### కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

**సంపుటము - 11**

**శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు**

కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డా॥ పి.వెంకటరాజు
విద్వాన్ సింగరాజు సచ్చిదానందం
డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు
డా॥ హెచ్.యస్. బ్రహ్మానంద

ప్రధానసంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Shalya, Souptika, Sthri parvamulu of Tikkana Somayaji
Vol. XI

Commentary by
**Dr. P. Venkataraju - Salya Parvam 1st Canto**
**Vidwan Singaraju Sacchidanandam - Salya Parvam - 2nd Canto**
**Dr. Jonnalagadda Mruthyunjaya Rao - Soupthika Parvam**
**Dr. H.S. Brahmananda - Sthri Parvam**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Series No.610
First Edition : 2005

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D. Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా అధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నందూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

*నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,*
*దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.*

మహాభారతం వేదాల, శాస్త్రాల, ఉపనిషత్తులసారం. అందుకే ఈ గ్రంథాన్ని పంచమ వేదంగా పరిగణిస్తారు. "భరతానాం మహజ్జన్మ మహాభారత ముచ్యతే" అని, "మహత్త్వాద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే" అని మహాభారతనామ నిష్పత్తి. అన్నితరాలను అలరించి ధర్మాన్ని, జ్ఞానాన్ని బోధించే మహేతిహాసం మహాభారతం.

ఇంతటి ప్రాశస్త్యం గల మహాభారతాన్ని వ్యాఖ్యానసహితంగా ప్రజలకు అందించాలని తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యం 1982–83 నన్నయ సంవత్సరంలో నిర్ణయం తీసుకున్నది. అందుకు అనుగుణంగా సామాన్యులకు కూడా అనువైన రీతిలో ప్రతిపదార్థ, తాత్పర్య విశేషాలతో రూపొందించాలని సంకల్పించింది. ఈ మహాభారత ప్రచురణ ఒక మహాయజ్ఞంలాగా కొనసాగుతున్నది. ఆంధ్రదేశంలోని ముప్పైమంది ప్రసిద్ధ విద్వాంసులు, మహాభారత వ్యాఖ్యానంలో పాలుపంచుకున్నారు. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ప్రధాన సంపాదకత్వం వహించారు. ఇందులో భాగంగా ఆది, సభా పర్వాలను 2000 సంవత్సరంలోను, 2003 సంవత్సరంలో గోదావరీ పుష్కరాల సందర్భంగా అరణ్య, విరాటపర్వాలను, 2004లో కృష్ణా పుష్కరాల సందర్భంగా ఉద్యోగ, భీష్మ, ద్రోణ పర్వాలను వెలువరించటం జరిగింది. తరువాత 2005లో కర్ణపర్వాన్ని ప్రత్యేక సంపుటంగా ప్రకటనకు సిద్ధం చేయడమైనది. ప్రస్తుతం శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలను ఒకే సంపుటంగా మీముందుంచుతున్నాం.

పగ, ద్వేషం, ప్రతీకారం, ఈర్ష్యకు లోనైన కౌరవులు పోరుకు సిద్ధపడటం, తద్ద్వారా కలిగిన పరిణామాలకు ఫలితంగా 'శోకరసం' ఈ పర్వాలలో మూర్తీభవించింది. శల్యునిసారథ్యాన్ని ఆతని మరణాన్ని, దుర్యోధనుని పతనాన్ని వర్ణించే పర్వమే శల్యపర్వం. సౌప్తిక పర్వంలో అశ్వత్థామ కరడుగట్టిన ప్రతీకార హింసాయుత ప్రవృత్తి గలవాడుగా గోచరించగా, ధర్మ పరిరక్షణ కోసం అవతరించిన భగవానుడుగా శ్రీ కృష్ణమూర్తి దర్శనమిస్తాడు. ఇక స్త్రీ పర్వంలో గాంధారి, కుంతి మున్నగు స్త్రీల మనఃప్రవృత్తుల చిత్రీకరణలో శోకరసం పెల్లుబికింది.

ఈ పర్వాలకు డా॥పి. వేంకటరాజు, విద్వాన్ సింగరాజు సచ్చిదానందం, డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద వ్యాఖ్యానం అందించారు. వీరికి మా ధన్యవాదాలు. ప్రధాన సంపాదకులైన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు విపులపీఠికను, కథాసంగ్రహాన్ని సమకూర్చారు. వారికి మా కృతజ్ఞతలు.

**కార్యనిర్వహణాధికారి,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,తిరుపతి.**

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

**పూర్వరంగం:**

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవశ్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భఆగవతం ప్రథమ స్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన ''పోతన'' పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు ''వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత'' గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

**నన్నయ భారత ప్రాజెక్టు :**

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీక్రారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 -' 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం'' గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాసపీఠము' - అనే ప్రశస్తసంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనాప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి **1983** జూలై **11**వ తేదీన హైదరాబాదు బాలాజీభవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శకసూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం :**

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అర సున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో

ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్లవేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను.''

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్పురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్లవేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ'' కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగాపర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జూలై 3వ తేదీన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన :**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డి గారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక''ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం :**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యంలో 1992 నవంబరు 5వ తేదీన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥ కే. సర్వోత్తమరావు** | **శ్రీడి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటి దొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మదుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥ రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీ కాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం :**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జులై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీడి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

## కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీస్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

## ఆ ప్రతిపాదనల సారాంశం :

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పండ్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి".

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాష్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదక మండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

**సంపాదక మండలి సభ్యులు**

| | |
|---|---|
| డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు | శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు |
| డా॥ ఎస్.బి. రఘునాథాచార్య | డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య |
| డా॥ కె.జె. కృష్ణమూర్తి | డా॥ కె. సర్వోత్తమరావు |

**సలహా మండలి సభ్యులు**

| | |
|---|---|
| పౌరసంబంధాధికారి, తి.తి.దే. | డా॥ బిరుదురాజు రామరాజు |
| అన్నమాచార్యప్రాజెక్ట్ డైరెక్టర్, తి.తి.దే. | డా॥ ఎం. కులశేఖరరావు |
| ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే. | డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు |
| | డా॥ ఎం. బుద్ధన్న |

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలుల లోని సభ్యులయొక్క సంయుక్తసమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటాలన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్తపాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ప్రథమసంపుటం ఆదిపర్వం (రెండు భాగాలు), ద్వితీయ సంపుటం-సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి. సుబ్బారావుగారి తరువాత కార్యనిర్వహణాధికారి అయిన డా॥పి. కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణనుగూర్చి ఆస్తకితో గమనిస్తూ అన్ని విధాల సహకరించి ఆది,సభా పర్వాల విడుదలకు ఏర్పాటుచేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాలనిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ప్రణాళిక వ్యాఖ్యాసహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. అప్పట్లో తీవ్రతరం అయిన ప్రయత్నంతో గోదావరి పుష్కరాల సమయానికి ఆరణ్యపర్వం (2 భాగాలు), విరాటపర్వం విడుదల అయ్యాయి. తర్వాత శ్రీ అజేయ కల్లంగారు కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన వెనువెంటనే ఈ మహాభారత వ్యాఖ్యన సహితప్రచురణ ప్రణాళికను మరింత వేగిరపరచి కృష్ణాపుష్కరాలలోపల యుద్ధ పంచకాన్ని విడుదల చేయాలనీ, 2004 సంవత్సరం చివరకు మిగిలిన పర్వాష్టకము వెలుగు చూడాలనీ నిర్ణయించడం జరిగింది. ఆ మార్గదర్శక సూత్రానుగుణంగా ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వాలు వెలువడ్డాయి. ఇప్పుడు కర్ణపర్వం విడుదలయింది. ప్రస్తుతం శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలను మూడింటిని కలిపి ఒకే సంపుటంగా మీముందు ఉంచుతున్నాము. పర్వాలన్ని విడుదల చేయటానికి సర్వయత్నాలు సాగుతున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారత' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. ఈ మహాగ్రంథం వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. సాహిత్యప్రియులూ, తి.తి.దేవస్థానం సంయుక్తకార్యనిర్వహణాధికారిగా ఉండిన శ్రీ ఆర్. అప్పారావు, ఐ.ఏ.ఎస్., గారికి వందనములు.

సంబంధిత విభాగాధిపతిగా, సలహామండలి ఎక్స్ అఫిషియోసభ్యులైన డా॥పి రంగారావు, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి-వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగా సహాయ సహకారాలందించిన తదితర అధికారిగణానికి నమస్సులు. ఈ ప్రణాళికద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధానపాత్ర వహించిన-వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదకమండలి, సలహా మండలి) విద్యావేత్తలకు, ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి- నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి.దేస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడంలో వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్ కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానిక పండితవర్యుల ఉప సంఘం (ఎడిటోరియల్ సెల్) నిర్మాణానికి సిఫారసు చేయగా, దేవస్థానం ఆమేరకు **పండితవరేణ్యులు డా॥ కె.సర్వోత్తమరావు, శ్రీసముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీముదివర్తి కొండమాచార్యులు గారలతో** ఎడిటోరియల్సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈ సెల్ ఉపకారం మరువరానిది. వీరు వర్క్‌షాపువలె నిర్వహింపబడుతున్న కవిత్రయ మహాభారత యజ్ఞంలో పాలుపంచుకుంటున్నారు. ఆ కారణంగానే తక్కిన పర్వాలు త్వరితంగా వెలువరించగలుగుతున్నాం.

"సప్తగిరి" సంపాదకులుగా, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి అమరులయ్యేవరకూ ప్రముఖపాత్ర వహించిన కాట్రపాటిసుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥ కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్-ఎడిటర్లు డాక్టర్ కె. రాధారమణ, డాక్టర్ ఎ. సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్-ఎడిటర్ శ్రీ బి. ఎన్. శ్రీనివాసన్ గారికి, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగ సుందరంగా తీర్చి దిద్ది పాఠకులకు తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయాధికారి శ్రీ ఐ. పార్వతీశ్వరరావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహ విశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగుచూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

**డా॥ఎన్.ఎస్. రామమూర్తి**
కన్వీనర్
సంపాదకుడు - సప్తగిరి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

### కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదక మండలి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|
| 1. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా. 1 |
| 3. డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా 1,2 |
| 4. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ. ఆశ్వా. 1,2 |
| 5. డాక్టర్ కే. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా. 1 |
| 6. డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా. 2 |
| 8. డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా. 4 |
| 9. డాక్టర్ కే. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా. 5 |
| 10. డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. డాక్టర్ కె. రాజన్నశాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | ఆను. ఆశ్వా. 1,2 |
| 27. డాక్టర్ శలాక రఘునాథశర్మ | ఆను. ఆశ్వా. 3,4 |
| 28. డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఆను. ఆశ్వా. 5 |
| 29. శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| అను. | – | అనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధానసంపాదకుడు |

| | | |
|---|---|---|
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభవిక్రీడితం |
| శా. | – | శార్దూలవిక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము-ద్వితీయాశ్వాసము

**శ్రీ శాశ్వతతత్త్వ కరణ క । లాశాలి! దయాది నిర్మల జ్ఞానమయా!**
**నాశోత్పత్తి రహిత! శు । ద్ధాశయ సంభజన మహిత! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సిరియొక్క; శాశ్వతత్వ= స్థిరత్వంయొక్క; కరణ= చేయటం అనే; కలా= విద్యచేత; శాలి!= ప్రకాశించేవాడా!; దయా+ఆది= దయ మొదలైనవీ; నిర్మల= అమలినమైన; జ్ఞానమయా!= జ్ఞానమూ స్వరూపంగా కలవాడా!; నాశ+ఉత్పత్తి రహిత!= మరణమూ, పుట్టుకా లేనివాడా!; శుద్ధ+ఆశయ సంభజన మహిత!= పరిశుద్ధ చిత్తవృత్తులు గలవారియొక్క ఉత్తమసేవచేత పూజింపబడేవాడా!, హరిహరనాథా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! చంచలయైన శ్రీని స్థిరంగా చేసే కళ కలవాడా! దయ మొదలైన సద్గుణాలూ, విమలజ్ఞానమూ స్వరూపంగా కలవాడా! నాశనం, ఉత్పత్తీలేనివాడా! పరిశుద్ధాత్ముల ఉత్తమ సేవచేత పూజించబడువాడా!

**విశేషం:** శ్రీకి స్వభావమైన చాంచల్యాన్ని పోగొట్టి స్థిరత్వం కల్పించటం ఒకకళ. అటువంటి కళ కలవాడు హరిహరనాథుడు. అతడు దయాది స్వరూపుడు. నిర్మలజ్ఞాన స్వరూపుడు. 'నాశోత్పత్తి రహిత' పుట్టటం, ఉండటం, పెరగటం, మార్పుచెందటం, క్షీణించటం, నశించటం అని పదార్థానికి ఆరు స్థితులు. షడ్భావవికారాలు. వాటిలో ఆద్యంతాలను (పుట్టటం, నశించటం) నిషేధించటం చేత మధ్యలో ఉన్న నాలుగూ కూడా పరమేశ్వరుడికి లేవని స్పష్టపడుతున్నది. 'నాశోత్పత్తి రహిత' అనే విశేషణంలో ఉత్పత్తికంటె నాశాన్నే మొదట పేర్కొనటం, ప్రాణులకు మరణం సహజం అని చెప్పటానికి.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. నట్లు సూర్యోదయంబైన యా సమయంబున సమీరనందనాదిసోదరులును, శౌరిసాత్యకులుం బరివేష్టింపనున్న ధర్మతనయు పాలికిఁ బఱతెంచి ధృష్టద్యుమ్నుని సారథి సాష్టాంగ దండ ప్రణామంబు సేసి కరకమలంబులు మొగిడ్చి. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ భగవంతుడా! హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు; సూర్య+ఉదయంబు+ఐనన్= సూర్యోదయంకాగా; ఆ సమయంబునన్= ఆవేళ; సమీరనందన+ఆది సోదరులును= భీముడు మున్నగు సోదరులూ; శౌరి సాత్యకులున్= కృష్ణసాత్యకులూ; పరివేష్టింపన్+ఉన్న= చుట్టువారగా ఉన్న; ధర్మతనయు పాలికిన్= ధర్మరాజు వద్దకు; పఱతెంచి= వచ్చి; ధృష్టద్యుమ్నుని సారథి= ధృష్టద్యుమ్నుడియొక్క సారథి; సాష్టాంగదండ ప్రణామంబు= దండాకారంగా ఎనిమిది అంగాలు నేలకు తగిలేటట్టుగా నమస్కారం; చేసి; కరకమలంబులు= హస్తపద్మాలు; మొగిడ్చి= ముడిచి.

**తాత్పర్యం:** దేవా! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు: అట్లా సూర్యోదయం కాగా ఆ సమయంలో భీముడూ మొదలైన సోదరులూ, కృష్ణసాత్యకులూ చుట్టూరా ఉన్న ధర్మరాజు దగ్గరకు వచ్చి ధృష్టద్యుమ్నుడి రథసారథి సాష్టాంగ నమస్కారం చేసి, హస్తపద్మాలు ముడిచి.

**విశేషం:** సాష్టాంగ దండప్రణామం - జానువులూ, పాదాలూ, చేతులూ, ఉరస్సూ, ధీ, శిరస్సూ, వచస్సూ, దృష్టీ - ఈ ఎనిమిదింటినీ నేలకు తగిల్చి కర్ర ఆకారంగా బోర్లా పరుండి చేసే నమస్కారం.

**సీ.** **'నరవర! మన వీడు నడిరేయి కృతవర్మ। యును గృపాచార్యుండుఁ దనకుఁ దోడు**
**గా వచ్చి జనులు నిద్రావివశాత్ములై। యుండ నశ్వత్థామ యొకఁడు సొచ్చి**
**తొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తత్సోదర। తనయాది పాంచాల తతుల ముట్టి**
**యన్యాయవిధిని నింద్యంబైన విక్రమ। లీలాతిశయమున నేలఁ గలిపి**

**ఆ.** **చేది బలము నెల్లఁ జెండి మాత్స్య ప్రభ। ద్రకులు మేలుకాంచి ద్రౌపదేయు**
**లను శిఖండిఁ గూర్చికొని తన్నుఁ దాఁకిన। బెట్టు చంపె నంతవట్టు వారి.** **3**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా! ధర్మరాజా!; మనవీడు= మనశిబిరం; నడిరేయి= అర్ధరాత్రి; కృతవర్మయును; కృపాచార్యుండున్; తనకున్; తోడు+కాన్= సహాయంగా; వచ్చి; జనులు; నిద్రా వివశ+ఆత్ములు+ఐ= నిద్రలో ఒళ్ళు మరచినవారై; ఉండన్= ఉండగా; అశ్వత్థామ+ఒకఁడు= అశ్వత్థామ ఒక్కడూ; చొచ్చి= ప్రవేశించి; తొలుతన్= మొదట; ధృష్టద్యుమ్నున్; త్రుంచి= వధించి; తద్+సోదర తనయ+ఆది పాంచాల తతులన్= అతడి సోదరులూ, కొడుకులూ మొదలైన పాంచాలవీరుల సమూహాలను; ముట్టి= తాకి; అన్యాయవిధిని= అధర్మపద్ధతిలో; నింద్యంబు+ఐన= నిందింపదగిన; విక్రమ లీలా+అతిశయమునన్= పరాక్రమలీల ఆధిక్యంతో; నేలన్+కలిపి= చంపి; చేది బలమున్+ఎల్లన్= చేది దేశపుసేన నంతనూ; చెండి= వధించి; మాత్స్య ప్రభద్రకులు= మాత్స్యులూ, ప్రభద్రకులూ; మేలుకాంచి= మేల్కొని; ద్రౌపదేయులను= ద్రౌపది కొడుకులనూ; శిఖండినీ= శిఖండినీ; కూర్చికొని= కూడగట్టుకుని; తన్నున్= తనను; తాఁకినన్= మార్కొనగా; అంతవట్టువారిన్= వాళ్ళను అంతమందినీ; బెట్టు= క్రూరంగా; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! మన శిబిరంలోకి అర్ధరాత్రి కృతవర్మా, కృపాచార్యుడూ తనకు తోడుగా వచ్చి, జనం నిద్రలో ఒళ్ళు మరచిపోయి ఉండగా, అశ్వత్థామ ఒక్కడూ ప్రవేశించి, మొదట ధృష్టద్యుమ్నుడిని వధించి, అతడి సోదరులూ, కొడుకులూ మొదలైన పాంచాల వీరులను అధర్మ పద్ధతిలో నింద్యమైన పరాక్రమం ప్రదర్శించి చంపి, చేది సైన్యాన్ని అంతనూ వధించి, మాత్స్యులూ, ప్రభద్రకులూ మేలుకొని ద్రౌపదికొడుకులనూ, శిఖండినీ కూడగట్టుకుని తనను ఎదిరిస్తే, వాళ్ళను అంతమందినీ దారుణంగా చంపాడు.

**వ.** **మఱియును.** **4**

**తాత్పర్యం:** ఇంకా.

**స్రగ్ధర.**

**వీడెల్లం దల్లడిల్లన్, వివిధ గతులమై విక్రమోల్లాస మొందం,**
**గ్రీడాకల్పంబుగా, నాకృతిఁగని ప్రజ శంకించి దైత్యుం డనం, జెం**
**డాడెన్. శీర్ష వ్రజంబున్, హరులగముల వేఁటాడె, నేనుంగులం దు**
**న్మాడెం, గౌక్షేయ హేలాభ్యసనలసిత బాహార్గళా భీషణుండై.** **5**

**ప్రతిపదార్థం:** వివిధ గతులమైన్= రకరకాల పద్ధతులతో; విక్రమ+ఉల్లాసము+ఒందన్= పరాక్రమం ప్రకాశించగా; క్రీడా+ కల్పంబుగాన్= ఆటలాగా; ప్రజ= జనం; ఆకృతిన్= ఆకారాన్ని; కని= చూచి; శంకించి= అనుమానించి; దైత్యుండు+అనన్= రాక్షసుడనగా; కౌక్షేయ= ఖడ్గంయొక్క; హేలా+అభ్యసన= సౌలభ్యంకోసమైన అభ్యాసంచేత; లసిత= ప్రకాశించిన; బాహా+అర్గళ= తలుపు గడియల వంటి బాహువులచేత; ఆభీషణుండు+ఐ= మిక్కిలి భయంకరుడై; వీడు+ఎల్లన్= శిబిరమంతా; తల్లడిల్లన్= కలతచెందగా; శీర్షవ్రజంబున్= తలల సమూహాన్ని; చెండాడెన్= ఖండించాడు; హరుల గములన్= గుర్రాల గుంపులను; వేఁ టాడెన్; తున్మాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ రకరకాల పద్ధతులతో పరాక్రమం ఒప్పేటట్లు, ఆటవలె, జనం తన ఆకారం చూచి అనుమానించి రాక్షసుడనగా, ఖడ్గలీలాభ్యాసంచేత ప్రకాశించే భుజార్గళాలు కలిగి భయంకరుడై, శిబిరం అంతా కలతచెందగా, తలల సమూహాన్ని ఖండించాడు. గుర్రాల గుంపులను వేటాడాడు. ఏనుగులను వధించాడు.

**తే.** **అడవి దరమిడి నఱుకంగ నందుఁ గల వి । హంగమంబులు గలగొన నఱచు తెఱఁగు**
**దోఁచె నాతఁడు యోధులఁ దునుమఁ గలఁగి । యన్యజనము లాక్రందించునప్ప డధిప! 6**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! ధర్మరాజా!; ఆతఁడు= ఆ అశ్వత్థామ; యోధులన్= వీరులను; తనుమన్= వధించగా; కలఁగి= కలతచెంది; అన్య జనములు= ఇతర జనులు; ఆక్రందించు+అప్పుడు= ఏడ్చేటప్పుడు; అడవి= అడవిని; తరము+ఇడి= వరసపెట్టి; నఱుకంగన్= నరకగా; అందున్+కల= అందులో ఉన్న; విహంగమంబులు= పక్షులు; కలగొనన్= వ్యాపించేటట్టు; అఱచు తెఱఁగు+తోఁచెన్= అరిచే విధం స్ఫురించింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ అశ్వత్థామ యోధులను వధించగా కలతచెంది ఇతర జనులు ఏడుస్తూంటే, అడవిని వరుసబెట్టి నరకగా అందులో ఉన్న పక్షులు అంతటా వ్యాపించేటట్లు అరచే విధం స్ఫురించింది.

**విశేషం:** అలం: స్మృతి. ఇక్కడ అశ్వత్థామ యోధులను నరకగా ఇతరులు ఏడవటం చేస్తూ, అడవిని నరికినప్పుడు అందులోని పక్షులు అరవటం తోచింది- అనటంచేత అలంకారం స్మృతి. ఉపమేయోపమానాలలో ఒకదానిని చూచినప్పుడు, ఇంకొకటి స్ఫురించినదని చెప్పితే అది స్మృతిమదలంకారం అవుతుందని లక్షణం.

**క.** **అఱచినఁ బఱచిన వ్రేళులు । గఱచిన నతఁ డించుకయును గరుణింపక యం**
**దఱ నుఱుముసేసె గుంపుల । కుఱికి యుఱికి ఖడ్గదారుణోల్లసనములన్. 7**

**ప్రతిపదార్థం:** అతఁడు= అశ్వత్థామ; గుంపులకున్= గుంపులలోకి; ఉఱికి+ఉఱికి= మిక్కిలి దుమికి; ఖడ్గదారుణ+ఉల్లసనములన్= కత్తియొక్క భయంకరములైన ప్రకాశాలతో; అందఱన్= అందరినీ; అఱచినన్= అరచినా; పఱచినన్= పారిపోయినా; వ్రేళులు+కఱచినన్= తమ తప్పు తాము ఒప్పుకొనటం సూచించినా; కరుణింపక= దయచూపక; నుఱుము+చేసెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ గుంపులలోకి ఉరికి ఉరికి కత్తి భయంకరంగా మెరుస్తూండగా, అందరినీ అరిచినా, పరుగెత్తుకొనిపోయినా, తమ తప్పు తాము ఒప్పుకొనటం సూచించినా, దయచూపక ఖండించాడు.

**వ.** **ఆ సమయంబున. 8**

**తాత్పర్యం:** అప్పుడు.

**మహాస్రగ్ధర.**

**కృపుఁడున్ హార్దిక్యుఁడున్ వాకిట నిలిచి భయాక్షిప్తయోధవ్రజంబున్**
**నృపులున్ వే నిర్గమింప న్వివిధ శరముల న్మేదినిం గూల్చుచున్ ఘో**
**రపు సంరంభంబు దుర్వారముగఁ గెరలి రౌద్రంబు రూపంబు దాల్పం**
**గుపితక్రవ్యాదులో నాఁ గుచరిత నిరతిం గ్రూరతాధుర్యు లైనన్. 9**

**ప్రతిపదార్థం:** కృపుఁడున్; హార్దిక్యుఁడున్= కృతవర్మా; వాకిటన్= ద్వారదేశంలో; నిలిచి; భయ= భయంచేత; ఆక్షిప్త= కలతపడిన; యోధ వ్రజంబున్= వీరుల గుంపూ; నృపులున్= రాజులూ; వే= వేగంగా; నిర్గమింపన్= బయటికి రాగా; వివిధ శరములన్= రకరకాల బాణాలతో; మేదినిన్= భూమిమీద; కూల్చుచున్= కూలుస్తూ; ఘోరము+సంరంభంబు= భయంకరమైన సంక్షోభం; దుర్వారముగన్= వారింపరానిదికాగా; కెరలి= చెలరేగి; రౌద్రంబు= రౌద్రరసం; రూపంబు+తాల్పన్= ఆకారం ధరించగా; కుపితక్రవ్యాదులో నాన్= కోపించిన రాక్షసులూ అన్నట్లు; కుచరిత నిరతిన్= చెడునడతయందలి ఆసక్తితో; క్రూరతా ధుర్యులు+ఐనన్= క్రూరత్వపు భారం వహించినవారు కాగా- మిక్కిలి క్రూరులు కాగా.

**తాత్పర్యం:** కృపాచార్యుడూ, కృతవర్మ ద్వారదేశంలో నిలిచి, భయంతో కలతచెందిన వీరుల సమూహమూ, రాజులూ వేగంగా బయటికి వస్తూ ఉంటే వాళ్ళను రకరకాల బాణాలతో నేలకూలుస్తూ, మహా సంక్షోభం వారించరానిది కాగా, చెలరేగి, రౌద్రరసం ఆకారం ధరించినట్లు, కోపించిన రాక్షసులా అన్నట్లు, చెడ్డ నడత అందలి ఆసక్తితో, మిక్కిలి క్రూరులు కాగా. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 'రౌద్రంబు రూపంబు దాల్పన్' - 'కుపిత క్రవ్యాదులోనాన్' - అలంకారాలు ఉత్ప్రేక్షలు.

**వ. తత్ప్రదేశంబు నవ్వీటిలోనుంబోలెఁ బీనుంగుపెంట యయ్యె నట్లు శిబిరంబునం గల కరితురగ నర నికరంబులు నిశ్శేషత్వంబు నొందె నాయుశ్శేషంబు కతంబునం గృతవర్మచేతం బట్టువడి యతండు మందల విడువ నిట వచ్చితి' నని చెప్పినం బాండవాగ్రజుండు. 10**

**ప్రతిపదార్థం:** తద్+ప్రదేశంబున్= ఆ ద్వారదేశంకూడా; ఆ+వీటిలోనున్+పోలెన్= ఆ శిబిరంలోపల వలెనే; పీనుంగుపెంట+ అయ్యెన్= శవాల నెలవు అయింది; అట్లు; శిబిరంబునన్+కల= శిబిరంలో ఉన్న; కరి తురగ నర నికరంబులు= ఏనుగుల, గుర్రాల, మనుష్యుల సమూహాలు; నిశ్శేషత్వంబున్+ఒందెన్= ఏమీ మిగలకుండా పోయాయి; ఆయున్+శేషంబు కతంబునన్= ఆయుర్దాయం మిగలబట్టి; కృతవర్మచేతన్; పట్టువడి; అతండు; మందల విడువన్= ప్రాణాలతో విడిచిపెడితే; ఇటన్= ఇక్కడకు; వచ్చితిన్= వచ్చాను; అని; చెప్పినన్= చెప్పగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడు ధర్మరాజు.

**తాత్పర్యం:** ఆ ద్వారదేశంకూడా శిబిరంలోపల వలెనే పీనుగుపెంట అయింది. ఆ రీతిగా శిబిరంలో ఉన్న ఏనుగుల, గుర్రాల, మనుష్యుల సమూహాలు ఏమీ మిగలకుండా పోయాయి. ఏదో కొంత ఆయుర్దాయం ఇంకా మిగలబట్టి కృతవర్మ చేతికి దొరికి, అతడు ప్రాణాలతో విడిచిపెడితే, ఇట్లా వచ్చాను.' అని చెప్పగా ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. శోకవేగసంతప్తుఁడై సొలసివ్రాల । సంభ్రమమ్మునఁ బట్టిరి సాత్యకియును**
**గవలు భీమసేనుండును గరతలముల । నుమ్మలికము నెమ్మనములఁ గ్రమ్ముదేర. 11**

**ప్రతిపదార్థం:** శోక వేగ సంతప్తుఁడు+ఐ= దుఃఖోద్రేకం చేతమిక్కిలి తపించినవాడయి; సొలసి(వ్రాలన్= మూర్ఛపోయి వాలిపోగా; సాత్యకియును; కవలున్= నకుల సహదేవులూ; భీమసేనుండును= భీముడూ; నెఱ+మనములన్= మనస్సులలో; ఉమ్మలికము= దుఃఖం; క్రమ్మదేరన్= వ్యాపించగా; సంభ్రమమ్మునన్= వేగిరపాటుతో; కరతలములన్= అరచేతులతో; పట్టిరి.

**తాత్పర్యం:** దుఃఖోద్రేకంతో మిక్కిలి తపించి మూర్ఛపోయి వాలిపోగా, సాత్యకీ, నకుల సహదేవులూ, భీముడూ, మనస్సులలో దుఃఖం పొంగగా వేగిరపాటుతో ఆయనను అరచేతులతో పట్టుకొన్నారు.

**వ. కొండొకసేపునకు మూర్ఛదేఱి యన్నరపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె. 12**

**ప్రతిపదార్థం:** ఆ+నరపాలుండు= ఆ రాజు- ధర్మరాజు; కొండొకసేపునకున్= కొంతసేపటికి; మూర్ఛ+తేఱి= మూర్ఛనుండి తెప్పిరిల్లి; ఎలుంగు= కంఠస్వరం; రాల్పడన్= డగ్గుత్తిక చెందగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొని కంఠస్వరం డగ్గుత్తికపడగా ఇట్లా అన్నాడు:

### ధర్మరాజు తన పుత్రు లశ్వత్థామచేఁ జచ్చుట విని పలవించుట (సం. 10-19-9)

**సీ. 'ఎట్టివారలకైన నెఱుఁగంగ నగునె కా । ర్యంబులగతు లుపాయంబు బలుపు**
**వెలయంగ నట్లు శత్రుల బంధుమిత్ర పు । త్రామాత్య యుతముగ నాహవమున**
**నందఱ నేఁ దెగటార్చినవాఁడనై । విజయంబు సేకొని విభవమెసఁగ**
**నిట యేఁగుదెంచితి నట బంధుమిత్ర పు । త్రామాత్యయుతముగ నస్మదీయ**

**తే. బలము నెల్లను ముట్టి శత్రులు నితాంత । ఘోరముగఁ దెగటార్చిరి కుత్సితంపు**
**విధము వాటిల్లె నస్థిరవిజయమునఁ బ । రాజయమని యాడు నిఁక ధరాజనంబు. 13**

**ప్రతిపదార్థం:** ఎట్టివారలకున్+ఐనన్= ఎంతటివారికైనా; కార్యంబుల గతులు= పనుల పోకడలు; ఎఱుఁగంగన్+అగునె?= తెలిసికో శక్యమవుతుందా?; ఉపాయంబు బలుపు= ఉపాయపుదార్ఢ్యం; వెలయంగన్= ఒప్పగా; అట్లు; శత్రులన్= శత్రువులను; బంధుమిత్ర పుత్ర+అమాత్య యుతముగన్= చుట్టాలతో, స్నేహితులతో, కుమారులతో, మంత్రులతో సహా; అందఱన్= అందరినీ; ఆహవమునన్= యుద్ధంలో; ఏన్= నేను; తెగటార్చినవాఁడను+ఐ= చంపినవాడినయి; విజయంబు+చేకొని= గెలుపొంది; విభవము+ఎసఁగన్= వైభవం అతిశయించగా; ఇట+ఏఁగుదెంచితిన్= ఇక్కడికి వచ్చాను; అటన్= అక్కడ; బంధుమిత్ర-పుత్ర+అమాత్య యుతముగన్= చుట్టాలతో, మిత్రులతో, కుమారులతో, మంత్రులతో సహా; అస్మదీయ బలమున్+ఎల్లను= మా సైన్యాన్ని అంతనూ; ముట్టి= తాకి; శత్రులు= వైరులు; నితాంత ఘోరముగన్= మిక్కిలిఘోరంగా; తెగటార్చిరి= చంపారు; కుత్సితము+విధము= కీడ్పడినరీతి; పాటిల్లెన్= సంభవించినది; ఇఁకన్= ఇకమీద; ధరాజనంబు= లోకం; అస్థిర విజయమునన్= నిలకడలేని గెలుపుచేత; పరాజయము+అని+ఆడున్= ఓటమి అని అంటుంది.

**తాత్పర్యం:** 'ఎంతటివారికైనా పనుల పోకడలు తెలిసికొనటానికి శక్యం కాదు. మంచి ఉపాయంతో ఆ రీతిగా శత్రువులను చుట్టాలతో, స్నేహితులతో, కుమారులతో, మంత్రులతో సహా అందరినీ యుద్ధంలో చంపి నేను గెలుపొంది, వైభవం అతిశయించగా ఇక్కడికి వస్తే; అక్కడ చుట్టాలతో, స్నేహితులతో, కుమారులతో, మంత్రులతో సహా మా సైన్యాన్ని అంతనూ తాకి వైరులు మిక్కిలి ఘోరంగా చంపారు. కీడ్పాటు సంభవించింది. ఇకమీద జనులు నిలకడలేని విజయం పరాజయంతో సమానం అని అంటారు.

**స్రగ్ధర.**

**బాణజ్వాలా నితాంత ప్రసరణముల శుంభద్ద్విషత్సాంద్ర సైన్య**
**శ్రేణీ కాంతారముల్ చూర్ణితములుగఁ బటుక్రీడమైఁ దేజరిల్లెన్**
**ద్రోణాచార్యాగ్ని; వేఁడిం దొడరక మెఱసెన్ దోర్విలాసంబు; వైరుల్**
**ప్రాణంబుల్ నాఁచికోల్ దప్పదు; తుది విధి యబ్బాలురం ద్రెళ్ళవైచెన్. 14**

**ప్రతిపదార్థం:** ద్రోణ+ఆచార్య+అగ్ని= ద్రోణాచార్యుడనే అగ్ని; బాణ= బాణాలు అనే; జ్వాలా= మంటలయొక్క; నితాంత= అధికమైన; ప్రసరణములన్= ప్రసారాలచేత; శుంభత్= ప్రకాశిస్తున్న; ద్విషత్= శత్రువులయొక్క; సాంద్ర= దట్టమైన; సైన్య= సేనలయొక్క; శ్రేణీ= వరుసలు అనే; కాంతారముల్= అడవులు; చూర్ణితములుగన్= పొడులుగా; పటు క్రీడమైన్= తీవ్రమైన విహారంతో; తేజరిల్లెన్= ప్రకాశించింది; దోన్(ః)+విలాసంబు= భుజబలలీల; వేఁడిన్= ఆ అగ్నివేడిని; తొడరక= పొందక; మెఱసెన్= ప్రకాశించింది - ఒప్పింది; వైరుల్= శత్రువులు; ప్రాణంబుల్; నాఁచికోల్= అపహరించటం; తప్పదు; తుదిన్= చివర; విధి= దైవం; ఆ+బాలురన్= ఆ పిల్లలను; త్రెళ్ళన్+వైచెన్= చంపించింది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడనే అగ్ని బాణాలనే జ్వాలల అధికమైన ప్రసారాలతో శత్రువుల దట్టమైన సేన లనే అడవులు నుగ్గు నుగ్గు అయ్యేటట్లు తీక్షణంగా విహరించి ప్రకాశించింది. ఆ అగ్ని వేడిని పొందక మన భుజబలం ఒప్పింది. శత్రువులు మనప్రాణాలు అపహరించటం తప్పదు. చివరకు దైవం ఆ పిల్లలను చంపించింది.

**విశేషం:** అలం: రూపకం. 'బాణాజ్వాలా', 'సైన్యశ్రేణీ కాంతారముల్', 'ద్రోణాచార్యాగ్ని' - అనేచోట్ల ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం. శత్రువులు ప్రాణాలు తీయటం ఎటూ తప్పదు కాని చివరకు పిల్లలు పోయారే అని ధర్మరాజు బాధ.

**మహాస్రగ్ధర.**

**శరదంష్ట్రా భీషణంబై చటుల రిపుమృగస్వైర విధ్వంసలీలా**
**స్ఫురణన్ శోభిల్లు రాధాసుతుఁ డను పులి విస్ఫూర్జితంబున్ సహింపన్**
**వెరవున్ దర్పంబు గల్గెన్; వికల రిపులచే వీటిఁబోయెం గుమారో**
**త్కర; మిం కేమందు? నాపత్పరికలన ప్రమాదంబునం గాక యున్నే? 15**

**ప్రతిపదార్థం:** శర= బాణాలు అనే; దంష్ట్రా= కోరలచేత; భీషణంబు+ఐ= భయంకరమయినదయి; చటుల= చంచలమైన; రిపు= శత్రువులనెడి; మృగ= లేళ్ళయొక్క; స్వైర= తన ఇచ్ఛవచ్చినట్టి; విధ్వంస లీలా= వినాశలీల యొక్క; స్ఫురణన్= తోచుటతో; శోభిల్లు= ప్రకాశించే; రాధాసుతుఁడు+అను పులి విస్ఫూర్జితంబున్= రాధకొడుకు(కర్ణుడు) అనే పులియొక్క గాండ్రింపు; సహింపన్= ఓర్చుకోవటానికి; వెరవున్= ఉపాయమూ; దర్పంబున్= గర్వమూ; కల్గెన్= కలిగాయి; వికల రిపులచేన్= క్షుద్ర శత్రువులచేత; కుమార+ఉత్కరము= కుమారుల సమూహం; వీటిఁబోయెన్= నశించింది; ఇంకన్+ఏమి+అందున్?= ఇంకేమంటాను?; ప్రమాదంబునన్= ఏమరుపాటుచేత; ఆపద్+పరికలన= ఆప్రద్గహణం; కాక+ఉన్నే?= కాకుండా ఉంటుందా?;

**తాత్పర్యం:** బాణాలనే కోరలచేత భయంకరమై, కదిలే శత్రువులనే లేళ్ళను ఇష్టంవచ్చినట్లు చంపి శోభిల్లే కర్ణుడనే పులి గాండ్రింపును ఓర్చుకొనే ఉపాయమూ, గర్వమూ కలిగి, క్షుద్ర శత్రువులచేత కుమారుల సమూహం నశించింది. ఇంక అనటాని కేముంది? ఏమరుపాటువలన ఆపద సంభవించకుండా ఉంటుందా?

**విశేషం:** అలం: రూపకం. అర్థాంతరన్యాసం. 'శరదంష్ట్రా', 'రిపుమృగ', 'రాధాసుతుఁ డను పులి' అనే చోట్ల ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడటం వలన అలంకారం రూపకం. ఇందులో 'వికల రిపులచేత వీటిఁబోయెం గుమారోత్కరము' అనే విశేషాంశం 'ఆపత్పరికలన ప్రమాదంబునం గాకయున్నే?' అనే సామాన్యాంశంచేత సమర్థింపబడింది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**స్రగ్ధర.**

> **శాతాస్త్ర స్ఫారవీచీ సముదయ రభసాశ్చర్యసంపాది హేలా**
> **స్ఫీతంబై క్రమ్ముదేరన్ బెదరక కలఁచెన్ భీష్మవారాశిఁ దుచ్ఛా**
> **రాతి వ్యాపారదుర్వారతఁ దెగియెఁ గుమారవ్రజం బక్కటా! ని**
> **ద్రా తంద్రావ్యాప్తి నక్రూరతఁ బొరసి భుజాప్రౌఢి వమ్మయ్యెఁ జుమ్మీ. 16**

**ప్రతిపదార్థం:** కుమార వ్రజంబు= కుమారుల సమూహం; శాత= వాడియైన; అస్త్ర= బాణాలు అనే; స్ఫార= పెద్దవైన; వీచీ= తరంగాలయొక్క; సముదయ= సమూహంయొక్క; రభస= తీవ్రతచేతా; ఆశ్చర్య సంపాది= ఆశ్చర్యాన్ని కలిగించే; హేలా= సౌలభ్యంచేత; స్ఫీతంబు+ఐ= వ్యాపించినదయి; క్రమ్ముదేరన్= పైకి ఉబుకగ; బెదరక= భయపడక; భీష్మ వారాశిన్= భీష్ముడనే సముద్రాన్ని; కలఁచెన్= కలతచెందించింది; అక్కటా!= అయ్యో!; తుచ్ఛ= నీచమైన; అరాతి= శత్రువులయొక్క; వ్యాపార= పనియొక్క; దుర్వారతన్= వారించరామిచేత; తెగియెన్= నశించింది; నిద్రా తంద్రా వ్యాప్తిన్= నిద్రవలని మైమరుపుయొక్క వ్యాప్తిచేత; అక్రూరతన్= క్రూరత్వం లేమిని; పొరసి= పొంది; భుజ-ప్రౌఢి= భుజబలనైపుణ్యం; వమ్ము+అయ్యెన్+చుమ్మీ= వ్యర్థమయింది సుమా!

**తాత్పర్యం:** కుమారుల సమూహం - వాడి బాణాలు అనే పెద్ద తరగల సమూహపు తీవ్రతతోనూ, ఆశ్చర్యకర సౌలభ్యం తోనూ వ్యాపించినదై మీదికిరాగా, భయపడక, భీష్మసముద్రాన్ని కలతచెందించింది. అయ్యో! ఇప్పుడు నీచశత్రువుల పని వారించరాకపోవటంచేత నశించింది. నిద్రమత్తుచేత క్రూరత్వం కోలుపోయి భుజబలనైపుణ్యం వ్యర్థమయింది సుమా!

**విశేషం:** అలం: రూపకం. 'శాతాస్త్ర స్ఫార వీచీ.' 'భీష్మ వారాశి' అనేచోట్ల ఉపమేయోపమానాల అభేదం వలన అలంకారం రూపకం.

> **ఆ. అధికబలము గెల్చి యవనీపతులు గొంద । అతివిహీనరిపుల యాక్రమమున**
> **మడిసి రకట! జలధి వెడలి సన్నపుఁ గ్రయ్య । మునిఁగి రూపడంగు జనుల మాడ్కి. 17**

**ప్రతిపదార్థం:** జలధిన్ వెడలి= సముద్రంలోంచి వెలికివచ్చి - సముద్రాన్ని దాటి; సన్నము+క్రయ్యన్= సన్నపాటి కాలువలో; మునిఁగి; రూపు+అడంగు= నశించే; జనులమాడ్కిన్= జనులవిధంగా; అకట!= అయ్యో!; అధిక బలమున్= గొప్ప సైన్యాన్ని; గెల్చి= గెలిచి; అవనీపతులు+కొందఱు= రాజులు కొంతమంది; అతివిహీన రిపుల+ఆక్రమమునన్= మిక్కిలి నీచశత్రువుల ఆక్రమణంచేత; మడిసిరి= చచ్చిపోయారు.

**తాత్పర్యం:** సముద్రాన్ని దాటి సన్నపాటి కాలువలో మునిగిపోయి నశించే జనుల విధంగా, కొంతమంది రాజులు గొప్ప సేనను గెలిచి మిక్కిలి తక్కువ రకపు శత్రువుల ఆక్రమణంచేత చచ్చిపోయారు. అయ్యో!

**విశేషం:** అలం: ఉపమ, భీష్మ ద్రోణ కర్ణాదులవంటి మహావీరులను ఓడించి, కొంతమంది రాజులు కృపకృతవర్మాశ్వత్థామల వంటి తక్కువరకం శత్రువులచేత చచ్చారని భావం.

**చ. జనకుఁడు లేమికిం గడు విషాదము నొందెడి కృష్ణ యిమ్మెయిం**
**దనయులు భ్రాతలుం దెగుట దా విని మూర్ఛ మునుంగు నెమ్మనం**
**బును నవశంపుమేను నయి భూస్థలిఁ ద్రెళ్ళక యున్నె? త్రెళ్ళదే**
**నిని బటుశోకవేగమున నిర్భరవేదనఁ జెందకుండునే? 18**

**ప్రతిపదార్థం:** జనకుఁడు= తండ్రి ద్రుపదుడు; లేమికిన్= లేకపోవటానికి - చచ్చిపోవటానికి; కడున్= మిక్కిలి; విషాదమున్+ఒందెడి= విచారించే; కృష్ణ= ద్రౌపది; ఈ+మెయిన్= ఈ విధంగా; తనయులున్= కొడుకులూ; భ్రాతలున్= సోదరులూ; తెగుట= నశించటం; తాన్= తాను; విని; మూర్ఛన్+మునుంగు= మూర్ఛపోయే; నెఱ+మనంబును= మనస్సూ; అవశము+మేనున్+అయి= వశం తప్పిన శరీరమూ కలదై; భూస్థలిన్= నేలమీద; త్రెళ్ళక+ఉన్నె?= కూలిపోదా?; త్రెళ్ళదు+ఏనిని= కూలిపోకపోయినా; పటుశోక వేగమునన్= తీవ్ర దుఃఖోద్రేకంతో; నిర్భర వేదనన్= తీవ్రమైన బాధను; చెందక+ఉండునే?= పొందకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** తండ్రి అయిన ద్రుపదుడు పోయాడని మిక్కిలి పరితపించే ద్రౌపది ఈ విధంగా కొడుకులూ, సోదరులూ నశించారని విని మూర్ఛిల్లే మనస్సూ, వశంతప్పిన శరీరమూ కలదై నేలమీద కూలిపోదా? ఒకవేళ కూలిపోకపోయినా, తీవ్ర దుఃఖోద్రేకంతో మిక్కిలి బాధపడకుండా ఉంటుందా?

**క. మున్నిట్టి తెఱఁగు శోకం । బెన్నఁడుఁ దా ననుభవించి యెఱుఁగ దకట! నేఁ**
**డన్నెలఁత యలఁత పెల్లున । నెన్ని యవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో!' 19**

**ప్రతిపదార్థం:** మున్ను= ఇంతకుముందు; ఇట్టి తెఱఁగు శోకంబు= ఈ విధమైన దుఃఖం; ఎన్నఁడున్= ఎప్పుడూ; తాన్= తాను; అనుభవించి+ఎఱుఁగదు= అనుభవించి ఎరుగదు; అకట!= అయ్యో!; నేఁడు= ఇప్పుడు; ఆ+నెలఁత= ఆ ఇంతి - ద్రౌపది; అలఁత పెల్లునన్= దుఃఖాతిశయంతో; ఎన్ని అవస్థలకున్ వచ్చి= ఎంత బాధపడి; ఎట్లు+అయ్యెడినో!= ఏమయిపోతుందో!

**తాత్పర్యం:** ఇంతకు ముందెప్పుడూ ఈ విధమైన దుఃఖం తాను అనుభవించి ఎరుగదు. అయ్యో! ఆమె దుఃఖాతిశయంతో ఎంత బాధపడి ఏమయిపోతుందో!'

**వ. అని వగలం బొగిలి పాంచాలి రావింపం దలంచి తన పనుపున నవ్వేలంది ద్రుపద విరాటులు చచ్చిన మఱునాఁడు తదీయ పత్నులకు శోకాపనోదంబు సేయుటకై సుభద్రయు నుత్తరయును దోనరుగ విడిదలనుండి విరాటుపురంబున కరిగి ద్రుపదుండును గొడుకులు నవ్వీటికి వచ్చునాఁడు దోడన వచ్చి కోడండ్రును దానును నందయున్న యా ద్రుపదు పత్నిని, విరాటపత్నిం గాంచి పదంపడి సుభద్ర యర్జును ననుమతి వడసి ద్వారవతికిం బోవ నమ్మత్స్యపురంబున నునికిం జేసి యన్నరనాథుండు నకులుం గనుంగొని యతిత్వరితగమనంబునకుం దగు రథంబునం జటులంబులైన రథ్యంబులం బూన్చికొని యుపప్లావ్యంబున కుం జని ద్రుపదనందనను, దక్కును మనదెసలంగలుగు నంగనలను ద్రుపదమత్స్యపతి పక్షంబు భామలను**

**దోడ్కొని యవ్విడిదలకుం జనుదెమ్మని చెప్పి యేము నయ్యెడకుం జనుదెంచెద మనుటయు నతండు తదుక్త ప్రకారంబునఁ జనియె. నజ్జనవల్లభుండు తక్కటి తమ్ములును, దామోదర సాత్యకులును నడలుచుఁ దన్నుం బొదివికొని చనఁ గౌరవ శిబిరంబునం గల జనంబులు గొల్చి వోవ నేడ్చుచు నిజశిబిరంబునకుం బోయి తత్ప్రదేశంబున. 20**

**ప్రతిపదార్థం:** అని; వగలన్= దుఃఖాలతో; పొగిలి= కుమిలి; పాంచాలిన్= ద్రౌపదిని; రావింపన్+తలంచి= రప్పించనెంచి; తన పనుపునన్= తన ఆజ్ఞచేత; ఆ+వెలంది= ఆ స్త్రీ - ద్రౌపది; ద్రుపదవిరాటులు= ద్రుపదుడూ, విరాటుడూ; చచ్చిన మఱు నాఁడు= చచ్చిపోయిన మరుసటి దినం; తదీయ పత్నులకున్= వారి భార్యలకు; శోక+అపనోదంబు+చేయుటకై= దుఃఖం పోగొట్టడానికని; సుభద్రయున్= సుభద్రా; ఉత్తరయును= ఉత్తరా; తోన్+అరుగన్= వెంటరాగా; విడదలనుండి= శిబిరంనుండి; విరాటు నగరంబునకున్= విరాటుడి పట్టణానికి; అరిగి= వెళ్ళి; ద్రుపదుండును; కొడుకులున్; ఆ+వీటికిన్= ఆ పట్టణానికి; వచ్చునాఁడు= వచ్చేటప్పుడు; తోడన్+అ= వెంటనే; వచ్చి; కోడండ్రును+తానును= కోడళ్ళూ, తనూ; అందున్+అ+ఉన్న= అక్కడే ఉన్నట్టి; ఆ ద్రుపదుపత్నిని= ఆ ద్రుపదుడి భార్యనూ; విరాటపత్నిన్= విరాటుడి భార్యనూ; కాంచి= చూచి; పదంపడి= తరువాత; సుభద్ర; అర్జున+అనుమతి= అర్జునుడి సమ్మతి; పడసి= పొంది; ద్వారవతికిన్+పోన్= ద్వారకకు వెళ్ళటానికి; ఆ+ మత్స్య పురంబునన్= ఆ మత్స్యనగరంలో-విరాటనగరంలో; ఉనికిన్+చేసి= ఉండటంచేత; ఆ+నరనాథుండు= ఆ రాజు-ధర్మరాజు; నకులున్+కనుంగొని= నకులుడిని చూచి; అతి త్వరిత గమనంబునకున్= మిక్కిలి తొందరగా వెళ్ళటానికి; తగు రథంబునన్= తగిన రథానికి; చటులంబులు+ఐన= చంచలములయిన; రథ్యంబులన్= గుర్రాలను; పూన్చికొని= కట్టి; ఉపప్లావ్యంబునకున్+చని= ఉపప్లావ్యపురానికి వెళ్ళి; ద్రుపద నందనను= ద్రౌపదినీ; తక్కును= మిగిలిన; మన దెసన్+కలుగు+ అంగనలను= మనవైపు స్త్రీలను; ద్రుపద మత్స్యపతి పక్షంబు భామలను= ద్రుపదరాజు; విరాటరాజు వైపు స్త్రీలను; తోడ్కొని= వెంటబెట్టుకొని; ఆ+విడదలకున్= ఆ శిబిరానికి; చనుదెమ్ము+అని చెప్పి= రమ్మని చెప్పి; ఏమున్= మేముకూడా; ఆ+ఎడకున్= ఆ ప్రదేశానికి; చనుదెంచెదము+అనుటయున్= వస్తాము అనగా; అతండు= నకులుడు; తద్+ఉక్త ప్రకారంబునన్= అతడు (ధర్మరాజు) చెప్పిన రీతిగా; చనియెన్= వెళ్ళాడు; ఆ+జనవల్లభుండు= ఆ రాజు(ధర్మరాజు); తక్కటి తమ్ములును= తక్కిన తమ్ములూ; దామోదర సాత్యకులును= కృష్ణసాత్యకులూ; అడలుచున్= దుఃఖిస్తూ; తన్నున్= తనను; పొదివికొని= కూడుకొని; చనన్= వెళ్ళగా; కౌరవ శిబిరంబునన్+కల జనంబులు= కౌరవశిబిరంలో ఉన్న జనులు; కొల్చి+పోవన్= సేవించి నడువగా; ఏడ్చుచున్= ఏడుస్తూ; నిజ శిబిరంబునకున్= తన శిబిరానికి; పోయి; తద్+ప్రదేశంబునన్= అక్కడ.

**తాత్పర్యం:** అని దుఃఖంతో కుమిలి ద్రౌపదిని రప్పించనెంచాడు. తన ఆజ్ఞ చొప్పున ఆమె ద్రుపద విరాటులు చచ్చిపోయిన మర్నాడు వారి భార్యలను ఓదార్చటానికని సుభద్రా, ఉత్తరా కూడా రాగా, శిబిరం నుండి విరాటనగరానికి వెళ్ళింది. ద్రుపదుడూ, కొడుకులూ ఆ విరాటనగరానికి వచ్చేటప్పుడు వాళ్ళ వెంటనే వచ్చి కోడళ్ళతో అక్కడే ఉన్న ద్రుపదుడి భార్యను, విరాటుడి భార్యను చూచింది. తరువాత అర్జునుడి అనుమతి పొంది సుభద్ర ద్వారకకు వెళ్ళటానికి ఆ విరాట నగరంలోనే ఉన్నది. అందుచేత ధర్మరాజు నకులుడిని చూచి, మిక్కిలి తొందరగా వెళ్ళటానికి తగిన రథానికి బాగా పరిగెత్తే గుర్రాలను పూన్చి 'నీవు ఉపప్లావ్యపురానికి వెళ్ళి ద్రౌపదినీ, తక్కిన మనస్త్రీలనూ, ద్రుపద విరాటుల స్త్రీలనూ వెంటబెట్టుకొని ఆ శిబిరానికి రమ్ము. మేము కూడా అక్కడికి వస్తాము' అని చెప్పాడు. నకులుడు ధర్మరాజు చెప్పిన విధంగా వెళ్ళాడు. ధర్మరాజు తక్కిన తమ్ములూ, కృష్ణ సాత్యకులూ దుఃఖిస్తూ తనతో రాగా, కౌరవశిబిరంలో ఉన్న జనులు సేవిస్తూ నడవగా, ఏడుస్తూ తన శిబిరానికి పోయి, అక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం).

**మహాస్రగ్ధర.**

> **స్ఫురదశ్వత్థామ చంచద్భుజలసదసి విస్ఫూర్జిత క్రూరధారా**
> **పరికృత్తావ్యక్తగాత్రప్రకరుల, సఖులన్, బంధులం, బుత్రులం, దాఁ**
> **గరుణం బుప్పొంగ నార్తిం గనుఁగొని, వికలాంగత్వముం బొంది మూర్ఛా**
> **పరతంత్రుండై ధరిత్రిం బడినఁ, బడిరి తద్భ్రాతలుం, గేశవుండున్. 21**

**ప్రతిపదార్థం:** స్ఫురత్= ప్రకాశిస్తున్న; అశ్వత్థామ= అశ్వత్థామయొక్క; చంచత్= చలిస్తున్న; భుజ= బాహువులలో; లసత్= ప్రకాశిస్తున్న; అసి= కత్తియొక్క; విస్ఫూర్జిత= ప్రకాశించే; క్రూర= కనికరంలేని; ధారా= అంచుచేత; పరికృత్త= ఖండించబడిన; అవ్యక్త= స్పష్టంగా తెలియబడని; గాత్ర= అవయవాలయొక్క; ప్రకరులన్= సమూహాలుగలవారైన; సఖులన్= మిత్రులనూ; బంధులన్= చుట్టాలనూ; పుత్రులన్= కొడుకులనూ, తాన్= తాను(ధర్మరాజు); కరుణంబు= కరుణరసం; ఉప్పొంగన్= పొంగిపొరలగా; ఆర్తిన్= బాధతో; కనుఁగొని= చూచి; వికల+అంగత్వమున్ పొంది= అవయవాలు వశంతప్పి; మూర్ఛా+పరతంత్రుఁడు+ఐ= మూర్ఛకు లోనైనవాడై; ధరిత్రిన్= నేలమీద; పడినన్= పడగా; తద్+భ్రాతలున్= అతడి సోదరులూ; కేశవుండున్= కృష్ణుడూ; పడిరి.

**తాత్పర్యం:** అశ్వత్థామ చేతిలో ప్రకాశించే కత్తిచేత ఖండించబడి, ఇది ఆ అవయవం అని తెలియకుండా ఉన్న అవయవాలు గల మిత్రులనూ, చుట్టాలనూ, కొడుకులనూ చూచి ధర్మరాజు కరుణరసం ఉప్పొంగగా బాధతో చూచి అవయవాలు వశంతప్పి మూర్ఛకు లోనయి నేలపై పడగా, అతడి సోదరులూ, కృష్ణుడూ కూడా పడ్డారు.

**వ. ఇట్లు పడి సాత్యకి ప్రయత్నంబున నందఱుం దెలిసిరి. ధర్మనందనుండు వెడవెడ దెలిసియు మగుడ నిగుడు నడలున మనంబు మునుంగ వెగడొంది నందనుల తనువుల మీఁద వ్రాలుచు వదనంబు బాష్పాంబు ధారాక్రాంతంబుగాఁ బ్రకటాక్రందనంబు సేయుచుఁ బలవించుచుండెఁ; గృష్ణార్జునులు సముచిత భాషణంబుల బోధించిరి. తక్కటివారును దగుమాటల నుపచరించిరి. కొండొకసేపునకు నవ్విభుండు రోదనంబు దక్కె.22**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పడి; సాత్యకి ప్రయత్నంబునన్= సాత్యకియొక్క ప్రయత్నంచేత; అందఱున్; తెలిసిరి= తెప్పిరిల్లారు; ధర్మనందనుండు= ధర్మరాజు; వెడవెడ= కొంచెం; తెలిసియున్= తెప్పిరిల్లీ; మగుడన్= మళ్ళీ; నిగుడు+అడలునన్= కలిగే దుఃఖంలో; మనంబు= మనస్సు; మునుంగన్= మునుగగా; వెగడు+ఒంది= తల్లడపడి; నందనుల తనువుల మీఁదన్= కొడుకుల శరీరాలపై; వ్రాలుచున్= పడుతూ; వదనంబు= ముఖం; బాష్ప+అంబు+ధారా+ఆక్రాంతంబు+కాన్= కన్నీటి ప్రవాహంచేత ఆక్రమించబడినది కాగా; ప్రకట+ఆక్రందనంబు+చేయుచున్= బిగ్గరగా మొర్రోమంటూ; పలవించుచున్+ఉండెన్= ఏడుస్తున్నాడు; కృష్ణ+అర్జునులు= కృష్ణుడూ, అర్జునుడూ; సముచిత భాషణంబులన్= తగిన మాటలతో; బోధించిరి= ఓదార్చారు; తక్కటివారును= తక్కినవారుకూడా; తగు మాటలన్= తగిన మాటలతో; ఉపచరించిరి= బోధించారు; ఆ+విభుండు= ఆ రాజు- ధర్మరాజు; కొండొకసేపునకున్= కొంతసేపటికి; రోదనంబు+తక్కె= ఏడుపుమాని.

**తాత్పర్యం:** ఇట్లా పడి సాత్యకి ప్రయత్నంచేత అందరూ తెప్పిరిల్లారు. ధర్మరాజు కొంచెం కొంచెంగా తేరుకొని మళ్ళీ కలిగే దుఃఖంలో మనస్సు మునుగగా తల్లడిల్లి కొడుకుల శరీరాలపై పడుతూ ముఖం కన్నీటి ప్రవాహంతో నిండగా బిగ్గరగా మొర్రోమని ఏడ్చాడు. కృష్ణార్జునులు తగిన మాటలతో ఓదార్చారు. తక్కినవాళ్ళు కూడా తగినట్లు మాటలాడి బోధించారు. కొంతసేపటికి ఆ రాజు ఏడుపుమాని. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'వ్రాలుచున్' - ఈ మాట పెక్కు ప్రతుల్లో ఉన్నదనటంచేత, అన్వయం యోగ్యతరంగా ఉంటుందని, స్వీకరించబడింది.

**తే.** **పుత్రులకు బాంధవులకును మిత్రతతికి । నగ్నికార్యంబు వొగులుచు నాచరించి**
**యొక్కచోట నాసీనుఁడై యుండె ద్రుపద । తనయ వచ్చుట వార్చి నెమ్మనము దలర.** **23**

**ప్రతిపదార్థం:** (పూర్వవచనంలోని 'అవ్విభుండు' - కర్త); పొగులుచున్= ఏడుస్తూ; పుత్రులకున్= కొడుకులకూ; బాంధవులకును= చుట్టాలకూ; మిత్ర తతికిన్= స్నేహితుల సమూహానికీ; అగ్ని కార్యంబు= దహనం; పొగులుచున్= కుములుతూ; ఆచరించి= చేసి; నెఱ+మనము= మనస్సు; తలరన్= చలించగా; ద్రుపద తనయ= ద్రౌపది; వచ్చుట= రాక; వార్చి= ప్రతీక్షించి; ఒక్కచోటన్; ఆసీనుఁడు+ఐ+ఉండెన్= కూర్చున్నాడు.

**తాత్పర్యం:** (ధర్మరాజు) దుఃఖిస్తూ కొడుకులకూ, చుట్టాలకూ, స్నేహితుల సమూహానికీ దహనకార్యం చేసి మనస్సు చలించగా ద్రౌపదికొరకు ప్రతీక్షిస్తూ ఒకచోట కూర్చున్నాడు.

**వ.** **అద్దేవియు నకులునిచేత నుపప్లావ్యంబున సుత సోదర మరణ ప్రకారంబు వినుటం జేసి.** **24**

**ప్రతిపదార్థం:** ఆ+దేవియున్= ఆ ద్రౌపదీదేవి కూడా; నకులునిచేతన్= నకులుడివలన; ఉపప్లావ్యంబునన్= ఉపప్లావ్యపురంలో; సుత సోదర మరణ ప్రకారంబున్= కొడుకులూ, సోదరులూ చచ్చిపోయిన విధం; వినుటన్+చేసి= వినటంచేత.

**తాత్పర్యం:** ఆ ద్రౌపదికూడా నకులుడివలన ఉపప్లావ్యపురంలో కొడుకులూ, సోదరులూ చచ్చిపోయిన విధం వినటంచేత. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **అలఁత గదిరి నోరెండఁగఁ । బలవించుచుఁ దోడుతోడ బాష్పజలం బ**
**గ్గలమై క్రమ్మఁగ సొలయుచుఁ । దెలియుచు నాతనికి నడలు దీపింపంగన్.** **25**

**ప్రతిపదార్థం:** అలఁత= దుఃఖం; కదిరి= అతిశయించి; నోరు+ఎండఁగన్= నోరు ఆర్చుకొనిపోయేటట్టు(ఆమె); పలవించుచున్= రోదిస్తూ; తోడుతోడన్= వెనువెంటనే; బాష్పజలంబు= కన్నీరు; అగ్గలము+ఐ= ఎక్కువై; క్రమ్మఁగన్= అలముకోగా; సొలయుచున్= మూర్ఛపోతూ; తెలియుచున్= తెప్పిరిల్లుతూ; ఆతనికిన్= ఆ నకులుడికి; అడలు= దుఃఖం; దీపింపంగన్= అతిశయించగా.

**తాత్పర్యం:** దుఃఖం అతిశయించి నోరు ఆర్చుకుపోయేటట్టు (ఆమె) రోదిస్తూ వెనువెంటనే కన్నీళ్ళు ఎక్కువై అలముకోగా మూర్ఛపోతూ తెప్పిరిల్లుతూ, ఆ నకులుడి శోకం అతిశయించగా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **అరుగుదెంచి యంతంత నవనీకాంతుఁగాంచి యధిక శోకాక్రాంతయై యార్తిం గూరి యాక్రందనంబు సేయ నమ్మాద్రీపుత్రుం డొయ్యన యయ్యంగన నరదంబు డించె; నుచిత వాహనంబుల నెక్కి తోడన వచ్చిన వనితాజనంబు లవతరణంబు సేసి వనట వందురుచుఁ బరివేష్టించి; రప్పు డా వధూరత్నంబు.** **26**

**ప్రతిపదార్థం:** అరుగుదెంచి= వచ్చి; అంతంతన్= కొంచెందూరం నుంచి; అవనీకాంతున్= రాజును (ధర్మరాజును); కాంచి= చూచి; అధికశోక+ఆక్రాంత+ఐ= మిక్కిలి దుఃఖంచేత ఆక్రమించబడిన దయి; ఆర్తిన్+కూరి= బాధలో మునిగి; ఆక్రందనంబు+ చేయన్= ఏడువగా; ఆ+మాద్రీ పుత్రుండు= ఆ మాద్రికొడుకు-నకులుడు; ఒయ్యన= మెల్లగా; ఆ+అంగనన్= ఆ స్త్రీని (ద్రౌపదిని); అరదంబున్+డించెన్= రథంనుండి దింపాడు; ఉచిత వాహనంబులన్= తగిన వాహనాలను; ఎక్కి; తోడన్+అ=

వెంట; వచ్చిన; వనితా జనంబులు= స్త్రీలు; అవతరణంబు+చేసి= దిగి; వనటన్= శోకంతో; వందురుచున్= దుఃఖిస్తూ; పరివేష్టించిరి= చుట్టూ కూర్చున్నారు; అప్పుడు= ఆ సమయంలో; ఆ వధూరత్నంబు= ఆ కాంతామణి - ద్రౌపది.

**తాత్పర్యం:** వచ్చి కొంచెం దూరంనుండి ధర్మరాజును చూచి అధిక శోకాక్రాంత అయి, బాధలో మునిగి రోదించగా ఆ నకులుడు మెల్లగా ఆమెను రథంనుండి దింపాడు. తగిన వాహనా లెక్కి వెంట వచ్చిన స్త్రీలు దిగి ఏడుస్తూ చుట్టూ కూర్చున్నారు. అప్పుడు ఆ కాంతామణి ద్రౌపది. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **పెనుమంచునఁ జెలువేదిన । వనజంబును బోలె నశ్రువారిపరీతా**
**ననము చెలువెడలఁ గొడుకలఁ । బనవుచుఁ జరణములు తొట్రువడ దీనగతిన్. 27**

**ప్రతిపదార్థం:** పెను మంచునన్= అధికమైన మంచుచేత; చెలువు+ఏదిన= అందం కోల్పోయిన; వనజంబును+పోలెన్= పద్మంలా; అశ్రువారి పరీత+ఆననము= కన్నీళ్ళతో నిండిన ముఖం; చెలువు+ఎడలన్= అందం నశించగా; కొడుకులన్= కొడుకులను గూర్చి; పనవుచున్= ఏడుస్తూ; చరణములు= కాళ్ళు; తొట్రు+పడన్= తడబడగా; దీనగతిన్= విచారంతో.

**తాత్పర్యం:** అధికమైన మంచుచేత అందం కోలుపోయిన పద్మంవలె కన్నీటితో నిండిన ముఖం అందం నశించగా కొడుకులను గూర్చి ఏడుస్తూ కాళ్ళు తడబడగా దైన్యంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ. 'పెనుమంచున - చెలువెడలన్' అలంకారం ఉపమ. అశ్రువారి - పెనుమంచు, ఆననము - వనజము- ఉపమేయోపమానాలు. చెలువేదు - సామాన్యధర్మం. పోలెన్ - ఉపమావాచకం.

**వ.** **కొన్ని యడుగులు వచ్చి వసుధాతలంబున వ్రాలిన వేగంబ వాయునందనుం డా ద్రుపదనందనఁ గ్రుచ్చియెత్తి ధర్మసూను సమీపంబునకుఁ దెచ్చిన నమ్మగువ మగుడ నిలంబడి యమ్మహీపతి యాననం బాలోకించి యెలుంగు రాలుపడ దైవమానుషంబులు సుసంగతంబులై యుండుటయు నతనికి సామ్రాజ్యంబు చొప్పడుటయు నుగ్గడించి. 28**

**ప్రతిపదార్థం:** కొన్ని+అడుగులు వచ్చి= కొన్ని అడుగులువేసి; వసుధా తలంబునన్= నేలమీద; వ్రాలినన్= పడగా; వేగంబు+అ= వడిగా; వాయు నందనుండు= భీముడు; ఆ ద్రుపద నందనన్= ఆ ద్రౌపదిని; క్రుచ్చి+ఎత్తి= పట్టుకొని లేవదీసి; ధర్మసూను సమీపంబునకున్= ధర్మరాజు దగ్గరకు; తెచ్చినన్= తీసికొనిరాగా; ఆ+మగువ= ఆ స్త్రీ-ద్రౌపది; మగుడన్= మళ్ళీ; ఇలన్+పడి= నేలపైబడి; ఆ+మహీపతి+ఆననంబు= ఆ రాజుముఖం; ఆలోకించి= చూచి; ఎలుంగు రాలుపడన్= కంఠస్వరం డగ్గుత్తికపడగా; దైవ మానుషంబులు= దైవమూ, పురుష ప్రయత్నమూ; సుసంగతంబులు+ఐ= బాగా పొసగినవయి; ఉండుటయున్= ఉండటమూ; అతనికిన్; సామ్రాజ్యంబు; చొప్పడుటయున్= లభించటమూ; ఉగ్గడించి= ప్రశంసించి.

**తాత్పర్యం:** కొన్ని అడుగులు వేసి నేలమీద వాలింది. వెంటనే భీముడు ఆ ద్రౌపదిని పట్టుకొని లేవదీసి ధర్మరాజు దగ్గరకు తీసికొనిరాగా, ఆమె మళ్ళీ నేలపైబడి ఆ రాజు ముఖం చూచి డగ్గుత్తికపడ్డ కంఠస్వరంతో దైవమూ, పురుషకారమూ రెండూ బాగా పొసగినవై ఉండటమూ, అతడికి సామ్రాజ్యం లభించటమూ ప్రశంసించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. కలిమికి నొప్పఁగాఁగ బలగంబయి నీకడ నా తనూభవుల్**
**మెలఁగఁగఁ జూడఁ గానన; యమేయ భుజాబలశాలి విక్రమో**
**జ్జ్వలుఁడు సుభద్రపట్టియును వమ్మయిపోయె; ననూనభోగముల్**
**గలిగెన్ యేనియున్ మఱవఁగా వశమే మన కా కుమారులన్? 29**

**ప్రతిపదార్థం:** కలిమికిన్= సంపదకు; ఒప్పు+కాఁగన్= తగినట్లుగా; బలఁగంబు+అయి= పరిజనమై; నీ కడన్= నీ దగ్గర; నా తనూభవుల్= నా కొడుకులు; మెలఁగఁగన్+చూడన్+కానన్=అ= ఉండటం చూడనేలేకపోయాను; అమేయ భుజా బలశాలి= అపరిమిత బాహుబల సంపన్నుడూ; విక్రమోజ్జ్వలుఁడు= పరాక్రమంచేత ప్రకాశించేవాడూ(అయిన); సుభద్ర పట్టియును= సుభద్రకొడుకూ-అభిమన్యుడూ; వమ్ము+అయి పోయెన్= వ్యర్థమైపోయాడు; అనూన భోగముల్= తక్కువకాని సుఖాలు; కలిగెన్+అ+ఏనిన్= ఉన్నప్పటికీ; మనకున్= మనకు; ఆ కుమారులన్= ఆ బిడ్డలను; మఱవఁగాన్+వశమే?= మరిచిపోవ తరమా?

**తాత్పర్యం:** సంపదకు తగ్గట్లుగా పరివారమయి నీ దగ్గర నా కుమారులు వర్తిల్లటం నేను చూడనేలేకపోయాను. అమిత బాహు బల సంపన్నుడూ, పరాక్రమశాలీ అయిన అభిమన్యుడు కూడా నశించాడు. అధిక భోగాలున్నా మనకు ఆ కుమారులను మరచిపోవ తరమా?

**వ. అని యప్పు డశ్వత్థామోద్దామ రణకరణస్మరణంబు దన చిత్తం బుత్తల పెట్టఁ గోపంబు దీపింప నాసీనయై. 30**

**ప్రతిపదార్థం:** అని; అప్పుడు= ఆ సమయంలో; అశ్వత్థామ+ఉద్దామ రణ కరణ స్మరణంబు= అశ్వత్థామయొక్క గొప్ప యుద్ధపుచేత యొక్క స్మృతి; తన చిత్తంబు= తన మనస్సును; ఉత్తలపెట్టన్= కలతపెట్టగా; కోపంబు; దీపింపన్= అతిశయించగా; ఆసీన+ఐ= కూర్చున్నదై.

**తాత్పర్యం:** అని అప్పుడు అశ్వత్థామ యుద్ధం చేసిన రీతి తలపుకు వచ్చి తన మనస్సును కలతపెట్టగా కోపాతిశయంతో కూర్చున్నదై.

**క. 'భూరమణ! గాఢనిద్రం । గూరిన సమయమున ముట్టికొని నా సుతులం**
**గ్రూరతఁ దెగటార్చెను బా । పారంభుఁడు గురుతనూజుఁ డక్రమలీలన్. 31**

**ప్రతిపదార్థం:** భూరమణ!= రాజా!; నా సుతులన్= నా కుమారులను; గాఢనిద్రన్+కూరిన సమయమునన్= గాఢంగా నిద్రపోతూన్న సమయంలో; పాప+ఆరంభుఁడు= పాపాత్ముడు అయిన; గురుతనూజుఁడు= గురుపుత్రుడు-అశ్వత్థామ; ముట్టికొని= మార్కొని; అక్రమలీలన్= అధర్మ పద్ధతిలో; క్రూరతన్= కనికరం లేకుండా; తెగటార్చెను= చంపాడు.

**తాత్పర్యం:** 'రాజా! నా కుమారులు మంచి నిద్రలో ఉన్న సమయంలో పాపాత్ముడైన అశ్వత్థామ మార్కొని అధర్మ పద్ధతిలో కనికరం లేకుండా చంపాడు.'

**క. అది యాఱని పెను చిచ్చై । మదిఁ గాల్పఁ దొడంగె దీని మాన్ప నుపాయం**
**బు దలంప నొండు లే ద । య్యదయుని ముట్టుకొని నామ మడఁచుట దక్కన్. 32**

**ప్రతిపదార్థం:** అది= ఆ అక్రమయుద్ధం; ఆఱని= ఆరిపోని; పెను చిచ్చు+ఐ= పెద్ద అగ్నియై; మదిన్= మనస్సును; కాల్పన్+ తొడంగెన్= దహించసాగింది; ఆ+అదయునిన్= ఆ నిర్దయుడిని; ముట్టుకొని= ఎదిరించి; నామము+అడఁచుట+తక్కన్= పేరులేకుండా చేయటంతప్ప; తలంపన్= ఆలోచించగా; దీనిన్= ఈ దుఃఖాన్ని; మాన్పన్= పోగొట్టటానికి; ఉపాయంబు= ఉపాయం; ఒండు లేదు= ఇంకొకటి లేదు.

**తాత్పర్యం:** 'అతడు చేసిన అధర్మయుద్ధం ఆరిపోని పెద్ద అగ్ని అయి మనస్సును దహించసాగింది. ఆ నిర్దయుడిని ఎదిర్చి పేరు లేకుండా చేయటం తప్ప, ఆలోచించగా, ఈ దుఃఖాన్ని ఉపశమింప చేయటానికి ఇంకొక ఉపాయం లేదు.

**క. వాయుసుతుఁ బనిచి నేఁడటు । సేయింపక తక్కితేనిఁ జెప్పెద విను మేఁ**
**బ్రాయోపవేశమున నీ । కాయ ముపేక్షింతుఁ జుమ్ము కౌరవనాథా!' 33**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కురుపతీ-ధర్మరాజా!; వాయుసుతున్= భీముడిని; పనిచి= పంపి; నేఁడు= ఈ వేళ; అటు= ఆ విధంగా; పేరుమాపేపని; చేయింపక తక్కితి(వి)+ఏనిన్= నీవు చేయించకపోతే; చెప్పెదన్+వినుము= చెపుతా విను; ఏన్= నేను; ప్రాయోపవేశమునన్= ఆమరణ నిరాహారదీక్షతో; ఈ కాయము= ఈ శరీరం; ఉపేక్షింతున్+చుమ్ము= విడుస్తాను సుమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! భీముడిని నియోగించి ఈ వేళ ఆ విధంగా వాడి పేరు మాపే పని నీవు చేయించకపోతే, చెపుతాను వినుము - నేను ఆమరణనిరాహారదీక్షతో ఈ శరీరం విడుస్తాను సుమా!'

**వ. అనుటయు నమ్మనుజపతి యమ్మానిని కిట్లనియె. 34**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ద్రౌపది అలా అనగా; ఆ+మనుజపతి= ఆ రాజు; ఆ+మానినికిన్= ఆ మానవతికి; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అట్లా అనగా ఆ ధర్మరాజు ఆ మానవతితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: పరికరం. ద్రౌపది పట్టుదల గల స్త్రీ కాబట్టి. ఇక్కడ ఆమెకు 'మానిని' అనే విశేషణం సాభిప్రాయం. కాబట్టి అలంకారం పరికరం.

**క. 'క్షితిపతి తనయులు పోర । న్మృతిఁ బొందుట తగునకాదె నీ సోదరులున్**
**సుతులు నతిపుణ్యపురుషో । చిత సుగతులు గనిరి వగలఁ జేడ్పడ నేలా? 35**

**ప్రతిపదార్థం:** క్షితిపతి తనయులు= రాచబిడ్డలు; పోరన్= యుద్ధంలో; మృతిన్+పొందుట= మరణించటం; నీ సోదరులున్= నీ సోదరులూ; సుతులున్= కుమారులూ; అతి పుణ్యపురుష+ఉచిత సుగతులు= మిక్కిలి పుణ్యాత్ములకు తగిన సద్గతులు; కనిరి= పొందారు; వగలన్= దుఃఖంతో; చేడ్పడన్+ఏలా= బాధపడటం దేనికి?

**తాత్పర్యం:** 'రాచబిడ్డలు యుద్ధంలో మరణించటం సముచితమే కదా! నీ సోదరులూ, కుమారులూ మిక్కిలి పుణ్యాత్ములకు తగిన సద్గతులు పొందారు. ఇంక నీవు దుఃఖంతో బాధపడటం దేనికి?

**వ. మనస్వినివైన నీ కుపశమించుట గర్తవ్యంబు. శోకంబు దక్కు మశ్వత్థామ యొనర్చిన పరాభవంబునఁ బుట్టిన యలుక వాని సమయింపక పోదని చెప్పుటయ కాదు, నా తలంపును నిట్ల; వాఁ డడవిం గలసినవాఁడు గానోపు; సమయించుట నీ కె ట్లెఱుంగ నగుఁ? జెప్పు' మనిన నప్పాలఁతి 'యప్పాపాత్మునకు సహజంబైన శిరోమణి గలదు, దానిం దెచ్చి యిచ్చినఁ జూచి జీవంబుతో నుండెద నని తలంచితి' నని పురుషాక్షరంబుగాఁ బలికి యప్పవమానతనయుఁ దన పాణితలంబున సంస్పర్శించి. 36**

**ప్రతిపదార్థం:** మనస్వినివి+ఐన= ప్రశస్తమైన మనస్సు కలదానవైన; నీకున్; ఉపశమించుట= శాంతించుట; కర్తవ్యంబు= కార్యము; శోకంబు= విచారం; తక్కుము= మాను; అశ్వత్థామ+ఒనర్చిన పరాభవంబునన్= అశ్వత్థామ చేసిన అవమానంవలన; పుట్టిన= కలిగిన; అలుక= కోపం; వానిన్= అతడిని; సమయింపక పోదు= చంపకుండా పోదు; అని; చెప్పుట+అ= చెప్పటమే; కాదు; నా తలంపును= నా అభిప్రాయమూ; ఇట్లు+అ= ఇట్లే; వాఁడు= అతడు(అశ్వత్థామ); అడవిన్+కలసినవాఁడు= అడవిలో కలిసినవాడు; కాన్+ఓపున్= అయి ఉంటాడు; సమయించుట= చంపటం; నీకున్; ఎట్లు+ఎఱుంగన్+అగున్= ఎలా తెలస్తుంది?; చెప్పుము; అనినన్; ఆ+పొలఁతి= ఆ స్త్రీ (ద్రౌపది); ఆ+పాప+ఆత్మునకున్= ఆ దుష్టుడికి; సహజంబు+ఐన= పుట్టుకతో ఉన్న; శిరోమణి= తలమానికం; కలదు; దానిన్; తెచ్చి; ఇచ్చినన్; చూచి; జీవంబుతోన్+ఉండెదన్= ప్రాణాలతో ఉంటాను; అని; తలంచితిన్; అని; పరుష+అక్షరంబుగాన్= నిష్ఠురంగా; పలికి; ఆ+పవమాన తనయున్= ఆ వాయుకుమారుడిని - భీముడిని; తన పాణితలంబునన్= తన చేతితో; సంస్పర్శించి= తాకి.

**తాత్పర్యం:** మంచి మనస్సుగల నీవు శాంతించటం మంచిది. శోకం మానుము. అశ్వత్థామ చేసిన అవమానం వలన కలిగిన కోపం వాడిని చంపితేకాని పోదని చెప్పటం కాదు. నా అభిప్రాయం కూడా ఇదే. వాడు అడవులపాలై పోయి ఉంటాడు. చంపినట్లు నీకెట్లా తెలుస్తుంది? చెప్పుము.' అంటే, ద్రౌపది' ఆ దుష్టుడికి పుట్టుకతోనే శిరోమణి ఉన్నది. దానిని తెచ్చి ఇస్తే చూచి ప్రాణాలతో ఉందా మని అనుకొన్నాను' అని కఠినంగా పలికి భీముడిని తన చేతితో స్పృశించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'క్షత్రధర్మ మాత్మఁ గైకొని రయమున । నరిగి పాపకర్ముఁడైన కుంభ**
**జన్మతనయు ముట్టి చంపుము నా మది । కనలు నడలు నుడిపి కావు నన్ను.' 37**

**ప్రతిపదార్థం:** క్షత్రధర్మము= క్షత్రియధర్మం; ఆత్మన్= మనస్సులో; కైకొని= పూని; రయమునన్= శీఘ్రంగా; అరిగి= వెళ్ళి; పాపకర్ముఁడు+ఐన= దుర్మార్గుడైన; కుంభజన్మ తనయున్= ద్రోణుడి కొడుకైన అశ్వత్థామని; ముట్టి= తాకి; చంపుము; నా మది కనలున్+అడలున్= నా మనస్సులోని కోపాన్నీ, శోకాన్నీ; ఉడిపి= మాన్పి; నన్నున్; కావు= రక్షించు.

**తాత్పర్యం:** 'మనస్ఫూర్తిగా క్షత్రియోచిత ధర్మం పూని శీఘ్రమే వెళ్ళి ఆ దుష్టుడైన అశ్వత్థామను తాకి చంపుము. నా మనస్సులోని కోపాన్నీ, శోకాన్నీ మాన్పి నన్ను రక్షించుము.'

**వ. వెండియు. 38**

**తాత్పర్యం:** ఇంకా.

ద్రౌపది యశ్వత్థామం బరిభవింప భీమసేను నియోగించుట (సం. 10-11-21)

**సీ. 'జతుగృహదాహావసరమునఁ జేసిన । సముదీర్ణతరపౌరుషంబుతోడ**
**నత్యుగ్రుఁడగు హిడింబాసుర వ్రచ్చిన । చోటఁ గైకొన్న నిష్ఠురతతోడ**
**యక్షులు పొదివిన యపుడు పాటించిన । యాభీల దోర్బలవ్యాప్తితోడ**
**సమధికబలుఁడు గీచకుని యేఁచినయెడఁ । బూనిన విక్రమస్ఫూర్తితోడఁ**

**ఆ. గూడ నిన్ను జనులు గొనియాడునట్టుగఁ । జనుము నీదు బలముఁ జలము మెఱయ**
**గీటడంపు మనల గెలిచితి నని గర్వ । మునఁ దనర్చు ద్రోణతనయు నెట్లు.' 39**

**ప్రతిపదార్థం:** జతు గృహ దాహ+అవసరమునన్= లక్కయిల్లు కాలే సమయంలో; చేసిన; సముదీర్ణ తన పౌరుషంబుతోడన్= మిక్కిలి గొప్పదైన పౌరుషంతోనూ; అతి+ఉగ్రుఁడు+అగు= మిక్కిలి భయంకరుడైన; హిడింబ+అసురున్= హిడింబుడనే రాక్షసుడిని; వ్రచ్చినచోటన్= చంపినచోట; కైకొన్న= పూనిన; నిష్ఠురతతోడన్= కాఠిన్యంతోనూ; యక్షులు; పొదివిన+అపుడు= ఆక్రమించినప్పుడు; పాటించిన= చూపిన; ఆభీలదోస్(ః)+బల వ్యాప్తితోడన్= భయంకరమైన భుజబల విస్తరంతోనూ; సమధిక బలుఁడు= మిక్కిలి గొప్పబలం కలవాడైన; కీచకుని ఏఁచిన+ఎడన్= కీచకుడు విజృంభించినప్పుడు; పూనిన= చూపిన; విక్రమస్ఫూర్తితోడన్= పరాక్రమ ప్రకాశంతోనూ; కూడన్= కూడుకోగా; నిన్నున్; జనులు; కొనియాడునట్లుగన్= ప్రశంసించే విధంగా; చనుము= వెళ్ళుము. నీదు బలమున్+చలమున్= నీ బలమూ, పట్టుదలా; మెఱయన్= ప్రకాశించేటట్లు; మనలన్= మనలను; గెలిచితిన్+అని= గెలిచానని; గర్వమునన్= అహంకారంతో; తనర్చు= ఒప్పే; ద్రోణతనయున్= అశ్వత్థామను; ఎట్లున్= ఎలా అయినాసరే; గీటడంపు(ము)= చంపుము.

**తాత్పర్యం:** 'లక్క ఇల్లు కాలేటప్పుడు చూపిన మిక్కిలి గొప్ప పౌరుషంతోనూ, మిక్కిలి భయంకరుడైన హిడింబాసురుడిని చంపినప్పుడు పూనిన కాఠిన్యంతోనూ, యక్షులు ఆక్రమించినప్పుడు చూపిన భయంకర భుజపరాక్రమవిస్తరంతోనూ, మిక్కిలి బలవంతుడైన కీచకుడు విజృంభించినప్పుడు ప్రదర్శించిన పరాక్రమ ప్రకాశంతోనూ కూడుకొని, నిన్ను జనులు ప్రశంసించే విధంగా వెళ్ళుము. నీ బలమూ, చలమూ ప్రకాశించేటట్లు మనలను గెలిచానని విర్రవీగే అశ్వత్థామను ఎట్లా అయినా సరే, చంపుము.'

**వ. అనిన విని యగ్గురుపుత్రుదెసం బొడమిన యమర్షంబున మేను వొంగఁ బవమానసూనుండు ద్రుపదనందనతో ధర్మనందనుం డాడిన మాట లశ్వత్థామపైఁ బోవుట కనుమతిగా నంతరంగంబున నంగీకరించి. 40**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఆ+గురుపుత్రు దెసన్= ఆ అశ్వత్థామమీద; పొడమిన= పుట్టిన; అమర్షంబునన్= కోపంతో; మేను= శరీరం; పొంగన్; పవమానసూనుండు= భీముడు; ద్రుపదనందనతోన్= ద్రౌపదితో; ధర్మనందనుండు= ధర్మరాజు; ఆడిన మాటలు= పలికిన పలుకులు; అశ్వత్థామపైన్= అశ్వత్థామమీదికి; పోవుటకున్= వెళ్ళుటకు; అనుమతి+కాన్= అంగీకారంగా, అంతరంగంబునన్= మనస్సులో; అంగీకరించి= సమ్మతించి.

**తాత్పర్యం:** అనగా విని ఆ అశ్వత్థామమీద పుట్టిన కోపంతో శరీరం పొంగగా భీముడును ద్రౌపదితో ధర్మరాజన్న మాటలు అశ్వత్థామ మీదికి పోవటానికి అంగీకారంగా మనస్సులో సమ్మతించి.

**మహాస్రగ్ధర.**

> **కనక ప్రస్ఫీత రత్నోత్కర పరివిసరత్కాంతి రాజన్నిజస్యం**
> **దనముం బన్నంగ నత్యాదరమున నకులుం దా నియోగించె; నాతం**
> **డును దీప్తోత్సాహుఁడై గండున సబలరయాటోపరథ్యాది సత్సా**
> **ధనయోగం బొప్ప సారథ్యమునకు నమరెం దన్మనోవృత్తియుక్తిన్. 41**

**ప్రతిపదార్థం:** తాన్= తాను-భీముడు; కనక= బంగారంయొక్క; ప్రస్ఫీత= మిక్కిలి విస్తారమైన; రత్న= మణులయొక్క; ఉత్కర= సమూహంయొక్క; పరివిసరత్= బాగా వ్యాపిస్తున్న; కాంతి= ప్రకాశంతో; రాజత్= వెలుగొందుతూన్న; నిజస్యందనమున్= తనదైన రథాన్ని; పన్నంగన్= పూన్చటానికి; అతి+ఆదరమునన్= మిక్కిలి ఆదరంతో; నకులున్; నియోగించెన్= ఆజ్ఞాపించాడు; ఆతండును= ఆ నకులుడూ; దీప్త+ఉత్సాహుఁడు+ఐ= ప్రకాశించే ఉత్సాహం కలవాడై; గండునన్= పరాక్రమంతో; సబల= బలంతోనూ; రయ= వేగంతోనూ; ఆటోప= సంభ్రమంతోనూ కూడిన; రథ్య+ఆది= గుర్రాలూ మొదలైన; సత్+సాధన యోగంబు= మంచి ఉపకరణాల కూడిక; ఒప్పన్= ఒప్పగా; తద్+మనస్(ః)+వృత్తి యుక్తిన్= ఆతని(భీముడి) మనోవ్యాపారంతోడి కూడికతో; సారథ్యమునకున్= సారథ్యానికి; అమరెన్= సిద్ధపడ్డాడు.

**తాత్పర్యం:** భీముడు బంగారుకాంతితోనూ, మణుల కాంతితోనూ వెలుగొందుతూన్న తన రథాన్ని సిద్ధం చేయుమని మిక్కిలి ఆదరంతో నకులుడిని నియోగించాడు. అతడు ప్రకాశించే ఉత్సాహంతో, పరాక్రమంతో, బలమూ, వేగమూ, సంభ్రమమూ కల గుర్రాలూ మొదలైన మంచిసాధన సామగ్రి ఒప్పగా, భీముడి మనోవృత్తి కనుగుణంగా సారథ్యం చేయటానికి సిద్ధపడ్డాడు.

**వ. ఇట్లు సహదేవ పూర్వజుం దనకు సారథిం జేసికొని సమీరనందనుండు కోదండ గదాదండాది హేతి సంపన్నం బైన యా రథం బెక్కి శిబిరంబు వేగంబ వెడలి గురుతనయాది యోధుల యరదంబుల చొప్పు వట్టికొని యతిత్వరితగతిం జని కురుక్షేత్ర సంచారి జనంబులం గని 'యశ్వత్థామ యెక్కడ మెలంగెనో యెఱుఁగుదురే?' యని యడిగిన వార లతండు కృపకృతవర్మలతోడం గరినగరంబు దెసకు నరిగి మగిడి భాగీరథీ తీరంబున కరుగుదెంచి యయ్యెడ నయ్యిరువురుం బాసి యొక్క వలని కరుగం దానును గృష్ణద్వైపాయన మహాముని యాశ్రమంబునకై తొలఁగి తత్ప్రదేశంబున వసియించెనని చెప్పుటయు నద్దిక్కు తేరు నడప నియోగించి నట్టియెడ ధర్మనందనునకు వసుదేవనందనుం డిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సమీరనందనుండు= వాయుపుత్రుడు భీముడు; సహదేవ పూర్వజున్= సహదేవుడి అన్నను నకులుడిని; తనకున్= తనకు; సారథిన్= సారథిగా చేసికొని; కోదండ గదాదండ+ఆదిహేతి సంపన్నంబు+ఐన= విల్లూ, దండంవంటి గదా మొదలైన ఆయుధాలతో కూడిన; ఆ రథంబు+ఎక్కి; శిబిరంబున్= శిబిరంనుంచి; వేగంబు+అ= వేగమే; వెడలి; గురుతనయ+ఆదియోధుల+అరదంబుల చొప్పు= అశ్వత్థామ మొదలగు వీరుల రథాల మార్గం; పట్టికొని= అవలంబించి; అతి త్వరితగతిన్= మిక్కిలి తొందరగా; చని; కురుక్షేత్ర సంచారి జనంబులన్+కని= కురుక్షేత్రంలో తిరిగే జనులను చూచి; అశ్వత్థామ; ఎక్కడ; మెలంగెన్= ఉన్నాడో; ఎఱుఁగుదురే?; అని; అడిగినన్; వారలు; అతండు; కృపకృతవర్మలతోడన్; కరినగరంబు దెసకున్= హస్తినాపురివైపు; అరిగి= వెళ్ళి; మగిడి= తిరిగి; భాగీరథీ తీరంబునకున్= గంగానది ఒడ్డుకు; అరుగుదెంచి= వచ్చి; ఆ+ఎడన్= అక్కడ; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరూ; పాసి= విడిచి; ఒక్క వలనికిన్= ఒక దిక్కుకు; అరుగన్= వెళ్ళగా; తానును= తాను; కృష్ణద్వైపాయన మహాముని+ఆశ్రమంబునకై= వ్యాసమునీంద్రుడి ఆశ్రమానికి;

తొలఁగి= వెళ్ళి; తద్+ప్రదేశంబునన్= ఆ చోట; వసియించెన్= నివసించాడు; అని; చెప్పుటయున్= చెప్పగా; ఆ+దిక్కు= ఆ వైపు; తేరు= రథం; నడపన్= పోనివ్వటానికి; నియోగించిన+అట్టి+ఎడన్= నియమించిన సమయంలో; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; వసుదేవ నందనుండు= కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఇట్లా భీముడు నకులుడిని తనకు సారథిగా చేసికొని విల్లూ, గదా మొదలైన ఆయుధాలతో కూడిన ఆ రథం ఎక్కి, శిబిరంనుంచి వేగమే బయలుదేరి అశ్వత్థామాది యోధుల రథాలు వెళ్ళిన మార్గాన్ని అవలంబించి, మిక్కిలి తొందరగా వెళ్ళి, కురుక్షేత్రంలో తిరిగే జనులను చూచి, 'అశ్వత్థామ ఎక్కడున్నాడో ఎరుగుదురా?' అని అడుగగా, వాళ్ళు 'అతడు కృపకృతవర్మలతో హస్తినాపురంవైపు వెళ్ళి, మరలి, గంగానది ఒడ్డుకు వచ్చి అక్కడ ఆ ఇద్దరు వీరులూ తనను విడిచి ఒక దిక్కుగా వెళ్ళగా, తాను వ్యాసాశ్రమానికి వెళ్ళి, అక్కడ నివసించాడు' అని చెప్పగా, 'ఆ వైపు రథం పోని' మ్మని నియోగించిన సమయంలో ధర్మరాజుతో కృష్ణు డిట్లా అన్నాడు:

**చ. అనిలసుతుండు శోకమును నల్కయుఁ జిత్తమునం గరంబు పే**
**ర్చిన గురుపుత్రు ముట్టికొనఁ జెచ్చెరఁ బోయెడు; నీతఁ డొంటి యా**
**తనిపయిఁ బోవ భూరమణ! తప్పదె కార్యము? పెద్దగూర్తు వీ**
**వనుజులలోన నాతనికి; నందఱుఁ బోవుట మేలు పోరికిన్. 43**

**ప్రతిపదార్థం:** భూరమణ!= ఓ రాజా! ధర్మరాజా!; అనిలసుతుండు= భీముడు; శోకమును= దుఃఖమూ; అల్కయున్= కోపమూ; చిత్తమునన్= మనస్సులో; కరంబు పేర్చినన్= మిక్కిలి అతిశయించగా; గురుపుత్రున్= అశ్వత్థామను; ముట్టికొనన్= మార్కొనటానికి; చెచ్చెరన్= శీఘ్రంగా; పోయెడున్= వెడతాడు; ఈతఁడు ఆతనిపయిన్= ఆ అశ్వత్థామమీదికి; ఒంటిపోవన్= ఒక్కడే పోతే; కార్యము= పని; తప్పదె?= చెడదా?; ఈవు= నీవు; అనుజులలోన్= తమ్ముళ్ళలో; ఆతనికిన్= ఆ భీముడికి; పెద్ద+కూర్తువు= మిక్కిలి ఇష్టపడతావు; పోరికిన్= యుద్ధానికి; అందఱున్= అందరూ; పోవుట= పోవటం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! భీముడు శోకమూ, కోపమూ మనస్సులో మిక్కిలి అతిశయించగా అశ్వత్థామను మార్కొనటానికి వేగంగా వెళ్ళాడు. ఇతడు ఒక్కడూ అతడి మీదికి పోతే కార్యం చెడదా? తమ్ముళ్ళందరిలోకీ అతడంటే నీకెంతో ఇష్టం. యుద్ధానికి అందరూ వెళ్ళటం మంచిది.

**వ. వినుము. 'సకల పృథివియు దహింపఁ జాలునట్టి బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రం బశ్వత్థామకు ద్రోణుం డిచ్చెఁ బ్రియాతిశయంబున వివ్వచ్చునకు నొసంగె. నశ్వత్థామ వివ్వచ్చుతోడి మత్సరంబునఁ దదీయబల నైపుణ్యంబునకు నసహ్యంబువడుఁ బడంపడి యెఱింగి పాండవులపై వీఁడు దీనిం బ్రయోగింప కుండవలయు నని తలంచి యమ్మహనీయ సాధనంబు మనుష్యులపైఁ బ్రయోగించుకొలఁది గాకునికియుం గలదు గావున సర్వధర్మవిదుండైన యగ్గురుం డొక్కనాఁ డస్త్రవిషయ సంభాషణ సమయంబున నతనితో ని ట్లనియె.'44**

**ప్రతిపదార్థం:** వినుము; సకల పృథివియున్= భూమినంతనూ; దహింపన్+చాలునట్టి= కాల్చగల; బ్రహ్మశిరోనామకంబు+అను= బ్రహ్మ శిరోనామకం అనే; దివ్య+అస్త్రంబు= దివ్యాస్త్రం; ద్రోణుండు= ద్రోణుడు; అశ్వత్థామకున్= అశ్వత్థామకు; ఇచ్చెన్; ప్రియ+అతిశయంబునన్= ప్రేమాతిశయంచేత; వివ్వచ్చునకున్= అర్జునుడికి; ఒసంగెన్= ఇచ్చాడు; అశ్వత్థామ; వివ్వచ్చుతోడి= అర్జునుడిమీది; మత్సరంబునన్= కోపంతో; తదీయ బల నైపుణ్యంబునకున్= అతడి బలప్రౌఢికి; అసహ్యంబు+పడున్=

అసూయపడతాడు; పదంపడి; తరువాత; ఎఱింగి; పాండవులపైన్= పాండవులపైన; వీఁడు; దీనిన్= దీనిని; ప్రయోగింపక+ ఉండవలయున్+అని తలంచి= ప్రయోగించకుండా ఉండాలని ఎంచి; ఆ+మహనీయ సాధనంబు= ఆ గొప్ప అస్త్రం; మనుష్యులపైన్= మనుష్యులమీద; ప్రయోగించు కొలఁది కాక+ఉనికియున్= ప్రయోగించకూడదనేదీ; కలదు కావునన్= ఉన్నది కాబట్టి; సర్వధర్మ విదుండు+ఐన ఆ+గురుండు= అన్ని ధర్మాలూ తెలిసిన ఆ ద్రోణుడు; ఒక్కనాఁడు= ఒకరోజు; అస్త్ర విషయ సంభాషణ సమయంబునన్= అస్త్రాలను గూర్చిన మాటల సందర్భంలో; అతనితోన్= అశ్వత్థామతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** వినుము. 'భూమినంతటినీ కాల్చగల బ్రహ్మశిరస్సు అనే పేరుగల దివ్యాస్త్రం అశ్వత్థామకు ద్రోణుడిచ్చాడు. ప్రేమాతిశయంచేత అర్జునుడికీ ఇచ్చాడు. అశ్వత్థామ అర్జునుడిమీది కోపం కొద్దీ అతడి బల ప్రౌఢికి అసూయపడతాడు. తరువాత తెలిసి పాండవులమీద వీడు దాన్ని ప్రయోగించకుండా ఉండాలని తలచి, ఆ గొప్ప సాధనం మానవుల మీద ప్రయోగించకూడదనేదీ ఉన్నది కాబట్టి, అన్ని ధర్మాలూ తెలిసిన ఆ ద్రోణుడు ఒకనాడు అస్త్రాలను గూర్చి మాటాడే సందర్భంలో అతడితో ఇట్లా అన్నాడు.'

క. **'మనుజులపై బ్రహ్మశిరం । బనునస్త్రం బేసితేని నశుభం బొలయున్**
**విను మెన్ని యాపదలు వ । చ్చిన నపరోపాయములన చెఱుపుము పుత్రా!'** **45**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; వినుము= విను; మనుజులపైన్= మనుష్యులమీద; బ్రహ్మశిరంబు+అను+అస్త్రంబు= బ్రహ్మశిరోనామకాస్త్రం; ఏసితి(వి)+ఏనిన్= ప్రయోగించితివా; అశుభంబు= కీడు; ఒలయున్= కలుగుతుంది; ఎన్ని+ఆపదలు= వచ్చినన్; అపర+ఉపాయములన్+అ= ఇతరోపాయాలచేతనే; చెఱుపుము= పోగొట్టుము.

**తాత్పర్యం:** 'కుమారా! వినుము. మనుష్యులమీద బ్రహ్మశిరోనామకాస్త్రం ప్రయోగించితివా కీడు కలుగుతుంది. ఎన్ని ఆపదలు వచ్చినా నీవు వాటిని ఇతరోపాయాలచేతనే తొలగించుకొమ్ము.'

వ. **అని చెప్పి మనోగతం బవశంబై నాలుకకు వచ్చి, 'వీఁ డెట్లును సజ్జనుల వృత్తంబునఁ బ్రవర్తిల్లెడునే?;' యని యతండు విన నుగ్గడించె. దానికి నశ్వత్థామ విషాదంబునఁ గుందియుండుఁ గాని యగ్గురుని చెప్పినట్లు సదుపదేశ కరణ నిష్ఠుండుగాఁ; డతనికి దురభిమానంబును గలదు. వినుము చెప్పెదఁ జిరజీవిత్వంబును భర్గవరప్రసాద జనక కారణంబును గలిగి యుండు ననియును దివ్యాస్త్ర శస్త్ర విద్యారహస్యంబునకు మూలం బైన యగస్త్యుచేత ద్రోణుండు వడసిన బ్రహ్మ శిరోనామకంబు దనకుం గలదనియును దత్ప్రభావంబు దేవమనుజ దనుజలోకంబులు భస్మీభూతంబులు సేయు నని యుండుం గావున మున్ను మీరు వనవాసులరై యున్నతఱిఁ దాను మా పురంబునకు వచ్చి యాదవ కుమారులతోడి వినోదంబులం దగిలియుండి యొక్కనాఁ డే నొంటిమై నుండ నా కడకుం జనుదెంచి నగుచు నిట్లనియె.** **46**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; మనస్(ః)+గతంబు= మనసులో ఉన్నది; అవశంబు+ఐ= తనకు తెలియకుండానే; నాలుకకున్ వచ్చినన్= నాలుకమీదికి రాగా; వీఁడు= ఈ అశ్వత్థామ; ఎట్లును= ఎలానూ; సత్+జనుల వృత్తంబునన్= మంచివాళ్ళ ప్రవర్తనతో; ప్రవర్తిల్లెడునే?= ప్రవర్తిస్తాడా; అని; అతండు; వినన్; ఉగ్గడించెన్= పలికాడు; దానికిన్= ఆ మాటకు; అశ్వత్థామ; విషాదంబునన్= విచారంతో; కుంది+ఉండున్+కాని= బాధపడి ఉంటాడే కాని; ఆ+గురుని చెప్పిన+అట్లు= ఆ గురుడు

చెప్పిన విధంగా; సత్+ఉపదేశ కరణ నిష్ఠుండు+కాఁడు= సదుపదేశాన్ని ఆచరించే వాడు కాడు; అతనికిన్; దురభిమానంబును= దురహంకారమూ; కలదు; వినుము; చెప్పెదన్; చిరజీవిత్వంబును= చిరంజీవిత్వంకూడా; భర్గ వర ప్రసాద జనక కారణంబును= ఈశ్వరుడి వర ప్రసాదంవలన కలిగినది; కలిగి+ఉండున్= కలిగి ఉన్నాడు; అనియును; దివ్య+అస్త్ర శస్త్ర విద్యా రహస్యంబునకున్= దివ్యాస్త్ర శస్త్ర విద్యా రహస్యానికి; మూలంబు+ఐన= మూల పురుషుడైన; అగస్త్యు చేతన్= అగస్త్యుడివలన; ద్రోణుండు; పడసిన పొందిన; బ్రహ్మశిరోనామకంబు; తనకున్; కలదు+అనియును; తద్+ప్రభావంబు= దాని మహిమ; దేవ మను దనుజలోకంబులు= దేవతల, మనుష్యుల, రాక్షసుల లోకాలు; భస్మీభూతంబులు+చేయున్+అని= బూడిదచేస్తుందని; ఉండున్; కావునన్; మున్ను= పూర్వం; మీరు; వనవాసులరు+ఐ= అడవిలో వసించేవారై; ఉన్న తఱిన్= ఉన్నప్పుడు; తాను; మా పురంబునకున్= మా నగరానికి; వచ్చి; యాదవ కుమారులతోడి= యాదవ బాలురతోడి; వినోదంబులన్= వేడుకలలో; తగిలి+ఉండి= ఆసక్తుడై యుండి; ఒక్కనాఁడు; ఏన్= నేను; ఒంటిమైన్= ఒంటరిగా; ఉండన్= ఉండగా; నాకడకున్; చనుదెంచి= వచ్చి; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అని చెప్పి, మనస్సులోని మాట తనకు తెలియకుండానే నాలుకమీదకు రాగా, 'వీడు ఎట్లాగూ సజ్జనుల ప్రవర్తన కలిగి ఉంటాడా?' అని అతడు వినేటట్లు అన్నాడు. ఆ మాటకు అశ్వత్థామ విచారంతో బాధపడి ఉంటాడే కాని ఆ గురుడు చెప్పినట్లు సదుపదేశం ఆచరించేవాడు కాడు. అతడికి దురహంకారం ఉన్నది. వినుము. చెప్పుతాను. అతడికి ఈశ్వరవరప్రసాదం వలన చిరంజీవిత్వమూ కలిగింది గదా అనీ, దివ్యాస్త్ర శస్త్ర విద్యా రహస్యానికి మూల పురుషుడైన అగస్త్యుడివలన ద్రోణుడు పొందిన బ్రహ్మశిరోనామకాస్త్రం తనకున్నది కదా! అనీ, దాని మహిమవలన దేవమనుష్యరాక్షసలోకాలు బూడిద అవుతాయనీ ధీమాగా ఉంటాడు. కాబట్టి, పూర్వం మీరు వనవాసం చేస్తూండేటప్పుడు తాను మా నగరానికి వచ్చి యాదవ బాలకులతోడి వేడుకలలో ఆసక్తుడై ఉండి, ఒకనాడు నేను ఒంటరిగా ఉండగా నా దగ్గరకు వచ్చి నవ్వుతూ ఇట్లా అన్నాడు:

**తే. 'విను మగస్త్యుఁడు మా తండ్రి వినుత తపము। పేర్మి కెంతయు నాత్మలోఁ బ్రీతిఁ బొంగి**
**బ్రహ్మ శిరమను దివ్యాస్త్రరత్న మొసఁగె;। నగ్గురుండు నాకిచ్చె నత్యాదరమున. 47**

**ప్రతిపదార్థం:** వినుము; అగస్త్యుఁడు; మా తండ్రి= మా తండ్రియొక్క; వినుత తపము పేర్మికిన్= పొగడబడే తపస్సుయొక్క గొప్పతనానికి; ఎంతయున్= మిక్కిలి; ఆత్మలోన్= మనస్సులో; ప్రీతిన్= సంతోషంతో; పొంగి; బ్రహ్మశిరము+అను; దివ్య+అస్త్ర రత్నము= దివ్యమైన అస్త్ర శ్రేష్ఠం; ఒసఁగెన్= ఇచ్చాడు; ఆ+గురుండు; అతి+ఆదరమునన్= మిక్కిలి వాత్సల్యంతో; నాకున్= నాకు; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'వినుము. అగస్త్యుడు మా తండ్రి చేసిన గొప్ప తపస్సుకు మనస్సులో ఎంతో సంతోషించి, బ్రహ్మ శిరస్సు అనే అస్త్రశ్రేష్ఠం ఇచ్చాడు. ఆ గురుడు అమిత వాత్సల్యంతో దానిని నా కిచ్చాడు.

**వ. ఆ దివ్యాస్త్రంబు నీ కిచ్చెద. నీవు నాకుఁ జక్రం బొసంగవలయు'నని పలికిన నే నద్దురభిమాని నాయెడం బరమ స్పర్ధ గలిగి యట్లడుగుట యెఱింగియు నొండనక యతనికి మదీయ చక్ర ధనుర్గదాఖడ్గంబులు సూపి 'వీనిలోన నీకు ధరింపఁ బ్రయోగింప శక్యంబైన దాని ధరింపు'మని చెప్పి 'నీవు నీ యస్త్రంబు నాకు నీ వలవదు. మిత్రుని కోరినయది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే?' యనుటయు నతండు సుదర్శనంబు వరియించినఁ; 'బుచ్చుకొ' మ్మంటి. నమ్మాటకు**

**ముదితుండగుచు నమ్మూఢుండు దనవామకరంబునఁ జక్రం బవలంబించి యెత్తం జాలక దక్షిణపాణిం బట్టి యెట్లుఁ గదలఁ దివియశక్తుండు గాక యుభయ హస్తంబులును లావుసేసి తివిసినను నది కదలకుండె నాతండు డస్సి నిలిచి విషణ్ణుండై యున్న నతని నాలోకించి యిట్లంటి. 48**

**ప్రతిపదార్థం:** ఆ దివ్య+అస్త్రంబున్; నీకున్= నీకు; ఇచ్చెదన్= ఇస్తాను; నీవు; నాకున్= నాకు; చక్రంబు= చక్రం; ఒసంగవలయున్= ఇవ్వవలెను; అని; పలికినన్= పలుకగా; నేను; ఆ+దురభిమాని= ఆ దురహంకారుడు; నా+ఎడన్= నాయందు; పరమ స్పర్ధ= మిక్కిలి అసూయ; కలిగి; అట్లు+అడుగుట= ఆ విధంగా అడగటం; ఎఱింగియున్; ఒండు+అనక= ఇంకొకమాట అనక; అతనికిన్; మదీయ చక్ర ధనుస్(ః)+గదా ఖడ్గంబులు= నా చక్రం (సుదర్శనం); ధనుస్సు (శార్ఙ్గం), గద(కౌమోదకి), ఖడ్గం(నందకం); చూపి; వీనిలోనన్; నీకున్; ధరింపన్= ధరించటానికి; ప్రయోగింపన్= ప్రయోగించటానికి; శక్యంబు+ఐన దానిన్; ధరింపుము= ధరించుము; అని; చెప్పి; నీవు; నీ+అస్త్రంబు; నాకున్; ఈన్+వలవదు= ఇవ్వనక్కరలేదు; మిత్రుని కోరిన+అది= స్నేహితుడు కోరినది; ఇచ్చుచున్+ఉండి= ఇస్తూ; దానికిన్; మాఱుగాన్= బదులుగా; ఒకటి; పుచ్చుకొనుట; పురుషార్థంబు తెరువే?= ధర్మమార్గమా?; అనుటయున్; అతండు; సుదర్శనంబున్; వరియించినన్= కోరగా; పుచ్చుకొమ్ము+ అంటిన్; ఆ+మాటకున్= ఆ మాటకు; ముదితుండు+అగుచున్= సంతోషించినవాడై; ఆ+మూఢుండు= ఆ తెలివితక్కువవాడు; తన వామ కరంబునన్= తన ఎడమచేతితో; చక్రంబు= చక్రం; అవలంబించి= పట్టుకుని; ఎత్తన్+చాలక= ఎత్తలేక; దక్షిణ పాణిన్= కుడిచేతితో; పట్టి; ఎట్లున్= ఏ విధంగానూ; కదలన్+తివియన్ శక్తుండు కాక= కదల్చలేక; ఉభయ హస్తంబులును= రెండు చేతులూ; లావు+చేసి= కూడగట్టి; తివిసినను= లాగినా; అది; కదలక+ఉండెన్; ఆతండు= అశ్వత్థామ; డస్సి= అలసి; నిలిచి; విషణ్ణుండు+ఐ= విషాదం పొందినవాడై; ఉన్నన్= ఉండగా; అతనిన్; ఆలోకించి= చూసి; ఇట్లు+అంటిన్= ఈ విధంగా అన్నాను.

**తాత్పర్యం:** ఆ దివ్యాస్త్రం నీ కిస్తాను. నీవు నాకు చక్రం ఇవ్వాలి' అని అంటే నేను ఆ దురహంకారి నాపై అసూయ కలిగి అట్లా అడుగుతున్నాడని తెలిసీ, ఇంకొకమాట అనకుండా, అతడికి నా చక్రం (సుదర్శనం), ధనుస్సూ(శార్ఙ్గం), గద(కౌమోదకి), ఖడ్గం (నందకం), చూపించి వీటిలో నీవు ధరించగల, ప్రయోగించగల దానిని ధరించుము' అని చెప్పి, 'నీవు నీ అస్త్రం నా కివ్వనక్కర్లేదు. స్నేహితుడు కోరినదానిని ఇస్తూ దానికి బదులుగా ఒకటి పుచ్చుకొనటం ధర్మమార్గం కాదు' - అనగా అతడు సుదర్శనం కోరితే, 'పుచ్చుకొమ్ము' అన్నాను. ఆ మాటకు సంతోషించి ఆ మందబుద్ధి తన ఎడమచేతితో-చక్రం పట్టుకొని ఎత్తలేక, కుడిచేతితో పట్టుకొని ఏ విధంగానూ కదల్చలేక, రెండు చేతులతోనూ లాగినా అది కదలకపోతే, అతడు అలసిపోయి దిగాలు పడిఉంటే, నేను అతడిని చూచి ఇట్లా అన్నాను:

**తే. 'అధికనిష్ఠమై బ్రహ్మచర్య వ్రతంబు । తోడ రుక్మిణీయుతముగాఁ దుహినశైల**
**తటమునందుఁ బన్ద్రెండు వత్సరము లుగ్ర । తప మొనర్చి యిమ్మహిత సాధనము వడసి. 49**

**ప్రతిపదార్థం:** అధిక నిష్ఠమైన్= ఎక్కువ నిష్ఠతో; బ్రహ్మచర్య వ్రతంబుతోడన్; రుక్మిణీ యుతముగాన్= రుక్మిణితో కూడి; తుహినశైల తటమునందున్= హిమవత్పర్వతపు చరియమీద; పంద్రెండు వత్సరములు= పన్నెండేళ్ళు; ఉగ్ర తపము= ఘోరతపస్సు; ఒనర్చి= చేసి; ఈ+మహిత సాధనము+పడసి= ఈ గొప్ప సాధనం పొంది.

**తాత్పర్యం:** 'ఎంతో నిష్ఠతో బ్రహ్మచర్యవ్రతంతో రుక్మిణితో కూడి హిమవత్పర్వతపు చరియమీద పన్నెండేళ్ళు ఘోరతపస్సు చేసి ఈ గొప్ప సాధనం పొంది. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. దివిజ దానవ గంధర్వాది సమస్తభూతంబులు నాతోడి యెత్తు రాకుండెడు నట్టి దోర్వీర్యంబున వెలసి వర్తిల్లుదు; నట్టిది దీని మహత్త్వంబు; న న్నీ చక్రం బింతక మున్ను బలభద్ర ప్రద్యుమ్న సాంబాది యాదవశ్రేష్ఠు లెవ్వరు నడుగరు; గాండీవి శ్వేతాశ్వ కపిధ్వజంబులుఁ దపోబలంబునఁ బడసి యెక్కటికయ్యంబున రుద్రు మెప్పించి పాశుపతంబు గొనియెఁ; బ్రాణంబులకంటె నే నతనికిం గూర్తు; నద్దేవసమునకు నొసంగఁ దగనిది యెద్దియులేే; దట్టి యర్జునుండును దీని నడిగెనే? భరతవంశాచార్యపుత్రుండవు, సకలజన మాన్యుండవు, నీ విట్లెఱుఁగక యడుగుదె? దీని నెవ్వరితోడ రణంబు సేయఁ దలంచి యడిగి?' తనిన నగ్గురునందనుం డిట్లనియె. 50**

**ప్రతిపదార్థం:** దివిజ దానవ గంధర్వ+ఆది సమస్త భూతంబులున్= దేవతలు, రాక్షసులు, గంధర్వులు మొదలుగా అన్ని ప్రాణులూ; నాతోడి ఎత్తు రాక+ఉండెడు+అట్టి= నాతో సాటి రానట్టి; దోర్వీర్యంబునన్ (దోస్(ః)+వీర్యంబునన్)= భుజ పరాక్రమంతో; వెలసి= ఒప్పి; వర్తిల్లుదున్= ఉంటాను; అట్టిది= అటువంటిది; దీని మహత్త్వంబు= దీని గొప్పతనం; నన్నున్; ఈ చక్రంబు; ఇంతకమున్న= ఇదివరకు; బలభద్ర ప్రద్యుమ్న సాంబ+ఆది యాదవశ్రేష్ఠులు= బలరాముడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ మొదలగు యాదవోత్తములు; ఎవ్వరున్= ఎవరూ; అడుగరు; గాండీవి= అర్జునుడు; శ్వేత+అశ్వ కపిధ్వజంబులు= తెల్లగుర్రాలూ, కపిధ్వజమూ; తపస్(ః)+బలంబునన్= తపశ్శక్తిచేత; పడసి= పొంది; ఎక్కటి కయ్యంబునన్= ఒక్కడూ చేసిన యుద్ధంలో; రుద్రున్= శివుడిని; మెప్పించి; పాశుపతంబున్= పాశుపతాస్త్రం; కొనియెన్= పొందాడు; నేను; ప్రాణంబులకంటెన్= ప్రాణాధికంగా; అతనికిన్+కూర్తున్= అతడిని ఇష్టపడతాను; ఆ+దేవ సమునకున్= ఆ దేవ సమానుడికి; ఒసంగన్+తగనిది= ఇవ్వరానిది; ఎద్దియున్+లేదు= ఏదీ లేదు; అట్టి అర్జునుండును= అలాంటి అర్జునుడు సైతం; దీనిన్+అడిగెనే?; భరతవంశ+ఆచార్య పుత్రుండవు= భరతవంశ గురుడి కుమారుడవు; సకల జన మాన్యుండవు= జనులందరిచేత మన్నింపదగ్గవాడవు; నీవు, ఇట్లు; ఎఱుఁగక; అడుగుదె?= అడుగుతావా?; దీనిన్; ఎవ్వరితోడన్; రణంబు+చేయన్+తలంచి= యుద్ధం చేయాలని; అడిగితి(వి)?+ అనినన్= అడిగావు? - అంటే; ఆ+గురునందనుండు= అశ్వత్థామ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు;

**తాత్పర్యం:** దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ మొదలైన ఎల్ల ప్రాణులూ నాతో సాటికాని భుజబలంతో ఒప్పి ఉంటాను. అదీ దీని గొప్పతనం. ఈ చక్రం ఇమ్మని నన్ను ఇంతవరకూ బలరాముడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలుగా గల యాదవోత్తము లెవరూ అడగలేదు. అర్జునుడు శ్వేతాశ్వాలూ, కపిధ్వజమూ తపోబలంతో పొంది, ఒక్కడూ చేసిన యుద్ధంలో రుద్రుడిని మెప్పించి పాశుపతాస్త్రం పొందాడు. నాకు ప్రాణంకంటె ఎక్కువైన ఆ దేవసమానుడికి ఇవ్వరానిది ఏదీ లేదు. అటువంటి అర్జునుడుసైతం దీనిని అడిగాడా? భరతవంశ గురుడి కుమారుడివి, అందరి మన్ననలూ పొందదగినవాడివి నీవు ఇట్లా తెలియక అడిగావా? దీనిని పుచ్చుకొని ఎవరితో యుద్ధం చేయాలని అడిగావు?' అంటే అశ్వత్థామ ఇట్లా అన్నాడు:

**చ. 'సకలజగత్ప్రసిద్ధ మగు చక్రము నీ వొసఁగంగ నిప్డు పు**
**చ్చి కొని భవత్పదాంబురుహసేవ పదంపడి చేసియైనఁ బో**
**రికి నిను నియ్యకొల్పి మదిఁ బ్రీతి యెలర్పఁ బెనంగి నీకు నో**
**డక విలసిల్లి యెల్లఁ బొగడం పెనుపొందఁగఁ గోరి వేఁడితిన్. 51**

**ప్రతిపదార్థం:** సకల జగత్+ప్రసిద్ధము= ఎల్ల లోకాలలోనూ గొప్పది; అగు; చక్రమున్= సుదర్శనాన్ని; నీవు; ఒసఁగంగన్= ఇస్తే; ఇప్డు= ఇప్పుడు; పుచ్చికొని= తీసుకొని; పదంపడి= తరువాత; భవత్+పద+అంబురుహ సేవ= నీ పాదపద్మ సేవ; చేసి+ఐనన్=

చేసైనా; పోరికిన్= యుద్ధానికి; నినున్; ఇయ్యకొల్పి= ఒప్పించి; మదిన్= మనస్సులో; ప్రీతి= సంతోషం; ఎలర్పన్= అతిశయించగా; పెనంగి= యుద్ధం చేసి; నీకున్; ఓడక= జంకక; విలసిల్లి= ఒప్పి; ఎల్లన్= అంతా; పొగడన్= పొగడగా; పెంపు+ఒందఁగన్+ కోరి= అతిశయించగోరి; వేఁడితిన్= కోరాను.

**తాత్పర్యం:** 'ఎల్ల లోకాలలోనూ ప్రసిద్ధమైన సుదర్శనం నీవు ఇస్తే, ఇప్పుడు పుచ్చుకొని తరువాత నీ పాదపద్మసేవ చేసైనా, యుద్ధానికి నిన్ను ఒప్పించి, మనస్సులో సంతోషం అతిశయించగా, యుద్ధం చేసి నీకు జంకకుండా ఒప్పి అందరూ పొగడగా పెంపు వహించగోరి కోరాను.

**వ. ఈ చక్రంబు నీక ధరియింపం దగియుండుఁ గాక, నా కిది లేకున్న నేమియగు? నెట్లును నీతోడ సంగరంబు సేయంగలవాఁడ' ననియె. నేను నవ్వుచు నట్లకాక యని ద్రోణాచార్య పుత్రత్వ బహుమానంబున మాననీయ రథ్యంబులు, నభిరామరత్నాంబరాభరణంబులు నిచ్చి పుచ్చినం జనియె; నట్టి మహాహంకారంబునకుఁ గారణంబైన బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రంబున నవ్యాహత సంరంభుండును, నసద్వ్యాపారారం భుండును, గ్రూర దర్శనుండును నగు నశ్వత్థామచేత భీముండు బాధితుండు గాకుండవలయు'నని పలికి పద్మనాభుండు సాత్యకి సహదేవులం జూచి మీరు శిబిరంబున నిలువుం'డని నియోగించి. 52**

**ప్రతిపదార్థం:** ఈ చక్రంబు; నీకున్+అ= నీకే; ధరియింపన్= ధరించటానికి; తగి+ఉండున్+కాక; నాకున్; ఇది; లేక+ఉన్నన్= లేకపోతే; ఏమి+అగున్?= ఏమవుతుంది? ఎట్లును; నీతోడన్; సంగరంబు= యుద్ధం; చేయంగలవాఁడన్; అనియెన్; నేను; నవ్వుచున్; అట్లు+అ+కాక+అని= అట్లే అని; ద్రోణాచార్య పుత్రత్వ బహుమానంబునన్= ద్రోణాచార్యుడి కుమారుడనే గౌరవంతో; మాననీయ రథ్యంబులున్= ప్రశస్తాలైన గుర్రాలూ; అభిరామ రత్న+అంబర+ఆభరణంబులున్= మనోహరాలైన రత్నాలూ, వస్త్రాలూ, నగలూ; ఇచ్చి; పుచ్చినన్= పంపగా; చనియెన్= వెళ్ళాడు; అట్టి; మహా+అహంకారంబునకున్= గొప్ప పొగరుకు; కారణంబు+ఐన; బ్రహ్మశిరోనామకంబు; అను; దివ్య+అస్త్రంబునన్= దివ్యాస్త్రంచేత; అవ్యాహత సంరంభుండును= అప్రతిహతమైన సంరంభం గలవాడూ; అసత్+వ్యాపార+ఆరంభుండును= దుష్కర్మాచరణుడూ; క్రూరదర్శనుండును= క్రూరాత్ముడూ; అగు; అశ్వత్థామచేతన్; భీముండు; బాధితుండు= పీడితుడు; కాక+ఉండవలయున్= కాగూడదు; అని; పలికి; పద్మనాభుండు= కృష్ణుడు; సాత్యకి సహదేవులన్+చూచి; మీరు; శిబిరంబునన్; నిలువుండు= ఉండండి; అని; నియోగించి= నియమించి.

**తాత్పర్యం:** ఈ చక్రం నీకే ధరించదగ్గదై ఉండుగాక! నాకు ఇది లేకపోతే నష్టమేమున్నది? ఎట్లాగూ నీతో యుద్ధం చేస్తాను' అన్నాడు. నేను నవ్వుతూ అట్లాగే అని ద్రోణాచార్యుడి కొడుకనే గౌరవంచేత అతడికి మంచి గుర్రాలూ, మనోహర రత్నాలూ, వస్త్రాలూ, ఆభరణాలూ ఇచ్చి పంపితే వెళ్ళిపోయాడు. అటువంటి గొప్ప పొగరుకు కారణమైన బ్రహ్మశిరోనామక దివ్యాస్త్రంతో అప్రతిహతమైన సంరంభం గలవాడూ, దుష్కర్మాచరణుడూ, క్రూరాత్ముడూ అయిన అశ్వత్థామచేత భీముడు బాధితుడు కారా' దని పలికి, కృష్ణుడు సాత్యకినీ, సహదేవుడినీ చూచి 'మీరు శిబిరంలో ఉండండి' అని నియమించి.

### ధర్మజధనంజయకృష్ణు లశ్వత్థామమీఁదికిఁ బోవుట (సం. 10-13-1)

**సీ. ప్రద్యోతితానేక రత్న శోభితమును । సంభృతాయుధవరిష్ఠంబు నైన**
**మాన్య రథమ్మున శైబ్యసుగ్రీవంబు । లను మేఘపుష్పవలాహకములఁ**

**బూన్పించి యాభీల భుజగారికేతనం । బెత్తించి వే నొగ లెక్కుటయును,**
**గాండీవధరణోద్భటుండును దూణీర । యుగళసన్నాహసముజ్జ్వలుండు**

**ఆ. నై ధనంజయుఁడు రథారోహణము సేసె । నగ్రజుండు నెక్కననికి నమరి**
**యొప్పి రమ్మురారియును వారు నప్పుడు । బలహరుండు నశ్వినులును బోలె. 53**

**ప్రతిపదార్థం:** ప్రద్యోతిత= మిక్కిలి ప్రకాశించిన; అనేక= పెక్కు; రత్న శోభితమును= మణులచేత ఒప్పినదీ; సంభృత+ఆయుధ వరిష్ఠంబున్= నిండిన ఆయుధాలచేత మిక్కిలి గొప్పదీ; ఐన; మాన్య రథమ్మునన్= గొప్ప రథానికి; శైబ్యసుగ్రీవంబులను= శైబ్యమునూ; సుగ్రీవమునూ; మేఘపుష్ప వలాహకములన్= మేఘపుష్పమునూ; వలాహకమునూ; పూన్పించి= కట్టించి; ఆభీల భుజగ+అరి కేతనంబు= భయంకరమైన గరుడకేతనం; ఎత్తించి; వే= శీఘ్రంగా; నొగలు+ఎక్కుటయును= తొట్టిలో కూర్చుండగా; గాండీవ ధరణ+ఉద్భటుండును= గాండీవధారణచేత భయంకరుడూ; తూణీర= అమ్ములపొదులయొక్క; యుగళ= జంట చేతా; సన్నాహ= కవచంచేతా; సముజ్జ్వలుండున్= మిక్కిలి ప్రకాశించేవాడూ; ఐ; ధనంజయుఁడు= అర్జునుడు; రథ+ఆరోహణము+ చేసెన్= రథం ఎక్కాడు; అగ్రజుండున్= అన్నకూడా (ధర్మరాజు కూడా); ఎక్కెన్; ఆ+ముర+అరియును= ఆ కృష్ణుడూ; వారున్= ధర్మజార్జునులూ; అప్పుడు; బలహరుండున్= ఇంద్రుడూ; అశ్వినులును+పోలెన్= అశ్వినీదేవతలవలె; అనికిన్= యుద్ధానికి అమరి= సంసిద్ధులై; ఒప్పిరి.

**తాత్పర్యం:** ప్రకాశించే పెక్కు మణులచేత ఒప్పినదీ, ఆయుధ సమృద్ధిచేత గొప్పదీ అయిన శ్రేష్ఠమైన రథానికి శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలనే కృష్ణుడి గుర్రాలను కట్టించి, భయంకరమైన గరుడకేతనం ఎత్తించి శీఘ్రమే నొగలపై కూర్చుండగా, గాండీవధారణచేత భయంకరుడూ, అంపపొదుల జంటా, కవచం అనేవాటిచేత మిక్కిలి ప్రకాశించేవాడూ అయి అర్జునుడు రథం ఎక్కాడు. అన్న ధర్మరాజు కూడా ఎక్కాడు. కృష్ణుడూ, వాళ్ళిద్దరూ అప్పుడు ఇంద్రుడూ, అశ్వినులూ అన్నట్లుగా యుద్ధానికి సంసిద్ధులై ఒప్పారు.

**విశేషం:** అలం: ఉపమ. 'ఒప్పి రమ్మురారియును వారు నప్పుడు - బలహరుండు నశ్వినులును బోలె.' - అలంకారం ఉపమ. మురారి, వారు - ఉపమేయం, బలహరుడు, అశ్వినులు ఉపమానం. పోలె - ఉపమావాచకం. ఒప్పిరి - సమానధర్మం. ఈ నాలుగూ ఉండటంచేత ఇది సంపూర్ణోపమ. కృష్ణుడి గుర్రాలలో ఒకదానికి సైన్యము (శైబ్యము) అని పేరు.

**వ. ఇట్లు సన్నద్ధంబైన యా రథంబు భాసురప్రతోదంబు పుచ్చుకొని యద్దామోదరుండు పఱప నయ్యుత్తమ రథ్యంబుల రయాతిశయంబున సమీరనందన స్యందనంబు గొండొక సేపునకుం గూడె; నప్పుడు భాగీరథీతీరం బునఁ గ్రోధాయత్త చిత్తుండగుచు నశ్వత్థామ యున్నయెడ రోయుచుఁ బోవు నప్పావని నమ్ముువ్వురు వారించి; రట్టు వారించిన నిలువక వారి ముందటం జని యతండు సూడ్కి యట నిగిడించి. 54**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సన్నద్ధంబు+ఐన= కట్టబడిన; ఆ రథంబున్; భాసుర ప్రతోదనంబున్= ప్రకాశించే కొరడాను; పుచ్చుకొని; ఆ+దామోదరుండు= ఆ కృష్ణుడు; పఱపన్= పరుగెత్తించగా; ఆ+ఉత్తమ రథ్యంబుల= ఆ శ్రేష్ఠములైన గుర్రాలయొక్క; రయ+అతిశయంబునన్= వేగాధిక్యంచేత; సమీర నందన స్యందనంబున్= భీముడి రథాన్ని; కొండొకసేపునకున్= కొంతసేపటికి; కూడెన్= కలిసికొన్నది; అప్పుడు; భాగీరథీ తీరంబునన్= గంగానది ఒడ్డున; క్రోధ+ఆయత్త చిత్తుండు+అగుచున్= కోపానికి వశమైన మనస్సుకలవాడు అవుతూ; అశ్వత్థామ+ఉన్న ఎడన్= అశ్వత్థామ ఉన్నచోటు; రోయుచున్= వెదకుతూ; పోవు+ఆ+పావనిన్= వెళ్ళే ఆ భీముడిని; ఆ+ముువ్వురున్= ఆ ముగ్గురూ - ధర్మజార్జున కృష్ణులు; వారించిరి= ఆపుచేశారు; అట్టు= ఆ విధంగా;

వారించినన్= ఆపగా; నిలువక; వారి ముందటన్+చని= వారికంటె ముందువెళ్ళి; అతండు= భీముడు; చూడ్కి= చూపు; అటన్= అక్కడ; నిగిడించి= సారించి.

**తాత్పర్యం:** ఇట్లా కట్టబడిన ఆ రథాన్ని మంచి కొరడా పుచ్చుకొని ఆ కృష్ణుడు పరుగెత్తించగా ఆ శ్రేష్ఠములైన గుర్రాల వేగాధిక్యంచేత భీముడి రథాన్ని కొంతసేపటికి కలుసుకొన్నది. అప్పుడు గంగానది ఒడ్డున కోపంతో అశ్వత్థామ ఉన్నచోటు వెదకుతూపోయే భీముడిని ఆ ముగ్గురూ ఆపుచేశారు. అట్లా వారిస్తే నిలువక వారికంటె ముందుగా వెళ్ళి అతడు అక్కడ చూపు సారించి.

**చ.** **సలిల సమీపదేశమున సంయమిసంఘము గొల్వఁగా సము**
**జ్జ్వల మహనీయమూర్తి యగు సాత్యవతేయుఁడు తారకాగణం**
**బుల నడుమం బ్రదీప్తుఁడగు పూర్ణసుధాంశుని యట్టు లుండ న**
**వ్వలనికిఁ బోక భక్తి నభివాదనముల్ మదిలోనఁ జేయుచున్.** **55**

**ప్రతిపదార్థం:** (పై వచనంలోని 'అతండు' - కర్త), సలిల సమీప దేశమునన్= నీటికి దగ్గరగా ఉన్నచోట; సంయమి సంఘము= మునుల సమూహం; కొల్వఁగాన్= సేవిస్తూండగా; సముజ్జ్వల మహనీయ మూర్తి+అగు= ప్రకాశించే గొప్ప ఆకారం గలవాడు అగు; సాత్యవతేయుఁడు= వ్యాసుడు; తారకా గణంబు నడుమన్= నక్షత్రాల సమూహాల మధ్య; ప్రదీప్తుఁడు+అగు= ప్రకాశించే; పూర్ణ సుధాంశుని+అట్టులు+ఉండన్= పూర్ణచంద్రుడిలా ఉండగా; ఆ+వలనికిన్= ఆవైపు; పోక= వెళ్ళక; భక్తిన్= భక్తితో; అభివాదమున్= నమస్కారం; మదిలోనన్= మనస్సులో; చేయుచున్= చేస్తూ.

**తాత్పర్యం:** నీటికి దగ్గరగా ఉన్న ప్రదేశంలో ముని సమూహం సేవిస్తూండగా ప్రకాశించే గొప్ప ఆకారం కల వ్యాసుడు నక్షత్ర సమూహాల మధ్య ప్రకాశించే నిండుచంద్రుడివలె ఉండగా (భీముడు) ఆ వైపు పోక, భక్తితో మనస్సులో నమస్కరిస్తూ. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ. 'సంయమిసంఘము గొల్వఁగా.... సాత్యవతేయుఁడు తారకాగణంబుల నడుమం బ్రదీప్తుఁడగు పూర్ణసుధాంశుని యట్టులుండ'... అలంకారం ఉపమ. సంయమిసంఘము, సాత్యవతేయుడు ఉపమేయాలు. తారకాగణంబులు, పూర్ణసుధాంశుడు క్రమంగా వాటికి ఉపమానాలు. ఉండు - సమానధర్మం. 'అట్టులు' ఉపమావాచకం. నాలుగంశాలూ ఉండటంచేత ఇది సంపూర్ణోపమ. ఈ ఉపమవలన ఇతర మునులకంటె వ్యాసుడి విశిష్టత తెలుస్తున్నది. భీముడు వ్యాసుడి దగ్గరకు వెళ్ళకపోవటానికి కారణం, అశ్వత్థామను పట్టుకోవటమే ప్రస్తుతం అతడికి ముఖ్యకర్తవ్యం కాబట్టి.

**వ.** **కెలంకులు గలయం బరికించి యొక్కెడ.** **56**

**ప్రతిపదార్థం:** కెలంకులు= ప్రక్కలు; కలయన్+పరికించి= అంతటా చూసి; ఒక్క+ఎడన్= ఒక్కచోట.

**తాత్పర్యం:** ప్రక్కలు బాగా చూచి, ఒకచోట.

**ఆ.** **మేన భసిత మలఁది మాననీయ తపః ప్ర । యుక్తి నాదరించి యున్న ద్రోణ**
**తనయుఁ గాంచి చాపదండంబు సజ్యంబు । సేసి మహితశరముచే నమర్చి.** **57**

**ప్రతిపదార్థం:** (54వ వచనంలోని 'అతఁడు' - కర్త) మేనన్= శరీరంపై; భసితము= భస్మం; అలఁది= పూసి; మాననీయ తపస్(ః)+ప్రయుక్తిన్= మన్నించదగిన తపఃప్రయోగాన్ని; ఆదరించి+ఉన్న= పాటించి ఉన్నట్టి; ద్రోణతనయున్= అశ్వత్థామను;

కాంచి= చూచి; చాపదండంబున్= వింటి బద్దను; సజ్యంబు+చేసి= త్రాటితో కూడినదిగా చేసి; మహిత శరముచేన్= గొప్ప బాణంతో; అమర్చి= కూర్చి.

**తాత్పర్యం:** శరీరం నిండా బూది పూసికొని గొప్ప తపస్సు చేస్తున్న అశ్వత్థామను భీముడు చూచి, వింటికి నారి తగిలించి, గొప్పబాణం కూర్చి.

**వ. భ్రుకుటిత వికట ఫాలభాగుండై. 58**

**ప్రతిపదార్థం:** భ్రుకుటిత= బొమముడి పడటంచేత; వికట= భయంకరమైన; ఫాలభాగుండు+ఐ= నుదుటి ప్రదేశం కలవాడయి.

**తాత్పర్యం:** బొమలు ముడిపడటంచేత భయంకరమైన నుదురు కలవాడై.

**తే. 'ఓరి ధాత్రీసురాధమ! క్రూరకర్మ! । కపట ధార్మిక! యత్యంత కల్మషాభి**
**యుక్తిఁ బోయినరేయి మహోగ్రవృత్తిఁ । దగిలి; తెంత వేగిరమునఁ దపసివైతి! 59**

**ప్రతిపదార్థం:** ఓరి ధాత్రీసుర+అధమ!= ఓరి నీచబ్రాహ్మణుడా!; క్రూరకర్మ!= క్రూరపు పనులు చేసేవాడా!; కపట ధార్మిక!= ధర్మం నటించేవాడా!; పోయిన రేయి= కడచిన రాత్రి; అత్యంత కల్మష+అభియుక్తిన్= మిక్కిలి పాపంతో; మహా+ఉగ్ర వృత్తిన్= మిక్కిలి ఘోరమైన ప్రవర్తనతో; తగిలితి(వి)= ఆసక్తిగలిగి ఉన్నావు; ఎంత వేగిరమునన్= ఎంతవేగంగా; తపసివి+ఐతి(వి)!= ముని వయ్యావు!

**తాత్పర్యం:** 'ఓరీ నీచబ్రాహ్మణుడా! క్రూరకర్ముడా! ధర్మం నటించేవాడా! గతరాత్రి మిక్కిలి పాపంతో ఘోరంగా ప్రవర్తించి, ఎంతవేగంగా ముని వయ్యావు?

**వ. ఇట్టు లొదిఁగిన జావు దప్పునే? లే లెమ్ము. తపమ్ము సాలు రణమ్మునకు ర'మ్మని కఠినాక్షరంబులుగాఁ బలికె. నటు పలుకు నా భీమసేనుం గనుంగొని యతని వెనుకఁ గదియ నడచిన సవ్యసాచి ధర్మజులం జూచి సవ్యథంబగు నంతఃకరణంబుతో నగ్గురునందనుండు వారల దివ్యాస్త్రవేదిత్వం బూహించి దుస్సహంబగు నమ్మహా దురితంబునకుఁదలంకి బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రంబు దలంచి యొక్క యిషీకంబు వుచ్చికొని యం దయ్యస్త్రంబు నావహించి 'యపాండవం బయ్యెడు' మని దారుణ భాషణంబులతోడ రోషప్రదీప్తుం డగుచుఁ బ్రయోగించిన. 60**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఇలా; ఒదిఁగినన్= దాక్కుంటే; చావు; తప్పునే?; లెమ్మ+లెమ్మ; తపమ్మ+చాలున్; రణమ్మనకున్= యుద్ధానికి; రమ్మ+అని; కఠిన+అక్షరంబులు+కాన్= పరుషంగా; పలికెన్; అటు= అట్లా; పలుకు+ఆ భీమసేనున్= పలికే ఆ భీముడిని; కనుంగొని= చూచి; అతని వెనుకన్; కదియన్+నడచిన= వెంటవచ్చినట్టి; సవ్యసాచి ధర్మజులన్= అర్జునుడినీ, ధర్మరాజునీ; చూచి; సవ్యథంబు+అగు+అంతఃకరణంబుతోన్= బాధతో గూడిన మనస్సుతో; ఆ+గురునందనుండు= ఆ అశ్వత్థామ; వారల= వాళ్ళయొక్క; దివ్య+అస్త్ర+ వేదిత్వంబు= దివ్యాస్త్రజ్ఞానం; ఊహించి= తెలిసి; దుస్సహంబు+అగు+ఆ+మహత్ (మహా) దురితంబునకున్= సహించశక్యంకాని ఆ మహాపాప కార్యానికి; తలంకి= కలతచెంది; బ్రహ్మశిరోనామకంబు+అను దివ్య+అస్త్రంబు= బ్రహ్మశిరోనామకమైన దివ్యాస్త్రాన్ని; తలంచి; ఒక్క+ఇషీకంబు+పుచ్చికొని= ఒక్క రెల్లుగడ్డిపరకను పట్టుకుని; అందున్; ఆ+అస్త్రంబున్= ఆ అస్త్రాన్ని; ఆవహించి= ఆవాహనం చేసి; అపాండవంబు+అయ్యెడున్+అని= నిష్పాండవం

అవాలని; దారుణ భాషణంబులతోడన్= పరుషవాక్యాలతో; రోష ప్రదీప్తుండు+అగుచున్= కోపంతో మండిపడుతూ; ప్రయోగించినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** ఇట్లా దాక్కుంటే చావు తప్పుతుందా? లెమ్ము. లెమ్ము. తపం చాలును. యుద్ధానికి రమ్ము' అని పరుషంగా పలికాడు. అట్లా అనే భీముడిని చూచి, అతడి వెనక వచ్చిన అర్జునుడినీ, ధర్మరాజునీ చూచి బాధపడే మనస్సుతో ఆ అశ్వత్థామ వాళ్ళ దివ్యాస్త్రజ్ఞానం ఎరిగి, సహించరాని తన మహాపాపకార్యానికి కలతపడి బ్రహ్మశిరోనామక దివ్యాస్త్రం తలచుకొని ఒక రెల్లు గడ్డిపోచ పట్టుకొని దానిపైకి ఆ అస్త్రాన్ని ఆవాహనంచేసి, 'పాండవనిర్మూలనం అవుతుంది గాక!' అని పరుషంగా అంటూ, కోపంతో మండిపడుతూ ప్రయోగించగా.

**స్రగ్ధర.**

**ఆ దివ్యాస్త్రంబునం దుద్భత మయి ఘనఘోరాగ్ని యర్చిర్వితానం**
**బేదిక్కుం దానయై పెల్లెసఁగుచు భువనంబెల్ల భస్మంబుగా నా**
**పాదింపం బేర్చుమాడ్కిం బరఁగి పెరిఁగినం బార్థునిం జూచి తద్బా**
**హాదర్పజ్ఞానముద్రావ్యపగతభయుఁ డై యంబుజాక్షుండు వల్కున్.** **61**

**ప్రతిపదార్థం:** ఆ దివ్య+అస్త్రంబునందున్= ఆ దివ్యాస్త్రంలోంచి; ఉద్భతము+అయి= పుట్టినదయి; ఘన ఘోర+అగ్ని= గొప్పదీ, భయంకరమైనదీ అయిన అగ్నియొక్క; అర్చిస్(ః)+వితానంబు= జ్వాలల సమూహం; ఏ దిక్కున్= ఏవైపైనా; తాను+అ+ఐ= తానే అయి; పెల్లు+ఎసఁగుచున్= మిక్కిలి విజృంభిస్తూ; భువనంబు+ఎల్లన్= లోకం అంతా; భస్మంబు+కాన్= బూడిదగా; ఆపాదింపన్= చేసేటట్టు; పేర్చుమాడ్కిన్= విజృంభించే విధంగా; పరఁగి= ఒప్పి; పెరింగినన్= వృద్ధిపొందగా; పార్థునిన్= అర్జునుడిని; చూచి; తద్= అతడియొక్క (ఆ అర్జునుడియొక్క); బాహా= భుజాలయొక్క; దర్ప= గర్వంయొక్క; జ్ఞానముద్రా= తెలివిడిగుర్తు చేత; వ్యపగత= పోయిన; భయుఁడు+ఐ= భయంగలవాడై; అంబుజ+అక్షుండు= పద్మాలవంటి కళ్ళుగలవాడు-కృష్ణుడు; పల్కున్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ దివ్యాస్త్రంనుండి పుట్టిన పెద్దదీ భయంకరమైనదీ అయిన అగ్నిజ్వాలల సమూహం, అన్నివైపులా తాను అయి మిక్కిలి విజృంభిస్తూ లోకాన్ని అంతనీ బూడిదచేసేటట్లు అతిశయించే విధంగా ఒప్పి పెరుగగా, కృష్ణుడు అర్జునుడిని చూచి, అతడి భుజ పరాక్రమం తెలిసినవాడవటంచేత భయంలేనివాడై ఇట్లా అన్నాడు.

**వ.** **'అర్జున! యర్జున! యిది బ్రహ్మ శిరోనామకం బను దివ్యాస్త్రంబు. దీని నొం డస్త్రంబు ప్రతిహతంబుఁ జేయంజాలదు, బ్రహ్మ శిరంబు నీవునుం బ్రయోగించి దీని నుడిపి నిన్నును నీ సోదరులను గాచికొనుము. సత్వరుండవు గమ్ము.'** **62**

**ప్రతిపదార్థం:** అర్జున!= అర్జునా!; ఇది; బ్రహ్మ శిరోనామకంబు; అను; దివ్య+అస్త్రంబు; దీనిన్= దీనిని; ఒండు+అస్త్రంబు= ఇంకొక అస్త్రం; ప్రతిహతంబున్= తిప్పికొట్టబడిందిగా; చేయన్+చాలదు= చేయలేదు; నీవునున్= నువ్వుకూడా; బ్రహ్మశిరంబున్= బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని; ప్రయోగించి; దీనిన్; ఉడిపి= మాన్పి; నిన్నును; నీ సోదరులను; కాచికొనుము= రక్షించుకొమ్ము; సత్వరుండవు+కమ్ము= త్వరపడు.

**తాత్పర్యం:** 'అర్జునా! అర్జునా! ఇది బ్రహ్మశిరోనామక దివ్యాస్త్రం. దీన్ని వేరే అస్త్రం తిప్పికొట్టలేదు. నీవు కూడా బ్రహ్మశిరోనామకాస్త్రాన్నే ప్రయోగించి దీనిని నిరోధించి, నిన్నూ నీ సోదరులనూ కాపాడుకొమ్ము. త్వరపడుము.'

**క. అనవుడు నవ్వీరుఁడు స । య్యన నరదము డిగ్గి నియతుఁడై ధనురాచా**
**ర్యుని సంస్మరించి చాపము । గొని మంత్రముతోడ శరము గుణమునఁ గూర్చెన్. 63**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; ఆ+వీరుఁడు= ఆ వీరుడైన అర్జునుడు; చయ్యనన్= శీఘ్రంగా; అరదమున్+డిగ్గి= రథందిగి; నియతుఁడు+ఐ= నియమం గలవాడై; ధనుస్(ః)+ఆచార్యునిన్= ధనుర్విద్యా గురువైన ద్రోణుడిని; సంస్మరించి= తలచుకొని; చాపము+కొని= విల్లు తీసుకొని; మంత్రముతోడన్= సమంత్రకంగా; శరమున్= బాణాన్ని; గుణమునన్= అల్లెత్రాటియందు; కూర్చెన్.

**తాత్పర్యం:** అని కృష్ణు డనగానే ఆ వీరుడు వెంటనే రథం దిగి నియమంతో ద్రోణాచార్యుడిని తలచుకొని, విల్లు తీసికొని, సమంత్రకంగా బాణాన్ని అల్లెత్రాటితో సంధించాడు.

అశ్వత్థామార్జునుల బ్రహ్మశిరోనామకాస్త్రంబు లొండొంటిం దాఁకుట (సం. 10-15-1)

**వ. కూర్చి తొలుత గురునందనునకుం గీడు వొందకుండ వలయునని ప్రార్థించి పదంపడి నాకును సోదరులకును శుభం బయ్యెడుమని పలికి యస్త్రదేవతలకు నమస్కరించి యస్త్ర మస్త్రంబునన శమియించుఁ గావుత మని శివంబుఁ జింతించుచుం బ్రయోగించిన నా దివ్యాస్త్రంబు కల్పాంతజ్వలనంబునుం బోలె నాభీలజ్వాలా మాలాకరాళంబై యుప్పరం బెల్లను దనమయంబుగా నిగిడి యశ్వత్థామాస్త్రంబు గ్రమ్మఱింప నుత్సహించిన నది క్రమ్మఱక పెరిఁగి సముద్దామధామం బగుటయు నయ్యస్త్రద్వితయంబు నాటోపంబున. 64**

**ప్రతిపదార్థం:** కూర్చి= సంధించి; తొలుతన్= మొదట; గురు నందనునకున్= అశ్వత్థామకు; కీడు+పొందక+ఉండన్+వలయున్+అని= హాని జరగకుండా ఉండాలని; ప్రార్థించి; పదంపడి= పిమ్మట; నాకున్= నాకు; సోదరులకును; శుభంబు+అయ్యెడున్+అని= శుభం కలగాలని; పలికి; అస్త్ర దేవతలకున్; నమస్కరించి; అస్త్రము; అస్త్రంబునన్+అ= అస్త్రంచేతనే; శమియించున్+కావుతన్+అని; శాంతించాలని; శివంబున్= శుభం; చింతించుచున్= తలపెడుతూ; ప్రయోగించినన్= ప్రయోగించగా; ఆ దివ్య+అస్త్రంబు; కల్పాంతజ్వలనంబునున్+పోలెన్= ప్రళయ సమయంలోని అగ్నివలె; ఆభీల జ్వాలామాలా కరాళంబు+ఐ= భయంకరమైన జ్వాలల సమూహంచేత భయంకరమై; ఉప్పరంబు+ఎల్లను= ఆకాశం అంతా; తనమయంబు కాన్= తనే నిండగా; నిగిడి= వ్యాపించి; అశ్వత్థామ+అస్త్రంబు= అశ్వత్థామ అస్త్రం; క్రమ్మఱింపన్= మరల్చటానికి; ఉత్సహించినన్= ప్రయత్నించగా; అది, క్రమ్మఱక= మరలక; పెరిఁగి; సముద్దామ+ధామంబు+అగుటయున్= మిక్కిలి భయంకరమైన కాంతులు గలది కాగా; ఆ+అస్త్ర+ద్వితయంబు+ఆటోపంబునన్= ఆ రెండు అస్త్రాల విజృంభణం చేతా.

**తాత్పర్యం:** సంధించి మొదట అశ్వత్థామకు హాని కలగకుండా ఉండాలని ప్రార్థించి, తరువాత 'నాకూ నా సోదరులకూ శుభం కలగా' లని పలికి అస్త్రదేవతలకు నమస్కరించి అస్త్రం అస్త్రంచేతనే శాంతించాలని, శుభం జరగాలని కోరుతూ ప్రయోగించగా ఆ దివ్యాస్త్రం ప్రళయ సమయంలో అగ్నివలె భయంకర జ్వాలల సమూహంతో వెరపు పుట్టిస్తూ ఆకాశం అంతా తనే అయ్యేటట్టు వ్యాపించి అశ్వత్థామ అస్త్రాన్ని త్రిప్పికొట్టటానికి ప్రయత్నించగా

అది మరలక పెరిగి భయంకరకాంతులు గలిగినది కాగా, ఆ రెండస్త్రాల విజృంభణంచేత. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. 'కల్పాంతజ్వలనంబునుం బోలె' - అలంకారం ఉపమ. అశ్వత్థామ అపాండవం కావాలని కోరగా, అర్జునుడు అశ్వత్థామకు కీడు కలగకూడదని కోరాడు. అదీ వాళ్ళ శీలాలకు గల తేడా.

**మహాస్రగ్ధర.**

> **జలధుల్ ఘూర్ణిల్లె, నుల్కాశతములు వడియెం, జండభానుండు మాసెం,**
> **గులశైలంబుల్ వడంకెం, గురిసె నురవడిన్ ఘోరపాషాణధారా**
> **వలి, నాకాశంబు ధాత్రీవలయముఁ దిరిగెన్, వజ్రనిర్ఘోష మెందుం**
> **జెలఁగం జొచ్చెన్, జనం బచ్చెరువును భయముం జెంది నిశ్చేష్ట మయ్యెన్. 65**

**ప్రతిపదార్థం:** జలధుల్= సముద్రాలు; ఘూర్ణిల్లెన్= తిరుగుడుపడ్డాయి; ఉల్కా శతములు+పడియెన్= వందలకొద్దీ ఉల్కలు రాలాయి; చండభానుండు= తీక్షణమైన సూర్యుడు; మాసెన్= అంతరించాడు; కులశైలంబుల్= కులపర్వతాలు; వడంకెన్= కంపించాయి; ఆకాశంబున్= ఆకాశం; ఘోరపాషాణ ధారా+ఆవలిన్= భయంకర శిలావర్షధారల సమూహాన్ని; ఉరవడిన్= మిక్కిలి వేగంతో; కురిసెన్; ధాత్రీ వలయమున్= భూమండలమూ; తిరిగెన్; ఎందున్= అన్నిచోట్లా; వజ్ర నిర్ఘోషము= పిడుగుల చప్పుడు; చెలఁగన్+చొచ్చెన్= మ్రోగ నారంభించినది; జనంబు= మనుష్యుల సమూహం; అచ్చెరువును= ఆశ్చర్యమూ; భయమున్; చెంది; నిశ్చేష్టము+అయ్యెన్= చేష్టలుడిగింది.

**తాత్పర్యం:** సముద్రాలు తిరుగుడు పడ్డాయి. వందలకొద్దీ ఉల్కలు రాలాయి. తీవ్ర సూర్యుడు అంతరించాడు. కులపర్వతాలు కంపించాయి. ఆకాశం భయంకర శిలావర్షం మిక్కిలి వేగంగా కురిసింది. భూమి తిరుగుడు పడింది. అంతటా పిడుగుల చప్పుడు మ్రోగ నారంభించింది. జనులు ఆశ్చర్యమూ, భయమూ చెంది చేష్టలుడిగారు.

**విశేషం:** 'కులశైలములు - మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము అని కులపర్వతాలు ఏడు.

**వ.** **ధర్మాత్ముండగు నారదుం డప్పుడు సాత్యవతేయునకు సన్నిహితుండయ్యె, నతండును భరత కులోద్వహుండగు నప్పారాశర్యుండును గూడి యిట్లు జగద్భయంకర ప్రక్రమోద్దాములగు నయ్యర్జునాశ్వత్థామల నుపశమింపంజేయుటకై నడుమ నిలిచి యయ్యిరువురును నాకర్ణింప నిట్లనిరి. 66**

**ప్రతిపదార్థం:** ధర్మ+ఆత్ముండు+అగు= పుణ్యాత్ముడైన; నారదుండు= నారదుడు; అప్పుడు; సాత్యవతేయునకున్= వ్యాసుడికి; సన్నిహితుండు+అయ్యెన్= సమీపించినవాడు అయ్యాడు; అతండును; భరతకుల+ఉద్వహుండు+అగు= భరతవంశోద్ధారకుడైన; ఆ+పారాశర్యుండును= ఆ వ్యాసుడును; కూడి= కలిసి; ఇట్లు; జగత్+భయంకర+ప్రక్రమ+ఉద్దాములు+అగు= లోక భీకరమైన ప్రయత్నంతో ఉద్దండులు అయిన; ఆ+అర్జున+అశ్వత్థామలన్= ఆ అర్జునుడినీ, అశ్వత్థామనీ; ఉపశమింపన్+చేయుటకై= శాంతింపజేయటానికి; నడుమన్= మధ్య; నిలిచి; ఆ+ఇరువురును= ఆ ఇద్దరూ; ఆకర్ణింపన్= వినేటట్టు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన నారదుడు అప్పుడు వ్యాసుడి దగ్గరకు వచ్చాడు. అతడూ, భరతవంశోద్ధారకుడైన వ్యాసుడూ కలిసి, ఈ రీతిగా లోకభీకర ప్రయత్నంలో ఉద్దండులైన ఆ అర్జునుడినీ, అశ్వత్థామనీ శాంతింపజేయటానికి మధ్య నిలిచి, వాళ్ళిద్దరూ వినేటట్లు ఇట్లా అన్నారు:

**క. 'పలువురు మహాస్త్ర విత్తము । లలఘు భుజావీర్యశౌర్యు లవనిఁ జనిరి వా**
**రలు దీనిఁ బ్రయోగించుట । గలిగెనె మానవులపై నకల్మషులారా?' 67**

**ప్రతిపదార్థం:** పలువురు= పెక్కుమంది; మహా+అస్త్రవిత్తములు= గొప్ప అస్త్రాలు తెలిసినవారిలో శ్రేష్ఠులూ; అలఘు భుజా వీర్య శౌర్యులు= తక్కువకాని భుజబల పరాక్రమం గలవారూ; అవనిన్+చనిరి= భూమిపై; ఒప్పినారు; అకల్మషులారా!= అనఘులారా!; వారలు; దీనిన్; మానవులపైన్= మనుష్యులమీద; ప్రయోగించుట= ప్రయోగించటం; కలిగెనె?= సంభవించిందా?

**తాత్పర్యం:** 'ఓ అనఘులారా! ఎంతోమంది దివ్యాస్త్రవిద్యావేత్తలలో శ్రేష్ఠులూ, గొప్ప భుజబలపరాక్రమం గలవారూ భూమిలో ఉండినారు. వాళ్ళు దీనిని మనుష్యుల మీద ప్రయోగించటం సంభవించిందా?'

**వ. అనిన విని సవ్యసాచి దివ్యాస్త్ర జ్వాలా కలాప మధ్యంబున నిస్సంభ్రములై యున్న సర్వధర్మరక్షణ సర్వలోక హితాచరణపరిణతులగు నప్పరమమునులం గనుంగొని తత్కాలోచితానుష్ఠానంబు నూహించి యమ్మహాత్ములతో నిట్లనియె. 68**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సవ్యసాచి= అర్జునుడు; దివ్య+అస్త్రజ్వాలా కలాప మధ్యంబునన్= దివ్యాస్త్రాల అగ్నిజ్వాలల సమూహం నడుమ; నిస్సంభ్రములు+ఐ+ఉన్న= నిశ్చేష్టులైఉన్న; సర్వ ధర్మ రక్షణ సర్వలోక హిత+ఆచరణ పరిణతులు+అగు= అన్ని ధర్మాలనూ రక్షించటంలోనూ, అన్ని లోకాలకూ మేలు చేయటంలోనూ పండిపోయినవారైన; ఆ+పరమ మునులన్= ఆ మహర్షులను; కనుంగని= చూచి; తద్+కాల+ఉచిత+అనుష్ఠానంబున్= ఆ సమయానికి తగిన ఆచారాన్ని; ఊహించి= తలచి; ఆ+మహత్+ఆత్ములతోన్= ఆ మహనీయులతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు దివ్యాస్త్రాల అగ్నిజ్వాలల సమూహం మధ్య నిశ్చేష్టులై ఉన్న సర్వధర్మ రక్షణంలోనూ, సకలలోక హితాచరణంలోనూ పండిపోయిన ఆ మహర్షులను చూచి, ఆ సమయానికి తగిన ఆచారాన్ని తలచి, ఆ మహనీయులతో ఇట్లా అన్నాడు:

**తే. అస్త్ర మస్త్రముతో శాంత మగుటఁ గోరి । సొలవ కట్లు ప్రయోగింపవలసెఁ గాని**
**యొండు దలఁపునఁ గా దది యుడుపవలయు । నేని యుడిపెదఁ బరమమునీంద్రులార! 69**

**ప్రతిపదార్థం:** పరమ ముని+ఇంద్రులార!= మహామునీశ్వరులారా!; అస్త్రము; అస్త్రముతోన్; శాంతము+అగుటన్+కోరి= శాంతించటం కోరి; సొలవక= జంకక; అట్లు= ఆ రీతిగా; ప్రయోగింపన్+వలసెన్+కాని= ప్రయోగించవలసి వచ్చింది కాని; ఒండు+తలఁపునన్+కాదు= మరొక ఉద్దేశంతో కాదు; అది; ఉడుపవలయున్+ఏని= ఉపసంహరించాలంటే; ఉడిపెదన్= ఉపసంహరిస్తాను.

**తాత్పర్యం:** 'మహామునీశ్వరులారా! అస్త్రం అస్త్రంతో ఉపశమిస్తుంది గదా అని జంకకుండా అట్లా ప్రయోగించవలసి వచ్చింది కాని మరొక ఉద్దేశంతో కాదు. దానిని ఉపసంహరించాలంటే ఉపసంహరిస్తాను.

**క. ఏను మదస్త్రం బుడుపం । గా నీ పాపాత్ముఁ డస్త్రఘనదహనమునం**
**దా నేర్చు నందఱను; మీ । మానసములఁ దలఁపవలయు మా సేమంబుల్.' 70**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మత్+అస్త్రంబు= నా అస్త్రం; ఉడుపంగాన్= ఉపసంహరించగా; ఈ పాప+ఆత్ముఁడు= ఈ దుర్మార్గుడు; అస్త్ర ఘన దహనమునన్= అస్త్రంయొక్క గొప్ప కాల్పుచేత; తాన్= తాను; అందఱను= మమ్ములను అందరినీ; ఏర్చున్= దహిస్తాడు; మా సేమంబుల్= మా క్షేమాలు; మీ మానసములన్= మీ మనస్సులలో; తలఁపవలయున్= ఆలోచించాలి.

**తాత్పర్యం:** నేను నా అస్త్రాన్ని ఉపసంహరిస్తే, ఈ దుర్మార్గుడు తన అస్త్రపు మహాదాహశక్తిచేత మమ్ములను అందరనూ దహిస్తాడు. మరి మా క్షేమం గూర్చి మీ మనస్సులలో ఆలోచించాలి.'

**తే. అనుచుఁ జయ్యన నస్త్రవిద్యాప్రవీణ । మానసుండగు నరుఁ డయ్యహీన రూప**
**సాధనము నశ్రమంబున సంహరించె । మెచ్చి యమ్మహామును లెదఁ బిచ్చలింప. 71**

**ప్రతిపదార్థం:** అనుచున్; చయ్యనన్= శీఘ్రంగా; అస్త్ర విద్యా ప్రవీణ మానసుండు+అగు నరుఁడు= అస్త్రవిద్యలో నేర్పుగల మనస్సు గలవాడైన అర్జునుడు; ఆ+అహీన రూప సాధనమున్= ఆ గొప్పసాధనాన్ని; ఆ+మహా+మునులు= ఆ మహర్షులు; మెచ్చి; ఎదన్= మనస్సులో; పిచ్చలింపన్= ఆనందించగా; అశ్రమంబునన్= అనాయాసంగా; సంహరించెన్= ఉపసంహరించాడు.

**తాత్పర్యం:** అంటూ శీఘ్రంగా అస్త్రవిద్యా నిపుణుడైన అర్జునుడు ఆ మహాస్త్రాన్ని ఆ మహర్షులు మెచ్చి హృదయంలో ఆనందించగా అనాయాసంగా ఉపసంహరించాడు.

**విశేషం:** చయ్యన ద్రుతప్రకృతికం కాబట్టి 'చయ్యననస్త్ర' అని దిద్దడమయినది.

**చ. తపమును, బ్రహ్మచర్యమును, దానము, సత్యముఁ గల్గు నా సురా**
**ధిపతనయుండు దక్క సముదీర్ణముగా నిగిడించి యమ్మహో**
**గ్రపు మహితాస్త్ర మొండ్లకును రాదు మగుడ్పఁగ; నట్టి భంగి భూ**
**మిపతుల కాదు దేవతలు మేకొనఁ జాలరు కౌరవేశ్వరా! 72**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కురురాజా! జనమేజయా!; తపమును; బ్రహ్మచర్యమును; దానమున్; సత్యమున్; కల్గు; ఆ సుర+అధిప తనయుండు= ఆ దేవేంద్రుడి కొడుకు - అర్జునుడు; తక్కన్= తప్ప; ఆ+మహత్+ఉగ్రము+మహిత+అస్త్రము= ఆ మిక్కిలి భయంకరమైన గొప్ప అస్త్రం; సముదీర్ణముగాన్= బాగా; నిగిడించి= ప్రయోగించి; ఒండ్లకును= ఇతరులకును; మగుడ్పఁగన్+రాదు= మరల్చరాదు; అట్టి భంగిన్= అటువంటి విధాన్ని; భూమిపతులు+అ కాదు= రాజులే కాదు; దేవతలున్= దేవతలు సైతం; మేకొనన్+చాలరు= చేయలేరు.

**తాత్పర్యం:** జనమేజయా! తపస్సూ, బ్రహ్మచర్యమూ, దానమూ, సత్యమూ కల ఆ అర్జునుడికి తప్ప ఆ భయంకరమైన దివ్యాస్త్రాన్ని బాగా ప్రయోగించి మరల్చటానికి ఇతరులకు సాధ్యంకాదు. ఆ పని రాజులే కాదు దేవతలు సైతం చేయలేరు.

**వ. బ్రహ్మశిరోనామకంబగు నమ్మహాస్త్రంబు దలంచి బ్రహ్మతేజోమయంబగుటం జేసి యిట్లు ప్రయోగించి వారింప శక్యంబు గాకుండు; వారించిరేని వారించిన వారిన తలద్రెంచు; గురుభక్తియు వ్రతయుక్తియు నెక్కుడు గలుగుట నక్కౌరవశ్రేష్ఠుండు నివారణపటిష్ఠుం డయ్యె; నవ్విధంబునఁ గవ్వడి యా దుర్నివారసాధనంబు వారించుట నాలోకించి యమ్మునీశ్వరు లమ్మాహాత్మ్యం బూహించి, రశ్వత్థామ నిజాస్త్ర సంహారంబు సేయంజూచి యది శక్యంబుగా కుండుటయు దీనమానసుండగుచు మాననీయోపాయుండగు సాత్య వతేయున కిట్లనియె. 73**

**ప్రతిపదార్థం:** బ్రహ్మశిరోనామకంబు+అగు+అ+మహా+అస్త్రంబు= బ్రహ్మశిరోనామకమైన ఆ గొప్ప అస్త్రాన్ని; తలంచి; బ్రహ్మ తేజస్(ః)+మయంబు+అగుటన్+చేసి= బ్రహ్మతేజస్సుతో నిండిన దవటంచేత; ఇట్లు; ప్రయోగించి; వారింపన్= ఆపడానికి; శక్యంబు+కాక+ఉండున్= సాధ్యంకాదు; వారించిరి+ఏని= ఒకవేళ వారించితే; వారించినవారిన్+అ= వారించిన వారినే; తల+త్రెంచున్= తల ఖండిస్తుంది; గురు భక్తియున్; వ్రతయుక్తియున్= తపస్విత్వమూ; ఎక్కుడు+కలుగుటన్= ఎక్కువగా ఉండటంచేత; ఆ+కౌరవ+శ్రేష్ఠుండు= ఆ కురువంశోత్తముడు (అర్జునుడు); నివారణ పటిష్ఠుండు+అయ్యెన్= వారించటానికి సమర్థుడయ్యాడు; ఆ+విధంబునన్; కవ్వడి= అర్జునుడు; ఆ దుర్నివార సాధనంబున్= ఆ వారించశక్యం కాని సాధనాన్ని; వారించుటన్= వారించటం; ఆలోకించి= చూచి; ఆ+ముని+ఈశ్వరులు= ఆ మునిశ్రేష్ఠులు; ఆ+మాహాత్మ్యంబు= ఆతడి మాహాత్మ్యం; ఊహించిరి; అశ్వత్థామ; నిజ+అస్త్ర సంహారంబు= తన అస్త్రోపసంహారం; చేయన్+చూచి= చేయబోయి; అది; శక్యంబు+కాక+ఉండుటయున్= సాధ్యం కాకపోగా; దీన మానసుండు+అగుచున్= విచారంతో కూడిన మనస్సుగల వాడవుతూ; మాననీయ+ఉపాయుండు+అగు= మన్నించదగిన ఉపాయం గలవాడైన; సాత్యవతేయునకున్= వ్యాసుడికి; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని స్మరించి అది బ్రహ్మతేజస్సుతో నిండిన దవటంచేత, ఇట్లా ప్రయోగించిన తరువాత వారించటానికి శక్యం కాదు. ఒకవేళ వారిస్తే, వారించిన వారికే శిరశ్ఛేదం చేస్తుంది. గురుభక్తీ, తపోయుక్తీ అధికంగా ఉండటంచేత ఆ అర్జునుడు వారించటానికి సమర్థుడయ్యాడు. ఆ విధంగా అర్జునుడు ఆ వారించ శక్యం కాని సాధనాన్ని వారించటం చూచి ఆ మునిశ్రేష్ఠులు అతడి మాహాత్మ్యాన్ని గుర్తించారు. అశ్వత్థామ తన అస్త్రాన్ని వారించాలని చూచి, అది సాధ్యం కాకపోవటం చేత, దైన్యంతో మంచి ఉపాయశాలి అయిన వ్యాసుడితో ఇట్లా అన్నాడు:

**తే. 'చంపెఁ గురువిభు నాకు లజ్జాకరముగ । భీముఁ డదియు నధర్మ సంగ్రామవృత్తి;**
**నంతఁ బోవక వచ్చి ప్రాణాపహార । మాచరింపఁగఁ బూని నన్నాక్రమించె. 74**

**ప్రతిపదార్థం:** భీముఁడు; కురువిభున్= కురుపతిని - దుర్యోధనుడిని; నాకున్; లజ్జాకరముగన్= సిగ్గు అయ్యేటట్టు; చంపెన్; అదియున్= ఆ చంపటంకూడా; అధర్మ సంగ్రామ వృత్తిన్= అధర్మయుద్ధ ప్రవర్తనతో; అంతన్+పోవక= దానితో ఊరుకోక; వచ్చి; ప్రాణ+అపహారము+ఆచరింపఁగన్+పూని= ప్రాణాలు తీయటానికి ప్రయత్నించి; నన్నున్+ఆక్రమించెన్= నాపై దండెత్తాడు.

**తాత్పర్యం:** భీముడు నాకు సిగ్గయ్యేటట్లు దుర్యోధనుడిని చంపాడు. అదీ అధర్మయుద్ధంలో. దానితో ఊరుకొనక వచ్చి నా ప్రాణాలు తీయాలని నామీది కురికాడు.

**చ. పరిభవజాతరోషమునఁ బ్రాణభయంబునఁ జేసి యిమ్మహా**
**శరము వివేకవర్జితవిచారుఁడనై యిటు లేసితిన్ మునీ**
**శ్వర! యిది పాండుభూపసుత వర్గము నంతటినేర్చుఁగాని యె**
**ప్పరుసున మాన దివ్విధము పాపమయేనియు దాని కోర్చితిన్.' 75**

**ప్రతిపదార్థం:** ముని+ఈశ్వర!= మునిపతీ!; పరిభవజాత రోషమునన్= అవమానం వలన కలిగిన కోపంతోనూ; ప్రాణ భయంబునన్+చేసి= ప్రాణభీతితోనూ; ఈ+మహత్+శరమున్= ఈ మహాస్త్రాన్ని; వివేక వర్జిత విచారుఁడను+ఐ= వివేకశూన్యమైన ఆలోచన గలవాడనై; ఇటులు+ఏసితిన్= ఇట్లా ప్రయోగించాను; ఇది; పాండు భూపసుత వర్గమున్+అంతటిన్= పాండురాజు కొడుకుల సమూహాన్నంతటినీ; ఏర్చున్+కాని; దహిస్తుందికాని; ఏ+పరుసునన్= ఏ విధంగానూ; మానదు; ఈ+విధము; పాపము+అ+ఏనియున్= పాపమే అయినా; దానికిన్; ఓర్చితిన్= సహించాను.

**తాత్పర్యం:** మునీశ్వరా! అవమానంవలన కలిగిన కోపంతోనూ, ప్రాణభీతితోనూ ఈ మహాస్త్రాన్ని మంచీచెడ్డా ఆలోచించకుండా ఇట్లా ప్రయోగించాను. ఇది పాండవుల నందరినీ ఎట్లా అయినా దహించి తీరుతుంది. ఈ విధం పాపమే అని తెలిసినా, దానికి ఒడబడ్డాను.'

**వ. అనిన విని యమ్మునిపతి యతని యాననంబునఁ జూడ్కి నిలిపి మీ తండ్రి యిప్పాండవమధ్యమునకు వాత్సల్యంబున నీయస్త్రం బొసంగె నీ యోధవరుండు నీకుఁ గీడు దలంపఁడు; భవదస్త్రం బుపశమించుటకునై నిజాస్త్రంబు ప్రయోగించె; మేము వలవ దన్న నుపసంహరించె; ని ట్లస్త్రవిద్యావైదగ్ధ్యంబు సడిసన్న కవ్వడి వధింప నీకు వశంబగునే? నీ యస్త్రం బతని యస్త్రంబు చేత నివారితం బయ్యెడు; నది యట్లుండె; వినుమ్మహాస్త్రంబు మనుష్య విషయంబుగాఁ బ్రయోగించువానికి నశుభంబగు; నొకనిచేతఁ బ్రయోగింపఁబడి యన్య నస్త్రం బుపశమించెనేని, యద్దేశంబునకుఁ బండ్రెండేం డ్లనా వృష్టి దురితం బగుం; గావునఁ బాండవులను నిన్నును నిద్దేశంబును రక్షించుటకుం జెప్పితి; మెప్పాటనయిన దీని నుపసంహరింపవలయుఁ; దపంబునకుఁ జొచ్చినవాఁడవు, రోషంబునకుఁ దొలంగి సుఖివి గమ్ము; ధర్మంబున జయంబు గొన నోపిన యిప్పార్థుండును బ్రీతుండై చనవలయు; భవదీయ శిరోమణి యీతని కి; మ్మట్లయిన నితండ కాఁడు, పాండవులందఱును నీ దగు జీవనంబు నపహరించినంతయ సంతసిల్లుదు; రిది సమీచీనంబయిన సంధిప్రకారం; బిట్లు సేయుట మే;' లనుటయు, నుమ్మలికంబుతో నగ్గురునందనుండు పరాశరనందనున కిట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+ముని పతి= ఆ మునీశ్వరుడు-వ్యాసుడు; అతని+ఆననంబునన్= అతని ముఖంపై; చూడ్కి= చూపు; నిలిపి; మీ తండ్రి; ఈ+పాండవ మధ్యమునకున్= ఈ అర్జునుడికి; వాత్సల్యంబునన్; ఈ+అస్త్రంబు+ ఒసంగెన్= ఈ అస్త్రాన్నిచ్చాడు; ఈ+యోధవరుండు= ఈ వీరశ్రేష్ఠుడు; నీకున్; కీడు+తలంపఁడు= హాని తలపెట్టడు; భవత్+అస్త్రంబు= నీ అస్త్రం; ఉపశమించుటకున్+ఐ= శాంతించటానికని; నిజ+అస్త్రంబు= తనదైన అస్త్రం; ప్రయోగించెన్; మేము; వలవదు+అన్నన్= వద్దంటే; ఉపసంహరించెన్= నివారించాడు; ఇట్లు; అస్త్రవిద్యా వైదగ్ధ్యంబు సడి+చన్న= అస్త్రవిద్యా నైపుణ్యంలో అనింద్యుడైన; కవ్వడిన్= అర్జునుడిని; వధింపన్= చంపటానికి; నీకున్; వశంబు+అగునే?= తరమవుతుందా?; నీ+అస్త్రంబు; ఇతని+అస్త్రంబుచేతన్; నివారితంబు+అయ్యెడున్= వారించబడుతుంది; అది; అట్లు+ఉండెన్; వినుము;

ఆ+మహా+అస్త్రంబు; మనుష్య విషయంబు+కాన్= మనుష్యులను గూర్చి-; మనుష్యులమీద; ప్రయోగించువానికిన్; అశుభంబు+ అగున్= కీడు కలుగుతుంది; ఒకనిచేతన్; ప్రయోగింపఁబడి; అన్య+అస్త్రంబు= ఇతరుడి అస్త్రం; ఉపశమించెన్+ఏని= శాంతిస్తే; ఆ+దేశంబునకున్; పంద్రెండు+ఏండ్లు; అనావృష్టి దురితంబు= వర్షాభావ కష్టం; అగున్; కావునన్; పాండవులను; నిన్నును; ఈ+దేశంబును; రక్షించుటకున్; చెప్పితిమి; ఏ+పాటన్+అయినన్= ఏ విధంగానైన; దీనిన్; ఉపసంహరింపవలయున్; తపంబునకున్; చొచ్చినవాఁడవు= తపస్సు చేయటానికి పూనుకున్నవాడవు; రోషంబునకున్= కోపానికి; తొలంగి; సుఖివి+ కమ్ము; ధర్మంబునన్; జయంబు+కొనన్+ఓపిన+ఈ+పార్థుండును= గెలువగల ఈ అర్జునుడూ; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; చనవలయున్= వెళ్ళాలి; భవదీయ శిరోమణి= నీ శిరోమణి; ఈతనికిన్; ఇమ్ము; అట్లు+అయినన్; ఇతండు+అ+కాఁడు; పాండవులు+అందఱును; నీది+అగు జీవనంబున్= నీ ప్రాణాన్ని; అపహరించిన+అంత+అ= తీసినంతే; సంతసిల్లుదురు= సంతోషిస్తారు; ఇది; సమీచీనంబు+అయిన= సముచితమైన; సంధి ప్రకారంబు= సంధి పద్ధతి; ఇట్లు+చేయుట; మేలు; అనుటయున్; ఉమ్మలికంబుతోన్= విచారంతో; ఆ+గురునందనుండు= ఆ అశ్వత్థామ; పరాశర నందనునకున్= పరాశరుడి కొడుకునకు వ్యాసుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ఆ మునీశ్వరుడు (వ్యాసుడు) అతడి ముఖంపై దృష్టి నిలిపి, 'మీ తండ్రి ఈ అర్జునుడికి శిష్యవాత్సల్యంతో ఈ అస్త్రాన్నిచ్చాడు. ఈ వీరశ్రేష్ఠుడు నీకు హాని తలపెట్టడు. నీ అస్త్రం ఉపశమించటానికి తన అస్త్రం ప్రయోగించాడు. మేము వద్దంటే ఉపసంహరించాడు. ఈ విధంగా అస్త్రవిద్యా నైపుణ్యంలో ఆరితేరిన అర్జునుడిని వధించటం నీ తరమవుతుందా? నీ అస్త్రం ఇతడి అస్త్రంచేత వారించబడుతుంది. అది అట్లా ఉండనిమ్ము. వినుము. ఆ మహాస్త్రాన్ని మనుష్యులపై ప్రయోగించినవాడికి అశుభం అవుతుంది. ఒకడిచేత ప్రయోగించబడి, ఇతరుడి అస్త్రం ఉపశమిస్తే, ఆ దేశానికి పన్నెండేళ్ళు అనావృష్టి కష్టం ప్రాప్తిస్తుంది. కాబట్టి, పాండవులనూ, నిన్నూ, ఈ దేశాన్నీ రక్షించటానికి చెప్పాము. ఏ విధంగా నైనా సరే దీనిని ఉపసంహరించాలి. తపస్సుకు పూనుకొన్నవాడివి కోపం విడిచిపెట్టి సుఖపడుము. ధర్మబద్ధంగా గెలువగల ఈ అర్జునుడు కూడా సంతోషంతో వెళ్ళాలి. నీ శిరోమణిని ఇతడి కిమ్ము. అట్లా అయితే ఇతడే కాడు, పాండవులందరూ నీ ప్రాణం తీసినంతగా సంతోషిస్తారు. ఇది సముచితమైన రాజీ పద్ధతి. ఇట్లా చేయటం మంచిది' అనగా విచారంతో ఆ అశ్వత్థామ వ్యాసుడితో ఇట్లా అన్నాడు:

**సీ.** **'పాండునందనులకు బ్రాఁతె రత్నంబులు? । కౌరవనాథు భండార మెల్లఁ**
**గైకొన్నవారు; నాగభయంబుఁ, దస్కర । భయమును, దానవభయము, దేవ**
**భయమును, బొరయవు; బాధింప దాఁకలి । తృష, నిద్ర, రోగంబు, దీనికతన;**
**నిట్టిరత్నము వీరి కీఁ జాలుదునె? ముని । నాయక! నీ వచనం బలంఘ్య**

**ఆ.** **మగుట దీని నీకు నర్పించితిని; మద । స్త్రంబు పాండవేయ రాగ పాత్ర**
**గర్భములకు హానిఁ గావించి సంతృప్తిఁ । బొంది తాఁ బ్రశాంతిఁ బొందుఁగాత.'** **77**

**ప్రతిపదార్థం:** ముని నాయక!= మునీశ్వరా!; రత్నంబులు; పాండు నందనులకున్= పాండవులకు; బ్రాఁతె?= అపురూపమా; కౌరవ నాథు భండారము+ఎల్లన్= కురురాజైన దుర్యోధనుడి బొక్కసమంతా; కైకొన్నవారు= పొందినవారు; నాగభయంబున్= సర్పభయమూ; తస్కర భయమును= చోరభయమూ; దానవభయమున్= రాక్షసభయమూ; దేవ భయమును; పొరయవు= కలుగవు; ఆఁకలి; తృష= దప్పి; నిద్ర; రోగంబు; దీనికతనన్= దీనివలన; బాధింపదు; ఇట్టి రత్నమున్; వీరికిన్; ఈన్+చాలుదునె?=

ఇయ్యగలనా?; నీ వచనంబు= నువ్వు అనిన మాట; అలంఘ్యము+అగుటన్= దాటరానిది అవటంచేత; దీనిన్; నీకున్; అర్పించితిని= ఇచ్చాను; మత్+అస్త్రంబు= నా అస్త్రం; పాండవేయ రాగ పాత్ర గర్భములకున్= పాండవేయుల ఇష్టానికి పాత్రములైన గర్భాలకు; హానిన్+కావించి= కీడుచేసి; సంతృప్తిన్+పొంది= తృప్తిపడి; తాన్= తాను(అస్త్రం); ప్రశాంతిన్= ఉపశమనాన్ని, పొందున్= కాత పొందునుగాక!

**తాత్పర్యం:** 'మునీశ్వరా! దుర్యోధనుడి బొక్కసాన్నంతటినీ పొందిన పాండవులకు రత్నాలు అపురూపమా? సర్పభయమూ, చోరభయమూ, రాక్షసభయమూ, దేవభయమూ కలుగవు. దీనివలన ఆకలీ, దప్పిక, నిద్రా, రోగమూ బాధించవు. ఇట్లాంటి రత్నం వీళ్ళకు ఇవ్వగలనా? అయినా నీ మాట దాటరానిది కాబట్టి దీనిని నీకు ఇచ్చాను. నా అస్త్రం పాండవేయుల గర్భాలకు హాని కలిగించి తృప్తిపడి ఉపశమిస్తుంది గాక!'

**క. అన విని కృష్ణద్వైపా । యనుఁ 'డట్టులు సేయు మొంటి కాస పడకు మీ'**
**యని పలుక నప్పలుకునం । గనియెను దన పలుకు తప్పగా నతఁడు మదిన్. 78**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; కృష్ణద్వైపాయనుఁడు= వ్యాసుడు; అట్టులు+చేయుము= అట్లా చెయ్యి; ఒంటికిన్= ఇంకొకదానికి; ఆసపడకుమీ= ఆశించకుమీ; అని; పలుకన్= పలుకగా; అతఁడు= అశ్వత్థామ; మదిన్= మనస్సులో; ఆ+పలుకునన్= ఆ మాటచేత; తన పలుకు= తను అన్నది; తప్పు+కాన్= తప్పుగా; కనియెను= గ్రహించాడు.

**తాత్పర్యం:** అనగా విని వ్యాసుడు 'అట్లా చేయుము. వేరే దానికి ఆశించకుము' అని పలుకగా, అశ్వత్థామ తన మనస్సులో, ఆతడి మాటను బట్టి తన మాట తప్పని గ్రహించాడు.

**విశేషం:** అశ్వత్థామ 'పాండవేయ గర్భా' లనటంలో 'పాండవుల సంతతి గర్భా' లని భావించగా, వ్యాసుడు 'పాండవులకు సంబంధించిన గర్భా' లని వేరుగా భావించాడు (పాండవేయ= పాండవ సంతతి యొక్క, పాండవులయొక్క.).

**వ. కని 'పాండవేయ రాగపాత్ర గర్భంబులని తత్సంతాన సంజాత గర్భంబులనెల్ల నుగ్గడించిన వాఁడనయితి; నది పారాశర్యుండు పాండవేయ భార్యాగర్భంబులన పేరుకొనుటగాఁ జేసి 'యొంటి కాసపడకుమీ' యనియె. దీని నెఱింగినవాఁడఁ గానేని యిది యనుమతిగా భావించి సకలగర్భవిధ్వంసనంబు గావించెదంగాక' యని నిశ్చయించి యమ్మునీంద్రునితో 'నట్ల చేయువాఁడ' నని పలికె. వారల సంవాదప్రకారంబు హృషీకేశుం డెఱింగి 'వీఁడు సంయమివరు మాట గీటునం బుచ్చి తనవలసినట్లు సేయువాఁడయ్యె; నిప్పాపాత్ము నుపక్రమంబునకు నడ్డపడి చూచెదఁ; గాకున్నఁ దుది నా చేయుతెఱంగున్నదియ కాదె' యని వితర్కించె, నప్పు డశ్వత్థామ చేతోవృత్తి సాత్యవతేయుం డెఱిఁగియుం, గృష్ణుం డెఱుంగుటయు నతం డతనితో సల్లాపంబు సేయం దలంచుటయుఁ గనుంగొని యూరకుండె. 79**

**ప్రతిపదార్థం:** కని= గ్రహించి, తెలిసి; పాండవేయ రాగ పాత్ర గర్భంబులు+అని= పాండవేయుల రాగానికి పాత్రములైన గర్భములని; తద్+సంతాన సంజాత గర్భంబులన్+ఎల్లన్= పాండవులయొక్క సంతతివలన పుట్టిన గర్భాలనన్నింటినీ; ఉగ్గడించినవాఁడన్+అయితిన్= చెప్పినవాడిని అయ్యాను; అది; పారాశర్యుండు= వ్యాసుడు; పాండవేయ భార్యాగర్భంబులన్+అ= పాండవులయొక్క భార్యల గర్భాలుగానే; పేరుకొనుటగాన్= చేసి= పేర్కొనటంచేత; ఒంటికిన్= వేరేదానికి; ఆసపడకుమీ=

ఆశించకుమీ; అనియెన్; దీనిన్= వ్యాసుడిభావం; ఎఱింగినవాఁడన్+కాన్+ఏని= తెలిసినవాడిని కాకపోతే; ఇది; అనుమతి+కాన్= అంగీకారంగా; భావించి; సకల గర్భ విధ్వంసనంబు సర్వగర్భాల నాశనం; కావించెదన్+కాక= చేస్తానుగాక; అని; నిశ్చయించి= నిర్ణయించి; ఆ+ముని+ఇంద్రునితోన్= ఆ మునీశ్వరుడితో-వ్యాసుడితో; అట్లు+అ= అట్లే; చేయువాఁడన్+అని పలికెన్= చేస్తానని పలికాడు; వారల సంవాద ప్రకారంబున్= ఆ వ్యాసాశ్వత్థామల పరస్పర సంభాషణ విధం; హృషీకేశుండు= కృష్ణుడు; ఎఱింగి= తెలిసి; వీఁడు= ఇతడు - అశ్వత్థామ; సంయమివరుమాటన్= మునీశ్వరుడైన వ్యాసుడిమాట; గీటునన్+పుచ్చి= అనాదరించి; తన వలసిన+అట్లు చేయువాఁడు+అయ్యెన్= తన ఇష్టం వచ్చినట్లు చేస్తాడు; ఈ+పాప+ఆత్మ+ ఉపక్రమంబునకున్= ఈ దుర్మార్గుడి పూనికకు; అడ్డుపడి చూచెదన్= అడ్డపడటానికి చూస్తాను; కాక+ఉన్నన్= లేకుంటే; తుదిన్= చివర; నా చేయు తెఱంగు+ఉన్నయది కాదె= నేను చేసే విధం ఉండనే ఉన్నది కదా!; అని; వితర్కించెన్= ఆలోచించాడు; అప్పుడు; అశ్వత్థామ చేతస్(ః)+వృత్తిన్= అశ్వత్థామ మనోభిప్రాయం; సాత్యవతేయుండు= వ్యాసుడు; ఎఱిఁగియున్= గ్రహించినా; కృష్ణుండు; ఎఱుంగుటయున్= గ్రహించటమూ; అతండు= కృష్ణుడు; అతనితోన్ అశ్వత్థామతో; సల్లాపంబు+చేయన్+తలంచుటయున్= మాట్లాడాలనుకోవటం; కనుంగొని= చూచి; ఊరక+ఉండెన్= ఊరుకున్నాడు.

**తాత్పర్యం:** గ్రహించి, 'పాండవేయ రాగ పాత్రగర్భము' లని పాండవుల సంతతి తాలూకు గర్భాలనన్నిటినీ ఉద్దేశించాను. కాని దానిని వ్యాసుడు పాండవుల భార్యల గర్భాలుగానే పేర్కొనటంచేత వేరే దానిని ఆశించకుము-అన్నాడు. అది నేను తెలిసినట్టుగా ఎందుకుండాలి? ఇది అంగీకారంగా భావించి అన్ని గర్భాలనీ నాశనం చేస్తానుగాక' అని నిర్ణయించి ఈ మునీశ్వరుడితో అట్లాగే చేస్తానని పలికాడు. వాళ్ళ పరస్పర సంభాషణక్రమం కృష్ణుడు తెలిసి 'వీడు మునీశ్వరుడి మాటను కాదని తన యిష్టం వచ్చినట్లు చేసేవాడివలె ఉన్నాడు. ఈ దుర్మార్గుడి ప్రయత్నానికి అడ్డపడటానికి చూస్తాను. లేకుంటే చివర నేను చేసే పని ఎట్లాగూ ఉండనే ఉన్నది కదా!' అని తలచాడు. అప్పుడు అశ్వత్థామ మనోభిప్రాయం వ్యాసుడు గ్రహించీ, కృష్ణుడు గ్రహించాడనీ, అతడు అశ్వత్థామతో మాటాడాలను కొంటున్నాడనీ తెలిసి, ఊరుకున్నాడు.

### శ్రీకృష్ణుఁ డుత్తరగర్భంబు దగ్ధంబు గాకుండఁ జేయ నిశ్చయించుట (సం. 10-16-1)

**క. వనజాక్షుఁడు ద్రౌణికి ని । ట్లనుఁ 'దునిమితి పాండు పౌత్రు లందఱఁ; బాపం**
**బునఁ బోయితి; గర్భంబులఁ । దునిమెద వం దొకటియైనఁ దొలఁగింపఁ దగున్.' 80**

**ప్రతిపదార్థం:** వనజ+అక్షుఁడు= తామరలవంటి కన్నులుగలవాడు - శ్రీకృష్ణుడు; ద్రౌణికిన్= అశ్వత్థామకు; ఇట్లు+అనున్; పాండు పౌత్రులన్+అందఱన్= పాండురాజు మనుమలనందరినీ; తునిమితి(వి)= వధించావు; పాపంబునన్= పోయితి(వి)= పాపానపోయావు-పాపం కట్టుకున్నావు; గర్భంబులన్= ఆ పౌత్రుల గర్భాలను ఆ పౌత్రుల సంతతిని; తునిమెదవు= వధిస్తావు; అందున్= ఆ గర్భాలలో; ఒకటి+ఐనన్= ఒకదాన్నైనా; తొలఁగింపన్+తగున్= తొలగించాలి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అశ్వత్థామతో ఇట్లా అన్నాడు: 'పాండురాజు మనుమలనందరినీ వధించావు. పాపం కట్టుకొన్నావు. ఇప్పుడు ఆ మనుమల గర్భాలను చంపాలనుకొంటున్నావు. అందులో ఒక దాన్నైనా నీ బారినపడకుండా తొలగించాలి.'

**క. 'ఏ నొక్కనిఁ బాండవ సం । తానార్థము గాఁగ నిత్తు; ధర్మముల మహా**
**దానంబులఁ గ్రతువుల జన । తానందితుఁ డగుచుఁ బెంపుఁ దలకొనువానిన్.' 81**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఒక్కనిన్= ఒకడిని; ధర్మములన్= ధర్మాలతోనూ; మహా+దానంబులన్= గొప్పదానాలతోనూ; క్రతువులన్= యజ్ఞాలతోనూ; జనతా+ఆనందితుఁడు+అగుచున్= జన సమూహాన్ని సంతోషించేటట్టు చేసేవాడు అవుతూ; పెంపున్= గొప్పతనాన్ని; తలకొనువానిన్= వహించేవాడిని; పాండవ సంతాన+అర్థము+కాఁగన్= పాండవుల సంతతికోసం; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** 'నేను ధర్మాలతోనూ, గొప్ప దానాలతోనూ, యజ్ఞాలతోనూ జనులను సంతోషపెట్టి గొప్పతనం పొందే ఒకడిని పాండవవంశం నిలబెట్టటం కొరకు రక్షిస్తాను.'

**తే.** **'అట్టి గర్భంబు నిలుపు త క్కన్ని గర్భ । ములును భవదస్త్రమున దగ్ధములుగఁ జేయు'**
**మనుడు సంరంభజృంభితుఁ డగుచు ద్రోణ । తనయుఁ డిట్లను నమ్మురాంతకుని తోడ.** **82**

**ప్రతిపదార్థం:** అట్టి గర్భంబున్= అటువంటి గర్భాన్ని; నిలుపు(ము); తక్కు+అన్ని గర్భములును= తక్కిన గర్భాల నన్నిటినీ; భవత్+అస్త్రమునన్= నీ బాణంతో; దగ్ధములుగన్+చేయుము= నాశనం చేయుము; అనుడున్= అనగానే; ద్రోణ తనయుఁడు= అశ్వత్థామ; సంరంభ జృంభితుఁడు+అగుచున్= కోపంతో విజృంభించినవాడవుతూ; ఆ+ముర+అంతకునితోడన్= ఆ శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'అట్లాంటి గర్భాన్ని నిలుపుము. తక్కిన గర్భాలనన్నిటినీ నీ అస్త్రంతో దహించుము' అనగానే అశ్వత్థామ కోపంతో విజృంభించి ఆ శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**వ.** **'పక్షపాతంబున నీ విట్లు పలికిన నే నట్లేల చేయుదు? మదస్త్రంబునకు లక్ష్యంబులుగా గర్భంబు లొండు గలుగు లేకుండు; నది యట్లుండె; విరాటనందన యగు నుత్తరగర్భంబు రక్షించెద నని చూచె; దప్పనికిఁ బూనితేనియు నా యస్త్రంబున నవశ్యం బదియును విధ్వంసంబు గావింతు' నని పలికినఁ బద్మనాభుండు.** **83**

**ప్రతిపదార్థం:** నీవు; పక్షపాతంబునన్= పాండవులమీదనే ఉన్న అభిమానంతో; ఇట్లు; పలికినన్= పలికితే; నేను; అట్లు+ఏల చేయుదున్?= అట్లా ఎందుకుచేస్తాను?; మదస్త్రంబునకున్= నా అస్త్రాన్నికి; లక్ష్యంబులు+కాన్= గురిగా; గర్భంబులు+ఒండు+ కలుగున్ లేక+ఉండున్= గర్భాలలో ఒకటి ఉంటుంది, లేకపోతుంది; అది+అట్లు+ఉండెన్= అది అలా ఉండనీ; విరాట నందన+అగు= విరాటుడి కూతురైన; ఉత్తర= ఉత్తరయొక్క; గర్భంబున్= చూలు; రక్షించెదన్+అని చూచెదు= కాపాడాలని చూస్తావు; ఆ+పనికిన్; పూనితి(వి)+ఏనియున్= పూనుకున్నావో; నా+అస్త్రంబునన్= నా బాణంతో; అవశ్యం= తప్పకుండా; అదియును= దానినికూడా; విధ్వంసంబు+కావింతున్= నాశనం చేస్తాను; అని పలికినన్= అని పలుకగా; పద్మనాభుండు= పద్మం నాభియందు గలవాడు-శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** 'నీవు పాండవ పక్షపాతంతో ఇట్లా అంటే, నేను అట్లా ఎందుకు చేస్తాను? నా అస్త్రానికి ఒక గర్భం లక్ష్యం కావచ్చు కాకపోవచ్చు. అది అట్లా ఉండనిమ్ము. నీవు విరాటపుత్రి అయిన ఉత్తర గర్భాన్ని రక్షించాలని చూస్తావు. ఆ పనికి పూనుకున్నావో, నా బాణంతో దానిని కూడా తప్పకుండా నాశనం చేస్తాను.' అని పలుకగా శ్రీకృష్ణుడు.

**క. 'అనఘుఁ డభిమన్యు తేజం । బనూనమై మాత్స్యపుత్రియం దున్నది; నీ**
**తునుముట గలిగిననుం ద । త్తనయున కే నాయు విచ్చెదను దీర్ఘముగన్.' 84**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు+అభిమన్యు తేజంబు= పాపరహితుడైన అభిమన్యుడి వీర్యం; అనూనము= తక్కువకానిదయి-గొప్పదయి; మాత్స్య పుత్రియందున్= విరాటుడి కూతురైన ఉత్తర గర్భంలో; ఉన్నది; నీ తునుముట= నువ్వు వధించుట; కలిగిననున్= సంభవించినా; తద్+తనయునకున్= అతడి కుమారుడికి; ఏను= నేను; దీర్ఘముగన్= దీర్ఘంగా; ఆయువు; ఇచ్చెదను.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన అభిమన్యుడి వీర్యం గొప్పదయి ఉత్తర గర్భంలో ఉన్నది. నీవు దానిని వధించటం సంభవించినా అతడి కుమారుడికి నేను దీర్ఘాయు విస్తాను.

**క. అనిన విని నగుచుఁ గుంభజ । తనయుం డిట్లనియె; 'నస్త్ర దగ్ధుని బ్రతికిం**
**చిన మేలకాదె! నీ వి । న్ననువు నెఱింగెదము గాక నరసఖ! దీనన్.' 85**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; కుంభజ తనయుండు= అశ్వత్థామ; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్; అస్త్రదగ్ధునిన్= అస్త్రంతో దహించబడినవాడిని; బ్రతికించినన్= బ్రతికిస్తే; మేలు+అ+కాదె!= మంచిదేకదా!; నరసఖ!= అర్జున మిత్రమా!; కృష్ణా!; దీనన్= ఈ విషయంలో; నీ విన్ననువున్= నీ నేర్పు; ఎఱింగెదము+కాక= చూద్దాములే.

**తాత్పర్యం:** అనగా విని అశ్వత్థామ నవ్వుతూ ఇట్లా అన్నాడు: 'అస్త్రదగ్ధుడిని బ్రతికిస్తే మంచిదేకదా! అర్జునమిత్రమా! కృష్ణా! ఈ విషయంలో నీ నేర్పు చూద్దాములే.'

**వ. అని పలికి పరమాదరణీయులగు సాత్యవతేయదేవకీనందనుల వాక్యంబు లాదరింపక పాండవ సంతాన సకల గర్భవిషయంబుగా నస్త్రప్రమోచనంబు సేసిన నుపలక్షించి వాసుదేవుం డతనితో నిట్లనుఁ; 'త్రికాలవేదియగు నొక్క బ్రాహ్మణుం డుపప్లావ్యంబునకు వచ్చి యుత్తరను జూచి నీ పుణ్యంబునఁ బ్రాణంబులు పరిక్షీణంబులైన పుత్రుండు జనియింపంగలవాఁ; డది కారణంబుగా భవదీయగర్భస్థునకుఁ బరిక్షిన్నామధేయం బగునని పలికె; నమ్మహాత్ముని వచనం బనృతంబు గానేరదు; భవత్కృత్యం, బకృతసమంబ; యబ్బాలుండు పాండవవంశకరుండగు,' నని చెప్పి తన చిత్తంబున రోషం బావహిల్లుటయు, 'బాలఘాతి వగు నీకు నశనంబు దుర్లభంబై, సహాయరహితుండవై దుర్గంధరక్తంబున నంగంబు దగ్ధంబగుచుండ మూఁడు వేలేండ్లు దిరుగుము; నాచేత రక్షితుండై, యక్కుమారుండు కృపాచార్యువలన ధనుర్వేదవిదుండై సర్వశస్త్రాస్త్రంబులు వడసి బహుసంవత్సరంబులు వసుధఁ బాలింపంగలవాఁడు; వానికి జనమేజయుండను మహారాజు ప్రభవించి నీవు సూచుచుండ నుజ్జ్వలుండె ప్రవర్తించు; మదీయంబులగు తపస్సత్యంబుల మహనీయ ప్రభావంబులు సూడు;' మని యాడె నప్పుడు కృష్ణద్వైపాయనుండు గురునందనున కిట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** అని; పలికి; పరమ+ఆదరణీయులు+అగు= మిక్కిలి గౌరవించదగినవారైన; సాత్యవతేయ దేవకీనందనుల= వ్యాస శ్రీకృష్ణులయొక్క; వాక్యంబులు; ఆదరింపక= మన్నించక; పాండవ సంతాన సకల గర్భ విషయంబు+కాన్= పాండవుల యొక్క సంతతి యొక్క ఎల్ల గర్భాలు లక్ష్యంగా; అస్త్ర ప్రమోచనంబు+చేసినన్= అస్త్రంయొక్క విడుదల చేయగా - అస్త్రాన్ని విడిచిపెట్టగా; ఉపలక్షించి= చూచి; వాసుదేవుండు= కృష్ణుడు; అతనితోన్; ఇట్లు+అనున్; త్రికాలవేది+అగు+ఒక్క బ్రాహ్మణుండు=

త్రికాలజ్ఞుడైన ఒక బ్రాహ్మణుడు; ఉపప్లావ్యంబునకున్; వచ్చి; ఉత్తరను; చూచి; నీ పుణ్యంబునన్= నీ పుణ్యంచేత; ప్రాణంబులు; పరిక్షీణంబులు+ఐన పుత్రుండు= కృశించినవైన కుమారుడు; జనియింపన్+కలవాఁడు= పుట్టబోతాడు; అది; కారణంబు+కాన్; భవదీయ గర్భస్థునకున్= నీ గర్భంలో ఉన్నవాడికి; పరిక్షిత్+నామధేయంబు= పరిక్షిత్తు అనేపేరు; అగున్; అని; పలికెన్; ఆ+మహా+ఆత్ముని వచనంబు= ఆ మహానుభావుడి మాట; అనృతంబు+కాన్+నేరదు= అబద్ధం కాజాలదు; భవత్+కృత్యంబు= నీవు చేసినపని; అకృత సమంబు+అ= చేయనిదానితోనే సమానం; ఆ+బాలకుండు= ఆ పిల్లవాడు; పాండవ వంశకరుండు+ అగున్= పాండవ వంశోద్ధారకుడు అవుతాడు; అని చెప్పి; తన చిత్తంబునన్= తన మనస్సులో; రోషంబు= కోపం; ఆవహిల్లుటయున్= కలగగా; బాలఘాతివి+అగు= పిల్లలను చంపినవాడవైన; నీకున్; అశనంబు= ఆహారం; దుర్లభంబు+ఐ= పొందశక్యం కానిదై; సహాయ రహితుండవు+ఐ= నిస్సహాయుడవై; దుర్గంధ రక్తంబునన్= దుర్వాసనగల రక్తంతో; అంగంబు= శరీరం; దగ్ధంబు+అగుచున్+ఉండన్= కాలిపోతూండగా; మూఁడు వేల+ఏండ్లు; తిరుగుము; నాచేతన్; రక్షితుండు+ఐ= కాపాడబడిన వాడై; ఆ+కుమారుండు= ఆ బాలుడు; కృపాచార్యువలనన్; ధనుస్(ః)+వేద విదుండు+ఐ= ధనుర్వేదం నేర్చుకొన్నవాడై; సర్వశస్త్ర+ అస్త్రంబులు= ఎల్ల శస్త్రాలూ, అస్త్రాలూ; పడసి= పొంది; బహు సంవత్సరంబులు= చాలా ఏళ్ళు; వసుధన్= భూమిని; పాలింపఁగలవాఁడు= ఏలతాడు; వానికిన్; జనమేజయుండు+అను మహారాజు= జనమేజయుడనే పేరుగల గొప్పరాజు; ప్రభవించి= పుట్టి; నీవు+చూచుచున్+ఉండన్= నీవు చూస్తూండగానే; ఉజ్జ్వలుండు+ఐ= ప్రకాశించేవాడై; ప్రవర్తించున్; మదీయంబులు+అగు= నావయిన, తపస్+సత్యంబుల మహనీయ ప్రభావంబులు= తపస్సుయొక్క, సత్యంయొక్క, గొప్ప మహిమలు; చూడుము+అని; ఆడెన్= పలికాడు; అప్పుడు; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; గురునందనునకున్= అశ్వత్థామతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి, మిక్కిలి గౌరవించదగిన వ్యాస శ్రీకృష్ణుల మాటలు పాటించక పాండవుల సంతానం తాలూకు గర్భాలన్నింటిమీద అస్త్రం విడిచిపెట్టటం చూచి శ్రీకృష్ణుడు అతడితో ఇట్లా అన్నాడు: 'త్రికాలజ్ఞుడైన ఒక బ్రాహ్మణుడు ఉపప్లావ్యపురం వచ్చి ఉత్తరను చూచి 'నీ పుణ్యంచేత ప్రాణాలు కృశించిన కొడుకు పుట్టుతాడు. అది కారణంగా నీ గర్భంలో ఉన్నవాడికి పరిక్షిత్తు అనే పేరు కలుగుతుంది' అని పలికాడు. ఆ మహానుభావుడి వచనం అబద్ధం కాజాలదు. నీవు చేసినపని చేయనిదానితోనే సమానం. ఆ బాలుడు పాండవ వంశోద్ధారకు డవుతాడు' అని తన మనస్సులో కోపం ఏర్పడగా 'పిల్లలను చంపిన నీవు ఆహారం లేక, నిస్సహాయుడ వై, కంపు కొట్టే రక్తంతో శరీరం కాలిపోతూండగా మూడువేల సంవత్సరాలు తిరుగుము. నా చేత రక్షితుడై ఆ కుమారుడు కృపాచార్యుడి దగ్గర ధనుర్వేదం నేర్చుకొని అన్ని శస్త్రాస్త్రాలూ పొంది అనేక సంవత్సరాలు భూమిని పరిపాలిస్తాడు. అతడికి జనమేజయ మహారాజు పుట్టి, నీవు చూస్తూండగానే, గొప్పగా వెలుగొందుతాడు. నా తపస్సత్యాల మహామహిమలు చూడుము' అని పలికాడు. అప్పుడు వ్యాసుడు అశ్వత్థామతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 'నీ పుణ్యంబునఁ బ్రాణంబులు పరిక్షీణంబులైన పుత్రుండు జనియింపం గలవాఁ డది కారణంబుగా భవదీయ గర్భస్థునకుఁ బరిక్షిన్నామధేయంబు.' అని తెలుగు భారతంలో ఉన్నది. కాని ఇక్కడ సంస్కృత భారతంలో ఇట్లా లేదు. అందులో-

> **"పరిక్షీణేషు కురుషు పుత్ర స్తవ జనిష్యతే,**
> **ఏతద స్యపరిక్షిత్త్వం గర్భస్థస్య భవిష్యతి"**

అని ఉన్నది. 'కౌరవులు నశించిపోగా నీకు కొడుకు పుట్టుతాడు. కడుపులో ఉన్నవాడికి ఈ పరిక్షిత్త్వం కలుగుతుంది.' అని దాని భావం. అశ్వమేధపర్వంలో కూడా ఇట్లాగే ఉన్నది.

తే. 'ఆత్మకులము పరిక్షీణమైన జనన । మొందెఁ గాన నియ్యభిమన్యునందనునకు
నర్థమగు పరిక్షిన్నామ మనియెఁ గృష్ణుఁ । డఖిల జనములు వినఁ గౌరవాధినాథ!' (భార. అశ్వ.)

'నీపుణ్యం కొద్దీ పరిక్షీణాలైన ప్రాణాలు గల కొడుకు పుట్టుతా' డంటే అర్థం ఏమిటి? ప్రాణాలు పరిక్షీణాలైన కొడుకు పుట్టటం పుణ్యం ఎట్లా అవుతుంది? మూలానువాదాలకు ఇక్కడ ఈ తేడా ఎందుకు వచ్చిందో! ఆలోచనీయం.

**తే. 'బ్రాహ్మణుఁడ వయ్యు నిట్లు క్రూరతకు రోయ । కస్మదీయ వాక్యంబుల నాదరంబు**
**సేయ కీ పాపకర్మంబు సేసినాఁడ; । వచ్యుతుఁడు వల్కినట్టుల యగుము నీవు.' 87**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణుఁడవు+అయ్యున్= నువ్వు బ్రాహ్మణుడివైనా; ఇట్లు= ఈ విధంగా; క్రూరతకున్= క్రౌర్యానికి; రోయక= వెనుదీయక; అస్మదీయ వాక్యంబులన్= నా మాటలను; ఆదరంబు+చేయక= మన్నించక; ఈ పాపకర్మంబు= ఈ పాపపుపని; చేసినాఁడవు; నీవు; అచ్యుతుఁడు= శ్రీకృష్ణుడు; పల్కిన+అట్టుల= పలికినట్లే; అగుము.

**తాత్పర్యం:** 'నీవు బ్రాహ్మణుడివైనా, ఈ విధంగా క్రౌర్యానికి వెనుదీయకుండా, నా మాటలను పాటించకుండా, ఈ పాపకృత్యం చేశావు. నీవు కృష్ణు డన్నట్లుగానే కమ్ము.'

**వ. అని యిట్లు శపియించి 'నీచకర్ముండ! పొ'మ్మనిన, విని యశ్వత్థామ యమ్మహాత్ముని యాననం బాలోకించి 'మునీంద్రా! నీవు మనుజులలోన నుండువాఁడ' వని ప్రతిశాపం బిచ్చి, 'నీకడన యేను వర్తిల్లఁ గలవాఁడ, నీవును శౌరియు సత్యవాదు లగుదురుగాక!' యని తన శిరోమణి పాండవుల కిచ్చి తపోవనంబునకుం జనియెఁ; బాండవులును గృష్ణుండును నమ్మునీంద్రునకు నమస్కరించి వీడ్కొని యతిత్వరితగతి నరుగుదెంచి. 88**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; శపియించి; నీచకర్మండ!= తుచ్ఛుడా!; పొమ్ము; అనినన్; విని; అశ్వత్థామ; ఆ+మహాత్ముని+ఆననంబు= ఆ మహానుభావుడి ముఖం; ఆలోకించి= చూచి; ముని+ఇంద్రా!= మునీశ్వరా!; నీవు; మనుజులలోనన్= మనుష్యులలో; ఉండువాఁడవు= ఉందువుగాక!; అని; ప్రతిశాపంబు+ఇచ్చి= మారుశాపం ఇచ్చి; నీకడన్+అ= నీ దగ్గరే; ఏను= నేను; వర్తిల్ల గలవాఁడన్= ఉండగలను; నీవును; శౌరియున్= కృష్ణుడూ; సత్యవాదులు= సత్యసంధులు; అగుదురు+కాక; అని; తన శిరోమణి; పాండవులకున్; ఇచ్చి; తపస్(ః)+వనంబునకున్= తపోవనానికి; చనియెన్; పాండవులును; కృష్ణుండును; ఆ+ముని+ ఇంద్రునకున్= ఆ మునీశ్వరుడికి; నమస్కరించి; వీడ్కొని= సెలవు పుచ్చుకొని; అతి త్వరితగతిన్= మిక్కిలి తొందరగా; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** అని ఇట్లా శపించి 'తుచ్ఛుడా! పొమ్మ'. అనగా విని అశ్వత్థామ ఆ మహానుభావుడి ముఖం చూచి, 'మునీశ్వరా! నీవు మనుష్యులలో ఉందువుగాక!' అని ప్రతిశాపం ఇచ్చి, 'నీ దగ్గరే నేను ఉంటాను. నీవూ, కృష్ణుడూ సత్యసంధులు అవుతారుగాక!' అని తన శిరోమణిని పాండవుల కిచ్చి తపోవనానికి వెళ్ళాడు. పాండవులూ, కృష్ణుడూ ఆ మునీశ్వరుడికి నమస్కరించి సెలవు పుచ్చుకొని మిక్కిలి తొందరగా వచ్చి.

**క. అరదములు డిగ్గి వగలం । బరితాపముఁ బొందుచున్న పాంచాలిం గాం**
**చిరి తమచేతోవృత్తులఁ । గరుణము మగుడంగఁ బొడమఁ గౌరవనాథా! 89**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కురురాజా!-జనమేజయా!; అరదములు డిగ్గి= రథాలుదిగి; వగలన్= దుఃఖాలతో; పరితాపమున్+ పొందుచున్+ఉన్న పాంచాలిన్= పరితపిస్తూన్న ద్రౌపదిని; తమ చేతస్+వృత్తులన్= తమ మనస్సులలో; మగుడంగన్= మళ్ళీ; కరుణము= శోకం; పొడమన్= పుట్టగా; కాంచిరి= చూశారు.

**తాత్పర్యం:** జనమేజయా! వాళ్ళు రథాలు దిగి దుఃఖంతో పరితపిస్తూ ఉన్న ద్రౌపదిని తమ మనస్సులలో మళ్ళీ కరుణరసం పుట్టగా చూచారు.

**వ. అట్లు గాంచి యక్కాంత చుట్టు నాసీనులై; రప్పు డగ్రజుండు పనుపఁ బవనతనయుం డమ్మణి యద్దేవికి సమర్పించి. 90**

**ప్రతిపదార్థం:** అట్లు; కాంచి; ఆ+కాంత చుట్టున్= ఆ ద్రౌపది చుట్టూ; ఆసీనులు+ఐరి= కూర్చున్నారు; అప్పుడు; అగ్రజుండు= అన్న ధర్మరాజు; పనుపన్= పంపగా; పవనతనయుండు= వాయుపుత్రుడు- భీముడు; ఆ+మణి= ఆ శిరోమణిని; ఆ+దేవికిన్= ఆ ద్రౌపదికి; సమర్పించి= ఇచ్చి.

**తాత్పర్యం:** అట్లా చూచి ఆ ద్రౌపది చుట్టూ కూర్చున్నారు. అప్పుడు అన్నగారు పంపగా భీముడు ఆ శిరోమణిని ఆ ద్రౌపది కిచ్చి.

### భీమసేనుఁ డశ్వత్థామ శిరోరత్నంబు ద్రౌపది కిచ్చుట (సం. 10-16-25)

**క. 'పగతు పని సక్కనయ్యెన్; । వగ మానుము రాజధర్మ వైశిష్ట్యము పెం**
**పుగ నాదరించి; నీ తా । ల్మిగదా భూపాలు నుమ్మలికముం బాచున్. 91**

**ప్రతిపదార్థం:** పగతు పని= శత్రుకార్యం శత్రువుని సాధించే కార్యం; చక్కన+అయ్యెన్= సమాప్తమయింది; రాజ ధర్మ వైశిష్ట్యము= రాజులకు ఉచితమైన ధర్మం యొక్క ప్రత్యేకత; పెంపుగన్= గొప్పగా-బాగా; ఆదరించి= మన్నించి; వగ మానుము= దుఃఖం విడిచిపెట్టుము; నీ తాల్మి కదా= నీ ఓరిమేకదా!; భూపాలు నుమ్మలికమున్= రాజు(ధర్మరాజు) దుఃఖాన్ని; పాచున్= పోగొట్టుతుంది.

**తాత్పర్యం:** 'శత్రువును సాధించేకార్యం పూర్తయింది. రాజోచిత ధర్మపు విశిష్టతను మన్నించి దుఃఖం మానుము. నీ ఓరిమే కదా ధర్మరాజు దుఃఖాన్ని పోగొట్టేది!

**చ. జనపతి పంపఁ గేశవుఁడు సంధికిఁ బోయెడునప్పు నీవు సె**
**ప్పిన గరువంపు రాజసపు బెట్టిదపుం దగు మాట లెల్ల నె**
**మ్మనమున నెక్కొనన్ నిలుపుమా; వగవం బనియేమి? సంగరం**
**బునఁ బగవారు పేర్చి పొరిపుచ్చక పువ్వులకోల సాఁతురే? 92**

**ప్రతిపదార్థం:** జనపతి= రాజు (ధర్మరాజు); పంపన్= పంపగా; కేశవుఁడు= శ్రీకృష్ణుడు; పోయెడు+అప్డు= వెళ్ళేటప్పుడు; నీవు; చెప్పిన; గరువంపు రాజసపు బెట్టిదపుందగు, మాటలెల్లన్= గొప్పతనంతో కూడిన, రజోగుణ ప్రధానములైన - పరుషాలైన, ఉచితములైన మాటలన్నీ; నెఱ+మనమునన్= నిండు మనస్సులో; నెక్కొనన్= పాదుకొనేటట్టు; నిలుపుమా= నిలువు; వగవన్+పని+

ఏమి?= విచారించటం వలన ప్రయోజనమేమిటి?; సంగరంబునన్= యుద్ధంలో; పగవారు= శత్రువులు; పొరిపుచ్చక= చంపక; పువ్వుల కోల= పుష్పబాణం; సాఁతురే?= ప్రయోగిస్తారా?

**తాత్పర్యం:** ధర్మరాజు పంపగా సంధిచేయటానికి శ్రీకృష్ణుడు కౌరవసభకు వెళ్ళేటప్పుడు నీవు అతడితో చెప్పిన గొప్పతనంతో కూడిన, రజోగుణ ప్రధానములైన, పరుషాలైన, ఉచితాలైన మాటలన్నీ నీ మనస్సులో పాదుకొనేటట్టు నిలుపుము. దుఃఖించటం వలన ఏమి ప్రయోజనం? యుద్ధంలో శత్రువులు చంపక, పుష్పబాణం ప్రయోగిస్తారా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'సంగరంబున .... సాఁతురే' అనే సామాన్యాంశంచేత శత్రువులు ద్రౌపది కొడుకులను చంపారు అనే విశేషాంశం సమర్థించ బడింది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం. చాఁచు, సాఁచు అని రెండు ధాతువులూ ఉన్నాయి.

**క. వినుము ధృతరాష్ట్ర! వంశం । బున మగపీచంబు నెల్లఁ బొలియించితిఁ గృ**
**ష్ణుని కారుణ్యము, జిష్ణుని । పెనుఁ బ్రాపును గలుగ నేను విగత భయుఁడనై. 93**

**ప్రతిపదార్థం:** వినుము; ధృతరాష్ట్ర వంశంబున; మగపీచంబున్+ఎల్లన్= ధృతరాష్ట్రుడి వంశంలో ఉన్న శూరులగర్వాన్నంతనీ; కృష్ణుని కారుణ్యమున్= శ్రీకృష్ణుడి దయా; జిష్ణుని పెను+ప్రాపును= అర్జునుడి పెద్ద అండా; కలుగన్; నేను; విగత భయుఁడను+ఐ= నిర్భయుడినై; పొలియించితిన్= అంతమొందించాను.

**తాత్పర్యం:** ద్రౌపదీ! వినుము. శ్రీకృష్ణుడి దయా, అర్జునుడి పెద్ద అండా ఉండగా నేను నిర్భయుడనై ధృతరాష్ట్రుడి వంశంలో ఉన్న శూరుల గర్వాన్నంతటినీ అంతమొందించాను.

**ఉ. త్రావితి దుస్ససేను రుధిరం బుర ముగ్రతఁ బేర్చి వ్రచ్చి, క్రీ**
**డా విధి వాని యగ్రజు తొడల్ వడి నుగ్గుగఁ జేసి, యార్చి, యా**
**భూవరు మౌళిఁ దన్నితి నృపుల్‌గని సంతసమంద; నింత హ**
**ర్షావసరంబు శోకసమయంబుగఁ జేయుట నీకు నర్హమే? 94**

**ప్రతిపదార్థం:** నృపుల్= రాజులు; కని= చూచి; సంతసము+అందన్= సంతోషపడగా; ఉగ్రతన్+పేర్చి= కోపంతో; విజృంభించి; ఉరము= రొమ్ము; వ్రచ్చి= చీల్చి; దుస్ససేను రుధిరంబు= దుశ్శాసనుడి రక్తం; త్రావితిన్= త్రాగాను; క్రీడావిధిన్= ఆటవలె అవలీలగా; వాని+అగ్రజు తొడల్= వాడి అన్నయైన దుర్యోధనుడి తొడలు; వడిన్= వేగంగా; నుగ్గుగన్+చేసి= విరుగగొట్టి; ఆర్చి= బొబ్బపెట్టి; ఆ భూవరు మౌళిన్= ఆ రాజు(దుర్యోధనుడి) శిరస్సును; తన్నితిన్; ఇంత హర్షావసరంబున్= ఇంతటి సంతోష సమయాన్ని; శోక సమయంబుగన్= దుఃఖ సమయంగా; చేయుట; నీకున్; అర్హమే?= తగునా?

**తాత్పర్యం:** రాజులు చూచి సంతోషపడగా కోపంతో విజృంభించి రొమ్ము చీల్చి దుశ్శాసనుడి నెత్తురు త్రాగాను. వాడి అన్న అయిన దుర్యోధనుడి తొడలు ఒక ఆటవలె - అవలీలగా వేగంగా విరుగగొట్టి బొబ్బపెట్టి శిరస్సు తన్నాను. ఇంతటి సంతోషసమయాన్ని దుఃఖసమయంగా చేయటం నీకు తగునా?

**క. గురుతనయుఁ డగుటఁ బ్రాణము । హరియింపఁగఁ జొరక విజయుఁ డశ్వత్థామం**
**బరిభూతుఁ జేసి యాయుధ । పరిగ్రహముతోడ' లజ్జఁ బాయం జేసెన్. 95**

**ప్రతిపదార్థం:** గురు తనయుఁడు+అగుటన్= గురుపుత్రుడవటంచేత; అశ్వత్థామన్= అశ్వత్థామను; విజయుఁడు= అర్జునుడు; ప్రాణము హరియింపఁగన్+చొరక= ప్రాణం తీయటానికి పూనుకోక; పరిభూతున్+చేసి= అవమానించి; ఆయుధ పరిగ్రహముతోడన్= ఆయుధ సాధనంతో; లజ్జన్+పాయన్+చేసెన్= సిగ్గు విడిచేటట్టు చేశాడు.

**తాత్పర్యం:** గురుపుత్రు డవటం చేత అశ్వత్థామను అర్జునుడు ప్రాణం తీయటానికి పూనుకొనక అవమానించి ఆయుధసాధనంతో సిగ్గు విడిచేటట్లు చేశాడు.

**వ. చూడామణి గోలుపోవుటంజేసి యా కుంభసంభవసంభవు కీర్తిశరీరంబు వడియె; ముఱికిఁ బొందియున్న; దింతియ; యిటువైరంబు పేరు లేకుండఁ దీర్చుట యెవ్వరికిం జను? నేమియుఁ గీడాడఁ దెఱపిలేక ధర్మతనయుండు నిర్మలకీర్తికి భాజనంబై యుల్లసిల్లెడు; నూఱడిల్లుము.' 96**

**ప్రతిపదార్థం:** చూడామణి= శిరోమణి; కోలుపోవుటన్+చేసి= పోగొట్టుకోవటంచేత; ఆ కుంభసంభవ సంభవు కీర్తి శరీరంబు= ఆ ద్రోణకుమారుడి (అశ్వత్థామయొక్క) కీర్తి అనే శరీరం; పడియెన్= పతనంచెందినది; ముఱికిన్+పొంది ఉన్నది= కలుషితమై ఉన్నది; ఇంతియ= ఇంతే; ఇటు= ఈ రీతిగా; వైరంబు పేరులేక+ఉండన్+తీర్చుట= శత్రుత్వం నామమాత్రంగా అయినా లేకుండా అంతమొందించటం; ఎవ్వరికిన్+చనున్?= ఎవరికి సాధ్యపడుతుంది?; ఏమియున్ కీడు+ఆడన్+తెఱపిలేక= ఏమీ నిందించటానికి అవకాశం లేక; ధర్మతనయుండు= ధర్మరాజు; నిర్మల కీర్తికిన్= స్వచ్ఛమైన కీర్తికి; భాజనంబు+ఐ= పాత్రమై; ఉల్లసిల్లెడున్= సంతోషిస్తున్నాడు; ఊఱడిల్లుము= ఉపశమించుము.

**తాత్పర్యం:** 'శిరోమణిని పోగొట్టుకొనటంచేత ఆ అశ్వత్థామ కీర్తిశరీరం పతనం చెందింది. కలుషితమై ఉన్నది. ఇంతే. ఇట్లా శత్రుత్వం నామమాత్రంగా కూడా లేకుండా అంతమొందించటం ఎవరికైనా సాధ్యమవుతుందా? ఎంతమాత్రమూ నిందించటానికి అవకాశం లేకుండా ధర్మరాజు స్వచ్ఛమైన కీర్తికి పాత్రుడై విరాజిల్లుతున్నాడు. ఉపశమించుము.'

**తే. అనినఁ గొండొక తెలివొందు నాననంబు । తోడ నుత్థితయైన యా తోయజాక్షి**
**ప్రభలు పర్వంగ నొప్పు నాపద్మరాగ । రత్న మఱచేత నిడికొని రాజుఁ జూచి. 97**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కొండొక తెలివు+ఒందు+ఆననంబు తోడన్= కొంచెం వికసించిన ముఖంతో; ఉత్థిత+ఐన= లేచిన; ఆ తోయజ+అక్షి= ఆ స్త్రీ - పద్మాలవంటి కళ్ళు గల ఆ ద్రౌపది; ప్రభలు= కాంతులు; పర్వంగన్= వ్యాపించగా; ఒప్పు; ఆ; పద్మరాగ రత్నము= పద్మరాగమణి; అఱచేతన్= అరచేతిలో; ఇడికొని= పెట్టుకుని; రాజున్= ధర్మరాజుని; చూచి.

**తాత్పర్యం:** అనగా, కొంచెం వికసించిన ముఖంతో లేచిన ఆ ద్రౌపది కాంతులు చిమ్ముతూ ఒప్పే పద్మరాగ మణిని అరచేతిలో పెట్టుకొని ధర్మరాజును చూచి.

**వ. భీమసేను నుద్దేశించి. 98**

**తాత్పర్యం:** భీముడితో.

**ఉ. 'నా మనమార దీనిఁ గని నందముఁ బొందితి; నింత సాలు నా,**
**కీ మహనీయరత్నము వహింపఁగ నర్హుఁ డితండ; యంచు నా**

**భూమిపుచేతఁ బెట్టుటయు, భూవర! యాతఁడు ద్రౌణిగౌరవ**
**శ్రీ మది భక్తిఁ బెంపఁగ ధరించె శిరంబున దానిఁ బ్రీతుఁడై. 99**

**ప్రతిపదార్థం:** నా మనము+ఆరన్ దీనిన్+కని= నేను మనసారా దీన్ని పొంది; నందమున్+పొందితిన్= సంతోషించాను; నాకున్; ఇంత+చాలున్= ఈ మాత్రం చాలు; ఈ మహనీయ రత్నమున్= ఈ గొప్ప రత్నాన్ని; వహింపఁగన్= ధరించటానికి; అర్హుఁడు= తగినవాడు; ఇతండు+అ= ఇతడే; అంచున్; ఆ భూమిపు+చేతన్= ఆ రాజు (ధర్మరాజు) చేతిలో పెట్టుటయున్= పెట్టగా; భూవర!= రాజా! జనమేజయా!; ఆతఁడు= ధర్మరాజు; ద్రౌణి గౌరవ శ్రీ= అశ్వత్థామమీద ఉండే గౌరవ సంపద; మదిన్= మనస్సులో; భక్తి; పెంపఁగన్= వృద్ధి పొందించగా; ప్రీతుఁడు+ఐ= సంతోషించినవాడై; దానిన్; శిరంబునన్= తలమీద; ధరించెన్= తాల్చాడు.

**తాత్పర్యం:** 'దీనిని పొంది నా మనసారా ఆనందించాను. నాకు ఈ మాత్రం చాలు. ఈ మహనీయ రత్నాన్ని ధరించటానికి ఇతడే అర్హు' డంటూ దానిని ఆ ధర్మరాజు చేతిలో పెట్టగా, జనమేజయా!, అతడు అశ్వత్థామపై గల గౌరవసంపద మనస్సులో అతడిపై భక్తిని పెంచగా, సంతోషంతో దాన్ని శిరస్సుపై ధరించాడు.

**వ. ఇవ్విధంబున. 100**

**తాత్పర్యం:** ఈ రీతిగా.

**తే. విలసితం బగు నమ్మణి చెలువు మిగుల । మౌళియందు ధరించి యమ్మనుజనాథుఁ**
**డుదయరాగ నితాంత సముజ్జ్వలేందు । బింబమునఁ బోల్చు పూర్వశైలంబు వోలె. 101**

**ప్రతిపదార్థం:** ఆ+మనుజనాథుఁడు= ఆ రాజు-ధర్మరాజు; విలసితంబు+అగు+ఆ+మణి= ప్రకాశించే ఆ మణి; చెలువు+మిగులన్= అందం అతిశయించగా; మౌళి+అందున్= శిరస్సుపై; ధరించి= తాల్చి; ఉదయరాగ నితాంత సముజ్జ్వల+ఇందు బింబమునన్= ఉదయ సమయంలోని ఎరుపుచేత అధికంగా ప్రకాశించే చంద్రబింబంచేత; పొల్చు= ఒప్పే; పూర్వ శైలంబు= తూర్పుకొండ(ను); పోలెన్.

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు ప్రకాశిస్తూ ఉన్న ఆ మణిని అందం అతిశయించగా శిరస్సుపై ధరించి, ఉదయకాలపు ఎరుపుతో అధికంగా ప్రకాశించే చంద్రబింబంతో ఒప్పే తూర్పుకొండవలె ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. మనుజనాథుడు, మణి-ఉపమేయాలు. పూర్వశైలం, చంద్రబింబం-వాటికి వరుసగా ఉపమానాలు. 'పోలెన్' ఉపమావాచకార్థాన్నిచ్చే సమాపకక్రియ. పొల్చు= సామాన్యధర్మం. అందుచేత ఇది పూర్ణోపమాలంకారం.

**వ. ఇత్తెఱంగునం బాండవాగ్రజుండు పాంచాలికిఁ బ్రియం బాచరించి తత్ప్రభృతి కాంతలును సహదేవ ప్రముఖ పురుషులును వినఁబవనతనయుం డశ్వత్థామఁబొడఁగనుట మొదలై గురునందనుండు చూడామణి యిచ్చుట తుదియైన వృత్తాంతం బంతయుఁ జెప్ప, నా భూవల్లభుండు లోనుగా నెల్లవారును నపత్యభాధకంబైన యా బ్రహ్మశిరంబు ప్రభావం బూహించి కృష్ణుని ప్రతివిధానంబు గలుగుట నూఱడిల్లియు నెట్లగునో యను శంకనుండి; రత్తఱి నుత్తరకుం దక్కఁ బాండవేయ వంశవధూజనంబులకు గర్భంబులు లేకయుండె; నయ్యస్త్రోత్తమం బవ్విరాటపుత్రి యుదరంబున నున్న పిండంబు బాధితంబు సేయుట గనుంగొని**

**యప్పుండరీకాక్షుండు ద్రౌణితో సల్లాపంబు సేయునవసరంబున నయ్యస్త్రఘాతవేదన లేకుండఁ దన చిత్తవృత్తిన యుడిపెం గాన నవ్విశేషం బయ్యభిమన్యువల్లభయాదిగా నెవ్వరు నెఱుంగ; రది యట్లుండెఁ; బుత్రుల దెస వగ దొఱఁగకున్న యా ధర్మనందనుండు దేవకీనందనున కిట్లనియె; 102**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పాండవ+అగ్రజుండు= పాండవుల అన్న ధర్మరాజు; పాంచాలికిన్= ద్రౌపదికి; ప్రియంబు+ఆచరించి= ప్రీతిని చేసి; తద్+ప్రభృతి కాంతలును= ఆమె మొదలైన స్త్రీలూ; సహదేవప్రముఖ పురుషులును= సహదేవుడు మొదలైన పురుషులూ; వినన్= వినేటట్టు; పవన తనయుండు= వాయుపుత్రుడు-భీముడు; అశ్వత్థామన్; పొడఁగనుట మొదలు+ఐ= చూడటం మొదలుకొని; గురు నందనుండు= అశ్వత్థామ; చూడామణి= శిరోమణి; ఇచ్చుట తుది+ఐన= ఇవ్వటం వరకూ గల; వృత్తాంతంబు+అంతయున్= వృత్తాంతమంతా; చెప్పన్= చెప్పగా; ఆ భూ వల్లభుండు= ఆ రాజు(ధర్మరాజు); లోనుగాన్= మొదలుగా; ఎల్లవారును= అందరూ; అపత్యబాధకంబు+ఐన= సంతానాన్ని నాశనంచేసే; ఆ బ్రహ్మశిరంబు+ప్రభావంబు= ఆ బ్రహ్మశిరోనామకాస్త్రం మహిమ; ఊహించి= తలచి; కృష్ణుని ప్రతివిధానంబు= శ్రీకృష్ణుడి ప్రతిక్రియ; కలుగుటన్= ఉండటంచేత; ఊఱడిల్లియున్= ఊరటచెందీ; ఎట్లు+అగునో= ఏం జరుగుతుందో; అను శంకన్= అనే భయంతో; ఉండిరి; ఆ+తఱిన్= ఆ సమయంలో; ఉత్తరకున్+తక్కన్= ఉత్తరకు తప్ప; పాండవేయ వంశ వధూజనంబులకున్= పాండవ వంశపు స్త్రీలకు; గర్భంబులు లేక+ఉండెన్= చూలులు లేకుండా పోయాయి; ఆ+అస్త్ర+ ఉత్తమంబు= ఆ అస్త్రరాజం; ఆ+విరాటపుత్రి+ఉదరంబునన్= ఆ ఉత్తర గర్భంలో; ఉన్న; పిండంబున్= పిండాన్ని; బాధితంబు+ చేయుట= బాధించటం; కనుంగొని= చూచి; ఆ+పుండరీక+అక్షుండు= తెల్లతామరలవంటి కన్నులు గల ఆ శ్రీకృష్ణుడు; ద్రౌణితోన్= అశ్వత్థామతో; సల్లాపంబు+చేయు+అవసరంబునన్= సంభాషించేటప్పుడు; ఆ+అస్త్రఘాతవేదన= ఆ అస్త్రపు దెబ్బవలన కలిగే బాధ; లేక+ఉండన్= లేకుండా; తన చిత్తవృత్తిన్+అ= తన మనోవ్యాపారం చేతనే; ఉడిపెన్+కానన్= మాన్పాడు కాబట్టి; ఆ+విశేషంబు= ఆ సంగతి; ఆ+అభిమన్యు వల్లభ+ఆదిగాన్= ఆ అభిమన్యుడి భార్య (ఉత్తర) మొదలుకొని; ఎవ్వరున్; ఎఱుంగరు; అది+అట్లు+ఉండెన్; పుత్రుల దెసన్= కుమారులమీద; వగ= దుఃఖం; తొఱఁగక+ఉన్న= పోని; ఆ ధర్మనందనుండు= ఆ ధర్మరాజు; దేవకీనందనునకున్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు ద్రౌపదికి ప్రియంచేసి, ఆమె మొదలుగా స్త్రీలూ, సహదేవుడు మొదలుగా పురుషులూ వినేటట్లు భీముడు అశ్వత్థామను చూచింది మొదలుకొని అశ్వత్థామ శిరోమణి ఇవ్వటం వరకూ గల వృత్తాంతం అంతా చెప్పగా, ధర్మరాజు మొదలుగా అందరూ సంతానాన్ని నాశనం చేసే ఆ బ్రహ్మశిరోనామకాస్త్రపు మహిమను తలచుకొని, దానికి శ్రీకృష్ణుడి ప్రతిక్రియ ఉన్నదికదా అని ఊరటచెంది, ఏమవుతుందో అనే భయంతో ఉన్నారు. అప్పుడు ఉత్తరకు తప్ప పాండవవంశంలోని స్త్రీలకు చూలులు లేకుండా పోయాయి. ఆ అస్త్రరాజం ఉత్తర గర్భంలో ఉన్న పిండాన్ని బాధించటం చూచి కృష్ణుడు అశ్వత్థామతో సంభాషించేటప్పుడే ఆ అస్త్రంవలన బాధలేకుండా తన మనోవ్యాపారంచేతనే మాన్పాడు కాబట్టి ఆ సంగతి ఉత్తర మొదలుగా ఎవ్వరూ ఎరుగరు. అది అట్ల ఉండగా కుమారులకొరకు దుఃఖం విడిచిపెట్టని ధర్మరాజు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'బలమున శౌర్యసంపద నభంగపరాక్రములైన ద్రౌపదే
యుల నొకరుండ ముట్టికొని యుద్భటవిక్రమ ముల్లసిల్ల దు
ర్బలుల వధించు చాడ్పునఁ గృపాణకళాలలితంబు లొప్ప వి
చ్చలవిడిఁ ద్రుంచె నట్టె! గురుసంభవుఁ డంతకు నెట్టు సాలెనో! 103**

**ప్రతిపదార్థం:** బలమునన్= బలంవలనా; శౌర్య సంపదన్= శౌర్యసంపదవలనా, అభంగ పరాక్రములు+ఐన= భంగపాటు లేని పరాక్రమంగల; ద్రౌపదేయులన్= ద్రౌపది కొడుకులను; ఒకరుండు+అ= ఒక్కడే; ముట్టికొని= ఎదుర్కొని; ఉద్భట విక్రమము= శ్రేష్ఠమైన పరాక్రమం; ఉల్లసిల్లన్= ఒప్పగా; దుర్బలులన్= బలహీనులను; వధించు చాడ్పునన్= చంపేవిధంగా; కృపాణ కళా లలితంబులు= ఖడ్గ విద్యానైపుణ్యాలు; ఒప్పన్; విచ్చలవిడిన్= ఇష్టం వచ్చినట్లు; త్రుంచెన్+అట్టె!= చంపాడట!; గురుసంభవుఁడు= అశ్వత్థామ; అంతకున్= అంతపనికి; ఎట్టు+చాలెనో= ఎట్లా సమర్థుడయ్యాడో!

**తాత్పర్యం:** 'బలంవలనా, శౌర్య సంపదవలనా భంగపా టెరగని పరాక్రమం గల ద్రౌపది కొడుకులను ఒక్కడూ ఎదుర్కొని శ్రేష్ఠమైన పరాక్రమం ఒప్పగా బలహీనులను వధించే విధంగా ఖడ్గవిద్యా నైపుణ్యం ప్రకాశించగా ఇష్టం వచ్చినట్లు చంపాడట! అశ్వత్థామకు ఆ సామర్థ్యం ఎట్లా వచ్చిందో!

**శా.** **ఉద్యోగ స్ఫురితుం, డజయ్య భుజవీర్యుం, డిద్ధ విక్రాంత సం**
**పద్యోగ ప్రథితుండు, శక్రనుతసంభావ్యక్రమోద్యద్ధను**
**ర్విద్యావైభవశాలి, సంగరకళావిస్తారసంవేది, ధృ**
**ష్టద్యుమ్నుం; డతఁ డోర్వకున్కి యెటు లశ్వత్థామ యుద్రేకమున్?.** **104**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుండు; ఉద్యోగ స్ఫురితుండు= కార్యనిర్వహణ దక్షుడూ; అజయ్య భుజ వీర్యుండు= జయించరాని బాహుపరాక్రమం కలవాడూ; ఇద్ధ విక్రాంత సంపద్+యోగ ప్రథితుండు= అప్రతిహతమైన పరాక్రమసంపద కలిగి ఉండటంచేత ప్రసిద్ధుడూ; శక్ర నుత సంభావ్య క్రమ+ఉద్యత్+ధనుస్(ః)+విద్యా వైభవశాలి= ఇంద్రుడిచేత పొగడబడిన, సమ్మానించదగిన సామర్థ్యంతో పూనుకొనే ధనుర్విద్యా సంపదచేత ఒప్పేవాడూ; సంగర కళా విస్తార సంవేది= యుద్ధ విద్య విపులంగా తెలిసినవాడూ; అతఁడు= అటువంటి అతడు; అశ్వత్థామ ఉద్రేకమున్= అశ్వత్థామ విజృంభణాన్ని; ఓర్వక+ఉన్కి= ఓడించలేక పోవటం; ఎటులు?= ఎట్లా (సంభవించింది)?

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కార్యనిర్వహణ దక్షుడు. జయించరాని బాహుబలం గలవాడు. అప్రతిహతమైన పరాక్రమ సంపద చేత ప్రసిద్ధుడు. ఇంద్రుడి ప్రశంస లందుకొన్న సామర్థ్యం గల ధనుర్విద్యా వైభవంతో ఒప్పేవాడు. యుద్ధవిద్య బాగా తెలిసినవాడు. అట్లాంటివాడు అశ్వత్థామ విజృంభణాన్ని ఓడించలేకపోవటం ఏమిటి?

**క.** **తక్కును గల పాంచాలుర । నొక్కఁడ శిబిరంబు సొచ్చి యుక్కు దలిర్పం**
**బెక్కండ్రఁ దునిమె నటె; యిది । యక్కజ మగు! నేమి కతన నధికుం డయ్యెన్?'** **105**

**ప్రతిపదార్థం:** (అశ్వత్థామ కర్త); తక్కును+కల= మిగిలిన; పాంచాలురన్= పాంచాలదేశపు వీరులను; ఒక్కఁడు+అ= ఒక్కడే; శిబిరంబు+చొచ్చి= శిబిరంలోకి ప్రవేశించి; ఉక్కు= బలం; తలిర్పన్= ఒప్పగా; పెక్కంఢ్రన్= అనేకులను; చంపెన్+అటె= చంపాడట; ఇది; అక్కజము+అగున్= ఆశ్చర్యంగా ఉన్నది; ఏమి కతనన్= ఏ కారణంచేత; అధికుండు+అయ్యెన్= గొప్పవాడయ్యాడు?

**తాత్పర్యం:** తక్కిన పాంచాలదేశపు వీరులను ఎంతమందినో ఒక్కడూ శిబిరంలో ప్రవేశించి బలం ఒప్పగా అశ్వత్థామ చంపాడట! ఇది ఆశ్చర్యకరం. అత డట్లా అధికు డవటానికి కారణం ఏమిటి?'

**వ.** **అనిన నమ్మహీకాంతునకు మురాంతకుం డి ట్లనియె.** **106**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడుగగా; ఆ+మహీకాంతునకున్= ఆ రాజుకు; ముర+అంతకుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అని అడుగగా ధర్మరాజుతో శ్రీకృష్ణు డిట్లా అన్నాడు:

### ధర్మరాజునకుఁ గృష్ణుఁడు శివప్రభావంబు చెప్పుట (సం. 10-17-6)

**చ.** **'హరుఁ, బరమేశ్వరేశ్వరుఁ, గృపాతిశయార్ద్రు, నమేయమూర్తి, శం**
**కరు, నచలైక భక్తిరసగమ్యుని, నవ్యయు, నిందుమౌళిఁ ద**
**త్పరమతి నాశ్రయించి యనపాయబలోద్భటశౌర్యసంపదన్**
**గురుతనయుండు గాంచి యధికుం డగుటం బగదీర్చె నమ్మెయిన్.** **107**

**ప్రతిపదార్థం:** గురు తనయుండు= గురుపుత్రుడు అశ్వత్థామ; హరున్= ఈశ్వరుడిని; పరమేశ్వర+ఈశ్వరున్= పరమేశ్వరుడైన ఈశ్వరుడిని; కృపా+అతిశయ+ఆర్ద్రున్= దయారసార్ద్రుడిని; అమేయమూర్తిన్= మితిలేని ఆకారం గలవాడిని; శంకరున్= శుభం కలగజేసేవాడిని అచల+ఏక భక్తిరస గమ్యునిన్= స్థిరమైన భక్తిరసంచేతనే పొందదగినవాడిని; అవ్యయున్= నాశనంలేని వాడిని; ఇందుమౌళిన్= చంద్రుడు శిరస్సునందు గలవాడిని; తత్పరమతిన్= ఆసక్తితో కూడిన మనస్సుతో; ఆశ్రయించి; అనపాయ బల+ఉద్భట శౌర్య సంపదన్= నాశనంలేని బలంచేత శ్రేష్ఠమైన పరాక్రమశ్రీని; కాంచి= పొంది; అధికుండు+అగుటన్= గొప్పవాడవటంచేత; ఆ+మెయిన్= ఆ రీతిగా; పగ+తీర్చెన్= పగసాధించాడు.

**తాత్పర్యం:** 'హరుడూ, పరమేశ్వరేశ్వరుడూ, దయారసార్ద్రుడూ, అపరిమితాకారుడూ, శంకరుడూ, స్థిరభక్తిచేతనే పొందదగినవాడూ, నాశరహితుడూ అయిన చంద్రశేఖరుడిని భక్తిశ్రద్ధలతో ఆశ్రయించి అశ్వత్థామ నాశనంలేని మహాపరాక్రమసంపత్తిని పొంది అధికు డవటంచేత ఆ రీతిగా పగసాధించాడు.

**చ.** **శివుఁడు ప్రసన్నుఁడైన నఱచేయునె యెవ్వరికైన? రాజపుం**
**గవ! యమరత్వమైన, బలఘస్మరు గెల్వఁగ నోపునట్టి ద**
**ర్ప విభవమైన నిచ్చుఁ; బరిపంథు లనేకుల నొక్కరుండు బా**
**హువిలసనంబు ఘోరముగ నోర్వఁగఁ జాలుట యీగి చోద్యమే?** **108**

**ప్రతిపదార్థం:** రాజపుంగవ!= రాజోత్తమా! ధర్మరాజా!; శివుఁడు; ప్రసన్నుఁడు+ఐనన్= ప్రసన్నుడైతే; ఎవ్వరికిన్+ఐనన్= ఎవరికైనా; అఱ= కొరత; చేయునె?= చేస్తాడా?; అమరత్వము+ఐనన్= దేవత్వాన్నైనా; బల ఘస్మరున్= బలాసురుడిని చంపినవాడిని - ఇంద్రుడిని; గెల్వఁగన్+ఓపు+అట్టి= గెలవగల; దర్ప విభవము+ఐనన్= పరాక్రమ సంపదనైనా; ఇచ్చున్; పరిపంథులు+అనేకులన్= శత్రువులను; పెక్కుమందిని; ఒక్కరుండున్= ఒక్కడూ; బాహు విలసనంబు= భుజక్రీడ; ఘోరముగన్= భయంకరంగా; ఓర్వఁగన్+చాలుట= ఓడించే సామర్థ్యాన్ని; ఈగి= ఇవ్వటం; చోద్యమే?= వింతా?

**తాత్పర్యం:** రాజోత్తమా! ధర్మరాజా! శివుడు ప్రసన్నుడైతే, ఎవరికైనా కొరతచేస్తాడా? దివ్యత్వాన్నైనా ఇస్తాడు. ఇంద్రుడిని గెలవగల పరాక్రమ సంపదనైనా ఇస్తాడు. అట్లాంటప్పుడు శత్రువు లనేకులను ఒక్కడూ భుజబలక్రీడను, భయంకరంగా ఓడించే సామర్థ్యాన్ని ఇవ్వటం ఏమి వింత?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. అమరత్వాన్నీ, ఇంద్రుడినీ ఓర్చే సామర్థ్యాన్నీ ఇచ్చేటప్పుడు, అనేక శత్రువులను ఒక్కడూ ఓడించే సామర్థ్యాన్ని ఇవ్వటంమాట చెప్పాలా? అని కైముత్యంచేత అర్థసంసిద్ధి జరుగుతోంది కాబట్టి కావ్యార్థాపత్త్యలంకారం.

**ఉ.** **తెల్లమి గాఁగ నేను శివదేవు నెఱుంగుదు; భూతసంచయం**
**బెల్ల జనింప, నిల్వఁగ, లయింపఁగఁ జేయు నతండె; యవ్విభుం**
**డుల్లమునం దలంప భువనోత్కరవిశ్వవిధానయుక్తి వ**
**ర్తిల్లుచునుండు; భక్తికి విధేయుఁ, డమేయుఁడు కౌరవేశ్వరా!** **109**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కురురాజా! ధర్మరాజా!; నేను; శివదేవున్= భగవంతుడైన శివుడిని; తెల్లమి+కాఁగన్= స్పష్టంగా; ఎఱుంగుదున్; అతండు+ఎ= అతడే; భూత సంచయంబు+ఎల్లన్= ప్రాణి సమూహమంతా; జనింపన్= పుట్టేటట్టూ; నిల్వఁగన్= నిలిచేటట్టూ; లయింపఁగన్= నశించేటట్టూ; చేయున్; ఆ+విభుండు= ఆ స్వామి; ఉల్లమునన్= మనస్సులో; తలంపన్= అనుకుంటే; భువన+ఉత్కర విశ్వ విధాన యుక్తి= లోక సమూహంయొక్క సకల సృష్టి వ్యవహారమూ; వర్తిల్లుచున్+ ఉండున్= ప్రవర్తిల్లుతూ ఉంటుంది; (అతడు); భక్తికిన్; విధేయుఁడు= వశపడేవాడు; అమేయుఁడు= మితియిడదగనివాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! నేను భగవంతుడైన శివుడిని బాగా ఎరుగుదును. అతడే ప్రాణి సమూహం అంతా పుట్టేటట్లూ, నిలిచేటట్లూ నశించేటట్లూ చేస్తాడు. ఆ స్వామి మనస్సులో అనుకొంటే లోక సమూహపు సర్వసృష్టి వ్యవహారమూ జరుగుతూ ఉంటుంది. అతడు భక్తికి లొంగేవాడు. ఇంతటివాడని చెప్పటానికి శక్యం కానివాడు.

**వ.** **అమ్మహాదేవుని దివ్యలీలలు సెప్పెద నాకర్ణింపుము.** **110**

**ప్రతిపదార్థం:** ఆ+మహాదేవుని= ఆ పరమేశ్వరుడి; దివ్యలీలలు= మానవాతీతమైన లీలలు; చెప్పెదన్; ఆకర్ణింపుము= విను.

**తాత్పర్యం:** ఆ పరమేశ్వరుడి మానవాతీతలీలలు చెపుతాను వినుము.

**సీ.** **భూతసంచయ సృష్టి బుద్ధిఁ దలంచి య । ప్పరమేశుఁ గానఁగ బ్రహ్మ యరిగి**
**తనదు మనోవృత్తి దగ నెఱింగించిన, । నమ్మహాత్ముండు తదభిమతంబు**
**గావింపఁ బూని తపోవిభవం బేమి । పనులకు నైనను బ్రథమసాధ**
**నంబని యూహించి, యంబుసమర్పిత । నిజమూర్తియై, తపోనిష్ఠ నుండె;**

**తే.** **నా విరించియు నద్దేవదేవు రాక । బహుసహస్రవర్షంబులు వార్చియుండి,**
**నిజతపఃప్రభావంబున నిపుణచిత్తు । దక్షుఁడనువాని సృజియించె; ధరణినాథ!** **111**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా! - ధర్మరాజా!; బ్రహ్మ; భూతసంచయ సృష్టిన్= ప్రాణి సమూహపు సృష్టిని; బుద్ధిన్= మనస్సులో; తలంచి= కోరి; ఆ+పరమేశున్= ఆ పరమేశ్వరుడిని; కానఁగన్= చూడటానికి; అరిగి= వెళ్ళి; తనదు మనస్(ః)+వృత్తిన్= తన మనోభిప్రాయాన్ని; తగన్= ఒప్పేటట్టు; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; తద్+అభిమతంబు= ఆ బ్రహ్మతలపు; కావింపన్+పూని= చేయబూని; ఏమి పనులకున్+ఐనన్= ఏ పనులకైనా; తపస్(ః)+విభవంబు= తపస్సంపద; ప్రథమ సాధనంబు= మొదటిసాధనం; అని; ఊహించి= తలచి; అంబు సమర్పిత నిజమూర్తి+ఐ= నీళ్ళలో ఉంచబడిన తన ఆకారం గలవాడై; తపస్(ః)+నిష్ఠన్= తపోనియమంతో; ఉండెన్; ఆ విరించియున్= ఆ బ్రహ్మయు; ఆ+దేవదేవురాకన్= ఆ దేవదేవుడి రాకను; బహు సహస్ర వర్షంబులు= పెక్కువేలేండ్లు; వార్చి+

ఉండి= కనిపెట్టుకొని ఉండి; నిజ తపస్(ః)+ప్రభావంబునన్= తనదైన తపోమహిమచేత నిపుణ చిత్తున్= నేర్పుగల మనస్సుగలవాడిని; దక్షుఁడు+అను వానిన్= దక్షుడనే వాడిని; సృజియించెన్= పుట్టించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రహ్మ ప్రాణి సమూహాన్ని సృజించాలనే తలంపుతో ఆ పరమేశ్వరుడిని చూడటానికి వెళ్ళి తన మనోభిప్రాయం ఒప్పుగా చెప్పగా, ఆ మహానుభావుడు అతడి ఉద్దేశం నెరవేర్చాలని, ఏ పనులకైనా తపస్సంపద మొదటి సాధనం గదా అని తలచి, నీళ్ళలో నిలబడి తపస్సు చేయసాగాడు. బ్రహ్మ ఆ దేవదేవుడు వస్తాడు గదా! అని పెక్కు వేలేండ్లు కనిపెట్టుకొని ఉండి, తన తపోమహిమ చేత నేర్పరి అయిన దక్షుడనే వాడిని పుట్టించాడు.

**వ. ఇట్లు సృజియించి యవ్విరించి యతని నాలోకించి 'ప్రజల సృజియింపు' మని పంచిన, నతండు 'పెద్దవా రొండ్లు లేరై రేనియు సృజియించెద' ననిన, నప్పరమేష్ఠి 'పరమేశ్వరుండు జలనిమగ్నుండై యున్నవాఁ; డేను నిన్ను నియోగించెద; నింక సృజియించుపెద్ద లెవ్వరును లేరు. సృజియింతువు గాక' యనవుడు నమ్మహాత్ముండు దేవాసురమనుష్యతిర్యగాత్మకభూతంబుల సృజియించిన, నాఁకొని యవి దక్షప్రజాపతి భక్షింపం గవిసిన. 112**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సృజియించి= పుట్టించి; ఆ+విరించి= ఆ బ్రహ్మ; అతనిన్= ఆ దక్షుడిని; ఆలోకించి= చూచి; ప్రజలన్; సృజియింపుము= పుట్టించుము; అని; పంచినన్= ఆజ్ఞాపించగా; అతండు; పెద్దవారు; ఒండ్లు= ఇతరులు; లేరు+ఐరి+ఏనియున్= లేకపోయినట్లయితే; సృజియించెదన్= సృష్టిస్తాను; అనన్; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మ; పరమేశ్వరుండు; జల నిమగ్నుండు+ఐ= నీటిలో మునిగినవాడై; ఉన్నవాఁడు; ఏను; నిన్నున్; నియోగించెదన్= నియమిస్తాను; ఇంకన్; సృజియించు పెద్దలు+ఎవ్వరును= సృష్టించే పెద్దలెవరూ; లేరు; సృజియింతువు+కాక= పుట్టించుము; అనవుడున్= అనగానే; ఆ+మహాత్ముండు; దేవ+అసుర మనుష్య తిర్యక్+ఆత్మక భూతంబులన్= దేవతలు; రాక్షసులు; మనుష్యులు; పశుపక్ష్యాదులు అనే ప్రాణులను; సృజియించినన్= పుట్టించగా; అవి; ఆఁకొని= ఆకలిగొన్నవై; దక్షప్రజాపతిన్= దక్షుడనే బ్రహ్మను; భక్షింపన్= తినటానికి; కవిసినన్= మీదపడగా.

**తాత్పర్యం:** ఇట్లా సృష్టించి ఆ బ్రహ్మ అతడిని చూచి, 'ప్రజలను సృజించుము' అని ఆజ్ఞాపిస్తే, అతడు 'పెద్దవాళ్ళు ఇతరులు లేకపోతే సృజిస్తాను' అన్నాడు. బ్రహ్మ 'పరమేశ్వరుడు నీళ్ళలో మునిగి ఉన్నాడు. నేను నిన్ను నియోగిస్తాను. ఇంక సృజించే పెద్దలెవ్వరూ లేరు అందుచేత నీవు సృజించుము.' అనగానే ఆ మహానుభావుడైన దక్షుడు దేవతలు, రాక్షసులు, మనుష్యులు, పశుపక్ష్యాదులు ఐన ప్రాణులను సృజించాడు, అంత అవి ఆకలిగొని దక్షప్రజాపతిని భక్షించటానికి మీదపడగా.

**ఆ. అతఁడు బ్రహ్మపాలి కతిరయంబునఁ బాటి । 'భూతతతులు నన్నుఁ బొదువకుండ**
**నాఁగవలయు; వాని కాహారములు గల్పి । తములు సేయవలయుఁ దగ మహాత్మ!' 113**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ దక్షప్రజాపతి; బ్రహ్మ పాలికిన్= బ్రహ్మ దగ్గరకు; అతి రయంబునన్= మిక్కిలి వేగంతో; పాటి= పరుగెత్తి; మహాత్మ!= మహానుభావా!; భూత తతులు= ప్రాణులు సమూహాలు; నన్నున్; పొదువక+ఉండన్= చుట్టుముట్టకుండా; ఆఁగవలయున్= ఆపాలి; వానికిన్= ఆ భూతాలకు; తగన్= తగినట్లు; ఆహారములు; కల్పితములు+చేయవలయున్= కల్పించాలి.

**తాత్పర్యం:** అతడు బ్రహ్మ దగ్గరకు వేగంగా పరుగెత్తి 'మహాత్మా! ప్రాణికోట్లు నన్ను చుట్టుముట్టకుండా ఆపాలి. వాటికి తగినట్లుగా ఆహారాలు కల్పించాలి.'

**వ. అనిన విని యా జగత్కర్త యోషధులును ఫలమూలాదిభక్ష్యసంపదుపకారంబులుగా వృక్షలతాగుల్మంబులను గల్పించి, యా భూతంబులకు వాని నాహారంబులుగా సమర్పించి, మఱియును బలిష్ఠభూతంబులకు దుర్బల భూతంబులు భక్ష్యంబగుం గాక యనియు నాదేశించెఁ; నంత నా భూతంబులు ప్రీతంబులై చని తత్ప్రకారంబున వృద్ధినొంది సంతానరూపంబున సమృద్ధంబు లగుచునుండెఁ; బెద్దకాలంబునకు బాలేందుధరుండు జలంబులు వెడలివచ్చి భూతకోట్ల నాలోకించి కోపించి నిజలింగంబుఁ బుచ్చి నేలనిడినం గని యా నీరజాసనుండు భవునిం బ్రశమనవాక్యంబుల ననునయించుచుఁ జేరనరిగి 'లింగంబు నిట్లేల చేసి?' తనుటయు నద్దేవుండు. 114**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ జగత్+కర్త= ఆ బ్రహ్మ; ఓషధులను; ఫలమూల+ఆది భక్ష్య సంపద్+ఉపకారంబులు+కాన్= పళ్ళు, వేళ్ళు మొదలైన భక్ష్య సంపదకు సాధనాలుగా; వృక్షలతా గుల్మంబులను= చెట్లు, తీగలు, పొదలు; కల్పించి= సృష్టించి; ఆ భూతంబులకున్= ఆ ప్రాణులకు; వానిన్; ఆహారంబులు+కాన్; సమర్పించి= ఇచ్చి; మఱియును; బలిష్ఠ భూతంబులకున్= బలవత్తమప్రాణులకు; దుర్బల భూతంబులు= బలహీనాలైన ప్రాణులు; భక్ష్యంబు+అగున్+కాక= ఆహారం అవుతాయి కాక; అనియున్; ఆదేశించెన్= ఆజ్ఞాపించాడు; అంతన్; ఆ భూతంబులు; ప్రీతంబులు+ఐ= సంతోషించినవయి; చని= వెళ్ళి; తద్+ప్రకారంబునన్= ఆ విధంగా; వృద్ధిన్+ఒంది= పెరిగి; సంతాన రూపంబునన్= సంతతి రూపంగా; సమృద్ధంబులు+అగుచున్+ ఉండెన్= బాగా వృద్ధి పొందుతున్నాయి; పెద్ద కాలంబునకున్= చాలా కాలానికి; బాల+ఇందుధరుండు= చంద్రకళను తాల్చినవాడు - శివుడు; జలంబులు వెడలి వచ్చి= నీళ్ళలో నుండి వెలికివచ్చి; భూతకోట్లన్= ప్రాణుల సమూహాలను; ఆలోకించి= చూచి; కోపించి; నిజలింగంబున్+పుచ్చి= తనదైన లింగాన్ని తీసి; నేలన్+ఇడినన్= నేలమీద పెట్టగా; కని; ఆ నీరజ+ఆసనుండు= ఆ పద్మాసనుడు-బ్రహ్మ; భవునిన్= శివుడిని; ప్రశమన వాక్యంబులన్= శాంత వచనాలతో; అనునయించుచున్= బ్రతిమాలుతూ; చేరన్+అరిగి= దగ్గరకు వెళ్ళి; లింగంబున్; ఇట్లు; ఏల చేసితి(వి)?; అనుటయున్; ఆ+దేవుండు= ఆ శివుడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని, ఆ సృష్టికర్త ఓషధులను, ఫలమూలాలూ మొదలైన భక్ష్య సంపదకు సాధనాలైన చెట్లనూ, తీగలనూ, పొదలనూ సృష్టించి ఆ ప్రాణులకు వాటిని ఆహారంగా సమర్పించి, ఇంకా, మిక్కిలి బలంగల ప్రాణులకు బలహీనాలైన ప్రాణులు భక్ష్యం అవుతాయని కూడా ఆదేశించాడు. అంత ఆ భూతాలు సంతోషించి, పోయి ఆ విధంగా వృద్ధినొంది సంతతి రూపంలో పెరుగుతున్నాయి. చాలాకాలం తరువాత శివుడు నీళ్ళలో నుండి వెలుపలకు వచ్చి ప్రాణికోట్లను చూచి కోపించి తన లింగాన్ని పెరికి నేలమీదపెట్టాడు. అది చూచి బ్రహ్మ శివుడిని శాంత వచనాలతో బ్రతిమాలుతూ దగ్గరకు వెళ్ళి 'లింగాన్ని ఇట్లా ఎందుకు చేశా?' వని అడిగాడు. ఆ దేవుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'భూతంబుల సృజియించుట । కై తోయములందు మునిఁగి యత్యుగ్ర తపః**
**స్ఫీతుఁడనై వచ్చితి నొరు । చేత సృజనమగుట నిట్లు సేసితి దీనిన్.' 115**

**ప్రతిపదార్థం:** భూతంబులన్= ప్రాణులను; సృజియించుటకై= పుట్టించటంకోసం; తోయములందున్= నీళ్ళలో; మునిఁగి; అత్యుగ్రతపఃస్ఫీతుఁడన్+ఐ= (అతి+ఉగ్ర)+తపస్+స్ఫీతుఁడన్+ఐ= మిక్కిలి భయంకరమైన తపస్సుచేత అధికుడినయి; వచ్చితిన్; ఒరుచేతన్= ఇతరుడిచేత; సృజనము+అగుటన్= సృష్టి జరగటం చేత; దీనిన్= ఈ లింగాన్ని; ఇట్లు చేసితిన్= ఈ విధంగా చేశాను.

**తాత్పర్యం:** 'ప్రాణులను పుట్టించటంకొరకు నీళ్ళలో మునిగి మిక్కిలి ఘోరమైన తపస్సుచేసి అధికుడినయి వచ్చాను. ఇంకొకడిచేత సృష్టి జరిగిపోవటం వలన ఈ లింగాన్ని ఇట్లా చేశాను.'

**వ. 'భూతంబుల సృజియించుటకుం గాక లింగంబు దన కేల?' యని పలికి సంరంభవిజృంభితుం డగుచు మాల్యవంతంబునకుఁ జని మహాతపంబు సేయుచుండ. 116**

**ప్రతిపదార్థం:** భూతంబులన్; సృజియించుటకున్+కాక= పుట్టించటానికి కాకపోతే; లింగంబు; తనకున్+ఏల= నాకెందుకు?; అని; పలికి; సంరంభ విజృంభితుండు+అగుచున్= కోపంతో విజృంభిస్తూ; మాల్యవంతంబునకున్; చని; మహా+తపంబు+ చేయుచున్+ఉండన్= గొప్ప తపస్సు చేస్తూండగా.

**తాత్పర్యం:** 'భూతాలను సృష్టించటానికి కాకపోతే లింగం నా కెందుకు?' అని పలికి కోపంతో విజృంభిస్తూ మాల్యవంతమనే పర్వతం దగ్గరకు వెళ్ళి తపస్సు చేస్తూండగా.

**క. ఆ సమయంబున లింగము । భాసురగతిఁ జూడ నొప్పె బ్రహ్మాదులకుం;**
**జేసిరి పూజలు వారలు । వాసవముఖ్యామరాదివర్గముఁ దారున్. 117**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; బ్రహ్మాదులకున్= బ్రహ్మ మొదలైనవారికి; లింగము; భాసుర గతిన్= ప్రకాశించే విధంగా; చూడన్+ఒప్పెన్= చూడటానికి ఒప్పింది; వారలు; వాసవ ముఖ్య+అమర+ఆది వర్గమున్+తారున్= ఇంద్రుడు మొదలుగా గల దేవతలు మొదలైనవారి సమూహమూ, తామూ; పూజలు చేసిరి= పూజించారు.

**తాత్పర్యం:** అప్పుడు లింగం బ్రహ్మ మొదలైనవాళ్ళకు అందంగా కనిపించింది. ఇంద్రుడూ మొదలైన దేవతల సమూహమూ తామూ దానికి పూజలు చేశారు.

**వ. అంతం బెద్దకాలంబునకు. 118**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; పెద్దకాలంబునకున్= చాలాకాలం తరువాత.

**తాత్పర్యం:** పిమ్మట చాలాకాలం తరువాత.

## రుద్రుఁడు దేవతలు సేయు యజ్ఞంబు సేరుట (సం. 10-18-1)

**క. సుర లొక్క మహాధ్వర మా । చరింపఁగఁ దలంచి ద్రవ్యసంపద మిగులం**
**దొరకొల్పి భాగయోగ్యా । మరుల నిరూపించి యతిసమాహితమతులై. 119**

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; ఒక్క; మహా+అధ్వరము= గొప్ప యజ్ఞం; ఆచరింపఁగన్+తలంచి= చేయగోరి; ద్రవ్య సంపదన్= వస్తుసంపదను; మిగులన్= ఎక్కువగా; దొరకల్పి= సిద్ధంచేసి; భాగ యోగ్య+అమరులన్= భాగానికి అర్హులైన దేవతలను; నిరూపించి= నిర్ణయించి; అతి సమాహిత మతులు+ఐ= మిక్కిలి ఏకాగ్రతగల మనస్సులుగలవారై.

**తాత్పర్యం:** దేవతలు ఒక మహాయజ్ఞం చేయగోరి దానికి కావలసిన వస్తుసంపదను అధికంగా సమకూర్చికొని యజ్ఞభాగానికి అర్హులైన దేవతలను నిర్ణయించి, మిక్కిలి ఏకాగ్రతగల మనస్సులు కలవారై.

**వ. తొడంగి యనుష్ఠానప్రపంచప్రవర్తకు లగుచుండిరి గాని రుద్రుని మహానుభావం బెఱుంగమింజేసి యయ్యోగమూర్తికి భాగకల్పనం బొనర్పరైరి; దాని నెఱింగి. 120**

**ప్రతిపదార్థం:** తొడంగి= ప్రారంభించి; అనుష్ఠాన ప్రపంచప్రవర్తకులు= ఆచరణ విస్తారాన్ని జరిపించేవారు; అగుచున్+ఉండిరి= అవుతున్నారు; కాని; రుద్రుని= శివుడియొక్క; మహానుభావంబు= గొప్పతనం; ఎఱుంగమిన్+చేసి= ఎరుగకపోవటంచేత; ఆ+యోగ మూర్తికిన్= ఆ ధ్యానస్వరూపుడికి - శివుడికి; భాగ కల్పనంబు= యజ్ఞభాగం కల్పించటం; ఒనర్పరైరి= చేయలేదు; దానిన్; ఎఱింగి.

**తాత్పర్యం:** ప్రారంభించి అనుష్ఠానం విస్తారంగా జరిపిస్తున్నారు కాని రుద్రుడి గొప్పతనం ఎరుగకపోవటంచేత ఆ యోగస్వరూపుడికి భాగం కల్పించలేదు. అది తెలిసి.

**సీ. అతుల తపోమయం బయి యద్భుతావహం । బయిన దైర్ఘ్యంబున నతిశయిల్లి**
**బాలార్కసన్నిభప్రభఁ దేజరిల్లెడు । నట్లుగా నొక్క శరాసనంబు**
**సృజియించి దానికి శింజినీ ప్రముఖంబు । లగు నంగకములు యజ్ఞాంగకల్పి**
**తములు గావించి యుద్దామకోపానల । జ్వాలలు సాకారలీల నిగుడఁ**

**ఆ. గేలియం దమర్చి కృత్తివాసుఁడు సుర । శ్రేణిక్రతువు నియతిఁ జేయునెడకు**
**నరుగుదెంచె సత్వరాభీల హేలా వి । కాసభాసి యగుచుఁ గౌరవేంద్ర! 121**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులలో శ్రేష్ఠుడా! - ధర్మరాజా!; అతుల తపస్(ః)+మయంబు+అయి= సాటిలేని వేడిమితో నిండినదై; అద్భుత+ఆవహంబు+అయిన= ఆశ్చర్యకరమైన; దైర్ఘ్యంబునన్= పొడవుతో; అతిశయిల్లి= మించి; బాల+అర్క సన్నిభ ప్రభన్= బాలసూర్యుడితో సమానమైన కాంతితో; తేజరిల్లెడు+అట్లు+కాన్= ప్రకాశించేటట్లు; ఒక్క శరాసనంబున్= ఒక ధనుస్సును; సృజియించి= పుట్టించి; దానికిన్; శింజినీ ప్రముఖంబులు+అగు+అంగకములు= నారి మొదలైన అంగాలు; యజ్ఞ+అంగ కల్పితములు= యజ్ఞ సాధనాలచే కల్పించబడినవి; కావించి= చేసి; ఉద్దామ కోప+అనల జ్వాలలు= భయంకర కోపాగ్ని శిఖలు; స+ఆకార లీలన్= మూర్తీభవించినట్లు; నిగుడన్= వ్యాపించగా; కేలియందున్= చేతిలో; అమర్చి= ధరించి; కృత్తివాసుఁడు= శివుడు (చర్మం వస్త్రంగా గలవాడు); సుర శ్రేణి= దేవతల సమూహం; క్రతువున్= యజ్ఞం; నియతిన్= నిష్ఠతో; చేయు+ఎడకున్= చేసే చోటికి; సత్వర+ఆభీల హేలా వికాస భాసి= తొందరతో గూడిన భయంకరమైన ద్వేషంయొక్క వికాసంతో ప్రకాశించేవాడు; అగుచున్; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠుడా - ధర్మరాజా! సాటిలేని వేడిమితో నిండినదై, ఆశ్చర్యకరమైన పొడవుతో మించి, బాల భాస్కరుడి తేజస్సుతో సమానమైన తేజస్సుతో ప్రకాశించేటట్లు ఒక విల్లు సృష్టించి, దానికి నారి మొదలైన అంగాలు యజ్ఞాంగాలచేత కల్పించి, భయంకరకోపాగ్ని జ్వాలలు మూర్తీభవించినట్లు వ్యాపించగా, చేత ధరించి, శివుడు దేవతలసమూహం నిష్ఠతో యజ్ఞం చేసే చోటికి సత్వరమూ, భయంకరమూ అయిన ద్వేషంతో ప్రకాశిస్తూ వచ్చాడు.

**మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ; బాతాళంబు ఘూర్ణిల్లె; భూ**
**ధరముల్ పెల్లగిలెన్; దిశావలయ ముత్కంపంబు నొందెన్; దివా**

**కర చంద్రాగ్నుల దీప్తి మాసె; సురలోకం బాకులం బయ్యె న**
**ప్పరమేశుం డటు తా మరుత్క్రతుపరిభ్రంశార్థియై వచ్చినన్. 122**

**ప్రతిపదార్థం:** ఆ+పరమేశుండు= ఆ పరమేశ్వరుడు; అటు= ఆ విధంగా; తాన్; మరుత్+క్రతు పరిభ్రంశ+అర్థి+ఐ= దేవతల యజ్ఞనాశనం కోరినవాడై; వచ్చినన్= రాగా; ధరణీచక్రము= భూవలయం; దిర్దిరన్= గిరగిరా; తిరిగెన్; పాతాళంబు; ఘూర్ణిల్లెన్= తిరుగుడు పడింది; భూధరముల్= పర్వతాలు; పెల్లగిలెన్= పెకలాయి; దిశావలయము= దిఙ్మండలం; ఉత్కంపంబున్+ఒందెన్= అధికంగా కంపించాయి; దివాకర చంద్ర+అగ్నుల దీప్తి= సూర్యుడి, చంద్రుడి, అగ్నికాంతి; మాసెన్= నశించింది; సురలోకంబు= దేవతల సమూహం; ఆకులంబు+అయ్యెన్= కలతచెందినది.

**తాత్పర్యం:** ఆ పరమేశ్వరుడు ఆ విధంగా దేవతల యజ్ఞాన్ని ధ్వంసం చేయటానికి రాగా, భూవలయం గిరగిరా తిరిగింది. పాతాళలోకం తిరుగుడుపడింది. పర్వతాలు పెల్లగిల్లాయి. దిగ్వలయం మిక్కిలి కంపించింది. సూర్య చంద్రాగ్నులు తేజోవిహీనులయ్యారు. దేవతల సమూహం కలతచెందింది.

**చ. అనిమిష సంఘమెల్లను భయంబునఁ జేష్టలు దక్కి యధ్వరం**
**బు నడప నేర్పు లేది కురుభూవర! చిత్రగతప్రకార మ**
**య్యె; నదరి యేసె నా క్రతువు నీశుఁడు; డెందము గాఁడఁ బాఱిపో**
**యె నది మృగంబుచందము వహించి హుతాశనసంయుతంబుగన్. 123**

**ప్రతిపదార్థం:** కురు భూవర!= కురురాజా! ధర్మరాజా!; అనిమిష సంఘము+ఎల్లను= దేవతల సమూహం అంతా; భయంబునన్= భయంతో; చేష్టలు+తక్కి= నిశ్చేష్టమై; అధ్వరంబున్= యజ్ఞాన్ని; నడపన్= నడిపించటానికి; నేర్పులు+ఏది= నైపుణ్యం కోల్పోయి; చిత్రగత ప్రకారము+అయ్యెన్= చిత్తరువులో ఉన్న విధంగా నిశ్చేష్టం అయింది; ఈశుఁడు; అదరి= విజృంభించి; ఆ క్రతువున్= ఆ యజ్ఞాన్ని; ఏసెన్= కొట్టాడు; అది= ఆ యజ్ఞం; డెందము+కాఁడన్= హృదయంలో నాటుకోగా; మృగంబు చందమున్= లేడి విధం; వహించి= పొంది; హుతాశన సంయుతంబుగన్= అగ్నితో కూడా; పాఱిపోయెన్.

**తాత్పర్యం:** ధర్మరాజా! దేవతలందరూ భయంతో నిశ్చేష్టులై యజ్ఞ నిర్వహణానికి కావలసిన నేర్పు కోల్పోయి, బొమ్మలవలె అయిపోయారు. ఈశ్వరుడు విజృంభించి ఆ యజ్ఞాన్ని కొట్టాడు. హృదయంలో నాటుకోగా ఆ యజ్ఞం లేడి రూపాన అగ్నితో కూడి పారిపోయినది.

**వ. ఇవ్విధంబున యజ్ఞం బపక్రాంతం బగుటయు నిర్జరులు నిశ్చేతనులై; రందు సవితృని బాహువులును, బూషుని దంతంబులును, భగుని లోచనంబులును ద్రిలోచనుండు గోదండాగ్రంబునఁ దునియను, డొల్లను బగులను బొడిచె నప్పుడు దలరి దివిజులు యజ్ఞాంగబులతోడంగూడఁ బలుగడలం బాఱం దొడంగిన. 124**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; యజ్ఞంబు; అపక్రాంతులు+అగుటయున్= ఆగిపోయినది కాగా; నిర్జరులు= దేవతలు; నిశ్చేతనులు+ఐరి= నిశ్చేష్టులయ్యారు; అందున్; సవిత చేతులూ; పూషుని దంతంబులును= పూషుడి పళ్ళూ; భగుని లోచనంబులును= భగుడి కళ్ళూ; త్రిలోచనుండు= ముక్కంటి శివుడు; కోదండ+అగ్రంబునన్= వింటికొనచేత; తునియను= ముక్కలయ్యేటట్టూ; డొల్లను= రాలేటట్టూ; పగులను= పగిలేటట్టూ; పొడిచెన్; అప్పుడు; దివిజులు= దేవతలు; తలరి= కంపించి; యజ్ఞ+అంగంబులతోడన్+కూడన్= యజ్ఞోపకరణాలతో సహా; పలు+కడలన్= నానా దిక్కులకు; పాఱన్+తొడంగినన్= పారిపోవ నారంభించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా యజ్ఞం ఆగిపోగా దేవతలు నిశ్చేష్టులయ్యారు. వాళ్ళలో సవిత్రుడి చేతులు ముక్కలయ్యేటట్లు, పూషుడి పళ్ళు ఊడేటట్లు, భగుడి కళ్ళు పగిలేటట్లు, ముక్కంటి వింటి కొనతో పొడిచాడు. అప్పుడు దేవతలు కంపించి యజ్ఞోపకరణాలతోసహా నానాదిక్కులకూ పారిపోవనారంభించగా.

**క. ఆ దేవుఁడు వారందఱు । నే దిక్కులఁ బోవకుండ నెయిది భయం బా**
**పాదించుచు నలి నాఁగెఁ । గోదండము నారి సాఁచి గుమురులు గొనఁగన్. 125**

**ప్రతిపదార్థం:** ఆ దేవుఁడు= ఆ శివుడు; వారు+అందఱున్; ఏ దిక్కులన్+పోవక+ఉండన్= ఏ దిక్కులకూ వెళ్ళిపోకుండా; ఎయిది= వెంటాడి; భయంబు+ఆపాదించుచున్= వెరపు పుట్టిస్తూ; కోదండము వారి సాఁచి= వింటి త్రాడు లాగి; గుమురులు+కొనఁగన్= గుంపులు కట్టేటట్టు; నలిన్= సమర్థతతో; ఆఁగెన్= ఆపాడు.

**తాత్పర్యం:** ఆ దేవుడు వెంటాడి వెరపు పుట్టిస్తూ వింటిత్రాడు లాగి వాళ్ళందరూ ఏ దిక్కులకూ పారిపోకుండా, గుంపులు కట్టేటట్లు సమర్థతతో ఆపాడు.

**తే. ఏయ నొల్లక యమరుల నివ్విధమునఁ । బొదివికొని యీశ్వరుఁడు వార**
**లొక్క మొగి 'వింటిగొనయంబు పెక్కు దునియ । లయ్యెడును' యనవుడు నది యట్ల యయ్యె. 126**

**ప్రతిపదార్థం:** ఏయన్+ఒల్లక= కొట్టటానికి ఇష్టపడక; అమరులన్= దేవతలను; ఈ+విధమునన్; పొదివికొని= ఆక్రమించి; ఈశ్వరుఁడు; తూలపుచ్చన్= అవమానించగా; వారలు= ఆ దేవతలు; ఒక్క మొగిన్= ఒక్కుమ్మడిగా; వింటి గొనయంబు= వింటిత్రాడు; పెక్కు+తునియలు+అయ్యెడున్+అ= ముక్కలు ముక్కలయిపోవుగాక; అనవుడున్= అనగానే; అది= ఆ త్రాడు; అట్లు+అ+అయ్యెన్= అలాగే అయింది.

**తాత్పర్యం:** దేవతలను కొట్టటానికి ఇష్టపడక ఈ విధంగా ఆక్రమించి ఈశ్వరుడు అవమానించగా వాళ్ళందరూ ఒక్కపెట్టున 'వింటిత్రాడు ముక్కలు ముక్కలయిపోవుగాక' అని అనగానే అది అట్లాగే అయింది.

**వ. ఆలోన. 127**

**తాత్పర్యం:** అంతలోనే.

**క. సుర లా క్రతువుం దారును । శరణం బను పలుకుతోడఁ జరణానతులై**
**కరుణకుఁ బాత్రము లగుటయు । శరణాగతవత్సలుఁడుఁ బ్రసన్నతఁ బొందెన్. 128**

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; ఆ క్రతువున్= ఆ యజ్ఞమూ; తారును= తామూ; శరణంబు+అను పలుకుతోడన్= శరణం అనే మాటతో; చరణ+ఆనతులు+ఐ= కాళ్ళమీద పడినవారై; కరుణకున్= దయకు; పాత్రములు= తగినవారు; అగుటయున్= కాగా; శరణ+ఆగత వత్సలుఁడు= శరణుకై వచ్చినవాళ్ళపై దయగలవాడు - ఈశ్వరుడు; ప్రసన్నతన్+పొందెన్= అనుగ్రహించాడు.

**తాత్పర్యం:** ఆ యజ్ఞమూ, దేవతలూ శరణంటూ కాళ్ళమీద పడి దయతో అర్హులు కాగా, శరణన్నవారిని కాచే ఈశ్వరుడు వాళ్ళను అనుగ్రహించాడు.

**వ. ఇట్లు ప్రసన్నుండై. 129**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహించినవాడై.

**తాత్పర్యం:** ఈవిధంగా అనుగ్రహించినవాడై.

**తే. ఆత్మకోపంబు పుచ్చి జలాశయమున । వైచి బాలేందుధరుఁడు దేవతల నాద**
**రమున వీక్షించె; నమ్మహోగ్రంపు రోష । మనలరూపమై యిగిరించె నజ్జలముల. 130**

**ప్రతిపదార్థం:** బాల+ఇందు ధరుఁడు= చంద్రకళాధరుడు-శివుడు; ఆత్మకోపంబు= తనకోపం; పుచ్చి= తొలగించి; జలాశయమునన్= సరస్సులో; వైచి= పడవేసి; దేవతలన్; ఆదరమునన్= దయతో; వీక్షించెన్= చూశాడు; ఆ+మహత్+ఉగ్రము+ రోషము= ఆ మిక్కిలి భయంకరమైన కోపం; అనలరూపము+ఐ= అగ్నిరూపం కలదయి; ఆ+జలములన్= ఆ నీళ్ళను; ఇగిరించెన్= ఇంకించింది.

**తాత్పర్యం:** శివుడు తన కోపాన్ని తొలగించి సరస్సులో పడవైచి దేవతలను దయతో చూశాడు. ఆ మహాకోపం అగ్నిరూపం ధరించి ఆ నీళ్ళను ఇంకించింది.

**వ. ఇత్తెఱంగునఁ గృపాయత్తచిత్తుండై సర్వేశ్వరేశ్వరుండు సవితృనకుఁ, బూషునకు, భగునకుఁ గరంబులును, దంతబులును, నయనంబులును నొసంగి యజ్ఞం బెప్పటియట్ల ప్రవర్తిల్ల ననుగ్రహార్ద్రభావంబునం బనిచిన. 131**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; సర్వ+ఈశ్వర+ఈశ్వరుండు= సర్వప్రభువులకు ప్రభువైనవాడు - పరమేశ్వరుడు; కృపా+ఆయత్త చిత్తుండు+ఐ= దయకు వశమైన మనస్సు గలవాడై; సవితృనకున్= సవితకు; పూషునకున్; భగునకున్; కరంబులును= చేతులూ; దంతంబులును= పళ్ళూ; నయనంబులును= కళ్ళూ; ఒసంగి= ఇచ్చి; యజ్ఞంబు; ఎప్పటి+అట్లు+అ= ఎప్పటిలాగే; ప్రవర్తిల్లన్= జరిగేటట్లు; అనుగ్రహ+ఆర్ద్ర భావంబునన్= దయవలని ఆర్ద్రతతో; పనిచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పరమేశ్వరుడు దయాధీన మనస్కుడై సవితకు చేతులూ, పూషుడికి పళ్ళూ, భగుడికి కళ్ళూ ఇచ్చి యజ్ఞం యథాప్రకారంగా జరిగేటట్టు దయా భావంతో ఆజ్ఞాపించగా.

**క. అమరులు భక్తిం గ్రతు భా । గము నప్పరమేశ్వరునకుఁ గల్పించి; రతం**
**డు మనంబునఁ బ్రీతుండై । సమాహితుండయ్యెఁ; జగము సంతోషించెన్. 132**

**ప్రతిపదార్థం:** అమరులు= దేవతలు; భక్తిన్= భక్తితో; ఆ+పరమేశ్వరునకున్; క్రతుభాగమున్= యజ్ఞభాగాన్ని; కల్పించిరి= ఇచ్చారు; అతండు; మనంబునన్= మనస్సులో; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; సమాహితుండు+అయ్యెన్= శాంతించాడు; జగము; సంతోషించెన్.

**తాత్పర్యం:** దేవతలు భక్తితో ఆ పరమేశ్వరుడికి యజ్ఞభాగం కల్పించారు. అతడు మనస్సులో సంతోషించి శాంతించాడు. లోకం సంతోషించింది.

**వ. అట్టివి యద్దేవదేవుని దివ్యలీల; లతండు కోపించిన భువనంబు లస్వాస్థ్యంబును, బ్రసన్నుండైన సుఖిత్వంబును గను; నా భూతనాథుండు గురుసుతునకు సన్నిహితుం డయ్యెఁ గావున నయ్యోధవరుం డొక్కరుండ శిబిరంబు ప్రవేశించి యిత్తెఱంగు పరాక్రమం బాచరించెఁ గాని యివ్విశేషం బారథికవరుని శక్తి నైనది గా; దిది చిత్తంబున నిడం బనిలేదు, భీష్మద్రోణకర్ణశల్యాదులైన మహావీరులం బోరఁ బరిమార్ప దొరకొనుటకును, దర్పదుర్దములైన ధృతరాష్ట్ర నందనాగ్రేసరులైన దుశ్శాసన దుర్యోధనులఁ జలంబు నెరయ వక్షోరక్తపానంబున, నూరుభంజనంబునం బరిమార్చుటం జేసి ప్రతిజ్ఞాపూరణాచరణశోభనంబు నొంద సంభావించుటకును గారణంబైన భవదీయ దైవమానుషయోగంబునకుఁ బరమానందంబు నొందు' మని యిట్లు గోవిందుండు ధర్మనందనునకు నాశ్వాసం బొనరించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 133**

**ప్రతిపదార్థం:** ఆ+దేవదేవుని= ఆ పరమేశ్వరుడి; దివ్యలీలలు; అట్టివి= అటువంటివి; అతండు; కోపించినన్= కోపిస్తే; భువనంబులు= లోకాలు; అస్వాస్థ్యంబును= అనారోగ్యస్థితినీ; ప్రసన్నుండు+అయినన్= ప్రసన్నుడైతే; సుఖిత్వంబును= సౌఖ్యాన్నీ; కనున్= పొందుతాయి; ఆ భూతనాథుండు= ఆ భూతపతి-శివుడు; గురు సుతునకున్= అశ్వత్థామకు; సన్నిహితుండు+అయ్యెన్= దగ్గరయ్యాడు; కావునన్; ఆ+యోధవరుండు= ఆ వీరశ్రేష్ఠుడు; ఒక్కరుండు+అ= ఒక్కడే; శిబిరంబు; ప్రవేశించి; ఈ+తెఱంగు పరాక్రమంబు= ఈ విధమైన పరాక్రమం; ఆచరించెన్= చేశాడు; కాని; ఈ+విశేషంబు; ఆ రథిక వరుని శక్తిన్= ఆ రథిక శ్రేష్ఠుడి శక్తిచేత; ఐన+అది కాదు; ఇది; చిత్తంబునన్= మనస్సులో; ఇడన్+పనిలేదు= పెట్టుకోపనిలేదు; భీష్మ ద్రోణ కర్ణ శల్య+ఆదులు+ఐన మహావీరులన్= భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, శల్యుడు మొదలుగా గల మహావీరులను; పోరన్= యుద్ధంలో; పరిమార్పన్= చంపటానికి; దొరకొనుటకును= యత్నించటానికీ; దర్ప దుర్దములు+ఐన= అణచరాని అహంకారం గలవారైన; ధృతరాష్ట్ర నందన+అగ్రేసరులు+ఐన= ధార్తరాష్ట్రులలో పెద్దవారైన; దుశ్శాసన దుర్యోధనులన్; చలంబు= పంతం; నెరయన్= నిండగా; వక్షస్(ః)+రక్తపానంబునన్= రొమ్ము నెత్తురు త్రాగటంచేతా; ఊరు భంజనంబునన్= తొడలు విరుగగొట్టటంచేతా; పరిమార్చుటన్+ చేసి= చంపటంవలన; ప్రతిజ్ఞా పూరణ+ఆచరణ శోభనంబున్= ప్రతిజ్ఞ నెరవేర్చటం అనే శుభాన్ని; ఒందన్= పొందేటట్టు; సంభావించుటకును= ఆదరించటానికి; కారణంబు+ఐన; భవదీయ దైవ మానుష యోగంబునకున్= నీదైన దైవమానుషాల కూటమికి; పరమ+ఆనందంబున్+ఒందుము+అని= పరమానందంపొందుమని; ఇట్లు; గోవిందుండు= కృష్ణుడు; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; ఆశ్వాసంబు= ఓదార్పు; ఒనరించెన్= చేశాడు; అని; జనమేజయునకున్; వైశంపాయనుండు; చెప్పుటయున్= చెప్పగా.

**తాత్పర్యం:** 'ఆ దేవదేవుడైన ఈశ్వరుడి దివ్యలీలలు అటువంటివి. అతడు కోపిస్తే లోకాలు అస్వస్థతనూ, ప్రసన్నుడైతే సౌఖ్యాన్నీ పొందుతాయి. ఆ ఈశ్వరుడు అశ్వత్థామకు ప్రసన్నుడయ్యాడు. కాబట్టి ఆ వీరవరు డొక్కడే శిబిరంలోకి ప్రవేశించి ఈ విధంగా పరాక్రమించాడు. కాని, ఈ విశేషం ఆ రథికవరుడి శక్తిచేత జరిగింది కాదు. నీవు ఇది మనస్సులో పెట్టుకొననక్కరలేదు. భీష్మ ద్రోణ కర్ణ శల్యాది మహావీరులను యుద్ధంలో చంప యత్నించటానికీ, అణచరాని అహంకారం గల ధార్తరాష్ట్రులలో పెద్దవాళ్ళైన దుశ్శాసనుడినీ, దుర్యోధనుడినీ పంతం నిండగా, రొమ్ము నెత్తురు త్రాగీ, తొడలు విరగ్గొట్టి ప్రతిజ్ఞ నెరవేరటం అనే శుభాన్ని పొందేటట్లు సంభావించడానికీ కారణమైన నీ దైవమానుష సమ్మేళనానికి పరమానందపడుము' అని ఈ విధంగా శ్రీకృష్ణుడు ధర్మరాజును ఓదార్చాడు అని జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పగా. (తరువాతిదైన స్త్రీ పర్వ ప్రథమాశ్వాసంలోని మొదటి పద్యంతో అన్వయం).

## ఆశ్వాశాంతము

**స్రగ్ధర.**

**సాయంప్రాతర్హుత ప్రజ్వలిత హుతవహస్వైరనిర్ధూతజాడ్య**
**స్ఫాయచ్చేతః ప్రసాద ప్రసృమరవిమలప్రౌఢబోధానుమోదీ!**
**మాయావ్యాపారదూరా! మఖతతిహృతినిర్మాణసంపాద్యమానా!**
**శ్రేయోరాజత్త్రిలోకాశ్రిత జనదురితక్షేపలీలావిలాసా! 134**

**ప్రతిపదార్థం:** సాయం= సాయంకాలమందూ; ప్రాతః= ఉదయసమయమందూ; హుత= హోమం చేయబడి; ప్రజ్వలిత= బాగా జ్వలించిన; హుతవహ= అగ్నిచేత; స్వైర= స్వేచ్ఛగా; నిర్ధూత= పోగొట్టబడిన; జాడ్య= జడత్వం గలిగినట్టి; స్ఫాయత్= వృద్ధి పొందుతున్న; చేతః+ప్రసాద= మనోనైర్మల్యమూ; ప్రసృమర= ప్రసరించే స్వభావంగల; విమల= నిర్మలమూ; ప్రౌఢ= గొప్పదీ అయిన; బోధ= జ్ఞానాన్ని; అనుమోదీ!= అంగీకరించేవాడా! (ఉభయ సంధ్యలలోనూ చేసే అగ్నిహోత్ర రూపకర్మంచేత చిత్తశుద్ధి కలిగి స్థిరమైన ఆత్మవిజ్ఞానం కలుగుతుందనీ, అలాంటి విజ్ఞానం పరమేశ్వరుడి తృప్తికి కారణమనీ భావం); మాయా వ్యాపార దూరా!= కుటిలమైన ఆచారం గలవారికి దవ్వయినవాడా! (లేదా మాయావ్యాపార మంటే జగత్ప్రవృత్తి. అధ్యాత్మ విదులకు తప్ప జగద్వ్యాపారమే యథార్థమనీ, గమ్యమనీ అనుకునే మూఢులకు దూరుడని భావం); మఖ= యజ్ఞాలయొక్క; తతి= సమూహంయొక్క; హృతి= నిర్మాణంచేత; సంపాద్యమానా!= సంపాదించబడేవాడా!; ('హృతినిర్మాణ' శబ్దంచేత త్రేతాగ్ని సంబద్ధములైన యజ్ఞాలే ప్రధానంగా గ్రాహ్యాలు); శ్రేయః= నిశ్శ్రేయస(ముక్తి) ఫలాన్నిచ్చే జ్ఞానంతో; రాజత్= ప్రకాశిస్తున్నట్టీ; త్రిలోక= మూడు లోకాలను; ఆశ్రిత= ఆశ్రయించినట్టి; జన= జనులయొక్క; దురిత= పాపాలను; క్షేప= పోగొట్టడం అనే పనే; లీలా విలాసా!= కేళీవిలాసంగా గలవాడా!- (హరిహరనాథా! అని ఈ విశేషణాలన్నీ కృతిపతియైన హరిహరనాథుడివి.)

**తాత్పర్యం:** హరిహరనాథా! నిష్కామంగా ఉభయ సంధ్యలలోనూ ఆచరించే అగ్నిహోత్రాది వైదిక కర్మలచేత కలిగే ఉత్తమజ్ఞానమంటే నీవు మిక్కిలి సంతోషిస్తావు. కుటిల వ్యాపారాలంటే నీకు ఎంతమాత్రమూ ఇష్టం ఉండదు. యజ్ఞస్వరూపుడవైన నీవు యజ్ఞ నిర్వహణం చేతనే సంపాదించబడతావు. సర్వలోకాలలోని జ్ఞానుల జ్ఞానాన్ని అభినందిస్తూ నీవు వాళ్ళ పాపాల నన్నింటినీ పోగొట్టుతూ మిక్కిలి వినోదిస్తావు.

**క. సురనికరానందకరా! । సురారికాంతావిలాసశోభాపహరా!**
**కరుణాసక్తమనస్కా! । సరిద్వరా బర్హి బర్హ చారు శిరస్కా! 135**

**ప్రతిపదార్థం:** సుర నికర+ఆనందకరా!= దేవతల సమూహానికి ఆనందాన్ని సమకూర్చేవాడా!; సుర+అరి= దేవతల శత్రువులైన రాక్షసులయొక్క; కాంతా= భార్యలయొక్క; విలాస= విలాసాలనూ; శోభా= శోభనూ; అపహరా!= అపహరించేవాడా!; (రాక్షసులను చంపేవాడా అని భావం); కరుణా+ఆసక్త మనస్కా!= దయతో గూడిన చిత్తం గలవాడా!; సరిత్+వర= నదీశ్రేష్ఠమైన గంగచేతనూ; (హరరూపంలో); బర్హి= నెమలియొక్క; బర్హ= పింఛం చేతనూ (హరిరూపంలో); చారు= మనోహరమైన; శిరస్కా!= శిరస్సుగలవాడా!

**తాత్పర్యం:** దేవతల సమూహానికి ఆనందాన్ని సమకూర్చేవాడా! రాక్షసుల భార్యల విలాసాలనూ, శోభనూ హరించేవాడా! (రాక్షసులను సంహరించేవాడా), దీనులయందు దయగలవాడా! హరరూపంతో నదీశ్రేష్ఠమైన గంగనూ, హరిరూపంలో నెమలి ఫింఛాన్నీ ధరించిన అందమైన శిరస్సు కలవాడా! హరిహరనాథా!

**మాలిని.**

**అకలుష హృదయాభివ్యక్త! సర్వోపయుక్తా!**
**సకలనిగమవేద్యా! స్వాస్థ్యవిద్యోపపాద్యా!**
**ప్రకృతివికృతిభావప్రాప్త సాంఖ్య ప్రదీప్తా!**
**సుకృతమయ విలాసా! సుస్థిరానందభాసా!** **136**

**ప్రతిపదార్థం:** అకలుష హృదయ+అభివ్యక్త!= నిర్మలమైన చిత్తమునందే సుస్పష్టంగా గోచరించేవాడా! మాలిన్యరహితమైన దర్పణంతో ప్రతిబింబంలాగా నిర్మల చిత్తంలో పరమేశ్వరుడు సుస్పష్టంగా గోచరిస్తాడని భావం; సర్వ+ఉపయుక్తా!= విశ్వానికంతకూ ఉపకరించేవాడా!; ధర్మ సంస్థాపనం ద్వారా పరమేశ్వరుడు సర్వలోకాలకీ ఉపకరిస్తాడని భావం; సకల నిగమ వేద్యా!= సమస్త శ్రుతులచే తెలియదగినవాడా!; స్వాస్థ్య విద్యా+ఉపపాద్యా!= స్వస్థ భావాన్ని తెలిపే విద్యలచేత తెలియదగినవాడా!; స్వ= తాను అంటే ఆత్మ; స్వస్థ అంటే ఆత్మనిష్ఠుడని భావం. పరమేశ్వరుఁడు ఆత్మస్వరూపుడవటం వలన స్వాస్థ్య విద్యోపపాద్యుడని భావం; ప్రకృతి వికృతి భావ= ప్రకృతి వికృతి భావంచేత అంటే కార్యకారణభావం చేత, ప్రాప్త= పొందబడిన; సాంఖ్య= సాంఖ్య దర్శన ప్రతిపాదకమైన జ్ఞానంచేత; ప్రదీప్తా!= మిక్కిలి ప్రకాశించేవాడా!; సుకృతమయ విలాసా!= పుణ్యరూపమైన విలాసం గలవాడా! (పరమేశ్వరుడి విశ్వసృష్ట్యాదిక విలాసజ్ఞానం పుణ్యహేతువవటంచేత పరమేశ్వరుడు సుకృతమయ విలాసుడని భావం); సుస్థిర+ఆనంద భాసా!= శాశ్వతానందం చేత ప్రకాశించేవాడా!; (ఇతరములైన ఇంద్రియసుఖాదులన్నీ కార్యరూపాలు అవటంచేత అవి నశ్వరాలు. పారమేశ్వర స్వరూపానందం కారణ స్వరూపం కాబట్టి, అది సుస్థిరమని భావం).

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీవు నిర్మల హృదయాలలోనే గోచరిస్తావు. ధర్మసంస్థాపనం చేస్తూ విశ్వానికంతకూ ఉపకరిస్తావు. అధ్యాత్మ విద్యా ప్రతిపాదకాలైన వేదాలే నీ స్వరూపాన్ని తెలుపుతాయి. ప్రకృతి పురుషరూప తత్త్వాల ద్వారా విశ్వ స్వరూపాన్ని బోధించే సాంఖ్య మతంలో నీవే వెలుగొందుతున్నావు. నీ విలాసరూపమైన విశ్వసృష్టి స్థితి సంహారాల విచారం చేత జనులకు ఎంతో సుకృతం కలుగుతుంది. నీవు శాశ్వతానంద స్వరూపుడవై ప్రకాశిస్తూ ఉంటావు.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధా రాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున సౌప్తిక పర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది; శ్రీమత్+ఉభయకవిమిత్ర= శ్రీమంతుడైన ఉభయకవిమిత్ర బిరుదం కలవాడూ; కొమ్మన+అమాత్య పుత్త్ర= కొమ్మనమంత్రి కుమారుడూ; బుధ+ఆరాధన విరాజి= పండితుల-దేవతల- పూజచే ప్రకాశించేవాడూ(అయిన); తిక్కన సోమయాజి= తిక్కన అనేపేరుగల సోమయాజిచేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీమహాభారతంబునన్= శ్రీమహాభారతంలో; సౌప్తిక పర్వంబునందున్= సౌప్తికమనే పేరుగల పర్వంలో; ద్వితీయ+ఆశ్వాసము= రెండవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది శ్రీమంతుడైన ఉభయకవిమిత్ర బిరుదంకలవాడూ, కొమ్మనమంత్రి కుమారుడూ, పండితుల (దేవతల) పూజలచేత ప్రకాశించేవాడూ, అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీమహాభారతంలోని సౌప్తికపర్వంలో రెండవ ఆశ్వాసం.

**సౌప్తికపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలో సౌప్తికపర్వం ముగిసింది.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ సాంగత్య విధాయి వి । కాసోల్లాసిత కటాక్ష! కరుణామయ మూ**
**ర్తీ! సారబోధ భరిత । వ్యాసాది మనోనివాస! హరిహరనాథా!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీ= ఐశ్వర్య; సాంగత్య= లాభాన్ని; విధాయి= కలుగజేసేటటువంటి; వికాస+ఉల్లాసిత= వికసనంచేత ప్రకాశింపజేయబడిన; కటాక్ష!= క్రీగంటి చూపుగలస్వామీ! (హరిహరనాథా!); కరుణామయమూర్తీ!= దయాస్వరూపుడా!; సారబోధ= విశ్వానికంతా సారభూతమైన జ్ఞానంతో; భరిత= నిండిన; వ్యాసాది మనోనివాస= వ్యాసాదులైన బ్రహ్మర్షుల మనసులలో నివసించేవాడా! హరిహరనాథా! (నీకు నమస్కారం).

**తాత్పర్యం:** స్వామీ! హరిహరనాథా! నీ కడగంటి చూపే భక్తులకు ఐశ్వర్యాన్ని కలిగించి సంతోష పరచగలుగుతుంది. నీవు దయామయుడివి. మహాజ్ఞానమూర్తులైన వ్యాసమహర్షి మొదలైన వారు సదా నిన్ను తమ హృదయాలలో ధ్యానిస్తారు. అట్లాంటి నీకు నమస్కారం.

**విశేషం:** భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఇట్లా చెప్పాడు:

**'చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున,**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!"**

'అర్జునా! నన్ను నాలుగు విధాలైన పుణ్యాత్ములు ఆరాధిస్తారు. ఆర్తులు జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు - అని నా భక్తులు నాలుగు రీతులుగా ఉన్నారు' అని తాత్పర్యం.

ఆర్తితో తమ కష్టాన్ని తొలగించుమని కోరేవారు (ద్రౌపది, గజేంద్రుడు మొదలైనవారు), మహాతత్త్వాన్ని తెలిసికొనాలన్న తపనతో - జిజ్ఞాసువులుగా - నా వద్దకు వచ్చేవారు, (ప్రహ్లాదుడు మొదలైన వారు), ధనమో, మరో ప్రయోజనమో కోరుకొని వచ్చేవారు (కుచేలుడు ఇట్లా వచ్చినవాడే) - ఉండగా, నాకు ప్రీతిపాత్రులు, మిక్కిలి శ్రేష్ఠులు జ్ఞానులు మాత్రమే (శుక, వ్యాస, పరాశరాదులు - నారదాదులు - మహాజ్ఞానులు - వీరే జీవన్ముక్తులు) అని శ్రీకృష్ణుడు చెప్పుతున్నాడు.

వ్యాసాదులు అట్లాంటి బ్రహ్మజ్ఞాన సంపన్నులు. ఇంతవరకు భారతకథలో అంతా లోకవ్యవహారమే. అర్థకామాల లంపటంలో ఒకరిపై మరొకరు జరిపిన యుద్ధమే అంతటా కనిపించేది.

యుద్ధమైపోయింది. ధర్మరాజులో నిర్వేదం మొదలయింది. ఈ నిర్వేదమే భగవద్గీతలోని అర్జున విషాదం. దాని ఫలితమే 'జ్ఞాన బోధ'. దానినే తిక్కన గారు 'సారబోధ' అని ఇక్కడ పిలుస్తున్నారు.

స్త్రీ పర్వంతో యుద్ధషట్కం పూర్తి అవుతుంది. ఇక తక్కినవి శాంతి సప్తకాలు. శాంత్యాది పర్వాలలో ధర్మరాజు ఈషణత్రయ విముక్తుడై మోక్షార్హుడు కావడానికి సంబంధించిన కథ ఉన్నది. ఈ మోక్షార్హత 'సారబోధ' ఉన్నవాడికే ఉంటుంది. అందుకే హరిహరనాథ స్తుతిలో వ్యాసాదుల ప్రసక్తి వచ్చింది. అన్ని పర్వాలలోను తరువాత జ్ఞాన వివేచన ప్రధానం కావటం గమనించవచ్చును.

**క. దేవా! జనమేజయ జగ । తీవరుఁడు కుతూహలము మదిన్ మొలతేరం**
**గా వైశంపాయన వద । నావేశిత దృగ్విలాసుఁ డై యి ట్లనియెన్. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా! (విను); జనమేజయ; జగతీవరుడు= జనమేజయ మహారాజు; మదిన్= మనసులో; కుతూహలము మొలతేరన్= కుతూహలం మొలకెత్తగా; వైశంపాయన= వైశంపాయన మహర్షియొక్క; వదన+ఆవేశిత= ముఖంలో చేర్చిన; దృక్+విలాసుఁడై= చూపుల విలాసం కలవాడై; ఇట్లు+అనియెన్= ఇట్లా అడిగాడు.

**తాత్పర్యం:** స్వామీ! హరిహరనాథా! తరువాతి కథ వినుము. జనమేజయ మహారాజు ఇంతవరకు విన్న సౌప్తిక పర్వ కథాసారాన్ని తలచి తరువాత ఏమి జరిగిందో అన్న కుతూహలంతో వైశంపాయనుడి ముఖంలోకి చూస్తూ ఇట్లా అడిగాడు.

**వ. తన సుతుండును సైన్యంబును బాండుసుతులచేత నట్లగుట సంజయువలన విని 'ధృతరాష్ట్రుం డెబ్భంగి వర్తించె నశ్వత్థామ కృప కృతవర్మ లా రాత్రి తమ చేసిన పరాక్రమంబు తెఱంగు దుర్యోధనున కెఱింగించి పోయిరని వింటిఁ బదంపడి కరినగరంబు దెస కరిగి మగిడి రనియు నాకర్ణించితి వార లట యెవ్వలనికిం జని రేల మగిడి రశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమంబునకుం బోవం దక్కిన యిరువురు నెక్కడ వోయి రవ్విధంబున విజయంబు నొందిన ధర్మనందనుం డేమి యాచరించె నంతయుం బరిపాటిం దేటపడం జెప్పు' మనిన నమ్ముని వరుం డిట్లనియె. 3**

**ప్రతిపదార్థం:** తన సుతుండును= తన కుమారుడైన దుర్యోధనుడూ; సైన్యంబును= అతని సైన్యమూ; పాండు సుతులచేతన్+ అట్లగుట= పాండవులచేత ఆ విధంగా నాశనం కావటం; సంజయుని వలన విని= సంజయుడు చెప్పగా విని; ధృతరాష్ట్రుండు+ఏ+ భంగిన్+వర్తించెన్?= ధృతరాష్ట్రుడు ఏం చేశాడు?; అశ్వత్థామ, కృప, కృతవర్మలు; ఆ రాత్రి= ఆ రాత్రి సమయంలో; తమచేసిన పరాక్రమంబు తెఱంగు= తాము చూపిన పరాక్రమాన్ని గురించి; దుర్యోధనునకున్+ఎఱింగించి= దుర్యోధనునికి చెప్పి; పోయిరని వింటిన్= పోయారని మీరు చెప్పగా విన్నాను; పదంపడి= ఆ తరువాత; కరినగరంబు దెసకున్= హస్తినాపురంవైపు; అరిగి= వెళ్ళి; మగిడిరనియున్= తిరిగి వచ్చారని కూడా; ఆకర్ణించితిన్= విన్నాను; వారలు+అట= ఆ అశ్వత్థామాదులు అక్కడ; ఏ+వలనికిన్+చనిరి?= ఏ దిక్కుగా వెళ్ళారు?; ఏల మగిడిరి?= ఎందుకు తిరిగి వచ్చారు?; అశ్వత్థామ; కృష్ణద్వైపాయ నాశ్రమంబునకున్+పోవన్= వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళగా; తక్కిన ఇరువురు= కృపుడు, కృతవర్మ; ఎక్కడ+పోయిరి?= ఎక్కడికి వెళ్ళారు?; ఆ+విధంబునన్= ఆ విధంగా; విజయంబున్+ఒందిన= విజయం పొందిన; ధర్మనందనుండు= ధర్మరాజు; ఏమి+ఆచరించెన్= ఏం చేశాడు? అంతయున్= ఈ విషయాలన్నిటినీ; పరిపాటిన్= క్రమంగా; తేటపడన్= వివరంగా; చెప్పుమనినన్= చెప్పండి అని కోరగా; ఆ మునివరుండు= వైశంపాయనుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'తన కుమారుడు అతడి సైన్యం పాండవులచేత సంపూర్ణంగా నాశనమవటాన్ని గురించి సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు ఎట్లా భరించాడు? ఏమి చేశాడు? అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ ఆ రాత్రి తాము చేసిన ఉపపాండవ సంహారాది విషయాలను దుర్యోధనుడికి చెప్పారని మీరు చెప్పగా విన్నాను. వాళ్ళు ముగ్గురూ హస్తినానగరంవైపు వెళ్ళి తిరిగి వచ్చారని కూడా విన్నాను. వారు హస్తినలో ఎక్కడికి వెళ్ళి వచ్చారు? ఎందుకు తిరిగి వచ్చారు? మరి అశ్వత్థామ వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళిపోగా కృప, కృతవర్మలు ఎక్కడికి వెళ్ళారు? అంతటి మహావిజయాన్ని పొందిన ధర్మరాజు ఏమి చేశాడు? ఈ విషయాలన్నీ వింటూ ఉంటే చాలా కుతూహలం కలుగుతున్నది.

ఆ తరువాత ఏ మేమి జరిగిందో అన్నీ వివరంగా చెప్పండి' అని జనమేజయుడు కోరగా వైశంపాయన మహర్షి ఇట్లా చెప్పటం మొదలుపెట్టాడు.

**తరలము**

**ధరణినాయక! యట్లు పుత్రశతంబు వైరికులంబుచే**
**నిరవశేషత నొందుటన్ మహనీయ గౌరవహీనతం**
**బొరసి కొమ్మలు దున్న మ్రోడ్పడు భూరుహంబును బోలె ని**
**ర్భర విపద్వికలాత్ముఁడై ధృతరాష్ట్రుఁ డుల్లము వమ్ముగన్.** **4**

**ప్రతిపదార్థం:** ధరణినాయక!= ఓ జనమేజయ మహారాజా!; అట్లు= ఆ విధంగా; పుత్రశతంబు= తన నూరుగురు కొడుకులు; వైరికులంబుచేన్= శత్రువులైన పాండు కుమారులచేత; నిరవశేషతన్+ఒందుటన్= నిశ్శేషం కావటం - అందరూ చనిపోవటం (వలన); మహనీయ= గొప్పదైన; గౌరవహీనతన్= గౌరవం నశించగా; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; పొరసి= పొంది (అతిక్రూరంగా); కొమ్మలు+తున్మన్= కొమ్మలు తునిమివేయగా; మ్రోడు+పడు= మోడుగా మారిపోయిన; భూరుహంబునున్+ పోలెన్= చెట్టులాగా; నిర్భర= పరిపూర్ణమైన; విపద్+వికల+ఆత్ముఁడై= ఆపదచేత వికలమైన మనసు కలవాడై; ఉల్లము= హృదయం; వమ్ముగన్= వ్యర్థం కాగా.

**తాత్పర్యం:** 'ఓ రాజా! వినుము. ఆ విధంగా తన నూరుగురు సంతానమూ ఒక్కరూ మిగలకుండా ఆ పాండవులచేతిలో నశించటం వలన ఆ ధృతరాష్ట్రుడికి ఉన్న గౌరవమంతా ఒక్కపాటున పడిపోయినట్లయి పోయింది. దగ్గరికి చేరి అతిక్రూరంగా కొమ్మలన్నిటిని తునిమివేస్తే పెద్దచెట్టయినా ఎట్లా మోడువారిపోతుందో అట్లా అయిపోయాడాయన పాపం! ఆయనకు భరించరాని దుఃఖం కలిగింది. అది ఎవరూ ఆర్చలేని ఆపద. మనసంతా కకావికలైపోయింది. హృదయం శూన్యమైపోయింది.

**విశేషం:** అలం: ఉపమ. ఇక్కడి నుండి తిక్కనగారు స్త్రీ పర్వంలో అంతటా చాలా విశేష వృత్తాలను వాడారు. క్రీ.శ. 13వ శతాబ్దంలో భారతాన్ని రాగాత్మకంగా పాడగా శ్రోతలు విని ఆనందించేవారు. ఆధునిక కాలంలోనే కావ్యాలు మౌనంగా చదవటం అలవాటయింది. ఈ వృత్తాలన్నీ వివిధ రీతుల గతులను కలిగినవి. ముఖ్యంగా అన్నిటిలోనూ ఒక గానయోగ్యతాలక్షణం కనిపిస్తుంది. తరువాతి కథలో యుద్ధభూమిలో కౌరవ వనితలు రకరకాలుగా తమ వారిని గురించి రోదిస్తారు. ఒక్కొక్క వ్యక్తిది ఒక్కొక్క అనురాగం. దానికి తగిన రాగం, తానం, లయ, రోదనలోనూ కనిపిస్తుంది. అంతే కాకుండా ఈ స్త్రీ పర్వాన్ని ఒకే ఛందస్సులో వ్రాసి ఉంటే చదివి భరించటమూ కష్టమే. తిక్కన శోక వర్ణన చేస్తున్న ఆయా సందర్భాలలో జ్ఞాన మీమాంస సదసత్కర్మల విచారణ చేయటం ద్వారా కరుణ రసం శాంతానికి అంగభూతంగా ఉండేటట్లు చేశాడు. అందుకే భిన్న చ్ఛందోరూపాలను గ్రహించాడని పెద్దలు చెప్పుతారు.

ఈ పద్యంలో 'తున్మ' - అనే క్రియ ఉంది. తునుమటమంటే మొగ్గను త్రుంచటం' వంటిది. అజేయ పరాక్రమం కల దుర్యోధనాదులను శ్రీకృష్ణుడి సహాయంతో పాండవులు అవలీలగా గెలవగలిగారు. 'తునుము' అనే క్రియ ఆ లక్షణాన్ని సూచిస్తుంది.

ధృతరాష్ట్రుడిని మోడువారిన చెట్టుతో పోల్చటంలో కూడా ఒక సార్థకత ఉన్నది. ధృతరాష్ట్రుడు కాండం, కొడుకులు, బంధువులు కొమ్మలు రెమ్మలు. అవన్నీ తెగిపోగా మిగిలిన 'మోడు' వలె మహారాజు ఉన్నాడు. ఒక నిర్జీవ ప్రతిమ, జీవచ్ఛవంవలె ఉన్నాడని అర్థం. అందుకే హృదయం శూన్యమైందని చెప్పటం కూడా.

**విశేషం:** తరలమునకు ప్రతిపాదంలోనూ న, భ, ర, స, జ, జ, గ అనే గణాలుంటాయి. 1-12 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ. చింతా భరంబున నూరక యున్నం జూచి సంజయుం డతని కిట్లనియె. 5**

**ప్రతిపదార్థం:** చింతాభరంబునన్= చింతాభారంచేత; ఊరక+ఉన్నన్= మాటా పలుకూ ఏమీలేకుండా ఉండగా; చూచి; సంజయుండు+అతనికిన్+ఇట్లు+అనియెన్= సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** చింతతో గుండె బరువైపోయింది. ధృతరాష్ట్రుడు మాటా పలుకూ లేకుండా అట్లాగే ఉండిపోయాడు. అపుడు సంజయుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**ఆ. 'నీకు నితరులట్ల శోకింపఁదగునె? యె । వ్వరిఁ దలంచి యింక వనరువాఁడ**
**వీవు? శోకమునకు నెయ్యది తుది? యిది । వలవ దుడుగు వినుము వసుమతీశ! 6**

**ప్రతిపదార్థం:** వసుమతీశ!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నీకు= నీలాంటి జ్ఞానికి; ఇతరులు+అట్ల= పామర జనులవలె; శోకింపన్+తగునె?= దుఃఖపడటం తగిన పనేనా!; ఎవ్వరిన్+తలంచి= (అందరూ పోయాక) ఎవరిని తలచుకొని; ఇంకన్= ఇంక; ఈవు= నీవు; వనరువాడవు= దుఃఖిస్తావు!; శోకమునకున్= బాధకు; తుది+ఏ+అది?= అంతమెక్కడ?; ఇది= ఇట్లా శోకించటం; వలవదు= తగదు; ఉడుగు= దుఃఖం వదలిపెట్టు; వినుము= నేను చెప్పబోయే మాటలు వినుము.

**తాత్పర్యం:** 'ఓ రాజా! నీవు జ్ఞానవంతుడివి. అయినా పామరుడివలె దుఃఖిస్తున్నావు. ఇది తగిన పనేనా? అందరూ పోయారు. ఇక నీవు ఎవరిని గురించి బాధపడతావు? అసలు నీ బాధకు అంతముంటుందా! ఇట్లా శోకించటం తగనపని. దుఃఖాన్ని వదలిపెట్టుము. నేను చెప్పేది వినుము.

**విశేషం:** ఇక్కడ ధృతరాష్ట్రుడి స్థాయి యుద్ధానికి ముందు అర్జునుడి విషాదస్థాయివలె ఉన్నది. అక్కడ చనిపోతారే అని అర్జునుడు బాధపడ్డాడు. ఇక్కడ చనిపోయారే అని ధృతరాష్ట్రుడు బాధపడుతున్నాడు. అందుకే గీతోపదేశం ఈ ఇరుతెగల మనుష్యులకూ జరిగింది. కృష్ణుడు చెపుతాడు.

**'గతాసూ నగతాసూంశ్చ**
**నానుశోచన్తి పణ్డితాః'**

(చనిపోయినవారి గురించి కాని, చనిపోనివారి గురించి కాని పండితులు శోకించరు.)

అట్లా దుఃఖించటం పామరుల పద్ధతి - అని కూడా శ్రీకృష్ణుడు చెప్పాడు. అందుకే నీవు జ్ఞానివి కనుక దుఃఖించవద్దంటూ

**'న త్వం శోచితు మర్హసి'** (నీవు దుఃఖించటానికి తగిన వాడవు కావు) అని కూడా చెప్పాడు.

భగవద్గీతను సొంతం విన్న సంజయుడు ఈ మాటను అనటంలో ఎంతో సామంజస్యం ఉన్నది. ఇతరులు- అనే మాటకు ఇంత అర్థాన్ని భావించవచ్చును.

**వ. పదునెనిమిది యక్షౌహిణులు సమసెఁ బితామహ పితృభ్రాతృ పుత్ర పౌత్ర సఖి సుహృత్సహాయులుందెగి రందు వగపునకుం బనిగాని వారలు గలరే? యేది కొలందిగా వగచె దందఱకు నగ్నికార్యంబు నిర్వర్తింపను దగిన వారలకుం దిలోదక ప్రదానంబులు సేయను వలయుఁ బొలిగలనికి వేంచేయు' మనుటయు. 7**

**ప్రతిపదార్థం:** పదునెనిమిది+అక్షౌహిణులు= పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యమూ; సమసెన్= నశించింది; పితామహ= తాతలు; పితృ= తండ్రులు; భ్రాతృ= అన్నదమ్ములు; పుత్ర= కొడుకులు; పౌత్ర= మనుమలు; సఖి= సన్నిహితులు; సుహృద్= స్నేహితులు; సహాయులున్= సదా తోడుగా ఉన్నవారు; తెగిరి= చనిపోయారు; అందున్= వారిలో; వగపునకున్+పని+కానివారలు= దుఃఖించటానికి తగనివాళ్ళు; కలరే?= ఉన్నారా?; ఏది+కొలందిగాన్= దేనికోసమని; వగచెదు?= దుఃఖిస్తావు?; అందఱకున్= అందరికీ; అగ్నికార్యంబు= దహన సంస్కారం; నిర్వర్తింపను (వలయున్)= చేయాలి; తగినవారలకున్= సన్నిహిత బంధువర్గానికి; తిలోదక ప్రదానంబులు+చేయను వలయున్= తిలలు, నీళ్ళు వదలిపెట్టాలి (తర్పణం చేయాలి); పొలి+కలనికిన్= యుద్ధభూమికి; వేంచేయుము+అనుటయున్= బయలుదేరండి అని చెప్పగా.

**తాత్పర్యం:** పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యమంతా నశించింది. తాతలు, తండ్రులు, కొడుకులు, అన్నదమ్ములు, మనుమలు, సన్నిహితులు, స్నేహితులు, సదా తోడుగా పనిచేసినవారు - అందరూ చచ్చిపోయారు. వీరిలో దుఃఖించటానికి తగనివారెవరు! అందరినీ గురించి శోకించవచ్చును. ఇక దేనికొరకు ఏడుస్తావు! రాజా! ఇక ఏడుస్తూ కూర్చొనవద్దు. యుద్ధంలో చనిపోయిన వారందరికీ దహన సంస్కారం చేయాలి. సన్నిహిత బంధువర్గానికి తిలోదక ప్రదానం చేయాలి. కాబట్టి దయచేసి సకుటుంబంగా యుద్ధభూమికి బయలుదేరండి' అని సంజయుడు చెప్పగా.

**విశేషం:** చనిపోయిన వారిని ప్రేతలంటారు. ప్రేతకు తొలుత దహన సంస్కారాదికం కావాలి. అది బంధువులు చేయవచ్చును. ఇతరులు కూడా చేయవచ్చును. కాని, తిలోదక ప్రదానం సన్నిహిత బంధువులు మాత్రమే చేస్తారు. దేహ ఋణవిముక్తి ఈ తిలోదక ప్రదానానికి అర్థమని సంప్రదాయజ్ఞులు చెప్తుతారు.

ప్రేతకు తిలోదక, వాసోదక(వాసస్+ఉదక), పిండోదకాలు మూడూ వరుసగా నీరు, వస్త్రం, అన్నం అవుతాయని హైందవ సంప్రదాయం చెపుతున్నది. ఈ తిలోదక ప్రదానాన్ని ధర్మోదక ప్రదాన మని కూడా హైందవు లంటారు.

**క. విపులార్తిఁ గూరి మనుజా । ధిప! యా భూవల్లభుండు ధృతిలేమిం జం**
**డపవన పతితంబగు పా । దపంబు చందంబు దోఁప ధరణిం బడియెన్. 8**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిప!= ఓ జనమేజయ మహారాజా! (వినుము); ఆ భూవల్లభుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; విపుల+ఆర్తిన్+కూరి= మిక్కిలి బాధలో కూరుకుపోయి; ధృతిలేమిన్= ధైర్యం కోల్పోయి; చండ= భయంకరమైన; పవన= గాలిచేత; పతితంబు+అగు= పడిపోయిన; పాదపంబు చందంబు+తోఁపన్= చెట్టులాగా; ధరణిన్+పడియెన్= నేలమీద పడ్డాడు.

**తాత్పర్యం:** ఓ జనమేజయా! వినుము. ఆ ధృతరాష్ట్రమహారాజు ఆ విధంగా పెద్దశోక సముద్రంలో మునిగిపోయాడు. ధైర్యం కోల్పోయాడు. భయంకరమైన గాలి తాకిడికి పడిపోయిన చెట్టువలె నేలమీద కూలిపోయాడు.

**వ. పడియుండి తల దోర్చికొనుచు నిట్లనియె. 9**

**ప్రతిపదార్థం:** పడి+ఉండి= అట్లా కొంత సేపు నేలమీద పడిఉండి; తలన్+దోర్చికొనుచున్= తల ఇటూ అటూ మోదుకొంటూ; ఇట్లనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా కొంతసేపు పడి ఉండి, పైకి లేచి, తల బాదుకుంటూ ఇలా అన్నాడు.

**వసంత తిలకము**

**'హా! పుత్రవర్గ మిటులాఅడిఁ బోవ దీప్త । వ్యాపారమేది మది వందుచు దీన వృత్తిం**
**బ్రాపించి యన్యులు కృపం బరికింప నిం కే। నోపన్ భవం బెడలి యుండఁగ జీవితోడన్. 10**

**ప్రతిపదార్థం:** హా!= అయ్యో!; పుత్రవర్గము= కుమార సమూహం; ఇటులు= ఈవిధంగా; ఆఅడిన్+పోవన్= అతిదీనంగా చనిపోగా; దీప్త వ్యాపారము= వైభవంతోడి ఉనికిని; ఏది= పోగొట్టుకొని; మదిన్= మనసులో; వందుచున్= కుంగిపోతూ; దీనవృత్తిన్= దైన్యంగా బ్రతకటాన్ని; ప్రాపించి= పొంది; భవంబు= ప్రాధాన్యం; ఎడలి= పోగొట్టుకొని; అన్యులు= ఇతరులు; కృపన్+పరికింపన్= దయతో నన్ను చూస్తుండగా; ఇంకన్= నేను; జీవితోడన్= కేవలం ప్రాణం నిలుపుకొన్న దేహంతో; ఉండఁగన్+ఓపన్= ఉండజాలను.

**తాత్పర్యం:** 'అయ్యో! ఎంత దౌర్భాగ్యం వచ్చిపడింది! కొడుకులంతా అతి దీనంగా చనిపోయారు. నా బ్రతుకులోని వైభవమంతా నశించిపోయింది. మనసులో నిరంతరం క్రుంగిపోతున్నాను. అతి దీనమైన బ్రతుకు మాత్రమే మిగిలింది. ఏ ప్రాధాన్యమూ లేని ఈ ప్రాణంతోటి దేహం మాత్రం ఎందుకు? ఇకపైన ఇతరులు నన్ను దయతో జాలితో చూడగా ఇంక నేను ప్రాధాన్యం పోగొట్టుకొని ప్రాణం నిలుపుకొన్న దేహంతో ఉండలేను.

**విశేషం:** రాష్ట్రమంతా- దైహికమయిన సంపద; ధృత= ధరించిన వాడని అర్థం చెప్పవచ్చు. నిరంతరం ధృతరాష్ట్రుడు తన జీవితాన్ని, తన బాధను, తన కుమారుల జీవితాన్ని, వారి వైభవాన్ని, తన ప్రాముఖ్యాన్ని మాత్రమే చూచుకొంటూ బ్రతికాడని అర్థం. అందుకే ఇతరులు తనమీద కృప చూపటాన్ని కూడా సహించలేకపోయాడు. సాధారణంగా మనుష్యుల బ్రతుకు లింతే.

వసంతతిలకానికి ప్రతిపాదంలోనూ త, భ, జ, జ, గ, గ- అనే గణా లుంటాయి, 1-8 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**క. ఎఱకలు విఱిగిన గరుడుని । తెఱఁగునఁ దేజంబు సెడిన దినకరుగతి నం**
**దఱు బంధులు దెగి విభవం । బఱి వెలవెలఁబాఱుచునికి యది బ్రదు కగునే! 11**

**ప్రతిపదార్థం:** ఎఱకలు= రెక్కలు; విఱిగిన= తెగిన; గరుడుని= తెఱఁగునన్= గురుత్మంతుడిలాగా; తేజంబు= కాంతి; చెడిన= పోగొట్టుకున్న; దినకరుగతిన్= సూర్యుడిలాగా; అందఱు బంధులున్= బంధువులంతా; తెగి= చనిపోగా; విభవంబు+అఱి= వైభవం పోగొట్టుకొని; వెలవెలన్+పాఱుచున్+ఉనికి= వెలవెలపోతూ ఉండటం; అది బ్రదుకు+అగునే?= అదీ ఒక బ్రతుకేనా?

**తాత్పర్యం:** 'రెక్కలు తెగిన పక్షివలె, కాంతిని కోల్పోయిన సూర్యుడివలె అయిపోయింది నా బ్రదుకు. నా బంధువులంతా పోయారు. నా వైభవం అంతా పోయింది. నా బ్రతుకు మసకబారి వెలవెలపోతున్నది. ఇట్లా బ్రతకటమూ ఒక బ్రతకటమేనా?

**విశేషం:** అలం: ఉపమ, మాలోపమ. పురాణాలలో గరుత్మంతుడు మహా పరాక్రమవంతుడు. సూర్యుడు సాక్షాత్తు నారాయణుడుగా చెప్పబడ్డాడు. ఇంద్రుడి వజ్రాయుధానికే కేవలం ఒక ఈకను పోనిమ్మని దానంచేసినవాడు గరుత్మంతుడు. అట్లాంటి అతడి రెక్కలు పోవటం అసంభవం. సూర్యుడికి గ్రహణ సందర్భంలో కాని, మేఘాలు అలముకొన్నప్పుడు కాని కాంతి తగ్గుతుంది. మహారాజుకు గరుడుడు, సూర్యుడు స్మృతిలో మెదలటం వెనుక తన బ్రతుకు, వైభవం ఎంత గొప్పవో చెప్పుకొనటమే చాలా ప్రధానాంశం. ఇట్లా భావించటమే మనషిలోని లోభం. పక్షికి రెక్కలు ఎటువంటివో, ధృతరాష్ట్రుడికి బంధువులు అటువంటి వారు. సూర్యుడికి తేజస్సు వంటిది ధృతరాష్ట్రుడికి విభవం అటువంటిది- అని గ్రాహ్యం.

**సీ.** **సంధికిఁ గృష్ణుండు సనుదెంచి పెక్కుభం । గులఁ జెప్ప భీష్ముండు గుంభజుండు**
**నట్లు హితార్థులై యంతలంతలు మాట । లాడిరి జామదగ్న్యాదులైన**
**మునివరు లవ్విధంబున నొత్తి చెప్పి రా । బుద్ధులన్నియును దుర్బుద్ధి నగుటఁ**
**బాటింపనైతి లోభమునఁ బాండు నృపాలు । పాలు తత్సుతులకుఁ బంచి యీని**

**తే.** **నా కతంబునఁ బొలిసిరి నందనులును । జెలులుఁ జుట్టంబులును సహాయులును ధైర్య**
**మెట్లు కలుగు వైదికముల కెట్లు మనసు । గొలుపుఁ బ్రాణంబుతో నెట్లు నిలువ వచ్చు? 12**

**ప్రతిపదార్థం:** సంధికిన్= రాయబారంకోసం; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; చనుదెంచి= వచ్చి; పెక్కు భంగులన్+చెప్పన్= ఎన్నో విధాలుగా చెప్పినా; భీష్ముండు= భీష్మాచార్యుడు; కుంభజుండు= ద్రోణాచార్యుడు; అట్లు= ఆ విధంగా; హిత+అర్థులు+ఐ= మేలుకోరినవారై; అంతలు+అంతలు= ఎన్నోహితోక్తులను (పెద్దమాటలను); మాటలు+ఆడిరి= చెప్పారు; జామదగ్న్య+ఆదులు+ ఐన= పరశురాముడు మొదలైన; మునివరులున్= ఋషిశ్రేష్ఠులు కూడా; ఆ+విధంబునన్= అదే విధంగా; ఒత్తి+చెప్పిరి= నొక్కి నొక్కి చెప్పారు (ప్రబోధించారు); ఆ బుద్ధులు+అన్నియును= ఆ ఉపదేశాలన్నిటినీ; దుర్బుద్ధిన్+అగుటన్= దుష్టబుద్ధి కలవాడిని కావటంవల్ల; పాటింపన్+ఐతిన్= పాటించలేదు; లోభమునన్= నా లోభగుణంవల్ల; పాండునృపాలు పాలు= పాండురాజుయొక్క వంతు; తద్+సుతులకున్= పాండురాజు కుమారులకు; పంచి ఈని= భాగం ఇవ్వని; నా కతంబునన్= నావల్లనే; నందనులున్= నా కొడుకులు; చెలులున్= స్నేహితులు; చుట్టంబులును= బంధువులు; సహాయులును= సహచరులు; పొలిసిరి= మరణించారు; ధైర్యము+ఎట్లు కలుగున్= ఇక ధైర్యం ఎలా ఉంటుంది; వైదికములకున్= వైదిక కర్మలవైపు; మనసు= మనసు; ఎట్లు+కొలుపున్?= ఎలా కుదురుతుంది?; ప్రాణంబుతోన్= ప్రాణంతో; ఎట్లు నిలువవచ్చున్?= ఎట్లా బ్రతకటం?.

**తాత్పర్యం:** ఆనాడు రాయబారం కొరకు శ్రీకృష్ణుడు వచ్చి ఎన్నో విధాలుగా యుద్ధం నాశకరమని చెప్పాడు. భీష్మద్రోణులూ ఇట్లాగే చెప్పారు. పరశురాముడూ మునులూ ఎన్నో హితోక్తులు చెప్పారు. కాని, లోభగుణంచేత, పుత్రులమీది మమకారంచేత ఏ మాటలూ విన్నవాడిని కాను. పాండుకుమారులకు రాజ్యభాగం ఇవ్వక పోతిని. నా కారణం వలననే నా కొడుకులు, చుట్టాలు, స్నేహితులు, సహచరులు అందరూ చనిపోయారు. ఇక నాకు ధైర్యం ఎట్లా ఉంటుంది? వైదిక కర్మకాండవైపు మనసు ఎట్లా పోతుంది? అసలు ప్రాణంతో బ్రతకటం ఎట్లా?

**క.** **నా కీడు దలఁప నేరక । శ్రీకి నెడపి పాడి యింత సేయక పుత్రా**
**నీక సుహృద్బాంధవులం । బోకార్చితి బ్రదుకు టింకఁ బొసఁగునె చెపుమా! 13**

**ప్రతిపదార్థం:** నాకీడు= నాకు రాబోయే దుర్గతిని; తలఁపనేరక= ఆలోచించకుండా; శ్రీకిన్= సంపదకు; ఎడపి= (పాండవులను) దూరంచేసి; పాడి= న్యాయం; ఇంత+చేయక= కొద్దిగా కూడా నడిపించకుండా; పుత్ర+అనీక= పుత్ర సమూహాన్నీ; సుహృద్=

స్నేహితుల్నీ; బాంధవులన్= బంధువులనూ; పోకార్చితిన్= చంపుకొన్నాను; బ్రతుకుట= బ్రతకటం; ఇంకన్= ఇంక; పొసఁగునె?= కుదురుతుందా?; చెపుమా!= (సంజయా!) చెప్పుము.

**తాత్పర్యం:** సంజయా! నాకు రాబోయే దుర్గతిని గురించి ఆలోచించకుండా పాండవులను సంపదకు దూరంచేశాను. న్యాయం ఏ మాత్రం నడిపించకుండా ఇట్లా చేయటం వలననే నా కొడుకులను, బంధువులను, స్నేహితులను పొట్టన పెట్టుకొన్నాను. ఇక నేను బ్రతకటం సమంజసం కాదు.

**వ. దైవంబు దుఃఖ భాజనత్వం బొనర్చుటం బూర్వజన్మాచరితంబైన సుకృతంబు లేమి గాననయ్యెడు వయః పరిణామంబునఁ బంచభూత క్షయంబును దుర్వినయ పరిపాకంబున సకల బంధునాశంబును సమయ ప్రాప్తంబులయ్యెనింక బ్రహ్మపదప్రాప్తియ తగు నదియై యున్నది యది యాచరించుట సంశితవ్రత పరాయణులైన పాండు సుతులు చూతురు గాక యనిన విని యజ్జనపతి శోకంబు శాంతంబు సేయుటకు సంజయుం డిట్లనియె. 14**

**ప్రతిపదార్థం:** దైవంబు= దైవం; దుఃఖభాజనత్వంబు= నా బ్రతుకును ఇలా దుఃఖంపాలుగా; ఒనర్చుటన్= చేయటం గమనిస్తే; పూర్వజన్మ ఆచరితంబు+ఐన= ముందుజన్మలో చేసుకొన్న; సుకృతంబులేమి= పుణ్యంలేకపోవటం; కానన్+అయ్యెడున్= స్పష్టంగా తెలుస్తోంది; వయః+పరిణామంబునన్= ప్రాయం మార్పుచేత; పంచభూతక్షయంబునున్= పంచభూతాల నాశనమున్నూ; దుర్వినయపరిపాకంబునన్= ఆయా వీరుల దుష్ట ప్రవృత్తి ఫలితంగా; సకల బంధునాశంబును= బంధువులందరూ ఇట్లా చనిపోవటం; సమయప్రాప్తంబులు+అయ్యేన్= కాలానికి తగినట్టు సంభవించాయి; ఇంకన్+అ= ఇక; బ్రహ్మపద ప్రాప్తిఅ= ఇట్లా మరణించినవారికి శాశ్వత బ్రహ్మలోక సిద్ధిమాత్రమే; తగునదియై యున్నది= తగిందిగా ఉంది (మిగిలింది); అది+ఆచరించుట= దానికి తగిన క్రియా కలాపాలు చేయటం; సంశిత వ్రత పరాయణులైన= పట్టిన ప్రతిజ్ఞను తీర్చుకోవటంలో దక్షులైన; పాండుసుతులు= పాండు కుమారులు; చూతురుగాక= చూసుకొంటారులే; అనినన్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా; విని= సంజయుడు విని; ఆ జనపతి= ఆ మహారాజు; శోకంబు= దుఃఖాన్ని; శాంతంబు+చేయుటకున్= ఉపశమింపచేయటానికి; సంజయుడు; ఇట్లనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** నా బ్రతుకు ఇట్లా శోకమయం కావటం చూస్తే నేను పూర్వజన్మలో ఏ పుణ్యమూ చేసిన వాడివలె కనిపించటం లేదు. కాలపరిణామం ఎవరికీ తప్పించటానికి వీలులేదు. పంచభూతాలు నశిస్తుండగా ఆయా వీరులలో పుట్టిన దుష్టప్రవృత్తుల ఫలితంగానే బంధువులంతా ఇట్లా తలా ఒకరీతిలో చనిపోయారు. ఇక వీరికి సుగతి ప్రాప్తి మాత్రమే మిగిలిన పని. దానికి తగిన ఉత్తర క్రియలు చేయటానికి పాండుకుమారు లున్నారు. వారు పట్టిన ప్రతిజ్ఞను నేరవేర్చటంలో నిష్ణాతులు. వారు చేయలేని దేమున్నది!' అని ధృతరాష్ట్రుడు అంటే ఆయన శోకాన్ని ఉపశమింపచేయటంకొరకు సంజయుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** భారతీయులు పూర్వజన్మ సుకృతాన్నిబట్టి ఉత్తరజన్మలో ఐశ్వర్యాదులు ఉంటాయని భావిస్తారు. అందుకే ధృతరాష్ట్రుడు తాను పూర్వజన్మలో పుణ్యకార్యాలు చేసిన వాడిని కానని బాధపడుతున్నాడు.

జీవితానికి అతి గంభీరమైన వ్యాఖ్యానం చెప్పాడు వ్యాసమహర్షి. మనిషి చేసే ప్రతి పనికి 'కాల' ప్రభావం కారణం అనటం ఆ వ్యాఖ్యాన తాత్పర్యం. కాలాన్నిబట్టి ప్రకృతి (పంచభూతాలు, వాటి తన్మాత్రలు), వాటినిబట్టి మనిషి ప్రవృత్తి,

ఉంటాయని ధర్మరాజాదులు అట్లా ప్రవర్తించి విజయాన్ని పొందటానికీ, దుర్యోధనాదులు అట్లా ప్రవర్తించి దుర్మరణం పాలు కావటానికీ 'సమయప్రాప్తి' (కాలశక్తి) కారణమని వ్యాసుడి నిర్ణయం.

మరణించిన వారికి 'బ్రహ్మలోక' సిద్ధి కలగాలని భారతీయులు వాంఛిస్తారు. అందుకు ఏర్పడిందే వైదిక క్రియ. బ్రహ్మ పదార్థం నుంచీ పుట్టిన జీవుడు మళ్ళీ బ్రహ్మలోకి చేరిపోవటమే బ్రహ్మపదప్రాప్తి. అందుకే అందరికీ మరణానంతరం చేయగల క్రియాకలాపం 'ఉత్తరక్రియ' అని అర్థం.

సంశిత వ్రతం - అంటే పట్టిన ప్రతిజ్ఞను నెరవేర్చటం. ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భంలో భీమాదులు ఏ ప్రతిజ్ఞలు చేశారో, వాటిని నెరవేర్చుకొనటమే సంశితవ్రత దీక్ష - అంటే దృఢవ్రత దీక్ష అని భావం.

**క. 'శ్రుతులును శాస్త్రములు బహు । శ్రుతులవలన వింటి శాంతి చొప్పడ వలదే?**
**మృతికి నృపులడలుదురె? ధీ । యుతు లీ విధమునకు రోయకుండుదురె? నృపా! 15**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; శ్రుతులును= వేదాలును; శాస్త్రములున్= శాస్త్రాలును; బహుశ్రుతులవలనన్= గొప్ప పండితుల ద్వారా; వింటి(వి)= విన్నావు; శాంతి చొప్పడవలదే?= శాంతి నీకు కలుగవలదా?; నృపులు= రాజులు; మృతికిన్= చావుకు; అడలుదురె?= శోకిస్తారా?; ధీయుతులు= జ్ఞానులు (పండితులు); ఈ విధమునకున్= ఇట్లా దుఃఖించటాన్ని; రోయక+ ఉండుదురె?= అసహ్యపడకుండా ఉంటారా?

**తాత్పర్యం:** 'రాజా! ఎందు కిట్లా దుఃఖిస్తావు!' ఎంతోమంది పెద్ద పెద్ద పండితుల వద్ద వేద శాస్త్రాలను విన్నావు కదా! నీవు శాంతి కలుగవలదా! రాజులు మృతికి భయపడటమా! పండితులు దీన్ని ఏవగించుకోరా! కనుక దుఃఖించవద్దు.

**తె. తొల్లి సృంజయుండు పుత్త్రశోకార్తుండైన నమరమునిసత్తముండగు నారదుం డుపన్యసించిన యితిహాసం బభిమన్యు మరణ శోక సంతప్తుండైన ధర్మతనయునకుం బరాశర తనయుండు సెప్పిన చొప్పునన యేనును జెప్ప నాకర్ణించితి గాదె! సుహృజ్జనంబు లుపదేశించిన మాటలు విననైతి నని నీవ చెప్పె దుమ్మలింపం బనియేమి? నీకును నీ కొడుకునకు మంత్రులు దుశ్శాసనుండును గర్ణుండును శకునియునటె యేమి సెప్పఁ గల దవధరింపుము. 16**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; సృంజయుండు= సృంజయుడు; పుత్రశోక+ఆర్తుండు+ఐనన్= పుత్రశోకంతో బాధపడుతుండగా; అమరముని సత్తముండగు= స్వర్గలోక ఋషులలో శ్రేష్ఠుడైన; నారదుండు= నారదమహర్షి; ఉపన్యసించిన= చెప్పిన; ఇతిహాసంబు= కథను; అభిమన్యు మరణశోక= అభిమన్యుని మృతిచేత పుట్టిన దుఃఖంతో; సంతప్తుండైన= కాలిపోతూ ఉండిన (బాధపడుతూ ఉండిన); ధర్మతనయునకున్= ధర్మరాజుకు; పరాశర తనయుండు= వ్యాసుడు; చెప్పిన చొప్పునన్+అ= చెప్పిన రీతిగానే; ఏనునున్+చెప్పన్= నేనూ నీకు చెప్పగా; ఆకర్ణించితి(వి)+కాదె!= విన్నావు కదా!; సుహృద్+జనంబులు= మిత్రులు; ఉపదేశించిన మాటలు= చెప్పిన ఉపదేశోక్తులను; వినన్+ఐతిన్+అని= వినకపోతినని; నీవ చెప్పెదు= నీవే చెబుతున్నావు; ఉమ్మలింపన్= బాధపడాల్సిన; పనిఏమి?= అవసరమేమున్నది?; నీకును= నీకూ; నీ కొడుకునకున్= కొడుకైన దుర్యోధనునికి; మంత్రులు= మంచి చెడులు బోధించే మంత్రి వర్యులు; దుశ్శాసనుండును, కర్ణుండును, శకునియున్+అటె!= దుశ్శాసనుండును, కర్ణుండును, శకునియున్+అటె!= దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని - వీళ్ళా!; ఏమి చెప్పన్+కలదు= ఇక ఏం చెప్పటానికున్నది!; అవధరింపుము= వినుము.

**తాత్పర్యం:** పూర్వం సృంజయుడు కుమారుడిని పోగొట్టుకొని బాధపడుతుండగా నారదుడు చెప్పిన ఇతిహాసాన్ని, అభిమన్యుడు పోయి దుఃఖిస్తున్న ధర్మరాజుకు వ్యాసుడు చెప్పగా, ఆ కథను నీకు నేను అట్లే చెప్పాను. విన్నావు కదా! ఇంకా శాంతి కలుగలేదా! మిత్రులు, ఆప్తులు చెప్పిన మంచిమాటలు వినకపోతినని నీవే అంటున్నావు. ఇక బాధ ఎందుకు! అయినా నీకూ, నీ కొడుకుకూ మంత్రులు దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని - వీళ్ళా! ఇక ఏమి చెప్పగలను! అయినా వినుము.

**విశేషం:** సృంజయు డనేరాజు కుమారుడు సువర్ణష్ఠీవి. నారదుడి అనుగ్రహంతో జన్మించినవాడు. అతని మూత్ర పురీషాలు బంగారంగా మారిపోయే వరంతో అతడు పుట్టాడు. కొందరు దుర్మార్గులు బంగారానికి ఆసపడి ఆ అబ్బాయిని చంపి చీల్చి వేశారు. సృంజయుడు బాధపడుతుండగా నారదుడు వచ్చి షోడశ మహారాజుల వృత్తాంతాలు చెప్పి అతడి దుఃఖం మాన్పి సువర్ణష్ఠీవిని బ్రతికించాడు. ఆ కథనే ఇక్కడ గుర్తు చేస్తున్నాడు (చూ. శాంతిపర్వం)

**ఆ. కొఱుత నుఱుకుఁ గాని కొడుకెన్నఁడును గార్య । తంత్రమునకుఁ జొరఁడు దాని నీవు**
**మాన్ప నొల్ల వతని మగఁటిమియును లావు । నచ్చి లోభ మెదఁ బెనంగొనంగ. 17**

**ప్రతిపదార్థం:** కొఱుతన్= శూలంమీద; ఉఱుకున్+కాని= పరిగెత్తడానికి ప్రయత్నిస్తాడు (సాహస కృత్యాలు చేయబూనుతాడని అర్థం) తప్ప; కొడుకు= నీ కుమారుడైన దుర్యోధనుడు; ఎన్నఁడును= ఏనాడూ; కార్యతంత్రమునకున్= కార్యసిద్ధికి అవసరమైన క్రియా కలాపానికి; చొరఁడు= ప్రయత్నించడు; అతని మఁగటిమియును= ఆ సుయోధనుని పరాక్రమం; లావు= బలం (శక్తి); నచ్చి= నమ్మి; లోభము= లోభగుణము; ఎదన్= హృదయంలో; పెనంగొనంగన్= బాగానాటుకుపోగా; దానిన్= అట్లా చేయటాన్ని; నీవు మాన్పన్+ఒల్లవు= నీవు మాన్పవు (నీవు అడ్డు పెట్టలేకపోయావు).

**తాత్పర్యం:** నీ కొడుకు దుర్యోధనుడు ఎప్పుడూ ఆపదలు కొని తెచ్చుకొనే పనులు చేయటానికే సాహసించాడు తప్ప కార్యసిద్ధికి తగిన రీతులలో సమాలోచన చేశాడా? పనిని సాధించాడా? పోనీ ఆ అవివేకపు పనులను నీవు ఆపగలిగావా? అతడి పరాక్రమాన్ని, శక్తిని నమ్మి నీలో లోభగుణం బాగా మనసులో నాటుకొనిపోగా, దానిని ఆపటానికి ఇష్టపడవైతివి.

**విశేషం:** కొఱ్ఱు - అంటే శూలంవంటి మారణాయుధం. దానిపైన నడవటానికి ఎవరూ సాహసించరు. దానిపై పరుగెత్తటానికి ఎవరు పూనుకొంటారు! అట్లా చేసినవాడు దుర్యోధనుడు. అందుకే ఆపదలు కొనితెచ్చుకొన్నాడని తాత్పర్యం. దీనికితోడు అవివేకుల మంత్రాంగం. పైగా ధృతరాష్ట్రుడు దుర్యోధనుడి పరాక్రమం నమ్మి లోభగుణం తన మనస్సులో పెనగొనగా వారించలేదు.

**క. ఆర్యులు దఱితోఁ దగియెడు । కార్యమనుష్ఠింతు రట్టుగా కప్పని మా**
**త్సర్యమునఁ దిగిచిపట్టి య । నార్యులు దుదిఁ దూర వగతు రాపదయైనన్. 18**

**ప్రతిపదార్థం:** ఆర్యులు= పుణ్యాత్ములు; తఱితోన్+తగియెడు= సమయానికి తగిన; కార్యము+అనుష్ఠింతురు= పనిచేస్తారు; అట్టు+కాక= అలా కాకుండా; ఆ+పని= ఆ పనిని; మాత్సర్యమునన్= మత్సర భావంతో (అసూయతో); అనార్యులు= పాపాత్ములు; తిగిచిపట్టి= విఘ్నం కల్పించి-ఆపి; తుదిన్= చివరకు; తూరన్= విఫలంకాగా; ఆపద+ఐనన్= ఆపద వాటిల్లగా; వగతురు= ఏడుస్తారు.

**తాత్పర్యం:** పుణ్యాత్ములు ఏ సమయానికి ఏం చేయాలో అది చేసి, కార్యసాధనలో సఫలీకృతులవుతారు. పాపాత్ములు ఆ పనిని అసూయాగ్రస్తులై అడ్డుకొని, తమ ప్రయత్నం విఫలం కాగా చివరకి ఏడుస్తారు. నీ కొడుకులు చేసిన పనులు అట్లాంటివే.

**విశేషం:** ఆర్య - అనార్య శబ్దాలను ఇతిహాసాలలో ధర్మ - అధర్మ; పుణ్య - పాప; శ్రేష్ఠ - అధమ వాచకాలుగా వాడి ఉన్నారు. పాండవులు ధౌమ్యాది పురోహితులచేత, నారదాది మహర్షులచేత ప్రరోచన పొంది కార్యసిద్ధిని పొందారు. దుర్యోధనాదులు దుర్మంత్రంతో అడుగడుగునా వారికి అడ్డుపడ్డారు. విఫలు లయ్యారు. చివరకి శోకం పాలయ్యారు.

**ఆ. జున్ను డెప్పరంపు జోటైన చఱినున్నఁ । జూచి విఱుగఁబడుటఁ జూడ కాత్మ**
**దీపుఁ గోరి యుఱుకు తిండికాఁడును బోలె । నయితి; వగచు టింక యనుచితంబు. 19**

**ప్రతిపదార్థం:** జున్ను= తేనెపట్టు; డెప్పరము+చోటు+ఐన= అపాయకరమైన; చఱిన్= కొండ చరియలో; ఉన్నన్= ఉండగా; చూచి; (ఆ చరియ); విఱుగన్+పడుటన్= విరిగిపోతూండటం (పడిపోవటం); చూడక= గమనించక; ఆత్మన్= చిత్తంలో; తీపున్+కోరి= తేనెలోని తియ్యదనాన్ని కోరి; ఉఱుకు= పరిగెత్తేటటువంటి; తిండికాఁడునున్+పోలె= తిండిపోతులాగా; అయితి(వి)= నీవు అయ్యావు; ఇంకన్; వగచుట= చింతించటం; అనుచితంబు= ఉచితం కాదు.

**తాత్పర్యం:** తేనెపట్టు కొండచరియలో శిఖరాన ఉన్నదనుకొమ్ము. దానిలోనుండి తేనె కావాలనుకొన్నవాడు ఆ చరియ గట్టిగా ఉన్నదా? లేదా? మనిషి ఎక్కినపుడు విరిగి పోతుందా? పోదా? అని ఆలోచించి మరీ ఎక్కాలి. కాని, తిండిపోతయినవాడు అదంతా పట్టించుకొనడు. ఎట్లాగైనా సరే ఆ తీపును అందుకుంటే చాలనుకొంటాడు. సరిగ్గా నీ పరిస్థితి అట్లాగే అయిపోయింది. ఇంక ఎందుకు ఏడవటం?

**విశేషం:** అలం: ఉపమ. జున్ను - అంటే సాధారణంగా పాలజున్ను మాత్రమే గుర్తుకువస్తుంది. తేనెపట్టును కూడా 'జున్ను' అనిపిలుస్తారు. రాజ్యసంపద - ఆ తేనెపట్టు. విరిగిపోతున్న చరియ - రాజధర్మం. అయినా లోభగుణగ్రస్తుడైన ధృతరాష్ట్రుడు దానిని పట్టించుకొనలేదు. ఆ సంపదనే కోరుకొన్నాడు. చివరికి చరియ విరిగిపోయింది - అని తాత్పర్యం. అధికంగా తిండిని కోరటానికి కూడా మనిషిలోని 'లోభ' గుణమే కారణం అని ప్రాచీనులు విశ్వసించారు.

**క. వగచినఁ బోయిన కార్యము । మగుడునె? వగవంగ లోకమాన్యుండగునే?**
**వగ పుణ్యగతికి మూలమె? వగ పెల్లవిధముల నుడుగ వలయు నరేంద్రా! 20**

**ప్రతిపదార్థం:** వగచినన్= దుఃఖిస్తే; పోయిన కార్యము= జరిగిపోయిన పని; మగుడునె?= మరలా తిరిగి వస్తుందా?; వగవంగన్= ఏడుస్తే; లోకమాన్యుండు+అగునే?= లోకంలో గౌరవం పొందుతాడా?; వగ= దుఃఖించటం; పుణ్యగతిన్ మూలమె?= చనిపోయిన వారికి ఉత్తమగతులు కలిగించటానికి కారణమవుతుందా?; నరేంద్రా!= ఓ రాజా!; (అందువల్ల); వగపు= దుఃఖాన్ని; ఎల్లవిధములన్= అన్ని రీతులలోనూ; ఉడుగన్+వలయున్= వదలిపెట్టాలు.

**తాత్పర్యం:** ఏడిస్తే ఒకసారి జరిగిపోయిన పని మళ్ళీ తిరిగి వస్తుందా? (చనిపోయిన వారు మరలివస్తారా?). ఏడిస్తే లోకం (నిన్ను) గౌరవిస్తుందా? నీవు ఏడవటం వలన చనిపోయినవారికి పుణ్యగతి కలుగుతుందా? అందుచేత బాధపడుతూ కూర్చొనటం ఏవిధంగానూ మంచిదికాదు. రాజా! దుఃఖించటం మానివేయుము.

**మత్తకోకిల:**

**తాన చుట్టుఁ దగిల్చి యగ్ని యుదగ్రతం దరికొన్నఁ దా**
**పానుభూతికి నోర్వఁజాలక యప్రయోజన వాక్య సం**
**తాన శోషిత వక్త్రుఁడై యతి దైన్యమొందెడు వాని య**
**ట్లైన నీదు విలాప మన్యుల కాడఁ బట్టగు భూవరా!** **21**

**ప్రతిపదార్థం:** తాను+అ= తనుకుతానే (స్వయంగా); చుట్టున్= తన చుట్టూ; తగిల్చి= మంటపెట్టుకొని; అగ్ని= మంట; ఉదగ్రతన్= భయంకరంగా; దరికొన్నన్= రాజుకొనగా; తాప+అనుభూతికిన్= ఆ వేడిమి అనుభవానికి; ఓర్వన్+చాలక= తట్టుకోలేక; అప్రయోజన= నిష్ప్రయోజనకరమైన; వాక్యసంతాన= మాటల సమూహంచేత; శోషిత= ఎండిపోయిన; వక్త్రుఁడు+ఐ= నోరుగలవాడై; అతిదైన్యము+ఒందెడువాని+అట్లు+అయినన్= అతిదీన స్థితిని పొందినవాడివలె అయితే; నీదు విలాపము= నీ ఏడ్పు; అన్యులకున్= ఇతరులకు; ఆడన్+పట్టు+అగున్= నవ్వులాటకు తగినది అవుతుంది (కనుక); భూవరా!= ఓ రాజా! (ఏడ్పు మానుము).

**తాత్పర్యం:** స్వయంగా తానే చుట్టూ మంట పెట్టుకొని ఆ మంట ఎక్కువైపోయి భయంకరంగా చుట్టుముట్టగా ఆ వేడిమికి తట్టుకొనలేక వ్యర్థంగా ప్రలాపం చేస్తూ నోరుకూడా తడి ఆరిపోయినవాడివలె ఉన్నది నీ ఏడ్పు. నీ దీనస్థితిని చూచి అందరూ నవ్వుకొంటారు కాని, ఎవరూ సానుభూతి చూపరు. కాబట్టి ఓ రాజా! ఏడ్పును మానుము.

**విశేషం:** అలం: ఉపమ. సంసారంలో తగులుకోవటం సాలీడు తనచుట్టూ తాను గూడుకట్టుకొని మధ్యన నిలిచిపోవటం వంటిదని వేదాంతులంటారు. తనచుట్టూ మంటపెట్టుకోవటం కూడా అలాంటిదే. భారతంలో అన్నిటికీ మూలం ధృతరాష్ట్రుడే అని 'మూలం ధృతరాష్ట్రో మహారాజ' అనే సామెత చెబుతుంది.

మత్తకోకిలలో ప్రతి పాదానికీ ర,స,జ,జ,భ,ర అనే గణాలుంటాయి. 1-11 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉంటుంది.

**ఆ.** **నీవుఁ గొడుకుఁ బల్కు నిష్ఠురవచనంబు । లను సమీరగతుల నతిశయిల్లు**
**పార్థు రోషవహ్ని పాల్పడి రధిప! నీ । వారలెల్ల నింక వగవఁ దగునె?'** **22**

**ప్రతిపదార్థం:** నీవున్= నీవూ; కొడుకున్= నీ కుమారుడు దుర్యోధనుడూ; పల్కు= పలికే; నిష్ఠుర= కఠినమైన; వచనంబులు+ అను= మాటలనే; సమీర గతులన్= గాలి తాకిడికి; అతిశయిల్లు= ఎక్కువైన; పార్థు= అర్జునుడి; రోషవహ్ని= రోషమనే అగ్నికి; అధిప!= ఓ రాజా!; నీ వారలు+ఎల్లన్= నీ వారంతా; పాలు+పడిరి= పాలయ్యారు; ఇంకన్= మరి ఇక; వగవన్+తగునె?= ఏడవటం ఉచితమా?

**తాత్పర్యం:** నీవు, నీ కుమారుడు దుర్యోధనుడు పలికిన కఠినవాక్కులనే గాలితాకిడికి అతిశయించిన అర్జునుడి రోషమనే అగ్నికి నీ వారంతా భస్మమయ్యారు. ఇక ఏడవటం ఎందుకు?'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని యనేక భంగులం బలికిన సంజయు పలుకులకుం జెవియొడ్డి ధైర్యంబు చిక్కఁబట్టి యంకిలిదేఱిన యవ్విభు నాలోకించి 'యేల నేలఁబడి పొరలెదు? లె'మ్మని పలికి విదురుం డి ట్లనియె. 23**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; (సంజయుడు) అనేక భంగులన్= అనేక రీతులుగా; పలికినన్= చెప్పగా; (అతని) పలుకులకున్= మాటలకు; చెవియొడ్డి= చెవిని అప్పగించి (ఆ మాటలు విని); ధైర్యంబు= ధైర్యాన్ని; చిక్కన్+పట్టి= కూడదీసికొని; అంకిలి+తేఱిన= స్పృహలోకి వచ్చిన; ఆ+విభున్+ఆలోకించి= ఆ రాజును చూచి; ఏల= ఎందుకు; నేలన్+పడి= నేలమీదపడి; పొరలెదు?= పొర్లుతావు?; లెమ్ము+అని= పలికి= అంటూ; విదురుండు= విదురుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నారు.

**తాత్పర్యం:** ఇట్లా సంజయుడు ఎన్నో రీతుల చెప్పగా ధృతరాష్ట్రుడు ఆ మాటలు విని, ధైర్యం కూడదీసికొని, స్పృహలోకి వచ్చాడు. ఇదంతా చూస్తున్న విదురుడు 'రాజా! ఎందు కిట్లా మాటిమాటికి రోదిస్తావు? లే లె'మ్మని అంటూ ఇట్లా చెప్పాడు.

**విదురుఁడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు చేయుట (సం. 11-2-1)**

**క. 'పెరుఁగుట స్రగ్గఁగ, రుచులం । బొరయుట యరుచంబు గాఁగఁ, బుట్టుట సావం,**
**బెరయుట పాయఁ, బదార్థో । త్కరముల నైజ; మది యెట్లు దప్పింప నగున్? 24**

**ప్రతిపదార్థం:** పెరుఁగుట= వృద్ధిపొందటం; స్రగ్గఁగన్= తగ్గిపోవటం కోసమే; రుచులన్+పొరయుట= రుచులలో ఆసక్తిపొందటం; అరుచంబు+కాఁగన్= విరక్తిని పొందటం కోసమే; పుట్టుట= జన్మించటం; చావన్= చావటం కోసమే; బెరయుట= సమీపించటం; పాయన్= వీడిపోవటం కోసమే; పదార్థ+ఉత్కరముల నైజము= పదార్థ సమూహాల తత్త్వం (ఇది); అది= అట్లా కావటాన్ని; ఎట్లు+తప్పింపన్+అగున్?= ఎట్లా తప్పించగలుగుతాం?

**తాత్పర్యం:** 'పెరగటం తరిగిపోవటంకొరకే, రుచులలో ఆసక్తి చూపించటం అసలు రుచినే పోగొట్టుకొనటంకొరకే, పుట్టటం చావటంకొరకే, దగ్గర కావటం దూరం కావటంకొరకే - ఇది పదార్థ స్వభావం. దీన్ని ఎట్లా తప్పించ గలుగుతాము?

**విశేషం:** విదురుడు ద్వంద్వ భావాలను గురించి బోధిస్తున్నాడు. ఆయన బోధించిన వేదాంతానికి భూమిక ఈ గుణాల వివరణలో ఉన్నది. పెరుగు×విరుగు; రుచి×అరుచి; పుట్టుక×చావు; దగ్గర×దూరం - అన్నవి రెండూ పదార్థాని కున్న విరుద్ధ స్వభావాలు. ఇదే లక్షణం కౌరవ పాండవుల విషయంలోనూ సత్యమని అర్థం. భగవద్గీత కూడా సుఖదుఃఖాది ద్వంద్వభావననుండి విముక్తుడు కావటమే జ్ఞానమని బోధించింది. మృత్యువు మనిషికి సహజమైన ధర్మం. అది తప్పించటానికి వీలుకాదు. మృత్యువు ఎట్లాంటిదో ముందరి పద్యంతో విదురుడు వివరిస్తాడు.

**సీ. బిరుదుల నైనను బిఱికి వాండ్రనునైనఁ । జంపుచోఁ గడపఁడు జముఁడు నేర్పు**
**లావును మర్త్యుని చావు మాన్పఁగలేవు । రణమొనర్చినఁ గాని రాదె మరణ**
**మెయ్యది యవధి? యిందెల్ల వారును దెగు । వారకా కది గడవంగ వశము**
**గా దింత యుమ్మలికంబేల? యట్లును । గాక నీ సుతులు సంగ్రామకేళి**

**తే. సలిపి యింద్రుని కతిథులై చనిరి యజ్ఞ। దానవిద్యాతపోలబ్ధ మాననీయ**
**గతులు సమరానివర్తన మృతుల యరుగు। నట్టి గతులకుఁ బాటిగా వండ్రు బుధులు. 25**

**ప్రతిపదార్థం:** బిరుదులన్+ఐనను= పరాక్రమవంతుల్ని కాని; పిఱికివాండ్రనున్+ఐనన్= పిరికివాళ్ళనిగాని; చంపుచోన్= చంపేసమయంలో; జముఁడు= యమధర్మరాజు; కడపఁడు= వదలిపెట్టడు; నేర్పు= ఒక మనిషికున్న నైపుణ్యంకాని; లావును= బలంకాని; మర్త్యుని= ఆ మనిషిని; చావు= మరణం; మాన్పఁగలేవు= తప్పింపజాలవు; రణము+ఒనర్చినన్+కాని= యుద్ధం చేస్తే తప్ప; మరణము= చావు; రాదె?= రాదా?; అవధి= చావుకు హద్దు; ఏ+అది?= ఎక్కడ?; ఇందున్= ఈ జగత్తులో; ఎల్లవారును= పుట్టినవారందరూ; తెగువారు+అ= చనిపోయేవారే; కాక= తప్ప; అది= ఆ మరణం; కడవంగన్= తప్పించకోవటానికి; వశము+కాదు= సాధ్యంకాదు; ఇంత= ఇంతగా; ఉమ్మలికంబు+ఏల?= దుఃఖించటం ఎందుకు?; అట్లును+కాక= అంతేకాకుండా; నీ సుతులు= నీ కుమారులు; సంగ్రామకేళి+సలిపి= యుద్ధమనే ఆటను ఆడి; ఇంద్రునికిన్+అతిథులై= ఇంద్రుడికి అతిథులుగా; చనిరి= స్వర్గానికి వెళ్ళారు; యజ్ఞ= యాగాలు; దాన= దాన ధర్మాలు; విద్యా= చదువులు; తపస్= తపస్సులు; (వీటిచేత) లబ్ధ= లభించే; మాననీయ గతులు= ఉత్తమ గతులు; సమర= యుద్ధంలో; అనివర్తన= తిరిగిరాని; మృతుల+అరుగు+అట్టి= మరణించిన యోధులు పొందే; గతులకున్= సుగతులకు; పాటి= సమానమైనవి; కావు= కావు (అని); బుధులు= పండితులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** యముడు జీవి ప్రాణం పోయేటప్పుడు పాశంవేసి లాగికొనిపోతున్న సమయంలో వాడు పరాక్రమశాలా? పిరికివాడా? అని చూడడు. ఎవరినీ వదలిపెట్టడు. మనిషి ఎంత నిపుణుడైనా, బలోపేతుడైనా వాడి చావు మాత్రం తప్పదు. యుద్ధం చేస్తేనే చస్తారా? మనిషి ఎక్కడున్నా చస్తాడు. ఇట్లాగే చావాలన్న నియమం ఏముంది? ఈ లోకంలో అందరూ తప్పక చనిపోయేవారే. ఎవరూ చావును తప్పించుకొనలేరు. ఇంతగా చావును గురించి బాధపడటం ఎందుకు? అంతే కాదు. నీ కొడుకులు ఉత్సాహంతో ఆటవలె యుద్ధంచేసే స్వర్గానికి అతిథులుగా వెళ్ళి ఇంద్రుడి చేత సత్కారాలు పొందుతున్నారు. యజ్ఞాలు చేయటం వలనకాని, దానధర్మాలు చేయటం వలన కాని, వేదశాస్త్రాలను నిరంతరం అభ్యసించటం వలన కాని, తపోదీక్షలో చిరకాలం ఉండటం వలన కాని ఏ పుణ్యగతులు కలుగుతాయో అవి యుద్ధంలో వెన్ను చూపకుండా పోరాడి మరణించే యోధులకు కలిగే పుణ్యగతులకు ఏ మాత్రం సరిసాటి కావని పండితులు అంటారు.

**విశేషం:** సూర్యమండలాన్ని ఛేదించుకొని ఉత్తమ లోకప్రాప్తి (వైకుంఠప్రాప్తి) నందగలవారు ఇద్దరేనట.

**"ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ**
**పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః"**

అని సంప్రదాయజ్ఞులు చెప్పుతారు. అష్టాంగ యోగంతో తనువును స్వతంత్రంగా త్యజించగలవాడు (పరివ్రాజకుడు), యుద్ధంలో ఎదురొడ్డి నిలిచి మరణించిన వాడు (యోధుడు) - వీరిరువురే వైకుంఠప్రాప్తికి అర్హులు. (కనుక నీ కొడుకులు యుద్ధంలో వీరమరణం పొందారు కాబట్టి వారు పుణ్యాత్ములయ్యారు).

**వ. కావున వారికి వగవం బనిలే దది యట్లుండె. సంసారంబున మాతృ పితృ సోదర దార పుత్ర సహస్రంబు లనుభవ గోచరంబులయ్యె నందెవ్వరికి వగచెద?' వని వెండియు. 26**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; వారికిన్= నీ కొడుకులను గురించి; వగవన్= దుఃఖించటం; పనిలేదు; అనవసరం; అది= ఆ విషయం; అట్లు+ఉండెన్= అట్లా ఉన్నది; సంసారంబునన్= ఈ సృష్టిలో; మాతృ= తల్లులు; పితృ= తండ్రులు; సోదర= అన్నదమ్ములు; దార= భార్యలు; పుత్ర= కొడుకులు; సహస్రంబులు= వేలకొద్దీ; అనుభవ= అనుభవంలో; గోచరంబులయ్యెన్= కనిపిస్తున్నారు; అందున్= వీరిలో; ఎవ్వరికిన్= ఎవరికోసమని; వగచెదవు?= ఏడుస్తావు?; అని= అంటూ; వెండియున్= ఇంకా ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** కాబట్టి నీ కొడుకుల విషయంలో చింతించటం అనవసరం. అది అట్లా ఉంచుము. ఎంతోమంది తల్లులు, తండ్రులు, అన్నదమ్ములు, భార్యలు, సంతానం - వేలకొద్దీ ఈ సంసారంలో తటస్థపడుతూ ఉంటారే! వాళ్ళలో ఎవ్వరికొరకు ఏడుస్తూ కూర్చుండగలవు?' అంటూ ఇంకా ఇట్లా చెప్పాడు.

**విశేషం:** పై పద్యంలో 'అనుభవగోచరంబు' అనే మాట చాలా విశిష్టమైనది. ఈ ప్రపంచం ఒక అనుభవం. నాటకంలోని అనుభవం కూడా ఇట్లాంటిదే. కుటుంబం, బంధు, మిత్రాది భావన ఒక అనుభవం మాత్రమే. జ్ఞాని ప్రపంచాన్నంతా ఒక కుటుంబంగా భావిస్తాడు, అందుకే జ్ఞానిని 'విశ్వకుటుంబి' అంటారు. విదురుడు అట్లాంటివాడు. అందుకే ఈ విశ్వభావనను గురించి చెప్పుతున్నాడు. అంటే లోకంలో శోకించటానికి ఎంతోమంది ఇతరులూ ఉన్నారు. వారిని గురించీ ఆలోచించుము. నీ దుఃఖం పటాపంచలవుతుం దని ఈ మాటల అర్థం. ఇది 'ఆత్మవాదం'.

కాని, ధృతరాష్ట్రుడు ఎంత సేపటికీ 'దేహవాది' గానే శోకిస్తాడు. తన కొడుకులు, తన బంధువులు, తనవారు: రాష్ట్రమంటే - దేహమని కూడా అర్థం. దేహధారి అని ధృతరాష్ట్ర పదానికి అర్థం.

**తే.** **'యౌవనంబును రూపంబు జీవితంబు । ద్రవ్య సంచయములు ననిత్యములు గావె?**
**వీని హానికి వగ పవివేక మగుటఁ । బండితులు వగఁ గూరరు పౌరవేంద్ర! 27**

**ప్రతిపదార్థం:** పౌరవేంద్ర!= పూరువంశంలో పుట్టిన శ్రేష్ఠుడైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; యౌవనంబును= యౌవనమూ; రూపంబు= సౌందర్యమూ; జీవితంబు= జీవితమూ; ద్రవ్యసంచయములు= పదార్థాలూ; అనిత్యములు+కావె?= అశాశ్వతాలు కావా?; వీని= వీటియొక్క; హానికి= నాశనాన్ని గురించి; వగపు= దుఃఖించటం; అవివేకము+అగుటన్= అవివేకం కాబట్టి; పండితులు= ప్రాజ్ఞులు (వివేకులు); వగన్= దుఃఖంలో; కూరరు= మునిగిపోరు.

**తాత్పర్యం:** 'రాజా! పూరువంశంలో పుట్టిన మీకు తెలియనిది ఏ మున్నది? వయస్సు, అందమూ, జీవితమూ, పదార్థ జగత్తు - ఇవన్నీ అశాశ్వతాలే కదా! అందువలన పండితు లెపుడూ ఇట్లాంటివాటి విషయంలో దుఃఖంలో మునిగిపోరు.

**విశేషం:** ఆదిపర్వంలో యయాతి కథ ఉన్నది. ఆ కథలో యయాతి తన ముసలితనాన్ని తీసికొని యౌవనం ఇమ్మని కొడుకులను అడుగుతాడు. పూరుడు మాత్రం ముందుకు వచ్చి తన తండ్రికి తన యౌవనం ధారపోస్తాడు. అట్లాంటి పుణ్యాత్ముడు కాబట్టి యయాతి పూరువుకే రాజ్యాభిషేకం చేశాడని కథ. 'అట్లాంటి వంశంలో పుట్టిన నీవు నిత్యానిత్య వివేకం కలిగినవాడివి కాకపోతే ఎట్లా?' అని విదురుడు గుర్తు చేయటంకొరకే 'పౌరవేంద్రా' అని పిలుస్తున్నాడు.

**వ.** **పాండిత్య సంపన్నుండవగు నీవు బంధుజీవహానికి వగవందగునె? వగవకూరకునికి మే లాకర్ణింపుము.28**

**ప్రతిపదార్థం:** పాండిత్య= విద్యా; సంపన్నుండవు+అగు+నీవు= పాండిత్య సంపద కలిగిన నీవు; బంధుజీవహానికిన్= బంధువుల మృతికి; వగవన్+తగునె?= దుఃఖించటం న్యాయమా?; వగవక= బాధపడకుండా; ఊరక+ఉనికి= ఊరకుండటమే; మేలు= మంచిది; ఆకర్ణింపుము= ఎందుకో చెబుతాను వినుము.

**తాత్పర్యం:** నీవు పండితుడవు. విద్యాసంపదగలవాడివి. బంధువుల మృతికి ఇట్లా బాధపడటం న్యాయంగా ఉన్నదా? బాధపడకుండా ఊరకే ఉండటమే శ్రేయస్కరం. ఎందుకో చెప్పుతాను వినుము.

**ఇంద్రవజ్ర :**

**చింతాపరత్వంబునఁ జెందు దుఃఖా । క్రాంతత్వ ముర్వీశ్వర! కానఁ గీడుం**
**జింతింపఁ డార్యాత్ముఁ డచింతనుండై । యంతః పరీతాపము నార్పఁ జాలున్. 29**

**ప్రతిపదార్థం:** చింతాపరత్వంబునన్= చింతిస్తూ ఉండిపోవటంవల్ల; దుఃఖాక్రాంతత్వమున్+చెందున్= దుఃఖంచేత ఆక్రమింపబడతాడు; ఉర్వి+ఈశ్వర!= ఓరాజా!(వినుము); కానన్= కాబట్టి; ఆర్య+ఆత్ముఁడు= పుణ్యాత్ముడు; కీడున్= అనర్థమును; చింతింపఁడు= చింతిస్తూ కూర్చోడు; అచింతనుండు+ఐ= ఏ చింతాలేనివాడై; అంతః+పరీతాపమున్= లోపల ఉన్న బాధాగ్నిని; ఆర్పన్+చాలున్= ఆర్పివేసికొనగలుగుతాడు.

**తాత్పర్యం:** ఓరాజా! ఊరకే చింతిస్తూ కూర్చుంటే నిన్ను దుఃఖం ఆక్రమిస్తుంది. దానివలన అనర్థమే తప్ప మంచిదికాదు. అందుకే పుణ్యాత్ముడు ఎప్పుడూ చింతచేస్తూ కూర్చోడు. చింతను వదలి, క్రియాశీలుడై లోపల ఉన్న బాధ అనేటటువంటి అగ్నిని వివేకమనే శక్తితో ఆర్పివేయగలుగుతాడు.

**విశేషం:** 'చింత' చేయటం - శోకించటం లౌకిక విషయాల్లో దుఃఖకారక మవుతుంది. చింతన చేయటం - స్మరణ - భగవంతుడి విషయంలో సుఖకారి అవుతుంది. అచింతనత్వం - అంటే దుఃఖకారి అయిన వ్యామోహంపట్ల స్మరణలేకుండా ఉండటమని అర్థం. అట్లాంటి అచింతనుడు - నిరంతరం ఉత్సాహంతో క్రియాశీలిగానే ఉంటాడు. కార్య విజయాన్ని పొందుతాడు. గీతలో పరమాత్మ కూడా అర్జునుడి విషాదం 'అనార్యజుష్ట' మని (పామరపద్ధతి) అనటంలో ఉద్దేశమిదే.

ఇంద్రవజ్రలో త,త,జ,గ,గ అనే గణాలుంటాయి. 1-8 యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**క. ప్రియవస్తు వెడలుటయు న । ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన విని**
**శ్చయ హీనులైన యల్పా । శయులకు 'దుఃఖంబుఁ జేయు' జగతీనాథా! 30**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ రాజా!; ప్రియవస్తువు= ఇష్టమైన వస్తువు; ఎడలుటయున్= నశించటం; అప్రియంబు= ప్రియంకానటువంటిది; పాటిల్లుటయున్= కలగటం; పరిజ్ఞాన= సమగ్రజ్ఞానముయొక్క; వినిశ్చయ హీనులు+ఐన= నిత్యానిత్య వివేక శూన్యులైన; అల్పాశయులకున్= సాధారణ మానవులకు (చిన్న ఆశయపరిధి ఉన్నవారికి); దుఃఖంబు+చేయున్= దుఃఖాన్ని కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! సాధారణ మనుష్యుల ఆశయాల పరిధి చాలా చిన్నదిగా ఉంటుంది. అట్లాంటివారికి నిత్యానిత్యవివేకం చేత కలిగిన నిశ్చిత జ్ఞానం ఉండదు. కనుక ప్రియమైన వస్తువు నశిస్తే ఏడుస్తారు. ఏ మాత్రం అనిష్టమైన పరిస్థితిలో చిక్కుకున్నా దుఃఖిస్తారు.

**విశేషం:** తిక్కన 'మహాశయ' శబ్దంనుండి 'అల్పాశయ' శబ్దాన్ని పుట్టించాడు. మహాశయులంటే సమగ్రజ్ఞానవంతులని అర్థం. వారి ఆశయాల పరిధి విశ్వజనీనంగా ఉంటుంది. అల్పాశయులు కుల, కుటుంబ, జీవిత పరిధిలో బ్రతుకుతూ ఉంటారు.

అట్లాంటివారికి ఏ చిన్న 'వస్తువు' పోయినా ఎంత చిన్న సంకట పరిస్థితి వచ్చినా ఏడుస్తూ కూర్చుంటారు. మహాశయులు ఇట్లాంటి సందర్భాలలోనే ధైర్యం వహిస్తారు.

జ్ఞానంకంటె విజ్ఞానం, దానికన్నా పరిజ్ఞానం చాలా గొప్పది. పరి - అంటే సమగ్రమైనదని అర్థం. భారత తాత్పర్యం 'ఎఱుకను సమగ్రం' చేయటం. ఆత్మజ్ఞానమే సమగ్ర జ్ఞానం. పదార్థజ్ఞానం విజ్ఞానం కావచ్చునేమో కాని పరిజ్ఞానం మాత్రం కాదు. కాబట్టి వస్తునాశం, అప్రియ సందర్భం - ఇవన్నీ తాత్కాలికాలు అనే నిశ్చితబుద్ధి పరిజ్ఞానంచేతే కలుగుతుంది.

**వ. పండితుల నవి గలంపం జాల 'వనిన విని ధృతరాష్ట్రుం డతనిదిక్కు మొగంబు గాఁగఁ గూర్చుండి 'నీ సుభాషితంబుల కతంబున శోకంబు డిందువడియెఁ బండితులు ప్రియాప్రియ వస్తు వియోగ సంయోగంబు వలన జనించు మానస దుఃఖంబుల నేమిటంజేసి పొరయకుండుదు రది సెప్పు 'మనుటయు నమ్మనుజపతి కతం డిట్లనియె. 31**

**ప్రతిపదార్థం:** (కనుక) పండితులన్= పండితులైన వారిని (పరిజ్ఞానం ఉన్నవారిని); అవి= వస్తునాశం, అప్రియసంప్రాప్తి - ఇవి రెండూ; కలంపన్+చాలవు= బాధింపజాలవు; అనినన్= అని చెప్పగా; విని; ధృతరాష్ట్రుండు; అతని దిక్కు= విదురుడివైపు; మొగంబు+కాఁగన్= ముఖంపెట్టి (ఎదురుగా); కూర్చుండి= కూర్చొని; నీ సుభాషితంబుల కతంబునన్= నీ సుభాషితాలవలన; శోకంబు= నా బాధ; డిందు+పడియెన్= నశించింది; పండితులు= ప్రాజ్ఞులు; ప్రియ+అప్రియ= ఇష్టమైన, ఇష్టంకాని; వస్తు= వస్తువులయొక్క; వియోగ= పోగొట్టుకోటంచేత; సంయోగంబువలనన్= కలయికచేత; జనించు= పుట్టునట్టి; మానస= మానసికమైన; దుఃఖంబులన్= సుఖదుఃఖాది భావాలను; ఏమిటన్+చేసి= దేనిచేత; పొరయకుండుదురు= పొందకుండా ఉంటారో; అది= అట్లా ఉండటం (ఎట్లాగో); చెప్పుము+అనుటయున్= చెప్పుమని అడుగగా; ఆ+మనుజపతికిన్= ఆ ధృతరాష్ట్రునితో; అతండు= విదురుడు; ఇట్లనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** సమగ్రమైన ఎరుక గలవారిని ప్రియాప్రియ వస్తువులు రెండూ ఏమీ చేయజాలవు' - అని చెప్పగా ధృతరాష్ట్రుడు విని, అతనివైపు తిరిగి కూర్చుండి 'నీ సుభాషితాల వలన నా బాధ తగ్గింది. ప్రాజ్ఞులు ప్రియాప్రియ వస్తువుల సంయోగ వియోగాల వలన పుట్టే ఏ మానసిక భావాలచేతా ఆక్రమించబడకుండా ఎట్లా ఉంటారు? అది ఎట్లాగో వివరించుము' - అని అడిగాడు. అప్పుడు విదురుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** వేదాంతం చదవటం, వినటం వేరు. అది ఆచరణలో ఉంచటంవేరు. ధృతరాష్ట్రుడు వినని విషయం ఏమున్నది? అందుచేత ప్రాజ్ఞులు ద్వంద్వభావాతీతులుగా ఎట్లా ఉంటారో తెలిసికొనాలని అడుగుతున్నాడు.

**క. 'ఈ లోకము నిస్సారం । బాలోకింపంగ ననఁటియట్టుల; యని తా**
**లోలతఁ బొందని పురుషుం । డేలా నెవ్వగలఁ జెందనిచ్చు మనంబున్? 32**

**ప్రతిపదార్థం:** ఈలోకము= ఈ సంసారం; ఆలోకింపంగన్= ఆలోచించిచూస్తే; అనఁటి+అట్టుల= అరటి చెట్టులాగా; నిస్సారంబు= బలంలేనిది (అందుకే దుఃఖిస్తుందని అర్థం); అని= అని భావించి; తాన్= తాను; లోలతన్= అందులో ఆసక్తి కలగి ఉండటాన్ని; పొందని పురుషుండు= పొందని మనిషి; ఏలా= ఎందుకు; మనంబున్= మనస్సును; నెఱ+వగలన్= సంపూర్ణ వ్యథలను; చెందన్+ఇచ్చున్?= పొందనిస్తాడు?

**తాత్పర్యం:** 'బాగా ఆలోచించి చూస్తే ఈ సంసార మనే వృక్షం అరటి చెట్టువలె దుర్బలమైనది. ఈ సంగతి గుర్తించి లోకంపట్ల ఆసక్తి పొందని మనిషి మనసును ఎందుకు వ్యథకు గురి చేస్తాడు?

**విశేషం:** అలం: ఉపమ. అరటి చెట్టు దుర్బలమైనది. అంతా నీరే. అందుకే దుర్యోధనుని తొడలు అరటి కాండాలవలె ఉన్నాయని (రంభోరు నిజోరుదేశమునన్- అని నన్నయగారి ప్రయోగం - సభాపర్వం 2-249). ఈ సందర్భంలో చెట్లలో వేప, మామిడి మొదలైన చెట్లకున్న సారత్వం అరటిచెట్టుకు లేకపోవటం గమనిస్తే - ఈ పోలిక అర్థమవుతుంది. సారమంటే బలమని అర్థం. ధీమంతులు సారజ్ఞానం కలవారు కాబట్టి 'ధృతి' మంతులనబడ్డారు.

**తే. అరయవచ్చినఁ దనమేను నెరవ తనకు । నొండు రూపులు దక్కక యునికి యరుదె?**
**యను తలంపు ధ్రువంబుగ నలవరించి । బుధజనంబులు శోకంబుఁ బొరయ రధిప! 33**

**ప్రతిపదార్థం:** అధిప= ఓ రాజా!; అరయవచ్చినన్= పర్యాలోచించగా; తనమేనున్= తన శరీరము; ఎరవు+అ= అన్యమైనదే; తనకున్; ఒండురూపులు= స్వరూపాలు; తక్కక+ఉనికిన్= కలగడం; అరుదె!= ఆశ్చర్యకరమా?; అను తలంపు= అనే నిశ్చయ జ్ఞానం; ధ్రువంబుగన్= దృఢంగా; అలవరించి= కలిగించుకొని (అభ్యాసంచేత సిద్ధింపజేసికొని); బుధజనంబులు= పండితులు; శోకంబున్= శోకాన్ని; పొరయరు= పొందరు.

**తాత్పర్యం:** పరిశీలించగా తన శరీరం కూడా తన కంటె భిన్నమయినదే. తనకు ఇతరమయిన ఆకారాలు సంభవించడం ఆశ్చర్యమా అని భావమును దృఢపరచుకొని విజ్ఞులు శోకించరు.

**విశేషం:** జీవుడు శరీరాన్ని ధరించి కొంతకాలం ఉండి దాన్ని పాత వస్త్రాలను వదలివేసినట్లు వదలివేస్తాడని గీత బోధిస్తున్న విషయం ఇక్కడ అనుసంధించుకుంటే 'వచ్చిన' అనే క్రియకు అర్థం తెలుస్తుంది. నెరయుట- అంటే సంపూర్ణత్వం పొందటం అని అర్థం. పుణ్యకర్మలవలన పునరావృత్తి రహితమైన బ్రహ్మలోక ప్రాప్తిని జీవి చెందుతాడు. అట్లాంటి ప్రాజ్ఞుడు మరలా మరొక రూపం పొందాలని ఆశించడు. వాడు జ్ఞానాగ్నిదగ్ధకర్ముడు - కాబట్టి కర్మపరిపాకం ఈ దేహంతోటే పూర్తి అవుతుందని అర్థం. లేనివాడే దివికి- భువికి తిరుగుతూ మరలా మరలా పుట్టుతుంటాడు. ఒండురూపులు - అంటే కొత్త కొత్త జన్మలని అర్థం.

**సీ. ఒక యింటనుండి వేఱొక యింటి కరిగిన । విధమును వస్త్రంబు విడిచి యొండు**
**వస్త్రంబు గట్టిన వడువును నై యుండు । నొడలు దొఱంగి యొండొక్క యొడలు**
**గైకొంట నృప! విను కడవకు సారెపై । నమర మృత్తిక యిడినపుడు విరియు**
**టయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు । వాని యెత్తెడు నెడ వ్రయ్యుటయును**

**తే. నెత్తి యొకచోట డించిన నెడలుటయును । నెండి యవియుటయును నావ మిడినఁ బగిలి**
**పోవుటయు వాడు జనులచేఁ బొలియుటయును । గలుగు గతి మేనికెట్లును గలుగుఁ జేటు. 34**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ రాజా! విను; ఒడలు= శరీరము; తొఱంగి= వదలిపెట్టి; ఒండు+ఒక్క+ఒడలు= మరొక శరీరం; కై+కొంట= ధరించటం; ఒక ఇంటన్+ఉండి= ఒక ఇంటిలో నుండి; వేఱు+ఒక+ఇంటికి+అరిగిన విధమును= మరో ఇంట్లోకి వెళ్ళిన పద్ధతి; వస్త్రంబు విడిచి= కట్టిన వస్త్రాన్ని విడిచిపెట్టి; ఒండు వస్త్రంబు+కట్టిన వడువును= మరొక వస్త్రాన్ని ధరించినపద్ధతి; ఐ+ఉండున్= అయి ఉంటుంది; కడవకున్= కుండ తయారు చేయటానికై; సారెపైన్= సారెపైన; అమరన్= తగినట్టుగా; మృత్తికన్+ఇడిన+అపుడు= మట్టిని పెట్టినప్పుడు; విరియుటయున్= విరిసిపోవటం; వెరవు+ఆరన్+నేర్పు అతిశయించగా; పట్టఁగన్+రాక= కుండను తీర్చటానికి కాకుండా; చెడుటయున్= చెడిపోవటం; వాని+ఎత్తెడు+ఎడన్= అవి ఎత్తేటప్పుడు; వ్రయ్యుటయును= విరిగిపోవటం; ఎత్తి+ఒకచోటడించినన్= కుండ తయారయ్యాక ఎత్తి ఒక వైపుపెట్టగా; ఎడలుటయును=

విచ్చిపోవటం; ఎండి= ఎండిన తరువాత; అవియుటయును= చీలిపోవటం; ఆవము+ఇడినన్= ఆవంలో పెట్టాక; పగిలిపోవుటయున్= విరిగిపోవటం; వాడు+జనులచేన్= ఉపయోగించే మనుష్యులచేత; పొలియుటయును= నశించటం; కలుగు గతి= కలిగే రీతి; మేనికిన్= దేహానికి కూడా; చేటు= నాశనం; ఎట్లునున్= ఎట్లాగైనా; కలుగున్= కలుగుతుంది (తప్పదు).

**తాత్పర్యం:** ఓ రాజా! వినుము. ఈ శరీరం వదలి మరో శరీరాన్ని ధరించటమే మరణమంటే. ఇది ఎట్లాంటిదంటే ఒక ఇంటిలో కొంతకాలం ఉండి మరో ఇంట్లోకి మారటం వంటిది. కట్టిన బట్టను విడిచి మరో బట్టను కట్టుకొనటం వంటిది. కుండలు తయారు చేయటానికి ఎంతో నేర్పుగా సారెపైన కుమ్మరి మట్టిని అమర్చుతాడు. అప్పుడే చాలాసార్లు ఆ మట్టి విరిసిపోవటం జరుగుతుంది. మరింత నేర్పుతో కుండను తీర్చటానికి ప్రయత్నిస్తాడు. అప్పుడూ పాకం చెడి మట్టి ముద్దగా మిగిలిపోవచ్చును. కుండ తయారయిందనుకొందాము. అప్పుడు ఆ కుండను ఎత్తి నేలమీద దించేటప్పుడు విచ్చిపోవచ్చును. ఎండించిన తరువాత చీలిపోవచ్చును. ఆవంలో పెట్టి కాల్చాక కూడా విరిగిపోవచ్చును. ఇదంతా అయ్యాక ఆ కుండను ఉపయోగించేవాడిచేత ఎపుడో ఒకప్పుడు అది పగలకుండా ఉండలేదు. ఇట్లా ఆ కుండ ఏదో ఒక దశలో ఎట్లా నశిస్తుందో ఈ దేహం కూడా అంతే ఎప్పుడో ఒకప్పుడు నశించి తీరుతుంది.

**విశేషం:** మనిషి దేహం ఎట్లాంటిదో, బ్రహ్మాండం కూడా అట్లాంటిదే. అందుకే బ్రహ్మాండాన్ని 'భాండ' మంటారు. దానిని చేసే కుమ్మరి పేరే బ్రహ్మదేవుడు. ఈ పౌరాణిక నేపథ్యమంతా కలిగిన ఆచారమే శవసంస్కారం చేసేటప్పుడు నీటితో నిండిన కుండను శవం చుట్టూ తిప్పి పగులగొట్టటం. ఇతిహాసాలలోని ఉపమలు కూడా ధార్మిక సందేశాన్ని అందిస్తాయనటానికి ఇక్కడ శరీరాన్ని కడవతో పోల్చి చెప్పిన పద్ధతి మంచి నిదర్శనం.

**వ.** **అది యెట్లంటేని గర్భాధానవేళయందును బిండావస్థయందును బ్రసూతిమాత్రంబున బాల్యంబునను యౌవనంబునం బ్రౌఢత్వ సమయంబునను వార్ధకంబునం గర్మానురూపంబగు నాశంబు శరీరంబునకు సంప్రాప్తంబగు నిది కొలందియని యెఱుంగరా దట్లగుటం దమతమ సుకృతదుష్కృతంబుల తెరువులఁ బోయిన నీ తనయాదులవలని వగలం బొగులం బ్రయోజనంబు లేదు. ప్రాజ్ఞులు వివేకంబున సంసారంబు దుఃఖబహుళంబని యెఱింగి తద్రూపగహనంబు గడచి శాశ్వత సుఖంబుఁ బడయుదు'రనిన విని యాంబికేయుండు 'సంసారదుఃఖబహుళతయును దద్గహనత్వంబును నెఱిగింపు' మనుటయు నవ్విభునకు విదురుం డిట్లనియె.** **35**

**ప్రతిపదార్థం:** అది+ఎట్లు+అంటి(వి)+ఏనిన్= అది ఎట్లాగని అంటివా, వినుము; గర్భ+ఆధాన వేళయందును= పురుషుడు స్త్రీలో గర్భాన్ని ధరింపజేసిన సమయంలోనూ; పిండ+అవస్థయందును= పిండదశలోనూ; ప్రసూతి+మాత్రంబునన్= ప్రసవసమయంలోనూ; బాల్యంబునను= బాల్యావస్థలోనూ; యౌవనంబునన్= యౌవనంలోనూ; ప్రౌఢత్వ సమయంబునన్= పెద్దవారయ్యాక; వార్ధకంబునన్= ముసలితనంలోనూ; శరీరంబునకున్= ఈ దేహానికి; కర్మ+అనురూపంబు+అగు= తమతమ పూర్వ జన్మలలో చేసిన పాపపుణ్య కర్మలకు తగిన; నాశంబు= (రీతిలో) నశించటం; సంప్రాప్తంబు+అగున్= జరుగుతుంది; ఇది+కొలంది+అని= మరణానికి ఇదే పద్ధతి అని; ఎఱుంగరాదు= గుర్తించలేము; అట్లు+అగుటన్= అట్లాకావటంవలన; తమతమ= తాము తాము చేసిన; సుకృత దుష్కృతంబుల= పుణ్యాపాపాల; తెరువులన్= (ఫలితంగా తమకు లభించిన) దారులలో (స్వర్గానికి, నరకానికి); పోయిన= వెళ్ళిపోయిన; నీ తనయాదుల వలని= నీ కుమారులు బంధువులు - వీరివలన

ఏర్పడ్డ; వగలన్= దుఃఖంతో; పొగులన్= బాధపడి; ప్రయోజనంబులేదు= ఏమీ లాభంలేదు; ప్రాజ్ఞులు= సమగ్రమైన జ్ఞానం ఉన్నవారు; వివేకంబునన్= వివేకం కారణంగా; సంసారంబు= ఈ సంసారం; దుఃఖబహుళంబు+అని= అనేక విధాలైన దుఃఖాలకు ఆకరమని; ఎఱింగి= తెలిసికొని; తద్+రూపగహనంబున్+కడచి= ఆ సంసారంలోని భిన్నక్లేశకారకమైన ఘట్టాలను దాటి; శాశ్వత సుఖంబున్= శాశ్వతమైన మోక్ష సుఖాన్ని; పడయుదురు= పొందుతారు; అనినన్= అని విదురుడు చెప్పగా; విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంసారదుఃఖ బహుళతయును= సంసారంలో ఎక్కడెక్కడ ఎట్లా దుఃఖం ఉందో; తద్+గహనత్వంబును= దాన్ని దాటటం ఎందుకు కష్టమో; ఎఱింగింపుము+అనుటయున్= నాకు తెలుపుము- అని కోరగా; ఆ+విభునకున్= ధృతరాష్ట్రుడికి; విదురుడు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** అది ఎట్లాగంటావా వినుము. పురుషుడు స్త్రీలో గర్భాన్ని ధరింప జేసిన సమయంలో, గర్భంలో పిండం ఎదుగుతున్న దశలో, కాన్పు జరిగేటప్పుడు, బాల్యంలో, యౌవనంలో, పెద్దవారయ్యాక ముసలితనంలో - ఈ దేహం తమ తమ కర్మలకు అనుగుణంగా ఎన్నో రీతులుగా నశిస్తూ ఉంటుంది. ఎన్ని విధాలుగా ఎప్పుడెప్పుడు నశిస్తుందో చెప్పటం కూడా కష్టమే. మరణానికి ఇదే పద్ధతి అని గుర్తించలేము. అట్లా కావటం వలన నీ కుమారులు బంధువులు కూడా తాము తాము పూర్వజన్మలలో చేసిన పుణ్యాపాప కర్మలకు అనుగుణంగా లభించిన దారులలో స్వర్గ, నరకాలకు చేరుకొన్నారు. వారిని గురించి దుఃఖించటం వలన లాభం ఏముంది? ఎరుక సమగ్రంగా ఉన్నవారు ఈ జీవితం ఎన్నో విధాలైన దుఃఖాలకు ఆకరమని తెలిసికొని ఆ దుఃఖ కారకమైన ఘట్టాలన్నింటినీ దాటి శాశ్వతమైన మోక్ష సుఖాన్ని పొందుతారు' అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని 'సంసారంలో ఎక్కడెక్కడ దుఃఖం పరివ్యాప్తమయిందో దాన్ని దాటటం ఎందుకు కష్టమో వివరించు'మని కోరగా విదురుడు ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు.

**విశేషం:** తరువాతి పద్యాలలో పుట్టుకనుండి మరణందాకా జీవితంలో దుఃఖం ఏ విధంగా పెనవేసుకున్నదో విదురుడు వివరిస్తాడు. 'గహనం' అనే మాటలకు వివరణ అవసరం. కఠినమని, కష్టమని, అసాధ్యమని - సందర్భాన్నిబట్టి అర్థం చెప్పాలి. దుఃఖం ఏదో ఒక రూపంలో వచ్చి మనిషిని తాకుతుంది - ఆ తాకిడిని తట్టుకొనటం 'గహనం' (గగనమైపోయిందని వ్యవహారంలో అంటాం).

తద్రూపగహనంబు - అంటే అనేక విధాలైన కష్టాలకు ఆకరమైన కఠినమైన సంసారమని అర్థం. గహనమైన దుఃఖరూపమైన సంసారమని భావం చెప్పుకోవాలి.

**తే.** **'కలసి శుక్ల శోణితములు కరుడు గట్టి । విను మమేధ్య మధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది**
**కాలవశత నప్పిండ మంగంబులెల్ల । గలిగి శిశువయి మారుతగతి యెలర్ప. 36**

**ప్రతిపదార్థం:** వినుము=రాజా విను; శుక్ల శోణితములు= వీర్యము, రజస్సులు; కలసి= రెండూకలిసి; కరుడుగట్టి= ముద్దగా మారి; అమేధ్య= మురికి (మలం); మధ్యమునన్= నడుమ; ప్రవృద్ధి పొంది= పెరిగి; ఆ+పిండము= ఆ పిండం; కాలవశతన్= కాలక్రమంలో; అంగంబులు+ఎల్లన్= అన్ని అవయవాల్నీ; కలిగి= పొంది; శిశువు+అయి= శిశువుగా; మారుతగతి= ప్రాణవాయు గమనం; ఎలర్పన్= కలుగగా.

**తాత్పర్యం:** 'రాజా! వినుము వీర్యం, రజస్సు కలిసి ముద్దగా మారి మురికి మధ్య పెరిగి ఆ పిండం కాలక్రమంలో అన్ని అవయవాల్నీ పొంది శిశువుగా అయి, ప్రాణవాయు గమనం పొందగా.

**క. వెడలునెడ గాఢ పీడం । బడి సుడివడి యోని నొత్తువడి యొక భంగిన్**
**వెడలఁగ గ్రహభూతముల । ప్పడు దొడఁగి యనేక దురితములు గల్పించున్. 37**

**ప్రతిపదార్థం:** వెడలు+ఎడన్= తల్లి గర్భం నుంచి బయటపడేటప్పుడు; గాఢపీడన్+పడి= తీవ్రమైన బాధను అనుభవించి; సుడివడి= గర్భంలో గిరగిర తిరిగి; యోనిన్= యోని ముఖంలో; ఒత్తు+పడి= అదుమబడి; ఒక భంగిన్= ఏదో ఒక రీతిగా (కష్టంపైన); వెడలఁగన్= బయటపడగా; గ్రహభూతములు= గ్రహాలు, భూతాలు; అప్పుడు= ఆ సమయంలో; తొడఁగి= ప్రయత్న పూర్వకంగా (పూనుకొని); అనేక= చాలా; దురితములు= కష్టాలు; కల్పించున్= కల్పిస్తాయి.

**తాత్పర్యం:** అట్లా పెరిగి శిశువైన పిండం తల్లి గర్భంనుండి బయటపడేటప్పుడు తీవ్రమైన బాధను అనుభవించి గర్భాశయంలో గిరగిర తిరుగుతూ యోని ముఖంలో అదుమబడి అతికష్టంమీద బయటపడగా, సరిగ్గా అదే సమయంలో గ్రహాలు, భూతాలు వ్రాలి ఆ శిశువునకు ఎన్నో కష్టాలు కలిగిస్తాయి.

**విశేషం:** గ్రహ - భూత శబ్దాలకు వివరణ అవసరం. సూర్యచంద్రాదులు గ్రహాలు. గ్రహస్థితి శిశువు జాతకంమీద ప్రభావం చూపుతుంది. భూతాలు - అంటే పంచభూతాలు (పృథివి, ఆపస్సు, తేజస్సు (అగ్ని), వాయువు, ఆకాశం) - వీటి ప్రభావం కూడా శిశువు ఆరోగ్యం మీద ఉంటుంది. భూతమని పిశాచాదులకు కూడాపేరు. శ్రీకృష్ణుడి బాల్యంలో వేధించిన పూతన ఒక భూతమే. ఇట్లా శిశువుకు ఆయురారోగ్య పీడలు కలుగుతాయి అంటారు. వీటిని మొత్తం కలిపి 'బాలగ్రహ దోష' మంటారు.

**వ. అట్లు జనియించి మనుజుండు. 38**

**ప్రతిపదార్థం:** మనుజుండు= మానవుడు; అట్లు; జనియించి= పుట్టి.

**తాత్పర్యం:** మనుష్యుడు అట్లా పుట్టి.

**క. బాలత్వంబున నవివే । కాలోలత శుచియు నశుచి యైనదియు సమం**
**బై లీల జుగుప్సిత విధి । శీలత నొందంగ దుర్విచేష్టలఁ దిరుగున్. 39**

**ప్రతిపదార్థం:** బాలత్వంబునన్= బాలుడుగా; అవివేక+ఆలోలతన్= అవివేకంతో కూడిన పనులలో ఆసక్తి కలిగి; శుచియున్= పవిత్రతా; అశుచి+ఐనదియున్= అపవిత్రమైనదీ; సమంబై= ఒకటికాగా; లీల= ఆడే ఆట(లు); జుగుప్సిత= అసహ్యంకలిగించే; విధి శీలత= పనులనే లక్షణంగా కలిగినవి కాగా; దుర్విచేష్టలన్= చెడ్డనడవడులతో; తిరుగున్= కాలం గడిపివేస్తాడు.

**తాత్పర్యం:** ఇక బాల్యంలో వివేకం లేని పనులలోనే ఆసక్తి మెండు. పరిశుభ్రత, అపరిశుభ్రత రెండూ బాలుడికి సమానమే. ఆటలో ఎన్నో అసహ్యకరమైన పనులు చేస్తాడు. యోగ్యం కాని పనులలో కాలం గడిపివేస్తాడు.

**విశేషం:** 'బాలస్తావత్ క్రీడాసక్తః' అని శంకరాచార్యులు కూడా ఈ విషయాన్ని వివరించారు. బాల్యమంటే ఆటలాడుకొనటం మాత్రమే. అవివేకపు పనుల మీద బాలుడికి ఆసక్తి మెండుగా ఉంటుంది. ఇట్లా బాల్యం వ్యర్థమవుతుంది. అప్పుడే నడవడిలో దుర్మార్గత్వం కూడా ప్రవేశించేది. అక్కడ సన్మార్గంవైపు ఎవరు మరలుతారో వారు పెద్దవా రయ్యాక బాగుపడుతారు.

**క. యౌవనమున విషయ పర । త్వావేశము దుఃఖకారియై యలఁపఁగ నా**
**నా విధ దుర్వినయములకుఁ । దావలమై మెలఁగు నిందితప్రక్రియలన్. 40**

**ప్రతిపదార్థం:** యౌవనమునన్= యుక్తవయస్సులో; విషయపరత్వ+ఆవేశము= ఇంద్రియపరమైన సుఖంలోని తీవ్రమైన కోరిక; దుఃఖకారియై= దుఃఖాన్ని కలిగించేదై; అలఁపఁగన్= బాధించగా; నానావిధ= అనేక విధాలైన; దుర్వినయములకున్= దుష్టప్రవర్తనలకు; తావలము+ఐ= చోటై; నిందిత= దూషితమైన; ప్రక్రియలన్= పనులలో; మెలఁగున్= ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** యౌవనం రాగానే ఇంద్రియపరమైన సుఖంలోని తీవ్రమైన కోరిక యువతీయువకులచేత ఎన్నో పనులు చేయిస్తుంది. చివరికి దుఃఖాన్నే కలిగిస్తుంది. ఎంతో బాధిస్తుంది. అనేక విధాలైన దుష్టమైన పనులు చేయటానికి ప్రేరేపిస్తుంది. ఇట్లా యౌవనం కూడా దుఃఖకారే అవుతుంది.

**విశేషం:** 'తరుణస్తావత్ తరుణీ సక్తః' అని శంకరాచార్యులు తరుణావస్థను వివరించారు. యౌవనంలో స్త్రీ సంబంధమైన కామన తప్ప మరొకటి 'ఇష్టంగా' ఉండదు. ఇంద్రియాలను ఆకర్షించటం, తద్ద్వారా మనస్సును భోగంవైపు లాగి బంధించటం కామలక్షణం. కామం ముందు ఏ వివేకమూ పనిచేయదు. ఆ యౌవనంలోనే ఎందరో తప్పటడుగులు వేసి ఆరోగ్యం కోల్పోతారు. అన్ని విధాలుగా భ్రష్టులై దొంగతనం, మోసం, మొదలు హత్యలు చేయటం దాకా మనిషిని పతనావస్థకు చేర్చగలగటం ఒక కామానికే సాధ్యం. చివరికి మనిషి దుఃఖంపాలు కావటం తప్ప కామం వలన మరొక లాభం లేదు - అని విదురుడి ఉపదేశ సారాంశం.

'బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి' అని అన్నారు. ఎంత గొప్ప విద్వాంసుడు, ఇంద్రియనిగ్రహ పటువూ అయినా విషయవాసన ముందు ఆకర్షించబడతాడని అర్థం.

**మత్తకోకిల:**

**వృద్ధుఁడైనతఱిన్ బలంబును వీఁకయుం దఱుగంగ దు**
**ర్బుద్ధి పాటిల మ్రగ్గి యింద్రియముల్ విశక్తతఁ బొంద దో**
**షోద్ధతిన్ రుజ లుద్భవింపఁగ నొండురూపగు పాశసం**
**బద్ధుఁ జేసి జముండు దివ్వఁగఁ బాయు నబ్భవముం దుదిన్. 41**

**ప్రతిపదార్థం:** వృద్ధుఁడు+ఐన+తఱిన్= ముసలివాడయ్యాక; బలంబును= బలమూ; వీఁకయున్= పరాక్రమమూ; తఱుగంగన్= తగ్గిపోగా; దుర్బుద్ధి+పాటిలన్= ఉచితానుచిత పరిజ్ఞానం నశించి, 'చెడు' వైపు బుద్ధి ప్రసరిస్తుండగా; ఇంద్రియముల్= ఇంద్రియాలు; మ్రగ్గి= పడిపోయి (అరిగిపోయి); విశక్తతన్= నిశ్శక్తిని; పొందన్= పొందగా; దోష+ఉద్ధతిన్= దోషాల విజృంభణంచేత; రుజలు= రోగాలు; ఉద్భవింపఁగన్= పుట్టగా; ఒండురూపగు= ఏదో ఒక రూపంలో; పాశసంబద్ధున్+చేసి= పాశంతోకట్టి; జముండు= యముడు; తివ్వఁగన్= ప్రాణంలాగగా (మనిషి చివరకు); ఆ+భవమున్= ఆ జన్మను; తుదిన్= చివరికి; పాయున్= వదిలి వేస్తాడు.

**తాత్పర్యం:** చివరికి ముసలితనం రాగా మనిషి బలమూ తగ్గుతుంది. పరాక్రమమూ తగ్గిపోతుంది. ఉచితానుచిత పరిజ్ఞాన శూన్యుడై అనుచిత కార్యాలవైపే బుద్ధి ప్రసరిస్తుంది. ఇంద్రియాలు పడిపోయి నిశ్శక్తి ఆవరిస్తుంది. దోషాలు విజృంభించి రకరకాల రోగాలు పుట్టుతాయి. అప్పుడు యముడు ఏదో ఒక రూపంలో కాలపాశాన్ని వేసి మనిషి ప్రాణాన్ని లాగుతాడు. చివరికి మనిషి నిస్సహాయుడై ఆ జన్మను వదలిపెట్టుతాడు.

**విశేషం:** బలం వేరు, విజృంభించే స్వభావం వేరు. ముసలి వయసులో ఈ రెండూ తగ్గిపోతాయి.

ఉచితానుచితపరిజ్ఞానం నశించటంతో ముసలివారి ప్రవృత్తి పిల్లల ప్రవృత్తిగా మారిపోతుంది. శిక్షితమైన జీవితం కాకపోతే ఏ విషయంలోనూ నిగ్రహముండదు. అందరినీ తిడుతూ అందరికీ భారమవుతాడు.

ఇంద్రియాలు అరిగిపోతాయి. వాటి కార్యకలాపాలకు కావలసిన శక్తి ఉండదు.

సత్త్వ రజ స్తమోగుణాలకు చెందిన వాతపిత్తశ్లేష్మదోషాలు మూడూ విజృంభిస్తాయి. ఆయుర్వేదం ప్రకారం అన్ని రోగాలు ఈ త్రివిధ దోషాలతో పుట్టుతాయి.

వయస్సుపరంగా 'జర' (ముసలితనం) ఆరోగ్యం చెడిపోవటం 'రుజ' (వ్యాధి) - ఈ రెండింటిలో ఏది వచ్చినా యమపాశం సిద్ధంగా ఉంటుంది.

అందుకే దంతాలు పడకుండా ఉన్నప్పుడే, తనువులో శక్తి ఉన్నప్పుడే, కాంతాసంఘం అసహ్యించుకొనకముందే మనిషి జాగరూకుడై భగవంతునివైపు మనసు మళ్ళించి ధార్మిక కార్యాలలో మగ్నుడై యుక్తాహార విహారాలతో దేహాన్ని మనస్సును క్రమబద్ధీకరించుకొనాలని మన భారతీయ సంప్రదాయం విధించింది.

మత్తకోకిల వృత్తంలో ప్రతిపాదానికీ ర,స,జ,జ,భ,ర గణాలుంటాయి. 1-11 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ.** **కావున సంసారంబు దుఃఖబహుళంబగుట విస్పష్టం బది యట్లుండె లోభక్రోధ మదోన్మత్తులై దుర్మతు లింద రమింతు రందలి సుఖలేశంబునకై యొండొరులం జెఱుపను జంపను జొచ్చి ధర్మపథంబు దప్పి యమ కింకరుల చేతం బడుదు రిత్తెఱంగు బుధులవలనఁ దెలియ విని విమలస్వాంతులు సన్మార్గంబున వర్తిల్లి నిత్యానంద స్వరూపు లగుదురు. దీని గహనత్వంబు పెద్దలచేత వినినతెఱంగు సెప్పెద నాకర్ణింపుము.42**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; సంసారంబు= ఈ సంసారం; దుఃఖబహుళంబు+అగుట= చాలా దుఃఖాలతో నిండినది కానటం; విస్పష్టంబు= చాలాస్పష్టమైన అంశం; అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉన్నది; లోభ, క్రోధ, మద+ఉన్మత్తులు+ఐ= లోభంతోనూ, క్రోధంతోనూ, మదంతోనూ మిక్కిలి ఉన్మాదం పొందినవారై; దుర్మతులు= దుష్టబుద్ధి కలవారు; ఇందున్+అ= ఈ విషయలంపటలోనే; రమింతురు= మునిగి సుఖాలు అనుభవిస్తుంటారు; ఇందలి= ఈ విషయజగత్తులోని; సుఖ లేశంబునకై= కొద్దిపాటిదైన ఈ సుఖంకోసం; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; చెఱుపను= నాశనం చేయడానికి; చంపను= చంపివేయడానికి; చొచ్చి= బయలుదేరి; ధర్మపథంబు+తప్పి= ధర్మమార్గం వదిలి; యమకింకరులచేతన్+పడుదురు= యమభటులచేతికి చిక్కుతారు; ఈ+తెఱంగు= ఈ రీతి; బుధులవలనన్+తెలియన్+విని= పండితులవలన బాగా విని; విమల స్వాంతులు= పవిత్రమైన హృదయం కలిగినవారు (పుణ్యాత్ములు); సత్+మార్గంబునన్+వర్తిల్లి= మంచి మార్గంలో నడుచుకొని; నిత్య+ఆనంద స్వరూపులు+అగుదురు= నిత్యమైన బ్రహ్మానంద స్వరూపులవుతారు (విముక్తులవుతారు); దీని= ఈ సంసారంయొక్క; గహనత్వంబు= దాటటంలోని క్లేశం; పెద్దలచేతన్+వృద్ధులవలన; వినిన తెఱంగు= విన్న పద్ధతి; చెప్పెదన్= నీకు చెబుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అందువలన ఈ సంసారం బహుదుఃఖాలకు నిలయం - అన్నది చాలా స్పష్టమైన అంశం. అది అట్లా ఉంచుదాం. లోభ క్రోధ మదాల చేత మనుష్యులు ఒక ఉన్మాద స్థాయిలో పడిపోయి దుష్టబుద్ధులై నిరంతరం విషయ లంపటంలోనే మునిగి సుఖం అనుభవిస్తూ కాలం గడిపేస్తారు. కొద్దిపాటిదైన ఈ సుఖం కొరకు ఒకరినొకరు

చెరపటానికి, చివరకి చంపటానికి కూడా వెనుదీయరు. ఈ పనిలో వాళ్ళు ధర్మపథాన్ని వదలివేసి చివరకి యమభటుల చేతుల్లో చిక్కుతారు. పుణ్యాత్ములు ఈ విధంగా దుష్ట బుద్ధులు నశించటాన్ని ప్రాజ్ఞులద్వారా విని నిత్యానిత్య వివేకం పొంది, సన్మార్గంలో వర్తిస్తూ, నిత్యమైన ఆనంద స్వరూపులై విముక్తులవుతారు. ఈ సంసారాన్ని దాటటం ఎంత క్లేశంతో కూడినదో పెద్దలనుండి నేను విన్న విషయం నీకు చెప్పుతాను వినుము.

**విదురుడు ధృతరాష్ట్రునకు సంసారగహనంబు తెఱంగెఱింగించుట (సం. 11-5-1)**

**తరువోజ:**

**అతిదుర్గమగు నరణ్య ప్రదేశమున నవనీసురుం డొకఁ డరుగుచునుండ**
**మితిలేని ఘోరంపు మృగములు శరభమృగపతిప్రముఖముల్ మిక్కిలి భయము**
**మతి కావహించుచు మార్గంబునందు మల్లడిగొనుడు నున్మార్గ యానమున**
**ధృతి దూలఁ జన నవి తిరిగె వెన్వెనుకఁ దెక్కలికాఱు దోఁతెంచి రాతనికి. 43**

**ప్రతిపదార్థం:** అతి= మిక్కిలి; దుర్గము+అగు= చొరటానికి వీలుకాని; అరణ్య ప్రదేశమునన్= అడవిలో; అవనీసురుండు+ ఒకఁడు= ఒక బ్రాహ్మణుడు; అరుగుచున్+ఉండన్= వెళుతుండగా; మితిలేని= లెక్కకు మిక్కిలి; ఘోరము+మృగములు= భయంకరమైన అడవి జంతువులు; శరభ= శరభాలు; మృగపతి ప్రముఖముల్= సింహాలు మొదలైనవి; మిక్కిలి భయము= గొప్ప భీతిని; మతికిన్= మనసుకి; ఆవహించుచున్= కలిగిస్తూ; మార్గంబునందున్= దారిలో; మల్లడిగొనుడున్= చుట్టుముట్టగా; ఉన్మార్గయానమునన్= దారిని తప్పించి అడ్డదారులు తొక్కి; ధృతిదూలన్= ధైర్యం నశించగా; చనన్= పరుగెత్తగా; అవి= ఆ అడవి జంతువులు; తిరిగె= వెనక్కు మళ్ళాయి; వెను+వెనుకన్= ఆ వెంటనే; ఆతనికిన్= ఆ బ్రాహ్మణుడికి; తెక్కలికాఱు= దొంగలు; తోఁతెంచిరి= అగుపడ్డారు.

**తాత్పర్యం:** ప్రవేశించటానికి వీలుకాని ఒక భయంకరమైన అడవిలో ఒక బ్రాహ్మణుడు వెళ్ళుతుండగా లెక్కకు మిక్కిలిగా అడవిజంతువులు, శరభాలు, సింహాలు, పులులు మొదలైనవి గొప్పభీతిని పుట్టిస్తూ అతడి చుట్టూ కమ్ముకొన్నాయి. ఆ బ్రాహ్మణుడు భయంతో వణికిపోతూ అడ్డదారులలో పడి పరిగెత్తటం మూలాన ఆ జంతువులు వెనక్కు మళ్ళాయి. ఆ వెంటనే ఆ బ్రాహ్మణుడికి ఒక దొంగల గుంపు కనిపించింది.

**విశేషం:** శరభం: మీగండ్లమెకము అని నిఘంటువులు చెప్పుతున్నాయి. సింహ శరభ శార్దూలాలను కలిపి చెప్పుతారు. అడవిలో మిక్కిలి భీతిని కలిగించే జంతువులు ఈ మూడూ అని అంటారు.

తరువోజలో ప్రతిపాదంలోనూ మూడు ఇంద్రగణాలూ, ఒక సూర్యగణమూ, మరల మూడు ఇంద్రగణాలూ, ఒక సూర్యగణమూ ఉంటాయి. మొదటి గణము మొదటి అక్షరమునకు, అయిదవగుణము మొదటి అక్షరమునకు యతిమైత్రి, మరల ఆఱవ గణము మొదటి అక్షరమునకు ఎనిమిదవ గణము మొదటి అక్షరమునకు యతిమైత్రి. ప్రాస నియమం కలదు.

**వ. అట్టి యెడ. 44**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**తోటకము**

**గరుపాఱఁగ మేను ప్రకంపమునం । బొరిఁ దొట్రువడం బదముల్ దొలఁగం**
**జొర నెచ్చొటు లేమి నసువ్యయభీ । భర మొందినఁ జేడ్పడు భావముతోన్. 45**

**ప్రతిపదార్థం:** మేను= శరీరం; గరుపాఱఁగన్= నిశ్చేష్టమై వెంద్రుకలు నిక్కపొడుచుకోగా; ప్రకంపమునన్= మిక్కిలి అదిరిపాటుచేత; పొరిన్= మిక్కిలిగా; తొట్రు+పడన్= తడబాటు పొందగా; పదముల్= కాళ్ళు; తొలఁగన్= అటు ఇటూ పడుతుండగా; చొరన్= ప్రవేశించటానికి (దూరటానికి); ఏ+చోటు+లేమిన్= ఏ చోటూ లేకపోవడంచేత; అసువ్యయభీభరము= ప్రాణంపోతుందన్న మిక్కిలి భయం; ఒందినన్= కలుగగా; చేడ్పుడు= చేష్టలుడిగిన; భావముతోన్= మనసుతో.

**తాత్పర్యం:** దొంగలను చూచి అతడి ఒళ్ళు నిక్కపొడుచుకొన్నది. భయంతో అదిరిపోయాడు. అడుగులు తడబడ్డాయి. ఎటువైపూ తప్పించుకొనటానికి వీల్లేని పరిస్థితి. ప్రాణం పోతుందన్న భయం అతిశయించి నిశ్చేష్టుడయ్యాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. ప్రకరణోచితమైన ఛందస్సు. తోటకవృత్తంలో ప్రతిపాదానికీ నాలుగు సగణా లుంటాయి. మొదటి అక్షరానికీ తొమ్మిదవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**తే. దెసలు గలయంగఁ జూచుచు దిక్కుదనకు । నెవ్వరును లేమి వెగడందు నెంత దవ్వు**
**సనిన నడవికిఁ గడ లేమియును మృగవ్ర జంబు పొదువుటయును గొందలంబు సేయ. 46**

**ప్రతిపదార్థం:** దెసలు= దిక్కులు; కలయంగన్= అన్నివైపులా; చూచుచున్= చూస్తూ; తనకున్; దిక్కు; ఎవ్వరును+లేమిన్= ఎవరూలేకపోవటంవలన; వెగడు+అందున్= భయపడ్డాడు; ఎంతదవ్వు+చనినన్= ఎంత దూరం పరిగెత్తినా; అడవికిన్= అడవికి; కడలేమియును= అంతం లేకపోవటం; మృగవ్రజంబు= అడవి జంతువుల సమూహం; పొదువుటయును= కమ్ముకోవటం; కొందలంబున్= చీకాకును; చేయన్= కలగజేయగా.

**తాత్పర్యం:** అటూ ఇటూ దిక్కులు చూస్తూ, తనను కాపాడేవారు ఎవరూ లేరని తెలిసిపోగా భయం ఎక్కువైంది. ఎంతదూరం పరుగెత్తినా అడవికి అంతం కనిపించటం లేదు. ఎటుపోయినా మృగాలు కమ్ముకొంటూనే ఉన్నాయి. వీటితో అతడు చీకాకు పడిపోగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**వ. అప్పు డాభీషణారణ్యంబున నేదిక్కు సూచినను దఱచుగా నొడ్డిన యురులు దోఁచె. ఘోరాకారయగు నొక్క యువిద యతనిం గౌఁగిలించుకొనియెఁ బంచశిరంబులును నగనిభంబులు నగు నాగంబు లనేకంబు లవ్వనంబునం గ్రందుకొనం దిరుగుచుండెఁ దత్ప్రదేశంబున నొక్కయుదపానంబు వల్లీవితానంబుచేత సంవృతంబై మీఁదఁ దృణంబులు వరఁగి నిగూఢంబైయున్న నప్పురుషుం డా నూతంబడి యొక్క బలుదీఁగం దవిలి తలక్రిందై వ్రేలుచుఁ గొమ్మనున్న పనసవంటి చందంబున నుండె న ట్లయ్యవస్థ నొందియు నక్కూపంబులో నొక్కభీమభుజంగంబు నాలుకలు గ్రోయ నాఱు దలలును బండ్రెండు కాళ్ళును గృష్ణశబల వర్ణంబును గల మహాగజం బానూతి దరినున్న తరువుఁ జేరంజనుదేర నందు శాఖోపశాఖల నానావర్ణంబులగు మధుకరంబులు మధుసంచయనం బాచరించి వర్తింప సితాసితంబులగు మూషికంబు లమ్మహీరుహంబు మూలంబు నఱుకు చుండ. 47**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆ+భీషణ+అరణ్యంబునన్= ఆ భయంకరమైన అడవిలో; ఏ దిక్కు+చూచినను= ఏవైపు చూచినా; తఱచుగాన్= ఎక్కడ పడితే అక్కడ; ఒడ్డిన= పన్నిన; ఉరులు= ఉచ్చులు; తోఁచెన్= కనిపించాయి; ఘోర+ ఆకార+అగు= భయంకరమైన ఆకారమున్న; ఒక్క+ఉవిద= ఒకస్త్రీ; అతనిన్+కౌఁగిలించుకొనియెన్= అతడిని కౌగిలించుకొన్నది;

పంచశిరంబులును= ఐదు తలలున్నవి; నగ నిభంబులున్+అగు= పెద్ద కొండలలాంటివైన; నాగంబులు= ఏనుగులు; అనేకంబులు= చాలా; ఆ+వనంబునన్= ఆ అడవిలో; క్రందుకొనన్= సందడిగా; తిరుగుచుండెన్= తిరుగాడుతున్నాయి; తద్+ప్రదేశంబునన్= అక్కడ; ఒక్క+ఉదపానంబు= ఒకబావి; వల్లీవితానంబుచేతన్= తీగల గుంపుచేత; సంవృతంబు+ఐ= కప్పబడి; మీద= పైన; తృణంబులు+పరఁగి= గడ్డితోకూడి ఉండి; నిగూఢంబు+ఐ+ఉన్నన్= గుర్తించటానికి వీలుకాకుండా ఉండగా; ఆ+పురుషుండు= ఆ బ్రాహ్మణుడు; ఆ నూతన్+పడి= ఆ బావిలోపడి; ఒక్క+బలు+తీఁగన్= ఒక గట్టి తీగకు; తవిలి= తగుల్కొని; తలక్రిందు+ఐ= తలకిందుగా; వ్రేలుచున్= వేలాడుతూ; కొమ్మన్+ఉన్న= కొమ్మచివరనున్న; పనస వంటి చందంబునన్= పనసపండులాగా; ఉండెన్= ఉండిపోయాడు; అట్లు+అవస్థన్+ఒందియున్= అలాంటి దుర్దశను పొందికూడా; ఆ+కూపంబులోన్= ఆ బావిలో; ఒక్కభీమ భుజంగంబు= ఒక పెద్దపాము; నాలుకలు గ్రోయన్= నాలుకలు చాచగా; ఆఱు+ తలలున్= ఆరుతలలూ; పండ్రెండు కాళ్ళును= పన్నెండు కాళ్ళూ; కృష్ణ శబలవర్ణంబును= రంగుల చారలు కలిగిన నల్లదనము; కల= కలిగిన; మహాగజంబు= పెద్ద ఏనుగు ఒకటి; ఆ నూతి దరిన్+ఉన్న= ఆ బావి దగ్గరనున్న; తరువున్+చేరన్+ చనుదేరన్= చెట్టు దగ్గరకు సమీపిస్తుండగా; అందున్= ఆ చెట్టులో; శాఖ+ఉపశాఖలన్= కొమ్మలలో రెమ్మలలో; నానా వర్ణంబులు+అగు= వివిధమైన రంగులు గల; మధుకరంబులు= తుమ్మెదలు; మధుసంచయనంబు+ఆచరించి= తేనెను ప్రోగుచేసి; వర్తింపన్= తిరుగుతుండగా; సిత+అసితంబులు+అగు= తెల్లనివి నల్లనివి అయిన; మూషికంబులు= ఎలుకలు; ఆ+మహీరుహంబు+మూలంబున్= ఆ చెట్టు మొదటిని; నఱుకుచున్+ఉండన్= కొరికివేస్తుండగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ భయంకరమైన అడవిలో ఏవైపు చూసినా ఎక్కడబడితే అక్కడ పన్నిన ఉచ్చులు కనిపిస్తున్నాయి. భయంకరమైన ఆకారమున్న ఒక స్త్రీ ఆ బ్రాహ్మణుడిని కౌగిలించుకొన్నది. ఐదుతలలతో కొండలవలె ఉన్న పెద్ద పెద్ద ఏనుగులు ఆ అడవిలో సందడిగా తిరుగుతున్నాయి. అక్కడ ఒక బావిలో అల్లిబిల్లిగా తీగలు అల్లుకొని ఉన్నాయి. ఆ తీగలపైన గడ్డి నిండి ఉండి, లోపల ఉన్న బావి ఎవరికీ తెలియకుండా ఉన్నది. ఆ బ్రాహ్మణుడు ఆ బావిలో పడ్డాడు. కాని, ఒక గట్టి తీగకు తగుల్కొని తలకిందులుగా వేలాడుతూ కొమ్మ చివరనున్న పనసపండువలె అట్లాగే ఉండిపోయాడు. అట్లాంటి దుర్దశలో అతడుండగా, ఆ బావిలో ఒక పెద్ద సర్పం నాలుకలు చాస్తుండగా ఆరుతలలూ, పండ్రెండు కాళ్ళూ ఉన్న ఒక పెద్ద ఏనుగు ఆ బావిదగ్గరున్న చెట్టును సమీపిస్తున్నది. అది రంగు రంగుల చారలున్న నల్లటి ఏనుగు. ఆ చెట్టులోని కొమ్మలు రెమ్మలు చిత్ర వర్ణాలు కలిగిన తుమ్మెదలతో నిండి ఉన్నాయి. ఆ తుమ్మెదలు ఆ పూలనుండి తేనెను బాగా చేర్చిపెట్టి నాట్యమాడుతున్నాయి. ఆ చెట్టుమూలాన్ని నల్లటివి తెల్లటివి అయిన ఎలుకలు తమ బలిష్ఠమైన పండ్లతో కొరికివేస్తున్నాయి.

**ఉత్సాహవృత్తము:**

> **ధరణినాథ! వినుము మధుర ధారలెల్ల ప్రొద్దునుం ।**
> **దొరుఁగుచుండ నతఁడు వాని దోహలమున నానుచుం**
> **బొరయఁ డెప్డుఁ దృప్తి వగలప్రోక యైన యట్టి దు ।**
> **స్తరపుటున్కి కొల్లఁబాటుఁ దన్కఁ డించుకేనియున్. 48**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= ఓ రాజా!; వినుము= వినుము; మధురధారలు= తేనెధారలు; ఎల్ల ప్రొద్దునున్= ఎల్లప్పుడూ; తొరఁ గుచుండన్= కారుతూ ఉంటే; అతడు= ఆ బ్రాహ్మణుడు; వానిన్= ఆ తేనెలను; దోహలమునన్= ఉత్సాహంతో; ఆనుచున్= తాగుతూ; ఎప్డున్= ఎప్పటికీ; తృప్తిన్= తృప్తిని; పొరయఁడు= పొందడు; వగలప్రోక+ఐన= బాధలకు రాశి (చోటు) అయిన; అట్టి= అట్లాంటి; దుస్తరము+ఉన్కికిన్= దుర్భరమైన స్థితికి; ఒల్లఁబాటున్= నిరాసక్తిని; ఇంచుకేనియున్= కొంచెంకూడా; తన్కఁడు= పొందడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. అట్లా తేనె ధారలు ఆపైన ఉన్న చెట్టులోనుండి పడుతూ ఉంటే ఆ తేనెలను ఎంతో ఉత్సాహంతో త్రాగుతూ ఆ బ్రాహ్మణుడు అట్లాగే ఉండిపోయాడు. ఎంత త్రాగినా అతనికి తృప్తి కలగలేదు. అంత దుర్భరమైన స్థితిలో ఉండి కూడా తన స్థితిపై అతడికి అసహ్యం పుట్టలేదు.

**విశేషం:** ఉత్సాహవృత్తంలో ప్రతిపాదానికీ ఏడు సూర్యగణాలూ, ఒక గురువూ ఉంటాయి. మొదటి గణం మొదటి అక్షరంచే అయిదవగణం మొదటి అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు. (వాడి పానోత్సాహానికి తగినట్లుగా ఉత్సాహవృత్తం.)

**వ.** **ఇట్లున్న యతనికి నా బహుళవ్యాళంబులం, దెక్కలికాఱుల యురుల వలనను, నయ్యుగ్రకామినీ కారణంబున నుం, బంచశిరస్కంబులగు సామజంబుల సందడి, నా కూపంబులోనున్న యద్దారుణ దర్వీకరంబు కతంబునను నూతిదరిం జరించునగ్గజంబు ఘోరత్వంబునం జేసియు మూషికంబుల తరుపతనహేతుభావంబునను నాచంచల చంచరీకంబుల కారించుటనుం జేతోవృత్తంబు వికలతాయత్తంబై యుండ నతండు జీవితాశయు విడువం' డనిన విని విదురునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఉన్న+అతనికిన్= ఇట్లా ఉన్న అతనికి; ఆ+బహు+వ్యాళంబులన్= అక్కడ తిరుగుతున్న చాలా ఏనుగులచేతనూ; తెక్కలికాఱుల= దొంగలయొక్క; ఉరులవలనను= ఉచ్చులచేతనూ; ఆ+ఉగ్ర కామినీ కారణంబుననున్= ఆ భయంకరమైన స్త్రీ కారణంగానూ; పంచశిరస్కంబులగు= ఐదు తలలున్న; సామజంబుల సందడిన్= ఏనుగుల సందడిచేత; ఆ కూపంబులోనున్న= ఆ బావిలోనున్న; ఆ+దారుణ దర్వీకరంబు+కతంబునను= ఆ భయంకరమైన పాముచేతనూ; నూతిదరిన్= బావివద్ద; చరించు= తిరుగాడే; ఆ+గజంబు= ఆ ఏనుగు యొక్క; ఘోరత్వంబునన్+చేసియున్= భయంకరమైన ఆకారంచేతనూ; మూషికంబుల= ఎలుకలయొక్క; తరుపతన= చెట్టుపడిపోవటమనే; హేతు= కారణమనే; భావంబునన్= ఆలోచనచేతనూ; ఆ+చంచల+చంచరీకంబుల= తిరుగాడే ఆ తుమ్మెదల; కారించుటనున్= పైన ముసిరి ఇబ్బంది పెట్టటంచేతనూ; చేతస్+వృత్తంబు= మనఃస్థితి; వికలత+ఆయత్తంబు+ఐ+ఉండన్= కకావికలై ఉండగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; జీవితాశయున్= ప్రాణంపైన ఆశనుమాత్రం; విడువండు= వదలిపెట్టడు; అనినన్+విని= అని చెప్పగా విని; విదురునకున్= విదురుడితో; ధృతరాష్ట్రుండు+ఇట్లనియెన్= ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా తీగలపైన తలకిందుగా వేలాడుతున్న అతడికి అక్కడ మెదలుతున్న పాములు, తిరుగుతున్న దొంగలు, పన్నిన ఉచ్చులు, ఆ భయంకరమైన స్త్రీ కౌగిలింత, ఐదుతలల ఏనుగుల సంచారం, ఆ బావిలోని విషసర్పం, బావి దగ్గర తిరుగుతున్న ఏనుగు, చెట్టును కొరికేస్తున్న ఎలుకలు, చెట్టు పడిపోతుందన్న ఆలోచనవలన పుట్టిన భయం, పైగా ముసురుతున్న తుమ్మెదలు - వీటితో మనసు కకావికలై పోయింది. అయినా ఆ బ్రాహ్మణుడు ఆ సమయంలో కూడా ప్రాణాలపైన ఆశను మాత్రం కోల్పోలేదు' - అని విదురుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**క.** **'మనమునఁ గృప పుట్టెడు న । ట్లనయముఁ గీడైన యునికి కాతం డెమ్మెఁ**
**గనియెను విడుమర? దానిన్ । వినవలతుం జెప్పవే వివేకనిరూఢా!' 50**

**ప్రతిపదార్థం:** వివేక నిరూఢా!= వివేకంచేత సుప్రసిద్ధుడవైన ఓ విదురా!; మనమునన్= హృదయంలో; కృప+పుట్టెడున్+అట్లు= దయపుట్టేటట్లుగా; అనయమున్= నిరంతరం; కీడు+ఐన+ఉనికికిన్= అపాయకరమైన ఆ స్థితికి; ఆతండు= ఆ బ్రాహ్మణుడు;

ఏ+మైన్= ఏ విధంగా; విడుమరన్= విమోచనాన్ని; కనియెన్?= పొందాడు?; దానిన్= ఆ పద్ధతిని; వినవలతున్= వినగోరుతున్నాను; చెప్పవే= దయతో వివరించుము.

**తాత్పర్యం:** 'వివేకంతో పేరు పొందిన విదురా! హృదయం ద్రవించి పోయేటట్లు అట్లా నిరంతరం అపాయకరమైన ఆ స్థితినుండి అతడు ఎట్లా బయటపడ్డాడు? ఈ విషయాన్ని వివరించుము. వినాలని కోరికగా ఉన్నది'.

**కవిరాజ విరాజితము**

> **అనవుడు నిట్లను నన్నర పాలును కాతఁడు 'మోక్షము నర్థి జగ**
> **జ్జనులకుఁ బెట్టుట సన్మతిఁ గోరి విశారదు లాదరసంభృతులై**
> **యనఘ! సుదుస్తరమైన భవంబున కచ్చగు నీ యితిహాసము బో**
> **ధన మహనీయ విధంబునఁ జెప్పి రుదాత్తగుణాశ్రయతామహితా! 51**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ధృతరాష్ట్రుడు అడుగగా; ఆ నరపాలునకున్= రాజుతో; ఆతఁడు= విదురుడు; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; విశారదులు= ప్రాజ్ఞులు; అర్థిన్= పరోపకారబుద్ధితో; జగత్+జనులకున్= ప్రపంచంలోని మనుష్యులకు; మోక్షమున్+పుట్టుట+కోరి= మోక్షం కలగటాన్ని కోరుకొని; సన్మతిన్= మంచి బుద్ధితో; ఆదరసంభృతులై= జగత్తుమీద పరమాదరం కలిగినవారై; అనఘ!= పాపరహితుడా!; సుదుస్తరమైన= దాటటానికి కష్టసాధ్యమైన; భవనంబునకున్= పుట్టుకకు (మానవజీవితానికి); అచ్చు+అగు= తుల్యమైన; ఈ+ఇతిహాసమున్= ఈ కథను; బోధన= జ్ఞానాన్ని; కలిగించే విధంగా; మహనీయ విధంబునన్= గొప్పరీతిలో; చెప్పిరి= చెప్పారు; ఉదాత్త= గొప్ప; గుణాశ్రయతా= గుణములకు ఆశ్రయం ఇవ్వటం వలన; మహితా!= మహనీయుడైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! (వినుము).

**తాత్పర్యం:** అని రాజు అడుగగా విదురుడు ఇట్లా చెప్పాడు. 'లోకంలోని మనుష్యులకు మోక్షం అంటే ఏమిటో తెలియ చెప్పటం కొరకే పండితులు ఈ కథను లోకహితం కోరి చెప్పారు. సరిగా జీవితం ఎట్లా దాటటానికి కష్టసాధ్యమైందో ఈ కథకూడా అచ్చంగా అట్లాంటిదే. అందుకే ఈ ఇతిహాసాన్ని ప్రాజ్ఞులు కల్పించారు. ఈ కథవలన మహత్తరమైన జ్ఞానబోధ కలుగుతుంది. నీవు కూడా గొప్ప గుణాలు కలిగినవాడివే. అందుచేత ఈ కథను వింటే నీకు తెలియని విషయం ఏమీ ఉండదు.

**విశేషం:** ఇతి+హ+ఆస - ఇతిహాసమని పెద్దలంటారు, ఇట్లా జరిగిందని ఏ కథను పెద్దలు సందర్భవశంగా ఉదాహరిస్తూ వస్తారో అవన్నీ ఇతిహాసాలే. ఇట్లాంటి ఇతిహాసాలు ఎన్నో కలిగిన మహేతిహాసం భారతం. ఇందులో జరిగినవి కొన్ని జరిగాయని జనులు చెప్పుకొంటూ వచ్చినవి కొన్ని, సందర్భాన్నిబట్టి పండితులు కల్పించినవి కొన్ని -ఇవన్నీ కలిసి భారత తాత్పర్యాన్ని నిరూపిస్తున్నాయి. అట్లాంటి కథ ఈ కథ.

కవిరాజవిరాజితవృత్తంలో ప్రతిపాదంలోనూ న,జ,జ,జ,జ,జ లగ - అనే గణాలుంటాయి. 1-8-14-20 అక్షరాలకు యతిమైత్రి, ప్రాసమైత్రి ఉన్నది.

**వ.** **కావున నేతత్స్వరూపం బభివ్యక్తంబుగా వివరింపవలసియుండు వినుము చెప్పెద నా దుర్గంబు సంసార గహనంబు వాలు మృగంబులుఁ దెక్కలికాఱు నురులు రోగంబులు కామినిజర పంచ శిరస్కంబులగు గజంబు లింద్రియ ప్రపంచంబు లాకూపంబున నున్న నాగం బంతకుండు తీఁగ జీవితాశ కూపంబు నుపాంతంబున**

**నున్న యవనీరుహం బాయువు దాని దెస నడచు సామజంబు సంవత్సరంబు తదీయ శిరంబు లాఱును ఋతువులు తత్పాదంబులు పండ్రెండు మాసంబులు తరుమూలంబు నఱుకు నెలుక లహోరాత్రంబులు మధుకరంబులు కామంబులు మధుధారలు కామరసంబులు మధుసంచయనం బాయువు వానివలన మానవులాసక్తులగుదు రిట్టి సంసార చక్రంబు పరివర్తనంబు బుధు లెఱుంగుదురు వారు దీని పాశంబులు ద్రెంపంజాలుదు' రనిన విని యాంబికేయుండు విదురున కిట్లనియె. 52**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఏతద్= దీని; స్వరూపంబు= స్వరూపాన్ని; అభివ్యక్తంబుగాన్= స్పష్టంగా; వివరింపవలసి యుండున్= వివరించాల్సి ఉంటుంది; చెప్పెదన్+వినుము= చెబుతాను వినుము (జాగ్రత్తగా వినుమని అర్థం); ఆ దుర్గంబు= ఇంతవరకూ వర్ణించిన ఆ అడవి; సంసారగహనంబు= సంసారమనే అడవి; వాలుమృగంబులు= క్రూరమృగాలు; తెక్కలి కాఱు= దొంగలు; ఉరులు= ఉచ్చులు; రోగంబులు= రోగాలు; కామిని= స్త్రీ; జర= ముసలితనం; పంచశిరస్కంబులగు= ఐదు తలలున్న; గజము= ఏనుగు; ఇంద్రియ ప్రపంచంబులు= ఐదు ఇంద్రియాలు (కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు); ఆ కూపంబు= ఆ బావిలో; ఉన్న నాగంబు= ఉన్న పాము; అంతకుండు= యముడు; తీఁగ= ఆ వ్యక్తి చిక్కుకున్న తీగ; జీవిత+ఆశ= బతకాలన్న కోరిక; కూపంబు+ఉపాంతంబునన్+ఉన్న= బావిసమీపంలోని; అవనీరుహంబు= చెట్టు; ఆయువు= ఆయుస్సు; దానిదెసన్= దానివైపు; నడచుసామజంబు= నడిచివచ్చే ఏనుగు; సంవత్సరంబు= సంవత్సరం; తదీయశిరంబులు+ ఆఱును= ఆ ఏనుగుకున్న ఆరు తలలూ; ఋతువులు= ఆరు ఋతువులు; తత్పాదంబులు పంద్రెండున్= దాని పంద్రెండు కాళ్ళు; మాసంబులు= నెలలు; తరుమూలంబు నఱుకు= చెట్టుమొదలును కొరికేటువంటి; ఎలుకలు= ఎలుకలు; అహోరాత్రంబులు= పగలు, రాత్రి; మధుకరంబులు= తుమ్మెదలు; కామంబులు= కోరికలు; మధుధారలు= తేనె ప్రవాహాలు; కామరసంబులు= ఇష్టప్రాప్తివలన పుట్టే తృప్తి; సంతోషం మొదలైన భావాలు; మధు సంచయనంబు= తుమ్మెదలు దాచిన తేనె; ఆయువు= ఆయుస్సు; వానివలనన్= కామం, దాని తృప్తి, ఇంకా బ్రతకాలన్న కోరిక, మిగిలిన ఆయుస్సు - వీటివలన; మానవులు= మనుష్యులు; ఆసక్తులగుదురు= జీవితంపట్ల ఆశకలిగిన వారు అవుతారు; ఇట్టి సంసార చక్రంబు+పరివర్తనంబు= సంసారమనే చక్రం తిరగటం ఇలాంటిదని; బుధులు+ఎఱుంగుదురు= పండితులు తెలుసుకొంటారు; వారు= అలాంటి ప్రాజ్ఞులు; దీని పాశంబులు= దీని పాశాలను; త్రెంపన్+చాలుదురు= తెంచిపారవేయగలుగుతారు; అనినన్+విని= అని విదురుడు చెప్పగా విని; ఆంబికేయుండు= అంబికాతనయుడైన ధృతరాష్ట్రుడు; విదురునకున్+ఇట్లు+అనియెన్= విదురుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కాబట్టి దీని స్వరూపాన్ని వివరిస్తే కాని అర్థం కాదు. చెప్పుతాను జాగ్రత్తగా వినుము. ఇంతవరకు వర్ణించిన ఆ అడవే సంసారం. క్రూరమృగాలే దొంగలు. ఉచ్చులే రోగాలు. ఆ స్త్రీయే ముసలితనం. ఐదు తలలున్న ఏనుగు ఐదు ఇంద్రియాలకు ప్రతీక. ఆ బావిలోని పామే యమధర్మరాజు. ఆ వ్యక్తి చిక్కుకున్న తీగయే బతకాలన్న కోరిక. ఆ బావి వద్దనున్న చెట్టు ఆయుస్సు. దానివైపు నడిచి వచ్చే ఏనుగు సంవత్సరం. దాని ఆరు తలలూ ఆరు ఋతువులు, పన్నెండు కాళ్ళూ పన్నెండు నెలలు. ఆ చెట్టు మొదటిని కొరికివేస్తున్న ఎలుకలే రేయింబవళ్ళు. (అందుకే నల్లగా తెల్లగా ఉన్నాయనటం). ఆ తుమ్మెదలే ఎడతెగని కోరికలు. కారుతున్న తేనె ప్రవాహాలే ఇష్టప్రాప్తివలన కలిగే సుఖసంతోషాదిభావాలు. ఆ తుమ్మెదలు చేర్చి ఉంచిన తేనెపట్టే ఆయుస్సు. వీటిచేత మనిషి ఇంకా బ్రతకాలని కోరుకొంటాడు. సంసారమనే చక్రం తిరగటం ఇలాంటిదని పండితులు తెలిసికొంటారు. వివేకవంతులైనవారు ఆ ఉచ్చులలో పడరు. పాశాలను ఛేదించుకొని బయటపడగలుగుతారు' అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఆ తీగపైన తలకిందులుగా వేలాడుతున్న మనిషివంటి బ్రతుకే మానవజీవిత మని తాత్పర్యం. ఇది అసలు బ్రతుకు కాదు. ఆ బావిలోనుండి బయటపడటం ఎంతకష్టమో ఈ మానవజీవితం నుంచి విముక్తి పొందటం కూడా అంతే కష్టం.

ఈ కథలోని పాత్ర - 'బ్రాహ్మణుడు' - ప్రతిమనిషీ ఆలోచన కలిగితే బ్రాహ్మణుడే అవుతాడని అర్థం. మోక్షానికి అర్హుడేనని అర్థం. అగ్రవర్ణీయుడైనా జీవితంలోని కామాది గుణాలకు బానిస కాక తప్పదని చెప్పటంకోసమే ఈ ఇతిహాసంలోని పాత్రగా బ్రాహ్మణుడు చెప్పబడ్డాడు.

ఇంద్రియాలు ఐదు. జ్ఞానేంద్రియాలు (త్వక్, చక్షుః, శ్రోత్ర జిహ్వాఘ్రాణాలు - చర్మం, కన్ను, చెవి, నాలుక, ముక్కు); జ్ఞానేంద్రియాలు పదార్థ జ్ఞానం కలిగిస్తాయి.

కర్మేంద్రియాలు - వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు (నోరు, చేయి, కాలు, గుద, జననేంద్రియాలు) - ఇవి కర్మావహం కలిగినవి. మనిషి సదా ఈ రెండింటి ద్వారా అటు మనసులోనూ, ఇటు దేహంలోనూ ఏదో ఒకపని చేస్తుంటాడు. అందుకే ఆ ఏనుగు నిరంతరం తిరుగుతూనే ఉన్నదనటం.

కాలాన్ని ఎలుకలతో పోల్చి చెప్పటం కూడా ఆలోచించదగినదే. కాలం తరిగిపోతుంది. నల్ల తెల్ల వర్ణాలే రేయుంబవళ్ళు. కడచిన కాలం మళ్ళీ రాదు కాబట్టి అది కొరికివేస్తున్నదనటం.

అన్ని అనుభవాలకన్నా కోరిక సిద్ధించినపుడు కలిగే సంతోషం మధురంగా ఉంటుంది. అంచేతనే అది 'తేనె' అనటం.

కాని, చివరి నిమిషం వరకు బ్రతకాలన్న కోరిక మనిషిని మళ్ళీ ఆశాపాశాలవైపు లాగుకొని వెళ్తుంది. ఆ కోరికను ఎవడు అదుపులో ఉంచుకొని నిరాసక్తుడవుతాడో - వాడు అసంగుడవుతాడు. అసంగత్వమే - వాడికి శస్త్రమవుతుంది. అట్లాంటివాడు ఈ సాంసారిక బంధాలనుండి విముక్తి పొందగలడు.

'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా' అని భగవద్గీత అందుకే కీర్తించింది. ఆ విషయాన్నే విదురుడు ఈ ఇతిహాసం ద్వారా ధృతరాష్ట్రునికి బోధిస్తున్నాడు. ఇది మానవునికి సార్వకాలికమైన ప్రబోధం.

**క. 'హిత ముపదేశించితి వీ । వతి నిర్మల చిత్తవృత్తి వగుట సుజన సం**
**స్తుత గుణ! యింకను జెప్పుము । ధృతికారక వచన పద్ధతిన్ విశదముగన్.' 53**

**ప్రతిపదార్థం:** ఈవు= నీవు (ఓ విదురా!); అతి నిర్మల= అతి పవిత్రమైన; చిత్తవృత్తివి+అగుటన్= మనోవృత్తి కలిగినవాడివి కావటంచేత; హితము+ఉపదేశించితి(వి)= నాకు మంచిని బోధించావు; సుజనసంస్తుతగుణ!= సుజనులచేత ప్రస్తుతించబడే గుణాలు కలవాడా! ఓ విదురా!; ధృతి= ధైర్యాన్ని; కారక= కలిగించే; వచనపద్ధతిన్= మాటలతో (రీతిలో); విశదముగన్= వివరంగా; ఇంకనున్+చెప్పుము= ఇంకా కాస్త బోధించుము.

**తాత్పర్యం:** 'విదురా! నీవు అతిపవిత్ర చిత్తవృత్తి కలవాడివి. నాకు హితాన్ని ఉపదేశించావు. నీ బోధనలవలననే సుజనులు నిన్ను ఎప్పుడూ కీర్తిస్తారు. నాకు ధైర్యం కలిగే రీతిలో ఇంకా వివరంగా ఈ విషయాన్ని బోధించుము'.

**వ. అనుటయు విదురుం డవ్విభున కిట్లనియె. 54**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; విదురుండు; ఆ+విభునకున్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు పలుకగా విదురుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**కవిరాజ విరాజితము:**

**అనయము లోలతమై విషయప్రచయంబను దుస్తర పంకమునన్**
**మునుఁగుచుఁ దేలుచు నుండఁగఁ గాలము ముట్టి రుజన్ జర నెవ్వగ పై**
**కొన దొరకొల్పి క్రమంబున నంగము క్రొవ్వును జెల్వును బాపి ప్రయో**
**జన రహితంబుగఁ జేసి యపాత్రపుఁజా వొనరించుఁ గురుప్రవరా! 55**

**ప్రతిపదార్థం:** కురుప్రవరా!= రాజా!; (మానవుడు) అనయమున్= నిరంతరం; లోలతమైన్= ఆసక్తితో (వ్యామోహంతో); విషయప్రచయంబు+అను= విషయ సమూహం అనేటటువంటి; దుస్తర పంకమునన్= దాటిపోవటానికి వీల్లేని బురదలో; మునుఁగుచున్+తేలుచున్= మునుగుతూ తేలుతూ; ఉండఁగన్= ఉండగా; కాలము= (ఇంతకు ముందు వివరించిన) కాలశక్తి; ముట్టి= తాకి; రుజన్= రోగంచేతనూ; జరన్= ముసలితనంచేతనూ; నెఱ+వగ= అధికదుఃఖం; పైకొనన్= ఆక్రమించగా; దొరకొల్పి= ఉసికొల్పి; క్రమంబునన్= క్రమంగా; అంగము= దేహంయొక్క; క్రొవ్వును= శక్తిని; చెల్వును= అందాన్ని; పాపి= పోగొట్టి; ప్రయోజనరహితంబుగన్+చేసి= ఎందుకూ పనికిరాకుండా చేసి; అపాత్రము+చావు= ఆయా జన్మకు ఉచితంకాని రీతిలోనైనాసరే చచ్చే విధంగా (అనుచిత మరణాన్ని); ఒనరించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** కురువంశం రాజులలో శ్రేష్ఠుడవైన ధృతరాష్ట్ర మహారాజా! వినుము. వ్యామోహంతో నిరంతరం విషయ ప్రపంచమనే బురదలో మునిగి తేలుతూ ఒకవైపు మనిషి తననుతాను మరచి ఉండగా, మరోవైపు కాలశక్తి రోగాన్ని, ముసలితనాన్ని ఉసికొల్పి మనిషిని ఆక్రమించేటట్లు చేస్తుంది. దానితో క్రమంగా మనిషిలోని శక్తి సన్నగిల్లుతుంది. అందం తరిగిపోతుంది. దేహం ఎందుకూ పనికిరాకుండా పోతుంది. చివరికి అన్యాయపు చావు చస్తాడు. ఇంతే మనిషిగతి.

**విశేషం:** అలం: రూపకం. కవిరాజ విరాజితంలో ప్రతిపాదానికీ- న, జ, జ, జ, జ, జ, వ అనే గణాలుంటాయి. 1-14 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. అని మఱియును. 56**

**తాత్పర్యం:** అని అంటూ ఇంకా.

**క. 'తేరు శరీరము దానికి । సారథి సత్త్వంబు తురగచయ మింద్రియముల్**
**దారుణతర బుద్ధి వ్యా । పారము లొనరంగ గనప పగ్గము లధిపా! 57**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! (వినుము); శరీరము= ఈ దేహం; తేరు= రథం; సత్త్వంబు= బుద్ధి; సారథి= రథాన్ని నడిపేవాడు; ఇంద్రియముల్= అవయవాలు; తురగచయము= గుర్రాలు; దారుణతర= మిక్కిలి భయంకరమైన; బుద్ధి= మతి (చేసే); వ్యాపారములు= ఆలోచనలు; ఒనరంగన్= అమరినట్లుగా; గనప= పెద్దవైన; పగ్గములు= పగ్గాలు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! వినుము. ఈ శరీరం ఒక రథం. దానికి సారథి బుద్ధి. కరచరణాది ఇంద్రియాలే గుర్రాలు. బుద్ధిచేసే భయంకరమైన ఆలోచనలే పగ్గాలు.

**విశేషం:** మనస్సు, బుద్ధి అనే మాటలను కొంత వివరించాల్సిన అవసరం ఉన్నది. మనస్సు- ఒక జ్ఞానేంద్రియం. పనులు చేయటానికి కావలసిన ప్రేరణ ఇచ్చేంతవరకే దానిపని. మంచి చెడుపనులకు రెంటికీ ప్రేరణ మనస్సే ఇస్తుంది.

బుద్ధి - మనసుకన్నా లోపలిపొర. సంకల్ప - వికల్పాలకు మీట (switch) బుద్ధి, విచక్షణ (discretion) బుద్ధి వ్యాపారం. అందుకే బుద్ధిని అంతఃకరణశక్తిగా చెప్పవచ్చును. శుశ్రూష, శ్రవణం, గ్రహణం, ధారణం, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానం, తత్త్వజ్ఞానం- ఇవి బుద్ధివ్యాపారాలుగా చెప్పబడ్డాయి.

చిన్నతనంలో ఎవరిని సేవిస్తామో, ఏది వింటామో, ఏది గ్రహించి మనసులో పదిలపరుచుకొంటామో, ఎట్లా ఊహిస్తామో, ఎట్లా తర్కిస్తామో, ఇహపరాలమీద ఏ ఆలోచనలు కలిగి ఉంటామో అవన్నీ కలిసి ఏర్పడే లోపలిపొర బుద్ధి. దానినిబట్టి ఆలోచన, దాన్నిబట్టి పని ఉంటాయి.

పగ్గాలు ఎట్లా లాగితే గుర్రాలు అట్లా పరుగిడుతాయి. అందుకని అవి బలిష్ఠంగా ఉండాలి. అప్పుడే గుర్రాలను అదుపు చేయగలుగుతాయి. దుర్మార్గపుటాలోచనలు బలిష్ఠంగా ఉన్నప్పుడు ఏమవుతుందో తరువాతి పద్యంలో (58) చెప్తున్నాడు. ఆ తరువాతి పద్యంలో (59) ఆలోచనలను ఎట్లా అదుపు చేయాలో చెప్పాడు. ఆ మీది పద్యంలో (60) ఈ దేహరథం ఎట్లా యముడి అధీనమో, వివేకంతో దానిని ఎట్లా నియంత్రించుకొనవచ్చో చెప్పాడు.

ఈ నాలుగు పద్యాల మూలాన్నీ కఠోపనిషత్తులో చూడవచ్చును. నచికేతునికీ యముడికీ సంవాదరూపంలో ఉన్న ఈ ఉపనిషత్తులో ఈ విషయం ఉన్నది.

**"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు**

**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ."**

(ఆత్మను రథంలోని యజమానుడిగా తెలిసికొనుము. శరీరమే రథం, బుద్ధి సారథి, మనస్సును కళ్ళెంగా తెలిసికొమ్ము.)

**"ఇంద్రియాణి హయా నాహుః విషయాంస్తేషు గోచరాన్,**

**ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః".**

(ఇంద్రియాలు గుర్రాలు. వాటి మార్గాలు ఇంద్రియ సుఖాలు. ధీమంతులు దేహేంద్రియ మనస్సులతో కూడిన 'ఆత్మను' 'భోక్త' అని పిలుస్తారు.)

తిక్కనగారు రథికుడు 'ఆత్మ' అనే విషయాన్ని అనువదించకపోయినా 'సత్త్వం' అనే మాటతో 'సారథి'ని సూచించటంలో ఈ మంత్రంలోని అర్థమంతా ఉన్నది. మనస్సు కళ్ళెం అనే మాటను కూడా 'ఆలోచనలు'గా చెప్పాడు.

**"య స్త్వవిజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా**

**తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః."**

(అయుక్తమైన మనస్సు కలవాడై అవిజ్ఞానవంతుడైన వాడికి సారథికి దుష్టాశ్వాలు వశం కానట్లు ఇంద్రియాలు వశం కావు.)

ఈ అర్థాన్నే తరువాతి పద్యంలో తిక్కనగారు చెప్తున్నారు.

క. **నరవర! యేర్పడ విను మ । త్తురగంబుల పటు రయంబుతో ననుసరతం**
**దిరుగు పురుషుండు సంసృతిఁ । బరువడి భ్రమియించు నవశభావవ్యాప్తిన్.** 58

**ప్రతిపదార్థం:** నరవర!= ఓ రాజా!; ఏర్పడన్= కుదురుగా; వినుము; ఆ+తురగంబుల= ఆ గుర్రాల; పటు= బలిష్ఠమైన; రయంబుతోన్= వేగంతో; అనుసరతన్= పాటుగా; తిరుగు పురుషుండు= తిరిగే మనిషి; అవశభావవ్యాప్తిన్= తన అధీనంలోలేని భావాలకు లోబడి; సంసృతిన్= సంసారంలో; పరువడిన్= క్రమంగా; భ్రమియించున్= అటూ ఇటూ భ్రమిస్తుంటాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! జాగ్రత్తగా వినుము. ఆ గుర్రాలు ఎంత వేగంగా వెళ్తే వాటి కనుగుణంగా ఎవరు తిరుగుతారో వారు తమ అధీనంలోలేని భావాలకు లోబడి ఈ సంసారంలో ఉరుకులు పరుగులతో అటూ ఇటూ భ్రమిస్తుంటారు.

**విశేషం:** ఇంద్రియాలు చెప్పినట్లుగా వింటూ పోతే చివరకి మిగిలేది 'బంధం' మాత్రమేనని తాత్పర్యం. సంసృతి - అనే పదం చాలా విశిష్టమైనది. ఎప్పటికీ కొనసాగుతూ పోయేదని అర్థం. ఆ ప్రయాణానికి అంతం ఉండదు. అందుకే పరుగెత్తటం అనటం. అంతే కాదు - నిర్దిష్ట గమ్యముండదు కాబట్టి 'భ్రమించటం' అనే మాటను తిక్కనగారు వాడారు.

**క. వానిఁ దమయిచ్చ నెందుం । బోనీ కుండంగ నాఁగు పురుషుఁడు సంసా**
**రానేక దుఃఖభాజన । తా నిరసనమునకు నేర్చు ధరణీనాథా! 59**

**ప్రతిపదార్థం:** ధరణీ నాథా!= రాజా!; వానిన్= ఆ గుర్రాలను; తమ ఇచ్చన్= తమ ఇష్టప్రకారం; ఎందున్+పోనీక+ఉండంగన్= ఎటూవైపూ పోనీకుండా ఉండేలా; ఆఁగు= ఆపేటువంటి; పురుషుఁడు= మనిషి; సంసార= సంసారంలోని; అనేక వివిధాలైన; దుఃఖ= దుఃఖాలకు; భాజనతా= పాత్రమగుటయొక్క; నిరసనమునకున్= తిరస్కారానికి; నేర్చున్= సమర్థ డౌతాడు.

**తాత్పర్యం:** రాజా! ఆ గుర్రాలను తమ ఇష్టం వచ్చినట్లు పోనీకుండా ఎవడు ఆపగలుగుతాడో అట్లాంటి మనిషి సంసారంలో అనేక దుఃఖాలపాలు కాకుండా ఉండటం నేర్చుకొనగలుగుతాడు.

**విశేషం:** పగ్గాలను రౌతు సరిగా నియమించకపోతే గుర్రాలు అదుపులో ఉండవు. తమ ఇష్టం వచ్చినట్లు పరిగెడుతాయి. ఎప్పుడు ఆలోచనలను గట్టిగా పట్టుకొని ఇంద్రియాలను అదుపుచేసికొంటామో అప్పుడు క్షేమంగా తేరును కాపాడుకొనగలుగుతాము.

కఠోపనిషత్తు ఈ విషయాన్ని ఇట్లా వివరిస్తున్నది.

**"యస్తు విజ్ఞానవా న్భవతి సమనస్కః స్సదా శుచిః**
**స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే."**

(ఎవడు వివేకవంతుడో, మనోనిగ్రహం కలవాడో, సదా పవిత్రుడో అట్లాంటివాడు పునరావృత్తిరహితమైన ఆ 'పరమ' పదాన్ని పొందుతాడు.

ఈ 'పరమపదం' అనే అర్థాన్నే 'దుఃఖభాజనతా నిరసన'మని తిక్కనగారు చెప్పుతున్నారు.

**క. యముని యధీనం బిది దుః । ఖముల ననేకములఁ జేయఁగా నోపు నృపో**
**త్తమ! యీరథ మది యడఁతురు । విమలవివేకౌషధమున విను మార్యజనుల్. 60**

**ప్రతిపదార్థం:** నృపోత్తమ!= రాజశ్రేష్ఠుడా!; వినుము; ఇది= ఈ జీవితం; యముని= కాలస్వరూపుడైన యమధర్మరాజుయొక్క; అధీనంబు= అధీనంలో ఉంటుంది (అంతేకాదు); అనేకములన్= నానా విధాలైన; దుఃఖములన్; చేయఁగాన్= కలిగించటానికి;

ఓపున్= సమర్థమైనది; ఆర్యజనుల్= పుణ్యాత్ములు (ప్రాజ్ఞులు); విమల= పవిత్రమైన; వివేక= వివేకమనే; ఔషధమునన్= మందుతో; ఈ రథము+అది= (ఈ శరీరం ఏదైతే ఉందో) దాన్ని; అడఁతురు= అధీనంలో ఉంచుకొంటారు.

**తాత్పర్యం:** రాజా! వినుము. ఈ జీవితం యముడి అధీనంలో ఉంటుంది. అంతే కాకుండా ఎన్నో విధాలైన దుఃఖాలకు ఇది నిలయం. అందుచేత పుణ్యాత్ములు వివేకమనే మందుతో శరీరమనే ఈ తేరును అదుపులో ఉంచుకొంటారు.

**విశేషం:** అలం: రూపకం. అకార్యం (చేయదగింది, చేయరానిది) అనే రెండు విషయాలను గురించి వివేచన ఉండటమే వివేకం. బుద్ధికి ఉన్న శక్తులన్నీ కలిగించేది వివేకాన్ని. ఆ శక్తులు దురుపయోగంపాలు అయితే అవివేకం ఏర్పడుతుంది. అపుడు ఇంద్రియాలు విజృంభిస్తాయి. ఫలితం రుజ-జర ఇత్యాదిగా ఉన్న అనారోగ్యం. దీనికి మందు వివేకమే. అందుకే 'వివేకౌషధమునన్' అని చెప్పటం.

**వ.** **ఆ పగ్గంబులు శీలంబను వెరవుతో నలవరించి వేగం బార్యు లుడుపుదురు వారలు జననమరణాదుల వలని భయంబు నుజ్జగించి పరమసుఖంబు నొందుదు రింతయు నెఱింగి శాంతినొంది పుత్రాది జ్ఞాతులకు నౌర్ధ్వదైహికంబులు సేయించి సుఖివిగ'మ్మనిన విని యమ్మాటలన్నియుం బోవిడిచి తుదింజెవి సూఁడినట్టి దయినఁ బుత్ర పరలోక క్రియావిషయంబగు మాటకు శోకం బతిశయిల్ల మూర్ఛిల్లె నట్టి సమయంబునం గృష్ణద్వైపాయనమునీంద్రుఁ డయ్యెడకు విజయంచేసిన విదురసంజయాదులు సంభ్రమంబున నెదురువచ్చి ప్రణతులైధృతరాష్ట్రునకు శిశిరజలసేచన లలితవ్యజనవీజనంబుల నాచరించిన నతండు సేదదేఱుటయు నతని కమ్మహాత్ముని రాక యెఱింగించిన నమ్మహీపతి యతనికి దండనమస్కారంబుసేసి గద్గదిక నెలుంగు రాలుపడ నిట్లనియె.** **61**

**ప్రతిపదార్థం:** ఆర్యులు= పుణ్యాత్ములు; ఆ పగ్గంబులు= ఆ పగ్గాలను; శీలంబు= నడవడి; అను= అనేటువంటి; వెరవుతోన్= ఉపాయంతో; అలవరించి= నియమించి; వేగంబు= ఆ గుర్రాల వేగాన్ని; ఉడుపుదురు= నియంత్రిస్తారు; వారలు= అట్లాంటి పుణ్యాత్ములు; జనన= పుట్టుకవలన; మరణ+ఆదుల వలని= మరణం మొదలైన వాటివలన (కలిగే); భయంబున్= భయాన్ని; ఉజ్జగించి= వదలిపెట్టి; పరమసుఖంబున్= మోక్షాన్ని; ఒందుదురు= పొందుతారు; ఇంతయున్+ఎఱింగి= ఇదంతా గుర్తించి; పుత్ర+ఆది జ్ఞాతులకున్= కొడుకులకు దాయాదులందరికీ; ఔర్ధ్వదైహికంబులు= ఉత్తర క్రియలు; చేయించి; సుఖివి+కమ్ము+అనినన్= సుఖంగా ఉండుము అని చెప్పగా; విని= వినికూడా; ఆ+మాటలు+అన్నియున్= ఆ మాటలన్నిటిని; పోన్+విడిచి= వదలిపెట్టి; తుదిన్= చివరిలో; చెవి సూఁడినట్టి దయినన్= చెవిని కాల్చినటువంటిది కాగా; పుత్ర= కొడుకులయొక్క; పరలోక+ఉత్తర; క్రియా విషయంబు+అగు+మాటకున్= క్రియలకు సంబంధించిన మాటలచేత; శోకంబు+అతిశయిల్లన్= దుఃఖం పెల్లుబికిరాగా; మూర్ఛిల్లెన్= మూర్ఛపోయాడు; అట్టి సమయంబునన్= ఆ సమయంలో; కృష్ణద్వైపాయన మునీంద్రుఁడు= వ్యాసుడు; ఆ+ఎడకున్= అక్కడికి; విజయము+చేసినన్= రాగా; విదుర సంజయులు= విదురుడు, సంజయుడు; సంభ్రమంబునన్= ఆశ్చర్యంగా; ఎదురువచ్చి= ఎదుర్కొని (ఆహ్వానించి); ప్రణతులు+ఐ= నమస్కరించి; ధృతరాష్ట్రునకున్= రాజుకు; శిశిరజల= చల్లటి నీటిని; సేచన= చల్లడమూ; లలిత= సుకుమారంగా; వ్యజన వీజనంబులన్= విసనకర్రతో విసరడమూ; ఆచరించినన్= చేయగా; అతండు; సేదదేఱుటయున్= బడలికదీరగా; అతనికిన్= ధృతరాష్ట్రునికి; ఆ+మహాత్మునిరాక= వ్యాసుడిరాకను; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+మహీపతి= ఆ రాజు; అతనికిన్= వ్యాసుడికి; దండనమస్కారంబు+చేసి= సాష్టాంగ నమస్కారం చేసి; గద్గదికన్= డగ్గుత్తికతో; ఎలుంగు= కంఠధ్వని; రాలుపడన్= కంపిస్తుండగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ములు ఆ పగ్గాలను నడవడి అనే ఉపాయంతో నియంత్రించి ఆ గుర్రాల వేగాన్ని అదుపులో ఉంచుకొంటారు. అట్లాంటి పుణ్యాత్ములు పుట్టుక మరణం మొదలైన వాటివలన కలిగే భయాన్ని విడిచిపెట్టి మోక్షసుఖాన్ని పొందుతారు. ఇదంతా గుర్తించి నీవు నీ పుత్రాదులకు, నీ దాయాదులకు ఉత్తరక్రియలు జరిపించి సుఖంగా ఉండుము' అని చెప్పగా విని, ఆ మాటలన్నిటినీ వదలిపెట్టి చివరిలో 'నీ పుత్రులకు ఉత్తరక్రియలు చేయుము' అన్నమాట చెవిని కాల్చివేయగా, దుఃఖం పెల్లుబికి రాగా, మూర్ఛపోయాడు. ఆ సమయంలో సరిగ్గా వ్యాసుడు అక్కడికి వచ్చాడు. విదురుడు, సంజయుడు మున్నగువారు ఆశ్చర్యపడి గౌరవంతో ఆయనను ఆహ్వానించి నమస్కరించారు. మరొకవైపు ధృతరాష్ట్రుడి ముఖంపైన చల్లని నీటిని చల్లి, విసనకర్రలతో నెమ్మదిగా విసిరి ఉపచారాలు చేశారు. సేదదీరిన ధృతరాష్ట్రుడికి వ్యాసముని రాకను తెలిపారు. ఆ రాజుకూడా గౌరవంతో వ్యాసమహర్షికి సాష్టాంగ నమస్కారంచేసి డగ్గుత్తికతో గొంతు కంపిస్తుండగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇంతమంది ఇన్ని విధాలుగా ఉపదేశించినా దేహధారి తన ఇంద్రియాల మార్గంలోనే వెళ్తాడని చెప్పటం కొరకే ధృతరాష్ట్రుడి ఈ అవస్థను వర్ణించటం. రాష్ట్రమంటే-శరీరం, దానిని ధృత-ధరించినవాడు. అతడి పిల్లలే అతడి ఇంద్రియాలు. రాజ్యభోగమే అతడి మనసుకున్న లోభగుణం. అందుకే పుత్రులమాట వినగానే 'వివేకం' నశిస్తుంది. భారత కథకంతా మూలం ఇదే.

**దోధక వృత్తము:**

> **'మానుష జన్మము మాన్య వివేకా! । మానసదుఃఖ సమాజము నెల్లం**
> **దాన ఘటించుచు దైన్యము దెచ్చుం । గాన భవంబిది గాల్పనె? తండ్రీ!** **62**

**ప్రతిపదార్థం:** మాన్య= మహనీయమైన; వివేకా!= జ్ఞానం కలవాడా! (వ్యాసమహర్షీ); మానుషజన్మము= మానవజన్మ; మానస దుఃఖ సమాజమునెల్లన్= మనసుకు అన్ని విధాల దుఃఖాలనూ; తాను+అ= తానే; ఘటించుచున్= సృష్టిస్తూ; దైన్యమున్+తెచ్చున్= దీనస్థితిని కల్పిస్తుంది; కాన= కాబట్టి; తండ్రీ!= ఓ తండ్రిగారైన వ్యాసమహర్షీ!; భవంబు+ఇది= ఈ పుట్టుక; కాల్పనె?= కాల్చటానికా? (నిష్ప్రయోజనమని అర్థం.)

**తాత్పర్యం:** 'మహనీయజ్ఞాన సంపన్నుడవైన వ్యాసమహర్షీ! ఈ మానవజన్మ తానంతట అదే మనస్సుకు అన్ని విధాలైన దుఃఖాలను సృష్టించి దీనస్థితిని కల్పింపజేస్తుంది. అందుచేత తండ్రీ! ఈ జన్మం ఎందుకు? కాల్చనా? (చివరకి ఎట్లాగూ జరిగే పని అదే!) ప్రయోజనం ఏమున్నది?

**విశేషం:** భవశబ్దానికి పుట్టుక-జన్మ-సంసారం- అని సందర్భాన్నిబట్టి అర్థాలుంటాయి. భూ-అనే ధాతువుకు పుట్టటమని అర్థం-ఎప్పటికప్పుడు కొత్తగా అనిపిస్తూ పుట్టేదికాబట్టి దీనిని జన్మమని-కొత్తగా ఏదో సమస్య పుట్టుతూనే ఉంటుంది. కాబట్టి-సంసారమని-అంటాం.

దోధక వృత్తంలో పాదానికి - భ, భ, భ, గ, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ, ఏడవ అక్షరానికీ యతిమైత్రి, ప్రాస నియమం కలదు.

**మంజుభాషిణీ వృత్తము:**

**ధనమంతయుం బొలియ దారుణంబుగాఁ । దనయవ్రజంబు దెగ దైన్యమారఁగాఁ**
**దన బంధులందఱు మృతంబుఁ బొంద నె । వ్వనినైన శోకమనువహ్ని కాల్పదే? 63**

**ప్రతిపదార్థం:** ధనమంతయున్= ధనమంతా; పొలియన్= నశించిపోగా; దారుణంబుగాన్= ఘోరంగా; తనయవ్రజంబు= కుమారుల సమూహం; తెగన్= చనిపోగా; దైన్యము+ఆరఁగాన్= దీనత్వమతిశయించగా; తనబంధులు+అందఱున్; మృతంబున్+ పొందన్= చావును పొందగా; ఎవ్వనిన్+ఐనన్= ఎవడినైనా; శోకమను= శోకమనేటువంటి; వహ్ని= అగ్ని; కాల్పదే?= కాల్చదా?

**తాత్పర్యం:** ఉన్న ధనమంతా నశించి, కొడుకులందరూ చచ్చి, బంధువులందరూ ఒక్కసారిగా పోతే, ఎవడినైనా ఆ దుఃఖమనే అగ్ని దహించకుండా ఉంటుందా?

**విశేషం:** అలం: రూపకం. మంజుభాషిణీ వృత్తంలో ప్రతిపాదంలోనూ స, జ, స, జ, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ తొమ్మిదవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**ఉపజాతి వృత్తము:**

**మునీంద్ర! నిర్భాగ్యత ముట్టి చావుం । గానేరదయ్యెం గడుగట్టి చిత్తం**
**బనూన మూర్ఛం దెగటారియుఁ దా । రానేర్చె నిమ్మేనికిఁ గ్రమ్మఱంగన్. 64**

**ప్రతిపదార్థం:** మునీంద్ర!= వ్యాసమహర్షీ!; నిర్భాగ్యత= దౌర్భాగ్యం; ముట్టి= ఆవరించి; చావున్= చావుకూడా; కాన్+నేరదయ్యెన్= రానిదయింది (రాకపోయింది); కడున్+గట్టి+చిత్తంబు= (నాది) చాలా గట్టి మనస్సు; అనూన= గొప్పదైన; మూర్ఛన్= మూర్ఛలో; తెగటారియున్= నశించికూడా; క్రమ్మఱంగన్= మళ్ళీ; ఈ+మేనికిన్= ఈ దేహంలోకి; తాన్= (ప్రాణం) తాను; రాన్+నేర్చెన్= రాగలిగింది (అంటే చనిపోతే బాగుండేదని అర్థం).

**తాత్పర్యం:** మహర్షీ! నా దౌర్భాగ్యం ఏమని చెప్పాలి! నాకు చావుకూడా రావటంలేదు. నాది చాలా గట్టి మనస్సు. లేకపోతే ఇంత పెద్ద మూర్ఛలో మునిగికూడా మళ్ళీ ఈ బొందిలోకి ప్రాణం రాగలిగింది.

**విశేషం:** ఐదు ప్రాణాలున్నాయని శారీరక శాస్త్రం చెప్తుతుంది. నాగ-కూర్మ-కృకర-దేవదత్త-ధనంజయాలని వీటిపేర్లు. నాగం-వాగ్ ద్వారంలో ఉండేది; కూర్మం-కంటిరెప్పలలో ఉంటుంది. కృకర-తుమ్మును కలిగిస్తుంది. దేవదత్తం-ఆవులింతను కలిగిస్తుంది-దేహమంతటా 'ధనంజయ' మనే ప్రాణం వ్యాపించి ఉంటుంది. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానాలని వరుసగా హృదయ, గుద, నాభి, కంఠ, సర్వశరీరాలను ఆశ్రయించి ఈ 'పంచప్రాణాలూ' వ్యాపించి ఉంటాయి. నాగకూర్మాది నామాలు కలిగినవి పంచప్రాణాల పేర్లు అని కొందరు. ఉపప్రాణాలు, లేదా ఉపవాయువులని కొందరు అంటారు. 'మనస్సంకల్ప' రూపంతో దృఢంగా ఉన్న 'ధనంజయ' మనే ప్రాణం వ్యాపించి ఉంటుంది.

## కృష్ణద్వైపాయనముని ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు చేయుట (సం. 11-8-12)

**వ. ఇంక నేమిసేయువాఁడ' నని పలికి యూరకున్న యన్నరనాథునకు మునినాథుం డి ట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇంక; ఏమి+చేయువాఁడను?= ఏం చేయగలను?; అని పలికి; ఊరకున్నన్= ఊరకుండగా; ఆ+ నరనాథునకున్= ఆరాజుతో; మునినాథుండు= శ్రేష్ఠుడైన వ్యాసమహర్షి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లాంటి స్థితిలో నేను ఏం చేయగలను?' అనిమాత్రమని ఊరకున్న ధృతరాష్ట్రుడితో వ్యాసుడు ఇట్లా చెప్పాడు.

**ఉత్సాహవృత్తము;**

**'నీవు ధర్మభంగి నెఱుఁగ నేర్తు నీతి కౌశలం । బావహిల్లు నీదు మనమునందుఁ గాన నేను శో**
**కావిలత్వ ముడుపఁబూని యరుగుదెంచితిన్ సుతా । భావజనిత దుఃఖవార్ధిపార మెయ్యు పుత్రకా! 66**

**ప్రతిపదార్థం:** పుత్రకా!= కుమారా!; నీవు; ధర్మభంగిన్= ధర్మవిధిని; ఎఱుఁగన్+నేర్తు(వు)= తెలిసినవాడివి; నీదు మనమునందున్= నీ మనసులో; నీతి కౌశలంబు= నీతి పథంలోని నేర్పు; ఆవహిల్లున్= ఉంది; కానన్= అందుకే; శోక+ఆవిలత్వము= శోకంచేత పుట్టిన కలతను; ఉడుపన్+పూని= పోగొట్టాలని; నేను+అరుగుదెంచితిన్= నేనువచ్చాను; సుత+అభావ+జనిత= కొడుకులు మరణించటంచేత పుట్టిన; దుఃఖవార్ధిన్= దుఃఖమనే సముద్రాన్ని; ఎయ్యు(ము)= దాటుము.

**తాత్పర్యం:** 'కుమారా! నీవు ధర్మవిధి ఎరిగినవాడవు. నీవు నీతిశాస్త్ర కుశలుడవు. అందుచేత నీకు శోకాన్ని పోగొట్టి శాంతిని ప్రసాదించాలని నేను వచ్చాను. పుత్రుల మరణంచేత పుట్టిన దుఃఖసముద్రాన్ని దాటి శాంతిని పొందుము.

**విశేషం:** అభావం-అంటే లేకపోవటం: ఈ సందర్భంలో అభావం అంటే మరణం చేత ఏర్పడ్డ అభావమని అర్థం. వృత్తవిశేషానికి చూడండి: స్త్రీ. 1.48.

**క. భూతము లనిత్యములు నీ । వీ తెరు వెప్పడును విం దహీన ధృతిన్ నీ**
**చేతోగతి నలవఱుపుము । భూతానిత్యత్వ మదియ పుచ్చును వగలన్. 67**

**ప్రతిపదార్థం:** భూతములు= ప్రాణులు; అనిత్యములు= అశాశ్వతాలు; నీవు; ఈ తెరువు= ఈ ధర్మాన్ని గురించి; ఎప్పుడును= ఎప్పుడూ; విందువు= వింటూనే ఉన్నావు; అహీన= గొప్ప; ధృతితోన్= ధైర్యంతో; భూత+అనిత్యత్వము= ప్రాణుల అశాశ్వతత్వమనే ఈ ధర్మాన్ని; చేతోగతిన్= మనసులో; అలవఱుపుము= (చక్కగా) అభ్యసించుము; అది+అ= ఆ జ్ఞానమే; వగలన్= నీ దుఃఖాన్ని; పుచ్చును= పోగొడుతుంది.

**తాత్పర్యం:** ప్రాణులు అన్నీ అశాశ్వతాలే. ఈ ధర్మాన్ని గురించి నీవు ఎప్పుడూ వింటూనే ఉన్నావు. గొప్ప ధైర్యంతో నీ మనస్సులో ప్రాణులు అశాశ్వతమనే ఈ ధర్మాన్ని అభ్యసించటం మొదలుపెట్టుము. ఆ జ్ఞానమే నీ దుఃఖాన్ని పోగొట్టుతుంది.

**విశేషం:** భూతం-అనేమాటకు నీరు, భూమి, వాయువు, ఆకాశం, అగ్ని అనే పంచభూతాలూ, ప్రాణం కలిగినవి, ప్రాణంలేనివి, జంతువులు, పక్షులు, మనుష్యులు - అనే ఇన్ని అర్థాలూ ఉన్నాయి. వెరసి మొత్తం 'ప్రకృతి' అని అర్థం. ఇది మార్పును పొందుతుంది, కాబట్టి అశాశ్వతం. ఆత్మ ఒకటే శాశ్వతమైనది- దానికి మార్పులేదు. అందుచేత ఆత్మనిత్యత్వ స్ఫురణ ఉండి 'జీవి' అశాశ్వతత్వాన్ని గురించి ఎరిగి, జీవితాన్ని ఆ జ్ఞానంతో గడపటంచేత విషాదాన్ని దాటగలడని తాత్పర్యం. కాని, ఈ జ్ఞానం వినుకలిచేత వచ్చేది కాదు. నిరంతరసాధనచేతనే వస్తుంది. అందుకే అభ్యసించుమని చెప్పటం.

**ఆ. అరయ జీవలోక మధ్రువ మన నరు । నొడలి బ్రదుకు చావుఁ గడవ దనఁగ**
**వినియు నెల్లఁ గనియు వీతవివేకతఁ । బుత్ర మరణమునకుఁ బొగుల నగునె? 68**

**ప్రతిపదార్థం:** అరయన్= బాగా ఆలోచిస్తే; జీవలోకము= ప్రాణిలోకం; అధ్రువము+అనన్= అశాశ్వతమైనదనీ; నరున్= మనిషియొక్క; ఒడలి బ్రదుకు= దేహంతోటి ఈ జీవితం; చావున్= మరణాన్ని; కడవదు+అనఁగన్= తప్పించుకోజాలదు అని; వినియున్= వినీ; ఎల్లన్+కనియున్= అన్నిటినీ చూచీ; వీత= పోయిన, వివేకతన్= జ్ఞానంతో; పుత్ర మరణమునకున్= పుత్రుల మరణానికి; పొగులన్+అగునె?= శోకించటం తగునా?

**తాత్పర్యం:** బాగా ఆలోచిస్తే ప్రాణిలోకం అశాశ్వతమైనదని, మనిషి దేహంతోడి ఈ జీవితం మరణాన్ని తప్పించుకొనజాలడని విని, ఇట్లాంటి నిజాలను చూచి వివేకజ్ఞానాన్ని కోల్పోయి పుత్రుల మరణానికి శోకించటం తగని పని.

**వ. అదియునుం గాక. 69**

**తాత్పర్యం:** అంతమాత్రమే కాకుండా.

**సీ. నీ వెఱుంగక యుండఁగా వచ్చెనే వైర । బంధంబు కౌరవపాండవులకు?**
**నీ పుత్త్రకుండ దీనికిఁ గారణం బిది । విధి నిర్మితంబైన విధము సువ్వె!**
**కౌరవజాతి సంక్షయ మవశ్యంబుగాఁ । గలయదియై చెల్లెఁగాక క్రొత్త**
**యైనదియే? బంధు లాజి విహార త । త్పరతమై సద్గతిఁ బడసినారు**

**ఆ. వారి కేల యింత వగవ నట్లును గాక । విమలబుద్ధియైన విదురుఁ డిట్టు**
**లగుట యెఱిఁగి బుద్ధి తగఁ జెప్పె నీకు జూ । దంబు సమయమునన దాని వినవ. 70**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ఎఱుంగక+ఉండఁగాన్= తెలియకుండా; కౌరవపాండవులకున్= కౌరవులకు; పాండవులకు; వైరబంధంబు= వైరరూపమైన బంధం; వచ్చెనే?= కలిగినదా?; నీ పుత్రకుండు+అ= నీ కొడుకే; దీనికిన్= దీనికంతటికీ; కారణంబు= కారణం; ఇది= ఇట్లా కావటం; విధి= విధిచేత (దైవంచేత); నిర్మితంబు+ఐన= కల్పించబడిన; విధము+చువ్వె!= పద్ధతి సుమా!; కౌరవజాతి= కురువంశీయుల; సంక్షయము= నాశనం; అవశ్యంబుగాన్= తప్పని సరిగా; కాన్+కల+అది+ఐ= జరగాల్సి ఉండి; చెల్లెన్+కాక= అట్లా జరిగిపోయింది తప్ప; క్రొత్త+ఐనది+ఏ?= ఇదేమి కొత్త విషయమా?; బంధులు= బంధువులందరూ; ఆజి= యుద్ధం అనే; విహార తత్పరతమైన్= విహారంలో ఆసక్తి కలవారై; సత్+గతిన్= సుగతిని; పడసినారు= పొందారు; వారికిన్= వారికోసం; ఇంత= ఇంతగా; వగవన్= దుఃఖించటం; ఏల?= ఎందుకు?; అట్లునున్+కాక= అంతేకాకుండా; విమలబుద్ధి+ఐన= పవిత్ర బుద్ధి కలిగిన; విదురుఁడు; ఇట్టులు+అగుట= ఇట్లా కాబోతుందని; ఎఱిఁగి= తెలిసినవాడై; నీకున్= నీకు (నీ కుమారునికి); తగన్= ఎన్నో విధాలుగా; జూదంబు సమయమునన్+అ= జూదమాడే సమయంలోనే; బుద్ధి+చెప్పెన్= నీతి బోధించాడు; దానిన్= దానిని; వినవు+అ= నీవు వినకపోతివి.

**తాత్పర్యం:** నీకు తెలియకుండా కౌరవ పాండవులకు వైరం కలిగిందా! నీకొడుకే ఇంతటికీ మూలం. ఇట్లా కావటం దైవవిధి. అందుకే అనివార్యంగా కౌరవ వంశం నాశనమైంది. అంతేకాని ఇదేం కొత్త విషయం కాదే! బంధువులందరూ యుద్ధమనే ఆటలో ఆసక్తి కలవారై (ఆడి) సుగతిని పొందారు. వారికొరకు ఇంతగా దుఃఖం పొందటం ఎందుకు? అంతేకాకుండా పరమ పవిత్ర బుద్ధి కలిగిన విదురుడు ఇట్లా కాబోతుందని తెలిసినవాడై ఆనాడు ద్యూతసమయంలోనే నీకూ నీ కుమారునికీ ఎన్నో విధాలుగా నీతిబోధ చేశాడు. కాని, నీవు దానిని విన్నావు కావు.

**దోధక వృత్తము:**

**దేవ కృతంబులు ధీరులకైనన్ । భూవర! మాన్పఁగఁ బోలునె? యెట్లుం**
**గావున శోకముఁ గాఱియ దల్గం । గా వలదే తుది గౌరవ మొప్పన్? 71**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; దేవకృతంబులు= దైవ నిర్ణయాలు (దేవతల పనులు); ధీరులకున్+ఐనన్= ఎంత ధీరులకైనా; ఎట్లున్= ఎట్లాగైనా; మాన్పఁగన్+పోలునె?= ఆపటానికి అవుతుందా?; కావునన్= అందుచేత; శోకమున్= శోకమును; కాఱియన్= బాధను; తుదిన్= చివరికి; గౌరవము+ఒప్పన్= నీకు మన్నన ఏర్పడేలా; తల్గన్+కాన్+వలదే?= పోగొట్టుకోవద్దా?

**తాత్పర్యం:** రాజా! దేవతల పనులను ఎంత ధీరులైనా ఎంత ప్రయత్నించినా ఆపలేరు. అవి అట్లాగే జరుగుతాయి. అందువలన నీ గౌరవాన్ని, వంశప్రతిష్ఠను నిల్పుకొనటానికైనా నీ శోకాన్నీ, బాధనూ పోగొట్టుకొమ్ము.

**విశేషం:** 'భీష్మాదులు జన్మించిన సద్వంశంలో పుట్టిన నీవు శోకిస్తూ కూర్చోవటం అనుచితమైనపని' - అని వంశగౌరవాన్ని గుర్తుచేయటం అతనిలో ఆత్మవిశ్వాసాన్ని నింపటం కోసమే. వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1.62

**వ. దేవతలకుం గృత్యంబయిన దానిఁ దత్ప్రత్యక్షంబున వింటి నది నీకు మేలు గోరిచెప్పెద నాకర్ణింపు; మే నశ్రమంబున నెందయినఁజరింతు నొక్కనాఁడు దేవసభకుంబోయితి నందుఁబురందరప్రముఖ బృందారకులను నారదాదిమునిబృందములనుంగాంచి సుఖగోష్ఠినున్న సమయంబున భూదేవి యచ్చటికి వచ్చి య వ్విబుధులతో నిట్లనియె. 72**

**ప్రతిపదార్థం:** దేవతలకున్= దేవతలకు; కృత్యంబయిన దానిన్= చేయదగ్గ పనిని గురించి (చేయబోయే దాన్ని గురించి); తద్+ఆ దేవతల; ప్రత్యక్షంబునన్= సమక్షంలోనే; వింటిన్= విన్నాను; అది= ఆ విషయాన్ని; నీకున్; మేలు+కోరి= మేలు కావాలన్న కోరికతో; చెప్పెదన్= చెబుతాను; ఆకర్ణింపుము= వినుము; ఏను= నేను; అ(శ్రమంబునన్= ఏ శ్రమాలేకుండానే; ఎందయినన్= ఎక్కడికి కావాలన్నా; చరింతున్= వెళ్తాను; ఒక్కనాడు; దేవసభకున్= స్వర్గంలో దేవతల సభకు; పోయితిన్= వెళ్ళాను; అందున్= ఆ సభలో; పురందర= ఇంద్రుడు; ప్రముఖ= మొదలైన; బృందారకులను= దేవతలను; నారద+ఆది= నారదుడు మొదలైన; ముని బృందములనున్= మునుల సమూహాలను; కాంచి= చూచి; సుఖగోష్ఠినున్న సమయంబునన్= ఇష్టాగోష్ఠిలో ఉన్న సమయంలో; భూదేవి; అచ్చటికిన్+వచ్చి= ఆ సభలోకి వచ్చి; ఆ+విబుధులతోన్= ఆ దేవతలతో; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** దేవతలు ఏం చేయబోతున్నారన్న విషయాన్ని ఆ దేవతల సమక్షంలోనే ఒకప్పుడు నేను విన్నాను. ఆ విషయాన్ని నీకు జ్ఞానం కలగటం కొరకు చెప్పుతాను వినుము. నేను ఏ శ్రమా లేకుండా ఎక్కడికి కావాలన్నా వెళ్ళగలను. ఒకనాడు దేవసభకు వెళ్ళాను. ఆ సభలో ఇంద్రాది దేవతలు, నారదాది మహర్షులు ఉన్నారు. వారి నందరినీ చూచి ఇష్టాగోష్ఠిలో ఉన్న సమయంలో ఆ సభలోకి భూదేవి వచ్చి దేవతలతో ఇట్లా అన్నది.

**క. 'మీరలు బ్రహ్మసభను మ । ద్భారము మాన్పుటకు నలిని బనిఁబూనితి రె**
**క్కారణమునఁ దడసితి రొకొ? । యేరూపునఁ దలుఁగుదాన నేను భరంబున్? 73**

**ప్రతిపదార్థం:** మీరలు= మీరందరూ (ఒకప్పుడు); బ్రహ్మసభను= బ్రహ్మదేవుడి సన్నిధిలో జరిగిన సభలో; మత్+భారము= నాపై ఉన్న దుష్ట భారాన్ని; మాన్పుటకున్= తొలగించటానికి; నలిని= ఉత్సాహంతో; పనిన్+పూనితిరి= ఏదో ఒకటి చేయాలని

పూనుకొన్నారు; ఏ+కారణమునన్= ఏ కారణంచేత; తడసితిరి+ఒకొ?= ఆలస్యం చేస్తున్నారో? (చెబుతారా); నేను; భరంబున్= ఈ భారాన్ని; ఏ రూపునన్= ఏ విధంగా తలుఁగుదానన్?= తగ్గించుకోగలను?

**తాత్పర్యం:** 'దేవతలారా! మీరంతా ఒకప్పుడు బ్రహ్మసన్నిధిలో జరిగిన సభలో నాపై ఉన్న దుర్భర భారాన్ని తొలగించటానికి ఎంతో ఉత్సాహంతో ఏదో ఒక పనిచేయాలని పూనుకొన్నారు. మరి ఏ కారణంచేత మీరు ఆలస్యం చేస్తున్నారో ఏమో! నేను ఈ భారాన్ని ఏ విధంగా తగ్గించుకొనగలను? (మీరే చెప్పండి)'.

**వ. అనిన విని సర్వలోక నమస్కృతుండగు నారాయణుండు నవ్వుచు న వ్వెలంది కిట్లనియె. 74**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడుగగా; విని; సర్వలోక= అన్ని లోకాలలోని వారిచేత; నమస్కృతుండు+అగు= నమస్కరింప బడేటటువంటివాడైన; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; నవ్వుచున్= నవ్వుతూ; ఆ+వెలందికిన్= ఆ భూదేవితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** అని భూదేవి అడుగగా సర్వలోకాలలోనూ నమస్కరించ బడేటటువంటి శ్రీమహావిష్ణువు నవ్వుతూ ఆమెతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** లోకానికంతా ఏది భారమో అది శ్రీమహావిష్ణువుకు ఒక ఆటలాంటిదని అర్థం. అందుకే ప్రతి అవతారమూ ఆయనకు ఒక 'లీల' అని పురాణాలు చెబుతున్నాయి. అందుకే ఈ లోకమంతా అతడి 'లీల' లో భాగమని భాగవతం చెబుతుంది. అందుకే విష్ణువు 'నవ్వటం'. ఈ హాసం కూడా 'లీలా విలాసం'లో భాగమేనని అర్థం. నరుడి కథలో జరగబోయే మార్పు నారాయణుడికే తెలుసునని ఈ సందర్భానికి అర్థం.

**తే. 'వినుము ధృతరాష్ట్రుఁ డనురాజు తనుజశతముఁ । బడయు దుర్యోధనుం డనఁబరఁగు పెద్ద**
**కొడుకు నీ భారతమంతయు నుడుపు నతఁడు । తడయ కయ్యెడు నది వగఁ దక్కు మబల! 75**

**ప్రతిపదార్థం:** అబల!= ఓ భూదేవీ!; వినుము; ధృతరాష్ట్రుఁడు+అనురాజు= ధృతరాష్ట్రుడనే పేరున్న రాజు; తనుజ శతమున్= నూరుగురు కుమారులను; పడయున్= పొందుతాడు; దుర్యోధనుండు+అనన్+పరఁగు= దుర్యోధనుడనే పేరున్న; పెద్ద కొడుకు; అతఁడు; నీ భారమంతయున్= నీ భారాన్ని అంతటినీ; ఉడుపున్= పోగొడతాడు; అది= ఆ పోగొట్టటం; తడయక+ అయ్యెడున్= తొందరలోనే జరుగుతుంది; వగన్= దుఃఖాన్ని; తక్కుము= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** 'భూదేవీ! వినుము. ధృతరాష్ట్రుడనే రాజు నూరుగురు కొడుకులను పొందుతాడు. వారిలో దుర్యోధను డనేవాడు పెద్దకొడుకు. నీ దుర్భర భారాన్నంతా సంపూర్ణంగా పోగొట్టుతాడు. అది కూడా తొందరలోనే జరుగుతుంది. ఇక శోకించవద్దు.

**వ. ఎట్లనిన. 76**

**తాత్పర్యం:** ఎట్లాగంటే.

**క. వానిం జంపను గావం । బూని సకలరాజలోకమును నీసుమెయిన్**
**సేనాసముదయములునుం । దానుఁ గురుక్షేత్ర సమర దారుణతఁ దెగున్. 77**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ దుర్యోధనుడిని; చంపనున్= చంపటానికి; కావన్= కాపాడటానికి; సకల రాజలోకమునున్= రాజులందరూ; ఈ సుమెయిన్= ఈర్ష్యతో; సేనాసముదయములునున్= సేనా సమూహాలూ; తానున్= సకలరాజలోకమూ; కురుక్షేత్ర= కురుక్షేత్రంలో జరిగే; సమర దారుణతన్= భయంకర యుద్ధంలో; తెగున్= చస్తుంది.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడిని కాపాడటానికి, చంపటానికి భారతభూమిలోని రాజులందరూ ఈర్ష్యతో చేరుతారు. చివరికి కురుక్షేత్రంలో జరిగే మహాయుద్ధంలో ఆ సకలరాజలోకమూ సైన్యాలతోపాటు ఘోరంగా చనిపోతుంది.

**వ.** **సోదరసముదయసహితంబుగా నతండును మృతుండగు; దానంజేసి భవదీయభారంబు వాయు నిశ్చింతంబునం జనుము భూతధారణం బాచరింపుము పొ'మ్మని పలికి యద్దేవిని వీడుకొలిపెఁ బదంపడి సకల ప్రజాసంహార కారణంబై కల్యంశంబున దుర్యోధనుండు జనియించె; నక్కుమారుండు.** **78**

**ప్రతిపదార్థం:** సోదర సముదయ= తమ్ముల గుంపుతో; సహితంబుగా= కూడ; అతండును= దుర్యోధనుడును; మృతుండు+ అగున్= చనిపోతాడు; దానన్+చేసి= అంచేత; భవదీయ= నీ; భారంబు+పాయున్= బరువు తగ్గిపోతుంది; నిశ్చింతంబునన్= నిశ్చింతగా; చనుము= వెళ్ళు; భూతధారణంబు= జీవులను ధరించటం; ఆచరింపుము= కొనసాగించుము; పొమ్ము; అని పలికి; ఆ+దేవిని= ఆ భూదేవిని; వీడుకొలిపెన్= పంపించాడు; పదంపడి= ఆ వెనుక; సకల ప్రజాసంహార= ప్రజలందరి మృతికీ; కారణంబు+ఐ= కారణం అవుతూ; కలి+అంశంబునన్= కలి అంశతో; దుర్యోధనుండు; జనియించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** సోదరులందరితో కూడా ఆ దుర్యోధనుడు చనిపోతాడు. అందువలన నీ భారం పూర్తిగా తగ్గిపోతుంది. నిశ్చింతగా వెళ్ళుము. మునుపటివలె జీవులను భరించే నీ పనిని చేస్తూ ఉండుము' - అని పలికి ఆ భూదేవిని నారాయణుడు ఓదార్చి పంపించాడు. ఆ వెనుక రాజులందరూ చనిపోవటానికి కారణమైన 'కలి' అంశతో దుర్యోధనుడు పుట్టాడు.

**విశేషం:** భూమికి 'భూతధాత్రి' అని పేరు - అన్ని భూతాలను ధరిస్తుంది కాబట్టి.

**తే.** **ఒరుల యున్నతి సయిరింపనోపఁ డధిక । బలుఁడు క్రోధి శూరత్వసంపన్నబుద్ధి**
**బుద్ధి సెప్పిన వినియెడు ప్రోడగాఁడు । గాన వైరంబు విడువఁడు కౌరవేంద్ర!** **79**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కురువంశీయులలో శ్రేష్ఠుడా!; ఒరుల= ఇతరుల; ఉన్నతి= గొప్పతనాన్ని; సయిరింపన్+ఓపఁడు= సహించలేడు; అధికబలుఁడు= మిక్కిలి బలవంతుడు; క్రోధి= క్రోధనుడు (కోపమున్నవాడు); శూరత్వ= పరాక్రమంతో; సంపన్న= నిండిన; బుద్ధి= చిత్తవృత్తి కలిగినవాడు; బుద్ధి+చెప్పినన్= ఇతరులు నీతి చెబితే; వినియెడు= వినేటువంటి; ప్రోడ= ప్రౌఢుడు (విచక్షణ ఉన్నవాడు); కాఁడు; కానన్= అందువలన; వైరంబున్= విరోధాన్ని; విడువఁడు= వదలిపెట్టడు.

**తాత్పర్యం:** రాజా! ఆ 'కలి' అంశతో పుట్టటంవలన దుర్యోధనుడు ఇతరుల గొప్పతనాన్ని సహించడు. ఎంత బలవంతుడో అంత కోపం కలిగినవాడు. అతని చిత్తవృత్తి పరాక్రమంతో నిండిపోయింది. ఎవరైనా పెద్దలు నీతి చెప్పితే వినే సంస్కారం లేదు. అందుకే వైరాన్ని వదలిపెట్టలేదు.

**విశేషం:** కలి - అంటే 'పాప'మని సారభూతమైన అర్థం. ఈనాటి మనుష్యులలో సర్వసాధారణంగా కనిపించే ఈర్ష్య, కోపం, దుష్టమైన బలం, అసంస్కార హృదయం - ఇవన్నీ 'కలి' లక్షణాలని భారత కథ నిరూపిస్తుంది.

**క. తమ్ముఁడు, శకునియుఁ, గర్ణుఁడు । నమ్మానవపతికిఁ దగినయనుచరు లతనిన్**
**సమ్మదమునఁ గలసిన నృపు । లమ్మెయి వారలు వినాశమగు టేలుడుగున్? 80**

**ప్రతిపదార్థం:** తమ్ముఁడు= దుశ్శాసనుడు; శకునియున్= శకుని; కర్ణుడు; ఆ+మానవపతికిన్= ఆ దుర్యోధనుడనే రాజుకు; తగిన+అనుచరులు= అన్నివిధాలా తగిన స్నేహితులు; అతనిన్= ఆ సుయోధనుని; సమ్మదమునన్= ప్రీతితో; కలసిన= చేరిన; నృపులు= రాజులందరూ; ఆ+మెయి+వారలు= అలాంటివారే (ఇక); వినాశము+అగుట= నాశనమైపోవటం అన్నది; ఏలా+ ఉడుగున్?= ఎందుకు ఆగుతుంది?

**తాత్పర్యం:** దుశ్శాసన శకుని కర్ణులు ఆ రాజుకు తగిన సహచరులు. అతడితో చేరిన రాజులూ అట్లాంటివారే. ఇక అందరూ నశించకుండా ఎట్లా ఉంటారు?

**తోదక వృత్తము:**

**తమ తమ తప్పులఁ దా రెరియంగా । విమలమతీ! యిటు వీరికినై శో**
**కమునఁ దహింపఁగఁగాదు మనంబున్ । సముచిత మిత్తఱి శాంతము సుమ్మీ!' 81**

**ప్రతిపదార్థం:** (అందుచేత); విమలమతీ!= నిర్మలమైన చిత్తమున్న రాజా!; తమతమ= వారువారు చేసిన; తప్పులన్= తప్పులతో; తారు= తాము; ఎరియన్+కాన్= కాలిపోగా (నశించగా); వీరికిన్+ఐ= వీరికోసమని; ఇటు= ఇలా; శోకమునన్= దుఃఖాగ్నిలో; మనంబున్= నీ మనస్సును; దహింపఁగన్+కాదు= కాల్చరాదు; ఈ+తఱిన్= ఈ సమయంలో; శాంతము= శాంతంగా ఉండటమే; సముచితము= తగింది; సుమ్మీ!= సుమా!.

**తాత్పర్యం:** తాము తాము చేసిన తప్పులతో తాము తాము కాలిపోయి నశించారు. అట్లాంటివారి కొరకు నీవు నీ మనస్సును ఇట్లా శోకాగ్నిలో దహించి వేయటం తగిన పనికాదు. ఈ సమయంలో శాంతంగా ఉండటమే తగిన పని సుమా!'

**విశేషం:** ఎరియు-మండు: దోషమనేది అగ్ని - పాపం ఎవరు చేస్తారో వారిని పాపమే దహించివేస్తుందని భారతీయుల విశ్వాసం.

'విమలమతీ!' - అనటంలో 'నిర్మలమైన చిత్తంతో ఇకనైనా ఆలోచించుము' అనే సూచనకూడా గర్భితంగా ఉంది.

తోదకవృత్తంలో ప్రతిపాదంలోనూ, న,జ,జ,య అనే గణాలుంటాయి: మొదటి అక్షరానికీ ఎనిమిదవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. అని చెప్పిన నవ్విభుండు దనకుం బాండవాగ్రజుం డవమానం బాచరించునను శంక నూని యునికి యమ్మహాముని దివ్యబోధంబునం దేటపడి యుండుం గావున నత్తాపసోత్తముండు వెండియు నిట్లనియె. 82**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని దుర్యోధనుని జన్మరహస్యాన్ని చెప్పగా; ఆ+విభుండు= ధృతరాష్ట్రుడు; తనకున్= తనకు; పాండవాగ్రజుండు= ధర్మరాజు; అవమానంబు+ఆచరించునను= అవమానం చేస్తాడని; శంకన్+ఊని+ఉనికి= అనుమానం కలిగి ఉండటం; ఆ+మహాముని= ఆ వ్యాసమహర్షి; దివ్య+బోధంబునన్= దివ్యజ్ఞానంలో (దృష్టిలో); తేటపడి+ఉండున్= స్పష్టమై ఉన్నది; కావునన్= అందుచేత; ఆ+తాపస+ఉత్తముండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** అని వ్యాసుడు చెప్పాడు. అంతలో ధృతరాష్ట్రుడి మనసులో తనను ధర్మరాజు తప్పక సోదరులతో వచ్చి అవమానపరుస్తా డన్న అనుమానం మొలకెత్తింది. దీనిని తన దివ్యదృష్టితో గుర్తించిన వ్యాసుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**క. 'పాండవుల వలని కీడొ । క్కొండును లేదధిప! నీదు కొడుకులు ధరణీ**
**మండలమంతయు మ్రింగిరి । పాండున్నపతి భాగమునకుఁ బాపిరి వారిన్. 83**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; పాండవులవలని= పాండవులవలన జరిగిన; కీడు+ఒక్కొండును= ఒక అపకారంకూడా; లేదు; నీదు కొడుకులు= నీ కుమారులైన దుర్యోధనాదులు; ధరణీమండలము+అంతయున్= భూమండలాన్ని అంతా; మ్రింగిరి= మ్రింగివేశారు; పాండు నృపతి= పాండురాజు; భాగమునకున్= రాజ్యభాగానికి; వారిన్= పాండవులను; పాపిరి= దూరంచేశారు.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. పాండవుల వలన ఎప్పుడూ ఏ కీడూ జరగలేదు. నీ కుమారులు దుర్యోధనాదులే మొత్తం భూమండలాన్నంతా మ్రింగివేశారు. పాండురాజు భాగాన్ని కూడా పాండవులకు దక్కకుండా చేశారు.

**వ. దానంజేసి యిట్లు సకల కౌరవ్యులకు నఖిల భూపతులకు నిఖిల ప్రజలకును బొలియవలసె నిది యంతయు మున్న యెఱుంగుదుఁ గావున. 84**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= అందువలన; ఇట్లు; ఈ రీతిగా; సకల కౌరవ్యులకున్= సకల కురువంశీయులకు; నిఖిల భూపతులకున్= రాజులదరికీ; నిఖిల ప్రజలకున్= ప్రజలందరికీ; పొలియన్ వలసెన్= చావవలసి వచ్చింది; ఇది+అంతయున్= ఇదంతా; ఇట్లా జరగబోతుందని; మున్ను+అ= ముందే; ఎఱుంగుదున్= నాకు తెలుసు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** అందువలననే ఈ రీతిగా కురువంశీయులు, రాజులు, ప్రజలు - అందరూ దుర్మరణం పాలు కావలసి వచ్చింది. ఇదంతా ఇట్లా జరుగబోతుందని నాకు తెలుసు కాబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** కురువంశంలో పుట్టిన వారందరూ కౌరవ్యులే. పాండవులు, వారి బంధువులు, సంతానం కూడా కురువంశీయులే. అందుకే ఇట్లా అనటం.

**ఉత్సాహవృత్తము**

**వినుము నారదుండు దీని వినఁగఁ జెప్పె ధర్మనం**
**దనున కతని మనము కరుణ దవిలియున్కి హింసకున్**
**గొనకొనంగఁ జొరమి నతఁడు కురుబలంబుతోడ పొం**
**దునక వడఁడె? జగము మెచ్చఁ దొడఁగి పెక్కు భంగులన్. 85**

**ప్రతిపదార్థం:** వినుము= (ధృతరాష్ట్ర మహారాజా!) వినుము; నారదుండు= నారదమహర్షి; దీనిన్= ఈ విషయాన్నంతా; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; వినఁగన్= వినేలా; చెప్పెన్= చెప్పాడు; (అందువలన) అతని మనము= ధర్మరాజు మనస్సు; కరుణన్+తవిలి= కరుణలో తగుల్కొని; ఉనికి= ఉండటంచేత; హింసకున్= హింసచేయటానికి; కొనకొనంగన్+చొరమిన్= ప్రయత్నించకపోవటంవలన; అతఁడు= ఆ ధర్మరాజు; కురుబలంబు తోడన్= కురు సైన్యంతో; జగము= ప్రపంచమంతా; పెక్కుభంగులన్= ఎన్నో విధాలుగా; మెచ్చన్= మెచ్చుకోగా; తొడఁగి= ప్రయత్నించి; పొందునకున్+అ+పడఁడె= సంధికే ప్రయత్నించలేదా?

**తాత్పర్యం:** రాజా! వినుము. నారదుడు ఈ విషయమంతా ధర్మరాజుకు ఏనాడో వివరించాడు. అందుచేతనే ధర్మరాజు మనసులో కరుణపుట్టి హింస చేయటానికి ప్రయత్నించకుండా కురుబలంతో ప్రపంచమంతా స్తుతించే విధంగా సంధికే ప్రయత్నించాడు. ఇది నీకు తెలియని విషయమా?

**విశేషం:** వృత్తలక్షణానికి చూడండి: స్త్రీ. 1.48

**తే.** **ఏను నతనికిఁ జెప్పితిం గాన నాతఁ। డధికయత్నంబు సేసెఁ దానంతవడియు**
**వైర మెమ్మెయి మాన్పంగ నేరఁ డయ్యె। నియతిఁ దప్పింప నేరికి నేర నగునె? 86**

**ప్రతిపదార్థం:** ఏనున్= నేనుకూడా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; చెప్పితిన్+కానన్= చెప్పాను కాబట్టి; ఆతఁడు= ధర్మరాజు; అధికయత్నంబు+చేసెన్= సంధికోసం ఎంతో ప్రయత్నించాడు; తాను+అంత పడియున్= తాను అంత ప్రయత్నించికూడా; వైరము+ఏ+మెయిన్= వైరం ఏ విధంగానూ; మాన్పంగన్+నేరఁడు+అయ్యెన్= మాన్పించలేకపోయాడు; నియతిన్= విధిని; తప్పింపన్= తప్పించటానికి; ఏరికిన్= ఎవరికైనా; నేరన్+అగునె?= సాధ్యమా?

**తాత్పర్యం:** నేనుకూడా ఆ ధర్మరాజుకు చెప్పాను కాబట్టి అతడు సంధికొరకు ఎంతగానో ప్రయత్నించాడు కాని, శత్రుత్వాన్ని మాన్పించలేకపోయాడు. ఎంత ప్రయత్నించినా విధిని తప్పించటానికి ఎవరు సమర్థులు?

**క.** **ఏ నిది యంతయు నెఱుఁగుదుఁ। గాన వృథా శోక వహ్నిఁ గాలమికిని నీ**
**మానసమునఁ గృపకలిమికిఁ। గా నొడివితి దేవగుహ్యగతియుఁ దెలిపితిన్. 87**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఇది= ఈ విషయం; అంతయున్= అంతా; ఎఱుఁగుదున్= తెలియుదును; కానన్= కాబట్టి; వృథా శోకవహ్నిన్+కాలమికిని= వ్యర్థమైన శోకమనే అగ్నిలో కాలకుండా ఉండటానికి; నీ మానసమునన్= నీ మనస్సులో; కృపకలిమికిన్+కాన్= దయపుట్టటానికి గాను; నొడివితిన్= ఇట్లా చెప్పాను; దేవ గుహ్యగతియున్= దేవతలయొక్క రహస్యమైన విధానాన్ని గురించి; తెలిపితిన్= నీకు తెలిపాను.

**తాత్పర్యం:** నాకు ఇదంతా బాగా తెలుసు కాబట్టి నీవు వ్యర్థమైన శోకాగ్నిలో కాలిపోకుండా ఉండటానికి, నీ మనసులో పాండవులపైన దయపుట్టటానికి ఇదంతా చెప్పాను. పైగా దేవతల రహస్య విధానం ఎట్లా ఉందో కూడా తెలిపాను.

**విశేషం:** గుహ్య మంటే రహస్యమని అర్థం. మానవులకు అర్థంకాని దాన్నే 'దైవరహస్య' మంటారు. దాన్నిబట్టి మనుషుల ప్రవృత్తులు ఉంటాయి - జ్యోతిశ్శాస్త్రాదుల ద్వారా ఈ రహస్యాన్ని కొద్దిగానైనా తెలిసికొనవచ్చును కాబట్టి జ్యోతిష్కులను 'దైవజ్ఞులు' అంటారు. ఋషులు ఈ రహస్యాన్ని సంపూర్ణంగా ఎరుగుదురని ఈ సందర్భం వలన తెలిసికొనగలము.

**భుజంగప్రయాతము:**

**వినీతుండవై ధర్మ వేదిత్వబుద్ధిం। దనర్పొందు నీ విట్లు దైన్యాతిరేకం**
**బునం బొంది శోకాగ్నిఁ బొక్కంగఁ గుంతీ। తనూజాగ్రజుం డాత్మఁ దాఁ గుందకున్నే? 88**

**ప్రతిపదార్థం:** వినీతుండవు+ఐ= పవిత్రుడవై; ధర్మవేదిత్వబుద్ధిన్= ధర్మాన్ని తెలిసిన బుద్ధితో; తనర్పు+ఒందు= ఔన్నత్యాన్ని పొందిన; నీవు; ఇట్లు= ఈ విధంగా; దైన్యాతిరేకంబునన్+పొంది= అతిశయించిన దైన్యాన్ని పొంది; శోకాగ్నిన్= శోకమనే

అగ్నిలో; పొక్కంగగన్= పరితపిస్తూ ఉంటే; కుంతీ తనూజ+అగ్రజుండు= ధర్మరాజు; ఆత్మన్= తనలో; తాన్= తాను; కుందక+ఉన్నే?= బాధపడకుండా ఉంటాడా?

**తాత్పర్యం:** నీవు అతి పవిత్రుడవు. ధర్మవేదివి. ఎంతో ఉన్నతుడవు. అట్లాంటి నీవు మిక్కిలి దీనంగా శోకమనే అగ్నిలో పరితపిస్తూ ఉంటే చూచి కుంతి పెద్దకొడుకు (ధర్మరాజు) ఎంత బాధపడతాడో చూచావా?'

**విశేషం:** భుజంగ ప్రయాత వృత్తంలో ప్రతిపాదంలోనూ నాలుగు య గణాలు ఉంటాయి. మొదటి అక్షరానికీ ఎనిమిదవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాస నియమం ఉన్నది.

**క.** **డెందము తిర్యగ్యోనుల । యందును గరుణా సమగ్రమై యుండు భవ**
**న్నందనుఁ డజాతశత్రున । కుం దచ్చరితంబు నీవుఁ గొంత యెఱుఁగవే! 89**

**ప్రతిపదార్థం:** భవత్+నందనుడు= నీ కుమారుడు; అజాతశత్రువునకున్= ధర్మరాజుకు; తిర్యగ్+యోనులలందునన్= పక్షుల విషయంలోను, జంతువుల విషయంలోనూ; డెందము= హృదయం; కరుణా సమగ్రమై+ఉండున్= కరుణతో నిండి ఉంటుంది; తద్+చరితంబు= అతని చరిత్ర; నీవున్= నీకూ; కొంత; ఎఱుఁగవే!= తెలుసుకదా!

**తాత్పర్యం:** నీ కుమారుడైన ధర్మరాజు అజాతశత్రువు. అతడికి ఈ లోకంలో శత్రువులే లేరు. అతడి హృదయంలో మనుష్యులు, జంతువులు, పక్షులు - అందరి విషయంలోనూ అన్నిటి విషయంలోనూ కరుణ మాత్రమే ఉంటుంది. అతడి చరిత్ర నీవూ కొంత ఎరుగుదువు కదా!

**విశేషం:** పండితుడు సమదర్శనం కలిగి ఉంటాడని భగవద్గీత చెప్పుచున్నది. ధర్మరాజు అట్లాంటివాడని ధృతరాష్ట్రుడు తెలియని వాడు కాడు. అందుకే 'కొంత' ఎరుగుదువు అనటం. ఈ సమదర్శనం ఉన్న ధర్మరాజు అజాతశత్రువే. అతడికి శత్రువే పుట్టలేదని అర్థం. అందుచేత నీ కొడుకులు కూడా అతడికి శత్రువులు కారనీ అర్థం అవుతుంది. ధృతరాష్ట్రుడికి ఈ సమభావం కలిగించాలనే దృష్టితోనే 'నీ కొడుకు ధర్మరాజు' అని గుర్తు చేస్తున్నాడు వ్యాసుడు.

**మానినీ వృత్తము**

**కావున నీ దెస నాతనికిన్ విముఖత్వము గల్గదు; భక్తి మెయిం**
**దా వినయం బెనయం గొనియాడుట దప్పదు కాంచెద వాతనిపై**
**నీవును నెయ్యముఁ గారుణికత్వము నెక్కొనఁ దమ్ములు నవ్విభుఁడు**
**న్వేవుర పెట్టుగ సంతతికల్మియ నీమది నిల్పుము పెంపొలయన్. 90**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; నీ దెసన్= నీ మీద; ఆతనికిన్= ఆ ధర్మరాజుకు; విముఖత్వము= వైముఖ్యం; కల్గదు= లేదు; (ఎందుకంటే); తాన్= అతడు; వినయంబు+ఎనయన్= వినయం పొందగా; కొనియాడుటన్= నిన్ను ఎప్పుడూ గౌరవిస్తూనే ఉండటంవలన; ఆతనిపైన్= ఆ ధర్మరాజుపై; నీవును= నీవు కూడా; నెయ్యమున్= స్నేహభావాన్ని; కాంచెదవు= పొందుతావు; తప్పదు= ఇది అనివార్యం; (నీవు కూడా); కారుణికత్వము= దయ; నెక్కొనన్= అతిశయించగా; తమ్ములున్= తమ్ములును; ఆ+విభుఁడున్= ఆ ధర్మరాజును; వేవుర= వేయిమందికి; పెట్టుగన్= మారుగా; సంతతి+కల్మి+అ= (నీ) సంతాన సంపదగానే; పెంపొలయన్= సౌభాగ్యం అతిశయించగా; నీ మదిన్= నీ హృదయంలో; నిల్పుము= నిలుపుకొమ్ము.

**తాత్పర్యం:** అందువలన నీ మీద ధర్మరాజుకు ఏ మాత్రం వైముఖ్యం లేదు. అతడు నిన్నెపుడూ గౌరవంతో చూస్తూనే ఉంటాడు. గమనించావు కదా! ఆ ధర్మరాజుపై నీవు కూడా తప్పకుండా స్నేహభావాన్ని పొందుతావు చూడుము. ఇది తప్పనిసరిగా జరుగుతుంది. ఇక నీవు దయతో పాండవులైదుగురినీ వెయ్యిమంది సంతానానికి మారుగా నీ హృదయంలో భావించుము. వారిని ఆదరించుము. అది మీ అందరికీ శ్రేయస్సు కలిగిస్తుంది.

**విశేషం:** మానినీ వృత్తంలో ప్రతిపాదానికీ ఏడు భ గణాలు, మీద గురువూ ఉంటాయి. మొదటి అక్షరానికీ పదమూడవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**తే.** **దైవకృతము నా పంపు చిత్తమునఁ బెట్టి। పుత్రశోకంబు విడు పాండుపుత్రు లధిప**
**తగరె! నినుఁ గొనియాడి పుత్రత్వ వృత్తిఁ। బరఁగ నది కీర్తిధర్మసంపాది గాదె!** **91**

**ప్రతిపదార్థం:** దైవకృతము= దైవ నిర్ణయం; నా పంపు= నా ఆజ్ఞ; చిత్తమునన్+పెట్టి= మనసులో ఉంచుకొని; అధిప!= ఓ రాజా!; పుత్రశోకంబున్= నీ పుత్రుల మరణంవలన పుట్టిన శోకాన్ని; విడు= వదలిపెట్టుము; పాండుపుత్రులు= పాండవులు; నినున్+కొనియాడి= నిన్ను గౌరవిస్తూ; పుత్రత్వ+వృత్తిన్= కుమారుల ధర్మంతో; పరఁగన్= ప్రవర్తించటానికి; తగరె!= అర్హులుకారా! (ఇంతేకాకుండా); అది= అట్లా ఉంటే; (నీకు) కీర్తి= కీర్తిని; ధర్మ= ధర్మాన్ని; సంపాది= సంపాదించేది; కాదె!= అవుతుంది కదా!

**తాత్పర్యం:** రాజా! దైవనిర్ణయాన్ని, నా ఆజ్ఞను నీ మనసులో ఉంచుకొమ్ము. నీ శోకాన్ని మానుము. పాండవులు నిన్ను గౌరవిస్తూ నీ కొడుకులవలె వర్తించటానికి తగినవారు కారా? (నీ తమ్ముడి కుమారులే కదా!). అట్లా వారు ఉండటం నీకు కీర్తిని, ధర్మాన్ని సంపాదించి పెట్టుతుంది కదా!

**వ.** **వనట యనియెడు నగ్ని నెఱుక యనియెడు నీట నార్పుము. ప్రాణంబులు ధరియింపుము. సముచిత వృత్తిఁ జరియింపు' మనిన విని చింతాక్రాంతుండై కొండొకసే పూరకుండి ధృతరాష్ట్రుఁడు తేజోధనుండగు నత్తాపసోత్తమున కిట్లనియె.** **92**

**ప్రతిపదార్థం:** వనట= శోకం; అనియెడు= అనే; అగ్నిన్= మంటను; ఎఱుక= జ్ఞానం; అనియెడు= అనే; నీటన్= నీటితో; ఆర్పుము= చల్లార్చుము; ప్రాణంబులు= నీ ప్రాణశక్తిని; ధరియింపుము= కూడదీసుకొమ్ము; సముచిత= తగిన; వృత్తిన్= రీతిలో; చరియింపుము= నడుచుకొమ్ము; అనినన్= అని వ్యాసమహర్షి చెప్పగా; విని; చింతా+ఆక్రాంతుండు+ఐ= ఆలోచనలో మునిగిపోయి (ఆలోచనచేత ఆక్రమింపబడి); కొండొకసేపు= కొంత సమయం; ఊరకుండి; ధృతరాష్ట్రుడు; తేజస్+ధనుండు+అగు= తపస్సువలన వచ్చిన తేజస్సునే సంపదగా కలిగిన; ఆ+తాపస్+ఉత్తమునకున్= ఆ ఋషి శ్రేష్ఠునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** 'నీ శోకం అనే మంటను జ్ఞానం అనే నీటితో ఆర్పివేయుము. నీ ప్రాణశక్తిని కూడదీసికొమ్ము. తగిన రీతిలో నడుచుకొమ్ము'. అని వ్యాసమహర్షి చెప్పగా మళ్ళీ కొంతసేపు ఆలోచనలో మునిగిపోయి తేరుకొని కాసేపు ఊరకుండి ధృతరాష్ట్రుడు తేజోధనుడైన ఆ మహర్షితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం. అగ్ని దహిస్తుంది. శోకం కూడా పరితాపాన్ని కలిగిస్తుంది. పరితాపమంటే మళ్ళీ కాలటమే. కాబట్టే శోకాన్ని శోకాగ్ని అంటారు. జ్ఞానం నీరువలెనే ప్రవాహరూపమైంది. అంతే కాకుండా అనుద్వేగకరమైనది. శాంతమైనది. అది నీటి లక్షణం.

**క. 'మును శోకానలతాపం । బునఁ బొగులుట నొండెఱుంగఁ బోలక దుఃఖం**
**బున మునుఁగ వలసె నీదు వ । చనములు విని మునివరేణ్య! శాంతుఁడ నైతిన్. 93**

**ప్రతిపదార్థం:** మును= ముందు (ఇంతవరకు); శోక+అనల= దుఃఖమనే అగ్నియొక్క; తాపంబునన్= మంటలో; పొగులుటన్= కుమిలిపోవటంవలన; ఒండు+ఎఱుంగన్+పోలక= మరోదాన్ని గుర్తించలేక; దుఃఖంబునన్= దుఃఖంలో; మునుఁగన్+వలసెన్= మునుగవలసి వచ్చింది; మునివరేణ్య!= మునిశ్రేష్ఠుడా!; నీదు= నీ; వచనములు= మాటలు; విని; శాంతుఁడను+ఐతిన్= శాంతమనస్కుడిని అయ్యాను.

**తాత్పర్యం:** 'మునిశ్రేష్ఠుడా! ఇంతవరకు దుఃఖమనే అగ్నిలో కుమిలిపోయి ఉండటం వలన మరొక దానిని గురించి ఆలోచించలేక పోయాను. ఇప్పుడు నీ మాటలు విని మనస్సు ప్రశాంతమైనది.

**విశేషం:** అలం: రూపకం.

**క. ధరియించెదఁ బ్రాణము మది । నెరియకయుండంగ శోక మేఁ దొఱఁగెద ని**
**ర్భర బాంధవంబు నొందెదఁ । బురుషోత్తములైన పాండుపుత్రకుల దెసన్'. 94**

**ప్రతిపదార్థం:** ప్రాణమున్= ప్రాణశక్తిని; ధరియించెదన్= కూడదీసుకొంటాను; మదిన్= మనసులో; ఎరియక+ఉండంగన్= బాధపడకుండా ఉండే లాగున; ఏన్= నేను; శోకము= దుఃఖాన్ని; తొఱఁగెదన్= విడిచిపెటతాను; పురుషోత్తములు+ఐన= మానవోత్తములైన; పాండుపుత్రుకుల దెసన్= పాండవుల మీద; నిర్భర= అతిశయించిన; బాంధవంబు= బాంధవ్యాన్ని; ఒందెదన్= పొందుతాను.

**తాత్పర్యం:** మహర్షీ! మీరు చెప్పినట్టే నా ప్రాణశక్తులను కూడదీసుకొంటాను. బాధపడటం మానివేసి దుఃఖాన్ని విడిచిపెడతాను. పాండవులు మానవోత్తములు. వారిమీద అతిశయించిన బాంధవ్యాన్ని పెంచుకొంటాను'.

**వ. అనుటయు నమ్మహాత్ముం డట్లగుట మేలని పలికి యంతర్ధానంబుఁజేసె. నిట్లు ప్రబోధితుండై యాంబికేయుండు గొండొక ప్రొ ద్దూరకుండి సంజయుం బేరుకొని పయనం బాయితంబు సేయుమని చెప్పి, విదురుతో 'నీవు గాంధారిని గుంతినిం దక్కుఁగల కౌరవవధూవర్గంబును దోడ్కొని రావలయు మనము పొలికలనికిం బోవుచున్న వారమని యెఱింగించి వెలువరింపు' మనిన నయ్యిరువురు నట్ల చేసిన. 95**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధృతరాష్ట్రుడు అనగా; ఆ+మహాత్ముండు= ఆ వ్యాసమహర్షి; అట్లు+అగుట= అట్లా చేయటం; మేలు+అని= మంచిదని; పలికి= చెప్పి; అంతర్ధానంబున్+చేసెన్= అంతర్ధానమయ్యాడు; ఇట్లు= ఈ విధంగా; ప్రబోధితుండు+ఐ= ఉపదేశింపబడి; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; కొండొకప్రొద్దు= కొంతసేపు; ఊరకుండి; సంజయున్= సంజయుడిని; పేరుకొని= పిలిచి; పయనంబు= ప్రయాణం; ఆయితంబు+చేయుము+అని= సిద్ధంచేయుమని; చెప్పి; విదురుతోన్= విదురునితో; నీవు; గాంధారినిన్= గాంధారిని; కుంతినిన్= కుంతిని; తక్కుఁగల= మిగిలిన; కౌరవ వధూవర్గంబునున్= కౌరవస్త్రీలను; తోడ్కొని= పిలుచుకొని; రావలయున్= రావాలి; మనము= మనం అందరం; పొలికలనికిన్= యుద్ధభూమికి; పోవుచున్నవారము= వెళ్తున్నాము; అని; ఎఱింగించి= చెప్పి (తెలిపి); వెలువరింపుము= ప్రయాణం చేయించుము; అనినన్= అని చెప్పగా; ఆ+ఇరువురున్= ఆ సంజయ విదురులు; అట్లు+అ చేసినన్= అట్లాగే చేయగా.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు చెప్పగా వ్యాసమహర్షి 'అట్లా చేయటం మంచి' దని చెప్పి మాయమయ్యాడు. ఈ విధంగా మహర్షిచేత ఉపదేశం పొందిన ధృతరాష్ట్రుడు కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి సంజయుడిని పిలిచి 'ప్రయాణానికి సిద్ధం చేయుము' అని చెప్పి విదురుడితో 'నీవు గాంధారిని, కుంతిని, తక్కిన కౌరవ స్త్రీలను పిలుచుకొని రావాలి. మనమందరం యుద్ధభూమికి వెళ్తున్నా మని వారికి తెలిపి, ప్రయాణం చేయించుము'. అని చెప్పగా ఆ ఇరువురు అట్లాగే చేయగా (తరువాతి పద్యంతో అన్వయం).

### ధృతరాష్ట్రుఁడు సపరివారంబుగాఁ బొలికలనికిం బోవుట (సం. 11-9-5)

**క. ఆరంగూరిన శోకము । భారంబున మేను దూలఁ బరవశగతి గాం**
**ధారి చనుదెంచె నవ్వసు । ధారమణుని కడకు జనవితానము వొగులన్. 96**

**ప్రతిపదార్థం:** ఆరన్= మిక్కిలిగా; కూరిన= పొందిన; శోకము భారంబునన్= శోక భారంచేత; మేను= శరీరము; తూలన్= తూలిపోతుండగా; పరవశగతిన్= పరాధీనురాలిగా (ఇతరుల ఆసరాతో); గాంధారి= గాంధారీదేవి; ఆ+వసుధారమణుని కడకున్= ఆ ధృతరాష్ట్ర భూపాలుని వద్దకు; జనవితానము= తోడుగా ఉన్న జనసమూహం; పొగులన్= దుఃఖిస్తుండగా; చనుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** మిక్కిలిగా పొందిన శోకం బరువుచేత గాంధారి శరీరం తూలిపోతూ ఉన్నది. ఇతరుల ఆసరాతో ఆమె ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చింది. తోడుగా వస్తున్న కౌరవస్త్రీలు ఏడుస్తున్నారు.

**వ. కుంతీ ప్రముఖంబైన కురువృద్ధనారీజనంబును బరివారవనితాజనసహితంబుగాఁ దరతరంబ యరుగుదెంచె నట్టియెడ. 97**

**ప్రతిపదార్థం:** కుంతీ ప్రముఖంబైన= కుంతి మొదలైన; కురువృద్ధ నారీజనంబును= కురువంశంలోని ముసలి ఆడవారు; పరివార వనితాజన సహితంబుగాన్= పరిచారికలైన ఇతర పరివార స్త్రీ సమూహంతో కూడి; తరతరంబ= క్రమక్రమంగా కలిసి; అరుగుదెంచెన్= అక్కడికి వచ్చారు; అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కుంతీదేవి మొదలైన కురువంశంలోని పెద్ద ఆడవారు, వారికి పరిచర్యలు చేసే ఇతర స్త్రీలు, క్రమక్రమంగా కలిసి అక్కడకు వచ్చారు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. చేతులు నడుదల సేర్చు టుత్కటశోక । మాకారములు దాల్చి నట్టులుండ**
**విరిసిన వేసలుల్ వెన్నులఁ బ్రక్కల । నెఱసి చూపఱ దృష్టి నీఱు సేయ**
**నందంద దొరఁగెడు నశ్రుజలంబుల । పెంపున మోములు ముంపఁబడఁగ**
**నేమియుఁ దొడవులు లేమిఁ బాడఱియున్న । యంగంబులందు దైన్యంబు నెఱయఁ**

**తే. బతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ । బేరుకొని వాతు లెండఁగఁ బ్రేముడించి**
**పనవు పలుకులు వినువారి వనటఁ దేల్పఁ । గురుకుమార నారీజనకోటి వచ్చె. 98**

**ప్రతిపదార్థం:** నడు+తలన్= నడినెత్తిమీద; చేతులు+చేర్చుట= తమ చేతుల్ని చేర్చడం; ఉత్కట= మిక్కిలిదైన; శోకము= శోకరసం; ఆకారములు= శరీరాలు; తాల్చినట్టులు+ఉండన్= ధరించినట్లు ఉండగా; విరిసిన= విరయబోసుకున్న; వేనలుల్= కొప్పులు; వెన్నులన్= వీపులపైనా; ప్రక్కలన్= పక్కలలోనూ; నెఱసి= వ్యాపించి; చూపఱ= చూచేవారి; దృష్టిన్= చూపును; నీఱు+చేయన్= భస్మం చేయగా (నిర్వికారంగా మార్చగా); అందంద= అక్కడక్కడా; తొరఁగెడు= వర్షిస్తున్న; అశ్రుజలంబుల= కంటి నీటియొక్క; పెంపునన్= అతిశయంచేత; మోములు= ముఖాలు; ముంపఁబడఁగన్= ముంచివేయబడగా; ఏమియున్= బొత్తిగా; తొడవులు= నగలు; లేమిన్= లేకపోవటంచేత; పాడు+అఱి+ఉన్న= పాడువడినట్టున్న; అంగంబులందున్= శరీరాలలో; దైన్యంబు= దీనత్వం; నెఱయన్= నిండగా; పతులన్= భర్తలను; అన్నలన్= అన్నలను; తమ్ములన్= తమ్ముళ్ళను; పేరుకొని పేర్లు పెట్టి పిలుస్తూ; వాతులెండంగన్= నోళ్ళుతడారిపోగా; ప్రేముడించి= దుఃఖిస్తూ; పనవు పలుకులు= వారిని పేర్కొంటూ మాట్లాడుతున్న మాటలు; వినువారిన్= వినేవాళ్ళను; వనటన్= దుఃఖంలో; తేల్పన్= ముంచివేయగా; కురుకుమార= కురువంశ రాజకుమారుల; నారీజనకోటి= స్త్రీ జననసమూహం; వచ్చెన్= వచ్చారు.

**తాత్పర్యం:** నడి నెత్తులపై చేతులుంచుకొని దుఃఖిస్తున్న ఆ స్త్రీలు రూపం దాల్చిన శోకంవలె కనిపిస్తున్నారు. విరబోసికొన్న వారి జడకొప్పులు వీపులమీదా పక్కలలోనూ వ్యాపించి చూచేవారిని నిర్వికారంగా మార్చి వేస్తున్నాయి. వారి కళ్ళనుంచి కారుతున్న అశ్రుజలాల వర్షంలో వారి ముఖాలు మునిగిపోయాయి. ఏ ఒక్క ఆభరణమూ లేని వారి అవయవాలు పాడుబడి శిథిలాలై అతిదీనంగా కనిపిస్తున్నాయి. యుద్ధంలో చనిపోయిన తమ భర్తలను, అన్నదమ్ములను పేరు పేరునా పిలుస్తూ నోళ్ళుతడి ఆరిపోయేటట్లు వారు చేస్తున్న ఆర్తనాదాలు వినేవాళ్ళనందరినీ దుఃఖసాగరంలో ముంచి వేస్తున్నాయి. ఈ విధంగా కురువంశ రాజకుమారుల స్త్రీలందరూ యుద్ధ భూమికి తరలివస్తున్నారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. 'నివుఱు' అంటే బూడిద. దానికి 'నీఱు' రూపాంతరం. భస్మంచేయటం అంటే కావ్యపరంగా ఏమీలేకుండా చేయటమని అర్థం. ఏ జడకొప్పు కామాన్ని ఉద్రేకింపజేస్తుందో ఆ జడే విరబోసుకున్నప్పుడు, దుఃఖసమయంలో నిర్వికారాన్ని కలిగిస్తుందని అర్థం.

**క. చెలులైనఁ జూడఁ బయ్యద । దొలఁగుటకును సిగ్గు పడు వధూజనతతి య**
**త్తల యెదుర నేక వస్త్రం । బులతో నంగమును వికృతిఁ బొందఁగ నడచెన్. 99**

**ప్రతిపదార్థం:** చెలులు+ఐనన్= చెలికత్తెలయినా; చూడన్= చూస్తుండగా; పయ్యద+తొలఁగుటకును= పైట తొలగిపోతే; సిగ్గుపడు= సిగ్గుపడేటటువంటి; వధూ జనతతి= కురుకుమారుల భార్యలు; అత్తల+ఎదురన్= తమ అత్తల ఎదుటనే; ఏకవస్త్రంబులతోన్= ఒకే చీరతో (తొలగిపోయిన పైటలతో); అంగమును= తమ శరీరాలు; వికృతిన్+పొందఁగన్= శోకంచేత వికారాన్ని పొందగా; నడచెన్= నడుస్తూ వచ్చారు.

**తాత్పర్యం:** సాధారణంగా చెలికత్తెలు అయినా చూస్తుండగా పైటలు తొలగిపోతే సిగ్గుపడేటటువంటి కురుకుమారుల భార్యలు తమ అత్తల ఎదుట పైటలు తొలగిపోతున్నా లెక్కచేయక శోకోద్రేకంచేత వికారమైన ఆకారాలతో వస్తున్నారు.

**క. కొండొక వగపున కేనియు । నొండొరువులఁ దెల్పునట్టి యువిదలు చిత్తం**
**బొండొండ వనట మునుఁగఁగ । నొండెవ్వరుఁ దెలుపలేక యుండి రవశలై. 100**

**ప్రతిపదార్థం:** కొండు+ఒక= ఏ కొంచెం; వగపునకున్+ఏనియున్= బాధనైనా; ఒండు+ఒరువులన్= ఒకరికొకరు; తెల్పునట్టి= చెప్పుకొనేటువంటి; ఉవిదలు= ఆ స్త్రీలు; చిత్తంబు= మనస్సులు; వనటన్= శోకంలో; మునుఁగఁగన్= మునిగిపోగా; ఒండు+ఎవ్వరున్= ఒకరికి మరొకరు; (ఏమీ); తెలుపలేక= చెప్పుకోలేకుండా; అవశలై= తమ మీద తమకే అదుపులేని స్థితిలో ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** ఆ కురు కుమారుల వనితలు చాలా సుకుమారమైన మనసులున్నవారు. ఏ కొంచెం బాధకలిగినా ఒకరికొకరు చెప్పుకొనే వారుకూడా మనస్సులు శోకంలో మునిగిపోగా ఒకరి కొకరు ఏమీ చెప్పలేక తమ మీద తమకే అదుపులేని మానసిక స్థితిలో సాగిపోతున్నారు.

**వ. అట్టి యెడఁ బురంబున నచ్చటచ్చట. 101**

**తాత్పర్యం:** అట్లాంటి సమయంలో నగరంలో ఆయా చోట్ల.

**తే. విపుల హర్మ్యతలంబులు వెడలునట్టి । వెలఁది మొత్తముల్ వొల్చె బల్వేఁటకాఱు**
**పతులఁ జంపిన గిరిగుహాప్రతతి వెడలఁ । బాఱు సింగంపుఁ బెంట్లకుఁ బాటియగుచు. 102**

**ప్రతిపదార్థం:** విపుల= పెద్దవైన; హర్మ్యతలంబులు= ఇంటి వాకిళ్ళు; వెడలునట్టి= వదలివస్తున్న; వెలఁది మొత్తముల్= స్త్రీల సమూహాలు (కురుకుమారుల భార్యలు కాని ఇతర యోధుల వనితలు); బల్+వేటకాఱు= బలిష్ఠులైన వేటగాండ్రు; పతులన్+చంపినన్= తమ పోతులను చంపివేయగా; గిరిగుహ ప్రతతిన్= కొండ గుహల సమూహాన్ని; వెడలన్+పాఱు= వదలి పారిపోతున్న (వస్తున్న); సింగంపున్+పెంట్లకున్= ఆడ సింహాలకు; పాటి+అగుచున్= సమానంగా; పొల్చెన్= అగుపించారు.

**తాత్పర్యం:** హస్తినాపురంలోని ఇతర మృతవీరుల భార్యలు విశాలమైన ఇళ్ళ నుండి బయటికి వస్తున్నారు. వారు వేటగాళ్ళు తమ పోతులను చంపివేయగా ఆక్రోశిస్తూ గుహలనుండి బయటికి వస్తున్న ఆడ సింహాలవలె వారు అగుపిస్తున్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. మున్నెన్నఁడు నెవ్వరికిం । గన్నులెదురఁ బడని యట్టి కాంతలు జను లె**
**ల్ల న్నిలిచి చూడ వెడలిరి । కన్నులు గమరన్ సుహృన్నికాయంబులకున్. 103**

**ప్రతిపదార్థం:** మున్ను= మునుపు; ఎన్నఁడున్= ఏనాడూ; ఎవ్వరికిన్= ఎవరికీ; కన్నుల+ఎదురన్= కళ్ళెదుట; పడని+అట్టి= కనిపించని; కాంతలు= కౌరవ కాంతలు; జనులు+ఎల్లన్= జనులందరూ; నిలిచి+చూడన్= నిలబడి చూస్తుండగా; సుహృద్+నికాయంబులకున్= స్నేహితుల, ఆప్తులసమూహాలకు; కన్నులు కమరన్= కన్నులు కాలగా; వెడలిరి= బయలు దేరారు.

**తాత్పర్యం:** మునుపు ఏనాడూ ఎవరికీ కళ్ళెదుట కనిపించని కౌరవకాంతలు ప్రజలందరూ నిలబడి చూస్తుండగా ఆప్తులైనవాళ్ళకు, స్నేహితులకు వారిని చూడలేక బాధతో కళ్ళుమండిపోతుండగా బయలుదేరి వచ్చారు.

**వ. అప్పుడు కురువీరాగారంబులయందు హాహాకారంబు లెసంగ నిట్లు వనితా జనవ్రాతం బేతెంచి ధృతరాష్ట్రు సూరెల నాక్రందన ధ్వనులు సెలంగ నిలిచె, విదురుండు డగ్గుత్తికపడుచు నయ్యువిదల నూరార్చుచుఁ**

**దగువారల నుచిత వాహనంబులపై నిడియె. నద్ధరణీనాథుండు నిజయోగ్యయానంబునఁ జనఁ దోడన యా తమ్ముండును గాంధారీప్రభృతులం దోడుకొని సంజయ సహితంబుగాఁ జనియెఁ, బిన్నలు పెద్దలనక సకల పౌరలోకంబునకు శోకం బావహిల్లినం బెల్లైన రోదనప్రణాదంబుల దిక్కులు పిక్కటిల్లెఁ. బ్రళయకాల జ్వలన జ్వాలలం బొదువంబడు జంతువు లాక్రోశించు చందంబు దోఁచెఁ, బురిఁగల వైశ్యశూద్ర శిల్పి కర్మార తక్షక క్షౌరక స్వర్ణకారక రజకాదు లమ్మహీపతి బలసి చని రివ్విధంబునం గ్రోశమాత్రంబు చని రాసమయంబున. 104**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కురువీర+అగారంబులయందు= కురు వీరుల ఇళ్ళలో; హాహాకారంబులు= ఆర్తనాదాలు; ఎసంగన్= పుట్టగా; ఇట్లు; ఈ విధంగా; వనితాజనవ్రాతంబు= స్త్రీ సమూహం; ఏతెంచి= వచ్చి; ధృతరాష్ట్రు సూరెలన్= ధృతరాష్ట్రుడి ప్రక్కల (సమీపంలో); ఆక్రందన ధ్వనులు= ఆర్తనాదాలు; చెలంగన్= మ్రోయగా; నిలిచెన్= నిలిచింది; విదురుండు= విదురుడు; డగ్గుత్తిక పడుచున్= మాట పెగలక, గద్గదస్వరంతో; ఆ+ఉవిదలన్= ఆ స్త్రీలను; ఊరార్చుచున్= ఓదారుస్తూ; తగువారలన్= ముఖ్యమైన వారిని; ఉచిత= వారి వారికి తగిన; వాహనంబులపైన్= వాహనాలమీద (బళ్ళమీద); ఇడియెన్= కూర్చోపెట్టాడు; ఆ+ధరణీనాథుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; నిజయోగ్య= తనకు తగిన; యానంబునన్= రథంలో; చనన్= బయలు దేరగా; తోడన్+అ= వెంటనే; ఆ+తమ్ముండును= తమ్ముడైన ఆ విదురుడు; గాంధారీ ప్రభృతులన్= గాంధారి, కుంతి మొదలైనవారిని; తోడుకొని= పిలుచుకొని; సంజయ సహితంబుగాన్= సంజయుడితో; కలిసి; చనియెన్= బయలుదేరాడు; పిన్నలు, పెద్దలు+అనక= చిన్నా పెద్దా అనే తేడా లేకుండా; సకల పౌరలోకంబునకున్= ప్రజలందరికీ; శోకంబు= దుఃఖం; ఆవహిల్లినన్= కలుగగా; పెల్లు+ఐన= అతిశయించిన; రోదన ప్ర+నాదంబులన్= పెద్ద ఏడుపులతో; దిక్కులు+పిక్కటిల్లెన్= దిక్కులు నిండాయి; ప్రళయకాల= ప్రళయకాలంలో; జ్వలన= మండుతున్న; జ్వాలలన్= మంటల్లో; పొదువంబడు= చిక్కుకున్న; జంతువులు; ఆక్రోశించు= రోదించే; చందంబు= విధం; తోఁచెన్= అగుపించినది; పురిన్+కల= ఆ నగరంలోని; వైశ్య= వైశ్యులు; శూద్ర= శూద్రులు; శిల్పి= శిల్పులు; కర్మారులు= కమ్మరులు; తక్షక= వడ్లవారు; క్షౌరక= మంగళ్ళు; స్వర్ణకారక= కంసాలులు; రజకాదులు= చాకళ్ళు మొదలైనవారు; ఆ+మహీపతిన్= ఆ రాజును; బలసి= చుట్టి లేదా చుట్టుకొని (ముందువెనుకలుగా); చనిరి= బయలుదేరారు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; క్రోశమాత్రంబు= ఒక క్రోసు దూరం; చనిరి= వెళ్ళారు; ఆ సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో కురుకుమారుల ఇళ్ళలో ఆర్తనాదాలు పుట్టాయి. ఏడ్పులు రోదనాలతో కురుస్త్రీలంతా వచ్చి ధృతరాష్ట్రుడి సమీపంలో నిలిచారు. విదురుడికి నోట మాట పెగలటం లేదు. నెమ్మదిగా వారికి ఓదార్పు మాటలు చెబుతూ ముఖ్యమైన వారిని వారివారికి తగిన వాహనాలమీద కూర్చొనపెట్టాడు. ధృతరాష్ట్రుడు కూడా తనకు తగిన రథాన్ని ఎక్కి బయలుదేరాడు. అతడి వెనుకనే విదురుడు గాంధారి, కుంతి మొదలైన వాళ్ళను పిలుచుకొని సంజయుడితో కలిసి బయలుదేరాడు. చిన్నా పెద్దా అనక అందరూ శోక సముద్రంలో మునిగిపోయారు. ఏడ్పులు పెడబొబ్బలతో దిక్కులు మారుమ్రోగిపోయాయి. ప్రళయకాలంలో మంటలలో చిక్కుకొన్న జంతువులవలె ఆ స్త్రీలు ఏడుస్తున్నారు.ఆ నగరంలోని వైశ్యులు, శూద్రులు, శిల్పులు, కమ్మరులు, వడ్లవారు, మంగళ్ళు, కంసాలులు, చాకళ్ళు మొదలైన అన్ని వృత్తులవాళ్ళు ఆ రాజును చుట్టుముట్టి నడుస్తున్నారు. ఇట్లా ఒక క్రోసెడు దూరం అందరూ వెళ్ళారు అప్పుడు.

**విశేషం:** క్రోశం - రెండు వేల ధనుస్సుల నిడివి కలిగిన దూరమని నిఘంటువులు 'క్రోసెడు' అన్నమాటకు అర్థం చెప్తున్నాయి.

**సీ. ఆచార్య సుతుఁడుఁ గృపాచార్యుఁడును గృత । వర్మయు నెదురుగా వచ్చి రథము**
**లంతంత డిగ్గి శోకార్తి నంగంబులు । దూల బాష్పంబులు దొరుఁగుచుండఁ**
**గా ధృతరాష్ట్రునిఁ గాంచి గద్గదకంఠు । లగుచు నాతని కిట్లు లనిరి 'నీదు**
**తనయుండు భుజబల దర్పంబు దుర్వార । శౌర్యంబు మెరయంగ సంగరంబు**

**తే. సేసి యింద్రాది సురుల మెచ్చించి వారి । కతిథియై చని పరమ సుఖానుభవము**
**దగిలె నేము ముప్పురమును దక్క నమ్మ । హీశుతోడన్ సైన్యంబు లెల్లఁ జనియె.' 105**

**ప్రతిపదార్థం:** ఆచార్యసుతుఁడున్= ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామా; కృపాచార్యుఁడును= కృపుడూ; కృతవర్మయున్= కృతవర్మా; ఎదురుగాన్+వచ్చి= ఎదురుగావచ్చి; అంతంతన్= కొంచెం దూరంలో; రథములు= రథాలనుండి; డిగ్గి= దిగినవారై; శోక+ఆర్తిన్= దుఃఖబాధచేత; అంగంబులు= అవయవాలు; తూలన్= కంపిస్తుండగా; బాష్పంబులు= కంటినీరు; తొరుఁగుచుండఁగాన్= ప్రవహిస్తుండగా; ధృతరాష్ట్రునిన్+కాంచి= ధృతరాష్ట్రుడిని చూచి; గద్గద= వణుకుతున్న; కంఠులగుచున్= గొంతుకలు కలవారై; ఆతనికిన్= ఆ రాజుతో; ఇట్టులు+అనిరి= ఇట్లా అన్నారు; నీదు తనయుండు= నీ కుమారుడైన దుర్యోధనుడు; భుజబలదర్పంబు= భుజబలంచేత ఏర్పడిన గర్వం; దుర్వార= వారించటానికి వీలుకాని; శౌర్యంబు= పరాక్రమం; మెఱయంగన్= ప్రకాశించగా; సంగరంబు+చేసి= యుద్ధంచేసి; ఇంద్ర+ఆది= ఇంద్రుడు యముడు మొదలైన; సురులన్= దేవతలను; మెచ్చించి; వారికిన్+అతిథి+ఐ= వారికి అతిథిగా (స్వర్గానికి); చని= వెళ్ళి; పరమ సుఖానుభవమును= స్వర్గసుఖాన్ని; తగిలెన్= పొందాడు; ఏము= మేము; ముప్పురమును తక్కన్= ముగ్గురం తప్ప; సైన్యంబులు+ఎల్లన్= తక్కిన సైన్యమంతా; ఆ+మహీశుతోడన= ఆ రాజుతోనే; చనియెన్= చనిపోయింది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడి కుమారుడైన అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ - వీరు ముప్పురూ ఎదురుగా వచ్చి కొంత దూరంలో రథాలు దిగి, దుఃఖబాధతో వారి అవయవాలు కంపిస్తుండగా, కళ్ళల్లో నీళ్ళు ధారలుగట్టి ప్రవహిస్తుండగా, ధృతరాష్ట్రుడిని చూచి గడగడలాడుతూ వణుకుతున్న కంఠాలతో ఆ రాజుతో ఇట్లా అన్నారు. 'నీ కుమారుడైన దుర్యోధనుడు తన భుజబలం దర్పంతోనూ, వారించటానికి కాని పరాక్రమంతోనూ మహాయుద్ధంచేసి ఇంద్రాది దేవతలను మెప్పించి వారికి అతిథిగా స్వర్గానికి వెళ్ళి పరమసుఖాన్ని పొందాడు. మేము ముగ్గురం తప్ప తక్కిన సైన్యమంతా ఆ మహారాజుతోనే చనిపోయింది.'

**వ. అనినఁ దదనంతరంబ. 106**

**తాత్పర్యం:** అని వారు ముప్పురూ చెప్పారు. ఆ తరువాత.

### కృపాచార్యుఁడు గాంధారి నూరార్చిన ప్రకారము (సం. 11-10-5)

**తే. తనుజ శోకార్తయైన గాంధారిఁ జూచి । యడలు తనదు చిత్తంబున నతిశయిల్ల**
**నలఁతఁ దేర్పంగఁ దలఁచి తానల్లఁ జేరి । యమ్మహాదేవి తోడ నిట్లనియెఁ గృపుఁడు. 107**

**ప్రతిపదార్థం:** తనుజ= కుమారుల మరణంచేత ఏర్పడిన; శోక+ఆర్త+ఐన= దుఃఖంచేత ఆర్తురాలుగా కనిపిస్తున్న; గాంధారిన్+చూచి= గాంధారీదేవిని చూసి; కృపుఁడు= కృపాచార్యులు; తనదు చిత్తంబునన్= తన మనసులో; అడలు= దుఃఖం; అతిశయిల్లన్= అధికంకాగా; అలఁతన్= బాధను; తేర్పంగన్+తలఁచి= పోగొట్టటంకోసం (పోగొట్టాలని ఆలోచించి); తాను; అల్లన్+చేరి= నెమ్మదిగా చేరి; ఆ+మహాదేవి తోడన్= ఆ మహారాణితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నారు.

**తాత్పర్యం:** తన కుమారుల మృతి చేత ఏర్పడ్డ దుఃఖంతో అతి దీనురాలుగా కనిపిస్తున్న గాంధారిని చూచి కృపాచార్యుడికి కూడా మనసులో దుఃఖం కట్టలు తెంచుకొన్నది. ఆమె బాధను పోగొట్టాలని ఆలోచించి ఆయన ఆమె వద్దకు నెమ్మదిగా వెళ్ళి ఆ మహారాణితో ఇట్లా అన్నాడు.

**మణిమాలా వృత్తము:**

> **'భవదీయ సూను లరి సైన్య పజ్క్తిఁ గొని కాల్చిరెల్లఁ బొగడన్**
> **వివిధాస్త్ర శస్త్రమయ సాంద్రవృష్టిఁ దెగటాఱి పెంపు మిగులన్**
> **దివి కేఁగి యందు మహనీయ తేజ మెసఁగంగ హృద్యబలభి**
> **ద్ధ్రువ సౌఖ్యసంపదలు గాంచి సంతోషమునఁ దేలి రేల వగవన్? 108**

**ప్రతిపదార్థం:** భవదీయ= నీ; సూనులు; కుమారులు; అరిసైన్య పజ్క్తిన్= శత్రు సైన్య సమూహాన్ని; కొని= పట్టుకొని; ఎల్లన్+ పొగడన్= అందరూ ప్రశంసించగా; కాల్చిరి= బూడిద చేశారు; వివిధ= అనేకాలైన; శస్త్రమయ= శస్త్రాలతో కూడిన; సాంద్రవృష్టిన్= దట్టమైన వర్షంచేత; తెగటాఱి= చనిపోయి; దివికిన్= స్వర్గానికి; పెంపుమిగులన్= అతిశయించిన గౌరవంతో; ఏఁగి= వెళ్ళి; అందున్= ఆ స్వర్గంలో; మహనీయ= గొప్ప; తేజము= కాంతి; ఎసఁగంగన్= అతిశయించగా; హృద్య= మనోహరమైన; బలభిత్= ఇంద్ర సంబంధమైన (స్వర్గ); ధ్రువ= నిత్యమైన; సౌఖ్యసంపదలు= సుఖాలను; కాంచి= పొంది; సంతోషమునన్= సంతోషంలో; తేలిరి= సరదాగా ఉన్నారు; వగవన్= దుఃఖించటం; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** 'గాంధారీదేవీ! నీ కుమారులు శత్రుసైన్య సమూహాలను అందరూ ప్రశంసించే రీతిలో ధ్వంసంచేశారు. వివిధ శస్త్రాస్త్రమయమైన ఆయుధ వర్షంలో అందరూ చనిపోయి అతిశయించిన గౌరవంతో స్వర్గానికి వెళ్ళి అక్కడ గొప్ప కాంతితో ప్రకాశిస్తూ మనోహరమైన నిరంతర స్వర్గసౌఖ్యాన్ని పొంది సంతోషసాగరంలో తేలుతున్నారు. అట్లాంటి వారిని గురించి చింతించటం తగదు.

**విశేషం:** మణిమాలా వృత్తంలో ప్రతిపాదానికీ స, జ, స, జ, స, జ, స గణము లుంటాయి. మొదటి అక్షరానికీ పదకొండవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**స్వాగత వృత్తము:**

> **అందొకండును రణావని భీతిం। బొంద కేటులను బోటుల డప్పిం**
> **బొందియైనఁ బొలిపోవఁడ దానం। బొంది రూర్ధ్వగతిఁ బుణ్యచరిత్రా! 109**

**ప్రతిపదార్థం:** పుణ్యచరిత్రా!= పవిత్ర చరిత్ర కలిగిన ఓ గాంధారీ! అందున్= నీ కొడుకులలో; ఒకండును= ఒక్కడుకూడా; రణ+అవనిన్= బాణాల యుద్ధభూమిలో; భీతిన్+పొందక= భయపడక; ఏటులన్= బాణాల దెబ్బలతో; పోటులన్= కత్తి పోట్లతో; డప్పిన్+పొంది+ఐనన్= దప్పిక పొందినవాడై ఉండికూడా; పొలి+పోవఁడు+అ= భంగపడి యుద్ధంనుండి మరలిపోలేదు; దానన్= అంచేత; ఊర్ధ్వగతిన్= సుగతిని (స్వర్గాన్ని); పొందిరి= పొందారు.

**తాత్పర్యం:** ఓ పవిత్ర చరిత్ర కలిగిన గాంధారీ! నీ కొడుకులలో ఒక్కడుకూడా యుద్ధభూమిలో భయాన్ని పొందలేదు. బాణాల, గదల దెబ్బలను, బల్లెం, కత్తి మొదలైన వాటి పోటులను పొంది ఎంత దప్పిక పొందిన వారైనా భంగపడి యుద్ధం విరమించి మరలి పోలేదు. అందుచేతనే వారికి స్వర్గ ప్రాప్తి కలిగింది.

**విశేషం:** యుద్ధంలో శత్రువులకు భయపడి వెన్నుచూపిరావటం యోధుడి లక్షణం కాదు. అట్లా ఎదురొడ్డి చనిపోయిన వారే స్వర్గాన్ని పొందుతారని భారతీయుల విశ్వాసం.

స్వాగతవృత్తంలో ప్రతి పాదానికీ ర, న, భ, గ, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ, ఏడవ అక్షరానికీ యతిమైత్రి, ప్రాస నియమం కలవు.

**వనమయూర వృత్తము:**

**పోర నొడ లస్త్రపరిపూతముగ ధీరో । దారతఁ బిఱిందికిఁ బదం బిడక దృప్య**
**ద్వైరితతి నొంచి తెగువారగుట మేలు । ర్వీరమణకోటి కని వేదములు సెప్పన్. 110**

**ప్రతిపదార్థం:** పోరన్= యుద్ధంలో; ఒడలు= దేహం; అస్త్ర= అస్త్రాలచేత; పరిపూతముగన్= నిండి పవిత్రంకాగా; ధీర+ఉదారతన్= పరాక్రమంచేత, ఔదార్యంచేత; పిఱిందికిన్= వెనుకకు; పదంబు+ఇడక= అడుగు పెట్టకుండా; దృప్యత్= దర్పించిన; వైరితతిన్= శత్రుసమూహాన్ని; నొంచి= నాశనంచేసి; తెగువారగుట= చచ్చినవారు కావటం; ఉర్వీరమణ కోటికిన్= రాజుల సమూహానికి; మేలు+అని= శ్రేష్ఠమని; వేదములు= వేదాలు; చెప్పున్= చెబుతాయి.

**తాత్పర్యం:** యుద్ధంలో శరీరం శస్త్రాస్త్రాలచేత సంపూర్ణంగా పవిత్రంగా, ధీరోదాత్తంగా పోరాడి, అడుగు వెనుకకు వేయకుండా దర్పించిన శత్రువుల సమూహాలను నాశనంచేసి చావటమే రాజులకు శ్రేష్ఠమైన కార్యమని వేదాలు చెప్తున్నాయి.

**విశేషం:** యోధుడు, యోగి - ఇరువురు మాత్రమే స్వర్గాన్ని పొందుతారు. అందుకే 'యుద్ధం ఒక యోగమే' అని భారతీయులు భావిస్తారు. వనమయూరవృత్తంలో ప్రతిపాదానికీ భ, జ, స, న, గ, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ తొమ్మిదవ అక్షరానికీ యతిమైత్రి.

**క. దానాద్యుత్తమ కర్మ వి । ధానంబులఁ బడయు గతు లుదాత్త రణమునం**
**జా నేర్చువాని చనియెడు । మానితగతిఁ బోల వండ్రు మహనీయాత్ముల్. 111**

**ప్రతిపదార్థం:** మహనీయ+ఆత్ముల్= మహాత్ములు; దాన+ఆది= దానం ధర్మం మొదలైన; ఉత్తమ= గొప్ప; కర్మవిధానంబులన్= కర్మ విధులచేత; పడయు= పొందేటటువంటి; గతులు= పుణ్యలోకాలు; ఉదాత్తరణమునన్= గొప్ప యుద్ధంలో; చాన్+నేర్చు+వాని= చనిపోగలవాడి; చనియెడు= పోయేటటువంటి; మానితగతిన్= ఉత్తమ లోకప్రాప్తిని; పోలవు+అండ్రు= సమానమైనవి కావని అంటారు (సరిపోవు అంటారు).

**తాత్పర్యం:** దానం, ధర్మం మొదలైన గొప్ప కర్మల విధులచేత ఏ పుణ్యలోకాలను పొందుతామో అవి మహాయుద్ధంలో మరణించే వాడు పొందే ఉత్తమ లోకప్రాప్తికి సమానం కావని మహాత్ములు అంటారు.

**వ. కావునం గురుకుమారుల మరణంబు సంభావనీయం బది దా నట్లుండెఁ బాండుకుమారులు గెలిచితి మని సంతసింపలే దది యెట్లనిన. 112**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; కురుకుమారుల= కురురాకుమారుల; మరణంబు= మృతి; సంభావనీయంబు= ఊహించదగినదే (దేవతలు ముందుగానే చెప్పారు కాబట్టి); అది+తాన్+అట్లుండెన్= అది అట్లా జరిగింది; పాండు కుమారులు= పాండవులు; గెలిచితిమి+అని= విజయం పొందామని; సంతసింపలేదు= సంతోషించలేదు; అది ఎట్లా అంటే.

**తాత్పర్యం:** అందువలన కురు రాజకుమారుల మృతి ఊహించదగినదే. దేవతలు ముందు చెప్పినట్లే జరిగింది. అది అట్లా ఉండనిమ్ము. పాండవులు మాత్రం తాము గెలిచామని సంతోషపడ్డారా! అదీ ఏమీ లేదు. ఎట్లాగంటే.

**నర్కుట వృత్తము:**

**వినుము మరుత్తనూభవుఁడు విశ్రుతధర్మగతిం**
**జనక కురుక్షితీశ్వరునిఁ జంపె గదాసమరం**
**బున నది యే మెఱింగి చనిపోయిన రేయి గడుం**
**గనలున ముట్టి ముప్వురముఁ గ్రౌర్య ముదగ్రముగన్. 113**

**ప్రతిపదార్థం:** వినుము= గాంధారీదేవీ! వినుము; మరుత్+తనూభవుఁడు= మరుత్తు అంటే వాయువు - వాయుకుమారుడు - భీముడు; విశ్రుత= ప్రసిద్ధమైన; ధర్మగతిన్= ధర్మపద్ధతిలో; చనక= నడవక; కురుక్షితి+ఈశ్వరునిన్= సుయోధన మహారాజును; గదాసమరంబునన్= గదా యుద్ధంలో; చంపెన్= చంపాడు; అది= ఆ విషయం; ఏము+ఎఱింగి= మేము తెలిసికొని; చనిపోయిన రేయి= దుర్యోధనుడు చనిపోయిన ఆ రాత్రే; ముప్వురము= మేము ముగ్గురం; కనలునన్= కోపంతో; క్రౌర్యము+ఉదగ్రముగన్= కఱకుదనం అతిశయించగా.

**తాత్పర్యం:** గాంధారీదేవీ! వినుము. వాయుపుత్రుడైన భీముడు యుద్ధంలో పాటించే ధర్మపద్ధతిని అనుసరించకుండా సుయోధనుడిని గదాయుద్ధంలో క్రూరంగా చంపాడు. ఆ విషయం విన్న మేము ముగ్గురం అదే రాత్రి అతికోపంతో అతిశయించిన క్రౌర్యంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** నర్కుటవృత్తంలో ప్రతిపాదానికీ న, జ, భ, జ, జ, వ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ పదకొండవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. పాండవ శిబిరంబున. 114**

**తాత్పర్యం:** పాండవుల సైనిక స్థావరంలో.

**బంధుర వృత్తము:**

**సకల రథములను నఖిల గజములున్ సర్వహయంబులతో బెరయన్**
**శకలములుగ భటనికర మఖిలముం జావఁగ ద్రౌపదిపుత్రులలో**
**నొకఁడును బ్రదుకక పొడిపొడియుఁగ నయ్యుర్వికి వారలమామల మ**
**స్తకములు కడమపడక వడి బలిగా సంతసమందఁ బిశాచతతుల్. 115**

**ప్రతిపదార్థం:** సకల రథములను= రథాలన్నింటినీ; అఖిల గజములున్= అన్ని ఏనుగులూ; సర్వహయంబులతోన్= అన్ని గుర్రాలతో; బెరయన్= కలిసిపోయేటట్టు; శకలములుగన్= ముక్కలు ముక్కలుగా; భటనికరము+అఖిలమున్= సైన్యం మొత్తం; చావఁగన్= చచ్చిపోయేలా; ద్రౌపది పుత్రులలోన్= ఉపపాండవులలో; ఒకఁడును= ఒక్కడుకూడా; బ్రదుకక= బ్రతికి బయటపడకుండా; పొడిపొడియుఁగన్= నుగ్గునుగ్గుగా అయిపోయేలా; వారల= ఆ ఉపపాండవుల; మామల మస్తకములు= మామల తలలు; కడమ+పడక= మిగులకుండా; ఆ+ఉర్వికిన్= ఆ యుద్ధభూమికి; వడిన్= పరాక్రమంతో; బలిగాన్= బలి అయ్యేటట్లుగా; పిశాచతతుల్= పిశాచసమూహాలు; సంతసమందన్= సంతోషపడగా.

**తాత్పర్యం:** రథాలను, ఏనుగులను, గుర్రాలను - అన్నిటిని కలిపి నుగ్గునుగ్గుచేసి మొత్తం సైన్యమంతా చనిపోగా, ద్రౌపది కుమారులలో ఒక్కడు కూడా మిగలకుండా అందరినీ చంపి, వారి మామల తలకాయలు కూడా మిగలకుండా వీరులందరినీ పొడిపొడిచేసి, ఆ యుద్ధభూమికి మా పరాక్రమంతో బలి పెట్టాము. పిశాచ సమూహాలు సంతోషించాయి. ఈ విధంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** బంధురవృత్తంలో ప్రతిపాదానికీ న, న, న, న, స, భ, భ, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ పదహారవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ.** **సమరంబు సేసితి మట్లగుట నప్పాండవుల విజయంబు వితథంబయ్యె నిటయేము సేయం దలంచిన దాని నెఱింగించెద నాకర్ణింపు మే మట్టి సమయంబున వార లాశిబిరంబున లేమింజేసి యాభంగి పరాక్రమం బాచరింప నోపితిమి గాని యమ్మహాబలుల మార్కొన శక్తులముగా మవ్వీరులట్లు దమ తనయులు మా తెగువం దెగటాఱుట విని శోక క్రోధాక్రాంతంబులగు నంతరంగంబులతో మమ్ము వెనుకొనుట దప్పదు. వారల బారికిం దప్పిపోవలయుం బోయెద మది తలం పనుజ్ఞయిమ్ము నీవు నుమ్మలింపకుండు 'మని పలికి ధృతరాష్ట్రు నుద్దేశించి 'దేవా! ధర్మపుత్రాదుల బారింబడక తొలంగుట భీతులగు మాకుం గర్తవ్యంబై యున్నయది మీ చేత ననుజ్ఞాతులమ నీ వింక దైవకృతం బలంఘనీయంబగుటఁ దలంచి వగ పుడుగు' మని యచ్చట నా కృప కృతవర్మాశ్వత్థామ లారాజునకు నద్దేవికిం బ్రదక్షిణంబుగా వచ్చి మరలి మరలి వారలం జూచుచుఁ దేరు లెక్కి భయంబున రయంబున నరదంబులు దోలుకొని గంగాతీరంబున కరిగి యచ్చట నన్యోన్యామంత్రణంబు సేసి పాసి రందుఁ గృపాచార్యుఁడు గరిపురి కేతెంచెఁ, గృతవర్మ నిజపురంబునకుఁ జనియె. నశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమంబు నాశ్రయించి గ్రక్కునం దపస్వియయ్యెఁ, దదనంతరంబ ధర్మజభీమార్జునులు దాడిమై వచ్చి యతని ముట్టుకొని రావృత్తాంతంబంతయు నీ విన్నయదియ తరువాతి కథ సెప్పెద విను మవ్విధంబునఁ గృపప్రముఖ రథికులు ముప్పురుం దన్ను విడిచి చనిన నాంబికేయుండు గ్రొత్తయైన నెవ్వగ పెల్లునఁ జిత్తంబు విషాద వేదనాయత్తం బగుచుండ నెడనెడ నిలుచుచుఁ జనుచుండె నక్కడ నయ్యజాతశత్రుండు గురునందను శిరోరత్నంబు దెచ్చి యిచ్చి యట్లు పాంచాలి నూరార్చియున్నంత నట వోయిన జనంబుల వలన వైచిత్రవీర్యుండు పొలికలనికి వచ్చుచున్నవాఁడని విని తదభిగ మనోన్ముఖుండై.** **116**

**ప్రతిపదార్థం:** సమరంబు= యుద్ధం; చేసితిమి= చేశాము; అట్లు+అగుటన్= అట్లా కావటంవలన; ఆ+పాండవుల విజయంబు= ఆ పాండవులు సాధించిన విజయం; వితథంబు+అయ్యెన్= వ్యర్థమయింది; ఇట= ఇక్కడ; ఏము= మేము ముగ్గురం; చేయన్+తలంచిన దానిన్+ఎఱింగించెదన్= చేయదలచినదాన్ని చెబుతాను; ఆకర్ణింపుము= వినుము; ఏము= మేము; అట్టి= సమయంబునన్= ఆ సమయంలో; వారలు+ఆ శిబిరంబునన్+లేమిన్+చేసి= ఆ పాండవులు శిబిరంలో లేరు కాబట్టి; ఆ భంగిన్= ఆ రీతిగా; పరాక్రమంబు= పరాక్రమాన్ని; ఆచరింపన్+ఓపితిమి= చూపించగలిగాము; కాని; ఆ+మహాబలులన్= ఆ మహాపరాక్రమవంతులను; మార్కొనన్= ఎదుర్కొనటానికి; శక్తులము+కాము= సమర్థులం కాము; ఆ+వీరులు= ఆ పాండవులు; తమ తనయులు= తమ కుమారులు; మా తెగువన్= మా సాహసంచేత; అట్లు= ఆ విధంగా; తెగటాఱుట విని= చనిపోవటాన్ని విని; శోక+క్రోధ+ఆక్రాంతంబులగు+అంతరంగంబులతోన్= దుఃఖం, క్రోధం నిండిన మనస్సులతో; మమ్మున్=

మమ్ములను; వెనుకొనుట= తరుముకొంటూ రావటం; తప్పదు= తప్పనిసరిగా జరుగుతుంది; వారల బారికిన్= వాళ్ళ బారినుండి; తప్పిపోవలయున్= తప్పించుకోవాలి; పోయెదము+అది+తలంపు= వెళ్ళిపోతాము- అది మా ఆలోచన; అనుజ్ఞ+ఇమ్ము= అనుమతిని ఇవ్వుము; నీవున్= నీవు కూడా; ఉమ్మలింపక+ఉండుము= శోకించవద్దు; అని పలికి; ధృతరాష్ట్రు+ఉద్దేశించి= ఆ మహారాజును చూచి; దేవా!= ఓ రాజా!; ధర్మపుత్రాదుల బారిన్+పడక= ధర్మరాజాదుల హింసకు చిక్కకుండా; తొలంగుట= తప్పించుకుపోవటం; భీతులు+అగు= భీతులైన; మాకున్+కర్తవ్యంబు+ఐ+ఉన్న+అది= మాకు చేయదగినపని అనిపిస్తోంది; మీచేతన్+అనుజ్ఞాతులము+అ= మీ చేత అనుమతింప బడ్డాము; నీవ, ఇంకన్= ఇకమీదట; దైవకృతంబు= దైవనిర్ణయం; అలంఘనీయంబు+అగుటన్+తలంచి= ఉల్లంఘించటానికి వీలు కాదన్నది అర్థం చేసికొని; వగపు= దుఃఖాన్ని; ఉడుగుము= విడిచిపెట్టుము; అని; అచ్చటన్= ఆ చోటే; ఆ, కృప, కృతవర్మ, అశ్వత్థామలు; ఆ రాజునకున్= రాజుకు; ఆ+దేవికిన్= గాంధారికీ; ప్రదక్షిణంబుగాన్+వచ్చి= ప్రదక్షిణంగా నమస్కరించి; మరలి మరలి= మళ్ళీ మళ్ళీ; వారలన్+చూచుచున్= వాళ్ళను చూస్తూ; తేరులు+ఎక్కి= రథాలు ఎక్కి; భయంబునన్+రయంబునన్= భయంగా, వేగంగా; అరదంబులు+తోలుకొని= రథాలు తోలుకొంటూ; గంగాతీరంబునకున్+అరిగి= గంగానదితీరానికి వెళ్ళి; అచ్చటన్= అక్కడ; అన్యోన్య+ఆమంత్రణంబు+చేసి= ఒకరినొకరు వీడ్కొని; పాసిరి= వెళ్ళిపోయారు; అందున్= వారిలో; కృపాచార్యుడు; కరిపురికిన్+ఏతెంచెన్= హస్తినాపురానికి వచ్చాడు; కృతవర్మ; నిజపురంబునకున్= ద్వారకకు; చనియెన్= వెళ్ళాడు; అశ్వత్థామ; కృష్ణద్వైపాయన= వ్యాసమహర్షి; ఆశ్రమంబున్= ఆశ్రమాన్ని; ఆశ్రయించి= చేరి; గ్రక్కునన్= ఆలస్యం చేయకుండా; తపస్వి+అయ్యెన్= తాపసి అయ్యాడు; తద్+అనంతరంబ= ఆ తరువాత; ధర్మజ భీమ అర్జునులు; దాడిమైన్= దాడిగా; వచ్చి; అతనిన్= ఆ అశ్వత్థామను; ముట్టుకొనిరి= ముట్టడించారు; ఆ వృత్తాంతంబు+అంతయున్= ఆ విషయమంతా; నీవు+విన్న+అది+అ= నీవు విన్నదే; తరువాతి కథ+చెప్పెదన్+వినుము= ఆ తరువాత జరిగిన కథ చెబుతాను వినుము; ఆ+విధంబునన్= ఆ విధంగా; కృప ప్రముఖ రథికులు= కృపాచార్యుడు మొదలైన మహావీరులు; తన్నున్ విడిచి చనినన్= తనను వదలిపోగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; క్రొత్త+ఐన= క్రొత్తగా పుట్టిన; నెఱ+వగ పెల్లునన్= సంపూర్ణ దుఃఖాతిశయంతో; చిత్తంబు= మనస్సు; విషాదవేదనా+ఆయత్తంబు+అగుచుండన్= విషాద వేదనతో నిండినది కాగా; ఎడనెడన్= అక్కడక్కడ; నిలుచుచున్+చనుచుండెన్= ఆగి నిలబడుతూ వెళ్తూ ఉన్నాడు; అక్కడన్= ఆ శిబిరంలో; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు; గురునందను= ద్రోణకుమారుడైన అశ్వత్థామయొక్క; శిరోరత్నంబు= తలమీదనున్న రత్నాన్ని; తెచ్చియిచ్చి; అట్లు= ఆ విధంగా; పాంచాలిన్+ఊరార్చి+ఉన్న+అంతన్= ద్రౌపదిని ఓదార్చి ఉండగా; (అప్పుడు); అట+పోయిన= యుద్ధభూమికి వెళ్ళి వచ్చిన; జనంబులవలనన్= జనాలవలన; వైచిత్రవీర్యుండు= విచిత్ర వీర్యుని కుమారుడైన ధృతరాష్ట్రుడు; పాలి+కలనికిన్= యుద్ధభూమికి; వచ్చుచున్నాడు+అని+విని= వస్తున్నాడని విని; తద్+అభిగమన+ఉన్ముఖుండై= ఆయన వస్తున్న దారిలోనే (బయలుదేరాడు).

**తాత్పర్యం:** యుద్ధం చేశాము. అట్లా అవటం వలన ఆ పాండవులు సాధించిన విజయం నిరుపయోగమయింది. ఇక్కడ మేము చేయదలచిన దాన్ని చెబుతాను వినుము. ఆ సమయంలో పాండవులు ఆ స్థావరంలో లేకపోవటం చేతనే అట్లా పరాక్రమించి మిగిలిన వారిని చంపగలిగాము. అంతే కాని ఆ మహాపరాక్రమవంతులను ఎదుర్కొనటానికి మేము సమర్థులం కాము. ఆ పాండవులు తమ కుమారులు మా పరాక్రమంతో అట్లా చనిపోవటాన్ని గురించి విని దుఃఖం, క్రోధం నిండిన మనస్సులతో మమ్మల్ని వెన్నాడి రావటం తప్పదు. వాళ్ళబారినుండి బయటపడాలి అన్నది మా ఆలోచన. దీనికి మీరు అనుమతించండి. నీవు దుఃఖించవద్దు' - అని గాంధారికి చెప్పి, ధృతరాష్ట్రుడితో 'ఓ రాజా! ధర్మరాజాదుల బారికి చిక్కకుండా తప్పించుకొనిపోవటం మాకు ఇప్పుడు కర్తవ్యం. మీ రెట్లాగూ అనుమతించారు. ఇక నీవు దైవనిర్ణయం ఎదిరించటానికి కాదన్న విషయాన్ని అర్థం చేసికొని దుఃఖాన్ని వదలిపెట్టుము' అని ఆ చోటనే వారిరువురికీ ప్రదక్షిణనమస్కారం చేసి, మళ్ళీ మళ్ళీ వాళ్ళనే చూస్తూ రథాలు ఎక్కి భయంభయంగా

రథాలు తోలుకొంటూ గంగానదీతీరానికి చేరుకొన్నారు. అక్కడ ఒకరినొకరు వీడ్కొని తమతమ మార్గాలలో వెళ్ళిపోయారు. వారిలో కృపాచార్యుడు హస్తినకు తిరిగి వచ్చాడు. కృతవర్మ ద్వారకకు చేరుకొన్నాడు. అశ్వత్థామ వ్యాసమహర్షి ఆశ్రమాన్ని చేరుకొని వెంటనే తపస్సు మొదలుపెట్టాడు. ఆ తరువాత ధర్మరాజాదులు దాడిగా వచ్చి ఆ అశ్వత్థామను ముట్టడించారు. ఆ విషయ మంతా నీవు విన్నదే. తరువాతి కథ చెప్పుతాను వినుము (అంటూ జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పుతున్నాడు). ఆ విధంగా కృపాచార్యుడు మొదలైన వీరులు తనను వదలిపోగా ధృతరాష్ట్రుడు కొత్తగాపుట్టిన దుఃఖంతో మనసు విషాదంతో వేదనతో నిండిపోగా అక్కడక్కడా ఆగి ఆగి ముందుకు సాగుతున్నాడు. అక్కడ ఆ శిబిరంలో ధర్మరాజు అశ్వత్థామ తలమీదనున్న రత్నాన్ని తెచ్చి ద్రౌపదికి ఇచ్చి ఆమెను ఓదార్చాడు. ఆ సమయంలో యుద్ధభూమినుండి తిరిగివచ్చిన వారి ద్వారా ధృతరాష్ట్రుడు యుద్ధభూమికి వస్తున్నాడని తెలిసి ఆయనను కలసికొనటానికి అదే దారిలో ధర్మరాజాదులు కూడా బయలుదేరారు.

## ధర్మరాజు దమ్ములతోడ ధృతరాష్ట్రు నొద్దకుఁ బోవుట (సం. 11-11-1)

**తే.** **తనయులందఱుఁ బొలియుట వినిన యడలు । మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు**
**పొగులుచును వచ్చెనను తలపోఁతఁ జేసి । యుల్ల మక్కటికమునఁ జొత్తిల్లుచుండ.** **117**

**ప్రతిపదార్థం:** తనయులందఱున్= కొడుకులందరూ; పొలియుట= చనిపోవటం; వినిన= విన్నటువంటి; అడలు= దుఃఖం; మానసంబున్= మనసును; దహింపన్= కాల్చివేస్తుండగా; ఆ+మనుజవిభుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; పొగులుచునున్= దుఃఖిస్తూ (బాధపడుతూ); వచ్చెన్+అను= వస్తున్నాడన్న; తలపోఁతన్+చేసి= ఆలోచనవచ్చి; ఉల్లము= హృదయం; అక్కటికమునన్= దయతో; జొత్తిల్లుచుండన్= ఆర్ద్రమై పోగా.

**తాత్పర్యం:** అంతమంది కొడుకులూ చనిపోయారన్న వార్త విని దుఃఖం మనసును దహించి వేస్తుండగా ఆ మహారాజు యుద్ధభూమికి వస్తున్నాడన్న ఆలోచన కలిగి ధర్మరాజుకు హృదయమంతా కనికరంతో ఆర్ద్రమై పోయింది.

**క.** **వదనమున విన్నఁదనముం । గదురఁగ హరిఁ జూచి రాజుఁ గానవలయు నా**
**కదియెట్లు నుడుగవచ్చునె? । కదలుండని పలికి చనియెఁ గలనివలనికిన్.** **118**

**ప్రతిపదార్థం:** వదనమునన్= ముఖంలోని; విన్నఁదనమున్= దైన్యం; కదురఁగన్= వ్యాపించగా; హరిన్+చూచి= శ్రీకృష్ణుని చూచి; రాజున్= ధృతరాష్ట్ర మహారాజును; కానన్ వలయున్= తప్పకుండా దర్శించుకోవాలి; నాకున్+అది+ఎట్లున్+ఉడుగన్ వచ్చునె?= నాకు అది తప్పనిసరి కాదా?; కదలుండు+అని= ముందుకు పదండి; అని; పలికి; కలనివలనికిన్= యుద్ధభూమివైపు; చనియెన్= సాగిపోయాడు.

**తాత్పర్యం:** ముఖంలో దైన్యం వ్యాపించగా ధర్మరాజు శ్రీకృష్ణుడితో 'నేను ధృతరాష్ట్రమహారాజును తప్పక దర్శించుకొనాలి. అది నాకు అవశ్యకర్తవ్యం. తప్పించుకొనటానికి వీలులేదు, ముందుకు వెళ్ళుదాము - 'అని అంటూ యుద్ధభూమివైపు సాగిపోయాడు.

**ద్రుతవిలంబిత వృత్తము**

**చనఁగ నాతఁడు సాత్యకి వాయునం । దనుఁడు గాండివి దమ్ములు సూరెలం**
**జనిరి ద్రౌపది సంభృతశోక యై । చనియెఁ జుట్టపుఁ జానలు సుట్టిరాన్.** **119**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ధర్మరాజు; చనఁగన్= వెళుతుండగా; సాత్యకి; వాయునందనుఁడు= భీముడు; గాండివి= అర్జునుడు; తమ్ములు= నకుల సహదేవులు; సూరెలన్= ఆ ప్రక్కల; చనిరి= వచ్చారు; ద్రౌపది; సంభృత= మిక్కిలి; శోక+ఐ= శోకంతో కూడినదై; చుట్టపు+చానలు= బంధువులైన స్త్రీలు; చుట్టిరాన్= వెన్నంటి వస్తుండగా; చనియెన్= ముందుకు సాగింది.

**తాత్పర్యం:** అట్లా ధర్మరాజు వెళ్ళుతుండగా సాత్యకి, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు ఆయనకు ఇరువైపులా బయలుదేరారు. ద్రౌపది మిక్కిలి శోకంతో కూడినదై బంధు స్త్రీలు వెన్నంటి వస్తుండగా ముందుకు సాగింది.

**విశేషం:** ద్రుతవిలంబితవృత్తంలో ప్రతిపాదానికీ న, భ, భ, ర అనే గణాలుంటాయి. 1-7 అక్షరాలకు యతిమైత్రి, ప్రాసనియమం కలదు.

**వ. ఇట్లు మాత్స్యపాంచాల భామలు నరిగిరి. తొలునాఁడు దుర్యోధనుండు మన్నించు మానవతులం గరి నగరంబునకుం గొని చని యారాత్రి యందు నిలిచి ధృతరాష్ట్రుం బొడగానక రేపకడ మగిడి వచ్చి యున్న యుయుత్సుండును నమ్మానవపతితోన చనియె. నట్లు ధర్మసూనుండు సని సమరతలంబు దఱియునంతకు నయ్యెడకు నాంబికేయుండు సనుదెంచె. నతని ముందటి వలని వనితాజనంబు లక్కౌంతేయాగ్రజుం గనుంగొని కరంబులెత్తి యేడ్చుచు నెదుర్కొని. 120**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మాత్స్య= మత్స్యదేశానికి చెందిన స్త్రీలు; పాంచాలభామలు= పాంచాలదేశానికి చెందిన స్త్రీలు; అరిగిరి= వెళ్ళారు; తొలునాఁడు= మొదటిరోజు; దుర్యోధనుండు= సుయోధనుడు; మన్నించు= అభిమానించే; మానవతులన్= స్త్రీలను; కరినగరంబునకున్= హస్తినాపురికి; కొని చని; ఆ రాత్రి+అందున్+నిలిచి= ఆ రాత్రి అక్కడే ఉండి; ధృతరాష్ట్రున్+పొడగానక= ధృతరాష్ట్రుడు కనిపించకపోగా; రేపకడ= ఉదయాన్నే; మగిడివచ్చి+ఉన్న= తిరిగివచ్చి ఉన్న; యుయుత్సుండును= యుయుత్సుడనే ధృతరాష్ట్రుని కుమారుడు; ఆ+మానవపతితోన్+అ= ఆ మహారాజుతోనే; చనియెన్= కలిసి వెళ్ళాడు; అట్లు= ఆ విధంగా; ధర్మసూనుండు= ధర్మరాజు; చని= బయలుదేరి; సమరతలంబున్= యుద్ధభూమిని; దఱియునంతకున్= సమీపించేటప్పటికి; ఆ+ఎడకున్= ఆ చోటికి; ఆంబికేయుండు+చనుదెంచెన్= ధృతరాష్ట్రుడు కూడా వచ్చాడు; అతని ముందటి వలని వనితాజనంబులు= ఆ రాజుకు ముందు నడుస్తున్న స్త్రీలు; ఆ+కౌంతేయ+అగ్రజున్= ఆ ధర్మరాజును; కనుంగొని= చూచి; కరంబులు+ఎత్తి= చేతులు పైకెత్తి; ఏడ్చుచున్= ఏడుస్తూ; ఎదుర్కొని= ఎదురుగా వచ్చి.

**తాత్పర్యం:** ఈ విధంగా మత్స్య పాంచాల దేశాలకు చెందిన స్త్రీలు, ద్రౌపది ముందువెనుకలుగా బయలుదేరారు. మొదటిరోజున సుయోధనుడు అభిమానించే స్త్రీలను హస్తినాపురికి తీసికొని వెళ్ళి ఆ రాత్రి అక్కడే ఉండిన యుయుత్సుడు అక్కడ ధృతరాష్ట్రుడు లేకపోగా ఉదయాన్నే యుద్ధభూమికి చేరుకొని మహారాజు వెంబడి బయలుదేరాడు. ఆ విధంగా ధర్మరాజు బయలుదేరి యుద్ధభూమికి చేరుకొనేటప్పటికి ధృతరాష్ట్రుడుకూడా అక్కడికి చేరుకొన్నాడు. ఆ రోజు ముందు నడుస్తున్న స్త్రీలు ధర్మరాజును చూడగానే చేతులు పైకెత్తి హాహాకారాలు చేస్తూ ఏడుస్తూ ఎదురుగా వచ్చారు.

**సీ. ధర్మ వేదిత్వ మీ ధరణీశ్వరునకు నెక్కడి । యది కృప యెందుఁగలదు? తలఁపఁ**
**దండ్రుల మామలఁ దాతలఁ గొడుకులఁ । దోడఁబుట్టువులను ద్రుంచివైచెఁ**

**గ్రూరత మెఱయంగ గురుజనంబులఁ గూల్చె । సఖుల సంబంధులఁ జంపె నదయుఁ**
**డని పల్కుదురు కొంద అప్పార్థుఁ జేరి గాం । గేయుని ద్రోణునిఁ గెడయఁ బొదువఁ**

**ఆ. బనుపనెట్లు నేర్చి తని పల్కుదురు గొంద । అకట! సింధురాజు ననుజమగనిఁ**
**దునిమి తేటి రాజ్య? మని పల్కుదురు గొంద । అతఁడు మోము వాంచి యరుగుచుండ. 121**

**ప్రతిపదార్థం:** కొందఱు= కొంతమంది స్త్రీలు; ఈ ధరణీశ్వరునకున్= ఈ ధర్మరాజుకు; ధర్మవేదిత్వము+ఎక్కడి+అది?= ధర్మవేత్తృత ఎక్కడిది?; తలఁపన్= ఆలోచిస్తే; కృప= దయ; ఎందున్+కలదు?= ఎక్కడున్నది?; తండ్రులన్= తండ్రులను; మామలన్= మామలను; తాతలన్= తాతలను; కొడుకులన్= కొడుకులను; తోబుట్టువులను= తమ్ముళ్ళను; త్రుంచివైచెన్= చంపివేశాడు; క్రూరత= క్రౌర్యం; మెఱయంగన్= ప్రకాశించగా; గురుజనంబులన్= గురువులను; కూల్చెన్= చంపాడు; సఖులన్= స్నేహితులను; సంబంధులన్= బంధువులను; చంపెన్= చంపాడు; అదయుఁడు= ఇతడు కనికరం లేనివాడు; అని పల్కుదురు= అని అన్నారు; కొందఱు= మరికొందరు; ఆ+పార్థున్+చేరి= ఆ అర్జునుడిని సమీపించి; గాంగేయునిన్= భీష్ముడిని; కెడయన్= చంపటానికి; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; పొదువన్+పనుపన్= ముట్టడించి చంపటానికి; ఎట్లు నేర్చితి(వి)?+అని= ఎలా సాహసించావు? అని; పలుకుదురు= ప్రశ్నించారు; కొందఱు= ఇంకొందరు; అకట!= అయ్యో!; సింధురాజున్= సింధురాజును (సైంధవుడిని); అనుజమగనిన్= నీ చెల్లెలు భర్తను; తునిమితి(వి)= చంపావు; ఏటి+రాజ్యము?= ఏమిటి మీరు సంపాదించిన రాజ్యం?; అని పల్కుదురు= అని ఎత్తి పొడిచారు; అతఁడు= ఆ అర్జునుడు; మోము+వాంచి= ముఖం వంచుకొని; అరుగుచుండన్= వెళ్ళిపోతుండగా.

**తాత్పర్యం:** కొంతమంది స్త్రీలు 'ఈ ధర్మరాజుకు ధర్మం ఏమి తెలియును? అసలు ఈ రాజుకు దయ ఎక్కడున్నది? తండ్రులను, మామలను, తాతలను, కుమారులను, తమ్ముళ్ళను చంపివేశాడు. విద్యనేర్పిన పెద్దలను గురువులను అతిక్రూరంగా చంపాడు. ఏ మాత్రం కనికరంలేని వాడు, ఛీ ఛీ' అన్నారు. మరికొందరు అర్జునుడిని చేరి 'కురువృద్ధుడు భీష్ముడిని చంపటానికి, గురువైన ద్రోణాచార్యుడిని ముట్టడించి తుదముట్టించటానికి, నీవు ఎట్లా సాహసించావు?' అని ప్రశ్నించారు. ఇంకొందరు 'అయ్యో! నీ చెల్లెలు భర్త అని కూడా చూడకుండా సైంధవుడిని ఎట్లా చంపావు? ఎందుకు మీరు సంపాదించిన ఈ రాజ్యమంతా? ఎవరికొరకు?' అని ఎత్తిపొడిచారు. అర్జునుడు ఏమీ మారు పలుకకుండా తల వంచుకొని వెళ్ళిపోతూ ఉండగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. మఱియుం గొందఱు. 122**

**తాత్పర్యం:** ఇంకా కొంత మంది.

**క. ఇందఱఁ జంపితినని యు । బ్బం దీఱద ద్రుపదతనయపట్టుల నభిమ**
**న్యుం దెగటార్చితి మఱఁదుల । నందఱ బ్రింగితి విభూతి యన నీ కెద్దీ? 123**

**ప్రతిపదార్థం:** (ధర్మరాజును చూచి); ఇందఱన్= ఇంతమందిని; చంపితిన్+అని= చంపానని; ఉబ్బన్+తీఱదు+అ= గర్విస్తే చాలదు; ద్రుపద తనయ పట్టులన్= ద్రౌపదికొడుకులను; అభిమన్యుడిని; తెగటార్చితి(వి)= పొట్టన పెట్టుకొన్నావు; మఱఁదులన్+అందఱన్= మరదులందరినీ; బ్రింగితి(వి)= పొట్టను బెట్టుకొన్నావు; విభూతి+అనన్= సంపద అనేది? నీకున్+ఎద్దీ?= ఎక్కుడున్నది?

**తాత్పర్యం:** ధర్మరాజును చూచి' ఇంతమందిని చంపానని గర్విస్తే సరిపోదు. ద్రౌపదికొడుకులను, అభిమన్యుడిని, చంపావు. మరదులందరినీ నీ పొట్టన బెట్టుకొన్నావు. అయినా నీకు వైభవం ఎక్కడున్నది? (ఏనాడున్నది కాబట్టి ఈనాడు లేకపోవటానికి? - అని అర్థం).

**వ. అని పలుకుదు రిట్లు బహుప్రకారంబులం బలుకుచుండం బలుకు వెలువరింపక పుత్రశోకార్తుఁడగు నప్పాండురాజపుత్రుండు పుత్ర శోకార్తి మిగులం బొగులు విచిత్ర వీర్యపుత్రుకడకుంజని తత్పార్శ్వవర్తులచేత నావేదితుండగుచు నా భూవల్లభు పాదంబులకుం బ్రణతుండగుటయు. 124**

**ప్రతిపదార్థం:** అని పలుకుదురు= అని అన్నారు; ఇట్లు= ఈ విధంగా; బహుప్రకారంబులన్= రకరకాలుగా; పలుకుచుండన్= అంటుండగా; పలుకు= మాట; వెలువరింపక= మాట్లాడక; పుత్రశోక+ఆర్తుఁడగు= పుత్రులు చనిపోయిన శోకంతో దీనుడుగా ఉన్న; ఆ+పాండురాజ పుత్రుండు= ఆ ధర్మరాజు; పుత్రశోక+ఆర్తిన్= కుమారులు చనిపోయిన శోకంవలన పుట్టిన దైన్యంతో; మిగులన్= మిక్కిలిగా; పొగులుచున్న= దుఃఖపడుతున్న; విచిత్రవీర్యపుత్రు కడకున్= ధృతరాష్ట్రుడి వద్దకు; చని= వెళ్ళి; తద్+పార్శ్వ వర్తులచేతన్= ఆయన పక్కనున్నవారిచేత; ఆవేదితుండు+అగుచున్= తనరాకను అతనికి తెలియచేస్తూ (వెళ్ళి); ఆ భూవల్లభు= ఆ రాజు; పాదంబులకున్= పాదాలకు; ప్రణతుండు+అగుటయున్= నమస్కరించగా.

**తాత్పర్యం:** అని అన్నారు. ఈ విధంగా రకరకాలుగా ఆ స్త్రీలు అంటుండగా, మారుమాట్లాడకుండా కొడుకులు పోయిన దుఃఖంతో అతిదీనంగా ఉన్న ధర్మరాజు, తనవలెనే కొడుకులు చనిపోయిన శోకంతో అతి దీనంగా దుఃఖిస్తున్న ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి అతడి ప్రక్కనున్నవారి ద్వారా తన రాకను ఆ మహారాజుకు తెలిపి ఆ రాజు పాదాలకు నమస్కరించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**శుద్ధ విరాటి వృత్తము:**

**ఉల్లం బప్రియ మొందఁ గ్రొత్త సం । ధిల్లన్ నెవ్వగ దీనవక్త్రుఁడై**
**యొల్లంబోవుచు నుచ్చె నవ్విభుం । డల్లం గౌఁగిట నా నృపాలకున్. 125**

**ప్రతిపదార్థం:** ఉల్లంబు= హృదయం; అప్రియము+ఒందన్= బాధామయం కాగా; క్రొత్త సంధిల్లన్= క్రొత్తగా కలుగగా; నెవ్వగన్= నిండు దుఃఖంతో; దీనవక్త్రుఁడు+ఐ= దీనంగా మారిపోయిన ముఖంతో; ఒల్లన్+పోవుచున్= వైకల్యంపొందుతూ; ఆ+విభుండు= ఆ ధృతరాష్ట్రుడు; ఆ నృపాలకున్= ధర్మరాజును; అల్లన్= నెమ్మదిగా; కౌఁగిటన్= కౌగిట్లో; ఉచ్చెన్= చేర్చుకున్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు వచ్చాడని' నమస్కరించాడని గుర్తించిన ధృతరాష్ట్రుడికి మళ్ళీ దుఃఖం కట్టలు తెంచుకొని ముఖం అతి దీనంగా మారిపోయింది. మనస్సు వికలమైపోయింది. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును నెమ్మదిగా కౌగిలించుకొన్నాడు.

**విశేషం:** శుద్ధవిరాటి వృత్తంలో ప్రతిపాదానికీ మ, స, జ, గ అనే గణాలుంటాయి. 1-6 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. ఇవ్విధంబున నాలింగనంబు సేసి సాంత్వన వచనంబుల నుపచరించెఁ దదనంతరంబ భీమార్జున నకుల సహదేవులు సేరిన నతనియొద్దివారు వారిం బేరు వేర నెఱిఁగించిన. 126**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; ఆలింగనంబు+చేసి= ఆలింగనం చేసికొని; సాంత్వన వచనంబులన్= ఓదార్పు మాటలతో; ఉపచరించెన్= ఉపశమనం కలిగించాడు; తద్+అనంతరంబ= ఆ తరువాత; భీమ, అర్జున, నకుల, సహదేవులు; చేరినన్= దగ్గరకురాగా; అతని+ఒద్దివారు= ధృతరాష్ట్రుని వద్ద ఉన్నవారు; వారిన్= వారిని; పేరు పేరన్= పేరు పేరునా; ఎఱిఁగించినన్= తెలుపగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజును కౌగిలించుకొని ఓదార్పు మాటలతో సాంత్వనం కలిగించాడు. ఆ తరువాత భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు మహారాజును సమీపించారు. సమీపంలో ఉన్నవారు వారిని పేరు పేరునా ధృతరాష్ట్రుడికి తెలుపగా (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **భీముఁ డనుమాట విని యతి భీమమైన । యలుక యను వహ్ని యవ్వీరుఁడను వనంబు**
**దరికొనంగ నుంకింప నధర్మవిధికి । నాయితంబగు నయ్యాంబికేయుఁ జూచి.** **127**

**ప్రతిపదార్థం:** భీముఁడు+అనుమాట+విని= భీముడు (వచ్చాడు) అనే మాట వినగానే; అతిభీమము+ఐన= అతిభయంకరమైన; అలుక+అను+వహ్ని= కోపం అనే అగ్ని; ఆ+వీరుఁడు+అను వనంబున్= ఆ మహావీరుడైన ధృతరాష్ట్రుడు అనే అడవిని; దరికొనంగన్= కాల్చివేయటానికి; ఉంకింపన్= యత్నించగా; అధర్మవిధికిన్= అధర్మకార్యానికి; ఆయితంబు+అగు= సిద్ధపడుతున్న; ఆ+ఆంబికేయున్+చూచి= ఆ ధృతరాష్ట్రుడిని (కృష్ణుడు) చూచి.

**తాత్పర్యం:** అర్జున నకుల సహదేవులను పరిచయం చేసినపుడు ఊరుకున్నాడు కాని 'భీముడు' అనే మాట వినగానే అతిభయంకరమైన కోపాగ్ని అతడిని దహించివేయటం ప్రారంభించింది. ఏ అధర్మకార్యం చేయటానికైనా సిద్ధపడేవాడివలె కనిపిస్తున్న ఆ మహారాజును కృష్ణుడు గమనించాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క.** **మనసెఱిఁగి హృషీకేశుఁడు । దనమనమున నిద్దురాత్ము తలఁపొప్ప దిసీ**
**యనుచుం బవనజు నద్దెస । జనకుండఁగ బట్టి వీతసంభ్రమలీలన్.** **128**

**ప్రతిపదార్థం:** హృషీకేశుఁడు= విష్ణురూపుడైన కృష్ణుడు; మనసు+ఎఱిఁగి= ఆ ధృతరాష్ట్రుని మనసులో ఉన్నది తెలిసికొని; తన మనమునన్= తన మనస్సులో; ఈ+దురాత్ము+తలఁపు+ఒప్పదు= ఈ దురాత్ముడి ఆలోచన సమంజసం కాదు; ఇసీ+అనుచున్= ఛీ ఛీ అనుకొంటూ; పవనజున్= భీముడిని; ఆ+దెసన్+ఉండఁగన్= ఆ రాజు వద్దకు వెళ్ళకుండా; వీత సంభ్రమలీలన్= పోయిన సంభ్రమంతో; పట్టి= పట్టుకొని.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మనస్సును కృష్ణుడు గుర్తించి 'ఈ దురాత్ముడి ఆలోచన చాలా దుర్మార్గమయిన' దని తలచి, భీముడిని ఆ రాజువద్దకు వెళ్ళకుండా సంభ్రమం లేక పట్టుకొన్నాడు.

**వ.** **ధృతరాష్ట్రుం డిట్టివాఁడు గాఁగలవాఁడని తొల్లి యెఱింగి త్రికాలవేదియైన కృష్ణుం డయోమయంబుగా భీమ ప్రతిరూపంబు సేయించి సంగ్రహించి నిగూఢ ప్రకారంబునం దత్ప్రదేశంబునకుఁ దెప్పించినవాఁడు గావున గ్రక్కున నయ్యినుపరూప పజ్జగతీశ్వరుం జేర నిలిపె; నిలిపిన నది భీమసేనుండ కాఁ దలంచి.** **129**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు; ఇట్టివాఁడు= ఇలాంటివాడు; కాఁగలవాఁడు+అని= కాబోతాడని (ఇట్లాంటి పని ఏదో చేయబోతాడని); త్రికాల వేదియైన= మూడు కాలాలు తెలిసిన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; తొల్లి+ఎఱింగి= ముందుగానే గుర్తించినవాడై; అయోమయంబుగాన్= ఇనుముతో; భీముని= భీముడి; ప్రతిరూపంబు= విగ్రహం; చేయించి; సంగ్రహించి= తీసికొని; నిగూఢ= రహస్య; ప్రకారంబునన్= పద్ధతిలో; తద్+ప్రదేశంబునకున్= ఆ స్థలానికి; తెప్పించినవాఁడు కావునన్= తెప్పించి ఉన్నాడు కాబట్టి; గ్రక్కునన్= వెంటనే; ఆ+ఇనురూపు= ఇనుప విగ్రహాన్ని; ఆ+జగత్+ఈశ్వరున్= రాజు దగ్గరికి; చేరన్+నిలిపెన్= చేర్చాడు; నిలిపినన్= అట్లా ఉంచగా; అది= ఆ విగ్రహం; భీమసేనుండు+అ+కాన్+తలంచి= భీముడే అని అనుకొని.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు భూత భవిష్యత్ వర్తమానాలు మూడూ తెలిసిన మహాత్ముడు కాబట్టి ధృతరాష్ట్రుడు ఇట్లాంటి పని ఏదో చేయబోతాడని ఊహించి ఇనుముతో భీముడి విగ్రహాన్ని తయారుచేయించి రహస్యంగా అక్కడికి తీసికొనివచ్చి పెట్టుకొని ఉండటంచేత వెంటనే ఆ విగ్రహాన్ని రాజు ముందరికి జరిపాడు. అట్లా విగ్రహాన్ని ఉంచగా ఆ విగ్రహమే భీమసేను డనుకొని (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కోపం బుత్కటమై యా । రూపము నిరుగేలఁ బట్టి క్రూరత ఘోరా**
**టోపం బెసకమెసఁగ నా । భూపతి వెసఁ గౌఁగిలించి పొలుపఱ విఱిచెన్. 130**

**ప్రతిపదార్థం:** కోపంబు= కోపం; ఉత్కటము+ఐ= అధికం కాగా; ఆ రూపమున్= ఆ విగ్రహాన్ని; ఇరుకేలన్+పట్టి= రెండు చేతులతోనూ అదుముకొని; క్రూరతన్= అతి క్రూరంగా; ఘోర= భయంకరమైన; ఆటోపంబు= వేగం; ఎసకము= విజృంభణ; ఎసఁగన్= అతిశయించగా; ఆ భూపతి= ఆ రాజు; వెసన్= క్షణంలో ఆలస్యం చేయకుండా; కౌగిలించి= కౌగిలించుకొని; పొలుపు+అఱన్= (ఆ విగ్రహం) అందం నశించేలా (ముక్కలయ్యేలా); విఱిచెన్= విరిచివేశాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు కోపం అతిశయించగా, ఆ విగ్రహాన్ని రెండు చేతులమధ్యా అదుముకొని అతిక్రూరంగా భయంకరమైన వేగంతో విజృంభణతో క్షణం ఆలస్యంచేయకుండా పొదువుకొని ఆ విగ్రహం ముక్కలయ్యేటట్లు విరిచిపారవేశాడు.

**విశేషం:** ఎంత వయస్సు ముదిరినా కామక్రోధాది గుణాలు నశించవనటానికి ధృతరాష్ట్రుని ఈ పని మంచి నిదర్శనం. విదురుడు, వ్యాసుడు చేసిన బోధలన్నీ నిష్ఫలమయ్యాయి. ఇంద్రియాలు మనస్సుకంటే బలవత్తరమైనవి అనటానికి నిరూపణమే ధృతరాష్ట్రుని ఈ క్రూరచేష్ట, అతని బలమూ భయంకరమైనదే.

**లయవిభాతి:**

**పెరుఁగఁగ నిజాంగములు సరభసపరిస్ఫురణ । మరుదుగ జనావలులు నిరుపమవిధం బి**
**న్నరపతి బలంబనఁగఁ గరయుగముతోలవియ । నురము సదియం బెలుచఁ దొరఁగఁగఁ బొరిన్ నె**
**త్తురులు ముఖ రంధ్రములఁ బరవశత మానసము । బొరయుటకుఁ జొచ్చియును సరిగొనఁగఁ గంటిన్**
**వరసుతున కిప్పుడను పరమపదవిన్ మగుడఁ । గురున్నపతి యా ప్రతిమఁ బొరి నిటులు పుచ్చెన్. 131**

**ప్రతిపదార్థం:** నిజ+అంగములు= తన అవయవాలు; పెరుఁగఁగన్= ఛిన్నములుకాగా; సరభస పరిస్ఫురణము= గొప్పవేగంయొక్క మిక్కిలి ప్రకాశం; అరుదుగన్= ఆశ్చర్యకరం కాగా; జన+ఆవలులు= అక్కడచేరిన జనాలు; ఈ+నరపతి+బలంబు= ఈ రాజు శక్తి; నిరుపమ+విధంబు+అనఁగన్= అసామాన్యమైనది అంటుండగా; కురున్నపతి= ధృతరాష్ట్రుడు; ఆ ప్రతిమన్= ఆ

విగ్రహాన్ని; పొరిన్= దృఢంగా; ఇటులు= ఇట్లాగ; పుచ్చెన్= గట్టిగా అదుముకొన్నాడు; కరయుగముతో లవియన్= రెండు చేతులతో కౌగిలించుకొని అదుమగా; ఉరము= రొమ్ము; చదియన్= చిట్లగా; పొరిన్= మిక్కిలిగా; నెత్తురులు= రక్తం; పెలుచన్= అత్యధికంగా; ముఖరంధ్రములు= ముఖంలోని రంధ్రాలవెంబడి; తొరఁగఁగన్= కారుతుండగా; మానసము= మనస్సు; పరవశతన్+పొరయుటకున్+చొచ్చియును= అదుపుతప్పిపోవటానికి సిద్ధంగా ఉన్నా; (ఈ భీముడిని) సరిగొనఁ గన్+కంటిన్= చంపగలిగాను; వరసుతునకున్= దుర్యోధనుడికి; పరమపదవిన్+మగుడన్= పరమపదవి (మోక్షం)ని చేరటం; ఇప్పుడు+అనున్= ఇప్పుడే - అంటున్నాడు.

**తాత్పర్యం:** అట్లా ఆ విగ్రహాన్ని అందిపుచ్చుకొన్న ధృతరాష్ట్రుడి అవయవాలు ఛిన్నములుకాగా; కాంతిమంతంగా వ్యాకోచించటం మొదలు పెట్టాయి. చూస్తున్న జనాలు ఈ రాజు బలం నిరుపమానమైనదని అంటుండగానే రెండు చేతుల తోలు లేచిపోయింది. ఆ కౌగిలిలో ఆ బొమ్మ ముక్కలైపోయింది. ధృతరాష్ట్రుడి రొమ్ము చిట్లిపోయింది. మిక్కిలి రక్తం ధారలు ముఖంలోని అన్ని రంధ్రాల ద్వారా చిమ్మటం ప్రారంభమయింది. మనసు అదుపు తప్పే స్థితిలో ధృతరాష్ట్రుడు మూర్ఛలో పడిపోతున్నాడు. ఇప్పుడు నేను నా కొడుకు మృతికి బదులు తీర్చుకోగలిగాను అనే ఉల్లాస స్థితిలో ధృతరాష్ట్రుడు ఆ ప్రతిమను మరల విధ్వంసము చేశాడు.

**విశేషం:** కొడుకు పగను తండ్రి తీర్చగలిగాడు- ఇది ధృతరాష్ట్రుడికి తృప్తిని కలిగిస్తున్న అంశం. ధృతరాష్ట్రుడి రాజ్యలోభం అంత భయంకరమైన వ్యసనం. అతడి ఈ చర్యద్వారా మనిషిలోని దుర్గుణాలు చిరకాలం మనిషిని ఎట్లా వదలవో అర్థం చేసికొనవచ్చును.

లయవిభాతివృత్తంలోని ప్రతిపాదానికీ న, స, న, న, స, న, న, న - అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ 10, 19, 28 అక్షరాలకూ యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. ఇత్తెఱంగున దశసహస్రసామజ సమానబలుండగు నయ్యంధనృపతి గంధవహనందన ప్రతిరూపంబు భగ్నంబు సేసి పెంపున నెడఁద నిర్భర హర్షంబు నొందియు మెఱమెచ్చునకై భీమునిం బేర్కొని హాహాకారంబు లెసంగ రోదనంబు సేసినఁ జిఱునవ్వునం దన వదనకమలం బొప్పం గమలనాభుం డతని కిట్లనియె.132**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; దశసహస్ర= పదివేల; సామజసమాన= ఏనుగులతో సమానమైన; బలుండగు= బలం కలిగినవాడైన= ఆ+అంధ నృపతి= ఆ గ్రుడ్డి మహారాజు; గంధవహనందన= వాయుకుమారుడి; ప్రతిరూపంబున్= విగ్రహాన్ని;= భగ్నంబు+చేసి= విరుగగొట్టి; పెంపున్= మిక్కిలిగా; ఎడఁదన్= హృదయంలో; నిర్భర= అధికమైన; హర్షంబున్+ ఒందియున్= సంతోషం పొందికూడా; మెఱమెచ్చునకై= అందరూ ఏమనుకొంటారోనని (ముఖప్రీతికోసం); భీమునిన్+పేర్కొని= భీముడిని పేరుపెట్టి పిలుస్తూ; హాహాకారంబులు+ఎసంగన్= హాహాకారాలు పుట్టగా; రోదనంబు+చేసినన్= ఏడ్వగా; చిఱునవ్వునన్= చిరునవ్వుతో; తన= తనయొక్క; వదనకమలంబు+ఒప్పన్= కమలంవంటి ముఖం ప్రకాశించగా; కమలనాభుఁడు= పద్మనాభుడైన కృష్ణుడు; అతనికిన్= ధృతరాష్ట్రునితో; ఇట్లనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పదివేల ఏనుగుల బలమున్న ఆ గ్రుడ్డి మహారాజు భీముడి విగ్రహాన్ని విరుగగొట్టి అత్యంత సంతోషం పొందిన హృదయంతో ఉండి కూడా అందరూ ఏమనుకుంటారో అని ముఖప్రీతికొరకు భీముడిని పేరుపెట్టి పిలుస్తూ హాహాకారాలు చేస్తూ ఏడుపులు మొదలుపెట్టాడు. అది చూచి చిరునవ్వుతో తన ముఖకమలం ప్రకాశిస్తుండగా శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడి బలం పదివేల ఏనుగుల బలంతో సమానమైనదట- అంటే నిజంగా భీముడు ఆ కౌగిలిలో చిక్కి ఉంటే బ్రతికేవాడుకాడని అర్థం. అందుకే 'ధృతరాష్ట్రుడి కౌగిలి' అనేమాట లోకంలో పుట్టింది. కపటపు కౌగిలింత అనే అర్థంలో ఆ ప్రయోగం రూఢి కెక్కింది.

**తే. 'అడల నేటికి? నీచేతఁ బడఁడు భీముఁ। డిపుడు భంజింపఁ బడినది యినుపరూపు**
**వినుము నీ కోప మెఱిఁగియ వెనుక కతనిఁ। దిగిచి యేను నీ ముందట దీని నిడివి. 133**

**ప్రతిపదార్థం:** అడలన్= ఏడవటం; ఏటికిన్?= ఎందుకు?; భీముఁడు= భీమసేనుడు; నీ చేతన్= నీ చేతిలో; పడఁడు= చావలేదు; ఇపుడు= ఇప్పుడు; భంజింపన్+పడినది= విరగగొట్టబడినది; ఇనుపరూపు= ఇనుముతో చేసిన విగ్రహం; వినుము= (ఏం చేశానో చెబుతాను వినుము); నీ కోపము= నీ కెంతకోపం ఉందో; ఎఱిఁగియ= తెలిసే; అతనిన్= ఆ భీముడిని; వెనుకకున్ తిగిచి= వెనుకకు నిలిపి; ఏను= నేను; నీ ముందటన్= నీ ముందర; దీనిన్+ఇడితిన్= ఈ బొమ్మను ఉంచాను.

**తాత్పర్యం:** 'మహారాజా! ఎందుకు ఏడుస్తావు? భీముడు నీచేతిలో చావలేదు లెమ్ము. ఇపుడు నీవు విరచింది ఆ భీముడి ప్రతిరూపమైన ఇనుప విగ్రహాన్ని. నీకింత కోపం ఉన్నదని ఎరిగినవాడిని కాబట్టే భీముడిని వెనుకకు దాటి నీ ముందర ఈ విగ్రహాన్ని జరిపాను.

**క. బలమున నీతో దొరయఁగ। నిల నెవ్వఁడు గలఁడు? నీ మహిత భుజ శాఖల్**
**తలఁపఁగఁ బ్రళయాంతకు దం। ష్ట్రలు వీనిం దగిలి వశమె? చాకుండంగన్. 134**

**ప్రతిపదార్థం:** బలమునన్= బలంలో; నీతోన్+దొరయఁగన్= నీతో సమానంకావటానికి; ఇలన్= ఈ భూమిలో; ఎవ్వఁడు+కలఁడు?= ఎవడు ఉన్నాడు?; తలఁపగన్= ఆలోచిస్తే; మహిత భుజశాఖల్= నీ యొక్క గొప్పవైన కొమ్మలవంటి భుజాలు; ప్రళయాంతకు= ప్రళయకాల రుద్రుడి; దంష్ట్రలు= కోరలు; వీనిన్+తగిలి= వీటితో తగులుకొని; చాకుండగన్= చావకా+ఉండా ఉండేందుకు; వశమె?= సాధ్యమా?.

**తాత్పర్యం:** రాజా! బలంలో నిన్ను సమీపించటానికి ఈ భూమిలో ఎవరున్నారు? నీ భుజశాఖలు ప్రళయకాలంలో విజృంభించిన రుద్రుడి కోరల్లాంటివి. వాటిని తగిలిన మనిషి మరలా బ్రతకటం సాధ్యమా!

**విశేషం:** అలం: రూపకం.

**వ. కావున 135**

**తాత్పర్యం:** అందుచేత

**ఉపేంద్రవజ్రావృత్తము:**

**మరుత్తనూజుం బరిమార్పఁ జూచుం। బరిస్ఫురత్కోప నిబద్ధుఁడై యి**
**ద్ధరావిభుండం చిది తల్గనే సం। స్మరించి యీ కోపు నమర్చికొంటిన్. 136**

**ప్రతిపదార్థం:** ఈ+ధరావిభుండు= ఈ భూవల్లభుడు; పరిస్ఫురత్= మిక్కిలి ప్రకాశించేటువంటి; కోప= కోపంచేత; నిబద్ధుఁడై= కట్టబడినవాడై; మరుత్+తనూజున్= వాయుకుమారుడిని; పరిమార్పన్+చూచున్= చంపటానికి ప్రయత్నిస్తాడు (అని ఆలోచించి); ఇది= ఈ అపాయం; తల్గన్= తప్పించుకోవటానికే; సంస్మరించి= బాగా ఆలోచించి; ఈ కోపున్= ఈ విధానాన్ని ఈ బొమ్మను; అమర్చికొంటిన్= ఏర్పాటు చేసికొన్నాను.

**తాత్పర్యం:** ఈ రాజు మిక్కిలికోపానికి దాసుడై భీముడిని తప్పకుండా చంపటానికి ప్రయత్నిస్తాడని ఊహించి ఈ అపాయం తప్పించటానికై బాగా ఆలోచించి ఈ బొమ్మను సిద్ధంగా ఉంచుకొన్నాను.

**విశేషం:** ఉపేంద్రవజ్రలో ప్రతిపాదానికీ పదకొండు అక్షరాలుంటాయి. జ, త, జ, గ, గ అనే గణాలుంటాయి. 1-8 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**తే. తనయ శోకాతురుండవై ధర్మ మెడలి । యనిలసుతుఁ దెగటార్చెదనని తలంచి**
**తట్టి పనియేల నీ చేతనగు? విధాతృ । లీలఁ బరికింప నేరక బేలవైతి. 137**

**ప్రతిపదార్థం:** తనయ= కొడుకులు చనిపోయిన; శోక+ఆతురుండవై= దుఃఖంచేత పుట్టిన తొందరపాటుతో; ధర్మము+ఎడలి= ధర్మం విడిచిపెట్టి; అనిలసుతున్= వాయుకుమారుడిని; తెగటార్చెదను+అని తలంచితి(వి)= చంపేస్తానని ఆలోచించావు; అట్టి పని= అట్లా చంపటం; నీచేత; ఏల+అగున్?= ఎందుకు వీలవుతుంది?; విధాతృలీలన్= సృష్టికర్త లీలను; పరికింపన్+నేరక= తెలుసుకోలేక; బేలవు+ఐతి(వి)= అమాయకుడివి అయ్యావు.

**తాత్పర్యం:** కొడుకులు చనిపోయారన్న శోకంతో పుట్టిన తొందరపాటుతో ధర్మం విడిచిపెట్టి వాయుకుమారుడిని చంపివేద్దామని ఆలోచించావు. అట్లా చంపటం నీ చేతిలో ఉందా! సృష్టికర్త లీలను గుర్తించలేక నీవే అపహాస్యం పాలయ్యావు.

**వ. అదియునుం గాక. 138**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**క. వినుమొకని నేల భవదను । జుని పుత్రుల నెల్లఁ జంపఁ జొప్పడినను నీ**
**తనయులు మగుడఁగ వత్తురె? । యనయము పాపంబు సేసి తాఱడిఁ బోవన్. 139**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఒకనిన్+ఏల= ఒకడిని మాత్రం ఏమిటి?; భవత్+అనుజుని పుత్రులన్+ఎల్లన్= నీ తమ్ముడి కొడుకులను అందరినీ; చంపన్+చొప్పడినను= చంపటానికి సిద్ధపడినా; నీ తనయులు= నీ కొడుకులు; మగుడఁగన్+వత్తురె?= మరలి వస్తారా?; అనయము= మిక్కిలిదైన; పాపంబు= పాపాన్ని; ఆఱడిన్+పోవన్= నిందబడేటట్టు; చేసితి(వి)= చేశావు.

**తాత్పర్యం:** రాజా! వినుము. ఈ ఒక్కడిని మాత్రం ఏమిటి? పాండురాజు కుమారులందరినీ చంపినా నీ కొడుకులు తిరిగివస్తారా? శాశ్వతమైన నిందమాత్రం మిగిలేటట్లు చాలా పెద్ద పాపం చేశావు.

**స్రగ్విణీ వృత్తము:**

**ఏము నీ పుత్రుచే నెన్నియేన్ భంగులన్ । వేమఱుం బాటు నీ వెంట భావించుచున్**
**సామసంపాదివై సైఁపు మాతప్పులన్ । భీమహత్త్వంబు సంధిల్లు నీ కిమ్మెయిన్.' 140**

**ప్రతిపదార్థం:** ఏము= మేము (నేను, పాండవులు); నీ పుత్రుచేన్= నీ కొడుకుచేతిలో; ఎన్నియేన్+భంగులన్= ఎన్నో రీతులలో; వేమఱున్= మాటిమాటికి; పాటు= ఆపదను (పొందినా); నీ వెంటన్= నీవు మా వెంట ఉన్నావని; భావించుచున్= భావిస్తూ (గడిపాము); (కనీసం ఇప్పుడైనా); మా తప్పులన్= మేము చేసిన తప్పులను; సామ సంపాదివై= అనుకూల్యాన్ని సాధించేవాడివై;

సైఁపు= సహించుము (క్షమించు); నీకున్+ఈ+మెయిన్= నీకు ఈ విధంగానైనా; ధీ మహత్త్వంబు= జ్ఞానంతో కూడిన బుద్ధి వైభవం; సంధిల్లున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** నేను, పాండవులు నీ కుమారుడి చేతిలో ఎన్నో రీతులలో మాటిమాటికి ఆపదపొందినా నీవు మా వెంట ఉన్నావని భావిస్తూ గడిపాము. కనీసం ఇప్పుడైనా నీవు మా తప్పులను సామరస్యం సాధించటంకొరకైనా క్షమించుము. నీకు ఈ విధంగానైనా జ్ఞానంతో కూడిన బుద్ధి వైభవం సిద్ధిస్తుంది.

**విశేషం:** స్రగ్విణీవృత్తంలో ప్రతిపాదానికీ ర, ర, ర, ర గణాలుంటాయి. 1-7 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. అని చెప్పె నప్పుడు ధృతరాష్ట్రు పరిచారకు లతని యవయంబుల రుధిరంబు ప్రక్షాళనంబున నపనయింపం దలంచి జలంబులు దెచ్చి యెఱింగించిన నజ్జనపతి యప్పని యాచరించె. నప్పుండరీకాక్షుండు వెండియు నవ్విభున కిట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** అని= అని ఈ విధంగా; చెప్పెన్= కృష్ణుడు చెప్పాడు; అప్పుడు= ఆ తరువాత; ధృతరాష్ట్రు పరిచారకులు= ధృతరాష్ట్రుని సేవకులు; అతని= ఆ రాజుయొక్క; అవయవంబుల రుధిరంబు= అవయవాలకు అంటిన రక్తాన్ని; ప్రక్షాళనంబునన్= కడగటం ద్వారా; అపనయింపన్= పోగొట్టటానికి; తలంచి= ఆలోచించి; జలంబులు= నీళ్ళు; తెచ్చి; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+జనపతి= ఆ రాజు; ఆ+పని= ఆపని; ఆచరించెన్= చేశాడు; ఆ+పుండరీకాక్షుండు= ఆ శ్వేతకమలనేత్రుడైన కృష్ణుడు; వెండియున్= మళ్ళీ; ఆ+విభునకున్= ఆ రాజుతో; ఇట్లనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని కృష్ణుడు చెప్పాడు. ఆ తరువాత పరిచారకులు అతడి ఒంటికి అంటిన రక్తాన్ని కడిగివేయటానికై నీళ్ళు తెచ్చి ఆ విషయం రాజుకు తెలిపారు. ధృతరాష్ట్రుడు ఒడలంతా కడుక్కొన్నాడు. అప్పుడు కృష్ణుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**సీ. 'జగతీశ! వేదముల్ సదివితి శాస్త్రముల్ । వింటి వర్తిల్లితి వృద్ధగోష్ఠి**
**నఖిలపురాణ పర్యాలోచనము సేసి । తెల్ల ధర్మంబులు నెఱుఁగు దిట్లు**
**నీ తప్పు దలఁపక నెవ్వగఁ బొందెదు । కనలెద వేను శంతనసుతుండు**
**గురుఁడును విదురుండుఁ గూర్చొని కూర్చొని । చెవులఁ బోయమె సవిశేషకార్య**

**తే. వచనములు? సంజయుఁడు పెక్కువరుస లుభయ । బలవిధంబులు దెలియఁగఁ బలుకఁ డెట్లు?**
**నీకు నా బుద్ధులన్నియు నెమ్మనమునఁ । జేర్పఁబోలవ యింకేమి సేయవచ్చు? 142**

**ప్రతిపదార్థం:** జగతీశ!= ఓ రాజా!; వేదముల్+చదివితి(వి)= నీవు వేదాలు చదివావు; శాస్త్రముల్+వింటి(వి)= శాస్త్రాలు విన్నావు; వృద్ధగోష్ఠిన్= పెద్దల చర్చలలో; వర్తిల్లితి(వి)= ఉన్నావు; అఖిల= అన్ని; పురాణ= పురాణాలను; పర్యాలోచనముచేసితి(వి)= బాగా ఆలోచించి అర్థంచేసుకొన్నావు; ఎల్ల ధర్మంబులు= అన్ని ధర్మాలను; ఎఱుగుదు(వు)= తెలిసినవాడివి; ఇట్లు= ఈ విధంగా; నీ తప్పున్+తలఁపక= నీ తప్పును గురించి ఆలోచించకుండా; నెఱ+వగన్+పొందెదు= మిక్కిలి దుఃఖాన్ని పొందుతున్నావు; కనలెద(వు)= లోలోపలి కోపంతో మండుతున్నావు; నేను= (రాయబార సమయంలో) నేను; శంతనసుతుండు= భీష్ముడు; గురుఁడును= ద్రోణాచార్యుడు; విదురుండు= విదురుడు; సవిశేష కార్యవచనములు= మిక్కిలి ప్రశస్తమైన చేయదగిన

పనులను గురించి మంచిమాటలు; కూర్కొని కూర్కొని= కూరికూరి; చెవులన్+పోయమె?= చెవులలో పోయలేదా?; సంజయుడు; పెక్కువరుసలు= చాలాసార్లు; ఉభయ బల విధంబులు= కురుపాండవ బలాలలోని తేడాలను; తెలియఁగన్+పలుకఁడె?= నీకు వివరంగా చెప్పలేదూ?; ఎట్లు= ఏ విధంగా; నీకున్; ఆ బుద్ధులు+అన్నియున్= ఆ నీతివాక్యాలన్నీ; నెమ్మనమునన్= (నీ) మనస్సులో; చేర్పన్+పోలవు+అ= దూరలేకపోయాయి; ఇంకన్+ఏమి+చేయవచ్చున్?= ఇక మనం ఏం చేయగలం?

**తాత్పర్యం:** 'ఓ రాజా! నీవు వేదాలు చదివినవాడివి. శాస్త్రాలు విన్నావు. పెద్దల చర్చలలో పాల్గొన్నవాడివి. అన్ని పురాణాలను అవలోకనం చేసి వాటి సారాన్ని గ్రహించినవాడివి. అన్ని ధర్మాలను ఎరిగినవాడివి. ఈ రీతిగా నీ తప్పును నీవు గుర్తించకుండా ఊరికే దుఃఖాన్ని పొందుతున్నావు. కోపపడుతున్నావు. నేను, భీష్ముడు, ద్రోణుడు, విదురుడు ఎన్ని మార్లు ఏంచేయాలో ఎట్లా చేయాలో నీ చెవుల్లో కూరికూరి నూరిపోశాము కదా! సంజయుడు కురుపాండవ బలాలలోని తేడాను ఎన్ని సార్లు నీకు వివరంగా చెప్పలేదు? ఆ బుద్ధులన్నీ నీ మనసులో ఏ మాత్రం దూరలేకపోయాయి. ఇక మనం ఏమి చేయగలం?

**క. భీమార్జునుల రణసము । ద్దామత్వం బెఱిఁగి యెఱిఁగి తగునే తొడరం**
**గా మనుజుల కవ్వీరుల? । నేమనఁగల దింక నేల యీ చందంబుల్? 143**

**ప్రతిపదార్థం:** భీమార్జునుల= భీముడు, అర్జునుడు - వీరి; రణ= యుద్ధ క్రీడలోని; సమ్+ఉద్దామత్వంబు= అతిశయించిన స్వాతంత్ర్యాన్ని; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసీ; మనుజులకున్= సామాన్యులకు; ఆ+వీరులన్= ఆ ఇరువురినీ (ఆ మహావీరులిద్దరినీ); తొడరంగాన్= ఎదిరింపగా; తగునే?= అవుతుందా?; ఏమనఁగలదు?= ఏమి అనగలం?; ఇంకన్= ఇక; ఈ చందంబుల్= ఈ రీతులు (ఇట్లా శోకించటం); ఏల= ఎందుకు?

**తాత్పర్యం:** భీమార్జునులు రణ క్రీడలో ఎట్లా లోకోత్తరంగా స్వతంత్రిస్తారో తెలిసి తెలిసీ సామాన్యులు వారిని ఎదిరించటం సాధ్యమవుతుందా! ఇక మనం ఏమనగలం? మరింక ఎందు కిట్లా శోకాలు పెట్టటం?

**క. తన మేలుఁ గీడుఁ దా మదిఁ । గనుచు హితులు సెప్ప బుద్ధిఁ గైకొని శుభముం**
**గొనకొని నడపు పతికి వ । చ్చునె పశ్చాత్తాప మెట్టి చోట? నరేంద్రా! 144**

**ప్రతిపదార్థం:** తనమేలున్= తనకు ఏదిమేలో దానిని; కీడున్= తనకు ఏది చెడుపో దానిని; తాన్+మదిన్+కనుచున్= తాను స్వయంగా తెలిసికొంటూ; హితులు చెప్పు= పెద్దలు స్నేహితులు చెప్పే; బుద్ధిన్+కైకొని= నీతి వాక్యాలను స్వీకరించి; శుభమున్+గొనకొని= శుభాన్ని సాధించి; నడపు= కార్యాన్ని నిర్వహించే; పతికిన్= రాజుకు; ఎట్టిచోటన్= ఏ సందర్భంలోనూ; నరేంద్రా!= ఓ రాజా!; పశ్చాత్తాపము= చేసిన తప్పునకు చింతించటం అన్నది; వచ్చునె?= కలుగుతుందా?

**తాత్పర్యం:** తన మంచి చెడులను తానే స్వయంగా గుర్తిస్తూ పెద్దలు స్నేహితులు చెప్పే నీతి వాక్యాలను స్వీకరించి శుభాన్ని సాధించి కార్యం నిర్వహించే రాజుకు ఎప్పుడూ చేసిన తప్పునకు చింతించవలసిన అవసరం కలుగదు.

**ప్రణవ వృత్తము:**

**నీ యుల్లం బొక నియతిం గార్యం । బాయత్తంబుగ ననుసంధింపం**
**జేయం జాలవు చెడు తెర్పుం బోఁ । బాయం ద్రోవవు బలిమిం బుత్రున్. 145**

**ప్రతిపదార్థం:** నీ+ఉల్లంబు= నీ హృదయం; ఒక నియతిన్= ఒక నియమానికి లోబడి; కార్యంబు= పనిని; ఆయత్తంబుగన్= సొంతంగా; అనుసంధింపన్= సిద్ధింపచేసుకోవటానికి; చేయన్= నీ చిత్తాన్ని సిద్ధపరచ; చాలవు= సమర్థుడివి కావు; బలిమిన్= బలంతో; పుత్రున్= నీ కొడుకును; చెడుతెర్వున్= చెడ్డమార్గంలో; పోన్= పోతుండగా; పాయక+త్రోవవు= ఆదారి తప్పించ జాలకపోయావు.

**తాత్పర్యం:** నీ మనసును సొంతంగా ఒక నియమానికి లోబడి ఎన్నడూ ఒక పనిని చేసికొనటానికి నీవు సిద్ధంచేయలేదు. (ఎప్పుడూ ఇతరులమీద ఆధారపడే పని చేశావు). నీ కొడుకు చెడుదారిలో పోతున్నపుడు ఆ దారిని తప్పించిన వాడివీ కావు (నీవు చేసిన ఉపేక్షా రూపమైన తప్పు ఇదే. అందుకే కౌరవ వంశం పతనమైంది).

**విశేషం:** 'ఆత్మబుద్ధి స్సుఖం చైవ' అని పెద్దల మాట. ఏ పనిచేసినా నిర్ణయం తీసుకున్నా తనకు తానుగా తీసికొనాలి. పరులమీద ఆధారపడి జీవించేవాడు ఎప్పుడూ వినాశం పొందుతాడు. (పరబుద్ధిర్వినాశకః) - ధృతరాష్ట్ర దుర్యోధనులు ఆత్మబుద్ధి నిష్ఠితులు కారు. వారిని ప్రబోధించిన పరబుద్ధులు దుర్మార్గులు తప్పా సాధుసత్పురుషులు కారు. ధృతరాష్ట్రుడికి రాజ్యలోభం, పుత్రలోభం రెండూ ఉన్నాయి. అందుకే పుత్రుడి దోషాలను సైరించటమే కాక 'ఉపేక్షిస్తూ' వచ్చాడు. దానినే కృష్ణుడు ఇక్కడ గుర్తు చేస్తున్నాడు.

వృత్తలక్షణం: ప్రణవవృత్తంలో ప్రతిపాదానికీ మ, న, య, గ అనే గణాలుంటాయి. మొదటి అక్షరానికీ ఆరవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**తే. ద్యూతమునగెల్పు నెపమున నుఱికి పుణ్య । కాంతఁ దల పట్టికొని సభాభ్యంతరమున**
**కీడ్చి వలువ లొలుచుటయు నెఱిఁగి సుతులఁ । జంపెనని భీముఁ జంపఁ దలంపనగునె. 146**

**ప్రతిపదార్థం:** ద్యూతమునన్= మాయాద్యూతంలో; గెల్పు నెపమునన్= గెలిచామన్న మిషతో; ఉఱికి= దూకి (పరిగెత్తి); పుణ్యాకాంతన్= పతివ్రత సుమంగళి అయిన ద్రౌపదిని; తలపట్టికొని= తలపట్టి; సభాభ్యంతరమునకున్= సభలోకి; ఈడ్చి= ఈడ్చుకొనివచ్చి; వలువలు+ఊడ్చుటయున్= బట్టలు ఊడదీయటం; ఎఱిఁగి= తెలిసి; సుతులన్= కొడుకులను; చంపెనని= చంపాడని; భీమున్+చంపన్= భీముడిని చంపటానికి; తలంపన్+అగునె= ఆలోచించవచ్చా!

**తాత్పర్యం:** మాయాద్యూతంలో గెలిచామనే నెపంతో పరుగెత్తిపోయి పుణ్యాకాంత అయిన ద్రౌపదిని తలపట్టుకొని సభామధ్యంలోకి లాగుకొనివచ్చి బట్టలు ఊడదీసిన విషయం తెలిసి ఉండికూడా, నీ కొడుకులను చంపాడని భీముడిని నీవు చంపాలని ఆలోచించటం బాగుందా! నీవే చెప్పుము!

**విశేషం:** కార్యకారణ సంబంధాన్ని కృష్ణుడు వివరిస్తున్నాడు. దుర్యోధనాదులను అంతక్రూరంగా చంపటానికి సభామధ్యంలో చేసిన ప్రతిజ్ఞలు కారణం. ఆ ప్రతిజ్ఞలకు ద్రౌపదీ మానభంగం కారణం. అది తెలిసి కూడా మళ్ళీ భీముడిని చంపాలని చూడటం సమంజసం కాదని కృష్ణుడి భావం.

**వ. నీ యవినీతియుం గొడుకుల దుశ్చరిత్రంబునుం దలంచి శోక రోషంబులు విడిచి శాంతుండవై యుండుమనిన నుపేంద్రునకు నన్నరేంద్రుం డిట్లనియె. 147**

**ప్రతిపదార్థం:** నీ+అవినీతియున్= నీ అవినీతి; కొడుకుల= నీ కుమారుల; దుశ్చరిత్రంబునున్= దుష్టచరిత్రనూ; తలంచి= బాగా గుర్తుచేసుకొని; శోకరోషంబులు= శోకాన్నీ, రోషాన్నీ, విడిచి; శాంతుండవై= శాంతమూర్తిగా; ఉండుము+అనినన్= ఉండుమని చెప్పగా; ఉపేంద్రునకున్= కృష్ణునికి; ఆ+నరేంద్రుండు= ఆ మహారాజు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** నీ అవినీతినీ, నీ కొడుకుల దుష్టచరిత్రను ఒకసారి బాగా గుర్తుచేసికొమ్ము. శోకాన్ని రోషాన్ని వదలిపెట్టుము. శాంతం పొందుము' - అని కృష్ణుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లా అన్నాడు.

**జలదవృత్తము:**

**'నీ పలుకెల్ల నిక్కమ యనింద్యగుణా! । యీ పురుషార్థహాని సుతు లీల్గుటకుం**
**దాపముఁ బొంది తాల్మి దిగఁ ద్రావి మహా । కోపుఁడ నైనఁ బాటిలెఁ దగుం గినియన్. 148**

**ప్రతిపదార్థం:** అనింద్యగుణా!= ప్రశంసింపదగిన గుణాలు కలిగిన కృష్ణా!; నీ పలుకు+ఎల్లన్= నీ మాటలన్నీ; నిక్కము+అ= సత్యాలే; సుతులు= కుమారులు; ఈల్గుటకున్= చనిపోయినందువలన; తాపమున్+పొంది= బాధపొంది; తాల్మి+దిగన్+త్రావి= ఓర్పును పోగొట్టుకొని; మహాకోపుఁడను+ఐనన్= మహాకోపం కలిగిన వాడివికాగా; ఈ పురుషార్థహాని+పాటిలెన్= ఈ ధర్మవిరుద్ధకార్యం వచ్చి పడింది; (నీవు) కినియన్= కోపగించుకోవటం; తగున్= సమంజసమైనదే.

**తాత్పర్యం:** 'కృష్ణా! నీవు ప్రశంసించదగిన గుణాలు మాత్రమే కలిగిన పురుషోత్తముడివి. నీ మాటలు అన్నీ సత్యాలే. కొడుకులు చనిపోయినందువలన మిక్కిలి బాధపొంది, ఓర్పును పోగొట్టుకొని మహాకోపాన్ని పొందటంవలన ఈ ధర్మహాని జరిగింది. అట్లాంటి నన్ను నీవు కోపగించటం సమంజసమే.

**విశేషం:** పురుషార్థాలని నాలిగింటికి పేరు - ధర్మం, అర్థం, కామం, మోక్షం. సందర్భాన్నిబట్టి ఇక్కడ 'ధర్మం' ప్రసక్తమయింది. ఇట్లా చంపాలనుకొనటం నాలోని కోపం ప్రకోపించటంచేత జరిగింది తప్ప నేను కోరి చేసినది కాదన్న విషయాన్ని మహారాజు చెప్పుతున్నాడు.

జలదవృత్తలక్షణం: ప్రతిపాదానికీ భ, ర, న, భ, గ - అనే గణాలుంటాయి. 1-10 అక్షరాలకు యతిమైత్రి - ప్రాసనియమం కలదు. దీనిని జలధరవృత్తమనీ పిలుస్తారు. (చూడండి స్త్రీ. 1.164). కొన్ని ప్రతులలో ఈ వృత్తం జలధరవృత్తంగా పేర్కొనబడి ఉన్నది.

**క. తెలిసితి నీ మాటలఁ బు । త్రుల దెస నెవ్వగనెల్లఁ దొఱఁగి యనుజ పు**
**త్రుల నాకుఁ బ్రియ మొనర్పం । గలవారుగ నడచువాఁడఁ గంసారాతీ!' 149**

**ప్రతిపదార్థం:** కంసారాతీ!= కంసుడి శత్రువైన కృష్ణా!; నీ మాటలన్= నీ మాటలవలన; తెలిసితిన్= జ్ఞానాన్ని పొందాను; పుత్రుల దెసన్= నా కుమారుల విషయంలో; నెవ్వగలన్+తొఱఁగి= బాధను వదలి; అనుజపుత్రులు+అ= నా తమ్ముడి కొడుకులే; నాకున్= నాకు; ప్రియము+ఒనర్పన్+కలవారుగన్= సంతోషం కలిగించగలిగే వారుగా; నడచువాఁడన్= నడుచుకొంటాను.

**తాత్పర్యం:** ఓ కంసవైరీ! నీ మాటలచేత 'తెలివి' ని పొందాను. నా కొడుకుల విషయంలో పడుతున్న బాధను ఇక వదలివేస్తాను. నా తమ్ముడి కుమారులే నాకు సంతోషం కలిగించగలిగేవారుగా నేను నడుచుకొంటాను.'

**వ. అనుటయు నమ్మహాత్ముండు భీమార్జున నకుల సహదేవులం గానిపించినఁగ్రమంబున నమ్మానవపతి వారలం గౌఁగిలించుకొని దీవించె నప్పు డాశ్రితవత్సలుండగు శ్రీవత్సలాంఛనుండు యుయుత్సునకుఁ దదీయ సందర్శనంబు సముచిత ప్రకారంబున నడిపె నట్లు గాంచిన వణిక్కన్యాజాతునెడం బొడమిన వాత్సల్యంబున వైచిత్రవీర్యుం డతనిఁ దిగిచికొని యక్కునం జేర్చికొనియెఁ దదనంతరంబ యద్ధరణీవిభుండు ధర్మపుత్ర**

**ప్రభృతులగు నయ్యేవుర నుద్దేశించి 'మీరు గాంధారిం గనుం' డని పంచిన నప్పాండవేయులు పద్మనాభ పురస్సరంబుగాఁ జని వినయంబున వినతులైన నద్దేవి దీవింప నొల్లక యుల్లంబు నిజతనూజుల మరణంబునకుం దాపంబునొంద శాపంబిచ్చునదియై యజాతశత్రు నుద్దేశించిన నత్తెఱఁగు సకలప్రాణి చిత్త వృత్తంబులు దన దివ్యబోధనంబునం దేటపడం గనియెడువాఁడును మనోజవుండును సర్వలోక సంపూజ్యుండును నగు సత్యవతీ సూనుండెఱింగి తత్క్షణంబ సన్నిహితుండై యఖిలజనంబు లభివందనంబు సేయం గైకొనుచు నక్కోడలిం జేరి యోహో! శపింపకు శమింపుమని పలికి మఱియు నిట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధృతరాష్ట్రుడనగా; ఆ+మహాత్ముండు= మహాత్ముడైన ఆ కృష్ణుడు; భీమార్జున నకుల సహదేవులం గానిపించినన్= భీముడిని, అర్జునుడిని, నకులుడిని, సహదేవుడిని ధృతరాష్ట్రుడి దగ్గర చూపెట్టాడు; క్రమంబునన్= వరుసగా; ఆ+మానవపతి= ఆ రాజు; వారలన్= వారిని; కౌఁగిలించుకొని దీవించెన్= కౌగిలించుకొని ఆశీర్వదించాడు; అప్పుడు= ఆశ్రిత వత్సలుండు+అగు= ఆశ్రయించినవారిని పిల్లలలాగా కాపాడే గుణమున్న; శ్రీవత్సలాంఛనుండు= శ్రీవత్సమనే పుట్టుమచ్చను గుర్తుగా కలిగిన శ్రీమహావిష్ణు రూపుడైన కృష్ణుడు; యుయుత్సునకున్= ధృతరాష్ట్రుని కుమారుడైన యుయుత్సునికి; తదీయ= ఆ ధృతరాష్ట్రుని; సందర్శనంబు= దర్శించుకోవటాన్ని; సముచిత= తగిన; ప్రకారంబునన్= విధానంలో; నడపెన్= నడిపాడు; అట్లు+కాంచిన= అలా వచ్చిచూసిన; వణిక్+కన్యాజాతుని+ఎడన్= వైశ్యకన్యాకుమారుని విషయంలో (యుయుత్సుడిపై); పొడమిన= పుట్టిన; వాత్సల్యంబునన్= కుమారత్వ భావనతో; వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుని కుమారుడైన ధృతరాష్ట్రుడు; అతనిన్= యుయుత్సుడిని; తిగిచికొని= దగ్గరకు తీసికొని; అక్కునన్+చేర్చికొనియెన్= రొమ్ముమీద చేర్చుకున్నాడు (కౌగిలించుకొన్నాడు); తద్+అనంతంబ= ఆ తరువాత; ఆ+ధరణీవిభుండు= ఆ రాజు; ధర్మపుత్ర= ధర్మరాజు; ప్రభృతులు +అగు= మొదలైన; ఆ+ఏవురన్+ఉద్దేశించి= ఆ ఐదుగురిని చూచి (పాండవులవైపు తిరిగి); మీరు= మీరు ఐదుగురు; గాంధారిన్+కనుండు+అని= గాంధారిని చూడండి అని; పంచినన్= పంపగా; ఆ+పాండవేయులు= ఆ కుంతీకుమారులు; పద్మనాభ పురస్సరంబుగాన్= కృష్ణుడు ముందు నడుస్తుండగా; చని= వెళ్ళి; వినయంబునన్= వినయంతో; వినతులు+ఐనన్= నమస్కరించగా; ఆ+దేవీ= ఆ గాంధారి; దీవింపన్+ఒల్లక= దీవించటానికి ఇష్టపడక; ఉల్లంబు= హృదయం; నిజ తనూజుల= తన కుమారుల; మరణంబునకున్= చావుకు; తాపంబున్+ఒల్లక= దీవించటానికి ఇష్టపడక; ఉల్లంబు= హృదయం; నిజ తనూజుల= తన కుమారుల; మరణంబునకున్= చావుకు; తాపంబున్+ఒందన్= మండిపడుతుండగా; శాపంబు+ఇచ్చునది+ ఐ= శాపం ఇవ్వటానికి; అజాతశత్రున్+ఉద్దేశించిన= ఆ ధర్మరాజువైపు చూడగా (తిరుగగా); ఆ తెఱఁగున్= ఆ వైనాన్ని; సకలప్రాణి చిత్త వృత్తంబులున్= అన్ని ప్రాణుల మనసులతో జరిగే పనులను; తన= తనయొక్క; దివ్యబోధంబునన్= దివ్యజ్ఞానంలో; తేటపడన్= స్పష్టంగా; కనియెడువాఁడును= చూచేవాడూ; మనోజవుండును= మహావేగం కలగినవాడూ; సర్వలోక= లోకాలన్నిటిచేతనూ; సంపూజ్యుండును= మిక్కిలిగా గౌరవింపబడేవాడూ; అగు= అయిన; సత్యవతీసూనుండు= సత్యవతి కొడుకైన వ్యాసమహర్షి; ఎఱింగి= గుర్తించి; తద్+క్షణంబు+అ= వెంటనే; సన్నిహితుండు+ఐ= ప్రత్యక్షమై; అఖిల జనంబులు= అక్కడున్న వారందరూ; అభివందనంబు= నమస్కారాలు; చేయన్= చేస్తుండగా; కైకొనుచున్= స్వీకరిస్తూ; ఆ+కోడలిన్+చేరి= కోడలైన గాంధారిని సమీపించి; ఓహో!= ఓ గాంధారీ!; శపింపకు(ము)= శాపం పెట్టవద్దు; శమింపుము+అని+పలికి= శాంతించుము అని చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అన్నాడు. అపుడు కృష్ణుడు భీమార్జున నకుల సహదేవులను ధృతరాష్ట్రుడి దగ్గర నిలబెట్టాడు. వరుసగా అందరినీ ఆ రాజు కౌగిలించుకొని దీవించాడు. ఆశ్రయించినవారిని కాపాడే ఆ కృష్ణుడు చివరగా యుయుత్సుడిని ధృతరాష్ట్రుడి వద్దకు పంపాడు. (యుయుత్సుడు వైశ్యకన్యకు ధృతరాష్ట్రుడికి జన్మించినవాడు - ధార్తరాష్ట్రుడై.) అతడిని చూడగానే కుమారుడు లభించాడని ఎంతో ఆనందం పొంది ఆ రాజు యుయుత్సుడిని

దగ్గర చేర్చుకొని కౌగిలించుకొన్నాడు. ఆ తరువాత మహారాజు పాండవుల వైపు తిరిగి 'మీరు గాంధారీదేవిని చూడండి' అని అన్నాడు. ఆ కుంతీకుమారులు పెదతండ్రిగారి అనుజ్ఞ మేరకు శ్రీకృష్ణుడు ముందు నడుస్తుండగా వెళ్ళి గాంధారికి వినయంతో నమస్కరించారు. అపుడు ఆమె ఆశీర్వదించటానికి ఇష్టపడక తన హృదయం మరణించిన కుమారులను గురించిన శోకంతో మండిపడుతుండగా శాపం ఇవ్వటానికి ధర్మరాజువైపు తిరిగింది. ప్రాణులందరి చిత్తాలలోనూ ఏ వికారాలు ఏర్పడుతాయో ఎట్లా ప్రవర్తిస్తారో తన దివ్యజ్ఞానంతో స్పష్టంగా చూడగలిగినవాడు, వ్యాసమహర్షి అక్కడ ప్రత్యక్షమయ్యాడు. మనోవేగం ఉన్నవాడు. అన్ని లోకాలలోనూ మిక్కిలిగా గౌరవించబడేవాడు; అట్లాంటి వ్యాసమహర్షి అక్కడ ప్రత్యక్షం కాగానే జనులందరూ ఆయనకు నమస్కరించారు. వారిని ఆశీర్వదిస్తూ మహర్షి కోడలైన గాంధారివద్దకు చేరి 'ఓ గాంధారీ! శపించవద్దు. శాంతించుము' అని అంటూ ఇంకా ఇట్లా చెప్పాడు.

**విశేషం:** భీముడిని కౌగిలించుకొనే సమయంలో శ్రీకృష్ణుడు అడ్డుపడ్డాడు. ఇనుపబొమ్మను పంపించి భీముడిని కాపాడాడు. ఇప్పుడు గాంధారి శాపం ఇవ్వకుండా వ్యాసమహర్షి కాపాడుతున్నాడు. గాంధారి పరమపతివ్రత. భర్తకొరకు కన్నులు మూసికొని అంధవ్రతదీక్ష చేయటమే ఆమె తపస్సు. అందుచేత మహర్షి కాపాడాడు. 'దైవం' అనుకూలమైనపుడే 'మనిషి' విజయం పొందగలడనటానికి ఇట్లాంటి సంఘటనలే నిరూపణం.

### ధర్మజుని శపింపఁ బూనిన గాంధారిని వ్యాసుఁడూరార్చుట (సం. 11-13-6)

**సీ.** **'పాండవేయాగ్రజుపై నల్కమానుము । రాజసంబేల? యీ రాజు ధర్మ**
**పరుఁడు నీ వించుక పాటించి వినవమ్మ । చెప్పెదఁ గౌరవశ్రేష్ఠుఁ డనికిఁ**
**జనుచుండి 'తల్లి! దీవన యిమ్ము జయముగా । నా'కని పలికిన నా కుమారు**
**తోడ నీ పేర్మికి నీడుగాఁ గొడుక! యె । క్కడనుండు ధర్మ మక్కడకు జయము**

**తే.** **సేరు ననవె? భూరి ఘోర యుద్ధంబున । గెలుపుగొనిరి గాన తలఁప ధర్మ**
**పరుల కాఁగవలయుఁ బాండుతనూజు ల । సూయ లేని బుద్ధిఁ జూడు మెట్లు.** **151**

**ప్రతిపదార్థం:** పాండవేయ+అగ్రజపైన్= కుంతీకుమారులలో పెద్దవాడైన ధర్మరాజుపైన; అల్కమానుము= కోపం విడిచిపెట్టు; రాజసంబు+ఏల?= ఈ రజోగుణం ఎందుకు?; ఈ రాజు= ఈ ధర్మరాజు; ధర్మపరుఁడు= ధర్మదీక్ష కలిగినవాడు; నీవు= అంచేత నువ్వు; ఇంచుక= కొంచెం; పాటించి= శ్రద్ధతో; వినవమ్మ!= వినుతల్లీ!; చెప్పెదన్= ఎందుకు క్షమించాలో చెబుతాను; కౌరవశ్రేష్ఠుఁడు= దుర్యోధనుడు; అనికిన్+చనుచుండి= యుద్ధానికి వెళ్తున్నపుడు; తల్లి!= ఓ అమ్మా!; నాకున్= నాకు; జయము+కాన్= జయం కలిగేలా; దీవన= ఆశీస్సు; ఇమ్ము= ఈ; అని; పలికినన్= కోరగా; ఆ కుమారుతోడన్= అతనితో; నీ పేర్మికిన్= నీ ప్రేమకు; ఈడుగాన్= సాటిగా (ప్రేమను అటుంచి); కొడుకు= కుమారా!; ధర్మము= ధర్మం; ఎక్కడన్+ఉండున్= ఎక్కడ ఉంటుందో; అక్కడకున్= అక్కడికి; జయము= జయం; చేరును+అనవె?= 'చేరుతుంది' అని చెప్పలేదూ!; భూరి= మహా; ఘోర యుద్ధంబునన్= భయంకర యుద్ధంలో; గెలుపున్+కొనిరి= విజయం పొందారు; కానన్= కాబట్టి; తలఁపన్= బాగా ఆలోచిస్తే; ధర్మపరులన్= ధర్మదీక్షితులైన; పాండుతనూజులకున్= పాండుకుమారులను; ఆఁగవలయున్= సైపవలయును (కరుణించాలి); ఎట్లున్= ఎలా అయినా (అన్ని విధాలా!); అసూయలేని; బుద్ధిన్= బుద్ధితో; చూడుము= చూడు (నీకే తెలుస్తుంది).

**తాత్పర్యం:** 'తల్లీ! ధర్మరాజుమీద కోపం విడిచిపెట్టుము. ఈ రజోగుణం ఇంకా నీ కెందుకు? ఈ ధర్మరాజు ధర్మదీక్ష కలవాడు. అందుచేత నీవు నేను చెప్పబోయే మాటలను శ్రద్ధతో వినుము. నీ కుమారుడు దుర్యోధనుడు యుద్ధభూమికి వెళ్ళబోతూ 'నాకు విజయం సిద్ధించేటట్లు ఆశీర్వదించుము' అని అడిగినప్పుడు నీ పుత్రాభిమానాన్ని అటుంచి 'నాయనా! ధర్మ మెక్కడో జయ మక్కడిచే చేరుతుం'దని చెప్పావు కదా! మహాఘోరమైన యుద్ధంలో వీళ్ళు గెలిచి బైటపడ్డారు. అందుచేత బాగా ఆలోచించి ధర్మదీక్షతో పోరాడి గెలిచిన పాండవులను సహించుము. ఆశ్రయ మిమ్ము. ఏ విధంగా నైనా అన్యాయం లేని బుద్ధితో ఆలోచించుము. నీకే అర్థమవుతుంది.

**విశేషం:** 'యతో ధర్మ స్తతోజయః' అని ప్రాచీన భారతీయుల విశ్వాసం.

గాంధారికూడా ఇదే మాటనే అన్నది. కుమారులు ధర్మపక్షాన లేరన్న వివేకం ఆమెకు ఉన్నదని ఈ మాటలు తెలుపుతాయి.

'రజోగుణం' - సత్త్వ రజస్తమోగుణాలని మూడు చెప్పబడ్డాయి. భగవద్గీతలో ఈ మూడింటి లక్షణాలు చెప్పబడ్డాయి. 'నేను అనే భావన, నాది, నాకు - అన్న కోరిక, రజోగుణ సంబంధులు. నేనే, నాకే - అన్నవి తమోగుణ సంబంధులు. ఈ రెండూలేని స్థితి సత్త్వస్థితి. యోగులు మాత్రమే ఈ స్థితిని అందుకొంటారు. భగవంతుడికి ఈ ముడు గుణాలూ లేవు. కాబట్టే ఆత్మ స్వరూపుడని పిలుస్తారు.

'తనకుమారులు చనిపోయారు. పాండవులు చంపివేశారు' అన్న భావనతోనే గాంధారీదేవి కుమిలిపోతున్నది. ఇదే రజోభావన. దానిని విడిచిపెట్టుమని వ్యాసుడి బోధ.

**మేదినీవృత్తము:**

**విను మిటులేటికిం జనిన వృత్త మూఁ ది యల్గన్ । జనము నుతించు నీదు గురుసారధీరబుద్ధిన్**
**నిను నతిశాంతచిత్తయని నిక్క మేనుఁ గందున్ । మనమున నట్టి నీ కగునె? మత్సరంబు వత్సా! 152**

**ప్రతిపదార్థం:** వత్స!= ఓ బిడ్డా! (ఓ అమ్మాయీ!); వినుము= నేను చెప్పేది బాగా వినుము; ఇటులు= ఈ విధంగా; చనిన= జరిగిపోయిన; వృత్తము= కథను; ఊఁది= పట్టుకొని; అల్గన్= కోపగించుకొనటం; ఏటికిన్?= ఎందుకు?; జనము= లోకం; నీదు= నీ యొక్క; గురు= గొప్పదైన; సారధీరబుద్ధిన్= జ్ఞానంతో; ధైర్యంతో కూడిన బుద్ధిని; నుతించున్= ప్రశంసిస్తుంది; నిక్కము= నిజంగా; నినున్= నిన్ను; అతిశాంత చిత్త+అని= అతి ప్రశాంతమైన మనస్సు కలిగినదానివని; ఏనున్+కందున్= నేను అనుకొంటాను; ఇట్టి నీకున్= ఇలాంటి నీకు; మనమునన్= మనస్సులో; మత్సరంబు= అసూయ; అగునె?= పుట్టవచ్చునా? (సమంజసంకాదని భావం).

**తాత్పర్యం:** అమ్మా! ఏనాడో జరిగిన కథలను పట్టుకొని ఇప్పుడు కోపగించుకొనటం వలన లాభం ఏముంటుంది? నీవు విచక్షణతో కూడిన జ్ఞానం కలిగిన దానివని, ధైర్యవంతురాలివని లోకం మెచ్చుకొనటం ఉన్నది. నేను ఎప్పుడూ నిన్ను ప్రశాంతమైన మనస్సు కలిగిన ఇల్లాలుగానే చూచాను. అట్లాంటి నీ మనస్సులో అసూయ పుట్టటమా! అది సమంజసంగా కనిపించటం లేదు.

**విశేషం:** మేదినీవృత్తంలో ప్రతిపాదానికీ న, జ, భ, జ, ర, గ - అనే గణాలుంటాయి. 1-11 అక్షరాలకు ప్రాసమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ. ధర్మంబు పరిగ్రహించి నీ కొడుకులగు పాండవులదెస రోషంబు నిగ్రహింపు' మనిన గంధవతీనందనునకు గాంధారరాజనందన యిట్లనియె. 153**

**ప్రతిపదార్థం:** ధర్మంబు= (నీవు) మాతృధర్మాన్ని; పరిగ్రహించి= అవలంబించి; నీ కొడుకులు+అగు= నీ కుమారులైన; పాండవుల దెసన్= పాండవుల విషయంలో; రోషంబు= కోపాన్ని; నిగ్రహింపుము+అనినన్= అణచుకో అని చెప్పగా; గంధవతీ నందనునకున్= యోజనగంధి కొడుకు - వ్యాసమహర్షికి; గాంధారరాజనందన= గాంధార రాజకుమార్తె (గాంధారి); ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తాత్పర్యం:** నీవు ఇప్పుడైనా మాతృధర్మాన్ని అవలంబించి నీ కుమారులైన పాండవులపైన ఉన్న రోషాన్ని పోగొట్టుకొమ్ము' అని చెప్పాడు. అప్పుడు వ్యాసుడితో గాంధారి ఇట్లా అన్నది.

**సీ. 'ఏ నసూయాగ్రస్తఁ గాను వీరలఁ జెడఁ । దలఁతునె? యెట్టు లుమ్మలికఁ జేసి**
**కలఁగితిఁ గాక యిక్కౌంతేయ వర్గంబు । గొంతికెట్లట్ల నాకును భరింప**
**వలదె? దుర్యోధను తులువతనంబున । శకునియుఁ గర్ణదుశ్శాసనులును**
**దుష్టాత్ము లగుటను ద్రుంగెఁ గౌరవకుల । మడరి పాండవులుఁ గయ్యంబుపాడిఁ**

**ఆ. జంపి రందఱ నది మది నొంపఁజాల । దచ్యుతుఁడు సూడఁ గురుపతి ననిలసుతుఁడు**
**దగునె గదపోర నాభికి దిగువ నొంచి । చంప? నత్తెఱఁ గుల్లంబు నొంపకున్నె? 154**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అసూయాగ్రస్తన్= అసూయతో నిండిన దాన్ని; కాను= కానేకాను; వీరలన్= పాండవులను; చెడన్+తలఁతునె?= నశించాలని అనుకొంటానా?; ఎట్టులు= ఎట్లాగో; ఉమ్మలికన్+చేసి= దుఃఖాతిశయంచేత; కలఁగితిన్+కాక= కోపగించుకొన్నాను తప్ప!; ఈ+కౌంతేయవర్గంబు= ఈ కుంతి కుమారులు (పాండవులు); గొంతికిన్+ఎట్లు+అట్లు= కుంతికి ఎట్లాగో అట్లాగే; నాకును= నేనూ; భరింపవలదె?= భరించవద్దా?; దుర్యోధను= దుర్యోధనుడి; తులువతనంబునన్= తుంటరితనంచేత; శకునియున్= శకునీ; కర్ణ దుశ్శాసనులును= కర్ణుడూ, దుశ్శాసనుడూ; దుష్టాత్మలగుటను= దుష్టాత్ములు కావటంవలన; కౌరవకులము= కురువంశం; త్రుంగెన్= నాశనమయింది; అడరి= విజృంభించి; పాండవులు= పాండుకుమారులు; కయ్యంబుపాడిన్= యుద్ధకర్మప్రకారంగా; అందఱన్= అందరినీ; చంపిరి= చంపారు; అది= అట్లా చంపటం; మదిన్= నా మనసును; నొంపన్+చాలదు= బాధపెట్టలేదు (బాధ కలిగింపజాలదు); అచ్యుతుఁడు+చూడన్= శ్రీకృష్ణుడు చూస్తూండగా; కురుపతిన్= దుర్యోధనుడిని; అనిల సుతుఁడు= వాయునందనుడైన భీముడు; గదపోరన్= గదాయుద్ధంలో; నాభికిన్+దిగువన్+నొంచి= నాభికి దిగువ కొట్టి; చంపన్+తగునె?= చంపవచ్చునా?; ఆ+తెఱఁగు= ఆ పని; ఉల్లంబున్= హృదయాన్ని; నొంపక+ఉన్నె?= బాధపెట్టకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** 'మహర్షీ! నేను అసూయ కలిగిన దానను కాను.పాండవులు నశించాలని నేను కోరుకొంటానా? ఎట్లాగో దుఃఖం అధికం కావటం వలన కోపగించుకొన్నాను. అంతే! ఈ పాండవులు కుంతికి ఎంతో నాకూ అంతే కదా! వీరి బాధ్యత ఆమె కెంతో నాకూ అంతే. దుర్యోధనుడి తుంటరితనంచేత, శకునికర్ణదుశ్శాసనుల దుర్మార్గంచేత కౌరవకులం నాశనమయిపోయింది. యుద్ధంలో విజృంభించి యుద్ధధర్మాన్ని బట్టి ఈ పాండవులు అందరినీ చంపారు. దీనివలన నా మనసుకు ఏమీ బాధ కలుగలేదు. శ్రీకృష్ణుడు చూస్తుండగా భీముడు గదాయుద్ధంలో దుర్యోధనుడిని బొడ్డుకు క్రింది భాగంలో గదతో మోది చంపటం న్యాయంగా ఉన్నదా? ఆ పని ఈ మాతృహృదయాన్ని బాధించకుండా ఉంటుందా? (మీరే చెప్పండి).

**క. విడుతురె శూరులు రణమునఁ । బడునట్టి యవస్థ తమకుఁ బాటిల్లిననుం**
**బుడమి సమస్తజనంబులు । నడపెడు తెఱఁ గలుక తప్పనకు రాకున్నే?' 155**

**ప్రతిపదార్థం:** శూరులు= పరాక్రమవంతులు; రణమునన్= యుద్ధంలో; పడునట్టి= (తాము) చనిపోయే; అవస్థ= పరిస్థితి; తమకున్; పాటిల్లిననున్= కలిగినా కూడా; పుడమిన్= భూమిలో; సమస్త జనంబులు= జనులందరూ; నడపెడు తెఱఁగు= అనుసరించే పద్ధతిని (నియమాలను); విడుతురె?= విడిచిపెడతారా?; తప్పునకున్= ఎవరైనా ఈ నియమాలు తప్పితే; అలుక= కోపం; రాక+ఉన్నే?= రాకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** పరాక్రమవంతులైన వాళ్ళు యుద్ధంలో చివరికి తాము చనిపోయే పరిస్థితి ఎదురైనా జనులంతా ఏ నియమాలను పాటించి యుద్ధంచేస్తారో దాన్నే అనుసరిస్తారు. నియమాన్ని ఉల్లంఘించరు. ఎవరైనా అట్లా ఉల్లంఘిస్తే చూచిన వారికి కోపం రాకుండా ఉంటుందా?

**విశేషం:** ప్రాచీన భారతీయ సమాజంలో నియమానికి (కట్టుబాటు) ఎంత విలువ ఉండేదో ఈ పద్యం సూచిస్తుంది. అట్లా నియమాన్ని తప్పినప్పుడు ఎవరైనా తప్పుపట్టే అవకాశం ఉండేదని అర్థం.

**వ. అనిన భీముండు భీతికంపితుండగుచు గాంధారికి వినతుండై వినయంబున నిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** అనినన్= గాంధారి ఇలా అనగా; భీముడు; భీతి= భయంతో; కంపితుండు+అగుచున్= కంపిస్తూ; గాంధారికి; వినతుండు+ఐ= నమస్కరించి; వినయంబునన్; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** గాంధారి ఇట్లా అనగా భీముడు భయంతో గడగడ వణకిపోతూ పెద్దతల్లికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

### భీముఁడు గాంధారికిఁ గోపోపశమనంబుగా నుత్తరంబు లిచ్చుట (సం. 11-14-1)

**సీ. 'తలపోసి చూడంగ ధర్మమయ్యె నధర్మ । మయ్యెనేఁ బ్రాణభయంబు కతన**
**నట్లు సేసితిఁ గృపయార సైరింపుము । నీదు పుత్త్రుఁడు లావు నేర్పుఁ గలఁడు**
**గావున నమ్మెయిఁగాని యోర్వంగ రా । దదియట్టులుండె ధర్మాత్మజునకుఁ**
**బాడితో వచ్చెనే పరిభవం బతనిచే? । ద్రౌపది యేకవస్త్రయు రజ స్వ**

**ఆ. లయును గాదె? యపుడు దయమాలి కొలువున । కీడ్చి తేరఁబంచి యేమి యనియె**
**నతఁడు వినవె! యూరు లప్పుణ్యకాంతకుఁ । జూపు టెఱుఁగవే విశుద్ధచరిత! 157**

**ప్రతిపదార్థం:** విశుద్ధచరిత!= పరమపవిత్రమైన చరిత్ర కలిగిన గాంధారీదేవీ! తలపోసి చూడంగన్= బాగా ఆలోచిస్తే; ధర్మము+అయ్యెన్= ధర్మం అయిందో; అధర్మము+అయ్యెన్= అధర్మమే అయిందో!; ప్రాణభయంబుకతనన్= ప్రాణభయంతో; నేను+అట్లు+చేసితిన్= నేను అట్లా చేశాను (తొడలపైన కొట్టటం); కృప+ఆరన్= కృప నిండగా (నిండు కృపతో); సైరింపుము= క్షమించుము; నీదుపుత్రుఁడు= నీ కుమారుడు; లావు= బలం; నేర్పున్= చాకచక్యం; కలఁడు= కలిగినవాడు; కావునన్= అందువలన; ఆ+మెయిన్+కాని= అలా తప్ప; ఓర్వంగన్+రాదు= ఓడించటం సాధ్యంకాదు; అది+అట్టులు+ఉండెన్= అది

అట్లా జరిగినది; (మరి); ధర్మాత్మజునకున్= ధర్మరాజుకు; అతనిచేన్= ఆ దుర్యోధనునిచేత; పరిభవంబు= అవమానం; పాడితోవచ్చెనే?= న్యాయపద్ధతిలో జరిగినదా?; అపుడు= ఆ జూదం సమయంలో; ద్రౌపది= పాండువుల పత్ని, నీ కోడలు అయిన ద్రౌపది; ఏకవస్త్రయున్= ఒకే చీర ధరించినది; రసజ్వలయున్= ముట్టుతో ఉన్నది; కాదె?= కాదా?; దయమాలి= కనికరంలేకుండా; కొలువునకున్= రాజసభలోకి; ఈడ్చి= ఈడ్చుకొని; తేరన్+పంచి= తీసుకురమ్మని పంపి (పిలిపించి); అతఁడు= ఆ దుర్యోధనుడు; ఏమి+అనియెన్= ఏమన్నాడో; వినవె!= నీవు విన్నావుగదా!; ఆ+పుణ్యకాంతకున్= రాజసూయ యజ్ఞంలో పవిత్రురాలైన ఆ పుణ్యస్త్రీకి; ఊరులు= తన తొడలు; చూపుట= చూపించి కూర్చోమనటం; ఎఱుఁగవే= నీకు తెలియదా!

**తాత్పర్యం:** 'పరమపవిత్ర చరిత్ర కలిగిన గాంధారీదేవీ! బాగా ఆలోచించిచూస్తే నేను చేసింది ధర్మమో అధర్మమో! ప్రాణభీతితో అట్లా చేశాను. నిండుదయతో మమ్మల్ని క్షమించుము. నీ కుమారుడు బలవంతుడు, చాకచక్యమున్నవాడు. అట్లాంటివాడిని అట్లా తప్ప ఓడించటం సాధ్యంకాదు. అందుచేత అట్లా చేయాల్సి వచ్చింది. అది అట్లా ఉంచుదాము. మరి ధర్మరాజుకు సభలో జరిగిన అవమానం న్యాయపద్ధతిలో జరిగిందా? ఆ సమయంలో ద్రౌపది ఏకవస్త్రంతో రజస్వలగా ఉన్నది కదా? ఏ మాత్రం దయలేకుండా నిండుకొలువులోకి ఈడ్పించుకొని వచ్చి దుర్యోధనుడు ఏమేమి అన్నాడో నీవు విన్నావు కదా! ఆ పవిత్రురాలికి తన తొడలు చూపించి కూర్చొనుమనటం నీవు ఎరుదుగువు కదా!

**వ. తత్కాలోద్దీపితంబైన కోపంబున నెసంగు మనస్సంతాపంబు దాల్మి దహించిన దదూరుభంగంబు గదా దండంబునఁ జేయంగలవాఁడనని యప్పేరోలగంబునఁ బ్రతిన వట్టితి నుత్తమ క్షత్ర ధర్మజ్ఞులు ప్రతిజ్ఞాహాని నిందింతురు గాన పూనిక నెఱపితి విను మా సభలో నప్పుడ తొడలు పాడిసేసి యతనిం దెగఁ జూడఁ దగియుండ నజాతశత్రునాజ్ఞ మిగులరామించేసి యమ్మహాత్ము చేసిన సమయంబు దప్పింపక యవ్విధంబున విపినంబున కరిగి యనేకదుఃఖంబులంబడి మగిడి యజ్జనపతి సంధిగోరి శౌరిం గౌరవసభకుం బుత్తెంచుటకుం దగుమాటలాడు నవసరంబున నేనును. 158**

**ప్రతిపదార్థం:** తద్+కాల= ఆ కాలంలో; ఉద్దీపితంబు+ఐన= ప్రకాశించిన; కోపంబునన్= కోపంతో; ఎసంగు= విజృంభించిన; మనస్+సంతాపంబు= మనసులోని పరితాపం; తాల్మిన్= ఓర్పును; దహించినన్= కాల్చివేయగా; తద్+ఊరుభంగంబు= అతడి తొడలను విరగగొట్టటం; గదాదండంబునన్= (నా) గదా దండంతో; చేయన్+కలవాఁడను+అని= చేయబోతానని; ఆ+పేరోలగంబునన్= ఆ నిండు సభలో; ప్రతిన+పట్టితిన్= ప్రతిజ్ఞ చేశాను; ఉత్తమ క్షత్ర ధర్మజ్ఞులు= ఉత్తమ క్షత్రియ ధర్మం తెలిసినవారు; ప్రతిజ్ఞాహానిన్= ప్రతిన నెరవేర్చుకోలేకపోవటాన్ని; నిందింతురు+కానన్= నిందిస్తారు కాబట్టి; పూనిక= నా పట్టుదలను; నెఱపితిన్= సాధించాను; వినుము= ఇంకా వినుము; ఆ సభలోన్= ఆ సభలోనే; అప్పుడు+అ= అప్పుడే; తొడలు= (నీ కుమారుని) తొడలు; పాడి+చేసి= నుగ్గుచేసి; అతనిన్= ఆ దుర్యోధనుడిని; తెగన్+చూడన్+తగి+ఉండన్= చంపివేయటం బాగుండగా; అజాతశత్రు+ఆజ్ఞ= ధర్మరాజు ఆనతి; మిగులరామిన్+చేసి= మీరకూడదు కాబట్టి; ఆ+మహాత్ము చేసిన= ఆ మహాత్ముడు చేసిన; సమయంబున్+తప్పింపక= నియమం; తప్పించకుండా; ఆ+విధంబునన్= ఆ రీతిగా; విపినంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి; అనేక= చాలా విధాల; దుఃఖములన్+పడి= దుఃఖాలకు లోనై; మగిడి= మళ్ళీ; ఆ+జనపతి= ఆ ధర్మరాజు; సంధిన్+కోరి= సంధిని అభిలషించి; శౌరిన్= శ్రీకృష్ణుడిని; కౌరవసభకున్= కౌరవుల సభకు; పుత్తెంచుటకున్= పంపటానికి; తగుమాటలు+ఆడు+అవసరంబునన్= తగిన మాటలు మాట్లాడుతున్న సమయంలో; నేనును= నేను కూడా.

**తాత్పర్యం:** ఆ కాలంలో అప్పటికప్పుడు పుట్టిన కోపంతో పరితాపం అధికమై మనసును దహించివేస్తుండగా అతడి తొడలను నా గదాదండంతో విరుగగొట్టుతానని ఆ నిండు సభలో ప్రతిజ్ఞ చేశాను. ఉత్తమక్షత్రియధర్మం తెలిసినవారు ప్రతినను నెరవేర్చలేకపోవటం తప్పుగా భావిస్తారు. కాబట్టి నా పట్టుదలను నెరవేర్చుకొన్నాను. ఇంకా ఒక విషయం వినుము. ఆ సభలోనే అప్పుడే ఆ దుర్యోధనుడి తొడలు నుగ్గునుగ్గుచేసి చంపివేస్తే బాగుండేది. కాని, ధర్మరాజుమాట మీరటానికి వీలులేదు. కాబట్టి ఆ మహాత్ముడు పెట్టిన నియమాలను తప్పించకుండా అడవికి వెళ్ళి, పడరాని దుఃఖాలు అనుభవించాము. చివరకు మళ్ళీ ధర్మరాజు సంధి జరిగితేనే మంచిదని శ్రీకృష్ణుడిని హస్తినాపురానికి పంపించే సమయంలో నేను కూడా (ఇట్లా అన్నాను).

**తే. 'అన్నదమ్ములమై యుండియకట! మనల । నొరులు దల లెత్తి చూడ నొండొరుల తోడఁ**
**బెనఁగ నేటికి? నీ నేల పెద్దవారి । బుద్ధి విని పంచికుడుచుట పోలదొక్కొ?' 159**

**ప్రతిపదార్థం:** అన్న+తమ్ములము+ఐ+ఉండి= అన్నదమ్ములై ఉండి కూడా; అకట!= అయ్యో! (ఈ విధంగా); మనలన్= మనలను; ఒరులు= ఇతరులు; తలలు+ఎత్తి+చూడన్= తప్పుపట్టటానికై తలలు పైకెత్తి చూచేలా; ఒండు+ఒరుల తోడన్= ఒకరు మరొకరితో; పెనఁగన్+ఏటికిన్?= పోరాడటం ఎందుకు?; ఈ నేలన్= ఈ భూమిని; పెద్దవారి బుద్ధివిని= పెద్దల మాటవిని; పంచి= పంచుకొని; కుడుచుట= అనుభవించటం; పోలదు+ఒక్కొ?= సరిపోదా?.

**తాత్పర్యం:** 'మనం అన్నదమ్ములమై ఉండి కూడా ఈ విధంగా ఇతరులు మనలను తప్పుపట్టటానికి వీలుకలిపిస్తూ (తలలు పైకెత్తి చూస్తుండగా) ఒకరితో మరొకరు యుద్ధం చేయటం ఎందుకు? పెద్దలు చెప్పినట్లుగా ఈ భూమిని పంచుకొని ఎవరి భాగం వారు అనుభవిస్తే సరిపోదా?'

**వ. అని నీ కొడుకునకుం జెప్పించితి దానను శాంతిం బొందక యద్దురాచారుండు చలంబున వైరంబుఁ బెనిచె నట్లగుట నవశ్యంబును ధర్మరాజునకు రాజ్యంబు సేకొనుటయు నాకుఁబ్రతిజ్ఞ దీర్చుటయుం గర్తవ్యంబులయ్యెం కావున నేమిభంగినైనం బగదీర్పవలసె నీవును సువిచార వింతయు విచారింపు' మనవుడు నద్దేవి యతని కిట్లనియె. 160**

**ప్రతిపదార్థం:** అని= అని; నీ కొడుకునన్= నీ కుమారుడైన దుర్యోధనుడికి; చెప్పి పుత్తెంచితిన్= చెప్పి పంపాను; దానను= దానిచేతకూడా; శాంతిన్+పొందక= శాంతించక; ఆ+దుర్+ఆచారుండు= ఆ దుర్మార్గుడు; చలంబునన్= కసితో; వైరంబున్+పెనిచెన్= శత్రుత్వాన్ని పెంచుకొన్నాడు; అట్లు+అగుటన్= అట్లా చేయటంవలన; అవశ్యంబును= తప్పని సరిగా; ధర్మరాజునకున్= ధర్మరాజుకు; రాజ్యంబు+చేకొనుటయున్= రాజ్యాన్ని గ్రహించటం; నాకున్; ప్రతిజ్ఞ+తీర్చుటయున్= చేసిన ప్రతినలను నిర్వహించటం; కర్తవ్యంబులు+అయ్యెన్= చేయదగ్గపనులు అయ్యాయి; కావునన్= అందుచేత; ఏమిభంగిన్+ఐనన్= ఏదో ఒక పద్ధతిని అవలంబించి; పగతీర్పన్+వలసెన్= పగను తీర్చుకోవలసి వచ్చింది. నీవును= నీవుకూడా; సువిచారవు= మంచి చెడులను తెలిసిన విచక్షణ ఉన్నదానివి; ఇంతయున్= దీన్నంతా; విచారింపుము= ఆలోచించుము; అనవుడున్= అని భీముడనగా; ఆ+దేవి= గాంధారీదేవి; అతనికిన్= భీముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని నీ కుమారుడికి చెప్పి పంపాను. దానితో శాంతించక ఆ దుర్మార్గుడు కసితో వైరం పెంచుకొన్నాడు. దానివలన ధర్మరాజు రాజ్యాన్ని గ్రహించటం, నేను నా ప్రతిజ్ఞలు తీర్చటం తప్పనిసరి అయింది. అందుచేత ఏదో ఒక విధంగా మా పగ తీర్చుకొనవలసి వచ్చింది. నీవు కూడా మంచి చెడులు తెలిసిన దానివి. విచక్షణ ఉన్నదానివి. ఇదంతా బాగా ఆలోచించుము' అని భీము డనగా గాంధారి అతడితో ఇట్లా అన్నది.

**క. 'ఆ చావు సావఁ దగు న। న్నీచునకున్ వానివలన నిక్కం బరయన్**
**నీ చెప్పినయన్నియుఁగల। వా చెయ్దియుఁ దగవ నీకు? నదియట్లుండెన్. 161**

**ప్రతిపదార్థం:** ఆ+నీచునకున్= ఆ నీచుడికి; ఆ చావు= ఆ విధంగా చావటం; తగున్= తగిందే; నిక్కంబు+అరయన్= నిజం ఆలోచిస్తే; వానివలనన్= వాడిలో; నీ చెప్పిన+అన్నియున్+కలవు= నీవు చెప్పిన దుర్గుణాలు అన్నీ ఉన్నాయి; (కాని) నీకున్= నీకు; ఆ చెయ్దియున్= ఆ పని; తగవ?= తగవే (న్యాయమే); అది= అది; అట్లుండెన్= అట్లా జరిగిపోయింది.

**తాత్పర్యం:** 'ఆ నీచుడికి అట్లా చావటం బాగుంది. ఆలోచిస్తే నీవు చెప్పిన దుర్గుణాలు అన్నీ వాడిలో ఉన్నాయి. కాని, అట్లా తొడలు విరుగగొట్టటం నీకు మాత్రం తగిన పనే? ఏమో అది అట్లా జరిగిపోయింది.

**తే. వైరి ననిఁ జంపుదురుగాక వ్రచ్చి నెత్తు। రెత్తికొని క్రోలు క్రూరాత్ము లెచట నైన**
**నెన్నఁడేనియుఁ గలిగిరే యీవు దక్క? । నది వృకోదర! వృకవిధ మసురభంగి.' 162**

**ప్రతిపదార్థం:** వృకోదర!= తోడేలువంటి పొట్ట కలిగిన ఓ భీమసేనా!; అనిన్= యుద్ధంలో; వైరిన్= శత్రువును; చంపుదురు+కాక= చంపుతారు తప్ప; వ్రచ్చి= రొమ్ముచీల్చి; నెత్తురు+ఎత్తికొని= నెత్తురు తీసికొని; క్రోలు= త్రాగేటువంటి; క్రూరాత్ములు= క్రూరులు; ఎచటనైనన్= ఎక్కడైనా; ఎన్నఁడేనియున్= ఎప్పుడైనా; కలిగిరే?= పుట్టారా?; నీవు+తక్కన్?= నీవు తప్ప?; అది= అట్లా తాగటం; వృకవిధము= తోడేలు చేసేపని; అసురభంగి= రాక్షసులు చేసే పని.

**తాత్పర్యం:** వృకోదరా! యుద్ధంలో శత్రువును చంపుతారు తప్ప రొమ్ము చీల్చి నెత్తురు తీసికొని త్రాగేటటువంటి క్రూరులు నీవు తప్ప ఇంక ఎక్కడైనా ఎప్పుడైనా పుట్టారా? అట్లా త్రాగటం మనుషులు చేసే పనికాదు. తోడేలు అట్లా చేస్తుంది. రాక్షసులు అట్లా చేస్తారు'.

**విశేషం:** 'వృకం' అంటే తోడేలు. తోడేలు జీర్ణాశయంలోనే 'వృకం' అనే భాగంవల్లనే ఆ పేరు వచ్చింది. అందుచేత ఎంత తిన్నా దానికి తృప్తి కాదన్న విశ్వాసం ఉన్నది. అందుచేత భీముడు వృకోదరుడని ప్రసిద్ధి చెందాడు. ఇక్కడ భీముడికి వృకోదర అనే సంబుద్ధి సార్థకంగా ప్రయోగించబడింది.

**వ. అనవుడు ననిలపుత్త్రుండు సుబలరాజపుత్త్రి కిట్లనియె. 163**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని గాంధారి అనగా; అనిలపుత్రుడు= వాయునందనుడైన భీముడు; సుబలరాజ పుత్రికిన్= సుబలరాజు కుమార్తె అయిన గాంధారితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** అని గాంధారి అనగా భీముడు ఆమెతో ఇట్లా చెప్పాడు.

**జలధరవృత్తము:**

**ఆ సభలోని కట్లు ద్రుపదాత్మజఁ దా । గాసిగ నీడ్చి వల్వొలువఁగాఁ గినుకం**
**జేసిన బాసకై పెదవిఁ జేర్చితి దు । శ్శాసను శోణితం బిది నిజం బరయన్.** **164**

**ప్రతిపదార్థం:** ఆ సభలోనికిన్= ఆ ద్యూత సభలోనికి; అట్లు= ఆ విధంగా; ద్రుపదాత్మజన్= ద్రౌపదిని; తాన్= తాను (ఆ దుశ్శాసనుడు); గాసిగన్= బాధించేలా; ఈడ్చి= ఈడ్చుకొనివచ్చి; వల్వ+ఒలువన్+కాన్= చీర విప్పగా; కినుకన్= కోపంతో; చేసిన= చేసినటువంటి; బాసకై= ప్రతిజ్ఞను తీర్చుకోవటానికై; దుశ్శాసను శోణితంబు= దుశ్శాసనుడి రక్తాన్ని; పెదవిన్+చేర్చితిన్= పెదవికి తాకించాను; అరయన్= బాగా చూస్తే; నిజంబు= నిజం; ఇది= ఇంతే.

**తాత్పర్యం:** ఆ సభలోనికి అంత క్రూరంగా ఆమెను బాధపెడుతూ లాగుకొనివచ్చి చీర విప్పి అవమానించినందువలన కోపంతో చేసిన ప్రతిజ్ఞ తీర్చటంకొరకు అట్లా దుశ్శాసనుడి రక్తాన్ని పెదవికి చేర్చాను (తాకించాను) తప్ప, త్రాగలేదు. నిజంగా నేను చేసినది ఇంతే.

**విశేషం:** లాక్షణికులు దీనిని జలదవృత్తమని కూడ పిలుస్తారు. లక్షణానికి చూడండి స్త్రీ. 1.148

**వ. అదియునుంగాక వినుమతని నేఁ బొదివినప్పుడు.** **165**

**ప్రతిపదార్థం:** అదియునున్+కాక= అంతేకాకుండా; వినుము= మరో విషయం ఉన్నది వినుము; అతనిన్= ఆ దుశ్శాసనుడిని; నేను; పొదివినప్పుడు= ఆక్రమించుకొన్నప్పుడు.

**తాత్పర్యం:** అంతేకాదు మరో విషయం కూడా ఉన్నది వినుము. నేను యుద్ధంలో దుశ్శాసనుడిని క్రిందపడవేసి ఆక్రమించుకొన్నప్పుడు.

**క్రౌంచపదవృత్తము:**

**కౌరవసేనావీరులు లావుం గడిమియుఁ జలమును గడఁక యెలర్పన్**
**ధీరతసొంపుం గ్రూరతపెంపుం దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్**
**బోరనఁ ద్రోవంగా రభసం బేపును గలితనమును బొలుపు వహింపన్**
**వారు భయంబుం గూరుటకుం గావలసెను రుధిరము వదనము సేర్పన్.** **166**

**ప్రతిపదార్థం:** కౌరవ సేనావీరులు= కురు సేనలోని వీరులు; లావున్= బలం; కడిమియున్= పరాక్రమం; చలమును= పట్టుదల; కడఁక= పూనిక; ఎలర్పన్= అతిశయించగా; ధీరత సొంపున్= ధైర్య సమృద్ధి; క్రూరతపెంపున్= అతిశయించిన క్రౌర్యం; తెగువయున్= సాహసం; నెఱపఁగన్= చూపించటానికి; తెరలక= మరలిపోకుండా; వీఁకన్= పరాక్రమంతో; బోరనన్= వెంటనే; త్రోవంగాన్= నన్ను పట్టి తోసివేయగా; రభసంబు= వేగం; ఏపును= విజృంభణం, కలితనమును= పరాక్రమం; పొలుపు వహింపన్= అధికంకాగా; వారు= ఆ సైన్యం; భయంబున్= భయంతో; కూరుటకున్= మునగటానికి; రుధిరమున్= రక్తాన్ని; వదనము+చేర్పన్= నోటికి తాకించటం; కావలసెను= అవసరమయింది.

**తాత్పర్యం:** ఆ కురుసేనలోని మహావీరులు బలపరాక్రమాలతో పట్టుదల వదలకుండా విజృంభించారు. ధైర్యసమృద్ధితో, అతిశయించిన క్రూరత్వంతో సాహసం చూపుతూ వెనుదిరుగకుండా మహాపరాక్రమంతో నన్ను వెంటనే ప్రక్కకు

తోసివేశారు. అపుడు నాలో వేగం, విజృంభణ, పరాక్రమం పెనవేసికొని నేనూ విజృంభించాను. ఆ సైన్యం భయపడాలంటే నా సమీపానికి రాకుండా ఉండాలంటే అట్లా రక్తాన్ని నోటికి తాకించక తప్పలేదు.

**విశేషం:** క్రౌంచపదవృత్తంలో ప్రతిపాదానికీ భ, మ, స, భ, న, న, య గణాలుంటాయి. 1, 11, 19 అక్షరాలకు యతిమైత్రి, ప్రాస నియమం ఉన్నది.

**వ. ఆ రెండు పనులకై యట్లు ద్రావుటగా నటించితిం గాని. 167**

**తాత్పర్యం:** వారు భయపడాలి. నన్ను సమీపించకుండా ఉండాలి. ఆ రెండుపనులు సిద్ధించటంకొరకు అట్లా నెత్తురు తాగటంవలె నటించాను తప్ప (నిజంగా రక్తం దోసిలితో పట్టి త్రాగలేదని అర్థం). (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. అన్యజనముల శోణితమైనఁ ద్రావు । టధిక పాతకమని విందు ననుజ రక్త**
**మాన నేనంత వెట్టినె? యంతపాప । కర్ముఁడనె? తల్లి! యంత నిష్కరుణమతినె? 168**

**ప్రతిపదార్థం:** తల్లి!= ఓ తల్లీ!; అన్యజనముల= ఇతరుల; శోణితమైనన్= రక్తమైనా; త్రావుట= త్రాగటం; అధిక= మిక్కిలి; పాతకము+అని= పాపమని; విందును= విన్నాను; అనుజరక్తము= తమ్ముడి రక్తాన్ని; ఆనన్= తాగటానికి; నేను; అత వెట్టినె?= అంత పిచ్చివాడినా?; అంత; పాపకర్ముఁడనె= పాపిష్ఠివాడినా!; అంత; నిష్కరుణ= కరుణలేని; మతినె?= హృదయమున్నవాడినా?

**తాత్పర్యం:** అమ్మా! వేరే మనుష్యుల రక్తమైనా త్రాగటం మహాపాపమని విన్నాను. అట్లాంటప్పుడు తమ్ముడి రక్తాన్ని త్రాగటానికి నేనేమైనా వెర్రివాడినా! అంత పాపిష్ఠినా! లేదా అంత కరుణలేని హృదయమున్న వాడినా?'

**వ. అనుటయు. 169**

**తాత్పర్యం:** అని భీముడు చెప్పగా- (గాంధారి ఇట్లా అన్నది.)

**తే. 'అంధులకు నూఁతకోలగా నకట! యొకని । నైన నిలుపక నూర్వుర నదయవృత్తి**
**మ్రింగి తందెవ్వఁ డేనియు మీకు నెగ్గు । లాచరింపని వాఁడు లేఁడయ్యెనయ్య? 170**

**ప్రతిపదార్థం:** అంధులకున్= గుడ్డివారికి; ఊఁతకోలగాన్= ఊతకర్రగా; అకట!= అయ్యో! ఒకనినైనన్= ఒక్కడినికూడా; నిలుపక= మిగల్చకుండా; నూర్వురన్= నూరుమందినీ; అదయవృత్తిన్= కనికరం ఏ మాత్రంలేకుండా; మ్రింగితి(వి)= పొట్టనుబెట్టుకొన్నావు (చంపివేశావు); అందున్= ఆ నూరుమందిలో; ఎవ్వఁడు+ఏనియున్= కనీసం ఒక్కడైనా; మీకున్= మీ పాండవులకు; ఎగ్గులు= అపకారం; ఆచరింపనివాఁడు= చేయనివాడు; లేఁడయ్యెనయ్య?= లేకపోయాడా నాయనా!

**తాత్పర్యం:** 'అయ్యో! గ్రుడ్డివాళ్ళకు ఆసరాగా ఒక్కడినైనా మిగల్చకుండా నూరుమందినీ నీ పొట్టన పెట్టుకొన్నావే! ఎంత దయలేని వాడివయ్యా నీవు? ఆ వందమందిలో ఒక్కడైనా మీకు అపకారం చేయనివాడు లేకపోయాడా బాబూ!

**క. ఒక్కరుని నీవు సంపక । తక్కిన నంతటనె ప్రతిన దప్పునె? విభవం**
**బెక్కఁగ మీయన్న నతం । డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా!' 171**

**ప్రతిపదార్థం:** కుమారా!= నాయనా!; ఒక్కరిని= ఒక్కడిని; నీవు+చంపక= నీవు చంపకుండా; తక్కిన+అంతటనె= వదలి వేసినంత మాత్రంలో; ప్రతిన+తప్పునె?= నీ ప్రతిజ్ఞ తప్పిపోతుందా?; అతండు= ఆ వదలివేసిన ఒకడు; మీ అన్నను= ధర్మరాజును; విభవంబు+ఎక్కఁగన్= వైభవం అతిశయించగా; ఎక్కటి రాజ్యంబు= ఏకచ్ఛత్రాధిపత్యం; చేయన్+ఈఁడె= చేయనివ్వడా!

**తాత్పర్యం:** నాయనా! నీవు ఒక్కడిని చంపకుండా వదలివేసినంత మాత్రంలో నీ ప్రతిజ్ఞాభంగ మవుతుందా! ఆ ఒక్కడు మీ అన్న వైభవోపేతంగా ఈ రాజ్యాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలకుండా అడ్డుపడతాడా? (ఎందు కింత క్రూరంగా అందరినీ ఊచకోత కోశావు?).'

**వ. అని పలికి ధర్మనందను దెస మనసు నిగుడం బుత్రపౌత్రవధసంపీడితస్వాంతయగు నగ్గాంధారి క్రోధ పరుషాక్షరంబుల 'నమ్మహారాజెచట నున్నవాఁ?' డనిన నా భూపతి భయకంపిత గాత్రుండగుచుం జేతులు మొగిచి సవినయంబుగా మెత్తని మాటల నిదె వచ్చితి దేవీ! యేను బాండవాగ్రజుండ ననుచుం జేరం బోయి. 172**

**ప్రతిపదార్థం:** అని పలికి ఈ విధంగా అని; ధర్మనందను దెసన్= ధర్మరాజు దిక్కు; మనసు+నిగుడన్= మనసు పోగా; పుత్ర= కొడుకుల; పౌత్ర= మనుమల; వధ= వధచేత; సంపీడిత= మిక్కిలిగా పీడించబడిన; స్వాంత+అగు= మనసు కలిగిన; ఆ+గాంధారీదేవి; క్రోధ= కోపంతోను; పరుష= కాఠిన్యంతోనూ; (నిండిన) అక్షరంబులన్= అక్షరాలతో; ఆ+మహారాజు+ఎచటన్+ ఉన్నవాఁడు+అనినన్= ఆ మహారాజు ఎక్కడ ఉన్నాడు? అని అడుగగా; ఆ భూపతి= ఆ ధర్మరాజు; భయ= భయంచేత; కంపిత= వణకుతున్న; గాత్రుండు+అగుచున్= శరీరం కలిగినవాడై; చేతులు= చేతులను; మొగిచి= ముడిచి (నమస్కరించి); సవినయంబుగాన్= వినయంతో; మెత్తని మాటలన్= మెత్తని పలుకులతో; దేవీ!= ఓ తల్లీ!; ఇదె= ఇదిగో; ఏను= నేను; పాండవ+అగ్రజుండన్= ధర్మరాజును; వచ్చితిన్= వచ్చాను చూడు; అనుచున్= అంటూ; చేరన్+పోయి= ఆమెను సమీపించి.

**తాత్పర్యం:** అని గాంధారి అన్నది. అప్పుడు ఆమె మనసులో ధర్మరాజు మెదిలాడు. కొడుకులు, మనుమళ్ళు క్రూరంగా చంపబడ్డారన్న వ్యథతో మిక్కిలిగా పీడించబడిన మనస్సు కలిగిన ఆ గాంధారి కోపంతోనూ, కాఠిన్యం తోనూ నిండిన కరకు ధ్వనితో 'ఎక్కడ ఆ మహారాజు?' అని అడిగింది. ఆ మాట విని ధర్మరాజు భయపడిపోయాడు. గడగడ వణుకుతూ చేతులు ముడిచి నమస్కరించి వినయంతోనూ నెమ్మదిగా. 'అమ్మా! ఇదుగో నేను ధర్మరాజును వచ్చాను చూడుము' అంటూ ఆమెను సమీపించి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇక్కడ గాంధారి ధర్మరాజుకు మహారాజు అనే విశేషం ప్రయోగించటం వాత్సల్యంతోకాదు. 'కసి'తో.

**క. 'నీ పుత్రులఁ జంపించిన । పాపాత్మునిఁ గ్రూరచిత్తుఁ బరివాదార్హున్**
**శాపంబునఁ బొలియింపుము । భూపాలకవల్లభాభిపూజిత చరణా! 173**

**ప్రతిపదార్థం:** భూపాలక= రాజుల; వల్లభా+అభిపూజిత= భార్యలచేత ఆరాధింపబడే; చరణా!= పాదాలు కలిగిన గాంధారీదేవీ!; నీ పుత్రులన్= నీ కుమారులను; చంపించిన= చంపించినటువంటి; పాపాత్మునిన్= పాపాత్ముడైనవాడూ; క్రూరచిత్తున్= క్రూరచిత్తుడైనవాడూ; పరివాదార్హున్= నిందకు తగినవాడూ (అయిన నన్ను); శాపంబునన్= శాపంతో; పొలియింపుము= వధించు (చంపుము).

**తాత్పర్యం:** 'నానా రాజుల భార్యలచేత ఆరాధింపబడే చరణసీమ కలిగిన ఓ మహారాణీ (గాంధారీదేవీ!) నీ కొడుకులను చంపించిన పాపాత్ముడను నేను. అతికఠిన చిత్తుడను నేను. నిందించటానికి అన్ని విధాలా తగినవాడిని. అట్లాంటి నన్ను నీ శాపంతో చంపివేయుము.

**క.** **ధరణింగల రాజులకుం। బరివారమ్మునకుఁ జావు పాటిల్లుటకై**
**పరుషత గైకొన్న యుధి। ష్ఠిరు దారుణ దండ కలితుఁ జేయందగదే!** **174**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిలో; కల= ఉన్న; రాజులకున్= రాజులకు; పరివారమ్మునకున్= వారి పరివారానికి; చావు= మరణం; పాటిల్లుటకై= కలగటంకోసం; పరుషతన్= కాఠిన్యాన్ని; కైకొన్న= పొందిన; యుధిష్ఠిరున్= ఈ ధర్మరాజును; దారుణ= భయంకరమైన; దండ+కలితున్= దండన పొందినవానిగా; చేయన్+తగదే?= చేయదగడా?

**తాత్పర్యం:** ఈ భారతభూమిలోని రాజులు, వారి పరివారాలూ అందరూ మరణం పాలుకావటానికై అతి కఠినుడుగా మారిపోయిన ఈ ధర్మరాజుకు ఏదైనా దారుణమైన శిక్ష విధించవమ్మా!

**మత్తకోకిల:**

**జీవమేటికి? రాజ్యమేటికిఁ జెల్లుఁ? జుట్టల బిడ్డలం**
**జావఁ జూచిన యట్టి ద్రోహికి సర్వభోగము లేటికిన్?'**
**నావుడున్ మఱుమాటలాడఁగ నాలుకాడక యుండి య**
**ద్దేవి యూర్పు నిగిడ్చె నుష్ణము దీర్ఘముం బరుషంబుగన్.** **175**

**ప్రతిపదార్థం:** చుట్టలన్= చుట్టాలను; బిడ్డలన్= పిల్లలనూ; చావన్+చూచిన= చనిపోయేలా చేసిన; అట్టి ద్రోహికిన్= అట్లాంటి ద్రోహబుద్ధి ఉన్నవాడికి; జీవము+ఏటికిన్?= ప్రాణం ఎందుకు?; రాజ్యము+ఏటికిన్+చెల్లున్?= రాజ్యపాలనాధికారం ఎందుకు?; సర్వభోగములు+ఏటికిన్?= ఈ భోగాలన్నీ ఎందుకు?; నావుడున్= అని ధర్మరాజు అనగా; మఱుమాటలు+ఆడఁగన్= మలిమాటలాడటానికి; నాలుక+ఆడక+ఉండి= నాలుకాడక అట్లాగే మౌనంగా ఉండి; ఆ+దేవి= గాంధారి; ఉష్ణమున్= వేడిగా; దీర్ఘమున్= పొడవుగా; పరుషంబుగన్= కఠినంగా (ఉన్న); ఊర్పున్= నిట్టూర్పును; నిగిడ్చెన్= వదలిపెట్టింది.

**తాత్పర్యం:** బంధువులను, కుమారులను చావజూసిన ద్రోహిని నేను. నేను ఇంకా ప్రాణాలతో ఎందు కుండాలి? నాకు రాజ్యం ఎందుకు? ఈ వైభవా లెందుకు?' అని ధర్మరాజు విలపించాడు. ఇది విని గాంధారి నోట మాటరాలేదు. వేడిగా పొడవుగా కరకుగా ఉన్న పెద్ద నిట్టూర్పును మాత్రం విడిచిపెట్టింది.

**విశేషం:** వేడి నిట్టూర్పు - లోపల ఉన్న పరితాపాన్ని సూచిస్తుంది. పొడవు నిట్టూర్పు - లోపల ఉన్న బాధతాలూకు ఆధిక్యాన్ని సూచిస్తుంది, కరకు నిట్టూర్పు - లోపల ఇంకా ఆమెకు వారిపై కోపం పోలేదని సూచిస్తుంది. సముచితంకాదని మాటలాడకుండా ఉండిపోయిందని అర్థం. వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1.21.

**వ. ఇట్లు ధృతరాష్ట్ర మహిషి యతని యుచితవచనంబులు విని యూరక యుండె నతం డంజలిపుటంబు ఫాలంబున మోపి యానతుండయ్యెఁ బట్టావృతనయన యగు నప్పతివ్రత దృష్టి పట్టంబునంచు సందునం జని యజ్ఞనపతి పదనఖంబులం జెందిన నవి గందినం జూచి సవ్యసాచి జనార్దను వెనుకకుం జనియెం సమీర సుతుండును మాద్రీసుతులునుం దిరుగుడువడి రప్పడు గాంధార రాజనందన క్రోధంబు దక్కి ధర్మపుత్రాదుల దెస మాతృభావం బలవడ సాంత్వనస్వరంబునం గుంతీసందర్శనంబు సేయరన్నా! యని పలికిన నప్పురుష సత్తములు చిత్తంబుల కలంక డిందువడ నందఱు నొక్కటఁ గుంతియున్న దెసకుఁ జన నక్కుంతిభోజనందన వారిం గలయం గనుంగొని. 176**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ ధృతరాష్ట్ర మహిషి= ఆ గాంధారి= అతని= ధర్మరాజుయొక్క; ఉచిత= సమంజసమైన; వచనంబులు విని= మాటలు విని; ఊరక+ఉండెన్= ఊరకే ఉండిపోయింది; అతండు= ఆ ధర్మరాజుకూడా; అంజలిపుటంబు= నమస్కరిస్తున్న చేతులను; ఫాలంబునన్+మోపి= నొసటన చేర్చి; ఆనతుండు+అయ్యెన్= వంగినవాడు అయ్యాడు; పట్ట+ఆవృత+ నయన+అగు= గుడ్డతో కప్పబడిన కనులు కలిగిన; ఆ+పతివ్రత= పతివ్రతఅయిన ఆ గాంధారీదేవి; దృష్టి= చూపు; పట్టంబున్+అంచు= గుడ్డ అంచులోని; సందునన్+చని= సందులో దూరి; ఆ+జనపతి= ధర్మరాజుయొక్క; పదనఖంబులన్+ చెందినన్= కాలిగోళ్ళను తాకగా; అవి= ఆ వేళ్ళు; కందినన్= ఎర్రబడగా; చూచి; సవ్యసాచి= అర్జునుడు; జనార్దను= కృష్ణుడి; వెనుకకున్= వెనుకవైపుగా; చనియెన్= వెళ్ళి దాక్కున్నాడు; సమీర సుతుండును= భీముడూ; మాద్రీ సుతులున్= నకుల సహదేవులూ; తిరుగుడు+పడిరి= దూరంగా అటూ ఇటూ వెళ్ళిపోయారు; అప్పుడు= ఆ సమయంలో; గాంధార రాజనందన= గాంధారీదేవి; క్రోధంబు+తక్కి= కోపం విడిచిపెట్టి; ధర్మపుత్రాదులదెసన్= పాండుకుమారుల పట్ల; మాతృభావంబు= తల్లిదనం; అలవడన్= ఏర్పడగా; సాంత్వన= ఓదార్పు కలిగించే; స్వరంబునన్= ధ్వనితో; కుంతీ సందర్శనంబు చేయరన్నా!= కుంతీదేవిని చూడండి నాయనలారా!; అని; పలికిన; ఆ+పురుషసత్తములు= ఆ పురుష శ్రేష్ఠులైన పాండవులు; చిత్తంబుల= మనసులోని; కలంక= శోకం; డిందు+పడన్= నశించగా; అందఱున్+ఒక్కటన్= అందరూ కలిసి; కుంతి+ఉన్న+దెసకున్= కుంతి ఉన్నచోటికి; చనన్= వెళ్ళగా; ఆ+కుంతిభోజ+నందన= ఆ కుంతిభోజుని కుమార్తె; వారిన్= వాళ్ళను; కలయన్+కనుంగొని= అందరినీ నెమ్మదిగా చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ గాంధారి ధర్మరాజు యొక్క సమంజసమైన మాటలు విని ఊరకే ఉండిపోయింది. ధర్మరాజు కూడా జోడించిన చేతులను పైకెత్తి నొసటనచేర్చి వినమితుడయ్యాడు. అప్పు డా గాంధారీదేవి చూపు కన్నులకు కట్టుకొన్న గుడ్డ అంచు సందులో నుండి దూరి ధర్మరాజు కాలి గోళ్ళను తాకినది. అప్పుడు ఆ వేళ్ళు వెంటనే ఎర్రబడ్డాయి. అది చూచి అర్జునుడు కృష్ణుడి వెనుకవైపుగా వెళ్ళి నిలబడ్డాడు. భీముడు, నకుల సహదేవులు కూడా తొట్రుపాటుతో అటూ ఇటూ పోయారు. ఆ సమయంలో గాంధారి కోపం విడిచిపెట్టి పాండు పుత్రులపట్ల మాతృభావాన్ని పొంది, ఓదార్పు కలిగించే స్వరంతో 'నాయనలారా! కుంతిని దర్శించుకోండి' అని చెప్పింది. ఆ మాటలు విని పాండవుల మనసులు కాస్త తేరుకొన్నాయి. శోకం తగ్గింది. అందరూ కలిసి కుంతి ఉన్నచోటికి వెళ్ళారు. అపుడు కుంతి వారినందరిని నెమ్మదిగా చూచి (ఇట్లా అన్నది). (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** కళ్ళకు కట్టుకున్న గంతసందులో నుండి చూస్తేనే ధర్మరాజు గోళ్ళు కమలిపోయాయంటే, ఇంక ఆమె గంతలులేక నేరుగా చూస్తే పాండవులందరూ భస్మీభూతులయిపోయి ఉండే వారని గ్రహించాలి. అదీ ఆ గాంధారి పాతివ్రత్యమహిమ.

## పాండవులు కుంతీదేవి కడకు గాంధారి పంపునం బోవుట (సం. 11-15-9)

**అంబురుహ వృత్తము**

**పెద్దయుఁగాలము వారలఁ జూడఁగఁ బ్రేముడించుచు దుర్భరా**
**పద్దశ నొందుట నమ్మహితాత్ముల పట్టులందఱుఁ ద్రుంగుటం**
**దద్దయు శోకమునం బొరి నశ్రులధార లొల్క వగర్పుతో**
**నద్దురవస్థ తెఱంగు గనుంగొని యంతకంటెను నార్తు లై. 177**

**ప్రతిపదార్థం:** పెద్దయున్+కాలము= చాలా కాలంగా; వారలన్= పాండవులను; చూడఁగన్= చూడాలని; ప్రేముడించుచున్= కోరుకుంటూ; దుర్భర+ఆపద్+దశన్= భరించటానికి వీలుకాని విపత్పరిస్థితిని; ఒందుటన్= పొందటంవలన; ఆ+మహితాత్ముల= పాండవుల; పట్టులు+అందఱున్= కుమారులంతా; త్రుంగుటన్= చనిపోవటంవలన; తద్దయున్= మిక్కిలి; శోకమునన్= దుఃఖంతో; పొరిన్= ఎడతెగకుండా; అశ్రులధారలు+ఒల్కన్= కళ్ళలో నీళ్ళు కారుతుండగా; వగర్పుతోన్= నిట్టూర్పులతో (ఉన్న); ఆ+దురవస్థన్= ఆ కుంతి పడుతున్న బాధను; కనుంగొని= చూసి (పాండవులు); అంతకంటెన్= ఆమెకంటె; ఆర్తులై= బాధపడుతున్న వారై.

**తాత్పర్యం:** పాండవులను చూడాలని చాలాకాలం నుండి కోరుకొంటున్న కుంతీదేవి వారిని చూచి, వాళ్ళు పడ్డ దారుణమైన కష్టాలను తలచుకొని, అభిమన్యుడు, ఘటోత్కచుడు, ఉపపాండవులు మొదలైన పాండుపుత్రుల కొడుకులందరూ చనిపోయిన వైనాన్ని గుర్తుతెచ్చుకొని, మహాదుఃఖంలో మునిగిపోయింది. ఆమె కళ్ళవెంబడి నీరు ధారగా కారుతుండగా, వేడి నిట్టూర్పులు విడుస్తూ బాధపడుతుండగా, ఆమె దురవస్థ చూచి పాండవులు ఆమెకంటె దీనులు అయి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అంబురుహవృత్తంలో ప్రతిపాదానికి భ, భ, భ, భ, ర, స, వ అనే గణాలుంటాయి. 1 - 13 అక్షరాలకు యతిమైత్రి.

**వ. చరణంబులు దొట్రిల్లం జని తచ్చరణంబుల మీఁద వ్రాలి. 178**

**ప్రతిపదార్థం:** చరణంబులు= కాళ్ళు; తొట్రిల్లన్= తడబడగా; చని= వెళ్ళి; తద్+చరణంబులమీఁదన్= ఆమె కాళ్ళపై; వ్రాలి= పడి.

**తాత్పర్యం:** ఆమె బాధ చూచి వీళ్ళూ చలించిపోయారు. తడబడుతున్న కాళ్ళతో వెళ్ళి ఆమె పాదాలపై అందరూ పడి నమస్కరించి.

**తే. ఏడ్వ నందఱపైఁ జేతు లిడుచుఁ బెలుచ । నేడ్చి యద్దేవి వారల నెత్తి వేఱు**
**వేఱ మేనులు నివురుచు వివిధ దారు । ణాస్త్ర శస్త్రవ్రణ ప్రచయములు గాంచి. 179**

**ప్రతిపదార్థం:** ఏడ్వన్= ఏడుస్తుండగా; అందఱపైన్= అందరిమీదా; చేతులు+ఇడుచున్= చేతులు ఉంచుతూ; పెలుచన్= మిక్కిలిగా; ఏడ్చి= ఆమెకూడా ఏడ్చి; ఆ+దేవి= ఆ కుంతీదేవి; వారలన్+ఎత్తి= వారినిపైకి తీసి; వేఱువేఱ= వేరువేరుగా ప్రతి ఒక్కరి; మేనులు= శరీరాలను; నివురుచున్= నిమురుతూ; వివిధ= నానావిధాలైన; దారుణ+అస్త్ర+శస్త్ర= భయంకరమైన అస్త్రాలచేత శస్త్రాలచేత (ఏర్పడిన); వ్రణ= గాయాల; ప్రచయములు= సముదాయాన్ని; కాంచి= చూచి.

**తాత్పర్యం:** అందరూ ఏడుస్తుండగా అందరిమీద చేతులు ఉంచి, కుంతికూడా కుమిలి ఏడ్చింది. వారిని ఒక్కొక్కరిని పైకి లేపి, వారి శరీరాలను నిమిరింది. వారి దేహాలలో నానావిధ శస్త్రాలచేత, అస్త్రాలచేత ఏర్పడిన గాయాలను చూచి- (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** శస్త్రం - బాహుబలంతో మాత్రమే ప్రయోగించేది. ఉదాహరణకు 'గద'. దీనికి మంత్ర ప్రయోగం ఉండదు. 'అస్త్రం' మంత్రంతో కూడి ప్రయోగించేది - ఉదాహరణకు ఆగ్నేయాస్త్రం. గాయాలు రెండింటివలన కావచ్చును. కన్నతల్లి కాబట్టి ఆమె వారి గాయాలను చూచింది. వారు పడ్డ కష్టాలకు ఆమె ప్రత్యక్ష సాక్షి. మీదు మిక్కిలి భాగస్వామిని కూడా. తల్లి అనురాగం ఎంత గాఢమైనదో ఈ పద్యం ద్వారా తెలిసికొనవచ్చునూ. ధర్మరాజాదులు తమ తల్లి అయిన కుంతికంటె ముందు గాంధారిని చూడటం విశేషం.

**క.** **'అచ్చోటు లంటి చూచుచు । వెచ్చని యూర్పులు నిగుడ్చు వేఁగుచుఁ బొగులుం**
**గ్రుచ్చి కవుంగిటఁ జేర్చును । 'వచ్చితిరే! నృపకుమారవరులార!' యనున్.** **180**

**ప్రతిపదార్థం:** అచ్చోటులు+అంటిచూచుచున్= ఆ గాయాలు అయిన చోట్లను తాకి చూస్తూ; వెచ్చని= వేడి; ఊర్పులు= నిట్టూర్పులు; నిగుడ్చున్= వదలిపెడుతూ; వేఁగుచున్= పరితాపంతో కాలిపోతూ; పొగులున్= ఏడుస్తుంది; గ్రుచ్చి= పట్టుకొని; కవుంగిటన్+చేర్చును= కౌగిలిలోకి చేర్చుకొంటుంది; నృపకుమార వరులార!= రాజకుమార శ్రేష్ఠులారా!; వచ్చితిరే!= వచ్చారా నాయనా!; అనున్= అంటుంది.

**తాత్పర్యం:** ఆ గాయాలు అయినచోట్లను తాకి చూస్తూ వేడి నిట్టూర్పులు విడుస్తూ పరితాపంతో కుమిలిపోతూ ఏడ్చింది. వారిని పట్టుకొని కౌగిలించుకొని 'నాయనలారా! వచ్చారా!' (ఇంతకాలానికి) అని అన్నది.

**సీ.** **ఆ సమయంబున నప్పాండుభూపాల । పత్నికి శోకాగ్ని ప్రజ్వరిల్లఁ**
**దత్సమీపమునకు ద్రౌపది విన్నని । మోముపైఁ గన్నీరు ముసుఁగువడఁగఁ**
**బదముల నట దొట్రుపాటు వాటిల్లంగ । దైన్య మాకారంబు దాల్చినట్టి**
**తెఱఁగునఁ జనుదెంచి 'దేవి! సౌభద్రాదు ।లైన నీ మనుమ లెం దరిగి? రెంత**

**తే.** **యేనిఁ గాలంబు నినుఁ జూడ రిప్ప డిచటి । కేలరా?' రంచు నడుగుల మ్రోల నేల**
**వ్రాలె వికలాంగియై తెంచివైవ నెండ । దాఁకి వందిత తీఁగ చందంబు దోఁప.** **181**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; ఆ+పాండు భూపాల పత్నికిన్= పాండుమహారాజు భార్య అయిన కుంతీదేవికి; శోక+అగ్ని= శోకమనే అగ్ని; ప్రజ్వరిల్లన్= అతిశయించి మండగా; తద్+సమీపమునకున్= ఆమె దగ్గరకు; ద్రౌపది; విన్నని= పాలిపోయిన; మోముపైన్= ముఖంమీద; కన్నీరు= కంటినీరు; ముసుఁగు+పడఁగన్= కప్పివేయగా; పదములన్+అట= ఆమె నడకలో; తొట్రుపాటు= తడబాటు; వాటిల్లంగన్= కలుగగా; దైన్యము= దీనత్వం; ఆకారంబు+తాల్చినట్టి= ఆకారం ధరించిన; తెఱఁగునన్+చనుదెంచి= విధంగా వచ్చి; దేవి!= అమ్మా!; సౌభద్రాదులైన= అభిమన్యుడు మొదలైన; నీ మనమలు= నీ మనవళ్ళు; ఎందు+అరిగిరి?= ఎక్కడికి వెళ్ళారు?; ఎంత+ఏనిన్+కాలంబు= ఎంత కాలం గడిచినా; నినున్+చూడరు= నిన్ను చూడలేదు; ఇప్పుడు; ఇచటికిన్= ఇక్కడికి; ఏలరారు?= ఎందుకని రారు?; అంచున్= అంటూ; అడుగుల మ్రోలన్= కుంతి పాదాల సమీపంలో; వికలాంగి+ఐ= విచ్ఛేదంపొందిన అవయవాలు కలిగినదై; తెంచివైవన్= తెంచివేయగా; ఎండ+తాఁకి=

ఎండతాకిడికి; వందిన= వాడిపోయిన; తీఁగ చందంబు= తీగ విధం; తోఁపన్= అగుపించగా; నేలన్= నేలమీద; వ్రాలెన్= కూలిపోయింది.

**తాత్పర్యం:** అప్పుడు కుంతీదేవికి శోకాగ్ని అతిశయించి మండటం మొదలుపెట్టింది. ఆమె దగ్గరకు ద్రౌపది పాలిపోయిన ముఖంమీద కన్నీరు తెరలుకట్టగా, తడబడుతున్న నడకతో జీవచ్ఛవంవలె దైన్యం ఆకారం దాల్చిన విధంగా వచ్చి 'అమ్మా! అభిమన్యుడు మొదలైన నీ మనవళ్ళు ఎక్కడా కనిపించరే. ఎక్కడికి వెళ్ళారు? ఇన్ని రోజులైనా నిన్ను చూడటానికి రా రెందుకు?' అని పిచ్చిదానివలె మాట్లాడుతూ కుంతి పాదాల సమీపంలో కుప్పకూలిపోయింది. కొమ్మనుండి తెంచివేయగా పైగా ఎండ తాకి వాడిపోయి నిర్జీవమైపోయిన తీగవలె ఆ ద్రౌపది కనిపించగా.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, ఉపమ.

**వ. ఇట్లు మేదినింబడి రోదనంబు సేయు నయ్యుగ్మలి మీఁద నొఱగి తానునుం బెద్ద యెలుంగున నేడ్చి గ్రుచ్చి యెత్తి యక్కునం జేర్చి యూరార్చి యత్తన్వియుం దనయులుం దోడన చనుదేరఁ గుంతి గాంధారి కడకుం జనియె నప్పుడు ద్రౌపది యా ధృతరాష్ట్ర పత్ని పాదంబులకు మ్రొక్కి యడలున వెక్కుచున్న నద్దేవి యమ్ముద్దియ నుద్దేశించి. 182**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మేదినన్+పడి= నేలమీద పడి; రోదనంబు+చేయు= ఏడుస్తున్న; ఆ+యుగ్మలిమీఁదన్= ఆస్త్రీ (ద్రౌపది)మీద; ఒఱగి= ఒరిగిపోయి; తానునున్= కుంతి తానుకూడా; పెద్ద+ఎలుంగునన్= పెద్ద గొంతుకతో; ఏడ్చి; గ్రుచ్చి+ఎత్తి= పట్టుకొని ఎత్తి; అక్కునన్+చేర్చి= రొమ్మున చేర్చుకొని; ఊరార్చి= ఓదార్చి; ఆ+తన్వియున్= ఆ ద్రౌపదీ; తనయులున్= తన కుమారులూ; తోడన్= తోడుగా; చనుదేరన్= రాగా; కుంతి; గాంధారి కడకున్= గాంధారి దగ్గరకు; చనియెన్= వెళ్ళినది; అప్పుడు= ఆ సమయంలో; ద్రౌపది; ఆ+ధృతరాష్ట్ర+పత్ని= గాంధారి; పాదంబులకున్= కాళ్ళకు; మ్రొక్కి= మొక్కి; అడలునన్= దుఃఖంతో; వెక్కుచున్+ఉన్నన్= వెక్కిళ్ళు పెడుతుండగా; ఆ+దేవి= ఆ గాంధారి; ఆ+ముద్దియన్= ద్రౌపదిని; ఉద్దేశించి= చూచి (వైపు తిరిగి).

**తాత్పర్యం:** ఈ విధంగా నేలమీద పడి ఏడుస్తున్న ద్రౌపది మీద కుంతి ఒరిగిపోయి తానుకూడా పెద్దగా ఏడ్చింది. ఆమెను పట్టుకొని ఎత్తి కౌగిలించుకొని ఓదార్చి, కొడుకులు, ద్రౌపది వెంట రాగా కుంతి గాంధారి దగ్గరికి వెళ్ళింది. అప్పుడు ద్రౌపది గాంధారి కాళ్ళకు నమస్కరించి వెక్కిళ్ళుపెడుతూ ఏడుస్తుండగా గాంధారి ఆమెవైపు తిరిగి ఇట్లా అన్నది.

**మత్తకోకిల:**

**'పుత్రి! యిట్లగు నమ్మ? శోకముఁ బొంది కుందుచు నున్న నీ**
**గాత్ర మొండొక కీడు పాటిలి కందుఁ బాండుతనూభవుల్**
**పుత్రవర్గము గన్నచో నెద భూరితాపముఁ బొందుడుం**
**బౌత్ర హీనతఁ బడ్డ గొంతికిఁ బాయనేర్చునె నెవ్వగల్? 183**

**ప్రతిపదార్థం:** పుత్రి!= అమ్మాయీ!; ఇట్లు+అగునమ్మ?= ఇట్లా చేస్తే అవుతుందా?; శోకమున్+పొంది= దుఃఖాన్ని పొంది; కుందుచున్+ఉన్నన్= కుంగిపోతే; నీ గాత్రము= నీ శరీరం; ఒండొక కీడు= ఏదో ఒక అపాయం; పాటిలి= కలిగి; కందున్= తపిస్తుంది; పాండుతనూభవుల్= మరి పాండవులు; పుత్ర వర్గమున్+కన్నచోన్= మరణించిన కుమారులను తలచుకొంటే; భూరితాపమున్+పొందుడున్= మహావేదనను పొందగా; పౌత్రహీనతన్= మనుమళ్ళ మరణం అనే దుఃఖంలో; పడ్డ= పడిన; గొంతికిన్= కుంతీదేవికి; నెవ్వగల్= నిండుశోకాలు; పాయనేర్చునె?= వదులుతాయా?

**తాత్పర్యం:** 'అమ్మాయీ! ఇట్లా బాధపడితే అవుతుందా! నీ విట్లా క్రుంగిపోతే తప్పకుండా ఏదో ఒక అపాయం జరుగుతుంది. మరి పాండవులకు మాత్రం వారి కుమారులను తలచుకొంటే శోకం కలగటంలేదా? మనవళ్ళు పోగా కుంతికి మాత్రం దుఃఖం లేదా?

**విశేషం:** వృత్తలక్షణానికి చూడండి - స్త్రీ. 1. 21.

**క. నిను నే నిట్టూరార్చెద । నను నీ వూరార్ప వలదె? నా నీ తెఱఁగుల్**
**విను మొక్కరూప మన కే । మనఁగలదు విధాత క్రూరుఁడై పఱుపంగన్? 184**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; నేను= నేను; ఇట్టు= ఇలా; ఊఁరార్చెదన్= ఓదారుస్తాను; ననున్= నన్ను; నీవు= నీవు; ఊఁరార్పవలదె?= ఓదార్పవద్దా?; వినుము= ఒక విషయం చెబుతాను వినుము; నా, నీ, తెఱఁగుల్= నా బదుకు నీ బదుకు; ఒక్కరూప= ఒకేవిధమైనవి; మనకున్= మనపట్ల; విధాత= బ్రహ్మ; క్రూరుఁడు+ఐ= కఠినుడై; పఱుపంగన్= బాధింపగా; ఏమనగలదు= ఏమనగలము?

**తాత్పర్యం:** నేను ని న్నెట్లా ఓదారుస్తున్నానో నన్ను నీవూ అట్లాగే ఓదార్చుము. మరొక విషయం వినుము. నీ జీవితమూ నా జీవితమూ ఒకే విధంగా ఉన్నాయి. (నేనూ కొడుకులను పోగొట్టుకున్నాను, నీవూ కొడుకులను కోల్పోయావు). మన విషయంలో విధి చాలా క్రూరంగా వ్యవహరించింది. దీన్ని ఏమనగలము చెప్పుము?

**ప్రహరణకలిత వృత్తము:**

**ఇది యిటులగు ట ట్లెఱిఁగి పలికె నా । విదురుండు సభఁ గోవిదులు పొగడఁగా**
**నది వినియును నే నడఁపన దురితం । బొదవెఁ గలఁక సే టొలయ కుడుగునే? 185**

**ప్రతిపదార్థం:** ఇది; ఇటులు+అగుట+అట్లు= ఇలా జరగబోయేటట్లుగా; ఎఱిఁగి= తెలిసి; ఆ సభన్= ఆ సభలో; కోవిదులు= పండితులు; పొగడఁగాన్= ప్రశంసించగా; ఆ విదురుండు= ఆ మహాత్ముడైన విదురుడు; పలికెన్= (ఆనాడే) చెప్పాడు; అది వినియును= అదంతా వినికూడా; దురితంబు= ఆ దుర్మార్గాన్ని; నేను అడఁపన= అణచలేదు (అణచిన దాన్ని కాను); కలఁక= సంక్షోభం; ఒదవెన్= ఏర్పడింది; చేటు= కీడు; ఒలయక= తగులకుండా; ఉడుగునే?= తప్పుతుందా?

**తాత్పర్యం:** ఇది ఇట్లా అవుతుందని తెలిసి, ఆనాడే సభలో విదురుడు పెద్దవారంతా ప్రశంసిస్తుండగా ఎంతగానో చెప్పాడు. అదంతా విని కూడా నా కుమారుల దుర్మార్గాన్ని నేను ఆపలేకపోయాను. అందుకే ఈ సంక్షోభం ఏర్పడింది. ఏనాటికైనా కీడు తగలకుండా ఉంటుందా!

**విశేషం:** ప్రహరణకలితవృత్తంలో ప్రతిపాదానికీ న, న, భ, న, ల, గ - అనే గణాలుంటాయి. 1 - 8 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ. ఇట్లనియెదం గాక నా చేతఁబోవునే యెవ్వరు నేమి సేయుదురు కాలవశంబున నవశ్యభావియైనది యయ్యె నుపశమింపు 'మని పలికెనని యిట్లు పాండవులు ధృతరాష్ట్రుని గాంధారిని ననునయించిన తెఱంగెఱింగించిన నా భంగి నుపశమితక్రోధయైన గాంధారరాజనందన పదంపడి యెవ్విధంబున వర్తించె? ధర్మతనయు ననంతర వర్తనం బెప్పాటఁ జెల్లె?నని యడుగుటయును. 186**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇలా; అనియెదన్‌గాక= అంటాను కాని; నా చేతన్+పోవునే?= దీన్ని ఆపడం నా సాధ్యమా?; ఎవ్వరున్+ ఏమి+చేయుదురు?= ఎవరైనా ఏం చేస్తారు?; కాలవశంబునన్= కాలానికి లోబడి; అవశ్యభావి+ఐనది= తప్పకుండా ఏది జరగాలో అది; అయ్యెన్= అయిపోయింది; ఉపశమింపుము= ప్రశాంతంగా ఉండుము; అని; పలికెన్= చెప్పింది; అని; ఇట్లు= ఈ విధంగా; పాండవులు; ధృతరాష్ట్రుని గాంధారిని= ధృతరాష్ట్ర గాంధారులను; అనునయించిన= ఓదార్చిన; తెఱంగు+ ఎఱింగించినన్= విధం తెలుపగా; అ భంగిన్= అలా; ఉపశమిత= ఉపశమించిన; క్రోధ+ఐన= కోపం కలిగిన; గాంధార రాజనందన= గాంధారీదేవి; పదంపడి= ఆ తరువాత; ఏ+విధంబునన్= ఏ విధంగా; వర్తించెన్?= నడుచుకొంది? (ఏం చేసింది?); ధర్మతనయున్= ధర్మరాజుయొక్క; అనంతరవర్తనంబు= తరువాతి ప్రవర్తన; ఏ+పాటన్= ఏ విధంగా; చెల్లెన్?= జరిగాయి? (ఏం చేశాడు?); అని; అడుగుటయున్= అడుగగా.

**తాత్పర్యం:** ఇట్లా అంటాను కాని నేను మాత్రం దీనిని ఆపగలిగిన దానినా? ఎవరు మాత్రం ఏమి చేయగలరు? కాలధర్మానికి లోబడి ఏది ఎట్లా జరగాలో అట్లా జరిగిపోయింది. నీవు ఇకనైనా ప్రశాంతంగా ఉండుము' అని చెప్పినది. ఇదే విధంగా పాండవులు ధృతరాష్ట్రుడిని గాంధారిని ఓదార్చారు. ఈ విషయాన్ని చెప్పగా అట్లా ప్రశాంతిపొందిన కోపంకలిగిన ఆ గాంధారి తరువాత ఏం చేసింది? ధర్మరాజు తరువాత ఏమేం చేశాడు?' అని జనమేజయుడు అడిగాడు.

## ఆశ్వాసాంతము

**శిఖరిణీవృత్తము:**

**తపస్స్వాధ్యాయాది క్షపిత మలచిత్తప్రకలితా । విపజ్జాలజ్వాలావిరమణ సుధావృష్టిలలితా!
జపాపుష్ప క్షీరచ్ఛవికిరణ సంసర్జనధురా! । సపర్యానిర్వాహప్రచుర కలన స్థైర్య మధురా! 187**

**ప్రతిపదార్థం:** తపస్= తపస్సుచేత; స్వాధ్యాయ= వేదాధ్యయనంచేత; క్షపిత= తొలగించబడిన; మల= కల్మషమున్న; చిత్త= మనస్సులచేత; ప్రకలితా!= చక్కగా భావించబడేటటువంటి స్వామీ!; విపద్+జాల= ఆపదల సమూహాలు అనేటువంటి; జ్వాలా= మంటల; విరమణ= ఆరిపోవటానికి; సుధావృష్టి= అమృతాన్ని వర్షించే; లలితా!= మధుర స్వరూపుడైన ఓ హరిహరనాథా!; జపాపుష్ప= దాసాని పూవుయొక్క; క్షీర= పాలయొక్క; ఛవి= కాంతి ఉన్న; కిరణ= కాంతుల; సంసర్జన= కలయికచేత; ధురా!= బరువైన ఓ స్వామీ!; సపర్యా నిర్వాహ= నీకైంకర్యాన్ని నిర్వహించే (భక్తులలో); ప్రచురకలన= మిక్కిలిగా ఏర్పడే; స్థైర్య= స్థిరత్వంచేత; మధురా!= ఆనంద స్వరూపంగా అనుభూతమయ్యే స్వామీ! (నీకు నమస్కారం).

**తాత్పర్యం:** ఓ హరిహరనాథస్వామీ! నీవు తపస్సుచేత, వేదాధ్యయనంచేత పరిశుద్ధ మనస్సులు కలవారిచేత చక్కగా భావించబడతావు. ఆపదలనే మంటలు ఆరిపోవటానికి నీ దయామృతమనే వర్షాన్ని కురిపిస్తావు. దాసానిపూవువలె ఎర్రగా, పాలవలె తెల్లగా ఉన్న నీ అరుణశ్వేతకాంతి చాలా మనోహరమైనది. భక్తులు తమతమ కైంకర్యాలతో స్థిరంగా నిన్ను హృదయాలలో పదిలపరచుకొని మధురమైన అద్వైతానందానుభవాన్ని పొందుతారు. అట్లాంటి నీకు నమస్కారము.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. 'తపస్సు' అనేమాటకు చాంద్రాయణాది వ్రతాలు చేయటం అని ఒక అర్థమున్నది. మనస్సును, ఇంద్రియాలను ఏకాగ్రతలో చేర్చటమనే మరి ఒక అర్థముంది. వీటిచేత మనస్సు పవిత్రమవుతుందని వైదిక సంప్రదాయం చెప్పుతున్నది.

సాధారణంగా హరి నల్లటివాడని; హరుడు తెల్లటివాడని పురాణ ప్రసిద్ధం. కాని తంత్రగ్రంథాలలో శివుడు - శుక్ల వర్ణుడుగా; దేవీ - అరుణ వర్ణగా చెప్పబడ్డారు. కనుక మహేశ్వర సంబంధమైన ప్రాణశక్తి ఎరుపు. తెలుపు వర్ణాలను రెండింటిని కలిగినదని అర్థం.

**"వందే గురుపద ద్వంద్వ మవాఙ్మానస గోచరమ్**
**రక్త శుక్ల ప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం నమః"**

అని తంత్ర గ్రంథ వచనం. తర్కించటానికి వీలులేని, త్రిపుర సంబంధం కలిగిన గురుపద ద్వంద్వం వాక్కుకు మనస్సుకు అతీతమైనది. అందులో రక్త శుక్ల కాంతులు రెండూ కలిసి ఉన్నాయట.

విష్ణు సహస్రనామంలో 'విక్షరో రోహితో మార్గః' (58) అనీ, 'సువర్ణ వర్ణో హేమాంగః' (93) అనీ - రెండు విధాలుగా చెప్పటం గమనిస్తే విష్ణువు అరుణవర్ణుడని, సువర్ణవర్ణుడని తెలుస్తున్నది.

భగవంతుడి ఆరాధనచేత భక్తి స్థిరమవుతుంది. 'ఓర్పు' దీని లక్షణం. దీనితో కలిగేది 'తృప్తి'. దీన్నే ఆనందంగా తిక్కనగారు పేర్కొన్నారు.

శిఖరిణీవృత్తంలో ప్రతిపాదానికీ య, మ, న, స, భ, వ అనే గణాలుంటాయి. 1-13 అక్షరాకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**క. సాత్యవతేయాది మహా । మత్యవగమ్య ప్రకార! మధుర విలాసా!**
**సత్యత్వానంతత్వ ని । రత్యయ శుభసారమయ సమగ్రవికాసా! 188**

**ప్రతిపదార్థం:** సాత్యవతేయ= సత్యవతి కుమారుడైన వ్యాసమహర్షి; ఆది= మొదలైన; మహామతి= గొప్ప మనీషులచేత; అవగమ్య= తెలియదగిన; ప్రకార= విధం కలిగినవాడా!; మధుర విలాసా!= హృద్యమైన లీలా విశేషాలు కలిగినవాడా!; సత్యత్వ= నిత్య భావంచేత; అనంతత్వ= అనంతత్వంచేత; నిరత్యయ= నశించని; శుభసారమయ= కల్యాణ రూపమైన; సమగ్ర వికాసా!= సంపూర్ణ అవతార స్వరూపుడా!

**తాత్పర్యం:** స్వామీ! నీ అసలు రూపాన్ని వ్యాసాది మహర్షులు మాత్రమే తెలిసికొనగలరు. నీ విలాసాలు అతి మధురాలు. నీ సంపూర్ణ స్వరూపం సత్యమైనది. అనంతమైనది. శాశ్వతమైనది. కల్యాణప్రదమైనది.

**విశేషం:** ఆలోచన, చేష్ట, విభూతి - ఈ మూటినీ ఇక్కడ 'ప్రకార' శబ్దంచేత మనం అర్థం చేసికొనవచ్చును. 'వికాస' శబ్దానికి అవతారమని అర్థం చెప్పాలి. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' మనే ఆర్యోక్తిని 'సత్యం శివం సుందరం' అనే సూక్తిని ఈ సందర్భంలో స్మరించవచ్చును.

హరిహర స్వరూపాన్ని గుర్తించటం ఎరుక సమగ్రమైన దనటానికి నిదర్శనం. అందుకే 'సమగ్ర వికాసా!' అని సంబోధించటం.

**మాలిని:**

**సదసదనభిషిక్తా! సంభృతానందభక్తా! । విదళిత దురితాలీ! విశ్వనిర్వాహ శాలీ!**
**మదవదసురభేదీ! మానసానుప్రమోదీ! । వదనజనితవిప్రా వైభవానంద దీప్రా! 189**

**ప్రతిపదార్థం:** సత్+అసత్+అనభిషిక్తా!= 'సత్'రూపంలోకాని, 'అసత్' రూపంలోకాని అభిషేకం పొందనివాడా!; సంభృత+ఆనంద+ భక్తా!= ఆనందంతో నిండిన భక్తులు కలవాడా!; విదళిత= నశింపచేయబడిన; దురిత+ఆలీ!= పాపసముదాయం కలిగినవాడా!; విశ్వ(ప్రపంచాన్ని; నిర్వాహశాలీ!= నిర్వహించేవాడా!; మదవత్+అసురభేదీ!= మదంతో కూడిన రాక్షసులను చంపేవాడా!; మానస+అనుప్రమోదీ!= ఆయాప్రాణుల చిత్త సంస్కారాన్నిబట్టి దానికి తగిన సంతోషాన్ని కలిగించేవాడా!; వదన జనిత విప్రా! ముఖం నుండి పుట్టిన బ్రాహ్మణులను కలవాడా!; వైభవ+ఆనంద దీప్రా!= ప్రభు సంబంధమైన ఆనందంతో ప్రకాశించేవాడా! (నీకు నమస్కారం).

**తాత్పర్యం:** హరిహరనాథస్వామీ! నీ రూపం సదసత్తులకు భిన్నమైనది, విలక్షణ మైనది. నిన్ను తలచే భక్తుల హృదయాలు సదా ఆనందంతో నిండి ఉంటాయి. నీవు వారి పాపాలను పటాపంచలు చేస్తావు. ప్రపంచంలో దేనిని ఎట్లా నిర్వహించాలో నీవు సమర్థంగా తెలిసినవాడవు. ధర్మహాని కలిగించే రాక్షసులను సంహరించి సాధుజన సంరక్షణ చేసేవాడవు. విజ్ఞాన స్వరూపులైన బ్రాహ్మణులు నీ ముఖం నుండే పుట్టారు. నీవు సర్వభువన నిర్వహణ రూపమైన ప్రభుత్వంతో మహానందరూపంతో ప్రకాశిస్తావు.

**విశేషం:** ఈ పద్యంలోని ప్రతి మాటా చాలా బరువైన అర్థాన్ని తెలుపుతుంది

సత్ - అని నేల, భూమి, అగ్ని, వాయువు మొదలైన ఇంద్రియాల అనుభవాలకు లోనయ్యే పదార్థ జగత్తును పిలుస్తాము. (అస్తి)

అసత్ - అంటే 'సత్తు' కానిది. ఇంద్రియానుభవాలకు అతీతమైన మనోబుద్ధ్యహంకారాదులన్నీ అసత్తులే (నాస్తి)

భగవంతుడి తత్త్వం 'ఆత్మ' పదార్థం- ఇది ఇంద్రియాలలాగా 'సత్తు' కాదు; మనోబుద్ధులవలె 'అసత్తు' కాదు. క్షీణతలేనిది. స్థిరమైనది. పరిణామానికి అతీతమైనది. కాబట్టి 'బ్రహ్మ' మన్నారు.

అనాదిమత్పరం బ్రహ్మ న 'సత్' తత్, 'నాసత్' ఉచ్యతే అని భగవద్గీత (13-13) - ఆ బ్రహ్మ పదార్థం సదసత్తులకు అతీతమైనదని వివరించింది.

'సంభృత' - అంటే నిండిన అని అర్థం. భక్తుడిలో భాగవతానందం తప్ప మరి ఒకటి ఉండదు. అందుకే ప్రహ్లాదాది భక్తులు భక్తి మాధుర్య పారవశ్యంలో భగవంతుడిని స్తుతించారు.

'దురితం' అంటే పాపం - ఎన్ని పాపాలు చేసినా భగవంతుడు భక్తుడైనవాడిని క్షమించి వాడి పాపాలు తొలగిస్తాడు - అన్ని పురాణాలు ఘోషించాయి. ఎంత దురాచారుడైనా నన్ను భజిస్తే సాధువు అవుతాడని భగవద్గీత స్పష్టంగా చెప్పింది. (గీత 9-30)

'విశ్వనిర్వహణం' అంటే సృష్టి స్థితి లయాలను కలుగచేయటమని అర్థం. ఎవరిని ఎట్లా పుట్టించి, పెంచి, తెంచాలో తెలిసి అట్లా చేయటమే విశ్వనిర్వహణం. అందుకే భగవంతుడిని లోకస్రష్ట అని, లోకపాలుడని, లోకాధిపతి అని, సర్వేశ్వరుడని ఉపనిషత్తులు ప్రశంసించాయి.

భగవద్గీతలో ఈ నిర్వహణను ఐంద్రజాలికుడు జంతువు బొమ్మను ఆడించిన విధంగా ఈశ్వరుడు ఈ మానవుడిని ఆడిస్తున్నాడని క్రింది శ్లోకం చెప్తుతుంది.

**"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."** (గీత 18-61)

'మదవత్' - అంటే మదం కలిగిన అని అర్థం. అసురులు విశృంఖలంగా సాధువులను హింసించి ధర్మగ్లాని కలుగచేయగా భగవంతుడు సాధువులను కాపాడి దుర్మార్గులను సంహరించి ధర్మసంస్థాపన చేయటం కొరకు పుడతాడని గీత స్పష్టంగా చెప్తుతున్నది.

**"పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతాం'**
**ధర్మసంస్థాపనార్థాయ । సంభవామి యుగే యుగే."** (గీత 4-8)

'మానస+అను+ప్రమోదీ' - ఎవరెవరి మనసు ఎట్లా ఉంటే అట్లాంటి సంతోషం అనుభవంలోకి వస్తుంది. అట్లా అనుభవంలోకి వచ్చేటట్లు చేసేవాడు పరమాత్మే. అందుచేత ఆ ఆనందానుభవం కూడా ఆయా దేహాలలో ఆవరించి ఉన్న భగవంతుడి 'అంశకు' చెందినదేనని తాత్పర్యం.

'వదన జనిత విప్రా' - పురుషసూక్తంలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు వరుసగా ఆ విశ్వరూపుడి వదన, బాహు, ఊరు, పాద సముద్భూతులని చెప్పటం కనిపిస్తుంది. అంటే ఈ భావన శ్రుతిస్మృతులలో ఉన్నదని అర్థం.

**'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్య కృతః**
**ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాం శూద్రో అజాయత."** (పురుషసూక్తం)

**"లోకానాం తు వివృద్ధ్యర్థం । ముఖ బాహూరు పాదతః**
**బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం । శూద్రం చ నిరవర్తయత్."**(మనుస్మృతి)

బ్రాహ్మణాది వర్గ వాచకాలు గుణ వాచకాలే తప్ప 'కుల' వాచకాలు కావు అని భారతంలోని కథలను బట్టి తెలుస్తుంది. విజ్ఞాన-రక్షణ - వ్యాపార - శ్రమలనే ధర్మాలను బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులుగా ప్రాచీనులు పిలిచారు.

'వైభవానందం' - ఆ ప్రభువువలెనే శాంత రసానందం కూడా పరమశ్రేష్ఠమైనదని చెప్పటానికే వైభవానందమనటం. అందుకే పరమేశ్వరుడిని 'ఆనందనిలయు'డని పిలవటం.

ఎక్కడ రూప, భావ, వ్యాపారాలు మూడూ అవాఙ్మానస గోచరాలో, అక్కడి అవతారాన్ని 'లీల' అంటారు. సకల సృష్టి స్థితి సంహార సమర్థుడైన హరిహరనాథుడు ఈ జగత్తును 'లీల'గా నిర్వహిస్తున్నాడని అర్థం.

**విశేషం:** మాలినీవృత్తంలోని ప్రతిపాదానికీ వరుసగా న, న, మ, య, య అనే గణాలుంటాయి. 1-9 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున స్త్రీపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**తాత్పర్యం:** ఉభయకవిమిత్రుడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను గౌరవించటంలో సుప్రసిద్ధుడు, బుధులచేతి ఆరాధనచే ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని స్త్రీపర్వంలో మొదటి ఆశ్వాసం సంపూర్ణం.

**స్త్రీపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీ మత్కీర్తిమదత్యభి । రామాకృతి! సద్గుణాభిరతి! మత్పూర్వ**
**గ్రామాకృతి! మత్సంప । త్త్యామోదిత భక్తలోక! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీమత్= సంపదతోకూడిన; కీర్తిమత్= కీర్తికలిగిన; అతి+అభిరామ+ఆకృతి!= మిక్కిలి మనోహరమైన రూపమున్నవాడా!; సద్గుణ+అభిరతి!= మంచి గుణాలయందు ఆసక్తి ఉన్నవాడా!; మత్పూర్వ= నా (తిక్కనగారి) పూర్వగణ్య; గ్రామ= సముదాయంయొక్క; ఆకృతి!= స్వరూపం కలవాడా!; మత్= నా (తిక్కనగారి); సంపత్తి= ఐశ్వర్యంచేత; ఆమోదిత= సంతోషపెట్టబడిన; భక్తలోక!= భక్త సముదాయం కలవాడా!; హరిహరనాథా! (నీకు నమస్కారం).

**తాత్పర్యం:** స్వామీ హరిహరనాథా! నీవు లోకోత్తరమైన శోభను, యశస్సును, సౌందర్యాన్ని కలిగినవాడివి. సత్యశౌచాది సద్గుణాలపట్ల నీకు అభిలాష అధికం. అంతే కాదు. నీవు నా పూర్వజన్మ పుణ్యస్వరూపుడివే. అందుకే నా కున్న ఐశ్వర్యంతో భక్తులను దానాదులచేత సంతోషపెట్టటానికి నాకు మహావకాశాన్ని ఇచ్చి కరుణించావు.

**విశేషం:** అభిరతి - అంటే ఇష్టం. భగవంతుడు సద్గుణవంతులను ప్రేమిస్తాడు. ఇట్లాంటివారికై ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తాడన్నది పురాణ ప్రసిద్ధమైన సత్యం.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు పాంచాలి నూఱడం బలికిన యనంతరంబ పతివ్రతాశిరోమణియు మహాభాగయు సత్యవచనయునగు నయ్యాంబికేయు భార్యకుం బారాశర్య మునీంద్ర వరప్రదానంబునం బ్రాప్తంబై తాత్కాలికం బయిన దివ్యదృష్టి విభవంబున నిజవ్రతహాని లేని తెఱంగున సంగర తలం బఖిలంబును నధికవిస్తార దూరప్రాప్తంబయ్యు నాలోకనగోచరం బగుటయు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథ స్వామీ! (విను); వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; పాంచాలిన్= పాంచాలిని; ఊఱడన్+పలికిన= ఓదార్పు మాటలు చెప్పిన; అనంతరంబు+అ= తరువాత; పతివ్రతా= పతివ్రతలలో; శిరోమణియున్= తలమానికమైనదియు; మహాభాగయున్= గొప్ప పుణ్యాత్మురాలూ; సత్యవచనయున్= ఎప్పుడూ సత్యాన్నే పలికేది; అగు= అయినటువంటి; ఆ+ఆంబికేయు+భార్యకున్= ఆ ధృతరాష్ట్రుడి భార్యకు గాంధారికి; పారాశర్య మునీంద్ర= పరాశరుడి కొడుకైన వ్యాసుడియొక్క; వరప్రదానంబునన్= వరం ఇవ్వటంచేత; ప్రాప్తంబు+ఐ= కలిగినదై; తాత్కాలికంబు+అయిన= అప్పటికి మాత్రం వచ్చిన; దివ్యదృష్టి విభవంబునన్= దివ్యదృష్టి వైభవంతో; నిజవ్రతహానిలేని తెఱంగునన్= తాను కళ్ళకు కట్టిన గుడ్డ విప్పరాదన్న నియమం పొల్లుపోకుండానే; సంగరతలంబు= యుద్ధరంగం; అఖిలంబును= అంతా; అధిక విస్తార= అధికవైశాల్యం కలిగినదై; దూరప్రాప్తంబు+అయ్యున్= దూరంగా ఉన్నప్పటికీ; ఆలోకన= చూపునకు; గోచరంబు+అగుటయున్= కనిపిస్తుండగా.

**తాత్పర్యం:** ఓ దేవా! తరువాతి కథను వినుము. వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా చెప్పాడు - ఆ విధంగా పాంచాలిని ఓదార్చిన తరువాత పరమ పతివ్రత, మహాపుణ్యాత్మురాలు, సత్యవ్రతురాలు అయిన గాంధారీదేవికి వ్యాసమునీంద్రుడి వరంవలన అప్పటికప్పుడు దివ్యదృష్టి కలిగింది. దీనివలన ఆమె కళ్ళకు కట్టిన గంత తీయకుండానే యుద్ధభూమిలో సుదూరంలో ఉన్నప్పటికీ వస్తు సముదాయమంతా ప్రత్యక్షంగా కనిపించటం మొదలుపెట్టింది.

**మణిగణ నికరము;**

**గొడుగుల పఱియలు గుఱుకులు గొనుటన్ । సిడముల తునియలు సెదరి యునికి బెం**
**దడిగలుఁ బడగలు దఱచు మురియలై । పుడమిఁ గలయుటకుఁ బొగు లొలయ మదిన్. 3**

**ప్రతిపదార్థం:** గొడుగుల పఱియలు= గొడుగుల బద్దలు; కుఱుకులు= ప్రోవులుగా (రాశులుగా); కొనుటన్= ఏర్పడి ఉండటంవలన; సిడముల= ధ్వజాల; తునియలు= ముక్కలు; చెదరి+ఉనికిన్= చెల్లాచెదురుగా పడిఉండటంవలన; పెన్= పెద్దవైన; దడిగలు= అరిగెలు; పడగలు= టెక్కెములు; తఱచు= మిక్కిలిగా; మురియలై= ఖండఖండాలై; పుడమిన్+కలయుటకున్= నేలలో కలిసిపోవటానికి; మదిన్= మనస్సులో; పొగులు= పరితాపం; ఒలయన్= కలగగా.

**తాత్పర్యం:** ఆ యుద్ధభూమిలో రథాలమీద ఉన్న గొడుగులు ముక్కలు ముక్కలై పెద్ద పెద్ద రాశులుగా పడి ఉన్నాయి. ధ్వజాలు ముక్కలై చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. అరిగెలు, టెక్కెములు చిన్న చిన్న ముక్కలైపోయి మట్టిలో కలిసిపోయాయి. ఇవన్నీ చూచిన గాంధారికి పరితాప మధికమై.

**విశేషం:** మణిగణనికర వృత్తంలో ప్రతిపాదానికీ వరుసగా నాలుగు నగణాలమీద ఒక సగణం ఉంటుంది. మొదటి అక్షరానికీ తొమ్మిదవ అక్షరానికీ యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**క. నుఱుమైన కాల్బలంబులు । నఱవఱ లయి యున్న యట్టి యరదంబులుఁ బెం**
**దఱచగు సూతాంగకములు । నొఱగిన రథ్యములగములు నుల్ల మలంపన్. 4**

**ప్రతిపదార్థం:** నుఱుము+ఐన= చంపబడిన; కాల్బలంబులు= సైనికులు; అఱవఱలు+అయి+ఉన్న+అట్టి= చిన్న చిన్న ముక్కలుగా పడి ఉన్న; అరదంబులు= రథాలు; పెన్+తఱచు+అగు= ఎక్కడిపడితే అక్కడ కనిపిస్తున్న; సూత+అంగకములు= సారథుల అవయవాలు; ఒఱగిన= చనిపోయి నేలపైబడిన; రథ్యముల= గుర్రాల; గములు= గుంపులు; ఉల్లము= హృదయాన్ని; అలంపన్= బాధించగా.

**తాత్పర్యం:** ఆ యుద్ధ భూమిలో చనిపోయిన సైనికుల దేహాలు, చిన్న చిన్న ముక్కలై పడి ఉన్న రథాలు, ఎక్కడపడితే అక్కడ పడి ఉన్న సారథుల దేహభాగాలు, నేల కొరిగిన గుర్రాల సముదాయాలు కనిపిస్తున్నాయి. వీటిని చూచి గాంధారి హృదయం తరుక్కుపోగా.

**లయగ్రాహి:**

**రావుతుల తుండములు మావఁతుల నుగ్గుఁ దుర । గావలి శవంబులు గజావయవ రాశీ**
**భావభయదస్థలులుఁ బ్రేవులును గండలును । బ్రోవులయి పెన్మెదడుపై విరిసి రక్త**

**స్రావమునఁ బెల్లయిన రేవమునఁ జూడఁ గడు । నేవ మగుపట్ల మృతభావగతులయ్యున్**

**జీవములఁ బాయరొకొ? నా వికచ వక్త్రముల । తో వఱలు రాజులు మనోవికృతి సేయన్. 5**

**ప్రతిపదార్థం:** రావుతుల= గుర్రాలు నడిపేవారి; తుండములు= ముక్కలు; మావఁతుల= మావటివాళ్ళ; నుగ్గున్= ముక్కలు; తురగ+ఆవలి= గుర్రపు సమూహాల; శవంబులు= శవాలు; గజ+అవయవ+రాశీభావ= ఏనుగుల అవయవాలు ముక్కలై రాశులుగా పడి ఉండటంవలన; భయద= భయాన్ని పుట్టించే; స్థలులున్= చోట్లు; ప్రేవులును= ప్రేగులూ; కండలును= కండలూ; ప్రోవులు+అయి= రాశులుగా పడి; పెన్మెదడు+పైన్ విరిసి= ఏనుగు వంటిపెద్ద జంతువుల మెదళ్ళ పైగా విచ్చిపోయి; రక్తస్రావమునన్= రక్త ప్రవాహంతో; పెల్లయిన రేవమునన్= అతిశయించిన విధంగా; చూడన్= చూడటానికి; కడున్= మిక్కిలి; ఏవము+అగు= రోత కలిగించే; పట్ల= చోట్ల; అమృతభాగవతులు+అయ్యున్= మరణించినప్పటికీ; జీవములన్= ప్రాణాలను; పాయరు+ఒక్కొ+నాన్= వదలిపెట్టరా? అనిపించేటట్లు; వికచ= తెరుచుకొన్న; వక్త్రములన్= నోళ్ళతో; వఱలు= ఒప్పుతున్న; రాజులు; మనోవికృతి+చేయన్= మనసుకు వికారం కలిగించగా.

**తాత్పర్యం:** గుర్రాలను నడిపే రౌతుల దేహాలు ఒకపక్క, ఏనుగులను నడిపే మావటివాండ్ర శరీరాలు ఒకపక్క ఖండఖండాలై పడి ఉన్నాయి. మరోవైపు గుర్రాల శవాలు, ఇంకొకవైపు ఏనుగుల అవయవాలు రాశులుగా పడి ఉన్నాయి. వాటిని చూస్తే గుండెల్లో గుబులు పుట్టేటట్లు ఉన్నది. ఎక్కడపడితే అక్కడ పేగులు, కండలు, పోగులుగా పడి ఉన్నాయి. ఏవో మృగాల పెద్ద మెదళ్ళు విచ్చిపోయి రక్తం ఏర్లు కట్టి పారుతున్నది. అదంతా చూడటానికి చాలా అసహ్యంగా ఉన్నది. మరణించినా ఇంకా జీవించి ఉన్నారా ఏమి! అనే తలపు కలిగేరీతిగా - రాజ్యాలు ఏలిన మహారాజులు నోళ్ళు తెరుచుకొని పడి ఉన్నారు. వీరినందరినీ చూసి గాంధారి మనస్సు కకావికలయిపోగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. లయగ్రాహివృత్తంలోని ప్రతిపాదానికీ భ, జ, స, న, భ, జ, స, న, భ, య - అనే గణాలుంటాయి. 1-9-17-25 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**లయగ్రాహి:**

**హార రుచులన్ హృదయ హారితరమూర్తు లగు । వారు హరినీలమణి భారవిలసత్కే**

**యూర బహులాంశుచయ చారుతర రేఖులగు । వారు నవవజ్రరుచిరోరు ఘృణిమత్కో**

**టీర రమణీయులగు వారు గరుడాశ్మమయ । భూరికటకద్యుతివిహార పరిశోభా**

**స్ఫారులగు వారలును బోరఁబడి నెత్తురులఁ । గూరుటఁ గరంబెడఁద కారటము సేయన్. 6**

**ప్రతిపదార్థం:** హార రుచులన్= ధరించిన దండల కాంతులచేత; హృదయహారితర= హృదయాలను మిక్కిలిగా ఆకర్షించే; మూర్తులు+అగువారు= శరీరాలు గలవారు; హరినీలమణి= ఇంద్రనీలమణుల; భారవిలసత్+కేయూర= ఆధిక్యంచేత ప్రకాశం పొందుతున్న భుజకీర్తుల; బహుల= అధికమైన; అంశుచయ= కిరణ సమూహంచేత; చారుతర= మిక్కిలి అందగించిన; రేఖులగువారు= విధంకలిగినవారు; నవవజ్ర= కొత్త వజ్రాలచేత; రుచిర= కాంతిమంతాలైన; ఉరు+ఘృణిమత్= పెద్ద వెలుతురుతోడి; కోటీర= కిరీటాలచేత; రమణీయులగు వారు= అందంగా ఉన్నవారు; గరుడ+అశ్మ+మయ= గరుడ పచ్చలతో నిండిన; భూరికటక= పెద్ద కడియాల; ద్యుతి= కాంతియొక్క; విహార= వ్యాప్తిచేత; పరిశోభా= మిక్కిలి శోభతో; స్ఫారులగు వారలును= నిండైన శోభతో కనిపిస్తున్నవారు (కూడా); పోరన్+పడి= యుద్ధంలో చనిపోయి; నెత్తురులన్+కూరుటన్= రక్తపు మడుగులో పడి ఉండటం; కరంబు= మిక్కిలిగా; ఎడఁదకున్= హృదయానికి; ఆరటము= ఆరాటం; చేయన్= కలిగించగా.

**తాత్పర్యం:** అక్కడపడి ఉన్న యుద్ధవీరులు ఎట్లా ఉన్నారంటే - ఒక్కొక్కరి మెడలో ఉన్న బంగారు హారాలచేత హృదయాలను మిక్కిలి ఆకర్షించేటట్లు వారి దేహాలు మిలమిలలాడుతున్నాయి. అత్యధికంగా ఇంద్రనీలమణులు పొదిగిన భుజకీర్తుల నుండి వెలువడే కాంతి సమూహంచేత వారి అందం ప్రత్యేకంగా కనిపిస్తున్నది. కొత్త వజ్రాలను పొదిగిన కిరీటాలు తళతళమెరుస్తూ ఆ వీరుల సౌందర్యాన్ని ప్రకటింపచేస్తున్నాయి. గరుడపచ్చలతో నిండిన పెద్ద పెద్ద కడియాలు వెలువరించే కాంతి దేహమంతటా పడి వారు అతి గంభీరంగా శోభాయమానంగా కనిపిస్తున్నారు. అట్లాంటి వీరులందరూ యుద్ధంలో చనిపోయి నెత్తురు మడుగులలో పడి ఉండటం చూసి గాంధారికి గుండెలో ఆరాటం కలుగగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వృత్తలక్షణం - చూడండి స్త్రీ. 2. 5.

**లయగ్రాహి:**

> **అమ్ములును విండ్లుఁ బరిఘమ్ములును దోమర చ । యమ్ములును గుంతనికరమ్ములుఁ గనత్ఖ**
> **డ్గమ్ములు నహీన ముసలమ్ములును జక్ర నివ । హమ్ములును లోనగు నసమ్మత మహోగ్రా**
> **స్త్రమ్ములును గండలును నెమ్ములుఁ గపాలములు । సమ్మిళిత రూపశకలమ్ములయి సంగ్రా**
> **మ మ్మతుల దారుణ విధమ్మగుటఁ దెల్పుట ధి । కమ్మగు కలంక హృదయమ్మున కొనర్పన్. 7**

**ప్రతిపదార్థం:** అమ్ములును= బాణాలూ; విండ్లున్= ధనుస్సులూ; పరిఘమ్ములును= పరిఘలు; తోమరచయమ్ములును= ఈటెల సముదాయాలు; కుంతనికరమ్ములున్= బల్లెముల సముదాయాలు; కనత్= ప్రకాశించే; ఖడ్గమ్ములు= కత్తులూ; అహీన= గొప్పవైన; ముసలమ్ములును= రోకళ్ళు (పెద్ద దుడ్డు కర్రలు); చక్రనివహమ్ములును= చక్రములచే ఆయుధాలూ; లోనగు= మొదలైన; అసమ్మత= భయంకరమైన; మహా+ఉగ్ర+అస్త్రమ్ములును= మహాక్రూరమైన ఆయుధాలు; కండలును= కండలూ; ఎమ్ములున్= ఎముకలూ; కపాలములున్= పుర్రెలు; సమ్మిళిత రూప శకలమ్ములు+అయి= అన్నీ కలిసిపోయి ముక్కలు ముక్కలై; సంగ్రామమ్ము= యుద్ధము; అతుల= సాటిలేని; దారుణ= భయంకరమైన; విధమ్ము+అగుటన్= విధంగా కలదని; తెల్పుట= తెలుపుతూ ఉండటం; హృదయమ్మునకున్= హృదయానికి; అధికమ్ము+అగు= మిక్కిలి; కలంక= బాధ; ఒనర్పన్= కలిగించగా.

**తాత్పర్యం:** అమ్ములు, ధనుస్సులు, పరిగెలు, ఈటెలు, బల్లెములు, తళతళలాడుతున్న కత్తులు, పెద్దపెద్ద దుడ్డు కర్రలు, చక్రాలు మొదలైన మహాక్రూరమైన ఆయుధాలు, మరొకవైపు కండలు, ఎముకలు, పుర్రెలు కలిసిపోయి ముక్కలు ముక్కలుగా పడి ఉండటం చూస్తే జరిగిందే మహా ఘోరయుద్ధమని తెలుపుతూ ఉండటం గాంధారి హృదయానికి మిక్కిలి బాధ కలిగించగా.

**విశేషం:** వృత్తలక్షణం - చూడండి. స్త్రీ. 2.5.

**లయగ్రాహి:**

> **కుత్తుకలబంటి యగు నెత్తురులు దోయిళుల । నెత్తి చవిగ్రోలుచును జిత్తములు దృప్తిన్**
> **జొత్తిలి నితాంత మదమత్తములుగాఁ జటుల । నృత్తములు సేయుచుఁ జలత్తను వికారో**
> **ద్వృత్తపటుహాసముల రిత్తలగు దుర్వచన । వృత్తులను నొండొరుల నొత్తికొని మాంసం**
> **బత్తి తినుటన్ వికటవృత్తులగు రాక్షసుల । మొత్తము పరిక్షుభితచిత్తత యొనర్పన్. 8**

**ప్రతిపదార్థం:** కుత్తుకలబంటి+అగు= కంఠాలవరకు; నెత్తురులు= రక్తాన్ని; దోయిళులన్= దోసిళ్ళతో; ఎత్తి+చవిన్+క్రోలుచును= ఎత్తుకొని ఇష్టంగా తాగుతూ; చిత్తములు= మనస్సులు; తృప్తిన్+జొత్తిలి= తృప్తితో మునిగిపోయి; నితాంత మదమత్తములుగాన్= మిక్కిలి మదించి; చటుల నృత్తములు+చేయుచున్= భయంకరమైన చిందులువేస్తూ; చలత్తనువికార+ఉద్వృత్త= ఊగుతున్న దేహవికారాలచేత మితిమీరిన; పటు= మొరటు; హాసములన్= నవ్వులతో; రిత్తలు+అగు= వ్యర్థాలైన; దుర్వచన వృత్తులను= బూతుమాటలతో; ఒండొరులన్= ఒకరినొకరు; ఒత్తికొని= తోసుకొంటూ; మాంసంబు+అత్తి+తినుటన్= అందరూ కలిసి మాంసం తినటంలో; వికటవృత్తులు+అగు= భయంకరంగా ప్రవర్తించే; రాక్షసుల మొత్తము= రాక్షసుల గుంపు; పరిక్షుభిత= మిక్కిలి కలత పొందిన; చిత్తతన్= మనస్థితిని; ఒనర్పన్= కలిగించగా.

**తాత్పర్యం:** గొంతుకలదాకా రక్తాన్ని దోసిళ్ళతో ఎత్తుకొని మహా ఇష్టంగా త్రాగుతూ, ఆ తృప్తిలో కరిగిపోయి మదమత్తులై చిందులువేస్తూ ఊగిపోతున్న దేహ వికారాలచేత ఎగిరెగిడిపడుతూ మొరటు నవ్వులతో బూతులు మాట్లాడుతూ ఒకరినొకరు తోసుకొంటూ అందరూ కలిసి మాంసం తినటంలో అతిభయంకరంగా వర్తిస్తున్న రాక్షసుల గుంపు గాంధారి మనస్సును మిక్కిలిగా కలచివేయగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వృత్తలక్షణం - చూడండి. స్త్రీ. 2. 5

**సీ.** **ప్రేవులు గండలు పెటికి పేటాడి యం । గదఁగొని మెదళుల గల్చికొనుచు**
**రాగిలి రక్తంబు ద్రావుచు లోచన । గుళికల నొలిచి మ్రింగుచును గుండె**
**కాయ లాదట మెయిఁ గబళించుచును గ్రొవ్వు । దెమలచి నమలుచు నెముక యూట**
**చవిగొని యానుచుఁ జావకయున్న రూ । పులు సచ్చుటకుఁ గాఁగఁ బెలుచఁ దన్ని**

**తే.** **కొనిన దెఱఁబాయఁ బాఱుచుఁ జెనకి తొడరి । కాటులాడుచు నున్న సృగాలములును**
**గాకములు రాపులుఁగులును గ్రద్దలును వృ । కంబులును మానసము వికలంబు సేయ.** **9**

**ప్రతిపదార్థం:** ప్రేవులు= పేగులను; కండలు= కండలను; పెటికి= ఊడబెరికి; పేటాడి= ముక్కలు చేసి; అంగదన్+కొని= ఆకలికొని; మెదళులు= మెదళ్ళను; అగల్చికొనుచున్= ఊడబెరుక్కొని; రాగిలి= ఆసక్తితో; రక్తంబున్+త్రావుచు= రక్తం త్రాగుతూ; లోచన గుళికలన్= కంటి గుడ్లను; ఒలిచి= ఒలుచుకొని; మ్రింగుచును= మింగుతూ; గుండెకాయలు= గుండెకాయల్ని; ఆదటమెయిన్= ఎంతో ఆపేక్షతో; కబళించుచును= మింగుతూ; క్రొవ్వన్+తెమలిచి= కొవ్వును ఊడదీసి; నమలుచున్= తింటూ; ఎముక+ఊట= మూలుగును; చవిగొని+అనుచున్= రుచిచూస్తూ జుర్రుతూ; చావక+ఉన్న= ఇంకా చావకుండా ఉండే; రూపులు= శరీరాలు చచ్చుటకున్+కాఁగన్= చావటానికై; పెలుచన్= మిక్కిలిగా; తన్నికొనినన్= తన్నుకొంటుండగా; తెఱఁబాయన్= ప్రాణాలుపోయేలా; పాఱుచున్= మీద ఎగురుతూ; చెనకి= ఎదిరించి; తొడరి= పూనికతో; కాటులాడుచున్= కొట్లాడుతూ; ఉన్న= ఉన్నటువంటి; సృగాలములు= నక్కలు; కాకములు= కాకులూ; రాపులుఁగులును= రాబందులూ; గ్రద్దలును; వృకంబులు= తోడేళ్ళు; మానసము= మనసును; వికలంబు+చేయన్= కలచివేస్తుండగా.

**తాత్పర్యం:** ఆ యుద్ధభూమిలో పేగులను కండలను ఊడబెరికి ముక్కలుచేసి ఆకలిగొని తింటూ, మెదళ్ళను ఊడబెరుక్కొని ఆసక్తితో రక్తం తాగుతూ, కంటిగుడ్లను ఒలుచుకొని మింగుతూ, గుండెకాయలను ఎంతో ఆసక్తిగా కబళిస్తూ ఎముకలలోని మూలుగును రుచిచూస్తూ జుర్రుతూ, ఇంకా చావకుండా ఉండే శరీరాలు తన్నుకొంటుండగా

ప్రాణాలుపోయేటట్లు పైన ఎగురుతూ, ఎదుర్కొని ఎంతో పూనికతో ఒకదానితో ఒకటి కొట్లాడుతూ ఉన్న తోడేళ్ళు, కాకులు, రాపులుగులు, గద్దలు, నక్కలు గాంధారి మనస్సును కలచి వేయగా.

**వ.** **అగ్గాంధార రాజనందన కలను గలయం గనుంగొనియెఁ దదవసరంబున సాత్యవతేయుండు కౌంతేయుల రావించి 'బంధు శవంబులకుఁ గాలోచితాచార సహితంబుగా నగ్ని సంస్కారంబు సేయుం'డని పనిచి యంతర్ధానంబు సేసె. వారు ధృతరాష్ట్రుం బొదివికొని వాసుదేవపురస్సరులయి యప్పనికిం జనుచుఁ గౌరవకాంతలఁ దత్ప్రదేశంబునకు నడపించిన నప్పడఁతులు పతులును సుతులును సోదరులును బౌత్రులును మిత్రులును గుణపంబులై పడియున్నఁ జూచి చెయ్యేది మేదిని నొఱగువారును వా విడిచి యఱచువారును బురపురం బొక్కువారును బడిపొరలుచుఁ బొగులువారును వేనలులు వీడి వెన్నుల విరియం దిరుగువారును బలవించువారును బేర్కొని యగ్గించువారును బ్రూన్పడువారును మోములుం దలలును మోఁదుకొనువారును నై రప్పు డా దుర్యోధనజనని జనార్దనుం బేర్కొని చేరంబిలిచి పరమశోకార్తయగుచు నతని కిట్లనియె.** **10**

**ప్రతిపదార్థం:** ఆ+గాంధార రాజనందన= ఆ సుబలరాజుకుతురు గాంధారి; కలనున్= యుద్ధభూమిని; కలయన్+ కనుంగొనియెన్= అంతా పరికించింది; తద్+అవసరంబునన్= ఆ సమయంలో; సాత్యవతేయుండు= వ్యాసుడు; కౌంతేయులన్= పాండవులను; రావించి= పిలిపించి; బంధు శవంబులకున్= బంధువుల శవాలకు; కాలోచిత+ఆచార సహితంబుగాన్= ఆ సమయానికి తగిన ఆచారాలను అనుసరించి; అగ్నిసంస్కారంబు+చేయుండు+అని= అగ్ని సంస్కారం చేయండి అని; పనిచి= ఆనతి ఇచ్చి; అంతర్ధానంబు+చేసెన్= అంతర్ధానమయ్యాడు; వారు= ఆ పాండవులు; ధృతరాష్ట్రున్+పొదివికొని= ధృతరాష్ట్రుని చుట్టుకొని (పరివేష్టించి); వాసుదేవ పురస్+సరులయి= శ్రీకృష్ణుడు ముందు నడుస్తుండగా; ఆ+పనికిన్+చనుచున్= ఆ బంధువుల అగ్నికార్యం కోసం వెళ్తూ; కౌరవకాంతలన్= కౌరవ స్త్రీలను; తద్+ప్రదేశంబునకున్= ఆ చోటికి; నడిపించినన్= పిలుచుకొని వెళ్ళగా; ఆ+పడఁతులు= ఆ స్త్రీలు; పతులును= భర్తలు; సుతులును= కుమారులు; సోదరులును= తమ్ముళ్ళు, అన్నలు; పౌత్రులును= మనుమళ్ళు; మిత్రులును= స్నేహితులు; కుణపంబులు+ఐ= శవాలై; పడి+ఉన్నన్+చూచి= పడి ఉండగా చూసి; చెయ్యు+ఏది= చేష్టలుడిగి; మేదినికిన్= నేలమీదికి; ఒఱగువారును= ఒరిగిపోయేవారు; వా+విడిచి= నోరుతెరచి; అఱచువారును= అరుస్తున్నవారు; పురపురన్+పొక్కువారును= తహతహలాడుతూ దుఃఖించేవారూ; పడిపొరలుచున్= నేలమీదపడి పొర్లుతూ; పొగులు వారును= పరితపిస్తున్నవారు; వేనలులు+వీడి= జడలు వీడిపోయి; వెన్నులన్+విరియున్= వీపులమీద పరచుకొని ఉండగా; తిరుగువారును= తిరుగుతున్నవారు; పలవించువారును= పిచ్చి పిచ్చిగా అరుస్తున్నవారు; పేర్కొని= ఆయా మృతవీరుల పేర్లు పెట్టి పిలుస్తూ; అగ్గించువారును= వారిని పొగడుతున్నవారు; మ్రాను+పడువారును= నిశ్చేష్టులవుతున్నవారు; మోమున్+తలలును= ముఖాలను, తలలను; మోఁదుకొనువారును= కొట్టుకొనేవారు; ఐరి= అయ్యారు; అప్పుడు; ఆ; దుర్యోధనజనని= ఆ గాంధారి; జనార్దనున్+పేర్కొని= కృష్ణుడిని పేరుపెట్టి పిలిచి; చేరన్+పిలిచి= దగ్గరకు రమ్మని; పరమశోకార్తయగుచున్= మిక్కిలి దుఃఖంతో దీనురాలై; అతనికిన్= కృష్ణుడితో; ఇట్లనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** గాంధారి ఇట్లా బాధపడుతూ ఆ యుద్ధభూమిని అంతా పరికించింది. ఆ సమయంలో వ్యాసమహర్షి పాండవులను పిలిపించి 'మృతులైన బంధువుల శవాలకు ఆ కాలానికి తగిన ఆచారాలతో కూడిన అగ్ని సంస్కారం చేయండి' అని ఆనతిచ్చి అంతర్ధాన మయ్యాడు. అపుడు పాండవులు ధృతరాష్ట్రుడిని నడిపించుకొంటూ శ్రీకృష్ణుడు ముందు నడుస్తుండగా ఆ బంధువులకు దహన సంస్కారం చేయటంకొరకు వెళ్తూ కౌరవస్త్రీలను ఆ ప్రదేశానికి

తీసికొని వెళ్ళారు. అక్కడ వారు తమతమ భర్తలు, కొడుకులు, తమ్ముళ్ళు, అన్నలు, మనుమళ్ళు, స్నేహితులు శవాలై పడి ఉండగా చూచి చేష్టలుడిగి నేలమీద ఒరిగిపోయారు. నోళ్ళు తెరచి హాహాకారాలు చేస్తున్నారు. తహతహలాడుతూ నేలమీదపడి పొర్లుతూ పరితపిస్తున్నారు. జడలు వీడిపోయి వీరుల పేర్లు పెట్టి పిలుస్తూ వారి గుణగణాలను గురించి చెప్పుతున్నారు. నిశ్చేష్టలై కొయ్యబారిపోతున్నారు. ముఖాలను, తలలను మోదుకొంటున్నారు. అప్పుడు గాంధారి కృష్ణుడిని పిలిచి దగ్గరికి రమ్మని మిక్కిలి దుఃఖంతో దీనురాలై అతడితో ఇట్లా అన్నది.

**విశేషం:** కాలోచితమైన ఆచారం - అంటే కొంత వివరించాలి. ఇక్కడ చేస్తున్నది సామూహిక దహన సంస్కారం. దీని పద్ధతి సాధారణ పితృ ప్రేతకర్మవంటిది కాదని అర్థం. అందుకే ఆ సమయానికి తగిన పద్ధతిలో చేశారని అర్థం.

### గాంధారి పాలికలను చూచి కృష్ణునితోఁ జెప్పి దుఃఖించుట (సం. 11-16-18)

**సీ.** **'చూడుము ధృతరాష్ట్రు కోడండ్రఁ గన్నార । వీరె కన్నీరు పై వెల్లి గొనఁగ**
**దీనతఁ బొందెడు నాననంబుల విప్ర । లాపంబులైన సల్లాపములను**
**నడలు చొండొరులకు నన్నలఁ దమ్ముల । రూపించి వేర్వేఱఁ జూపుటయును**
**బొరిమొగంబులు సూచి పురుపురఁ బొక్కుచుఁ । దలలల్లం దూలంగ నిలుచుటలును**

**తే.** **గలిగి యలిగెడు వారి కన్నులకుఁ బండు । వగుచునున్నారు కాకులు మగల తనువు**
**లెక్కియున్నను చేష్టలు దక్కి కొంద । ఱడువఁ జేయాడకున్నవా రంబుజాక్ష!** **11**

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్ష!= కమలనేత్రుడవైన కృష్ణా!; ధృతరాష్ట్రు= ధృతరాష్ట్రుని; కోడండ్రన్= కోడళ్ళను; కన్నారన్= కళ్ళారా; చూడుము; వీరె= ఇదుగో వీరే ఆ కోడళ్ళు; కన్నీరు= కంటినీరు; పై+వెల్లికొనఁగన్= ముఖంపైన ప్రవహిస్తుండగా; దీనతన్+పొందెడు+ఆననలంబులన్= దైన్యంతో కూడిన ముఖాలతో; విప్రలాపంబులైన= పొంతనలేని; సల్లాపములను= మాటలతో; అడలుచున్= దుఃఖిస్తూ; ఒండొరులకున్= ఒకరు మరొకరికి; అన్నలన్= తమ అన్నలను; తమ్ములన్= తమ్ముళ్ళను; రూపించి= నిర్ణయించి; వేర్వేఱన్= వేరు వేరుగా; చూపుటయును= చూపించటం; పొరిన్= క్రమంగా; మొగంబులు= ముఖాలు; చూచి; పురపురన్+పొక్కుచున్= తహతహలాడుతూ ఏడుస్తూ; తలలు+అల్లన్+తూలంగన్= తలలు వాలిపోతూ ఉండగా; నిలుచుటలును= ఎట్లాగో నిలదొక్కుకొని నిలబడి ఉండటం; కలిగి; అలిగెడువారి= కోపగించుకొన్నవారి; కన్నులకున్= కళ్ళకు; పండువు+అగుచున్+ఉన్నారు= విందు అవుతున్నారు; కాకులు; (తమ); మగల తనువులు= భర్తల దేహాలు; ఎక్కి+ఉన్నను= ఎక్కిఉన్నా; చేష్టలు+తక్కి= నిశ్చేష్టలై; కొందఱు= కొందరు స్త్రీలు; అడువన్= తోలటానికి; చేయి+అడకున్నారు= చేయి ఆడించుకున్నారు.

**తాత్పర్యం:** 'కృష్ణా! ధృతరాష్ట్ర మహారాజు కోడళ్ళను చూడుము. ఇదుగో వీరే వారు! కంటినీరు ముఖాలపైన వెల్లువలుగట్టగా అతిదీనమైన ముఖాలతో పొంతన లేని పలుకులతో, పుట్టెడు దుఃఖంతో, ఒకరి కొకరు చనిపోయిన తమ అన్నదమ్ముల ముఖాలు చూచి ఇది 'ఫలానా వారిదే' అని నిర్ణయిస్తూ చూపిస్తున్నారు. చూపించి తాము చూచి మళ్ళీ తహతహలాడుతూ ఏడుస్తూ తలలు వాలిపోతుండగా ఎట్లాగో నిలదొక్కుకొని నిలబడి ఉన్నారు. వీళ్ళమీద కసి ఉన్నవారికి ఈ నాటికి 'కన్నులపండుగు' అయింది. తమ భర్తల దేహాలపై కాకులు కూర్చొని ఉన్నా వాటిని తోలటానికి చెయ్యి ఎత్తలేని స్థితిలో ఉన్న ఈ ఆడవారిని చూస్తే ఎంత బాధ అవుతుందో చూడుము.

**విశేషం:** అంత దుఃఖంలోనూ పగవారిని గురించి స్మరించటంలోనే మనుష్య సహజమైన అజ్ఞానం ఉన్నది. మమతానుబంధాలు అధికంగా ఉన్న స్త్రీలలో అది మరింత అధికమని నిరూపించటానికే 'స్త్రీ పర్వ' మనేపేరు వ్యాసమహర్షి ఉంచాడు. దుఃఖంలోనూ ద్వేషం, అసూయ, పట్టుదలలు నశించవని అర్థం.

**మానిని:**

**కూలియుఁ గాంతి యిగుర్పఁగఁ దేజము గుందక వహ్నులు గ్రూరశిఖా**
**జాల మడంగియుఁ జాయ వెలింగెడు చందము నొందిరి శల్యుఁడుఁ బాం**
**చాలుఁడుఁ గర్ణుఁడుఁ జాపగురుండును శాంతనవుండు నిజంబున కీ**
**బాలుఁడు వీరి ప్రభం గడచెం గుణభద్రునిఁ గంటె సుభద్రసుతున్.** **12**

**ప్రతిపదార్థం:** శల్యుఁడు; పాంచాలుఁడు= ద్రుపదుడు; కర్ణుఁడు; చాపగురుండును= ద్రోణుడూ; శాంతనవుండు= భీష్ముడు (వీరంతా); కూలియున్= చనిపోయికూడా; తేజము+కుందక= కాంతి తగ్గక; కాంతి+ఇగుర్పఁగన్= కొత్తకాంతులీనుతూ; వహ్నులు= అగ్నులు; క్రూర= తీక్ష్ణమైన; శిఖాజాలము= జ్వాలల సమూహం; అడంగియున్= తగ్గిపోయినా; చాయ= కాంతి; వెలింగెడు చందమున్= ప్రకాశించే విధాన్ని; ఒందిరి= పొందారు; నిజంబునకున్= నిజానికి; ఈ బాలుఁడు= ఈ బాలుడైన అభిమన్యుడు; వీరి ప్రభన్= వీరందరి కాంతిని; కడచెన్= అధిగమించాడు; గుణభద్రునిన్= సుగుణవంతులలో శ్రేష్ఠుడైన; సుభద్రసుతున్= సుభద్ర కుమారుడైన అభిమన్యుడిని; కంటె?= చూచావా?

**తాత్పర్యం:** కృష్ణా! శల్యుడు, ద్రుపదుడు, కర్ణుడు, ద్రోణుడు, భీష్ముడు వీరంతా యుద్ధంలో చనిపోయినా, మంటలు తగ్గాక కూడా అగ్ని కాంతి ఎట్లా కొత్త కొత్తగా పుట్టుతూ ఉంటుందో అట్లా ప్రకాశం తగ్గకుండా ఉన్నారు. నిజానికి వీరందరికన్నా ఎక్కువ కాంతితో అభిమన్యుడు మెరిసిపోతున్నాడు. సుగుణాలఖని ఈ సుభద్రకొడుకు ఈ బాలుడిని చూచావా? (శవంలో కూడా జీవకాంతులు తగ్గలేదని అర్థం).

**విశేషం:** అలం: ఉపమ. వృత్తలక్షణానికి చూడండి స్త్రీ. 1.90

**ఆ.** **ప్రభువు లంతనంత రాజిల్ల నెడనెడ । వీరయోధతతులు వెలుఁగుచుండ**
**గ్రహచయమునఁ దారక ప్రకరంబున । బొలుచు గగనతలముఁ బోలెఁ గలను.** **13**

**ప్రతిపదార్థం:** ప్రభువులు= రాజులు; అంతన్+అంతన్= అక్కడక్కడా; రాజిల్లన్= ప్రకాశిస్తుండగా; ఎడన్+ఎడన్= అక్కడక్కడా; వీరయోధతతులు= వీరులైన యోధుల సమూహాలు; వెలుఁగుచుండన్= ప్రకాశిస్తుండగా; గ్రహచయమునన్= గ్రహాలరాశితోనూ; తారక ప్రకారంబునన్= నక్షత్రాల సముదాయంతోనూ; పొలుచు= ఒప్పినటువంటి; గగన తలమున్= ఆకాశతలాన్ని; కలను= యుద్ధభూమి; పోలన్= పోలి ఉంది.

**తాత్పర్యం:** అక్కడక్కడా రాజులు, అక్కడక్కడా యుద్ధవీరులు కాంతులీనుతూ ప్రకాశిస్తుండగా ఈ యుద్ధభూమి గ్రహరాశులతోనూ, నక్షత్రసముదాయాలతోనూ వెలిగే ఆకాశంవలె కనిపిస్తున్నది.

**విశేషం:** అలం: ఉపమ.

సీ. **అర్జున భీష్మ చాపాచార్య భీమ క ।ర్ణాదుల మహిత దివాస్త్ర వితతు**
**లాడిన నొండొక కీడు రానేరమి । వీతవికారమై వీరయోధ**
**చారుశరీరసంచయ ముండఁగా దీనిఁ । గంకశివాగృధ్రకాకకులము**
**లాదిగాఁ గలుగు క్రవ్యాదముల్ వీఁకు వీఁ । కాడుట నెంగిలి యయ్యెనకట!**

తే. **హంసతూలికా తల్పములందుఁ బొందు । భోగిజనముల మృదుగాత్రములు ముకుంద!**
**కంటె పరుసని ధరణి భాగమునఁ గూలి । యున్న యవి సూచువారల యుల్ల ముడుక.** 14

**ప్రతిపదార్థం:** ముకుంద!= ఓ కృష్ణా!; అర్జున; భీష్మ; చాపాచార్య= ధనుర్విద్యాగురుడైన ద్రోణ; భీమ; కర్ణాదుల= కర్ణుడు మొదలైన మహావీరుల; మహిత= గొప్పవైన; దివ్యాస్త్ర వితతులు= దివ్యమైన అస్త్రసముదాయాలు; ఆడినన్= నాటుకోగా; ఒండొక= ఏ ఒక్క; కీడు రానేరమిన్= అపాయం కలుగనందువలన; వీత= పోయిన; వికారమై= వికారం కలిగినదై (ఏ వికారం లేకుండా); వీరయోధ= వీరులైన యోధుల; చారు= అందమైన; శరీర సంచయము= శరీర సముదాయం; ఉండఁగాన్= యుద్ధభూమిలో ఉండగా; దీనిన్= దీనిని; కంక= రాపులుగులు; శివాగృధ్రకాకకులములు= నక్కలు, గ్రద్దలు, కాకులు - వీటి సముదాయం; ఆదిగాఁగలుగు= మొదలైనటువంటి; క్రవ్యాదముల్= మాంసాన్ని తినేవి; వీఁకు వీఁకాడుటన్= ఉద్ధతితో చెలరేగి పరాక్రమించటంవలన; ఎంగిలి+అయ్యెన్+అకట!= అయ్యో! ఎంగిలి అయిపోయింది; హంసతూలికా తల్పములందున్= బూరుగు దూదితో చేసిన పరుపులందు; పొందు= విశ్రమించే; భోగిజనముల= ఈ భోగపురుషుల; మృదుగాత్రము=మెత్తటి శరీరాలు; చూచువారల= చూచేవారి; ఉల్లము+ఉడుకన్= హృదయాలు పరితపించే విధంగా; పరుసని= కఠినమైన; ధరణిభాగమునన్= నేలమీద; కూలి= పడి; ఉన్నయవి= ఉన్నాయి; కంటె= చూచావా?

**తాత్పర్యం:** కృష్ణా! అర్జున, భీష్మ, ద్రోణ, భీమ, కర్ణాదుల దివ్యాస్త్ర సముదాయాలు నాటినా కించిత్తు కీడు వాటిల్లని ఈ మహావీరుల దేహాలను రాపులుగులు, నక్కలు, గ్రద్దలు, కాకులు ఆక్రమించి పొడిచి పొడిచి ఎంగిలిచేశాయి. అయ్యో! హంసతూలికాతల్పాలలో విశ్రమించే ఈ విలాసపురుషుల శరీరాలు కఠినమైన ఈ నేలపై పడి ఉన్నాయి. చూచేవారికి గుండెలు తరుక్కుపోతున్నాయి. చూచావా?

క. **చెవిని సొగియించు వీణా । రవమును గానంబు వేణురావము నిత్యో**
**త్సవముగ విను రాజులకడ । శివారుతము చెలఁగుచునికి చిత్త మలంచెన్.** 15

**ప్రతిపదార్థం:** చెవినిన్= చెవులను; సొగియించు= సుఖింపచేసేటువంటి; వీణానాదం; గానంబు= పాట; వేణురావము= పిల్లనగ్రోవి ధ్వని; నిత్య+ఉత్సవముగన్= ప్రతిరోజూ సంతోషదాయకమైన వినోదంగా; విను= వినేటువంటి; రాజులకడన్= రాజుల సమీపంలో; శివారుతము= ఆడు నక్కల ఊళలు; చెలఁగుచునికి= ధ్వనిస్తూ ఉండటం; చిత్తము= హృదయాన్ని; అలంచెన్= బాధపెట్టుతోంది.

**తాత్పర్యం:** ప్రతిరోజూ వినోదకార్యక్రమాలుగా చెవులను సుఖింపచేసే వీణానాదాన్ని, మధురగానాన్ని వేణుధ్వనులను వినేటువంటి రాజుల వద్ద నక్కలు ఊళలు విజృంభించటం చూస్తే హృదయం కలత పొందుతున్నది.

తే. **సారచందనహృద్య కస్తూరి కాది । లేపనాలిప్తి నుండెడు భూపవర్యు**
**లకట! శోణితపంకదిగ్ధాంగులగుటఁ । గనుట కోర్వరాదయ్యెడుఁ గమలనాభ!.** 16

**ప్రతిపదార్థం:** సార= శ్రేష్ఠమైన; చందన= శ్రీగంధం; హృద్య= మనోహరమైన; కస్తూరిక+ఆది= కస్తూరి, పునుగు, జవ్వాది మొదలైన; లేపన= లేపనాల; ఆలిప్తిన్= పూతతో; ఉండెడు= సుగంధాలు చిమ్ముతూ ఉండే; భూపవర్యులు= రాజులు; అకట!= అయ్యో!; శోణిత= రక్తమనే; పంక= బురదచేత; దిగ్ధ+అంగులగుటన్= పూత పూయబడిన శరీరాలు కలవారు కావటం వలన; కమలనాభ!= ఓ కృష్ణా!; కనుటకున్= చూడటానికి; ఓర్వరాదు+అయ్యెడున్= భరింటానికి వీలుకాకుండా ఉన్నది.

**తాత్పర్యం:** శ్రేష్ఠమైన శ్రీగంధం, మనోహరమైన కస్తూరి, పునుగు, జవ్వాది మొదలైన లేపనాలతో సుగంధాలు చిమ్ముతూ అందంగా కనిపించే ఈ రాజుల శరీరాలు రక్తమనే బురద పూత పూయబడి చాలా దారుణంగా అగుపిస్తున్నాయి. కృష్ణా! ఎట్లా చూచి భరించటం?

**క. వనితలు మేలపుమెయి మెలు । పునఁ దిగిచిన నొప్పు హారములు మొదలగు ప్ర**
**న్నని తొడవులు గ్రద్దలు దివి । య నరేంద్రులు గొందఱునికి యచ్యుత! కంటే? 17**

**ప్రతిపదార్థం:** అచ్యుత!= కృష్ణా!; మేలపు మెయిన్= సరదాగా; వనితలు= తమ ప్రియురాళ్ళు; మెలుపునన్= నెమ్మదిగా; హారములు మొదలగు= దండలు మొదలైన; ప్రన్నని= చక్కటి; తొడవులు= ఆభరణాలు; తివియన్= తీసివేయగా; ఒప్పు= ప్రకాశించే; రాజులు; కొందఱు(ఇక్కడ); (ఆ నగలను); గ్రద్దలు= గద్దలు; తివియన్= లాగిపారవేస్తుండగా; ఉనికి= ఇలా పడిఉండటం; కంటే?= చూస్తున్నావా?

**తాత్పర్యం:** కృష్ణా! తమ ప్రియురాళ్ళు సరదాకొరకు తాము ధరించిన చక్కని ఆభరణాలను హారాలను తీసివేస్తుండగా ప్రకాశించే రాజులు ఆ నగలనే గ్రద్దలు క్రూరంగా లాగివేస్తుండగా ఈ యుద్ధభూమిలో చలనం లేకుండా పడి ఉన్నారు. చూస్తున్నావు కదా!

**క. ప్రాణంబులు విడిచియును గృ । పాణాదులు విడువకున్న భటు లారయ స**
**ప్రాణుల పోలెం బ్రధన । క్షోణికిఁ దొడవగుచు నున్కి చూడుము కృష్ణా! 18**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= వాసుదేవా!; ప్రాణంబులు= ప్రాణాలు; విడిచియును= విడిచిపెట్టికూడా; కృపాణ+ఆదులు= కత్తులను కటార్లను; విడువక+ఉన్న= చేతులలో అట్లాగే పట్టుకొని ఉన్న; భటులు= యోధులు; ఆరయన్= బాగాచూస్తే; సప్రాణుల పోలెన్= బ్రతికి ఉన్న వారిలాగా; ప్రధన క్షోణికిన్= యుద్ధ భూమికి; తొడవు+అగుచున్= ఆభరణాలౌతూ; ఉన్కి= ప్రకాశిస్తూ ఉండటం; చూడుము.

**తాత్పర్యం:** వాసుదేవా! ప్రాణాలు వదిలినా కూడా కత్తులను కటార్లను తమ చేతుల్లోనే ఉంచుకొని ఉన్న ఈ వీరులు బాగా చూస్తే బ్రతికి ఉన్నవారివలెనే కనిపిస్తున్నారు. ఈ యుద్ధభూమికి సమర్పించబడిన ఆభరణాలవలె అగుపిస్తున్నారు - చూస్తున్నావా?

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. సూరెలను నందిజను లిం । పారఁగ వినుతింప నొప్పునట్టి మహీశుల్**
**నారీజనములు సుట్టుం । జేరి పనవుచుండ నునికి సేసె నలంతన్. 19**

**ప్రతిపదార్థం:** సూరెలను= ప్రక్కలను; వంది జనులు= వంది మాగాధులు; ఇంపు+ఆరఁగన్= మనోహరంగా; వినుతింపన్= స్తోత్రాలు చేస్తుండగా; ఒప్పునట్టి= ప్రకాశించేటువంటి; మహీశుల్= రాజులు; నారీజనములు= తమ తమ స్త్రీలు; చుట్టున్+చేరి= చుట్టూచేరి; పనవుచుండన్= ఏడుస్తూ ఉండగా; ఉనికి= ఇట్లా ఉండటం; అలంతన్= దుఃఖాన్ని; చేసెన్= కలిగిస్తోంది.

**తాత్పర్యం:** వందిమాగధులు చుట్టూ నిలబడి మనోహరంగా స్తోత్రపాఠాలు చెప్పుతూ ఉంటే ప్రకాశించేటువంటి రాజులు తమతమ స్త్రీలు చుట్టూ చేరి హృదయవిదారకంగా ఏడుస్తుండగా ఇట్లా పడి ఉండటం ఎంతో బాధను కలిగిస్తున్నది.

**తే.** **కూరు మొన పెట్టినట్టులు గొంద ఱుజ్జ్వ। లాయుధములు గంకటములు నమర నున్నఁ**
**జూచి చావని వారని చూడు చేర। నరుగకున్నవి కంక గృధ్రాదు లనికి.** **20**

**ప్రతిపదార్థం:** కొందఱు= కొందరు యుద్ధవీరులు; కూరు మొనపెట్టిన+అట్టులు= కునుకుతీస్తున్నవారివలె; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; ఆయుధములు= ఆయుధాలు; కంకటములు= కవచాలు; అమరన్= ఒప్పగా; ఉన్నన్= ఉండగా; చూచి; చావని వారని= చనిపోయినవారు కారని (అంటే బ్రతికినవారేనని); కంక= రాపులుగులు; గృధ్ర+ఆదులు= గద్దలు మొదలైనవి; అనికిన్= యుద్ధభూమివైపు; అరుగక+ఉన్నవి= వెళ్ళకుండా ఉన్నాయి; చూడు= చూడుము.

**తాత్పర్యం:** కృష్ణా! అటుచూడుము కొంతమంది వీరులు మెరిసిపోతున్న ఆయుధాలతో తళతళలాడుతున్న కవచాలతో కునుకుతీస్తున్నవారివలె అగుపిస్తూ ఉండటం చూచి వారు బ్రతికినవారే అని రాపులుగులు, గద్దలు ఆవైపుకి రాకుండా దూరదూరంగానే ఉంటున్నాయి.

**విశేషం:** అలం: భ్రాంతిమంతం.

**వ.** **ఇది యంతయు నీచే సాధితంబైన కార్యం' బని పలికి వెండియు.** **21**

**తాత్పర్యం:** ఇదంతా నీవు సాధించిన ఘనకార్య'మని ఎత్తిపొడిచి గాంధారి మళ్ళీ ఇట్లా అంటున్నది.

**సీ.** **'అట్టలకడ యుత్తమాంగముల్ గానక। యలమట నలుగడ లరయువారుఁ**
**దలలు చేతులఁగొని తనువు లుత్తలమునఁ। దఱచు పీనుఁగులలోఁ దడవు వారు**
**శిరములు మేనులఁ జేర్చి భావించి ని। జాస్యముల్ ప్రేసికొం చఱచువారు**
**తునియలు పెక్కైనఁ బనివడి గూర్చి రూ। పులు గనుంగొని మూర్ఛ మునుఁగువారు**

**తే.** **నైన కౌరవపాంచాలి మానినీ జ। నముల నచ్యుత! చూడుము నాథజనక**
**పుత్రసోదరశవముల పొంతకేఁగి। పెక్కు దురవస్థ లొందెద రక్కటకట!** **22**

**ప్రతిపదార్థం:** అచ్యుత!= కృష్ణా!; అట్టలకడన్= మొండెముల దగ్గర; ఉత్తమాంగముల్= తలలు; కానక= కనిపించక; అలమటన్= దుఃఖంతో; నలుగడలు= నాలుగువైపులా; అరయువారు= తిరిగిచూస్తున్నవారు; తలలు; చేతులన్+కొని= చేతుల్లో పట్టుకొని; తనువులు= మొండెములను; ఉత్తలమునన్= పరితాపంతో; తఱచు= అధికమైన; పీనుఁగులలోన్= శవాలలో; తడవువారు= వెదికి చూచేవారు; శిరములు= తమకు దొరికిన తలలను; మేనులన్+చేర్చి= శరీరాలతో చేర్చి; భావించి= తమవారిని

పోల్చుకొని; నిజ+ఆస్యముల్= తమ ముఖాలను; వ్రేసికొంచున్= మొత్తుకొంటూ; అఱచువారు= ఏడ్చేవారు; తునియలు+ పెక్కు+ఐనన్= శరీరాలు ముక్కలు ముక్కలయిపోగా; పనివడి= యత్నించి; కూర్చి= ఆ భాగాలను చేర్చి; రూపులు= తమవారి దేహాలను; కనుంగొని= గుర్తించి; మూర్ఛన్= మూర్ఛలో; మునుఁగువారున్= పడిపోయేవారు; ఐన= అయినటువంటి; కౌరవ= కౌరవులకు చెందిన; పాంచాల= పాంచాలురకు చెందిన; మానినీజనములన్= స్త్రీలను; చూడుము; నాథ= భర్తల; జనక= తండ్రుల; పుత్ర= కొడుకుల; సోదర= అన్నదమ్ముల; శవముల పొంతకున్+ఏఁగి= శవాల వద్దకు వెళ్ళి; అక్కటకట!= అయ్యయ్యో!; పెక్కు= ఎన్నో; దురవస్థలు= పాట్లు; ఒందెదరు= పడుతున్నారు (పొందుతున్నారు).

**తాత్పర్యం:** 'కృష్ణా! అటు చూడుము. మొండెముల దగ్గర తలలు కనిపించక కొందరు నాలుగు దిక్కులా పరుగెత్తి తలలు వెదుకుతున్నారు. తలలు చేతులలో పట్టుకొని మొండెములు కనిపించక పరితాపంతో ఆ పీనుగుల పెంటల్లో కొందరు మొండెములు వెదకుతున్నారు. తమకు దొరికిన తలలను శరీరాలతో చేర్చి తమ వారిని పోల్చుకొని బాధతో తలలు మొత్తుకొంటూ కొందరు ఏడుస్తున్నారు. శరీరాలు ముక్కలయిపోగా ఆ భాగాలను కూర్చుకొని తమవారి దేహాలను గుర్తించి కొందరు మూర్ఛపడిపోతున్నారు. తమ భర్తల, తండ్రుల, కొడుకుల, అన్నదమ్ముల శవాలవద్దకు వెళ్ళి, వారు పడుతున్నపాట్లు ఎట్లా చూడటం! అయ్యయ్యో!

**తే.** **అవయవములు రూపఱఁగఁ గ్రవ్యాద భక్షి । తంబులై యున్కిఁ గొన్ని శవంబు లువిద**
**లెంత సూచియునవి గొంద ఱెఱుఁగ జాల । రయ్యెదరు సూడు తమ బంధులగుటఁ గృష్ణ!** **23**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= వాసుదేవా!; అవయవములు= శరీర భాగాలు; రూపు+అఱఁగన్= ఆకారాలు నశించగా; క్రవ్యాద= మాంసం తినేటువంటి కాకులు గ్రద్దలు మొదలైనవాటి చేత; భక్షితంబులు+ఐ= తినబడి; ఉన్కిన్= ఉండటంవలన; తమ బంధులు+అగుటన్= తమ బంధువులు కావటంవలన; ఉవిదలు= స్త్రీలు; కొందఱు= కొంతమంది; కొన్ని శవంబులు= కొన్ని శవాలను; ఎంత చూచియున్= ఎంత పరికించినా; అవి= ఆ శవాలను; ఎఱుఁగఁజాలరు+అయ్యెదరు= గుర్తించలేకుండా పోతున్నారు!; చూడు.

**తాత్పర్యం:** వాసుదేవా! కొన్ని శవాల అవయవాలు నక్కలు కాకులు తినివేయటంవలన, పూర్తిగా ఆకారాలు కోల్పోవటంవలన, తమబంధువుల శవాలకొరకై వచ్చి పరికిస్తున్న కొంతమంది స్త్రీలు తమవారి దేహాలనే గుర్తించలేకుండా పోతున్నారు. ఇది ఎంత దురవస్థ!

**క.** **ఇట్టివి యెల్లనుఁ గనుఁగొను । కట్టిఁడితన మొందునట్లుగా నేమొకొ తొ**
**ల్పుట్టువునం జేసితి నీ । చుట్టలనిటు సూడకుండఁ జొప్పడ దయ్యెన్.** **24**

**ప్రతిపదార్థం:** ఇట్టివి= ఇలాంటి దురవస్థలను; ఎల్లనున్= అన్నిటిని; కనుఁగొను= చూచేటటువంటి; కట్టిఁడితనము= క్రూరత్వం; ఒందునట్లుగాన్= పొందేటట్లుగా; తొల్పుట్టువునన్= పూర్వజన్మంలో; చేసితిన్= (ఏ పాపాన్ని) చేశానో; ఏమొకొ= ఏమో; ఈ చుట్టలన్= ఈ బంధువులను; ఇటు= ఇలా; చూడకుండన్= చూడకుండా ఉండటానికి; చొప్పడదు+అయ్యెన్= కుదరలేదు.

**తాత్పర్యం:** ఇట్లాంటి దురవస్థలను చూచే క్రూరత్వం పొందేటట్లుగా పూర్వజన్మలో నేను ఏపాపం చేశానో ఏమో? ఈ బంధువులను ఇట్లా చూడకుండా తప్పింది కాదు.

క. **అని పలుకునపుడు దుర్యో। ధనుని కళేబరము దృగ్గతంబగుటయు న**
**వ్వనిత యిలఁ ద్రెళ్ళె నఱికిన। యనఁటి క్రియన్ మూర్ఛఁ జిత్త మవశం బైనన్.** 25

**ప్రతిపదార్థం:** అని= అని పై విధంగా; పలుకునపుడు= మాట్లాడుతున్న సమయంలో; దుర్యోధనుని కళేబరము= దుర్యోధనుని శరీరం; దృక్+గతంబు+అగుటయున్= కనిపించటంతో; ఆ+వనిత= ఆ స్త్రీ (గాంధారి); మూర్ఛన్= మూర్ఛవలన; చిత్తము= మనస్సు; అవశంబు+ఐనన్= అదుపు కోల్పోగా; నఱికిన= నరికివేసిన; అనఁటి క్రియన్= అరటి చెట్టువలె; ఇలన్= నేలమీద; త్రెళ్ళెన్= పడిపోయింది.

**తాత్పర్యం:** అని ఇట్లా మాట్లాడుతున్న సమయంలో దుర్యోధనుడి శవం గాంధారి కంటబడింది. వెంటనే ఆ తల్లి మూర్ఛవలన వివశురాలై మొదలు నరికిన అరటిచెట్టువలె నేలమీద పడిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

### గాంధారి దుర్యోధనుని కళేబరంబు చూచి పలవించుట (సం. 11-17-1)

వ. **ఇట్లు మూర్ఛిల్లి కొండొక సేపునకుం దెలిసి గాంధారి పరిచారిక లూఁదికొని పోవ నప్పుత్ర శవంబుకడకుఁ బోయి.** 26

**ప్రతిపదార్థం:** ఇట్లు; మూర్ఛిల్లి; కొండొకసేపునకున్= కొంతసేపటికి; తెలిసి= తెలివివచ్చి; గాంధారి; పరిచారికలు; ఊఁదికొని పోవన్= ఊతగా పట్టుకొనగా; ఆ+పుత్రశవంబు కడకున్= ఆ కుమారుడి శవంవద్దకు; పోయి.

**తాత్పర్యం:** ఇట్లా మూర్ఛపోయి, కొంత సేపటికి తెలివి రాగా, గాంధారిని పరిచారికలు పట్టుకొని పోగా, ఆ కుమారుడి శవం దగ్గరగా వెళ్ళి.

**విశేషం:** ఊఁది= ఊతగా; కొని= పట్టుకొని - అంటే ఆసరాగా నిలిచి నెమ్మదిగా నడిపించుకొని పోవటమని అర్థం.

**తరలము:**

**విపుల వక్షముమీఁద నశ్రులు వెల్లిగొల్పుచు వ్రాలి 'యో**
**నృపతికుంజర! కౌరవేశ్వర! నేలనిమ్మెయి నీ యుదా**
**త్తపు శరీరముఁ బొందఁ బాడియె? తల్లి వచ్చిన భక్తితో**
**నుపచరింపక లాఁతివై యిటులూరకుండుట యుక్తమే?'** 27

**ప్రతిపదార్థం:** విపుల= విశాలమైన; వక్షము మీఁదన్= రొమ్ముమీద; అశ్రులు= కంటినీరు; వెల్లికొల్పుచున్= ప్రవాహంలాగా కారుస్తూ; వ్రాలి= ఆశరీరంమీద వాలిపోయి; ఓ నృపతి కుంజర!= ఓ రాజశ్రేష్ఠుడా!; కౌరవేశ్వర!= కౌరవులలో శ్రేష్ఠుడా!; నీ+ఉదాత్తము+శరీరము= నీదైన గొప్ప శరీరం; ఇమ్మెయిన్= ఇంత నికృష్టంగా; నేలన్= నేలమీద; పొందన్= పడిఉండటం (నేలను చేరటం); పాడియె?= న్యాయమా?; తల్లి వచ్చినన్= తల్లి దగ్గరకు వస్తే; భక్తితోన్= భక్తితో ఉపచరింపక= లేచి నమస్కరించి సేవించకుండా; లాఁతివి+ఐ= వేరే వ్యక్తిలాగా; ఇటులు= ఈ విధంగా; ఊరక+ఉండుట= మౌనంగా కదలకుండా ఉండటం; యుక్తమే?= సమంజసమేనా?

**తాత్పర్యం:** విశాలమైన కుమారుడి రొమ్ముమీద ఎడతెగకుండా కన్నీరు కారుస్తూ గాంధారి వాలిపోయింది. 'రాజులలో పేరుపొందావు. కౌరవులలో అందరికన్నా మిన్న అనిపించుకొన్నావు. నాయనా! నీ గొప్ప దేహం ఇట్లా నికృష్టంగా నేలమీద పడి ఉండటం ఎంత అన్యాయమయ్యా! తల్లి దగ్గరికి వస్తే, లేచి నమస్కరించి ఉపచారాలు చేయకుండా వేరే వ్యక్తివలె కదలకుండా మౌనంగా ఉన్నావే! నీ కిది న్యాయంగా ఉన్నదా?' (అని బాధపడుతున్నది).

**విశేషం:** తరములో ప్రతిపాదానికీ న, భ, ర, స, జ, జ, గ అనే గణాలుంటాయి. 1-12 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలవించుచు హాహాకారంబు లెసంగ రోదనంబు చేసి యా సుబలనందన తన సమీపంబునకుఁ జనుదెంచియున్న యుపేంద్రున కిట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా బాధపడి; మఱియున్= ఇంకా; అనేక= పలు; ప్రకారంబులన్= రీతులలో; పలవించుచున్= విలపిస్తూ; హాహాకారంబులు+ఎసంగన్= హాహాకారాలు అతిశయించగా; రోదనంబుచేసి= ఏడ్చి; ఆ సుబలనందన= ఆ గాంధారి; తన; సమీపంబునకున్= దగ్గరకు; చనుదెంచియున్న= వచ్చి ఉన్న; ఉపేంద్రునకున్= కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని ఇట్లా బాధపడి ఇంకా పలువిధాలుగా తనకుమారుడిని గురించి తలచుకొంటూ హాహాకారాలు చేస్తూ ఏడుస్తుండగా గాంధారి సమీపానికి కృష్ణుడు వచ్చాడు. ఆయనను చూచి గాంధారి ఇట్లా అన్నది.

**మంగళమహాశ్రీ:**

**ఈతఁడు రణంబునకు నెత్తి చనుచుండియును నెంతయును భక్తిఁ గని నాకుం**
**బ్రీతియెసఁగం బలికి బ్రేమ మొలయం బొగడి పెద్దయు వినీతినిరతుండై**
**చేతులు మొగిడ్చి జయ సిద్ధియుఁగ దీవన విశిష్టదయ నిమ్మనిన ధర్మం**
**బే తల ననూనమగు నిద్ధజయ మా తలకు నెట్లయిన సిద్ధమగు నంటిన్. 29**

**ప్రతిపదార్థం:** ఈతఁడు= ఈ సుయోధనుడు; రణంబునకున్= యుద్ధానికి; ఎత్తి= దండెత్తి; చనుచున్+ఉండియును= వెళ్ళూ; ఎంతయును= ఎంతో; భక్తిన్+కని= భక్తితో నన్ను చూచి; నాకున్+ప్రీతి+ఎసఁగన్+పలికి= నాకు ఎంతో సంతోషం కలిగేలా మాట్లాడి; ప్రేమము+ఒలయన్+పొగడి= ప్రేమ పుట్టేలా పొగడి; వినీతి= వినయంతో; నిరతుండు+ఐ= శ్రద్ధ కలిగినవాడై; చేతులు; మొగిడ్చి= జోడించి (నమస్కరించి); జయసిద్ధియుఁగన్= జయం సిద్ధించేలాగున; విశిష్టదయన్= మిక్కిలి అనుగ్రహంతో; దీవనన్= ఆశీస్సు; ఇమ్ము+అనినన్= ఇవ్వాలమ్మా! - అని కోరగా; ధర్మంబు= ధర్మం; ఏ తలన్+అనూనము+అగున్= ఏ పక్షంలో అధికంగా ఉంటుందో; ఇద్ధజయము= గొప్పవిజయం; ఆ తలకున్+ఎట్లయినన్= ఆ వైపు ఎట్లాగైనా; సిద్ధము+అగున్= సిద్ధిస్తుంది; అంటిన్= అన్నాను.

**తాత్పర్యం:** ఈ సుయోధనుడు యుద్ధానికి పూనుకొని వెళ్తూ ఎంతో భక్తితో నన్ను దర్శించుకొని నాకు సంతోషం కలిగే మాటలు మాట్లాడి ప్రేమ పుట్టేటట్లు పొగడి వినయంతో కూడినవాడై చేతులు జోడించి నమస్కరించి 'తల్లీ! నాకు విజయం సిద్ధించేటట్లుగా నీవు మిక్కిలి అనుగ్రహంతో ఆశీర్వదించుము' అని కోరగా 'నాయనా! ధర్మం ఏ పక్షంలో అధికంగా ఉంటుందో ఆ పక్షానికి దిగ్విజయం ఎట్లాగయినా తప్పక సిద్ధిస్తుం' దని అన్నాను.

**విశేషం:** 'యతో ధర్మ స్తతో జయః' (ఎక్కడ ధర్మముంటే అక్కడ విజయమని అర్థం). ధర్మం సత్యకర్మకు సంబంధించింది. భగవంతుడు ధర్మసంరక్షణకే అవతరిస్తాడు.

**'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్' (గీత)**

పాండవులు 'ధర్మ' రక్షితులని గాంధారికి తెలుసును కాబట్టి ఇట్లా అంటున్నది.

మంగళమహాశ్రీవృత్తంలో ప్రతిపాదానికీ భ, జ, స, న, భ, జ, స, న, గ, గ అనే గణాలుంటాయి. 1-9-17 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. ఇట్లన నేల? యంటేని. 30**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అనన్+ఏల?= ఎందుకు అన్నావు?; అంటి(వి)+ఏనిన్= అంటే.

**తాత్పర్యం:** ఇట్లా ఎందుకు అన్నావంటే.

**మానినీవృత్తము:**

**జూదమునప్పుడు సర్వజనంబులు చూచి భయంపడి యిప్పని యి**
**మ్మేదిని సేనలకుం గురుకోటికి మృత్యువు గాని నిజం బలఁతిం**
**బోదని యాడరె? యమ్మెయి నాదగు బుద్ధికిఁ దోఁచిన సత్యము దా**
**మోదర! పాటిలదే కొడుకంచుఁ బ్రియోక్తులు పల్కినఁ బెంపు సెడున్. 31**

**ప్రతిపదార్థం:** జూదము+అప్పుడు= జూదమాడే సమయంలో; సర్వజనంబులు= అక్కడ చేరిన జనులంతా; చూచి= ఆ ద్రౌపదీమాన భంగాన్ని చూసి (భీముడు చేసిన ప్రతిజ్ఞలు); భయంపడి= భయపడి; ఈ+పని= ఇట్లా చేయటం; ఈ+మేదినిన్= ఈ భూమిలో; సేనలకున్= సైన్యాలకు; కురుకోటికిన్= కౌరవ సమూహానికి; మృత్యువు+కాని= మృత్యువు తప్ప (మరొకటి కాదు); నిజంబు= సత్యం; అలఁతిన్= తేలికగా; పోదు= పొయ్యేది కాదు; అని; ఆడరె?= అనలేదా?; ఆ+మెయిన్= ఆ విధంగా; దామోదర!= ఓ కృష్ణా!;' నాదగు= నాదైన; బుద్ధికిన్= బుద్ధికి; తోఁచిన సత్యము= తోచిన సత్యం; పాటిలదే?= కలుగదా?; కొడుకు+అంచున్= కొడుకు అంటూ; ప్రియ+ఉక్తులు= మంచిమాటలు; పల్కినన్= పలికితే; పెంపు+చెడున్= శ్రేయస్సు నశిస్తుంది.

**తాత్పర్యం:** ఆనాడు జూదమాడుతున్న సమయంలో అక్కడ చేరిన జనమంతా ద్రౌపది మానభంగాన్ని, భీముడి ప్రతిజ్ఞలు చూచి ఇట్లా చేయటం ఈ భూమిలోని సైన్యానికి, కౌరవవంశానికి చావుకోసం తప్ప - ధర్మం అంత సులభంగా నశించదు - అని అన్నారు గదా! నా బుద్ధికి కూడా అదే తోచింది. అది జరగకపోతుందా? కుమారుడని మెప్పుకోలు మాటలు పలకటం పెంపు కలిగించదు.

**విశేషం:** కొడుకు ఇట్లా అడిగినప్పుడు తల్లి అట్లా చెప్పటం కేవలం ద్వాపరయుగానికి సంబంధించిన మాతృధర్మమనే చెప్పాలి. రాజనీతి ప్రకారం ఆలోచిస్తే చివరి నిమిషంలోనైనా ఈ మాటలకు విలువనిచ్చి 'సంధి' చేసుకోకుండా ఉంటాడా అన్న ఆశ కూడా ఆ తల్లికి ఉండవచ్చును. ఆశీర్వదించినా జయం పొందడు. అందుకే ధర్మమున్నచోట విజయమనిచెప్పి అతడినే ఆలోచించుకొమ్మంది. భారతంలోని స్త్రీ పాత్రలలోని విజ్ఞత, వివేకం ఉదాత్తమైనవి - అనటానికి గాంధారి పలుకులు ప్రబల నిదర్శనం.

మానినీ వృత్తంలో ప్రతిపాదానికీ ఏడు భగణాలు, మీద గురువు ఉంటాయి. 1-13 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**వ. వినుము దీవనకుం జొరక మధ్యస్థపుమాట లాడుటయకాదు మఱి నే నప్పు డతని తోడ. 32**

**ప్రతిపదార్థం:** వినుము; దీవనకున్+చొరక= ఆశీర్వదించకుండా; మధ్యస్థపు మాటలు+ఆడుట+అ+కాదు= మధ్యస్థంగా మాటలాడటమే కాదు; మఱి; నేను; అప్పుడు+అతనితోడన్.

**తాత్పర్యం:** అంతేకాదు. వినుము. ఆశీర్వదించకుండా మధ్యస్థంగా మాట్లాడటమే కాదు. మరి నేను అతడితో ఇంకా- (ఇట్లా అన్నాను.) (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ఆహవంబునయందు నీ వోహటించి । పోవ సడివచ్చు సడి కంటెఁ జావుమేలు;**
**శస్త్రజీవితఁ బరలోకసౌఖ్య మనుభ । వింపు మమరత్వసంపద వెలయు మంటి.' 33**

**ప్రతిపదార్థం:** ఆహవంబున+అందున్= యుద్ధంలో; నీవు; ఓహటించి+పోవన్= వెనుదిరిగిపోగా; సడి= అపవాదు; వచ్చున్= వస్తుంది; సడికంటెన్= ఆ అపవాదువలన అపకీర్తి కన్నా; చావు మేలు= మరణం మేలు; (కనుక) శస్త్రజీవితన్= శస్త్రాలతో జీవించే యోధుని ధర్మంతో (వీరత్వంతో); పరలోక= స్వర్గలోక; సౌఖ్యము= సుఖాన్ని; అనుభవింపుము; అమరత్వ సంపదన్= స్వర్గంలో మరణంలేని వైభవంతో; వెలయుము+అంటిన్= ప్రకాశించుమన్నాను.

**తాత్పర్యం:** 'యుద్ధంలో వెనుదిరిగి వస్తే అపకీర్తి వస్తుంది. అపకీర్తికన్నా చావు నయం. నీవు యుద్ధవీరుడుగా జీవించుము. పరలోక సౌఖ్యాన్ని పొందుము. స్వర్గంలో మరణంలేని వైభవాన్ని పొందుము. సుఖించుము' అన్నాను.

**క. అని చెప్పియుంటి; నా చె । ప్పిన యట్టులు సేసి యితఁడు పేరును బెంపుం**
**గనియుండఁగ ని ట్లడలున । మునుఁగు టరయఁ గడుపుశోకమున పెంపు సుమీ! 34**

**ప్రతిపదార్థం:** అని= అని పై విధంగా; చెప్పి+ఉంటిన్= చెప్పాను; నా+చెప్పిన+అట్టులు+చేసి= నేను చెప్పినట్టుగా చేసి; ఇతఁడు= దుర్యోధనుడు; పేరును= కీర్తిని; పెంపున్= ప్రతిష్ఠను; కని+ఉండఁగన్= పొంది ఉండగా; ఇట్లు= ఈ విధంగా; అడలునన్= దుఃఖంలో; మునుఁగుట= మునిగిపోవటం; అరయన్= బాగా ఆలోచిస్తే; కడుపు శోకమునన్= పుత్రుడు చావటంవలన ఏర్పడిన గర్భ శోకం యొక్క; పెంపు సుమీ!= అతిశయం తప్ప మరొకటికాదు సుమా!

**తాత్పర్యం:** అట్లా నేను ఆనాడు చెప్పాను. నేను చెప్పినట్టుగానే చేసి దుర్యోధనుడు కీర్తి ప్రతిష్ఠలు పొందాడు. ఇక అతడిని గురించి ఇట్లా ఏడుస్తూ ఉన్నానంటే కేవలం పుత్రశోకంతో మాత్రమే తప్ప, అతడి కేమి తక్కువ?

**విశేషం:** శోకాలలో పుత్రశోకం నిరంతరంగా ఉంటుందని పెద్దలు చెప్పుతారు.

**మాతృదుఃఖం తు షాణ్మాసం । పితృదుఃఖం తు వత్సరమ్,**
**భార్యాదుఃఖం పునర్భార్యా । పుత్రశోకం నిరంతరమ్.**

తల్లి పోతే ఆరు నెలలు చింతిస్తారు. తండ్రిపోతే సంవత్సరంపాటు దుఃఖిస్తారు. భార్య చనిపోతే దుఃఖం మరో భార్య వచ్చే వరకే. కాని పుత్రుడి మరణం జీవితాంతం దుఃఖాన్ని కలగజేస్తుంది.

ఇక్కడ గాంధారీధృతరాష్ట్రుల శోకం తగ్గకపోవటానికి హేతువు గర్భసంబంధమే.

**ఆ. అరి విమర్ది యితనికై వగపేటికిఁ। బుణ్య లోకమునకుఁ బోయెననుచు**
**నుండ నోపెనేని నుల్లంబు ధృతరాష్ట్రు। దిక్కులేమిఁ దలఁచి పొక్కకున్నె?' 35**

**ప్రతిపదార్థం:** అరి విమర్ది= శత్రువులను చంపిన; ఇతనికై= ఇతనికోసం; వగపు+ఏటికిన్?= చింత ఎందుకు?; పుణ్యలోకమునకున్= పుణ్యలోకాలకు; పోయెను+అనుచున్+ఉండన్+ఓపెను+ఏని= వెళ్ళిపోయాడంటూ ఉండగలిగినా; ఉల్లంబు= హృదయం; ధృతరాష్ట్రు= ధృతరాష్ట్రునియొక్క; దిక్కులేమిన్= దిక్కులేనితనాన్ని; తలఁచి= తలచుకొని; పొక్కక+ఉన్నె?= దుఃఖించకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** శత్రువులను ఘోరంగా చంపి తానూ చనిపోయిన ఇతడికొరకు చింతించటం ఎందుకు? పుణ్యాత్ముడు స్వర్గానికి వెళ్ళిపోయా డంటూ ఉండగలిగినా ఆ పెద్దాయన ధృతరాష్ట్రుడికి ఈ వయసులో ఆసరాగా ఎవరూ లేకపోయారే? అన్న ఆలోచనతో హృదయం తరుక్కుపోతున్నది. ఈ దుఃఖం తప్పుతుందా కృష్ణా!'

**వ. అని వెండియు. 36**

**తాత్పర్యం:** అని మళ్ళీ ఇట్లా అన్నది.

**సరసిజ వృత్తము:**

**'శ్రీరమ్యత్వం బారఁగఁ బెం పూర్జితముగ మణివిరచితమకుటములం**
**దారుం జూడన్ సారవిభూతిన్ ధరణిపు లనిమిషధవనిభు లగుచున్**
**భూరిప్రీతిన్ సూరెలఁ గొల్వన్ భువనవినుతమగు పొలుపు వెలయ ము**
**న్నీ రా జుండున్ దారుణ దైవం బిటు పఱచునె తుది నితని? కటకటా! 37**

**ప్రతిపదార్థం:** శ్రీరమ్యత్వంబు= రాజ్యసంపద యొక్క మనోహరత్వం; ఆరఁగన్= ఒప్పగా; పెంపు= వైభవం; ఊర్జితముగన్= వృద్ధిచెందగా; మణి విరచిత= మణులు పొదిగిన; మకుటములన్= కిరీటాలతో; సారవిభూతిన్= గొప్ప సంపదలతో; ధరణిపులు= రాజులు; అనిమిషధవ= (దేవతలరాజు - ఇంద్రుడు) ఇంద్రుడితో; నిభులు+అగుచున్= సమానులవుతూ; తారున్+చూడన్= తాము చూస్తుండగా; భూరిప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; సూరెలన్= ప్రక్కల; కొల్వన్= సేవిస్తుండగా; భువన వినుతము+అగు= ప్రపంచ ప్రసిద్ధమైన; పొలుపు= వైభవం; వెలయన్= ప్రకాశించగా; మున్ను+ఈ రాజు+ఉండున్= మునుపు ఈ సుయోధనుడు వెలిగాడు; తుదిన్= చివరికి; దారుణదైవంబు= కరుణలేని దైవం; ఇతనిన్= ఇతడిని; ఇటు+పఱచునె?= ఇట్లా భంగపరుస్తుందా?; కటకటా!= అయ్యయ్యో!.

**తాత్పర్యం:** 'కృష్ణా! రాజ్యసంపదవలని మనోహరత్వంతో వృద్ధిచెందిన వైభవంతో మణులు పొదిగిన కిరీటాలు కలిగిన గొప్ప కీర్తి సంపదలతో విరాజిల్లుతూ ఇంద్రసములైన రాజులు తనచుట్టూ చేరి సేవిస్తుండగా సంతోషించినవాడు ఈ దుర్యోధనుడు. ఇతడి వైభవం ఈ భువనంలోనే సుప్రసిద్ధమైనది. అట్లాంటి ఇతడిని పాపిష్ఠి దైవం చివరకు ఇట్లా భంగపరుస్తుందా! అయ్యో ! ఎంత దారుణం!

**విశేషం:** సరసిజవృత్తంలో ప్రతిపాదానికీ వరుసగా మ, త, య, న, న, న, స - గణాలు ఉంటాయి. 1-10-18 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం లేదు.

**తే. కనకబహురత్నమయ పీఠమున మృగాక్షు । లాలవట్టంబు లిడఁ జెలు వమరునట్టి**
**కౌరవేంద్రుండు పెనునేలఁ గంకపక్ష । పవన హతుఁడయ్యెఁ జూచితె? పద్మనాభ! 38**

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= ఓ కృష్ణా!; మృగాక్షులు= లేడి కన్నులుగల స్త్రీలు; ఆలవట్టంబులు+ఇడన్= గుడ్డతో చేసిన గుండ్రని పెద్దవిసనకర్ర (సం. ఆలావర్తం)తో వీస్తుండగా; కనక బహురత్నమయ= బంగారుతోను, అనేక మణులతోను చేయబడిన; పీఠమునన్= సింహాసనంలో; చెలువు+అమరునట్టి= అందంగా ప్రకాశించేటటువంటి; కౌరవేంద్రుండు= దుర్యోధనుడు; పెనునేలన్= ఈ విశాలమైన, కఠినమైన నేలమీద; కంకపక్ష= రాపులుగుల రెక్కలచేత పుట్టిన; పవన= హోరుగాలిచేత; హతుఁడు+అయ్యెన్= కొట్టబడినవాడయ్యాడు - చనిపోయాడు; చూచితె?= చూచావా? (ఎంత ఘోరమో).

**తాత్పర్యం:** కృష్ణా! లేడికన్నులవంటి కన్నులున్న పరిచారక స్త్రీలు వస్త్రంతో తయారుచేసిన పెద్ద విసనకర్రను వీస్తుండగా మణులు పొదిగిన బంగారు సింహాసనంలో అందంగా కొలువు తీరినట్టి ఈ దుర్యోధనుడు ఈనాడు ఈ యుద్ధభూమిలో రాబందుల రెక్కలనుండి పుట్టిన హోరుగాలి తాకిడికి గురి అయ్యాడు - ప్రాణాలు పోగొట్టుకున్నాడు. చూచావా? ఎంత ఘోరంగా ఉన్నదో!

**క. ఈ రాజు భీమసేను ను । దారోగ్ర పరాక్రమమున ధరణి నొఱగి దు**
**ర్వారమదవారణము కం । ఠీరవము విహారమునఁ బడిన గతిఁ బొలిచెన్. 39**

**ప్రతిపదార్థం:** ఈ రాజు= అలాంటి ఈ దుర్యోధనుడు; భీమసేను= భీమసేనుడి; ఉదార+ఉగ్ర పరాక్రమమునన్= ఘనమైన క్రూరమైన పరాక్రమంచేత; దుర్వార= వారించటానికి వీలులేని; మదవారణము= మదించిన ఏనుగు; కంఠీరవము విహారమునన్= సింహంతో చేసిన వినోద క్రీడలో (లేదా సింహం వీర విహారంలో); పడిన గతిన్= చనిపోయేరీతిలో; ధరణిన్+ఒఱగి= నేలమీద ఒరిగిపోయి; పొలిచెన్= కనిపిస్తున్నాడు.

**తాత్పర్యం:** అట్లాంటి ఈ దుర్యోధనుడు భీమసేనుడి ఘనమైన క్రూరమైన పరాక్రమంతో ఓడి, మదపుటేనుగు సింహం చేసిన వీర విహారంలో చనిపోయినట్టుగా నేలమీద ఒరిగిపోయి కనిపిస్తున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం । బదివేలవిధములఁ జెప్పఁ బాటింపఁడు దు**
**ర్మదమునఁ దగియెడు బుద్ధులు । విధి మూఁడిన మర్త్యుఁ డేల విను నుచితోక్తుల్? 40**

**ప్రతిపదార్థం:** విదురుఁడు= పినతండ్రి విదురుడు; తండ్రియున్= తన తండ్రి ధృతరాష్ట్రుడు; తనకున్= తనకని; తగియెడు= తగిన; బుద్ధులు= మంచిమాటలు (నీతులు); పదివేల విధములన్= పదివేల రీతులుగా; చెప్పన్= చెప్పగా; దుర్మదమునన్= మిక్కిలి మదంతో; పాటింపఁడు= విన్నాడు కాడు; విధి= కర్మ (చేటు); మూఁడిన= సంభవించిన; మర్త్యుడు= మనిషి; ఉచిత+ఉక్తుల్= సుభాషితాలు; ఏల వినున్?= ఎందుకు వింటాడు?

**తాత్పర్యం:** తన పినతండ్రి, మహాజ్ఞాని విదురుడు, తన తండ్రి ధృతరాష్ట్రుడు చెవిలో ఇల్లుకట్టుకొని ఎన్ని వేల విధాలుగానో బుద్ధిమాటలు చెప్పారు. ధర్మాన్ని బోధించారు. కాని, అతడి దుర్మదం అట్లాంటిది. ఒకరి మాటలూ లెక్కచేసినవాడు కాడు. చేటుమూడిన మనిషి సుభాషితాలు వింటాడా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. పదునొకఁ డక్షౌహిణు లే। పొదవఁగ నలిఁ గొలువ నొప్ప నుర్వీశ్వరుఁడే**
**తుది నిష్పరివారుండై। గదఁ జేకొని యొంటి పోరి కలనిం బడియెన్. 41**

**ప్రతిపదార్థం:** పదునొకఁడు= పదకొండు; అక్షౌహిణులు= అక్షౌహిణుల సైన్యం; ఏపు= ఆధిక్యం; ఒదవఁగన్= కలుగగా; నలిన్= ఉత్సాహంతో; కొలువన్= సహాయకారులుగా సేవించగా; ఒప్పు= ప్రకాశించే; ఉర్వీశ్వరుఁడే= ఈ సుయోధన మహారాజే; తుదిన్= చివరికి; నిష్పరివారుండు+ఐ= ఏ పరివారమూలేనివాడై; గదన్= గదను; చేకొని= తీసికొని; ఒంటి= ఒంటరిగా; పోరి= యుద్ధంచేసి; కలనిన్= యుద్ధభూమిలో; పడియెన్= నేలకు ఒరిగాడు.

**తాత్పర్యం:** పదకొండు అక్షౌహిణుల సైన్యం ఆధిక్యం అతిశయించగా ఉత్సాహంతో తనవెంట ఉండగా ప్రకాశించే ఈ రాజే చివరకి ఏతోడూ లేక గదను తీసికొని ఒంటరిగా పోరాడి నేలమీద పడ్డాడు.॥

**తే. ధరణి గజఘోటకము లొప్ప ధార్తరాష్ట్రు। లెల్లఁ బొలుపారఁగాఁగంటి నిప్ప డవి వి**
**నాశ మొందినఁ బాడఱి నలిననాభ। యది పరాధీనముగఁ జూచునట్టి దయ్యె.' 42**

**ప్రతిపదార్థం:** నలిననాభ!= పద్మనాభా! (కృష్ణా!); ధరణి= విశాలమైన రాజ్యమూ; గజ= ఏనుగులు; ఘోటకములు= గుర్రాలు; ఒప్పన్= ఒప్పుగా; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్ర కుమారులు; ఎల్లన్= అందరూ; పొలుపు+ఆరన్+కాన్= వైభవంగా ఉండటం; కంటిన్= చూశాను; ఇప్పుడు= ఈనాడు; అవి= ఆ ఏనుగులు; గుర్రాలు; వినాశమొందినన్= నశించగా; అది= ఆ భూమి; పాడఱి= శూన్యమై; పరాధీనముగన్= శత్రువులకు వశం కాగా; చూచునట్టిది+అయ్యెన్= చూసేటువంటిది అయినది (చూడటం సంభవించినది).

**తాత్పర్యం:** కృష్ణా! విశాలమైన ఈ రాజ్యం, ఏనుగులు, గుర్రాలు కలిగి కురుకుమారులు వైభవోపేతంగా అందరూ కలకలలాడుతూ ఉండటం చూచాను. అదే ఈనాడు ఆ ఏనుగులు, గుర్రాలు సర్వనాశనమైపోగా, ఈ విశాలభూమి శూన్యమై పరాధీనం కాగా చూచే దౌర్భాగ్యం నాకు దాపురించింది.'

**వ. అని దుర్యోధనవల్లభ నిరీక్షించి మాధవు నుద్దేశించి యిట్లనియె. 43**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా అని; దుర్యోధన వల్లభన్= దుర్యోధనుడి భార్యను (భానుమతిని); నిరీక్షించి= చూచి; మాధవున్= శ్రీకృష్ణుడి; ఉద్దేశించి= వైపు చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఇట్లా అని, గాంధారి భానుమతిని చూచి శ్రీకృష్ణుడివైపు తిరిగి ఇట్లా అన్నది.

**ఆ. 'కొడుకు చావుకంటెఁ గోడలి యడలునఁ। బెరిఁగి శోకవహ్ని దరికొనంగ**
**నంతరంగ మిప్ప డగ్గల మెరియంగఁ। దొడఁగె దీనికేది తుది? యుపేంద్ర! 44**

**ప్రతిపదార్థం:** ఉపేంద్ర!= కృష్ణా!; కొడుకు= కుమారుడి; చావుకంటెన్= మృతికన్నా; కోడలి= ఈ భానుమతి; అడలునన్= శోకంతో; పెరిఁగి= అధికమై; శోకవహ్ని= శోకమనే; నిప్పు; దరికొనంగన్= విజృంభిస్తుండగా; అంతరంగము= హృదయము; ఇప్పుడు= ఇప్పుడు; అగ్గలము= మిక్కిలిగా; ఎరియంగన్+తొడఁగెన్= మండటం మొదలుపెట్టింది; దీనికిన్= ఈ బాధకు; ఏది తుది?= అంతం ఎక్కడ?

**తాత్పర్యం:** 'కృష్ణా! కొడుకు చనిపోవటం వలన కంటె ఈ కోడలి దుఃఖం వలన నాలో ఉన్న శోకమనే అగ్ని బాగా ప్రజ్వరిల్లి హృదయాన్ని కాల్చివేయటం మొదలుపెట్టింది. ఈ బాధకు అంతం ఎక్కడ?

**విశేషం:** అలం: రూపకం.

**సీ.** **చూడు మిమ్ముద్దియ సుతుఁజూచి వదన మ । ల్లార్చుచుఁ బ్రాణేశునాననంబు**
**పైఁ జూడ్కి యడరించి పాణితలంబున । నందంద నెమ్మొగ మడిచికొనుచు**
**మరలఁ బుత్రునిదెస కరిగిన మనసు పే । రడలున మునుఁగంగ నతని చెన్ను**
**మోమునఁ దనమోము మోపి మూర్ఛల్లుచుఁ । దెలిసి వల్లభునురఃస్థలము గ్రుమ్ము**

**తే.** **నుడుకుఁ గన్నీరఁ దడియంగ నొఱగుచును వి । చేష్టయై యూరకుండుచుఁ జెలులతోడఁ**
**దిరిగి పొగులంగ వేనలి విరియ మేన । నవులఁ దిరుగుచునున్నది యక్కటకట! 45**

**ప్రతిపదార్థం:** చూడుము; ఈ+ముద్దియ= ఈ స్త్రీ; సుతున్+చూచి= కుమారుడిని చూచి; వదనము= ముఖం; అల్లార్చుచున్= కదలిస్తూ= అటూ ఇటూ ఊపుతూ; ప్రాణేశు+ఆననంబుపైన్= తన భర్త ముఖంమీదికి; చూడ్కి= చూపును; అడరించి= వ్యాపింపచేసి; పాణితలంబునన్= అరచేతితో; అందందన్+నెమ్మొగము= ముఖంమీద పలుమార్లు; అడిచికొనుచున్= కొట్టుకొంటూ; మరలన్= మళ్ళీ; పుత్రుని దెసకున్= కొడుకు వద్దకు; అరిగినన్= పోగా; మనసు= తన మనస్సు పేరు+అడలునన్= పెను దుఃఖంలో; మునుఁగంగన్= మునిగిపోగా; అతని చెన్నుమోమునన్= అతడి అందమైన ముఖంపైన; తన మోము= తన ముఖాన్ని; మోపి= ఆనించి; మూర్ఛిల్లుచున్= మూర్ఛపోయి; తెలిసి= తెలివి వచ్చాక; వల్లభు+ఉరఃస్థలమున్= భర్త రొమ్ముమీద; గ్రుమ్మన్= తలబాదుకొంటుంది; ఉడుకు+కన్నీరన్= వేడి కన్నీటితో; తడియంగన్= తడిసేటట్లు; ఒఱగుచును= ఒరగిపోతూ; విచేష్టయై= చేష్టలుడిగి; ఊరకుండుచున్= మౌనంగా ఉండిపోతూ; చెలులతోడన్= తోడి స్త్రీలతో; తిరిగి= కలిసిమళ్ళీ; పొగులంగన్= ఏడుస్తుండగా; వేనలి= జడ; మేనన్= ఒంటిపై విరియన్= వ్యాపించగా; అవులన్= పిచ్చిదానిలాగా బయట; తిరుగుచున్నది= తిరుగుతోంది; అక్కటకట!= అయ్యయ్యో!

**తాత్పర్యం:** కృష్ణా! చూడుము. ఈ భానుమతి తన కొడుకును చూచి ముఖం అల్లాడిస్తూ, భర్త ముఖం వైపు చూచి అరచేతితో తన తలమీద పలుమార్లు బాదుకొంటున్నది. మళ్ళీ కొడుకువైపు మనసుపోగా దుఃఖంలో మునిగిపోయి అందమైన అతడి ముఖంమీద తన ముఖం పెట్టి మూర్ఛపోయింది. తెలివి వచ్చాక భర్త శవంవద్దకు వెళ్ళి రొమ్ముమీద తలను బాదుకొంటున్నది. ఆమె వేడి కన్నీటితో భర్త దేహం తడిసిపోయేటట్లు ఒరిగిపోయింది. నిశ్చేష్టురాలై మౌనంగా ఉండిపోయి మళ్ళీ తన తోడి స్త్రీలతో కలిసి ఏడవటం మొదలుపెట్టింది. జడ విడిపోయి దేహమంతా వ్యాపించగా పిచ్చిదానివలె బయట తిరుగుతున్నది. అయ్యయ్యో! ఎంత ఘోరం!

**విశేషం:** అలం: స్వభావోక్తి

**వ.** **అని వెండియు. 46**

**తాత్పర్యం:** అని ఇంకా.

**సీ. ఈ సుమధ్యమ యిమ్మహీశ్వరు బాహు త । లంబున లలితోపలాలనంబు**
**నొంది రాగిల్లెడునుల్లంబుతో నుండు । నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ**
**వచ్చుఁ? గనుంగొన వశముగాదిది యిట్టి । కొడుకును మనుమండుఁ బుడమి నిట్లు**
**పడియుండఁ జూచెడు పాపజాతికి నిప్ప । డవియక నిగ్గడియైన యినుప**

**తే. గుండియకుఁ జేటుపాటింకఁ బుండరీక । నయన! యెన్నఁడు లేమి నిర్ణయముగాదె?**
**యింత కోర్చెడు నట్టివా రెన్నఁడేని । నుర్వి నెందేని గలుగుదురొక్కొ యొరులు? 47**

**ప్రతిపదార్థం:** పుండరీక నయన!= శ్వేతకమలాక్షా! కృష్ణా!; ఈ సుమధ్యమ= ఈ స్త్రీ (చక్కని నడుముగలది); ఈ+మహీశ్వరు= ఈ సుయోధనుని; బాహుతలంబునన్= బాహువులక్రింద; లలిత+ఉపలాలనంబున్= సుకుమారమైన బుజ్జగింపును; ఒంది= పొంది; రాగిల్లెడు+ఉల్లంబుతోన్= ప్రేమమయమైన హృదయంతో; ఉండున్= ఉంటుంది; ఇంకన్+ఇటన్= ఇకమీదట; ఈ+ముగ్ధన్= ఈ ముద్దరాలిని; ఎట్లు+చూడఁగన్+వచ్చున్?= ఎట్లా చూడగలము?; కనుంగొనన్+వశము+కాదు+ఇది= ఇది చూడటానికి దుర్భరమైన విషయం; ఇట్టి కొడుకును= ఇట్లాంటి కుమారుడు; మనుమండు= ఇట్లాంటి మనుమడూ; పుడమిన్+ఇట్లు= నేలమీద ఇలా; పడి+ఉండన్+చూచెడు= పడి ఉండగా చూచేటువంటి; పాపజాతికిన్= పాపిష్ఠురాలైననాకు; ఇప్పుడు+అవియక= ఇప్పుడే బద్దలు అయిపోకుండా; నిగ్గడి+ఐన= కఠినమైన; ఇనుము+గుండియకున్= ఇనుముతో తయారైన గుండెకు; చేటు+పాటు+ఇంకన్= నాశనం ఇంక; ఎన్నఁడున్= ఏనాటికీ; లేమి= లేకపోవటం; నిర్ణయము+కాదె?= నిశ్చయమేకదా!; ఇంతకున్+ఓర్చెడు+అట్టివారు= ఇంతకష్టానికి కూడా ఓర్చుకొనేటువంటివారు; ఎన్నఁడు+ఏనిన్= ఏనాడైనా; ఉర్విన్+ఎందేనిన్= భూమిమీద ఎక్కడైనా; ఒరులు= ఇతరులు; కలుగుదురు+ఒక్కొ?= ఉంటారా మరి?

**తాత్పర్యం:** కృష్ణా! సన్నని నడుము గలిగిన ఈ భానుమతి ఆ సుయోధనుడి ఉన్నత బాహువుల నీడలో బుజ్జగింపబడి, అతిశయించిన ప్రేమతో సంతోషంతో కనిపించేది. ఇక పైన ఈ ముద్దరాలిని ఎట్లా చూడగలం చెప్పుము? ఇది భరించరాని విషయం. ఇట్లాంటి కొడుకును మనవడిని నేలమీద దిక్కులేకుండా ఇట్లా పడిఉండగా చూచేటటువంటి పాపిష్ఠిదాన్ని నేను. నా గుండె మామూలు గుండెకాదు. ఇనుపగుండె. అందుకే ఇంత దురవస్థను చూచీ బద్దలైపోకుండా ఇంకా అట్లాగే ఉన్నది. ఇక ఎప్పటికీ ఇది బద్దలు కాదు. ఎంత కఠినురాలిని నేను! ఇంత కష్టాన్ని ఓర్వగలిగినవారు ఏ కాలంలోనైనా భూమిమీద ఎక్కడైనా ఇతరు లున్నారా? (నేను తప్ప).

**క. జననియు భార్యయు నేమై । న నేమి? వేదములు బొంకునకుఁ జొరమి నిజం**
**బని పుణ్యలోక మగునని । తన కార్యము సూచె నిట్లు తగునె యితనికిన్?' 48**

**ప్రతిపదార్థం:** జననియున్= తల్లీ; భార్యయున్= భార్యా; ఏమి+ఐనన్+ఏమి?= ఏమయితే ఏమి?; వేదములు= వేదాలు; బొంకునకున్+చొరమి= అసత్యానికి సాహసించకపోవటం; నిజంబు+అని= సత్యమని; పుణ్యలోకము+అగును+అని= స్వర్గం తప్పకసిద్ధిస్తుందని; తన కార్యము+చూచెన్= తనపని తాను చూచికొన్నాడు; ఇతడికిన్= ఇతనికి; ఇట్లు= ఇలా (చేయుటం); తగునె?= సరిపోతుందా?

**తాత్పర్యం:** ఈ దుర్యోధనుడు 'తల్లీ భార్యా ఏమైతేనేమి? వేదాలు అసత్యం పలకవు. స్వర్గం తప్పక సిద్ధిస్తుంది.' అని తనపని తాను చేసికొని తన స్వర్గం తాను చూచికొన్నాడు. ఇట్లా చేయటం సమంజసంగా ఉన్నదా!'

**వ. అని యనేక భంగుల విలాపంబు సేసి తక్కటితనయుల దెస నాలోకించి విష్ణుదేవునితో నిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అని= ఇలా చెప్పి; అనేక భంగులన్= రకరకాలుగా; విలాపంబు+చేసి= ఏడ్చి; తక్కటి= తక్కిన; తనయుల దెసన్= కుమారులవైపు; ఆలోకించి= చూచి; విష్ణుదేవునితోన్= కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తాత్పర్యం:** ఇట్లా అనేక విధాలుగా వాపోయి, ఏడ్చి ఏడ్చి, చివరికి తక్కిన కుమారుల శవాల వైపు చూచి కృష్ణుడితో ఇట్లా అన్నది.

**భాస్కర విలసిత వృత్తము:**

**కౌరవనృపతి తనూజశతంబుం గంటె? పవనసుతు పటుభుజలీలా**
**ఘోరతఁ దడఁబడ మేదినిమీఁదఁగూలె వికటముఖకరచరణత్వం**
**బేరికయినఁ గనుఁగొన్న విషాదం బెంతయు మది నొలయఁగఁ బ్రియకాంతల్**
**చేరి విలపనము దద్దయు నార్తిం జేయఁగ నునికి వనట తిరిఁ బెట్టన్. 50**

**ప్రతిపదార్థం:** కౌరవనృపతి= ధృతరాష్ట్ర మహారాజుయొక్క; తనూజ శతంబున్= నూరుగురు కొడుకులను; కంటె?= చూశావా?; పవనసుతు= భీముని; పటు= బలంతోకూడిన; భుజలీలా ఘోరతన్= భుజముల విలాసంయొక్క భీకరత్వంచేత; తడఁబడన్= ముందువెనుకలై; మేదినిమీఁదన్= నేలమీద; కూలెన్= పడిపోయారు; (వారి); వికట= వికారంపొందిన; ముఖ= ముఖాలు; కరచణత్వంబు= చేతులు, కాళ్ళు కలిగి ఉండటం; ఏరికిన్+అయినన్= ఎవరికైనా; కనుగొన్నన్= చూస్తే; విషాదంబు= విషాదం; ఎంతయున్= ఎంతో (పుడుతుంది); మదిన్+ఒలయఁగన్= (విషాదం) మనుసుల్లో పుట్టగా; ప్రియకాంతల్= ఈ కురువీరకుమారుల భార్యలు; చేరి= వారి శవాలవద్దచేరి; తద్దయున్= మిక్కిలి; ఆర్తిన్= దీనత్వంతో; విలపనము= విలాపం; చేయఁగన్+ఉనికి= చేస్తూ ఉండటం; వనట= దుఃఖాన్ని; తిరిన్+పెట్టన్= పురివెట్టగా (అధికంగా చేయగా).

**తాత్పర్యం:** కృష్ణా! అదిగో! అక్కడ ధృతరాష్ట్ర మహారాజుగారి నూరుగురు సంతానాన్ని చూడుము. భీముడి బలిష్ఠమైన భుజాల విలాసానికి తలకిందులై నేలమీద కూలారు. వికారం పొందిన వారి ముఖాలు, కాళ్ళు చేతులు చూస్తే ఎవరికైనా దుఃఖం కలుగుతుంది. అట్లాంటిది ఈ కుమారుల భార్యలందరూ వారి శవాలవద్ద చేరి అతిదీనంగా విలపిస్తూ ఉండటం చూస్తూంటే దుఃఖం మరింత అధికమవుతున్నది.

**విశేషం:** (తిరిఁబెట్టు'= అన్నది జాతీయం. దీనికి గుడ్డను పురిపెట్టి చెవుల్లో ముక్కుల్లో ఎక్కించటమని అర్థం. పురి ఎక్కించటమనీ అర్థం. పురి ఎక్కిస్తే గట్టిదనం ఎక్కువ అవుతుంది. దానితో ఫలితం అధికమవుతుంది. అట్లాగే దుఃఖం రెండింతలయిందనే అర్థంలో తిక్కనగారు అచ్చమైన ఈ గ్రామీణమైన పలుకుబడిని గాంధారినోట పలికించారు.

భాస్కరవిలసిత వృత్తానికి ప్రతిపాదంలోనూ వరుసగా భ, న, జ, య, భ, న, న, స, గ - అనే గణాలు ఉంటాయి 1-13 అక్షరాలకు యతిమైత్రి. ప్రాస నియమం ఉన్నది.

**తే. చందనార్ద్రకుట్టిమములఁ జరణతలము । లొందుటకు నేవగించు నయ్యువిదలిపుడు**
**నెత్తురుల రేవ మెక్కిన నేలఁ బొరలు । చున్న వారేమి సెప్పుదు? నుడుకుపేర్మి. 51**

**ప్రతిపదార్థం:** చందన+ఆర్ద్ర= శ్రీగంధ కలాపంచేత తడిగా ఉన్న; కుట్టిమములన్= రత్నాలు పొదిగిన చలువరాతి చుట్టులపైన; చరణతలములు= అరికాళ్ళు; ఒందుటకున్= మోపటానికి; ఏవగించు= అసహ్యించుకొనే; ఆ+ఉవిదలు+ఇపుడు= ఆ కురువీరుల భార్యలు ఇపుడు; ఉడుకుపేర్మిన్= విషాదంవలన పుట్టిన వేడితో; నెత్తురుల= రక్తం గడ్డకట్టటంచేత; లేవము+ఎక్కిన= గట్టిపడిన; నేలన్+పొరలుచున్నవారు= నేలమీదపడి పొర్లుతున్నారు; ఏమి+చెప్పుదున్?= ఏమనగలను?

**తాత్పర్యం:** పూర్వం శ్రీగంధం పూసినందువలన చల్లగా తడిగా ఉన్న చలువరాతి చట్టులపైన కాళ్ళుమోపటానికి అసహ్యించుకొనే కురుకుమారుల భార్యలు విషాదం వలన పుట్టిన నిండు వేడిమిలో రక్తం గడ్డలుకట్టి గట్టిపడిన ఈ యుద్ధభూమిలో పడి పొర్లుతున్నారు. ఏ మనేది ఈ దురదృష్టాన్ని?

**క. బాలలుఁ దరుణులు బ్రౌఢలుఁ । దూలెడు వికలాంగకములతో డెందములన్**
**వాలిన విరహానలముల । పాలై వందురెద రొక్కభంగిన యకటా! 52**

**ప్రతిపదార్థం:** బాలలున్= చిన్న వయసులోనివారు; తరుణులు= యుక్తవయసులోనివారు; ప్రౌఢలు= నడిమి వయసులోని వారు; తూలెడు= తూలిపోతున్న; వికల+అంగకములతోన్= వికారశరీరాలతో; డెందములన్= హృదయాలలో; వాలిన= విజృంభించిన; విరహ+అనలముల= విరహమనే అగ్నుల; పాలై= పాలై; ఒక్కభంగిన్= ఒకే రీతిగా; వందురెదరు= దుఃఖిస్తున్నారు; అకట!= అయ్యో! (ఏం దురవస్థ).

**తాత్పర్యం:** ఈ కురుకుమారుల భార్యలలో చిన్నవారు, యుక్తవయుసులలోనివారు, నడివయస్సులలో ఉన్నవారు -అందరూ తూలిపోతున్న వికార శరీరాలతో హృదయాలలో విరహాగ్నులు విజృంభించగా, ఒకే రీతిలో ఏడుస్తూ దుఃఖిస్తున్నారు. అయ్యో! ఇదేమి దురవస్థ!

**క. బలదర్ప ధైర్యశౌర్యో । జ్జ్వలులగు ధృతరాష్ట్రసుతుల సతులకు ని ట్లా**
**కులతమెయి వనటపెల్లునఁ । దలరవలసె దిక్కుమాలి దైవముచెయిదిన్. 53**

**ప్రతిపదార్థం:** బల= బలంచేత; దర్ప= గర్వంచేత; ధైర్య= ధైర్యంచేత; శౌర్య= పరాక్రమంచేత; ఉజ్జ్వలులు+అగు= మిక్కిలి ప్రకాశించిన; ధృతరాష్ట్ర సుతుల సతులకున్= కురు కుమారుల భార్యలకు; ఇట్లు= ఈ విధంగా; ఆకులతమెయిన్= వ్యాకులతతో; దిక్కుమాలి= ఏ దిక్కులేకుండా; దైవము చెయిదిన్= ఆ దైవ చేష్టవలన; వనట పెల్లునన్= అధికమైన దుః ఖంలో; తలర వలసెన్= బాధపడవలసి వచ్చింది.

**తాత్పర్యం:** ఈ కురుకుమారులు బల మున్నవారు. గర్వ మున్నవారు. ధైర్యపరాక్రమాలు కలవారు. మిక్కిలి వైభవంతో ప్రకాశించారు. అట్లాంటి వీరి భార్యలు ఆ దైవం చేసిన పనివలన ఇట్లా మిక్కిలి వ్యాకులత పొంది ఏ దిక్కూ లేని స్థితిలో అతిశయించిన దుఃఖంతో బాధపడవలసి వచ్చింది. దీన్ని ఎట్లా భరించటం?

**క. నిజభూషణాతపత్ర । ధ్వజకంకటఖండవేష్టితములైన కురు**
**వ్రజగాత్రశకలములు వా । రిజనాభ! కనుంగొనంగ రెట్టించె వగల్. 54**

**ప్రతిపదార్థం:** వారిజనాభ!= పద్మనాభా! (కృష్ణా!); నిజ= తమవైన; భూషణ= నగలు; ఆతపత్ర= గొడుగులు; ధ్వజ= టెక్కెములు; కంకట= కవచాలు; (వీటి) ఖండ వేష్టితములైన= ముక్కలతో కూడుకొని ఉన్న; కురువ్రజ= కురుకుమారుల సమూహంయొక్క; గాత్ర శకలములు= శరీర భాగాలు; కనుంగొనంగన్= చూడగా; వగల్= దుఃఖం; రెట్టించెన్= రెండింతలయింది.

**తాత్పర్యం:** కృష్ణా! నగలు, గొడుగులు, ధ్వజాలు, కవచాలు - వీటి ముక్కలతో కలసిపోయిన కురుకుమారుల దేహ భాగాలను చూస్తుంటే నా దుఃఖం ఇబ్బడి అయిపోయింది.

**క. జననియుఁ దండ్రియుఁ దొలు బా । మునఁ జేసిన పాపకర్మమునఁగాక సుయో**
**ధనుఁడు మొదలయిన నూర్వుర । ననఘుఁడు ధర్మజుఁడు నామ మడఁపగఁదగునే. 55**

**ప్రతిపదార్థం:** జననియున్= తల్లీ; తండ్రియున్= తండ్రీ; తొలుబామునన్= పూర్వ జన్మంలో; చేసిన= చేసినటువంటి; పాపకర్మమునన్+కాక= పాపకర్మవలన కాకపోతే; సుయోధనుఁడు మొదలయిన; నూర్వురన్= మహావీరులు నూరుమందినీ; అనఘుఁడు= పుణ్యాత్ముడు; ధర్మజుఁడు= ధర్మరాజు; నామము+అడఁపగన్= పేళ్ళులేకుండా చేయటానికి; తగునే?= సమర్థుడా?

**తాత్పర్యం:** వాళ్ళ తల్లిదండ్రులు చేసిన పూర్వజన్మ పాపంవలన కాకపోతే దుర్యోధనుడు దుశ్శాసనుడు మొదలైన మహావీరులు నూరుమందిని ఈ పుణ్యాత్ముడు ధర్మరాజు నామరూపాలు లేకుండా చేయగలడా?

**విశేషం:** ధర్మరాజును 'పుణ్యాత్ముఁడు' అని నొక్కి చెప్పటంలో గాంధారికి ఇంకా ధర్మరాజాదులపై కోపం నశించలేదని స్పష్టం. స్త్రీకి ఉన్న ఈ పుత్రప్రేమవలన శత్రుద్వేషాన్ని 'పుణ్యాత్ముఁడు' అనేమాట నొక్కి చెప్పుచున్నది.

### గాంధారి దుశ్శాసనుని కళేబరంబు చూచి పలవించుట (సం. 11-18-19)

**సీ. అచ్యుత! వీఁడె మహాభీలభుజుఁడగు । భీమగదాహతి భూమిఁ గూలి**
**యాతని చేత సర్వాంగంబులందును । గలుగు క్రొన్నెత్తురు కాంక్షఁ ద్రావఁ**
**బడి మఱి తెగటారి పడియున్నవాఁడు దు । శ్శాసనుఁ డీతండు సభకు ద్రుపద**
**పుత్రి నీడిచి తెచ్చి పొలువతనమ్మునఁ । బతుల సన్నిధిఁ గురుక్షితివిభునకుఁ**

**తే. గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగ దూల । పుచ్చెఁ బెక్కువిధంబుల నొచ్చి యా మృ**
**గాక్షి యప్పుడు మారుతి యంతరంగ । మేర్పఁ దలఁపించుదానన యింతపుట్టె. 56**

**ప్రతిపదార్థం:** అచ్యుత!=కృష్ణా!; మహా+ఆభీల+భుజుఁడు+అగు= మహా భయంకరమైన భుజబలం కలిగిన; భీమ= భీముని యొక్క; గదాహతిన్= గదదెబ్బలచేత; భూమిన్+కూలి= నేలమీదపడి; ఆతనిచేతన్= ఆ భీముడిచేత; సర్వాంగంబులందును= అన్ని అవయవాలలోనూ; కలుగు= ఉన్న; క్రొన్నెత్తురు= క్రొత్త నెత్తురు; కాంక్షన్= కోరికతో; త్రావఁబడి= త్రాగబడి; మఱి= ఇంతేకాకుండా; తెగటారి= చచ్చి; పడి+ఉన్నవాఁడు= పడిఉన్నాడు; వీఁడె= ఇతడే; దుశ్శాసనుఁడు; ఈతండు= ఇతడు; సభకున్= ఆనాడు సభలోకి; ద్రుపద పుత్రిన్+ఈడిచి+తెచ్చి= ద్రౌపదిని ఈడ్చుకొని వచ్చి; పొలువతనమ్మునన్= దుర్మార్గంతో; పతుల సన్నిధిన్= ఆమె భర్తలముందు; కురుక్షితి విభునకున్= దుర్యోధనునికి; కర్ణునకున్= కర్ణుడికి; చిత్త సంప్రీతి+కాఁగన్= మనసుకు సంతోషమయ్యేలా; పెక్కు విధంబులన్= చాలా రీతులలో; దూలపుచ్చెన్= అవమానించాడు; ఆ మృగాక్షి= ఆ ద్రౌపది; అప్పుడు= ఆ సమయంలో; నొచ్చి= బాధపడి; మారుతి= వాయుదేవుని కుమారుడైన భీముడి; అంతరంగము+ ఏర్పన్+తలపించుదానన= గుండె మండేలా తన బాధను వ్యక్తీకరించినందువల్ల; ఇంత పుట్టెన్= ఇదంతా జరిగింది; (ఎవరు తప్పించగలరు?)

**తాత్పర్యం:** కృష్ణా! మహాభయంకరమైన భుజబలమున్న భీముడి గద దెబ్బలతో నేలమీద పడి అన్ని అవయవాలలోనూ పొంగిన క్రొత్త వేడి నెత్తురును భీముడు తనివితీరా త్రాగగా ప్రాణాలు కోల్పోయి పడి ఉన్నాడు. ఇదుగో! వీడే దుశ్శాసనుడు. ఇతడు ఆనాడు సభలోకి ద్రౌపదికి ఈడ్చుకొని వచ్చి, దుర్యోధనుడు, కర్ణుడు సంతోషపడేటట్లు ఆమెను చాలా రీతులతో అవమానించాడు. ఆ సమయంలో ఆ భీముడి గుండెలు మండిపోయేలా ద్రౌపది తన బాధను ప్రకటిస్తూ ఏడ్చిన ఏడ్పు ఆ ఘోరానికి కారణం. దానివలననే ఇదంతా జరిగింది. ఎవరు తప్పించగలరు?

**క. ఆ సభ నమ్మెయి నీ దు । శ్శాసనుఁ డప్పాండుపుత్రసతిఁ గ్రూరాత్ముం**
**డై సంకలేక పెద్దయుఁ । గాసిం బెట్టంగ నెఱిఁగి కలఁగినమదితోన్. 57**

**ప్రతిపదార్థం:** ఆ సభన్= ఆ సభలో; ఆ+మెయిన్= ఆ తీరుగా; ఈ దుశ్శాసనుఁడు; ఆ+పాండుపుత్రసతిన్= ద్రౌపదిని; క్రూరాత్ముండు+ఐ= కఠినమైన మనస్సుతో; సంకలేక= ఏ జంకూ లేకుండా; పెద్దయున్= మిక్కిలిగా; గాసిన్+పెట్టంగన్= బాధపెట్టగా; ఎఱిఁగి= పరిచారికలు చెప్పగా; తెలిసికొని; కలఁగిన= బాధపడిన; మదితోన్= మనసుతో.

**తాత్పర్యం:** ఆ సభలో ఆ తీరుగా ఈ దుశ్శాసనుడు ద్రౌపదిని కఠినచిత్తుడై ఏ జంకూ లేకుండా మిక్కిలిగా బాధపెట్టగా, ఆ విషయాన్ని పరిచారకుల ద్వారా తెలిసికొని బాధపడ్డ మనస్సుతో.

**వ. ఏను దుర్యోధనునితో నిట్లంటి. 58**

**తాత్పర్యం:** నేను దుర్యోధనుడితో ఇట్లా అన్నాను.

**తరువోజ:**

**హరిచేత రక్షితయైన పాంచాలి కగునయ్య యిమ్మెయి నత్యంత నీచ**
**పరిభవదుఃఖంబుపాల్ సేఁత? మీఁదు పరికింపకున్నఁ గీడ్పాటిల్లకున్నె?**
**యరికంజకుంజరుఁ డగు భీముఁ బల్కులను బరిగోలల నలఁచుమేలె?**
**వెరవిడి వేవేగ విడువుము గారవింపు మీ వంశపవిత్ర నో పుత్ర! 59**

**ప్రతిపదార్థం:** ఓ పుత్ర!= ఓ కుమారా!; హరిచేతన్= శ్రీకృష్ణుడిచేత; రక్షిత+ఐన= రక్షింపబడిన; పాంచాలికిన్= ద్రౌపదికి; ఈ+మెయిన్= ఈ విధంగా; అత్యంత నీచ= మిక్కిలి నీచంగా; పరిభవ దుఃఖంబుపాల్+చేఁత= అవమానమనే దుఃఖంపాలు చేయటం; అగును+అయ్యె?= సరైన పని అవుతుందా?; మీఁదు= తరువాతి జరిగేదానిని; పరికింపకున్నన్= ఆలోచించకుండా ఉంటే; కీడ్+పాటిల్లక+ఉన్నె?= కీడు జరక్కుండా ఉంటుందా?; అరి= శత్రువులనే; కంజ= తామర పూలకు; కుంజరుఁడు+అగు= ఏనుగువంటి వాడయిన; భీమున్= భీముడిని; పల్కులు+అను= మాటలనేటువంటి; బరిగోలలన్= అంకుశాలతో; నలఁచుట= బాధించటం; మేలె?= తగునా?; వెరవు+ఇడి= నీతిని పాటించి (వెరవిఁడి= ఉపాయహీనుడా! అని సంబోధన కూడా కావచ్చు - అపుడు విఁడి అన్నది రూపం); వేవేగ= వెంటనే; విడువుము= ద్రౌపదిని వదలిపెట్టుము; ఈ వంశపవిత్రను= కురువంశ పవిత్రురాలైన ఈ ద్రౌపదిని; గారవింపుము= గౌరవించుము.

**తాత్పర్యం:** కుమారా! శ్రీకృష్ణుడి రక్షణ ఉన్న ద్రౌపదిని ఇట్లా మిక్కిలి నీచంగా అవమానం పాలుచేయటం సరైనపని అవుతుందా? తరువాత ఏమవుతుందో ఆలోచించకుండా పని చేయవచ్చునా? అట్లా చేస్తే కీడు కలుగకుండా

ఉంటుందా? శత్రువు లనే తామరపూలకు ఏనుగువంటివాడు భీముడు. అతడిని మాటవలనే అంకుశాలతో పొడిచి బాధించటం మంచిదా! నీతిని పాటించి వెంటనే ద్రౌపదిని వదలిపెట్టుము. కురువంశానికే పవిత్రత తెచ్చిన ఈ సాధ్విని గౌరవించుము.

**విశేషం:** అలం: రూపకం. ద్రౌపది అగ్నిలోపుట్టింది. కనుక పవిత్రురాలు. రాజసూయయాగంలో పవిత్రస్నానంచేత కూడా పవిత్రురాలు. కనుక అవమానించటం వలన వంశం నశిస్తుందన్న సూచన ఉన్నది.

తరువోజలో ప్రతిపాదానికీ రెండింద్రగణాలూ ఒక సూర్యగణమూ, మరల రెండింద్రగణాలూ ఒక సూర్యగణమూ ఉంటాయి. గణాల మొదటి అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**క. క్రూరాత్ముఁడు నీచుఁడు గాం। ధార విభునిఁ దొఱఁగు పాండు తనయులఁ బుణ్య**
**ప్రారంభులఁగూడి మనుము। కౌరవకుల మెల్ల బ్రదుకఁగాఁ బొగడొందన్.' 60**

**ప్రతిపదార్థం:** క్రూర+ఆత్ముఁడు= కఠిన చిత్తుడు; నీచుఁడు= నీచగుణాలు కలిగినవాడు; గాంధార విభునిన్= గాంధారరాజు శకునిని; తొఱఁగు= వదలిపెట్టుము; పాండు తనయులన్= పాండుపుత్రులను; పుణ్యప్రారంభులన్= పుణ్యం సంపాదించే కార్యాల విషయంలో పూనిక గలవారు; (అట్లాంటివారిని); కూడి= కలిసికొని; కౌరవకులమెల్లన్= కౌరవ వంశీయులంతా; బ్రదుకఁగాన్= జీవించేలా; పొగడు+ఒందన్= ప్రశంసలు పొందగా; మనుము= నీవు హాయిగా బ్రదుకుము.

**తాత్పర్యం:** ఈ గాంధారరాజు శకుని కఠినచిత్తుడు. అతినీచగుణాలు కలిగినవాడు. (నా సోదరుడే కావచ్చును గాక - అని అర్థం). 'ఇతడి స్నేహం వదలిపెట్టుము. పాండవులు పుణ్యం సంపాదించే కార్యాల విషయంలో పూనిక గలవారు. అట్లాంటివారి స్నేహం చేయుము. కౌరవవంశీయు లంతా చల్లగా బ్రదుకుతారు. ప్రపంచమంతా నిన్ను స్తుతిస్తుంది. నీవు చల్లగా ఉండుము'.

**క. అని యెన్ని భంగులను జె। ప్పినఁ దా నప్పలుకు లెల్లఁ బెడచెవులం బె**
**ట్టె నుదగ్రుఁడు దగుకార్యము। గనునె? వశంబగునె దైవగతి తప్పింపన్? 61**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; ఎన్ని భంగులను= ఎన్ని రీతులుగా; చెప్పినన్= చెప్పినా; తాను= ఆ దుర్యోధనుడు; ఆ+పలుకులు+ఎల్లన్= ఆ మాటలను అన్నిటినీ; పెడచెవులన్+పెట్టెన్= పెడచెవిని పెట్టాడు (వినలేదు); ఉదగ్రుఁడు= మిక్కిలి కోపమున్నవాడు; తగు కార్యమున్= తగిన పనిని (సముచిత కార్యాన్ని); కనునె?= నిర్ణయించుకోగలడా?; దైవగతి= దైవనిర్ణయం; తప్పింపన్= తప్పించటానికి; వశంబు+అగునె?= వీలు అవుతుందా?

**తాత్పర్యం:** అని ఈ విధంగా ఎన్ని రీతులుగా చెప్పినా ఆ దుర్యోధనుడు ఆ మాటలను పెడచెవినిపెట్టాడు. కోపిష్ఠి ఏది మంచి? ఏది చెడు? అనే ఆలోచనతో పని చేస్తాడా? అయినా దైవనిర్ణయం తప్పించటం ఎవరికి సాధ్యమవుతుంది.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**తే. నాఁటిమాట లుల్లంబున నాటియుండ। నొవ్వుతోఁ దటివేచి నేఁ డివ్విధమునఁ**
**బటిచె భీముండు నొప్పింపఁబడిన త్రాఁచు। పాము పగసాటి తెగ తార్చుభంగిఁ గృష్ణ! 62**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= కష్ణా!; నాఁటిమాటలు= ఆనాటి పలుకులు; ఉల్లంబునన్= హృదయంలో; నాటి+ఉండన్= నాటుకొని ఉండగా; నొవ్వుతోన్= బాధతో; తఱి+వేచి= సమయం కోసం కాచుకొని ఉండి; నేఁడు= ఈ రోజు; ఈ+విధమునన్= ఈ విధంగా; భీముండు= భీముడు; నొప్పింపఁబడిన= బాధింపబడిన; త్రాఁచుపాము= నాగుపాము; పగ+చాటి= పగను ప్రకటించి (కసిదీరా); తెగటార్చు భంగిన్= చంపేవిధంగా; పఱిచెన్= చంపాడు (చేశాడు).

**తాత్పర్యం:** కృష్ణా! ఆనాడు సభలో వాళ్ళంతా మాట్లాడిన మాటలు హృదయంలో గాఢంగా నాటుకొనిపోగా ఆ బాధతో సరైన సమయంకొరకు కాచుకొని ఉన్న భీముడు ఈనాటికి దెబ్బతిన్న నాగుపాము కసిదీరా కాటువేసినట్లు ఈ విధంగా కురుకుమారులందరినీ చంపాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **తగుఁ బగ దీర్చుట యిమ్మెఁ । దగ వగునే నెత్తురెత్తి త్రావుట? భీముం**
**డు గడున్ ఘోరము సేసెను । మగల కతి క్షుద్రవృత్తమా పొగ డొసఁగున్?** **63**

**ప్రతిపదార్థం:** పగతీర్చుట= పగతీర్చుటం; తగున్= సమంజసమే; ఈ+మెయిన్= ఈ విధంగా; నెత్తురు+ఎత్తి+త్రావుట= నెత్తురు తీసికొని త్రాగటం; తగవు+అగునే?= న్యాయమా?; భీముండు= భీముడు; కడున్= మిక్కిలి; ఘోరము= ఘోరమైనపని; చేసెను= చేశాడు; మగలకున్= వీరులకు; అతి= మిక్కిలి; క్షుద్రవృత్తమా= నీచ పద్ధతా; పొగడు+ఒసఁగున్?= ప్రశంసను తెచ్చేది?

**తాత్పర్యం:** పగ తీర్చుకొనటం ఎవరికైనా సమంజసమే. కాని, ఈ విధంగా నెత్తురు తీసికొని త్రాగటం న్యాయమైన పని అవుతుందా? ఏమైనా భీముడు చాలా దారుణమైన పనిచేశాడు. వీరులకు ఇట్లాంటి నీచమైన పద్ధతులద్వారానా మంచి పేరు వచ్చేది? (రాదని అర్థం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**తరలము:**

**కరములుం జరణంబులున్ విరి గల్గి సాఁగి వికీర్ణమై**
**యురము నిర్భరవైకృతంబుగ నుర్విఁ ద్రెళ్ళి సుతుండు గే**
**సరి నఖంబుల వ్రవ్వఁబడ్డ గజంబు చాడ్పున నుండఁగాఁ**
**గరుణ మాత్మకు నింత మిక్కిలి గాక యున్నె? జనార్దనా!** **64**

**ప్రతిపదార్థం:** జనార్దనా!= కృష్ణా!; కరములున్= చేతులూ; చరణంబులున్= కాళ్ళూ; విరి గల్గి సాఁగి= విడిపోయి వ్యాపించి; వికీర్ణమై= ముక్కలై (యుద్ధభూమిలో వెదజల్లబడ్డాయి); ఉరము= రొమ్ము; నిర్భర= మిక్కిలి; వైకృతంబుగన్= వికారరూపాన్ని పొంది; ఉర్విన్= నేలమీద; త్రెళ్ళి= పడి; సుతుండు= ఈ దుశ్శాసనుడు; కేసరి నఖంబులన్= సింహం గోళ్ళతో; వ్రవ్వఁబడ్డ= చీల్చబడిన; గజంబు చాడ్పునన్= ఏనుగులాగా; ఉండఁగాన్= కనిపిస్తుండగా; ఆత్మకున్= మనసుకు; కరుణము= దుఃఖం; ఇంత= మరింత; మిక్కిలి+కాక+ఉన్నె?= అధికం కాకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** కృష్ణా! చేతులు కాళ్ళు విడిపోయి ముక్కలు ముక్కలై యుద్ధభూమిలో వెదజల్లబడ్డాయి. రొమ్ము చీలిపోయి వికారంగా తయారై నేలమీదపడిన ఈ దుశ్శాసనుడిని చూస్తే సింహంగోళ్ళచేత చీల్చబడిన ఏనుగువలె అగుపిస్తున్నాడు. ఇట్లాంటి కొడుకును చూచి మనసులో దుఃఖం మరింత ఎక్కువ కాకుండా ఉంటుందా? చెప్పుము.

**విశేషం:** అలం: ఉపమ. తరలములో ప్రతిపాదానికీ న, భ, ర, స, జ, జ, గ అనే గణాలుంటాయి. 1-12 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**సీ.** **వీఁడె వికర్ణుండు వాఁడి మెఱుంగు మే । ఘంబుల గముల మధ్యంబునందుఁ**
**దేజరిల్లెడుమాడ్కి రాజిల్లుచున్నవాఁ । డతిసాంద్రహస్తికాయములలోనఁ**
**గార్ముకజ్యాకిణకఠినమైనయున్న యి । బ్బాలుని ముంజేయి బాల గృధ్ర**
**మోపదు కబళించియును జంచుపుటమునఁ । జీరంగఁ జూచితే శౌరి? యితని**

**తే.** **రమణి పొరిఁబొరి గన్నీరు గ్రమ్మఁ జుట్టు । మెలఁగి కాకుల గ్రద్దలఁ దొలఁగ నడుచు**
**చున్నయది పాసి యవి వోవకున్న నిట్లు । సూతురే తల్లులెందును సుతుల నకట!** **65**

**ప్రతిపదార్థం:** వీఁడె= వీడే; వికర్ణుండు; వాఁడి మెఱుంగు= ఉజ్జ్వలమైన మెరుపు; మేఘంబుల గముల= మేఘాల గుంపుల; మధ్యంబునందున్= నడుమ; తేజరిల్లెడు మాడ్కిన్= ప్రకాశించు రీతిగా; అతిసాంద్ర= మిక్కిలి బలిష్ఠములైన; హస్తి కాయములలోనన్= ఏనుగుల దేహాలమధ్య; రాజిల్లుచున్నవాఁడు= ప్రకాశిస్తున్నాడు; కార్ముక= ధనుస్సు యొక్క; జ్యా= అల్లెత్రాటిని లాగటంవల్ల పుట్టిన; కిణ= కాయలచేత; కఠినము+ఐ+ఉన్న= గట్టిగా ఉన్న; ఈ బాలుని= ఈ కుమారుడి; ముంజేయిన్= ముంచేతిని; బాలగృధ్రము= పిల్లగద్ద; కబళించియును= ముక్కుతోపట్టుకున్నా; చంచుపుటమునన్= ముక్కుపుటంతో; చీరంగన్= చీల్చడానికి; ఓపదు= దానిచేత కావటంలేదు (అంత పెద్దదని అర్థం); చూచితే శౌరి?= కృష్ణా చూస్తున్నావా?; ఇతని రమణి= ఇతని భార్య; పొరిన్+పొరిన్= మాటిమాటికి (నిరంతరంగా); కన్నీరు క్రమ్మన్= కంట్లో నీరు కమ్ముతుండగా; చుట్టున్+మెలఁగి= చుట్టూ తిరుగుతూ; కాకులన్= కాకులనీ; గ్రద్దలన్= గద్దలనీ; పాసి= దూరంగా; అవి= ఆ కాకులు గద్దలు; పోవకున్నన్= పోకుండా ఉంటే; (వాటిని); తొలఁగన్= పారిపోయేలా; అడుచుచున్న+అది= తరుముతూ ఉంది; ఇట్లు= ఈ విధంగా; తల్లులు; ఎందును= ఎక్కడైనా; సుతులన్= కొడుకులను; చూతురే?= చూశారా?; అక్కట!= అయ్యో!

**తాత్పర్యం:** కృష్ణా! ఇదిగో వీడే వికర్ణుడు. ఉజ్జ్వలమైన మెరుపు మేఘాలనడుమ తళుక్కున ప్రకాశించినట్లుగా అతి బలిష్ఠములైన ఏనుగుల దేహాల మధ్య వెలుగుతూ ఉన్నాడు. నిరంతరం వింటినారిని లాగటంవలన పుట్టిన కణుపులచేత గట్టిపడిన ఈ కుమారుడి ముంజేతిని పిల్లగద్ద ముక్కుతో కరుచుకొనటానికి యత్నించినా ముక్కుపుటంతో దానిని చీల్చటం ఆ గ్రద్దకు సాధ్యం కాలేదు. చూచావా? కృష్ణా! అదిగో అతడి భార్య నిరంతరంగా ఏడుస్తూ భర్త శవంచుట్టూ తిరుగుతూ, మూగుతున్న కాకులను గద్దలను దూరంగా తరుముతూ ఉన్నది పాపం. ఇట్లా ఏ తల్లులకైనా ఎక్కడైనా తమ కొడుకులను చూచే దౌర్భాగ్యం కలిగిందా! అయ్యో! నేనెంత దురదృష్టవంతురాలిని!

**విశేషం:** అలం: ఉపమ. అర్థాంతరన్యాసం.

**క.** **మారుతనందను నుగ్రపు । నారాచము లొడల నాటినం జచ్చియు న**
**వ్వీర కుమారుం డుజ్జ్వల । చారుత్వముఁ బాయకున్న చందముఁ గంటే?** **66**

**ప్రతిపదార్థం:** మారుత నందను= వాయు నందనుడైన భీముడియొక్క; ఉగ్రము+నారాచములు= క్రూరమైన బాణాలు; ఒడలన్= ఒంటియందు; నాటినన్= దిగబడగా; చచ్చియున్= చనిపోయికూడా; ఆ+వీర కుమారుండు= ఆ వికర్ణుడు; ఉజ్జ్వల చారుత్వమున్= ప్రకాశంతోడి అందాన్ని; పాయకున్న= వదలకున్న; చందము= తీరును; కంటే?= చూస్తున్నావా?

**తాత్పర్యం:** కృష్ణా! భీముడు వేసిన క్రూరమైన బాణాలు దేహంలో దిగబడి ప్రాణాలు కోల్పోయికూడా ఈ వీరకుమారుడి దేహంలో కాంతి, మనోహరత్వం తగ్గకున్నాయి. చూస్తున్నావు కదా!

**క. అని మొన నెవ్వరికిని మా । ర్కొన రాని ఘనుండు దుర్ముఖుఁడు భీమునిచే**
**వినిపాతితుఁడై భూరజ । మున బ్రుంగుడు వడ్డవాఁడు మురహర! కంటే? 67**

**ప్రతిపదార్థం:** మురహర!= మురాసురుడిని చంపిన ఓ కృష్ణా!; అనిమొనన్= యుద్ధంలో; ఎవ్వరికిని= ఎవరికీ; మార్కొనన్+రాని= ఎదిరించటానికి వీలులేని; ఘనుండు= బలవంతుడైన; దుర్ముఖుఁడు= దుర్ముఖుడు; భీమునిచేన్= భీముడిచేత; వి+ నిపాతితుఁడు+ఐ= కొట్టబడి నేలగూలి; భూరజమునన్= నేలమీది ధూళిలో; బ్రుంగుడు+పడ్డవాఁడు= మునిగిపోయాడు; కంటే?= చూశావా?

**తాత్పర్యం:** కృష్ణా! ఇదిగో చూడుము! ఈ దుర్ముఖు డున్నాడే - వీడిని యుద్ధంలో ఎవరూ ఎదిరించలేరు. అంతటి బలపరాక్రమశాలి వీడు. అట్లాంటి వీడు భీముడి గద దెబ్బలకు నేలగూలి మట్టిలోని దుమ్ముధూళులతో మునిగిపోయాడు. చూస్తున్నావా!

**తే. నక్క తోఁడెలు వీని యాననము సగము । దిన్నయవి యట్టులయ్యును నున్నయొప్ప**
**దొరసి సప్తమినాఁటిచందురునిఁ బోలె । చూడు భావించి దీపితశూరవంశ! 68**

**ప్రతిపదార్థం:** దీపిత= ప్రకాశించే; శూరవంశ!= శూరుని వంశం కలవాడా! (నీవు పుట్టగా శూరుని వంశం ప్రకాశించిందని అర్థం. శౌరి- అని కృష్ణుడికి మరో పేరు); నక్క; తోఁడెలు; వీని+ఆననమున్= వీడి ముఖాన్ని; సగము+తిన్నయవి= సగం తిన్నాయి; అట్టులు+అయ్యును= అలా అయికూడా; ఉన్న+ఒప్పు= ఉన్నకాంతి; దొరసి= కలిగి; సప్తమినాఁటి= శుద్ధ సప్తమినాడు ప్రకాశించే; చందురునిన్+పోలెన్= చంద్రుడివలె; భావించి చూడు= కాస్త ఆలోచించి చూడుము.

**తాత్పర్యం:** కృష్ణా! నీవు శూరుడి వంశాన్ని ప్రకాశింపజేశావు. అక్కడ చూడుము. నక్క, తోడేలు వాడి ముఖాన్ని సగం తినివేశాయి. అయినా కూడా ఆ ముఖంలో మిగిలిన కాంతి సప్తమినాటి చంద్రబింబంవలె కాంతులు చిమ్ముతూనే ఉన్నది. బాగా చూడుము.

**విశేషం:** ఉపమ.

**మత్తకోకిల:**

**శూరసేనుఁడు భీమసేననిషూదితుండయి చుట్టు నం**
**భోరుహానన లార్తి మూర్తతఁ బొందిన ట్లతిరూక్ష హా**
**హారవంబులతోడఁ గ్రుమ్మర నల్లవాఁడె వికారితా**
**కారుఁడై పడియున్నవాఁడు వృకంబుఁ బక్షులు జించినన్. 69**

**ప్రతిపదార్థం:** శూరసేనుఁడు= శూరసేనుడనే నా కుమారుడు (అదిగో); భీముడిచేత; నిషూదితుండు+అయి= చంపబడి; చుట్టున్= చుట్టూ; అంభోరుహ+ఆననలు= పద్మముఖులైన భార్యలు; ఆర్తి= దీనత్వం; మూర్తతన్+పొందినట్లు= మూర్తిమత్త్వాన్ని పొందినట్లు; అతి+రూక్ష= అతి దారుణమైన; హాహారవంబులతోడన్= హాహాకారాలతో; క్రుమ్మరన్= తిరుగుతుండగా; అల్లవాఁడె= అదుగోవాడే (అక్కడ); వృకంబు= తోడేలు; పక్షులు= కాకులు గద్దలు; చించినన్= చీల్చివేయగా; వికారిత+ ఆకారుఁడు+ఐ= వికారంపొందిన శరీరం కలిగినవాడై; పడి+ఉన్నవాఁడు= పడి ఉన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! వాడే నా కొడుకు శూరసేనుడు. భీముడిచేత చంపబడి, చుట్టూ అతని భార్యలు దీనత్వం ఆకారం పొందినట్టు అతి దారుణంగా హాహాకారాలు చేస్తూ విలపిస్తూ తిరుగుతుండగా, తోడేలు, కాకులు గ్రద్దలు చీల్చివేయగా దేహం గుర్తించటానికి వీలులేకుండా మారిపోయి పడి ఉన్నాడు.

**విశేషం:** మత్తకోకిలలో ప్రతిపాదానికీ ర, స, జ, జ, భ, ర - అనేగణాలుంటాయి. 1-11 యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**సీ.** **అంగంబు కోమల మంతరంగంబు చా । తుర్య నిరూఢంబు శౌర్యఘనుఁడు**
**వీఁడె గోవింద! వివింశతి యీతండు । సొబగుండు మెలఁతలు సుట్టు నెపుడు**
**నప్సరోగణ మమరాధిపుఁ గొలిచెడు । చాడ్పునఁ బాయక సమ్మదంబు**
**చిగురొత్త నుండుదు రగరుకస్తూరికా । చందనాద్యనులేపశాలి యిపుడు**

**తే.** **గ్రద్దలును గాకులును జుట్టుఁ గదిసియుండఁ । దఱచునెత్తుటఁ దోఁగిన తనువుఁ దాను**
**నున్నవాఁడు గానాకర్ణనోత్సుకుండు । నక్క లఱచెడు చేరువ నక్కటకట! 70**

**ప్రతిపదార్థం:** గోవింద!= కృష్ణా!; వీఁడె= ఇతడే; వివింశతి= వివింశతి అనే పేరు గల నా మరి ఒక కుమారుడు; అంగంబు కోమలము= ఇతని శరీరము చాలా సుకుమారం; అంతరంగంబు= మనస్సు; చాతుర్యనిరూఢంబు= నేర్పరితనంలో ప్రసిద్ధం; శౌర్యఘనుఁడు= గొప్ప పరాక్రమంచేత గొప్పవాడు; ఈతండు= ఇతడు; సొబగుండు= అందగాడు; చుట్టున్= ఇతడి చుట్టూ; మెలఁతలు= స్త్రీలు; ఎపుడున్= ఎల్లప్పుడూ; అమరాధిపున్= ఇంద్రుడిని అప్సరస్+గణము= అప్సరసల సమూహం; కొలిచెడు చాడ్పునన్= సేవించే తీరుగా; పాయక= ఎప్పుడూ వదలకుండా; సమ్మదంబు= సంతోషం; చిగురొత్తన్= క్రొత్త క్రొత్తగా పుడుతుండగా (నిత్య సంతోషంతో); ఉండుదురు= (ఇతనిచుట్టూ) ఉంటారు; అగరు= అగరు; కస్తూరికా= కస్తూరి; చందనాది= శ్రీగంధం మొదలైన; అనులేపశాలి= అనులేపాలను పూసుకోవటంలో సుసంపన్నుడు; ఇపుడు; గ్రద్దలును= గ్రద్దలూ; కాకులును= కాకులూ; చుట్టున్= చుట్టూ; కదిసి+ఉండన్= మూగి ఉండగా; తఱచు నెత్తుటన్= మిక్కిలిగా రక్తంలో; తోఁగిన= మునిగిపోయిన; తనువున్+తానున్= తనువుతో తాను; ఉన్నవాఁడు= ఉన్నాడు; గాన+ఆకర్ణన= పాటలను వినటంలో; ఉత్సుకుండు= ఆసక్తి కలవాడు; నక్కలు; అఱచెడు= ఊళలువేసే; చేరువన్= చోట; అక్కటకట!= అయ్యయ్యో! (పడిఉన్నాడు).

**తాత్పర్యం:** కృష్ణా! వీడు నా ఇంకొక కుమారుడు వివింశతి. ఇతడి శరీరం సుకుమారం. మనసు నేర్పరితనంలో ప్రసిద్ధమైనది. గొప్ప పరాక్రమం కలిగినవాడు. ఇంద్రుడి చుట్టూ అప్సరసలు సేవిస్తూ ఉండే విధంగా ఇతడి చుట్టూ ఎల్లప్పుడూ స్త్రీలు వదలకుండా నిత్య సంతోషంతో ఉండేవారు. అగరు, కస్తూరి, చందనం మొదలైన సుగంధద్రవ్యాల పూతలను పూసికొని చాలా వైభవంతో కనిపించేవాడు. ఇప్పుడు అతని చుట్టూ గ్రద్దలు, కాకులు కూచుకొని ఉన్నాయి. రక్తపుమడుగులో మునిగిపోయి ఉన్నాడు. ఇతడికి సంగీతమంటే చాలా ఆసక్తి. ఇపుడు నక్కలు ఊళలువేసే చోట పడి ఉన్నాడు. ఎంత దౌర్భాగ్యమో చూడుము.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **కనకపుంఖశరావృత గాత్రుఁడైన । దుష్ప్రహుండు చచ్చి యుండియుఁ దోయజాక్ష!**
**వికచ నవకర్ణికార సంవేష్టనంబు । గలుగు శైలంబు తెఱఁగునఁ బొలిచెఁ జూడు.** **71**

**ప్రతిపదార్థం:** తోయజాక్ష!= పద్మనయనా కృష్ణా!; కనకపుంఖ= బంగారు పింజలు అమర్చిన; శర+ఆవృత= బాణాలచేత కప్పబడిన; గాత్రుఁడు+ఐన= దేహం కలిగినటువంటి; దుష్ప్రహుఁడు= దుష్ప్రహుడు అనే పేరుగల నా కొడుకు; చచ్చియుండియున్= చనిపోయికూడా; వికచనవ= అప్పుడే వికసించిన; కర్ణికార= కొండగోగు చెట్లయొక్క; సంవేష్టనంబు= చుట్టూ కూడుకొని ఉండటం; కలుగు= కలిగిన; శైలంబు= కొండ; తెఱఁగునన్= రీతిగా; పొలిచెన్= ప్రకాశిస్తున్నాడు; చూడు= చూడుము.

**తాత్పర్యం:** కృష్ణా! అటు చూడుము. బంగారు పింజలు అమర్చిన బాణాలచేత కప్పబడిన దేహం కలిగి, నేల కొరిగిన దుష్ప్రహుడు చనిపోయికూడా అప్పుడే వికసించిన కొండగోగుచెట్టులు చుట్టూ విస్తరించగా ప్రకాశించే కొండవలె కాంతులు విరజిమ్ముతూ పడి ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

### గాంధారి యభిమన్యు కళేబరంబు గనుంగొని ప్రలాపించుట (సం. 11-20-1)

**వ.** **అని మఱియు నిట్లనియె.** **72**

**తాత్పర్యం:** అని ఇంకా ఇట్లా అన్నది.

**లయవిభాతి:**

**అరయ నిది పెద్దయని యరుల మొనఁ జిత్తమున । సరకుగొన కుగ్రమగు బరవస మెలర్పం**
**ద్వరితగతిఁ జొచ్చి కురువరుఁడు దలరం గవిసి । కరితతులుఁ దేరులనికరములుఁ దురంగో**
**త్కరములును గాల్బలము నెరవులును గీటడఁగ । శరగురుఁడుఁ గర్ణుఁడును గురుసుతుఁడు మద్రే**
**శ్వరుఁడుఁ గృపుఁడుం బరవ బరఁగి దివిజుల్ వొగడ । ధరఁబడి ముకుంద! మన నరతనయుఁ డొప్పెన్.** **73**

**ప్రతిపదార్థం:** ముకుంద!= కృష్ణా!; మన నరతనయుఁడు= మన అర్జునుని కొడుకు (అభిమన్యుడు); అరయన్= చూడగా; ఇది; పెద్ద+అని= చాలాపెద్ద దని; లెక్కచేయకుండా; ఉగ్రము+అగు= భయంకరమైన; బరవసము= ధైర్యం; ఎలర్పన్= పుట్టగా; త్వరితగతిన్= అతివేగంగా; చొచ్చి= యుద్ధరంగంలో ప్రవేశించి; కురువరుఁడు= దుర్యోధనుడు; తలఁదన్= భయపడేట్టు; కవిసి= ఎదుర్కొని; కరితతులు= ఏనుగుల సమూహాలు; తేరుల నికరములు= రథాల సముదాయాలు; తురంగ+ఉత్కరములు= గుర్రాల గుంపులు; కాల్బలము= సైనికులు; నెరవులును= పరివారమూ; గీటడఁగన్= చావగా; శరగురుఁడు= ద్రోణుడూ; కర్ణుఁడును= కర్ణుడూ; గురుసుతుఁడున్= అశ్వత్థామా; మద్రేశ్వరుఁడున్= శల్యుడూ; కృపుఁడున్= కృపుడూ; పరవన్= బాణాలు ప్రయోగించగా; పరఁగి= ఘోరయుద్ధం చేసి ప్రసిద్ధుడై; దివిజుల్+పొగడన్= దేవతలు స్తుతించగా; ధరన్+పడి= నేలగూలి; ఒప్పెన్= ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! మన అర్జునుడి కుమారుడి అభిమన్యుడు వీడే. శత్రుసైన్యం అంత పెద్దదని ఏ మాత్రం లెక్కచేయకుండా భయంకరమైన ధైర్యంతో అతివేగంగా పద్మవ్యూహాన్ని ప్రవేశించి దుర్యోధనుడివంటి మహావీరుడు

భయపడేటట్టు ఎదిరించి యుద్ధం చేశాడు. ఏనుగులను, రథాలను, గుర్రాలను, సైనికులను, పరివారాలను నుగ్గునుగ్గ చేశాడు. చివరికి ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, శల్యుడు, కృపుడు - అందరూచేరి ఘోరంగా బాణాలు ప్రయోగించగా వాటిని ఎదిరించి ప్రసిద్ధుడై దేవతలు ప్రస్తుతిస్తుండగా నేలమీద కూలి ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** లయవిభాతికి వృత్తలక్షణానికి చూడండి - స్త్రీ. 1-131.

**ఆ. పాడి మాలి తన్నుఁ బలువురు పొదివినఁ । బోరి తద్ద డప్పిఁ గూరి నిదుర**
**పోయెనొకొ సుభద్ర పుత్త్రుండు! మృతుఁడైనఁ । జెలువ మింత యేల కలుగ నేర్చు? 74**

**ప్రతిపదార్థం:** పాడి= న్యాయం; మాలి= తప్పి; తన్నున్= తనను; పలువురు= చాలమంది; పొదివినన్= చుట్టుముట్టుగా; పోరి= పోరాడి; తద్ద= మిక్కిలి; డప్పిన్= దప్పికతో; కూరి= మునిగి; నిదురపోయెన్+ఒకొ!= నిద్రపోయాడు కాబోలు!; సుభద్ర పుత్రుండు= ఈ అభిమన్యుడు; మృతుఁడు+ఐనన్= చనిపోయి ఉంటే; ఇంత; చెలువము= సౌందర్యం; ఏల= ఎందుకు; కలుగన్+నేర్చున్?= ఉంటుంది?

**తాత్పర్యం:** అన్యాయంగా తనను అంతమంది చుట్టుముట్టితే వారితో పోరాడి పోరాడి, అలసిపోయి, దప్పికతో గాఢనిద్రలో మునిగిపోయాడు కాని, మన అభిమన్యుడు చావలేదు. చనిపోయి ఉంటే ముఖంలో ఇంత 'కళ' ఎందుకుంటుంది?

**విశేషం:** అలం: కావ్యలింగం.

**సీ. ఉత్తర యిక్కుమారోత్తము నురమున । వ్రాలి మోమునఁ దనవదనకమల**
**మందంద చేర్చుచున్నది మున్ను గన్నంత । మెలఁగంగనేరక చెలులమాటు**
**గొను సిగ్గు పెంపున వనట నిట్లయ్యె ని । ప్పడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియునిఁ**
**గనుఁగొని బిగియారఁ గౌఁగిలించుచు శిర । మూరుతలంబున నునిచి పాణి**

**తే. పల్లవంబున నానన మల్లనల్ల । దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ**
**బొడము పెల్లునఁ గన్నీరు దుడిచికొనుచు । నలఁత పెనువెల్లిఁ దేలెడు నంబుజాక్ష! 75**

**ప్రతిపదార్థం:** అంబుజాక్ష!= కృష్ణా!; ఉత్తర= అభిమన్యుడి భార్య ఉత్తర; ఈ+కుమారోత్తము= అభిమన్యుడి; ఉరమునన్= రొమ్ముమీద; వ్రాలి= వ్రాలి; మోమునన్= ముఖంమీద; తన; వదనకమలమున్= కమలంవంటి ముఖాన్ని; అందందు+అ= మాటి మాటికి (అక్కడక్కడా); చేర్చుచున్నది= ఆనిస్తోంది; మున్ను= ముందు (యుద్ధానికి మునుపు); కన్న+అంతన్= అభిమన్యుడిని చూడగానే; మెలఁగంగన్+నేరక= అతనితో కలిసి వర్తించటానికి ధైర్యంచాలక; సిగ్గుపెంపునన్= అధికమైన సిగ్గుతో; చెలుల మాటు+కొనున్= చెలికత్తెల చాటుకు వెళ్ళిపోయేది; వనటన్= దుఃఖంతో; ఇప్పుడు; ఇట్లు+అయ్యెన్= ఇట్లా అయింది చూడు; పొలఁతి= ఈమె (స్త్రీ); ప్రియునిన్= ప్రియుడిని; కనుఁగొని= చూసి; బిగియారన్= గట్టిగా; కౌఁగిలించుచున్= కౌగిలించుకొంటూ; శిరమున్= తలను; ఊరుతలంబునన్= తొడలమీద; ఉనిచి= ఉంచుకొని; పాణిపల్లవంబునన్= అరచేతులతో; ఆననము= ముఖాన్ని; అల్లనల్లన్= మెల్లమెల్లగా; తొడయుచును= నిమురుచు; నిన్నున్+చూచుచున్= నిన్ను చూస్తూ; తోడుతోడన్= వెంటనే; పొడము పెల్లునన్= పుట్టే ఆధిక్యంతో; కన్నీరు తుడిచికొనుచున్= వచ్చిన కన్నీరును తుడుచుకొంటూ; అలఁత పెనువెల్లిన్= శోక మహాసముద్రంలో; తేలెడున్= కొట్టుకొనిపోతున్నది.

**తాత్పర్యం:** కృష్ణా! ఉత్తరాదేవి తన భర్త రొమ్ముమీద వాలిపోయి ముఖంమీద ముఖం మాటిమాటికి ఆనిస్తోంది. యుద్ధానికి మునుపు అభిమన్యుడిని చూడగానే చెలికత్తెలచాటుకు సిగ్గుతో పారిపోయేది. మరి ఇప్పటి స్థితిలో అతి దుఃఖంవలన ఇట్లా అయింది. ప్రియుడిని చూచి గట్టిగా కౌగిలించుకొని మోకాళ్ళపై తలను వాల్చి అరచేతులతో మోగాన్ని స్పృశిస్తూ నిన్ను చూడగానే మరింత దుఃఖానికి లోనై కంటినీరు తుడుచుకొంటూ శోకమహా సముద్రంలో మునిగిపోయింది పాపం!

**విశేషం:** అలం: రూపకం.

**వ. వింటె యవ్వనిత విలాపంబు? 76**

**తాత్పర్యం:** ఆ స్త్రీ విలపిస్తున్న తీరు విన్నావా?

**సీ. 'భద్రచారిత్ర! సుభద్రను నిర్జర । ప్రతిమానులగు పాండురాజసుతులఁ**
**బాసి యెం దరిగితి? పార్థుని పట్టి న। చ్యుతుని యల్లుని సమరోర్విఁ జెనసి**
**పరిమార్పఁ జాలిరెవ్వరు? పెక్కుభంగుల । మాటలాడఁగ మఱుమాటలేల**
**యాడవు నాతోడ? నస్త్రగురుండుఁ ద । త్తనయుండుఁ గృపుఁడు రాధాసుతుండుఁ**

**తే. బాడిమానసులండ్రు నిబ్బాలు నొకనిఁ । బొదివి రిస్సిరొ! పెక్కండ్రు ప్రోడ లిదియు**
**మగఁటిమియె? క్రించుపని కిట్లు దెగినయప్పు । డుల్లములు వారలకు నెట్టులుండె నొక్కొ! 77**

**ప్రతిపదార్థం:** భద్ర= శ్రేష్ఠమైన; చారిత్ర!= చరిత్రకల ఓ అభిమన్యుడా!; సుభద్రను= మీ తల్లి సుభద్రను; నిర్జర= దేవతలతో; ప్రతిమానులు= సమానులైన; పాండురాజసుతులన్= పాండు కుమారులను; పాసి= వదలి; ఎందున్+అరిగితి(వి)?= ఎక్కడికి వెళ్ళావు?; పార్థుని పట్టిన్= అర్జునుని కుమారుడిని; అచ్యుతుని+అల్లునిన్= కృష్ణుడి అల్లుడిని; సమర+ఉర్విన్= యుద్ధభూమిలో; చెనసి= ఎదిరించి; పరిమార్పన్+చాలిరి+ఎవ్వరు?= చంపగలిగినవారు ఎవరున్నారు?; పెక్కు భంగులన్= ఎన్నో తీరులలో; మాటలాడఁగన్= మాట్లాడుతున్నానే; మఱుమాటలు+ఏల+ఆడవు+నాతోడన్?= నాతో మారు మాట్లాడకున్నావెందుకు?; అస్త్రగురుండున్= ద్రోణాచార్యుడు; తత్తనయుండున్= అశ్వత్థామ; కృపుఁడున్= కృపాచార్యుడు; రాధాసుతుండున్= కర్ణుడూ; పాడి మానసులు+అండ్రు= న్యాయంగా నడుచుకునే పెద్ద మనుషులంటారు; ఈ+బాలున్+ఒకనిన్+పొదివిరి= ఆ యువకుడిని ఒక్కడిని ముట్టడించారు; పెక్కండ్రు ప్రోడలు= చాలామంది పెద్దవాళ్ళు (కలిసి); ఇస్సిరొ!= ఛీ ఛీ!; ఇదియున్= ఇదికూడా (ఒక); మగఁటిమియె?= పరాక్రమమేనా?; ఇట్లు= ఇట్లా; క్రించు పనికిన్= నీచ కార్యానికి; తెగిన+అప్పుడు= సాహసించినపుడు; వారలకున్= వాళ్ళకు; ఉల్లములు= హృదయాలు; ఎట్టులు+ఉండెన్+ఒక్కొ!= ఎట్లా ఉన్నాయో ఏమో! (ఈ కరకు పని చేయటానికి వాళ్ళ మనసులు ఎట్లా అంగీకరించాయి? అని అర్థం.)

**తాత్పర్యం:** 'ఉత్తమమైన చరిత్ర కలిగిన ఓ అభిమన్యుడా! మీ తల్లి సుభద్రను, దేవతాసమానులైన పాండవులను వదలి ఎక్కడికి వెళ్ళావు? అర్జునుడి కుమారుడివి. శ్రీకృష్ణుడి అల్లుడివి. నిన్ను ఎదిరించి చంపగలిగినవారు ఎవరున్నారు? ఇన్ని విధాలుగా మాట్లాడుతున్నానే - మారుమాటలాడ వెందుకు? ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు, కర్ణుడు న్యాయ మెరిగిన పెద్దమనుషులంటారే. అట్లాంటి పెద్దలు పలువురు చేరి ఒక చిన్నవాడిని ముట్టడించటమా? ఛీ ఛీ! ఇది కూడా మగతనమేనా? ఇట్లాంటి నీచకార్యానికి పాల్పడటానికి వాళ్ళకు మనస్సులు ఎట్లా వచ్చాయి?

**క. పాండవులును బాంచాలురు । దండిమగలు వారు సూడఁ దలఁకక నిన్నున్**
**భండనమునఁ బడవైవఁగ । గండు గలుగు టద్భుతంబు గాదె తలంపన్! 78**

**ప్రతిపదార్థం:** పాండవులును= పాండుకుమారులు; పాంచాలురు= పాంచాలవీరులు; దండిమగలు= నిండు పరాక్రమవంతులు; వారు+చూడన్= వాళ్ళు చూస్తుండగా; తలఁకక= భయపడక; నిన్నున్= నిన్ను; భండనమునన్= యుద్ధంలో; పడవైవఁగన్= చంపగా; గండు= మగఁటిమి కలవాడు; కలుగుట= ఉండటం; తలంపన్= ఆలోచిస్తే; అద్భుతంబు+కాదె!= ఆశ్చర్యం కాదూ!

**తాత్పర్యం:** పాండవులు, పాంచాలురు మహాపరాక్రమశాలులు. వాళ్ళు చూస్తుండగా నిన్ను ఏ సంకోచమూ లేకుండా యుద్ధంలో చంపగలిగిన మగటిమి ఉన్నవారు ఉండటం ఆశ్చర్యం కాదూ!

**క. తనలేనిచోటఁ బలువురు । నినుఁ జుట్టును ముట్టి యొక్కనింజేరి వధిం**
**చిన వంచనకు ధనంజయు । మన మెమ్మెయి నురియునొక్కో! మన్మథమూర్తీ! 79**

**ప్రతిపదార్థం:** మన్మథ= మన్మథుని వంటి; మూర్తీ!= ఆకారం కలవాడా!; తన= తనయొక్క; లేనిచోటన్= లేని స్థలంలో; పలువురు= చాలమంది; నినున్= నిన్ను; చుట్టును= చుట్టుముట్టి; ఒక్కనిన్+చేరి= ఒక్కడిని సమీపించి; వధించిన= చంపిన; వంచనకున్= మోసానికి; ధనంజయు మనము= అర్జునుడి మనస్సు; ఏ+మెయిన్= ఏ విధంగా; ఉరియున్+ఒక్కో!= దుఃఖిస్తుందో ఏమో!

**తాత్పర్యం:** మన్మథుడి వంటి మనోహరాకారం కలిగిన నాథా! తానులేని సమయంలో అంతమంది నిన్ను చుట్టుముట్టి ఒక్కడిని చేసి ఘోరంగా చంపిన మోసాన్ని తలచుకొని అర్జునుడి మనస్సు ఏ విధంగా దుఃఖిస్తుందో కదా!

**తరలము:**

**అరుల నెల్లను గెల్చి మేదిని యంతయుంగొని తేజమున్**
**సిరియుఁ బెంపును గీర్తియున్ విలసిల్లఁగా వినుచుండియుం**
**బురుషసింహులు పాండుభూవరపుత్రు లక్కట! మోదముం**
**బొరయ నేర్తురె? నిన్నుఁ గోల్పడిపోయి పుష్కరలోచనా! 80**

**ప్రతిపదార్థం:** పుష్కరలోచనా!= పద్మలోచనా! (తామరలవంటి కన్నులు కలవాడా); అరులన్+ఎల్లను= శత్రువులందరినీ; గెల్చి= గెలిచి; మేదిని+అంతయున్+కొని= రాజ్యాన్నంతా సంపాదించుకొని; తేజమున్= కాంతిని; సిరియున్= సంపదను; పెంపును= వైభవాన్ని; కీర్తియున్= మంచిపేరును; విలసిల్లన్‌గాన్= వ్యాపించగా; వినుచుండియున్= ప్రశంసలను వింటూ ఉండి కూడా; పురుష సింహులు= పురుష శ్రేష్ఠులు; పాండుభూవర పుత్రులు= పాండు కుమారులు; నిన్నున్+కోల్పడి+పోయి= నిన్ను పోగొట్టుకొని; అక్కట!= అయ్యో!; మోదమున్= సంతోషాన్ని; పొరయన్+నేర్తురె?= పొందగలరా?

**తాత్పర్యం:** తామరలవంటి కన్నులు గలవాడా! శత్రువులందరినీ చంపి రాజ్యాన్నంతా సంపాదించుకొని కాంతి, సంపద, వైభవం, కీర్తి - నలుదిశల వ్యాపించగా లోకం మెచ్చుకొంటూ ఉండగా, వింటూ ఉన్నా పాండురాజ కుమారులు నిన్ను పోగొట్టుకొని సంతోషం పొందగలరా! అయ్యో! ఇప్పుడు రాజ్యం వచ్చి లాభ మేమిటి?

**విశేషం:** వృత్తలక్షణం - చూడండి. స్త్రీ 2-27.

**క. నీ మూర్తియందుఁ బ్రాణము । లేమిఁ దెలిసియుండఁ జంచలింపక జీవం**
**బేమి కతంబునఁ గలిగియొ । నామేను దొఱంగిపోదు నాథ! యెఱుంగన్. 81**

**ప్రతిపదార్థం:** నాథ!= ప్రియా!; నీ మూర్తియందున్= నీ దేహంలో; ప్రాణము లేమిన్= ప్రాణంలేకపోవటం; తెలిసి+ఉండన్= తెలిసి ఉండికూడా; చంచలింపక= ఏచలనమూలేక; జీవంబు= ప్రాణం; ఏమి కతంబునన్= ఏ కారణం; కలిగియొ= ఉన్నదో; నా మేనున్= నా దేహం నుండి; తొఱంగిపోదు= వెళ్ళిపోదు; ఎఱుంగన్= తెలియదు.

**తాత్పర్యం:** ప్రియా! నీ దేహంలో ప్రాణం లేదని తెలిసినా కూడా ఏ చలనమూ లేకుండా నా ప్రాణం ఏ కారణంతో నా దేహం నుండి వెళ్ళిపోవటం లేదో నాకు తెలియటం లేదు.

**సీ. దేవలోకంబున నీ విప్పుడెవ్వతఁ । దీపారు పలుకులఁ దేర్చి కురులు**
**వుడుకుచుఁ దగ నన్న పోలె లోలాత్మఁగాఁ । జేయుచున్నాఁడవు? చెలువు నేర్పు**
**మెఱయంగ నచ్చర తెఱవల మనములు । గలఁచి యాడుదు గాక యలఁతిఁ బోదె?**
**యంగనాగోష్ఠి నున్నపుడు నా నడవడి । బుద్ధిఁ దలంతె? ని న్బొందఁ గాంచి**

**ఆ. యాఱు నెలలు వోయె నంతియ యింతియై । కానిలేదె? తొంటి మేనఁ జేసి**
**నట్టి మేలు మోహనాకార యభిమన్యు । వీర నిర్వికార! వినుతసార! 82**

**ప్రతిపదార్థం:** అభిమన్యు వీర!= వీరుడైన ఓ అభిమన్యు కుమారా!; నిర్వికార!= ఏ వికారములేనివాడా!; వినుతసార!= ప్రస్తుతింపబడ్డ పరాక్రమం కలవాడా!; దేవలోకంబునన్= స్వర్గంలో; నీవు+ఇపుడు= నీవు ఈ సమయంలో; ఎవ్వతన్= ఏ అప్సరసను; తీపారు పలుకులన్= మధురమైన పలుకులతో; తేర్చి= లాలించి; కురులు+పుడుకుచున్= వెంట్రుకలలో వేళ్ళుపోనిచ్చి; తగన్= తగినట్టుగా; నన్నున్+అ+పోలెన్= నన్నులాగే; లోలాత్మగాన్= సంతసించిన హృదయం కలిగినదానిలాగా; చేయుచున్నాఁడవు?= చేస్తున్నావు?; చెలువు= అందమూ; నేర్పు= జాణతనం; మెఱయంగన్= వెలయగా; అచ్చర తెఱవల మనములు= అప్సరసల మనస్సులు; కలఁచి+ఆడుదు+కాక= క్షోభపెడతావు తప్ప; అలఁతిన్+పోదె?= సులభంగా వారిని వదలిపెడతావా?; అంగనాగోష్ఠిన్+ఉన్నపుడు= స్త్రీలతో కలిసి ఉన్నపుడు; నానడవడి= నేను వర్తించే రీతిని; బుద్ధిన్+తలంతె= మనసులో అనుకొంటావా! నిన్+పొందన్+కాంచి= నీతో సుఖపడి; ఆఱునెలలు+పోయెన్= ఆరు నెలలు గడిచిపోయింది; తొంటిమేనన్= పూర్వజన్మలో; చేసినట్టిమేలు= చేసిన ఉపకారం; అంతియ= అంతో; ఇంతియ= ఇంతో; కానిలేదె?= కాని లేకపోయిందా?; మోహనాకార!= సమ్మోహకమైన శరీరం కలిగిన నాథా! (నన్ను వదిలి ఎట్లా వెళ్ళావు?).

**తాత్పర్యం:** మహావీరా! అభిమన్యూ! ఏ వికారాలూ లేకుండా నిద్రిస్తున్నావా! ప్రపంచమంతా నీ పరాక్రమం మారు మోగిపోతోంది. నీవు స్వర్గానికి చేరి ఇప్పుడు ఏ అప్సరసను మధురమైన పలుకులతో లాలించి జుట్టులోకి వేళ్ళు జొనిపి నన్ను ఎట్లా సమ్మోహనపరిచావో అట్లాగే ఆమెనూ సుఖింపచేస్తూ ఉండి ఉంటావు. అందమూ నేర్పరితనమూ కల్గిన నీవు అప్సరసల మనస్సులను క్షోభపెట్టుతావు తప్ప అంత సులభంగా వారిని వదిలిపెట్టుతావా? ఆ దివ్యాంగనలతో కలిసి మాట్లాడుతున్నపుడు నేనూ, నా నడవడీ గుర్తుకురావా? నన్ను తలచుకోవా? నీతో సుఖించి ఆరు నెలలు గడిచిపోయింది. ఆ జన్మలో చేసిన మేలు అంతో ఇంతో కూడా నీకు మనసులో మిగలలేదా? ఓ సమ్మోహనకారా! నన్ను వదలి ఎట్లా వెళ్ళావు?'

**వ. అను చున్నది యిట్లు పలవింప విరాటనందనం దదీయ జననీప్రముఖ బాంధవస్త్రీ జనంబు లచ్చటువాయయం దిగిచి పొగులుచుం గొనిపోయిరి వారలం గనుంగొనుము. 83**

**ప్రతిపదార్థం:** అనుచున్నది= అని అంటున్నది; ఇట్లు= ఈ విధంగా; పలవింపన్= శోకించగా; విరాటనందనన్= ఉత్తరను; తదీయ= ఆమె యొక్క; జననీ ప్రముఖ= తల్లి మొదలైన; బాంధవ స్త్రీజనంబు= బంధు స్త్రీలు; ఆ+చోటు+పాయన్= ఆ చోటునుండి; తిగిచి= పట్టుకొని లేపి; పొగులుచున్= దుఃఖిస్తూ; కొనిపోయిరి= తీసుకువెళ్ళారు; వారలన్= వారిని; కనుంగొనుము= చూడుము.

**తాత్పర్యం:** అని అంటున్నది. ఈ విధంగా ఆమె శోకిస్తుండగా ఉత్తరను ఆమె తల్లి మొదలైన బంధువులైన స్త్రీలు ఆ చోటినుండి లేపి దుఃఖిస్తూ పట్టుకొని తీసికొనివెళ్ళారు. వారిని చూడుము.

**కవిరాజ విరాజితము.**

**గురుని శరంబులు దాఁకిన మేదినిఁగూలి విరాటుఁడు పేరిన నె**
**త్తురుల మునింగిన మేనును దానును ధూళి సమీరుఁడు మోము పయిం**
**బొరిఁబొరిఁ జల్లఁగ నుక్కి గనుంగొని పొడ్మఁగ నశ్రులు హా యనుచుం**
**బురపురఁ బొక్కెద రెమ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్. 84**

**ప్రతిపదార్థం:** గురుని శరంబులు= ద్రోణుడి బాణాలు; తాఁకినన్= నాటుకోగా; మేదినిన్+కూలి= నేలకూలి; విరాటుఁడు= విరాటరాజు; పేరిన= గడ్డకట్టిన; నెత్తురులన్+మునింగినన్= రక్తంలో మునిగిపోగా; సమీరుఁడు= వాయుదేవుడు; ధూళిన్= దుమ్మును; మోముపయిన్= ముఖంమీద; పొరిన్+పొరిన్= మాటిమాటికీ; చల్లఁగన్= చల్లగా; మేనును+తానును= దుమ్ము నిండిన శరీరంతో ఆరాజు; ఉన్కిన్= ఉండటాన్ని; కనుంగొని= చూసి; అశ్రులు= కళ్ళనీరు; పొడ్మఁగన్= పెల్లుబికిరాగా; హా+అనుచున్= హా హా కారాలు చేస్తూ; పురపురన్+పొక్కెదరు= కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు (ఆ స్త్రీలు); ఎమ్మెయిన్= ఎంత; చోపినన్= తరిమినా; పక్షితతుల్= పక్షి సమూహాలు; పోవక= వెళ్ళిపోకుండా; మూఁగెడున్= ఆ శవంచుట్టూ మూగుతున్నాయి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుల బాణాలు తగిలి నేలకూలి విరాటరాజు గడ్డకట్టిన నెత్తురులో మునిగిపోగా, వాయుదేవుడు దుమ్మును దోసిళ్ళతో చల్లినట్లు మాటిమాటికీ చల్లుతుండగా, ఆ దుమ్ములో, ధూళితో నిండిన శరీరంలో ఆ రాజు పడి ఉండటం చూచి ఆ స్త్రీలకు కళ్ళల్లో నీరు పెల్లుబికి రాగా హాహాకారాలు చేస్తూ కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు. వారు ఎంత తరిమినా పోకుండా కాకులు, గద్దలు, రాబందులు ఆ శవం చుట్టూ మూగుతున్నాయి.

**విశేషం:** కవిరాజవిరాజితవృత్తంలో ప్రతిపాదంలోనూ వరుసగా న, జ, జ, జ, జ, జ, ల, గ - అనే గణాలు ఉంటాయి. 1-8-14 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**క. అకటకట! యుత్తరుఁడు గొం । డొక కాంభోజుండునుం గడున్ బాలుఁడు వా**
**లిక కైదువు లాడిన నే । ల కొఱగి యొప్పి రభిమన్యు లక్ష్మణుల క్రియన్. 85**

**ప్రతిపదార్థం:** అకటకట!= అయ్యయ్యో!; ఉత్తరుఁడు= విరాటమహారాజు కుమారుడు ఉత్తరుడు; కడున్+బాలుఁడు= మరీ చిన్నవాడు; కొండొక= ఒకానొక; కాంభోజుండును= కాంభోజయువరాజు; వాలిక= వాడి అయిన; కైదువులు= ఆయుధాలు;

ఆడఁగన్= నాటుకోగా; అభిమన్యు= అభిమన్యుడు; లక్ష్మణుల క్రియన్= లక్ష్మణకుమారుడు - వీరిలాగా; నేలకొఱగి= నేల మీదపడి; ఒప్పిరి= ప్రకాశిస్తున్నారు.

**తాత్పర్యం:** అయ్యయ్యో! ఇక్కడ చూడుము. ఉత్తరకుమారుడు, మరొక చిన్నవాడు కాంభోజయువరాజు. శత్రువులు ప్రయోగించిన వాడి ఆయుధాలకు చిక్కి అభిమన్యు లక్ష్మణ కుమారులవలె నేలకొరగి ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నారు.

**సీ.** **పాండుపుత్రుల భుజాబలమున కులుకక । యెవ్వీరు ప్రాపున నెదురు నడచె**
**దుర్యోధనుఁడు గొంతి తొలిచూలి కెవ్వఁడు । హృదయ శల్యంబయి నిదుర సెఱుచు**
**నట్టి కర్ణుండు మదాంధసింధురము బ । లోద్ధత ద్విరద మహోగ్రవిక్ర**
**మమున గీటడఁగిన మాడ్కి నర్జును బలు । గడిమిచేఁ దెగటార్పఁబడియె వీని**

**ఆ.** **బాహు విలసనమునఁ బడిన మహాయోధ । వరు లనేకు లితఁ డవార్యరోష**
**భూషితుండు పరుషభాషణశీలుండు । ధైర్యధనుఁడు దానశౌర్యశాలి.** **86**

**ప్రతిపదార్థం:** పాండుపుత్రుల= పాండవుల; భుజాబలమునకున్= భుజభక్తికి; ఉలుకక= భయపడక; ఏ+వీరు= ఏ వీరునియొక్క; ప్రాపునన్= అండతో; దుర్యోధనుఁడు: ఎదురు నడచెన్= పాండవులకు వ్యతిరేకంగా ప్రవర్తించాడో; గొంతి= కుంతీదేవి; తొలిచూలికిన్+ఎవ్వఁడు= తొలిబిడ్డ అయిన ధర్మరాజుకు ఎవడు; హృదయశల్యంబు+అయి= గుండెలో పుండులాగా; నిదుర+చెఱుచున్= నిద్రలేకుండా చేశాడో; అట్టి= అటువంటి; కర్ణుండు= కర్ణుడు; మద+అంధ= మదంతో గ్రుడ్డిదయిన; సింధురము= ఏనుగు; బల+ఉద్ధత= బలంతో మిక్కిలి అతిశయించిన; ద్విరద= ఏనుగుయొక్క; మహోగ్రవిక్రమమునన్= మిక్కిలి భయంకరమైన పరాక్రమంచేత; గీటడఁగినమాడ్కిన్= చచ్చిన తీరుగా; అర్జును= అర్జునుడియొక్క; బలు+కడిమిచేన్= మిక్కిలి పరాక్రమంచేత; తెగటార్పఁబడియెన్= చంపబడ్డాడు; వీని= ఈ కర్ణుడి; బాహు విలసనమునన్= బాహువుల విలాసంచేత; పడిన= చచ్చిన; మహాయోధవరులు= మహాయోధశ్రేష్ఠులు; అనేకులు= చాలామంది (ఉన్నారు); ఇతఁడు= ఈ కర్ణుడు; అవార్య= వారించటానికి వీలుకాని; రోష= రోషంతో; భూషితుండు= అలంకరించబడినవాడు; పరుష భాషణశీలుండు= కఠినంగా మాట్లాడేస్వభావం కల్గినవాడు; ధైర్యధనుఁడు= ధైర్యమే సంపదగా కలవాడు; దాన= దానంచేతను; శౌర్య= పరాక్రమంలోనూ; శాలి= ఒప్పేవాడు.

**తాత్పర్యం:** ఏ వీరుడి అండతో దుర్యోధనుడు పంచపాండవుల బాహు పరాక్రమానికి భయపడక వారికి వ్యతిరేకంగా ప్రవర్తించాడో, కుంతీదేవి పెద్దకొడుకయిన ధర్మరాజుకు ఎవడు గుండెలో గాలమై నిద్రలేకుండా చేశాడో - ఆ కర్ణుడు మదంతో గుడ్డిదయిన ఏనుగు, బలంతో మిక్కిలి అతిశయించిన ఏనుగుయొక్క మిక్కిలి భయంకరమైన పరాక్రమం చేత చచ్చిన రీతిగా అర్జునుడి మహా పరాక్రమంచేత చంపబడ్డాడు. ఈ కర్ణుడి బాహువిలాసంచేత ఎంతో మంది మహాయోధులు మృతిపొందారు. ఈ కర్ణుడికి రోషమే మహాభూషణం. ఇతడు అతి పరుషంగా మాట్లాడే స్వభావం కలిగినవాడు. ధైర్యమే ఇతడి సంపద. దానవీరంలో ఇతడు సుప్రసిద్ధుడు.

**వ.** **విను మవ్వీరోత్తముండు.** **87**

**తాత్పర్యం:** ఆ వీర శ్రేష్ఠుడు ఎట్లాంటివాడో చెప్పుతాను వినుము.

**క.** **పిఱుఁదం గురుధరణీపతి । నఱచేతం బ్రాణములు ఘనారాతి బలం**
**బుఱని తెగువ ముందటఁ బె । న్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్.** **88**

**ప్రతిపదార్థం:** పిఱుఁదన్= వెనుక; కురుధరణీపతిన్= కురురాజు దుర్యోధనుడిని; అఱచేతన్= అరచేతిలో; ప్రాణములు= ప్రాణాలను; ముందటన్= ముందు; ఘన+అరాతిబలంబు= గొప్పదైన శత్రుసైన్యం; ఉఱని= లక్ష్యపెట్టని; తెగువన్= సాహసంతో; పెన్= మిక్కిలిగా; కొఱలుట= కోపించటం; చిత్తమునన్= మనసులో; పెట్టికొని= ఉంచుకొని; విహరించెన్= యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడు బాధ్యతతో యుద్ధం చేశాడు. ఇతడి వెనుక ఇతడిని నమ్మి యుద్ధంలోకి దిగిన దుర్యోధను డున్నాడు. పరశురామాదుల శాపాలవలన తన ప్రాణాలకు ముప్పున్నదని తెలుసును. ముందర శత్రుసైన్యం విజృంభణంతో అతిరోషంతో దూసికొనివస్తున్నది. ఇన్నిటినీ మనసులో ఉంచుకొని యుద్ధంలో వీరవిహారం చేశాడు.

**తే.** **ఇతని చుట్టును గలకల మెసఁగ రోద । నంబు సేయు పత్నీనివహంబులోనఁ**
**గంటె వృషసేనుతల్లి యగ్గలపుటడలు? మూర్తియైన తెఱంగున నార్తిఁ దూలె.** **89**

**ప్రతిపదార్థం:** ఇతని చుట్టును= ఈ కర్ణుడి శవం చుట్టూ; కలకలము+ఎసఁగన్= పెద్దధ్వని పుట్టగా; రోదనంబు+చేయు= ఏడుస్తున్న; పత్నీ నివహంబులోనన్= భార్యల సమూహంలో; వృషసేనుతల్లి= వృషసేనుడితల్లి - కర్ణుడిభార్య; అగ్గలము+అడలు= మిక్కిలి దుఃఖం; మూర్తి+ఐన= ఆకారం దాల్చిన; తెఱంగునన్= రీతిగా; ఆర్తిన్= దుఃఖంతో; తూలెన్= వాలిపోయింది; కంటె= చూస్తున్నావా!

**తాత్పర్యం:** ఈ కర్ణుడి శవం చుట్టూ చేరి పెద్ద ధ్వనిపుట్టగా పెద్దగా ఏడుస్తున్న అతడి భార్యల గుంపును చూశావా? అందులో దుఃఖమే ఆకారం పొందినట్టుగా అతి దుఃఖంతో నేలమీద వాలిపోతున్న ఆమె వృషసేనుడి అమ్మ. కర్ణుడి ధర్మపత్ని. ఆమెను చూస్తున్నావా?

**వ.** **ఈ రమణీరత్నంబు ధరణీతలంబునం బొరలుచు.** **90**

**ప్రతిపదార్థం:** ఈ రమణీరత్నము= ఈ శ్రేష్ఠమైన స్త్రీ; ధరణీతలంబునన్= నేలమీద; పొరలుచున్= పొర్లుతూ.

**తాత్పర్యం:** ఈ వృషసేనుడి అమ్మ దుఃఖాతిరేకంతో నేలమీద పడి పొర్లుతూ (ఇట్లా అంటున్నది).

**తే.** **పరశురాముని శాపంబు బాణశక్తిఁ । గ్రాఁప బ్రాహ్మణశాపంబు రథము సిక్కు**
**వఱుప గాండీవధరుచేతి మెఱుఁగుటమ్ము । మన్నిగొనియెనె యో కర్ణ! మగలరాజ!** **91**

**ప్రతిపదార్థం:** ఓ కర్ణ!= ఓ మహావీరుడైన కర్ణా!; మగలరాజ!= వీరులలో శ్రేష్ఠుడా!; పరశురాముని శాపంబు= పరశురాముడిచ్చిన శాపం; బాణశక్తిన్= నీ బాణాలశక్తిని; క్రాఁపన్= నాశనం చేయగా; బ్రాహ్మణశాపంబు= బ్రాహ్మణుడిచ్చిన శాపం; రథమున్= రథాన్ని; చిక్కుపఱుపన్= భూమిలో ఇరుక్కుపోయేలా చేయగా; గాండీవధరు చేతి= అర్జునుడి చేతిలోని; మెఱుఁగు+అమ్ము= వాడిబాణం; (నిన్ను); మన్నిగొనియెనె?= చంపివేసిందా? (నాథా!)

**తాత్పర్యం:** 'ఓ మహావీరుడా! కర్ణా! పరశురాము డిచ్చిన శాపం నీ బాణాలశక్తిని నశింపజేసింది. బ్రాహ్మణు డిచ్చిన శాపం రథచక్రం భూమిలో క్రుంగిపోయేటట్లు చేసింది. చివరకు అర్జునుడి చేతిలోని వాడిబాణం నీ ప్రాణాలు తీసింది. నాథా! ఎంత దారుణ మిది!

**వ.** **అని మఱియుం బలుదెఱంగులం బలవించి యుత్థితయై యాలోకించి.** **92**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; మఱియున్= ఇంకా; పలు+తెఱంగులన్= అనేకవిధాలుగా; పలవించి= విలపించి; ఉత్థిత+ఐ= లేచి; ఆలోకించి= తన భర్త దేహాన్ని చూసి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఇంకా అనేక రీతులలో ఆమె విలపించి విలపించి, చివరికి లేచి తన భర్త దేహాన్ని చూచి (తరువాత పద్యంతో అన్వయం.)

**తే.** **కాకులును గ్రద్దలును దిన్నఁ గడును ద్రెస్సి । యపరపక్షచతుర్దశి యమృతకరుని**
**కరణి నొప్పెడు కర్ణుమొగంబుమీఁద । వనిత యందంద మోపెడుఁ దన మొగంబు. 93**

**ప్రతిపదార్థం:** కాకులును; గ్రద్దలును; తిన్నన్= తినగా; కడును= మిక్కిలి; త్రెస్సి= తెగి చివికిపోయి; అపరపక్ష= కృష్ణపక్ష; చతుర్దశి= చతుర్దశినాటి; అమృతకరుని కరణిన్= చంద్రుడిలాగా; ఒప్పెడు= కనిపిస్తున్న; కర్ణు మొగంబుమీఁదన్= కర్ణుడి ముఖంపైన; వనిత= వృషసేనుడి తల్లి; అందంద= మాటిమాటికి; తన మొగంబున్= తన ముఖాన్ని; మోపెడున్= మోపుతోంది.

**తాత్పర్యం:** కాకులు, గద్దలు తినవేయగా మిక్కిలిగా తెగి చివికిపోయిన కృష్ణపక్షంలోని చతుర్దశినాటి చంద్రుడివలె కాంతివిహీనంగా కనిపిస్తున్న కర్ణుడి ముఖంపైన తన ముఖం మాటిమాటికి మోపుతూ వృషసేనుడి తల్లి దుఃఖిస్తున్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉత్సాహవృత్తము:**

**వాఁడిమగఁడు నిద్రపోవు వాలుమృగముఁ బోలె నై**
**వీఁడె బాహ్లికుండు వృష్ణివీర! చూడు చచ్చియుం**
**బోఁడి దొఱఁగ కున్నయట్టి పొల్పునన్ వెలింగె వె**
**న్నీఁ డితండు బలము లెన్నియేనిఁ బెల్లు ద్రోచినన్. 94**

**ప్రతిపదార్థం:** వృష్ణివీర!= వృష్ణికులంలో పుట్టిన, వీరుడైన కృష్ణా!; చూడు= ఇక్కడచూడుము; వీఁడె= ఇతడే; బాహ్లికుండు= బాహ్లికుడు; వాలు మృగమున్+పోలెన్+ఐ= పులిలాగా; వాఁడి మగఁడు= ఈ మహావీరుడు; నిద్రపోవున్= నిద్రపోతున్నాడు; చచ్చియున్= చచ్చికూడా; పోఁడి= అందం; తొఱఁగకున్న+అట్టి+పొల్పునన్= తగ్గిపోని విధంగా; వెలింగెన్= ప్రకాశిస్తున్నాడు; బలములు+ఎన్నియేనిన్= శత్రుబలాలు ఎన్నైనా సరే; పెల్లు+త్రోచినన్= ఎంత ఘోరంగా పోరాడినా; ఇతండు= ఈ బాహ్లికుడు; వెన్ను+ఈఁడు= వెన్నుచూపడు.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! ఇదిగో ఈ బాహ్లికుడు మహావీరుడు నిద్రపోయేపులిలాగా ఉన్నాడు చూడు. చచ్చినా అందం ఏమాత్రం తగ్గని విధంగా వెలుగుతున్నాడు. ఎంతసైన్యం ఎంత బలంగా ఎదిరించినా వెనుకకు తిరిగిపోడు.

**విశేషం:** అలం: ఉపమ. వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1. 48.

**తే.** **మేనఁ బ్రాణము వాసినమీఁద మొగము । బొఱసి యుండునె? యెందు నిత్తెఱఁగు కాంతి**
**తోడఁ? బున్నమనాఁటి చందురుని చంద । మమరెఁ జూడు మిక్కురువృద్ధు నాననంబు. 95**

**ప్రతిపదార్థం:** మేనన్= దేహంలోనుండి; ప్రాణము; పాసిన= వదలిన; మీఁదన్= తరువాత; ఎందున్= ఎక్కడైనా; మొగము= ముఖం; ఈ+తెఱగు కాంతితోడన్= ఈ విధమైన ప్రకాశంతో; పొఱసి+ఉండునె?= కూడి ఉంటుందా?; ఈ+కురువృద్ధ+ ఆననంబు= కురువంశీయులలోని పెద్దలలో ఒకడైన ఇతడి ముఖం; పున్నమనాఁటి= పూర్ణిమనాటి; చందురుని చందము= నిండు చందురుని రీతిగా; అమరెన్= ఒప్పింది; చూడు= చూడుము.

**తాత్పర్యం:** కృష్ణా! ఆ బాహ్లికుడిని చూడుము. దేహంలో నుండి ప్రాణం వదలిపోయిన తరువాత ఎక్కడైనా ముఖం ఇంత కాంతిమంతంగా ఉండటం చూచామా! కురువృద్ధులలో ఒకడైన ఈ బాహ్లికుడి ముఖం నిండుపున్నమినాటి చంద్రుడి రీతిగా కాంతులు విరజిమ్ముతున్నది.

**విశేషం:** అలం: ఉపమ.

## గాంధారి సైంధవుని కళేబరము చూచి వాపోవుట (సం. 11-22-7)

**సీ.** **పల్కుతప్పమి నెఱపంగఁ దలంచి యు । త్సాహంబు వాటించి సవ్యసాచి**
**దుర్యోధనుండును దొరలు ననేక సై । న్యంబులు నంతంత నడ్డపడఁగ**
**దెరలిచి వడి మెడద్రెవ్వ నేసినఁ బడి । యున్నాఁడు సైంధవుఁ డుఱక ద్రుపద**
**తనయఁ గాననమునఁ గొనిచన్ననాఁడ తాఁ । దెగినాఁడు గాఁడె! కౌంతేయు లపుడు**

**తే.** **దయ దలిర్పంగ దుస్సలఁ దలఁచి యలుక । గ్రాఁచి మందలవిడిచిరి గాక దైవ**
**కృతము తప్పింప రాకున్కి కతన నిపుడు । వారు విడిచి రిమ్ముద్దియవలని కరుణ.** **96**

**ప్రతిపదార్థం:** సవ్యసాచి= అర్జునుడు; పల్కుతప్పమి= మాట తప్పకపోవటాన్ని; నెఱపంగన్+తలంచి= చెల్లించుకోవాలని నిశ్చయించి; ఉత్సాహంబు= ఉత్సాహాన్ని; పాటించి= పూని; దుర్యోధనుండును; దొరలు= అనేక సామంతరాజులు (అనేక శ్రేష్ఠవీరులని కూడా అర్థం); అనేక సైన్యంబులున్= ఎంతో సైన్యం; అంతంతన్= మాటిమాటికి; అడ్డపడఁగన్= అడ్డుపడగా; తెరలిచి= పక్కకునెట్టి; వడిన్= వేగంగా; మెడన్+త్రెవ్వన్+ఏసినన్= మెడ తెగేలాగా బాణం వేయగా; సైంధవుఁడు= సైంధవుడు; ఉఱక= మెదలకుండా; పడి+ఉన్నాఁడు= పడి ఉన్నాడు; ద్రుపదతనయన్= ద్రౌపదిని; కాననమునన్= అడవిలో; కొని చన్ననాఁడు+అ= అపహరించి తీసుకొని వెళ్ళిననాడే; తాన్= తాను; తెగినాఁడుగాఁడె!= చచ్చాడు కాదూ!; కౌంతేయులు= పాండవులు; అపుడు= ఆ సమయంలో; దయ+తలిర్పంగన్= దయపుట్టగా; దుస్సలన్+తలఁచి= దుస్సలను తలచుకొని; అలుక+గ్రాఁచి= కోపం వదలి; మందల విడిచిరిగాక= ప్రాణంతో వదలిపెట్టారు తప్ప!; దైవకృతము= దైవనిర్ణయం; తప్పింపరాక+ఉన్కి+కతనన్= తప్పించటానికి వీలుకానిది కావటం వలన; వారు= ఆ పాండవులు; ఈ+ముద్దియ వలని కరుణన్= ఈ స్త్రీపట్లగల కరుణచేత; విడిచిరి= వదలిపెట్టారు.

**తాత్పర్యం:** అర్జునుడు తనమాట చెల్లించుకొనాలని నిశ్చయించుకొని ఉత్సాహం పూని దుర్యోధనాది మహావీరులు, గొప్ప సైన్యం మాటిమాటికి తనకు అడ్డుపడుతున్నా ప్రక్కకు నెట్టి వాడిబాణాలు వేయగా మెడతెగి సైంధవుడు కదలక మెదలక పడి ఉన్నాడు. అసలు ఆనాడు ద్రౌపదిని అడవిలో దొంగిలించి తీసికొనివెళ్ళిననాడే తాను చచ్చాడు కదా! ఆ సమయంలో తమ చెల్లెలని దుస్సల ముఖం చూచి వాడిని ప్రాణాలతో పోనిచ్చారు. దైవనిర్ణయం ఎవరూ తప్పించలేరు. అందుకే ఆ పాండవులు కూడా ఈనాడు చెల్లెలిపట్ల దయను విడిచి సైంధవుడిని చంపారు.

**తే. హృదయమున వగలేనియ ట్టిట్టునట్టుఁ । దిరుగుచున్నది దుస్సల వరుని శిరముఁ**
**గాన కీ కూఁతు నిమ్మెయిఁ గనుట కంటెఁ । దలఁప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ! 97**

**ప్రతిపదార్థం:** కృష్ణ= కృష్ణా!; హృదయమునన్= హృదయంలో; వగలేని+అట్టు= ఏ దుఃఖమూ లేని రీతిగా; ఇట్టున్+అట్టున్= ఇలా అలా; దుస్సల= సైంధవుడి భార్య; వరుని శిరమున్+కానక= తన భర్త శిరస్సు కనిపించక; తిరుగుచున్నది= తిరుగుతోంది; ఈ కూఁతున్= ఈ దుస్సలను; ఈ+మెయిన్= ఈ విధంగా; కనుటకంటెన్= చూడటం కన్నా; తలఁపన్= ఆలోచిస్తే; ఎక్కుడు= అధికమైన; దుఃఖంబు+కలదె?= దుఃఖం ఉంటుందా?

**తాత్పర్యం:** కృష్ణా! హృదయంలో ఏ దుఃఖమూ లేని దానివలె నా కూతురు దుస్సల సందడిగా అటూ ఇటూ తిరుగుతున్నది. ఎందుకో తెలుసా! తన భర్త శిరస్సు దొరకక. ఇట్లా ఈ కొమార్తెను చూడటం కన్నా అధికమైన దుఃఖం ఏముంటుంది?

**వ. నాఁటి రాత్రి యరులు చేసికొనిన ప్రతిజ్ఞ వేగులవారిచేత దుస్సల విని సైంధవునికి బుద్ధి చెప్పిన తెఱంగు లవి వినుము. 98**

**ప్రతిపదార్థం:** నాఁటిరాత్రి= ఆనాటి రాత్రి; అరులు= శత్రువులు; చేసికొనిన= చేసికొన్నటువంటి; ప్రతిజ్ఞన్= ప్రతిజ్ఞను; వేగులవారిచేతన్= గూఢచారులవలన; దుస్సల; విని; సైంధవుడికి; బుద్ధి చెప్పిన= బుద్ధి చెప్పిన; తెఱంగులు+అవి= ఆ రీతులను; వినుము.

**తాత్పర్యం:** ఆనాటి రాత్రి సైంధవుడిని చంపటానికి శత్రువులు చేసికొన్న ప్రతిజ్ఞలు వేగులవారిచేత విని దుస్సల సైంధవుడికి ఎన్నో రీతులుగా నీతిబోధ చేసింది. ఎట్లాగో వినుము.

**సీ. విజయు ప్రతిజ్ఞకుఁ ద్రిజగంబులోపల । నడ్డంబులేదు సు మ్మధికుఁ డంటిఁ**
**గురురాజు సైన్యంబు బిరుదు నమ్మకు మంటి । గురుఁడు పార్థునకు మార్కొనఁడ యంటి**
**నరు డాయ నొకనికైనను బుద్ధిగొనదంటి । సమరంబు నీకు నసాధ్యమంటి**
**ధర్మపుత్త్రుఁడు నిన్ను దయఁగాచుఁ బొమ్మంటి । నామాట వినఁగదె నాథ యంటి**

**ఆ. రాజతిలక రాజ రాజకంఠీరవ । రాజరత్న దివసరాజతేజ**
**రాజరాజ!' యనుచు రాజన్యసైంధవ । రాజుఁ బనవుచుండె నాజిలోన. 99**

**ప్రతిపదార్థం:** రాజతిలక!= రాజశ్రేష్ఠుడా!; విజయు= పార్థుని; ప్రతిజ్ఞకున్= ప్రతిజ్ఞకు; త్రిజగంబులోపలన్= ముల్లోకాలలో; అడ్డంబులేదు= అడ్డంలేదు; సుమ్ము= సుమా!; అధికుఁడు= ఆ అర్జునుడు అందరినీ మించినవాడు; అంటిన్= అన్నాను; నమ్మకుము= నమ్మవద్దు; అంటిన్= అన్నాను; గురుఁడు= ద్రోణుడు; పార్థునకున్= అర్జునుడికి; మార్కొనఁడు= ఎదుర్కోడు; అంటిన్= అన్నాను; రాజరత్న!= రాజులలో శ్రేష్ఠుడా!; నరున్= అర్జునుడిని; డాయన్= సమీపించటానికి; ఒకనికైనను= ఏ ఒక్కడికీ; బుద్ధి+కొనదు+అంటిన్= సాహసం రాదు అన్నాను; సమరంబు= యుద్ధం; నీకున్= నీకు; అసాధ్యము+అంటిన్= అసాధ్యం అన్నాను; దివసరాజతేజ!= సూర్యతేజా!; ధర్మపుత్రుడు= ధర్మరాజు; నిన్నున్= నిన్ను; దయన్+కాచున్+పొమ్ము+అంటిన్= దయతో రక్షిస్తాడు పో అన్నాను; నాథ= ఓ నాథా!; రాజరాజ!= రాజ శ్రేష్ఠుడా!; నామాట= నా మాటలు; వినన్+కదె+అంటిన్= దయచేసి వినుము అన్నాను (ఇట్లా ఆమె అన్న మాటలు గాంధారి తెల్పి); అనుచున్= అని ఈ విధంగా; రాజన్యున్= రాజశ్రేష్ఠుడైన; సైంధవరాజున్= సైంధవుడిని గూర్చి; ఆజిలోనన్= యుద్ధభూమిలో; పనవుచుండెన్= ప్రలాపిస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** 'రాజా! నీవు రాజశ్రేష్ఠుడివి. నా మాటలు వినుము. అర్జునుడి ప్రతిజ్ఞకు మూడులోకాలలోను తిరుగులేదు సుమా! అతడు అందరికన్నా మిన్న. నీవు రాజసింహానివి. దుర్యోధనుడి సైన్యం అంత గొప్పది, ఇంత గొప్పది అని నమ్మి యుద్ధరంగంలోకి దూకవద్దు. ద్రోణుడు ఎప్పటికీ అర్జునుడిని ఎదుర్కొనటానికి ఇష్టపడడు. నీకున్న కాంతి రాజులలో ఎవరి కున్నది? అర్జునుడిని సమీపించటానికి ఎవడూ సాహసించడు. నీవు సూర్యతేజుడివి. ధర్మరాజు నిన్ను తప్పక దయతో కాపాడుతాడు 'ఫో' అన్నాను. నీవు చక్రవర్తివి. నా మాటలు దయచేసి వినుము. అన్నాను' అని ఆ దుస్సల ఆనాడు సైంధవుడితో అన్న మాటలు మళ్ళీ అంటుండగా వింటున్నావు గదా! అట్లా ఆ రాజును గూర్చి ఆ వనిత యుద్ధరంగంలో ప్రలాపిస్తున్నది.

**తే.** **తోడఁబుట్టువు విధవయై తొలఁగి యునికి । కోర్చి చలమునఁ బతిఁ దెగటార్చి సంత**
**సించితిరె? తండ్రులార! మీరంచుఁ బాండు । పుత్రకుల దూఱుచున్నది పొలఁతి వింటె?** **100**

**ప్రతిపదార్థం:** తండ్రులార!= ఓ తండ్రులార; తోడఁబుట్టువు= మీ చెల్లెలు; విధవ+ఐ= భర్తను పోగొట్టుకొనినదై; తొలఁగి= శుభకార్యాలకు అనర్హురాలై; ఉనికికిన్= ఉండటాన్ని; ఓర్చి= భరించి; చలమునన్= పట్టుదలతో; పతిన్= నా భర్తను; తెగటార్చి= చంపి; మీరు సంతసించితిరె?= మీరందరూ సంతోషపడ్డారా?; అంచున్= అంటూ; పాండుపుత్రకులన్= పాండు కుమారులను; పొలఁతి= దుస్సల; దూఱుచున్నది= నిందిస్తున్నది; వింటె?= వింటున్నావా?

**తాత్పర్యం:** 'ఓ తండ్రులారా! మీ చెల్లెలు భర్తను పోగొట్టుకొని విధవరాలై ఏ శుభకార్యానికీ పనికిరానిదిగా బయటికి నెట్టబడి ఉండటం కూడా సహించి పట్టుదలతో నా భర్తను చంపి మీరు సంతోషపడ్డారా?' అంటూ పాండవులను దుస్సల నిందిస్తున్నది. వింటున్నావా?

**ఉత్సాహవృత్తము:**

**తనయుఁ గాచుపనికిఁబూని ధర్మపుత్ర వాయునం**
**దనులుఁ గవలుఁ జేయఁ గలుగు దండిమగలు సేనలం**
**గొని వడిం గడంగ సరకుగొనక నిల్చి యొక్కఁడుం**
**బెనఁగి యాఁగె సైంధవుండు బిరుదు దక్షుఁడుంగదే!** **101**

**ప్రతిపదార్థం:** తనయున్= కొడుకైన అభిమన్యుడిని; కాచు= కాపాడే; పనికిన్+పూని= పనికోసం పూనుకొని; ధర్మపుత్ర వాయునందనులున్= ధర్మరాజు, భీముడు; కవలున్= నకుల సహదేవులు; చేయన్+కలుగు= సమర్థులైన; దండిమగలు= పరాక్రమవంతులైన వీరులు; సేనలన్+కొని= తమ సైన్యంతో; వడిన్+కడంగన్= వేగంగా ఉద్యమించగా; సైంధవుండు= సైంధవుడు; సరుకుగొనక= లెక్క చేయకుండా; నిల్చి= యుద్ధంలో నిలబడి; ఒక్కఁడున్= ఒక్కడే; పెఁనగి+ఆఁగెన్= యుద్ధం చేసి ఆపాడు; బిరుదు దక్షుఁడున్+కదే!= పేరందిన సమర్థుడు కదా!

**తాత్పర్యం:** అభిమన్యుకుమారుడిని కాపాడే పనికోసం పూనుకొన్న ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు సమర్థులైనవారు. పరాక్రమవంతులు. తమ సైన్యంతో కూడి వేగంగా ఉద్యమించినపుడు సైంధవుడు వాళ్ళను లెక్కచేయకుండా యుద్ధంలో నిలదొక్కుకొని ఒక్కడే పోరాడి వారిని ఆపగలిగాడు. సైంధవుడు మరి తక్కువవాడా! పేరు పొందిన సమర్థుడు కదా!

**విశేషం:** ఈ పేరు ఏమిటంటే అర్జునుడు లేని పాండవులను ఒక్కపూట జయించగలడన్న వరం ఉండటమే. వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1.48.

**తే. తప్పు సైంధవుపైఁ బెట్టఁ దగునొ? తగదొ? పార్థు ప్రతినకు నొక్కండ పాత్రమయ్యెఁ**
**దాన యందఱ నాఁగుట తప్పగాదె? । యదియ సౌభద్రు మృతి హేతు వగుట లేదె? 102**

**ప్రతిపదార్థం:** తప్పు= తప్పంతా; సైంధవుపైన్= సైంధవుడిమీద; పెట్టన్+తగునొ?+తగదొ?= పెట్టవచ్చునో? రాదో? (పెద్దలు నిశ్చయించాలి); పార్థు ప్రతినకున్= అర్జునుడి ప్రతిజ్ఞకు; ఒక్కండు+అ= సైంధవుడు ఒక్కడే; పాత్రము+అయ్యెన్= పాత్రుడయ్యాడు; తాను+అ= తానే; అందఱన్= అందరినీ; ఆఁగుట= ఆపటం; తప్పుకాదె?= తప్పుకాదె?; అదియ= అదే; సౌభద్రు= అభిమన్యుడి; మృతిహేతువు= మృతికి కారణం; అగుటలేదె?= కావటం లేదా?

**తాత్పర్యం:** తప్పు సైంధవునిమీద పెట్టవచ్చునో లేదో కాని అర్జునుని ప్రతిజ్ఞకు సైంధవుడు ఒక్కడే గురియైనాడు. (సైంధవుడు) తానొక్కడే అందరునూ (పాండవులనందరినీ) ఆపడం తప్పేకదా? అదియే అభిమన్యుడి మృతికి కారణం కావడం లేదా?

**విశేషం:** తన అల్లుడు కాబట్టి సైంధవుడి విషయంగా ఇంత మీమాంస చేస్తున్నది గాంధారి. ధర్మరాజాదులను ఆపటంవలన సైంధవుడే అభిమన్యుడి చావుకు కారణమంటారు కొందరు. కాని, అభిమన్యుడు తానొక్కడే దుస్సాహసంతో అంతమంది మేటిమగలను ఎదుర్కొనటం తప్పుగదా! ఆ దుస్సాహసమే అతడి మృతికి హేతువు. అభిమన్యుడు చావటానికి పద్మవ్యూహంలో నుండి బయటికి రావటం తెలియకపోవటం తప్ప సైంధవుడు అడ్డుపడటం కాదని గాంధారి వాదం.

**తే. బోరగిలఁ బడ్డవాఁడు గపోలమొకటి । పుడమి మోచినయది మోము పొలుపు సెడదు**
**వీఁడె చూచితె శల్యుండు? వెడలియున్న జిహ్వ దినియెడు వాయస శ్రేణి కృష్ణ! 103**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= కృష్ణా!; బోరగిలపడ్డవాఁడు= బోరగిల పడిఉన్నాడు; కపోలము+ఒకటి= ఒక చెక్కిలి; పుడమిన్= నేలను; మోచిన+అది= ఆని ఉన్నది; మోము= ముఖం; పొలుపు+చెడదు= అందం చెడిపోలేదు; వీఁడె+చూచితె?= వీడిని చూచావా?; శల్యుండు= ఇతడే శల్యుడు; వెడలి+ఉన్న= బయటకు వచ్చిన; జిహ్వన్= నాలుకను; వాయసశ్రేణి= కాకుల గుంపు; తినియెడున్= తింటున్నది.

**తాత్పర్యం:** కృష్ణా! ఇటుచూడుము. పాపం బోరగిలపడి ఉన్నాడు. ఒక చెక్కిలి నేలమీద ఆని ఉన్నది. ముఖంలో అందం ఏమాత్రమూ చెడిపోలేదు. ఎవరో గుర్తించావా? ఇతడే శల్యుడు. అయ్యో! బయటికి వచ్చిన నాలుకను కాకులు పొడుచుకొని తింటున్నాయి.

**క. ఇట్టవునె? మాద్రితోడం । బుట్టె ననక యితని ధర్మ పుత్రునకుఁ గడుం**
**బెట్టిదుఁడై చంపవలసెఁ । జుట్టపుఁదనమేల రాజ సుతులకుఁ గలుగున్? 104**

**ప్రతిపదార్థం:** ఇట్టు+అవునె?= ఇట్లా చేయటం బాగున్నదా?; మాద్రితోడన్= నకులసహదేవులతల్లి; తన పినతల్లి మాద్రితోపాటు; పుట్టెను+అనక= శల్యుడు పుట్టాడని భావించక; ఇతనిన్= ఈ శల్యుడిని; ధర్మపుత్రునకున్= ధర్మపుత్రుడికి; కడున్= మిక్కిలి; బెట్టిదుఁడై= నిర్దయుడై; చంపన్ వలసెన్= చంపవలసి వచ్చినది; రాజసుతులకున్= రాజకుమారులకు; చుట్టపుఁదనము= చుట్టరికం; ఏల కలుగున్= ఎందుకుంటుంది?

**తాత్పర్యం:** ఈ విధంగా చేయటం బాగున్నదా? ఈ శల్యుడు తమ తల్లి తోబుట్టువు అని కూడా భావించకుండా నిర్దయగా ధర్మరాజు యుద్ధంలో ఇతడిని చంపివేశాడు. అయినా రాజకుమారులకు బంధుత్వాలు ఎందుకు?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క.** **సెల్లుఁడు యమతనయునితో । నెల్ల గుణంబులను జాల నెనయుదు నని తా**
**నుల్లమున నిశ్చయించుం । జెల్లంబో! పోరఁ బగఱచే ని ట్లయ్యెన్.** **105**

**ప్రతిపదార్థం:** సెల్లుఁడు= ఈ శల్యుడు; తాను; ఎల్లగుణంబులను= అన్నిగుణాలలోను; యమతనయునితోన్= ధర్మరాజుతో; చాలన్= మిక్కిలిగా; ఎనయుదును= పోలుతాను; అని; ఉల్లమునన్= హృదయంలో; నిశ్చయించున్= అనుకొంటాడు; చెల్లంబో= అయ్యో! (అయితే ఏమిటి?); పోరన్= యుద్ధంలో; పగఱచేన్= శత్రువులచేత; ఇట్లు+అయ్యెన్= ఇలా దుర్గతి పాలయ్యాడు.

**తాత్పర్యం:** ఈ శల్యుడు తాను అన్ని గుణాలలోనూ ధర్మరాజుతో సమానమే అని అనుకొంటూ ఉండేవాడు. అయ్యో! ఏమి లాభం! చివరికి యుద్ధంలో ఈ విధంగా దుర్మరణం పాలయ్యాడు.

**వ.** **అ మ్మహీవిభుండు.** **106**

**తాత్పర్యం:** ఆ శల్యమహారాజు.

**భుజంగ ప్రయాతము:**

**కురుక్షోణినాథుండు గోరంగ మైత్రిన్ । ధురం దాల్చి తా నేర్పుతో సారథిత్వం**
**బరిశ్రేణిసంత్రాసియై పూని కర్ణుం । బరిక్షోభితుం జేసె భాషాస్త్రపంక్తిన్.** **107**

**ప్రతిపదార్థం:** కురుక్షోణినాథుండు= దుర్యోధనుడు; మైత్రిన్= స్నేహాన్ని; కోరంగన్= కోరగా; ధురన్+తాల్చి= ఆ బరువును మోసి; తాన్= తాను; నేర్పుతోన్= నైపుణ్యంతో; అరిశ్రేణి= శత్రుసమూహానికి; సంత్రాసి+ఐ= భయం కలిగించేవాడై; సారథిత్వంబు= రథచోదకుని పనిని; పూని= తీసికొని; కర్ణున్= కర్ణుడులాంటి మహావీరుడిని; భాషాస్త్రపంక్తిన్= మాటలనే బాణాల వరుసతో; పరిక్షోభితున్= మిక్కిలి కలతచెందినవాడినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు శల్యుడిని మైత్రి కోరాడు. మిత్రధర్మాన్ని పాటించి, పెట్టిన బాధ్యతను స్వీకరించి ఎంతో నైపుణ్యంతో శత్రుసైన్యం ఇబ్బందిపడే రీతిగా రథసారథి పనిని చేపట్టి కర్ణుడి వంటి మహావీరులను మాటలనే బాణాలతో మిక్కిలి క్షోభచెందేటట్లు చేశా డీ శల్యుడు.

**విశేషం:** అలం: రూపకం. వృత్తలక్షణానికి చూడండి: స్త్రీ. 1. 88॥

**ఆ.** **అధిక పంక పతితమై యున్న యాఁబోతుఁ । బొదివియున్న మొదవు కదుపు వోలె**
**నున్న వారు సూడు మువిదలు దైన్య మా । స్యముల నెలవు కొనఁగ శల్యు బలసి.** **108**

**ప్రతిపదార్థం:** అధికపంక= మిక్కిలిగా ఉన్న బురదలో; పతితమై+ఉన్న= పడిఉన్న; ఆఁబోతున్= ఆబోతును; పొదివి+ఉన్న= పొదువుకొని ఉన్న; మొదవు కదుపు= ఆవుల సమూహం; పోలెన్= వలె; ఉవిదలు= అతని భార్యలు; దైన్యము= దీనత్వం; ఆస్యములన్= ముఖాలలో; నెలవు+కొనఁగన్= నిండుకోగా; శల్యున్= శల్యుడిని; బలసి= చుట్టూచేరి; ఉన్నవారు+చూడుము= ఉన్నారు చూడుము.

**తాత్పర్యం:** కృష్ణా! ఆ శల్యుడిని ఆశ్రయించి అతి దీనంగా ఏడుస్తూ ఉన్న స్త్రీలను చూడుము. ఆబోతు బురదలో కూరుకొనిపోగా చుట్టూ ఆవులు పొదువుకొన్నట్లుగా కనిపించటం లేదూ?

**విశేషం:** అలం: ఉపమ. శల్యుడు మద్యమన్నా, స్త్రీ అన్నా చాలా ఆసక్తి కలిగిఉండేవాడు. అందుకే అతడి శవంచుట్టూ ఉన్న స్త్రీలను గురించి ప్రత్యేకంగా పోల్చి చెప్పటం.

**మత్తకోకిల:**

**చూచితే భగదత్తు? నీతఁడు శూరతామహిమన్ నరున్**
**వీచిసన్నిభబాణపంక్తుల వెఱ్ఱిఁ జేసె మహేంద్రుతో**
**నేచి పోరుబలుండు వోలె సహింప కీతని నిట్లుగాఁ**
**జూచి తాతనిమీఁది నెయ్యము సొంపునన్ మురమర్దనా! 109**

**ప్రతిపదార్థం:** మురమర్దనా!= మురాసురుడిని చంపిన ఓ కృష్ణా!; భగదత్తున్= భగదత్తుడిని; చూచితే?= చూచావా?; ఈతఁడు= ఇతడు; శూరతామహిమన్= పరాక్రమం యొక్క ఆధిక్యంచేత; మహేంద్రుతోన్= మహేంద్రుడితో; ఏచి= విజృంభించి; పోరు= యుద్ధం చేసిన; బలుండు+పోలెన్= బలుడనే రాక్షసుడివలె (అందుకే ఇంద్రుడికి బలవిరోధి అనిపేరు); నరున్= అర్జునుడిని; వీచి= అలలతో; సన్నిభ= సమానమైన (అంటే అలలవలె ఎడతెరిపి లేని); బాణపంక్తులన్= అమ్ముల వరుసలతో; వెఱ్ఱిన్+చేసెన్= పిచ్చివాడిని చేశాడు; సహింపక= భగదత్తుడి పరాక్రమం చూచి ఓర్వలేక; అతనిమీఁది= అర్జునుడిపై గల; నెయ్యపుసొంపునన్= ప్రేమాధిక్యంచేత; ఈతనిన్= ఈ భగదత్తుడిని; ఇట్లుకాన్+చూచితి(వి)= ఇట్లా మరణం పాలు కావించావు.

**తాత్పర్యం:** కృష్ణా! ఇతడు భగదత్తుడు. పోల్చుకొన్నావా! మహేంద్రుడిమీద విజృంభించి యుద్ధం చేయగల్గిన బలాసురుడివలె నరుడిమీద ఎడతెరిపి లేకుండా బాణాల వర్షం కురిపించి, అతడిని పిచ్చివాడిని చేశాడు. భగదత్తుడి పరాక్రమం చూచి ఓర్వలేక, అర్జునుడిమీద అభిమానంతో ఈతడిని ఈ విధంగా మరణంపాలు చేశావు.

**క. పులుఁగులును మెకంబులునుం । దొలిచి తినిన నెలవుదప్పి తొలఁగియుఁ గంటే?**
**తల నున్న కనక దామము । పొలుపు దెగం బాయ దీ నృపుం గమలాక్షా! 110**

**ప్రతిపదార్థం:** కమల+అక్షా!= కమలాలవంటి కన్నులు గల కృష్ణా!; పులుఁగులును= కాకులు, గద్దలువంటి పక్షులు; మెకంబులునున్= నక్కలు, తోడేళ్ళువంటి జంతువులు; తొలిచి తినినన్= రంధ్రాలు చేసి విరిచి తినగా; నెలవు+తప్పి= తమతమ స్థానాల నుండి; తొలఁగియున్= జారి ప్రక్కల్లో బడినా; తలన్+ఉన్న= తలలో అలంకరించుకొన్న; కనకదామము పొలుపు= సంపెంగపూల వాసన; ఈ నృపున్= ఈ రాజు దేహాన్ని; తెగన్+పాయదు= కొంచెంకూడా వదలిపెట్టలేదు; కంటే?= చూస్తున్నావా?

**తాత్పర్యం:** కృష్ణా! పక్షులు, మృగాలు దేహాన్ని రంధ్రాలు చేసి విరిచి తినటం వలన దేహభాగాలు ఎక్కడివక్కడ వెదజల్లబడ్డాయి. అయినా ఇతడి తలలో అలంకరించుకొన్న సంపెంగపూల వాసన ఈ రాజు శరీరాన్ని కొంచెంకూడా వదలలేదు. చూస్తున్నావా?

**గాంధారి శరతల్పగతుం డగు భీష్మునుద్దేశించి శోకించుట (సం. 11-23-14)**

**సీ. బలశౌర్యములఁ దన పాటిగా నెందును । మానవు నొరుఁ జూపలేని యట్టి**
**శంతనుపుత్రుఁడే శత్రులబాహు ద । ర్పంబున రణభూమిఁ బడియెఁ దన్ను**
**వాలాయమును గెల్వవచ్చునె? 'చంపి కొం' । డని పాండుసుతులపై నగ్గలంపుఁ**
**గరుణ మర్మము సెప్పెఁగాక యెమ్మెయి నైన । నతినిష్ఠ యెప్పుడు నతనియందుఁ**

**ఆ. గలదు గాదె! తండ్రి కార్యంబునకుఁ గాఁగ । రాజ్య ముడిగి పూనె బ్రహ్మచర్య**
**మితనిఁ జెప్పి చెప్ప నితరుండు పౌరుష । కలిత సంభవుండు గలఁడె కృష్ణ. 111**

**ప్రతిపదార్థం:** కృష్ణ= కృష్ణా!; బలశౌర్యములన్= బలంలోనూ, పరాక్రమంలోనూ, తన పాటిగాన్= తనకు సమానుడుగా; ఎందును= ఎక్కడా; ఒరున్ మానవున్= ఇంకో మానవుడిని; చూపలేనియట్టి= చూపలేనటువంటి; శంతనుపుత్రుఁడే= భీష్ముడే; శత్రుల= శత్రువుల; బాహుదర్పంబునన్= బాహుగర్వంచేత; రణభూమిన్+పడియెన్= యుద్ధభూమిలో కూలిపోయాడు; తన్నున్= తనను; వాలాయమును= తప్పక; గెల్వన్‌వచ్చునె?= ఎవరైనా గెలవటానికి శక్యం అవుతుందా?; చంపికొండు+అని= చంపుకోండి అని; పాండుసుతులపైన్= పాండుకుమారులపైన; అగ్గలము+కరుణన్= మిక్కిలి దయతో; మర్మము చెప్పెన్+కాక= తాను చనిపోయే రహస్యాన్ని చెప్పాడు తప్ప (ఎవరు గెలవగలుగుతారు?); ఎమ్మెయిన్+ఐనన్= ఎలాఅయినా; అతినిష్ఠ= గొప్పనిష్ఠ; ఎప్పుడున్= అన్ని కాలాలలోనూ; అతనియందున్= భీష్ముడిలో; కలదు+కాదె!= ఉన్నదేకదా!; తండ్రికార్యంబునకున్= తండ్రిపనికి (కర్తవ్యానికి); కాఁగన్= అనుకూలం అయ్యేట్టుగా; రాజ్యము+ఉడిగి= రాజ్యం వదలుకొని; బ్రహ్మచర్యము= బ్రహ్మచారిగా ఉండిపోవటాన్ని; పూనెన్= అవలంబించాడు; ఇతనిన్+చెప్పి= ఇతడిని పేర్కొని; చెప్పన్= చెప్పటానికి; పౌరుషకలితసంభవుండు= సంపూర్ణ పురుషత్వంతో కూడిన జన్మగలవాడు; ఇతరుండు= మరొకడు; కలఁడె?= ఉన్నాడా? (లేడు).

**తాత్పర్యం:** కృష్ణా! బలంలోకాని, పరాక్రమంలోకాని తనకు సాటిగా మరొక మానవుడిని చూపటానికి వీలులేని మహావ్యక్తి భీష్ముడే శత్రువుల బాహుదర్పానికి బలై నేలమీద పడ్డాడు. అయినా ఆయనను ఎవరూ తమంతట తాముగా జయించలేరు కదా! 'నన్ను చంపుకోండి' అని పాండవులమీద ఉన్న అధికమైన దయతో ఆయనే తాను చనిపోయే రహస్యాన్ని వారికి చెప్పాడు తప్ప, ఆయనను ఎవరు గెలువగలరు! ఎట్లా అయితేనేం! ఆయనకున్న దీక్ష ఈనాటిది కాదు కదా! తన తండ్రి కోరికను సానుకూలం చేయటానికి తాను బ్రహ్మచారిగా ఉండిపోయాడు గాదా! రాజ్యం వదలుకోలేదా! (అట్లాగే ఇదికూడ అని తాత్పర్యం). ఈయన పేరు చెప్పి మరోపేరు చెప్పటానికి సంపూర్ణ పురుషత్వంతో కూడిన జన్మగల మరో మహానుభావుడు ఎవ డున్నాడు?

**క. కురువంశ మెడల వచ్చినఁ । బరమోపాయమున మగుడఁ బడసెన్ మడిసెం**
**గురునికరముతోడన యి । ప్పురుషుఁడు పురుషార్థసారభూషణుఁడు గదే! 112**

**ప్రతిపదార్థం:** కురువంశము= కౌరవవంశం; ఎడలవచ్చినన్= విచ్ఛిన్నం కాగా; పరమ+ఉపాయమునన్= తల్లి సత్యవతిద్వారా వ్యాసమహర్షిని రప్పించి అంబికాదులకు సంతానాన్ని కల్గించటం ద్వారా; మగుడన్+పడసెన్= మళ్ళీ కౌరవవంశాన్ని రక్షించుకొన్నాడు;

కురునికరముతోడన్+అ= కురుకుమారుల సమూహంతోనే; మడిసెన్= చనిపోయాడు; ఈ+పురుషుఁడు= ఈ మహాపురుషుడు; పురుషార్థసార= ధర్మార్థకామమోక్షాలనే పురుషార్థాల సారభూతమైన ధర్మానికి; భూషణుఁడు= అలంకారంవంటి వాడు; కదే!= కదా!

**తాత్పర్యం:** కృష్ణా! కౌరవవంశం ఆగిపోయిన సమయంలో ధార్మికమైన పద్ధతిలో వ్యాసమహర్షిద్వారా మళ్ళీ కౌరవవంశాన్ని సంపాదించుకొన్నవాడూ ఈయనే. చివరివరకు కురుకుమారులతోనే ఉండి వారితోపాటే ప్రాణాలూ వదిలినవాడూ ఈయనే. ఈ మహాపురుషుడు ధర్మ స్వరూపుడు! (పురుషార్థాల పరమార్థాన్ని ఇట్లాంటి మహావ్యక్తుల జీవితం ద్వారానే కదా తెలిసికొనాలి!).

**క. దేవుఁడు గా కితఁడు నరుఁడు । నా వచ్చునె? నిష్ఠపెంపునం బ్రాణంబుల్**
**తా వలసినపుడ విడువం । గా వేడుక నునిచి నాఁడు గాదె తనువునన్! 113**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= భీష్మాచార్యుడు; దేవుఁడుగాక= దైవస్వరూపం తప్ప; నరుఁడు+నాన్+వచ్చునె?= మనిషి అనవచ్చునా?; నిష్ఠపెంపునన్= దీక్షయొక్క ఆధిక్యంచేత; ప్రాణంబుల్= ప్రాణాలను; తాన్+వలసినపుడు+అ= తానుకోరుకున్నపుడే; విడువంగాన్= వదలటానికి గాను; వేడుకన్= లీలగా; తనువునన్= శరీరంలో; ఉనిచినాఁడు+కాదె!= ఉంచినాడు కదా!

**తాత్పర్యం:** కృష్ణా! భీష్ముడు దైవస్వరూపుడు తప్ప సాధారణ మానవుడు కాడు. అందుకే ఆయనకున్న దీక్షతో ప్రాణాలను తాను కోరుకొన్నపుడు వదలటానికై లీలగా తన దేహంలోనే ఉంచాడు కదా!

**విశేషం:** ముందటి పద్యంలో భీష్ముడి ధర్మనిష్ఠ చెప్పబడింది. భీష్ముడు రాజధర్మాన్ని, పుత్రధర్మాన్ని, పితృధర్మాన్ని- దేనినీ వదలలేదు. 'స్వధర్మే నిధనం శ్రేయః' - అనే గీతోక్తిని సంపూర్ణంగా ఆచరించాడు. అందుకే ఎంత దోష దూషితమైనా కౌరవ పక్షంలోనే జీవితాంతం ఉన్నాడు. అందుకే అతడిలో 'నిష్ఠ' తపస్సుగా మారి దివ్యత్వంగా సిద్ధించింది. దాని రూపమే 'స్వచ్ఛంద మరణం'. ఇది మహాయోగులకు మాత్రమే సిద్ధించే విషయం. భీష్ముడిలోని బ్రహ్మచర్యం - సత్యవ్రతదీక్ష - ధర్మనిష్ఠ - కర్మయోగం - నిష్కామంగా కర్మఫలత్యాగం - అనే అన్ని గుణాలు సాత్త్విక తపస్సు లక్షణాలు కాబట్టి ఆయన పరమశాంతమూర్తిగా తన మరణాన్ని కూడా కోరి తెచ్చుకొన్నాడు. ఆ జీవితంలో మిగిలిపోయింది దేహం ఒకటే. దానిని పుణ్యామార్గం పట్టించటం కొరకు దేహగతంగా చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా అనుభవించిన శిక్ష- అంపశయ్య మీదపడి ఉండటం. ఇదంతా కలిపి చూస్తే ఇతడు మానవమాత్రుడు కాడు అనే గాంధారి వాక్యాలకు పరమార్థం తెలుస్తుంది.

**తే. తీవ్ర బాణజాల దీప్తులు పరఁగించి । పాండుతనయ సైన్య బహుళతమము**
**లీలఁ బదిదినంబు లోలి వినోదించి । యకట! భీష్మభానుఁ డస్తమించె. 114**

**ప్రతిపదార్థం:** తీవ్ర= వాడిఅయిన; బాణజాల= బాణాల సమూహాలనేటటువంటి; దీప్తులు= కిరణాలు; పరఁగించి= వ్యాపింపజేసి; పాండుతనయసైన్య= పాండు కుమారుల సైన్యమనేటటువంటి; బహుళతమమున్= దట్టమైన చీకటిని; లీలన్= వేడుకగా; పది దినంబుల్= పదిరోజులు; ఓలిన్= వరుసగా; వినోదించి= తొలగించి; భీష్మభానుఁడు= భీష్ముడనే సూర్యుడు; అస్తమించెన్= వెళ్ళిపోయాడు; అకట!= అయ్యో!

**తాత్పర్యం:** వాడి బాణాలనే కిరణాలు వ్యాపింపజేసి పాండవసైన్యమనే చీకటిని ముప్పుతిప్పలు పెట్టి ఆడించి, పదిరోజులు వినోదించి, భీష్ముడనే సూర్యుడు అస్తమించాడు. ఎంత విషాదకరం!

**విశేషం:** అలం: రూపకం.

**క. శరవణమునందుఁ బొలుపుం । బొరసిన గాంగేయుతోడఁ బోల్పఁగ ననువై**
**శరతల్పంబునఁ దేజో । భరితుఁడు గాంగేయుఁ డొప్పెఁ బంకజనాభా! 115**

**ప్రతిపదార్థం:** పంకజనాభా!= కమలం నాభిలోగల కృష్ణా!; శరవణమునందున్= రెల్లుగడ్డిలో; పొలుపున్= ఒప్పును; పొరసిన= పొందిన; గాంగేయుతోడన్= (గంగకుమారుడితో) కుమారస్వామితో; పోల్పఁగన్= పోల్చడానికి; అనువు+ఐ= వీలుగా; శరతల్పంబునన్= బాణాలతో చేసిన పడకలో; తేజస్+భరితుఁడు= కాంతిమంతుడైన; గాంగేయుఁడు= గంగకుమారుడు (భీష్ముడు); ఒప్పెన్= ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** అలనాడు రెల్లుగడ్డిలో ప్రభవించిన కుమారస్వామితో పోల్చదగినవాడై ఈనాడు బాణతల్పంలో తేజోమూర్తి అయిన ఈ భీష్ముడు కాంతులు చిమ్ముతున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ, శ్లేష 'శర' మనే మాటకు బాణమని, రెల్లు అని రెండు అర్థాలున్నాయి. శివపార్వతుల తేజాన్ని అగ్నిదేవుడు గంగలో నిక్షేపించగా పుట్టినవాడు కుమారస్వామి అందుకే 'గాంగేయుడు' అని షణ్ముఖుడికి పేరున్నది. గంగాశంతనుల కుమారుడు భీష్ముడు. కాబట్టి ఇతడూ 'గాంగేయుడే'. మరి ఆయన రెల్లువనంలో పుట్టగా ఈయన 'శరతల్పంలో' (అంపశయ్యపై) ఉన్నాడు. కాబట్టి పోలిక సరిపోయిందని గాంధారి అంటున్నది.

**తే. అర్జునుఁడు వెట్టె నితనికి నంపపాన్పు । నకుఁ దగంగ నిశాత బాణముల మూఁట**
**నలవరించిన తలగడ యస్త్రజనిత । వారిఁ దృప్తునిఁ జేసె నవ్వీరవరుఁడు. 116**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= పాండవమధ్యముడైన అర్జునుడు; ఇతనికిన్= ఈ మహావీరుడైన భీష్ముడికి; అంపపాన్పునకున్= అంపశయ్యకు; తగంగన్= తగినట్టుగా; నిశాత= వాడియైన; బాణములమూఁటన్= మూడు బాణాలతో; అలవరించిన= ఏర్పరచిన; తలగడ= తలగడను (దిండును); పెట్టెన్; ఆ+వీరవరుఁడు= ఆ అర్జునుడే; అస్త్రజనిత= అస్త్రంతో పుట్టిన; వారిన్= నీటితో; తృప్తునిన్+చేసెన్= దప్పిక తీరినవాడిగా చేశాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ఈ మహావీరుడికి అర్జునుడు అంపశయ్యను ఏర్పరచి, దిండుగా మూడు వాడిబాణాలను సవరించి, బాణంతో నీటిని తెప్పించి ఆ నీటితో ఆ మహావీరుడి దప్పికను పోగొట్టాడు.

**క. వీరశయనమున గంగకు । మారుఁడు కల్పక్షయమున మార్తాండుఁడు సం**
**చార మెడలి ధరఁ బడి యొ । ప్పారెడు చందమున వెలిఁగె నంబురుహాక్షా! 117**

**ప్రతిపదార్థం:** అంబురుహ+అక్షా!= కమలాక్షా (కృష్ణా); వీరశయనమునన్= వీరుడికి తగిన ఈ అంపశయ్యలో; గంగకుమారుఁడు= ఈ భీష్ముడు; కల్పక్షయమునన్= కల్పాంతంలో; మార్తాండుఁడు= సూర్యుడు; సంచారము+ఎడలి= సంచారం చాలించి; ధరన్+పడి= నేలవాలి; ఒప్పారెడు= ప్రకాశించే; చందమునన్= రీతిలో; వెలిఁగెన్= కాంతులు చిమ్ముతున్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ఈ అంపశయ్యమీద ఉన్న భీష్ముడు కల్పాంతంలో సూర్యుడు లోకసంచారం మాని, నేలమీద వాలి, విశ్రాంతి తీసికొన్న రీతిగా ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. దేవవ్రతుండు గీర్వా । ణావాసంబునకుఁ జనినయట కురునికరం**
**బేవాని నడిగి తెలియునొ । కో? విశ్రుతధర్మ సంప్రయోగ విధంబుల్. 118**

**ప్రతిపదార్థం:** దేవవ్రతుండు= భీష్ముడు; గీర్వాణ+ఆవాసంబునకున్= దేవతల నివాసానికి - స్వర్గానికి; చనిన+అట= వెళ్ళిపోయాక; కురునికరంబు= కురువంశీయులు; ఏవానిన్= ఎవరిని; అడిగి; విశ్రుత= సాంప్రదాయకమైన; ధర్మ సంప్రయోగవిధంబుల్= ధార్మికంగా ఈ పని ఇట్లా చేయాలి; ఇట్లా చేయకూడదు అనే విధాన్ని గురించి; తెలియును+ఒకో?= తెలిసికొంటుందో ఏమో?

**తాత్పర్యం:** భీష్ముడు స్వర్గం చేరిన తరువాత కురుకుమారులకు ఇది మంచి, ఇది చెడు, ఇట్లా చేయాలి, ఇట్లా చేయకూడదు అనే ధర్మసూక్ష్మాలను వివరించి, చేయదగిన పనిని బోధించేవారు ఎవరుంటారు? వారు ఎవరిని అడిగి తెలిసికొనాలో ఏమో!

**విశేషం:** ఇంటిపెద్ద మరణించినపుడు అందరూ బాధపడేది ఈ విషయంలోనే. భారతకథలో భీష్ముడు ఎన్నో సందర్భాలలో దుర్యోధనుడికి, ధర్మరాజుకు, ఇరువురికి ధర్మసూక్ష్మ వివేచన చేసి కర్తవ్యం బోధించాడు. ధర్మరాజాదులు ఆ మాటలు పాటించారు. దుర్యోధనుడు పాటించక మరణం పొందాడు. ఇది గాంధారికి తెలుసు. అందుకే వంశానికి పెద్ద దిక్కు - ఈయన కూడా పోతే వంశాన్ని రక్షించే పురుషుడే ఉండడే! అని ఆమె ఆక్రోశిస్తోంది.

**సీ. పగవారి మొన లను పల్లెరులం గాల్చి । మడిసెఁ గుంభజుఁ డనియెడు దవాగ్ని**
**యెన్ని యస్త్రము లింద్రుఁ డెఱుఁగు నన్నింటను । బరిణతుం డీతండు భార్గవునకు**
**నెట్లట్ల సువిధేయ మిమ్మహాత్మునకు ధ । నుర్వేద మితనికి సర్వవేద**
**ములుఁ బరిచితము లియ్యలఘుతేజుని శిక్షఁ । గాదె! పార్థుఁడు కార్ముకమున మేటి**

**ఆ. యయ్యెఁ? దక్కుకౌరవాన్వయజాతులు । సాత్యకియును ని వ్విశాలబుద్ధి**
**నాశ్రయించుటను మహాస్త్రవిత్తములైరి । యోధు లింతవార లుర్విఁగలరె? 119**

**ప్రతిపదార్థం:** పగవారి= శత్రువుల; మొనలు+అను= సైన్యమనేటువంటి; పల్లెరులన్+కాల్చి= పల్లేరులను కాల్చి; కుంభజుఁడు= ద్రోణుడు; అనియెడు దవాగ్ని= అనబడేటటువంటి దావాగ్ని; మడిసెన్= సమసినది; ఎన్ని అస్త్రములు= ఎన్ని అస్త్రాలు; ఇంద్రుఁడు+ఎఱుగున్= ఇంద్రుడికి తెలియునో; అన్నింటను= అన్నిటిలోను; ఈతండు= ఇతడు; పరిణతుండు= నిష్ణాతుడు; భార్గవునకున్= పరశురాముడికి; ఎట్లు= ఏవిధంగా; ధనుర్వేదము= ధనుర్విద్య; సువిధేయము= మిక్కిలి విధేయమో; అట్ల= అలాగే; ఈ+మహాత్మునకున్= ఈ మహానుభావుడికికూడా (సువిధేయమే); ఇతనికిన్= ఇతనికి; సర్వవేదములున్= అన్ని వేదాలు; పరిచితములు= పరిచయం లోనివే; ఇయ్యలఘుతేజుని= ఈ గొప్ప తేజస్సు కల్గినవాని; శిక్షన్+కాదె!= శిష్యరికంతోనే కదా!; పార్థుఁడు= అర్జునుడు; కార్ముకమునన్= విలువిద్యలో; మేటి+అయ్యెన్?= సమర్థుడయ్యాడు? (సర్వోత్తముడయ్యాడు); తక్కు= తక్కిన; కౌరవ+అన్వయ+జాతులున్= కురుకుమారులూ; సాత్యకియును= సాత్యకీ; ఈ+విశాలబుద్ధిన్= ఈ గొప్ప విద్యావంతుడిని; ఆశ్రయించుటను= ఆశ్రయించటంచేత; మహాస్త్ర+విత్+తములు+ఐరి= మహాస్త్రాలు తెలిసిన వారిలో శ్రేష్ఠులయ్యారు; ఇంతవారు= ఇంతటి; యోధులు= మహావీరులు; ఉర్విన్= భూమిలో; కలరె?= ఉన్నారా?

**తాత్పర్యం:** శత్రుసైన్యా లనే పల్లేరులను తుదముట్టించి ద్రోణుడనే దావాగ్ని ఆరిపోయింది. ఇంద్రుడికి ఎన్ని దివ్యాస్త్రాలు తెలియునో అన్నీ తెలిసినవాడు ఈయన. పరశురాముడికి ఎట్లా ధనుర్విద్య వశమయిందో అట్లా వశమైన మహాధనుర్వేత్త ఈ ద్రోణాచార్యుడు. సర్వవేదాలూ తెలిసిన మనీషి, ఈ పుణ్యపురుషుడి శిక్షణలోనే కదా అర్జునుడు మేటి విలుకాడు అయ్యాడు! తక్కిన కురుకుమారులు, సాత్యకి ఈ మహావేత్త దగ్గరకదా ఉత్తమ ధనుర్వేత్తలుగా తయారయ్యారు! ఇంతటి గొప్ప యోధుడు ప్రపంచంలో ఉన్నాడా?

**విశేషం:** అలం: రూపకం.

**క.** **వివిధ మహాస్త్రంబులు గా । లవశతఁ జెడెఁ గాక శౌర్యలంపటు నియ్యో**
**ధవరునిఁ బగవారికిఁ జే । ర వశంబగునెట్లు సంగరంబునఁ? గృష్ణా! 120**

**ప్రతిపదార్థం:** కృష్ణా= కృష్ణా!; వివిధ= వివిధాలైన; మహాస్త్రంబులు= గొప్ప గొప్ప అస్త్రాలు; కాలవశతన్= కాలశక్తికి లోబడి; చెడెన్+కాక= వ్యర్థాలు అయ్యాయి తప్ప; శౌర్యలంపటున్= పరాక్రమమే వ్యసనంగా కల్గిన; ఈ+యోధువరునిన్= ఈ వీరశ్రేష్ఠుడిని; సంగరంబునన్= పోరులో; చేరన్= సమీపించటానికి (ఎదిరించటానికి); పగవారికిన్= శత్రువులకైనా; ఎట్లు వశంబు+అగున్= ఎట్లా సాధ్యం?

**తాత్పర్యం:** కృష్ణా! ద్రోణాచార్యుల వద్దనున్న మహాస్త్రాలు కాలశక్తికి లోబడి వ్యర్థమయ్యాయి తప్ప ఆ మహాయోధుడిని యుద్ధంలో శత్రుసేనలు సమీపించగలవా? అది ఎట్లా సాధ్యం?

**తే.** **గురుని ము న్నిడుకొని కాదె కురుకుమారు । లనికిఁ బిలిచిరి? ధర్మపుత్రాదులయిన**
**వాలుమగల నట్లంతటివాఁడుఁబగఱు । నఱకివైచినఁ బడియున్న తెఱఁగుఁ గంటె? 121**

**ప్రతిపదార్థం:** గురునిన్= తమ గురువైన ద్రోణాచార్యుడిని; మున్ను+ఇడుకొని+కాదె!= ముందుంచుకునే కదా!; కురుకుమారులు= దుర్యోధనాదులు; ధర్మపుత్ర+ఆదులు+అయిన= ధర్మరాజు మొదలైన; వాలుమగలన్= మహావీరులను; అనికిన్+పిలిచిరి?= యుద్ధానికి రమ్మన్నారు?; అట్లు+అంతటివాఁడు= అట్లాంటివాడు; పగఱు= శత్రువులు; నఱకివైచినన్= నరికివేయగా; పడి+ఉన్న పడిఉన్న; తెఱఁగున్= విధాన్ని; కంటె?= చూశావా?

**తాత్పర్యం:** అసలు ద్రోణాచార్యులను నమ్మికదా దుర్యోధనాదులు - ధర్మరాజు, భీముడు, అర్జునుడు వంటి మహావీరులను యుద్ధానికి రమ్మని ప్రకటించారు! అట్లాంటి వీరుడు ఈనాడు శత్రువులు నరికివేయగా నేలమీదపడి ఉన్న తీరు చూస్తున్నావా?

**తోటకము.**

**సతతంబును శిష్యులు సద్వినయా । న్వితులై ప్రణమిల్లెడు వీరిపద**
**ద్వితయంబు గడుంజెడఁ దిన్నవి సూ । చితె నక్కలు? దైవము చెయ్దిఁ గటా! 122**

**ప్రతిపదార్థం:** సతతంబును= నిత్యమూ; శిష్యులు= శిష్యులైన కురుకుమారులు; పాండవులు; సత్+వినయ+అన్వితులై= మంచి వినయంతో కూడినవారై; ప్రణమిల్లెడు= నమస్కరించేటువంటి; వీరి= ఈ ద్రోణాచార్యులవారి; పద ద్వితయంబున్= రెండుకాళ్ళనూ; కడున్+చెడన్= బాగా నశించేలా; నక్కలు; తిన్నవి; కటా= అయ్యో!; దైవము+చెయ్దిన్= దేవుడి చేత; చూచితె= చూచావా?

**తాత్పర్యం:** ఎల్లప్పుడూ శిష్యులు మంచి వినయంతో నమస్కరించేటువంటి ఈ ద్రోణాచార్యులవారి పాదాలను ముక్కలు చేసి నక్కలు తినివేశాయి. అయ్యో! దైవం ఎంత క్రూరంగా ప్రవర్తించిందో చూచావా? కృష్ణా!

**విశేషం:** తోటకవృత్తంలో ప్రతిపాదానికీ నాలుగు సగణాలుంటాయి. 1-9 అక్షరాలకు యతిమైత్రి - ప్రాసనియమం కలదు.

**ఆ. ద్రుపదతనయుఁ డట్టె! ద్రోణునితలఁ గోయు । వాఁడు విధికి నెట్టివారి నెట్టి**
**తెఱఁగు సేయ రాదు? దీనికి నేమను । వార మిది యసంభవంబు గాదె? 123**

**ప్రతిపదార్థం:** ద్రోణునితలన్= ద్రోణాచార్యులతలను; కోయువాఁడు= ఖండించేవాడు; ద్రుపద తనయుఁడు+అట్టె!= ధృష్టద్యుమ్నుడా! విధికిన్= విధి; ఎట్టివారిన్= ఎలాంటివారిని; ఎట్టి తెఱఁగు= ఏ తీరుగా; చేయన్‌రాదు?= మార్చులేదు?; దీనికిన్= దీనికి; ఏమి+అనువారము?= ఏమనగలము?; ఇది= ఇట్లా కావటం; అసంభవంబు+కాదె!= సంభవమైన విషయంకాదు కదా!

**తాత్పర్యం:** ఇట్లాంటి మహాయోధుడైన ద్రోణాచార్యుడి తలనరికేవాడు అర్భకుడైన ధృష్టద్యుమ్నుడా! విధివశంగా ఎంతటివారు ఎంతగా అయిపోతారు! విధి చేయని పని ఏమున్నది? ఏమనవచ్చు దీనిని? అయినా ఎట్లా చంపాడు? ఇది అసంభవమే!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**సీ. కృపునితోఁబుట్టువు కృపి తన భర్త ద్రో । ణాచార్యుపాల దైన్యంబు విపుల**
**వేణియు మొగమున వెంట ముసుంగు వ । డంగ రాల్పడిన యెలుంగుతోడఁ**
**బలవించి పలవించి బహుశిష్యు లయ్యతి । రథవర్యు నస్త్రశస్త్రములు రథము**
**నవయవంబులును జితాకలనంబు సే । యుచు సామగానసంయుక్తవదను**

**ఆ. లగుట సూచి సామ మతికరుణంబుగాఁ దాను బాడఁజొచ్చె మానితాగ్ని**
**సొద నమర్చి యవ్విశుద్ధాత్ము నొండొక । యగ్నివోలెఁ బెట్టి రందుఁ గృష్ణ! 124**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= కృష్ణా!; కృపునితోఁబుట్టువు= కృపాచార్యుడి చెల్లెలు; కృపి= తన భర్త ద్రోణాచార్యు(డి); పాలన్= సమీపంలో; దైన్యంబు= దీనత్వం(తో); విపులవేణియున్= విరబోసుకున్న వెంట్రుకలతో; మొగమున వెంటన్= ముఖంమీద; ముసుంగు+పడంగన్= ముసుగు పడగా (ముసుగు వేసికొని); రాల్పడిన= బొంగురుపోయిన; ఎలుంగుతోడన్= కంఠంతో; పలవించి పలవించి= మాటిమాటికి దుఃఖిస్తూ (ఉండగా); బహుశిష్యులు= ద్రోణుడికున్న చాలామంది శిష్యులు; అతిరథవర్యు= అతిరథశ్రేష్ఠుడైన ఆ ద్రోణుడియొక్క; అస్త్రశస్త్రములు+రథమున్+అవయవంబులును= బాణాలను, శస్త్రాలను, దేహభాగాలను; చితాకలనంబు+చేయుచున్= చీల్చి చితిగా పేర్చి; సామగాన సంయుక్తవదనులు+అగుట+చూచి= సామగానం పాడుతున్న నోళ్ళు కలవారు కావటం చూసి; మానితాగ్ని= వైదిక కార్యాలలో మిక్కిలిగా గౌరవింపబడే అగ్నిదేవుడే; అతికరుణంబుగాన్= అతి కరుణతో; సామము= సామవేదాన్ని; తాను+పాడన్+చొచ్చెన్= తానుపాడటం మొదలు పెట్టాడు (అప్పు డందరూ చేరి); సొదను= చితిని; అమర్చి; ఆ+విశుద్ధాత్మున్= ఆ పవిత్రాత్ముడిని; ఒండొక= మరొక; అగ్ని+పోలెన్= అగ్నిలాగా; అందున్= ఆ చితిలో; పెట్టిరి= ఉంచారు.

**తాత్పర్యం:** కృష్ణా! ద్రోణుడి భార్య, కృపాచార్యుడి చెల్లెలు - కృపి తన భర్తసమీపంలో అతి దీనంగా కూర్చొని విరబోసికొన్న జుట్టుతో తలమీది ముసుగుతో పలవరిస్తూ రోదిస్తున్నది. ద్రోణుల శిష్యులు తక్కినవారు చూచి ఆ మహాయోధుడి అమ్ములు, బాణం, శస్త్రాలు, రథం, అవయవాలు వీటి నన్నిటిని ప్రోగుచేసి, చితి పేర్చి, సామవేదం చదువుతూ ఉండగా సాక్షాత్తు అగ్నిదేవుడే సామం పాడజొచ్చాడు. ఆ విధంగా చితి నేర్పరచి గురువుగారినే మరొక అగ్నివలె ఆ చితిలో చేర్చి దహనానికి సిద్ధం చేశారు.

**విశేషం:** ఇతరులను ఎవరిని వర్ణించినపుడు కాని ఈ చితి వర్ణన లేదు. ఎందుకంటే ద్రోణుడు బ్రాహ్మణుడు కాబట్టి ధర్మరాజాదులు దహనం చేయటానికి వీలు లేదు; కాబట్టి శిష్యులు చేయటాన్ని వర్ణిస్తున్నాడు. దహనం కూడా జీవికి చేయవలసిన కర్మలలో ఒకటి. అందుకే సామగానం చేశారనటం. అగ్ని స్వయంగా సామం ఆలపించటం ఏమిటి? ద్రోణుడు పవిత్రుడు. అగ్నిస్వరూపుడే. అయోనిజుడు. కాబట్టి దైవస్వరూపుడు. అందుకే అగ్ని స్వయంగా ద్రోణుడి శరీరాన్ని స్వీకరించాడని అర్థం. అందుకే 'మరి ఒక అగ్నివలె' అని స్పష్టం చేయటం.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క.** **కృపి మున్నుగ శిష్యులు సొద । యపసవ్యము గాఁగఁ దిరిగి యరిగిరి శోకా**
**ర్తపు టొడళులతో గంగకు । నపగతశరవిద్య యయ్యె నవని కటకటా!** **125**

**ప్రతిపదార్థం:** కృపి మున్నుగన్= కృపి ముందు నడుస్తుండగా; శిష్యులు= ద్రోణుడి శిష్యులు; సొద= చితికి; అపసవ్యము కాఁగన్= అప్రదక్షిణ మర్గంలో; తిరిగి; శోక+ఆర్తపు+ఒడళులతోన్= శోకంతో, దీనత్వంతో కూడిన శరీరాలతో; గంగకున్= నదికి స్నానాలు చేయటానికి; అరిగిరి= వెళ్ళారు; అవని= భూమి; అపగత= పోగొట్టుకున్న; శరవిద్య+అయ్యెన్= శరవిద్య కలిగింది అయింది; కటకటా!= అయ్యయ్యో!

**తాత్పర్యం:** కృపి ముందు నడుస్తూండగా శిష్యులు ఆ చితికి అప్రదక్షిణంగా తిరిగి శోకంతో దీనత్వంతో కూడిన శరీరాలతో నదిలో స్నానాలు చేయటానికి వెళ్ళారు. ఈ భూలోకంలో ఇక బాణవిద్య లుప్తమై పోయినట్లే. ఎంత దౌర్భాగ్యం!

**విశేషం:** భారతకాలంలో స్త్రీలు కూడా చితిచుట్టూ తిరిగేవారన్న విషయం ఈ సందర్భంలో గుర్తించాలి.

**ఆ.** **సోమదత్త సుతునిఁ జూడుము సాత్యకి । దూష్యభంగి శిరముఁ దునుమ నొఱగి**
**యున్నవాఁడు గ్రద్ద లొలిచి తినంగ నీ । సుకృతపరుని నిట్లు సూడవలసె.** **126**

**ప్రతిపదార్థం:** సోమదత్తసుతునిన్= భూరిశ్రవుని; చూడుము; సాత్యకి; దూష్యభంగిన్= నిందింపదగు రీతిలో; శిరమున్+తునుమన్= కుత్తుకను కోయగా; ఒఱిగి+ఉన్నవాడు= నేలమీద పడి ఉన్నాడు; ఈ సుకృతపరునిన్= ఈ పుణ్యాత్ముడిని; ఇట్లు= ఈ విధంగా; గ్రద్దలు; ఒలిచి తినంగన్= ఒలిచి తింటుండగా; చూడన్ వలసెన్= చూడవలసి వచ్చింది.

**తాత్పర్యం:** కృష్ణా! చూడుము. అదే సోమదత్తుడి కొడుకు భూరిశ్రవుడి పార్థివశరీరం. సాత్యకి చాలా నీచంగా తల నరికివేయగా అట్లా పడి ఉన్నాడు. గద్దలు ఒంటిని ఒలిచివేసి తింటున్నాయి. ఈ పుణ్యాత్ముడిని ఇట్లా చూడవలసి వచ్చినది.

**వ. సోమదత్తుఁడు పుత్రశోకాయత్తుండై యుండి తన్ను సాత్యకి గవిసినప్పుడు తన కొడుకునెడ నతండు సేసిన యధర్మం బుగ్గడించి గర్హించిన విధంబు మృతుండైనను మొగంబునం దోఁచుచున్నది. భూరిశ్రవు తల్లి యది యతనిని వల్లభునిఁ బొరిఁ బొరిం గనుంగొనుచు గద్గదకంఠంబుతో నా సోమదత్తు నుద్దేశించి. 127**

**ప్రతిపదార్థం:** సోమదత్తుఁడు; పుత్రశోక+ఆయత్తుండు+ఐ+ఉండి= కుమారుడి మరణశోకానికి వశుడై ఉండి; తన్నున్= తనను; సాత్యకి; కవిసినప్పుడు= ముట్టడించినప్పుడు; తన కొడుకు+ఎడన్= తన కుమారుడి విషయంలో; అతండు+చేసిన= ఆ సాత్యకి చేసిన; అధర్మంబు= అధర్మయుద్ధం (నీచకార్యం); ఉగ్గడించి= పేర్కొని; గర్హించిన= నిందించిన; విధంబు= తీరు; మృతుండు+ఐనను= ఆ సోమదత్తుడు చనిపోయినా; మొగంబునన్= ముఖంలో; తోఁచుచున్నది= కనిపిస్తున్నది; భూరిశ్రవు తల్లి= సోమదత్తుడి భార్య; అది= ఆమె; అతనిని= ఆ భూరిశ్రవుడిని; వల్లభునిన్= తన భర్తను; పొరిన్+పొరిన్= మాటిమాటికి; కనుంగొనుచున్= చూస్తూ; గద్గద కంఠంబుతోన్= డగ్గుత్తిక పడిన గొంతుతో; ఆ సోమదత్తున్= ఆ సోమదత్తుడిని; ఉద్దేశించి= చూసి.

**తాత్పర్యం:** ఆ సోమదత్తుడు పుత్రశోకంతో కూడినవాడై తన మీదికి సాత్యకి దూసుకొని వచ్చినప్పుడు తన కుమారుడి విషయంలో అతడు చేసిన నీచకార్యాన్ని పేర్కొని నిందించిన తీరు ఆ సోమదత్తుడు చనిపోయినా అతడి ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నది (అంటే ముఖదర్పణంలో ఆ నరాల బిగింపు, ఆవేశం, క్రోధం, అవమానం అవన్నీ అట్లాగే ప్రతిబింబిస్తున్నాయని అర్థం). అదిగో ఆమె భూరిశ్రవుడి తల్లి. తన కొడుకును, తన భర్తను మార్చి మార్చి చూస్తూ వణకిపోతున్న కంఠంతో భర్తను ఉద్దేశించి ఇట్లా అంటున్నది).

**సీ. ఓ రాజ! కల్పక్షయోపమానంబగు। కౌరవజాతి సంక్షయము చూడ**
**కున్నాఁడ వధిక దానోజ్జ్వలు బహుమహా। ధ్వరకర్త భూరిశ్రవసుఁడు నీదు**
**గారాబుపట్టి సంక్రందననందను। దుర్విక్రమంబునఁ దునుమఁబడిన**
**బాహువు సాత్యకి పాపకర్మంబున। సంఛిన్నమైన మస్తకము నై మ**

**ఆ. హీతలమునఁ బడియె నిప్పుణ్యసంతతి। దిక్కుసూడ వేల? యొక్కమాటు**
**కొడుకు చుట్టు నేడ్చు కోడండ్ర యలమట। యరయ విట్లు దగునె యధిప! నీకు? 128**

**ప్రతిపదార్థం:** ఓ రాజ!= ఓ సోమదత్త మహారాజా!; కల్పక్షయ+ఉపమానంబగు= కల్పాంతంతో సమానమైన; కౌరవజాతి= కురువంశ; సంక్షయము= నాశనం; చూడక+ఉన్నాఁడవు= చూడకుండా ఉన్నావు (చూడకుండానే వెళ్లిపోయావా! అని అర్థం); అధిక దాన+ఉజ్జ్వలు= మిక్కిలి దానధర్మాలచేత ప్రకాశించేవాడు; బహుమహా+అధ్వరకర్త= గొప్ప యాగాలను చాలా వాటిని చేసినవాడు; నీదు గారాబుపట్టి= నీ ముద్దులకొడుకు; భూరిశ్రవసుఁడు (అంటే పెద్దల దగ్గర బాణ ధర్మసూక్ష్మాలు శాస్త్ర చర్చలు విన్నవాడని అర్థం); సంక్రందననందను= ఇంద్ర కుమారుడైన అర్జునుడి; దుర్విక్రమంబునన్= దుష్టపరాక్రమంతో; తునుమన్+పడిన= ఖండించబడిన; బాహువు= భుజం(కలవాడై); సాత్యకి; పాపకర్మంబునన్= నీచమైన పనివలన; సంఛిన్నమైన= తెగగొట్టబడిన; మస్తకమున్+ఐ= తలగల్గినవాడై; మహీతలమునన్= నేలమీద; పడియెన్= పడ్డాడు; ఈ+పుణ్యసంతతి+దిక్కు= ఈ పుణ్యపురుషుడైన కుమారుడివైపు; ఒక్కమాటు= ఒక్కసారి; చూడవు+ఏల?= చూడకున్నావెందుకు?; కొడుకుచుట్టు= నీ కుమారుడి చుట్టూ; ఏడ్చు= ఏడుస్తున్న; కోడండ్ర+అలమట= కోడళ్ళ దుఃఖం; అరయవు= తెలిసికొని పరామర్శించవు; అధిప!= మహారాజా!; ఇట్లు= ఇలా చేయటం; నీకున్+తగునె?= నీకు తగిన పనేనా?

**తాత్పర్యం:** ఓ సోమదత్తమహారాజా! యుగాంతంతో ఉపమింపదగిన కురువంశ నాశనాన్ని చూడలేకుండా వెళ్ళిపోయావా? ఎన్నో దానధర్మాలు చేసినవాడు, ఎన్నో మహాయాగాలు చేసినవాడు, నీ ముద్దులకొడుకు అయిన భూరిశ్రవుడిని చూస్తున్నావా? అర్జునుడు దుర్మార్గంగా విజృంభించి భుజం తెగగొట్టాడు. సాత్యకి అతి నీచంగా తల నరికాడు. అట్లా నీ కొడుకు నేలకూలాడు. నీ కొడుకును ఒక్కసారి ఎందుకు పలకరించవు? నీ కుమారుడి చుట్టూ చేరి ఏడుస్తున్న కోడళ్ళను ఎందుకు పరామర్శించవు? మహాప్రభువైన నీకు ఇది తగినదేనా?

**క. వీ రేవు రొంటి చీరలుఁ । దారును విరిదలలతోడఁ దద్దయు నడలుం**
**గూరి పలవించెదరు నిను । సారసికల భీతిరుతుల చందము దోఁపన్. 129**

**ప్రతిపదార్థం:** వీరు+ఏవురు= నీ కోడళ్ళు ఐదుగురూ; ఒంటిచీరలన్= ఏకవస్త్రలై; తారును= తాము; విరిదలలతోడన్= విరబోసుకున్న వెంట్రుకలతో; తద్దయున్= మిక్కిలిగా; అడలున్+కూరి= దుఃఖంలో మునిగి; సారసికల= ఆడబెగ్గురు పక్షుల; భీతిరుతుల= భయంతో కూడిన అరపుల; చందము= తీరు; తోఁపన్= తోచేటట్లుగా; పలవించెదరు నినున్= నిన్ను గూర్చి ప్రలాపాలు చేస్తూ ఏడుస్తున్నారు;

**తాత్పర్యం:** నీ కోడళ్ళు ఐదుగురూ ఏకవస్త్రలై, విరబోసుకున్న జుట్లు కలిగినవారై మిక్కిలిగా దుఃఖంలో మునిగిపోయి నిన్ను గురించి విలపిస్తున్నారు. ఆ ఏడుపు ఆడబెగ్గురు పిట్టలు భయంతో అరిచిన తీరుగా ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ఆలమునకు వెడలునప్పు డిచ్చితి నీదు । పసిఁడి గొడుగు లసిత విభవుఁ**
**డగుట కది నిక్కృత్తమై పడి యున్నది । య క్కుమారు రథమునందుఁ జూడు. 130**

**ప్రతిపదార్థం:** ఆలమునకున్= యుద్ధానికి; వెడలు+అప్పుడు= బయలు దేరినప్పుడు; పసిఁడి గొడుగున్= బంగారు గొడుగును; సుతుఁడు= కుమారుడు; లసిత= వెలుగొందిన; విభవుఁడు= వైభవం కలవాడు (వైభవోపేతుడు కావాలని అర్థం); అగుటకున్= కావాలని; ఇచ్చితి(వి)= ఇచ్చావు; అది= ఆ గొడుగు; నిక్కృత్తమై= విరగగొట్టబడి; పడి+ఉన్నది; ఆ+కుమారు= భూరిశ్రవుని; రథమునందున్+చూడు= రథంలో చూడుము.

**తాత్పర్యం:** రాజా! నీవు నీ కుమారుడు యుద్ధానికి బయలుదేరుతున్నపుడు వైభవోపేతుడుగా ఉండాలని బంగారు గొడుగును బహుమతిగా ఇచ్చావు. ఆ గొడుగు శత్రు సైన్యంచేత విరుగగొట్టబడి నీ కుమారుడి రథంలో పడి ఉన్నది చూడుము!).

**క. అని పనవుచున్నయది య । వ్వనితను గోడంద్రఁ జూడ వశమే? ఘనుఁ డ**
**ర్జునుఁ డిట్టి నీచకర్మం । బున కెట్టులు సొచ్చెనో! కుపురుషుఁడ పోలెన్. 131**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పనవుచున్న+అది= రోదిస్తున్నది; ఆ+వనితను= ఆమెను; కోడంద్రన్= కోడళ్ళను; చూడన్+వశమే?= చూడటానికి సాధ్యమా?; ఘనుఁడు= మహావీరుడైన; అర్జునుఁడు; కుపురుషుఁడ+పోలెన్= నీచ మానవుడిలాగా; ఇట్టి= ఇట్లాంటి; నీచకర్మంబునకున్= నీచమైన పనికి; ఎట్టులు= ఏ విధంగా; చొచ్చెనో!= సిద్ధపడ్డాడో!

**తాత్పర్యం:** అని అంటూ ఆమె ఎన్నో విధాలుగా భర్తను తలచుకొని ఏడుస్తున్నది. ఆమెను ఆమె కోడళ్ళను చూడటానికి శక్యం కావటంలేదు. మహావీరుడైన అర్జునుడే ఇట్లాంటి నీచకార్యానికి ఎట్లా ఒడిగట్టాడు? ఈ పని ఎవరో నీచులు చేయదగింది.

**కవిరాజ విరాజితము:**

**విను మది సాత్యకి చచ్చుట కోర్వక వీరవరుండగు పార్థుఁడు సే**
**సిన తగవైనను నయ్యె నతం డటు చే నఱుకన్ మునియైన మహా**
**త్మునిఁ గని యుబ్బుచు సాత్యకి యేమని త్రుంచె శిరంబు? కడంగి జగం**
**బున నొరు లింత నికృష్టపుఁ గర్మము పొంతను బోదురె? చక్రధరా! 132**

**ప్రతిపదార్థం:** చక్రధరా!= చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణా!; అది+విను= ఆ సంఘటన వినుము; సాత్యకి; చచ్చుటకున్+ఓర్వక= చనిపోవటాన్ని సహించలేక; వీరవరుండగు= వీరులలో శ్రేష్ఠుడైన; పార్థుఁడు= అర్జునుడు; చేసిన= చేసినటువంటి; తగవు= న్యాయం; ఐనను+అయ్యెను= అయితే అయినది; అతండు= ఆ అర్జునుడు; అటు= ఆ రీతిగా; చే+నఱుకన్= చేతిని నరికివేయగా; ముని+ఐన= ముని అయినటువంటి; మహాత్మునిన్+కని= మహాత్ముడైన భూరిశ్రవసుని చూచి; ఉబ్బునన్= విజృంభించి; సాత్యకి= సాత్యకి; శిరంబు= తలను; కడంగి= మిక్కిలి ప్రయత్నించి; ఏమని= ఏ ప్రయోజనం కోసం; త్రుంచెన్?= నరికాడు?; జగంబునన్= ఈ ప్రపంచంలో; ఒరులు= ఇతరులు ఎవరైనా సరే; ఇంత= ఇంతటి; నికృష్టపు+కర్మము+పొంతను= నీచమైన పని దగ్గరికైనా; పోదురె?= వెళ్ళుతారా?

**తాత్పర్యం:** కృష్ణా! అది ఎట్లా జరిగిందో వినుము. సాత్యకి చనిపోవటాన్ని అర్జునుడు భరించలేడు కాబట్టి, అట్లా చేయి నరికి 'న్యాయం' అనుకొన్నా డనుకొందాము. మరి ఆ భూరిశ్రవుడు సాధువే! ఆ మహాత్ముడిని సమీపించి విజృంభించి పూనుకొని ఆయన తలను సాత్యకి నరికి ఏమి సాధించాడు? అసలు జగత్తులో ఎవరైనా ఇంత నీచపుపని దగ్గరకైనా వెళ్తారా? నీవే చెప్పుము!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. కవిరాజవిరాజితంలో ప్రతిపాదానికీ న, జ, జ, జ, జ, జ, స, ర అనే గణాలుంటాయి. 1-14 అక్షరాలకు యతిమైత్రి. ప్రాస నియమం కలదు.

**క. ఇక్కురువరు నాండ్రురలో । నొక్కత యతిరమ్యమూర్తి యుత్సంగమునం**
**దక్కర మిడికొని పనవెడు । నెక్కుడువగ నూని యదె మహీధర! కంటే? 133**

**ప్రతిపదార్థం:** మహీధర!= భూసతిని ధరించినవాడా! (విష్ణురూపుడైన కృష్ణా!); ఈ+కురువరు= ఈ కురుశ్రేష్ఠుడియొక్క; ఆండ్రురలోన్= భార్యలలో; అతిరమ్యమూర్తి= మిక్కిలి సౌందర్యవతి; ఒక్కత= ఒకామె; ఉత్సంగమునన్= తొడమీద; ఆ+కరము= ఆ భుజాన్ని; ఇడుకొని= ఉంచుకొని; ఎక్కుడు వగన్+ఊని= ఎక్కువ దుఃఖాన్ని పొంది; పనవెడున్= శోకిస్తోంది; అదె= అదిగో అక్కడ; కంటే?= చూస్తున్నావా?

**తాత్పర్యం:** కృష్ణా! ఈ భూరిశ్రవుడి భార్యలలో అందమైన ఒక స్త్రీ అతడి చేతిని తన తొడపై ఉంచుకొని మిక్కిలి శోకంతో కుమిలిపోతూ ఏడుస్తున్నది. అదిగో చూస్తున్నావా?

**సీ.** **మెలుపారఁగాఁ బట్టి మొలనూలి మణులు గ । దల్చుచుఁ దిగుచుచుఁ దగులొనర్చుఁ**
**జనుఁగవ మీఁది కల్లన వచ్చి లలిత వి । మర్దనంబున లజ్జ మరలఁ ద్రోచు**
**నాభి యూరులు జఘనము మెత్త మెత్తన । యొత్తి ముదంబున నుల్ల మూన్చు**
**ననయంబుఁ దిన్నని యనువున గనయంబు । ప్రిదులంగ మెలఁపి సొక్కొదవఁ జేయ**

**ఆ.** **నిక్కరంబు నెయ్య మెక్కింప నేరంగఁ । దగిలి సంతతంబుఁ దలఁచునట్టి**
**భంగి మెఱయ గీడువఱుపంగఁ గొనియాడ । వలఁతి నీఱు సేయవలసె దీని.** **134**

**ప్రతిపదార్థం:** మెలుపు+ఆరఁగాన్= సౌకుమార్యం నిండగా; పట్టి= పట్టుకొని; మొలనూలి= కటి సూత్రంలోని; మణులు= మణులను; కదల్పుచున్= కదలిస్తూ; తిగుచుచున్= లాగుతూ; తగులు+ఒనర్చు= తమిని పుట్టిస్తుంది (ఈ+కరము= ఈ చేయి); చనుఁగవ మీఁదికిన్= స్తనాలమీదికి; అల్లన= మెల్లగా; వచ్చి= వచ్చి; లలిత విమర్దనంబునన్= నెమ్మదిగా పిసకటం వలన; లజ్జన్= సిగ్గును; మరలన్+త్రోచున్= మరలిపోయేలా చేస్తుంది; నాభి=బొడ్డు; ఊరులు= తొడలు; జఘనము= పిరుదు; మెత్తమెత్తని= సుతిమెత్తగా; ఒత్తి= ఒత్తి; ముదంబునన్= సంతోషంతో; ఉల్లము+ఊన్చు= హృదయాన్ని సంతోషింపచేస్తున్నది (ఊంచు - ఊయలలూపుతుంది); అనయంబున్= ఎప్పుడూ; తిన్నని+అనువునన్= మనోహరమైన రీతిలో; గనయంబు= పోకముడి; ప్రిదులంగన్= ఊడిపోయేలా; మెలఁపి= చేసి; చొక్కు= పారవశ్యం; ఒదవన్+చేయన్= కల్గించటానికి; ఈ+కరంబు= ఈ చేయి; నెయ్యము= ప్రేమను; ఎక్కింప నేరంగన్= అధికం చేయడానికి సమర్థమై; తగిలి= స్పృశించి; సంతతంబున్= ఎల్లప్పుడూ; తలఁచునట్టి భంగిన్= తలుచుకునే రీతిలో; మెఱయన్= ప్రకాశిస్తుండగా; దీనిన్= దీన్ని; కొనియాడవలఁతి= ప్రశంసించదగిన నేర్పరితనం కల్గినది కాగా; కీడు పఱుపంగన్= నాశనం చేయగా; నీఱు+చేయవలసెన్= అగ్నికి ఆహుతి చేసి బూడిద చేయాల్సి వచ్చింది.

**తాత్పర్యం:** ఆ భూరిశ్రవుని భార్య తన భర్తచేతి గొప్పతనాన్ని గురించి ఇట్లా విలపిస్తున్నది - 'ఈ చేయి సుకుమారంగా కటిసూత్రాన్ని పట్టుకొని అందులోని మణులను కదిలిస్తూ లాగుతూ ఆసక్తిని అధికం చేసేది. స్తనాలమీదికి నెమ్మదిగా వచ్చి సుతారంగా పిసుకుతూ సిగ్గును పోగొట్టేది. బొడ్డును, తొడలను, పిరుదులను మెత్త మెత్తగా ఒత్తుతూ హృదయాన్ని ఊయల లూపేది. ఎప్పుడూ చాలా తిన్నగా పోకముడిని సడలించి నన్ను పారవశ్యం పాలు చేసేది. ఈ చేయి తగిలిన వారికి ఎప్పుడూ ప్రేమ అధికం కావటమే. ఎవరూ ఈ చేతిని మరవలేరు. ఇది ఎప్పుడూ మెచ్చుకోదగిన బంగారు చేయి. అట్లాంటి దీనిని నరికి పారవేయగా ఈనాడు మంటలలో వేసి బూడిద చేయాల్సివస్తున్నది.

**విశేషం:** ఈ పరిస్థితిలో కూడా ఎంత శృంగారం!

**ఆ.** **ఒరుని తోడఁ బోర హరి సూడ సిగ్గఱి । యేసె విజయుఁ డతని యేటు సభల**
**న ముకుందుఁ డెట్టు లగ్గించు? నట్టి వి । వ్వచ్చుఁ డేమిభంగి మెచ్చుఁ దన్ను?** **135**

**ప్రతిపదార్థం:** ఒరునితోడన్= మరి ఒకడితో; పోరన్= యుద్ధం చేస్తుండగా; హరి+చూడన్= శ్రీకృష్ణుడు చూస్తూండగా; సిగ్గు+అఱి= సిగ్గు వదలి; విజయుఁడు= అర్జునుడు; ఏసెన్= ఈ చేతిని విరగొట్టాడు; అతని+ఏటున్= అట్లా అతడు కొట్టటాన్ని; ఆ+ముకుందుఁడు= ఆ కృష్ణుడు; సభలన్= పదిమంది పెద్దలు చేరి న్యాయం చెప్పేచోట; ఎట్టులు= ఏ విధంగా; అగ్గించున్?= ప్రశంసించగలుగుతాడు?; అట్టి= అలాంటి; వివ్వచ్చుఁడు= అర్జునుడు; ఏమిభంగిన్= ఏ విధంగా; తన్నున్= తన్నుతాను; మెచ్చున్?= పొగడుకోగలడు?

**తాత్పర్యం:** మరొకడితో యుద్ధం చేస్తుండగా (సాత్యకితో యుద్ధం చేస్తున్నప్పుడు) శ్రీకృష్ణుడు చూస్తుండగా సిగ్గు విడిచి అర్జునుడు భూరిశ్రవుడి చేయి నరికాడు. పదిమంది పెద్దలు చేరినచోట అర్జునుడు చేసిన ఈ పనిని కృష్ణుడు ఎట్లా మెచ్చుకొంటాడు? అసలు అర్జునుడు బీభత్సుడని కదా పేరు. అతడు మాత్రం తాను చేసిన ఈ పనిని 'ఏం గొప్ప' అని పొగడుకొనగలడు?

**వ. అని యిట్లు విలాపంబు చేసి యూరకున్న దిన్నాతిం దక్కటి యెలనాఁగ లేలిన దానిఁ బొదివికొని యున్న వా రాలోకింపుము. 136**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విలాపంబు+చేసి= ఏడ్చి; ఊరకున్నది= ఊరకే ఉండిపోయింది; ఈ+నాతిన్= ఈ స్త్రీని; తక్కటి= తక్కిన; ఎలనాఁగలు= స్త్రీలు; ఏలినదానిన్+పోలెన్= మహారాణివలె; పొదివికొని= పొదువుకొని; ఉన్నవారు= ఉన్నారు; ఆలోకింపుము= చూడుము.

**తాత్పర్యం:** అని ఈ రీతిగా ఏడ్చి ఏడ్చి ఆమె ఊరుకొన్నది. తక్కిన స్త్రీలు ఈమెను పట్టపురాణివలె పొదువుకొని ఉన్నారు. చూడుము.

### గాంధారి శకుని కళేబరంబు గాంచి యతని చేఁత లుగ్గడించి శోకించుట (సం. 11-24-21)

**సీ. మేనల్లుఁడగు నకులానుజు నేటులఁ । బడియుండి శకునుల పాలువడ్డ**
**శకునిఁ జూచితె? మురసంహర! యితఁడు మా । యా జాలమునకు నాఁడోజ సకల**
**మాయలు నీ చేత మడిసె దుర్ద్యూతంబు । నొనరించి రాజ్యంబు గొనియె ధర్మ**
**తనయునిచే నిష్టు దన చెయ్డి ఫలియించె । ననియను జూదంబునందుఁ బ్రాణ**

**ఆ. మోటు వడియె నెత్తమాటకు నీతండు । గఱచు టెల్లఁ గురునికాయనాశ**
**మునకు నయ్యె నీ నృపుఁడ కాఁడె పాండు నం । దనుల తోడివైరమునకుఁ గర్త? 137**

**ప్రతిపదార్థం:** మేనల్లుఁడు+అగు= మేనల్లుడైనటువంటి; నకుల+అనుజున్= సహదేవుని; ఏటులన్= దెబ్బలచేత(బాణపు); పడి+ఉండి= నేలమీదపడి ఉండి; శకునుల= రాబందుల; పాలు+పడ్డ= పాలుపడిన; శకునిన్= నా సోదరుడు శకునిని; చూచితె?= చూశావా?; మురసంహర= కృష్ణా!; ఇతఁడు= ఈ శకుని; మాయాజాలమునకున్= మాయా జాలాలు చేయడంలో; నాఁడు= ఆనాడు; ఓజ= ఉపాధ్యాయుడు; సకలమాయలు= అన్ని మాయలు; నీచేతన్= నీ చేతుల్లో; మడిసెన్= నశించాయి. దుర్ద్యూతంబున్= దుర్మార్గపద్ధతిలో జూదాన్ని; ఒనరించి= ఆడి; ధర్మతనయుచేన్= ధర్మరాజు నుండి; రాజ్యంబున్+కొనియెన్= రాజ్యాన్ని లాగుకొన్నాడు; ఇష్టు= చివరికి, ఈనాడు; తన= తనయొక్క; చెయ్డి= చేత(పాపకర్మ); ఫలియించెన్= ఫలించింది; అని+అను= యుద్ధమనేటువంటి; జూదంబునందున్= జూదంలో; ప్రాణము+ఓటు+పడియెన్= ప్రాణం ఓడిపోయాడు; నెత్తము+ఆటకున్= జూదం ఆడటానికి; ఈతండు= ఇతడు; కఱచుట+ఎల్లన్= చేసిన అభ్యాసమంతా; కురునికాయ నాశమునకున్= కురు సమూహ వినాశానికి; అయ్యెన్= పనికి వచ్చింది; ఈ నృపుఁడ+కాఁడె!= ఈ రాజే కదా!; పాండునందనుల తోడి= పాండు కుమారులతో; వైరమునకున్+కర్త?= శత్రుత్వానికి మూలం?

**తాత్పర్యం:** స్వయానా తన మేనల్లుడైన సహదేవుడి వాడి బాణాల దెబ్బలకు చిక్కి, ప్రాణాలు పోయి, నేలబడి రాబందులపాలైన సోదరుడు శకునిని చూస్తున్నావా! కృష్ణా! ఈ శకుని ఆ రోజులలో మాయలు పన్నటంలో అందరికీ

గురుస్థానంగా ప్రకాశించాడు. కాని అన్ని మాయలూ నీ చేతిలో నశించాయనుకో. ఆనాడు మోసంగా జూదమాడి ధర్మరాజునుండి రాజ్యమంతా లాగుకొన్నాడు. చివరికి ఈనాడు యుద్ధమనే జూదంలో తన ప్రాణాన్నే ఒడ్డి ఓడిపోయాడు. ఈ నాటికి ఇతని పాపకర్మ ఫలించింది. అసలు జూదమాడటానికి ఇతడు చేసిన నిరంతరమైన అభ్యాసం కురువంశ నాశనానికి తప్ప ఎందుకు పనికి వచ్చింది? నిజానికి పాండుకుమారులతో వైరం రావటానికి మూలం కూడా ఇతడే.

**విశేషం:** ద్వాపరయుగం 'సంశయ' ప్రధానమైనదట. 'శకునం' - అంటే నిశ్చయజ్ఞానం లేకపోవటమే. దుర్యోధనుడికి 'శకుని' మంత్రి కావటంలో రహస్య మిదే. అందుకే జీవితాంతం దుర్యోధనుడిని ధర్మపద్ధతికి వ్యతిరేకంగానే నడిపించాడు. అందుకే పాండవులతో నిరంతరవైరం నడిపినవాడు శకునే. అందుకే గాంధారి ఈమాట అంటున్నది.

**క. హిత మొనరించెద నంచున్ । ధృతరాష్ట్ర తనూభవునకుఁ దెక్కలికాఁడై**
**మృతి యొనరించెం దానును । మృతుఁ డయ్యెను భ్రాతృపుత్ర మిత్ర యుతముగన్. 138**

**ప్రతిపదార్థం:** హితము= మంచిది; ఒనరించెదను+అంచున్= చేస్తాను అంటూ; ధృతరాష్ట్ర తనూభవునకున్= దుర్యోధనుడికి; తెక్కలికాఁడై= మోసగాడై(వంచకుడై); మృతి+ఒనరించెన్= చావుతెచ్చిపెట్టాడు; తానును= తానుకూడా; మృతుఁడు+అయ్యెన్= చనిపోయాడు; భ్రాతృ= సోదరులతో; పుత్ర= కొడుకులతో; మిత్రయుతమునన్= స్నేహితులతో (కలిసి - చనిపోయాడు).

**తాత్పర్యం:** 'నీకు మంచి చేస్తాను' అంటూ దుర్యోధనుడికి ఈ మోసగాడు చివరకు మరణం తెచ్చిపెట్టాడు. అంతేకాక తానుకూడా సోదరులతో, కొడుకులతో, స్నేహితులతో కలిసి చనిపోయాడు.

**మత్తకోకిల:**

**వార లస్త్రహతాంగులై యనవద్యలోకము గాంచి రీ**
**వైరకర్తయు నట్లు గాంచెను వారి నల్పవిచారులం**
**బోరి కెత్తెడునట్లుగాఁ దగఁ బొంది వెఱ్ఱులఁ జేసె నీ**
**క్రూరుఁ డందును నన్నదమ్ములకున్ విరోధము సేయఁడే? 139**

**ప్రతిపదార్థం:** వారలు= కురుపుత్రులు; అస్త్ర+హత+అంగులు+ఐ= అస్త్రాల చేత నశింపచేయబడిన శరీరాలు గలవారై; అనవద్య= పుణ్య; లోకమున్= లోకాన్ని; కాంచిరి= పొందారు; ఈ+వైరకర్తయున్= ఈ విరోధమూలమైన శకునికూడా; అట్లు+కాంచెను= అట్లాగే దోషరహితమైన స్వర్గాన్ని పొందాడు; వారిన్= వారిని (ఆ కురుకుమారులను); అల్పవిచారులన్= అల్పజ్ఞానులను; పోరికిన్+ఎత్తెడునట్లుగాన్= యుద్ధానికి సిద్ధపడే విధంగా; తగన్+పొంది= తగినట్టుగా వశం చేసుకొని; ఈ క్రూరుఁడు= ఈ కఠినాత్ముడు; వెఱ్ఱులన్+చేసెన్= వెర్రివాడిగా చేశాడు; అందున్= అందులోనూ; అన్నదమ్ములకున్= అన్నదమ్ములకు; విరోధము+చేయఁడే?= విరోధం కల్పించడా?

**తాత్పర్యం:** ఈ కురుకుమారులు అస్త్రాలచేత నశించిన శరీరాలు కలవారై స్వర్గానికి వెళ్ళిపోయారు. ఈ వైరానికి మూలమైన ఈ శకునికూడా అట్లాగే స్వర్గం పొందాడు. అసలే కౌరవులు అల్పజ్ఞానులు. అల్పబుద్ధులుకూడా. అట్లాంటివారిని వశం చేసికొని వెర్రివారిగా మార్చి యుద్ధానికి సిద్ధపడేటట్లు చేసినవాడు ఈ శకునే. అట్లాంటివాడు అన్నదమ్ముల మధ్య విరోధాన్ని కల్పించడా!

**విశేషం:** వృత్తలక్షణానికి చూడండి : స్త్రీ. 1. 21.

**క. రుచిరాంగదు శస్త్రనిచయు । నిచితాంగకునిం గళింగనృపుఁ గంటి సమి**
**ద్విచరణ విహరణమున నితఁ । డ చలితధృతి యగుట యెఱుఁగ నయ్యెడుఁ గృష్ణా! 140**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= కేశవా!; రుచిర+అంగదున్= కాంతిమంతమైన భుజకీర్తులు గలవాడు; శస్త్రనిచయ= శస్త్ర సమూహంతో; నిచితాంగకునిన్= నిండిన అవయవాలు కల్గిన వాడిని; కళింగనృపున్= కళింగరాజును; కంటిన్= చూచాను; సమిత్= యుద్ధంలో; విచరణ విహరణమునన్= భ్రమించటమనే ఆటలో; ఇతఁడు= ఈ కళింగరాజు; అచలిత= చలించని; ధృతి+అగుట= ధైర్యం కలవాడనటం; ఎఱుఁగన్+అయ్యెడున్= స్పష్టమవుతోంది.

**తాత్పర్యం:** కృష్ణా! ఇతడే కళింగదేశాధిపతి. అందమైన భుజకీర్తులు కల్గిన ఇతడి దేహం నిండా శస్త్రాలు నాటుకొని ఉన్నాయి. ఈ శస్త్రాల వ్యాప్తిని బట్టి ఇతడు యుద్ధరంగంలో వీరవిహారం చేయడంలో ఏమాత్రం ధైర్యం మొక్కవోనివాడని స్పష్టమవుతున్నది. చూస్తున్నావా!

**ఆ. ఇతని చుట్టునున్న యెలనాఁగ లడలునఁ । గూరి వందియును ముకుంద! యొప్ప**
**వాయకున్నవారు బలితంపువడఁబడ్డ । పుష్పదామకముల పొలుపు దోఁప. 141**

**ప్రతిపదార్థం:** ముకుంద!= కృష్ణా!; ఇతనిచుట్టున్= ఇతనిచుట్టూ; ఉన్న= చేరి ఉన్న; ఎలనాఁగలు= స్త్రీలు; అడలునన్+కూరి= దుఃఖంలో మునిగి; వందియును= వాడిపోయి కూడా; బలితంపు+వడన్+పడ్డ= బలమైన వడదెబ్బతిన్న; పుష్పదామకముల= పూలదండల; పొలుపు+తోఁపన్= విధం తోపగా; ఒప్పు= అందాన్ని; పాయకున్నవారు= పోగొట్టుకోకుండా ఉన్నారు.

**తాత్పర్యం:** కృష్ణా! ఇతడి చుట్టూ చేరి ఉన్న స్త్రీలు దుఃఖంలో మునిగిపోయి ఏడుస్తూ ఉండటం వలన వాడిపోయినా బలమైన వడదెబ్బ తగిలినా పూలదండలు ఎట్లా తమ సౌందర్యం కోల్పోవో అట్లాగే అందంగా కనిపిస్తున్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉత్సాహవృత్తము:**

**మానినీ జనంబు సేరి మగధనాథుఁడగు జయ**
**త్సేను చుట్టు నేడ్వ నధిక దీన నాదములకు నా**
**మానసంబు సాంద్రకరుణమయతఁ బొందె మోహనం**
**బైన యిట్టి యేడ్పు లెందు నంబుజాక్ష! వింటిమే? 142**

**ప్రతిపదార్థం:** అంబుజాక్ష!= కమలనయనా (కృష్ణా!); మగధనాథుఁడగు= మగధదేశాధిపతియైన; జయత్సేనుచుట్టున్= జయత్సేనుడి చుట్టూ; మానినీ జనంబు+చేరి= స్త్రీలు చేరి; ఏడ్వన్= ఏడుస్తుండగా; అధిక= అధికమైన; దీన నాదములకున్= ఆర్తితో కూడినవారి ఎలుగులకు; నా మానసంబు= నా మనస్సు; సాంద్ర కరుణమయతన్= దట్టమైన కరుణతో కూడిన లక్షణాన్ని; పొందెన్; మోహనంబు+ఐన= మనస్సును హరించేటువంటి; ఇట్టి+ఏడ్పులు= ఇట్లాంటి ఏడుపులు; ఎందున్= ఎక్కడైనా; వింటిమే?= విన్నామా?

**తాత్పర్యం:** కృష్ణా! మగధదేశాధిపతి అయిన జయత్సేనుడి చుట్టూ స్త్రీలు చేరి ఏడుస్తుండగా వారి మిక్కుటమైన దీనాలాపాలు విని నా మనసు నిండా దట్టంగా కరుణ వ్యాపించిపోయింది. ఇట్లాంటి మనసును మోహింపజేసే ఏడుపులను ఎక్కడైనా విన్నామా!

**విశేషం:** పై పద్యంలో గాంధార స్త్రీలలో ఏడ్చినా లావణ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నదని, మగధస్త్రీలలో ఏడుపులోనూ మనోహరత్వం ఉందని ఇక్కడ చెప్పటం వలన - ఆయా ప్రాంతాలలోని స్త్రీల మానసిక దైహిక వ్యవస్థలలోని తేడాను సూచిస్తున్నట్లు కనిపిస్తున్నది. అందరిదీ ఏడుపే. అందరికీ శోకముంది. కాని వ్యక్తం తీరే వేరు. ఆ తీరులోని ఆకర్షణ కూడా వేరు. అందుకే స్త్రీపర్వమని వ్యాసభగవానుడు సార్థకనామధేయం చేసి ఉండాలి. వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1. 48.

**సీ.** **కోసలనాథుండు భాసురమూర్తి బృ । హద్బలుచుట్టుఁ బ్రియాంగనాజ**
**నంబులు సేరి కంపంబుతోడఁ జెమర్చు । కరముల నభిమన్యు కరవిముక్త**
**శరములఁ బెఱుకుచుఁ బొరి మూర్ఛఁ బొరయుచు । నప్పటికప్పటి కతని ముఖముఁ**
**దేఱి చూచుచు విధిఁ దిట్టుచు శోకాగ్ని । నుల్లంబు లెరియంగ నున్నవారు**

**ఆ.** **తునిమివైవ నెండఁ దనికినఁ బెద్దయు । వంది చూడ్కి దిగువ వలను కలిమి**
**దొఱఁగకున్నయట్టితోయజంబుల చంద । మయ్యెఁ జూడ వీరి యాననములు.** **143**

**ప్రతిపదార్థం:** కోసలనాథుండు= కోసలదేశాధిపతి; భాసురమూర్తి= ప్రకాశించే శరీరంకలవాడు; బృహద్బలు చుట్టున్= బృహద్బలుని చుట్టూ; ప్రియాంగనాజనంబులు= భార్యలగుంపు; చేరి; కంపంబుతోడన్= వణకుతో; చెమర్చుకరములన్= చెమర్చుతున్న చేతులలో; అభిమన్యు= అభిమన్యుని; కర= చేతినుంచి; విముక్త= వదలబడిన; శరములన్+పెఱుకుచున్= బాణాలను తీసివేస్తూ; పొరిన్= మాటిమాటికీ; మూర్ఛన్+పొరయుచున్= మూర్ఛపోతూ; అప్పటికప్పటికిన్= మాటిమాటికీ; అతని ముఖమున్; తేఱిచూచుచున్= బాగా చూస్తూ; విధిన్+తిట్టుచున్= దైవాన్ని తిట్టుకుంటూ; శోకాగ్నిని= శోకాగ్నిలో; ఉల్లంబులు+ఎరియంగన్= హృదయాలు అడలుతుండగా; ఉన్నవారు= ఉన్నారు; వీరి+ఆననములు= వీరి ముఖాలు; తునిమివైవన్= విరిచివేయగా; ఎండన్+తనికినన్= ఎండలో ఎండినాకూడా; పెద్దయున్+వంది= మిక్కిలిగా వాడి; చూడ్కి= చూపునకు; దిగువవలను= దిగువవైపు; కలిమి+తొఱఁగక+ఉన్న= శోభను పోగొట్టుకోకుండా ఉన్న; తోయజంబుల= తామరల; చందమయ్యెన్= తీరుగా ఉన్నాయి.

**తాత్పర్యం:** కృష్ణా! ఈ కోసలాధిపతి పేరు బృహద్బలుడు. మిక్కిలి ప్రకాశించే శరీరం కలవా డితడు. ఇతడి భార్యలు ఇతడి చుట్టూ చేరి వణకుతూ చెమర్చుతున్న చేతులతో అభిమన్యుడి చేతినుండి వదలబడి బృహద్బలుడి శరీరంలో నాటిన బాణాలను తీసివేస్తూ మాటిమాటికి మూర్ఛపోతున్నారు. మాటిమాటికీ అతడి ముఖాన్ని తనివితీరా చూచికొంటూ దైవాన్ని తిట్టుకుంటూ శోకాగ్నిలో ఎదలు మండగా చింతాక్రాంతులై ఉన్నారు. తామరలను తూళ్ళతో సహా పెరికివేయగా ఎండలో ఎండిపోయినా దిగువవైపు శోభను పోగొట్టుకోకుండా ఉన్న విధంగా వీరి ముఖాలు సొంపుతో ప్రకాశిస్తూనే ఉన్నాయి.

**విశేషం:** అలం: ఉపమ. వారి దేహాలు తామరతూడులు. అవి ఎండతాకిడికి వాడిపోయాయి. తామరలు పైనకూడా వాడిపోయి ఉండవచ్చును. అట్లాగే తలలమీద ముసుగులు వేసికొన్నవారి శిరోభాగాలు కూడా కాంతి విహీనమయ్యాయి. కాని, ముసుగు లోపలి ముఖాలు మాత్రం తమ సహజకాంతితో ఒప్పి ఉన్నాయి. అది ఈ పోలికలోని స్వారస్యం.

**వ. ద్రోణబాణపరిపీడితప్రాణులై పడియున్నవారు ధృష్టద్యుమ్ననందనులు. 144**

**ప్రతిపదార్థం:** ద్రోణ= ద్రోణాచార్యులయొక్క; బాణ= బాణాల చేత; పరిపీడిత= బాగా పీడించబడిన; ప్రాణులు+ఐ= ప్రాణాలు గలవారై; ధృష్టద్యుమ్న నందనులు= ధృష్టద్యుమ్నుడి కొడుకులు; పడి+ఉన్నవారు= పడి ఉన్నారు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడి కొడుకులు ద్రోణాచార్యులు ప్రయోగించిన బాణాల చేత పీడించబడి ప్రాణాలు కోల్పోయి పడి ఉన్నారు.

**మత్తకోకిల:**

**అంగదంబులుఁ గంకణంబులు హారవల్లులు నాదిగా**
**నంగకంబుల భూషణంబులు హారికాంతి వెలుంగఁ**
**సంగరాంగణభూమికిం దమచారుభావ మలంక్రియా**
**సంగతిం గలిగింప నొప్పిరి శౌరి! చూచితె వీరలన్? 145**

**ప్రతిపదార్థం:** శౌరి!= కృష్ణా!; అంగదంబులు= భుజకీర్తులు; కంకణంబులు= కడియాలు; హారవల్లులున్= సన్నటి మణులు గూర్చిన దండలు; ఆదిగాన్= మొదలైనవి - కల్గి; అంగకంబుల= అవయవాలయొక్క; భూషణంబులు= నగలు; హారికాంతిన్= మనోహరమైన కాంతితో; వెలుంగగాన్= ప్రకాశిస్తుండగా; సంగర+అంగణ+భూమికిన్= యుద్ధభూమికి; తమ= తమయొక్క; చారుభావము= అందం; అలంక్రియా సంగతిన్= అలంకారంతో ఒప్పినదిగా; కలిగింపన్= చేయగా; ఒప్పిరి= ప్రకాశిస్తున్నారు; వీరలన్= వీరిని; చూచితె?= చూచావా?

**తాత్పర్యం:** కృష్ణా! వీరి భుజకీర్తులు, కడియాలు, సన్నటిమణులతో కూర్చిన దండలు, ఆయా అవయవాలలో పొదిగిన నగలు మనోహరమైన కాంతితో ప్రకాశిస్తున్నాయి. ఈ చిన్నవారు సమరభూమికి తమ సౌందర్యాన్ని అలంకారంగా సమర్పించిన రీతిగా వెలుగుతున్నారు. వీళ్ళను చూస్తున్నావా!

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. వృత్తలక్షణం - చూడండి: స్త్రీ. 1.21

**నర్కుటము:**

**త్వరిత రథాశ్వమారుత గతస్ఫురితాకృతియై**
**శరబహుళార్చిరుద్గమవిశాలతఁ బొల్చు ధను**
**ర్గురుఁడను చిచ్చుపై శలభకోటిగతింబడి మ్రం**
**దిరిఁ గనుఁగొంటె యేవురు నుదీర్ణులఁ గేకయులన్? 146**

**ప్రతిపదార్థం:** త్వరిత= వేగిరింపబడిన; రథాశ్వమారుత= రథానికి కట్టిన గుర్రాలు అనబడే వాయువులో; గత= లీనమైన; స్ఫురిత= సంచరిస్తున్న; ఆకృతి+ఐ= ఆకారం కల్గినదీ; శర= బాణాల; బహుళ= ఆధిక్యంతోడి; ఉద్గమ= పొడుచుకొని వస్తున్న; విశాలతన్= వైశాల్యం కల్గిందీ (అయినటువంటి); పొల్చు= ఒప్పు; ధనుః+గురుఁడు= ధనుర్విద్యా గురుడైన ద్రోణాచార్యుడు; అను= అనబడే; చిచ్చుపైన్= మంటపైన; శలభకోటి= మిడతలదండు; గతిన్+పడి= రీతిగాపడి; మ్రందిరి= చచ్చారు; (ఈ); ఏవురన్= అయిదుగురినీ; ఉదీర్ణులన్= ఉద్రిక్తులను; కేకయులన్= కేకయ రాజులను; కనుఁగొంటే?= చూచావా?

**తాత్పర్యం:** వేగంగా పోతున్న రథాశ్వాలు అనే గాలి కారణంగా కదులుతున్న ఆకారం కల్గిందీ, బాణాల ఆధిక్యంచేత విస్తరిస్తున్న వైశాల్యం కల్గిందీ అయినటువంటి ధనుర్విద్యాగురువైన ద్రోణాచార్యుడనే మంటపైన మిడతల దండు రీతిగా పడి ఈ ఐదుగురు ఉద్రిక్తులైన కేకయరాజులు మాడి చచ్చారు. చూస్తున్నావా!

**విశేషం:** అలం: ఉపమ - రూపకానుప్రాణితం. కదులుతున్న అశ్వాలు గల రథంలో ఉండటం వలన ద్రోణుడి ఆకారం నిర్దిష్టంగా తెలియటం లేదు. ఆయన అవిచ్ఛిన్నంగా ప్రయోగిస్తున్న బాణాల పరిధి ఎప్పటికప్పుడు విస్తరిస్తూ ఉండటం వలన ఎటు తిరిగినా ఎటు పరుగెత్తినా ఆ బాణాల దెబ్బలను తప్పించుకొనలేరని అర్థం. అది ద్రోణుడు - అనే ధనుర్విద్యా పండితుడనే 'మంట' అనే మాటకు అర్థం. వృత్తలక్షణానికి చూడండి - స్త్రీ. 1. 113.

**క.** **పంచాననంబుచేతం । బంచత్వముఁ బొందియున్న బంధురకరిఁ బో**
**లించుటకుం దగి యొప్పెం । బాంచాలుఁడు ద్రోణుకడిమిఁబడి కంసారీ! 147**

**ప్రతిపదార్థం:** కంసారీ!= కంసుడి శత్రువైన కృష్ణా!; పంచాననంబు చేతన్= సింహంచేత; పంచత్వమున్+పొంది ఉన్న= చచ్చి ఉన్న; బంధుర= పెద్దదైన; కరిన్+పోలించుటకున్= ఏనుగుతో పోల్చుటకు; తగి= తగినవాడై; పాంచాలుఁడు= పాంచాలరాజు; ద్రోణు= ద్రోణుని; కడిమిన్= విక్రమానికి; పడి= చిక్కి; ఒప్పెన్= కనిపిస్తున్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ద్రోణుడి పరాక్రమానికి చిక్కి చచ్చిపడి ఉన్న పాంచాలరాజు సింహంచేత చచ్చిన పెద్ద ఏనుగువలె కనిపిస్తున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **ద్రుపదనృపాలుని ధవళా । తపత్రమస్త్రంబులె చోటుఁ దాఁకక జిగియా**
**రి పొలిచె శారద చంద్రుం । డుపమాపాత్రంబు గాఁగ నుర్వియను దివిన్. 148**

**ప్రతిపదార్థం:** ద్రుపదనృపాలుని= పాంచాలరాజైన ద్రుపద మహారాజుయొక్క; ధవళ= తెల్లనైన; ఆతపత్రము= గొడుగు; అస్త్రంబులు= అస్త్రాలు; ఏ+చోటన్= ఎక్కడా; తాఁకక; జిగి+ఆరి= కాంతులు చిమ్ముతూ; ఉర్వి+అను= భూమి అనేటువంటి; దివిన్= ఆకాశంలో; శారద= శరత్కాలంలోని; చంద్రుండు= చంద్రబింబం; ఉపమాపాత్రంబు+కాగన్= ఉపమకు తగింది కాగా; పొలిచెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** పాంచాలాధిపుడైన ద్రుపదుడి తెల్లనిగొడుగు మాత్రం ఏ అస్త్రాలకూ చిక్కకుండా కాంతులు చిమ్ముతూ భూమి అనే ఆకాశంలో శరత్కాలంలోని చంద్రబింబంవలె ప్రకాశిస్తున్నది. (అంటే శరత్కాలంలో స్వచ్ఛమైన వెన్నెల ఉంటుంది కాబట్టి ఆ గొడుగుకూడా ఏ రంధ్రాలు లేకుండా ప్రకాశిస్తున్నదని అర్థం. దీనిని బట్టి రథాన్ని ద్రుపదుడి సారథి అంత జాగరూకంగా నడిపించాడని అర్థం).

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **వల్లభులును గోడండ్రు నీ వసుమతీశ్వ । రునకు నగ్నిసంస్కారంబు నొనరఁ జేసి**
**యుమ్మలికమునఁ దద్దయు వెమ్మునంత । రంగములతోడ నరిగిరి గంగ దెసకు. 149**

**ప్రతిపదార్థం:** వల్లభులును= తక్కినరాజులు (వల్లభలు= భార్యలు); కోడండ్రున్= కోడళ్ళు; ఈ వసుమతీశ్వరునకున్= ఈ రాజుకు; అగ్ని సంస్కారంబున్= దహనకార్యాన్ని; ఒనరన్+చేసి= పూర్తిచేసి; ఉమ్మలికమునన్= దుఃఖంతో; తద్దయున్= మిక్కిలిగా; వెమ్మ= పరితప్తమైన; అంతరంగములతోడన్= హృదయాలతో; గంగ దెసకున్= గంగవైపు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** మిగిలిన రాజులు, అతడి భార్యలు, కోడళ్ళు ద్రుపదమహారాజుకు దహనకార్యం పూర్తిచేసి దుఃఖాతిశయంతో పరితప్తమైన హృదయాలతో గంగవైపు వెళ్ళుతున్నారు.

**క.** **ద్రోణుఁడు దలరం దలపడి । బాణకళావేది చేదిపతి యుజ్జ్వల త**
**ద్బాణహతిఁ గూలి సమర । క్షోణి పరిష్కారమగుచు శోభిల్లెఁ గడున్.** **150**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యులవంటి ధనుర్విద్యాశూరులే; తలరన్= వణికిపోయేట్లు; తలపడి= ఎదుర్కొని; బాణకళావేది= బాణవిద్యావేత్త; చేదిపతి= చేదిభూపాలుడు; ఉజ్జ్వల= ప్రకాశించేటటువంటి పదునైన; తద్= ఆ ద్రోణుడి; బాణహతిన్= బాణపుదెబ్బలచేత; కూలి= నేలమీద పడి; సమరక్షోణి= యుద్ధభూమికి; పరిష్కారము+అగుచున్= భూషణంలాగా; కడున్= మిక్కలిగా; శోభిల్లెన్= ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** ద్రోణుడివంటి బాణవిద్యాగురువే కంపించేటట్లు ఎదుర్కొని బాణవిద్యారహస్యవేత్త అయిన చేది భూపాలుడు పదునైన ఆ ద్రోణుడి అస్త్రఘాతాలకు చిక్కి నేలమీద పడి యుద్ధభూమికి ఒక గొప్పభూషణంవలె మిక్కలి ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** అలం: రూపకం.

**తే.** **తలయుఁ గాళులు దమయూరుతలములందు । బెట్టికొని వీని భార్యలు బెట్టిదంపు**
**టడలు తాఁకునఁ గడు బెగడారఁ గూరు । నుల్లములతోడఁ బలవించుచున్నవారు.** **151**

**ప్రతిపదార్థం:** వీని భార్యలు= ఈ చేదిరాజు భార్యలు; తలయున్= ఇతడి తలా; కాళులు= కాళ్ళూ; తమ ఊరుతలములందున్= తమ తొడలమీద; పెట్టికొని= పెట్టుకొని; బెట్టిదము+అడలు= తీవ్రమైన శోకముయొక్క; తాఁకునన్= దెబ్బతో; కడున్= మిక్కలిగా; బెగడు+ఆరన్= బెంగతో కూడి; కూరున్= దుఃఖంలో మునిగిపోయిన; ఉల్లములతోడన్= హృదయాలతో; పలవించుచున్నవారు= ఏదేదో మాట్లాడుతూ ఉన్నారు.

**తాత్పర్యం:** ఈ రాజు భార్యలు ఇతడి తలను కాళ్ళను తమ తొడలమీద ఉంచుకొని తీవ్రమైన శోకపు దెబ్బతో మిక్కలిగా నిండిన బెంగతో దుఃఖంలో మునిగిపోయిన హృదయాలతో ఏదేదో పలవరిస్తున్నారు.

**క.** **మానవనాథు లనేకులు । వీని భుజావిక్రమంబు వేఁడిఁ బడిరి నీ**
**మేనమఱఁది శిశుపాలుని । సూనుం డీ ధృష్టకేతుఁ జూచితె? కృష్ణా!** **152**

**ప్రతిపదార్థం:** కృష్ణా!; మానవనాథులు= రాజులు; అనేకులు= చాలమంది; వీని= ఈ చేదిరాజుయొక్క; భుజావిక్రమంబు వేఁడిన్= భుజపరాక్రమమనే మంటలో; పడిరి= పడ్డారు; (ఇతడు); నీ మేనమఱఁది= నీ మేనత్తకొడుకు; శిశుపాలుని సూనుండు= శిశుపాలుడి కుమారుడు; ఈ+ధృష్టకేతున్= ఈ ధృష్టకేతుడిని; చూచితె?= చూశావా?

**తాత్పర్యం:** కృష్ణా! ఎంతోమంది రాజులు ఈ చేదిరాజు భుజపరాక్రమమనే వేడితాకుకు చచ్చారు. ఇతడే ధృష్టకేతువు. నీ మేనత్త కుమారుడు శిశుపాలుడి కుమారుడు. గుర్తుపట్టావా?

**ఉత్సాహవృత్తము:**

**అతని నందనుఁడు సుకేతుఁ డల్లవాఁడె ద్రోణ పా**
**తితుఁడు వీనిఁ జూడగా మదిన్ సుయోధనుండుఁ ద**
**త్సుతుఁడు దోఁచుచున్నవారు శోకవహ్నితాప మూ**
**ర్జితము గాఁగ బంధుజనుల చిత్తమెంత గుందునో? 153**

**ప్రతిపదార్థం:** అతని= ఆ ధృష్టకేతుని; నందనుఁడు= కుమారుడు; సుకేతుఁడు; అల్ల+వాఁడె= అదిగోవాడే!; ద్రోణ= ద్రోణాచార్యులచేత; పాతితుఁడు= పడగొట్టబడ్డవారు; వీనిన్+చూడగా= వీడిని చూస్తుంటే; మదిన్= నా మనసులో; సుయోధనుండు= దుర్యోధనుడు; తత్సుతుఁడు= అతడి కొడుకు; తోఁచుచున్నవారు= గుర్తుకు వస్తున్నారు; శోకవహ్నితాపము= శోకమనే మంటవేడిమి; ఊర్జితము+కాఁగన్= ఎక్కువకాగా(వీరినిచూసి); బంధుజనుల చిత్తము= బంధువుల హృదయాలు; ఎంత+కుందునో?= ఎంత దుఃఖిస్తాయో?

**తాత్పర్యం:** ఆ ధృష్టకేతుడి కుమారుడు సుకేతుడు అడుగో వాడే. ద్రోణాచార్యుడు వాడిని పడగొట్టాడు. వీడిని చూస్తుంటే నాకు దుర్యోధనుడు, అతడి కొడుకు గుర్తుకు వస్తున్నారు. ఇట్లా తండ్రీకొడుకులను ఒకసారి చూచిన బంధువుల హృదయాలలో శోకమనే అగ్ని మరింతమంటలు రేపకుండా ఉంటుందా! వారు ఎంతగా కుందిపోతారో! (నా హృదయమూ అట్లాగే చింతా దుఃఖశోక పరితప్తమై పోయిందని అర్థం.)

**విశేషం:** అలం: రూపకానుప్రాణితమైన స్మృతి. వృత్తలక్షణం - చూడండి. స్త్రీ. 1. 48

**తే.** **అల్ల వారె యవంతీశు లధిక బాహు । బలులు విందానువిందులు బహుళభూష**
**ణోజ్జ్వలులు పడియున్నవా రుగ్ర వాయు । పతిత కుసుమిత నవసాల భంగిఁ దోఁప.' 154**

**ప్రతిపదార్థం:** అల్ల= అరుగో; వారె= వారే; అవంతీశులు= అవంతీ రాజ్యపాలకులు; అధిక బాహుబలులు= మిక్కిలి బాహుబలం కలవారు; విందఅనువిందులు= విందుడు, అనువిందుడు; బహుళ= అధికమైన; భూషణ= నగలచేత; ఉజ్జ్వలులు= మిక్కిలిగా ప్రకాశించేవారు; ఉగ్రవాయుపతిత= భయంకరమైన పెనుగాలికి పడిన; కుసుమిత= దండిగా పూలుపూసిన; నవ సాలభంగి= కొత్త సాలవృక్షాలలీల; తోఁపన్= స్ఫురిస్తుండగా; పడి+ఉన్నవారు= పడి ఉన్నారు.

**తాత్పర్యం:** అరుగో - వారే అవంతీ రాజ్యపాలకులు. మిక్కిలి బాహుబలవంతులు. వీరిని విందుడు, అనువిందుడు అంటారు. దండిగా నగలు ధరించి కాంతులీనుతూ వెలిగేవారు. భయంకరమైన పెనుగాలి తాకిడికి నేలకూలినటువంటి పూలు విరగబూసిన మద్దిచెట్లు గుర్తుకు వస్తున్నాయి - వీళ్ళను చూస్తుంటే'.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ.** **అని చూపి యిట్లనియె. 155**

**తాత్పర్యం:** అని ఆ విందానువిందులను చూపించి ఇట్లా అన్నది:

**సీ.** **'శాంతనవుండు నాచార్యుండుఁ గర్ణుండు । భూరిశ్రవుఁడు గురుపుత్రకుండుఁ**
**గృపుఁడు సైంధవుఁడును గృతవర్మయును గురు । రాజు నమానుషరథికవరులుఁ**
**గలయంగ నెన్నెడు కొలఁదులవారె? వా । రలిగిన జెడుదు రయ్యమరులైన**
**నట్టి వీరుల బారికగపడియుండియు । నేమియుఁ గారైతి రీవుఁ బాండు**

**తే.** **తనయు లందఱు నీ కూర్మితమ్ముఁడును । మహాద్భుత మ్మిది దలఁప భీష్మాదులైన**
**వారి నటె పోర నిర్జింపవచ్చు నెట్టి । పనియు భరమె? దైవమునకుఁ బద్మనాభ!** **156**

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= పద్మాన్ని నాభిలో ధరించిన ఓ కృష్ణా!; శాంతనవుండున్= భీష్ముడు; ఆచార్యుండున్= ద్రోణుడూ; కర్ణుండున్= కర్ణుడూ; భూరిశ్రవుఁడున్= భూరిశ్రవసుడూ; గురుపుత్రకుండున్= అశ్వత్థామా; కృపుఁడున్= కృపుడూ; సైంధవుఁడును; కృతవర్మయును; కురురాజున్= దుర్యోధనుడూ; అమానుష రథికవరులున్= ఇంకా తక్కిన అతిరథమహారథులు (అమానుష= అసాధారణులైన); కలయంగన్= చూడగా; ఎన్నెడు+కొలఁదులవారె?= లెక్కింపదగిన శక్తులు కలవారా?; వారు; అలిగినన్= కోపగించుకొన్న; ఆ+అమరులైనన్= ఆ దేవతలయినా; చెడుదురు= నశిస్తారు; అట్టివీరుల= అట్లాంటి మహావీరుల; బారికిన్= హింసకు; అగపడి+ఉండియున్= వశమైకూడా; ఈవున్= నీవు; పాండుతనయులందఱున్= పాండుకుమారులు ఐదుగురూ; నీ కూర్మి తమ్ముఁడును= సాత్యకీ; ఏమియున్+కారు+ఐతిరి= ఏమి కాకుండా బయటపడ్డారు; ఇది; తలఁపన్= ఆలోచించగా; మహాద్భుతమ్ము= మహాద్భుతమే; భీష్మాదులైనవారిన్= భీష్మాదిమహావీరులను; పోరన్= యుద్ధంలో; నిర్జింపవచ్చునటె!= జయించడమా!; దైవమునకున్= దేవుడికి; ఎట్టి పనియున్= ఎట్లాంటి పని అయినా; భరమె?= గొప్పదా?

**తాత్పర్యం:** కృష్ణా! భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, భూరిశ్రవుడు, అశ్వత్థామ, కృపుడు, సైంధవుడు, కృతవర్మ, దుర్యోధనుడు - అసాధారణమైన పరాక్రమమున్న అతిరథ మహారథులు. వీరిలో ఎవ్వరిశక్తినైనా ఇంతే అని చెప్పగలమా? వారు కోపగించుకొంటే దేవతలైనా నశిస్తారు. అట్లాంటి మహావీరుల తాకిడికి ఎదురై కూడా నీవు, పాండవులు, నీ తమ్ముడు సాత్యకి ఏ అపాయమూ లేకుండా బయటపడ్డారు. ఆలోచిస్తే ఇంతకంటే మహాద్భుతం ఏముంటుంది? భీష్మాది మహాయోధులను యుద్ధంలో జయించటమా! నమ్మటానికి వీలులేని విషయమే. అయినా భగవంతుడి చేత కాని పని ఏముంది!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ.** **దైవంబు దుర్యోధనాదులగు నూర్వురకు నొక్కెత్తున నిట్లగునే?' యని వెండియు.** **157**

**ప్రతిపదార్థం:** దైవంబు= దైవం; దుర్యోధన+ఆదులకు= దుర్యోధనుడు మొదలైన; నూర్వురకున్= నూరుమందికీ; ఒక్క+ఎత్తునన్= ఒక్కరీతిగా; ఇట్లు+అగునే= ఇట్లా అవుతుందా? అని; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** దైవం దుర్యోధనాదులైన నూరుమంది పట్లా ఇట్లా ఒకేరీతిగా అన్యాయం చేస్తుందా?' అని ఇంకా ఇట్లా అంటున్నది.

**తరువోజ:**

**కురురాజు మొదలైన కొడుకుల నెల్ల గోల్పోవు టిప్పుడు గోవింద! కలిగె;**
**నరిగితి సంధి సేయఁగరాకయున్న నటయప్లు నీ చెప్పుటైనది కాదె?**
**పరమహితంబుగఁ బలికిరి గంగపట్టియు విదురుండు పాటించి పెక్కు**
**వెరవుల నొత్తిన విననైతి నా వివేకుల చూ పేల వృథ నోవనేర్చు?' 158**

**ప్రతిపదార్థం:** గోవింద!= కృష్ణా!; కురురాజు మొదలైన= దుర్యోధనుడు మొదలైన; కొడుకులన్+ఎల్లన్= కుమారులందర్నీ; కోల్పోవుట= పోగొట్టుకోవటం; ఇప్పుడు= ఈ వేళ; కలిగెన్= సంభవించింది; సంధి+చేయఁగన్= సంధి చేయటానికి; అరిగితి(వి)= వెళ్ళావు; రాకయున్నన్= సంధిచేయలేకపోయిన స్థితి వచ్చినపుడు; అట= ఆ సభలో; అప్డు= ఆ సమయంలో; నీ+చెప్పుట= నీయొక్క చెప్పుట (నీవేం చెప్పావో అది); ఐనది+కాదె!= నిజం అయిందికదా!; గంగపట్టియున్= భీష్ముడూ; విదురుండున్= విదురుడూ; పరమ+హితంబుగన్= గొప్ప మేలునుకోరి; పలిపిరి= బోధించారు; పాటించి= పూనికతో; పెక్కు+వెరవులన్= అనేక ధర్మాలను, రాజనీతులను, ఉపాయాలను; ఒత్తినన్= నొక్కి చెప్పినా; వినన్+ఐతిన్= వినకుండా పోయాను; ఆ+వివేకుల= ఆ వివేకవంతుల; చూపు+ఏల+వృథ+పోవ+నేర్చున్?= దృష్టి ఎందుకు తప్పవుతుంది?

**తాత్పర్యం:** కృష్ణా! దుర్యోధనుడు మొదలైన కుమారులందరినీ ఈనాడు కోల్పోయాను. నీవు ఆనాడు సంధి చేయటానికి హస్తినకు వచ్చావు. సంధి కుదరదని తెలిసినపుడు నీవు ఏ మాటలు చెప్పావో అవన్నీ నిజమయ్యాయి గదా! భీష్ముడు, విదురుడు అనేక విధాలుగా కురువంశ క్షేమాన్ని కోరి ఎంతగానో బోధించారు. పూనికతో ఎన్నో ధర్మసూక్ష్మాలు, రాజనీతులు, ఉపాయాలు నొక్కి నొక్కి చెప్పారు. అయినా నేను పుత్రవ్యామోహంతో వినకపోయాను. ఆ పుణ్యాత్ముల వివేకంతో కూడిన దూరదృష్టి తప్పవుతుందా?'

**విశేషం:** వృత్తలక్షణానికి చూడండి. స్త్రీ. 1.43.

**వ. అని పలికి పశ్చాత్తాప దుఃఖంబు పెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయియైన పుత్రశోకం బడరి యలంతి గాని యలఁతఁ బెట్ట నూరకుండి యక్కౌరవరాజపత్ని పద్మనాభుదెసఁ గనుంగొని కోపోద్దీపితయై. 159**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని ఈ విధంగా పలికి; పశ్చాత్తాప దుఃఖంబు పెల్లునన్= పశ్చాత్తాపం వలన పుట్టిన అత్యధిక దుఃఖంతో; ఒల్లంబోయి= తెలివి పోగొట్టుకొని; తెలిసి= తెలివిరాగా; చిత్తస్థాయి అయిన= చిత్తంలో నాటుకుపోయిన; పుత్రశోకంబు+అడరి= పుత్రులమరణం వలన పుట్టిన దుఃఖం అధికమై; అలంతికాని= స్వల్పంగాని (అత్యధికమైన); అలఁతన్+పెట్టన్= బాధ కల్గించగా; ఊరకుండి= కొంచెంసేపు ఊరకొని; ఆ+కౌరవరాజపత్ని= ఆ ధృతరాష్ట్రరాజు భార్య; పద్మనాభుదెసన్+కనుంగొని = కృష్ణుడివైపు చూచి; కోపోద్దీపితయై= కోపంతో మిక్కిలి మండిపోతూ (ఇలాఅంది).

**తాత్పర్యం:** అని చెప్పి పశ్చాత్తాపం వలన పుట్టిన దుఃఖాతిశయంతో మూర్ఛపోయి తేరుకొని మనసులో పేరుకొనిపోయిన శోకం అత్యధికమైన బాధను కల్గించగా కొంతసేపు ఊరకుండి ఆ గాంధారి కృష్ణుడిని చూస్తూ కోపంతో మండిపోతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'ధృతరాష్ట్ర పాండుభూపతుల కుమారులు। తమలోన నీసున సమరమునకుఁ**
**దొడఁగిన నీ వడ్డపడవైతి తగుచాలు। మానిసుల్ గలిగియు మాననీయ**

**వాక్యుండవయ్యును శక్యసమస్త కా । ర్యుండనఁ బేర్కొనియును నుపేక్ష**
**చేసితి కురురాజుఁ జెఱుపన తిరిగితి । నిఖిలరాజులఁ దదనీకములను**

**ఆ. నామ మడఁచి తెల్లభూములుఁ బాడయ్యె । నంతవట్టు ఫలము ననుభవింపు**
**మేపడంగ నిన్ను శాపానలజ్వాల । దగ్ధమూర్తిఁ జేయుదాన వినుము. 160**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడియొక్క; పాండుభూపతులు= పాండురాజు యొక్క; కుమారులు= కొడుకులు; తమలోనన్= తమలోతాము; ఈసునన్= అసూయతో; సమరమునకున్+తొడఁగినన్= యుద్ధానికి సిద్ధపడితే; నీవు+ అడ్డపడవు+ఐతి(వి)= నీవు అడ్డుపడకుండా పోయావు; తగు= న్యాయం తెలిసినవారు; చాలు= సమర్థులైనవారు అయిన; మానుసుల్= పెద్దమనుషులు; కలిగియున్= ఉండికూడా; మాననీయ= గొప్పదైన; వాక్యుండవు+అయ్యును= మాట కలిగినవాడయికూడా; శక్యసమస్తకార్యుండు+అనన్= అన్ని పనులు చేతనయినవాడు అని; పేరు+కొనియును= పేరు పొందికూడా; ఉపేక్ష చేసితి(వి)= ఉపేక్ష చేశావు; కురురాజున్= దుర్యోధనుడిని; చెఱుపన్+అ= చెడపడానికే; తిరిగితి(వి)= రాయబారాలు చేశావు; నిఖిలరాజులన్= రాజులందరినీ; తద్+అనీకములను= వారి సైన్యాలను; నామము+అడఁచితి(వి)= పేరు కూడా లేకుండా చేశావు; ఎల్లభూములున్+పాడయ్యెన్= అన్ని ప్రాంతాలూ నాశనమయ్యాయి; అంత+పట్టు ఫలము= దానికి తగ్గఫలాన్ని; అనుభవింపుము; ఏపు+అడంగన్= నీ వైభవం సర్వనాశనం అయ్యేలా; నిన్నున్= నిన్ను; శాప+అనలజ్వాలన్= శాపమనే నిప్పుమంటలో; దగ్ధమూర్తిన్= కాలినవానిగా; చేయుదానన్= చేస్తాను; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'పాండవ కౌరవులు తమలో తాము అసూయతో యుద్ధానికి సిద్ధపడితే నీవు వారికి అడ్డుపడకుండా పోయావు. న్యాయం తెలిసినవారు, సమర్థులు అయిన భీష్మాదులు ఉండి కూడా, నీవు సకల ధర్మవేత్త మధురభాషి అయి ఉండికూడా, అన్ని పనులు చేతనయినవాడివని పేరుపొందికూడా, నిర్లక్ష్యం చేశావు. దుర్యోధనుడిని నాశనం చేయటానికి నీవు రాయబారాలు చేశావు. రాజులను, వారి సైన్యాలను పేరు లేకుండా చేశావు. అందరూ చచ్చారు. అన్ని ప్రాంతాలూ బీడుభూము లయ్యాయి. చేసినదానికి తగిన ఫలాన్ని అనుభవించుము. నీ వైభవం సర్వనాశన మయ్యేట్లుగా నా శాపాగ్నిలో నిన్ను కాల్చి పారవేస్తాను వినుము.

### గాంధారి శ్రీకృష్ణునకు శాపం బిచ్చుట (సం. 11-25-36)

**సీ. పూని పాతివ్రత్యపుణ్యఫలంబున । సంపాదితంబైన సారతపము**
**బలిమి సాధనముగాఁ బలికెద నుత్తమ । జ్ఞాతులఁ దమలోని సంగరమునఁ**
**బొలియఁజేసితి గాన పొలియుదు రన్యోన్య । ఘాతుకులై భవద్ జ్ఞాతిజనులు**
**నీవును దప్పక నేఁ డాదిగా ముప్ప । దాఱగు నేఁడైన యద్దినమున**

**తే. నరయ దిక్కెవ్వరును లేని యగ్గలంపు । గుత్సితంపుఁ దెఱంగునఁ గూలువాఁడ**
**విట్లు మీ వధూజనములు నేడ్చువారు । పతుల సుతులను బంధులఁ బనవి పనవి.' 161**

**ప్రతిపదార్థం:** పూని= ప్రయత్నించి; పాతివ్రత్య= పతివ్రతగా జీవించటంలో అబ్బిన; పుణ్యఫలంబునన్= పుణ్యానికి ఫలితంగా; సంపాదితంబు+అయిన= సంపాదింపబడిన; సారతపము= గొప్ప తపస్సును; బలిమి= బలమైన; సాధనముగాన్= సాధనంగా (గ్రహించి); పలికెదన్= చెబుతున్నాను; ఉత్తమజ్ఞాతులన్= మంచి దాయాదులను; తమలోని= తమలో తాము చేసుకొన్న;

సంగరమునన్= యుద్ధంలో; పొలియన్+చేసితి(వి)+కానన్= చచ్చేలా చేశావు కాబట్టి; భవత్= నీయొక్క; జ్ఞాతి జనులున్= దాయాదులు కూడా; అన్యోన్య= ఒకరినొకరు; ఘాతుకులు+ఐ= కొట్టుకొని; పొలియుదురు= చస్తారు; నీవును= నీవు కూడా; తప్పక= తప్పకుండా; నేఁడాదిగాన్+ముప్పది+ఆఱగు+ఏఁడైన+ఆ+దినమునన్= సరిగా ఈ నాటికి 36 సంవత్సరాలు పూర్తి అయిన రోజున; అరయన్= చూడటానికి; దిక్కు+ఎవ్వరునులేని= దిక్కెవ్వరూ లేనటువంటి; అగ్గలంపున్+కుత్సితంపున్+తెఱంగునన్= మిక్కిలి క్రూరమైన విధంగా; కూలువాఁడవు= చస్తావు(చావబోతావు); ఇట్లు= ఈవాళ వీళ్ళందరూ ఎట్లా ఏడుస్తున్నారో అట్లు; మీ వధూజనంబులు= మీ యాదవ కాంతలు కూడా; పతులన్= భర్తలను; సుతులను= కొడుకులను; బంధులను= బంధుజనులను; పనవి పనవి= పేరు పేరునా తలచుకొని; ఏడ్చువారు= ఏడుస్తారు.

**తాత్పర్యం:** ఎంతో దీక్షతో పతివ్రతగా ఇంత సుదీర్ఘజీవితాన్ని గడపిన పుణ్యానికి ఫలంగా అబ్బిన తపశ్శక్తితో చెప్పుతున్నాను. మంచి దాయాదులను తమలోతాము పోరాడుకొని ఒకరినొకరు చంపుకొని నశించేటట్లు చేశావు. నీ దాయాదులు కూడా ఇట్లాగే ఒకరి నొకరు కొట్టుకొని చస్తారు చూడుము! నీవు కూడా సరిగ్గా ఈనాటికి 36 సంవత్సరాలు పూర్తి అయిన రోజున చూడటానికి దిక్కు ఎవరూ లేని రీతిలో అతిక్రూరంగా చావబోతావు. నామాట తప్పదు. ఈవాళ వీళ్ళందరూ ఎట్లా ఏడుస్తున్నారో అట్లాగే మీ యాదవకాంతలు కూడా భర్తలను, కొడుకులను, బంధువులను పేరుపేరునా తలచుకొని కుమిలి కుమిలి ఏడుస్తారు పొమ్ము.'

**క.** **అని ఘోరంబుగఁ బలికిన । విని విపులమనస్కుఁడైన విష్ణుఁడు చిఱున**
**వ్వున నానన మొప్పఁగ న । వ్వనితకు ని ట్లనియె గౌరవస్తుత్యముగన్.** **162**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; ఘోరంబుగన్= కఠినంగా, పలికినన్= పలకగా; విని; విపుల= విశాల; మనస్కుఁడైన= హృదయంగలవాడైన; విష్ణుఁడు= శ్రీకృష్ణుడు; చిఱునవ్వునన్= చిరునవ్వుతో; ఆననము= ముఖం; ఒప్పఁగన్= ప్రకాశింపగా; ఆ+వనితకున్= ఆ గాంధారితో; గౌరవస్తుత్యముగన్= మర్యాదాకరంగానూ, స్తుతింపదగిన రీతిలోనూ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ఇట్లా అతి ఘోరంగా ఆమె శాప మివ్వగా విని, విశాల హృదయుడైన శ్రీహరి చిరునవ్వుతో ముఖం విరాజిల్లగా ఆ గాంధారీదేవితో మర్యాదను పాటిస్తూ శత్రువులు కూడా స్తుతించే విధంగా ఇట్లా అన్నాడు:

**తే.** **'మున్నకాదె యాదవులకు మునివరేణ్య । కలిత దారుణ శాపంబు గలదు నీకు**
**నేల చర్వితచర్వణమిట్లు సేయ? దీన నీవేమి త్రవ్వితి? దానిఁ జెపుమ!** **163**

**ప్రతిపదార్థం:** యాదవులకున్= యాదవ సమూహానికి; మునివరేణ్య= మునులలో శ్రేష్ఠులైనవారిచేత; కలిత= చేయబడిన; దారుణ= భయంకరమైన; శాపంబు= శాపం; మున్న= ముందే; కలదుకాదె!= ఉన్నది కదా!; నీకున్= నీకు; ఇట్లు; చర్వితచర్వణము= నమిలినదాన్నే మళ్ళీ నమిలేవిధంగా చెప్పినదాన్నే మళ్ళీ చెప్పటం; చేయన్+ఏల?= చేయడం ఎందుకు?; దీనన్= ఇందువలన; నీవు+ఏమి త్రవ్వితి(వి)?= నీవు కొత్తగా ఏమి చెప్పావు? (త్రవ్వటం - అంటే ఏదో ఒక కొత్త విషయాన్ని కనుక్కోవటమని అర్థం); దానిన్= దాన్ని; చెపుమ!= చెప్పు చూద్దాము.

**తాత్పర్యం:** 'గాంధారీదేవీ! యాదవులకు మునివరులు ఇచ్చిన ఘోరశాపం ముందే ఉన్నది కదా! మళ్ళీ నీవు దానిని పునరుక్తం చేశావు. దీనివలన నీవు కొత్తగా ఏమి చెప్పావు? దాన్ని చెప్పుము.

**క. యదువంశజాతులకుఁ ద । ప్పదు నాశము వారి సురలుఁ బరిమార్పఁగ లే**
**రది కారణంబు గాఁగఁ దె । గుదు రొండొరుచేత రణము ఘోరత్వమునన్.' 164**

**ప్రతిపదార్థం:** యదువంశ జాతులకున్= యదువంశంలో పుట్టినవారికి; నాశము= నాశనం; తప్పదు; వారిన్= వారిని; సురలున్= దేవతలుకూడా; పరిమార్పగన్+లేరు= చంపజాలరు; అది కారణంబు+కాఁగన్= ఆ కారణంచేత; రణము ఘోరత్వమునన్= ఘోరయుద్ధంలో; ఒండు+ఒరుచేతన్= ఒకరిచేతిలో ఒకరు; తెగుదురు= చస్తారు.

**తాత్పర్యం:** యాదవులకు నాశనం తప్పదు. వారిని దేవతలు కూడా చంపలేరు. అందుచేత ఘోరయుద్ధంలో ఒకరినొకరు చంపుకొని చస్తారు' - అని కృష్ణుడు ఆ శాపరహస్యాన్ని వివరించాడు.

**తే. అనిన పలుకులు విని పాండుతనయు లెదలు । వెఱపు పెంపున గంపింప విహ్వలించి**
**యాత్మజీవితములదెస నాస లపుడు । వదల విడిచిరి కౌరవవంశవర్య! 165**

**ప్రతిపదార్థం:** కౌరవవంశవర్య!= ఓ జనమేజయ మహారాజా!; (ఈ విధంగా); అనిన పలుకులు= శ్రీకృష్ణు డన్న మాటలు; విని= విన్నవారై; పాండు తనయులు= పాండు కుమారులు; ఎదలు= హృదయాలు; వెఱపు+పెంపునన్= అధికమైన భయంతో; కంపింపన్= వణకగా; విహ్వలించి= మిక్కిలిగా భయపడిపోయి; ఆత్మజీవితముల దెసన్= తమ జీవితాలపట్ల; ఆసలు= ఆశలు; వదల విడిచిరి= వదలిపెట్టారు.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! ఇట్లా కృష్ణుడు అనగానే పాండుకుమారుల గుండెలు అధికమైన భయాందోళనలతో వణకిపోయారు. వారు తమ తమ జీవితాలపట్ల ఆశ సంపూర్ణంగా వదులుకొన్నారు.

**విశేషం:** పాండువులకు శ్రీకృష్ణుడే ప్రాణం. ప్రాణశక్తి కూడా. ఎప్పుడు ఆయనకే శాపం తప్పనిదవుతున్నదని తెలిసిందో పాండవులు ప్రాణాలపై ఆశలు వదులుకొనటం సహజం కదా!

**వ. ఇట్లు పలికిన యచ్యుతుం డద్దేవి నుద్దేశించి 'లేవమ్మా! మృతులైన సకల బంధుమిత్రులకు నగ్నికార్యంబులు సేయింపవలయు'నని వెండియు. 166**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పలికిన= అనిన; అచ్యుతుండు= కృష్ణుడు; ఆ+దేవిన్= ఆ గాంధారిని; ఉద్దేశించి= చూసి; లేవమ్మా!= అమ్మా! ఇంతవరకు శోకించింది చాలు 'లే'; మృతులు+ఐన= చనిపోయిన; సకలబంధు మిత్రులకున్= బంధువులకు, స్నేహితులకు అందరికీ; అగ్నికార్యంబులు= దహనకార్యం; చేయింపవలయున్+అని= చేయించాలి అని; వెండియున్= ఇంకా (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ విధంగా పలికిన శ్రీకృష్ణుడు గాంధారిని చూసి 'అమ్మా! చాలు. ఇంక పైకి లెమ్ము. చనిపోయిన బంధుమిత్రులందరికీ అగ్నికార్యాలు చేయించాలి కదా!' అంటూ ఇంకా ఇట్లా అన్నాడు:

**సీ. 'వినుము గాంధారి! నీ తనయుండు చేయు దు । ర్నయము లెఱుంగవె? నాకు నీకు**
**శాంతనవునకు నాచార్యునకు బాహ్లి । కునకుఁ దండ్రికి మాన్పఁ గొలఁది గాని**
**దుర్మానమున నట్లు దొడరి యి ట్లయ్యె మీ । యపరాధమున వచ్చినట్టి కీడు**
**నకు నింత నొవ్వంగ ననుఁ బల్కఁ దగునె? యు । మ్మలికంబు ధృతిఁ బట్టి మాన్పు మింకఁ**

**తే. జేటునకుఁ జావునకు వగఁజెందు జనుల । కినుమడింపదె మానసమున నలంత?**
**రాచ కూఁతుండ్రు సుతుల సంగ్రామ నిరత । హృదయులగు వారిఁ గాంచఁ గోరుదుర కాదె!' 167**

**ప్రతిపదార్థం:** గాంధారి!= గాంధారీదేవీ!; వినుము; నీ తనయుండు= నీ కుమారుడు; చేయు= చేసే; దుర్నయములు= చెడ్డపనులు; ఎఱుంగవె?= నీకు తెలియవా?; నాకున్= నాకూ; నీకున్= నీకూ; శాంతనవునకున్= భీష్ముడికీ; ఆచార్యునకున్= ద్రోణుడికీ; బాహ్లికునకున్= బాహ్లికుడికీ; తండ్రికిన్= ధృతరాష్ట్రుడికీ; మాన్పన్= మాన్పడానికి; కొలఁదికాని= వీలుకాని; దుర్మానమునన్= దురభిమానంతో; అట్లు= ఆ విధంగా; తొడరి= పనులుచేసి; ఇట్లు+అయ్యెన్= ఈనాడు ఇట్లా అయ్యాడు దుర్యోధనుడు; మీ+అపరాధమునన్= మీ తప్పువలన; వచ్చిన+అట్టి కీడునకున్= వచ్చినటువంటి చేటుకు; ఇంత నొవ్వంగన్= ఇంత నొచ్చేటట్లుగా; ననున్+పల్కన్+తగునె?= నన్ను గురించి మాట్లాడటం న్యాయమా?; ఇంకన్= ఇక; ఉమ్మలికంబున్= శోకాన్ని; ధృతిన్+పట్టి= ధైర్యాన్ని అవలంబించి; మాన్పుము= పోగొట్టుకొమ్ము; చేటునకున్= నాశనానికి; చావునకున్= మరణానికి; వగన్+చెందు= శోకించేటటువంటి; జనులకున్= మానవులకు; మానసమునన్= మనస్సుల్లో; అలంత= బాధ; ఇనుమడింపదె?= రెట్టింపు కాదా?; రాచ కూఁతుండ్రు= రాజుల ఇళ్ళలోని అమ్మాయిలు; సుతులన్= కొడుకులను; సంగ్రామ నిరతహృదయులగు వారిన్= యుద్ధంలో అంకితమైన అంతరంగం కలవారిని; కాంచన్+కోరుదురు+అ కాదె= కనాలని కోరుకుంటారు కదా!

**తాత్పర్యం:** 'గాంధారీదేవీ! వినుము. నీ కుమారుడు చేసిన దుర్మార్గమైన పనులు నీకు తెలియనివా? దుర్యోధనుడి దురభిమానాన్ని నేను కాని, నీవు కాని, భీష్మద్రోణ బాహ్లికులు కాని, చివరకి ధృతరాష్ట్ర మహారాజు కాని మాన్పలేకపోయాము. ఆ దురభిమానంతో చేసిన పనుల పర్యవసానంగానే అతడికి ఈనాడు ఈ దశ వచ్చింది. మీ తప్పువలన వచ్చిన చేటుకు బాధ్యుడిని నేనని నన్ను నొప్పించేటట్లు ఇట్లా మాట్లాడటం న్యాయమా? ఇకనైనా ధైర్యం అవలంబించి నీ శోకాన్ని దూరం చేసికొమ్ము. కీడుకు, చావుకు ఏ మానవులు శోకిస్తారో వారి దుఃఖం రెండింతలవుతుంది తప్ప ఉపశమించదు. రాజుల కుమార్తెలు యుద్ధంలో అంకితమైన హృదయం కలవారిని కుమారులుగా పొందాలని కోరుకుంటారు కదా!'

**విశేషం:** గాంధారి క్షత్రియ కులసంజాత కాబట్టి ఆమె అభిలాషకు అనుగుణంగా యుద్ధంలో నిరంతర ఆసక్తి పొందే కుమారులే పుట్టారని తాత్పర్యం.

కూఁతు శబ్దమునకు బహువచనరూపం కూఁతులు. కూఁతుండ్రు అని తిక్కన ప్రయోగించటం విశేషం. ఇక్కడ కూఁతుల అని ఉన్నప్పటికీ ఛందోభంగం ఏర్పడదు.

**వ. అని చెవి సూఁడినట్లు పలికిన విని నిరుత్తరయై గాంధారి యూరకుండె నట్టియెడ ధృతరాష్ట్రుండు ధర్మనందనుతో 'నీవు మన మొనలంగల జనులకొలంది యెఱుంగుదు చచ్చినవారి లెక్క దలంతేని నా కెఱిఁగింపు' మని పల్కిన విను మెఱుకపడ్డవా రుత్తమ జనంబులు డెబ్బది యాఱుకోట్లు నిరువది వేలును మ్రుక్కడి మూఁక యిరువది నాలుగువేలు మున్నూట యిరువండ్రుఁ దెగిరని చెప్పిన నమ్మనుజపతి 'వీరిందఱు నేగతికిఁ బోదు?' రనుటయు. 168**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా కృష్ణుడు; చెవి సూఁడినట్లు= చెవి కాలినట్లు (అంటే భరించలేని విధంగా అని అర్థం); పలికినన్= అనగా; విని; నిరుత్తర+ఐ= సమాధానం ఏమీ చెప్పక; గాంధారి; ఊరక+ఉండెన్= మౌనంగా ఉండిపోయింది; అట్టి+ఎడన్= అప్పుడు; ధృతరాష్ట్రుండు; ధర్మనందనునితో; నీవు; మన= కౌరవపాండవుల; మొనలన్= సైన్యాలలో; కల=ఉన్న;

జనులకొలంది= జనుల పరిమితి (జనసంఖ్య); ఎఱుంగుదు(వు)= తెలిసినవాడివి; చచ్చినవారి లెక్క= చనిపోయినవారిలెక్క; తలంతు+ఏని= గుర్తు ఉంటే; నాకున్+ఎఱింగింపుము= నాకు చెప్పు; అని పల్కినన్= అని అడుగగా; వినుము= ధర్మరాజు అంటున్నాడు 'వినుము'; ఎఱుకపడ్డవారు= ప్రసిద్ధులు; ఉత్తమజనంబులు= ఉన్నతవర్గాల మనుష్యులు; డెబ్బదియాఱుకోట్లు నిరువదివేలును= 76 కోట్ల 20 వేలమంది; ముక్కడిమూఁక= ఇతరజనం; ఇరువదినాలుగువేలు మున్నూరు యిరువండ్రున్= 24వేల 320 మంది; తెగిరని చెప్పినన్= చనిపోయారని చెప్పగా; ఆ+మనుజపతి= ఆ రాజు; వీరు+ఇందఱున్= వీరు ఇంతమందీ; ఏగతికిన్= ఏయే గతులకు; పోదురు?+అనుటయున్= వెళ్తారు? అని అడుగగా.

**తాత్పర్యం:** అని ఈ విధంగా శ్రీకృష్ణుడు మాట్లాడిన మాటలు గాంధారి చెవిని కాల్చాయి. అయినా ఏమీ సమాధానం చెప్పకుండా ఊరకుండిపోయింది. అపుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో 'నీకు మన రెండు సైన్యాలలోని జనుల సంఖ్య తెలుసును. యుద్ధంలో ఎంతమంది చనిపోయారో గుర్తుంటే చెప్పుము' అని అడిగాడు. అప్పుడు ధర్మరాజు 'మహారాజా! వినుము. ప్రసిద్ధులు ఉన్నత వర్గాలవారు 76కోట్ల 20 వేలమంది, ఇతరజనం 24వేల 320 మంది చనిపోయా'రని చెప్పగా ఆ రాజు' అయితే వీరు ఇంతమందీ ఏయే గతులకు వెళ్ళుతారో చెప్పుతావా?' అని అడిగాడు.

**తే.** **'ఎవ్వ రాత్మదేహములు సమిద్ధమైన । యస్త్రవహ్ని వేలిచిరి వా రమరలోక**
**మునకుఁ జని నిర్జరాంగనాజన విలసితుఁ । డైన యమరేంద్రునకుఁ బూజ్యు లగుదు రధిప! 169**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఎవ్వరు= ఏ యోధులైతే; ఆత్మదేహములు= తమ దేహాలను; సమిద్ధమైన= బాగా రగుల్చబడిన; అస్త్రవహ్నిన్= అస్త్రాలచేత పుట్టిన అగ్నిలో; వేలిచిరి= హోమం చేశారో; వారు; అమరలోకమునకున్+చని= స్వర్గానికి వెళ్ళి; నిర్జర+అంగనాజన= అప్సరసలతోడి; విలసితుఁడైన= ప్రకాశించేటువంటి; అమరేంద్రునకున్= ఇంద్రుడికి; పూజ్యులు= పూజింపదగినవారు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. ఏ యోధులు తమ దేహాలను బాగా మండుతున్న అస్త్రాల చేత పుట్టిన అగ్నిలో హోమం చేశారో వారు స్వర్గానికి వెళ్ళి అప్సరసలతో వైభవంగా విరాజిల్లే మహేంద్రుడికి అతిథులై పూజలందుతారు.

**క.** **తఱచుగ శస్త్రాస్త్రంబులు । నెఱఁకులు దూఱినఁ జలించి నిజధైర్యంబుల్**
**మఱచి తెఱలి చచ్చిరి కొం । దఱు గుహ్యకగతికిఁ బోవఁ దగుదురు వారల్. 170**

**ప్రతిపదార్థం:** తఱచుగన్= మిక్కిలిగా; శస్త్రాస్త్రంబులు= శస్త్రాలు, అస్త్రాలు; నెఱుఁకులు= ఆయువుపట్టుల్లో; దూఱినన్= నాటుకోగా; చలించి= భయపడిపోయి; నిజధైర్యంబుల్= తమ ధైర్యాన్ని; మఱచి= విస్మరించి; తెఱలి= బయటపడి; కొందఱు= కొంతమంది యోధులు; చచ్చిరి= చచ్చారు; వారల్= వారు; గుహ్యకగతికిన్= యక్షలోకానికి; పోవన్+తగుదురు= పోవటానికి అర్హులవుతారు.

**తాత్పర్యం:** అనేక శస్త్రాలు, అస్త్రాలు ఆయువుపట్టులలో నాటుకోగాభయపడిపోయి, తమ ధైర్యాన్ని కోల్పోయి వెన్నుచూపి యుద్ధరంగంనుండి బయటపడి కొంతమంది యోధులు చచ్చారు. వారు యక్షలోకానికి పోవటానికి అర్హులవుతారు.

**విశేషం:** గుహ్యకులు దేవయోనులు. కుబేరుడు వీరి అధిపతి.

**క. సమరమున నెత్తెఱంగున । సమసిననుం గీడుతెరువు చన రుత్తమ లో**
**కమునకుఁ బోదురు జనములు । ప్రముదితులై యంద్రు బుధులు పౌరవముఖ్యా!' 171**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశంలో పుట్టిన శ్రేష్ఠుడైన ధృతరాష్ట్రుడైన మహారాజా!; సమరమునన్= యుద్ధంలో; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; సమసిననున్= చచ్చినా; జనములు= మనుష్యులు; కీడుతెరువు= నరకానికి; చనరు= పోరు; ప్రముదితులు+ఐ= మిక్కిలి సంతోషంతో; ఉత్తమ లోకమునకున్= స్వర్గానికే; పోదురు= వెళతారు (అని); బుధులు= పండితులున అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! యుద్ధంలో ఎట్లా చనిపోయినా ఆ వ్యక్తులు నరకానికి పోనే పోరు. తప్పకుండా సంతోషంతో స్వర్గానికే వెళ్తారు అని పండితు లంటారు.'

**క. అనిన విని ' నాథవంతులు । ననాథులును నైన వీరి కందఱకుఁ గృపా**
**ధనలోల! చేయఁగా వ । చ్చున కాదే యగ్నికార్యశోభనముఁ దగన్? 172**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇలా అనగా; విని= ధృతరాష్ట్రుడు విని (ఇట్లా అన్నాడు); కృపాధనలోల!= దయ అనే సంపదలో (దయాసంపదలో) ఆసక్తి ఉన్న ఓ ధర్మరాజా!; నాథవంతులున్= దిక్కున్నవారు; అనాథులును= దిక్కులేనివారు; ఐన= అయినటువంటి; వీరికందఱకున్= వీరందరికీ; అగ్ని కార్య శోభనమున్= పవిత్రమైన అగ్నికర్మను; తగన్= విధియుక్తంగా; చేయఁగాన్+వచ్చున కాదే!= చేయవచ్చు కదా!

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనగా విని ధృతరాష్ట్రు డిట్లా అన్నాడు: 'దయామూర్తి అయిన ధర్మరాజా! ఈ చనిపోయిన వారిలో దిక్కున్నవారూ ఉన్నారు. ఏ దిక్కూ లేనివారూ ఉన్నారు. అట్లాంటప్పుడు వీరి కందరికీ విధి ప్రకారంగా దహనకర్మ చేయటంలో తప్పేమీ లేదు కదా!'

**విశేషం:** ఇక్కడ 'దిక్కు' అనే మాటకు మిగిలినవారు అని అర్థం. సాధారణంగా బంధువులలో ఎవరో ఒకరు మిగిలి ఆ దహనకర్మ జరుపుతారు. ఈ మహాయుద్ధంలో దాదాపు అందరూ తుడిచిపెట్టుకుపోయారు కాబట్టి ఈ ధర్మసంకటం వచ్చింది. సమాధానం ధర్మరాజే చెప్పుతున్నాడు.

**వ. అని పలుకుటయు ధర్మనందనుం డిట్లను 'నీ యఖిల జనంబులు నాహితాగ్నుల యట్ల యట్లుంగాక వీరలిందఱ కుదకదహనక్రియాకరణయోగ్యులును లేరు మన మేది కొలఁదిగా నిప్పని సేయుద'మని పలికి తా రజ్ఞాత వాసంబు నిర్వహించి సముచిత ప్రకారంబున విరాటాదులచేతం బరిజ్ఞాతులైన సమయంబున సంగతుండై యది మొదలుగాఁ జెల్లెడు శాంతిక పౌష్టికాది శ్రౌతస్మార్తక్రియాకలాపంబులు నడపుచుం దమయొద్దనున్న ధౌమ్యునాలోకించి విదురుని సంజయునిఁ గనుంగొని 'మీరు భరతకులులకుందక్క ననాథవంతులైన వారలకు విధ్యుక్తంబుగా నగ్నిసంస్కారంబు సేయుం'డని పనిచి యత్తెఱంగునకుం దోడుపడుటకై సూతజనంబులను దత్కాలసమాగతులైన కరిపురజనంబులోనం దగువారి నిరూపించి మున్న తెప్పించిన చందనాగురుఖండ క్షౌమవసన కస్తూరికాకుంకుమఘృతతైలప్రభృతులగు వలయువస్తువు లా**

**ధౌమ్యముఖ్యుల కొప్పించిన వా రయ్యవసరంబునం గూడికొనిన బహుబ్రాహ్మణ సంఘంబులతోఁ జని దుర్యోధన దుశ్శాసనకర్ణశల్యాదులకు నభిమన్యుఘటోత్కచవిరాటధృష్టకేతుప్రముఖులకును దక్కును బే రెఱుకపడు నానాదేశాధీశులకుం బ్రచురకాష్ఠ సంచయంబులను భగ్నరథావయవ ధ్వజ ధనుశ్శరకుంతాదులను సొదలు వేర్పించి పితృమేధ క్రియలు నడపి చిచ్చునం జొనిపి యనాథవంతులైన భూకాంతుల ననేక సహస్ర సంఖ్యులం బ్రోవులుగాఁ బెట్టించి సమగ్రదారుసముదయంబు లమర్చి యగ్ని యిచ్చి రప్పడు ఋగ్యజుః పఠన రవంబులును సామగాన నాదంబులును రమణీరోదన ధ్వనులును రోదసీకుహరంబు నిండె ధూమంబున దిక్కులు పిక్కటిల్లెఁ జేతనభూతంబులకెల్ల విపులవిషాదం బావహిల్లె నవ్విధంబునం దగవు నడిపించి. 173**

**ప్రతిపదార్థం:** అని పలుకుటయున్= అని ధృతరాష్ట్రుడనగా; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనున్= ఇలా అంటాడు; ఈ అఖిలజనంబులున్= ఈ యుద్ధంలో పాల్గొన్న సమస్త జనులూ; ఆహితాగ్నుల+అట్ల= విధిపూర్వకంగా నిత్యమూ ఇంటిలో అగ్నిని స్థాపించుకొని యజ్ఞం చేసే వారివలె (అంటే వీరికి అగ్నికార్యం యుద్ధప్రక్రియలోనే సిద్ధిస్తోందని అర్థం); అట్లున్+కాక= అంతే కాకుండా; వీరలు+ఇందఱకున్= వీరు ఇంతమందికీ; ఉదకదహన క్రియాకరణ యోగ్యులు= జలతర్పణం, దహనం చేయటానికి అర్హత ఉన్నవారు; లేరు; మనము+ఏది= మనం పూనుకొని; కొలఁదిగా= సాధ్యమైనంతవరకు; ఈ+పని+చేయుదము= ఈ పనిచేద్దాము; అని పలికి; తారు= తాము; అజ్ఞాతవాసంబు; నిర్వహించి= చేసి; సముచిత= తగిన; ప్రకారంబునన్= విధంగా; విరాటాదులచేతన్= విరాట రాజు మొదలైనవారిచేత; పరిజ్ఞాతులైన= తెలిసికోబడిన; సమయంబునన్= సందర్భంలో; సంగతుండు+ఐ= కలిసినవాడై; అది మొదలుగాన్= అప్పటినుంచి; చెల్లెడు= జరిగిన; శాంతిక= శాంతి; పౌష్టిక= పుష్టి; ఆది= మొదలైన; శ్రౌత= శ్రుతికి సంబంధించిన; స్మార్త= స్మృతికి సంబంధించిన; క్రియాకలాపంబులు= హోమాది యాజ్ఞిక కార్యాలు; నడపుచున్= నడిపిస్తూ; తమ+ఒద్దన్+ఉన్న= తమ వద్ద ఉన్న; ధౌమ్యున్+ఆలోకించి= ధౌమ్యుడిని చూసి; విదురునిన్= విదురుడిని; సంజయునిన్= సంజయుడిని; కనుంగొని= చూసి; మీరు= మీరిద్దరూ; భరతకులులకున్+తక్కన్= భరతవంశీయులకు తప్ప; అనాథవంతులైన వారలకున్= ఏ దిక్కూ లేకుండా చనిపోయినవారికి; విధి+ఉక్తంబుగాన్= కర్మవిధి ప్రకారంగా; అగ్ని సంస్కారంబు= దహనక్రియను; చేయుండని పనిచి= చేయండి అని పంపి; ఆ+తెఱంగునన్= ఆ విధంగా; తోడుపడుటకై= సహాయంగా ఉండటానికి; సూతజనంబులనున్= సూతజనులను; తత్కాల= ఆ సమయానికి; సమాగతులైన= అక్కడికి వచ్చి ఉన్న; కరిపురజనంబులోనన్= హస్తినాపుర జనులలో; తగువారిన్= తగిన మనుష్యులను; నిరూపించి= ఏర్పరచి; మున్న= ముందుగానే; తెప్పించిన= తెప్పించి సిద్ధంగా ఉంచిన; చందన= శ్రీగంధం; అగురు= అవురుగడ్డి; ఖండ= దర్భ; క్షౌమ వసన= పట్టు బట్టలు; కస్తూరికా= కస్తూరి; కుంకుమ; ఘృత= నెయ్యి; తైల= నూనె; ప్రభృతులు+అగు= మొదలైన; వలయు వస్తువులు= అవసరమైన వస్తువులను; ఆ ధౌమ్యముఖ్యులకున్= ఆ ధౌమ్యాచార్యుడు మొదలైన పెద్దవారికి; ఒప్పించినన్= అప్పగించగా; వారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కూడికొనిన= అక్కడికి చేరిన; బహు= చాలమంది; బ్రాహ్మణ సంఘంబులతోన్= బ్రాహ్మణ సమూహాలతో; చని= వెళ్ళి; దుర్యోధన; దుశ్శాసన; కర్ణ; శల్య+ఆదులకున్= శల్యుడు మొదలైనవారిన్; అభిమన్యు; ఘటోత్కచ; విరాట; ధృష్టకేతు; ప్రముఖులకును= మొదలైనవారికీ; తక్కు= తప్ప(తక్కిన); పేరు+ఎఱుకపడు= ప్రసిద్ధులైన; నానా దేశ+అధి+ఈశులకున్= నానా రాజులకు; ప్రచుర= దండిగా; కాష్ఠ= కఱ్ఱల; సంచయంబులను= మోపులతో; భగ్న= విరిగిన; రథావయవ= రథభాగాలు; ధ్వజ=టెక్కెములు; ధనుః=విండ్లు; శర=అమ్ములు; కుంత+ఆదులను= బల్లెం మొదలైన వాటిచేత; సొదలు+పేర్పించి= చితులు పేర్పించి; పితృమేధ క్రియలు= ప్రేతయజ్ఞ క్రియను (దహన కర్మను); నడపి= నడిపించి; చిచ్చునన్= మంటలో; చొనిపి= ఆ శవాలను చేర్చి; అనాథవంతులైన= ఏ దిక్కూలేక మరణించిన; భూకాంతులన్= రాజులను; అనేక సహస్రసంఖ్యులన్= చాలావేలమందిని (వేనకువేలుమందిని); ప్రోవులుగాన్= రాసులుగా; పెట్టించి= ఒకచోట చేర్పించి; సమగ్ర= పెద్దపెద్ద; దారు సముదయంబులు= దుంగలను, కొయ్యలను; అమర్చి; అగ్ని+ఇచ్చిరి=

నిప్పుపెట్టారు; అప్పుడు; ఋక్+యజుః+పఠన రవంబులును= ఋక్ వేదం; యజుర్వేదం పఠిస్తున్న శబ్దాలు; సామగాన నాదంబులును= సామవేదం పాడుతున్నప్పటి నాదం; రమణీ= స్త్రీల; రోదన ధ్వనులును= ఏడుపులు; రోదసీకుహరంబు= ఆకాశమనే గుహ అంతటా; నిండెన్= నిండిపోయింది; ధూమంబునన్= పొగలో; దిక్కులు= అన్ని దిక్కులు; పిక్కటిల్లెన్= నిండిపోయాయి; చేతన= ప్రాణమున్న; భూతంబులకెల్లన్= జీవరాశికంతటికీ; విపుల= మిక్కిలి; విషాదంబు= శోకంబు; ఆవహిల్లెన్= కల్గింది; ఆ+విధంబునన్= ఆ రీతిగా; తగవున్= ఆ కర్మవిధిని; నడిపించి= నడిపించాక.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డనగా ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'ఈ యుద్ధంలో పాల్గొన్న సమస్త జనులూ అగ్నిని సిద్ధంగా ఉంచుకొన్న యాజ్ఞికులవంటివారే. (యుద్ధమే వారికి యజ్ఞకుండం. అస్త్రాలే అగ్నులు. కాబట్టి వారికి వేరే యజ్ఞం అక్కరలేదని అర్థం). అంతే కాకుండా వీరింతమందికీ జలతర్పణం, దహనం చేయటానికి అర్హత ఉన్నవారు లేరు. మనం పూనుకొని సాధ్యమైనంత వరకు ఈ పనిచేద్దాము' అని అంటూ తాము అజ్ఞాతవాసం చేసి సముచితమైన రీతిలో విరాటమహారాజు మొదలైన వారిచేత తెలిసికొనబడిన సందర్భంలో కలిసినవాడై, అప్పటి నుండి జరిగిన శాంతి పుష్టి హోమాదులను నడిపిస్తూ తమ వెంటనే ఉన్న ధౌమ్యాచార్యులను చూచి, విదుర సంజయులను పిలిచి 'మీరిద్దరూ భరతవంశీయులకు తప్ప తక్కిన ఏ దిక్కూలేకుండా చనిపోయినవారికి కర్మవిధి ప్రకారంగా దహనకర్మను చేయండి' అని చెప్పి పంపించి, ఆ పనిలో వారికి సహకరించటానికి సూతజనులను, ఆ సమయానికి అక్కడికి వచ్చి ఉన్న హస్తినాపుర జనులలో తగినవారిని గుర్తించి, ముందుగానే తెప్పించి సిద్ధంగా ఉంచిన శ్రీగంధం, అగురుగడ్డి, దర్భలు, పట్టు బట్టలు, కస్తూరి, కుంకుమ, నెయ్యి, నూనె మొదలైన వస్తువులను ఆ ధౌమ్యుడు మొదలైన పెద్దలకు అప్పగించాడు. వారు ఆ సమయానికి అక్కడ చేరి ఉన్న బ్రాహ్మణులను తీసికొని వెళ్ళి దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శల్యాదులకు, అభిమన్యు, ఘటోత్కచ, విరాట, ధృష్టకేతు ప్రముఖులకు తప్ప, తక్కిన ప్రసిద్ధులైన నానారాజులకు పెద్ద పెద్ద కర్రల మోపులతోను, విరిగిన ప్రేతయజ్ఞ క్రియ జరిపించి, మంటలో ఆ శవాలను చేర్చి అనాథలుగా మరణించిన రాజులను వేనకువేలమందిని రాసులుగా ఒకచోట చేర్పించి పెద్ద పెద్ద దుంగలను, కొయ్యలను వారిపై అమర్చి నిప్పుపెట్టారు. అపుడు ఒకపక్క ఋగ్వేదం, యజుర్వేదం చదువుతున్న శబ్దాలు, సామవేదం పాడుతున్న నాదం, ఆడవారి ఏడుపులు అన్నీ కలిసి ఆకాశమనే గుహ మారుమోగిపోయింది. పొగతో దిక్కులన్నీ నిండిపోయాయి. ప్రాణాలతో ఉన్న జీవరాసులన్నిటికీ మిక్కిలి శోకం పుట్టింది. ఆ రీతిగా వారు ప్రేతకర్మ విధిని నడిపించారు.

**విశేషం:** భరతవంశీయులకు పాండవులు ఉత్తర క్రియలు జరిపారు. ధృతరాష్ట్ర సహితంగా ధర్మరాజు సోదరులతో కలిసి ఈ క్రియ నిర్వర్తించాడు.ఇది ప్రేతకర్మలో ధర్మవిధి.

కాని, భారతయుద్ధంలో చనిపోయిన అన్ని లక్షలమందికి ఉత్తరక్రియలు ఎట్లా జరిపారన్న సందేహం వస్తుంది. 'అనాథ ప్రేతలుగా' వారిని పరిగణించి వారికి ఉత్తర క్రియలు ఎవరైనా చేయవచ్చునని వ్యాసుడు పరిష్కారం చూపాడు. విదురుడు, సంజయుడు, ఆ నగరవాసులు, అప్పటికి అక్కడున్న బ్రాహ్మణులు ఈ పనిచేశారట. అందుకే భారతాన్ని 'ధర్మశాస్త్ర' మంటారు.

కుంతి ధర్మజునకుఁ గర్ణుండు దన కొడుకు కగుట దెలుపుట (సం. 11-27-1)

**సీ.** **భూవర! కురువంశ పుంగవుం డగు ధర్మ। తనయుండు ధృతరాష్ట్రు వినయ మొప్ప**
**మున్నిడుకొని యాఁడు మొత్తంబుఁ దోడ్కొని। బంధు జనంబులు బలసి రాఁగ**
**నరిగి గంగాస్నాన మాచరించి తిలోద। క ప్రదానము సర్వకౌరవులకు**
**నయ్యాంబికేయుండు నక్కురుభార్యలు। ననుజులుఁ దానును నధిక నిష్ఠఁ**

**ఆ.** **చేసి రతనికడకు నా సమయంబున। నడలు నెమ్మనమున నడరి క్రమ్ము**
**కన్నునీరు మొగము గప్పంగఁ జని కుంతి। యెల్లవారు వినఁగ నిట్టు లనియె** 174

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ జనమేజయ మహారాజా!; కురువంశ= కురువంశంలో; పుంగవుండు+అగు= శ్రేష్ఠుడైన; ధర్మతనయుండు= ధర్మరాజు; వినయము+ఒప్పన్= వినయంతో; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్ర మహారాజును; మున్ను+ఇడుకొని= ముందుగా ఉంచుకొని; ఆఁడుమొత్తంబున్+తోడ్కొని= స్త్రీ జనాన్ని పిలుచుకొని; బంధుజనంబులు+బలిసిరాఁగన్= బంధువులందరూ వెంటరాగా; అరిగి= వెళ్ళి; గంగాస్నానమాచరించి= నదిలో స్నానం చేసి; సర్వకౌరవులకున్= కౌరవులందరికీ; ఆ+ఆంబికేయుండు= ఆ ధృతరాష్ట్రుడు; ఆ+కురుభార్యలు= కురుకుమారుల భార్యలు; అనుజులున్= తమ్ములు; తానును= తానూ; నిష్ఠన్= నిష్ఠతో; తిలోదక ప్రదానము+చేసిరి= తిలోదకా లిచ్చారు; అతని కడకున్= ఆ ధర్మరాజు దగ్గరకు; ఆ సమయంబునన్= అప్పుడు; అడలు= దుఃఖిస్తున్న; నెమ్మనమునన్= నిండుమనసుతో; అడరి= అదేపనిగా; క్రమ్మ= క్రమ్ముకొంటున్న; కన్నునీరు= కంటినీరు; మొగము+కప్పంగన్= ముఖంమీద తెరలాగ కప్పుతుండగా; కుంతి= కుంతీదేవి; చని= వెళ్ళి; ఎల్లవారు= అక్కడచేరిన వారంతా; వినఁగన్= వింటుండగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! అప్పుడు ధర్మరాజు ధృతరాష్ట్ర మహారాజును ఎంతో వినయవిధేయతలతో ముందుగా ఉంచుకొన్నవాడై (అంటే ధృతరాష్ట్రుడు ముందు నడుస్తుండగా); కౌరవస్త్రీ జన సమూహాన్ని పిలుచుకొని, బంధుజనులంతా వెంట తరలిరాగా నదికి వెళ్ళాడు. అందరూ స్నానాలు చేశారు. యుద్ధంలో మరణించిన కౌరవులందరికీ ధృతరాష్ట్రుడు, కురుకుమారుల భార్యలు, తాను, తన తమ్ములు అత్యధిక శ్రద్ధతో తిలోదకాలు ఇచ్చారు. ఆ సమయంలో ధర్మరాజు దగ్గరకు కుంతీదేవి వచ్చింది. ఆమె మనసంతా దుఃఖంతో నిండిపోయి అదే పనిగా కమ్ముకొని వస్తున్న కంటినీరు మొగంమీద తెరవలె కప్పుకొంటుండగా అందరూ వింటుండగా ఆమె ధర్మరాజుతో ఇట్లా అన్నది:

**తరలము.**

**'వినుము! కౌరవ కోటికిం దన విల్లు పెట్టనికోటగా**
**నని యొనర్చి, భవద్బలంబుల నన్నిటిన్ మిము నేవురం**
**దనిపి, యంబరచారులెల్లను దన్ను మెచ్చి నుతింపఁ బా**
**ర్థునిమహాస్త్రము బల్విడిం దలఁ ద్రుంపఁ గూలిన కర్ణునిన్.** 175

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! వినుము; కౌరవకోటికిన్= కౌరవసమూహానికి; తనవిల్లు= తన విల్లు; పెట్టనికోటగాన్= పెట్టనటువంటి కోటలాగ; అని+ఒనర్చి= యుద్ధంచేసి; భవత్+బలంబులన్= నీ సైన్యాన్ని; అన్నిటిన్= అంతటినీ; మిమున్+ఏవురన్= మీ ఐదుగురినీ; తనిపి= తృప్తులయ్యేటట్లు చేసి; అంబర= ఆకాశ; చారులు= గమనం కల్గిన దేవతలందరూ;

తన్నున్ మెచ్చి నుతింపన్= తన్ను ప్రశంసించి ప్రస్తుతిస్తుండగా; పార్థుని= అర్జునుడి; మహాస్త్రము= గొప్ప అస్త్రం; బల్విడిన్= పరాక్రమంతో; తలన్+త్రుంపన్= తలను తుంచగా; కూలిన= చనిపోయిన; కర్ణునిన్= కర్ణుడిని.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వినుము. కౌరవ సమూహానికి తన విల్లును పెట్టని కోటవలె నిలిపి యుద్ధం చేసి, మీ సైన్యానికీ మీ ఐదుగురికీ యుద్ధక్రీడలో అసామాన్యుడనే తృప్తిని కల్గించి, దేవతలు కూడా తన పరాక్రమాన్ని ప్రశంసిస్తుండగా అర్జునుడి మహాస్త్రం అతివేగంగా తలను తుంచివేయగా నేలకూలిన కర్ణుడిని. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** పద్యలక్షణానికి చూడండి. స్త్రీ. 2. 94.

**క.** **జనులెల్లను రాధేయుం । డనుటను మీరలును వాని నట్టుల కా నె**
**మ్మనమునఁ దలంతు రటుగా । దనఘ! మదీయాత్మజన్ముఁ డాతం డరయన్.** **176**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; జనులు+ఎల్లనున్= జనులంతా; రాధేయుండు+అనుటను= రాధేయుడు అంటూ రావటం వలన; మీరలును= మీరుకూడా; వానిన్= అతడిని; అట్టులకాన్= అలాగే; నెమ్మనమునన్= మనసుల్లో; తలఁతురు= ఊహించారు; అటుగాదు= అది సత్యంకాదు; ఆతండు= ఆ కర్ణుడు; అరయన్= బాగా గుర్తిస్తే; మదీయ= నా; ఆత్మ జన్ముఁడు= కుమారుడే.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! జనులంతా అతడిని రాధేయుడు అంటూ రావటం వలన మీరుకూడా రాధ కుమారుడనే ఇంతకాలమూ మీ మనసులలో భావిస్తూ వచ్చారు. కాని, అది సత్యం కాదు. ఆ కర్ణుడు నిజానికి నా కుమారుడేనయ్యా!

**ఆ.** **మీకు నగ్రజుండు నాకు భాస్కరు దయ । లలితకవచకుండలములతోడఁ**
**బుట్టినాఁడు గానఁ బోయంగ వలయుఁ ది । లోదకంబు లమ్మహోన్నతునకు'.** **177**

**ప్రతిపదార్థం:** మీకున్+అగ్రజుండు= మీ ఐదుగురికీ ఆయన అన్నగారు; నాకు; భాస్కరుదయన్= సూర్యుని వరంతో; లలిత= అందమైన; కవచకుండలములతోడన్= కవచకుండలాలతో; పుట్టినాఁడు= పుట్టాడు; కానన్= కాబట్టి; ఆ+ మహోన్నతునకున్= ఆ గొప్పవాడికి; తిలోదకంబులన్= నువ్వులు, నీళ్ళు; పోయంగవలయున్= ప్రదానం వేయాలి (ఇవ్వాలి).

**తాత్పర్యం:** మీ ఐదుగురికీ ఆయన అన్నగారు. సూర్యుడి వరప్రసాదంగా నాకు సుందరమైన కవచకుండలాలతో పుట్టాడు. అందువలన ఆ మహానుభావుడికి తిలోదకప్రదానం మీరు చేయాలి.'

**వ.** **అని తదీయ జన్మప్రకారంబును దివాకరుప్రసాద ప్రభావంబును జెప్పుటయు దుస్సహంబు లగు నమ్మాటలు చెవులు సూఁడినట్లయినఁ బాండవులు పరమదుఃఖావేశంబు నొంది రందు భీమాదులు నివ్వెఱపడియుండ ధర్మనందనుండు దల్లడిల్లుచుం దల్లితో నిట్లనియె.** **178**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; తదీయ= ఆ కర్ణుని; జన్మప్రకారంబునున్= పుట్టిన తీరును; దివాకరు= సూర్యుడి; ప్రసాదప్రభావంబునున్= వరప్రభావాన్ని; చెప్పుటయున్= చెప్పగా; దుస్సహంబులు+అగున్= భరించడానికి; వీలులేని; ఆ+మాటలు= ఆ కుంతీదేవి మాటలు; చెవులు+చూడిఁనట్లు+అయినన్= చెవులు కాల్చినట్టుకాగా(మిక్కిలి బాధించగా); పాండవులు; పరమ

దుఃఖ+ఆవేశంబున్+ఒందిరి= మిక్కిలి దుఃఖం పొందారు; అందున్= వారిలో; భీమ+ఆదులు= భీముడు మొదలైనవారు; నివ్వెఱపడి+ఉండన్= ఆశ్చర్యంతో నిశ్చేష్టులై ఉండగా; ధర్మనందనుండు= ధర్మరాజు; తల్లడిల్లుచున్= తల్లడిల్లుతూ; తల్లితోన్= తమ తల్లితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అని చెప్పి కుంతీదేవి ఆ కర్ణుడు పుట్టినతీరునూ, సూర్యుడి దివ్యవర ప్రభావాన్నీ వివరించగా ఆ కుంతీదేవి పలుకులు భరింపరానివై చెవులు కాల్చగా పాండవులు దారుణమైన దుఃఖం పొందారు. వారిలో భీమాదులు ఆశ్చర్యంతో నిశ్చేష్టులైపోగా ధర్మరాజు తల్లడిల్లిపోతూ తమతల్లితో ఇట్లా అన్నాడు:

**సీ.** **'అనిలజార్జునుల మార్కొని నేర్చె నెవ్వని । యుత్సాహమూఁది సుయోధనుండు,**
**వైదేహ పౌండ్రాది వసుధేశులెవ్వని । కడిమి సొంపున కరిగాఁపులైరి,**
**మనసైన్యకోటి యెవ్వని బాహువీర్య సం । పద కోడి యంతంత నొదుఁగుచుండు,**
**నద్భుతం బొనరించె నమరుల కెవ్వని । యసమాన వివిధ దివ్యాస్త్ర మహిమ.**

**తే.** **మమ్మునందఱ నెవ్వని మహితశక్తి । యెక్కుడై సంగరంబునఁ జిక్కుపఱిచె,**
**నట్టికర్ణునిఁ గొంగున నగ్ని డాఁచి । నట్టు లెమ్మెయి డాఁచితో యమ్మ! చెపుమ.** **179**

**ప్రతిపదార్థం:** అనిలజ= వాయుకుమారుడైన భీముడిని; అర్జునులన్= అర్జునులను (అంటే భీమార్జునులను); ఎవ్వని= ఎవ్వడియొక్క; ఉత్సాహము+ఊఁది= ఉత్సాహాన్ని ఆసరాగాకొని; సుయోధనుండు= దుర్యోధనుడు; మార్కొనన్+నేర్చెన్= ఎదిరించటానికి సమర్థుడయ్యాడో; వైదేహ= విదేహరాజు; పౌండ్ర+ఆది+వసుధేశులు= పౌండ్రక మొదలైన రాజులు; ఎవ్వని= ఎవ్వడియొక్క; కడిమి= పరాక్రమం; సొంపునన్= వైభవంచేత; అరిగాఁపులు+ఐరి= పన్ను చెల్లించే సామంతరాజులయ్యారో; మనసైన్యకోటి= మన పాండవసైన్యం; ఎవ్వరి= ఎవ్వడియొక్క; బాహువీర్యసంపదకున్+ఓడి= బాహుబల సంపదముందు ఓడి; అంతంతన్= క్రమంగా; ఒదుఁగుచుండున్= అణిగి ఉంటూ వచ్చిందో; ఎవ్వని= ఎవ్వడియొక్క; అసమాన= నిరుపమానమైన; వివిధ= అనేక; దివ్య+అస్త్రమహిమ= దివ్యాలైన అస్త్రాల వైభవం; అమరులకున్= దేవతలకు కూడా; అద్భుతంబు+ఒనరించెన్= ఆశ్చర్యాన్ని కలిగించిందో; మమ్మున్+అందఱన్= మమ్ములను అందరినీ; ఎవ్వని= ఎవ్వడియొక్క; మహితశక్తి= గొప్పశక్తి; ఎక్కుడు+ఐ= అధికమై; సంగరంబునన్= యుద్ధంలో; చిక్కు+పఱిచెన్= ఇబ్బందిపెట్టిందో; అట్టి= అలాంటి; కర్ణునిన్= మహావీరుడు కర్ణుడిని; కొంగునన్= కొంగులో; అగ్నిడాఁచి+అట్టులు= నిప్పును దాచిపెట్టినట్లు; ఎమ్మెయిన్= ఎలా; డాఁచితో!= దాచిపెట్టావో!; అమ్మ!= అమ్మా!; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** 'భీమార్జునులవంటి అసమానవీరులను ఎవడి ఉత్సాహాన్ని ఆసరాగాకొని దుర్యోధనుడు ఎదుర్కొనటానికి సమర్థుడయ్యాడో, విదేహపౌండ్రాదులైన చిన్న చిన్న రాజులు ఎవడి పరాక్రమ వైభవంచేత కప్పాలు చెల్లించగలిగిన సామంతులయ్యారో, మన పాండవసైన్యం ఎవడి బాహుబలసంపదముందు ఓడి అక్కడి కక్కడ అణగి ఉంటూ వచ్చిందో, ఎవడి నిరుపమానమైన దివ్యాస్త్ర సంపద దేవతలకు కూడా ఆశ్చర్యాన్ని కల్గించిందో, మమ్ములను అందరినీ ఎవడి మహాశక్తి అతిశయించి యుద్ధంలో చికాకు కలిగించిందో - అట్లాంటి కర్ణుడిని కొంగులో నిప్పును దాచిపెట్టినట్టు ఎట్లా దాచిపెట్టావమ్మా! చెప్పుము.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. అర్జునుఁ డొకరుఁడు దక్క ను । పార్జితశౌర్యమున నమ్మహాబాహుని వి**
**స్ఫూర్జితరథమున కెదురై । గర్జిల్లఁగ రథికుఁ డెందుఁ గలుగునె జననీ! 180**

**ప్రతిపదార్థం:** జననీ!= అమ్మా! అర్జునుఁడు ఒకరుఁడు+తక్కన్= అర్జునుడు ఒకడుతప్ప; ఉపార్జిత= సంపాదింపబడిన; శౌర్యమునన్= పరాక్రమంతో; ఆ+మహాబాహుని= ఆ మహావిక్రముడైన కర్ణుడి; విస్ఫూర్జిత= మిక్కిలి ప్రకాశించేటువంటి; రథమునకున్= రథానికి; ఎదురు+ఐ= ఎదురుపడి; గర్జిల్లఁగన్= గర్జించటానికి; రథికుఁడు= రథంమీద ఉండి యుద్ధం చేసే వీరుడు; ఎందున్= ఎక్కడైనా; కలుగునె?= ఉన్నాడా?

**తాత్పర్యం:** అమ్మా! అర్జునుడు ఒకడు తప్ప సంపాదించిన పరాక్రమంతో ఆ మహావిక్రముడైన కర్ణుడి దివ్యప్రకాశమున్న రథానికి ఎదురుపడి గర్జించగల యోధు డెవడున్నాడు చెప్పుము!

**తే. కర్ణుఁ దొలుచూలుగా నేల కంటి తల్లి? నీదుమంత్రంబు పరమ విషాదకారి**
**యయ్యె మాకెల్ల నట్టి మహాబలైక । గణ్యు బ్రుంగుడుపఱుచుట కారణమున. 181**

**ప్రతిపదార్థం:** కర్ణున్= కర్ణుడిని; తొలుచూలుగాన్= తొలికాన్పుగా; ఏలకంటి తల్లి?= ఎందుకు కన్నావమ్మా?; నీదుమంత్రంబు= నీవు నేర్చుకున్న మంత్రం; మాకున్+ఎల్లన్= మా కందరికీ; అట్టి= అట్లాంటి; మహాబల+ఏక+గమ్యున్= అద్వితీయమైన మహాపరాక్రమవంతుడిని; బ్రుంగుడుపఱుచుట కారణమునన్= చంపటంవలన; పరమవిషాదకారి+అయ్యెన్= గొప్పశోకాన్ని కల్గించినదయినది.

**తాత్పర్యం:** తొలిచూలుగా కర్ణుడిని ఎందుకు కన్నావమ్మా? అట్లాంటి అద్వితీయ మహాపరాక్రమవంతుడిని చంపటం వలన నీవు నేర్చిన మంత్రం మా అందరికీ గొప్ప శోకాన్నే తెచ్చిపెట్టింది.

**తరువోజ:**

**భానుపుత్రుని చావు బంధులనెల్లఁ బరమసంతాపంబు పాల్పడఁజేసె**
**మానితబలుఁ డభిమన్యుండు పోర మడిసినప్పుడు నిట్టి మఱకువ నాత్మ**
**మానదు ద్రౌపదేయుల నాశమునకు నుడుక దివ్విధమున నుల్లంబు ద్రుపద**
**సూనులు ధృతరాష్ట్రసుతులును ద్రుంగుచొప్పున కిమ్మెయిఁ జొర దడల్ చాల. 182**

**ప్రతిపదార్థం:** భానుపుత్రుని= సూర్యపుత్రుడైన కర్ణుడి; చావు= మరణం; బంధులన్+ఎల్లన్= బంధువులందరినీ; పరమ= మిక్కిలి; సంతాపంబు= దుఃఖం; పాల్పడన్+చేసెన్= పాల్పడచేసినది; మానిత= ప్రఖ్యాతమైన; బలుఁడు= బలంగలవాడైన; అభిమన్యుండు= అభిమన్యుడు; పోరన్= యుద్ధంలో; మడిసినప్పుడున్= చనిపోయినప్పుడుకూడా; ఇట్టి; మఱకువ= విస్మృతి (నిశ్చేష్టత); ఆత్మము= మనసు; ఆనదు= పొందదు; ద్రౌపదేయుల= ద్రౌపదికుమారులైన ఉపపాండవుల; నాశమునకున్= నాశనానికి కూడా; ఉల్లంబు= హృదయం; ఈ+విధమునన్= ఈ రీతిగా; ఉడుకదు= తపింపలేదు; ద్రుపదసూనులు= ద్రుపదరాజు కొడుకులు; ధృతరాష్ట్ర సుతులును= కురు కుమారులు; త్రుంగు చొప్పునకున్= చనిపోయిన రీతికికూడా; ఈ+మెయిన్= ఈ రీతిగా; చాల+అడల్= మిక్కిలి దుఃఖాన్ని; చొరదు= పొందలేదు.

**తాత్పర్యం:** అమ్మా! సూర్యకుమారుడైన కర్ణుడి మరణం బంధువులందరినీ మిక్కిలిగా దుఃఖంపాలు చేసింది. ప్రఖ్యాతబలుడు అభిమన్యుడు చనిపోయినప్పుడు కూడా ఇంత విస్మృతిని మనసు పొందలేదు. ఉపపాండవులు

గతించినప్పుడు కూడా హృదయ మింత ఉడికిపోలేదు. ద్రుపదుడి కుమారులు, కురుకుమారులు చనిపోయిన తీరుకు కూడా హృదయాలు ఇంతగా దుఃఖాన్ని పొందలేదు. (కర్ణుడి మరణం అంతగా క్రుంగదీసిందని అర్థం).

**విశేషం:** వృత్తలక్షణానికి చూడుడు - స్త్రీ. 1. 43.

**ఆ. అతఁడు మాకు నన్న యని మున్న యెఱుఁగంగఁ । గన్నఁ గురుబలంబుఁ గలఁగఁబడక**
**మనుదు మట్టులైన మనుజలోకమునకుఁ । గలుగ దడలు మాకుఁ గలుగ దడలు.' 183**

**ప్రతిపదార్థం:** అతఁడు= కర్ణుడు; మాకున్+అన్న+అని= మాకు అన్న అనేటువంటి విషయం; మున్ను+అ= ముందే; ఎఱుఁగంగన్+కన్నన్= తెలిసికొని ఉంటే; కురుబలంబు= కురుసైన్యం; కలఁగన్+పడక+మనుదుము= వ్యాకులం చెందకుండా ఎట్లా మెలగాలో అట్లా మెలిగేవాళ్ళం; అట్టులు+ఐనన్= అట్లా అయి ఉంటే; మనుజలోకమునకున్= మానవలోకానికే; అడలు= దుః ఖం; కలుగదు= కల్గేదికాదు; మాకున్= మాకుకూడా; అడలు= దుఃఖం; కలుగదు= ఉండేది కాదు.

**తాత్పర్యం:** కర్ణుడు మాకు అన్న అనే విషయం ముందుగానే తెలిసి ఉంటే కురుకుమారులు, వారి సైన్యం వ్యాకులం చెందకుండా ఎట్లా మసలుకొనాలో అట్లా మెలిగేవాళ్ళం. అట్లా అయి ఉంటే మానవలోకానికే ఏ దుఃఖమూ కలిగేది కాదు.'

**వ. అని విలాపంబు సేసి విషాదశిథిలవర్ణంబులతో గోత్రనామంబు లుగ్గడించుచు నమ్మార్తాండనందనునకుం దిలోకప్రదానంబు సేసెఁ; దదనంతరంబ భీమార్జున నకుల సహదేవులుం జేసి రట్లు కర్ణుండు పాండవాగ్రజుం డగుట యెఱింగి గురువధూజనంబు లార్తనాదంబు లెసంగ నాక్రందించిరి; ధృతరాష్ట్రుండును గాంధారీ కుంతీ పూర్వకంబుగా నతనికి నుదకకర్మం బాచరించె; నయ్యజాతశత్రుండా దినేశపుత్రునివలని సౌభ్రాత్రంబువలనఁ బరిచారికాసమేతంబుగాఁ దద్భార్యల రావించి గారవించి యతనికై యనేక విధ పుణ్యకర్మంబులు భూరిదక్షిణంబులుగాఁ ననుష్ఠించి కృతకృత్యతానందంబు నొంది సకలబంధుసహితంబుగా గంగాసముత్తరణం బాచరించె - నని యిట్లఖిలజనాభినందితుండగు ధర్మనందనుండు గర్ణుం దమయన్న యని యెఱింగిన తెఱంగు వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన నజ్జనపతి 'కురువంశ్యుండగు నయ్యుధిష్ఠిరువర్తనం బటమీఁద నెట్లు సెల్లె?'నని యడుగుటయు. 184**

**ప్రతిపదార్థం:** అని విలాపంబు+చేసి= అని ఏడ్చి; విషాద= శోకం వలన; శిథిల= వణకువల్ల జారిపోతున్న; వర్ణంబులలోన్= అక్షరాలతో; గోత్రనామంబులు= గోత్రంపేరు, పూర్వీకుల పేర్లు, చనిపోయినవానిపేర్లు; ఉగ్గడించుచున్= పలుకుతూ; ఆ+మార్తాండనందనునకున్= ఆ సూర్యకుమారుడైన కర్ణుడికి; తిలోదక ప్రదానంబు+చేసెన్= నువ్వులు, నీళ్ళు వదలిపెట్టాడు (తిలతర్పణం చేశాడు); తద్+అనంతరంబ= ఆ తరువాత; భీమ, అర్జున, నకుల, సహదేవులున్= అతడి తమ్ముళ్ళూ; చేసిరి= అట్లాగే చేశారు; కర్ణుండు; పాండవ+అగ్రజుండు+అనుట= పాండవుల అన్న అనే విషయం; ఎఱింగి= తెలిసి; కురువధూజనంబులు= కురుకుమారుల భార్యలు; ఆర్తనాదంబులు+ఎసంగన్= ఆర్తనాదాలు అతిశయించగా; ఆక్రందించిరి= ఏడ్చారు; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడు కూడా; గాంధారీ, కుంతీ పూర్వకంబుగాన్= గాంధారి; కుంతీదేవులు ముందు చేయగా; అతనికిన్= కర్ణుడికి; ఉదకకర్మంబు= ధర్మోదక ప్రదానం; ఆచరించెన్= చేశాడు; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు; ఆ+దినేశపుత్రుని వలని= ఆ కర్ణుడిపట్ల ఉన్న; సౌభ్రాత్రంబు వలన్= సోదరభావం వలన; పరిచారికా సమేతంబుగాన్=

పరిచారికలతో సహా; తద్+భార్యలన్+రావించి= అతడి భార్యలను రప్పించి; గారవించి= గౌరవించి; అతనికై= కర్ణుడికోసం; అనేకవిధ= వివిధాలైన; పుణ్యకర్మంబులు= పుణ్యకర్మలను; భూరి దక్షిణంబులుగాన్= అధికమైన దక్షిణలతో; అనుష్ఠించి=చేసి; కృతకృత్యతా+ఆనందంబున్+ఒంది= విధిని పూర్తి చేశానన్న తృప్తిని పొంది; సకల బంధు సహితంబుగాన్= బంధువులందరితో కలిసి; గంగా సముత్తరణంబున్+కావించెన్+అని= గంగానదిని దాటాడని; ఇట్లు= ఈ విధంగా; అఖిలజన= జనులందరిచేత; అభినందితుండు+అగు= మెచ్చుకోబడిన; ధర్మనందనుండు= ధర్మరాజు; కర్ణున్= కర్ణుడిని; తమ అన్నయని= తమ అన్న అని; ఎఱింగిన తెఱంగు= తెలిసికొన్న విధం; వైశంపాయనుండు= వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడికి; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+జనపతి= జనమేజయుడు; కురువంశ్యుండగు= కురువంశీయుడైన; ఆ+యుధిష్ఠిరు వర్తనంబు= ఆ యుధిష్ఠిరుడి నడవడి; మీఁదన్= తరువాత; ఎట్లు+చెల్లెనని= ఎట్లా జరిగిందని; అడుగుటయున్= అడుగగా.

**తాత్పర్యం:** అని ఏడ్చి, ధర్మరాజు దుఃఖం వలన వణకుతున్న కంఠంతో జారిపోతున్న అక్షరాలతో గోత్రనామాదులను ఉచ్చరిస్తూ కర్ణుడికి తిలోదకాలు వదలిపెట్టాడు. ఆ తరువాత భీమార్జున నకుల సహదేవులు కూడా అట్లాగే చేశారు. కర్ణుడు పాండవుల అన్న అని తెలిసి కురుకుమారుల భార్యలు ఆర్తనాదాలు చేస్తూ ఏడ్చారు. ధృతరాష్ట్రుడు గాంధారి కుంతీదేవులతో కలిసి ధర్మోదకాలు సమర్పించాడు. ధర్మరాజు ఆ కర్ణుడిపట్ల ఉన్న సోదరభావం వలన పరిచారికలతో సహా అతడి భార్యలను రప్పించి, గౌరవించి, కర్ణుడికోసం అనేక పుణ్యకర్మలను అధికమైన దక్షిణలతో చేసి, విధిని పూర్తి చేశానన్న తృప్తిని పొంది, బంధువులతో కలిసి గంగానదిని దాటాడని - ఈ విధంగా జనులందరి చేత ప్రశంసించబడిన ధర్మరాజు కర్ణుడిని తమ అన్న అని తెలిసికొన్న విధం వైశంపాయనుడు జనమేజయుడికి తెలిపాడు. అప్పుడు జనమేజయుడు వైశంపాయనుడిని 'అయ్యా! ఆ తరువాత ధర్మరాజు ఏమి చేశాడు' అని అడిగాడు.

## ఆశ్వాసాంతము

**మందాక్రాంతము.**

**వీణానాద ప్రతిమ నిగమావిర్భవత్సార పుణ్య**
**శ్రేణీ సంపాదిత విమలతాస్థేమ నిర్లేపచిత్త**
**త్రాణక్రీడాకలన సతతోత్సాహ వద్దివ్యభావా!**
**ప్రాణాపానాహరణ నిపుణ ప్రాపణీయానుభావా!** 185

**ప్రతిపదార్థం:** వీణానాద= వల్లకీ ధ్వనులతో; ప్రతిమ= సమానమైన; నిగమ= వేదపాఠం చేయటం వలన; పుట్టేనాదంతో; ఆవిర్భవత్= పుట్టుతున్న; సారపుణ్య= సారభూతమైన పుణ్యుల; శ్రేణీ= వరుసలచేత; సంపాదిత= సమకూర్చబడిన; విమలతా= నైర్మల్యం; స్థేమ= స్థిరత్వం కల్గిన; నిర్లేప= ఆసక్తతలేని; చిత్త= మనస్సుకలవారిని; త్రాణ= రక్షించడమనేటువంటి; క్రీడా= విలాసంతో; కలన= ఒప్పుచున్న; సతత= నిరంతర; ఉత్సాహవత్= ఉత్సాహం కల్గిన; దివ్యభావా!= ప్రకాశించే హృదయం కలవాడా!; ప్రాణ= ప్రాణమూ; అపాన= అపానమూ అనే ప్రాణవృత్తుల; ఆహరణ= కూడికచేత; నిపుణ= నైపుణ్యంతో; ప్రాపణీయ= పొందించబడదగినటువంటి; అనుభావా= ప్రభావం కల్గినవాడా!

**తాత్పర్యం:** వీణవలె మనోహరమైన వేదనాదాన్ని అర్థభావన చేస్తూ నిరంతరం అభ్యసించే పుణ్యాత్ములకు కలిగేటటువంటి అసంగచిత్త, స్థైర్యాది ఉత్తమగుణాలను నీవే రక్షిస్తావు. ప్రాణాపానాది వాయువృత్తి నిరోధక రూపమైన యోగాభ్యాసంవలన మహాయోగులు నిన్నే పొందుతారు. అట్లాంటి దివ్య ప్రభావం కల్గిన నీకు నమస్కారం.

**విశేషం:** హరిహరనాథస్వామిని ఇక్కడ యోగస్వరూపుడిగా వర్ణించటాన్ని మనం గమనించవచ్చును. వీణ -శరీరానికి ప్రతీకగా కల్పించబడిన దివ్యవాద్యమని సంగీతజ్ఞులు చెబుతారు. వీణాదండమే మేరుదండం. నాడులే నాదతంత్రులు. కనుక వీణానాద సాధన మహాయోగంగా వివరించబడింది. మహర్షులుకూడా వీణాసాధన చేసేవారని ప్రతీతి. కారణం నాదోపాసనవలన కలిగేది నిర్వికారమైన ప్రశాంత చిత్తం. వేదనాదోపాసనకు కూడా అదే ప్రయోజనం కాబట్టి ఈ పోలిక సమంజసం. నిర్వికారతకు ఫలితమే అసంగచిత్తం. అంటే ఎందులోనూ మునిగిపోనిదని అర్థం. తామరాకుమీద నీటిబొట్టువలె తటస్థంగా ఉండే చిత్తమని అర్థం. స్థేమమంటే స్థిరమని అర్థం. ఉపాసకుడు అసంగధర్మాన్ని అలవరచుకొన్నా సులభంగా లభ్యంకానిది స్థిరత్వం. దానిని కూడా ప్రసాదించేవాడు భగవంతుడు మాత్రమేనని అర్థం. అందుకే భగవద్గీతలో స్వామి 'యోగక్షేమం వహామ్యహం' అని ఆనతి ఇచ్చాడు. యోగమంటే అసంగచిత్త పరిపాకమనే అర్థం. క్షేమమంటే స్థిరమైన అంతరంగమనే పరమార్థం.

ఇక ప్రాణాపానాదుల విషయం స్థానంగా కల్గినది ప్రాణం. గుదస్థానీయమైనది అపానం. ప్రాణాపాన సమాయుక్తుడుగానే భగవంతుడు చతుర్విధాలైన భక్ష్య భోజ్య లేహ్య చోష్యములనే ఆహార పదార్థాలను జీర్ణం చేస్తున్నాడని భగవద్గీత చెబుతున్నది. ప్రాణయామం అంటే ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం - ఇత్యాదిగా ఉన్న ప్రాణవృత్తులను నియమించటం అని అర్థం (నియమించటమంటే నిగ్రహించటమని భావం). యోగమంటే ఈ నిరోధం ద్వారా ఏర్పడేటటువంటి చిత్తవృత్తి సంయమనమని అర్థం. దానిద్వారా కలిగేదే పరమేశ్వరానుగ్రహమని యోగశాస్త్రం చెప్తున్నది. యోగతత్త్వోపనిషత్తులవంటి గ్రంథాలలో ఈ ప్రక్రియ వివరించబడింది.

ఇట్లా ప్రాణాపానాదులను సంయమనం చేయటం వలన తొలుత దూరశ్రవణ, దూరదర్శన, దూరగమన, కామరూపత్వ, అదృశ్యకరణి, సువర్ణకరణి - ఇత్యాది కొన్ని సిద్ధులు కలుగుతాయనీ, అల్లాంటి లౌకిక సిద్ధుల విషయంలో అనాసక్తుడై ఎవడు నిరంతర అభ్యసనంతో నిష్ఠను, ఓర్పును అవలంబిస్తాడో ఆ యోగి పరమేశ్వరానుగ్రహం పొందుతాడు. అదే మోక్షం. అందుకే 'నిపుణంగా' (నైపుణ్యంతో అని అర్థం). లౌకకవ్యామోహాదులనుండి బయటపడటానికి నైపుణ్యమవసరం. ఈ అనుగ్రహసిద్ధి సహజంగా వచ్చేది కాదు. బహుప్రయత్న సిద్ధం కాబట్టి 'ప్రాపణీయ' మని తిక్కనగారు సూచిస్తున్నారు.

మందాక్రాంతలో ప్రతి పాదానికీ మ, భ, న, త, త, గ, గ అనే గణాలుంటాయి. 1-11 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం కలదు.

**క.** **త్వంతాహంతా నిరసన! శాంతాంతఃకరణ యోగిజనవిజ్ఞేయా**
**చింతాసాగరమగ్న । భ్రాంతజనాధ్యేయ! పరమభక్తివిధేయా! 186**

**ప్రతిపదార్థం:** త్వంతా+అహంతా నిరసన!= నీవు, నేను అనే భావాలు లేనివాడా!; శాంత+అంతఃకరణ యోగిజన విజ్ఞేయా!= శాంతమైన అంతఃకరణం కల్గిన ఉత్తమ జ్ఞానయోగుల చేత తెలిసికోదగినవాడా!; చింతాసాగర= చింత అనేటువంటి సముద్రంలో; మగ్న= మునిగి; భ్రాంత= అజ్ఞాన రూప భ్రాంతిని కల్గిన; జన+అధ్యేయ!= జనులకు అధ్యేయుడా! (అట్లాంటి జనులు నిన్ను తెలిసికో లేరని తాత్పర్యం); పరమభక్తి విధేయా!= ఉత్తమ భక్తికి లొంగేటువంటివాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీవు - నేను అనే భావన లేని పరమ శాంత చిత్తవృత్తి గల జ్ఞానయోగులు సమాధిలో నిన్నే తెలిసికొంటారు. సదా సంసార సముద్రంలో మునిగి చింతాభ్రాంతులతో కూడిన జనులు ఎన్నటికీ నిన్ను గుర్తించలేరు. ఉత్తమభక్తి మాత్రమే నిన్ను అందుకొనగలిగిన సులభ సాధనం.

**విశేషం:** ఈ సృష్టిమొదట ఆత్మ మాత్రమే ఉన్నది. దానికి స్వ- పర భేదం లేదు. సృష్టిక్రమంలో పదార్థ మేర్పడి జీవం అందులో బద్ధమైన తరువాత నీ - నా అనే తేడాలు ఏర్పడ్డాయి. లోకంలోని మనుష్యులను ఈ భావనే వేరుచేస్తున్నది. స్త్రీపర్వంలోని కథనంతా మనసులో తలచుకొంటే గాంధారీ ధృతరాష్ట్రులకు ఈ భావన అందరూ చనిపోయిన తరువాతకూడా పోలేదని తెలుస్తుంది. ధర్మరాజు, విదురుడు, కృష్ణుడు మాట్లాడిన మాటలలో ఈ స్వపరభేదం లేదు. అందుకే చిత్తభ్రాంతి, శోకం, గాంధారీ ధృతరాష్ట్రులకు, తక్కిన కురుకుమారుల భార్యలకు, చివరికి పాండవులకుకూడా ఇవి పోలేదు.

కాని, భగవంతుడు పరమశాంతులకు కాని లభ్యం కాడు. అందుకే భీష్మాది జ్ఞానయోగులకు మాత్రమే అతడి తత్త్వం అవగతమైంది. వారికి చింతాభ్రాంతులు లేవు.

ధర్మరాజు, ఇతర పాండవులు, ద్రౌపది కూడా మామూలు మనుష్యులే, కేవలం భక్తితో శ్రీకృష్ణుడిని విశ్వసించారు. జీవితాన్ని కర్మయోగంగా సాధించారు. ఇక రాబోయే పర్వాలలో యజ్ఞయాగాదులచేత పవిత్రులై, శోక భ్రాంతులను పోగొట్టుకొని, సంయమితేంద్రియులై చివరకు మహాప్రస్థానయోగ్యత పొందారు. వారిలో మిగిలిన స్వర్గారోహణ పర్యంతం 'ధర్మం' చేత నడుపబడినవాడు ధర్మరాజు మాత్రమే. ఈ అర్థమంతా 'పరమభక్తి విధేయా!' అనే సంబోధనలో నిక్షిప్తంగా ఉన్నది.

**మాలిని**

**భరిత నియమచేతః పద్మవిజ్ఞాన కేలీ!**
**పరిమళపరిపాక ప్రౌఢసంపర్కశాలీ!**
**పరిణతికృతదూష్య ద్భంగి భూతాళిహేలా!**
**కరణ భృతి జగత్సంస్కర్తృతానందశీలా!** **187**

**ప్రతిపదార్థం:** భరిత నియమ= నియమాలతో కూడిన; చేత; పద్మ= పద్మంవంటి హృదయంయొక్క; విజ్ఞాన= జ్ఞానంలో; కేలీ!= రమించేవాడా!; పరిమళ= సుగంధంలాంటి; పరిపాక= పుణ్యపరిపాకం ఉన్న వారితో; ప్రౌఢ= దృఢమైన; సంపర్కశాలీ!= సంబంధం కలవాడా!; పరిణతి= పరిణామంచేత; కృత= చేయబడ్డ; దూష్యత్= దూషింపదగిన; భంగి= రీతి కల్గిన; భూతాళి= భూతాల; హేలా= విలాసంకలవాడా!; కరణ= చేయటం; భృతి= ధరించటం; అనేటువంటి; జగత్= జగత్తుయొక్క; సంస్కర్తృత+ఆనందశీలా!= ప్రపంచ సంస్కారంతో ఆనందించే స్వభావం కల్గినవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథ ప్రభూ! నీవు ఉత్తమ నియమాలను పాటించే సుచరిత్రుల హృదయపద్మాలలోని మహాజ్ఞానంతో రమిస్తావు. నీవు ఎప్పుడూ సుగంధం వంటి పుణ్యపరిపాకం ఉన్నవారితోనే దృఢమైన సంబంధం ఉంటుంది. నిత్యపరిణామం పొందిఅనేకరకాలుగా విచ్ఛిన్నం పొందే ఈ సర్వసృష్టి నీ విలాసంలో భాగమే. అందుకే జగత్తును సృష్టించి, పెంచి, సంహరించి ఆనందిస్తూ ఉంటావు.

**విశేషం:** వైదికజీవితం నియమనిష్ఠలతో కూడింది. శుచిత్వం, తుష్టి, సంతోషం, తపస్సు, ఇంద్రియనిగ్రహం, స్నానం, మౌనం, ఉపవాసం, యజ్ఞం, వేదాధ్యయనం, బ్రహ్మచర్యం, క్రోధరాహిత్యం, గురుభక్తి, దానం - అనే 14 నియమాలను స్మృతి గ్రంథాలు వివరిస్తున్నాయి. ఈ నియమాలచేత హృదయంలో జ్ఞానం పొటమరిస్తుంది. ఇది సాత్త్విక జీవితంలో పుట్టే జ్ఞానం కాబట్టి ఉత్తమజ్ఞానమని భగవంతుడు ఈ జ్ఞానంలో ఆసక్తి కలవాడని మొదటి పాదానికి అర్థం.

భగవంతుడు ఎప్పుడూ పుణ్యపరిపాకమున్న ఉత్తమపురుషులలోనే నికటసంబంధం కలిగి ఉంటాడు. భారతకథలో పాండవులతోనే శ్రీకృష్ణుడు జీవితమంతా నడపటంలోని మహార్థ మిదే. చివరకి యుద్ధం పూర్తి అయ్యాక కూడా పాండవులను వెన్నాడి ఉన్నాడు. లేకపోతే భీముడు ధృతరాష్ట్రుడి కౌగిలినుండి తప్పించుకొనేవాడు కాడు. ఆ ఉత్తమపురుషుల స్నేహం 'పరిమళం' వంటిదట. ఆ పరిమళమే మహాభారతంలో మనకు అనుభవమయ్యే శాంతరసానుభవం. ఇది రెండవ పాదానికి అర్థం.

లోకసృష్టి పరిణామంలో దూషణకు పాత్రమవుతుంది. కౌరవుల పక్షంలోని వీరులందరి జీవితాలను స్మరిస్తే పరిణామంలో పంచభూతాత్మక జగత్తు ఎట్లా దిగజారుతుందో తెలుస్తుంది. ఆ భూతాళి యొక్క విలాసం కూడా పరమేశ్వరుడి లీలలో భాగమే. అందుకే భగవద్గీతాకారుడు 'మోసంబులలో ద్యూతము నేనే' అని తన విశ్వవిభూతిని ప్రకటించాడు. ఇది మూడవ పాదానికి అర్థం.

ఇక చివరిపాదం. జగత్తును చేసేవాడు, మోసేవాడు, తీసేవాడు- అన్నీ తానే అని గీతాకారుడు ప్రకటించిన విషయం సుప్రసిద్ధమేకదా! సృష్టి స్థితి లయాలు మూడూ స్వామివారి ఆనందలీల. ప్రతి పనిలోనూ స్వామివారికి ఆనందమే. అందుకే బ్రహ్మసూత్రాలలో 'లోకవత్తు లీలాకైవల్యం' అని బాదరాయణుడు సూత్రించాడు. అందుచేత గాంధారీ ప్రభృతుల శోకరస ప్రవాహంలో కూడా భగవంతుడి లీలా స్రవంతి ఉన్నదని అర్థం. అందుకే తిక్కనగారు అంత రమణీయంగా చిత్రచిత్రగతులలో, వృత్తాలతో స్త్రీ పర్వాన్ని అతిరమణీయంగా రచించారు.

మాలినీవృత్తంలోని ప్రతిచరణంలోనూ వరుసగా న, న, మ, య, య - అనే గణాలుంటాయి, 1-9 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున స్త్రీపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఉభయ కవిమిత్రుడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, బుధారాధనవిరాజి, తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలో స్త్రీపర్వంలో ద్వితీయాశ్వాసం సంపూర్ణం. ఇంతటితో స్త్రీపర్వం సమాప్తం.

**స్త్రీపర్వంలోని ద్వితీయాశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలో స్త్రీపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్య పర్వము

## గద్య పద్య ప్రథమ పాద సూచి

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము

## గద్య పద్య ప్రథమ పాద సూచి

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీ పర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

పద్యము — పుట

***

# పీఠిక



★ ★ ★

ఉ. 'నీదెస నాదు చిత్తమున నెక్కొనియుండెడు భక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె? భక్తజనాభిమత ప్రదాన వి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ! సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత; ముల్లము నా పయి నిల్పు మిత్తఱిన్.' **(శల్య. 1. 275)**

మహాభారతంలోని యుద్ధషట్కాన్ని రెండు భాగాలుగా విభజించటం సాహిత్య సంప్రదాయం. భీష్మ ద్రోణ కర్ణ పర్వాలు మొదటి భాగం; శల్య సౌప్తిక స్త్రీ పర్వాలు రెండవ భాగం.

''మహాభారతంలో పద్దెనిమిది పర్వాలను ఆదిపంచకం, యుద్ధషట్కం, శాంతిసప్తకం - అని మూడు భాగాలుగా వ్యవహరించే సంప్రదాయం ఒకటుంది. బహుశా ఇది తెలుగుదేశంలో ఏర్పడ్డ సంప్రదాయమే కాబోలు. ఎందుచేతనంటే మహాభారతానికి తెలుగుదేశంలో ఉన్న వ్యాప్తి, ప్రాముఖ్యం మరో ప్రాంతంలో లేదు.''

''నన్నయ భావించినట్లు మహాభారత మొక దివ్య వృక్షమైనట్లయితే (ఆది. 1.66) ఆ వృక్షానికి మూలం ఆదిపంచకం; స్కంధం యుద్ధషట్కం; శాఖోపశాఖలు శాంతిసప్తకం - అని వ్యాఖ్యానించవచ్చు. అంటే మహాభారత వృక్షానికి ఆధారం ఆది పంచకం; ఆయువుపట్టు యుద్ధషట్కం; సారం శాంతి సప్తకం. ఆదిపంచకంలోగాని, శాంతిసప్తకంలోగాని పర్వాలపేర్లు వ్యక్తి నామాంకితాలు కావు. స్థల, విషయ, కార్య, తత్త్వాదులను సూచించే పేర్లవి. యుద్ధషట్కంలో భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య పర్వాలు - కౌరవపక్ష సేనానాయక నామాంకితాలు. సౌప్తికపర్వాన్ని వీరనామాంకితంగా చెప్పాలంటే అశ్వత్థామ పర్వంగా చెప్పాలి. కాని, అశ్వత్థామ బ్రాహ్మణోచితం, వీరోచితం కానట్టి అధమాధమ ప్రవర్తనను ప్రదర్శించినందువల్ల అతని పేరును పర్వాంకితం చేయడం అనుచితం. ఇక స్త్రీ పర్వం యుద్ధపంచకానికి ఒక విధమైన సింహావలోకనం. యుద్ధ పరిణామ ఫలమైన శోకం ఇందు మూర్తీభవించింది. విజేతల హృదయాలు నిర్భరమైన నిర్వేదానికి, పశ్చాత్తాపానికి పాల్పడ్డాయి. మానవుని శీలపరీక్షకు, ధర్మనిరతికి, యుక్తా యుక్త విచక్షణకు క్లిష్టపరిస్థితులు ఒక గీటురాయి. అట్టి పరిస్థితుల్లోనే వ్యక్తుల నిజస్వరూపం బయటపడుతుంది. కురుపాండవులకు యుద్ధం అనివార్యంగా పరిణమించినప్పుడు బంధుమిత్రులు, రాజులు, సామంతులు, వీరులు ధర్మాధర్మ నిర్ణయాలు చేసుకొని, లక్ష్యాన్ని నిర్దేశించుకొని కార్యరంగంలోకి ఉరకవలసి వచ్చింది.

కాబట్టే భారతపాత్రల బాహ్యాభ్యంతర ప్రవృత్తులు యుద్ధషట్కంలోనే ప్రస్ఫుటంగా గోచరిస్తాయి''. (ఆచార్య జి.యన్.రెడ్డి - పీఠిక. ఆం.ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ 'ఆంధ్రమహాభారతము. శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు)

## 1. పర్వత్రయం పగకే అంకితం:

యుద్ధషట్కం షడ్రస సమాహారం. భీష్మపర్వంలో యుద్ధవీరం, ద్రోణపర్వంలో రౌద్రం, కర్ణపర్వంలో అద్భుతం, శల్యపర్వంలో భయానకం, సౌప్తికపర్వంలో బీభత్సం, స్త్రీ పర్వంలో కరుణ ప్రధానంగా ప్రవర్తిల్లుతాయి. పరుషరసాలూ, పరుషరసజన్య రసాలూ పోషించబడే యుద్ధఘట్టాల విశ్వరూపం ఈ పర్వషట్కం. భీష్మ, ద్రోణ, కర్ణులను సంహరించే వీరుడు అర్జునుడు. అందువలన యుద్ధషట్క ప్రథమభాగంలో అర్జున ప్రతాపం కథను ముందుకు నడిపిస్తుంది. ఆ తరువాతి మూడు పర్వాలలో భీమ పరాక్రమం భయంకరంగా సాగుతుంది. ధార్తరాష్ట్రుల నందరిని చంపే భారం భీముడే వహించాడు. దుష్టచతుష్టయంలో దుశ్శాసన దుర్యోధనులు భీముడి పాల పడ్డారు. కర్ణుడిని అర్జునుడు, శకునిని సహదేవుడు చంపారు. శల్యుడు వస్తుతః పాండవ పక్షపాతి. కాని, దుర్యోధనుడి వ్యూహంలో చిక్కి ధర్మజుడిని వదలి కౌరవపక్షంలో చేరవలసి వచ్చింది. అది ధర్మవిరుద్ధమని తెలిసి కూడా ఇచ్చిన మాట నిలబెట్టుకొనటానికి కర్ణ రథసారథ్యంలో ఆ మహావీరుడి మనస్సును కలతపెట్టి పాండవులకు సహాయం చేశాడు. ఇక మిగిలింది దుర్యోధనుడికి సహాయం చేయటమే. అది అతడి కర్తవ్యంగా మిగిలిన వీరధర్మం. పాండవులకు పరోక్షంగా సహాయం చేసి, ప్రత్యక్షంగా యుద్ధానికి సిద్ధమై కౌరవసేనా నాయకుడుగా వ్యూహాన్ని నడిపిన శల్యుడి సంహారం ధర్మరాజుకు మిగిలింది. ఇతిహాస నాయకుడైన ధర్మరాజు చంపిన శల్యుడి పేరుమీద వెలసిన శల్యపర్వం నామసార్థక్యం కలిగి ఉన్నది. భీష్మాది పర్వాలవలెనే శల్యపతనంతో శల్యపర్వం ముగియాలి. కాని, అతడు మధ్యాహ్నానికే చనిపోయాడు. ఆ తరువాత యుద్ధభారాన్ని దుర్యోధనుడే చేపట్టాడు. చివరిదాకా పోరాడాడు. అతడిచుట్టూ ఉన్న వీరులలో ఉలూక శకునులు కన్నుమూశారు. యుద్ధవీరులు అతడిని వీడి పరుగెత్తారు. పదకొండు అక్షౌహిణుల సైన్యం సమసిపోగా దుర్యోధనుడు ఓడినట్లే అయింది. ఆ తరువాత ద్వైపాయన హ్రదంలో దాగినా పాండవు లాతడిని బయటికి రప్పించి ద్వంద్వయుద్ధం ప్రవర్తిల్లచేశారు. భీమ గదాఘాతానికి దుర్యోధనుడు తొడలు విరిగిపడిపోయాడు. కాని, ఈ పర్వంలో చావలేదు. అశ్వత్థామను సైన్యాధ్యక్షుడిగా అభిషేకించి కథను ముందుకు సాగించాడు కాబట్టి శల్యపర్వంలోని పూర్వభాగంలో శల్యపతనం, ఉత్తరభాగంలో దుర్యోధన పతనం చిత్రించబడటం వలన శల్యపర్వానికి ఒక ప్రత్యేకత కలిగింది. రారాజైన దుర్యోధనుడు సేనాధ్యక్షుడు కాడు. కాని, యుద్ధరంగంలో సేనాధ్యక్షుడు లేకపోతే అతడే ఆ బాధ్యత నిర్వహించాలి. చివరకు ఆతడు చేసింది అదే. సేనాధ్యక్షు లెవ్వరూ రణరంగంనుండి పారిపోయి ప్రాణరక్షణం కొరకు పాట్లుపడలేదు. అట్టి దుర్గతి దుర్యోధనుడికి ఏర్పడింది. చనిపోయే ముందు చనిపోని ఒక మహావీరుడిని - అశ్వత్థామను సైన్యాధ్యక్షుడిగా అభిషేకించటం ఈ పర్వ నిర్వహణంలో విశేషం. ప్రాణం విడువనున్న దుర్యోధనుడు తన పగకు ప్రతినిధిగా నిలువగలిగిన అశ్వత్థామకు శత్రుసంహారం కార్యాన్ని ఒప్పచెప్పటం కురుక్షేత్ర యుద్ధానికి కొసమెరుపు. అయితే ఒక విశేషం. భీష్మాదులు దుర్యోధనుడి ప్రార్థనపై సేనానులయ్యారు. అశ్వత్థామ స్వీయప్రార్థనపై సర్వసేనానిగా రారాజుచేత నియుక్తుడయ్యాడు. సర్వసేనానులు సైన్యాన్ని నడిపారు. అశ్వత్థామ రథిక ద్వయ సహాయంతో రాత్రియుద్ధం చేసి రాక్షసత్వాన్ని ప్రకటించాడు.

తమ్ములూ, కొడుకులూ కూలినప్పుడు కూడా బిగ్గరగా దుఃఖించని దుర్యోధనుడు కర్ణుడు చనిపోయాడని ఎలుగెత్తి విలపించాడు. తాను ఒంటరివాడ నయ్యానని భయపడ్డాడు. ఆ రాత్రి శిబిరంలో ఉంటే పాండవులు వచ్చి తననూ, మిగిలినవారినీ చంపివేస్తారేమో అని భయపడి సరస్వతీనదీతీరం చేరి గుడారాలలో రాత్రి గడిపాడు. భీష్మాది వీరులు పడిపోయినప్పుడు కూడా కర్ణుడు తనకు తోడున్నాడనీ, పాండవులపై విజయాన్ని సాధిస్తాడనీ పేరాశతో ఉండేవాడు. కర్ణుడు పోగానే తన ఆశలన్నీ కుప్పగూలినట్లు ఆవేదనపడ్డాడు. కౌరవ సేనకు బలం కర్ణుడు. అతడు లేని దుర్యోధనుడు తాను బలహీనుడనని భావించాడు. బలంలేని దుర్యోధనుడికి పగయే బలంగా పరిణమించింది. కర్ణుడు అతడిలో పగను రగిల్చి చివరకు పగను మిగిల్చాడు. ఇక మిగిలినవారు అతడి వగను మాన్పటానికి పగను బలపరిచారు. శల్య సౌప్తిక పర్వాలలోని కౌరవవీరులు, సేనానాయకులు ఈ బాటలో నడిచారు. అందువలన శల్య పర్వం నుండి పాత్రలవర్తనాలలో ధర్మచింతకంటె

పగయే ప్రధానపాత్ర నిర్వహించింది.

**2. 'పగ యడఁగించు టెంతయు శుభంబు':**

ఏనాడో ధర్మరాజు శ్రీకృష్ణుడితో చెప్పిన ఈ పద్య తాత్పర్యం ఇక్కడ ప్రవర్తిల్లుతున్నట్లు ప్రత్యక్షమౌతుంది.

చ. 'పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స; యడంగునే పగం
బగ?; వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; నే
మిగతి దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా!'. **(ఉద్యో. 3. 21)**

శల్య సౌప్తిక స్త్రీ పర్వ నిర్మాణానికి ఈ పద్యం ఒక ప్రణాళికవలె భాసించింది. ధర్మరాజు పలికిన పలుకే సత్యమైనట్లు తారసిల్లింది.

కర్ణుడి మరణంతో యుద్ధం ఆగిపోతుందనీ, దుర్యోధనుడు ధర్మరాజుతో సంధికి అంగీకరిస్తాడనీ, దానితో పగ చల్లారుతుందనీ కౌరవస్కంధావారంలో కూడా కొందరు పెద్దలు భావించారు. కృపాచార్యుడు దుర్యోధనుడికి హితబోధ చేశాడు. సమరనీతి నాశ్రయించి తర్కబద్ధంగా మాట్లాడాడు. ముఖ్యంగా ఆయన చెప్పిన మూడంశాల ముచ్చట విలువైనది.

క. 'సమరము నిష్కారణవై । రమునం బాటిల్లె; నెల్లరాజులు, భరతో
త్తములును మడిసిరి; విడు కో । పము; దీర్ఘక్రోధుఁడైన పతి కీ డొందున్'.

క. 'తమకు బలం బెక్కిన తఱి । సముచిత మగు విగ్రహంబు; శత్రుల కుత్సా
హము మీఱినపుడు గర్త । వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్'.

క. 'కలవారెల్లను దెగి నీ । తలన నిలిచెఁ గార్య మధిప! తగ నొడఁబడు మి
ట్టల మగునాత్మ వినాశము । కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్'. **(శల్య. 1. 55-57)**

పగకు మూలం కోపం; కోపాతిశయంతో తనకు బలాధిక్యం ఉన్నది కదా అని రాజు పగరపై దండెత్తటం సహజం. కాని, శత్రువులది పైచేయై, విజయం విఫలమైనప్పుడు కోపాన్ని తగ్గించుకొని, పగను చల్లార్చుకొని సంధిచేయుటం శ్రేయస్కరం. దుర్యోధనుడికి అండగా నిలిచిన వీరులంతా చనిపోయారు. ఇక ప్రారంభించిన కార్యం అతడివలననే ముగింపు లేనిదిగా ముందు నిలిచింది. కార్యాన్ని కొనసాగిస్తే ఆత్మవినాశమే ఫలితాంశంగా పరిణమిస్తుంది. అది మహాపాప మంటారు పండితులు - అని అరటిపండు ఒలిచినట్లుగా విప్పి చెప్పాడు కృపుడు.

ధర్మదృష్టితో చూస్తే దుర్యోధనుడికి హితం కలిగే ప్రబోధ మిది. కాని, అతడిది ధర్మదృష్టి కాదు. పగసాధించే పంతం. దానికి అనుగుణంగా తనవాదాన్ని వినిపించాడు.

సీ. 'కపటంపు జూదంబు ఘటియించి రాజ్యంబు । గొని ధర్మజుని మది గుందఁజేసి,
సభ కేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ । బాంచాలి ముందల పట్టి యీడ్చి,
సంధి సేయఁగఁ బూని శౌరి యేతెంచిన । నవ్విధంబున నప్రియం బొనర్చి,
పలువురు గూడి సౌభద్రు నొక్కని బాలుఁ । గిట్టి యత్తెఱఁగున గీ టడంచి.

తే. 'నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తు రనిల । సుతుఁడు మదమునఁ ద్రావుట సూచి కొఱఁత
ప్రతిన దీర్చునతం డని భయముఁ బొంది । పొందు గోరిన నది యేల పొసఁగుఁ జెపుమ!'(శల్య.1. 66)

ఈ మాటలు దుర్యోధనుడు పశ్చాత్తాపంతో అన్నవి కావు. 'పగ యడఁగించు టెంటయు శుభం; బది లెస్స' అని కృపాచార్యుడు హితవు చెప్పితే, దుర్యోధనుడు 'అడంగునే పగన్ బగ?' అని తన వాదాన్ని సాగించాడు. మోసంతో రాజ్యాన్ని హరించటం రాజనీతి ధర్మ ద్రోహం; పరుల ఇల్లాలిని ఏకవస్త్రను నిండుసభలో అవమానం చేయటం నైతిక ధర్మద్రోహం; సంధి ప్రయత్నాన్ని సాగకుండా చేయటం లోకనీతి ధర్మద్రోహం; అభిమన్యు వధ యుద్ధనియమ ధర్మద్రోహం. ఇన్ని ద్రోహాలనూ దుర్యోధనుడు చేసినట్లు అతడే అంగీకరించాడు. దాని వెనుక స్వార్థపూరిత క్రోధ ప్రేరితమైన పగ ప్రేరకశక్తిగా ప్రజ్వరిల్లింది. ఆతడి పగ పాండవులు తిరిగి ప్రతీకారం చేసే పగను ప్రేరేపించింది. సహనమూర్తులని ప్రశస్తిపొందిన పాండవులు తమ తమ ప్రతిజ్ఞలను తీర్చుకొనటానికే సమరం సాగించారు. దానికి సాక్ష్యాలు ఎన్ని ఉన్నా భీముడు దుశ్శాసనుడిని చంపి, నెత్తురు త్రాగి పగ తీర్చుకొన్న సన్నివేశం నికట దృష్టాంతం. దుర్యోధనుడి పగకూ, పాండవుల పగకూ ప్రతికారరూప సంఘర్షణ ఏర్పడినప్పుడు పగ అణగదు, అభివృద్ధి చెందుతుంది. భీముడు చేసిన రెండు ప్రతిజ్ఞలలో దుశ్శాసన వధ మొదటిది. అది ముగిసింది కాబట్టి త్వరలో దుర్యోధనుడి తొడలు విరుగగొట్టి అతడిని సంహరిస్తా నన్న ప్రతినను చెల్లించుకొంటానని బహిరంగంగా ప్రకటించాడు. కాబట్టి 'అడంగునే పగం బగ?' అని ధర్మరాజు అన్నట్లు దుర్యోధనుడు సంధి కుదరటానికి ధర్మజు నడిగి రాజ్యభాగం తీసికొనవలసిన దైన్యాన్ని అతడు అంగీకరించవలసి వస్తుంది కాబట్టి 'ఒక్కని దయం గను రాజ్యసుఖంబు లేటికిన్?' -అని పేర్కొని యుద్ధమే కర్తవ్య మని నిశ్చయించాడు.

దుర్యోధను డేముహూర్తాన ఈ మాటలన్నాడో కాని, శల్యపర్వమంతా ఈ పద్యం చుట్టే తిరిగింది. 'పగఁ గొన్న మార్కొనక పల్కక యుండఁగవచ్చునే?' అనే తాత్పర్యం పెక్కుచోట్ల ప్రత్యక్షమౌతుంది. ఉదాహరణకు సంధి కంగీకరించక, శల్యాది వీరులు, శకునివంటి బంధువులు, తమ్ములు తనచుట్టూ చచ్చిపడ్డా పంతం వీడకుండా యుద్ధం సాగించటం, అందరినీ చంపించి తానూ చచ్చి పాండవులపై పగ సాధించటమే తన వీర వ్రతంగా ప్రవర్తించటం చూచి కృష్ణార్జునులు దుర్యోధనుడి మూర్ఖత్వానికి విస్తుపోయారు, ఏవగించుకొన్నారు. అర్జును డన్నమాటలు:

చ. 'అమరనదీ సుతుండు వడినప్పుడు వీరలబుద్ధి సంధికా
ర్యమునకుఁ జొచ్చు నింక నని యాత్మఁ దలంచింతి; సమ్మహాత్ముఁడు
న్సముచితవాక్యవృత్తిఁ గురునాయకుఁ దేర్పఁగఁ జూచెఁ; జిత్తదో
షమహిమ నద్దురాత్ముఁడు ప్రశాంతత నొందఁడ యెన్ని భంగులన్.' (శల్య. 1. 350)

కర్ణ, దుశ్శాసన, శల్యుల మరణం కన్నారా చూచికూడా పగ మాని ధర్మరాజుకు రాజ్యభాగ మిచ్చే తలపు దుర్యోధనుడికి రాలేదు. కాబట్టి అతడిని చంపి మిగిలిన కథను ముగించటమే కర్తవ్యమని అర్జునుడు భావించాడు. కృష్ణుడు రాయబారిగా నిలిచిన నిండుసభలో విదురుడు చెప్పిన మాటలూ, దుర్యోధనుడు పుట్టినప్పుడు మునులు 'ఈ పాపాత్ముడు నిఖిల క్షత్రియ క్షయహేతు' వని పలికిన తీరూ చెప్పి అతడి వధ అవశ్య కర్తవ్యమని సమర్థించాడు. కృష్ణార్జున సంవాదం వగగొన్న పాండవ పక్షం మాట్లాడుతూ, మార్కొనే ప్రస్థానానికి ప్రతినిధిగా నిలిచింది. పాండవ వీరులందరూ దుర్యోధనుడిని అధిక్షేపించినవారే, అతడిపై, అతడి సైన్యంపై విజృంభించి పగతీర్చుకొనే ప్రయత్నం చేసినవారే. అందుకే ధర్మరాజు అన్నాడు- శత్రువులవలన వగగొన్నవారు తిరగబడక మానరనీ. ప్రతీకారానికి పూనుకొంటే పగవారి అంతు చూచేంతవరకు ఆగరనీ, ఆ స్థితిలో పగసాధింపు చర్యలే ప్రధానమయి క్రూరత్వం చోటుచేసికొంటుందనీ పేర్కొన్నాడు. దుర్యోధనుడిపై పగ సాధించి అతడి అంతం చూడదలచుకొన్న ధర్మరాజాదులు- అతడిని వెన్నాడి, అధిక్షేపించి, దాగి ఉన్న కొలనునుండి బయటకు తెప్పించి, భీముడిని ప్రబోధించి గదాయుద్ధంలో దుర్యోధనుడి తొడలు విరుగగొట్టేటట్లు చేశారు. దుర్యోధనుడు ప్రదర్శించిన క్రౌర్యాన్ని తలదన్నేటట్లు పాండవులు త్రిప్పికొట్టారు. నాభిక్రింద కొట్టటం సమరధర్మమా? తలను కాలితో తన్నటం న్యాయమా? వంటి ప్రశ్నలు వేసినప్పుడు శ్రీకృష్ణాదులు చెప్పిన సమాధానాలలో- పాండవులు ప్రదర్శించిన పగ

దుర్యోధనుడు పగతో చేసిన పాపకార్యాలకు ప్రతీకారమే కాని వారు పూనుకొని చేసినవి కావని సమర్థించారు. ప్రతీకారచర్యలను యుద్ధమర్యాదలుగా, ప్రతిజ్ఞాపాలనలుగా వ్యాఖ్యానించారు. బలరామాదులకు నచ్చజెప్పారు. ప్రతిజ్ఞలు చేసినప్పుడు లేని అభ్యంతరాలు వాటిని ప్రవర్తిల్ల చేసేటప్పు డెందుకని ప్రశ్నించారు. కపటవర్తనులను, మాయావులను వారికి తగిన పద్ధతులలో చంపటం యుద్ధధర్మవిరుద్ధం కాదని వాదించారు. దుర్యోధనుడు చివరివరకూ పగసాధించే ధర్మాన్నే పాటించి, తనకు ముప్పువాటిల్లిన సమయంలో పాండవుల పగసాధింపు చర్యలను యుద్ధ ధర్మ విరుద్ధ చర్యలుగా వ్యాఖ్యానించి, తన క్రౌర్యాన్ని కప్పిపుచ్చుకొనటానికి యత్నించాడు. భీమార్జున కృష్ణులు అతడి బండారాన్ని బయటపెట్టి భంగించారు. పగయే యుద్ధంలో ప్రమాణమైతే 'ఏమిగతి తలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!' అన్నమాట సత్యమౌతుంది. పాండవుల పగ - వారికి విజయాన్ని కలిగించింది. కాని, పాండవులు తన తండ్రిని అబద్ధంతో వంచించి చంపిన తీరుకు కోపించి పగసాధించే ప్రతిన పూనిన అశ్వత్థామ, ఆరిపోతున్న దుర్యోధనుడి పగలో ఆజ్యం పోసి మండించి సౌప్తికపర్వంలో పాండవ శిబిరాన్ని శ్మశానంగా మార్చాడు. ఇది దేనిఫలం? పాండవుల ప్రతీకారానికి జరిగిన ప్రతీకారం. చివరకు పాండవులకు ఏమి మిగిలింది? పగవలన వారికి ఏమి లాభించింది? ధర్మరాజుమాట నిజమైంది. శల్యపర్వం పగవలన కౌరవులకు తగిలిన శాపం. సౌప్తిక పర్వం కౌరవుల పగవలన పాండవులకు మిగిలిన ప్రతిఫలం. ఈ రెండింటిలో ధర్మచింత లేదు. శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలలో దీనిమీద ధర్మాధర్మ విచారం ఎంతో సాగుతుంది. పాత్రలు తమలో తాము నిందించుకొన్నారు, అధిక్షేపించుకొన్నారు, సరిపెట్టుకొన్నారు, శాపాలు పెట్టుకొన్నారు. ఇన్ని అయినా చివరకు మిగిలిం దేమిటి? అందరూ కలిసి చనిపోయినవారికి శ్రద్ధాంజలి ఘటించటమే. అందుకే తిక్కనగారి 'పగ యడఁగించు టెంతయు శుభంబు' అనే వాక్యం ఒక 'సామెతపద్యంగా' తెలుగులో మిగిలిపోయింది.

పగలు వగలు సుఖదుఃఖాలవలె ద్వంద్వాలు. అయితే, పగను సాధించి పొందే ఫలాన్ని గురించి దుర్యోధనుడికీ, ధర్మరాజుకూ భిన్న దృక్పథాలు ఉన్నాయి. పగ వగ కలిగిస్తుందని ఇద్దరికీ తెలుసు. కాని, దుర్యోధనుడు దుర్మదాంధుడు, అహంకారి కాబట్టి వగ లేని పగ విజయమని భావించాడు. పాండవులను పగతో వధిస్తే పగవలన వగ కలుగకుండా సుఖించవచ్చునని ప్రయత్నించాడు. ఒకవేళ పగవలన వగయే మిగిలితే బ్రతికి దానిని అనుభవించటం కంటె చచ్చి స్వర్గసుఖాన్ని పొందటం విజయ మనుకొన్నాడు.

చ. 'చదివితి నెల్ల వేదములు, జన్నము లొప్పఁగఁ జేసితిన్, రమా
స్పద మగు వృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి, దు
ర్మదరిపుగాఢపర్వ పరిమర్దన కేళి యొనర్చితిం దగం,
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే?'.

వ. 'నీకుం జూడ నెట్టివాఁడ నైనను నా కేమి? మీరింకఁ బశ్చాత్తాప దుఃఖితు లగుచు నుందురు గాక!'

**(శల్య. 2. 329, 330)**

అని శ్రీకృష్ణుడితో పలికిన మాటలు అతడి హృదయాన్ని వ్యక్తం చేశాయి. అతడు పగతోనే పురుషార్థ చతుష్టయాన్ని సాధించినట్లు చెప్పుకొన్నాడు. వేదాలు చదివాడు, యజ్ఞాలు చేశాడు, పాండవులను పాండిత్యంలో పుణ్యకార్యాలలో మించాలని యత్నించి ధర్మ పురుషార్థాన్ని సాధించినట్లు భావించాడు. ధనాన్ని సంపాదించే ఉపాయంతో రాజ్యాన్ని హరించి, పరిపాలన సామర్థ్యంతో రాజుల నందరినీ మెప్పించి అర్థపురుషార్థాన్ని సాధించినట్లు తలచాడు. శత్రుమర్దనం చేసి పగసాధించే ప్రయత్నం చేసి కామపురుషార్థాన్ని సాధించా ననుకొన్నాడు. పగతో సాధించిన పురుషార్థాలు ఇహంలో వగనే కలిగిస్తాయని తెలిసి కూడా దానిని అతిక్రమించటానికి యత్నించి విఫలుడయ్యాడు. తనవారందరు నశించారన్న వగ తనను క్రుంగదీయకుండా రణమరణంతో స్వర్గాన్ని సాధిస్తున్నానని ప్రకటించాడు. బ్రతికి పగసాధించలేకపోతే చచ్చి స్వర్గాన్ని పొందటమే వగలేని పగగా అతడు వ్యాఖ్యానించాడు. ఆ ధీమాతోనే ధర్మరాజును శ్మశానంవంటి రాజ్యాన్ని ఏలుకొనుమన్నాడు. కౌరవులు సాధించిన

పగవలన కలిగిన వగను జీవితాంతం అనుభవిస్తూ శేషజీవితాన్ని నరకంగా గడుపుమన్నాడు.

ఆ. 'ఓడి వచ్చినాఁడ; నుద్ధతి నా కేల? । యుడుకు మాని నీవ యుర్వి యేలు;
గుల్మములును నేనుఁగులు లేని బయలు నీ । తలనె కట్టికొనుము ధర్మతనయ!'. **(శల్య. 2. 72)**

అని దుర్యోధను డంటే, ధర్మరాజు ఇట్లా మారు పలికాడు.

సీ. 'నీ యీగి నేను భూనాయకుఁ డగు టొల్ల । రాజకోటికిఁ బరిగ్రహము సనునె?
నిను ననిం దెగటార్చి నేలఁ బాలించెద; । నను నోర్చితేని పెంపును సుఖింపు;
మేమిటివాఁడవై యిచ్చితి పుడమి నీ । కనియెడు మాట యిట్లాడె దిపుడు;
నీవు ధరిత్రి నీ నేర్చినఁ గురుకులం । బునకు ని ట్లాఱడిఁ బోవ నేల?

తే. శాంతి నొందుటకై ధర్మ సంవిభాగ । కరణ మొనరింప వచ్చిన కమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక వాఁడి సూది । మోపినం తైన నుర్వి నీ నోప నంటి.

క. ఏమి విధంబునఁ బొరలియు । భూమి కురునృపాల నీకుఁ బుచ్చుకొనఁగ రా
కీమెయి దైన్యపడితి; నా । కే మార్గము వట్టి యిచ్చె దేర్పడ జెపుమా!

క. అరులకు సిరి యిచ్చెద నను । వెరవిఁడియుం గలఁడె? దీని విడువుము; నాకున్
ధర యిచ్చితేనియును నినుఁ । బొరిగొన కే విడువ; నఱిమి పోరుట యొప్పున్.

క. నాచే నీ ప్రాణంబులు । నీచే నా జీవితంబు నిజ మున్నవి; యి
న్నీచత యపకార్యము; రా । జోచితకర్మ కృతనిశ్చయుఁడ వగుము నృపా!' **(శల్య. 2. 74-77)**

ప్రాణాలున్నంతవరకు పగసాధించాలని పూనుకొని, ప్రాణభయంతో కొలనులో దాగికొని, ప్రాణరక్షణకొరకై తనకు ఉద్ధతిలేదని బొంకి, కోపం మాని భూమిని ఏలుకొనుమని ధర్మరాజుకు రాజ్యాధికారాన్ని ఇస్తూ, బలగంలేని శూన్యభూమిని తలకుచుట్టుకొమ్మని కసితో కూడిన ఎగతాళిగా హెచ్చరించి తన మనఃప్రవృత్తిని ప్రకటించుకొన్నాడు రారాజు. రాజ్యాన్ని ఇవ్వదలచిన దుర్యోధనుడు పగ వీడినవాడుగా కనపడ్డా అది పరివర్తనమా? కపటనాటకమా? అనే ప్రశ్నను పగరకు కల్పించాడు. చిత్తశుద్ధి కలవాడైతే పై చివరి వాక్యం పలుకడు. పగతో రాజ్యాన్ని బలహీనపరిచి వగను కలిగించేటట్లు వదలిపెట్టుతానన్న అహంకారం ప్రదర్శించాడు. సంపదతో కూడిన భూమిని సంతృప్తిగా అనుభవించి, సారరహితమైన నేలను వదలి విజయాన్ని సాధించినట్లు వ్యంగ్యంగా వెటకారం చేశాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడికి సమాధానం చెప్పిన ధర్మజుడు అతడి పగలోని సెగను గుర్తించి పరిహాసంచేశాడు. దాన మిచ్చినా తాను క్షత్రియుడు గాన తీసికొనని దుర్యోధనుడే స్వయంగా పలికిన మాటను జ్ఞాపకం తెచ్చాడు. తానూ అదే మాటను మాటకు మాటగా అన్నాడు. దుర్యోధనుడిని చంపిగాని రాజ్యం పాలించేది లేదనీ, ధర్మరాజును చంపగలిగితే సుయోధనుడు సుఖించవచ్చుననీ చెప్పాడు. ఒకడు చచ్చి మరొకడికి రాజ్యం చెందేటట్లు చేయటమే కర్తవ్యంగాని బ్రతికి ఉండగా భూమిని పాలించటం చెల్లదని పేర్కొన్నాడు. దుర్యోధనుడికి రాజ్యమిచ్చే అధికారం ఎక్కడ ఉన్న? దని ప్రశ్నించాడు. నిజంగా ఇవ్వగలిగి ఉంటే కురుకులానికి ఇంత కష్టం వచ్చి ఉండేది కాదన్నాడు. శ్రీకృష్ణు డెంత చెప్పినా వినక 'వాడి అయిన సూదిమొన మోపినంత నేలనైనా నేను పాండవులకు ఇవ్వనని' నిండుకొలువులో చెప్పినమాటను జ్ఞాపకం చేశాడు. దుర్యోధనుడు తనకు ఎవరైనా రాజ్యమిచ్చినా స్వీకరించలేని దైన్యస్థితిలో ఉండి ధర్మరాజుకు రాజ్యమిస్తా ననటం విడ్డూరమని ఎగతాళి చేశాడు. శత్రువులకు సిరినిచ్చే వెర్రివాడు లోకంలో ఉన్నాడా? అని అవహేళన చేశాడు. ఒకవేళ దుర్యోధనుడు చివరిక్షణంలో మనసు మార్చుకొని రాజ్యమిచ్చినా, తాను అతడిని చంపక విడువనని స్పష్టంగా ప్రకటించాడు. ఫలితాంశం

ఇట్లా తేల్చిచెప్పాడు - 'ధర్మజుడి చేతిలో దుర్యోధనుడి ప్రాణాలున్నాయి. సుయోధనుడిచేతిలో ధర్మజుడి జీవితం ఉన్నది. ఎవరో ఒకరు మిగలాలి. 'శత్రువును చంపి రాజ్యం తీసికొనటమే క్షత్రియధర్మం' అన్నాడు.

ఈ మాటలు ధర్మజుడి హృదయానికి వ్యాఖ్యానాలు. అగ్నిశేషం, ఋణశేషం, శత్రుశేషం ఉంచకూడదంటారు. అట్లాగే పరివర్తనం లేని పగను సగంలో వదలకూడదు. దుర్యోధనుడు పగతో పాండవులకు వగ కల్పించి, చివరకు తాను ప్రాణంతో బ్రతికి, సమయం చూచి పగరకు అపకారం చేయాలనీ, రాజ్యాన్ని మరల ఆక్రమించాలనీ భావించాడు. అతడిని వదలిపెట్టితే పగవలన కలిగే వగను నిరంతరం కొనితెచ్చుకొన్నట్లే అవుతుందని ధర్మజుడు భావించాడు. పగ లేని వగయే ఉత్తమం అనుకొన్నాడు. వగ వివేకం వలన తగ్గిపోతుంది కాని, పగ నట్టింట పుట్టలో ఉన్న పామువలె భయం కలిపిస్తుంది- అన్నది ధర్మరాజు అభిప్రాయం. అందువలననే దుర్యోధనుడిని చంపక వదలనన్నాడు. తాను చచ్చి అయినా పగను అంతం చేయాలని తలపెట్టాడు. భావికథ ధర్మజుడి అభిమతానికి అనుగుణంగానే సాగింది. ఎందరు హతులైనా, అనంతదుఃఖం ముంచెత్తినా కాలక్రమంలో పాండవులు శాంతిని పొందారు. సంపూర్ణ రాజ్యసుఖాల ననుభవించారు. 'పగ యడఁగించు టెంతయు శుభంబు - అది లెస్స' అనే వాక్యం పగకు ప్రతినిధిగా నిలిచిన దుర్యోధనుడికి వర్తింపజేసి వ్యాఖ్యానించిన మనీషి ధర్మరాజు. అడగించుటకు అక్కడి అర్థం అణచటం, ఇక్కడి అర్థం అంతమొందించటం!

### 3. శల్యపర్వం సహజ యుద్ధపర్వం:

భీష్మ, ద్రోణ, కర్ణ పర్వాలలో ఆయా మహావీరుల ప్రతాపాలు క్రమంగా పది, అయిదు, రెండు రోజులు ప్రచండంగా వెలుగొందాయి. అయితే వారి నాయకత్వం సాగినప్పుడు సంఖ్యాబలం అధికంగా ఉండేది. క్రమంగా వీరులూ, చతురంగబలాలూ నేలగూలటంచేత సంఖ్యాబలం తగ్గింది. పెక్కుమంది నడుమ ప్రకాశించటం ఒక విశేషం అయితే పలుచబడిన సైన్యం మధ్య వెలుగొందటం కూడా మరొక విచిత్రం. శల్యవిజృంభణం రెండవ పద్ధతికి చెందింది. అతడు సేనాపతి అయ్యేటప్పటికి ఉభయ పక్షాలలో మిగిలిన సైన్యాలు - కౌరవపక్షంలో 11వేల రథాలు, 10700 ఏనుగులు, 2 లక్షల గుర్రాలు, 3 కోట్ల కాల్బలం; పాండవ పక్షంలో 6వేల రథాలూ, 3వేల ఏనుగులూ, లక్ష గుర్రాలూ, కోటి కాల్బలం. బలాలమోహరింపు తగ్గటంవలన వీరుల విజృంభణాలకు కథలో విస్తృతి కనపడుతుంది. కౌరవసేనాపతులలో ఒక విశేషం ఉన్నది. వారు మరణించేరోజు ఆరే దీపం భగ్గుమంటుందన్నట్లు అప్రతిహతంగా పోరాడి దేవతల మెప్పు పొందుతారు. అవక్రపరాక్రములుగా రణరంగంలో రాణించే ఆ వీరులను పాండవులు సప్రయత్నంగా, సోపాయంగా సంహరించే సాహసం ప్రదర్శిస్తారు. కౌరవవీరులలో పురుషయత్నం పరాకాష్ఠ నందుకొంటే పాండవ వీరులలో దైవానుకూల్యం గల మానవతేజం ప్రజ్వలిస్తుంది. ఈ దృష్టితో చూస్తే శల్యపర్వం ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.

మహాభారత యుద్ధసమయంలో కౌరవపాండవులచేత విశేషంగా గౌరవించబడిన వీరుడు శల్యుడు. పాండవులకు మేనమామ కావటంచేత వారి ప్రార్థన మేరకు సైన్యసహాయం చేయటానికి అంగీకరించి అతడు వారి పక్షంలో చేరటానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో దుర్యోధనుడు ప్రచ్ఛన్నంగా ఆయనకు చేయించిన సేవలు అతడిని ముగ్ధుడిని చేశాయి. సేవలు చేయించింది ధర్మరాజని భావించి తెర వెనుక ఉన్న దుర్యోధనుడికి వరాలు గుప్పించాడు. తనది తొందరపాటని గుర్తించి, ధర్మజుడిని దర్శించి, పరిస్థితి వివరించి, సారథ్యంలో కర్ణుడి మనసు కలతపెట్టి పాండవ విజయానికి తోడ్పడేటట్లు రహస్య వాగ్దానమిచ్చాడు. ఈ సంగతి లోకానికి తెలియదు. అత డెవరికీ చెప్పలేదు. ధర్మజుడు బైట పెట్టలేదు. కర్ణుడు నేలకూలిన తరువాత ధర్మజుడి కిచ్చిన వరం ముగిసినట్లయింది. ఆ తరువాత దుర్యోధన పక్షంలో శల్యుడు పూర్తిగా పోరాడే పాత్ర నిర్వహించవలసి వచ్చింది. శల్యుడు గొప్ప ఆత్మాభిమాని, బలశాలి, స్నేహప్రవృత్తి, బంధుప్రీతి కలవాడు. అన్నిటినీ మించి స్తుతిప్రియుడు, అల్పసంతోషి. ఈ బలాబలాలను గుర్తించిన దుర్యోధన ధర్మజులు ఆయనను సమయోచితంగా వాడుకొన్నారు. ఇరువురూ యథోచితంగా లాభపడ్డారు.

కర్ణుడు శల్యసారథ్యాన్ని సమకూర్చుమని దుర్యోధనుడిని అడిగాడు. రారాజే స్వయంగా శల్యుడిని సమీపించి అతడు సత్యవ్రతుడనీ, శాత్రవులను దుర్దశపాలు చేయటంలో ఘనుడనీ, మహాభాగుడనీ కీర్తించి, అర్జునుడిని చంపాలని

ఉత్సహిస్తున్న కర్ణుడికి రథసారథ్యం చేయుమని వినయవినమ్రుడై ప్రార్థించాడు. శల్యుడికి జాత్యభిమానం, ఆత్మాభిమానం అడ్డం వచ్చాయి. మూర్ధాభిషిక్తుడూ, మహావీరుడూ, క్షత్రియుడూ అయిన తాను సూతపుత్రుడైన కర్ణుడికి సారథ్యం చేయనని భీష్మించుకొన్నాడు. కాని, దుర్యోధనుడు అతడి ఆత్మాభిమానం తృప్తిపడేటట్లు రథికంటె సారథి గొప్పవాడని తెలిపే త్రిపురాసుర సంహార కథను చెప్పి, రథి అయిన కర్ణుడు అర్జునుడికంటె ఘనుడనీ, సారథి అయిన శ్రీకృష్ణుడికంటె శల్యుడు అన్నింట మించినవాడనీ అతిశయంగా ప్రశంసించాడు. దానికి మనసు పొంగి శల్యుడు కర్ణసారథ్యానికి అంగీకరించాడు. అంతటితో ఆగక కర్ణుడిని రణమధ్యంలో తన ఇచ్చవచ్చిన మాటలతో హితవు చెప్పటానికి రారాజువద్ద అనుమతి తీసికొన్నాడు. కర్ణసారథి అన్నదానికంటె పార్థసారథికంటె గొప్పవాడన్న ప్రశంస శల్యుడికి బిరుదుగా తోచింది. ఆ ప్రవృత్తి అతడి చిత్తవృత్తికి పతాక.

కర్ణుడి తరువాత సేనాపతి ఎవ్వరనే ప్రశ్న వచ్చింది కౌరవ స్కంధావారంలో. అశ్వత్థామ శల్యుడి పరాక్రమాన్ని నిరూపించి అతడిని సర్వసైన్యాధ్యక్షుడిగా చేయుమని దుర్యోధనుడికి సలహా ఇచ్చాడు. ఆజి నైపుణ్యం, మహనీయ శౌర్యం, భూరిబలం, సర్వసత్త్వవేదనం. పరాక్రమోద్ధతి, ధైర్యసమగ్రత శల్యుడి సహజ వీరగుణాలని పేర్కొన్నాడు. మేనల్లురైన పాండవులను వదలి కౌరవపక్షంలో చేరిన శల్యుడి కంటె పరమహితుడు మరొకడు ఉండడని చెప్పాడు. కుమారస్వామి సేనాపతి కాగా దేవతలు దైత్యులను సంహరించినట్లు శల్యుడు నాయకుడైతే మనం శత్రువులను జయించగలమని ప్రోత్సహించాడు. దుర్యోధనుడు శల్యుడిని ప్రార్థించాడు. ఆతడు సుముఖుడై తనను గురించి ఇట్లా చెప్పుకొన్నాడు.

మ. 'భుజవీర్యంబున నచ్యుతార్జునులు నన్ బోలంగలే; రల్కఁ వ
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాచే నొత్తు; రే నేచి య
క్కజపుం జేవయు లావుఁ జూపు వడికిం గౌంతేయు లే యోర్తు? రా
ప్రజయున్ నీ ప్రజయుం దలంగఁ జెలఁగం బాటింతు నాటోపమున్.'

చ. 'అఱిముఱి బాణజాలముల నక్కడి సైనికులం దెరల్చెదన్;
గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసిన వీర వర్గమున్
నఱికెదఁ; జూచు ఖేచరగణంబుల కచ్చెరుపా టొనర్చెదన్;
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన రూ పడంచెదన్',

శా. 'గంగానందను పోటు మెచ్చక, గురుం గాదంచు, రాధాతనూ
జుం గీడాడుచు, నీతఁ డెవ్వఁడొకొ యంచున్ శల్యుఁడే! యిట్టివా
నిం గయ్యంబుల మున్ను గాన మనుచు న్వేభంగులం జూపఱె
ల్లం గీర్తింప ధనుః కళానిపుణ లీలా ఖేలతన్ జూపెదన్'. **(శల్యు. 1. 85-87)**

శల్యుడు ధీరోద్ధతుడివలె పలికాడు. భీష్మ ద్రోణులకంటె కర్ణుడూ ఇట్లాగే ప్రగల్భాలు పలికాడు. అయితే శ్రీకృష్ణుడు శల్యుడిని గురించి వేసిన అంచనా మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. అది వ్యాజస్తుతి ఏమో అన్నంత అనుమానం కలిగిస్తుంది. కృష్ణుడు ధర్మరాజుతో అనిన మాట లివి -

సీ. 'శల్యు నెఱుంగుదు; శౌర్య ధైర్యంబు । లగ్గల మాతనికి; బాహుబల ఘనుండు;
గాంగేయకుంభకర్ణుల మిగిలెడుఁ; । గాఁడేని సముఁ డగుఁ గాని యసదు
గాఁ దలంపఁగ రాదు; కౌరవపతి మాన్యుఁ । జేయుట నధిక విజృంభణంబుఁ
జూపు; భీమునకు నర్జునునకు నెనయంగ । రాదు; సాత్యకి కోర్వరాదు; పార్ష

తే. తునకుఁ దత్సోదరులకు మార్కొని పెనంగి । బ్రదుకురాదు; నీవీట నా బల్లిదునకు
నెదురు రథికునిఁ గానననేక హేతి । నిపుణ శార్దూల విక్రమ! నీవు దక్క'. (శల్య. 1.91)

శల్యుడు పాండవ వీరులకంటె అన్నింట మిన్న అయినా ధర్మరాజుతో సరిగాడని శ్రీకృష్ణుడి నిష్కర్ష. ధర్మజుడే శల్యుడిని చంపుతాడని శ్రీకృష్ణుడి నిర్ణయం. 'యుద్ధంలో శల్యుడిని నేను చంపుతా'నని ధర్మజుడు ఉద్యోగపర్వంలో ప్రతిజ్ఞచేశాడు. దానిని శ్రీకృష్ణుడు స్థిరీకరించినట్లయింది. ధర్మరాజుది పురుషయత్నం. శ్రీకృష్ణుడిది దైవానుకూల్యం. స్వల్పమైన నిందకూడా రాకుండా ధర్మరాజుచేత ధర్మబద్ధమైన సహజయుద్ధాన్ని చేయించి విజయాన్ని ప్రసాదించాడు శ్రీకృష్ణుడు. శల్యపర్వ ప్రత్యేకతలలో ఇది ఒకటి.

పదునెనిమిదవనాటి యుద్ధంలో శల్యుడు సర్వతోభద్ర వ్యూహం పన్నాడు. అంతకుముందే పాండవులు త్రిముఖ వ్యూహంతో సిద్ధమై ఉన్నారు. యుద్ధారంభంలో శల్యుడి విజృంభణం కౌరవసేనలకు ఆశ్చర్యం కలిగించింది. పాండవు లతడిచేతిలో ప్రాణాలు కోల్పోవటం తథ్యమనే ఆశలు దుర్యోధనుడి మనసులో పొటమరించాయి. పాండవులు తెగబడి శల్యుడిపై విరుచుకొని పడ్డారు. భీమార్జునులు భయంకరమైన ఎదురుదాడి చేసి సైన్యాన్ని మట్టుపెట్ట నారంభించారు. ధర్మజ, నకుల, సహదేవులు ప్రతివీర సంహారంతో తమ ప్రతాపాలకు వన్నె తెచ్చుకొన్నారు. నకులుడు కర్ణ పుత్రులైన చిత్రసేన, సత్యసేన, సువర్మలను సంహరించాడు. అతడి ధాటికి ఓర్వలేక కౌరవసేనలు వికావికలై పరుగెత్తసాగాయి. శల్యుడు సింహనాదం చేసి, రౌద్రవిక్రమ స్ఫూర్తితో సేనలను పురికొల్పి సమీకరించి విజృంభించాడు. పాండవులు ఒక్కుమ్మడిగా అతడిపై దాడిచేశారు. అయినా శల్యుడు తెగించి విక్రమించి పాండవసేనలపై బాణవర్షం కురిపించాడు. వారు భయపడి ధర్మరాజు రథం వెనుకకు పోయి తలదాచుకొన్నారు. ధర్మరాజు శల్యుడి దాడిని త్రిప్పికొట్టాడు. భీముడు శల్యుడిని ఢీకొని భీకర గదాయుద్ధం చేశాడు. ఇరువురు వీరులూ మత్తేభాలవలె పోరాడి సైనికుల మెప్పులు పొందారు. కొంతసేపటికి ఇరువురూ పరస్పర గదాఘాతాలతో మూర్ఛపోయారు. కృపాచార్యుడు శల్యుడిని రథంమీద ఉంచుకొని దూరంగా తొలగిపోయాడు. భీముడు తేరికొని శల్యుడిని యుద్ధానికి పిలిచాడు. శల్యుడు తేరుకొని గదాదండంతో రథమెక్కి యుద్ధానికి వచ్చాడు. దుర్యోధనుడి ముందున్న సైనికులు అతడిని అనుసరించారు. ధర్మరాజుకు ముందున్న రథికులు చేకితానుడిని ముందుంచుకొని భీముడిని దాటి దుర్యోధనుడిపై తలపడ్డారు. అతడి వజ్రగదాఘాతానికి చేకితానుడు చనిపోయాడు. పాండవసేన మండిపడి కౌరవసేనపై బాణవర్షం కురిపించింది. శల్యుడిపై పాండవులు విజృంభించారు. అతడిపై ధర్మరాజు ముద్గరాన్నీ, సాత్యకి తోమరాన్నీ, భీముడు భల్లాన్నీ, నకులుడు శక్తినీ, సహదేవుడు గదనూ ఒక్కసారిగా ప్రయోగించారు. శల్యుడు వాటిని వమ్ముచేసి అర్చాడు. పటు బాణ ప్రయోగాలతో సాత్యకిని, పాండవులను మూర్ఛపొందించాడు. దానిని చూచి శల్యుడు పాండవులను ఆనాడు చంపుతాడని భావించి దుర్యోధనుడు సంతోషించాడు.

భీమ నకుల సహదేవులు కలిసి శల్యుడిపై విజృంభించారు. ధర్మరాజు శల్యుడి చక్రరక్షకుడైన ద్యుమత్సేనుడి తల నరికాడు. శల్యుడు జూలు పీకిన సింహంవలె కోపించి భీమాదులను బాణాలతో నొప్పించి, నెత్తురు పారేటట్లు చేశాడు. ధర్మరాజును మూర్ఛపొందించాడు. తేరుకొన్న ధర్మరాజుకు శల్యపరాక్రమం భయం కలిగించింది. పౌరుషంతో శల్యుడిని చంపుతానని శపథంచేసిన ధర్మరాజుచేత శ్రీహరిని స్మరింపజేసిన గౌరవం శల్యుడికే దక్కింది. ఒక్కసారితో అది ఆగలేదు. మూడు సార్లు శల్యుడు ధర్మరాజును ముచ్చెమటలు పట్టించాడు. మూర్ఛలో ముంచాడు. శ్రీహరిని స్మరింపజేశాడు. ధర్మజ విజయం దైవాధీన మని నిరూపించాడు.

శల్యుడు ఎంతటి మహావీరుడైనా యుద్ధంలో కొన్నిసార్లు అతడిని కృపాశ్వత్థామలు రక్షించవలసి వచ్చింది. అయినా, ఆయన ప్రదర్శించిన యుద్ధకేళి దేవతలను కూడా మెప్పించింది. పాండవులను ముప్పు తిప్పలు పెట్టింది. దానికి ప్రతిగా భీమార్జున నకుల సహదేవులు అతడిని మూడు చెరువుల నీళ్ళు త్రాగించారు. ఆ భీకర సమరంలో ప్రత్యర్థులైన శల్యధర్మజుల యుద్ధం వీర రసోద్రేకంగా సాగింది. మచ్చుకొక సన్నివేశం - శల్యుడు ధర్మజుడి వక్షఃస్థలంమీద పటుబాణాన్ని నాటాడు. ధర్మజుడు మరొక ఘోరబాణంతో శల్యుడిని కొట్టి మూర్ఛచెందేటట్లు చేశాడు. శల్యుడు తేరికొని కోపంతో

వాడిబాణాన్ని ప్రయోగించగా ధర్మరాజు పసిడి బాణాలతో దానిని విరుగగొట్టాడు. శల్యుడు తొమ్మిది బాణాలను ధర్మజుడి వక్షంమీద నాటాడు. క్రూరభల్లంతో చాపాన్ని విరుగగొట్టాడు. ధర్మజుడు మరొకవిల్లు చేపట్టి యుద్ధం చేశాడు. శల్యుడికి కృపుడూ, ధర్మరాజుకు భీముడూ తోడుగా నిలిచి పోరాడారు. కృపుడూ శల్యుడూ కలిసి ధర్మరాజును విరథుడిని చేశారు. అప్పుడు మరల ధర్మజుడు శ్రీహరిని స్మరించాడు.

**4. ధర్మరాజుకు దైవ సహాయం:**

ధర్మరాజు శ్రీహరిస్మరణం మూడుసార్లు చేశాడు. అందులో గజేంద్రుడిని తలపింప చేశాడు. 'కలఁడు కలం డనెడి వాఁడు కలఁడో లేఁడో?' అని భయంతో శంకించిన గజరాజువలెనే ధర్మజుడు మొదటిసారి శ్రీహరివచనం నిజమౌతుందో కాదో అని భయాందోళనలను ప్రకటించాడు.

క. 'హరి వచనంబు లసత్యతఁ । బొరయఁగ నేర్చునొకొ! మద్రభూపతి బాహు
స్ఫురణము భీమాది రథిక । వరు లోర్వని యట్లు గాఁగ వ్రాలెడిఁ దోడ్తోన్'. **(శల్య. 1. 205)**

శ్రీకృష్ణుడు చెప్పిన మాటలలో రెండంశా లున్నాయి. ఒకటి - భీమాదులు శల్యుడితో దీటురారు. రెండు - ధర్మజు డొక్కడే శల్యుడిని మించిన యోధుడు. ఇందులో శల్యుడు భీమాదులను యుద్ధంలో మించిన మాట సత్య మౌతున్నట్లు స్పష్టమైనది. మరి ధర్మజుడు కూడా శల్యుడిచేతిలో మూర్ఛపోవటం గమనిస్తే రెండవ మాట నిజమౌతుందో లేదో అనే భయం, ఆందోళనం కలిగింది. పురుషయత్నంలో భగవంతుడిని స్మరింపచేసే ప్రథమదశ భయం. దానివలన విజయం అనిశ్చిత స్థితిలో ఉంటుంది.

అనిశ్చిత స్థితికి మూలం అనుమానం. మూర్ఛలో పడ్డప్పుడు భయాందోళనలు కలిగాయి. ఆపై విరథుడైనప్పుడు శంక అంకురించింది.

క. 'గెలుపుము శల్యుని నీ' వని । పలికి ముకుందుండు నన్నుఁ బనిచిన వాఁ; డ
ప్పలుకులకు నసత్యత్వము । గలుగఁగ నేర్చునొకొ దైవఘటన బలమునన్' **(శల్య. 1. 263)**

అని ధర్మజుడు తలపోశాడు. ఇక్కడ భీమాదుల ప్రసక్తి లేదు. శ్రీకృష్ణుడి ఆశీస్సుల ప్రసక్తి ఉన్నది. శల్యుడిని చంపుతా నని చెప్పిన ధర్మజుడి మాట మానవీయం కాబట్టి అబద్ధం కావచ్చును. కాని, కృష్ణుడిమాట దైవనిర్ణయం కదా! అది అసత్యం కావటానికి వీలు లేదు. అయినా, శల్యుడి పరాక్రమం ధర్మరాజుకు ప్రాణసంకటంగా మారింది. శ్రీకృష్ణుడు ఆశీర్వదించినా ధర్మజుడి జీవితంలో దేవుడు విజయం వ్రాసిపెట్టి ఉండకపోతే అది నిజం కాదేమో! అని శంకించాడు ధర్మరాజు.

శంకను తొలగించగలిగింది విశ్వాసం. ధర్మజుడు దైవంమీద అచంచల విశ్వాసం కలవాడు. కాబట్టి శంకతో ఊగిసలాడుతున్న మనస్సును స్వయంగా కుదుటపరచుకొన్నాడు. 'ఆ జగన్నాథు వచనంబునకు నన్యథాత్వం బేలఁ గలుగు?' (శల్య. 1. 264) నని వెంటనే విశ్వాసభావాన్ని వ్యక్తీకరించాడు. స్థిర నిశ్చయుడైన తరువాత భగవంతుడి నేకాగ్రచిత్తంతో, భక్తి భావంతో, విజయార్థి అయి ప్రార్థించాడు. శరణాగతికి సుముఖు డయ్యాడు. 'అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే । తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్' అన్న భగవంతుడి వాగ్దాన ఫలాన్ని పొందే అర్హతను సంపాదించాడు. ఈ క్రింది రెండు పద్యాలూ అందుకు సాక్ష్యాలు.

చ. 'స్ఫురిత షడర్ధనేత్రునిఁ, ద్రిశూల సముజ్జ్వలు, నిర్గుణున్, గుణా
దర సముపాత్తమూర్తిఁ, గలిత ప్రభవస్థితి సంహృతి క్రియా

నిరతి వివర్తిత త్రిభువనీ మహనీయుని, దైత్యమర్ది, న
ప్పురుషవరుం జతుర్భుజవిభుత్వ మహోన్నతు నాశ్రయించెదన్'.

తే. 'భండనము సేయు నరు నగ్రభాగమునఁ బ్ర । చండ శూలోగ్ర హస్తుఁడై శత్రుకోటి
గీటడంచుచు నేఁ జూడఁ గేలి సలుపు । దేవు జయసిద్ధికై నన్నుతింతు భక్తి'. **(శల్య. 1. 265 -266)**

వీటిలో మొదటి పద్యం తిక్కనగారే ధర్మజుడి నోట పలికినట్లున్నది. అది హరిహరాద్వైత భావంతో పురుషోత్తముడిని స్తుతించిన పద్యం. రెండవ పద్యం అర్జునుడి ముందుభాగంలో శూలహస్తుడై నడుస్తూ శత్రు సంహార కార్యాన్ని తానే ముందుగా నిర్వహిస్తున్న రుద్రుడి ప్రశంస ఉన్నది. శ్రీకృష్ణుడి నర్చించిన పూజాద్రవ్యాలు ఆ మహాదేవుడి శరీరంమీద తోచినట్లు అర్జునుడు చెప్పగా ధర్మరాజు విన్నాడు కూడా. ఆ మహాదేవుడే అతడి కానాడు శరణ్యు డయ్యాడు. శివుడే విష్ణువని, విష్ణువే శివరూపుడని తెలిసిన ఎరుక ఈ భక్తి భావనకు మూలం. శత్రుసంహారానికి కావలసిన దివ్య లక్షణాలను దైవ చైతన్యంలో జాగృతం చేసి వాటిని తన విజయసిద్ధికై ప్రసన్నం చేసికొనటమే ఈ పరమేశ్వర స్తుతిలోని పరమతాత్పర్యం.

మొదట పరమేశ్వరుడి త్రినేత్రత్వాన్ని స్మరించాడు. మూడవకన్ను తెరిచి శత్రువులను భస్మం చేయమని దాని భావం. ఆ తరువాత త్రిశూలం చేత ప్రకాశించేవాడిని తలచాడు. శూలంతో శత్రుసంహారం చేయుమని భావం. నిర్గుణుడైన పరమాత్మభావనం చేత సర్వాంతర్యామివై సర్వశక్తిమత్త్వాన్ని ప్రకటించుమని కోరాడు. గుణాలను ఆదరించే ఉదాత్తమూర్తిని భావించటంతో భగవంతుడి దయాగుణాదులను అర్థించినట్లు భావం. సృష్టిస్థితిలయాత్మక ప్రవృత్తిచేత భువనాలను పాలించే మహనీయుడిని భావించటంచేత పుట్టిన జీవులను గిట్టించే సంకల్పం గల మహేశ్వరుడే శత్రువులను సంహరించగలడని భావం. రాక్షసమర్దనుం డనటంచేత దుష్టశిక్షణ ప్రవృత్తిని ప్రదర్శించుమని ప్రార్థించాడని భావం. పురుషవరుడనీ, చతుర్భుజుడనీ, విభుత్వ మహోన్నతుడనీ కీర్తించటంవలన ఉత్తమ పురుష స్థితినీ, విష్ణు స్థితినీ (నలుగురు తమ్ముల పరాక్రమ స్ఫూర్తినీ), ప్రభుత్వ ప్రాప్తిచేత కలిగే ఉదాత్త ఔన్నత్యాన్నీ ధర్మజుడు భగవంతుడినుండి కోరుతూ ఆతడిని శరణువేడుతున్నాడని ధ్వని. 'నరుడికి తోడుగా నిలిచి ముందుగా శత్రుసంహారం చేసి అతడి విజయమార్గం ఎట్లా సుగమం చేస్తున్నావో, నాకు కూడా అటువంటి సహాయాన్ని అందించి విజయం చేకూర్చు'మని పరమేశ్వరుడిని కోరాడు. ధర్మజుడు సాత్త్విక సంపన్నుడు కాబట్టి అతడు భగవంతుడిని అర్థించి సంకల్ప సిద్ధి పొందగలడని భారతంలో ఎన్నో చోట్ల నిరూపించబడింది. ఇక్కడ కూడ సకామభక్తిని సాత్త్విక సమాహితశక్తితో ప్రసరించి విజయాన్ని ప్రసాదించుమని పరమేశ్వరుడిని ప్రార్థించాడు. భక్తిపారవశ్యంలో ఉన్న ధర్మరాజు చేసిన బాణప్రయోగం బలహీనంగా తోచగా శల్యుడు విజృంభించి ఆతడిమీద పెల్లుగా బాణ వర్షం కురిపించాడు.

యోగక్షేమం వహిస్తానన్న పరమేశ్వరుడి చైతన్యం జాగృతమైనట్లు స్పష్టంగా తోచింది. భీముడు శల్యుడి విల్లును విరిచాడు. గుర్రాలను, సూతుడిని క్రమంగా కూల్చాడు. శల్యుడి కవచాన్ని నేలపడగొట్టాడు. కవచ హీనుడైన శల్యుడు ఆగ్రహించి, కత్తీ డాలూ తీసికొని రథం దిగి యముడివలె విజృంభించాడు. భీముడు అతడి కత్తిని, డాలునూ విరుగగొట్టాడు. వెంటనే శల్యుడు మరొక కవచాన్ని ధరించి భయంకరమైన గదను చేపట్టి ధర్మరాజుపై ఉద్ధృతంగా దాడిచేశాడు. అప్పుడు సాత్యకి, ధృష్టద్యుమ్ను, శిఖండి, ద్రౌపదేయులు, మాద్రేయులు ధర్మరాజుకు బాసటగా నిలిచి శల్యుడిని ఎదుర్కొన్నారు. కాని, అతడు వారిని లెక్కచేయక హుటాహుటి ధర్మరాజుపై సింహంవలె లంఘించాడు. ధర్మజుడు రౌద్రోద్రేకంతో మేనుపెంచి భారమంతా శ్రీకృష్ణుడిపై ఉంచి ఇట్లా మనసులో సంకల్పించాడు.

క. 'ఇతని సమయింప నయ్య । చ్యుతుఁడు ననుం బనిచె; నాకు నొనరించిన పా
లితఁ' డని తలంచి మొగ ము । గ్రత నొందఁగ శక్తిమీఁదఁ గనుదో యొలయన్'. **(శల్య. 1. 273)**

ధర్మరాజు భావనలో ఒక విశేషం ఉన్నది. అచ్యుతుడు ధర్మరాజును శల్యుడిని చంపుమని పంపాడట! శల్యుడిని తన పాలుగా మిగిల్చాడట! ఈ మాట లెంత సార్థకంగా ఉన్నాయి! ధర్మజుడిలో అహంకారం లేదు; కర్తృత్వ భావన లేదు.

అతడు తనను భగవంతుడి సాధనంగా భావించాడు. అచ్యుతుడే అందరినీ సంహరిస్తూ శల్యుడిని తన పాలుగా మిగిల్చాడట! అంటే- చంపేది ధర్మరాజైనా చంపిస్తున్నది అచ్యుతు డని భావం. మొదట శల్యుడిని చంపుతానని ఎంచుకొన్నది ధర్మజుడే. అది అతడికి అహంకారానికి ఆనవాలు. తరువాత తనకు తన పరాక్రమం మీద అనుమానం కలిగి శల్యసంహారం అచ్యుతుడి దయవలన తనకు సిద్ధించే అవకాశ మని భావించాడు. ఆ తరువాత సంకల్పించినవాడూ, ప్రతిజ్ఞ నిర్వహించేవాడూ, చంపేవాడూ - అన్నీ అచ్యుతుడే అని భావించి ధర్మరాజు తనను నిమిత్తమాత్రుడిగా తలంచాడు. ఇక యోగక్షేమ భారం శ్రీకృష్ణుడిదే అయింది.

ఇక్కడ తిక్కన తీర్చిదిద్దిన సన్నివేశం కడు రమణీయం. ధర్మరాజు ప్రదర్శించింది విష్ణుభక్తి, పొందింది శివశక్తి. ధర్మరాజు వద్ద శక్తి అనే మహాస్త్రం ఉన్నది. అది ప్రాణాంతక సమయంలో ధర్మరాజుకు స్ఫురించింది. ఈ స్ఫురణ నిచ్చినవాడు స్థితికారు డయిన విష్ణువు. అందుకే మనస్సులో మ్రొక్కాడు హృషీకేశుడిని.

ఉ. 'నీ దెస నాదు చిత్తమున నెక్కొని యుండెడు భక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె? భక్తజనాభిమత ప్రదాన వి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ! సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత; ముల్లము నాపయి నిల్పు మిత్తఱిన్'. **(శల్య. 1. 275)**

విష్ణుభక్తుడికి భద్రత కలగటంలో ఆశ్చర్యం లేదు. భక్తాభీష్టం తీర్చటమే భగవంతుడి వ్రతం. కాబట్టి ధర్మరాజును కాపాడాలని భగవంతుడు సంకల్పిస్తే చాలు జయం కరతలామలకం ఔతుందని భావించటం పై పద్య తాత్పర్యం.

ధర్మరాజుకు స్ఫూర్తి నిచ్చింది విష్ణువు. శక్తి నిచ్చింది పరమేశ్వరుడు.

ఉ. 'అచ్చపు భక్తికిన్ మదిఁ బ్రియంబున నొందిన ఫాలలోచనుం
డిచ్చిన ప్రీతి యోగమును నెక్కుడు భక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్ఠమెయిం బరిశోభితార్చనం
బిచ్చుచుఁ దాను గొల్వ నుతి కెక్కిన యమ్మహనీయ శక్తికిన్'.

మ. 'ప్రణతుండై రభసోదయాభినవదర్పస్ఫూర్తి శోభిల్లుచు
న్మణిదండద్యుతి మంజరీ స్ఫురణము న్సంశోభిఘంటాపటు
క్వణనంబున్ రిపుసైనిక ప్రకర దృక్కర్ణవ్యథం జేయ భీ
షణరేఖం బగుదానిఁ బుచ్చుకొని చంచన్ముష్టి దృష్ట్యుద్ధతిన్'. **(శల్య. 1.277-278)**

శల్యుడిమీద శక్తిని ప్రయోగించాడు. అది శల్యుడి కవచంలో ప్రవేశించి, రొమ్ము చీల్చి వీపునుండి బయటకు వెలువడి భూమిలో ప్రవేశించింది. ఆ వేటువలన ముక్కులనుండి, చెవులనుండి, కన్నులనుండి నెత్తురు కారుతూ శరీరాన్ని తడిపివేయగా శల్యుడు - ప్రియురాలి ఉరంమీద వాలే ప్రియుడివలె - నేలమీద చేతులు రెండూ చాచి బోరగిలపడి ప్రాణాలు వదిలాడు. ధర్మరాజు చేసిన ధర్మయుద్ధంలో చనిపోయిన శల్యుడు శాస్త్రోక్తంగా సమర్పించిన హవిస్సులను స్వీకరించి చల్లారిన హోమాగ్నివలె భాసించాడు.

శల్యుడి తమ్ముడూ, చుట్టాలూ కలిసి ధర్మరాజును ఎదుర్కొని ప్రాణాలు కోల్పోయారు. కృతవర్మ, కృపాచార్యుడు వీగిపోయారు. శల్యపర్వంలో ధర్మరాజుకు తిరుగులేని విజయం సిద్ధించింది. ఈ పర్వంలో భీమార్జున నకుల సహదేవులు, మిగిలిన వీరులూ చేసిన పోరు స్థాయిభావానికి పోషకంగా నిలిచిన సంచారిభావాల సంపుటివలె రాణించింది.

శల్యు డెవ్వరికీ ఆజన్మశత్రువు కాడు. పగతో ఎవరినైనా చంపుతానని అతడు శపథాలు చేయలేదు. అతడిని చంపటానికి కారణంగా బలమైన విద్రోహచర్య ఏదీ కానబడదు. దుర్యోధనుడు అతడిని అవసరం కొద్దీ వాడుకొన్నాడు. కర్ణసారథ్యం తరువాత శల్యుడు కౌరవసైన్య సారథ్యం నిర్వహించవలసి వస్తుందని ఊహించలేదు. మిగిలినవారిలో పెద్దవాడు, తనపట్ల అభిమానం చూపాడని మాత్రమే దుర్యోధను డాతడికి సైన్యాధ్యక్షపదవి నిచ్చాడు. ఏ కారణంచేతనో కృప, కృతవర్మ, అశ్వత్థామలను సర్వసైన్యాధ్యక్షులుగా అతడు శల్యుడికి ముందుగా వరించలేదు. అది కూడా విధి ప్రేరితమనే భావించాలి. పాండవులు చేసిన శపథాలలో ధర్మజ, నకుల, సహదేవులవి ఇంకా పూర్తికావలసి ఉన్నది. ఆ వరుసలో శల్యుడు, శకుని, ఉలూకుడు చావటానికి మిగిలి ఉన్నారు. అందువలన శల్యుడిని ఎన్నుకొని ఉంటాడు. అతడు యుద్ధం చేసింది సగం దినం. కొన్ని గడియలు మాత్రమే పాండవులను సంహరించే ప్రతాపాన్ని ప్రదర్శించి మెరుపువలె మెరిసి ఆరిపోయాడు. అతడి నాయకత్వంలోనే శల్య, శకునుల పుత్రులు, మిత్రులు అస్తమించారు. భీమ ప్రతిజ్ఞకు బలికావలసి ఉన్న దుర్యోధనుడు ఒంటికంబంవలె నిలిచి ఉన్నాడు. ఇట్లా నిలిచిన దుర్యోధనుడు గెలిచిన రాజా? ఓడిన రాజా? సైన్యాధిపతియా? సైన్యాధిపతిని నియమించే సర్వాధికారియా? పెద్ద ప్రశ్నార్థకంగా మిగిలిన దుర్యోధనుడు శల్య మరణానంతరం శకునిని పిలిచి తరువాతి కార్యక్రమాన్ని గురించి అడిగాడు. శకుని తాను సేనాపతి నౌతానని అనలేదు. మరెవ్వరూ అతడి పేరును ప్రతిపాదించలేదు. శకుని తన పావులు నడిపి 'రాజు పూనుకొని ముందుకు ధైర్యంగా సాగకపోతే సైనికులు మెచ్చుకొంటారా?' అని సలహాచెప్పి దుర్యోధనుడిని ముందుకు త్రోశాడు. సేనాపతి అయితే చావక తప్పదని శకునికి తెలుసు. కాని, చివరి క్షణంలో కూడా మోసంతో విజయాన్ని సాధించి దుర్యోధనుడికి బహూకరించటానికి యత్నించాడు. అశ్వసైన్యంతో పాండవబలాన్ని వెనుకనుండి దాడిచేసి మట్టుపెట్టాలని రహస్యవ్యూహం పన్నాడు. దానిని నకుల సహదేవులతో త్రిప్పికొట్టించి ధర్మరాజు అతడి ప్రాణాలను తీయించాడు. మోసగాడిని మోసంతో కాక మొగంమీద మొత్తి శకునినీ, ఉలూకుడినీ నకుల సహదేవులు చంపారు. శకుని తరువాత చివరకు మిగిలింది కృపాశ్వత్థామ కృతవర్మలు. వారితో యుద్ధభవితవ్యాన్ని గురించి చర్చించకుండానే దుర్యోధనుడు రణరంగం నుండి ఏకాంతంగా నిష్క్రమించి ద్వైపాయన హ్రదంలో దాగికొన్నాడు. మిగిలిన ముగ్గురు రథికులూ దారం తెగిన గాలిపటాలవలె గమ్యంలేని గతితో తిరుగవలసి వచ్చింది. శల్యవధ కౌరవులకు హృదయశల్యంగా పరిణమించింది.

యుద్ధషట్కంలో శల్యపర్వం సాధారణ యుద్ధ ప్రక్రియ సాగిన సహజపర్వం. శల్యవధవరకు ధర్మజుడి విజయాన్ని సూచించే వస్తు ధ్వని రమణీయంగా సాగింది. ఈ పర్వంలో శల్యుడు మహాస్త్ర ప్రయోగం చేయలేదు. ఆ మాటకు వస్తే కౌరవపాండవ వీరులందరూ శస్త్రప్రయోగాలే చేశారు కాని అస్త్రాలు వెలికి తీయనేలేదు. ఇందులో మహేశ్వరదత్తమైన శక్తిని బయటికి తీసి ప్రయోగించినవాడు ధర్మరాజొక్కడే. అందుకే అతడు గెలుపును సాధించి నాయకుడయ్యాడు. ఇందులో శల్యధర్మజులకు ఏ శాపాలూ లేవు. శల్యుడు పొందింది సహజమరణం. ధర్మజుడు సాధించింది సహజ విజయం. అందువలన శల్యపర్వం సహజయుద్ధపర్వం.

## 5. శల్యపర్వ నామ సార్థక్యం:

శల్యపర్వం వస్తుతః రెండు భాగాలుగా విరిగింది. పూర్వభాగం శల్యనామధేయుడైన సేనాని పేరుతో సార్థకమయింది. ఉత్తర భాగం శల్యశబ్దార్థ ప్రవర్తనంవలన సార్థకమయింది. శల్యమంటే కంటకం (ముల్లు) అనీ, గుండెలో గ్రుచ్చుకొన్న బాణమనీ, బాణపు ముక్క అనీ, ఒకచోట నిలువక చలించేదనీ (శలతీతి శల్యః శల చలనే) అర్థాలు గోచరిస్తాయి. శల్యపతనానంతరం దుర్యోధనుడు రణరంగంలో అనేక విధాల యుద్ధం చేయటానికి యత్నించి, తన వారందరూ తనువులు చాలించగా, రణరంగాన్ని వీడి ద్వైపాయన హ్రదానికి సాగిపోయాడు. ఆ తరువాత భీముడితో గదాయుద్ధం చేయటానికి శమంత పంచక తీరానికి వెళ్ళాడు. అట్లాగే కృప, కృతవర్మ, అశ్వత్థామలు దుర్యోధనుడి అన్వేషణలో తిరగటం, పాండవులు దుర్యోధనుడు దాగి ఉన్న చోటును అన్వేషించటానికి తిరగటం, చారులవలన విని దుర్యోధనుడున్న హ్రదం వద్దకు పోవటం, అక్కడికి తీర్థయాత్రాచణశీలి అయిన బలరాముడు రావటం, దుర్యోధనుడు, పాండవులు, శ్రీకృష్ణ సాత్యకులు శిబిరాలలో వసించకుండ రాత్రివేళ నదీతీరాలకు వెళ్ళి నిద్రించటం, శ్రీకృష్ణుడు నడిరేయి హస్తినాపురానికి

వెళ్ళిరావటం, యుయుత్సుడు భర్తలను కోల్పోయిన స్త్రీలను హస్తినాపురానికి చేర్చటం మొదలైన సన్నివేశాలన్నీ చలన శీలాన్ని తెలిపే కథాంశాలుగా గోచరిస్తాయి. అందువలన శల్యపర్వనామం స్వభావ వ్యంజకంగా సార్థకమయింది.

శల్యపర్వోత్తర భాగంలోని కథలో ముఖ్యాంశం దుర్యోధనుడి ఊరుభంగం. ఇది కౌరవపాండవుల హృదయాలలో శాశ్వతంగా నాటుకొన్న శల్యం. దుర్యోధనుడు తొడలు విరిగి పడిన నాటినుండి నేటివరకు ఈ అంశంపై ధర్మాధర్మచర్చ చర్చనీయాంశమై సాగుతూ రావణకాష్ఠంవలె ఆరకుండా మండుతూనే ఉన్నది. శల్యమంటే ముల్లూ కావచ్చును. బాణమూ కావచ్చును. పాండవులకు కురుసభలో గుచ్చుకొన్న శల్యాలు అనేకం. మాయాద్యూతంలో ధర్మజుడి రాజ్యం హరించటంవలన కలిగిన బాధ ఒక శల్యం. ద్రౌపది నేకవస్త్ర అని కూడా తలంచక నిండుకొలువుకు జుట్టుపట్టి లాగికొని వచ్చి అవమానించటం మరొక శల్యం. ద్రౌపదిని తన తొడపై కూర్చుండుమని దుర్యోధనుడు సైగ చేయటం మరొక శల్యం. ద్రౌపదిని 'బంధకి' అని కర్ణుడు పిలిచి హేళన చేయటం మరొక శల్యం. అభిమన్యుడిని ఒంటరివాడిని చేసి, బాలుడని కూడా భావించకుండా ప్రౌఢవీరులందరూ కలిసి మోసంతో సంహరించటం మొదలైనవి శల్యాలే. బాల్యంనుండి దుర్యోధనుడు పాండవులకు చేసిన అపకారాలన్నీ మాయని గాయాలవలె బాధపెట్టే శల్యాలు. పాండవుల గుండెలలో గుచ్చుకొన్న శల్యాలకు ప్రతిజ్ఞాపాలనలే నివారణోపాయాలు, తగిన ఔషధాలు. ప్రతిజ్ఞలు ధర్మశాస్త్రాలను చూచి చేసేవి కావు. శాపాలూ అంతే. శత్రువులు చేసిన అధర్మ క్రియలకు ప్రతీకార క్రియలే పాండవ ప్రతిజ్ఞలు. వాటిని పగ తీర్చికొన్నట్లుగా తీర్చికొని కృతప్రతిజ్ఞులు కావటమే క్షత్రియులకు కృతార్థత. ఇది క్షత్రియ వీరధర్మం. ప్రతిజ్ఞానిర్వహణంమీద ప్రతివిమర్శ ఎంతవరకు న్యాయం? అనేది శల్యపర్వంలో ప్రారంభమయ్యే చర్చ. యుద్ధధర్మానికీ, ప్రతిజ్ఞానిర్వహణానికీ, లోకధర్మానికీ, ధర్మశాస్త్రానికీ, వేదతాత్పర్యానికీ ముడిబెట్టి ఏకవాక్యత సాధించటం ఎవ్వరికీ సాధ్యం కాదు. వేదవ్యాసుడూ, శ్రీకృష్ణుడూ ఆయా ధర్మాలకు అనుగుణమైన సమన్వయ సూత్రాలను చెప్పి హృదయశల్యాలకు తగిన మందువేయగల వైద్య విద్వాంసులు. వారి మాటలకు ప్రామాణ్యం కలిగించటమే భారత పరమార్థం. వారి తీర్పులను అంగీకరించటమే పరమధర్మం. కాదనటం వ్యక్తి దృక్పథం. ఈ రెండింటినడుమ విశ్వజనీనతను సాధించే యత్నమే ఈ పర్వత్రయ ప్రయత్నం. అందులో శల్యపర్వం శల్యమూల్యాంకన చర్యల చర్చాపర్వం. 'ఊరుభంగం' దానికి కేంద్ర బిందువు.

ధృతరాష్ట్ర దుర్యోధనులది కణిక (శుక్ర)నీతి; ధర్మజ శ్రీకృష్ణాదులది బృహస్పతి నీతి. ఈ ఇరువురికీ సమాన ప్రమాణాలు వాదంలో ఉండటం దుర్లభం. మిత్రులనైనా బంధువులనైనా మోసంచేసి, చంపి రాజ్యాన్ని, ధనాన్ని హరించటం శుక్రనీతి సమర్థిస్తుంది. అందువలన దుర్యోధనుడు తాను పాండవులపట్ల వ్యవహరించిన తీరుగాని, సంధిని కాదనటం కాని, రాజ్యభాగ మివ్వననటం గాని, యుద్ధంలో నిర్దయగా అభిమన్యు ప్రభృతులను చంపటం కాని, అధర్మపద్ధతులు కావు. ధర్మం తనదాకా వచ్చినప్పుడు అతడి ప్రమాణాలు వేరౌతాయి. దుర్యోధనుడు శ్రీకృష్ణుడిని భీమార్జునులను, ధర్మరాజును రణనియమాలను ఉల్లంఘించారని వాదించాడు. అందులో ఊరుభంగం నియమ విరుద్ధమనీ, పాండవులది అధర్మ విజయమనీ విమర్శించాడు. కృష్ణుడిపై మోపిన అభియోగా లివి-

సీ. 'కంసదాసుని పుత్ర! కానవు నీ దురా । చారంబుఁ గృపయు లజ్జయును లేక
ప్రేలెదు; నీవు సెప్పినఁ బార్థు చేసిన । నన్న గైకొని గదా సంగరంబు
పాడి దొఱంగి యప్పాపకర్ముఁడు వైచెఁ । గాక; చక్కటి తోడి కయ్యు మైన
లీల మిమ్మందఱ నేలపాలుగఁ జేయ । నే; శిఖండి గడంగి యేసె ననఁగ

తే. నర్జునుఁడు శాంతనవుఁ గూల్చునట్లు చేసి; । తస్త్రగురుచాపునకుఁ బాండవాగ్రజన్ము
బొంకు మని పంచి; తరదంబు పుడమిఁ గ్రుంగఁ । గర్ణుఁ జంపించి; తేమనఁ గలదు నిన్ను?'

క. 'భూరిశ్రవుఁ డొక్కనితోఁ । బోరఁగ నేయించి తట్లు; పాడిచీఁకటి నం
హోరహితు సైంధవుని నరు । బారి పఱిచి; తిట్టి నీకుఁ బల్కులు సనునే!'

క. 'నను, భీష్ము, గురుని, సూతసు । తుని భూరిశ్రవు జయద్రథుం జక్కటి ద

ప్పని యనిఁ గోల్పుచ్చుఁగ వ । చ్చునె నీకుం? గపటశూర! సుచరితదూరా!'.**(శల్య. 2. 325 - 327)**

అతడి మాటలకు శ్రీకృష్ణుడు ఇచ్చిన సమాధానంలో రణనియమాలకు సంబంధించినవి కాక ధర్మనీతికి చెందిన అంశాలుండటం గమనార్హం. 'పాండునందనులు పుట్టినంతనుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు; కురుబలంబునకు గుద్దలి గొని దూర్ద్యూతంబు నీవ తొడరితి; దాన నింతలు వుట్టెఁ; బవనతనయుండు పట్టిన ప్రతిన యెఱుంగవె? గద నూరుభంగంబు సేయుదు నని పలికి పిడికిటం బొడుచునే? యవి యెల్లను వృథాజల్పంబు; లూరకుండు'. (శల్య. 2.328) మని మందలించాడు.

దుర్యోధనుడు శ్రీకృష్ణుడి ధర్మవాదానికి సూటిగా సమాధానం చెప్పలేదు. చెప్పలేడు కూడా. పాండవులపట్ల పగ సాధించటం అతడి కణికనీతి దృష్టిలో ధర్మమే. అందుకే అన్నాడు - 'నేను వేదాలు చదివాను, యజ్ఞాలు చేశాను, సంపదలు గడించి సామంతులు కొలువగా సంతోషించాను. దుర్మదాంధులైన శత్రువులను మర్దించాను. చివరకు మిత్రులతో బంధువులతో కలిసి స్వర్గానికి వెళ్ళుతున్నాను. ఇది ఒప్పదా?' అని అడిగాడు. కృష్ణుడి దృష్టిలో తాను ఎటువంటి వాడైనా, అతడిని యుద్ధనియమాలకు విరుద్ధంగా చంపినందుకు పాండవులు జీవితాంతం పశ్చాత్తాపంతో పరితపిస్తూనే ఉంటారని పలికాడు. అప్పుడు దేవతలు దుర్యోధనుడిమీద పూలవాన కురిపించారు.

దానిని దైవప్రశంసగా గ్రహించి ధర్మజాదులు తాము దుర్యోధనుడినీ, భీష్మాదులనూ చంపింది ధర్మవిరుద్ధమేమో అని దిగులు పడ్డారు. శ్రీకృష్ణుడు వారితో ఇట్లా అన్నాడు.

సీ. 'గాంగేయు గురుకర్ణ కౌరవపతులఁ జ । క్కటియనిఁ బరిమార్పఁ గాన మైతి
మని మీరు వగవకుఁ; డద్దొర లుగ్రాస్త్ర వేదులు; ప్రస్ఫుట విక్రమమున
నడరి వారల గెల్చు టరిది గావున నేను । బహువిధోపాయముల్ వన్ని యిట్లు
దీర్చితిఁ గాక; యత్తీవ్ర పరాక్రము । లలఁతులఁ బోదురే? యట్లుఁ గాక

తే. వారి విధి యివ్విధమునఁ జావంగఁ జేసె; । దైవఘటనలు దప్పింప మీ వశంబె?
సురలు దనుజులు గెల్చిన చొప్పు లిట్ల; । సంతసపు సమయంబున వంత లేల?' **(శల్య. 2. 331)**

శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు ఉపశమన వాక్యాలుగా తోచినా అత డనుసరించిన ఉపాయాలను దేవతలు దనుజులను వధించటంలో పాటించిన బృహస్పతినీత్యుపాయాలుగా పేర్కొన్నాడు. అది దేవతలు మెచ్చే పద్ధతిగా సూచించాడు. అన్నిటికి మించి వారి వారి విధి వ్రాతలు తప్పించటం ఎవ్వరి తరం కాదు - అని ప్రకటించాడు. ఇంతటితో పాండవులలో ధర్మాధర్మ చర్చ ముగిసినట్లే.

అయితే ఈ చర్యను ముందుకు సాగించింది కౌరవపక్షంవారే. వారిలో బలమైన ప్రతినిధులు ఇద్దరు. ఒక అశ్వత్థామ. అతడికి తోడుగా నిలిచినవారు కృపకృతవర్మలు. రెండు: గాంధారి. ఆమె నంటి ఉన్నవాడు ధృతరాష్ట్రుడు. వీరికి ప్రతివాదులుగా నిలిచినవారు శ్రీకృష్ణుడు, వేదవ్యాసుడు. ముద్దాయిలుగా నిలిచి వినయవాక్యాలతో ఎదుటివారి ఎత్తులను చిత్తుచేసినవారు ధర్మజ భీమాదులు. అశ్వత్థామ మాటలకంటె మిన్నగా పగకు ప్రతిచర్యను నడిపి, పాండవులకు వగకలిగించి, వారి పగ తీర్చే చర్యలవలన తానూ వగచెంది శిరోమణిని పోగొట్టుకొని జీవచ్ఛవంగా నిలిచాడు. గాంధారి శ్రీకృష్ణుడిని శపించి ఆయనచేత నిష్ఠురా లాడించుకొని, పశ్చాత్తాపపడి పాండవులచేత తమకు అపరకర్మలు తప్పని తమ కర్మకు స్వయంకృతాపరాధాలే కారణమని తెలిసి, తెలివితో మౌనం పాటించింది. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడి వ్యూహంలో చిక్కి ఇనుప భీముడి విగ్రహాన్ని కౌగిలించుకొని, దానిని విరుగగొట్టి తనలోని పగను పైకి ప్రకటించుకొని కుటిలుడుగా అపకీర్తిపాలయ్యాడు. శ్రీకృష్ణుడి

మందలింపుతో మారుమాటాడకుండ ఉండిపోయాడు. అనగా, శల్యపర్వంలోని 'ఊరుభంగం' రేపిన దుమారం రెండు పర్వాల నిండా రేగి చివరకు మృతుల కిచ్చిన జలతర్పణాలతో అణగిపోయిందన్నమాట!

నన్నయ శల్యపర్వాన్ని 'నవ్యార్థరమణీయ' మని ప్రశంసించాడు.

ఆ. 'సభల విస్తరిల్లి శల్యాదికములైన । నాల్గు పర్వముల వినంగఁ జాలి
నవమ పర్వమనఁగ నవ్యార్థరమణీయ । మగుచు శల్యపర్వ మతిశయిల్లు'. **(ఆది. 1. 52)**

**6. సౌప్తికపర్వ కథాసూత్రం:**

సౌప్తికపర్వ కథానాయకుడు అశ్వత్థామ. పగను సాధించటంలో దుర్యోధనుడికి మానసిక ప్రతినిధి. అయితే, వారిద్దరి ప్రతీకారాలలో ప్రాధాన్య వివక్షలు వేరు. భీష్ముడిని చంపటానికి పగతో తపస్సుచేసి పుట్టాడు శిఖండి. ద్రోణుడిని చంపటానికి పగతో ద్రుపదుడు చేసిన యజ్ఞఫలంగా జన్మించాడు ధృష్టద్యుమ్నుడు. దుర్యోధనుడిలోని పగను పెంచి మహాగ్నిగా మార్చిన కర్ణుడు తనశాపాలకు తానే బలి అయ్యాడు. అతడి మృత్యువుకు అర్జునుడు హేతువయ్యాడు. దుర్యోధన దుశ్శాసనుల పగకు గురి అయిన భీముడు వారి చావుకు కారణమయ్యాడు. ఈ వీరుల మరణాలకూ బలమైన కారణాలున్నాయి. కాగా, అశ్వత్థామను ప్రతీకారశక్తిగా మార్చిన సన్నివేశాలు ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని చంపిన తీరు, దానిని వీరధర్మంగా చెప్పుకొంటున్న పాండవుల వైఖరి, దానిని సమర్థించిన శ్రీకృష్ణుడి వైనం.

యజ్ఞకుండంలో నుండి పుట్టిన ధృష్టద్యుమ్నుడు పాండవ సర్వసేనాధ్యక్షుడు అయ్యాడు. అంటే ద్రుపదుడి పగనుండి ద్రోణవధ కొరకే పుట్టిన వీరుడిని పాండవులు తమసేనాపతిగా అంగీకరించారన్నమాట! అతడు పరాక్రమాతిశయంతోనే, తపఃఫలంతోనో, మహాస్త్రసంపదతోనో ద్రోణాచార్యుడిని చంపుతాడని అందరూ ఆశించారు. కాని, నిజానికి ద్రోణుడిని చంపింది శ్రీకృష్ణుడి నీతిచాతుర్యం, ధర్మజుడి వాక్యచాతుర్యం. అశ్వత్థామ హతుడైనాడన్న వార్త ఆయనను యుద్ధవిముఖుడిని చేసింది. బ్రతుకుమీది ఆశను మాన్పింది. యోగంతో ప్రాణాలను త్యజించి జీవన్ముక్తావస్థను సాధించాడు ద్రోణుడు. అట్టి స్థితిలో జుట్టుపట్టి, తలపైకెత్తి, కత్తితో శిరస్సు నరికాడు ధృష్టద్యుమ్నుడు. అర్జునాదులు దానిని వారించినా ధృష్టద్యుమ్నుడు వినలేదు. చచ్చినపామును చంపిన వీరుడయ్యాడు పాండవసేనాపతి. ఆ సంగతి తెలిసిన అశ్వత్థామ అప్పుడే పగతీర్చుకొనటానికి విజృంభించాడు కాని, పాండవు లతని ఆట కట్టించటంతో ఆ ప్రయత్నం మానుకొన్నాడు. లేకపోతే తండ్రి తరువాత కొడుకే సైన్యాధ్యక్షు డయ్యేవాడేమో! కర్ణుడికి అగ్రతాంబూలం ఇవ్వటంతో అశ్వత్థామ వెనుకబడ్డాడు. కర్ణుడి తరువాత కూడా ఆతడే శల్యుడి పేరు చెప్పాడు. శల్యుడి తరువాత దుర్యోధను డెవరి పేరూ చెప్పలేని స్థితిలో ఉండటంచేత తాను చేయదలచుకొన్న ప్రతీకారానికి అవకాశం దొరకలేదు. అందువలన తనంతట తానే కౌరవసేనాపతిగా ఉండటానికి ప్రతిపాదించుకొన్నాడు. అతడు చంపదలచుకొన్న వారివరుసలో మొదటివాడు ధృష్టద్యుమ్నుడు. అతడిని పశువును చంపినట్లు చంపుతానని తన కసినంతా ఒలకపోశాడు. ద్రుపద సంతానంలో పురుషులు మొదట, ఆ తరువాత ఆతడి స్త్రీ సంతానమైన ద్రౌపదికి పుట్టిన సంతానం (ఉపపాండవులు) అతడి లక్ష్యం. ధృష్టద్యుమ్న సేనాపతిత్వాన్ని అంగీకరించిన పాండవులూ, పాండవసైన్యం,. ఏనుగులు, గుర్రాలూ - అందరూ వధార్హులే. యోగనిద్రలో ఉన్న ద్రోణుడిని చంపిన పాండవులందరూ నిద్రలో ఉండగా చంపదగిన వారే. ఇట్లా ఆలోచించిన అశ్వత్థామ అంతఃకరణానికి బహిఃప్రతీక గుడ్లగూబ. రాత్రివేళ సంచరించే ఆ పక్షికి కాకులగుంపును చంపటం ప్రతీకారచర్య కాదు, స్వాభావికచర్య మాత్రమే. పొగవంటి పగచీకటిలో ఉన్న అశ్వత్థామకు కూడా అది సహజ యుద్ధ చర్యగానే స్ఫురించింది. అతడికి తగిన రాజు దుర్యోధనుడు - ఆ క్రింది రాత్రి పాండవులు రాత్రివేళ దాడిచేస్తారేమో అనే భయంతో శిబిరంలో పడుకొనకుండా సరస్వతీ నదీతీరంలో బసచేశాడు. కాని, పాండవులు ఆ దుశ్చర్యకు పాల్పడలేదు. అశ్వత్థామ అటువంటి చర్యకే పూనుకొన్నాడు. దుర్యోధనుడి తొడలు విరుగగొట్టింది భీమసేనుడు కదా! మరి అశ్వత్థామ అతడిపై దండెత్తటానికి మొదట సంకల్పించలే దెందుకు? అసలు రహస్యం అది కాదు. రారాజు అనుమతిస్తే తనపగను సాధించుకొనాలని. దుర్యోధనుడు ప్రేరకుడు కాదు. నిమిత్తమాత్రుడైన కారకుడు. రాత్రి యుద్ధం ధర్మవిరుద్ధమని

కృపాచార్యుడు హితబోధ చేసినా, అతడు పగసాధింపు న్యాయానికే ప్రాధాన్యమిచ్చి, కృప కృతవర్మలను నిరుత్తరులను చేయగలిగాడు. పగతీర్చుకొనటంలో ధర్మచింత లేదనీ, పగతో పుట్టినవారి చావు పగతోనే ముగియటం కాలం ధర్మమనీ అశ్వత్థామ తన ప్రవర్తనతో ప్రతిష్ఠాపనం చేశాడు. ధృష్టద్యుమ్న శిఖండులను తాను చేతులారా చంపి సంతృప్తిని ప్రకటించాడు. ద్రౌపదికి పుట్టిన పాపానికి ఉపపాండవులకు ఉచితమైన శిక్ష వేశానని భావించాడు. ఆ విశేషాలను దుర్యోధనుడికి చెప్పి అతడి చేత భీష్మ ద్రోణ కర్ణాదులు చేయని ఘనకార్యం చేసినట్లు ప్రశంస లందుకొన్నాడు. తన పగకు ఫలంగా తన కేమౌతుం దని మొదట ఊహించలేదు. కాని, పాండవ శిబిరంలో పాండవులూ, శ్రీకృష్ణుడూ, సాత్యకీ కనబడకపోవటంతో పాండవ ప్రతీకారం తనకు అపాయం కలిగిస్తుందని శంకించాడు. చేసిన పాపం ధృతరాష్ట్రుడికి చెప్పి పితృఋణాన్నీ ప్రభుఋణాన్నీ తీర్చుకొన్న తృప్తితో, వ్యాసాశ్రమానికి పోయి తాపసిగా వేషం మార్చి తపస్సు చేయటం మొదలుపెట్టాడు.

చమత్కార మేమంటే - దుర్యోధన విరోధి భీముడూ, కర్ణవిరోధి అర్జునుడూ, ద్రోణవధకు కారకుడైన ధర్మరాజూ, కౌరవులకే విరోధి అనిపించుకొనే శ్రీకృష్ణుడూ అతడు తాపసి వేషంలో దాగి ఉన్న తామసిక రూపాన్ని బయటపెట్టారు. ద్రుపదవంశానికి ఆడబడుచైన ద్రౌపది అశ్వత్థామను పరిభవించటానికి పగతోకూడిన పంతంపట్టి భీముడిని ప్రేరేపించి అతడిపైకి ఆగ్రహంతో పంపింది. శ్రీకృష్ణుడు మిగిలినవారి నందరినీ అతడికి తోడుగా తీసికొనివెళ్ళాడు. అనగా ప్రాణాలతో మిగిలిన పాండవ పక్షమంతా కలిసి అశ్వత్థామను అంతం చేయాలని పూనుకొన్నదన్నమాట! పగల ప్రతాపాలు ప్రచండంగా సంఘర్షణకు దిగాయి. కురుక్షేత్ర యుద్ధంలో ఇది చివరి ఘట్టం. అద్భుతానికే అద్భుతం. ఆ అద్భుత పురుషోత్తముడు శ్రీకృష్ణుడు. ఆయన కురుసభలో చేసిన ప్రకటనను అంతవరకు పరోక్షంగాను, ప్రత్యేకించి సౌప్తికపర్వంలో ప్రత్యక్షంగానూ ప్రపంచించి చూపించాడు.

ఉ. 'సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబారిన దైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁ గాని ధర్మ ని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్'. **(ఉద్యో. 3.373)**

సర్వకాల సర్వావస్థలయందు నిత్యసత్యంగా నిలిచేది సారవంతమైన ధర్మం. ఆపద్ధర్మాలూ, అవాంతర ధర్మాలూ, అవసరానికి అనువైన అవస్థా ధర్మాలూ సారవంతాలు కావు. సాపేక్షాలు మాత్రమే. ధర్మానికి విజయం కలగటమే సారపుధర్మం. చిత్తశుద్ధితో కూడిన సత్యం విమలసత్యం. ధర్మలక్షితమైన త్రికరణశుద్ధి విమలసత్యం. యుద్ధంలో ధర్మవిజయానికి కృషిచేస్తూ కార్యసాధనకు ఆపద్ధర్మంవంటి దానిని ఆశ్రయించినా చిత్తశుద్ధీ లక్ష్యశుద్ధీ దానిని కలుషితం కాకుండా రక్షిస్తాయి. ఒకవేళ దానికి పాపం, అసత్యం అడ్డుపడి ఆపదలు కలిగిస్తే, ఫలవంతం కాకుండా చేస్తే ఆ సమయంలో ఎవరు ఉపేక్ష చేసినా వారికి చేటు తప్పదు. సమర్థుల ఉపేక్షవలన కార్యం చెడిపోయే అవస్థ ఏర్పడినప్పుడు దైవమే పూనుకొని ధర్మాన్ని రక్షించి, సత్యశుభదాయకమైన ఫలాన్ని అందిస్తాడు. ఈ ప్రకటన అక్షరాలా సత్యమయింది సౌప్తికపర్వంలో.

కౌరవులకు ఎప్పుడూ అపకారం చేయని పాండవుల వర్తనం సారవంతమైన ధర్మం. తమకు న్యాయంగా రావలసిన రాజ్యభాగంకంటె మరొక్కటి అడగకుండా ఉండటం, సంధికి రాయబారం పంపటం, కౌరవుల దుర్నీతికి ఫలంగా మరొకమార్గం లేక యుద్ధం చేయటం విమల సత్యానికి సాక్ష్యాలు. భీష్మపతనం నుండి శల్యపతనం వరకు విజ్ఞులు సంధిచేసికొమ్మని ఎన్నిసార్లు ప్రబోధించినా దుర్యోధనుడు వినక పాపచింతతో పాండవులను చంపి వారిరాజ్యాన్ని శాశ్వతంగా అనుభవించాలని భావించటం మహాపాపం. దీనిని శ్రీకృష్ణుడే పెక్కుసార్లు ప్రస్తావించి దుర్యోధనాదులను నిందించటం ఈ పర్వంలో గమనిస్తాం. ఈ పర్వంలో ధృతరాష్ట్రుడు పెద్ద బొంకు. అతడి మనసులో ఒకటి, మాటలో మరొకటి, చేతలో మరొకటి. అతడు దుర్యోధనుడి దుష్ప్రవర్తనను మాన్పలేక, తాను మారలేక, పరిస్థితులను చక్కదిద్దలేక, ప్రారంభమైన యుద్ధాన్ని ఆపలేక కథను శుభాంతం చేసే శక్తిని కోల్పోయాడు. గాంధారి తన కొడుకును సరిదిద్దుకొనలేక పాపమంతా కృష్ణుడిమీద పెట్టి వాస్తవాన్ని బొంకుగా వక్రీకరించింది. వీరందరికి ప్రతినిధిగా అశ్వత్థామ లోకాన్ని అపాండవం చేయాలని ఆగ్రహించి నరహోమ

శిశుహోమాలు చేశాడు. వీరందరూ సారపు ధర్మాన్నీ, విమల సత్యాన్నీ తమకు తోచిన రీతిలో యథాశక్తి చెడబారేటట్లు చేశారు. శ్రీకృష్ణు డొక్కడే వాటిని సత్యశుభదాయకాలుగా నిర్వహించి, సారపు ధర్మాన్నీ, విమలసత్యాన్నీ సంరక్షించాడు. అందుకే శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడైన సర్వేశ్వరుడని సౌప్తికపర్వం నిర్ద్వంద్వంగా నిరూపించింది.

పాండవ స్కంధావారాన్ని శ్మశానంగా మార్చి, పాండవ ప్రతీకారానికి భయపడి, పాండవులకు పరమపూజ్యుడయిన వ్యాసమహర్షి ఆశ్రమ సమీపంలో నిలిచి, శరీరాన్నంతా బూడిద పూతతో నింపి, పాండవులు గౌరవించే మునివేషంలో తపస్సు చేస్తున్నట్లు నటించాడు అశ్వత్థామ. చేసిన పాపాన్ని, బొంకుతో కప్పిపుచ్చుకొనటానికి యత్నించాడు. పాండవు లాతడి కపట ప్రవృత్తిని సత్యంగా భావించి క్షమిస్తారేమో అని భావించాడు. కాని, భీముడు అతడి బండారాన్ని బైటపెట్టాడు. పరుషంగా మందలించి యుద్ధానికి పిలిచాడు.

తే. 'ఓరి! ధాత్రీసురాధమ! క్రూరకర్మ! కపట ధార్మిక! యత్యంత కల్మషాభి
యుక్తిఁ బోయినరేయి మహోగ్రవృత్తిఁ । దగిలి; తెంత వేగిరమునఁ దపసి వైతి?'

వ. 'ఇట్టు లొదిగినఁ జూపు దప్పునే? లేలెమ్ము! తపమ్ము సాలు; రణమ్మునకు రమ్ము' **(సౌప్తి. 2.59,60)**

భీము డుపయోగించిన సంబుద్ధులు సౌప్తికపర్వంలోని అశ్వత్థామ శీలచిత్రణకు పనికివచ్చే సార్థక విశేషణాలు. వాటిని విన్న అశ్వత్థామ తాను చేసిన మహాపాపాన్ని స్మరించి లోలోన కలత చెందాడు. కాని, పరితాపాన్ని ప్రకటించటానికి సిద్ధపడలేదు. ఆ క్షణంలో కూడా ప్రతీకారాన్నే ఎన్నుకొన్నాడు. అసాధ్యమైన బ్రహ్మశిరోనామక మహాస్త్రాన్ని పైకి తీసి 'దీనివలన అపాండవమగుగాక!' అని సంకల్పించి ప్రయోగించాడు. దానికి ప్రతీకారం చేయకపోతే పాండవులు దగ్ధమౌతారు. శ్రీకృష్ణుడు తాను పూనుకొని అర్జునుడిచేత బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని దానిపై ప్రయోగింపచేశాడు. ఉభయాస్త్రాలూ ఉజ్జ్వలంగా సంఘర్షించాయి. లోకాలు తల్లడిల్లాయి.

అప్పుడు నారదుడూ, వ్యాసుడూ కలిసి వచ్చి ఆ వీరుల నడుమ నిలిచి, మానవులమీద ప్రయోగించరాని ఆ అస్త్రాలను ప్రయోగించటం దోషమని ప్రబోధించి, ఉపసంహరించుకొనండని హితవు చెప్పారు. అర్జునుడు గురుభక్తి ప్రకాశించగా పారాశర్యుడి మాట ననుసరించి ఉపసంహరించుకొన్నాడు. ఒకసారి ప్రయోగించి ఉపసంహరించుకొన్నవారికి కీడు కలుగుతుందనే నియమమున్నా వ్యాసుడి కృపవలన అర్జునుడికి ఏ అపాయమూ కలుగలేదు. అశ్వత్థామ ఆత్మనిగ్రహాన్ని కోల్పోవటంచేత అస్త్రాన్ని ఉపసంహరించుకొనలేకపోగా, విచారిస్తూనే ఇట్లా అన్నాడు:

చ. 'పరిభవజాతరోషమునఁ బ్రాణభయంబునఁ జేసి యిమ్మహా
శరము వివేకవర్జిత విచారుఁడనై యిటు లేసితిన్; మునీ
శ్వర! ఇది పాండుభూపసుతవర్గము నంతటి నేర్చుఁ గాని యె
ప్పరుసున మాన; దివ్విధము పాపమ యేనియు దాని కోర్చితిన్'. **(సౌప్తి. 2. 75)**

అన్నాడు. తపస్సు చేస్తున్నవాడికి పగ పనికిరాదని చెప్పి, పాండవులు అతడి ప్రాణాలు తీయకుండా ఉండాలంటే శిరోమణి నర్పించుమని వ్యాసుడు హితవు చెప్పాడు. శిరోరత్నం ధరించినవారికి నాగభయం, దొంగల భయం, దానవభయం, దేవభయం కలుగవు. ఆకలి, దప్పిక, నిద్ర రోగభయాలు ఉండవు. అట్టి రత్నాన్ని ఇవ్వటానికి మొదట అంగీకరించకపోగా, అతడి అస్త్రం 'పాండవేయ రాగపాత్ర గర్భమాలకు హాని కలిగించి శాంతి పొందుతుం'దని చెప్పాడు. 'అపాండవ మౌతుం'దన్న మాటకు ప్రత్యామ్నాయ మిది. అందులో 'ఒక దాని కాసపడబోకు' మని వ్యాసుడు కోరాడు. అతడు దానికి అంగీకరించలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు అడ్డుతగిలి అభిమన్యుడి తేజం ఉత్తరగర్భంలో పెరుగుతున్నదనీ దానిని రక్షించుమనీ కోరాడు. అది పాండవ పక్షపాతంతో అడుగుతున్న కోరికగా పేర్కొని శ్రీకృష్ణుడి మాటను అశ్వత్థామ తిరస్కరించాడు. దానితో శ్రీకృష్ణుడిలోని దివ్యత్వం జాగృతమై ఆ బిడ్డను తానే రక్షిస్తాననీ' అతడు వంశకరు డౌతాడనీ ప్రకటించటం జరిగింది. ఆ మాట వెంటనే అమలు జరిగింది. ఉత్తరగర్భం నిలిచింది. 'అస్త్రాగ్ని దగ్ధుడైన వాడిని రక్షించటం మేలేకదా!' అని అవహేళన చేశాడు అశ్వత్థామ. సకల గర్భాలపై అస్త్ర ప్రయోగం చేశాడు.

బాలఘాతి అయిన అశ్వత్థామ ఆహారం లేక, సహాయం లేక, దుర్గంధంతో కూడిన రక్తంతో శరీరం కుళ్ళిపోతూండగా మూడువేలేళ్ళు తిరుగుతూ కృపాచార్యుడిచేత విలువిద్య నేర్చిన పరీక్షిత్తునూ, అతడి కొడుకు జనమేజయుడినీ చూడగలడని శ్రీకృష్ణుడు శపించాడు. వేదవ్యాసుడు కూడా ఆ శాపాన్ని ధ్రువీకరించాడు. శిరోమణిని పాండవుల కిప్పించాడు.

తే. బ్రాహ్మణుఁడవయ్యు నిట్లు క్రూరతకు రోయ । కస్మదీయ వాక్యంబుల నాదరంబు
సేయ కీపాపకర్మంబు సేసినాఁడ; । వచ్యుతుఁడు పల్కినట్టుల యగుము నీవు'. **(సౌప్తి. 2.87)**

అశ్వత్థామ వేదవ్యాసుడిని కూడ వదలలేదు. ఆ మహర్షిని మానవుల మధ్య వసించి ఉండేటట్లు ప్రతిశాపం ఇచ్చాడు. అతడి పగకు పారాశరుడైనా పరమాత్ముడైన ఒక్కటే! అపాండవంగా అంతం కావలసిన ధర్మచరితం ఉద్ధరించబడింది. విమలసత్యం బొంకుచేత, పాపంచేత చెడబారకుండా శ్రీకృష్ణుడు కథానిర్వహణం చేసి ధర్మాన్నీ, సత్యాన్నీ, శుభాన్నీ కలిగించి దైవమనిపించుకొన్నాడు. వంశాంకురాన్ని రక్షించి చంద్రవంశాన్ని ఆచంద్రతారార్కం ఉండేటట్లు చేశాడు.

సౌప్తికపర్వంలో సంహారశక్తి అశ్వత్థామ. అతడు మహేశ్వర శక్తి ప్రభావంతో సంహారం చేశాడు. ఇక సంరక్షణ శక్తి శ్రీకృష్ణుడు. భక్త రక్షణ కళాపారీణుడై ప్రకాశించాడు. శివకేశవులు రేయుంబవళ్ళవలె రాణించిన పర్వం సౌప్తికపర్వం.

అందుకే నన్నయ సౌప్తికపర్వం ప్రతిభా పూర్ణమని కీర్తించాడు.

క. 'నుత సౌప్తికాది పర్వ । త్రితయంబునఁ దనరి వసుమతీసురవర స
మ్మతమై సౌప్తికపర్వము । ప్రతిభ వినం బొలుచు దశమపర్వం బనఁగన్'. **(ఆది. 1. 54)**

## 7. స్త్రీపర్వం సార్థకనామం:

శల్య సౌప్తికపర్వాలవలెనే స్త్రీపర్వం కూడా రెండాశ్వాసాలలో నిర్మించబడింది. ఇందులో ప్రధానపాత్రలు గాంధారీ ధృతరాష్ట్రులు. వీరిద్దరూ పుత్రులనూ, బంధువులనూ, పౌత్రులనూ, మిత్రులనూ కోల్పోయి రెక్కలు తెగిన పక్షులవలె, కొమ్మలు విగిరిన చెట్లవలె మిగిలిపోయారు. ఆ దంపతులు కురుక్షేత్ర యుద్ధానంతరం వ్యవహరించిన తీరు ఈ పర్వంలో ప్రధానవస్తువు. పుత్రుల మరణవార్త ధృతరాష్ట్రుడికి అపారదుఃఖాన్ని కలిగించింది. గాంధారికి దుఃఖాన్ని మించిన కోపాన్ని పెంచింది. వారిరువురిని శాంతింపజేయటం ప్రథమాశ్వాసంలోని వస్తువు. విదురుడూ, కృష్ణద్వైపాయనుడూ ధృతరాష్ట్రుడి దుఃఖాన్ని శమింపచేసే బోధను చేశారు. కృపాచార్యుడూ, వ్యాసుడూ గాంధారి దుఃఖాన్నీ, కోపాన్నీ చల్లార్చటానికి యత్నించారు. శ్రీకృష్ణుడు, ధర్మరాజు, భీముడు మొదలైన పాండవులు నిపుణంగా వ్యవహరించి ఆ దంపతులకు దుఃఖకోపోపశమనం చేసి ప్రశాంత వాతావరణాన్ని కల్పించగలిగారు.

పురుషుడైన ధృతరాష్ట్రుడికంటె స్త్రీ అయిన గాంధారి పాత్ర ఈ పర్వంలో విశిష్టస్థానాన్ని పొందింది. రణరంగంలో అసువులు కోల్పోయిన వీరుల భార్యలందరూ శోకమూర్తులై వారివారి ఆత్మీయుల శవాలను దర్శించి తమ కన్నీటి తర్పణాలను అర్పించటానికి యుద్ధభూమికి బయలుదేరారు. వారందరికీ గాంధారి నాయకురాలుగా ముందు సాగింది. సంతతినంతా కోల్పోయి భర్తతో మిగిలిన హస్తినాపుర మహారాజ్ఞి ఆమె ఒక్కతే. ఆమె శాపానుగ్రహశక్తియుక్తురాలైన పతివ్రత. ఆమె మిగిలిన స్త్రీలను ఓదార్చగలదా? ఆ విషాదానికి కారణం ఎవరని ఆమె వారికి నిరూపించి చెప్పగలుగుతుంది? పాండవులా? కౌరవులా? ధృతరాష్ట్రుడా? చివరకు తానా? లేక జగన్నాటక సూత్రధారి శ్రీకృష్ణుడా? - ఎవరీ విపత్తుకు కారణం? అన్న ప్రశ్న స్త్రీలకందరికీ సంబంధించింది. వారందరి మనోభావాలకు మణిదర్పణమే స్త్రీపర్వం.

పాండవులు ధృతరాష్ట్రుడిని చూచి జాలిపడతారు; గాంధారిని చూచి భయపడతారు. ఆ రాజు పుట్టుగ్రుడ్డి. ఆమె కన్నులకు గంత కట్టుకొన్న ఇల్లాలు. శ్రీకృష్ణుడు కురుసభలో విశ్వరూపాన్ని ప్రదర్శించినప్పుడు దానిని చూడగలగటానికి ధృతరాష్ట్రుడికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. ఆ తరువాత దృష్టిని ప్రసాదిస్తానన్నా పరమాత్మదర్శనం చేసిన దృష్టితో లోకాన్ని చూడనని దృష్టిని ఉపసంహరించుమని ధృతరాష్ట్రుడు కోరుకొన్నాడు. యుద్ధారంభంలో వేదవ్యాసుడు రణరంగంలో జరిగే

సన్నివేశాల నన్నింటిని దర్శించగలిగే దివ్యదృష్టి నిస్తానన్నాడు. కాని, కుమారులు ప్రదర్శించే ఆ క్రూరకర్మలను చూడలేనని గ్రుడ్డిరాజు దానిని స్వీకరించలేదు. సంజయుడికి వ్యాసు డా దృష్టి నిచ్చి జరిగిన వృత్తాంతాన్ని రాజుకు వినిపించే సౌకర్యాన్ని కలిగించాడు. దుర్యోధనుడి పతనంతో అతడి దివ్యదృష్టికూడా ఆగిపోయింది. ధృతరాష్ట్రుడు పూర్వంవలెనే గ్రుడ్డిరాజుగానే మిగిలిపోయాడు. ఇతరుల సహాయంతో బ్రతికే ఇబ్బందిలో పడ్డాడు. అయినా, అతడికి ఆత్మజ్ఞానం కలగలేదు.

గాంధారి చరిత్రం స్త్రీపర్వంలో విచిత్రం. ఆమె ఎంత శోకమూర్తియో అంతకంటె మించిన క్రోధమూర్తి. కొడుకులలో ఒక్కడిని కూడా మిగల్చకుండ చంపిన పాండవులంటే ఆమెకు మంట! కడుపుకోతకంటె ఆ మంట అధికంగా బాధకలిగించింది. చనిపోయిన కొడుకులను, మనుమళ్ళను, బంధువులను కన్నారా చూచుకొని కన్నీరు కార్చాలని ఆమె కోరుకొన్నది. వ్యాసు డామె అంతరంగాన్ని గుర్తించి దివ్యదృష్టి నిచ్చాడు. కళ్ళకు గంతలున్నా బయటి ప్రపంచం స్పష్టంగా కనపడసాగింది. ద్వితీయాశ్వాసమంతా ఆమె చేసింది శవాల దర్శనమే. విన్నది - ఆ శవాలపై బడి విలపించే స్త్రీల ఆర్తనాదాలే. ఆమె వాటిని చూచి, విని తానూ స్పందించి శోకించింది. అయితే వాటిని మూగగా అనుభవించటమా? ఎవరికైనా చెప్పుకొనటమా? అన్న ప్రశ్న వచ్చింది. ఇతరులతో పంచుకొన్నప్పుడే బాధ తగ్గుతుంది కాబట్టి శ్రోతగా ఆమె భర్త అయిన ధృతరాష్ట్రుడిని కాక శ్రీకృష్ణుడిని ఎన్నుకొన్నది. ఆయన ఆమె చెప్పినదంతా సాక్షిగా విన్నాడు. చివర కామెకు తోచిన సత్యమేమిటంటే- ఈ కౌరవ వినాశనానికంతా శ్రీకృష్ణుడే మూలకారణమని. దుఃఖంనుండి కోపం విజృంభించింది. అంతఃకలహాలతో యాదవులు నశిస్తారనీ, వారి భార్యలు కౌరవ వనితలవలెనే రోదిస్తారనీ, శ్రీకృష్ణుడు నిస్సహాయుడై చంపబడతాడనీ ఆమె శ్రీకృష్ణుడిని శపించింది. శ్రీకృష్ణ డామెను మందలించి, ఆ సర్వనాశనానికి కారణం ధృతరాష్ట్ర గాంధారుల లోభ గుణమేనని తేల్చి చెప్పి, వారికి పాండవులే దిక్కని చూపించి, దుఃఖ క్రోధాల పొంగును తగ్గించి, బంధువుల పరలోక క్రియలకు పూనుకొనేటట్లు చేశాడు.

మరొక విచిత్ర మేమంటే - స్త్రీపర్వం ముగిసేసరికి కొడుకులను సరిదిద్దుకొనలేక ఒక తల్లి (గాంధారి) నూరుగురు కొడుకులను పోగొట్టుకొన్నది. కన్నెప్రాయంలోనే తాను కన్న పెద్దకొడుకును చివరివరకు ప్రకటించలేక మరొకతల్లి (కుంతి) ఆతడిని స్వార్థానికి బలిచేసింది. ఇద్దరు మహారాజ్ఞులు చేసిన నిర్వాహకమే కురుకులనాశనానికీ, అంతఃపుర వనితల రోదనానికీ, వీరపత్నుల వేదనలకూ మూలకారణమని శ్రీకృష్ణుడు సాక్షిగా ప్రదర్శించే విధిరూప విశ్వదర్శనమే స్త్రీ పర్వం. గ్రుడ్డివారికి కూడా కనపడే దివ్యసత్యం ఇది.

గాంధారివంటి వీరమాతలకు, భానుమతివంటి వీరపత్నులకు శ్రీకృష్ణు డిచ్చిన ఈ శాంతి సందేశం స్త్రీపర్వానికి భరతవాక్యం వంటిది.

సీ. 'వినుము గాంధారి! నీ తనయుండు చేయు । దుర్నయము లెఱుంగవే? నాకు నీకు
శాంతనవునకు నాచార్యునకును బాహ్లి । కునకుఁ దండ్రికి మాన్పఁ గొలఁది గాని
దుర్మానమున నట్లు దొడరి యిట్లయ్యె; మీ । యపరాధమున వచ్చినట్టి కీడు
నకు నింత నొవ్వంగ ననుఁ బల్కఁ దగునె? యు । మ్మలికంబు ధృతిఁ బట్టి మాన్పు మింకఁ;

తే. జేటునకుఁ జావునకు వగఁ జెందు జనుల । కినుమడింపదె మానసమున నలంత?
రాచకూతుండ్రు సుతుల సంగ్రామ నిరత । హృదయు లగువారిఁ గాంచఁ గోరుదుర కాదె'.

**(స్త్రీ. 2.167)**

**8. మూడు రసాల ముచ్చట:**

శల్యపర్వంలో భయానక రసం సున్నితంగా పోషించబడింది. భయం కలిగించేవారు మూడు రకాలు. 1. ఆకృతి భీషణులు; 2. క్రియా భీషణులు; 3. మాహాత్మ్య భీషణులు. రాక్షసులు, పిశాచాలు మొదలైనవారు ఆకృతి భీషణులు.

వీరభద్రుడు, పరశురాముడు మొదలైనవారు క్రియా భీషణులు. శ్రీకృష్ణుడు మొదలైన దివ్యులు మాహాత్మ్య భీషణులు. భయం ఒకటే అయినా హేతువులనుబట్టి మూడు విధాలయింది. భయాన్ని అనుభవించేవారు కూడా త్రిగుణ ప్రధానులుగా ఉంటారు. సహజభయం రజస్తమ ప్రవృత్తులలోనూ, సత్త్వసముత్థమైన భయం సాత్త్వికులలోనూ గోచరిస్తుంది. శల్యపర్వంలో ధర్మజుడు సాత్త్వికుడు; దుర్యోధనుడు రాజసికుడు. వీరిద్దరికి కలిగింది మరణభయమే. భయాలన్నింటిలో మరణభయం గొప్పది. స్థాయిభావంగా అభివృద్ధి చెందగలిగింది. సాత్త్వికుడైన ధర్మరాజు శల్యుడిని సంహరిస్తానని ప్రతిజ్ఞచేసినా శ్రీకృష్ణుడి ఆశీస్సులుంటే తప్ప గెలవటం సాధ్యం కాదనే భయం ఆయనకు లోలోన ఉన్నది. ఇంగితజ్ఞుడైన కృష్ణుడు -

క. 'గాంగేయుని గుంభజుఁ గ । ర్ణుం గడచిత; మింక నుద్ధురుం డగు మద్రే
శుం గూల్పు; మంతతోడఁ దె । గుం గురుపతి పని; జయంబు గొనుము గడంకన్' **(శల్య. 1. 94)**

అని ధర్మరాజును ప్రోత్సహించాడు. యుద్ధంలో శల్యుడు ప్రచండంగా పోరాడినా రెండు మూడుసార్లు మూర్ఛపోయాడు. జయాభిలాషతో పాటు అపజయభయాన్ని కూడా అతడు దుర్యోధనుడికి కలిగించాడు. ధర్మరాజు తన శక్తినంతా వినియోగించి పోరాడినా మూడుసార్లు మూర్ఛపోయి, అపజయం పాలౌతానని భయపడ్డాడు. మూడుసార్లు దైవాన్ని స్మరించిన సన్నివేశం వెనుక గమనించాం. విశేషమేమంటే భయానకరసానికి దైవం కాలుడు, వర్ణం కృష్ణం. ధర్మరాజు చేసిన హరిహరాత్మకమైన స్తుతి భయానక రసాన్ని వ్యంగ్యంగా సూచించింది. ధర్మరాజుకు భయకారకుడు శల్యుడు. అతడు క్రియాభీషణుడు. శల్యుడు ధర్మరాజుపరాక్రమాన్ని చూచి భయపడ్డట్లు లేదు. నాయకుడైన ధర్మజుడే భయభావానికి పాత్రం కావటం రసవిశేషం.

శల్యపతనానంతరం దుర్యోధనుడిపై యుద్ధ భారం పడింది. ఆ పరిస్థితిలో రాజే స్వయంగా యుద్ధంచేసి ఆదర్శవంతుడు కావాలన్న శకుని సూచనతో యుద్ధాన్ని సాహసంతో సాగించాడు. భీముడు గదతో 21వేల మంది వీరులను ఏనుగులనూ అడవిని కూల్చినట్లు మట్టుపెట్టాడు. అర్జునుడు అశ్వాలనూ, రథాలనూ పడగొట్టాడు. ధృష్టద్యుమ్న సాత్యకులు సాల్వుడిని కడతేర్చారు. కృతవర్మ విరథుడయ్యాడు. ఉలూకుడూ, శకునీ అశ్వయుద్ధంలో నకుల సహదేవుల చేతులలో హతులయ్యారు. దుర్యోధనుడి తమ్ముడు సుదర్శనుడు చనిపోయాడు. దుర్యోధనుడు తనచుట్టూ నిలిచిపోరాడేవారు లేక, ఎదుట పాండవులు హర్షోత్సాహాలతో విజృంభించటం చూచి సహించలేక, ఒంటరిగా దొరికితే తనను పాండవులందరూ కలిసి చంపుతారనే భయంతో రణం నుండి తొలగి, రక్షణకొరకు ద్వైపాయనహ్రదంలో దాగుకొన్నాడు. ధర్మజుడు దుర్యోధనుడి భయాన్ని పేర్కొని అధిక్షేపించాడు.

మ. 'భయముం బాయఁగఁ ద్రోచి వీరగుణముం బాటించి సంగ్రామ ని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషము మైఁ జూ పొండె గెల్పొండెఁ గా
క యధీరత్వము నాకు నీడె? యని వీఁకం బేర్చి వే తాఁకు; మెం
తయుఁ బేరయ్యెడు రమ్ము! లె! మ్మొదిఁగినం దైన్యంబు వచ్చుం జుమీ!' **(శల్య. 2. 61)**

ఇందులో తిక్కన భయభావం వలన కలిగే అనుభవాదులను పేర్కొని వాటిని దాటి యుద్ధవీరాన్ని ప్రకటించుమని ధర్మజుడు ప్రబోధించినట్లు రసవ్యంజకమైన రచన చేశాడు. 'నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరుదు' అని దుర్యోధనుడు తన స్థితిని సమర్థించుకొన్నాడు. కొలనునుండి బయటకు వస్తే పాండవులందరు కలిసి ఒక్కుమ్మడిగా పై బడి చంపుతారేమో నన్న భయం అతడిని మొదట పీడించింది. భయం ఆ ఉద్ధతుడిచేత పేదమాటలు మాట్లాడింపజేసింది. మచ్చుకు -

సీ. 'మీ రేవురును బరివార బాంధవ మిత్ర । సహితుల, రఖిలాస్త్ర శస్త్రవంతు
లరు, కరిస్యందన తురగ సమేతులు; । రే నొకరుండ, విహీన సహచ
రత్వంబు విగతాయుధత్వంబు వాహన । హీనత నొందితి; నే విధమున

నని యొనర్పఁగ వచ్చు? నది గాక పోటుల । డస్సితిఁ గడు; మీకు డప్పి లేదు;

తే. వరుసఁ దగ నొక్కఁ డొక్కఁడ వచ్చి పోరు । డిపుడ వెడలి మిమ్మందఱ నెల్ల చెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ; జుట్టుముట్టి । పలువు రొక్కనితోఁ బోరఁ బాడి యగునె?' **(శల్య. 2. 84)**

'పలువురు కూడి ఒక్కడిని చుట్టుముట్టి చంపటం' అనే క్రూరనీతి కౌరవులే అభిమన్యు వధలో ప్రయోగించారు. పాండవులు దాని కెప్పుడు ఎట్లా తిప్పికొట్టి ప్రతీకారం చేస్తారో అని దుర్యోధనుడి హృదయంలో పెనుభూతంవలె భయం బెదిరిస్తూనే ఉన్నది. అతడికి అభయం ఇచ్చే దైవం లేక నేలకూలాడు.

శల్యపర్వంలో నాయక ప్రతినాయకు లిరువురూ భయాభావంచేత ఆవరించబడి వ్యవహరించటం వలన వారి నాశ్రయించిన అంగరసంగా భయానకం భాసించింది.

సౌప్తికపర్వం బీభత్సరస ప్రధానం. ఈ పర్వానికి నాయకుడు అశ్వత్థామ. అర్ధరాత్రివేళ గుడ్లగూబ చెట్టుకొమ్మలపై నిద్రిస్తున్న కాకులను చంపిన దృశ్యాన్ని చూచాడు.

ఉ. 'కొన్నిటి కంఠముల్ నులుపుఁ, గొన్నిటి కాళులు ద్రుంచు, నుగ్రతం
గొన్నిటి పక్షముల్ నఱకుఁ, గొన్నిటి పొట్టలు వ్రచ్చు లీలమైఁ,
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు; నిట్టుల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా!' **(సౌప్తి. 1.18)**

ఈ దృశ్యం చూచిన అశ్వత్థామకు జుగుప్స కలగాలి. జుగుప్స సామాన్యంగా వైరాగ్య ప్రేరకం కావచ్చును. లేదా రౌద్రప్రేరకం కావచ్చును. అశ్వత్థామకు రౌద్రోద్రేక హేతువయింది. తానుకూడ పాండవ శిబిరంమీద పడి పగరను దారుణంగా చంపి భయానక బీభత్సాలను సృష్టించాలనే ఉత్సాహం కలిగింది. బీభత్సకారకుడైన అశ్వత్థామకు ఆ రసాధిదేవత అయిన మహాకాలుడైన శివుడు ప్రత్యక్షమయ్యాడు. అతడు అఖిలభూత భయంకరుడు. అతడి రూపం ఉగ్రంగానూ, సుందరంగానూ, ఉజ్జ్వలంగానూ, భీషణంగానూ ఉన్నది. అశ్వత్థామ ప్రయోగించిన ఆయుధాలన్నీ ఆ భూతనాథుడిపట్ల వమ్మయి పోయాయి. చివరికి అశ్వత్థామ ఆత్మోపహార మిచ్చే వీరకృత్యానికి పూనుకొన్నాడు. అతడి తెగువకు మెచ్చి శివుడు తాను నారాయణాత్మకుడైన మహాకాలుడ నని తెలియచెప్పుకొని, పాంచాలురకు కాలం చెల్లిందని పేర్కొని, ఒక మహనీయ ఖడ్గాన్ని ప్రసాదించాడు.

అశ్వత్థామ అసలే రౌద్రరసమూర్తి. దానికి తోడు మహాకాలుడి ఖడ్గంతో భయానక రూపం తాల్చాడు. రౌద్రభయానకాలు జనక రసాలు. వాటివలన కరుణ బీభత్సరసాలు జనిస్తాయి. రౌద్రరసం శత్రుసంహార రూప రౌద్రకర్మగా అశ్వత్థామ నాశ్రయించింది. వీరుల కది భయానకంగా పరిఢవిల్లింది. చూచేవారిలో, వినేవారిలో, ఆ దృశ్యాన్ని చదివేవారిలో అది భయానక రసంగానూ, కరుణ రసంగానూ పరిణమించింది. పీనుగులను తింటూ విచ్చలవిడినాట్యం చేసే పిశాచాలను చూస్తే జుగుప్స కలుగుతుంది. ఒక్కొక్క అవస్థకు ఒక్కొక్క ఉదాహరణం.

1. అశ్వత్థామ చేసిన ధృష్టద్యుమ్న సంహారం అతిభయంకరం. మచ్చుకు -

చ. 'వివశత భీతిఁ బొంది కడు విహ్వలుఁడై తనుఁ జూడ ద్రోణ సం
భవుఁడు వెసన్ శరాసనము వాపి గుణంబు తదీయకంఠముం
దవులఁగఁ జేర్చి వాగురవిధం బొడఁగూర్చి మనంబు విక్రమో
త్సవమున నుబ్బఁగాఁ బశువుఁ జంపెడు చాడ్పునఁ జంపువేడుకన్'. **(సౌప్తి. 1. 152)**

2. చూచేవారికి కరుణరస కారకం.

తే. 'పీనుఁగై యున్న పాంచాల సూనుఁ జూచి । రక్షకులును దదీయపురంధ్రులును స
మగ్రశోకాంధకార నిమగ్నచిత్త । వృత్తులై యేడ్చి రెలుఁగులు విన్ను ముట్ట'. **(సౌప్తి. 1. 163)**

3. అశ్వత్థామ సలిపిన సంహార క్రీడలు భయంకరాలే కాక బీభత్స కారకాలు కూడా.

శా. 'కాలాకారతఁ బేర్చి దోర్లసిత ఖడ్గస్ఫార సాంద్రప్రభా
జాలం బొప్పఁగ నిట్లు సొచ్చి లఘుసంచారంబు శోభిల్లఁ బాం
చాల వ్రాతముఁ గ్రీడమైఁ దునిమె రక్షశ్శ్రేణి మాంసంబుఁ గీ
లాలంబుం గబళించి త్రావి మదలీలాలోలతం గ్రాలఁగన్'. **(సౌప్తిక. 1-171)**

4. దానవగణం చేసే రక్తపానాదులు జుగుప్సాకరాలు.

వ. 'ఇవ్విధంబున వివిధ వికారాననంబులు బహుభంగిక కరపాదంబులు గలుగు నపరిమిత క్రవ్యాదులు గవిసి మేదోమాంస మస్తిష్క మజ్జంబు లానుచుం, జవియైనవానిఁ బుత్రమిత్ర కళత్రాదుల కొసంగుచు, నన్యకోటి బెరసినయెడఁ ద్రోద్రోపులాడి, యవియుఁ గైకొనుచుం గీలాల పానంబున మత్తిల్లి నృత్యంబులు సేయుచు మఱియు ననేక ప్రకారంబుల విహారంబు సలుపుచు నుల్లసిల్లిరి'..... **(సౌప్తి. 1. 202)**

అశ్వత్థామ పగతో నిర్వహించిన రౌద్రకర్మ వలన పాండవులలో కరుణరసం ఉద్భవించింది. కరుణనుండి ద్రౌపదిలో మరల రౌద్ర ముదయించింది. భీముడిలో ఆ రౌద్రం రూపం తాల్చింది. అర్జున శ్రీకృష్ణాదులలో అది అతిశయించింది. అశ్వత్థామపై ఆ క్రోధం విజృంభించింది. పాండవ క్రోధం అశ్వత్థామకు తాపకారకమయింది. అతడి ప్రతీకార వాంఛ పాండవులకు భయంకర శాపంగా పరిణమించింది. శ్రీకృష్ణుడే లేకపోతే కథ అపాండవంగా ముగిసేది. అశ్వత్థామ చివరకు వాసనకొట్టే శరీరంతో, అన్నపానాలు లేక, ఏకాకిగా, మూడువేల ఏళ్ళు తిరుగుతూ ఉండవలసి వచ్చింది. అతడి స్థితిని గమనిస్తే ఆకృతి కట్టిన బీభత్సం వలె భాసించాడు. బీభత్సాన్ని సృష్టించి తానే బీభత్సంగా మారిన అశ్వత్థామ పగవలన పతితుడైన బ్రాహ్మణుడు.

నన్నయ స్త్రీపర్వాన్ని సుకవులు, పండితులు సభలలో మెచ్చుకొంటారనీ, అది 'కృపాయితమై' (కృపాయుతమై) ఉంటుందని పేర్కొన్నాడు. అయితే 'కృప' దయారసమైనా కావాలి, లేదా కరుణరసమైనా కావాలి. స్త్రీపర్వం కరుణరస ప్రధానమని జగద్విదితం.

క. పర్వుచు స్త్రీపర్వాదిక । పర్వంబుల నేనిటం గృపాయితమై స్త్రీ
పర్వంబు పదునొకండగు । పర్వము నా వెలయు సుకవిపండిత సభలన్.' **(ఆది. 1.56)**

తిక్కన స్త్రీపర్వాన్ని కరుణరస సంభరితంగా సంతరించాడు. కరుణానికి స్థాయిభావం శోకం. ఆత్మీయుల మరణం వలన ఏర్పడిన శోకం రసస్థాయికి చేరుతుంది. శోకం ఉత్తమ మధ్యమాధమ పాత్రలలో వేరువేరుగా వ్యక్తమౌతుంది. ఉత్తమ మధ్యములో పరగతం అనీ, ఆత్మగతమనీ రెండేసి విధాలుగా గోచరిస్తుంది. పరులను ఆశ్రయించిన విభావాలచేత శోకం కలగటం పరగతం. స్వాశ్రయా (ఆత్మగతా)లైన విభావాలచేత ఉత్పన్నమయ్యేది ఆత్మగతం. స్త్రీ పురుషులలో శోకం సమానమే అయినా స్త్రీలలో సుస్వరంగా రోదించటం, మోహం చెందటం, పరివేదనం, విలపించటం, ఆయాసపడటం, గుండెలు బాదుకొనటం వంటి చేష్టలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. స్త్రీల వాచకాభినయంలో హాహాకారాలూ, రోదనలూ,

ఆక్రోశాలూ, ప్రలాపాలూ, దీర్ఘభాషణలూ, దూరాహ్వానాలూ, ఆక్రందనలూ ఉంటాయి. గుణ కథనంతో కూడిన రోదనం విలాపం. గద్గదకంఠంతో గుణాఖ్యానంతో కూడిన రోదనం పరిదేవితం. బిగ్గరగా ఏడ్వటం ఆక్రందనం. ఇట్లా కరుణరస పోషణం కావ్యనాటకాలలో ప్రసిద్ధం. విశేష మేమంటే అలంకార శాస్త్రంలో ఎన్నిరకాల శోకాభినయ విశేషా లున్నాయో దాదాపు వాటికన్నిటికీ తిక్కన రచించిన స్త్రీపర్వం సరసోదాహరణ కావ్యంగా ఉండటం అపూర్వం.

స్త్రీపర్వంలో గాంధారి స్వయంగా దుర్యోధన దుశ్శాసనాదులైన కుమారులను, శకునివంటి బంధువులను తానే స్వయంగా దర్శించి, స్పర్శించి దుఃఖించింది. అది స్వాశ్రయ శోకం. కోడళ్ళు, వీరుల భార్యలు ఆయా వీరుల శవాలను చూస్తూ విలపించినవన్నీ తాను విని స్పందించి శ్రీకృష్ణుడికి చెప్పింది. దీనిని పరగత శోకం అనవచ్చును. స్త్రీల రోదనలలో సుస్వర విన్యాసాలు విశేష వృత్తాలలో ధ్వనించాయి. శవాల దీనస్థితి చూస్తే శత్రువుకు కూడా గుండె తరుక్కొనిపోతుంది. రణభూమిని స్వయంగా చూచిన అనుభవమున్న తిక్కన గాంధారి దృష్టితోచూచి వర్ణించినదంతా సహజంగా సమకూరింది. ఇనుమును బంగారం చేసే రసవిద్య తిక్కనది. జుగుప్సాకరమైన శిథిల శవాలపై వారి జీవన స్మృతుల చిత్రాలను చిత్రించి, స్త్రీ విలాపాలతో ఫ్రేములు కట్టి భావుకుల మనఃఫలకాల మీద తగిలించాడు.

మచ్చుకు కొన్ని:

1. గాంధారి దుర్యోధనుడి శవాన్ని చూచి శోకాతిశయంతో మూర్ఛపోయి, కాసేపటికి తెప్పరిల్లి పరిచారికలు తనను తీసికొనిపోగా కుమారుడి దరిచేరింది.

తరల. 'విపుల వక్షముమీఁద నశ్రులు వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతి కుంజర! కౌరవేశ్వర! నేల నిమ్మెయి నీ యుదా
త్తపు శరీరముఁ బొందఁ బాడియె? తల్లి వచ్చిన భక్తితో
నుపచరింపక లాఁతివై యిటు లూరకుండుట యుక్తమే?' **(స్త్రీ. 2. 27)**

అని విలపించింది. తల్లి వస్తే ఎదురువచ్చి ప్రీతితో మాట్లాడి ఉపచరించే సన్నివేశం రణరంగంలో పడి ఉన్న అతడి శరీరాన్ని చూచినప్పుడు జ్ఞాపకం రావటం సహజం. కరుణరసభరితం. తరలమంటే చంచలం, తరంగితం, కంపితం అని అర్థం. ఏడుమాత్రల ఆవృత్తితో నడిచే తరలం మత్తకోకిలవలె రాగరంజితం. శృంగార కరుణాది రసాలలో సస్వర విన్యాసం దీనిలో బాగా రాణిస్తుంది.

తిక్కన తరలవృత్తాన్ని అయిదు సార్లు స్త్రీ పర్వంలోనే వాడాడు. ఆ అయిదింటినీ స్వాశ్రయశోక వర్ణనలోనే వినియోగించి ప్రధాన స్త్రీ పురుష పాత్రలు ఆత్మీయులైన ప్రముఖులను గురించి విలపించినట్లుగా రచించటం ఛందోరసశిల్పం. ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క శోకభంగిమ. ధృతరాష్ట్రుడు శోకచింతాభారంతో మాటాడలేక స్తంభమనే భావముద్రను వహించి ఉన్న స్థితి 1.4వ పద్యంలో చిత్రించాడు. గాంధారి దుర్యోధనుడిని చూచి విలపించినట్లుగానే దుశ్శాసనుడి శవాన్ని చూచికూడా తరలవృత్తంలో విలపిస్తుంది. దుర్యోధన దుశ్శాసనుల భార్యల విలాపం కంటె తిక్కన గాంధారి శోకానికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు. వారు కథలో అనామకలుగా ఉండటం దానికి కారణం కావచ్చును.

గాంధారి తరువాత కర్ణుడిని గూర్చి కుంతి చేసిన విలాపం కూడా తరలవృత్తం కావటం విశేషం (2.174). ఈ రెండింటికంటె తిక్కన మరొక ఔచిత్యాన్ని కూడా పాటించాడు. అభిమన్యుడిని గురించి ఉత్తర విలపించిన తరలవృత్తం (2.79) కరుణరసార్ద్రం. తల్లులు కొడుకులను గూర్చి పలికినవి విలాపాలు కావటం, భార్య భర్తను గురించి పలికినది పరిదేవితం కావటం మరొక విశేషం.

2. సైంధవుడి భార్య దుస్సల గాంధారి కూతురు. ఆమె తన భర్త తల తెగి ఎక్కడ పడ్డదో కనుగొనలేక వెర్రిగా అటూ ఇటూ తిరుగుతున్నదట! దుఃఖాతిశయంలో అది ఒక దుర్భరావస్థ. కరుణ రసాలంబనంగా ఉన్న ఆ కూతురును చూచి గాంధారి స్పందించిన తీరు మనస్సును ద్రవింపచేస్తుంది.

తే. 'హృదయమున వగలేని యట్టిట్టు నట్టుఁ । దిరుగుచున్నది దుస్సల వరుని శిరము
గాన; కీ కూఁతు నిమ్మెయిఁ గనుటకంటె । దలఁప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ!' (స్త్రీ. 2.97)

3. తమ్ముడైన శకుని శవాన్ని చూచి గాంధారి బోరున దుఃఖించలేదు. ఆయన తన కొడుకులకు చేసిన కానరాని కీడును స్మరిస్తూ వేడిగా నిట్టూర్చింది.

మత్తకోకిల. 'వార లస్త్రహతాంగులై యనవద్య లోకముఁ గాంచి; రీ
వైరకర్తయు నట్ల గాంచెను; వారి నల్వ విచారులం
బోరి కెత్తెడునట్లుగాఁ దగఁ బొంది వెఱ్ఱులఁ జేసె నీ
క్రూరుఁ; డందును నన్నదమ్ములకున్ విరోధము సేయఁడే!' (స్త్రీ. 2.139)

4. శరతల్పగతుడై ఉత్తరాయణ పుణ్యకాలం కొరకు ప్రాణాలు ఉగ్గబట్టి శయనించి ఉన్న భీష్ముడిని దర్శించి దుఃఖించటానికి మారుగా కంటె భక్తితో నమస్కరించింది గాంధారి. భక్తిగౌరవ ప్రదమైన శోక ప్రదర్శన మది.

క. 'దేవుఁడు గా కితఁడు నరుఁడు । నా వచ్చునె! నిష్ఠ పెంపునం బ్రాణంబుల్
తా వలసినపుడు విడువం । గా వేడుక నునిచినాఁడు గాదె తనువునన్'. (స్త్రీ. 2.118)

5.ద్రోణాచార్యుల శవాన్ని చూచి మర్యాద పూర్వకంగా కంటతడిపెట్టింది గాంధారి. కౌరవుల ఆశల కన్నింటికీ ఆలంబనమైన ద్రోణుడు శిష్యుల నమస్సులందుకొనే పూజ్యపాదుడు. అతడి పాదాలను నక్కలు తిన్న వైఖరిని గమనించి నిట్టూర్చింది.

తోటకము.'సతతంబును శిష్యులు సద్వినయా । న్వితులై ప్రణమిల్లెడు వీరపద
ద్వితయంబు గడుం జెడఁ దిన్నవి సూ । చితె నక్కలు దైవము చెయ్దిఁ గటా!' (స్త్రీ. 2.122)

6.గాంధారి స్త్రీల విలాపాలలో విపంచినాదాలు విన్నది. శోకంలో నుండి రాగమయ శోకా లుద్భవిస్తాయని శ్రీకృష్ణుడికి (శ్రోతకు) వినిపించింది ఉత్సాహవృత్తంలో.

ఉత్సాహ.'మానినీ జనంబు సేరి మగధనాథుఁ డగు జయ
త్సేను చుట్టు నేడ్వ నధిక దీన నాదములకు నా
మానసంబు సాంద్ర కరుణమయతఁ బొందె; మోహనం
బైన యట్టి యేడ్పు లెందు నంబుజాక్ష! వింటివే!' (స్త్రీ. 2. 143)

కవిత్రయ మహాభారతంలో నన్నయ నాలుగు, ఎఱ్ఱన రెండు, తిక్కన ఏడు ఉత్సాహ వృత్తాలను రచించారు. ముగ్గురిలో ఎక్కువ వ్రాసిన తిక్కన వాటినన్నింటినీ స్త్రీపర్వంలోనే వాడాడు. అందులోనూ ఏడింట నాలుగు గాంధారి నోట పలికించాడు. వరుసగా బాహ్లిక, సైంధవ, జయత్సేన, సుకేతనుల శవాలను చూచి విలపించిన వాక్యాలను వాటిల్లో నినదింపజేశాడు.

పై పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ కీ.శే. డా॥ పాటిబండ మాధవశర్మగారు ఇట్లా అన్నారు. ''జయత్సేనుడి చుట్టుఁ జేరి విలపించు నాతని భార్యల దీననాదములు వినుచు గాంధారి తన యప్పటి చిత్తవృత్తిని తానే యొక యుత్సాహవృత్తమున

వర్ణించుచున్నది. తిక్కన రససిద్ధాంత గర్భిత మీ పద్యము. ప్రసాదమాధుర్య గుణములకు నిధియైన ఈ పద్యము గాంధారి తత్కాల కరుణరస పారవశ్యమును చక్కగా వ్యక్తము చేయుచున్నది. మోహనములైన జయత్సేన పత్నుల రోదననాదములు గాంధారీ హృదయమునఁ బ్రతిధ్వనించి యామె వాక్యమందలి వర్ణవిన్యాసమునఁ బ్రత్యక్షమై శ్రోతకు పరమాహ్లాదము ప్రసాదించుచున్నవి. ఈ వృత్తమందలి యక్షరములలో సగము వఱకు అనునాసికములు, బిందుపూర్వక సరళములు నగుట గమనించ వచ్చును." (ఆంధ్ర మహాభారతము: ఛందశ్శిల్పము - పుట. 364).

తిక్కన మహాకవిత్వ శిల్ప సౌందర్యంలో శల్యసౌప్తిక స్త్రీపర్వాలు రసోల్లాసాన్ని రాగరంజితంగా రంగరించుకొన్నాయి.

## 9. తిక్కన రచనా శిల్పం:

తిక్కనది ప్రధానంగా వర్ణనాత్మక ధోరణి, నాటకీయ ఫణితి. జడపదార్థాలలో చైతన్య స్ఫూర్తిని ప్రదర్శించటం, ప్రకృతిని కథాసన్నివేశానికీ, పాత్రల మనః ప్రవృత్తులకూ అనుగుణంగా ప్రకరణోచితంగా వర్ణించటం, బీభత్సాది పరుష రసాలకు రమణీయ స్వభావాన్ని కల్పించి రసాస్వాదన శక్తిని పెంచటం, నిత్యజీవితం నుండి ఉపమాద్యలంకారాలను ఎన్నుకొని వర్ణనలు నిర్మించి ఆంధ్రావళి మోద మొందేటట్లు చిత్రించటం వంటి శిల్ప విశేషాలు ఏ పర్వంలోనైనా సామాన్యంగా గోచరిస్తాయి. ఈ పర్వత్రయంలో ప్రతిఫలించిన కొన్ని శిల్పాలను మచ్చుకు గమనిద్దాం.

### (1). సూర్యోదయ వర్ణనం:

శల్యపర్వారంభంలో యుద్ధం ప్రారంభం కాకపూర్వం సూర్యోదయమైనట్లు మూడు పద్యాలలో వర్ణించి ప్రకృతికీ, కాలానికీ, కథకూ ఉన్న సంబంధాన్ని కళాత్మకంగా ఆవిష్కరించిన శిల్పం తిక్కనకు వెన్నతో పెట్టిన విద్య.

ఉ. 'ఒండొరులన్ జయించు మతి నుద్భట లీలలఁ జాల నొప్పి య
ప్పాండవ కౌరవుల్ పెనఁగుభంగిఁ గనుంగొను నొక్కొ యీ
తండు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగు బింబకాంతి న
ర్కుం డభిరాముఁడై పొడపుఁగొండ పయిన్ వెలుఁగొందెఁ జూడఁగన్'.

చ. 'అరసి యనాగతం బెఱుఁగునట్టి మనంబులు గల్గు పాండు భూ
వరసుత బంధుమిత్ర కురువర్గ సుహృజ్జనకోటు లత్తఱిం
బొరసె నతిప్రమోదమును భూరి విషాదము నాఁగ నంబుజో
త్కరము వికాసమయ్యెఁ, గుముదంబులు మీలన మొందె నెంతయున్'.

సీ. కుంజర నికురుంబకుంభస్థలీ సంగ । సిందూర రుచులతోఁ జెలిమి చేసి,
కేతన వ్రాత సంకీలిత మాణిక్య । రశ్మల గెడ విహారంబు సలిపి,
సైనిక నికర వక్షఃస్థల పరిలిప్త । కాశ్మీర దీప్తులఁ గౌఁగిలించి,
దండనాథోత్కర చండభావోద్వృత్త । చక్షుః ప్రభలుఁ దారు సరసమాడి,

తే. యంశుజాలంబు లుభయ సైన్యంబులందుఁ । బరఁగి బహువిధ శస్త్రాస్త్ర కిరణతతుల
బెరసి ప్రాగ్భాగలక్ష్మి దీపించి మెఱయ । బాల్యరమణీయుఁ డగు చిత్రభానుఁ డొప్పె'. **(శల్య. 1.114-116)**

కావ్యంలో ఉండే అష్టాదశవర్ణనలలో ఒకటిగా భావిస్తే ఈ సూర్యోదయ వర్ణనం కవి ప్రతిభకు ప్రతీకగా భావించవచ్చును. తాత్పర్యం మూడు ముక్కలలో చెప్పాలంటే - సూర్యుడు తూర్పుకొండమీద ఉదయించాడు. పద్మాలు వికసించాయి, కలువలు ముకుళించాయి. సూర్యకిరణాలు చతురంగబలాలపై పడి ఆయా సైన్యాభరణాలపై ప్రతిఫలించి తూర్పుదిక్కనే

లక్ష్మికి వెలుగు తోరణా లందించాయి. యుద్ధప్రారంభానికి సమయం ఆసన్నమయింది అనే కాల సూచనగా వర్ణనం జరిగింది.

తిక్కన దీనిని అలంకృతం చేశాడు. మొదటి పద్యంలో ఉత్ప్రేక్ష ఉన్నది. జడమైన సూర్యబింబాన్ని అభిరాముడిగా చెప్పి దానియందు చేతనత్వాన్ని ఆరోపించాడు. ఆ రోజు చివరిరోజు కాబోతున్న దన్న కాలసూచనను చేస్తూ ఆ వీరుడు ఉభయసేనల యుద్ధం చూడాలన్న ఆసక్తితో తూర్పుకొండపై కెక్కి విహంగవీక్షణంచేయాలని సంకల్పించాడో అన్నట్లు కనపడుతున్నాడట! సూర్యుడు కాలానికి కాని నారాయణుడికి గాని ప్రతీక కావచ్చును. కాలపురుషుడుగానూ నారాయణుడుగానూ శల్యవధ ధర్మరాజు నిర్వహించి విజయానికి బాటవేస్తాడని నిర్దేశించాడు. ఆ ఫలితాన్ని సూచించే వస్తు నిర్దేశంగా దీనిని అన్వయించవచ్చును. అప్పు డీపద్యం నాటి యుద్ధపర్వానికి నాందీవాక్యమౌతుంది. ఉత్ప్రేక్ష ఊహయే కాబట్టి వేచి చూడవలసిందే - అని భావం.

మొదటి పద్యం 'చూడఁగన్' అనే క్రియతో ముగిసి రెండవ పద్యం 'అరసి' అన్న క్త్వార్థక క్రియతో మొదలౌతుంది. పైకి చూస్తే అది సూర్యోదయమే. కాని, దాని ప్రభావాన్ని పరిశీలించి చూస్తే మరొక ఉత్ప్రేక్ష భాసిస్తుంది. పాండవ బంధుమిత్రులు, కౌరవబంధుమిత్రులు సూర్యోదయాన్ని చూచి బాగా ఆలోచించి క్రమాలంకారాన్ని ఆశ్రయించి ఒక వర్గం అత్యంతానందాన్ని పొందిందా? మరొక వర్గం భూరివిషాదాన్ని పొందిందా? అని ఊహించగలిగేటట్లుగా పద్మాలు వికసించాయట! కలువలు ముకుళించాయట! ఉభయ పక్షవీరులూ భవిష్యత్కాల ఫలాలను తెలిసికొనగల్గిన మనీషులట! అందువలన ప్రకృతి వివేకాన్నిబట్టి భవిష్యత్తును భావించగలిగారని భావం. అలంకారధ్వనితో పాండవులకు కలుగబోయే విజయం, కౌరవులకు రాబోయే విషాదం రెండవ పద్యంలో ధ్వనించింది.

నాంది మూడు శ్లోకాలలో ఉండటం ఒక పరిపాటి. తెలుగులో తిక్కన ఆ పరిపాటిని పద్యాలలోకి మార్చాడు. మూడవ పద్యంలో కూడా కర్త సూర్యుడే. అయితే అందులో చిత్రభానుడు, చిత్రాః భానవో యస్య సః చిత్రభానుః నానావర్ణాలైన కిరణాలు కలవాడు చిత్రభానుడు. అతడు బాల్య రమణీయుడు. చిన్నవయసులో ఉన్న అందగాడు. ప్రౌఢుడు, ప్రచండుడు కాడు; ఉభయభానుడు. కాబట్టి అతడు క్రీడాప్రియుడు. బాల్యస్నేహితుడు, అతడికి రంగులన్నా రంగుల కాంతులన్నా ఇష్టం. వాటితో తన చేతులు కలిపి ఆడుకొంటాడు. చిత్రభానుడి కరాలు (కిరణాలనే చేతులు) సహజంగా అరుణారుణ కాంతులు కలవి. ఏనుగుల కుంభస్థలాలపై సిందూరం కనపడితే ఆ వర్ణ కాంతులతో ముందుగా స్నేహం చేసికొని తన కిరణాల వన్నెను పెంచుకొన్నాడు. తరువాత టెక్కాలపై కట్టబడిన మాణిక్యాల కాంతితో కలిసి చేతులల్లారుస్తూ విహారం చేశాడు. సైనికుల వక్షఃస్థలాలపై పూసిన కాశ్మీర వర్ణకాంతులను తన చేతులతో కౌగిలించుకొన్నాడు. కోపోద్రిక్తులైన దండనాథుల చూపులలోని ఎర్రని కాంతులతో సరసమాడాడట! చిత్రభానుడి విచిత్రవర్ణ కరాలు (కిరణాలనే చేతులు) శస్త్రాస్త్ర కిరణతతులతో కలిసి ప్రాగ్దిశాలక్ష్మిని మెప్పించి మెరిసిపోయాయట! అంటే సూర్యకిరణాలు సైన్యంమీద పడి కాంతులు ప్రతిఫలించి వెలగటం చేత తూర్పుదిక్కున మరింత ప్రకాశింపచేశాయని భావం. శ్లేషప్రాణిత రూపకం వలన సూర్యకరప్రభావం ధ్వనిమయం అయింది. పాండవవర్గంలోని సైన్యం సంతోషాన్ని పొందుతుందనీ, కౌరవవర్గసైన్యం విషాదం పొందవచ్చుననీ భావికథార్థ సూచన ఏర్పడింది. జడవస్తువుల మీద చైతన్యపాత్రారోపణం చేయటమే కాకుండ, సాలంకృత వర్ణనతో ధ్వనిమయంగా కథావస్తువును సూచించే నాందీ శ్లోకమర్యాదను కూడా తిక్కన పాటించి శిల్పత్రివేణిని కల్పించాడు.

## (2). యుద్ధవర్ణనం

తిక్కన యుద్ధవర్ణనలతో భయానక బీభత్స రససన్నివేశాలను సైతం ఆస్వాద మధురంగా మార్చే రామణీయకమంత్రం ప్రయోగించి ఇనుమును బంగారం చేస్తాడు. శల్యపర్వంలో పోరు ఘోరంగా మొదలయింది. అది దొమ్మియుద్ధం. రక్తం ఏరులవలె పారినట్లు, అందులో వీరులు విహారాలు చేసినట్లూ అలంకరించి వర్ణించి భయానక బీభత్సాలలో రమణీయ దృశ్యం కల్పించాడు. ఇది గొప్పకాల్పనిక భావన! భావిప్రబంధ వర్ణనలకు మార్గదర్శి.

సీ. 'నెత్తుటఁ దోఁగియు నిగిడిపోరెడు వీరు । లలరిన నడమోదుగుల విధంబు,
గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహు దం । డములు మహాభుజంగముల పగిది,
యవని రక్తాక్తంబులై యున్న యట్టిబల్ । దలలు గెందామర కొలని పగిది,
దఱచుగా నెఱిదప్ప నొఱగిన గజములు । గులిశ భగ్నాచల కులమునట్లు,

తె. దునిసి తొఱఁగిన జోదుల తొడలు సామ । జముల కరములు నొండొంటి చందములు గ
నుంగొనఁగ వింత లగుటను సంగరాంగ । ణంబు రమణీయమును భీషణంబు నయ్యె'.

తె. 'ఏమి చెప్పుదు రౌద్రంపు టెసకమందుఁ । దఱచు మెదళులు ఱొంపులు నుఱుములైన
యెమ్ము లిసుకయు సితచామరమ్ము లంచ । లయ్యె రుధిరంపు టేఱుల కప్పు డధిప!'

క. 'విను మయ్యేఱులలో వా । హనములె యోడలుగఁ జూడ నక్కజ మగు ను
క్కున నుద్దామ విహారం । బొనరించిరి వీరయోధు లుర్వీనాథా!' **(శల్య. 1. 129-131)**

ఇటువంటి వర్ణనలు సందర్భోచితంగా పర్వమంతా పరచి కథను రక్తికట్టించాడు తిక్కన.

## (3). ప్రతిపద సార్థక్యం

క. 'పలపలని మూఁకలోఁ గా । ల్నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీ కొడుకు గదా
కలితభుజుం డయి యొక్కఁడుఁ । దొలఁగి చనియె; నేమి చెప్పుదుం గురునాథా!' **(శల్య. 1. 401)**

''ఈ పద్యమును గూర్చి యొక రసవంతమైన ఇతిహాసము కలదు. భారతరచనమున వేదవ్యాసునకు గణనాథుడు వలె తిక్కనగారికి గురునాథు డనువాడు లేఖకుడుగా నుండెనట! అతడు తిక్కనగారి వలె కొమ్మనగారి రక్తము పంచుకొని పుట్టిన కుమ్మరియట! గురునాథుని గంటము నిలిచినచో తిక్కనకంఠము నిలువదు అని ఆ యన్నదమ్ములు సమయము చేసికొనిరట! తిక్కనగా రీపద్యము చెప్పుచు 'తొలఁగి చనియె' అన్నచోట వాక్యము ముగిసియు పద్యము ముగియనందున, వ్యర్థ పదములతో పూరింప మనసు రాక, ఏమియు తోచక 'ఏమి చెప్పుదుం గురునాథా!' అని పలికిరట! గురునాథు డామాటను వ్రాసెనట! పద్యము పూర్తికాక గురునాథుని గంటము నిలిచిన దని భ్రమించి తిక్కనగారు తన కంఠము నుత్తరించుకొనబోయిరట! గురునాథు డాయనను వారించి గంటము నిలువకుండనే పద్యము పూర్తి యైనదని చెప్పి పై పద్యము కడముట్ట చదివెనట!. గురునాథుని ఉద్దేశించి తాను పలికిన వాక్యము ధృతరాష్ట్ర నుద్దేశించి సంజయుడు పలికినట్లు పద్యమున చక్కగా అతికినందులకు తిక్కనగారు మిగుల ఆశ్చర్య పడిరట! ఈ ఇతిహాసమున సత్యముమాట యెట్లున్నను సరసత్వము నిండుగా నున్నది. ఈ యైతిహ్యము లేనిచో ఈ చిన్నపద్యము నెవరు గుర్తింతురు? గుర్తింపనిచో ఇందలి సుందర శిల్పమంతయు అడవిగాచిన వెన్నెలయే కదా!

''పదునెనిమిదవనాటి అపరాహ్ణమున కౌరవ పక్ష స్థితి యెట్లున్నదో సంజయుడు ధృతరాష్ట్రునికి జెప్పుచున్నాడు. పదునొకండు అక్షౌహిణుల పరిమితిగల సేనయంతయు నశించినది. మహావీరులు, వీరభటులు, రథగజతురగదళములు నశించినవి. అల్పమైన కాల్బలము మిగిలినది. అప్పుడు దుర్యోధనుడు - పలపలని మూకలో - పలుచగా రణరంగములో కాల్నిలువక - 'కాలు' నిలుచునుగాని 'కాల్' నిలువదు. ప్రాణము లేని లకారము ప్రక్కకు క్రుంగదీయగా ఒరిగిపోవును. కాల్ నిలువక - గుఱ్ఱంబు డిగ్గి - యుద్ధారంభమున అతిరథుడైన దుర్యోధనుడు రథారూఢుడు; రథదళము నశింపగా భద్రగజారూఢుడు; గజదళము నశింపగా భద్రాశ్వరూఢుడు; అదియు నశింపగా అశ్వారూఢుడు. ఆ యశ్వము గుఱ్ఱము - తట్టు దానినుండి దిగినాడు. దిగుటకాదు. గుభాలున ఉరుకుట. డిగి గదాకలితభుజు డయినాడు. అతని బలగమంతయు నశించినది. మిగిలినది గదాబలము, భుజబలము. ఆ రెండింటిని కూడగట్టుకొనినాడు. ఒక్కఁడు - ఒంటరి - సోదరమిత్ర

బంధు వర్గమంతయు నశించినది. తొలఁగిచనియె - పారిపోయెనని చెప్పుటకు సంజయునకు బుద్ధిపుట్టలేదు. ఎంతటి వైభవముతో వెలిగిన రాజరాజు దుర్యోధనుడు ఎంతటి హీనదశకు వచ్చినాడు? దుర్యోధనుని శోచనీయావస్థను వర్ణించుటకు సంజయునికి మాటలు దొరకలేదు. ఏమి చెప్పుదున్ కురునాథా! - అని వాపోయినాడు. నిందయంతయు ధృతరాష్ట్రుని నెత్తిన మోపుచున్నట్లు 'నీ కొడుకు' అన్నాడు. నీ యవివేకము వలన ఇట్టి స్థితికి వచ్చినవాడు. నూర్గురు సోదరులకు మొట్టమొదటివాడయ్యు, అందరు చావగా చిట్టచివరకు మిగిలినవాడు దుర్యోధనుడు. అప్పటి స్థితిలో రాజరాజు కాడు. కేవలం ధృతరాష్ట్రుడి కొడుకు. పద్యమున ప్రతిపదము, అక్షరము పనితనము మెరపించుచున్నది. తిక్కనగారు భారతమును ఆశువుగా చెప్పినారని ఐతిహ్యము చెప్పుచున్నది. తిక్కనగారు ఆశువుగా చెప్పినను ప్రత్యక్షరము శిల్పరమణీయముగా చెప్పిరని ఈ పద్యము చాటుచున్నది." (డా॥ పాటిబండ మాధవశర్మ : తిక్కన కవితావైభవము: యువభారతి ప్రచురణ, 1974).

### (4). మానవ స్వభావ వ్యంజకమైన సన్నివేశ చిత్రణం:

అశ్వత్థామ రౌద్రోద్రేకంలో ఉన్మాదావస్థను ప్రదర్శించాడు సౌప్తికపర్వంలో. ధృష్టద్యుమ్నుడిని పశువును చంపిన విధంగా చంపితేకాని కోపం పోదనీ, ఉత్తమాస్త్రాలతో చంపననీ కృప, కృతవర్మలతో స్పష్టంగా చెప్పాడు. పాండవ స్కంధావారంలో పాన్పున గాఢనిద్రలో ఉన్న ధృష్టద్యుమ్నుడిని తలపట్టుకొని, పెడమరల దిగిచి,

ఉ. 'నేలపయిం బడం దిగిచి నిష్ఠురభంగి నురఃస్థలంబు మో
కాల నొగిల్చి యేపున మొగం బతిదారుణ ముష్టి నొంచె; ని
ద్రాలసవృత్తి నంగములయందు బలంబును బుద్ధినేర్పునుం
జాలని యవ్విరోధి వివశత్వముఁ బొందఁగఁజేసె వ్రేల్మిడిన్'. **(సౌప్తి. 1.150)**

ఉ. 'కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం
బోలుచుఁ బేర్చి యా ద్రుపదభూపసుతున్ సమయించె వేదనన్
ఱోలఁగ, రోఁజఁగాఁ బలుమఱుం బొరలంబడి లాలఁ గ్రక్క న
వ్వాలుమగండు వాక్పరిభవంబుఁ దలంచుచుఁ గ్రౌర్యధుర్యుఁడై'. **(సౌప్తి. 1.158)**

తన తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుడిని నిర్దయగా చంపి, అంతటితో ఆగక, ద్రుపదపుత్రులనూ పాంచాల దేశ వీరులనూ వరుసగా వధించాడు. అతడు సంహరించేటప్పుడు ఆయావీరుల తత్కాలావస్థలను తిక్కన అత్యంత సహజంగా చిత్రించాడు.

శా. 'నిద్రాసక్తునిఁ, గొంత మేల్కనినవానిన్, సుప్రబుద్ధాత్ముఁడై
యుద్రేకంబును శౌర్యసారమును బాహూల్లాసముం జూపఁ జం
చ ద్రేఖం దిరమైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాఁకి యు
న్నిద్రస్వైర సముద్ధతిన్ మెఱయువానిం దున్మె నేకాకృతిన్.' **(సౌప్తి. 1. 173)**

అంతటితో ఆగలేదు అతడి క్రౌర్యం. గజతురగాది బలాలను కూడా బలిగొన్నది. ఆనాటి రాత్రి గుడ్లగూబ కాకులను చంపిన ఘోరవైఖరిని తా నప్పుడు ప్రదర్శించాడు.

ఉ. 'కొన్నిటి పాదముల్ నఱుకుఁ, గొన్నిటి మోరలు సెక్కు, లీలమైఁ
గొన్నిటి కంఠముల్ దునుముఁ, గొన్నిటి వీఁపులు వ్రచ్చు, నుబ్బునం

గొన్నిటి సర్వగాత్రములు క్రూరవిచేష్టిత విభ్రమంబు దోఁ
ప న్నుఱుమాడుఁ బ్రౌఢబల భాసిత భూరి భుజావిహారుఁడై'. **(సౌప్తి. 1. 176)**

ప్రతీకార కాంక్షతో ధర్మాధర్మాలనూ, ఉచితానుచితాలనూ పాటించక వివేకాన్ని కోల్పోయి ఉన్మాదావస్థలో రక్తపిపాసువుగా మారిన అశ్వత్థామ పాత్ర చిత్రణం అత్యంత సహజం.

**(5). వస్తుచ్ఛందఃసంవాదం :**

మహాస్రగ్ధర: 'తలలన్ హస్తమ్ములం బాదములఁ దనువులం దత్ప్రదేశంబుఁ గప్పం
దొలఁగించున్ వానిఁ గ్రొన్నెత్తురు వఱపి; హయస్తోమదంతి ప్రతానం
బుల మేదోమాంస ఖండంబుల దనుజ మహాభోజనం బావహించున్;
మలఁగంబాఱున్ జెలంగు న్నలి నెసఁగు జయోన్మత్తుఁడై మానవేంద్రా!'. **(సౌప్తి. 1. 194)**

''ఈ మహాస్రగ్ధరయందు వర్ణింపబడిన యంశము రక్తమును ఘనీభవింప జేయు అశ్వత్థామ సౌప్తిక రౌద్రవిహారము. ఉపపాండవ సంహారఘట్టము. సౌప్తికపర్వము అద్భుత భయానక బీభత్స కరుణ జనకమైన మహారౌద్ర రసమునకు ఆటపట్టు. రుద్రదేవతావిష్టుడైన యశ్వత్థామ ప్రళయ విహారము ఇందలి వస్తువు. ఆ వస్తువును భావించి కవిబ్రహ్మయు రౌద్రరసావిష్టుడై రచన సాగించెనా యనిపించును. ఆ పర్వమందలి స్థాయిచ్ఛందము స్రగ్ధర. అది సర్వేతర వృత్తములను అధఃకరించి సహృదయుని రక్తమును కరడు కట్టించి హృదయ స్పందము మందీభూతము గావించు తమఃప్రధానమైనది. గురుదీర్ఘాక్షర బాహుళ్యము ఈ పర్వమందలి గద్యపద్యము లన్నింటను సులభముగా గుర్తింపవచ్చును. మంద్రము, మందమునైన హృదయస్పంద సంచారము పర్వమందంతటను ప్రళయసమయ మహాతాండవమందలి రుద్రదేవుని గురువిలంబిత పదన్యాసము ననుకరించుచున్నది. ఆఱు మత్తేభములు, ఆఱు శార్దూలములు నాతి దూరాంతరావృత్తము లైన ఇరువది స్రగ్ధరా మహాస్రగ్ధర రౌద్రతాండమునకు దీప్తి కలిగించుచున్నవి. పర్వమును పఠించిన సహృదయునకు ఇందలి 327 పద్యగద్యములను స్రగ్ధరాచ్ఛందమే యావేశించినదా యనిపించును. అశ్వత్థామ హృదయమువలె కవిబ్రహ్మ హృదయముకూడ రౌద్రావేశముచే ఏకాగ్రమై యున్నది. అంతరంగ బహిరంగ క్రియాసంవాదము, వస్తుచ్ఛందః సంవాదము ఈ పర్వమున పరమ రమణీయముగా నున్నవి. (డా. పాటిబండ మాధవశర్మ: ఆంధ్ర మహాభారతము: ఛందఃశిల్పము. పు. 553-554)

**(6). విలాపవీణానాదాల శ్రుతి మాధుర్యం :**

మందాక్రాంతము:

'వీణా నాద ప్రతిమ నిగమావిర్భవత్సారపుణ్య
శ్రేణీ సంపాదిత విమలతాస్థేమ నిర్లేపచిత్త
త్రాణ క్రీడాకలన సతతోత్సాహవద్దివ్యభావా!
ప్రాణాపానాహరణ నిపుణ ప్రాపణీయానుభావా!' **(స్త్రీ. 2. 185)**

''స్త్రీపర్వమున తా నుపయోగించిన ఛందముల మాధుర్యమును తిక్కనగారు తామే ప్రశంసించుకొనుచున్నారా యనిపించుచున్నది ఈ పద్యము. వీణానాద ప్రతిమము లైన వేదనాదముల లయించి నిర్మలములు, నిర్లిప్తములు నైన చిత్తములను త్రాణము చేయుటకు ఉత్సహించువాడట హరిహరనాథుడు. ఆ స్వామి తన నానావిధ మధురచ్ఛందోమయమైన స్త్రీపర్వము విని తన్ననుగ్రహించు నని తిక్కనగారి యాశయము. స్త్రీపర్వ ద్వితీయాశ్వాసమునందలి స్త్రీల రోదన నాదములు విని స్వామి కరుణార్ద్ర హృదయు డయ్యెనన్న సూచనయు నిందు గలదు. 'మోహనంబైన యిట్టి యేడ్పు లెందు నంబుజాక్ష!

వింటిమే!' అని కురుకాంతల విలాప మాధుర్యమున జొక్కిన గాంధారి శ్రీకృష్ణునితో పలికినది. ఆ మధుర నాదములు తిక్కనగారి చెవులందు మారుమ్రోగుచు ఆయన చిత్తమును కరుణరసమయము గావించుచుండె గాబోలు! ఆయననోట వీణానాద ప్రతిమ మధురమైన మందాక్రాంతావృత్తము వెలువడెను. రౌద్ర రసావిష్టమైన హృదయముతో సౌప్తిక పర్వమున హరిహరనాథుని స్రగ్ధరలో సంబోధించుట యెట్టి యౌచిత్యమో స్త్రీపర్వాంతమున మందాక్రాంతలో సంబోధించుటయు అట్టి యౌచిత్యమే. స్త్రీపర్వమున ప్రథమాశ్వాసము ప్రధానముగా ధృతరాష్ట్ర విలాపమయము. అతని విలాపములందు అంతర్వాహినిగా పాండవ ద్వేషము గలదు. ఓజః ప్రదీప్తమయిన ఆర్ద్రత ఆయన చిత్తవృత్తి లక్షణము. ఆ ఆశ్వాసము చివర తిక్కనగారు హరిహరనాథ ప్రబోధమున ఓజస్వినియైన శిఖరిణీవృత్తమును వాడిరి. ద్వితీయాశ్వాసము అంతయు గాంధారీ విలాపమయము. ఆమె చిత్తము శుద్ధకరుణమయము. మధురమైన ఆర్ద్రత దాని లక్షణము. ఈ యాశ్వాసము చివర తిక్కనగారు మధుర మందరమైన మందాక్రాంతను వాడిరి. పర్వరసానుసారియైన ఛందమును పర్వాంతమున ప్రయోగించుట ఛందోమర్మజ్ఞతకు పరకోటి'. (డా॥ పాటిబండ మాధవశర్మ; తిక్కన కవితావైభవం. యువభారతి ప్రచురణ).

## 10. ఉపాఖ్యానాలూ, ఉపదేశాలూ :

శల్యపర్వంలో బలరాముడి తీర్థయాత్రాభివర్ణనం, సౌప్తికపర్వంలో శివప్రభావ వర్ణనం అనేవి ఉపాఖ్యానాలుగా లెక్కించదగినవి. ఈ రెండూ కథకు ప్రత్యక్షంగా తోడ్పడి, కథాజీవితానికి బలాన్ని చేకూర్చేవి కావు, అయితే బలరాముడు చేసిన తీర్థయాత్రలలో ప్రభాసతీర్థంనుండి కురుక్షేత్రం వరకూ గల పుణ్యక్షేత్ర తీర్థ మాహాత్మ్యాలను గమనిస్తే కురుక్షేత్రం కూడా మహాపుణ్యక్షేత్రమని స్పష్టమౌతుంది. ఆ క్షేత్రంలో మృతులైనవారు స్వర్గవాసులౌతారని తెలుపబడుతుంది. దుర్యోధనుడు ఆ క్షేత్రంలో శమంత పంచకతీర్థం వద్ద యుద్ధంచేసి మృతుడైనందువలన అతడికి స్వర్గం తథ్యమని అతడితోపాటు అందరూ భావించటానికి దోహదకారి అయింది. బలరాముడు దుర్యోధన భీములకు గదాయుద్ధ గురువు కాబట్టి ఆయన ఎదుట శిష్యుల యుద్ధం జరగటం, ఆయన వారిరువురిలో యుద్ధ నియమాల ననుసరించి పోరు సలిపిన దుర్యోధనుడికి సద్గతి కలగాలనీ, భీముడికి కీర్తి కలగాలనీ ఆశించటం గమనిస్తే గదాయుద్ధంమీద విజ్ఞుల అభిప్రాయాలు ఎట్లా ఉంటాయో తెలుస్తుంది. శ్రీకృష్ణుడు బలరాముడికి ఇచ్చిన సమాధానం కాదనలేని ఒక తీర్పుగా నిలిచింది. కథలో ఊరుభంగ చర్యకు బలరాముడి చర్చ ఒక బలమైన ప్రతిపక్షంగా ఉంటుంది. శ్రీకృష్ణుడు దానికి ప్రతిసమాధానం చెప్పటం వలన పాండవయుద్ధనీతి కథలో బలపడింది. బలరాముడి తీర్థయాత్రా భాగం ప్రక్షిప్తమని కొందరి పండితుల అభిప్రాయం.

అశ్వత్థామకు పరమశివుడి అనుగ్రహం వలన లభించింది దివ్య ఖడ్గం. ఆతడి రౌద్ర విహారానికి గల కారణా లేమి టని ధర్మరాజు శ్రీకృష్ణుడిని అడుగగా గోవిందుడు చెప్పిన శివప్రభావ వృత్తాంతం సౌప్తికపర్వం చివర చెప్పబడి ఉన్నది. శివుడు కరుణిస్తే కలిగే లాభాలను, కోపిస్తే కలిగే నష్టాలను తెలిపే ఈ ఉపాఖ్యానం ధర్మరాజుకు సందేహ నివృత్తిని కలిగించటమే కాక భారత కథలో శివశక్తి నిర్వహించిన పాత్రకు వ్యాఖ్యాన మనిపించింది.

పాండవ పక్షంలో అర్జునుడు మహావీరుడు. అతడు శివుడిని తపస్సుతో మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. కౌరవ పక్షంలో అశ్వత్థామ రుద్రుడిని ఆత్మోపహారంతో సంతోషపెట్టి దివ్యఖడ్గాన్ని పొందాడు. ఆ పరమశివుడు నారాయణ సంకల్పానికి అనుగుణంగా సంహార కార్యాన్ని నిర్వహిస్తున్నట్లు పేర్కొన్నాడు. దీనినిబట్టి శ్రీకృష్ణుడే అర్జునుడికీ అశ్వత్థామకూ శత్రు సంహార శక్తులను సమకూర్చాడన్నమాట! స్థితికారుడి అదుపాజ్ఞలలో లయకారుడు వ్యవహరించటం వలన కాలం తీరినవారు విధి ప్రేరణతోనే కన్ను మూస్తారనే పరమసత్యాన్ని ఈ గాథ ప్రకటిస్తున్నది.

దుర్యోధనుడు తొడలు విరిగి పడిపోవటంతో గాంధారీ ధృతరాష్ట్రులు శోక సముద్రంలో మునిగారు. వారికి దుఃఖ కోపోపశమనం కొరకు హితోక్తులు.

సంజయుడు లౌకిక నీతివాదాన్ని ప్రమాణంగా చేసికొని హితవు చెప్పాడు. దుర్యోధనాదుల దుర్వర్తననూ, ధృతరాష్ట్రుడి

లోభగుణాన్నీ విమర్శించి, స్వయంకృతాపరాధం వలన కలిగిన విపత్తుకు అప్పుడు దుఃఖించటం గతజల సేతుబంధనం వంటిదనీ, హాస్యాస్పదమనీ హెచ్చరించాడు.

క. 'ఆర్యులు దఱితోఁ దగియెడు । కార్య మనుష్ఠింతు; రట్టుగా కప్పని మా
త్సర్యమునఁ దిగిచి పట్టి య । నార్యులు దుదిఁ దూర వగతు రాపద యైనన్''

ఆ. 'జున్ను డెప్పరంపుఁ జోటైన తఱి నున్నఁ । జూచి విఱుగఁబడుటఁ జూడ కాత్మఁ
దీపుఁ గోరి యుఱుకు తిండికాఁడును బోలె । నయితి; వగచు టింక ననుచితంబు'.

క. 'వగచినఁ బోయిన శౌర్యము । మగుడునె? వగవంగ లోకమాన్యుం డగునే?
వగ పుణ్యగతికి మూలమె? । వగ పెల్లవిధముల నుడుగవలయు నరేంద్రా!'. **(స్త్రీ. 1. 18-20)**

విదురుడు ధర్మనీతి నాశ్రయించి వైరాగ్య బోధకమైన హితవు చెప్పి దుఃఖోపశమనం చేయ యత్నించాడు. మచ్చుకు కొన్ని మాటలు:

తే. 'యౌవనంబును, రూపంబు, జీవితంబు । ద్రవ్యసంచయములు ననిత్యములు గావె!
వీని హానికి వగ పవివేక మగుటఁ । బండితులు వగఁ గూరరు పౌరవేంద్ర!'

సీ. 'ఒక యింటనుండి వేఱొక యింటి కరిగిన । విధమును, వస్త్రంబు విడిచి యొండు
వస్త్రంబుఁ గట్టిన వడువును నై యుండు । నొడలు దొఱంగి యొండొక్క యొడలు
గైకొంట నృప! విను కడవకు సారెపై । నమర మృత్తిక యిడునపుడు విరియు
టయు, వెరవారఁ బట్టఁగ రాక చెడుటయు, । వాని యెత్తెడు నెడ వ్రయ్యుటయును,

తే. నెత్తి యొకచోట డించిన నెడలుటయును, । నెండి యవియుటయును, నావ మిడినఁ బగిలి
పోవుటయు, వాడుజనులచేఁ బొలియుటయును । గలుగు గతి మేని కెట్లును గలుగుఁ జేటు'.

**(స్త్రీ. 1. 27, 34)**

వేదవ్యాసుడు ధృతరాష్ట్రుడికి వివేకాన్ని ప్రబోధించాడు. జరిగిన కథకంతటికి కారణ మెవరో గ్రుడ్డిరాజుకు తెలుసు. తెలిసి తెలిసి దుఃఖించటం అవివేకం. విధిప్రేరితులై కౌరవులు అందరూ యుద్ధంలో పాల్గొని కన్నుమూశారు. కాబట్టి

తోదకవృత్తము. 'దేవకృతంబులు ధీరులకైనన్ । భూవర! మాన్పఁగఁ బోలునె యెట్లుం?
గావున శోకము గాఱియ దల్గం । గావలదే తుది గౌరవ మొప్పన్'.

తోదక వృత్తము.'తమ తమ తప్పులఁ దా రెరియంగా । విమలమతీ! యిటు వీరికినై శో
కమున దహింపఁగఁ గాదు మనంబున్; । సముచిత మిత్తఱి శాంతము సుమ్మీ!'**(స్త్రీ. 1. 71, 81)**

ఇట్లా స్త్రీపర్వంలో శోక మెంత ఉన్నదో దానిని ఉపశమింపజేసే ఉపదేశ మంత ఉన్నది. బంధువినాశ దుఃఖతాపంతో వగకు గురి అయిన మనుష్యులకు బుధులు ఉపదేశ వాక్యాలు అమృత ధారలు!

**11. పర్వ పరమార్థం:**

మహాభారత కథలోని అంతరార్థాన్ని అధ్యాత్మవిదులు భావించి దర్శించి, తాత్త్విక జ్ఞాన సంపన్నులు కావటం ఇతిహాస పఠన, శ్రవణ, మనన, నిదిధ్యాసల ఫలం. శల్య సౌప్తిక పర్వాలలో పాండవ విజయం చెప్పబడింది. దాని తాత్పర్యాన్ని ఈ విధంగా భావించవచ్చును. అంతరార్థ మహాభారత గ్రంథ రచయిత డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారి

మాటలలో కొన్ని విశేషాలు.

1.''శల్యుని యుద్ధంలో ఉభయ పక్షాల సైన్యాలు చాలావరకు నాశనమయ్యాయి. తామసిక వృత్తిలో చిక్కువడిన అసమగ్ర ద్వైత జ్ఞానమార్గం (శల్యుడు) సమగ్ర సాత్త్విక జ్ఞానంలోని అద్వైత ఋజుమనోవృత్తితో (ధర్మజాదులతో) సంఘర్షణకు తలపడి పోరుసాగిస్తే రెండు వర్గాలలోని వృత్తులూ చాలావరకు ఒకదానితో మరొకటి విజృంభించి నశిస్తాయని ఉభయసైన్యాలూ శల్యుని యుద్ధంలో చాలవరకు నశించాయి అనటానికి అంతరార్థం''.

2.''దుర్యోధనుడు జలస్తంభన విద్యతో ద్వైపాయన హ్రదంలో మునిగి ఉన్నాడు. అంటే ముక్తిని నాశం చేసే దుష్టయుద్ధం సాగించే తమోవృత్తి (దుర్యోధనుడు) అహంకార మమకారాలనే ద్వైపాయన హ్రదంలో మాయావృతుడై జలంలో మునిగి ఉన్నాడని అంతరార్థం''.

3.''ధర్మరాజు హ్రదం గట్టుపైని నిలబడి దుర్యోధనుడిని ఎత్తిపొడుపు మాటలతో దూషించటంతో దుర్యోధనుడు బైటపడ్డాడు. అంటే, అహంకార మమకారాలలో చిక్కుకొన్న అజ్ఞాని తన లోపాలను ఎవరైనా జ్ఞాని బయటపెట్టినప్పుడు దానిని సహించక ఎదురు తిరుగుతాడు. అంటే, సాధకునిలోని అజ్ఞానంలోని అజ్ఞానవృత్తి రహస్యంగా దాగి చిరకాలం ఉండలేదనీ, అది తిరిగి జ్ఞానవృత్తిపై అహంకరించి ఎదుర్కొంటుందనీ అంతరార్థంగా గ్రహించాలి''.

4.''దుర్యోధనునికి భీముడు ఊరుభంగం చేశాడు. ఊరుభంగం అంటే తొడలు విరుగగొట్టటం అని అర్థం. అంతరార్థంలో ఉ+ఉరు= ఊరు ఔతుంది. 'ఉ' అంటే సూక్ష్మదేహమైన తైజసిక ప్రకృతి . తైజసిక ప్రకృతి అనగా త్రిపుటిలోని స్వప్నావస్థలో ఉండే మానసికవృత్తి. భీముడనగా సాధకుడిలోని అభయవృత్తి. భీమునిచేత - అభయవృత్తిచేత, ఉ - తైజసిక మనఃప్రకృతికి, అనగా సూక్ష్మదేహ వాసనా ప్రకృతికి; ఉరు= గొప్పదైన; భంగం= నాశనం చేసిందని అర్థం''

5. ''దుర్యోధనుడు అశ్వత్థామను సర్వసైన్యాధిపతిగా అభిషిక్తుడిని చేశాడు అంటే- ముక్తికి సంబంధించిన సమస్త వృత్తుల నాశనానికై సాధకునిలోని తామసికవృత్తి, తనలోని ప్రకృతి సంబంధ ప్రకాశానికి తనలోని ముక్తి నిరోధక తామసికవృత్తుల పై అధికారం కలిగించిందని అంతరార్థం''.

6. ''అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ - ఈ ముగ్గురు రథికులూ కురుక్షేత్ర యుద్ధంలో చావకుండా మిగిలినవారు. అశ్వత్థామ అంటే ప్రకృతి ప్రకాశం. కృపు డంటే పోషించేవాడు. అనగా వాసనా కృతములైన కర్మలను ప్రోత్సహించే ప్రారబ్ధ కర్మ ప్రవృత్తి అని అర్థం. కృతవర్మ అంటే - చేయబడిన కర్మలకు కవచం వంటివాడని అర్థం - అనగా జీవునిలో వాసనావృత్తి అని భావం. ప్రకృతి ప్రకాశం అనగా మాయ, ప్రారబ్ధకర్మ, సంచితకర్మల యొక్క వాసనలు అనే ఈ మూడూ ఒకదానిని ఒకటి వీడకుండా కలిసి ఉంటాయని అంతరార్థం.''

7. ''న్యగ్రోధ వృక్షం మీద దివాంధం (గుడ్లగూబ) రాత్రివేళ చేసిన పనిని అశ్వత్థామ ఆదర్శంగా తీసికొన్నాడు. అంటే- ప్రకృతి ప్రకాశం తమోవృత్తిలో ఉన్నప్పుడు ముక్తిమార్గాన్ని నిరోధించే అపరాశక్తి యొక్క అజ్ఞానంచేత ఆవరించబడి ఉంటుంది అనే అంతరార్థం చెప్పుకొనాలి''.

8. ''అశ్వత్థామ ఆ రాత్రి పాండవ శిబిరంలో నిద్రిస్తున్న ధృష్టద్యుమ్నుడు, పాంచాలురు, ఉపపాండవులు మొదలైనవారిని అనేకులను చంపాడు. అంటే - అజ్ఞానావృతమయిన మాయాప్రకృతి సాధకునిలోని ముక్తివృత్తికి సంబంధించిన దృఢజ్ఞాన ప్రకాశాన్నీ (ధృష్టద్యుమ్నుడిని), పంచేంద్రియ నిగ్రహవృత్తులనూ (పాంచాలురనూ), మనోవ్యాపారాలను (ఉపపాండవులనూ) సుప్తములై ఉన్నప్పుడు చంపివేసింది. అనగా - కారణదేహంలోని జ్ఞాన వాసనలను పనిచేయకుండా వ్యర్థములైన వానినిగా చేసివేసిందని అంతరార్థంగా గ్రహించాలి.''

9. ''సూర్యోదయం కాగానే పాండవులు అశ్వత్థామను వెదకి పట్టుకొని అతని శిఖలో ఉన్న మణిని లాగుకొని దానిని ధర్మరాజుచేత ధరింపజేశారు. మణి తళతళ మెరిసే లక్షణం కలది. అశ్వత్థామ శిఖలోని మణిని లాగేశారు అంటే- ప్రకృతి యొక్క ప్రకాశాన్ని ప్రకృతినుండి లాగి తీసివేశారు. సాధకుడు జీవన్ముక్తావస్థను చేరుకోవటమంటే అదే. ప్రకృతిలోనే

ఉంటూ, ప్రకృతిని తన గుప్పిటిలో ఉంచుకొని, ప్రకృతికి బద్ధులు కాకుండా, ప్రకృతిని స్వవశం చేసికొని అసంగత్వంతో సాధకుడు జీవించటమే జీవన్ముక్తావస్థ. మణిని ధర్మరాజు ధరించాడు అంటే సాధకుడు స్వధర్మ ప్రవృత్తిలో జీవన్ముక్తావస్థను చేరుకొన్నాడని అర్థం. అశ్వత్థామ యొక్క శిరోమణిని ధరించినవారికి ఆకలిదప్పులు గాని, చోర వ్యాధి శస్త్రబాధలు కాని ఉండవు. అంటే ప్రకృతిశక్తియొక్క గొప్పతనాన్ని అనుభవించినవారికి అనగా అష్టసిద్ధులు లభించినవారికి సర్వబాధానివారక శక్తులూ లభిస్తాయని వాని అంతరార్థంగా గ్రహించాలి.

11. ''కౌరవపక్షంలో అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ అను ముగ్గురు తప్ప, అందరూ హతులయ్యారు. పాండవ పక్షంలో పంచపాండవులు, కృష్ణుడూ, సాత్యకి అను ఏడుగురు తప్ప మిగిలిన వారందరు నిహతులయ్యారు. అంటే సాధకుడిని ముక్తుడిని కాకుండా చేయటానికీ, సాధకునిలోని సాత్త్విక వృత్తులతో యుద్ధం చేసే తామసిక సంబంధం గల వృత్తులన్నీకూడా సాధనవలన జ్ఞానంలో చిట్టచివరకు విలీనమై పోతాయి. ఒక్క ప్రకృతి మాత్రం విలీనావస్థలో నిలిచి ఉంటుంది. ప్రకృతికి సంబంధించినవే మాయ, జీవుడు, ప్రకృతిని అనుసరించియే ఉంటాయి. ఈ మూడూ కలిసియే ప్రకృతి అని పిలువబడుతుంది. ఆ ప్రకృతిలోని వ్యాపింపజేసే ఇతర తామసిక వృత్తులన్నీ జ్ఞానసాధనలో సాధకునిలో విలీనమై ఉంటాయి. ప్రకృతిమాత్రం అనగా మాయ, జీవుడు, ప్రకృతి నశించవు - అన్నదే అశ్వత్థామాదులు ముప్వురూ యుద్ధంలో చనిపోక బ్రతికి ఉన్నారన్నదానికి అంతరార్థం. అభయవృత్తి, ఋజువృత్తి, ఐహిక విరాగవృత్తి, జ్ఞానప్రకాశవృత్తి అనే నాలుగు వృత్తులూ ధర్మవృత్తిని ఆశ్రయించి ఉండేవే. ఆ ధర్మవృత్తి యమనియమాది అష్టాంగ సాధనవలన కలుగుతుంది. ఆ ధర్మవృత్తి ప్రతిజీవునిలోను గల బ్రహ్మైక్యం పొందాలనే ముక్తి వృత్తి. దానికి నశించటం అనేదే లేదు. ధర్మపదానికి సహజమైనది అని అర్థం. నిర్వృతివృత్తి (కృష్ణుడు) ధర్మవృత్తికి ఎప్పుడూ తోడ్పడుతూనే ఉంటుంది. సాత్యకి అనేది 'సత్యక' శబ్దం నుండి పుట్టింది. 'సత్యం' అనగా పరమాత్మ అని అర్థం. సత్యం, శివం, సుందరం - అనేవి పరమాత్మను చెప్పే పదాలు. కాన, సత్యవృత్తియే సాత్యకి అనే పదానికి అర్థం. ప్రతిజీవికి అంటే సాధకుడికి సహజమైన పరమాత్మభావన అని అర్థం. ప్రతిజీవికి పరమాత్మలో ఐక్యమవ్వాలనే భావన అంతర్గతంగా సహజంగా ఉంటుంది. పాండవపక్షంలో పంచపాండవులు, కృష్ణుడు, సాత్యకి యుద్ధంలో నశించక బ్రతికి ఉన్నారన్న దానిలో సౌప్తికపర్వంలో ముక్తిమార్గం సంపూర్ణతకు చేరుకోవడం అనేది జయప్రదంగా ముగింపు చేయబడింది. వ్యాసుడు తన భారతాన్ని 'జయం' అనే పేరుతో పాండవ విజయంగా సౌప్తికపర్వంతో ముక్తి సాధనాక్రమాన్ని పూర్తిచేశాడు. 'జయం' అంటే పాండవులు కౌరవులను జయించటం అనేది బాహ్యార్థం. తామసిక వృత్తులను సాత్త్వికవృత్తులు ఎదిరించి ముక్తిని సాధించటం అనే సాధనలను జయప్రదంగా ఎట్లు నెరవేర్చాలో చెప్పేది 'జయం' అని అంతరార్థం''.

12. ''స్త్రీపర్వం, శాంతిపర్వం, ఆనుశాసనికపర్వం, ఆశ్రమవాసపర్వం, అశ్వమేధపర్వం - అను అయిందింటిలోనూ అంతరార్థం చెప్పవలసిన కథాభాగాలు లేవు. కథను ఆసక్తికరంగా పూర్తిచేయటానికి సౌతి, వైశంపాయనుడు అను వ్యాసమహర్షి యొక్క శిష్యులు ఆ అయిదు పర్వాలు తాము పెంచారు. వ్యాసుడు వ్రాసిన 8800 శ్లోకాల గ్రంథాన్ని మొత్తం లక్షశ్లోకాలు గల గ్రంథంగా పర్వాలు పెంచి పెద్దది చేసి 'జయ' మనే దానిని మహాభారతంగా వ్యాప్తి చేశారని డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారు అభిప్రాయపడ్డారు. (వివరాలకు చూడండి అంతరార్థ మహాభారతము (1986)

## 12. కవిత్రయ మహాభారతం: వ్యాఖ్యానం

తెలుగులో ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం అవతరించి వెయ్యేళ్ళు కావస్తున్నా, ఇంతవరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామి వారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు భారతీయ వైదిక ధర్మప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమవేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలరాయడు మాత్రమే చేపట్టి ధర్మరక్షణ కళా ప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమదయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు వ్యాఖ్యానించిన పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధ మండలిని పరిష్కరించి సర్వాంగసుందరంగా

ప్రచురించి, సామాన్య జనులకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుడి పక్షాన బాధ్యతవహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి.బోర్డు ఛైర్మన్, సభ్యులు, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వారి సహకారులూ, సంపాదక సలహామండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్ సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికారులూ, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభినందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన అరణ్యపర్వం మూడవసంపుటిగా రెండుభాగాలలో ప్రచురించబడింది. మొదటిభాగం నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం. రెండవభాగం ఎఱ్ఱాప్రెగడ పూరించిన ఆరణ్యపర్వ శేషం. ఈ విధంగా ఆరణ్యపర్వం విభజించబడి ప్రచురించబడటం తెలుగులో ఇదే ప్రథమం. నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ సంపుటాలుగా విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ పర్వాలు వెలువడ్డాయి. ఇప్పటి ఈ తొమ్మిదవ సంపుటి శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాల సమష్టి సంపుటి.

ఈ పర్వాల వ్యాఖ్యానంలో నలుగురు మహాపండితులు పాల్గొన్నారు. శల్యపర్వ ప్రథమాశ్వాసానికి డా॥ పి.వేంకటరాజుగారు, ద్వితీయాశ్వాసానికి శ్రీసింగరాజు సచ్చిదానందంగారు, సౌప్తికపర్వంలోని రెండాశ్వాసాలకూ విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు, స్త్రీపర్వం మొత్తానికీ సంగీత సాహిత్యకళావేత్తలు డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానందగారూ వ్యాఖ్యానం వ్రాశారు. శాస్త్ర మర్మజ్ఞులైన వీరు సరళమైన రచన చేశారు. ఈ పర్వాలకు తగిన పీఠికను నేను సంతరించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు, విద్మన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారికీ, శ్రీ కె.సత్యరామ ప్రసాద్‌గారికీ, శ్రీ జి.రాధాకృష్ణగారికీ, శ్రీమతులు సుశీలా లక్ష్మీ విద్యానాథులకు, డాక్టర్ వి.యస్. లక్ష్మికీ నా కృతజ్ఞతలు.

పరమ కల్యాణ భద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వర స్వామివారు వేదవేద్యులు, వేదాంత గమ్యులు, పరతత్త్వరూపులు అయినా భక్తసులభులు, సాహిత్య సంగీత కళాప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ; వ్యాఖ్యానం సుగంధపరిమళ సేవ; విశేషాంశాలు ఉజ్జ్వలాలంకార సేవ; పీఠిక ఆ విరాణ్మూర్తికి మంగళనీరాజన సేవ. ఈ పర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చన!

సత్యశివసుందర రూపులైన స్వామివారి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజకు సుమమంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని స్వామివారిని వేడుకొంటున్నాను.

హైదరాబాదు
**02-10-2004**

**జి.వి.సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు,
కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు,
తిరుమల తిరుపతి దేవస్థానం.

# శల్యపర్వ కథాసారం

కర్ణుడు నేలగూలిన తరువాత దుర్యోధనుడు మిగిలిన కొద్దిపాటి సైన్యంతో స్కంధావారంలో ప్రవేశించి బంధుమిత్రులతో అనంతర కార్యక్రమాన్ని గురించి యోచించసాగాడు. అప్పుడు కృపాచార్యుడు ఇట్లా అన్నాడు. 'మీ వంటి రాజులు పూర్వం కూడా యుద్ధాలు చేశారు. అది ఉత్తమ ధర్మం కూడా. దానివలన సుగతిని పొందారు. అయినా, నే నొక్కటి చెప్పుతాను వినుము. భీష్మద్రోణ కర్ణాది మహావీరులూ, రాజులూ, బంధుమిత్రులూ, బలగాలూ రణంలో చనిపోయారు. పదిహేడు రోజులు యుద్ధం సాగింది. మనవైపు సైనికులు బాగా తగ్గిపోయారు. అర్జునాది వీరులు తలచుకొంటే ఈ సైన్య మొక లెక్కకాదు. నీ వలన యుద్ధం కలిగింది. ప్రాణహాని జరిగింది. ఇకనైనా యుద్ధం మాని ముందుగా నిన్ను కాపాడుకొమ్ము. ధర్మనందనుడిని చూచి సంధిచేసికొమ్ము. రాజ్యాన్ని ఇరువురూ పంచుకొని ధృతరాష్ట్రుడిని సేవిస్తూ సుఖంగా జీవించండి'- అని హితోపదేశం చేశాడు. అయినా, ఆయన మాటలు దుర్యోధనుడికి రుచించలేదు. పై పెచ్చు -

తే. 'నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తు రనిల । సుతుఁడు మదుమునఁ ద్రావుట సూచి కొఱఁత
ప్రతిన దీర్చు నతం డని భయముఁ బొంది । పొందుఁ గోరిన నది యేల పాసఁగుఁ జెపుమ!"(శల్య. 1.66)

అని పలికి, యుద్ధం చేయటమే ఉచిత మని పేర్కొని, గెలిస్తే విజయం, ఓడితే స్వర్గం స్వీకరిస్తానని సంధి ప్రతిపాదనను తిరస్కరించాడు. ఒకరి దయవలన కలిగే రాజ్యసుఖాలు తనకు వద్దని మరల యుద్ధానికి సిద్ధమయ్యాడు.

### 1. శల్యసేనాపతిత్వం:

ఆనాటి రాత్రి శిబిరంలో వసిస్తే పాండవులు దాడి చేస్తారేమోనన్న అనుమానంతో దుర్యోధనాదులందరూ కలిసి సరస్వతీ నదీతీరానికి పోయి కృతస్నానులై అక్కడి పలు కుటీరాలలో రాత్రి గడిపారు. మరునాడు ఉదయాన అశ్వత్థామ సలహామేరకు మద్రభూపతి అయిన శల్యుడిని సర్వసైన్యాధ్యక్షుడిగా రారాజు అభిషేకించాడు. ఆ వార్త విన్న ధర్మరాజు శ్రీకృష్ణుడి ప్రబోధంతో ఉత్సహించి తన మేనమామ అయిన శల్యుడిని మరునాడు సంహరించాలని సంకల్పించి ఆ రాత్రి విశ్రమించాడు.

మరునాడు ఉదయం శల్యుడు సర్వతోభద్రవ్యూహాన్ని పన్నాడు. దాని ముఖస్థానంలో అతడే నిలిచాడు. వలపట శక, యవన సమేతుడై కృపాచార్యుడూ, దాపట త్రిగర్త సమేతుడై కృతవర్మా, వెనుక కాంభోజ సహాయుడై అశ్వత్థామా, నడుమ దుర్యోధనుడూ, అతడి ముందు గజసైన్యంతో శకునీ మోహరించారు. అంతకుముందే పాండవులు త్రిముఖవ్యూహం సిద్ధంచేసికొన్నారు. ఆ మూడు ముఖాలలో వరుసగా ధృష్టద్యుమ్న, శిఖండి, సాత్యకులు నిలిచారు. ధర్మజుడికి రక్షగా భీమార్జునులు అగ్రభాగంలో మోహరించారు. కౌరవులు పాండవులతో తలపడేటప్పుడు ఎట్టి పరిస్థితులలోనూ వారితో ఒక్కొక్కరుగా పోరాడరాదనీ, పలువురు కలిసి ఒక్కుమ్మడిగా యుద్ధం చేయాలనీ నిర్ణయించుకొన్నారు.

పదునెనిమిదవ నాటి యుద్ధం ప్రారంభమయింది. శల్య విజృంభణం కౌరవసేనలకు ఆశ్చర్యం కలిగించింది. అతడు పాండవులను జయించగలడనే పేరాస కలిగించింది. గురుభీష్మ కర్ణులు సాధించలేని కార్యాలను శల్యుడు సాధించగలడనే నమ్మకం కలిగింది. 'శల్యో జేష్యతి పాండవాన్' అనే నానుడి పుట్టింది.

పాండవ పక్షంలో భీమార్జునుల విజృంభణం బలంగా సాగింది. పాండవులు తెగబడి పోరు సల్పారు. కౌరవవీరులు పంతంతో ఎదిరించారు. నకులుడు కర్ణపుత్రులైన చిత్రసేన, సత్యసేన, సుశర్మలను పరాక్రమాన్ని ప్రకటించి వధించాడు. భీమసేనుడు భీకర గదాయుద్ధంలో శల్యుడిని మూర్ఛపోయేటట్లు చేశాడు. కృపాచార్యుడు శల్యుడిని రథంమీద ఉంచుకొని దూరంగా తొలగిపోయాడు. కొంతసేపటికి శల్యుడు తేరుకొని ఎత్తిన గదాదండంతో తన రథాన్ని పిలిచాడు. చుట్టూ ఉన్న సైనికులు ఉప్పొంగి పోవగా దుర్యోధనుడి ముందున్న సైనికులను కలుపుకొని ముందుకు సాగగా, ధర్మరాజు ముందున్న

రథికులు చేకితానుడిని ముందుంచుకొని భీముడిని దాటి దుర్యోధనుడిపై తలపడ్డారు. అతడి వజ్ర గదాఘాతానికి చేకితానుడు చనిపోయాడు. పాండవసైన్యం మండిపడి కౌరవసైన్యంమీద బాణవర్షం కురిపించింది. శల్యుడు ధర్మరాజును, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడినీ, మూడువేల రథికులతో కూడిన అశ్వత్థామ అర్జునుడిని డీకొన్నారు. పోరు ఘోరంగా సాగింది.

### 2. శల్యవిజృంభణం:

యుద్ధంలో శల్యుడి ప్రయోగ ప్రతాపం ప్రశంసాపాత్రంగా సాగింది. అతడిపై ధర్మరాజు ముద్గరాన్నీ, సాత్యకి తోమరాన్నీ, భీముడు భల్లాన్నీ, నకులుడు శక్తినీ, సహదేవుడు గదనూ ప్రయోగించగా శల్యుడు బాణాలతో వాటిని వమ్ముచేసి ఆర్చాడు. సాత్యకి రోషంతో విజృంభించగా శల్యుడు అతడిని, పాండవులను మూర్ఛపొందించాడు. దానిని చూచి శల్యుడు పాండవులను ఆనాడు చంపుతాడని దుర్యోధనుడు భావించి సంతోషించాడు.

అంతలో భీమ నకుల సహదేవులు కలిసి విజృంభించి శల్యుడిని ఎదుర్కొన్నారు. ధర్మరాజు శల్యుడి చక్రరక్షకుడైన ద్యుమత్సేనుడి తల నరికాడు. శల్యుడు జూలు పీకిన సింహంవలె కోపించి భీమాదులను బాణాలతో నొప్పించి నెత్తురు పారేటట్లు చేశాడు. దానిని చూచి ధర్మరాజు ఖిన్నుడై తాను శల్యుడిని చంపగలనని శ్రీకృష్ణుడు తనతో అన్నమాటలను జ్ఞాపకం చేసికొన్నాడు. ధైర్యంతో సైన్యాన్ని శల్యుడిపై పురికొలిపాడు. శల్యుడు ధర్మరాజాదులను బాణాలతో కప్పి, వారిని చిమ్మచీకట్లలో ముంచాడు. దేవతలు అతడి ప్రతాపాన్ని ప్రశంసించారు. అర్జునుడు తనను చుట్టుముట్టిన సంశప్తకులను వికలాంగులుగా మార్చాడు. అశ్వత్థామ అర్జునుడిని వాడి బాణాలతో క్రూరంగా కొట్టాడు. అర్జునుడు అడవిని కాల్చే కార్చిచ్చువలె కౌరవసైన్యాన్ని ధ్వంసంచేశాడు. అశ్వత్థామ సురథుడనే పాంచాల కుమారుడిని చంపి అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడితో పోరి బాధింపబడ్డాడు. కృప కృతవర్మలు శిఖండి ప్రభృతులతో తలపడగా శల్యుడు ధర్మజ, భీమ, నకుల సహదేవ సాత్యకులతో పోరాడి వారిని నొప్పించాడు. పాండవులు తొలగిపోయారు. సాత్యకి శల్యుడిపై తిరగబడ్డాడు. శల్యుడు విజృంభించాడు. పాండవసేనలు శ్రీకృష్ణార్జునులవైపు పరుగెత్తాయి. అర్జునుడు వారికి అండగా నిలిచి కృప కృతవర్మలను ఎదుర్కొన్నాడు. సహదేవుడు శకునిని, శిఖండి అశ్వత్థామను, భీముడు దుర్యోధనుడిని ఢీకొన్నారు. ధర్మరాజు నకులుడు వెంటరాగా శల్యుడిని ఎదిరించి నిలువరించాడు.

### 3. శల్యసంహారం:

మధ్యాహ్నమయింది. చండప్రచండుడై శల్యుడు పాండవసైన్యాన్ని నురుమాడటం మొదలుపెట్టాడు. ఇరుపక్షాలవారూ అతడి పరాక్రమాన్ని ప్రశంసించారు. ధర్మరాజు క్రుద్ధుడై శల్యుడిపై దాడికి పూనుకొన్నాడు. తన రథానికి కుడివైపున నకుల సాత్యకులూ, ఎడమవైపున సహదేవ ధృష్టద్యుమ్నులూ, ముందు భీముడూ, వెనుకవైపు అర్జునుడూ నడువగా, శల్యుడిని సంహరిస్తానని శపథం చేసి ముందుకు సాగాడు. ఇద్దరి నడుమ ద్వంద్వయుద్ధం ఘోరంగా జరిగింది. వారిరువురూ పెద్దపులులవలె విజృంభించారు. అంతలో భీముడు దుర్యోధనుడిపై తలపడి అతడిని మూర్ఛలో ముంచాడు. గుర్రాలు రారాజు రథాన్ని దూరంగా లాగికొని పోయాయి. అశ్వత్థామాదులు అర్జునుడిని లెక్కచేయకుండా ధర్మరాజుపై దాడిచేసి చుట్టుముట్టారు. వారిని బాధించి ధర్మజుడు శల్యుడిని ఎదుర్కొన్నాడు. వారిద్దరినీ చూచి, సమబలానికి మెచ్చి ఎవరు విజయాన్ని సాధిస్తారో అని సైనికులు ఆసక్తిని ప్రకటించారు. ధర్మరాజు శల్యుడిపై మూడువందల బాణాలు గుప్పించాడు. గుర్రాలనూ, సారథినీ చంపి, చేయి కదపలేని విధంగా శల్యుడిని బాధించాడు. అశ్వత్థామ శల్యుడిని తన రథంమీద ఉంచి అపాయం నుండి తప్పించాడు. శల్యుడు తేరికొని మరొక రథంమీద ఎక్కి రణరంగంలో ప్రవేశించి తనను ముట్టడించిన పాండవవీరులను త్రోసికొనిపోయి ధర్మరాజుతో తలపడ్డాడు. వారిద్దరి నడుమ బాణయుద్ధం బలంగా సాగింది. ఇద్దరికి వారి వారి వీరులు సాయంగా పోరాడారు. ధర్మరాజు తనలో ఇట్లా అనుకొన్నాడు: 'నీవు శల్యుడిని గెలుపుము - అని దీవించి కృష్ణుడు నన్ను పంపాడు. అతడి మాటలు అబద్ధాలౌతాయా? దైవ ఘటన తప్పించరానిది' - అని శ్రీకృష్ణుడిని స్మరించాడు. ఆతడి ఆశీస్సులు ఫలించేటట్లు ప్రార్థించాడు. శ్రీకృష్ణుడిని రుద్రరూపుడిగా సంభావించాడు.

అంతలో భీముడు శల్యుడి విల్లును ఖండించాడు. గుర్రాలను చంపాడు. సూతుడి కంఠం నరికాడు. కవచాన్ని నేలపడగొట్టాడు. విరథుడు కవచహీనుడు అయిన శల్యుడు కోపించి కత్తీ డాలూ తీసికొని రథం దిగి యముడివలె విజృంభించాడు. భీముడు అతడి కత్తిని, డాలును ఖండించాడు. శల్యుడు ధర్మరాజుపై దాడిచేశాడు. 'శ్రీకృష్ణుడు ఈ శల్యుడిని సంహరించటానికే నన్ను పంపించాడు. శల్యసంహారం నా వంతు' అని భావించి ధర్మరాజు భయంకరమైన శక్తిని సంధించి భగవానుడిని ప్రార్థించి, రౌద్రోద్రేకంతో త్రిపురాసుర సంహారం చేసే రుద్రుడివలె కోపించి ఆ మహాశక్తిని శల్యుడిపై ప్రయోగించాడు. అది శల్యుడి కవచంలో భేదించి దూరింది. రొమ్ము చీల్చి, వీపునుండి బయటకు వెలువడి భూమిలో ప్రవేశించింది. ఆ గాయంవలన ముక్కులనుండి, చెవులనుండి, కన్నులనుండి నెత్తురు కారుతూ శరీరాన్ని తడిపివేయగా శల్యుడు - ప్రియురాలి ఉరంమీద వాలే ప్రియుడివలె - నేలమీద చేతులు రెండూ చాచి బోరగిల పడి ప్రాణాలు వదిలాడు. ధర్మరాజు చేసిన ధర్మయుద్ధంలో చనిపోయిన శల్యుడు శాస్త్రోక్తంగా వేల్చిన హవిస్సులు స్వీకరించి చల్లారిన హోమాగ్నివలె భాసించాడు. అన్నమరణానికి కోపించి శల్యుడి తమ్ముడు ధర్మరాజును ఎదిరించి అతడిచేతిలో మరణించాడు. శల్యసోదరుల మరణానికి పాండవసైన్యం పొంగిపోయింది.

## 4. దుర్యోధన యుద్ధ నిర్వాహకం:

కృతవర్మ, కృపాచార్యుడు ధర్మరాజును ఎదుర్కొని వీగిపోయారు. దుర్యోధనుడు భద్రగజాన్ని ఎక్కి యుద్ధరంగంలో విజృంభించాడు. శల్యుడి చుట్టాలు ధర్మరాజును చుట్టుముట్టారు. పాండవులందరూ కలిసి వారిని వధించారు. అప్పుడు దుర్యోధనుడు ఖిన్నుడై శకునిని తగిన ఉపాయాన్ని చెప్పమని కోరాడు. 'రాజు పూనుకొని ముందుకు ధైర్యంగా సాగకపోతే, సైనికులు మెచ్చుకొంటారా?'- అని శకుని హితవు చెప్పాడు. ఆ మాట విని దుర్యోధనుడు సైన్యానికి ధైర్యం చెప్పుతూ రణాన్ని సాగించాడు. పాండవ విజృంభణం దుర్యోధనుడి సైన్యాన్ని కలవరపెట్టింది. నలుదిక్కులా పరుగెత్తేటట్లు చేసింది. సైనికులంతా ధర్మజ విజయం తథ్యమనీ, దుర్యోధనుడి మరణం తప్పదనీ భావించారు. పాండవపక్షంవారు 'ఇంక ధర్మరాజు నాయకుడు' అని కీర్తించారు.

దుర్యోధనుడు ఏనుగు దిగి, రథ మెక్కాడు. పారిపోతున్న బలాలకు ధైర్యం చెప్పి యుద్ధానికి పురికొల్పాడు. 'పాండవ సైన్యం పలచబడింది. కృష్ణార్జునులు దాహంతో అలసిపోయారు. ఇప్పుడు మనం పరాక్రమాన్ని ప్రదర్శించి విజయం సాధిద్దాం' - అని చేయెత్తి పిలుపు నిచ్చాడు. సైనికులు ఉప్పొంగి దుర్యోధనుడి వెంటనడిచి భీముడిని చుట్టుముట్టారు. అతడు గదను చేపట్టి రథం దిగి 21వేల మంది వీరులను అడవిని నరికినట్లు మట్టుపెట్టాడు. రథాలనూ, అశ్వాలనూ అర్జునుడు ధ్వంసం చేశాడు. ధృష్టద్యుమ్న సాత్యకుల చేతిలో సాల్వుడు చనిపోయాడు. కృతవర్మ విరథు డయ్యాడు. కురుసైన్యం చెల్లాచెదరైపోయింది. దుర్యోధనుడు ఒంటరిగా పోరు సాగించాడు. తన కున్న లౌకిక దివ్యశక్తుల నన్నింటినీ కూడగట్టి పరాక్రమాన్ని ప్రదర్శించాడు. పాండవ వీరులపై బాణాలను గుప్పించాడు. శకుని మొదలైనవారు దుర్యోధనుడిని సమీపించి సహాయంచేశారు. శకునికీ ధర్మరాజుకూ ద్వంద్వయుద్ధం సాగింది. శకుని పుత్రుడైన ఉలూకికీ నకులుడికీ; సాత్యకికీ, కృతవర్మకూ; దుర్యోధనుడికీ ధృష్టద్యుమ్నుడికీ గొప్పయుద్ధం జరిగింది. దుర్యోధనుడు ఉపపాండవులను కలతపెట్టాడు. పాండవులు విజృంభించి కౌరవసేనను తరుమగొట్టారు. దుర్యోధనుడు ఒంటరిపోరు సాగించాడు. ధర్మజుడు కృప, కృతవర్మలను విరథులను చేశాడు. దుర్యోధనుడు కోపించి ఏడువందలమంది రథికులను పురికొల్పి ధర్మరాజుపై దాడికి పంపాడు. శిఖండి ప్రముఖులతో కలిసి పాండవులు వారిని సంహరించారు.

శకుని మాయోపాయం పన్ని పాండవ సైన్యాన్ని వెనుకనుండి అశ్వసేనతో దాడిచేశాడు. ధర్మరాజు అశ్వహృదయం తెలిసిన నకుల సహదేవులను అశ్వబలంతో శకునిపై పంపాడు. వారితో ఉపపాండవులను కూడా పంపాడు. వారు కౌరవ బలాలను పెంటకుప్పలుగా మార్చారు. శకుని యుద్ధరంగంనుండి తొలగిపోయాడు. యుద్ధం చేస్తున్న దుర్యోధనుడిని కలిసి పాండవ గజసైన్యాన్ని చంపేయత్నం చేశాడు. వారి ప్రయత్నాన్ని చూచి అర్జునుడు దుర్యోధనుడివైపు రథాన్ని నడిపించుమని కృష్ణుడిని కోరాడు.

'కృష్ణా! యుద్ధం ఆగకుండా పద్దెనిమిది రోజులు సాగింది. సముద్రంవలె ఉన్న కౌరవసైన్యం గోష్పాదమంత అయింది. కౌరవులే మూర్ఖులై ఈ యుద్ధాన్ని ప్రారంభించారు. భీష్ముడు పడినప్పుడైనా వారు యుద్ధం మాని ఉండవలసింది. భీష్ముడు దుర్యోధనుడికి అనునయంగా చెప్పాడు కూడా. ద్రోణాచార్యుడూ, భగదత్తుడూ, సైంధవుడూ, దుశ్శాసనుడూ, కర్ణుడూ, చివరకు శల్యుడూ చనిపోవటం చూచిన తరువాతైనా వారికి వివేకోదయం కాలేదు. ఇప్పటికైనా ధర్మరాజుకు రాజ్యభాగ మిచ్చి ప్రాణం రక్షించుకొనడు. దుర్యోధనుడు నిజంగా మూర్ఖుడివలె ఉన్నాడు' అని అర్జునుడు అన్నాడు. 'కుత్సితుడైన దుర్యోధనుడు ముక్కున ఊపిరి ఉండగా రాజ్యభాగం ఇవ్వడు. అంతేకాక అతడు పుట్టినప్పుడు మునులు 'ఈ పాపాత్ముడు నిఖిల క్షత్రియ క్షయ హేతువు' అని ఆదేశించారు కదా!' అని కృష్ణు డన్నాడు. 'ఆ మునులు చెప్పినట్లుగానే జరిగింది. బ్రతికి ఉన్నవారిని చంపించి తాను చచ్చిగాని ధర్మరాజుకు రాజ్యం వదలడు. ఇది నిశ్చయం. దురహంకారి అయిన దుర్యోధనుడు తన నిస్సహాయతను గమనించి కూడా పంతం వదలటంలేదు. ఇతడిని ఇంక చంపి తీరుతాను' అని అర్జునుడు రథాన్ని ముందుకు సాగించాడు.

## 5. ద్వైపాయన హ్రదంలో దాగిన దుర్యోధనుడు:

అర్జునుడు సైన్యాన్ని నుగ్గుచేస్తూ పారిపోయేటట్లు చేశాడు. దుర్యోధనుడు వారిని ప్రోత్సహిస్తూ మరల యుద్ధం సాగించాడు. ధృష్టద్యుమ్నుడిని కలతపరచాడు. అతడు దుర్యోధనుడి రథాన్ని కూలగొట్టాడు. రారాజు రథాన్ని దిగి ఉత్తమాశ్వాన్ని అధిరోహించాడు. ఏనుగుల గుంపును అర్జునుడిమీదకు ఉసికొల్పాడు. అర్జునుడు బాణాలతో, భీముడు గదాదండంతో, ధృష్టద్యుమ్నాదులు బాహుబలాలతో కౌరవసేనను కూలగొట్టారు. ఒంటరిగా వ్యూహాన్ని ఆలోచిస్తున్న దుర్యోధనుడిని చంపండి-అని కృష్ణుడు అర్జునుడికి సూచించాడు. అంతలో శకునీ, సుశర్ముడూ అర్జునుడిని ఎదుర్కొన్నారు. దుర్యోధనుడి తమ్ముడు సుదర్శనుడూ రణంలో చనిపోయాడు. ఉలూకుడిని సహదేవుడు చంపాడు. కొడుకు చావుకు కుమిలిపోయిన శకునిని వెంటాడి బల్లెంతో తల నరికి చంపాడు. కౌరవుల కుతంత్రాలకు మూలమైన శకుని మరణించటంవలన పాండవులందరూ సంతోషించారు. దుర్యోధనుడు తన చుట్టూ నిలిచి పోరాడేవారు లేక, ఎదుట పాండవులు హర్షోత్సాహాలతో ఉండటం సహించలేక యుద్ధభూమినుండి తొలగిపోవటానికి నిశ్చయించుకొన్నాడు. గుర్రం దిగి, గద భుజంమీద ధరించి, ఏకాదశాక్షౌహిణీపతి పరివార రహితుడై వెడలి, ద్వైపాయన హ్రదం చేరి, జలస్తంభన విద్యా ప్రభావంతో అందులో దాగుకొన్నాడు.

యుద్ధంలో చావకుండా కృపాశ్వత్థామ కృతవర్మలు మిగిలారు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు సంజయుడిని పట్టుకొన్న సాత్యకిని చూచి వారించాడు. అయినా సాత్యకి సంజయుడిని తల నరుక పోగా వ్యాసమహర్షి ప్రత్యక్షమై సంజయుడి వధను వారించాడు. సంజయుడు దుర్యోధనుడిని దర్శించుకొన్నాడు. ప్రాణాలతో ఉన్నావారు ముగ్గురు రథికులే అన్న విషయాన్ని తెలియపరిచాడు. దుర్యోధనుడు నిట్టూర్చి తన తండ్రికి అతడి ద్వారా సందేశాన్ని పంపాడు. 'ధృతరాష్ట్ర మహారాజా! నీ వైపువారంతా చనిపోయారు. పాండవులు, వారి ఆప్తులూ జీవించి ఉన్నారు. దెబ్బలు తిని నేను చావకుండా పాండవులబారి నుండి తప్పించుకొన్నాను. పాండవులు రాజ్యాన్ని తీసికొని నాకు కొంతభాగం ఇస్తామన్నా నాకు ఆ ఎంగిలి కూడు వద్దు. తమ్ములూ, కొడుకులూ, సేవకులూ అందరూ పోయిన తరువాత నేను సంతోషంతో ఉండగలనా? కాబట్టి ఈ మడుగులో కొంతకాలం దాగి, అనుకూల సమయంలో ఎక్కడికైనా పోయి, ఏదో విధంగా నా పగ తీర్చికొంటాను' అని సంజయుడి ద్వారా తన సందేశాన్ని పంపాడు. జలస్తంభన శక్తితో మడుగులోకి దూరి గుప్తంగా దాగి ఉన్నాడు.

కృపాచార్యుడికీ, కృతవర్మకూ సంజయుడు కనపడి జరిగిన సంగతి అంతా తెలియచెప్పాడు. దుర్యోధనుడి దీనస్థితికి వారు చింతించారు. బంధువుల శవాలను చూచి దుఃఖించే స్త్రీల ఆర్తనాదాలు పెరిగాయి. యుయుత్సుడు ధర్మరాజు అనుమతితో వారినందరినీ హస్తినాపురానికి తీసికొనిపోయాడు. పాండవులు దుర్యోధనుడిని అన్వేషిస్తూ కొలనుప్రాంతానికి వచ్చి అక్కడ అతడు కనపడక పోవటంతో తిరిగివెళ్ళాడు.

పాండవులు వెళ్ళగానే కృప కృతవర్మ అశ్వత్థామలు దుర్యోధనుడు దాగి ఉన్న కొలను సమీపించి అతడిని పిలిచారు. అతడు అలసి ఉండటంచేత మరునాడు కలుద్దామని చెప్పాడు. అశ్వత్థామ పౌరుషంతో 'దాగటం పిరికివారి లక్షణం, దాడిచేయటం వీరలక్షణం. నా పగ తీరేటట్లు నేను పాండవులను చంపి నా తండ్రికి సంతోషం కలిగిస్తాను' అని రారాజుతో పలికాడు.

పాండవ గూఢచారులలో ఒకడైన భీముడి బోయవాడు వారి సంభాషణలు విని భీముడికీ, ధర్మరాజుకూ దుర్యోధనుడు దాగి ఉన్న ద్వైపాయన హ్రదం గురించి చెప్పాడు. వా రాసంగతి శ్రీకృష్ణుడికి తెలిపారు. అందరూ కలిసి హ్రదం వద్దకు చేరారు. వారి కోలాహలం విని దుర్యోధనుడి అనుమతితో రథికత్రయం అప్పటికి పోరుమాని రహస్యస్థలంలో ఉండటానికి వెళ్ళారు. సంజయుడు ప్రక్కనున్న పొదలలో దాగి ఉన్నాడు. పాండవులు హర్షోత్సాహాలతో ఆ కొలని వద్దకు వచ్చారు. దుర్యోధనుడి మాయాశక్తిని గుర్తించారు.

## 6. ధర్మజ దుర్యోధన సంవాదం :

ధర్మ : కృష్ణా! దుర్యోధనుడు మాయావిద్యా శక్తిచేత నీటిలో నిశ్చింతగా దాగి ఉన్నా, దేవేంద్రుడే వచ్చి ఇతడికి సహాయపడినా, నా చేతిలో వీడికి చావు తప్పదు.

శ్రీకృష్ణ : (సన్నని స్వరంతో) మాయావులను మోసంతోనే చంపాలి, రాక్షసులను విష్ణువు, ఇంద్రుడూ తగిన మాయోపాయాలతో చంపలేదా? కాబట్టి దుర్యోధనుడు నీటినుండి బయటకు వచ్చే ఉపాయం ఆలోచించుము.

ధర్మ : (దుర్యోధనుడిని ఉద్దేశించి) సుయోధనా! ఇది నీకు తగిన పనేనా? భూమండలంలో ఇంతటి దురవస్థ ఎక్కడా చూడలేదు. నీ కొరకు లెక్కలేనంత మంది రాజులు, బంధువులు, మిత్రులు, సేనలు నేల కొరిగారు. వారందరి త్యాగాలూ చావులూ వృథా అయ్యేటట్లు నీవు మాత్రం క్షేమంగా ఉందామని నీటిలో దాగావా? ఒకవేళ ఇట్లా దాగుకొన్నా చావు తప్పుతుందా? నీవు మహారాజువు కదా! ఇది వీర ధర్మమా? గొప్పదైన కౌరవశంశంలో పుట్టి ఇటువంటి దైన్యానికి పాలుపడటం వంశగౌరవమా? నిన్ను చూచి శత్రువులు నవ్వరా? రాజధర్మం వదలితే నీకు ఇహపరాలు ఉండవు. ఆనాడు నిండు సభలో నీవు పలికిన మాటలు నీ ప్రాణాలను తప్పక బలిగొంటాయి. ప్రాణం కంటె మానం గొప్పది కదా! నీ తీరు అభిమానానికి అవమానం కలిగిస్తున్నది. నీవు నమ్ముకొన్న కర్ణశకుని దుశ్శాసనుల వలననే నీ కీ అవమానం కలిగింది. ఇంక ఎక్కడికి తప్పించుకొని పోగలవు? మగతనంతో యుద్ధానికి సిద్ధం కమ్ము. యశస్సో, మృత్యువో తేల్చుకొమ్ము. యుద్ధంలో నీవు మమ్మల్ని జయిస్తే భూవలయాన్ని పాలించుము. చనిపోతే స్వర్గసుఖాలు అనుభవిస్తావు.

దుర్యో : ధర్మరాజా! మానవుడు ప్రాణభయం పొందటంలో ఆశ్చర్యం లేదు. నాకు ఇప్పుడు పరివారం లేదు. ఆప్తులూ, స్నేహితులూ లేరు. అస్త్రశస్త్రాలు లేవు. వాహనాదులు లేవు. సాయుధ బలాలూ లేవు. యుద్ధంలో తగిలిన దెబ్బలవలన నేను అలసి ఉన్నాను. అలసట తీరిన తరువాత యుద్ధం చేస్తాను. మీరూ కొంత విశ్రాంతి తీసికొని రండి.

ధర్మ : మేము ఇంతదాకా విశ్రాంతి తీసుకొన్నాము. అలసట తీరింది. నిన్ను వెదకి కనుగొన్నాము. నీకూ దాహం తీరింది. ఇక యుద్ధానికి సిద్ధం కమ్ము.

దుర్యో : ఎవరికొరకు రాజ్యాలనూ భోగాలనూ కోరుకొంటామో ఆ కుమారులూ, తమ్ములూ, బంధువులూ అందరూ పోయారు. ఇక యుద్ధ మెందుకు? ఒకవేళ మీ వారిని చంపి విజయం సాధించినా కర్ణభీష్మద్రోణులు లేని రాజ్యం నాకు సంతోషాన్ని కలిగిస్తుందా? తనవారితో కలిసి భోగించలేని సంపద తనివి తీర్చదు. నీ వారు బ్రతికి ఉన్నారు కాబట్టి నీవే రాజ్యభోగాన్ని అనుభవించుము. గుర్రాలూ, ఏనుగులూ లేని ఈ బీడువంటి రాజ్యాన్ని నీ తలకు చుట్టుకొనుము.

ధర్మ : (నవ్వుతూ) ఎందుకు ఈ ప్రేలాపనలు? నీవారంతా పోయిన తరువాత కూడా శల్యుడిని సేనాపతి చేసికొని మమ్మల్ని గెలిచి రాజ్యాన్ని పాలించాలని ఆశపడలేదా? అయినా, నాకు రాజ్యదానం చేస్తానన్నావు. నీవు ఎవడవు ఇవ్వటానికి? నీ కేమి అధికారం ఉన్నది ఇప్పుడు? శ్రీకృష్ణుడు సంధిచేసికొని భాగమిమ్ము అన్నప్పుడు నీవు ఇవ్వక ఈ దీనస్థితికి వచ్చావు. శత్రువులకు రాజ్యదానం చేసే వెర్రివాడు లోకంలో ఉండడు. కాబట్టి యుద్ధమే నీ

ధర్మం. ఇప్పుడు నీ ప్రాణాలు నా చేతులలో ఉన్నాయి. నా జీవితం నీ చేతిలో ఉన్నది. నీవు లక్కయిల్లు కాల్చావు, పాములతో కరిపించావు. నీళ్ళలో త్రోయించావు. విషం కలిపిన అన్నం పెట్టించావు. ఇట్లా ఎన్ని కపటోపాయాలు చేసినా మేము నశించలేదు. అందువలన ఇక మాయోపాయాలవలన ప్రయోజనం లేదు. ఇంకా దాగి ఉండటం ఎందుకు? బయటపడి యుద్ధం చేయుము.

దుర్యో : (చీకాకుపడి) మీరందరు బంధుమిత్రులతో కూడి ఉన్నారు. నేను ఒంటరివాడిని, నాకు సేనలు లేవు. ఎట్లా యుద్ధం చేయగలను? అంతేకాక దెబ్బలతో అలసి ఉన్నాను. అయినా మీలో ఒక్కొక్కరు వచ్చి పోరాడండి. నేను హ్రదం వెలువడి వచ్చి మిమ్ములను వరుసగా చంపుతాను. అనేకులు ఒక్కుమ్మడిగా దాడిచేసి ఒక్కడితో యుద్ధం చేయటం న్యాయమా? మీరు ఈ కట్టడికి సమర్థులు కాకపోతే - నేనే మీ అందరినీ మట్టు పెట్టుతాను. భీష్మద్రోణాదుల ఋణం తీర్చుకొంటాను. ఇట్లా అనటం శ్రీకృష్ణుడినీ మిమ్ములనూ చూచి భయపడి కాదు. యుద్ధనీతిని అందరికీ తెలియచెప్పటానికి.

ధర్మ : సుయోధనా! నీ యుద్ధనీతి హర్షించతగిందే. నీ వొక్కడివే మా అందరిని భుజబలంతో చంపుతా నంటున్నావు. అయినా, నేను యుద్ధ ధర్మాన్ని ఎందుకు విడుస్తాను? నీకు కావలసిన అస్త్రశస్త్రాల నిస్తాను. మాలో ఒక్కడే నీతో యుద్ధంచేసి జయిస్తాడు. అతడిని నీవు ఓడించగలిగితే రాజ్యమంతా నీవే తీసికొని పరిపాలించుము.

దుర్యో : నేను గదాయుద్ధం చేస్తాను. నిన్నూ, నీ సోదరులను, వీరులను నా గదతోనే మట్టుపెట్టుతాను.

ధర్మ : సరే! రమ్ము. నేను ఒక్కడనే గదతో అకుంఠిత బలాన్ని ప్రదర్శించి నీ ప్రాణాలు తీస్తాను.

ధర్మరాజు మాటలు విని దుర్యోధనుడు మనసు కలతపడగా పుట్టలోనుండి వెలువడ్డ మహాసర్పంవలె మహాపౌరుషంతో కొలనునుండి బయటకు వెలువడ్డాడు. చూచేవారికి కాలదండం చేతపట్టిన యముడివలె భయం కలిగించాడు. పాండవులందరు కలిసి అతడిని చూచి నవ్వారు. అతడు మండిపడి వారిని యుద్ధంలో చంపుతానని హుంకరించాడు. అయినా, పాండవులందరూ కలిసి తనపై దాడిచేసి చంపుతారేమో అని భయపడి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

దుర్యో : ఒక్కరొక్కరే పోరుకు రండి. మీరు చాలమంది ఉన్నారు. నేను ఒక్కడనే కత్తివేటులతో డస్సి ఉన్నాను.

ధర్మ : ఆనాడు యుద్ధంలో అభిమన్యుడు బాలుడై ఉన్నా, ఒంటరిగా పోరుతున్నా, ప్రౌఢవీరులైన అనేకులు ఒక్కుమ్మడిగా దాడిచేసి ఏ న్యాయంతో చంపారో - ఇప్పుడు కూడా అదే న్యాయం చెల్లుతుందని గ్రహించుము. (ఆ మాట విని నిరుత్తరు డయ్యాడు దుర్యోధనుడు). అది నీకు న్యాయం కావచ్చునేమో కాని నాకు కాదు. నీకు తగిన శిరస్త్రాణాన్నీ, కవచాన్నీ ఇస్తాను. మా అయిదుగురిలో ఒకరిని ఎన్నుకొమ్ము. అతడు నీతో యుద్ధం చేస్తాడు. వాడిని చంపి అఖండరాజ్యాన్నీ ఏలుకొమ్ము. లేదా వాడిచేతిలో చచ్చి వీరస్వర్గం పొందుము. నే నీ కట్టడి చేస్తున్నాను. ఒక్కటి వినుము. నిన్ను ప్రాణాలతో పోనివ్వను. యుద్ధానికి కావలసిన సౌకర్యాలన్నీ కలిగిస్తాను. అన్నదమ్ముల కుండే బంధుత్వానికి దీనివలన ఇబ్బంది ఉండదు.

దుర్యోధనుడు తనకు దగిన సువర్ణ శిరస్త్రాణాన్నీ, కవచాన్నీ ఎన్నుకొన్నాడు. వాటిని ధరించి మేరుపర్వతంవలె మెరసిపోయాడు. పాండవులలో ఎవరైనా గదతో యుద్ధంచేయండి అని ఎలుగెత్తి పిలిచాడు.

శ్రీకృష్ణ : ధర్మరాజా! దుర్యోధనుడు గదాయుద్ధానికి పిలిస్తే పాండవులు వివేకం కోల్పోయి ఒప్పుకొన్నారని లోకం అనుకొంటుంది. శత్రువులపట్ల అతిదయ పనికిరాదు. ఒకడిని చంపితే భూమినంతా తీసికొను మని అనటం నీవు శకుని జూదంలో రాజ్యాన్నంతా ఒక్కసారి పందెం కాచి ఓడినట్లే ఉన్నది. యుద్ధం జూదం కాదు.

భీముడు : శ్రీకృష్ణా! గద నా చేతిలో ఉంటే పదునాల్గు లోకాలను మట్టుపెట్టగలను. దుర్యోధనుడి బడాయిమాటల కేమి? అతడు నాకంట పడి ప్రాణాలతో పోగలడా?

శ్రీకృష్ణ : భీమా! బకుడిని, హిడింబుడిని, జరాసంధుడిని - ఇట్లా బలగర్వితులను ఎందరినో చంపావు. ఇత డొక లెక్కా? (దుర్యోధనుడివైపు క్రీగంటి చూపు ప్రసరిస్తూ) నీవు విజృంభించి దుశ్శాసనుడి రొమ్మును చీల్చి నెత్తురు త్రాగినప్పుడు కళ్ళు ఒప్పగించి చూస్తూ భయంతో ఈ దుర్యోధనుడు నోరు నొక్కుకొన్నాడు. అలనాడు నిండుసభలో ద్రౌపదిని అవమానించినప్పుడు నీవు చేసిన ప్రతిజ్ఞలలో ఒకటి తీర్చుకొన్నావు. ఈ రెండవ ప్రతిజ్ఞను కూడా పౌరుషంతో తీర్చికొమ్ము. ధర్మరాజుకు పట్టం కట్టుము. నీవు గదతో విజృంభించుము. దుర్యోధనుడు హతుడౌతాడు. దానికి నేను బాధ్యుడను. భీమా! మరొక మాట. దుర్యోధనుడు మహాబలవంతుడు బాగా వ్యాయామం చేశాడు. నీవు ప్రయత్న పూర్వకంగా యుద్ధం చేయాలి సుమా! ఇది నా హెచ్చరిక!

భీముడు : (ఉత్సాహంతో ధర్మరాజును ఉద్దేశించి) అగ్రజా! వినుము. అర్జునుడు ఖాండవాన్ని దహించినట్లుగా నేనీ వంశనాశకుడిని చుట్టుముట్టి చంపుతాను. రాజ్యాధికారాన్ని నీకు కట్టపెట్టుతాను. శకుని మాయోపాయం తనకే బెడిసికొట్టిందని కొడుకు మరణవార్త విని ఆ గ్రుడ్డిరాజు దుఃఖిస్తాడు. (అని దుర్యోధనుడికి ఎదురుగా నిలబడి) నీవు చేసేవి క్రూర కర్మలని తలంచకుండా లక్కయింటికి నిప్పుపెట్టించావు. మాయాజూదంలో ధర్మరాజును ఓడించావు. నిండుసభలో ద్రౌపదిని అవమానించావు. వాటన్నిటి ఫలాన్నీ ఇప్పుడు అనుభవిస్తావు. పెక్కుమాట లెందుకు? యుద్ధానికి రమ్ము.

దుర్యో : భీమా! గదాయుద్ధంలో ఇంద్రుడు కూడా నన్ను ఎదుర్కొనలేడు. నీవు ఒక లెక్కా? అయితే నీవు ధర్మం తప్పకుండా యుద్ధం చేసి, ప్రాణాలతో తప్పుకొనుము. చూద్దాం.

భీమ దుర్యోధనుల విజృంభణ చూచి అక్కడ కూడి ఉన్న రాజకుమారులందరూ హర్షించారు. అంతలో బలరాముడు తన శిష్యులైన భీమ దుర్యోధనుల గదాయుద్ధాన్ని చూడాలని తీర్థయాత్రలను ముగించుకొని అక్కడికి వచ్చి సత్కారాలను పొంది ఆసక్తితో యుద్ధ దర్శనోత్సాహాన్ని ప్రకటించాడు.

## 7. భీమదుర్యోధనుల గదాయుద్ధం:

దుర్యోధనుడి కోరిక ప్రకారం గదాయుద్ధం శమంత పంచక సమీపంలోని కురుక్షేత్ర యుద్ధభూమిలో ప్రవర్తిల్లటానికి నిశ్చయించారు. ధర్మరాజు చూడవచ్చిన రాజులందరినీ క్రమశిక్షణతో వ్యవహరించేటట్లు నిర్దేశించి కూర్చుండబెట్టాడు. భీమ దుర్యోధనులు బలరాముడి ఆశీస్సులను పొంది రంగభూమిలో నిలిచారు. పరస్పరం కొరకొర చూచుకొంటూ యుద్ధోత్సాహాన్ని ప్రకటించారు. మొదట దుర్యోధనుడే భీముడిని యుద్ధానికి పిలిచాడు. అప్పుడు ఎన్నో అపశకునాలు కనపడ్డాయి. భీమ దుర్యోధనులు పరస్పర వీర పరుషవాక్యాలు మాటాడుకొన్నారు. తమ గొప్పలు తాము చెప్పుకొన్నారు. భీముడు ఎత్తినగదతో దుర్యోధనుడిపై దూకాడు. దుర్యోధనుడు ఉత్సాహంతో ఎదుర్కొన్నాడు. గదాయుద్ధం మహా భయంకరంగా సాగింది. అనేక విధాల వ్యూహాలతో పెనగటం సాగించారు. ఒకరివేటులను మరొకరు నేర్పుతో తప్పించుకొన్నారు. రౌద్రోల్లాసంతో కొట్టిన గదల దెబ్బలవలన నెత్తురులు కారగా సంధ్యామేఘాలవలె వారిరువురూ రాణించారు. దేవతలు వారి యుద్ధానికి ఆశ్చర్యపోయారు. వారిద్దరిలో ఎవరు గెలుస్తారో చెప్పలేని సందిగ్ధావస్థలో పడ్డారు. దుర్యోధనుడి దెబ్బలకు భీముడు మూర్ఛపోయాడు. అతడు చనిపోయాడని భ్రమించి దుర్యోధనుడు సింహనాదం చేశాడు. దేవతలు పూలవాన కురిపించారు. భీముడు తేరుకొని అతడిని నేలపై పడవేశాడు.

అప్పుడు అర్జునుడు భీమదుర్యోధనుల బలతారతమ్యాన్ని గురించి శ్రీకృష్ణుడి నడిగాడు. 'గురూపదేశం ఇరువురికీ సమానమే అయినా, భీముడికి శరీరబలం ఎక్కువ. దుర్యోధనుడికి నేర్పరితనం ఎక్కువ. అందువలన నేర్పరి అయిన దుర్యోధనుడి వలన భీముడు దెబ్బలు తినవలసి వచ్చింది. మాయదారిని మాయోపాయంతో మట్టుపెట్టటమే న్యాయ' మని నిర్ణయించి దుర్యోధనుడి తొడలు విరుగగొట్టుతానని భీముడు చేసిన శపథాన్ని అర్జునుడి సైగలతో అతడికి సూచింపచేశాడు కృష్ణుడు. భీముడు దానిని గ్రహించి, ఆ పనిని ప్రాణంమీదకు వచ్చినప్పుడు చేయ నిశ్చయించాడు. భీముడి గదాఘాతాన్ని నేర్పుగా దుర్యోధనుడు తప్పించుకొన్నాడు. అతడు తిరిగి భీమసేనుడిని కొట్టాడు. అతడు సొమ్మసిల్లాడు. దానిని గుర్తించక

దుర్యోధనుడు భీముడిపైకి తిరిగి దూకాడు. భీముడు స్వీయరక్షణార్థం దుర్యోధనుడి తొడలపై గదతో మోదాడు. వజ్రపాతంతో కొండచరియ విరిగి పడినట్లుగా దుర్యోధనుడు తొడలు విరిగి నేలమీద కూలాడు. భీముడు కోపంతో అతడిని చూచి 'ఏకవస్త్ర అయి ఉన్న ద్రౌపదిని ఆ విధంగా నిండు సభకు లాగి అవమానించిన పాపానికి ఫలం అనుభవించు' మని ఎడమకాలితో అతడి తలను గట్టిగా తన్నాడు. అంతటితో అతడికి కసి తీరక మరల అతడి ముఖం చూచి 'బంధుద్రోహీ! ఆనాడు మమ్ములను పశువులని అవహేళన చేస్తూ అరిచావు. ఇప్పుడు మేము క్షత్రధర్మం ప్రకాశించగా మిమ్మల్ని పశువులని పిలుస్తున్నాను. ఇది మాయాద్యూతం కాదు. భుజబలంతో శత్రువుల గర్వాన్ని అణచటం. (అని పలికి ధర్మజ శ్రీకృష్ణాదులవైపు తిరిగి) మమ్ములను గొడ్డువోయిన వారని పరుషంగా నిందించిన కౌరవులను బంధుమిత్ర పరివార సమేతంగా యుద్ధంలో చంపాము. దీనివలన మాకు స్వర్గమైనా, నరకమైనా సమానమే.'

అంటూ భీముడు గదను తీసికొని దుర్యోధనుడి మెడను అదిమిపట్టి అతడి తలను మరల తన్నాడు. ధర్మరాజు వారించి అతడి పొగరుబోతుతనాన్ని అధిక్షేపించాడు. అతడి పనిని లోకం మెచ్చదని గర్హించాడు. ధర్మనీతి వర్తనులైన పాండవులు చేయదగని అనుచిత కార్యమని మందలించాడు. కన్నీరు నిండగా దుర్యోధనుడిని సమీపించి అతడి అధర్మత్వం, అత్యాశ, అవివేకం, గర్వం కారణంగా బంధునాశనం జరిగిందనీ, కౌరవుల భార్యలకు వైధవ్యం ఏర్పడిందనీ దుఃఖించాడు.

గదాయుద్ధంలో బొడ్డుక్రింది భాగంలో మోదకూడదన్న న్యాయాన్ని పాటించనందుకు కోపగించి బలరాముడు భీముడి చర్యను నిందించి దండించబోయాడు. శ్రీకృష్ణుడు అతడిని వారించి రాజులకు ప్రతిజ్ఞ నెరవేర్చటం ఉత్తమ ధర్మమనీ, మైత్రేయ ముని శాపంవలన దుర్యోధనుడి తొడలు విరుగలసి ఉన్నదనీ తెలిపాడు. బలరాముడు దానిని పూర్తిగా అంగీకరించకపోయినా, ధర్మం తప్పకుండ యుద్ధం చేసిన దుర్యోధనుడికి ఉత్తమ లోకాలు కలుగుతాయనీ, భీముడికి కీర్తి కలుగుతుందనీ పలికి వెంటనే రథమెక్కి వెళ్ళిపోయాడు. భీముడు ధర్మరాజును నిస్సంశయంగా రాజ్యభారం వహించుమని కోరాడు. ధర్మరాజు శ్రీకృష్ణుడి దివ్య సంకల్పాన్నీ, భీముడి బల ప్రదర్శననూ కీర్తించాడు. భీమ పరాక్రమాన్ని వీరులందరు ప్రశంసించారు.

## 8. శ్రీకృష్ణ దుర్యోధనుల సంవాదం:

దుర్యోధనుడి తొడలు విరుగగొట్టటం ధర్మమా అధర్మమా అనే మీమాంసలో చిక్కుకొన్న రాజులనందరినీ ఉద్దేశించి శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు. - 'భీముడు అధర్మ యుద్ధం చేశా డనవద్దు. పతివ్రత అయిన స్త్రీని కనికరం లేకుండా అంతగా అవమానం చేసినా సహించి ధర్మరాజు తన తండ్రిపాలు తనకు ఇమ్మని అడిగాడు. దుర్యోధనుడు ఆ ధర్మాన్ని నిర్వర్తించలేదు. అందువలన సుయోధనుడు మోసగాడు. అతడికి ఆ చావు తగిందే. విదురాదు లెందరో హితవు చెప్పారు. వినలేదు. భీముడి ప్రతినకు లోనైతే అది అధర్మ మౌతుందా? కూకటివేళ్ళతో కూలిన చెట్టువలె భూమిమీద పడి ఉన్న ఈ పాపాత్ముడి విషయంలో ధర్మాధర్మచింత లెందుకు? మీరందరూ రథా లెక్కి బయలుదేరండి' అన్నాడు.

దుర్యో : కంసదాసుడి కొడుకా! కృష్ణా! నీ దురాచారాలు గుర్తించకొనకుండా దయా దాక్షిణ్యాలు మాని మాట్లాడుతున్నావు. నీవు చెప్పగా అర్జునుడు చేసిన సైగను అందుకొని గదాయుద్ధ ధర్మాన్ని తప్పి భీముడు కొట్టాడు. న్యాయ యుద్ధంలో అయితే మిమ్ములనందరిని మట్టి కరిపించేవాడిని. శిఖండిని ముందుపెట్టుకొని అర్జునుడు భీష్ముడిని కూలదోశాడు. ద్రోణుడి వధకొరకు ధర్మరాజు అబద్ధమాడాడు. రథచక్రం భూమిలో కూరుకొనగా కర్ణుడిని పార్థుడు చంపాడు. వీటికి కారణం నీవే. భూరిశ్రవుడినీ, సైంధవుడినీ అర్జునుడిపాలబడేటట్లు చేసింది నీవే. నన్నూ, భీష్ముడినీ, ద్రోణుడినీ, కర్ణుడినీ, భూరిశ్రవస్సైంధవులనూ న్యాయం తప్పని యుద్ధంలో మీరు ఓడించగలరా? మాయదారి కృష్ణుడవు నీవు.

కృష్ణుడు : నీవు భీముడిని బాల్యంలో పాములచేత కరపించావు; అన్నంలో విషంపెట్టావు, నీట ముంచావు, చాలాసార్లు చంపయత్నించావు, పాండవులు నిద్రించే లక్క ఇల్లు తగులబెట్టావు, మాయాద్యూతంలో ధర్మరాజు సంపదలను హరించావు, ద్రౌపదిని నిండు సభలో అవమానించావు, నీ దుర్ణయాలకు అప్పుడే నిన్ను చంపి ఉండవలసింది.

ధర్మరాజు ఆ కష్టాలన్నీ సహించి నా చేత సంధియత్నం చేయించాడు. నీవు ఆ యత్నాలను వమ్ము చేశావు. నీ లోభగుణం చేతనే భీష్మద్రోణాదులకు ప్రాణహాని కలిగింది. శిఖండి ధృష్టద్యుమ్నులు కారణజన్ములు. వారివలన భీష్మద్రోణులు పడిపోయారు. యుద్ధంలో అనేకులతో పోరి అలసి ఉన్న సాత్యకిని చంపబోయిన భూరిశ్రవుడిని చంపటం అన్యాయమా? అనేక ప్రౌఢవీరులు కలిసి అభిమన్యుడిని చంపటం న్యాయమా? చెల్లెలైన ద్రౌపదిని చెరపట్టదలచిన సైంధవుడిని చంపటం అధర్మమా? చంపకుండ అర్జునుడు అగ్నిలో ప్రవేశించటం న్యాయమా? ఘోషయాత్రలో నిన్ను గంధర్వులచెర నుండి తప్పించాడు అర్జునుడు. ఉత్తర గోగ్రహణంలో నిన్ను చంపక వదలిపెట్టాడు. కర్ణుడికి బ్రాహ్మణ శాపం వలన కలిగిన ముప్పునకు అర్జునుడు బాధ్యుడా? శల్యుడిని ధర్మరాజు అధర్మంగా చంపాడనలేదు నీవు. పాండవులు ధర్మవర్తనులు. నీవు పుట్టినప్పటినుండి ధర్మాన్ని గొడ్డలితో నరుకుతున్నావు. భీముడు నిన్నుగూర్చి చేసిన ప్రతిజ్ఞ నీకు తెలియదా? తొడలు గదతో మోదుతా నన్నాడు కాని పిడికిలితో పొడుస్తా నన్నాడా? నీవు తగిన జాగ్రత్త వహించవద్దా? వట్టి ప్రగల్భా లెందుకు? మాట్లాడకుము.

దుర్యో : వేదాలన్నీ చదివాను, యజ్ఞాలు చేశాను, సంపదలు గడించి రాజులు కొలువగా సంతోషించాను. దుర్మదాంధులైన శత్రువులను మర్దించాను. చివరకు మిత్రులతో బంధువులతో కలిసి స్వర్గానికి వెళ్ళుతున్నాను. ఇది ఒప్పదా? నీ దృష్టిలో నే నెటువంటి వాడనైనా నా కేమి? మీరంతా పశ్చాత్తాపంతో పరితపిస్తూనే ఉంటారు గాక!

దేవతలు దుర్యోధనుడి మీద పూలవాన కురిపించారు. దేవదుందుభులు మ్రోగాయి. దిక్కులన్నీ సుగంధయుతమైన గాలితో నిండిపోయాయి. భీష్మద్రోణ కర్ణ దుర్యోధనాదులను చంపిన తీరు ధర్మం కాదేమోనని పాండవులు సిగ్గుపడి బిక్కమొగాలు పెట్టారు. శ్రీకృష్ణుడు వారికి ధైర్యం చెప్పి, భీష్మాదుల బల విశేషాలనూ, దైవ నిర్ణయాలనూ తెలియచెప్పి, దేవతలు రాక్షసులను గెలిచే తీరువంటిదని పేర్కొని, సంతోష సమయంలో దుఃఖించవద్దన్నాడు. పాండవుల మనసులు కుదుటపడ్డాయి. పాండవులూ కృష్ణుడూ తమ తమ శంఖాల నూదారు. ధృష్టద్యుమ్నాదులు శిబిరాలకు వెళ్ళి ఆ రాత్రి విశ్రమించారు. మరునాడు హస్తినాపురానికి వెళ్ళాలని సంకల్పించి ధర్మజుడి అనుమతి తీసికొన్నారు. ధర్మరాజాదులు కౌరవ శిబిరానికి వెళ్ళారు.

కృష్ణార్జునుల రథం అక్కడికి చేరింది. శ్రీకృష్ణుడు అర్జునుడిని ఆయుధాలు ప్రక్కనబెట్టి అతడిని ముందుగా రథం దిగుమన్నాడు. ఆపైన ఆయన దిగుతానన్నాడు. గాండీవాన్నీ, తూణీరాల జంటనూ తీసికొని అర్జునుడు రథం దిగాడు. శ్రీకృష్ణుడు పగ్గాలు ముడిచి రథం దిగాడు. ధ్వజంమీద భూతగణం తొలగిపోయింది. తేరు మండిపోయింది. అర్జునుడు ఆశ్చర్యపడి కృష్ణుడిని దానికి కారణమడిగాడు. 'భీష్మద్రోణకర్ణాదులు ప్రయోగించిన బాణాల అగ్నులచేత రథం ఇదివరకే చుట్టబడింది. యుద్ధం అయిపోయింది కాబట్టి ఇప్పుడు దానిని కాలనిచ్చాను' అని గోవిందుడు చెప్పాడు. ధర్మజుడు కోరిన మేరకు పాండవులను రక్షించానని శ్రీకృష్ణుడు ప్రకటించాడు. దివ్యాస్త్రాగ్నులనుండి వారిని రక్షించి అనుగ్రహించినందుకు ధర్మరాజు గోవిందుడికి కృతజ్ఞతలు తెలిపాడు. కృష్ణు డేవైపు ఉంటే ఆ వైపు విజయం తథ్యమని వ్యాసుడి వాక్యాన్ని యుధిష్ఠిరుడు స్మరించాడు. శ్రీకృష్ణుడు అర్జునుడి ప్రతాపాన్ని ప్రశంసించాడు. పాడుపడిన కౌరవశిబిరంలో ఉండటం శ్రేయస్కరం కాదని రత్నరాశులను గ్రహించి శ్రీకృష్ణుడి వెంట ఓఘవతీ తీర్థం చేరి ఆ రాత్రి అక్కడ విశ్రమించారు.

## 9. శ్రీకృష్ణుడు గాంధారీ ధృతరాష్ట్రులను ఓదార్చటం:

ఆ రాత్రి ధర్మరాజు శ్రీకృష్ణుడిని హస్తినాపురానికి వెళ్ళిరమ్మని ప్రార్థించాడు. భీముడు దుర్యోధనుడిని యుద్ధంలో అధర్మంగా చంపాడని తెలిసి గాంధారి కోపించి పాండవులను శపిస్తుందేమో అన్న భయం కలిగి, ఆమెను శాంతింపజేయగల

మహితాత్ముడు శ్రీకృష్ణుడని భావించి ధర్మజుడు అతడిని పంపాడు. పంపింది ధృతరాష్ట్రుడి వద్దకైనా ప్రయోజనం గాంధారి కోపోపశమనమే.

శ్రీకృష్ణుడు హస్తినాపురికి పోయాడు; గాంధారీ సహితుడై పుత్రశోకంతో తపిస్తున్న ధృతరాష్ట్రుడిని దర్శించాడు. అప్పటికే వ్యాసమహర్షి అక్కడికి వచ్చి ఆ మహారాజును ఓదారుస్తున్నాడు. శ్రీకృష్ణుడు కూడ వ్యాసమహర్షికి నమస్కరించి ధృతరాష్ట్రుడి చేతులను తనచేతిలోకి తీసికొని కన్నీరు పెట్టుకొని, బొంగురుపోయిన గళంతో పలుకుతూ వంశమంతా నిష్కారణంగా నాశనమైనందుకు విచారం వ్యక్తంచేశాడు. తన రాయబారాన్నీ, ద్రౌపది అవమానాన్నీ, పాండవుల అరణ్య అజ్ఞాతవాస కష్టాలనూ, విదురాది బోధలనూ దుర్యోధనాదులు వినక రాజ్యభాగాన్ని పాండవులకు నిరాకరించిన అంశాలనూ పేర్కొన్నాడు. పాండవులు మోసపు మనసులు లేనివారనీ, ఇకపై గాంధారీ ధృతరాష్ట్రుల పరలోక క్రియలు పాండవులే నిర్వహించవలసి ఉంటుందనీ, అందువలన వారి మేలు కోరటం మంచిదని చెప్పి, ధర్మరాజు పొందుతున్న దుఃఖాన్ని గురించి వివరించాడు. గాంధారిని ఉద్దేశించి ఆమెవంటి సాధ్వీమణి లేదని కీర్తించి, ఎన్ని చెప్పినా వినక రాజ్యంలో భాగ మివ్వక దుర్యోధనుడు అవలంబించిన దుర్నీతి ఆ విపత్తుకు కారణమని పేర్కొని, ఆమె కోపంతో చూస్తే మూడు లోకాలు భస్మీపటలం ఔతాయని, కాబట్టి పాండవుల పట్ల వాత్సల్యాన్ని చూపాలని హితవు చెప్పి ఆమెను ఒప్పించాడు. అంతలో శ్రీకృష్ణుడి మనసులో అశ్వత్థామ సమరోత్సాహం గోచరించింది. వెంటనే బయలుదేరి పాండవుల వద్దకు వెళ్ళాడు. వ్యాసుడుకూడా ఉపశమన వాక్యాలు చెప్పి అంతర్ధాన మయ్యాడు.

సంజయుడు దుర్యోధనుడిని సందర్శించాడు. భీమాదులు యుద్ధంలో అనుసరించిన యుద్ధధర్మ విరుద్ధ మార్గాన్ని గురించి చెప్పి, వారికి అపకీర్తి కలుగుతుందని చెప్పి ధృతరాష్ట్రుడికి తెలియపరిచాడు. తొడలు విరిగి పడేంతవరకు ఇతరులకు తలవంచలేదనీ, శమంతపంచక ప్రాంతంలో ప్రాణాలు వదలితే పుణ్యలోకాలు కలుగుతాయనీ, మోసంతో పొందిన రాజ్యాన్ని పాండవులు పొందుతారనీ పేర్కొన్నాడు. ఆ విషయాలను అశ్వత్థామ, కృప, కృతవర్మలకు చెప్పమని కోరాడు. అతడిని చూడటానికి వచ్చిన జనులు ఆ సంగతిని అశ్వత్థామాదులకు తెలియచెప్పారు.

### 10. అశ్వత్థామ విజృంభణం:

ఆ రథికత్రయం దుర్యోధనుడి వద్దకు వచ్చి అతడి దీనావస్థను చూచి దుఃఖించింది. అశ్వత్థామ అతడి పూర్వవైభవాన్ని ప్రస్తావించి పలవరించాడు. దుర్యోధనుడు గద్గదకంఠంతో సుఖదుఃఖాలు కావడి కుండల వంటివని పేర్కొని, ఎన్ని ఆపదలు వచ్చినా జంకక ధైర్యంతో యుద్ధంచేసే బంధువులు, స్నేహితులు, కుమారులు, సోదరులు యుద్ధంలో చనిపోగా తా నొక్కడే మిగిలినా వారిని చూచే భాగ్యం కలగటం అదృష్టంగా భావించాడు. విష్ణుమహిమ తెలిసి ఉన్నా నిర్భయంగా పగను సాధించటానికి పూనుకొని జయంకోరి వారు శౌర్యసంపదను ప్రదర్శించి పోరినందుకు హర్షం ప్రకటించి, విధివైపరీత్యానికి విచారించాడు. దుర్యోధనుడి దుఃస్థితిని గమనించిన అశ్వత్థామ రోషోద్రేకంతో ఇట్లా అన్నాడు. 'పాండవులు నా తండ్రిని ఆ విధంగా చంపినప్పుడే నాకు తీవ్రకోపం, తాపం కలిగాయి. ఇప్పుడు రారాజును నిన్ను కూల్చిన విధం నా మనసున మరీ మండిస్తున్నది. పాండవులను నా భయంకరాస్త్రాల వహ్నికి దగ్ధం చేస్తాను. మహారాజా! వినుము ఆ శ్రీకృష్ణుడు చూస్తుండగానే ధృష్టద్యుమ్నాది వీరుల నందరినీ మట్టుపెట్టుతాను. నన్ను ఆజ్ఞాపించుము' అన్నాడు. ఆ మాటలకు దుర్యోధనుడు సంతోషించి, కృపాచార్యులచేత కమండలు జలం తెప్పించి, అశ్వత్థామను సైన్యాధ్యక్షుడిగా అభిషేకించాడు. అతడు సంతోషించి దుర్యోధనుడిని కౌగిలించుకొని సింహనాదం చేసి కృప కృతవర్మలు వెంటరాగా పాండవ స్కంధావారంవైపు ప్రస్థానం సాగించాడు.

# సౌప్తికపర్వ కథాసారం

అశ్వత్థామా, కృపాచార్యుడూ, కృతవర్మా పాండవశిబిరం వైపు నడిచారు. అక్కడ విజయోత్సాహం కోలాహలంగా సాగుతూ ఉన్నది. తాము గుర్తించబడతామేమో అనే భయంతో ఆ ముగ్గురూ సమీపారణ్యంలో ఒక మర్రిచెట్టుకింద శరీరాలు వాల్చారు. చీకటి పడింది. కృపుడూ, కృతవర్మా బాగా అలసిపోవటంచేత నిద్రపోయారు. కోపంచేత కాల్చబడిన మనస్సుగల అశ్వత్థామకు మాత్రం నిద్రపట్టలేదు. పాండవులమీద ఎట్లా పగదీర్చుకొనాలా అనే ఆలోచనలో పడి అతడు మర్రిచెట్టుకేసి చూశాడు. దాని కొమ్మలపై ఎన్నో కాకులు నిద్రపోతున్నాయి. అప్పుడు ఒక గ్రుడ్లగూబ అక్కడికి వచ్చి ఆ కాకుల నన్నిటినీ రకరకాలుగా చంపటం అశ్వత్థామ చూచి, అది తనకు కర్తవ్యోపదేశంగా భావించి, తాను కూడా అట్లాగే శత్రువులను ఆ రాత్రే నిద్రపోతే ఉన్న సమయంలో చంపటానికి నిశ్చయించుకొన్నాడు. కృపకృతవర్మను లేపి, తన నిశ్చయం చెప్పి, వాళ్ళ అభిప్రాయం అడిగాడు. కృపాచార్యుడు దానికి సమ్మతించక, ఎన్నో నీతులు చెప్పి, 'గాంధారీ ధృతరాష్ట్రుల దగ్గరకు వెళ్ళి, అక్కడ విదురుడు కూడా ఉంటాడు కాబట్టి, వాళ్ళు ముగ్గురూ ఎట్లా చెప్పితే అట్లా నడుచుకొందాం' అన్నాడు. అశ్వత్థామకు అతడి మాటలు నచ్చలేదు. 'నే నొక్కడినే ఆ కార్యం నిర్వహిస్తా' నని అశ్వత్థామ పట్టుపట్టగా, విధి లేక ఆ ఇద్దరూ అతడిని అనుగమించారు.

### 11. నడిరేయి నరహోమం:

ఇట్లా వెళ్ళే అశ్వత్థామ స్థిరసంకల్పాన్ని పరీక్షించటానికి ఈశ్వరుడు ఒక భయంకర భూతరూపంలో అతడి మార్గాన్ని నిరోధించాడు. అశ్వత్థామ ఆ పెనుభూతంపై ప్రయోగించిన బాణాలన్నీ వ్యర్థమయ్యాయి. చివరకు తీవ్రస్వభావుడైన ఆ అశ్వత్థామ ఆత్మోపహారానికి సంసిద్ధుడు కాగా శివుడు ప్రత్యక్షమై అతడి కొక మహనీయమైన ఖడ్గాన్ని ప్రసాదించాడు. అశ్వత్థామ సంతోషించి అప్రతిహతమైన ఆ ఖడ్గం సహాయంతో పాండవ సంహారానికి ఉద్యమించాడు. ఆ స్కంధావారం గుట్టుమట్టూ అంతకుముందే తెలిసికొన్నవా డవటంచేత ముందుగా తన తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుడి శిబిరం ప్రవేశించి నిద్రిస్త ఉన్నవాడిని తన్ని లేపి, ఆక్రమించి, వింటి అల్లెత్రాడు అతడి కంఠానికి బిగించి ఉరిపోసి చంపాడు. పిశాచోన్మత్తుడైన ఆ వీరుడు క్రమంగా పాంచాలురను అందరినీ, ద్రౌపదేయులనూ, అసంఖ్యాక యోధులనూ నిద్రపోతూ ఉండగా నిర్దయుడై వధించాడు. మేలుకొని పారిపోవటానికి ప్రయత్నించే అభాగ్యులను శిబిరద్వారం దగ్గర ఉన్న కృప కృతవర్మలు అడ్డగించి చంపివేశాడు. పాండవులైదుగురూ, కృష్ణ సాత్యకులూ మాత్రం ఆ శిబిరంలో కనబడనందుకు అశ్వత్థామ విచారించాడు. అతడి రాక్షసావేశానికి, నీచ పరాక్రమానికి విచారిస్తూ కృప కృతవర్మలు తలలు వంచుకొని ఊరకున్నారు.

తరువాత ఆ ముగ్గురు యోధులూ తాము జరిపిన సంహార వృత్తాంతాన్ని వినిపించటానికి దుర్యోధనుడి దగ్గరకు పరుగెత్తారు. అతడు చనిపోవటానికి సిద్ధంగా ఉండి, తీవ్రవేదన పొందుతూ, ఇప్పుడో ఇకనో అన్నట్లుగా ఉన్నాడు. అతడి దీనస్థితిని చూచి వాళ్ళు చాలా బాధపడ్డారు. అశ్వత్థామ దుర్యోధనుడికి ఎంతో కీర్తిని సంపాదించిపెట్టిన అతడి గదాయుద్ధ కౌశలాన్ని ప్రశంసించి, 'నీ కొరకు బాధపడకుము. నీవు పుణ్యలోకానికి పోయినప్పుడు నా తండ్రి అయిన ద్రోణుడిని చూచి ద్రోహి అయిన ధృష్టద్యుమ్నుడిని నీ కొడుకు చంపాడని చెప్పుము' అని విన్నవించాడు. ఉపపాండవ, పాంచాలాదుల మరణం విని దుర్యోధనుడు సంతోషించి, 'భీష్మ ద్రోణులు కాని, కర్ణశల్యులు కాని మీవలె నాకు మేలు చేయలేదు. సుఖంగా ఉండండి, మనకు పునర్దర్శనం స్వర్గ లోకంలో అవుతుంది. వెళ్ళండి' అని పలికి ప్రాణం విడిచిపెట్టాడు. రథికులు ముగ్గురూ దుఃఖంతో అతడికి ప్రదక్షిణం చేసి తిరిగి తిరిగి చూస్తూ రథారూఢులై వెళ్ళిపోయారు.

ఈ వృత్తాంతం అంతటినీ సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పి 'యుద్ధ ప్రకారం అంతా నీకు చెప్పటానికి వ్యాసమునీంద్రుడు నన్ను నియోగించి ఇచ్చిన దివ్యదర్శనత్వం నీ కొడుకుతో పాటు పోయింది. ఇంక నా కా శక్తి లే' దని చెప్పి వెళ్ళిపోయాడు.

## 12. అశ్వత్థామ శిరోరత్నం:

మర్నాడు సూర్యోదయ సమయంలో ధృష్టద్యుమ్నుడి సారథి పాండవుల వద్దకు వచ్చి రాత్రి జరిగిన దారుణవధ క్రమం అంతా చెప్పాడు. ధర్మరాజాదులు మూర్ఛిల్లి, కొంతసేపటికి తెలిసి, మిక్కిలి విలపించారు. సముద్రమంతా దాటి చిన్న క్రయ్యలో మునిగిపోయినట్లు అయిందని ధర్మరాజు దుఃఖించాడు. అతడు ద్రౌపదికి ఈ దుఃఖవార్తను చెప్పటానికి నకులుడిని పంపాడు. ద్రౌపది ద్రుపద విరాటులు మరణించిన నాటి రాత్రి వారి భార్యలను ఓదార్చటానికి సుభద్రతోనూ, ఉత్తరతోనూ కలిసి మాత్స్య నగరానికి వెళ్ళింది. నకులుడు ఉపప్లావ్యపురానికి వెళ్ళి ద్రౌపదికి ఈ దుఃఖవార్త చెప్పి, ఆమెనీ, ఇతర స్త్రీ జనాన్నీ తీసికొని వచ్చాడు. ఆత్మపుత్ర వినాశనానికి దుఃఖించే ద్రౌపదిని 'క్షత్రియకాంత సంతానం యుద్ధంలో వీర మరణం పొందటం సముచితమే కదా!' అని ధర్మరాజు ఊరడించాడు. 'దుర్మార్గుడైన అశ్వత్థామను చంపవలసిందే. కాని, అతడు అడవికి పోయి ఉంటాడు. అతడిని చంపటం నీ కెట్లా తెలుస్తుంది?' అని ధర్మరాజు అనగా ద్రౌపది 'అశ్వత్థామకు సహజమైన శిరోరత్నాన్ని తెచ్చి చూపితే జీవంతో ఉంటా'నని భీముడిని హెచ్చరించింది. వెంటనే అతడు నకుల సహాయుడై రథం ఎక్కి అశ్వత్థామను అన్వేషించటానికి బయలుదేరాడు. 'అశ్వత్థామ అజేయ పరాక్రముడు. క్రూరుడు, వాడి దగ్గర లోకభయంకరమైన బ్రహ్మశిరో నామకాస్త్రం ఉన్నది. భీముడిని ఒక్కడినీ పంపటం క్షేమకరంకా'దని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు. అప్పుడు సహదేవసాత్యకులను స్కంధావార రక్షణకై నియోగించి ధర్మరాజూ, శ్రీకృష్ణుడూ, అర్జునుడూ భీముడికి సాయపడటానికి వెళ్ళారు. పలాయితుడైన అశ్వత్థామను వ్యాసుడి ఆశ్రమానికి సమీప ప్రదేశంలో తపస్సు చేస్తుండగా పట్టుకొన్నారు. పాండవవీరులను చూచి అశ్వత్థామ భయక్రోధాలతో బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ఒక గడ్డి పరకయందు ఆవహింపజేసి ప్రయోగించాడు. అది భయంకర జ్వాలలతో పాండవులను ఆక్రమించబోయింది. అర్జునుడు కూడా శ్రీకృష్ణ ప్రేరితుడై ఆత్మరక్షణ కొరకు అదే అస్త్రాన్ని ప్రయోగించాడు. నారద వేదవ్యాసులు ఆ మహాస్త్రాలచేత లోక సంక్షోభం కాకుండా ఎవరి అస్త్రాన్ని వారు ఉపసంహరించుకొనాలని ఆదేశించారు. సత్త్వస్వభావుడూ, గురుభక్తి తత్పరుడూ అయిన అర్జునుడు తన అస్త్రాన్ని ఉపసంహరించుకొన్నాడు. కాని, తామస ప్రవృత్తిగల అశ్వత్థామ అట్లా చేయలేకపోయాడు. 'ఆ మహాస్త్రాన్ని మనుష్య విషయంగా ప్రయోగించే వాడికి అశుభం కలుగుతుంది. ఒకటిచేత ప్రయోగించబడి, అన్యుడి అస్త్రం ఉపశమిస్తే, ఆ దేశానికి పన్నెండేళ్ళు అనావృష్టిదోషం పడుతుంది. కాబట్టి పాండవులనూ, నిన్నూ ఈ దేశాన్నీ రక్షించటానికి చెప్పాము. ఎట్లా అయినా సరే దీనిని ఉపసంహరించుము. నీ శిరోమణిని అర్జునుడికి ఇమ్ము. అప్పుడు ఇతడే కాదు, పాండవులందరూ నీ ప్రాణం తీసినంతగా సంతోషిస్తారు' - అని వ్యాసుడు ఉపదేశించగా, అశ్వత్థామ దానిని పాండవుల కివ్వటానికి నిరాకరించి, వ్యాసుడి కిచ్చి, తన అస్త్రం పాండవేయ గర్భాలకు హాని కలిగింది ఉపశమిస్తుందని చెప్పాడు. వ్యాసుడు అతడితో 'అట్లా చెయ్యి, వేరే దానికి ఆశించకు' అనగానే అశ్వత్థామ తన మాట తప్పని గ్రహించాడు. అశ్వత్థామ పాండవేయగర్భాలనటంలో పాండవ సంతతి గర్భాల నన్నిటినీ ఉద్దేశించగా, వ్యాసుడు పాండవుల భార్యల గర్భాలుగానే 'వేరేదానికి ఆశించకు' అన్నాడు. అది నేను తెలిసినట్లుగా ఎందుకుండాలి?' అని అతడితో పలికి, అన్ని గర్భాలనూ నాశనం చేయటానికి నిశ్చయించుకొన్నాడు. శ్రీకృష్ణుడు తాను ఉత్తరాగర్భస్థుడికి సుదీర్ఘమైన ఆయువు నిస్తానని పలికినా లెక్కచేయక అస్త్రాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు అది చూచి అశ్వత్థామతో 'ఉత్తరకు ఒక బ్రాహ్మణుడి వాక్కువలన పరిక్షిత్తు అనే కొడుకు పుట్టుతాడు. వాడు పాండవ వంశోద్ధారకుడు అవుతాడు. నీవు చేసిన పని అంతా వ్యర్థం' అని పలికి కోపంతో 'పిల్లలను చంపిన నీవు ఆహారం లేక, నిస్సహాయుడవై దుర్గంధ భూయిష్ఠమైన రక్తంచేత శరీరం దగ్ధమవుతూ ఉండగా మూడువేల సంవత్సరాలు తిరుగుము. ఆ పరిక్షిత్తుకు జనమేజయుడు పుట్టి గొప్పవాడవుతాడు' అన్నాడు. వ్యాసుడు కూడా 'కృష్ణు డన్నట్లుగానే కమ్ము' అని శపించాడు. అశ్వత్థామ వ్యాసుడిని 'నీవు మనుష్యులలో ఉంటా'వని బదులు శపించి 'నేనూ నీ దగ్గరే ఉంటా'నని పలికి శిరోమణిని పాండవుల కిచ్చి తపోవనానికి వెళ్ళాడు.

గురుపుత్రు డవటంచేత అర్జునుడు అశ్వత్థామను చంపటానికి పూనుకోక, అవమానించి, ఆయుధాలతోపాటు సిగ్గుకూడా విడిచిపెట్టేటట్లు చేశాడు.

ధర్మరాజు అశ్వత్థామశిరోమణిని భీముడి కిచ్చి దానిని ద్రౌపది కిమ్మన్నాడు. భీముడు అట్లాగే చేసి 'దుఃఖం మాని ఓర్పు వహించు'మని ఆమె కుపదేశించాడు. ద్రౌపది దానిని ధర్మరాజుకే ఇచ్చింది.

శ్రీకృష్ణుడి అభయ ప్రదానంవలన ఊరడిల్లినా, ఉత్తరాగర్భానికి ఏమి ముప్పు కలుగుతుందో అని అందరూ భయపడజొచ్చారు. అప్పుడు ఉత్తరకు తప్ప పాండవ వంశంలోని స్త్రీలకు చూలులు లేకుండా పోయాయి. ఆ అస్త్రరాజం ఉత్తర గర్భంలోని పిండాన్ని బాధించటం చూచి శ్రీకృష్ణుడు తాను అశ్వత్థామతో సంభాషించేటప్పుడు ఆ అస్త్రం వలన దాని కెటువంటి ప్రమాదం లేకుండా తన మనోవ్యాపార్థం చేతనే చేశాడు. ఆ సంగతి ఎవరికీ తెలియదు.

## 13. పరమేశ్వర ప్రభావం:

మిక్కిలి బలవంతులైన ద్రౌపదేయులనూ, ధృష్టద్యుమ్నుడినీ, తక్కిన వీరులనూ అశ్వత్థామ ఒక్కడూ ఎట్లా చంపగలిగా డని ధర్మరాజు శ్రీకృష్ణుడిని అడుగగా, ఈశ్వరుడిని ఆశ్రయించటంచేత అశ్వత్థామ అట్లా చేయగలిగాడని చెప్పి శ్రీకృష్ణుడు ధర్మరాజుకు శివుడి దివ్యలీలలు చెప్పాడు.

బ్రహ్మ జగత్తును సృష్టించగోరి పరమేశ్వరుడిని సృష్టి నిర్మాణ సూత్రాన్ని అడుగగా, అతడు బ్రహ్మ కోరికను తీర్చటానికి నీళ్ళలో నిలబడి తపస్సు చేయటం ప్రారంభించాడు. శివుడు ఎంతకూ రాకపోవటంచేత బ్రహ్మ దక్షుడనే వాడిని సృజించి సృష్టిచేయ నియోగించాడు. దక్షుడు భూతసృష్టి చేశాడు. అవి ఆకలిగొని దక్షుడిని భక్షించటానికి మీదపడ్డాయి. రక్షించుమని దక్షుడు బ్రహ్మను వేడుకొన్నాడు. బ్రహ్మ ఓషధులనూ, వృక్షసంపదనూ సృష్టించి వాటికి సమర్పించి, బలహీనులు బలవంతులకు ఆహారం అవుతారని ఆదేశించాడు. భూతాలు సంతోషించి సంతతి రూపంలో వృద్ధి పొందసాగాయి. చాలాకాలం తరువాత శివుడు నీళ్ళలో నుండి వెలుపలికి వచ్చి ప్రాణికోట్లను చూచి కోపంతో తన లింగాన్ని పెరికి నేలమీద పెట్టాడు. 'భూతసృష్టికొరకు నేను నీళ్ళలో ఉండి తపస్సు చేసి అధికుడి నయి వచ్చాను. ఈలోగా ఇంకొకడిచేత సృష్టి జరిగిపోయింది. భూతసృష్టికి పనికిరాని లింగం నా కెందు కని పలికి మాల్యవంతానికి వెళ్ళి మహాతపస్సు చేయనారంభించాడు. దేవతలు శివలింగానికి పూజలు చేశారు. దేవతలు ఒక యజ్ఞం చేస్తూ, రుద్రుడి మహానుభావత ఎరుగకపోవటంచేత అతడికి అందులో భాగం కల్పించలేదు. అది తెలిసి శివుడు ఒక విల్లు సృజించి ఆ యజ్ఞాన్ని ధ్వంసం చేయటానికి రాగా, లోకాలన్నీ వ్యాకులత చెందాయి. సూర్యచంద్రాగ్నులు తమ తేజస్సులు కోల్పోయారు. దేవతలు కలతచెందారు. ఈశ్వరుడు విజృంభించి యజ్ఞాన్ని కొట్టాడు. అది లేడి రూపం ధరించి పారిపోయింది. ఈశ్వరుడు వింటికొనతో సవితచేతులూ, పూషుడిపళ్ళూ, భగుడికళ్ళూ రాలగొట్టాడు. దేవతలు పారిపోయారు. శివుడు వాళ్ళను ఆపి, కొట్టకుండా అవమానించగా, వాళ్ళు వింటిత్రాడు ముక్కలయిపోవుగాక!' అనగానే అది అట్లాగే అయింది. ఆ యజ్ఞమూ, దేవతలూ శరణంటూ శివుడి పాదాల మీద పడ్డారు. ఈశ్వరుడు వాళ్ళను అనుగ్రహించాడు. అతడు తన కోపాన్ని తొలగించి సరస్సులో పడవేసి దేవతలను దయతో చూచాడు. అది అగ్ని రూపం ధరించి ఆ నీళ్ళను ఇంకించింది. శివుడు సవితకు చేతులూ, పూషుడికి పళ్ళూ, భగుడికి కళ్ళూ ఇచ్చి యజ్ఞం ఎప్పటివలె ప్రవర్తించేటట్టు అనుగ్రహించాడు. దేవతలు శివుడికి యజ్ఞభాగం కల్పించారు. శివుడు శాంతించాడు.

'ఈశ్వరుడి లీలలు అట్లాంటివి. అతడు కోపిస్తే లోకాలు అస్వస్థతనూ, ప్రసన్నుడైతే సౌఖ్యాన్నీ పొందుతాయి. అశ్వత్థామ అతడి అనుగ్రహం వలననే అంతటి శక్తిమంతు డయ్యాడు. కాని, స్వశక్తి వలన కాదు. నీవు దీనిని మనస్సులో పెట్టుకొనవద్దు. నీ యుద్ధ విజయానికి కారణమైన నీ దైవమానుష యోగానికి నీవు పరమానందపడుము' అని శ్రీకృష్ణుడు ధర్మరాజును ఓదార్చాడు.

# స్త్రీపర్వ కథాసారం

### 14. ధృతరాష్ట్రుడికి సంజయుడి ప్రబోధం:

కొడుకులు నూరుమంది పాండవుల చేతిలో నశించి పోవటంతో ధృతరాష్ట్రుడు కొమ్మలన్నీ నరికివేసిన మహావృక్షం వలె మోడువడి పోయి భరించలేని దుఃఖంలో మునిగిపోయాడు. సంజయుడు ఆయనకు ధైర్యం చెప్పి, గతించినవారిని గురించి దుఃఖిస్తూ కూర్చునేదానికంటె వారి దహన సంస్కారాల గురించి, బంధువుల కిచ్చే తిలోదకాల గురించీ ఆలోచించుమని హితవు చెప్పాడు. ఆ మాట విని ఆ వృద్ధరాజు గాలితాకిడికి పడిపోయిన పెద్దచెట్టువలె మూర్ఛపోయాడు. కొంతసేపటికి తేరుకొని రెక్కలు తెగిన పక్షివలె, కాంతిని కోల్పోయిన సూర్యుడివలె వెలవెల పోతూ ఆత్మీయులందరూ అంతరించిపోయిన తన బ్రతుకూ ఒక బ్రతుకేనా? అంటూ పెద్దగా విలపించాడు. ఆనాడు కృష్ణుడు రాయబారపు సభలో చెప్పిన హితవూ, భీష్మద్రోణాదులు పలికిన నీతివచనాలూ వినక, పాండవులకు తండ్రిపాలు రాజ్యం ఇవ్వక తనవారి నందరినీ చంపుకొన్నందుకు పరితపించాడు. తన బ్రతుకు వృథా అని వాపోయాడు. తనకు కలిగిన శోకం పూర్వజన్మ పాపఫల మని భావించాడు. తానే స్వయంగా తనవారికి అంత్యక్రియలు చేయలేననీ, దానికీ పాండవులే సమర్థులనీ పేర్కొన్నాడు.

సంజయుడు ధృతరాష్ట్రుడికి అభిమన్యుడి మరణానంతరం వ్యాసుడు ధర్మరాజుకు బోధించిన సృంజయ వృత్తాంతం చెప్పాడు. పుణ్యాత్ములు ఏ సమయంలో ఏం చేయాలో అది చేసి కార్యసాధనలో సఫలీకృతు లౌతారు. పాపాత్ములు అసూయాగ్రస్తులై ఆ పనిని అడ్డుకొని తమ ప్రయత్నం విఫలం కాగా విలపిస్తారు. కౌరవులు చేసిన పనులు పాపాత్ముల చేష్టల వంటివి. గతించింది, నశించింది తిరిగిరాదు. స్వయంగా చుట్టూ మంట పెట్టుకొని అది క్రమ్ముకొంటే తట్టుకొనలేక రోదన చేసినట్లున్నదని ధృతరాష్ట్రుడి దీన స్థితిని పేర్కొని, అతడికి వివేకాన్ని బోధించాడు. దుర్యోధనుడి కఠినవాక్కు లనే గాలికి అర్జున భీముల రోషమనే అగ్ని వ్యాపించి కౌరవాటవిని దహించి వేసిందని తెలియచెప్పాడు. యుద్ధంలో చనిపోయినవారందరూ యజ్ఞాలూ, దానధర్మాలూ, వేదశాస్త్రపఠనాలూ చేసి సంపాదించిన పుణ్యంకంటె ఎక్కువ పుణ్యాన్ని పొంది వీరస్వర్గాన్ని అలంకరిస్తారనీ, వారిని గురించి దుఃఖించ నవసరం లేదనీ ఉపశమన వాక్యాలు పలికాడు. సంసారం అరటిచెట్టువలె నిస్సారమైనదనీ, దానిని గుర్తిస్తే మనస్సు పెనువగలకు గురికాకుండా ఉంటుందనీ, శరీరాన్ని విడిచి ఆత్మలు క్రొత్త శరీరాలను పొందటమే మరణజననాల రహస్యమని తెలిసిన విజ్ఞులు ఆప్తుల మరణానికి ఆర్తి పొందరనీ జీవనతత్త్వాన్ని వివరించి సంసారం బహుళ దుఃఖమయమని తెలిపే ఇతిహాసాన్ని వివరించాడు. శరీరం ఒక రథం. బుద్ధి సారథి. ఇంద్రియాలు గుర్రాలు. బుద్ధి చేసే ఆలోచనలు పగ్గాలు. పుణ్యాత్ములు పగ్గాలను నడవడి అనే ఉపాయంతో నడిపి ఇంద్రియాలనే గుర్రాలను అదుపు చేస్తారు. అటువంటి వారిని జననమరణాదులవలన కలిగే దుఃఖాలు కలతపెట్టలేవు. కాబట్టి ధృతరాష్ట్రుడు ఇంద్రియవశుడు కాక భయాన్ని వదలి, మోక్షం పొందే మార్గాన్ని ఎన్నుకొని, పుత్రపౌత్రాదులకు, దాయాదులకు ఉత్తరక్రియలు చేయటం సముచితమని ప్రబోధించాడు.

### 15. ధృతరాష్ట్రుడికి వ్యాసమహర్షి ప్రబోధం:

కన్నబిడ్డలకు ఉత్తరక్రియలు చేయాలనే మాట వినేసరికి గుండె మండగా ధృతరాష్ట్రుడు వేదనతో మూర్ఛపోయాడు. ఆ సమయంలో వ్యాసమహర్షి అక్కడికి వచ్చాడు. వృద్ధరాజు తేరుకొని బిడ్డల నందరినీ కోల్పోయిన తన జన్మ నిష్ఫల మనీ, తనకు చావు కూడా రావటం లేదనీ వాపోయాడు. అప్పుడు వ్యాసు డిట్లా అన్నాడు: 'పుట్టిన ప్రతిజీవీ గిట్టకమానదు. ఈ వాస్తవాన్ని తెలిసిన విజ్ఞులు వివేకాన్ని కోల్పోయి పుత్రుల మరణానికి శోకించరు. అంతేకాక కౌరవపాండవుల వైరం నీకు తెలియకుండా కలిగింది కాదు. అంతటికీ నీ కొడుకే మూలం. మిగిలినవారందరూ యుద్ధంలో ఆసక్తి కలవారే. కాబట్టి విదురాది విబుధులు ఎన్నివిధాల చెప్పినా నీవూ, నీ కొడుకూ వినలేదు. దీనికితోడు దేవతల సంకల్పం కూడా దానికి తోడ్పడింది. పూర్వం భూభారాన్ని తొలగించటానికి ధృతరాష్ట్రుడి కొడుకైన దుర్యోధనుడు పుట్టి యుద్ధంలో తన నూరుగురు సోదరులూ, వివిధ దేశ ప్రభువులూ సైనికులూ కురుక్షేత్రంలో చనిపోతారని విష్ణువు చెప్పిన మాటలు వినిపించాడు.

కౌరవులు తాము చేసిన తప్పులతో నశించారు. దానికి విచారపడటం వివేకం కాదని అన్నాడు. ధర్మరాజు తనను అవమానిస్తాడేమో అన్న ధృతరాష్ట్రుడి అనుమానాన్ని వ్యాసుడు తీర్చాడు. పాండవుల వలన ఎప్పుడూ ఎవ్వరికీ ఎటువంటి కీడు జరగలేదు. దుర్యోధనాదులే భూమండలాన్ని మ్రింగారు. పాండవులకు పాండురాజు భాగం దక్కకుండా చేశారు. అందువలననే కౌరవులందరూ కదనరంగంలో కన్నుమూశారు. నారదుడీ సంగతి ధర్మరాజుతో ఎప్పుడో చెప్పాడు. అందుకే అతడు వంశనాశనం కాకుండా హింస ప్రవర్తిల్లకుండా శాంతికాముకుడై సంధియత్నం చేశాడు. నేను కూడా అతడిని ప్రోత్సహించాను. కాని, విధిని ఎవ్వరు తప్పించగలరు? ఇదంతా దేవరహస్యం. నీకు తెలియాలనీ పాండవులపై పగ తగ్గి దయపెరగాలనీ చెప్పాను. ధర్మరాజు సర్వభూత సమభావం కలవాడు. అతడు అజాతశత్రువు. నీవు దుఃఖిస్తూ ఉంటే చూడలేడు. కాబట్టి నీ కొడుకులకంటె ఎక్కువగా అతడిని ఆదరించుము. వారు నీ తమ్ముడి కొడుకులే కదా! నీ శోకాగ్నిని జ్ఞానజలంతో ఆర్పివేయుము'. ఈ ఉపదేశం విని ధృతరాష్ట్రుడు తీవ్ర దుఃఖం నుండి ఉపశమనం పొందాడు. వ్యాసుడు అంతర్ధానమయ్యాడు.

### 16. యుద్ధభూమికి ధృతరాష్ట్రుడి పయనం:

ధృతరాష్ట్రుడు యుద్ధభూమికి బయలుదేరాడు. శోకభారంతో శరీరం తూలుతూ ఉండగా గాంధారి అతడి వద్దకు వచ్చింది. కుంతీదేవి మొదలైన దేవేరులు, కౌరవుల భార్యలు, పరిచారికలు, తలలపై చేతులు పెట్టుకొని, జుట్టు విరబోసికొని, వనితల ఆకారం పొందిన శోకంవలె, రోదిస్తూ, అతిదీనంగా అక్కడికి తరలివచ్చారు. మిగిలిన మృతవీరుల భార్యలు దుఃఖార్తలై వీథులలోకి వచ్చారు. విదురాదులు వారివారికి ఉచితమైన వాహనాలను అమర్చి ప్రస్థానం సాగించారు. ధృతరాష్ట్రుడి రథం ముందుకు సాగగా ఆ శోకయాత్ర కొనసాగుతున్నది.

అంతలో అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ - ముగ్గురూ రణభూమినుండి తిరిగివస్తూ రథాలు దిగి ధృతరాష్ట్రుడికి నమస్కరించి, దుర్యోధనుడు వీరోచితంగా పోరి వీరస్వర్గం పొందాడనీ, కౌరవసేనలో చనిపోక మిగిలింది తాము ముగ్గురే అనీ నివేదించారు. దుఃఖితురా లైన గాంధారికి దుర్యోధన పరాక్రమాన్నీ, కురువీరుల యుద్ధనైపుణ్యాన్నీ ప్రశంసించి చెప్పి, వారు దానధర్మాలవలన పొందే పుణ్యలోకాల కంటె ఉత్తమలోకాలను పొందారని చెప్పారు. భీముడు ధర్మయుద్ధమార్గాన్ని తప్పి దుర్యోధనుడి తొడలు విరుగగొట్టటంచేత ఆ ముగ్గురూ కోపగించి పాండవ స్కంధావారాన్ని శ్మశానం చేసినట్లు పేర్కొన్నారు. పాండవు లక్కడలేకపోవటంతో వారుప్రాణాలతో బ్రతికిపోయారని అంటూ వారు పగ సాధించటానికై వారిని వెన్నాడి రావటం తథ్యమని చెప్పి, గాంధారి అనుమతి పొంది తప్పించుకొని పోయారు. వారిలో కృపాచార్యుడు హస్తినకు తిరిగివచ్చాడు. కృతవర్మ ద్వారకకు చేరుకొన్నాడు. అశ్వత్థామ వ్యాసమహర్షి ఆశ్రమాన్ని చేరుకొని వెంటనే తపస్సు మొదలుపెట్టాడు. ఆ తరువాత పాండవు లతడిపై దాడి చేసి, శిరోరత్నాన్ని గ్రహించి వెళ్ళి ద్రౌపదికిచ్చిన కథ ఇదివరకే చెప్పబడింది.

ధృతరాష్ట్రుడు సపరివారంగా యుద్ధభూమికి వస్తున్నాడన్న వార్త విని ధర్మరాజు ఆర్ద్రుడై శ్రీకృష్ణుడి అనుమతితో భీమాదులందరూ, ద్రౌపదీ, ఇతర రాణులూ పరివారం అందరూ కలిసి వెంటరాగా శోకమూర్తులై ఆ రాజుకు ఎదురు పోయారు. ధృతరాష్ట్రుడివైపున్న స్త్రీలందరూ ధర్మరాజును చూచి చేతులు పైకెత్తి, హాహాకారాలు చేస్తూ 'తండ్రులను, మామలను, తాతలను, తమ్ములను గురువులను అతిక్రూరంగా చంపిన నిర్దయుడు' అని ఛీత్కారాలు చేశారు. భీష్మద్రోణులను చంపినందుకు అర్జునుడిని నిష్ఠురాలాడారు. చెల్లెలి మగడని కూడా తలంచక సైంధవుడిని చంపినందుకు కొందరు బాధపడ్డారు. 'ఇంతకూ మీరు ఇంతటి యుద్ధం చేసి సంపాదించిన ఈ రాజ్యం ఎవరికొరకు?' అని ఎత్తిపొడిచారు. ధర్మజుడూ, అర్జునుడూ నిశ్శబ్దంగా తలలు వంచి నడిచి ధృతరాష్ట్రుడిని సమీపించారు.

### 17. ధృతరాష్ట్రుడి కౌగిలి:

ధృతరాష్ట్ర మహారాజును సమీపించి, తన నెరిగించుకొని ధర్మరాజు నమస్కరించాడు. ధృతరాష్ట్రు డతడిని కౌగిలించుకొన్నాడు. అట్లాగే అర్జున, నకుల, సహదేవులను కూడ కౌగిలించుకొన్నాడు. భీముడిపేరు వినేసరికి ఆ గ్రుడ్డిరాజు మొగంలో భయంకరమైన క్రోధం ప్రకోపించింది. ఏదో ఘోరాన్ని తలపెట్టిన రీతి గోచరించింది. త్రికాలజ్ఞుడైన శ్రీకృష్ణుడు

భీముడిని అతడి వద్దకు పంపకుండా అంతకుముందే అమర్చిఉన్న ఒక ఇనుప భీమవిగ్రహాన్ని ధృతరాష్ట్రుడి ముందు ఉంచాడు. అతడు నిజభీముడని భావించి గ్రుడ్డిరాజు తన వేయిఏనుగులబలాన్ని కూడగట్టుకొని కౌగిలించుకొన్నాడు. ఆ కౌగిలి బిగువులో భీముడి ఉక్కు విగ్రహం ముక్కలయింది. రాజురొమ్ము చిట్లింది. ముఖరంధ్రాలన్నింటినుండి రక్తం కారనారంభించింది. అతడు మూర్ఛపోయాడు. ఆ మూర్ఛలో 'ఈనాటికి భీముడిని చంపగలిగాను. నా కొడుకు దుర్యోధనుడికి ఈనాడే మోక్షం కలుగుతుంది' అని పలవరించాడు. మూర్ఛ తేరినతర్వాత తాను లోలోన సంతోషిస్తూనే ఎవ రే మనుకొంటారో అని భీముడి పేరు ఉచ్చరిస్తూ పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు. శ్రీకృష్ణు డా కపటనాటకాన్ని చూచి, నవ్వి, భీముడు బ్రదికి ఉన్నాడని చెప్పి, ధృతరాష్ట్రుడి దుర్బుద్ధిని బైటపెట్టి, 'పాండవులను చంపినా, చనిపోయిన కౌరవులు తిరిగి వస్తారా? ఇప్పటి చర్యవలన చెరగని మచ్చవంటి పాపం చేశా' వని, ఇప్పటికైనా పాండవులను సామరస్యంతో చూచి విజ్ఞతను ప్రకటించుము' అని హెచ్చరించాడు. పలురకాల మందలించాడు. శ్రీకృష్ణుడి మాటలు విని ధృతరాష్ట్రుడు పరితప్తుడై పాండవులను సొంత కొడుకులుగా చూచుకొంటానని మాట ఇచ్చాడు. ధృతరాష్ట్రుడి శరీరాని కంటిన రక్తాన్ని పరిచారకులు కడిగారు. అప్పుడు శ్రీకృష్ణుడు పాండవులనూ, యుయుత్సుడినీ ధృతరాష్ట్రుడి వద్దకు పంపాడు. అతడు వారి నందరినీ కౌగిలించుకొన్నాడు.

### 18. గాంధారి కోపతాపాలు:

ధృతరాష్ట్రుడి సూచన మేరకు పాండవులు గాంధారిని దర్శించారు. గాంధారి వారిని ఆశీర్వదించటానికి ఇష్టపడకపోగా ధర్మరాజును శపించటానికి సంకల్పించింది. దానిని దివ్యజ్ఞానంతో గమనించిన వ్యాసుడు ప్రత్యక్షమై అతడిని శపించవద్దని వారించాడు. దుర్యోధనుడు యుద్ధానికి బయలుదేరే టప్పుడు తల్లికి నమస్కరించి 'విజయం సిద్ధించేటట్లు దీవించు'మని కోరగా, ఆమె 'ధర్మ మెక్కడ ఉంటుందో విజయ మక్కడ కలుగుతుంది' అని దీవించిన సంగతి జ్ఞాపకం చేసి, ధర్మదీక్షతో యుద్ధంచేసిన పాండవులకు విజయం కలగటం ఆమె ఆశీఃఫలమే అని పలికాడు. అసూయను మాని, మాతృధర్మాన్ని గౌరవించి, పాండవులపై కోపాన్ని వదలి శాంతితో మసలుకొను' మని వ్యాసుడు గాంధారికి హితవు చెప్పాడు. దానికి గాంధారి ఒడబడింది. దుర్యోధనుడి దుర్నీతి వలన కౌరవనాశనం జరిగిందని అంగీకరించింది. కాని, శ్రీకృష్ణుడు చూస్తూ ఉండగా భీముడు గదాయుద్ధంలో దుర్యోధనుడి తొడలు విరుగగొట్టటం అన్యాయమనీ, అదే తన హృదయాన్ని బాధిస్తున్న దనీ అదే కోపకారణ మనీ పేర్కొన్నది. ఆమె కోపాన్ని చూచి భయపడి భీముడు గాంధారితో ఇట్లా అన్నాడు: 'తల్లీ! నేను చేసింది ధర్మమో అధర్మమో నాకు తెలియదు కాని, ప్రాణభయంతో అట్లా చేయవలసి వచ్చింది. దానికి నన్ను క్షమించుము. బలవంతుడూ, నిపుణుడూ అయిన సుయోధనుడిని అట్లా తప్ప మరొక విధంగా ఓడిచటం సాధ్యంకాదు. అయినా, దానిని అట్లా ఉండి ఆలోచించుము. అలనాటి సభలో ధర్మరాజుకు జరిగిన అవమానం ధర్మమేనా? ఏకవస్త్ర అయిన ద్రౌపదిని నిండుసభకు ఈడ్చుకొని వచ్చి, దుర్భాషలాడి, ఆ పవిత్రురాలికి తన తొడలు చూపించి కూర్చొనుమనటం నీకు తెలియదా? అప్పుడు నాకు కలిగిన క్రోధావేశంలో, పరితాపతీవ్రతలో అతడి తొడలు యుద్ధంలో విరుగగొట్టుతా నని శపథం చేశాను. ప్రతిజ్ఞను నెరవేర్చటం ప్రతాపవంతులకు ప్రధాన లక్షణం. అతడి తొడలను ఆ నిండుసభలోనే నుగ్గు నుగ్గు చేసి ఉంటే బాగుండేది. కాని, ధర్మజుడి నియమానుసారం అడవులకు వెళ్ళాం. పడరాని పాట్లు పడ్డాం. చివరకు ధర్మరాజు సంధియత్నం చేశాడు. శ్రీకృష్ణుడిని రాయబారిగా పంపాడు. అప్పుడు ఆయనతో నేను పంపిన సందేశం విన్నావుగా. 'మనం అన్నదమ్ములమై ఉండికూడా, ఇతరులు వేలెత్తి చూపేటట్లు, వైరంతో పరస్పరం యుద్ధం చేయటం తగదు. పెద్దలు చెప్పినట్లుగా విని రాజ్యాన్ని పంచుకొని సుఖంగా అనుభవించటం మంచిది' - అని చెప్పి పంపాను. కాని, దుర్యోధనుడు ఆ మాటలు వినక వైరం పెంచుకొని యుద్ధం చేశాడు. దానివలన ధర్మజుడు రాజ్యాన్ని గ్రహించాడు. నేను ప్రతిజ్ఞలను నెరవేర్చుకొన్నాను. మంచిచెడలు తెలిసినదానిని నీవు విచక్షణతో విచారించుము' - అనగా ఆమె సమాధాన పడింది కాని, దుశ్శాసనుడి రొమ్ము చీల్చి నెత్తురు త్రాగటం అమానుషం కాదా? అని అడిగింది. దానికి భీముడు అలనాటి నిండుసభలో ద్రౌపది అతడు చేసిన అవమానాన్ని పేర్కొని తన ప్రతిజ్ఞను సమర్థించుకొన్నాడు. అంతేకాక, యుద్ధంలో శత్రువులు తనను చుట్టుముట్టి దుశ్శాసనుడికి దూరంగా త్రోసివేయటానికి ప్రయత్నించగా వారిని భయపెట్టటానికి రక్తాన్ని త్రాగినట్లు నటించి పెదవుల దాక చేర్చానే కాని నిజానికి తమ్ముడి రక్తాన్ని త్రాగేటంత క్రూరుడిని కాను' అన్నాడు. దానికి గాంధారి ఇట్లా అన్నది. 'గ్రుడ్డివాళ్ళమైన ఈ

తల్లిదండ్రులకు అసరాగా ఒక కొడుకునైనా మిగల్చకుండా అందరినీ చంపటం న్యాయమా? ఒక్కడు మిగిలితే, మీ రాజ్యానికి అడ్డం వస్తా డనుకొన్నారా? ఏడీ ఆ ధర్మజమహారాజు?' అని కరకుగా పలికింది.

ధర్మరాజు ఆమె మనసు కనిపెట్టి, దగ్గరకు పోయి నమస్కరించాడు. 'నీ కొడుకులను చంపిన పాపాత్ముడను వచ్చాను. కఠినంగా శపించి శిక్షించుము. నేను బ్రతకటానికి అర్హుడిని కాను. నా కీ రాజ్యం వద్దు. ఈ వైభవాలు వద్దు' అని విలపించాడు. గాంధారి మారుమాటాడలేకపోయింది. కరుకుగా వేడి నిట్టూర్పులు విడిచి ఊరకుండిపోయింది. ధర్మరాజు చేతులెత్తి నమస్కరించి ఆశీస్సులు కోరాడు. గాంధారి కళ్ళగంతల సందులోనుండి ధర్మజుడి కాలిగోళ్ళు కనపడగా చూచింది. అవి ఎర్రగా కందిపోయాయి. దానిని చూచి అర్జునుడు శ్రీకృష్ణుడి వెనుకకుపోయి నిలిచాడు. భీమనకుల సహదేవులు ప్రక్కకు జరిగారు. అప్పుడు గాంధారి కోపం వదలి, వాత్సల్యంతో పాండవులను 'కుంతీదేవిని దర్శించుకొనండి' అని చెప్పింది. పాండవులు తేరుకొని కుంతి వద్దకు వెళ్ళారు.

చాలాకాలంగా పాండవులను చూడాలనే కోరికతో అలమటిస్తున్న కుంతీదేవి వారు పడ్డ కష్టాలను, కోల్పోయిన పుత్రపౌత్రులను తలంచుకొని కన్నీరు మున్నీరుగా దుఃఖించింది. పాండవుల నందరినీ చేతులు సాచి దరికి తీసికొని, వారి శరీరాలపై ఆయుధాల దెబ్బలవలన కలిగిన గాయాలను తాకి నిట్టూర్పులు నిగిడించింది. ద్రౌపది ఆమెను సమీపించి, చనిపోయిన అభిమన్యుప్రభృతులను తలచుకొని విలపించింది. అత్తా కోడళ్ళు ఒకరి నొకరు కౌగిలించుకొని భోరున ఏడ్చారు. ఇద్దరూ కలిసి గాంధారి వద్దకు వెళ్ళారు. వారందరూ తమ పుత్రులను కోల్పోయిన దుఃఖాలను కలియబోసికొని ఒకరు నొకరు ఓదార్చుకొన్నారు. విదురాదులు చెప్పిన హితవును విని కుమారులను అదుపులో పెట్టుకొనలేకపోవటం చేతనే ఆ విపత్తు ఏర్పడిందని గాంధారి పేర్కొన్నది. కాలప్రభావాన్ని తప్పించటం శక్యం కాదని అందరూ నిర్వేదాన్ని ప్రకటించారు. పాండవులు గాంధారినీ, ధృతరాష్ట్రుడినీ సముచితంగా ఓదార్చారు.

### 19. గాంధారి మృతవీరుల సందర్శనం:

వ్యాసమహర్షి గాంధారికి దివ్యదృష్టిని ప్రసాదించాడు. ఆమె కన్నులకు గంత ఉన్నా యుద్ధభూమిలో దగ్గరగా, దూరంగా ఉన్న వస్తువులన్నీ స్పష్టంగా కనపడసాగాయి. యుద్ధభూమిలో ముక్కలు ముక్కలై చిందరవందరగా పడిఉన్న రథాల భాగాలూ, గజాలు, గుర్రాలు, సైనికుల దేహఖండాలూ కుప్పలు కుప్పలుగా పడి ఉన్న దృశ్యాలూ ఆమె దృష్టికి గోచరించాయి. ఆమె హృదయం తరక్కుపోయింది. నెత్తురు మడుగులలో పడిఉన్న వీరుల శవాలు ఆమెకు ఆరాటం కలిగించాయి. శవాల మాంసాలను, నెత్తురును త్రాగుతూ సంతోషంతో గంతులు వేస్తున్న రాక్షసుల గుంపులు మిక్కిలి ఏవగింపును కలిగించాయి. గాంధారి శ్రీకృష్ణుడిని దగ్గరికి పిలిచి దీనంగా ఈ విధంగా చెప్ప నారంభించింది.

'కృష్ణా! ధృతరాష్ట్ర మహారాజు కోడళ్ళను చూడుము. వారు కన్నీరు మున్నీరౌతూ వారి భర్తలనూ, అన్నదమ్ములనూ గుర్తిస్తూ, కాకులు పొడుచుకొని తింటున్న వారి శవాలను చూచి తూలిపోతున్నారు. కర్ణ, శల్య, ద్రోణాదులు అభిమన్యు ముఖ్య కుమారులు చనిపోయినా కాంతుల నీనుతున్నారు. హంసతూలికాతల్పాలుమీద శయనించే ఈ వీరుల శరీరాలను రాపులుగులు, నక్కలు, గ్రద్దలు, కాకులు ఆక్రమించి పొడిచి పొడిచి ఎంగిలిచేశాయి. వినోద వాద్యాలతో, సుగంధద్రవ్యాలతో, హారాలతో విరాజిల్లేవారు నక్కల ఊళలు, రక్తపు పూతలు, గ్రద్దలు తమను క్రమ్మివేస్తున్నా కదలక మెదలక పడి ఉన్నారు. రాజులూ, యుద్ధవీరులూ కాంతు లీనుతూ పడి ఉన్న యుద్ధభూమి గ్రహనక్షత్రాలలో వెలిగిపోతున్న ఆకాశంవలె ఉన్నది చూచావా?

యుద్ధం చేస్తున్నప్పుడు చేతులలో ఉన్న ఆయుధాలతో అట్లాగే పడి ఉన్న వీరులను చూచి రాబందులు దగ్గరకు రావటానికి జంకుతున్నాయి. కొందరి శరీరాలను నక్కలు, కాకులు తినివేయగా వారిని గుర్తించటం కష్టమై పోతున్నది. ముక్కలైన దేహభాగాలను కలిపి తమ తమ వారి ఆకారాలను కూర్చుకొని వనితలు భోరుమని విలపిస్తున్నారు. ఇటువంటి దారుణదృశ్యాలను చూడటానికి బ్రతికి ఉన్న నేను పూర్వజన్మలో ఎంతటి పాపం చేశానో? అని బావురు మన్నది.

ఆమె దుర్యోధనుడి శవాన్ని చూచింది. శోకాతిశయంతో మొదలు నరికిన అరటిచెట్టువలె మూర్ఛపోయింది. కన్నీరు ధారలుగా కారుస్తూ అతడి రొమ్ముమీద వాలిపోయింది. రారాజుగా బ్రతికిన కొడుకు దీనంగా నేలమీద పడి ఉన్నందుకు కుమిలిపోయింది. తల్లి వచ్చినా లేచి నమస్కరించకుండా మౌనంగా పడి ఉన్నందుకు ఆమె వాపోయింది పలు పలువిధాలుగా విలపిస్తున్న గాంధారి శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నది. 'కృష్ణా! నా కొడుకు యుద్ధానికి పోతూ వినయంతో నాకు నమస్కారంచేసి తనకు విజయం కలిగేటట్లు ఆశీర్వదించుమని కోరాడు. నేను 'ధర్మం ఏ పక్షంలో ఉంటే ఆ పక్షానికి విజయం తప్పక సిద్ధిస్తుంది' అని అన్నాను. ఎందుకంటే ఆనాడు జూదమాడుతున్న సమయంలో సభలోనివారంతా ద్రౌపదీ వస్త్రాపహరణాన్నీ, భీముడి ప్రతిజ్ఞలను చూచి భయపడి, 'ఆ అధర్మానికి ఫలంగా కౌరవవంశనాశం, విస్తారసైన్య ధ్వంసం ఔతుంది కాని, ధర్మం అంత సులభంగా నశించదు' అని అన్నారు. నా బుద్ధికి కూడా అదే తోచింది. నా కుమారుడని సత్యం తప్పి మెరమెచ్చు మాటలు పలికితే పెంపు కలుగుతుందా? అంతేకాక మరొకమాటకూడా అన్నాను. 'యుద్ధంలో వెనుదిరిగి వచ్చిన దానికంటె చావు మేలు, యుద్ధవీరుడుగా నీవు పరలోక సౌఖ్యాన్ని పొంది సుఖించుము' అన్నాను. నే నన్నట్లే, నా మాట నిలుపుతున్నట్లే - దుర్యోధనుడు కీర్తి ప్రతిష్ఠలు పొందాడు. నేను ఇతడి పరాక్రమాన్ని తలచి ధైర్యంగా ఉన్నా, ధృతరాష్ట్రుడికి దిక్కు ఎవరూ లేకపోయారే అనే భావం నా గుండెను మండిస్తున్నది. అదే నాకు మిగిలిన దుఃఖం. ఎన్నో భోగాల ననుభవించిన ఈ రారాజు సింహం చంపిన మదపుటేనుగువలె కటికనేలమీద పడి ఉండటం చూడలేకపోతున్నాను. విదురాది విజ్ఞులు ఎందరు ఎన్నివిధాల చెప్పినా ఇతడు వినలేదు. విధి మూడిన బుద్ధికి మంచిమాటలు రుచిస్తాయా? పదకొండు అక్షౌహిణుల సైన్యం వెంటరాగా ప్రకాశించే ఈ రాజు ఒంటరిగా పడి ఉండి రాబందులకు ఆహారం కావటం అబ్బురం కాదా! కొడుకు చావుకంటె నా కోడలు (దుర్యోధనుడి భార్య) భానుమతి శోకం నన్ను కలవర పెట్టుతున్నది. యుద్ధభూమిలో పడి ఉన్న తన భర్తనూ, కొడుకునూ చూస్తూ, దుఃఖాతిశయంతో వారిపైబడి మూర్ఛపోతూ లేస్తూ దీనంగా విలపిస్తున్నది. ఆమెను చూచి శోకాన్ని భరించలేకపోతున్నాను. దుర్యోధనుడు మాత్రం తల్లీ భార్యా ఏమయితేనేం? తాను మాత్రం సర్వం సిద్ధించే మార్గాన్ని ఎన్నుకొని వెళ్ళాడు' అంటూ ఎన్నో విధాల వాపోయింది.

ఆ తరువాత గాంధారి భీముడిచేతిలో మృతులైన తన కొడుకుల నందరినీ చూపించి వారి భార్యల విలాపాలను వినిపించి, పలువిధాల తాను వాపోయింది. కౌరవుల తల్లిదండ్రులు చేసిన పూర్వజన్మ పాపంవలన కాకపోతే దుర్యోధన దుశ్శాసనాదులను పుణ్యాత్ముడైన ధర్మరాజు చంపగలడా?' అని పలికింది.

సింహం తన వాడి అయిన గోళ్ళతో చీల్చి చంపిన మదపుటేనుగువలె పడి ఉన్న దుశ్శాసనుడిని చూపించి, అతడు నిండుసభలో ద్రౌపదికి చేసిన అపచారానికి ఫలితంగా భీమ ప్రతిజ్ఞకు బలి అయ్యాడని పేర్కొన్నది. ద్రౌపదిని అవమానపరచటం అధర్మమని తాను దుర్యోధనుడికి నీతి చెప్పిన మాటలను జ్ఞాపకంచేసికొన్నది. కొడుకులు మాట విననందుకు విచారించింది. కాని, భీముడు దుశ్శాసనుడి శరీరాన్ని విరిచి, ముక్కలను నలుదిక్కులా విసరి అతడి రొమ్ముచీల్చి రక్తాన్ని త్రాగిన దారుణ దృశ్యం అతడికి కీర్తి కలిగిస్తుందా? నాకు దుఃఖం అతిశయింపజేయకుండా ఉంటుందా?' అని వాపోయింది.

వికర్ణుడి శవాన్ని చూచి అతడి చేతికున్న కణుపులను పిల్లగ్రద్దలు చీల్చటానికి వీలుకాకపోతున్న దృశ్యానికి అతడి భార్య దుఃఖిస్తున్న తీరుకు జాలిపడింది. అట్లాగే దుర్ముఖుడు, శూరసేనుడు, వివింశతి మొదలయిన కురుకుమారుల శవాలను చూచి విలపించింది. ఆ తరువాత అభిమన్యుడి శవాన్ని చూచి యుద్ధంలో పద్మవ్యూహ భేదనంలో అతడు ప్రదర్శించిన ప్రతాపాన్ని ప్రశంసించింది. దుర్యోధన, కర్ణ, ద్రోణ, అశ్వత్థామ, శల్యాది మహావీరులతో అతడు మహాయుద్ధం చేసి అలసిపోయి పడుకొన్నట్లుగా అతడి శరీరం ఉన్నదనీ, అతడి ముఖకాంతి అతడు చావలేదేమో అన్న భ్రాంతిని కలిగిస్తున్నదనీ పలవరించింది. సిగ్గుల ముద్దరాలైన ఉత్తర తన భర్త శవంపై బడి దుఃఖిస్తున్న దృశ్యాన్ని చూచి హృదయం ద్రవిస్తున్నదని విలపించింది. 'పెద్దలందరూ కూడి అన్యాయంగా అతడిని చంపిన వ్యూహాన్ని తలపోసి ఆ నీచకార్యాన్ని ఉత్తర నిరసించటం గాంధారి విన్నది. అతడిని, ఉపపాండవులను పోగొట్టుకొన్న పాండవులకు విజయం కలిగి లాభ మేమున్నదని విలపిస్తున్న ఉత్తరను బంధువులు బుజ్జగించి ప్రక్కకు తీసికొని పోతున్న దృశ్యాన్ని కృష్ణుడికి గాంధారి చూపించింది.

అట్లాగే ఉత్తర కుమారుడు, లక్ష్మణ కుమారుడు మొదలయిన వీర కుమారులను, మహాపరాక్రమశాలి కర్ణుడినీ గాంధారి చూచింది. వారి యుద్ధవీరాన్ని ప్రశంసిస్తూ విలపించింది. ఆ తరువాత బాహ్లికుడూ, సైంధవుడూ మొదలయిన మహావీరులను చంపిన అర్జునుడికి జాలికూడా లేదని వాపోయింది. చెల్లెలని కూడా భావించక తనకు పతి వియోగం కలిగించిన అన్నలను నిష్ఠుర మాడుతున్న దుస్సలను చూపించి దుఃఖించింది. చెక్కుచెదరని శల్యుడి శవాన్ని చూచి, దుర్యోధనుడికీ అతడికీ ఉన్న స్నేహాన్ని స్మరించి అతడి భార్యల దుఃఖాన్ని చూచి శోకించింది. భీష్ముడు కురువంశ రక్షణంలో చేసిన సేవలను కీర్తించింది. సూర్యుడి వంటి భీష్ముడు అంపశయ్యపై అస్తమించినట్లున్న ఆ దృశ్యాన్ని చూచి విషాదాన్ని పొందింది. శత్రువు లనే అడవిని దహించి ఆరిపోయిన అగ్నివలె ఉన్న ద్రోణుడి శరీరాన్ని దర్శించింది. ద్రోణుడిని నమ్మి దుర్యోధనుడు యుద్ధానికి దిగిన సన్నివేశాలను స్మరించింది. శిష్యులు నమస్కరించే ఆ గురుదేవుడి పాదాలను నక్కలు పీక్కొని తింటున్న దృశ్యాన్ని చూచి హృదయవిదారకంగా దుఃఖించింది. ద్రోణాచార్యుడి భార్య, కృపాచార్యుడి చెల్లెలు అయిన కృపి పొందే వేదనను చూచి జాలిపడింది. ద్రోణ శిష్యులు గురుశవదహనం చేయటం, అందరూ కలిసి నదిలో స్నానంచేయటం గాంధారి కృష్ణుడికి చూపించి కంటనీరు పెట్టింది.

సాత్యకి నిర్దాక్షిణ్యంగా చంపిన సోమదత్తుడి కొడుకు భూరిశ్రవుడి శవాన్ని చూచింది. సోమదత్తుడి భార్య అటు మగడి శవాన్ని ఇటు కొడుకు శవాన్ని చూచి దుఃఖించే దృశ్యం కరుణరసభరితంగా ఉండగా కృష్ణుడికి చూపించింది.

మాయలకే మామ అనిపించుకొన్న శకుని సహదేవుడి బాణాలకు నేలకూలాడు. అతడి మాయలన్నీ శ్రీకృష్ణుడి దివ్యమాయలతో వమ్మయిపోయాయి. ఆనాడు మోసంతో జూదమాడి ధర్మజుడు రాజ్యమంతా లాగుకొన్నాడు. ఈనాడు యుద్ధమనే జూదంలో తన ప్రాణాన్నే ఒడ్డి ఓడిపోయాడు. ఇతడి పాపకర్మ ఫలించింది. ఇతడి ద్యూత వ్యసనం కురువంశ నాశనానికి తప్ప ఎందుకూ పనికిరాలేదు. ఇతడు చూపించిన అధర్మమార్గమే కౌరవులకు పాండవులతో వైరం తెచ్చి పెట్టింది. దుర్యోధనుడికి మంచి చేస్తానని చెప్పి మోసంచేశాడు. చివరకు సోదరులతో, పుత్రులతో, స్నేహితులతో సహా మరణించేటట్లు చేశాడు. కౌరవులందరితోపాటు శకుని కూడా స్వర్గానికి పోయాడు. అల్పజ్ఞులైన కౌరవులను మోసంచేసి యుద్ధానికి పురికొల్పాడు. ఇతడివలననే సోదరకలహం ఏర్పడింది - అంటూ గాంధారి కృష్ణుడికి చెప్పింది.

ఆ తరువాత శరీరం నిండా శస్త్రాలతో ఉన్న కళింగదేశాధిపతిని చూచి, అనేక స్త్రీలు అతడిపైబడి దుఃఖించటం శ్రీకృష్ణుడికి చూపించింది. అట్లాగే మగధదేశాధిపతి జయత్సేనుడి శవాన్ని పేర్కొని, అతడి వనితల విలాపాన్నీ, తగ్గని లావణ్యాన్నీ చూపించింది. కోసలాధిపతి బృహద్బలుడు, ధృష్టద్యుమ్నుడి కొడుకులు, కేకలరాజులూ, పాంచాల రాజైన ద్రుపదుడు, చేది భూపాలుడు, ధృష్టకేతువు, సుకేతుడు, అవంతి రాజ్యపాలకులైన విందానువిందులు మొదలయిన వీరుల శవాలను, వారి భార్యల శోకాలనూ చూపించింది. వినిపించింది. ఆ తరువాత గాంధారీ కృష్ణుల నడుమ ఇట్లా సంభాషణ సాగింది.

## 20. గాంధారి శాపం:

గాంధారి : కృష్ణా! భీష్మద్రోణ, కర్ణులు, భూరిశ్రవుడు, అశ్వత్థామ, కృప, సైంధవ, కృతవర్మ, దుర్యోధనాదులవంటి అతిరథమహారథులు విజృంభిస్తే దేవతలు కూడా నశిస్తారు. కాని, వారి నందరినీ ఎదిరించి కూడా నీవూ, పాండవులూ, సాత్యకీ ఏ అపాయం లేకుండా బయటపడ్డారు. ఇంతకంటె అద్భుత మేముంటుంది? ఇది విధివిలాసం. దైవం కౌరవులకు ఇంత అన్యాయం చేస్తుందా? నేను నా కొడుకుల నందరినీ కోల్పోయాను. ఆనాడు నీవు సంధికి వచ్చి నిండుసభలో చెప్పిన మాటలన్నీ ఇప్పుడు నిజమయ్యాయి. భీష్మ విదురాదులు చెప్పిన హితోక్తులను నేను పుత్ర వ్యామోహంతో పాటించలేదు. అందుకే ఈ దుఃస్థితి కలిగింది. (అని మూర్ఛపోయి కొంతవడికి తేరుకొని కృష్ణుడిని చూచి మండిపడుతూ) కృష్ణా! దీనికి నీవే మూలకారణం. నీవు సకల ధర్మవేత్తవు. మధురభాషివి, సర్వకార్య దక్షుడవు అయి కూడా పాండవ కౌరవుల మధ్య యుద్ధం జరుగకుండా చూడక నిర్లక్ష్యం చేశావు. నీ రాయబారం సంధికి కాదు. దుర్యోధనాదులైన రాజులను నామరూపాలు లేకుండా చేయటానికే. ఇప్పుడు అందరూ పోయారు, అన్ని ప్రాంతాలు

బీడులయ్యాయి. దీనికి ఫలితం అనుభవించుము. నేను పతివ్రతాదీక్షతో పొందిన తపఃపుణ్యంతో నిన్ను శపిస్తున్నాను. దాయాదుల నడుమ పోరు కలిగి వారందరు నశించేటట్లు చేసినందువలన నీ దాయాదులు కూడా ఒకరినొకరు కొట్టుకొని చస్తారు. నీవు కూడా సరిగ్గా ఈనాటికి ముప్పైఏళ్ళకు దిక్కులేని చావు పొందుతావు. ఈనాడు కౌరవ వనితలు ఏ విధంగా ఏడుస్తున్నారో యాదవకాంతలు కూడా భర్తలను, కొడుకులను, బంధువులను పేరు పేరునా తలచుకొని కుమిలి కుమిలి ఏడుస్తారు' (అని ఘోరంగా శపించింది).

శ్రీకృష్ణుడు : (చిరునవ్వుతో) గాంధారీదేవి! యాదవులకు మునివరులు ఇచ్చిన ఘోరశాపం ముందే ఉన్నది కదా! మళ్ళీ నీవు దానిని పునరుక్తం చేశావు. దీనివలన నీవు కొత్తగా ఏమి సాధించావు చెప్పుము. యాదవులకు నాశనం తప్పదు. వారిని దేవతలు కూడా చంపలేరు. అందుచేత ఘోరయుద్ధంలో పరస్పరం చంపుకొని చస్తారు. గాంధారీ! ఇక లెమ్ము చనిపోయిన బంధుమిత్రులకు దహన కార్యాలు చేయించాలి కదా! చివరకు ఒకమాట చెప్పుతాను వినుము. నీ కుమారుడు చేసిన దుర్మార్గాలు నీకు తెలియవా? దుర్యోధనుడి దురభిమానాన్ని నేను కాని, నీవు కాని, భీష్మ ద్రోణ బాహ్లికాదులు కాని, చివరకు ధృతరాష్ట్ర మహారాజు కాని మాన్పలేకపోయాము. అతడి దుశ్చర్యల ఫలితమే నేటి ఈ దుఃస్థితి. మీ తప్పువలన కలిగిన కీడుకు నన్ను బాధ్యుడిని చేయటం న్యాయమా? ఇకనైనా నీ శోకాన్ని దూరం చేసికొమ్ము. క్షత్రియవనితలు యుద్ధవీరులనే కొడుకులుగా కోరుకొంటారు. వారికై దుఃఖిస్తే శోకం రెండింతలౌతుంది. కాబట్టి నిగ్రహించుకొమ్ము'.

శ్రీకృష్ణుడి మాటలు గాంధారి చెవులలో నిప్పులు పోశాయి. ఆమె మారుమాటాడలేక ఊరకుండి పోయింది.

ధృతరాష్ట్రుడు : ధర్మరాజా! నీకు మన రెండు వైపుల సైన్యాలలోని జనుల సంఖ్య తెలుసు. యుద్ధంలో ఎంత మంది చనిపోయారో గుర్తుంటే చెప్పుము.

ధర్మరాజు : ప్రసిద్ధులు, ఉత్తములు 76 కోట్ల 20 వేలమంది. ఇతరులు 24 వేల 320 మంది చనిపోయారు.

ధృతరాష్ట్రుడు : వీరందరూ ఏయే గతులు పొందుతారో చెప్పగలవా?

ధర్మరాజు : అస్త్రాల అగ్నిలో ఆహుతి అయిన వీరులు స్వర్గంలో ఇంద్రుడి అతిథులై అప్సరః స్త్రీలతో ఆనందిస్తారు. అస్త్రశస్త్రాలు ఆయువుపట్టులలో తగలటంచేత భయపడి పారిపోయినవారు యక్షలోకం చేరుతారు. ఇక- యుద్ధంలో ఏ విధంగా చనిపోయి స్వర్గానికే పోతారు కాని, నరకానికి పోరు - అని పండితులంటారు.

ధృతరాష్ట్రుడు : ఈ చనిపోయినవారిలో దిక్కున్నవారూ ఉన్నారు. దిక్కులేనివారూ ఉన్నారు. వీరందరికీ విధి ప్రకారం దహన కర్మ చేయవచ్చునా?

ధర్మరాజు : ఈ యుద్ధంలో పాల్గొన్నవారందరూ అగ్నిని సిద్ధంగా ఉంచుకొన్న యాజ్ఞికులవంటివారే. వీరందరికీ తల కొరివి పెట్టి, జలతర్పణాలు వదిలే అర్హత కలవారు లేరు. మనమే పూనుకొని ఆ పని నిర్వహించాలి.

అప్పుడు ధర్మరాజు ధౌమ్యుడినీ, విదుర, సంజయులనూ పిలిచి 'మీరు భరత వంశీయులకు తప్ప మిగిలిన దిక్కులేని వారికందరికి విధి విధానాన్ని అనుసరించి దహనకర్మ చేయించండి' అని తగిన వారిని వారికి తోడుగా నియమించాడు, కావలసిన ద్రవ్యాలు సమకూర్చాడు. వారు ధర్మజుడు చెప్పినట్లు కర్తవ్యం నిర్వహించారు. ఒకవైపు వేద స్వరాలు, మరొకవైపు స్త్రీల శోకనాదాలూ కలిసి ఆకాశమంతా మారుమ్రోగిపోయాయి.

**21. కర్ణుడు రాధేయుడు కాడు కౌంతేయుడు:**

ఆ తరువాత ధర్మరాజు ధృతరాష్ట్ర మహారాజును, కౌరవ వనితలను, బంధుజనులను కలుపుకొని గంగకు వెళ్ళి, స్నానాలు చేసి, మృతులకు తిలోదకాలు ఇచ్చాడు. అప్పుడు కుంతీదేవి ధర్మరాజు వద్దకు వచ్చి పొంగివస్తున్న దుఃఖంతో అందరూ వినేటట్లు ఈ విధంగా అన్నది.

కుంతి : ధర్మరాజా! వినుము. కౌరవులకు తన వింటిని పెట్టనికోటగా ఉంచినవాడూ, యుద్ధక్రీడలలో మీ అందరిచేత ప్రశంస లందుకొన్నవాడూ, దేవతలు కీర్తించగా అర్జునుడి మహాస్త్రానికి తల తెగి నేల కొరిగినవాడూ అయిన కర్ణుడు లోకులంతా పిలిచేటట్లు రాధేయుడు కాదు. నా కొడుకు. మీ అయిదుగురికీ అన్న. సూర్యుడి వరప్రసాదంగా నాకు అందమైన కవచకుండలాలతో పుట్టాడు. అందువలన ఆ మహానుభావుడికి తిలోదక ప్రదానం మీరు చేయండి.

ధర్మరాజు : (దుఃఖిస్తూ) కర్ణుడు మహావీరుడు. దుర్యోధనుడు అతడి ఆసరా చూచుకొని అసమాన వీరులైన భీమార్జునులను ఎదుర్కొనటానికి సాహసించాడు. అతడి బలం చూచి విదేహాది రాజులు రారాజుకు సామంతులయ్యారు. అతడి బాహుబలం వలన పాండవ బలం అక్కడి కక్కడ అణగి ఉంటూ వచ్చింది. అతడి దివ్యాస్త్ర సంపదకు దేవతలు కూడా ఆశ్చర్యపడేవారు. అతడి మహాశక్తి మమ్ములను యుద్ధంలో చీకాకు కలిగించింది. అటువంటి ఆ మహాత్ముడి జన్మరహస్యాన్ని కొంగున నిప్పులు దాచిపెట్టినట్లు ఎట్లా ఇన్నాళ్ళు దాచావమ్మా?. ఒక్క అర్జునుడు తప్ప మరెవ్వరూ అతడి రథాన్ని ఎదిరించి నిలువగలిగినవారు లేరు. తొలిచూలుగా కర్ణుడిని ఎందుకు కన్నావమ్మా? అట్లాంటి అద్వితీయ మహాపరాక్రమవంతుడిని చంపటంవలన నీవు నేర్చిన మంత్రం మా అందరికీ మహాశోకాన్ని తెచ్చిపెట్టింది. సూర్యకుమారుడైన కర్ణుడి మరణం బంధువులందరికీ దుఃఖం కలిగించింది. అభిమన్యుడూ, ఉపపాండవులూ, ద్రుపదుడి కుమారులూ, కురుకుమారులూ మరణించినప్పుడు కూడా ఇంతటి దుఃఖం కలుగలేదు. కర్ణుడు మా అన్న అని ముందుగానే తెలిసి ఉంటే కురుకుమారులు, వారి సైన్యం వ్యాకులం చెందకుండా ఎట్లా మసలు కొనాలో అట్లా మసలుకొనేవాళ్ళం, అట్లా అయి ఉంటే మానవ లోకానికి ఏ దుఃఖమూ కలిగేది కాదు.×

అని ధర్మరాజు దుఃఖించాడు. వణకుతున్న చేతులతో కర్ణుడికి తిలోదకాలు ఇచ్చాడు. ఆ తరువాత శోకభారంతో భీమార్జున నకుల సహదేవులు అట్లాగే చేశారు. ధృతరాష్ట్ర గాంధారులూ, కురుకుమారుల భార్యలూ తర్పణాలు వదిలారు. కర్ణుడిపై గల సోదరభావంతో ధర్మరాజు అతడి భార్యలనూ, పరిచారికలనూ పిలిపించి సముచితంగా గౌరవించి, బహుదక్షిణలతో పుణ్యదానాలు చేసి, విధి విధానంగా అపరకర్మలు చేశాడు. తరువాత బంధుజనులతో కలిసి గంగానదిని దాటి వెళ్ళాడు.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

| విషయము | సంస్కృతమూలము | పుట |
|---|---|---|

# ద్వితీయాశ్వాసము

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

| విషయము | సంస్కృతమూలము | పుట |
|---|---|---|

# ద్వితీయాశ్వాసము

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ గిరిజాసమవాయమ । హాగురు తరశుభగ సంపదాలంబ! సదా**
**యోగిజన క్షేమ సమీ । హాగర్భిత దివ్యచిత్త! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= లక్ష్మితో; గిరిజా= పార్వతితో; సమవాయ= విడదీయరాని సంబంధం కలిగిన; మహా= మిక్కిలి; గురుతర= గొప్పది అయిన అనగా వర్ణింపశక్యం కాని అనంతమైన; శుభగ= మంగళకరాలగు; సంపద్= ఐశ్వర్యములకు; ఆలంబ= ఆధారమయినవాడా!; సదా= ఎల్లప్పుడు; యోగిజన= బ్రహ్మజ్ఞానులగు మహర్షులయొక్క; క్షేమ= సంరక్షణయందలి; సమీహా= తీవ్రమయిన కోరికతో అనగా ఇచ్ఛాశక్తితో; గర్భిత= నిండిన; దివ్యచిత్త!= ఉత్తమగుణాలు గల హృదయం కలవాడా!; (దయ, కరుణ, ప్రేమ మొదలగు గుణములు; దివ్యములు- అట్టి గుణాలతో నిండిన చిత్తం దివ్యచిత్తం); హరి= విష్ణువు; హర= శివుడు- అనే భేదం లేని అనగా హరిహర అభేదరూపం కలిగిన - పరబ్రహ్మ స్వరూపా! హరిహరనాథా!= (సంబోధనం.)

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీవు లక్ష్మీపార్వతులతోడి విడదీయరాని సంబంధం కలవాడవై (అనగా హరికి లక్ష్మితోను, హరునకు పార్వతితోను విడదీయరాని సంబంధం కలవాడవు), సకల కల్యాణ ప్రదాలైన మహైశ్వర్యాలకు ఆశ్రయుడవు. నీవు ఎల్లప్పుడు బ్రహ్మజ్ఞానులైన యోగిజనుల సంరక్షణనే అపేక్షిస్తావు.

**విశేషం:** సమవాయము - ఇది తర్కశాస్త్ర పదం. మధువు నుండి మాధుర్యం విడదీయరానిది. అట్లే అగ్నికి ఉష్ణమునకు, వాయువునకు స్పర్శమునకు విడదీయరాని సంబంధం. ఇదియే సమవాయము. ఇందు శ్రీగిరిజలకు సమవాయము. హరిహరులకు సమవాయము. శ్రీహరులకు గిరిజాహరులకు సమవాయము. ఇది హరిహరాద్వైతమును ప్రతిపాదించటంలో తిక్కయజ్వహృదయం.

**క. దేవా! జనమేజయ ధా । త్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య**
**శ్రీవిలసితుఁడై యిట్లనుఁ । దా వైశంపాయనున కుదాత్త వినీతిన్. 2**

**ప్రతిపదార్థం:** దేవా= హరిహరనాథా!; జనమేజయ= జనమేజయుడను; ధాత్రీ= భూమికి; వల్లభుఁడు= భర్తఅయినవాడు అనగా జనమేజయమహారాజు; ఉత్సుకత్వ= కుతూహలం అను; రేఖా= కాంతివలన; సౌమ్య= ప్రశాంత; శ్రీ= సౌందర్యముతో; విలసితుఁడై= ప్రకాశించుచున్నవాడగుచు; ఉదాత్త= ఉన్నతమైన; వినీతిన్= వినయముతో; తాన్= తనంతతానుగా; వైశంపాయనునకున్= వైశంపాయన మహర్షితో; ఇట్లు= ఈ ముందు చెప్పబోవు విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! జనమేజయ మహారాజు మిక్కిలి కుతూహలం కలవాడై వినయంతో వైశంపాయన మహర్షితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సామాన్యంగా పురాణకథలు అన్నీ ఉగ్రశ్రవసుడు అనే సూతుడు శౌనకాది మహర్షులకు సత్రయాగమున చెప్పుతున్నట్లు సాగుతాయి. మహాభారత రచనలో ఆదికవి నన్నయ ఆ మార్గాన్నే అవలంబించారు. కాని తిక్కయజ్వ స్వతంత్రించి 'ఏను

విన్నపంబు సేయు తెఱంగుగా అంతస్సన్నిధిం గలిగించుకొని అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద' అని తానుగా హరిహరనాథునకు మహాభారత కథను విన్నవిస్తున్నట్లు పదిహేను పర్వములను రచించాడు. కావ్యాన్ని కూడా హరిహరనాథుడికే అంకితమొనర్చి హరిహర అద్వైతమును అవలంబించాడు. ఇది తిక్కయజ్వ విశిష్టత.

జనమేజయుడు పరీక్షిత్తు కుమారుడు. వైశంపాయనుడు వ్యాసభగవానుడి శిష్యుడు. పైల, సుమంత, వైశంపాయన జైమినులు నల్వురు వ్యాసభగవానుడి శిష్యులు. చతుర్వేదాలను, అష్టాదశ పురాణాలను ముల్లోకాలకు వ్యాప్తి చెందించిన మహర్షులు.

**క. దురమున నమ్మెయిఁ గర్ణుఁడు । పరిమార్పంబడిన నల్పపరిజనుఁడై య**
**క్కురుపతి యజయ్యులగున । య్యరులయెడం బిదప నెట్టులయ్యె? మునీంద్రా! 3**

**ప్రతిపదార్థం:** మునీంద్రా!= వైశంపాయన మహామునీ!; పిదపన్= అటు తరువాత; దురమునన్= యుద్ధంలో; ఆ+మెయిన్= ఆ విధంగా-కర్ణుఁడు= సైన్యాధ్యక్షుడైన కర్ణుడు; పరిమార్పంబడినన్= చంపబడగా; ఆ కురుపతి= కౌరవనాథుడైన దుర్యోధనుడు; అల్ప= తక్కువ; పరిజనుఁడై= సేవకులు కలవాడై - అనగా స్వల్పసైన్యము కలవాడై; అజయ్యులగు= జయింపశక్యముకాని; అ+అరులఎడన్= ఆ శత్రువులైన పాండవులతో; ఎట్టులు= ఏ విధంగా; అయ్యెన్?= (యుద్ధం) జరిగినది?

**తాత్పర్యం:** ఓ వైశంపాయన మహామునీ! (ఆ పదియేడవ రోజు) యుద్ధంలో కౌరవసైన్యాధ్యక్షుడైన కర్ణుడు ఆ విధంగా చంపబడగా, స్వల్పసైన్యం గల దుర్యోధనుడు అజేయులైన పాండవులతో ఏ విధంగా యుద్ధం చేశాడు?

**తే. ఏను మును విన్న యక్కౌరవేంద్రపాండు । విభు తనూజుల చరితంబు వేడ్కఁ బెంచెఁ**
**జెవుల తియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ! వారిదైన యనంతర వర్తనంబు. 4**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; వైశంపాయన మహామునీ; ఏను= నేను; మును= ఇంతకుముందు; విన్న= వినినటువంటి; ఆ కౌరవేంద్ర= ఆ కురుపతి అయిన దుర్యోధనుడియొక్క; పాండువిభు= పాండురాజుయొక్క; తనూజుల= కుమారులయిన పాండవులయొక్క; చరితంబు= చరిత్ర; వేడ్కన్= నాలో కుతూహలమును; పెంచెన్= పెంపొందించెను; ఎక్కువచేసెను; వారిదైన= ఆ కౌరవపాండవులయొక్క; అనంతర వర్తనంబు= అటుతరువాత ప్రవర్తనం; చెవుల తియ్యంబు= చెవులకు ఇంపు; తళుకొత్తన్= మిక్కిలి ప్రకాశింపగా; చెప్పుము= వినిపించుము.

**తాత్పర్యం:** పవిత్రుడైన ఓ వైశంపాయన మహామునీ! నేను మీ వలన ఇంతవరకు వినిన కౌరవపాండవుల చరిత్రం ఇంకనూ వినాలని మిక్కిలి కుతూహలం రేకెత్తెతున్నది. అందువలన వారి అనంతర చరిత్రను చెవుల కింపుగా వినిపించుము.

**వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కి ట్లనియె నట్లు కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్ట వసుధావరులు పరివేష్టింపఁ గొంచెపు మూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దేర్ప విషాదం బుడిచి సముత్సాహదోహలియై శల్యునిం దనకు సేనాపతిఁ గావించి వేగుటయు బలుపుఁబొలుపును వెలయఁ బొలికలనికి నడచెఁ బాండవేయులును బలంబుతోడం బన్నియేతెంచిన నయ్యిరువాఁగునకు సురాసురసమరంబునుం బోని సంగ్రామం బయ్యె నంత మధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరు పరాక్రమంబునం దెగియెఁ బదంపడి తనభటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కుదక్కి**

**యక్కురువిభుం డనిపని సాలించి వెఱం బొందెడుడెందంబుతో నొక్కరుండునుం దొలంగం బాఱి యొక్క మడువుసొచ్చి దాఁగి యుండె నట గెలుపునుబ్బునం బొంపిరివోవు పాండవేయు లతం డందునికి యెఱింగి యయ్యెడకు నరిగి నలిరేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడి తోడిపెనంకువం బెద్దయుంబ్రొద్దు పెనంగి యాభూనాథుండును బ్రొద్దు సాల వాలినప్పుడు భీముగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ కృపకృతవర్మలు దనకుం దోడుగా ధర్మనందనస్కంధావారంబుఁ బొదివి పాంచాల ప్రభద్రక మాత్స్య ప్రభృతి శేషసైన్యంబుల సమయించె మఱునాఁడు సంజయుండు కురుక్షేత్రంబున నుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 5**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధముగా; అడిగిన= జనమేజయుడు అడుగగా; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; ఆ మహీ= ఆ భూమికి; నాయకునకున్= మహారాజైన జనమేజయునకు; ఇట్లు= ఈ విధముగా; అనియెన్= చెప్పెను; అట్లు= ఆ విధముగ; కర్ణుండు; తెగినన్= యుద్ధమునందు చావగా; దుర్యోధనుండు; హత= చంపబడగా; అవశిష్ట= మిగిలిన; వసుధావరులు= రాజులు; పరివేష్టింపన్= చుట్టుముట్టగా; కొంచెపు= కొద్దిపాటి; మూఁకలతోడన్= సైనికులతో; విడిదలకున్= విడిదిచేయుచోటునకు; చని= వెడలి; సుహృజ్జనంబులు= స్నేహితులు; తేర్పన్= ఓదార్చగా; విషాదంబు= దుఃఖమును; ఉడిచి= పోగొట్టుకొని; సముత్సాహ= మిక్కిలి ఉత్సాహమువలన; దోహలియై= ప్రేరేపింపబడినవాడై; శల్యునిన్; తనకున్= తన పక్షమునకు; సేనాపతిన్= సైన్యాధ్యక్షునిగా; కావించి= చేసి; వేగుటయున్= తెల్లవారుటయు; బలుపు= బలమును; పొలుపును= ఒప్పును; వెలయన్= ప్రకాశింపగా; పొలికలనికిన్= యుద్ధభూమికి; నడచెన్= వెడలెను; పాండవేయులును= పాండురాజుకుమారులైన ధర్మరాజు మొదలగువారు కూడ; బలంబుతోడన్= తమ సైనికబలముతో; పన్ని= వ్యూహరచన చేసి యుద్ధమునకు సిద్ధపడి; ఏతెంచినన్= రాగా; అయిరువాఁగునకున్= రెండుపక్షముల సైన్యమునకు; సుర= దేవతలయొక్క; అసుర= రాక్షసులయొక్క; సమరంబునున్= యుద్ధమును; పోని= పోలిన; సంగ్రామంబు= యుద్ధము; అయ్యెన్; అంతన్= అప్పుడు; మధ్యాహ్నంబునన్; ఆ+మద్రపతి= అట్టి శల్యుడు; యుధిష్ఠిరు పరాక్రమంబునన్= ధర్మరాజుయొక్క శౌర్యమువలన; తెగియెన్= చనిపోయెను; పదంపడి= మరియు ఆ వెనువెంటనే; తన= తనయొక్క; భటులున్= సైనికులును; చెలులున్= స్నేహితులును; చుట్టంబులును= బంధువులును; సమసినన్= చనిపోగా; ఉక్కు= బలము; తక్కి= కోల్పోయి; ఆ+కురువిభుండు= ఆ దుర్యోధనుడు; అనిపని= యుద్ధం చేయటం; చాలించి= మానివేసి; వెఱన్= భయమును; పొందెడు= పొందినటువంటి; డెందంబుతోన్= హృదయముతో; ఒక్కరుండునున్= ఒక్కడును; తొలంగంబాఱి= తొలగిపోయి (అనగా యుద్ధభూమినుండి వెడలిపోయి); ఒక్క= ఒక; మడువు= లోతైన కొలను; చొచ్చి= ప్రవేశించి; దాఁగి= మరుగుపడి; ఉండెన్; అట= అక్కడ; గెలుపు+ఉబ్బునన్= విజయంయొక్క ఉత్సాహంవలన - అనగా విజయోత్సాహంవలన; పొంపిరివోవు= విజృంభించిన; పాండవేయులు; అతండు= ఆ దుర్యోధనుడు; అందున్= ఆ మడువునందు; ఉనికి= ఉండుట; ఎఱింగి= తెలిసికొని; ఆ+ఎడకున్= ఆ స్థానమునకు; అరిగి= వెడలి; నలిరేఁగి= మిక్కిలిరెచ్చిపోయి - అనగా మిక్కిలి ఉద్రేకం పొంది; చుట్టుముట్టి= ఆ మడువు చుట్టునుమూగి; పిలిచినన్= పిలువగా; వెడలి= బయటకువచ్చి; వడముడితోడి= భీముడితోడి; పెనంకువన్= యుద్ధమున; పెద్దయున్= ఎక్కువ; ప్రొద్దు= కాలం - అనగా ఎక్కువసేపు; పెనంగి= యుద్ధముచేసి; ఆ భూనాథుండును= భూమికి భర్త అయిన ఆ దుర్యోధనుడు; ప్రొద్దు= సూర్యుడు; చాలన్= ఎక్కువగా; వాలినప్పుడు= క్రుంకిన సమయమున; భీము= భీముడియొక్క; గదా= గద అను ఆయుధముయొక్క; ఘాతంబునన్= దెబ్బవలన; తొడలు, విఱిగి= ముక్కలుగా విరిగి; పడియెన్= క్రిందపడిపోయెను; అంతన్= అటు తరువాత; నిశాసమయంబునన్= రాత్రి సమయమునందు; అశ్వత్థామ= ద్రోణుడి కుమారుడైన అశ్వత్థామ; కృప= ద్రోణుని బావమరది అయిన కృపుడును; కృతవర్మ= భోజదేశమునకు అధిపతి అయిన కృతవర్మయు; తనకున్; తోడుగాన్= తోడురాగా; సహాయము రాగా; ధర్మనందన= ధర్మరాజుయొక్క; స్కంధావారంబున్= సైనిక శిబిరంబును; పొదివి= క్రమ్ముకొని; పాంచాల= పాంచాలదేశముయొక్క; ప్రభద్రక= ప్రభద్రకులను క్షత్రియదళము; మాత్స్య= మత్స్య దేశ

క్షత్రియదళము; ప్రభృతి= ఈ మొదలగు; శేష= మిగిలిన; సైన్యంబులన్= సేనలను; సమయించెన్= సంహరించెను; మఱునాఁడు= మరుసటి దినమున; సంజయుండు; కురుక్షేత్రంబుననుండి= కురుక్షేత్రయుద్ధభూమినుండి; పూర్వాహ్ణంబునన్= మధ్యాహ్నానికి ముందు కాలాన; కరినగరంబునకున్= హస్తినాపురమునకు; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** జనమేజయమహారాజు పాండవులు అటుపిమ్మట ఏమి చేశారని అడుగగా వైశంపాయన మహాముని ఈ విధంగా చెప్పాడు; కర్ణుడు చనిపోయిన తరువాత యుద్ధంలో చనిపోగా మిగిలిన రాజశ్రేష్ఠులు తన చుట్టును చేరి ఉండగా కొంచెం సైన్యాన్ని వెంటనిడికొని దుర్యోధనుడు విడిదికి వెళ్ళాడు. అక్కడ స్నేహితులు దుఃఖితుడైన అతడిని ఓదార్చగా దుఃఖాన్ని విడిచి, మరల సమరోత్సాహాన్ని సంతరించుకొని మద్రపతి అయిన శల్యుడిని తనకు సేనాపతిగా చేసికొని తెల్లవారిన వెంటనే సైనికబలమును సమకూర్చుకొని మరల యుద్ధభూమికి వెళ్ళాడు. పాండవులు కూడా తమ సైనికబలంతో వ్యూహరచన కావించుకొని యుద్ధానికి సిద్ధమై రాగా, ఆ ఇరుపక్షాలవారికి దేవరాక్షసుల యుద్ధమును పోలిన యుద్ధం జరిగింది. అంతట మధ్యాహ్నసమయాన ధర్మరాజు మహాపరాక్రమంతో కౌరవసైన్యాధిపతి అయిన శల్యుడిని చంపివేశాడు. అటు తరువాత వెనువెంటనే దుర్యోధనుడి సైనికులు, స్నేహితులు, చుట్టములు, ఆ యుద్ధంలో చనిపోగా సమస్తబలాన్నీ కోల్పోయి దుర్యోధనుడు సమరం చాలించి, భయంతో ఒంటరిగా ఆ యుద్ధభూమినుండి తొలగిపోయి, ఒక లోతైన జలాశయంలో దిగి దాగి ఉన్నాడు. ఇక అక్కడ విజయోత్సాహంతో విజృంభించిన పాండవులు దుర్యోధనుడు మడుగులో దాగి ఉండటాన్ని గమనించి, అక్కడకు వెడలి, ఆ మడువును చుట్టుముట్టి, మహోద్రేకంతో దుర్యోధనుడిని పిలువగా అతడు ఆ మడువునుండి పైకి వచ్చి భీముడితో చాలాసేపు యుద్ధం చేశాడు. అంతట సూర్యాస్తమయ సమయంలో భీముడి గదాఘాతమున తొడలు విరిగి దుర్యోధనుడు నేలకు ఒరిగాడు. అనంతరం రాత్రి సమయంలో కృపకృతవర్మలు తోడు రాగా అశ్వత్థామ ధర్మరాజుయొక్క సైనిక శిబిరంలోనికి ప్రవేశించి, యుద్ధంలో పాండవపక్షాన మిగిలిన పాంచాల ప్రభద్రక మాత్స్య సైనికులను సంహరించాడు. ఆ మరునాటి మధ్యాహ్నానికి ముందుగా సంజయుడు కురుక్షేత్రం నుండి హస్తినాపురానికి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **పొరిఁ బొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై**
**చరణయుగంబు దొట్రువడ సంభృతశోకత రాజవీథి నె**
**వ్వరిఁ గనియైన హా మహితవైభవ హా ధృతరాష్ట్రపుత్ర! హా**
**కరిపురనాథ! యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్ ॥ 6**

**ప్రతిపదార్థం:** పొరిన్+పొరిన్= మాటిమాటికి; మోమున్= ముఖమును; బాష్పజల పురము= కన్నీటి వెల్లువ; క్రమ్మఁగన్= ఆవరించగా; ఊర్ధ్వబాహుఁడు+ఐ= పైకి ఎత్తబడిన చేతులు కలవాడై; చరణయుగంబు= రెండు కాళ్ళు; తొట్రుపడన్= తొందరపాటు వలన తడబడగా; సంభృత= మిక్కిలియైన; శోకతన్= దుఃఖముతో; రాజవీథిన్= రాజమార్గమున; ఎవ్వరిన్= ఏ ఒక్కరిని; కని+ఐనన్= చూచినను; హా!= అయ్యో!; మహిత వైభవ= గొప్ప సంపద గల; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రునియొక్క; పుత్ర!= కుమారా!; హా!= అయ్యో!; కరిపుర= హస్తినాపురమునకు; నాథ!= ప్రభువు అయినవాడా!; అంచున్= అనుచు; ఎలుఁగు= కంఠధ్వని; గద్గదికన్= గాద్గద్యమును - డగ్గుత్తికను; తగులంగన్= పొందగా; ఏడ్చుచున్= దుఃఖిస్తూ.

**తాత్పర్యం:** ఆ సంజయుడు కురుక్షేత్రంనుండి హస్తినాపురానికి వచ్చి, మాటిమాటికి ముఖం కన్నీటితో నిండిపోగా, చేతులు పైకెత్తి, కాళ్ళు తొట్రుపాటు పడుతుండగా దుఃఖ భారంతో, హస్తినాపుర రాజమార్గంలో ఎవరు కనిపించినా

'హా మహితవైభవా! హా ధృతరాష్ట్రపుత్రా! హా కరిపురనాథా!' అంటూ గద్గదస్వరంతో ఎలుగెత్తి ఏడుస్తూ, (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. జననయన చకోరానం । దనుఁడగు నృపచంద్రుఁ డనుచితంబయిన విధం**
**బున నస్తమించె నంచుం । దనుడోలన భరితభూరిదైన్యుం డగుచున్. 7**

**ప్రతిపదార్థం:** జన= ప్రజలయొక్క; నయన= నేత్రములనెడి; చకోర= చకోరపక్షులకు; ఆనందనుఁడు= సంతోషమును కలిగించువాడు; అగు= అయినటువంటి; నృప= రాజు అనెడి; చంద్రుఁడు= చందమామ; అనుచితంబు+అయిన= ఉచితం కాని; విధంబునన్= ప్రకారంగా; అస్తమించెన్= మరణించెను; అంచున్= అనుచు; తను= శరీరంయొక్క; డోలన= ఊగుటచేత; భరిత= నిండిన; భూరి= అధికమైన; దైన్యుండు= దీనత్వం కలవాడు; అగుచున్= ఔతూ.

**తాత్పర్యం:** చంద్రుడు చకోర పక్షులకు ఆనందాన్ని చేకూర్చేటట్లు ప్రజలనేత్రాలకు ఆనందాన్ని చేకూరుస్తున్న రాజచంద్రు డయిన దుర్యోధనుడు అనుచితంగా మరణించాడు - అంటూ మిక్కిలి దుఃఖభారంతో సంజయుడు దీనుడై (ధృతరాష్ట్ర మందిరాన్ని ప్రవేశించాడు).

**విశేషం:** 'జన నయన చకోరానందనుఁ డగు నృపచంద్రుఁడు అస్తమించె' - ఇది చక్కని రూపకాలంకారం.

**వ. చని ధృతరాష్ట్ర మందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడండ్రును విదురుండును మఱియును దగు చుట్టంబులునుం బరివేష్టింపఁ గర్ణులేమికిఁ బ్రేముడించు పలుకులు సెల్ల నుల్లంబు దురపిల్లనున్న యన్నర నాథుం గని డగ్గుత్తికవెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి పాదప్రణామం బాచరించి యేడ్పు బెరయు నెలుంగుతో నిట్లనియె. 8**

**ప్రతిపదార్థం:** చని= వచ్చి; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రునియొక్క; మందిరంబు= భవనములోనికి; ప్రవేశించి= చొచ్చి; లోపలికొలువునన్= లోపల ఉన్న సభాస్థానమునందు - అనగా ఆంతరంగిక సభామండపమునందు; గాంధారియున్= గాంధారియు; కోడండ్రును= కోడళ్ళును; విదురుఁడును; మఱియును= ఇంకను; తగుచుట్టంబులునున్= దగ్గరిబంధువులును; పరివేష్టింపన్= చుట్టును మూగి ఉండగా; కర్ణులేమికిన్= కర్ణునియొక్క మరణమునకు; ప్రేముడించు= దుఃఖపూరితములు అయిన; పలుకులు= మాటలు; చెల్లన్= కొనసాగగా; ఉల్లంబు= హృదయము; దురపిల్లన్= తపించుచుండగా; ఉన్న= ఉన్నటువంటి; ఆ నరనాథున్= ఆ ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి; పాద= పాదములకు; ప్రణామంబు= నమస్కారం; ఆచరించి= చేసి; ఏడ్పు= దుఃఖము; బెరయు= వ్యాపించు; ఎలుంగుతోన్= పెద్దకంఠధ్వనితో - అనగా బోరుబోరున ఏడుస్తూ; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** సంజయుడు వచ్చి ధృతరాష్ట్రుడి మందిరం లోనికి ప్రవేశించాడు. ఆ మందిరంలోపల ఉన్న అంతరంగిక సభామండపంలో, గాంధారియు, కోడళ్ళును, విదురుడును, దగ్గరిచుట్టాలు ఆ ధృతరాష్ట్రుడి చుట్టూ మూగి ఉన్నారు. అప్పుడు ధృతరాష్ట్రుడు కర్ణుడి మరణానికి దుఃఖిస్తూ సంతాపంతో నిండిన హృదయంతో తపిస్తుండగా, ఆ ధృతరాష్ట్రుడిని చూచి, గద్గదస్వరంతో తనపేరు చెప్పుకొని, దగ్గరకు పోయి, పాదాలకు నమస్కరించి సంజయుడు బోరుబోరున ఎలుగెత్తి ఏడుస్తూ, ఈ విధంగా చెప్పాడు.

**సీ.** **'జననాథ! శల్యుండు సమసె సౌబలుఁడు గీ । టడఁగె నులూకుండు మడిసె సకల**
**సంశప్తకులుఁ గడచనిరి కాంభోజశ । తానీకములు దెగటాఱె యవన**
**పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్ । దిక్కులమన్నీలుఁ దక్కఁగలుగు**
**నరనాయకులును జచ్చిరి కుమారులు గల । యందఱుఁ దెగిరి కర్ణాత్మజులును**

**తే.** **బొలిసిరయ్య! వృకోదరు పలుకు దప్ప । కుండఁ దద్గదాదండప్రచండనిహతి**
**రెండు దొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ । గూలి రూపఱి రారాజు ధూళి బ్రుంగె. 9**

**ప్రతిపదార్థం:** జననాథ!= ధృతరాష్ట్ర మహారాజా! శల్యుండు= మద్రపతి అయిన శల్యుడు; సమసెను= చనిపోయెను; సౌబలుఁడు= గాంధార రాజు శకుని; గీటడఁగెన్= చచ్చెను; ఉలూకుండు= శకుని పుత్రుడు అయిన ఉలూకుడు; మడిసెన్= మరణించెను; సకల= సమస్తమైన; సంశప్తకులు= త్రిగర్తాధీశ్వరులగు సుశర్మ, సత్యరథుడు, సత్యసేనుడు, సత్యకర్ముడు, మొదలగు వారు; కడచనిరి= చచ్చిరి; కాంభోజ= కాంభోజరాజు సుదక్షిణుడు - అతడిసేనలు; శతానీకములు; తెగటాఱెన్= చచ్చిపోయాయి; యవన= యవనదేశాధీశులయొక్క; పార్వతీయ= పార్వతీయుడను రాజుయొక్క (ఇతడు కుక్షి అను దానవుడి అంశవలన జన్మించాడు.); మ్లేచ్ఛ= మ్లేచ్ఛ దేశాధీశులయొక్క; బలములు= సేనలు; త్రుంగెన్= నేలకూలెను; నల్= నాలుగు; దిక్కుల= దిక్కులనుండి; వచ్చిన; మన్నీలున్= రాజశ్రేష్ఠులును; తక్క= మిగిలి; కలుగు= ఉన్న; నరనాయకులును= రాజులును; చచ్చిరి= మరణించారు; కుమారులు= రాజపుత్రులు; కల= ఇంకను ఉన్న; అందఱున్= అందరును; తెగిరి= చచ్చారు; కర్ణ= కర్ణునియొక్క; ఆత్మజులును= పుత్రులును; పొలిసిరి= చచ్చిరి; అయ్య!= ఓ పూజ్యుడా - ధృతరాష్ట్ర మహారాజా!; వృకోదరు= భీముని యొక్క (తోడేలు పొట్టవంటి పొట్టకలవాడు కావున భీముడికి వృకోదరుడని పేరు); పలుకు= మాట; తప్పకుండన్= అబద్ధం కాకుండగ; తద్= ఆ; గదాదండ= గదాయుధమునియొక్క; ప్రచండ= తీవ్రమైన; నిహతిన్= దెబ్బవలన; రెండు+తొడలును= రెండు తొడలును; విఱిగి= ముక్కలై; ధరిత్రిన్= భూమిపై; పెలుచన్= దబ్బున; కూలి= పడిపోయి; రూపఱి= రూపము చెడి; రారాజు= దుర్యోధనుడు; ధూళిన్= దుమ్ములో; బ్రుంగెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! శల్యుడు, శకుని, శకుని కుమారుడు ఉలూకుడు, సమస్త సంశప్తకులు, కాంభోజరాజులు, శకులు, యవనులు, పార్వతీయులు, మ్లేచ్ఛులు, వారి బలాలు నలు దిక్కులనుండి వచ్చిన రాజులు, రాజపుత్రులు కర్ణుడి కుమారులు అందరూ యుద్ధంలో మరణించారు. ఇక భీముడి ప్రతిజ్ఞ ప్రకారం గదాఘాతం వలన రారాజు దుర్యోధనుడు రెండు తొడలు విరిగి నేలకూలి రూపం చెడి దుమ్ము కొట్టుకొని ఉన్నాడు.

**విశేషం:** ఈ సీసపద్యంలో తిక్కయజ్వ వాడిన పదమును వాడకుండా - తొమ్మిది శబ్దములను ప్రయోగించాడు. ఈ తొమ్మిది శబ్దములు 'చచ్చుట' అను ఒకే అర్థమును బోధిస్తున్నవి. 1.సమసె. 2.గీటఁడగె. 3.మడిసె. 4.కడచనిరి. 5.తెగటాఱె. 6.త్రుంగె;. 7.చచ్చిరి. 8.తెగిరి. 9.పొలిసిరి. ఒకే అర్థమును బోధించు అనేక శబ్దములను ఒకే పద్యమున ప్రయోగించటం 'శబ్దవైచిత్రి'. ఇక, ఇచ్చట బీభత్సకరుణ రసములు పోషింపబడుతున్నవి. ఈ శబ్దవైచిత్రి తిక్కయజ్వ రసాభ్యుచితబంధమునకు ప్రాణం.

**వ.** **మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గల పాంచాలురును జేదిమాత్స్య ప్రభద్రక ప్రభృతి బలంబులు లోనుగా నవశిష్టజనంబులును నీమనుమలైన ప్రతివింధ్యాది ద్రౌపదేయులును సకల రథసామజ ఘోటక సుభటసమేతంబుగా మృతిఁ బొందిరిట్లు కౌరవ శిబిరంబును బాండవస్కంధావారంబును విధి వశంబున వనితావశేషంబులయ్యె నిందుఁ గృపకృతవర్ములు**

**నశ్వత్థామయుఁగా మువ్వురును నందుఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులుగా నేడ్వురును భవత్సుతుండయిన యుయుత్సుండును శేషించి రివ్విధంబునఁ బదునొకండు నేడక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ గావింపనుం జంపనుం బూను కాలంబగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందె' నని చెప్పటయు నమ్మహీపతి మూర్ఛిల్లె. విదురుండును వివశుండై యొఱగె. గాంధారియుఁ గోడండ్రును జెయ్వేది పుడమిం బడిరి; తక్కటిచుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబుచందం బైరి. సంజయప్రయత్నంబున నందఱుం గ్రమంబునం దేఱి రప్పుడు మేను వడంక న మ్మానవనాథుండు నలు దిక్కులకు మొగంబు ద్రిప్పి విదురునుద్దేశించి 'పుత్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితిఁ దమ్ముండ! యిటమీఁద నీవ నాకు గతి యగు' మనుచు మగుడనిగుడు మూర్ఛాతిశయంబునం బరవశుండయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేదదీర్చినం గూర్చుండి యక్కురువిభుండు గుంభనిక్షిప్త భుజంగంబు చందంబున నిశ్వాసంబు నిగుడ్చుచు నూరకున్నం గనుంగొని యక్కాంతాసముదయంబును సంజయుండును రోదనంబు సేసిరి, పదంపడి యవ్విచిత్రవీర్యనందనుండు. 10**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను; ధృష్టద్యుమ్నుండును; శిఖండియున్; ఉత్తమౌజుండును= ఉత్తమౌజుడును - (ఇతడు పాంచాలదేశపు యోధుడు); యుధామన్యుండును= యుధామన్యుడును- (ఇతడు పాంచాలదేశపురాజకుమారుడు - ఉత్తమౌజుడును - యుధామన్యుడును యుద్ధమున అర్జునుని రథరక్షకులు); లోనుగాన్= మొదలుగా; కల= ఉన్న; పాంచాలురును= పాంచాలదేశమువారును; చేది= చేదిదేశముయొక్క; మాత్స్య= మత్స్యదేశముయొక్క; ప్రభద్రక= ప్రభద్రకులు; ప్రభృతి= మొదలగు; బలంబులు= సైన్యములు - (చేది దేశపు రాజు శిశుపాలుడు - అతడి పుత్రుడు ధృష్టకేతుడు. ఇతడు ఒక అక్షౌహిణి సేనతో పాండవపక్షముననుండి పోరాడాడు. కురుక్షేత్ర యుద్ధంలో - విరాటుడు ఒక అక్షౌహిణి సైన్యముతో పాండవ పక్షంనుండి యుద్ధం చేశాడు. ఇక ప్రభద్రకులు పాంచాలదేశపు క్షత్రియవీరులు); లోనుగాన్= మొదలుగా; అవశిష్ట= మిగిలిన; జనంబులును= సైనికులును; నీ మనుమలైన; ప్రతివింధ్య= ప్రతివింధ్యుడు; ఆది= మొదలగు; ద్రౌపదేయులును= ద్రౌపదీపుత్రులును- (ద్రౌపదికి పంచపాండవుల వలన జన్మించిన పుత్రులు అయిదుగురు. ఇందు మొదటివాడు ప్రతివింధ్యుడు. ధర్మరాజు వలన ప్రతివింధ్యుడు - భీముడి వలన సుతసోముడు - అర్జునుడి వలన శ్రుతకీర్తి - నకులుడి వలన శతానీకుడు- సహదేవుడి వలన శ్రుతకర్ముడు జన్మించారు); సకల= సమస్తమైన; రథ= రథములు; సామజ= ఏనుగులు; ఘోటక= గుర్రములు; సుభట= వీరసైనికులు; సమేతంబుగాన్= సహితముగ; మృతిన్= మరణమును; పొందిరి; ఇట్లు; కౌరవశిబిరంబును= దుర్యోధనాదులయొక్క విడిదిచేయు శిబిరము; పాండవ స్కంధావారంబును= పాండవులు విడిదిచేయు శిబిరమును; విధివశంబునన్= కాల ప్రభావమున; వనితా= స్త్రీలు మాత్రమే; అవశేషంబులు= మిగిలినవిగా; అయ్యెన్= అయినవి; ఇందున్= ఈ కౌరవపక్షమున; కృపకృతవర్ములున్= కృపుడు, కృతవర్మ; అశ్వత్థామయున్+కాన్= అశ్వత్థామతో కలిపి; ముప్పురునున్= ముగ్గురును; అందున్= ఆ పాండవపక్షమున; పాండవులు= ధర్మరాజాదులు; ఏవురును= అయిదుగురును; భవత్= నీయొక్క; సుతుండు= పుత్రుడు; అయిన= అయినటువంటి; యుయుత్సుండును= యుయుత్సుడనేవాడు; శేషించిరి= మిగిలిరి; ఈ విధంబునన్= ఈ ప్రకారముగ; పదునొకండు= పదకొండును; ఏడక్షౌహిణులును= ఏడు అక్షౌహిణులును; అఖిల= సమస్తమైన; క్షోణికిన్= భూమండలమునకు; దుర్యోధనున్= దుర్యోధనుడిని; అధిపున్= అధిపతిని; కావింపనున్= చేయుటకొరకు; చంపనున్= చంపుటకును; పూను= పూనిక వహించిన; కాలంబు= సమయము; అగుటయున్= వచ్చుటయు; ఆలంబునన్= యుద్ధంలో; నిశ్శేషత్వంబున్= ఒక్కడును మిగులని స్థితిని; ఒందెన్= పొందెను; అని= ఈ విధంగా; చెప్పటయున్= చెప్పగా; ఆ మహీపతి= ఆ ధృతరాష్ట్రుడు; మూర్ఛిల్లెన్= మూర్ఛను పొందెను; విదురుండును= విదురుడు కూడ; వివశుండై= స్మృతి

కోల్పోయినవాడై; ఒఱగెన్= వాలిపోయెను; గాంధారియున్= గాంధారియు; కోడంద్రును= కోడళ్ళును; చెయ్వు= చేష్ట; ఏది= ఉడిగి; పుడమిన్= భూమిపై; పడిరి; తక్కటి చుట్టంబులు= మిగిలిన బంధువులు; మొగంబులు= ముఖములు; మొగుడన్= ముడుచుకొనిపోగా; చిత్రరూపంబు= చిత్రించిన బొమ్మల రూపము; చందంబు= మాదిరిగా; ఐరి= అయిపోయిరి; సంజయప్రయత్నంబునన్; అందఱున్= అందరు; క్రమంబునన్= ఒకరితరువాత ఒకరు క్రమముగా; తేటిరి= తేరుకొనిరి; అనగా తెలివిని పొందిరి; అప్పుడు; మేను= శరీరము; వడంకన్= వణకుచుండగా; ఆ మానవనాథుండు= ఆ ధృతరాష్ట్రుడు; నలుదిక్కులకున్= నాలుగు వైపులకును; మొగంబు= ముఖము; త్రిప్పి= త్రిప్పిచూచి; విదురున్; ఉద్దేశించి; పుత్రహీనుండన్= పుత్రులు లేనివాడను; అనాథుండన్= దిక్కులేనివాడను; అగుట= అయితినని; ఎఱింగితిన్= తెలిసికొంటిని; తమ్ముండ!= తమ్ముడా!; ఇటమీఁదన్= ఇటుపైన; నీవ= నీవే; నాకున్; గతి; అగుము; అనుచున్; మగుడన్= మరల; నిగుడు= వ్యాపించు; మూర్ఛాతిశయంబునన్= మూర్ఛయొక్క విజృంభణమువలన; పరవశుండు= స్మృతిని కోల్పోయినవాడు; అయినన్= కాగా; అతండును= ఆ సంజయుడు; నారీజనంబును= స్త్రీజనమును; శీత= చల్లని; అంబు= నీళ్ళచేత; సేచనంబులను= తడుపుటవలనను; లలిత= మెత్తని; వ్యజన= తాటాకు విసనకర్రలతో; వీజనంబులను= విసరుటవలన; కొండొకసేపు= కొంతసేపటికి; సేద= బడలిక; తేర్చినన్= తీరునట్లు చేయగా; కూర్చుండి; ఆ+కురువిభుండు= ధృతరాష్ట్రుడు; కుంభ= కుండయందు; నిక్షిప్త= దాచబడిన; భుజంగంబు= త్రాచుపాము; చందంబునన్= విధముగా; నిశ్వాసంబు= నిట్టూర్పు; నిగుడ్చుచున్= వ్యాపింపజేస్తూ; ఊరకున్నన్= మౌనముగా ఉండగా; కనుంగొని; ఆ+కాంతా= ఆ స్త్రీలయొక్క; సముదయంబును= సమూహమును; సంజయుండును; రోదనంబుచేసిరి= బొబ్బలుపెట్టి ఏడ్చిరి; పదంపడి= ఆ వెనువెంటనే; ఆ= అట్టి; విచిత్రవీర్య= విచిత్రవీర్యునియొక్క; నందనుండు= పుత్రుడు అయిన ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధృష్టద్యుమ్నుడు, శిఖండి, ఉత్తమౌజుడు, యుధామన్యుడు మొదలైన పాంచాలురు, చేది, మాత్స్య, ప్రభద్రకాదుల సైన్యాలు, ఇంకను మిగిలిన బలాలు, నీ మనుమలు ద్రౌపది పుత్రులు, అయిన ప్రతివింధ్యాదులు, సకల రథగజ తురగ పదాతి దళములగు చతురంగబల సమేతంగా యుద్ధంలో మరణించారు. కౌరవ శిబిరంలోను, పాండవ శిబిరంలోను, స్త్రీలు మాత్రం మిగిలారు. కౌరవపక్షంలో కృప కృతవర్మ అశ్వత్థామలు ముగ్గురు మిగిలారు. పాండవ పక్షంలో, పాండవులు అయిదుగురు, కృష్ణుడు, సాత్యకి నీ కొడుకు యుయుత్సుడు మిగిలారు. ఈ సమస్తభూమండలానికి దుర్యోధనుడు అధిపతి కాగలడనే కారణంగా కాలవశాన ఈ కురుక్షేత్ర యుద్ధంలో, కౌరవపక్షంలో పదకొండు అక్షౌహిణులు, పాండవపక్షంలో, ఏడు అక్షౌహిణులు, మొత్తం పద్దెనిమిది అక్షౌహిణులయోధులు పోరాడి నిశ్శేషంగా మరణించారు- అని ఇట్లు సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు మూర్ఛపొందాడు. విదురుడు వివశుడయ్యాడు. గాంధారి, ఆమె కోడళ్ళు చేష్టలుడిగి నేలపై పడిపోయారు. మిగిలిన బంధువులందరూ చలనం లేని చిత్రములయ్యారు. అంతట సంజయుడి ప్రయత్నం వలన మరల వారందరూ తేరుకొన్నారు. అప్పుడు ధృతరాష్ట్రుడు నలువైపుల ముఖం త్రిప్పి విదురుడితో 'నేను పుత్రహీనుడను, దిక్కులేని వాడను అయిపోయాను. ఓ తమ్ముడా! ఇక మీద నీవే నాకు దిక్కు. అని చెప్పి మరల మూర్ఛపోయాడు. అప్పుడు సంజయుడు అచ్చట ఉన్న స్త్రీలు, ఆ ధృతరాష్ట్రుడిపై చల్లని నీళ్ళు చల్లి, విసనకర్రలతో విసరగా, కొంతసేపటికి బడలిక తగ్గగా లేచి కూర్చొని, కుండలో ఉంచిన నాగుపాము బుసలు కొట్టేటట్లు - ఆ ధృతరాష్ట్రుడు నిట్టూర్పులు నిగుడిస్తూ మౌనం వహించి ఉన్నాడు. అట్టి స్థితిలో ఉన్న ధృతరాష్ట్రుడిని చూచి, అచ్చట ఉన్న స్త్రీలు, సంజయుడు, భోరున ఏడ్చారు. ఆ వెనువెంటనే ధృతరాష్ట్రుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. 'కుంభ నిక్షిప్త భుజంగంబు చందంబున నిశ్వాసంబు నిగుడ్చుచు' అను ఈ ఒక్క ఉపమానంతో తిక్కయజ్వ ధృతరాష్ట్రుడికి పాండవులయందు గల క్రోధాన్ని, పుత్రమరణంవలన కలిగిన శోకాన్ని, ఏమీ చేయలేని నిస్సహాయ పరిస్థితిని చక్కగ చూపించి, ధృతరాష్ట్రుడి పాత్రను అపూర్వంగా చిత్రించాడు.

**ఆ. అనఘ! వశము గాదు మనసు గోడండ్ర మీ । వదినెఁ జుట్టములను సదనములకుఁ**
**బుచ్చు మనియెఁ బలుకు లచ్చుపాటడఁచు గ । ద్గదిక దైన్య మెసఁగ విదురుతోడ. 11**

**ప్రతిపదార్థం:** పలుకులు= మాటలు; అచ్చుపాటు= స్పష్టత; అడఁచున్= తగ్గించు; గద్గదిక= డగ్గుత్తిక; దైన్యము= దీనత వలన వచ్చిన దుఃఖమును; ఎసఁగన్= ఎక్కువచేయగా - అనగా అతిశయింపచేయగా; విదురుతోడన్= విదురుడితో; అనఘ!= పాపరహితుడా!; మనసు= మనస్సు అనగా ఆలోచనాశక్తి; వశము= అధీనము; కాదు; కోడండ్రన్= కోడళ్ళను; మీ వదినెన్= నీకు వదినె అయిన గాంధారిని; చుట్టములను= బంధువులను; సదనములకున్; వారి వారి ఇండ్లకు; పుచ్చుము= పంపుము; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మాటలు తడబాటు వలన స్పష్టత కోల్పోతూ ఉండగా, దుఃఖాతిశయంవలన వణకుతున్న కంఠస్వరంతో ధృతరాష్ట్రుడు విదురుడితో 'నా మనసు నా అధీనంలో లేదు. నీవు మీ వదినె గాంధారిని, కోడండ్రను, బంధువులను వారి వారి ఇండ్లకు పంపు' మన్నాడు.

**క. అనుటయు నాతం డందఱ । కును మెలపునఁ జెప్ప వగలఁ గుందుచు నల్ల**
**ల్లన తమనిలయంబులకును । జనిరి మఱియు నేడ్చుచుండె సంజయుఁ డలఁతన్. 12**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధృతరాష్ట్రుడు విదురునితో ఇట్లు చెప్పగ; ఆతండు= ఆ విదురుడు; అందఱకును= అచ్చట ఉన్న స్త్రీలకందరకును; మెలపునన్= మెల్లగా-ఊరడింపుగా; చెప్పన్= చెప్పగా; వగలన్= భరింపరాని దుఃఖముతో; కుందుచున్= క్రుంగిపోవుచు; అల్లల్లన= మెల్లమెల్లగా; తమ నిలయంబులకును= వారి వారి ఇండ్లకు; చనిరి= వెడలిరి; మఱియును= ఇంకను; సంజయుఁడు; అలఁతన్= బాధతో; ఏడ్చుచుండెన్= దుఃఖిస్తూ ఉండినాడు.

**తాత్పర్యం:** తన మందిరంలో ఉన్న స్త్రీలను చుట్టాలను గాంధారిని వారి వారి ఇండ్లకు పంపుమని ధృతరాష్ట్రుడు విదురుడితో చెప్పగా విదురుడు వారందరికి ఓదార్పుగా మెల్లగా చెప్పగా వారందరు దుఃఖంతో క్రుంగిపోతూ మెల్లమెల్లగా వారి వారి ఇండ్లకు వెడలిపోయారు. అటు తరువాత కూడా సంజయుడు భరించరాని బాధతో ఏడుస్తూనే ఉండినాడు.

**వ. అమ్మేదినీశ్వరుం డేది గతి? యని దుఃఖాతిశయంబునఁ జేతులు విదిర్చి యా సూతనందను దిక్కు మొగంబయి. 13**

**ప్రతిపదార్థం:** ఆ+మేదినీశ్వరుండు= ప్రభువు అయిన ఆ ధృతరాష్ట్రుడు; దుఃఖాతిశయంబునన్= భరింపశక్యము కాని దుఃఖముతో; ఏది= ఏది; గతి?= మార్గము?; అని; చేతులు; విదిర్చి= విదిలించి; ఆ సూతనందను= ఆ సంజయుడి(యొక్క); దిక్కు= వైపు; మొగంబు= ముఖము; అయి= ఉంచినవాడై అనగా సంజయుడి వైపు చూచినవాడై.

**తాత్పర్యం:** అప్పుడు ధృతరాష్ట్రుడు భరించరాని దుఃఖంతో 'నాకిప్పు డేది గతి' అని చేతులు విదిలిస్తూ సంజయుడి వైపు తిరిగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'చావరు నొవ్వరు పాండవు । లేవురు నని నీవు చెప్ప ని ప్పలుకులు దుః**
**ఖావేశకరములై చే । తోవృత్తి దహింపఁ జొచ్చె దుర్భరభంగిన్. 14**

**ప్రతిపదార్థం:** పాండవులు= పాండురాజకుమారులైన ధర్మరాజాదులు; ఏవురున్= అయిదుగురు (ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు); చావరు= మరణించరు; నొవ్వరు= బాధపడరు; అని= ఈ ప్రకారంగా; నీవు; చెప్పన్= చెప్పుచుండగా; ఈ పలుకులు= ఈ మాటలు; దుర్భరభంగిన్= భరింపశక్యంకాని విధంగా; దుఃఖ= దుఃఖమును; ఆవేశకరములు+ఐ= ఆవేశింపచేసినవై - అనగా దుఃఖమును కల్పించినవై; చేతోవృత్తిన్= మనస్సుయొక్క వ్యాపారమును; దహింపన్= మండింప(లేక) తగులబెట్ట; చొచ్చెన్= చేసెను - అనగా బాధింపజేసెను.

**తాత్పర్యం:** 'పాండవులు అయిదుగురు మరణించలేదు. ఏ విధమయిన బాధనూ పొందలేదు' అని నీవు చెప్పిన మాటలు భరించరాని దుఃఖంతో నా గుండెను మండింపజేస్తున్నాయి.

**క. తనయు లని నందఱుం బడి । రనఁగా విని పెక్కు పఱియలై పోవక యి**
**ట్లునికి యరయ వజ్రమయం । బని తలఁపఁగఁదగు మదీయ మగు హృదయంబున్. 15**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధమునందు; తనయులు= కుమారులు; అందఱున్= అందరును; పడిరి= చనిపోయిరి; అనఁగాన్= అని నీవు చెప్పగా; విని; పెక్కు; పఱియలు= బ్రద్దలు; ఐ= అయి; పోవక= పోకుండ; ఇట్లు= ఈ విధముగ; ఉనికి= ఉండుట; అరయన్= ఆలోచింపగ; మదీయము= నాకు సంబంధించినది; అగు= అయినటువంటి; హృదయంబున్= గుండెను; వజ్రమయంబు= వజ్రమువలె కాఠిన్యముతో కూడినదిగా; అని; తలఁపఁగన్= భావింపగ; తగున్= ఒప్పును.

**తాత్పర్యం:** నా కుమారులందరూ యుద్ధంలో మరణించారని నీవు చెప్పగా వినికూడా నా హృదయం బ్రద్దలు కాకుండా ఉన్నదంటే అది వజ్రమయమని చెప్పవచ్చును.

**ఉ. కన్నులు చీకులై సుతనికాయము బాలవిహారలీలలుం**
**జెన్నగు ప్రాయమొంది విలసిల్లు తెఱంగును జూడఁ గాన కి**
**ట్లున్నను బంధుకోటి సమయోచితలాలనఁ బల్కుపల్కులన్**
**విన్నవి వీనులిప్డు గొఱవిం దముఁ జూఁడినయట్ల పొక్కెడిన్. 16**

**ప్రతిపదార్థం:** సుత= కొడుకులయొక్క; నికాయము= సముదాయము; బాల= పసితనమునందు; విహార= వేడుకగా తిరుగుచు చేయు; లీలలున్= క్రీడలును అనగా ఆటపాటలును; చెన్ను= సుందరము; అగు= అయిన; ప్రాయము= వయసు అనగా యౌవనము; ఒంది= పొంది; విలసిల్లు= ప్రకాశించు; తెఱంగును= విధమును; కన్నులు; చీకులై= గ్రుడ్డివై; చూడన్+కానక= చూచే భాగ్యానికి నోచుకొనక; ఇట్లు= ఈ విధముగా; ఉన్నను= ఉన్నప్పటికీ; బంధుకోటి= చుట్టముల సముదాయము, అనగా చుట్టాలందరు; సమయ= కాలమునకు; ఉచిత= అనుకూలమయిన; లాలనన్= బుజ్జగింపుతో; పల్కు= పలికెడి; పల్కులన్= పలుకులను; విన్నవి= వినినటువంటి; వీనులు= చెవులు; ఇప్డు= ఇప్పుడు; కొఱవిన్= కొఱకచ్చుతో - అనగా కాలుతున్న కర్రతో, తమున్= తమను; (చెవులను) చూఁడిన= కాల్చిన; అట్ల= అట్లే; పొక్కెడిన్= బాధపడుతున్నాయి.

**తాత్పర్యం:** కన్నులు గ్రుడ్డివై ఉన్నందున కొడుకులు పసితనంలో ఆడిన ఆటలను, వయస్సు వచ్చిన తరువాత ప్రకాశించే యౌవన సౌందర్యాన్ని - చూడలేక పోయినా, బంధుకోటి సమయోచితంగా బుజ్జగించుతూ పలికే

పలుకులను విన్న ఈ చెవులు ఇప్పుడు కొరవితో తమను వాతపెట్టినట్లుగా బాధపడుతున్నాయి. (యుద్ధంలో తనయులందరు చనిపోయారని సంజయుడు చెప్పగా విన్న చెవులు - కొరవితో వాతపెట్టినట్లుగా బొబ్బలెక్కాయని భావం.)

**వ. అని దుర్యోధను నుద్దేశించి. 17**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా సంజయుడితో చెప్పి; దుర్యోధనున్= దుర్యోధనుడిని; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** ఈ విధముగా సంజయుడితో చెప్పి అటు తరువాత దుర్యోధనుడి గురించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్పు కొడుక! మీ । యమ్మ నూరార్ప రావయ్య వృద్ధు**
**లగు మమ్ము విడుచుట దగునె? యేగతిఁ బోవు । వారము సెప్పుము? కౌరవేంద్ర!**
**యంధత్వవికలుల నరయక యి ట్లుపే । క్షించితి నామీఁదఁ గృపయుఁ బ్రియము**
**నెక్కడ వోయె? భూమీశులు గొలువంగ । నుండుదీ వ ట్లొంటి నున్నవాఁడ ।**

**తే. వధికబల దుర్నివారుండవైన నీకుఁ । బాండుపుత్రుల చేత నప్పాటఁ జావు**
**వచ్చె నిచ్చలు భక్తిమై వచ్చి కొలిచి । గారవింప నింకెవ్వరు గలరు నాకు? 18**

**ప్రతిపదార్థం:** కొడుక!= కుమారా దుర్యోధనా!; ఇట= ఇక్కడకు; రమ్ము= రావయ్యా!; నన్నున్= నన్ను; కౌఁగిటన్= కౌగిలింతలో; చేర్పు= చేర్పుము-అనగా కౌగిలించుకొనుము; మీయమ్మన్= మీ తల్లిని; ఊరార్పన్= ఊరడించుటకు- ఓదార్చుటకు; రావయ్య; వృద్ధులు= ముసలివారము; అగు= అయిన; మమ్మున్; విడుచుట= విడిచిపెట్టుట; తగునె?= ఒప్పునా?; ఏగతిన్= ఏ విధమయిన బ్రతుకు మార్గమున; పోవువారము= పోగలవారము; చెప్పుము= తెలుపుము; కౌరవేంద్ర!= దుర్యోధనా!; అంధత్వ= గ్రుడ్డితనముచే; వికలులన్= అంగవిహీనులమయిన మమ్ములను; అరయక= విచారింపక; ఇట్లు= ఈ ప్రకారముగ; ఉపేక్షించితి(వి)= అశ్రద్ధగ విడిచిపెట్టితివి; నామీఁదన్= నాయందు; కృపయున్= దయయును; ప్రియమున్= ప్రేమయును; ఎక్కడన్= ఎచ్చటకు; పోయెన్?; భూమీశులు= భూమికి ప్రభువులు అయిన మహారాజులు; కొలువంగన్= సేవించుచుండగ; ఉండుదు(వు)= ఉండెడివాడవు; ఈవ= అట్టినీవే; అట్లు= ఆ విధముగ; ఒంటిన్= ఒంటరిగ; ఉన్నవాఁడవు= ఉన్నావు (అనగా మడుపు దగ్గర మరణించి ఒంటరిగా పడి ఉన్నావు); అధిక= మిక్కిలి ఎక్కువ అయిన; బల= బలముచే; దుర్నివారుండవు= నిరోధింపశక్యముకాని వాడవు; ఐన= అయినటువంటి; నీకున్= నీకు; పాండుపుత్రులచేతన్= పాండురాజు కుమారులచేత; ఆ+పాటన్= ఆ విధంగా; చావు; వచ్చెన్= సంభవించినది; నిచ్చలున్= ఎల్లప్పుడూ; భక్తిమైన్= భక్తితో; వచ్చి= ఏతెంచి; కొలిచి= సేవించి; గారవింపన్= ఆదరించుటకు; నాకున్; ఇంకన్= ఇటుపైని; ఎవ్వరు= ఎవరు; కలరు?= ఉన్నారు?

**తాత్పర్యం:** ఓ కుమారా! దుర్యోధనా! ఇటు వచ్చి నన్ను కౌగిలించుకోవయ్యా! మీ తల్లి గాంధారిని ఓదార్చవయ్యా! ముసలివార మయిన మమ్ములను విడిచిపోవటం తగునా? ఏ విధమయిన బ్రతుకు మార్గంలో మేము పోగలం? ఓ కౌరవేంద్రా! దుర్యోధనా! చెప్పుము. గ్రుడ్డితనంచేత అంగవిహీనుల మని కూడ విచారించక, ఇట్లా మమ్ములను అశ్రద్ధగా విడిచిపెట్టావు. నామీద గల దయ, ప్రేమ ఎక్కడికి పోయాయి? మహారాజులచేత సేవ లందుకొను నీ వేనా ఇట్లా ఒంటరివాడవై మడుపు దగ్గర మరణించి పడి ఉన్నావు? అత్యధిక బలసంపన్నులకు కూడ నిరోధింప శక్యంకాని

నీకు పాండుపుత్రులచేత ఆ విధమయిన మరణం సంభవించిందా? ఇంక నాకు నిత్యం భక్తితో వచ్చి సేవచేసి ఆదరించేవారెవ్వరు ఉన్నారు?

**విశేషం:** ఈ సీసమున తిక్కన ధృతరాష్ట్రుడి దుఃఖాతిరేకాన్ని - అలతి అలతి పలుకులతో అత్యంత సుందరంగా, కరుణరస భావాలతో అభివర్ణించాడు. ఇది శోకవివశుడైన ధృతరాష్ట్రుడి భావరూప చిత్రణం.

**వ. కయ్యంపుమాట పుట్టినయప్పుడు నీవు నాతోడ. 19**

**ప్రతిపదార్థం:** కయ్యంపుమాట= యుద్ధమునకు సంబంధించిన ప్రసంగం; పుట్టిన+అప్పుడు= వచ్చినప్పుడు; నీవు; నాతోడ=నాతో.

**తాత్పర్యం:** యుద్ధవిషయం ప్రస్తావించేటప్పుడు నీవు నాతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**శా. 'చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా**
**కీ పాండుక్షితిపాలపుత్త్రులెదు రిం దెవ్వాఁడు దృప్యద్భుజా**
**వ్యాపారుం డనిఁ గర్ణుఁడొక్కరుఁడు మాయం జేయు మద్బాణవి**
**ద్యాపారీణత గెల్తు నొక్కఁడన యే నయ్యేవురన్ వ్రేల్మిడిన్. 20**

**ప్రతిపదార్థం:** చాపాచార్యుఁడు= ద్రోణుడు, భీష్ముఁడున్= భీష్ముడును; కృపుఁడున్= కృపాచార్యుడును; అశ్వత్థామయున్= ద్రోణపుత్రుడు అశ్వత్థామయును; కల్గన్= ఉండగా; ఈ పాండుక్షితిపాల= ఈ పాండురాజుయొక్క; పుత్రులు= కుమారులు; ఇందున్= వీరిలో; ఏ+వాఁడు= ఎవడు అనగా ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు - ఇందులో ఎవడు; నాకున్; ఎదురు?= ఎదురు నిలువగలవాడు?; దృప్యత్= దర్పించుచున్న; భుజావ్యాపారుండు= యుద్ధము చేయువాడు; కర్ణుఁడు; ఒక్కరుఁడు= ఒక్కడే; అనిన్; యుద్ధమునందు; మాయన్= నాశము అగునట్లు; చేయున్; (అనగా కర్ణుడు ఒక్కడే పాండవులను నాశము చేయును); మద్బాణవిద్యాపారీణతన్= నాయొక్క అస్త్రప్రయోగవిద్యయందలి పరిపూర్ణమయిన నేర్పరితనమువలన; ఏను= నేను; ఒక్కఁడన= ఒక్కడనే; ఆ+ఏవురన్= ఆ అయిదుగురు పాండవులను; వ్రేల్మిడిన్= చిటికెలో; గెల్తున్= గెలువగలను.

**తాత్పర్యం:** 'భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ ఉండగా ఈ పాండురాజ పుత్రులయిన ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులలో ఎవడు నాకు ఈ యుద్ధంలో ఎదురు నిలిచి పోరగలడు? (అనగా పాండవులలో ఒక్కడును నన్ను ఎదురించగలవాడు లేడు.) ఇక భుజదర్పంతో యుద్ధంలో విజృంభించే కర్ణుడు ఒక్కడే ఈ పాండవులను నాశనం చేయగలడు. మరియు నా అస్త్రప్రయోగ విద్యాపారీణతతో నే నొక్కడనే ఆ అయిదుగురు పాండవులను చిటికెలో గెలువగలను.

**తే. మున్ను చెప్పినవారు గా కెన్నఁ గలరు । సుమ్ము! బాహ్లిక భగదత్త సోమదత్త**
**శకుని భూరిశ్రవశ్శలశల్యసింధు । రాజ విందానువిందాది రథికవరులు. 21**

**ప్రతిపదార్థం:** మున్ను= ఇంతకుముందు; చెప్పినవారు= చెప్పబడినవారు (భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణులు); కాక= కాకుండా; బాహ్లిక= బాహ్లికుడు; (ఇతడు బాహ్లిక దేశపురాజు. క్రోధవశుడను దైత్యుని అంశవలన జన్మించినవాడు.) భగదత్త= భగదత్తుడు (ఇతడు ప్రాగ్జ్యోతిషపురాధిపతి. భాష్కలుడను అసురుని అంశవలన జన్మించినవాడు. వీనికి సుపర్వుడనుపేరు

కలదు.) సోమదత్త= సోమదత్తుడు (ఇతడు కురువంశ మహారాజు ప్రతీపుని పౌత్రుడు- బాహ్లికుని పుత్రుడు. మహాపరాక్రమవంతుడు. వీనికి బాహ్లిక - బాహ్లీకాత్మజ- కౌరవేయ - కౌరవ్య - కురుపుంగవ - అనుపేర్లు ఉన్నాయి); శకుని= శకుని (ఇతడు గాంధారరాజు సుబలుని కుమారుడు, దుర్యోధనుని మేనమామ. దుష్టచతుష్టయములో ముఖ్యుడు. ద్వాపరుని అంశవలన జన్మించినవాడు. దేవతల శాపము వలన ధర్మవిరోధిగా మిగిలాడు.); భూరిశ్రవస్= భూరిశ్రవుడు; శల= శలుడు (భూరిశ్రవుడు, శలుడు వీరు సోమదత్తుని కుమారులు); శల్య= శల్యుడు (ఇతడు మద్రదేశాధిపతి. మాద్రికి అన్నగారు. నకులసహదేవులకు మేనమామ.); సింధురాజ= సింధుదేశాధీశుడైన సైంధవుడు (వీని అసలుపేరు జయద్రథుడు. దుర్యోధనుని సోదరి దుశ్శల భర్త. వృద్ధక్షత్రునికుమారుడు. వీనికి సైంధవుడు, సౌవీరుడు, సింధుపతి, సింధురాజు, సింధుసౌవీర భర్త - వృద్ధక్షత్రుని కుమారుడు కాబట్టి, వార్ధక్షత్రి - అని పేర్లు గలవు.); విందానువింద= విందుడు- అనువిందుడు (వీరు అవంతీ రాజకుమారులు - వీరిద్దరు చెరొక అక్షౌహిణీ సేనకు అధిపతులు - దుర్యోధనుడి సేనలో గల పదిమంది ప్రధాన అధినాయకులలో వీరు కూడ ముఖ్యులు; ఆది= ఈ మొదలగు; రథికవరులు= రథికశ్రేష్ఠులు; ఎన్న(న్)= లెక్కింప; కలరు= కలవారు; సుమ్మ= సుమా!

**తాత్పర్యం:** ఇంతకుముందు చెప్పిన వారు కాకుండా బాహ్లికుడు, భగదత్తుడు, సోమదత్తుడు, శకుని, భూరిశ్రవుడు, శలుడు, శల్యుడు, సైంధవుడు, విందుడు, అనువిందుడు మొదలైన రథికశ్రేష్ఠులు లెక్కింప పెక్కురు కలరు సుమా!

**విశేషం:** వీరు పదిమంది. దుర్యోధనుడి సేన పదునొకండక్షౌహిణులు. ఒక్కొక్క అక్షౌహిణికి ఒక్కొక్కరు అధినాయకులుగా పది అక్షౌహిణులకు ఈ పదిమంది అధినాయకులుగా వ్యవహరించారు. మిగిలిన అక్షౌహిణికి దుర్యోధనుడు అధినాయకుడు.

**క. ఏనును గర్ణుఁడు దమ్ములు । నా నలువురు వీరులైన నటు సూడు పృథా**
**సూనుల నెట్ల జయించెద । నో నమ్ముము నా బలంబును గలితనంబున్.' 22**

**ప్రతిపదార్థం:** ఏనును= నేనును; కర్ణుఁడు= కర్ణుడు; తమ్ములున్= తమ్ములును; ఆ నలువురు= ఆ భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలు నలుగురు; వీరులు= శూరులు; అయినన్= అయి ఉండగా; పృథాసూనులన్= కుంతియొక్క పుత్రులను; ఎట్ల= ఏ ప్రకారముగ; జయించెదనో= జయింపగలనో; అటుచూడు; నా బలంబును= నా శక్తిని; కలితనంబున్= సామర్థ్యమును; నమ్ముము.

**తాత్పర్యం:** నేనూ, కర్ణుడూ, తమ్ములూ; భీష్మద్రోణకృపాశ్వత్థామలు నలుగురూ; వీరులమైన మేమందరం కలిసి ఆ కౌంతేయులను ఎట్లా జయిస్తామో చూడుము. నా శక్తిసామర్థ్యాలను విశ్వసింపుము.'

**క. అని యూఱడిల్లఁ బలికిన । విని భవదీయానివార్య విక్రమమునఁ బాం**
**డు నరేంద్రసుతులు దెగుదుర । యని తలఁచితి నీవె తెగితె యవ్వీరులచేన్? 23**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారముగ; ఊఱడిల్లన్= ఓదార్పు పొందునట్లు; పలికినన్= పలుకగా; విని; భవదీయ= నీయొక్క; అనివార్య= నివారింపశక్యముకాని; విక్రమమునన్= పరాక్రమమువలన; పాండు నరేంద్ర= పాండురాజుయొక్క; సుతులు= కుమారులు; తెగుదురు+అ= తప్పకుండ నశిస్తారు; అని; తలఁచితిన్= భావించితిని; ఆవీరులచేన్= వీరులైన ఆ పాండవులచే; నీవె= నీవే; తెగితె?= చచ్చితివా?

**తాత్పర్యం:** నన్ను ఊరడించటానికి నీవు పలికిన పలుకులు విని నివారించ శక్యంకాని నీ పరాక్రమంతో పాండవులు చంపబడుతారని భావించాను. అట్లాకాక ఆ వీరులచేత నీవే చంపబడ్డావా?

**విశేషం:** ఈ పద్యంలో ధృతరాష్ట్రుడి అంతఃకరణం చక్కగా ఆవిష్కరించబడింది.

**క. అమరనదీతనయుఁడు సిం । హము గాక నరుండె? పార్థుఁ డట్టి మహాత్మున్**
**సమయించెనట్లు జంబుక । సముని శిఖండిఁ గొని విధి కసాధ్యము గలదే! 24**

**ప్రతిపదార్థం:** అమరనదీ= ఆకాశగంగానదియొక్క; తనయుఁడు= కుమారుడు భీష్ముడు; సింహము= సింహము; కాక= కాక; నరుండె?= మానవుడా? (కాదు అని అర్థం); అట్టి= అటువంటి; మహాత్మున్= గొప్పవాడిని; జంబుక= నక్కతో; సముని= సమానమైనవానిని; శిఖండిన్= శిఖండిని; కొని= తీసికొని; పార్థుఁడు= అర్జునుడు; (పృథయొక్క కొడుకు కావున పార్థుడు); అట్లు; సమయించెన్= సంహరించెను; విధికిన్= బ్రహ్మకు; అసాధ్యము= చేయలేనిది; కలదే!= కలదా! (లేదని తాత్పర్యము.)

**తాత్పర్యం:** భీష్ముడు సింహమే కాని నరుడు కాడు. అటువంటి మహాత్ముడిని నక్కవంటి శిఖండిని ముందిడుకొని అర్జునుడు సంహరించాడు. విధికి సాధ్యం కానిది ఏమున్నది?

**విశేషం:** అలం: రూపకం, ఉపమ, అర్థాంతరన్యాసం. భీష్ముడు - ఉపమేయం; సింహము - ఉపమానం; శిఖండి - ఉపమేయం; జంబుకము - ఉపమానం; పార్థుడు భీష్ముడిని సంహరించటం - విశేషార్థం. విధి కసాధ్యము కలదే!- సామాన్యార్థం. విశేషార్థాన్ని సామానార్థం చేత సమర్థించటం వలన అర్థాంతరన్యాసం.

మూలము: **భీష్మశ్చ నిహతో యత్ర లోకనాథః ప్రతాపవాన్ । శిఖండినం సమాసాద్య మృగేంద్ర ఇవ జంబుకమ్ ॥**

కేవలం ఉపమాలంకారము గల మూలశ్లోకమును కందంలో బిగించి అర్థాంతరన్యాసంతో కూడ అలంకరించి తిక్కయజ్వ స్వతంత్రానువాదాన్ని ప్రకటించాడు.

శిఖండి: ఇతడు ద్రుపదమహారాజు పుత్రుడు. ద్రౌపదికి అన్నగారు. మనస్విని అనే రాణి గర్భమున పుత్రికగా జన్మించాడు. తల్లిదండ్రులు పుత్రోచితసంస్కారములు జరిపించారు. స్థూలకర్ణుడనే యక్షుడి దయవలన పురుషరూపమును ధరించాడు. ముందు స్త్రీగా జన్మించి తరువాత పురుషరూపమును ధరించినందువలన - శిఖండి, శిఖండినీ - అనే పేర్లు కలిగినవి. భీష్ముడు స్త్రీగా పుట్టి పురుషులుగా మారిన శిఖండుల మోములు చూడడు. అది ఆతడి ప్రతిజ్ఞ. అందువలన పార్థుడు భీష్ముడి సలహాను అనుసరించి కురుక్షేత్ర సంగ్రామమున భీష్ముడిని సంహరించటానికి మరొకమార్గంలేక శిఖండిని ముందిడుకొని యుద్ధం చేశాడు. భీష్ముడు అస్త్రసన్న్యాసం చేశాడు. పార్థుడు భీష్ముడిని కూల్చాడు.

**చ. శరగురుఁడట్టి యోధుఁ డటె చచ్చె ననిన్ దొర గాని వానిచే**
**వెరవున లావునన్ జనులు వెక్కసమందఁగఁ జేయు సింధుభూ**
**వరుఁడటె! రిత్తవోయె ననివార్యుల బాహ్లిక సోమదత్తులం**
**బరు లవలీలఁ జంపిరటె! పల్కుదు నేమని యేను దైవమున్? 25**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధమునందు; శరగురుఁడు= ద్రోణుడు; అట్టియోధుఁడటె! = సామాన్యయోధుడా! (ఎంతో గొప్ప యోధుడు); దొర= యోధుడు; కానివానిచే= కానటువంటివాడిచే; చచ్చెన్= మరణించెను; వెరవునన్= ఉపాయమునందును; లావునన్= బలంచేతను; జనులు= ప్రజలు; వెక్కసము= దుస్సహత్వము; అందఁగన్= పొందగ; చేయు= చేయగల; సింధుభూవరుఁడు+అటె! = సింధుదేశమునకు రాజు అయిన జయద్రథుడా!; రిత్త= వ్యర్థముగా; పోయెన్= చనిపోయెను; అనివార్యులన్= నివారింప శక్యముకానివారు అయిన; బాహ్లికసోమదత్తులన్= బాహ్లికుడిని సోమదత్తుడిని; పరులు= శత్రువులు; అవలీలన్= చాలా తేలికగా; చంపిరి+అటె!= సంహరించారా!; ఏను= నేను; దైవమున్= దైవమున గూర్చి; ఏమని; పల్కుదును?= చెప్పుదును?

**తాత్పర్యం:** ద్రోణుడు తనకెంతమాత్రము సాటిగాని వాడిచేత యుద్ధంలో మరణించేటంత తక్కువ యోధుడా? జనులు సహింపశక్యం కాని బలం కల జయద్రథుడు వ్యర్థంగా చనిపోయాడు కదా! యుద్ధంలో ఎవ్వరిచేతకూడా నిరోధింపశక్యం కాని బాహ్లిక సోమదత్తులను శత్రువులు అవలీలగా చంపారు కదా! ఇక నేను దైవచేష్టితాన్ని గూర్చి ఏమని చెప్పను? (అంతా విధివిధానమని తాత్పర్యం.)

**విశేషం:** ద్రోణుడు భరద్వాజ మహర్షి పుత్రుడు. బృహస్పతి అంశతో జన్మించాడు. ఒకరోజు భరద్వాజ మహాముని గంగానదిలో స్నానానికి వెళ్ళాడు. అక్కడ అంతకుముందే గంగలో స్నానం చేస్తున్న ఘృతాచి అనే అప్సరస వస్త్రం కొంచెం తొలగింది. అది చూచిన భరద్వాజుడికి వీర్యస్ఖలన మయింది. మహర్షి ఆ వీర్యాన్ని ద్రోణమున (యజ్ఞకలశం) ఉంచి సంరక్షించగా దాని నుండి ద్రోణుడు జనించాడు. ద్రోణము నుండి పుట్టినందువలనే ద్రోణుడని పేరు వచ్చింది.

ద్రోణుడు సంపూర్ణవేదాధ్యయన సంపన్నుడు. పరశురాముడి వద్ద సమస్త అస్త్రవిద్యలను అభ్యసించాడు. మహర్షి అగ్నివేశుడి ఆశ్రమంలో, ద్రుపదుడితో కలిసి విద్యాభ్యాసం చేశాడు. కౌరవులకు, పాండవులకు శరగురువు. అర్జునుడివంటి మహావీరుడికి ప్రియగురువు. భీష్ముడిచేత ప్రశంసలందిన పరాక్రమం కలవాడు. బ్రహ్మశిరోనామక అస్త్రమును అర్జునుడికి ఉపదేశించినవాడు. ఇంతటి మహాయోధుడు ద్రోణుడు. సామాన్యుడయిన ధృష్టద్యుమ్నుడిచేత సంహరించబడ్డాడా!- అని ధృతరాష్ట్రుడు విలపిస్తూ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

నిజానికి ద్రోణుడిని ఎవ్వరూ సంహరించలేదు. అశ్వత్థామ మరణించాడని భావించి అస్త్రత్యాగం చేసి యోగమార్గాన బ్రహ్మలోకాన్ని పొందాడు. అనంతరం ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి శిరమును ఖండించి తన జన్మకారణానికి సాఫల్యం చేకూర్చుకొన్నాడు.

**క. నీ నమ్మిన భూరిశ్రవుఁ । డేనికలా వతఁడు నెందు నెనలేని మగం**
**డైన భగదత్తుఁడును వ । మ్మైన తెఱంగట్టె! యేమి యందుఁ గుమారా! 26**

**ప్రతిపదార్థం:** కుమారా!= కొడుకా!; నీ నమ్మిన= నీవు నమ్మిన; భూరిశ్రవుఁడు; ఏనిక, లావు, అతడు= ఏనుగంతటి బలం కలవాడు (భూరిశ్రవుడు); ఏనికలావు+అతఁడు= ఏనుగంతటి బలం కలవాడు; ఎందున్= ఎచ్చటను; ఎనలేని= సమానమైనవాడు లేని; మగండు= శూరుడు; ఐన= అయినటువంటి; భగదత్తుఁడును= భగదత్తుడుకూడ; వమ్ము= నాశము; ఐన= అయిన; తెఱంగు= విధము; అట్టె!= ఆశ్చర్యకరం; ఏమి= ఏమని?; అందున్= చెప్పుదును?

**తాత్పర్యం:** కుమారా! నీవు నమ్మిన భూరిశ్రవుడు ఏనుగు వంటి బలంకలవాడు. ఎచ్చటను తనతో సమానమైనవాడు లేని శూరుడు. అటువంటి భగదత్తుడు మరణించిన విధం ఆశ్చర్యకరం. ఇంక ఏమి చెప్పగలను?

**ఉ. నచ్చిన కర్ణు విక్రమమునం బరవీరులయందొకండునుం**
**జచ్చుట లేదు దుర్దమము శల్యభుజావిభవంబు లోకముల్**
**మెచ్చినయట్టి దందు నొకమేలు వినంబడ దమ్మహాత్ములన్**
**మ్రుచ్చులఁ జంపినట్టులు పరుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్. 27**

**ప్రతిపదార్థం:** నచ్చిన= నమ్మిన; కర్ణు= కర్ణునియొక్క; విక్రమమునన్= పరాక్రమమువలన; పర= శత్రువులయొక్క; వీరులయందున్= శూరులయందు; ఒకండునున్= ఒక్కడు కూడ; చచ్చుట= చచ్చినది; లేదు; దుర్దమము= నిగ్రహింపశక్యముకాని;

శల్య= శల్యుడియొక్క; భుజావిభవంబు= భుజసంపద; లోకముల్= జనులు; మెచ్చిన అట్టిది= మెచ్చినటువంటిదే; అందున్= ఆ భుజసంపదయందు; ఒక మేలు= ఒక్క శుభంకూడ; వినంబడదు= వినిపించదు; ఆ మహాత్ములన్= అట్టి గొప్పవారిని; దైవము; ఇచ్చినన్= సహాయమందించినందున; ముచ్చులన్= దొంగలను; చంపినట్టులు= చంపినట్లుగా; పరుల్= శత్రువులు; తెగటార్చిరి= సంహరించిరి.

**తాత్పర్యం:** నీవు నమ్మిన కర్ణుడి పరాక్రమంవలన శత్రువీరులలో ఒక్కడు కూడా మరణించలేదు. నిగ్రహింప శక్యం కానిది, లోకం మెచ్చినది అయిన శల్యుడి భుజబలపరాక్రమాన్ని గూర్చి ఒక్క శుభవాక్యం కూడా వినబడదు. దైవసహాయం కారణంగా అట్టి మహాత్ములను శత్రువులు దొంగలను చంపినట్లు చంపారు.

**విశేషం:** 'దైవమిచ్చినన్' అను దానికి - దైవం అనుకూలం కాగా అని భావం. ఒక్క శుభవాక్యం కూడా వినబడదు అంటే శల్యుడు ఒకరినైనా చంపినాడనే వార్త వినలేదు కదా! అని అర్థం.

**తే. కొడుక! తమ్ములు దోడ్పడఁ గడఁగి శత్రు । వరుల గెలిచెద నంటి వొక్కరుఁడు దక్క**
**కుండ నీ తమ్ముఁ గుఱ్ఱల నూచముట్టు । గొనియెనే విధి! యేగతిఁ జనుదుఁ జెపుమ! 28**

**ప్రతిపదార్థం:** కొడుక!= కుమారా దుర్యోధనా; తమ్ములు= తమ్ములు; తోడ్పడన్= సహాయపడగా; శత్రువరులన్= శత్రువులలో శ్రేష్ఠులైనవారిని; కడఁగి= పూని; గెలిచెదను= జయించెదను, అంటివి= అన్నావు; ఒక్కరుఁడు= ఒక్కడుకూడ; తక్కకుండ= మిగలకుండ; నీ తమ్ముఁగుఱ్ఱలన్= పిన్నవారైన నీ తమ్ములను; ఊచముట్టు= నిశ్శేషముగ అనగ ఒక్కడూమిగులకుండ; విధి= దైవము; కొనియెన్+ఏ= తీసికొనిపోయాడా!; (ఆశ్చర్యార్థకము-); ఏగతిన్= ఏ మార్గమున; చనుదున్= పోవుదును; చెపుమ!= తెలుపుమా!

**తాత్పర్యం:** కుమారా దుర్యోధనా! తమ్ములు సహాయపడగా శత్రువులను జయిస్తానన్నావు. ఇప్పుడు ఒక్కడుకూడా మిగలకుండా చిన్నవాళ్లైన నీ తమ్ములను దైవం తీసికొనిపోయింది. ఇక నేనెటు వెళ్లాలో చెప్పు.

**క. కదిసి పవనజుఁడు బెట్టుగ । గద వ్రేసినఁ దొడలు విఱిగి కయ్యపునేలన్**
**మదమఱి పడినప్పుడు నీ । మది నేమని తలఁచితో కుమార! యెఱుంగన్!'. 29**

**ప్రతిపదార్థం:** కుమార= కొడుకా! కయ్యపునేలన్= యుద్ధభూమియందు; పవనజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; కదిసి= కలియబడి; గదన్= గదతో; బెట్టుగన్= గట్టిగ; వ్రేసినన్= కొట్టగా; తొడలు; విఱిగి= ముక్కలయిపోయి; పడినప్పుడు= పడిపోయి ఉన్నప్పుడు; మదము= గర్వము; అఱి= నశించి; నీమదిన్= నీ మనసునందు; ఏమని; తలఁచితో= ఆలోచించితివో; ఎఱుంగన్= తెలియలేకున్నాను.

**తాత్పర్యం:** కుమారా! దుర్యోధనా! యుద్ధభూమిలో భీముడు నీతో కలియబడి గదతో నిన్ను గట్టిగా కొట్టగా తొడలు విరిగిపడిపోయి ఉన్నప్పుడు గర్వం నశించి నీ మనసులో ఏమని ఆలోచించావో గదా!'

**వ. అని పెక్కు భంగుల విలపించి. 30**

**ప్రతిపదార్థం:** అని= అని; పెక్కు= అనేకములైన; భంగులన్= విధాలుగా; విలపించి= శోకించి.

**తాత్పర్యం:** ఇట్లు ధృతరాష్ట్రుడు అనేక విధాలుగా పేరుపేరునా తలచి తలచి దుఃఖించి.

**విశేషం:** తొడలు విరిగి పడి ఉన్నప్పుడు దుర్యోధనుడు తలచిన తలపులు (చూడు. శల్య. ద్వి. ఆ. ప. 325, 326, 327, 329) శ్రీకృష్ణుని నిందించినవే. ధృతరాష్ట్రుడు అనేక విధాల పుత్రనాశనానికి విలపిస్తూ 'విధి కసాధ్యము గలదే' పల్కుదు నేమని యేను దైవమున్' 'దైవమిచ్చినన్' 'కొనియెనే విధి' అని శ్రీకృష్ణుడిని ఉద్దేశించే పలికాడు. ఈ పలుకులలో శోకమే కాక క్రోధం కూడా వ్యంగ్యంగా ఉన్నది. సహజంగా శత్రువు తన పుత్రుడిని సంహరించినప్పుడు పుత్రశోకంతోపాటు శత్రువు ఎడల క్రోధం మిక్కుటంగా ఉంటుంది. చంపినవాడికంటె చంపించిన వాడి యెడల క్రోధం మిక్కుటంగా ఉండటం - లోకధర్మం. ఈ ధర్మాన్నే తిక్కయజ్వ ధృతరాష్ట్రుడి విలాపంలో వ్యంగ్యంగా ఆవిష్కరించాడు.

**చ. తలఁపఁగ భాగ్యవంతుల కుదాత్తశుభంబగుఁ గాక పుణ్యహీ**
**నుల కది గల్గనేర్చునె తనూభవు లాఱడిఁ బోయిరింకఁ గా**
**నలఁ జరియింపఁ బోవుటయ నా కుచితం బటు గాక చండినై**
**నిలిచితినేని మాటలనె నిచ్చలు భీముఁడు చూఁడుచుండఁడే! 31**

**ప్రతిపదార్థం:** తలఁపంగన్= ఆలోచింపగా; భాగ్యవంతులకున్= అదృష్టవంతులకు; ఉదాత్తశుభంబు= ఉన్నతమైన మంగళము; అగున్= కలుగుతుంది; కాక= అట్లుకాక; పుణ్యహీనులకున్= సుకృతములేనివారికి; అది= అట్టి ఉన్నతమైన శుభము; కల్గన్= కలుగ; నేర్చునె?= వచ్చునా? (అనగా కలుగదు); తనూభవులు= కొడుకులు; ఆఱడిన్ పోయిరి= నశించారు; ఇంకన్= ఇంక; కానలన్= అడవులందు; చరియింపన్= సంచరించుటకు అనగా నివసించుటకు; పోవుటయ= పోవుటయే; నాకున్; ఉచితంబు= తగింది; అటు= అట్లా; కాక= కాకుండా; చండినై= మొండివాడినై; నిలిచితిన్= ఉంటిని; ఏని; నిచ్చలున్= నిత్యము, ఎల్లప్పుడు; మాటలనె= మాటలతోనే; భీముఁడు; చూఁడుచున్= కాల్చుచు; ఉండఁడే!= ఉండడా! (ఉండును అని అర్థము.)

**తాత్పర్యం:** ఆలోచించి చూడగా అదృష్టవంతులకు మాత్రమే గొప్ప గొప్ప శుభాలు కలుగుతాయి. సుకృతం లేని వారికి శుభం కలుగదు. కొడుకులు నశించిపోయారు. ఇంక ఇటుపైన అడవులందు నివసించి జీవించటమే నాకు తగినది. అట్లుకాక మొండివాడినై ఇక్కడనే ఉన్నట్లయితే భీముడు నిత్యం మాటలతోనే నన్ను కాలుస్తూ ఉంటాడు.

**విశేషం:** తిక్కయజ్వ సహజకవితాశైలికి ఈ పద్యమును ఉదాహరణంగా గ్రహింపవచ్చును. ఆయన కవిత యందంతటా ఈ శైలియే కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఈ పద్యంలో అయిదు విడివిడి వాక్యాలు ఉన్నాయి. ఏ వాక్యానికావాక్యం వచనంవలె సాగిపోతుంది. గద్యసౌందర్యాన్ని పుణికిపుచ్చుకొన్న పద్యరచన ఇది. గొలుసుకట్టుగా కలిపి పద్యంగా చేయవచ్చును. అట్లా కలిపినప్పుడు అలవోకగా యతిప్రాసలు అతికిపోతాయి. ఇది తిక్కన శైలిలోని పరమరహస్యం. అందువలన అనంతర కవులు నన్నయాదులను అనుసరించినట్లు తిక్కయజ్వను అనుసరించలేకపోయారు. ఒక్క అనంతామాత్యుడు మాత్రం ఆ ప్రయత్నం చేశాడు.

**క. విను దుర్యోధన దుశ్శా । సనులఁ బలికి పలికి నిచ్చ చావుగ నప్పా**
**వని యలఁచుఁ గాన నడవికిఁ । జనుటయ మేలైన తెఱఁగు సంజయ నాకున్!. 32**

**ప్రతిపదార్థం:** సంజయ!; విను= వినుము; దుర్యోధన దుశ్శాసనులన్= దుర్యోధన దుశ్శాసనులను; పలికి పలికి= తిట్టి తిట్టి; నిచ్చ-చావుగన్= నిత్యమరణంగా; ఆ పావని= ఆ భీముడు; అలఁచున్= నన్ను బాధిస్తాడు; కానన్= కావున; నాకున్= నాకు; అడవికిన్= అరణ్యమునకు; చనుటయ= వెడలుటయే; మేలు ఐన తెఱఁగు= మంచిమార్గం.

**తాత్పర్యం:** సంజయా! వినుము. దుర్యోధన దుశ్శాసనులను నిందించి నిందించి భీముడు నిత్య మరణంగా నన్ను బాధిస్తాడు. కనుక నాకు అడవికి పోవటమే మంచి మార్గం.

**వ. అని పలికి యత్యంత దుఃఖదూషితస్వాంతుం డగుచు నమ్మహీకాంతుండు నిట్టూర్పు నిగిడించి యా సూత నందనున కిట్లనియె. 33**

**ప్రతిపదార్థం:** అని; పలికి; అత్యంత= మిక్కిలి; దుఃఖ= శోకముచే; దూషిత= పాడుపడిన; స్వాంతుండు= మనస్సు కలవాడు; అగుచున్; మహీ= భూమికి; కాంతుండు= భర్తయైన ఆ ధృతరాష్ట్రుడు; నిట్టూర్పు= దీర్ఘనిశ్వాసము; నిగిడించి= సాగదీసి; ఆ సూతనందనునకున్= ఆ సంజయుడితో; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్.

**తాత్పర్యం:** అడవికి పోవటమే మంచిమార్గమని చెప్పి మిక్కిలి దుఃఖంతో పాడైపోయిన మనస్సుకలవాడై, ఆ ధృతరాష్ట్రుడు ఒక దీర్ఘనిశ్వాసం విడిచి ఆ సంజయుడితో ఇట్లా అన్నాడు.

**క. 'సురసరిదాత్మజుఁడును శర । గురుఁడును గర్ణుండుఁ దెగుటకుం దలఁకక యె**
**వ్వరి బాహుబలముగొని యే । మరి కోల్తల సేసి రొక్కొ! మనవా రనికిన్.' 34**

**ప్రతిపదార్థం:** సురసరిత్= దేవగంగానదియొక్క అనగా ఆకాశగంగానదియొక్క; ఆత్మజుఁడును= తనయుడును అనగా భీష్ముడును; శరగురుఁడును= అస్త్రవిద్యకు గురువు అయిన ద్రోణుడును; కర్ణుండున్= కర్ణుడును; తెగుటకున్= మరణించుటకు; తలఁకక= భయపడక; మనవారు= దుర్యోధనాదులైన మనవారు; అనికిన్= యుద్ధమునకు; ఎవ్వరి= ఎవరియొక్క; బాహుబలము= భుజపరాక్రమము; కొని= తీసికొని; ఏమరి= మరచి; కోల్తల= యుద్ధసన్నాహం; చేసిరి; ఒక్కొ!= చేశారో కదా!

**తాత్పర్యం:** 'భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, మరణించినందులకు భయపడకుండా ఎవడి పరాక్రమాన్ని పరిగణించి మనవారు యుద్ధసన్నాహం చేశారు?'

**వ. అని తన కొడుకు చలం బూహించి. 35**

**ప్రతిపదార్థం:** అని= అని; తన= తనయొక్క; కొడుకు= కొడుకైన అనగా దుర్యోధనుడియొక్క; చలంబు= మాత్సర్యము; ఊహించి= గుర్తించి.

**తాత్పర్యం:** అని ప్రశ్నించి, తన కొడుకు మాత్సర్యాన్ని గుర్తించి.

**చ. 'మును విదురుండు సెప్పె నతిమూర్ఖమనోగతి యైన యీ సుయో**
**ధను చరితంబు గీ డఖిలధాత్రిజనంబులకుం బొనర్చు నా**
**శన మని దానిఁ గొంద అవిచారులు పాటిగఁ బట్టరైరి నా**
**కును మది వారికె ట్లటుల కుత్సిత మయ్యె విధాత త్రిప్పునన్. 36**

**ప్రతిపదార్థం:** అతి= మిక్కిలి; మూర్ఖ= తెలివితక్కువ; మనః= మనస్సుయొక్క; గతి= గమనము; ఐన= కలిగిన అనగా పరమమూర్ఖుడైన; ఈ సుయోధను= ఈ దుర్యోధనుడియొక్క; చరితంబు= నడవడిక; కీడు= దోషభూయిష్ఠం; అఖిల= సమస్తమైన; ధాత్రి= భూమండలమందలి; జనంబులకున్= ప్రజలకు; నాశనము= చేటు; పొనర్చున్= కలుగచేస్తుంది; అని;

విదురుండు; మును= ముందుగా; చెప్పెన్; దానిన్= దానిని; కొందఱు= కొంతమంది; అవిచారులు= ఆలోచనలేనివారు అనగా తెలివితక్కువవారు; పాటిగన్= ప్రమాణంగా; పట్టరు= గ్రహింపనివారు; ఐరి= అయ్యారు; విధాత= బ్రహ్మయొక్క; త్రిప్పునన్= త్రిప్పుటచేత; నాకును= నాకుకూడ; వారికిన్= ఆ తెలివితక్కువవారికి; ఎట్లు= ఏ విధంగా తోచినదో; అటుల= ఆ విధంగానే; మది= మనస్సు; కుత్సితము= చెడినది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** 'పరమమూర్ఖుడయిన ఈ దుర్యోధనుడి నడవడి దోష భూయిష్ఠం. అది సమస్త భూమండలప్రజలకు నాశనం కలుగచేస్తుంది - అని ఇంతకుముందే విదురుడు చెప్పాడు. ఆ మాటను కొందరు మందబుద్ధులు ప్రమాణంగా గ్రహించలేదు. బ్రహ్మవ్రాతవలన నాకు కూడా ఆ తెలివిలేనివారికి వలెనే మనస్సు పాడయింది.

**క. అప్పు డటు లతఁడు సెప్పఁగఁ । దప్పఁ దలంచిన ఫలంబు దగఁ గుడువక పోఁ**
**జొప్పడునె సూతనందన! చెప్పు మనికి నెవ్వఁ డమరు సేనాపతియై? 37**

**ప్రతిపదార్థం:** సూతనందన!= సంజయా!; అప్పుడు; అటులు= ఆ విధముగా; అతఁడు= ఆ విదురుడు; చెప్పఁగన్= చెప్పగా; తప్పన్= తప్పుగా; తలంచిన ఫలంబు= ఆలోచించిన ఫలితము; తగన్= తగినట్లుగా; కుడువక= అనుభవింపక; పోన్= పోగొట్ట; చొప్పడునె?= తప్పుతుందా?; అనికిన్= యుద్ధమునకు; ఎవ్వఁడు= ఎవడు; సేనాపతియై= సేనానాయకుడై; అమరున్= ఒప్పునో; చెప్పుము.

**తాత్పర్యం:** అప్పుడు విదురుడు దుర్యోధనుడి చరితం చెప్పగా దానిని తప్పుగా తలంచిన ఫలితం అనుభవించక తప్పదు కదా! సంజయా! యుద్ధానికి ఎవ్వడు సేనాపతి అయి ఒప్పాడో చెప్పుము.

**చ. దురమున నర్జున ప్రకట దోర్విభవంబు నెదుర్పఁ జాలు ను**
**ద్ధుఁడొకరుండు గల్గెనె విధూతవిరోధిబలుండు శల్యుఁ డె**
**వ్వరి భుజశక్తిఁ జిక్కెఁ? గురువర్గము సంక్షయమట్లు సెల్ల దు**
**స్తరబలభాసి భీముని గదంబడియెం గురుముఖ్యుఁ డెమ్మెయిన్? 38**

**ప్రతిపదార్థం:** దురమునన్= యుద్ధమునందు; అర్జున= అర్జునునియొక్క; ప్రకట= ప్రసిద్ధమయిన; దోః= భుజములయొక్క; విభవంబున్= సంపదను - అనగా భుజబల పరాక్రమమును; ఎదుర్పన్= ఎదురింప; చాలు= సరిపడు; ఉద్ధురుఁడు= భరించువాడు అనగా సామర్థ్యముకలవాడు; ఒకరుండు= ఒక్కడైనను; కల్గెనె?= కలిగెనా?, ఉన్నాడా?; విధూత= ఎగురగొట్టబడిన; విరోధి= శత్రువుయొక్క; బలుండు= బలము కలవాడయిన; శల్యుఁడు; ఎవ్వరిభుజశక్తిన్= ఎవరిభుజబలమునకు; చిక్కెన్= దొరకిపోయెను?; కురువర్గము= కౌరవసమూహముయొక్క; సంక్షయము= సర్వనాశము; అట్లు= ఆ విధముగా; చెల్లన్= కొనసాగగా; ఏ మెయిన్= ఏ విధముగా; కురుముఖ్యుడు= కౌరవులలో ప్రధానమైనవాడు అయిన దుర్యోధనుడు; దుస్తర= తరింపశక్యముకాని అనగా అడ్డుకొనజాలని; బల= బలముచే; భాసి= ప్రకాశించు; భీముని; గదన్= గదాయుధమువలన; పడియెన్?= కూలిపోయెను?

**తాత్పర్యం:** యుద్ధంలో అర్జునుడి భుజబలపరాక్రమాన్ని ఎదురించగల సామర్థ్యం కలవాడు ఒక్కడైనా కలడా?- లేడు. శత్రుబలాలను ఎగురగొట్ట గలిగిన శల్యుడు ఎవరి పరాక్రమానికి దొరికిపోయాడు? కురు సమూహంయొక్క సర్వనాశనం - సంతాపం కలుగచేస్తుండగా, ఏ విధంగా దుర్యోధనుడు భీముడి గదాయుధం వలన కూలిపోయాడు?

**వ. కృపకృతవర్మాశ్వత్థామ లెబ్భంగి బ్రతికిరి? ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ పాంచాలురును జేది మాత్స్య ప్రభద్రక ప్రభృతి బలంబులును నా మనుమలైన ప్రతివింధ్యాది ద్రౌపదేయులును దక్కునుం గలుగు యోధవీరులు నెవ్విధంబున మృతిఁ బొందిరి? పాండవు లేవురును బద్మనాభసాత్యకులును యుయుత్సుండును నెత్తెఱంగునఁ దెగటాఱక తప్పి రింతయుఁ బరిపాటిఁ దేటపడం జెప్పు' మనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె.**

**39**

**ప్రతిపదార్థం:** కృప కృతవర్మాశ్వత్థామలు= కృపాచార్యులు, కృతవర్మ, అశ్వత్థామ; ఏ+భంగిన్= ఏ విధంగా; బ్రతికిరి?= జీవించి ఉండిరి?; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడును; శిఖండి= శిఖండియును; ప్రముఖ= ముఖ్యులైన; పాంచాలురును= పాంచాలదేశపురాజులును; చేది= చేది దేశముయొక్క; మాత్స్య= మత్స్యదేశముయొక్క రాజులును; ప్రభద్రక= ప్రభద్రకులను; ప్రభృతి= ఈ మొదలగు; బలంబులును= యోధులును; నా మనుమలైన= నాకు మనుమలు అయిన; ప్రతివింధ్యాది= ప్రతివింధ్యుడు మొదలగు; ద్రౌపదేయులును= ద్రౌపది పుత్రులును; (ప్రతివింధ్యుడు, సుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్మ - వీరు ద్రౌపదేయులు - ఉపపాండవులని నామాంతరము); తక్కునున్= ఇంకను మిగిలి; కలుగు= ఉన్నట్టి; యోధవీరులును= శూరులైన యోధులును; ఏవిధంబునన్= ఏ విధముగా; మృతిన్= మరణమును; పొందిరి?; పాండవులు; ఏవురును= అయిదుగురును; పద్మనాభ= శ్రీకృష్ణుడును; సాత్యకులును= సాత్యకియును; యుయుత్సుండును; ఎత్తెఱంగునన్= ఏ ప్రకారంగా; తెగటాఱక= చావక; తప్పిరి?= తప్పుకొనిరి?; ఇంతయున్= ఇదియంతయు; పరిపాటిన్= అనుక్రమంగా; తేటపడన్= తేటతెల్లంగా - స్పష్టంగా; చెప్పుము; అనినన్= అనగా; విని; సంజయుండు; ధృతరాష్ట్రునకు; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కృప, కృతవర్మ, అశ్వత్థామలు ఎట్లా బ్రతికారు? ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖులైన పాంచాల రాజులు చేదిదేశ, మత్స్య దేశరాజులు, ప్రభద్రకులనే పాంచాలదేశపు క్షత్రియదళాలు, ప్రతివింధ్యుడు మొదలైన ద్రౌపది పుత్రులు, ఇంకను మిగిలిన యోధులు ఏ విధంగా మరణాన్ని పొందారు? పాండవులు అయిదుగురు, శ్రీకృష్ణుడు, సాత్యకి, యుయుత్సుడు, ఏ విధంగా మృత్యువుకు లోబడకుండా తప్పించుకొన్నారు. ఇది అంతా క్రమం తప్పకుండా తేటతెల్లంగా చెప్పుము.' అని ధృతరాష్ట్రుడు అడుగగా విని, సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** మహాభారత యుద్ధంలో కౌరవపక్షాన మృతిపొందకుండా ముగ్గురు మాత్రం మిగిలారు. వారు కృపుడు, కృతవర్మ, అశ్వత్థామలు.

కృపుడు: ఇతడు గౌతమగోత్రుడు. శరద్వంతుడి పుత్రుడు. రుద్రగణ అంశావతారుడు. 'జానపది' అను అప్సరసను చూడడం వల్ల మహర్షి శరద్వంతునికి వీర్యస్ఖలనమయినది. అతడు దానిని రెల్లుగడ్డిపై గిరవాటు వేయగా అది రెండు భాగములయినది. ఒక భాగం కుమారుడుగా, మరొక భాగం కుమార్తెగా జన్మించారు. కుమారుడు కృపుడు. కుమార్తె కృపి. ఈ కృపి ద్రోణాచార్యుడి పత్ని. అశ్వత్థామకు తల్లి. కృపుడు అశ్వత్థామకు మేనమామ. రెల్లుగడ్డిలో పుట్టిన వీరిని వేటకై వచ్చిన శంతనుడు కృపతో పెంచి పోషించాడు. కృపతో పోషించబడినందువలన కృప, కృపి అనే పేర్లు సిద్ధించాయి. కృపుడు ధనుర్వేదంలో పరమాచార్యుడు. అందువలన కృపాచార్యుడుగా కూడా ప్రసిద్ధుడు. 'ఆచార్య, ఆచార్యసత్తమ, భారతాచార్య, బ్రహ్మర్షి, శారద్వత-' మొదలైన పేర్లతో భారతంలో వ్యవహరించబడ్డాడు.

కృతవర్మ: ఇతడు యదుకులవీరుడు. భోజవంశజుడు. హృదికుడి పుత్రుడు. మరుద్గణ అంశావతారుడు. శ్రీకృష్ణుడికి ఇష్టుడు. కౌరవపక్షంలో యుద్ధం చేసిన యదుసేనకు అధినాయకుడు. 'అనార్తవాసి, హార్దిక్య, హృదికసుత, మాధవ, సాత్వత, వార్ష్ణేయ, వృష్ణి, వృష్ణిసింహ', మొదలైన పేర్లతో వ్యవహరించబడ్డాడు.

అశ్వత్థామ: ఇతడు కృపి గర్భమున జన్మించిన ద్రోణాచార్యుడి పుత్రుడు. శివ, యమ, కామ, క్రోధములు సమ్మిళితం అయిన అంశవలన జన్మించినవాడు. ఇతడు పుట్టినవెంటనే పాలకొరకు ఉచ్చైశ్రవము అరచినట్లు గట్టిగా ఏడ్చాడు. పిండి కలిపిన నీళ్ళు ఇయ్యగా, వాటిని పాలు అనుకొని త్రాగి ఏడుపు మానాడు. అందువలన ఆకాశవాణి 'అశ్వత్థామ' అని పేరుపెట్టిందట. 'ఆచార్యనందన, ఆచార్యపుత్ర, ఆచార్యతనయ, ద్రౌణి, గురుపుత్ర, భారతాచార్యపుత్ర' మొదలైన పేర్లు కూడా ఇతనికి ఉన్నాయి.

ఇక పాండవ పక్షంలో మిగిలినవారు - ఐదుగురు పాండవులు, శ్రీకృష్ణుడు, సాత్యకి, యుయుత్సుడు. శ్రీకృష్ణ పాండవులు ప్రసిద్ధులు.

సాత్యకి: ఇతడు వృష్ణి వంశజుడు. 'శిని' కుమారుడైన సత్యకుడి పుత్రుడు. ఇతనికి 'యుయుధానుడు' అనే ప్రసిద్ధనామం కలదు. ఇతడు ఎల్లప్పుడు శ్రీకృష్ణుడితో కలిసి ఉండేవాడు. శ్రీకృష్ణుడికి సోదరసమానుడు. పాండవులకు హితుడు. 'వృష్ణికులభూషణ, సత్యప్రతిజ్ఞ, శత్రుమర్దన' అనునవి ఇతడి బిరుదాలు. సప్తమరుత్తుల అంశవలన జన్మించాడు. శైనేయ, మాధవ, మాధవసింహ, సాత్వత, వృష్ణి మధూద్వహ' మొదలైన నామాలతో మహాభారతంలో వ్యవహరింపబడ్డాడు.

యుయుత్సుడు: ఇతడు 'కరణ' అను వైశ్యపత్నియందు ధృతరాష్ట్రుడికి జన్మించిన పుత్రుడు. ధృతరాష్ట్రుడికి గాంధారీ గర్భమున జన్మించినవాడని శాంతిపర్వమున కలదు. కురుక్షేత్ర యుద్ధం ప్రారంభించటానికి ముందు ధర్మరాజు భీష్మాదులకు నమస్కరించి, 'మా పక్షమున చేరదలచిన రాజులుంటే ఇప్పుడే వచ్చి చేరండి' అని పిలిచాడు. అప్పుడు కౌరవసేనలో ఉన్న ధృతరాష్ట్ర పుత్రుడు యుయుత్సుడు ఒక్కడు మాత్రం వచ్చి పాండవ పక్షంలో చేరాడు. ధృతరాష్ట్రుడి పుత్రులలో యుద్ధంలో మరణించకుండా మిగిలినవాడు ఇతడు ఒక్కడే.

ధృతరాష్ట్రుడి విలాపం: సంజయుడు కురుక్షేత్రము నుండి హస్తినాపురానికి వచ్చి ధృతరాష్ట్రుడి మందిరాన్ని ప్రవేశించి కౌరవుల పరాజయాన్ని, పాండవుల విజయాన్ని, దుర్యోధనాదుల మరణాన్ని, ఇరుపక్షాలలో చావకుండా మిగిలినవారిని గూర్చి ధృతరాష్ట్రుడికి వివరించాడు. అది మొదలు ఇంతవరకు పుత్రపరాజయాన్ని గూర్చి, సర్వసంక్షయాన్ని గూర్చి తలచి తలచి ధృతరాష్ట్రుడు విలపించాడు.

ఈ ధృతరాష్ట్ర విలాపమున తిక్కన చూపిన కవనసౌందర్యం అనితరసాధ్యం. ఈ సన్నివేశమంతా ధృతరాష్ట్రుడి ఏకపాత్రాభినయం. ఒక్క ఆహార్యాభినయం తప్ప వాచికం - ఆంగికం - సాత్త్వికం పుష్కలంగా కలవు. తిక్కన కవిత నాటకీయ శిల్పంతో నిండి ఉన్నదని ఆర్యుల వచనం. ఆ శిల్పసౌందర్యాన్ని శల్యపర్వంలోని ఈ 'ధృతరాష్ట్ర విలాపం' అనే సన్నివేశంలో దర్శించవచ్చును. క్రోధాన్ని శోకంతో కలగలిపి, ప్రేమను ద్వేషంతో మేళవించి ధృతరాష్ట్రుడు పలికిన పలుకులు తిక్కన చేసిన సజీవపాత్ర చిత్రణకు, సాత్త్వికాభినయశిల్పానికి పరమోదాహరణాలు. 'మూర్ఛిల్లుట', 'నలుదిక్కులు మొగము త్రిప్పుట', 'కుంభనిక్షిప్త భుజంగంబు చందంబున నిశ్వాసంబు నిగుడ్చుట', 'చేతులు విదుర్చుట', 'నిట్టూర్పు నిగుడించుట'- ఈ మొదలైన ధృతరాష్ట్రుడి చేష్టలు తిక్కన చిత్రించిన ఆంగికాభినయానికి మచ్చుతునకలు. ఇక 'స్వగతం' గా సాగిన విలాపమంతా వాచికాభినయమే.

**ఉ. సూతసుతుండుఁ జేయఁగల శూరులు దర్పసమగ్రభూపతి**
**వ్రాతముఁ బెక్కుదంతిరథవాజి భటావలులున్ భుజాబల**
**స్ఫీతులు పాండునందనులచేఁ దెగటారిన నోడి వీటికిన్**
**నీ తనయుండు హీనరథినీయుతుఁడై యటు లేఁగి నెవ్వగన్. 40**

**ప్రతిపదార్థం:** భుజాబల= భుజబలంచేత; స్ఫీతులు= అధికులు; పాండు= పాండురాజుయొక్క; నందనులచేన్= కొడుకులచే; సూతసుతుండున్= కర్ణుడును; చేయఁగల శూరులు= యుద్ధం చేయగలవీరులు అనగా భీష్మద్రోణాదులు; దర్ప= భుజగర్వముకల;

సమగ్ర= సమస్తమైన; భూపతి= భూమికి భర్తలైన రాజులయొక్క; వ్రాతమున్= సమూహమును; పెక్కు= అనేకములైన; దంతి= ఏనుగులయొక్క; రథ= రథములయొక్క; వాజి= గుఱ్ఱములయొక్క; భట= భటులయొక్క; ఆవలులున్= వరుసలును - అనగా రథగజ తురంగ పదాతిదళములును - చతురంగ బలములును; తెగటారినన్= చంపబడగా; ఓడి= అపజయము పొంది; నెవ్వగన్= మిగుల సంతాపముతో; నీ తనయుండు= నీ కుమారుడు దుర్యోధనుడు; హీన= స్వల్పమైన; రథినీ= సైన్యముతో; యుతుడు+ఐ= కూడినవాడై; వీటికిన్= శిబిరమునకు; అటులు= ఆప్రకారముగ; ఏఁగి= వెడలి.

**తాత్పర్యం:** భుజబల పరాక్రమాలు గల పాండవులచేత కర్ణుడు, భీష్మద్రోణాది మహావీరులు భుజగర్వం గల సమస్త భూపతులు, అనేకములైన రథ గజతురగ పదాతిదళాలు, సంహరించబడగా, ఓడిపోయి నీ కుమారుడు దుర్యోధనుడు కొద్దిసేనలతో మిక్కిలి సంతాపంతో శిబిరానికి వెడలి. (తరువాతి వచనంతో అన్వయం.)

### కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట (సం. 9-3-8)

**వ. మందిరంబుఁ బ్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్రపరిజనవృతుండై నిలిచె నయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుండై కృపాచార్యుం డన్నరేంద్రున కిట్లనియె. 41**

**ప్రతిపదార్థం:** మందిరంబున్= శిబిరములోనికి; ప్రవేశింపక= ప్రవేశించకుండా; ఒక్క; బయలన్= బహిరంగ ప్రదేశమున; నిఖిల= సమస్తమైన; బంధు= చుట్టములతో; మిత్ర= స్నేహితులతో; పరిజన= సేవకులతో; వృతుండై= చుట్టబడినవాడై; నిలిచెన్= ఉండెను; ఆ అవసరంబునన్= ఆ సమయమున; కృపా= దయచే; ఆర్ద్ర= తడిసిన; చిత్తుండు+ఐ= హృదయము కలవాడై; కృపాచార్యుండు; ఆ నరేంద్రునకున్= ఆ దుర్యోధనునకు; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** దుర్యోధనుడు శిబిరంలోనికి ప్రవేశించక, ఒక బహిరంగ ప్రదేశంలో బంధుమిత్ర పరిజనులతో పరివేష్టించబడి ఉన్నాడు. అట్టి సమయంలో దయార్ద్రహృదయుడై కృపాచార్యుడు ఆ దుర్యోధనుడితో ఈ ప్రకారంగా అన్నాడు.

**క. 'సమరము మిముబోంట్లకు ను । త్తమ ధర్మం బిదియ తొంటి ధాత్రీశులు కృ**
**త్యముగఁ గొని యాచరించిరి । తమకు సుగతి గోరి కీర్తితస్ఫురణమెయిన్. 42**

**ప్రతిపదార్థం:** మిముబోంట్లకున్= మీ వంటివారికి; సమరము= యుద్ధము; ఉత్తమ= శ్రేష్ఠమయిన; ధర్మంబు= వేదవిహితకర్తవ్యము; ఇదియ= ఈ యుద్ధధర్మమే (అవధారణార్థము); కృత్యముగన్= చేయదగిన దానినిగా; తొంటి= మునుపటి; ధాత్రి= భూమికి; ఈశులు= ప్రభువులయిన రాజులు; కొని= స్వీకరించి; కీర్తిత= కీర్తింపబడిన; స్ఫురణమెయిన్= ప్రకాశముతో; తమకున్; సుగతి= ఉత్తమగతి; కోరి; ఆచరించిరి= యుద్ధధర్మమును ఆచరించిరి.

**తాత్పర్యం:** 'మీ వంటి వారికి యుద్ధం వేదవిహిత కర్తవ్యమే. ఈ ధర్మాన్నే పాటించి మునుపటి రాజులు కీర్తిమంతులై ఉత్తమగతిని కోరి యుద్ధధర్మాన్ని ఆచరించారు.

**విశేషం:** తిక్కన 'సుగతి' పదంయొక్క అభంగశ్లేషతో ఈ కందమున సుందరమైన గీతావాక్యార్థాన్ని బంధించి క్షత్రియ ధర్మమును బోధించాడు. 'హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్' (గీత 2 - 37)' 'స్వధర్మమపి చావేక్ష్య

న వికంపితు మర్హసి। ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే' (గీ॥ 2 - 31) వంటి భగవద్గీతలోని శ్లోకాలను ఆయా సందర్భాలకు తగిన విధంగా తిక్కన తన భారతంలో అనువదించినట్లు గ్రహించటాని కిది ఉదాహరణ.

**క.** **ఐనను నొకపలు కడ్డము। గా నొడివెద దానిలెస్సగా విని యది మే**
**లైనను జేసెదు గాదే। న్మానెద వేర్పడఁగ వినుము మనుజాధీశా! 43**

**ప్రతిపదార్థం:** మనుజ= మానవులకు; అధీశా!= ప్రభువు అయిన దుర్యోధనా!; ఐనను= అయినప్పటికి (మీవంటివారికి యుద్ధం ఉత్తమధర్మం అయినప్పటికిని); ఒక; పలుకు= మాట; అడ్డముగాన్= విరుద్ధంగా (ఆ ఉత్తమధర్మానికి విరుద్ధంగా); నొడివెదన్= చెప్పెదను; దానిన్= దానిని (ఆమాటను); లెస్సగాన్= చక్కగా; విని; అది (ఆ మాట); మేలు= శుభము; ఐనను= అయినచో; చేసెదు= చేయుదువుగాక; కాదేన్= అట్లుకాని ఎడల (శుభంకానిది అయిన ఎడల); మానెదవు= మానెదవు; ఏర్పడఁగన్= స్పష్టంగా; వినుము.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! అయినా క్షత్రియధర్మానికి విరుద్ధంగా ఒకమాట చెప్పుతాను. ఆమాటను చక్కగా విని, అది శుభం అయితే ఆ ప్రకారం చేయుము. కానిచో మానుకొమ్ము. నేను చెప్పేది స్పష్టంగా వినుము.

**చ.** **అమరనదీ తనూభవుఁడు నస్త్రగురుండును కర్ణుఁడుం బరా**
**క్రమమహనీయు లావహధురంధరు లట్టిర తక్కుఁ గల్గు భూ**
**రమణులు బంధుమిత్రులు దురంబున నందఱఁ బాండునందనుల్**
**సమయఁగఁ జేసి రట్లు భుజశక్తియు దైవబలంబు నెక్కుడై. 44**

**ప్రతిపదార్థం:** అమరనదీ= దేవనదియొక్క (ఆకాశగంగానదియొక్క); తనూభవుఁడున్= తనయుడును (భీష్ముడును); అస్త్ర= అస్త్రవిద్యకు; గురుండును= గురువుఅయినవాడును (ద్రోణుడును); కర్ణుఁడున్= కర్ణుడును; పరాక్రమ= శౌర్యముచేత; మహనీయులు= గొప్పవారు; ఆహవ= యుద్ధముయొక్క; ధురంధరులు= భారమును మోయువారు; (యుద్ధముచేయుటలో ప్రముఖులు); తక్కున్= మిగులు; కల్గు= ఉన్నట్టి; భూ; రమణులు= రాజులు; బంధు= చుట్టములు; మిత్రులు= స్నేహితులు; అట్టిర= అట్టివారే (అవధారణార్థం) అనగా పరాక్రమంలోమహనీయులే, ఆహవ ధురంధరులే అయిఉన్నారు); అందఱన్= ఇట్టివారి నందరినీ; పాండునందనుల్= పాండవులు; భుజశక్తియున్= భుజబలమును; దైవబలంబును= దైవంయొక్క బలమును; ఎక్కుడై= అధికంగా కలవారై; దురంబునన్= యుద్ధంలో; అట్లు= ఆ విధంగా (శిఖండిని అడ్డుపెట్టి భీష్ముడిని; అశ్వత్థామా హతః అని' ద్రోణుడిని; రథం క్రుంగగా కర్ణుడిని) సమయఁగన్= మరణించేటట్లుగా; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, పరాక్రమంలో చాలా గొప్పవారు. యుద్ధవిద్యలో ప్రముఖులు. మిగిలిన భూపతులు, చుట్టాలు, స్నేహితులు కూడా అంతటి పరాక్రమవంతులే. యుద్ధవిద్యలో వాళ్ళూ ప్రముఖులే. అట్టివారి నందరినీ పాండవులు భుజబలము, దైవబలం, అధికంగా కలవారై చంపగలిగారు.

**చ.** **వెరవును లావునుం గలుగు వీరులు పోరులఁ బడ్డ హీనతం**
**బొరసితి మస్త్రశస్త్రహతి భూవర చిక్కినవారు నొల్లఁ బో**
**యిరి విను పాండురాజసుతు లేవురు గంటికి రెప్పచందమై**
**హరి తముఁ గావఁగా వెలసి రక్షతదేహవిలాససంపదన్. 45**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా దుర్యోధనా!; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధాలయొక్క; శస్త్ర= మంత్రపూతములుకాని ఆయుధములయొక్క; హతిన్= దెబ్బలవలన; వెరవును= ఉపాయమును (అనగా యుద్ధవ్యూహములను); లావునున్= బలమును; కలుగు= కలిగిన, వీరులు= శూరులు; పోరులన్= యుద్ధములందు (ఈ పదియేడు దినముల యుద్ధములందు); పడ్డన్= చనిపోగా; హీనతన్= తక్కువతనమును; పొరసితిమి= పొందితిమి; చిక్కిన= మిగిలిన; వారున్= వారును; ఒల్లఁబోయిరి= మూర్ఛపోయిరి; విను; పాండురాజు= పాండురాజుయొక్క; సుతులు= కొడుకులు; ఏవురు= అయిదుగురు; కంటికిన్; రెప్పచందమై= రెప్పవలె; హరి= శ్రీకృష్ణుడు; తమున్= తమను; కావఁగాన్= రక్షించుచుండగా; అక్షత= దెబ్బలు లేని (అనగా గాయములులేని); దేహ= శరీరములయొక్క; విలాస= సౌందర్యంయొక్క; సంపదన్= ఐశ్వర్యముతో; వెలసిరి= ప్రకాశించిరి.

**తాత్పర్యం:** దుర్యోధనా! అస్త్రశస్త్రాల దెబ్బలవలన ఉపాయం, బలం కలిగిన వీరులు ఈ పదియేడు దినముల యుద్ధంలో చనిపోగా మనం తక్కువతనమును పొందాము. అనగా బలహీనుల మయ్యాము. ఇక మిగిలిన వారు శస్త్రాస్త్రాల దెబ్బలచేత మూర్ఛిల్లారు. దుర్యోధనా! వినుము. పాండురాజు కొడుకులు అయిదుగురు కంటికి రెప్పవలె శ్రీకృష్ణపరమాత్మ తమను రక్షిస్తూ ఉండగా గాయాలు కూడా లేని దేహవిలాస సంపదలతో ప్రకాశించారు.

**క. శ్వేతాశ్వపాటవం బు । ద్ద్యోతితమై మెఱయఁగాఁ జతుర్దంతరుచి**
**స్ఫీత మగు గజముక్రియ నరుఁ । డాతత కురుసైన్యసరసియందుఁ జరించున్. 46**

**ప్రతిపదార్థం:** నరుడు= అర్జునుడు; శ్వేత= తెల్లని; అశ్వ= గుర్రములయొక్క; పాటవంబు= శక్తి; ఉద్ద్యోతితము= ప్రకాశవంతము; ఐ= అయి; మెఱయఁగాన్= ప్రకాశింపగా; చతుర్దంత= నాలుగు దంతాలయొక్క; రుచి= కాంతితో; స్ఫీతము= గొప్పది; అగు; గజము= ఏనుగు; క్రియన్= వలె; ఆతత= విశాలమయిన; కురుసైన్య= కౌరవసేనయనెడి; సరసియందున్= సరోవరమునందు; చరించున్= సంచరించును.

**తాత్పర్యం:** తెల్లనిగుర్రాల శక్తి ప్రకాశవంతమై వెలుగుతుండగా అర్జునుడు చతుర్దంతాల కాంతితో వెలుగొందే ఐరావతం అనే ఏనుగువలె విశాలమైన కౌరవసైన్యమనే సరోవరంలో సంచరిస్తాడు. (ఏనుగు సరోవరాన్ని కలచివేసేటట్లు అర్జునుడు కురుసేనను నశింపచేస్తాడని భావం.)

**విశేషం:** రూపకానుప్రాణిత ఉపమాలంకారంతో ఈ పద్యం అలంకరింపబడింది. కురుసైన్యమనెడి సరసి - రూపకం. కురుసైన్యమునకు సరోవరమునకు అభేదం. (ఉపమాన ఉపమేయములకు అభేదకల్పనం రూపకం) ఇక నరుడు - ఉపమేయం, గజము - ఉపమానం; క్రియన్ - ఉపమావాచకం; చరించున్ - సమానధర్మం. పూర్ణోపమ.

అర్జునుడి రథమునకు గల శ్వేతాశ్వములు నాలుగు. ఇంద్రుడి ఏనుగు ఐరావతమునకు దంతములు నాలుగు. అందువలన చతుర్దంతి అని పేరు. నాలుగు అశ్వములు తెల్లనివి. నాలుగు దంతములు తెల్లనివి. ఐరావతం తెల్లనిది. చతుర్దంత పదప్రయోగంతో అశ్వసంఖ్య, శ్వేతాశ్వపదప్రయోగంతో ఐరావతవర్ణం సూచితాలు. ఇది తిక్కనగారి శ్లేషవ్యంగ్య చమత్కారం. మూలంలో మూడు శ్లోకాలు కలవు. ఆ మూడు శ్లోకాల తాత్పర్యార్థాన్ని తిక్కన ఈ కందంలో రమణీయముగా పొదిగాడు.

**'శ్వేతాశ్చ వేగ సంపన్నాః శశికాశ సమప్రభాః । పిబంత ఇవ చాకాశం రథే యుక్తాస్తు వాజినః ॥**
**గాహమాన మనేకాని మహేంద్రసదృశప్రభమ్ । ధనంజయ మపశ్యామ చతుర్దంష్ట్ర మివ ద్విపమ్ ॥**

విక్షోభయంతం సేనాంతే త్రాసయంతం చ పార్థివాన్ । ధనంజయ మపశ్యామ నలినీమివ కుంజరమ్ ॥ (శల్య ॥ప ॥ అధ్యా 4) (శ్లో 20, 23, 24)

**క. జ్యారవము నాదముగ నతి । ఘోరత వైరులను కరటికోటికి రయదు**
**ర్వారం బగు నర్జున కం । ఠీరవము శితాస్త్రనఖపటిష్ఠతఁ జూపున్. 47**

**ప్రతిపదార్థం:** వైరులు= శత్రువులు; అను= అనెడి; కరటి= ఏనుగులయొక్క; కోటికిన్= గుంపునకు; జ్యా= వింటినారియొక్క; రవము= ధ్వని; అతిఘోరతన్= మిక్కిలి భయంకరమగు; నాదముగన్= ధ్వనికాగా (అనగా గర్జనముకాగా); రయ= వేగంచేత; దుర్వారంబు= నివారింపశక్యముకానిది; అగు= అయినట్టి; అర్జున= అర్జునుడు అనెడి; కంఠీరవము= సింహము; శిత= వాడియైన (అనగా తీక్షణమైన); అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములనెడి; నఖ= గోళ్ళయొక్క; పటిష్ఠతన్= గట్టితనమును (అనగా పటుత్వమును); చూపున్= చూపించును.

**తాత్పర్యం:** శత్రువులు అనే ఏనుగుల గుంపునకు వింటినారియొక్క ధ్వని అతిభయంకరమైన ధ్వనికాగా - వేగంచేత, బలంచేత నివారింప శక్యంకాని అర్జునుడు అనే సింహం వాడి అయిన మంత్రాస్త్రా లనెడి గోళ్ళయొక్క పటుత్వాన్ని చూపిస్తుంది.

**విశేషం:** ఇది రూపకముల మయము. జ్యారవమునకు - సింహగర్జనమునకు; వైరులకు; కరటికోటికి-అర్జుననకు-కంఠీరవమునకు; శితాస్త్రములకు - నఖములకు; అభేదకల్పనముతో తిక్కన దీనిని రచించాడు. 'రయ' శబ్ద ప్రయోగం అర్థ గాంభీర్య చమత్కార జనకం. రయము= వేగము; రయము= బలము అని రెండర్థములు. ఇచ్చట ఈ రెండర్థములూ సాభిప్రాయములు. అర్జునుడు యుద్ధవిద్యలో వేగమునందు-బలమునందు అనితరసాధ్యుడు. అట్లే సింహం ఏనుగులవేటలో వేగమునందు - బలము నందు అనితరసాధ్యం. సింహగర్జనం ఏనుగులకు అతి భయంకరమైనది. అర్జునుడి జ్యారవము - శత్రువులకు అతిభయంకరమైనది. సింహనఖములు అతిపటుతరములు; అర్జునుని అస్త్రములు మహామంత్రపూతములు. సింహము గర్జించి ఏనుగుల గుంపును చెదరగొట్టి, నఖములతో కుంభస్థలములను చీల్చుతుంది. (సింహగర్జనను స్వప్నంలో విన్నను ఏనుగు మరణిస్తుందని లోకవ్యవహారం.) అర్జునకంఠీరవ పదప్రయోగంతో తిక్కన అర్జునుడి అద్భుత పరాక్రమ పరోక్షచిత్రణం- ఈ కందమున సుందరంగా తీర్చాడు. 'త్రాసయంతం తథా యోధాన్ ధనుర్ఘోషేణ పాండవమ్ । భూయ ఏనమపశ్యామ సింహం మృగగణానివ' ॥ ఇది దీనికి మూలం. (శల్య ॥ అధ్యా-4, శ్లో-25)

**తే. అర్జునోదగ్ర దవశిఖ హరిమహాని । లంబు ప్రేరేఁప వైరిబలప్రకీర్ణ**
**గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ । దేఱి చూడను రాకున్కి దెల్ల మధిప! 48**

**ప్రతిపదార్థం:** అధిప!= దుర్యోధనా!; అర్జున= అర్జునుడు అనెడి; ఉదగ్ర= భయంకరమయిన; దవశిఖ= దవాగ్ని జ్వాల (అనగా అడవులను కాల్చు అగ్ని); హరి= శ్రీకృష్ణుడు అనెడి; మహా= గొప్ప; అనిలంబు= వాయువు; ప్రేరేఁపన్= ప్రేరేపించగా (అనగా రెచ్చగొట్టగా); వైరి= శత్రువులయొక్క; బల= సైన్యమనెడి; ప్రకీర్ణ= వ్యాపించిన; గహన= అడవియొక్క; దహన= అగ్నియొక్క; విహారము; ఉగ్రముగన్= భయంకరముగ; చలుపన్= చేయగా; తేఱి= తేరిపార; చూడను= చూచుటకు కూడ; రాకున్కి= వీలుకాదనుట; తెల్లము= స్పష్టము.

**తాత్పర్యం:** అర్జునుడు అనే భయంకరమయిన దవాగ్నిజ్వాల - శ్రీకృష్ణుడు అనే మహావాయువు ప్రేరేపించగా శత్రుసైన్య మనెడి వ్యాపించిన అటవీదహన విహారాన్ని శత్రువులకు తేరిపార చూడటానికి కూడా వీలుకాదనడం స్పష్టం.

**విశేషం:** అలం: రూపకం. అర్జునుడు దవాగ్నిజ్వాల; అర్జున దవాగ్నిజ్వాల శత్రుసైన్యమనే గహనాన్ని దహనవిహారం చేస్తున్నది. ఆ విహారాన్ని తేరిచూడ శక్యంగాదు. - శ్రీకృష్ణుడు - మహానిలము; శత్రుసైన్యము - గహనం (అరణ్యము); ఈ ఉపమాన ఉపమేయములకు అభేదము.

**ఉ. ద్రోణుఁడు సూతనందనుఁడు ద్రోణ తనూజుఁడు నేను శల్యుడుం**
**త్రాణపరాయణత్వమున దర్పము సూపఁగఁ నీవుఁ దమ్ములున్**
**బాణపరంపరల్ గురియ ఫల్గునుఁ డందఱ మీఱి సైంధవ**
**ప్రాణము నాఁచికోలు నరపాల! తలంపఁగ మర్త్యకృత్యమే! 49**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు; సూతనందనుఁడున్= కర్ణుడు; ద్రోణ తనూజుఁడున్= ద్రోణుడి కుమారుడు అశ్వత్థామ; నేను= నేనును(కృపాచార్యుడు); శల్యుఁడున్= శల్యుఁడును; త్రాణపరాయణత్వమునన్= (సైంధవుడిని) రక్షించటంలో గల ఆసక్తితో; దర్పము= గర్వం; చూపఁగ= చూపించగ; నీవున్= నీవును (దుర్యోధనుడవు అయిన నీవును); తమ్ములున్= తమ్ములును (దుశ్శాసనాదులును); త్రాణ= రక్షించుటయందలి; పరాయణత్వమునన్= ఆసక్తితో; బాణ= బాణములయొక్క; పరంపరల్= వరుసలు (అనగా ఒక దాని తరువాత ఒకటిగా); కురియన్= కురిపించగా; ఫల్గునుఁడు= అర్జునుడు; అందఱన్= మనలనందరను; మీఱి= మించిపోయి; సైంధవప్రాణము= సైంధవుని యొక్క ప్రాణము; నాఁచికోలు= అపహరణం; నరపాల!= నరులను పాలించు దుర్యోధనా!; తలంపఁగన్= ఆలోచింపగ; మర్త్య= మానవులకు సాధ్యమయిన; కృత్యమే!= కార్యమా! (కాదు అని అర్థం)

**తాత్పర్యం:** ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, నేను, శల్యుడు, నీవు నీ తమ్ములు సైంధవుడి రక్షణ అందలి అనురక్తితో బాణపరంపరలు కురిపిస్తున్నా ఒక్క అర్జునుడు మనలనందరిని మించిపోయి సైంధవుడి ప్రాణం అపహరించాడు. దుర్యోధనా! ఆలోచించి చూడగా అది మానవసాధ్యమయిన కార్యమా? కాదుసుమా!

**ఉ. ఇంతకుమున్ను సెల్లెఁ బదియేడుదినంబుల సంగరం బతి**
**శ్రాంతతఁ గుంది రిందుఁ గలసైనికు లద్దెసఁ గల్గుయోధు లా**
**క్రాంత విరోధిదర్పుఁడు పురందరనందను బల్మికల్మి ని**
**శ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు చెమర్పక కౌరవేశ్వరా! 50**

**ప్రతిపదార్థం:** కౌరవ= కౌరవులకు; ఈశ్వరా!= ప్రభువు అయిన దుర్యోధనా!; ఇంతకుమున్ను= ఇంతకుముందు; పదియేడు; దినంబుల= రోజుల; సంగరంబు= యుద్ధము; చెల్లెన్= సాగింది; ఇందున్= ఇందు(కౌరవపక్షమున); కల= ఉన్నట్టి; సైనికులు= సేనలు; అతి= మిక్కిలి; శ్రాంతతన్= అలసిపోవుట వలన; కుందిరి= క్రుంగిపోయిరి(బలహీనులు అయిపోయారు); ఆ+దెసన్= ఆ దిక్కునందు(ఆ పాండవపక్షమున); కల్గు= ఉన్నట్టి; యోధులు= యుద్ధవీరులు; ఆక్రాంత= ఆక్రమించబడిన; విరోధి= శత్రువులయొక్క; దర్పుఁడు= గర్వముకలవాడు అయిన; పురందర= ఇంద్రునియొక్క; నందను= కుమారునియొక్క (అర్జుననియొక్క); బల్మికల్మిన్= శత్రువులను జయించగల శక్తి సంపదవలన; చెక్కుచెమర్పక= కొంచెం కూడా అలసటలేకుండగా (చెక్కిలి చెమటపట్టకుండా - అనగా అశ్రమంగా); నిశ్చింతతన్= ఏ విధమయిన విచారములేకుండగా; ఉల్లసిల్లెదరు= సంతోషంతో ఒప్పారుతారు.

**తాత్పర్యం:** దుర్యోధనా! ఇంతకుముందు పదియేడు దినాల యుద్ధం అయిపోయింది. మన సైనికులు అలసి సొలసి క్రుంగిపోయి ఉన్నారు. ఆ వైపు పాండవ పక్ష యోధులు శత్రుదర్పాన్ని నిర్మూలించే ఇంద్రతనయుడైన అర్జునుడి బలం కలిగి ఉన్నందున చెక్కు చెమర్పకుండా ఏ విధమయిన విచారం లేకుండా అమితానందం కలిగి ఉన్నారు.

**క. బలవిక్రమ ఘనులగు దొర । లిలిగిన మనసేన మేదినీశ్వర! విను క**
**న్నులు సెడినట్లున్నది యీ । కొలఁదిం బొరిగొనుట నరునకున్ సుకరమగున్॥' 51**

**ప్రతిపదార్థం:** మేదినీ= భూమికి; ఈశ్వర!= ప్రభువు అయిన దుర్యోధనా!; విను; బల= బలమునందు; విక్రమ= పరాక్రమమునందు; ఘనులు= గొప్పవారు; అగు= అయినట్టి; దొరలు= ప్రభువులు (అనగా సైన్యాధ్యక్షులయిన భీష్మ, ద్రోణ, కర్ణులు); ఇలిగినన్= మరణించగా; మనసేన= మనయొక్క సైన్యము; కన్నులు= నేత్రములు; చెడినట్లు= చెడిపోయినట్లు (గ్రుడ్డిది అయినట్లు) ఉన్నది= ఉన్నది. (అనగా సేనను నడిపించు సేనాపతులు లేక మనసేన గ్రుడ్డిదానివలె ఉన్నదని తాత్పర్యం); ఈకొలఁదిన్= ఈ తక్కువసేనను; పొరిగొనుట= చంపుట; నరునకున్= అర్జునునకు; సుకరము= సులభము; అగున్= అగును.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! వినుము. బలపరాక్రమవంతులైన భీష్మ, ద్రోణ, కర్ణులు మరణించిన తరువాత మనసేన సేనాపతులు లేక గ్రుడ్డిది అయినట్లున్నది. అర్జునుడికి ఈ తక్కువసేనను సంహరించటం మిక్కిలి సులభం సుమా!'

**వ. అని చెప్పి కృతవర్మ శల్య గురుపుత్రులను దన్ను నెన్ని. 52**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; కృతవర్మ; శల్య; గురుపుత్రులను= అశ్వత్థామలను; తన్నున్= తనను; ఎన్ని= పరిగణించి (అనగా ఎంపికచేసి.

**తాత్పర్యం:** కృపాచార్యుడు ఈ విధంగా కౌరవపాండవపక్ష బలాబలాలను గూర్చి దుర్యోధనుడికి చెప్పి, కృతవర్మ, శల్య, అశ్వత్థామలనూ- తననూ ఎంపిక చేసి.

**క. దామోదరు తమ్ముండును । భీముఁడు నిరుగెలఁకులందుఁ బేర్చి తఱుమ ను**
**ద్దామగతి నడరు కవ్వడి । కే మిందఱుఁ దలఁప నొక్క యెత్తుకుమారా! 53**

**ప్రతిపదార్థం:** కుమారా!= దుర్యోధనా!; తలఁపన్= ఆలోచించగా; దామోదరు= శ్రీకృష్ణునియొక్క; తమ్ముండును= తమ్ముడు అయిన సాత్యకియును; భీముఁడును= భీముడును; ఇరు= రెండు; కెలఁకులందున్= ప్రక్కలయందును; పేర్చి= విజృంభించి; తఱుమన్= వెంబడించి పరుగెత్తించగా; ఉద్దామ= అడ్డులేని; గతిన్= గమనముతో; అడరు= విజృంభించి బాణములు ప్రయోగించు; కవ్వడికిన్= అర్జునునకు; ఏము= మేము; ఇందఱున్= ఇంతమందిమి (అనగా ఈ కృతవర్మ, శల్యుడు, అశ్వత్థామ, నేనుకూడా); ఒక్క; ఎత్తు= సమానము. (మేమందరము ఒక్క అర్జునుడితో సమానమని తాత్పర్యం.)

**తాత్పర్యం:** కుమారా! శ్రీకృష్ణుడి తమ్ముడు సాత్యకి, భీముడు, అర్జునుడి రథానికి రెండుప్రక్కల నుండి విజృంభించి వెంటాడి తరుముతుండగా అడ్డులేని విధంగా బాణాలు ప్రయోగించే అర్జునుడు ఒక ఎత్తు, మేమందరం ఒక ఎత్తు.

**విశేషం:** తిక్కన ఒక్క అర్జునుడి పౌరుష పరాక్రమాలనే ఈ సన్నివేశంలో 46వ పద్యం మొదలు 53వ పద్యం వరకు ఏడు పద్యాలలో బహుభంగుల సాలంకారంగా అభివర్ణించాడు. వ్యాసభగవానులు ఈ సందర్భంలో భీముడి సింహనాదాన్నీ, శ్రీకృష్ణుడి పాంచజన్యనిస్వనాన్నీ, అర్జునుడి గాండీవ నిర్ఘోషాన్నీ కలగలిపి ఒక్క శ్లోకంలో ప్రణవనాదాన్ని వినిపించాడు.

**చ.** **అనిలసుతుండు పూన్కి బలుపారఁగఁ గొండొక దీర్చె నేపు నొం**
**దిన భుజసంపదం గొఱఁత దీర్పఁగ నింకఁ గడంగకుండునే?**
**మనకు నజాతశత్రుని సమంచితమార్దవ మూఁది సంధి సే**
**య నుచితమైన కాలమిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్.** **54**

**ప్రతిపదార్థం:** అనిలసుతుండు= వాయువు కొడుకైన భీముడు; పూన్కి= పూనిక-ఉద్యమము; బలుపు= బలము; ఆరఁగన్= ఒప్పగా; కొండొక= కొంచెము; తీర్చెన్= చక్కదిద్దెను; ఏపును= ఆధిక్యమును; ఒందిన= పొందిన; భుజసంపదన్= భుజబలముతో; కొఱఁత= మిగిలినలోటు; తీర్పఁగన్= చక్కబరుచుటకు; ఇంకన్= ఇంక; కడంగక= ప్రయత్నింపకుండగ; ఉండునే?= ఉండునా? (ఉండడు అని భావం.); మనకున్= మనకు; అజాతశత్రుని= ధర్మరాజుయొక్క; సమంచిత= ఒప్పిన; మార్దవము= మృదుత్వము; ఊఁది= లేపి; సంధి; చేయను= చేసికొనుటకు; ఇది; ఉచితము= తగినది; ఐన= అయినటువంటి; కాలము= సమయము; చిత్తమున్= మనసునందు; ఆగ్రహమున్= కోపమును; చొరనీకు= ప్రవేశించనీయకుము - పాండవులయెడల మనసునందు ఆగ్రహమును చొరనీయకుము.

**తాత్పర్యం:** భీముడు తన ఉద్యమాన్ని కొంచెం నెరవేర్చాడు. ఇంకా తన అధికమైన భుజబల సంపదతో మిగిలిన లోటును చక్కబరచటానికి ప్రయత్నించకుండా ఉండడు. అందువలన ఒప్పిన ధర్మరాజుయొక్క మార్దవ లక్షణాన్ని వినియోగించుకొని, సంధి చేసికోవటాని కిది మంచి సమయం. ఇట్లా చెప్పుతున్నందులకు నా యెడల నీ మనసులో కోపం ప్రవేశించనీయకుము. పాండవుల విషయంలో కూడా నీ మనసులో ఆగ్రహమును ప్రవేశించనీయకుము.

**విశేషం:** 'నాడు ద్రౌపది వస్త్రాపహరణ సమయంలో కౌరవసభలో భీముడు రెండు శపథాలు చేశాడు. ఒకటి దుశ్శాసనుడి వక్షఃస్థలమును చీల్చి చంపటం. దానిని చక్కదిద్దాడు. అనగా నెరవేర్చాడు. ఇక రెండవది దుర్యోధనుడి తొడలు విరుగగొట్టి చంపటం. దానిని చక్కబరచవలసి ఉన్నది. ఆ శపథమును ఏపుమీఱిన తన భుజబలంతో నెరవేర్చకుండా ఉండడు. భీముడు నీ తొడలు విరుగగొట్టి తప్పకుండా చంపగలడు. అందువలన ధర్మజుడిని ఆశ్రయించి సంధి చేసికొనుము', ఇది ఈ పద్యంలోని భావం.

**క.** **సమరము నిష్కారణవై । రమునం బాటిల్లె నెల్ల రాజులు భరతో ।**
**త్తములును మడిసిరి విడు కో । పము; దీర్ఘ క్రోధుఁడైనపతి కీడొందున్.** **55**

**ప్రతిపదార్థం:** సమరము= యుద్ధము; నిష్కారణ= కారణములేని; వైరమునన్= శత్రుత్వము వలన; పాటిల్లెన్= కలిగెను; ఎల్లరాజులున్= అందరు రాజులు; భరత= భరతవంశమునందలి; ఉత్తములును= శ్రేష్ఠులును; మడిసిరి= మరణించిరి; కోపము; విడు= విడిచిపెట్టుము; దీర్ఘక్రోధుఁ డైనపతి; ఎడతెగని కోపం కలిగినవాడు; అయినట్టి; రాజు; కీడు= నాశనము; ఒందున్= పొందును.

**తాత్పర్యం:** ఈ యుద్ధం కారణంలేని శత్రుత్వంవలన కలిగింది. సమస్త రాజులు, భరతవంశంలోని శ్రేష్ఠులు మరణించారు. అందువలన ఇక కోపం విడిచిపెట్టుము. దీర్ఘక్రోధుడైన రాజు నాశనమౌతాడు.

**క. తమకు బలం బెక్కినతఱి । సముచితమగు విగ్రహంబు శత్రుల కుత్సా**
**హము మీఱినపుడు గర్త । వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్. 56**

**ప్రతిపదార్థం:** తమకున్; బలంబు; ఎక్కిన తఱిన్= అధికముగా ఉన్న సమయమున; విగ్రహంబు= యుద్ధము; సముచితము= తగినది; అగున్; శత్రులకున్= విరోధులకు; ఉత్సాహము; మీఱినపుడు= అతిశయించినపుడు; సంధి= యుద్ధవిరమణకు తగిన ఒప్పందము; కర్తవ్యము= తప్పకచేయతగినది; అనంగన్= అని; ఆర్యులచేతన్= పూజ్యులైన పెద్దలచేత; విందుము= వినుచుందుము.

**తాత్పర్యం:** తమకు శక్తిసామర్థ్యాలు అధికంగా ఉన్నప్పుడు యుద్ధం తగినది. శత్రువులకు ఉత్సాహం అధికంగా ఉన్నప్పుడు సంధి చేసికొనటం కర్తవ్యం. ఈ న్యాయం పూజ్యులైన పెద్దలచే చెప్పబడగా వింటాము. కావున, సంధి చేసికొనటం ఉచితం కదా!

**విశేషం:** 'హీయమానేన వై సంధిః పర్యేష్టవ్యం సమేన వా విగ్రహో వర్ధమానేన మతి రేషా బృహస్పతేః' (మూలం)

**క. కలవారెల్లను దెగి నీ । తలన నిలిచెఁ గార్య మధిప! తగ నొడఁబడు మి**
**ట్టలమగు నాత్మవినాశము । కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్. 57**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువా! దుర్యోధనా!; కలవారు= ఉన్నవారు; ఎల్లను= అందరును; తెగి= మరణించగా; నీతలన= నీయందే; కార్యము= సంధికార్యం; నిలిచెన్= శేషించి ఉన్నది; తగన్= ఒప్పుగా; ఒడఁబడుము= సంధికి సమ్మతించుము; ఇట్టలము= అధికము; అగు= అయినట్టి; ఆత్మవినాశము= తనయొక్క వినాశము; కలుగుట= కలిగినందువలన; బుధుల్= పండితులు (అనగా ధర్మజ్ఞానము కలవారు); అది; విపుల= మిక్కిలి; పాతకంబు= పాపము; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! నీ పక్షాన ఉన్నవారందరు మరణించారు. అందువలన కర్తవ్యం నీ పక్షాన శేషించి ఉన్నది. కావున సంధికి సమ్మతించుము. అధికమయిన ఆత్మవినాశం మహాపాతకమని ధర్మజ్ఞానులయిన బుధులు చెప్తుతూ ఉంటారు.

**క. తనకై కాదే! మదినె । ల్లను గోరుట వినుము దాఁ బ్రళయమొందెన యే**
**నిని వారని యుద్యోగం । బునకు ఫలంబేమి? రాజపుంగవ! చెపుమా! 58**

**ప్రతిపదార్థం:** రాజపుంగవ!= రాజులలో శ్రేష్ఠుడవు అయిన దుర్యోధనా!; మదిన్= మనసునందు; ఎల్లను= సమస్తమును (అనగా సమస్త రాజ్యసంపదను); కోరుట= కోరుకొనుట; తనకై= తన కొరకు; కాదే!= కాదా! - (తన కొరకే అని తాత్పర్యము); వినుము; తాన్= తాను (మదిలో సమస్త రాజ్యమును కోరుకొను తానే); ప్రళయము= గొప్ప నాశము; ఒందెనయేనిని= పొందినచో; వారని= ఆగని; ఉద్యోగంబునకున్= యుద్ధ ప్రయత్నమునకు; ఫలంబు= ప్రయోజనము; ఏమి?= ఏమి ఉన్నది?; చెపుమా!;

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! మదిలో సమస్త రాజ్యసంపదను తన కొరకే కోరుకొనేవాడు తానే నాశనం పొందినపుడు ఈ యుద్ధప్రయత్నంవలన ప్రయోజనం ఏమున్నది చెప్పుము? (ఆత్మవినాశనం వలన ప్రయోజనమేమీ లేదు. అందువలన సంధియే అవశ్యకర్తవ్య మనటం తాత్పర్యం.)

**విశేషం:** 'దుర్యోధనా! పాండవులకు దాయభాగం దక్కకుండా సమస్త రాజ్యసంపదను నీవే పొందవలె నని ఈ యుద్ధాన్ని ప్రారంభించావు. ఇపుడు నీవే వినాశం పొందినట్లయితే, ఇక ఈ యుద్ధంవలన నీకు ప్రయోజన మేమి? ఏమీ లేదు. అందువలన యుద్ధాన్ని విరమించి సంధికి ఒడంబడుము.' ఇది కృపాచార్యుడి హితోపదేశ సారాంశం.

**క. నినుఁ గాచికొనుము నీ వు । న్నను సర్వమ గల్గు ధర్మనందనునిఁ దగం**
**గను మతఁడు రాజునని తన । మనమున నెక్కించుకొనఁడు మదగర్వంబుల్. 59**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; కాచికొనుము= రక్షించుకొనుము; నీవు; ఉన్నను= ఉన్నచో (అనగా బ్రతికి ఉన్నచో); సర్వము+ అ= సమస్తమును; కల్గును= లభించును; ధర్మనందనునిన్= ధర్మరాజును; తగన్= ఒప్పుగా; కనుము= చూడుము; అతఁడు; రాజను= నేను రాజును; అని; తన= తనయొక్క; మనమునన్= మనసునందు; మదగర్వంబుల్= మదమును, గర్వమును; ఎక్కించుకొనఁడు= ప్రవేశింపనీయడు.

**తాత్పర్యం:** నిన్ను రక్షించుకొనుము. నీవు జీవించి ఉంటే నీకు సర్వసంపదలు కలుగుతాయి. ధర్మజుడిని మంచిగా చూడుము. అతడు 'నేను రా'జను మద గర్వాలతో నిండిన భావాలను తన మనసునందు ప్రవేశించనీయడు. అందువలన యుద్ధాన్ని విరమించి సంధి చేసికొనుము.

**విశేషం:** 'అతడు రాజునని తన మనమున నెక్కించుకొనడు మదగర్వంబుల్' - ధర్మజుడు నీవలె 'నేనే రాజును' అనే మదగర్వాలు తన మనస్సులో ఎక్కించుకొనడు- అనే తాత్పర్యార్థంతో కృపుడు దుర్యోధనుడికి బుద్ధి చెప్పటం గ్రహించవచ్చును.

**తే. రాజ్యభాగంబు దగ ధృతరాష్ట్రునకును । నీకు నన్నదమ్ములకు నా నృపతి యొసఁగు**
**నాతఁ డెపుడు శుశ్రూష సేయంగఁ గోరు । గురుజనములకుఁ గావునఁ గూడుటొప్పు. 60**

**ప్రతిపదార్థం:** ఆ నృపతి= ఆ ధర్మరాజు; రాజ్యభాగంబు= సామ్రాజ్యమందలి వంతు; తగన్= ఒప్పుగా; ధృతరాష్ట్రునకును; నీకును; అన్నదమ్ములకును; ఒసఁగున్= ఇచ్చును; ఆతఁడు; ఎపుడున్= ఎల్లపుడు; గురుజనములకున్= పెద్దలకు (అనగా గాంధారీ ధృతరాష్ట్రులకు); శుశ్రూష= సేవ; చేయంగన్= చేయటానికి; కోరున్= కోరుచుండును; కావునన్= అందువలన; కూడుట= సంధిచేసికొని వారితో కలిసియుండుట; ఒప్పు= ధర్మము (న్యాయసమ్మతము).

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు రాజ్యభాగాన్ని ధృతరాష్ట్రుడికి, నీకు, తోడబుట్టువులకు తప్పక ఇస్తాడు. ఆ ధర్మరాజు ఎల్లప్పుడూ పెద్దలకు సేవ చేయాలనే ఉత్సాహం చూపుతూ ఉంటాడు. అందువలన సంధి చేసికొనుట న్యాయసమ్మతం.

**విశేషం:** ఈ పద్యం ధర్మరాజు స్వభావాన్ని తెలుపుతుంది. ధర్మరాజు రాజ్యభాగం తమ్ములకు ఇస్తాడన్న సందర్భంలో తమ్ములంటే భీమార్జున నకుల సహదేవులు.

**చ. హరియును గా దనండు గరుణాన్వితులై తగ నమ్మహాత్ము లె**
**ప్పరుసునఁ గార్యనిశ్చయము పల్కినఁ గీచకవైరియుం బురం**
**దరతనయుండునుం గవలు దానికి మార్పులుకంగ నెమ్మెయిం**
**జొర రగు సంధియెట్లు ననసూయత నూల్కొని చేయు మిత్తఱిన్. 61**

**ప్రతిపదార్థం:** హరియును= శ్రీకృష్ణుడును; కాదు; అనండు; ఆ మహాత్ములు; ఆ గొప్పవారు (అనగా పూజ్యులు అయిన ఆ శ్రీకృష్ణధర్మజులు); కరుణా= దయతో; అన్వితులై= కూడినవారై; ఏ+పరుసునన్= ఏ విధంగా; కార్య నిశ్చయము= సంధి కార్యంయొక్క నిర్ణయం; తగన్= ఒప్పునట్లుగా; పల్కినన్= చెప్పినా; కీచకవైరియున్= కీచకునకు శత్రువు అయిన భీముడును; పురందర= మహేంద్రునియొక్క; తనయుండునున్= కుమారుడైన అర్జునుడును; కవలు= కవలపిల్లలైన నకుల సహదేవులును; దానికిన్; మాఱు= మరొకవిధంగా; పలుకంగన్= చెప్పుటకు; ఏ+మెయిన్= ఏ విధముగాను; చొరరు= ప్రవేశించరు, ఒప్పుకొనరు; ఎట్లును= ఏ ప్రకారముగ నైనను; సంధి; అగున్= జరుగును; ఇత్తఱిన్= ఈ సమయమున; అనసూయతన్= అసూయ లేకుండా; నూల్కొని= ఒప్పుకొని; చేయుము= సంధి ప్రయత్నము చేయుము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు కూడా సంధిని కాదనుడు. ఆ మహాత్ములైన శ్రీకృష్ణ ధర్మజులు ఏ విధంగా కార్య నిశ్చయం చేస్తారో దానికి విరుద్ధంగా భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు అడ్డుచెప్పరు. అందువలన ఈ సమయంలో అసూయ మాని సంధి ప్రయత్నం చేయుము. సంధి జరిగి తీరుతుంది.

**విశేషం:** కీచకుడు మత్స్యదేశాధీశుడైన. విరాటమహారాజునకు సేనాపతి. మహారాణి అయిన సుదేష్ణకు అన్నగారు. మహాబలశాలి. సూతరాజు కేకయుడి యొక్క పెద్ద భార్య మాలవిక గర్భమున, ఈ కీచకుడు, ఇతడి సోదరులు ఉపకీచకులు జన్మించారు. అజ్ఞాతవాసంలో ద్రౌపది సుదేష్ణ ఒద్ద సైరంధ్రిగా ఉన్నపుడు కీచకుడు ద్రౌపదిని మోహించి బలాత్కరించాడు. అది కారణంగా భీముడు కీచకుడిని, ఉపకీచకులను సంహరించాడు. అందువలన భీమునికి కీచకవైరి నామం సిద్ధించింది. ఈ నామం భీముడి బలపరాక్రమాలను ప్రకటిస్తున్నది. కాలేయుడనే మహాదైత్యుడి బాణముయొక్క అంశవలన కీచకుడు జన్మించాడు.

**ఆ. ఇంత చెప్ప టనికి నేనోడి ప్రాణ ర । క్షణము సేసికొనుట గాదు నీకుఁ**
**బథ్యమనియుఁ దఱిమి పల్కితి విను విన । వేని నొచ్చి తలఁచె దిట్టులగుట. 62**

**ప్రతిపదార్థం:** ఇంత= ఇదియంతయు; చెప్పుట; (అనగా ఇంతవరకు సంధికై నీకు హితము చెప్పుట); అనికిన్= యుద్ధమునకు; ఏను; ఓడి= భయపడి; ప్రాణరక్షణము= ప్రాణముయొక్క రక్షణము - కాపాడుటకు; చేసికొనుట= చేసికొనుటకు; కాదు (అనగా ప్రాణమును కాపాడుకొనుటకు కాదు); నీకున్= నీకును; పథ్యము= హితము; అనియున్= కలుగునని కూడ; తఱిమి= మఱిమఱి - వెంటపడి; పల్కితి= చెప్పితిని; విను; (ప్రార్థనార్థకము); వినవు= వినిపించుకొనవు; ఏనిన్= అట్లయితే; ఇట్టులు= ఈ ప్రకారముగ; అగుట= అయినందులకు; నొచ్చి= బాధపడి; తలఁచెదు= చింతిస్తావు, పశ్చాత్తాపపడతావు.

**తాత్పర్యం:** ఇంతవరకూ నీకు ఈ విధంగా చెప్పటానికి కారణం నేను యుద్ధానికి భయపడి కాని, నా ప్రాణాన్ని రక్షించుకొనటానికి కాని కాదు. నీకు హితం శుభం కలుగాలని చెప్పాను. నా మాట వినుము. నా ఉపదేశం విననిచో, అయ్యో! ఇట్లయినదే అని ఆవల చింతిస్తావు.

**వ. అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుండు వేఁడి నిట్టూర్పు నిగిడించి యొక్కింత సేపు చింతాక్రాంతుండై యూరకుండి వ్రాల్చిన కనుదోయి విచ్చి యవ్విప్రవరు మొగంబు సూచి యిట్లనియె. 63**

**ప్రతిపదార్థం:** అని; ఆ+గౌతముండు= ఆ కృపాచార్యుడు; శోక= దుఃఖమునకు; ఆయత్త= అధీనము అయిన; చిత్తుండు= మనసు కలవాడు; అగుచున్= అగుచు; తనకున్; హిత= క్షేమమును కలుగచేయు; ఉపదేశంబు= బోధ; చేసినన్= చేయగా;

విని; దుర్యోధనుండు; వేఁడినిట్టూర్పు; నిగిడించి= విడిచి; ఒక్కింతసేపు= కొంచెం సమయం; చింతాక్రాంతుండై= విచారం కలిగినవాడై; ఊరకుండి= మౌనంగా ఉండి; వ్రాల్చిన= వాలియున్న; కనుదోయి= రెండు కన్నులను; విచ్చి= తెరచి; ఆ విప్రవరు మొగంబు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠునియొక్క ముఖము (ఆ కృపాచార్యుని ముఖము); చూచి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ కృపాచార్యుడు దుఃఖంతో నిండిన మనసు కలవాడై తనకు క్షేమకరమైన బోధ చేయగా విని, ఆ దుర్యోధనుడు వేడి నిట్టూర్పును విడుస్తూ కొంచెం సేపు విచారించి, వ్రాల్చిన కన్నులను తెరచి, ఆ కృపాచార్యుడి ముఖం చూచి ఇలా అన్నాడు.

**విశేషం:** ఈ వచనమున తిక్కనగారు ప్రయోగించిన 'విప్రవరుమొగంబు' అను పదము సాభిప్రాయం. 'విప్ర' శబ్దం బ్రాహ్మణ సామాన్యవాచకం కాదు. 'విప్రః వేదాధ్యయన సంపన్నః' అని ఆర్యోక్తి. విప్రుడు వేదాధ్యయన సంపన్నుడైన బ్రాహ్మణుడని ఆర్య వచనం. కృపాచార్యులు విప్రవరుడు. అథర్వవేదాధ్యయనంలో వరిష్ఠుడు. అథర్వవేదమునకు ఉపవేదము అయిన ధనుర్వేదవిద్యలో పారం ముట్టినవాడు.

కృపాచార్యులవారి తండ్రి శరద్వంతుడు, ధనుర్వేదవిద్యయందు పారంగతుడు. కృపుడు తండ్రి ఒద్ద ధనుర్వేదాన్ని అభ్యసించాడు. ద్రోణాచార్యుడు మాత్రం ఈ విద్యను పరశురాముడి యొద్ద అభ్యసించాడు. తిక్కన కృపాచార్యుడిని 'విప్రవరు' డనుట కిది తాత్పర్యం. మూలంలో ఈ సందర్భమునందు - వ్యాసభగవానులు ఈ పదాన్ని ప్రయోగించలేదు.

**చ.** **'చెడుటకు నోర్వ కీ విటులు చెప్పితి నాకు హితంబు నెయ్య మె**
**క్కుడు గలయట్టి చుట్టమునకున్ నయశిక్ష దగుం గదా! భరం**
**పడి బవరంబులం బెనఁగు భంగిని గార్యము దెల్పఁ జాలిన**
**ప్పడు నిను రక్షణార్థివని భూసురసత్తమ యే నెఱుంగుదున్!. 64**

**ప్రతిపదార్థం:** భూసురసత్తమ!= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడవైనవాడా!; చెడుటకున్= చెడిపోవుటకు; ఓర్వక= సహింపక; ఈవు= నీవు; ఇట్టులు= ఈ ప్రకారముగా; నాకున్; హితంబును= క్షేమమును గూర్చి; చెప్పితి(వి); నెయ్యము= స్నేహము; ఎక్కుడు= ఎక్కువగా; కలయట్టి= కలిగినట్టి; చుట్టమునకున్= బంధువునకు; నయశిక్ష= నీతిబోధ; తగున్= ఒప్పును; కదా!; భరంపడి= విజృంభించి; బవరంబులన్= యుద్ధములందు; పెనఁగు భంగిని= పోట్లాడునప్పుడు; కార్యము= చేయవలసిన పని; తెల్పన్+ చాలినప్పుడు= తెలియచేయవలసి వచ్చినప్పుడు; నినున్= నిన్ను; రక్షణార్థివి= రక్షణము కోరువాడవు; అని; ఏను; ఎఱుంగుదున్.

**తాత్పర్యం:** 'నేను చెడిపోవటం సహించలేక నీవు ఈ ప్రకారంగా నా క్షేమాన్ని గూర్చి చెప్పావు, స్నేహం ఎక్కువగా గల చుట్టానికి నీతిబోధ చేయటం ఒప్పును కదా! యుద్ధాలలో విజృంభించి పోట్లాడుకొనేటప్పుడు చేయతగిన పనిని తెలియచేయవలసి వచ్చినప్పుడు నిన్ను నా రక్షణం కోరేవాడవని - ఓ బ్రాహ్మణోత్తమా! నేను ఎరుగుదును.

**వ.** **నీ కూర్మి పేర్మిం జేసి దొలఁగింపం జూచి సంధి కర్తవ్యంబని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లంటేని. 65**

**ప్రతిపదార్థం:** నీ కూర్మి= నీయొక్క స్నేహముయొక్క; పేర్మిన్= ఆధిక్యము; చేసి= చేత; తొలఁగింపన్= యుద్ధమునుండి తప్పింప; చూచి= తలచి; సంధి; కర్తవ్యంబు= చేయతగినపని; అని; పలికితివి= చెప్పితివి; కాని; ఆ పలుకులు= ఆ మాటలు; నాకున్; రుచియింపవు= ఇష్టము కావు; ఎట్లు= ఏ ప్రకారంగా; అంటి(వి)+ఏని= అంటావా.

**తాత్పర్యం:** నీకు నాయందు గల స్నేహం, గౌరవంవలన నన్ను ఈ యుద్ధంనుండి తొలగించదలచి సంధికార్యం ఆచరణీయమని చెప్పావు. కాని ఆ మాటలు నాకు రుచించవు - ఎందువలననంటావేమో!

**సీ. కపటంపు జూదంబు ఘటియించి రాజ్యంబు । గొని ధర్మజుని మది గుందఁ జేసి**
**సభ కేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ । బాంచాలి ముందల పట్టి యీడ్చి**
**సంధిసేయఁగఁ బూని శౌరి యేతెంచిన । నవ్విధంబున నప్రియం బొనర్చి**
**పలువురు గూడి సౌభద్రు నొక్కని బాలుఁ । గిట్టి యత్తెఱఁగున గీటడంచి**

**తే. నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము, నెత్తు రనిల । సుతుఁడు మదమునఁ ద్రావుట సూచి కొఱఁత**
**ప్రతిన దీర్చు నతండని భయముఁ బొంది । పొందు గోరిన నదియేల పొసగుఁ జెపుమ? 66**

**ప్రతిపదార్థం:** కపటంపు జూదము= మాయాద్యూతము; ఘటియించి= కల్పించి; రాజ్యంబు; కొని= తీసికొని; ధర్మజుని= ధర్మరాజుయొక్క; మది= మనసు; కుందన్= క్రుంగిపోవునట్లు చేసి; సభకున్= కౌరవసభకు; ఏకవస్త్రన్= ఏకవస్త్రను; రజస్వలన్; పాంచాలిన్; ఆ+మెయిన్= ఆ విధంగా; ముందల= ముందుతలను(జుట్టును); పట్టి= పట్టుకొని; ఈడ్చి; (లాగి); సంధి; చేయఁగన్= చేయుటకు; పూని= పూనిక వహించి(ప్రయత్నించి); శౌరి= శ్రీకృష్ణుడు; ఏతెంచినన్= రాగా; ఆ విధంబునన్= ఆ విధముగా; అప్రియంబు= అనిష్టము; ఒనర్చి= చేసి; పలువురు= అనేకులు; కూడి= కలిసి (అనగా ద్రోణ, కర్ణ, శల్య, కృప, కృతవర్మ, అశ్వత్థామాదులు అనేకులు); బాలున్= పసివానిని; సౌభద్రున్= సుభద్ర కుమారుడయిన అభిమన్యుని; ఒక్కనిన్; కిట్టి= సమీపించి; ఆ తెఱఁగునన్= ఆ విధముగ; గీటడంచి= చంపి; నేఁడు= ఈనాడు; దుశ్శాసనుని= దుశ్శాసనునియొక్క; ఱొమ్ము= వక్షఃస్థలంయొక్క; నెత్తురు= రక్తము; అనిలసుతుఁడు= వాయువు యొక్క సుతుడు, భీముడు; మదమునన్= గర్వముతో; త్రావుట; చూచి; కొఱఁత= మిగిలిపోయిన; ప్రతిన= శపథము; అతండు= ఆ భీముడు; తీర్చును= నెరవేర్చగలడు; అని; భయమున్= భీతిని; పొంది; పొందు= సంధిని; కోరినన్= అభ్యర్థించినట్లయిన; అది= ఆ సంధి; ఏల= ఎందులకు; పొసఁగున్= కుదురుతుంది; చెపుమ?= చెప్పుము?

**తాత్పర్యం:** మాయాజూదాన్ని కల్పించి, రాజ్యాన్ని అపహరించి ధర్మరాజు మనసు క్రుంగదీసి, నిండు కౌరవసభలో ఏకవస్త్ర, రజస్వల అయిన ద్రౌపదిని జుట్టుపట్టి ఈడ్చి, సంధి చేయటానికి వచ్చిన శ్రీకృష్ణుడికి అనిష్టం కలిగించి, ద్రోణ, కర్ణ, శల్య, కృతవర్మ, అశ్వత్థామ మొదలైన అనేకులు కూడి బాలు డయిన అభిమన్యుడిని ఒంటరివాడిని చేసి చంపించి, దుశ్శాసనుడి వక్షఃస్థలం చీల్చి భీముడు గర్వంతో నెత్తురు త్రాగటం ఈనాడు ప్రత్యక్షంగా చూచి, నీ తొడలు విరుగగొట్టి చంపుతా' నని మిగిలిపోయిన రెండవ శపథం భీముడు నెరవేర్చగలడని భయపడి సంధికై పాండవులను అర్థిస్తే - అది ఏవిధంగా పొసగుతుంది? ఒప్పుతుంది? చెప్పుము.

**ఉ. రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి**
**భ్రాజిత వృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు శత్రుకోటికి**
**న్దేజము దప్పఁ జేయుచు నతిప్రమదంబున నున్న నాకు నిం**
**కాజియె కాక యొక్కని దయం గను రాజ్యసుఖంబు లేటికిన్? 67**

**ప్రతిపదార్థం:** రాజులు; భక్తిన్= భక్తితో; కొల్వఁగన్= సేవించుచుండగ; ధరావలయంబు= భూమండలము; అఖిలంబున్= సమస్తమును; దర్ప= గర్వముతో; విభ్రాజిత= ప్రకాశించుచున్న; వృత్తిన్= ప్రవర్తనతో; ఏలి= పరిపాలించి; అనురక్తులన్=

అనురాగముకలవారిని (అనగా నాయందు అనురాగము కలవారిని - నేను అనురాగముతో చూచువారిని); ప్రోచుచున్= రక్షిస్తూ; శత్రుకోటికిన్= విరోధి సముదాయమునకు; తేజము= ప్రకాశము(లేక) శక్తి; తప్పన్= తక్కువగా; చేయుచున్= చేస్తూ; అతిప్రమదంబునన్= మిక్కిలి సంతోషంతో; ఉన్న= ఉన్నటువంటి; నాకున్= నాకు; ఇంకన్; ఆజియె= యుద్ధమే; కాక; ఒక్కని= ఒకానొకడి (ఒక అల్పుడి); దయన్= దయవలన; కను= పొందెడి; రాజ్యసుఖంబులు= రాజ్యంవలన లభించు భోగములు; ఏటికిన్?= ఎందులకు?

**తాత్పర్యం:** రాజులందరు భక్తితో సేవిస్తుండగా ఈ సమస్త భూమండలాన్నీ గర్వంతో వెలిగే నడవడితో పరిపాలిస్తూ నాకు అనురక్తులయిన వారిని, నాయందు అనురాగం కలవారిని పోషిస్తూ శత్రుసమూహాలను శక్తిహీనులను చేస్తూ, అత్యంత సంతోషంతో ఉండే నాకు ఇంక యుద్ధమే అవశ్యకర్తవ్యం కాని, ఒకానొకడి దయవలన లభించే రాజ్యభోగాలు ఎందుకు?

**విశేషం:** 'ఒక్కని దయం గను రాజ్యసుఖంబు లేటికిన్' - ఈ ఒక్క మాటతో మహాకవి తిక్కన దుర్యోధనుడి హృదయాన్ని ఆవిష్కరించాడు. దుర్యోధనుడి మాటలన్నీ అతడెంతటి అభిమానధనుడో పట్టిచూపుతాయి.

**వ. నిశ్చయం బిట్టిద యగుటం జేసి. 68**

**ప్రతిపదార్థం:** నిశ్చయంబు= నిర్ణయము; ఇట్టిద= ఇదియే; అగుటంజేసి= అయినందువలన;

**తాత్పర్యం:** యుద్ధం చేయటమే నా నిర్ణయం అయినందువలన.

**ఆ. పొడుతు నెట్లు పాండుపుత్రులతోఁ గయ్య । మేను నీవు దీనికియ్యకొనుము**
**పలుకు వినమి గాఁగఁ దలఁపకు ముచితంబు । తెఱఁగు ధీరజనుల కెఱుఁగరాదె? 69**

**ప్రతిపదార్థం:** పాండు పుత్రులతోన్= పాండురాజుకుమారులతో; ఏను= నేను; కయ్యము= యుద్ధము; ఎట్లున్= ఎట్లయినను; పొడుతును= పోట్లాడుదును, చేస్తాను; దీనికి= ఈ నిర్ణయమునకు; నీవు; ఇయ్యకొనుము= అంగీకరింపుము; పలుకు= నీవు చెప్పినమాట; వినమి కాఁగన్= వినకపోవటంగా; తలఁపకుము= భావించకుము; ఉచితంబు= సరి అయిన; తెఱఁగు= మార్గం; ధీరజనులకున్= ధైర్యవంతులయిన మనుజులకు; ఎఱుఁగరాదె?= తెలియాలికదా?

**తాత్పర్యం:** నా నిర్ణయం పాండుపుత్రులతో యుద్ధం. నీవు దీనికి అంగీకరించాలి. నేను నీ మాట విననందులకు అన్యవిధంగా తలపవద్దు. సరి అయిన మార్గం ధైర్యవంతులైన మనుజులకు తెలియవలయును కదా!

**చ. విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు**
**త్రభటసమానవృత్తమున దైన్యమునొందుట కోర్వరాదు వీ**
**తభయతఁ బోరఁ బేర్కొని యుదాత్తపదంబున కేఁగి భీష్మ కుం**
**భ భవ జయద్రథాదు లగు బంధులమిత్రులఁ గూడు టొ ప్పగున్. 70**

**ప్రతిపదార్థం:** విభవమునున్= సమస్త సంపదయును; ప్రతాపమును= పరాక్రమమును; విశ్రుతకీర్తియున్= ప్రసిద్ధమయిన యశస్సును; మాయ= నశించిపోయేవే; ధర్మపుత్ర= యమధర్మరాజు పుత్రుడయిన ధర్మరాజుయొక్క; భట= యోధులతో; సమాన= సరితూగగలగునట్లు; వృత్తమునన్= ప్రవర్తించుటయందు; దైన్యమును= దీనత్వమును (దిక్కులేనితనమును);

ఒందుటకున్= పొందుటకు; ఓర్వన్= సహింప; రాదు; వీత= పోయిన; భయతన్= భీతితో; పోరన్= యుద్ధంలో; పేర్కొని= పిలిచి; ఉదాత్త= గొప్పదియైన; పదంబునకున్= స్థానమునకు - అనగా స్వర్గమునకు; ఏఁగి= వెళ్ళి; భీష్మ; కుంభభవ= ద్రోణుడు; జయద్రథ= సైంధవుడు; ఆదులగు= మొదలగు; బంధులన్= చుట్టములను; మిత్రులన్= స్నేహితులను; కూడుట= కలియుట; ఒప్పు= ఒప్పిదము (మంచిది); అగున్= అగును.

**తాత్పర్యం:** నా వైభవం, నా పరాక్రమం, నా ప్రసిద్ధమయిన కీర్తి, నిత్యం కావు, స్థిరం కావు. ధర్మపుత్రుడి యోధులతో సరితూగేటట్లు ప్రవర్తించటం దీనత్వాన్ని పొందటం సహించరానిది. అందువలన భీతిని విడిచి యుద్ధం చేయటం, స్వర్గానికి వెళ్ళి భీష్మ ద్రోణ జయద్రథాదులగు చుట్టాలను, స్నేహితులను కలియటం మంచిది అవుతుంది.

**వ. అంత వలవ దిమ్మాట మగపాడి కాడితిం గాని. 71**

**ప్రతిపదార్థం:** అంత= అంతవరకు; వలవదు= వలదు; ఈ+మాట= ఈ పలుకు; మగపాడికిన్= పురుష ధర్మము తెలియుటకు; ఆడితిన్= పలికితిని; కాని= అంతియ కాని.

**తాత్పర్యం:** అంతవరకు వద్దు. ఈ మాట (స్వర్గానికివెళ్ళి, భీష్మద్రోణాదులను కలియటం మంచిది అనే మాట) పురుష ధర్మం తెలియటానికి చెప్పాను కాని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ఏను దెంపుచేసి యీ యున్నరథిక జ । నంబుతోడఁ గడఁగి నడవ బెట్టు**
**దఱిమి పాండురాజతనయుల మర్దింతు । ననఘ! నీవు మెచ్చునట్లు గాఁగ!' 72**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన కృపాచార్యా!; ఏను; తెంపు చేసి= సాహసం చేసి; ఈ ఉన్న= ఇక్కడ ఉన్నట్టి; రథికజనంబుతోడన్= రథ మధిరోహించి యుద్ధం చేయగల యోధులతో; కడఁగి= పూని; నడవన్= నడువగా (యుద్ధమునకు వెళ్ళగా); బెట్టు= బెడిదంగా-బాగా; తఱిమి; పారద్రోలి; పాండురాజు తనయులన్= పాండురాజు యొక్క కుమారులను; నీవు; మెచ్చునట్లు కాఁగన్= నీవు మెచ్చుకొనేవిధంగా; మర్దింతున్= చంపుతాను.

**తాత్పర్యం:** ఓ కృపాచార్యా! నేను సాహసం చేసి ఇక్కడ ఉన్నట్టి మహాయోధులైన రథికజనంతో యుద్ధానికి వెళ్ళి, నీవు మెచ్చుకొనేటట్లు ఆ పాండవులను తరిమి కొట్టి చంపుతాను.'

**చ. అన విని చుట్టు నున్న నృపులందఱు సంతస మంది యన్నరేం**
**ద్రుని వినుతించి యోటమికి రోయుట నొందిన చింతవంత యె**
**ల్లను దిగఁ ద్రోచి నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లు నా**
**ననములు దోఁప దర్పవచనంబుల సేనకు నుబ్బొనర్చుచున్. 73**

**ప్రతిపదార్థం:** అనన్= అని చెప్పగా; విని; చుట్టును; ఉన్న= ఉన్నట్టి; నృపులు= రాజులు; అందఱున్; సంతసము; అంది= పొంది; ఆ+నరేంద్రుని= ఆ దుర్యోధనుని; వినుతించి= పొగడి; ఓటమికిన్= ఓడిపోయినందులకు; రోయుటన్= నిందలు పాలగుటాన్ని; ఒందిన= పొందిన; చింతన్, వంతన్= విచారాన్నీ, దుఃఖాన్నీ; ఎల్లను= అంతయును; దిగన్+త్రోచి= వదలిపెట్టి; నెమ్మనములన్= (నెఱ+మనములన్)= నిండుహృదయాలలో; రణ= యుద్ధమునందలి; కౌతుకము= కుతూహలము; ఆవహిల్లు= కలుగునట్టి; ఆననములు= ముఖములు; తోఁపన్= కనబడగా; దర్ప= గర్వముతో కూడిన; వచనంబులన్= పలుకులతో; సేనకున్= సైన్యమునకు; ఉబ్బు= ఉత్సాహము; ఒనర్చుచున్= కలిగించుచు.

**తాత్పర్యం:** 'ఈ రథిక జనంతో వెడలి యుద్ధంలో పాండురాజు తనయులను సంహరిస్తానని దుర్యోధనుడు చెప్పగా విని, చుట్టు గుమిగూడి ఉన్న రాజులందరు సంతోషం పొంది, దుర్యోధనుడిని పొగడి, ఓటమివలన కలిగిన నిందను పొందినందువలన ఏర్పడిన సమస్త దుఃఖాన్ని, బాధను విడిచిపెట్టి నిండు మనసులలో యుద్ధ కుతూహలం కలిగినట్టి ముఖాలు గోచరించగా గర్వంతో కూడిన పలుకులతో సైన్యానికి ఉత్సాహం కలిగిస్తూ. (తరువాతి, వచనంతో అన్వయం.)

### దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీతీరంబు చేరుట (సం. 9-4-49)

వ. **చెలంగిన కృపకృతవర్మాశ్వత్థామ శకుని శల్యులు గార్యంబు విచారించి కౌరవేశ్వరు నాలోకించి 'మనమీరాత్రి శిబిరంబున నిద్రించుట యొప్పదెట్లనినఁ గర్ణుందెగటార్చుటం జేసి పేర్చినయుబ్బునఁ బాండవులు పైకొని పరాక్రమింప నప్పళింపఁ గలుగుఁ బో యని తలంచెదము. వినుము వంచనఁ దొలంగియుండి మనకుం గల చతురంగంబుల నాయితంబు సేసికొని పెనఁకువం బన్ని వారికి వెఱఁగగునట్టి బెట్టిదంపుటురవడిం గదిసి రణంబు సేయుద మట్లైన జయంబు గొనవచ్చు' నని చెప్పిన నవ్వసుమతీపతి ప్రీతుండై యది లెస్స వెర వట్ల చేయుదమని సముచితభంగిం దగువారల కెఱింగించి కదలి యచటికి రెండామడ యగు సరస్వతిపొంతం బయలికి బలంబులం గొని చని సకలజనవాహనసహితంబుగా నమ్మహానదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి వలయు తెఱంగున వెనుక నడతెంచిన వివిధాహారంబులం దుష్టిఁ బొంది యిష్టాలాపంబులు సెల్లుచుండ నున్న సమయంబున ము న్నాకర్ణంబు నడపిన దొరలును జిత్రసేనాది భవత్కుమారులును గర్ణుకొడుకు సత్యసేనుండును లోనైన యాప్తజనంబు లమ్మనుజనాథున కి ట్లనిరి.** 74

**ప్రతిపదార్థం:** చెలంగినన్= (రాజులు) విజృంభించగా; కృప= కృపుడు; కృతవర్మ; అశ్వత్థామ; శకుని; శల్యులు - ఈ అయిదుగురు; కార్యంబున్= చేయవలసి పనిని; విచారించి= బాగుగ ఆలోచించి; కౌరవేశ్వరున్= దుర్యోధనుడిని; ఆలోకించి= చూచి; మనము; ఈ రాత్రి; శిబిరంబునన్= శిబిరమునందు (సైన్యముండుచోటు); నిద్రించుట; ఒప్పదు= మంచిదికాదు; ఎట్లు; అనినన్; కర్ణున్= కర్ణుని; తెగటార్చుటన్= సంహరించటం చేత; పేర్చిన= విజృంభించిన; ఉబ్బునన్= సంతోషముతో; పాండవులు; పైకొని= మీదపడి; పరాక్రమింపన్= పరాక్రమము చూపుటకు; అప్పళింపన్= ప్రయత్నము; కలుగున్ పో= జరుగవచ్చునో; అని; తలంచెదము; వినుము; వంచనన్= మోసమునుండి; తొలంగి= తప్పించుకొని; ఉండి; మనకున్= మనకు; కల= ఉన్నట్టి; చతురంగంబులన్= చతురంగ బలములను (అనగా రథబలము- గజబలము- తురంగబలము - పదాతిబలము. ఈ నాలుగు సైన్యములందు గల బలములు.) ఆయితంబు= సిద్ధము; చేసికొని; పెనఁకువన్= యుద్ధమునకు; పన్ని= వ్యూహరచనచేసి; వారికిన్= వారికి అనగా పాండవులకు; వెఱఁగు= ఆశ్చర్యం; అగునట్టి= కలిగించునట్టి; బెట్టిదంపు= ఉద్ధతమగు; ఉరవడిన్= వేగముతో; కదిసి= ఢీకొని; రణంబు= యుద్ధం; చేయుదము; అట్లు= ఆ ప్రకారముగా; ఐన= అయిన ఎడల(అనగా చేసినచో); జయంబు= విజయము; కొనవచ్చున్= పొందవచ్చును; అని; చెప్పినన్; ఆ వసుమతీ పతి= భూమికి భర్త అయిన ఆ దుర్యోధనుడు; ప్రీతుండై= సంతోషించినవాడై; అది= ఆ పద్ధతి; లెస్స= ఆమోదయోగ్యమయిన; వెరవు= ఉపాయము; అట్ల= ఆ ప్రకారముగానే (నిర్ధారణార్థకము); చేయుదము; అని; చెప్పి; సముచితభంగిన్= తగినవిధముగా; తగు= అర్హమైన; వారలకున్; ఎఱింగించి= తెలియజేసి; కదలి= బయలుదేరి; అచటికిన్; రెండు; ఆమడ= ఆమడ దూరము; అగు= కలుగు; సరస్వతి పొంతన్= సరస్వతీ నదీతీరముయొక్క సమీపమున; బయలికిన్= బహిరంగప్రదేశమునకు; బలంబులన్=

సేనలను; కొని= తీసికొని; చని= వెళ్ళి; సకల జనవాహన సహితంబుగాన్; సకల= సమస్తమయిన; జన= జనులతో; వాహన= వాహనముల; సహితంబుగాన్= కూడినవాడై; ఆ+మహానదియందు= ఆ గొప్పనదియందు (అనగా ఆ పవిత్రమయిన నదియందు); ఇచ్ఛా= ఇష్టమునకు; అనురూప= అనుగుణమయిన; స్నాన, పానంబులు= స్నానపానములు; ఆచరించి= చేసి; వలయు= కావలసిన; తెఱంగునన్= విధంగా; వెనుకన్= తన వెంట; నడతెంచిన= తమతోపాటు తీసికొనివచ్చిన; వివిధ= పలు రకములయిన; ఆహారంబులన్= తినుబండారాలను; తుష్టిన్= సంతప్తితో; పొంది; ఇష్ట= ప్రియమయిన; ఆలాపంబులు= సంభాషణములు; చెల్లుచుండన్= కొనసాగుచుండగా; ఉన్న; సమయంబునన్= కాలమున; మున్ను= ఇంతకుముందు; ఆ కర్జంబు= ఆ పని; నడిపిన= చేసిన; దొరలును= యోధవరులును అనగా కృప కృతవర్మాశ్వత్థామ శకుని శల్యులు; చిత్రసేన= చిత్రసేనుడు; ఆది= మొదలగు; భవత్= నీయొక్క కుమారులును= కొడుకులును; కర్ణుకొడుకు= కర్ణుని కుమారుడు; సత్యసేనుండును; లోనైన= ఈ మొదలైన; ఆప్తజనంబులు= సన్నిహితులైన మనుజులు (అనగా బంధువులు); ఆ+మనుజ నాథునకున్= మనుజులకు ప్రభువు అయిన దుర్యోధనునకు; ఇట్లు= ఈ ప్రకారముగా; అనిరి= చెప్పిరి.

**తాత్పర్యం:** విజృంభించిన కృపుడు, కృతవర్మ, అశ్వత్థామ, శకుని, శల్యులు అటు తరువాత చేయవలసిన పనిగురించి బాగుగా ఆలోచించి, ఆ దుర్యోధనుడిని చూచి 'మనం ఈ రాత్రి శిబిరంలో నిద్రించటం మంచిది కాదు. ఎందువలననంటే కర్ణుడిని సంహరించటం వలన కలిగిన సంతోషంతో పాండవులు మీదపడి ఆక్రమించటానికి ప్రయత్నించవచ్చు నేమో అని ఆలోచిస్తున్నాము. అందువలన వినుము. మోసమునుండి తప్పించుకొని ఉండి మనకు గల చతురంగ బలాలను సిద్ధం చేసికొని, యుద్ధవ్యూహాన్ని రచించి, ఆ పాండవులకు ఆశ్చర్యం కలిగేటట్లు ఉద్ధతమైన వేగంతో ఢీకొని యుద్ధం చేద్దాము. అట్లా చేస్తే విజయం గైకొనవచ్చును-' అని చెప్పగా, ఆ దుర్యోధనుడు సంతోషించినవాడై 'అది ఆమోదయోగ్యమయిన ఉపాయం. అట్లే చేద్దాము.' అని చెప్పి, తగిన విధంగా అర్హమయిన వారికి తెలియచేసి బయలుదేరి అక్కడికి రెండామడల దూరంలో ఉన్న సరస్వతీనది సమీపంలో బహిరంగ ప్రదేశానికి సేనలను తీసికొని వెళ్ళి సమస్త జనులతో, వాహనాలతో కూడుకొనినవాడై ఆ మహానదిలో ఇష్టానుసారంగా స్నానపానాదులు కావించి, కావలసిన విధంగా తమవెంట తెచ్చిన పలురకాలయిన ఆహారాలను భుజించి సంతృప్తిని చెంది, ప్రియమైన సరససల్లాపాలు కొనసాగిస్తూ ఉండగా, అట్టి సమయంలో ఇంతకుముందు చెప్పిన యోధవరులు (కృపాచార్య కృతవర్మాశ్వత్థామ శకుని శల్యులు, చిత్రసేనాదు లయిన నీ కుమారులు, కర్ణుడి కుమారుడు సత్యసేనుడు మొదలయిన ఇష్టజనులు) ఆ దుర్యోధనుడితో ఈ ప్రకారంగా చెప్పారు.

**విశేషం:** చిత్రసేనుడు: ఇతడు ధృతరాష్ట్రుడి నూర్గురు పుత్రులలో ఒకడు. ఇతడికి సత్యసంధుడనే మరొక పేరు ఉన్నది. ధృతరాష్ట్రుడి వందమంది పుత్రులలో సత్యసేను డనే పేరుగల పుత్రుడు కూడ ఉన్నాడు. అతడుకూడా ధృతరాష్ట్రుడి పుత్రులలో గల పదకొండుమంది మహారథులలో ఒక మహారథి. అందువలన ధృతరాష్ట్రపుత్రుడు సత్యసేనుడికి, కర్ణుడి పుత్రుడు సత్యసేనుడికి భేదం తెలియటానికి 'కర్ణుకొడుకు సత్యసేనుండు' అని ప్రత్యేకంగా చెప్పబడిందని గ్రహించాలి.

**చ. 'వెరవును లావునుం గలిగి విక్రమసంపద సొంపు మీఱ భూ**
**వర భవదీయమైన బలవర్గము నొడ్డన మేర్ప వీఁకమైఁ**
**బురికొలుపంగ నిర్భయతఁ బోరెడు నట్లుగఁ దాను ముందరై**
**తిరముగఁ జేయఁ జాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుఁగన్.' 75**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజులలో శ్రేష్ఠుడవైన దుర్యోధనా!; వెరవును= ఉపాయమును; లావునున్= బలమును; కలిగి= కలిగి ఉండి; విక్రమ= పరాక్రమముయొక్క; సంపదన్= ఐశ్వర్యంయొక్క; సొంపు= సమృద్ధిని; మీఱి= అతిక్రమించి; భవదీయము= నీకు సంబంధించినది; ఐన= అయినటువంటి; బలవర్గమును= సైన్యసమూహమును; ఒడ్డనము= వ్యూహముగ; ఏర్పన్= ఏర్పరచగల; వీఁకమైన్= పరాక్రమముతో; పురికొలుపంగన్= ఉద్రేకము పుట్టించగల; నిర్భయతన్= భయము లేకుండగ; పోరాడునట్లుగన్= యుద్ధముచేయునట్లుగ; తాను= తానే; ముందరై= ముందుగా ఉండి (అగ్రభాగమున ఉండి); తిరముగన్= స్థిరముగ; చేయన్= యుద్ధము చేయుటకు; చాలు= సమర్థుడై; ఒక; ధీరున్= ధైర్యశాలిని; సైన్యనాథుఁగన్= సేనకు అధిపతినిగ; ఒనర్పుము= చేయుము.

**తాత్పర్యం:** 'రాజశ్రేష్ఠుడవైన దుర్యోధనా! ఉపాయబలం కలిగి ఉండి, పరాక్రమ సంపద సమృద్ధిగా ఉండి, నీ సైన్య సమూహంతో వ్యూహాన్ని ఏర్పరచి, పరాక్రమంతో ఉద్రేకాన్ని పుట్టించి, నిర్భయంగా యుద్ధం చేయటానికి సమర్థుడైన ఒక ధైర్యశాలిని సైన్యాధిపతిగా చేయుము.'

**వ. అనిన విని వృషస్కంధుండును పీనదీర్ఘభుజార్గళుండును భర్గవరలబ్ధజన్ముండును దివ్యాస్త్రవేదియు నవ్యాహతవిక్రమోద్దాముండును నగు నశ్వత్థామ నాలోకించి యాదరభరితుండగుచు నాధరణీవరుండతని కిట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; వృష= ఎద్దుమూపువంటి; స్కంధుండును= భుజముల మధ్యభాగం కలవాడును; పీన= ఉబ్బిన (లేక) బలిసిన; దీర్ఘ= పొడవైన; భుజా+అర్గళుండును= గడియమ్రాకులవంటి భుజములుకలవాడును (పూర్వము తలుపులకు పెట్టుకొను గెడ - గట్టిగా లావుగా - పొడవుగా ఉండెడిది. దానికి గడియమ్రాను అనిపేరు. దీనినే అర్గళమందురు.); భర్గ= శివునియొక్క; వర= వరము వలన; లబ్ధ= పొందిన; జన్ముండును= పుట్టుక కలవాడును; దివ్య= దేవతలకు సంబంధించిన; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములను గూర్చి; వేదియును= తెలిసినవాడును; అవ్యాహత= అడ్డులేని విధంగా; విక్రమ= పరాక్రమంచేత; ఉద్దాముండును= గొప్పవాడును; అగు= అయినటువంటి; అశ్వత్థామను; ఆలోకించి= చూచి; ఆదర= గౌరవభావముతో; భరితుండు= నిండిన హృదయము కలవాడు; అగుచున్= అగుచు; ఆ ధరణీ వరుండు= భూమికి భర్త అయిన ఆ దుర్యోధనుడు; అతనికిన్= అతడికి - అనగా ఆ అశ్వత్థామతో; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** వృషము మూపు వంటి మూపుకలవాడూ, ఉబ్బుగా ఎత్తుగా పొడవుగా గడియమ్రానువంటి భుజాలు కలవాడూ, శివుడివరం వలన పుట్టినవాడూ, దివ్యాస్త్రాలను తెలిసినవాడూ, అడ్డులేని పరాక్రమంతో భయంకరుడు - అయిన అశ్వత్థామను దుర్యోధనుడు చూచి ఆదరపూర్వకంగా ఇలా అన్నాడు.

**ఆ. 'అనఘ! నీవు నాకు నాచార్యునట్లు। నేడుగడయుఁ గాన హితము సెప్పఁ**
**దగు బలాధినాథుఁడుగఁ జేయ నర్హుని। నెల్ల వినఁగ నిశ్చయింప వలయు.' 77**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! అనగా పూజ్యుడా!; నీవు; నాకున్; ఆచార్యు= ద్రోణాచార్యుని; అట్టులన్= ఆ విధముగ; ఏడుగడయున్= రక్షకుడవు; కానన్= కావున; హితము= క్షేమము(లేక)శుభము; చెప్పన్= చెప్పుటకు; తగున్= తగినవాడవు; బల= సైన్యమునకు; అధినాథుడుగన్= అధిపతిగ; చేయన్= చేయుటకు; అర్హునిన్= యోగ్యతకలవాణ్ణి; ఎల్లన్= అందరు; వినఁగన్= వినునట్లుగ; నిశ్చయింపన్= నిర్ణయించగా; వలయున్= వలయును. (అనగా నిర్ణయించుము.)

**తాత్పర్యం:** 'ఓ పూజ్యుడా! నీవు నాకు ద్రోణాచార్యులవంటి రక్షకుడవు. నాకు క్షేమాన్ని, శుభాన్ని చెప్పటానికి తగినవాడవు. అందువలన సైన్యాధిపతిగా యోగ్యత కలవాడిని అందరు వినేటట్లు నిర్ణయించుము.

**చ. అనుటయు నాతఁడిట్టులను 'నజ్జనపాలున కాజి నైపుణం**
**బున మహనీయశౌర్యమును భూరిబలంబును సర్వసత్త్వవే**
**దనముఁ బరాక్రమోద్ధతియు ధైర్యసమగ్రతయుం గలండు శ**
**ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా! 78**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ఇట్లు చెప్పగా; ఆ జన పాలునకున్= రాజైన ఆ దుర్యోధనునకు; ఆతఁడు= ఆ అశ్వత్థామ; ఇట్టులు= ఈ ప్రకారముగా; అనున్= అనెను; కౌరవేశ్వరా!; ఆజిన్= యుద్ధమునందు; నైపుణంబును= నేర్పరితనమును; మహనీయ= మిక్కిలి గొప్పది అయిన - అనగా శ్రేష్ఠమయిన; శౌర్యమును= పరాక్రమమును; భూరి= అధికమయిన; బలంబును= శక్తియును; సర్వసత్త్వ వేదనమును= సమస్తమైన సేనాబలాలకు బాధ కలిగించటమూ; పరాక్రమ= పరాక్రమమునందు; ఉద్ధతియున్= దర్పమును; ధైర్య= ధీరత్వమునందు; సమగ్రతయున్= సంపూర్ణత్వమును; కలండు= కలిగియున్నట్టి; శల్యుని; రథినీ= సైన్యమునకు; పతిత్వ= అధిపతిత్వముయొక్క; మహిమ= గొప్పతనముచే; ఉజ్జ్వలున్= ప్రకాశవంతుని; చేయుము.

**తాత్పర్యం:** దుర్యోధనుడు సేనాపతిత్వానికి అర్హుడిని నిర్ణయించుమని అశ్వత్థామను కోరగా, అశ్వత్థామ ఆ దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు: 'ఓ కౌరవేశ్వరా! దుర్యోధనా! యుద్ధవిద్యయందు నేర్పరితనం కలవాడు, శ్రేష్ఠమైన శౌర్యపరాక్రమాలు కలవాడు, ఎవరెవరి శక్తి ఏ పాటిదో తెలిసి సేనాబలాలను బాధించగలవాడు, పరాక్రమ దర్పం, సంపూర్ణమయిన ధైర్యం కలవాడు అయిన శల్యుడిని సైన్యాధిపతిగా అభిషిక్తుడిని చేయుము.

**క. నినుఁబట్టి పాండుపుత్రులఁ । దన మేనల్లురఁ దొఱంగె ధరణీశ్వర! యీ**
**తనిఁగడచిన పరమహితులు । మనకుఁ గలరె? యితఁడు లోకమాన్యుఁడు గాఁడే? 79**

**ప్రతిపదార్థం:** ధరణీశ్వర!= భూమికి ప్రభువు అయిన దుర్యోధనా!; నినున్= నిన్ను; పట్టి= చేకొని; (నినున్ పట్టి= నీగురించి); తన మేనల్లురన్= చెల్లెలి కుమారులైన; పాండుపుత్రులన్= పాండురాజు కుమారులయిన నకుల సహదేవులను; తొఱంగెన్= విడిచిపెట్టాడు; ఈతనిన్= ఈతనిని అనగా శల్యుని; కడచిన= మించిన; పరమహితులు= మిక్కిలి మేలు కోరేవారు; మనకున్= మనకు; కలరె?= ఉన్నారా?; ఇతఁడు= ఈ శల్యుడు; లోక= లోకముచేత అనగా ప్రజలచేత; మాన్యుఁడు= పూజింపదగినవాడు; కాఁడే?= కాడా?; (పూజింపదగినవాడని తాత్పర్యము.)

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! నీ వలన ఇతడు తన మేనల్లురు అయిన పాండవులను వదలి వచ్చాడు. ఇంతకు మించిన గొప్పవారు కాని, మన హితం కోరేవారు కాని మనకు లేరు. ఈ శల్యుడు లోకపూజ్యుడు సుమా!

**తే. కార్తికేయుం డధీశుఁడుగా నమర్త్యు । లెలమిఁ బురికొని దైత్యుల గెలుచుకరణి**
**మద్రవిభుఁ డగ్రణిగఁ నేచి మనము నడచి । కడిఁది పగఱ జయింతము కౌరవేంద్ర!' 80**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కౌరవులకు ప్రభువు అయిన దుర్యోధనా!; కార్తికేయుండు= కుమారస్వామి; అధీశుఁడుగాన్= అధిపతిగా (దేవసేనకు అధిపతిగ); అమర్త్యులు= దేవతలు; (మృత్యువు కలవారు మర్త్యులు - మృత్యువులేని వారు అమర్త్యులు); ఎలమిన్= సంతోషముతో; పురికొని= ఉద్రేకించి; దైత్యులన్= రాక్షసులను; గెలుచు= జయించు; కరణిన్=

విధముగా; మద్రవిభుఁడు= మద్రదేశ ప్రభువు అయిన శల్యుడు; అగ్రణిగన్= అధిపతిగ - (లేక) ప్రధానుడుగా (లేక) ముఖ్యుడిగా; ఏచి= విజృంభించి; మనము; నడచి= యుద్ధమునకు వెళ్ళి; కడిఁది పగఱన్= జయింపనలవికాని శత్రువులను; జయింతము= జయించగలము.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! కుమారస్వామి సేనాధిపతిగా దేవతలు ఉద్రేకించి రాక్షసులను జయించిన విధంగా మద్రదేశపు ప్రభువు అయిన శల్యుడిని సేనాధిపతిగా చేసి విజృంభించి యుద్ధంలో శత్రువులను జయించగలము.

**విశేషం:** అలం: ఉపమ. కార్తికేయుడు: సప్తర్షిమండలానికి ఎదురుగా మధ్యాకాశంలో మనకు ఆరు నక్షత్రాల గుంపు కనిపిస్తుంది. జానపదులు వాటిని పిల్లలకోడి చుక్కలంటారు. జ్యోతిశ్శాస్త్రంలో వాటిని కృత్తికలు అంటారు. ఆధునిక పదార్థ విజ్ఞనశాస్త్రజ్ఞులు - వాటిని - కోట్లాది అగ్ని నక్షత్రాల మండలం అంటారు. సప్తమహర్షుల పత్నులలో ఒక్క వసిష్ఠపత్ని అరుంధతి తప్ప మిగిలిన మహర్షిపత్నులందరిని భర్తలు శపించగా వీరికి పరమశివుడు నక్షత్రమండలంలో స్థానం కల్పించాడనీ, వీరే ఆరు నక్షత్రాలుగా వెలుగుతున్నారనీ అంటారు పౌరాణికులు. ఈ కృత్తికలను తల్లులుగా స్వీకరించి నందున కుమారస్వామికి కార్తికేయు డనే పేరు వచ్చింది.

**వ. అనిన విని సమస్త జనపతులును 'జయ జయ' శబ్దంబులతో శల్యుం బరివేష్టించి సంగరోత్సాహంబునం బొంగిరి. కురునాథుండును గద్దియ డిగి సవినయంబున నమ్మద్రవిభున కభిముఖుండై యిట్లనియె. 81**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; సమస్త= సమస్తమయిన; జనపతులును= రాజులును; జయ జయ= 'జయ జయ'అను; శబ్దంబులతోన్= ధ్వనులతో; శల్యున్= శల్యుడిని; పరివేష్టించి= చుట్టునుమూగి; సంగర= సంగ్రామమునందలి; ఉత్సాహంబునన్= ప్రయత్నముతో; పొంగిరి= సంతోషించిరి; కురునాథుండును= దుర్యోధనుడును; గద్దియ= ఆసనము; డిగి= దిగి; సవినయంబునన్= వినయసహితముగా అనగా వినమ్రత కలిగినవాడగుచు; ఆ+మద్రవిభునకున్= మద్రదేశ ప్రభువు అయిన ఆ శల్యుడికి; అభిముఖుండై= ఎదురు మొగము కలవాడై; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** మద్రవిభుడిని సేనాపతిగా చేస్తే శత్రువులను జయించగలమని అశ్వత్థామ చెప్పగా విని, రాజులందరు జయజయధ్వానాలతో శల్యుడిని చుట్టుముట్టి యుద్ధోత్సాహంతో పొంగిపోయారు. దుర్యోధనుడు కూడా గద్దె దిగి శల్యుడికి అభిముఖంగా నిలబడి వినమ్రతతో ఈ ప్రకారంగా పలికాడు.

**ఉ. పొచ్చెము లేని నెయ్యమునఁ బూని విపద్దశనొందకుండఁగా**
**నెచ్చెలిఁగావఁ జూచు మహనీయున కిట్టిద కాల మిప్పు డీ**
**వచ్చుపడంగ నీ భుజబలాతిశయంబున నద్భుతంపు గె**
**ల్పిచ్చి కృతార్థుఁ జేయు నను నే నినుఁ జెందియుఁ దూలఁ బోదునే? 82**

**ప్రతిపదార్థం:** పొచ్చెము= కపటము; లేని= లేనట్టి; నెయ్యమునన్= స్నేహము వలన; పూని= ఉద్యమించి (లేక) ప్రయత్నించి; విపద్= ఆపదతో కూడిన; దశన్= అవస్థను; ఒందకుండఁగాన్= పొందకుండగ; నెఱ+చెలిన్= నెచ్చెలిన్= మంచి మిత్రుని; కావన్= రక్షింప; చూచు= చూచెడి; మహనీయునకున్= గొప్పవానికి; ఇట్టిది+అ= ఇటువంటిదే (అవధారణార్థము); కాలము= సమయము; ఇప్పుడు; (ఈ సమయమున); ఈవు= నీవు; నీ భుజబలాతిశయంబునన్; నీ= నీయొక్క; భుజ= భుజములయొక్క; బల= పరాక్రమముయొక్క; అతిశయంబునన్= విజృంభణంతో; అచ్చుపడంగన్= స్పష్టపడేటట్లుగా; అద్భుతంపు=

ఆశ్చర్యకరమయిన; గెల్పు= విజయము; ఇచ్చి= సమకూర్చి; ననున్= నన్ను; కృతార్థున్= కృతకృత్యుని; చేయు= చేయుము; నినున్= నిన్ను; ఏన్= నేను; చెందియున్= పొందియుండి కూడ; తూలఁబోదునే?= నశిస్తానా?

**తాత్పర్యం:** కపటం లేని స్నేహం కారణంగా ఉద్యమించి ఆపద పొందకుండ నెచ్చెలిని కాపాడే మహనీయుడికి ఇదే మంచి సమయం. ఇప్పుడు నీ భుజబలంతో విజృంభించి ఆశ్చర్యకరమయిన విజయాన్ని సమకూర్చి నన్ను కృతార్థుడిని చేయగల నిన్ను నేను పొంది ఉండి కూడా నష్టపోతానా?

**క. పూనుము చమూపతిత్వము । నా నమ్మినవారు నేను నరవర బలసం**
**తానంబుతోడఁ బరిజన । మై నడచెద మాక్రమింపు మరివర్గంబున్.' 83**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; చమూ= సైన్యమునకు; పతిత్వము= అధిపతిత్వమును; పూనుము= వహింపుము; నా నమ్మినవారు= నన్ను నమ్ముకొని ఉన్నవారు; నేను; నరవర= రాజశ్రేష్ఠులయొక్క; బల= సైన్యములయొక్క; సంతానంబుతోడన్= సమూహముల తోడను; పరిజనమై= సేవకులమై; నడచెదము= యుద్ధమునకు వెడలెదము; అరి= శత్రువులయొక్క; వర్గంబున్= సమూహమును; ఆక్రమింపుము= జయించుము.

**తాత్పర్యం:** శల్య మహారాజా! సైన్యాధిపత్యం వహించుము. నేనూ, నన్ను నమ్మినవారు నీ సేవకులమై నీ వెంట నడుస్తాము. అందరము కలిసి యుద్ధానికి రాగలము. శత్రుసమూహాన్ని జయించుము.'

**చ. అన విని శల్యుఁ డిట్లనియె 'నమ్మనుజేంద్రును కిప్పు డింత ప్రా**
**ర్థన మొనరింప నేల? వసుధావర! యే నినుఁ జేరి నప్డ నా**
**ధనమును బ్రాణమున్ బలవితానము నీకు సమర్పణంబు సే**
**సినయవి గావె? నీ పనుపు సేసెదఁ గౌరవసేనఁ గాచెదన్. 84**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; శల్యుఁడు; ఇట్లు= ఈ విధంగా; మనుజ= మానవులకు; ఇంద్రునకున్= ప్రభువు అయిన ఆ దుర్యోధనుడికి; అనియెన్= చెప్పెను; ఇప్పుడు; ఇంత; ప్రార్థనము= వేడుకొనటం; ఒనరింపన్= చేయగ; ఏల?; వసుధావర!= భూమికి భర్తఅయిన దుర్యోధనా!; ఏన్= నేను; నినున్= నిన్ను; చేరినప్డు+అ= కూడినప్పుడే; నా= నాయొక్క; ధనమును= సంపదయును; ప్రాణమును; బలవితానమున్= సైన్య సమూహమును అనగా నా సర్వస్వమును; నీకున్; సమర్పణంబు= నీ పరము; చేసినయవి= చేయబడినవి; కావె?= కావా?; నీ పనుపు= నీవు నియోగించిన పనిని; చేసెదన్= చేయుదును; కౌరవసేనన్= కురుసైన్యమును; కాచెదన్= రక్షించెదను.

**తాత్పర్యం:** అని చెప్పగా విని, శల్యుడు ఆ మనుజేంద్రుడయిన దుర్యోధనుడితో ఈ విధంగా అన్నాడు. 'ఇంత ప్రార్థన మెందుకు? నేను నీ పక్షంలో చేరినప్పుడే నా ధనాన్నీ ప్రాణాన్నీ - సైన్యసమూహాన్నీ, నా సర్వస్వాన్నీ నీకు సమర్పించాను. నీవు నియోగించిన పనిని చేస్తాను. కురుసైన్యమును రక్షిస్తాను.

**మ. భుజవీర్యంబున నచ్యుతార్జునులు నన్ బోలంగ లే రల్క వ**
**చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాచే నొత్తు రే నేచి య**
**క్కజపుంజేవయు లావు జూపువడికిం గౌంతేయులే యోర్తు రా**
**ప్రజయున్ నీ ప్రజయుం దలంగఁ జెలఁగం బాటింతు నాటోపమున్. 85**

**ప్రతిపదార్థం:** భుజవీర్యంబునన్= భుజబలపరాక్రమమునందు; అచ్యుత+అర్జునులు= అచ్యుతార్జునులు= శ్రీకృష్ణార్జునులు; నన్= నన్ను; పోలంగన్= సరిపోవగ; లేరు; అల్క= కోపము; వచ్చి; జయింపఁగన్= గెలుచుటకు; కడంగినన్= పూనుకొనినచో; సురలు= దేవతలు; నాచేన్= నాచేత; నొత్తురు= బాధచెందగలరు; ఏన్= నేను; ఏచి= విజృంభించి; అక్కజపున్= ఆశ్చర్యకరమయిన; చేవయున్= ధైర్యమును; లావున్= బలమును; చూపు= చూపించెడి; వడికిన్= వేగమునకు; కౌంతేయులే(లా)= కుంతీకుమారులా; ఓర్తురు= సహిస్తారు లేదా ఓడిస్తారు?; ఆ ప్రజయున్= ఆ ప్రజలును; నీ ప్రజయున్= నీ ప్రజలును; తలంగన్= తొలగిపోవునట్లుగ; చెలఁగన్= సంతోషించునట్లుగా; ఆటోపమున్= విజృంభణమును; పాటింతున్= ఆచరించి చూపిస్తాను.

**తాత్పర్యం:** భుజ బల పరాక్రమంలో శ్రీకృష్ణార్జునులు నాతో సరి సమానులుకారు. నేను కోపం వచ్చి జయించటానికి పూనుకుంటే దేవతలు కూడా నాచేత బాధింపబడుతారు. నేను విజృంభించి ఆశ్చర్యకరమయిన ధైర్యసాహస శౌర్యాలు చూపితే ఆ కౌంతేయులా సహించువారు? కావున పాండవసేనలు పారిపోయేటట్లుగా, కౌరవసేనలు సంతోషించేటట్లుగా, నా గర్వాన్ని, ప్రతాపాన్ని చూపిస్తాను.

**విశేషం:** ఆ ప్రజయున్ తలంగన్. ఈ ప్రజయున్ చెలంగన్ - అని క్రమాన్వయం. దేవతలు సహితం నాచే బాధింపబడతారంటే, ఇంక ఆ పాండవులా సహించగలవారు? లేదా ఓడించగలవారు? ఓడు= ఓడిపోవు, ఓడుచు= ఓరుచు= ఓడించు; ఓరుచు+దురు= ఓర్తురు; ఓడిస్తారు; ఓర్చు= సహించు - ఓర్చుదురు= ఓర్తురు= సహిస్తారు.

**చ.** **అఱిముఱి బాణజాలముల నక్కడి సైనికులం దెరల్చెదన్**
**గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసిన వీరవర్గమున్**
**నఱికెదఁ జూచు ఖేచరగణంబుల కచ్చెరుపా టొనర్చెదన్**
**బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన రూ పడంచెదన్.** **86**

**ప్రతిపదార్థం:** అఱిముఱి= త్వరత్వరగా; బాణ= అమ్ములయొక్క; జాలములన్= వరుసలతో; అక్కడి= ఆ చోటునందున్న; సైనికులన్= సేనలను; తెరల్చెదన్= తొలగించెదను; కుఱుకొని= యత్నించి; నాకున్; మాఱుకొని= ఎదుర్కొని; కోల్తలన్= ఎదుట నిలిచి యుద్ధమును; చేసిన; వీర= శూరులయొక్క; వర్గమున్= సమూహమును; నఱికెదన్= ఖండించెదను; చూచు= చూచుచుండెడి; ఖే= ఆకాశమున; చర= సంచరించెడి దేవతలయొక్క; గణంబులకున్= గుంపులకు; అచ్చెరుపాటు= ఆశ్చర్యము; ఒనర్చెదన్= కలిగిస్తాను; పాండునందనులన్= పాండురాజు కుమారులను; పఱపెదన్= పాఱిపోవునట్లు చేసెదను; పాఱక= పాఱిపోకుండ; నిల్చినన్= నిలిచి ఉన్నచో; రూపు= రూపమును; అడంచెదన్= నశింపచేసెదను.

**తాత్పర్యం:** యుద్ధభూమియందలి సైనికులను తొందర తొందరగా బాణాల వరుసలను ప్రయోగించి తొలగిస్తాను. నాకు దగ్గరపడి నన్ను ఎదుర్కొని ఎదుట నిలిచి యుద్ధం చేసే వీర వర్గాన్ని ఖండిస్తాను. దివినుండి చూచే దేవ గణాలు ఆశ్చర్యపడేటట్లు చేస్తాను. పాండుకుమారులను పారద్రోలుతాను. పారిపోకుండా నిలిచి ఉంటే సంహరిస్తాను.

**శా.** **గంగానందను పోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ**
**జుం గీడాడుచు నీతఁ డెవ్వఁ డొకో యంచున్ శల్యుఁడే! యిట్టి వా**
**నిం గయ్యంబుల మున్నుగాన మనుచు న్వేభంగులం జూప టె**
**ల్లం గీర్తింప ధనుఃకళానిపుణలీలాఖేలతన్ జూపెదన్.** **87**

**ప్రతిపదార్థం:** గంగానందును= భీష్ముని; పోటు= యుద్ధము; మెచ్చక; గురున్= ద్రోణుని; కాదు; అంచున్= అనుచు; రాధా= రాధయొక్క; తనూజున్= కుమారుడైన కర్ణుని (కన్నతల్లికుంతి - పెంచిన తల్లి రాధ - కర్ణుడు రాధేయుడు గానే ప్రసిద్ధుడు); కీడు= తక్కువ; ఆడుచున్= చేయుచు; ఈతఁడు; ఎవ్వఁడు; ఒకొ!; అంచున్= అనుచు; శల్యుఁడే!= శల్యుడా!; ఇట్టి వానిన్= ఇటువంటివానిని; మున్ను= ఇంతకుమునుపు; కయ్యంబులన్= యుద్ధములందు; కానము= చూడము; అనుచున్= అనుచు; వేభంగులన్= వేయి విధములుగా; చూపఱు= చూచువారు; ఎల్లన్= అందరును; కీర్తింపన్= పొగడుచుండగా; ధనుః= ధనుస్సుయొక్క; కళా= విద్యయందలి; నిపుణ= నేర్పరితనమును; లీలా= వినోదము కలిగించు; ఖేలతన్= క్రీడగా; చూపెదన్= చూపించెదను.

**తాత్పర్యం:** భీష్మడి యుద్ధాన్ని మెచ్చుకొనక, ద్రోణుడిని కాదని, కర్ణుడిని తక్కువచేస్తూ యుద్ధం చేసే ఈతడు ఎవ్వడు? శల్యుడేనా? అని ఆశ్చర్యం చెందుతూ ఇంతకు ముందెన్నడూ ఏ యుద్ధంలోనూ - ఇట్టి వాడిని చూడలేదంటూ, వేయివిధాలుగా చూచేవారందరూ కీర్తించేటట్లు నా విలువిద్యా నైపుణ్యాన్ని వినోదక్రీడగా చూపిస్తాను.

**విశేషం:** ఈ సందర్భంలో మూడు పద్యాలలో (85,86,87) తిక్కన శల్యుడి ప్రతాపమును వర్ణించాడు. ఆ వర్ణన వలన శల్యుడు ఆత్మప్రతాపస్తుతి పరాయణుడయిన ఉద్ధతుడుగా కనిపిస్తాడు. ఉదాత్తుడుగా కనిపిస్తాడు. మూలమున వ్యాసభగవానులు శల్యుని ఉదాత్తుడుగా చిత్రించాడు. "అద్య చాహం రణే సర్వాన్ పాంచాలాన్సహ పాండవైః । నిహనిష్యామి వా రాజన్! స్వర్గం యాస్యామి వా హతః" - ఇది వ్యాసుడు చేసిన శల్యుడి ధీరోదాత్త లక్షణం. (శల్య. అధ్యా-7)

### దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట (సం. 9-6-5)

**వ. అని పలికిన నీ సుతుండు ప్రీతుండై కనకకలశంబుల సరస్వతీజలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునఁ దగురాజులుం దానును సేనామధ్యంబున భద్రవిధానోపేతంబుగా నమ్మద్రవిభు నభిషేకించి బలాధిపత్యపట్టబంధంబు నిర్వర్తించిన శంఖభేరీప్రముఖమంగళతూర్యరవంబులు సెలంగ సైనిక సింహనాదంబు లుల్లసిల్ల నప్పు డా శల్యునుద్దేశించి దీవనలం బొగడ్తల నఖిల జనంబులును ముఖరులయి రిట్లు సంతసిల్లి సపరివారంబుగాఁ గురుభూమీశ్వరుండు విశ్రామంబు నొందె. నట్టియెడ మున్న సమరజయంబునం బ్రమోదభరితుండగుచు నిజశిబిరంబునకుం జనిన పాండవాగ్రజుండు బంధుమిత్రపరిజనంబులఁ దమతమ విడిదలకుం బోవం బనుపక యుచితప్రదేశంబునఁ బేరోలగంబుండి మనవారివలనివిశేషంబు లరయఁ జారులం బనిచినవాఁడై వారలు మగిడి వచ్చునంతకు నే మేని వినోదంబులం బ్రొద్దువుచ్చి యక్కడి యుత్సాహంబు తెఱంగంతయు విని యచ్యుతునాననం బాలోకించి యిట్లనియె: 88**

**ప్రతిపదార్థం:** (సంజయుడు ధృతరాష్ట్రునకు ఇట్లు చెప్పెను) అని= ఈ విధముగా శల్యుడు; పలికినన్= చెప్పిన తరువాత; నీ సుతుండు= నీ కుమారుడయిన దుర్యోధనుడు; ప్రీతుండై= సంతోషించినవాడై; కనక= బంగారముతో చేసిన; కలశంబులన్= చెంబులతో (జలపాత్రలతో); సరస్వతీ జలంబులు= సరస్వతీ నదియొక్క నీళ్ళు; తెప్పించి; శాస్త్ర= ధర్మశాస్త్రములందు; ఉక్త= చెప్పిన; ప్రకారంబునన్= విధముగా; తగు= యోగ్యతగల; రాజులున్= రాజులును; తానును; సేనామధ్యంబునన్= సేనయొక్క మధ్యభాగమున; భద్ర= శుభకరమగు; విధాన= వేద విహితమగు పద్ధతిలో; ఉపేతంబుగాన్= కూడినదిగా; ఆ మద్రవిభున్= ఆ మద్రదేశపు ప్రభువు అయిన శల్యుడిని; అభిషేకించి; బల= సైన్యమునకు; ఆధిపత్య; పట్ట= పట్టం; బంధంబు= కట్టుటను;

నిర్వర్తించినన్= నిర్వర్తించగా; శంఖ= శంఖములు; భేరీ= భేరులు; ప్రముఖ= మొదలగు వాద్యాలయొక్క; మంగళ= శుభప్రదములయిన; తూర్య= వాద్యములయొక్క; రవంబులు= ధ్వనులు; చెలంగన్= మ్రోయగా; సైనిక= సైనికులయొక్క; సింహనాదంబులు= సింహగర్జనలు; ఉల్లసిల్లన్= విజృంభించగా; అప్పుడు; ఆ శల్యున్= ఆ సేనాధిపతిఅయిన శల్యుని; ఉద్దేశించి= గురించి; దీవనలన్= ఆశీస్సులతో; పొగడ్తలన్= స్తుతులతో; అఖిలజనంబులును= సమస్తమయిన ప్రజలును; ముఖరులు= శబ్దం చేసిన వారు; అయిరి; ఇట్లు= ఈ ప్రకారముగా; సంతసిల్లి= సంతోషించి; సపరివారంబుగాన్= అనుచరులతో కూడిన వాడగుచు; కురుభూమీశ్వరుడు= కురురాజయిన దుర్యోధనుడు; విశ్రామంబును= విశ్రాంతిని; ఒందెన్= పొందెను; అట్టి+ఎడన్= ఆసయమంలో; మున్ను= అంతకుముందు; సమర= సంగ్రామమందలి; జయంబునన్= విజయమువలన; ప్రమోదభరితుండు= ఆనందం నిండిన హృదయం కలవాడు; అగుచున్; నిజ= తనయొక్క; శిబిరంబునకున్= విడిదికి; చనినన్= వెడలగా; పాండవాగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; బంధుమిత్ర= చుట్టములను, స్నేహితులను; పరిజనంబులన్= సేవకులను; తమ తమ= వారి వారి; విడిదలకున్= శిబిరములకు; పోవన్= పోవుటకు; పనుపక= నియోగించక; ఉచిత= తగిన; ప్రదేశంబునన్= చోటునందు; పేరు+ఓలగంబు= పెద్దకొలువు; ఉండి; మనవారివలని= మనవారియొక్క; విశేషంబులు= తెలిసికొనదగిన విశిష్ట విషయములు; అరయన్= విచారించి తెలిసికొనుటకు; చారులన్= గూఢచారులను; పనిచినవాఁడై= పంపించినవాడై; వారలు; మగిడి= తిరిగి; వచ్చునంతకున్= వచ్చువరకు; ఏమి+ఏని= ఏమైనను; వినోదంబులన్= వేడుకల వలన; ప్రొద్దు+పుచ్చి= కాలముగడపి; అక్కడి; ఉత్సాహంబు= ప్రయత్నము యొక్క; తెఱంగు= విధము; అంతయున్; విని; అచ్యుతున్= శ్రీకృష్ణుడియొక్క; ఆననంబు= ముఖము; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పాడు. 'శల్యుడు తన ప్రతాపాన్ని, బల పరాక్రమాలను గూర్చి చెప్పిన తరువాత నీ కుమారుడు దుర్యోధనుడు సంతోషించి, బంగారు చెంబులతో సరస్వతీ నదీ జలాలు తెప్పించి శాస్త్రోక్తంగా యోగ్యులయిన రాజులును, తానును సేనామధ్యంలో శుభప్రదమైన వేదవిహిత విధానంతో ఆ మద్ర దేశాధిపతి శల్యుడిని అభిషేకించి, సైన్యాధిపత్యానికి చిహ్నమయిన పట్టబంధాన్ని తొడిగి అభిషేకం నిర్వర్తించగా మంగళవాద్యధ్వనులు మిన్నుముట్టగా సైనికులు ఆనందోత్సాహాలతో సింహనాదాలు చేయగా, ఆ సమయంలో సేనాధిపతి అయిన శల్యుడిని ఉద్దేశించి ఆశీస్సులతో, స్తుతులతో జనులందరు రణగొణ ధ్వనులు చేశారు. ఈ విధంగా సంతోషం పొంది, అనుచరులతో కూడి దుర్యోధనుడు విశ్రాంతిని పొందాడు. ఆ సమయంలో అంతకుముందు సంగ్రామ విజయంవలన ఆనంద భరిత హృదయుడయిన ధర్మరాజు తన విడిదికి వెడలి బంధుమిత్ర పరిజనులను తమ తమ శిబిరాలకు పంపించకుండా, తగిన ప్రదేశంలో పెద్ద కొలువు తీర్చి కౌరవ శిబిరంలో జరుగుతున్న ప్రయత్నాలను విచారించి తెలిసికొనుటకు గూఢచారులను పంపించి, వారు తిరిగి వచ్చేవరకు వేడుకలతో కాలం గడిపి, ఆ కౌరవ శిబిరంలోని ప్రయత్నాన్నంతా విని శ్రీకృష్ణుడి ముఖాన్ని చూచి ఈ ప్రకారంగా అన్నాడు.

**చ.** **'కురుపతి మద్రరాజుఁ దనకున్ బలముఖ్యునిఁగా నొనర్చి సం**
**గరమున కుత్సహించె నధికప్రమదంబున వారిసేనయుం**
**దిరమయి పేర్చియున్నయది దీనికి నెయ్యది సేయువార? మీ**
**వరయుము కార్యవృత్తి హృదయంబునఁ బాండవరక్షణోత్సుకా. 89**

**ప్రతిపదార్థం:** పాండవ= పాండవులను; రక్షణ= కాపాడుట యందు; ఉత్సుకా!= ఉత్కంఠం కలిగినవాడా! - శ్రీకృష్ణా!; కురుపతి= దుర్యోధనుడు; మద్రరాజున్= శల్యుడిని; తనకున్; బల= సేనకు; ముఖ్యునిఁగాన్= అధిపతిగా; ఒనర్చి= చేసి;

సంగరమునకున్= యుద్ధమునకు; ఉత్సహించెన్= ప్రయత్నము చేయుచుండెను; వారి= వారియొక్క; సేనయున్= సైన్యము కూడ; అధికప్రమదంబునన్= మిక్కిలి సంతోషముతో; తిరుమయి= స్థిరమయినదిగ; పేర్చి= విజృంభించి; ఉన్నయది= ఉన్నది; కార్య= చేయదగిన; వృత్తిన్= పనిని; ఎయ్యది= ఏది; చేయువారము?= చేయగలవారము?; ఈవు= నీవు; హృదయంబునన్= మనసులో; అరయుము= విచారింపుము.

**తాత్పర్యం:** 'పాండవ రక్షణమునందే ఉత్కంఠ కలిగిన శ్రీకృష్ణా! కురుపతి మద్రపతి శల్యుడిని తనకు సేనాధిపతిగా చేసి, యుద్ధానికి సిద్ధమయ్యాడు. దీనికి ఏమి చేయగలవారం? నీవు చేయదగిన పనిని మనసునందు ఆలోచించుకో

**వ. నీ వెట్లు నిశ్చయించి పలికె దట్ల సేయుదు' ననిన నమ్మహీకాంతునకు మురాంతకుం డి ట్లనియె: 90**

**ప్రతిపదార్థం:** నీవు; ఎట్లు= ఏ ప్రకారముగా; నిశ్చయించి= నిర్ణయించి; పలికెదు(వు)= చెప్పుదువో; అట్ల; చేయుదున్; అనినన్= అని చెప్పగా; ఆ మహీ= భూమికి; కాంతునకున్= భర్తఅయిన ఆ ధర్మరాజుకు; మురాంతకుండు= శ్రీకృష్ణుడు; (మురుడు అను రాక్షసుడిని సంహరించినందువలన శ్రీకృష్ణునకు మురాంతకుడని పేరు.); ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** నీవు ఏ ప్రకారంగా నిర్ణయించి చెప్పితే అట్లే చేస్తాను' అని చెప్పిన ధర్మరాజుతో శ్రీకృష్ణు డిట్లా అన్నాడు.

**సీ. శల్యు నెఱుంగుదు శౌర్యధైర్యంబు । లగ్గల మాతనికి బాహుబలఘనుండు**
**గాంగేయకుంభజకర్ణుల మిగిలెడుఁ । గాదేని సముఁడగుఁ గాని యసదు**
**గాఁ దలంపఁగరాదు కౌరవపతి మాన్యుఁ, । జేయుట నధికవిజృంభణంబుఁ**
**జూప భీమునకు నర్జునునకు నెనయంగ । రాదు సాత్యకి కోర్వరాదు పార్ష**

**తే. తునకుఁ దత్సోదరులకు మార్కొని పెనంగి । బ్రదుక రాదు నీవీట నా బల్లిదునకు**
**నెదురు రథికునిఁగాన ననేక హేతి । నిపుణశార్దూలవిక్రమ! నీవు దక్క. 91**

**ప్రతిపదార్థం:** శల్యున్= శల్యుని; ఎఱుంగుదున్= ఎరుగుదును; ఆతనికిన్= శల్యుడికి; శౌర్యము= పరాక్రమము; ధైర్యంబులు= ధీరత్వములు; అగ్గలము= అధికము; బాహు= భుజములయొక్క; బల= బలమునందు; ఘనుండు= గొప్పవాడు; గాంగేయ= భీష్మ; కుంభజ= ద్రోణ; కర్ణులన్= కర్ణులను; మిగిలెడున్= మించిపోవును(అనగా అతిశయించును.); కాదేని= అట్లు కాని ఎడల; సముఁడగున్= వారికి సమానుడగును; కాని= అంతేకాని; అసదుగాన్= అల్పునిగా; తలంపఁగన్= భావింప; రాదు; కౌరవపతి= కౌరవులకు ప్రభువు అయిన దుర్యోధనుడు; మాన్యున్= గౌరవింపదగినవాడినిగా (అనగా సైన్యాధిపతిగా); చేయుటన్= చేసినందువలన; అధిక= మిక్కిలి; విజృంభణంబున్= అతిశయంబును; చూపున్= చూపించును; భీమునకును; అర్జునునకును; ఎనయంగన్+రాదు=ఎదురించరాదు; సాత్యకికిన్; ఓర్వరాదు= సహింపరాదు; పార్షతునకున్= ధృష్టద్యుమ్నుడికి; తత్సోదరులకున్= అతని సోదరులకును; మార్కొని= ఎదుర్కొని; పెనంగి= యుద్ధముచేసి; బ్రదుకరాదు= జీవించి యుండుటకు వీలు కాదు; అనేక= వివిధములయిన; హేతి= ఆయుధాలు ప్రయోగించుట యందు; నిపుణ= నైపుణ్యము గల అనగా నేర్పరితనంగల; శార్దూల= పెద్దపులి వంటి; విక్రమ!= పరాక్రమం కలవాడా! నీవు; తక్కన్= తప్ప; ఆ బల్లిదునకున్= అధికబలవంతుడయిన ఆ శల్యునకు; ఎదురు; రథకునిన్= సమానుడైన రథమధిరోహించి యుద్ధము చేయగల యోధుడిని; కానను= చూడను.

**తాత్పర్యం:** శల్యుడిని ఎరుగుదును. ఆ శల్యుడికి పరాక్రమధైర్యాలు అధికం. భుజబలంలో కూడా గొప్పవాడు. భీష్మ, ద్రోణ, కర్ణులను మించినవాడు. లేకుంటే వారితో సమానుడు. అంతేకాని అల్పుడు కాడు. అదీకాక దుర్యోధనుడు ఆతడిని సైన్యాధిపతిగా చేశాడు. అందువలన అతడు యుద్ధంలో అధిక విజృంభణాన్ని ప్రదర్శిస్తాడు. భీముడు కాని, అర్జునుడు కాని, సాత్యకి కాని, ధృష్టద్యుమ్నుడు గాని ఆతడి సోదరులు కాని ఆతడిని ఎదుర్కొనజాలరు. ఎదుర్కొంటే బ్రదుకజాలరు. వివిధాయుధ ప్రయోగ నైపుణ్యం కలిగి, పెద్దపులి వంటి పరాక్రమం కల ఓ ధర్మరాజా! నీవు తప్ప అధికబలవంతుడయిన ఆ శల్యుడిని ఎదుర్కొని యుద్ధం చేయగల రథికుడు మరొకడు మన సేనలో కనపడటం లేదు.

**క. ఒరులయినఁ బెక్కు దినములఁ । బొరిగొను నీ బలము నెల్లఁ బొరివోవ నతం**
**డరిభంజన! నీ వైనం । బరమోత్సాహమున నెల్లి పడవై తతనిన్. 92**

**ప్రతిపదార్థం:** అరిభంజన!= శత్రుసంహారకుడవైన ధర్మజా!; అతండు= ఆ శల్యుడు; ఒరులు= ఇతరులు (అనగా నీవు తప్ప ఇతరులు); అయినన్= అయినచో; పెక్కు= అనేక; దినములన్= రోజులలో; నీ బలమున్= నీయొక్క సైన్యమును; ఎల్లన్= సమస్తమును; పొరిపోవన్= నాశమగునట్లు; పొరిగొనున్= చంపివేయును; అతనిన్= ఆ శల్యుడిని; నీవు; అయినన్= అయినచో; పరమ= ఉత్కృష్టమయిన; ఉత్సాహమునన్= ప్రయత్నముతో; ఎల్లి= రేపు; పడవైతు(వు)= పడగొట్టుదువు (అనగా చంపగలవు).

**తాత్పర్యం:** ఆ శల్యుడు నీవు తప్ప ఇతరులయితే పెక్కు దినాలలో నీ సమస్త సైన్యాన్ని నాశనమయ్యేటట్లు చేస్తాడు. శత్రువులను అణచగల ఓ ధర్మరాజా! నీవు అయితే పరమోత్సాహంతో ఆ శల్యుడిని రేపే సంహరించగలవు.

**ఆ. అతఁడు మేనమామ యను కృప దక్కుము । రాజధర్మమును బురస్కరించి**
**యతుల విక్రమక్రియా పాటవంబున । నవ్విరోధినామ మడఁపవలయు. 93**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ శల్యుడు; మేనమామ; అను= అనెడి; కృపన్= దయను; తక్కుము= విడిచిపెట్టుము; రాజధర్మమును= రాజులయొక్క ధర్మమును; పురస్కరించి= ముందిడుకొని (రాజధర్మమునకు ప్రాముఖ్యమిచ్చి); అతుల= సాటిలేని; విక్రమ= పరాక్రమముయొక్క; క్రియా= అభ్యాసమువలన లభించిన; పాటవంబునన్= శక్తివలన; ఆ విరోధి= ఆ శత్రువుయొక్క; నామము= ప్రసిద్ధి; అడఁపవలయున్= నాశము చేయవలయును.

**తాత్పర్యం:** ఆ శల్యుడు నీ మేనమామ అనే దయను విడిచిపెట్టుము. రాజధర్మానికి ప్రాముఖ్య మిచ్చి, సాటిలేని పరాక్రమంతో ఆ శత్రువు పేరు లేకుండా చేయాలి.

**క. గాంగేయునిఁ గుంభజుఁ గ । ర్ణుం గడచితి మింక నుద్ధురుండగు మద్రే**
**శుం గూల్పు మంతతోడఁ దె । గుం గురుపతి పని జయంబు గొనుము కడంకన్. 94**

**ప్రతిపదార్థం:** గాంగేయునిన్= భీష్ముని; కుంభజున్= ద్రోణుని; కర్ణున్= కర్ణుని; కడచితిమి= దాటితిమి; ఇంకన్= ఇంక; ఉద్ధరుండు= బరువైనవాడు అనగా బలాఢ్యుడు; అగు; మద్రేశున్= శల్యుని; కూల్పుము= పడగొట్టుము (సంహరించుము); అంతతోడన్= అంతటితో; కురుపతి= దుర్యోధనునియొక్క; పని; తెగున్= పరిసమాప్తము అగును; కడంకన్= ప్రయత్నంతో; జయంబున్= విజయమును; కొనుము= కైకొనుము - దక్కించుకొనుము.

**తాత్పర్యం:** భీష్ముడిని, ద్రోణుడిని, కర్ణుడిని దాటాము. ఇంక బలాఢ్యుడు మద్రదేశాధీశుడైన శల్యుడిని కూల్చుము. అంతటితో కురుపతి పని పూర్తవుతుంది. ప్రయత్నించి విజయాన్ని గైకొనుము.

**వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 95**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అతనికిన్= శ్రీకృష్ణుడికి; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పిన తరువాత మరల ధర్మరాజు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'అనఘ! నీవు చెప్పినట్టులు సేసెద; । మున్ను పలికినాఁడ నన్నరేంద్రు**
**కడిమి నాకుఁ బాలుగాఁ బూని యుద్యోగ । వేళయందు నెల్ల వినుచునుండ. 96**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితా! - శ్రీకృష్ణా!; నీవు; చెప్పినట్టులు= చెప్పినవిధముగా; చేసెదన్; మున్ను= ఇంతకు ముందు; ఉద్యోగవేళయందున్= సంజయుని రాయబారపు సమయమున; ఎల్లన్= అందరును; వినుచున్= వినుచును; ఉండన్= ఉండగా; ఆ+నర+ఇంద్రు కడిమి= ఆ శల్యుడి శౌర్యం; నాకున్= నాకు; పాలుగాన్= వంతుగా; పూని= పూనిక వహించి; పలికినాఁడన్= చెప్పినాడను.

**తాత్పర్యం:** 'పూజ్యుడా శ్రీ కృష్ణా! నీవు చెప్పిన విధంగానే తప్పక చేస్తాను. ముందు సంజయుడి రాయబార సమయంలో అందరూ వింటూండగా ఆ శల్యుడు యుద్ధంలో నా వంతుగా ప్రతిజ్ఞ చేసి పలికాను. అందువలన నీవు చెప్పినట్లుగానే చేస్తాను.

**విశేషం:** మహాభారత యుద్ధమునకు పూర్వం రెండురాయబారాలు జరిగాయి. ఒకటి సంజయుడి రాయబారం. రెండవది శ్రీకృష్ణుడి రాయబారం. సంజయుడు కౌరవుల తరపున రాయబారం నడిపాడు. శ్రీకృష్ణుడు పాండవుల తరపున రాయబారం నడిపాడు. సంజయుడు ధర్మరాజు నిశ్చయాన్ని దుర్యోధనుడికి చెప్పే సందర్భంలో యుద్ధంలో శల్యుడిని తన వంతుగా గెలుస్తానని ధర్మరాజు అన్నట్లు చెప్పాడు. 'కృతపుణ్యుఁడు సుశ్లోకుఁడు ధర్మతనూజుఁడు లోకోత్తురు శల్యుఁదా గెలుచువాఁ డధిపా' (చూడుడు. ఉద్యోగపర్వము. ద్వి. 229, 230, 231)

**వ. సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని పలికి పద్మనాభునిఁ దమ తమ్ములను ధృష్టద్యుమ్న శిఖండిసాత్యకి ప్రముఖులను దక్కటి పరిజనంబులను నిజమందిరంబులకుం బోవం బనిచి వీతశల్యంబైన మాతంగంబు చందంబున శయ్యాతలంబు సేరె బలం బంతయు నత్యంత సంతుష్టంబై విశ్రాంతి నొందె నారాత్రి యే నిట వచ్చి నీకుఁ గర్ణువృత్తాంతంబు సెప్పి నీవు వనుప మగిడి చని తెలతెల వేగునప్పుడు కౌరవసేనాసన్నివేశంబు సేరితి నా సమయంబున. 97**

**ప్రతిపదార్థం:** (ధర్మరాజు) పద్మనాభునిన్= శ్రీకృష్ణుని; సదనంబునకున్= మందిరమునకు; చని= వెళ్ళి; సుఖనిద్ర= గాఢనిద్ర (అనగా సుషుప్తియందు గల నిద్రాస్థితి); చేయుము; అని; పలికి; తన తమ్ములను; ధృష్టద్యుమ్న; శిఖండి; సాత్యకి; ప్రముఖులను; తక్కటి= మిగిలిన; పరిజనంబులను= సేవకులను; నిజమందిరంబులకున్= తమయొక్క భవనములకు; పోవన్= పోవునట్లుగా; పనిచి= పంపించి; వీత= పోయిన; శల్యంబు= బాణము; ఐన= కలిగిన; మాతంగంబు= ఏనుగు;

చందంబునన్= వలె; శయ్యాతలంబు= శయనించుటకు తగిన స్థలము; చేరెను; బలంబు= సైన్యము; అంతయున్= సమస్తమును; అత్యంత= మిక్కిలి; సంతుష్టంబు+ఐ= సంతృప్తి పొందినదియై; విశ్రాంతిన్= విశ్రాంతిని; ఒందెన్= పొందెను (ఇక సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లు చెప్పుచున్నాడు); ఆ రాత్రి; ఏన్= నేను; ఇటన్= ఇక్కడకు; వచ్చి; నీకున్; కర్ణు= కర్ణునియొక్క; వృత్తాంతంబు= సమాచారము; చెప్పి; నీవు; పనుపన్= పంపించగా; మగిడి= తిరిగి; చని= వెళ్ళి; తెలతెల= తెల్లతెల్లగా వెలుతురు; వేగునప్పుడు= ఉదయించునప్పుడు (అనగా తెల్లవారుచుండగా); కౌరవ= కౌరవులయొక్క; సేనా= సైన్యముయొక్క; సన్నివేశంబు= శిబిరము; చేరితిన్= చేరితిని; ఆ సమయంబునన్= ఆ సమయమునందు.

**తాత్పర్యం:** ధర్మరాజు శ్రీకృష్ణుడిని మందిరానికి వెళ్ళి 'సుఖనిద్ర' చేయుమని పంపించి, తన తమ్ము లైన భీమార్జున నకుల సహదేవులను, ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ప్రముఖులను, మిగిలిన సేవకులను, తమ తమ గృహాలకు పంపించి, తీసివేయబడిన బాణం కల ఏనుగువలె ధర్మరాజు శయనమందిరం చేరాడు. సైన్యమంతయును మిక్కిలి సంతృప్తి పొంది విశ్రాంతి పొందింది. ఇంక సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పుతున్నాడు: ఆ రాత్రి అనగా పదిహేడవ రోజు యుద్ధం ముగిసి కర్ణుడు కూలిన రాత్రి నేను ఇక్కడకు వచ్చి కర్ణుడి యుద్ధం, సంహారం మొదలైన సమాచారమంతా చెప్పి నీవు పంపగా తిరిగి వెళ్ళి తెలతెలవారుతుండగా కౌరవ శిబిరం చేరాను. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**క. కురుపతి పడవాళ్ళం దగు । దొరలకడకు సత్వరముగ దురమునకు భటో**
**త్కరము నను వు సేయుటకై । బరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా! 98**

**ప్రతిపదార్థం:** పార్థివ= రాజులలో; ముఖ్యా!= ప్రముఖుడవు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; కురుపతి= దుర్యోధనుడు; పడవాళ్ళన్= సేనాధిపతులను; తగు= తగిన - అనగా దళపతులు కా తగిన; దొరలకడకున్= రాజులవద్దకు; దురమునకున్= యుద్ధమునకు; భట= భటులయొక్క; ఉత్కరమున్= సమూహమును; సత్వరముగన్= మిక్కిలి వేగముగా; అనువు= సిద్ధము; చేయుటకై; బరవసము= ధైర్యము; తలిర్పన్= చిగురించునట్లుగా; పనిచెన్= పంపించెను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుడు యుద్ధానికి భట సమూహాన్ని వేగంగా సిద్ధం చేయటానికి ధైర్యం అతిశయించేటట్లుగా దళపతులు కాదగిన రాజులకడకు సేనాధిపతులను పంపించాడు.

**వ. పనిచిన నెల్లవారు నుల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్లఁ దమతమ చతురంగంబులకు సవరణలు సంఘటింపం దొడంగినఁ దూర్యంబులు సెలంగ నొండొరులఁ బిలుచునెలుంగులు నింగిముట్ట రథనేమిగజపద తురంగఖురపుటభటచరణ సంఘట్టితంబగు ధరణీతలం బద్రువ బహుళంబగు నులివు చంద్రోదయ సమయఘూర్ణమానంబగు మహార్ణవంబు నినదంబు ననుకరించె; న ట్లాయితంబై శల్యశకుని కృతవర్మాశ్వత్థామలును దక్కునుం గల యోధవరులును నొక్కెడ ననుజసహితుండై యున్న మనుజపతి సన్నిధిఁ గూడి యతండు వినఁ దమలో నిట్లనిరి. 99**

**ప్రతిపదార్థం:** పనిచినన్= పంపగా; ఎల్లవారున్= అందరును; ఉల్లంబులన్= మనస్సులందు; ఉత్సాహంబులు= యుద్ధప్రయత్నములు; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; తమతమ= వారి వారి; చుతరంగంబులకున్= చతురంగ బలములకు అనగా

రథ, గజ, తురగ, పదాతి దళములకు; సవరణలు= అలంకరణలు; సంఘటింపన్= సమకూర్చుటకు; తొడంగినన్= ప్రారంభించగా; తూర్యంబులు= వాద్య ధ్వనులు (అనగా యుద్ధసన్నాహ సూచకములగు వాద్యధ్వనులు); చెలంగన్= మ్రోగగా; ఒండొరులన్= ఒకరినొకరును (అనగా పరస్పరము); పిలుచు నెలుంగులు= పిలిచెడి కంఠధ్వనులు; నింగిముట్టన్= ఆకాశము ముట్టుకొనగా (అనగా వ్యాపించగా); రథనేమి= రథచక్రముల అంచులచేత; గజ= ఏనుగులయొక్క; పద= పాదములచేత; తురంగ= గుర్రాలయొక్క; ఖురపుట= దొప్పలవంటి గిట్టలచేత; భటచరణ= భటులయొక్క పాదములచేత; సంఘట్టితంబు= గట్టిగా త్రొక్కబడినది; అగు= అయిన; ధరణీ= భూమియొక్క; తలంబు= స్థలము (అనగా భూభాగము); అద్రువన్= అదరగా(అనగా చలింపగా); బహుళంబు= అధికము; అగు= అయినట్టి; ఉలివు= మ్రోత; చంద్ర= పున్నమ చందమామ; ఉదయ= ఉదయించు; సమయమునన్= కాలమున; ఘూర్ణమానంబు= సుళ్ళు తిరుగబడుచు శబ్దించునది; అగు= అయినట్టి; మహార్ణవంబు= మహాసముద్రముయొక్క; నినదంబును= ధ్వనిని; అనుకరించెన్= అనుకరించెను; అట్లు= ఆ ప్రకారముగా; ఆయితంబై= సంసిద్ధమై; శల్య= శల్యుడు; శకుని; కృతవర్మ; అశ్వత్థామలు; తక్కునున్= ఇంకను మిగిలి; కల= ఉన్నట్టి; యోధవరులునున్= శ్రేష్ఠులైన యోధులును; ఒక్కెడన్= ఒక చోట; అనుజ= తమ్ములతో; సహితుండై= కూడియున్నవాడై; ఉన్న= ఉన్నట్టి; మనుజ= మానవులకు; పతి= ప్రభువు అయిన; దుర్యోధనుడి; సన్నిధిన్= అతిసమీపమున; కూడి= కలిసి; అతండు= ఆ దుర్యోధనుడు; వినన్= వినునట్లుగా; తమలోన్= తమలోతాము; ఇట్లు= ఈ ప్రకారముగ; అనిరి= అనుకొన్నారు.

**తాత్పర్యం:** అట్లు పంపించగా అందరూ మనసులందు రణోత్సాహాలు ఉప్పొంగగా వారి వారి రథగజతురంగ పదాతులనెడి చతురంగ బలాలకు అలంకరణాలు సమకూర్చుకొనటం ప్రారంభించగా యుద్ధ సన్నద్ధసూచకాలైన తూర్యధ్వనులు మ్రోగాయి. సైనికులు ఒకరినొకరు పిలుచుకొనే అరుపులు నింగిని తాకాయి. చతురంగబలాలతో రథచక్రాల అంచులచేత, ఏనుగుల పాదాలచేత, గుర్రాల గిట్టలచేత భటుల చరణఘాతాలచేత, సంఘట్టితమైన భూభాగం చలించిపోయింది. ఆ సమయంలో ఉద్భవించిన అధికమయిన ఆ మ్రోత చంద్రోదయ సమయాన సుళ్లు తిరుగుతూ ఉప్పొంగే మహాసముద్రం చేసే ధ్వనిని అనుకరించింది. ఆ ప్రకారంగా యుద్ధ సన్నద్ధులైన శల్య శకుని కృతవర్మాశ్వత్థామలు, మిగిలిన యోధవరులు ఒకచోట తమ్ములతో కూడి ఉన్న సుయోధనుడి సన్నిధిలో కలిసి, ఆ సుయోధనుడు వినేటట్లుగా తమలో తాము ఈ ప్రకారంగా చెప్పుకొన్నారు.

**క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ । కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ**
**క్కొక తలగాఁ దలపడి వా । రి కడంక యుడుపఁగవలయుఁ గ్రీడయ పోలెన్. 100**

**ప్రతిపదార్థం:** ఒకఁడు; ఒకఁడ= ఒక్కడే; పాండవులన్; తాఁకక= ఎదుర్కొనక; సైన్య= సేనతో; ఉపేత= కూడుకొని; గాఢ= గట్టి అయిన; గతిన్= పద్ధతితో(అనగా దృఢమైన వ్యూహంతో); అందఱున్= అందరును; ఒక్కొక్కతలగాన్= ఒక్కుమ్మడిగా; తలపడి= ఎదుర్కొని; వారి= వారియొక్క; కడంక= ప్రయత్నము; క్రీడయ= ఆట; పోలెన్= వలె; ఉడుపఁగన్= తొలగింపగ(లేక) పోగొట్టగ; వలయును.

**తాత్పర్యం:** ఒక్కొక్కడే పాండవులను ఎదుర్కొనక, సేనతోకూడి దృఢమైన వ్యూహంతో అందరూ కలిసి ఒక్కుమ్మడిగా ఒక్కొక్కడిపై తలపడి ఆ పాండవుల ప్రయత్నాన్ని ఒక క్రీడవలె ఉడిగించాలి.

**వ. మన మొకళ్లొకళ్ళకుఁ బ్రాపగుచు నేపారి పోరినం జుల్కన గెల్పు గొనవచ్చు నిత్తెఱంగు మనకు సమయంబు సుండీ! యట్లుగాక యొంటి పెనంగెడివాఁడును బెనఁగెడివానిఁ గని కూడుకొనని వాఁడును బంచవిధ**

**పాపంబుల నొందఁగలవాఁడని యొండొరులకుం జెప్పికొని కదలి యుద్దామసామర్థ్యంబున నమ్మద్రపతి ముంగలియై నడవం జనునప్పుడు. 101**

**ప్రతిపదార్థం:** మనము; ఒకళ్ళొకళ్ళకున్= ఒకరు మరొయొకరికి; ప్రాపు= ఆశ్రయం; అగుచున్; ఏపారి= విజృంభించి; పోరినన్= పోరాటము సల్పినచో; గెల్పు= విజయము; చుల్కనన్= తేలికగా; కొనవచ్చున్= కైకొనవచ్చును; ఈ+తెఱంగు= ఈ ప్రకారంగా; మనకున్; సమయంబు= ఒప్పందము (అనగా శపథము); సుండీ!= సుమండీ!; అట్లు= ఆ ప్రకారంగా; కాక; ఒంటి= ఒంటరిగ; పెనంగెడివాఁడును= పోరాడెడివాడును; పెనఁగెడివానిని= పోరాడేవాడిని; కని= చూచి; కూడుకొననివాఁడును= వానికి సహకరించనివాడును; పంచవిధ= అయిదు విధాలైన; పాపంబులన్= పాతకములను; ఒందన్ కలవాఁడు= పొందగలడు; అని; ఒండొరులకున్= ఒకరికొకరికి (అనగా పరస్పరము); చెప్పికొని= అనుకొని; కదలి= బయలుదేరి; ఉద్దామ= భయంకర= అధిక; సామర్థ్యంబునన్= యోగ్యతవలన (అనగా శక్తివలన); ఆ+మద్రపతి= ఆ మద్రదేశాధిపతి శల్యుడు; ముంగలియై= ముందున్నవాడై; నడవన్= నడుచుచుండగా; చనునప్పుడు= వెడలుచున్నప్పుడు.

**తాత్పర్యం:** 'మనం ఒకరికొకరం రక్షకులమై విజృంభించి పోరాడితే జయం సులభంగా సంపాదించవచ్చును. ఇది మనకు శపథం. ఈ శపథం ప్రకారం కాకుండా ఒంటరిగా పోరాడెడివాడు, వాడిని చూచి అతడితో కలిసి పోరాటం చేయనివాడు, పంచమహాపాతకాలను పొందగలడు' అని పరస్పరం ఒట్టుపెట్టుకొని బయలుదేరి అధికమైనశక్తి కల శల్యుడు ముందు నడుస్తూ ఉండగా. (తరువాతి పద్యంలో అన్వయం.)

**విశేషం:** ఈ వచనమున ఉస్మానియా ప్రతియందు తప్పు పాఠం ఉన్నది. అది అచ్చుతప్పు అనటానికి వీలుకాదు. మంచిపాఠమును పాఠాంతరంగా చూపి - తప్పు పాఠమును ప్రమాణంగా గ్రహించారు. (3) కూడుకొనిన - తప్పుడు పాఠము. (3) కూడుకొనని - పాఠాంతరము - ఇదే అసలు పాఠము. ఈ వచనమున 'కూడుకొనని' అనే పాఠమునే గ్రహించితిని. ఇట్లు చెప్పుటకు మూలమే ప్రమాణము.

> 'న న ఏకేన యోద్ధవ్యం కథంచిదపి పాండవైః ॥8॥
> యో హ్యేకః పాండవైర్యుధ్యే ద్యోవాయుద్ధ్యంత ముత్సృజేత్ ।
> స పంచభిర్భవేద్యుక్తః పాతకైశ్చోపపాతకైః ॥9॥
> అన్యోన్యం పరిరక్షద్భిర్యోద్ధవ్యం సహితైశ్చ హ ।
> ఏవం తే సమయం కృత్వా సర్వే తత్ర మహారథాః ॥10॥
> మద్రరాజం పురస్కృత్య తూర్ణ మభ్యద్రవన్ పరాన్ । ॥11॥ (శల్య. అ-8; 8,9,10,11,)

**పంచమహాపాతకములు:**

1. స్వర్ణస్తేయం 2. సురాపానం 3. బ్రహ్మహత్య 4. గురుపత్నీగమనం, 5. శిశుహత్య.

## కౌరవసైన్యంబు యుద్ధసన్నద్ధం బై వెడలుట (సం. 9-7-10)

**సీ.** **చంచరీకావళి ఝుంకృతుల్ గల్పించు । కర్ణఝుళంఝుళాకలనములును**
**ధరణీపరాగసంతానంబుఁ గబళించు । కరశీకరచ్ఛటాస్ఫురణములును**
**ఘంటికాటంకృతికాంతి సంభావించు । నిర్భరబృంహితనిస్వనములు**
**నంబరభాగంబు నల్పంబు గావించు । నున్నతగాత్రసముద్ధతులును**

**తే.** **జారు భీషణరేఖలు భూరిమద భ । రాభిరామ యానంబులు నాహవోచి**
**తోగ్ర కల్పనాభంగులు నుల్లసిల్లఁ । గరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడచె.** **102**

**ప్రతిపదార్థం:** చంచరీక= తుమ్మెదల; ఆవళి= సమూహంయొక్క; ఝుంకృతుల్= ఝుంకారములు; కల్పించు; కర్ణ= చెవులయందలి; ఝళం ఝళా= ఝళం ఝళం అను; ఆ కలనములును= ధ్వనులును (అనగా ఏనుగుల చెవులకు వ్రేలాడ గట్టిన చిరు మువ్వల ఝళం ఝళారావములును); ధరణీ= భూమియొక్క; పరాగ= ధూళియొక్క; సంతానంబు= సముదాయము; కబళించు= మ్రింగెడి; కర= తొండములనుండి వచ్చు; శీకర= నీటి తుంపరలయొక్క; ఛటా= సమూహములను; స్ఫురణములను= తలంపులను(శీకరము అనగా సామాన్యార్థము - తుంపర విశేషార్థము - ఏనుగు తొండమునుండి వచ్చుమదము - కరశీకరము అనినను, శీకరము అనినను ఏనుగుతొండమునుండి వచ్చు మదమనియే అర్థము. సామాన్య విశేషార్థములను గ్రహించుటకు తిక్కయజ్వ 'కరశీకర' ప్రయోగము చేసెను. అందువలన ఏనుగుల తొండములనుంచి వచ్చు మదముయొక్క తుంపరలు - అను అర్థమును గ్రహింపవలసి యున్నది.) ఘంటికా= ఘంటలయొక్క; టంకృతి= టంకారధ్వనులయొక్క; కాంతి= సౌందర్యము; సంభావించు= గౌరవించు; నిర్భర= ప్రగాఢమయిన; బృంహిత= ఏనుగుల ఘీంకారములయొక్క; నిస్వనములును= ధ్వనులును; అంబర= ఆకాశముయొక్క; భాగంబు; అల్పంబు= తక్కువ; కావించు= చేసే; ఉన్నత= ఎత్తైన; గాత్ర= దేహములయొక్క; సముద్ధతులును= ఔన్నత్యములును; చారు= సుందరమయిన; భీషణ= భయంకరమయిన; రేఖలు= వరుసలు; భూరి= అధికమైన; మద= మదముయొక్క; భర= భారమువలన; అభిరామ= మనోహరమయిన; యానంబులును= నడకలును; ఆహవ= యుద్ధమునకు; ఉచిత= యోగ్యమయిన; ఉగ్ర= భయంకరమయిన; కల్పనా= రచింపబడిన (అనగా ఏర్పాటు చేయబడిన); భంగులున్= రీతులును; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; ధాత్రి= భూమియొక్క; తలంబు= స్థలము (అనగా భూభాగము లేక భూమండలము) క్రక్కదలన్= కంపించగా; కరులు= ఏనుగులు; నడచెన్= నడచెను.

**తాత్పర్యం:** (చతురంగబలములలో గజదళం ముఖ్యమైనది. సేనలు యుద్ధభూమికి నడచేటప్పుడు అగ్రభాగంలో గజదళం నడవటం ఆచారం. అందువలన ముందుగా గజదళం వర్ణించబడుతున్నది.) ఏనుగుల చెవులయొక్క చిరుమువ్వల నుండి వచ్చే ఝళం ఝళ ధ్వనులు తుమ్మెదల గుంపులు చేసే ఝుంకారాలను తలపిస్తున్నాయి. ఏనుగుల తొండాలనుండి పుట్టిన మదంయొక్క తుంపరలు భూమినుండి పుట్టిన ధూళి సముదాయాన్ని మ్రింగుతున్నట్లు తోస్తున్నవి. ఏనుగుల కంఠాలలో వ్రేలాడే ఘంటలయొక్క టంకార ధ్వనులు ప్రగాఢమయిన ఘీంకారధ్వనులను పోలి ఉన్నాయి. ఎత్తైన ఏనుగులయొక్క దేహాల ఔన్నత్యాలు ఆకాశభాగాన్ని అల్పం చేస్తున్నవి. సుందరాలు, భయంకరాలు అయిన మదభారం కల ఏనుగుల వరుసలయొక్క మదభారంవలని మందగమనాలు మనోహరాలౌతున్నవి. ఈ విధంగా యుద్ధానికి తగిన భయంకర మయిన ఏనుగుల వరుసలు ప్రకాశించగా భూభాగం కంపించేటట్లు గజదళం యుద్ధభూమికి నడచింది.

**చ.** **గతిబహుతాలసత్ఖురవిఘట్టితమేదిని జీవితేశ క**
**ల్పిత నఖరేఖలం జెలువు పెంపు వహించు పురంధ్రిఁ బోల ను**
**ద్ధతముఖబంధురాంగలలితంబులు నూర్జితకింకిణీఝుణ**
**త్కృతి పటుహేషలుం దగ నుదీర్ణములై నడచెం దురంగముల్.** **103**

**ప్రతిపదార్థం:** గతి= గమనములయొక్క; బహుతా= అనేకత్వముచే; లసత్= ప్రకాశించుచున్న; ఖుర= గిట్టలతో; విఘట్టిత= తొక్కబడిన(లేక)కొట్టబడిన; మేదిని= భూమి; జీవిత+ఈశ= ప్రాణమునకు అనగా బ్రతుకునకు ప్రభువు అయిన భర్తచేత అనగా ప్రాణప్రియునిచేత; కల్పిత= చేయబడిన; నఖ= గోళ్ళయొక్క; రేఖలన్= గీతలవలన (అనగా నఖక్షతములవలన); చెలువు= అందముయొక్క; పెంపు= వృద్ధిని; వహించు= ధరించు; పురంధ్రిన్= గృహిణిని; పోలన్= పోలునట్లుగా; ఉద్ధత= ఉన్నతమయిన; ముఖ= ముఖములతో; బంధుర= సుందరముగా వంగిన; అంగ= అవయవములయొక్క; లలితంబులును= సౌకుమార్యములు కలిగినట్టియు - (ముఖములు ఎత్తుగా ఉండి, మెడ, నడుము సుందరముగా వంగిఉండి - సుకుమారముగా ఉన్న ఉత్తమజాతి అశ్వములను తురంగములందురు); ఊర్జిత= అధికమైన; కింకిణీ= చిరుగంటలయొక్క (అనగా గుర్రములకాళ్లకు కట్టిన గజ్జెలయొక్క); ఝణత్కృతి= ఝణం ఝణ ధ్వనులు; పటు= చురుకుతనమును చూపుటకు సమర్థమయిన; హేషలున్= సకిలింపులు కలిగినట్టియు అగు; తురంగముల్= గుర్రాలు; తగన్= ఒప్పుగా; ఉదీర్ణములై= గొప్పవియై; నడచెన్= (యుద్ధభూమికి) నడచెను.

**తాత్పర్యం:** (ఇది చతురంగబలములలో తురంగదళ వర్ణనం.) యుద్ధభూమికి వెడలుతున్న తురంగాలు తాళ లయాన్వితముగా నడుస్తున్నాయి. ఆ తురంగాల గిట్టలతో తొక్కబడిన భూమి ప్రాణప్రియుడి నఖక్షతాలవలన అతిశయించిన సౌందర్యం కల గృహిణిని పోలి ఉన్నది. (ఉత్తమజాతి తురగాల నడకలు తాళలయాన్వితంగా ఉండటం లోకప్రసిద్ధం). ఉన్నతాలయిన ముఖాలతో సుందరంగా వంగిన మెడ, నడిమి భాగాలతో సుకుమారాలయిన అవయవాలతో ఆ తురంగా లొప్పుతున్నవి. (గుర్రాల కాళ్ళకు గజ్జెలు కట్టటం, ఏనుగుల మెడలకు ఘంటలు కట్టటం సంప్రదాయం, సౌందర్య పోషకం.) దృఢమయిన ఆ చిరుగంటల ఝణంఝణ ధ్వనులు, చురుకుతనాన్ని చూపటానికి సమర్థమయిన సకిలింపులు కల ఆ తురంగాలు ఒప్పుగా గొప్పగా యుద్ధభూమికి నడచాయి.

**విశేషం:** ఇది శ్లేషానుప్రాణిత ఉపమ. బహుతాల+సత్ఖుర - బహుతా+లసత్ఖుర - అని పదచ్ఛేదము. అందువలన ఖండశ్లేష. ఉత్ప్రేక్ష అనగా ఊహ. ఉపమాన ధర్మసంబంధంతో ఉపమేయాన్ని ఉపమానంగా ఊహించి చెప్పుట ఉత్ప్రేక్ష. ఇచ్చట - ఉపమేయం మేదిని. ఉపమానం పురంధ్రి. ఖుర విఘట్టితమునకు నఖరేఖలకు ధర్మసంబంధం. పోల(న్) - వాచకం.

**సీ.** **మీఱిన యుబ్బున మీఁదికిఁ గాళులు । సాఁచు రథ్యంబుల చటులతయును**
**లలిఁ బెండ్లికినిఁ బోవు చెలువున విలసిల్లు । సూతజనంబు విస్ఫూర్జితంబు**
**జతనంబు మేలిమిఁ జారుఘోరములగు । నవయవంబుల విభవాతిశయము**
**బిరుదుల నుద్భటస్ఫురణంబులై క్రాలు । కేతనంబుల సముద్ద్యోతితంబు**

**తే.** **సొంపు మిగులంగ జోదుల యంపపొదుల । దీప్తులును లేఁత నవ్వుల దీధితులును**
**హారిరశ్ములుఁ గీడ్పర నగుచు వెలుఁగఁ । దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర!** **104**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కౌరవులకు ప్రభువుఅయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మీఱిన= అతిశయించిన; ఉబ్బునన్= ఆనందముతో; మీఁదికిన్= పైకి; కాళులు= కాళ్లు; చాఁచు= చాచెడి; రథ్యంబుల= గుర్రములయొక్క; చటులతయును= చంచలత్వమును; లలిన్= ఉత్సాహంతో; పెండ్లికినిన్= పెండ్లికొరకు; పోవు= వెడలునట్లుగా; చెలువునన్= సొంపుతో; విలసిల్లు= ప్రకాశించు; సూతజనంబు= సూతజనులయొక్క (అనగా రథములను తోలు జనులయొక్క) (గుర్రములను మేపుచు - రథములను తోలుచూ జీవించువారు సూతులు. వీరు సారథులుగా కూడ ఉండవచ్చును. కాని సారథులందరు సూతులు మాత్రముకారు. పార్థసారథి శ్రీకృష్ణుడు సూతుడు కాడు. కర్ణసారథి శల్యుడు సూతుడుకాడు.) విస్ఫూర్జితంబు= అరుపులు

బొబ్బలతో, చప్పట్లతో నిండిన శబ్దముతో మిక్కిలి ప్రకాశవంతమగు; జతనంబుమేలిమిన్- జతనంబు= ప్రయత్నముయొక్క- మేలిమిన్= ఆధిక్యము వలన (అనగా అధిక ప్రయత్నముతో చేయబడిన); చారు= సుందరములు; ఘోరములు= భయంకరములు; అగు= అయినట్టి; అవయవంబుల= అంగములయొక్క (అనగా రథాంగములయొక్క) విభవ= సంపద అనగా శక్తియొక్క; అతిశయము= ఆధిక్యమును; బిరుదులన్= బిరుదులవలన (అనగా - అథిరథుడు - మహారథుడు - రథుడు - అర్ధరథుడు - మొదలగు శౌర్య చిహ్నములగు బిరుదులవలన); ఉద్భట= అధికమయిన; స్ఫురణంబులై= తలపులు తోచునట్లు; క్రాలు= ఒప్పు; కేతనంబుల= జెండాయొక్క (రథములమీద వారి వారి శౌర్యచిహ్నములు సూచించుటకు కట్టబడిన టెక్కెములు); సముద్యోతితంబు= గొప్ప ప్రకాశము కలిగినదియును; సొంపు= సౌందర్యము; మిగులంగన్= అతిశయింపగా; జోదుల= యోధులయొక్క; అంపపొదుల= తూణీరములయొక్క; దీప్తులును= కాంతులును; లేఁత నవ్వుల దీధితులును= చిరునవ్వుల యొక్క కాంతులును (అనగా పరిహాసమును సూచించు చిరునవ్వులు); హారి రశ్మలున్- హారి= మనోజ్ఞములైన; రశ్మలున్= పగ్గములును (అనగా కళ్ళెములు); కీడ్పెరన్= శత్రువులకు కీడు; సూచించేది; అగుచున్= సూచించునది అగుచు; వెలుఁగన్= ప్రకాశింపగా - ఉద్దామతన్= అడ్డులేని విధముగా; తేరులు= రథములు (అనగా రథ దళము); అరిగెన్= వెడలెను.

**తాత్పర్యం:** (ఇది చతురంగ బలములలో రథ దళముయొక్క వర్ణనం.) ఓ ధృతరాష్ట్ర మహారాజా! అతిశయించిన ఆనందంతో కాళ్ళు పైకి చాచే చంచలత్వం, - ఉత్సాహంతో పెండ్లికి పోయేటట్లుగా సొంపుతో సూతజనులు చేసే శబ్దాలు-అధిక ప్రయత్నంతో చేయబడిన - భయద సుందరమైన రథాంగాల వైభవాతిశయం, శౌర్యచిహ్నాలగు బిరుదముల వలన అధికస్ఫూర్తితో ఒప్పు జెండాల అధిక ప్రకాశం, సౌందర్యం అతిశయింప యోధులయొక్క అమ్ముల పొదుల కాంతులు, చిరునవ్వుల కాంతులు మనోజ్ఞాలయిన కళ్ళాలు కలిగి ఇతరులయిన శత్రుపక్షాన్ని తక్కువచేస్తూ అశుభసూచక మవుతూ ప్రకాశించగా అడ్డులేని విధంగా రథాలు యుద్ధభూమికి వెడలాయి.

**విశేషం:** అలం: స్వభావోక్తి. చైతన్య చిత్రణంలో తిక్కయజ్వ సిద్ధహస్తులు. ఈ సీసపద్యంలో దూరమునుండి దర్శించేటప్పుడు కనిపించే దృశ్యరూప చైతన్య చిత్రణం చేయబడినది. అందువలన ముందుగా ఉత్సాహంతో కాళ్ళు పైకెత్తు రథ్యముల చంచలత్వం, ఆ తరువాత రథ్యములను తోలు సూతజనుల సొగసులు, అటు పిమ్మట రథాంగముల వైభవం, అనంతరం రథాలపై నుండు టెక్కెముల రెపరెపలు, యోధుల తూణీరాలు, లేతనవ్వులు, కళ్ళెములు కాంతులు - ఇది క్రమ దృశ్యరూప చిత్రణం.

**చ. కడఁకయు లావునుం గరఁగి గట్టిగఁ గూర్చి యొనర్చినట్టి పే**
**రొడళులఁ దాల్మియుం గడిమియుం గలయం బరికించి యందు నే**
**ర్పిడుకొని గాఢభంగి రచియించిన చందము నెమ్మనంబులం**
**గడుఁ జెలువొంద నుబ్బి వడిఁ గాల్బలమేఁగెఁ గరం బుదగ్రతన్. 105**

**ప్రతిపదార్థం:** కడఁకయున్= ప్రయత్నమును; లావునున్= బలమును; కరఁగి= కరగించి; గట్టిగన్= కఠినముగ; కూర్చి= కలిపి; ఒనర్చునట్టి= తయారుచేసినట్టి; పేరొడళులన్= పెద్ద దేహములను; తాల్మియున్= ఓర్పును; కడిమియున్= పరాక్రమమును; కలయన్= కలిసిపోవునట్లుగా; పరికించి= వీక్షించి; అందున్= అందులో; నేర్పు= నేర్పరితనమును; ఇడుకొని= ఉంచుకొని (అందులో సామర్థ్యము కలవారిని ఉంచుకొని); గాఢ= తీక్ష్ణమయిన; భంగిన్= విభాగముగా; రచియించిన= సేనను రూపొందించిన; చందమున్= విధానంతో; నెమ్మనంబులన్= నిండైన మనస్సులందు; కడున్= మిక్కిలి; చెలువు= సౌందర్యం; ఒందన్= పొందగా; ఉబ్బి= సంతోషంతో పొంగిపోయి; కరంబు= మిక్కిలి; ఉదగ్రతన్= భయంకరంగా; వడిన్= వేగంగా - కాల్బలము= పదాతిదళము; ఏఁగెన్= వెడలెను.

**తాత్పర్యం:** (ఇది చతురంగ బలాలలో పదాతివర్ణనం) ప్రయత్నం, బలం కలగలిపి కరిగించి గట్టిగా పోతపోసినట్టి పెద్ద పెద్ద దేహాలు గల వాళ్లలో ఓర్పు, పరాక్రమం కలగలిపి బాగుగా పరీక్షించి అందులో నేర్పరితనం కలవారిని మాత్రమే పరిగణించి అధిక విభాగంగా సేనను రూపొందించిన విధానంతో నిండు మనసులందు మిక్కిలి సౌందర్యం పొందగా, సంతోషంతో పొంగిపోయి మిక్కిలి భయంకరంగా వేగంగా కాల్బలం యుద్ధభూమికి వెడలింది.

**విశేషం:** యుద్ధ సన్నద్ధమయి వెడలే ఈ చతురంగ బలవర్ణనం మూలంలో లేదు. అందువలన ఇది తిక్కయజ్వ కవనరామణీయకానికి, స్వీయకల్పనకు, స్వతంత్ర భావనాపటిమకు నిదర్శనం. ఉత్తమ కవనానికి వర్ణన, చిత్రణములు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలు. ఈ వర్ణన చిత్రణములే నిశ్చేతన పదార్థాలకు చేతనత్వం పరికల్పించును. స్థావరాలను జంగమాలుగా రూపొందించును. మహాకవుల బుద్ధిశక్తికి రెండు ముఖ్య లక్షణములుండును. ఒకటి ఊహ. రెండు భావన. ఊహాకల్పనము వర్ణనం. సత్యభావన చిత్రణం. కవిబ్రహ్మ తిక్కయజ్వ సత్యాత్మిక భావన ఈ చతురంగ బల చిత్రణమున సాక్షాత్కరించింది. 'రూపచిత్రణం, భావ చిత్రణం - చైతన్యచిత్రణం' అని చిత్రణం మూడు విధాలు. వర్ణ్య వస్తువునందలి - రూప, భావ, చేతనత్వములు కుసుమించి, వికసించి ఫలిస్తే కావ్యశరీరానికి ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది.

**వ. ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరం బోవునంతం బాండవబలంబును జనుదెంచె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; కురుబలంబు= కౌరవసైన్యము; సమరతలంబు= యుద్ధభూమి; చేరన్= చేరుటకు; పోవన్= పోవుచుండగా; అంతన్= ఆ సమయమున; పాండవబలంబును= పాండవులయొక్క సైన్యమును; చనుదెంచెన్= వచ్చెను; అనినన్= అని చెప్పగా; విని; ఆంబికేయుండు= అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుడు; సంజయునకున్; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కౌరవసైన్యం యుద్ధభూమి చేరేటంతలో పాండవ సైన్యం కూడా యుద్ధభూమి చేరిన దని విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**తే. 'సురనదీ సుతుచావును గురుని చావుఁ । గర్ణుచావును వినిన నా కర్ణములకు**
**శల్యుచావు, దుర్యోధనుచావుఁ జెప్పి, । యధికతరముగ సంతోష మావహింపు. 107**

**ప్రతిపదార్థం:** సురనదీ= ఆకాశగంగానదియొక్క; సుతు= కుమారుడైన భీష్మునియొక్క; చావును= మరణమును; గురుని= ద్రోణునియొక్క; చావున్= మరణమును; కర్ణుచావును; కర్ణునియొక్క మరణమును; వినిన= ఆలకించిన; నా కర్ణములకున్= నా చెవులకు; శల్యుచావున్= శల్యుడి యొక్క మరణమును; దుర్యోధను= దుర్యోధనునియొక్క; చావున్= మరణమును; చెప్పి= వినిపించి; అధికతరగముగన్= మిక్కిలి ఎక్కువగ; సంతోషము; ఆవహింపుము= కలుగచేయుము.

**తాత్పర్యం:** 'భీష్మ ద్రోణ కర్ణుల మరణములను ఆలకించిన నా చెవులకు శల్య దుర్యోధనుల మరణాలను కూడా వినిపించి అనుభవశక్యంకాని సంతోషమును కలుగచేయుము. (ఇది ధృతరాష్ట్రుడి దుఃఖాతిశయ స్థితిని సూచిస్తున్నది.)

**క. అమ్మద్రవిభుని ధర్మజుఁ । డెమ్మెయిఁ బరిమార్చెఁ గౌరవేంద్రుని భీముం**
**డెమ్మెయి గీటడఁచె రణం । బెమ్మెయిఁ బరిపాటిఁ జెల్లె? నేర్పడఁ జెపుమా!' 108**

**ప్రతిపదార్థం:** ఆ+మద్రవిభుని= ఆ మద్రదేశ ప్రభువు అయిన శల్యుడిని; ధర్మజుండు= ధర్మరాజు; ఏ+మెయిన్= ఏ విధంగా; పరిమార్చెన్= సంహరించాడు; కౌరవేంద్రుని= కౌరవులకు ప్రభువు అయిన దుర్యోధనుడిని; భీముండు; ఏ+మెయిన్= ఏ విధంగా; గీటడఁచెన్= చంపెను; రణంబు= యుద్ధం; ఏ+మెయిన్= ఏ విధంగా; చెల్లెన్?= జరిగెను?; పరిపాటిన్= క్రమముగా; ఏర్పడన్= తేటతెల్లంగా; చెపుమా!= చెప్పుము.

**తాత్పర్యం:** మద్రదేశ ప్రభువు అయిన శల్యుడిని ధర్మరాజు ఏ విధంగా సంహరించాడు? దుర్యోధనుడిని భీముడు ఎట్లు చంపాడు? యుద్ధం ఏ విధంగా జరిగింది? ఇది అంతా క్రమంగా తేటతెల్లంగా చెప్పుము.'

**వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లను 'వగచుకొలంది కడచనియె; ధీరుండవై వార్త లవధరింపుము. 109**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (ధృతరాష్ట్రుడు) ఇట్లు అడుగగా; సంజయుండు; ఆ+మనుజపతికిన్= మానవులకు ప్రభువు అయిన ఆ ధృతరాష్ట్రుడికి; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; వగచు కొలంది= దుఃఖంయొక్క మితి; కడచనియెన్= దాటింది (అనగా ఇప్పటికే దుఃఖం అనుభవించగల మితి దాటిపోయింది కాబట్టి); ధీరుండవు+ఐ= ధైర్యంకలవాడవై; వార్తలు (నేను చెప్పే); వృత్తాంతాలు; అవధరింపుము= ఏకాగ్రతతో శ్రద్ధగా వినుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఇట్లా అడుగగా సంజయుడు ఆ ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: దుఃఖాన్ని అనుభవించగల మితి దాటింది. ఇక ధీరుడవై నేను చెప్పే వృత్తాంతాలు, యుద్ధవిషయాలు శ్రద్ధగా వినుము.

**క. గంగాసుతగురుకర్ణుల । సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా**
**రం గనియు నీ తనయు లా । సం గూరిరి వారిఁ జంపు శల్యుం డనుచున్. 110**

**ప్రతిపదార్థం:** సంగరమునన్= యుద్ధమునందు; పాండుసుతులు= పాండురాజ కుమారులు; గంగాసుత= గంగాదేవి పుత్రుడు అయిన భీష్ముడిని; గురు= ద్రోణుడిని; కర్ణులన్= కర్ణులను; చంపుట= సంహరించుట; కన్నారన్= ప్రత్యక్షముగా; నీ తనయులు= నీకొడుకులు; కనియున్= చూచియు; శల్యుండు; వారిన్= వారిని (ఆ పాండవులను); చంపున్= చంపును; అనుచున్= అనుచు; ఆసన్= ఆశను; కూరిరి= పొందిరి.

**తాత్పర్యం:** యుద్ధంలో పాండవులు భీష్మద్రోణ కర్ణులను సంహరించటం ప్రత్యక్షంగా చూచి కూడా నీ కొడుకులు శల్యుడు ఆ పాండవులను చంపుతాడనే పేరాశ పొందారు.

**వ. దుర్యోధనుండు దిక్కుమాలి యుండియు నడియాసం జేసి తన్ను సంపన్నునిం గాఁ దలంచుచు. 111**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; దిక్కుమాలి= దిక్కులేక (అనగా ఏ మార్గములేక); ఉండియున్= ఉన్నవాడయ్యును; అడి+ఆసన్+చేసి= వ్యర్థమైన ఆశవలన; తన్నున్= తనను; సంపన్నునిన్= సంపదకలిగిన వాడు; కాన్= అగునట్లుగా; తలంచుచున్= ఆలోచించుచూ.

**తాత్పర్యం:** దుర్యోధనుడు దిక్కుమాలినవాడై ఉండికూడా పేరాశ వలన తనను తాను సకలైశ్వర్యములు కలవాడినిగా తలుస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **అనుజులుఁ దాను శల్యునిఁ బ్రియాతిశయంబునఁ జేరఁ బోవ నా**
**యన మును కర్ణుఁ డర్జున శరాహతిఁ గూలిన నుబ్బి భీముఁ డా**
**ర్చిన నడలొంది తల్లడిలు చిత్తము లూఱట నొంద వారలం**
**గనుఁగొని పల్కులన్ శ్రుతిసుఖం బొనరించె నుదగ్రమూర్తియై.** **112**

**ప్రతిపదార్థం:** అనుజులున్= తమ్ములును; తాను(దుర్యోధనుడు); ప్రియ= ప్రేమయొక్క; అతిశయంబునన్= ఆధిక్యంవలన; శల్యునిన్= శల్యుడిని; చేరన్= సమీపమునకు; పోవన్= వెళ్లగా; ఆయన= ఆ శల్యుడు; మును= ఇంతకుముందు; అర్జున= అర్జునునియొక్క; శర= తీక్ష్ణమయిన బాణములయొక్క; ఆహతిన్= దెబ్బలవలన; కర్ణుడు; కూలినన్= పడిపోగా; భీముడు; ఉబ్బి= సంతోషముతో పొంగి; ఆర్చినన్= పెద్దగొంతుతో అరవగా; అడలు= భయము (లేక) దుఃఖము; ఒంది= పొంది; తల్లడిలు= చలించిపోయిన; చిత్తములు= మనస్సులు; ఊఱటన్= ఉపశమనం; ఒందన్= పొందునట్లుగా; వారలన్= వారిని (దుర్యోధనాదులను); ఉదగ్ర= భయంకరమయిన; మూర్తియై= రూపంకలవాడై (శల్యుడు); కనుఁగొని= చూచి; పల్కులన్= మాటలతో; శ్రుతిసుఖంబు= చెవులకు ఇంపుకలిగేటట్లు; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** తమ్ములు, తాను అధిక ప్రేమతో శల్యుడి చెంతకు చేరగా ఆ శల్యుడు అంతకుముందు అర్జునుడి బాణాల దెబ్బలకు కర్ణుడు కూలగా భీముడు సంతోషంతో పొంగి అరిచిన ఆర్పులకు భయపడి చలించిపోయిన మనసులకు ఉపశమనం కలిగేటట్లు - ఆ దుర్యోధనాదులను చూచి భయంకర రూపం కలవాడై మాటలతో వారి చెవులకింపు కలిగించాడు.

**వ.** **ఇట్లు సమరోత్సాహ సమగ్రుండయిన మద్రపతి సర్వతోభద్ర వ్యూహంబు పన్నించె నందు ముఖంబున మద్రపతి గర్ణపుత్ర ప్రముఖ పరివృతుండై తాను నిలిచె. వలపట శకయవనసమేతుండై కృపాచార్యుండును దాఁపటఁ ద్రిగర్తసహితుండై కృతవర్మయు వెనుకఁ గాంభోజసహాయుండై యశ్వత్థామయు నడుమఁ గురువీర పరిరక్షితుండయి కౌరవేశ్వరుండును నతని ముందటఁ గరిఘటాగ్ర భాగవర్తియై బహుల చతురంగంబులతోడ శకునియు నిలుచునట్లుగా నొనర్చి పేర్చి యురవణించె. నంతక మున్ను పాండవులు మూఁడు మొగంబులుగా మోహరించిరి. ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రజునగ్ర భాగంబున శోభిల్లి సీతారూప విద్యోతితంబైన శల్యుకేతనంబు సూచి త్రోచి నడచి' రనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ బాండవులకుం గల సేనాంగంబుల కొలంది యెఱింగింపు' మనవుడు సంజయుం డా జనపతికిట్లను మనకుఁ బదునొకండు వేలు రథంబులును బదివేలు నేడు నూఱు గజంబులును రెండు లక్షలు హయంబులును మూఁడు కోట్లు పదాతులును వారికి నాఱువేలు రథంబులును మూఁడువే లేనుంగులును లక్ష గుఱ్ఱంబులును కోటి కాల్బలంబులును గలిగియుండె నయ్యొడ్డనంబు లొండొంటి గెలుచు నగ్గలిక డగ్గరియె నట్టియెడ.** **113**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; సమర= యుద్ధమునందలి; ఉత్సాహ= ప్రయత్నముతో; సమగ్రుండు= సంపూర్ణుడు; అయిన; మద్ర= మద్రదేశమునకు; పతి= అధిపతి (భర్త) అయిన శల్యుడు; సర్వతోభద్ర= సర్వతోభద్రము అను పేరుగల; వ్యూహంబు= యుద్ధ తంత్రరచనము; పన్నించెన్= సిద్ధము చేసెను; (మహాభారత యుద్ధమున భీష్ముడు - గరుడ వ్యూహమును ద్రోణుడు పద్మవ్యూహము చక్రవ్యూహము చక్రశకట వ్యూహములను; కర్ణుడు-మకర వ్యూహమును; శల్యుడు

సర్వతోభద్రవ్యూహమును రచించిరి. అర్జునుని ప్రతిజ్ఞనుండి జయద్రథుని రక్షించుటకు ద్రోణుడు చక్రశకట వ్యూహమును రచించెను. సర్వతోభద్రము అను ఒక యోగముద్ర కలదు. దీనికి వరుణుడు అధిదైవము. విష్ణు రథమునకు సర్వతోభద్రమని పేరు.); అందున్= అందు; (ఆ సర్వతోభద్రవ్యూహమునందు); ముఖంబునన్= ముఖస్థానమున; మద్రపతి= మద్రదేశమునకు భర్త అయిన శల్యుడు; ప్రముఖ= గొప్పవారైన; కర్ణపుత్ర= కర్ణుడియొక్క పుత్రులతో; పరివృతుండై= చుట్టబడినవాడై; తాను (శల్యుడు); నిలిచెన్= ఉండెను; వలపటన్= కుడివైపున; శక= శకులతో; యవన= యవనులతో; సమేతుండై= కూడియున్నవాడయి; కృపాచార్యుండును; దాఁపటన్= ఎడమవైపున; త్రిగర్త= త్రిగర్త దేశవీరులతో; సహితుండై= కూడియున్నవాడై; కృతవర్మయున్= కృతవర్మయును; వెనుకన్= వెనుకవైపున; కాంభోజసహాయుండై= కాంభోజవీరులు తోడుగాఉన్నవాడై; అశ్వత్థామయున్; నడుమన్= మధ్యభాగమున-కురువీర= కౌరవవీరులచేత; పరిరక్షితుండు+అయి= కాపాడబడువాడై; కౌరవ= కౌరవులకు; ఈశ్వరుండును= ప్రభువు అయిన దుర్యోధనుండును; అతనిముందటన్= ఆ దుర్యోధనుడిముందు; కరి= ఏనుగుల; ఘటా= సమూహంయొక్క; అగ్రభాగ= ముందుభాగమున; వర్తియై= ఉన్నవాడై; బహుల= విశాలమైన; చతురంగంబులతోడన్= చతురంగబలంబులతోడ; శకునియున్; నిలుచునట్లుగాన్= ఉండునట్లుగా; ఒనర్చి= చేసి; పేర్చి= చతరంగబలములు ఒకదాని తరువాత ఒకటి వరుసగా ఉంచి; ఉరవణించెన్= విజృంభించెను; అంతకమున్న= అంతకంటె ముందుగా; పాండవులు; మూఁడు మొగంబులుగాన్= మూఁడు ముఖములుగా (త్రిముఖ వ్యూహముతో); మోహరించిరి= వ్యూహమును పన్నిరి; ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకులు= ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకియును; అగ్రేసరులుగాన్= ముందు ఉన్నవారు కాగా (మూడు ముఖములయొక్క ముందుభాగమున ముప్వురును యథాక్రమముగా ఉండగా); భీమార్జునులు= భీముడును, అర్జునుడును; అగ్రజు= అన్న అయిన ధర్మరాజుయొక్క= అగ్రభాగంబునన్= ముందుభాగమునందు; శోభిల్లి= ప్రకాశించి; సీతా= పసుపు రంగుకల (లేక చిత్రవిచిత్ర వర్ణములు కల); రూప= ఆకారముతో; విద్యోతితంబైన= ప్రకాశించుచున్న; శల్య= శల్యునియొక్క; కేతనంబు= రథముపై ఉన్నటెక్కెము (జెండా); చూచి; త్రోచి= వేగిరపడి; నడచిరి= యుద్ధమునకు వెడలిరి; అనినన్= (సంజయుడు) ఇట్లు చెప్పగా; విని; ధృతరాష్ట్రుండు; అప్పటికిన్= ఆ సమయమునకు; మనకున్= మనకు (అనగా కౌరవపక్షమునకు); పాండవులకున్; కల= ఉన్నట్టి; సేనా= సైన్యముయొక్క; అంగంబుల= విభాగములయొక్క (అనగా చతురంగంబులయొక్క); కొలంది= పరిమితి; ఎఱింగింపుము= తెలియచేయుము; అనవుడున్= (ధృతరాష్ట్రుడు) ఇట్లు అడిగినవెంటనే; సంజయుండు; ఆ జనపతికిన్= ఆ ధృతరాష్ట్రునికి; ఇట్లు= ఈ విధముగా; అనున్= చెప్పెను; మనకున్= మనకు (కౌరవపక్షమునకు); పదునొకండువేలు= పదకొండు వేలు; రథంబులును; పదివేలు; ఏడునూఱు= ఏడువందలు; గజంబులును= ఏనుగులును; రెండులక్షలు; హయంబులును= గుర్రములును; మూడుకోట్లు; పదాతులును= కాల్బలమును; వారికిన్ (అనగా పాండవులకు); ఆఱువేలు; రథంబులును; మూడువేలు; ఏనుంగులును; లక్ష గుఱ్ఱంబులును; కోటి; కాల్బలంబులును; కలిగి; ఉండెన్; అ+ఒడ్డనంబులు= ఆ సేనావ్యూహంబులు; ఒండొంటిన్= ఒకదానితో ఒకటి క్రమముగా; గెలుచు= గెలిచే; అగ్గలికన్= ఉత్సాహంతో; డగ్గఱియెన్= దగ్గరపడియెను (సమీపమునకు చేరెను); అట్టియెడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా యుద్ధ సన్నద్ధుడయిన శల్యుడు సర్వతోభద్ర వ్యూహం సిద్ధం చేశాడు. ఆ సర్వతోభద్ర వ్యూహమునందు ముఖస్థానంలో కర్ణపుత్రులతో చుట్టబడినవాడై శల్యుడు నిలిచాడు. కుడివైపు శకయవన సమేతుడై కృపాచార్యుడున్నాడు. ఎడమవైపు త్రిగర్త వీరులతో కూడి కృతవర్మ ఉన్నాడు. వెనుకవైపు కాంభోజులు తోడుగా అశ్వత్థామ నిలిచాడు. నడుమభాగంలో కురువీరులతో దుర్యోధనుడు ఉన్నాడు. ఆ దుర్యోధనుడికి ముందు గజసమూహం ఉన్నది. దానికి అగ్రభాగంలో చతురంగబలాలతో శకుని నిలిచాడు. ఈ విధంగా సర్వతోభద్రవ్యూహాన్ని సిద్ధపరచి, ఒకటి తరువాత ఒకటి వరుసగా ఉంచి, వేగిరపాటుతో శల్యుడు సమరోత్సాహ సమగ్రుడయ్యాడు. అంతకంటె ముందుగానే పాండవులు మూడు ముఖాలుగా వ్యూహాన్ని సిద్ధపరిచారు. అనగా త్రిముఖ వ్యూహాన్ని పన్నారు. ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకులు ముగ్గురు మూడు ముఖాల సేనలకు అగ్రభాగంలో నిలిచారు. భీమార్జునులు

అగ్రజుడయిన ధర్మరాజునకు ముందుభాగాన నిలిచి ప్రకాశించారు. అప్పుడు పసుపురంగుతో ప్రకాశిస్తున్న శల్యుడి కేతనం చూచి పాండవులు వేగంగా యుద్ధానికి నడిచారు. సంజయుడు ఇట్లా చెప్పగా విని ధృతరాష్ట్రుడు: 'మనకును, పాండవులకు ఆ యుద్ధ సమయంలో కల చతురంగ బలముల పరిమితిని వివరించుము' అన్నాడు. ఇట్లు ధృతరాష్ట్రుడు అడిగిన వెంటనే సంజయుడు ధృతరాష్ట్రుడి కిట్లా చెప్పాడు. 'మనకు అనగా కౌరవపక్షానికి, పదకొండు వేలు రథాలు, పదివేల ఏడువందల ఏనుగులు, రెండు లక్షల గుర్రాలు, మూడు కోట్లు కాల్బలం, పాండవులకు ఆరువేలు రథాలు, మూడువేలు ఏనుగులు, లక్ష గుర్రాలు, కోటి కాల్బలం ఉన్నది. ఇట్లుండగా ఆ సేనా వ్యూహాలు ఒకదానితో ఒకటి గెలిచే ఉత్సాహంతో సమీపించాయి. అటువంటి సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మహాభారతముననుసరించి త్రిగర్తమను జనపదము కలదు. అచ్చట నివసించు రాజుపేరు త్రిగర్తుడు. త్రిగర్తరాజు 'సురథుడు' అనువాడు కలడు. అతడు ఏనుగుతో సహా నకులుడిచే చంపబడెను (ద్రోణపర్వము). త్రిగర్తరాజు 'సుశర్మ' ప్రసిద్ధుడు. ఇతడు దక్షిణ గోగ్రహణము నిర్వహించెను. అందు భీముడిచే ఓడింపబడినాడు. ఇక ఒక త్రిగర్తరాజునకు అయిదుగురు సోదరులు కలరు. అందు 'సత్యరథుడు' ముఖ్యుడు. త్రిగర్తదేశ నామముతో వ్యవహరింపబడు వీరులైన రాజులు అనేకులు కురుక్షేత్ర సంగ్రామమున కౌరవపక్షమున ఉండి పోరాడిరి. ఈ సర్వతోభద్ర వ్యూహమున - కృతవర్మతో ఉన్న త్రిగర్తుల పేర్లు చెప్పుటకు వలనుపడదు. 'సుశర్మ' కాని 'సత్యరథుడు' కాని కావచ్చును. మూలమున 'త్రిగర్తైః' అని ఉన్నందువలన త్రిగర్త దేశముయొక్క వీరులు అని చెప్పుట ఉచితము. కాంభోజదేశమనగా-ప్రస్తుత 'కాబోలి' ముఖ్య పట్టణముగా గల ఆఫ్ఘనిస్తాన్. మహాభారత కాలమున ఆ దేశమును పాలించురాజు సుదక్షిణుడు. అతడు మహారథుడు. ఈ సుదక్షిణుని అర్జునుడు సంహరించినట్లు ద్రోణపర్వమున కలదు. అందువలన సుదక్షిణుని తండ్రి సైన్యసమేతముగా ఇచ్చట అశ్వత్థామకు తోడుగా ఉండి ఉండవచ్చును. మూలమున 'కాంబోజైః' అని ఉన్నందువలన కాంబోజవీరులు అని చెప్పుట ఉచితము. 'కాంబోజ' - 'కాంభోజ' - ఇందు 'కాంబోజ' శుద్ధరూపము.

**ఉ. ఒండొరులన్ జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి య**
**ప్పాండవ కౌరవుల్ పెనఁగు భంగిఁ గనుంగొను వేడ్క నొక్కొ? యీ**
**తండు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగు బింబకాంతి న**
**ర్కుం డభిరాముఁడై పొడుపు గొండపయిన్ వెలుఁగొందెఁ జూడఁగన్. 114**

**ప్రతిపదార్థం:** ఒండొరులన్= ఒకరినొకరు (పరస్పరము); జయించు= గెలుచు; మతిన్= తలంపుతో; ఉద్భట= అధికమయిన; లీలలన్= చేష్టలతో (అనగా సంగ్రామ క్రీడలతో); చాలన్= మిక్కిలి; ఒప్పి= ప్రకాశించి; ఆ+పాండవకౌరవుల్= ఆ పాండవులు, కౌరవులు, పెనఁగు= యుద్ధముచేయు; భంగిన్= విధానమును; కనుంగొను= చూచెడి; వేడ్కన్= కుతూహలముతో; ఈతండు= ఈతడు (ఈ సూర్యుడు); మహా+అద్రిన్= ఉదయపర్వతమును; ఎక్కెన్= ఎక్కెను; ఒక్కొ?; అనన్= అనునట్లుగా; తద్దయున్= మిక్కిలి; చెన్ను+అగు= ఎర్రని; బింబకాంతిన్= బింబముయొక్క ప్రకాశంతో; అర్కుండు= సూర్యుడు; చూడఁగన్= చూడగా; అభిరాముడై= మనోహరుడై; పొడుపు= తూరుపు; కొండపయిన్= కొండమీద; వెలుఁగు+ఒందెన్= ప్రకాశించెను.

**తాత్పర్యం:** ఒకరినొకరు పరస్పరం జయించే తలంపుతో ఆ పాండవ కౌరవులు యుద్ధనీతిని పాటించి యుద్ధాన్ని చేసే విధానాన్ని చూచే కుతూహలంతో సూర్యుడు మేరుపర్వతాన్ని అధిరోహించాడా? అనునట్లు మిక్కిలి ఎర్రని

బింబకాంతితో సూర్యుడు మనోజ్ఞుడై తూర్పు దిక్కున ప్రకాశించాడు. (సూర్యోదయ మయిందని తాత్పర్యం. ఇది సూర్యోదయ వర్ణనం.)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**చ.** **అరసి యనాగతం బెఱుఁగునట్టి మనంబులు గల్గు పాండుభూ**
**వరసుతబంధుమిత్రకురువర్గ సుహృజ్జనకోటు లత్తఱిం**
**బొరసె నతిప్రమోదమును భూరివిషాదమునాఁగ నంబుజో**
**త్కరము వికాసమయ్యెఁ గుముదంబులు మీలన మొందె నెంతయున్.** **115**

**ప్రతిపదార్థం:** అరసి= ఆలోచించి; అనాగతంబు= జరుగబోవునది (భవిష్యము); ఎఱుఁగునట్టి= తెలియునట్టి; మనంబులు= మనస్సులు; కల్గు= కలిగిన; పాండుభూవర= పాండురాజుయొక్క; సుత= కుమారుల; బంధు= చుట్టముల; మిత్ర= స్నేహితులయొక్క; కోటులు= సమూహములు; కురువర్గ= కౌరవ విభాగముయొక్క; సుహృద్+జన= స్నేహితులయొక్క; కోటులు= సమూహములు; ఆ+తఱిన్= ఆ సమయమునందు; అతిప్రమోదమును; మిక్కిలి ఆనందమును; భూరి= అధికమయిన; విషాదమున్= దుఃఖమును; పొరసెన్= పొందెను; నాఁగన్= అన్నట్లు; అంబుజ= పద్మములయొక్క; ఉత్కరము= సముదాయముయొక్క; వికాసము= వికసనము; అయ్యెన్= ఐనది; కుముదంబులు= కలువలు; ఎంతయున్= మిక్కిలి; మీలనము+ఒందెన్= ముడుచుకొన్నాయి.

**తాత్పర్యం:** ఆలోచించి జరుగబోయేది తెలియునట్టి మనస్సులు కలిగిన పాండవులు, వారి బంధుమిత్ర సముదాయం అత్యంతానందాన్ని, అట్లే జరుగబోయేది తెలియునట్టి మనస్సులు కలిగి కురువర్గంవారి సుహృజ్జన సముదాయం అధిక దుఃఖమును పొందెనా! అనునట్లుగా ఆ సూర్యోదయ సమయంలో తామరలు వికసించాయి. కలువలు ముకుళించాయి.

**విశేషం:** అలం: క్రమాలంకార అనుప్రాణితం - ఉత్ప్రేక్షాలంకారం. ఇది సూర్యోదయ వర్ణనం. సూర్యోదయసమయాన తామరలు వికసించటం - కలువలు ముకుళించటం, చంద్రోదయ సమయాన కలువలు వికసించటం, తామరలు ముకుళించటం ప్రకృతి ధర్మం. తామర వికాసం ఆనందానికి, కుముదం ముకుళించటం దుఃఖానికి ప్రతీకలుగా పాండవపక్షం విజయానందం కౌరవపక్షం అపజయ దుఃఖం పొందేటట్లుగా క్రమంగా ఉత్ప్రేక్షించబడ్డాయి.

**సీ.** **కుంజరనికురుంబకుంభస్థలీసంగ । సిందూరరుచులతోఁ జెలిమి చేసి**
**కేతనవ్రాతసంకీలితమాణిక్య । రశ్ముల గెడ విహారంబు సలిపి**
**సైనికనికరవక్షఃస్థలపరిలిప్త । కాశ్మీర దీప్తులఁ గౌఁగిలించి**
**దండనాథోత్కరచండభావోద్వృత్త । చక్షుఃప్రభలుఁ దారు సరసమాడి**

**తే.** **యంశుజాలంబు లుభయసైన్యంబులందుఁ । బరఁగి బహువిధశస్త్రాస్త్రకిరణతతుల**
**బెరసి పరభాగలక్ష్మి దీపించి మెఱయ । బాల్యరమణీయుఁడగు చిత్రభానుఁ డొప్పె.** **116**

**ప్రతిపదార్థం:** కుంజర= ఏనుగులయొక్క; నికురుంబ= సమూహముయొక్క; కుంభస్థలీ= కుంభస్థలములందు; సంగ= కూడి ఉన్న; సిందూర= సిందూరముయొక్క; రుచులతోన్= కాంతులతో; చెలిమిన్= స్నేహమును; చేసి; కేతన= జెండాలయొక్క;

వ్రాత= సమూహమునందు; సంకీలిత= పొదుగబడిన; మాణిక్య= కెంపులయొక్క; రశ్ములన్= కాంతులతో; గెడ= జతకూడి (స్నేహముచేసి); విహారంబు; సలిపి= చేసి; సైనిక= సేనలయొక్క; నికర= సమూహములయొక్క; వక్షఃస్థల= ఉరఃస్థలములందు; పరిలిప్త= బాగుగా పూయబడిన; కాశ్మీర= కుంకుమపువ్వుల; దీప్తులన్= కాంతులను; కౌఁగిలించి; దండనాథ= సైన్యాధిపతులయొక్క; ఉత్కర= సమూహములయొక్క; చండ= రోషపూరితమయిన; భావ+ఉద్వృత్త= భావములతో వృద్ధిపొందిన; చక్షుః= నేత్రములయొక్క; ప్రభలున్= కాంతులును; తారున్= తామును; సరసము= శృంగార సంభాషణము; ఆడి= చేసి; అంశు= కిరణములయొక్క; జాలంబులు= సమూహములు; ఉభయ= రెండుపక్షముల; సైన్యములందున్= సేనలయందును; పరఁగి= వ్యాపించి; బహువిధ= పలురకములయిన; శస్త్ర= సామాన్య ఆయుధములయొక్క; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములయొక్క; కిరణ= కాంతులయొక్క; తతులన్= సమూహాలతో; బెరసి= కలిసి; పరభాగ= తూర్పుదిక్కుయొక్క; లక్ష్మి= సౌందర్యము; దీపించి= ప్రజ్వలించి; మెరయన్= ప్రకాశించేటట్లుగా; బాల్య= పసితనంచేత; రమణీయుఁడు= సౌందర్యము కలవాడు(శోభకలవాడు); అగు= అయినట్టి; చిత్రభానుఁడు= బాలసూర్యుడు (ఉదయసూర్యుడు); ఒప్పెన్= ప్రకాశించెను.

**తాత్పర్యం:** ఉదయసూర్యుడి కిరణాలు ఏనుగుల గుంపులయొక్క కుంభస్థలాల అందలి సిందూరకాంతులతో చెలిమి చేసి, జెండా కొయ్యల సమూహాలందు పొదుగబడిన కెంపుల కాంతులతో జతగూడి విహారం సలిపి, సేనా సమూహాల ఉరఃస్థలాలందు పూయబడిన కుంకుమపువ్వుల కాంతులను కౌగిలించి, సైన్యాధిపతుల సమూహాలయొక్క రోషపూరిత భావాలతో వర్ధిల్లిన నేత్రకాంతులతో కదిసి సరసమాడి, ఉదయసూర్యుడి కిరణసమూహాలతో కలిసి, తూర్పుదిక్కుయొక్క సౌందర్యం ప్రజ్వలించి ప్రకాశించేటట్లుగా పసితనపు శోభతో ఉదయసూర్యుడు ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఇదికూడా సూర్యోదయ వర్ణనమే. ఈ వర్ణనలో తిక్కన శబ్దవైచిత్రిని ప్రదర్శించారు. ఒకే అర్థం ఇచ్చే పలు శబ్దాలను ప్రయోగించటం శబ్దవైచిత్రి. వర్ణనలందు శబ్దవైచిత్రిని, చిత్రణలందు అర్థవైచిత్రిని ప్రదర్శించటం తిక్కనకు అలవాటు. ఈ సీసపద్యంలో సమూహం అనడానికి నికురంబ, వ్రాత, నికర, ఉత్కర, జాలంబులు -తతులు, అని ఆరు శబ్దాలను ప్రయోగించాడు. అట్లే కాంతులు అనే అర్థానికి రుచులు, రశ్ములు, దీప్తులు, ప్రభలు, కిరణములు- అని అయిదు శబ్దాలు ప్రయోగించాడు. ఇంకను - లేత ఎరుపు రంగు అర్థానికి - సిందూరము - మాణిక్యము - కాశ్మీరము- అని మూడు శబ్దాలు ప్రయోగించాడు. ఈ సూర్యోదయవర్ణనం అమూలకం. అనేక వర్ణభాసురమైన బాలభానుని కాంతులు కుంజర-కేతన-సైనిక-దండనాథుల వివిధాంశములతో కూడి ఉన్నట్లు వర్ణింపబడెను. చెలిమిచేయుట, విహరించుట, కౌగిలించుట, సరసమాడుట అనునవి ఆ రెంటి సమ్మేళనమును సూచించు సరసశబ్దములు, సామ్యార్థవాచకాలు. ఈ వర్ణన తిక్కన వర్ణనానైపుణ్యానికి గీటురాయి.

### కురుపాండవుల పదునెనిమిదవనాఁటి యుద్ధప్రారంభము (సం. 9-7-43)

**వ. ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దార్కొని భేరీప్రముఖ తూర్య నిస్వనంబులు నింగి వొంగం జెలంగ.**

**117**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; పూర్వసంధ్యా= ఉదయసంధ్యయొక్క; సమయంబునన్= కాలమున; తార్కొని= ఎదుర్కొని; భేరీ= భేరీ అను వాద్య విశేషము; ప్రముఖ= మున్నగు; తూర్య= తూర్యములను వాద్య విశేషములయొక్క (తూతూ బూరాలని జానపదుల వ్యవహారము); నిస్వనంబులు= ధ్వనులు; నింగి= ఆకాశము; పొంగన్= పొంగునట్లుగా; చెలంగన్= మ్రోయగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ఉదయకాలంలో కురుపాండవులు వారి సైన్యాలు ఒకరినొకరు ఎదుర్కొని భేరీ తూర్యధ్వనులు ఆకాశం మారుమ్రోగేటట్లు వినిపిస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఒండొంటిఁ దాఁకి హేతులు । మండఁగఁ దచ్చూర్ణతతులు మహి రాలఁగ ను**
**ద్దండతఁ గలయం బెరసెను । రెండు మొనలుఁ గ్రూరతరపరిస్ఫురణములై. 118**

**ప్రతిపదార్థం:** ఒండొంటిన్= ఒకదానితో ఒకటి; తాఁకి= తగిలి; హేతులు= పొడవైన కత్తులు; మండఁగన్= మండగా; తద్+ చూర్ణ= ఆ పొడులయొక్క; తతులు= సమూహములు; మహిన్= భూమియందు; రాలఁగన్= పడగా; కలయన్= అంతట; ఉద్దండతన్= అధికముగా; రెండుమొనలున్= రెండు పక్షాల సైన్యాలును; క్రూరతర= మిక్కిలి భయంకరముగా; పరిస్ఫురణంబులై= తలపించునవియై; బెరసెను= కలియబడెను.

**తాత్పర్యం:** కత్తులు ఒకదానితో మరియొకటి తగిలి మంటలు లేవగా పొడి అయిపోయిన ఆ ఆయుధాల పోగులు భూమిపై రాలగా భయంకరంగా ఆ కురు పాండవసేనా వ్యూహములు కలియబడ్డాయి.

**వ. ఇత్తెఱంగునఁ దలపడి. 119**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ ప్రకారముగా; తలపడి= కలియబడి.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కురుపాండసేనలు కలియబడి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అరదంబులు నరదంబులఁ । గరులు గరుల హరులు హరులఁ గాల్వురు మఱి గా**
**ల్వురఁ దాఁకి పెనఁగెఁ గడు భీ । కర భంగులు మెచ్చు దేర గగనచరులకున్. 120**

**ప్రతిపదార్థం:** అరదంబులన్= రథములతో; అరదంబులును= రథములును; కరులన్= ఏనుగులతో; కరులున్= ఏనుగులును; హరులన్= గుర్రములతో; హరులున్= గుర్రములు; మఱి= ఇంకను; కాల్వురన్= కాల్బలముతో; కాల్వురున్= కాల్బలము; తాఁకి= ఎదుర్కొని; కడున్= మిక్కిలి; భీకర= భయంకరమయిన; భంగులు= పద్ధతులు; గగన= ఆకాశమునందు; చరులకున్= సంచరించువారికి (అనగా సిద్ధ సాధ్యగరుడగంధర్వ యక్షకిన్నర కింపురుషాది దేవయోనులకు); మెచ్చుదేరన్= మెప్పుకలిగేటట్లు; పెనఁగెన్= పోరాడెను.

**తాత్పర్యం:** రథాలు రథాలతో, ఏనుగులు ఏనుగులతో, గుర్రాలు గుర్రాలతో, కాల్బలం కాల్బలంతో ఎదుర్కొని మిక్కిలి భయంకరమైన యుద్ధ రీతులతో గగన సంచారు లయిన దేవయోనులకు మెప్పు కలిగేటట్లు పోరాడాయి. (అనగా చతురంగ దళాలు ఒకదానితో ఒకటి భయంకరంగా పోరాడాయి అని తాత్పర్యం.)

**చ. పెనుపును నాకసం బవియు బృంహితముల్ దము నుగ్రగర్జిత**
**స్వనములతోడి మేఘముల చందముగా నొనరింప మీఁది యో**
**ధనికర మేయు సాయకవితానము భీషణవృష్టి గా రయం**
**బునఁ బయికొన్న యేనుఁగుల పోరునఁ దేరులు దేలె నెత్తుటన్. 121**

**ప్రతిపదార్థం:** పెనుపును= ఎంతోగొప్పగా; ఆకసంబు= ఆకాశము; అవియు= బ్రద్దలయ్యే; బృంహితముల్= ఘీంకారములు; తమున్= తమను (ఆ ఏనుగులను); ఉగ్ర= భయంకరములయిన; గర్జిత= ఉరుముచున్న ఉరుములయొక్క; స్వనములతోడి= ధ్వనులతోకూడియున్న; మేఘముల= మబ్బులయొక్క; చందము= విధము; గాన్= అగునట్లుగా; ఒనరింపన్= చేయగా; మీఁది= మీదను ఉన్న; యోధ= వీరులయొక్క; నికరము= సమూహము; ఏయు= ప్రయోగించు; సాయక= బాణములయొక్క; వితానము= సమూహము; భీషణ= భయంకరమయిన; వృష్టి= వర్షము; గాన్= అగునట్లుగా; రయంబునన్= వేగముగా; పయికొన్న= మార్కొనిన; ఏనుఁగులపోరునన్= ఏనుగులయొక్క పోరాటమునందు; నెత్తుటన్= రక్తమునందు; తేరులు= రథములు; తేలెన్= తేలెను.

**తాత్పర్యం:** ఆకాశాన్ని బ్రద్దలు చేసే గొప్ప ఘీంకృతులు తమను ఉరుములతో కూడిన మేఘాలుగా చేయగా, మీదనున్న యోధులు వేసే బాణాల సమూహం భయంకరమైన వర్షంగా మారి - వేగంగా మార్కొనిన ఏనుగుల పోరులో రథాలు రక్తంలో తేలాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఔన్నత్య ధర్మమున ఆకాశంతో, బృంహిత ధర్మమున మేఘాలతో సాయకవితాన ప్రయోగ ధర్మమున వృష్టితో ఉత్ప్రేక్షించి తిక్కయజ్వ చంపకమాలతో ఉత్ప్రేక్షమాలికలల్లాడు. నెత్తుట తేరులు తేలుట అతిశయోక్తి. బ్రహ్మర్షి వ్యాస భగవానుడిని కవిబ్రహ్మ ఈ గజసంగ్రామ వర్ణనంలో అతిశయించి, మూలానికి మెరుగులు పెట్టాడు.

**మూలం:**

> **'గజానాం భీమరూపాణాం ద్రవతాం నిఃస్వనో మహాన్ ।**
> **అశ్రూయత యథాకాలే జలదానాం నభస్తలే ॥**
> **నాగైరభ్యాహతాః కేచిత్ సరథా రథినోఽ పతన్ ।**
> **వ్యద్రవన్త రణే వీరా ద్రావ్యమాణా మదోత్కటైః ॥ (శల్య- 9 - 3, 4.)**

**తే. కరులగమి వొదివి రథముల్ గాలుకొనఁగ । నీక మరలిన ఘోటకానీకములను**
**బిరుదుమగల మొత్తములను బిండిపీఁచు । సేయు బలితంపునేర్పు లచ్చెరువుఁ బెనుఁ ప. 122**

**ప్రతిపదార్థం:** కరుల= ఏనుగులయొక్క; గమి= గుంపు; పొదివి= చుట్టుముట్టి; రథముల్= రథాలు; కాలుకొనఁగన్= కాలుపెట్టడానికి; ఈక= ఇయ్యక (అనగా కాలునిలుపుటకు అవకాశమీయక); మరలిన= తిరిగిపోయిన; ఘోటక= గుర్రములయొక్క; అనీకములను= సేనలను; బిరుదు= శౌర్యచిహ్నములుగల; మగల= వీరులయొక్క; మొత్తములను= సమూహములను (అనగా అతిరథ మహారథ రథ అర్ధరథులను); పిండిపీఁచుసేయు= పిండి, పీచు చేయుచున్న (ఇది తెలుగు జాతీయ ప్రయోగము); బలితంపు= బలిష్ఠములయిన; నేర్పులు= చేష్టలు(నేర్పరితనములు); అచ్చెరువున్= ఆశ్చర్యమును; పెనుఁపెన్= పెంపు చేయగా.

**తాత్పర్యం:** ఆ యుద్ధమునందు ఏనుగులగుంపు రథాలను చుట్టుముట్టి కాలు నిలుపటానికి అవకాశమీయనందువలన మరలిపోయిన ఆ రథాలను లాగే గుర్రాలను, ఆ రథాలను అధిరోహించిన అతిరథ మహారథ అర్ధరథ మొదలైన బిరుదులు గల వీరుల సమూహాలను పిండి, పీచు చేస్తున్న ఆ ఏనుగులయొక్క బలిష్ఠమయిన చేష్టలు ఆశ్చర్యాన్ని అధికం చేస్తుండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇది తిక్కయజ్వ కవిత యందలి చైతన్య చిత్రణ సౌందర్యం. (మూలము 121 పద్య విశేషంలో ఇవ్వబడింది.)

క. **పటురయమున నాశ్వికు లొ । క్కటఁ బెక్కం డ్రెక్కి రథనికరములు ఝుడితి**
**త్రుటితాకృతులుగ విహరిం । చుట యెక్కుడు వేడ్కసేయ సురగణమునకున్. 123**

**ప్రతిపదార్థం:** పటు= తీవ్రమయిన; రయమునన్= వేగమున; ఆశ్వికులు= గుర్రములను ఎక్కి యుద్ధము చేయువారు; ఒక్కటన్= ఒక్కసారిగా (ఏకకాలమున); పెక్కండ్రు= పలువురు; రథ= రథములయొక్క; నికరములు= సమూహములు; ఎక్కి; ఝుడితి= అతిశీఘ్రముగ (వెనువెంటనే); త్రుటిత= ముక్కలు ముక్కలుగా చేయబడిన; ఆకృతులుగన్= ఆకారాలు కలుగునట్లుగ; విహరించుట= వేడుకతో సంచరించుట; సుర= దేవతలయొక్క; గణములకు(న్)= సమూహములకు; ఎక్కుడు= మిక్కిలి; వేడ్క= వేడుక; చేయన్= చేయుచుండగా.

**తాత్పర్యం:** అతి శీఘ్రంగా పలువురు ఆశ్వికులు ఒక్కసారిగా రథాలను ఎక్కి వెనువెంటనే ముక్కలు ముక్కలుగా త్రుంచిన ఆకారాలు అయ్యేటట్లు చేయడం దేవతా సమూహాలకు మిక్కిలి సంతోషం కలిగిస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. **పలువుర నొక్కఁడు నొక్కనిఁ । బలువురుఁ దెగటార్చుటయును బలుదెఱఁగుల మూఁ**
**కలు పలుదెఱఁగులఁ దలఁపడి । పొలియించుట పొలియుటయును బొరి నుగ్రముగన్. 124**

**ప్రతిపదార్థం:** ఒక్కఁడున్= ఒక్కడు; పలువురన్= అనేకులను; ఒక్కనిన్= ఒక్కనిని; పలువురున్= అనేకులును; తెగటార్చుటయును= చంపుటయును; పలుతెఱఁగుల= అనేక విధములయిన; మూఁకలు= సమూహములు (అనగా సేనా సమూహములు); పలు తెఱఁగుల= అనేక విధములుగ; తలఁపడి= కలియబడి(పోరాడి); పొలియించుట= చంపుట; పొలియుటయును= చచ్చుటయును; పొరిన్= మిక్కిలి; ఉగ్రముగన్= భయంకరం కాగా.

**తాత్పర్యం:** ఒక్కడు పలువురను, పలువురు ఒక్కడిని చంపుతూ అనేకములయిన సేనల సమూహాలు అనేక విధాలుగా పోరాడి చంపటం, చావటం కలిగి మిక్కిలి భయంకరం కాగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. **చలమునఁ బోక పెనఁగు కా । ల్బలముపయిఁ దురగములును నిభంబులును రథం**
**బులుఁ గూడి కవిసి యింతిం । తలు దునియలు సేఁత యనుచిత క్రౌర్యముగాన్. 125**

**ప్రతిపదార్థం:** చలమునన్= మాత్సర్యముతో; పోక= వెడలిపోకుండగ; పెనఁగు= యుద్ధము చేయు; కాల్బలముపయిన్= పదాతిదళముమీద; తురగములునున్= గుర్రపు దళమును; ఇభంబులును= ఏనుగులును(అనగా గజదళమును); రథంబులున్= రథములును; కూడి= కలిసి; కవిసి= కలియబడి; ఇంతింతలు= చిన్న చిన్న; తునియలు= ముక్కలు; చేఁత= చేయుట (అనగా అశ్వదళము గజదళము రథములు కలిసి ఒక్కుమ్మడిగా పదాతిదళముపై పడి చిన్న చిన్న ముక్కలుగా చేయుట); అనుచిత= ఉచితము కానిది అగు (అనగా యుద్ధనీతికి తగనిది అగు); క్రౌర్యముగాన్= క్రూరత్వంగా.

**తాత్పర్యం:** ఒకరిపై ఒకరు మాత్సర్యంతో యుద్ధం చేసే పదాతి దళంపై రథగజ తురంగ దళాలు ఒక్కుమ్మడిగా కలియబడి చిన్న చిన్న ముక్కలుగా ఆ పదాతి దళాన్ని చేయటం - యుద్ధనీతికి ఉచితం కాని క్రూరత్వంగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. **తెల్లని సవరణ మెఱయ స । ముల్లసితములగు తురంగముల మొత్తము చం**
**చల్లలిత పక్షములు శో । భిల్లగతుల నొప్పనంచపిండుం బోలన్. 126**

**ప్రతిపదార్థం:** తెల్లని; సవరణ= అలంకారము (వాహనములకు చేసే అలంకారాలు - అనగా జీనులు మొదలగునవి, గుర్రాలకు తగిలించే తెల్లని చామరాలు); మెఱయన్= ప్రకాశింపగా; సముల్లసితములు= మిక్కిలి ప్రకాశవంతములు; అగు= అయినట్టి; తురంగముల= గుర్రములయొక్క; మొత్తము= సముదాయము; చంచత్= చలించుచున్నవియు; లలిత= అందమైనవి అగు; పక్షములు= రెక్కలు; శోభిల్లు= ప్రకాశించు; గతులన్= గమనములతో; ఒప్పు= ఒప్పే; అంచ= హంసలయొక్క; పిండున్= గుంపును; పోలన్= పోలగా.

**తాత్పర్యం:** తెల్లని చామరాలు ప్రకాశించగా - మిక్కిలి ప్రకాశవంతాలైన గుర్రాల సముదాయం చంచలాలు మనోహరాలు అయిన రెక్కలు ప్రకాశించే గమనాలతో ఒప్పే హంసల గుంపును పోలగా.

**విశేషం:** అలం: ఉపమ. తెల్లని చామరాలతో ప్రకాశించే గుర్రాల గమనాలు చంచలాలు సుకుమారాలు అయిన హంసల గుంపుల గమనాలను పోలి ఉన్నాయి. తురంగాల మొత్తము ఉపమేయం. అంచపిండు ఉపమానం; పోలన్ ఉపమవాచకం. తెలుపు సమానధర్మం. పూర్ణోపమ.

**వ. అయ్యిరువాఁగును పోరాడునప్పుడు. 127**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువాఁగుఁను= ఆ రెండుపక్షముల సైన్యములును; పోరాడునప్పుడు= యుద్ధము చేయు సమయమున.

**తాత్పర్యం:** ఆ రెండు పక్షముల సైన్యాలును అనగా కురుపాండవ సైన్యాలు యుద్ధం చేసే సమయంలో.

**విశేషం:** 121, 122, 123, 124, 125, 126 పద్యాలన్నీ అసంపూర్ణ వాక్యాలే, అవి అన్నీ 'పోరాడు' అనుక్రియతో అన్వయిస్తున్నాయి.

**క. గుణనినదము రథనేమి । క్వణనంబుం దురగఖురరవముఁ గరిఘంటా**
**రణనమును హేతి సంఘ । ర్షణనాదముఁ దూర్యఘోష సంపదఁ గడచెన్. 128**

**ప్రతిపదార్థం:** గుణ= వింటినారి యొక్క; నినదమున్= ధ్వనియును (విల్లునకు కట్టు అల్లెత్రాడునకు నారి అనిపేరు. అమ్ములు ప్రయోగించునప్పుడు ఈ నారినుండి వచ్చు మ్రోతలు.) రథ= రథములయొక్క; నేమి= చక్రముల కడకమ్ములయొక్క; కణ్వనంబున్= ధ్వనియును (రథములు వెళ్లునప్పుడు చక్రములకడకమ్ములు భూమిని తాకునప్పుడు వచ్చు ధ్వనులు); తురగ= గుర్రములయొక్క; ఖుర= గిట్టలయొక్క; రవమున్= ధ్వనియును; కరి= ఏనుగులయొక్క; ఘంటా= ఘంటలయొక్క (కంఠములందు వ్రేలాడుచున్న ఘంటలయొక్క); రణనమును= ధ్వనియును; హేతి= కత్తులు మొదలయిన ఆయుధములయొక్క; సంఘర్షణ= ఒకదానికొకటి ఒరిసికొనుట వలన పుట్టిన; నాదమున్= ధ్వనియును; తూర్య= తూర్యములయొక్క; ఘోష= ధ్వనియొక్క; సంపదన్= వైభవమును; కడచెన్= మించిపోయెను.

**తాత్పర్యం:** ఆ రెండు సైన్యాలు యుద్ధం చేసే సమయంలో అల్లెత్రాడుల ధ్వనులు, రథచక్రాల కడకమ్ముల ధ్వనులు, గుర్రాల గిట్టల చప్పుళ్ళు, ఏనుగుల కంఠాలలో వ్రేలాడే ఘంటల మ్రోతలు, కత్తులు మొదలయిన ఆయుధాలు ఒకదాని కొకటి ఒరిసికొనటంవలన పుట్టిన ధ్వనులు, మొత్తం ఈ అయిదు ధ్వనులు మిళితమయి తూర్యధ్వనుల వైభవాన్ని మించిపోయింది.

**విశేషం:** ఇందు తిక్కన శబ్ద చిత్రణవైచిత్ర్యమును దర్శింపవచ్చును. నినదము, క్వణనము, రవము, రణనము, నాదము, ఘోషము. ఈ కందమునందలి ఈ ఆరు శబ్దములూ - ధ్వన్యర్థకములే కాక ధ్వన్యనుకరణములు. (ఒక్క అర్థాన్ని బోధించటానికి) ఏకార్థ బోధకాలైన వివిధ శబ్దాల ప్రయోగం శబ్దవైచిత్రి.

ఇప్పట్టున వ్యాసభగవానుని వర్ణనం కూడా రమణీయంగా ఉన్నది.

'వాజినాం ఖురశబ్దేన రథనేమి స్వనేన చ । పత్తీనాం చాపి శబ్దేన నాగానాం బృంహితేన చ॥
వాదిత్రాణాం చ ఘోషేణ శంఖానాం నినదేన చ । అభవన్నాదితా భూమిః నిర్ఘాతైరివ భారత ॥
ధనుషాం కూజమానానాం శస్త్రౌఘానాం చ దీప్యతాం । కవచానాం ప్రభాభిశ్చ న ప్రాజ్ఞాయత కించన ॥ (శల్య9-14,15,16)

**సీ.** **నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడు వీరు । లలరిన నడ మోదుగులవిధంబు**
**గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహు దం । డములు మహాభుజంగములభంగి**
**యవని రక్తాక్తంబులై యున్న యట్టిబల్ । దలలు గెందామరకొలని పగిది**
**దఱచుగా నెఱి దప్ప నొఱగిన గజములు । గులిశభగ్నాచలకులమునట్లు**

**తే.** **దునిసి తొఱఁగిన జోదులతొడలు సామ । జములకరములు నొండొంటి చందములు గ**
**నుంగొనఁగ వింతలగుటను సంగరాంగ । ణంబు రమణీయమును భీషణంబు నయ్యె.** **129**

**ప్రతిపదార్థం:** నెత్తుటన్= రక్తమునందు; తోఁగియున్= తడిసియు లేక మునిగియు; నిగిడి= విజృంభించి; పోరెడు= పోరాటము సల్పెడు; వీరులు= శూరులు (పరాక్రమవంతులు); అలరిన= (పూలు) వికసించిన; నడ= నడచు; మోదుగుల= మోదుగ వృక్షములయొక్క; విధంబు= విధమును; గ్రక్కునన్= వేగముగ; తెగిపడి= తెగిపోయి; కదలెడు= చలించెడు; బాహుదండములు= దండములవంటి భుజములు, మహా= గొప్పవి అగు; భుజంగముల= నాగుపాములయొక్క; భంగి= విధమును; అవని= భూమియందలి; రక్త= రక్తంతో; అక్తంబులై= కలిసినవియై; ఉన్న; అట్టి; బల్= గొప్ప; తలలు= శిరములు; కెందామర= ఎర్రతామరలయొక్క; కొలని= సరస్సు; పగిది= విధమును; తఱచుగాన్= ఎక్కువగా; నెఱి= అందము; తప్పన్= తప్పిపోగా (తరిగిపోగా); ఒఱగిన= నేలవ్రాలిన; గజములు= ఏనుగులు; కులిశ= వజ్రాయుధముచే; భగ్న= విరుగగొట్టబడిన; అచల= పర్వతములయొక్క; కులము= సముదాయము; అట్లు= రీతి; తునిసి= ఖండింపబడి; తొరఁగిన= విడివడిపోయిన; జోదుల= యోధులయొక్క; తొడలు; సామజముల= ఏనుగులయొక్క; కరములున్= తొండములును; ఒండొంటి= ఒకదానికొకటి; చందములు= విధములు; కనుంగొనఁగన్= కనిపించగ (తొడలు తొండములుగ తొండములు తొడలుగ కనిపించగ); వింతలు= ఆశ్చర్యజనకములు; అగుటను= అగుటచేత; సంగర= యుద్ధము చేయు; అంగణంబు= ముంగిలి (అనగా యుద్ధము చేయు ప్రదేశము - అనగా యుద్ధభూమి); రమణీయమును= సుందరమయినదియును; భీషణంబును= భయానకమయినదియును; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** రక్తంతో తడిసి యుద్ధం చేస్తున్న వీరులు - వికసించిన పూలతో నడుస్తున్న మోదుగుచెట్లుగాను, వేగమున తెగిపోయి కదలాడుతున్న దుడ్డుకర్రలవంటి భుజాలు గొప్ప గొప్ప నాగుపాములుగాను, భూమిపై రక్తసిక్తములై పడి ఉన్న తలలు ఎర్రతామరల కొలనుగాను; అందం తరిగి కూలిపోయిన ఏనుగులు వజ్రాయుధంచేత విరుగగొట్టబడిన పర్వాతాల సముదాయాన్నీ, ఖండించబడి విడిపడిపోయిన యోధుల తొడలు ఏనుగుల తొండాలు ఒకదానికొకటి అనిపించగా ఆశ్చర్యజనకంగా ఆ యుద్ధభూమి సుందరమూ, భయానకమూ అయింది.

**విశేషం:** ఇది యుద్ధభూమి స్వరూప చిత్రణం. ఉపమల మాలిక. శృంగార, భయానక, అద్భుతరసభావాలతో నిండిన సీస మిది. ఈ సీసంలోని ప్రతిపాదంయొక్క మొదటిభాగం భయానకం. రెండవ భాగం శృంగారం. ఇచట శృంగార మంటే సౌందర్యం. ప్రతి పాదం ఒక ఉపమ. భయానకమును శృంగారంతో ఉపమించటం ఇందలి విచిత్ర చిత్రణం. బీభత్సరస భావాలు కూడా ఇందు పుష్కలంగా ఉన్నాయి. కాని తిక్కయజ్వ 'రమణీయమును, భీషణంబును, వింతలగుటను' అనే ప్రయోగాలతో శృంగార, భయానక, అద్భుత రసభావాలను మాత్రం సూచించాడు.

**తే. ఏమి చెప్పుదు రౌద్రంపు టెసకమందుఁ । దఱచు మెదళులు ఱొంపులు నుఱుములైన**
**యెమ్ము లిసుకయు సితచామరమ్ము లంచ । లయ్యె రుధిరంపు టేరుల కప్పుడధిప! 130**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అందున్= ఆ యుద్ధభూమియందు జరుగు; రౌద్రంపు= క్రోధముయొక్క; ఎసకము= విజృంభణము; ఏమి; చెప్పుదున్; తఱచు= అధికమయిన; మెదళులు= మస్తిష్కములు; ఱొంపులు= బురదలు; నుఱుములు= పొడులు(చూర్ణములు); ఐన= అయినటువంటి; ఎమ్ములు= ఎముకలు; ఇసుకయున్; సిత= తెల్లని; చామరమ్ములు= వింజామరములు; అప్పుడు= ఆ సమయమున; రుధిరంపు= రక్తముయొక్క; ఏరులకున్= నదులకు; అంచలు= హంసలు; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ యుద్ధభూమిలోని క్రోధ విజృంభణాన్ని గూర్చి ఏమి చెప్పను? అది వర్ణించటానికి శక్యం కానిది. ఆ యుద్ధసమయంలో మెదడులు బురదలుగా, చూర్ణాలయిన ఎముకలు ఇసుకగా తెల్లని చామరాలు ఆ రక్తపుటేరులలో హంసలుగా అయ్యాయి.

**విశేషం:** అలం: రూపకం. ఉపమాన ఉపమేయములకు అభేద కల్పనం రూపకం. సమరాంగణం ఉపమేయం. ఏరులు ఉపమానం. ఈ రెంటికి అభేదం కల్పించటంవలన ఇది రూపకం. అట్లే నదులందు బురద ఇసుక, నీరు; ఆ నీటియందు మస్తిష్కములు బురదలుగా, చూర్ణములయిన ఎముకలు ఇసుకగా, రక్తం జలంగా - తెల్లని చామరాలు హంసలుగా ఉపమేయ ఉపమానములకు క్రమంగా అభేదకల్పనంవల్ల ఇది రూపకమాలిక అయింది. ఇట్లు అలంకార మాలిక లల్లటం తిక్కన సహజకవితాలక్షణం.

**క. విను మయ్యేఱులలో వా । హనములె యోడలుగఁ జూడ నక్కజమగు ను**
**క్కున నుద్దామ విహారం । బొనరించిరి వీరయోధు లుర్వీనాథా! 131**

**ప్రతిపదార్థం:** ఉర్వీ= భూమికి; నాథా! ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; వినుము; ఆ+ఏఱులలోన్= ఆ రక్తపు నదులలో; వాహనములె= ఎక్కదగిన రథాదులే; ఓడలుగన్; చూడన్= చూడగ; అక్కజము= ఆశ్చర్యము; అగు= అయినట్టి; ఉక్కునన్= శౌర్యముతో; వీర= పరాక్రమము కలిగిన; యోధులు= యుద్ధము చేయు సైనికులు; ఉద్దామ= అడ్డులేని విధముగ; విహారంబు= సంచారము; ఒనరించిరి= చేసిరి.

**తాత్పర్యం:** (సంజయుడు చెప్పుతున్నాడు) ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆలకించుము. ఆ రక్తపు నదులలో వాహనాలు ఓడలు కాగా, అధికమయిన శౌర్యంతో వీరులయిన యోధులు అబ్బురపరిచే సాహసంతో అడ్డులేని విధంగా సంచారం చేశారు. వీర విహారం చేశారు.

**వ. ఇవ్విధంబునం బోరు ఘోరంబై చెల్లుచుండ నుల్లసిత విక్రమవిజృంభితులగు భీమపార్థులు నలిరేఁగి నారాచప్రముఖ నానావిశిఖంబుల మనమొనఁ గనుపుగొట్టిన నది బెగడొంది మగిడిన నమ్మేటి మగలుబ్బి పౌండ్రదేవదత్తంబుల నొత్తుటయు ధృష్టద్యుమ్నుండును శిఖండియుం గౌంతేయాగ్రజు మున్నిడికొని తఱుమఁ దోడన కవలును గడంగి రట్లాటోపదీపితులైన పాండవేయుల యురవడికి నోటతి నీబలంబు హాహాకారంబులతోఁ బలుదెసలఁ బఱవందొడంగినం గనుంగొని శల్యుండు సారథి కిట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారముగ; పోరు= యుద్ధము; ఘోరంబు= భయంకరము; ఐ= అయినట్టిదియై; చెల్లుచున్= కొనసాగుచు; ఉండన్; ఉల్లసిత= ప్రకాశించుచున్న; విక్రమ= పరాక్రమముతో; విజృంభితులు= చెలరేగినవారు; అగు= అయినట్టి; భీమ పార్థులు= భీముడును అర్జునుడును; నలి రేఁగి= విజృంభించి; నారాచ= వాడి అయిన ఇనుప బాణములు; ప్రముఖ= మొదలైన; నానా= పలురకములగు; విశిఖంబులన్= తీక్ష్ణములయిన బాణములతో; మన= మనయొక్క; మొనన్= సేనావ్యూహమును; కనుపు= ఒకముక్కను (అనగా ఒక భాగమును లేక ఒక పర్వమును); కొట్టినన్ విడగొట్టగా; అది= ఆ సేనావిభాగము; బెగడు= భయము; ఒంది= పొంది; మగిడినన్= మరలిపోవుచుండగా; ఆ+మేటి మగలు= గొప్పవారయిన ఆ వీరులు; ఉబ్బి= పొంగి; పౌండ్ర= పౌండ్రమను పేరుగల శంఖమును; దేవదత్తంబులన్= దేవదత్తమను పేరుగల శంఖమును; ఒత్తుటయున్= ఊదుటయు (పూరించుటయు); ధృష్టద్యుమ్నుండును; శిఖండియున్; కౌంతేయ= కుంతీపుత్రులలో; అగ్రజున్= పెద్దవాడు అయిన ధర్మరాజును; మున్ను= ముందు; ఇడుకొని= ఉంచుకొని; తఱుమన్= పారద్రోలగా; తోడన= ఆ వెంబడి; కవలును= కవలపిల్లలు అయిన నకులసహదేవులును; కడంగిరి= పూనిక వహించిరి; అట్లు= ఆ ప్రకారముగ; ఆటోప= సంభ్రమము వలన (అతి వేగముగా యుద్ధము చేయుటవలన); దీపితులు= ప్రకాశింపచేయబడినవారు; ఐన= అయినట్టి; పాండవేయుల= పాండురాజు కుమారులయిన పాండవులయొక్క; ఉరవడికిన్= విజృంభణమునకు; ఓటఱి= బలహీనమయి; నీ బలంబు= నీయొక్క సైన్యము; హాహాకారంబులతోన్= దుఃఖమును, బాధను తెలుపు హాహా అను అరుపులతో; పలు= అనేకములగు; దెసలన్= దిక్కులకు; పఱవన్= పారిపోవుటకు; తొడంగినన్= ప్రారంభించగా; కనుంగొని= చూచి; శల్యుండు; సారథికిన్; ఇట్లు= ఈ విధముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ప్రకారంగా యుద్ధం భయంకరంగా కొనసాగుతుండగా ప్రకాశమాన పరాక్రమంతో విజృంభించే భీమార్జునులు అతిశయించి, వాడి అయిన ఇనుపబాణాలు మొదలైన ముఖ్యములైన బాణాలతో మన సేనావ్యూహంలోని ఒక భాగాన్ని విడగొట్టగా, ఆ సేనా విభాగం భయపడి పారిపోతుండగా మహావీరు లయిన ఆ భీమార్జునులు పొంగిపోయి పౌండ్ర దేవదత్తాలను పూరించారు. అంతట ధృష్టద్యుమ్నుడు, శిఖండి ధర్మరాజును ముందుంచుకొని తరుమగా ఆ వెంబడి నకుల సహదేవులునూ పూనిక వహించారు. ఆ ప్రకారంగా ప్రకాశమానులైన పాండవుల శీఘ్రసంగ్రామానికి బలహీనమయిన నీ సైన్యం హాహాకారలతో పలు దెసలకు పారిపోవటం ప్రారంభించగా చూచి శల్యుడు సారథితో ఇట్లా అన్నాడు:.

**విశేషం:** భీముడి శంఖంపేరు పౌండ్రం. అర్జునుడి శంఖం పేరు దేవదత్తం. ఈ దేవదత్తం దివ్యశంఖం. మయుడు ఈ దేవదత్తాన్ని బిందుసరోవరంనుండి తెచ్చి అర్జునుడికి ఇచ్చాడు. ఈ మయుడే భీముడికి గదను ఇచ్చాడు. ఈ మయుడే పాండవులకు మయసభను నిర్మించి ఇచ్చాడు.

**ఉ.** **'అల్లదె కంటె? పాండుతనయాగ్రణితేరు సితాశ్వయుక్తమై**
**తెల్లని యెల్లి నొప్పినది తీవ్రత మార్కొని యాన్నృపాలు శో**
**భిల్లుట మాన్పఁగా వలయు భీషణభంగి రథంబు వోవ ని**
**మ్మెల్లజనంబు నా కడిమి యేర్పడ నేఁ డెఱుఁగంగఁ జేసెదన్.** **133**

**ప్రతిపదార్థం:** సిత= తెల్లని; అశ్వ= గుర్రములతో; యుక్తమై= కూడినదియై; పాండు= పాండురాజుయొక్క; తనయ= కుమారులలో; అగ్రణి= పెద్దవాడయిన ధర్మరాజుయొక్క; తేరు= రథము; తెల్లని; ఎల్లిన్= గొడుగుతో; ఒప్పినది= అందముగా ఉన్నది; అల్లదె= అదిగో అక్కడ ప్రత్యేకముగా ఉన్నది; కంటె?= చూచితివా?; తీవ్రతన్= తీవ్రముగా(భీకరముగా); మార్కొని=

ఎదుర్కొని; ఆ నృపాలు= ఆ రాజు(ఆ ధర్మరాజు); శోభిల్లుట= ప్రకాశించుట (విజృంభించుట); మాన్పఁగాన్= పోగొట్టగా; వలయున్= చేయవలయును; భీషణ= భయంకరమయిన; భంగిన్= విధముగా; రథంబు; పొనిమ్ము; నేఁడు; ఎల్ల= సమస్తమయిన; జనంబున్= ప్రజలు; నా; కడిమి= పరాక్రమము; ఎఱుంగగన్= తెలిసికొనునట్లుగా; ఏర్పడన్= తేటపడగా; చేసెదన్= చేసెదను.

**తాత్పర్యం:** 'తెల్లని గుర్రాలతో కూడి, తెల్లని గొడుగుతో అందంగా ప్రకాశిస్తున్న ఆ ధర్మరాజురథం అదిగో అక్కడ ఉన్నది. చూచావా? తీవ్రంగా ఎదుర్కొని ఆ ధర్మరాజు విజృంభణాన్ని పోగొట్టాలి. కాబట్టి, భయంకర రీతిలో రథాన్ని అటు పోనిమ్ము. నేడు నా పరాక్రమం సమస్త ప్రజలు తెలిసికొనేటట్లు తేటపడచేస్తాను.

**తే. సురల నైన గెలుతు దురమున విను నాకుఁ। బాండుపుత్త్రు లెదురె భండనమున?**
**నేర్పు బలుపుఁ జూపి నిన్ను మెప్పింతు నా। చేతిబరువు సూడు సూతవర్య! 134**

**ప్రతిపదార్థం:** సూత= సూతులలో; వర్య!= ఉత్తముడవు అయిన ఓ సారథీ!; విను; దురమునన్= యుద్ధమునందు; సురలను= దేవతలను; ఐనన్= అయినను; గెలుతున్= జయింతును; భండనమునన్= యుద్ధంలో; నాకున్= నాకు; పాండుపుత్రులు= పాండురాజు కుమారులు; ఎదురె?= ఎదురు నిలువగలవారే?; నా= నాయొక్క; చేతి= చేతియొక్క; బరువున్= భారమును; చూడు= చూడుము; భండనమునన్= యుద్ధమున; నేర్పు; బలుపున్= బలమును; చూపి; నిన్ను; మెప్పింతున్= మెప్పింతును.

**తాత్పర్యం:** ఓ సారథీ! ఆలకింపుము. యుద్ధంలో దేవతల నైనను జయిస్తాను. యుద్ధంలో నాకు ఈ పాండవులు ఎదురు నిలువలేరు. నా చేతిభారం చూడుము. ఈ యుద్ధంలో నా నైపుణ్యం, బలం ప్రదర్శించి నిన్ను మెప్పిస్తాను.

**విశేషం:** ఈ పద్యం అమూలకం. 133వ పద్యానికి మూలం.

**'ఉవాచ సారథిం తూర్ణం చోదయాశ్వాన్మహాజవాన్ ।**
**ఏష తిష్ఠతి వై రాజా పాండుపుత్రో యుధిష్ఠిరః ।**
**ఛత్రేణ ధ్రియమాణేవ పాండురేణ విరాజతా ॥**
**అత్ర మాం ప్రాపయ క్షిప్రం పశ్య మే సారథే బలమ్ ।**
**న సమర్థో హి మే పార్థః స్థాతు మద్య పురోయుధి ॥ (శల్య. అధ్యా. 10)**

తిక్కయజ్వ స్వేచ్ఛానువాద సౌందర్యాన్ని గ్రహించటంకొరకు అచ్చటచ్చట మూలమును చూపటం జరుగుతున్నది.

**వ. అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురుగా నరదంబు సముచితరయంబున నడప నమ్మద్రపతి సముద్ర సముద్రేకంబు చందంబైన యా సైన్యంబు సరభసత్వంబు చెలియలికట్టయుంబోలి యుడుపుట యచ్చెరువై యుండె నట్లు శౌర్యధైర్యంబుల నుల్లసిల్లు శల్యుం జూచి మనమూఁకలును మగుడ నిగిడిన సంగ్రామంబు భీమంబయ్యె నందు నకులుండును గర్ణపుత్త్రుండగు చిత్రసేనుండును దలపడి యొండొరువులకుఁ గృతాస్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం బెనంగునెడ నా సూతపౌత్త్రుండు. 135**

**ప్రతిపదార్థం:** అనుటయున్= చెప్పుటయు; వాఁడు= సారథి; పాండవ= పాండవులయొక్క; బలంబులకున్= సేనలకు; ఎదురుగాన్= ఎదురుగా; అరదంబు= రథము; సముచిత= తగిన; రయంబునన్= వేగమున; నడపన్= నడపగా; ఆ+మద్రపతి= మద్రదేశమునకు ప్రభువు అయిన ఆ శల్యుడు; సముద్ర= సముద్రముయొక్క; సముద్రేకంబు= ఉప్పొంగు(విజృంభించు);

చందంబు= విధము; ఐనన్= కాగా; ఆ సైన్యంబు= ఆ సేనలు (ఆ పాండవసేనలు); సరభసత్వంబు= వేగిరపాటుతనము; చెలియలి కట్టయున్= సముద్రపు గట్టును; పోలి= వలె; ఉడుపుట= ఆపుట; అచ్చెరువై= ఆశ్చర్యకరమై; ఉండెన్= ఉండెను; అట్లు= ఆ ప్రకారముగా; శౌర్య= పరాక్రమము; ధైర్యంబులన్= ధీరత్వములతో; ఉల్లసిల్లు= ప్రకాశించు; శల్యున్; చూచి; మనమూఁకలును= మనయొక్క సేనలును; మగుడన్= మరల; నిగిడినన్= నిక్కగా(విజృంభించగా); సంగ్రామంబు= యుద్ధము; భీమంబు= భయానకము; అయ్యెన్= అయ్యెను; అందున్= ఆ యుద్ధమునందు; నకులుండును; కర్ణపుత్రుండగు= కర్ణుని కుమారుడగు; చిత్రసేనుండును; తలపడి= కలియపడి; ఒండొరువులకున్= ఒకరికొకరికి (పరస్పరం); కృతాస్త్రత్వంబును= సమర్థమైన అస్త్రప్రయోగము కలిగియుండుటను; సమర= యుద్ధముచేయుటయందు; విశారదత్వంబును= పాండిత్యము కలిగియుండుటను; చూపుచున్= చూపించుచు; పెనంగు= పోరాటమును; ఎడన్= సలుపు సమయమున (పోరాడే స్థానంలో); ఆ సూత= ఆ సూతునియొక్క; పౌత్రుండు= మనుమడు (కర్ణుడిని పెంచిన తండ్రి సూతుడు - అందువలన కర్ణుడి కొడుకు సూతుడికి మనుమడు).

**తాత్పర్యం:** శల్యుడు ఇట్లా సారథితో చెప్పగా, సారథి పాండవ బలాలకు ఎదురుగా రథాన్ని తగిన వేగంతో నడపగా ఆ శల్యుడు ఉప్పొంగే సముద్రాన్ని చెలియలికట్ట ఆపిన విధంగా పాండవసేనలయొక్క వేగిరపాటును ఆపటం ఆశ్చర్యకరమై ఉండింది. ఆ ప్రకారంగా పరాక్రమ ధీరత్వాలు ప్రకాశించే శల్యుడిని చూచి, కురు సైన్యాలు మరల విజృంభించగా, యుద్ధం భయానకమైనది. ఆ యుద్ధంలో నకులుడు, కర్ణుడి కుమారుడయిన చిత్రసేనుడును కలియబడి ఒకరినొకరు పరస్పరం అస్త్రప్రయోగ సామర్థ్యంతో యుద్ధం చేయటంలో పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ పోరాడేటప్పుడు ఆ సూతుడి మనుమడయిన చిత్రసేనుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

### కర్ణకొడుకులు చిత్రసేన సత్యసేన సుశర్ములు నకులునిచేతఁ జచ్చుట (సం. 9-9-12)

**చ.** **నకులుని చాపదండము ఘనప్రదరంబునఁ దున్మి, భాస్వరాం**
**బకములు మూఁడు దీవ్రగతి ఫాలతలంబున నాటి త్రుంచె ఘో**
**టకములఁ గేతనం బిలఁ బడన్ విదళించి వధించె సూతు ఖే**
**టకమును ఖడ్గముం గొని కడఁగఁ బయిం బరఁగించె భల్లముల్.** **136**

**ప్రతిపదార్థం:** నకులుని= నకులునియొక్క; చాపదండము= వింటికర్రను; ఘన= గొప్పదిఅయిన; ప్రదరంబునన్= బాణముతో; తున్మి= ఖండించి; మూఁడు; భాస్వర= ప్రకాశమానములగు; అంబకములు= బాణములు; తీవ్రతన్= మిక్కిలి వేగంగా; ఫాల= లలాటము యొక్క; భాగంబునన్= ప్రదేశమునందు; నాటి= గ్రుచ్చి; ఘోటకములన్= గుర్రములను; కేతనంబు= జెండాకొయ్య; ఇలన్ పడన్= భూమిపై పడునట్లు; విదళించి= ఖండించి; త్రుంచెన్= చంపెను; సూతు= సారథిని; వధించెన్= సంహరించెను; ఖడ్గమున్= కత్తిని; ఖేటకమును= డాలును; కొని= తీసికొని; కడంగన్= ప్రయత్నం చేయగా; భల్లముల్= బల్లెములు; పయిన్= ఆ నకులుడిపై; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఆ సూతపౌత్రుడు చిత్రసేనుడు నకులుడి వింటి కర్రను గొప్పదైన బాణంతో ఖండించి, మూడు ప్రకాశమానాలైన బాణాలు నకులుడి లలాటంపై గ్రుచ్చి, గుర్రాలను జెండా కొయ్యను భూమిపై పడేటట్లు ఖండించాడు. సారథిని ఖండించి, సంహరించాడు. (నకులుడు) కత్తిని డాలును గైకొని దాడికి పూనుకొనగా చిత్రసేనుడు అతనిపై బల్లాలు ప్రయోగించాడు.

**క. ఆ నిశితభల్లములు దన । మేనికి రాకుండఁ బలుక మెఱయ జడియుచున్**
**వే నిగిడి కదిసె మాద్రీ । సూనుం డా సూతసూతిసూను నరదమున్. 137**

**ప్రతిపదార్థం:** ఆ; నిశిత= వాడి అయిన; భల్లములు= బల్లెములు; తన; మేనికిన్= దేహమునకు; రాకుండన్= తగులకుండగ; పలుక= డాలు; మెఱయన్= ప్రకాశింపగ; జడియుచున్= త్రిప్పుతూ; వే= వేగమున; నిగిడి= విజృంభించి; మాద్రీ= మాద్రియొక్క (పాండురాజు రెండవపత్ని); సూనుండు= కుమారుడు(నకులుడు); ఆ; సూత= సూతునియొక్క; సూతి= కుమారునియొక్క (కర్ణుడియొక్క); సూనుని= కుమారుని (చిత్రసేనుని); అరదమున్= రథమును; కదిసెన్= చేరెను.

**తాత్పర్యం:** చిత్రసేనుడు విసిరిన ఆ వాడిఅయిన బల్లెములు తన దేహానికి తగులకుండగనే (తన దేహం దగ్గరకు రాకుండగనే) డాలును త్రిప్పుతూ వేగంగా విజృంభించి నకులుడు చిత్రసేనుడి రథాన్ని సమీపించాడు.

**తే. కదిసి మీఁదికి లంఘించి మదమెలర్ప । గళముఁ దునిమిన నమ్మస్తకంబు డొల్లెఁ**
**గర్ణపూరకిరీటసంకలిత వివిధ । రత్నరోచులు మెఱయ ధరాతలమున. 138**

**ప్రతిపదార్థం:** కదిసి= చేరి (చిత్రసేనుని రథముచేరి); మీఁదికిన్= పైకి(రథముపైకి); లంఘించి= దూకి; మదము= గర్వము; ఎలర్పన్= అతిశయింపగ; గళము= కంఠము(కుత్తుక); తునిమినన్= ఖండించగా; ఆ+మస్తకంబు= ఆ శిరస్సు; కర్ణపూర కిరీట= చెవికమ్మ, మకుటములయందు; సంకలిత= కూడియున్న (పొదిగియున్న); వివిధ= పలురకములయిన; రత్న= మాణిక్యములయొక్క; రోచులు= కాంతులు; మెఱయన్= ప్రకాశింపగ; ధరా= భూమియొక్క; తలమునన్= స్థలమున; డొల్లెన్= దొర్లెను.

**తాత్పర్యం:** నకులుడు చిత్రసేనుడి రథంపైకి దూకి, గర్వం అతిశయించగా కుత్తుకను ఖండించగా ఆ తల కర్ణకుండలాలలో, కిరీటంలో పొదిగిన పలురకాలయిన మాణిక్య కాంతులు ప్రకాశిస్తూ ఉండగా భూమిపై పడి దొర్లింది.

**విశేషం:** మహాభారతంలో చిత్రసేనులు లెక్కకు మిక్కిలి ఉన్నారు. ధృతరాష్ట్రుడి పుత్రులు పదకొండుమంది మహారథులలో చిత్రసేను డొకడు ఉన్నాడు. పరీక్షిత్తు మహారాజుయొక్క మూడవపుత్రుడు చిత్రసేను డొకడు ఉన్నాడు. జరాసంధుని మంత్రి నీతిశాస్త్ర విశారదుడు చిత్రసేను డొకడు ఉన్నాడు. అభిసార దేశపురాజు చిత్రసేను డొకడు ఉన్నాడు. త్రిగర్తరాజు సుశర్మ అన్నగారు చిత్రసేను డొకడు ఉన్నాడు. పాంచాల యోధుడు చిత్రసేను డొకడు ఉన్నాడు. నాగరాజు చిత్రసేను డొకడు ఉన్నాడు. గంధర్వరాజు చిత్రసేను డొకడు ఉన్నాడు.

**వ. ఇట్లు చిత్రసేనుండు పడినం గనుంగొని కౌంతేయసైనికు లార్చినం బేర్చిన శోకరోషంబుల మనంబుల ముప్పిరిగొన వాని సోదరులు సత్యసేనుండును - సుశర్ముండును నప్పాండుపుత్రుపైఁ గవిసిన నతండు వేఱొక్క-తేరెక్కి బలు విల్లెత్తి దండధర ప్రచండమూర్తియై మార్కొనిన నబ్బిరుదుమగ లయ్యరదంబు భల్లంబుల నఱకం దొడంగిన నుఱక చిఱునవ్వు నవ్వి. 139**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; చిత్రసేనుండు; పడినన్= పడిపోయిన(చనిపోయిన); కనుంగొని= చూచి; కౌంతేయ= కుంతీపుత్రులయొక్క(పాండవులయొక్క); సైనికులు; ఆర్చినన్= అరవగా; పేర్చిన= అతిశయించిన; శోకం= దుఃఖము; రోషంబులు= క్రోధములు; మనంబులన్= మనస్సులందు; మూడు+పిరి= మూడు పేటలుగా; కొని= చుట్టుకొని; వాని;

సోదరులు; సత్యసేనుండు; సుశర్ముండునున్; ఆ+పాండుపుత్రునిపైన్= ఆ పాండురాజు కుమారుడిపై(నకులుడిపై); కవిసినన్= ఉరకగా; ఆతండు= ఆ నకులుడు; వేఱొక్క= ఇంకొక; తేరు= రథము; ఎక్కి; బలు= బలముగల; విల్లు= ధనువు; ఎత్తి= తీసికొని; దండధర= యమునివలె; ప్రచండ= తీవ్రమయిన (భయంకరమయిన); మూర్తి+ఐ= ఆకారము కలవాడై; మార్కొనినన్= ఎదుర్కొనగా; ఆ+బిరుదు= ఆ మహారథులు అయిన; మగలు= వీరులు (సత్యసేన - సుశర్మలు); ఆ+అరదంబు= ఆ రథమును; భల్లంబులన్= బల్లెములతో; నఱకన్= ఖండించుటకు; తొడంగినన్= ప్రారంభించగా; ఉఱక= లెక్కచేయక; చిఱునవ్వు; నవ్వి.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా చిత్రసేనుడు పడిపోగా చూచి పాండవుల సైనికులు అరవగా, దుఃఖం, క్రోధం ముప్పిరిగొనగా చిత్రసేనుడి సోదరులయిన సత్యసేన, సుశర్మలు ఆ నకులుడిపై కలియబడగా, నకులుడు ఇంకొక రథం ఎక్కి బలమయిన ధనువు గైకొని యముడివలె భయంకరమయిన ఆకారం కలవాడయి ఎదుర్కొనగా, మహారథులయిన ఆ వీరులు నకులుడి రథాన్ని బల్లెములతో ఖండించటానికి ప్రారంభించగా నకులుడు దానిని లెక్కచేయక ఒక చిన్న నవ్వు నవ్వి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మూలంలో కర్ణుడి కొడుకు 'సుశర్మ' డనేవాడు లేడు. 'సుషేణు'డు ఉన్నాడు. సుశర్ముడు త్రిగర్త దేశాధీశుడు. దక్షిణ గోగ్రహణంలో కౌరవసైన్యానికి ఇతడు నాయకుడు. ఆ యుద్ధంలో విరాటుడికి బందీ కాగా ధర్మరాజు కృపవలన విడిపించబడ్డాడు. ఈ శల్యపర్వమునందే ఈ 'సుశర్మ'ను అర్జునుడు సంహరించాడు.

**'సుశర్మాణం సమాసాద్య బిభేద హృదయం రణే ।**
**స గతాసు ర్మహారాజ పపాత ధరణీతలే ॥ (శల్య 27-46)**

ఇక మహాభారతంలో 'సుషేణ' నామధేయులు చాలమంది ఉన్నారు. ధృతరాష్ట్రుడి నూరుమంది పుత్రులలో ఒక 'సుషేణుడు' ఉన్నాడు. ధృతరాష్ట్రుడనే నాగరాజు పుత్రుడు ఒక 'సుషేణుడు' ఉన్నాడు. పురువంశీయ పరీక్షిత్తుడి పుత్రుడు ఒక 'సుషేణుడు' ఉన్నాడు. జమదగ్ని పుత్రుడు ఒక 'సుషేణుడు' ఉన్నాడు. వానరరాజు వాలి మామగారు ఒక 'సుషేణుడు' ఉన్నాడు.

**చ. కడువడి సత్యసేను తురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జ**
**క్కడిచిన నొండుతేరికి రయంబు మెయిం జని యన్యచాప మె**
**క్కిడుటయు నక్కుమారు నిశితేషుయుగంబున నొంచి నొంచెఁ గ**
**వ్వడియనుజన్ముఁ డుగ్రుఁ డయి వాని సహోదరు రెండు తూపులన్. 140**

**ప్రతిపదార్థం:** కడు= మిక్కిలి; వడిన్= వేగంగా; సత్యసేను; తురగంబులన్= గుర్రములను; కూల్చి= చంపి; శరాసనంబున్= వింటిని; చక్కడిచినన్= ఖండించగా; ఒండు= ఇంకొక; తేరికిన్= రథమునకు; రయంబుమెయిన్= మిక్కిలివేగముగా; చని= వెళ్ళి; అన్య= మరియొక; చాపము= విల్లు; ఎక్కిడుటయున్= ఎక్కుపెట్టుటయు; ఆ+కుమారు= ఆ కుమారుని; నిశిత= వాడియైన; ఇషు= బాణములయొక్క; యుగంబునన్= రెండింటితో; నొంచి= నొప్పించి; కవ్వడి= అర్జునునియొక్క; (ఏకకాలమున రెండు చేతులతో బాణములు ప్రయోగించగల వాడు కావున అర్జునునకు కవ్వడి అనిపేరు. సవ్యసాచి అని అర్థము); అనుజన్ముండు= తమ్ముడు(నకులుడు); ఉగ్రుఁడయి= భయంకరుడయి; వాని(సత్యసేనుని); సహోదరునిన్= సోదరుని; రెండుతూపులన్= రెండు బాణములతో; నొంచెన్= నొప్పించెను.

**తాత్పర్యం:** నకులుడు చిన్ననవ్వు నవ్వి, మిక్కిలి వేగంగా సత్యసేనుడి గుర్రాలను కూల్చి వింటిని ఖండించగా సత్యసేనుడు ఇంకొక రథం కొరకు వేగంగా వెళ్ళి మరియొక వింటిని ఎక్కుపెట్టగా అర్జునుడి తమ్ముడైన నకులుడు ఆ కుమారుడిని వాడి అయిన రెండు బాణాలతో నొప్పించి, భయంకరుడైన అతడి సోదరుడిని రెండు బాణాలతో నొప్పించాడు.

**తే. అతని ధను వా సుశర్ముఁ డుద్ధతి దలిర్పఁ। ద్రుంచుటయు నొండువింట బల్దూపు లొడలఁ**
**బఱపి వాని సిడంబున నఱికి సత్య। సేను విలు ద్రుంచె నా పాండుసూనుఁ డధిప! 141**

**ప్రతిపదార్థం:** అధిప! ధృతరాష్ట్ర మహారాజా!; అతని; ధనువు= విల్లు; ఆ సుశర్ముడు; ఉద్ధతి= గర్వము; తలిర్పన్= అతిశయింపగా; త్రుంచుటయున్= ఖండించుటయు; ఆ పాండు సూనుఁడు= ఆ పాండురాజు కుమారుడు(నకులుడు); ఒండు= మరియొక; వింటన్= ధనువుతో; బల్= బలమయిన; తూపులు= బాణములు; ఒడలన్= దేహమునందు; పఱపి= ప్రయోగించి; వాని; సిడంబును= టెక్కెమును; నఱికి; సత్యసేను విలు= సత్యసేనునియొక్క ధనువు; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ నకులుడి ధనువును ఆ సుశర్ముడు గర్వం అతిశయించగా ఖండించటంతో నకులుడు మరియొక వింటితో బలమైన బాణాలు ప్రయోగించి, ఆ సుశర్ముడి రథకేతనాన్ని ఖండించి సత్యసేనుడి విల్లును కూడా నరికాడు.

**విశేషం:** వావిళ్ళవారి ప్రతిలోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ప్రతిలోనూ సుశర్ముడి 'శిరమ్మును నఱికి' అని ఉన్నది. కాని, 148వ పద్యంలో సుశర్మ శిరస్సును నకులుడు తునిమినట్లు 'అవ్విరోధి శిరము దునిమె' అని ఉన్నది. కర్ణుడి కొడుకులలో మూడవవాడైన సుశర్మ 148వ పద్యంలో చంపబడినట్లున్నది కాబట్టి ఈ పద్యంలో 'శిరంబును' అనటానికి మారుగా ఉస్మానియావారి భారత పాద దీపికలో 'సిడంబు' అనే పాఠాంతరం పరిగ్రాహ్యమైతే ఆ విరోధం తొలగుతుంది కాబట్టి 'సిడంబు' అనే పాఠాంతరాన్ని గ్రహించటమైనది.

**శా. ఆ రాధేయతనూజుఁ డన్యధను వుగ్రాకారుఁడై యెత్తి దు**
**ర్వారప్రక్రియ నేసె నావిశిఖముల్ వారించి యాతం డతి**
**క్రూరస్ఫారశరత్రయం బతని వక్షోభిత్తిఁ గీలించి వే**
**నారాచంబులు రెండు దమ్ముని మెయిన్ నాటెం గడున్ బెట్టుగన్. 142**

**ప్రతిపదార్థం:** ఆ; రాధేయ= రాధకుమారుడయిన కర్ణునియొక్క; తనూజుఁడు= కుమారుడు(సత్యసేనుడు); ఉగ్ర= భయంకరమయిన; ఆకారుఁడై; అన్య= మరియొక్క; ధనువు= విల్లు; ఎత్తి= ఎక్కుపెట్టి; దుర్వార= వారింపశక్యముకాని; ప్రక్రియన్= విధముగా; ఏసెన్= ప్రయోగించెను; ఆ విశిఖముల్= ఆ బాణములు; వారించి= నివారించి(ఆపి); ఆతండు; అతి= మిక్కిలి; క్రూర= భయంకరమయిన; స్ఫార= గొప్పవి అయిన(అధికశక్తిమంతమయిన); శర= బాణములు; త్రయంబు= మూడు(మూడు బాణములు); అతని= అతనియొక్క (ఆ సత్యసేనునియొక్క); వక్షస్భిత్తిన్= గోడవలె దృఢమైన రొమ్మున; కీలించి= నాటించి; వే= వేగంగా; రెండు; నారాచంబులు= వాడి అయిన ఇనుప బాణాలు; తమ్ముని= తమ్ముడియొక్క (సత్యసేనుని తమ్ముడయిన సుశర్మునియొక్క); మెయిన్= శరీరమును; కడున్= మిక్కిలి; బెట్టుగన్= గట్టిగా; నాటెన్= గ్రుచ్చెను.

**తాత్పర్యం:** ఆ సత్యసేనుడు భయంకరాకారుడై ఇంకొకవిల్లు ఎక్కుపెట్టి వారింపశక్యంకాని విధంగా బాణాలను ప్రయోగించాడు. ఆ బాణాలను నివారించి నకులుడు మిక్కిలి భయంకరం, అధిక శక్తిమంతం అయిన మూడు బాణాలు ఆ సత్యసేనుడి వక్షఃస్థలంలో నాటించి, వేగంగా రెండు బాణాలు సత్యసేనుడి తమ్ముడు సుశర్ముడి శరీరంలోనికి మిక్కిలి గట్టిగా గ్రుచ్చాడు.

**క.** **వా రలిగి యొక్కయుమ్మడి । సారథిఁ దెగటార్చి యార్చి చాపము దునియం**
**దేరు వికలముగ మేను వి । దారితముగ నేసి రత్యుదగ్రస్ఫురణన్.** **143**

**ప్రతిపదార్థం:** వారు(ఆ సత్యసేన సుశర్ములు); అలిగి= కోపించి; ఒక్క+ఉమ్మడి= ఒక్కటిగా ఇద్దరును ఏకమై; సారథిన్= సారథిని; తెగటార్చి= చంపి; ఆర్చి= అరచి; చాపము= విల్లు; తునియన్= ఖండించగా; తేరు= రథము; వికలముగన్= ముక్కలుగ; మేను= దేహము; విదారితముగన్= చీలిపోవునట్లుగా; అతి+ఉదగ్ర= మిక్కిలి భయంకరమయిన; స్ఫురణన్= విజృంభణతో; ఏసిరి= కొట్టిరి.

**తాత్పర్యం:** కర్ణపుత్రులైన సత్యసేన సుశర్ములు కోపించి ఒక్కుమ్మడిగా సారథిని చంపి అరచి విల్లు ఖండించగా రథం ముక్కలయ్యేటట్లుగా దేహం చీలిపోయేటట్లుగా మిక్కిలి భయంకరమయిన విజృంభణంతో కొట్టారు.

**వ.** **ఇవ్విధంబున.** **144**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా సత్యసేన సుశర్ములు నకులుడిని కొట్టగా.

**మ.** **విరథుండున్ వినికృత్తచాపుఁడు శరావిద్ధుండునై మేదినీ**
**వర నీపుత్రుఁడు చంచదుగ్రతర జిహ్వాం బైన చండాహి నాఁ**
**గర మాభీలతఁ బొల్చుశక్తిఁ గొని యల్కన్ సత్వరుండయ్యె సు**
**స్థిరసంరంభత సత్యసేనుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్.** **145**

**ప్రతిపదార్థం:** మేదినీ= భూమికి; వర!= భర్తవయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; విరథుండున్= రథములేనివాడును; వినికృత్త= విరుగగొట్టబడిన; చాపుఁడున్= ధనువు కలవాడును; శర= బాణములతో; ఆ విద్ధుండును= చీల్చబడినవాడును; ఐ= ఉన్నవాడై; నీ పుత్రుడు= నీయొక్క కుమారుడు(నకులుడు); చంచత్= చలించుచున్న; ఉగ్రతర= మిక్కిలి భయంకరమయిన; జిహ్వాంబు+ఐన= నాలుక గల; చండ= తీవ్ర; అహి= పాము; నాన్= అనునట్లుగా; కరము= మిక్కిలి; ఆభీలతన్= భయంకరముగా; పొల్చు= ఒప్పు; శక్తిన్= శక్తి అను ఆయుధమును; కొని= తీసికొని; అల్కన్= కోపంతో; సత్వరుండు= మిక్కిలివేగిరపాటు కలవాడు; అయ్యెన్; సుస్థిర= మిక్కిలి నిలకడకల; సంరంభతన్= గర్వంతో; చూపఱు= చూచువారు; అగ్గింపఁగన్= పొగడేటట్లుగ; సత్యసేనున్= సత్యసేనుని; పడవైచెన్= పడగొట్టెను (చంపెను.)

**తాత్పర్యం:** (సంజయుడు చెప్పుతున్నాడు) ఓ ధృతరాష్ట్ర మహారాజా! రథం లేని వాడు, విరుగగొట్టబడిన విల్లు కలవాడు, బాణాలతో శరీరం చీల్చబడినవాడు అయిన నీ పుత్రుడు నకులుడు చలిస్తున్న భయంకరమైన నాలుక

కలిగిన మిక్కిలి క్రూరమైన పామా అన్నట్లు భయంకరమైన 'శక్తి' అనే ఆయుధాన్ని తీసికొని కోపంతో వేగిరపాటు కలవాడై నిలకడ కలిగిన గర్వంతో చూచేవాళ్ళు పొగడేటట్లుగా సత్యసేనుడిని సంహరించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఆ. అన్నపాటు సూచి యనుజుఁ డుల్లంబున । నడలు కనలుఁ గదుర నంపవానఁ**
**గప్పె నకులు నంతఁ గాంచి భీముకుమారుఁ । డెయిదె నతనియరద మెక్కె నతఁడు. 146**

**ప్రతిపదార్థం:** అన్న; పాటు= పడుట; చూచి; అనుజుఁడు= తమ్ముడు (సుశర్ముడు లేక సుషేణుడు); ఉల్లంబునన్= హృదయమునందు; అడలు= శోకము; కనలున్= కోపమును; కదురన్= అతిశయింపగా; అంప= బాణములయొక్క; వానన్= వర్షంతో; నకులున్; కప్పెన్= కప్పెను; అంతన్= అంతలో; కాంచి= చూచి; భీము= భీమునియొక్క; కుమారుడు(భీమునివలన ద్రౌపదియందు పుట్టినపుత్రుడు శ్రుతసోముడు); ఎయిదెన్= దగ్గరకు చేరాడు. అతఁడు= నకులుడు; అతని= అతనియొక్క (భీమపుత్రుడియొక్క); అరదము= రథము; ఎక్కెన్= ఎక్కెను.

**తాత్పర్యం:** అన్న సత్యసేనుడు పడిపోవటం చూచి తమ్ముడు సుశర్ముడు (సుషేణుడు) హృదయంలో శోకం, కోపం అతిశయించగా నకులుడిపై బాణవర్షం కురిపించాడు. అంతలో నకులుడిని చూచి భీముడిపుత్రుడు శ్రుతసోముడు దగ్గరకు చేరాడు. నకులుడు శ్రుతసోముడి రథం అధిరోహించాడు.

**వ. ఇట్లు ద్రౌపదేయుండగు శ్రుతసోముని యరదంబెక్కి బలువిల్లుగొని యక్కుమారుండును దోడుపడ నా సుశర్ముని బటుశరపరంపరలం బొదివినఁ బొలివోక యతండు. 147**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; ద్రౌపదేయుఁడు= ద్రౌపది పుత్రుడు అగునట్టి; శ్రుతసోముని= శ్రుతసోమునియొక్క; అరదంబు= రథము; ఎక్కి; బలు= బలమయిన; విల్లున్= ధనువు; కొని= తీసికొని; ఆ+కుమారుండును; ఆ పుత్రుడును (శ్రుతసోముడును); తోడుపడన్= సహాయపడగా; ఆ సుశర్ముని; (సుషేణుని); పటు= తీవ్రమయిన; శర= బాణములయొక్క; పరంపరలన్= వరుసలతో (ఒకదానితరువాత ఒకటిగా); పొదివినన్= క్రమ్ముకొనగా; పొలివోక= వెనుదీయక; అతండు (అనగా ఆ సుశర్ముడు లేక సుషేణుడు).

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ద్రౌపది కుమారుడైన శ్రుతసోముడి రథం ఎక్కి బలమయిన ధనువును తీసికొని ఆ శ్రుతసోముడు సహాయపడగా ఆ సుశర్ముడి (ఆ సుషేణుడి) తీవ్రమయిన బాణాల వరుసలతో కొట్టాడు. అయినా, వెనుదీయకుండా ఆ సుశర్ముడు (ఆ సుషేణుడు). (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. వాఁడి తూపులు నకులుమై మూఁడు నాఁటి । యిరువదింటఁ దత్పుత్రుని యురము నొంప**
**నర్ధచంద్రబాణాహతి నవ్విరోధి । శిరము దునిమె నప్పాండుభూవరసుతుండు. 148**

**ప్రతిపదార్థం:** వాఁడి తూపులు= వాడి అయిన బాణములు, నకులు= నకులునియొక్క; మైన్= దేహమందు; మూఁడు; నాఁటి= గ్రుచ్చి; ఇరువదింటన్= ఇరువది బాణములతో; తద్= ఆ; పుత్రుని= ద్రౌపదేయుని(శ్రుతసోముని); ఉరమున్= వక్షఃస్థలమును; నొంపన్= బాధింపగా; ఆ+పాండు భూవర= ఆ పాండురాజుయొక్క; సుతుండు= కుమారుడు(నకులుడు); అర్ధచంద్ర= అర్ధచంద్రుడియొక్క ఆకృతిగల; బాణ= బాణంయొక్క; ఆహతిన్= దెబ్బతో; ఆ+విరోధి= ఆ శత్రువుయొక్క (సుశర్ముడియొక్క లేక సుషేణుని యొక్క) శిరము= తలను; తునిమెన్= ఖండించెను.

**తాత్పర్యం:** వాడి అయిన బాణాలు నకులుడి దేహంలో మూడు గ్రుచ్చి ఇరువది బాణాలతో శ్రుతసోముడి వక్షఃస్థలాన్ని బాధించగా, ఆ నకులుడు అర్ధచంద్రాకృతిగల బాణంయొక్క దెబ్బతో శత్రువు అయిన ఆ సుశర్ముడి (సుషేణుని) తలను ఖండించాడు.

**శా. మాద్రీపుత్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం జూచి వీ**
**రోద్రేకం బెడలంగ నీ సుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన**
**న్మద్రాధీశుఁడు సింహనాదము రణన్మౌర్వీసముల్లాసమున్**
**రౌద్రప్రక్రమసూచకంబులుగ సంరంభస్ఫురస్మూర్తియై. 149**

**ప్రతిపదార్థం:** మాద్రీపుత్రునిచేతన్= మాద్రీపుత్రుడు అయిన నకులుడిచేత; కర్ణసుతులు= కర్ణునియొక్క కుమారులు (చిత్రసేన - సత్యసేన - సుశర్ములు (సుషేణులు); ఈ మాడ్కిన్= ఈ విధంగా; పడన్= కూలిపోవుటను; చూచి; వీర= శూరులయొక్క; ఉద్రేకంబు= విజృంభణము; ఎడలంగన్= పోగా; నీ= నీయొక్క(ధృతరాష్ట్రునియొక్క); సుతు= కుమారునియొక్క= (దుర్యోధనునియొక్క); బలంబు= సైన్యము; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగ; విచ్చినన్= విడివడిపోగా (చెల్లాచెదరుకాగా); మద్రాధీశుఁడు= మద్రదేశమునకు అధిపతి అయిన శల్యుడు; సింహనాదమున్= సింహగర్జనమును; రణత్= ధ్వనిచేయు; మౌర్వీ= వింటినారియొక్క (అల్లెత్రాడుయొక్క); సముల్లాసమున్= ప్రకాశమును; రౌద్ర= క్రోధముయొక్క; ప్రక్రమ= ప్రారంభమునకు; సూచకంబులుగన్= తెలియచేయు గుర్తులుగా; సంరంభ= ఆటోపంతో; స్ఫురత్= ప్రకాశించు; మూర్తి; రూపము; ఐ= కలవాడై.

**తాత్పర్యం:** నకులుడిచేత కర్ణుడికుమారులు ఈ ప్రకారంగా కూలిపోవటం చూచి, శూరుల విజృంభణం వికలం కాగా నీ కుమారుడైన దుర్యోధనుడి సైన్యం ఒక్కసారిగా విడివడి చెల్లాచెదురుకాగా మద్రదేశాధిపతి శల్యుడు సింహగర్జనను, మౌర్వీనాదాన్ని క్రోధసూచకాలుగా ప్రకాశించే రూపం కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. హస్తతల మెత్తి నిలునిలుమని యదల్పఁ। బోకతిరిగి యమ్మూఁకలు పోరి కమరెఁ**
**బాండవేయుల మొనలు నుద్దండవృత్తి। నురవణించిన సంగర ముగ్రమయ్యె. 150**

**ప్రతిపదార్థం:** హస్తతలము= అరచేతిని; ఎత్తి; నిలునిలుము= ఆగుము ఆగుము; అని; అదల్పన్= అదలించగా; ఆ+ మూఁకలు= ఆ సైన్యములు; పోక= వెడలిపోక; పోరికిన్= యుద్ధమునకు; అమరెన్= సిద్ధమయ్యెను; పాండవేయుల= పాండవులయొక్క; మొనలున్= సేనలును; ఉద్దండ= అధికమయిన; వృత్తిన్= వ్యాపారంతో (ఉత్సాహంతో); ఉరవడించినన్= వేగిరపాటు పడగా; సంగరము= యుద్ధము; ఉగ్రము= భయంకరము; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** శల్యుడు చేతిని ఎత్తి, ఆగుమాగు మని అదలించగా ఆ కౌరవసైన్యం వెడలిపోక మరల యుద్ధానికి సిద్ధమైనది. పాండవసేనలు కూడా అధికోత్సాహంతో వేగిరపాటు పడగా యుద్ధం భయంకరం అయింది.

**చ. అడరి ధనంజయాదులగు నక్కడి వీరులు విక్రమింప ని**
**క్కడ భవదీయనందనముఖప్రభవోద్భట యోధవర్గము**
**ల్వడిఁ దఱుమంగ నప్పుడు బలద్వయమున్ విశిఖాగ్ని పేర్చి యె**
**క్కుడయిన భీతి నొందె రణఘోరత భూవర! యేమి సెప్పదున్? 151**

**ప్రతిపదార్థం:** అడరి= విజృంభించి; ధనంజయ= అర్జునుడు; ఆదులు= మొదలు; అగు= అగునట్టి; అక్కడి= ఆ పాండవపక్షమందలి; వీరులు= శూరులు; విక్రమింపన్= పరాక్రమమును చూపగా; ఇక్కడన్= ఈ కౌరవపక్షమునందలి; భవదీయ= నీయొక్క; నందన= కుమారుడు (దుర్యోధనుడు); ముఖ= మున్నగు; ప్రభవ= పుట్టుకచేత; ఉద్భట= భయంకరులైన; యోధ= వీరులయొక్క; వర్గముల్= సమూహాలు; వడిన్= వేగముగా; తఱుమంగన్= తరుమగా (వెంటపడి పరుగెత్తునట్లు చేయగా); అప్పుడు= ఆ సమయమున; బల= సైన్యములు; ద్వయమున్= రెండును; విశిఖాగ్ని= బాణాలయొక్క అగ్ని; పేర్చి= విజృంభించి; ఎక్కుడు+అయిన= అధికమయిన; భీతిన్= భయమును; ఒందెన్= పొందెను; భూవర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; రణ= రణముయొక్క; ఘోరతన్= భయంకరత్వమును గూర్చి; ఏమి; చెప్పుదున్?= చెప్పగలను? (అత్యంత భయంకరమయిన యుద్ధమున గూర్చి చెప్పటం సాధ్యంకాదు.)

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! విజృంభించి అర్జునుడు మొదలయిన పాండవపక్షంలోని వీరులు పరాక్రమించగా ఈ కౌరవ పక్షంలోని నీ కుమారుడు దుర్యోధనుడు మున్నగు పరాక్రమవంతులు, శ్రేష్ఠులు అయిన యోధ సమూహాలు వేగంగా వెంటపడి తరుమగా ఆ సమయంలో రెండు సైన్యాలూ బాణాల వలన పుట్టిన అగ్ని విజృంభించి అధికమయిన భయాన్ని పొందాయి. ఆ భయంకర యుద్ధాన్ని గూర్చి ఏమి చెప్పగలను? (ఆ యుద్ధం వర్ణింప శక్యం కానిది.)

**వ. ఇట్లు మథితంబయ్యును బౌరుషంబు పెంపున నిరువాఁగును వేగంబు గుందక వింత చందంబునం బేర్చుక్రందు గగనచరులకుఁ గన్నులపండువుగా బృంహితధ్వనులను ఘంటానినదంబులను నేమినిస్వనంబులను గేతుకింకిణీక్వణనంబులను రింఖారవంబులను హేషాఘోషంబులను భుజస్ఫాలనంబులను సింహనాదంబులను దిక్తటభేదనం బొనర్ప నద్భుతోత్సాహంబున నాహవక్రీడ సలుపుచుండఁ బుండరీకాక్ష రక్షితులగు పాండుపుత్రుల బలశౌర్యసంపదల సొంపునం బెంపొదవు ధృష్టద్యుమ్న శిఖండిసాత్యకి ప్రముఖులైన దండిమగలు గూడికొని తఱుమ దారుణనైపుణంబున బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు గవిసినం గలంగు మృగకులంబు కైవడిం గౌరవసైన్యంబు దైన్యంబు నొందిన. 152**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; మథితంబు= మధించబడింది; అయ్యును= అయినప్పటికిని; పౌరుషంబు= పరాక్రమముయొక్క; పెంపునన్= ఆధిక్యమువలన; ఇరు= రెండు; వాఁగును= పక్షములసైన్యములును; వేగంబు= వేగిరపాటు; కుందక= తగ్గిపోకుండగ; వింత= విచిత్రమయిన; చందంబునన్= విధముగా; పేర్చు= విజృంభించు; క్రందు= సందడి; గగన= ఆకాశమునందు; చరులకున్= సంచరించువారికి (యక్షగంధర్వ కిన్నర కింపురుషాదులకు); కన్నుల= నేత్రములకు(చూపులకు); పండువుగాన్= వేడుకకాగా; బృంహిత= ఏనుగులు చేయు ఘీంకారపు; ధ్వనులను= శబ్దములచేతను; ఘంటా= ఘంటలయొక్క; నినదంబులను= ధ్వనులచేతను (ఏనుగుల మెడలకు వ్రేలాడగట్టిన ఘంటల ధ్వనులచేతను); నేమి= రథ చక్రముల కమ్ములయొక్క; నిస్వనంబులను= శబ్దములచేతను; కేతు= జెండాకొయ్యలయొక్క; కింకిణీ= చిరుమువ్వలయొక్క; క్వణనంబులను= ధ్వనులచేతను; రింఖా= గుర్రాల గిట్టలయొక్క; రవంబులను= శబ్దములచేతను; హేషా= గుర్రాల సకిలింతలయొక్క; ఘోషంబులను= ధ్వనులచేతను; భుజా= భుజములయొక్క; స్ఫాలనంబులను= చరుపుల వలన పుట్టిన శబ్దముల చేతను; సింహనాదంబులను= సింహ గర్జనములచేతను (యుద్ధభూమియందు వీరులు చేయు బొబ్బలు); దిక్= దిక్కులయొక్క; తట= ఆకాశపుటంచులను; భేదనంబు= బద్దలగునట్లు (చిల్లులుపడునట్లు); ఒనర్పన్= చేయగా; అద్భుత= ఆశ్చర్యకరమగు; ఉత్సాహంబునన్= ప్రయత్నముతో; ఆహవ= యుద్ధమనెడి; క్రీడన్= ఆటను; సలుపుచుండన్= చేయుచుండగా; పుండరీక+అక్ష= తెల్లతామరలవంటి నేత్రములు కలవాడు అగు శ్రీకృష్ణుడిచేత; రక్షితులు= కాపాడబడుచుండువారు; అగు= అయినట్టి; పాండుపుత్రుల= పాండురాజు కుమారులయొక్క; బల= బలము; శౌర్య= పరాక్రమములయొక్క; సంపదల=

ఐశ్వర్యములయొక్క; సొంపునన్= సమృద్ధివలన; పెంపు= వృద్ధి; ఒదవు= పొందు; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడును; శిఖండి; సాత్యకి; ప్రముఖులు= ముఖ్యులు; ఐన; దండి= ప్రతాపవంతులయిన; మగలు= వీరులు; కూడికొని= కలిసికొని; తఱుమన్= వెంటపడి పరుగెత్తునట్లు చేయగా; దారుణ= భయంకరమయిన; నైపుణంబునన్= కౌశలముతో; బాహా= భుజములయొక్క; ఆటోపంబు= గర్వము; చూపినన్= చూపగా (ప్రదర్శింపగా); కార్చిచ్చు= దవానలము (అడవులను కాల్చు అగ్ని); కవిసినన్= వ్యాపించగా; కలంగు= కలతపడు (వ్యాకులమగు); మృగ= లేళ్ళయొక్క; కులంబు= గుంపు; కైవడిన్= వలె; కౌరవసైన్యంబు= కౌరవులయొక్క సైన్యము; దైన్యంబున్= దీనత్వమును; ఒందినన్= పొందగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా అల్లకల్లోలం అయినప్పటికీ అధిక పరాక్రమంతో రెండు పక్షాల సైన్యాలు వేగిరపాటు తగ్గకుండా మరియొక విధంగా విజృంభించిన ఆ విచిత్ర యుద్ధం ఆకాశసంచారులయిన యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషాదులకు కన్నులపండువు కాగా, ఏనుగుల ఘీంకార ధ్వనులతో, ఏనుగుల కంఠాలకు వ్రేలాడుతున్న ఘంటానాదాలతో, రథచక్రాల కమ్ముల తాకిడివలన పుట్టిన ధ్వనులతో, జెండాకొయ్యలయందు వ్రేలాడే చిరుమువ్వల నాదాలతో, గుర్రాల గిట్టల చప్పుళ్ళతో, గుర్రాల సకిలింతల ధ్వనులతో, భుజాల చరుపులవలన పుట్టిన ధ్వనులతో వీరులు చేసే సింహగర్జనలతో దిక్కుల అంచులు చిల్లులు పడగా ఆశ్చర్యకరమయిన ప్రయత్నంతో యుద్ధక్రీడ చేస్తూ ఉండగా శ్రీకృష్ణుడిచేత పరిరక్షించబడుతున్న పాండవుల బలపరాక్రమాల సమృద్ధివలన వర్ధిల్లే ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి మున్నగు ప్రతాపవంతులగు వీరులు ఒక్కటిగా కలిసికొని తరుమగా భయంకరమైన కౌశలంతో భుజగర్వం చూపగా కార్చిచ్చు వ్యాపించినప్పుడు వ్యాకులమయిన లేళ్ళ గుంపువలె కౌరవసైన్యం దీనత్వం పొందగా.

**విశేషం:** ఈ వచనంలో చిన్న ఉపమ కలదు. 'కార్చిచ్చు వ్యాపించగా వ్యాకులమయిన లేళ్ళ గుంపు వలె కౌరవసైన్యం దీనత్వం పొందింది.' తిక్కన ఈ వచనంలో ఆహవక్రీడలో నాదవిన్యాసం చేశాడు. ఘీంకారనాదము, ఘంటానాదము, నేమినాదము, కింకిణీ నాదము, రింఖానాదము, హేషానాదము, స్ఫాలననాదము, సింహనాదము, హాసవిన్యాస, నాద విన్యాసములు తిక్కయజ్వ కవనక్రీడలు.

**క. పెనురొంపి లోపలను బ్రుం । గిన ధేనువు నెత్తుపోలికిని శల్యుం డ**
**మ్మొనఁ దనభుజబలమునఁ గలఁ । గని యట్టుగ నిలిపె శౌర్యగర్వము మెఱయన్. 153**

**ప్రతిపదార్థం:** పెను= పెద్ద; రొంపి= బురద; లోపలను; బ్రుంగిన= మునిగిపోయిన; ధేనువును= గోవును; ఎత్తు= పైకి తీయు; పోలికిని; శల్యుండు; ఆ+మొనన్= ఆ కురుసైన్యమును; తన= తనయొక్క; భుజబలమునన్= భుజబలముతో; శౌర్య= పరాక్రమము; గర్వము; మెఱయన్= ప్రకాశింపగా; కలఁగని= కలతచెందని; అట్టుగ; నిలిపెను.

**తాత్పర్యం:** పెద్ద బురదలో మునిగిపోయిన గోవును పైకి తీసే విధంగా శల్యుడు ఆ కురుసైన్యాన్ని తన భుజబలంతో పరాక్రమం, గర్వం ప్రకాశించగా కలతచెందనట్లుగా నిలిపాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. నిలిపి పేర్చిన సమయంబున మన దిక్కున నుల్కాపాత ప్రముఖంబులగు దుర్నిమిత్తంబులు వొడమిన నీ కొడుకులు గూడుకొని చేయం గలసైనికులం గూర్చికొని తిరంబయి పెనంగి రట్లు పెనంగునెడఁ గడంగి తలకడచి మిగిలి మద్రపతి మార్గణాసారంబు వరఁగించుచుఁబాండవాగ్రజు నగ్రభాగంబున నున్న భీమసేన**

**సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయమాద్రేయులఁ దాఁకి పదిపదిప్రదరంబుల నొప్పించి కదిసి యన్నరపతికిని బదితూపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాలప్రభద్రకబలంబు లా జెట్టిబిరుదు చుట్టుముట్టిన. 154**

**ప్రతిపదార్థం:** నిలిపి(సేనలను నిలిపి); పేర్చిన= విజృంభించిన; సమయంబునన్; మనదిక్కునన్= మనవైపున(కౌరవుల పక్షమున); ఉల్కాపాత= ఆకాశమునుండి వెలుగుచుపడునట్టి చుక్కలవంటి పదార్థములు పడిపోవుట; ప్రముఖములు= మున్నగు; దుర్నిమిత్తంబులు= దుష్టశకునములు; పొడమినన్= పుట్టిన(పొడచూపగా); నీ కొడుకులు= నీయొక్క (ధృతరాష్ట్రుడియొక్క) కుమారులు; కూడుకొని= కలిసికొని; చేయంగల= చేయగల (బాగుగా యుద్ధం చేయగల); సైనికులన్= సేనలను; కూర్చికొని= సమీకరించుకొని (పోగుచేసికొని); తిరంబు= స్థిరము; అయి; పెనంగిరి= పోరాడిరి; అట్లు; పెనంగు= యుద్ధముచేయు; ఎడన్= సమయమున; కడంగి= ప్రయత్నించి; తల కడచి= సేనాగ్రమునుండి (వ్యూహమునుండి) అతిక్రమించి; మిగిలి= ఉద్రేకించి; మద్రపతి= శల్యుడు; మార్గణ= బాణములయొక్క; ఆసారంబు= వర్షము; పరఁగించుచున్= ప్రయోగించుచు (బాణవర్షము కురిపించుచు); పాండవ= పాండవులలో; అగ్రజున్= పెద్దవాడయిన ధర్మరాజునకు; అగ్రభాగంబునన్= ముందుభాగమున; ఉన్న; భీమసేన= భీమసేనుడిని; సాత్యకి= సాత్యకిని; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడిని; శిఖండి= శిఖండిని; ద్రౌపదేయ= ద్రౌపది పుత్రులను; మాద్రేయులన్= మాద్రిపుత్రులను (నకుల సహదేవులను); తాఁకి= ఎదుర్కొని; పదిపది= పది పది చొప్పున; ప్రదరంబులన్= బాణములతో; వేఁడిమి= ప్రతాపము; చూపి= చూపించి; మలసినన్= విజృంభించుచుండగా; పాంచాల= పాంచాల దేశముయొక్క; ప్రభద్రక= ప్రభద్రకులను క్షత్రియులయొక్క; బలంబులు= సైనికదళములు; ఆ జెట్టి= శూరశ్రేష్ఠుడయిన ఆ శల్యుని; బిరుదు= శౌర్యచిహ్నమును (మహారథుడను శౌర్య చిహ్నముగల రథమును); చుట్టుముట్టినన్= చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** శల్యుడు చెదరిపోతున్న సేనలను నిలిపి, విజృంభించే సమయంలో మనవైపున ఉల్కాపాతాలు మొదలయిన దుష్టశకునాలు పొడచూపగా నీకుమారులు కలిసికొని యుద్ధం చేయటానికి సమర్థులయిన సేనలను సమకూర్చుకొని స్థిరంగా పోరాడారు. ఆ ప్రకారంగా యుద్ధం చేసే సమయంలో ఆ వ్యూహాన్ని అతిక్రమించి, ఉద్రేకించి మద్రపతి శల్యుడు బాణవర్షం కురిపిస్తూ ధర్మరాజునకు ముందు నిలిచిన భీమసేన సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయ మాద్రేయులను ఎదుర్కొని, పది పది చొప్పున బాణాలతో బాధించి, ధర్మరాజు దగ్గరకు చేరి పదిబాణాలతో ప్రతాపం చూపించి విజృంభిస్తుండగా పాంచాల దేశపు క్షత్రియులయిన ప్రభద్రక దళములు ఆ శల్యుడిని చుట్టుముట్టగా.

**విశేషం:** వ్యాసభగవానులు మూలమున మహారథ శబ్దం ప్రయోగించిన చోట తిక్కన బిరుదు శబ్దం ప్రయోగించిన కారణంగా బిరుదు శబ్దానికి మహారథుడనే అర్థం చెప్పటం జరుగుతున్నది. సామాన్యంగా అతిరథ - మహారథ - రథ - అర్ధరథులందరికి బిరుదు శబ్ద ప్రయోగం తిక్కన తెనుగు శబ్ద ప్రయోగంపై గల మక్కువను సూచిస్తున్నది.

**ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం**
**గూలుగజంబులుం గెడయు గుఱ్ఱపుతండముఁ ద్రెళ్ళు తేరులుం**
**గీలెడలించినట్ల పడుకేతువితానము నుగ్గునూచమై**
**రాలు పదాతి వర్గములు రక్తపుటేఱులుఁ బ్రేవుప్రోవులున్. 155**

**ప్రతిపదార్థం:** అతండు (ఆశల్యుడు); వాలి= విజృంభించి; బాహు= భుజములయొక్క; విభవంబు= సంపద; అలరించినన్= ప్రకాశింపజేయగా; రౌద్రతన్= క్రోధముతో; పేర్చి= విజృంభించి; కూలు= కూలిపోయిన(చనిపోయిన); గజంబులున్= ఏనుగులును; కెడయు= చనిపోయిన; గుఱ్ఱపు= గుర్రములయొక్క; తండమున్= గుంపులను; త్రెళ్ళు= విరిగిపడిపోయిన; తేరులున్= రథములును; కీలు= ఇరుసు; ఎడలించినట్లు+అ= తొలగించినట్లుగా; పడు= పడిపోవుచున్న; కేతు= జెండాకొయ్యలయొక్క; వితానమున్= సమూహమును; నుగ్గనూచమై= ఖండఖండములై (పిండిపిండియై); రాలు= క్రిందపడిపోయిన; పదాతివర్గములున్= కాల్బలములును; రక్తపుటేఱులున్= నెత్తుటి నదులను; ప్రేవు= పేగులయొక్క; ప్రోవులున్= పోగులును.

**తాత్పర్యం:** ప్రభద్రక దళాలు చుట్టుముట్టగా శల్యుడు విజృంభించి భుజసంపద ప్రకాశింపజేయగా క్రోధంతో అతిశయించి కూలిపోయిన ఏనుగులు, చనిపోయిన గుర్రాల గుంపులు, విరిగిపడిపోయిన రథములు, ఇరుసులు తొలగిపడిపోయిన జెండా కొయ్యల సమూహం, ఖండఖండాలై పిండిపిండిగా రాలిపోయిన కాల్బలం, నెత్తురు ప్రవాహాలు, పేగుల పోగులు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'నుగ్గనూచమై' ఇది తెలుగుజాతీయం. సందర్భాన్ని అనుసరించి 'ఖండఖండములై' అనే అర్థం వ్రాయబడింది. తిక్కయజ్వ యుద్ధ పర్వాలలో తరచుగా ఈ జాతీయాన్ని ప్రయోగించాడు. బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరంలో ఇట్లా వ్రాశారు. "నుగ్గనూచ" అని ఒకానొక నిఘంటువునందు ఏకపరముగా వ్రాయబడి యున్నది. అట్లు చెప్పినచో 'నూచ' శబ్దము ప్రత్యేకముగాను ప్రయోగించబడుచున్నది. కనుక 'నుగ్గనూచ' శబ్దములు రెండు చేరినప్పుడు 'మిక్కిలిపొడి' యని అర్థము చెప్పవచ్చును." దీనికి పై ఉదాహరణమునందు 'దుమ్ము ధూళిగా" అని చెప్పి ఉండటమే ప్రమాణంగా గ్రహించవలెను. పై ఉదాహరణలు 'కొన్నిటి హస్తముల్ చదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ము ధూళిగాఁ గొన్నిటి గుంభముల్ వగులఁ గొన్నిటిగాళులు 'నుగ్గనూచగా' - (భీష్మ -2 ఆశ్వా) రూ ॥ నూచము.' అరదంబులు పొడిపొడియై హరులగములు 'నుగ్గనూచమై' (భీష్మ -2 ఆశ్వా) - ఇది శబ్దరత్నాకరవ్యవహారం.

ఇంతకు ఇది 'నూచ' శబ్దమా 'ఊచ' శబ్దమా? లోకవ్యవహారంలో 'ఊచకోత' ఖండ ఖండములుగా ముక్క ముక్కలుగా నరకుట అనే అర్థం ప్రచురంగా ఉన్నది. అట్లే 'నుగ్గనూచమై' అను తెలుగుజాతీయ ప్రయోగానికి, ఖండ ఖండాలుగా, ముక్కలు ముక్కలుగా, పొడి పొడిగా, పిండి పిండిగా' అని సందర్భాన్ని అనుసరించి అర్థం చెప్పటం యుక్తం.

**వ. మఱియును. 156**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను.

**క. ఏ రూపులయిన రూపఱ । ఘోరాశనులట్ల శల్యు క్రూరాస్త్రంబుల్**
**కౌరవులు పొంగఁ బాండుకు । మారులసేనపయిఁ దొరిఁగె మనుజాధీశా! 157**

**ప్రతిపదార్థం:** మనుజ= మానవులకు; అధీశా!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; ఏ రూపులు= ఏ ఆకారములు; అయినన్= అయినప్పటికిని; రూపు+అఱన్= అంగ విహీనులగునట్లు; శల్యు= శల్యునియొక్క; క్రూర= భయంకరములయిన; అస్త్రంబుల్= బాణములు; ఘోర+అశనులు+అట్లన్= భయంకరమైన పిడుగులవలె; పాండుకుమారుల= పాండురాజు పుత్రులయొక్క; సేనపయిన్= సైన్యముమీద; కౌరవులు; పొంగన్= సంతోషించునట్లు; తొరిఁగెన్= పడెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఏ ఆకారాలు కలిగిఉన్నప్పటికీ అంగవిహీనములయ్యేటట్లు శల్యుడి భయంకరములైన బాణాలు భయంకరములైన పిడుగులు పడుతున్నట్లు పాండవుల సేనపై కౌరవులైన దుర్యోధనాదులు సంతోషించేటట్లుగా పడ్డాయి.

**వ. అట్లు దొరుఁగు దారుణమార్గణాసారంబున వెగడుపడి యాబలంబు పాండవాగ్రజు వెనుక కొదిఁగిన నమ్మహీపతి పురికొలిపికొని శల్యు మార్కొని నిశితవిశిఖవర్షంబునం బొదివిన నమ్మద్రవిభుండు గ్రూరనారాచం బతనిమేనుచ్చివో నేయ నా ధర్మనందనునకుఁ దలకడచి యేడమ్ముల నవ్వడముడియు సహదేవుం డయిదు తూపులను నకులుండు నవశరంబులను బ్రతివింధ్యాదిద్రౌపదేయులు బహుబాణపరంపరలను నవ్వీరు నేయ నప్పుడు కృపాచార్యుండును గృతవర్మయు శకునియుఁ దత్సుతుం డులూకుండును నీ కొడుకులుం గవిసిరి. గురుపుత్రుండు మందహాసంబుతో నమందగతి వచ్చి వారిఁ గూడికొనియె. నక్కడి సైనికులును రభసంబున నా రథికవరులఁ దాఁకి రట్టియెడ. 158**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారముగా; తొరుఁగు= పడుచున్న; దారుణ= భయంకరమయిన; మార్గణ= బాణములయొక్క; ఆసారంబునన్= వర్షమువలన; వెగడుపడి= భయపడి; ఆ బలంబు= ఆ సైన్యము (పాండవుల సేనలు); పాండవ= పాండవులలో; అగ్రజు= పెద్దవాడు అయిన ధర్మరాజుయొక్క; వెనుకకున్= వెనుకభాగమునకు; ఒదిఁగినన్= తొలగగా; మహీ= భూమికి; పతి= ప్రభువు అయిన ధర్మరాజు; పురికొలిపికొని (అనగా మరల సేనలలో ఉత్సాహము కలుగునట్లు హెచ్చరించుకొని); శల్యు= శల్యుని; మార్కొని= ఎదుర్కొని; నిశిత= వాడిఅయిన; విశిఖ= బాణములయొక్క; వర్షంబునన్= వానవలన; పొదివినన్= క్రమ్ముకొనగా; ఆ+మద్రవిభుండు= శల్యుడు; క్రూర= భయంకరమయిన (తీక్ష్ణమయిన); నారాచంబు= ఇనుపబాణము; అతని మేను= అతనియొక్క దేహము; ఉచ్చివోన్= చీల్చుకొని పోవునట్లు; ఏయన్= ప్రయోగించగా; ఆ ధర్మనందనునకున్= ఆ ధర్మరాజునకు; తల= ముందు భాగమును; కడచి= దాటివచ్చి (సేనావ్యూహమునుండి ధర్మరాజుముందునకు వచ్చి); ఏడు+అమ్ములన్= ఏడు బాణములతో; ఆ+వడముడియున్= భీముడును; సహదేవుండు; అయిదుతూపులను= అయిదు బాణములతో; నకులుండు; నవశరంబులను= తొమ్మిది బాణములతో; ప్రతివింధ్యాది= ప్రతివింధ్యుడు మొదలగు; ద్రౌపదేయులు= ద్రౌపది పుత్రులు; బహు= అనేకాలయిన; బాణ= బాణాలయొక్క; పరంపరలనున్= వరుసలతోడను; ఆ+వీరున్= వీరుడయిన ఆ శల్యుడిని; ఏయన్= కొట్టగా; అప్పుడు= ఆ సమయమున; కృపాచార్యుండును; కృతవర్మయున్; శకునియున్; తద్= ఆ శకునియొక్క; సుతుండు= కుమారుడు; ఉలూకుండును; నీ కొడుకులున్= నీ పుత్రులయిన దుర్యోధనాదులును; కవిసిరి= కలియబడిరి; గురు= ద్రోణుడియొక్క; పుత్రుండు= కుమారుడు(అశ్వత్థామ); మందహాసంబుతోన్= చిరునవ్వుతో; అమందగతిన్= శీఘ్రగమనముతో; వచ్చి; వారిన్ (దుర్యోధనాదులను); కూడికొనియెన్= కలిసికొనియెను; అక్కడి; సైనికులును= సేనలును; రభసంబునన్= ఉత్సాహముతో; ఆరథికవరులన్= ఆ రథిక శ్రేష్ఠులను; తాఁకిరి= ఎదుర్కొనిరి; అట్టియెడన్= ఆ సమయమున.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా పడుతున్న భయంకరమైన బాణవర్షానికి తడబాటు పడిపోయి ఆ పాండవసేనలు ధర్మరాజు వెనుకకు తొలగగా ఆ ధర్మరాజు సేనలను పురికొలిపికొని శల్యుడిని ఎదుర్కొని, వాడి అయిన బాణవర్షంతో క్రమ్ముకోగా ఆ శల్యుడు భయంకరమైన ఇనుపబాణం ఆ ధర్మరాజు దేహం చీల్చుకొనిపోయేటట్లుగా ప్రయోగించగా, సేనావ్యూహంనుండి తప్పుకొని ఆ ధర్మరాజు ముందునకు వచ్చి ఏడు బాణాలతో భీముడు, సహదేవుడు అయిదు బాణాలతో, నకులుడు తొమ్మిది బాణాలతో, ప్రతివింధ్యాది ద్రౌపది పుత్రులు అనేక బాణాల వరుసలతో, ఆ వీరుడయిన శల్యుడిని కొట్టగా ఆ సమయంలో కృపాచార్యుడు, కృతవర్మ, శకుని అతడి పుత్రుడు ఉలూకుడు, దుర్యోధనాదులు పాండవులతో కలియబడ్డారు. గురుపుత్రుడు అశ్వత్థామ చిరునవ్వుతో శీఘ్రగమనంతో వచ్చి దుర్యోధనాదులను కలిసికొన్నాడు. అచ్చట ఉన్న సైన్యాలు ఉత్సాహంతో ఆ రథిక శ్రేష్ఠులను ఎదుర్కొన్నాయి. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు । నుపమాతీతాతిఘోరయుద్ధంబున బా**
**హుపటుత్వమ్ములు సూపి ర । ధిప! యొండొరులకు సమత్వదీప్తాకృతులై. 159**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; కృపుఁడును= కృపాచార్యుడును; ధృష్టద్యుమ్నుఁడును; ఉపమా= పోలికకు; అతీత= అతిక్రమించిన; అతి= మిక్కిలి; ఘోర= భయంకరమయిన; యుద్ధమునన్= సంగ్రామమునందు; సమత్వ= సమానభావంచేత; దీప్త= ప్రకాశవంతమయిన; ఆకృతులై= ఆకారములు కలవారై (రూపములు కలవారై); ఒండొరులకున్= ఒకరికొకరు; బాహు= భుజములయొక్క; పటుత్వమ్ములు= సామర్థ్యములు; చూపిరి= ప్రదర్శించిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయంలో కృపాచార్యుడు, ధృష్టద్యుమ్నుడు పోలిక చెప్పటానికి వీలుకాని మిక్కిలి భయంకరమైన యుద్ధంలో సమానమైన ప్రకాశవంతమైన రూపాలు కలవారై పరస్పరం తమ తమ భుజబల సామర్థ్యాలు ప్రదర్శించుకొన్నారు.

**క. ఒకని నొకనిఁ బదిపది సా । యకముల నొప్పించె వీరులగు పాండుకుమా**
**రకు లేవుర నంతట ద్రో । ణ కుమారుఁడు మోము చిఱుతనగవున నొప్పన్. 160**

**ప్రతిపదార్థం:** అంతటన్= అటు తరువాత; ద్రోణకుమారుఁడు= అశ్వత్థామ; మోము= ముఖము; చిఱుతనగవునన్= చిరునవ్వుతో; ఒప్పన్= ప్రకాశింపగా; వీరులు= పరాక్రమవంతులు; అగు= అయినట్టి; పాండుకుమారకులు= పాండు రాజుయొక్క పుత్రులు; ఏవురన్= అయిదుగురను; ఒకనిన్= ఒక్కొక్కరిని; పదిపది= పదేసి; సాయకములన్= బాణములతో; నొప్పించెన్= బాధించెను.

**తాత్పర్యం:** అటు తరువాత అశ్వత్థామ ముఖం చిరునవ్వుతో ప్రకాశించగా పరాక్రమవంతులైన పాండుపుత్రులు ఐదుగురనూ ఒక్కొక్కడిని పదేసి బాణాలతో బాధించాడు.

**ఆ. వాయుతనయు ఋశ్యవర్ణాశ్వముల మద్ర । పతి ధరిత్రిఁ గూల్చె నతఁడు దేరు**
**డిగ్గి నిజగదాపటిష్ఠతఁ జూపెఁ గౌ । రవ్య సైన్యమునకు రాజముఖ్య! 161**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజులలో శ్రేష్ఠుడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మద్రపతి= మద్రదేశమునకు ప్రభువు అయిన శల్యుడు; వాయు= వాయుదేవునియొక్క; తనయు= పుత్రుడు అయిన భీమునియొక్క; ఋశ్యవర్ణ= గిట్టలకు పై భాగమున తెలుపురంగు కాళ్ళుకలిగిన; అశ్వములన్= గుర్రములను; ధరిత్రిన్= భూమిపై; కూల్చెన్= పడగొట్టెను; అతఁడు= అతడు (అనగా భీముడు); తేరు= రథము; డిగ్గి= దిగి; కౌరవ్య= కౌరవులకు సంబంధించిన; సైన్యమునకున్= సేనకు; నిజ= తనయొక్క; గదా= గద అనెడి ఆయుధముయొక్క; పటిష్ఠతన్= శక్తిని(గట్టితనమును); చూపెన్= చూపించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శల్యుడు భీముడి గుర్రాలను నేలపై కూల్చాడు. భీముడు రథం దిగి కౌరవసైన్యానికి తన గదాయుధం యొక్క శక్తిని చూపించాడు.

**క. అనిలజుని యశ్వములఁ గూ । ల్చిన యప్పడు శల్యునిం గలితనము మెఱయం**
**దన యంపవెల్లిచే ముం । చె నకులుతమ్ముండు నీదుసేన దలంకన్. 162**

**ప్రతిపదార్థం:** అనిలజుని= వాయుపుత్రుడయిన భీమునియొక్క; అశ్వములన్= గుర్రములను; కూల్చిన= పడగొట్టిన (చంపిన); అప్పుడు= ఆ సమయమున; నకులు= నకులునియొక్క; తమ్ముండు= సహదేవుడు; నీదు= నీయొక్క; సేన= సైన్యము (కురుసైన్యము); తలంకన్= చలించునట్లుగా; కలితనము= సామర్థ్యము; మెఱయన్= ప్రకాశింపగా; శల్యునిన్= శల్యుని; తన= తనయొక్క; అంప= బాణములయొక్క; వెల్లిచేన్= ప్రవాహంలో; ముంచెన్= ముంచివేసెను. (కప్పివేసెను).

**తాత్పర్యం:** భీముడి గుర్రాలను శల్యుడు చంపిన సమయంలో సహదేవుడు కౌరవసైన్యం చలించేటట్లుగా తన సామర్థ్యం ప్రకాశించగా శల్యుడిని తన బాణప్రవాహంలో ముంచెత్తాడు.

**తే.** **అతని హయములు నమ్మద్రపతి శరములఁ । బడిన నప్పాండవునిఁ దలకడచి బలము**
**పొదివె నయ్యోధముఖ్యుఁ దత్పుత్రుఁ డపుడు । గదిసె నా సహదేవుపైఁ గడిమి మెఱయ.** **163**

**ప్రతిపదార్థం:** ఆ+మద్రపతి= ఆ మద్రదేశాధిపతి అయిన శల్యుని యొక్క; శరములన్= బాణములచే; అతని= అతనియొక్క (సహదేవునియొక్క); హయములున్= గుర్రములును; పడినన్= కూలిపోగా(చనిపోగా); ఆ పాండవునిన్= ఆ పాండు కుమారుడైన సహదేవుడిని; తలకడచి= దాటివచ్చి; బలము= పాండవసైన్యం; ఆ+యోధముఖ్యున్= ఆ వీరశ్రేష్ఠుడైన శల్యుడిని; పొదివెన్= క్రమ్ముకొన్నాడు; తద్= ఆ శల్యుడియొక్క; పుత్రుఁడు= కుమారుడు (రుక్మాంగదుడు); అపుడు= ఆ సమయమున; ఆ+యోధముఖ్యున్= ఆ వీరశ్రేష్ఠుడయిన; సహదేవునిపైన్= సహదేవుడి మీద; కడిమి= పరాక్రమము; మెఱయన్= ప్రకాశింపగా; కదిసెన్= కలియబడెను.

**తాత్పర్యం:** శల్యుడి బాణాలచేత ఆ సహదేవుడి గుర్రాలు మరణించగా సహదేవుడిని దాటివచ్చి ఆ వీరశ్రేష్ఠుడయిన శల్యుడిపై పాండవసైన్యం క్రమ్ముకొన్నది. ఆ సమయంలో శల్యుడి కుమారుడు (రుక్మాంగదుడు) పరాక్రమం ప్రకాశించగా సహదేవుడిపై కలియబడ్డాడు.

**చ.** **కవిసిన దట్టకెంపడరు కన్నులతోడఁ గృపాణపాణియై**
**యవనికి దాఁటి యాతనిశరావలిఁ ద్రుంచుచుఁ గిట్టి తేరిపై**
**కి వడిఁ జలంబుమై నరిగి కేళియపోలె శిరంబు ద్రుంచి పో**
**యె వెసఁ బొగడ్తకెక్క ధరణీశ్వర! యొండురథంబు మీఁదికిన్.** **164**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= భూమికి ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కవిసినన్= కలియబడగా; దట్టకెంపు= దట్టమయిన ఎరుపు; అడరు= అతిశయించు; కన్నులతోడన్= నేత్రములతో; కృపాణ= కత్తి; పాణి= హస్తమునందు కలవాడు; ఐ= అయి(సహదేవుడు); అవనికిన్= భూమిమీదికి; దాఁటి= దూకి(రథముపై నుండి భూమిమీదకు దూకి); ఆతని= ఆతనియొక్క (ఆ శల్యుడి కుమారుడియొక్క); శర= బాణములయొక్క; ఆవలిన్= సమూహమును (లేక) వరుసను; త్రుంచుచున్= ఖండించుచు; కిట్టి= సమీపించి; తేరిపైకిన్= రథముమీదకు (శల్యపుత్రుడి రథము మీదకు); వడిన్= వేగముగా; చలంబుమైన్= మాత్సర్యముతో; అరిగి= వెడలి; కేళియపోలెన్= క్రీడవలె; శిరంబు= తల; త్రుంచి= ఖండించి; పొగడ్తకున్= స్తుతించుటకు; ఎక్కన్= తగినవాడు అగుచు, ప్రశంసనీయంగా; ఒండు= మరియొక; రథంబుమీఁదికిన్= రథముపైకి; వెసన్= వేగముగా; పోయెన్= వెడలిపోయెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శల్యుడి పుత్రుడు సహదేవుడితో కలియబడగా దట్టంగా ఎర్రబడిన కన్నులతో కత్తిచేతపట్టి రథంనుండి భూమిపైకి దూకి శల్యపుత్రుడియొక్క బాణపరంపరలను ఖండిస్తూ సమీపించి,

శల్యపుత్రుడి రథంమీదకు వేగంగా మాత్సర్యంతో వెడలి క్రీడవలె అతడి తల ఖండించి స్తుతింప తగినవాడవుతూ ఇంకొక రథంపైకి వేగంగా వెడలిపోయాడు.

**వ. ఇవ్విధంబున. 165**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా.

**క. సుతుఁ డీల్గిన మద్రమహీ । పతి శోకక్రోధవేగభరితాత్మకుఁడై**
**శితశరపంపరల ను । ద్ధతిఁ బాండవసైనికుల మదం బడఁగించెన్. 166**

**ప్రతిపదార్థం:** సుతుఁడు= కుమారుడు; ఈఁల్గినన్= మరణించగా; మద్రమహీపతి= మద్రదేశమునకు అధిపతి అయిన శల్యుడు; శోక= దుఃఖముయొక్క; క్రోధ= కోపముయొక్క; వేగ= వేగముచే; భరిత= నిండిన; ఆత్మకుఁడై= మనస్సుకలవాడై; శిత= వాడి అయిన; శర= బాణములయొక్క; పరంపరలన్= వరుసలతో; ఉద్ధతిన్= గర్వముతో; పాండవ= పాండవులయొక్క; సైనికుల= సైనికులయొక్క; మదంబు= గర్వము; అడఁగించెన్= తగ్గించెను.

**తాత్పర్యం:** తన పుత్రుడు మరణించగా, మద్రపతి శల్యుడు దుఃఖంతోను, కోపంతోను నిండిన మనస్సు కలవాడై, వాడి అయిన బాణపరంపరతో గర్వాన్ని కనపరుస్తూ ఆ పాండవ సైనికుల గర్వాన్ని అణచాడు.

**విశేషం:** శల్యుడి పుత్రుడిని సహదేవుడు సంహరించాడు. శల్యుడికి ఇద్దరు పుత్రులు ఉన్నారు. ఒకడు రుక్మాంగదుడు. రెండవవాడు రుక్మరథుడు. రుక్మరథుడిని అభిమన్యుడు సంహరించినట్లు ద్రోణపర్వంలో ఉన్నది. అందువలన సహదేవుడు ఇచ్చట రుక్మాంగదుడిని సంహరించినట్లుగా గ్రహించాలి. ఈ సందర్భంలో మూలంలో వ్యాసుడు కాని, అనువాదంలో తిక్కన కాని, శల్యపుత్రుడి పేరు ప్రస్తావించలేదు.

## శల్యభీమసేనుల గదాయుద్ధము (సం. 9-10-42)

**క. ఉరవడి రథికజనంబులఁ । దెరలిచి యేపారు తనదుతేరు మెఱయ ను**
**ద్ధురగతిఁ గౌంతేయాగ్రజు । నరదమునకుఁ గవిసె వాలురమ్ములు నిగుడన్. 167**

**ప్రతిపదార్థం:** ఉరవడిన్= విజృంభణంతో; రథిక= రథికులయిన; జనంబులన్= మనుజులను (అనగా సైనికులను); తెరలిచి= తొలగించి; ఏపారు= అతిశయించు; తనదు= తనయొక్క; తేరు= రథము; మెఱయన్= ప్రకాశింపగా; ఉద్ధుర= గర్వముతో కూడిన; గతిన్= గమనముతో; కౌంతేయ= కుంతీపుత్రులతో; అగ్రజు= పెద్దవాడయిన ధర్మరాజుయొక్క; అరదమునకున్= రథమునకు; వాలు+అమ్ములు= క్రూరమయిన బాణములు; నిగుడన్= వ్యాపించగా; కవిసెన్= ఉరికాడు.

**తాత్పర్యం:** మిక్కిలి వేగంగా రథికులైన సేనలను తొలగించి శల్యుడు తన రథం ప్రకాశించగా స్థిరమైన గమనంతో ధర్మజుడి రథంమీదికి క్రూరమయిన బాణాలు వ్యాపించగా ఉరికాడు.

**సీ. కనుఁగొని భీముండు గన్నుల నిప్పలు । రాల శుండాలకీలాలరంజి**
**తంబును రిపుసైన్యదైన్యప్రదంబును । నాత్మీయవాహినీహర్షకరము**

**నై శతధారా మహాభుజగ క్షమా । ధరశృంగసమత నుదగ్ర మగుచు**

**నెనిమిది యంచుల నెసఁగు మెఱుఁగుల । దారుణంబగు గదాదండ ముగ్ర**

**తే. రేఖ సారించి రౌద్ర ముద్రేక మందఁ । గదిసి మద్రాధిపుని తురంగములఁ జదియ**

**మోఁదె నాతండు దోమరమునఁ దదీయ । విపులవక్షంబు భేదించె నృపవరేణ్య! 168**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజులలో శ్రేష్ఠుడవయిన ధృతరాష్ట్ర మహారాజా!; భీముండు; కనుఁగొని= చూచి; కన్నులన్= కన్నులనుండి; నిప్పులు= అగ్నికణములు; రాలన్= పడుచుండగా; శుండాల= ఏనుగులయొక్క; కీలాల= నెత్తురుతో (తడిసి); రంజితంబును= ఎర్రనైనదియు; రిపు= శత్రువులయొక్క; సైన్య= సేనకు; దైన్య= దీనస్థితిని; ప్రదంబున్= కలుగచేయునదియును; ఆత్మీయ= తమయొక్క; వాహినీ= సైన్యమునకు; హర్షకరమును+అయి= సంతోషమును కలుగచేయునదియును అయి; శతధారా= వజ్రాయుధముయొక్కయు; మహాభుజగ= గొప్పపాముయొక్కయు; క్షమాధర శృంగ= పర్వత శిఖరము యొక్కయు; సమతన్= సమత్వముచేత; ఉదగ్రము= భయంకరమయినది; అగుచున్= అగుచును; ఎనిమిది; అంచులన్= అంచులతో; మెఱుంగులన్= కాంతులతో; ఎసఁగు= అతిశయించు; దారుణంబు= భయంకరము; అగు; గదాదండము= దండము వంటి గదాయుధముయొక్క (దండము అనగా దుడ్డుకర్ర); ఉగ్రరేఖన్= భయంకరమయిన విధంగా; సారించి= దాచి; రౌద్రము= కోపం; ఉద్రేకము= ఆవేశం; అందన్= పొందుచు; కదిసి= దగ్గరకుచేరి; మద్ర= మద్రదేశమునకు; అధిపుని= ప్రభువు అయిన శల్యుడియొక్క; తురంగములన్= గుర్రములను; చదియన్= చితుక; మోఁదెన్= కొట్టెను; ఆతండు= అతడు అనగా శల్యుడు; తోమరమునన్= తోమరమనే ఆయుధంతో; తదీయ= ఆ భీముడియొక్క; విపుల= విశాలమయిన; వక్షంబు= ఉరఃస్థలము; భేదించెన్= బ్రద్దలుకొట్టెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీముడి కన్నులనుండి అగ్ని కణాలు పడుతుండగా చూచి, ఏనుగుల రక్తంతో తడిసి ఎర్రనైనది, శత్రుసేనలకు దైన్యాన్ని కలిగించేది, తమ సేనలకు సంతోషం కలిగించేది, వజ్రాయుధంతోనూ, మహాసర్పంతోనూ, పర్వత శిఖరంతోనూ సమానమైనది, అతి భయంకరమైనది, ఎనిమిది అంచులతో (ధారలతో) వాటి కాంతులతో అతిశయించేదీ, భయంకరమైనది అయిన గదాదండం భయంకరంగా ఎత్తి, కోపం ఆవేశం పొంది దగ్గరకు చేరి శల్యుడి గుర్రాలను చితుకకొట్టాడు. ఆ శల్యుడు తోమరంతో ఆ భీముడి విశాలమైన వక్షఃస్థలాన్ని బ్రద్దలు చేశాడు.

**విశేషం:** ఈ సీసంలో భీముడి గదాస్వరూపం వర్ణించబడింది. ఆరు విశేషణాలతో గదయొక్క ఉగ్రరూపమును తిక్కన వర్ణించాడు. మూలంలో ఇంతటి వర్ణన లేదు.

**క. ఉరమున నాటిన ఘనతో । మరమును డాచేతఁ బెఱికి మారుతి మద్రే**

**శ్వరుసూతుఁ వైచె దానన । ధరణిని బోరగిలఁబడ నుదగ్ర స్ఫురణన్. 169**

**ప్రతిపదార్థం:** మారుతి= భీముడు; ఉరమునన్= గుండెపై; నాటిన= గ్రుచ్చుకొన్న; ఘన తోమరమున్= గొప్పదైన ఆ తోమరాన్ని; డాచేతన్= ఎడమచేతితో; పెఱికి= పైకి లాగి; దానన్+అ= దానితోనే; ఉదగ్ర స్ఫురణన్= అతిశయించిన స్ఫూర్తితో; మద్ర+ఈశ్వర సూతున్= శల్యుడి సారథిని; ధరణిని= నేలపై; బోరగిలన్+పడన్= బోరగిలేటట్లు (వీపుపైకి ముఖంక్రిందికి అయ్యేటట్లు) పడగా; వైచెన్= వేశాడు.

**తాత్పర్యం:** భీముడు తన వక్షఃస్థలం మీద నాటిన ఆ పెద్ద తోమరాన్ని ఎడమచేతితో పైకి లాగి బిగువైన పట్టుతో శల్యుని సారథి నేలపై బోరగిల పడేటట్లు దానితోనే త్రిప్పికొట్టాడు.

**మ. విరథుండై పొలివోని దర్పమున నవ్వీరుండు ఘోరంపు ము**
**ద్గరముం గేల సమర్చి తేరు డిగి దుర్దాంతాకృతిన్ వజ్ర భా**
**సురశక్రుండును దండచండ యముఁడున్ శూలోగ్ర ఫాలాక్షుఁడున్**
**సరి సేయందగువారు గాఁగఁ బొలిచెన్ సంస్తుత్యసంరంభతన్. 170**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుండు= పరాక్రమవంతుడైన ఆ శల్యుడు; విరథుండు+ఐ= రథములేనివాడై; పొలి+పోని= తరిగిపోని; దర్పమునన్= గర్వంతో; ఘోరంపు= భయంకరమైన; ముద్గరమున్= ముద్గరమును పేరుగల ఆయుధమును; కేలన్= చేతితో; అమర్చి= పట్టుకొని; తేరు= రథము; డిగి= దిగి; దుర్దాంత= నిగ్రహింపశక్యముకాని; ఆకృతిన్= ఆకారముతో; వజ్ర= వజ్రాయుధంతో; భాసుర= ప్రకాశించే; శక్రుండును= ఇంద్రుడును; దండ= దండముతో; చండ= భయంకరుడయిన; యముఁడున్= యముడును; శూల= త్రిశూలంతో; ఉగ్ర= భయంకరుడయిన; ఫాల= నుదుటియందు; అక్షుఁడున్= నేత్రముకలవాడయిన రుద్రుడును; సరి= సమానము; చేయన్= చేయుటకు; తగువారు; కాఁగన్= అగునట్లుగా; సంస్తుత్య= స్తుతింపదగిన; సంరంభతన్= సంభ్రమంతో; పొలిచెన్= ఒప్పెను.

**తాత్పర్యం:** పరాక్రమవంతుడైన శల్యుడు రథంలేనివాడై, విరిగిపోయిన రథం కలవాడై తరిగిపోని గర్వంతో భయంకరమైన ముద్గరమనే ఆయుధాన్ని చేతబట్టుకొని రథం దిగి నిగ్రహింప శక్యంకాని ఆకారంతో వజ్రాయుధంతో ప్రకాశించే ఇంద్రుడు, దండంతో భయంకరుడయిన యముడు, త్రిశూలంతో భయంకరుడైన రుద్రుడు సమానులయ్యేటట్లు స్తుతింపదగిన గర్వంతో ఒప్పారాడు.

**విశేషం:** ఇట శల్యుడి వర్ణనం దీపకముతో దీప్తించినది. ప్రకృతాప్రకృతమయిన ధర్మసామ్యం వల ఔపమ్యం స్ఫురించినచో దీపకము. ముద్గరము చేత బట్టిన శల్యుడు - ప్రకృతము. వజ్రము ధరించిన ఇంద్రుడు, దండము ధరించిన యముడు, త్రిశూలము ధరించిన రుద్రుడు అప్రకృతములు. 'సరిసేయందగువారు' అనుటలో ధర్మసామ్యము వలన ఔపమ్యం స్ఫురించింది కావున దీపకము. ముద్గరధారియైన శల్యుడు వజ్రధారియైన ఇంద్రుడితో, దండధారియైన యముడితో, శూలధారియైన రుద్రుడితో పోల్చబడుతున్నాడు కాబట్టి - ఇది ఉపమేయమే అని కొందరి అభిప్రాయం.

**వ. ఇ ట్లవష్టంభ విజృంభితుండైన యాసేనాధిపతిం జూచి యేచి భీముఁ డుద్దామరభసంబున నతనికి సమ్ముఖంబుగా నడరినఁ బణవాది వాదిత్ర నిర్భరనినదంబులు సెలంగె, నప్పు డయ్యిరువాఁగు నిరువుర నేనికపోరు చూచు విధంబునఁ గనుఁగొనుచు గదారణంబునకు శల్యుండు దక్క మారుతి మార్కొనఁ జాలు మేటిమగలు నివ్వడముడి వెలిగా నిమ్మద్రపతిమీఁదఁ గవియునట్టిజెట్టి బిరుదులుం గలరే? యనుచు నచ్చెరువొందుచుండ. 171**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; అవష్టంభ= గర్వముతో; విజృంభితుండు= అతిశయించినవాడ; ఐన= అయినట్టి; ఆ సేనాధిపతిన్= ఆ సైన్యాధ్యక్షుని (అనగా శల్యుడిని); చూచి; ఏచి= విజృంభించి; భీముఁడు; ఉద్దామ= భయంకరమైన; రభసంబునన్= వేగముతో; అతనికి; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; అడరినన్= విజృంభించగా; పణవము= తప్పెట; ఆది=

మొదలగు; వాదిత్ర= తతము - ఆనర్ధము - సుషిరము - ఘనము - అను చతుర్విధ వాద్య విశేషముల యొక్క; నిర్భర= గాఢమయిన; నినదంబులు= ధ్వనులు; చెలంగెన్= మ్రోసెను; అప్పుడు; ఆ+ఇరువాఁగును= ఆ రెండు సైన్యములును; ఇరువురను= ఇద్దరిని (శల్యభీమసేనులిద్దరిని); ఏనిక= ఏనుగులయొక్క; పోరు= పోరాటము; చూచు; విధంబునన్= విధముగా; కనుఁగొనుచున్= చూచుచున్నవారగుచు; గదారణంబునకున్= గదాయుద్ధమునకు; శల్యుండు; తక్కన్= తప్ప; మారుతిన్= భీముడిని; మార్కొనన్+చాలు= ఎదుర్కొనటానికి సరిపడే; మేటిమగలున్= గొప్పవారైన వీరులు; ఈ+వడముడి= ఈ భీముడు; వెలిగాన్= కాకుండా; ఈ+మద్రపతిమీఁదన్= మద్రదేశాధీశుడైన ఈ శల్యుడిపై; కవియు+అట్టి= పోరాడేటటువంటి; జెట్టి బిరుదులున్= మల్లురైన మహారథులు; కలరే?= ఉన్నారా?; అనుచున్; అచ్చెరువు+ఒందుచుండన్= ఆశ్చర్య పడుతుండగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా గర్వంతో విజృంభించే కురుసేనాధిపతి అయిన శల్యుడిని చూచి భీముడు అమితమైన కోపంతో అతడికి ఎదురుగా విజృంభించగా, తప్పెటలు మొదలగు వాదిత్రములయొక్క గాఢమయిన ధ్వనులు చెలరేగాయి. ఆ సమయంలో ఆ రెండు సైన్యాలు ఆ ఇద్దరి పోరాటాన్ని రెండు ఏనుగుల పోరాటం చూచేటట్లు చూస్తూ, గదాయుద్ధానికి శల్యుడు తప్ప భీముడిని ఎదుర్కొనటానికి సరిపడే గొప్పవారైన వీరులు కాని, ఈ భీముడు కాకుండా శల్యుడితో పోరాడునట్టి మల్లురయిన మహారథులు కాని లేరు అనుకొంటూ ఆశ్చర్యం పొందుతుండగా.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. మండలప్రచార మహితాకృతులు గర్జ । నలుగఁ బొలిచి మాఱు మలసి ఱంకె**
**లెసఁగఁ బోరి కమరి యేపారు వృషభయు । గంబునట్లు వారు గవిసి రధిప! 172**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; మండల= వలయాకారంగా; ప్రచార= తిరుగుతున్న; మహిత+ఆకృతులు= గొప్ప ఆకారములు కలవారు (గదాయుద్ధంలో కాని, మల్లయుద్ధంలో కాని గదలు తిప్పుతూ యోధులిద్దరూ వలయాకారముగ తిరగటాన్ని 'మండల ప్రచారం' అంటారు. 'మండలావర్త మార్గేషు గదావిహరణేషు చ' మూలము); మాఱు= ఎదురు; మలసి= తిరిగి; ఱంకెలు= రంకెలు (ఆబోతుల అరుపులు); గర్జనలుగన్= సింహగర్జనలుగా; పొలిచి= విలసిల్లి; ఎసఁగన్= విజృంభించగా; పోరికిన్= పోరాటమునకు; అమరి= సిద్ధమయిన; ఏపారు= విజృంభించు; వృషభయుగంబున్= రెండు ఆబోతులు; అట్లు= విధంగా; వారు= వారు (ఆ భీముడు, శల్యుడు); 'తౌ వృషావివ'; కవిసిరి= కలియబడిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! వలయాకారంగా తిరుగుతూ గదలు త్రిప్పుతూ సింహగర్జనలు చేస్తూ ఎదురు తిరిగి రంకెలు పెట్టుతూ పోరాటానికి సిద్ధమైన రెండు ఆబోతుల విధంగా గొప్పవైన ఆకారాలతో ఆ భీముడూ శల్యుడూ కలియబడ్డారు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. మదమున నిమ్మెయిం గదిసి మద్రవిభుండును భీమసేనుఁడున్**
**గదలమెఱుంగు లాకసము గ్రమ్మఁగ నుద్భటభంగిఁ ద్రిప్పి బె**
**ట్టిదముగ వ్రేయ నిప్పలు వడిం దొరఁగించె సమగ్రవిస్మయ**
**ప్రదరవభంగులై యవి పరస్పరఘోరవిఘట్టనంబునన్. 173**

**ప్రతిపదార్థం:** మద్ర= మద్రదేశానికి; విభుండును= ప్రభువు అయిన శల్యుడును; భీమసేనుఁడున్= భీమసేనుడును; ఈ+మెయిన్= ఈ ప్రకారంగా; మదమునన్= గర్వంతో; కదిసి= కలియబడి; గదల= గదలయొక్క; మెఱుంగులు= మెరుపులు; ఆకసమున్= ఆకాశాన్ని; క్రమ్మఁగన్= కప్పికొనేటట్లుగా; ఉద్భట= మిక్కిలి అధికమయిన; భంగిన్= విధంగా; త్రిప్పి= గిరగిర త్రిప్పి; బెట్టిదముగన్= గట్టిగా; వ్రేయన్= విసరగా; అవి; పరస్పర= ఒకదానితో ఒకటి; ఘోర= భయంకరమయిన; విఘట్టనంబునన్= తాకిడివలన; సమగ్ర= సంపూర్ణమయిన; విస్మయప్రద= ఆశ్చర్యమును కలుగచేయు; రవ= నాదాలయొక్క; భంగులై= అంతరాళాలు కలవిఅయి; నిప్పులు= అగ్నికణాలు; వడిన్= వేగంగా; తొరఁగించెను= కురిసెను. ('అంగారవర్షం ముముచే దద్భుతమివాభవత్' - మూలం).

**తాత్పర్యం:** శల్యుడు భీమసేనుడు ఈ ప్రకారంగా గర్వంతో కలియబడి గదల కాంతులు ఆకాశాన్ని కప్పివేసేటట్లు అధికమైన వేగంగా గిరగిర త్రిప్పిగట్టిగా విసరగా ఆ గదలు రెండూ ఒకదానితో ఒకటి భయంకరంగా కొట్టుకొనగా, సంపూర్ణమైన, ఆశ్చర్యమైన ధ్వనులు గలవయి నిండిపోగా అవి అగ్నికణాలను వేగంగా కురిపించాయి.

**వ. ఇట్లు దొడంగి. 174**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; తొడంగి= ప్రారంభించి.

**తాత్పర్యం:** భీముడు, శల్యుడు ఈ ప్రకారంగా గదాయుద్ధాన్ని ప్రారంభించి.

**క. ధిక్కారంబులు చరణద । భక్కారంబులును మెఱయ బలువు వెరవు పే**
**రుక్కును నెక్కుడు వేగము । నక్కజములుగా నుదీర్ణులై పోరునెడన్. 175**

**ప్రతిపదార్థం:** ధిక్కారంబులు= తిరస్కారములు (అనగా ఒకరిపై ఒకరు చేయు నిందలు); చరణ= పాదములయొక్క; దభక్కారంబులును= దభక్కు అనే ధ్వనులును; మెఱయన్= ప్రకాశింపగ; బలువు= ఎక్కువ; వెరవు= ఉపాయము; పేరు= ఎక్కువ; ఉక్కునున్= బలమును; ఎక్కుడు= ఎక్కువ; వేగమును; అక్కజములుగాన్= అధికముగా; ఉదీర్ణులై= పెరిగినవారై (పైకి ఎగిరినవారై); పోరు+ఎడన్= పోరాటం చేయుచుండగా.

**తాత్పర్యం:** ధిక్కారములు, దభక్కారములు (ఒకరి పాదాలను మరొకరు తొక్కడం వలన కలిగిన చప్పుళ్లు) అతిశయించగా ఉపాయం, బలం, వేగం - ఈ మూడును అధికంగా కలవారై గదాయుద్ధం చేస్తుండగా.

**విశేషం:** ఏకార్థ బోధకములగు' బలువు - పేరు - ఎక్కుడు - అక్కజములు' ప్రయోగించి తిక్కన శబ్ద వైచిత్రిని కనబరచాడు. 'ఉపాయము - బలము - వేగము' ఈ మూడును యుద్ధవీరులకు ఉండవలసిన ముఖ్య లక్షణములు.

దభక్కారము= పాదముల తాకిడిచేత కలిగే ధ్వన్యనుకరణ శబ్దం.

**చ. వెరవున నంగముల్ నుసులవ్రేటులు వమ్ముగఁ దాఁకినప్డు ది**
**క్కరి రదన ప్రహారములఁ గంపము నొందకయుండు మేదినీ**
**ధరములఁ బోల్పఁ బట్టగు నుదగ్రపుమూర్తుల కిద్దఱందు ని**
**ష్ఠుర రభసంబు శౌర్యము పటుత్వము ద్రాసునఁ బెట్టిన ట్లగున్. 176**

**ప్రతిపదార్థం:** అంగముల్= అవయవములు; నుసుల= లాఘవపు; వ్రేటులు= దెబ్బలు; వమ్ముగన్= వ్యర్థమయ్యేటట్లు; తాఁకినప్డు= ఒకరితో ఒకరు ఢీకొన్నప్పుడు; దిక్కరి= దిగ్గజములయొక్క; రదన= దంతములయొక్క; ప్రహారములన్= దెబ్బలవలన; కంపమున్= చలనమును; ఒందక= పొందక; ఉండు; మేదినీ= భూమిని; ధరములన్= మోయునట్టి-పర్వతములను; ఉదగ్రపు= భయంకరమయిన; మూర్తులకున్= ఆకారములు కలిగినవారికి; పోల్పన్= పోల్చటానికి; పట్టు+అగున్= తగినదై ఉన్నది; ఇద్దఱందున్= ఇద్దరిలోనూ; నిష్ఠుర= పరుషమయిన; రభసంబు= ఆవేశము; శౌర్యము= పరాక్రమము; పటుత్వమున్= చాతుర్యమును; త్రాసునన్= తక్కెడయందు; పెట్టిన+అట్లు+అగున్= ఉంచినట్లు అగును.

**తాత్పర్యం:** భీముడు, శల్యుడు ఉపాయంతో ఒకరితో ఒకరు ఢీకొన్నారు. దెబ్బలు తప్పించుకొనే విధంగా నేర్పుగా అవయవాలను కదిలించగా ఆ దెబ్బలు వ్యర్థంకాగా, దిగ్గజాల దంతముల దెబ్బలకు చలించకుండా ఉండునట్టి పర్వతాలతో పోల్చటానికి అనువుగా ఆ భయంకరాకారులు భాసించారు. ఆ ఇద్దరిలోనూ గల పరుషమయిన ఆవేశం, శౌర్యం, చాతుర్యం - మూడింటినీ తక్కెడయందు ఉంచినట్లవుతుంది.

**వ. ఒక్కొక్కమాఱు బ్బున. 177**

**ప్రతిపదార్థం:** ఒక్కొక్కమాఱు= ఒక్కొక్కసారి; ఉబ్బునన్= సంతోషంతో.

**తాత్పర్యం:** ఆ భీముడూ, శల్యుడూ, ఆ గదాయుద్ధంలో ఒక్కొక్కసారి సంతోషంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఎనిమిది యడుగుల కొలఁదిని। వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గి**
**ట్టిన తగళులకైవడిఁ దాఁ। కు నగంబుల భంగిదోఁచుఁ గురుకులముఖ్యా! 178**

**ప్రతిపదార్థం:** కురుకుల= కురుకులమునకు; ముఖ్యా!= ముఖ్యుడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఎనిమిది; అడుగుల; కొలఁదిని= పరిమితివరకును; వెనుకకున్+వెనుకకున్= బాగా వెనుకకు; పోయి; నిగిడి= తిరిగి విజృంభించి; వేగంబునన్= వేగముగా; కిట్టిన= సమీపించిన; తగళుల= గొర్రెపొట్టేళ్ళ; కైవడిన్= వలెను; తాఁకు= ఒకదాని నొక్కటి ఢీకొనే; నగంబుల= పర్వతముల; భంగిన్= విధముగా; తోఁచున్= తోచును.

**తాత్పర్యం:** కురుకులంలో శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ భీముడు, శల్యుడు ఎనిమిదేసి అడుగులు వెనుకకు పోయి తిరిగి విజృంభించి వేగంగా సమీపించిన గొర్రె పొట్టేళ్ళ వలె ఒకదానితో ఒకటి ఢీకొనే పర్వతాల వలెను తోచారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇత్తెఱంగునం బెనంగి నెత్తుట జొత్తిల్లినయంగంబులు పుష్పిత కింశుకంబులఁబోలఁబరిశ్రమంబు నొందియుఁ**
**బొలివోవని దర్పంబున. 179**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధముగా; పెనంగి= పెనగులాడి(పోరాడి); నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లిన= ఎఱ్ఱబడిన; అంగంబులు= అవయవములు; పుష్పిత= పుష్పించిన; కింశుకంబులన్= మోదుగుపూలను; పోలన్= పోలగా; పరిశ్రమంబున్= మిక్కిలి అలసటను; ఒందియున్= పొందియు; పొలిపోవని= చెడిపోని(తగ్గని); దర్పంబునన్= గర్వంతో;

**తాత్పర్యం:** ఈ విధంగా పోరాడి, రక్తంతో తడిసి ఎఱ్ఱబడిన అవయవాలు పుష్పించిన మోదుగచెట్లను పోలగా, మిక్కిలి అలసట పొందినా తగ్గని గర్వంతో.

**విశేషం:** అలం: ఉపమ. 'తౌ గదాభిహతైర్గాత్రైః క్షణేన రుధిరోక్షితౌ । ప్రేక్షణీయతరా వాస్తాం పుష్పితావివ కింశుకౌ॥ (శల్య-12-15. మూలం.)

## గదాయుద్ధమున మూర్ఛితుఁడైన శల్యునిఁ గృపుడు తొలంగం గొనిపోవుట (సం. 9-11-23)

**క. ఇరువురును సందు సూడక । వెర వెడలిన యాగ్రహముల వ్రేసిన గద లొం**
**డొరుల మెడలకెలఁకుల బ । ల్నరములు దాఁకుటయు వా రిలం బడి రధిపా! 180**

**ప్రతిపదార్థం:** అధిపా!= ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇరువురును= ఇద్దరును (భీముడును-శల్యుడును); సందు= ఎడము; చూడక= చూడకుండా; వెరవు= ఉపాయము; ఎడలిన= పోయిన; ఆగ్రహములన్= పట్టుదలలతో; వ్రేసిన= కొట్టిన; గదలు; ఒండొరుల= ఒకరొకరి; మెడల; మెడలయొక్క; కెలఁకులన్= ప్రక్కలనున్న; బల్= దృఢములయిన; నరములు; తాఁకుటయున్= తగులుటయు; వారు (ఆ భీమశల్యులు); ఇలన్= నేలపై; పడిరి= పడిపోయిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ భీముడూ, శల్యుడూ, ఇద్దరూ ఎడం లేకుండా ఉపాయం విచ్ఛిన్నమయిన కోపాలతో కొట్టుకోగా, గదలు ఒండొరుల మెడల ప్రక్కలనున్న గట్టి నరాలకు తగలగా వారు నేలపై పడ్డారు.

**వ. ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛిల్లుటయు నుభయసైన్యజనంబులును హాహాకారముఖరులై రట్టియెడఁ**
**గృపాచార్యుండు శల్యుకడకుఁ దన రథంబు రయంబునం బఱపించి. 181**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ఆ+మహావీరులు= ఆ గొప్ప పరాక్రమవంతులు (భీముడును, శల్యుడును); మూర్ఛిల్లుటయును= మూర్ఛపోవుటయును; ఉభయ= రెండుపక్షములయొక్క; సైన్య= సేనలకు సంబంధించిన; జనంబులును= మనుజులును; హాహాకార= హాహాకారములనెడి; ముఖరులు= ధ్వనులు చేయుచున్నవారలు; ఐరి= అయిరి; అట్టియెడన్= ఆ సమయమున; కృపాచార్యుండు; శల్యు= శల్యుని; కడకున్= దగ్గరకు; తన రథము; రయంబునన్= వేగముగా; పఱపించి= తోలించి.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ఆ మహావీరులు మూర్ఛిల్లగా కురుపాండవ సైన్యాలు రెండూ హాహాకారాలు చేశాయి. ఆ సమయంలో కృపాచార్యుడు శల్యుడి దగ్గరకు తన రథాన్ని వేగంగా తోలించి.

**క. పడియును గద విడువని య । క్కడిఁదిమగని గ్రుచ్చి యెత్తి గారవమున నం**
**దిడి తొలఁగం గొనిపోయెను । వడముడి దెప్పటియె నంత వసుధాధీశా! 182**

**ప్రతిపదార్థం:** వసుధా= భూమికి; అధీశా!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; పడియును= పడిపోయినను; గదన్= గదను; విడువని= విడిచిపెట్టని; ఆ+కడిఁది= ఆ అధికశక్తిగల; మగనిన్= వీరుడిని (ఆ శల్యుడిని); క్రుచ్చి; ఎత్తి; గారవమునన్= గౌరవభావముతో; అందు+ఇడి= రథమునందు పెట్టుకొని; తొలఁగన్= తొలగించి; కొనిపోయెను= తీసికొనిపోయెను; అంతన్= అటు తరువాత; వడముడి= భీముడు; తెప్పటియెన్= తెప్పిరిల్లెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పడిపోయినా గదను విడిచిపెట్టని ఆ మహావీరుడయిన శల్యుడిని కృపాచార్యుడు గ్రుచ్చి ఎత్తి, గౌరవభావంతో ఆ రథంమీద ఉంచుకొని అక్కడినుండి తొలగించి తీసికొనిపోయాడు. అటు తరువాత భీముడు మూర్ఛనుండి తెప్పిరిల్లాడు.

**వ. తెప్పిఱి లేచి చూచి సేద దేఱని యమ్మద్రపతిం బేరుకొని యుద్దండగదాదండమండితంబైన కరంబునం బిలిచె నయ్యుద్ధతి సహింపఁజాలక సింహనాదంబుతోడఁ దూర్యస్వనంబులు సెలంగఁ గురుభూవరు ముందరి సైనికులు రభసంబుగా నతఁడునుఁ గూడికొని తఱుమఁ గవిసినం గౌంతేయాగ్రజునగ్రభాగంబున రథికులు చేకితానపురస్సరులై యార్పులు నింగిముట్ట నయ్యనిలతనయుఁ దలకడచి వారిం దలపడి పెనంగి రప్పుడు. 183**

**ప్రతిపదార్థం:** (భీముడు) తెప్పిఱి= తెప్పిరిల్లి (మూర్ఛనుండి తేరుకొని); లేచి; చూచి; సేద= అలసటనుండి; తేఱని= తేరుకొనని; ఆ; మద్ర= మద్రదేశమునకు; పతిన్= ప్రభువు అయిన శల్యుడిని; పేరుకొని= పేరుపెట్టి; ఉద్దండ= మిక్కిలి పొడవైన; గదా దండ మండితంబు= దండమువంటి గదచే నలంకరింపబడినది; ఐన= అయినట్టి; కరంబునన్= చేతితో; పిలిచెన్= పిలిచెను; ఆ+ఉద్ధతిన్= గర్వమును; సహింపన్= ఓర్పు వహింప; చాలక= లేక; సింహనాదంబుతోడన్= సింహగర్జనముతో కూడ; తూర్య= తూర్యములను వాద్యములయొక్క (తూతూబూరాలయొక్క); స్వనంబులు= ధ్వనులు; చెలంగన్= మ్రోయగా; కురుభూవరు= కురురాజునకు (దుర్యోధనునకు); ముందరి= ముందుగా ఉన్న; సైనికులు= సేనలు; రభసంబుగాన్= ఆవేశంతో; అతఁడునున్= అతడును (దుర్యోధనుడును); కూడికొని= కలిసికొని; తఱుమన్= తరుముటకు; కవిసినన్= ఎదుర్కొనగా (కలియబడగా); కౌంతేయ= కుంతీపుత్రులలో; అగ్రజు= పెద్దవాడైన ధర్మరాజునకు; అగ్ర= ముందు; భాగంబునన్= ప్రదేశమున; రథికులు= రథముపై నుండి యుద్ధము చేయు యోధులు; చేకితాన= చేకితానుడు; పురస్సరులై= ముందుకలిగినవారై; ఆర్పులు= సింహనాదాలు; నింగి= ఆకాశమును; ముట్టన్= ముట్టుకొనగా; ఆ+అనిల= వాయువుయొక్క; తనయున్= కుమారుడైన భీముడిని; తలకడచి= దాటి; వారిన్= వారిని (కురుసైనికులను); తలపడి= కలియబడి; పెనంగిరి= పోరాడిరి; అప్పుడు.

**తాత్పర్యం:** భీముడు మూర్ఛనుండి తెప్పరిల్లి, లేచి చూచి, అలసట నుండి తేరుకొనని ఆ శల్యుడిని పేరుపెట్టి పొడవైన దండంవంటి గదతో అలంకృతమైన హస్తంతో పిలిచాడు. భీముడి ఆ గర్వాన్ని సహించలేక సింహగర్జనలతో కూడిన తూర్యధ్వనులు వ్యాపించగా దుర్యోధనుడు ఆవేశంతో తన సేనతో ఎదుర్కొనగా ధర్మరాజునకు అగ్రభాగంలో ఉన్న రథికులైన యోధులూ, చేకితానుడు ముందుండగా సింహనాదాలు ఆకాశాన్ని ముట్టగా ఆ భీముడిని దాటి కురుసైనికులతో కలియబడి పోరాడారు. ఆ సమయంలో.

**విశేషం:** చేకితానుడు - ఇతడు పాండవపక్షంనుండి యుద్ధం చేసిన వృష్ణి వంశజుడయిన యాదవుడు. ఇతడు మహారథుడు. ఇతడికి సాత్వతుడు - వార్ష్ణేయుడు అనే పేర్లు కూడా ఉన్నాయి.

**శా. ఆ కౌరవ్యవిభుండు వజ్రకలితంబై యొప్పుప్రాసంబు దీ**
**ప్తాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బునం గ్రాలఁ గే**
**లీకల్పంబుగ మింట జంట మెఱుఁగు ల్నిండం బ్రదీప్తక్రమ**
**శ్రీకాంతుండగు చేకితానుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్. 184**

**ప్రతిపదార్థం:** ఆ; కౌరవ్య= కురువంశమునకు సంబంధించిన; విభుండు= ప్రభువు- దుర్యోధనుడు; వజ్ర= వజ్రమువలె; కఠినంబు= గట్టిది; ఐ= అయి; ఒప్పు= ఒప్పునట్టి; ప్రాసంబున్= ఈటెను; దీప్త= ప్రజ్వలించిన; ఆకార= రూపముతో; ఉజ్జ్వల= ప్రకాశమానమగు; వృత్తిన్= వ్యాపారముతో; ఎత్తి= పైకి ఎత్తి; నిజ= తనయొక్క; సైన్యంబు= సేన; ఉబ్బునన్= సంతోషంతో; క్రాలన్= ఒప్పగా; కేలీ= క్రీడయొక్క; కల్పంబుగన్= విధమున; మింటన్= ఆకాశమునందు; జంటమెఱుఁగుల్= రెండు మెరుపులు (రెండు కాంతులు); నిండన్= నిండునట్లుగ; చూపఱు= చూచువారు; అగ్గింపఁగన్= పొగడునట్లుగా; ప్రదీప్త= మిక్కిలి ప్రకాశించిన; క్రమశ్రీ= గతుల సంపదచే; కాంతుఁడు= మనోహరుడు; అగు= అయినట్టి; చేకితానున్= చేకితానుని; పడవైచెన్= వధించెను.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు వజ్రంవలె కఠినమైన ఈటెను ప్రజ్వలించేటట్లు ప్రకాశించే విధంగా పైకి ఎత్తి, తన సేన సంతోషంతో సంభ్రమం చెందగా క్రీడాగతిని అనుసరించి ఆకాశంలో రెండు మెరుపులు నిండగా మిక్కిలి ప్రకాశంతో ఆక్రమిస్తున్న ప్రతాపవంతుడైన చేకితానుడిని చూచేవారు పొగడేటట్లుగా వధించాడు.

**విశేషం:** జంటమెఱుఁగుల్ - రెండు మెరుగులు - ఒకకాంతి దుర్యోధనుడి ప్రాసమునకు సంబంధించినది. రెండవది చేకితానుడి క్రమమునకు సంబంధించినది' - అతడు కూడ 'ప్రదీప్తక్రమశ్రీకాంతుఁడు' కదా! తిక్కన ఈ పద్యంలో 'మింటజంట మెఱుగుల్నిండం' అని వర్ణించాడు. సామాన్యంగా దుర్యోధనుడు - చేకితానుడు - మింటకెగసి తాకినపుడు గల స్థితిని - తిక్కనగారు ఇట్లు ఊహించి ఉత్ప్రేక్షించియుండవచ్చును. ఇంకను - ఆయనకు గల అనుభవాన్ని బట్టి కూడా ఇట్లు సూచించి యుండవచ్చును. ఈ వర్ణనం అమూలకం. మూలంలో వ్యాసభగవానుడు ఒక చిన్న అనుష్టుప్పులో - దుర్యోధనుడు చేకితానుని వధించుటను చెప్పాడు. తిక్కయజ్వ పెద్ద శార్దూలంతో దాని అభివర్ణించాడు.

**వ. ఇట్లు చేకితానుండు వీతాసుండైనం గని కౌంతేయులు గోపాటోపంబున సైన్యోపేతగతిం గడంగి కౌరవసైన్యంబుపైఁ బటుబాణంబులు గురియుచు నడరిన శల్యుండు ధర్మపుత్రుని దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతిపనుప నశ్వత్థామత్రిగర్తులు మూఁడు వేల రథంబులవారు వివ్వచ్చుని మహోత్సాహంబున మార్కొనిరి. తక్కటి యోధులు సేనయు నవ్విరోధి వరూథిని గలయం బెరయుటయు నక్కజంబయ్యె నప్పుడు పెంధూళి యెగసి చూడ్కులు నిగుడకున్నను సైనికుల సింహనాదంబులు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకంబుగాఁ బోరిన బోరనఁ దొరఁగుఁ శోణితం బారేణువు నడంచినఁ బ్రియం బంది యిరువాఁగును 'వ్రేయుండు పొడవుం' డను నెలుంగులు నింగి ముట్టఁ బెనంగు నట్టియెడ. 185**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధముగా; చేకితానుండు; వీత= పోయిన; అసుండు= ప్రాణములుకలవాడు; ఐనన్= కాగా; కని= చూచి; కౌంతేయులు= కుంతీకుమారులు(పాండవులు); కోప= క్రోధముయొక్క; ఆటోపంబునన్= విజృంభణంతో; సైన్య= సేనతో; ఉపేత= కూడిన; గతిన్= గమనముతో; కడంగి= పూని (ప్రయత్నించి); కౌరవ= కౌరవులయొక్క; సైన్యంబుపైన్= సేనపై; పటు= వాడిఅయిన; బాణంబులు= అమ్ములు; కురియుచున్= ప్రయోగించుచు; అడరినన్= అతిశయించగా; శల్యుండు; ధర్మపుత్రుని= ధర్మరాజును; దుర్యోధనుండు; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; ఆ+మహీపతి= దుర్యోధనుడు; పనుపన్= నియోగించగా; అశ్వత్థామ; త్రిగర్తులు= త్రిగర్తదేశాధీశుడైన సుశర్మ మొదలగువారు; మూఁడువేల రథంబులవారు= మూఁడువేలు రథములు కలవారు; వివ్వచ్చున్= అర్జునుని; మహా= గొప్ప; ఉత్సాహంబునన్= ప్రయత్నంతో; మార్కొనిరి= ఎదుర్కొనిరి; తక్కటి= మిగిలిన; యోధులు= వీరులు; సేనయున్= సైన్యమును; ఆ+విరోధి= ఆ శత్రువులయొక్క;

వరూథినిన్= సైన్యముతో; కలయన్= కలియబడుటకు; బెరయుటయున్= చేరుటయు; అక్కజంబు= ఆశ్చర్యం; అయ్యెన్; అప్పుడు= ఆ సమయమున; పెంధూళి= పెద్దదుమ్ము; ఎగసి= పైకిలేచి; చూడ్కులు= చూపులు; నిగుడక= వ్యాపించకుండా (కనిపించకుండా); ఉన్నను= ఉండగా; సైనికుల; సింహనాదంబులు= సింహగర్జనలు; చెలంగన్= శబ్దాలేర్పడేటట్లు; చేయుటయున్= చేయుటవలను; బిరుదులు= పౌరుషచిహ్నములయిన అతిరథమహారథ మొదలగు బిరుదులు; ప్రకటించుటయున్= ప్రకటించుటవలనను; బోధకంబుగాన్= తెలియబడునట్లుగా; పోరినన్= పోరాడగా; బోరనన్= వేగముగా; తొరఁగు= ప్రవహించు; శోణితంబు= రక్తము; ఆ రేణువున్= ఆ దుమ్మును; అడంచినన్= అణగద్రొక్కగా; ప్రియంబు సంతోషము; అంది= పొంది; ఇరువాఁగును= రెండు సేనలును; వ్రేయుండు= కొట్టుడు; పొడువుండు= పొడువుడు; అను= అనునట్టి; ఎలుంగులు= అరుపులు(శబ్దములు); నింగిన్= ఆకాశమును; ముట్టన్= అంటుకొనునట్లు; పెనంగు= యుద్ధము చేయుచున్న; అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా చేకితానుడు మరణించగా చూచి పాండవులు మిక్కిలి కోపంతో సేనతో కూడి కౌరవసైన్యంపై వాడి అయిన బాణాలు ప్రయోగిస్తూ విజృంభించగా, శల్యుడు ధర్మరాజును, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడిని, దుర్యోధనుడి పనుపున అశ్వత్థామ త్రిగర్తులు మూడువేల రథాలతో అర్జునుడిని ఎదుర్కొన్నారు. మిగిలిన యోధులు, సేనలు ఆ శత్రుసేనతో అనగా పాండవసేనతో కలియబడగా యుద్ధం ఆశ్చర్యకరమైనది. ఆ సమయంలో పెద్ద దుమ్ము పైకి లేచి చూపులకు ఏమీ కనిపించకుండా ఉండగా సైనికులు చేసే సింహగర్జనలవలన పుట్టిన శబ్దాలు, అతిరథమహారథాదిబిరుదాలు ప్రకటించటంవలన పుట్టిన శబ్దాలు తెలియబడేటట్లుగా పోరాడుతుండగా బోరున ప్రవహించే రక్తం ఆ దుమ్మును అణచివేసింది. అప్పుడు సంతోషం పొంది రెండు సేనలూ 'కొట్టండి పొడవండి' అని చేసే అరుపులు ఆకాశాన్ని అంటుకొనేటట్లు యుద్ధం చేస్తున్న సమయంలో.

**విశేషం:** పెంధూళి - పెను+ధూళి - పెన్+ధూళి - పెంధూళి.

**చ.** **బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్**
**గురిసిన నాన్నృపాలుఁడు నకుంఠితుఁడై పదునాల్గు తూపుల**
**న్నరపతి మేనఁ గ్రుచ్చి యెలనవ్వున నొప్పిన నమ్మహీశు పే**
**రురమున నాటె నారథికుఁ డొక్క సముజ్జ్వలబాణ మేడ్తెఱన్.** **186**

**ప్రతిపదార్థం:** మద్ర= మద్రదేశమునకు; పతి= అధిపతి అయిన శల్యుడు; బరవసము= ధీరత్వము; ఒప్పన్= ప్రకాశింపగా; పాండవ= పాండవులలో; ముఖ్యుని= ముఖ్యుడయిన (అనగా ప్రథముడు అయిన) ధర్మజుని; మీఁదన్= పైన; కాండముల్= బాణములు; కురిసినన్= ప్రయోగించగా; ఆ నృపాలుఁడున్= ఆ ధర్మరాజు కూడా; అకుంఠితుఁడై= మొక్కవోనివాడై - కుంటువడనివాడై; పదునాల్గు తూపులు= పదినాలుగు బాణములు; ఆ; నరపతి= నరులకు ప్రభువు అయిన ఆ శల్యుడి; మేనన్= దేహమునందు; క్రుచ్చి; ఎలనవ్వునన్= చిరునవ్వుతో; ఒప్పినన్= ప్రకాశింపగా; ఆ రథికుఁడు= ఆ శల్యుడు; ఒక్క; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశవంతమయిన; బాణమున్= బాణమును; ఏడ్తెఱన్= పరాక్రమముతో; ఆ; మహీ= భూమికి; ఈశు= ప్రభువు అయిన ఆ ధర్మరాజుయొక్క; పేరు= విశాలమయిన; ఉరమునన్= వక్షఃస్థలమునందు; నాటెన్= క్రుచ్చెను.

**తాత్పర్యం:** మద్రపతి శల్యుడు మిక్కిలి ధైర్యంతో పాండవ ప్రథముడైన ధర్మరాజుమీద బాణాలు వర్షించగా ఆ ధర్మరాజు కూడా మొక్కవోని ధైర్యం కలవాడై పదునాలుగు బాణాలు ఆ శల్యుడి దేహమునందు గ్రుచ్చి ఒక

చిరునవ్వు నవ్వగా, శల్యుడు ఒక మిక్కిలి ప్రకాశవంతమైన బాణాన్ని పరాక్రమం అతిశయించగా ఆ ధర్మరాజు విశాలమయిన వక్షఃస్థలంపై నాటాడు.

**వ. నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుం డను తదీయచక్రరక్షకుం దునిమి నవనారాచంబులు సారథిమేన నిగిడించె. 187**

**ప్రతిపదార్థం:** నాటినన్= గ్రుచ్చగా; ఆ+మనుజేంద్రుండు= ఆ ధర్మరాజు; కనలి= కోపించి; చంద్రసేనుండు; అను; తదీయ= ఆ శల్యుడి రథంయొక్క; చక్ర= చక్రములను; రక్షకున్= రక్షించువానిని; తునిమి= ఖండించి; నవ= తొమ్మిది; నారాచంబులు= తీక్షణములయిన బాణములు; సారథి= రథమునడుపువాని; మేనన్= శరీరమునందు; నిగిడించెన్= వ్యాపింపచేసెను (అనగా గ్రుచ్చుకొనేటట్లు చేసెను.)

**తాత్పర్యం:** శల్యుడు ధర్మరాజు యొక్క పేరురంపై వాడి అయిన బాణాన్ని గ్రుచ్చగా - ఆ ధర్మరాజు మిక్కిలి కోపించి, చంద్రసేను డనే శల్యుడి రథచక్రరక్షకుడిని ఖండించి, తొమ్మిది బాణాలు శల్యుడి రథసారథి శరీరంలో గ్రుచ్చాడు.

**విశేషం:** మహాభారతంలో ఇద్దరు చంద్రసేనులు ఉన్నారు. ఒక చంద్రసేనుడు సముద్రసేనుడి కొడుకు. ఇతడు పాండవపక్షాన యుద్ధం చేసిన మహారథి. ఇతడిని అశ్వత్థామ సంహరించాడు. ఇక రెండవ చంద్రసేనుడు కౌరవపక్షంలోని యోధుడు. ఇతడు శల్యుడి రథచక్ర రక్షకుడు. ఇతడినే ధర్మరాజు ఖండించాడు. ఈ సందర్భంలో ధర్మరాజు ద్రుమసేనుడనే శల్యుడి మరియొక చక్రరక్షకుడిని కూడా సంహరించినట్లు మూలంలో ఉన్నది. 'ద్రుమసేనం చతుఃషష్ట్యా నిజఘాన మహారథః చక్రరక్షే హతే శల్యః పాండవేన మహాత్మనా' ॥ ఈ ద్రుమసేనుడు గవిష్ఠుడనే దైత్యుడి అంశవలన జన్మించిన క్షత్రియుడు. ఈ వచనంలో తిక్కనార్యుడు సారథిని తొమ్మిది బాణాలతో కొట్టినట్లు వ్రాశాడు. ఆ విషయం మూలంలో కనపడదు.

**ఆ. అపుడు శినివరుండు ననిలపుత్త్రుఁడుఁ జేది । బలము శల్యుఁ దీవ్రభంగి బొదువ**
**నాతఁ డా ధనంజయాగ్రణిఁ బటుతర । పంచమార్గణముల నొంచె నధిప! 188**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అపుడు; శినివరుండును= సాత్యకియును; అనిల= వాయువుయొక్క; పుత్త్రుఁడును= కుమారుడయిన భీముడును; చేది= చేది దేశముయొక్క; బలమున్= సైన్యమును; శల్యున్= శల్యుడిని; తీవ్ర= అధికమయిన; భంగిన్= విధముగా; పొదువన్= ఎదుర్కొనగా; ఆతఁడు= ఆశల్యుడు; ఆ; ధనంజయ= అర్జునుని కంటె; అగ్రణినిన్= పెద్దవానిని అనగా భీముని; పటుతర= మిక్కిలి కఠినమైన; పంచ= అయిదు; మార్గణములన్= బాణములతో; నొంచెన్= నొప్పించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయంలో అనగా ధర్మరాజు శల్యుడి చక్రరక్షకులను, సారథిని ఖండించిన తరువాత - సాత్యకి, భీముడు, చేది సేన ఆ శల్యుడిని తీవ్రంగా ఎదుర్కొనగా ఆ శల్యుడు భీముడిని మిక్కిలి కఠినమయిన అయిదు బాణాలతో నొప్పించాడు.

**విశేషం:** పద్యంలో 'చేదిబలము' అని ప్రయోగింపబడింది. చేదిదేశపురాజు శిశుపాలుడు. అతడి పుత్రుడు ధృష్టకేతుడు. అతడు ఒక అక్షౌహిణి సేనతో పాండవపక్షం వైపు యుద్ధం చేశాడు. ఇక శినివరుడు అనగా సాత్యకి, వృష్ణి వంశమునందలి 'శిని'

యొక్క కుమారుడు సత్యకుడు. సత్యకుడి పుత్రుడు సాత్యకి. ఇతడు సప్తమరుత్తుల అంశతో జన్మించాడు. మహాభారతంలో సాత్యకికి అనేక నామాలు ఉన్నాయి. అందు కొన్ని - ఆనర్త, శైనేయ, శినిపౌత్ర, శినిపుత్ర, శినిప్రవర, శినిప్రవీర, శినిపుంగవ, శినివీర, శినివృషభ, దాశార్హ, మాధవ, మాధవసింహ, యుయుధాన, మొదలైనవి.

**క. విను మిరువదియేడమ్ముల । శినిమనుమని యు బ్బడంచెఁ జేదిరథికులం**
**దునిమెం దీవ్రశరోత్కర । మున నిరువది యేవురన్ సముద్భటభంగిన్. 189**

**ప్రతిపదార్థం:** వినుము; ఇరువదియేడు; అమ్ములన్= బాణములతో; శినిమనుమని= సాత్యకియొక్క; ఉబ్బు= ఆధిక్యమును; అడంచెన్= అణచెను(తగ్గించెను); తీవ్ర= మిక్కిలి వాడి అయిన; శర= బాణములయొక్క; ఉత్కరమునన్= సమూహముతో; సముద్భట= శ్రేష్ఠమయిన; భంగిన్= విధముగా; ఇరువది; ఏవురన్= అయిదుగురు; చేది= చేది దేశముయొక్క; రథికులన్= వీరులను; తునిమెన్= ఖండించెను (సంహరించెను).

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆలకించుము. శల్యుడు ఇరువది ఏడు బాణాలతో సాత్యకియొక్క ఆధిక్యాన్ని తగ్గించాడు. తరువాత మిక్కిలి వాడి అయిన బాణాలతో శ్రేష్ఠమైన విధంగా ఇరువది అయిదుమంది చేది వీరులను సంహరించాడు.

**క. కవలు తనమీఁద రయమునఁ । గవిసిన నిశితతరసాయకములను మౌర్వీ**
**రవము సెలంగఁగ వారల । యవయవముల నినిచె నతఁ డహంకృతి మెఱయన్. 190**

**ప్రతిపదార్థం:** అతఁడు (అనగా శల్యుడు); అహంకృతి= అహంకారము (అనగా గర్వము) మెఱయన్= ప్రకాశింపగా; కవలు= నకులసహదేవులు; తనమీఁదన్; రయమునన్= వేగముగా; కవిసినన్= కలియబడగా; మౌర్వీ= వింటినారియొక్క; రవము= ధ్వని; చెలంగఁగన్= మ్రోయగా; నిశితతర= మిక్కిలి వాడి అయిన; సాయకములను= బాణములను; వారల= వారియొక్క; అవయవములన్= అంగములందు; నినిచెన్= నింపెను.

**తాత్పర్యం:** నకుల సహదేవులు తనపై వేగంగా కలియబడగా, ఆ శల్యుడు ప్రకాశిస్తున్న గర్వంతో, వింటినారియొక్క ధ్వని మిక్కుటమయ్యే విధంగా వాడి అయిన బాణాలతో ఆ నకుల సహదేవుల అంగాలను నింపివేశాడు.

**చ. కనుఁగొని ధర్మసూతి భుజ గర్వమెలర్పఁగ బెట్టు గిట్టి శ**
**ల్యుని మెయిఁ దీవ్రమార్గణసముత్కరముం బరఁగించి కేతువుం**
**దునిమిన నాతఁ డా పతికిఁ దూపుల వేఁడిమి సూపి వాయుసూ**
**నునిఁ గవలన్ శినిప్రవరు నొంచె వడిం బదియేసి యమ్ములన్. 191**

**ప్రతిపదార్థం:** ధర్మసూతి= యమధర్మరాజు పుత్రుడయిన ధర్మరాజు; కనుఁగొని= చూచి; భుజగర్వము= బాహువులయొక్క పొగరు; ఎలర్పఁగన్= అతిశయించగా; బెట్టు= అత్యంతము; కిట్టి= సమీపించి; శల్యుని= శల్యునియొక్క; మెయిన్= దేహమునందు; తీవ్ర= తీక్షణమయిన; మార్గణ= బాణములయొక్క; సముత్కరమున్= సమూహమును; పరఁగించి= ప్రయోగించి; కేతువున్= జెండాకొయ్యను; తునిమినన్= ఖండించగా; ఆతఁడు; ఆ పతికిన్= ఆ ప్రభువు అయిన ధర్మరాజునకు; తూపులవేఁడిమి= బాణములయొక్క తాపము; చూపి; వడిన్= వేగముగా; పదియేసి= పది చొప్పున; అమ్ములన్= బాణములను; వాయు సూనునిన్= భీముడిని; కవలన్= నకులసహదేవులను; శినిప్రవరున్= సాత్యకిని; నొంచెన్= నొప్పించెను.

**తాత్పర్యం:** ధర్మరాజు శల్యుడిని చూచి బాహుగర్వం అతిశయించగా సమీపించి, శల్యుడి దేహంలో తీక్షణమైన బాణసముదాయాన్ని ప్రయోగించి జెండాకొయ్యను ఖండించాడు. అప్పుడు ఆ శల్యుడు ధర్మరాజునకు వాడి బాణాల తాపాన్ని చూపించి, వేగంగా పదేసి బాణాలతో భీముడిని, నకుల సహదేవులను, సాత్యకిని నొప్పించాడు.

**ఉ. నొంచి మదించి ఖేచరమనోహరుఁడై వడి ధర్మపుత్రు స్రు**
**క్కించి మహోగ్రబాణపరికీలితదేహునిఁ జేసె దానఁ గో**
**పించి శితాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం గడంక గు**
**ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్. 192**

**ప్రతిపదార్థం:** నొంచి= నొప్పించి; మదించి= గర్వించి; ఖే= ఆకాశమునందు; చర= సంచరించు దేవయోనులయొక్క; మనః+హరుఁడు+ఐ= మనస్సులను హరించినవాడై (దేవగంధర్వ యక్ష కిన్నరసిద్ధసాధ్యాదులకు ఆనందమును కలిగించువాడై); వడిన్= వేగముగా; ధర్మపుత్రున్= ధర్మరాజును; స్రుక్కించి= మూర్ఛనొందించి; మహా= గొప్ప; ఉగ్ర= భయంకరమయిన; బాణ= బాణములతో; పరికీలిత= బాగుగా నాటబడిన; దేహునిన్= శరీరముకల వానినిగా; చేసెన్= చేసెను; దానన్= అందువలన; కవలు= నకుల సహదేవులు; భీముఁడు; సాత్యకియున్= సాత్యకియును; కోపించి= కోపమును పొంది; శిత= వాడిఅయిన; అస్త్రముల్= బాణములు; కడంకన్= ప్రయత్నముతో; గుప్పించినన్= కురిపించగా; వానిన్= ఆ బాణములను; త్రుంచి= ఖండించి; వారలన్= వారిని (అనగా నకుల సహదేవులను; భీముని- సాత్యకిని); శరపీడిత= బాణములచే బాధింపబడిన; దేహులన్= శరీరములు కలవారినిగా; చేసెన్= చేసెను.

**తాత్పర్యం:** శల్యుడు భీముడిని, నకుల సహదేవులను, సాత్యకిని నొప్పించి, గర్వించి, దేవగంధర్వాది ఆకాశ సంచారులకు ఆనందాన్ని కలిగిస్తూ, వేగంగా ధర్మజుడిని మూర్ఛనొందించి భయంకరములయిన బాణాలతో అతడి శరీరంలో గ్రుచ్చాడు. ఇట్లా ధర్మజుడు బంధించబడగా నకుల సహదేవులు, భీముడు, సాత్యకి, మిక్కిలి కోపించి వాడి అయిన బాణాలను శల్యుడిపై కురిపించగా, శల్యుడు వాటిని ఖండించి ఆ నకుల సహదేవులను, భీముడిని, సాత్యకిని, శరపీడిత దేహులుగా చేశాడు.

**వ. చేసి యొండొక భాసితధ్వజం బెత్తించి మెఱసిన. 193**

**ప్రతిపదార్థం:** చేసి; ఒండొక= ఇంకొక; భాసిత= ప్రకాశవంతమయిన; ధ్వజంబు= జెండాకొయ్యను; ఎత్తించి= నిలబెట్టి; మెఱసినన్= ప్రకాశింపగా.

**తాత్పర్యం:** ఆ నకుల సహదేవులను, భీముడిని, సాత్యకిని శరపీడిత దేహులను చేసి, ఇంకొక ప్రకాశవంతమయిన జెండా కొయ్యను నిలబెట్టి, ఆ శల్యుడు ప్రకాశించగా.

**సీ. భీముఁ డాతని మెయి బెడిదంపు నారసం । బడరించి వెండియు నట్టి వేడు**
**వఱపె సాత్యకి శతబాణంబు లతనిపై । బెట్టేసె మాద్రి తొల్పట్టి యైదు**
**తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు । గమ్ముల నవ్వీరు నంగకములఁ**
**బరఁగించి రమ్మద్రపతి భీమసేనాదు । లైన యన్నలువుర నతిరయమున**

**తే.** **వరుస డెబ్బదిమూఁటను నిరువదేను । వాఁడి తూపుల నేనింట మూఁడు మార్గ**
**ణములఁ బీడితులుగఁ జేసి నఱకె భల్ల । నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య!** **194**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజులలో శ్రేష్ఠుడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; భీముఁడు; ఆతని= ఆ శల్యుని; మెయిన్= శరీరమునందు; బెడిదంపు= భయంకరమగు; నారసంబు= బాణము; అడరించి= ప్రయోగించి; వెండియున్= మరియు; అట్టివి; ఏడు; పఱపెన్= ప్రయోగించెను; సాత్యకి; శత= నూరు; బాణంబులు; అతనిపైన్= ఆ శల్యుడిపై; బెట్టు= గట్టిగా; ఏసెన్= ప్రయోగించెను; మాద్రి= మాద్రియొక్క; తొల్పట్టి= మొదటిబిడ్డ(నకులుడు); ఐదు; తీవ్ర= మిక్కిలి వాడి అయిన; అస్త్రములన్= బాణాలను; సహదేవుండు; పదునాలుగు; అమ్ములన్= బాణాలను; ఆ+వీరున్= పరాక్రమవంతుడయిన శల్యుడి; అంగకములన్= అవయవములందు; పరఁగించిరి= ప్రయోగించిరి; ఆ+మద్రపతి= శల్యుడు; భీమసేన; ఆదులు= మొదలగువారు; ఐన= అయినటువంటి; ఆ+నలువురన్= నలువురను; అతి= మిక్కిలి; రయమునన్= వేగముగా; వరుసన్= క్రమముగా; డెబ్బది; మూఁటను= మూడు బాణములతో; ఇరువది; ఏను= అయిదు; వాఁడి= వాడిఅయిన; తూపులను= బాణములతోను; ఏనింటన్= అయిదింటితో; మూఁడు మార్గణములన్= మూడు బాణములతో (సహదేవుని); పీడితులుగన్= బాధింపబడునట్టి వారుగ; చేసి; భల్ల= బల్లెముయొక్క; నిహతిన్= దెబ్బతో; సహదేవు= సహదేవునియొక్క; చాపంబున్= వింటిని; నఱకెన్= ఖండించెను.

**తాత్పర్యం:** రాజ శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీముడు శల్యుని దేహంలో భయంకరమైన బాణాన్ని ప్రయోగించి ఇంకా అటువంటి ఏడు బాణాలు మరల శల్యుడిపై ప్రయోగించాడు. సాత్యకి శల్యుడిపై నూరు బాణాలు ప్రయోగించాడు. నకులుడు అయిదు వాడి అయిన బాణాలు, సహదేవుడు పదునాలుగు బాణాలు ఆ శల్యుడి అవయవాలపై ప్రయోగించారు. అంతట ఆ శల్యుడు భీముడు, సాత్యకి, నకులుడు, సహదేవుడు ఆ నలువురను వరుసగా డెబ్బదిమూడు, ఇరువది అయిదు, అయిదు, మూడు బాణాలతో కొట్టి బల్లెంతో సహదేవుడి వింటిని ఖండించాడు.

**శా.** **ఆ మాద్రీసుతుఁ డన్యచాపధరుఁడై యత్యుగ్రబాణంబులన్**
**మామా! యెక్కడఁ బోయె? దంచు వెస నమ్మద్రేశు నేయంగ ను**
**ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ**
**స్తోమంబుల్ గురియంగ ధర్మసుఁతుడుం దూపుల్ మెయిం గ్రువ్వఁగన్.** **195**

**ప్రతిపదార్థం:** ఆ; మాద్రీ= మాద్రియొక్క; సుతుఁడు= కుమారుడు (అనగా సహదేవుడు); అన్య= మరియొక; చాప= వింటిని; ధరుఁడై= ధరించినవాడై; అతి= మిక్కిలి; ఉగ్ర= భయంకరమయిన; బాణంబులన్= బాణములతో; మామా!; ఎక్కడన్= ఎక్కడకు; పోయెదు?= పోయెదవు?; అంచున్= అనుచు; వెసన్= వేగముగా; ఆ; మద్రేశున్= శల్యుడిని; ఏయంగన్= కొట్టగా; భీమసాత్యకులు= భీముడును, సాత్యకియును; ఉద్దామ= అడ్డులేని విధముగా; ఉదగ్రతన్= భయంకరత్వముతో; శాత= వాడి అయిన; ప్రస్ఫురత్= ప్రకాశించుచున్న; మార్గణ= బాణములయొక్క; స్తోమంబుల్= సమూహములు; కురియంగన్= కురిపించగా; ధర్మసుతుఁడున్= ధర్మరాజుకూడా; తూపుల్= బాణములు; మెయిన్= దేహమునందు (శల్యుడి దేహమునందు); క్రువ్వఁగన్= కురిపించగా (నాటగా).

**తాత్పర్యం:** సహదేవుడు మరియొక వింటిని ధరించి, మిక్కిలి భయంకరమయిన బాణాలతో 'మామా! ఎక్కడకు పోతావు?' అంటూ వేగంగా ఆ శల్యుడిని కొట్టగా భీమసాత్యకులు కూడా అడ్డులేని విధంగా భయంకరంగా వాడి

అయిన, ప్రకాశవంతమయిన బాణసమూహాలను కురిపించగా ధర్మజుడు కూడా ఆ శల్యుడి దేహమునందు బాణాలు నాటగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. కలయఁగ నెత్తురుల్ దొరఁగ గైరిక నిర్ఝరజాలరంజితా**
**చలమును బోలి పొల్పెసఁగి శల్యుఁడు వారల నస్త్రపంచకం**
**బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర! ధర్మజు చాప మమ్ముతో**
**బలమును శౌర్యమున్ సురలు ప్రస్తుతి సేయ మహోగ్రమూర్తియై. 196**

**ప్రతిపదార్థం:** కురుభూవర!= కురు వంశ మహారాజు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కలయఁగన్= అంతట; శల్యుఁడు; నెత్తురుల్= రక్తములు; తొరఁగన్= స్రవించుచుండగ; గైరిక= గైరికాది ధాతువులతోడి; నిర్ఝర= సెలయేరులయొక్క; జాల= సమూహములతో; రంజిత= ఎర్రనైన; అచలమును= పర్వతమును; పోలి; పొల్పు= ఒప్పుగా; ఎసఁగి= విజృంభించి; వారలన్= వారిని; అస్త్ర= మంత్రపూతములయిన బాణములయొక్క; పంచకంబులన్= అయిదింటితో; వెసన్= వేగముగా; నొంచి= నొప్పించి; బలమును; శౌర్యమున్= పరాక్రమమును; సురలు= దేవతలు; ప్రస్తుతి= మెచ్చుకోలు; చేయన్= చేయునట్లుగా; మహా= మిక్కిలి; ఉగ్ర= భయంకరమయిన; మూర్తియై= ఆకారముకలవాడై; ధర్మజు= ధర్మరాజుయొక్క; చాపము= విల్లు; అమ్ముతోన్= బాణంతో; త్రుంచెన్= ఖండించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు శల్యుడు రక్తప్రవాహాలు దేహంనుండి స్రవిస్తుండగా గైరికాది ధాతువులతో నిండిన సెలయేరుల సమూహాలతో ఎర్రగా ఉన్న పర్వతంవలె ప్రకాశిస్తూ విజృంభించి, ధర్మరాజు, భీముడు, సాత్యకి, నకుల సహదేవులు అయిదుగురిని ఒక్కొక్కరిని అయిదేసి మంత్రపూతాలయిన బాణాలతో నొప్పించి, తన బలాన్ని పరాక్రమాన్ని దేవతలు ప్రస్తుతి చేసేటట్లు భయంకరాకారం కలవాడై, ఒక్క బాణంతో ధర్మరాజు వింటిని అమ్ముతో కూడ ఖండించాడు.

**విశేషం:** అలం: ఉపమ. శల్యుడు ఉపమేయము. గైరిక నిర్ఝరజాల రంజితాచలము - ఉపమానము; పోలి - ఉపమావాచకం. ఎఱుపు - సమానధర్మం. పూర్ణోపమ. ఈ ఉపమకు మూలం. 'సుస్రావ రుధిరం గాత్రై ర్గైరికం పర్వతో యథా!' (శల్య - 13-24)

**ఉ. వేఱొక చాపమెత్తి పృథివీవర! ధర్మతనూజుఁ డింతతోఁ**
**దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబుగ నంచు సూతుమైఁ**
**దూఱఁ దురంగమాంగములు దూఁటులు వోవఁగ శల్యునెమ్ములన్**
**గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్. 197**

**ప్రతిపదార్థం:** పృథివీ= భూమికి; వర!= భర్తఅయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ధర్మ= యమధర్మరాజుయొక్క; తనూజుఁడు= కుమారుడు అనగా ధర్మరాజు; వేఱొక= మరియొక; చాపము= విల్లు; ఎత్తి= పట్టుకొని; అతి= మిక్కిలి; ప్రకటంబుగన్= వెల్లడియగునట్లుగా; పగ= విరోధము; ఇంతతోన్= ఇంతటితో; తీఱఁగన్= ముగిసిపోవునట్లుగ; చేయుదున్= చేస్తాను; అంచున్= అనుచు; సూతు= సూతునియొక్క; మైన్= దేహమునందు; తూఱన్= చొచ్చుకొనిపోవునట్లుగ; తురంగ= గుర్రములయొక్క; అంగములు= అవయవములు; తూఁటులు= చిల్లులు; పోవఁగన్= పడునట్లుగా; శల్యు= శల్యునియొక్క; ఎమ్ములన్= ఎముకలను; గీఱన్= భేదించునట్లుగ; సిడంబున్= ధ్వజమును(జెండాకొయ్యను); కాఁడన్= నశించునట్లుగ; సముజ్జ్వల= ప్రకాశవంతమయిన; చండ= క్రూరమయిన; కాండముల్= బాణములు; పరఁగించెన్= ప్రయోగించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజు మరియొక విల్లు పట్టుకొని 'ఇంతటితో విరోధం (యుద్ధం) ముగిసిపోవునట్లుగా చేయగలను' అంటూ సూతుడి దేహం చొచ్చుకొని పోయేటట్లుగా, గుర్రాల అవయవాలు చిల్లులు పడేటట్లుగా, శల్యుడి ఎముకలు భేదించేటట్లుగా, జెండాకొయ్య విరిగేటట్లుగా ప్రకాశవంతమైన, క్రూరమైన బాణాలు ప్రయోగించాడు.

**వ. ఇవ్విధంబున విజృంభించిన. 198**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ ప్రకారముగ; విజృంభించినన్= అతిశయించగా.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ ప్రకారంగా అతిశయించి యుద్ధం చేస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ధర్మరాజు శల్యునిబాణంబులచేత మూర్ఛితుం డగుట (సం. 9-11-66)**

**క. కోపించి యతఁడు దర్పా । టోపం బుగ్రముగ దశపటుప్రదరము లా**
**భూపాలు మేనఁ జొనిపిన । భూపాలక! యాతఁడొల్లఁ బోవుటయు వెసన్. 199**

**ప్రతిపదార్థం:** భూ= భూమికి; పాలక!= పరిపాలకుడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అతఁడు= అనగా ఆ శల్యుడు; కోపించి; దర్ప= గర్వముయొక్క; ఆటోపంబు= ఆడంబరము; ఉగ్రముగన్= భయంకరము అగునట్లుగా; దశ= పది; పటు= కఠినమయిన; ప్రదరములు= బాణములు; ఆ; భూపాలు= రాజైన ధర్మరాజుయొక్క; మేనన్= శరీరమునందు; చొనిపినన్= చొప్పించగా; ఆతఁడు= ఆ ధర్మరాజు; ఒల్లఁబోవుటయున్= మూర్ఛపోవుటయు; వెసన్= వేగముగా.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ శల్యుడు కోపించి గర్వపు ఆడంబరం భయంకర మయ్యేటట్లుగా పది కఠినమయిన బాణాలు ఆ ధర్మరాజు శరీరంలో నాటగా ఆ ధర్మరాజు మూర్ఛపోయాడు. ఆ వెంటనే వేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. శైనేయుఁ డడరి యుజ్జ్వల । నానావిశిఖముల మద్రనరపతిఁ బొదువం**
**దా నలిగి విల్లు దునియలు । గా నొక భల్లమున నేసె గర్వోద్ధతుఁడై. 200**

**ప్రతిపదార్థం:** శైనేయుఁడు= శినియొక్క మనుమడు అయిన సాత్యకి; అడరి= విజృంభించి; ఉజ్జ్వల= ప్రకాశవంతమయిన; నానా= అనేక విధములయిన; విశిఖములన్= వాడి అయిన మొనలు గల బాణాలతో; మద్ర= మద్రదేశముయొక్క; నరపతిన్= నరులకు భర్త అయిన శల్యుని; పొదువన్= కప్పివేయగా; తాన్= తాను(అనగా శల్యుడు); అలిగి= కోపించి; గర్వ= గర్వముతో; ఉద్ధతుఁడై= గర్వించినవాడై; విల్లు= ధనువు(సాత్యకి విల్లు); తునియలు+కాన్= చిన్న చిన్న ముక్కలగునట్లుగా; ఒక భల్లమునన్= ఒక బల్లెముతో; ఏసెన్= కొట్టెను.

**తాత్పర్యం:** శల్యుడి బాణాల వలన ధర్మరాజు మూర్ఛిల్లగా, ఆ వెంటనే సాత్యకి విజృంభించి ప్రకాశవంతమైన అనేక విధాలైన బాణాలతో ఆ శల్యుడిని కప్పివేయగా, శల్యుడు కోపించి పొగరుతో గర్వించినవాడై సాత్యకి ధనువును చిన్న చిన్న ముక్కలయ్యేటట్లుగా ఒక బల్లెంతో కొట్టాడు.

**క. ఆ రథికవరుని నకులుని । మారుతి సహదేవు మూఁడు మార్గణముల నే**
**పారఁగ బలుపారఁగ రయ । మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁడధిపా! 201**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఆ; మహా= గొప్ప; భుజుఁడు= బాహువులు కలవాడు అయిన శల్యుడు; ఆ; రథిక= యోధులలో; వరునిన్= శ్రేష్ఠుడయిన వానిని; నకులుడిని; మారుతిన్= భీముడిని; సహదేవున్= సహదేవుడిని; మూఁడు మార్గణములన్= మూడేసి బాణములతో; ఏపు+ఆరఁగన్= పెంపు అనగా ఆధిక్యము అతిశయించునట్లుగా; బలుపు+ఆరఁగన్= బలం అతిశయించునట్లుగా; రయము+ఆరఁగన్= వేగము అతిశయించునట్లుగా; నొప్పించెన్= నొవ్వచేసెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ మహాభుజ బలపరాక్రమవంతుడైన శల్యుడు యోధశ్రేష్ఠులైన సాత్యకిని, నకులుడిని, భీముడిని, సహదేవుడిని, మూడేసి బాణాలతో తన ఆధిక్యం, బలం, వేగం అతిశయించేటట్లుగా బాధించాడు.

**విశేషం:** ఈ పద్యంలో 'మూఁడు మార్గణములన్' అని ఉన్నది. మూడు బాణములని అర్థం. సాత్యకిని, భీముడిని, నకులుడిని, సహదేవుడిని మూడు బాణములతో బాధించాడని తాత్పర్యం. మూలాన్ని పరిశీలించగా - ఒక్కొక్కరిని మూడేసి బాణములతో కొట్టినట్లు ఉన్నది.

**వ. అంతం దెలిసి యక్కౌంతేయాగ్రజుండు మద్రపతిని ముద్గరంబున నేయ నవ్విరోధిపై సాత్యకి దోమరంబును వృకోదరుండు భల్లంబును నకులుండు శక్తియు సహదేవుండు గదయును బ్రయోగించిన నయ్యోధవరుండు వాని నన్నింటిని మింట మెఱుంగు లడర వెడఁద యమ్ములు వరఁగించి త్రుంచి యార్చినం బేర్చిన రోషంబున నా కృష్ణానుజుండు సారథి మూఁడు వాఁడితూపుల నవ్విరోధి రెండు బాణంబుల బెట్టేసినఁ గ్రోధదీప్తుండై యా శల్యుఁడు ప్రచండకాండంబుల నయ్యేవురను స్రుక్కించిన జూచి నీ పుత్త్రుం డతనిచేతఁ బాండుపుత్త్రులు పొలియుదు రని తలంచె నట్లు భాసమానుండైన సేనాపతిం గని భీమసేనుండు సహింపక తెంపున బెట్టు గిట్టిన. 202**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో; ఆ; కౌంతేయ= కుంతీపుత్రులలో; అగ్రజుండు= పెద్దవాడు అయిన ధర్మరాజు; తెలిసి= మూర్ఛనుండి తేరుకొని; మద్రపతిని= మద్రదేశమునకు అధిపతి అయిన శల్యుడిని; ముద్గరంబునన్= ముద్గరముతో (అనగా ఇనుపగదతో); ఏయన్= కొట్టగా; ఆ+విరోధిపైన్= శత్రువుపై(అనగా శల్యునిమీద); సాత్యకి; తోమరంబును= తోమరము అనే ఆయుధాన్ని; వృక+ఉదరుండు= భీముఁడు (తోడేలు ఉదరమువంటి ఉదరముకలవాడు కావున భీముడికి వృకోదరుడని పేరు); భల్లంబును= బల్లెమును; నకులుడు; శక్తియును= శక్తి అనే ఆయుధాన్ని; సహదేవుండు; గదయును= గదను; ప్రయోగించినన్= ప్రయోగించగా; ఆ; యోధ= యుద్ధవీరులలో; వరుండు= శ్రేష్ఠుడు అయిన శల్యుడు; వానిన్= వానిని; ఆ ఆయుధములను; అన్నింటిని; మింటన్= ఆకాశమునందు; మెఱుంగులు= మెఱుపులు; అడరన్= వ్యాపించునట్లుగా; వెడఁద= విశాలమయిన (పొడవు అయిన); అమ్ములు= బాణములు; పరఁగించి= ప్రయోగించి; త్రుంచి= ముక్కలు చేసి; ఆర్చినన్= పెద్దబొబ్బ పెట్టగా (గట్టిగా అరవగా); పేర్చిన= అతిశయించిన; రోషంబునన్= కోపముతో; ఆ; కృష్ణ= శ్రీకృష్ణునకు; అనుజుండు= తమ్ముడు అయిన సాత్యకి; సారథిన్= సారథిని(శల్యుడి సారథిని); మూఁడు; వాఁడి= వాడిఅయిన; తూపులన్= బాణములతో; ఆ; విరోధిన్= శత్రువును (అనగా శల్యుడిని); రెండు; బాణంబులన్= బాణములతో; బెట్టు= గట్టిగా; ఏసినన్= కొట్టగా; ఆ శల్యుఁడు; క్రోధ= కోపముతో; దీప్తుండై= ప్రజ్వలించుచున్నవాడై; ప్రచండ= భయంకరములయిన; కాండంబులన్= బాణములతో; ఆ; ఏవురను= అయిదుగురను; స్రుక్కించినన్= బాధించగా; చూచి; నీపుత్రుండు= నీయొక్క కుమారుడు(అనగా దుర్యోధనుడు);

అతనిచేతన్; పాండుపుత్రులు= పాండురాజు కుమారులు; పొలియుదురు= చత్తురు; అని; తలంచెను= ఆలోచించెను; అట్లు= ఆ ప్రకారంగా; భాసమానుండైన= ప్రకాశమానుడయిన; సేనాపతిన్= సైన్యాధ్యక్షుని(శల్యుని); కని= చూచి; భీమసేనుండు; సహింపక= ఓర్పువహింపక; తెంపునన్= సాహసముతో; బెట్టు= మిక్కిలి దగ్గరకు; కిట్టినన్= సమీపించగా.

**తాత్పర్యం:** అంతలో ధర్మరాజు మూర్ఛనుండి తేరుకొని శల్యుడిని ముద్గరంతో కొట్టాడు. ఆ సమయంలో ఆ శల్యుడిపై సాత్యకి తోమరాన్ని, భీముడు బల్లెమును, నకులుడు శక్తిని, సహదేవుడు గదను ప్రయోగించారు. వీరశ్రేష్ఠుడయిన ఆ శల్యుడు ఆ ఆయుధాలన్నింటినీ ఆకాశంలో మెరుపులు వ్యాపించేటట్లు పెద్ద పెద్ద బాణాలు ప్రయోగించి చిన్న చిన్నముక్కలుగా చేసి పెడబొబ్బ పెట్టాడు. దానితో అతిశయించిన కోపంతో సాత్యకి శల్యుడి సారథిని మూడు వాడి అయిన బాణాలతో, శల్యుడిని రెండు బాణాలతో గట్టిగా కొట్టాడు. అంతట ఆ శల్యుడు క్రోధంతో ప్రజ్వలించినవాడై, భయంకరాలయిన బాణాలతో అయిదుగురిని బాధించాడు. అది చూచి నీ పుత్రుడు దుర్యోధనుడు ఆ శల్యుడిచేత పాండు పుత్రులు చస్తారని తలంచాడు. ఆ ప్రకారంగా ప్రకాశమానుడైన శల్యుడిని చూచి భీమసేనుడు సహించ జాలక సాహసంతో ఆ శల్యుడి సమీపానికి రాగా.

**క. శిని మనుమఁడు గవలును దో । డన యురవడి నడరి పొదువుటయు నగ్గలికం**
**బెనఁగె నతం డా నలువుర । కనలుఁ గడంకయును సరకు గాఁ గొన కధిపా! 203**

**ప్రతిపదార్థం:** అధిపా!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; శిని= శినియొక్క; మనుమఁడు(అనగా సాత్యకి); తోడన= వెంటనే; కవలును= నకులసహదేవులును; విజృంభణంతో= మిక్కిలివేగముగా; పొదువుటయును= క్రమ్ముకొనుటయును; అడరి= విజృంభించి; అగ్గలికన్= ఉత్సాహముతో; పెనఁగెన్= పోరాడెను; అతండు; ఆ నలువుర= ఆ నలుగురియొక్క; కనలున్= కోపమును; కడంకయును= యుద్ధముచేయు పోకడలను, సరకుగాన్+కొనక= లక్ష్యము చేయకుండా; పెనఁగెన్= పోరాడెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సాత్యకి ఆ వెంటనే మిక్కిలి వేగంగా నకుల సహదేవులను కలిసికొని విజృంభించి, ఉత్సాహంతో శల్యుడితో పోరాడాడు. ఆ శల్యుడు ఆ నలువురి కోపాన్ని, యుద్ధప్రయత్నాన్ని లక్ష్యపెట్టకుండా పోరాడాడు.

**వ. ఇట్లు పెనంగుచుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చిన చంద్రసేనుతోడివాని ద్యుమత్సేనుఁ దల ద్రెవ్వ నేసిన జక్రరక్షకహీనుం డయ్యును బొలివోవని కనలున శల్యుండు సటలు వెటికినం గోపించు సింగంబుచందంబై సమీరణసుతాదులగు జోదుల నలువురయంగంబులఁ దురంగనికరశరీర సారథినికాయసహితంబుగా బహువిధవిశిఖంబులు వరఁగించి నెత్తురులు దొరఁగించినం గని యా ధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున. 204**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; పెనంగుచుండన్= పోరాడుచుండగా; పాండవ= పాండురాజు కుమారులలో; అగ్రజుండు= పెద్దవాడయిన ధర్మరాజు; మున్ను= అంతకుముందు; తనచేతన్= తనచేత; చచ్చిన= చచ్చిపోయిన; చంద్రసేనుతోడివానిన్= చంద్రసేనునితోడివాడైన; ద్యుమత్సేనున్= ద్యుమత్సేనునియొక్క; తల= శిరస్సు; త్రెవ్వన్= తెగిపోవునట్లుగా; ఏసినన్= కొట్టగా; చక్రరక్షక= రథ చక్రములను రక్షించువాడు; హీనుండు= లేనివాడు; అయ్యును= అయినను; పొలివోవని= చెడిపోవని; కనలునన్= కోపముతో; శల్యుండు; సటలు= జూలు; పెఱికినన్= పీకినందువలన; కోపించు= కోపించే; సింగంబు=

సింహము; చందంబు= వలె; ఐ= అయినటువంటి వాడయి; సమీరణ= వాయువుయొక్క; సుత= పుత్రుడు భీముడు; ఆదులగు= మొదలగు; జోదులు= యోధులగు; నలువుర= నలువురియొక్క; అంగంబులన్= అవయవములను; తురంగ= గుర్రాలయొక్క; నికర= సమూహముయొక్క; శరీర= దేహములు; సారథి= సారథులయొక్క; నికాయ= సమూహముల; సహితంబుగాన్= సమేతముగా; బహువిధ= అనేకవిధములయిన; విశిఖంబులు= వాడియైన బాణాలు; పరఁగించి= ప్రయోగించి; నెత్తురులు= రక్తములు; తొరఁగించినన్= ప్రవహించునట్లు చేయగా; కని= చూచి; ఆ; ధర్మ= యమధర్మరాజుయొక్క; నందనుండు= కుమారుడు అనగా ధర్మరాజు; విషాదంబున్= దుఃఖమును; ఒంది= పొంది; నిజ= తనయొక్క; అంతర్గతంబునన్= అంతఃకరణమునందు (మనస్సునందు).

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా పోరాడుతుండగా ధర్మరాజు అంతకుముందు తనచేత చంపబడిన చంద్రసేనుడితో పాటు శల్యుడికి చక్ర రక్షకుడుగా ఉన్న ద్యుమత్సేనుడి తల నరికాడు. అటు తరువాత చక్రరక్షకుడు లేనివాడైనా శల్యుడు తరుగని కోపంతో జూలు పీకినందుకు కోపించే సింహంవలె భీముడు మొదలైన యోధులైన నలుగురి అవయవాలను, గుర్రపు సమూహాలయొక్క శరీరాలను, సారథుల సమూహాలను అనేక విధాలయిన వాడి బాణాలు ప్రయోగించి రక్తాలు ప్రవహించేటట్లు చేయగా చూచి ధర్మరాజు దుఃఖించి తనలోతాను.

**విశేషం:** ఈ సందర్భంలో తిక్కన ధర్మజుడు ద్యుమత్సేనుడనే శల్యుడి చక్రరక్షకుడిని సంహరించినట్లు అభివర్ణించాడు. మూలంలో ఈ సందర్భంలో కాని, మరియొక చోటకాని 'ద్యుమత్సేనుడు' అనే చక్రరరక్షకుడు ఉన్నట్లు కానరాదు. వ్యాసమహాభారతంలో ఒక 'ద్యుమత్సేనుడు' సావిత్రి భర్త అయిన సత్యవంతుడి తండ్రి. మరియొక 'ద్యుమత్సేనుడు' ఉన్నాడు. అతడు పర్వతరాజు. అతడు యుద్ధమునకు సంబంధించిన వాడు కాడు. శల్యుడి చక్రరక్షకుడుగా యుద్ధంలో పాల్గొన్న 'ద్యుమత్సేనుడు' అనే వాడు వ్యాస మహాభారతంలో కానరాడు. ఇది పండితులు పరిశీలించవలసిన విషయం.

**క. 'హరి వచనంబు లసత్యతఁ । బొరయఁగ నేర్చునొకొ! మద్రభూపతి బాహు**
**స్ఫురణము భీమాదిరథిక । వరు లోర్వని యట్లుగాఁగ వ్రాలెడిఁ దోడ్తోన్.' 205**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణునియొక్క; వచనంబులు= పలుకులు; అసత్యతన్= నిజము కానితనమును; పొరయఁగన్= పొందగ; నేర్చున్= అగును; ఒకొ!= ఏమో!; మద్రభూపతి= మద్రదేశాధిపతి అయిన శల్యుడియొక్క; బాహు= భుజములయొక్క; స్ఫురణము= విజృంభణము(ప్రకాశము); భీమ= భీముడు; ఆది= మొదలగు; రథికవరులు= శ్రేష్ఠులయిన యోధులు; ఓర్వని= భరింపరానిది; అట్లుగాఁగన్= అగునట్టిదిగా; తోడ్తోన్= వడివడిగా; వ్రాలెడిన్= మీరిపోవుచున్నది (అధికమగుచున్నది).

**తాత్పర్యం:** ధర్మరాజు తనలోతాను ఇట్లా చింతించాడు. 'శ్రీకృష్ణుడి మాటలు కల్లలు కావు కదా! శల్యుడి భుజవిజృంభణం భీముడు మొదలైన యోధశ్రేష్ఠులు భరించరానిదిగా తీవ్రం అవుతున్నది.'

**వ. అని తలపోసి తన బలంబునకుఁ జేయి వీచినఁ దోయధివీచివితానవిలాసంబుచందంబునఁ జతురంగబలంబులు శల్యునిపైఁ గవిసిన నా ధైర్య ధౌరేయుండు మందరనగంబులీలఁ గైకొని వారలం గలంచి పాంచాలపుత్ర ప్రభృతియోధప్రకరంబులను బాండవాగ్రజునిం బరమ సాంద్రతీవ్రశరాంధకారంబునఁ గప్పి సింహనాదంబు చేసిన. 206**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధముగా; తలపోసి= చింతించి; తన బలంబునకున్= తనయొక్క సేనకు; చేయి; వీచినన్= ఊపగా; తోయధి= సముద్రముయొక్క; వీచి= కెరటములయొక్క; వితాన= సమూహములయొక్క; విలాసంబు= సౌందర్యము

(శృంగారము); చందంబునన్= విధముగా; చతురంగంబులు= నాలుగు రథాది యుద్ధాంగాలు; శల్యునిపైన్= శల్యుడిమీద; కవిసినన్= కలియబడగా; ఆ; ధైర్య= ధీరత్వముయొక్క; ధౌరేయుండు= భారమును మోయువాడు అయిన శల్యుడు (అనగా మిక్కిలి ధైర్యముకల శల్యుడు); మందర= మందరమనుపేరుగల; నగంబు= పర్వతముయొక్క; లీలన్= విలాసమును; కైకొని= గ్రహించి; వారలన్= వారిని; కలంచి= కలతచెందించి; పాంచాలపుత్ర= ధృష్టద్యుమ్నుడు; ప్రభృతి= మొదలగు; యోధ= వీరులయొక్క; ప్రకరంబులను= సమూహములను; పాండవాగ్రజునిన్= ధర్మరాజును; పరమ= మిక్కిలి; సాంద్ర= దట్టమయిన; తీవ్ర= వాడి అయిన; శర= బాణములవలని; అంధకారంబునన్= చిమ్మచీకటితో; కప్పి= కప్పివేసి; సింహనాదము= సింహగర్జనము; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** అని ధర్మరాజు తనలోతాను చింతించి, వెనువెంటనే తన సేనలకు చేయి ఊపగా సముద్రతరంగ సమూహాలవలె చతురంగబలాలు శల్యుడిమీద కలియబడగా సాహసవంతుడు అయిన ఆ శల్యుడు మందరపర్వతం పాల సముద్రాన్ని కలచినట్లు ఆ చతురంగ బలాలను కలచి, ధృష్టద్యుమ్నుడు మొదలైన వీరులను, ధర్మరాజును మిక్కిలి దట్టమయిన వాడి అయిన బాణాల వలన నిండిన చిమ్మచీకటితో కప్పివేసి సింహగర్జనం చేయగా.

**విశేషం:** అలం: ఉపమ. రూపకం.

**క. దివిజగరుడఖచరాదులు । వివిధవచనరచన లెసఁగ వినుతించిరి శా**
**త్రవ భీకరుఁడగు నమ్మద్రవిభుని రణవిహరణములు ధరణీనాథా! 207**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ధృతరాష్ట్ర మహారాజా!; శాత్రవ= శత్రువులకు; భీకరుఁడగు= భయంకరుడయిన; ఆ; మద్ర= మద్రదేశమునకు; విభుని= ప్రభువు అయిన శల్యునియొక్క; రణ= యుద్ధమునందలి; విహరణములు= విహారములు; దివిజ= దేవతలు; గరుడ= గరుడులు; ఖ= ఆకాశమునందు; చర= సంచరించు దేవయోనులు; ఆదులు= మొదలగువారు; వివిధ= అనేకవిధములయిన; వచన= వచనములతో కూడిన; రచన= రచనా విన్యాసములు; ఎసఁగన్= ఒప్పగా; వినుతించిరి= స్తుతించిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శత్రుభయంకరుడైన శల్యుడి యుద్ధ విహారాలు దేవతలు, గరుడ గంధర్వయక్షకిన్నరకింపురుష సిద్ధసాధ్యులు మొదలైనవారు వివిధ ప్రక్రియలతో కూడిన వచన రచనా విన్యాసాలతో స్తుతించారు.

**వ. ఆ సమయంబున. 208**

**తాత్పర్యం:** అప్పుడు

**తే. గురుసుతుఁడు పెనుబ్రాపుగా నరునిఁ బొదివి । యధిప! సంశప్తకులు వివిధా స్త్రతతులఁ**
**గప్పి రతఁ డందఱను జండకాండవిదళి । తాంగులుగఁ జేసె దోర్లీల యతిశయిల్ల. 209**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభువు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; గురు= ద్రోణాచార్యునకు; సుతుఁడు= పుత్రుడు అయిన అశ్వత్థామ; పెను= పెద్ద; ప్రాపుగాన్= సహాయకుడిగా; సంశప్తకులు(త్రిగర్తాధీశులయిన సుశర్మ మొదలగువారు); నరునిన్= అర్జునుడిని; పొదివి= క్రమ్ముకొని(చుట్టుముట్టి); వివిధ= అనేకవిధములయిన, అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములయొక్క; తతులన్= సమూహములతో; కప్పిరి= కప్పివేసిరి; అతఁడు; అందఱను; దోః= భుజములయొక్క; లీల=

విలాసము; అతిశయిల్లన్= విజృంభించగా; చండ= భయంకరమయిన; కాండ= బాణములతో; విదళిత= చీల్చబడిన; అంగులుగన్= అవయవములు కలవారినిగా; చేసెన్;

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అశ్వత్థామను ఆశ్రయించి అతడి సాయంతో సంశప్తకులు అర్జునుడిని చుట్టుముట్టి అనేక విధాలయిన ఆయుధాలతో కప్పివేశారు. ఆ అర్జునుడు వారినందరిని భుజబలం విజృంభించగా విలాసంగా భయంకరమైన బాణాలతో ఆ సంశప్తకులను చీల్చబడిన అవయవాలు కలవారినిగా చేశాడు.

**విశేషం:** త్రిగర్త దేశాధీశుడు సుశర్మ మహాబల పరాక్రమవంతుడు. ఈ త్రిగర్తసేనలు సంశప్తకులు. ద్రోణపర్వంలో అర్జునుడు ఈ సంశప్తకులను సహస్రాధికంగా సంహరించినట్లు ఉన్నది. సుశర్మ తమ్ముడు సత్యరథుడు అనేవాడు ఉన్నాడు. సత్యరథుడు తన అయిదుగురు సోదరులతో కలిసి - 'అర్జునుడిని సంహరించగలము' లేనిచో మరణించగల'మని ప్రతిజ్ఞ చేశాడు. ఈ ప్రతిజ్ఞ కారణంగా త్రిగర్త దేశాధీశులకు, వారిసేనలకు సంశప్తకులనే పేరు వచ్చింది. ఈ సందర్భంలో మూలంలో వ్యాసభగవానుడు త్రిగర్తులనియే ప్రయోగించాడు. తిక్కన మాత్రం సంశప్తకులని ప్రయోగించాడు. మూలంలో ఇలా ఉంది.

> **'అర్జునో ద్రౌణినా విద్ధో యుద్ధే బహుభిరాయసైః ।**
> **తస్య చానుచరైః శూరై స్త్రిగర్తానాం మహారథైః ॥ (శల్య - 14-1)**

**చ.** **తెరలక వారు పైపయి నుదీర్ణసముద్ధతిఁ గ్రమ్మి వాజులన్**
**హరిని సిడంబుపైఁ గదియ నాతఁడు సేడ్పడ బాణవర్షముం**
**గురిసిరి కౌరవేంద్రుమొనకుం బ్రమదంబగు ఘోరభంగి న**
**ప్పరుషపరాక్రమస్ఫురణ పార్థివసత్తమ! కాన మెయ్యెడన్. 210**

**ప్రతిపదార్థం:** వారు (అనగా అశ్వత్థామయు ఆ సంశప్తకులును); తెరలక= తొలగిపోవకుండగా; ఉదీర్ణ= పెల్లుబికిన; సముద్ధతిన్= దర్పముతో; క్రమ్మి= క్రమ్ముకొని; వాజులన్= గుర్రములను; హరిని= శ్రీకృష్ణుడిని (అర్జునుడిని రథసారథి); సిడంబుపైన్= ధ్వజముపైని; పైపయిన్= మీదమీద; కదియున్= సమీపించగా; ఆతఁడు (అనగా అర్జునుడు); చేడ్పడన్= బాధపడునట్లుగా; కౌరవేంద్రు= దుర్యోధనునియొక్క; మొనకున్= సేనకు; ప్రమదంబు= ఆనందము; అగు= కలిగించునట్టి; ఘోర= భయంకరమయిన; భంగిన్= విధముగా; బాణ= బాణములయొక్క; వర్షమున్= వర్షమును; కురిసిరి= కురిపించిరి; పార్థివ= రాజులలో; సత్తమ!= ఉత్తముడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఆ; పరుష= నిష్ఠురమయిన (క్రూరమైన); పరాక్రమ= వీరత్వముయొక్క; స్ఫురణ= ప్రకాశము; ఎయ్యెడన్= ఎక్కడా; కానము= చూడము.

**తాత్పర్యం:** అశ్వత్థామ, సంశప్తకులు, యుద్ధభూమినుండి తొలగిపోకుండా పెల్లుబికిన దర్పంతో క్రమ్ముకొని పార్థుడి గుర్రాలపై సారథి అయిన శ్రీకృష్ణుడిపై, ధ్వజంపైబడి మీదమీదకు సమీపించి, అర్జునుడు బాధపడేటట్లుగా, దుర్యోధనుడిసేన ఆనందపడేటట్లుగా భయంకరంగా బాణవర్షాన్ని కురిపించారు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! అట్టి క్రూరమైన పరాక్రమప్రకాశం ఎక్కడా చూడం.

**వ.** **ఇట్లు సవ్యసాచికిఁ జేయార్ప రాకుండ దర్పంబు సూపిన నా భూవరకుమారవర్యుండు వీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్రక్షురికాముఖనారాచప్రముఖవిశిఖపరంపరలు వరఁగింప నవి యా సైనికుల రథ్యంబులం గూల్చియుఁ గేతనంబులు ద్రుంచియు బాణంబులు నఱకియు బాణాసనంబులు విఱిచియు**

**సూతుల గీటడంచియు నరదంబులఁ జెక్కియు మైమఱువులు పొళ్లుసేసియుఁ జామరంబులు దునిమియు నాతపత్రంబులు రూపుమాపియు నెత్తురు లురలించియుఁ గండలు దొరఁగించియు నెమ్ములు వగిలించియుఁ గాళ్ళు ద్రుంచియుఁ జేతులు దునిమియు వ్రయ్యలుగా వక్షంబులు సీఱియు మర్మంబులఁ జొచ్చియు మకుటంబులు డుల్చియుఁ దలలు రాల్చియుఁ బ్రాణంబులు పీల్చియు రౌద్రం బావహించిన లయకాలరుద్రుని సంక్రీడనంబు చందంబు దోఁచెనప్పుడు రథికవరసహస్ర ద్వితయంబు దెగటారె నవ్వాఁడిమగండు పేరడవి దహించు దావపావకుని చందంబున వెలింగెఁ దదీయతేజోమహిమ సహింపక యుద్దామగతి నశ్వత్థామ గదిసి యక్కవ్వడిం దొడరి దురం బొనర్చె నందు. 211**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; సవ్యసాచికిన్= అర్జునుడికి; చేయార్పరాకుండన్= చేతులకు విశ్రాంతి లేకుండగ; దర్పంబు= గర్వము; చూపినన్= ప్రదర్శింపగ; ఆ; భూ= భూమికి; వర= భర్త అయిన పాండురాజుయొక్క; కుమార= కుమారులలో అనగా పుత్రులలో; వర్యుఁడు= శ్రేష్ఠుడు అయిన అర్జునుడు; వీర= శౌర్యము; ఆగ్రహ= కోపము-వీనియొక్క; ఆవేశంబునన్= ప్రవేశంవలన; విజృంభించి= అతిశయించి; భల్ల= బల్లెములు; అర్ధచంద్రక్షురికా= అర్ధచంద్రాకారము గల బాణముల; ముఖ= ముఖముగల; నారాచ= ఇనుపబాణములు; ప్రముఖ= మున్నగు; విశిఖ= బాణములయొక్క; పరంపరలు= వరుసలు; పరఁగింపన్= ప్రయోగించగా; అవి; ఆ సైనికుల= ఆ సేనలయొక్క; రథ్యంబులన్= రథములు లాగెడి గుర్రములను; కూల్చియున్= కూల్చియు; కేతనంబులు= జెండాకొయ్యలు; త్రుంచియున్= ముక్కలు చేసియు; బాణంబులు; నఱికియున్= ఖండించియు; బాణాసనంబులు= ధనుస్సులు; విఱిచియున్= ఖండించియు; సూతులన్= సూతులను; గీటడంచియున్= చంపియును; అరదంబులన్= రథములను; చెక్కియున్= ముక్కలుచేసియు; మైమఱువులు= కవచములు; పొళ్ళు= పొడిపొడిగా అనగి పిండి పిండిగా; చేసియున్= చేసియు; చామరంబులు= వింజామరములు; తునిమియున్= ఖండించియు; ఆతపత్రంబులు= గొడుగులు; రూపుమాపియున్= నాశనము చేసియు, రూపం లేకుండా చేసియు; నెత్తురులు= రక్తములు; ఉరలించియున్= కార్పించియు; కండలు= మాంసపుముద్దలు (శరీరభాగములు); తొరిఁగించియున్= స్రవింపచేసియు; ఎమ్ములు= ఎముకలు; పగిలించియున్= చిట్లించియు, పగులునట్లు చేసియు; కాళ్ళు; త్రుంచియున్= ఖండించియు; చేతులు; తునిమియున్= ఖండించియు; వ్రయ్యలుగాన్= ముక్కలుగా; వక్షంబులు= వక్షఃస్థలములు(గుండెలు); చీఱియున్= చీల్చియు; మర్మంబులన్= రహస్యస్థలములను (అనగా మర్మావయవములను); చొచ్చియున్= ప్రవేశించియు; మకుటంబులు= కిరీటములు; డుల్చియున్= పడగొట్టియు; తలలు= శిరములు; రాల్చియున్= నేలకూలునట్లు చేసియు; ప్రాణంబులు; పీల్చియున్= పీల్చియు; రౌద్రంబు= క్రోధము; ఆవహించిన= ఆవేశించినట్టి; లయకాల= ప్రళయకాలమునందలి; రుద్రుని= శివునియొక్క; సంక్రీడనంబు= ఆట; చందంబు= విధముగా; తోఁచెన్= తోచెను; అప్పుడు= ఆ సమయమున; రథికవర= రథికశ్రేష్ఠుల; సహస్రద్వితయంబు= రెండువేలు; తెగటారెన్= సంహరింపబడెను; ఆ; వాఁడిమగండు= శూరుడు; పేరు= విశాలమయిన; అడవి= అరణ్యము; దహించు= కాల్చు; దావపావకుని=కార్చిచ్చు; చందంబునన్= విధముగా; వెలింగెన్= ప్రకాశించెను; తదీయ= ఆ అర్జునుడి; తేజస్= పరాక్రమప్రకాశముయొక్క; మహిమన్= గొప్పతనమును; సహింపక= ఓర్వజాలక (భరింపజాలక); ఉద్దామ= భయంకరమైన; గతిన్= విధమున; అశ్వత్థామ; కదిసి= సమీపించి; ఆ; కవ్వడిన్= అర్జునుని; తొడరి= ఎదిరించి; దురంబు= యుద్ధము; ఒనర్చెన్= చేసెను; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా అర్జునుడికి విశ్రాంతి లేకుండా అశ్వత్థామ, సంశప్తకులు తమ దర్పం చూపగా ఆ అర్జునుడు శౌర్యక్రోధముల వలన ఒడలు తెలియకుండా విజృంభించి బల్లెములు, అర్ధచంద్రాకారం గల ఇనుపబాణాలు, ఇంకను వాడి అయిన అనేక విధాలైన బాణాల వరుసలు ప్రయోగించాడు. ఆ ఆయుధాలు ఆ కౌరవసేనల యొక్క

గుఱ్ఱాలను కూల్చి, జెండా కొయ్యలను ముక్కలు చేసి, బాణాలను ఖండించి, ధనుస్సులను విరుగగొట్టి, సూతులను చంపి, రథాలను ముక్కలు చెక్కలు చేసి, కవచాలను పిండిపిండిగా చేసి, వింజామరలను ఖండించి, గొడుగులు ఆకారం లేకుండా చేసి, రక్తములు చెక్కలు చేసి, కండలు స్రవింపచేసి, ఎముకలు పగులగొట్టి, తలలు నేలకూల్చి, ప్రాణాలు పీల్చి, క్రోధం ఆవహించిన ప్రళయకాల రుద్రుడి క్రీడ విధంగా తోపింపజేశాడు. ఆ సమయంలో రెండువేల రథికశ్రేష్ఠులు సంహరించబడ్డారు. అప్పుడు ఆ శూరుడయిన అర్జునుడు మహారణ్యాన్ని కాల్చే దావాగ్ని విధంగా ప్రకాశించాడు. ఆ సమయంలో ఆ అర్జునుడి పరాక్రమాన్ని భరింపజాలక అడ్డులేని గమనంతో అశ్వత్థామ ఆ అర్జునుడిని సమీపించి, ఎదిరించి యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **అతఁడు పంద్రెండు వాలమ్ము లాబీభత్సు । మెయిఁ, గ్రుచ్చి కృష్ణుని మేనియందుఁ**
**బది వాఁడితూపులు వఱపిన మదిలోన । నగ్గించి యవ్వీరుఁ డలఁతినగవు**
**తోడ రథ్యముల సూతునిఁ గూల్చి యాతని । తనువున నెఱ తెగగొనక నాటె**
**మూఁడు మార్గణములు ముసలంబు పరిఘుంబు । నాతఁడు నిగిడింప నదియు నదియు**

**తే.** **నన్నరుఁడు దోడుతోడ నైదాఱునిశిత । కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు**
**సొనిపె నవ్విప్రు మేన మార్కొనియె నపుడు । గడఁగి యప్పార్థు సంశప్తకవ్రజంబు.** **212**

**ప్రతిపదార్థం:** అతఁడు(అశ్వత్థామ); పంద్రెండు; వాలమ్ములు= బాణములు; ఆ; బీభత్సు= అర్జునుడియొక్క; మెయిన్= దేహమునందు; క్రుచ్చి; కృష్ణుని; మేనియందున్= దేహమునందు; పది; వాడి; తూపులు= బాణములు; పఱపినన్= ప్రయోగించగా; ఆ; వీరుఁడు= శూరుడు అయిన అర్జునుడు; మదిలోనన్= మనసులో; అగ్గించి= స్తుతించి; అలఁతి= చిన్న; నగవుతోడన్= నవ్వుతో(చిరునవ్వుతో); రథ్యములన్= గుర్రములను; సూతునిన్= సూతుని; కూల్చి= చంపి; ఆతని= ఆ అశ్వత్థామయొక్క; తనువునన్= దేహమునందు; నెఱన్ తెగగొనక= పూర్తిగా ఎక్కుపెట్టక; మూఁడుమార్గణములు= మూడుబాణములు; నాటెన్= గ్రుచ్చెను; ఆతఁడు= ఆ అశ్వత్థామ; ముసలంబు= ముసలము అను ఆయుధమును (ఉక్కుగుండు అగ్రమున కలిగిన బాణము); పరిఘుంబు= పరిఘ అను ఆయుధము; నిగిడింపన్= ప్రయోగించగా; ఆ+నరుఁడు= అ అర్జునుడు; తోడుతోడను= వెంటవెంటనే; ఐదు= అయిదు; నిశిత= వాడియైన; కాండములన్= బాణములతో; అదియును= ఆ ముసలమును; ఆఱు; నిశిత= వాడిఅయిన; కాండములన్= బాణములతో; అదియును= ఆ పరిఘమును కూడ; త్రుంచి= ఖండించి; పటు= అత్యంత శక్తిమంతమయిన; సాయక= బాణముల; త్రయంబు= మూడు; ఆ; విప్రు= బ్రాహ్మణునియొక్క అనగా అశ్వత్థామయొక్క; మేనన్= దేహమునందు; చొనిపెన్= చొప్పించెను; అపుడు; సంశప్తక= సంశప్తకులయొక్క; వ్రజంబు= సమూహము; కడఁగి= పూనిక వహించి(ప్రయత్నించి); ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; మార్కొనియెన్= ఎదుర్కొనెను.

**తాత్పర్యం:** అర్జునుడికి అశ్వత్థామకు జరుగుతున్న ఆ యుద్ధంలో - అశ్వత్థామ పన్నెండు బాణాలను అర్జునుడి దేహంలో గ్రుచ్చాడు. శ్రీకృష్ణుడి దేహమునందు పది వాడి అయిన బాణాలు ప్రయోగించాడు. అప్పుడు అర్జునుడు మనస్సులో అశ్వత్థామను స్తుతించి చిరునవ్వుతో గుర్రాలను, సూతుడిని చంపి అశ్వత్థామ దేహమునందు జీవస్థానం చెడకుండా మూడు బాణాలు గ్రుచ్చాడు. అప్పుడు అశ్వత్థామ ముసలం, పరిఘం ప్రయోగించగా అర్జునుడు వెంటవెంటనే అయిదు వాడి అయిన బాణాలతో ముసలమును, ఆరు వాడి అయిన బాణాలతో పరిఘమును ఖండించి, శక్తిమంతమయిన మూడు బాణాలు అశ్వత్థామ దేహంలో చొప్పించాడు. ఆ సమయంలో సంశప్తక సమూహం అర్జునుడిని ఎదుర్కొన్నది.

**విశేషం:** ఈ సీసపద్యమున మూడవపాదంలో ఉస్మానియా ప్రతిలో 'నెఱతెగగొనక' పాఠమును స్థిరం చేశారు. నెఱ - నిండు -నెఱి= అందము - ఈ రెండు శబ్దములు ప్రసిద్ధములు. ఇవి కళలు. ఇందొకటి చిన్నయసూరిమతము. మరియొకటి బహుజనపల్లి మతము. ఇక 'నెఱవు' ద్రుతప్రకృతికమయిన శబ్దం కలదు. దానికి ప్రాణము లేక ప్రాణస్థానము - జీవము లేక జీవస్థానం - ఆయువు లేక ఆయుఃస్థానమని అర్థాలు. ఇదియు శకటరేఫ శబ్దం. ద్రుతప్రకృతికమునకు తకారము పరుషము పరుమగుచో అది 'ద'కారము సరళంగా మారుతుంది. అప్పుడు 'నెఱఁ దెగగొనక' అని ఉండాలి. అట్లుగాక 'నెఱతెగగొనక' పాఠమును గ్రహిస్తే అర్థం పొసగదు. అందువలన 'నెఱఁదెగగొనక' అనుపాఠాన్ని గ్రహించటం ఉచితం. ఇది ఒక తెనుఁగు జాతీయ ప్రయోగం. ఇక 'నైదాఱు' పాఠముకంటె' - 'నాఱునైదు' పాఠం మూలానుగుణం. 'త మంతక మివ క్రుద్ధం పరిఘం ప్రేక్ష్య పాండవః । అర్జునస్త్వరితో జఘ్నే పంచభిః సాయకోత్తమైః ॥' (శల్య. 14-33)

**వ. ఇత్తెఱంగున. 213**

**తాత్పర్యం:** ఈ విధంగా.

### సురథుఁడను పాంచాలకుమారుం డశ్వత్థామచేఁ జచ్చుట (సం. 9-13-35)

**క. సురథుఁడు గురుసుతుపైఁ దన । యరదము వఱపించి యేయ నప్పాంచాలో**
**త్తరు నొక నారసమునకును । నెర సేసె నతండు గినుక యెసకం బెసఁగన్. 214**

**ప్రతిపదార్థం:** సురథుఁడు; గురుసుతు పైన్= అశ్వత్థామపై; తన= తనయొక్క; అరదము= రథము; వఱపించి= తోలించి; ఏయన్= కొట్టగా; ఆ; పాంచాల= పాంచాలదేశపు వీరులలో; ఉత్తరున్= ఉత్కృష్టుని; అతండు= అశ్వత్థామ; కినుక= కోపముయొక్క; ఎసకంబు= విజృంభణము; ఎసఁగన్= అతిశయించగా; ఒక నారసమునకున్= ఒక వాడి అయిన బాణమునకు; ఎర= బలి; చేసెను.

**తాత్పర్యం:** సురథు డనేవాడు అశ్వత్థామపై తన రథం తోలించి కొట్టగా అశ్వత్థామ కోపోద్రేకంతో ఆ పాంచాల వీరుడిని ఒక వాడి అయిన బాణానికి బలిచేశాడు.

**వ. ఇత్తెఱంగున. 215**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ ప్రకారంగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా అశ్వత్థామ సురథుడు యుద్ధం చేస్తూ ఉండగా.

**ఆ. సురథుఁ గూల్చి యతనియరదంబు పైకి ను । ద్ధురత నరిగి గురుసుతుండు చండ**
**కాండసమితి నిగుడ గాండీవిఁ దాఁకి సం । శప్తకులకు సంతసం బొనర్చె. 216**

**ప్రతిపదార్థం:** గురుసుతుండు= అశ్వత్థామ; సురథున్= సురథుని; కూల్చి= చంపి; అతని= సురథునియొక్క; అరదంబుపైకిన్= రథముమీదకు; ఉద్ధురతన్= భారాతిశయంతో; అరిగి= వెడలి; చండ= భయంకరమయిన; కాండ= బాణములయొక్క; సమితి= సమూహము; నిగుడన్= వ్యాపించునట్లుగా; గాండీవిన్= అర్జునుని; తాఁకి= ఎదుర్కొని; సంశప్తకులకున్= సంశప్తకులకు; సంతసంబు= సంతోషము; ఒనర్చెన్= కలుగచేసెను.

**తాత్పర్యం:** అశ్వత్థామ సురథుడిని చంపి, ఆ సురథుడి రథంపైకి వెడలి, భయంకరమైన బాణ సమూహాన్ని వ్యాపింపజేసి, గాండీవిని ఎదుర్కొని సంశప్తకులకు సంతోషాన్ని కలుగజేశాడు.

**విశేషం:** మహాభారతంలో సురథులనే పేరుగలవారు అనేకులు ఉన్నారు. ఆదిపర్వంలో క్రోధవశ సంజ్ఞకల దైత్యుడి అంశతోపుట్టిన సురథుడనే ఒక రాజు ఉన్నాడు. సభాపర్వంలో సూర్యపుత్రుడు యముడిని ఉపాసించే సురథుడనే రాజు కూడా ఉన్నాడు. వనపర్వంలో శిబిదేశపు రాజకుమారుడు కోటికాస్యుడి తండ్రి సురథుడనేవాడు ఉన్నాడు. ఇదిగాక వనపర్వంలో - జయద్రథుడి అనుచరుడు త్రిగర్తదేశపురాజు సురథుడనే వాడు ఉన్నాడు. అతడు ద్రౌపదిని జయద్రథుడు అపహరించే సమయంలో నకులుడితో పోరాడి చనిపోయాడు. ద్రోణపర్వంలో సురథుడనే సంశప్తక వీరుడు ఉన్నాడు. అతడు అర్జునుడితో యుద్ధం చేశాడు. మరియు ద్రోణపర్వంలోనే ద్రుపదుడి పుత్రుడు సురథుడు ఉన్నాడు. అతడిని అశ్వత్థామ సంహరించాడు. అశ్వమేధ పర్వంలో దుశ్శల గర్భమున జయద్రథుడి వలన జన్మించిన సురథుడనే జయద్రథుడి పుత్రుడు కూడా ఉన్నాడు. ఇక ఈ శల్యపర్వంలో అశ్వత్థామ సంహరించిన సురథుడు - పాండవపక్షాన యుద్ధం చేస్తున్న ఒక మహారథి అయిన పాంచాల రాజకుమారుడు.

**వ. అయ్యవసరంబున 217**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** అశ్వత్థామ సురథుని చంపి అర్జునుడిని ఎదుర్కొనే సమయంలో.

**క. కురుపతి ధృష్టద్యుమ్నుని । యురవడిఁ దగ నిలువరించి యుద్ధతి మెఱయన్**
**శరపంచకమున నొంచెను । బరఁగించెను మఱియు సప్తబాణము లొడలన్. 218**

**ప్రతిపదార్థం:** కురుపతి= దుర్యోధనుడు; ధృష్టద్యుమ్నుని= ధృష్టద్యుమ్నుడియొక్క; ఉరవడిన్= విజృంభణమును; తగన్= ఒప్పుగా; నిలువరించి= ఆపుచేసి; ఉద్ధతి= గర్వం; మెఱయన్= ప్రకాశింపగా; శర= బాణములయొక్క; పంచకమునన్= అయిదింటితో; నొంచెను= బాధించెను; మఱియున్= ఇంకను; సప్త= ఏడు; బాణములు; ఒడలన్= దేహమునందు; పరఁగించెను= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడి వేగాన్ని ఒప్పుగా నిలుపుచేసి గర్వంతో ప్రకాశిస్తూ అయిదు బాణాలతో ధృష్టద్యుమ్నుడిని బాధించాడు. ఇంకా ఏడు బాణాలు దేహంలో ప్రయోగించాడు.

**విశేషం:** ఉస్మానియా ప్రతి ప్రకారం 'సప్తబాణము' అనే మాటకు బదులుగా 'నవతి బాణము' అని ఉన్నది. అయితే - 'ద్రోణహన్తార ముగ్రేషు - పునర్వ్యాధ సప్తభిః' అని మూలం. అందువలన 'సప్త' పాఠమే ఒప్పుగా గ్రహించవలెను.

**తే. అతఁడు డెబ్బది యమ్ముల నతని నొంప । నన్నరేంద్రుండుఁ జేడ్పడ ననుజసమితి**
**బలయుతంబుగ నడరి యబ్బలియు మీఁదఁ । గురిసి రస్త్రశస్త్రంబులు నరవరేణ్య! 219**

**ప్రతిపదార్థం:** అతఁడు= అతడు (ధృష్టద్యుమ్నుడు); డెబ్బది; అమ్ములన్= బాణములతో; అతనిన్= ఆ దుర్యోధనుని; నొంపన్= బాధించగా; ఆ+నరేంద్రుండు= దుర్యోధనుడు; చేడ్పడన్= బాధపడగా; నర= నరులలో; వరేణ్య!= శ్రేష్ఠుడవు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అనుజ= తమ్ముయొక్క; సమితి= సమూహము; బలయుతంబుగన్= సైన్యసమేతముగా;

అడరి= విజృంభించి; ఆ; బలియుమీఁదన్= మిక్కిలి బలముకల ధృష్టద్యుమ్నుడి మీద; అస్త్ర= మంత్రపూతములయిన బాణములు; శస్త్ర= ఆయుధాలు; కురిసిరి= కురిపించిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ ధృష్టద్యుమ్నుడు డెబ్బదిబాణాలతో దుర్యోధనుడిని బాధించగా అతడి తమ్ములందరూ సైన్యసమేతులై మహా బలిష్ఠుడయిన ధృష్టద్యుమ్నుడిపై విజృంభించి అస్త్రశస్త్రాలను కురిపించారు.

**క. ఆ పాంచాలోత్తముఁ డు ၊ ద్దీపిత కోపుఁడయి వారిఁ దీవ్రతరశరా**
**టోపంబునఁ గలఁచె రయం ၊ బేపారఁగ నాత్మసేన కేడ్తెఱ మెఱయన్. 220**

**ప్రతిపదార్థం:** ఆ పాంచాలోత్తముఁడు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఉద్దీపిత= ప్రజ్వలించిన; కోపుఁడయి= కోపము కలవాడయి; రయంబు= వేగము; ఏపారంగన్= అతిశయించగా; ఆత్మ= తనయొక్క; సేనకున్; ఏడ్తెఱ= పరాక్రమము; మెఱయన్= ప్రకాశించునట్లుగ; వారిన్= వారిని(అనగా సైన్య సమేతులయిన దుర్యోధనుడి తమ్ములను); తీవ్రతర= మిక్కిలి తీక్షణమయిన; శర= బాణములయొక్క; ఆటోపంబునన్= వేగిరపాటుతో; కలఁచెన్= కలతచెందించెను.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ప్రజ్వలించిన కోపం కలవాడై వేగం అతిశయించగా తన సైన్యానికి పరాక్రమం ప్రకాశించేటట్లుగా సైన్యసమేతులయిన దుర్యోధనుడి తమ్ములను మిక్కిలి తీక్షణములయిన బాణాలతో కలత చెందించాడు.

**చ. కృప కృతవర్మలం గడిమిఁ గిట్టి శిఖండిప్రభద్రకుల్ మహో**
**గ్రపువడి దోడ్పడంగ భుజగర్వము సూపిన నా బలాఢ్యులుం**
**గుపితమనస్కులై బలుపుఁ గోల్తలఁ బేర్చినలావు చేవ క**
**య్యపువెర వేపు దాల్మి సరి నచ్చెరుపాటున ముంచెఁ జూపఱన్. 221**

**ప్రతిపదార్థం:** శిఖండి; ప్రభద్రకుల్= పాంచాల క్షత్రియవీరులైన ప్రభద్రకులు; కృపకృతవర్మలన్= కృపుడు, కృతవర్మలను; కడిమిన్= మిక్కిలి పరాక్రమముతో; కిట్టి= సమీపించి; మహా= గొప్ప; ఉగ్రపు భయంకరమయిన; వడి= వేగము; తోడ్పడంగన్= సహాయపడగా; భుజగర్వము= బాహువులయొక్క దర్పము; చూపినన్= చూపించగా; ఆ; బలాఢ్యులు= బలవంతులు; కుపిత= కోపముతో కూడిన; మనస్కులు= మనస్సులు కలవారు; ఐ= అయి; బలుపున్= బలమైన; కోల్తలన్= యుద్ధ ప్రయత్నంతో; పేర్చినన్= విజృంభించగా; లావు= బలము; చేవ= ధైర్యము; కయ్యపు= యుద్ధమునకు సంబంధించిన; వెరవు= ఉపాయము; అతిశయము; తాల్మి= క్షమ; సరిన్= సమానముగా; చూపఱన్= చూచువారిని; అచ్చెరుపాటునన్= ఆశ్చర్యమునందు; ముంచెన్= ముంచెను.

**తాత్పర్యం:** శిఖండి ప్రభద్రకులు కృపకృతవర్మలను మిక్కిలి పరాక్రమంతో సమీపించి మహాభయంకరమైన వేగంతో బాహువుల దర్పం చూపించగా ఆ బలవంతులయిన ఆ కృపకృతవర్మలు కోపించిన మనస్సులు కలవారై బలంతో ఎదుట నిలిచి యుద్ధం చేయటానికి విజృంభించగా ఆ ఇరుపక్షాలయొక్క బలం, ధైర్యం, యుద్ధోపాయం, అతిశయం, క్షమ మొదలైన గుణాలు అన్నీ సమానంగా ఉన్నాయి. అట్టి సమానత్వం చూచువారిని ఆశ్చర్యంతో ముంచింది.

**విశేషం:** 'శిఖండీ కృతవర్మాణం గౌతమం చ మహారథమ్ । ప్రభద్రకైః సమాయుక్తో యోధయామాస ధన్వినౌ (శల్య - 15, 7) ఇది పై పద్యమునకు మూలం, దీనిని తిక్కన స్వీయ ఊహాపోహలతో అలతి అలతి అచ్చతెలుగు పద సంయోజనతో తన కవితా ప్రాభవాన్ని చంపకంగా సంతరించాడు.

**వ. అప్పుడు శల్యుండు యుధిష్ఠిరభీమసేననకులసహదేవసాత్యకులపైఁ బటుబాణంబులు గుప్పించి నొప్పించిన. 222**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయమున; శల్యుండు; యుధిష్ఠిర= ధర్మరాజు; భీమసేన= భీముడు; నకుల సహదేవ; సాత్యకులపైన్= సాత్యకులమీద; పటు= శక్తిమంతములైన; బాణంబులు; కుప్పించి= కురిపించి; నొప్పించినన్; బాధించగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో అనగా కృపకృతవర్మలు శిఖండి ప్రభద్రకులు పోరాడే సమయంలో శల్యుడు ధర్మజ భీమసేన నకుల సహదేవ సాత్యకులమీద శక్తిమంతములైన బాణాలు కురిపించి బాధించగా.

**క. నకులుఁడు రభసంబున సా । యకదశక మతని యురంబునందుఁ జొనుప స**
**భ్రుకుటి యగుచు నయ్యల్లునిఁ । ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా! 223**

**ప్రతిపదార్థం:** నృపా!= ధృతరాష్ట్ర మహారాజా!; నకులుఁడు; రభసంబునన్= శీఘ్రముగ; సాయక= బాణములు; దశకము= పది; అతని= ఆ శల్యుడి; ఉరమునందున్= వక్షఃస్థలమునందు; చొనుపన్= చొప్పించగ; సభ్రుకుటి= బొమముడి సహితుడు; అగుచున్= అగుచు; ఆ+అల్లునిన్= మేనల్లుడైన నకులుని; త్రికాండములన్= మూడు బాణములతో; నొంచి= నొప్పించి; అతఁడు= ఆ శల్యుఁడు; దీపించెన్= ప్రకాశించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నకులుడు శీఘ్రంగా పదిబాణాలు ఆ శల్యుడి వక్షఃస్థలంపై చొప్పించగా బొమముడి బొగించి మేనల్లుడైన నకులుడిని మూడు బాణాలతో నొప్పించి ఆ శల్యుడు ప్రకాశించాడు.

**క. తక్కటినలువురు వొదివిన । నొక్కొకనిశరీరమున మహోగ్రాస్త్రంబుల్**
**పెక్కులు వెసఁ బఱపి మదం । బెక్కి నకులుధనువు దునిమె నిషుసహితముగన్. 224**

**ప్రతిపదార్థం:** తక్కటి= మిగిలిన; నలువురు; పొదివినన్= క్రమ్ముకొనగ(చుట్టుముట్టగ); మహా= గొప్ప; ఉగ్ర= భయంకరమయిన; అస్త్రంబుల్= బాణములు; పెక్కులు= అనేకములు; ఒక్కొక్కని; శరీరమునన్; వెసన్= వేగముగా; పఱపి= ప్రయోగించి; మదంబు= గర్వము; ఎక్కి= పొంది; నకులు ధనువున్= నకులుడి యొక్క వింటిని; ఇషు= బాణముల; సహితంబుగన్= సమేతంగా; తునిమెన్= ఖండించెను.

**తాత్పర్యం:** నకులుడు కాక మిగిలిన నలుగురు శల్యుడిని చుట్టుముట్టగా మహాభయంకరాస్త్రాలు అనేకాలు ఒక్కొక్కడి దేహంలో వేగంగా ప్రయోగించి, గర్వం పొంది బాణసమేతంగా నకులుడి ధనువును ఖండించాడు.

**వ. ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి. 225**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; శల్యుండు; విజృంభించినన్= అతిశయించగా; కోపించి= కోపం పొంది.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా శల్యుడు ధర్మజ భీమసేన సహదేవ సాత్యకి నకులులపై విజృంభించగా నకులుడు కోపించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. నకులుం డొండొక చాప మెత్తి పటుబాణశ్రేణిఁ బర్వింపఁ గీ**
**చకవిధ్వంసి నిగిడ్చె షష్టిశరముల్ శైనేయుఁ డుద్దీప్త సా**
**యకముల్ దొమ్మిది యేయ ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా**
**యకుపై నన్నియుఁ బిన్నతమ్ముఁడును దోడై నాట నాటెం గడున్. 226**

**ప్రతిపదార్థం:** నకులుండు; ఒండొక= మరియొక; చాపము= విల్లు; ఎత్తి= గ్రహించి; పటు= సమర్థమయిన; బాణ= బాణములయొక్క; శ్రేణిన్= వరుసను; పర్వింపన్= ప్రయోగించగా; కీచకవిధ్వంసి= భీముడు; షష్టిశరముల్= అరువది బాణములు; నిగిడ్చెన్= వ్యాపింపచేసెను; శైనేయుఁడు= సాత్యకి; ఉద్దీప్త= ప్రజ్వలించు; సాయకముల్= బాణములు; తొమ్మిది; ఏయన్= ప్రయోగించగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఈరైదమ్ములు= పదిబాణములు; ఆ; మద్రనాయకుపైన్= శల్యుడిపై; అన్నియున్= అన్నియును; పిన్న= చిన్న; తమ్ముఁడును; తోడై= సహాయకుడై; నాటన్= గ్రుచ్చగా; కడున్= మిక్కిలి; నాటెన్= క్రుచ్చెను.

**తాత్పర్యం:** నకులుడు మరియొక విల్లు గ్రహించి సమర్థమైన బాణాల వరుసలను ప్రయోగించగా, భీముడు అరువది బాణాలు వ్యాపింపచేయగా, సాత్యకి ప్రజ్వలించే బాణాలు తొమ్మిది ప్రయోగించగా, ధర్మరాజు పదిబాణాలు, చిన్న తమ్ముడు సహదేవుడు పదిబాణాలు ఆ శల్యుడిపై నాటారు.

**తే. అతఁడు వెస నవసప్తతి శితశిలీము । ఖముల సాత్యకి నొంచి మార్గణముతోడ**
**ధనువు ద్రుంచి రథ్యమ్ముల ధరణిఁ గూల్చి । పదిపదుల్ బలుఁదూపులు పఱపె మేన. 227**

**ప్రతిపదార్థం:** అతఁడు= అతడు (శల్యుడు); వెసన్= శీఘ్రముగ; నవసప్తతి= డెబ్బది తొమ్మిది; శిత= వాడి అయిన; శిలీముఖములన్= బాణములతో; సాత్యకిన్= సాత్యకిని; నొంచి= నొప్పించి; మార్గణముతోడన్= ఒక బాణముతో; ధనువు= విల్లు; త్రుంచి= ఖండించి; రథ్యమ్ములన్= గుర్రములను; ధరణిన్= భూమియందు; కూల్చి; పదిపదుల్= నూరు; బలు+తూపులు= బలమైన బాణములు; మేనన్= శరీరమునందు; పఱపెన్= ప్రయోగించెను.

**తాత్పర్యం:** శల్యుడు శీఘ్రంగా డెబ్బదితొమ్మిది వాడి బాణాలతో సాత్యకిని నొప్పించి, ఒక బాణంతో విల్లు ఖండించి, గుర్రాలను నేలకూల్చి, నూరుబలమైన బాణాలు ఆ సాత్యకి శరీరంపైన ప్రయోగించాడు.

**క. ఇవ్విధమున శినివీరుని । క్రొవ్వు చెఱిచి పాండుపుత్రకుల బాణంబుల్**
**నివ్వటిలనీక నలువుర । నవ్వీరుఁడు నొవ్వ నేసె నద్భుతభంగిన్. 228**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ ప్రకారముగ; శినివీరుని= సాత్యకియొక్క; క్రొవ్వు; చెఱిచి= పోగొట్టి; పాండు= పాండురాజుయొక్క; పుత్రకుల= కుమారులయొక్క; బాణంబుల్; నివ్వటిలనీక= వ్యాపించనీయక; ఆ+వీరుఁడు= శూరుడు అయిన ఆ శల్యుడు; అద్భుత= ఆశ్చర్యకరమయిన; భంగిన్= విధముగ; నలువురను; నొవ్వన్ ఏసెన్= బాధపడునట్లు కొట్టెను.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా సాత్యకియొక్క క్రొవ్వు పోగొట్టి, పాండుపుత్రుల బాణాలు వ్యాపించనీయకుండా శూరుడయిన ఆ శల్యుడు ఆశ్చర్యకరమైన విధంగా ఆ నలువురను (ధర్మజ భీమ నకుల సహదేవులను) బాధించాడు.

**ఉ. పాండవు లట్లు మద్రపతి బాణములం దెరలంగఁ జూచి తా**
**నొండొక తేరికిం జని సముద్ధతి సాత్యకి దాఁకె నాతనిం**

**జండతరప్రచారణవిశారదుఁడై వెస వారు గూడి యు**

**ద్దండత సూపి రక్కజపుదర్ప మెలర్పఁ బెనంగె నాతఁడున్. 229**

**ప్రతిపదార్థం:** మద్రపతి= శల్యుడియొక్క; బాణములన్= బాణములవలన; పాండవులు; అట్లు= ఆ ప్రకారముగ; తెరలంగన్= తొలగిపోగా; చూచి; సాత్యకి; తాను; ఒండొక= మరియొక; తేరికిన్= రథముమీదకు; చని= వెడలి; చండతర= మిక్కిలి భయంకరమయిన; ప్రచారణ= సంచారమునందు; విశారదుఁడై= మహాపండితుడై; సముద్ధతి(న్)= మిక్కిలి దర్పముతో; ఆతని(న్)= ఆ శల్యుడిని; తాఁకెన్= ఎదిరించెను; వెసన్= శీఘ్రముగా; వారు= పాండవులు; కూడి= కలిసి; ఉద్దండత= ఆధిక్యము; చూపిరి; ఆతఁడున్= ఆ శల్యుడును; అక్కజపు= అధికమయిన (ఆశ్చర్యకరమయిన); దర్పము= గర్వము; ఎలర్పన్= అతిశయించగా; పెనంగెన్= పోరాడెను.

**తాత్పర్యం:** ఆ శల్యుడి యొక్క బాణాలవలన పాండవులు తొలగిపోవటం చూచి సాత్యకి మరొక రథమెక్కి భయంకర ప్రచారణ విశారదుడై గర్వంతో ఆ శల్యుడిని ఎదిరించాడు. వెంటనే పాండవులు కూడా కలిసి తమ ఆధిక్యం చూపారు. ఆ శల్యుడు అధికమైన గర్వం అతిశయించగా పోరాడాడు.

**ఉ. ఏవురతోడ న ట్లొకఁడ యేచి పెనంగుటఁ గౌరవేంద్రయో**

**ధావళి చూచి కూడికొని యారథికోత్తముగాఢ విక్రమ**

**శ్రీవిలసిల్ల నంపపెనుఁజీఁకటి యాకసమెల్లఁ గప్పఁగాఁ**

**జేవయు లావుఁ జూపుటయుఁ జేడ్పడి రా ప్రతివీరులందఱున్. 230**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారముగ; ఒకఁడ= ఒక్కడే, ఏవురతోడన్= అయిదుగురితో; ఏచి= విజృంభించి; పెనంగుటన్= యుద్ధముచేయుటను; కౌరవ= కౌరవులకు; ఇంద్ర= ప్రభువు అయిన దుర్యోధనునియొక్క; యోధ= వీరులయొక్క; ఆవళి= సమూహము; చూచి; కూడికొని= కలిసికొని; ఆ; రథిక= రథికులలో; ఉత్తము= గొప్పవాడయిన శల్యుడియొక్క; గాఢ= అధికమయిన; విక్రమ= పరాక్రమముయొక్క; శ్రీ= శోభ; విలసిల్లన్= ప్రకాశింపగా; అంప= బాణములనెడి; పెను= పెద్ద; చీఁకటి; ఆకసము; ఎల్లన్= అంతటను; కప్పఁగాన్= కప్పివేయగా; చేవయున్= ధైర్యమును; లావున్= బలమును; చూపుటయున్= చూపించగా; ఆ ప్రతివీరులు= ఎదుటిపక్షపువీరులు; అందఱున్= అందరును; చేడ్పడిరి= బాధపడిరి.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా ఒక్క శల్యుడు అయిదుగురు పాండవులతో విజృంభించి యుద్ధం చేయటాన్ని దుర్యోధనుడి యోధసమూహం చూచి కలిసికొని, రథికశ్రేష్ఠుడు అయిన శల్యుడి అధికమైన పరాక్రమ శోభ ప్రకాశించగా బాణాల పెనుచీకటి ఆకాశమంతా కప్పివేయగా ధైర్యాన్ని, బలాన్ని చూపించగా, ఆ ప్రతివీరులయిన పాండవులు అందరూ బాధపడ్డారు.

**వ. సేనయు నొక్కుమ్మడి నద్దిక్కు దఱిమినం గని కృష్ణార్జునులు నిజసైన్యంబు సమస్తంబు నేకముఖంబు సేసి మార్కొని రా సమయంబునఁ గిరీటి కృపకృతవర్మలను సహదేవుండు సౌబలుని ద్రౌపదేయులు గొందఱు రాజులను శిఖండి యశ్వత్థామను భీమసేనుండు సుయోధనునిఁ దాఁకఁ బాండవాగ్రజుండు దనకు నకులుండు బాసటగా శల్యు నిలువరించెఁ దక్కునుం గల యోధులుం దక్కటిసైనికులుం దలపడి క్రమంబున నెల్ల బలంబులును గలయం బెరసె నిట్లు నూల్కొని యంతకంతకు రణంబు సమ్మర్దదారుణం బయ్యె నత్తఱి**

**నమ్మద్రపతి రౌద్రంబు రూపుదాల్చిన తెఱంగునం బొంగి పాంచాలయాదవాది రథికవరులకును బాండు కుమారులకును వారింపఁ గొలఁదిగాక రథ చిత్రగతుల మెఱయ నెక్కడఁ జూచినం దానయై నానావిధవిశిఖ వితానంబుల(నింపి) నంబర భాగంబు సంపిహితంబు సేసిన మధ్యందినగతం బయ్యును మార్తాండబింబంబు దోఁపక యుండె నట్టియెడ. 231**

**ప్రతిపదార్థం:** సేనయున్= సైన్యమును; ఒక్కుమ్మడిన్= ఒక్కటిగా; ఆ+దిక్కు= ఆ వైపు; తఱిమినన్= వెంబడించి పరుగెత్తగా; కృష్ణార్జునులు; నిజ= తమయొక్క; సైన్యంబు= సేన; సమస్తంబును= అంతయును; ఏకముఖంబు= ఒక్కటిగా ఐక్యము; చేసి= కావించి; మార్కొనిరి= ఎదుర్కొనిరి; ఆ సమయంబునన్= ఆ సమయమునందు; కిరీటి= అర్జునుడు; కృపకృతవర్మలను= కృప కృతవర్మలను; సహదేవుండు; సౌబలునిన్= శకునిని; ద్రౌపదేయులు= ద్రౌపదిపుత్రులు; కొందఱు రాజులను; శిఖండి; అశ్వత్థామను; భీమసేనుండు; సుయోధనునిన్= దుర్యోధనుని; తాఁకన్= ఎదుర్కొనగ; పాండవ= పాండవులలో; అగ్రజుండు= పెద్దవాడయిన ధర్మరాజు; తనకున్; నకులుండు; బాసటగా= సహాయముగా; శల్యున్= శల్యుడిని; నిలువరించెన్= కదలకుండా నిలిపెను(ఆపెను); తక్కునుంగల= మిగిలిన; యోధులున్= వీరులును; తక్కటి= మిగిలిన; సైనికులున్= సైనికులును; తలపడి= కలియబడి; క్రమంబునన్= వరుసగా; ఎల్లబలంబులును= సమస్త సైన్యములును; కలయన్= కూడునట్లు (కలసిపోవునట్లు); బెరసెన్= వ్యాపించెను; ఇట్లు; నూల్కొని= కుదురుకొని; అంతకున్+అంతకున్= క్రమక్రమముగా; రణంబు= యుద్ధము; సమ్మర్ద= బాగుగా మర్దించునట్లుగా; దారుణంబు= భయంకరము; అయ్యెన్= అయ్యెను; ఆ+తఱిన్= ఆ సమయమున; ఆ+మద్రపతి= ఆ శల్యుడు; రౌద్రంబు= క్రోధము; రూపు= ఆకారము; తాల్చిన= ధరించిన; తెఱంగునన్= విధముగా; పొంగి= ఉత్సహించి(గర్వముతో ఉబ్బి); పాంచాల; ధృష్టద్యుమ్న; యాదవ= సాత్యకి; ఆది= మొదలగు; రథిక= యోధులలో; వరులకును= శ్రేష్ఠులకును; పాండుకుమారులకును= పాండురాజు పుత్రులకును; వారింపన్= నివారించుటకు; కొలఁది= శక్యము; గాక= కాకుండా; రథ= రథముయొక్క; చిత్ర= చిత్ర విచిత్ర; గతులన్= గమనములతో; మెఱయన్= ప్రకాశించగా; ఎక్కడన్= ఏచోటు; చూచినన్= చూచినా; తానయై= తానే ఐ; నానావిధ= అనేక విధములయిన; విశిఖ= బాణముల; వితానంబులన్= సమూహములతో; అంబరభాగంబు= ఆకాశభాగము; సంపిహితంబు= బాగుగా కప్పబడినదిగా; చేసినన్= చేయుగా; మధ్యందిన= మధ్యాహ్న సమయమును; గతంబు= పొందినది; అయ్యును= అయినప్పటికిని; మార్తాండబింబంబు= సూర్యబింబము; తోఁపక= కనబడకుండా; ఉండెను; అట్టిఎడన్= ఆ సమయమున.

**తాత్పర్యం:** సైన్యమంతా ఒక్కటిగా ఆ వైపు తరుమగా చూచి, కృష్ణార్జునులు తమ సైన్యం అంతా ఒక్కటిగా చేసి ఎదుర్కొన్నారు. ఆ సమయంలో అర్జునుడు, కృపకృతవర్మలను, సహదేవుడు శకునిని, ద్రౌపది పుత్రులు కొందరు రాజులను, శిఖండి అశ్వత్థామను, భీమసేనుడు సుయోధనుడిని ఎదుర్కొనగా, ధర్మరాజు తనకు నకులుడు సహాయకుడుగా శల్యుడిని నిలువరించాడు. మిగిలిన వీరులూ, మిగిలిన సైనికులూ కలియబడి క్రమంగా సమస్త సైన్యాలు అంతటా వ్యాపించాయి. ఈ ప్రకారంగా కుదురుకొని క్రమక్రమంగా యుద్ధం భయంకరమయింది. ఆ సమయంలో శల్యుడు క్రోధం ఆకారం ధరించిన విధంగా గర్వంతో పొంగి ధృష్టద్యుమ్నుడు, సాత్యకి మొదలైన యోధశ్రేష్ఠులకు పాండవులకు నివారింప శక్యంగాక రథంయొక్క చిత్ర గమనాలతో ప్రకాశించగా, ఏ చోట చూచినా తానే అయి అనేక విధాలయిన బాణాల సమూహాలతో ఆకాశభాగం నింపి వేయగా, మధ్యాహ్న సమయం అయింది. అయినప్పటికీ మార్తాండబింబం కనబడకుండా పోయింది. అట్టి సమయంలో.

**సీ. కరులఁ ద్రుంచెడువేళ గిరులఁ దున్మాడు సం । క్రందను కైవడిఁ గానవచ్చు**
**నరదముల్ దెరలించునప్పుడు పఱమొగుల్ । విరియించుబలుగాడ్పు విధము మెఱయు**

**హయములఁ జెండాడ నరుగు చోట్లను లేళ్ళ । గమిఁ గిట్టు కోల్పులికరణి యొలయు**

**భటులకు నరుగుచోఁ బసలేని పెనుఁ గాన । దరికొనుచిచ్చుచందంబు గలుగు**

**తే. గసిమసంగిన యంతకుకరణి యంత్య । కాలరుద్రుని దర్ప మకాండ మృత్యు**

**ముఖము నుగ్రభావము దోఁచు మొనయు వీర । సమితిఁ దెగటార్చు నప్పు డా శల్యునందు. 232**

**ప్రతిపదార్థం:** కరులన్= ఏనుగులను; త్రుంచెడు= ఖండించే; వేళన్= సమయంలో; గిరులన్= పర్వతములను; తునుము+ఆడు= ఖండించు; సంక్రందను= మహేంద్రుని; కైవడిన్= వలె; కానవచ్చున్= కనిపించును; అరదముల్= రథములు; తెరలించునప్పుడు= తొలగించునప్పుడు; పఱ= గొప్ప; మొగుల్= మేఘములు; విరియించు= చెదరగొట్టు; బలు= బలమయిన; గాడ్పు= గాలి; విధము; మెఱయున్= ప్రకాశించును; హయములన్= గుర్రములను; చెండాడన్= ఖండించుటకు; అరుగు= వెడలు; చోట్లను= చోటులందు(స్థలములను); లేళ్ళగమిన్= లేళ్ళయొక్క; గుంపును; కిట్టు= సమీపించు; కోల్పులి= పెద్దపులి; కరణి= విధము; ఒలయున్= పొందును; భటులకున్= భటులకొరకు; అరుగుచోన్= వెడలు నప్పుడు; పస= సారము; లేని; పెనున్= పెద్ద; కానన్= అడవిని; దరికొను= కాల్చు; చిచ్చు= అగ్ని; చందంబున్= విధము; కలుగున్= కలుగును; కసిమసంగిన= విజృంభించిన; అంతకుకరణి= యముని వలె; అంత్యకాల= ప్రళయకాల; రుద్రుని= రుద్రునియొక్క; దర్పము= గర్వము; అకాండ= ఆకస్మిక; మృత్యు= మృత్యువుయొక్క; ముఖము= ముఖముయొక్క; ఉగ్ర= భయంకరమయిన; భావము= భావము; మొనయు= మార్కొనునట్టి; వీర= యోధులయొక్క; సమితిన్= సమూహమును; తెగటార్చునప్పుడు= చంపు సమయమున; ఆ శల్యునందున్= ఆ శల్యునియందు; తోఁచున్= స్ఫురించును.

**తాత్పర్యం:** ఏనుగులను ఖండించే సమయంలో పర్వతాలను ఖండించే మహేంద్రుడివలె కనిపించాడు. రథాలు తొలగించేటప్పుడు మేఘాలు చెదరగొట్టే బలమయిన గాలి విధంగా ప్రకాశించాడు. గుర్రాలను ఖండించటానికి వెడలేచోట్లలో లేళ్ళగుంపును సమీపించే పెద్దపులివలె వ్యాపించాడు. భటుల కొరకు వెడలేటప్పుడు సారంలేని పెద్ద అడవిని కాల్చే అగ్నివలె అయ్యాడు. విజృంభించిన యముడివలె ప్రళయకాల రుద్రుడి దర్పం ఆకస్మిక మృత్యుముఖం, భయంకరమైన భావం ఎదిరించే యోధసమూహాన్ని చంపేటప్పుడు ఆ శల్యుడి యందు ఉదయించాయి.

**విశేషం:** అలం: ఉపమ. రూపకం. ఈ సీసపద్యంలో తిక్కన శల్యుడి అతిలోక భయంకర పరాక్రమాన్ని వర్ణించాడు. మొదటిపాదంలో ఇంద్రుడితో ఉపమించాడు. రెండవపాదంలో గాడ్పుతో ఉపమించాడు. మూడవపాదంలో పెద్దపులితో ఉపమించాడు. నాలుగవపాదంలో అగ్నితో ఉపమించాడు. ఎత్తుగీతలో యముడితో, రుద్రుడితో ఉపమించాడు. ఇట్లా ఉపమాలంకార మాలికను శల్యుడికి కంఠహార మొనర్చాడు. అట్లే కరులకు గిరులకు అరదములకు పఱమొగులులకు హయములకు లేళ్ళకు భటులకు కాననమునకు అభేదం పరికల్పించి రూపకమర్యాద పాటించాడు. ఈ సీసపద్యవర్ణన అమూలకం. ఇది తిక్కన స్వీయ కవితావైభవానికి ఉదాహరణం.

**వ. ఇట్లు విజృంభించి యత్యద్భుత విక్రమంబున నుల్లసిల్లు నమ్మద్రమహీపతి నుభయసైన్యంబులజనంబులు ప్రశంసించి రంత కంతకు నగ్గలంబగు నగ్గలికఁ జెలంగి యతండు భల్లాదికాండపరంపరలు పటురయంబునఁ బరఁగించు పరమాభీలభంగికి నోహటించి ధర్మజుమోహరంబు దెరలి మరలి పఱవం దొడంగిన నన్నర వరుం డదల్చి కరతలం బెత్తి నిలునిలు మని నివారింప నిలువ దయ్యె. నయ్యుధిష్ఠిరుండు పౌరుషంబు పెంపునఁ దెంపు సేసి యా శల్యునిఁ దాఁకి దర్పంబు సూపినం జూచి మగుడ నిగిడి సేన పోరికిం బురికొనియె నప్పుడు పాండవాగ్రజుండు దమ్ములను దొరలను దనపాలికిఁ బిలువం బంచి వారలతో నిట్లనియె. 233**

**ప్రతిపదార్థం:** ఇట్లు; విజృంభించి; అతి= మిక్కిలి; అద్భుత= ఆశ్చర్యకరమయిన; విక్రమంబునన్= పరాక్రమంతో; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; ఆ; మద్రమహీ= మద్రభూమికి; పతిన్= భర్తఅయిన శల్యుడిని; ఉభయ= ఇరుపక్షములయొక్క; సైన్యంబులు= సేనలయొక్క; జనంబులు= జనులు; ప్రశంసించిరి= మెచ్చుకొనిరి(స్తుతించిరి); అంతకంతకున్= క్రమక్రమముగా; అగ్గలంబు= అధికము; అగు; అగ్గలికన్= శౌర్యముతో; చెలంగి= ఉత్సాహముపొంది, అతండు= ఆ శల్యుడు; భల్ల= బల్లెము; ఆది= మొదలగు; కాండ= బాణములయొక్క; పరంపరలు= వరుసలు; పటు= సమర్థమయిన(మిక్కిలి); రయంబునన్= వేగముగా; పరఁగించు= ప్రవర్తించు; పరమ= అత్యంతమైన; ఆభీల= భయంకరమయిన; భంగికిన్= విధమునకు; ఓహటించి= వెనుదీసి; ధర్మజు= ధర్మరాజుయొక్క; మోహరంబు= సేనావ్యూహము; తెరలి= తొలగి; మరలి= వెనుతిరిగి; పఱవన్= పరుగుపెట్టుటకు; తొడంగినన్= ప్రారంభించగా; ఆ; నర= నరులలో; వరుండు= శ్రేష్ఠుడయిన ధర్మరాజు; అదల్చి= అదలించి (గద్దించి); కరతలంబు= హస్తతలము(చేయి); ఎత్తి= పైకెత్తి; నిలుము+నిలుము= ఆగుము ఆగుము; అని; నివారింపన్= నిరోధించగా (అడ్డగించగా); నిలువదు= ఆగనిది; అయ్యెన్= అయ్యెను; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; పెంపునన్= ఆధిక్యమువలన; తెంపు= సాహసము; చేసి; ఆ శల్యునిన్; తాఁకి= ఎదిరించి; దర్పంబు= గర్వము; చూపినన్= చూపించగా; చూచి; మగుడన్= మరల; నిగిడి= విజృంభించి; సేన= సైన్యము; పోరికిన్= పోరాటమునకు; పురికొనియెన్= క్రమ్ముకొనెను; అప్పుడు; పాండవ+ అగ్రజుండు= ధర్మరాజు; తమ్ములను; దొరలను= రాజులను; తన; పాలికిన్= దగ్గరకు; పిలువన్= పిలువగా; పంచి; వారలతోన్= వారలతో; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా శల్యుడు విజృంభించి మిక్కిలి ఆశ్చర్యకరమైన పరాక్రమంతో ప్రకాశించగా ఆ శల్యుడిని ఇరుపక్షాల సైనికులు మెచ్చుకొన్నారు. అంతట క్రమక్రమంగా అధికమైన శౌర్యంతో ఉత్సహించి శల్యుడు బల్లెం మొదలైన బాణాల వరుసలు మిక్కిలి వేగంగా ప్రవర్తించే అత్యంత భయంకరమైన విధానికి వెనుదీసి ధర్మరాజు సేన తొలగి మరలి వెనుతిరిగి పరుగిడటానికి ప్రారంభించగా వారిని అదలించి చేయిపైకెత్తి, నిలునిలుడని అడ్డగించగా ఆ సైన్యం ఆగనిది అయింది. ఆ ధర్మరాజు పరాక్రమంతో సాహసించి ఆ శల్యుడిని ఎదిరించి గర్వం చూపగా మరల విజృంభించి సైన్యం పోరాటానికి క్రమ్ముకొన్నది. అప్పుడు ధర్మరాజు తమ్ములను రాజులను తన దగ్గరకు పిలిపించి వారలతో ఇట్లా అన్నాడు:

**చ.** **అమరనదీసుతాదులగు నక్కడివీరుల మీర లందఱుం**
**గ్రమమునఁ బిల్కుమార్చి భుజగర్వము సూపితి రేను శత్రుసై**
**న్యమథనకల్యు శల్యుఁ దెగటార్చెద నాకిది కృత్య మీసము**
**ద్యమ మనివార్యమై నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్.** **234**

**ప్రతిపదార్థం:** అమరనదీ= దేవనదిఅయిన గంగానదియొక్క; సుత= కుమారుడగు భీష్ముడు; ఆదులగు= మొదలగు; అక్కడి= ఆ చోటునందలి అనగా(కౌరవ పక్షమునందలి); వీరులన్= శూరులను; మీరలు= మీరు; అందఱున్= అందరును; క్రమమునన్= వరుసగా; పిల్కుమార్చి= చంపి; భుజగర్వము= భుజములయొక్క దర్పము; చూపితిరి= చూపితిరి; ఏను= నేను; శత్రు= విరోధులయొక్క; సైన్య= సైన్యమును; మథన= మథించుటయందు; కల్యున్= నేర్పరి అయిన; శల్యున్= శల్యుని; తెగటార్చెదన్= చంపెదను; నాకు; ఇది; కృత్యము= చేయదగిన కార్యము; ఈ సముద్యమము= ఈ గొప్ప ప్రయత్నము; అనివార్యమై= నివారింపశక్యము కానిదియై(అడ్డులేనిదియై); నెగడునట్టి= వర్ధిల్లునట్టి; తెఱంగు= మార్గము(క్రమము); చెప్పెదన్= చెప్పెదను; వినుండు= వినుడు.

**తాత్పర్యం:** 'భీష్మద్రోణకర్ణాది శూరులను మీరు అందరూ వరుసగా చంపి భుజగర్వం చూపారు. నేను విరోధి సైన్యాన్ని మథించటంలో నేర్పరి అయిన శల్యుడిని చంపుతాను. నాకు ఇది చేయదగిన కార్యం. ఈ ప్రయత్నం నివారించ శక్యం కానిది అయి నెరవేరే మార్గం చెపుతాను వినండి.

**వ.** **'నా తేరికి నకులుఁడును సాత్యకియు వలపటను సహదేవుండును ధృష్టద్యుమ్నుండును డాపటను గావలియై రావలయు వెనుకం గదిసి విప్పచ్చుండును ముందటి కెలన మొనసి వడముడియును నడచునది యింత యేమిటి కనవలదు నన్నొండె నతం డతని నొండె నేను సమయించుట యవశ్యంబును గలుగం జూచితి నిట్లు తెంపుచేసి యమ్మద్రపతి మార్కొను నాకు దుర్దమప్రయత్నంబు కర్తవ్యంబు. కృపకృతవర్మాశ్వత్థామ సౌబల సుయోధనుల య్యోధముఖ్యు రక్షింపం జేయు పరాక్రమంబునకు మీరు ప్రతివిక్రమం బాచరించుచుండ నుదీర్ణంబగు మదీయబాహుపాటవంబున నమ్మేటిమగని గీటడఁగించువాఁడ' నని పలికిన నారథికవరులును దక్కునుగలవార లమ్మానవపతి పూనికి నగ్గించి యతని రథంబు సవిశేషకల్పితంబు గావించి యతండు సెప్పినతెఱంగున సన్నద్ధులై సముద్ధతిం దేజరిల్లుటయుఁ దత్సైన్యం బుత్సాహదీప్తంబై కడంగినఁ గరిఘంటారవంబులును రథనేమినిస్వనంబులును దురంగకింకిణీక్వణనంబులును సుభట సింహనాదంబులును నిస్సాణాదితూర్యనినదంబులును బెరసి యంబరంబు పిక్కటిల్లఁ జేసె. నివ్విధంబున యుధిష్ఠిరుం డుద్భటుండై యురవడించిన. 235**

**ప్రతిపదార్థం:** నా తేరికిన్= నా యొక్క రథమునకు; నకులుఁడును; సాత్యకియు; వలపటను= కుడివైపున; సహదేవుండును; ధృష్టద్యుమ్నుండును; డాపటను= ఎడమవైపున; కావలియై= రక్షకులై; రావలయున్= రావయును; వెనుకన్= వెనుకవైపు; కదిసి= దగ్గరగా ఉండి; విప్పచ్చుండును= అర్జునుడును; ముందటికెలనన్= ముందువైపున; మొనసి= పూని; వడముడియును= భీముడును; నడచునది= నడువవలయును; ఇంత= ఇదియంతయు; ఏమిటికిన్= ఎందులకు; అనవలదు= అనరాదు; అతండు= శల్యుడు; నన్నొండెన్= నన్నో; అతనిన్= శల్యుడిని; నేను ఒండెన్= నేనో; సమయించుట= సంహరించుట; అవశ్యంబును= తప్పకుండా; కలుగన్= అగునట్లుగా; చూచితిని; ఇట్లు; తెంపు= సాహసము; చేసి; ఆ+మద్రపతిన్= ఆ శల్యుడిని; మార్కొను= ఎదుర్కొను; నాకున్; దుర్దమ= అణపశక్యంకాని; ప్రయత్నంబు= మిక్కిలి యత్నము; కర్తవ్యంబు= చేయదగినది; కృప= కృపుడును; కృతవర్మ= కృతవర్మయును; అశ్వత్థామ= అశ్వత్థామయును; సౌబల= శకునియు; సుయోధనులు= దుర్యోధనుడును; ఆ+యోధముఖ్యున్= ఆ యోధ వీరులలో ప్రముఖుడయినవానిని (శల్యుడిని); రక్షింపన్= కాపాడుటకు; చేయు= చేసెడి; పరాక్రమంబునకున్= పౌరుష సామర్థ్యమునకు; మీరు; ప్రతి= సరిఅయిన; విక్రమంబు= పరాక్రమము; ఆచరించుచుండన్= ఆచరించుచుండగా; ఉదీర్ణంబు= పెరిగినది; అగు= అయినట్టి; మదీయ= నా యొక్క; బాహు= భుజములయొక్క; పాటవంబునన్= శక్తివలన (సామర్థ్యమువలన); ఆ; మేటి= గొప్ప; మగని= వీరుని; గీటఁడగించు= నశింపచేయు; వాఁడన్= వాడను; అని; పలికినన్= పలుకగా; ఆ రథికవరులును= ఆ యోధ శ్రేష్ఠులును; తక్కును= ఇంకను; కల= ఉన్నట్టి; వారలున్= వారును; ఆ+మానవపతి= ఆ ధర్మరాజుయొక్క; పూనికిన్= ప్రయత్నము; అగ్గించి= స్తుతించి; అతని రథంబున్= ఆ ధర్మజుడి రథాన్ని; సవిశేష= అతిశయముతో; కల్పితంబు= నిర్మాణము; (నిర్మితము); కావించి= చేసి; అతండు; చెప్పిన; తెఱంగునన్= ప్రకారంగా; సన్నద్ధులై= సంసిద్ధులై; సముద్ధతిన్= మిక్కిలి గర్వముతో; తేజరిల్లుటయున్= ప్రకాశించుటయు; తద్+సైన్యంబు= ఆ సైన్యము; ఉత్సాహ= ప్రయత్నమువలన; దీప్తంబై= ప్రకాశించుచున్నది అగుచు; కడంగినన్= యత్నించగా; కరి= ఏనుగులయొక్క; ఘంటా= గంటలయొక్క; రవంబులును= ధ్వనులును; రథ= రథములయొక్క; నేమి= కమ్ముల యొక్క; నిస్వనంబులును= ధ్వనులును; తురంగ= గుర్రముల యొక్క; కింకిణీ= చిరుగంటలయొక్క(మువ్వల

యొక్క); క్వణనంబులును= ధ్వనులును; సుభట= మంచి భటులయొక్క; సింహనాదంబులును= సింహగర్జనలవలన పుట్టిన ధ్వనులును; నిస్సాణ= డప్పులు; ఆది= మొదలగు; తూర్య= బూరాలయొక్క; నినదంబులున్= ధ్వనులును; బెరసి= వ్యాపించి; అంబరంబు= ఆకాశము; పిక్కటిల్లన్= ధ్వనించునట్లు; చేసెను; ఈ+విధంబున= ఈ ప్రకారముగ; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఉద్భటుండై= అధికుడై; ఉరవడించినన్= వేగిరపడగా.

**తాత్పర్యం:** 'నా రథానికి నకులుడు, సాత్యకి కుడివైపున సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు ఎడమవైపున, రక్షకులై రావయును. వెనుకవైపు దగ్గరగా ఉండి అర్జునుడు, ముందు భీముడు నడువవలెను. ఇది అంతా ఎందులకు అని అడుగవద్దు. శల్యుడు నన్నో, శల్యుడిని నేనో సంహరించటం తప్పకుండా జరుగవలెనని చూచాను. ఈ ప్రకారంగా సాహసం చేసి ఆ శల్యుడిని ఎదుర్కొనే నాకు కఠినతరమైన యత్నం చేయతగింది. కృప కృతవర్మ అశ్వత్థామ శకుని దుర్యోధనులు ఆ శల్యుడిని కాపాడటానికి చేసే పురుషయత్నానికి మీరు దానికి మారుగా పరాక్రమం చూపాలి. అధికమైన నా బాహుబలంవలన ఆ మహావీరుడిని సంహరించగలవాడను.' ధర్మరాజు ఈ విధంగా పలుకగా ఆ యోధ శ్రేష్ఠులు ఇంకను మిగిలినవారు ఆ ధర్మరాజు ప్రయత్నాన్ని మెచ్చి, అతడి రథాన్ని చక్కగా సన్నద్ధం చేసి, ఆ ధర్మరాజు చెప్పిన విధంగా యుద్ధానికి సంసిద్ధులై మిక్కిలి గర్వంతో ప్రకాశించగా ఆ సైన్యం ఉత్సాహంతో ప్రజ్వలించి యుద్ధం చేయటానికి ప్రయత్నించగా గజసైన్యంయొక్క గంటల ధ్వనులు, రథముల నేమి ధ్వనులు, గుఱ్ఱాల చిరుగంట మ్రోతలు, భటుల సింహగర్జనలనుండి వెడలిన ధ్వనులు, డప్పులు మొదలైన వాద్యాల ధ్వనులు వ్యాపించి ఆకాశం నిండిపోయాయి. ఈ ప్రకారంగా ధర్మరాజు అధికుడై తొందర పడుతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

### శల్య ధర్మనందనుల ద్వంద్వయుద్ధము (సం.9-15-54)

**క. కురువిభుఁడు దనదు మొనలకు । బరవస మొప్పంగ మద్రపతి మును శౌర్యో**
**ద్ధురుఁడయి కడఁగ నడరి య । వ్వరూథినిం దాఁకె ధరణి వడవడ వడఁకన్. 236**

**ప్రతిపదార్థం:** కురువిభుఁడు= దుర్యోధనుఁడు; తనదు= తనయొక్క; మొనలకున్= సేనలకు; బరవసము= ధైర్యము; ఒప్పంగన్= ఒప్పునట్లు చేయగా; మద్రపతి= శల్యుడు; మును= ముందుగా; శౌర్య= పరాక్రమంతో; ఉద్ధురుఁడు+అయి= గర్వం కలవాడై; కడఁగన్= పూనిక వహించగా; అడరి= చెలరేగి; ధరణి= భూమి= వడవడ= గడగడ; వడఁకన్= కంపించగా; ఆ; వరూథినిన్= పాండవ సైన్యమును; తాఁకెన్= ఎదుర్కొనెను.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన సేనలకు ధైర్యం కలిగించగా శల్యుడు పరాక్రమంతో గర్వసహితుడై పూనిక వహించి, అతిశయించి భూమి గడగడ కంపించేటట్లు ఆ పాండవసైన్యాన్ని ఎదుర్కొన్నాడు.

**వ. అట్టియెడ. 237**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**తే. పులులు దలపడిన యుబ్బును । బలుపును దోఁపంగ మద్రపతిధర్మసుతుల్**
**తలపడి యొండొరువులపై । నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్. 238**

**ప్రతిపదార్థం:** పులులు= పెద్ద పులులు; తలపడిన= కలియబడిన; ఉబ్బును= సంతోషమును; బలుపును= బలమును; తోఁపంగన్= తోచగా(అనిపించగా); మద్రపతి= శల్యుడు; ధర్మసుతుల్= యమధర్మరాజుయొక్క పుత్రుడు అయిన ధర్మరాజు; ఒండొరులపైన్= ఒకరిమీద ఒకరు; తలపడి= కలియబడి; అలఘు= తేలికకాని; ప్రదరములు= బాణములు; అధిక= మిక్కిలి; రయమునన్= వేగముగా; పఱపిరి= ప్రయోగించిరి.

**తాత్పర్యం:** పెద్దపులులు కలియబడిన సంతోషం, ఉత్సాహం బలం తోచేటట్లు శల్యధర్మరాజులు కలియబడి ఒకరిపై ఒకరు మిక్కిలి వేగంగా బలమైన బాణాలు ప్రయోగించారు.

**వ. వారి నాలోకించి యుభయసైన్యంబులు విజృంభించి సంరంభంబునం గలయం బెరసినఁ గ్రందుకయ్యం బయ్యె నందు. 239**

**ప్రతిపదార్థం:** వారిన్= ఆ శల్య ధర్మరాజులను; ఆలోకించి= చూచి; ఉభయ= రెండు; సైన్యంబులు= సేనలు; విజృంభించి= అతిశయించి; సంరంభంబునన్= వేగిరపాటుతో; కలయన్= కలియబడి; బెరసినన్= వ్యాపించగా; క్రందుకయ్యంబు= దొమ్మియుద్ధము; అయ్యెన్; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** ఆ శల్య ధర్మరాజుల యుద్ధాన్ని చూచి రెండు సైన్యాలు విజృంభించి వేగిరపాటుతో కలియబడి వ్యాప్తి చెందగా దొమ్మియుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో.

**ఉ. నీ తనయుండు సింహకమనీయతరం బగు భీమునుల్లస**
**త్కేతన మర్ధచంద్రశరతీవ్రహతిన్ మణికింకిణీనినా**
**దాతిశయంబుతోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్**
**వాతిశరంబునం దునిమె వారివరూథిని యేపడంగఁగన్. 240**

**ప్రతిపదార్థం:** నీ; తనయుండు= కుమారుఁడు; సింహ= సింహముచేత; కమనీయతరంబు= మిక్కిలి సుందరము; అగు= అయినట్టి; భీముని; ఉల్లసత్= ప్రకాశించుచున్న; కేతనము= టెక్కెము (జెండాకొయ్య); అర్ధచంద్ర= అర్ధచంద్రుడియొక్క ఆకారముగల; శర= బాణముయొక్క; తీవ్ర= గట్టి; హతిన్= దెబ్బతో; మణులయొక్క; కింకిణీ= మువ్వలయొక్క; నినాద= ధ్వనులయొక్క; అతిశయంబుతోడన్= విజృంభణముతో; పడునట్లు= పడిపోవునట్లు; ఏసి= కొట్టి; శరాసనంబు= విల్లు; బల్= బలమయిన; వాతి= వెడద (వాయి= నోరు; వాతి= నోరుగల); శరంబునన్= బాణముతో; వారి; వరూథిని= సేనయొక్క; ఏపు= పెంపు; అడంగఁగన్= అణగిపోవునట్లుగా; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీయొక్క పుత్రుడు దుర్యోధనుడు సింహసౌందర్యం గల భీముడి ప్రకాశవంతమైన జెండాకొయ్య అర్ధచంద్రాకృతి గల బాణంతో మణుల మువ్వల ధ్వనులతో కూడి పడిపోయేటట్లు కొట్టి, బలమయిన వెడద బాణంతో ఆ పాండవుల సేనల పెంపు నశించేటట్లు భీముడి విల్లును ఖండించాడు.

**చ. అతఁడు ప్రదీప్తకోపముఖుఁడై పటుశక్తి నురంబు వైచినం**
**బతి యరదంబుపైఁ బడియె బల్వగుమూర్ఛమునింగి యప్ప డా**
**యతధను వెత్తి సూతుతల యక్కురుఘస్మరుఁ డేసె డొల్ల వే**
**గ తొలఁగ నీడ్చెఁ దేరు దురగంబులు మూఁక గలంగి సొం పఱన్. 241**

**ప్రతిపదార్థం:** అతఁడు= భీముడు; ప్రదీప్త= ప్రజ్వలించిన; కోప= క్రోధముగల; ముఖుఁడై= ముఖముగలవాడై; పటు= కఠినమయిన; శక్తిన్= శక్తి అను ఆయుధముతో; ఉరంబు= వక్షఃస్థలము; వైచినన్= కొట్టగా; బల్వు= బలమయిన; అగు= అయినట్టి; మూర్ఛ= మూర్ఛయందు; మునింగి= మునిగిపోయి; పతి= దుర్యోధనుఁడు; అరదంబు పైన్= రథముపై; పడియెన్= పడిపోయెను; అప్పుడు= ఆ సమయమున; ఆ+కురు ఘస్మరుఁడు= కౌరవ సంహారకుడైన భీముడు; ఆయత= పొడవు అయిన; ధనువు= విల్లు; ఎత్తి= పట్టుకొని; సూతుతల= సూతుని యొక్క తల; డొల్లన్= దొర్లునట్లు; ఏసెన్= కొట్టెను; తేరు= రథము; తురగంబులు= గుర్రములు; తొలఁగన్= తొలఁగునట్లు; వేగ= వేగముగ; మూఁక= సైన్యము (కురుసైన్యము); కలంగి= కలతచెంది; సొంపు= సంతోషము; అఱన్= నశించునట్లుగా; ఈడ్చెన్= ఈడ్చెను.

**తాత్పర్యం:** భీముడు ప్రజ్వలిస్తున్న క్రోధంగల ముఖం కలవాడై సమర్థమైన శక్తితో వక్షఃస్థలాన్ని కొట్టగా దుర్యోధనుడు మూర్ఛలో మునిగిపోయి రథంపై పడిపోయాడు. ఆ సమయంలో కురు సంహారకుడైన భీముడు ఒక పెద్ద విల్లు పట్టుకొని సూతుడి శిరస్సు నేల దొర్లేటట్లు కొట్టాడు. తరువాత వేగంగా కురుసైన్యం కలతచెంది సంతోషం నశించేటట్లుగా రథాన్ని గుర్రాలు దూరంగా తొలగేటట్లు లాగుకొని పోయాయి.

**క. కని యశ్వత్థామయుఁ గృపుఁ । డును గృతవర్ముఁడును నెక్కుడు బరవసమునన్**
**మరసేనకుఁ దలమిగిలిన । మనుజేశ్వర! కవిసెఁ గ్రీడి మద మెలరారన్. 242**

**ప్రతిపదార్థం:** మనుజ= మానవులకు; ఈశ్వర!= పాలకుడవు అయిన ధృతరాష్ట్ర మహారాజ!; అశ్వత్థామయును; కృపుఁడును; కృతవర్ముఁడును; ఎక్కుడు= మిక్కిలి; బరవసమునన్= ధైర్యముతో; మనసేనకున్= మనసైన్యమునకు; తలమిగిలిన= ముందు మిగులగా; క్రీడి= అర్జునుడు; మదము= గర్వము; ఎలరారన్= అతిశయించగా; కవిసెన్= కలియబడెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అశ్వత్థామ కృప కృతవర్మలు మిక్కిలి ధైర్యంతో మన సైన్యానికి ముందుగా రాగా అర్జునుడు గర్వంతో విజృంభించి కలియబడ్డాడు.

**క. అమ్ముఖమున సమరము రౌ । ద్రమ్ము పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీ**
**కమ్ము బహులాస్త్రశస్త్ర చ । యమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రమునన్. 243**

**ప్రతిపదార్థం:** ఆ+ముఖమునన్= సేనాగ్రభాగమున; సమరము= యుద్ధము; రౌద్రమ్ము= క్రోధము; పెనిచెన్= పెంచెను; అనీకమ్ము= సైన్యము; మద్ర= మద్రదేశముయొక్క; విభునిన్= ప్రభువు అయిన శల్యుడిని; తలకడచి= అతిక్రమించి; బహుల= అనేకములయిన; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములయొక్క; శస్త్ర= సామాన్య ఆయుధములయొక్క; చయమ్ములన్= సమూహములతో; అతి= మిక్కిలి; ఉగ్రముగన్= భయంకరంగా; ధర్మజునిన్= ధర్మరాజును; పొదివెన్= క్రమ్ముకొనెను.

**తాత్పర్యం:** ఆ సేనాగ్రభాగంలో యుద్ధం క్రోధాన్ని పెంచింది. అశ్వత్థామాదులతో కూడిన సైన్యం శల్యుడిని దాటి వెడలి, అనేకాలయిన అస్త్రశస్త్రసమూహాలతో మహాభయంకరంగా ధర్మరాజును చుట్టుముట్టింది.

**వ. పొదివిన నయ్యుధిష్ఠిరుండు. 244**

**ప్రతిపదార్థం:** పొదివినన్= చుట్టుముట్టగా; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** చుట్టుముట్టగా ఆ ధర్మరాజు.

చ. అరదము చిత్రసంచరణ మక్కజమై విలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దనచేతఁ గూలఁగాఁ
బొరలఁగ మేదినిం దునియ ప్రోవులుగా రుధిరంపురొంపి బ్రుం
గ రణవిహారముం జలిపెఁ గౌరవనాథ! యనేకభంగులన్. 245

**ప్రతిపదార్థం:** కౌరవనాథ!= ధృతరాష్ట్ర మహారాజా!; అరదము= రథము; చిత్ర= వివిధములగు; సంచరణము= సంచారము; అక్కజమై= ఆశ్చర్యకరమై; విలసిల్లన్= ప్రకాశింపగా; తేరులున్= రథములును; కరులును= ఏనుగులును; ఘోటకంబులును= గుర్రాలును; కాల్బలమున్= పదాతిదళమును; తనచేతన్= తనచేత; కూలఁగాన్= చావగా; మేదినిన్= భూమిపై; తునియ= ముక్కలయొక్క; ప్రోవులుగాన్= ప్రోగులుగా; పొరలఁగన్= దొర్లగా; రుధిరంపు= రక్తముయొక్క; రొంపిన్= బురదయందు; బ్రుంగన్= మునుగగా; అనేక= పలు; భంగులన్= విధములుగా; రణ= యుద్ధమునందు; విహారమున్= విహారమును; చలిపెన్= చేసెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ ధర్మరాజు తన రథం వివిధ గతుల సంచారంతో అధికంగా ప్రకాశించగా రథాలు, ఏనుగులు, గుర్రాలు, పదాతిదళము తనచేత చంపబడగా భూమిపై ముక్కలు ప్రోవులుగా పొర్లగా రక్తం బురదలో మునుగగా పలువిధాలుగా యుద్ధంలో వేడుకగా తిరిగాడు.

క. నరులు మృదు వితఁ డనంగాఁ। బరఁగు యుధిష్ఠిరుఁడు శత్రుబలముల కతి ని
ష్ఠురుఁ డయ్యె నపుడు సుర ల। చ్చెరువందిరి చూచి ద్రోణు శిక్షఁ బొగడుచున్. 246

**ప్రతిపదార్థం:** నరులు= మనుజులు; ఇతఁడు(అనగా ధర్మరాజు); మృదువు= మెత్తనివాడు; అనంగాన్= అనగా; పరఁగు= ఒప్పు; యుధిష్ఠిరుఁడు= ధర్మరాజు; శత్రుబలములకున్= విరోధిసేనలకు; అతి= మిక్కిలి; నిష్ఠురుఁడు= కఠినుడు; అయ్యెను; అపుడు= ఆ సమయమున; సురలు= దేవతలు; చూచి; ద్రోణు= ద్రోణునియొక్క; శిక్షన్= శిక్షణమును; పొగడుచున్= పొగడుచు(స్తుతించుచు); అచ్చెరువు= ఆశ్చర్యము; అందిరి= పొందిరి.

**తాత్పర్యం:** మనుజులు 'ఈతడు మృదుహృదయు' డని అనగా ఒప్పే ధర్మరాజు విరోధిబలాలకు మిక్కిలి కఠిన హృదయుడయ్యాడు. ఆ సమయంలో దేవతలు చూచి ద్రోణుడి శిక్షణను పొగడుతూ ఆశ్చర్యం పొందారు.

క. మునుము బయలైన నలిఁ బే। ర్చినయమ్మనుజేంద్రుమీఁద శితవిశిఖము లే
పున నిగిడించుచు శల్యుఁడు। దనరు భుజాబలముతోడఁ దఱిమెం బెలుచన్. 247

**ప్రతిపదార్థం:** మునుము= ముందుభాగం; బయలు= శూన్యము; ఐనన్= అయినను; నలిన్= ఉత్సాహంతో; పేర్చిన= విజృంభించిన; ఆ; మనుజ+ఇంద్రుమీఁదన్= ప్రభువైన ధర్మరాజుమీద; శల్యుఁడు; ఏపునన్= ఆధిక్యముతో; శిత= వాడి అయిన; విశిఖములు= బాణములు; నిగిడించుచున్= ప్రయోగించుచు; తనరు= ఒప్పు; భుజా= భుజములయొక్క; బలముతోడన్= బలముతో; పెలుచన్= అతిశయముతో; తఱిమెన్.

**తాత్పర్యం:** ముందుభాగం బయలుగా ఉన్నా అత్యంతం విజృంభించిన ఆ ధర్మరాజుమీద శల్యుడు వాడి అయిన బాణాలు ఆధిక్యంతో ప్రయోగిస్తూ భుజబలంతో అతిశయంగా తరిమాడు.

**క. అవ్వీరుని వాలంపఱ । క్రొవ్వు నడఁచి తనదునంపకోల లడరఁగా**
**నవ్వసుధాధిపుఁ డల్లని । నవ్వొలయఁగ మాఱుకొనె ఘృణారహితుండై. 248**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుని; వాలు= వాడి అయిన; అంపఱ= బాణసమూహము; క్రొవ్వును; అడఁచి= అణచి; తనదు= తనయొక్క; అంపకోలలు= బాణములు; అడరఁగాన్= విజృంభించగా; ఆ; వసుధా+అధిపుఁడు= ప్రభువు అయిన ధర్మరాజు; అల్లని= మెల్లని; నవ్వు; ఒలయఁగన్= వ్యాపించగ; ఘృణా= దయా; రహితుండై= లేనివాడయి; మాఱుకొనెన్= ఎదుర్కొనెను.

**తాత్పర్యం:** శూరుడయిన ఆ ధర్మరాజు క్రొవ్వును అణచి శల్యుడు తన బాణాలతో విజృంభించగా, ఆ ధర్మరాజు మెల్లని నవ్వు ఒలికించి, దయలేనివాడై ఎదుర్కొన్నాడు.

**వ. ఇవ్విధంబున మార్కొని ధర్మజమద్రపతులు నిజశంఖంబులు పూరించిరి. భేరీప్రముఖతూర్యస్వనంబులు నింగి వొంగారఁ జెలఁగె నయ్యిరువురు నొండొరులపైఁ జండకాండపరంపరలు పరఁగించి తనువుల నెత్తురు లురలించి పూచిన బూరువుల పొలుపు దాల్చి రట్టి యెడఁ గనుంగొను జనంబులు. 249**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారముగ; మార్కొని= ఎదుర్కొని; ధర్మజమద్రపతులు= ధర్మరాజు శల్యులు; నిజ= తమ తమ; శంఖంబులు; పూరించిరి= ఊదిరి; భేరీ= దుందుభి; తూర్య= తూతూబూరాలయొక్క; స్వనంబులు= ధ్వనులు; నింగి= ఆకాశము; పొంగారన్= పొంగిపోవునట్లు; చెలఁగెన్= మ్రోసెను; ఆ; ఇరువురును= ఇద్దరును; ఒండొరులపైన్= ఒకరిపై ఒకరు; చండ= భయంకరమయిన; కాండ= బాణములయొక్క; పరంపరలు= వరుసలు; పరఁగించి= ప్రయోగించి; తనువులన్= దేహములందలి; నెత్తురులు= రక్తములు; ఉరలించి= ప్రవహింపజేసి; పూచిన; బూరువుల= బూరుగుచెట్లు యొక్క; పొలుపు= ఒప్పు(సౌందర్యము); తాల్చిరి= ధరించిరి; అట్టియెడన్= ఆ సమయంబున; కనుంగొను= చూచు; జనంబులు= జనులు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదుర్కొని ధర్మరాజశల్యులు తమ తమ శంఖాలు ఊదారు. ముఖ్యములయిన దుందుభి తూర్యాల ధ్వనులు ఆకాశం పొంగిపోయేటట్లు ఒప్పాయి. ఆ ఇద్దరు ఒకరి పై ఒకరు భయంకరాలైన బాణాల వరుసలు ప్రయోగించి శరీరాలలో రక్తాలు స్రవించగా పూచిన బూరుగు చెట్ల సౌందర్యం పొందారు. ఆ సమయంలో చూచే జనులు.

**విశేషం:** అలం: ఉపమ. 'ఉద్భిన్నరుధిరౌ' శూరౌ మద్రరాజ యుధిష్ఠిరౌ । పుష్పితౌ శుశుభాతే వై వసంతే కింశుకౌ యథా' (శల్య. 16-57). కింశుక మనగా మోదుగ చెట్టు.

**చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్క రూప దు**
**స్తరభుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడఁగించి యివ్వసుం**
**ధర గొను నొక్కొ? నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ**
**శ్వరుఁడుగఁ జేయ నోపునొకొ శల్యుఁడు గౌరవరాజనందనున్? 250**

**ప్రతిపదార్థం:** వెరవును= ఉపాయమును; లావున్= బలమును; చేవయును= ధైర్యమును; ఆరయన్= ఆలోచించగా; వీరలకున్= వీరికి; ఒక్కరూపు+అ= ఒక్కవిధమే; దుస్తర= దాటశక్యముకాని; భుజ= భుజములయొక్క; శక్తిన్= సామర్థ్యముతో; ధర్మజుఁ డు; శల్యుని; రూపు= ఆకృతిని; అడఁగించి= నశింపజేసి (రూపుమాపి); ఈ; వసుంధర= భూమి; కొనును= గ్రహించును; ఒక్కొ= ఏమో?; నేఁడు= ఈ దినము; ఇతనిన్= ఈ ధర్మరాజును; తాన్= తాను; సమయించి= సంహరించి; సమస్త= సర్వ;

మేదినీ= భూమికి; ఈశ్వరుండుగన్= రాజుగ; కౌరవరాజు= ధృతరాష్ట్రునియొక్క; నందనున్= కుమారుఁడు అయిన దుర్యోధనుని; శల్యుఁడు; చేయన్= చేయుటకు; ఓపున్= చాలును; ఒక్కొ?= ఏమో?

**తాత్పర్యం:** ఉపాయమును, బలమును, ధైర్యమును - ఆలోచించగా వీరికి సమానం. దాటశక్యంకాని భుజశక్తితో ధర్మరాజు శల్యుడిని రూపుమాపి ఈ భూమిని పరిగ్రహిస్తాడేమో! అట్లుకాక శల్యుడు ఈ దినం ఈ ధర్మరాజును సంహరించి దుర్యోధనుడిని ఈ సమస్త భూమండలానికి రాజుగా చేస్తాడేమో? (ఇట్లా శల్యుడు ధర్మరాజు ఒకరిని మించి ఒకరు యుద్ధం చేస్తున్నారనటం తాత్పర్యం.)

**వ. అని సందేహడోలాయమానమానసులై; రప్పుడు. 251**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధముగా తలచి; సందేహ= సందేహంతో డోలాయమాన= ఊగిసలాడు; మానసులు= మనస్సులు కలవారు; ఐరి= అయ్యారు; అప్పుడు= ఆ సమయమున.

**తాత్పర్యం:** అప్పుడు సంశయంతో ధర్మరాజశల్యుల యుద్ధాన్ని చూస్తున్న జనులు ఊయలవలె ఊగిసలాడే మనస్సులు కలవారు అయ్యారు. ఆసమయంలో.

**తే. మద్రపతి ధర్మజుని విల్లు రౌద్రమెసఁగఁ । ద్రుంచి నూఱమ్ములేసి యుద్ధురతఁ బేర్చె**
**నతఁడు వేఱొక్క ధను వెత్తి యతని ధనువుఁ । దునిమి వెస నేసె మున్నూఱు తూపు లధిప! 252**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మద్రపతి= శల్యుడు; రౌద్రము= క్రోధము; ఎసఁగన్= విజృంభించగా; ధర్మజుని= ధర్మరాజుయొక్క; విల్లు= ధనువు; నూఱు; అమ్ములు= బాణములు; ఏసి= ప్రయోగించి; త్రుంచి= ఖండించి; ఉద్ధురతన్= ఆధిక్యముతో; పేర్చెన్= విజృంభించెను; అతఁడు= అతడు(అనగా ఆ ధర్మరాజు); వేఱొక్క= మరియొక; ధనువు= విల్లు; ఎత్తి= పట్టుకొని; అతని= శల్యుడి; ధనువున్= వింటిని; తునిమి= ఖండించి; వెసన్= శీఘ్రముగా; మున్నూఱు= మూడువందలు; తూపులు= బాణములు; ఏసెన్= ప్రయోగించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శల్యుడు క్రోధం విజృంభించగా ధర్మజుడి ధనువును నూరు బాణాలు ప్రయోగించి ఖండించి, ఆధిక్యంతో విజృంభించాడు. ధర్మరాజు మరియొక విల్లు పట్టుకొని, శల్యుడి ధనువును ఖండించి, శీఘ్రంగా మూడువందల బాణాలు ప్రయోగించాడు.

విరథుఁడయిన శల్యుని నశ్వత్థామ దన రథముపై నిడుకొని పోవుట (సం. 9-15-65)

**ఉ. తోడనె తేరి వాహములఁ ద్రుంచి మదంబున సూతుప్రాణముల్**
**క్రీడయ పోలెఁ బుచ్చికొని కేతువుఁ గూల్చిన సేన విచ్చెఁ జే**
**యాడకయున్న శల్యుని రయంబున నాత్మరథస్థుఁ జేసి పె**
**న్గీడునఁ బొందకుండఁ దొలఁగించెను ద్రోణసుతుండు భూవరా! 253**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; తోడనె= వెంటనే; తేరి= రథముయొక్క; వాహములన్= గుర్రములను; త్రుంచి= ఖండించి; మదంబునన్= గర్వముతో; సూతు= సూతుడియొక్క; ప్రాణముల్; క్రీడ+అ= ఆట; పోలెన్= వలెను;

పుచ్చుకొని= తీసికొని; కేతువున్= జెండాకొయ్యను; కూల్చినన్= రాల్చగా; సేన= సైన్యము; విచ్చెన్= విడిపోయెను; చేయి; ఆడక= కదలక; ఉన్న= ఉన్నట్టి; శల్యునిన్; రయంబునన్= వేగముగా; ద్రోణ= ద్రోణునియొక్క; సుతుండు= పుత్రుడు అయిన అశ్వత్థామ; ఆత్మ= తనయొక్క; రథస్థున్= రథమునందున్నవానినిగా; చేసి; పెన్+కీడునన్= పెద్ద అశుభమును; పొందకుండన్= పొందకుండగా; తొలఁగించెను= తప్పించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజు శల్యుడిపై మూడువందల బాణాలు ప్రయోగించి, ఆ వెంటనే రథంయొక్క గుర్రాలను ఖండించి, గర్వంతో సూతుడి ప్రాణాలు ఆటవిధంగా తీసికొని, జెండాకొయ్యను పడగొట్టగా సైన్యం చెల్లాచెదరైంది. అప్పుడు చేయి కదపలేని స్థితిలో ఉన్న శల్యుడిని అశ్వత్థామ వేగంగా తన రథంపై ఉంచాడు. ఆ విధంగా శల్యుడిని పెద్ద కష్టంనుండి తప్పించాడు.

**వ.** **ఇట్లు శల్యుండు సమరవైకల్యంబు నొందుటయు ధర్మనందనుం డార్చి పేర్చి తద్బలంబుఁ దఱిమె నంత నమ్మద్రపతి యొండు రథంబు గల్పించుకొని కడంగి యా కౌంతేయాగ్రజుపైఁ గంకపత్త్రంబులు నిగిడించుచు నిగిడినం గని యద్దెసఁ జేయఁ గల సైనికోత్తములు సరభసంబున నయ్యోధవరు నెదుర్కొని రప్పు డతఁడు సాత్యకిఁ బదిసాయకంబులను భీమసేననకులసహదేవుల శరత్రయంబులను స్రుక్కించి యెక్కుడు మదంబునం బొదలిన యంగంబులతో నలిరేఁగి మఱియు నప్పడు పొగడం దగియుండె నాకర్ణింపుము. 254**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; శల్యుండు; సమర= యుద్ధమునుండి; వైకల్యంబును= వికలత్వమును; ఒందుటయున్= పొందుటయు; ధర్మనందనుండు= ధర్మరాజు; ఆర్చి= పెడబొబ్బపెట్టి; పేర్చి= విజృంభించి; తద్బలంబున్= ఆ సైన్యమును; తఱిమెను= పారద్రోలెను; అంతన్= ఆ సమయమున; ఆ+మద్రపతి= ఆ శల్యుడు; ఒండు= ఇంకొక; రథంబు= రథము; కల్పించుకొని= సమకూర్చుకొని; కడంగి= యత్నించి(పూనిక వహించి); ఆ+కౌంతేయ+అగ్రజుపైన్= కుంతీపుత్రులలో పెద్దవాడయిన ధర్మరాజుపై; కంకపత్త్రంబులు= బాణములు; నిగిడించుచున్= ప్రయోగించుచు; నిగిడినన్= విజృంభించగా; కని= చూచి; ఆ+దెసన్= ఆ వైపున; చేయఁగల= యుద్ధము చేయగల; సైనిక= సైనికులలో; ఉత్తములు= శ్రేష్ఠులు; సరభసంబునన్= వేగముగా; ఆ; యోధ= వీరులలో; వరున్= శ్రేష్ఠుడయిన శల్యుడిని; ఎదుర్కొనిరి; అప్పుడు; అతఁడు= ఆ శల్యుడు; సాత్యకిన్; పదిసాయకంబులను= పదిబాణములతోడను; భీమసేన నకుల సహదేవులన్= భీమసేన, నకుల, సహదేవులను; శరత్రయంబులను= మూడేసి బాణములతోను; స్రుక్కించి= బాధించి; ఎక్కుడు= మిక్కిలి; మదంబునన్= గర్వముతో; పొదలిన= పెరిగిన; అంగంబులతోన్= అవయవములతో; నలిరేఁగి= విజృంభించి; మఱియును; అప్పుడు; పొగడన్= పొగడుటకు; తగి= తగినట్లుగా; ఉండెను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** వినుము భూవరా! ఈ ప్రకారంగా శల్యుడు యుద్ధంనుండి తొలగగా ధర్మరాజు పెడబొబ్బపెట్టి విజృంభించి ఆ కౌరవసైన్యాన్ని పారద్రోలాడు. ఆ సమయంలో శల్యుడు ఇంకొక రథాన్ని సమకూర్చుకొని ఆ ధర్మరాజుపై బాణాలు ప్రయోగిస్తూ విజృంభించగా చూచి ఆ పాండవపక్షంలోని యుద్ధం చేయగల వీరశ్రేష్ఠులు వేగంగా ఆ శల్యుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు ఆ శల్యుడు సాత్యకిని పదిబాణాలతోను, భీమసేన నకుల సహదేవులను- ఒక్కొక్కరిని మూడేసి బాణాలతోను బాధించి మిక్కిలి గర్వంతో పెరిగిన అవయవాలతో విజృంభించి తగినట్లుగా ఉన్నాడు.

**సీ.** **కమలాకరములీలఁ గలఁచి యాడెడు గంధ । దంతావళము సముద్దండతయును**
**దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా । వధియించు కంఠీరవంబు నేపు**

**నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ । గాల్చు దావాగ్ని యుగ్రక్రమంబు**

**ప్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ । యించు ఫాలాక్షుని యేడ్తెఱయును**

**తే. బోల్పఁ బట్టులయ్యె భుజగర్వశౌర్య ప్ర । తాపదుర్దమప్రకోపములకు**

**మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య । హననకేళి సలుపు నవసరమున. 255**

**ప్రతిపదార్థం:** కమల= పద్మములకు; ఆకరము= గని అయినట్టిది (అనగా కమలములు కలిగిన సరోవరము); లీలన్= విలాసముగా; కలఁచి; ఆడెడు; గంధ= మదించిన; దంతావళము= ఏనుగుయొక్క; సమ్+ఉద్దండతయును= భయంకరత్వమును; తరమిడి= వరుసపెట్టి; మృగ= లేళ్ళయొక్క; సముత్కరమున్= సమూహమును; ఘోరంబుగాన్= భయంకరముగా; వధియించు= చంపు; కంఠీరవంబున్= సింహముయొక్క; ఏపు= విజృంభణము; నీరస= రసములేని(ఎండిపోయిన); అరణ్యంబు= అడవి; నిర్భర= సంపూర్ణమయిన(దట్టమయిన); ఆటోపతన్= ఆడంబరముతో; కాల్చు; దావాగ్ని= దావాగ్నియొక్క; ఉగ్రక్రమంబు= భయంకరమయిన విధానము; ప్రకట= స్పష్టమయిన; విక్రాంతిన్= పరాక్రమముతో; పురత్రయంబును= త్రిపురములను; సమయించు= సంహరించు; ఫాల+అక్షుని= శివుని; ఏడ్తెఱయును= అతిశయమును; మద్రవిభుఁడు= శల్యుడు; కోలుమసఁగి= మిక్కిలి విజృంభించి; శాత్రవ= విరోధి, సైన్య= సేనలయొక్క; హనన= చంపుట అనెడి; కేళి= క్రీడ(ఆటను); చలుపున్= చేయు(ఆడు); అవసరమునన్= సమయమున; భుజగర్వ= భుజగర్వము; శౌర్య= శౌర్యము; ప్రతాప= ప్రతాపము; దుర్దమ+ప్రకోపములకున్= అణచశక్యముకాని; మిక్కిలి క్రోధములకు; పోల్పన్= వాటితో పోల్చుటకు; పట్టులు= స్థానములు; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** విలాసంగా సరోవరాన్ని కలచి ఆడే మదపుటేనుగు విజృంభణమును - వరుసపెట్టి లేళ్ళ సమూహాన్ని భయంకరంగా చంపు సింహంయొక్క విజృంభణమును, ఎండిపోయిన అడవిని గాఢంగా కాల్చే దవాగ్ని విధానమును, స్పష్టమయిన పరాక్రమంతో త్రిపురాలను సంహరించే రుద్రుడి విజృంభణమును పోలి, శల్యుడు మిక్కిలి విజృంభించి విరోధి సైన్యముల చంపెడి ఆట ఆడే సమయంలో శల్యుడి భుజదర్పానికి మదపుటేనుగు ఉద్దండతయు, శల్యుడి పరాక్రమానికి సింహముయొక్క విజృంభణం, శల్యుడి ప్రతాపానికి దావాగ్ని ఉగ్రత్వము, శల్యుడి దుర్దమ ప్రకోపానికి (అడ్డగించలేని రౌద్రమునకు) రుద్రుడి అతిశయం పోల్చటానికి ఆధారస్థానాలు అయ్యాయి.

**విశేషం:** ఈ సీసపద్యమునందలి శల్యుడి భుజగర్వ శౌర్య ప్రతాపదుర్దమ ప్రకోపముల వర్ణన, చిత్రణ, కల్పనలు తిక్కన స్వీయ కవితా విజృంభణములు. ఈ ఉపమానములు - అమూలకములు. ముఖ్యంగా ఈ సీసంలో అనంతార్థ గాంభీర్యము, ఉపమాలంకారమాలికాలంకృత సౌందర్యములు విరిశాయి. రౌద్రబీభత్సరసభావాలు ఇందు పరిపుష్టములు. తిక్కన అచ్చ తెనుఁగు పదప్రయోగాని కిది ఆటపట్టు కాదు. ఉభయ కావ్యప్రౌఢి కిది ఉదాహరణము.

**వ. ధర్మనందనుం దలమిగిలిన చతురంగంబుల నివ్విధంబున వినిహతంబులు సేసి యమ్మహీపతిపైఁ గవిసినం గని కవలును శైనేయుండును భీమసేనుండును దోడ నడవ నతం డమ్మేటిమగని మార్కొని పటుమార్గణంబు లురంబున నించి నొంచె నప్పుడు కురువిభుండు వనుప మనసైనికులు దలమిగిలి శల్యునికిఁ బ్రాపయి యప్పవనతనయప్రభృతులతోడఁ బెనంగె రతం డాపాండవాగ్రజుమేనఁ జండకాండసప్తకంబు నినిచిన నజ్జననాథుండు నవనిశితనారాచంబు లవ్వీరు నంగంబుల నాటించె. నిట్లు దలపడి కోలుపులుల పోలికఁ బేరేనుంగుల తెఱంగున బలుసింగంబులు చందంబునం బోరి యొండొరుల నొప్పించి రప్పుడు. 256**

**ప్రతిపదార్థం:** ధర్మనందనునన్= ధర్మరాజును; తల మిగిలిన= మించిన; చతుః= నాలుగు; అంగంబులన్= రథాద్యంగములను; ఈ+విధంబునన్= ఈ ప్రకారముగా; వినిహతంబులు= చంపబడినవి(గా); చేసి; ఆ+మహీపతిపైన్= ఆ ధర్మరాజుమీద; కవిసినన్= కలియబడగా; కని= చూచి; కవలును= నకుల సహదేవులును; శైనేయుండును= సాత్యకియును; భీమసేనుండును; తోడన్= కూడి; నడువన్= నడువగా; అతండు= ఆ ధర్మరాజు; ఆ+మేటి= శ్రేష్ఠుడయిన; మగనిన్= వీరుని; మార్కొని= ఎదుర్కొని; పటు= కఠినమయిన; మార్గణంబులు= బాణములు; ఉరంబునన్= వక్షఃస్థలమునందు; నించి= నిండించి; నొంచెన్= బాధించెను; అప్పుడు; కురువిభుండు= దుర్యోధనుడు; పనుపన్= పంపించగా; మన; సైనికులు; తలమిగిలి= అతిక్రమించి; శల్యునికిన్= శల్యుడికి; ప్రాపయి= తోడై; ఆ; పవన తనయ= వాయుపుత్రుడు అయిన భీముడు; ప్రభృతులతోడన్= మొదలగువారితో; పెనంగిరి= పోరాడిరి; అతండు= ఆ శల్యుడు; ఆ; పాండవ= పాండవులలో; అగ్రజు= పెద్దవాడయిన ధర్మజుని; మేనన్= దేహమునందు; చండ= భయంకరమయిన; కాండ= బాణములయొక్క; సప్తకంబు= ఏడు; నినిచినన్= గ్రుచ్చగా; ఆ; జననాథుండు= ప్రభువు ధర్మరాజు; నవ= నూతనమయిన; నిశిత= వాడి అయిన; నారాచంబులు= బాణములు; ఆ+వీరున్= ఆ వీరునియొక్క; అంగంబులన్= అవయవములందు; నాటించెను= గ్రుచ్చెను; ఇట్లు= ఈ ప్రకారముగ; తలపడి= కలియబడి; కోలుపులుల పోలికన్= పెద్ద పులులవలె; పేరు= పెద్ద; ఏనుగుల= ఏనుగులయొక్క; తెఱంగునన్= విధమున; బలు= బలమయిన; సింగంబుల= సింహములయొక్క; చందంబునన్= విధముగ; పోరి= పోరాడి; ఒండొరులన్= ఒకరినొకరు; నొప్పించిరి= బాధించిరి; అప్పుడు= ఆ సమయమున.

**తాత్పర్యం:** ధర్మరాజును దాటి పోయిన చతురంగబలాలను ఈ విధంగా పడగొట్టి బాధించి చంపి, ఆ శల్యుడు ధర్మరాజుపై కలియబడగా చూచి నకులసహదేవులు, సాత్యకి, భీముడు కలిసి నడువగా ధర్మరాజు ఆ మహావీరుడయిన శల్యుడిని ఎదుర్కొని కఠినమయిన బాణాలు వక్షఃస్థలమునందు గ్రుచ్చి బాధించాడు. ఆ సమయంలో దుర్యోధనుడు పంపగా మన సైనికులు ముందుకు వెడలి శల్యుడికి దగ్గరపడి భీముడు మొదలైన వారితో పోరాడారు. ఆ శల్యుడు ధర్మరాజు దేహంలో ఏడు భయంకరములైన బాణాలు గ్రుచ్చగా ధర్మరాజు తొమ్మిది వాడి అయిన బాణాలు ఆ వీరుడైన శల్యుడి అవయవాలలో నాటాడు. ఈ ప్రకారంగా కలియబడి శల్యధర్మజులు పెద్దపులుల వలె మదించిన ఏనుగుల విధంగాను, బలమయిన సింహాల మాదిరి పోరాడి ఒకరినొకరు బాధించుకొన్నారు. ఆ సమయంలో.

**సీ.** **శల్యుండు బలునారసము పాండవాగ్రజు । నురమున నాట నత్యుగ్రదీప్త**
**ఘోరనారాచ మా కుంతీసుతుం డేయ । నతఁడు మూర్ఛిల్లిన నలరె నధిపుఁ**
**డమ్మద్రపతి తేఱి యలుకఁ గెంపారెడు । కనుఁగవతోఁ జండకాండ మొకట**
**నయ్యుధిష్ఠిరు నొంప నాతండు పసిఁడి మై । మఱు వాఱుతూపుల నఱికి వైచి**

**తే.** **వాలురమ్ములు దొమ్మిది వక్షమున ని । గుడ్ప నయ్యోధవరుఁ డతిక్రూరభల్ల**
**యుగళఖండితచాపుఁ జేయుడును నొండు । ధనువు గొని యవ్విభుండు దత్తనువు నించె. 257**

**ప్రతిపదార్థం:** శల్యుండు; బలు= బలమయిన; నారసము= బాణము; పాండవ= పాండవులలో; అగ్రజున్= పెద్దవాడయిన ధర్మరాజుయొక్క; ఉరమునన్= వక్షఃస్థలమున; నాటన్= గ్రుచ్చగా; అతి= మిక్కిలి; ఉగ్ర= భయంకరమయిన; దీప్త= ప్రజ్వలించు; ఘోర= కఠినమయిన(తీవ్రమయిన); నారాచము= బాణము; ఆ; కుంతీ సుతుండు= ధర్మరాజు; ఏయన్= ప్రయోగించగా; అతఁడు= ఆ శల్యుడు; మూర్ఛిల్లినన్= మూర్ఛపొందగా; అధిపుఁడు= అధిపతి అయిన ధర్మరాజు; అలరెన్= సంతోషించెను; ఆ+మద్రపతి= ఆ శల్యుడు; తేఱి= తేఱుకొని(మూర్ఛనుండి మేలుకొని); అలుకన్= కోపముతో; కెంపారెడు= ఎఱ్ఱబడిన; కనుఁగవతోన్= కన్నుదోయితో; చండ= భయంకరమయిన; కాండము= బాణము; ఒకటన్= ఒక్క; దానితో; ఆ+ యుధిష్ఠిరున్=

ఆ ధర్మరాజును; నొంపన్= నొవ్వచేయగా; ఆతండు= ధర్మరాజు(శల్యుని); పసిఁడి= బంగారుపు; మైమఱువు= కవచము; ఆఱు; తూపులన్= బాణములతో; నఱికివైచి= ఖండించివేసి; వాలురమ్ములు= వాడి బాణములు; తొమ్మిది; వక్షమునన్= రొమ్ముపై; నిగుడ్పన్= నాటగా; ఆ; యోధ= వీరులలో; వరుఁడు= శ్రేష్ఠుడు అనగా శల్యుడు; అతి= మిక్కిలి; క్రూర= భయంకరమయిన; భల్ల= బల్లెములయొక్క; యుగళ= రెంటితో; ఖండిత= ఖండించబడిన; చాపున్= ధనువు కలవానినిగా; చేయుడునున్= చేయగా; ఒండు= మరియొక; ధనువు= విల్లు; కొని= తీసికొని; ఆ+విభుండు= ప్రభువు అయిన ధర్మరాజు; తద్= ఆ శల్యుని; తనువు= దేహము; నించెన్= నింపెను.

**తాత్పర్యం:** శల్యుడు బలమైన బాణాన్ని ధర్మరాజు వక్షఃస్థలంలో గ్రుచ్చగా మిక్కిలి భయంకరమై ప్రజ్వలించే కఠినమయిన బాణాన్ని ధర్మరాజు ప్రయోగించగా దానితో శల్యుడు మూర్ఛిల్లగా ధర్మరాజు సంతోషించాడు. శల్యుడు మూర్ఛనుండి తేరుకొని, కోపంతో ఎర్రబడ్డ కనులతో భయంకరమైన బాణం ఒకదానితో ఆ ధర్మరాజును నొవ్వచేయగా, ధర్మరాజు శల్యుడి బంగారపు కవచాన్ని ఆరుబాణాలతో ఖండించివేసి, వాడి బాణాలు తొమ్మిది రొమ్మున నాటగా, ఆ యోధశ్రేష్ఠుడైన శల్యుడు మిక్కిలి క్రూరమైన రెండు బల్లెములతో ధర్మరాజు ధనువును ఖండించాడు. అప్పుడు ధర్మరాజు మరియొక విల్లు తీసికొని ఆ శల్యుడి దేహాన్ని బాణాలతో నింపాడు.

**క. బాసటయై భీముఁడు పె । ల్లేసెను మద్రపతి నాతఁ డిరువురతోడం**
**జేసెం గయ్యము గృపును । ద్భాసిత విక్రమముతోడుపాటు గలుగఁగన్. 258**

**ప్రతిపదార్థం:** భీముఁడు; బాసటయై= తోడై(సహాయుడై); మద్రపతిన్= శల్యుని; పెల్లు= గట్టిగా; ఏసెను= కొట్టెను; ఆతఁడు= ఆ శల్యుడు; కృపు= కృపుడియొక్క; ఉద్భాసిత= మిక్కిలి ప్రకాశవంతమయిన; విక్రమము= పరాక్రమము; తోడుపాటు= సహాయపడుట; కలుగఁగన్= కలుగగా; ఇరువురతోడన్= ఇద్దరితో (ధర్మజ భీమసేనులతో); కయ్యము= యుద్ధము; చేసెన్= చేసెను.

**తాత్పర్యం:** భీముడు తోడుగా శల్యుడిని గట్టిగా కొట్టాడు. శల్యుడు కృపుడి ప్రకాశవంతమయిన పరాక్రమం తోడు కాగా ఆ ఇద్దరితో యుద్ధం చేశాడు.

**వ. అట్టియెడం గంకటాంతరంబు ధరియించి కడంగి. 259**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= ఆ సమయంలో; కంకట+అంతరంబు= మరొక కవచాన్ని; ధరియించి= ధరించి; కడంగి= పూనుకొని.

**తాత్పర్యం:** ఆ సమయంలో మరొక కవచాన్ని ధరించి పూనుకొని.

**ఆ. మద్రవిభుఁడు ధర్మమారుతసుతుల మై । మఱువు లుఱక నఱికి మార్గణములు**
**దొమ్మిదింట రెంటఁ దూఁటులు సేసె దో । ర్దండములు ప్రదీప్తదర్పుఁ డగుచు. 260**

**ప్రతిపదార్థం:** మద్రవిభుఁడు= మద్రదేశ ప్రభువు అయిన శల్యుడు; ప్రదీప్త= బాగుగా ప్రజ్వలించుచున్న; దర్పుఁడు= గర్వము కలవాడు; అగుచున్= అగుచు; ధర్మమారుతసుతుల= ధర్మరాజు భీమసేనులయొక్క; మైమఱువులు= కవచములు; ఉఱక= సులభముగా; నఱికి= ఖండించి; మార్గణములు= బాణములు; తొమ్మిదింటన్= తొమ్మిదింటితో; రెంటన్= రెండింటితో; దోః+దండములు= దండములవంటి భుజములు; తూఁటులు= రంధ్రములు; చేసెన్= చేసెను.

**తాత్పర్యం:** శల్యుడు బాగా ప్రజ్వలిస్తున్న గర్వంతో ధర్మరాజభీమసేనుల కవచాలను తొమ్మిది బాణాలతో ఖండించి, రెండు బాణాలతో దండములవంటి భుజాలను తూట్లు పొడిచాడు.

**క. ఆలో ధర్మజు సారథిఁ । గూలఁగఁ గృపుఁ డేయ మద్రకుంజరుఁడు భుజా**
**లీల మెఱయంగ హయము । ల్నాలుగు నొకవ్రేల్మిడిని నిలం బడవైచెన్. 261**

**ప్రతిపదార్థం:** ఆలోన్= అంతలో; ధర్మజు= ధర్మరాజుయొక్క; సారథిన్= సారథిని(రథమునడుపువానిని); కూలఁగన్= చనిపోవునట్లు; కృపుఁడు; ఏయన్= కొట్టగా; మద్రకుంజరుఁడు= శ్రేష్ఠుడయిన మద్రదేశపురాజు - శల్యుఁడు; భుజాలీల= భుజములయొక్క విలాసము; మెఱయంగన్= ప్రకాశింపగా; హయములు= గుర్రములు; నాలుగును= నాల్గింటిని; ఒకవ్రేల్మిడిని= ఒక చిటికెలో; ఇలన్= నేలపై; పడవైచెన్= పడవేశాడు.

**తాత్పర్యం:** అంతలో ధర్మరాజుసారథిని కూలిపోయేటట్లు కృపుడు కొట్టగా, మద్రశ్రేష్ఠుడయిన శల్యుడు భుజవిలాసం ఒప్పగా నాలుగు గుర్రాలను ఒక్క చిటికెలో నేలపై పడవేశాడు.

**వ. ఇవ్విధంబున విరథుండై యమ్మహీకాంతుం డంతర్గతంబున. 262**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారముగ; విరథుండై= రథములేనివాడై; ఆ+మహీకాంతుండు= ఆ ధర్మరాజు; అంతర్గతంబునన్= మనస్సునందు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా రథం లేనివాడై ధర్మరాజు మనస్సులో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. గెలువుము శల్యుని నీ వని । పలికి ముకుందుండు నన్నుఁ బనిచినవాఁ డ**
**ప్పలుకులకు నసత్యత్వము । గలుగఁగ నేర్చు నొకొ! దైవఘటనబలమునన్. 263**

**ప్రతిపదార్థం:** నీవు; శల్యుని; గెలువుము; అని; పలికి; ముకుందుండు= శ్రీకృష్ణుడు; నన్నున్; పనిచిన= పంపించిన; వాఁడు; దైవఘటన= దైవప్రయత్నముయొక్క; బలమునన్= శక్తివలన; ఆ+పలుకులు= ఆ మాటలకు; అసత్యత్వము= అయథార్థత్వము; కలుగఁగనేర్చున్+ఒకొ!= కలుగగలదా?(సంభవించగలదా?)

**తాత్పర్యం:** 'నీవు శల్యుడిని జయింపుము' అని చెప్పి శ్రీకృష్ణుడు నన్ను పంపాడు. దైవయత్నం వలన ఆ మాటలకు అయథార్థత్వం కలుగదుకదా!'

**వ. అని శంకించియుఁ గొంకుపోవక యజ్జగన్నాథు వచనంబునకు నన్యథాత్వం బేల గలుగునని యద్దేవునిం దలంచి యామాట యమోఘంబు గావలయునని ప్రార్థించి వెండియు. 264**

**ప్రతిపదార్థం:** అని; శంకించియున్= సందేహించియు; కొంకు= భయము; పోవక= పొందక; ఆ; జగత్= ప్రపంచమునకు; నాథు= ప్రభువు అయిన శ్రీకృష్ణునియొక్క; వచనంబునకున్= మాటకు; అన్యథాత్వంబు= వేరొక్కవిధము; ఏల?= ఎందులకు?; కలుగును; అని; ఆ+దేవునిన్= ఆ భగవంతుడయిన శ్రీకృష్ణుడిని; తలంచి= స్మరించి; ఆ మాట; అమోఘంబు= సఫలము (వ్యర్థము కానిది); కావలయును; అని; ప్రార్థించి; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** అని సందేహించి, భయపడక శ్రీకృష్ణుడియొక్క మాటకు భిన్నముగా ఎందులకు జరుగుతుంది? అని ఆ దేవుడిని స్మరించి ఆ మాట వ్యర్థం కానిది కావలయునని ప్రార్థించి మరియు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **'స్ఫురితషడర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణున్ గుణా**
**దర సముపాత్తమూర్తిఁ గలితప్రభవస్థితిసంహృతిక్రియా**
**నిరతివివర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్ది న**
**ప్పరుషవరుం జతుర్భుజు విభుత్వమహోన్నతు నాశ్రయించెదన్.** **265**

**ప్రతిపదార్థం:** స్ఫురిత= భాసించిన(తోచిన); షడర్ధ= మూడు; నేత్రునిన్= నేత్రములు కలవానిని; త్రిశూల= త్రిశూలముతో; సముజ్జ్వలున్= బాగుగా ప్రకాశించువానిని; నిర్గుణున్= నిర్గుణుని(త్రిగుణరహితుడిని); గుణ= సత్త్వ, రజస్, తమస్ అను త్రిగుణములతో; ఆదర= ఆదరముతో; సముపాత్త= పొందబడిన; మూర్తిన్= రూపము(ఆకారములు) కలవానిని; కలిత= పొందబడిన; ప్రభవ= ఉద్భవము(పుట్టుక); స్థితి(ఉండుట); సంహృతి= సంహారము(నాశము) అనెడి; క్రియా= చేష్టయందలి; నిరతి= ఆసక్తితో; వివర్తిత= త్రిప్పబడిన; త్రిభువనీ= మూడులోకములకు సంబంధించిన; మహనీయునిన్= మహాత్ముని; దైత్య= రాక్షసులను; మర్దిన్= నాశము చేయువానిని; ఆ; పురుష; వరున్= శ్రేష్ఠుని; చతుర్భుజున్= నాలుగు భుజములు కలవానిని; విభుత్వ= వ్యాపకత్వమున, సర్వపరిపాలకత్వమున; మహా+ఉన్నతున్= గొప్ప అభ్యుదయము కలవానిని; ఆశ్రయించెదన్= శరణువేడెదను.

**తాత్పర్యం:** 'త్రినేత్రుడిని, త్రిశూలుడిని త్రిగుణరహితుడిని త్రిగుణాత్మకుడిని త్రిమూర్తిని, సృష్టి స్థితి లయములు, చేష్టా, ఆసక్తి, పరివర్తనములు భూః భువః సువః అను త్రిభువనములు, ఈ త్రితయములలో మహాత్ముడిని రాక్షససంహారకుడిని పరమపురుషుడిని చతుర్భుజుడిని సర్వవ్యాపకత్వం, సర్వపాలకత్వం మొదలైన వాటియందు గొప్ప అభ్యుదయం కలవాడిని పరమాత్మను శరణు వేడెదను.

**విశేషం:** ఇది హరిహర స్వరూప వర్ణనం, ప్రార్థనం. తిక్కన హృదయంలో భాసించిన స్వరూపమిది. షడర్ధనేత్రుడు - త్రిశూల సముజ్జ్వలుడు నిర్గుణుడు - గుణాదర సముపాత్తమూర్తి - కలిత ప్రభవ స్థితి సంహృతి క్రియా నిరతి త్రిభువనీమహనీయుడు. ఇంతవరకు సదాశివ స్వరూపము. దైత్యమర్దనుడు - చతుర్భుజుడు - విభుత్వ మహోన్నతుడు పురుషవరుడు - ఇంతవరకు మహా విష్ణు స్వరూపము - వెరసి తిక్కన ఉపాసనా రూపమయిన హరిహరమూర్తి చిత్రణము.

ఇఁక ముఖ్యముగా ఉస్మానియా ప్రతియందు ఈ పద్యమునందలి మూడవపాదము 'నిరతి వివర్తితి త్రిభువన మహనీయుని దైత్య మర్ది' అని కలదు. ఇందు ఇట్లున్నచో గణయతులు తప్పినవి. అందువలన 'త్రిభువనీ' పాఠముగా సరిచేయబడినది. వావిళ్ళ ప్రతియందు 'త్రిభువనీ' అనియే కలదు.

**తే.** **భండనము సేయు నరునగ్రభాగమునఁ బ్ర । చండ శూలోగ్రహస్తుఁడై శత్రుకోటి**
**గీటడంచుచు నేఁ జూడఁ గేలి సలుపు । దేవు జయసిద్ధికై సన్నుతింతు భక్తి.'** **266**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; చూడన్= చూడగా; భండనము= యుద్ధము; చేయు; నరున్= అర్జునుడియొక్క; అగ్రభాగమునన్= ముందు భాగమునందు; ప్రచండ= మిక్కిలి భయంకరమయిన; శూల= శూలముతో; ఉగ్ర= భయంకరమయిన; హస్తుడై= (పాణి) చేయికలవాడై; శత్రు= విరోధి; కోటిన్= సముదాయమును; గీటడంచుచున్= చంపుచు; కేలి= క్రీడ(ఆట); చలుపు= చేయు; దేవున్= ఆది దేవుని; భక్తిన్= భక్తితో; జయ= విజయము; సిద్ధికై= సిద్ధించుటకై(సమకూరుటకై); సన్నుతింతున్= స్తుతించెదను.

**తాత్పర్యం:** నేను చూడగా యుద్ధం చేస్తున్న అర్జునుడి ముందుభాగంలో మిక్కిలి భయంకరమైన శూలంతో భయంకరమయిన హస్తం కలవాడై విరోధి సముదాయాన్ని చంపుతూ క్రీడ సలిపే దేవుడిని భక్తితో జయం సమకూరటానికి స్తుతిస్తాను.'

**విశేషం:** పై రెండు పద్యాలు నిజానికి రుద్రస్తుతి. జయసిద్ధికి రుద్రస్తుతి చేయటం సంప్రదాయం. మహాభారత యుద్ధంలో రుద్రవిజృంభణం సైన్యసంహారం పరోక్షంగా కలదు. ఈ పద్యంలో 'నరునగ్రభాగమున' అను పాఠము సరి అయినది. ఇక ధర్మరాజు చేసిన ఈ స్తుతి మూలమున దాక్షిణాత్య ప్రతిలో కాని (నీలకంఠీయము) ఉత్తరాది ప్రతిలోకాని (గీతాప్రెస్) లేదు. ఇది కేవలం తిక్కయజ్వ కల్పనం. ఇందు తిక్కన హరిహరస్తుతి ఒనర్చాడు.

**వ. అనుచుఁ బురుషోత్తమునిఁ జిత్తమున నిలిపి యున్నతంబైన పూర్వకాయంబుతో మందప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతి దెస నిగిడింప నతఁ డవి బెండువడుటగాఁ దలంచి తఱిమి యఱిముఱి శరంబులు గురియుటయు నప్పుడు. 267**

**ప్రతిపదార్థం:** అనుచున్= ఇట్లు అనుచు; పురుషోత్తమునిన్= పురుషోత్తముడయిన నారాయణుని; చిత్తమునన్= చిత్తమునందు; నిలిపి= నిశ్చలముగా ధ్యానించి; ఉన్నతంబైన= ఎత్తైన; పూర్వకాయంబుతోన్= కటిప్రదేశమునకు పై భాగమున ఉన్నదేహముతో; మంద= మెల్లని; ప్రకారంబుగన్= విధంగా; మార్గణంబులు= బాణములు; ఆ+మద్రపతి= శల్యుని; దెసన్= దిక్కు; నిగిడింపన్= ప్రయోగించగా; అతఁడు= ఆ శల్యుడు; అవి= బాణములు; బెండువడుట= బలహీనపడుట; కాన్= అగునట్లుగా; తలంచి= భావించి; తఱిమి= వెంబడించి - పరుగెత్తించి; అఱిముఱిన్= సంభ్రమముతో; శరంబులు= బాణములు; కురియుటయున్= కురిపించుటయు(ప్రయోగించుటయు); అప్పుడు= ఆ సమయమున.

**తాత్పర్యం:** ఇట్లా ధర్మరాజు రుద్రుడిని ప్రార్థిస్తూ ఆ పురుషోత్తముడిని మనస్సులో నిశ్చలంగా ధ్యానించి ఎత్తైన పూర్వకాయంతో మెల్లగా బాణాలు ఆ శల్యుడి వైపు ప్రయోగించగా శల్యుడు ఆ బాణాలు నిస్సారములైనవిగా భావించి, తరిమి, సంభ్రమంతో బాణాలు ప్రయోగించే సమయంలో.

**చ. పవనసుతుండు విల్నఱికి బాణయుగంబున మేనునొంచి శా**
**త్రవులు దలంక నారథికురథ్యములన్ ధరఁ గూల్చి సూతు కం**
**ఠవిదళనం బొనర్చి ప్రకటస్ఫురణంబునఁ గంటకంబు భ**
**ల్ల వితతి ఘోరసంహతి నిలం బడనేసె రయం బెలర్పఁగన్. 268**

**ప్రతిపదార్థం:** పవన= వాయువుయొక్క; సుతుండు= పుత్రుడు అయిన భీముడు; విల్= విల్లు; నఱికి= ఖండించి; బాణ= బాణములయొక్క; యుగంబునన్= రెండింటితో; మేను= శరీరము; నొంచి= నొప్పించి; శాత్రవులు= విరోధులు; తలంకన్= భయపడగా; ఆ రథికు= ఆ శల్యుడియొక్క; రథ్యములన్= రథములాగు గుర్రములను; ధరన్= నేలపై; కూల్చి= పడవైచి; సూతు= సూతిడియొక్క; కంఠ= కంఠముయొక్క; విదళనంబు= ఖండించుట; ఒనర్చి= చేసి; ప్రకట= స్పష్టమయిన; స్ఫురణంబునన్= ప్రకాశంతో; కంటకంబున్= కవచమును; భల్ల= బల్లెములయొక్క; వితతిన్= సమూహముతో; ఘోర= భయంకరమయిన; సంహతిన్= దెబ్బతో; రయంబు= వేగము; ఎలర్పఁగన్= అతిశయించునట్లుగ; ఇలన్= నేలపై; పడవేసెన్= పడగొట్టెను.

**తాత్పర్యం:** పవనసుతుడైన భీముడు శల్యుడి విల్లు ఖండించి, రెండు బాణాలతో శరీరాన్ని నొప్పించి విరోధులు భయపడేటట్లు ఆ శల్యుడి గుఱ్ఱాలను నేలకూల్చి, సూతుడి కంఠం ఖండించివేసి, స్పష్టమయిన ప్రకాశంతో కవచమును బల్లెముల సమూహంతో భయంకరంగా వేగిరపాటుతో నేలపై పడగొట్టాడు.

**వ. ఇవ్విధంబున. 269**

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా.

**క. విరథుండు నచాపుఁడు వ । ర్మరహితగాత్రుండు నైన మద్రవిభుఁడు భా**
**సురఖడ్గచర్మశోభిత । కరుఁడై తేరుడిగి కన్నుఁగవఁ గెంపారన్. 270**

**ప్రతిపదార్థం:** విరథుండున్= రథములేనివాడును; అచాపుఁడున్= ధనువులేనివాడును; వర్మ= కవచము; రహిత= లేని; గాత్రుండును= దేహముకలవాడును; ఐన= అయినట్టి; మద్రవిభుఁడు= శల్యుడు; భాసుర= ప్రకాశవంతమయిన; ఖడ్గ; చర్మ= డాలుతో; శోభిత= సుందరమయిన; కరుఁడై= చేయి కలవాడై; కన్నుఁగవన్= రెండు కన్నులును; కెంపారన్= ఎఱ్ఱబడగా; తేరు= రథము; డిగి= దిగి.

**తాత్పర్యం:** రథం లేనివాడు, ధనువు లేనివాడు, కవచం లేనివాడు అయినట్టి శల్యుడు ప్రకాశవంతమైన కత్తిడాలులతో సుందరమైన చేతులు కలవాడై రెండు కన్నులు ఎఱ్ఱబడగా రథం దిగి.

**మ. జముచందంబున నేచి ధర్మసుతుపై సంరంభదుర్దాంతద**
**ర్పమునన్ వే కలియంగఁ జండబలదుర్వారుండు భీముండు ద్రుం**
**చె మదంబారఁగ వాలునున్ బలకయున్ శీఘ్రత్వ సందీప్తుఁడై**
**తమది క్కార్పులుఁ దూర్యనాదములు నత్యంతంబు శోభిల్లఁగన్. 271**

**ప్రతిపదార్థం:** జము= యమునియొక్క; చందంబునన్= విధముగా; ఏచి= విజృంభించి; సంరంభ= వేగిరపాటుతో; దుర్దాంత= అణగఁద్రొక్క శక్యముకాని; దర్పమునన్= గర్వముతో; ధర్మసుతుపైన్= ధర్మరాజుమీద; వే కలియంగన్= వేగముగా కలియబడగా; చండ= తీవ్రమయిన; బల= బలమువలన; దుర్వారుండు= వారింపశక్యముకాని వాడయిన; భీముండు; మదంబు= గర్వము; ఆరఁగన్= విజృంభించగా; తమదిక్కు= తమవైపు; ఆర్పులున్= బొబ్బలును (అరుపులును); తూర్య= వాద్యాల యొక్క; నాదములును= ధ్వనులును; అత్యంతంబు= మిక్కిలి; శోభిల్లఁగన్= ప్రకాశించుచుండగా; శీఘ్రత్వ= వేగిరపాటుతో; సందీప్తుఁడై= ప్రజ్వలించుచున్నవాడై; వాలునున్= కత్తిని; పలకయున్= డాలును; ద్రుంచెన్= ఖండించెను.

**తాత్పర్యం:** శల్యుడు యముడివలె విజృంభించి వేగిరపాటుతో అణపశక్యంకాని గర్వంతో ధర్మరాజు మీద వేగంగా కలియబడగా, భయంకరమైన బలంవలన అడ్డగించరాని శక్తిగల భీముడు గర్వం అతిశయించగా తమవైపు బొబ్బలు, తూర్యధ్వనులు మిక్కిలి ప్రకాశిస్తూ ఉండగా వేగిరపాటుతో ప్రజ్వలిస్తున్నవాడై, కత్తిని, డాలును ఖండించాడు.

**వ. అమ్మద్రపతి నేర్పును జేవయుం గల పరిజనంబులు చేర్పఁ గంకటగదాదండంబులు ధరియించి యుధిష్ఠిరుమీఁద నరువడి నడరె నప్పు డప్పాండవాగ్రజునకు బాసటయై సాత్యకిధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయమాద్రేయు లేయు సాయకంబులు సరకుగొనక గదం జిత్రంబుగా జడియుచు వడముడి**

**విక్రమంబునఁ దవులంబడక నిగిడె నశ్వసూత రహితంబగు రథంబుపై నున్న యన్నరేంద్రుండు తన దెసకు సింహచంక్రమణత్వసుందరుండై వచ్చు నవ్వీరు నాలోకించి నక్రోధంబైన యవష్టంభంబున నుద్దీపితుండై.**

**272**

**ప్రతిపదార్థం:** ఆ+మద్రపతి= ఆ శల్యుడు; నేర్పును= ఉపాయమును; చేవయున్= ధైర్యమును; కల= కలిగిన; పరిజనంబులు= అనుచరులు; చేర్పన్= సమకూర్చగా; కంకట= కవచము; గదా దండంబులు= గదాయుధం; ధరియించి= ధరించి; యుధిష్ఠిరుమీఁదన్= ధర్మరాజుపై; ఉరవడిన్= అతివేగముగా; అడరెను= విజృంభించెను; అప్పుడు; ఆ+పాండవ+అగ్రజునకున్= ఆ పాండవులలో పెద్దవాడైన ధర్మరాజునకు; బాసటయై= సహాయకులై; సాత్యకి; ధృష్టద్యుమ్నుఁడు; శిఖండి; ద్రౌపదేయ= ద్రౌపదిపుత్రులు; మాద్రేయులు= మాద్రిపుత్రులు అయిన నకుల సహదేవులు; ఏయు= ప్రయోగించు; సాయకంబులు= బాణములు; సరకుగొనక= లెక్కచేయక; గదన్= గదను; చిత్రంబుగాన్= ఆశ్చర్యకరముగా; జడియుచున్= త్రిప్పుచున్న; వడముడి= భీముడి; విక్రమంబునన్= పరాక్రమంచే; తవులంబడక= చిక్కుపడక; నిగిడెను= విజృంభించెను; అశ్వ= గుర్రములు; సూత= సూతుడు; రహితంబు= లేనిది; అగు= అయినట్టి; రథంబుపైన్= రథముమీద; ఉన్న= ఉన్నట్టి; ఆ+నర+ఇంద్రుండు= జనులకు ప్రభువు అయిన ఆ శల్యుఁడు; తన= తనయొక్క; దెసకున్= దిక్కునకు; సింహముయొక్క; చంక్రమణత్వ= లంఘనముతో; సుందరుండై= చూడముచ్చటగా; వచ్చు= వచ్చుచున్న; ఆ+వీరున్= ఆ పరాక్రమవంతుని; ఆలోకించి= చూచి; సక్రోధంబైన= కోపముతో కూడిన; అవష్టంభంబునన్= గర్వముతో; ఉద్దీపితుండై= ప్రకాశించుచున్నవాడై.

**తాత్పర్యం:** శల్యుడు ఉపాయం ధైర్యం కలిగిన అనుచరులు సమకూర్చిన కవచం గదా దండాలు ధరించి ధర్మరాజు మీద మిక్కిలి వేగంగా విజృంభించాడు. ఆ సమయంలో ధర్మరాజుకు సహాయులై సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, ద్రౌపది పుత్రులు, నకుల సహదేవులు ప్రయోగించే బాణాలు లెక్కచేయక, గదను ఆశ్చర్యజనకంగా త్రిప్పుతున్న భీముడి పరాక్రమానికి చిక్కుపడకుండా శల్యుడు విజృంభించాడు. గుర్రాలూ సూతుడూ లేని రథం మీద ఉన్నట్టి శల్యుడు తనవైపు (ధర్మరాజువైపు) సింహంవలె లంఘిస్తూ చూడముచ్చటగా వస్తున్న మహా పరాక్రమవంతుడైన శల్యుడిని చూచి, రౌద్రంతో కూడిన గర్వంతో ధర్మరాజు ప్రకాశిస్తున్నవాడై.

**క. 'ఇతని సమయింప నయ్య । చ్యుతుఁడు ననుం బనిచె నాకు నొనరించిన పా**
**లితఁ' డని తలంచి మొగ ము । గ్రత నొందఁగ శక్తిమీఁదఁ గనుదో యొలయన్. 273**

**ప్రతిపదార్థం:** ఆ; అచ్యుతుఁడు= శ్రీకృష్ణుడు; ఇతనిన్= ఈ శల్యుడిని; సమయింపన్= సంహరించుటకు; ననున్= నన్ను; పనిచెన్= పంపించెను; నాకున్= నాకు; ఒనరించిన= చేసిన; పాలు= భాగము; ఇతఁడు= ఈ శల్యుఁడు; అని; తలంచి= భావించి; మొగము= ముఖము; ఉగ్రతన్= భీకరముగ; ఒందఁగన్= పొందగ; శక్తిమీఁదన్= శక్తి అను ఆయుధముమీద; కనుదోయి= రెండుకన్నులు; ఒలయన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** 'ఆ శ్రీకృష్ణుడు ఈ శల్యుడిని సంహరించటానికి నన్ను పంపించాడు. నావంతు ఈ శల్యుడు' అని భావించి ముఖం భయంకరంకాగా శక్తి అనే ఆయుధంమీద కన్నులు వ్యాపించగా.

**వ. హృషీకేశు నుద్దేశించి. 274**

**ప్రతిపదార్థం:** హృషీకేశున్= శ్రీకృష్ణుడిని; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** ధర్మరాజు శక్తిమీద కన్నులు వ్యాపింపజేసి శ్రీకృష్ణుడిని గురించి ఇట్లా ప్రార్థించాడు.

**ఉ. 'నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడి భక్తి భద్రసం**
**పాదిని గావు టచ్చెరువె! భక్తజనాభిమతప్రదానవి**
**ద్యాదయితత్వమేర్పడ జయం బొడఁగూర్పుము దేవ! సంశ్రితాం**
**హోదళనంబు నీకు వ్రత ముల్లము నాపయి నిల్పు మిత్తఱిన్.' 275**

**ప్రతిపదార్థం:** నీదెసన్= నీవైపు; నాదు= నాయొక్క; చిత్తమునన్= నిశ్చలమయిన మనస్సునందు; నెక్కొని= నెలకొని; ఉండెడి; భక్తి= భక్తి; భద్ర= శుభమును; సంపాదిని= సంపాదించునది; కావుట= అగుట; అచ్చెరువె!= ఆశ్చర్యమా!; భక్తజన= భక్తులైన జనులయొక్క; అభిమత= ఇష్టముయొక్క; ప్రదాన= ఇచ్చుటయను; విద్యా= విద్యయందు; దయితత్వము= ప్రియత్వము; ఏర్పడన్= బయల్పడునట్లుగా; జయంబు= గెలుపు; ఒడఁగూర్పుము= సిద్ధించునట్లు చేయుము; దేవ!; సంశ్రిత= ఆశ్రయింపబడిన వారియొక్క; అంహోదళనంబు= పాపములను ఖండించుట; నీకున్; వ్రతము= నియమము(దీక్ష); ఈ+తఱిన్= ఈ సమయమున; ఉల్లము= హృదయము; నాపైన్= నామీద; నిల్పుము= ఉంచుము.

**తాత్పర్యం:** 'నా చిత్తంలో నెలకొని ఉన్న నీమీది భక్తి శుభాన్ని కలిగించటంలో ఆశ్చర్య మేమున్నది? భక్తుల ఇష్టాన్ని ఈడేర్చటంలో నీకు గల ప్రియత్వం బయల్పడేటట్లు నాకు గెలుపు సిద్ధింపజేయుము. ఓ భగవంతుడా! ఆశ్రితుల పాపాలను ఖండించటం వ్రతంగా గల నీవు ఈ సమయంలో నీ హృదయాన్ని నాపై ఉంచుము. నన్ను అనుగ్రహించుము!'

**వ. అని హృదయంబునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు. 276**

**ప్రతిపదార్థం:** అని; హృదయంబునన్= మనస్సునందు; ప్రార్థించి; ఆ; పార్థివ= రాజులలో; ఉత్తముండు= శ్రేష్ఠుడు అయిన ధర్మరాజు.

**తాత్పర్యం:** అని మనస్సునందు శ్రీకృష్ణుడిని రాజశ్రేష్ఠుడైన ధర్మరాజు ప్రార్థించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. అచ్చపు భక్తికిన్ మదిఁ బ్రియంబున నొందిన ఫాలలోచనుం**
**డిచ్చిన ప్రీతియోగమును నెక్కుడు భక్తియు నావహిల్లఁగా**
**నిచ్చలు గంధపుష్పములు నిష్ఠమెయిం బరిశోభితార్చనం**
**బిచ్చుచుఁ దాను గొల్వ నుతి కెక్కిన యమ్మహనీయశక్తికిన్. 277**

**ప్రతిపదార్థం:** అచ్చపు-భక్తికిన్= తన స్వచ్ఛమైన భక్తికి; మదిన్= మనస్సునందు; ప్రియంబునన్+ఒందిన= సంతోషించిన; ఫాలలోచనుండు= ఫాలాక్షుడు(శివుడు); ప్రీతి-యోగమును= సంతోషపుయుక్తి; ఎక్కుడు భక్తియున్= అధికభక్తియును; ఆవహిల్లఁగాన్= కలుగగా; నిచ్చలున్= ఎల్లప్పుడును; గంధ-పుష్పములన్= గంధంతోను; పూలతోను; నిష్ఠమెయిన్= నియమంతో; పరిశోభిత+అర్చనంబు= ప్రకాశించే పూజ; ఇచ్చుచున్; తాను(ధర్మరాజు); కొల్వన్= సేవించగా; నుతికిన్+ఎక్కిన= పొగడ్తకెక్కిన; ఆ+మహనీయ - శక్తికిన్= ఆ గొప్ప శక్త్యాయుధమునకు.

**తాత్పర్యం:** మనస్సునందు ప్రేమవలన కలిగిన స్వచ్ఛమైన భక్తికి శివుడు సంతోషంతో ప్రసాదించిన స్తుతింపతగిన గొప్ప శక్తి అనే ఆయుధానికి ధ్యానం, మిక్కిలి భక్తి కలుగగా, నిత్యం గంధ పుష్పములతో మిక్కిలి శ్రద్ధతో ప్రకాశవంతమైన పూజ చేస్తూ సేవించగా.

**మ. ప్రణతుండై రభసోదయాభినవదర్పస్ఫూర్తి శోభిల్లుచు**
**న్మణిదండద్యుతిమంజరీస్ఫురణము న్సంశోభిఘంటాపటు**
**క్వణనంబున్ రిపుసైనికప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ**
**షణరేఖంబగు దానిఁ బుచ్చుకొని చంచన్ముష్టిదృష్ట్యుద్ధతిన్. 278**

**ప్రతిపదార్థం:** ప్రణతుండై= నమస్కరించినవాడై; రభస= తీవ్రమయిన కోపమువలన; ఉదయ= పుట్టిన; అభినవ= క్రొంగ్రొత్త; దర్ప= గర్వముయొక్క; స్ఫూర్తిన్= తోచుటవలన; శోభిల్లుచున్= ప్రకాశించుచు; మణిదండ= రత్నములు పొదిగిన దండముయొక్క; ద్యుతి= కాంతుల; మంజరీ= గుత్తుల; స్ఫురణమున్= ప్రకాశమును; సంశోభి= మిక్కిలి; ప్రకాశించుచున్న; ఘంటా= గంటలయొక్క; పటు=బలమైన; క్వణనంబున్= ధ్వనియును; రిపు= శత్రువుల; సైనిక= సేనలయొక్క; ప్రకర= సమూహముయొక్క; దృక్= కన్నులకు; కర్ణ= చెవులకు; వ్యథన్= బాధను; చేయన్= కలిగించగా; భీషణ= భయంకరమగు; రేఖంబు= రూపము; అగు; దానిన్= ఆ శక్తిని; పుచ్చుకొని= తీసికొని; చంచత్= చలించుచున్న; ముష్టి= పిడికిలి; దృష్టి= చూపులయొక్క; ఉద్ధతిన్= గర్వముతో.

**తాత్పర్యం:** ధర్మరాజు శక్తికి నమస్కరించినవాడై, తీవ్రమైన కోపంవలన పుట్టిన క్రొంగ్రొత్త గర్వపు స్ఫూర్తితో ప్రకాశిస్తూ రత్నాలు పొదిగిన దండముయొక్క కాంతుల పూలగుత్తుల ప్రకాశాన్ని మిక్కిలి వెలుగొందుతున్న గంటల గొప్ప ధ్వని, శత్రుసైనికుల సమూహాల కన్నులకు కాంతియు చెవులకు ధ్వనియు బాధను కలిగించగా - భయంకరమైన ఆ శక్తిని తీసికొని చలిస్తున్న పిడికిలితో చూపులలోని గర్వంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. అభిరామభీమాకారుండై. 279**

**ప్రతిపదార్థం:** అభిరామ= మనోహరమైన; భీమ= భయంకరమైన; ఆకారుండు+ఐ= ఆకారం కలవాడై.

**తాత్పర్యం:** ధర్మరాజు మనోజ్ఞమయిన, భయంకరమైన రూపం కలవాడై.

**తే. నెరయుకినుకఁ బెన్వెడఁదయై నిప్పు లురులు । కన్నుఁగవ శల్యుఁ జూచిన నున్నయునికి**
**నతఁడు నీఱు గాకుండుట యరిది యయ్యె । మాకుఁ జూడంగ నప్పడు మనుజనాథ! 280**

**ప్రతిపదార్థం:** నెరయు= నిండైన; కినుకన్= కోపముతో; పెను= పెద్దగా; వెడఁద ఐ= విశాలమై; నిప్పులు; ఉరులు= రాలు; కన్నుఁగవన్= రెండు కన్నులతో; శల్యున్= శల్యుని; చూచినన్= చూడగా; ఉన్న ఉనికిన్= ఉన్నట్లుండగనే; అతఁడు= ఆ శల్యుడు; నీఱు= నివురు(మసి); కాకుండుట= కాకపోవుట; మనుజనాథ!= మానవులకు ప్రభువైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మాకున్= మాకు; చూడంగన్= చూడగా; అరిది= ఆశ్చర్యము; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** నిండైన కోపంతో పెద్దగా విశాలమైన నిప్పులు రాలే కన్నులతో ధర్మరాజు శల్యుడిని చూడగా ఉన్నవాడున్నట్లే ఆ శల్యుడు నివురు (బూడిద) కాకపోవటం - ఓ ధృతరాష్ట్ర మహారాజా! చూడగా మాకు ఆశ్చర్యమైనది. (ధర్మరాజు చూపులకు శల్యుడు నుసికాకపోవటం చూచేవారికి ఆశ్చర్యమైంది.)

**విశేషం:** ఈ తేటగీతియందు 'శల్యుఁడు' 'మనుజనాథ!' అనే పదములు తప్ప మిగిలిన వన్నియు అచ్చతెనుఁగు పదాలు. మూలం ఉన్నది ఉన్నట్లుగా అనువదించబడినది. మూలము:

**'నిరీక్షితోవై నరదేవరాజ్ఞా । పుతాత్మనా నిర్ధృతకల్మషేణ ।**
**ఆభూ న్నయద్భుస్మసా న్మద్రరాజ । స్తదద్భుతం మే ప్రతిభాతి రాజన్ ॥ (9-16-39)**

ఇక ఈ సందర్భంలో ధర్మజుడు 'ఫాలలోచనుడిచ్చిన ప్రీతియోగమును - నెక్కుడు భక్తియు నావహిల్లగా శక్తికి నమస్కరించి' నట్లు తిక్కయజ్వ వర్ణించాడు. (277వ పద్యం) ఇది అమూలకం. ప్రీతియోగమంటే సంతోషయుక్తి (కూడిక).

**వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రయ దాహదోహలియగు శూలాయుధు లీల దోఁప దుర్నిరీక్షుండై. 281**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; రౌద్ర= క్రోధముయొక్క; ఉద్రేకంబునన్= పెరుగుదలవలన; పురత్రయ= త్రిపురములను; దాహ= కాల్చుటయందు; దోహలి= ఉత్సాహము కలవాడు; అగు= అయినట్టి; శూల= త్రిశూలము; ఆయుధు= ఆయుధముగా కలిగిన; శివుని; లీలన్= విధముగ; తోఁపన్= తోచగా; దుర్నిరీక్షుండై= చూడ శక్యము కానివాడై.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ధర్మరాజు మిక్కుటమైన క్రోధం వలన త్రిపురాలను దహించే శివుడి విధంగా చూడశక్యం కానివాడై.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. ఘోరతర ప్రకారమగు కుంచితబాహువిలాస మొప్ప వి**
**స్తారము వింతయౌనురము సారతరంబుగఁ జూచి వజ్రధా**
**రారుచి సన్నిభప్రచురరశ్ములు పర్వఁగ బిట్టువైచె న**
**ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్కృతికల్యు శల్యునిన్. 282**

**ప్రతిపదార్థం:** ఘోరతర= మిక్కిలి భయంకరమగు; ప్రకారము= పద్ధతి; అగు= కలిగినట్టి; కుంచిత= వంచబడిన; బాహు= భుజములయొక్క; విలాసము= ఒయ్యారము; ఒప్పన్= ప్రకాశింపగా; విస్తారము= విరివి అయిన; వింతయౌ= విస్మయకరమగు; ఉరము= వక్షఃస్థలము; ఒప్పన్= ప్రకాశింపగా; ఆ+విభుండు= ప్రభువు అయిన ధర్మరాజు; ఉదాత్త= ఉన్నతమయిన; సమిత్కృతి= యుద్ధము చేయుటయందు; కల్యున్= నేర్పుకలవాడయిన; శల్యునిన్= శల్యుని; చూచి; వజ్ర= వజ్రాయుధముయొక్క; ధారా= వాడియొక్క; రుచి= కాంతితో; సన్నిభ= సమానమయిన; ప్రచుర= విస్తారమయిన; రశ్ములు= కాంతులు(కిరణములు); పర్వఁగన్= వ్యాపించగా; ఆ+దారుణశక్తిన్= శక్తి అను భయంకరాయుధమును; సారతరంబుగన్= మిక్కిలి బలముగా; బిట్టు= శీఘ్రముగా(వేగంగా); వైచెన్= విసిరెను.

**తాత్పర్యం:** మిక్కిలి భయంకరమైన పద్ధతి కలిగినట్టి వంచబడిన భుజాల ఒయ్యారం ప్రకాశించగా, విరివి అయిన విస్మయకరమయిన వక్షఃస్థలం ప్రకాశించగా ఆ ధర్మరాజు గొప్పయుద్ధం చేయటంలో నేర్పరి అయిన శల్యుడిని చూచి, వజ్రాయుధపు అంచుల కాంతితో సమానమైన, విస్తారమైన కాంతులు వ్యాపించగా ఆ భయంకరమైన శక్తి అనే ఆయుధాన్ని విసిరాడు.

**తే. అట్లు పాండుభూపాలకు నగ్రసుతుఁడు । మద్రనాథుని వైచిన రౌద్రమెసఁగ**
**గంకటముదూఱి వక్షంబు గడచి వెన్ను । వెడలిచని యమ్మహాశక్తి పుడమిఁ జొచ్చె. 283**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారముగా; పాండుభూపాలకు= పాండురాజుయొక్క; అగ్రసుతుఁడు= పెద్దకొడుకు అయిన ధర్మరాజు; మద్రనాథునిన్= మద్రదేశ ప్రభువైన శల్యుడిని; రౌద్రము= క్రోధము; ఎసఁగన్= విజృంభించగా; వైచినన్= కొట్టగా; ఆ+మహాశక్తి= ఆ గొప్ప శక్తి అను ఆయుధము; కంకటము= కవచము; తూఱి= ప్రవేశించి; వక్షంబు= ఱొమ్ము; కడచి= దాటి; వెన్ను= వీపు; వెడలిచని= బయటకు వచ్చి; పుడమిన్= భూమిలో; చొచ్చెన్= ప్రవేశించెను.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా ధర్మరాజు క్రోధం విజృంభించగా శల్యుడివైపు ఆ మహాశక్తి ఆయుధాన్ని విసరగా అది ఆ శల్యుడి కవచంలో ప్రవేశించి రొమ్ము చీల్చి, వీపునుండి బయటకు వచ్చి భూమిలో ప్రవేశించింది.

**విశేషం:** ఈ పద్యానికి మూలం: 'సా తస్య మర్మాణి విదార్య శుభ్ర మురో విశాలం చ తథైన భిత్త్వా। విదేశ గాం తోయమివా ప్రసక్తా యశోవిశాలం నృపతే ర్దహన్తీ॥ (శల్య - 17-50)

వ్యాసభగవానుడు మూలంలో శక్తి ఆయుధాన్ని అద్భుతంగా వర్ణించాడు. దానిని ఇచటచూపటం న్యాయం. తిక్కన సంక్షేపంలో ఇది మరుగునపడినది.

**తతస్తు శక్తిం రుచిరోగ్రదండాం మణిప్రలేకోజ్వలితాం ప్రదీప్తామ్ ।**
**చిక్షేప వేగాత్సు భృశం మహాత్మా మద్రాధిపాయ ప్రవరః కురూణామ్ ॥ (40)**

**దీప్తా మథైనాం ప్రహితాం బలేన సవిస్ఫులింగాం సహసా పతంతీమ్ ।**
**ప్రైక్షంత సర్వే కురవః సమేతా దివోయుగాంతే మహతీమివోల్కామ్ ॥ (41)**

**తాం కాలరాత్రీమివ పాశహస్తాం యమస్య ధాత్రీమివ చోగ్రరూపామ్ ।**
**స బ్రహ్మదండ ప్రతిమా మమోఘాం ససర్జ యత్తోయుధి ధర్మరాజః ॥ (42)**

**గన్ధ ప్రగత్ర్యాసనపాన భోజనైరభ్యర్చితాం పాండుసుతైః ప్రయత్నాత్ ।**
**సాంవర్తకాగ్ని ప్రతిమాం జ్వలన్తీం కృత్యా మథర్వాంగిరసీమి వోగ్రామ్ ॥ (43)**

**ఈశానహేతోః ప్రతినిర్మితాం తాం త్వష్టా రిపూణామసుదేహభక్ష్యామ్ ।**
**భూమ్యన్తరిక్షాది జలాశయాని ప్రసహ్య భూతాని నిహన్తు మీశామ్ ॥ (44)**

**ఘంటాపతాకాం మణివజ్రభాజం వైడూర్య చిత్రాం తపనీయదండామ్ ।**
**త్వష్టా ప్రయత్నా న్నియమేన క్లప్తాం బ్రహ్మద్విషా మంతరకరీమమోఘామ్ ॥ (45)**

**బలప్రయత్నా దధిరూఢవేగాం మన్త్రైశ్చ ఘోరై రభిమంత్ర్య యత్నాత్ ।**
**ససర్జ మార్గేణ చ తాం పరేణ వధాయ మద్రాధిపతేస్తదానీమ్ ॥ (46) (9-16-46)**

తిక్కన అనువాదంలో ఈ వర్ణనంలేదు. ఔచిత్యాన్ని సహృదయులైన విజ్ఞులు గ్రహింతురుగాక!

## ధర్మరాజు శక్తి ప్రయోగించి శల్యునిం జంపుట (సం. 9-16-50)

**వ. ఇట్లు శక్తి బెడిదంపుటు రవడి నుచ్చిపోయిన. 284**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; శక్తి= శక్తి అను ఆయుధము; బెడిదంపు= భయంకరమగు; ఉరవడిన్= మిక్కిలి వేగముగా; ఉచ్చిపోయినన్= దూసికొని వెడలిపోగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా శక్తి అనే ఆయుధం భయంకరమైన వేగంతో శల్యుడిని కొట్టి వెడలిపోగా.

**చ. క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్త మంగ మా**
**ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలంబడియెన్ ధరం గర**
**ద్వితయము సాఁచి ధర్మజునిదిక్కు శిరంబుగ వజ్రదారుణా**
**హతిఁ బడు భూరిభూధరమహత్తరశృంగముభంగి భూవరా! 285**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; క్షతమునన్= గాయమువలన; ముక్కునన్= ముక్కునుండి; చెవులన్= చెవులనుండి; కన్నులన్= కన్నులనుండి; ఒల్కెడు= ఒలికెడు; రక్తము; అంగము= శరీరము; ఆప్లుతముగన్= తడిసినదిగా; చేయఁగాన్= చేయగా; అతఁడు= ఆ శల్యుడు; ధరన్= భూమిపై; బోరగిలన్= రొమ్ము భూమిపై ఆనునట్లు; పడియెన్= పడిపోయెను; కరద్వితయము= రెండుచేతులు; చాఁచి= సాగిలపడి; వజ్ర= వజ్రాయుధపు; దారుణ= భయంకరమయిన; ఆహతిన్= దెబ్బవలన; పడు= పడిపోయిన(కూలిన); భూరి= పెద్దది అయిన; భూధర= పర్వతముయొక్క; మహత్తర= మిక్కిలి గొప్పది అయిన; శృంగము= శిఖరము; భంగిన్= విధముగ; ధర్మజునిదిక్కు= ధర్మరాజువైపు; శిరంబుగన్= తల కలవాడుగా; ధరన్= భూమిపై; పడియెన్= పడిపోయెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! గాయం వలన ముక్కునుండి చెవులనుండి కన్నులనుండి ఒలికే నెత్తురు శరీరాన్ని తడిపివేయగా, ఆ శల్యుడు భూమిపై బోరగిలపడిపోయాడు. చేతులరెండూ చాచి, సాగిలబడి వజ్రాయుధం యొక్క భయంకరమైన దెబ్బవలన పడిపోయిన మిక్కిలి పెద్దదైన పర్వత శిఖరం విధంగా ధర్మరాజువైపు తల కలవాడుగా భూమిపై పడిపోయాడు.

**విశేషం:** అలం: ఉపమ. శల్యుఁడు-ఉపమేయం; పర్వతశిఖరం-ఉపమానం; భంగి(న్) - ఉపమావాచకం. పడిపోవుట - సమానధర్మం. పూర్ణోపమ. ఇక మూలంలో స్కందుడు కొట్టిన క్రౌంచపర్వతమువలె శల్యుడు అయినట్లు కూడా వ్యాసుడు వర్ణించాడు. తిక్కన ఇంద్రుడి వజ్రాయుధం వలన కూలిన పర్వతశిఖరంతో పోల్చి వర్ణించాడు.

**ఆ. భూమిమీఁద నిట్లు బోరగిలంబడి । మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర!**
**లేమయురమునందు లీలమై వ్రాలిన । ప్రాణనాథుఁ బోల్పఁ బట్టు గాఁగ. 286**

**ప్రతిపదార్థం:** మానవ= మనుజులకు; ఇంద్ర!= ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇట్లు= ఈ ప్రకారముగ; భూమిమీఁదన్= నేలమీద; బోరగిలన్+పడి= రొమ్ము భూమిపై ఆనునట్లుగా పడి; మద్రనాథుఁడు= శల్యుఁడు; లేమ= యౌవనవతి అయిన మగువయొక్క; ఉరమునందున్= వక్షఃస్థలముమీద; లీలమైన్= విలాసంతో; వ్రాలిన= ఒరిగిన; ప్రాణనాథున్= ప్రియుని(భర్తను); పోల్పన్= పోల్చుటకు; పట్టు= స్థానము; కాఁగన్= అగునట్లుగా; ఒప్పెన్= ప్రకాశించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ప్రకారంగా నేలమీద బోరగిలపడి శల్యుడు యౌవనవతి అయిన మగువ వక్షఃస్థలంమీద విలాసంతో ఒరిగిన ప్రియుడితో పోల్చటానికి తగినట్లుగా ప్రకాశించాడు.

**విశేషం:** రాజుకు భూనాథుడని పేరు. శల్యుడు రాజు, భూపాలుడు. భూమి స్త్రీ రూపిణి. అందువలన ఈ పద్యంలోని శల్య వర్ణనం సముచితం.

**ఆ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి। పొలిచెఁ జూడ మద్రభూవిభుండు**
**విధియుతంబు గాఁగ వేలిచి విడిచిన। నాఱి యున్నయగ్ని ననుకరించి. 287**

**ప్రతిపదార్థం:** మద్రభూవిభుండు= మద్రదేశ ప్రభువైన శల్యుడు; ధర్మసంగరమునన్= ధర్మయుద్ధమునందు; ధర్మజునిచేన్= ధర్మరాజుచేత; చచ్చి= మరణించి; విధియుతంబు గాఁగన్= వేద విధి విధానముతో కూడి; వేలిచి= హోమాగ్నియందు నేయి మొదలగు వానిని స్వాహాకారముతో సమర్పించి; విడిచినన్= వదలిపెట్టగా; ఆఱి= ఆరిపోయి; ఉన్న= ఉన్నట్టి; అగ్నిన్= హోమాగ్నిని; అనుకరించి; చూఁడన్= చూడగా; పొలిచెన్= ఒప్పెను.

**తాత్పర్యం:** శల్యుడు ధర్మయుద్ధంలో ధర్మరాజు వలన మరణించి, వేదవిధివిధానసహితంగా హోమాగ్నిలో స్వాహాకారంతో సమర్పించి విడిచిన ఘృతాదివస్తు సముదాయం హుతమై ఉపశమించి ఉన్నట్టి అగ్నిని అనుకరించి సాక్షాత్కరించాడు.

**విశేషం:** శల్యుడి పవిత్రమూర్తిమత్త్వం, ధర్మస్వరూపం, వ్యక్తిత్వసత్యం - ఈ ఒక్క ఆటవెలది యందు సాక్షాత్కరించబడ్డాయి. భీష్ముడు ఎంతటి పరాక్రమవంతుడో, ధర్మస్వరూపుడో, శల్యుడూ అంతటివాడే. రెండు ధర్మాలకు పరస్పరసంఘర్షణమే శల్య ధర్మరాజుల యుద్ధంలోని అంతరార్థం. ధర్మరాజుచేత మరణించటమే శల్యుడి ఉత్తమత్వానికి నిదర్శనం. హిరణ్యకశిపుని పుత్రుడు ప్రహ్లాదుడు; ప్రహ్లాదుడి తమ్ముడు సంహ్లాదుడు. ఈ సంహ్లాదుడి అంశావతారం శల్యుడు. అసలు మహాభారతంలోని పాత్రలన్నీ అంశావతారాలే.

> **'ప్రియయా కాన్తయా కాన్తః పతమానమివోరసి ।**
> **చిరం భుక్త్వా వసుమతీం ప్రియాం కాన్తా మివ ప్రభుః ॥**
> **సర్వైరంగైః సమాశ్లిష్య ప్రసుప్త ఇవ సోఽభవత్ ।**
> **ధర్మ్యే ధర్మాత్మనా యుద్ధే విహతో ధర్మసూనునా ।**
> **సమ్యక్ హుత ఇవ స్విష్టః ప్రశాంతోఽగ్నిరివాధ్వరే ॥ (శల్య. 16-54, 55, 56)**

ఇవి పై రెండు ఆటవెలదులకు మూలాలు. ఎంతటి రమణీయ ఉపమాలంకారాలు!

**మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ**
**కిన నా భూపతి చిత్రచాపధరుఁడై కేళీసమప్రక్రియన్**
**ధనువుం గేతువుఁ ద్రుంచి తోడన సముద్యద్దీప్తభల్లాహతిం**
**దునిమెం గుండలకాంతమైన శిరమున్ దుర్దాంతదర్పంబునన్. 288**

**ప్రతిపదార్థం:** శల్య= శల్యుడియొక్క; అనుజుఁడు= తమ్ముడు; కని= చూచి; ఉగ్ర= భయంకరమయిన; స్ఫూర్తి= స్ఫురణము; శోభిల్లన్= ప్రకాశింపగా; ధర్మసుతున్= ధర్మరాజును; ఏచి= విజృంభించి; తాఁకినన్= ఎదుర్కొనగ; ఆ భూపతి= ఆ ధర్మరాజు; చిత్ర= ఆశ్చర్యజనకమయిన; చాప= ధనువును; ధరుఁడై= ధరించినవాడై; కేళీ= క్రీడతో; సమ= సమానమయిన; ప్రక్రియన్= విధముతో; ధనువున్= వింటిని; కేతువున్= టెక్కెమును; త్రుంచి= ఖండించి; తోడన= వెంటనే; సముద్యత్= సంసిద్ధతతో; దీప్త= ప్రజ్వలించుచున్న; భల్ల= బల్లెముయొక్క; ఆహతిన్= దెబ్బతో; దుర్దాంత= సహింపశక్యంకాని; దర్పంబునన్= గర్వముతో; కుండల= కర్ణకుండలములవలన; కాంతము= ప్రకాశవంతము; ఐన= అయినట్టి; శిరమున్= తలను; తునిమెన్= ఖండించెను.

**తాత్పర్యం:** శల్యుడి తమ్ముడు శల్యుడి మరణాన్ని చూచి భయంకరాకారుడై ప్రకాశిస్తూ, విజృంభించి ధర్మరాజును ఎదుర్కొనగా ధర్మరాజు ఆశ్చర్యజనకమైన వింటిని ధరించి, ఆటాడినట్లుగా శల్యుడి తమ్ముడి వింటిని టెక్కెమును ఖండించి, ఆ వెంటనే సంసిద్ధతతో ప్రకాశిస్తున్న బల్లెంయొక్క దెబ్బతో సహింపశక్యం కాని గర్వంతో కర్ణకుండలాలతో కాంతిమంతమైన తలను ఖండించాడు.

**విశేషం:** శల్యుడి తమ్ముడనియే కాని పేరులేదు- అగస్త్యభ్రాతవలె. ఇట్టివారు పురాణాలలో చాలామంది ఉన్నారు.

**వ. ఇట్లు శల్యుండు సోదర సహితంబుగాఁ బడినఁ బాండవసైన్యంబు జనంబులు వృత్రవధం బొనరించు పాకశాసనుఁ బ్రశంసించు బృందారకుల చందంబున నగ్గించి రమ్మొగ్గరంబునం దూర్యనినదంబులు సింహనాదంబులుఁ జెలంగఁ గలంగి కురుసేన విఱిగి పఱచినం బోనీక పొడువుం డనుచు సాత్యకి వెనుకొనుటయుఁ గనుంగొని కృతవర్ముండు మార్కొనియె. నయ్యాదవసింహులరణంబు దారుణంబయ్యె నందు. 289**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; శల్యుండు; సోదరసహితంబుగాన్= తమ్ముడితోకూడ; పడినన్= మరణించగా; పాండవ= పాండవులయొక్క; సైన్యంబు= సైన్యముయొక్క; జనంబులు= సైనికులు; వృత్ర= వృత్రాసురునియొక్క; వధన్= సంహారమును; పొనరించు= చేయు; పాకశాసనున్= ఇంద్రుని; ప్రశంసించు= పొగడు; బృందారకుల= దేవతల; చందంబునన్= విధముగా; అగ్గించిరి= పొగడిరి(స్తుతించిరి); ఆ; మొగ్గరంబునన్= సేనావ్యూహమునందు; తూర్య= తూర్యములయొక్క; నినదంబులు= ధ్వనులు; సింహనాదంబులున్= సింహగర్జనములును; చెలంగన్= గోల చేయగా; కలంగి= కలతచెంది; కురుసేన= కౌరవులసైన్యము; విఱిగి= ఓడిపోయి; పఱచినన్= పాఱిపోవుచుండగా; పోనీక= పోనీయక; పొడవుండు= పోట్లాడుడు; అనుచున్= అనుచు; సాత్యకి; వెనుకొనుటయున్= వెంటాడుటయును; కనుంగొని= చూచి; కృతవర్ముండు; మార్కొనియెన్= ఎదుర్కొనియెను; ఆ; యాదవసింహుల= యాదవశ్రేష్ఠులైన-సాత్యకి కృతవర్మలయొక్క; రణంబు= యుద్ధము; దారుణంబు= భయంకరము; అయ్యెను; అందున్= ఆ యుద్ధమునందు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా శల్యుడు తమ్ముడితో కూడా మరణించగా పాండవుల సైన్యంలోని సైనికులు వృత్రాసురుడిని సంహరించిన మహేంద్రుడిని పొగడే దేవతల విధంగా పొగిడారు. అప్పుడు ఆ సేనావ్యూహంలో తూర్యధ్వనులు, సింహగర్జనలు శబ్దించగా కలతచెంది కురుసేన ఓడిపోయి పారిపోతూ ఉండగా 'పోట్లాడండి' అంటూ సాత్యకి వెంటాడటాన్ని చూచి కృతవర్మ ఎదుర్కొన్నాడు. ఆ యాదవశ్రేష్ఠులయొక్క యుద్ధం భయంకరమైనది. ఆ యుద్ధంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. కృతవర్మ సాత్యకి నతిశితశరదశ । కమున నొంచి తురంగముల యుబ్బు**
**నుడిపి విల్లునుముటయును నొండువింట న । బ్బలియుఁ డాతని మేనఁ బదిమెఱుంగు**
**టమ్ములు వఱపి రథ్యమ్ముల నరదంబు । సూతుని నఱికినఁ జూచి కృపుఁడు**
**దనతేరిపైఁ బెట్టుకొని తొలఁగించె న । వ్వీరుపోరికి మూఁక వెఱచి పఱచెఁ**

**తే. గడఁగి వెనుకొన్న పాండవోత్కరము నొకఁడ । నిలువరించె నుద్దండుఁడై నీతనూజుఁ**
**డంత వేఱొక్కతే రెక్కి యరుగుదెంచి । తాఁకె హార్దిక్యుఁ డరిసేన తల్లడిల్ల. 290**

**ప్రతిపదార్థం:** కృతవర్మ; సాత్యకిన్; అతి= మిక్కిలి; శిత= వాడిఅయిన; శర= బాణములయొక్క; దశకమునన్= పదింటితో; నొంచి= నొప్పించి; తురంగముల= గుర్రములయొక్క; ఉబ్బున్= పొంగు; ఉడిపి= పోగొట్టి; విల్= విల్లు(ధనువు); తునుముటయున్= ఖండించుటయును; ఒండు= మరియొక; వింటన్= ధనువుతో; ఆ+బలియుఁడు= ఆ బలవంతుడు(సాత్యకి); ఆతని= ఆ కృతవర్మయొక్క; మేనన్= శరీరమునందు; పది; మెఱుంగు= ప్రకాశవంతమయిన; అమ్ములు= బాణములు; పఱపి= ప్రయోగించి; రథ్యమ్ములన్= గుర్రాలను; అరదంబున్= రథమును; సూతునిన్= సూతుని; నఱికినన్= ఖండించగా; చూచి; కృపుఁడు; తన; తేరిపైన్= రథముమీద; పెట్టుకొని= ఉంచుకొని; తొలఁగించెను= తప్పించెను; ఆ; వీరు= వీరుడయిన సాత్యకియొక్క; పోరికిన్= యుద్ధమునకు; మూఁక= సైన్యము; వెఱచి= భయపడి; పఱచెన్= పాఱిపోయెను; కడఁగి= పూనికవహించి; వెనుకొన్న= వెంటాడిన; పాండవ= పాండవులయొక్క; ఉత్కరమున్= సమూహమును; నీతనూజుఁడు= నీయొక్క కొడుకు (దుర్యోధనుఁడు); ఒకఁడు+అ= ఒక్కడే; ఉద్దండుఁడై= అధికుడై; నిలువరించెను= ఆపెను; అంతన్= అంతలో; వేఱొక్క= ఇంకొక; తేరు= రథము; ఎక్కి; హార్దిక్యుఁడు= కృతవర్మ; అరుగుదెంచి= వచ్చి; అరిసేన= శత్రుసేన; తల్లడిల్లన్= తొట్రుపాటు పడగా(చలింపగా); తాఁకెన్= ఎదిరించెను.

**తాత్పర్యం:** కృతవర్మ సాత్యకిని మిక్కిలి వాడి అయిన పదిబాణాలతో నొప్పించి, గుర్రాల పొంగు పోగొట్టి, ధనువును ఖండించాడు. బలవంతుడైన సాత్యకి మరియొక ధనువుతో ఆ కృతవర్మ శరీరమునందు ప్రకాశవంతమయిన పదిబాణాలు ప్రయోగించి గుర్రాలను రథాన్ని, సూతుడిని ఖండించాడు. అది చూచి కృపుడు, కృతవర్మను తన రథంపై పెట్టుకొని అచ్చటనుండి తప్పించాడు. వీరుడైన ఆ సాత్యకి చేసే యుద్ధానికి సైన్యం భయపడి పారిపోయింది. వెంటాడుతున్న పాండవసైన్యసమూహాన్ని దుర్యోధనుడు ఒక్కడే నిలువరించాడు. అంతలో ఇంకొక రథం ఎక్కి కృతవర్మ వచ్చి శత్రుసేన తొట్రుపాటు పడేటట్లు ఎదిరించాడు.

**వ. ఇ ట్లెదిర్చి పేర్చినయలుకఁ బాండవాగ్రజుండు గృతవర్మని ఘోటకంబులను గీటడఁగించినఁ గురునందనుం డా హృదికనందనుని నిజస్యందనంబున నిడుకొని యవ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ము లెమ్ములం గీలింప నతండు పదాఱుతూపుల నాభూపాలునిఁ దదీయ తురంగంబుల నేసె నా సమయంబున. 291**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; ఎదిర్చి= ఎదిరించి; పేర్చిన= అధికమైన; అలుకన్= కోపముతో; పాండవ= పాండవులలో; అగ్రజుండు= పెద్దవాడు అయిన ధర్మరాజు; కృతవర్మని= కృతవర్మయొక్క; ఘోటకంబులను= గుర్రములను; గీటడఁగించినన్= చంపగా; గురునందనుండు= అశ్వత్థామ; హృదికనందనుని= హృదికునియొక్క పుత్రుడయిన కృతవర్మను; నిజ= తనయొక్క; స్యందనంబునన్= రథమునందు; ఇడుకొని= ఉంచుకొని; అవ్వలికిన్= ఆవలకు; కొనిపోయెన్= తీసికొని పోయెను; అప్పుడు; కృపాచార్యుండు; కదిసినన్= కలియబడగా; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; ఆఱు= ఆరు; అమ్ములు= బాణములు; ఎమ్ములన్= ఎముకలను; కీలింపన్= తగిలించగా; అతండు= కృపాచార్యుఁడు; పదాఱు= పదియు ఆరు(పదహారు); తూపులన్= బాణములతో; ఆ భూపాలునిన్= ఆ ధర్మరాజును; తదీయ= ఆతడి; తురంగంబులన్= గుర్రములను; ఏసెను= కొట్టెను; ఆ సమయంబున.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ఎదిరించి అతిశయించిన కోపంతో ధర్మరాజు కృతవర్మ గుర్రాలను చంపాడు. అశ్వత్థామ కృతవర్మను తన రథమునం దుంచుకొని ఆవలకు తీసికొని పోయాడు. ఆ సమయంలో కృపాచార్యుడు

కలియబడగా ధర్మరాజు ఆరుబాణాలతో ఎముకలను కొట్టాడు. అంతట కృపాచార్యుడు పదహారు బాణాలతో ధర్మజుడిని, ఆతడి గుర్రాలను కొట్టాడు. ఆ సమయంలో.

**తే.** **భద్రకరి నెక్కి చామర ప్రకరవీజ। నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి**
**యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ। బొలిచె నెంతయు భవదీయపుత్త్రుఁ డధిప! 292**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; భవదీయ= మీయొక్క; పుత్రుఁడు= కుమారుఁడు అయిన దుర్యోధనుఁడు; భద్రకరిన్= భద్రగజమును(శుభమును కలుగచేయు ఏనుగు భద్రగజము); ఎక్కి; చామర= వింజామరలయొక్క; ప్రకర= సమూహములయొక్క; వీజనములు= విసరుటలు; ధవళ= తెల్లని; ఆతపత్ర= గొడుగులయొక్క; విభ్రమ= విలాసముయొక్క; సమృద్ధి= అధికమయిన సంపద; అతిశయిల్లన్= ఆధిక్యమునందగా; సైన్య= సైన్యముయొక్క; ఉత్సాహము= ప్రయత్నము; ఆవహిల్లన్= కలుగగా; ఎంతయున్= మిక్కిలి; పొలిచెను= ఒప్పెను. (ప్రకాశించెను)

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ పుత్రుడు దుర్యోధనుడు భద్రగజాన్ని ఎక్కి వింజామరల సమూహాలు వీస్తుండగా, తెల్లని గొడుగుల విలాససంపద విలసిల్లగా సైన్యంయొక్క ప్రయత్నం కలుగగా మిక్కిలి ప్రకాశించాడు.

**శల్యుచుట్టంబు లొక్కపెట్ట ధర్మరాజుం జుట్టుముట్టుట (సం. 9-17-3)**

**ఉ.** **అమ్మనుజేంద్రు ముందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుచు**
**ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు లు**
**గ్రమ్ముగ వీఁకఁ దేరులు పొగడ్తకు నెక్కఁగ దీప్తమైన కో**
**పమ్మున నేచి పాండవులపై నడరం గని పేరెలుంగునన్. 293**

**ప్రతిపదార్థం:** శల్యుచుట్టమ్ములు= శల్యుడి యొక్క చుట్టములు; అనేకులు; వీర= శూరులయిన; యోధులు= పరాక్రమవంతులు; సత్వరమ్ముగన్= వేగముగా; కడంగి= ప్రయత్నించి; ఆ+మనుజేంద్రు= ఆ ధర్మరాజు; ముందటికిన్= ముందునకు; ఆర్పులతోన్= అరుపులతో; చనుదెంచి= వచ్చి; సత్వరమ్ముగన్= శీఘ్రంగా; కడంగి= పూని; అనేకులు= పెక్కులు; వీరయోధులు; ఉగ్రమ్ముగన్= భయంకరంగా; వీఁకన్= పరాక్రమంతో; తేరులు= రథాలు; పొగడ్తకున్= స్తుతికి; ఎక్కఁగన్; దీప్తమైన= ప్రకాశవంతమయిన; కోపమ్మునన్= కోపముతో; ఏచి= విజృంభించి; పాండవులపైన్= పాండవులమీద; అడరన్= విజృంభించుట; కని= చూచి; పేరు= పెద్ద; ఎలుంగునన్= కంఠధ్వనితో.

**తాత్పర్యం:** శల్యుడి చుట్టాలు పరాక్రమవంతులైన యోధులు అనేకులు వేగంగా ప్రయత్నించి ఆ ధర్మరాజు ముందుకు పెడబొబ్బలు పెట్టుతూ వచ్చి చుట్టుముట్టగా పరాక్రమంతో కోపంతో విజృంభించి పాండవులమీద విజృంభించటాన్ని చూచి పెద్ద కంఠధ్వనితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఈ పద్యమునకు మూలం చిన్న అనుష్టుప్పు.

**'శల్యేఽథ నిహతే రాజన్ మద్రరాజ పదానుగాః ।**
**రథాః సప్తశతా వీరా నిర్యయు ర్మహతో బలాత్ ॥** **(9-17-1)**

**వ.** **అన్నరనాథుండు. 294**

**ప్రతిపదార్థం:** ఆ+నరనాథుండు= ఆ దుర్యోధనుడు.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు.

**తే.** **మీర లేర్పడ వడిఁ దలమిగిలి చనఁగ । వలదు నాద్రోల బలుపారి నిలువుఁడనియె**
**వారు నిలువక పాండవబలము చేవ । దఱుగఁ జొచ్చి యుధిష్ఠిరుఁ దాఁకి రధిప! 295**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజ!; మీరలు= మీరు; ఏర్పడన్= తేటపడునట్లు; వడిన్= వేగముగా; తలమిగిలి= ముందుకు; చనఁగన్= వెడలగ; వలదు; నాద్రోలన్= నా ఎదుట; బలుపు+ఆరి= బలము కలిగి; నిలువుఁడు; అనియెన్= అనియెను; వారు నిలువక; పాండవబలము= పాండవుల సైన్యముయొక్క; చేవ= ధైర్యము; తఱుగన్= తగ్గిపోవునట్లు; చొచ్చి= ప్రవేశించి; యుధిష్ఠిరున్= ధర్మరాజును; తాఁకిరి= ఎదుర్కొనిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! 'మీరు వేగముగా ముందుకు వెడల వద్దు. నా ఎదుట బలంగా నిలవండి.' అని దుర్యోధనుడు శల్యుడి చుట్టాలను వారించినా వారు నిలువక పాండవబలముయొక్క ధైర్యం తరిగిపోవునట్లు ప్రవేశించి ధర్మరాజును ఎదుర్కొన్నారు.

**వ.** **ఇట్లు చలంబున నవ్విభుం దలపడి వివిధాస్త్రంబులు గుప్పించి నొప్పించినఁ గవ్వడియును వడముడియుఁ గవలును ద్రౌపదికొడుకు లేవురును గోవిందుతమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున నుద్దండచతురంగ సమేతులై యా రథికులఁ బొదువుటయును వారలు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్మదమకరప్రకరంబులవిధంబున విహరించి రట్లు పాండవసేనాసంక్షోభసంపాదులగు నాజోదుల యాటోపం బాలోకించి గాంధారపతి గాంధారేయు నాలోకించి. 296**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగ; చలంబునన్= మాత్సర్యముతో; ఆ; విభున్= ప్రభువు అయిన ధర్మరాజును; తలపడి= ఎదుర్కొని; వివిధాస్త్రంబులు= నానావిధములయిన ఆయుధములు; కుప్పించి= ఒక్కసారిగా ప్రయోగించి; నొప్పించినన్= బాధించగా; కవ్వడియును= అర్జునుడును; వడముడియున్= భీముడును; కవలును= నకుల సహదేవులును; ద్రౌపదికొడుకులు= ద్రౌపదియొక్క పుత్రులు; ఏవురును= అయిదుగురును; గోవిందు= శ్రీకృష్ణుడియొక్క; తమ్ముండును= తమ్ముడు అయిన సాత్యకియును; ధృష్టద్యుమ్నుండును; శిఖండియును; చండ= తీవ్రమయిన; రయంబునన్= వేగముతో; ఉద్దండ= అధికమయిన; చతురంగ= చతురంగ సైన్యములతో; సమేతులై= కూడినవారై; ఆ రథికులన్= రథముపై నుండి యుద్ధము చేయు ఆ యోధులను; పొదువుటయును= క్రమ్ముకొనుటయును; వారలు= వారు; వీర= పరాక్రమముయొక్క; ఉద్రేకంబునన్= అధికమయిన ఆవేశమువలన; సైన్య= సేనలు అనెడి; సాగరంబునన్= సముద్రమునందు; ఉన్మద= మదించిన; మకర= మొసళ్ళయొక్క; ప్రకరంబుల= సమూహములయొక్క; విధంబునన్= ప్రకారముగా; విహరించిరి= వేడుకగా తిరిగిరి; అట్లు; పాండవ= పాండవులయొక్క; సేనా= సేనలకు; సంక్షోభ= అలజడిని; సంపాదులు= కలిగించినవారు; అగు= అయినట్టి; ఆ జోదుల= ఆ యోధులయొక్క; ఆటోపంబు= ఆడంబరము; ఆలోకించి= చూచి; గాంధార= గాంధారదేశమునకు; పతి= భర్త(అనగా గాంధారరాజు శకుని); గాంధారేయున్= గాంధారిపుత్రుడైన దుర్యోధనుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా మాత్సర్యంలో ఆ ధర్మరాజును చుట్టుముట్టి నానావిధాలయిన ఆయుధాలు ఒక్కసారిగా ప్రయోగించి బాధించగా అర్జునుడు, భీముడు, నకుల సహదేవులు, ద్రౌపదికొడుకులైన ఉపపాండవులు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, శిఖండియును తీవ్రమైన వేగంతో అధికమైన చతురంగబలాలతో కూడి ఆ యోధులను చుట్టుముట్టారు.

ఆ శల్యుడి చుట్టములు పరాక్రమావేశపరులై సేన అనే సముద్రంలో మదించిన మొసళ్ళయొక్క గుంపుల విధంగా వేడుకగా తిరిగారు. ఆ ప్రకారంగా పాండవసైన్యాల అలజడిని సంపాదించినట్టి ఆ మద్రదేశయోధుల ఆడంబరాన్ని చూచి శకుని దుర్యోధనుడితో.

**విశేషం:** అలం: ఉపమ. రూపకానుప్రాణితం.

**తే.** **'మద్రవిభువారి నిమ్మెయి మార్తు రాఁగి । కొనఁగ మనకు నుపేక్షింపఁ జనునె?' యనుడు**
**నతఁడు 'నామాట వినక వా రరిగి రేమి । సేయువారము? చెప్ప మౌచిత్య మనియె'** **297**

**ప్రతిపదార్థం:** మద్రవిభు= మద్రదేశపు అయిన శల్యునికి సంబంధించిన; వారిన్= వారిని; ఇమ్మెయిన్= ఈ విధముగా; మార్తురు= చంపుదురు; మనకున్= మనకు; ఆగికొనగన్= అడ్డగించుటకు; ఉపేక్షింపన్= అశ్రద్ధచేయగా; చనునె?= చెల్లునా? (తగునా?); అనుడున్= శకుని ఇట్లు అనగా; అతఁడు= ఆ దుర్యోధనుఁడు; నామాట; వినక= వినకుండా; వారు; అరిగిరి= వెడలిరి; ఏమి చేయువారము?= చేయగలము?; ఔచిత్యము= ఉచితమార్గము; చెప్పుము; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'శల్యుడికి సంబంధించిన వారిని పాండవులు ఈవిధంగా చంపుతారు. ఆ పాండవులను అడ్డగించటానికి మనకు అశ్రద్ధ చేయతగునా?' శకుని ఇట్లా చెప్పగా దుర్యోధనుడు ఇట్లా అన్నాడు. 'ఆ శల్యుడి అనుచరులు నామాట వినకుండ వెళ్ళారు. ఏమి చేయగలం? ఉచితమయిన మార్గం చెప్పుము'. అన్నాడు.

**వ.** **అని నన్ను నాపరివారంబును రక్షింపను దగవెఱింగింపను నర్హుండ వీవకాదె?' యనుమాట లాడిన నతండు ప్రీతుండై బలపరిపాలనంబును గర్జంబు సెప్పుటయును దనపనిగా మనంబునంబూని యవి దోఁచునట్టి యుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం బాపాదించి.** **298**

**ప్రతిపదార్థం:** అని; నన్నున్; నాపరివారంబును= నాయొక్క పరిజనమును; రక్షింపను= రక్షించుకొనుటకు; తగవు= న్యాయము (మార్గము); ఎఱింగింపను= తెలియచెప్పుటకు; ఈవ= నీవే; అర్హుండవు= తగినవాడవు; కాదె?= కాదా?; అను= అనెడి; మాటలు= పలుకులు; ఆడినన్= పలికిన; అతండు= ఆ శకుని; ప్రీతుండై= సంతోషించినవాడై; బల= సైన్యముయొక్క; పరిపాలనంబును= నిలుపుటను(కాపాడుటను); కర్జంబు= కార్యము; చెప్పుటయును= చెప్పుటకూడా; తనపనిగాన్= తనయొక్క పనిగా(కార్యముగా); మనంబునన్= మనస్సునందు; పూని= తలచి; అవి; తోఁచునట్టి= తోచునట్టి; ఉచిత వచనంబులన్= న్యాయమయిన మాటలతో; ఆ+వసుమతీ పతికిన్= రాజు దుర్యోధనుడికి; ప్రియంబు= సంతోషము; ఆపాదించి= కలిగించి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు శకునితో ఇట్లా అని, 'నన్ను నా పరిజనాన్ని రక్షించుకొనటానికి తగిన మార్గాన్ని న్యాయాన్ని తెలియచెప్పటానికి నీవే సమర్థుడవుకదా!' అనగా - ఆ శకుని సంతోషించినవాడై తన పనిగా మనస్సునందు తలచి, ఉచితవచనాలతో ఆ దుర్యోధనుడికి సంతోషం కలిగించి.

**చ.** **'వినుము నరేంద్ర! సైనికులు విక్రమలీల నరాతిసేన సొ**
**చ్చినఁ బతి గావకున్న నుపజీవులు మెత్తురె? యన్నఁ 'గాతుఁ గా'**
**కని బహుతూర్యనాదములు నార్పులునుం జెలఁగంగఁ ద్రోచి య**
**జ్జనపతి వీఁకమై నడరె సైన్యయుతంబుగ సత్వరంబుగన్.** **299**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ప్రభువు అయిన (అనగా రాజు అయిన దుర్యోధనా!); వినుము; సైనికులు; విక్రమ= పరాక్రమముయొక్క; లీలన్= విలాసముతో; అరాతి= శత్రువులయొక్క; సేన= సైన్యము; చొచ్చినన్= ప్రవేశించగా; పతి= అధిపతి; కావకున్నను= రక్షించకున్నచో; ఉపజీవులు= రాజుపై ఆధారపడి జీవించువారు; మెత్తురె?= మెచ్చుకొందురా?; అన్నన్= అనగా; కాతున్= రక్షింతును గాక అని; బహు= పలు; తూర్యనాదములును= తూర్య ధ్వనులును; ఆర్పులునున్= అరుపులును; చెలఁగంగన్= ధ్వనించగా; త్రోచి= లెక్కజేయక; ఆ+జనపతి= ఆ దుర్యోధనుడు; సత్వరంబుగన్= మిక్కిలి వేగముగా; సైన్యయుతంబుగన్= సేనా సమేతముగా; వీఁకమైన్= పరాక్రమముతో; అడరెన్= అతిశయించెను.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన మహారాజా! ఆలకించుము. సేనలు పరాక్రమవిలాసంతో శత్రుసైన్యమునందు ప్రవేశించినప్పుడు వారి అధిపతి రక్షించకపోతే వారిపై ఆధారపడి జీవించేవారు మెచ్చుకొంటారా?' అని శకుని అనగా 'వారిని రక్షిస్తాను-' అని పలు తూర్యధ్వనులు, సైనికుల అరుపులు వ్యాపించగా, వాటిని దుర్యోధనుడు లెక్కచేయక మిక్కిలి వేగంగా సేనాసమేతంగా పరాక్రమంతో విజృంభించాడు.

**క. అంత ధనంజయ కిమ్మీ । రాంతకముఖ యోధవర మహాస్త్రప్రకరం**
**బంతకుకడ కనిచెఁ బరి । శ్రాంతంబగు మద్రనాథు రథిక చయంబున్. 300**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో; ధనంజయ= అర్జునుడు; కిమ్మీరాంతక= భీముడు; ముఖ= మున్నగు; యోధవర= శ్రేష్ఠులయిన యోధులయొక్క; మహా= గొప్ప; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములయొక్క; ప్రకరంబు= సమూహం; పరిశ్రాంతంబు= మిక్కిలి అలసిపోయింది; అగు= అయినట్టి; మద్రనాథు= శల్యుడియొక్క; రథిక= రథికయోధులయొక్క; చయంబున్= సమూహమును; అంతకుకడకున్= యమునియొద్దకు; అనిచెన్= పంపించెను.

**తాత్పర్యం:** అంతలో దుర్యోధనుడు సేనాసమేతుడై విజృంభించగా అర్జునుడు, భీముడు మొదలైన యోధ శ్రేష్ఠుల గొప్ప గొప్ప అస్త్ర సమూహాలు అలసిపోయిన ఆ శల్యుడి రథిక సమూహాలను యముడి మందిరానికి పంపాయి (సంహరించాయి).

**వ. ఇవ్విధంబున. 301**

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా.

**మ. అరులం గీటడఁగించి పాండుసుతు సైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం**
**గురుభూనాయకుసేన నొచ్చి కలయం గూలన్ ధరన్ గుంపులై**
**తిరుగం బాఱఁగఁ జొచ్చె విచ్చె మరలన్ దిగ్భ్రాంతి వాటిల్ల స**
**త్వరతన్ నల్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లఁగన్. 302**

**ప్రతిపదార్థం:** అరులన్= శత్రువులను; గీటడఁగించి= చంపి; పాండుసుతు= ధర్మరాజుయొక్క; సైన్యంబు= సేన; ఉబ్బి= సంతోషించి; పైన్+క్రమ్మినన్= మీదపడి వ్యాపించగా(చుట్టుముట్టగా); కురుభూనాయకు= దుర్యోధనుడియొక్క; సేన= సైన్యము; నొచ్చి= బాధచెంది; గుంపులై= ప్రోగులై; ధరన్= భూమిపై; కూలన్= కూలిపోగా; కలయన్= అంతటా; తిరుగన్= వెనుతిరిగి; పాఱఁగన్= పాఱిపోవను; చొచ్చెన్= ప్రయత్నించెను; మరలన్= తిరిగి; దిగ్భ్రాంతి= ఆశ్చర్యకరమయిన భ్రమ; పాటిల్లన్= కలుగగా; విచ్చెన్= విడివడిపోయెను; ఆ+విభుఁడు= ప్రభువు అయిన ఆ దుర్యోధనుఁడు; గర్వంబు= దర్పంబు; ఏది= నశించి; వెల్వెల్లఁగన్= వెలవెలపోవగా; సత్వర= మిక్కిలివేగిరపాటుతో కూడిన; గతిన్= గమనముతో; నల్గడన్= నాలుగుదిక్కులకు; పాఱెను= పారిపోయెను.

**తాత్పర్యం:** ధర్మరాజు సైన్యం శత్రువులను చంపి సంతోషించి మీదపడగా దుర్యోధనుడి సైన్యం బాధచెంది ప్రోగులై నేలపై కూలి, వెనుతిరిగి పారిపోవటానికి ప్రారంభించింది. మరల ఆశ్చర్యకరమైన భ్రమ కలుగగా విడిపోయింది. ఆ దుర్యోధనుడు దర్పం నశించి వెలవెలపోగా మిక్కిలి వేగిరపాటుతో కూడిన గమనంతో నలుదిక్కులకు పారిపోయింది.

**క. మనవారి కపుడు భీష్ముని । చనుటయుఁ గోదండగురుని సమయుటయును గ**
**ర్ణుని పొలియుటయును గ్రొత్తై । మనమున వెనుఁబాటు గదిరె మనుజాధీశా! 303**

**ప్రతిపదార్థం:** మనుజాధీశా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అపుడు= ఆ సమయమున; మనవారికిన్= మన సైన్యమునకు; భీష్మని= భీష్మునియొక్క; చనుటయును= పోవుటయును; కోదండగురుని= ద్రోణుని; సమయుటయును= చనిపోవుటయును; కర్ణుని; పొలియుటయును= చనిపోవుటయును; క్రొత్తై; మనస్సునందు; వెనుఁబాటు= విషాదము; కదిలె(న్)= కలిగెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయంలో మన సైన్యానికి భీష్ముడి, ద్రోణుడి, కర్ణుడి మరణాలు క్రొత్తగా మనస్సులలో విషాదం కలిగించాయి.

**విశేషం:** మూలము: 'భీష్మే ద్రోణే చ నిహతే సూతపుత్రే చ భారత । యద్దుఃఖం తవ యోధానాం భయం చాసీ ద్విశాంపతే' (9-18-5)

**వ. అప్పు డద్దిక్కు జనంబులు. 304**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆ+దిక్కు= ఆ వైపు; జనంబులు= జనులు.

**తాత్పర్యం:** ఆ సమయంలో పాండవపక్షంలోని జనులు.

**చ. ధరణికి నింక నాయకుఁడు ధర్మతనూజుఁడు నేఁ డవశ్యముం**
**గురుపతి గూలు నెవ్వగలకుం గుదురయ్యెడు నాంబికేయుఁ డు**
**ద్ధురు లగు పాండునందనుల దుర్దమభంగి యెఱింగి ధర్మత**
**త్పరులకు గెల్పు బ్రాఁతె? హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్? 305**

**ప్రతిపదార్థం:** ఉద్ధురులు= బలవంతులు; అగు= అయినట్టి; పాండునందనులు= పాండవులయొక్క; దుర్దమ= సహింపశక్యముకాని; భంగి= విధము; యెఱింగి= తెలిసికొని; ఇంకన్; ధరణికిన్= భూమికి; నాయకుఁడు= ప్రభువు(రాజు); ధర్మతనూజుఁడు= ధర్మరాజు; నేఁడు= ఈనాడు; అవశ్యమున్= తప్పకుండ; కురుపతి= దుర్యోధనుఁడు; కూలున్= మరణించును; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుఁడు; నెవ్వగలకున్= ఆపదలకు; కుదురు= అనుకూలుడు; అయ్యెడున్= అగును; ధర్మ= ధర్మమునందు; తత్పరులకున్= లగ్నమయిన మనస్సుకలవారికి; గెల్పు= విజయము; బ్రాఁతె?= దుర్లభమా?; హరి= విష్ణు; భక్తులన్; భూరి= గొప్ప; సంపదలు= ఐశ్వర్యములు; పొందవె?= ప్రాప్తించవా? (ప్రాప్తించునని అర్థము.)

**తాత్పర్యం:** బలవంతులైన పాండవుల సహింపశక్యంకాని విధం తెలిసికొని పాండవపక్షంలోని జనులు ఇంక ఈ భూమికి రాజు ధర్మరాజు; ఈనాడు దుర్యోధనుడు తప్పకుండ మరణిస్తాడు. ధృతరాష్ట్రుడు ఆపదల పాలౌతాడు. ధర్మమునందు మనస్సు లగ్నమైనవారికి జయం దుర్లభం కాదు. విష్ణుభక్తులకు అనంత ఐశ్వర్యాలు కలుగుతాయి.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. సామాన్య విషయం విశేష విషయంతో కాని, విశేష విషయం సామాన్య విషయంతోకాని సమర్థిస్తే అర్థాంతరన్యాసం. సామాన్యంతో - విశేషం - విశేషంతో సమర్థించినా అర్థాంతర న్యాసమే. ఇక్కడ రెండు సామాన్య విషయాలు ఉన్నాయి. 'ధర్మతత్పరులకు గెల్పు బ్రాఁతె' 'హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్' ఈ రెండు సామాన్య విషయాలతో - 'ఇంక ధరణికి నాయకుఁడు ధర్మతనూజుఁడు' అనే విశేష విషయం సమర్థించబడింది. ధర్మతత్పరత, హరిభక్తి-ఈ రెండూ పాండవులకు - అందునా ధర్మరాజునకు ఎక్కువగా ఉన్నాయి.

**వ.** **అని రట్టియెడ నీ కొడుకు నిజసారథిం జూచి 'మనబలం బాహవంబున కోహటించి పాఱెడు నిత్తఱి నేను బరవసంబు సేసినఁ గాని నిలువ దవ్విధంబునకు రథం బనువై యుండఁ జేసి చేరఁ దె' మ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు డిగ్గి రథంబెక్కి యెక్కుడు మగఁటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు సని యెలుం గెత్తి.** **306**

**ప్రతిపదార్థం:** అనిరి; అట్టియెడన్= ఆ సమయమున; నీ కొడుకు; నిజ= తనయొక్క; సారథిన్; చూచి; మనబలంబు= మనయొక్క సైన్యము; ఆహవంబునకున్= యుద్ధమునకు; ఓహటించి= వెనుదీసి; పాఱెడున్= పారిపోవుచుండెను; ఈ+తఱిన్= ఈ సమయమున; నేను; బరవసంబు= ధైర్యము; చేసినన్= కలుగచేసిన; కాని; నిలువదు= నిలిచి ఉండదు; ఆ+విధంబునకున్= ఆ ప్రకారముగా చేయుటకు; రథంబు; అనువై= అనుకూలమై; ఉండన్= ఉండుటను; చేసి; చేరన్= చేరుటకు; తెమ్ము= తీసికొనిరమ్ము; అనినన్= అనగా; వాఁడు; అట్ల= ఆ విధముగానే; చేయన్= చేయగా; అతండు= అతఁడు(దుర్యోధనుఁడు); ఏనుంగు= ఏనుగు; డిగ్గి= దిగి; రథంబు; ఎక్కి; ఎక్కుడు= అధికమయిన; మగఁటిమిన్= పౌరుషమువలన; పొంగు= ఉబ్బు; అంగంబులతోన్= అవయవములతో; సైనికులకున్= సేనలకు; అడ్డంబు= అడ్డముగ; చని= వెడలి; ఎలుంగు= పెద్దకంఠధ్వని; ఎత్తి.

**తాత్పర్యం:** 'ఇంక ధర్మరాజు నాయకుడు' అని పాండవ పక్ష జనులు అన్నారు. ఆ సమయంలో నీ పుత్రుడు దుర్యోధనుడు తనసారథిని చూచి 'మన సైన్యం యుద్ధానికి వెనుదీసి పారిపోతున్నది. ఈ సమయంలో నేను ధైర్యం కలిగిస్తే కాని నిలిచి ఉండదు. ఆ ప్రకారంగా చేయటానికి రథం అనుకూలమయినది. తెమ్ము' అని అనగా సారథి ఆ విధంగా చేయగా దుర్యోధనుడు ఏనుగు దిగి రథా న్నెక్కి అధికమైన పౌరుషం వలన ఉబ్బిన అవయవాలతో సైనికులకు అడ్డంగా వెడలి పెద్దకంఠధ్వనితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ.** **'ఎక్కడఁ బోవ వచ్చు? గిరులేనియుఁ గాననభూము లైనఁ దో**
**నెక్కియుఁ జొచ్చియుం బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్**
**ద్రొక్కక తక్క రట్లయిన దుర్గతి వాటిలుఁ బోక నిల్చి బే**
**రుక్కునఁ బోరినన్ సుగతి యొండెను సంపద యొండెఁ జొప్పడున్.** **307**

**ప్రతిపదార్థం:** ఎక్కడన్= ఎక్కడకు; పోవన్= పోవను; వచ్చున్?= వచ్చును?; గిరులు= పర్వతములు; ఏనియున్= అయినా; కానన= అరణ్య; భూములు; అయినన్; తోన్= తోడనే; ఎక్కియున్= ఎక్కియును; చొచ్చియున్= ప్రవేశించియును; పగతురు= శత్రువులు; ఏడ్తెఱన్= పరాక్రమముతో; కిట్టి= సమీపించి; చలంబునన్= మాత్సర్యముతో; తలల్= శిరములు; త్రొక్కక= త్రొక్కకుండ; తక్కరు= విడువరు; అట్లు= ఆ ప్రకారముగ; అయినన్= అయినచో; దుర్గతి= నరకము; వాటిలున్= కలుగును; పోక= పారిపోకుండా; నిల్చి= నిలిచి; పేరు= పెద్ద; ఉక్కునన్= శౌర్యముతో; పోరినన్= పోరాడినచో; సుగతి= స్వర్గము; ఒండెను= కానీ(ఐనా); సంపద; ఒండెన్= కానీ (ఐనా); చొప్పడున్= కలుగును.

**తాత్పర్యం:** 'ఎక్కడకు పోవచ్చును? పర్వతా లైనా, అరణ్యా లయినా వెంటనే ఎక్కి, చొచ్చి కూడా శత్రువులు పరాక్రమంతో సమీపించి మాత్సర్యంతో తలలు త్రొక్కకుండా విడువరు. ఆ ప్రకారంగా జరిగితే నరకం కలుగుతుంది. అట్లా పారిపోకుండా నిలిచి గొప్ప పరాక్రమంతో పోరాడితే స్వర్గం అయినా, సంపద అయినా కలుగుతుంది. (పోరాడి మరణిస్తే స్వర్గం - జయిస్తే సంపద కలుగుతాయని తాత్పర్యం.)

**వ. అట్లుం గాక. 308**

**ప్రతిపదార్థం:** అట్లున్= ఆ విధంగా; కాక= కాకుండ.

**తాత్పర్యం:** ఆ విధంగా కాక.

**క. పాండవబల మల్పంబై । యుండం గృష్ణుఁడు ధనంజయుండును దప్పిం**
**బెండువడఁగఁ గని మనకును । గం డడఁగఁగ నేల? గెలుపు గైకొన వచ్చున్.' 309**

**ప్రతిపదార్థం:** పాండవబలము= పాండవులయొక్క సైన్యము; అల్పంబు= తక్కువ(స్వల్పము); ఐ= అయి; ఉండన్= ఉండగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ధనంజయుండును= అర్జునుడును; డప్పిన్= దాహముతో; బెండువడఁగన్= బలహీనతనొందగా; కని; మనకును= మనకును; గండడఁగఁగన్= పరాక్రమహీనులగుట; ఏల?= ఎందులకు?; గెలుపు= జయము; కైకొనవచ్చున్= పొందవచ్చును.

**తాత్పర్యం:** పాండవుల సైన్యం తక్కువగా ఉండగా, శ్రీకృష్ణుడు అర్జునుడు దాహంతో బలహీనత పొందగా, మనం పరాక్రమహీనుల మవటం ఎందులకు? గెలుపు పొందవచ్చును.'

**వ. అని పలికి కరతలం బెత్తి నిలునిలుమనిన నీబలం బతని నగ్గించుచు మరలె. నమ్మేటిమగండు ముంగలి యయి నిలిచి పొంగారం గవియు కౌంతేయసేనాసముద్రంబునకుఁ జెలియలికట్ట యయ్యె. నయ్యవసరంబునందు మునుకొని వడిం దఱుము వడముడిం బొదివి మనపదాతిప్రకరంబు దర్పంబున నార్పులు బొబ్బలుం జెలంగ బహువిధాస్త్రశస్త్రంబులు వరఁగించినం బెరిఁగిన మదాతిరేకంబున గదాదండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ గూల్చు పెనుగాలి కైవడి నతం డేకవింశతి సహస్రసంఖ్యసుభటుల నేలపాలు సేసె నప్పుడు. 310**

**ప్రతిపదార్థం:** అని; పలికి; కరతలంబు= చేయి; ఎత్తి= పైకి ఎత్తి; నిలునిలుము= ఆగుము ఆగుము; అనినన్= అనగా; నీబలంబు= నీయొక్క సైన్యము; అతనిన్= అతనిని; అగ్గించుచున్= పొగడుచు; మరలెను; ఆ+మేటి మగండు= ఆ గొప్పవీరుడు; ముంగలి= ముందు; అయి= ఉన్నవాడయి; నిలిచి; పొంగారన్= ఉవ్వెత్తున పొంగుచు; కవియు= కలియబడు; కౌంతేయ= కుంతీకుమారులయొక్క; సేనా= సైన్యమనెడి; సముద్రంబునకున్= సముద్రమునకు; చెలియలికట్ట= గట్టు; అయ్యెను; ఆ+అవసరంబునందున్= ఆ సమయమునందు; మునుకొని= ముందుపడి; వడిన్= వేగముగా; తఱుము= వెంటపడి పరుగుపెట్టించు; వడముడిన్= భీముని; పొదివి= చుట్టుముట్టి; మన; పదాతి= కాల్బలముయొక్క; ప్రకరంబు= సమూహము; దర్పంబునన్= గర్వముతో; ఆర్పులు= అరుపులు; బొబ్బలున్= పెద్ద పెద్ద అరుపులు; చెలంగన్= మ్రోయగా; బహువిధ= నానావిధములయిన; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములు; శస్త్రంబులు= సామాన్య ఆయుధములు; పరఁగించినన్= ప్రయోగించగా; పెరిఁగిన; మద= గర్వముయొక్క; అతిరేకంబునన్= ఉద్రేకమువలన; గదాదండంబున్=

గదను; ధరియించి= పట్టుకొని; ఘోర= భయంకరమయిన; ఆకారుండు= రూపముకలవాడు; అగుచున్= అగుచు; తేరు= రథము; డిగ్గి= దిగి; పేరడవిన్= పెద్ద అరణ్యమును; కూల్చు= పడగొట్టు; పెను= పెద్ద; గాలి; కైవడిన్= విధముగా; అతండు= అతఁడు(భీముడు); ఏకవింశతి= ఇరువదియొక్క; సహస్రసంఖ్య= వేలసంఖ్యగల; సుభటులన్= మంచి వీరులను; నేలపాలు= భూమిపాలు; చేసెను; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** 'గెలుపు పొందవచ్చును' అని చెప్పి దుర్యోధనుడు ముంజేయి పైకెత్తి నిలునిలు మని ఆపగా, కౌరవసైన్యం దుర్యోధనుడిని పొగడుతూ మరలింది. గొప్పవీరు డయిన దుర్యోధనుడు ముందు నిలిచి, ఉవ్వెత్తున పొంగుతూ కలియబడే పాండవసైన్యసముద్రానికి చెలియలికట్ట అయ్యాడు. ఆ సమయంలో ముందుపడి వేగంగా వెంటపడి తరుముతూ పరుగుపెట్టించే భీముడిని చుట్టుముట్టి కౌరవుల కాల్బలం గర్వంతో అరుపులు బొబ్బలతో నానావిధ అస్త్రశస్త్రాలను ప్రయోగించగా, పెరిగిన గర్వముయొక్క ఉద్రేకంవలన భీముడు గదను పట్టుకొని భయంకరమయిన ఆకారం కలవాడై రథం దిగి పెద్ద అడవిని పడగొట్టే పెద్దగాలివలె ఇరువది ఒక్కవేలమంది వీరులను సంహరించాడు. ఆ సమయంలో.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ.

**క.** **కరిహయరథబృందం బు । ద్ధురత నడరెఁ బాండునృపసుతుల మూఁకలపై**
**నరుఁ డబ్బలంబునకు ని । ష్ఠురగాండివ ముక్తశరపటుత్వము సూపెన్.** **311**

**ప్రతిపదార్థం:** పాండునృప= పాండురాజుయొక్క; సుతుల= కుమారులయొక్క; మూఁకలపైన్= సేనలమీద; కరి= ఏనుగులయొక్క; హయ= గుర్రములయొక్క; రథ= రథములయొక్క; బృందంబు= సమూహము; ఉద్ధురతన్= బలంగా; అడరెన్= విజృంభించెను; నరుఁడు= అర్జునుఁడు; ఆ+బలంబునకున్= ఆ సైన్యమునకు; నిష్ఠుర= తీక్షణమయిన; గాండివ= గాండీవమునుండి; ముక్త= విడిచిపెట్టిన; శర= బాణములయొక్క; పటుత్వము= కాఠిన్యము; చూపెన్= చూపెను.

**తాత్పర్యం:** ఆ సమయంలో పాండవుల సేనలమీద ఏనుగుల, గుర్రాల, రథ సమూహాలు ఒక్కుమ్మడిగా వ్యాపించాయి. అర్జునుడు ఆ సమయంలో ఆ కౌరవబలానికి తీక్షణమయిన గాండీవంనుండి విడిచిపెట్టబడిన బాణాలయొక్క కాఠిన్యం చూపించాడు.

**క.** **నకులసహదేవులును సా । త్యకియును రభసమున వాలురమ్ములు నిగుడన్**
**శకునిపయిఁ గవిసి రతఁడును । బ్రకటస్ఫురణంబునం దిరంబై పోరెన్.** **312**

**ప్రతిపదార్థం:** నకులసహదేవులును; సాత్యకియును; రభసమునన్= శీఘ్రముగా; వాలు= వాడియైన; అమ్ములు= బాణములు; నిగుడన్= వ్యాపింపచేయుచు; శకునిపయిన్= శకునిపై; కవిసిరి= కలియబడిరి; అతఁడును= ఆ శకునియును; ప్రకట= స్పష్టముగా; స్ఫురణంబునన్= తోచునట్లుగా; తిరంబై= స్థిరముగా ఉండి; పోరెన్= పోరాడెను.

**తాత్పర్యం:** నకుల సహదేవులు, సాత్యకి శీఘ్రంగా వాడి బాణాలు వ్యాపింపజేస్తూ శకునిపై కలియబడ్డారు. ఆ శకుని కూడా స్థిరంగా ఉండి పోరాడాడు.

**చ. సమదగజాధిరూఢుఁ డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో**
**టములఁ గలంచుచున్ గజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి**
**త్రముగ వధించుచున్ రథకదంబములన్ సమయించుచున్ మహో**
**గ్రముగఁ జరించువిస్ఫురణఁ గన్గొని కోపసముద్భటాకృతిన్. 313**

**ప్రతిపదార్థం:** సమద= మదముతో కూడిన; గజ= ఏనుగుపై; అధిరూఢుఁడు= అధిరోహించినవాడు; అయి= అయినట్టి; సాల్వుఁడు; పాండవసేనన్= పాండవులయొక్క; సైన్యమును; చొచ్చి= ప్రవేశించి; ఘోటములన్= గుర్రములను; కలంచుచున్= కలతపెట్టుచు; గజ= ఏనుగులయొక్క; ఘటల్= గుంపులూ; విరియించుచున్= విడివడునట్లు చేయుచు; కాల్బలంబున్= పదాతిదళమును; చిత్రముగన్= ఆశ్చర్యకరముగా; వధించుచున్= చంపుచు; రథ= రథములయొక్క; కదంబములన్= గుంపులను; సమయించుచున్= నశింపచేయుచు; మహా= గొప్ప; ఉగ్రముగన్= భయంకరముగ; చరించు= సంచరించు; విస్ఫురణన్= కాంతిని; కన్గొని= చూచి; కోప= కోపముయొక్క; సముద్భట= మిక్కిలి ఆధిక్యం కలిగిన; ఆకృతిన్= ఆకారముతో.

**తాత్పర్యం:** మదించిన ఏనుగుపై అధిరోహించినవాడై సాల్వుడు పాండవసైన్యంలో ప్రవేశించి గుర్రాలను కలతపెట్టుతూ, ఏనుగుల గుంపులను విడగొట్టుతూ పదాతిదళమును ఆశ్చర్యకరంగా చంపుతూ, రథాల గుంపులను నశింపజేస్తూ కోపంవలన మిక్కిలి కాంతిమంతమైన ఆకారంతో మహాభయంకరంగా తిరుగాడే ఉద్ధతిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వ్యాసమహాభారతంలో 'సాల్వుడు' అనువాడు లేడు. 'శాల్వుడు' ఉన్నాడు. మూలము 'సన్నివృత్తే బలౌఘే తు 'శాల్వో' మ్లేచ్ఛగణాధిపః । అభ్యవర్తత సంకృద్ధః పాండూనాం సుమహద్బలమ్' (శల్య-20-1). ఈ పద్యంలో 'సాల్వుడు' అని యతిస్థానంలో ప్రయోగింపబడినది. 'శ' వర్ణ - 'స' వర్ణములకు అభేదం. 'శాల్వుఁడు' అని ఉండుటయే ఉత్తమ పాఠం. వ్యాసభారతమున 'శాల్వ' నామకులు కాశీరాజపుత్రి 'అంబ'ను ప్రేమించిన క్షత్రియపుత్రుడు శాల్వుడు ఒకడు. ఇక వ్యుషితాశ్వుని పత్ని భద్ర. ఆమె మృతుడైన పతి శవంతో శయనించగా ముగ్గురు 'శాల్వురు', నల్వురు 'మద్రులు' ఉద్భవించారు. ఈ శాల్వదేశపు రాజే ద్యుమత్సేనుడు. సత్యవంతుడి తండ్రి. మద్రదేశపు రాజు అశ్వపతి. సావిత్రి తండ్రి. సావిత్రీసత్యవంతుల వివాహకథ - సత్యవంతుడి మృత్యుంజయత్వం లోకప్రసిద్ధమే కదా! ఇది పాతకాలపు కథ. అశ్వపతి పాలించిన మద్రదేశానికి రాజు ఈ శల్యుడు. ఇతడు ఈ కురుక్షేత్రయుద్ధ కాలంవాడు. ఇక పాండవపక్షంలో 'శాల్వుడు' అనే యోధుడు ఒకడు ఉన్నాడు. ప్రస్తుతం ఈ పద్యము నందలి 'శాల్వుడు' మ్లేచ్ఛ గణాధిపతి. మహాముష్కరుడు. ఈ మ్లేచ్ఛశాల్వుని గజమునకు గొప్ప చరిత్ర ఉన్నది. ఇది పర్వతంవలె ఉంటుంది. మదధారలతో నిత్యం ప్రకాశిస్తూ ఉంటుంది. ఇంద్రుడి గజం ఐరావతంలో సమానమయిన శక్తి కలది. (ఏనుగులలో అనేకజాతులు కలవు. అందు 'మహాభద్ర' అనే పేరుగల కులమునందు పుట్టినది ఈ గజము. ఈ కులమునందలి ఏనుగులకు భద్రగజములని పేరు. చక్రవర్తులు ఈ భద్రగజాలను అధిరోహిస్తారు. సామాన్య గజములు భద్రగజములు కావు.) ఈ మ్లేచ్ఛ గణాధిపతి (శాల్వుడు) గజశాస్త్రంలో నిష్ణాతుడు. నకులుడు అశ్వవిద్యయందు నిష్ణాతుడు. శాల్వుడు తన ఏనుగును ధృష్టద్యుమ్నుడిపైకి తోలాడు. ధృష్టద్యుమ్నుడు ఈ మదగజాన్ని సంహరించాడు. సాత్యకి శాల్వుడిని సంహరించాడు. 'ఆస్థాయ సుమహానాగమ్ ప్రభిన్నం పర్వతోపమమ్ । దృప్తమైరావత ప్రఖ్యమమిత్ర గణమర్దనమ్॥' యో నౌ మహాన్ భద్రకుల ప్రసూతః । సుపూజితో ధార్తరాష్ట్రేణ నిత్యమ్ । సుకల్పితః శాస్త్ర వినిశ్చయజ్ఞైః సదోపవాహ్య సమరేషు రాజన్॥ (9-19-2,3).' ఆకాశము - ప్రకృతి; ఆకసము వికృతి - అయినట్లు 'శాల్వుఁడు' తెలుఁగున 'సాల్వుఁడు' వికృతి రూపము కావచ్చును.

## ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాళ్వుఁ డేనుంగుతోడఁ బీనుంగై పడుట (సం. 9-19-24)

**వ. ధృష్టద్యుమ్నుం డెదుర్కొనిన నతనిఁ ద్రొక్కించువాఁడై యవ్వీరుండు వారణపతిఁ గొల్పిన నతండు. 314**

**ప్రతిపదార్థం:** (సాల్వుని చూచి); ధృష్టద్యుమ్నుండు; ఎదుర్కొనినన్= ఎదుర్కొనగా; అతనిన్= ఆ ధృష్టద్యుమ్నుడిని; త్రొక్కించువాఁడై= త్రొక్కించుటకు పూనికొనినవాడై; ఆ+వీరుండు= పరాక్రమవంతుడు అయిన సాల్వుడు; వారణపతిన్= గజరాజును; కొల్పినన్= పురికొల్పగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ఎదుర్కొనగా ఆ ధృష్టద్యుమ్నుడిని త్రొక్కించేవాడై ఆ సాల్వుడు గజరాజును పురికొల్పగా ధృష్టద్యుమ్నుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. పటునారాచచయంబు కుంభయుగళీభాగంబునన్ బెట్టు నా**
**టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము సాటోపంబుగాఁ గ్రమ్మఱిం**
**చుటకున్ సాల్వుని మెచ్చెఁ గన్గొను జనస్తోమంబు కోపోద్గమో**
**ద్భటవేగంబున వచ్చి పట్టె నది యాపాంచాలు తే రుగ్రమై. 315**

**ప్రతిపదార్థం:** పటు= కఠినమయిన; నారాచ= బాణములయొక్క; చయంబు= సమూహము; కుంభ= కుంభస్థలమునందలి; యుగళీ= రెండింటియొక్క; భాగంబునన్= ప్రదేశమునందు; బెట్టు= గట్టిగా; నాటుటయున్= గ్రుచ్చుటతో; ఆ+గజము= ఆ ఏనుగు; క్రొవ్వు= మదము; అఱి= తరిగి; పాఱెన్= పారిపోయెను; సాటోపంబుగాన్= ఆడంబరముతోకూడా; క్రమ్మఱించుటకున్= మరలించుటకు; కన్గొను= చూచుచున్న; జన= జనులయొక్క; స్తోమంబు= సముదాయము; సాల్వుని; మెచ్చెన్= పొగిడెను; అది= ఆ ఏనుగు; ఉగ్రమై= భయంకరమై; కోప= క్రోధమువలన; ఉద్గమ= ఉబికిన; ఉద్భట= శ్రేష్ఠమయిన; వేగంబునన్= వేగముతో; వచ్చి; ఆ; పాంచాలు= ధృష్టద్యుమ్నుడియొక్క; తేరు= రథము; పట్టెన్= పట్టుకొనెను.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కఠినమైన బాణ సమూహంతో ఆ మదగజంయొక్క కుంభస్థలాల జంటను గట్టిగా గ్రుచ్చగా ఆ ఏనుగు మదం తరిగి పారిపోయింది. మరల సాల్వుడు ఆడంబరంతో మరలించినందులకు అక్కడ చూస్తున్న జనసముదాయం సాల్వుడిని పొగడింది. ఆ ఏనుగు భయంకరమై, క్రోధంవలన ఉబికిన శ్రేష్ఠమైన వేగంతో వచ్చి ఆ ధృష్టద్యుమ్నుడి రథాన్ని పట్టుకొన్నది.

**క. ఆతఁడు గద చేతం గొని । భీతి గదురుమనముతోడఁ బృథ్వికి దాఁటన్**
**సుతాశ్వసమేతంబుగ । నా తే రయ్యేనుఁ గెత్తె నాకసమునకున్. 316**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ ధృష్టద్యుమ్నుడు; గద; చేతన్= చేతితో; కొని= తీసికొని; భీతి= భయము; కదురు= కలుగు; మనముతోడన్= మనసుతో; పృథ్వికిన్= భూమిపైకి; దాఁటన్= దూకగా; సూత= సూతుడు; అశ్వ= గుర్రములు; సమేతంబుగన్= సహితముగ; ఆ తేరు= ఆ రథము; ఆకసమునకున్= ఆకాశమునకు; ఆ+ఏనుఁగు= ఆ ఏనుగు; ఎత్తెను= లేవనెత్తెను.

**తాత్పర్యం:** ఆ ధృష్టద్యుమ్నుడు గద చేత తీసికొని భయం కలిగిన మనసుతో భూమిపైకి దూకగా రథాన్ని తోలే సూతుడితో గుర్రాలతో సహా ఆ రథాన్ని ఆకాశానికి ఆ ఏనుగు ఎత్తివేసింది.

**ఆ. ఎత్తి త్రిప్పి యాడి యిలతోడ వ్రేసి పా । దములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర**
**తతులు నిగుడఁ బవనతనయ శిఖండి సా । త్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున. 317**

**ప్రతిపదార్థం:** ఎత్తి; త్రిప్పి= గిరగిర త్రిప్పి; ఆడి= ఆడుకొని; ఇలతోడన్= నేలపై; వ్రేసి= కొట్టి; పాదములన్= పాదములతో; చదుపన్= నలుపగా; చూచి; పవన+తనయ= భీముడు; శిఖండి; సాత్యకులు; అతి= మిక్కిలి; రయమునన్= వేగముగా; దారుణ= భయంకరమయిన; అస్త్ర= బాణములయొక్క; తతులు= సమూహములు; నిగుడన్= వ్యాపించునట్లు; సాల్వున్= సాల్వుని; తాఁకిరి= ఎదుర్కొనిరి.

**తాత్పర్యం:** ఆ రథాన్ని పైకి ఎత్తి త్రిప్పి ఆడుకొని నేలపై కొట్టి, పాదాలతో నలుపగా చూచి భీముడు, శిఖండి సాత్యకి మిక్కిలి వేగంగా భయంకరమైన బాణసమూహాలు వ్యాపించేటట్లు సాల్వుడిని ఎదుర్కొన్నారు.

**క. అతఁ డందఱ బాణంబులు । వితథంబులు సేసి యస్త్రవిద్యాపారీ**
**ణత సూపె నవ్విధం బ । ద్భుతము నినిచె గగనచరతతులచిత్తములన్. 318**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ సాల్వుడు; అందఱ బాణంబులు= అందరియొక్క బాణములు; వితథంబులు= వ్యర్థములు; చేసి; అస్త్రవిద్యా= బాణవిద్యయందలి; పారీణత= పారము ముట్టుట; చూపెన్= చూపెను; ఆ+విధంబు= ఆ విధానము; గగనచర= దేవతలయొక్క; తతులు= గుంపులయొక్క; చిత్తములన్= మనస్సులను; అద్భుతమును= ఆశ్చర్యమును; నినిచెన్= నింపెను.

**తాత్పర్యం:** ఆ సాల్వుడు అందరి బాణాలనూ వమ్ము చేసి, అస్త్రవిద్యయందలి సంపూర్ణమైన నేర్పరితనాన్ని చూపాడు. ఆ విధానం దేవతల గుంపుల చిత్తములను ఆశ్చర్యంతో నింపినది.

**వ. అప్పుడు. 319**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**తే. ఆజ్ఞ పాటించి మదివెఱ యుజ్జగించి । రయము మెఱయ నప్పాంచాలరాజసుతుఁడు**
**గదిసి యెగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ । గొండ గూలిన ట్లక్కరి గూలె నధిప! 320**

**ప్రతిపదార్థం:** అధిప!= అధిపతి అనగా రాజు అయిన ధృతరాష్ట్ర మహారాజా!; ఆజ్ఞ!= సమయం; పాటించి= ఆదరించి; మది= మనస్సునందు; వెఱ= భయము; ఉజ్జగించి= విడిచి; రయము= వేగము; మెఱయన్= ప్రకాశింపగా; ఆ; పాంచాల రాజసుతుఁడు= ధృష్టద్యుమ్నుడు; కదిసి= సమీపించి; ఎగసి= ఎగిరి; గదన్= గదతో; కుంభస్థలి= కుంభస్థలము; పగుల్పన్= పగులగొట్టగా; ఆ+కరి= ఆ ఏనుగు; కొండ= పర్వతము; కూలినట్లు; పడిపోయినట్లు; కూలెను= పడిపోయెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సమయాన్ని పాటించి మనస్సునందు భయాన్ని తొలగించి, వేగం ప్రకాశించగా ధృష్టద్యుమ్నుడు సమీపించి, ఎగిరి, గదతో కుంభస్థలము పగులగొట్టగా, ఆ ఏనుగు పర్వతం పడిపోయినట్లు పడిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ. ఏనుగు ఉపమేయం; పర్వతం ఉపమానం; కూలుట - సమానధర్మం; అట్లు - వాచకం. అందుచేత సంపూర్ణోపమ.

**క. ఆలోనన శినివరుఁడు వి। శాలాస్యప్రదరనిహతి సాల్వునిశిర మా**
**భీలముగఁ ద్రుంప నాతఁడు। గూలిన మనమూఁక విచ్చెఁ గురువంశనిధీ! 321**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ!= కురువంశమునకు నిధి అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఆలోనన= అంతలోనే; శినివరుఁడు= సాత్యకి; విశాల= విశాలమయిన; ఆస్య= ముఖముకల; ప్రదర= బాణముయొక్క; నిహతిన్= దెబ్బవలన; సాల్వుని; శిరము= తల; ఆభీలముగన్= భయంకరముగ; త్రుంపన్= ఖండించగా; అతఁడు= ఆ సాల్వుడు; కూలినన్= చనిపోగా; మన= మనయొక్క; మూఁక= సైన్యము; విచ్చెన్= విడిపోయెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అంతలోనే సాత్యకి విశాలమైన ముఖం కలిగిన బాణంయొక్క దెబ్బతో సాల్వుడి తలను భయంకరంగా ఖండించగా ఆ సాల్వుడు చనిపోయాడు. మనసైన్యం విడిపోయింది.

**ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు**
**న్మీలిత విక్రముం డగుడు మేమెయి నాతనిఁ దాఁకె నస్త్ర వి**
**ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు పోర వారి దో**
**ర్లీలలు సూచి రోటువడి రెండు బలంబులు యోధవీరులున్. 322**

**ప్రతిపదార్థం:** వాలి= అతిశయించి(విజృంభించి); ఎలుంగు= పెద్ద కంఠనాదము; చూపి= చూపించి(చేసి); కృతవర్ముఁడు= కృతవర్మ; సైన్యమున్= సేనను; నిల్వరించి= నిలిపి(ఆపి); ఉన్మీలిత= వికసించిన; విక్రముండు= పరాక్రమముకలవాడు; అగుడున్= కాగా; మేమెయిన్= అనాయాసముగ; అస్త్రవిద్యా= బాణవిద్యయందు; లసితుండు= ప్రకాశించువాడు అయిన; సాత్యకి; ఆతనిన్= ఆ కృతవర్మను; తాఁకెన్= ఎదుర్కొనెను; ఉదగ్రతన్= భయంకరముగా; వారలు= వారు; పోరన్= పోరుచుండగా; రెండు= ఇరుపక్షముల; బలంబుల= సైన్యములయొక్క; యోధవీరులున్= యుద్ధమునందు నేర్పుగల - శూరులును; వారి= వారియొక్క; దోః= భుజములయొక్క; లీలలు= విలాసములు; ఓటుపడి= భయపడి; చూచిరి.

**తాత్పర్యం:** కృతవర్మ విజృంభించి పెద్ద బొబ్బపెట్టి సేనను ఆపుచేసి, వికసించిన పరాక్రమం ప్రదర్శిస్తూ ఉండగా, బాణవిద్యలో ప్రకాశించే సాత్యకి అనాయాసంగా ఆ కృతవర్మను ఎదుర్కొన్నాడు. వారిరువురూ భయంకరంగా యుద్ధం చేస్తుండగా రెండు పక్షాల సైన్యాలలో పరాక్రమవంతులయిన యోధులు ఆ కృతవర్మ సాత్యకుల భుజబల పరాక్రమ విలాసాలను భయపడి చూచారు.

**వ. ఇట్లు పెనంగు చుండి. 323**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; పెనంగుచున్= పోరాడుతూ; ఉండి.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కృతవర్మ సాత్యకులు పోరాడుతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కృతవర్ము నొంచె నెనిమిది। శితశరముల శినివరుండు శినివరుచాపం**
**బతఁడు దునిమె బలువిలుగొని। యతని హయంబులను సూతు నాతఁడు గూల్చెన్. 324**

**ప్రతిపదార్థం:** శినివరుండు= సాత్యకి; ఎనిమిది; శిత= వాడిఅయిన; శరములన్= బాణములతో; కృతవర్మన్= కృతవర్మని; నొంచెన్= నొప్పించెను; అతఁడు= అతడు (కృతవర్మ); శినిపరు= సాత్యకియొక్క; చాపంబు= ధనువును; తునిమెన్= ఖండించెను; అతఁడు= సాత్యకి; బలు= బలమయిన; విలు= ధనువు; కొని= తీసికొని; అతని= ఆ కృతవర్మయొక్క; హయంబులను= గుఱ్ఱములను; సూతున్= రథము నడుపువానిని; కూల్చెన్= చంపెను.

**తాత్పర్యం:** సాత్యకి ఎనిమిది వాడి అయిన బాణాలతో కృతవర్మను నొప్పించాడు. కృతవర్మ సాత్యకి వింటిని ఖండించాడు. సాత్యకి బలమైన మరియొక విల్లు తీసికొని కృతవర్మ గుఱ్ఱాలను, సూతుడిని చంపాడు.

**మ. విరథుండై యభిరామశూలమున నవ్వీరుండు శైనేయు వై**
**చె రయం బార నతండు భల్లమునఁ ద్రుంచెం బెక్కు తుండంబు లై**
**తొరుఁగం జూచి విషాదియై నిజరథ స్థుం జేసి తద్బాణగో**
**చరతాదుర్దశ కా వృథోద్యముఁ గృపాచార్యుండు దప్పించినన్. 325**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుండు= ఆ శూరుఁడు అయిన కృతవర్మ; విరథుండై= రథములేనివాడయి; అభిరామ= మనోహరమయిన; శూలమునన్= శూలము అను ఆయుధముతో; శైనేయున్= సాత్యకిని; వైచెన్= కొట్టెను; అతండు= సాత్యకి; రయంబు+ఆరన్= మిక్కిలి వేగముగా; భల్లమునన్= బల్లెముతో; త్రుంచెన్= ఖండించెను; పెక్కు= అనేకములగు; తుండంబులై= ఖండములై (ముక్కలై); తొరుఁగన్= పడిపోవుటను; చూచి; కృపాచార్యుండు; విషాదియై= దుఃఖము కలవాడై; నిజ= తనయొక్క; రథస్థున్= రథమునందుండునట్లు; చేసి; తద్= ఆ; బాణ= బాణములకు; గోచరతా= లక్ష్యం కావడమనే; దుర్దశకున్= చెడ్డ అవస్థకు; ఆ; వృథా= వ్యర్థమయిన; ఉద్యమున్= ప్రయత్నము కలవాడయిన కృతవర్మను; తప్పించినన్= తప్పించగా.

**తాత్పర్యం:** శూరుడయిన ఆ కృతవర్మ రథంలేనివాడై మనోహరమైన బల్లెంతో ఆ శూలాన్ని ఖండించాడు. అది అనేకములయిన ముక్కలై పడిపోయింది. కృపాచార్యుడు అది చూచి జాలిపొంది, తన రథమునందుండేటట్లు చేసి, సాత్యకి ప్రయోగించే ఆ బాణాలకు లక్ష్యమైన చెడ్డదశనుండి - ఆ వ్యర్థ ప్రయత్నం కలవాడయిన కృతవర్మను తప్పించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మన సేన విఱిగె నృప నీ । తనయుం డొక్కరుఁడు నత్యుదగ్రతఁ గుంతీ**
**తనయుల నద్దెసఁ గల యో । ధని కాయముఁ బొదివె బాణధారలఁ బెలుచన్. 326**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మన; సేన; విఱిగెన్= చెల్లాచెదరైపోయెను; నీ తనయుండు= నీయొక్క పుత్రుడు(దుర్యోధనుడు); ఒక్కరుఁడున్= ఒక్కడే; అతి= మిక్కిలి; ఉదగ్రతన్= భయంకరముగా; కుంతీతనయులన్= కుంతీపుత్రులను; ఆ+దెసన్= ఆ వైపు; కల= ఉన్నట్టి; యోధ= వీరులయొక్క; నికాయమున్= సముదాయమును; బాణధారలన్= బాణములయొక్క ధారలతో; పెలుచన్= ఆగ్రహముతో; పొదివెన్= కలియబడెను (క్రమ్ముకొనెను).

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! మన కురుసైన్యం చెల్లాచెదరైపోయింది. నీ పుత్రుడు దుర్యోధనుడు ఒక్కడే మిగిలి పాండవులను, ఆ పాండవపక్షాన కల వీరసముదాయాన్ని బాణసమూహాలతో ఆగ్రహంతో భయంకరంగా క్రమ్ముకొన్నాడు.

**మ. పతి యిమ్మై సముదీర్ణవిక్రమకళాపారీణుఁడై విద్విష**
**చ్చతురంగంబులయందు నొక్కటియు విస్ఫారోల్లసన్మార్గణ**
**హతికిం దప్పక యుండునట్లుగ సమగ్రాశ్చర్యసంపాదకో**
**ద్ధతబాహావిభవంబు సూపె సురబృందస్తోత్రపాత్రోద్ధతిన్. 327**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధముగా; పతి= రాజు దుర్యోధనుడు; సముదీర్ణ= బాగుగా పెరిగిన; విక్రమ= పరాక్రమముయొక్క; కళా= కళయందు; పారీణుఁడై= పారము ముట్టినవాడయి; విద్విషత్= శత్రువులయొక్క; చతురంగంబులయందున్= నాలుగు సేనాంగములయందును; ఒక్కటియున్= ఒక్కటికూడా; విస్ఫార= అధికమైన; ఉల్లసత్= ప్రకాశించుచున్న; మార్గణ= బాణములయొక్క; ఆహతికిన్= దెబ్బకు; తప్పక= తప్పించుకొనకుండగా; ఉండునట్లుగన్= ఉండునట్లుగా; సమగ్ర= సంపూర్ణముగా; ఆశ్చర్య= అద్భుతమును; సంపాదక= గడించునట్టి; ఉద్ధత= మదించిన; బాహా= భుజములయొక్క; విభవంబు= వైభవం; సుర= దేవతలయొక్క; బృంద= సమూహముయొక్క; స్తోత్ర= స్తుతులకు; పాత్ర= యోగ్యమయిన; ఉద్ధతిన్= గర్వమును; చూపెన్= చూపించెను.

**తాత్పర్యం:** ఈ విధంగా దుర్యోధనుడు అపారమైన పరాక్రమంతో శత్రువుల చతురంగబలాలలో ఒక్కటికూడా అధికంగా ప్రకాశిస్తున్న బాణాల దెబ్బకు తప్పించుకొనకుండా ఉండేటట్లుగా దేవతాసమూహాలయొక్క స్తుతులతో యోగ్యమైన గర్వంతో అద్భుతమైన, అధికమైన భుజబలసంపదను సంపూర్ణంగా చూపించాడు.

**వ. అప్పుడు రెండు వీళ్ళ నతని పాటిమేటిమగలు లేరనుబుద్ధి నాకుం బొడమెఁ బదంబపడి పాండవులును జేయఁగల వారలును నవ్వీరుం బొదివిన నతం డందఱ కన్ని రూపులై ధర్మసుతుని శతశరంబులను భీమసేను డెబ్బది సాయకంబులను సహదేవుని నైదింటను నకులు నఱువదినాల్గింటను ధృష్టద్యుమ్నుని సప్త మార్గణంబులను ద్రౌపదేయుల నైదైదు తూపులను సాత్యకి మూఁడు కాండంబుల నొప్పించి సహదేవుధనువు దునిమిన నక్కుమారుండు వేఱొక్క విలు గొని చలంబున నక్కురువిభుం గదిసినఁ దక్కటి రథికులుం గూడికొని యొక్కొక్కరుండు పె క్కమ్ములు పైఁ గురియఁ గేలిచందంబున వాని నన్నింటి వారించుచుఁ దత్తనువుల శోణితంబు పూరించుచు నాజెట్టి జోదు బెట్టిదుండై పెనంగ మన యోధులుం బురికొని యద్దొరల మార్కొనిరి. మన సైన్యంబు దైన్యంబు విడిచి మరలి వారిబలంబులఁ దలపడియె నట్టియెడ. 328**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయమున; రెండు; వీళ్ళను= దండులందును; అతనిపాటి= అతనివంటి; మేటి= గొప్ప; మగలు= వీరులు; లేరను= లేరు అను; బుద్ధి= తలపు; నాకున్= నాకు; పొడమెన్= కలిగెను; పదంపడి= వెనువెంటనే; పాండవులును; చేయఁగలవారలునున్= యుద్ధము చేయగలవారలును; ఆ+వీరున్= ఆ వీరుని; పొదివినన్= క్రమ్ముకొనగా; అతండు= అతడు(దుర్యోధనుడు); అందఱకున్= అందరకు; అన్ని; రూపులై= ఆకారములై; ధర్మసుతునిన్= ధర్మరాజును; శత= నూరు; శరంబులను= బాణముతోను; భీమసేనున్= భీమసేనుని; డెబ్బది; సాయకంబులను= బాణములతోను; సహదేవునిన్= సహదేవుని; ఐదింటను= అయిదు బాణములతోను; నకులున్= నకులుని; అఱువది నాల్గింటను= అరవైనాలుగు బాణాలతోను; ధృష్టద్యుమ్నుని= ధృష్టద్యుమ్నుని; సప్త= ఏడు; మార్గణంబులను= బాణములతోను; ద్రౌపదేయులన్= ద్రౌపదిపుత్రులను; అయిదైదు= ఐదేసి; తూపులను= బాణములతోను; సాత్యకిన్= సాత్యకిని; మూఁడు; కాండంబులన్= బాణములతోను; నొప్పించి= బాధించి; సహదేవుధనువు= సహదేవునియొక్క విల్లు; తునిమినన్= ఖండించగా; ఆ+కుమారుండు= ఆ కుమారుడు అనగా సహదేవుడు; వేఱొక్క= మరియొక; విలు= విల్లు(ధనువు); కొని= తీసికొని; చలంబునన్= మాత్సర్యముతో;

ఆ+కురువిభున్= ఆ కురురాజును (దుర్యోధనుని); కదిసినన్= దగ్గరకురాగా; తక్కటి= మిగిలిన; రథికులున్= రథముపై నుండి యుద్ధము చేయు వీరులును; కూడికొని= కలిసికొని; ఒక్కొక్కరుండు= ఒక్కొక్కడు; పెక్కు= అనేకములయిన; అమ్ములు= బాణములు; పైన్= మీద; కురియన్= కురిపించగా; కేలి= క్రీడ; చందంబునన్= విధముగా; వానిని; అన్నింటిని; వారించుచున్= అడ్డుకొనుచు; తద్= ఆ; తనువులన్= శరీరములందు; శోణితంబు= రక్తము; పూరించుచున్= నింపుచు; ఆ; జెట్టి= మల్లుడు అయిన; జోదు= యోధుడు; బెట్టిదుండై= గర్వితుడై; పెనంగన్= యుద్ధము చేయుచుండగా; మన= మనయొక్క; యోధులున్= వీరులును; పురికొని= క్రమ్ముకొని; ఆ+దొరలన్= ఆ యోధ శ్రేష్ఠులను; మార్కొనిరి= ఎదుర్కొనిరి; మన సైన్యంబు= మనయొక్క సేన; దైన్యంబు= దీనత్వము; విడిచి= వదలి; మరలి= తిరిగి; వారి= వారియొక్క; బలంబులన్= సేనలతో; తలపడియెన్= పోరాడెను; అట్టియెడన్= ఆ సమయమున.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఇరుపక్షాలలోనూ అతడివంటి గొప్ప వీరులు లేరనే తలపు నాకు కలిగింది. వెనువెంటనే పాండవులు, ఆ పక్షమున యుద్ధం చేయగల వీరులు ఆ వీరుడిని (దుర్యోధనుడిని) క్రమ్ముకొనగా అతడు (దుర్యోధనుడు) అందరకును అన్ని ఆకారాలు కలవాడై, ధర్మరాజును నూరు బాణాలతోను భీమసేనుడిని డెబ్బది బాణాలతోను, సహదేవుడిని అయిదు బాణాలతోను, నకులుడిని అరువది నాలుగు బాణాలతోను ధృష్టద్యుమ్నుడిని ఏడు బాణాలతోను, ద్రౌపది పుత్రులను ఐదేసి బాణాలతోను, సాత్యకిని మూడు బాణాలతోను, నొప్పించి సహదేవుడి విల్లు ఖండించగా సహదేవుడు మరియొక విల్లు తీసికొని మాత్సర్యంతో ఆ కురురాజు (దుర్యోధనుడి) దగ్గరకు రాగా మిగిలిన రథికులను కలిసికొని ఒక్కొక్కడు అనేకములయిన బాణాలు ఆ దుర్యోధనుడిపై కురిపించగా క్రీడవలె వాటిని అన్నింటినీ అడ్డుకొంటూ ఆ శరీరములయందు రక్తం నింపుతూ మల్లుడైన ఆ యోధుడు (దుర్యోధనుడు) గర్వితుడై యుద్ధం చేస్తూ ఉండగా మన వీరులు క్రమ్ముకొని ఆ యోధశ్రేష్ఠులను (పాండవవీరులను) ఎదుర్కొన్నారు. మనసేన దీనత్వం విడిచి తిరుగబడి వారి(పాండవులయొక్క) సేనలతో పోరాడింది. ఆ సమయంలో.

**క. భీముఁడు గురుతనయుఁడు ను । ద్దామ భుజావీర్యశౌర్యధైర్యములు జన**
**స్తోమము లగ్గింపఁగ సం । గ్రామ మొనర్చిరి నితాంతగాఢస్ఫూర్తిన్. 329**

**ప్రతిపదార్థం:** భీముఁడున్= భీముడును; గురు= ద్రోణునియొక్క; తనయుఁడును= పుత్రుడును (అశ్వత్థామయును); ఉద్దామ= అధికమైన; భుజా= భుజములయొక్క; వీర్య= పరాక్రమము; శౌర్య= పరాక్రమము (శూరత్వము); ధైర్యము= ధీరత్వములు; జన= జనులయొక్క; స్తోమములు= సమూహములు; అగ్గింపఁగన్= స్తుతించుచుండగ; నితాంత= అత్యంతము (మిక్కిలి); గాఢ= అధికమైన; స్ఫూర్తిన్= ఉత్సాహంతో; సంగ్రామము= యుద్ధము; ఒనర్చి= చేసిరి.

**తాత్పర్యం:** భీముడు, అశ్వత్థామ అడ్డులేని తమ భుజబల పరాక్రమధైర్యాలను ప్రజాసమూహాలు మెచ్చుకొంటూ ఉండగా అత్యంతం అధికమైన ప్రకాశంతో యుద్ధం చేశారు.

**చ. పరుషపరాక్రమస్ఫురణఁ బాండవముఖ్యుని వాజులం జతు**
**శ్శరహతిఁ గూల్చె సౌబలుఁడు సత్వరుఁడై సహదేవుఁ డమ్మహీ**
**శ్వరుఁ దనతేరిమీఁద నిడి సంగరమధ్యముఁ బాపె నాతఁ డొం**
**డరదముమీఁదికిం జని రయంబున నయ్యరిఁ దాఁకె నుద్ధతిన్. 330**

**ప్రతిపదార్థం:** పరుష= కఠినమైన; పరాక్రమ= పరాక్రమముయొక్క; స్ఫురణన్= ప్రకాశంతో; పాండవ= పాండవులలో; ముఖ్యుని= ముఖ్యుడైన ధర్మజునియొక్క; వాజులన్= గుర్రములను; సౌబలుఁడు= శకుని; చతుః= నాలుగు; శర= బాణములయొక్క; హతిన్= దెబ్బతో; కూల్చెన్= చంపెను; సహదేవుఁడు= సహదేవుడు; సత్వరుఁడై= వేగిరపాటు కలవాడయి; ఆ= ఆ; మహీ+ఈశ్వరున్= ధర్మజుని; తన= తనయొక్క; తేరిమీఁదను= రథముపైని; ఇడి= ఉంచి; సంగర= యుద్ధముయొక్క; మధ్యము+పాపె= మధ్యనున్నవానిని; పాపెన్= తొలగించెను; ఆతఁడు= అతడు (ఆ ధర్మరాజు); ఒండు= మరియొక; అరదము= రథము; మీఁదికిన్= పైకి; చని= వెడలి; రయంబునన్= వేగముగా; ఆ+అరిన్= ఆ శత్రువును; ఉద్ధతిన్= గర్వముతో; తాఁకెను= ఎదుర్కొనెను.

**తాత్పర్యం:** శకుని కఠినమైన పరాక్రమవిక్రమంతో ధర్మజుడి గుర్రాలను నాలుగు బాణాలతో కొట్టి చంపాడు. సహదేవుడు వెంటనే వేగిరపాటుతో ధర్మరాజును తన రథంపైన ఉంచి, యుద్ధంయొక్క నడుమ భాగంనుండి తొలగించాడు. ధర్మరాజు ఇంకొక రథం మీదకు వెడలి, వేగంగా ఆ శత్రువును (శకునిని) ఎదుర్కొన్నాడు.

**క.** **శరములఁ బొదివిన నాతఁడు । దిరమై యేయంగ రణము దివిజగరుడ ఖే**
**చరసిద్ధిప్రకరాద్భుత । కరప్రకారమున నొప్పెఁ గౌరవనాథా!** **331**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కౌరవులకు ప్రభువైన ఓ ధృతరాష్ట్రమహారాజా!; శరములన్= బాణములతో; పొదివినన్= క్రమ్ముకొనగా; ఆతఁడు= ఆ శకుని; తిరమై= స్థిరముగా ఉండి; ఏయంగన్= బాణములు ప్రయోగించగా; రణము= యుద్ధము (శకుని ధర్మరాజుల యుద్ధము); దివిజ= దేవతలకు; గరుడ= గరుడులకు; ఖే= ఆకాశమున; చర= సంచరించు; సిద్ధ= సిద్ధులయొక్క; ప్రకర= సమూహములకు; అద్భుతకర= ఆశ్చర్యకరములైన; ప్రకారమునన్= విధముగ; ఒప్పెన్= ప్రకాశించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజు శకునిని బాణాలతో క్రమ్ముకొనగా ఆ శకుని కూడా స్థిరంగా ఉండి బాణాలు ప్రయోగించగా వారి యుద్ధం దేవతలు, గరుడులు, ఆకాశసంచారులైన సిద్ధగణాలు ఆశ్చర్యం పొందేటట్లుగా ప్రకాశించింది.

**సీ.** **శకుని నందనుఁడును నకులుండు నొండొరు । లకుఁ జండ బాహుబలంబు సూపి**
**రతుల శౌర్యమున సాత్యకికృతవర్ములు । పోరిరి విలుద్రుంచి కౌరవేంద్రుఁ**
**డేసె ధృష్టద్యుమ్ను నేచి యొండొకవింట । నతని నాతఁడు నొంప నక్కజంపుఁ**
**గయ్య మయ్యిరువుర కయ్యె ద్రౌపదిపుత్రు । లేవురు పతిఁ గిట్టి యింద్రియములు**

**తే.** **బాలిశునిఁ జిక్కువఱిచినపగిదిఁ దలరఁ । జేయ నతఁ డీడఁబోవక సాయకములు**
**పెక్కు రయమున నిగిడించి యక్కుమార । వితతిఁ గలఁపఁ దత్సంగర మతిశయిల్లె.** **332**

**ప్రతిపదార్థం:** శకుని= శకునియొక్క; నందనుఁడును= పుత్రుడును; నకులుండును= నకులుడును; ఒండొరులకున్= వారికి ఒకరు; చండ= భయంకరమైన; బాహు= భుజములయొక్క; బలంబు= బలము (శక్తి); చూపిరి; అతుల= సాటిలేని; శౌర్యమునన్= పరాక్రమముతో; సాత్యకి; కృతవర్మలు; పోరిరి= పోరాడిరి; విలు= ధనువు; త్రుంచి= ఖండించి; కౌరవ+ ఇంద్రుఁడు= కౌరవులకు ప్రభువైన దుర్యోధనుడు; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుని; ఏసెన్= కొట్టెను; ఆతఁడు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఒండొక= మరియొక; వింటన్= వింటితో (ధనువుతో); అతనిన్= ఆ దుర్యోధనుడిని; ఏచి= అతిశయించి; నొంపన్= నొవ్వచేయగా (బాధించగా); ఆ+ఇరువురకున్= ఆ ఇద్దరకు; అక్కజంపు= ఆశ్చర్యకరమగు (అధికమగు); కయ్యము=

యుద్ధము; అయ్యెన్= అయ్యెను; ద్రౌపదిపుత్రులు= ద్రౌపదియొక్క పుత్రులు; ఏవురు= అయిదుగురు; పతిన్= రాజును (దుర్యోధనుని); కిట్టి= సమీపించి; ఇంద్రియములు= ఇంద్రియములు (త్వక్కు - చక్షువు - శ్రోత్రము - జిహ్వ - ఘ్రాణములు జ్ఞానేంద్రియములు అయిదు. వాక్కు - పాణి - పాదము - పాయువు - ఉపస్థలు - కర్మేంద్రియములు అయిదు - ద్రౌపది పుత్రులు అయిదుగురు); బాలిశునిన్= మూర్ఖుని (అజ్ఞానిని); చిక్కు= సంకటము; పఱచిన= పడచేసిన(పెట్టినట్లుగా); పగిదిన్= విధముగ; తలరన్= చలింప; చేయన్= చేయగా; అతఁడు= అతడు (దుర్యోధనుడు); ఈడఁబోవక= వెనుదీయక; పెక్కు= అనేకములైన; సాయకములు= బాణములు; రయమునన్= వేగముగా; నిగిడించి= ప్రయోగించి; ఆ+కుమార= ఆ ద్రౌపదికుమారులయొక్క; వితతిన్= సమూహమును; కలఁపన్= బాధించగా; తత్సంగరము= ఆ యుద్ధము; అతిశయిల్లెన్= విజృంభించెను.

**తాత్పర్యం:** శకుని పుత్రుడు ఉలూకుడు, నకులుడు ఒకరికొకరు భయంకరమైన భుజబలాన్ని చూపెట్టుకొన్నారు. సాటిలేని పరాక్రమంతో సాత్యకి కృతవర్మలు పోరాడారు. దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడిని ధనువు ఖండించి కొట్టాడు. ఆ ధృష్టద్యుమ్నుడు మరియొక వింటితో అతిశయించి ఆ దుర్యోధనుడిని బాధించాడు. ఆ ఇద్దరకు ఆశ్చర్యకరమైన గొప్పయుద్ధం జరిగింది. ద్రౌపదిపుత్రులు అయిదుగురూ దుర్యోధనుడిని సమీపించి, ఇంద్రియాలు అజ్ఞాని అయిన మూర్ఖుడిని సంకటపరచినట్లు చలింపజేశారు. ఆ దుర్యోధనుడు వెనుదీయక అనేకములైన బాణాలు వేగంగా ప్రయోగించి, ద్రౌపదికుమారసమూహాన్ని కలత చెందించాడు. ఇట్లా ఆ యుద్ధం అతిశయించింది.

**విశేషం:** ఈ పద్యమున తిక్కన "ఉపమా కాళిదాసస్య" అనే ఆర్యోక్తి స్ఫురించేటట్లు ఒక చక్కని చిక్కని ఉపమాలంకారాన్ని ప్రయోగించాడు. 'ద్రౌపది పుత్రులేవురు పతిఁ గిట్టి యింద్రియములు బాలిశునిఁ జిక్కు పఱచిన పగిది' - జ్ఞానేంద్రియాలు అయిదు కర్మేంద్రియాలు అయిదు. జ్ఞాని ఇంద్రియ విషయాలకు అతీతంగా ఉంటాడు. అజ్ఞాని ఇంద్రియాలకు వశుడై సంసార సంకటములం దుంటాడు. అట్లే ద్రౌపది పుత్రులైదుగురకు దుర్యోధనుడు వశుడయ్యాడని తాత్పర్యం. ద్రౌపది పుత్రులు ఉపమేయం; ఇంద్రియములు ఉపమానం; చిక్కుపరచుట - సమానధర్మం; పగిది - ఉపమావాచకం. దుర్యోధనుడు ఉపమేయం; బాలిశుడు ఉపమానం; చిక్కుపరచుట - సమానధర్మం; పగిది - ఉపమావాచకం. ఇది ఉపమాసంశ్లిష్టం.

పంచపాండవులు పంచమహాభూతాలకు ప్రతీకలు. యమ,వాయు,ఇంద్ర,అశ్వినులు - పంచమహాభూతాలకు అధిష్ఠానదేవతలు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు - వాటి గుణములు లేక తన్మాత్రలు. కుంతి ప్రకృతి. యాజ్ఞసేని ద్రౌపది శక్తి. పంచభూతములైన పంచపాండవులకు శక్తియందు జన్మించిన ఉపపాండవులు - పంచేంద్రియములకు ప్రతీకలు. ఇంతటి భావార్థాన్ని - ఈ ఉపమాలంకారంతో స్ఫురింపచేయటం తిక్కన విశిష్టత.

**వ. మఱియు ననేకు లనేకులం బొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చిన యగ్గలిక మొగ్గరంబులు రెండునుం గలయం బెరసినం బేర్చిన పెంధూళి భానుబింబంబు గప్పె నప్పుడు దొరుఁగు నరతురంగమాతంగరుధిరధారల నడంగిన నధికంబైన సంగరంబునకుం గడంగిన కౌంతేయుల యురవడికి నోహటించి మన మోహరంబు దొరలు మరలిన మరలనీక నీ కొడుకు పురికొలుపుకొని తఱిమినం గనలి ధర్మసుతుండు. 333**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను; అనేకులు= పలువురు; అనేకులన్= పలువురను; పొదివి= క్రమ్మి; పోరాడన్= యుద్ధముచేయుచుండగా; అంతకంతకున్= అంతకంతకును; పేర్చిన= అతిశయించిన; అగ్గలికన్= శౌర్యముతో; మొగ్గరంబులు= సేనావ్యూహములు; రెండునున్= రెండును; కలయన్= కలియబడి; బెరసినన్= వ్యాపించగా; పేర్చిన= అతిశయించిన; పెంధూళి= పెద్దదుమ్ము; భానుబింబంబు= సూర్యబింబమును; కప్పె= కప్పెను; అప్పుడు= ఆ సమయమున; తొరుఁగు=

స్రవించు; నర= మనుజులయొక్క; తురంగ= గుర్రములయొక్క; మాతంగ= ఏనుగులయొక్క; రుధిర= రక్త; ధారలన్= ధారలచేత; అడంగినను= అణగారిపోగా; అధికంబైన= ఎక్కువైన; సంగరంబునకున్= యుద్ధమునకు; కడంగిన= ప్రయత్నించిన (పూనిక వహించిన); కౌంతేయుల= కుంతీపుత్రులయొక్క; ఉరవడికిన్= మిక్కిలి వేగమునకు; ఓహటించి= వెనుదీసి; మన= మనయొక్క; మోహరంబు= సేనావ్యూహమునందలి; దొరలు= రాజులైన వీరులు; మరలినన్= తిరిగిపోవుచుండగా; నీ కొడుకు= నీ యొక్క కొడుకు (దుర్యోధనుడు); మరలనీక= తిరిగిపోకుండ; పురికొలుపుకొని= క్రమ్ముకొని (ఉత్సాహము కల్పించి); తఱిమినన్= తరుమగా; కనలి= కోపించి; ధర్మసుతుండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** ఇంకా పలువురు పలువురను క్రమ్మి పోరాడగా అంతకంతకూ అతిశయించిన శౌర్యంతో సేనావ్యూహాలు రెండును కలియబడి వ్యాపించగా, అతిశయించిన పెద్దదుమ్ము సూర్యబింబాన్ని కప్పివేసింది. ఆ సమయాన స్రవించే నరులయొక్క, గుర్రాలయొక్క, ఏనుగులయొక్క రక్తధారలచేత దుమ్ము అణగారిపోగా, అధికమైన యుద్ధానికి పూనిక వహించిన పాండవుల వేగానికి వెనుదీసి కౌరవసేనా వ్యూహంలోని వీరులు తిరిగి పోతుండగా దుర్యోధనుడు తిరిగిపోకుండా పురికొల్పి తరుమగా, కోపించి ధర్మరాజు (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. మూఁడు నారాచములఁ గృపు వాఁడి చెఱిచి । వాలి కృతవర్మహయముల నాలుగింటఁ**
**గూల్పఁ దనతేరిపై నిడి గురుసుతుండు । దొలఁగుఁ గొంపోయె నవ్విరథుని నృపాల! 334**

**ప్రతిపదార్థం:** నృపాల!= ధృతరాష్ట్ర మహారాజా!; (ధర్మరాజు); మూఁడు= మూడు; నారాచములన్= బాణములతో; కృపు వాఁడి= కృపునియొక్క శౌర్యము; చెఱిచి= పోగొట్టి; వాలి= అతిశయించి; కృతవర్మ= కృతవర్మయొక్క; హయములన్= గుర్రములను; నాలుగింటన్= నాలుగింటితో (నాలుగు బాణములతో); కూల్పన్= చంపగా; గురుసుతుండు= అశ్వత్థామ; తనతేరిపైన్= తనయొక్క రథముమీద; ఇడి= ఉంచి; తొలఁగన్= తొలగునట్లు; ఆ+విరథుని= ఆ రథములేనివానిని (కృతవర్మను); కొంపోయెను= తీసికొనిపోయెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజు మూడు బాణాలతో కృపాచార్యుడి శౌర్యం పోగొట్టి అతిశయించి కృతవర్మ గుర్రాలను నాలుగు బాణాలతో చంపగా అశ్వత్థామ రథంలేని కృతవర్మను తన రథంమీద ఉంచి తొలగించటానికి తీసికొనిపోయాడు.

**చ. కురుపతి చూచి చిత్తమునఁ గోపము పెంపెసలార నేడు నూ**
**ఱరదము లాతనిం బొదువునట్లుగఁ బంచిన నొక్క పెట్ట బం**
**ధురతర వారివాహములు తోయజబాంధవుఁ గప్పుచాడ్పు దోఁ**
**ప రయముమైఁ గడంగి యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్. 335**

**ప్రతిపదార్థం:** కురుపతి= కౌరవులకు ప్రభువైన దుర్యోధనుడు; చూచి; చిత్తమునన్= మనసునందు; కోపము= క్రోధము; పెంపు= ఆధిక్యము; ఎసలారన్= అతిశయించగా; ఏడు; నూఱు= వందలు; అరదములు= రథములు; ఆతనిన్= ఆ ధర్మరాజును; పొదువునట్లుగన్= క్రమ్ముకొనునట్లుగా; పంచినన్= పంపించగ; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; బంధురతర= మిక్కిలి దట్టమైన; వారివాహములు= మేఘములు; తోయజ= పద్మములకు; బాంధవున్= చుట్టమైన సూర్యుని; కప్పు= కప్పివేయు; చాడ్పు= విధము; తోఁపన్= తోచగా (అనిపించగా); రయముమైన్= వేగంతో; కడంగి= ప్రయత్నించి; అవి= అవి (ఆ ఏడు వందల రథములు); పైకొని= కలియబడి-మీదపడి; ఆ+విభుతోన్= ఆ ప్రభువైన ధర్మరాజుతో; పెనంగఁగన్= యుద్ధంచేయగా.

**తాత్పర్యం:** ధర్మరాజు కృపుడిని, కృతవర్మను విరథులను చేయటం దుర్యోధనుడు చూచి, మనసులో కోపం వృద్ధిపొందగా ఏడు వందల రథాలు ఆ ధర్మరాజును క్రమ్ముకొనేటట్లుగా పంపించాడు. దట్టమైన మేఘాలు ఒక్కసారిగా సూర్యుడిని కప్పివేసినట్లుగా ఆ ఏడువందల రథాలు వేగంగా ఆ ధర్మరాజుతో కలియబడి యుద్ధంచేస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. ధర్మరాజు - ఉపమేయము; సూర్యుడు - ఉపమానం; కప్పివేయుట - ధర్మము; విధము - వాచకం. అట్లే ఏడు వందల రథములు ఉపమేయం; వారి వాహనాలు ఉపమానం; - కప్పివేయటం ధర్మం; విధం-వాచకం. ధర్మవాచకములు రెండు ఉపమేయ ఉపమానాలు సమానం కావున ఇది ఉపమా సంశ్లిష్టము. ఇట్టి విశిష్ట అలంకార ప్రయోగం తిక్కయజ్వ ప్రత్యేకత.

**క. కనుఁగొని శికండిముఖయో । ధనికాయం బడరి యా రథప్రకరంబున్**
**సునిశితశరప్రకరములఁ । దనుమాడెన్ రౌద్రరసము దొలుకాడంగన్. 336**

**ప్రతిపదార్థం:** శిఖండి= శిఖండి; ముఖ= మున్నగు; యోధ= యుద్ధవీరుల; నికాయంబు= సమూహము; కనుఁగొని= చూచి; అడరి= అతిశయించి (త్వరపడి); ఆ రథప్రకరంబున్= ఆ రథములయొక్క సమూహమును; రౌద్రరసము; తొలుకాడంగన్= తొణికిసలాడునట్లుగా; సునిశిత= బాగుగా వాడియైన; శర= బాణములయొక్క; ప్రకరములన్= సమూహములతో; తునుమాడెన్= ఖండించెను.

**తాత్పర్యం:** శిఖండి ప్రముఖయుద్ధవీరుల సమూహాన్ని చూచి, అతిశయించి, ఆ రథాల సమూహాన్ని రౌద్రరసం తొణికిసలాడేటట్లుగా వాడి అయిన బాణసమూహాలతో ఖండించాడు.

**వ. ఆ సమయంబున మనదెస నుల్కాపాతశర్కరావర్షాదులగు నుత్పాతంబులు గలిగె వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో 'మీరు కోల్తల సేయుం డేను బెడముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద' నంచు సముద్ధతిం గదిసె, నప్పుడు మద్రేశబలపురస్సరంబైన యమ్మోహరంబు రభసంబునం దఱిమి పాండవసేనా సంరంభంబున కోర్వక తిరిగిన నా సుబలసూనుండు ప్రబలతురంగ దశ సహస్రంబులతో వేగంబు మెఱయ వైరిసేనవెనుకఁ గిట్టి 'యేను గలుగ మీకు భయం బేల?' యని యక్కౌరవసైనికులం బేరుకొని యదల్చి యార్చిన నా కౌంతేయవాహిని కలంగినఁ గని ధర్మనందనుండు సహదేవు నాలోకించి. 337**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; మనదెసను= మనవైపు; ఉల్కా= ఆకాశమునుండి పడుచున్నటులు భాసించు తారవంటి వెలుగు; పాత= పడుట; శర్కరా= చక్కెరయొక్క; వర్షాదులు= వర్షములు మొదలగునవి; అగు= ఐన; ఉత్పాతంబులు= అపశకునములు; కలిగెన్= పుట్టెను; వానికిన్= ఆ అపశకునములకు; శంకింపక= సందేహింపక; శకుని; కడంగి= ప్రయత్నించి (పూనిక వహించి); యోధవరులతోన్= యోధశ్రేష్ఠులతో; మీరు; కోల్తలసేయుండు= ఎదుటనిలిచి యుద్ధము చేయుడు; ఏను= నేను; పెడముట్టునన్= వెనుకనుండి ముట్టడించి; తాఁకి= ఎదుర్కొని; ధర్మనందన= ధర్మరాజు; ఆదులను= మొదలగువారిని; సమయించెదను= సంహరించెదను; అంచున్= అనుచు; సముద్ధతిన్= మిక్కిలి దర్పముతో; కదిసెన్= కలియబడెను; అప్పుడు= ఆ సమయమున; మద్రేశ= శల్యుని; బల= సైన్యము; పురస్సరంబైన= ముందు నడుచుచున్నట్టిదైన; ఆ+మోహరంబు= ఆ సేనావ్యూహము; రభసంబునన్= సాహసముతో; తఱిమి= కలియబడి; పాండవ= పాండవులయొక్క; సేనా= సైన్యముయొక్క;

సంరంభంబునకున్= వేగిరపాటునకు; ఓర్వక= భరింపజాలక; తిరిగిననన్= మరలిపోవుచుండగా; ఆ సుబలసూనుండు= ఆ శకుని (సుబలునియొక్క కుమారుడు); ప్రబల= మిక్కిలి బలమైన; తురంగ= గుర్రములయొక్క; దశసహస్రంబుతోన్= పదివేలతో; వేగంబు= వేగము; మెఱయన్= ప్రకాశింపంగా; వైరి= శత్రువులయొక్క; సేన= సైన్యమునకు; వెనుకన్= వెనుకభాగము; కిట్టి= సమీపించి; ఏను= నేను; కలుగన్= ఉండగా; మీకున్; భయంబు= భయము; ఏల?= ఎందులకు? అని; ఆ+కౌరవ= ఆ కౌరవులయొక్క; సైనికులన్= సేనలను; పేరుకొని= పేరుపెట్టి పిలిచి; అదల్చి= అదలించి; ఆర్చినన్= పెద్ద బొబ్బపెట్టగా (అరవగా); ఆ కౌంతేయవాహిని= ఆ కుంతీపుత్రులయొక్క సేన; కలంగినన్= కలత చెందగా; ధర్మనందనుండు= ధర్మరాజు; సహదేవున్= సహదేవుని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అప్పుడు మనవైపు ఉల్కలు చక్కెరవర్షాలు మొదలైన అపశకునాలు కలిగాయి. ఆ అపశకునాలకు సందేహించక, శకుని పూనిక వహించి యోధశ్రేష్ఠులతో 'మీరు యుద్ధంచేయండి; నేను వెనుకనుండి ముట్టడించి ఎదుర్కొని ఆ ధర్మరాజు మొదలైన వారిని సంహరిస్తాను.' అంటూ మిక్కిలి గర్వంతో కలియబడ్డాడు. ఆ సమయంలో శల్యుడి సైన్యం ముందు పోతుండగా ఆ సేనావ్యూహం సాహసంతో కలియబడి పాండవ సేనల వేగిరపాటునకు భరింపజాలక మరలిపోవుతుండగా శకుని మిక్కిలి బలమైన పదివేల గుర్రాలతో వేగం ఒప్పగా శత్రుసేన వెనుక భాగాన్ని సమీపించి, 'నేను ఉండగా మీకు భయం ఎందుకు?' అని ఆ కౌరవసైనికులను పేరు పెట్టి పిలిచి, అదలించి, పెద్దబొబ్బపెట్టగా ఆ పాండవుల సేన కలతచెందింది. అప్పుడు ధర్మరాజు సహదేవుడిని చూచి.

### శకుని సహదేవు లాశ్వికసహాయులై ఘోరంబుగాఁ బోరుట (సం. 9-21-32)

**ఆ. 'వేగ తాఁకు మైదువేల గుఱ్ఱంబులు । ద్రౌపదీతనూజతతియు నీవు**
**శకుని ననుడు నతఁడు సంరంభజృంభియై । యట్ల చేయ ఘోరమయ్యెఁ బోరు. 338**

**ప్రతిపదార్థం:** ఐదువేల గుఱ్ఱంబులు= ఐదువేల గుర్రములు; ద్రౌపదీ= ద్రౌపదియొక్క; తనూజ= పుత్రులయొక్క; తతియున్= సమూహమును (అనగా ఉపపాండవులును); నీవు; శకునిన్= శకునిని; వేగ= వేగముగ; తాఁకుము= ఎదుర్కొనుము; అనుడున్= ఇట్లు అనగానే; అతఁడు= అతడు; సంరంభ= త్వరగా; జృంభియై= విజృంభించినవాడై; అట్ల= ఆ విధముగానే (అవధారణార్థము); చేయన్= చేయగా; పోరు= యుద్ధము; ఘోరము= భయంకరము; అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** ధర్మరాజు సహదేవుడిని చూచి 'ఐదువేల గుర్రాలతో ద్రౌపదిపుత్రులు, నీవు శకునిని వేగంగా ఎదుర్కొనండి.' అని చెప్పగా సహదేవుడు త్వరగా విజృంభించినవాడై ఆ విధంగానే చేయగా యుద్ధం భయంకరమైనది.

**వ. అట్టి యెడ. 339**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ. లీలఁ గట్టియతోడఁ గూలంగవైచియు । డొంకెనపోటులఁ బొంక మడఁచి**
**పడఁ ద్రోచియును వాలఁ గడికండములుగ వ్రే । సియుఁ గతారంబులఁ జీరి చెఱచి**
**గీటడంగించియు గిట్టి యొండొరుఁ బట్టి । కొని మల్లుచందంబు ననికిఁ జొచ్చి**
**నేలకు వంచియుఁ గేలిమై గళముపై । నెక్కియుఁ బెక్కండ్రు రొక్క మొగిన**

**ఆ. యెక్కుటయు సహించి యుక్కునఁ బెనఁగియు । నుఱక వివిధగతుల నుబ్బి చెలంగి**
**బొమ్మలాడినట్లు పోరి యా రావుతు । లధిప! నెరయ మెఱసి రందు నిందు. 340**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; లీలన్= విలాసముగా; కట్టియతోడన్= కర్రతో (దండము); కూలంగన్= కూలిపోవునట్లుగ (చనిపోవునట్లుగ); వైచియున్= విసిరియు; డొంకెన= వంకరల ఈటె; పోటులన్= పొడుపులతో(పొడుచుకొనుట); పొంకము= పొందిక; అడఁచి= అణచి; పడఁద్రోచియును= క్రిందపడునట్లు చేసియు; వాలన్= కత్తితో; కడికండములుగన్= ఖండ ఖండములుగ; వ్రేసియున్= నరికియు; కఠారంబులన్= పెద్ద పెద్ద ఖడ్గములతో; చీరి= చీల్చి; చెఱిచి= పోగొట్టి; గీటడంగించియున్= చంపియు; కిట్టి= సమీపించి; ఒండొరున్= ఒకరినొకరు; పట్టికొని; మల్లుచందంబున్= మల్లునివిధముగ(జెట్టి); అనికిన్= యుద్ధమునకు; చొచ్చి= తలపడి; నేలకున్= భూమికి; వంచియున్= వంగదీసియు; కేళిమైన్= క్రీడతో; గళముపైన్= కంఠముపై; ఎక్కియున్= ఎక్కియు; పెక్కండ్రుడురు= పలువురు; ఒక్కమొగిన= ఒక్కసారి మొత్తముగా; ఎక్కుటయున్= మీదపడుటయును; సహించి= ఓర్పువహించి; ఉక్కునన్= శౌర్యముతో; పెనఁగియును= యుద్ధముచేసియు; ఉఱక= లక్ష్యపెట్టక; వివిధ= అనేక విధములైన; గతులన్= గమనములతో; ఉబ్బి= సంతోషించి; చెలఁగి= ఉత్సహించి; బొమ్మలు; ఆడినట్లు= ఆడినట్లు; పోరి= యుద్ధముచేసి; ఆ రావుతులు= ఆ రౌతులు (గుఱ్ఱములనెక్కి పోరాడువారు); నెరయన్= వ్యాపించగా; అందున్= అచ్చట; ఇందున్= ఇచ్చట; మెఱసిరి= ప్రకాశించిరి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సహదేవుడు, ద్రౌపదికుమారులు అయిదువేల గుఱ్ఱాలతో శకునితో యుద్ధంచేసే సమయంలో క్రీడగా దుడ్డుకర్రతో చనిపోయేటట్లు విసిరి, వంకరల ఈటె పోటులతో పొంకం అణచి క్రింద పడద్రోచి, కత్తితో ఖండఖండాలుగా నరికి, పెద్ద పెద్ద ఖడ్గాలతో చీల్చి చెండాడి చంపి, సమీపించి ఒకరినొకరు పట్టుకొని మల్లవీరుల విధంగా యుద్ధానికి తలపడి నేలపైకి వంగదీసి, ఆటాడినట్లు మెడలపైకి ఎక్కి, పలువురు మొత్తంగా మీదపడి, ఓర్పుతో శౌర్యంతో యుద్ధంచేసి, ఒకరిపై ఒకరు దుమికి వివిధ గమనాలతో సంతోషించి, ఉత్సహించి, బొమ్మలాడినట్లు ఆ రౌతులు అంతటా వ్యాపించి వెలిగారు.

**విశేషం:** ఇది తురంగ సైన్యం చేసిన యుద్ధంయొక్కవర్ణనం. గుఱ్ఱాలపై నుండి యుద్ధం చేసేవారు రౌతులు. ఇది రథాలపైనుండి అస్త్రశస్త్ర ప్రయోగాలతో చేసే యుద్ధవర్ణనంకాదు. చతురంగ బలాల యుద్ధాలు నానావిధాలుగా ఉంటాయి. ఆ యుద్ధరీతు లన్నింటిని వ్యాసభగవానుడు మూలమున యుద్ధపర్వములందు అత్యద్భుతంగా వర్ణించాడు. తిక్కన కూడా యుద్ధవర్ణనలు బాగుగా చేశాడనీ అందుకు ఆయన అనుభవం తోడైనదనీ కొందరు విశ్వసిస్తారు.

ఇక ఈ పద్యంలో వర్ణించిన యుద్ధం కర్రలతో, కత్తులతో, ఈటెలతో, కాళ్ళతో, చేతులతో చేసిన "దొమ్మీ" అనబడే యుద్ధం. దీనిని బొమ్మలాడినట్లుగా తిక్కన ఉత్ప్రేక్షించాడు.

**వ. మఱియు ననేక ప్రకారంబుల భండనంబుసేసిరి. పదంపడి యమ్మాద్రీకుమారుని వీరోద్రేకంబునకు నోహటించి గాంధారీసోదరుం డాఱువేల తురంగంబులతోడం దిరిగె నతండును ద్విసహస్రహయశేషసేనాసమేతుండై యన్న కడకరిగె. నా సౌబలుండును జుట్టి వచ్చి ధృష్టద్యుమ్నుని మొనపైఁ బడిన నతండు సైన్యసముద్దండ సంరంభం బెసంగ విక్రమాటోపంబు సూపినయపుడు పంచసహస్రత్రిశతహయంబులు వడిన రౌద్రంబు రూపు దాల్చిన ట్లాయుధఖండనాస్థిభంజనశబ్దశ్రవణంబునను రక్తమాంసమేదోస్థిమస్తిష్క మజ్జాసమ్మేళన దారుణరణతలదర్శనంబునను దదీయ విస్రగంధాఘ్రాణంబునను యోధులు వీతచేతస్కులైరి. తెగినతల**

**యొకచేతను నెత్తుట జొత్తిల్లిన కరవాలం బొకకరంబునను బట్టుకొని యట్టలాడినట్లు పెనంగి యా శకుని హతావశిష్టంబులైన సప్తశతాశ్వంబులతోడఁ దొలంగి యచ్చటి జనంబులతోఁ 'గురుపతి యెచ్చట నున్నవాఁ డనిన వార లతని కిట్లనిరి. 341**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; అనేక= నానా; ప్రకారంబులన్= విధములుగా; భండనంబు= యుద్ధము; చేసిరి= చేసిరి; పదంపడి= వెనువెంటనే; ఆ+మాద్రీ= ఆ మాద్రియొక్క; కుమారుని= పుత్రుని అనగా సహదేవునియొక్క; వీర= పరాక్రమముయొక్క; ఉద్రేకంబునకున్= విజృంభణమునకు; తిరిగెన్= వెనుదిరిగెను; ఓహటించి= వెనుదీసి; గాంధారీ= గాంధారియొక్క; సోదరుండు= సహోదరుడయిన శకుని; ఆఱువేల తురంగంబులతోడన్= ఆరువేల గుఱ్ఱాలతో; అతండును= అతడును (సహదేవుడును); ద్వి= రెండు; సహస్ర= వేల; హయ= గుఱ్ఱములు; శేష= మిగిలిన; సేనా= సైన్యముతో; సమేతుండై= సహితుడై (కూడినవాడై); అన్నకడకున్= అన్నదగ్గరకు; అరిగెన్= వెడలెను; ఆ సౌబలుండును= ఆ శకునియు; చుట్టివచ్చి= తిరిగివచ్చి; ధృష్టద్యుమ్నుని; మొనపైన్= సేనపై; పడినన్= పడగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; సైన్య= సేనతోకూడ; సముద్దండ= అధికమైన; సంరంభంబు= వేగిరపాటు; ఎసంగన్= అతిశయించగ; విక్రమ= పరాక్రమముయొక్క; ఆటోపంబు= ఆడంబరము; చూపిన+అపుడు= చూపిన సమయమున; పంచ= ఐదు; సహస్ర= వేలు; త్రిశత= మూడు వందలు; హయంబులు= గుఱ్ఱములు (అయిదువేల మూడువందల గుఱ్ఱములు); పడినన్= పడిపోగా (చనిపోగా); రౌద్రంబు= క్రోధము; రూపు= ఆకృతి; తాల్చినట్లు= ధరించినట్లు; ఆయుధ= ఆయుధములయొక్క; ఖండన= విరుచుట; అస్థి= ఎముకలయొక్క; భంజన= పగులగొట్టుట; శబ్ద= శబ్దములయొక్క (ధ్వనులయొక్క) శ్రవణంబునను= వినుటవలనను; మాంస= మాంసముయొక్క; మస్తిష్క= మెదడుయొక్క (మేదస్సకు-మస్తిష్కమునకు కొంచెము భేదముకలదు. మెదడునందలి రెండ భాగములివి); మజ్జా= మజ్జాయొక్క (ఎముకలలో ఉన్న మూలుగు మజ్జ అనబడును); సమ్మేళన= వీటి కలయిక వలన; దారుణ= భయంకరమైన; రణ= యుద్ధముయొక్క; తల= భూమియొక్క (యుద్ధభూమియొక్క); దర్శనంబునను= చూచుటవలనను; తదీయ= ఆ యుద్ధమునందలి మాంసాదులయొక్క; విస్రగంధ= కుళ్లినకంపు; ఆఘ్రాణంబునను= పీల్చుటవలనను; యోధులు= యుద్ధముచేయుచున్న వీరులు; వీత= పోయిన; చేతస్కులు= మనస్సుకలవారు; ఐరి= అయ్యిరి; తెగిన= ఖండింపబడిన; తల= శిరము; ఒకచేతను= ఒకచేతితోను; నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లిన= ఎఱ్ఱబారిన; కరవాలంబు= కత్తి; ఒక కరంబునను= ఒక చేతితోడను; పట్టుకొని; అట్టలు+ఆడినట్లు= తలలు తెగిన శరీరములు ఆడినట్టుగా; పెనంగి= యుద్ధముచేసి; ఆ శకుని; హత= చంపబడగా; అవశిష్టంబులైన= మిగిలిపోయిన; సప్త= ఏడు; శత= వందలు; అశ్వంబులతోడన్= గుఱ్ఱములతో; తొలంగి= తప్పించుకొని; అచ్చటి= ఆ యుద్ధభూమియందలి; జనంబులతోన్= ప్రజలతో; కురుపతి= దుర్యోధనుడు; ఎచ్చట= ఎక్కడ; ఉన్నవాఁడు?= ఉన్నవాడు?; అనినన్= అనగా; వారలు= వారు; అతనికిన్= ఆ శకునికి; ఇట్లు= ఈ విధముగా; అనిరి= చెప్పిరి.

**తాత్పర్యం:** ఇంకా నానా విధాలుగా యుద్ధం చేశారు. వెనువెంటనే సహదేవుడి పరాక్రమ విజృంభణకు వెనుదీసి, శకుని ఆరువేల గుఱ్ఱాలతో తిరుగబడ్డాడు. సహదేవుడుకూడా రెండువేల గుఱ్ఱాలు మిగిలిన సైన్యంతో కూడి అన్న దగ్గరకు వెళ్ళాడు. శకుని తిరిగి వచ్చి ధృష్టద్యుమ్నుడి సేనపై పడగా ఆ ధృష్టద్యుమ్నుడు సేనతో కూడా అధికమయిన వేగిరపాటుతో అతిశయించి, పరాక్రమపు ఆడంబరాన్ని ప్రదర్శించగా ఆ సమయంలో అయిదువేల మూడువందల గుఱ్ఱాలు చనిపోయాయి. అప్పుడు రౌద్రం ఆకృతి ధరించినట్లు ఆయుధాలు విరిగిపోవటంవలనను, ఎముకలు, మస్తిష్కము మజ్జలు బాగా కలిసి పోయినందువలన భయంకరమైన యుద్ధభూమిని చూపటం వలనను, ఆ మాంసమజ్జాదులయొక్క కుళ్ళినకంపు పీల్చుటవలనను యోధుల చైతన్యం నశించింది. ఖండించబడిన తలను ఒకచేతితోను, రక్తంతో ఎఱ్ఱబారిన కత్తి ఒక చేతితోను పట్టుకొని, తలతెగిన శరీరములు ఆడినట్లు యుద్ధంచేసి,

చావగా మిగిలిన ఏడువందల గుఱ్ఱాలతో ఆ శకుని తప్పించుకొని యుద్ధభూమినుండి తొలగి, అచ్చట ఉన్న ప్రజలతో 'దుర్యోధనుడు ఎక్కడ ఉన్నా?'డ ని అడుగగా వారు ఆ శకునికి ఈ విధంగా చెప్పారు.

**ఉ. అల్లదె కంటె? పూర్ణశశియట్లు కడుం జెలువొందెఁ జూడఁ బే**
**రెల్లి రథప్రతాన మదె యేపున సంగరకేళిఁ జాల శో**
**భిల్లెడు నయ్యెడన్ రిపువిభీషణవిక్రమణప్రకారగా**
**ఢోల్లసనుండు భూపతి మహోన్నతి నొప్పెడుఁ బొమ్ము చెచ్చెరన్. 342**

**ప్రతిపదార్థం:** అల్లదె= అల్లదిగొ; కంటె?= చూచితివా?; పూర్ణ= నిండు; శశి= చందమామ; అట్లు= అన్నట్లుగా; పేరు= పెద్ద; ఎల్లి= గొడుగు; చూడన్= చూడగా; కడున్= మిక్కిలి; చెలువు= సౌందర్యము; ఒందెన్= పొందెను; అదె= అదియే; రథ= రథములయొక్క; ప్రతానము= సమూహము; ఏపునన్= విజృంభణముతో; సంగర= యుద్ధమనెడి; కేళిన్= ఆటయందు; చాలన్= మిక్కిలి; శోభిల్లెడున్= ప్రకాశించెను; ఆ+ఎడన్= ఆచ్చోట; రిపు= శత్రువులకు; విభీషణ= భయంకరమైన; విక్రమణ= పరాక్రమముయొక్క; ప్రకార= విధముచే; గాఢ= దట్టమయిన; ఉల్లసనుండు= ఉల్లాసము కలవాడు (ఆనందము కలవాడు); భూపతి= భూభర్త అయిన దుర్యోధనుడు; మహా= గొప్ప; ఉన్నతిన్= ఆధిక్యముతో; ఒప్పెడున్= ప్రకాశించుచున్నాడు; చెచ్చెరన్= వెంటనే (శీఘ్రముగా); పొమ్ము= వెడలుము.

**తాత్పర్యం:** 'అదిగో చూచావా? నిండు పున్నమిచందమామ అన్నట్లుగా ఆ పెద్ద గొడుగు మిక్కిలి సౌందర్యంతో ప్రకాశించేది. అదే- రథముల వరుస. విజృంభణంతో యుద్ధక్రీడయందు మిక్కిలి ప్రకాశించింది. ఆ చోటనే శత్రువులతో భయంకరంగా పరాక్రమించటంలో దట్టమయిన ఆనందం కలవాడైన దుర్యోధనుడు గొప్ప ఆధిక్యంతో వెలుగుతున్నాడు. వేగంగా పొమ్ము.

**వ. అనిన విని తల యెత్తి చూచి తత్ప్రదేశంబున కరిగి యద్ధరణీశుం గని యతని కిట్లనియె. 343**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా (చెప్పగా); విని= విని; తల= శిరము; ఎత్తి= పైకి ఎత్తి; చూచి; తద్= ఆ; ప్రదేశంబునకున్= చోటునకు; అరిగి= వెడలి; ఆ= ఆ; ధరణీ= భూమికి; ఈశున్= ప్రభువు అయిన దుర్యోధనుని; కని= చూచి; అతనికిన్= అనితో; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియె= చెప్పెను (పలికెను).

**తాత్పర్యం:** ప్రజలు చెప్పగా శకుని విని తల పైకెత్తి చూచి, అక్కడికి వెడలి ఆ దుర్యోధనుడిని చూచి అతడితో ఈ ప్రకారంగా అన్నాడు.

**క. 'పొలియించితి నే గుఱ్ఱం । బులఁ దేరుల కుఱికి యింక భూరిరయమునన్**
**బొలియింపవలయుఁ బ్రాణం । బులు డాఁచిన వశమె పాండుపుత్రుల గెలువన్. 344**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; తేరులకున్= రథములపైకి; ఉఱికి= దుమికి; గుఱ్ఱంబులన్= గుఱ్ఱములను; పొలియించితిన్= చంపితిని; ఇంకన్= ఇంక; భూరి= మిక్కిలి; రయమునన్= వేగముగా; పొలియింపవలయున్= చంపవలయును (పాండు పుత్రులను); ప్రాణంబులు; డాఁచినన్= దాచుకొనినచో; పాండుపుత్రులన్= పాండురాజు కుమారులను (పాండవులను); గెలువన్= జయించుట; వశమె?= తరమా?

**తాత్పర్యం:** 'నేను రథాలపైకి దుమికి గుర్రాలను చంపాను. ఇంకా మిక్కిలి వేగంగా పాండుపుత్రులను చంపాలి. ప్రాణాలు దాచుకొంటే పాండవులను జయించటం సాధ్యం కాదు.

**వ. రథంబులు గజంబులు దెగినం గాని కాలుబలంబుల సమయించుట పని గా' దనిన నమ్మాటకు సైనికులు సంతసం బంది బరవసంబు సేయ నమ్మహీనాయకుండు సముత్సాహదోహలియై తఱిమిన మనమూఁకలు కడంక యెలర్ప దర్పస్ఫురితంబులగుచు నురవణించినం గని గాండీవి గోవిందున కిట్లనియె. 345**

**ప్రతిపదార్థం:** రథంబులు= రథములు; గజంబులు= ఏనుగులు; తెగినన్+కాని= చస్తే కాని; కాలుబలంబులన్= పదాతి దళములను; సమయించుట= సంహరించుట; పనికాదు= సాధ్యముకాదు; అనినన్= అని చెప్పగా; ఆ+మాటకున్= ఆ పలుకునకు; సైనికులు= భటులు; సంతసంబు= సంతోషము; అంది= పొంది; బరవసంబు= ధైర్యము; చేయన్= చేయగా; ఆ= ఆ; మహీనాయకుండు= రాజు అయిన దుర్యోధనుడు; సముత్సాహ= మిక్కిలి ప్రయత్నంతో; దోహలియై= అతిశయించినవాడయి (మిక్కిలి ఉత్సాహము కలవాడై); తఱిమినన్= వెంటపడిపోవునట్లు చేయగా; మనమూఁకలు= మన సైన్యములు; కడంక= ప్రయత్నము; ఎలర్పన్= అతిశయింపగా; దర్ప= గర్వముతో; స్ఫురితంబులు= ప్రకాశములు కలవారు; అగుచున్= అగుచును; ఉరవణించినన్= వేగిరపాటు పొందగా; కని= చూచి; గాండీవి= అర్జునుడు (గాండీవము కలవాడు గాండీవి); గోవిందునకున్= శ్రీకృష్ణునకు; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్.

**తాత్పర్యం:** రథాలు ఏనుగులు నాశనమయితే కాని పదాతిదళాలను సంహరించటం సాధ్యం కాదు.' అని శకుని చెప్పగా ఆ మాటకు సైనికులు సంతోషం పొంది ధైర్యం చేయగా దుర్యోధనుడు మిక్కిలి అతిశయించిన ఉత్సాహంతో వెన్నంటి పారిపోయేటట్లు తరుముతుండగా మన సైన్యాలు ప్రయత్న మతిశయించగా గర్వంతో ప్రకాశిస్తూ వేగిరపాటుచూపగా చూచి, అర్జునుడు, శ్రీకృష్ణుడితో ఈ ప్రకారంగా అన్నాడు:

**క. 'మొనసి చనుదెంచు దుర్యో । ధనసేనాసముదయంబుఁ దఱియ నురవడిం**
**జననిమ్ము మన రథము నా । సునిశితబాణముల సమయఁ జూచెద దీనిన్.' 346**

**ప్రతిపదార్థం:** మొనసి= పూనికవహించి; చనుదెంచు= వచ్చుచున్న; దుర్యోధన= దుర్యోధనునియొక్క; సేనాసముదయంబున్= సేనా సమూహమును; తఱియన్= సమీపించునట్లు; మనరథమున్= మనయొక్క రథము; ఉరవడిన్= విజృంభణంతో; చననిమ్ము= వెడలనిమ్ము; దీనిన్= ఈ దుర్యోధనసేనా సమూహమును; నా= నాయొక్క; సునిశిత= మిక్కిలి వాడి అయిన; బాణములన్= బాణములతో; సమయన్= నశించునట్లు; చూచెదన్= చూచెదను (నశించునట్లు చేసెదనని భావం).

**తాత్పర్యం:** 'పూనికతో వస్తున్న, దుర్యోధనుడి సేనాసమూహాన్ని సమీపించేటట్లు మన రథం మిక్కిలి వేగంగా ముందుకుపోనిమ్ము. ఈ దుర్యోధన సేనాసమూహాన్ని వాడి అయిన బాణాలతో నశించేటట్లు చేస్తాను.'

### దుర్యోధను మౌర్ఖ్యం బుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట (సం. 9-23-18)

**వ. అనుచు నమ్మొన యాలోకించి నిరూపించి. 347**

**ప్రతిపదార్థం:** అనుచున్= ఇట్లు చెప్పుచు; ఆ+మొన= ఆ సైన్యం; ఆలోకించి= చూచి; నిరూపించి= నిరూపణచేసి (అనగా వేరు వేరుగా స్పష్టంగా పరిగణించి).

**తాత్పర్యం:** అర్జునుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అంటూ ఆ సైన్యాన్ని చూచి నిరూపణచేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పెనఁకువ యెడ త్రెవ్వక పదు । నెనిమిదిదివసములు సెల్లె బెనఁగంగా**
**వనధిం బోలెడు కురుబల । మనఘా! కనుఁగొనఁగ గొప్పదాకృతి యయ్యెన్. 348**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవు అయిన ఓ శ్రీకృష్ణా! (సంబోధనము); పెనఁకువ= యుద్ధము; ఎడత్రెవ్వక= ఎడతెగకుండగ (ఆగకుండగ); పదునెనిమిది= పద్దెనిమిది; దివసములు= దినములు; చెల్లెన్= కడచెను; ఏన్= నేను; పెనఁగంగాన్= యుద్ధంచేయగా; వనధిన్= సముద్రమును; పోలెడు= పోలునట్టి; కురుబలము= కౌరవసైన్యము; కనుఁగొనఁగన్= చూడగా; గోష్పద= గోవుపాదమంతటి; ఆకృతి= ఆకారముకలది (మిక్కిలి చిన్నది అనుటకు గోష్పదమందురు); అయ్యెన్= అయ్యెను.

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! యుద్ధం ఎడతెగకుండా పద్దెనిమిది దినాలు గడిచాయి. నేను యుద్ధం చేసినందువలన సముద్రమంతటి కౌరవ సైన్యం చూడగా గోవుపాదమంత చిన్నది అయింది.

**ఆ. దైవ మిట్లు గలఁచునే వీరి మదిమది । నుండి ఘోరమైన యుద్ధమునకుఁ**
**దొడఁగ వలయునట్టి తొడరువు కావించి । కొనిరి చీఁకురాజుకొడుకు లేచి. 349**

**ప్రతిపదార్థం:** చీఁకురాజు= గ్రుడ్డిరాజు (ధృతరాష్ట్రుడు); కొడుకులు= పుత్రులు; ఏచి= విజృంభించి; మదిమదినుండి= హాయిగానుండి; ఘోరమయిన= భయంకరమయిన; యుద్ధమునకున్; తొడఁగవలయు= ప్రారంభించవలయును; అట్టి; తొడరువు= యత్నము; కావించికొనిరి= చేసికొనిరి; వీరి= వీరియొక్క (కౌరవులయొక్క); మది= మనస్సు; ఇట్లు= ఈ ప్రకారమగు; దైవము= దైవము; కలఁచునే!= కలత చెందించెను గదా!

**తాత్పర్యం:** గ్రుడ్డిరాజు కొడుకులయిన కౌరవులు విజృంభించి హాయిగా ఉండి భయంకరమయిన యుద్ధాన్ని ప్రారంభించవలెననే యత్నం చేసికొన్నారు. వీరియొక్క మనస్సును ఈ ప్రకారంగా దైవం కలతచెందించింది కదా!

**చ. అమరనదీసుతుండు వడినప్పుడు వీరలబుద్ధి సంధికా**
**ర్యమునకుఁ జొచ్చునింక నని యాత్మఁ దలంచితి నమ్మహాత్ముఁడు**
**న్సముచిత వాక్యవృత్తిఁ గురునాయకుఁ దేర్పఁగఁ జూచెఁ జిత్త దో**
**షమహిమ నద్దురాత్ముఁడు ప్రశాంతత నొందఁడ యెన్నిభంగులన్. 350**

**ప్రతిపదార్థం:** అమరనదీ= ఆకాశగంగానదియొక్క; సుతుండు= కుమారుఁడు అనగా భీష్ముడు; పడినప్పుడు= పడిపోయినప్పుడు; ఇంకను; వీరల= ఈ కౌరవులయొక్క; బుద్ధి; సంధికార్యమునకున్= పొందునకు (యుద్ధములేకుండ సంధి చేసికొనుటకు); చొచ్చును= చొరబడును (అంగీకరించును); అని; ఆత్మన్= నాలో; తలంచితిని= అనుకొంటివి; ఆ+మహాత్ముఁడున్= ఆ గొప్ప ఆత్మకలవాడయిన భీష్ముడును; సముచిత= మిక్కిలి ఉపయోగకరమయిన (యోగ్యమయిన); వాక్యవృత్తిన్= మాటలయొక్క పొందికతో; కురునాయకున్= దుర్యోధనుని; తేర్పఁగన్= ప్రసన్నుని చేయుటకు; చూచెన్= చూచెను; ఆ+దురాత్ముఁడు= ఆ చెడ్డమనస్సు కలవాడు; ఎన్ని= భంగులన్= విధములుగానైనను; ప్రశాంతతను= మిక్కిలిశాంతిని; ఒందఁడు+అ= పొందడు గదా!

**తాత్పర్యం:** భీష్ముడు యుద్ధభూమియందు పడిపోయినప్పుడైనా ఈ కౌరవుల బుద్ధి సంధిచేసికొనటానికి చొరబడుతుందని అనుకొన్నాను. మహాత్ముడయిన ఆ భీష్ముడు కూడా యోగ్యమైన మాటలతో ఆ దుర్యోధనుడిని ప్రసన్నుడిని చేయటానికి చూచాడు. అయినా ఆ దుష్టబుద్ధి కల దుర్యోధనుడు ఎన్ని విధాలుగా చెప్పినా శాంతమనస్కుడు కాడాయెను.

**క. గంగాతనయుఁడు దెగినను । సంగరమున కుత్సహింపఁజనునే తమకున్?**
**వెంగలు లని యప్పుడు దెలి । యంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా! 351**

**ప్రతిపదార్థం:** కృష్ణా!; గంగాతనయుఁడు= గంగాదేవి పుత్రుడయిన భీష్ముడు; తెగినను= చచ్చినప్పటికిని; సంగరమునకున్= యుద్ధమునకు; ఉత్సహింపన్= ప్రయత్నింపగా; తమకున్= దుర్యోధనాదులకు; చనునే?= ఒప్పునా? (ఒప్పదు); అప్పుడు= ఆ సమయమున; సుయోధనాదులన్= దుర్యోధనుడు మొదలగువారిని; వెంగలులు= వెర్రివాళ్ళు; అని; తెలియంగాన్= స్పష్టముగా; ఎఱిఁగితిన్= తెలిసికొంటిని.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా!= భీష్ముడు పతనమైన తరువాత కూడా యుద్ధానికి ప్రయత్నించటం దుర్యోధనాదులకు తగదు. అప్పుడే దుర్యోధనాదులు మూఢులని స్పష్టంగా తెలిసికొన్నాను.

**ఉ. దంతియుఁ దాను నాజి భగదత్తుఁడు గూలఁగఁ జూచి సింధుభూ**
**కాంతుని చావు దెల్లముగఁ గన్గొని యాతనిఁ గావఁ బూని య**
**ట్లంతలు రాజు లెల్ల సమయం గని ద్రోణునిపాటు గాంచి యా**
**వంతయు నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ డెంత మూర్ఖుఁడో! 352**

**ప్రతిపదార్థం:** ఆజిన్= యుద్ధమునందు; భగదత్తుఁడు; తానున్= తానును; దంతియున్= ఏనుగును; కూలఁగన్= చనిపోగా; చూచి; సింధుభూకాంతుని= సింధుదేశపు రాజు అయిన జయద్రథుని; చావు= మరణము; తెల్లముగన్= స్పష్టంగా; కన్గొని= చూచి; ఆతనిన్= ఆతనిని అనగా ఆ జయద్రథుని; కావన్= రక్షించుటకు; పూని= ప్రయత్నంచేసి; అట్లు= ఆ ప్రకారంగా; అంతలు= గొప్పవారయిన; రాజులు; ఎల్లన్= సమస్తమైనవారును; సమయన్= చనిపోగా; కని= చూచి; ద్రోణుని= ద్రోణాచార్యుని; పాటు= మరణము; కాంచి= చూచి; ఆవంతయున్= కొంచెముకూడా; ఆత్మలోనన్= మనసులోపల; తెలియండు= తెలిసికొనడు; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ఎంత= ఎంతటి; మూర్ఖుఁడో!= వివేకహీనుడో కదా!

**తాత్పర్యం:** భగదత్తుడు, అతని ఏనుగు చనిపోవటం స్వయంగా చూచి, సింధుదేశపురాజు జయద్రథుడి చావు తెల్లంగా చూచి, ఆ సైంధవుడిని రక్షించటానికి ప్రయత్నించిన గొప్ప గొప్ప రాజులందరు చనిపోగా చూచి, నా శపథం చూచి, ద్రోణాచార్యుడి మరణం చూచి - కొంచెంకూడా మనసులో తెలిసికొనడు. దుర్యోధనుడు ఎంతటి వివేకహీనుడో కదా!

**క. తన యనుజు లకట! దుశ్శా । సనుఁడును లోనైనవారు సమసిన చందం**
**బును బంధుసహితముగఁ గ । ర్ణుని గీటడఁచిన విధంబునుం జూడఁ డొకో! 353**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; తన= తనయొక్క; అనుజులు= తమ్ములు; దుశ్శాసనుఁడును= దుశ్శాసనుడును; లోనైనవారు= మొదలగువారు; సమసిన= మరణించిన; చందంబును= విధమును; బంధుసహితముగన్= చుట్టములతోకూడా; కర్ణుని= కర్ణునియొక్క; గీటడఁచిన= చంపిన; విధంబునున్= విధానమునుకూడ; చూడఁడు= చూడడు (గ్రహించడు) ఒకొ!= కదా!

**తాత్పర్యం:** దుశ్శాసనుడు మొదలైన తన తమ్ములు మరణించిన విధాన్ని, చుట్టాలతో కూడా కర్ణుడిని చంపిన విధాన్ని గ్రహించడు కదా!

**క. అది యెల్ల నేల చెప్పఁగఁ? । దుది శల్యునిపాటు గనియుఁ దోఁపఁ డితఁడు బ**
**ల్లిదుఁ డని ధర్మజు దెసఁ దలఁ । పిది కురుపతి బుద్ధికొలఁది యేటికి వగవన్? 354**

**ప్రతిపదార్థం:** అది; ఎల్లన్= అది అంతయూ; చెప్పఁగన్= చెప్పుట; ఏల?= ఎందుకు?; తుది= చివర; శల్యుని= శల్యునియొక్క; పాటు= పతనం - చావు; కనియున్= చూచియును; ఇతడు= ఈ ధర్మరాజు; తోఁపడు= భావించడు; ధర్మజుదెసన్= ధర్మరాజు పట్ల; బల్లిదుఁడు= బలం గలవాడు; అని; కురుపతి= కౌరవులకు భర్త అయిన దుర్యోధనునియొక్క; బుద్ధి= బుద్ధియొక్క (జ్ఞానముయొక్క); కొలఁది= పరిమితి; ఇది; అని; ఇతఁడు= ఇతడు; తలఁపు+ఇది= ఆ దుర్యోధనుని అంచనా ఇదే! వగవన్= విచారించుట; ఏటికిన్?= ఎందులకు?

**తాత్పర్యం:** అదంతా అనుకోవడం ఎందుకు? చిట్ట చివర శల్యుని చావు చూచి కూడా ధర్మరాజు బలమైన వాడని గ్రహించడం లేదు. ధర్మరాజును గూర్చి దుర్యోధనుడి అంచనా, ఆలోచన ఇంతే. అతడి బుద్ధి బలం అంతే. దీనికి విచారించడం ఎందుకు?

**క. క్షోణీరాజ్యార్ధము దన । ప్రాణము గలుగంగనీఁడు రారాజు జగ**
**త్త్రాణపరాయణకరణ ధు । రీణుండగు పాండుసుతగరిష్ఠున కెట్లున్. 355**

**ప్రతిపదార్థం:** ఎట్లున్= ఏ విధముగాను; జగత్= ప్రపంచమును; త్రాణ= కాపాడుటయందు; పరాయణ= అనురక్తి అనెడి; కరణ= కార్యమునందు; ధురీణుండు= భారమును మోయువాడు; అగు= అయినట్టి; పాండు= పాండురాజుయొక్క; సుత= పుత్రులలో; గరిష్ఠునకున్= మిక్కిలి గొప్పవాడయిన ధర్మరాజునకు; రారాజు= దుర్యోధనుడు; తన ప్రాణము= తనయొక్క ప్రాణము; కలుగంగన్= ఉండగా; క్షోణీ= భూమియొక్క; రాజ్య= సామ్రాజ్యముయొక్క; అర్ధము= సగభాగము; ఈఁడు= ఈయడు.

**తాత్పర్యం:** ఏ విధంగానైనా ప్రపంచాన్ని కాపాడటంలో అనురక్తి గలవాడైన ధర్మరాజుకు ఈ దుర్యోధనుడు తన ప్రాణం ఉన్నంతవరకు రాజ్యభాగం ఈయడు.

**వ. కావునఁ గొఱంతయును దీర్పవలసియున్న' దనిన విష్ణుండు జిష్ణున కిట్లనియె. 356**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; కొఱంతయును= మిగిలిన కొంచెముకూడ; తీర్పవలసియున్నది= పూర్తిచేయవలసియున్నది; అనినన్= ఇట్లు చెప్పగా; విష్ణుండు= శ్రీకృష్ణుడు; జిష్ణునకున్= అర్జుననకు; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** అందువలన మిగిలి ఉన్న కొంచెం కూడ పూర్తి చేయవలసి ఉన్నది' అని అర్జునుడు అనగా అతడితో శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు:

**ఉ. 'అక్కడ సంధికిం జనినయప్పుడు నవ్విదురుండు కృష్ణ! నీ**
**విక్కడ కేల వచ్చితి? విహీనవివేకుఁడు దుర్మదాంధ్యముం**

**దక్కునె? సంగరంబ యుచితం బగుకృత్యముగాక యిమ్మెయి**
**న్ముక్కున నూర్పుగల్గఁ గుజనుండు సుయోధనుఁ డుర్వి యిచ్చునే?'** **357**

**ప్రతిపదార్థం:** సంధికిన్= సంధికి; చనిన= వెడలిన; అప్పుడు= ఆ సమయమున; అక్కడన్= అచ్చట; ఆ+విదురుండు= ఆ విదురుడు; కృష్ణ!= ఓ కృష్ణా!; నీవు; ఇక్కడకున్= ఇచ్చటకు; ఏల= ఎందులకు; వచ్చితి?= వచ్చితివి?; విహీన= లేని (పోయిన); వివేకుఁడు= యుక్తా యుక్త జ్ఞానము కలవాడు (దుర్యోధనుడు); దుర్మద= దుష్టమయిన గర్వముతో కూడిన; ఆంధ్యమున్= గ్రుడ్డితనమును; తక్కునే?= విడిచిపెట్టునా?; సంగరంబ= యుద్ధమే; ఉచితంబగున్= యోగ్యమయిన (ఉపయోగకరమయిన); కృత్యము= చేయదగిన పని; కాక= అట్లుకాక; ఈ+మెయిన్= ఈ విధముగా; కుజనుండు= కుత్సితబుద్ధిగల మనుజుడు అయిన; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ముక్కునన్= ముక్కునందు; ఊర్పుగల్గన్= ఊపిరి ఉండగా (ప్రాణమున్నంతవరకు); ఉర్వి= భూమి (రాజ్యము); ఇచ్చునే?= ఇచ్చునా? (ఈయడు).

**తాత్పర్యం:** 'నేను సంధికి పోయినప్పుడు ఆ విదురుడు 'కృష్ణా! నీ విక్కడికి ఎందుకు వచ్చావు? యుక్తాయుక్త జ్ఞానం లేని దుర్యోధనుడు దుష్టమైన గర్వంతో కూడిన గర్వాన్ని విడిచిపెట్టడు. యుద్ధమే చేయదగిన పని. అట్లా కాకుండా, ఈ విధంగా సంధి జరిగితే కుత్సితుడైన దుర్యోధనుడు ముక్కున ఊపిరి ఉన్నంతవరకు రాజ్యం ఈయడు.'

**వ.** **అని బోధించె నదియునుంగాక దుర్యోధనుండు జనియించినప్పుడు మును 'లిప్పాపాత్ముండు నిఖిల క్షత్రియక్షయ హేతు!' వగునని యాదేశించిరిగాదే' యనిన నర్జునుం డతని కిట్లనియె.** **358**

**ప్రతిపదార్థం:** అని; బోధించెను= చెప్పెను; అదియునుంగాక= అదియేకాకుండా; దుర్యోధనుడు; జనియించినప్పుడు= పుట్టినప్పుడు; మునులు= మునీశ్వరులు (ఋషులు); ఈ+పాపాత్ముండు= పాపబుద్ధికలవాడు; నిఖిల= సమస్తమయిన; క్షత్రియ= రాజులయొక్క; క్షయ= నాశనమునకు; హేతువు= కారణభూతుడు; అగునని; ఆదేశించిరి= ఆజ్ఞాపించిరి; కాదే!= కదా!; అనినన్= అనిచెప్పగా; అర్జునుండు= అర్జునుడు; అతనికిన్= శ్రీకృష్ణునికి; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను (ఋషివాక్యము ఆజ్ఞవంటిది)

**తాత్పర్యం:** విదురుడు ఆ విధంగా నాకు బోధించాడు. అంతేకాక దుర్యోధనుడు పుట్టినప్పుడు మునులు 'ఈ పాపాత్ముడు సమస్త రాజులయొక్క నాశనానికి కారణభూతుడు కాగలడని ఆజ్ఞాపించారు కదా!' అని శ్రీకృష్ణుడు చెప్పగా అర్జునుడు ఆ శ్రీకృష్ణుడితో ఈ ప్రకారంగా అన్నాడు.

**తే.** **'అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె। నున్నవారలఁ బొలియించి తన్ను విడిచి**
**కాని విడువండు ధృతరాష్ట్రసూనుఁ డుర్వి। ధర్మసూనున కిది నిశ్చితంబు గృష్ణ!** **359**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్ములు= ఆ గొప్ప మనస్సుకల మునులు; చెప్పిన= పలికిన; అట్ల= అట్లే; అయ్యెను; ఉన్నవారలన్= బ్రతికి ఉన్న వారలను; పొలియించి= చంపి; తన్నున్= తనను; విడిచికాని= చంపుకొని కాని; ధృతరాష్ట్ర సూనుఁడు= ధృతరాష్ట్రుని కుమారుడయిన దుర్యోధనుడు; ధర్మసూనునకున్= ధర్మరాజునకు; ఉర్వి= భూమి; విడువండు= విడిచిపెట్టడు; కృష్ణ!= ఓ కృష్ణా!; ఇది; నిశ్చితంబు= నిశ్చయింపబడినది.

**తాత్పర్యం:** 'ఆ మహాత్ములయిన మునులు చెప్పినట్లుగానే జరిగింది. బ్రతికి ఉన్న వారిని చంపించి, తాను చచ్చికాని దుర్యోధనుడు ధర్మరాజుకు రాజ్యం వదలడు. ఓ కృష్ణా! ఇది నిశ్చయం.

**క. దుర్బలమగు నమ్మూఁకను । దోర్బల మెసఁగంగ నిపుడ త్రుంచెద నా దు**
**ర్నిర్బంధపరుఁడు దనదగు । దౌర్బల్యము గనుచు మదము దక్కి కనుఁగొనన్. 360**

**ప్రతిపదార్థం:** ఆ; దుర్నిర్బంధపరుడు= మొండివాడు (దుర్యోధనుడు); తనదగు= తనదైన; దౌర్బల్యము= దుర్బలత్వము; కనుచున్= పొందుచు; మదము= గర్వము; తక్కి= విడిచి; కనుఁగొనన్= చూచుచుండగా; దుర్బలమగు= బలహీనమైనట్టి; ఆ+మూఁకను= ఆ సైన్యమును; దోర్బలము= భుజబలము; ఎసఁగంగన్= అతిశయించునట్లుగ; ఇపుడు+అ= ఇపుడే (ఈ క్షణమునందే); త్రుంచెదన్= ఖండించెదను.

**తాత్పర్యం:** ఆ దుష్టశత్రువు దుర్యోధనుడు తనదైన నిస్సహాయతను చూస్తూ, గర్వం పోగొట్టుకొనే విధంగా బలంలేని ఆ సైన్యమును భుజబలం అతిశయించేటట్లుగా ఈ క్షణమే ఖండిస్తాను.

**వ. రయంబున రథంబు గడపు' మనుడు నుత్తుంగమాతంగమహీరుహశోభితంబును సాంద్రస్యందన గుల్మగహనంబును బహుళహయకక్షాకీర్ణంబును సముద్భట సుభట లతాలసితంబును నైన సుయోధను సేనా కాననంబునందు మాధవమహావాయువు ధనంజయదారుణానలంబు దరికొల్పిన. 361**

**ప్రతిపదార్థం:** రయంబునన్= వేగంగా; రథంబు= రథము; కడపుము= త్రోలుము; అనుడును= అనగానే; ఉత్తుంగ= మిక్కిలి ఎత్తైన; మాతంగ= ఏనుగులనే; మహీరుహ= వృక్షములతో; శోభితంబును= సుందరమయినదియును; సాంద్ర= దట్టమయిన; స్యందన= రథములనెడి; గుల్మ= పొదరిండ్లతో; గహనంబును= చొరశక్యము కానిదియును; బహుళ= అనేకములయిన; హయ= గుఱ్ఱములనెడి; కక్షా= గడ్డిపొదలతో; ఆకీర్ణంబును= వ్యాప్తమయినదియును; సముద్భట= శ్రేష్ఠమయిన; సుభట= మంచి భటులు అనెడి; లతా= లతలతో; లసితంబును= ప్రకాశించుచున్నదియును; ఐన= అయినట్టి; సుయోధను= దుర్యోధనునియొక్క; సేనా= సైన్యమనెడి; కాననంబునందున్= అరణ్యమునందు; మాధవ= శ్రీకృష్ణుడనెడి; మహా= గొప్ప; వాయువు= గాలి; ధనంజయ= అర్జునుడనెడి; దారుణ= భయంకరమయిన; అనలంబున్= అగ్ని; దరికొల్పినన్= రగుల్గొలుపు తుండగా.

**తాత్పర్యం:** వేగంగా రథం తోలుము' అని అర్జునుడు మిక్కిలి ఎత్తైన ఏనుగు లనే మహావృక్షాలతో సుందరమయినది, దట్టమయిన రథాలనే పొదరిండ్లతో చొరశక్యం కానిది, అనేకములయిన గుఱ్ఱాలనెడి గడ్డిపొదలతో నిండిపోయినది. శ్రేష్ఠ లయిన భటు లనెడి లతలతో ప్రకాశిస్తున్నది - అయిన దుర్యోధనుడి సైన్యమనే అరణ్యాన్ని శ్రీకృష్ణు డనెడి పెనుగాలి అర్జునుడనెడి భయంకరమయిన అగ్ని రగుల్గొలుపుతుండగా రాజుకొనేటట్లు చేయగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అనే ఆర్యోక్తి అన్వర్థమయ్యేటట్లు ఆంధ్రకవులు కూడా వచనరచనలందు విరోధాభాసలు, రూపకములు, ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు, స్వభావోక్తులతో కాదంబరి వచనరచనాశైలిని అనుకరించి, అనుసరించటానికి ప్రయత్నిస్తారు. అట్టిదాని కిది చిన్న ఉదాహరణ. దుర్యోధనుడి సేనారణ్యం ఒక రూపకం. చతురంగ బలములు రూపకాలు. మాధవమహావాయువు, ధనంజాయాగ్నులు - ఈ రూపకమాలికకు సూత్రములు. ఇట్లా ఈ వచనం ఒక చక్కని రూపకమాలిక. చతురంగ బలాలతో - ఏనుగులు వృక్షములుగా - రథములు పొదరిండ్లుగా, గుఱ్ఱములు గడ్డిపొదలుగా, భటులు లతలుగా- ఉపమాన ఉపమేయములకు అభేదాన్ని కల్పించి - దుర్యోధనుడి సైన్యమును ఒక మహారణ్యంగా, మాధవుడిని మహావాయువుగా, అర్జునుడిని అగ్నిగా అభేదాన్ని కల్పించి, ఒక మహారూపకాలంకారంగా తిక్కన వర్ణించాడు.

ధనంజయ శబ్దానికి అర్జును డనేకాక అగ్ని అనే అర్థం కూడా ఉన్నది.

**క. ఆ కృష్ణవర్త్ముఁ డుజ్జ్వల । భీకరశరజిహ్వ లడరఁ బేర్చిన నధిక**
**వ్యాకులత నొందె రోదసి । నాకౌకస్సమితి మెచ్చునం బొదలంగన్. 362**

**ప్రతిపదార్థం:** ఆ కృష్ణవర్త్ముఁడు= ఆ అగ్ని (అర్జునుడనెడి ఆ అగ్ని); ఉజ్జ్వల= బాగుగా ప్రకాశించుచున్న; భీకర= భయంకరమయిన; శర= బాణములనెడి; జిహ్వలు= నాలుకలనెడి జ్వాలలు; అడరన్= వ్యాపింపగా; పేర్చినన్= విజృంభించగా; నాకౌకః= దేవతలయొక్క; సమితి= సమూహము; మెచ్చునన్= పొగడ్తలతో; పొదలంగన్= వర్ధిల్లగా; రోదసి= ఆకాశము; అధిక= మిక్కిలి; వ్యాకులతను= కలతను; ఒందెన్= పొందెను.

**తాత్పర్యం:** ఆ అర్జును డనే అగ్ని బాగా ప్రకాశిస్తున్న భయంకరమైన బాణాలనెడి జ్వాలలు వ్యాపిస్తూ విజృంభించగా దేవతాసమూహం పొగడ్తలతో ఒప్పగా ఆకాశం మిక్కిలి కలతచెందింది.

**వ. ఇట్లు దారుణరణవిహరణంబు సలిపి సవ్యసాచి యా సైన్యంబు నిపతిత విఘటిత భ్రాంత పలాయితంబు సేసినఁ దెరలక నిలిచి కురుపతి కరతలంబెత్తి నిలు నిలుమని యెలుంగు సూపిన నది మగుడఁ బురికొని నిగిడి నేమినినద ఘంటాక్వణనకింకిణీ నిక్వాణంబులు సెలంగఁ బాండవబలంబుఁ దాఁకిన ధృష్టద్యుమ్న శిఖండి శతానీకు లయ్యనీకంబు ననేకవిధసాయక నికాయంబులం గప్పి రప్పుడు ధృష్టద్యుమ్ను నరదంబు చక్కటికి సంరంభంబున. 363**

**ప్రతిపదార్థం:** ఇట్లు; దారుణ= భయంకరమయిన; రణ= యుద్ధముయొక్క; విచారణంబు= విహారము; సలిపి= చేసి; సవ్యసాచి= అర్జునుడు; ఆ సైన్యంబు= ఆసేన (కురుసైన్యము); నిపతిత= పడగొట్టబడి; విఘటిత= విడగొట్టబడి; భ్రాంత= భ్రమింపజేయబడి; పలాయితంబు= పారిపోవునట్లు; చేసినన్= చేయగా; తెరలక= తొలగిపోక; నిలిచి; కురుపతి= కౌరవులకు భర్త అయిన దుర్యోధనుడు; కరతలంబు= చేయి; ఎత్తి= పైకి ఎత్తి; నిలునిలుము; అని; ఎలుంగు= పెద్దకంఠధ్వని (పెద్ద అరుపు); చూపినన్= చూపగా (పెద్ద కేకవేయగా); అది= ఆ సైన్యము; మగుడన్= మరల; పురికొని= క్రమ్ముకొని; నిగిడి= విజృంభించి; నేమి= (రథచక్రముల) కమ్ములయొక్క; నినద= ధ్వనులు; ఘంటా= (ఏనుగుల) గంటలయొక్క; క్వణన= ధ్వనులు; కింకిణీ= మువ్వలయొక్క (గుఱ్ఱములకు కట్టిన మువ్వలు); నిక్వాణంబులు= ధ్వనులు; చెలంగన్= మ్రోయగా; పాండవబలంబున్= పాండవుల సైన్యమును; తాఁకినన్= ఎదుర్కొనగా; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడు; శిఖండి= శిఖండియు; శతానీకులు= శతానీకుడును; ఆ; అనీకంబున్= సైన్యమును; అనేక విధ= పలువిధములైన; సాయక= బాణములయొక్క; నికాయంబులన్= సమూహములతో; కప్పిరి= కప్పివేసిరి; అప్పుడు= ఆ సమయమున; ధృష్టద్యుమ్నుని; అరదంబు= రథముయొక్క; చక్కటికిన్= దిక్కునకు; సంరంభంబునన్= వేగిరపాటుతో.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా భయంకరమైన యుద్ధవిహారం చేసి అర్జునుడు కురుసేన పడగొట్టబడి విడగొట్టబడి, బ్రమింపజేయబడి, పారిపోయేటట్లు చేయగా తొలగిపోక నిలిచి దుర్యోధనుడు చేయి పైకి ఎత్తి నిలునిలుమని పెద్దకంఠధ్వని చేయగా, ఆ సైన్యం మరల తిరిగి క్రమ్ముకొని విజృంభించి రథచక్రాల కమ్ముల ధ్వనులు, ఏనుగుల ఘంటానాదాలు, గుఱ్ఱాలకు కట్టిన మువ్వల ధ్వనులు మ్రోయగా పాండవసైన్యాన్ని ఎదుర్కొనగా ధృష్టద్యుమ్నుడు, శిఖండిశతానీకులు ఆ కురుసైన్యాన్ని పలువిధాలయిన బాణాల సమూహాలతో కప్పివేశారు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడి రథం దిక్కునకు వేగిరపాటుతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** నకులుడి వలన ద్రౌపదికి జన్మించిన పుత్రుడు శతానీకుడు. ఇతడు విశ్వేదేవుల అంశవలన జన్మించాడు. కురువంశంలో శతానీకుడనే మహాత్ముడు - రాజర్షి ఉండేవాడు. నకులుడు ఆ రాజర్షిపేరును తనపుత్రుడికి పెట్టాడు. ఇతడికి మహాభారతంలో - నకులదాయాద - నకులసుత - నకులాత్మజ - నాకులి - అనే పేర్లు ఉన్నాయి.

**ఉ. భూపతి మించి యా ద్రుపదభూపతనూజునురంబు నిర్భరా**
**టోపత యుల్లసిల్లఁగఁ బటుప్రదరంబుల నొంప నాతఁ డు**
**ద్దీపితకోపుఁడై హరులు ద్రెళ్ళఁగ సారథి డొల్ల నేయఁ గా**
**నే పటి తేరు డిగ్గి యతఁడెక్కె హయోత్తముఁ గౌరవేశ్వరా! 364**

**ప్రతిపదార్థం:** కౌరవేశ్వరా!= కౌరవులకు ప్రభువు అయిన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; భూపతి= భూమికి భర్త అయిన దుర్యోధనుడు; మించి= అతిశయించి; ఆ ద్రుపదభూప= ఆ ద్రుపదమహారాజుయొక్క; తనూజు= పుత్రునియొక్క; ఉరంబున్= వక్షఃస్థలమును (అనగా ధృష్టద్యుమ్నుడి వక్షఃస్థలమును); నిర్భర= ప్రగాఢమయిన; ఆటోపము= ఆడంబరము; ఉల్లసిలఁగన్= ప్రకాశింపగా; పటు= కఠినమయిన; ప్రదరంబులన్= బాణములతో; నొంపన్= నొవ్వచేయగా; ఆతఁడు= అతడు (ధృష్టద్యుమ్నుడు); ఉద్దీపిత= ప్రజ్వలించిన; కోపుఁడై= కోపము కలవాడై; హరులు= గుఱ్ఱములు; త్రెళ్ళఁగన్= కూలిపోగా (పడిపోగా); సారథి; డొల్లన్= క్రిందపడునట్లుగా; ఏయఁగాన్= కొట్టగా; అతఁడు= ఆ దుర్యోధనుడు; ఏపు= పెంపు; అఱి= నశించి; తేరు= రథము; డిగ్గి= దిగి; హయ+ఉత్తమున్= ఉత్తమాశ్వమును; ఎక్కెన్= అధిరోహించెను (ఎక్కెను).

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుడు అతిశయించి ధృష్టద్యుమ్నుడి వక్షఃస్థలాన్ని ప్రగాఢమయిన సంభ్రమంతో కఠినమయిన బాణాలతో నొవ్వచేశాడు. ఆ ధృష్టద్యుమ్నుడు ప్రజ్వలించిన కోపం కలవాడై గుఱ్ఱాలు కూలిపోయేటట్లు సారథి పడిపోయేటట్లు కొట్టగా దుర్యోధనుడు పెంపు నశించి, రథం దిగి ఉత్తమాశ్వాన్ని అధిరోహించాడు.

**వ. ఎక్కి కొండొక తొలంగి మాతంగ ఘటలం బురికొల్పిన నవి పురందరనందను నరదంబుఁ బొదివిన నవ్వీరుండు ఘోరనారాచధారల నవ్వారణంబులపైఁ గురియం గని గదాహస్తుండై యరదంబు డిగ్గి యనిలపుత్త్రుండు గవిసినఁ దుండంబు లవిసియు దంతంబులు దునిసియుఁ గుభంబులు వగిలియుఁ బ్రక్కలు చదిసియు వెన్నులు విఱిగియు నగ్గజంబు లొఱలుచు నెత్తురులు గ్రక్కుచుఁ దెరలుచు సుడివడుచుండ వెండియుం బైపై నురవణించు కరులం గనుంగొని ధర్మజనకులసహదేవులును ధృష్టద్యుమ్నాదియోధులు నద్దిక్కు తటిమి రట్టియెడ నశ్వత్థామకృతవర్మకృపాచార్యులు దుర్యోధనుఁ దేరిగములలోనంగానక కలనం బడియెనో? యని యనుమానించుచు నచ్చటి మానవపతులం 'గురుపతి యెచ్చట నున్నవాఁ?'డని యడిగినఁ గొందఱు శకునిదెసఁ దొలంగె ననఁ దక్కటి వా 'రతని వెదక నేల బ్రదికియుండె నేనియుఁ గనికొందము పాండవులమీఁద నుఱికి పొడుతము గాక' యనిన విని యట్ల చేయ నారథికత్రయంబును దదనీకంబును వెడలి సౌబలుఁడున్న చక్కటికిం జనియె నిట్లు దిక్కుమాలిన యమ్మొన చుట్టుముట్టి. 365**

**ప్రతిపదార్థం:** ఎక్కి= అధిరోహించి (దుర్యోధనుడు ఒక ఉత్తమాశ్వము ఎక్కి); కొండొక= ఇంకొక చోటునకు; తొలంగి= తొలగి; మాతంగ= ఏనుగులయొక్క; ఘటలన్= సమూహములను (ఏనుగుల గుంపునకు ఘటా అని పేరు); పురికొల్పినన్= క్రమ్ముకొనునట్లు చేయగా; అవి= అవి (ఆ ఏనుగులు); పురందర= ఇంద్రునియొక్క; నందనుని= పుత్రుడయిన అర్జునునియొక్క;

అరదంబున్= రథమును; పొదివినన్= క్రమ్ముకొనగా; ఆ+వీరుండు= ఆ శూరుడు (పరాక్రమ వంతుడయిన అర్జునుడు); ఘోర= భయంకరమయిన; నారాచ= బాణములయొక్క; ధారలన్= జడులను; ఆ+వారణంబులపైన్= ఆ ఏనుగులమీద; కురియన్= కురిపించగా; కని= చూచి; గదా= గద; హస్తుండై= చేతియందుకలవాడై; అరదంబు= రథము; డిగ్గి= దిగి; అనిలపుత్రుండు= భీముడు; కవిసినన్= కలియబడగా; తుండంబులు= తొండములు; అవిసియున్= పగిలిపోయి; దంతంబులు= దంతములు; తునిసియున్= తునాతునకలు అయిపోయియు (ముక్కలు అయిపోయి); కుంభంబులు= కుంభస్థలములు; పగిలియున్= పగిలిపోయి; ప్రక్కలు= ప్రక్కభాగములు; చదిసియున్= నలిగిపోయి; వెన్నులు= వీపులు; విఱిగియున్= విరిగిపోయి; ఆ+గజంబులు= ఆ ఏనుగులు; ఒఱలుచున్= అరచుచు(బాధతో); నెత్తురులు= రక్తములు; క్రక్కుచున్= క్రక్కుచును; తెరలుచున్= బయలువెడలుచు; సుడి+పడుచుండన్= చుట్టుకొని పోవుచుండగా; వెండియున్= మరియును; పైపైన్= మీద మీదకు; ఉరవణించు= విజృంభించుచున్న; కరులన్= ఏనుగులను; కనుంగొని= చూచి; ధర్మజ నకుల సహదేవులును= ధర్మరాజు నకులుడు సహదేవుడును; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడు; ఆది= మొదలగు; యోధులును= వీరులును; ఆ+దిక్కు= ఆ వైపు; తఱిమిరి= పరుగెత్తిరి; అట్టియెడన్= ఆ సమయమున; అశ్వత్థామ కృతవర్మ కృపాచార్యులు= అశ్వత్థామయు, కృతవర్మయు, కృపాచార్యుడును; దుర్యోధనున్= దుర్యోధనుడిని; తేరి= రథములయొక్క; గములలోనన్= సమూహములలోపల; కానక= చూడజాలక; కలనన్= యుద్ధమునందు; పడియెనో?= పడిపోయెనా? (చనిపోయెనా ఏమి); అని; అనుమానించుచున్= సందేహించుచు; అచ్చటి= అక్కడ ఉన్న; మానవపతులన్= మహారాజులను; కురుపతి= దుర్యోధనుడు; ఎచ్చటన్= ఎక్కడ; ఉన్నవాఁడు?= ఉన్నాడు?; అని; అడిగినన్= అడుగగా; కొందఱు= కొంతమంది; శకునిదెసన్= శకుని ఉన్నవైపు; తొలంగెను= వెడలెను; అనన్= అనిచెప్పగా; తక్కటివారు= మిగిలినవారు; అతనిన్= ఆ దుర్యోధనుడిని; వెదకను= వెదకుట; ఏల?= ఎందుకు?; బ్రదికి= జీవించి; ఉండెనేనియున్= ఉన్నట్లయితే; కనికొందము= చూచికొందము; పాండవులమీఁదను= పాండవులపై; ఉఱికి= దూకి; పొడుతము= పోట్లాడదాము; కాక; అనినన్= ఇట్లు చెప్పగా; విని; అట్ల= ఆ విధముగానే; చేయన్= చేయుటకు; ఆ+రథిక= ఆ రథికులు అయిన (యోధులు అయిన); త్రయంబును= ముప్పురును (అశ్వత్థామ కృతవర్మ కృపాచార్యులు); తద్+ఆనీకంబును= ఆ సైన్యమును; వెడలి= వెళ్ళి; సౌబలుఁడు= శకుని; ఉన్న= ఉన్నట్టి; చక్కటికిన్= దిక్కునకు; చనియెన్= వెడలింది; ఇట్లు= ఈ ప్రకారముగా; దిక్కుమాలిన= నాథుడులేని; ఆ+మొన= ఆ సేన; చుట్టుముట్టి= క్రమ్ముకొని.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఒక ఉత్తమాశ్వాన్ని అధిరోహించి ఇంకొక చోటునకు తొలగి ఏనుగుల గుంపులను క్రమ్ముకొనేటట్లు చేయగా అవి అర్జునుడి రథాన్ని చుట్టుముట్టాయి. అప్పుడు వీరుడయిన ఆ అర్జునుడు భయంకరములైన బాణాల వరుసలను ఆ ఏనుగులమీద కురిపించాడు. అది చూచి గదను చేత ధరించి రథం దిగి భీముడు ఏనుగులపై కలియబడగా, తొండములు పగిలి, దంతములు ముక్కలైపోయి, కుంభస్థలాలు బ్రద్దలైపోయి, ప్రక్కభాగాలు నలిగిపోయి, వీపులు విరిగిపోయి, ఆ ఏనుగులు ఘీంకరిస్తూ రక్తములు క్రక్కుతూ, బయలువెడలుతూ చుట్టుకొనిపోతూ ఉన్నాయి. మరియు మీదమీదకు వేగిరపాటుతో పడుతున్న ఏనుగులను చూచి ధర్మరాజ నకుల సహదేవులును ధృష్టద్యుమ్నుడు మొదలైన యోధులును ఆ వైపునకు పరుగెత్తారు. ఆ సమయంలో అశ్వత్థామ కృతవర్మ కృపాచార్యులు దుర్యోధనుడి రథముల సమూహాల లోపల చూడజాలక యుద్ధంలో చనిపోయాడేమో? అని సందేహిస్తూ అచ్చట ఉన్న రాజులను 'దుర్యోధనుడు ఎక్కడ ఉన్నాడు?' అని అడిగారు. ఇట్లా అడుగగా కొందరు రాజులు 'శకుని ఉన్నవైపు వెళ్ళాడు' అని చెప్పారు. మిగిలినవారు 'దుర్యోధనుడిని వెదకటం ఎందులకు? జీవించి ఉండెనా - తెలిసి కొందము. లేనియెడల పాండవులమీదపడి పోట్లాడుదాము'. అని చెప్పగా విని ఆ విధంగానే చేయటానికి ఆ యోధులు ముప్పురూ ఆ సైన్యంతో శకుని ఉన్నట్టి దిక్కుకు వెళ్ళారు. ఈ ప్రకారంగా దిక్కుమాలిన ఆ సేనను చుట్టిముట్టి (తరువాతి పద్యంతో అన్వయం).

## దుర్విషహప్రభృతి కురుకుమారులు భీమునిచేఁ జచ్చుట (సం. 9-24-41)

**క. పాంచాలకుమారాదు లు। దంచిత భుజబలము మెఱయ నమ్ములవెల్లిన్**
**ముంచిరి నిజకరిహరి రథ। సంచయసంరంభ మెసఁగ జగతీనాథా! 366**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; పాంచాలకుమారాదులు= పాంచాలదేశపురాజు అయిన ద్రుపదుని కుమారుడు అయిన ధృష్టద్యుమ్నుడు మొదలగువారు; ఉదంచిత= విజృంభించిన; భుజబలము= బాహుబలము; మెఱయన్= ప్రకాశించగా; అమ్ముల= బాణములయొక్క; వెల్లిన్= ప్రవాహంతో; నిజ= తమయొక్క; కరి= ఏనుగులయొక్క; హరి= గుఱ్ఱములయొక్క; రథ= రథములయొక్క; సంచయ= సముదాయముయొక్క; సంరంభము= వేగిరపాటు; ఎసఁగన్= అతిశయించగా; ముంచిరి;

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధృష్టద్యుమ్నుడు మొదలైనవారు విజృంభించి బాహుబలం ప్రకాశించగా తమ ఏనుగుల, గుర్రాల, రథాల సముదాయపు వేగిరపాటు అతిశయించగా బాణాల పరంపరతో కౌరవసేనను ముంచారు.

**వ. అప్పు డేను ధృష్టద్యుమ్నునిబారి కొక భంగిఁ దొలంగఁ దప్పియు నద్దెస నుద్దామగతి చతుశ్శతస్యందనములతో నడరు సాత్యకిచేతఁ బట్టువడితి; నట్టియెడ వడముడి కుంజర ప్రకరభంజనవిహరణపారీణతం బేర్చి యార్చినం జూచి నీ కొడుకులు దుర్విషహ దుష్ప్రదర్శన ప్రముఖులు శితశిఖంబులు గురియుచుం గవిసి యబ్బలుమగనిం బొదివిన నతండు రథం బెక్కియెక్కుడుమదంబున భల్లనారాచాదిబాణంబుల బ్రాణంబులు గొనినం గనుంగొని హతశేషంబైన భవదీయబలంబు గ్రోధశోకావేశంబున నవ్వీరుఁ జుట్టుముట్టిన నాజెట్టిజోదు పంచశత రథంబులును దంతిశతసప్తకంబును దురంగాష్టశతంబును బదాతిదశసహస్రంబును దనసాయక సముదయంబుల వేగంబున సమయునట్లుగా సంక్రీడనంబు సూపినం దక్కటివారు దేఱిచూడనుం జాల కంతంత నిలువ భవత్కుమారమారణం బప్రతిహతంబై చెల్లుటకు నుల్లంబు వికసిల్లె. శిష్టైకసోదరుండైన సుయోధనునిఁ దెగినవానిన కాఁ గొని తన్ను నప్పుడు కృతార్థునింగాఁ దలంచుచు మల్లచఱచినం గించిదవశిష్టంబైన యాకౌరవసైన్యంబు వెగడంది ఱిచ్చవడియె. నయ్యవసరంబున గుఱ్ఱపుఁ దండంబులతో సుదర్శనుండు దాను నున్న సుయోధను నాలోకించి గోపాలదేవుండు దేవేంద్రపుత్రున కిట్లనియె. 367**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయమున; ఏను= నేను; ధృష్టద్యుమ్ని= ధృష్టద్యుమ్నుడి; బారికిన్= అధీనమునుండి; ఒక భంగిన్= ఏదో ఒక విధముగా; తొలంగన్= తొలగ; తప్పియున్= తప్పుకొనియు (ప్రక్కకు తప్పుకొని); ఆ+దెసను= ఆ దిక్కునకు; ఉద్దామ= అడ్డులేని; గతి= గమనముకలవాడై; చతుశ్శత= నాలుగువందల; స్యందనములతోన్= రథములతో; అడరు= అతిశయించు; సాత్యకిచేతన్= సాత్యకిచేత; పట్టుపడితిని (అ థాపశ్యం సాత్యకిం త ముపాయాంతం మహారథమ్। రథైశ్చతుశ్శతైర్వీరోమామభ్యద్ర తదాహవే॥ 9-24-48- మూలం); అట్టియెడన్= ఆ సమయంలో; వడముడి= భీముడు; కుంజర= ఏనుగులయొక్క; ప్రకర= సమూహమును; భంజన= భగ్నముచేయు (నాశముచేయు); విహరణ= విహారమునందు; పారీణతన్= పారము ముట్టుటవలన; పేర్చి= విజృంభించి; ఆర్చినన్= పెద్ద బొబ్బపెట్టగా; చూచిన; నీ కొడుకులు= నీ పుత్రులు; దుర్విషహ= దుర్విషహుడు; దుష్ప్రదర్శన= దుష్ప్రదర్శనుడు; ప్రముఖులు= మొదలగు ముఖ్యమయినవారు; శిత= వాడియైన; విశిఖంబులు= బాణములు; కురియుచున్= ప్రయోగించుచు; కవిసి= కలియబడి; ఆ+బలు= ఆ బలమయిన; మగనిన్= వీరుని (భీముడిని); పొదివినన్= ఎదుర్కొనగా; అతండు; రథంబు; ఎక్కి= అధిరోహించి; ఎక్కుడు= మిక్కిలి;

మదంబునన్= గర్వముతో; భల్ల= బల్లెములు; నారాచ= నారాచములు(ఇనుపబాణాలు); ఆది= మొదలగు; బాణంబులన్= బాణములతో; ప్రాణంబులు= ప్రాణములు; కొనినన్= తీసికొనగా; కనుంగొని= చూచి; హత= చంపబడగా; శేషంబైన= మిగిలిన; భవదీయ= నీయొక్క; బలంబు= సేన; క్రోధ= కోపముయొక్క; శోక= దుఃఖముయొక్క; ఆవేశంబునన్= తీవ్రతవలన; ఆ+వీరున్= ఆ పరాక్రమవంతుని (భీముని); చుట్టుముట్టినన్= క్రమ్ముకొనగా; ఆ జెట్టి= ఆ మల్లుడయిన; జోదు= యోధుడు (భీముడు); పంచ= అయిదు; శత= వందల; రథంబులును= రథములును; దంతి= ఏనుగులయొక్క; శతసప్తకంబును= ఏడువందలును; తురంగ= గుర్రములయొక్క; అష్టశతంబును= ఎనిమిది వందలును; పదాతి= కాల్బలములయొక్క; దశసహస్రంబును= పదివేలును; తన= తనయొక్క; సాయక= బాణములయొక్క; సముదయంబులన్= సమూహములతో; వేగంబునన్= శీఘ్రముగా; సమయునట్లుగాన్= సంహరింపబడునట్లుగా; సంక్రీడనంబు= గొప్పక్రీడను; చూపినన్= చూపించగా; తక్కటి= మిగిలిన; వారు; తేఱిచూడనున్= తేరిపారచూచుటకు కూడా; చాలక= లేక (శక్తిలేక); అంతంతన్= అక్కడక్కడ; నిలువన్= నిలబడగా; భవత్= మీయొక్క; కుమార= పుత్రులయొక్క; మారణంబు= వినాశనము; అప్రతిహతంబై= అడ్డులేనిదియై; చెల్లుటకున్= అయిపోవుటకు; ఉల్లంబు= హృదయము; వికసిల్లెన్= వికసించినది; శిష్ట+ఏక= మిగిలిన ఒక్క; సోదరుండైన= సోదరుడు కలవాడైన (తమ్ముడు కలవాడు అయిన - ఆ తమ్ముడి పేరు సుదర్శనుడు); సుయోధనునిన్= దుర్యోధనుని; తెగినవానినకాన్= ఖండింపబడిన వానినిగానే; కొని= అనుకొని (తలచి); తన్నున్= తనను; అప్పుడు= ఆ సమయమున; కృత+అర్థునిఁగాన్= ధన్యునిగా (నెరవేరిన పని కలవానినిగా, చేయబడిన ప్రయోజనము అనగా ఫలితము కలవానినిగా); తలంచుచున్= ఆలోచించుచు; మల్లచఱచినన్= భుజాస్ఫాలనముచేయగా (కుస్తీపట్టునప్పుడు మల్లవీరులు భుజములను కాని తొడలనుకాని చఱచుకొందురు); కించిత్= కొంచెము; అవశిష్టంబైన= మిగిలిన; ఆ కౌరవసైన్యంబు= ఆ కౌరవులయొక్క సైన్యము; వెగడంది= తడబాటుపొంది; ఱిచ్చ+పడియెన్= చేష్టలుడిగెను (నిశ్చేష్టమయ్యెను); ఆ+అవసరంబునన్= ఆ సమయమున; గుఱ్ఱపున్= గుర్రములయొక్క; తండంబులతోన్= సముదాయములతో; సుదర్శనుండు= సుదర్శనుడు; తానును; ఉన్న; సుయోధనున్= దుర్యోధనుడిని; ఆలోకించి= చూచి; గోపాలదేవుండు= శ్రీకృష్ణుడు; దేవేంద్రపుత్రునకున్= అర్జునునకు; ఇట్లు= ఈ ప్రకారముగ; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** ఆ సమయంలో నేను ధృష్టద్యుమ్నుడి పట్టునుండి ఏదో ఒక విధంగా ప్రక్కకు తప్పుకొని, ఆ దిక్కునకు అడ్డులేని గమనం కలవాడై నాలుగు వందల రథాలతో అతిశయించే సాత్యకిచేత పట్టుపడ్డాను. ఆ సమయంలో భీముడు ఏనుగులయొక్క సమూహాలను నాశనంచేసే అపారవిహారంతో విజృంభించి పెద్దబొబ్బపెట్టగా చూచి నీ కొడుకులు దుర్విషహ దుష్ప్రదర్శన ప్రముఖులు వాడిబాణాలు ప్రయోగిస్తూ కలియబడి ఆ బలైన వీరుడిని ఎదుర్కొనగా, అతడు రథం ఎక్కి మిక్కిలి గర్వంతో బల్లెములు నారాచములు మొదలైన ఆయుధాలతో వారి ప్రాణాలు తీశాడు. అది చూచి చావగా మిగిలిన నీ సేనలు కోపదుఃఖాల తీవ్రతవలన ఆ పరాక్రమవంతుడైన భీముడిని చుట్టుముట్టాయి. అప్పుడు ఆ మల్లుడైన యోధుడు - భీముడు అయిదువందల రథాలను, ఏడువందల ఏనుగులను, ఎనిమిది వందల గుర్రాలను, పదివేల కాల్బలాలను తన బాణపరంపరత వేగంగా సంహరింపబడేటట్లుగా క్రీడించి చూపించగా మిగిలినవారు తేరిపారచూడటానికి కూడా అర్హతలేక అక్కడక్కడ నిలబడగా నీ పుత్రుల వినాశం అడ్డులేకుండా అయిపోయినందులకు హృదయం వికసించినది. ఇక ఒక్క సోదరుడు మిగిలినవాడైన దుర్యోధనుడిని ఖండింపబడిన వాడినిగా భావించి తననుతాను ధన్యుడిగా ఆలోచిస్తూ భుజాస్ఫాలనం చేయగా, కొంచెం మిగిలిన ఆ కౌరవసైన్యం తడబాటు పొంది చేష్ట లుడిగినది. ఆ సమయంలో గుర్రాల గుంపులతో సుదర్శనుడు తానును ఉన్నట్టి దుర్యోధనుడిని చూచి శ్రీకృష్ణుడు అర్జునుడితో ఈ ప్రకారంగా అన్నాడు.

**విశేషం:** మూలమును అనుసరించి ఈ సన్నివేశంలో భీముడు సంహరించిన ధృతరాష్ట్ర పుత్రులు : 1). దుర్మర్షణుడు; 2). శ్రుతాంతుడు; 3). జైత్రుడు; 4). భూరిబలుడు; 5). రవి; 6). జయత్సేనుడు; 7). సుజాతుడు; 8). దుర్విషహుడు; 9). దుర్విమోచనుడు; 10). అరిహుడు; 11). దుష్ప్రధర్షుడు; 12). శ్రుతపర్వుడు; 13). మహాబాహుడు; 14). సుదర్శనుడు. వీరుకాక దుర్విరోచనుడు, దుష్కర్ణుడు, దుష్టరాజయుడు, దుష్ప్రధర్షణుడు అనే ధృతరాష్ట్రపుత్రులు ద్రోణపర్వంలో భీముడిచేత సంహరింపబడినట్లు ఉన్నది.

**సీ.** **'అరు లడంగిరి యుధిష్ఠిరుఁ డాది యగు భవ । ద్భ్రాతలు నీ పరిపాలనమున**
**నుల్లసిల్లిరి సంజయుని బాడుదల వట్టి । కొని వచ్చి సాత్యకి వినుతి కెక్కె**
**నెలమి ధృష్టద్యుమ్నుఁ డెంతయు నొప్పె ని । ప్పడ కూడి తఱుము మీప్రోవుగట్టి**
**నిలిచిన హయములం బొలియింపవలయు నిం । దున్నాఁడు చూచితె? యొడ్డు చక్కఁ**

**తే.** **గా నమర్చుచుఁ జూడ్కులు గలయదెసల । బొరి నిగుడ్చుచు ధృతరాష్ట్రపుత్రుఁ డల్ల**
**వాఁడె! తెల్లనిగొడుగుతో వాఁడి దక్కి । నివురు గప్పిన నొప్పఱు నిప్పువోలె.** **368**

**ప్రతిపదార్థం:** అరులు= శత్రువులు; అడంగిరి= నశించారు; యుధిష్ఠిరుఁడు= ధర్మరాజు; ఆదియగు= మొదలు అగు; భవత్= నీ యొక్క; భ్రాతలు= సోదరులు; నీ పరిపాలనమునన్= నీయొక్క సంరక్షణమున; ఉల్లసిల్లిరి= వికసించిరి (ప్రకాశించిరి); సంజయుని; బాడుదల= అవమానించి; పట్టికొనివచ్చి; సాత్యకి; వినుతికిన్= మెప్పునకు; ఎక్కెన్= పొందెను; ఎలమిన్= సంతోషముతో; ధృష్టద్యుమ్నుఁడు; ఎంతయున్= మిక్కిలి; ఒప్పెన్= ప్రకాశించెను; ఇప్పుడు+అ= ఈ సమయముననే; కూడి= కలిసికొని; తఱుము= వెంటపడి పరిగెత్తునట్లు చేయు; మీప్రోవు= మీగుంపు (ప్రోగు); కట్టి= నిర్మించి (మీరు గుంపుగూడి); నిలిచిన; హయములన్= గుర్రములను; పొలియింప వలయున్= చంపవలయును; ఇందున్+ఉన్న+వాఁడు= ఇచ్చట ఉన్నాడు; చూచితె?= చూచితివా?; ఒడ్డు= సేనావ్యూహము; చక్కఁగాన్= చక్కగా; అమర్చుచున్= అమరజేయుచు (సర్దుబాటుచేయుచు); చూడ్కులు= చూపులు; కలయన్= అంతట; దెసలన్= దిక్కులను; పొరి= మిక్కిలి; నిగుడ్చుచున్= వ్యాపింపచేయుచు; ధృతరాష్ట్రపుత్రుఁడు= దుర్యోధనుడు; అల్లవాఁడె!= అదిగో అక్కడివాడే!; తెల్లని; గొడుగుతో; వాఁడి= వికాసము; దక్కి= పోయి; నివురు= నుసి; కప్పిన; ఒప్పు= అందము; అఱు= నశించు; నిప్పు+పోలెన్= అగ్నివలె; వాఁడి= వికాసము; దక్కి= పోయి; అల్లవాఁడె!= అదిగోవాడే!.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడితో చెప్పుతున్నాడు. 'శత్రువులు తగ్గిపోయారు. ధర్మరాజు మొదలగు నీ సోదరులు నీ సంరక్షణంలో ప్రకాశించారు. సంజయుడిని అవమానించి పట్టుకొని వచ్చి సాత్యకి మెప్పుపొందాడు. సంతోషంతో ధృష్టద్యుమ్నుడు మిక్కిలి ప్రకాశించాడు. ఈ సమయంలోనే కలిసికొని తరుమునట్లు మీరు గుంపుగా కూడి గుర్రాలను చంపవలయును. ఇదిగో ఒక్కడు ఉన్నాడు చూచితివా? సేనావ్యూహాన్ని చక్కగా అమర్చుతూ చూపులు అంతటా వ్యాపింపజేస్తూ దుర్యోధనుడు తెల్లని గొడుగుతో వికాసంపోయి అందం నశించి నివురుకప్పిన నిప్పువలె ఉన్నాడు చూచావా?

**విశేషం:** అలం: ఉపమ. పద్యములను గద్యములుగా రచించటం, అందులో అలతి అలతి పదవాక్యములతో సంవాదచారిమను ప్రదర్శించటం తిక్కనకు గల కవితా మార్మికత. 'నివురు గప్పిన నిప్పువోలె' - ఉపమ.

**క.** **ఇతనిని భవదీయోజ్జ్వల । శితనారాచప్రసారశీఘ్రాభీలో**
**ద్ధతి గతజీవితుఁ జేయుము । గృతకృత్యుఁడ వగదు జగము గీర్తింపంగన్.** **369**

**ప్రతిపదార్థం:** ఇతనిని= ఈ దుర్యోధనుడిని; భవదీయ= నీయొక్క; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశవంతమయిన; శిత= వాడి అయిన; నారాచ= బాణములయొక్క; ప్రసార= వ్యాపించుటవలన; శీఘ్ర= వేగముగా; ఆభీల= భయంకరమయిన; ఉద్ధతిన్= గర్వముతో; గత= పోయిన; జీవితున్= జీవము కలవాడినిగా; జగము= ప్రపంచము; కీర్తింపంగన్= పొగడునట్లుగా; చేయుము; కృతకృత్యుఁడవు= ధన్యుడవు; అగుదు(వు).

**తాత్పర్యం:** ఈ దుర్యోధనుడిని నీయొక్క ప్రకాశవంతమైన వాడి అయిన బాణాల వ్యాప్తితో శీఘ్రంగా భయంకరమయిన గర్వంతో ప్రపంచం కీర్తించేటట్లు సంహరించుము. ధన్యుడవు ఔతావు.

**క. వినుము ధృతరాష్ట్రనందను । లనిలతనయుచేతఁ బొలిసి రందఱు నిం కొ**
**క్కనుజుండు నితండును ని । ల్చిన వా రయ్యిరువు రిపుడు చెల్లెద రెట్లున్'. 370**

**ప్రతిపదార్థం:** వినుము ఆలకింపుము; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రునియొక్క; నందనులు= పుత్రులు; అందఱున్= అందరును; అనిల= వాయువుయొక్క; తనయుచేతన్= పుత్రుడిచేతను (భీమునిచేతను); పొలిసిరి= చచ్చిరి; ఇంకొక్క= ఇంక ఒక్క; అనుజుండు= తమ్ముడును; ఇతండును= ఈ దుర్యోధనుడును; నిల్చినవారు= నిలిచి ఉన్నారు (బతికి ఉన్నారు); ఎట్లున్= ఏ విధంగా అయినను; ఆ+ఇరువురు= ఆ ఇద్దరును; ఇపుడు= ఇప్పుడు; చెల్లెదరు= చత్తురు.

**తాత్పర్యం:** అర్జునా! ఆలకించుము. ధృతరాష్ట్ర పుత్రులందరు భీముడిచేత చచ్చారు. ఇంక ఒక తమ్ముడు, దుర్యోధనుడు మిగిలి ఉన్నారు. ఏ విధంగా అయినా ఆ ఇద్దరూ ఇప్పుడు చస్తారు'.

**వ. అనిన విని సవ్యసాచి సవినయంబుగా నయ్యంబుజాక్షు వీక్షించి. 371**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; సవ్యసాచి= అర్జునుడు; సవినయంబుగాన్= వినయంతో; ఆ+అంబుజ+అక్షున్= ఆ శ్రీకృష్ణుడిని; వీక్షించి= చూచి.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు చెప్పగా ఆలకించి, అర్జునుడు వినయంగా ఆ కృష్ణుడిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అమరనదీతనూభవుని నస్త్రకళాగురుఁ గర్ణునిన్ మహా**
**సమరమునం దనేక బలసంఘములన్ బలవన్నృపాలవ**
**ర్గములను మద్రరాజుఁ దుదిగాఁ దెగటార్చె భవత్ప్రసాదది**
**వ్యమహిమ యింక నల్పతరవైరి సమూహము దాని కడ్డమే? 372**

**ప్రతిపదార్థం:** అమరనదీ= దేవనది అయిన ఆకాశగంగానదియొక్క; తనూభవునిన్= పుత్రుని అనగా భీష్ముని; అస్త్రకళా= అస్త్రవిద్యాకళకు; గురున్= గురువు అయిన ద్రోణుని; కర్ణునిన్= కర్ణుని; అనేక= పలు; బల= బలవంతులయిన సైన్యం; సంఘములన్= సమూహములను; బలవత్= బలవంతులయిన; నృపాల= రాజులయొక్క; వర్గములను= సముదాయములను; తుదిగాన్= చివరగా; మద్రరాజు= శల్యుడు; మహాసమరమునందున్= గొప్ప యుద్ధమునందు; భవత్= మీ యొక్క; ప్రసాద= అనుగ్రహము యొక్క; దివ్య= దైవీయమయిన; మహిమ (ఈశ్వర సంబంధి శక్తి); తెగటార్చెన్= చంపెను; ఇంకన్= ఇంక; అల్పతర= మిక్కిలి స్వల్పమయిన; వైరి= శత్రువులయొక్క; సమూహము= సముదాయము; దానికిన్= సంహారమునకు (దుర్యోధనుని, అతని తమ్ముని సంహరించుటకు); అడ్డమే?= అడ్డము అగునా? (కాదని భావం).

**తాత్పర్యం:** భీష్ముడిని, ద్రోణుడిని, కర్ణుడిని పలుసేనాసమూహములను బలవంతులయిన రాజులయొక్క సముదాయాలను, చిట్టచివరగా శల్యుడిని ఈ గొప్ప యుద్ధంలో మీ అనుగ్రహ మహిమ చంపింది. ఇంక మిక్కిలి స్వల్పమైన శత్రుసమూహం అనుజుడితో కూడా దుర్యోధనుడిని సంహరించటానికి అడ్డం కాదు.

**వ. ఇన్నూఱు రథంబులు నూఱేనుంగులు రెండువేల కాలుమానిసియు సౌబలునితోడి యేనూఱుగుఱ్ఱంబులు నింతియ కాదె యీసేన! యిది కృపాశ్వత్థామకృతవర్మలు గలసి నిలుప నిలిచినయది యేను దఱి యఱుముట కలిగెనే నింతపట్టును బరిమార్చెద నిమ్మూఁక పడియును బాఱియుం దనచుట్టు బయలైన సుయోధనుం డెట్లయ్యెడివో యటు సూడుము. మార్కొనియెనేని మదీయ మార్గణాగ్నికి నాహుతి సేసి కపటద్యూతంబున నపహృతంబులైన సకలధనంబులు నలుఁగుమొన మరల్చినవాఁడనై పాండవాగ్రజుని చింతవంత యంతయుఁ బుచ్చివైచెద. నేఁ డెల్లపనులు సక్కనయ్యెడుఁ. గరిపురపురంధ్రీజనులు తమపతులుఁ బుత్రులుం బొలియుట విని పాండవు లుద్దండ బాహువీర్యశౌర్య సమగ్రులని యెఱింగెదరుగాక!' యనుటయు నన్నరుమాటకు మెచ్చుచు నతండు. 373**

**ప్రతిపదార్థం:** ఇన్నూఱు= రెండువందలు; రథంబులు= రథములు; నూఱు= వంద; ఏనుంగులు= ఏనుగులు; రెండువేల కాలుమానిసియున్= రెండువేల పదాతి దళమును; సౌబలుని= శకుని; తోడి; ఏనూఱు= అయిదువందలు; గుఱ్ఱంబులు= గుఱ్ఱములును; ఇంతియ= ఇంతే; కాదె!= కదా!; ఈసేన= ఈ సైన్యము (ఈ కౌరవ సైన్యము ఇంత అల్పమే కదా అని భావం); ఇది; కృప= కృపుడు; అశ్వత్థామ= అశ్వత్థామ; కృతవర్మలు= కృతవర్మలు; కలిసి; నిలుపన్= నిలుపగా; నిలిచినయది= నిలబడినట్టిది; ఏను= నేను; తఱి= సమీపించి; అఱుముట= ఆక్రమించుట; కలిగెనేని= కలిగినట్లు అయితే; ఇంతవట్టును= ఇది అంతయును; పరిమార్చెదను= సంహరించెదను; ఈ+మూఁక= ఈ సైన్యము; పడియును= చనిపోయియును; పాఱియున్= పాఱిపోయియును; తనచుట్టు= తనచుట్టును; బయలైన= శూన్యమయిన (ఖాళీ అయిన); సుయోధనుండు= దుర్యోధనుడు; ఎట్లు= ఏ విధముగా; అయ్యెడినో= అయినాడో; అటు= ఆ వైపు; చూడుము= తిలకించుము (చూడుము); మార్కొనియెనేని= ఎదుర్కొనినట్లయిన; మదీయ= నాయొక్క; మార్గణ= బాణములనెడి; అగ్నికిన్= అగ్నికి; ఆహుతి= వ్రేల్చుట; చేసి; కపట= మాయా; ద్యూతంబునన్= జూదమువలన; అపహృతంబులైన= అపహరింపబడినట్టి; సకల ధనంబులు= సమస్త సంపదలును; అలుఁగు= బాణములయొక్క; మొన= చివరిభాగముతో; (అలుఁగున్= బాణములతో; మొనన్= సేనావ్యూహమును); మరల్చినవాఁడనై= మరలించినవాడవై; పాండవాగ్రజుని= ధర్మరాజుయొక్క; చింతవంత= సంతాపముతో కూడిన విచారము; అంతయున్= అంతయును; పుచ్చివైచెదన్= పోగొట్టెదను; నేఁడు= నేడు; ఎల్లపనులు= అన్ని కార్యములు; చక్కన= బాగుగా; అయ్యెడున్= అగును; కరిపుర= హస్తినాపురము నందలి; పురంధ్రీజనులు= స్త్రీలు; తమపతులున్= తమయొక్క భర్తలును; పుత్రులున్= కుమారులును; పొలియుట= మరణించుట; విని= ఆలకించి; పాండవులు= పాండవులు (పాండురాజు పుత్రులు); ఉద్దండ= అడ్డులేని; బాహు= భుజబలములయొక్క; వీర్య= పరాక్రమము; శౌర్య= శూరత్వములందు; సమగ్రులు= సమృద్ధికలవారు; అని; ఎఱింగెదరుగాక!= తెలిసికొందురుగాక!; అనుటయును= ఇట్లు చెప్పుటయును; ఆ+నరు= ఆ అర్జునుడి; మాటకున్= పలుకునకు; మెచ్చుచున్= కొనియాడుచు; అతండు= ఆ కృష్ణుడు.

**తాత్పర్యం:** రెండువందల రథాలు, వంద ఏనుగులు, రెండువేల కాల్బలం శకునితో అయిదు వందల గుర్రాలు- ఇంతే కదా ఈ కౌరవసైన్యం. ఇది కృప కృతవర్మ అశ్వత్థామలు కలిసి నిలుపగా నిలబడినట్టిది. నేను సమీపించి ఆక్రమించటం కలిగినట్లయితే ఈ సైన్యాన్నంతా సంహరిస్తాను. ఈ సైన్యం చనిపోయి పారిపోయి తనచుట్టును శూన్యమైన సుయోధనుడు ఏ విధంగా ఉన్నాడో! అటు చూడుము. ఎదిరించినట్లయితే నా బాణాగ్నితో ఆహుతి చేసి

మాయాద్యూతంతో అపహరించబడిన సమస్తసంపదలను నా బాణాగ్రహంతో సేనా వ్యూహాన్ని మరలించిన వాడనై ధర్మరాజుయొక్క సంతాప విచారాలను అంతా పోగొట్టుతాను. నేడు అన్ని కార్యాలు బాగా అవుతాయి. హస్తినాపురమునందలి స్త్రీలు తమయొక్క భర్తలును, పుత్రులును మరణించటం ఆలకించి, పాండవులు అడ్డులేని భుజబల పరాక్రమశౌర్య సమృద్ధులు అని తెలిసికొంటారు గాక!' అని చెప్పగా ఆ అర్జునుడి పలుకులను కొనియాడుతూ శ్రీకృష్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అరదము గౌరవేంద్రుదెసకై నడపంగఁ గెలంకులం గడం**
**గిరి నకులానుజన్ముఁడును గీచకవైరియుఁ గౌరవేశ్వరుం**
**బొరిగొన నుత్సహించి వడి భూవర! వారి కెదిర్చె సౌబలుం**
**డరిబలముం దదీయ రథికావలియున్ వినుతింప నుగ్రుఁడై. 374**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అరదము= రథము; కౌరవేంద్రు= దుర్యోధనునియొక్క; దెసకై= దిక్కునకై; నడపంగన్= నడిపించగా; కెలంకులన్= ప్రక్కలను (రెండు వైపులను); నకుల= నకులునియొక్క; అనుజన్ముఁడును= తమ్ముడును (సహదేవుడును) (అనుసరించి పుట్టినవాడు అనుజన్ముడు); కీచకవైరియున్= భీముడును (కీచకుడికి శత్రువు); కౌరవ+ఈశ్వరున్= దుర్యోధనుని; పొరిగొనన్= చంపుటకు; ఉత్సహించి= ప్రయత్నించి; వడిన్= వేగముగా; కడంగిరి= పూనుకొనిరి; సౌబలుండు= శకుని (సుబలుని కుమారుడు); వడిన్= వేగముగా (ఉభయత్ర అన్వయము); అరి= శత్రువులయొక్క; బలమున్= సైన్యమును; తదీయ= అతనియొక్క; రథిక= రథికులయొక్క (మహాయోధుల); ఆవలియున్= సమూహమును; వినుతింపన్= స్తుతించునట్లు; ఉగ్రుఁడై= మిక్కిలి కోపము కలవాడై; వారికిన్= వారికి; ఎదిర్చెన్= ఎదిరించెను (ఎదురునిలిచెను);

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు రథాన్ని దుర్యోధనుడివైపు నడిపించగా రెండు ప్రక్కలను సహదేవుడూ భీముడూ దుర్యోధనుడిని చంపటానికి ప్రయత్నించి, వేగంగా పూనుకొన్నారు. శత్రుసైన్యం, వాళ్ళ రథిక సమూహమూ ప్రశంసిస్తూండగా, శకుని మిక్కిలి కోపించినవాడై వారికి ఎదురు నిలిచాడు.

**వ. తక్కటివారు నుక్కెక్కి పురికొని రా శకునియు సుశర్ముండును సవ్యసాచిని సుదర్శనుండు సమీరనందనుని నీయగ్రనందనుండు సహదేవునిం దలపడి రట్టియెడ. 375**

**ప్రతిపదార్థం:** తక్కటివారున్= మిగిలినవారును; ఉక్కు= బలము; ఎక్కి= అతిశయించి; పురికొనిరాన్= విజృంభించిరాగా; శకునియున్= శకునియు; సుశర్ముండును= సుశర్ముడును; సవ్యసాచిని= అర్జునుడిని; సుదర్శనుండు= సుదర్శనుడు (దుర్యోధనుని తమ్ముడు); సమీర= వాయువుయొక్క; నందనునిన్= పుత్రుడు భీముడిని; నీ= నీయొక్క; అగ్రనందనుండు= మొదటి పుత్రుడయిన దుర్యోధనుడు; సహదేవునిన్= సహదేవుడిని; తలపడిరి= ఎదుర్కొనిరి; అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** మిగిలినవారు బలం పుంజుకొని విజృంభించి రాగా శకుని, సుశర్ముడు అర్జునుడిని ఎదుర్కొన్నారు. దుర్యోధనుడి తమ్ముడు సుదర్శనుడు భీముడిని ఎదిరించాడు. దుర్యోధనుడు సహదేవుడిని ఎదుర్కొన్నాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వడముడిఁ దలమిగిలి రయం । బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం**
**దొడరి భవత్సుతు మార్కొని । నిడుదవెడఁదతూపులేసి నెఱిఁ దూలించెన్. 376**

**ప్రతిపదార్థం:** వడముడిన్= భీముడిని; తలమిగిలి= ముందునకువచ్చి; రయంబు= వేగం; అడఁరగన్= అతిశయించగా; సహదేవుఁడు; అతి= మిక్కిలి; ఉదగ్రతన్= భయంకరముగా; మెఱయన్= ప్రకాశింపగా; తొడరి= పూనిక వహించి; భవత్= నీయొక్క; సుతున్= పుత్రుని (దుర్యోధనుని); మార్కొని= ఎదుర్కొని; నిడుద= పొడవైన; వెడఁద= వెడల్పైన; తూపులు= బాణములు; ఏసి= ప్రయోగించి; నెఱిన్= మిక్కిలి; తూలించెన్= ఎగురగొట్టెను (చలింపచేసెను).

**తాత్పర్యం:** భీముడిని దాటుకుని వచ్చి వేగం అతిశయించగా సహదేవుడు మిక్కిలి భయంకరంగా ప్రకాశిస్తూ పూనిక వహించి నీ పుత్రుడైన దుర్యోధనుని ఎదుర్కొని పొడవైన, వెడల్పయిన బాణాలు ప్రయోగించి మిక్కిలి చలింపజేశాడు.

**ఉ.** **కట్టియ వైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రి లేఁ**
**బట్టి నతండు సోలియును బాహిరపోవక తేరి యా విభుం**
**గిట్టి నిశాతబాణచయకీలితదేహునిఁ జేసె రావుతుల్**
**కట్టుపకాసులై నరునిఁ గప్పిరి శక్తులఁ దోమరంబులన్.** **377**

**ప్రతిపదార్థం:** భవత్= నీయొక్క; తనయుండు= పుత్రుడు (దుర్యోధనుడు); మాద్రి= మాద్రియొక్క; లేఁబట్టిన్= చిన్నకొడుకును (సహదేవుని); నెన్నుదురు= ఫాలభాగము; కాఁడన్= రంధ్రము పడునట్లు; కట్టియ= దండమును (దుడ్డుకర్రను); వైచెన్= వేసెను (విసిరెను); అతండు= ఆ సహదేవుడు; సోలియును= సొమ్మసిల్లిపోయినా; బాహిరపోవక= మూర్ఛిల్లక; తేరి= తెలివిపొంది; ఆ విభున్= ఆ ప్రభువు అయిన దుర్యోధనుని; కిట్టి= సమీపించి; నిశాత= మిక్కిలి వాడి అయిన; బాణచయ= బాణసమూహములతో; కీలిత= గుచ్చబడిన; దేహునిన్= దేహము కలవానిగా; చేసెన్= చేసెను; రావుతుల్= రౌతులు; కట్టుపకాసులై= అచలులై; శక్తులన్= శక్తులనే ఆయుధములతోను; తోమరంబులన్= తోమరములు అనే ఆయుధములతోను; నరునిన్= అర్జునుడిని; కప్పిరి= కప్పివేసిరి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు సహదేవుడి ఫాలభాగం చిల్లులుపడేటట్లు దండం విసిరాడు. ఆ సహదేవుడు సొమ్మసిల్లి మూర్ఛిల్లక, తెలివిపొంది ఆ దుర్యోధనుడిని మిక్కిలి వాడియైన బాణ సమూహాలతో బంధించబడిన దేహం కలవాడినిగా చేశాడు. రౌతులు రణశూరులై శక్తులను తోమరాలను ప్రయోగించి అర్జునుడిని కప్పివేశారు.

**వ.** **గాంధారదేశీయు లగు నాశ్వికులట్లు పొదివిన నొదవినకినుకఁ గ్రూరభల్లంబుల శిరంబులు ధరం దొరిఁగించినఁ ద్రిగర్తస్యందనసందోహం బడరి గోవిందపురందరపుత్రులపైఁ బటుప్రదరపరంపరలు వరఁగించి విజృంభించిన నవ్విజయుండు.** **378**

**ప్రతిపదార్థం:** గాంధారదేశీయులగున్= గాంధారదేశమునకు సంబంధించిన; ఆశ్వికులు= రౌతులు; అట్లు= ఆ ప్రకారముగా; పొదివినన్= క్రమ్ముకొనిన; ఒదవిన= కలిగిన; కినుకన్= కోపముతో; క్రూర= భయంకరమయిన; భల్లంబులన్= బల్లెములతో; శిరంబులు= తలలు; ధరన్= భూమిపై; తొరిఁగించినన్= పడునట్లు చేయగా; త్రిగర్త= త్రిగర్తదేశముయొక్క; స్యందన= రథములయొక్క; సందోహంబు= సమూహము; అడరి= విజృంభించి; గోవింద= శ్రీకృష్ణ; పురందర పుత్రులపైన్= అర్జునులపై; పటు= కఠినమయిన; ప్రదర= బాణములయొక్క; పరంపరలు= వరుసలు; పరఁగించి= ప్రయోగించి; విజృంభించినన్= విజృంభించగా; ఆ+విజయుండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** గాంధారదేశపు రౌతులు క్రమ్ముకొనగా కలిగిన కోపంతో అర్జునుడు భయంకరమైన బల్లెములతో తలలు నేలపై పడి దొర్లేటట్లు చేయగా త్రిగర్తదేశపు రథాల సమూహం విజృంభించి శ్రీకృష్ణార్జునులపై కఠినమైన బాణాల వరుసలు ప్రయోగించి విజృంభించగా ఆ అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయము).

**సీ. సత్యకర్మునితల చారుకుండల పరి । స్ఫురితత్వ మొందుచు ధరణి డొల్ల**
**నేసి మృగంబుపై కెరఁగుసింగమపోలెఁ । గిట్టి సత్యేషుని గీ టడంచి**
**బహుదినసంచితప్రకటకోపానల । జ్వాలలు సాకారలీలఁ బర్వు**
**తెఱంగున నరుణదృగ్దీప్తిజాలంబు సు । శర్మపై నిగిడించి సాయకత్ర**

**తే. యం బొడల నాటుటయుఁ దద్రథంబు లొక్క । పెట్టఁ గవిసిన నన్నిటిఁ బిలుకుమార్చి**
**రథ్యములఁ గూల్చి యతనియురంబు ఘోర । భల్లమున వ్రచ్చి నిర్జితప్రాణుఁ జేసె. 379**

**ప్రతిపదార్థం:** సత్యకర్మని తల; చారు= సుందరమయిన; కుండల= చెవికుండలములయొక్క; పరిస్ఫురితత్వము= అత్యంత ప్రకాశకత్వము; ఒందుచున్= పొందుచు; ధరణిన్= నేలపై; డొల్లన్= దొర్లునట్లుగ; ఏసి= ప్రయోగించి (కొట్టి); మృగంబుపైకిన్= లేడిపైకి; ఎరఁగు= దూకు; సింగమపోలెన్= సింహమువలె; కిట్టి= సమీపించి; సత్యేషుని; గీటడంచి= చంపి; బహుదిన= అనేకదినాలు; సంచిత= కూడబెట్టిన; ప్రకట= స్పష్టమయిన; కోప= కోపమనెడి; అనల= అగ్నియొక్క; జ్వాలలు= శిఖలు; సాకార లీలన్= ఆకారముతో కూడినరీతిగా; పర్వు= వ్యాపించు; తెఱఁగునన్= విధముగా; అరుణ= ఎర్రని; దృక్= చూపులయొక్క; దీప్తి= కాంతియొక్క; జాలంబు= సమూహము; సుశర్మపైన్= సుశర్ముడిపై; నిగిడించి= వ్యాపింపజేసి (ప్రసరింపచేసి); సాయక= బాణములయొక్క; త్రయంబు= మూడు (మూడు బాణములు); ఒడలన్= దేహమునందు; నాటుటయున్= క్రుచ్చుటయును; తద్= ఆ; రథంబులు; ఒక్కపెట్టన్= ఒక్కుమ్మడిగా; కవిసినన్= వ్యాపించగా; అన్నిటిన్= అన్నిటిని; పిలుకుమార్చి= నాశనం చేసి; రథ్యములన్= గుర్రములను; కూల్చి= చంపి; అతని= ఆ సుశర్మయొక్క; ఉరంబు= వక్షఃస్థలము; ఘోర= భయంకరమయిన; భల్లమునన్= బల్లెముతో; వ్రచ్చి= చీల్చి; నిర్జిత= జయింపబడిన; ప్రాణున్= ప్రాణము కలవానినిగా; చేసెన్= చేసెను.

**తాత్పర్యం:** అర్జునుడు సత్యకర్ముడి తలను సుందరమైన చెవికుండలాలు బాగా మెరుస్తూ నేలపై దొర్లేటట్లు కొట్టాడు. లేడిపై పడిన సింహంవలె సమీపించి సత్యేషుని చంపాడు. అనేక దినాలు కూడబెట్టిన కోపాగ్నిజ్వాలలు ఆకృతిపొంది విలాసంగా వ్యాపించే విధంగా ఎర్రని దృక్కుల కాంతుల సమూహం సుశర్ముడిపై ప్రసరింపజేసి మూడు బాణాలు ఆతడి దేహంలో గ్రుచ్చాడు. ఆ సుశర్ముడి రథాలు ఒక్కుమ్మడిగా మీదపడగా వాటి నన్నింటినీ నాశనం చేశాడు. సుశర్మయొక్క వక్షఃస్థలమును భయంకరమయిన బల్లెంతో చీల్చి, అతడి ప్రాణాలను తీశాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఈ పద్యంలో అర్జునుడు సత్యకర్ముడిని, సత్యేషుడిని, సుశర్ముడిని సంహరించాడు. వీరు సంశప్తకులు. ఇందలి సుశర్మ త్రిగర్త దేశాధీశుడు. అతడి తమ్ములు సత్యకర్మ, సత్యేషులు. వీరు అర్జునుడిని సంహరింపగలమని ప్రతిజ్ఞచేశారు. 'మృగంబుపైకెరఁగు సింగమ పోలెన్'- ఉపమ.

**వ. ఇవ్విధంబునఁ ద్రిగర్తపతిం బ్రేతపతిపాలి కనిచి మనదెస జనంబులు ఖేదంబుం దమవారు మోదంబు నొంద నతని నందనుల నేడ్వుర నెనమండ్ర ముప్పదుండ్ర మూఁడు మూఁడు గోలలం దలలు నఱికెఁ. దత్సైన్యశేషంబు బాఱిసమరె. భీమసేనుబారింబడిన సుదర్శనుండు దదీయశరజాలంబున నదర్శనగతుండై పదంపడి**

**తచ్ఛరవిఖండితకంఠుండైనఁ గోపంబు దీపింప వగమిగుల నక్కుమారుమూఁక యమ్మారుతసుతుఁ జుట్టుముట్టిన నతండు బెట్టిదంబులగు తూపుల నది రూపడంగు నట్లేపున విహరింపఁ గనుంగొని సహింపక మహీపతిముందటిబలంబు బరవసంబునం గవిసిన నక్కౌంతేయసైన్యంబున సరభసంబున నెదిర్చి పేర్చిన సమయంబున సౌబలుండును సహదేవుం దాఁకినం దత్సుతుం డులూకుండు బాసటయై యడరె. వడముడియుఁ బిన్నతమ్మునికి బాసటయయ్యె. నా శకుని మాద్రీతనయునిఁ బ్రదీప్తభల్ల త్రయంబున నొప్పించి పదినారాచంబు లతని మేన గుప్పించినం గోపించుచు నయ్యిరువురు సాయకనికాయంబు నిగిడించిన నా గాంధారరాజు మొగ్గరంబునఁ గత్తళంబులు గరవాలంబులు పల్యాణంబులు మోరలు గంఠంబులు చరణంబులు గరంబులు శిరంబులు దునియలై తొరఁగిన ధాత్రి చిత్రాకారంబైయుండె. నిట్లు దన తురగ సముదయంబు సమయుటయుఁ జలం బెడపక నీ మఱంది యన్నకులానుజుం గిట్టి. 380**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారముగా; త్రిగర్తపతిన్= త్రిగర్తదేశపు రాజు అయిన సుశర్మను; ప్రేతపతి= యమునియొక్క; పాలికి= వద్దకు; అనిచి= పంపి; మనదెస= మనవైపు; జనంబులు= జనులు; ఖేదంబున్= దుఃఖమును; తమవారు= పాండవపక్షమువారు; మోదంబును= ఆనందమును; ఒందన్= పొందునట్లు; అతని= ఆ సుశర్ముడి; నందనులన్= పుత్రులను; ఏడ్వురన్= ఏడుగురను; ఎనమండ్రన్= ఎనిమిది మందిని; ముప్పదుండ్రన్= ముప్పదిమందిని; మూఁడు మూఁడు= మూఁడేసి చొప్పున; కోలలన్= బాణములతో; తలలు= శిరములు; నఱికెన్= ఖండించెను; తద్= ఆ; సైన్యశేషంబు= మిగిలిన సైన్యము; బారిసమరెన్= నశించెను; భీమసేను= భీమునియొక్క; బారిన్= అధీనమునందు; పడిన; సుదర్శనుండు; తదీయ= ఆ భీమునియొక్క; శర= బాణములయొక్క; జాలంబునన్= సమూహము (వరుస) వలన; అదర్శనగతుండై= కనిపించకుండా పోయినవాడై (కప్పబడినవాడై); పదంపడి= వెనువెంటనే; తద్+శర= ఆ బాణములచే; విఖండిత= ఖండింపబడిన; కంఠుండు= కంఠముకలవాడు; ఐనన్= కాగా; కోపంబు= క్రోధము; దీపింపన్= ప్రజ్జ్వలింపగా; వగ= దుఃఖము; మిగులన్= ఎక్కువకాగా; ఆ+కుమారు= ఆ కుమారునియొక్క (సుదర్శనునియొక్క); మూఁక= సైన్యము; ఆ+మారుత సుతున్= ఆ వాయుపుత్రుడయిన భీముని; చుట్టుముట్టినన్= చుట్టుముట్టగా (క్రమ్ముకొనగా); అతండు= ఆ భీముడు; బెట్టిదంబులగు= మిక్కిలి క్రూరములగు; తూపులన్= బాణములతో; అది= ఆ మూఁక(సేన); రూపు+అడంగునట్లు= నశించునట్లు; ఏపునన్= విజ్రుంభణమున; విహరింపన్= విలాసముగా తిరుగుచుండగా; కనుంగొని= చూచి; సహింపక= ఓర్వక; మహీపతి= దుర్యోధనునియొక్క; ముందటి= అగ్రభాగమున ఉన్న(ముందున్న); బలంబు= సైన్యము; బరవసంబునన్= ధైర్యముతో; కవిసినన్= కలియబడగా; ఆ+కౌంతేయ= ఆ కుంతీపుత్రులయొక్క; సైన్యంబును= సైన్యము కూడా; సరభసంబునన్= మిక్కిలి వేగిరపాటుతో; (కోపముతో); ఎదిర్చి= ఎదిరించి; పేర్చిన= విజ్రుంభించిన; సమయమునన్= సమయమునందు; సౌబలుండును= శకునియును; సహదేవున్= సహదేవుని; తాఁకినన్= ఎదుర్కొనగా; తత్సుతుండు= ఆతడి పుత్రుడు(శకుని పుత్రుడు); ఉలూకుండు; బాసటయై= సహాయకుడై; అడరెన్= విజ్రుంభించెను; వడముడియున్= భీముడును; పిన్నతమ్మునికిన్= చిన్నతమ్ముడయిన సహదేవునికి; బాసట= సహాయకుడు; అయ్యెన్= అయ్యెను; ఆ శకుని; మాద్రీతనయునిన్= మాద్రి పుత్రుడయిన సహదేవుని; ప్రదీప్త= మిక్కిలి ప్రజ్జ్వలించిన; భల్ల= బల్లెములయొక్క; త్రయంబునన్= మూడింటితో; నొప్పించి= బాధించి; పది నారాచంబులు= పది వాడియైన బాణములు; అతని మేనన్= ఆ సహదేవుని దేహమునందు; కుప్పించినన్= కురిపించగా (ప్రయోగించగా); కోపించుచున్= కోపించుచు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరును; సాయక= బాణములయొక్క; నికాయంబున్= సమూహమును; నిగిడించినన్= వ్యాపింపచేయగా (ఒకరిపై ఒకరు ప్రయోగించగా); ఆ గాంధారరాజు= ఆ శకుని; మొగ్గరంబునన్= ఆ వ్యూహమునందు; కత్తళంబులు= కవచములు; కరవాలంబులు= కత్తులు; పల్యాణంబులు= జీనులు; మోరలు= ముఖములు (ఇచ్చట గుఱ్ఱముల ముఖములు); కంఠంబులు; చరణంబులు= పాదములు (కాళ్ళు); కరంబులు= చేతులు; శిరంబులు= తలలు; తునియలై= ముక్కలై; తొరఁగినన్= రాలగా; ధాత్రి= భూమి(యుద్ధభూమి);

చిత్ర= బొమ్మలయొక్క; ఆకారంబై= ఆకృతి కలదియై; (చిత్ర= ఆశ్చర్యకరమయిన; ఆకారంబై= ఆకృతికలదియై); ఉండెను; ఇట్లు= ఈ ప్రకారముగా; తన= తనయొక్క; తురగ= గుర్రములయొక్క; సముదయంబు= సమూహము; సమయుటయున్= చచ్చుటయు; చలంబు= మత్సరము; ఎడపక= ఎడబాయక (వదలక); నీ మఱంది= నీ బావమరది అయిన శకుని; ఆ+నకుల+అనుజున్= ఆ సహదేవుని; కిట్టి= సమీపించి.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా త్రిగర్తదేశాధిపతి సుశర్మను యముని వద్దకు పంపి, మనవైపు జనులు దుఃఖాన్ని పాండవపక్షంవారు ఆనందాన్ని పొందేటట్లు ఆ సుశర్మడి పుత్రులను ఏడుగురను, ఎనిమిదిమందిని, ముప్పదిమందిని - క్రమంగా మూడు మూడు బాణాలతో తలలు ఖండించాడు. మిగిలిన సైన్యం పారిపోయి నశించినది. భీముడి అధీనంలో పడిన సుదర్శనుడు ఆ భీముడి బాణసమూహాలవలన కప్పబడి వెనువెంటనే ఆ బాణాలచేత ఖండింపబడిన కంఠం కలవాడయ్యాడు. అప్పుడు క్రోధం ప్రజ్వలించగా దుఃఖం ఎక్కువకాగా ఆ సుదర్శనుడి సైన్యం భీముడిని చుట్టుముట్టగా భీముడు మిక్కిలి క్రూరములైన బాణాలతో ఆ మూక నశించేటట్లు విజృంభించాడు. విలాసంతో తిరుగగా చూచి ఓర్వక దుర్యోధనుడి ముందున్న సైన్యం ధైర్యంతో కలియబడింది. ఆ పాండవులసైన్యం కూడా వేగిరపాటుతో ఎదిరించి విజృంభించింది. శకుని సహదేవుడిని ప్రజ్వలిస్తున్న మూడు బల్లెములతో బాధించి పదిబాణాలు అతడి దేహంలో ప్రయోగించాడు. వారు పరస్పరం కోపిస్తూ ఆ ఇద్దరూ బాణాల సమూహాన్ని వ్యాపింపచేయగా, శకుని సేనావ్యూహమునందు కవచములు కత్తులు జీనులు గుర్రముల ముఖములు కంఠములు కాళ్ళు చేతులు తలలు ముక్కలై పడ్డాయి. అప్పుడు యుద్ధభూమి చిత్రించిన బొమ్మ ఆకారాన్ని పొంది ఉన్నది. ఈ ప్రకారంగా తన గుర్రాల సముదాయం సంహరించబడటంతో మాత్సర్యం విడువక నీ బావమరది శకుని ఆ సహదేవుడిని సమీపించి.

**క. పెనుగడఁత దొడ్డ యత్తళ । మున వైచిన నతఁడు మూర్ఛమునిఁగి రథము మీఁ**
**దన పడినఁ గనలి యప్పా । వని పొదివెను గౌరవేంద్రవాహినిఁ గడఁకన్. 381**

**ప్రతిపదార్థం:** పెను= పెద్ద; కడఁతన్= కణత భాగాన్ని; దొడ్డ= గొప్ప; అత్తళమునన్= ఈటెతో; వైచినన్= కొట్టగా; అతఁడు= ఆ సహదేవుడు; మూర్ఛమునిఁగి= మూర్ఛలోమునిగి; రథము మీఁదను= రథము మీదనే; పడినన్= పడగా; ఆ+పావని= ఆ భీముడు (పవనుని పుత్రుఁడు పావని); కనలి= కోపించి; కడఁకన్= పూనికతో; కౌరవేంద్ర= దుర్యోధనుని; వాహినిన్= సేనను; పొదివెను= క్రమ్మెను.

**తాత్పర్యం:** శకుని ఆ సహదేవుడి పెద్దకణతను గొప్ప ఈటెతో కొట్టగా సహదేవుడు మూర్ఛలో మునిగి రథంపై పడిపోగా, భీముడు కోపించి పూనికతో దుర్యోధనుడిని సేనను ఆక్రమించాడు.

**వ. పొదివిన యవ్వీరునారాచంబుల తాఁకున. 382**

**ప్రతిపదార్థం:** పొదివిన= క్రమ్ముకొనిన; ఆ+వీరు= ఆ వీరునియొక్క (భీమునియొక్క); నారాచంబుల= బాణములయొక్క; తాఁకునన్= యుద్ధంలో.

**తాత్పర్యం:** దుర్యోధనుడి సేనను క్రమ్ముకొని పరాక్రమవంతుడైన భీముడి బాణాలయొక్క యుద్ధంలో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అది గొంత పుడమిఁ బడ ను । న్నది పాఱినఁ గని యదల్చి యవనీశుఁడు బె**
**ట్టిదముగ నెలుఁగు సూపెను । మద మారఁగ నబ్బలంబు మగుడు విధమునన్. 383**

**ప్రతిపదార్థం:** అది= ఆ దుర్యోధనుని సేన; కొంత; పుడమిన్= భూమిమీద; పడన్= పడగా(చావగా); ఉన్నది= మిగిలియున్నది; పాఱినన్= పరుగెత్తి పారిపోగా; కని= చూచి; అదల్చి= అదలించి; అవనీ+ఈశుఁడు= రాజు (దుర్యోధనుడు); మదము= గర్వము; ఆరఁగన్= కలుగగా; ఆ+బలంబు= ఆ సైన్యము; మగుడు= మరలు; విధమునన్= విధముగా; బెట్టిదముగన్= కఠినముగ; ఎలుఁగున్= కంఠస్వరము; చూపెను (కేకపెట్టెను).

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి సైన్యం కొంత చావగా మిగిలిన ఉన్న సేన పారిపోతూ ఉండగా చూచి, అదలించి దుర్యోధనుడు గర్వంతో ఆ సైన్యం మరలేటట్లుగా గట్టిగా ఒక కేక పెట్టాడు.

**వ. ఇవ్విధంబున దొర యఱిమి తఱిమి యమ్మొన కుత్సాహంబుగాఁ జటులవాహంబగు రథంబెక్కి శకునిఁ గూడుకొని కవిసిన. 384**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారముగ; దొర= రాజు; అఱిమి= ఆక్రమించి; తఱిమి; ఆ+మొనకున్= ఆ సేనకు; ఉత్సాహంబుగాన్= ఉత్సాహం కలిగేటట్లుగా; చటుల= చలించే; వాహంబు= గుర్రము; అగు= కలుగు; రథంబు= రథము; ఎక్కి= అధిరోహించి; శకునిన్= శకునిని; కూడుకొని= కలిసికొని; కవిసినన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా దుర్యోధనుడు ఆక్రమించి తరిమి ఆ సేనకు ఉత్సాహం కలిగేటట్లు చేసి, చలించే గుర్రాలు కల రథం అధిరోహించి శకునిని కలిసికొని వ్యాపించగా.

**తే. పాండవుల సైన్యమును సముద్దండ లీల । మాఱుకొనె నంతలో మూర్ఛదేఱి నకులు**
**తమ్ముఁ డమ్మామపైఁ బదియమ్ము లొక్క । పెట్టఁ గ్రుచ్చి యాతనివిలు బెట్టు ద్రుంచె. 385**

**ప్రతిపదార్థం:** పాండవుల సైన్యమును= పాండవులయొక్క సైన్యముకూడా; సముద్దండలీలన్= భయంకరంగా; మాఱుకొనెను= ఎదుర్కొనెను; అంతలోన్= ఆ సమయంలో; మూర్ఛదేఱి= మూర్ఛనుండి తేరుకొని; నకులు తమ్ముఁడు= నకులుని తమ్ముడయిన సహదేవుడు; ఆ+మామపైన్= ఆ మామ అయిన శకునిపై; పది; అమ్ములు= బాణములు; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; క్రుచ్చి; ఆతని= ఆ శకుని; విలు= విల్లు; బెట్టు= గట్టిగా; త్రుంచెన్= ఖండించెను.

**తాత్పర్యం:** పాండవుల సైన్యం కూడా భయంకర లీలతో ఎదుర్కొన్నది. అంతలో మూర్ఛ నుండి తేరుకున్న సహదేవుడు ఆ శకునిపై పది బాణాలు ఒక్కసారిగా గుచ్చి ఆ శకుని విల్లు గట్టిగా ఖండించాడు.

### ఉలూకుఁడు సహదేవుచేత మృతుం డగుట (సం. 9-26-23)

**సీ. ఆ సౌబలుండు శరాసనాంతరదీప్తుఁ । డగుటయు నకులుఁడు ననిలసుతుఁడు**
**దాఁకిన వారి నతండు పెక్కమ్ముల । నొప్పింప నతని తనూజుఁ డనిల**
**సుతసహదేవుల సునిశితశరవర్ష । మునఁ గప్ప నయ్యులూకుని ననేక**
**సాయకంబుల నొంచి శకునిపై నఱువది । యమ్ములు నాటించి యనుచరులను**

**తే.** **బెగడు పఱిచె నా భీముండు బె ట్టులూకుఁ । డడరి యన్నకులానుజు నంపవెల్లి**
**ముంప నతఁడేచి పటుభల్లమున శిరంబు । ద్రుంచె నన్నలయెదలు సంతోష మొంద.** **386**

**ప్రతిపదార్థం:** ఆ సౌబలుండు= ఆ శకుని; శరాసన+అంతర= మరియొక ధనువుతో; దీప్తుఁడు= ప్రకాశించువాడు; అగుటయున్; నకులుఁడు; అనిల= వాయువుయొక్క; సుతుఁడు= పుత్రుడు (భీముడు); తాఁకినన్= ఎదుర్కొనగా; వారిన్= వారిని; అతండు= ఆ శకుని; పెక్కు= అనేకములయిన; అమ్ములన్= బాణములతో; నొప్పింపన్= బాధించగా; అతని= ఆ శకునియొక్క; తనూజుఁడు= పుత్రుడైన ఉలూకుడు; అనిలసుత సహదేవులన్= భీముని సహదేవుని; సునిశిత= బాగుగా వాడియైన; శర= బాణాలయొక్క; వర్షమునన్= కురియించినందువలన; కప్పన్= కప్పివేయగా; ఆ+ఉలూకుని= ఆ ఉలూకుని; అనేక= పలు; సాయకంబులన్= బాణములతో; నొంచి= నొప్పించి; శకునిమైన్= శకుని దేహమునందు; అఱువది= అరవై; అమ్ములు= బాణములు; నాటించి= గ్రుచ్చి; అనుచరులను= అనుసరించి ఉన్న యోధులను; ఆ భీముండు; బెగడ పఱిచెను= భయముపొందునట్లు చేసెను; ఉలూకుడు; బెట్టు= గట్టిగా; అడరి= విజృంభించి; ఆ+నకుల+అనుజున్= ఆ నకులునియొక్క తమ్ముని (అనగా సహదేవుని); అంపవెల్లిన్= బాణాల ప్రవాహంలో; ముంపన్= ముంచగా; అతఁడు= ఆ సహదేవుడు; ఏచి= విజృంభించి; పటు= కఠినమైన; భల్లమునన్= బల్లెముతో; అన్నలయెదలు= అన్నలయొక్క మనస్సులు; సంతోషము= ఆనందము; ఒందన్= పొందునట్లుగా; శిరంబు= తల; త్రుంచెన్= ఖండించెను.

**తాత్పర్యం:** ఆ శకుని మరియొక ధనువుతో చెలరేగుతూ నకులుడు భీముడు ఎదుర్కొనగా వారిని పెక్కుబాణాలతో నొప్పించాడు. శకుని పుత్రుడు ఉలూకుడు భీమసహదేవులను బాగా వాడి అయిన బాణాలను కురిపించి కప్పివేయగా ఉలూకుడిని అనేక బాణాలతో నొప్పించి శకుని దేహంలో అరువది బాణాలు గ్రుచ్చి భీముడు శకుని అనుచరులను భయం పొందేటట్లు చేశాడు. ఉలూకుడు గట్టిగా విజృంభించి సహదేవుడిని అమ్ముల వెల్లువలో ముంచాడు. సహదేవుడు విజృంభించి కఠినమైన బల్లెముతో అన్నల మనసులు ఆనందం పొందేటట్లుగా ఉలూకుడి తలను ఖండించాడు.

**విశేషం:** ఉలూకుడు శకుని పుత్రుడు. మహాపరాక్రమవంతుడు. ఇతడు శాంతిప్రియుడు. 'శాకుని, కైతవ, సౌబలసుత, కైతవ్య' అని ఇతడికి పేర్లు. సంస్కృత మహాభారతంలో ఉలూకదూతాగమన పర్వమనే ఒక అవాంతర పర్వం ఉద్యోగపర్వంలో ఉన్నది.

**క.** **తనయుఁడు వడ శకుని కనుం । గొని శోకం బాత్మ నారఁగూరఁగ నశ్రుల్**
**కనుఁగొనలయందు నినిచె । న్మనుజేశ్వర! విదురు భాషణంబులు దలఁచెన్.** **387**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= మానవులకు ప్రభువైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; తనయుండు= కుమారుడు; పడన్= కూలగా; శకుని; కనుంగొని= చూచి; శోకంబు= దుఃఖము; ఆత్మను= మనస్సును; ఆరఁగూరఁగన్= నిండుగా పొందగా; అశ్రుల్= బాష్పములు; కనుఁగొనలయందున్= కన్నుల చివరి భాగములయందు; నినిచెన్= నింపెను; విదురు= విదురునియొక్క; భాషణంబులు= పలుకులు; తలఁచెన్= స్మరించెను.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పుత్రుడైన ఉలూకుడు కూలిపోగా శకుని చూచి, దుఃఖంతో మనస్సు నిండగా బాష్పాలను కనుల చివరి భాగాలలో నింపి, ఆనాడు విదురుడు చెప్పిన మాటలను స్మరించాడు.

**వ.** **అ ట్లడలుచు నిట్టూర్పు నిగుడ సహదేవుపై నడరి మూఁడు నారాచంబుల నిగిడించిన.** **388**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారంగా; అడలుచున్= దుఃఖించుచు; నిట్టూర్పు= నిశ్వాసము; నిగుడన్= వ్యాపించగా; సహదేవుపైన్= సహదేవునిమీద; అడరి= విజృంభించి; మూఁడు; నారాచంబులు= బాణములు; నిగిడించినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా శకుని దుఃఖిస్తూ నిశ్వాసం వ్యాపించగా సహదేవుడిపై విజృంభించి, మూడు బాణాలు ప్రయోగించగా.

**చ. అవి వెసఁ ద్రుంచి యాతనిశరాసనముం దునుమాడె నక్కుమా**
**ర వరుఁ డతం డనిందితపరాక్రముఁడై పటుఖడ్గయష్టిదీ**
**ప్తవిపులముద్గరంబున విభాసితశక్తిని వైవఁ దోడుతో**
**నవియు ననేకబాణముల నానృపసూనుఁడు నుగ్గుసేసినన్. 389**

**ప్రతిపదార్థం:** అవి= అవి (ఆ మూడు బాణములు); వెసన్= శీఘ్రముగా; త్రుంచి= ఖండించి; ఆతని= అతనియొక్క (శకుని); శరాసనమున్= ధనువును; ఆ+కుమార వరుఁడు= ఆ కుమార శ్రేష్ఠుడైన సహదేవుడు; తునుమాడెన్= ఖండించెను; అతండు= ఆ శకుని; అనిందిత= నిందింప బడని; పరాక్రముఁడై= పరాక్రమముకలవాడై; పటు= కఠినమైన; ఖడ్గ= కత్తిని; యష్టి= దుడ్డుకర్రను; దీప్త= ప్రజ్జ్వలించుచున్న; విపుల= విశాలమైన; ముద్గరంబును= ఇనుపగదను; విభాసిత= మిక్కిలి ప్రకాశవంతమైన; శక్తినిన్= శక్తి అను ఆయుధమును; వైవన్= ప్రయోగించగా; తోడుతోన్= వెనువెంటనే; ఆ నృపసూనుఁడు= రాజపుత్రుడైన ఆ సహదేవుడు; అవియును= వానినికూడా; అనేకబాణములన్= పలువిధములయిన బాణములతో; నుగ్గు= పిండి; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** ఆ మూడు బాణాలను శీఘ్రంగా ఖండించి సహదేవుడు శకునియొక్క ధనువును కూడా ఖండించాడు. శకుని గొప్ప పరాక్రమం కలవాడై వాడిగల పెద్ద కత్తిని, కర్రను, ఇనుపగదను, మిక్కిలి కాంతిమంతమైన శక్తిని ప్రయోగించగా ఆ వెనువెంటనే ఆ సహదేవుడు అనేక బాణాలతో వాటిని కూడా పిండి చేశాడు. అట్లా చేయగా.

**విశేషం:** 'పటు ఖడ్గయష్టి దీప్త విపుల ముద్గరంబును' అనే పాఠము మూలానుగుణం. ఇందు ఉస్మానియా ప్రతిలో 'ముద్గరంబున' అని కలదు. అందువలన 'ముద్గరంబును' అని అర్థం వ్రాయబడింది. 'ప్రగృహ్య మహతీం గదామ్' (సం.9-27-36) మూలం. (శల్య. 28-38).

**క. కనుఁగొని పార్శ్వచరులు వి । చ్చిన శకునియుఁ బాఱె నుల్లసిల్లిరి కుంతీ**
**తనయులు దదీయసేనా । జను లార్చిరి కురువిభుఁడు విషాదము నొందెన్. 390**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; పార్శ్వచరులు= ప్రక్కలందుండు యోధులు (అనగా రక్షకులు - చక్ర రక్షకులు); విచ్చినన్= విడివడిపోగా; శకునియున్= శకునికూడా; పాఱెన్= పారిపోయెను; కుంతీతనయులు= కుంతీ పుత్రులైన పాండవులు; ఉల్లసిల్లిరి= సంతోషించిరి; తదీయ= ఆ పాండవులయొక్క; సేనాజనులు= సేనా నాయకులు; ఆర్చిరి= అరిచిరి; కురువిభుఁడు= దుర్యోధనుడు; విషాదమును= దుఃఖమును; ఒందెన్= పొందెను.

**తాత్పర్యం:** చూచి, రథరక్షకులైన యోధులు విడివడిపోగా శకుని కూడా పారిపోయాడు. కుంతీపుత్రులు సంతోషించారు. వారి సేనానాయకులు బొబ్బరించారు. దుర్యోధనుడు దుఃఖించాడు.

**వ. ఇట్లు పాఱిన. 391**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; పాఱినన్= పారిపోగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా పార్శ్వరక్షకులు పారిపోగా.

**చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ బర్వఁ బాండవా**
**వరజుఁడు పోవనీక పొదువన్ వడిఁ బింగలివారు పోరికిం**
**బురికొని త్రోచినన్ సుబలపుత్రుఁడు దత్తురగవ్రజంబుతో**
**బరవసమొప్పఁగా నతనిపైఁ గవిసెం గృతనిశ్చయాత్ముఁడై. 392**

**ప్రతిపదార్థం:** సత్వరంబుగన్= మిక్కిలివేగముగ; అరదము= రథము; పెల్లుగన్= ఎక్కువగా; శర= బాణములయొక్క; ఆవళిన్= సమూహమును; పర్వన్= వ్యాపించగా; పాండవ+అవరజుఁడు= సహదేవుడు; పోవనీక= పోనీయక; పొదువన్= క్రమ్ముకొనగా; వడిన్= వేగముగా; పింగలివారు= వెనుకటివారు; పోరికిన్= యుద్ధమునకు; పురికొని= విజృంభించి; త్రోచినన్= కలియబడగా; సుబలపుత్రుఁడు= శకుని; కృత= చేయబడిన; నిశ్చయ= నిర్ణయముకల; ఆత్ముఁడై= మనసు కలవాడై; తద్= ఆ; తురగ= గుఱ్ఱములయొక్క; వ్రజంబుతోన్= సమూహముతో; బరవసము= ధైర్యము; ఒప్పఁగాన్= ప్రకాశింపగా; అతనిపైన్= ఆ సహదేవునిపై; కవిసెన్= కలియబడెను.

**తాత్పర్యం:** మిక్కిలివేగంతో రథం సాగుతూంటే, బాణాల సమూహం చుట్టుముట్టుతూంటే పాండవులలో చిన్నవాడైన సహదేవుడు పోనీయక క్రమ్ముకొన్నాడు. అప్పుడు వెనుకటివారు యుద్ధానికి విజృంభించి కలియబడగా శకుని నిశ్చయం కలిగిన మనస్సుకలవాడై ఆ గుఱ్ఱాల సమూహాలతో (తురంగసైన్యంతో) ధైర్యం వెల్లివిరియగా ఆ సహదేవుడిపై కలియబడ్డాడు.

**వ. కవిసినం గని గుణంబు సారించి శరాసారం బడరించి యా సహదేవుం డిట్లనియె. 393**

**ప్రతిపదార్థం:** కవిసినన్= కలియబడగా; కని= చూచి; గుణంబు= నారి; సారించి= సాగదీసి; శరాసారంబు= బాణవర్షం; అడరించి= కలిగించి; ఆ సహదేవుండు; ఇట్లు= ఈ ప్రకారముగా; అనియెన్= అని పలికెను.

**తాత్పర్యం:** శకుని కలియబడగా చూచి, నారి సారించి, బాణాలు ప్రయోగించి, ఆ సహదేవుడు ఈ ప్రకారంగా అన్నాడు.

**చ. 'తలఁకుట యొప్పునే నృపతి ధర్మము నూఁది యెదిర్చి యేమెయిన్**
**నిలుచుట యొప్పఁగాక మహనీయుల ధర్మతనూభవాదులం**
**బలికితి వీవు జూదపునెపంబునఁ దత్పలమందె దిప్డ మా**
**చలము బలంబు నేర్పడియెఁ జచ్చిరి మీ యవివేకు లందఱున్. 394**

**ప్రతిపదార్థం:** నృపతిధర్మము= రాజధర్మమును; ఊఁది= విడిచి; తలఁకుట= భయపడుట; ఒప్పునే?= సమ్మతమగునా? (కాదు); ఏమెయిన్= ఏవిధముగానైనను; నిలుచుట= నిలబడుట (ధైర్యముగా ఉండుట); ఒప్పుఁగాక= సమ్మతమగుగాక;

ఈవు= నీవు; జూదపు= జూదముయొక్క; నెపంబునన్= మిషతో; మహనీయులన్= మిక్కిలి గొప్పవారయిన; ధర్మతనూభవ+ ఆదులన్= ధర్మరాజు మొదలగు వారిని; పలికితివి= పలికితివి(తిట్టితివి); ఇప్డు= ఇప్పుడు (ఈ సమయమున); తత్ఫలము= ఆ ఫలితము; అందెదు= పొందగలవు; మీ= మీయొక్క; అవివేకులు= మూర్ఖులు; అందఱున్= అందరును; చచ్చిరి= మరణించారు; మా చలము= మా యొక్క కోపమును; బలమున్= బలమును; ఏర్పడియెన్= తేటపడెను.

**తాత్పర్యం:** 'రాజధర్మం విడిచి భయపడటం సమ్మతమగునా? ఏ విధంగానైనా నిలవటం ధైర్యంగా ఉండటమే ఉచితం. నీవు జూదం మిషతో మహాత్ములైన ధర్మరాజు మొదలైనవారిని తిట్టావు. ఈ సమయంలో ఆ ఫలితాన్ని పొందుము. నీ మూర్ఖులందరును మరణించారు. మా కోపం బలం ఇప్పుడు తేటతెల్లమయ్యాయి.

**వ. మమ్ము నపహసించిన వారిలోఁ గురుకులదాహకుం డొక్కరుండ తక్కె నద్దురాత్ముండు సూచుచుండ భవదీయ శిరంబుఁదాలఫలంబు లగుడంబునం బడవైచు పగిదిఁ బటుభల్లంబున డొల్ల నేసెద మామా! పాఱక నిలువుమీ!' యని యట్లు బహుభంగులఁ బలికి యతం డేయు సాయకంబుల వారించి దశమార్గణంబులు మేనఁ జొనిపి. 395**

**ప్రతిపదార్థం:** మమ్మున్= మమ్ములను; అపహసించినవారిలోన్= అవహేళన చేసినవారిలో (అనగా మమ్ములను అకారణంగా నిందించి అవమానం చేసిన వారిలో); కురుకుల= కురువంశమునకు; దాహకుండు= అగ్నివంటివాడు (అనగా కురువంశమును తగులబెట్టినవాడు); ఒక్కరుండ= ఒక్కడే; తక్కెను= మిగిలెను; ఆ+దురాత్ముండు= ఆ దుష్టబుద్ధికలవాడు; చూచుచుండన్= చూచుచుండగా; భవదీయ= నీ యొక్క; శిరంబున్= తలను; తాలఫలంబు= తాటిపండు; లగుడంబునన్= కఱ్ఱతో; పడవైచు= పడగొట్టు; పగిదిన్= విధముగా; పటు= కఠినమయిన; భల్లంబునన్= బల్లెముతో; డొల్లన్= నేల దొర్లునట్లు; ఏసెదన్= కొట్టెదను; మామా!= ఓ మామా!; పాఱక= పారిపోకుండ; నిలువుమీ!= నిలుచుండుమీ!; అని; అట్లు= ఆ ప్రకారంగా; బహుభంగులన్= పలువిధములుగా; పలికి; అతండు= ఆశకుని; ఏయు= ప్రయోగించు; సాయకంబులు= బాణములు; వారించి= నివారించి (అడ్డుకొని); దశ= పది; మార్గణంబులు= బాణములు; మేనన్= దేహమునందు; చొనిపి= గ్రుచ్చి.

**తాత్పర్యం:** ఓ మామా! మమ్ము అకారణంగా అవహేళనచేసిన వారిలో కురువంశమును తగులబెట్టినవాడయిన దుర్యోధనుడు ఒక్కడే మిగిలాడు. ఆ దుర్మార్గుడు చూస్తుండగా నీ తలను తాడిపండు కఱ్ఱతో పడగొట్టే విధంగా కఠినమైన బల్లెంతో నేలపడి దొర్లేటట్లు కొట్టుతాను. ఓ మామా! పారిపోకుండా నిలువుము' అని ఆ ప్రకారంగా పలు విధములుగా పలికి ఆ శకుని ప్రయోగించే బాణాలు అడ్డుకొని పది బాణాలు ఆ శకుని దేహమునందు గ్రుచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తురగములు సిడము గొడుగును । శరాసనముఁ దునిమి యార్వ సాహసమున ని**
**ష్ఠుర శక్తిఁ బూన్చె నాతని । యురః స్థలము వైవ శకుని యుర్వీనాథా! 396**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; తురగములు= గుఱ్ఱములు; సిడము= ధ్వజము; గొడుగును; శరాసనమున్= ధనువును; తునిమి= ఖండించి; ఆర్వన్= అరవగా; శకుని; సాహసమునన్= తెగువతో; నిష్ఠుర= కఠినమైన; శక్తిన్= శక్తి అను ఆయుధమును; ఆతని= ఆ సహదేవుని; ఉరఃస్థలము= వక్షఃస్థలము; వైవన్= వైచుటకు (కొట్టుటకు); పూన్చెను= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సహదేవుడు శకుని గుఱ్ఱాలు, ధ్వజం, గొడుగు ధనువు ఖండించి పెద్దగా అరవగా శకుని తెగువతో కఠినమైన శక్తి అనే ఆయుధాన్ని ఆ సహదేవుడి వక్షఃస్థలాన్ని కొట్టటానికి ధరించాడు.

**మ. సహదేవుం డది శాతభల్లమున నుత్సాహోగ్రుఁడై త్రుంచి దు**
**స్సహభల్లద్వితయంబునం గరయుగస్వైరచ్ఛిదాకేళి స**
**ల్పి హసద్వక్త్ర విలాస మొప్పెసఁగ నాభీలద్యుతిస్ఫారభ**
**ల్లహతిం గంఠము ద్రుంప మస్తకము డొల్లన్ డొల్లె మేనున్ మహిన్. 397**

**ప్రతిపదార్థం:** సహదేవుండు= సహదేవుడు; ఉత్సాహ= ప్రయత్నముతో; ఉగ్రుఁడై= క్రోధంతో భయంకరమైన ఆకారము కలవాడై; శాత= వాడియైన (తీక్షణమైన); భల్లమునన్= బల్లెముతో; అది= ఆ శక్తిని; త్రుంచి= ఖండించి; దుస్సహ= భరింపశక్యము కాని; భల్ల= బల్లెములయొక్క; ద్వితయంబునన్= రెండింటితో; కరయుగ= రెండుచేతులతో; స్వైర= స్వేచ్ఛగా; ఛిదా= ఛేదించుటయనెడి; కేళిన్= క్రీడ; సల్పి= సలిపి; హసత్= నవ్వుచున్న; వక్త్ర= మోముయొక్క; విలాసము= లీల; ఒప్పెసఁగన్= ఒప్పునట్లుగా; ఆభీల= భయంకరమైన; ద్యుతి= కాంతితో; స్ఫార= గొప్పదైన; భల్ల= బల్లెములయొక్క; హతిన్= దెబ్బతో; కంఠము= గళము(గొంతు); త్రుంపన్= ఖండించగా; మస్తకము= శిరము; డొల్లన్= దొర్లగా; మహిన్= భూమిపై; మేనున్= దేహముకూడా; డొల్లెన్= దొర్లెను.

**తాత్పర్యం:** సహదేవుడు క్రోధంతో భయంకరమైన ఆకారం కలవాడై ప్రయత్నంతో తీక్షణమైన బల్లెంతో శకుని ప్రయోగించిన శక్తిని ఖండించి, భరింపశక్యం కాని రెండు బల్లెములతో రెండు చేతులతో స్వేచ్ఛగా ఛేదించే క్రీడ సలిపి నవ్వుముఖం విలాసంగా ప్రకాశించగా భయంకరమైన కాంతితో చలిస్తున్న బల్లెంయొక్క దెబ్బతో (శకుని) కంఠాన్ని ఖండించగా తల, మొండెం భూమిపై పడి దొర్లాయి.

**వ. ఇట్లు కౌరవులదుర్నయంబునకు మూలంబగు శకునిఁ దెగటార్చి పేర్చియార్చిన యనుజన్ము నాలోకించి ధర్మతనయ ప్రముఖులు పరమ ప్రమోదభరితాంతఃకరణులై నిజశంఖంబులు పూరింప శౌరియుఁ బాంచజన్యరావంబున రోదసి నింప సుయోధను సేన చెదరక బెదరక నిలిచి యా సౌబలు సైన్యంబు సహదేవునిపై ననేకాస్త్ర శస్త్రంబులు గురియుచుఁ గవిసినం గవ్వడియు వడముడియు నవి యన్నియు మోఘంబు లగునట్లు చేసి యమ్మూఁక బలువడనేసి యుల్లాసభాసితు లైనం గని జనపతి శోకాక్రాంతమతియై హతశేషులైన నిజ సైనికులం బురికొల్పిన వారలు రక్షకరహితులయ్యును దెంపు పెంపున శంకింపక యాసవ్యసాచిం బొదివి తదస్త్రశిఖాసందోహంబున మ్రందిపోయి రక్కురురాజు దనచుట్టును బయలగుటఁ గలయం జూచి కట్టెదురఁ జెలంగు నా కౌంతేయులం గనుంగొని తొలంగిపోవం దలంచె ననుటయు నాంబికేయుండు సంజయు దిక్కు మొగంబై. 398**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారముగా; కౌరవుల= కౌరవులయొక్క; దుర్నయంబునకున్= దుర్నీతికి; మూలంబు= కారణము; అగు= అయినట్టి; శకునిన్= శకునిని; తెగటార్చి= చంపి; పేర్చి= అతిశయించి; ఆర్చినన్= అరచిన; అనుజన్మున్= తమ్ముడైన సహదేవుని (అనుసరించి జన్మించినవాడు అనుజన్ముడు); ఆలోకించి= చూచి; ధర్మతనయ ప్రముఖులు= ధర్మరాజు మొదలగు వారు; పరమ= అత్యంత; ప్రమోద= ఆనందముతో; భరిత= నిండిన; అంతఃకరణులై= మనసు కలవారై (మనోబుద్ధి చిత్తాహంకారములు అంతఃకరణ చతుష్టయము); నిజ= తమయొక్క; శంఖంబులు= శంఖములు; పూరింపన్= పూరించగా; శౌరియున్= శ్రీకృష్ణుడును; పాంచజన్య= పాంచజన్యమను పేరుగల శంఖముయొక్క; రావంబునన్= ధ్వనితో; రోదసి= భూమ్యాకాశమధ్యప్రదేశము; నింపన్= నిండిపోవునట్లు చేయగా; సుయోధను= దుర్యోధనునియొక్క; సేన= సైన్యము;

చెదరక= కలతచెందక; బెదరక= భయపడక; నిలిచి= నిలిచి; ఆ సౌబలు= ఆ శకునియొక్క; సైన్యంబు= సేన; సహదేవునిపైన్; అనేక= పలు; అస్త్ర= మంత్రపూతములయిన ఆయుధములు; శస్త్రంబులు= సామాన్య ఆయుధములు; కురియుచున్= కురిపించుచు; కవిసినన్= కలియబడగా; కవ్వడియున్= అర్జునుడును; వడముడియున్= భీముడును; అవియన్నియున్= ఆ అస్త్రశస్త్రములన్నియును; మోఘంబులు= నిరుపయోగములు; అగునట్లు; చేసి; ఆ+మూఁక= ఆ సేన; బలువడనేసి= బలము తగ్గించి; ఉల్లాస= సంతోషముతో; భాసితులైనన్= ప్రకాశవంతులు కాగా; కని= చూచి; జనపతి= దుర్యోధనుడు (జనులకు పతి అనగా రాజు); శోక= దుఃఖముతో; ఆక్రాంత= ఆక్రమింపబడిన; మతియై= బుద్ధికలవాడై; హతశేషులైన= చంపబడగా మిగిలినట్టి; నిజ= తనయొక్క; సైనికులన్= సేనలను; పురికొల్పినన్= క్రమ్ముకొనునట్లు చేయగా; వారలు= వారు; రక్షక= రక్షించువారు; రహితులయ్యును= లేనివారు అయ్యును; తెంపు= ధైర్యముయొక్క; పెంపునన్= ఆధిక్యమువలన; శంకింపక= అనుమానింపక; ఆ సవ్యసాచిన్= ఆ అర్జునుడిని; పొదివి= క్రమ్ముకొని; తద్= ఆ; అస్త్ర= బాణములయొక్క; శిఖా= అగ్రభాగములయొక్క; సందోహంబునన్= సమూహములవలన; మ్రందిపోయిరి= మరణించారు; ఆ+కురురాజు= దుర్యోధనుడు; తనచుట్టును; బయలు= శూన్యము; అగుటన్; కలయంజూచి= అంతటా చూచి; కట్టెదురన్= ఎట్టఎదురుగ; చెలంగు= సంతోషించు; ఆ+కౌంతేయులన్= ఆ కుంతీపుత్రులైన పాండవులను; కనుంగొని= చూచి; తొలంగిపోవన్= తప్పుకొనిపోవుటకు; తలఁచెన్= ఆలోచించెను; అనుటయున్= అని చెప్పుటయు; ఆంబికేయుండు= అంబిక పుత్రుడైన ధృతరాష్ట్రుడు; సంజయుదిక్కు= సంజయునివైపు; మొగంబై= ముఖము కలవాడై.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కౌరవుల చెడ్డ ప్రవర్తనకు కారణమైన శకునిని చంపి అతిశయించి, అరిచిన తమ్ముడు సహదేవుడిని చూచి ధర్మరాజు మొదలైన ప్రముఖులు అత్యంత ఆనందంతో నిండిన హృదయం కలవారై తమయొక్క శంఖాలు పూరింపగా శ్రీకృష్ణుడు కూడా పాంచజన్యమనే శంఖంయొక్క ధ్వనితో ఆకాశం నింపగా, దుర్యోధనుడియొక్క సైన్యం కలత చెందక భయపడక నిలిచి ఉన్నది. ఆ శకుని సైన్యం సహదేవుడిపై అనేక అస్త్రశస్త్రములు కురిపిస్తూ కలియబడింది. అప్పుడు అర్జునుడూ భీముడూ ఆ అస్త్రశస్త్రాలన్నింటిని నిరుపయోగములయ్యేటట్లు చేసి, ఆ సేన బలం తగ్గించి, సంతోషంతో వెలిగారు. అది చూచి దుర్యోధనుడు దుఃఖంతో నిండిన బుద్ధికలవాడై - చావగా మిగిలిన తనసేనను క్రమ్ముకొనునట్లు చేయగా వారు రక్షించేవాళ్ళు లేకపోయినా అధికమైన ధైర్యంతో అనుమానించక ఆ అర్జునుడిని క్రమ్ముకొని అతడి బాణాలనే మంటలలో మసి అయిపోయారు. ఆ దుర్యోధనుడు తన చుట్టూ శూన్యం కావటం చూచి, ఎట్ట ఎదుట సంతోషంతో ఉన్న పాండవులను చూచి యుద్ధభూమినుండి తొలగిపోవటానికి తలచాడు. ఇట్లా చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయుడివైపు తిరిగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అట్లు మన సైన్యములు దెగటారినపుడు । కుంతి కొడుకులలో బలమెంత గలిగె?**
**నకట! నాకొడు కెట్టివాఁడయ్యెఁ జెపుమ! । యనుడు నతఁ డిట్టు లనియె నమ్మనుజపతికి.** **399**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారముగా; మనసైన్యములు= మన సేనలు; తెగటారినపుడు= చంపబడినప్పుడు; కుంతికొడుకులలోన్= కుంతియొక్క పుత్రులలో; బలము= సైన్యము; ఎంత; కలిగెన్?= ఉన్నది?; అకట!= అయ్యో!; నా కొడుకు= నా పుత్రుడు; ఎట్టివాఁడు= ఎటువంటివాడు; అయ్యెన్= అయ్యెను(ఏమయ్యెను); చెపుమ!= చెప్పుము!; అనుడున్= అనగా; ఆ+మనుజపతికిన్= ఆ రాజునకు అనగా ధృతరాష్ట్రునకు; అతఁడు= ఆ సంజయుడు; ఇట్టులు= ఈ ప్రకారముగా; అనియెన్= చెప్పెను.

**తాత్పర్యం:** 'ఆ ప్రకారంగా మనసైన్యాలు చంపబడినపుడు కుంతి కొడుకులకు సైన్య మెంత మిగిలింది? అయ్యో! నా కొడుకు ఏమయ్యాడు? చెప్పుము.' - అనగా ఆ ధృతరాష్ట్రుడికి సంజయుడు ఇట్లా చెప్పాడు.

**వ. అట్టి యెడ రెండు వేలు రథంబు లేడునూఱు గజంబు లైదువేలు గుఱ్ఱంబులు పదివేలు కాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండును సంగరాంగణంబున మెఱసి యుండె. 400**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయమున; రెండువేలు రథంబులు= రెండువేలు రథములు; ఏడునూఱు గజంబులు= ఏడువందలు ఏనుగులు; ఐదువేలు; గుఱ్ఱంబులు= గుర్రములు; పదివేలు; కాలుమానిసియున్= కాల్బలమును; తానును= తానును (దుర్యోధనుడును); ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడును; సంగర+అంగణంబునన్= యుద్ధభూమియందు; మెఱసి= ప్రకాశించి; ఉండెన్= ఉండెను.

**తాత్పర్యం:** ఆ సమయమున రెండువేలు రథములు, ఏడువందలు ఏనుగులు, అయిదు వందల గుర్రాలు, పదివేల కాల్బలంతో ధృష్టద్యుమ్నుడు యుద్ధభూమియందు ప్రకాశించి ఉన్నాడు. దుర్యోధనుడు ఏకాకిగా మిగిలాడు.

**విశేషం:** "రథానాం ద్వేసహస్రేతు సప్తనాగశతాని చ । పంచచాశ్వ సహస్రాణి పత్తీనాం చ శతం శతాః॥
ఏత చ్చేష మభూ ద్రాజన్ పాండవానాం మహద్బలమ్ । పరిగృహ్య హి యద్యుద్ధే ధృష్టద్యుమ్నో వ్యవస్థితః।
ఏకాకీ భరతశ్రేష్ఠ తతో దుర్యోధనో నృపః ॥ (సం. 9-28-21,22,23)

**క. పలపలని మూఁకలోఁ గాల్ । నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీ కొడుకు గదా**
**కలిత భుజుండై యొక్కఁడుఁ । దొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా! 401**

**ప్రతిపదార్థం:** కురునాథా! ధృతరాష్ట్రమహారాజా!; పలపలనిమూఁకలోన్= తఱిగిపోయిన సైన్యమునందు; కాల్‌నిలువక= ఉండలేక; గుఱ్ఱంబు= గుర్రము; డిగ్గి= దిగి; నీ కొడుకు= నీ కొడుకు (దుర్యోధనుడు); గదా= గదతో; కలిత= కూడిన; భుజుండై= బాహువులు కలవాడై; ఒక్కఁడున్= ఒక్కడును(ఏకాకిగా); తొలఁగి= తొలగి (యుద్ధభూమినుండి తప్పుకొని); చనియెన్= వెడలిపోయెను; ఏమి= ఏమి; చెప్పుదున్= చెప్పగలను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! తగ్గిపోయిన సైన్యంలో ఉండలేక గుర్రం దిగి నీ కొడుకు దుర్యోధనుడు గద భుజమున ధరించి ఒక్కడే యుద్ధభూమినుండి తొలగి వెడలిపోయాడు. ఇంక ఏమి చెప్పగలను?'

**వ. అని ధృతరాష్ట్రునకు సంజయుండు దుర్యోధను పలాయనం బెఱింగించె నని చెప్పిన విని యటమీఁది వృత్తాంతం బె ట్లయ్యె నని యడుగుటయును. 402**

**ప్రతిపదార్థం:** అని= అని; ధృతరాష్ట్రునకు; సంజయుండు= సంజయుడు; దుర్యోధను= దుర్యోధనుడియొక్క; పలాయనంబు= పారిపోవుట; ఎఱింగించెను= తెలియజేసెను; అని; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; అటమీఁది= తరువాత; వృత్తాంతంబు= చరిత్రము; ఎట్లు= ఏ విధముగా; అయ్యెను= అయినది (జరిగెను); అని; అడుగుటయును= అడుగగా (జనమేజయుడు వైశంపాయనుని అడుగుటయును).

**తాత్పర్యం:** అని ఈ విధంగా ధృతరాష్ట్రుడికి సంజయుడు దుర్యోధనుడు పారిపోవుటం తెలియజేశాడు - అని చెప్పగా విని, అటు తరువాత చరిత్రం ఏ విధంగా జరిగిందని (జనమేజయుడు వైశంపాయనుని) అడుగగా.

## ఆశ్వాసాంతము

ఉ. సంగవిదూరతాకలిత! శాంతరసస్ఫుటరోహ దిద్ధబో
ధాంగ! సమాశ్రితాపదుదయ జ్వలన ప్రశమప్రవర్తకా
పాంగమరీచిరూప వితతామృత వీచి విహార! వాసవో
త్సంగతలోపలాల్య పద! సంసృతివారణ! దైత్యదారణా. **403**

**ప్రతిపదార్థం:** సంగవిదూరతాకలిత!= దేనితోను సంబంధంలేని వాడా!; (పరమేశ్వరుడు ఆకాశంవలె అవయవరహితుడగుటచేత దేనితోడను సక్తిలేనివాడు, కావుననే శ్రుతి పరమేశ్వరుడిని గూర్చి చెప్పుతూ "అసంగో హ్యయం పురుషః'' (బృ. 4-3-15. చూ.40 ప) అని వర్ణించింది); శాంతరస= ప్రశాంతి రూపమైన శాంతరసమునందు; స్ఫుట= స్పష్టంగా; రోహత్= మొలుస్తున్న; ఇద్ధ= స్పష్టంగా ప్రకాశించే; బోధ= జ్ఞానమే; అంగ!= శరీరంగా కలవాడా!; సమాశ్రిత= ఆశ్రితులైన భక్తులయొక్క; ఆపద్+ఉదయ= విపత్తులు కలగటం అనెడి; జ్వలన= అగ్నిని; ప్రశమ= ఆర్పుటకు; ప్రవర్తక= ప్రవర్తింపజేయు; అపాంగ= క్రేగంటి ప్రసారంయొక్క; మరీచిరూప= కిరణరూపమగు; వితత= విస్తారమగు; అమృతవీచి= సుధాతరంగములందు; విహార!= విహరించేవాడా!; వాసవ= దేవేంద్రుడియొక్క; ఉత్సంగతల= ఊరు ప్రదేశంలో; ఉపలాల్య= లాలింపదగిన; పద!= చరణములు కలవాడా!; సంసృతివారణ!= సంసారమును అనగా తత్కృత బాధలను నివారించేవాడా!; దైత్యదారణా!= రక్కసులను చీల్చేవాడా!; (అనగా ధర్మవ్యవస్థా భంజకులను నశింపజేసేవాడనుట.)

**తాత్పర్యం:** నీవు నిరవయవుడవు అగుటచేత నీకు దేనితోనూ సంబంధంలేదు. శాంతరసంవలన కలిగే జ్ఞానమే నీ వాస్తవ రూపం. నీవు ఆశ్రితులయందు అమృతమయ కటాక్షాలను బరపి, వారి ఆపదలను పోగొట్టుట యం దాసక్తుడవు. కావుననే సురేంద్రుడు సైతము తన తొడలపై నీ పాదముల నుంచుకొని సంవాహనం చేస్తుంటాడు. నీవు దైత్యులను చీల్చి చెండాడుతావు. భక్తుల సంసారబాధలను నివారిస్తుంటావు.

క. ఆశ్చర్య కరణ కరుణా! । నిశ్చల శుచిహృదయ భావనీయ విహరణా!
పశ్చిమనాడీ సరణ! పు । రశ్చరణధ్యేయ! భక్తరమణ విధేయా! **404**

**ప్రతిపదార్థం:** ఆశ్చర్యకరణ కరుణా!= అచ్చెరువును కలుగజేసే దయకలవాడా!; (సామాన్య దేవతల కరుణారసం పరిమితమై ఉండగా హరిహరనాథుని దయ నిరవధికమగుటచేత ఆశ్చర్యజనకమని భావం. ఇట్టి యపార కరుణారసామృతమునే తిక్కయజ్వ తనకు స్వప్న ప్రత్యక్షం గావించిన హరిహరస్వామిని వర్ణిస్తూ "కరుణా రసము పొంగి తొరఁగెడు చాడ్పున శశిరేఖ మమృతంబు జాలువార''. (విరా. 1-12) అని వర్ణించాడు.) నిశ్చలశుచి హృదయ భావనీయ విహరణా! - నిశ్చల= చలింపనట్టియు; (నివాతదేశగత దీపకళికవోలె ఇతర చిత్తవృత్తులచేత ఆక్రమింపబడక ఏక రూపంతో ఉండి); శుచిహృదయ= నిర్మల చిత్తంచేత; భావనీయ= ఊహింపదగిన; విహరణా!= విహారం కలవాడా!; (పరమేశ్వరుడి లీలావిహారాలన్నీ నిర్మలము నిశ్చలము అగు హృదయం కలవారలకే అవగతములు అగునని భావం); పశ్చిమనాడీ సరణ!= సుషుమ్నా నాడిద్వారా ప్రసరించేవాడా!; (గుదస్థానగతమైన మూలాధార చక్రమునందలి చైతన్యాత్మకమై పరమేశ్వరరూపమగు కుండలినీశక్తి సుషుమ్నాద్వారమున మూలాధారాది షట్చక్రములను భేదించి బ్రహ్మరంధ్రమునందుట యోగశాస్త్ర ప్రసిద్ధం. కావున పరమేశ్వరుడు పశ్చిమ నాడీ సరణుఁ డనబడుతున్నాడు); పురశ్చరణధ్యేయ!= పురశ్చరణంచేత ధ్యానింపదగినవాడా!; (పురశ్చరణమునందు సంపూర్ణానుగ్రహం కొరకు పరమేశ్వరుడు ధ్యానింపదగినవాడని భావం); భక్తరమణవిధేయా!= భక్తులను ఆనందపరుస్తూ విధేయుడైనవాడా!

**తాత్పర్యం:** నీవు ఆపదలనందిన వారియెడ కనపరిచే దయను గమనిస్తే ఆశ్చర్యమౌతుంది. నీ విహారాలన్నీ అచంచలమైన హృదయంతో భావించదగినవే. యోగుల శరీరములయందు నీవు సుషుమ్నానాడీ మార్గాన

సంచరిస్తుంటావు. నీ అనుగ్రహమును సంపాదించటానికై ఉపాసకులు తమ మంత్ర పురశ్చరణంలో నిన్ను ధ్యానిస్తారు. అట్టి వారిని నీ వెల్లప్పుడు సంతోషపరుస్తూ వారికి విధేయుడవై ఉంటావు.

**విశేషం:** పైన నిరూపించబడిన ఉపాసనా ప్రక్రియలో నిమగ్నులైన భక్తులు పరమేశ్వర ధ్యానామృతహ్రదంలో నిమగ్నులౌతూ మహానందం పొందుతుండటంచేత పరమేశ్వరుడు భక్తుల నానందింపజేస్తాడు. అట్లే భక్తుల అభీష్టములను నెరవేర్చటంచేత భక్తులకు విధేయుడు ఔతున్నాడని భావం.

**మాలిని: ప్రణవమయ గరిష్ఠోపాయ సంవేద్యభూమా!**
**భణన మనన దూరస్ఫార విస్తార సీమా!**
**గుణవిభవ నిరాసా కుంఠితోల్లాస ధామా!**
**గణన రహితలీలా! కల్ప నిత్యాభిరామా!** **405**

**ప్రతిపదార్థం:** ప్రణవమయ= ప్రణవరూపమగు (ఓంకార రూపమగు); గరిష్ఠ+ఉపాయ= ఉత్తమోపాయంచేత; సంవేద్య= తెలియదగిన; భూమా!= భూమత్వం కలవాఁడా!; (మంత్రం దేవతా వాచకం. అది దేవతా స్వరూపమును తెలిసికొనుటకు సాధనము. అట్టి సాధనములలో "ప్రణవము" అని. ఇట్టి ప్రణవోపాసనమువలన దెలియదగిన తత్త్వం భూమభావం. కావున ఇట్టి భూమరూపుడగు పరమేశ్వరుడిని ప్రణవోపాసకులు మాత్రం తెలియగలరని భావం); భణన= పలుకుటకు; మనన= తలంచుటకు; దూర= అందని; స్ఫార= తేజంయొక్క; విస్తార= అతిశయమునకు; సీమా!= అవధి అగువాడా; (పరమేశ్వరుడి తేజోవిస్తారము వాఙ్మానసములకందని భావం. లేదా "స్ఫార విస్తార సీమ" అనగా అభివృద్ధి విస్తారమునకు స్థానమైనవాడు. బ్రహ్మ బృహద్రూపు డగుటచేత ఆతడు సర్వబృహత్త్వమునకు స్థానమని భావం); గుణ= సత్త్వ రజస్తమో గుణాలయొక్క; విభవ= అతిశయమును; నిరాస= నిరసించునట్టి; అకుంఠిత= వ్యర్థంకాని(మొక్కవోని); ఉల్లాస= ఆనందమునకు; ధామా!= స్థానమైనవాడా!; (అనగా త్రిగుణాత్మకమైన ప్రకృతియొక్క వికారమునకు అతీతమైన ఉత్తమానంద స్వరూపుడగుట); గణన రహితలీలా!= లెక్కలేనన్ని విలాసములు గలవాడా!; (పరమేశ్వరుడి విశ్వసృష్టి స్థితి సంహార రూపములగు విలాసములు గణనాతీతములని భావం); కల్పనిత్యాభిరామా!= కల్పసమయమున గూడ నశించని మనోహరత్వం కలవాడా! (కల్పమనగా రెండు వేల దైవయుగాల సమయమని అర్థం. అది ఒక బ్రహ్మదినం. ప్రళయ సమయం. ఇట్టి సమయంలో విశ్వమంతయు నశించినను పరమేశ్వరుడు నిత్యానందస్వరూపు డని భావం.)

**తాత్పర్యం:** నీ సర్వాతిశయ రూపం (భూమరూపము) శబ్దమునకు మూలకారణమైన ప్రణవముచేతనే తెలియవలెను. నీ తేజోవిశేషముయొక్క పరిమితి చెప్పుటకుగాని తలచుటకుగాని శక్యం కానిది. నీవు త్రిగుణాతీతుడవగుటచేత నీ ఆనందం స్థిరమైనది. నీ విలాసములు లెక్కకు మించినవి. యుగాంతమున సర్వప్రపంచం నశించినను నీ సౌందర్యం మాత్రం నశింపక స్థిరంగా ఉంటుంది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మహాభారతంబున శల్యపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైనదీ, సంస్కృతాంధ్రోభయ కవులకు మిత్రుడైనవాడూ, కొమ్మనామాత్యపుత్రుడూ, పండితులచేత ఆరాధించబడేవాడూ (పండితులను ఎల్లప్పుడూ సేవించేవాడూ) అయిన తిక్కన సోమయాజిచేత రచించబడినదీ అయిన శుభప్రదమైన ఆంధ్రమహాభారతంలోని శల్యపర్వంలో మొదటి ఆశ్వాసం.

శల్యపర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీ కరణ నిపుణ పదప । ద్మా! కేవల సత్త్వసద్మ! మాయావ్యవధూ**
**త్యేకాయనగమ్యా! మధు । రాకృతి సర్వత్రరమ్య! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీకరణనిపుణ= సిరిని కల్గించటంలో నైపుణ్యంకల; పదపద్మా!= పాదపద్మాలు కలవాడా!; కేవల= కేవలం; సత్త్వసద్మ= సత్త్వ గుణానికి నిలయమైనవాడా!; మాయావ్యవధూతి+ఏకాయన గమ్యా!= మాయాగుణాన్ని నిరాకరించే ఒకే ఒక మార్గంచేత పొంద తగినవాడా!; మధుర+ఆకృతి= ఆనందస్వరూపంచేత; సర్వత్ర రమ్య!= అన్నిట అందమయిన వాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీ పాద పద్మాలు భక్తులకు అనంతమయిన సంపదల నిస్తాయి. నీవు సత్త్వ నిలయుడవు. మాయచేత నిండిన ప్రపంచాన్ని నిరాకరించటంచేతనే నీవు తెలియదగినవాడవు; ఆనందరూపమైన ఆకారంచేత అంతటా అందమైనవాడవు.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు నిజపుత్రుండు పరాజయంబు నొందుట యాక ర్ణించి యాంబికేయుండు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; నిజపుత్రుండు= తన కుమారుడు(దుర్యోధనుడు); పరాజయంబున్+ఒందుటన్= ఓడిపోవటాన్ని; ఆకర్ణించి= విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వైశంపాయనుండు జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు: తన కుమారుడి ఓటమిని విని ధృతరాష్ట్రుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'మద మడఁగి యొక్కరుండును । గద చేకొని రాజరాజు కాల్నడ నెట వో**
**మదిఁ దలఁచి తొలఁగెనొకొ! యా । పద లిట్టివి కలవె మనుజపతులకు నెందున్? 3**

**ప్రతిపదార్థం:** మదము+అడఁగి= గర్వం అణగిపోయి; ఒక్కరుండును= ఒక్కడే; గద చేకొని= గదను చేతబట్టి; రాజరాజు= దుర్యోధనుడు; కాల్నడన్= కాలినడకతో; ఎట+పోన్= ఏ దిక్కునకు పోవగా; మదిన్= మనసులో; తలఁచి= తలచుకొని; తొలఁగెనొకొ!= యుద్ధభూమినుండి తొలగివెళ్ళాడో?; ఎందున్= ఎక్కడగాని; మనుజపతులకున్= రాజులకు; ఇట్టి ఆపదలు= ఇటువంటి కష్టాలు; కలవె?= ఉన్నవా?

**తాత్పర్యం:** 'గర్వ మడగిన వాడై ఒకడే గదను చేతబట్టి దుర్యోధనుడు కాలి నడకను ఎటు వెళ్ళాడో? ఎక్కడైనా రాజులకు ఇట్టి బాధలు కలగటం ఉన్నదా? (లేదని భావం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విశేషాంశాన్ని సామాన్యాంశం సమర్థిస్తున్నది.

**వ. అనంతర వర్తనంబు తెఱం గెఱింగింపు 'మనుటయు నజ్జననాథునకు సంజయుం డిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** అనంతర వర్తనంబు= తరువాత జరిగిన నడవడి; తెఱంగు= పద్ధతి; ఎఱింగింపుము+అనుటయున్= తెలుపుము అనగా; ఆ+జననాథునకున్= ఆ రాజుకు(ధృతరాష్ట్రుడికి); సంజయుండు+ఇట్లు+అనియెన్= సంజయు డీవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** (సుశర్మను ఓడించిన తరువాతి) యుద్ధ వృత్తాంతాన్ని వివరించు'మని అడుగగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా పలికాడు:

**సీ. 'ఏకాదశాక్షౌహిణీశుఁ డై పెంపునఁ । బొంపిరివోవు నప్పుడమిఱేఁడు**
**వెనుక నొక్కరుఁడును జన లేక యేకాకి । యై పోయె నచటికి ననతిదూర**
**మై యుత్తరము ముట్టినట్టితూర్పున నొక్క । మడు వున్న దానిలో నడఁగియుండు**
**వాఁడుగా నట్టు లవ్వలనికిఁ జని చని, । విదురువాక్యంబులు మదిఁ దలంచి**

**ఆ. 'యధికమతి నృపాలుననుజుండు సెప్పె న । ట్లకట! దానిఁ గొనన' యనుచు శోక**
**తప్తచిత్తుఁ డయ్యెఁ; దైవ మెవ్వరి నెట్లు । చేయఁ జాల? దేమి సెప్పఁ గలదు? 5**

**ప్రతిపదార్థం:** ఏకాదశ+అక్షౌహిణీశుఁడు+ఐ= పదునొకండక్షౌహిణుల సేనకు నాయకుడై; పెంపునన్= గొప్పతనంతో; పొంపిరి+పోవు+ఆ+పుడమిఱేడు= అతిశయించే ఆ రాజు; (దుర్యోధనుడు); వెనుకన్= తన వెన్నంటి; ఒక్కరుఁడునున్+చనన్ లేక= వెళ్ళటానికి ఒక్కడు కూడా లేక; ఏకాకి ఐ= ఒంటరివాడయి, పోయెన్= వెళ్ళాడు; అచటికిన్= ఆ చోటునకు; అనతిదూరము+ఐ= కొద్దిదూరంగా; ఉత్తరము ముట్టినట్టి తూర్పునన్= ఈశాన్యభాగాన; ఒక్కమడువు+ఉన్నన్= ఒకనీటిమడుగు ఉండగా; దానిలోన్ అడఁగి+ఉండువాఁడుకాన్= ఆ మడువులో దాగికొనిఉండేవాడై; అట్టులు+ఆ+వలనికిన్= ఆ విధంగా ఆ దిక్కునకు; చనిచని= పోయి పోయి; విదురు+వాక్యంబులు= విదురుడి పలుకులు; మదిన్+తలంచి= మనసులో తలచుకొని; అధికమతి= మిక్కిలి తెలివైనవాడగు; నృపాలు+అనుజుండు+చెప్పెన్= రాజుగారి తమ్ముడు(ధృతరాష్ట్రుడి తమ్ముడైన విదురుడు) చెప్పాడు; అకట!= అయ్యో!; దానిన్= దానిని; కొనన్+అ= గ్రహించలేదు, స్వీకరించనేలేదు; అనుచున్= అంటూ; శోకతప్తచిత్తుఁడు+ అయ్యెన్= దుఃఖంతో బాధింపబడ్డ మనసుకలవాడైనాడు; దైవము= విధి; ఎవ్వరిన్+ఎట్లు= ఎవ్వరిని ఎట్లు; చేయన్+చాలదు!= చేయలేదు?; ఏమి చెప్పన్+కలదు?= ఏం చెప్పను?

**తాత్పర్యం:** 'పదకొండక్షౌహిణుల సైన్యానికి అధిపతిగా గొప్పదనంతో విలసిల్లే ఆ రాజు తన వెంట ఒకడు కూడా వచ్చేవాడు లేక ఏకాకిగా ఆ యుద్ధభూమినుండి వెళ్ళాడు. ఆ చోటికి దగ్గరగా ఈశాన్య భాగాన ఒక్క(నీటి) మడువు ఉన్నది. ఆ వైపునకు వెళ్ళి ఆ మడుగులో దాగికొని, విదురుడి మాటలు మనసులో తలచుకొంటూ 'అయ్యో! నేను ఆమాటలను మన్నించలేకపోయాను' అంటూ దుఃఖాతిశయంతో విచారించాడు. విధి ఎవరిని ఏమి చేస్తుందో ఏమి చెప్పగలం?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విశేషాంశం సామాన్యాంశంచేత సమర్థింపబడుతున్నది.

**వ. అట్టియెడ సుడిసి చిక్కిన మూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషంబుగా సమయించి కృష్ణసారథికంబును ధవళహయంబును గపీంద్రకేతనంబును నగు నుజ్జ్వలస్యందనంబున నప్పురందరనందనుండు**

**బంధుమిత్రాభినందితుండై యొప్పె; నప్పుడు పాలికలన నీ బలం బఖిలంబును బెనుగాలిం బడిన పేరడవిపగిదిం గానంబడుచుండె; నందుఁ గృపాశ్వత్థామకృతవర్మలు ముువ్వురు బ్రదికి పోయి; రాసమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుంగొని నగుచు సాత్యకి నుద్దేశించి. 6**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; సుడిసి చిక్కిన మూఁకలు= అలసి క్షీణించిన సేనలు; వీఁకమైన్= ఉత్సాహంతో; ఎదిర్చినన్= ఎదుర్కొనగా; పొదివి= క్రమ్ముకొని; నిరవశేషంబుగాన్= నిశ్శేషంగా; సమయించి= చంపి; కృష్ణసారథికంబును= కృష్ణుడు సారథిగా కలదియు; ధవళహయంబును= తెల్లని గుర్రాలు కలదియు; కపి+ఇంద్ర కేతనంబును= హనుమద్ధ్వజం కలదియు; అగు= అయిన; ఉజ్జ్వల స్యందనంబునన్= ప్రకాశిస్తున్న తేరిమీద; ఆ+పురందరనందనుండు= ఆ ఇంద్రపుత్రుడయిన అర్జునుడు; బంధుమిత్ర+అభినందితుండు+ఐ= బంధువులు, స్నేహితుల చేత పొగడబడినవాడై; ఒప్పెన్= ఒప్పిఉన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; పాలికలనన్= యుద్ధరంగంలో; నీ బలంబు+అఖిలంబును= నీ సేన అంతా; పెనుగాలిన్+పడిన= పెద్దగాలి తాకిడికి పడిపోయిన; పేరడవి పగిదిన్= పెద్ద అడవి మాదిరిగా; కానంబడుచుండెన్= కనపడుతూ ఉన్నది; అందున్= ఆ సేనలో; కృపాశ్వత్థామ కృతవర్మలు; ముువ్వురు బ్రదికిపోయిరి= ముగ్గురు మాత్రం బ్రదికి బయటపడ్డారు; ఆ సమయంబునన్= అట్టివేళలో; ధృష్టద్యుమ్నుండు; నన్నున్+కనుంగొని= ధృష్టద్యుమ్నుడు నన్ను గుర్తించి; నగుచున్= నవ్వుతూ; సాత్యకిన్+ఉద్దేశించి= సాత్యకితో.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఓడి క్షీణించిన సేనలు పౌరుషంతో ఎదిరించగా, వారిని చుట్టుముట్టి ఒక్కరుకూడా మిగలకుండా చంపి, కృష్ణుడు రథం నడుపుతూ ఉండగా, తెల్లనిగుర్రాలూ, కపిధ్వజమూ శోభించే ప్రకాశవంతమైన రథంలో బంధుమిత్రాదులు అభినందిస్తూ ఉండగా అర్జునుడు రాణించాడు. అప్పుడు యుద్ధభూమిలో నీ సైన్యం పెద్దగాలికి నేలకొరిగిన పెద్ద అడవివలె కనబడింది. అందులో కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ - ఈ ముగ్గురుమాత్రమే బ్రతికిపోయారు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు నన్ను చూచి నవ్వుతూ సాత్యకితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. 'వీని నేటికిఁ బట్టితి? వీఁడు బ్రదికి । యిచట వర్తించి మనకు నెగ్గేమి సేయు?**
**నప్రయోజన మిది; విడు' మనిన 'నేల । వీడుతు నీ ద్రోహితల దెగ నడుతు' ననుచు. 7**

**ప్రతిపదార్థం:** వీనిన్+ఏటికిన్ పట్టితి(వి)?= (ఈ సంజయుడిని) ఇతడిని ఎందుకు పట్టుకొన్నావు?; వీఁడు బ్రతికి= వీడు ప్రాణాలతో ఉండి; ఇచటన్+వర్తించి= ఇక్కడ తిరుగుతూ; మనకున్; ఎగ్గు+ఏమి+చేయున్?= కీ డేమి చేయగలడు?; అప్రయోజనము+ఇది= ఈ పట్టుకొనటం నిరుపయోగం; విడుము+అనినన్= వదలుము అనగా; ఏల విడుతున్?= ఎందుకు వదలుతాను?; ఈ ద్రోహి తలన్= ఈ దుర్మార్గుడి తలను; తెగన్+అడుతున్= నరుకుతాను; అనుచున్= అంటూ.

**తాత్పర్యం:** 'వీడి నెందుకు పట్టుకొన్నావు? ఇతడివలన మన కేమీ కీడు కలుగుతుంది? ఇది నిష్ప్రయోజనమయిన పని' అనగా అతడు నవ్వుతూ 'వీడిని వదలటం ఎందుకు? తల తెగనరుకుతాను. 'వీడు ద్రోహి' అని అంటూ.

**వ. ఆ శైనేయుండు వాలు వెఱికి వ్రేయం జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధిచేసి, యతని వారించి, 'సంజయుం జంపుట యనుచితంబు; ముందల విడువు'మని యానతిచ్చిన నతండును వినతుండై' యట్ల కాక యని పలికి నన్ను విడిచెఁ; గృష్ణద్వైపాయనుండు మదీయాననం బాలోకించి 'బ్రదికిపోయి తెక్కడకైనం**

**బొ మ్మనుటయు' నమ్మునీంద్రు వీడ్కొంటి; నంత నతఁ డంతర్ధానంబు సేసె; నేను దత్ప్రదేశంబు వాసి నీసుతుండు సనిన చక్కటికిఁ గ్రోశమాత్రంబు వోయి ద్వైపాయనం బనం బ్రసిద్ధం బైన యమ్మడువు సమీపంబున. 8**

**ప్రతిపదార్థం:** ఆ శైనేయుండు= ఆ సాత్యకి; వాలు+పెఱికి= కత్తి దూసి; వ్రేయన్+చూచునంతన్= దెబ్బకొట్టటానికి ప్రయత్నించేటంతలో; కృష్ణద్వైపాయనుండు సన్నిధి చేసి= వ్యాసుడు ప్రత్యక్షమై; అతనిన్+వారించి= సాత్యకిని అడ్డుకొని; సంజయున్+చంపుట అనుచితంబు= సంజయుడిని చంపటం న్యాయం కాదు; ముందల= ముందుతల (తలయొక్క ముందుభాగం); విడువుము+అని= వదలుమని; ఆనతి+ఇచ్చినన్= ఉత్తరువు చేయగా; వినతుండు+ఐ= అణకువతో; అట్ల కాక!= అట్లాగుననే!; అని పల్కి= చెప్పి; నన్నున్ విడిచెన్= నన్ను వదలాడు; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; మదీయ+ఆననంబు+ ఆలోకించి= నా మొగమును చూచి; బ్రదికిపోయితి(వి)= బ్రతికిబయటపడ్డావు; ఎక్కడకైనన్+పొమ్ము+అనుటయున్= ఎక్కడికైనా వెళ్లమని చెప్పగా; ఆ+మునీంద్రున్= వ్యాసమునీశ్వరుడిని; వీడ్కొంటిన్= వదలివెళ్ళాను; అంతన్= ఆ తరువాత; అతఁడు= వ్యాసుడు; అంతర్ధానంబు+చేసెన్= అంతర్ధానమైనాడు; ఏను తత్ప్రదేశంబు పాసి= నేనా చోటు వదలి; నీ సుతుండు చనిన చక్కటికిన్= నీ కుమారుడు వెళ్ళిన దిక్కునకు; క్రోశమాత్రంబు+పోయి= క్రోసు దూరం వెళ్ళి; ద్వైపాయనంబు+అనన్+ప్రసిద్ధంబు+ఐన= ద్వైపాయనమని ప్రఖ్యాతినొందిన; ఆ+మడువు సమీపంబునన్= ఆ కొలను దగ్గర.

**తాత్పర్యం:** ఆ సాత్యకి కత్తి తీసి నన్ను చంపటానికి పూనుకొన్నంతలో వ్యాసుడు ప్రత్యక్షమై వారించి సంజయుడిని చంపటం ఉచితం కాదన్నాడు. ఆతడి యాజ్ఞను ఆమోదించి సాత్యకి నన్ను వదలివేశాడు. అపుడు వ్యాసుడు నా మొగం చూచి 'బ్రతికిపోయావు. ఎక్కడికైనా వెళ్ళిపొ'మ్మన్నాడు. అపుడు మునిని వీడ్కొన్నాను. వ్యాసుడు అంతర్ధానమయ్యాడు. నేను దుర్యోధనుడు పోయిన దిక్కున నడిచి అక్కడకు క్రోసు దూరంలో ఉన్న ద్వైపాయనమనే కొలను వద్దకు చేరాను.

**తే. అతనిఁ గాంచితి; నతఁ డశ్రు లడర నడలు । చూడ్కి నామోము చక్కఁగాఁ జూడ కోర**
**వోవఁ జూచుచు దీనతఁ బొందియునికి । గని మనంబున శోకంబు గదుర నేను. 9**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అతనిన్+కాంచితిని= ఆ దుర్యోధనుడిని చూచాను; అతఁడు+అశ్రులు+అడరన్= అతడు కన్నీళ్ళు కారగా; అడలుచూడ్కిన్= భయముతోడి చూపుతో; నామోము= నా మొగమును; చక్కఁగాన్= నేరుగా; చూడక= చూడకుండా; ఓర+పోవన్+చూచుచున్= ఓరగా చూస్తూ; దీనతన్+పొంది= దైన్యంపొంది; ఉనికి= ఉండటం; నేను; కని= చూచి; మనంబునన్= నా మనసులో; శోకంబు+కదురన్= దుఃఖం కలుగగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడిని చూచాను. అతడు కన్నీరొలుకగా నా మొగం చూడలేక ప్రక్కచూపులుచూస్తూ దీనత్వంతో ఉండటాన్ని గమనించి అతడి స్థితికి మనసులో దుఃఖం కలుగగా, నేను (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి, యెట్టకేల కెలుంగు దెచ్చుకొని పారాశర్యప్రసాదంబున బ్రదికినతెఱంగు సెప్పిన, నమ్మహీకాంతుండును గొంత ప్రొద్దు నిశ్చేష్టితుండై యుండి, పదంపడి నాదెసఁ జూచి 'మనదెస బ్రదికిన వారు గలరే?' యనినఁ గృపాచార్యాదిరథికత్రయంబును బేరుకొని 'వారలు బ్రతికిపోయిరి; తక్కొరుండును బ్రదుకుట లేదని యెఱింగించిన, నిట్టూర్పు నిగిడించుచు నామూఁపుపైఁ జే యిడి యన్నర నాథుండు నన్ను నీకడ కనుపం దలంచి నాతో ని ట్లనియె. 10**

**ప్రతిపదార్థం:** ఒక్కింతసేపు= క్షణమాత్రకాలం; పలుకు వెలువరింపన్+చాలక= మాటపెగులక; ఊరకుండి= ఊరకొని; ఎట్టకేలకున్= చివరకు; ఎలుంగు+తెచ్చుకొని= గొంతుపెగల్చుకొని; పారాశర్య ప్రసాదంబునన్= వ్యాసుని దయతో; బ్రదికిన తెఱంగున్= బ్రదికిన విధమును; చెప్పినన్= చెప్పగా; ఆ+మహీకాంతుండును= రాజగు ఆ దుర్యోధనుడును; కొంతప్రొద్దు= కొద్దిసేపు; నిశ్చేష్టితుండు+ఐ ఉండి= కదలిక లేనివాడై; నాదెసన్+చూచి= నాదిక్కునకు చూచి(సంజయుడి వైపు చూచి); మన దెసన్= మనవైపున; బ్రదికినవారు= బ్రతికిఉన్నవారు; కలరే?= ఉన్నారా?; అనినన్= అనగా; కృపాచార్య+ఆది రథికత్రయంబును= కృపాచార్యుడు మొదలయిన రథికులను ముగ్గురిని; పేరుకొని= చెప్పి; వారలు బ్రతికిపోయిరి= వారు బ్రతికిఉన్నారు; తక్కు+ ఒరుండును= వేరెవ్వరుడును; బ్రదుకుట లేదు+అని= జీవించలేదని; ఎఱింగించినన్= తెలుపగా; నిట్టూర్పు నిగుడించుచున్= నిట్టూర్పు వదలుచూ; నామూఁపుపైన్+చేయి+ఇడి= నా మూపున చేయి పెట్టి; ఆ+నరనాథుండు= ఆ రాజు (దుర్యోధనుడు); నన్నున్= (సంజయుడిని) నన్ను; నీకడకున్+అనుపన్+తలంచి= పంపాలని యోచించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కొంచెం సేపు మాట్లాడలేకుండా ఊరకుండి, తుదకు గొంతు పెగుల్చుకొని, వ్యాసుడి దయతో నేను బ్రతికిన విధాన్ని చెప్పగా, దుర్యోధనుడు కొంత సేపు కదలిక లేక ఉండిపోయాడు. పిమ్మట నా వైపు చూచి 'మన వారిలో బ్రతికి ఉన్నావా రున్నారా?' అని అడుగగా 'కృపాచార్యాది రథికులు ముగ్గురూ బ్రతికిపోయారు. ఇంకెవడూ లేడు' అని తెలుపగా, నిట్టూర్పుతో నా వీపుమీద చేయిపెట్టి ఆ రాజైన దుర్యోధనుడు నన్ను నీ వద్దకు పంపనెంచి నాతో ఇట్లా అన్నాడు:

**తే.** **'మాఱుమానిసి లేకుండ మడిసి రెల్ల। వారు నీ దెసఁ; బాండుభూవరతనూజు**
**లాప్తులుం దాము నున్న వా; । రాహవమునఁ । బడక తొలఁగితిఁ బోటులఁ బడియు నేను'.** **11**

**ప్రతిపదార్థం:** మాఱుమానిసి లేకుండన్= మరొక్కమనిషి కూడా లేకుండ; ఈ దెసన్= ఈవైపున; ఎల్లవారున్ మడిసిరి= అందరూ చనిపోయారు; పాండు భూవర తనూజులు= పాండవులును; తాము= తామును; ఆప్తులు= ఆత్మీయులును; ఆహవమునన్+పడక= యుద్ధంలో పడిపోకుండా; ఉన్నవారు= బ్రతికి ఉన్నారు; ఏను= నేను; పోటులన్+పడియున్= దెబ్బలు తినినా (చావకుండా); తొలఁగితిన్= తప్పించుకొన్నాను.

**తాత్పర్యం:** 'మరొక్క మనిషి లేకుండా ఈ వైపు వారంతా చనిపోయారు. పాండవులును వారి కావ్తులయినవారును జీవించి ఉన్నారు. దెబ్బలు తినినా నేను చావకుండా యుద్ధంలో తప్పించుకొన్నాను.'

**వ.** **అని.** **12**

**తాత్పర్యం:** అని చెప్పి.

**క.** **'కౌంతేయులబారిం బడ; । నింతియ సిరి చాలు; రాజ్య మెల్లను దారై**
**పొంత ననుఁ బెట్టుకొని యొక । కొంత యొసఁగిరేని నట్టికూ డేమిటికిన్?** **13**

**ప్రతిపదార్థం:** కౌంతేయుల బారిన్+పడను= పాండవులచే చిక్కక తప్పించుకొన్నాను; ఇంతియ= ఇంతమాత్రపు!; సిరి చాలు= సంపద చాలును; రాజ్యము+ఎల్లను= రాజ్యమంతటిని; తారై= తాముగా; పొంతన్+నను= నన్ను దగ్గర; పెట్టుకొని= ఉంచుకొని; ఒక కొంత= ఒకింత; ఒసఁగిరేనిన్= ఇస్తే; అట్టికూడు= అటువంటి తిండి; ఏమిటికిన్?= (నాకు) ఎందుకు?

**తాత్పర్యం:** 'పాండవుల బారిన పడకుండా నేను తప్పించుకొన్నాను. ఈ మాత్రపు సిరి నాకు చాలును. రాజ్యాన్ని పూర్తిగా తామే కైకొని, నన్ను దగ్గర పెట్టుకొని, ఒకింత నాకు ఇచ్చినా, అటువంటి నికృష్టపుకూడు నాకెందుకు?

**క. అనుజులఁ దనుజుల మత్పరి । జనులను సమయించి వారు సమరోల్లాసం**
**బున మెఱయఁ జూడ నేర్తునె? । జననాథున కింతవట్టు సంజయ! చెపుమా! 14**

**ప్రతిపదార్థం:** సంజయ!= ఓ సంజయుడా!; అనుజులన్= తోబుట్టులను; తనుజులన్= కుమారులను; మత్+పరిజనులను= నా సేవకులను; సమయించి= చంపి; వారు= పాండవులు; సమర+ఉల్లాసంబునన్= యుద్ధోత్సాహంతోడి ఆనందంతో; మెఱయన్= ప్రకాశింపగా, చూడన్+నేర్తునె?= చూడగలనా?; జననాథునకున్= రాజునకు (ధృతరాష్ట్రుడికి); ఇంతపట్టు= ఇంతమాత్రం; చెపుమా!= చెప్పుము!

**తాత్పర్యం:** సంజయా! తోబుట్టువులను, కుమారులను, సేవకులను అందరినీ యుద్ధంలో చంపి, పాండవులు విజయోత్సాహంతో వెలుగుతూ ఉండగా చూచి సహించగలనా? ధృతరాష్ట్రుడికీ సంగతిని చెప్పుము.

### దుర్యోధనుఁడు ద్వైపాయనంబను మడుఁగున డాఁగియుండుట (సం. 9-28-51)

**క. ఇమ్మడువులోన డాఁగెద; । నిమ్ముల నెచ్చటికినైన నేఁగెదఁ; దగు వృ**
**త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి । యెమ్మెయినేనియును దీర్తు నేఁ బగయ సుమీ!' 15**

**ప్రతిపదార్థం:** ఈ+మడువులోనన్= ఈ మడుగులోపల; డాఁగెదన్= దాగి ఉంటాను; ఇమ్ములన్= అనుకూలమైనపుడు; ఎచ్చటికినైనన్= ఎక్కడికైనా; ఏఁగెదన్= వెళ్ళుతాను; తగువృత్తమ్మునన్= తగినప్రవర్తనతో; తొలఁగి= తప్పుకొని; నిలిచి= నిలిచి ఉండి; మఱి= ఆ మీదట; ఏ+మెయిన్+ఏనియునున్= ఏరీతిగానైనా; ఏన్= నేను; పగయ= పగనే; తీర్తున్= తీర్చుకొంటాను; సుమీ!= సుమా!

**తాత్పర్యం:** ఈ మడుగులో దాగి, అనుకూలమైన సమయంలో ఎక్కడకయినా పోయి, వేచి అదను చూచి, ఏ విధంగానైనా నా పగ తీర్చుకొంటాను సుమా!'

**వ. అని చెప్పి యమ్మడువు సొచ్చి మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁకకుండ సంస్తంభనంబు సేసికొని యుండె; నంత రథ్యంబులు పరిశ్రాంతినొంది తూఁగాడ నస్త్రశస్త్రాదిక్షతంబు లగు నవయవంబులతోడ రాజదర్శన విషణ్ణులగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ లచ్చట మెలంగి దబ్బాటుగా నన్నుం గని 'సంజయా! బ్రదికితే?' యని పలికి 'కురుపతి ప్రాణంబులం గలఁడే?' యని యడిగిన నజ్జననాథుఁ డొక్కండును బాఱుతెంచి నీరిలో డాఁగియున్న తెఱం గెఱింగించి యా హ్రదంబు సూపి యే మిరువురము నొండొరులతో నాడినమాటలు దేటపడం జెప్పిన వార లత్యంత విషాదంబు నొంది. 16**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఆ విధంగా చెప్పి; ఆ+మడువు+చొచ్చి= ఆ కొలనులోనికి దిగి; మాయావిశేషంబునన్= మాయాశక్తివలన; జలంబులు శరీరంబు సోకక+ఉండన్= నీరు దేహం తగులకుండా ఉండేటట్లు; సంస్తంభనంబు= కదలని స్థితిని; చేసికొనిఉండెన్= ఏర్పరచుకొని ఉన్నాడు; అంతన్= ఆ మీదట; రథ్యంబులు= గుర్రాలు; పరిశ్రాంతిన్+ఒంది= అలసి; తూఁగాడన్= ఊగిసలాడగా; అస్త్రశస్త్ర+ఆదిక్షతంబులు+అగు= అస్త్రశస్త్రాదుల దెబ్బలవలన అయిన గాయాలు కల; అవయవంబులతోడన్= అంగాలతో;

రాజదర్శన విషణ్ణులు+అగుచున్= దుర్యోధనుడిని చూడటంకొరకు విచారపడుతూ; కృపకృతవర్మ+అశ్వత్థామలు= కృప కృతవర్మ అశ్వత్థామ లనువారు; అచ్చటన్+మెలంగి= అక్కడ తిరుగుచూ; దబ్బాటుగాన్+నన్నున్+కని= ఆకస్మికంగా నన్ను చూచి; సంజయా! బ్రదికితే? అని పలికి= సంజయా! బ్రతికి ఉన్నావా? అని అడిగి; కురుపతి= దుర్యోధనుడు; ప్రాణంబులన్+ కలఁడే?= ప్రాణాలతో ఉన్నాడా?; అని అడిగినన్= అని అడుగగా; ఆ+జననాథుండు+ఒక్కండును= ఆ రాజు ఒంటరిగా; పాఱుతెంచి= పరుగెత్తివచ్చి; నీరిలో డాఁగిఉన్న తెఱంగు+ఎఱింగించి= నీటిలో దాగిఉన్న విధం తెలిపి; ఆ హ్రదంబు+చూపి= ఆ నీటిలో మడుగు చూపించి; ఏము+ఇరువురము= మేమిద్దరము; (సంజయదుర్యోధనులు); ఒండొరులతోన్= ఒకరితో మరొకరు; ఆడిన మాటలు= మాట్లాడినమాటలు; తేటపడన్+చెప్పినన్= సుస్పష్టంగా చెప్పగా; వారలు= కృతవర్మ అశ్వత్థామలు; అత్యంత= మిక్కిలి; విషాదంబున్+ఒంది= దుఃఖపడి.

**తాత్పర్యం:** సంజయుడి కా విధంగా చెప్పి దుర్యోధనుడు తన మాయాశక్తితో ఆ కొలనులోనికి వెళ్ళి తన శరీరానికి నీళ్ళు తగులకుండా సంస్తంభన విద్యతో ఉన్నాడు. ఆ మీదట అలసిన గుర్రాలతో ఒంటికి తగిలిన దెబ్బలతో దొరను చూడటానికై దుఃఖపడుతున్నవారైన కృప కృతవర్మ అశ్వత్థామలు అక్కడ తిరుగుతూ అకస్మాత్తుగా నన్ను చూచి 'సంజయా! బ్రతికే ఉన్నావా? కురురాజు ప్రాణాలతో ఉన్నాడా?' అని అడిగితే ఆ రాజు ఒకడు మాత్రమే పరుగెత్తివచ్చి ఈ నీటిలో దాగిఉన్న విధానాన్ని తెలిపి, ఆ కొలనును చూపి మేమిద్దరం మాట్లాడుకొన్న మాటలు స్పష్టంగా చెప్పగా, కృప కృతవర్మ అశ్వత్థామలు చాలా దుఃఖించి.

**చ. 'నరవరుఁ డేము సంగరమునం బడకున్కి యెఱుంగఁ డక్కటా!**
**బరవస మేది వచ్చెఁ బిదపన్ వినియున్ మముఁ గూర్చికోలు దు**
**స్తర మనుబుద్ధి నిప్పటికి శత్రుల కన్మొఱఁగం దలంచి యీ**
**వెరవున డాఁగె; సర్వపృథివీపతి దుర్దశ నిట్లు పొందునే? 17**

**ప్రతిపదార్థం:** అక్కటా!= అయ్యో!; నరవరుఁడు= రాజగు దుర్యోధనుడు; ఏము= మేము; సంగరమునన్+పడక+ఉన్కి= యుద్ధంలో చావకుండటం; ఎఱుంగఁడు= తెలియడు; బరవసము+ఏది= ధైర్యం నశించి; వచ్చెన్; పిదపన్= ఆ పిమ్మట; వినియున్= విని కూడా; మమున్+కూర్చికోలు= మమ్ము కలిపికొనటం; దుస్తరము= సాధ్యంకాదు; అను బుద్ధిన్= అనే ఆలోచనతో; ఇప్పటికిన్= ఇంతసేపటికి; శత్రుల= పగవారి; కన్మొఱఁగన్+తలంచి= కనుగప్పదలచుకొని; ఈ వెరవునన్= ఈ ఉపాయంతో; డాఁగెన్= దాగికొన్నాడు; సర్వపృథివీపతి= సమస్త భూమండలాధీశుడు(దుర్యోధనుడు); ఇట్లు= ఈ విధంగా; దుర్దశన్= కష్టదుఃస్థితిని; పొందునే?= అనుభవించునా?

**తాత్పర్యం:** రారాజు దుర్యోధనుడికి మేము యుద్ధరంగంలో చావకపోవటం తెలియదు; ధైర్యాన్ని పోగొట్టుకొన్నాడు. అయ్యో! పిమ్మట మేము జీవించి ఉన్నామని విని కూడా మమ్ము కలియటం అసాధ్యం అనే ఊహతో శత్రువుల కనుగప్పి ఉపాయంతో ఈ కొలనులో దాగాడు. సమస్తభూమండలాధీశుడు ఇట్టి కష్టాన్ని పొందటమా?'

**వ. అవ్విభుండు పెనుఁబ్రాపై నిలిచిన నేము పగతురతోడం బెనంగంజాలుదు మను సమయంబున విజయవిజృంభితు లగు పాండవులు సబలంబుగా నచ్చేరువ నడతెంచిన నా రథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి ననుఁ గృపాచార్యు రథంబు మీఁద నిడికొని మనశిబిరంబున కరిగి; రందు. 18**

**ప్రతిపదార్థం:** ఆ+విభుండు= ఆ రాజు; పెనుప్రాపు+ఐ నిలిచినన్= పెద్ద అండగా ఉన్నట్లయితే; ఏము= మేము (ముగ్గురం); పగతుర తోడన్= శత్రువులతో; పెనంగన్+చాలుదుము= యుద్ధం చేయగలుగుదుము; అను సమయంబునన్= అనే కాలంలో; విజయ విజృంభితులు= విజయం పొందటంచేత ఉప్పొంగుతున్నవారు; అగు= అయిన; పాండవులు; సబలంబుగాన్= సైన్యంతో; ఆ+చేరువన్+నడతెంచినన్= ఆ సమీపానికిరాగా; ఆ రథికులు= ఆ రథవీరులు; తారు= తాము; ఆ+చోటన్= ఆ స్థలంలో; నిలుచుట= ఉండటం; కార్యము కాదు+అని= తగదని; తలంచి= భావించి; ననున్= నన్ను (సంజయుడిని); కృపాచార్యు రథంబుమీఁదన్= కృపాచార్యుడి తేరిమీద; ఇడుకొని= పెట్టుకొని; మన శిబిరంబునకున్= మన గుడారానికి; అరిగిరి= వెళ్ళారు; అందున్= అక్కడ (ఆ శిబిరంలో).

**తాత్పర్యం:** ఆ రాజు పెద్ద దిక్కుగా ఉన్నట్లయితే విరోధులతో యుద్ధం చేయగలము' అని మేము చెపుతున్న సమయాన విజయగర్వంతో పేట్రేగిన పాండవులు సైన్యంతో ఆ సమీపానికి రాగా వారు తా మక్కడ ఉండటం తగినది కాదని తలచి నన్ను కృపాచార్యుడి రథంమీద పెట్టుకొని, మన గుడారానికి వెళ్ళారు. అక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. కలగొనఁ బాఱుచున్ సతులు గన్నుల నశ్రుజలంబు లొల్క వీఁ**
**పులపయి పెన్నెఱుల్ విరియఁ బొద్మఁగ లాలలు రోదనధ్వనుల్**
**సెలఁగఁగ మోములుం దలలుఁ జేతులుఁ గెంపుగ మోఁదికొంచు భ**
**ర్తల సహజన్ములన్ సుతులఁ దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్. 19**

**ప్రతిపదార్థం:** కలగొనన్= కలతనంది; పాఱుచున్= పరుగెత్తుతూ; సతులు= స్త్రీలు; కన్నులన్+అశ్రుజలంబులు+ఒల్కన్= కళ్ళలో దుఃఖబాష్పాలు చిందగా; వీఁపులపయిన్= వీపులమీద; పెన్నెఱుల్= పెద్దవెంట్రుకలు(అనగా కురులు); విరియన్= విడిపోగా; లాలలు పొడ్మఁగన్= పెదవులనుండి చొంగ పుట్టగా; (ఏడ్చినపుడు సామాన్యంగా కలిగే చేష్ట); రోదనధ్వనుల్= ఏడ్పుల శబ్దాలు; చెలఁగఁగన్= మ్రోయగా; మోములున్+తలలు+చేతులు+కెంపుగన్+మోఁదికొంచున్= ముఖాలు, తలలు, చేతులు, ఎర్రగా అయ్యేటట్లు కొట్టుకొంటూ; భర్తలన్= మగలను; సహజన్మలన్= తోబుట్టువులను; సుతులన్= కుమారులను; తండ్రులన్= కన్నతండ్రులను; పేర్కొని= పిలుస్తూ; ఆర్తిన్+ఒందుచున్= పెద్దగా దుఃఖిస్తూ.

**తాత్పర్యం:** స్త్రీలు కలతచెంది పరుగెత్తుతూ, కనులనుండి చిందే దుఃఖాశ్రువులతోను, వీపులపై విరిసి వ్రేలాడే తలవెంట్రుకలతోను, నోటినుండి కారే చొంగతోను, ఏడ్పువలన కలిగే శబ్దంతో మొగాలు, తలలు, చేతులు ఎరుపెక్కగా మోదుకొంటూ, మగలను, తోబుట్టువులను, కుమారులను, తండ్రులను పేర్కొంటూ రోదిస్తూ. (తరువాతిపద్యంతో అన్వయం).

**వ. హతశేషు లైన పతాకాతపత్రచామరభృదాది జనంబులవలన సకలజనసంక్షయంబు వినుచు నేలంబడి పొరలుచు లేచుచునికి యత్యంతకరుణంబై యుండె; నప్పుడు మాన్యవనితాజనంబులకావలివారునుం గడంగి వారలం దగిన వాహనంబులపై నిడికొని యిక్కడకు వచ్చిరి; తక్కినభీతజనంబులు పలుదెసలం బాఱి; రట్టియెడ నీ కొడుకు యుయుత్సుండు శోకసంతప్తచిత్తుండై. 20**

**ప్రతిపదార్థం:** హతశేషులు+అయిన= చావగా మిగిలిన; పతాకా+ఆతపత్ర+చామరభృత్+ఆది+జనంబులవలనన్= జెండాలను, గొడుగులను, చామరాలను మోసేవారు మొదలైనవారివలన; సకల జనసంక్షయంబు వినుచున్= జనులందరిచావును వింటూ;

నేలన్+పడి= భూమిమీద పడి; పొరలుచున్ లేచుచున్+ఉనికి= పొర్లుతూ లేస్తూ ఉండటం; అత్యంతకరుణంబు+ఐ ఉండెన్= మిక్కిలి జాలిగొలిపేదిగా ఉండింది; అప్పుడు; మాన్య వనితాజనంబుల కావలివారును= గౌరవం కల స్త్రీ జనానికి ఉన్న రక్షకులున్నూ; కడంగి= పూని; వారలన్+తగిన వాహనంబులపైన్ ఇడికొని= వారందరిని తగిన వాహనాలమీద పెట్టుకొని; ఇక్కడకున్ వచ్చిరి; తక్కిన= మిగిలిన; భీతజనంబులున్= భయపడిన వారు; పలుదెసలన్+పాటిరి= అనేక దిక్కులకు పరుగెత్తారు; అట్టిఎడన్= ఆ సమయంలో; నీ కొడుకు యుయుత్సుండు= నీ కుమారుడు - యుయుత్సుడనేవాడు; శోకసంతప్త చిత్తుండు+ఐ= దుఃఖంతో వేగిన మనసుతో.

**తాత్పర్యం:** చనిపోగా మిగిలిన వారు ధ్వజాలను, గొడుగులను, చామరాలను చేతపట్టుకొని వచ్చిన మనుష్యుల మూలాన సమస్త జననాశనాన్ని వింటూ భూమిమీద పొర్లుతూ లేస్తూ ఉండటం మిక్కిలి శోచనీయంగా ఉండింది. గౌరవంగల స్త్రీలను వారి సేవకులు తగిన వాహనాలతో ప్రయత్నపూర్వకంగా తీసికొని ఇక్కడకు వచ్చారు. భయపడిన జనం నానాదిక్కులకు పరుగులు తీశారు. అప్పుడు నీ కుమారుడు యుయుత్సుడు దుఃఖంతో మండే మనస్సుతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**శా. 'గంగానందనుఁ డాదిగాఁగఁ గురుసంఘం బెల్ల సంగ్రామధా**
**త్రిం గూలెం; బతియొక్కరుండు పటు కౌంతేయప్రతాపంబు పే**
**ర్మిం గీడ్పాటున కోర్చి పాఱె; విధి నామేఁ బ్రాణముల్ నిల్పె; నా**
**కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొంచేఁగు టర్హం బగున్. 21**

**ప్రతిపదార్థం:** గంగానందనుఁడు+ఆదికాఁగన్= భీష్ముడు మొదలుగా; కురుసంఘంబు+ఎల్లన్= కౌరవవర్గమంతా; సంగ్రామధాత్రిన్= యుద్ధభూమిలో; కూలెన్= కూలిపోయింది; పతి ఒక్కరుండు= రాజొక్కడు మాత్రం; పటుకౌంతేయ ప్రతాపంబు పేర్మిన్= తీవ్రమైన పాండవుల శౌర్యాధిక్యానికి; కీడ్పాటునకున్+ఓర్చి= కష్టానికి తట్టుకొని; పాఱెన్= పరుగెత్తాడు; విధి= దైవం; నా మేన్+ప్రాణముల్ నిల్పెన్= నా శరీరంలో ప్రాణాలను నిల్పింది; నాకున్; కాంతాజనులన్= ఆడువారిని; తగంగన్= తగినట్లుగా; పురికిన్+కొంచున్= ఊరికి పిలుచుకొని; ఏఁగుట= వెళ్ళటం; అర్హంబు+అగున్= యోగ్యమైనపని ఔతుంది.

**తాత్పర్యం:** భీష్ముడు మొదలుగా కౌరవులందరూ యుద్ధభూమిలో నశించారు. రా జొక్కడే (దుర్యోధనుడొక్కడే) తీవ్రమయిన పాండవుల ధాటికి ఓర్చి పరుగులు తీశాడు. దైవం నా ప్రాణాన్ని నిల్పింది. ఈ ఆడువారిని హస్తినాపురికి పిలిచికొనిపోవటం ఉచితమైన పని.

**వ. ఏకాదశాక్షౌహిణీ భర్త మన్నించు మానవతులు గాసి యగుదురే?' యని మనంబునం దలపోసి రథంబు డిగ్గి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు నెఱింగించిన నప్పాండవాగ్రజుండు పరమకృపాపరుండు గావునఁ బ్రీతుం డై శౌరియాననం బాలోకించి 'యది మేల కాదె?' యని పలికి, యతం డనుమతి సేయ నవ్వైశ్యాపుత్రుఁ బరిరంభణంబు సేసి 'లెస్స తలంపు తలంచి' తని సంభావించి వీడుకొలిపిన, నతండు రథారూఢుం డై రథ్యంబులఁ ద్వరితగతి నడపి భూపతి ప్రేయసీజనంబుల కధ్యక్షు లగువృద్ధకంచుకులం గలసి వారును దానును వారల నుచితప్రకారంబులఁ దేర్చి పురంబు ప్రవేశించునప్పుడెదుర విదురుం గాంచి. 22**

**ప్రతిపదార్థం:** ఏకాదశ= పదకొండు; అక్షౌహిణీభర్త= అక్షౌహిణులసేనకు నాయకుడు; మన్నించు= గౌరవించే; మానవతులు= స్త్రీలు; గాసి అగుదురే?= కష్టాలపాలగుదురే?; అని మనంబునన్+తలపోసి= అని మనసులో తలచి; రథంబుడిగి= తేరు దిగి; ఆ+తెఱంగు శౌరికిన్= ఆ విధమును శ్రీకృష్ణుడికీ; అజాతశత్రునకున్= ధర్మరాజునకూ; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; పరమ కృపాపరుండు+కావునన్= మిక్కిలి దయగలవాడు కావటంచేత; ప్రీతుండై= సంతోషించినవాడై; శౌరి= శ్రీకృష్ణుడి; ఆననంబు+ఆలోకించి= మొగాన్ని చూచి; అది మేలు+అ కాదె= అది మంచిదే కదా!; అని పలికి= అనిచెప్పి; అతండు+అనుమతి+చేయన్= అతడు అంగీకరించగా; ఆ వైశ్యాపుత్రున్= ఆ వైశ్యాకుమారుడిని; పరిరంభణంబు+చేసి= కౌగిలించుకొని; లెస్స తలంపు తలంచితి(వి)= మేలగు యోచన చేశావు; అని సంభావించి= అని ఆదరించి; వీడుకొల్పినన్= పంపగా; అతండు= ఆ యుయుత్సుడు; రథారూఢుండు+ఐ= తేరునెక్కిన వాడై; రథ్యంబులన్+ త్వరితగతిన్= గుర్రాలను వేగంగా తోలి; భూపతి ప్రేయసీ జనంబులకున్= రాజస్త్రీలకు; అధ్యక్షులు+అగు= అధికారులయిన; వృద్ధకంచుకులన్+కలిసి= ముసలికంచుకులను కలిసికొని; వారును+తానును= తామంతా; వారలన్; ఉచిత ప్రకారంబులన్+ తేర్చి= సముచితంగా ఓదార్చి; పురంబు ప్రవేశించునప్పుడు; హస్తినాపట్టణం లోనికి వెళ్ళేటప్పుడు; ఎదురన్+విదురున్+కాంచి= ఎదురుగా విదురుడిని చూచి.

**తాత్పర్యం:** 'పదునొకండక్షౌహిణుల సేనలకు నాయకుడు ఆదరించే స్త్రీలు ఇంత కష్టానికి గురి అయ్యారే! అని మనసులో తలపోసి తేరు దిగి, శ్రీకృష్ణుడికి ధర్మరాజుకు తెలియచేయగా ధర్మరాజు దయతో ప్రీతిగా శ్రీకృష్ణుడి ముఖాన్ని చూచి 'అది మంచిదే కదా!' అని చెప్పి, ఆయన అనుమతితో ఆ వైశ్యాకుమారుడిని కౌగలించుకొని మంచి యోచన చేశావని, అతడిని ఆదరించి పంపాడు. అట్లా పంపగా యుయుత్సుడు రథారూఢుడై త్వరితగతిని రాజాంతఃపురకాంతలను రక్షించే అధికారులయిన వృద్ధకంచుకులను కలసి, వారితోపాటు తానుకూడా ఆ స్త్రీలను తగువిధంగా ఓదార్చి, హస్తినాపురంలో ప్రవేశించేటప్పుడు విదురుడు ఎదురుగా రాగా చూచినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **అతఁ డడుగంగ శల్యసుబలాత్మజులుం బలమంతయున్ రణ**
**క్షితిఁ బడు టేర్పడం బలికి, చెప్పెఁ దురంగము డిగ్గి మేదినీ**
**పతి యొకరుండు పాఱుటయుఁ బాండవముఖ్యుఁడు ప్రీతిఁ బంపఁగా**
**నతివల నిల్లు సేర్చుటకు నై యిట రాకయు మానవేశ్వరా!** **23**

**ప్రతిపదార్థం:** మానవేశ్వరా!= ఓ రాజా! ధృతరాష్ట్రా!; అతఁడు+అడుగంగన్= ఆ విదురుడుఅడుగగా; శల్యసుబలాత్మజులున్= శల్యుడును; గాంధార రాజకుమారుడును (శకుని); బలము+అంతయున్= సేన మొత్తము; రణరక్షితిన్= యుద్ధభూమిలో; పడుట= పడిపోవటం(చనిపోవటం); ఏర్పడన్+పలికి= స్పష్టంగా చెప్పి; తురంగము డిగ్గి= గుర్రంనుండి దిగి; మేదినీపతి= రాజు(దుర్యోధనుడు); ఒకరుండు పాఱుటయున్= ఒకడే పారిపోవటం; పాండవముఖ్యుఁడు= ధర్మరాజు; ప్రీతిన్+పంపఁగాన్= ప్రేమతో పంపగా; అతివలన్= స్త్రీలను; ఇల్లు చేర్చుటకునై= ఇంటికి చేర్చటానికై; ఇటు రాకయున్= ఇట్లా రావటం; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! విదురు డడుగగా శల్యుడు, గాంధారరాజు కుమారుడు శకునీ, సేనమొత్తం యుద్ధభూమిలో చనిపోవటం స్పష్టంగా చెప్పి, దుర్యోధనుడు గుర్రంనుండి దిగి ఒంటరిగా పరుగెత్తటం, ధర్మరాజు ప్రేమతో పంపగా అంతపురస్త్రీలను వారి ఇళ్ళకు చేర్చటానికి ఇక్కడకు (హస్తినకు రావటం) (యుయుత్సుడు చెప్పాడు).

**వ. అనిన విని యతండు శోకవ్యాకులుం డగుచు నవ్వైశ్యాపుత్రుం బొగడి కాలోచితకృత్యం బాచరించి 'లెస్సచేసి' తని పలికి మఱియు నిట్లనియె. 24**

**ప్రతిపదార్థం:** అనిన్+విని అతండు= విదురుడు; శోకవ్యాకులుండు+అగుచున్= దుఃఖంతో చీకాకు పడుతూ; ఆ+వైశ్యాపుత్రున్+ పొగడి= ఆ వైశ్యకుమారుడైన యుయుత్సుడిని పొగడి; కాలోచితకృత్యంబు+ఆచరించి;= ఆ సమయానికి తగిన పనులు చేసి; లెస్స చేసితి+అని పలికి= మంచిపని చేశావని మాటాడి; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అని చెప్పగా విని విదురుడు దుఃఖంతో కలతచెందాడు. యుయుత్సుడిని పొగడాడు. కాలోచిత కృత్యాలను చేసి, 'నీవు మంచిపని చేశా'వని పలికి, ఇంకను ఈ విధంగా అన్నాడు.

**తే. 'ఎప్పుడును సంజయుఁడు వచ్చి యెఱుఁగఁ జెప్పుఁ । బతికి సమరవిశేషంబు లతఁడు నేఁటి**
**తెఱఁగు చెప్పెడిఁ గాక యేతెంచి మున్న । మనము వినిపింపఁ గాఁ దగ దనఘ! దీని. 25**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా! ఎప్పుడును; సంజయుఁడు; వచ్చి; పతికిన్= రాజుకు, ధృతరాష్ట్రుడికి; ఎఱుఁగన్+ చెప్పున్= తెలియచేస్తాడు; అతఁడు; నేఁటి తెఱంగున్= ఈనాటి పరిస్థితిని; పతికిన్= రాజునకు; సమర= యుద్ధమునందలి; విశేషంబులు= వివరములను; చెప్పెడిన్+కాక= చెప్పుగాక; మున్ను ఏతెంచి= ముందుగా వచ్చి; మనము; దీనిన్= ఈ వార్తను; వినిపింపఁగాన్= చెప్పగా; తగదు= తగదు.

**తాత్పర్యం:** 'సంజయుడు వచ్చి యుద్ధంలో జరిగిన అన్ని విషయాలను రాజునకు తెలుపుతాడు. ఈ దినం జరిగిన దానిని కూడ ఆతడే చెప్పుగాక! ముందుగా వచ్చి మనం తెలుపరాదు' అని ఇంకా ఇట్లా అన్నాడు.

**వ. 'ఒండు ముఖంబున నివ్వార్త నగరు సొరకుండునట్లుగా సంవిధానంబు సేయవలయు; నీవు దుర్యోధను ప్రియాజనంబులను దద్రక్షకులను దోడ్కొని భవదీయమందిరంబునకుం జనుము; తక్కటివారి నంతంత నడఁకువతో నిలువ నియమింపవలయు' నని పలికి తానును యుయుత్సుండును సావధానప్రయత్నంబున నవ్విధానంబు సంఘటించి, నీ తమ్ముండు పెద్దమొగసాలం జాలుమానుసులం గావలివెట్టి, యభ్యంతరంబు ప్రవేశించి యుండె; నక్కడఁ గౌరవసేనాసన్నివేశం బత్యంతవిరళజనం బయ్యె; మున్ను మాతంగతురంగసుభట బృంహిత హేషిత భాషణంబులవలన శబ్దాంతరంబు కర్ణగోచరంబు గానియట్టి యా శిబిరంబు నిశ్శబ్దం బయి యుండె ననిన విని యాంబికేయుం డిట్లనియె. 26**

**ప్రతిపదార్థం:** ఒండు ముఖంబునన్= వేరొకరివలన; ఈ+వార్త నగరు చొరకుండునట్లుగాన్= ఈ మాట అంతఃపురానికి చేరకుండేటట్లు; సంవిధానంబు= కట్టడి; చేయవలయున్= చేయాలి; నీవు; దుర్యోధను; ప్రియాజనంబులను= ప్రియురాండ్రను; తద్+రక్షకులను= వారి కావలివారిని; తోడ్కొని= తీసికొని; భవదీయ= నీయొక్క; మందిరంబునకున్= ఇంటికి; చనుము= వెళ్ళుము; తక్కటివారిన్= మిగిలినవారిని; అంతంతన్= అక్కడక్కడ; అడఁకువతోన్= వినయంతో; నిలువన్= నిలచేటట్లు; నియమింపవలయున్= ఏర్పాటుచేయాలి; అని పలికి= అని చెప్పి; తానును; యుయుత్సుండును; సావధాన ప్రయత్నంబునన్= శ్రద్ధతో కూడిన ప్రయత్నంతో; ఆ+విధానంబున్= ఆ పద్ధతిని; సంఘటించి= చేసి; నీ తమ్ముండు= నీ తమ్ముడు; పెద్దమొగసాలన్= పెద్దవాకిలికి; చాలు మానుసులన్= సమర్థులైన మనుష్యులను; కావలి పెట్టి= కాపలా నిలిపి; అభ్యంతరంబున్= అంతఃపురాన్ని; ప్రవేశించి= చేరి; ఉండెన్= ఉన్నాడు; అక్కడన్= యుద్ధభూమిలో; కౌరవసేన= కురుసేనయొక్క; సన్నివేశంబు=

శిబిరం; అత్యంత= మిక్కిలి; విరళజనంబు+అయ్యెన్= పలుచబడిన మనుష్యులున్నదిగా ఐనది; మున్ను= అదివరలో; మాతంగ= ఏనుగుల; తురంగ= గుర్రాల; సుభట= శిక్షితులైన సేనలయొక్క; బృంహిత= ఘీంకారాలతోను; హేషిత= సకిలింతలతోను; శబ్ద+అంతరంబు= వేరే శబ్దం; కర్ణగోచరంబు+కాని అట్టి= చెవికి వినబడని; ఆ శిబిరంబు= ఆ సైనికుల గుడారం; నిశ్శబ్దంబు+అయి ఉండెన్= అలజడి లేకుండా ఉన్నట్టిది అయింది; అనినన్ విని= అనగా విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** వేరొకరిద్వారా ఈ వార్త నగరికి చేరకుండా ఉండేటట్లు కట్టడి చేయాలి. నీవు దుర్యోధనుడి అంతఃపురకాంతలను, వారి కావలివారిని పిలుచుకొని నీ ఇంటికి పొమ్ము. మిగిలినవారిని అక్కడక్కడ అడకువతో ఉండేటట్లు ఏర్పాట్లు చేయుము.' అని చెప్పి, తానూ యుయుత్సుడూ తగిన ప్రయత్నంతో ఆ పనిని నిర్వహించి నీ తమ్ముడైన విదురుడు తగినవారిని పెద్దవాకిలికి కాపుగా పెట్టి అంతఃపురం చేరాడు. ఇక యుద్ధరంగంలో కౌరవసైనికులు పలుచబడ్డాడు. ఒకనాడు మదపుటేనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింతలు, పదాతి సైనికుల వీరస్వరాలతో శిబిరం ఎంతో సందడిగా ఉండి, వేరే చప్పుళ్ళను వినటానికి సాధ్యపడేది కాదు. అట్టి గుడారం ఇప్పుడు నిశ్శబ్దంగా ఉన్నది' అని చెప్పగా ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు:

**క. 'సూతసుత! యిట్లు పగతుర । చేత మనబలంబు రాజసింహులు బంధు**
**వ్రాతమ్మును సమసినఁ దుది । నే తెఱఁగున నడచితిరి? నరేంద్రుఁడు మీరున్?' 27**

**ప్రతిపదార్థం:** సూతసుత!= ఓ సంజయా!; ఇట్లు= ఈ మాదిరిగా; పగతుర చేతన్= విరోధులవలన; మన బలంబు= మన సేనలు; రాజసింహులు= రాజ శ్రేష్ఠులూ; బంధువ్రాతమ్మును= బాంధవుల సమూహమూ; సమసినన్= నాశనంకాగా; తుదిన్= చివరకు; నరేంద్రుఁడు= రాజును(దుర్యోధనుడు); మీరున్= మీరందరును; ఏ తెఱఁగునన్= ఏ విధంగా; నడచితిరి?= ప్రవర్తించారు?

**తాత్పర్యం:** 'ఓ సంజయా! ఈ విధంగా వైరులచేత మన సేనలు, రాజులు, బంధు సమూహం నాశనమయిన పిమ్మట మన రాజూ, మీరూ ఏం చేశారు?'

**వ. అనుటయు నమ్మహీకాంతునకు సంజయుం డిట్లనియె 'నంత నయ్యెడకుఁ గౌంతేయులు సైన్యంబును దారును సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగుదెంచు కలకలంబు వీతెంచిన. 28**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+మహీకాంతునకున్= ఆ రాజునకు(ధృతరాష్ట్రుడికి); సంజయుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అంతన్= అంతలో; ఆ+ఎడకున్= ఆ చోటికి; కౌంతేయులు= పాండవులు; సైన్యంబును= సేనయు; తారును= తామును; సుయోధన+అన్వేషణపరులు+అయి= దుర్యోధనుడిని వెదకువారై; రయంబునన్= వేగంగా; అరుగుదెంచు= వచ్చే; కలకలంబు= కోలాహలం; వీతెంచినన్= వినరాగా.

**తాత్పర్యం:** అపుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లాఅన్నాడు: 'అంతలో పాండవులు ససైన్యంగా కలకలారావంతో సుయోధనుడిని వెదకుతూ ఆ చోటికి రాగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కృతవర్మయుఁ గృపుఁడును గురు । సుతుఁడును గనుఁగొనుచు నొండుచోటికిఁ జని; ర**
**ట్లతిరభసంబునఁ గుంతీ । సుతు లచటికి వచ్చి నీదుసుతుఁ బలుగడలన్. 29**

**ప్రతిపదార్థం:** కృతవర్మయున్ కృపుఁడును= కృతవర్మ, కృపాచార్యుడు; గురుసుతుఁడును= అశ్వత్థామయు; కనుఁగొనుచున్= వెదకుతూ; ఒండు చోటికిన్= వేరొక దిక్కునకు; చనిరి= వెళ్ళారు; అట్లు= ఆ విధంగా; అతిరభసంబునన్= మిక్కిలి తొందరగా; కుంతీసుతులు= కుంతి కుమారులు (పాండవులు); అచటికిన్= ఆ చోటుకు; వచ్చి; నీదు సుతున్= నీ కుమారుడిని; పలుగడలన్= అనేక దిక్కులలో.

**తాత్పర్యం:** కృతవర్మా, కృపుడూ, అశ్వత్థామా వారిని గమనించి మరొకచోటికి పోయారు. మిక్కిలి తొందరగా పాండవులు ఆ చోటికి వచ్చి నీ కుమారుడి కొరకు అనేక దిక్కులలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ.** **అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చనిరి; చనునప్పు డజాతశత్రుండు నీ పుత్రునగరిలోని జనంబులఁ గృపతోడం గనుంగొని 'వెఱవకుండుఁ' డని పలికి చనియె; నట్లు వారు నిజశిబిరంబునకుం జనుటయు, మనయోధవరులు నేను మనంబున నడలు గదుర నమ్మడువుకడకుం బోయితిమి; కృపాదు లగు మువ్వురు దమరాక యెఱింగించి యమ్మనుజపతి కి ట్లనిరి.** **30**

**ప్రతిపదార్థం:** అన్వేషించి= వెదకి; కానమికిన్= కనపడనందుకు; విషాదంబున్+ఒందుచున్= చింతిస్తూ; మరలి చనిరి= తిరిగి వెళ్ళారు; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు; అజాతశత్రుండు= ధర్మరాజు; నీ పుత్రునగరిలోని జనంబులన్= నీకుమారుడి శిబిరంలోని జనులను; కృపతోడన్+కనుంగొని= దయతో జూచి; వెఱవక+ఉండుఁడు+అని పలికి+చనియెన్= భయపడవద్దని చెప్పి వెళ్ళాడు; అట్లు వారు= ఆ విధంగా పాండవులు; నిజ శిబిరంబునకున్+చనుటయున్= తమ గుడారాలకు వెళ్ళగా; మన యోధవరులున్ నేనున్= మన వీరులూ నేనూ; మనంబునన్= మనసులో; అడలు+కదురన్= భయం కలుగగా; ఆ+మడువు కడకున్+పోయితిమి= ఆ కొలని వద్దకు (దుర్యోధనుడున్న ద్వైపాయన హ్రదం వద్దకు) పోయాము; కృపాదులగు= కృపుడు మొదలైన; మువ్వురు; ఆ+మనుజపతికిన్= రాజయిన ఆ దుర్యోధనుడికి; తమరాక= తాము రావటం; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు:

**తాత్పర్యం:** (పాండవులు) వెదకి, కనబడనందులకు చింతిస్తూ తిరిగి వెళ్ళారు. పోయేటప్పుడు ధర్మరాజు నీ కుమారుడి శిబిరంలోని జనులను దయతో చూచి, 'భయపడకండి' అని వెళ్ళాడు. వారు వెళ్ళిన పిమ్మట మనసులో భయం కలుగగా మన వీరులతో కలసి నేను ఆ కొలను దగ్గరకు వెళ్ళాను. కృపాదులైన ముగ్గురూ రారాజునకు మా రాకను తెలిపి, పిమ్మట ఈ విధంగా అన్నారు:

### కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట (సం.9-29-41)

**క.** **'లెమ్ము కురునాథ! కడఁగుము । మమ్ముం గొని పాండుపుత్రమథనమునకు; సై**
**న్య మ్మదియును నీచేతఁ గృ । శ మ్మయ్యెడుఁ జుమ్ము! వలదు శంకింపంగన్.** **31**

**ప్రతిపదార్థం:** లెమ్ము కురునాథ!= కురురాజా! లేవయ్యా; మమ్మున్+కొని= మా ముగ్గురిని తీసికొని; పాండుపుత్ర= పాండురాజ కుమారుల; మథనమునకున్= సంహారానికి; కడఁగుము= పూనుకొమ్ము; సైన్యమ్ము+అదియును= ఆ సేనకూడా; నీచేతన్= నీవలన; కృశమ్ము+అయ్యెడున్+చుమ్ము!= బలహీన పడగలదు సుమా!; శంకింపంగన్= అనుమానించగా; వలదు= వద్దు.

**తాత్పర్యం:** 'కురురాజా! లెమ్ము. మా ముగ్గురి అండతో పూనుకొని పాండవ సంహారానికి నడుము బిగించుము. నిస్సందేహంగా నీచేత పాండవ సైన్యం క్షీణిస్తుంది. వెనుకాడవద్దు.

**వ. అట్లు కాక గెలిచి భూమి యేలుట యొండెఁ జచ్చినాకలోకసుఖం బనుభవించుట యొండెం గాని నీయట్టివాని కిట్టితెఱంగు కర్తవ్యంబుగా' దని పలికిన విని యవ్విభుండు వారల కి ట్లనియె. 32**

**ప్రతిపదార్థం:** అట్లు కాక= ఆ విధంగా కాకుండా (పాండవులను జయించక); గెలిచి= జయించి; భూమి ఏలుట= రాజ్యాన్ని పాలించుటో; ఒండె= లేదా; చచ్చి; నాకలోక సుఖంబు+అనుభవించుట+ఒండెన్= స్వర్గసుఖాలను అనుభవించటమో; కాని; నీ+అట్టివానికిన్= నీ వంటివాడికి; ఇట్టి తెఱంగు= ఈ విధంగా ఉండటం(దొంగచాటుగా ఉండటం); కర్తవ్యంబు కాదు= చేయదగిన పనికాదు; అని= అంటూ; పలికినన్= మాటాడగా; విని; ఆ+విభుండు(దుర్యోధనుడు); వారలకున్= వారితో (కృపాదులతో); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అంతే కాక గెలిచి భూమిని పాలించటం గాని, చనిపోయి స్వర్గలోక సుఖాన్ని అనుభవించటంగాని తగుతుంది. కాని నీవంటి వాని కిటువంటి తీరు తగదు' అని చెప్పగా విని ఆ రాజు వారితో ఇట్లా అన్నాడు:

**చ. 'తనువు ఘనాస్త్రశస్త్రములతాఁకున నొప్పిని డప్పి పుట్టె నా**
**మనము వశంబు గా కెడలె మాటల చందము సూడ మీరు డ**
**స్సినయటు లున్నవార లనుజీవులు లేరు తొలంగి నేఁటి మా**
**త్ర నిలువుఁ డెల్లి పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్. 33**

**ప్రతిపదార్థం:** తనువు= ఒడలు; ఘన+అస్త్రశస్త్రములు= పెను బాణముల, కత్తుల; తాఁకునన్= దెబ్బలతో; (కల్గిన) నొప్పిని= బాధవలన; డప్పి+పుట్టెన్= దాహం కలుగుతున్నది; నా మనంబు= నా మనస్సు; వశంబుకాక+ఎడలెన్= సాధ్యం కాకుండా వికలమయింది; మాటల చందము= మాటల పద్ధతి; చూడన్= చూడగా; మీరు డస్సినఅటులు+ఉన్నవారలు= మీరుఅలసినట్లున్నారు; అనుజీవులు లేరు= సేవకులు లేరు; తొలంగి= తప్పుకొని; నేటిమాత్రన్= ఈ దినం మాత్రము; నిలువుఁడు= ఆగండి; ఎల్లి= రేపు; లావు వచ్చినన్= బలం వస్తే; పైకొని= మీదై; అరాతులన్= వైరులను; గెల్తము= జయిద్దాం.

**తాత్పర్యం:** 'నా శరీరానికి బాణాలయొక్క, కత్తులయొక్క దెబ్బలమూలంగా కల్గిన నొప్పి వలన దాహంగా ఉన్నది. నా మనసు వశం తప్పుతున్నది. మీరూ అలసినట్లున్నారు. సేవకులు కూడా లేరు. అందుచేత ఈరోజు ఆగండి. శక్తి వస్తే రేపు విజృంభించి వైరులను జయిద్దాం.'

**వ. అనవుడు నగ్గురునందనుండు. 34**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆ+గురునందనుండు= ఆ గురుకుమారుడైన అశ్వత్థామ.

**తాత్పర్యం:** అనగా విని అశ్వత్థామ.

**ఉ. 'ఏ లనుమాన? మేను సమయించెద వైరము నేఁటితోడఁ; బాం**
**చాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ**

**పాలక! పుచ్చఁ గత్తళము; పాటిగఁ బట్టుము నాదుమాట; లి**
**య్యాలితనంబు వాపెదఁ; బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్.' 35**

**ప్రతిపదార్థం:** భూపాలక!= ఓ రాజా!; ఏల+అనుమానము?= సందేహ మెందుకు?; వైరము= శత్రుత్వం; నేటితోడన్= ఈ దినంతో; ఏను సమయించెదన్= నేను మాపుతాను; పాంచాలురన్+ఎల్లన్= పాంచాల దేశంవారినందరినీ; తీవ్రశరజాలములన్= వాడిఅయిన బాణాల సమూహాలతో; పొలియించి= సంహరించి; కాని; కత్తళము= కవచం; పుచ్చన్= విడిచిపెట్టను; నాదుమాటలు= నా మాటలు; పాటిగన్= ప్రమాణంగా; పట్టుము; ఈ+ఆలితనంబున్+పాపెదన్= దైన్యాన్ని తొలగిస్తాను; నీకున్; తండ్రికిన్= తండ్రియయిన ధృతరాష్ట్రుడికి; ప్రియంబు+ఒనరించెదన్= ప్రీతి కలిగిస్తాను.

**తాత్పర్యం:** 'నీ కనుమానం దేనికి? ఈ దినంతో వైరం లేకుండేటట్లు వాడిబాణాలతో పాంచాలురందరినీ చంపి కానీ కవచాన్ని విడువను. ప్రమాణంగా నా మాటను నమ్ముము. ఈ దైన్యాన్ని ముగిస్తాను. నీకూ, తండ్రిగారికి సంతోషం కల్గిస్తాను.' (అని అన్నాడు).

**వ. అనియె; నపుడనిల సుతుని వేఁట కాఱులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతులై జలపానార్థం బమ్మడువునకు వచ్చి; రంతకుమున్ను ధర్మనందనుం డొక్కబోయం బొడఁగని 'దుర్యోధనుండు దొలఁగెం జెట్టుచేమల నడంగి యుండునో? మీరు మెలంగు నెడల నరయవలయు' ననిన వాఁడును వృకోదరుని మృగయులలోనివాఁ డగుటఁ దమవారికి నెదురు వోయి యమ్మాట తెఱం గెఱిఁగించుటం జేసి యప్పని మనంబులం దున్నట్టి యాబోయ లట్లు కెలన నేమరి సల్లాపంబులు సేయుచున్న యన్నరనాథుని యారథికవరుల వచనంబులు విని పూర్వాభ్యాసంబువలన నయ్యుక్తి ప్రత్యుక్తుల పరిపాటి దేటపడిన నన్నీటిలో నీకొడుకు డాఁగి యుంట నిశ్చయించి తమలో మెల్లన నిట్లనిరి. 36**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అప్పుడు= ఆ సమయమున; అనిలసుతుని= భీముడియొక్క; వేఁటకాఱులు= బోయలు; మాంసభారంబులతోడన్= మాంసముయొక్క బరువువలన; పరిశ్రాంతులు+ఐ= అలసినవారై; జలపాన+అర్థంబు= నీరు త్రాగటంకొరకు; ఆ+మడువునకున్ వచ్చిరి= ఆ కొలనుకు వచ్చారు; అంతకు మున్ను= అంతకంటె ముందుగా; ధర్మనందనుండు+ఒక్కబోయన్+పొడఁగని= ధర్మరాజు ఒక బోయవాడిని చూచి; దుర్యోధనుండు తొలఁగెన్= దుర్యోధనుడు తప్పుకొన్నాడు; చెట్టుచేమలన్+అడంగి ఉండునో?= చెట్టు చేమలందు దాగి ఉంటాడేమో!; మీరు మెలంగు+ఎడలన్= మీరు తిరిగేటటువంటి చోటులతో; అరయవలయున్= గుర్తించాలి; అనినన్= అనగా; వాఁడును= ఆ బోయవాడు కూడా; వృకోదరుని= భీముడియొక్క; మృగయులలోని వాఁడు+అగుటన్= బోయలలోని వాడైనందున; తమవారికిన్= తనతోడివారికి; ఎదురు పోయి= ఎదు రేగి; ఆ+మాట తెఱంగు+ఎఱింగిచుటన్+చేసి= తెలియజేయటంవలన; ఆ+పని; మనంబులందున్+ఉన్నట్టి= మనసులలో ఉన్న; ఆ బోయలు= ఆ బోయవారు; అట్లు= ఆ విధంగా; కెలనన్= ప్రక్కలయందు; ఏమరి= ఏమరుపాటుగా; సల్లాపంబులు చేయుచున్నన్= స్వేచ్ఛగా మాటాడుకొంటూ ఉండగా; ఆ+నరనాథుని= ఆ దుర్యోధనుడి; ఆ రథికవరుల= ఆ వీరుల (కృప, కృతవర్మ, అశ్వత్థామల); వచనంబులు విని= మాటలు విని; పూర్వ+అభ్యాసంబువలనన్= వెనుకటి అనుభవంతో; (ఆ+ఉక్తి) ప్రత్యుక్తుల పరిపాటిన్= ఆ పరస్పర సంభాషణల పద్ధతి; తేటపడినన్= స్పష్టపడగా(తెలియగా); ఆ+నీటిలోన్= ఆ నీటిలో; నీ కొడుకు డాఁగియుండుట= నీ కుమారుడు దాగుకొని యుండటం; నిశ్చయించి= నిర్ణయించి; తమలోన్; మెల్లనన్= నెమ్మదిగా(రహస్యంగా); ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు;

**తాత్పర్యం:** భీముడి బోయవారు మాంసభారంతో అలసి ఆ మడుగు దగ్గరకు నీరు త్రాగేందుకు వచ్చారు. ధర్మజు డంతకు ముందు ఒక బోయవాడిని చూచి, 'దుర్యోధనుడు తప్పించుకొన్నాడు. చెట్లు చేమలలో దాగి ఉండవచ్చును. మీరు తిరిగేటప్పుడు గుర్తించండి' అని చెప్పగా వాడు కూడా భీముడి బోయలలో ఒకడు కావటంచేత మిగిలినవారికి ఎదురుగా పోయి, ఆ విషయం తెలియజేసినందున ఆ పని మనసులలో మెదలుతుండగా, ప్రక్కనే ఏమరుపాటుగా మాట్లాడుతున్న ఆ రాజుకూ, వీరులకూ సాగిన ఉక్తిప్రత్యుక్తులక్రమం విని, ఆ నీటిలో నీ కుమారుడు దాగి ఉండటాన్ని నిశ్చయించుకొని తమలో మెల్లగా ఈ విధంగా అనుకొన్నారు.

**క. 'ఈ రథికులు తను నిమ్మెయిఁ । బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం**
**గౌరవపతి డాఁగినగతి । బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. 37**

**ప్రతిపదార్థం:** ఈ రథికులు= ఈ వీరులు; తనున్+ఈ+మెయిన్+పోరికిన్+తఱుమంగన్= వీరు ఈ విధంగా తనను యుద్ధానికి రెచ్చగొట్టగా; తాను; పురికొనక= ఉద్వేగ మందకుండా; ఇచటన్= ఈ చోట; కౌరవపతి= కౌరవరాజు దుర్యోధనుడు; డాఁగినగతి= దాగిన విధం; బోరనన్+చని= వేగంగా వెళ్ళి; భూనాథునకున్= ధర్మరాజుకు; చెప్పవలయున్= చెప్పవలసి ఉన్నది.

**తాత్పర్యం:** 'సేనానులు తనను ఆ విధంగా యుద్ధానికై తరుమగా ఉద్వేగపడకుండా దుర్యోధనుడు ఇక్కడ దాగికొని ఉన్న వైనం వేగంగా వెళ్ళి ధర్మజుడికి తెలియజేయాలి.

**తే. అతఁడు పసదన మొసఁగు మారుత తనయుని । మున్ను గని మెచ్చు వడయుద; మన్నరేంద్రు**
**నతఁడ కాన్పించు మనల; రయమునఁ బోవ । వలయు; మాంసభారంబులు వలదు లెండు. 38**

**ప్రతిపదార్థం:** అతఁడు= ధర్మరాజు; పసదనము+ఒసఁగున్= బహుమతి ఇస్తాడు; మారుత తనయునిన్= భీముడిని; మున్ను+కని= ముందుగా చూచి; మెచ్చు+పడయుదము= మెప్పుపొందుదాం; మనలను; ఆ+నరేంద్రున్+అతఁడు+అ కాన్పించున్= ఆ ధర్మరాజును అతడే కనపడేటట్లు చేస్తాడు; రయమునన్= వేగంగా; పోవవలయున్= పోవాలి; మాంసభారంబులు (వేటలోని)= మాంసాల బరువులు; వలదు= అక్కరలేదు; లెండు= లేవండి.

**తాత్పర్యం:** ధర్మరాజు మనకు బహుమతి నిస్తాడు. భీముడిని ముందుగా చూచి అతడి ఆదరాన్ని పొందుదాము. మనకు ఆ ధర్మరాజును ఆతడే చూపగలడు. ఈ మాంసాల బరువులు వదలి వేగంగా పోదాం లేవండి.'

**వ. అని మోపులు డిగవిడిచి వెసం బాఱి; రయ్యవసరంబునఁ బాండునందనులు నీ నందను వెదక ననేక చారులం బొలికలని కెలంకులకం బుచ్చి, యాతండు తను కగపడమికిఁ జింతాక్రాంతు లై యుండ నాబోయలు భీమునిపణిహారులఁ ద్రోచికొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి, యతనిం గాంచి, యమ్మడువున నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. 39**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; మోపులు డిగవిడిచి= బరువులు క్రింద దింపి; వెసన్+పాఱిరి= త్వరగా వెళ్ళారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; పాండు నందనులు= పాండురాజకుమారులు; నీ నందను వెదకన్= నీ కుమారుడిని వెదకటానికి; అనేక చారులన్= వేగులవారిని చాలమందిని; పొలికలని కెలంకులకున్+పుచ్చి= యుద్ధభూమి ప్రక్కలకు పంపి; ఆతండు తమకున్+అగపడమికిన్= ఆతడు తమకు కనపడనందులకు; చింతాక్రాంతులు+ఐ+ఉండన్= చింతతో ఉండగా;

ఆ బోయలు= ఆ బోయవారు; భీముని పణిహారులన్ త్రోచికొనుచున్= భీముడి సేవకులను త్రోసికొంటూ; తద్+మందిరంబును+తటియన్+చొచ్చి= ఆతని భవనం చేరబోయి; అతనిన్+కాంచి= ఆ భీముడిని చూచి; ఆ+మడువునన్= ఆ కొలనులో; ఆ+మహీపతి= ఆ రాజు; డాఁగిఉనికి= దాగిఉండటం; ఎఱింగించి= తెలిపి.

**తాత్పర్యం:** ఆ బోయలు తమవీపులమీది బరువులను క్రిందకు దింపి త్వరగా వెళ్ళారు. అప్పటికే పాండవులు నీకొడుకును వెదకటానికి పట్టణానికి పలువురు గూఢచారులను పంపారు. వారికి నీ కొడుకు కనపడలేదని తెలిసి, పాండవులు నీ కుమారుడు ఉన్నచోటు తెలియనందున చింతిస్తూ ఉన్నారు. అపు డా బోయలు భీముడి సేవకులను ప్రక్కకు త్రోసికొంటూ వెళ్ళి నగరులోనికి వెళ్ళిచూచి, ఆ దుర్యోధను డా కొలనులో ఉండటం తెలిపి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **తమవిన్నమాట లన్నియుఁ । గ్రమమునఁ జెప్పిన నతండు గడుఁ బ్రియమున న**
**ర్థము లొసఁగె వారికి ననే । కములు వహింపంగఁ గొలఁది గాకుండంగన్. 40**

**ప్రతిపదార్థం:** తమ విన్న మాటలన్నియున్= తాము విన్నట్టి మాటలన్నీ (కృపాదులతో దుర్యోధనుడు మాటాడిన మాటలు); క్రమమునన్ చెప్పినన్= వరుసగా చెప్పగా; అతండు= ఆ భీముడు; కడున్= మిక్కిలి; ప్రియమునన్= ప్రీతితో; వారికిన్= ఆ బోయలకు; అనేకములు= చాలా; వహింపఁగన్= మోయగా; కొలదిగాకుండంగన్= సాధ్యం కానట్లుగా; అర్థములు= ధనములు; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** బోయలు తాము విన్న మాటలన్నీ భీముడికి వరుస తప్పకుండా చెప్పారు. అందు కాతడు మెచ్చి, వారు మోయలేనన్ని బరువైన బహుమతులను ఇచ్చాడు.

**వ.** **ఒసంగి యా లుబ్ధకుల నగ్రజుఁ గానిపించి 'దేవా! దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబున నొక్కక్షుద్రవిద్యంజేసి జలంబులు నిజశరీరంబు సోఁకకుండునట్లుగాఁ జేసికొని డాఁగియున్నవాఁడు; వీ రెఱింగి వచ్చి'రని యతనికి విన్నవించి, యా సుయోధనగురునందనాదుల సల్లాపంబు లెఱిఁగించిన, నతండు పరమహర్షంబున నా బోయలకు బహువిధంబు లగు పసదనంబు లిచ్చి తక్కిన తమ్ములకును గృష్ణునకుఁ జెప్పికొని వారును సకలబంధు మిత్రపరిజనంబులును దోడన చనుదేర నుద్దామగమనంబున. 41**

**ప్రతిపదార్థం:** ఒసంగి= ఇచ్చి; ఆ లుబ్ధకులన్= ఆ బోయలను; అగ్రజున్+కానిపించి= తన అన్నఅగు ధర్మరాజునకు చూపి; దేవా!= స్వామి!; దుర్యోధనుండు; ద్వైపాయనహ్రదంబునన్= ద్వైపాయనమనే కొలనులో; ఒక్కక్షుద్రవిద్యన్+చేసి= ఒకానొకనీచమైన విద్యవలన; జలంబులు= నీళ్ళు; నిజశరీరంబు సోకకుండునట్లుగాన్= తన ఒడలికి తాకకుండే విధంగా; చేసికొని; డాఁగి= దాగికొని; ఉన్నవాఁడు; వీరు+ఎఱింగి వచ్చిరి= వీరు తెలిసికొని వచ్చారు; అని= అంటూ; అతనికిన్ విన్నవించి; ఆ సుయోధన గురునందనాదుల సల్లాపంబులు= ఆ దుర్యోధనాశ్వత్థామాదుల మాటలు; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= ధర్మజుడు; పరమ హర్షంబునన్= మిక్కిలి ఆనందంతో; ఆ బోయలకు; బహువిధంబులు+అగు= అనేక రకాలయిన; పసదనంబులు+ఇచ్చి= బహుమానాలు ఇచ్చి; తక్కిన తమ్ములకును= మిగిలిన తమ్ములకును (అర్జున; నకుల, సహదేవులకు); కృష్ణునకునన్+చెప్పికొని= కృష్ణుడికి కూడ తెలియచేసి; వారును= వారందరూ; సకల బంధుమిత్ర పరిజనంబులును= బంధువులూ, స్నేహితులూ, సేవకులూ - అందరును; తోడన చనుదేరన్= వెంట బయలుదేరగా; ఉద్దామ గమనంబునన్= త్వరితమైన నడకతో.

**తాత్పర్యం:** (ఆ బోయలకు బహుమానములిచ్చి) ఆ కిరాతకులను ధర్మజుడికి చూపి, 'దేవా! దుర్యోధనుడు ద్వైపాయన హ్రదంలో దాగి ఉన్నాడు. ఒకానొక క్షుద్రవిద్య కారణంగా అతడి శరీరానికి నీరు తగలకుండా ఉన్నాడు. ఈ సంగతి నీకు తెలపటానికి వీరు వచ్చారు' అని అనగా ఆతడు వారు చెప్పిన వార్తను విని సంతోషించి, వారిని సత్కరించి, తక్కిన తమ్ములకు కృష్ణుడికి ఆ విషయాన్ని చెప్పి సమస్త బంధుమిత్రులతో వేగంగా వెళ్ళుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **తురగ ఖురపుటరథనేమికరిపదాతి । ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ**
**పణవనిస్సాణ కాహళ రణన మెల్ల । దెసలఁ బరఁగంగ వచ్చె నద్దెసకునధిప!** **42**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; తురగఖురపుట= గుర్రాల డిప్పల వంటి గిట్టల; రథనేమి= రథచక్రాల పట్టాల; కరి= ఏనుగుల; పదాతి ఘట్టనంబులన్= కాల్బలాల తాకిడి వలనను; నేల; గ్రక్కదలన్= మిక్కిలిగా కదలగా; శంఖ= శంఖముల; పణవ= తప్పెటల; నిస్సాణ= నిస్సాణముల (చర్మవాద్యాల); కాహళ= కాహళములనే వాద్యాల; రణనము= చప్పుడు; ఎల్లదెసలన్= అన్ని దిక్కులా; పరఁగంగన్= వ్యాపించగా; ఆ+దెసకున్= ఆ వైపునకు; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** చతురంగ బలాల ఒత్తిడికి భూమి అదరుతూ ఉండగా, ఆ సమయంలో వివిధ వాద్యాల ధ్వనులు అన్ని దిక్కులా వ్యాపిస్తూ ఉండగా ధర్మరాజు ఆ వైపు వచ్చాడు.

**వ.** **అట్లు ధర్మనందనుం డేతెంచు కలకలం బాలకించి యంతకమున్ను రణోత్సాహంబునకై రాజు నిర్బంధించు చున్న యగ్గురుపుత్రకృతవర్ము లతనితో నిట్లనిరి.** **43**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ధర్మనందనుండు= ధర్మరాజు; ఏతెంచు= వస్తున్న; కలకలంబు+ఆలకించి= శబ్దమును విని; అంతకున్ మున్ను= అంతకంటె ముందుగా; రణోత్సాహంబునకై= యుద్ధంమీది ఆసక్తితో; రాజున్= దుర్యోధనుడిని; నిర్బంధించుచున్న= తొందర చేస్తున్న; ఆ+గురుపుత్ర= అశ్వత్థామ; కృపకృతవర్మలు= కృపుడును, కృతవర్మయు; అతనితోన్ ఇట్లు+అనిరి= ఆ దుర్యోధనుడితో ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** ధర్మరాజు వస్తున్న కోలాహలాన్ని విని అంతకుముందు దుర్యోధనుడిని యుద్ధోత్సాహంతో నిర్బంధిస్తున్న అశ్వత్థామ కృప కృతవర్మలు ఇట్లా అన్నారు.

**మ.** **'ధరణీనాయక! పాండుపుత్రులు సముద్దామోద్ధతిన్ వీరె వ**
**చ్చిరి వీరిన్ వడిఁ గిట్టి తాఁకుదమొ? నీచిత్తంబు పోరాటకుం**
**జొరదే నిప్పటికిం దొలంగి చని యెచ్చోనైన నేముండి చె**
**చ్చెర రూపించినవేళఁ జెప్పినెడకుం జేరంగ నేతెంతుమో?'** **44**

**ప్రతిపదార్థం:** ధరణీనాయక!= ఓ రాజా!; పాండుపుత్రులు= పాండురాజు కుమారులు; సముద్దామ+ఉద్ధతిన్= నిరంకుశమైన పొగరుతో; వీరె వచ్చిరి= ఇదిగో ఇప్పుడే వచ్చారు; వీరిన్= ఈ పాండవులను; వడిన్= త్వరగా; కిట్టి తాఁకుదమొ?= సమీపించి యుద్ధం చేద్దామా?; నీ చిత్తంబు= నీ మనస్సు; పోరాటకున్+చొరదేన్= యుద్ధాని కిష్టపడకుంటే; ఇప్పటికిన్+తొలంగి చని= ఇప్పటికి తొలగిపోయి; ఏ+చో(ట)నైనన్= ఎక్కడనైనా; ఏము+ఉండి= మేముండి; చెచ్చెరన్= త్వరగా; రూపించినవేళన్= నిర్ణయించిన సమయానికి; చెప్పిన+ఎడకున్= నిర్ణయించిన చోటికి; చేరంగన్= చేరగా; ఏతెంతుమో?= వచ్చెదమా?

**తాత్పర్యం:** 'ఓ రాజా! పాండవులు పెరిగిన దర్పంతో అడ్డులేని ఆటోపంతో వచ్చారు. వారిని ఎదుర్కొని యుద్ధం చేద్దామా? లేక ఇప్పటికి తొలగిపోయి, ఎక్కడైనా దాగి, అదను చూచి నిర్ణయించిన చోటికి చేరుదామా?'

**ఆ. అనుడు నా నృపాలుఁ డయ్యోధవరులతో । 'నిప్పు డనికి నుత్సహింప కెచటి**
**కేనిఁ దొలఁగిపోయి యిచటికి మగుడంగ । రండు పగలు సనిన రాత్రి యగుడు. 45**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; ఆ నృపాలుఁడు= ఆ రాజు(దుర్యోధనుడు); ఆ+యోధవరులతోన్= ఆ సైనికముఖ్యులతో; ఇప్పుడు+అనికిన్= ఇపుడు యుద్ధానికి; ఉత్సహింపక= ఉత్సాహం చూపక; ఎచటికిన్+ఏనిన్= ఎక్కడికైనా; తొలఁగిపోయి= తప్పించుకొనిపోయి; పగలు+చనినన్= పగలుపోగా(వెలుతురుపోగా); రాత్రియగుడున్= రాత్రికాగా; మగుడంగన్= మరల; ఇచటికిన్ రండు= ఇక్కడకు రండి.

**తాత్పర్యం:** (వారిమాటకు) ఆ దుర్యోధనుడు ఆ సేనా ముఖ్యులతో (అశ్వత్థామ, కృపకృతవర్మలతో) 'ఇపుడు యుద్ధాసక్తిని చూపకుండా ఎక్కడికైనా వెళ్ళి, పగలు గడచి రాత్రి వచ్చినప్పుడు మరల రండి' అని అన్నాడు.

**వ. వారు వారణపురంబున కనివారణఁ బోయెదరు; వోవుదురు గాక యిచ్చేరువఁ బోయిరేనియు ని మ్మడువున నాయునికి యెఱుంగలే; రట్లు గాక యెఱింగిరేనియు నన్నుఁ జేరరాదు; మదీయ విద్యా విశేషసంస్తంభితాంభో దుర్గంబున నిర్భయుండ నై యుండెదఁ బొం' డనినం బొగులు మనంబులతోడ నా రథికజనంబులు వోవం బతి జలంబులు శిలాసదృశంబులుగాఁ బరిస్తంభించె; నేనును బాండుసూనుల చారు లెల్లకడల మెలంగుటం జేసి రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గా దనియు నతనితోయస్తంభవైదగ్ధ్యం బెఱుంగుట నొలసిన యూఱటను ముందటియట్ల వారలతోడం జని చని చిత్తంబు గలంగినం జాలక యరదంబు డిగ్గి యచ్చట నొక్కయెడ నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడువు నఱుత నొక్కపఱపు గలపాదయీఱమిం దూఱి పొంచియుండితి; వారలు దూరంబు సని యొక్క విపులవటంబు పొంత విశ్రాంతి నొంది నీనందను వలనికిం జనిన హృదయంబులతోఁ దదీయకార్యచింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధ సంభాషణంబులు సేయు చుండి రక్కడ. 46**

**ప్రతిపదార్థం:** వారు= ఆ పాండువులు; వారణపురంబునకున్= హస్తిపట్టణానికి; అనివారణన్= తప్పనిసరిగా; పోయెదరు= వెళ్ళెదరు; పోవుదురుగాక!= పోతారుకాక!(పోతే పోయారు); ఈ+చేరువన్= ఈప్రక్కగా; పోయిరి+ఏనియున్= పోయినను; ఈ+మడువునన్= ఈ కొలనులో; నా+ఉనికి= నేనుండుట; ఎఱుంగలేరు= తెలియలేరు; అట్లుగాక ఎఱింగిరేనియున్= ఆ విధంగా కాకుండా తెలిసినట్లయినా; నన్నున్+చేర రాదు= నా దగ్గరకు వచ్చుటకు వీలుకాదు; మదీయ= నాయొక్క; విద్యావిశేష= విద్యాధిక్యముచే; సంస్తంభిత+అంభోదుర్గంబునన్= స్తంభింపజేయబడిన ఈ జలదుర్గంలో; నిర్భయుండను+ఐ ఉండెదన్= భయం లేకుండా ఉంటాను; పొండు= మీరు వెళ్ళండి; అనినన్= అనగా; పొగులు మనంబులతోన్= కుమిలే మనసులతో; ఆ రథికజనంబులు= ఆ వీరులు; పోవన్= వెళ్ళగా; పతి= రాజు(దుర్యోధనుడు); జలంబులు= నీటిని; శిలాసదృశంబులుగాన్= రాళ్ళవలె; పరిస్తంభించెన్= స్తంభింపజేశాడు; ఏనును= నేనును(సంజయుడు); పాండుసూనుల చారులు= పాండవుల వేగులు; ఎల్ల+ఎడలన్= అంతటనూ; మెలంగుటన్+చేసి= తిరగటంవలన; రాజును= దుర్యోధనుడిని; అప్పుడు; వెలువరించుట= బయలు చేయటం; కర్జంబుకాదు+అనియున్= సరిఅయిన పని కాదనియు; అతని తోయ స్తంభవైదగ్ధ్యంబు+ ఎఱుంగుటన్= వాని జలస్తంభన విద్యా నైపుణ్యాన్ని తెలిసిఉండటంవలన; ఒలసిన ఊఱటను= కలిగిన ఓర్మిచే; ముందటి+అట్లు=

వెనుకటి మాదిరిగానే; వారలతోడన్+చని చని= వారి వెంట వెళ్ళి వెళ్ళి; చిత్తంబు+కలంగినన్= మనసు కలతపడగా; చాలక= శక్తిలేక; డిగ్గి= దిగి; అచ్చటన్; ఒక్క+ఎడన్= ఒక చోట; ఒదిఁగి నిలిచెదన్= దాగి ఉంటాను; అని; వారలకున్+చెప్పి= వారికి చెప్పి; ఆ+మడువు+అఱుతన్= ఆ కొలను సమీపాన; ఒక్కపఱపుకల= బాగా విస్తరించిన; పొద+ఈఱమిన్+దూరి= పొద జొంపంలో దూరి; పొంచి+ఉండితిన్= పొంచి ఉన్నాను; వారలు దూరంబు+చని= వారు దూరంగా వెళ్ళి; ఒక్క; విపుల= విస్తారమైన; వటంబు పొంతన్= మర్రిచెట్టు సమీపాన; విశ్రాంతిన్+ఒంది= అలసట తీర్చుకొని; నీనందనువలనికిన్+చనిన= నీ కుమారుని ప్రక్కకు ప్రసరించిన; హృదయంబులతోన్= మనసులతో; తదీయ కార్య చింతాభరంబు= అతడి వైపు వెళ్ళిన ఆలోచనల బరువును; పట్టుకొనన్= పట్టుకోగా; తదనుబంధ సంభాషణంబులు చేయుచుండిరి= దానికి సంబంధించిన మాటలు మాట్లాడుతూ ఉన్నారు.

**తాత్పర్యం:** 'ఆ పాండవులు తప్పకుండా హస్తినకు వెళ్ళితే వెళ్ళుతారు. ఈ ప్రక్కకు వచ్చినప్పటికిని ఈ కొలనులో నేను ఉండటం తెలిసికోలేరు. ఒకవేళ తెలిసికొన్నా నన్ను చేరలేరు. నా విద్యా వైదుష్యంతో స్తంభింపజేయబడిన ఈ జలదుర్గంలో నిర్భయంగా ఉండగలను. పొండి' అనగా ఆ రథికులు దిగులు గుండెలతో వెళ్ళారు. దుర్యోధనుడు జలాలను శిలలతో పోలే విధంగా స్తంభనవిద్యను పాటించి జలంలో ప్రవేశించాడు. పాండవుల గూఢచారులు నలుమూలలా తిరుగుతుండటంచేత అతడిని బయలు వెలువడేటట్లు చేయటం తగినపనికాదని భావించి, అతడి జలస్తంభన విద్యాపాండిత్యం తెలిసి ఉండటంచేత నేను ఊరట చెందాను. ముందటివలెనే రథికత్రయంతో కలిసి కొంతదూరం వెళ్ళాను. కాని, నా మనసు కలతపడటంతో నిలువలేక రథందిగి, అక్కడే ఒకచోట ఒదిగి ఉంటా' నని చెప్పి ఆ సరోవర సమీపంలోని ఒక పొదలో దాగి పొంచి ఉన్నాను. వారు దూరంగా వెళ్ళి, ఒక మర్రిచెట్టు క్రింద విశ్రాంతి తీసికొని బరువైన గుండెలతో నీ కుమారుడి పనికి సంబంధించిన మాటలు మాట్లాడుతున్నారు. ఇక ఇక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కలకల నవ్వుచుఁ బెలుచం । బలుకుచుఁ దమకెలఁకులందుఁ బాంచాలకుమా**
**రులు సనుదేరఁగఁ బాండుసు । తులు వచ్చిరి సంతసంబుతో మడువునకున్. 47**

**ప్రతిపదార్థం:** కలకలనవ్వుచున్= గలగల నవ్వుతూ; పెలుచన్+పలుకుచున్= పెద్దగా మాట్లాడుతూ; తమ కెలఁకులందున్= తమ ప్రక్కలలో; పాంచాలకుమారులు చనుదేరఁగన్= పాంచాలరాజ కుమారులు రాగా; పాండుసుతులు= పాండురాజు కుమారులు; సంతసంబుతోన్, మడువునకున్+వచ్చిరి= ఆనందంతో కొలను దగ్గరకు వచ్చారు.

**తాత్పర్యం:** పాంచాలరాజు కుమారులు తమతో వస్తూ గలగల నవ్వుతూ, ఉచ్చైఃస్వరంతో మాట్లాడుతూ రాగా పాండురాజు కుమారులు సంతోషంతో ఆ కొలనువద్దకు వచ్చారు.

**వ. ఇట్లు వచ్చి ధర్మతనయుండు భవత్తనయమాయాస్తంభితం బైన యాజలాశయంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన ని ట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** ఇట్లు వచ్చి= పై విధంగా వచ్చి; ధర్మతనయుండు= ధర్మరాజు; భవత్+తనయ= నీ కుమారుడి; మాయా స్తంభితంబు+ఐన= మాయచేత కట్టివేయబడిన; ఆ జలాశయంబున్= ఆ మడుగును; నిరూపించి= చూచి; తద్+ప్రకారంబు+ ఎఱింగించి= అదిఉన్న విధమును తెలిపి; అచ్యుతునితోన్= శ్రీకృష్ణుడితో; అల్లనన్= మెల్లగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ విధంగా వచ్చి ధర్మరాజు నీకుమారుడు మాయచేత స్తంభించేటట్లు చేసిన ఆ నీటిమడుగును చూచి, అది ఉండే తీరు చెప్పి, నెమ్మదిగా శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు:

**క. 'చొరరాదు మనుజులకు నె । వ్వరికిని నిజ్జలము కౌరవక్షితిపతి ని**
**ర్భరమాయా సంరక్షా । భరితం బై; కాన వీతభయుఁ డాతండున్.' 49**

**ప్రతిపదార్థం:** మనుజులకున్= మానవులకు; ఎవ్వరికిని; ఈ+జలము= ఈ నీరు; కౌరవక్షితిపతి= కౌరవరాజు(దుర్యోధనుడు); నిర్భర మాయాసంరక్షాభరితంబు+ఐ= అధికమగు మాయచేత కాపాడబడుతున్నదై(ఉండటంచేత); చొరరాదు= ప్రవేశింపసాధ్యం కాదు; కాన= కనుక; ఆతండున్= ఆతడు; వీతభయుఁడు= భయము లేనివాడు.

**తాత్పర్యం:** 'మానవులు ఎవరూ చొరరాని ఈ నీరు దుర్యోధనుడి పెనుమాయచేత కాపాడబడుతున్నది. కనుక ఆతడు భయం లేకుండా ఇందున్నాడు.

### ధర్మరాజు మడుగున డాఁగియున్న దుర్యోధనుని దూఱనాడుట (సం. 9-30-6)

**క. అని వెండియు నాపతి గురు । జననాథుగుఱించి పలుకు 'శక్రుఁడు దోడై**
**చనుదెంచె నేని పోవ । చ్చునె నాచేఁ దప్పి యిందుఁ జొచ్చినఁ దనకున్?' 50**

**ప్రతిపదార్థం:** అని వెండియున్+ఆ పతి= అని మరల ఆ రాజు(ధర్మరాజు); కురుజననాథుగుఱించి= దుర్యోధనుడిని గూర్చి; పలుకున్= చెప్తున్నాడు; ఇందు చొచ్చినన్= ఈ మడుగులో దాగినను; తనకున్= దుర్యోధనుడికి; శక్రుఁడు= ఇంద్రుడు; తోడై చనుదెంచెను+ఏని= ఇంద్రుడు తోడుగా వచ్చినప్పటికిని; నాచేన్+తప్పి= నానుండి తప్పించుకొని; పోవచ్చునె?= పోనగునా?;

**తాత్పర్యం:** అంటూ ధర్మరాజు దుర్యోధనుడిని గూర్చి ఇట్లా అన్నాడు. 'మడుగులో దాగికొన్నా, దేవేంద్రుడు సహాయపడినా ఇతడు నా నుండి తప్పించుకొనటం సాధ్యం కాదు'

**వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున నిట్లనియె. 51**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విన్నవాడై; అచ్యుతుండు+అతనికిన్= శ్రీకృష్ణుడు ఆతడితో(ధర్మజుడితో); అల్పస్వరంబునన్= మెల్లని గొంతుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అనగా విన్న శ్రీకృష్ణు డా ధర్మజుడితో మెల్లని గొంతుతో ఇట్లా అన్నాడు:

**ఉ. 'మాయలు గల్గు దుష్టులకు మాయపుభంగులె మందు గాక ని**
**ర్మాయత నుల్లసిల్లెడు పరాక్రమ లీలలు గొల్చు నెట్లు? దై**
**తేయులు దొల్లి మాయల నతిప్రబలాత్మకు లైనఁ దద్వధో**
**పాయములన్ జయింపరె నృపాలక! విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 52**

**ప్రతిపదార్థం:** నృపాలక!= ఓ రాజా!; మాయలు కల్గు దుష్టులకున్= మోసాలుచేసే దుర్మార్గులకు; మాయపు భంగులె= మోసపు విధానాలే; మందు= ప్రతిక్రియ; కాక= అట్లు కాక; నిర్మాయతన్+ఉల్లసిల్లెడు= మోసం లేకుండా ప్రకాశించే;

పరాక్రమలీలలు= శత్రువులను జయించే విధాలు; ఎట్లు గొల్చున్?= ఏ విధంగా తగుతాయి?; తొల్లి= పూర్వం; దైతేయులు= రాక్షసులు; మాయలన్= మోసాలతో; అతిప్రబల+ఆత్మకులైనన్= మిక్కిలి బలవంతులు కాగా; విష్ణుడు ఇంద్రుడున్+తగన్= విష్ణుడూ ఇంద్రుడూ తగు విధంగా; తద్+వధ+ఉపాయములన్= వారిని చంపే ఉపాయాలతో; జయింపరె?= జయించరా?

**తాత్పర్యం:** మాయాత్మకులైన దుర్మార్గులకు మోసపు పద్ధతులే మందు. మాయతో కాకుండా విరోధులను జయించటం ఏ విధంగా సాధ్యం అవుతుంది? మిక్కిలి బలవంతులైన దైత్యులను విష్ణుడు, ఇంద్రుడు మాయోపాయాలతో జయించలేదా?

**వ. హిరణ్యకశిపు వృత్రవధ ప్రకారంబు వినమె? రావణుండు హోమాదిమాయాక్రియావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపంబడె? నరకాసుర నేను బరిమార్చిన తెఱం గెఱుంగవే? వీఁడగపడునట్టి విధంబు సూచికొ' మ్మనిన విని యప్పాండవాగ్రజుండు జలాంతర్గతుం డై యున్న భవన్నందను నుద్దేశించి యిట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** హిరణ్యకశిపు= హిరణ్యకశిపుడియొక్క; వృత్రవధ= వృత్రాసురుడిని చంపిన; ప్రకారంబులు= పద్ధతులు; వినమె?= వినలేదా? రావణుండు? హోమ+ఆది= హోమము మొదలయిన; మాయాక్రియా= మోసపు చేష్టల; విఘాతంబులనన్+ కాదె?= అడ్డంకులవలన కాదా?; రాముచేతన్= శ్రీరాముడిచేత; నిర్జింపంబడియెన్?= సంహరింపబడ్డాడు?; నరకాసురునిన్; నేను; పరిమార్చిన= చంపిన; తెఱంగు= విధం; ఎఱుంగవే?= తెలియవా?; వీఁడు= దుర్యోధనుడు; అగపడునట్టి= కనపడే; విధంబు= పద్ధతి; చూచికొమ్ము= ఏర్పరచుకొనుము(వెదకుము); అనినన్= అనగా; విని= విన్నవాడై; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడు(ధర్మరాజు); జలాంతర్గతుండై యున్న= నీటిలో ఉన్న; భవత్+నందనున్= నీ కుమారుడిని; ఉద్దేశించి= లక్షించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** 'హిరణ్యకశిపు వృత్రాసురులను చంపిన విధం వినలేదా? రావణాసురుడు కావించిన హోమాది మాయల విఘాతంవలన కదా శ్రీరాముడిచేత హతమార్చబడ్డాడు? నేను నరకాసురుడిని చంపిన పద్ధతి నీకు తెలియదా? (కనుక) దుర్యోధనుడు దొరకే పద్ధతిని ఎన్నుకొనుము' అనగా ధర్మరాజు నీటిలో ఉన్న నీ కుమారుడిని పేర్కొని ఇట్లా అన్నాడు:

**చ. 'ఇటు తగునే సుయోధన! మహీవలయంబున నిట్టిదైన్య మె**
**చ్చట వినఁ జూడఁ గల్గెనె? యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ**
**చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు త్రుం**
**గుటయును జూచి; తేమిటికిఁ గ్రుంకితి నీళ్లను? జావు దప్పనే? 54**

**ప్రతిపదార్థం:** సుయోధన!= ఓ దుర్యోధనా!; ఇటు తగునే?= ఇట్లుండవచ్చునా?; మహీవలయంబునన్= భూగోళంలో; ఇట్టి దైన్యము= ఇటువంటి దీనావస్థ; ఎచ్చటన్= ఏ చోటా; వినన్+చూడన్+కల్గెనె!= వినలేదు, చూడలేదు కదా!; అసంఖ్యులు= లెక్కపెట్టలేనంతమంది; రాజులు; నీకున్+కాఁగన్= నీ కొరకు; చచ్చుటయును= చనిపోవటమూ; బంధుమిత్రులు= బంధువులు, స్నేహితులు; విశుద్ధచరిత్రులు= మంచి పేరున్నవారు; పోరన్= యుద్ధంలో; అట్లు త్రుంగుటయును= ఆ విధంగా చనిపోవటమూ; చూచితి(వి)= చూచావు; ఏమిటికిన్= ఎందుకై; నీళ్ళను= నీటిలో; క్రుంకితి(వి)?= మునిగావు?; చావు= చనిపోవటం; తప్పునే?= తప్పిపోతుందా?

**తాత్పర్యం:** 'దుర్యోధనా! లోకంలో ఇట్టి నీచమైన స్థితి నీకు తగునా? నీకై అనేకులు రాజులు చనిపోవటం, లెక్కపెట్టరానంతమంది బంధుమిత్రులు చనిపోవటం చూచావు. నీళ్ళలో ఎందుకు మునిగి దాగి ఉన్నావు? అంతమాత్రాన చావు తప్పుతుందా?

**ఉ. శూరుఁడ వండ్రు నిన్ మడువు సొచ్చుట శౌర్యముచొప్పె? మాన మే**
**యూరికిఁ బోయె? నాజి నృపు లోడుదురే? నృపుఁ డున్న మాత్రయే?**
**కౌరవవంశజాతుఁడవు గష్టపుఁ జచ్చుట దెచ్చుకొంటి; నీ**
**పేరును బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే? 55**

**ప్రతిపదార్థం:** శూరుడవు+అంద్రు నిన్= నిన్ను శౌర్యంకలవాడ వంటారు; మడువు చొచ్చుట= నీటిమడుగులో దూరటం; శౌర్యము చొప్పె?= పరాక్రమ ధర్మమా?; మానము+ఏ ఊరికిన్+పోయెన్?= నీ అభిమానం ఏ ఊరికి పోయింది?; (నీ అభిమానం చచ్చిందా?); ఆజిన్= యుద్ధంలో; నృపులు= రాజులు; ఓడుదురే?= వెనుకంజవేయుదురా?; నృపుఁ డన్న మాత్రయే?= నీకు కేవలం రాజమాత్రుడవా? (సామాన్యరాజువా?); కౌరవవంశజాతుఁడవు= కురువంశంలో పుట్టావు; కష్టపున్+చచ్చుట= నీచంగా చావటం; తెచ్చుకొంటి(వి)= తెచ్చుకొన్నావు; నీ పేరును పెంపు మాలి= నీ కీర్తి గొప్పతనం పోగా; అరిబృందము= వైరి సమూహం; నవ్వఁగన్= ఎగతాళి చేసి నవ్వగా; ఇట్లు చేయుదే?= ఈ విధంగా చేస్తావా?

**తాత్పర్యం:** దుర్యోధనా! నిన్ను శూరు డంటారు. నీ వీ కొలనులో దూరటం వీరధర్మమా? నీ అభిమానం ఏ ఊరికి పోయింది? యుద్ధంలో రాజులు వెనుకంజ వేస్తారా? నీవు సాధారణమైన రాజువా! కౌరవవంశంలో పుట్టావు. నీచమైన చావును తెచ్చుకొన్నావు. నీ కీర్తినీ, గొప్పతనాన్నీ వదలి శత్రుసమూహం నవ్వేటట్లు ఈ విధంగా చేస్తావా?

**తే. క్షత్త్రధర్మంబు విడిచినఁ గలదె యిహము । బరముఁ? బేరోలగంబునఁ బలుకుపలుకు**
**లెల్ల మఱచితె? విను మవి పొల్లు లైనఁ । గష్టపాటు గా కుసు ఱేల గావ వచ్చు? 56**

**ప్రతిపదార్థం:** క్షత్త్రధర్మంబు= రాజుధర్మం; విడిచినన్= వదలితే; ఇహమున్ పరమున్ కలదె?= ఈ లోకములో గాని, ఊర్ధ్వలోకంలో గాని సుఖం ఉన్నదా?; పేరు+ఓలగంబునన్= పెద్దసభలో; పలుకు పలుకులు+ఎల్లన్= (ప్రేలిన ప్రేలాపనలు) మాటాడినమాటలన్నీ; మఱచితె?= మరచావా?; అవి= ఆ పలుకులు; పొల్లులు+ఐనన్= వ్యర్థములయితే; కష్టపాటు+కాక= కష్టంకలుగుతుందే కాని; ఉసుఱు= ప్రాణం; ఏల= ఎందుకు; కావన్+వచ్చున్= రక్షిస్తాయి? (రక్షించవనుట.)

**తాత్పర్యం:** రాజధర్మం వదిలితే ఇహపరా లుంటాయా? పెద్దసభలో ప్రేలిన ప్రేలాపనలు మరచావా? వినుము. వ్యర్థమైన కష్టమే కాక ఆ మాటలు ప్రాణాలను ఏ విధంగా కాపాడుకొనవచ్చును?

**చ. కొడుకులు దమ్ములుం గలన ఘోరపుఁ జావులు సావఁ జూచి యె**
**ట్లొడఁబడె నీదుబుద్ధి యొడ లోముట కై? విను రాజరాజ! యి**
**మ్మడువున కీడ్చి తెచ్చె విధి; మానము ప్రాణముకంటెఁ జాల నె**
**క్కు డగుట సెప్పఁగా వినవొకో? కడునీచతఁ బొంది తక్కటా! 57**

**ప్రతిపదార్థం:** రాజరాజ!= రారాజా!; కొడుకులు తమ్ములున్= కుమారులు, తమ్ముళ్ళు; కలనన్= యుద్ధంలో; ఘోరపు చావులు చావన్+చూచి= భయంకరమయిన చావులు చావగా చూచి; నీదు బుద్ధి= నీ తెలివి; ఒడలు+ఓముటకై= శరీరాన్ని

కాపాడుకొనుటకై; ఎట్లు+ఒడఁబడెన్?= ఏ విధంగా ఒప్పుకొన్నది?; విధి= దైవం; నినున్= నిన్ను; ఈ+ మడువునకున్+ ఈడ్చితెచ్చెన్= ఈ కొలనిలోనికి ఈడ్చుకొని తెచ్చింది; మానము= అభిమానం; ప్రాణముకంటెన్= ప్రాణంకన్నా; చాలన్= మిక్కిలి; ఎక్కుడు+అగుట= ఎక్కువ కావటం; చెప్పఁగాన్= (లోకంలో) చెప్పుకోగా?; వినవు+ఒకో?= వినలేదా?; అక్కటా!= అయ్యో!; కడున్= మిక్కిలి; నీచతన్= నికృష్టతను; (దైన్యమును); పొందితి(వి)= పొందావు.

**తాత్పర్యం:** కుమారులు, తమ్ములు యుద్ధంలో భయంకరంగా చనిపోగా చూచిన నీ బుద్ధి శరీరాన్ని కాపాడుకొనటం కొరకు ఎట్లా ఒప్పుకొన్నది? రారాజా! దైవం ని న్నీ మడుగున కీడ్చి తెచ్చింది. అభిమానం ప్రాణంకంటే గొప్ప అని అనటం వినలేదా? మిక్కిలి నీచత్వాన్ని పొందావు.

**శా.** **అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహాగర్వ దుర్వారసం**
**రంభం బోర్వక డాఁగి యుండె నట రారా జిస్సిరో! చచ్చుచో**
**గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దోర్గర్వంబు బెండయ్యెనే?**
**శుంభన్మానము దూలెఁగా కని జనస్తోమంబు నిందింపదే?** **58**

**ప్రతిపదార్థం:** రారాజు= దుర్యోధనుడు; పాండుసుత= పాండురాజ కుమారుల; బాహాగర్వ= భుజాల దర్పంయొక్క; సంరంభంబు+ఓర్వక= విజృంభణాన్ని సహించలేక; అంభస్+గర్భము+చొచ్చి= నీటిలోపలకు ప్రవేశించి; డాఁగిఉండెను+అట= దాగిఉన్నాడట; ఇస్సిరో!= ఛీ!; చచ్చుచోన్= చనిపోయేటపుడు; గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి= గంభీరతను, ధైర్యమును వదలి; దోర్గర్వంబు= భుజాబలము; బెండు+అయ్యెనే?= నిస్సారమైపోయిందా?; శుంభత్+మానము= వికాసవంతమయిన అభిమానం; తూలెన్+కాక= పోయింది కదా; అని= అంటూ; జనస్తోమంబు= ప్రజల సమూహం; నిందింపదే?= దూషించదా?

**తాత్పర్యం:** రారాజు పాండురాజ కుమారుల భుజబల విజృంభణానికి తట్టుకొనలేక మడుగులో దాగినాడట! - అని ప్రజలు ఛీకొట్టరా! చచ్చేటపుడు భుజబలదర్పం కూడా తొలగిపోయిందా! వికాసంతో ఉండవలసిన అభిమానం నశించింది కాబోలు! అని అంటూ సమస్త జనులూ నిన్ను దూషించరా?

**తే.** **కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ । దలఁచి వారలఁ గొని మమ్ము గెలుచువాఁడ**
**వై మనంబున శంకింప కట్లు కీడు । చేసి తా తూఁపు దప్పిన గాసి యైతి.** **59**

**ప్రతిపదార్థం:** కర్ణ= కర్ణుడు; శకుని; దుశ్శాసనుల్= దుశ్శాసనుడు; ఘనులు కాఁగన్+తలఁచి= గొప్పవాళ్ళుగా తలచుకొని; వారలన్= వారలను; కొని= చేకొని; మమ్మున్ గెలుచు= మమ్ములను గెలువదలచిన; వాఁడవు+ఐ= వాడవయి; మనంబునన్= మనసులో; శంకింపక= అనుమానించక; అట్లు= ఆ విధంగా; కీడుచేసితి(వి)= ఆ విధంగా బాధపెట్టావు; ఆ తూఁపు తప్పినన్= ఆ పూనిక తప్పిపోగా; గాసి ఐతి(వి)= కష్టపడ్డావు.

**తాత్పర్యం:** కర్ణ శకుని దుశ్శాసనులను గొప్పవారిగా నమ్మి వారి సహాయంతో ఎట్టి అనుమానమూ లేకుండా మమ్మల్ని గెలుద్దామని ఆ విధమైన కీడును చేశావు. ఆ పూనిక తప్పగా కష్టపడుతున్నావు.

**వ.** **నీ కొలంది గంటి; మగపడితి; వింక నెందుఁ బోవచ్చు?' నని మఱియు ని ట్లనియె.** **60**

**ప్రతిపదార్థం:** నీ కొలందిన్+కంటిమి= నీ శక్తి గమనించాము; అగపడితివి= కనిపించావు; ఇంకన్ ఎందున్+పోవచ్చున్= ఇక ఎక్కడకు పోగలవు?; అని మఱియున్= అని ఇంకనూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** (దుర్యోధనా)! ఇప్పటి నీ శక్తి చూచాము. మాకు దొరికావు. ఇక ఎక్కడకు పోగలవు?' అని ఇంకా ఈ విధంగా అన్నాడు:

**మ.** **'భయముం బాయఁగఁ ద్రోచి వీరగుణముం బాటించి సంగ్రామని**
**శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁ జా వొండె గెల్పొండెఁ గా**
**క యధీరత్వము నాకు నీడె యని వీఁకం బేర్చి వే తాఁకు మెం**
**తయుఁ బే రయ్యెడు; రమ్ము లె; మ్మొదిఁగినన్ దైన్యమ్ము వచ్చుంజుమీ!'** **61**

**ప్రతిపదార్థం:** భయమున్+పాయఁగన్+త్రోచి= భయాన్ని పోద్రోలి; వీరగుణమున్+పాటించి= వీరత్వమును చూపించి; సంగ్రామ నిశ్చయ బుద్ధిన్+తలకొల్పి= యుద్ధం మీద స్థిరమయిన మనసు నిల్పి; పౌరుషముమైన్= మగతనంతో; చావు+ఒండెన్, గెల్పు+ఒండెన్= చావో బ్రతుకో ఏదో ఒక్కటియే; కాక= తప్ప; (అని); అధీరత్వము= ధైర్యం లేకుండటం; నాకున్ ఈడె అని= నాకు తగునా? అనుకొంటూ; వీఁకన్+పేర్చి= ధైర్యంతో విజృంభించి; వేతాఁకుము= వెంటనే ఎదుర్కొనుము; ఎంతయున్+ పేరు+అయ్యెడున్= ఎంతయినా పేరు వస్తుంది (కీర్తి వస్తుంది); రమ్మ= రా; లెమ్మ= లే; ఒదిఁగినన్= దాగుకొంటే; దైన్యమ్మ= దీనత్వము; వచ్చున్+చుమీ= వస్తుంది సుమా!

**తాత్పర్యం:** భయాన్ని వీడి, వీరత్వంతో స్థిరమైన మనసుతో యుద్ధానికి సిద్ధమై మగతనంతో చావో జయమో ఏదో ఒకటి అని నిశ్చయించి, ధైర్యమును వదలటం నాకు తగునా? అనుకొంటూ విజంభించి వెంటనే ఎదుర్కొనుము. నీకు పేరు ప్రతిష్ఠలు కలుగుతాయి. రమ్మ, లెమ్మ! దాగుకొంటే దీనత వస్తుంది సుమా!'

**చ.** **అని మము నోర్చినం బృథివి యంతయు నేలఁగ వచ్చు; నీవు చ**
**చ్చిన సురసద్మ సౌఖ్యములు చేకుఱు; రెండుదెఱంగులందు నొ**
**ప్పనియది లేదు డాఁగ నగుబాటును బ్రాణము చేటుఁ దెచ్చుకోల్**
**వినుఁ! మము నీ వెదుర్పఁ దగు వేయువిధంబులఁ జాటి చెప్పెదన్.** **62**

**ప్రతిపదార్థం:** అనిన్+మమున్+ఓర్చినన్= యుద్ధంలో మమ్మ ఓడిస్తే; నీవు; పృథివి+అంతయున్= భూమినంతటినీ; ఏలఁ గవచ్చున్= పాలించవచ్చును; చచ్చినన్= చనిపోతే; సురసద్మసౌఖ్యములు= స్వర్గసుఖాలు; చేకుఱున్= కలుగుతాయి; రెండు తెఱంగులందున్= ఈ రెండు పద్ధతులలో; ఒప్పని+అది లేదు= సరికానిది లేదు; డాఁగన్= దాగికొనగా; నగుబాటును= అవమానమును; ప్రాణము చేటు తెచ్చుకోల్= ప్రాణనష్టమును తెచ్చుకొనటమును; మమున్+నీవు+ఎదుర్పన్+తగున్= మమ్మ నీవు యుద్ధంలో ఎదుర్కొనటం తగిన పని; వేయు విధంబులన్= వేయివిధాలుగా; చాటిచెప్పెదన్= చాటింపువేసినట్లు చెప్పుతున్నాను; విను= వినుము.

**తాత్పర్యం:** నీవు యుద్ధంలో మమ్మ ఓడించినట్లయితే భూమండలమంతా పరిపాలింపవచ్చును. లేదా చనిపోతే స్వర్గలోకసుఖాలు పొందవచ్చును. ఈ రెండు పద్ధతులూ సరిఅయినవే. దాగుకొంటే అవమానం, ప్రాణాల పైకి తెచ్చుకొనటం ఔతుంది. నీవు మమ్మ యుద్ధంలో ఎదుర్కొనటం యుక్తం. నా మాట వినుము. వేయి విధాలుగా చాటింపు వేసినట్లు చెపుతూ ఉన్నాను.

**వ.** **తెంపు చేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించిన పరమధర్మంబు; పురుషుండ వైతేని దీని ననుష్ఠింపు' మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుం డి ట్లనియె.** **63**

**ప్రతిపదార్థం:** తెంపు చేసిన మా మీఁదన్+ఉఱుకుట= మా పైకి సాహసంతో దూకడము; ధాత= బ్రహ్మ; నీకు నిర్మించిన= నీకు ఏర్పరచిన; పరమధర్మంబు= శ్రేష్ఠమయిన ధర్మం; పురుషుండవు+ఐతి(వి)+ఏని= మగవాడవైనట్లయితే; దీనిన్+ అనుష్ఠింపుము= దీనికి ఆచరింపుము; అనినన్ విని= అనగా విని; ఆ+వసుమతీశునకున్= ఆ రాజుతో(ధర్మరాజుతో); సుయోధనుండు+ఇట్లనియెన్= దుర్యోధను డీ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సాహసంతో మా మీదికి యుద్ధానికి దూకటమే బ్రహ్మ నీకు నిర్ణయించిన ధర్మం. దీనిని ఆచరించుము. మగటిమి కలవాడ వయితే దీనిని చేయుము.' అని ధర్మరాజు అనగా దుర్యోధనుడు ఈ విధంగా అన్నాడు.

### దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట (సం. 9-30-35)

**సీ. 'నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరు దయ్య! వినుము తెల్లంబుగా మనుజనాథ!**
**రథవాహసారథిరహితుండ నగుటను। బాణాదిహేతిసంపదలు లేమిఁ**
**బరివారశూన్యత వాటిల్లుటను బంధు। మిత్రసహాయులు మిడి యడంగఁ**
**జచ్చుటయును బోట్ల నొచ్చి మేనును డప్పి। గూరి చిత్తంబును బోరి కెలయ**

**తే. కునికిఁ జేసియుఁ దొలఁగితి నొదిఁగి సేద। దేర్చుకొని రణమునకు నుదీర్ణవృత్తి**
**వచ్చువాఁడను నీవు మీవారు విశ్ర। మింపుఁ డంతకు మఱి రండు సొంపు సూప.' 64**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ఓ రాజా!; నరుఁడు= మానవుడు; ప్రాణభయంబున్+పొరయుట= ప్రాణభయాన్ని పొందటం; అరుదు+అయ్య!= ఆశ్చర్యమా!; తెల్లంబుగాన్= స్పష్టంగా; వినుము; రథవాహ= తేరు, గుర్రాలు; సారథి= సారథి; రహితుండను+ అగుటయున్= లేనివాడను అగుటవలనను; బాణ+ఆది హేతి సంపదలు లేమిన్= బాణాలు, ఆయుధాలు మొదలైన యుద్ధసాధనాలు లేనందునను; పరివారశూన్యత+పాటిల్లుటను= సేవకులు లేకుండటంచేత; మిత్ర, సహాయులు= స్నేహితులు, సహాయకారులు; మిడి+అడంగన్+చచ్చుటన్= గర్వం అణగి చనిపోవటం చేతను; పోట్లన్+నొచ్చి= దెబ్బలచేత నొవ్వబడి; మేనును= ఒడలును; డప్పికూరి= దాహం కాగా; చిత్తంబును= మనసును; పోరికిన్+ఎలయక+ఉనికిన్= యుద్ధానికి సిద్ధం కాకుండటంచేతను; తొలఁగితిన్= తప్పుకొన్నాను; ఒదిఁగి= తొలగి; సేదన్+తీర్చుకొని= అలుపు తీర్చుకొని; రణమునకున్= యుద్ధానికి; ఉదీర్ణవృత్తిన్= గొప్పగా; వచ్చువాఁడను= రాగలను; అంతకున్= అంతదాక; నీవున్+మీవారున్= నీవూ నీ మనుష్యులూ; విశ్రమింపుఁడు= విశ్రాంతి తీసికొనండి; సొంపు చూపన్= మీతీరు చూపటానికి; మఱిరండు= ఆ పైన రండి.

**తాత్పర్యం:** 'ఓ రాజా! మానవుడు ప్రాణభయం చెందటం ఆశ్చర్యమా? స్పష్టంగా వినుము. రథాలు, గుర్రాలు, సారథులు లేనివాడను, అస్త్రశస్త్రాలూ లేనివాడను, సేవకులు, స్నేహితులూ, సాయపడేవాళ్ళూ గర్వమణగిచనిపోవడం వలనా దెబ్బల వలన కలిగిన బాధచేతనూ, యుద్ధానికి తలపడలేకున్నాను. అందువలన తప్పుకొన్నాను. ఒక్కింత అలసట తీర్చుకొని గొప్పగా యుద్ధానికై తలపడతాను. మీవారూ మీరూ కొంత విశ్రాంతి తీసికొని తిరిగి మీ నైపుణ్యం చూపటానికి రండు.'

**వ. అని పలికినఁ బాండవాగ్రజుండు. 65**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని మాటలాడగా; పాండవాగ్రజుండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** అని మాటలాడగా ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఇందాఁక విశ్రమించితి; । మిందు నినుం దడవి కంటి; మిప్పు డిచట నీ**
**కుం దేఱె డప్పి; కురుపతి । నందన! ర మ్మింక రణమునకు నాయిత మై.' 66**

**ప్రతిపదార్థం:** కురుపతినందన!= కురురాజకుమారా!; ఇందాఁకన్= ఇంతవరకును; విశ్రమించితిమి= విశ్రాంతి తీసికొన్నాము; ఇందున్= ఇక్కడ; నినున్= నిన్ను; తడవి కంటిమి= వెదకి చూచాము; ఇప్పుడు+ఇచటన్= ఇపు డిక్కడ; నీకున్= నీకు; దప్పి తేఱెన్= అలసట తీరింది; ఆయితము+ఐ= సిద్ధమై; ఇంకన్+రణమునకున్+రమ్ము= ఇక యుద్ధానికి రమ్ము.

**తాత్పర్యం:** 'ఓ కురురాజ కుమారా! ఇంతదాక అలుపుదీరా విశ్రమించాము. వెదకి ఇక్కడ నిన్ను చూచాము. నీకూ ఇప్పటికి అలసట తీరింది. ఇక యుద్ధానికి సన్నద్ధమై రమ్ము.'

**వ. అనుటయు. 67**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లు అనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు నెల్లభోగ । ములును గోరుదు రక్కుమారులును నాదు**
**తమ్ములును లేరు; తురగరథ ద్విపప్ర । హీన యయ్యె నీ క్షోణియు; నేల పెనఁగ? 68**

**ప్రతిపదార్థం:** ఎవ్వరికిన్+కాఁగన్= ఎవరి కొరకుగా; రాజ్యంబున్= రాజ్యమును; ఎల్లభోగంబులును= అన్ని సుఖాలూ; కోరుదురు= కోరుకొంటారో; ఆ+కుమారులును= ఆ కొడుకులున్నూ; నాదు తమ్ములును లేరు= నా తమ్ముళ్ళూ లేరు; ఈ క్షోణియున్= ఈ నేలకూడా; తురగ రథ ద్విప ప్రహీనము+అయ్యెన్= గుఱ్ఱాలూ, తేర్లూ, ఏనుగులూ నశించింది అయినది; పెనఁగన్+ఏల?= పెనుగులాట దేనికి?

**తాత్పర్యం:** 'ఎవరికొరకై రాజ్యాన్ని ఆశిస్తానో, ఎవరికొరకై భోగాలన్నిటినీ కోరుకొంటానో ఆ కుమారులూ నా తమ్ముళ్ళూ లేరు. ఈ భూమికూడా చతురంగ బలహీనమయినది. ఇంకెందుకు యుద్ధం చేయటం?

**చ. ద్రుపదతనూజులన్ గెలిచి దోర్బలసంపద నుల్లసిల్లి మి**
**మ్మపజితదర్పహీను లగునట్లుగఁ జేసి సమస్తభూపతి**
**త్వపదము గంటినేనియు వృథారభసం బది యింపు గాదు క**
**ర్ణుపడుట భీష్ములేమిని గురుండు మృతుం డగుటన్ ధరాధిపా! 69**

**ప్రతిపదార్థం:** ధరాధిపా!= ఓ రాజా!; ద్రుపద తనూజులన్= ద్రుపదుని కుమారులను; గెలిచి= జయించి; దోర్బలసంపదన్= భుజబలైశ్వర్యంతో; ఉల్లసిల్లి= సంతసించి; మిమ్మున్= మిమ్మల్ని; (పాండవులను) అపజిత దర్పహీనులు+అగునట్లుగన్+చేసి= జయింపబడని దర్పం లేనివారు అయ్యేటట్టు చేసి - దుర్దమ దర్పహీనులగునట్లు చేసి; సమస్త భూపతిత్వపదము= భూసామ్రాజ్యాధిపత్య పదవిని; కంటిన్+ఏనియున్= పొందినప్పటికినీ; వృథా= వ్యర్థమగు; రభసంబు= ఆర్భాటం; కర్ణు పడుటన్= కర్ణుడు చనిపోవటం చేతా; గురుండు= ద్రోణుడు; మృతుండు+అగుటన్= చనిపోవటంచేతా; అది ఇంపుగాదు= అది(నా) ఇష్టం కాదు;

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ద్రుపదుడి కుమారులను గెలిచి భుజబల సంపదతో సంతోషంగా మీ అందరనూ దుర్దమ గర్వహీనులనుగా చేసి రాజ్యాధిపత్యము నందినప్పటికీ ఈ వృథార్భాటం కర్ణభీష్మద్రోణులు గతించటం వలన నాకు ప్రీతిని కలిగించదు.

**క. తనవారుఁ దానుఁ గూడఁగ । ననుభవసుఖ మందఁ డేని యది రాజ్యమె రా**
**జునకు? భవత్పరిజనములు । ననుజన్ములు బ్రదికి; రేలు మఖిలధరిత్రిన్. 70**

**ప్రతిపదార్థం:** తనవారున్ తానున్ కూడఁగన్= తనవారును తానును కలిసి; అనుభవ సుఖము+అందఁడు+ఏని= అనుభవించదగిన సౌఖ్యం పొందనిచో; రాజునకున్= రాజైన వాడికి; అది రాజ్యమె?= ఆ రాజ్య మొక రాజ్యమా?; నీ సేవకులు; అనుజన్ములు= తోబుట్టువులు; బ్రదికిరి= బ్రతికిఉన్నారు; అఖిల ధరిత్రిన్ ఏలుము= ప్రపంచమంతటిని ఏలుకొమ్ము.

**తాత్పర్యం:** తన వారితో కలిసి అనుభవించదగు సుఖమే సుఖం. కాని, అది లేనిచో రాజునకు అది రాజ్యమూ కాదు. ఆ సుఖము సుఖమూ కాదు. నీ సోదరులు, సేవకులూ అందరూ బ్రతికే ఉన్నారు. ప్రపంచాన్నంతటినీ నీవే ఏలుకొమ్ము.

**క. ఏ నింక సమర మొల్ల మ । హీనాయక! నీక యుర్వి నిచ్చితి శాంతిం**
**గానకుఁ జని వల్కలపరి । ధానుఁడ నై తప మొనర్చెదను మునుల కడన్. 71**

**ప్రతిపదార్థం:** మహీనాయక!= ఓ రాజా!; ఏన్+ఇంకన్ సమరము+ఒల్లన్= నే నింక యుద్ధమున కిష్టపడను; నీకున్+అ= నీకే; ఉర్విన్+ఇచ్చితిన్; భూమిని(రాజ్యమును) ఇచ్చివేసినాను; శాంతిన్+కానకున్+చని= శాంతితో; అడవికి వెళ్ళి; వల్కలపరిధానుఁడను+ఐ= నార చీరలే బట్టలుగా కలవాడనై; మునులకడన్= తాపసుల వద్ద; తపము+ఒనర్చెదను= తపస్సు చేస్తాను.

**తాత్పర్యం:** నా కింక యుద్ధం వద్దు. ఓ రాజా! ఈ భూమిని నీ కిచ్చాను. శాంతంగా అడవులకు వెళ్ళి మునుల సన్నిధిని నారచీరలు కట్టుకొని తపస్సు చేసికొంటాను.

**ఆ. ఓడి వచ్చినాఁడ నుద్ధతి నా కేల? । యుడుకు మాని నీవ యుర్వి యేలు**
**గుఱ్ఱములును నేనుఁగులు లేని బయలు నీ । తలనె కట్టికొనుము ధర్మతనయ!' 72**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ!= ధర్మరాజా!; ఓడి వచ్చినాఁడన్= ఓడిపోయివచ్చాను; ఉద్ధతి= గర్వం; నాకున్+ఏల?= నా కెందుకు?; ఉడుకు మాని= తాపం వదలి; నీవ+ఉర్వి+ఏలు= నీవే భూమిని పాలించుకొమ్ము; గుఱ్ఱములును+ఏనుఁగులున్ లేని బయలు= గుఱ్ఱాలు, ఏనుగులు లేని బీడును; నీ తలనె కట్టికొనుము= నీ నెత్తినే కట్టుకొనుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఓడిపోయి వచ్చినాను. నా కెందుకయ్యా గర్వం? ఈ భూమిని నీవే పాలించుకొమ్ము. గుఱ్ఱాలు, ఏనుగులు లేని ఈ బీడును నీ నెత్తిపైననే కట్టుకొమ్ము'.

**చ. అన విని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనింగుఱించి యి**
**ట్లనుఁ 'దనుజానుజన్మసుహృదాప్త సహాయుల సన్నఁ గాదె శ**
**ల్యునిఁ గొని మమ్ము గెల్చి సకలోర్వియు నేలుట కుత్సహించి తీ**
**పనవుట లేల? మాను మిది; పాటిగఁ బట్టుము లెమ్ము పోరికిన్. 73**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అనగా విన్నవాడై; ఆ+నరేశ్వరుఁడు= ఆ ధర్మరాజు; హాసముతోన్= నవ్వుతో; అతనిన్+గుఱించి= ఆ దుర్యోధనుడి గూర్చి; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు; తనుజ+అనుజన్మ+సుహృద్+ఆప్తసహాయులు= కుమారులు, సోదరులు, స్నేహితులు, ఆత్మీయులు, సహాయకులు; చన్నన్+కాదె?= పోయిన తరువాతనే కదా!; శల్యునిన్+కైకొని= శల్యుడిని తీసికొని; మమ్మున్ గెల్చి= మమ్ము జయించి; సకల+ఉర్వియున్= భూమండలమంతయు; ఏలుటకున్= పాలించటానికి; ఉత్సహించితి(వి)= ఆసపడ్డావు; ఈ పనవుటలు= ఈ ప్రేలుటలు; ఏల?= ఎందుకు?; మానుము= మానుకొనుము; ఇది పాటిగన్+పట్టుము= దీనిని ధర్మంగా ఎంచుము; పోరికిన్= యుద్ధానికి; లెమ్ము= లే.

**తాత్పర్యం:** ధర్మరాజు దుర్యోధనుడితో నవ్వుతూ ఇట్లా అన్నాడు: 'కుమారులు, తమ్ములు, ఆప్తజనాలు, సహాయంగా వచ్చేవారూ గతించిన తరువాతనే కదా శల్యుడిని తీసికొనివచ్చి మమ్ము గెల్చి భూమండలమంతా పాలించవలెనని ఆశపడ్డావు. ఈ ప్రేలాపన లెందుకు గాని ధర్మం ఎంచి యుద్ధానికి లెమ్ము.

**సీ.** **నీ యీగి నేను భూనాయకుఁ డగు టొల్ల । రాజకోటికిఁ బరిగ్రహము సనునె?**
**నిను ననిం దెగటార్చి నేలఁ బాలించెద । నను నోర్చితేని పెంపున సుఖింపు**
**మేమిటి వాఁడవై యిచ్చితి పుడమి నీ । కనియెడు మాట యిట్లాడె దిపుడు**
**నీవు ధరిత్రి యీ నేర్చినఁ గురుకులం । బునకు నిట్లాఱడిఁ బోవ నేల?**

**తే.** **శాంతి నొందుటకై ధర్మసం విభాగ । కరణ మొనరింపవచ్చినకమలనాభు**
**వాక్యవృత్తిఁ బాటింపక వాఁడి సూది । మోపి నంతైన నుర్వి యీనోప నంటి.** **74**

**ప్రతిపదార్థం:** నీ ఈగిన్= నీ దానాన్ని; ఏను= నేను; భూనాయకుఁడు+అగుటన్+ఒల్లన్= రాజగుటకు ఇష్టపడను; రాజకోటికిన్= రాజులకు; పరిగ్రహము= దానం తీసికొనటం; చనునె?= తగునా?; నినున్= నిన్ను; అనిన్= యుద్ధంలో; తెగటార్చి= నాశనం చేసి; నేలన్= భూమిని; పాలించెదన్= పరిపాలన చేస్తాను; ననున్+ఓర్చితి(వి)+ఏని= నన్ను ఓడించినట్లయితే; పెంపునన్= గొప్పగా; సుఖింపుము= సుఖించు; ఏమిటివాఁడవు+ఐ= ఏమంత గొప్పవాడవై; పుడమిన్= భూమిని (రాజ్యాన్ని); ఇచ్చితి(వి)?= ఇచ్చావు?; ఈక= ఇవ్వకుండా; అనియెడుమాట= అనే మాట; ఇపుడు= ఈ సమయంలో (అన్నీ కోలుపోయిన ఈ సమయంలో); ఇట్లు= ఈ రీతిగా; ఆడెదు= అంటున్నావు; నీవు ధరిత్రిన్+ఈన్+నేర్చినన్= నీవు భూమిని ఈయగల్గిన వాడవే అయితే; కురుకులంబునకున్= కురువంశం కొరకు; ఇట్లు+ఆఱడిన్+పోవ నేల?= ఈ విధంగా నిందాపాత్రమై పో నేల?; శాంతిన్+ఒందుటకై= శాంతిని పొందటానికి గాను; ధర్మసంవిభాగ కరణము= న్యాయంగా భాగమును పరిష్కరించటం; ఒనరింపన్= చేయుటకు; వచ్చిన= వచ్చినటువంటి; కమలనాభువాక్యవృత్తిన్= శ్రీకృష్ణుడిమాట తీరును; పాటింపక= నడవకుండా; వాఁడిసూదిన్= వాడి అయిన సూదిని; మోపినంతైనన్= ఆన్చినంతకూడ; ఉర్విన్= భూమిని; ఈన్+ఓపనంటి(వి)= ఈయలేనన్నావు.

**తాత్పర్యం:** నీ ఈ దానములో రాజగుటకు నేను అంగీకరించను. యుద్ధంలో చంపి భూమిని పాలిస్తాను. నన్ను ఓడించినట్లయితే గొప్పగా సంతోషించుము. నీ వెవడ వని భూదానం ఇచ్చావు? ఈ సమయంలో ఇట్లా మాట్లాడుతున్నావేమిటి? నీవే భూమిని ఈయగల్గితే కురువంశం ఇట్లా నిందాపాత్రం కానేల? ధర్మపద్ధతిలో భాగ పరిష్కారానికై వచ్చి మాట్లాడిన శ్రీకృష్ణుడి మాటలు లెక్కచేయకుండా వాడి సూది మొన మోపినంత భూమిని కూడ ఈయనన్నావు.

**క.** **ఏమి విధంబునఁ బోరలియు । భూమి కురున్నృపాల! నీకుఁ బుచ్చుకొనఁగ రా**
**కీమెయి దైన్యపడితి? నా । కేమార్గము వట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా!** **75**

**ప్రతిపదార్థం:** కురునృపాల!= కౌరవరాజా!; ఏమి+విధంబునన్= ఏ ప్రకారంగా; పొరలియున్= పొరలినప్పటికీ - శ్రమించినప్పటికీ; నీకు భూమిన్!= నీకు భూమిని; పుచ్చుకొనఁగ రాక= తీసికొన వీలుపడక; ఈ మెయిన్= ఈ విధంగా; దైన్యపడితి?= నీచస్థితికి వచ్చావు?; నా కే మార్గము పట్టి ఇచ్చెదు?= నాకు ఏ విధంగా ఇస్తావు?; ఏర్పడన్+చెపుమా!= స్పష్టంగా చెప్పుము!

**తాత్పర్యం:** కౌరవరాజా! ఏ విధంగానూ - ఎంత పొరలినా - ఎంత శ్రమించినా; భూమిని తీసికొనటానికి నీకు వీలుపడక ఇంత నీచస్థితికి దిగజారావు? ఏ విధంగా దీనిని నాకిస్తావో స్పష్టంగా చెప్పుము.'

**క. అరులకు సిరి యిచ్చితి నను । వెరవి డియుం గలఁడె? దీని విడువుము నాకున్**
**ధర యిచ్చి తేనియును నినుఁ । బొరిగొన కే విడువ నఱిమి పోరుట యొప్పున్. 76**

**ప్రతిపదార్థం:** అరులకున్= వైరులకు; సిరి ఇచ్చితిన్+అను= సంపద నిస్తాననే; వెరవిఁడియున్+కలఁడె?= ఉపాయహీను డున్నాడా?; దీనిన్ విడువుము= ఈ ప్రయత్నం మానుకొమ్ము; నాకున్ ధరఇచ్చితి(వి)+ఏనియును= నాకు నీవు భూమి నిచ్చినప్పటికిని; నినున్= నిన్ను; పొరిగొనక= చంపకుండా; ఏన్ విడువన్= నేను వదలను; అఱిమిన్= ఆక్రమించి(క్రమ్ముకొని); పోరుట= యుద్ధం చేయటం; ఒప్పున్= తగును.

**తాత్పర్యం:** వైరులకు సంపద నిస్తాననే వెర్రివా డుంటాడా? ఈ ప్రయత్నాన్ని మానుకొనుము. నాకు ఒకవేళ ఈ భూమిని ఇచ్చినా నిన్ను చంపక వదలను. కనుక విక్రమించి యుద్ధం చేయటమే తగును.

**క. నాచే నీ ప్రాణంబులు । నీచే నా జీవితంబు నిజ మున్నవి యి**
**న్నీచత యవకార్యము రా । జోచితకర్మకృత నిశ్చయుఁడ వగుము నృపా!' 77**

**ప్రతిపదార్థం:** నృపా= రాజా!; నాచేన్ నీ ప్రాణంబులు= నీ ప్రాణాలు నాచేతను; నీచే నా జీవితంబు= నా ప్రాణం నీచేతను; ఉన్నవి= ఉన్నాయి; నిజము= అది సత్యం; ఈ+నీచతన్= ఈ నైచ్యం; అవకార్యము= చేయగూడని పని; రాజ+ఉచితకర్మ= విధి నిర్ణయించిన రాజులు చేయవలసిన పనియందు; కృతనిశ్చయుఁడవు+అగుము= నిశ్చయించుకొన్నవాడవుకమ్ము.

**తాత్పర్యం:** నీ ప్రాణాలు నాచేతిలోనూ నా ప్రాణాలు నీచేతిలోనూ ఉన్నాయి. ఇది నిజం. నీ ఈ నైచ్యం తగనిది, రాజులకు తగిన కర్మఅయిన యుద్ధానికి దృఢనిశ్చయుడవు కమ్ము.'

**వ. అని వెండియు నిట్లను 'జతుగృహంబు దహించితి, పాములం గఱపించితి, నీటం ద్రోయించితి, విషాన్నంబు వెట్టించితి; వెన్ని కపటోపాయంబలు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే? యింక నట్ల య మ్మాయలం బ్రయోజనంబు లేదు. 78**

**ప్రతిపదార్థం:** అని వెండియున్+ఇట్లు+అనున్= అని మరియు ఈవిధంగా అన్నాడు; జతుగృహంబు దహించితి(వి)= లక్కయింటిని కాల్చావు; పాములన్+కఱపించితి(వి)= పాములచేత కరిపించావు; నీటన్+త్రోయించితి(వి)= నీటిలో త్రోయించావు; విషాన్నంబు పెట్టించితి(వి)= విషం కలిపిన అన్నమును పెట్టించావు; ఎన్ని కపట+ఉపాయంబులు చేసినను= ఎన్ని విధాలయిన కుట్రలు చేసినను; నీచేతన్+చెడక+ఉనికి= నీవలన నాశనం కాకుండటం; ఎఱుంగవే?= నీవు ఎరుగవా?; ఇంకన్+అట్లు+అ= ముందు కూడా అట్లే; ఆ+మాయలన్+ప్రయోజనంబు లేదు= ఆ మోసాలవలన లాభంలేదు.

**తాత్పర్యం:** (ధర్మరాజు ఇంకా ఇట్లా అన్నాడు) లక్క ఇల్లు కాల్పించావు. పాములతో కరిపించావు. నీళ్ళలో త్రోయించావు, విషం కలిపిన అన్నం పెట్టించావు. ఎన్ని కుట్రలు చేసినప్పటికీ నీవలన మేము నాశనం కాకుండా ఉండగలగటం నీకు తెలియదా? ముందుకూడా అట్లే ఆ విధమైన మోసాలవలన ప్రయోజనం లేదు.

**క. లే లెమ్ము! బిరుద వై ర । మ్మాలమునకు; నీవు నెఱుఁగ దవ్విధము కడున్**
**మే లొండు తెరవు లే; దిం । కేల యొదిఁగి కష్టపడ? నరేశ్వర! చెపుమా! 79**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= ఓ రాజా!; లే లెమ్ము= త్వరగా లే; బిరుదువు+ఐ= వీరుడవయి; ఆలమునకున్= యుద్ధానికి; రమ్ము= రా; నీవున్; ఎఱుఁగుదు(వు); ఆ+విధము= ఆ రీతి-యుద్ధానికి సిద్ధపడటం; కడున్= మిక్కిలి; మేలు= మంచిది; ఒండు= వేరొక; తెరువులేదు= మార్గములేదు; ఇంక= ఇక; ఒదిగి= తొలగి; కష్టపడున్ ఏల?= కష్టపడుట ఎందుకు? చెపుమా.

**తాత్పర్యం:** ఓ రాజా! లేచిరావయ్యా! యుద్ధానికి రమ్ము! నీకు ఇంతకంటె మేలైన మార్గం వేరే లేదు. ఆ సంగతి నీకూ తెలుసు. ఇంకనూ దాగికొని బాధపడట మెందుకు?'

**వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవారు నట్ల పలికి' రనిన విని ధృతరాష్ట్రుండు. 80**

**ప్రతిపదార్థం:** అని ఈ+విధంబునన్= అని ఈ ప్రకారంగా; ఆ+మనుజ+ఇంద్రుండు= ఆ ధర్మరాజు; మఱియున్= ఇంకను; పలుకన్= మాటాడగా; పెఱవారును= ఇతరులు కూడా; అట్లు+అ పలికిరి= అదే విధంగా మాటాడారు; అనినన్ విని= అని (సంజయుడు) చెప్పగా విన్నవాడై; ధృతరాష్ట్రుండు.

**తాత్పర్యం:** అని ఈ విధంగా ధర్మరాజు, మిగిలిన వారూ మాట్లాడారు.' అని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'ఇట్లు జంకింపఁబడి మఱి యేమి సేసె । నాతనూజుండు? మున్ను నెన్నఁడును జంకఁ**
**బడినవాఁడు గాఁ డక్కట! పుడమి నాల్గు । సెఱఁగులును వెఱఁ దన పంపు సేయ బ్రదికె. 81**

**ప్రతిపదార్థం:** నా తనూజుండు= నా కుమారుడు; ఇట్లు జంకింపఁబడి= ఈ విధంగా బెదరించబడి; మఱిఏమి+చేసెన్?= ఇంకేమి చేశాడు?; మున్ను= పూర్వం; ఎన్నఁడును= ఎప్పుడు కూడా; జంకబడినవాఁడు= బెదరించబడినవాడు; కాఁడు= కాదు; అక్కట!= అయ్యో!; పుడమి నాల్గు చెఱుగులును= భూమి నాల్గు దిక్కులూ; వెఱన్= భయంతో; తన పంపు+చేయన్ బ్రదికెన్= తన ఉత్తరువు పాటింపగా బ్రతికాడు.

**తాత్పర్యం:** 'ఈ విధంగా బెదరించబడ్డ నా కుమారుడు ఇం కేమి చేశాడు? ఇదివరలో ఎపుడూ కూడా భయపెట్టబడినవాడు కాడు. నాల్గుదిక్కులూ తా నంటే భయపడుతూ తన ఆజ్ఞను పాటించే విధంగా బ్రతికినవాడు. అయ్యో!

**క. పరిజనహీనత దీనతఁ । బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని**
**ష్ఠురవాక్యమ్ముల నమ్మెయిఁ । బరితాపము సేయ నేమిభంగి నిలిచెనో?' 82**

**ప్రతిపదార్థం:** పరిజనహీనతన్= సేవకులు లేమిని; దీనతన్= దైన్యమును; పొరసిన+ఎడన్= కలిగినపుడు; ముట్టుకొని= తాకి; రిపుప్రకరము= వైరిసమూహం; ఆ+మెయిన్= ఆ విధంగా; నిష్ఠురవాక్యమ్ములన్= కఠినమైన మాటలతో; పరితాపము+చేయన్= బాధించగా; ఏమి భంగిన్ నిలిచెనో?= ఏ విధంగా (బ్రతికి) ఉన్నాడో!.

**తాత్పర్యం:** సేవకులు లేకుండా దీనంగా ఉండగా వైరిసేన క్రమ్ముకొని, ఆ విధంగా నిష్ఠురమైన మాటలతో బాధించగా (దెప్పుడు మాటలతో తూలనాడగా) ఏ విధంగా ఉండగలిగాడో?'

**వ.** **అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె 'నట్లు ధర్మతనయుండును దమ్ములుఁ గొడుకులును ద్రుపదపుత్రులును బొదువుకొని పలుకు పరుసని పలుకులకుఁ జిత్తం బుత్తలపడ నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం బొనర్చువాఁడై యప్పాండవాగ్రజున కిట్లనియె.** **83**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; సంజయుండు; ఆ+మనుజపతికిన్+ఇట్లు+అనియెన్= సంజయు డా రాజుతో (ధృతరాష్ట్రుడితో) ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; ధర్మతనయుండును+తమ్ములున్+కొడుకులును= ధర్మరాజును, వానితమ్ములును, కుమారులును; ద్రుపదపుత్రులును= ద్రుపదరాజు కుమారులును; పొదువుకొని= చుట్టూ క్రమ్ముకొని; పలుకు పరుసని పలుకులకున్= మాట్లాడే పరుషవాక్యాలకు; చిత్తంబు+ఉత్తలపడన్= మనసు చీకాకుపడగా; ఆననంబు పల్లటిల్లన్= మొగం చిన్నపోగా; కరంబులు విదిర్చి= చేతులు విదలించుకొని; దురంబు+ఒనర్చువాఁడు+ఐ= యుద్ధం చేసేవాడై; ఆ+పాండవ+అగ్రజునకున్+ఇట్లు+అనియెన్= ఆ పాండవుల అన్న అయిన ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు: ధర్మరాజు, అతడి తమ్ములు, ద్రుపద పుత్రులు చుట్టుకొని మాట్లాడే పరుషపు మాటలకు మనసు చీకాకుపడగా, మొగం చిన్నపోగా, చేతులు విదలించుకొని, యుద్ధం చేసేవాడుగా ఆ ధర్మరాజుతో (దుర్యోధనుడు) ఈ విధంగా అన్నాడు:

**సీ.** **'మీ రేవురును బరివార బాంధవమిత్ర । సహితుల, రఖిలాస్త్రశస్త్రవంతు**
**లరు, కరిస్యందనతురగసమేతుల; । రే నొకరుండ, విహీనసహచ**
**రత్వంబు విగతాయుధత్వంబు వాహన । హీనత నొందితి; నే విధమున**
**నని యొనర్పఁగ వచ్చు? నది గాక పోటుల । డస్సితిఁ గడు; మీకు డప్పి లేదు;**

**తే.** **వరుసఁ దగ నొక్కఁ డొక్కఁడ వచ్చి పోరుఁ; । డిపుడ వెడలి మిమ్మందఱ నెల్ల చెలులఁ**
**జుట్టముల రూపుమాపెదఁ; జుట్టుముట్టి । పలువు రొక్కనితోఁ బోరఁ బాడి యగునె?** **84**

**ప్రతిపదార్థం:** మీరు+ఏవురును= మీ అయిదుగురూ; పరివార= సేనా పరివారంతో; బాంధవమిత్రసహితులరు= బంధువులతో, స్నేహితులతో కలిసి ఉన్నవారు; అఖిల+అస్త్రశస్త్రవంతులరు= అన్ని అస్త్రశస్త్రాలను కలిగినవారు కూడాను; కరిస్యందన తురంగ సమేతులరు= ఏనుగులు, తేరులు, గుర్రాలతో కూడి ఉన్నవారు; ఏను+ఒకరుండన్= నే నొక్కడనే; విహీనసహచరత్వంబు= తోడులేనితనం; విగత+ఆయుధత్వంబు= (యుద్ధానికి కావలసినన్ని) ఆయుధాలు లేనితనం = వాహనహీనత= వాహనాలు లేకుండటం; ఒందితిన్= పొందాను; ఏ విధముగన్+అని+ఒనర్పగవచ్చున్?= ఎట్లా యుద్ధం చేయాలి?; అది గాక= అంతే కాదు; పోటులన్= దెబ్బలవలన; కడున్ డస్సితిన్= మిక్కిలి అలసిపోయాను; మీకున్ డప్పి లేదు= మీకు శ్రమ(కూడా) లేదు; వరుసన్= క్రమంగా; ఒక్కడు+ఒక్కండు+ఆ వచ్చి= ఒకడొకడే వచ్చి; పోరుఁడు= యుద్ధం చేయండి; ఇపుడు+అ+వెడలి=

ఇపుడే (ఈ కొలను నుండి వెలువడి) వచ్చి; మిమ్మున్+అందఱన్= మీ అందరినీ; ఎల్ల చెలులన్= స్నేహితులందరినీ; చుట్టములన్= బంధువులను; రూపుమాపెదన్= చంపుతాను; పలువురు= అనేకులు; చుట్టుముట్టి= క్రమ్ముకొని; ఒక్కనితోన్+ పోరన్= ఒక్కడితో యుద్ధం చేయటం; పాడి అగునె?= ధర్మమా?

**తాత్పర్యం:** మీ ఐదుగురును సేనలతో బంధువులతో ఉన్నవారు, అఖిలాస్త్ర శస్త్రాలతో ఉన్నవారు, ఏనుగులు, రథాలు, గుర్రాలు కలిగినవారు, నేనా ఒక్కడను, సహచరులు, ఆయుధాలు, వాహనాలు లేనివాడిని. నేను ఏ విధంగా మీతో యుద్ధం చేయగలను? అంతేకాక దెబ్బలవలన అలసి ఉన్నాను. మీరు ఏ శ్రమా లేనివారు. ఏ విధంగా ఒక్కడనే మీతో యుద్ధం చేయటం? క్రమంగా ఒకరొక్కరే వచ్చి పోట్లాడండి. ఇపుడే వెలికి వచ్చి మీ అందరితో పోట్లాడి సమిత్రబాంధవంగా చంపుతాను. పెక్కుమంది ఒక్కడితో యుద్ధం చేయటం న్యాయమా?

**వ. అట్లు మీరు సాలరేని. 85**

**ప్రతిపదార్థం:** అట్లు మీరు+చాలరేని= ఆ విధంగా మీరు సమర్థులు కాకుంటే.

**తాత్పర్యం:** దానికి మీకు సామర్థ్యం లేకపోతే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. తమ్ముల నిన్నుఁ గేశవునితమ్ముని ద్రౌపదియన్నదమ్ములం**
**గ్రమ్మన గీ టడంచెద నొకండన యే నిదె వచ్చి బాహుద**
**ర్పమ్మున నిర్గవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతే**
**జమ్మున రూపుమాపు క్రియ; సజ్జత నిల్వుము సుస్థిరుండవై. 86**

**ప్రతిపదార్థం:** తమ్ములన్ నిన్నున్= నిన్నూ నీ తమ్ములను; కేశవుని తమ్మునిన్= సాత్యకినీ; ద్రౌపది అన్నదమ్ములన్= ద్రౌపది అన్ననూ, తమ్ములనూ; గ్రమ్మనన్= వెంటనే; గీటడంచెదన్= నాశనం చేస్తాను(రూపుమాపుతాను); ఏను+ఒకండను+అ= నేనొక్కడనే; ఇదె వచ్చి= ఇదుగో వచ్చినవాడనై; బాహుదర్పమ్మునన్= భుజబలంతో; ఇర్గవారమును= చీకట్ల సమూహాన్ని; భానుఁడు+తోఁచి= సూర్యుడు ఉదయించి; సముజ్జ్వలాత్మతేజమ్మునన్= మిక్కిలి వెలిగేతనకాంతితో; రూపుమాపుక్రియన్= అణగార్చేటట్లు (సూర్యుడు తన వెలుగుతో చీకటిని పోగొట్టినట్లుగా); సుస్థిరుండవై నిల్వుము= సంసిద్ధతతో గట్టిగా నిలబడుము.

**తాత్పర్యం:** నేనొక్కడనే నిన్నూ, నీ తమ్ములనూ, సాత్యకినీ, ద్రౌపది అన్నదమ్ములనూ రూపుమాపుతాను. ఇదిగో వచ్చి భుజబలంతో సూర్యుడు ఉదయించి నిండైన వెలుగుతో చీకట్ల సముదాయాన్ని రూపుమాపినట్లుగా చంపుతాను. సంసిద్ధతతో, దృఢంగా నిలుపుము.

**తే. వినుము నీకుఁ గృష్ణునకును వెఱచి కాదు । ముంద రేనట్టు లాడుట యెందుఁ జెల్లు**
**సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల । వారలకుఁ దెల్పుటకుఁ గాని వసుమతీశ! 87**

**ప్రతిపదార్థం:** వసుమతీశ!= ఓ రాజా!; వినుము; ముందర= ఇంతకు మునుపు; ఏన్+అట్టులు+ఆడుట= నేనావిధంగా మాట్లాడటం; ఎందున్= ఎక్కడనైనా; చెల్లు= సరిపోవునట్టి; సమరధర్మంబు తెఱఁగున్= యుద్ధన్యాయం; ఎల్లవారలకున్= అందరకూ; తెల్లముగన్= స్పష్టంగా; తెల్పుటకున్+కాని= తెలియటానికే గాని; నీకున్ కృష్ణునకును వెఱచి కాదు= నీకూ కృష్ణుడికీ భయపడికాదు.

**తాత్పర్యం:** ఓ రాజా! వినుము. నీకూ శ్రీకృష్ణుడికీ భయపడికాదు. యుద్ధ నీతిని అందరకూ తెలియచేయటానికే ఇంతవరకు నే నా విధంగా మాట్లాడాను.

**వ. నేఁడు మిమ్ముందఱ సమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయద్రథశకునిశల్యాదు లగు బంధుమిత్ర సహాయుల ఋణంబు దీర్చెద' నని పలికినం బాండవాగ్రజుం డి ట్లనియె. 88**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈ దినం; మిమ్ము+అందఱన్ సమయించి= మీ అందరిని చంపి; భీష్మద్రోణకర్ణ భగదత్త బాహ్లిక జయద్రథ శకుని శల్య+ఆదులగు= భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, భగదత్తుడు, బాహ్లికుడు, సైంధవుడు, శకుని, శల్యుడు మొదలైన; బంధుమిత్ర సహాయుల ఋణంబు+తీర్చెదన్= బంధువుల, మిత్రుల, సహాయుల ఋణం తీరుస్తాను; అని పలికినన్= అని మాట్లాడగా; పాండవ+అగ్రజుండు+ఇట్లు+అనియెన్= ధర్మరాజు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రోజు మీ అందరిని చంపి, భీష్మ ద్రోణ కర్ణ భగదత్త బాహ్లిక జయద్రథ శకుని శల్యాదులయిన బంధుమిత్రుల, సహాయుల ఋణం తీర్చుకొంటాను' అని మాట్లాడిన దుర్యోధనుడితో ధర్మరాజు ఈ విధంగా అన్నాడు:

**చ. 'సమరము పాడి నీ వెఱిఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ**
**ప్పు మనుజనాథ! యొక్కఁడును బూని మహాద్భుతబాహుసంపదన్**
**మము వడిఁ దాఁకెదం బిలుకు మార్చెద నంట యుదాత్త మైనధై**
**ర్యమహిమ గాదె! యి ట్లనిన యంతన యే నటు లేల చేసెదన్? 89**

**ప్రతిపదార్థం:** మనుజనాథా!= ఓ రాజా!; సమరము పాడి= యుద్ధనీతి; నీవు+ఎఱిఁగి= నీవు తెలిసికొని; శత్రులన్+గెల్వఁగన్= వైరులను గెలవటానికి; ఉత్సహించుట+ఒప్పున్= ఆసక్తి చూపటం తగును; ఒక్కఁడును పూని= ఒక్కడే ప్రయత్నంతో; మహాద్భుత బాహుసంపదన్= గొప్పగా అబ్బురమును గల్గించే భుజబలంతో; మము వడిన్+తాఁకెదన్= మమ్ము - త్వరగా ఎదిరిస్తాను; పిలుకుమార్చెదన్+అంట= చంపెదననటం; ఉదాత్తమైన ధైర్యమహిమ+కాదె!= గొప్ప ధైర్యశక్తి కదా!; ఇట్లు+అనిన అంతనన్= ఈ విధంగా అన్నమాత్రాన; ఏన్+అటుల+ఏల చేసెదన్?= నే నా విధంగా ఎందుకు చేస్తాను?

**తాత్పర్యం:** ఓ రాజా!, యుద్ధధర్మాన్ని తెలిసి వైరులను గెలువటానికి నీవు ఆసక్తి చూపటం తగిఉన్నది. నీ వొక్కడివే భుజబలంతో మా అందర నెదుర్కొని చంపెద నంటున్నావు. అది మిక్కిలి గొప్పదే. అంతమాత్రాన నే నా విధంగా ఎందుకు చేస్తాను.

**చ. వలసిన యస్త్రశస్త్రములు వాహనముం గొను; మొక్కరుండ నిన్**
**గలన జయించువాఁ; డతనిగర్వము నీ వడఁగించితేని యీ**
**యిల సకలంబు గైకొని వహింపుము రాజ్యవిభూతి; వాఁడు నిన్**
**దలపడి పోరుఁ జుట్టలును దక్కటివారలు నిల్చి చూడఁగన్.' 90**

**ప్రతిపదార్థం:** వలసిన= అవసరమైన; అస్త్ర, శస్త్రములు= మంత్రసహిత బాణాలూ, మంత్రరహితబాణాలూ; వాహనమున్= వాహనాన్నీ; కొనుము= తీసికొమ్ము; నిన్= నిన్ను; ఒక్కరుండు+అ= ఒకడే; కలనన్= యుద్ధంలో; జయించువాఁడు=

జయిస్తాడు; అతని గర్వమున్= ఆతడి పొగరును; ఈవు= నీవు; అడఁగించితి(వి)+ఏని= అణచినట్లయితే; ఈ+ఇల సకలంబు= ఈ భూమి (రాజ్యం) మొత్తం; కైకొని= తీసికొని; రాజ్యవిభూతి= ప్రభుత్వ వైభవం; వహింపుము= పొందుము; వాఁడు= (నీతో ఎదురొడ్డిపోరే) వాడు; చుట్టలును= బంధువులూ; తక్కటివారలున్= మిగిలినవారూ; నిల్చి= నిలబడి; చూడఁగన్= చూస్తూ ఉండగా; నిన్= నిన్ను; తలపడి= ఎదుర్కొని; పోరున్= యుద్ధంచేస్తాడు.

**తాత్పర్యం:** దుర్యోధనా! నీకు అవసరమైన అస్త్రశస్త్రాలను వాహనాన్నీ తీసికొమ్ము. యుద్ధంలో నిన్ను మా పక్షంనుండి ఒక్కడే ఎదిరిస్తాడు. అతడి గర్వాన్ని నీవు అణచగలిగితే ఈ రాజ్యాన్నంత నీవే గ్రహించి దాని వైభవాన్ని అనుభవించుము. అతడు ఇక్కడి చుట్టాలూ, మిగిలినవారు నిలబడి చూస్తూ ఉండగా నిన్ను ఎదిరించి యుద్ధం చేస్తాడు.

**వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కి ట్లనియె. 91**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇట్లా అనగా; విని; భవత్+నందనుండు= నీ కొడుకు; ధర్మనందనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లు సమాధానం ఈయగా, దానికి నీ కొడుకు ఈ విధంగా ప్రత్యుత్తర మిచ్చాడు.

**చ. 'అరదము లెక్కి ఘోరవివిధాస్త్రచయంబుల మున్ను పోరమే?**
**నరవర! క్రొత్తచందము రణంబు కరంబు ప్రియంబు సేయు; ని**
**ష్ఠురగదలం బదాతు లయి శూరతయున్ మహనీయధీరతా**
**స్ఫురణమునుం బొగడ్త వడఁ బోరుట మే లని నిశ్చయించితిన్. 92**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; అరదములు+ఎక్కి= తేరులమీది కెక్కి; ఘోర= భయంకరమయిన; వివిధ+అస్త్రచయంబులన్= అనేకములయిన అస్త్రములతో; పోరమే?= యుద్ధం చేయలేదా?; క్రొత్తచందము రణంబు= క్రొత్తపద్ధతి యుద్ధం; ప్రియంబు+ చేయున్= ప్రీతికొల్పుతుంది; నిష్ఠుర= కఠినమయిన; గదలన్+పదాతులు+అయి= గదలతో కాల్బంటులై; శూరతయున్= శౌర్యమును; మహనీయ= గొప్పది అయిన; ధీరతాస్ఫురణమునున్= ధైర్యస్ఫూర్తి; పొగడ్త+పడన్= కీర్తనీయం కాగా; పోరుట; మేలు+అని నిశ్చయించితిన్= మంచి దని నిర్ణయించుకొన్నారు.

**తాత్పర్యం:** 'రథాలమీద' అనేకాస్త్ర శస్త్రాలతో ఇదివరలో భయంకరంగా యుద్ధం చేశాం కదా! ఓ రాజా! ఇప్పుడు క్రొత్త రకమయిన యుద్ధం నాకు సంతోషదాయకం. భయంకరమయిన గదను చేతబూని కాల్బలంవలె నేలపై నిలిచి, మగటిమి, శౌర్యమూ తెలియగా, గొప్పగా యుద్ధం చేయటం మంచి దని నిశ్చయించాను.

**తే. వింతకూరలు గుడుపున వేడ్క సేయు । భంగి సంగ్రామమున నూత్నభంగు లెడఁదఁ**
**గౌతుకము సేయుఁ గావున గద ధరించి । నిను సహోదరులను యోధులను జయింతు.' 93**

**ప్రతిపదార్థం:** వింత కూరలు= అబ్బురమయిన కూరలు; కుడుపునన్= తినుటకు; వేడ్కచేయు= ఆసగొలుపు; భంగిన్= రీతిలో; సంగ్రామమునన్= యుద్ధంలో; నూత్నభంగులు= క్రొత్తపద్ధతులు తెలియగా; ఎడఁదన్= మనసులో; కౌతుకంబు చేయున్= ఆసగొల్పుతాయి; కావునన్= కనుక; గద ధరించి= గదను పూని; నిను సహోదరులను యోధులను జయింతున్= నిన్నూ, తోబుట్టువులనూ, వీరులనూ జయిస్తాను.

**తాత్పర్యం:** భోజనంలో క్రొత్తకూరలు ఆసక్తి గొలిపే విధంగా యుద్ధంలో క్రొత్త పద్ధతులు హృదయానికి ఉల్లాసం కలిగిస్తాయి. కాబట్టి గదతో నిన్నూ, నీ సోదరులనూ, వీరులనూ జయిస్తాను.'

**చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో 'గద నొక్కరుండ నేఁ**
**గొనియెద నీదుప్రాణము లకుంఠితబాహువిలాసభాసి నై'**
**యనవుడుఁ బుట్ట లోపలి మహాభుజగేంద్రుఁడు రోఁజునట్టు రోఁ**
**జె నధిప! య వ్విభుండు దనచిత్తము నప్పలుకుల్ గలంచినన్. 94**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అనుటయున్= (దుర్యోధనుడు అట్లా అనగా)అనగా; పొంగి= ఉప్పొంగి; ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఆతనితోన్= దుర్యోధనుడితో; గదన్= గదతో; ఒక్కరుండన్= ఒకడినే; అకుంఠిత బాహు విలాసభాసినై= కుంటుపోని భుజశక్తితో ప్రకాశిస్తూ; నీదుప్రాణములు+కొనియెదన్= నీ ప్రాణాలు తీస్తాను; అనవుడున్= అనగా; తన చిత్తమును= తన మనసును; ఆ+పలుకుల్= ఆ ధర్మరాజు మాటలు; కలంచినన్= కలతచెందించగా; ఆ+ విభుఁడు= ఆ దుర్యోధనుడు; పుట్టలోపలి= పుట్టలోఉన్న; మహాభుజగ+ఇంద్రుఁడు= పెనుబాము; రోఁజునట్లు= బుసకొట్టేటట్లుగా; రోఁజెన్= బుసకొట్టాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అనగా ధర్మరాజు ఉప్పొంగి దుర్యోధనునితో గదతో నేనొక్కడనే మొక్కవోని భుజశక్తితో ప్రకాశిస్తూ నీ ప్రాణాలు తీస్తాననగా ఆ మాటలు తన చిత్తాన్ని కలత చెందించగా ఆ దుర్యోధనుడు పుట్టలోని పెనుపాము రోజినట్లుగా రోజినాడు.

**విశేషం:** అలం: ఉపమ.

## దుర్యోధనుఁడు గదామండితుం డై హ్రదంబు వెడలివచ్చుట (సం. 9-31-45)

**వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలు శూకలాశ్వంబుచందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు సంక్షోభింప నపహసిత శైలసారోదారంబును గనకపట్టికామండితంబును నైన; గదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని వెడలె నట్లు సంరంభవిజృంభితుండై. 95**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; నిశ్వాసంబు= నిట్టూర్పు; నిగుడన్= రాగా; ఒడలు పొంగన్= శరీరం ఉప్పొంగగా; పటుకశాఘాతంబునన్= కటువైన చబుకు దెబ్బతో; కెరలు శూకల+అశ్వంబు చందంబునన్= విజృంభించే పొగరుబోతు గుర్రంవలె; కెరలి= విజృంభించి; జలస్తంభంబు+ఉడిపికొని= నీటిలో ఉన్న(కట్టును) వదలుకొని; మడువు= ఆ నీటిమడుగు; సంక్షోభింపన్= అల్లకల్లోలం కాగా; అపహసిత శైలసార+ఉదారంబును= కొండను పరిహసించే గొప్పదనం కలదియు; కనకపట్టికామండితంబును= బంగారపు పట్టికతో అందమైనదియును; అయిన= అయినట్టి; గదాదండంబు= పొడవగు కాడతో ఉన్న గద; విపుల+అంసపీఠంబునన్= విశాలమయిన భుజంమీద; అమర్చుకొని వెడలెన్= పెట్టుకొని వెడలివచ్చాడు; అట్లు= ఆ విధంగా; సంరంభవిజృంభితుండు+ఐ= అట్టహాసంతో దూకుతున్నవాడై.

**తాత్పర్యం:** ఆ విధంగా నిట్టూర్పులు వదలుతూ రాగా, ఒడ లుప్పొంగగా, చబుకుదెబ్బయొక్క తీవ్రతతో విజృంభించే పొగరుబోతు గుర్రంమాదిరిగా విజృంభించి, జలస్తంభనస్థితిని వదలివేసి ఆ నీటి మడుగు అల్లకల్లోలం

కాగా, కొండ కాఠిన్యాన్ని ఎగతాళి చేసే గొప్పదనం కలదీ, బంగారుపట్టీతో పొడవుగా ఉన్నదీ అయిన గదాదండాన్ని విస్తృతమైన తన భుజపీఠం మీద పెట్టుకొని దుర్యోధనుడు వెడలివచ్చాడు. ఆ విధంగా అట్టహాసంతో దూకుతున్నవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **గదయుఁ దానును రుచిరశృంగమునఁ బొల్చు । పర్వతము గ్రేణి సేయు నీపట్టిఁ జూచి**
**కాలదండంబు చేకొని లీలఁ దోఁచు । జమునిఁగా మదిఁ దలఁచిరి జనము లెల్ల.** **96**

**ప్రతిపదార్థం:** గదయున్+తానును= తానూ గదయు; రుచిర శృంగరమునన్+పొల్చు= అందమైన శిఖరంతో ఒప్పునట్టి; పర్వతమున్+క్రేణిచేయు= కొండను పరిహాసం చేసే; నీ పట్టిన్+చూచి= నీ కుమారుడిని చూచి; కాలదండంబు చేకొని= కాలదండాన్ని పట్టుకొని; లీలన్+తోఁచు= అలవోకగా కనుపించే; జమునిన్+కాన్= యముడిగా; జనములు+ఎల్లన్= మనుజులంతా; తలఁచిరి= మనసులో భావించారు.

**తాత్పర్యం:** గదతోపాటు తాను అందమైన శిఖరంతో వెలిగే పర్వతాన్ని పరిహసించే నీ కొడుకును చూచి, జనులందరూ అతడిని కాలదండంతో అవలీలగా తిరిగే యముడిగా భావించారు.

**విశేషం:** అలం: విషమం. భ్రాంతి (ఉపమేయానికి ఉపమానంకంటె ఆధిక్యం చెప్పబడినందువల్ల అలంకారం విషమం.)

**వ.** **అతనిఁ గనుంగొని పాంచాలురును బాండవులును.** **97**

**ప్రతిపదార్థం:** అతనిన్+కనుంగొని= అతడిని చూచి; పాంచాలురును; పాండవులును.

**తాత్పర్యం:** అతడిని చూచి పాంచాలురూ, పాండవులూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **చిఱుతనగవుతో నొండొరు చేతు లప్ప । ళించి నిర్భరసంతోషలీల నొప్పి;**
**రమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిఁగి । బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడమఁ గెంపు.** **98**

**ప్రతిపదార్థం:** చిఱుతనగవుతోన్= చిరునవ్వుతో; ఒండొరుచేతులు= ఒకరొకరి చేతులు; అప్పళించి= చప్పట్లు చరచి; నిర్భర సంతోషలీలన్+ఒప్పిరి= అధికమైన సంతసంతో ఒప్పారు; ఆ+మహీనాథుఁడు= ఆ రాజగు దుర్యోధనుడు; ఆ+అపహాసము+ ఎఱిఁగి= ఆ పరిహాసాన్ని తెలిసికొని; బొమలు ముడివడన్= కనుబొమలు సుళ్ళు తిరుగగా; కనుఁగవన్= కనుదోయిలో; కెంపు పొడమన్= కోపం కలుగగా;

**తాత్పర్యం:** (పాంచాల పాండవులు) చిర్నగవుతో ఒకరొకరు చేతులు చరచి విపరీతమైన సంతోషంతో ఒప్పిఉన్నారు. ఆ దుర్యోధను డా పరిహాసం గ్రహించి కనుబొమలు ముడిపడగా రెండు కన్నులలోను ఎర్రజీర కలుగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ.** **కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల నెల్ల నాలోకించి.** **99**

**ప్రతిపదార్థం:** కోప+ఆవేశంబున్+ఒంది= కోపంతో ఉద్వేగపడి; ఉద్వృత్త తారకంబులన్= పైకెత్తబడిన కనుగ్రుడ్లతో; వారలన్+ఎల్లన్= వారందరినీ; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** కోపోద్వేగంతో పైకెత్తబడిన కనుగ్రుడ్లతో వారందరిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఈ గెలి వే లార్చెద బా। హాగర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ**
**భాగమునఁ గూల్చి నెఱపెద। నాగద బలు పెట్టు లైన నగుఁ డందాఁకన్. 100**

**ప్రతిపదార్థం:** ఈ గెలివి= ఈ సంతోషం; ఏల?= ఎందుకు?; బాహాగర్వము మెఱయన్= భుజబలం ప్రకాశించగా; అతిశయించగా; మిమ్మున్+అందఱను= మీ అందరినీ; మహీభాగమునన్+కూల్చి= భూమిమీద పడగొట్టి; ఆర్చెదన్= అరుస్తాను; ఎట్టులైనన్= ఏమయినప్పటికిని; నా గద= నా గదయొక్క; బలుపున్= బలమును; నెఱపెదన్= ప్రదర్శిస్తాను; అందాఁకన్= అంతదాక; నగుఁడు= నవ్వండి.

**తాత్పర్యం:** 'ఈ సంతోషం ఎందుకు? నా భుజబలం మెరయగా మీ అందరినీ భూమిమీద పడగొట్టి నా గద యొక్క బలాన్ని ప్రదర్శింపజేస్తాను. అంతవరకు మాత్రమే మీరంతా నవ్వండి.'

**తే. అనుచుఁ బోటులఁ దొరుఁగు రక్తాంబుధార। లంగమెల్లను గప్పిన నప్పు డొప్పె**
**గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ। బొలుచు కులపర్వతంబు చాడ్పున నతండు. 101**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; పోటులన్= దెబ్బలనుండి; తొరుఁగు= కారుతున్న; రక్త+అంబుధారలు= నెత్తురుచారికలు; అంగము+ఎల్లను కప్పినన్= ఒడలంతా కప్పగా; అప్పుడు= ఆ సమయంలో; కావిసెలయేఱులు= ఎర్రనికొండవాగులు; ఎల్లెడన్ కలయన్+పర్వన్= అన్ని దిక్కులందును (అంతటను) వ్యాపించగా; పొలుచు= ఒప్పు; కులపర్వతంబు చాడ్పునన్= కులపర్వతంవలె; అతండు ఒప్పెన్= ఆ దుర్యోధనుడు భాసించాడు.

**తాత్పర్యం:** అంటూ దెబ్బల నుండి జాలువారే నెత్తురు చారికలు ఎర్రని కొండవాగులవలె అన్నిదిక్కులకు వ్యాపించగా, కులపర్వతంవలె అతడు ఒప్పారాడు.

**విశేషం:** అలం: ఉపమ. పర్వతోపమ వలన దుర్యోధనుడి ధైర్యస్థైర్యాలు తెలుస్తున్నాయి.

**వ. అట్లు ఘోరాకారుండై నిలిచి నీ కొడుకు పాండురాజుకొడుకులు బంధుమిత్రపరివారసమేతంబుగా నడరి యొక్క పెట్ట తన్నుం బొదువుదు రని శంకించి పాండవాగ్రజుదెసఁ గనుంగొని. 102**

**ప్రతిపదార్థం:** అట్లు ఘోర+ఆకారుండు+ఐ నిలిచి= ఆ విధంగా భయంకరమూర్తిగా నిలిచి; నీ కొడుకు= నీ కుమారుడు; పాండురాజు కొడుకులు= పాండు కుమారులు; బంధుమిత్ర పరివారసమేతంబుగాన్= బంధువులతోను, స్నేహితులతోను, సేవకులతోను కలసి; అడరి= విజృంభించి; ఒక్కపెట్టన్= ఒక్కుమ్మడిగా; తన్నున్+పొదువుదురు+అని శంకించి= తనను క్రమ్ముకొంటారని అనుమానించి; పాండవ+అగ్రజు+దెసన్+కనుంగొని= ధర్మరాజు దిక్కుచూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా భయంకరాకారుడై నిలిచిన నీ కుమారుడు పాండవులూ, వారి బంధుమిత్రులూ, సేవకులూ, విజృంభించి ఒక్కుమ్మడిగా తనను క్రమ్ముకొంటారని అనుమానించి, ధర్మజుడి దెస చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'రండిట యొక్కఁ డొక్కఁడ దురం బొనరింపఁగ; మీరు పల్వు రొ**
**క్కండను నేను; హేతిహతకాయత డస్సినవాఁడ' నన్న నా**
**తం 'డభిమన్యు బాలుని నధర్మతఁ బ్రౌఢు లనేకయోధు లొ**
**క్కండన కెట్లు చంపి? రటు గాఁ గొను మిబ్బవరంబు'నావుడున్. 103**

**ప్రతిపదార్థం:** రండు+ఇట= ఇటురండి; ఒక్కఁడు+ఒక్కఁడ= ఒకడొక్కడే; దురంబు+ఒనరింపఁగన్= యుద్ధం చేయటానికి; మీరు పల్వురు= మీరు చాలామంది; ఒక్కండను నేను= నే నొక్కడనే; హేతిహత కాయతన్= కత్తిదెబ్బలు కల దేహంతో; డస్సినవాఁడన్= అలసినవాడను; అన్నన్= అనగా; ఆతండు= ఆ ధర్మరాజు; బాలునిన్= పసివాడిని; అభిమన్యున్= అభిమన్యుడిని; అధర్మతన్= అన్యాయంగా; ప్రౌఢులు= నేర్పరులు; అనేకయోధులు= చాలామంది వీరులు; ఒక్కండు+అనక= ఒక్కడేఅని తలచకుండా; ఎట్లు చంపిరి?= ఏ విధంగా చంపారు; ఈ+బవరంబున్= ఈ యుద్ధంలో కూడ; అటుగాన్= ఆ విధంగానే; కొనుము= తీసికొనుము.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ధర్మరాజుతో 'ఒకరొక్కరే యుద్ధానికి ఇటు రండి. మీ రనేకులు నే నొక్కడనే. కత్తివ్రేటులతో చాలా అలసిపోయాను.' అనగా ధర్మరాజు అభిమన్యుని 'పసివాడని ఎంచకుండా ప్రౌఢులైన మీ రనేకులు యోధవరులు ఏ విధంగా చంపారు? ఇపు డీ యుద్ధం కూడా అటులే అనుకొనుము' అని అనగా.

**వ. నిరుత్తరుం డై యున్న భవత్తనయున కా ధర్మతనయుం డిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** నిరుత్తరుండు+ఐ+ఉన్న= బదులు చెప్ప జాలకఉన్న; భవత్+తనయునకున్= నీ కుమారుడితో; ఆ ధర్మతనయుండు+ఇట్లు+అనియెన్= ఆ ధర్మరాజు ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** మారు పలుకలేక నిలిచిఉన్న నీ కొడుకుతో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. 'ఏ నట్లు సూపి చెప్పితిఁ। గాని యది రణంబుపాడి గామి యెఱుఁగుదున్;**
**రా నీను నీదుపయి మ। త్సైనికులను వెఱవ కాయితము గమ్ము నృపా! 105**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; ఏను+అట్లు చూపి చెప్పితిన్కాని= నేనా విధంగా ఎత్తి చూపి చెప్పాను గాని; రణంబుపాడి= యుద్ధధర్మం; అది కామి= అది కాకపోవటం; ఎఱుఁగుదున్= తెలిసినవాడను; మత్+సైనికులను= నా సేనలను; నీదుపయిన్= నీ మీదకు; రానీను= రానియ్యను; వెఱవక= భయపడక; ఆయితము+కమ్ము= సిద్ధపడుము.

**తాత్పర్యం:** 'నే నా విధంగా ఎత్తి చూపాను. కానీ యుద్ధధర్మం అది కాదని నాకు తెలుసు. నా సేనను నీమీదకు రానీయను. భయపడకుండా సిద్ధం కమ్ము.

**క. తల సక్క ముడిచికొని ద్రిం। డలవడ బంధించి పోరి కమరి నిలువు; నీ**
**వలచిన యట్టివ యిచ్చెద। నలఘుశిరస్త్రాణ కంకటాదులు నెమ్మిన్. 106**

**ప్రతిపదార్థం:** తల+చక్కముడిచికొని= తలను బాగా కట్టుకొని(జుట్టును ముడివేసికొని); ద్రిండు+అలవడన్ బంధించి= తల వెనుక (మెత్తదనమునకై) దిండొక దానిని కట్టుకొని; పోరికిన్= యుద్ధానికి; అమరి నిలువు= బాగా నిలబడుము; నీ వలచిన

యట్టివ= నీవు ఇష్టపడినవాటినే; అలఘు= పెద్దవి అయిన; శిరస్త్రాణ కంకట+ఆదులు నెమ్మిన్= తలకును ఒంటికినీ రక్షలైన కవచాదులను; నెమ్మిన్= ప్రీతితో; ఇచ్చెదన్= ఇస్తాను;

**తాత్పర్యం:** తల జడను బాగా కట్టుకొని, తలక్రింద దిండును కట్టుకొని యుద్ధానికి వచ్చి నిలువుము. నీకు నచ్చిన వాటిని తలకు ఒంటికి సరిపడే కవచాలను ఇస్తాను.

**వ. మఱియు నొక్క తెఱంగు నీమనంబున మెచ్చును నచ్చెరువును నెలకొనం బలికెద; నాకర్ణింపుము. 107**

**ప్రతిపదార్థం:** మఱియున్+ఒక్క తెఱంగు= ఇంకొక విధం; నీ మనంబునన్= నీ మనసుతో; మెచ్చును+అచ్చెరువును; మెప్పూ. ఆశ్చర్యమూ; నెలకొనన్= కుదురుకొనే విధంగా; పలికెదన్= మాటాడుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇంకొక విధం నీ మనసులో మెప్పు, ఆశ్చర్యం కుదిరేటట్లుగా మాటాడుతాను. వినుము.

**తే. ఏఱికొను మీవు నొకని మాయేవురందు; । వాఁడు నీతోడ గదఁ బోరువాఁడు; వానిఁ**
**జంపి మహి యేలు; వానిచేఁ జచ్చి త్రిదివ । సౌఖ్య మొందుము; చేసితి సమయ మేను.' 108**

**ప్రతిపదార్థం:** మా ఏవురు+అందున్+ఒకనిన్= మా అయిదురుగురితో ఒకడినిని; ఈవున్+ఏఱికొనుము= నీవు ఎంచుకొనుము; వాఁడు= అతడు; నీతోడన్= నీతో; గదన్+పోరుఁవాడు= గదతో యుద్ధం చేయగలడు; వానిన్= ఆతడిని; చంపి= నాశనంచేసి; మహి+ఏలు(ము)= భూమిని పాలించుము(లేదా); వానిచేన్+చచ్చి= ఆతడిచేతలో చనిపోయి; త్రిదివసౌఖ్యము= స్వర్గసౌఖ్యమును; ఒందుము= పొందుము; ఏను+సమయము+చేసితిన్= నేను ప్రమాణం చేస్తున్నాను.

**తాత్పర్యం:** మా ఐదుగురిలో ఒకడిని ఎన్నుకొనుము. వాడు నీతో యుద్ధం చేస్తాడు. వాడిని చంపి మొత్తం రాజ్యాన్ని ఏలుకొనుము. (లేదా) వాడివలన చచ్చి దేవలోకసుఖాన్ని పొందుము. నే నీ ప్రతిజ్ఞ చేస్తున్నాను.'

**వ. అని పలికి యుజ్జ్వల వివిధవర్మంబు లాతని ముందటం బెట్టించి. 109**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాటాడి; ఉజ్జ్వల= కాంతిమంతాలైన; వివిధ వర్మంబులు= నానా విధాలయిన కవచాలను; వానిముందటన్+పెట్టించి= ఆ దుర్యోధనుడి ముందుంచి.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా మాట్లాడి, కాంతిమంతాలయిన అనేక కవచాలను అతడి ముందు పెట్టించి.

**క. 'విను జీవముతో నిన్నుం । జననిచ్చుట యొండు దక్క సమరంబున గో**
**రినయది నీ కొసఁగెద; నిం । తన చెడియెనె యకట! యన్నదమ్ముల కూర్మల్?' 110**

**ప్రతిపదార్థం:** విను; నిన్నున్= నిన్ను; జీవముతోన్= ప్రాణాలతో; చనన్+ఇచ్చుట= పోనీయటం; ఒండు= ఒకటి; తక్కన్= తప్ప; సమరంబునన్= యుద్ధంలో; కోరిన+అది= కోరుకొన్నది; నీకున్+ఒసఁగెదన్= నీ కిస్తాను; అన్నదమ్ముల కూర్మల్= అన్నదమ్ములకుండే అభిమానాలు; అకట!= అయ్యో!; ఇంతన చెడియెనె?= ఈ మాత్రానికే చెడిపోయాయా?

**తాత్పర్యం:** 'వినుము. నిన్ను ప్రాణాలతో పోనీయటం తప్ప (ఈ) యుద్ధంలో నీ కోరినవన్నీ ఇస్తాను. ఇంతమాత్రాన అన్నదమ్ముల కున్న బంధుత్వం నశించినదా?'

**వ. అనిన విని నీతనయుం 'డిట్ల కాక నీవు నా కలిగెదవే?' యని కనకచిత్రితంబులగు శిరస్త్రాణకంకటంబులు గైకొని ధరియించి కాంచనాచలంబు ననుకరించుచు గద చేత నమర్చి పాండవాగ్రజుం గనుంగొని.111**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విన్నవాడై; నీతనయుండు= నీకుమారుడు; ఇట్లు+అ కాక= ఇంతే కాక; నీవు నాకున్+అలిగెదవే?= నా మీద నీవు కోపగిస్తావా?; అని= అంటూ; కనక చిత్రితంబులు+అగు= బంగారు తొడిగిన; శిరస్త్రాణ కంకటంబులు కైకొని= తలకు, ఒడలికి కవచాలు తీసికొని; ధరియించి= వేసికొని; కాంచనాచలంబున్= మేరుపర్వతమును (బంగారు కొండను); అనుకరించుచున్= పోలి; గద చేతన్+అమర్చి= గదను చేతబట్టుకొని; పాండవాగ్రజున్+కనుంగొని= ధర్మరాజును చూచి.

**తాత్పర్యం:** అంతట నీ కుమారుడు 'అటులే! నీవు నాపై కోపగిస్తావా?' (కోపగించవు అని తెలుసు) అని బంగారుమయమయిన కవచాలను తలకూ శరీరానికీ వేసికొని మేరుపర్వతమును తలపిస్తూ గద చేతబూని ధర్మజుడిని చూచి.

**సీ. 'కవలలో నొకఁ డొండె, గాండివి యొండె, వృ । కోదరుఁ డొండె, నీ వొండెఁ జేత**
**గద గొని యెక్కటికయ్యంబునకుఁ బూని । యేర్పడ నిలిచిన, నీ క్షణంబ**
**సమయంగఁ జూచెద; గ్రమమున మీ రెల్ల । నొకఁ డొక్కఁ డేతేరఁ బ్రకటబాహు**
**దర్పంబు వొగడొంద ధరఁ గూల ద్రేయుచు । వచ్చెద; మఱియు నీవారిలోన**

**తే. నలిగి యెవఁడు దాఁకిన నట్ల నాదు । గదకు నెరసేసి పేర్చెదఁ; గడు గదార**
**ణంబు నాతోడఁ జేయ మన్మథహరుండు । గడఁగ లేఁడు; మీ కెందుఁ బోఁ గలదు నేఁడు?' 112**

**ప్రతిపదార్థం:** కవలలోన్+ఒకఁడు= నకుల సహదేవులలో ఒకడు; ఒండెన్= లేదా; గాండివి= అర్జునుడు; ఒండెన్= లేదా; వృకోదరుఁడు= భీముడు; ఒండెన్= లేదా; నీవు+ఒండెన్= నీవైనా కాని; చేతన్గదన్+కొని= గదను తీసికొని; ఎక్కటికయ్యంబునకున్= ఒక్కడుగా యుద్ధానికి; పూని= సన్నద్ధమై; ఏర్పడన్+నిలిచినన్= స్పష్టంగా నిలిచినట్లయితే; ఈ క్షణంబు+అ= ఇప్పుడే; సమయంగన్+చూచెదన్= చచ్చునట్లు చూస్తాను; క్రమమునన్= వరుసగా; మీరు+ఎల్లన్= మీరంతా; ఒకఁడు+ఒక్కఁడు+ఏతేరన్= ఒక్కొక్కడుగా రాగా; ప్రకట బాహుదర్పంబు= స్పష్టమయిన భుజబలం; పొగడు+ఒందన్= కీర్తనీయం కాగా; ధరన్= భూమిపై; కూలద్రేయుచున్ వచ్చెదన్= పడద్రోస్తూ వస్తాను; మఱియున్= ఇంకను; నీవారిలోనన్= నీ మనుష్యులలో; అలిగి= కోపంతో; ఎవ్వఁడు తాఁకినన్= ఎవ డెదుర్కొనప్పటికినీ; ఎర+చేసి= ఆ విధంగానే గదకు ఆహారం చేసి; కడున్= మిక్కిలి; పేర్చెదన్= అతిశయిస్తాను; గదారణంబున్= గదాయుద్ధాన్ని; నాతోడన్= నాతో; చేయన్= చేయగా; మన్మథహరుండు= ఈశ్వరుడు; కడఁగన్ లేఁడు= పూనుకొనలేడు; నేఁడు= ఈనాడు; మీకున్+ఎందున్ పోన్+కలదు?= మీ రెక్కడికి బోగలరు?

**తాత్పర్యం:** 'నకుల సహదేవులం దొకడు గానీ, అర్జునుడు కానీ, భీముడు కానీ, లేక నీవో - ఈ క్షణమే గద చేబూని ద్వంద్వయుద్ధానికి సిద్ధమైతే మీ చావును చూస్తాను. మీరంతా ఒక డొక్కడుగా వచ్చినట్లయితే నా భుజబలగర్వంతో భూమిమీద పడగొట్టుతాను. అంతేకాదు. నీ వాళ్ళలో ఎవరు వచ్చినా నా గదకు ఆహారంగా చేస్తాను. నాతో గదాయుద్ధానికి ఈశ్వరుడు కూడా సాహసించడు. ఇక మీరు నే డెక్కడికి పోగలరు?'

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి.

**వ. ఇవ్విధంబున దుర్యోధనుం డుద్ధతుం డై మఱియుం బెద్ద యెలుంగునఁ బలుకుచుండ నతండు వినకుండఁ బద్మనాభుండు పాండవాగ్రజున కిట్లనియె. 113**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; దుర్యోధనుండు+ఉద్ధతుండు+ఐ= దుర్యోధనుడు గర్వించినవాడై; మఱియున్+ పెద్దఎలుంగునన్= ఇంకాపెద్దగొంతుతో; పలుకుచుండన్= మాట్లాడుతూ ఉండగా; అతండు= దుర్యోధనుడు; వినకుండన్= వినకుండే విధంగా; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు; పాండవ+అగ్రజునకున్+ఇట్లనియెన్= ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధను డీవిధంగా గర్వించి మాట్లాడుతూ మరింత పెద్ద గొంతుతో పలుకసాగాడు. అతడికి వినబడనట్లుగా శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు:

**చ. 'ఇతఁడు గదారణంబునకు నీ కొలఁదిన్ నినుఁ బిల్చినన్ మరు**
**త్పతిసుతుఁ గోరినం జిఱుతతమ్ములలో నొకనిన్ వరించినన్**
**మతిసెడిరొక్కొవీర? లనుమాటకుఁ బాత్రము గామె? సాహసం**
**బుతఱియె? మేదినీశ! యిది బుద్ధి దొఱంగి తనుగ్రహంబునన్. 114**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ దుర్యోధనుడు; గదారణంబునకున్= గదాయుద్ధానికి; కొలఁదిన్= ఇంతగా; నినున్ పిల్చినన్= నిన్ను పిలచినప్పటికిని; మరుత్పతిసుతున్+కోరినన్= దేవరాజసూను డయిన అర్జునుడిని ఆహ్వానించినప్పటికినీ; చిఱుత తమ్ములలోన్+ఒకనిన్= చిన్న తమ్ములైన నకుల సహదేవులలో ఒకడిని; వరించినన్= కోరినప్పటికినీ; వీరలు= ఈ పాండవులు; మతి+చెడిరి+ఒక్కొ?= మతి పోగొట్టుకొన్నారా?; అనుమాటకున్= అనే మాటకు; పాత్రను కామె?= పాత్రమగుదుము కదా!; సాహసంబు తఱియె?= సాహసించటానికి సమయమా?; మేదినీశ!= ఓ రాజా!(ధర్మజా!); ఇది= ఇట్టి చేష్ట; అనుగ్రహంబునన్= దయవలన; బుద్ధి తొఱంగితి(వి)= తెలివిని విడిచిపెట్టావు.

**తాత్పర్యం:** 'ఈ దుర్యోధనుడు గదాయుద్ధానికి ఇంతగా నిన్ను, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ, వీరిలో ఒకరిని పిలిస్తే బుద్ధి చెడి పాండవులు దీని కొప్పుకొన్నారనే మాట వస్తుంది కదా! ఎక్కువదయ చూపటంలో తెలివిని విడిచావు.

**చ. ఒకరునిఁ జంపితేని సకలోర్వియుఁ గైకొను మంట నీవు మున్**
**శకునికి మాయజూదమున సంపద లెల్లఁ ద్రయోదశాబ్దభో**
**గ్యకృతి నమర్చి యొడ్డి నటు లైనది పందెపుఁగయ్య మయ్యె శ**
**త్రుకులము నెల్ల దుఃఖపడి త్రుంచుట దాఁ దుదిఁ బందెమాడనే? 115**

**ప్రతిపదార్థం:** ఒకరునిన్= ఒక్కడిని; చంపితి(వి)+ఏని= చంపినట్లయితే; సకల+ఉర్వియున్+కైకొనుము+అంట= భూమినంతను తీసికొనుమనటం; నీవు; మున్= ఇదివరకు; శకునికిన్; మాయజూదమునన్= మోసపూరిత మయిన జూదంలో; సంపదలు+ఎల్లన్= ఐశ్వర్యమంతటినీ; త్రయోదశ+అబ్ద= పదమూడేండ్లు; భోగ్యకృతిన్+అమర్చి= అనుభవించుకొనే పద్ధతిని సిద్ధం చేసి; ఒడ్డినటులు+ ఐనది= పందముగా పెట్టినట్టైనది; పందెపున్+కయ్యము+అయ్యెన్= పందెమునకై యుద్ధమయింది; శత్రుకులమున్+ఎల్లన్= వైరికులమునంతటినీ; దుఃఖపడి త్రుంచుట= కష్టపడి చంపుట; తాన్= అది; తుదిన్= తుదకు; పందెము+ఆడనే?= పందె మాడటానికా?

**తాత్పర్యం:** ఓ ధర్మజా! ఒకడిని చంపితే భూమినంతనూ తీసికొనుమని చెప్పటం - ఇదివరకు నీవు మాయాజూదంలో శకునికి సంపదనంతనూ పదమూడేండ్లు అనుభవించటానికి సమర్పించినట్లు ఐనది. పందెపు జగడంగా తయారయింది. కష్టపడి వైరులను సంహరించటం - తుదకు పందెమాడటానికా?

**చ. నరవర! యెక్క టెక్కటి పెనంగఁగ భీముని నైనఁ బన్పఁ గా**
**దరయఁగ భీముకంటె గదయందలి కౌశల మెక్కు డీ మహి**
**శ్వరునకు; భీముమేన బలసంపద మిక్కిలి; దానఁ బోవునే?**
**వెరవునఁ గోలుపోదె భుజవీర్యము? పోరుల నెందుఁ జూడమే?' 116**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; ఎక్కటి+ఎక్కటి పెనంగన్= ఒకరితో ఒక్కరే యుద్ధం చేయగా; భీమునిన్+ఐనన్= భీముడిని కూడా; పన్పన్+కాదు= పంపకూడదు; అరయఁగన్= పరిశీలించగా; ఈ మహీశ్వరునకున్= ఈ రాజునకు; భీముకంటెన్= భీముడికన్నను; గదయందలి కౌశలము+ఎక్కుడు= గదావిద్యయందలి నేర్పరితనం ఎక్కువ; భీముమేనన్= భీముడి శరీరంలో; బలసంపద మిక్కిలి= బలసంపద ఎక్కువ; దానన్+పోవునే?= అంతమాత్రాన సరిపోతుందా!; వెరవునన్= ఉపాయంతో; భుజవీర్యము= భుజబలం; కోలుపోదె= ఓడిపోదా?; పోరులన్+ఎందున్+చూడమే?= యుద్ధాలనెక్కడైనా చూడమా?

**తాత్పర్యం:** ఓ రాజా! ఒక్కరొక్కరుగా యుద్ధం చేయటానికి భీముడిని కూడా పంపరాదు. ఎందుకంటే ఈ మహారాజుకు గదావిద్యయందు నేర్పు ఎక్కువ. భీముడికి శరీరబల మెక్కువ. అంతమాత్రాన సరిపోతుందా? ఉపాయానికి ముందు భుజబలం వీగిపోవటం మనం యుద్ధాలలో చూస్తున్నాము కదా!'

**వ. అనిన విని మహాబలనందనుండు వసుదేవనందనున కిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; మహాబలనందనుండు= భీమసేనుడు; వసుదేవనందనునకున్+ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని భీముడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

### శ్రీకృష్ణుఁడు భీము నగ్గించి దుర్యోధనుతోఁడి గదాయుద్ధమునకుఁ బనుచుట (సం. 9-32-15)

**మ. 'గద నా చేతికి వచ్చినప్పుడు మహోగ్రక్రీడమై లోకము**
**ల్పదునాల్గున్ సమయింతుఁ బొ మ్మను సముల్లాసంబు న న్నొందు; దు**
**ర్మదసంరంభ వికత్థనుం డయిన కౌరవ్యాధముం డెట్లు నా**
**కెదు రై ప్రాణముతోడఁ బోవు? నృపు నిట్లే లొత్తె దీమాత్రకున్? 118**

**ప్రతిపదార్థం:** గద నాచేతికిన్ వచ్చిన+అప్పుడు= నా చేతిలో గద ఉన్నపుడు (అనగా ధరించినపుడు); మహా+ఉగ్రక్రీడమైన్= మిక్కిలి భయంకరమైన ఆటతో; లోకముల్ పదునాల్గున్= పదునాల్గు లోకాలను; సమయింతున్+పొమ్ము= నిశ్చయంగా సంహరిస్తాను పోవయ్యా! (అని పరిహాసంగా); అను సముల్లాసంబు= అనే ఉత్సాహం; నన్నున్+ఒందున్= నాకు కలుగుతుంది; దుర్మదసంరంభ= దురహంకారంతో; వికత్థనుండు+అయిన= ఆత్మస్తుతి పరుడయిన; కౌరవ్య+అధముండు= కౌరవులలో నీచుడు; ఎట్లు= ఏ విధంగా; ఎదురై= ఎదుర్కొని; ప్రాణముతోడన్+పోవున్= బ్రతికిపోతాడు?; ఈ మాత్రకున్= ఇంత మాత్రానికే; నృపున్= ధర్మరాజును; ఇట్లు= ఈ విధంగా; ఏల+ఒత్తెదు?= ఎందుకు నిష్ఠురంగా మాటాడుతావు?

**తాత్పర్యం:** నా చేతిలో గద ఉండగా పదునాల్గులోకాలు ఎదురయినా ఆటవలె భయంకరంగా నిశ్చయంగా సంహరిస్తాను. దురహంకారంతో ఆత్మస్తుతి నున్న నీచ దుర్యోధనుడు నాకంట బడి ప్రాణాలతో పోగలడా? ఎందుకయ్యా ఇంతమాత్రానికే ధర్మరాజును నీవు వ్యర్థంగా మాట్లాడుతావు?

**విశేషం:** పొమ్ము - నిశ్చయార్థకం.

**తే.** **వాని గద భారమునకు నొవ్వకయు నాదు । పటుగదాదండ ముద్దండ బాహుదర్ప**
**లీల విలసిల్ల వ్రేయుదు నేలఁ గూల । సంతసముతోడి మెచ్చు పుట్టింతు నీకు.'** **119**

**ప్రతిపదార్థం:** వాని గదభారమునకున్= ఆ దుర్యోధనుడి గదయొక్క బరువుకు; నొవ్వకయున్= బాధపడకుండా; నాదు పటుగదాదండము; ఉద్దండబాహుదర్పలీలన్= భయంకరభుజబలక్రీడతో; విలసిల్లి= ఒప్పి; నేలన్+కూలవ్రేయుదున్= భూమిమీద పడద్రోసెదను; నీకున్; సంతసముతోడి= ఆనందంతో కూడిన; మెచ్చు= మెప్పు; పుట్టింతున్= కలిగిస్తాను.

**తాత్పర్యం:** (ఓ కృష్ణా!) ఆ దుర్యోధనుడి గదాభారానికి బాధపడకుండా భయంకర మైన నా భుజబలక్రీడతో ఒప్పి, అతడిని నేలగూలవేస్తాను. నీకు సంతోషంతో కూడిన మెప్పును కల్గిస్తాను.'

**వ.** **అనుటయు నచ్యుతుండు ప్రియం బెసంగ నాకిమ్మీరమర్దను మొగంబునఁ జూడ్కి నిలిపి.** **120**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ప్రియంబు+ఎసంగన్= ప్రీతి కలుగగా; ఆ కిమ్మీరమర్దను మొగంబునన్= కిమ్మీరు డనే రాక్షసుడిని చంపిన ఆ భీముడి ముఖంపై; చూడ్కినిలిపి= చూపు నిలిపి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ప్రేమాతిశయంగా కిమ్మీరుడిని చంపిన భీముడి మొగమున ప్రీతి కలుగగా చూచినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ.** **'బకవిధ్వంసన మాచరించితి; హిడింబప్రాణముల్ గొంటి కీ**
**చకనిర్మూలనకేలి సల్పితి జరాసంధాంగక స్వైర భం**
**జకలీలన్ విలసిల్లి తీ వవి మనుష్యస్ఫూర్తి మాత్రంబులే?**
**యొక మర్త్యుం డెదు రెట్లు నీకు? మది నే నూహింప కి ట్లాడితిన్.** **121**

**ప్రతిపదార్థం:** ఈవు= నీవు; బక విధ్వంసనము+ఆచరించితి(వి)= బకు డనే వానిని సంహరించావు; హిడింబ ప్రాణముల్+ కొంటి(వి)= హిడింబాసురుడి ప్రాణాలను తీశావు; కీచక నిర్మూలన కేలి+చల్పితి(వి)= కీచకులను మొత్తంగా నాశం చేశావు; జరాసంధ= జరాసంధుడి; అంగకస్వైర భంజకలీలన్ విలసిల్లితి(వి)= శరీరాంగాలను స్వైరంగా విరిచే ఆటలో ప్రకాశించావు; అవి= ఆయా పనులు; మనుష్యస్ఫూర్తి= మానవుడి ప్రజ్ఞ; మాత్రంబులే?= అంతమాత్రమేనా?; నీకున్; ఒక మర్త్యుండు= ఒకానొక మానవుడు; ఎదురు+ఎట్లు?= ఎదురై ఏ విధంగా ఉండగలడు?; మదిలోన్= మనసులో; ఊహింపక= యోచన సేయకుండ; ఇట్లు+ఆడితిన్= ఈ విధంగా అన్నాను.

**తాత్పర్యం:** 'బకుడిని నాశం చేశావు. హిడింబాసురుడిని సంహరించావు. జరాసంధుడిని శరీరభాగాలు స్వేచ్ఛగా విరిచి జయించావు. సామాన్య మానవుడు చేయగలిగిన పను లేనా ఇవి! మనుష్యులలో ఒకడు నీకు సాటియా? యోచించక ఇట్లా అన్నాను.

**క. కాళింగాదిక్షోణీ । పాలుర నున్మదమహాద్విపప్రకరములన్**
**నేల నిడి కాలఁ జమరితి । వాలిన కురునృపకుమార వర్గంబులతోన్.' 122**

**ప్రతిపదార్థం:** కాళింగ+ఆది క్షోణీపాలురన్= కాళింగుడు మొదలైన రాజులను; ఉన్మద మహాద్విప ప్రకరములన్= మిక్కిలి మత్తిల్లిన ఏనుగుల సమూహములను; నేలన్+ఇడి= భూమిపైన ఉంచి(పడద్రోసి); వాలిన= అతిశయించిన; కురునృప కుమారవర్గంబులతోన్= కురు రాజకుమార సమూహాలతో; కాలన్+చమరితి(వి)= కాలితో నలగగొట్టావు.

**తాత్పర్యం:** కాళింగాది రాజులను, కురురాజ కుమారులను మత్తిల్లిన ఏనుగుల గుంపును నేలద్రోసి కాలితో నలియద్రొక్కావు.

**వ. అని పలికి కురుపతిదెసఁ గటాక్షవీక్షణంబు నిగుడ వెండియు. 123**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; కురుపతిదెసన్= దుర్యోధనుడి దిక్కునకు; కటాక్షవీక్షణంబు= కడకంటి చూపులు; నిగుడన్= వ్యాపించగా; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు పలికి, దుర్యోధనుడివైపు కడగంటి చూపు సారించి, మరల భీముడితో ఇట్లా అన్నాడు.

**తే. 'వాలి దుశ్శాసనుని ఱొమ్ము వ్రయ్యఁ జీరి । నీవు నెత్తురు ద్రావంగ నిన్ను నతఁడు**
**సూచుచుండియు వెఱసొచ్చి స్రుక్కెఁగాక । కవియఁజాలెనె నీపయిఁ బవనతనయ? 124**

**ప్రతిపదార్థం:** పవనతనయ!= ఓ వాయుపుత్రా! (భీమసేనా!); వాలి= విజృంభించి; దుశ్శాసనుని ఱొమ్ము= దుశ్శాసనుడి రొమ్మును; వ్రయ్యన్+చీరి= పగిలేటట్లు చీల్చి; నీవు నెత్తురు త్రావంగన్= నీవు నెత్తురు త్రాగగా; అతఁడు= ఆ దుర్యోధనుడు; నిన్నున్= నిన్ను; చూచుచుండియున్= చూస్తున్నప్పటికినీ; వెఱన్+చొచ్చి= భయపడి; స్రుక్కెన్+కాక= (భయంతో) అణగినాడుగాని; నీ పయిన్+కవయన్+చాలెనె?= నీ మీదకు క్రమ్ముకొన గల్గాడా?

**తాత్పర్యం:** '(నీవు) విజృంభించి దుశ్శాసనుడి రొమ్మును చీల్చి అతడి నెత్తురును త్రాగినపుడు చూస్తూ ఉన్నప్పటికినీ భయంతో అణగి, ముడుచుకొని ఉన్నాడు. కాని నీమీదకు ఈ దుర్యోధనుడు దాడి చేయగలిగాడా?

**చ. అగపడి కచ్చువెట్టి యితఁ డాడినమాటల కిప్డు బల్లిదుం**
**డుగఁ గొని యేను బల్వురుఁ గడు న్వడి నీతనిఁ జంపకుండ నే**
**మిగ సమయంబు సేసి తిది మేలొకొ? యంటి నృపాలుతోడ నీ**
**మగఁటిమి చందముల్ దలఁచి మారుతనందన! యూఱడిల్లితిన్. 125**

**ప్రతిపదార్థం:** మారుతనందన!= వాయునందనా!; అగపడి= వశపడి; కచ్చు+పెట్టి= గర్వంతో; ఇతఁడు+ఆడిన మాటలకున్= ఇతడు మాట్లాడిన మాటలకు; ఇప్డు= ఈ సమయంలో; బల్లిదుండుగన్+కొని= బలవంతుడుగా లెక్కచేసి; ఏను; పల్వురున్= చాలమంది; కడున్+వడిన్= మిక్కిలి వేగంగా; వీనిన్+చంపకుండన్= చంపకుండ ఉండేటట్లు; ఏమిగ+సమయంబు+చేసితి(వి)?= ఏమని ప్రతిజ్ఞ చేశావు?; ఇది మేలు+ఒకొ?= ఇది మంచిదేనా అని?; నృపాలు తోడన్= ధర్మరాజుతో; అంటిన్; నీ మగఁటిమి చందముల్= నీ బలముయొక్క విధములు; తలఁచి= తలచుకొని; ఊఱడిల్లితిన్= ఊరటచెందాను.

**తాత్పర్యం:** భీమసేనా! గర్వంతో ఈ దుర్యోధనుడు ఆడిన మాటలకు అతడిని బలవంతుడిగా పరిగణించి, ధర్మరాజుతో 'అందరూ వెంటనే వేగంగా వీడిని చంపకుండా ఏమని ప్రతిజ్ఞ చేశావు?' అన్నాను. అయితే, నీ శౌర్యాన్ని జ్ఞాపకం చేసికొని ఊరట చెందాను.

**చ. తులువతనంబునన్ సభకు ద్రోపది ముందల వట్టి యీడ్చి య**
**ట్లలఁపఁగఁ జూచి నీవు దగ నాడిన రెండు దెఱంగులందుఁ బెం**
**పొలయఁగ దుస్ససేనుపని యొక్కటి దీర్చితి; తీర్పు మింక బా**
**హుల కసివోవ వీనిపనియుం ద్వరితక్రమవిక్రమంబునన్. 126**

**ప్రతిపదార్థం:** తులువతనంబునన్= తుంటరితనంతో; సభకున్= సభలోనికి; ద్రోపదిన్= ద్రౌపదిని; ముందల(ముందు+తల)+ పట్టి= జుట్టుపట్టుకొని; ఈడ్చి= లాగి; అట్లు= ఆ మాదిరిగా; అలఁపఁగన్= బాధించగా; చూచి= చూచిన; నీవు (ఓ భీమసేనా నీవు); తగన్= తగినట్లు; ఆడిన రెండు తెఱంగుల+అందున్= చెప్పిన రెండు విధాలలో; పెంపు+ఒలయఁగన్= గొప్పదనం తెలియగా; దుస్ససేను పని+ఒక్కటి= దుశ్శాసనుడి పని ఒక్కటి - మొదటిదానిని; తీర్చితి(వి)= తీర్చుకొన్నావు(సంహరించావు); ఇంకన్= ఇక పోగా; బాహుల కసి+పోవన్= భుజాల కసి తీరేటట్లుగా; వీని పనియున్= ఈ దుర్యోధనుడి పనినికూడా(అనగా చంపటం); త్వరితక్రమ విక్రమంబునన్= తొందరగా క్రమవిజృంభణంతో; తీర్పుము= నెరవేర్చుము.

**తాత్పర్యం:** తుంటరితనంతో సభలో ద్రౌపది ముందరి జుట్టును పట్టుకొని లాగి, ఆ విధంగా బాధించగా చూచిన నీవు చేసిన ప్రతిజ్ఞలలో రెండింటిలో మొదటిదానిని దుశ్శాసనుడిని చంపి తీర్చుకొన్నావు. ఇక పోగా భుజాల తీట తీరేటట్లుగా ఈ దుర్యోధనుడి పనిని కూడా తీర్చుము (చంపుము), విజృంభించుము, త్వరపడుము.

**తే. పరజయము నొంది కట్టుము పట్ట మఖిల । ధరణి రాజ్యంబునకు ధర్మతనయుఁ బ్రీతి**
**బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు । నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు!' 127**

**ప్రతిపదార్థం:** పరజయమున్+ఒంది= శత్రుజయముపొంది; అఖిల ధరణిరాజ్యంబునకున్= సమస్త భూసామ్రాజ్యానికి; ప్రీతిన్= ప్రియంతో; ధర్మతనయున్= ధర్మరాజుకు; పట్టము కట్టుము= పట్టాభిషేకం చేయుము; నీవు+తమ్ములు= నీవూ, నీ తమ్ములూ; ఎల్ల బంధువులకున్= బంధువులందరికి; కన్నులపండువు+అగుచున్= కన్నులపండుగగా; సుఖవృత్తిన్+నెలవు కొనుఁడు= సుఖంగా ఉండండి.

**తాత్పర్యం:** శత్రుజయాన్ని సాధించి, సమస్త భూమండలానికీ ధర్మరాజును ప్రభువుగా పట్టాభిషేకం చేయుము. బంధువులకు కన్నులపండువుగా నీవూ, నీ తమ్ములూ సుఖంగా ఉండండి.'

**వ. అని మఱియును. 128**

**ప్రతిపదార్థం:** అని మఱియున్= అని ఇంకను.

**తాత్పర్యం:** అని ఇంకను. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. 'బరవస మొప్ప నీవు గదపండువు సేయఁ దలంచి తాఁకినం**
**గురుపతి నిర్జితుం డగుటకుం బవనాత్మజ! యేను బూఁట; పో**

**టరితన మెల్లఁ జూపుము; కడంగుము నీ' వని యేలిమాటమై**

**నరవర! ధర్మసూనుఁడు వినన్ విజయం బొసఁగెన్ మఱందికిన్. 129**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా! ధృతరాష్ట్రా!; పవన+ఆత్మజ!= వాయునందనా!; బరవసము+ఒప్పన్= ధైర్యముఒప్పగా; నీవు గదపండువు చేయన్+తలంచి తాఁకినన్= గదకు పండువు చేయనెంచి తాకినట్లయితే; కురుపతి= కురురాజు; నిర్జితుండు+ అగుటకున్= ఓడిపోవటానికి; ఏను+పూఁట= నేను బాధ్యత వహిస్తాను; పోటరితనము= (నీ)వీరత్వమును; ఎల్లన్+చూపుము=అంతటినీ ప్రదర్శించుము; నీవు; కడంగుము= పూనుకొనుము; అని= అంటూ; ధర్మసూనుఁడు+వినన్= ధర్మరాజు వినేటట్లు; ఏలిమాటన్= కృత్రిమంగా; మఱందికిన్= మేనమరదికి(భీముడికి); విజయం బొసఁగెన్= జయమునిచ్చాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ధైర్యంతో నీవు గదకు పండుగు చేయ నెంచి తలపడితే దుర్యోధనుడు హతుడవుతాడు. భీమసేనా! అందుకు నేను బాధ్యుడను. నీ పరాక్రమాన్ని పూర్తిగా ప్రదర్శించుము. పూనుకో - అని పరిహాసంగా ధర్మరాజు వినేటట్లుగా భీముడికి కృత్రిమంగా విజయం చేకూరేటట్లుగా (కృష్ణుడు) పలికాడు.

**వ. ఇవ్విధంబున వృకోదరునకు మనోజయప్రదంబు లగు మాట లాడి 'దుర్యోధనుండు దండిమగండు; శ్రమంబునుం జాలఁగలఁడు; నీ వతిప్రయత్నంబునుఁ బెనంగవలయుఁ జుమ్మీ!' యని పలికె; నప్పుడు సాత్యకి యా సమీరనందను నగ్గించెఁ, బాంచాలురుఁ దక్కునుంగలుగు ధరణీశులు నబ్బలుమగనిఁ బ్రశంసించి; రతం డగ్రజునాననం బాలోకించి. 130**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; వృకోదరునకున్= భీముడికి; జయప్రదంబులు+అగు మాటలు+ఆడి= జయాన్ని కలిగించే మాటలు చెప్పి; దుర్యోధనుండు; దండిమగండు= పెద్దవీరుడు; శ్రమంబునున్+చాలన్+కలఁడు= సాధనబాగా చేశాడు; ప్రయత్నంబునన్= నీవు మిక్కిలి ప్రయత్నంతో; పెనంగవలయున్+చుమ్మీ!= పోట్లాడవలెను సుమా!; అని పలికెన్= అని మాటాడాడు; అప్పుడు= ఆ సమయంలో; సాత్యకి; సమీరనందనున్= భీముడిని; అగ్గించెన్= పొగడాడు; పాంచాలురు= పాంచాల దేశంవారును; తక్కునున్+కలుగు= మిగిలిన; ధరణీశులున్= రాజులును; ఆ+బలుమగనిన్= బలవంతు డయిన ఆ వీరుడిని; ప్రశంసించిరి= పొగడారు; అతండు+అగ్రజుని+ఆననంబు+ఆలోకించి= అతడు తన అన్న అయిన ధర్మజుడి మొగాన్ని చూచి.

**తాత్పర్యం:** (శ్రీకృష్ణుడు) ఈ విధంగా భీముడికి జయం కలిగేటట్లు మాట్లాడి, 'దుర్యోధనుడు పెద్దవీరుడు; గదాయుద్ధ సాధన బాగా చేసినవాడు. నీవు మిక్కిలి ప్రయత్నంతో పోట్లాడవలెను' అన్నాడు. సాత్యకి, పాంచాల కుమారులూ, మిగిలిన వారూ బలవంతుడైన భీమసేనుడిని పొగడారు. ఆతడు అన్నగారి మొగం చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'వినుము నరేంద్ర! యేను బలవిక్రమముల్ వొగడొంద నిక్కుల**

**ఘ్నునిపయి నామనంబు నతికోపము; పార్థుఁడు ఖాండవంబునం**

**దనలముపర్వఁ జేసినటు లగ్గలికన్ నిగిడించెదన్; గదం**

**గొనియెదఁ బ్రాణముల్; మహి యకుంఠితశాస్త్రిగ నేలు మంతయున్. 131**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ఓ రాజా!(ధర్మజా); వినుము; ఏను; బలవిక్రమముల్ పొగడు+ఒందన్= బలశౌర్యాలు కీర్తికెక్కగా; ఈ+కులఘ్నునిపయిన్= ఈ కులనాశకుడిమీద; నామనంబు+అతికోపము= నా మనసుయొక్క మిక్కిలి కోపం; పార్థుఁడు=

అర్జునుడు; ఖాండవంబునందున్= ఖాండవవనంలో; అనలము పర్వన్+చేసినటులు= అగ్నిని వ్యాపింపచేసిన విధంగా; అగ్గటికన్= అతిశయంగా; నిగిడించెదన్= వ్యాపింపచేస్తాను; గదన్= గదతో; ప్రాణముల్ కొనియెదన్= (వీని) ప్రాణాలను తీస్తాను; అకుంఠిత శాస్తిగన్= కుంటువోవని ఆజ్ఞతో; మహి= భూమి; అంతయున్+ఏలుము= మొత్తమును పరిపాలింపుము.

**తాత్పర్యం:** 'ఓ రాజా! వినుము. నేను బలశౌర్యాలు కీర్తించబడగా ఈ కులకంటకుడిపై నున్న నా మనసులోని కోపాన్ని అర్జునుడు ఖాండవవనంలో వ్యాపింపజేసిన అగ్నివలె మిక్కిలి వ్యాపింపజేస్తాను. గదతో వాడి ప్రాణాలు తీస్తాను. అడ్డులేని అధికారంతో శాసకుడవుగా రాజ్యాన్ని పాలించుము.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**ఆ. మహితకీర్తి పుష్పమాలికఁ బూన్చెద । నిన్నుఁ జీకురాజు నేఁడు వనరుఁ**
**గాక! శకుని బుద్ధికతమునఁ దమ కింత । పుట్టె నని తనూజుపొలియు టెఱిఁగి.' 132**

**ప్రతిపదార్థం:** మహితకీర్తి= గొప్పదైన కీర్తి అనెడి; పుష్పమాలికన్= పూలమాలను; నిన్నున్; పూన్చెదన్= ధరింపజేస్తాను; శకునిబుద్ధి కతమునన్= శకుని తెలివి కారణంగా; తమకున్+ఇంత పుట్టెను+అని= తమకు చివర కీవిధంగా చేటు కలిగిందని; తనూజు పొలియుట+ఎఱిఁగి= కుమారుడు చనిపోవటం తెలిసి; చీఁకురాజు= అంధుడయిన రాజు (ధృతరాష్ట్రుడు); వనరుఁగాక!= దుఃఖించునుగాక!

**తాత్పర్యం:** ధర్మరాజా! గొప్పకీర్తి అనే పూలమాలను నీకు ధరింపజేస్తాను. శకుని ఉపదేశంవలన తమకిటువంటి చేటు వాటిల్లినదని కొడుకు చావు విని అంధరాజు నేడు దుఃఖించుగాక!

**వ. అని పలికి సన్నాహంబు శోభిల్లుచుండ గదాదండంబుఁ గేల నమర్చి వృత్రున కభిముఖుం డగు వాసవుండునుం బోలె దుర్యోధనుదిక్కు మొగంబై నిర్వ్యూహం బైన శుండాలంబు చందంబున నున్న యన్నరపతిఁ గనుంగొని తమయన్నయుఁ దమ్ములు నెమ్మనంబుల సంతసిల్లఁ దానును సమరోల్లాసభాసితుం డగుచు నతని కిట్లనియె. 133**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాటాడి; సన్నాహంబు శోభిల్లుచుండన్= ప్రయత్నం ప్రకాశిస్తూ ఉండగా; గదాదండంబున్= దండంవంటి గదను; కేలన్+అమర్చి= చేత పట్టుకొని; వృత్రునకున్+అభిముఖుండు+అగు వాసవుండున్+పోలెన్= వృత్రాసురుడి కెదురయిన ఇంద్రుడివలె; దుర్యోధను దిక్కు మొగంబు+ఐ= దుర్యోధనుడి ప్రక్కకు తిరిగినవాడై; నిర్వ్యూహంబు+ఐన శుండాలంబు చందంబునన్= కట్టువీడిన మదపుటేనుగువలె; ఉన్న ఆ+నరపతిన్+కనుంగొని= ఆ రాజును (దుర్యోధనుడిని) చూచి; తమ అన్నయున్+తమ్ములున్= తమ అన్నగారయిన ధర్మజుడును, తమ్ములైన అర్జున నకుల సహదేవులును; నెమ్మనంబులన్ సంతసిల్లన్= నిండు మనసులతో సంతోషించగా; తానును= భీమసేనుడు; సమర+ఉల్లాసభాసితుండు+ అగుచున్= యుద్ధోత్సాహంతో ప్రకాశిస్తూ; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ దుర్యోధనుడితో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ విధంగా మాటాడి, తన ప్రయత్నం శోభించగా గదను చేత ధరించి వృత్రాసురుడి ఎదురుగా వెళ్ళిన ఇంద్రుడివలె దుర్యోధనుడివైపు మొగం కలవాడై కట్టువిప్పబడిన మదపుటేనుగువలె ఉన్న ఆ రాజును చూచి, తన అన్నగారూ, తమ్ములూ మనసునిండుగా సంతోషించగా భీమసేనుడు యుద్ధోత్సాహంతో వెలుగుతున్నవాడై ఆ దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

ఉ. 'ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక లక్కయింటఁ జి
చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ దూలఁ బుచ్చి తా
చుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడఁగ ద్రోవది భంగపెట్టి తి
ట్టట్టన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము చేరి తగ్గ మై. **134**

**ప్రతిపదార్థం:** ఇట్టిది క్రూరకర్మము+అని= ఈ పని క్రూరమైన పని అంటూ; ఇంచుక కొంకక= ఒకింతకూడా సందేహించకుండా; లక్కయింటన్+చిచ్చు+ఒట్టితి= లక్కయింటికి నిప్పుపెట్టావు; మాయజూదమునన్= మోసపు జూదంలో; ధర్మజు+తూలన్+ పుచ్చితి(వి)= ధర్మరాజును ఓడించావు; ఆ చుట్టలు= ఆ బాంధవులు; పెద్దలున్= పెద్దవారూ; చెలులున్ చూడఁగన్= స్నేహితులు చూస్తూ ఉండగా; ద్రోవదిన్= ద్రౌపదిని; ఇట్టు అట్టు+అనన్= ఇటు అటు అనకుండా(జంకకుండా); భంగపెట్టితి(వి)= అవమానించావు; ఇంకన్ తద్+ఫలములు= ఆ పనులవలన కలిగే ఫలితాలు; అన్నిటిన్+ఒందుము= మొత్తాన్ని అనుభవించుము; అగ్గమై= వశమై; చేరితి(వి)= దగ్గరకు వచ్చావు.

**తాత్పర్యం:** 'ఈ పని క్రూరమైన నీచకర్మ అని తలచకుండా లక్క ఇంటికి నిప్పు పెట్టావు. మాయాజూదంలో ధర్మరాజును ఓడించావు. చుట్టాలు, పెద్దలు, స్నేహితులు చూస్తూ ఉండగా జంకకుండా ద్రౌపదిని అవమానం పాలు చేశావు. వీటికన్నింటికిని మొత్తంగా ఫలితాన్ని అనుభవించుము. నా చేతికి చిక్కావు.

సీ. గాంగేయకుంభజ కర్ణశల్యాదులు । నీకుఁగాఁ బెనఁగి యనేకబంధు
మిత్రులు మడిసిరి ధాత్రీపతులఁ దోడు । దెచ్చితి పలువురఁ జచ్చి రంత
వట్టువారును దోడఁబుట్టువు లెల్లను । గూలి; రంతటికిని మూల మైన
శకుని గీటడఁగె; నిం కొకరుఁడ వీ వున్న । వాఁడవు; విను! నిన్ను నేఁడు నాదు

తే. గదకు నెర సేసి లోకంబు కల్మషంబు । లేను బాపెద; నీరజ్జు లేల? నాకుఁ
జక్కనై రమ్ము మద్భుజాస్తంభశుంభ । దుగ్రకేళికిఁ బాత్రమై యోట దక్కి'. **135**

**ప్రతిపదార్థం:** గాంగేయ= భీష్ముడు; కుంభజ= ద్రోణుడు; కర్ణ= కర్ణుడు; శల్య+ఆదులు= శల్యుడు మొదలయినవారు; నీకున్+కాన్+పెనంగి= నీ కొరకై యుద్ధంచేసి; అనేక బంధుమిత్రులు= ఎందరో బంధువులు స్నేహితులు; మడిసిరి= చనిపోయినారు; ధాత్రీపతుల+పలువురన్+తోడుతెచ్చితి(వి)= ఎందరినో రాజులను సహాయంగా తీసికొనివచ్చావు; అంత+ పట్టువారును= అంతమట్టుకు వారంతా; చచ్చిరి= చనిపోయారు; తోడఁబుట్టువులు+ఎల్లను= నీ తోబుట్టిన వారంతా; కూలిరి= చనిపోయారు; అంతటికిని= ఈ మొత్తానికి; మూలము+ఐన= కారణమైన; శకుని; గీటడఁగెన్= నశించాడు; ఇంకన్+ ఒకరుఁడవు= ఇంక ఒక్కడవు; ఈవు+ఉన్నవాఁడవు= నీవున్నావు; విను= వినుము; నిన్నున్ నేఁడు నాదుగదకున్+ఎర చేసి= ఈ దినం నిన్ను నాగద కాహారంగా వేసి; లోకంబు= లోకాలయొక్క; కల్మషంబులు= పాపాలు; ఏను+పాపెదన్= నేను తొలగిస్తాను; ఈ రజ్జులు+ఏల?= ఈ పనికిరాని మాట లెందుకు?; నాకున్+చక్కనై= నా కెదురుగా; మద్భుజాస్తంభ= కంబాలవంటి నా భుజాల; శుంభత్+ఉగ్రకేళి= గర్వంతో భయంకరమయిన క్రీడకు; పాత్రము+ఐ= ఆధారమై; ఓట+తక్కి= జంకు మాని; రమ్ము.

**తాత్పర్యం:** నీకొరకై భీష్మద్రోణ కర్ణశల్యాదులు, అనేకులు బంధుమిత్రులు మరణించారు. రాజులను తోడు తెచ్చుకొన్నావు. వారు కూడా చచ్చారు. తోబుట్టువు లందరూ నశించారు. దీనికంతటికిని మూలంగా ఉండిన శకుని

చనిపోయాడు. ఇంక నీ వొక్కడ వున్నావు. వినుము. నిన్ను నేడు నా గదకు ఆహారంగా చేసి లోకంలోని పాపాన్నంతా నేను పోగొట్టుతాను. నీ ఈ పనికిరాని మాట లెందుకు? అనుమానించకుండా నా కెదురుగా రమ్ము. నా భుజదర్పభయంకర క్రీడకు పాత్రమైనావు.'

**చ. అనుడు నెదిర్చి నీతనయుఁ డాతని కిట్లను 'నేల రిత్త గ**
**ర్జనములు? గానవే పటు భుజాకలితోగ్రగదా సముద్భటున్**
**నను? నిటు రమ్ము! సూపుము రణంబున నీదుబలంబుఁ జేవయున్;**
**మన మిటు చేరి నిల్చి వెడ మాటల నాడుచు నున్కి యొప్పునే? 136**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; ఎదిర్చి= ఎదుర్కొని; నీ తనయుఁడు= నీ కుమారుడు; ఆతనికిన్+ఇట్లు+అనున్= ఆ భీముడితో ఈ విధంగా అన్నాడు; ఏల రిత్త గర్జనములు?= వ్యర్థమైన గర్జింపులెందుకు?; పటు= తీవ్రమయిన; భుజాకలిత= చేతియందున్న; ఉగ్రగదాసముద్భటున్= భయంకరమయిన గదతో ఎత్తివచ్చినవాడిని; ననున్= నన్ను; కానవే?= చూడవా?; ఇటు రమ్ము= ఈ దిక్కునకు రమ్ము; రణంబునన్= యుద్ధంలో; నీదు బలంబు= నీ శక్తి; చేవయున్= నేర్పును; చూపుము; మనము+ఇటు చేరి నిల్చి= మన మీవిధంగా చేరి; వెడమాటలన్+ఆడుచున్+ఉన్కి= పనికిరాని మాటలను మాట్లాడటం; ఒప్పునే?= తగునా?

**తాత్పర్యం:** అనగా విని, నీ కుమారుడు భీముడితో ఇట్లా అన్నాడు: 'ఈ వ్యర్థమైన గర్జన లెందుకు? కఠినమైన నా భుజదండంతో భయంకరమైన గద నెత్తి వచ్చిన నన్ను చూడలేదా? ఇటు రమ్ము. యుద్ధంలో నీ బలాన్నీ చేవనూ చూపుము. మనం ఈ విధంగా నిలిచి పనికిరాని మాటలు మాట్లాడటం తగునా?

**క. వినుము గదారణమున ననుఁ। జెనయఁగ వాసవున కైనఁ జెల్లదు; నీ వీ**
**యనిఁ బాడి దప్ప కుండఁగ। బెనఁగుము ప్రాణంబుతోడఁ బ్రిదిలెదు భీమా!' 137**

**ప్రతిపదార్థం:** భీమా!; వినుము; గదారణమునన్= గదాయుద్ధంలో; ననున్+చెనయఁగన్= నన్ను+ఎదుర్కొవటానికి; వాసవునకున్+ ఐనన్= ఇంద్రుడికైనా; చెల్లదు= సాధ్యం కాదు; నీవు+ఈ+అనిన్= నీ వీ యుద్ధంలో; పాడితప్పకుండఁగన్= ధర్మపద్ధతిని తప్పకుండా; పెనఁగుము= యుద్ధం చేయుము; ప్రాణములతోడన్+ప్రిదిలెదు(వు)= ప్రాణాలతో ఊడిపోతావు (చనిపోతావు).

**తాత్పర్యం:** ఓ భీమా! వినుము. గదాయుద్ధంలో నన్ను ఎదుర్కొనటానికి ఇంద్రుడికైనా సాధ్యం కాదు. నీ వీ యుద్ధంలో ధర్మం తప్పకుండా యుద్ధం చేయుము. ప్రాణాలతో తప్పుకొనలేవు.'

**వ. అనిన విని పాంచాలురుం దక్కిన జనపాలురుం బ్రశంసించి మత్తమాతంగంబుఁ దాలశబ్దంబుల నుబ్బం జేయునోజ రారాజుఁ బ్రహర్షంబు నొందించిరి; గజబృంహితంబులు హయహేషితంబులును జెలంగె నాయుధంబు లెక్కుడు మెఱుంగులఁ బొలిచెఁ; దదనంతరంబ యెల్లవారును నెడగలుగఁ గూర్చుండి రమ్మహావీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతిలోకం బగు నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి రట్టియెడ. 138**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; పాంచాలురున్+తక్కిన జనపాలురున్+ప్రశంసించి= పాంచాల దేశీయులూ, మిగిలిన రాజులూ పొగడి; మత్తమాతంగంబున్= మదపుటేనుగును; తాల శబ్దంబులన్+ఉబ్బన్+చేయున్+ఓజన్= తాళాల

చప్పుళ్ళతో ఉత్సాహం కలిగించే విధంగా; రారాజున్= దుర్యోధనుడిని; ప్రహర్షంబున్+ఒందించిరి= సంతోషం కలిగేటట్లు చేశారు; గజ బృంహితంబులు= ఏనుగుల ఘీంకారాలు; హయహేషితంబులును= గుర్రాల సకిలింతలూ; చెలంగెన్= మ్రోగాయి; ఆయుధంబులు= యుద్ధానికి వాడే అస్త్రశస్త్రాలు; ఎక్కుడు మెఱుంగులన్+పొలిచెన్= మిక్కిలి వెలుగులతో ఒప్పినవి (బాగా పదనుపెట్టటంవలన); తదనంతరంబ= ఆ మీదట; ఎల్లవారును= అందరును; ఎడ+కలుగన్+కూర్చుండిరి= విడిగా దూరముండేటట్లు కూర్చున్నారు; ఆ+మహావీరులు= ఆ గొప్ప యోధులు; తలపడువారు+ఐ= ఎదుర్కొనేవారుగా; వీర+ఉద్రేకంబునన్+చేసి= వీరోద్రేకాలతో; అతిలోకంబు+అగు= లోకాతీతమైన; అవష్టంభంబునన్= గర్వంతో; విజృంభించి= రేగి; ఒండొరులన్+అవలోకించిరి= ఒకరినొకరు చూచుకొన్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అట్లా అనగా పాంచాలురు, మిగిలిన రాజులు అతడిని పొగడినారు. మదపుటేనుగును శబ్దాలతో ఉబ్బించే విధంగా చేశారు. ఏనుగులు ఘీంకారాలతోను, గుర్రాలు సకిలింతలతోను ఒప్పాయి. ఆయుధాలు బాగా మెరిశాయి. ఆ తరువాత అందరూ ఎడంగా కూర్చున్నారు. ఆ గొప్ప వీరులు వీరోద్రేకాలతో గర్వంతో విజృంభించి ఒకరి నొకరు చూచుకొన్నారు. ఆ సమయంలో.

### భీమదుర్యోధనుల గదాయుద్ధము సూడ బలరాముఁడు వచ్చుట (సం. 9-33-2)

**సీ.** **యదుకుల దీపకుం డగు రాముఁ డవ్వార్త । యంతకమును విని యక్కుమారు**
**లాత్మశిష్యులు గాన నాహవ మీక్షింపఁ । దీవ్రయానమున నేతెంచి దృష్టి**
**గోచరుం డగుటయుఁ, గురునాథ! తగ నెల్ల । వారు నెదుర్కొని గారవమునఁ**
**బ్రణమిల్లిన నతండు ప్రత్యభివందన । మాచరింపంగ ధర్మాత్మజుండు**

**తే.** **సమ్మదంబునఁ బరిరంభణమ్ము సేసె; । నరుఁడుఁ గవలును ద్రౌపదీనందనులును**
**వందనం బొనరించిరి; వారి నాతఁ । డర్హభంగి భాషణముల నాదరించె.** **139**

**ప్రతిపదార్థం:** కురునాథ!= ఓ కురురాజా, ధృతరాష్ట్రా!; యదుకుల దీపకుండు+అగు రాముఁడు= యాదవవంశాన్ని వెలుగజేసే బలరాముడు; ఆ+వార్తన్= ఆ భీమ దుర్యోధనుల గదాయుద్ధ వార్తను; అంతక మును విని= అంతకుముందే విని; ఆ+కుమారులు= ఆ రాజకుమారులు; ఆత్మ శిష్యులుకానన్= తన శిష్యులు కనుక; ఆహవము+ఈక్షింపన్= యుద్ధాన్ని చూడటానికై; తీవ్రయానమునన్= వేగమైన ప్రయాణంతో; ఏతెంచి= వచ్చి; దృష్టిగోచరుండు+అగుటయున్= కనబడగా; ఎల్లవారున్+ఎదుర్కొని= అందరును ఎదురేగి; గారవమునన్+ప్రణమిల్లినన్= గౌరవంతో నమస్కరించగా; అతఁడు= ఆ బలరాముడు; ప్రత్యభినందనము+ఆచరింపఁగన్= ఎదురు నమస్కారం చేయగా; ధర్మాత్మజుండు= ధర్మరాజు; సమ్మదంబునన్= సంతోషంతో; పరిరంభణంబు చేసెన్= కౌగిలించుకొన్నాడు; నరుఁడున్= అర్జునుడు; కవలును= నకుల సహదేవులూ; ద్రౌపదీనందనులును= ఉపపాండవులూ; వందనంబు+ఒనరించిరి= నమస్కారం చేశారు; అతఁడు= ఆ బలరాముడూ; వారిన్= ఆ అందరిని; అర్హభాషణములన్= ఉచితమైన మాటలతో; ఆదరించెన్= గౌరవించాడు.

**తాత్పర్యం:** యాదవకుల ప్రదీపకుడైన బలరాము డా వార్తను అంతకుముందే విని, ఆ కుమారులు తనకు శిష్యులు కావటంచేత వారి యుద్ధం చూడటానికి వేగమైన పయనంచేసి వచ్చాడు. ఆతడు కనబడగానే అందరూ ఎదురేగి గౌరవంతో నమస్కారం చేశారు. బదులుగా అతడును నమస్కరించాడు. ధర్మరా జాతడిని కౌగలించుకొన్నాడు. అర్జున నకుల సహదేవులు, ఉపపాండవులు నమస్కరించారు. వారందరినీ తగిన విధంగా ఆ బలరాముడు ఆదరించాడు.

**క. హరియును సాత్యకియు వినయ । భరితాంతఃకరణు లగుచుఁ బ్రణతు లయిన న**
**య్యిరువురను గ్రుచ్చి బెరయం । బరిరంభణ మాచరించెఁ బరమప్రీతిన్. 140**

**ప్రతిపదార్థం:** హరియును= శ్రీకృష్ణుడునూ; సాత్యకియున్; వినయభరిత+అంతఃకరణులు+అగుచున్= అణకువతో నిండిన మనసు కలవారై; ప్రణతులు+అయినన్= నమస్కరించగా; ఆ+ఇరువురను గ్రుచ్చి= ఆ యిర్వురినీ గట్టిగా; బెరయన్= కూడేటట్లుగా; పరిరంభణము= కౌగిలింత; పరమప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; ఆచరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణసాత్యకులు వినయముతో నిండిన మనసుతో నమస్కారం చేయగా వారినిరువురిని గ్రుచ్చి కౌగిలించుకొన్నాడు.

**వ. ఇత్తెఱంగున నెల్లవారలు నాబలదేవునిఁ గాంచి కుశలప్రశ్నంబు సేసి; రయ్యాదవపుంగవుండు సదుత్తరం బిచ్చి 'యేను బోయి పెక్కుదినంబు లయ్యె' నని యుగ్గడించి, 'మిమ్మునిందఱను జూచుటకును నాశిష్యులగదా యుద్ధం బనుసంధించుటకును వచ్చితి' ననియె; నమ్మరుత్సుతుండును భవత్సుతుండును గదలు సేతులన యుండ నతనిఁ జేరి భక్తిం బ్రణామంబు లాచరించిన నతం డాదరించె; నంతఁ గౌంతేయాగ్రజుండు రౌహిణేయుతో 'నన్నదమ్ముల యిరువుర యెక్కటిపోరు సూడు'మని పలికి వా రట్లు ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధులైన తెఱం గెఱింగించిన, నతండు 'లెస్సకాక!' యని యనుమతి సేసె-నని సంజయుండు ధృతరాష్ట్రునకు రామునాగమనంబు సెప్పె ననిన విని, తదీయప్రవర్తన శ్రవణకుతూహలాయత్తచిత్తుం డైన జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఎల్లవారలున్= అందరూ; ఆ బలదేవునిన్+కాంచి= ఆ బలరాముడిని చూచి; కుశలప్రశ్నంబు చేసిరి= క్షేమ సమాచారాలను అడిగారు; ఆ+యాదవ పుంగవుండు= ఆ యాదవులలో శ్రేష్ఠుడు; సత్+ఉత్తరంబు+ ఇచ్చి= మంచి బదులిచ్చి; ఏనున్+పోయి పెక్కుదినంబులయ్యెన్= నేను వెళ్ళి చాలా రోజులయింది; అని ఉగ్గడించి= అని చెప్పి; మిమ్ములన్+ఇందఱన్+చూచుటకును= మిమ్మందరిని చూడటానికి; నా శిష్యుల గదాయుద్ధంబు; అనుసంధించుటకును= కూర్చుటకుగాను; వచ్చితిన్+అనియెన్= వచ్చాను అన్నాడు; ఆ+మరుత్సుతుండును= ఆ వాయునందనుడూ; భవత్సుతుండును= నీ కుమారుడూ; గదలు చేతులన ఉండన్= గదలు చేతులలోనే ఉండగా; అతనిన్+చేరి= ఆయనను సమీపించి; భక్తిన్+ ప్రణామంబులు+ఆచరించినన్= భక్తితో నమస్కారాలు చేయగా; అతండు+ఆదరించెన్= ఆతడు ప్రీతిగా మన్నించాడు; అంతన్+కౌంతేయ+అగ్రజుండు= అంతట కుంతి కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; రౌహిణేయుతోన్= రోహిణీకుమారుడయిన బలరాముడితో; అన్నదమ్ములు+ఇరువుర= అన్నదమ్ములిద్దరి; ఎక్కటిపోరు చూడుము+అని= ఒక్కరినొక్కరే ఎదుర్కొని చేసే యుద్ధాన్ని చూడుమని; పలికి= మాటాడి; వారు+అట్లు ద్వంద్వ యుద్ధంబునకున్= వా రా విధంగా ద్వంద్వ యుద్ధానికి; సన్నద్ధులు+ఐన తెఱంగు= సిద్ధమైన తీరు; ఎఱింగించినన్= తెలియచేయగా; అతండు= ఆ బలరాముడు; లెస్స కాక!= మేలు గాక!; అని= అంటూ; అనుమతి+చేసెన్= అంగీకారం తెలిపాడు; అని= అంటూ; సంజయుండు ధృతరాష్ట్రునకు; రాము+ ఆగమనంబు చెప్పెన్+అనినన్ విని= బలరాముడి రాకను చెప్పాడు - అనగా విని; తదీయ= వారియొక్క; ప్రవర్తన= నడవడిని గూర్చి; శ్రవణకుతూహల+ఆయత్త చిత్తుండు+ఐన= వినుట కాసక్తి నిండిన మనసున్న వాడైన; జనమేజయుండు= జనమేజయ చక్రవర్తి; వైశంపాయనునకున్+ఇట్లు+అనియెన్= వైశంపాయనమునితో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఈ విధంగా వారంతా ఆ బలరాముడిని చూచి, అతడి క్షేమాలను గురించి అడిగారు. ఆ యాదవ ముఖ్యుడను బదులిచ్చి 'నేను పోయి చాలా నాళ్ళయింది. మిమ్మింతమందిని చూడటానికీ నా శిష్యుల గదాయుద్ధాన్ని

కూర్చటానికే వచ్చాను'- అన్నాడు. ఆ వాయునందనుడు, నీ కుమారుడు, గదలతోనే అతడికి దగ్గరగా పోయి నమస్కారం చేశారు. ఆతడు వారిని ప్రీతిగా చూచాడు. అపుడు ధర్మరాజు బలరాముడితో అన్నదమ్ముల ద్వంద్వయుద్ధాన్ని చూడవలసిందిగా చెప్పి, వా రా ద్వంద్వ యుద్ధానికి సిద్ధమైన తీరు తెలుపగా అతడు మంచిదని అనుమతిచ్చాడు. అని ధృతరాష్ట్రుడితో సంజయుడు బలరాముడి రాకను గురించిన విశేషం తెలియజెప్పగా విని జనమేజయుడు ఆ యుద్ధ విశేషాలను వినటానికి ఆసక్తి చూపుతూ వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **ఉభయవాహిని సంగరోద్యోగసమయ । మున హలాయుధుఁ డేతెంచి మురహరుండు**
**పాండురాజసూనులయెడఁ బక్షపాతి । యని విరాటాదిబంధులు విననఁగఁ బలికి.** **142**

**ప్రతిపదార్థం:** ఉభయవాహిని= ఇరువాగుల సేన; సంగర+ఉద్యోగసమయమునన్= యుద్ధానికి ప్రయత్నించే వేళలో; హలాయుధుఁడు= బలరాముడు; ఏతెంచి= వచ్చి; మురహరుండు= మురాసురుడిని చంపిన శ్రీకృష్ణుడు; పాండురాజ సూనుల+ఎడన్= పాండురాజు కుమారులమీద; పక్షపాతి అని= అభిమాని అని; విరాట+ఆది= విరాటుడు మొదలయిన; బంధులు= బంధువులు; విననఁగన్+పలికి= వినేటట్లుచెప్పి.

**తాత్పర్యం:** ఇరువైపు సేనలూ యుద్ధ ప్రయత్నంలో ఉండగా బలరాము డక్కడకు వచ్చి విరాటాది బంధువులంతా వినేటట్లుగా శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి అని చెప్పి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **హరి యెఱుఁగని చక్కటియును । బురుషార్థము నా కెఱుంగఁ బోలునె? యీ ని**
**ష్ఠురత వినఁ జూడఁ జాలక । సరస్వతీతీర్థమునకుఁ జనియెడు బుద్ధిన్.** **143**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణుడు; ఎఱుఁగని= తెలియని; చక్కటియును= మార్గమూ; పురుషార్థము= పురుషార్థమూ; నాకున్+ఎఱుంగన్+పోలునె?= నాకు తెలియనగునా?; ఈ నిష్ఠురతన్= ఈ కష్టపు పని; వినన్+చూడన్+చాలక= విన లేక, కన లేక; సరస్వతీ తీర్థమునకున్; చనియెడు బుద్ధిన్= వెళ్ళవలననే మనసుతో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడికి తెలియని మార్గమూ పురుషార్థమూ నే నెఱుగగలనా? ఈ కష్టమైన విషయాన్ని నేను వినలేను, చూడ లేను - అని సరస్వతీ తీర్థమునకు పోవలెనని మనసుతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ.** **మీ కెఱింగించి పో వచ్చితిఁ బోయి వచ్చెద' నని వాసుదేవ ధర్మజు లొడఁబడి యనుపఁ జనియె నని వింటి బలదేవుండు తీర్థయాత్ర నిర్వర్తించిన తెఱంగును భీమసుయోధనుల గదాయుద్ధంబు చెల్లినభంగియు నతని కాలోన నచటి కేఁగుదేర సమకూరిన విధంబును వివరించి చెప్పు' మనిన జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె.** **144**

**ప్రతిపదార్థం:** మీకున్+ఎఱింగించిపోన్= మీకు తెలిపిపోవటానికి; వచ్చితిన్= వచ్చాను; పోయివచ్చెదను= వెళ్ళివస్తాను; అని; వాసుదేవ ధర్మజులు= శ్రీకృష్ణుడును, ధర్మరాజును; ఒడఁబడి= ఇష్టపడి; అనుపన్+చనియెన్= పంపగా వెళ్ళాడు; అని వింటిన్= అని విన్నాను; బలదేవుండు= బలరాముడు; తీర్థయాత్ర= తీర్థయాత్రను; నిర్వర్తించిన తెఱంగును= సాగించిన విధమును; భీమసుయోధనుల గదాయుద్ధంబు; చెల్లిన భంగియున్= సాగిన విధమును; అతనికిన్= ఆ బలరాముడికి; ఆలోనన్= అంతలోనే; ఏఁగుదేరన్ సమకూరిన విధంబును= రావటానికి ఏర్పడిన విధమును; వివరించి= విస్తారంగా; చెప్పుము; అనినన్= అనగా; జనమేజయునకున్= జనమేజయుడితో; వైశంపాయనుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** (బలరాముడు) మీకు చెప్పి పోవటానికై వచ్చాను. పోయి వస్తాను-' అనగా శ్రీకృష్ణధర్మజులు ఒప్పికొని పంపగా వెళ్ళా డని విన్నాను. బలరాముడు సాగించిన తీర్థయాత్రా విధానాన్నీ, భీమదుర్యోధనులు సాగించిన గదాయుద్ధాన్నీ, బలరాము డంతలోనే అక్కడకు వచ్చిన పద్ధతిని, సవిస్తరంగా చెప్పవలసింది' అని జనమేజయుడు అడుగగా, వైశంపాయనుడు ఇట్లా అన్నాడు.

**సీ.** **'వినుము నరేంద్ర! యవ్విధమునఁ జని యమ్మ । హాత్ముండు గోసువర్ణాదు లైన**
**దానార్వబహుపదార్థంబులు దన యగ్ని । హోత్రంబు దెచ్చుట కుచితజనులఁ**
**బుచ్చె ననేక విప్రుల నాప్తసచివుల । వలయు రథ ద్విపాశ్వములగముల**
**రావించెఁ దండులప్రముఖభోజన సాధన । ములు సంపన్నహృద్యములు గాఁగఁ**

**ఆ.** **దేరఁ బనిచె నిట్లు తీర్థయాత్రాసంవి । ధాన మాచరించి మాననీయ**
**మగు సరస్వతీమహాంభోధిసంగమ । స్థానమునకుఁ జనియె సవినయముగ.** **145**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ఓ జనమేజయ చక్రవర్తీ!; వినుము; ఆ+విధమునన్+చని= ఆ మాదిరిగా వెళ్ళి; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు(బలరాముడు); గో సువర్ణాదులు+ఐన= పశువులు, సువర్ణములు ఐన; నానార్థబహు పదార్థంబులు= తగిన వస్తువు లనేకములను; తన+అగ్నిహోత్రంబున్= తన అగ్నిహోత్రమును (గార్హపత్యాగ్నిని); తెచ్చుటకున్= తీసికొని వచ్చుటకు; ఉచిత జనులన్+పుచ్చెన్= తగిన మనుష్యులను పంపాడు; అనేకవిప్రులన్= బ్రాహ్మణులను చాలమందిని; ఆప్తసచివులన్= ఆత్మీయు లయిన మంత్రులను; వలయు రథద్విప+అశ్వముల గములన్= అవసరమైన తేరులను, ఏనుగులను, గుర్రాలను, రావించెన్= రప్పించాడు; తండుల ప్రముఖ= బియ్యం మొదలైన అవసరమయిన; భోజన సాధనములు= ఆహారవస్తువులు; సంపన్నహృద్యములు+కాఁగన్= సమృద్ధములును, మనోహరములును అగునట్లు; తేరన్+పనిచెన్= తీసికొని రా పంపాడు; ఇట్లు తీర్థయాత్రా సంవిధానము+ఆచరించి= ఈవిధంగా తీర్థాలను సేవించి; మాననీయము+అగు= ప్రశస్తమయి నట్టి; సరస్వతీమహాంభోధిసంగమస్థానమునకున్= సరస్వతీ తీర్థం సముద్రంలో కలిసే చోటునకు; సవినయముగన్+చనియెన్= సవినయంగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఓ రాజేంద్రా! ఆ మాదిరిగా వెళ్ళిన మహనీయుడైన, బలరాముడు సమస్త సంపదలతోను, అవసరమైన సంభారాలతోను తాను చేయవలసిన అగ్నికార్యాలకు అనువైన అగ్నిహోత్రాన్ని తీసికొని రావటానికి అర్హులయిన వారిని పంపాడు. అనేకులు బ్రాహ్మణులను, ఆప్తులయిన మంత్రులను అవసరమైన రథాలు ఏనుగులను, గుర్రాలను రావించుకొన్నాడు. భోజనానికి కావలసిన మంచి బియ్యాన్ని, ఇతర భోజన పదార్థాలను చక్కగా అమరేటట్లు ఆజ్ఞ ఇచ్చాడు. ఈ విధంగా యాత్రను ఏర్పాటు గావించుకొని, పవిత్రమయిన సరస్వతీనది సముద్రంలో కలిసేచోటునకు అడకువతో వెళ్ళాడు.

**వ.** **అది ప్రభాసం బనుపేరం బరఁగు న ట్లందులకుఁ జని తీర్థసేవనం బనుష్ఠించి యంతనుండియుఁ బథిశ్రాంతిప్రయాణంబుల సరస్వతి చేరువ నడచి తదీయ సకలతీర్థంబు లాడుచు నన్నపానంబుల నాసనశయనయానంబులను ధేనుకనకరత్నాంబరాభరణాదిద్రవ్యంబులను విప్రుల నతిప్రీతులఁ జేయుచు, బాలవృద్ధవనితావికలాంగదుర్బలప్రాయులఁ బరిశ్రాంతు లైనయెడలఁ దడిమికొని యథేష్ట ప్రకారంబుల శరీరస్థితి నడిపింపఁ దగువారిని నియోగించి మఱియు ననేకధర్మంబు లాచరించుచుఁ గురుక్షేత్రంబునకు**

**వచ్చె' ననుటయు జనమేజయుం డా తీర్థవిశేషంబులు వివరించి చెప్పు మనుడు వైశంపాయనుం డిట్లనియె. 146**

**ప్రతిపదార్థం:** అది= ఆ సంగమస్థానం; ప్రభాసంబునుపేరన్+బరఁగున్= ప్రభాసమనే పేరుతో ఒప్పుతుంది; అట్లు+అందులకున్+చని; తీర్థసేవనంబు+అనుష్ఠించి= తీర్థస్నానాదులనుచేసి; అంతనుండియున్= అక్కడినుండి; పథిశ్రాంతి ప్రయాణంబులన్= నడకవలన కలుగు శ్రమతో ప్రయాణములతో; సరస్వతి చేరువన్+నడచి= సరస్వతికి దగ్గరగా నడచి; తదీయ= దాని సంబంధమగు; సకలతీర్థంబులు+ఆడుచున్= అన్ని తీర్థాలలో స్నానంచేస్తూ; అన్నపానంబులన్+ఆసన+శయన+యానంబులను= అన్నపానాలను, ఆసనాలను, పడకలను, ప్రయాణాలను; ధేను= ఆవులను; కనక= బంగారు; రత్న+అంబర+ఆభరణ+ఆది ద్రవ్యంబులను= నవరత్నములతోనూ, వస్త్రములతోను, నగలతోను కూడిన సంపదలను(ఇచ్చుటవలన); విప్రులను= బ్రాహ్మణులను; అతి ప్రీతులన్+చేయుచు= మిక్కిలిగా తృప్తిపరుస్తూ; బాల= పసివారు; వృద్ధ= ముదుసలులు; వనితా= స్త్రీలు; వికల+అంగ= అంగవైకల్యం కల; దుర్బలప్రాయులన్= బలహీనులైనవారిని; పరిశ్రాంతులు+అయిన ఎడలన్= అలసినట్లయితే; తడిమికొని= నిమురుకొంటూ; యథేష్టప్రకారంబులన్= వారి ఇష్టానుసారంగా; శరీరస్థితి= ఆరోగ్యానికి తగినట్లు; నడపింపన్+తగువారిన్= నడిపించతగ్గవారిని; నియోగించి; ఆజ్ఞాపించి; మఱియున్= ఇంకను; అనేక= చాలా; ధర్మంబులు= ధర్మాలు; ఆచరించుచున్= చేస్తూ; కురుక్షేత్రంబునకున్= కురుక్షేత్రానికి; వచ్చెన్= వచ్చాడు; అనుటయున్= అనగా; జనమేజయుండు; ఆ తీర్థ= ఆ తీర్థముయొక్క; విశేషంబులు= గొప్పదనాలు; వివరించి; చెప్పుము+అనుడున్= చెప్పుమనగా; వైశంపాయనుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ సంగమస్థానానికి ప్రభాసతీర్థ మని పేరు. ఆ తీర్థమును ఆరాధించి, అక్కడినుండి మార్గాయాసంతో కూడిన పయనాలతో సరస్వతికి సమీపంగా నడచి, అందున్న అన్ని తీర్థాలలో మునుగుతూ, ఆహారశయనాదులకు ఏర్పాట్లు చేసి, గోవులను సంపదను పట్టువస్త్రాలనూ, నగలనూ బ్రాహ్మణుల కొసగి వారిని సంతోషపరిచి, పసివారినీ, ముదుసలివారినీ, స్త్రీలనూ అంగవైకల్యం గలవారినీ బలహీనులైన వారిని అలసినచోటులలో ఆదుకొనేవారిని ఏర్పాటు చేసి, ఇంకను అనేక ధర్మాలు చేస్తూ కురుక్షేత్రానికి వచ్చాడు - అని అనగా జనమేజయుడు తీర్థ విశేషాలను వివరించు మనగా వైశంపాయను డీ విధంగా చెప్పాడు:

**క. ముసు చనియెఁ బ్రభాసమునకు । నని చెప్పితి నతని నది మహత్తరతీర్థ**
**మ్ము నరేంద్ర! యందుఁ జంద్రుఁడు । దన యక్ష్మం దీర్చుకొని గతవ్యథుఁ డయ్యెన్. 147**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ఓ రాజా!; అతనిన్; మును చనియెన్+ప్రభాసమునకున్+అని చెప్పితిన్= ఇదివరకు ప్రభాస తీర్థమునకు వెళ్ళాడని చెప్పాను; అది; మహత్తర= గొప్ప; తీర్థమ్ము= తీర్థం; అందున్= ఆ తీర్థంలో; చంద్రుఁడు; తన; యక్ష్మన్+తీర్చుకొని= క్షయవ్యాధిని; తీర్చుకొని= పోగొట్టుకొని; గత= పోయిన; వ్యథుడు+అయ్యెన్= బాధగలవాడయ్యాడు.

**తాత్పర్యం:** ఆతడు ప్రభాసతీర్థానికి ముందుగా వెళ్ళాడని చెప్పాను. అది మిక్కిలి మహిమ(శక్తి) కల తీర్థం. ఓ రాజా! చంద్రు డాతీర్థంలో మునిగి తన క్షయవ్యాధిని పోగొట్టుకొన్నాడు.

### ప్రభాసతీర్థ ప్రభావవర్ణనము (సం. 9-33-36)

**వ. అత్తెఱం గెఱింగించెద దక్షకన్యకల నశ్విన్యాదు లగు సప్తవింశతి సంఖ్యలఁ జంద్రుండు వివాహం బయ్యె నందు రోహిణి రూపాతిశయవతి యగుటం జేసి తదాసక్తుండైనఁ దక్కటివారు వగ నొంది తండ్రికడకుం**

**జని చంద్రుని యన్యాయం బెఱింగించిన, నా ప్రజాపతి చంద్రునితో నుగ్గడించి 'యది చాల నధర్మం బింక నిట్లు సేసి తేని శపింతుఁ జుమ్మీ! సముఁడవై వర్తింపు' మనుటయు నమ్మాట దెస ననాదరంబు సేసి యతండు వెండియుఁ దొంటియట్ల వర్తించిన నెఱింగి యమ్మహాత్ముండు కోపించి యఖుఁదెవులు గొనుమని శాపం బిచ్చిన, నయ్యోషధినాథుండు నానాఁటికిఁ గృశుం డయ్యె న ట్లాతెవులుచేత నతండు పోఁడిమి మాలిన నోషధులు పసచెడియె; దానఁ బ్రజలు డయ్యం జొచ్చి; రది చంద్రకార్శ్యహేతుకం బగుట యనుసంధించి.** **148**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు= ఆ విధాన్ని(తీర్థమహత్త్యమును); ఎఱింగించెదన్= తెలుపుతాను; దక్షకన్యకలన్= దక్షుడికూతులైన; అశ్విని+ఆదులు+అగు= అశ్విని మొదలైనవారిని; సప్తవింశతి సంఖ్యలన్= ఇరవై ఏడుమందిని; చంద్రుఁడు వివాహంబయ్యెన్= చంద్రుడు పెండ్లాడాడు; అందున్= వారిలో; రోహిణి= రోహిణిఅనునామె; రూపాతిశయవతి+అగుటన్+చేసి= మిక్కిలి అందగత్తె అయినందున; తద్+ఆసక్తుండు+ఐనన్= ఆమె అందు ప్రీతికలవాడు కాగా; తక్కటివారు= మిగిలినవారు; వగన్+ఒంది= దుఃఖపడి; తండ్రికడకున్+చని= తమ తండ్రి వద్దకు వెళ్ళి; చంద్రుని అన్యాయంబు+ఎఱింగించినన్= చంద్రుడి అధర్మమును తెలుపగా; ఆ ప్రజాపతి= ఆ దక్షప్రజాపతి; చంద్రునితోన్+ఉగ్గడించి= చంద్రుడితో మాటాడి; అది చాలన్+అధర్మంబు= అది మిక్కిలి అన్యాయం; ఇంకన్+ఇట్లు+చేసితి(వి)+ఏని= ఇంకా ఇట్లాగే చేశావంటే; శపింతున్+చుమ్మీ!= శాపమిస్తాను సుమా!; సముఁడవు+ఐ= సమానుడవుగా; వర్తింపుము= నడచుకొనుము; అనుటయున్= అని చెప్పటమూ; ఆ+మాటదెసన్= ఆ మాటకు; అనాదరంబు+చేసి= లెక్కచేయక; అతండు= చంద్రుడు; వెండియున్= మరల; తొంటి+అట్లు+అ= వెనుకటిమాదిరిగనే; వర్తించినన్+ఎఱింగి= నడచుకొనగా తెలిసికొని; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడైన దక్షుడు; కోపించి; అఖుఁదెవులు+ కొనుమని= కృశించే జబ్బును(క్షయను) పొందుమని; శాపంబు+ఇచ్చినన్= శాపం ఇవ్వగా; ఆ+ఓషధినాథుండు= ఆ చంద్రుడు; నానాఁటికిన్+కృశుండు+అయ్యెన్= దినదినానికి క్షీణించాడు; అట్లు+ఆ తెవులుచేతన్= ఆ విధంగా ఆ జబ్బుతో; అతడు పోఁడిమి మాలినన్= వాడు ఒప్పులేనివాడు కాగా; ఓషధులు; పసచెడియన్= బలహీనము అయినవి; దానన్+ప్రజలు= అందుచేత ప్రజలు; డయ్యన్+చొచ్చిరి= అలసట కలవారైరి; అది; చంద్రకార్శ్య= చంద్రుడు కృశించిన; హేతుకంబు+అగుటన్= కారణం కావటంతో; అనుసంధించి= కూర్చి.

**తాత్పర్యం:** ఆ వివరాన్ని తెలియజేస్తాను. దక్షుడి కూతులు ఇరువదిఏడుగురను (అశ్విని మొదలైనవారిని) చంద్రుడు పెండ్లాడాడు. వారిలో చాలా అందగత్తెఅయిన రోహిణియందు అభిమానం ఎక్కువగా కలిగి ప్రవర్తించగా, మిగిలిన వారు మనస్తాపంతో తండ్రి వద్దకు వెళ్ళి, చంద్రుడు చేసే అన్యాయాన్ని చెప్పారు. ఆ దక్షప్రజాపతి చంద్రుడితో అది చాలా అన్యాయ మనీ ఇకముందా విధంగా చేస్తే శపిస్తాననీ అన్నాడు. ఆ మాటను లెక్కచేయకుండా చంద్రుడు వెనకటివలెనే ప్రవర్తించసాగాడు. ఆ విషయాన్ని తెలిసికొన్న దక్షుడు కోపించి అతడిని క్షయవ్యాధిచేత బాధనందు మని శపించాడు. దానితో ఓషధీపతి అయిన చంద్రుడు దినదినానికీ కృశించి పోయాడు. ఆ రోగంవలన ఆతడు కళావిహీనుడుకాగా ఓషధులు కూడా బలహీనాలయ్యాయి. అందుచేత ప్రజలు అలసిపోజొచ్చారు. అది చంద్రుడు కృశించిన కారణంగా జరిగిందని గ్రహించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దేవత లమృతాంశునితో । 'నీ వేటికిఁ గృశుఁడ వైతి? నిక్కము చెపుమా!'**
**నావుడుఁ దనతెఱఁ గేర్పడఁ । గా వారికి నతఁడు సెప్పెఁ గౌరవముఖ్యా.!'** **149**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= కురువంశంలో ప్రధానుడైనవాడా! జనమేజయా!; దేవతలు+అమృత+అంశునితోన్= దేవతలు చంద్రుడితో; నీవు+ఏటికిన్ కృశుఁడవు+ఐతి(వి)?= నీవెందుకై కృశించిపోయావో; నిక్కము చెపుమా!= నిజం చెప్పుము;

నావుడున్= అనగా; తన తెఱఁగు+ఏర్పడఁగాన్= తన స్థితి స్పష్టంగా తెలియగా; అతఁడు= చంద్రుడు; వారికిన్+చెప్పెన్= ఆ దేవతలకు చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ కౌరవరాజా! జనమేజయా! దేవతలు చంద్రుడిని 'నీవు ఇట్లా క్షీణించిపోవటానికి కారణ మేమిటో నిజంగా చెప్పుము.' అని అడుగగా, అతడు వాళ్ళకు ఆ వివరమంతా చెప్పాడు.

**క. విని వార లతనిఁ దోడ్కొని । చని ప్రార్థించుటయుఁ దగఁ బ్రసన్నుం డై యి**
**ట్లను దక్షుఁ 'డఖిల భార్యా । జనులయెడన్ నడవవలయు శశి సమవృత్తిన్. 150**

**ప్రతిపదార్థం:** విని= అది విన్నవారై; వారలు= ఆ దేవతలు; అతనిన్+తోడ్కొని= ఆ చంద్రుడి తీసికొని; చని= వెళ్ళి; ప్రార్థించుటయున్= ప్రార్థించగా; తగన్+ప్రసన్నుండు+ఐ= తగునట్లుగా దయగలవాడై; దక్షుఁడు+ఇట్లనున్= దక్షు డీ విధంగా అన్నాడు; అఖిల భార్యాజనులఎడన్= భార్యలందరి విషయంలోను; శశి= చంద్రుడు; సమవృత్తిన్= సమానమైన ప్రవర్తనంతో; నడవవలయున్= నడచుకొనవలెను.

**తాత్పర్యం:** దేవతలు విని, చంద్రుడిని తోడుకొనిపోయి దక్షుడిని ప్రార్థించగా ఆదరంతో ఆతడు 'భార్యలందరి విషయంలోనూ చంద్రుడు సమానమైన అభిమానంతో నడచుకొనవలయు'నని చెప్పాడు.

**వ. అట్లు నడచుచు సరస్వతీజలనిధిసంగమకలితం బైన తీర్థంబుజలంబుల నిమగ్నుం డై వృద్ధిఁ బొందు; వరుసన పదియేను పదియేనుదినంబులు సంక్షయంబును బ్రవర్ధనంబు నొందం గలవాఁ' డని చెప్పి వెండియు. 151**

**ప్రతిపదార్థం:** అట్లు నడచుచున్= ఆ విధంగా నడుస్తూ; సరస్వతీ జలనిధి సంగమకలితంబు+ఐన= సరస్వతీ తీర్థమూ సముద్రమూ కలసిన తీర్థముల నీళ్ళలో; నిమగ్నుండు+ఐ= స్నానంచేసి (మునిగి); వృద్ధిన్+పొందున్= వృద్ధిపొందుతాడు; వరుసన= క్రమంగా; పది ఏను+పది ఏను దినంబులు= పదిహేను దినాల చొప్పున; సంక్షయంబును= తగ్గుటయున్నూ; ప్రవర్ధనంబున్ ఒందన్= పెరుగుటయున్నూ; ఒందన్+కలవాఁడు; అని చెప్పి వెండియున్= అని చెప్పి ఆ మీదట.

**తాత్పర్యం:** ఆ విధంగా నడుస్తూ సరస్వతీ నది సముద్రంలో కలిసేచోట కల పవిత్రతీర్థములలో మునిగి వృద్ధిని పొందే పద్ధతిలో పదిహేను దినాలు తగ్గుతూ పెరుగుతూ ఉండగలడు' అని చెప్పి ఇంకను. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'అమవస సమవస నా తీ । ర్థమునఁ గృతస్నానుఁ డై సుధాకరుఁడు ప్రవృ**
**ద్ధి మహితతనుఁ డగు' నని యతఁ । డమరుల వీడ్కొల్పి యా మృగాంకునితోడన్. 152**

**ప్రతిపదార్థం:** అమవస+అమవసన్= ప్రతి అమావాస్య నాడూ; సుధాకరుఁడు= చంద్రుడు; ఆ తీర్థమునన్= ఆ తీర్థంలో; కృతస్నానుండు+ఐ= స్నానమాడి; ప్రవృద్ధి మహితతనుఁడు+అగును+అని= (ఆరోగ్యం) పెరిగిశక్తిమంతమయిన శరీరంకలవాడౌతాడని; అఁతడు+అమరులన్ వీడ్కొని= ఆ దక్షుడు దేవతలను పంపించి; ఆ మృగాంకునితోడన్= ఆ చంద్రుడితో.

**తాత్పర్యం:** 'అమావాస్యకు, అమావాస్యకు, చంద్రు డా తీర్థంలో స్నానమాడి ప్రవర్థమానమయ్యే శక్తిగల శరీరంకలవాడవుతాడు' అని దేవతలను పంపివేసి, ఆ దక్షుడు చంద్రుడితో ఈ విధంగా అన్నాడు:

**వ. 'వనితలకు విప్రులకు నవమానంబు సేయకుమీ!' యని పలికి వీడ్కొలిపె నట్లు శాపమోక్షంబు గని చంద్రుం డాతీర్థంబునకుఁ జని తదీయ జలస్నానంబున నాప్యాయితశరీరుండై లోక ప్రభాసుం డయ్యెఁ; నదికారణంబుగా నాతీర్థంబు ప్రభాసం బనుపేరం బ్రసిద్ధి నొందె; నందుండి యా రోహిణీ నందనుం డరిగి చమసోద్భేదనం బను తీర్థంబున నొకరాత్రి వసియించి, యుదపానంబునకుం బోయె; దానివిశేషం బాకర్ణింపుము. 153**

**ప్రతిపదార్థం:** వనితలకున్= స్త్రీలకును; విప్రులకున్= బ్రాహ్మణులకును; అవమానంబు+చేయకుమీ!= అవమానం చేయవద్దు సుమా!; అని పలికి వీడ్కొలిపెన్= అని చెప్పి పంపాడు; అట్లు శాపమోక్షంబున్+కని= ఆ విధంగా శాపమునుండి విమోచనం పొందే తెరవు చూచి; చంద్రుండు+ఆ తీర్థంబునకున్ చని= చంద్రు డా తీర్థానికి వెళ్ళి; తదీయ జలస్నానంబునన్= ఆ నీటిలో స్నానం చేయటంచేత; ఆప్యాయిత శరీరుండు+ఐ= సుఖమయమైన శరీరంకలవాడు అయి; లోక ప్రభాసుండు+అయ్యెన్= లోకాన్ని కాంతిమంతం చేసినవా డయ్యాడు; అది కారణంబుగాన్= ఆ కారణంవలన; ఆ తీర్థంబు= ఆ సంగమ తీర్థం; ప్రభాసంబు+అను పేరన్+ప్రసిద్ధిన్+అందెన్= (ఆ తీర్థం) ప్రభాసమనే పేరుతో కీర్తిపొందినది; అందుండి= అక్కడినుండి; ఆ రోహిణీ నందనుండు+అరిగి= రోహిణి కుమారుడైన బలరాముడు వెళ్ళి; చమసోద్భేదనంబు+అను తీర్థంబునన్= చమసోద్భేదన మనే పేరున్న ఆ తీర్థంలో; (యాగ సమయంలో అందరును తీసికొనే ఒక విధమయిన రసం పుట్టే చోటు); ఒక రాత్రి వసియించి= ఒక్కరాత్రి మాత్రం ఉండి; ఉదపానంబునకున్+పోయెన్= ఉదపానమనే బావికిపోయాడు; దాని విశేషంబులు= దాని గొప్పదనమును; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** 'స్త్రీలను, బ్రాహ్మణులను అవమానింపవద్దు.' అని వీడ్కొలిపాడు. ఆ విధంగా శాపం తొలగిపోయే విధాన్ని తెలిసి చంద్రు డా తీర్థానికి పోయి ఆ నీటిలో స్నానం చేసి చక్కని శరీరంతో లోకాన వెలిగాడు. ఆ కారణంచేత ఆ తీర్థం ప్రభాసమని కీర్తి నందింది. అక్కడనుండి బలరాముడు చమసోద్భేదనతీర్థంలో ఒక రాత్రి ఉండి స్నానమాడి ఉదపానమనే బావిని సేవించటానికి వెళ్ళాడు. ఆ కథ వినుము.

**క. త్రితుఁ డనఁగా ద్వితుఁ డన నే। కతుఁ డనగఁ దపస్విసుతులు గల; రా విప్ర**
**త్రితయము భూపాలురకును। గ్రతుదీక్ష లొనర్చి ధేనుగణముం బడసెన్. 154**

**ప్రతిపదార్థం:** త్రితుఁడు+అనఁగాన్= త్రితుడనే పేరు కలవాడు; ద్వితుఁడు+అనన్= ద్వితుడనేవాడు; ఏకతుఁడు+అనఁగన్= ఏకతు డనేవాడును; తపస్వి సుతులు= మునికుమారులు; కలరు= ఉన్నారు; ఆ విప్రత్రితయము= ఆ ముగ్గురు బ్రాహ్మణులును; భూపాలురకును= రాజులకు; క్రతుదీక్షలు+ఒనర్చి= యజ్ఞదీక్ష లిచ్చి; ధేనుగణమున్+పడసెన్= ఆవులను పొందారు.

**తాత్పర్యం:** త్రితుడు, ద్వితుడు, ఏకతుడు అనే మునికుమారు లుండేవారు. వారు రాజులకు యజ్ఞదీక్షలనిచ్చి ఆవులను పొందారు.

**వ. పడసి యొక్కట నేతెంచునెడ నయ్యేకతద్వితులు నిజభ్రాత యగు త్రితుని వంచించి తా రాగోవులఁ దొలంగ నడిచికొని పోవువారుగాఁ బాపబుద్ధి కుత్సహించి; రాసమయంబునఁ దెరువున నొక్కవృకం బున్నఁ దద్భయంబునం దొలంగం బోయి ప్రమాదంబున త్రితుండు నూతం బడిన నయ్యిరువురు నతని నుపేక్షించి ధేనువులం గొనిపోయి; రమ్మునికుమారుండు నిర్జలం బైన యయ్యుదపానంబున నుండి సోమపానంబు సేసినం గాని యీ దురితంబు వాయ దని తలంచి యజ్ఞసాధనంబునకుఁ బ్రతివిధులు**

**సంకల్పరూపంబున సంపాదించికొని క్రతువొనరించిన దేవతలు సన్నిధిసేసి హవిర్భాగంబులు గైకొనిరి. సరస్వతీజలంబు తత్కూపంబున నుద్గతంబై యా సవనపతి నుద్ధరించె; నయ్యమరులు వరం బడుగు మనిన నమ్మహాద్విజుండు. 155**

**ప్రతిపదార్థం:** పడసి యొక్కన్ ఏతెంచునెడన్= ఆ విధంగా పొంది ఒక్కడూ వచ్చే సమయంలో; ఆ+ఏకతద్వితులు= ఆ యేకత ద్వితు లనేవారు; నిజభ్రాతఅగు= తమ సోదరుడయిన; త్రితుని= త్రితు డనే వాడిని; వంచించి= మోసంచేసి; తారు= తాము; ఆ గోవులన్= ఆ పశువులను; తొలంగన్+అడిచికొనిపోవువారుగాన్= తప్పించి తోలుకొని పోయే వారై; పాపబుద్ధికిన్= మోసపు చేష్టకు; ఉత్సహించిరి= ఆసపడ్డారు; ఆ సమయంబునన్= ఆ వేళలో; తెరువునన్= బాటలో; ఒక్క వృకంబు+ఉన్నన్= ఒక తోడేలుండగా; తద్+భయంబునన్+తొలంగన్+పోయి= దానివలన భయంతో తప్పుకొనబోయి; ప్రమాదంబునన్= ప్రమాదవశాన; త్రితుండు= త్రితుడనేవాడు; నూతన్+పడినన్= బావిలో పడగా; అతనిన్+ఉపేక్షించి= వాడిని లెక్కసేయకుండా; ధేనువులన్+కొనిపోయిరి= ఆవులను తీసికొనిపోయారు; ఆ+మునికుమారుండు= ఆ తపసి కుమారుడు; నిర్జలంబు+అయిన ఆ+ఉదపానంబుననుండి= నీరులేని ఆ బావినుండి; సోమపానంబు+చేసినఁగాని= సోమరసాన్ని త్రాగితేగాని; ఈ దురితంబు= ఈ పాపం; పాయదు+అని తలంచి= పోదని భావించి; యజ్ఞసాధనంబునకున్+ప్రతినిధులు= యజ్ఞాన్ని సాగించటానికి మారువిధానాలు; సంకల్పరూపంబునన్ సంపాదించుకొని= సంకల్పమాత్రాన సంపాదించుకొని; క్రతువు+ఒనరించినన్= యజ్ఞం చేయగా; దేవతలు సన్నిధి+చేసి= దేవతలు ప్రత్యక్షమై; హవిర్భాగంబులు గైకొనిరి= యజ్ఞహవిస్సులో భాగాలను తీసికొన్నారు; సరస్వతీ జలంబు= సరస్వతీ తీర్థంలోని నీరు; తద్+కూపంబునన్+ఉద్గతంబు+ఐ= ఆ బావిలో పుట్టుకొని వచ్చి; ఆ సవనపతిన్= ఆ యజ్ఞపతిని; ఉద్ధరించెన్= గట్టెక్కించింది; ఆ+అమరులు; వరంబు+అడుగుము+అనినన్= ఆ దేవతలు వరమడుగు మనగా; ఆ+మహాద్విజుండు= ఆ గొప్ప బ్రాహ్మణుడు.

**తాత్పర్యం:** ఆవులను పొంది, ఒకడూ వస్తుండగా తోడబుట్టినవారయిన ఏకద్వితులు త్రితుని మోసగించి అతడి ఆవులను అపహరించి దాటుకొని పోయేవారయి పాపపుచేష్టకు ఆసక్తి చూపారు. ఆ సమయంలో దారిలో ఒక పెద్ద తోడేలుండగా భయపడి తప్పుకోబోయి ప్రమాదవశాత్తు త్రితుడు బావిలో పడగా ఆ ఇరువురూ అతడిని లెక్క చేయక ఆవులను తోలుకొనిపోయారు. ఆ తాపసబాలుడు నీరు లేని ఆ బావినుండి సోమపానం చేస్తేగాని ఈ పాపం పోదని తలచి యజ్ఞం చేయటానికి ప్రతినిధులను సంకల్పరూపంగా సంపాదించుకొని యజ్ఞం చేయగా దేవతలు ప్రత్యక్షమై హవిర్భాగాలు తీసికొన్నారు. సరస్వతీ జలం ఆ బావినుండి పుట్టి ఆ యజ్ఞపతిని కాపాడింది. ఆ దేవతలు వరమును దేనినైనా కోరుకొమ్మనగా, ఆ బ్రాహ్మణోత్తముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'వినుఁ డుపస్పర్శ మిందుఁ జేసిన యతండు । వడయువాఁడు మహిత సోమపానఫలము
వరము నా కిది' యనుటయు వార లట్టు । లవుట సంప్రీతి మై నిచ్చి దివికిఁ జనిరి. 156**

**ప్రతిపదార్థం:** వినుఁడు= (మీరంతా) వినండి; ఇందున్= ఈ తీర్థంలో; ఉప స్పర్శ చేసిన+అతండు= స్నానం (ఆచమనం) చేసినవాడు; మహిత= మహత్త్వంకల; సోమపానఫలము= సోమరసాన్ని త్రాగిన ఫలితాన్ని; పడయువాఁడు= పొందగలడు; ఇది నాకున్ వరము= ఇదియే నాకు (ఈయదగిన) వరం; అనుటయున్= అనగా; వారలు+అట్టులు+అవుట= వా రావిధంగా కావటాన్ని (వరమును); సంప్రీతిమైన్+ఇచ్చి= సంతోషంతో ఇచ్చి; దివికిన్+చనిరి= స్వర్గానికి వెళ్ళారు.

**తాత్పర్యం:** ఈ తీర్థంలో స్నానం చేసినవాడు సోమరసాన్ని త్రాగిన ఫలితం పొందినవాడు కావాలి. ఇది నేను కోరే వరం.' అనగా, వారు అట్లే అగుగాక!' అని వర మిచ్చి సంతోషంతో దేవలోకానికి వెళ్ళారు.

**వ. అట్టి యయ్యుదపానంబును సేవించి వినశనంబునకుఁ జనియెఁ; దత్తీర్థంబు హీనజాతులకుఁ బొడసూపక నశించుఁ గావున వినశనం బనం బరఁగె; మఱియు భూమికంబునకుఁ బోయె; నది యప్సరోగీతనృత్య విహారభూమి యగుట భూమికం బనఁ బ్రసిద్ధం బయ్యెఁ; బదంపడి గంధర్వతీర్థంబునకు నేఁగె; నది విశ్వావసుప్రభృతిగంధర్వతపస్సిద్ధిస్థానం; బందుండి గర్గస్రోతంబునకుఁ జనియె; నందు గర్గుండు సన్మునిసేవితుండై చిరకాలంబు వసించె; నచ్చోటు గదలి యా బలభద్రుండు. 157**

**ప్రతిపదార్థం:** అట్టి= అంతమహిమ కల; ఆ+ఉదపానంబును సేవించి= ఆ నీటిని త్రాగుటచేత సేవించి(నవాడై); వినశనంబునకున్+చనియెన్= వినశనమనే తీర్థమున్న చోటికి వెళ్ళాడు; తద్+తీర్థంబు= ఆ తీర్థం; హీనజాతులకున్+పొడసూపక= నీచజాతులకు కానరాక; నశించున్+కావునన్= నశించిపోతుంది కనుక; వినశనంబు+అనన్+పరఁగెన్= వినశనము అనే పేరుతో ఒప్పింది; మఱియున్= ఇంకనూ; భూమికంబునకున్+పోయెన్= భూమికతీర్థానికి వెళ్ళాడు; అది= ఆచోటు; అప్సరో గీతనృత్య విహారభూమి= దేవతావేశ్యలు సంగీత నాట్యాలతో తిరిగేచోటు; అగుటన్= అగుటవలన; భూమికంబు+అనన్= భూమికమనే పేరుతో; ప్రసిద్ధంబు+అయ్యెన్= ప్రఖ్యాతి నందింది; పదంపడి= ఆ మీదట; గంధర్వ తీర్థంబునకున్+ఏఁగెన్= గంధర్వమనే తీర్థానికి వెళ్ళాడు; అది= ఆ చోటు; విశ్వావసుప్రభృతి= విశ్వావసుడు మొదలైన; గంధర్వ తపస్సిద్ధి కలిగినచోటు; అందుండి గర్గస్రోతంబునకున్+చనియెన్= గర్గస్రోతమనే పేరున్న చోటికి వెళ్ళాడు; అందున్= ఆ చోటు; గర్గుండు= గర్గమహాముని; సత్+మునిసేవితుండు+ఐ= మంచిమునులచేత సేవించబడుతూ; చిరకాలంబు= చాలకాలం; వసించెన్= కాపురమున్నాడు; ఆ+చోటున్+కదలి= ఆచోటు దాటి; ఆ బలభద్రుండు= ఆ బలరాముడు.

**తాత్పర్యం:** అటువంటి తీర్థాన్ని సేవించి, వినశనానికి వెళ్ళాడు. ఆ తీర్థం తక్కువ జాతివారికి కానరాకుండా నశిస్తుంది గనుక వినశనమని పిలువబడింది. ఇంకను భూమికమనే తీర్థానికి కూడ వెళ్ళాడు. అది అప్సరసలు సంగీత గీతనృత్యాలతో విహారం చేసే చోటు. ఆ తరువాత గంధర్వ తీర్థానికి వెళ్ళాడు. ఆ చోటు విశ్వావసుడు మొదలైన గంధర్వులు తపస్సిద్ధి పొందినట్టిది. అక్కడనుండి గర్గస్రోతమునకు వెళ్ళాడు. అది గర్గుడు సన్మునులచేత సేవించబడి చాలకాలం నివాసం చేసిన చోటు. అటనుండి బలరాముడు కదలి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. వినుము శంఖతీర్థమునకు నైసర్గిక । మునకు నాగధన్వమునకు వరుసఁ**
**జనియె; నాగధన్వ మనునది వాసుకి । స్థాన మచటఁ దొల్లి సకల సురులు. 158**

**ప్రతిపదార్థం:** వినుము; శంఖతీర్థమునకున్; నైసర్గికమునకున్= నైసర్గికము అనే తీర్థానికీ; నాగధన్వమునకున్ వరుసన్+చనియెన్= నాగధన్వమనే చోటునకూ వరుసగా వెళ్ళాడు; నాగధన్వము+అనునది= నాగధన్వమనే పేరున్నది; వాసుకిస్థానము= (నాగేంద్రుడగు) వాసుకి ఉన్నచోటు; అచటన్; తొల్లి= అంతకు పూర్వం; సకలసురులు= దేవతలందరును.

**తాత్పర్యం:** శంఖతీర్థమునకూ, నైసర్గికానికీ, నాగధన్వానికీ వరుసగా వెళ్ళాడు. ఆ నాగధన్వం వాసుకికి నివాసస్థానం కావడంచేత, ఇంతకు మునుపు దేవతలందరూ అక్కడ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించి; రందుండి యా నీలాంబరుండు నైమిశంబున కరిగె; నయ్యెడం దొల్లి సరస్వతి యనునేఱు దూరం బై యుండ నైమిశారణ్యవాసు లగుమునులు క్రతువు సేయం దొడంగిన; నాసరస్వతి వారల సంభావించుటకు మలంగి పాఱినకతంబునం దటసమీపం బయ్యె; నవ్విశేషంబు విని**

**విస్మితుం డగుచు నాహలాయుధం డా తీర్థంబుఁ గొనియాడి, సప్తసారస్వతంబునకుం బోయె నచ్చట మంకణుండును మహాముని వసించుఁ దొల్లి నలినభవుసత్త్రంబున నైమిశారణ్యమునుల యాగంబున గయుని క్రతువున నుద్దాలకునధ్వరంబున వసిష్ఠసప్తతంతువున గురునిసవనంబున వెండియు నొకమఱి యాపరమేష్ఠి యజ్ఞంబున హిమవత్పుష్కరాదు లైన తత్ప్రదేశంబులకు సుప్రభయుఁ గనకాక్షియు విశాలయు సురతన్వయు నోఘమాలయు సువేణియు విమలోదకయు ననునామంబుల నారీవేషయుక్తయై సరస్వతి చని యజమానసకల దేవముని సంభావన వడసె నట్టి సప్తాకారంబుల నాసంయమియాశ్రమంబునఁ బ్రవర్తించుట నది సప్తసారస్వతం బనం బరఁగె; నమ్మంకణుని చరితంబులు మఱియునుం గల వాశ్చర్యకరంబులు వినుము. 159**

**ప్రతిపదార్థం:** నాగ+ఇంద్రత్వమునకున్= పాములకు రాజుగా; వాసుకిన్+అభిషేకించిరి= వాసుకిని అభిషేకం చేశారు; అందుండి= అక్కడనుండి; ఆ నీలాంబరుండు= నీలంరంగు గల వస్త్రాన్ని ధరించినవాడైన బలరాముడు; నైమిశంబునకున్+అరిగెన్= నైమిశ మనే పేరున్న వనానికి వెళ్ళాడు; ఆ+ఎడన్+తొల్లి సరస్వతి అను+ఏఱు= ఆ చోట పూర్వం సరస్వతిఅనే పేరున్న ఏరు; దూరంబు+ఐ+ఉండన్= చాలదూరంగా ఉండగా; నైమిశారణ్యావాసులు+అగు మునులు= నైమిశారణ్యంలో కాపురముండే తాపసులు; క్రతువు చేయన్+తొడంగినన్= యజ్ఞం చేయటాన్ని మొదలుపెట్టగా; ఆ సరస్వతి వారల సంభావించుటకున్= ఆ సరస్వతీనది వారి నాదరించటానికి; మలంగి= తిరిగి; పాఱిన+కతంబునన్= ప్రవహించిన కారణంగా; తటసమీపంబు+అయ్యెన్= తీరానికి దగ్గరైనది; ఆ+విశేషంబు విని= ఆ గొప్పను విన్నవాడై; విస్మితుండు+అగుచున్= ఆశ్చర్యంపొందుతూ; ఆ హలాయుధుండు= నాగలి ఆయుధంగా కల ఆ బలరాముడు; ఆ తీర్థంబున్+కొనియాడి= ఆ తీర్థాన్ని కీర్తించి; సప్తసరాస్వతంబునకున్+పోయెన్= సప్తసారస్వతమనే తీర్థానికి పోయాడు; అచ్చటన్= ఆ చోట; మంకణుండు+అను మహాముని వసించున్= మంకణముని ఉన్నాడు; తొల్లి= పూర్వం; నవినభవుసత్రంబునన్= బ్రహ్మయజ్ఞంలో; నైమిశారణ్యమునుల యాగంబునన్= నైమిశారణ్యంలో ఉన్న మునులు చేసి యాగంలో; గయుని క్రతువునన్= గయుడు చేసిన యజ్ఞంలో; ఉద్దాలకుని అధ్వరంబునన్= ఉద్దాలకుడి యాగంలో; వసిష్ఠసప్తతంతువునన్= వసిష్ఠుడి యాగంలో; గయుని క్రతువునన్= గయుడు చేసిన యజ్ఞంలో; ఉద్దాలకుని అధ్వరంబునన్= ఉద్దాలకుడి యాగంలో; వసిష్ఠసప్తతంతువునన్= వసిష్ఠుడి యాగంలో; గురుని సవనంబునన్= గురుడి యాగంలో; వెండియున్+ఒకమఱి= ఇంకొకమారు; ఆ+పరమేష్ఠి యజ్ఞంబునన్= బ్రహ్మకావించే ఆ యజ్ఞంలో; హిమవత్+పుష్కరాదులు+ఐన= హిమవంతము, పుష్కరం మొదలైన; తద్+ప్రదేశంబులకున్= ఆ చోటులకు; సుప్రభయు; కనకాక్షియు; విశాలయు; సురతన్వయు; ఓఘమాలయు; సువేణియు; విమలోదకయు; అను నామంబులన్= అనే పేర్లతో; నారీవేషయుక్త+ఐ= స్త్రీకి ఆమోదయోగ్యమయ్యే వేషంతో; సరస్వతి చని= సరస్వతి(నది) వెళ్ళి; యజమాన= యజ్ఞకర్తయొక్కయు, సకల దేవముని, సంభావన పడసెన్= అందరు దేవతలయొక్క, మునులయొక్క, మర్యాదలను పొందింది; అట్టిసప్త+ఆకారంబులన్= ఆ విధంగా ఏడు రూపాలతో; ఆ సంయమి ఆశ్రయంబునన్+ప్రర్తించుటన్= ఆ తాపసి ఆశ్రమంలో తిరగటంవలన; అది= ఆ నది; సప్తసారస్వతంబు+అనన్+పరఁగెన్= సప్త సారస్వతముగా ఒప్పిఉన్నది; ఆ+మంకణుని చరితంబులు మఱియునున్ కలవు= ఆ మంకణముని గాథలు ఇంకా ఉన్నవి; ఆశ్చర్యకరంబులు= అబ్బురమును కలిగించేవి; వినుము.

**తాత్పర్యం:** పాములకు రాజైనట్లు వాసుకిని అభిషేకించారు. అక్కడినుండి ఆ నీలాంబరుడు (బలరాముడు) నైమిశానికి వెళ్ళాడు. మునుపు సరస్వతి అనే నది దూరంగా ఉండగా నైమిశారణ్యంలో ఉండే తాపసులు యజ్ఞం చేయటం మొదలు పెట్టగానే ఆ సరస్వతి వారిని గౌరవించటానికై తిరిగి పారిన కారణాన అది తటసమీపమైనది.

ఆ ప్రత్యేకతను విని ఆశ్చర్యపడి, బలరాముడు ఆ తీర్థాన్ని పొగడి సప్తసారస్వతానికి వెళ్ళాడు. ఆ చోట మంకణు డనే గొప్ప తపస్వి పూర్వముండేవాడు. పూర్వం బ్రహ్మచేసిన యాగంలో, నైమిశంలోని మునులయాగంలో, గయుడి యజ్ఞంలో, ఉద్దాలకుడి యజ్ఞంలో, వసిష్ఠుడి సప్తతంతువులో, గురుడి యాగంలో, ఇంకా ఒకమారు బ్రహ్మయజ్ఞంలో, హిమవంతం, పుష్కరం మొదలైన చోటులలోను, సుప్రభ, కనకాక్షి, విశాల, సురతన్వ, ఓఘమాల, సువేణి, విమలోదక- అనే పేర్లతో స్త్రీవేషంలో సరస్వతి వెళ్ళి, యజ్ఞకర్తలవలననూ, సమస్తదేవతలవలననూ, మునులవలననూ గౌరవం పొందింది. ఆ విధంగా ఏడు రూపాలతో ఆ తపస్వి ఆశ్రమంలో తిరగటంచేత సప్తసారస్వతమని ఒప్పింది. ఆ మంకణుని గాథలు ఆశ్చర్యాన్ని కల్గించేవి ఇంకనూ ఉన్నవి. వినుము.

### మంకణమహాముని మాహాత్మ్యాభివర్ణనము (సం. 9-37-1)

**సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయు । చుండి యా చేరువ నోర్తు తడుపు**
**గట్టక నీళ్ళాడఁగాఁ జూడఁ దనదు శు । క్లము నిర్గమించిన ఘటసురక్షి**
**తము సేయ సప్తభేదము లొంది యది సత్పు । రుషు లైరి వారు మరుద్గణంబు**
**నకు సంజననకారణం బైరి; విను మొక్క । నాఁ డ త్తపస్వి వ్రేల్నాటి దర్భ**

**ఆ. గంటిఁ గూరయసరు గాఱిన నర్తించె । నతఁడు తపముసిద్ధి కాత్మఁ బొంగి**
**జగము లెల్లఁ దాన సంక్షోభ మొందె; ని । ర్జరులు భీతిఁ జనిరి శంభుఁ గాన. 160**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ మంకణుడు; సరస్వతిన్+అవగాహనమున్+చేయుచుండి= సరస్వతీ నదిలో స్నానంచేస్తూ ఉండగా; ఆ చేరువన్= ఆ సమీపంలో; ఓర్తు= ఒకర్తె; తడుపు+కట్టక= వస్త్రం కట్టుకొనకుండా; నీళ్ళాడఁగాన్= స్నానమాడగా; చూడన్= చూడగా(చూడటంవలన); తనదు శుక్లము= తనవీర్యం; నిర్గమించినన్= వెలువడగా; ఘటసురక్షితము+చేయన్= కుండలో భద్రంచేయగా; సప్తభేదములు+ఒంది= ఏడు భాగాలుగా అయి; సత్పురుషులు+ఐరి= పుణ్యవంతులైనారు; వారు= ఆ ఏడ్గురును; మరుద్గణంబులకున్= దేవతలకు; సంజననకారణంబు+ఐరి= పుట్టుకకు కారణమైనారు; వినుము= ఇంకను వినుము; ఒక్కనాఁడు= ఒకానొక దినాన; ఆ తపస్వి= ఆ మునియొక్క; వ్రేల్+నాటి= వ్రేలియందు గ్రుచ్చుకొని; దర్భగంటిన్= దర్భచేత ఏర్పడిన ఆ గాయంనుండి; కూర+అసరు= శాకరసం; గాఱినన్= స్రవించగా; అతఁడు= ఆ ముని; తపము సిద్ధికి= తపస్సిద్ధికి; ఆత్మన్+పొంగి= మనసులో సంతసించి; నర్తించెన్= నాట్యమాడాడు; జగములు+ఎల్లన్= అన్ని లోకాలు; దానన్+సంక్షోభము+ ఒందెన్= దానివలన అల్లకల్లోలమయ్యాయి; నిర్జరులు= దేవతలు; భీతిన్= భయంతో; శంభున్+కానన్+చనిరి= పరమేశ్వరుడిని చూడటానికి పోయారు.

**తాత్పర్యం:** ఆ మంకణుడు సరస్వతీనదిలో స్నానం చేస్తుండగా సమీపంలో ఒకతె గుడ్డ కట్టుకొనకుండా స్నానం చేయటం చూడగా తననుండి వీర్యం వెలువడింది. దానిని కుండలో భద్రం చేయగా అది ఏడు భాగాలై సత్పురుషు లయ్యారు. దేవతలపుట్టుకకు వారే కారణ మయ్యారు. అందువలన ప్రపంచ మంతా అల్లకల్లోలమైనది. దేవతలు భయంతో శివుడిని చూడటానికి వెళ్ళారు.

**వ. కని యంతయు నెఱింగించిన నద్దేవోత్తముం డాభూదేవోత్తముపాలి కరిగి 'యిది యెంతటి విశేషంబు? దపంబు లిట్టివే? నర్తించుట మాను' మని పలికి తన యంగుటంబు వ్రేలం గీఱిన నందు భస్మంబు గాఱిన నాసంయమి సిగ్గువడి దండప్రణామంబు సేసి. 161**

**ప్రతిపదార్థం:** కని= చూచి; అంతయున్= మొత్తం; ఎఱింగించినన్= మొత్తం తెలుపగా; ఆ+దేవ+ఉత్తముండు= ఆ దేవతలలో ఉత్తముడు(శ్రేష్ఠుడు); ఆ భూదేవ+ఉత్తము పాలికిన్+అరిగి= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుని వద్దకు వెళ్ళి; ఇది ఎంతటి విశేషంబు!= ఇది ఏమంత గొప్ప విషయం!; తపంబులు+ఇట్టివే?= తపస్సులంటే ఇవేనా?; నర్తించుట మానుము+అని పలికి= నాట్యం చేయటం నిలుపు మని చెప్పి; తన అంగుటంబున్ వ్రేలన్+గీఱినన్= తన బొటనవ్రేలిని వ్రేలితో గీరగా; అందున్ భస్మంబు+ కాఱినన్= దానినుండి బూడిద కారగా; ఆ సంయమి సిగ్గుపడి= ఆ తాపసి సిగ్గుపడి; దండప్రణామంబు+చేసి= దండమువలె నేలపైబడి నమస్కారం చేసి.

**తాత్పర్యం:** (శంభుడిని) చూచి అంతా తెలుపగా ఆ దేవోత్తముడు ఆ బ్రాహ్మణోత్తముడి వద్దకు వెళ్ళి, 'ఇది ఏమంత శ్రేష్ఠమైనది! తపస్సు లిటువంటివా? నాట్యం చేయటం నిలిపివేయుము -' అని చెప్పి తన బొటనవ్రేలిని వ్రేలితో గీరగా - అందుండి భస్మం కారింది. దానికి ఆ తపస్వి సిగ్గుపడి సాష్టాంగ నమస్కారం చేశాడు.

**ఆ.** **'దైవ మెల్లఁ దలఁప నీవ సమస్తజ । గంబులకును, నేడుగడయు నీవ;**
**కర్మఫలదుఁడవును గర్మప్రదుండవు । నీవ కరుణ నన్నుఁ గావు మభవ!'** **162**

**ప్రతిపదార్థం:** అభవ!= పుట్టుక లేనివాడా! ఈశ్వరా!; ఎల్లన్ తలఁపన్= అంతా తలచగా; దైవము; సమస్త జగంబులకును నీవు+అ= అన్ని లోకాలకును నీవే; ఏడుగడయున్+నీవు+అ= రక్షకుడవు కూడా నీవే; కర్మఫలదుఁడవును+కర్మప్రదుండవును= చేసే పనులకు ఫలితమును, చేయవలసిన పనిని చేయించువాడవును; ఈవ= నీవే; నన్నున్+కరుణన్= నన్ను దయతో; కావుము= కాపాడుము.

**తాత్పర్యం:** 'అంతా తలపోయగా నీవే దైవం. ఆధారం కూడా నీవే. పనులను చేయించే వాడవు, చేసినదానికి ఫలితాన్ని ఇచ్చేవాడవూ నీవే. దయతో నన్ను కాపాడుము.'

**వ.** **అని వెండియు ననేక ప్రకారంబులం బ్రశంసించినం బ్రసన్నుండై పశుపతి యతనికిఁ దపఃప్రభావం బక్షీణంబుగా వరం బిచ్చి చనియె; నమ్మహామునిని నృత్యంబు మానిన జగంబుల సంక్షోభంబు శాంతం బయ్యె; నట్టి యమ్మహాత్మునినివాసం బైన సప్తసారస్వతంబున నుండి యాసీరి యౌశనంబునకుం బోయె; వినుము! తొల్లి రఘురామునిచేతఁ జచ్చిన మహోదరుం డను నసుర తలపునుక యొక్క తపస్వికాలఁ దగిలి పుచ్చ రాకున్న నతండు వేదనం బొందుచుండం గని యార్యులు 'నౌశనం బనుతీర్థంబు శక్రుండు దపంబుసేసినచో టందుఁ బొమ్ము; నీదురితంబు వాయు' ననిన మహోదరనామధేయుండగు నాసంయమి యచ్చటికిం జనినఁ గపాలంబు ముక్తం బయ్యె; దానంజేసి యది కపాలమోచనం బనం బరఁగు; నచ్చోటు గదలి పృథూదకంబున కరిగెఁ; దదీయ విశేషంబు వినుము! గాధి యను మహారాజు కొడుకు విశ్వామిత్రుం డనునతండు.** **163**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; వెండియున్= ఇంకను; అనేక ప్రకారంబులన్= నానావిధాలుగా; ప్రశంసించినన్= కీర్తించగా; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహపరుడై; పశుపతి= పరమశివుడు; అతనికిన్= ఆ మునికి; తపః ప్రభావంబు= తపశ్శక్తి; అక్షీణంబు+కాన్= నాశనం కాకుండా; వరంబు+ఇచ్చి చనియెన్= వరమొసగి వెళ్ళాడు; ఆ+మహాముని= ఆ గొప్ప తపసి; నృత్యంబు= నాట్యమును; మానినన్= మానివేయగా; జగంబుల సంక్షోభంబు= లోకాలలో అలజడి; శాంతంబు అయ్యెన్= శాంతించింది; అట్టి ఆ+మహాత్ముని నివాసం బైన; సప్త సారస్వతంబున నుండి= సప్తసారస్వతమునుండి; ఆ సీరి= ఆ బలరాముడు; ఔశనంబునకున్+ పోయెన్= ఔశనమనే తీర్థమునకు వెళ్ళాడు; వినుము; తొల్లి= ఇదివరలో; రఘురామునిచేతన్= రఘురాముడిచేత; చచ్చిన=

చనిపోయిన; మహోదరుండు+అను అసుర= మహోదరుడనే రాకాసి; తలపునుక= తలపుర్రె; ఒక్కతపస్వి కాలన్+తగిలి= ఒక తాపసి కాలికి తగిలి; పుచ్చ రాకున్నన్= తీసివేయగాకుండగా; అతండు వేదనన్+పొందుచుండన్+కని= ఆతడు బాధపడుతూ ఉండగా చూచి; ఆర్యులు= పూజ్యులు; సరస్వతిని= సరస్వతీ తీర్థమున; ఔశనం బను తీర్థంబు= ఔశన తీర్థం; శక్రుండు= ఇంద్రుఁడు; తపంబు సేసిన చోటు; అందున్+పొమ్ము= ఆ చోటునకు పోవలసినది; నీ దురితంబు+పాయున్+అనినన్= నీ పాపాలు పోతాయనగా; అచ్చటికిన్+చనినన్= ఆ చోటునకు పోగా; కపాలంబు ముక్తంబు+అయ్యెన్= కపాలం వదలివేసింది; దానన్+చేసి= అందువలన; అది కపాలమోచనంబు+అనన్+పరఁగున్= దానికి కపాలమోచనమని పేరు వచ్చింది; ఆ+చోటు వదలి= ఆ స్థానాన్ని వదలి; పృథూదకంబునకున్+చనియెన్= పృథూదక తీర్థానికి వెళ్ళాడు; తదీయ విశేషంబు వినుము= దానికి సంబంధించిన విశేషం వినుము; గాధిఅను మహారాజు కొడుకు= గాధిరాజు కుమారుడు; విశ్వామిత్రుండు+అను+అతండు= విశ్వామిత్రు డనేవాడు.

**తాత్పర్యం:** అని ఇంకను అనేక విధాలుగా కీర్తించగా ప్రత్యక్షమై పరమశివుడు అతడికి తపశ్శక్తి నశించకుండా వరమిచ్చి వెళ్ళాడు. ఆ తాపసి నాట్యాన్ని మానివేయగా ప్రపంచంలోని అలజడి శాంతించింది. అటువంటి ఆ మహనీయుడికి ఉనికిపట్టయిన ఏడు సరస్వతీ తీర్థాలనుండి ఆ బలరాముడు ఔశనమునకు పోయాడు. ఆ విషయాన్ని వినుము. పూర్వం రఘురాముడిచేత చనిపోయిన మహోదరుడనే రాక్షసుడి తల పుర్రె ఒక తపస్వి కాలికి తగిలి దానిని తొలగించటానికి సాధ్యంకాక అతడు బాధపడుతుండగా చూచిన పెద్దలు 'ఔశనతీర్థంలో ఇంద్రుడు తపం చేసినచోటునకు పొమ్ము. నీ పాపములు తొలగిపోతాయి' అనగా ఆ ముని ఆ చోటునకు పోగా పుర్రెఎముక వదలింది. అందుచేత అది కపాల మోచన మని పిలువబడుతున్నది. బలరాముడు ఆచోటును వదలి పృథూదక తీర్థానికి వెళ్ళాడు. దాని గొప్పతనాన్ని వినుము. గాధి అనే మహారాజు కుమారుడు విశ్వామిత్రు డనేవాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. తండ్రి యట్ల సకలధాత్రీశుఁ డై యుండి । దనుజమథనమునకు దండు వెడలి**
**యరుగునెడ వసిష్ఠునాశ్రమంబున పొంత । విడియఁ బరిజనములు వినయ మెడలి. 164**

**ప్రతిపదార్థం:** తండ్రి+అట్లు+అ= తండ్రి మాదిరి; సకలధాత్రీశుఁడు ఐ ఉండి= సమస్త భూమికిని రాజైఉండి; దనుజమథనమునకున్= దానవులను చంపటానికి; దండు వెడలి= సేనతో వెళ్ళి; అరుగు+ఎడన్= వెళ్ళేటప్పుడు; వసిష్ఠు+ ఆశ్రమంబున పొంతన్= వసిష్ఠుడి ఆశ్రమానికి దగ్గర; విడియన్= నిలువగా(విడిసిఉండగా); పరిజనములు= సేవకులు; వినయము+ఎడలి= పరివారం అడకువ లేక.

**తాత్పర్యం:** సమస్త భూలోకనాథు డైన తన తండ్రివలెనే దానవులను చంపటానికి సేనతో వెళ్ళేటపుడు వసిష్ఠుడి ఆశ్రమంప్రక్క విడిసిన సేనలు క్రమం తప్పి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అందు దుర్నయంబు లాచరించిన నమ్ముని కోపించి నిజహోమధేనువు నాలోకించి 'నీ బలంబు పనుపు' మనిన నది దనమాహాత్మ్యంబున నచట నావహిల్లిన ఘోరాకారు లగు వీరులఁ బనుప వార లారాజు వరూథిని మడియించిన శేషించిన జనంబులు పలుగడలం పాఱె; రట్లు దురవస్థం బొందు నాసేనం జూచి యగ్గాధినందనుం డెల్ల శక్తులకంటెఁ దపశ్శక్తి యెక్కుడగుట యెఱింగి యాపృథూదకంబునఁ దపంబు**

**సేయుచుండ దానికి దేవపతి విఘ్నంబు సేయ, మఱియు నియమ నిష్ఠుండై బ్రహ్మచేత బ్రాహ్మణ్యంబును బడసె నత్తీర్థంబునుండి యాబలభద్రుండు బకాశ్రమంబున కరిగె; నయ్యెడఁ బకుండను మునీంద్రుండు తొల్లి.** **165**

**ప్రతిపదార్థం:** అందు దుర్నయంబులు+ఆచరించినన్= ఆ ఆశ్రమం దగ్గర నీతిమాలిన పనులు చేయగా; ఆ+ముని= ఆ వసిష్ఠుడు; కోపించి; నిజ= తన; హోమధేనువును; ఆలోకించి= చూచి; నీ బలంబున్; నీ శక్తిని; పనుపుము+అనినన్= ఆజ్ఞాపించుము; అనగా; అది= ఆ ఆవు; తన మాహాత్మ్యంబునన్= తన శక్తితో; అచటన్+ఆవహిల్లిన= అక్కడ కానవచ్చిన; ఘోర+ఆకారులు+అగు= భయంకరు లయిన; వీరులన్+పనుపన్= వీరులను పంపగా; వారలు= ఆ వీరులు; ఆ రాజు వరూథినిన్= ఆ రాజుసేనను; మడియించినన్= చంపగా; శేషించిన జనంబులు= మిగిలిన వారు; పలుగడలన్+పాఱిరి= అనేక దిక్కులకు పరుగుతీశారు; అట్లు దురవస్థన్+చెందు ఆసేనన్+చూచి= ఆ విధంగా కష్టపడే ఆ సేనను చూచి; ఆ+గాధినందనుండు= ఆ గాధిరాజకుమారుడు; ఎల్లశక్తులకంటెన్= అన్ని బలాలకంటే; తపశ్శక్తి= తపోబలం; ఎక్కుడు+అగుటన్= గొప్పది కావటం; ఎఱింగి= తెలిసికొని; ఆ పృథూదకంబునన్+తపంబు చేయుచుండన్= ఆ పృథూదక తీర్థంలో తపస్సు చేస్తూ ఉండగా; దానికిన్= ఆ తపస్సునకు; దేవపతి= ఇంద్రుడు; విఘ్నంబు+చేయన్= అడ్డంకులు కల్గించగా; మఱియున్ నియమనిష్ఠుండు+ ఐ= నియమంతో ఇంకా పట్టుదల కలవాడై; బ్రహ్మచేత బ్రాహ్మణ్యంబును పడసెన్= బ్రహ్మదేవుడి వలన బ్రాహ్మణ్యమును పొందాడు; ఆ+తీర్థంబున నుండి= ఆ తీర్థం వద్దనుండి; బలరాముండు; బక+ఆశ్రమంబునకున్+అరిగెన్= బకాశ్రమానికి వెళ్ళాడు; ఆ+ఎడన్= ఆ చోట; బకుండు+అను ముని+ఇంద్రుండు= బకు డనే తాపసి; తొల్లి= పూర్వం.

**తాత్పర్యం:** ఆ వసిష్ఠుడి ఆశ్రమంలో చెడ్డపనులను చేసిన ఆ తాపసి కోపించి తమ యజ్ఞధేనువును పిలిచి 'నీ శక్తిని చూపు' మన్నాడు. ఆ ఆవు భయంకరాకారులయిన వీరులను పంపగా వా రా రాజు సేనను చంపగా మిగిలినవారు పలుదిక్కులకు పరుగెత్తారు. ఆ విధంగా దురవస్థ నందిన తన సేనను జూచి ఆ గాధికుమారుడు అన్ని బలాలకంటె తపోబలమే గొప్పదని తెలిసికొని ఆ పృథూదక తీర్థంలో తపస్సు చేశాడు. ఆ తపస్సునకు దేవరాజయిన ఇంద్రుడు అడ్డంకులు కలిగించాడు. ఇంకను బ్రహ్మనుగూర్చి నియమంతో పట్టుదలగా ఆతడు తపస్సుచేసి బ్రహ్మత్వమును పొందాడు. అట్టి తీర్థంనుండి బలరాముడు బకుడి ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ చోట బకుడనే తాపసి తొల్లిటి కాలంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ధృతరాష్ట్రుం డను ధరణీ । పతి దన్ను నధఃకరించి పలికినఁ గోపా**
**న్వితుఁడై హోమ మొనర్చెను । ఘృతనరమాంసముల నతనికిం గీ డొదవన్.** **166**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు+అను ధరణీపతి= ధృతరాష్ట్రు డనే పేరు గల రాజు; తన్నున్+అధఃకరించి పలికినన్= తనను(బకుడిని) తిరస్కరించి మాటాడగా; కోప+అన్వితుడై= కోపం కలవాడై; ఘృత నరమాంసములన్= నేతితోను, మానవమాంసంతోను; అతనికిన్+కీడు+ఒదవన్= ఆ ధృతరాష్ట్రుడికి కీడు కలిగేటందుకు; హోమము+ఒనర్చెను= హోమం చేశాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర డనే రాజు బకుడిని తిరస్కరించాడు. దానికి కోపంతో అతనికి హాని కలగటానికి ఆ ముని నేతితోను, నరమాంసంతోను హోమంచేశాడు.

**ఆ. నఱుకఁ బడిన యడవి తెఱఁగున నతని రా । ష్ట్రంబు సకల జంతు సముదయములు**
**మడియ విన్ననయ్యు నడలి యా భూపతి । యత్తపస్విపాలి కరుగుదెంచి.** **167**

**ప్రతిపదార్థం:** నఱుకఁబడిన= నరికివేయబడ్డ; అడవి; తెఱఁగునన్= మాదిరిగా; అతని; రాష్ట్రంబు= దేశంలోని; సకల జంతు సముదయములు= ప్రాణికోటి అంతయు; మడియన్= నశించగా; విన్నన+అయ్యెన్= చిన్నబోయి వైవర్ణ్యం చెంది; అడలి= భయపడి; ఆ+తపస్వి= ఆ ముని; పాలికిన్= వద్దకు; ఆ భూపతి= ఆ ధృతరాష్ట్రరాజు; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** నరికివేసిన అడవివలె ప్రాణికోటి అంతా నశించగా అతని దేశం చిన్నపోగా ఆ రాజు భయపడి ఆ తాపసివద్దకు వచ్చి (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **దండప్రణామం బాచరించి పెక్కుభంగులఁ దేలించి మున్ను ధేను నిమిత్తం బగుదుర్భాషణంబుల నింత పుట్టుటం జేసి యాసంయమికి ననేక ధేనువుల నొసంగి దురితోపశాంతి యొనర్చె; నట్టి బకాశ్రమంబున నుండి రేవతీరమణుండు యయాతంబునకుం బోయె నందు యయాతి యజ్ఞంబున భోజనసమయంబున ఘృతదుగ్ధాదులయందు విప్రుం డెయ్యది గోరిన నది యెల్ల సరస్వతి సంపూర్ణ మనోరథంబు గా నొసంగుచు వచ్చె; నయ్యెడఁ గదలి వసిష్ఠావగాహంబునకు వచ్చెఁ; దత్ప్రదేశంబు దొల్లి విశ్వామిత్రునాశ్రమం; బతండు వసిష్ఠునెడఁ దపోవిషయమత్సరంబునఁ గుపితుండై.** **168**

**ప్రతిపదార్థం:** దండప్రణామంబు+ఆచరించి= దండం వలె సాష్టాంగంగా నమస్కారం చేసి; పెక్కు భంగుల తేలించి= అనేక విధాలుగా సంతోషపరిచి; మున్ను= అదివరకు; ధేనునిమిత్తంబు+అగు= ఆవు కారణంగా కల్గిన; దుర్భాషణంబులన్= చెడ్డమాటలవలన; ఇంత+పుట్టుటన్+చేసి= ఇంత(కష్టం) కలగటంచేత; ఆ సంయమికిన్= ఆ తాపసికి; అనేక ధేనువులన్+ఒసంగి= ఎన్నో ఆవుల నిచ్చి; దురిత+ఉపశాంతి+ఒనర్చెన్= పాపమునకు శాంతి కల్గించినాడు; అట్టి బక+ఆశ్రమంబుననుండి= అటువంటి శక్తికల బకుడి తపోవనమునుండి; రేవతీరమణుండు= రేవతి ప్రియుడయిన బలరాముడు; యయాతంబునకున్+పోయెన్= యయాతమనే చోటికి వెళ్ళాడు; అందున్= ఆ చోట; యయాతియజ్ఞంబునన్= యయాతి చేస్తున్న యాగంలో; భోజన సమయంబునన్= అన్నం తినేటప్పుడు; ఘృతదుగ్ధాదులయందున్= నేతిలోను, పాలలోను (ఈ మొదలయినవానిలో); ఏ+అది కోరినన్= దేని నాశిస్తే; అది ఎల్లన్= వాటినంతను; సరస్వతి సంపూర్ణమనోరథంబుగాన్+ఒసంగుచున్= సరస్వతీ తీర్థం నిండుగా కోరికలు తీరేటట్లు ఇస్తూ; వచ్చెన్= వచ్చినది; ఆ+ఎడన్+కదలి= ఆ చోటునుండి బయలుదేరి; వసిష్ఠ+అవగాహంబునకున్ వచ్చెన్= వసిష్ఠతీర్థానికి వచ్చాడు; తద్+ప్రదేశంబు= ఆ చోటు; తొల్లి విశ్వామిత్రుఆశ్రమంబు= వెనుక విశ్వామిత్ర మహర్షి తపోవనం; అతండు= ఆ విశ్వామిత్రుడు; వసిష్ఠున్+ఎడన్= వసిష్ఠుడి మీద; తపోవిషయమత్సరంబునన్+కుపితుండు+ఐ= తపస్సునకు సంబంధించిన అసూయతో కోపం కలవాడై.

**తాత్పర్యం:** (ధృతరాష్ట్రరాజు బకుడికి నమస్కారం చేశాడు). సాష్టాంగ నమస్కారం చేసి అనేక విధాలుగా సంతృప్తి పరచి, గతంలో ఆవు కారణంగా (కష్టాలను తలచుకొని) దుర్భాషణముల వలన కలిగిన దానిని తలచుకొని ఆ తాపసికి ఎన్నో ఆవుల నిచ్చి పాపమును పోగొట్టుకొన్నాడు. అటువంటి బకాశ్రమం నుండి యయాతమనే చోటుకు బలరాముడు వెళ్ళాడు. అక్కడ యయాతి చేసే యజ్ఞంలో భోజన వేళలో నేతులు, పాలు బ్రాహ్మణుడు ఏది కోరిన దానినంతా సరస్వతి నిండయిన మనస్తృప్తితో ఇస్తూ వచ్చింది. ఆ చోటు వదలి వసిష్ఠ తీర్థానికి వెళ్ళాడు. మును పది విశ్వామిత్రుడి ఆశ్రమం. ఆ విశ్వామిత్రుడు తపోవిషయంగా వసిష్ఠుని యెడ అసూయతో కోపించినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **అతని వధించుటకై సరస్వతి మదిఁ । దలఁచిన నానది తత్క్షణంబ**
**సౌమ్యవేషంబునఁ జనుదెంచి నిభృత యై । పని యేమి? యనిన నమ్ముని వసిష్ఠుఁ**

**గొనిరమ్ము నాకడ కని పంచెఁ; బంచిన । వార లిద్దఱ తపోవైభవంబు**

**నకు భయమందుచు నరనాథ యరిగి వ । సిష్ఠున కప్పని సెప్పెఁ దెలియ**

**తే. నాతఁ డవ్వాహినికి నిట్టు లనియె 'నన్ను । నీవు గొనిపోక తక్కిన నీకు శాప**

**మిచ్చు నగ్గాధిసుతుఁడు దదిచ్ఛ సలుపు । మించు కేనియుఁ గొంకక యెప్పడైన. 169**

**ప్రతిపదార్థం:** అతనిన్ వధించుటకై= ఆ వసిష్ఠుడిని చంపటానికి; మదిన్+తలంచినన్= (విశ్వామిత్రుడు) మనసులో తలచుకొనగా; ఆ నది= ఆ సరస్వతి; తత్క్షణంబ= వెంటనే; సౌమ్యవేషంబునన్+చనుదెంచి= శాంతమగు వేషంతో వచ్చి; నిభృత+ఐ= అడకువ కలదిగా; పని+ఏమి+అనినన్= తాను చేయవలసిన కార్యమేమి అని అడుగగా; ఆ+ముని= ఆ విశ్వామిత్రముని; వసిష్ఠున్+కొని నాకడకున్ రమ్ము= వసిష్ఠుడిని నా వద్దకు తీసికొనిరమ్ము; అని పంచెన్= అన్న ఆజ్ఞతో పంపాడు; పంచినన్= (అట్లు) పంపగా; వారల+ఇద్దఱ తపోవైభవంబునకున్+భయమందుచు= ఆ ఇద్దరి (వసిష్ఠ విశ్వామిత్రుల) తపశ్శక్తికి భయపడుతూ; నరనాథ!= ఓ రజా!; అరిగి= వెళ్ళి; వసిష్ఠునకున్+ఆ+పని తెలియన్ చెప్పెన్= వసిష్ఠునకా కార్యమును చెప్పింది; ఆతఁడు+ఆ+వాహినికిన్+ ఇట్టులు+అనియెన్= ఆ వసిష్ఠు డానదితో ఈ విధంగా అన్నాడు; నన్నున్; నీవు; కొనిపోక తక్కినన్= పిలిచికొని పోకపోతే; నీకున్; ఆ+గాధిసుతుండు= ఆ గాధికొడుకు; శాపము+ఇచ్చున్= శాపమిస్తాడు; ఇంచుక+ఏనియున్+కొంకక= కొంచెంకూడా సందేహించకుండా; ఎప్పుడైనన్= ఏ సమయంలో నైనా; తదిచ్ఛ సలుపుము= ఆ గాధేయుడి కోర్కెను నెరవేర్చుము.

**తాత్పర్యం:** వసిష్ఠుడిని చంపటానికై విశ్వామిత్రుడు తన మనసులో తలచుకొన్నాడు. ఆ సరస్వతీనదిని తలచుకొనగా వెంటనే శాంతమూర్తిగా వినయంతో వచ్చి (ఆ విశ్వామిత్రుడిని) తాను చేయనగు పని ఏమో అడిగింది. దాని కాతడు వెంటనే వసిష్ఠుడిని తన వద్దకు పిలిచికొని రమ్మన్నాడు. ఆ ఉత్తరువు విని ఆ నది ఇర్వురి తపశ్శక్తికి భయపడింది. ఓ రాజా! ఆ నది వెళ్ళి వసిష్ఠున కా విషయం చెప్పింది. వసిష్ఠు డా నదీమతల్లితో ఇట్లా అన్నాడు: 'నన్ను నీవు పిలుచుకొనిపోకపోతే నీ కా విశ్వామిత్రుడు శాపమిస్తాడు. వాని కోరిక ప్రకారం ఏ మాత్రం సందేహించకుండా ఆ పనిని చేయుము.'

**వ. అని యనుజ్ఞ యిచ్చిన సరస్వతి యత్తపస్వి తనచేరువ నొకప్పుడు జపయుక్తుండై యుండం గూలాపహరణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొనిపోయిన, నతం డాంగిరసమంత్రముల నత్తరంగిణిం బ్రణుతించె; నదియు సంప్రీత యగుచు నమ్ముని విశ్వామిత్రునకు సన్నిహితుం జేసిన, నతని నగ్గాధిసూనుండు వధియింప సాధనం బన్వేషించు నాలోన వంచించి యా ప్రవాహం బవ్వసిష్ఠుఁ దొలంగించినఁ గోపించి విశ్వామిత్రుండు 'శోణిత వాహిని వగు' మని శపించిన నొక్కసంవత్సరం బత్తటిని దైత్యసేవితయై యుండె; నత్తీర్థంబునకుఁ గొందఱు మును లేతెంచి యా దురవస్థ నాలోకించి. 170**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; అనుజ్ఞ ఇచ్చినన్= ఆమోదమును తెలియజేయగా (ఇష్టంతో ఆమోదమును తెలుపగా); సరస్వతి= ఆ సరస్వతీ నది; ఆ+తపస్వి= ఆ ముని; తన చేరువన్= తన సమీపంలో; ఒకప్పుడు= ఒకనాడు; జపయుక్తుండు+ఐ ఉండన్= జపంచేసికొంటూ ఉండగా; కూలాపహరణంబు+చేసి= ఆ గట్టును తెంచి; వఱుతన్= మెడపై; ఆ+మహాత్మున్+ కొనిపోయినన్= ఆ తాపసిని తీసికొనిపోగా; అతండు+ఆంగిరసమంత్రంబులన్= ఆ వసిష్ఠుడు ఆంగిరసమంత్రాలతో; ఆ+తరంగిణిన్= ఆ నదిని; ప్రస్తుతించెన్= ప్రార్థించాడు; అదియున్= ఆ నదియు; సంప్రీతఅగుచున్= సంతోషమందుచు;

ఆ+మునిన్= ఆ తాపసి అయిన వసిష్ఠుడిని; విశ్వామిత్రునకున్ సన్నిహితున్+చేసినన్= విశ్వామిత్రుడికి దగ్గరచేయగా; అతనిని= ఆ వసిష్ఠుడిని; ఆ+గాధిసూనుండు= ఆ విశ్వామిత్రుడు; వధియించు సాధనంబు= చంపుట కవసరమైన ఆయుధాన్ని; అన్వేషించున్+ఆలోనన్= వెదికేటంతలోగా; వంచించి= మోసంచేసి; ఆ ప్రవాహంబు= ఆ నది; ఆ+వసిష్ఠున్+తొలఁగించినన్= ఆ వసిష్ఠుడిని తప్పించగా; కోపించి విశ్వామిత్రుండు= విశ్వామిత్రుడు కోపం చేసికొని; శోణితవాహిని వగుము+అని= నెత్రుటేరువు కమ్మని; శపించినన్= శాపమీయగా; ఒక్క సంవత్సరంబు+అత్తటిని= ఒక ఏడాదిపాటు ఆనది; దైత్యసేవితయై ఉండెన్= రాకాసులతో సేవించబడుతూ ఉండంది; ఆ తీర్థంబునకున్= ఆ తీర్థానికి; కొందఱు మునులు= తాపసులు కొంతమంది; ఏతెంచి= వచ్చి; ఆ దురవస్థన్= ఆ కష్టమైన స్థితిని; ఆలోకించి= చూచినవారై.

**తాత్పర్యం:** అని చెబుతూ ఉత్తరువులీయగా సరస్వతీనది తన సమీపంలో ఆ తపసి ఒకానొకనాడు జపం చేస్తూ ఉండగా ఆ గట్టును కోసి భుజంమీద మహనీయుడిని తీసికొనిపోగా వసిష్ఠుడు అంగీరస మంత్ర జపములను జపిస్తూ ఆ నదీమతల్లిని పొగడాడు. అందుచే ఆ నది అతడిని విశ్వామిత్రుడికి దగ్గర చేయగా ఆ విశ్వామిత్రుడు అతడిని చంపటానికై మార్గాలను వెదకుతుండగా వంచనతో ఆ ఏరు వసిష్ఠుడిని తప్పించింది. విశ్వామిత్రు డా ఏరును నెత్రుటేరుగా కమ్మని శపించాడు. ఒక్క సంవత్సరం పాటు ఆ ఏరు రాక్షసులచేత సేవించబడింది. ఆ తీర్థానికి కొంతమంది తాపసులు వచ్చి ఆ కష్టదశను చూచి(నారు). (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అమ్మహానది నడిగి వా రత్తెఱంగు । దెలిసి నిజయత్నబలమునఁ దీర్పఁ దీఱె**
**నట్టిదురవస్థ; వారలు నాత్మఁ బ్రీతి । యూనఁ జలిపిరి పావనస్నానవిధులు.** **171**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ తాపసులు; ఆ+మహానదిన్+అడిగి= ఆ గొప్ప నదిని విచారించి తెలిసికొని; నిజయత్నబలమునన్= తమ ప్రయత్నబలంతో; తీర్పన్= ఆ బలంతో తొలగించగా; అట్టి దురవస్థ= ఆ కష్టం; తీఱెన్= తొలగింది; ఆత్మన్+ప్రీతి+ ఊనన్= మనస్సు సంతసించగా; పావనస్నానవిధులు= పవిత్రమయిన స్నానాదికార్యాలు; చలిపిరి= చేశారు.

**తాత్పర్యం:** ఆ తాపసులంతా ఆ మహానదిని అడిగి విషయమంతా తెలిసికొని, తమ ప్రయత్న బలంతో ఆ కష్టదశను తొలగించారు. మనసుకు సంతోషం కలుగగా పవిత్రమయిన స్నానాది కార్యాలు చేశారు.

**వ.** **అప్పుడు గొందఱు బ్రహ్మరాక్షసు లమ్మునులకుఁ బ్రణమిల్లి తమచేసిన విప్రద్వేషగురుజనావమానదుష్టాన్న భక్షణాదులగు పాతకంబులు వేఱువేఱ యుపన్యసించి 'యే మియ్యెడ వసియించి యున్నవారము; మాకు నిష్కృతి యనుగ్రహింపవలయు' ననుటయు వార లాపనికి సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది యరుణానదివలన నట్టితెఱం గగు టెఱుంగుం గావున నిగూఢంబుగా నరుణం దనలోనికిఁ దెచ్చి 'దీన మజ్జనంబు సేయుఁ' డని యనుమతి సేసిన.** **172**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కొందఱు= కొంతమంది; బ్రహ్మరాక్షసులు= బొమ్మరాకాసులు; ఆ+మునులకున్= ఆ తపస్వులకు; ప్రణమిల్లి= నమస్కారంచేసి; తమ= తాము; చేసిన= కావించిన; విప్రద్వేష= బ్రాహ్మణులయందు విరోధం; గురుజన+అవమాన= గురువులను అవమానం చేయటం; దుష్ట+అన్న భక్షణ+ఆదులు+అగు= చెడుభోజనాలు చేయటం మొదలైన; పాతకంబులు= పాపాలను; వేఱువేఱ ఉపన్యసించి= ప్రత్యేకంగా తెలిపి (వివరించి); ఏము+ఈ+ఎడన్వసియించి ఉన్నవారము= మే మిక్కడ నివాసమున్నాము; మాకున్; నిష్కృతి= ప్రాయశ్చిత్తం; అనుగ్రహింపవలయున్= దయచేయవలెను; అనుటయున్; వారలు= ఆ తపసులు; ఆ పనికిన్= ఆ కోరిక తీర్చటానికి; సరస్వతిన్+ప్రార్థించినన్= సరస్వతిని వేడుకోగా;

ఆ+మహానది= ఆ గొప్పఏరు; అరుణానదివలనన్= అరుణానదిమూలాన; అట్టి తెఱంగు+అగుటన్= ఆ విధంగా కావటాన్ని; ఎఱుంగున్+కావునన్= తెలిసికొన్నది గనుక; నిగూఢంబుగాన్= రహస్యంగా; అరుణన్= అరుణానదిని; తనలోనికిన్+తెచ్చి= తనలోనికి తీసికొనివచ్చి; దీనన్= ఈ నదిలో; మజ్జనంబు+చేయుఁడు= స్నానమాడండి; అని= అంటూ; అనుమతి+చేసినన్= ఉత్తరువీయగా.

**తాత్పర్యం:** కొంతమంది బ్రహ్మరాక్షసులు అపు డా మునులకు నమస్కారం చేసి తాము అదివరకు కావించిన బ్రాహ్మణ దూషణ గురు జనావమాన దుష్టాన్న భోజనాది పాతకాలను తెలిపి, 'మే మీ చోట నివసిస్తున్నాము. మా దోషాలు తొలగిపోయేటట్లను గ్రహించవలయును'. అని వేడుకొనగా ఆ తాపసు లా కోరికను తీర్చుటకై సరస్వతిని ప్రార్థించారు. అంత సరస్వతీనది అరుణానది మూలంగా ఆ విధంగా కావటం తనకు ముందే తెలియటం వలన రహస్యంగా అరుణానదిని తనలోనికి తీసికొనివచ్చి 'ఈ నదిలో మునుగండి' అని ఉత్తరువు చేయగా (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. అజ్జలములఁ గ్రుంకి యాబ్రహ్మరాక్షసుల్ । తనువు లచట విడిచి ధర్మపరుల**
**గతికిఁ బోయి; రట్టు లతిగూఢ మై యున్న । యరుణ తెఱఁ గెఱింగి యమరపతియు. 173**

**ప్రతిపదార్థం:** ఆ+జలములన్+క్రుంకి= ఆ ఏటి నీటిలో మునిగి; ఆ బ్రహ్మరాక్షసుల్= ఆ బొమ్మరాకాసులు; తనువులు+అచటన్+విడిచి= శరీరాల నక్కడ వదలివేసి; ధర్మపరులగతికిన్+పోయిరి= ధర్మాత్ములు పోయే ఉత్తమస్థితికి వెళ్ళారు; అట్టులు= ఆ విధంగా; అతి గూఢమైఉన్న= మిక్కిలి రహస్యంగా ఉండే; అరుణ తెఱఁగు+ఎఱింగి= అరుణానది విధానము తెలిసికొని; అమరపతియున్= దేవేంద్రుడుకూడ.

**తాత్పర్యం:** ఆ నీటిలో మునిగి ఆ బ్రహ్మరాక్షసులు తమ శరీరాల నక్కడ వదలి, ధర్మాత్ములు పోయే గతికి వెళ్ళారు. ఆ విధంగా అతిరహస్యంగా ఉండే ఆ అరుణానది విషయం తెలిసికొని దేవేంద్రుడు కూడా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. తాను సఖ్యంబు సేసి నమ్మించి నముచిఁ జంపిన పాపంబు తదీయస్నానంబునం బాపికొనియె; నట్టి పుణ్యస్థానంబుననుండి యత్తాలధ్వజుండు సోమతీర్థంబునకుం జనియె; నది సోముండు రాజసూయంబు చేసినచో; టయ్యెడ ననిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధిపత్యంబునకు నభిషేకంబు సేసి; రతండు తారకాదులైన యసురులం దెగటార్చె నతని జననాదివృత్తాంతంబు కౌరవవంశజాతుండ వగు నీకు వినఁదగుఁ జెప్పెద నాకర్ణింపుము. 174**

**ప్రతిపదార్థం:** తాను; సఖ్యంబు చేసి= స్నేహం చేసి; నమ్మించి= నమ్మకం చూపి; నముచిన్= నముచి అనే రాక్షసుడిని; చంపిన= హతమార్చిన; పాపంబు= దోషం; తదీయ స్నానంబునన్+పాపికొనియెన్= ఆ నదిలో స్నానం చేయటంవలన పోగొట్టుకొన్నాడు; అట్టి పుణ్యస్థానంబునుండి= అటువంటి పవిత్రమయిన చోటునుండి; ఆ తాలధ్వజుండు= ఆ బలరాముడు; సోమతీర్థంబునకున్= సోమతీర్థమునకు; చనియెన్= వెళ్ళాడు; అది; సోముండు= చంద్రుడు; రాజసూయంబు చేసిన చోటు= రాజసూయమనే యాగం చేసిన చోటు; ఆ+ఎడన్= ఆ చోట; అనిమిషులు= దేవతలు; షణ్ముఖునకున్= ఆరుమొగాల దేవర అయిన సుబ్రహ్మణ్యస్వామికి; నిర్జర సేనాధిపత్యంబునకున్= దేవసేనాపతిత్వమునకు; అభిషేకంబు+చేసిరి= పట్టాభిషేకం చేశారు; అతండు= ఆ షణ్ముఖుడు; తారక+ఆదులయిన అసురులన్+తెగటార్చెన్= తారకుడు మొదలయిన రాక్షసులను

హతమార్చాడు; అతని జనన+ఆదివృత్తాంతము= అతని పుట్టుక మొదలయిన విషయాలు; కౌరవవంశ జాతుండవు+అగు= కురువంశంలో పుట్టినవాడయిన నీకు; వినన్+తగున్= వినటం ఉచితం; చెప్పెదన్= చెప్పుతున్నాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** స్నేహం చేసి తాను నమ్మకాన్ని కలిగించి నముచిని చంపిన పాపం ఆ నదిలో స్నానం చేసినందున తొలగించుకొన్నాడు ఇంద్రుడు. అటువంటి పుణ్యభూమి నుండి ఆ బలరాముడు సోమతీర్థానికి పోయాడు. ఆ తీర్థం చంద్రుడు రాజసూయం చేసినట్టి చోటు. అచటనే దేవతలు ఆరు మొగాల స్వామి సుబ్రహ్మణ్యుడికి దేవసేనాపతిగా పట్టం కట్టారు. ఆతడు తారకాది అసురులను తెగటార్చాడు. కౌరవవంశంలో పుట్టిన జనమేజయా! నీ వా కథ వినవలయును. చెప్పుతాను - వినుము.

### కుమారస్వామి ప్రభావాభివర్ణనము (సం. 9-43-56)

**ఆ. 'హరుఁడు దనదువీర్య మగ్నియం దిడిన వ । హింపఁజాల కజున కెఱుఁగఁ జెప్పి**
**యతఁడు వనుప దాని నగ్ని గంగాగర్భ । భూతముగ నొనర్చె భూపవర్య! 175**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= ఓ రాజశ్రేష్ఠా! (జనమేజయా!); హరుఁడు= పరమశివుడు; తనదువీర్యము= తన వీర్యమును; అగ్నియందు+ఇడినన్= అగ్నిలో ఉంచగా; వహింపన్+చాలక= (ఆ శక్తిని) భరించలేక; అజునకున్= స్రష్టకు(బ్రహ్మకు); ఎఱుఁగన్+చెప్పి= తెలియచేసి; అతఁడు= బ్రహ్మ; పనుపన్= (పంపగా); ఆజ్ఞాపించగా; దానిని= ఆ శక్తిని; గంగాగర్భభూతముగన్= గంగ కడుపున ఉండేటట్లుగా; ఒనర్చెన్= చేసెను.

**తాత్పర్యం:** పరమశివుడు తన వీర్యాన్ని అగ్నిలో నిక్షేపించగా, ఆ శక్తిని భరింపలేక ఆ అగ్ని సృష్టికర్త అయిన బ్రహ్మకు తెలుపగా, ఆ బ్రహ్మ దానిని గంగానదీ గర్భంలో దాచుమని చెప్పగా అట్లే చేశాడు. (అని జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పాడు).

**వ. తేజోమయం బైన యాగర్భంబు గంగ హిమవన్నగంబుమీఁద నముత్సృష్టంబు సేసినఁ గనకమయం బైనశరస్తంబంబున నగ్నిసన్నిభుం డగుకుమారుండై యొప్పె; నయ్యెడ మెలంగుకృత్తిక లక్కుమారుం గని పుత్రార్థినులై యందఱు నొక్కపెట్ట 'వీఁడు మాకొడు' కని పలుకుచుఁ గరతలంబుల నెత్త, నప్పు డయ్యార్వుఱ చన్నులుం జేఁపిన నద్ధారకుండు చంద్రనిభంబు లైన యాననంబు లాఱు దాల్చి సప్తమాతృస్తన్యపానం బాచరించిన విస్మయప్రమోదభరిత లై వార లాశిశువు నెప్పటియెడన యునిచి; ర ట్లయ్యగ్నిభవుండు గాంగేయుండును శరజన్ముండును గార్తికేయుండును నయ్యెఁ; నయ్యెడకు బృహస్పతి యేతెంచి జాతకర్మాద్యనుష్ఠానంబుల నిర్వర్తించి పోయెఁ; దత్ప్రదేశంబు దన మహానుభావంబున జాతరూప మయంబై యుండు. 176**

**ప్రతిపదార్థం:** తేజోమయంబు+ఐన ఆ గర్భంబు= కాంతిమంతమైన ఆ గర్భం; హిమవత్+నగంబుమీఁదన్= మంచుకొండపైన; సముత్సృష్టంబు+చేసినన్= విడచిపెట్టగా; కనకమయంబు+ఐన= బంగారుమయమయిన; శరస్తంబంబునన్= రెల్లుగడ్డిలో; అగ్ని సన్నిభుండు+అగు= అగ్నితో సమానుడైన; కుమారుండు+ఐ= పుత్రుడుగా; ఒప్పెన్= ఉన్నాడు; ఆ+ఎడన్= ఆ చోటులో, మెలంగు= తిరుగాడుతున్న; కృత్తికలు= కృత్తిక దేవతలు(కన్యలు); ఆ+కుమారున్+కని= ఆ కుమారుడిని చూచి; అందఱున్

పుత్ర+అర్థినులై= కుమారుడిని ఆశించినవారై; వీఁడు మాకొడుకని పలుకుచున్= ఈ పిల్లవాడు మా కుమారుడని చెప్పుతూ; కరతలంబులన్+ఎత్తన్= చేతులలోని కెత్తుకొనగా; అప్పుడు+ఆయార్వుర చన్నులున్+చేఁపినన్= ఆ సమయాన ఆ ఆరుగురి చన్నులూ పాలు చేపగా; ఆ+దారకుండు= ఆ పిల్లవాడు; చంద్రనిభంబులైన= చంద్రుడితో సమానమైన; ఆననంబులు+ఆఱు+ తాల్చి= మొగాలు ఆరింటిని పొంది; సప్తమాతృస్తన్య పానంబు+ఆచరించినన్= ఆ ఏడుగురి తల్లులు చన్నుబాలు త్రాగగా; వార లా శిశువును= వా రా బిడ్డను; ఎప్పటి ఎడన= ఎపుడూ ఉన్న చోటునందే; ఉనిచిరి= ఉంచారు; అట్లు+ఆ+అగ్నిభవుండు= ఆ విధంగా ఆ అగ్నినుండి పుట్టినవాడు; గాంగేయుండును= గంగకొడుకునూ; శరజన్ముండును= రెల్లునందు పుట్టినవాడునూ; కార్తికేయుండును= కృత్తికల కుమారుడును; అయ్యెన్= అయ్యాడు; ఆ+ఎడకున్= ఆ చోటునకు; బృహస్పతి వచ్చి= జాతకర్మాది+అనుష్ఠానంబులన్= జాతకర్మ మొదలయిన ఆచార విధులను; నిర్వర్తించిపోయెన్= జరిపి వెళ్ళాడు; తద్+ప్రదేశంబు= ఆ చోటు; తన మహానుభావంబునన్= తన మహాశక్తి మూలాన; జాతరూపమయంబు+ఐ+ఉండున్= బంగారుమయమై ఉంటుంది.

**తాత్పర్యం:** కాంతిమంతుడైన ఆ బిడ్డను గంగ హిమాలయం మీద నిలుపగా బంగారు మయమైన రెల్లు దర్భలలో అగ్నితో తుల్యుడయిన కొడుకుగా ఉన్నాడు. ఆ చోట తిరిగే కృత్తిక లా బాలుడిని చూచి కుమారుడికై ఒక్కమారే వీడు నా కుమారుడు 'నా కుమారు' డని చేతులలోని కెత్తుకొన్నారు. అపు డా ఆరుగురికీ చన్నులు చేపినవి. ఆ పసివాడు చంద్రుడితో సమానమైన ఆరుమొగాలతో ఆ మాతల స్తన్యాన్ని త్రాగాడు. వా రాశ్చర్యమానసలై సంతోషంతో ఆ బిడ్డను యథాస్థానంలో వదలారు. అందుచేత ఆతడు అగ్నిభవుడుగాను, గాంగేయుడుగాను శరజన్ముడుగాను, కార్తికేయుడుగాను అయ్యాడు. అచ్చటికి బృహస్పతి వచ్చి అతడికి జాతకర్మాది ఆచారాలను జరిపి వెళ్ళాడు. ఆ మహానుభావుడి శక్తిచేత ఆ చోటు బంగారు మయమై ఉంటుంది.

**విశేషం:** 'సప్తమాతృస్తన్యపానంబాచరించిన' అనేదానికి 'అయ్యారుగుర మాతృస్తన్య, సమస్త మాతృస్తన్యపానంబులు అనే పాఠాంతరాలున్నాయి.

**క.** **విను మక్కుమారుఁ డుత్తమ । మనఁ దగియెడుతపము దనవిహారముగా వ**
**ర్ధన మొందె ధాత్రి ధాత్రిగ । ధనురాగమమును శ్రుతులును దనుఁ గొలువంగన్.** **177**

**ప్రతిపదార్థం:** వినుము; ఆ+కుమారుఁడు= ఆ కుమారస్వామి; ఉత్తమము= శ్రేష్ఠం; అనన్= అనగా; తగియెడు= తగిన; తపము; తన విహారము+కాన్= తాను తిరుగుచోటుగా; ధాత్రి= భూమి; ధాత్రిగన్= దాదిగా; ధనున్+ఆగమమును= ధనుర్వేదమును; శ్రుతులును= వేదాలును; తనున్+కొలువంగన్= తనను సేవించగా; వర్ధనము+అందెన్= వృద్ధిపొందాడు.

**తాత్పర్యం:** ఆ కుమారుడు ఉత్తమమైన తపస్సు విహారంగా భూమి దాదిగా ధనుర్వేదాది వేదాలు తనను సేవించగా వృద్ధి పొందాడు. వినుము.

**వ.** **ఒక్కనాఁ డక్కుమారుం జూచువేడుక శివుండు శైలకన్యకయుం దానుఁ బ్రకృష్టబలపరాక్రమంబులు నానాప్రకారవదనశరీరంబులు గలుగు ప్రమథ గణంబు గొలువ నయ్యెడకుఁ జనుదెంచె; నప్పుడు బ్రహ్మావిష్ణులును నింద్రాదిదిక్పాలురును రుద్రాదిత్యమరుద్వసుప్రభృతి సకలసురులును గరుడగంధర్వకిన్నరకింపురుష సిద్ధవిద్యాధరయక్షాది దివ్యులును మునులును మఱియుఁ బితృదేవతలును ననుచరసమేతులై యేతెంచిరి;**

**మూర్తిమంతంబు లై యోషధిసరిత్సముద్రపర్వతంబులు నరుదెంచె; నిట్లు నిజదర్శనకౌతుకంబున వచ్చిన యమ్మహాసమూహంబున కభిముఖుండై యోగబలాన్వితుం డగు నబ్బాలుండు రా నన్నీలగ్రీవుండు నిరీక్షించి యంతర్గతంబున. 178**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు+ఆ కుమారున్= ఒకానొక దినాన ఆ కుమారుడిని; చూచువేడుకన్= చూడాలి అనే కోరికతో; శివుండు= పరమశివుడు; శైలకన్యయున్+తానున్= పార్వతియు తానును; ప్రకృష్ట బలపరాక్రమంబులు= ఉత్కృష్టమయిన బలశౌర్యాలు; నానా ప్రకారవదన శరీరంబులు= అనేక విధాలయిన ముఖములు శరీరములును; కలుగు= కలిగిన; ప్రమథగణంబు+కొలువన్= ప్రమథగణాలు సేవించగా; ఆ+ఎడకున్+చనుదెంచెన్= ఆచోటునకు వచ్చాడు; అప్పుడు= ఆ సమయాన; బ్రహ్మవిష్ణులును= బ్రహ్మయు, విష్ణువును; ఇంద్ర+ఆది దిక్పాలురును= ఇంద్రుడు మొదలయిన దిక్పతులును; రుద్ర+ఆదిత్య+మరుత్+వసుప్రభృతి+సకలసురులును= ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, సప్తమరుత్తులు, అష్టవసువులు, మొదలయిన దేవతలందరును; గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, సిద్ధ, విద్యాధర, యక్షాది దివ్యులును= గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, విద్యాధరులు, యక్షులు, మొదలైన దివ్యగణాలును; మునులను= తాపసులును; మఱియున్; పితృదేవతలును= ఇంకను పితృదేవతలును(వీరందరును); అనుచర సమేతులు+ఐ ఏతెంచిరి= పరివారంతో కూడి వచ్చారు; మూర్తిమంతంబులై= ఆకారాలతో; ఓషధి= ఓషధులును; సరిత్+సముద్ర+పర్వతంబులు= నదులు, సప్త సముద్రాలు, పర్వతాలు; అరుదెంచెన్= వచ్చాయి; ఇట్లు= ఈ విధంగా; నిజదర్శనకౌతుకంబునన్= తన్ను చూచే ఉత్సాహంతో; వచ్చినన్= రాగా; ఆ+మహా సమూహంబునకున్= ఆ గొప్ప సమూహానికి; అభిముఖుండు+ఐ= ఎదురై; యోగబలాన్వితుండు+అగు= యోగశక్తితో కూడినవాడైన; ఆ+బాలుండు= ఆ బాలకుడు; రాన్= రాగా; ఆ+నీలగ్రీవుండు= ఆ నీలకంఠుడు; నిరీక్షించి= ఎదురుచూచి; అంతర్గతంబునన్= మనసులో.

**తాత్పర్యం:** ఒకనాడు కుమారుడిని చూచే ఆసక్తితో పరమేశ్వరుడు పార్వతితో విశేషమైన బలాన్నీ, శక్తినీ అనేక విధాలయిన శరీరాలు కలిగిన ప్రమథగణాలు సేవించగా ఆ చోటునకు వచ్చాడు. అపుడు బ్రహ్మ విష్ణులు, ఇంద్రాది దిక్పాలురు, ఏకాదశరుద్ర ద్వాదశాదిత్య సప్తమరుత్తులు, అష్టవసువులు మొదలయిన సమస్త దేవతలును, గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర యక్షాది దివ్యులును, తాపసులును, ఇంకను పితృదేవతలును వారి పరివారంలో కూడివచ్చారు. ఓషధులు నదులు సప్త సముద్రాలు సప్తకులపర్వతాలు మూర్తిమంతములై వచ్చాయి. ఈ విధంగా తనను చూడగా ఆసక్తులైన వచ్చిన ఆ గొప్ప సమూహానికి ఎదురేగి యోగబలంతో కూడుకొన్న ఆ పసివాడు రాగా ఆ నీలకంఠుడు తేరిపార చూచి, మనసులో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ఉమయు నగ్నియు గంగయు నుండ నన్ను। గారవంబున నధికునిఁగాఁ దలంచి**
**చక్క నాపాలి కేతెంచునొక్కొ! వీఁడు। సంభృతస్నేహ భక్తివిస్రంభుఁ డగుచు.' 179**

**ప్రతిపదార్థం:** ఉమయున్= పార్వతియును; అగ్నియున్= అగ్నిదేవుడును; గంగయున్= గంగాదేవియును; ఉండన్= ఉండగా; నన్నున్ గారవంబునన్= నన్ను ఆదరంతో; అధికునిగాన్+తలంచి= గొప్పవానిగా భావించుకొని; చక్కన్= నేరుగా; నా పాలికిన్+ఏతెంచు నొక్కొ వీఁడు?= ఈతడు నా దగ్గరకు వచ్చునా?; సంభృత= నిండిన; స్నేహ= స్నేహం, భక్తి అనువాటితో విశ్వాసంగలవాడు అవుతూ; విస్రంభుఁడు+అగుచున్= నమ్మకం కలవాడై.

**తాత్పర్యం:** 'పార్వతి, అగ్ని, గంగ, మొదలైనవారుండగా గౌరవంతో నన్ను గొప్పగా తలచుకొని ఇతడు స్నేహంతోను, భక్తితోను నా దగ్గరకు వస్తాడా?'

**క. అనుచుండఁగ నమ్మువ్వురు । తనతన చిత్తమున నట్ల తలఁపఁగ నది యె**
**ల్లను దివ్యబోధమునఁ గని । కొని య బ్బాలుండు యోగకుశలత వెలయన్. 180**

**ప్రతిపదార్థం:** అనుచుండఁగన్= అంటూ ఉండగా; ఆ+మువ్వురు= ఆ ముగ్గురును(పార్వతి, అగ్ని, గంగలు) తన తన చిత్తమునన్= తమ తమ మనస్సులలో; అట్ల తలఁపఁగన్= ఆ విధంగానే తలచుకొనగా; అది ఎల్లను= దానినంతా; దివ్యబోధమునన్; కనికొని= చూచినవాడై; ఆ+బాలుండు= ఆ పసివాడు; యోగ కుశలత వెలయన్= యోగమునందలి నేర్పుతో ప్రకాశించగా.

**తాత్పర్యం:** అంటూ ఆ ముగ్గురూ తమ తమ మనసులలో అదే విధంగా తలచుకొన్నారు. దానినంతా దివ్యజ్ఞానంతో తెలిసికొని, ఆ బాలుడు యోగశక్తి ప్రకాశించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. మూర్తిచతుష్టయంబు దాల్చి యన్నలువుర యొద్దకు నేకకాలంబునం జనినం గని యెల్లవారు నద్భుతమగ్నమానసు లై; రక్కుమారుండు పదంపడి యొక్కరుం డై పొలిచి నిలిచె; నప్పుడు. 181**

**ప్రతిపదార్థం:** మూర్తిచతుష్టయంబు+తాల్చి= నాలుగు ఆకారాలను పొందినవాడై; ఆ+నలువుర ఒద్దకున్= ఆ నలుగురి దగ్గరకు; (ఉమాగ్ని గంగా పరమశివుల కడకు); ఏకకాలంబునన్+చనినన్= ఒక్కసారిగానే వెళ్ళగా; కని= చూచి; ఎల్లవారున్= అందరూ; అద్భుత మగ్న మానసులు+ఐరి= ఆశ్చర్యంలో మునుగునట్టి మనసులు కలవారయ్యారు; ఆ+కుమారుండు= ఆ కుమారస్వామి; పదంపడి= ఆ మీదట; ఒక్కరుండు+ఐ పొలిచి= ఒకడుగా ఒప్పి; నిలిచెన్= నిలిచాడు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆతడు నాలుగు ఆకారాలతో ఆ నలుగురి ఒద్దకు వెళ్ళాడు. ఒకేమారు ఆతడు వెళ్ళగా చూచిన వారందరూ అబ్బురపడ్డారు. మరల ఆ కుమారస్వామి ఒకడుగా కానవచ్చి నిలిచాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. హరుఁడును గంగయున్ శిఖియు నంబికయుం బ్రణిపాతపూర్వని**
**ర్భర వినయంబుతోడఁ దగఁ బద్మజుఁ జేరి 'మహాత్మ! యిక్కుమా**
**రు రుచిరమూర్తికిన్ గుణగురుత్వవిభూతికి నీడు గాఁగ ని**
**మ్మరసి యుదాత్త మైనపద' మన్న నతండు ప్రియం బెలర్పఁగన్. 182**

**ప్రతిపదార్థం:** హరుఁడును= ఈశ్వరుడునూ; గంగయున్= గంగాదేవియునూ; శిఖియున్= అగ్నియునూ; అంబికయున్= పార్వతియునూ; ప్రణిపాతపూర్వ నిర్భర వినయంబుతోడన్= నమస్కారపూర్వకంగా మిక్కిలి అణకువతో; తగన్= తగువిధంగా; పద్మజున్+చేరి= బ్రహ్మవద్దకు వెళ్ళి; మహాత్మ!= ఓ మహనీయుడా!; ఈ+కుమారు= ఈ కుమారుడియొక్క; రుచిరమూర్తికిన్= తేజోమయమూర్తికి; గుణగురుత్వవిభూతికిన్= గొప్ప గుణసంపదకు; ఈడుకాఁగన్= సాటిగా; అరసి= చూచి; ఉదాత్తము+ఐన పదము= గొప్ప స్థానమును; ఇమ్ము= ఒసగుము; అన్నన్= అనగా; అతండు= ఆ బ్రహ్మ; ప్రియంబు+ఎలర్పఁగన్= ప్రీతి కలుగగా.

**తాత్పర్యం:** పరమశివుడు, పార్వతి, గంగ, అగ్ని సంతోషంతోను, వినయంతోను, తగు విధంగా బ్రహ్మవద్దకు వెళ్ళి, 'మహనీయుడా! ఈ బాలుడి తేజోమయమూర్తికీ గుణసంపదకూ తగిన గొప్ప పదవిని ఆలోచించి ఈయవలసినది' అని అడిగారు. అందులకు బ్రహ్మ ప్రీతితో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **దేవహితపరుం డగుటం జేసి చిత్తంబునఁ దలపోసి 'వీఁడు దేవసేనకుం బతి యగుంగాక!' యని నిశ్చయించి వారల వీక్షించి యవ్విధ మెల్లవారును వినం దెలియఁ బలికి శక్రవరుణాదు లగుమేటి వేల్పుల నబ్బాలునకుం జూపి 'వీరు నీకు రక్షణీయు' లని యప్పగించె; నయ్యమరవరు లక్కుమారు నభిషేకంబు సేయుద మని వారిజాసనుం బురస్కరించుకొని యెల్లవారును దోడన యరుగుదేర సరస్వతీసమీపంబునకుం జని సకలరత్నమయం బైన దివ్యపీఠంబు హిమవంతుండు వెట్ట నం దా భూతపతిపుత్త్రు నునిచి బృహస్పతి హోమకార్యంబు నిర్వర్తింప నీశానవిష్ణు విధికౌశికులు లోనుగా నమర ముఖ్యు లభిషేకద్రవ్యంబులు సారస్వతజలపూర్ణ మణికనక కలశంబులు ధరియించి గంధర్వాప్సరోగణంబులు సంగీతమంగళం బాచరింప మహామునిప్రకర పుణ్యాహఘోషంబులు సెలంగ నుమా శ్రీసరస్వతీశచీప్రముఖ లైన పుణ్యాంగనలు దీవనలతో సేస లొలుక నభిషేకించి సమ్మోదంబున సేనాధిపత్యంబునకుం బట్టంబు గట్టిరి; తొల్లి తత్ప్రదేశంబున దేవతలు జలాధిపత్యంబునకు వరుణు నభిషిక్తుం జేసి; రవ్వరుణాభిషేకంబుకంటెఁ గుమారాభిషేకం బొప్పె; న ప్పావకసంభవునకుఁ గామదమన కమలభవశార్‌ఙ్గి శతమఖ ప్రముఖు లగు సకల ప్రభువులు దమతమయనుచరులయందు రూపగుణబలపరాక్రమాధికు లైన వారి నేఱి భీమఘంటాకర్ణ సంక్రమ దండధర సహితు లగు ననేకవీరుల నొసంగి వారల బెరసి వర్తించుటకుఁ దగిన సేనాంగసముదయంబు నమ్మహితాత్మునకు మూలబలంబుగా నొనర్చి; రబ్బలంబులఁ జిత్రాభరణ వర్మాయుధధరులును వివిధ ప్రకారాకారులు నగు గజకర్ణ నికుంభ కుముదాదు లైన సైనికులు మెఱసి యుల్లసిల్లి; రమ్మాఁకలతో శత్రుభయంకరంబు లగుచు మాతృకాగణంబులు ప్రభాసినీ విశాలాక్షీ పాలితాపురస్సరంబులై పొలిచె నట్టియెడ.** **183**

**ప్రతిపదార్థం:** దేవహిత పరుండు+అగుటన్+చేసి= దేవతలకు మేలు చేసేవాడు కావటంవలన; చిత్తంబునన్+తలపోసి= మనసులో తలచుకొని; వీఁడు= ఈ బాలుడు; దేవసేనకున్+పతి+అగున్+కాక!= దేవతల సేనకు నాయకు డగుగాక!; అని నిశ్చయించి= అంటూ నిర్ణయించి; వారలన్ వీక్షించి= ఆ పరమశివుడు మొదలయిన వారిని చూచి; ఆ+విధము= ఆ పద్ధతిని (ఆ బాలుడు దేవసేనానాయకుడయ్యే విధమును); ఎల్లవారును= అందరును; వినన్= వినగా; తెలియన్+పలికి= స్పష్టంగా తెలిసేటట్లుగా చెప్పి; శక్రవరుణ+ఆదులు+అగు మేటి వేల్పులన్= ఇంద్రుడు, వరుణుడు మొదలయిన గొప్ప దేవతలను; ఆ+బాలునకున్+చూపి= ఆ పిల్లవాడికి చూపించి; వీరు నీకు రక్షణీయులు= వీరంతా నీకు కాపాడదగినవారు; అని అప్పగించెన్= అని ఒప్పచెప్పాడు; ఆ+అమరవరులు= ఆ దేవతాశ్రేష్ఠులు; ఆ+కుమారున్= ఆ బాలుడిని; అభిషేకంబు చేయుదము+అని= (సేనానిగా) పట్టం కట్టుదామని; వారిజాసనున్ పురస్కరించుకొని= బ్రహ్మను ముందుంచుకొని; ఎల్లవారును= అందరును; అరుగుదేరన్= బయలుదేరి రాగా; సరస్వతీ సమీపంబునకున్+చని= సరస్వతీ తీర్థం దగ్గరకు వెళ్ళి; సకల రత్నమయంబు+ఐన= అన్ని రత్నాలతో నిండిన; దివ్యపీఠంబు= ఉత్కృష్టమైన పీఠమును; హిమవంతుడు పెట్టన్= హిమవంతుడు ఏర్పాటు చేయగా; అందున్+ఆభూతపతి పుత్రునిన్= అక్కడ నా ప్రమథనాథుడి కుమారుడిని; ఉనిచి= నిలిపి; బృహస్పతి= దేవగురువు; హోమకార్యంబు నిర్వర్తింపన్= హోమాదికాలైన పనులు చేయగా; ఈశాన విష్ణు విధి కౌశికులు లోనుగాన్= పరమశివుడు, విష్ణువు, బ్రహ్మ, కౌశిక మహర్షి మొదలుగా(త్రిమూర్తులందరును); అమరముఖ్యులు= దేవతలతో తలమానికము లయినవారు; అభిషేక ద్రవ్యంబులు= సేనాని పట్టాభిషేకాని కవసరమయిన వస్తువులు; సారస్వత జల= సరస్వతీ నదినీటితో; పూర్ణ= నిండిన; మణికనక కలశంబులు= రత్నాలు తాపిన బంగారుకుండలు; ధరియించి= చేతబట్టుకొని; గంధర్వఅప్సరోగణంబులు= గంధర్వులు, అప్సరసలు; సంగీత మంగళంబు+ఆచరింపన్= సంగీతంతో మంగళాదులు చేయగా;

మహాముని ప్రకర పుణ్యాహ ఘోషంబులు చెలంగన్= గొప్ప తాపసి సమూహాలు కావించే పుణ్యాహవాచన వేద ఘోషములు మ్రోయగా; ఉమా+శ్రీ+సరస్వతీ+శచీప్రముఖ= పార్వతి, లక్ష్మి, సరస్వతి, శచి మొదలయిన; పుణ్యాంగనలు= ముత్తైదువలు; సేసలు+ఒలుకన్+అభిషేకించి= సేస బ్రాలతో స్నానంచేయించి; సమ్మోదంబునన్= సంతోషంతో; సేనాధిపత్యంబునకున్+పట్టంబు కట్టి= సేనానాయకత్వానికి పట్టంకట్టి; తొల్లి= వెనుకటి కాలంలో; తద్+ప్రదేశంబునన్= ఆ చోట; దేవతలు; జల+అధిపత్యంబునకున్= నీటిమీది అధికారానికి; వరుణున్+అభిషిక్తున్+చేసిరి= వరుణుడిని అధిపతిగా చేశారు; ఆ+వరుణ+అభిషేకంబుకంటెన్= ఆ వరుణుడికి జరిగిన అభిషేకంకంటె; కుమార+అభిషేకంబు+ఒప్పెన్= ఆ బాలకుడి అభిషేకం ఒప్పారింది; ఆ+పావకసంభవునకున్= ఆ యగ్నినుండి పుట్టినవాడికి; కామదమన= మన్మథుడి పొగ రణచిన శివుడు; కమలభవ= బ్రహ్మ; శార్‌ఙ్గి= విష్ణువు; శతమఖ ప్రముఖులు+అగు= దేవేంద్రుడు మొదలైన; సకల ప్రభువులు= అధిపతులందరూ; తమ తమ అనుచరులయందున్= తమ తమ సేవకులలో; రూపగుణ బలపరాక్రమ+అధికులు+ఐన వారిని= ఆకృతిలోను, గుణంలోను బలంలోను వైరులను+ఆక్రమించుకొనటంలోను గొప్పవారైన వారిని; ఏఱి= లెక్కించి; భీమ= భయంకరమైన; ఘంటాకర్ణ= ఘంటాకర్ణుడనేవాడును; సంక్రమ= సంక్రముడు; దండధరసహితులు+అగు; అనేక వీరులన్+ఒసంగి= ఎందరో బలశాలుల నిచ్చి; వారలన్+బెరసి= వారితో కలసి; వర్తించుటకున్= తిరగటానికి; తగిన సేనా+అంగ సముదయంబున్= తగినట్టి సేనా సమూహాన్ని; ఆ+మహితాత్మునకున్ మూలబలంబుగాన్+ఒనర్చినన్= ఆ శక్తిమంతుడికి ఆధారమయ్యే సేనగా చేయగా; ఆ+బలంబులన్= ఆ సేనలో; చిత్ర+ఆభరణ+వర్మ+ఆయుధధరులును= రకరకాలైన ఆభరణాలను, కవచాలను, ఆయుధాలను ధరించినవాళ్ళూ; వివిధ ప్రకార+ఆకారులున్+అగు= అనేక విధాలయిన శరీరాలున్నవారు ఐన; గజకర్ణ= గజకర్ణుడు; నికుంభ= నికుంభుడు; కుముద+ఆదులు+ఐన= కుముదుడు మొదలయిన; సైనికులు= భటులు; మెఱసి= విజృంభించి; ఉల్లసిల్లిరి= సంతోషించారు; ఆ+మూఁకలతోన్= ఆ సేనలతో; శత్రుభయంకరంబులు+అగుచున్= వైరులకు భయాన్ని కలిగిస్తూ; మాతృకాగణంబులు= సప్తమాతృకలూ, ప్రమథగణాలూ, ప్రభాసినీ విశాలాక్షీ పాలికాపురస్సరంబులు+ఐ= ప్రభాసినియు, విశాలాక్షియు పాలిక ముందున్నవారై; పొలిచెన్= ఒప్పింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** (బ్రహ్మ) ఆ బాలుడు దేవతలకు ప్రియుడనే విషయాన్ని తెలిసికొని, 'ఈతడు దేవసేనాపతిఅగు గాక!' అని నిర్ణయించాడు. అక్కడివారినంతా కలయజూచాడు. వారందరు తెలిసికొనేటట్లు ఆ విషయాన్ని చెప్పాడు. ఇంద్రుడు వరుణుడు మొదలయిన ప్రధానులైన దేవరాజులను ఆ బాలుడికి చూపి 'వీరంతా నీకు రక్షకులు' అని ఒప్పచెప్పి ఆ కుమారస్వామికి అభిషేకం చేద్దామని తలచి, బ్రహ్మను ముందుంచుకొని అందరూ కూడిరాగా సరస్వతీ తీర్థం దగ్గరకు వెళ్ళాడు. అన్ని రత్నాలను నింపిన దివ్యపీఠాన్ని పర్వతరాజైన హిమవంతుడు పెట్టగా దానిమీద ఆ భూతనాథుడి కుమారుడిని నిలిపి, బృహస్పతి హోమాదికాలు చేయగా ఈశానుడు విష్ణుడు బ్రహ్మ, కౌశికులు మొదలైన దేవ ప్రముఖులు అభిషేక వస్తువులను సరస్వతి నీటితో నింపిన బంగారు మయమైన రత్నాలు తాపిన గిండీలను మోసికొంటూ గంధర్వాప్సరోగణాలు సంగీతంలో మంగళాశీస్సులు పలుకగా మహాముని సమూహాలు పుణ్యాహవేదఘోషలతోను, పార్వతి, లక్ష్మి, సరస్వతి, శచి మొదలైన ముత్తయిదువలు అక్షతలతో స్నానం చేయించి సంతోషంతో సేనానాయకత్వానికి పట్టాభిషేకం చేసి ఆధిపత్యాన్ని ఒసగారు. మును పాచోట దేవతలు జలాధిపతిగా వరుణుడిని అభిషేకించారు. ఆ వరుణాభిషేకం కంటె కుమారాభిషేకం ఒప్పింది. ఆ అగ్నిదేవసంభవుడికి పరమశివుడు, బ్రహ్మ, విష్ణువు మొదలైన ప్రభువులందరూ తమతమ సేవకులందలి రూపాధిక్యాన్నీ, బలాధిక్యాన్నీ, పరాక్రమాధిక్యాన్నీ కలవారిని ఎన్నుకొని భీమ ఘంటాకర్ణ సంక్రమ దండధర సహితు లయిన ఎందరో వీరుల నొసగి వారితో కలసి తిరగటానికి తగినటువంటి సేనాంగాల సమూహాన్నీ ఆ శక్తిమూర్తికి మూలబలంగా ఇచ్చారు. ఆ సేనలు చిత్రాభరణవర్మాయుధధారులుగా అనేక ప్రకారాకారు లైన గజకర్ణ నికుంభకుముదాదులైన సైనికులు ఒప్పారు. ఆ

సేనతో వైరిభయంకరు లైన సప్త మాతృకాగణాలు ప్రభాసినీ విశాలాక్షీ పాలికాపురస్సరంగా నిలచాయి. అటువంటి సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. శంకరుఁ డుదిత భాస్కరనిభధ్వజమును, । వాసవుఁ డసురవిధ్వంసకరణ**
**పరిణతశక్తియు, హరి బలవర్ధని । యగు వనమాలయు, నగజ యెపుడు**
**మాయని వెలిపట్టుదోయిని, గంగ యు । జ్జ్వల సుధామయకమండలువు, గురుఁడు**
**దీప్తదండము, వైనతేయుండు మహితమ । యూరంబు, వరుణుం డుదార రూప**

**తే. మైన తామ్రచూడంబును, నర్థవిభుఁడు । దర్పితచ్ఛాగమును, శతదళభవుండు**
**లసితకృష్ణాజినంబును నసమసమర । జయము నొసఁగిరి ప్రీతి నా షణ్ముఖునకు. 184**

**ప్రతిపదార్థం:** శంకరుఁడు= ఈశ్వరుడు; ఉదిత= ఉదయించే; భాస్కర నిభ ధ్వజమును= సూర్యుడితో సమానమైన పతాకాన్నీ; వాసవుఁడు= ఇంద్రుడు; అసుర, విధ్వంసకరణ, పరిణత శక్తియున్= రాక్షసులను నాశనం చేయడంలో పక్వత పొందిన శక్తిని; హరి= విష్ణువు; బలవర్ధని+అగు= శక్తిని పెంచగలుగు; వనమాలయున్= వనమాలను; అగజ= పార్వతి; మాయని= మాసిపోని; వెలిపట్టుదోయిని= తెల్లపట్టు జతను; గంగ= గంగాదేవి; ఉజ్జ్వల= వెలుగుతున్న; సుధామయ= అమృతమయమైన; కమండలువు= కమండలాన్నీ; గురుఁడు= బృహస్పతి; దీప్తదండమున్= ప్రకాశించే దండాన్నీ; వైనతేయుండు= గరుత్మంతుడు; మహిత మయూరంబున్= మహిమ కల నెమలిని; వరుణుండు; ఉదారరూపము+ఐన= గొప్పరూపంకల; తామ్రచూడంబును= కోడిపుంజును; అర్థవిభుఁడు= కుబేరుడు; దర్పిత+ఛాగమును= పొగరుబోతు మేకను; శతదళభవుండు= బ్రహ్మ; లసిత= సొగసైన; కృష్ణాజినంబును= ఇర్రితోలును; సమరజయమును= యుద్ధంలో సాటిలేని గెలుపును; ఆ షణ్ముఖునకున్= ఆ ఆరుమొగాల వాడికి; ప్రీతిన్= ప్రేమతో; ఒసఁగిరి= ఇచ్చారు.

**తాత్పర్యం:** పరమేశ్వరుడు ఉదయభానుడికి సమానమైన కాంతిని, ఇంద్రుడు రాక్షసులను నాశనం చేయగల పరిపక్వమయిన శక్తిని, విష్ణుడు బలమును పెంచే వనమాలను, పార్వతి ఏవేళలోనూ నాశనం కాని తెల్లపట్టు వస్త్రాల జతను, గంగాదేవి ప్రకాశవంతమయినదీ, అమృతంతో నిండినదీ ఐన కమండలాన్నీ, బృహస్పతి వెలుగు దండాన్నీ, గరుడుడు మహిమగల నెమలిని, వరుణుడు ఉదారరూపమైన కుక్కుటమునూ, కుబేరుడు పొగరుబోతు మేకను, స్రష్ట అందమైన జింకతోలును సాటిలేని యుద్ధవిజయాన్నీ ఆ షణ్ముఖుడికి ప్రేమతో ఇచ్చారు.

**వ. ఇట్లు సిద్ధస్వరూపదీపితుం డైన యతని నాపోవక చూచుచు శంకరుండు 'వీని కీ విభవంబునకు ననాయాసంబున నమరవిరోధి నాశంబు గావించుటకు వలయు' నని తలంచి భూతమయం బగు మహాసైన్యంబు సమర్పించె; నప్పు డింద్రాదిబృందారకులు నిజబలసందోహంబులతో నాబర్హివాహనుఁ బరివేష్టించిరి; శంఖభేరీపణవగోముఖ ప్రముఖతూర్యంబులు దిక్కులు పిక్కటిల్లఁ జెలంగె; నట్లు మహతి యగు దేవసేనకుఁ బతియై యమ్మహాసేనుండు సురముఖ్యులఁ జూచి 'మీ కెవ్వరి నేనియుం జంపను జెఱుపను వలసియున్నది యట్టిబల్లిదంపుఁ బగఱం బరిమార్చెద' నని వరం బిచ్చిన వారలు బహుప్రమోదంబు నొందిరి; సేన యార్చినఁ ద్రిలోకంబులు నాదమయంబు లయ్యెఁ; నవ్విధంబున విశాఖుని నుత్తమపదస్థునిఁ గావించి విరించి వైకుంఠ శ్రీకంఠులు నిజేచ్ఛఁ జనిరి; పదంపడి యగ్గుహుండు దేవతలు తారకాసురునివలన నలంగి యునికి యెఱింగి. 185**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సిద్ధస్వరూప దీపితుండు+ఐన= స్వభావసిద్ధంగా ప్రకాశించే ఆకృతికలవాడైన; అతనిన్= ఆ ఆరుమొగాలవాడిని; ఆపోవక= తృప్తినందకుండా; చూచుచున్= చూస్తూ; శంకరుండు= పరమేశ్వరుడు; వీనికిన్+ఈ విభవంబునకున్= ఈ బాలకుడికి ఈ ఐశ్వర్యం; అనాయాసంబునన్= సుఖంగా; అమర విరోధినాశంబుకావించుటకున్= దేవతల శత్రువులను చంపటానికి; వలయునని తలంచి= అవసరమని భావించి; భూతమయంబు+అగు= ప్రమథ గణాలతో నిండిన; మహాసైన్యంబును= పెను సేనను; సమర్పించెన్= ఇచ్చాడు; అప్పుడు= ఆ సమయంలో; ఇంద్ర+ఆది బృందారకులు= ఇంద్రుడు మొదలైన దేవతలు; నిజ బల సందోహంబులతోన్= తమ సేనాసమూహాలతో; ఆ బర్హివాహనున్+పరివేష్టించిరి= ఆ నెమలి వాహనంగా కలవాడిని - కుమారస్వామిని చుట్టుకొనినారు; శంఖ= శంఖం; భేరీ= నగారాలు; పణవ= ఉడుక; గోముఖ ప్రముఖ తూర్యంబులు= ఆవు మొగంవంటి తూర్య నాదవాద్యాలు; దిక్కులు పిక్కటిల్లన్+చెలంగెన్= దిక్కులు నిండగా మ్రోగాయి; అట్లు= ఆ విధంగా; మహతి+అగు= గొప్పదైన; దేవసేనకున్= సురసేనకు; పతి+ఐ= నాయకుడై; ఆ+ మహాసేనుండు= ఆ కుమారస్వామి; సురముఖ్యులన్+చూచి= దేవతలలో ముఖ్యులయిన వారిని చూచినవాడై; మీకున్; ఎవ్వరిని+ఏనియున్= ఎవరినైనా; చంపన్+చెఱుపనున్ వలసిఉన్నది= చంపటం, పాడుచేయటం కావలసిఉన్నది; అట్టి= అటువంటి; బల్లిదంపు+పగఱన్= బలవంతు లైన శత్రువులను; పరిమార్చెదను అని వరంబు+ఇచ్చినన్= చంపెద నని వరము నొసగగా; వారలు= ఆ దేవతలు; బహుప్రమోదంబున్+ఒందిరి= మిక్కిలి సంతోషించారు; సేన= సైన్యం; ఆర్చినన్= సింహనాదం చేయగా; త్రిలోకంబులు= ముల్లోకాలు; నాదమయంబులు+అయ్యెన్= శబ్దాలతో నిండింది; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా; విశాఖునిన్= ఆరుమొగాల వాడిని (విశాఖా నక్షత్రంలో పుట్టినవాడిని); ఉత్తమపదస్థునిన్+కావించి= గొప్ప పదవిలో నిలిపి; విరించి= బ్రహ్మ; వైకుంఠ= విష్ణుడు; శ్రీకంఠులు= గరళకంఠుడును; నిజ+ఇచ్చన్+చనిరి= తమ కిష్టమయిన చోటులకు వెళ్ళారు; పదంపడి= ఆ మీదట; ఆ+గుహుండు= ఆ సుబ్రహ్మణ్యుడును; దేవతలు= దేవతలును; తారక+అసురని వలనన్= తారకుడనే రాక్షసుడి మూలాన; నలంగి+ఉనికి= బాధపడి ఉండటం; ఎఱింగి= తెలిసికొని.

**తాత్పర్యం:** ఈ విధంగా నిజరూపంతో వెలుగుతున్న వాడిని వదలకుండా చూచిన శివుడు 'ఈతడికి ఈ వైభవంతో సుఖంగా శ్రమలేకుండా రాక్షసవినాశం చేయటానికి సాధ్య మవుతుంది.' అని యోచించి ప్రమథగణాలతో నిండిన మహాసేనను ఇచ్చాడు. అపుడు ఇంద్రుడు మొదలైన దేవతలు తమ బలాలతో నెమలివాహనంగా కలిగిన కుమారస్వామి చుట్టూ చేరారు. శంఖం, భేరి, పణవం, గోముఖం మొదలైన తూర్య శబ్దాలు దిక్కులనిండా వ్యాపించాయి. అటువంటి శక్తిమంతమైన సురసైన్యానికి నాయకుడుగా ఆ మహాసేనుడు దేవతలను చూచి 'మీ రెవరినైనా చంపటంగాని, నాశనం చేయటంగానీ చేయవలసి ఉన్నదా? అటువంటి బలవంతు లైన శత్రువులను నాశనం చేస్తాను.' అని మాట ఇచ్చాడు. వా రంతా చాలా ఆనందించారు. సేన చేసిన సింహనాదానికి ముల్లోకాలు నాదమయము లయ్యాయి. ఆ విధంగా విశాఖుడిని ఉన్నత స్థానంలో నిలిపి బ్రహ్మ విష్ణు శివులు తమకు నచ్చిన చోటులకు వెళ్ళారు. ఆపై షణ్ముఖుడు దేవతలు తారకుడివలన బాధపడటం తెలిసికొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **బలయుతముగ నడచిన న । బ్బలియుండు ననేకదైత్యబలములతో న**
**గ్గలిక నెదురు నడచెను ద । ద్బలయుగమున కక్కజంపు భండన మయ్యెన్.** **186**

**ప్రతిపదార్థం:** బలయుతముగన్ నడచినన్= సేనలతో నడువగా; ఆ+బలియుండు= ఆ బలవంతుడు(తారకుడు); అనేక దైత్యబలములతోన్= అనేక రాక్షసబలాలతో; అగ్గలికన్= శౌర్యంతో; ఎదురు నడచెను= ఎదురువెళ్ళాడు; తద్+బలయుగమునకు= ఆ ఇరుసేనలకు; అక్కజంపు భండనము+అయ్యెన్= ఆశ్చర్యమును కల్గించే యుద్ధమైనది.

**తాత్పర్యం:** బలయుతుడై ఆ కుమారస్వామి నడవగా - ఆ బలవంతు డైన తారకుడు పలువురు రాక్షస సైనికులతో శౌర్యంతో ఎదురువెళ్ళాడు. ఆ సేనలు రెంటికి ఆశ్చర్యం కల్గించే యుద్ధం జరిగింది.

**కుమారస్వామి తారకాసురుం జంపి దేవతలకు ముదంబు సేయుట (సం. 9-45-63)**

**వ. అట్టియెడ. 187**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తనదొరలుఁ దాను దారక । దనుజేంద్రుఁడు గార్తికేయుఁ దాఁకిన నమృతా**
**శన గణ సమ్మదసంపా । దనుఁ డగుచును శక్తి యతఁడు ధరియించె నృపా! 188**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; తన దొరలున్+తానున్= తాను, తన రాజులును; తారక దనుజేంద్రుఁడు= తారకు డనే రాక్షసరాజు; కార్తికేయున్+తాఁకినన్= షణ్ముఖుడిని ఎదుర్కొనగా; అమృత+అశన గణ= దేవసమూహములకు; సమ్మదసంపాదనుఁడు+ అగుచును= సంతోషాన్ని కలిగించేవాడగుతూ; అతఁడు= షణ్ముఖుడు; శక్తి ధరియించెన్= శక్త్యాయుధాన్ని ధరించాడు.

**తాత్పర్యం:** తారకాసురుడు తన రాజులతో కుమారస్వామిని ఎదుర్కొన్నాడు. అమృతాహారులయిన దేవతలకు సంతోషంగా నా ఆరుమొగాలదేవుడు శక్త్యాయుధాన్ని పూనాడు.

**వ. అమ్మహనీయసాధనంబున ననేకకోటిశక్తు లుద్భవించి నానాదానవప్రకరంబుల బడలువడం జేసి, యుల్కాసహస్రంబుల పిడుగులతండంబుల మ్రోఁతచందంబున విరావం బావహిల్ల నది ప్రయోగించి యమ్మహాత్ముండు మహిషత్రిపాదభృతోదరు లను దనుజసేనాపతులం బొలియింప నిలింపసైన్యంబులు సంరంభంబున దైత్యబలంబులం దెగటార్చె; నక్కుమారుండు ప్రయోగింప నాశక్తి పగతురం బిలుకుమార్చి క్రమ్మఱఁ గరతలంబునకు వచ్చు చుండె; నత్తారకుం డట్లు దమవారు సమసిన సక్రోధుండై యగ్గుహునిఁ గిట్టి బెట్టిదం బగు నతని శక్త్యస్త్రంబులతాఁకునం బడియె; నిట్లు జయంబు సేకొని యక్కార్తికేయుండు వెలింగె; విబుధులు ప్రమోదంబు నొందిరి; పదంపడి. 189**

**ప్రతిపదార్థం:** ఆ+మహనీయ సాధనంబునన్= ఆ మహత్త్వంగల ఆయుధంతో; అనేక కోటిశక్తులు+ఉద్భవించి= ఎన్నోకోట్ల ప్రాణులు (శక్తిమంతమైనవి) పుట్టి; నానాదానవ ప్రకరంబులన్= అనేక రాక్షస సమూహాలను; బడలు+పడన్+చేసి= అలసిపోయేటట్లు కావించి; ఉల్కా సహస్రంబులు+పిడుగుల+తండంబుల+మ్రోఁతచందంబునన్= అగ్ని గోళాలను పిడుగులగుంపుల శబ్దంమాదిరిగా; విరావంబు+ఆవహిల్లన్= గొప్ప శబ్దం క్రమ్ముకోగా; అది ప్రయోగించి= ఆ శక్తిని ప్రయోగించి; ఆ+మహాత్ముండు= ఆ శక్తిమంతుడైన కుమారస్వామి; మహిష+త్రిపాదభృత+ఉదరులు= మహిషుడు, త్రిపాదభృతోదరుడు; అను= అనే పేరున్న; దనుజసేనాపతులన్+పొలియింపన్= రాక్షస సేనా నాయకులను చంపగా; నిలింప సైన్యంబులు= దేవసేనలు; సంరంభంబునన్= ఉత్సాహంతో; దైత్యబలంబులన్+తెగటార్చెన్= రాక్షససేనలను నాశం చేశాయి; ఆ+కుమారుండు ప్రయోగింపన్= ఆ కుమారస్వామి వేయగా; ఆ శక్తి= ఆ శక్త్యాయుధము; పగతురన్+పిలుకుమార్చి= విరోధులను చంపి; క్రమ్మఱన్= మరల; కరతలంబునకున్= చేతిలోనికి; వచ్చుచుండెన్= వస్తూ ఉండినది; ఆ+తారకుండు= ఆ తారకాసురుడు; అట్లు= ఆ విధంగా; తమవారు= తన

వైపు ఉన్నవారు; సమసినన్= చనిపోగా; ఆ+గుహునిన్+కిట్టి= ఆ కుమారస్వామిని సమీపించి; బెట్టిదంబు+అగు+అతని= బలముగలదయిన అతడి; శక్త్యస్త్రంబుల తాఁకునన్+పడియెన్= శక్త్యాయుధాల దెబ్బకు చనిపోయాడు; ఇట్లు జయంబు+చేకొని= ఈ విధంగా విజయాన్ని పొంది; ఆ కార్తికేయుండు= ఆ కుమారస్వామి; వెలింగెన్= ప్రకాశించాడు; విబుధులు= దేవతలు; ప్రమోదంబున్+ఒందిరి= సంతోషించారు; పదంపడి= ఆ మీదట.

**తాత్పర్యం:** భయంకరమైన మహత్త్వశక్తిగల ఆ అస్త్రం నుండి అనేక కోట్ల శక్తులు పుట్టి, నానా రాక్షస సమూహాలను అలయజేశాయి. ఆ శక్తినుండి అనేకాగ్నిగోళాల పిడుగుల గుంపుమ్రోత క్రమ్ముకోగా అది ఎందరో దానవసేనానాయకులను హతమార్చింది. దేవసేనలు ఉత్సాహంతో రాక్షససేనలను తెగటార్చాయి. ఆ బాలుడు శక్త్యాయుధాన్ని వేయగా అది శత్రువులను రూపుమాపి, తిరిగి అతడి చేతిలోనికి వస్తూ ఉన్నది. ఆ విధంగా తనవారు చావగా తారకుడు కోపంతో ఆ గుహుడిని తాకి, బలయుతమైన అతడి శక్త్యాయుధపు దెబ్బకు పడిపోయాడు. ఆ కార్తికేయుడు విజయంతో వెలిగాడు. దేవతలంతా ఆనందించారు. ఆ మీదట. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. బలికొడుకు బాణుఁ డనియెడు । బలవదసురవల్లభుండు బాధించు నను**
**ర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయ । బలిష్ఠుఁ డయి జగము లెల్ల భయముం బొందన్. 190**

**ప్రతిపదార్థం:** బలి కొడుకు= బలిచక్రవర్తి కుమారుడు; బాణుఁడు+అనియెడు బలవత్+అసురవల్లభుండు= బాణు డనే పేరున్న బలవంతుడైన రాక్షసరాజు; క్రౌంచపర్వతాశ్రయ బలిష్ఠుఁడయి= క్రౌంచపర్వతం స్థావరంగా బలవంతుడై; జగములు+ ఎల్లన్ భయము+అందన్= లోకాలంతా భయమందగా; అమర్త్యులన్= దేవతలను; బాధించున్= కష్టపెట్టుతాడు.

**తాత్పర్యం:** బలిచక్రవర్తి కుమారుడు బాణుడనే పేరు కలవాడు బలవంతుడైన రాక్షసరాజు. క్రౌంచపర్వతం తన ఉనికిగా చేసికొని, లోకభయంకరుడుగా దేవతలను బాధపెట్టుతూ ఉన్నాడు.

**వ. దానిని విని యమ్మహాసేనుండు. 191**

**ప్రతిపదార్థం:** దానిన్+విని= ఆ విషయమును విని; ఆ+మహాసేనుండు= ఆ కుమారస్వామి.

**తాత్పర్యం:** ఆ వృత్తాంతాన్ని వినిన కుమారస్వామి. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. కడిమిం బోయి మహోగ్రశక్తినిహతిం గ్రౌంచంబు భేదించి యె**
**క్కుడు గర్వంబున వచ్చి మార్కొనిన రక్షోనాథుఁ దత్సైన్యముం**
**గడు వేగంబున రూపుమాపి మునిసంఘంబుల్ ప్రశంసింపఁ బె**
**ల్లడరన్ నిర్జరదుందుభిధ్వనులు పుష్పాసార మొప్పారఁగన్. 192**

**ప్రతిపదార్థం:** కడిమిన్+పోయి= పరాక్రమంతో వెళ్ళి; మహోగ్రశక్తి నిహతిన్+క్రౌంచంబున్+భేదించి= మహాభయంకరమైన శక్త్యాయుధపు దెబ్బతో క్రౌంచపర్వతాన్ని చీల్చి; ఎక్కుడు గర్వంబునన్ వచ్చి= మిక్కిలి అహంకారంతో వచ్చి; మార్కొనినన్= ఎదుర్కొనగా; రక్షస్+నాథున్= రాక్షసరాజును(బాణుని); తద్+సైన్యమున్= వాని సేనను; కడు వేగంబునన్+రూపుమాపి= మిక్కిలి తొందరగా నాశనంచేసి; మునిసంఘంబుల్= తాపసిసమూహాలు; ప్రశంసింపన్= పొగడగా; నిర్జర= దేవతల; దుందుభిధ్వనులు= భేరీ శబ్దాలు; పెల్లు+అడరన్= మిక్కిలి వ్యాపించగా; పుష్ప+ఆసారము+ఒప్పారఁగన్= పూలవాన శోభించగా (కురియగా).

**తాత్పర్యం:** రాక్షసరాజు (బాణుడు) పరాక్రమంతో పోయి భయంకరమైన శక్తిగల కత్తివేటుతో క్రౌంచపర్వతాన్ని చీల్చాడు. ఎక్కువ గర్వంతో వచ్చిన ఆ రాక్షస రాజును, వాడి సేనను మునులందరూ తనను పొగడగా, దేవదుందుభులు ఎక్కువగా మ్రోగగా, పూలవాన కురియగా మిగుల వేగంగా కుమారస్వామి నాశనం చేసి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. త్రిభువనానందకరుం డై విజయవిభవాతిశయంబున నొప్పె; ని ట్లఖిలలోక సంభావనీయం బగు షణ్ముఖచరితంబు లాకర్ణించి కృతార్థుండ వైతి; కౌరవాన్వయపావన! యాబలదేవువృత్తాంతంబు కొంత విను; మతం డత్తీర్థంబునఁ బ్రతిష్ఠితుండైన కుమారునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యందలిపెద్దలు కుమరాభిషేకంబు సెప్పఁ జెవులపండువు సేసి. 193**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయపావన!= కురువంశంలో పవిత్రుడైనవాడా! జనమేజయా!; త్రిభువన+ఆనందకరుండు+ఐ= ముల్లోకాలకు సంతోషం కల్గించినవాడై; విజయవిభవ+అతిశయంబునన్= గెలుపువలని వైభవంయొక్క ఆధిక్యంతో; ఒప్పెన్= ఒప్పి ఉన్నాడు; ఇట్లు+అఖిలలోక సంభావనీయంబు+అగు= ఈ విధంగా అన్ని లోకాలలోను పొగడదగినదైన; షణ్ముఖచరితంబులు+ఆకర్ణించి= ఆరు మొగాల వాడి కథలు విని; కృతార్థుండవు+ఐతి(వి)= ధన్యుడవైనావు; ఆ బలదేవు వృత్తాంతంబు కొంత వినుము= ఆ బలరాముడి గాథను మిగిలిన దానిని వినుము; అతండు= ఆ బలరాముడు; ఆ+ తీర్థంబునన్= ఆ సరస్వతీ తీర్థంలో; ప్రతిష్ఠితుండు+ఐన= నిలుపబడినవాడయిన; కుమారునకున్= కుమారస్వామికి; ప్రదక్షిణ ప్రణామంబులు+ఆచరించి= ప్రదక్షిణనమస్కారాలు చేసి; అందలి పెద్దలు= అక్కడున్న పెద్దవారు; కుమార+అభిషేకంబు+ చెప్పన్= కుమారస్వామి పట్టాభిషేకాన్ని గూర్చి చెప్పగా; చెవులపండువు+చేసి= ఇంపుగా విని.

**తాత్పర్యం:** ఈ విధంగా ముల్లోకాలకు సంతోషం కల్గించిన వాడై విజయైశ్వర్యంతో ఉన్నాడు. సమస్త లోకాలూ గౌరవించవలసిన ఆ ఆరుమొగాల వాడి గాథలు విని ధన్యుడవైనావు. ఓ కురువంశపావనా! ఆ బలరాముడి కథను మిగిలిన దానిని వినుము. ఆత డా తీర్థంలో నిలుపబడిన కుమారస్వామికి ప్రదక్షిణపూర్వక నమస్కారాలను చేసి అక్కడి పెద్దలయినవారు కుమారస్వామి పట్టాభిషేకాదులను గూర్చి చెప్పగా చెవులకు ఇంపుగా విని.

**ఆ. అగ్నితీర్థమునకు నరిగె; నయ్యెడఁ దొల్లి । యగ్ని డాఁగియున్న నమరు లచటి**
**కేఁగుదెంచి కాంచి; రిద్ధశమీగర్భ । లీనుఁ డైన యతని మానవేంద్ర! 194**

**ప్రతిపదార్థం:** మానవేంద్ర!= ఓ రాజా!; అగ్నితీర్థమునకున్= అగ్నితీర్థానికి; అరిగెన్= వెళ్ళాడు; తొల్లి= పూర్వం; అగ్ని= అగ్నిదేవుడు; డాఁగిఉన్నన్= దాగికొని ఉండగా; అమరులు= దేవతలు; అచటికిన్+ఏఁగుదెంచి= ఆ చోటికి వచ్చి; ఇద్ధశమీ గర్భలీనుఁడు+ఐన= ప్రకాశిస్తున్న జమ్మికడుపున అణగి ఉన్న; అతనిన్= ఆ అగ్నిని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** అగ్నితీర్థం చాలా పవిత్రమైనదని విని బలరాముడు అక్కడకు వెళ్ళాడు. పూర్వం అగ్నిదేవుడు అందులో దిగి ఉండగా, దేవతలందరునూ అక్కడకు వచ్చారు. ప్రకాశిస్తున్న జమ్మిచెట్టు కడుపులో లీనమైన అతడిని చూచారు.

**వ. భృగుశాపంబునం బ్రాపించు సర్వభక్షకత్వంబునకుఁ జాకల తొలంగిన యగ్నిదేవు నట్లు గని బ్రహ్మాదిదేవత లమ్మునివచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షణుం డయ్యు మాలో నగ్రపూజ్యుండ వని యొడంబఱిచి నిజస్థానంబునకుం జనునప్పు డత్తీర్థంబు పరమపావనం బని తజ్జలంబులఁ గృతస్నాను లైరి; యందుండి**

**యాసీరి కౌబేర తీర్థంబునకుం జనియె; నది కుబేరుండు తపంబు సేసి ధనాధిపత్యంబు మొదలైనవరంబులు వడసినచో; టయ్యెడఁ గదలి యతండు. 195**

**ప్రతిపదార్థం:** భృగుడిశాపంబునన్= భృగుమహర్షి శాపంచేత; ప్రాపించు= సిద్ధించు; సర్వభక్షకత్వంబునకున్= అన్నిటినీ తినే దానికి; చాలక= సరిపోక (చాలకుండా); తొలంగిన+అగ్నిదేవునట్లు కని= తప్పుకొన్న అగ్నిదేవుడిని ఈ విధంగా ఉండగా చూచి; బ్రహ్మఆదిదేవతలు= బ్రహ్మమొదలయిన దేవతలందరూ; ఆ+మునివచనంబు+అమోఘంబు+కావునన్= ఆ తాపసి మాటలు వ్యర్థంకానివి కనుక; నీవు సర్వభక్షణుండు+అయ్యున్= అన్నిటినీ తినేవాడవైనప్పటికిని; మాలోన్= మాలో; అగ్రపూజ్యుండవు= తొలుత పూజించతగినవాడవు; అని= అంటూ; ఒడంబఱిచి= ఒప్పించి; నిజస్థానంబునకున్= తన చోటికి; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు; ఆ తీర్థంబు పరమపావనంబు+అని= ఆ తీర్థం చాలా పవిత్రమైనదంటూ; తద్+జలంబులన్= ఆ నీటిలో; కృతస్నానులు+ఐరి= స్నానం చేశారు; అందుండి= అక్కడినుండి; ఆ సీరి= ఆ బలరాముడు; కౌబేర తీర్థంబునకున్+చనియెన్= కుబేరతీర్థానికి వెళ్ళాడు; అది= ఆచోటు; కుబేరుండు+తపంబుచేసి= కుబేరుడు తపస్సు చేసి; ధన+ఆధిపత్యంబున్= ధనంమీద అధిపతిత్వాన్ని; పడసినచోటు= (వరంగా) పొందినచోటు; ఆ+ఎడన్+కదలి= ఆచోటునుండి కదలి; ఆతండు.

**తాత్పర్యం:** భృగుడిశాపం వలన కలిగే సర్వభక్షకత్వమునకు ఓర్వని దాగి ఉన్న అగ్నిదేవుడిని చూచి బ్రహ్మాది దేవతలు 'ఆ మునిమాటలు అమోఘమయినందువలన నీవు అన్నింటిని తినేవాడవైనా మాలో తొలుత పూజించదగినవాడవు' అని ఒప్పించి తమ తమ చోటులకు వెళ్ళారు. తమ చోటులకు వెళ్ళేటపుడు ఆ తీర్థం పరమపవిత్రమయినదని అంటూ ఆ నీటిలో స్నానమాడారు. బలరాము డక్కడినుండి కుబేరతీర్థానికి వెళ్ళాడు. అది కుబేరుడు తపస్సు చేసినందున ఐశ్వర్యాధిపత్యం మొదలయిన వరాలు పొందినచోటు. ఆ చోటునుండి అతడు ముందుకు సాగాడు.

## ప్రభావతి యను మునికన్యక మహిమాభివర్ణనము (సం. 9-47-2)

**సీ. బదరిపాచన నామ పరమతీర్థమునకుఁ । జనియె; భరద్వాజతనయ తొల్లి**
**యచటఁ బ్రభావతి యనునది యింద్రుండు । పతి గాఁగఁ గోరి తపంబు సేయ**
**నతఁడు వసిష్ఠునాకృతి దాల్చి వచ్చిన । నయ్యింతి యర్ఘ్యపాద్యాదు లిచ్చి**
**భక్తితోఁ జేరి 'మత్పాణి శక్రున కిచ్చు । దాన; నపూనిక మానఁ గాని**

**తే. వలయుపనిఁ బంపుఁ' డన్న నవ్వొలయ నమ్మ । హాత్ముఁ 'డది యట్ల యగుఁ గాని యతివ! వీనిఁ**
**బక్వములు సేయు' మని కొన్ని బదరిఫలము । లా నితంబినిచే నిచ్చి యవుల నుండ. 196**

**ప్రతిపదార్థం:** బదరిపాచన నామ పరమతీర్థమునకున్+చనియెన్= బదరి పాచనమనే శ్రేష్ఠమైన తీర్థానికి వెళ్ళాడు; తొల్లి= పూర్వం; అచటన్= ఆ చోటులో; భరద్వాజ తనయ= భరద్వాజుడి కొమార్తె; ప్రభావతి+అనునది= ప్రభావతి అనే ఆమె; ఇంద్రుండు+పతి+కాఁగన్+కోరి= ఇంద్రుడిని భర్తగా కోరి; తపంబు+చేయన్= తపస్సు చేయగా; అతఁడు= ఆ ఇంద్రుడు; వసిష్ఠ+ఆకృతి తాల్చి వచ్చినన్= వసిష్ఠుడి వేషంలో రాగా; ఆ+ఇంతి= ఆ స్త్రీ (భరద్వాజుడి కూతురు); అర్ఘ్యపాద్య+ఆదులు+ ఇచ్చి= అర్ఘ్యం పాద్యం మొదలైన సంప్రదాయబద్ధమైన స్వాగతములిచ్చి; భక్తితోన్+చేరి= భక్తితో దగ్గరకు వెళ్ళి; మత్పాణి= నా చేతిని; శక్రునకున్+ఇచ్చుదానన్= ఇంద్రుడికిస్తాను; ఆ+పూనిక మానన్= ఆ ప్రయత్నం వదలను; కాని= కానైతే; వలయుపనిన్= అవసరమైన పనిని; పంపుఁడు= ఆనతివ్వండి; అన్నన్= అనగా; నవ్వు+ఒలయన్= నవ్వు జనించగా; ఆ+

మహాత్ముఁడు= ఆ మహనీయుడు; అది అట్ల+అగున్+కాని= ఆ పని అట్లే అవుతుంది కాని; అతివ!= ఓ స్త్రీ!; వీని పక్వములు చేయుము+అని= వీటిని పరిపాకం చెందే విధంగా చేయుము అని; కొన్ని బదరిఫలములు= కొన్ని రేగుపండ్లు; ఆ నితంబిని చేన్+ఇచ్చి= ఆ స్త్రీ చేతి కిచ్చి; అవులన్+ఉండన్= దూరంగా ఉండగా.

**తాత్పర్యం:** బదరిపాచనం అనే పవిత్రమయిన తీర్థానికి వెళ్ళాడు. అది పావన తీర్థ మనీ పూర్వ మచట భరద్వాజుడి కూతురు ప్రభావతి అనే పేరుగలఆమె ఇంద్రుడిని భర్తగా కోరి తపస్సు చేయగా ఇంద్రుడు వసిష్ఠుడి వేషంతో వచ్చాడు. ఆ స్త్రీ అర్ఘ్యపాద్యాదు లిచ్చింది. భక్తితో ఆతడి వద్దకు వెళ్ళి 'నా చేతిని ఇంద్రుడికే ఇస్తాను, ఆ ప్రయత్నం మానుకోను. అయితే మీకు కావలసిన పనికి నన్ను వినియోగించుకొనండి'. అన్నది. అది విని, ఇంద్రుడు 'అట్లే కానిమ్ము' అని ఆమె చేతికి కొన్ని రేగుపండ్లు ఇచ్చి వాటిని పక్వమయ్యేటట్లు చేయుమని అడిగి దూరంగా ఉన్నాడు.

**వ. అదియును గృతస్నానయుఁ గలితధౌతపరిధానయు నై ప్రాయి నగ్ని రాజఁబెట్టి యాఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండ నవి పాకంబునకు రాకయుండ వెండియుఁ దన సవరించిన కాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁ గాని యారేఁగుఁబండ్లురియవయ్యెఁ; గాష్ఠంబులు గలయెడకుం బోయి తెచ్చునంత కగ్ని యాఱెనేని దుష్పాకం బగు నని యా మగువ తనకా లింధనంబుగా నిడి పాకంబు సేయఁ గనుంగొని పాకశాసనుం డచ్చెరువొంది ప్రత్యక్షంబై 'శుభాంగి! నీదు నిష్ఠాతిశయంబునకు మెచ్చితి. భవదభిమతం బిచ్చితిని. తనువు విడిచి త్రిదివమ్మునకు రమ్ము. సర్వపాపహరం బైన యీ తీర్థంబు లోకత్రయప్రఖ్యాతం బయ్యెడు' మనియె. నమ్మహాభాగయు నాసుమనోవిభునకు మనోరమ యై వెలసె; నట్టి బదరిపాచనంబుననుండి. 197**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ భరద్వాజుడి కూతురును; కృతస్నానయున్= స్నానంచేసినదియు; కలితధౌతపరివిధానయున్+ఐ= ఉతికిన(మడుగు)చీరను కట్టుకొన్నదై; ప్రాయిన్+అగ్ని రాజన్+పెట్టి= పొయ్యిలో నిప్పును ముట్టించి మండజేసి; ఆ ఫలంబులు= ఆ రేగుపండ్లు; జలంబులతోడన్= నీటితోకూడా; ఎక్కించి= పొయ్యిమీద కెక్కించి; వండుచుండన్= వంట చేస్తూఉండగా (ఉడికిస్తుండగా); అవి పాకంబునకున్ రాకఉండన్= ఆ పండ్లు పరిపక్వమైన స్థితికి రాకుండా ఉండగా; వెండియున్= ఇంకను; తన సవరించిన కాష్ఠంబులు= తాను సరిచేసిన కట్టెలు; క్రమంబునన్= వరుసగా; ఇడి= (పొయ్యిలో) ఉంచి; అనలంబున్= నిప్పును; ప్రబలంబుచేయన్= ఎక్కువ మండేటట్లు చేయగా; కాష్ఠంబులు= కట్టెలు; సమసెన్+కాని= అయిపోయాయి కాని; ఆ రేగుపండ్లు+ఉరియవు+అవయ్యెన్= ఆ రేగుపండ్లు ఉడకలేదు; కాష్ఠంబులు+కల+ఎడకున్+పోయి= కట్టె లున్నచోటికి పోయి; తెచ్చునంతకున్= తెచ్చేసరికి; అగ్ని ఆఱెను+ఏని= నిప్పు చల్లారిపోతే; దుష్పాకంబు+అగును+అని= చెడిన వంటఔతుందని; ఆ మగువ= ఆ స్త్రీ; తనకాలు+ఇంధనంబుగాన్+ఇడి= తనకాలినే కట్టెగా చేసిపెట్టి; పాకంబు+చేయన్= వంట చేయగా; కనుంగొని= చూచి; పాకశాసనుండు+అచ్చెరువు+ఒంది= ఇంద్రు డబ్బురపడి; ప్రత్యక్షంబు+ఐ= కనబడి; శుభాంగి!= ఓ సుందరీ!; నీదునిష్ఠాతిశయంబునకున్ మెచ్చితి= నీ పట్టుదలకూ నియమానికీ మెచ్చుకొన్నాను; తనువు విడిచి= ఈ (మానవ) శరీరాన్ని వదలి త్రిదివంబునకున్+రమ్ము= స్వర్గానికి రమ్ము; సర్వపాపహరంబు+ఐ= అన్ని పాపాలను పోగొట్టునదై; ఈ తీర్థంబు= ఈ పవిత్రమయిన తీర్థం; లోకత్రయ ప్రఖ్యాతంబు+అయ్యెడున్= ముల్లోకాలలో ప్రసిద్ధినందుతుంది; అనియెన్= అన్నాడు; ఆ+మహాభాగయున్= ఆ మహానుభావురాలు కూడా; ఆ సుమనోవిభునకున్= ఆ దేవరాజునకు; మనోరమ ఐ= భార్యయై; వెలసెన్= ఒప్పింది; అట్టి బదరిపాచనంబుననుండి= అటువంటి బదరి పాచన పవిత్రతీర్థం నుండి.

**తాత్పర్యం:** ఆ భరద్వాజుడి కూతురు స్నానమాడి మడుగు వస్త్రాలను కట్టుకొని పొయ్యిలో నిప్పును రాజజేసి పండ్లను నీటితో కూడా పొయ్యిమీద కెక్కించి వండుతూ ఉండగా, అవి ఉడికి పాకానికి రాకుండినవి. ఇంకనూ తాను చక్కజేసిన కట్టెలను వరుసగా పెట్టి, నిప్పును ప్రబలం చేయగా కట్టె లైపోయినవి. కాని ఆ రేగుపండ్లు ఉడకలేదు. 'కట్టెలుండే చోటికి పోయి తెచ్చేలోపల నిప్పు ఆరిపోతే వంట చెడిపోతుంది.' అని ఆ స్త్రీ తన కాలినే వంటకట్టెగా పెట్టి వంట చేయటాన్ని చూచిన ఇంద్రుడు అబ్బురపడి ప్రత్యక్షమై 'సుందరీ! నీ నిష్ఠాతిశయానికి సంతోషించాను. నీకోర్కెను తీరుస్తున్నాను. ఈ శరీరాన్ని వదలి దేవలోకానికి రమ్ము. పాపాలనంతా తొలగించే ఈ తీర్థం ముల్లోకాలలో కీర్తింపబడుతుంది.' అని అన్నాడు. ఆమెకూడా ఆ దేవరాజునకు భార్యగా ఒప్పారింది. అటువంటి బదరిపాచనం నుండి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ఇంద్రతీర్థమునకు నేఁగె నా బలభద్రుఁ । డచట నూఱుక్రతువు లాచరించి**
**యనిమిషేశ్వరుండు గనియె శతక్రతుఁ । డనుప్రసిద్ధితోడ నతులపదము. 198**

**ప్రతిపదార్థం:** ఆ బలభద్రుఁడు= ఆ బలరాముడు; ఇంద్రతీర్థమునకున్+ఏఁగెన్= ఇంద్రతీర్థానికి వెళ్ళాడు; అచటన్= ఆ తీర్థంలో; నూఱు క్రతువులు+ఆచరించి= నూరు యజ్ఞాలు చేసి; అనిమిష+ఈశ్వరుండు= దేవరాజు; శతక్రతుఁడు= నూరుయాగాలు చేసినవాడు; అను ప్రసిద్ధితోడన్= అనే కీర్తితో; అతులపదము= సాటిలేని స్థానాన్ని; కనియెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఆ తరువాత బలరాముడు ఇంద్రతీర్థానికి వెళ్ళాడు. ఆ తీర్థంలో ఇంద్రుడు నూరుయాగాలు చేసి శతక్రతుడనే కీర్తితోపాటు సాటిలేని పదవిని పొందాడు.

**వ. అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం బోయెఁ; బలుమాఱు రాజుల నెల్లను బొరిగొని పరశురాముం డతృప్తుండై ప్రాయశ్చిత్తంబుగా నయ్యెడఁ గశ్యపు నుపదర్శనంబున రాజసూయంబులు నశ్వమేధంబులు వాజపేయంబులు ననేకంబు లొనర్చి యమ్మునీంద్రునకు దక్షిణ సమస్తక్షోణియు నొసంగె; నందుండి యయ్యేకకుండలుండు యామునంబునకుం జనియె; నది వరుణుండు రాజసూయంబులు సేసినప; ట్టయ్యధ్వరంబు నవసానంబున దేవాసురులకు సకలభూతసంక్షయకరం బగు చున్న సంగరంబు ప్రవర్తించె. 199**

**ప్రతిపదార్థం:** ఆ+చేటున్+కదలి= ఆ చోటునుండి వెడలిపోయి; హలాయుధుండు= బలరాముడు; రామతీర్థంబునకున్+పోయెన్= రామతీర్థానికి వెళ్ళాడు; పలుమారు రాజులన్+ఎల్లను పొరిగొని= పలుమార్లు రాజులనంతా హతమార్చి; పరశురాముండు+ అతృప్తుండు+ఐ= పరశురాముడు సంతోషపడకుండా; ప్రాయశ్చిత్తంబుగాన్= చేసిన తప్పునకు శిక్షగా; ఆ+ఎడన్= ఆచోటులో; కశ్యపు+ఉపదర్శనంబునన్= కశ్యపుడి పర్యవేక్షణలో; రాజసూయంబులు= రాజసూయ యాగాలు; అశ్వమేధంబులు= అశ్వమేధయాగాలు; వాజపేయంబులు= వాజపేయ యాగాలు; అనేకంబులు+ఒనర్చెన్= చాలా చేశాడు; ఆ+మునీంద్రునకున్= ఆ ఋషీంద్రుడికి; దక్షిణ= దక్షిణగా; సమస్త క్షోణియున్= భూమినంతను; ఒసంగెన్= ఇచ్చాడు; అందుండి= అక్కడనుండి; ఆ+ఏకకుండలుండు= ఒకకుండలం గలవాడైన అతడు; యామునంబునకున్+చనియెన్= యామునతీర్థమునకు వెళ్ళాడు; అది వరుణుండు రాజసూయంబు చేసినపట్టు= ఆ చోటు వరుణుండు రాజసూయ యాగం చేసిన చోటు; ఆ+అధ్వరంబు+ అవసానంబునన్= ఆ యాగాంతమున; దేవ+అసురులకున్= దేవతలకు, రాక్షసులకును; సకల భూతసంక్షయకరంబు= సమస్త ప్రాణులకు నాశకరమైనది; అగుచున్న= జరుగుతున్న; సంగరంబు ప్రవర్తించెన్= యుద్ధం సాగినది.

**తాత్పర్యం:** బలరాము డా చోటునుండి కదలి రామతీర్థానికి వెళ్ళాడు. పరశురాముడు పెక్కుమార్లు రాజులను చంపికూడా తృప్తి పొందక ప్రాయశ్చిత్తంగా కశ్యపుడి పర్యవేక్షణలో రాజసూయ, అశ్వమేధ, వాజపేయాది యాగాలు చేసి, సమస్తభూమిని ఆ మునీంద్రుడికి దక్షిణగా ఇచ్చాడు. ఆ చోటునుండి ఏకకుండలుడైన బలరాముడు యామున తీర్థమునకు వెళ్ళాడు. అది వరుణుడు రాజసూయ యాగం చేసిన చోటు. ఆ యజ్ఞం ముగిసేసమయంలో దేవతలకు- రాక్షసులకు సమస్త ప్రపంచనాశంకరమయిన యుద్ధం నడచింది.

**ఆ. అచటు గదలి యాతఁ డాదిత్యతీర్థసం । సేవనమున కరిగె ధీవిశాల!**
**యందుఁ గ్రతు వొనర్చి యాదిత్యుఁ డుజ్జ్వల । జ్యోతిషాధిపత్యశోభి యయ్యె. 200**

**ప్రతిపదార్థం:** ధీవిశాల!= మంచిబుద్ధిమంతుడా!; అచటుకదలి+ఆతఁడు= ఆ బలరాము డా చోటునుండి బయలుదేరి; ఆదిత్య తీర్థ సంసేవనమునకున్+అరిగెన్= ఆదిత్య తీర్థాన్ని సేవించటానికి వెళ్ళాడు; అందున్+క్రతువు+ఒనర్చి= అక్కడ యాగం చేసి; ఆదిత్యుఁడు= సూర్యుడు; ఉజ్జ్వల= ప్రకాశవంతమైన; జ్యోతిషాధిపత్య శోభి+అయ్యెన్= గ్రహాధిపత్యంచేత ప్రకాశించాడు.

**తాత్పర్యం:** బలరాము డాచోటునుండి వెళ్ళి సూర్యతీర్థాన్ని సేవించటానికి వెళ్ళాడు. సూర్యు డా చోట యాగం చేసి, ప్రకాశమానమైన గ్రహాధిపత్యాన్ని పొందాడు.

**వ. ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును జైమినియు దేవల జైగీషవ్యాదు లగు నైష్ఠికు లనేకు లయ్యెడ నద్భుతయోగసిద్ధిం బొందిరి. 201**

**ప్రతిపదార్థం:** ద్వైపాయనుండును= వ్యాసుడునూ; శుకుండును= శుకమహర్షియున్నూ; కృష్ణుండును= శ్రీకృష్ణుడునూ; జైమినియున్= జైమినిమునియునూ; మఱియును= ఇంకను; దేవల= దేవల ఋషియునూ; జైగీషవ్యాదులు+అగు= జైగీషవ్యుడూ మొదలైన; నైష్ఠికులు+అనేకులు= నిష్ఠగలవారు చాలమంది; ఆ+ఎడన్= ఆచోట(సూర్యతీర్థంలో); అద్భుతయోగస్థితిన్+పొందిరి= ఆశ్చర్యకరయోగ సిద్ధిని పొందారు.

**తాత్పర్యం:** వ్యాసుడూ, శుకుడూ, కృష్ణుడూ, జైమినీ, ఇంకా దేవలుడు, జైగీషవ్యుడు మొదలగు నిష్ఠాపరు లనేకులు అచ్చట అద్భుతమైన యోగసిద్ధిని పొందారు.

**తే. అచటినుండి సారస్వత మను వసిష్ఠ । తీర్థమున కేఁగె నా బలదేవుఁ డధిప**
**యందుఁ దొల్లి నిష్ఠాతిశయంబుమై ద । ధీచి యనుముని నియమంబు లాచరించె. 202**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; అచటినుండి= ఆ సూర్యతీర్థంనుండి, సారస్వతము+అను= సారస్వతం అనేపేరుగల; వసిష్ఠతీర్థమునకున్= వసిష్ఠతీర్థానికి; ఆ బలదేవుఁడు= ఆ బలరాముడు; ఏఁగెన్= వెళ్ళాడు; అందున్= ఆ తీర్థంలో; నిష్ఠా+ అతిశయంబుమైన్= మిక్కిలి శ్రద్ధతో; దధీచి అను ముని= దధీచి అనే పేరుగల ముని; నియమంబులు+ఆచరించెన్= నియమాలను పాటించాడు.

**తాత్పర్యం:** ఆ ఆదిత్య తీర్థంనుండి బలరాముడు సారస్వతమనే వసిష్ఠ తీర్థానికి వెళ్ళాడు. పూర్వ మా చోట దధీచి అనే ముని మిక్కిలి నియమంతో తపస్సు చేశాడు.

**వ.** **ఆ నియమాచరణంబునకు నింద్రుండు శంకించి తద్విఘ్నకరణంబునకు నలంబుస యనునప్సరోవనితం బుత్తెంచినఁ దదీయదర్శనంబున నమ్ముని వీర్యంబు స్ఖలించిన దాని సరస్వతి గర్భంబుగా ధరియించి పుత్త్రుం గాంచి తపస్విజనగోష్ఠి నున్న యత్తపోధనుకడకుఁ దెచ్చి 'వీఁడు నీకొడుకు; భవత్తేజంబు వృథ వోనీక యేను వహించి కాంచితి; వీనిం గైకొను' మనిన నతండు వాని నెత్తికొని యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసి యాసరిద్వర నాలోకించి 'నీవు బ్రహ్మసరస్సున జనియించితి; పుణ్యనదులయందు మేటి' వని సంస్తుతించి 'నీజలంబులం దర్పణంబు సేసిన విశ్వేదేవతలుఁ బితరులు గంధర్వులుఁ దృప్తులౌదు' రని యనుగ్రహించి 'యిక్కుమారుండు నీ పేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పంద్రెండేం డ్లనావృష్టి యైన నయ్యాపదఁ బొంద కుండఁ బెక్కండ్రు మునుల రక్షించి వేదాధ్యయనంబులు సేయించు' నని చెప్పి యొప్పగించిన సరస్వతి ప్రీత యై తనయుం గొని చనియె; నా కాలంబున. 203**

**ప్రతిపదార్థం:** ఆ నియమ+ఆచరణంబునకున్= ఆ నియమాన్ని ఆచరించటానికి; ఇంద్రుండు శంకించి= ఇంద్రుడు అనుమానించి; తద్+విఘ్నకరణంబునకున్= ఆ దధీచి నియమానికి అడ్డు తగలటానికి; అలంబుస+అను+అప్సరస్+వనితన్+పుత్తెంచినన్= అలంబుస అనే అప్సరసను పంపగా; తదీయ దర్శనంబునన్= ఆమెను చూడటంచేత; ఆ+మునివీర్యంబు= ఆ దధీచి మునియొక్క వీర్యం; స్ఖలించినన్= జారగా; దానిన్= ఆ వీర్యమును; సరస్వతి గర్భంబుగాన్ ధరియించి= సరస్వతి తన కడుపులో మోసి; పుత్రున్+కాంచి= కొడుకును కని; తపస్విజన గోష్ఠిన్+ఉన్న= మునిజనుల గోష్ఠిలోనున్న; ఆ+తపోధనుకడకున్+తెచ్చి= ఆ తాపసివద్దకు తీసికొనివచ్చి; వీఁడు నీ కొడుకు= వీడు నీ కుమారుడు; భవత్+తేజంబు వృథ పోనీక= నీ శక్తిని వ్యర్థం కానీయక; ఏను వహించి= నేను మోసి; కాంచితిన్= కన్నాను; కైకొనుము+అనినన్= తీసికొను మనగా; అతండు= ఆ దధీచి; వానిన్= ఆ బాలుడిని ఎత్తికొని; ఆలింగనంబును= కౌగిలిని; మూర్ధఘ్రాణంబును= శిరస్సు నాఘ్రాణించుట; చేసి= చేసినవాడై; ఆ సరిద్వరన్+ఆలోకించి= శ్రేష్ఠమైన ఆ నదిని చూచి; నీవు బ్రహ్మ సరస్సున జనియించితి(వి)= నీవు బ్రహ్మతీర్థంలో పుట్టావు; పుణ్యనదులఅందున్= పవిత్రమైన నదులలో; మేటివి= గొప్పదానవు; అని సంస్తుతించి= అంటూ పొగడి; నీ జలంబులన్+తర్పణంబు చేసినన్= నీనీటిలో (పితరులకు) తర్పణం చేస్తే; విశ్వేదేవతలు; పితరులు= పితృదేవతలు; గంధర్వులు= గంధర్వులు; తృప్తులు+ఔదురు= సంతుష్టు లవుదురు; అని అనుగ్రహించి= అంటూ దయజూపి; ఈ+కుమారుండు= ఈ బాలుడు; నీపేర సారస్వతుండు+అనన్+పరఁగున్= నీ పేరుమీద ఈ పసివాడు సారస్వతుడని పిలువబడతాడు; పదంపడి= ఆ మీదట; పంద్రెండు+ఏండ్లు= పన్నెండు సంవత్సరాలు; అనావృష్టి+ఐనన్= వానలు లేకుండిన; ఆ+ఆపద+పొందకుండన్= ఆ ప్రమాదం వలని కష్టమును అనుభవించకుండా; పెక్కండ్రు మునులన్ రక్షించి= చాలామంది తాపసులను కాపాడి; వేదాధ్యయనంబులు= వేదమును చదవటం; చేయించును+అని చెప్పి= చేయిస్తాడని చెప్పి; ఒప్పగించినన్= అప్పజెప్పగా; సరస్వతి ప్రీత+ఐ= సరస్వతి సంతోషించి; తనయున్+కొని చనియెన్= తన కుమారుడిని తీసికొని వెళ్ళింది; ఆ కాలంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ దధీచి తపో నియమానికి దేవరాజు సంశయించి దానికి అడ్డు వేయటానికై అలంబుస అనే అప్సరః కాంతను పంపాడు. ఆమెను చూడటంతో ఆ మునికి వీర్యం జారింది. దానిని సరస్వతీనది తన కడుపున దాచి, కుమారుడిని కని ఆ తపోధనుడి వద్దకు తీసికొనివచ్చి, తాపసుల గోష్ఠిలోనున్న దధీచితో 'వీడు నీ కొడుకు; - నీ వీర్యాన్ని వ్యర్థం కానీయక నేను ధరించి కన్నాను. వీడిని తీసికొనుము' అన్నది. ఆత డా కుమారుడిని ఎత్తుకొని కౌగిలించుకొని, ప్రేమతో శిరస్సు ముద్దుపెట్టుకొని, ఆ నదీమతల్లిని చూచి 'నీవు బ్రహ్మ సరస్సున పుట్టావు. పవిత్రమైన నదులలో మేటివి' అని మెచ్చి, నీ జలాలతో తర్పణం వదలితే దేవతలు, పితృదేవతులు, విశ్వేదేవతలు,

గంధర్వులు తృప్తిపొందుతారు' అని దయచూపి, 'ఈ బాలుడు నీ పేరున సారస్వతు డనబడతాడు. ముందు పండ్రేండ్లు వానలు లేక కాటకం వస్తే ఆ ప్రమాదంనుండి అనేకులు మునులను కాపాడి వేదవిద్య నేర్పుతాడు' అని చెప్పి ఒప్పగించగా సరస్వతి సంతోషించి, కుమారుడితో వెళ్ళింది. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అమరులకు నసురులకుఁ గల । హము గలిగిన బలవిరోధి యాయుధనికురుం**
**బము సవరించు మహోద్యో । గమునఁ బ్రవర్తించె వీరకౌతుక మలరన్. 204**

**ప్రతిపదార్థం:** అమరులకున్+అసురులకున్= దేవతలకు రాక్షసులకును; కలహము కలిగినన్= జగడం రాగా; బలవిరోధి= ఇంద్రుడు; ఆయుధ నికురుంబమున్= అస్త్రసమూహాన్ని; సవరించు= చక్కచేసే; మహా+ఉద్యోగమునన్= గొప్ప ప్రయత్నంలో; వీరకౌతుకము+అలరన్= వీరోత్సాహాలు ఒప్పగా; ప్రవర్తించెన్= నడచుకొన్నాడు.

**తాత్పర్యం:** దేవాసురులకు యుద్ధం రాగా ఇంద్రుడు అస్త్రసమూహాన్ని సవరించే పెనుప్రయత్నంలో వీరోత్సాహాలతో ప్రకాశించాడు.

**వ. అ ట్లుద్యోగించి. 205**

**ప్రతిపదార్థం:** అట్లు+ఉద్యోగించి= ఆ విధంగా ప్రయత్నం చేసి.

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రయత్నించి.

**చ. జగముల నెందునుం బడయఁ జాల కతండు దధీచియస్థులం**
**దగియెడునాయుధంబు లగుఁ దత్పరతం జని వేఁడ నాతఁ డి**
**చ్చు గురుతరాక్షయోజ్జ్వలయశోనిరతుం డని పంపఁగా నిలిం**
**పగణము వోయి వేఁడిన నృపాలక! యిచ్చె నతండు ప్రీతితోన్. 206**

**ప్రతిపదార్థం:** నృపాలక!= ఓ రాజా! (జనమేజయా!); అతండు= ఆ ఇంద్రుడు; జగములన్+ఎందునున్+పడయన్+చాలక= లోకాలలో ఎక్కడను పొందలేక; దధీచి అస్థులన్= దధీచి ఎముకలలో; తగియెడు నాయుధంబులు+అగున్= తగిన (యుద్ధసాధనాలు) ఆయుధాలు కాగలవు; తత్పరతన్= ఆసక్తితో(పట్టుదలతో); చని వేఁడన్= వెళ్ళి ప్రార్థించగా; ఆతఁడు+ ఇచ్చున్= ఆతడు+ఈయగలడు; (దధీచి ఈయగలడు); గురుతర= గొప్పదయిన; అక్షయ= నాశనంకాని; ఉజ్జ్వల= ప్రకాశించే; యశోనిరతుండు= కీర్తిమంతుడు; అని= అంటూ; పంపఁగాన్= పంపించగా; నిలింపగణము= దేవతల సమూహాలు; పోయి వేఁడినన్= దగ్గరకు పోయి ప్రార్థించగా; అతండు= ఆ దధీచి; ప్రీతితోన్+ఇచ్చెన్= సంతోషంతో ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు ప్రపంచంలో ఎక్కడా పొందలేనివైన దధీచి ఎముకలు ఆయుధాలు కాగల వని పట్టుదలతో వెళ్ళి ప్రార్థించగా 'దధీచి ఈయగలడు. అతడు విస్తారమూ, ప్రకాశవంతమూ నాశంకానిదీ అయిన కీర్తి కలవా' డని పంపగా దేవతలు పోయి వేడుకొనగా ప్రీతితో దధీచి ఇచ్చాడు. ఓ రాజా! (వినుము). (అని జనమేజయుడికి వైశంపాయనముని చెప్పాడు.)

**వ. ఇచ్చి యతం డవ్యయలోకంబున కరిగె; నమరవరుండును దదస్థుల వజ్రాయుధంబు నొనర్చి పేర్చె; నంత నాసారస్వతుండు ద్వాదశవార్షికం బగుననావృష్టి దురితంబునఁ దన్నుఁ జేరి పిన్న యనక**

**విద్యావిశేషకలితంబైన గౌరవంబున శిష్యత్వంబు భజియించిన యఱువదివేవురు మునుల సరస్వతీప్రభావజనితం బగు నన్నంబున రక్షించుచు వేదంబుఁ జదివించె; నా సారస్వతతీర్థంబున నుండి యాసంకర్షణుండు వృద్ధకన్యాశ్రమంబు నకుం బోయె నయ్యెడ గర్గవంశవర్యుం డగు ఖని యను తపోధనుండు. 207**

**ప్రతిపదార్థం:** ఇచ్చి+అతండు+అవ్యయ లోకంబునకున్+అరిగెన్= ఆ ఎముకల నిచ్చి ఆయన నాశనం లేనట్టి లోకానికి వెళ్ళాడు; అమరవరుండును= దేవరాజును; తద్+అస్థులన్ వజ్రాయుధంబు+ఒనర్చి= ఆ ఎముకలతో వజ్రాయుధం చేసి; పేర్చెన్= విజృంభించాడు; అంతన్+ఆ సారస్వతుండు= ఆ మీదట ఆ సరస్వతీ తనయుడు; ద్వాదశ వార్షికంబు+అగు= పన్రెండేండ్లు సాగిన; అనావృష్టి దురితంబునన్= వానలేనట్టి కష్టంతో; తన్నున్+చేరి= తన వద్దకు వచ్చి; పిన్న+అనక= పసివాడనకుండా; విద్యావిశేష కలితంబు+ఐన= చదువరితనంతో కూడుకొన్న; గౌరవంబునన్= మర్యాదతో; శిష్యత్వంబు= శిష్యత్వంతో, భజియించినన్= పూజించగా; అఱువది+వేవురు మునుల= అరవైవేలమంది తాపసులను; సరస్వతీ ప్రభావజనితంబు+అగు= సరస్వతీ తీర్థప్రభావం వలన కలిగిన; అన్నంబునన్ రక్షించుచున్= భోజనంతో కాపాడుతూ; వేదంబున్+చదివించెన్= వేదాధ్యయనం చేయించాడు; ఆ సారస్వత తీర్థంబున నుండి; ఆ సంకర్షణుండు= ఆ బలరాముడు; వృద్ధకన్యా+ఆశ్రమంబునకున్+పోయెన్= వృద్ధకన్యయొక్క తపోవనానికి వెళ్ళాడు; ఆ+ఎడన్= అక్కడ; గర్గవంశవర్యుండు+అగు= గర్గమహాముని వంశంలో శ్రేష్ఠుడైన; 'ఖని' అను తపోధనుండు= ఖనిఅని పేరుండే తాపసి.

**తాత్పర్యం:** దధీచి తన ఎముకలను ఇచ్చి, నాశనం లేని లోకాలకు వెళ్ళిపోయాడు. ఆ ఎముకలతో ఇంద్రుడు వజ్రాయుధాన్ని తయారు చేసికొని విజృంభించాడు. అటు పిమ్మట సారస్వతుడు పన్నెండేళ్ళపాటు సాగిన అనావృష్టి కారణంగా తాను చిన్నవాడైనా విద్యావంతుడు కావటం వలన తన శిష్యత్వాన్ని స్వీకరించిన అరవై వేలమంది మునులను సరస్వతీనదీ ప్రభావం వలన లభించిన అన్నంతో కాపాడుతూ వేదాధ్యయనం చేయించాడు. అట్టి సారస్వత తీర్థం నుండి బలరాముడు వృద్ధకన్యాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ గర్గవంశంలో ఉత్తముడైన 'ఖని' అనే ఋషి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **పరమతపమున నొకకన్యఁ బడసి పెంచి । దివమునకు నేఁగె; నది తపస్స్థిరతఁ బూని**
**పతి వరింపంగ నొల్లక బ్రహ్మచర్య । మున వెలింగి య య్యాశ్రమమున వసించె. 208**

**ప్రతిపదార్థం:** పరమతపమునన్= గొప్పతపస్సుతో; ఒక కన్యకన్+పడసి= ఒక కూతును పొంది; పెంచి; దివమునకున్+ఏఁగెన్= స్వర్గానికి వెళ్ళాడు; అది= ఆ కన్య; తపఃస్థిరతన్+పూని= స్థిరమైన తపస్సుచేసి; పతిన్+వరింపంగన్+ఒల్లక= భర్తను వరించటానికి ఇష్టపడక; బ్రహ్మచర్యమునన్ వెలింగి= బ్రహ్మచర్య నిష్ఠతో ప్రకాశించి; ఆ+ఆశ్రమమునన్ వసించెన్= ఆ ఆశ్రమంలో ఉండింది.

**తాత్పర్యం:** ఖని అనే పరమతాపసి తపశ్శక్తితో ఒక కూతురిని పొంది పెంచి స్వర్గానికి వెళ్ళాడు. ఆ కన్య స్థిరమైన తపస్సునకు పూనుకొని, భర్తను వరించటానికి ఇష్టపడకుండా బ్రహ్మచర్యాశ్రమంలో ప్రకాశిస్తూ ఆ ఆశ్రమంలో ఉండిపోయింది.

**వ.** **పదంపడి యత్యంతవృద్ధ యై పరలోకగమనంబు గోరె; నప్పుడు యదృచ్ఛాసన్నిహితుం డైన నారదుం డక్కన్యక కిట్లనియె. 209**

**ప్రతిపదార్థం:** పదంపడి= ఆ మీదట; అత్యంత వృద్ధ ఐ= మిక్కిలి ముదుసలిఅయి; పరలోక గమనంబు+కోరెన్= పరలోకానికి పోవాలని కోరింది; అప్పుడు= ఆ సమయంలో; యదృచ్ఛా సన్నిహితుండు+ఐన నారదుండు= తలవని తలంపుగా దగ్గరకు వచ్చి నారదుడు; ఆ+కన్యకకున్= ఆ (వృద్ధ) కన్యకతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ మీదట చాలముదుసలిఅయిన ఆ కన్యకకు పరలోకానికి వెళ్ళవలెననే ఆస కలిగింది. అపుడు తలవని తలంపుగా అక్కడికి వచ్చిన నారదుడు ఆకన్యతో ఈ విధంగా అన్నాడు.

**క. 'విను! పాణిగ్రహణము సే । యనివనితకుఁ బుణ్యలోక మప్రాప్యము గా**
**వున నే యుపాయమున నై । నను దగియెడు వరు వరింపు నలినదళాక్షీ!'. 210**

**ప్రతిపదార్థం:** నలినదళ+అక్షీ!= ఓ పద్మాలరేకులవంటి కన్నులు కలదానా!; విను= వినుము; పాణిగ్రహణము చేయని వనితకున్= పెండ్లిచేసికొనని స్త్రీకి; పుణ్యలోకము= పవిత్రమగు లోకం; అప్రాప్యము= కలుగదు; కావునన్= అందుచేత; ఏ+ఉపాయమునన్+ఐనను= ఏదైనా ఉపాయంతో; తగియెడు= (నీకు) తగిన; వరున్+వరింపు(ము)= భర్తను ఎన్నుకొనుము.

**తాత్పర్యం:** 'ఓ పద్మదళాక్షీ! వినుము. వివాహం కాని స్త్రీకి పుణ్యలోకాలు కలుగవు. కనుక ఏదేని ఉపాయంతో నీకు తగిన భర్తను ఎన్నుకొనుము.'

**ఆ. అనిన నిజతపంబు నర్ధంబు లంచంబు । గాఁగ నిచ్చి యదియు గాలవాత్మ**
**జుని వరించె; నతఁడు సుదతితో సమయంబు । పలికికొనియె ధరణిపాలవర్య! 211**

**ప్రతిపదార్థం:** ధరణిపాలవర్య!= రాజశ్రేష్ఠుడా!; అనినన్= అనగా; నిజతపంబు= తన తపస్సుయొక్క; అర్ధంబు= సగభాగం; లంచంబుకాగన్+ఇచ్చి= లంచంగా ఇచ్చి; అదియున్= ఆ ఖని కూతురు; గాలవ+ఆత్మజునిన్ వరించెన్= గాలవుడి కుమారుడిని వివాహమాడింది; అతఁడు= ఆ గాలవుడి కుమారుడు; సుదతితోన్= ఆ స్త్రీతో; సమయంబు పలికికొనియెన్= కట్టడి చేసికొన్నాడు.

**తాత్పర్యం:** తన తపస్సుతో సగం లంచంగా ఇచ్చి ఆ వృద్ధకన్యక గాలవుడి కుమారుడిని వివాహమాడింది అతడుకూడ ఆమెతో ఒక కట్టడి చేసికొన్నాడు.

**వ. సమయంబు నేకరాత్ర సహవాస సమ్మతికలితం; బట్లు పాణిగ్రహణ సంస్కారవతి యై యావృద్ధకన్యక దైవయోగంబున నారాత్రి మనోహరయౌవనయుఁ బరమానులేపమాల్యాంబరభూషణాభిరామయు నయ్యె; నమ్మునియుఁ బ్రీతుండై యన్నాతిసంగతి నన్నిసి గడపెఁ; బ్రభాతంబున నన్నింతంబిని యతని కిట్లనియె. 212**

**ప్రతిపదార్థం:** సమయంబు= (ఆతడు చేసికొన్న ఒడంబడిక) ప్రమాణం; ఏకరాత్ర సహవాస సమ్మతి కలితంబు= ఒకరాత్రి కలిసిఉండటం అనే ఒప్పుదలతో కూడింది (అనగా ఒకరాత్రి మాత్రమే ఆ వృద్ధకన్యకు భర్తగా వ్యవహరించేందుకు); అట్లు= ఆ ప్రకారం; పాణిగ్రహణ సంస్కారవతి ఐ= వివాహ సంస్కారం కలదియై; ఆ వృద్ధకన్యక= ఆ ముదుసలి కన్యక; దైవయోగంబునన్= దైవానుగ్రహంచేత; ఆ రాత్రి= ఆ రాత్రి సమయాన; మనోహర యౌవనయున్= సుందర యౌవనము; పరమ+అనులేపన+మాల్య+అంబర+భూషణ+అభిరామయున్= ఉత్తమ సుగంధ ద్రవ్యాలతోను, పూమాలలతోను, వస్త్రాలతోను,

నగలతోను, చాలా అందగత్తెగాను; అయ్యెను= అయింది; ఆ+మునియున్+ప్రీతుండు+ఐ= ఆ తపసికూడా సంతోషించినవాడై; ఆ+నాతి సంగతిన్= ఆ స్త్రీ సాంగత్యంతో; ఆ నిసిన్+గడపెన్= ఆ రాత్రి గడపాడు; ప్రభాతంబునన్= ఉదయాన; ఆ+నితంబిని= ఆ స్త్రీ; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆతడితో ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ ముని చేసిన కట్టడి - ఒక్కరాత్రి మాత్రం ఆమెతో కలిసి ఉండటం. ఆ విధంగా వివాహసంస్కారవతి అయిన ఆ ముదుసలికన్నె దైవానుగ్రహంతో ఆ రాత్రి మనసును ఆకర్షించే వయసుకత్తెగా, సాటిలేని సుగంధవస్తువులతోను, వస్త్రాలతోను, నగలతోను చాలా అందగత్తెగా ఐనది. ఆ ముని కూడా ప్రీతినందినవాడై ఆ ఇంతితో కలిసి సంతోషంగా ఆ రాత్రిని గడిపాడు. ఉదయాన ఆమె ఆతడితో ఇట్లా అన్నది.

**తే.** **'ఒక్క రేయి నీపాల నాయునికి గాఁగఁ । బలికికొన్నార; మది సెల్లె నలఘుచరిత!**
**పోయి వచ్చెద' నని దివంబునకుఁ బోవ । నుత్సహించె నమ్ముని మది నుమ్మలింప.** **213**

**ప్రతిపదార్థం:** అలఘుచరిత!= ఓ గొప్ప నడవడిక కలవాడా!; ఒక్కరేయి= ఒకరాత్రి (మాత్రం); నీపాలన్= నీతో; నాఉనికి+ కాఁగన్= నేనుఉండేటట్లుగా; పలికి కొన్నారము= మాటాడుకొన్నాం; అది చెల్లెన్= అది అయిపోయింది; పోయివచ్చెదన్= వెళ్లివస్తాను; అని; ఆ తపసి; మదిన్+ఉమ్మలింపన్= దుఃఖపడగా; దివంబునకున్+పోవన్= స్వర్గానికి పోవటానికి; ఉత్సహించెన్= ఆసక్తిని చూపింది.

**తాత్పర్యం:** 'ఒకరాత్రి మాత్రం నీతో కలిసి ఉండటానికి ప్రమాణం చేసికొన్నాము. అది గడచిపోయింది. ఓ పుణ్యాత్ముడా! నేను పోయి వస్తాను.' అని స్వర్గానికి వెళ్ళటానికి ఆసక్తిని చూపింది. ఆ తపసి మనసున చాలా బాధపడ్డాడు.

**వ.** **ఇట్లుత్సహించి 'యిత్తీరంబున దేవఋషిపితృతర్పణపరుండై యొక్కనాఁడుపవసించినవాఁడు పంచాశద్వత్సర పరిపూరణీయం బగు నైష్ఠిక బ్రహ్మచర్య ఫలంబు వడయువాఁ'డని పలికి తనువువిడిచి దివంబున కరిగెఁ; గురువంశోత్తమా! యయ్యెడ నారేవతీపతి శల్యుండు రణంబునఁ బాండవులచేత నిహతుం డగుట విని, వగచుచు నచ్చటికిఁ జేరువ యగు శమంతపంచకంబునకుం జని, యందులమునులఁ గురుక్షేత్రవిశేషంబు లడిగిన. వార లతనికి నది ప్రజాపతి యుత్తరవేది యనియును, సమస్తదేవతలు నందు వరిష్ఠంబు లడిగిన, వార లతనికి నది ప్రజాపతి యుత్తరవేది యనియును, సమస్తదేవతలు నందు వరిష్ఠంబు లగుసత్రంబు లాచరించి రనియును, దానిఁగురుం డనురాజు దున్నుటం జేసి దానికిఁ గురుక్షేత్రం బనునామంబు గలిగె ననియు నెఱింగించిన, న య్యేకకుండలుం 'డాభూమీశ్వరుఁ డేమి ప్రయోజనంబునకు దున్నె?' ననుటయు, నాతపోధను లి ట్లనిరి.** **214**

**ప్రతిపదార్థం:** కురువంశ+ఉత్తమా!= కురువంశంలో ఉత్తముడైన వాడా! (జనమేజయా!); ఇట్లు+ఉత్సహించి= ఈ విధంగా ఆసక్తిని చూపి; ఈ+తీరంబునన్= ఈ గట్టువద్ద; దేవఋషి పితృ తర్పణ పరుండు+ఐ= దేవతలకును, ఋషులకును, పితరులకును, తృప్తి చేసేవాడుగా; ఒక్కనాడు ఉపవసించువాఁడు= ఒక దినం ఉపవాసం ఉండేవాడు; పంచాశద్వత్సర పరిపూరణీయుండగు నైష్ఠిక బ్రహ్మచర్య ఫలంబు పడయు వాఁడు+అని= ఏబది వత్సరాల నియమంతో గడపిన బ్రహ్మచర్య వ్రతఫలితాన్ని పొందగలవాడని; పలికి= చెప్పి; తనువు విడిచి= శరీరాన్ని వదలి; దివంబునకున్+అరిగెన్= స్వర్గానికి వెళ్లింది;

ఆ+ఎడన్+ఆరేయి నిలిచి= ఆ చోట ఆ రాత్రి ఉండి; శల్యుండు= శల్యుడు; రణంబునన్= యుద్ధంలో; పాండవులచేతన్= పాండవులచే; నిహతుండు+అగుట= చంపబడటం; విని= విన్నవాడయి; వగచుచున్= దుఃఖిస్తూ; అచ్చటికిన్+చేరువ+అగు= ఆ చోటుకు దగ్గరైన; శమంతపంచకంబునకున్+చని= శమంతపంచకమనే చోటికి వెళ్ళి; అందు మునులన్= అక్కడి తాపసులను; కురుక్షేత్ర విశేషంబులు+అడిగినన్= కురుక్షేత్రంలోని విశేషాలను గూర్చి అడుగగా; వారలు+అతనికిన్= వారు ఆ బలరాముడికి; అది= ఆ తీర్థమున్నచోటు; ప్రజాపతి= స్రష్టకు; ఉత్తరవేది= ఉత్తరమున ఉండే యజ్ఞాదులు చేసికొనటానికై యున్నట్టి తిన్నె; అనియును= అనిచెప్పి; సమస్తదేవతలు= దేవతలందరూ; అందున్= ఆ చోట; వరిష్ఠంబు+అగు= శ్రేష్ఠమైన; వ్రతంబులు+ఆచరించిరి+అనియున్= నోములు కావించినారనీ; దానిన్= ఆ చోటును (తిన్నెను); కురుండు+అనురాజు దున్నుటన్‌చేసి= కురుడనే రాజు దున్నినందువలన; దానికి; కురుక్షేత్రంబు+అను నామంబు కలిగెన్= కురుక్షేత్రమని పేరు కలిగింది; అనియున్ ఎఱింగించినన్= అని చెప్పగా; ఆ+ఏకకుండలుండు= ఆ బలరాముడు; ఆ భూమి+ఈశ్వరుఁడు= ఆ కురురాజు; ఏమిప్రయోజనంబునకున్= ఏ ఫలానికై; దున్నెన్?= దున్నాడు?; అనుటయున్= అని అడుగగా; ఆ తపోధనులు= ఆ తాపసులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధమైన ఆసక్తితో ఈ తీరంలో దేవతలను, ఋషులను, పితరులను తృప్తిపరచేవాడుగా ఒకరోజు ఉపవాసం చేసినవాడు ఏబది సంవత్సరాలు నియమంతో గడిపిన బ్రహ్మచర్య వ్రతఫలాన్ని పొందగలడు.' అని చెప్పి ఆ వృద్ధకన్య తన శరీరాన్ని వదలి స్వర్గానికి వెళ్లింది. కురువంశీయులలో ఉత్తముడైనవాడా! అక్కడ బలరాముడు శల్యుడు యుద్ధంలో పాండవులచేత చంపబడటాన్ని విని దుఃఖిస్తూ ఆ చోటునకు దగ్గరగా ఉన్న శమంతపంచకతీర్థానికి వెళ్ళి అక్కడ ఉన్న మునులను కురుక్షేత్ర విశేషాలు అడిగినాడు. దానికి వారు 'అది బ్రహ్మకు ఉత్తరదిక్కున నున్న యజ్ఞవేది' అనీ, ఎందరో దేవతలు అందు శ్రేష్ఠములైన యజ్ఞాలను చేశారనీ తెలిపారు. ఆ చోటును కురు డనే రాజు దున్నుట మూలంగా దానికి కురుక్షేత్రమనే పేరు వచ్చింది' అని కూడా చెప్పారు. 'ఆ రాజు ఏ ఫలాన్ని ఆశించి దానిని దున్నాడు?' అని బలరాముడు అడుగగా వాళ్ళు ఈ విధంగా అన్నారు.

### కురుక్షేత్ర ప్రభావాభివర్ణనము (సం. 9-52-4)

**సీ.** **'ఇందుఁ బుట్టినజను లెల్లను దుదిఁ ద్రిది । వంబున కరుగంగవలయు నని మ**
**నంబునఁ గోరి యన్నరపతి దున్నంగ, । నింద్రుఁడు సనుదెంచి యేల యిచట**
**దునియెద? వనిన నమ్మనుజాధిపతి తన । కోర్కి సెప్పిన, గేలిగొనుచుఁ జనియెఁ;**
**బలుమఱు నద్దేవపతి వచ్చి వెండియు । నుల్లసమాడుచు నుండు నతని**

**ఆ.** **నతఁడు నిష్ఠఁ గుంద కనిశంబు దున్నంగ । వరముఁ బ్రీతి నొసఁగువాఁడు గాఁగ**
**నమరు లెఱుఁగ నిశ్చయము సేసి యాశక్రుఁ । డచటి కేగుదెంచి యతనితోడ.** **215**

**ప్రతిపదార్థం:** ఇందున్+పుట్టిన జనులు+ఎల్లను= ఒక్కడ పుట్టిన మానవులంతా; తుదిన్= చివరకు; త్రిదివంబునకున్+అరుగంగన్ +వలయును+అని= దేవలోకానికి వెళ్ళాలి అని; మనంబునన్= మనసులో ఆశించి; ఆ+నరపతి= ఆ కురురాజు; దున్నంగన్= భూమిని దున్నగా; ఇంద్రుఁడు చనుదెంచి= ఇంద్రుడు వచ్చి; ఏల ఇచటన్ దునియెదవు+అనినన్= ఇక్కడ ఎందుకు నేలను దున్నుతున్నావని అడుగగా; ఆ+మనుజ+అధిపతి తన కోర్కి చెప్పినన్= ఆ రాజు తన ఆశయాన్ని చెప్పగా; గేలిగొనుచున్+ చనియెన్= పరిహసిస్తూ వెళ్ళాడు; ఆ+దేవపతి= దేవరాజు; పలుమఱున్ వచ్చి= పెక్కుమారులు వచ్చి; వెండియున్+ఉల్లసము+ ఆడుచున్+ఉండున్= ఇంకా పరిహాసం చేస్తూనే ఉన్నాడు; అతనిన్= ఆ రాజును; అతఁడు నిష్ఠన్+కుందక= ఆ రాజు

నియమం తప్పకుండా; దున్నంగన్= భూమిని దున్నగా; వరమున్ ప్రీతినొసఁగువాఁడుగాన్= ప్రీతితో వరం ఇచ్చేవాడుగా; అమరులు+ఎఱుఁగన్= దేవతలకు తెలియగా; నిశ్చయం చేసి= నిర్ణయించి; ఆ శక్రుఁడు+అచటికిన్+ఏగుదెంచి= ఆ ఇంద్రు డక్కడకు వచ్చి; అతనితోడన్= ఆ రాజుతో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ క్షేత్రంలో పుట్టిన వారంతా తుదకు స్వర్గానికే వెళ్లవలె నని మనసులో తలచి, ఆ రాజు భూమిని దున్నుతుండగా ఇంద్రుడు వచ్చి భూమి దున్నే కారణ మడిగాడు. దానికి ఆ రాజు తన మనసులోని కోరికను చెప్పగా ఎగతాళి చేస్తూ వెళ్ళాడు. అనేక పర్యాయాలు ఆ దేవరాజు వచ్చి మరల మరల దానిని ఎగతాళిచేశాడు. ఐనా, ఆ రాజు తన నిష్ఠను వదలక దున్నుతూ ఉండగా, దేవతలకు తెలిసేవిధంగా వరాన్ని ఈయదలచి, ఇంద్రుడు ఆచోటికి వచ్చి ఆతడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. ఈ పుణ్యక్షేత్రంబున నిరాహారులై దేహంబు విడిచిన వారలకు నిందు సమరంబు సేసి సమ్యక్ప్రకారంబున మృతిఁ బొందిన సమస్తజంతువులకును సురలోకప్రాప్తి గలిగెడు' మని పల్కి నిజస్థానంబునకుం జనియె; నట్లు చను చుండి యాశతమఖుఁడు సంభావనాతిశయంబున. 216**

**ప్రతిపదార్థం:** ఈ పుణ్యక్షేత్రంబునన్= ఈ పవిత్ర క్షేత్రంలో; నిరాహారులు+ఐ= భోజనాన్ని మానిన వారుగా; దేహంబును విడిచిన వారలకున్= శరీరత్యాగం చేసిన వారికినీ; ఇందు సమరంబు చేసి= ఇక్కడ యుద్ధం చేసి; సమ్యక్+ప్రకారంబునన్= సరియగు విధానంతో; మృతిన్+పొందిన= చనిపోయిన; సమస్త జంతువులకును= అన్ని ప్రాణులకున్నూ; సురలోక ప్రాప్తి కలిగెడున్= స్వర్గలోకం కలుగుతుంది; అని పల్కి= అంటూ చెప్పి; నిజస్థానంబునకున్+చనియెన్= తన చోటగు దేవలోకానికి వెళ్ళాడు; అట్లు చనుచుండి ఆ శతమఖుఁడు= ఆ విధంగా వెళ్లుతూ ఆ ఇంద్రుడు; సంభావనా+అతిశయంబునన్= గౌరవాతిశయంతో.

**తాత్పర్యం:** ఈ పవిత్రక్షేత్రంలో ఉపవాసంచేస్తూ దేహత్యాగం చేసినవారికీ, ఇక్కడ యుద్ధంచేసి సముచితమైన పద్ధతిలో చనిపోయిన సమస్త ప్రాణులకూ, స్వర్గలోక ప్రాప్తికలుగుతుంది.' అని చెప్పి దేవలోకానికి వెళ్ళాడు. ఆ విధంగా వెళ్ళుతూ ఆ ఇంద్రుడు గౌరవాతిశయంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'గాలిఁ గురుక్షేత్రంబున । ధూలి తనువుఁ జెంది నరుని దుష్కర్మములం**
**దోలి యతనికి ధరిత్రిం । దూలి మధురలీలమై నతులగతి యొసఁగున్. 217**

**ప్రతిపదార్థం:** కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రంలో; గాలిన్= వాయువుచేత; ధూలి= దుమ్ము; తనువున్+చెంది= ఒడలిని తాకి; నరుని= మానవుని; దుష్కర్మములన్+తోలి= చెడుపాపాలను తొలగించి; అతనికిన్= ఆ మానవుడికి; ధరిత్రిన్= భూమియందు; తూలి= తొలగి; మధురలీలమైన్= తీయని ఆటగా; అతులగతి ఒసఁగున్= సాటిలేని గతి - ఉత్తమగతి నిస్తుంది.

**తాత్పర్యం:** 'కురుక్షేత్రంలో మానవుడి శరీరాన్ని గాలి, దుమ్ము తాకి పాపాలను తొలగించి, భూమిని విడిచిపోయిన పిమ్మట ఉత్తమగతిని కలిగిస్తుంది.

**వ. అని నిర్దేశించినఁ గురునృపాలుండును గృతకృత్యుండై సంతోషించె' నని చెప్పుటయు, నా ప్రలంబవైరి ప్రమోదభరితుం డగుచు మెలంగి యశ్వత్థమధూకామ్రబిల్వాదిభూరుహోప శోభితం బైన నిజపూర్వాశ్రమంబుఁ**

**గనుంగొని 'యిది యెవ్వరియాశ్రమం?' బని యడిగిన నమ్మును 'లియ్యెడఁ దొల్లి విష్ణుదేవుండు దపంబు సేసినచోటు; మఱియు శాండిల్యప్రభృతు లిందు యోగసిద్ధిం బొంది' రనిన విని యయ్యాశ్రమంబుఁ గొనియాడి తత్ప్రదేశంబున బహిఃపరివారంబు నెల్ల వీడుకొల్పి యొక్కపుణ్యాచలం బెక్కి దానితటంబున సమస్థలంబున మునిజనసహితంబుగ నాసీనుం డయ్యెఁ; నాసమయంబున నిచ్చటికి జటామండలకలితుండును గుశచీరచ్ఛాయా సుందరుండును గలహప్రియుండును నగు నారదుండు హేమదండంబును మణికమండలువును గచ్ఛపవీణయుం బొలుపు మెఱయ నేతెంచిన, నెల్లవారలుం బ్రత్యుత్థానప్రణామంబు లాచరించి సుఖోపవిష్టుం జేసి పరివేష్టించి; రా దేవమునిం గొల్చియుండి య బ్బలదేవుండు. 218**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించినన్= అని ఆజ్ఞాపించగా; కురున్పపాలుండును= కురురాజును; కృతకృత్యుండు+ఐ= చేయదగినపని చేసినవాడై; సంతోషించెన్= సంతోషించాడు; అని చెప్పుటయున్= అంటూ చెప్పగా; ఆ ప్రలంబవైరి= ఆ ప్రలంబుడి శత్రువు (బలరాముడు); ప్రమోదభరితుండు+అగుచున్= సంతోషంచేత నిండినవాడై; మెలంగి= నడచుకొని; అశ్వత్థ= రావి; మధూక= ఇప్ప; ఆమ్ర= మామిడి; బిల్వ= మారేడు; ఆది= మొదలయిన; భూరహా= చెట్లతో; ఉపశోభితంబు+ఐన= అందంగా ఉన్న; నిజపూర్వ+ఆశ్రమంబున్+కనుంగొని= తన వెనుకటి ఆశ్రమాన్ని చూచి; ఇది ఎవ్వరి+ఆశ్రమంబు+అని+అడిగినన్= ఇది ఎవ్వరి ఆశ్రమ మని అడుగగా; ఆ+మునులు= ఆ తపస్వులు; ఈ+ఎడన్= ఈ చోట; తొల్లి విష్ణుదేవుండు= పూర్వం విష్ణుదేవుడు; తపంబు చేసిన చోటు= తపస్సు చేసిన చోటు; మఱియున్= ఇంకను; శాండిల్య ప్రభృతులు= శాండిల్యుడు మొదలయినవారు; ఇందున్= ఈ చోట; యోగసిద్ధిన్+పొందిరి+అనినన్= యోగసిద్ధి పొందారనిన; విని; ఆ+ఆశ్రమంబున్+ కొనియాడి= ఆ తపోవనాన్ని పొగడి; తత్ప్రదేశంబునన్= ఆచోటున; బహిఃపరివారంబును+ఎల్లన్ వీడుకొల్పి= వెలుపల ఉండదగిన సేవకులకు వీడ్కోలు+ఇచ్చి; ఒక్కపుణ్య+అచలంబు+ఎక్కి= ఒక పవిత్రమైన కొండనెక్కి; దాని తటంబునన్= దాని చరియపై; సమస్థలంబునన్= సమమైన నేలపై; మునిజన సహితంబుగా ఆసీనుండు+అయ్యెన్= మునులతో కూడి కూర్చున్నాడు; ఆ సమయంబునన్ ఇచ్చటికిన్= ఆ వేళలో ఈచోటునకు; జటామండల కలితుండును= జటామండలంతో కూడినవాడూ; కుశచీరచ్ఛాయా సుందరుండును= దర్భలు, నారచీరలచే రేఖా సుందరుడైనవాడూ; కలహప్రియుండును= జగడాలకు ఆనందించేవాడూ; అగు; నారదుండు; హేమదండంబును= బంగారు యోగ దండాన్నీ; మణికమండలువును= మణులు తాపిన కమండలాన్నీ; కచ్ఛపవీణయున్= కచ్ఛపమనే పేరుగల వీణయు; పొలుపు మెఱయన్= అందం అతిశయించగా; ఏతెంచినన్= రాగా; ఎల్లవారును= అందరును; ప్రత్యుత్థాన= ఎదురేగి; ప్రణామంబులు= నమస్కారాలు; ఆచరించి= చేసి; సుఖంగా కూర్చుండబెట్టి; పరివేష్టించిరి= చుట్టూ కూడారు; ఆ దేవమునిన్+కొల్చిఉండి= ఆ దేవతాపసిని సేవించి; ఆ+బలదేవుండు= ఆ బలరాముడు.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించగా కురురాజు తాను ధన్యుడైనట్లుగా సంతోషించాడు - అని చెప్పగా బలరాముడు సంతోషంతో తిరిగి చెప్పగా ఇప్ప, మామిడి, మారేడు మొదలయిన చెట్లతో అందంగా ఉన్న తన వెనుకటి ఆశ్రమాన్ని గుర్తించి 'ఇది ఎవ్వరి తపోవనవం' అని అడుగగా ఆ తాపసులు 'ఈ చోట ముందు విష్ణుదేవుడు తపస్సు చేశాడు. ఇంకను శాండిల్యుడు మొదలయినవారు ఈ చోట యోగసిద్ధిని పొందారు'. అనగా విని ఆ తపోవనమును పొగడి ఆ చోట తన సేనను నిల్పి, ఒక పవిత్రమైన కొండమీదకు ఎక్కి, దాని చరియవద్ద చదునైన చోట మునిజనులతో కూడి కూర్చున్నాడు. ఆ సమయాన అక్కడకు జడలకొప్పుతో కూడినవాడూ, నారచీరల చాయగలిగిన అందగాడూ జగడాలపై ఇష్టం కలవాడూ ఐన నారదుడు బంగారు యోగదండమూ, రత్నాలు పొదిగిన కమండలమూ, 'కచ్ఛపి'

అనే తన వీణా అందగించగా అందరూ లేచి ఎదురేగి నమస్కరించి, కూర్చుండజేసి తామూ చుట్టూ కూర్చున్నారు. ఆ దేవఋషిని సేవించి ఆ బలరాముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కురువృత్తాంతం బడిగినఁ । గరమేర్పడఁ జెప్పె నతఁడు గాంగేయుండున్**
**గురుఁడును గర్ణుఁడు శల్యుఁడు । వరుస ననిం దెగుట కౌరవక్షితినాథా! 219**

**ప్రతిపదార్థం:** కౌరవ క్షితినాథా!= ఓ కురురాజా!; కురువృత్తాంతంబున్= కౌరవుల కథను; అడిగినన్= అడుగగా; కరము= మిక్కిలి; ఏర్పడన్= స్పష్టం కాగా; అతఁడు= ఆ ముని; గాంగేయుండున్= భీష్ముడున్నూ; గురుఁడును= ద్రోణుడున్నూ; కర్ణుఁడు= కర్ణుడునూ; శల్యుఁడు= శల్యుడున్నూ; వరుసన్= క్రమంగా; అనిన్+తెగుటన్= యుద్ధంలో చనిపోవటాన్ని; ఏర్పడన్+ చెప్పెన్= స్పష్టంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ కురురాజా! బలరాముడు కురువీరుల వృత్తాంతాన్ని అడుగగా, ఆ తాపసి భీష్మద్రోణ కర్ణ శల్యాదులు వరుసగా పడిపోవటాన్ని స్పష్టంగా చెప్పాడు.

**వ. మఱియును మృతు లైన నృపకుమారాది యోధవరులం జెప్పి పదునెనిమిది దివసంబులఁ జెల్లిన సంగరంబు తెఱంగును, సంక్షేమరూపంబునఁ తెలియఁబలికి, దుర్యోధనసైన్యం బంతయు సమయుటయు, నందుఁ గృపాశ్వత్థామ కృతవర్మలు బ్రదికిపోవుటయు నన్నరపాలుఁ డోడి పాఱి ద్వైపాయన హ్రదంబు సొచ్చి జలంబుల సంస్తంభించి డాఁగుటయు, నది పాండవు లెఱింగి సపరివారంబుగాఁ జనుదెంచి యమ్మడువుఁ జుట్టుముట్టి బెట్టిదంపు మాట లాడుటయు, దానం గనలి యమ్మనుజవరుండు మడువు వెడలి వచ్చుటయు నెఱింగించి బిరుదు మగ లగు పగతురు పెక్కండ్రు పొదివికొనియుండం గురుపతియు నుక్కు దక్కక యున్నవాఁ; డద్దండితనంబుఁ జూచిన మెత్తు వీ వని యుగ్గడించి. 220**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; మృతులు+ఐన= చనిపోయిన; నృపకుమార+ఆది యోధవరులన్= రాజకుమారులు మొదలైన యుద్ధవీరులను; చెప్పి= పేర్కొని చెప్పి; పదునెనిమిది దివసంబులు= పద్దెనిమిది దినాలు; చెల్లిన సంగరంబు తెఱంగును= జరిగిన యుద్ధ విధానాన్ని; సంక్షేప రూపంబునన్= సంగ్రహంగా; తెలియన్+పలికి= తెలిసేటట్లు చెప్పి; దుర్యోధన సైన్యంబు+అంతయున్ సమయుటయున్= దుర్యోధనుడి సేన అంతా నాశనం కావటం; అందున్= దానిలో; కృప+అశ్వత్థామ కృతవర్మలు= కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ అనేవారు; బ్రదికిపోవుటయున్= జీవించి ఉండటమున్నూ; ఆ+నరపాలుఁడు= ఆ రాజైన దుర్యోధనుడు; ఓడిపాఱి= ఓటమినంది పరుగెత్తి; ద్వైపాయనహ్రదంబు+చొచ్చి= ద్వైపాయన మనే నీటి మడుగులోనికి వెళ్ళి; జలంబుల స్తంభించి= నీటిని కదలకుండా చేసి; డాఁగుటయున్= దాగిఉండటమునూ; అది; పాండవులు; ఎఱింగి= తెలిసికొని; సపరివారంబుగాన్= సేవకులతో; చనుదెంచి= అక్కడకువచ్చి; ఆ+మడువున్ చుట్టుముట్టి= ఆ నీటిమడుగు చుట్టును దండుతో ముట్టడించి; బెట్టిదంపు మాటలు+ఆడుటయున్= నిష్ఠురమైన మాటలు పలుకుటయూ; దానన్+కనలి= ఆ మాటలకు కోపించి; ఆ+మనుజవరుండు= ఆ రాజగు దుర్యోధనుడు; మడువు వెడలి వచ్చుటయున్= ఆ మడుగునుండి బయటకూ రావటమునూ; ఎఱింగించి= తెలిపి; బిరుదుమగలు+అగు పగతురు= బలవంతులయిన విరోధులు; పెక్కండ్రు పొదివికొని+ఉండన్= చాలామంది చుట్టుకొని ఉండగా; కురుపతియున్ ఉక్కుదక్కక= కురురాజయిన దుర్యోధనుడును దర్పం వదలకుండా; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఆ+దండితనంబున్ చూచినన్= ఆ దర్పమును చూస్తే; ఈవు= నీవును; మెత్తువు+అ= మెచ్చుకొందువంటూ; ఉగ్గడించి= చెప్పి.

**తాత్పర్యం:** ఇంకా చనిపోయిన రాజకుమారు లయిన వీరులను గూర్చి చెప్పి, పదునెనిమిది నాళ్ళ యుద్ధాన్ని సంగ్రహంగా తెలిపి దుర్యోధనుడి సేన అంతా నశించటం, వారిలో కృపాశ్వత్థామ కృతవర్మలు మాత్రం బ్రదికి ఉండటం, ఆ రాజు ఓడి పారిపోయి ద్వైపాయనమనే నీటి మడుగులో దూరి దాగికొని ఉండటం, దానిని పాండవులు తెలిసికొని సేనతో వెళ్ళి ఆ మడుగును చుట్టుముట్టి, నిష్ఠురంగా మాటాడినందున ఆ అభిమానధనుడు (రాజు) కోపించి నీటి మడుగునుండి వెలికిరావటం తెలిపి, పేరున్న వీరులయిన శత్రువులు చాలామంది క్రమ్ముకొని ఉండగా కురురాజు దర్పాన్ని వదలక శోభించాడు. ఆ గొప్పతనాన్ని చూస్తే నీవు మెచ్చుకొంటావు' అని చెప్పి.

**వ.** **అతనికి భీమసేనునకు నాహవ మయ్యెడు నొంటిమై మహా**
**ద్భుతబలశౌర్య ధైర్యములఁ బొల్చు భవత్ప్రియశిష్యులన్ సుశి**
**క్షితులఁ గనుంగొనం దలఁపు చిత్తమునన్ మొలతెంచునేనిఁ బొ**
**మ్మతుల గదాకృతోజ్జ్వల విహార ముదారనిరూఢి నొప్పెడున్.** **221**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ దుర్యోధనుడికీ; భీమసేనునకున్= భీమునకును; ఒంటిమైన్= ఒక్కడితో(ఎక్కటి); ఆహవము+ అయ్యెడున్= యుద్ధమవుతుంది; మహా+అద్భుత+బల+శౌర్య+ధైర్యములన్= ఆశ్చర్యకరాలైన బలపరాక్రమధైర్యాలతో; పొల్చు= ఒప్పే; భవత్+ప్రియశిష్యులన్= నీకు ప్రీతిగొల్పే శిష్యులను; సుశిక్షితులన్= చక్కని శిక్షణ గల వారిని; కనుంగొనన్+ తలఁపు= చూడవలెననే కోరిక; చిత్తమునన్ మొలతెంచునేనిన్= మనసులో తలెత్తితే పొమ్ము= వెళ్ళుము; అతుల= సాటిలేని; గదాకృత+ఉజ్జ్వల విహారము= గదలతో చేసే చక్కనైన విహారం; ఉదారనిరూఢిన్= గొప్ప ప్రసిద్ధితో; ఒప్పెడున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** దుర్యోధనుడికీ భీమసేనుడికీ ఎక్కటి యుద్ధం జరుగుతుంది. భుజబలశౌర్యాలతోను మంచి శిక్షణతోను ఉన్న నీ శిష్యులను చూడవలెననే కోరిక మనసులో తలెత్తితే పొమ్ము. గదలవలన కలిగే సాటిలేని సొగసైన ఆ విహారం గొప్పగా ఉంటుంది.'

**వ.** **అనిన విని యమ్మునీంద్రునిం దక్కటిమునులను వీడ్కొని యచలంబు డిగ్గి యభ్యంతరపరిజనంబుల నిజపురంబున కనిచి, యన్నీలాంబరుం డరదంబు సమీపంబునకుఁ జని సరస్వతి నాలోకించి.** **222**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విన్నవాడై; ఆ+మునీంద్రునిన్, ఆ తాపసిని; తక్కటి మునులను వీడ్కొని= మిగిలిన తాపసులను వదలి; అచలంబు డిగ్గి= ఆ కొండను దిగి; అభ్యంతర పరిజనంబులన్= అంతఃపుర సేవకులను; నిజపురంబునకున్ అనిచి= తన ఊరికి పంపినవాడై; ఆ+నీల+అంబరుండు= ఆ బలరాముడు; అరదంబు సమీపంబునకున్+చని= తేరు వద్దకు వెళ్ళి; సరస్వతిన్ ఆలోకించి= సరస్వతీ తీర్థాన్ని చూచి.

**తాత్పర్యం:** ఆ ముని లట్లా చెప్పగా విన్నవాడై బలరాముడు ఆ మునిని, తక్కిన మునులను వదలి, ఆ కొండను దిగి అంతఃపుర స్త్రీలను, సేవకులను తన ఊరికి పంపి, తన తేరు వద్దకు వెళ్ళి, సరస్వతిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **అరయఁగ మేటి పుణ్యనదులందు సరస్వతి సౌఖ్యసంపదల్**
**నరులకుఁ గల్గు నిజ్జగమునం బరలోకమునందు నీసరి**
**ద్వర నొకనాఁడు సేరినను వాసవముఖ్య సమస్తదేవతా**
**వరులును నిందు మేల్ వడయవత్తురు సంస్కృతి సొలు సిద్ధికిన్.** **223**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= చూడగా; మేటి పుణ్యనదులందున్= పవిత్రమైన నదులలో శ్రేష్ఠమైన; సరస్వతి= సరస్వతీనది; ఈ+జగమునన్= ఈ లోకంలో; నరులకున్= మనుజులకు; సౌఖ్య సంపదల్ కల్గున్= సుఖం సంపదలు కలుగుతాయి; పరలోకమునందున్= చనిపోయిన తరువాత స్వర్గలోకాదులలో; ఈ సరిద్వరన్= ఈ నదీమతల్లిని; ఒకనాఁడు చేరినను= ఒక దినం చేరినప్పటికినీ (అనగా ఒక మారు సేవించినను); వాసవముఖ్య సమస్త దేవతావరులును= ఇంద్రాది దేవతా శ్రేష్ఠులంతా; ఇందున్= ఈ నదిలో; మేల్+పడయవత్తురు= మంచి జరగటానికి వస్తారు; సిద్ధికిన్= తపస్సిద్ధికి; సంస్మృతి+చాలున్= మనసుతో తలచుకొనటమే చాలును.

**తాత్పర్యం:** పరిశీలించగా ఉత్తమమైన నదులలో సరస్వతి మేటి. ఈ లోకంలో మానవులకు సుఖసంపదలు కలిగేదానికీ చనిపోయిన తరువాత స్వర్గలోక సిద్ధికీ ఉత్తమమైన ఈ నదిని చేరితే చాలును. ఇంద్రాది దేవముఖ్యులు కూడా ఈచోట సౌఖ్యం పొందటానికై వస్తారు. మనసులో తలచుకొన్నమాత్రం చేతనే సిద్ధి కలుగుతుంది.

**తే. అనుచుఁ బలుమాఱు చూచుచు నధికభక్తి । మోడ్పుఁగేలు శిరంబును మోపికొనుచుఁ**
**బుణ్యతమనిజమూర్తి విస్ఫూర్తి మెఱయ । నమ్మురారాతిపూర్వజుఁ డరద మెక్కి. 224**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; పలుమాఱు చూచుచున్= పెక్కుమార్లు చూస్తూ; అధిక భక్తిన్= మిక్కిలి భక్తితో; మోడ్పు+కేలు= జోడించిన చేతులు; శిరంబునన్ మోపికొనుచున్= తలపై పెట్టుకొంటూ; పుణ్యతమ= ఉత్తమ పుణ్యములు; నిజమూర్తి విస్ఫూర్తి మెఱయన్= తమ ప్రకాశంతో వెలుగగా; ఆ+ముర+అరాతి+పూర్వజుఁడు= ఆ మురారికి అన్న అయిన బలరాముడు; అరదము+ఎక్కి= తేరు ఎక్కి.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్తుతూ పలుపర్యాయాలు చూస్తూ మిక్కిలి భక్తితో నమస్కారం చేసి, చేతులను తలమీద పెట్టుకొని పుణ్యాతిశయంచేత తనమూర్తి శక్తి ఎక్కువకాగా ఆ బలరాముడు తన రథం ఎక్కి. (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. అతిత్వరితగమనంబున ద్వైపాయనహ్రదంబునకుఁ జనుదెంచె; నయ్యెడ. 225**

**ప్రతిపదార్థం:** అది త్వరితగమనంబునన్= మిక్కిలి వేగంగా ప్రయాణం చేసి; ద్వైపాయన హ్రదంబునకున్= ద్వైపాయన మనే మడుగున్న చోటునకు; చనుదెంచెన్= ఏతెంచాడు; ఆ+ఎడన్= ఆ చోట.

**తాత్పర్యం:** మిక్కిలి వేగంగా బయలుదేరి ప్రయాణం చేసి, ద్వైపాయనమనే మడుగున్న చోటికి బలరాముడు వచ్చి, అక్కడ.

**తే. ధర్మపుత్రాదులును సుయోధనుఁడు నతని । గన్న తెఱఁ గాంబికేయుండు విన్న తెఱఁగు**
**నధిప! ముని చెప్పినాఁడ; న ట్లన్నరేంద్ర । కుంజరుఁడు విని యిట్లను సంజయునకు. 226**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; జనమేజయా!; ధర్మపుత్ర+ఆదులును= ధర్మరాజు మొదలైనవారునూ; సుయోధనుండున్= దుర్యోధనుడునూ; అతనిన్+కన్న తెఱఁగు= అతనిని చూచిన విధం; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుండు; విన్నతెఱఁగు= విన్నపద్ధతి; ముని చెప్పినాఁడన్= ఇదివరకే చెప్పాను; అట్లు= ఆ విధంగా; ఆ+నరేంద్రకుంజరుఁడు= ఆ రాజశ్రేష్ఠుడు (ధృతరాష్ట్రుడు) విని= విన్నవాడై; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ జనమేజయరాజా! ధర్మరాజు మొదలైన వారూ సుయోధనుడూ ఆ బలరాముడిని చూచిన విధాన్ని ఇదివరకే చెప్పాను. ఆ విధంగా ఆ రాజశ్రేష్ఠుడు(ధృతరాష్ట్రుడు) విని సంజయుడితో ఇట్లా అన్నాడు:

**పాండవ దుర్యోధనులు ద్వైపాయనహ్రదంబు విడిచి పొలికలనికిఁ బోవుట (సం. 9-54-3)**

**క. 'బలభద్రుఁడు సనుదెంచిన । నలఘుగదాస్ఫురిత భుజసహాయత్వసము**
**జ్జ్వలుఁ డగు మత్పుత్రునకుం । దెలివి మిగులకున్నె? రణముతెఱఁ గె ట్లయ్యెన్?' 227**

**ప్రతిపదార్థం:** బలభద్రుఁడు; చనుదెంచినన్= (ద్వైపాయనమునకు) రాగా; అలఘుగదా స్ఫురిత= పెద్ద గద నుండి వెలువడుచున్న; భుజసహాయత్వ సముజ్జ్వలుఁడు+అగు= భుజబలంతో వెలుగుతున్నవాడైన; మత్+పుత్రునకున్+తెలివిమిగులక+ఉన్నె?= నా కుమారుడైన దుర్యోధనుడికి ప్రజ్ఞ ఎక్కువ కాకుంటుందా?; రణము తెఱఁగు+ఎట్లు+అయ్యెన్= యుద్ధపద్ధతి ఏవిధంగా సాగింది?

**తాత్పర్యం:** 'బలరాముడిని చూడగానే సాటిలేని భుజబల సహాయంతో ప్రకాశించే గదాధరుడైన నా కుమారుడి తెలివి ఎక్కువౌతుంది కదా! అయితే యుద్ధ మెట్లా సాగింది?'

**క. అనుటయు నతఁ డిట్లను న । జ్జనపతికి హలాయుధుండు సనుదెంచి నె**
**మ్మనము దెలివొందె మూఁపులు । దనరె మొగం బలరె నీదుతనయున కధిపా! 228**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అతఁడు= ఆ సంజయుడు; ఆ+జనపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుకు; ఇట్లు+అనున్= ఇలా అన్నారు; అధిపా!= ఓ రాజా!; హల+ఆయుధుండు చనుదెంచినన్= బలరాముడు రాగా; నీదు తనయునకున్= నీ కుమారుడికి; నెమ్మనము తెలివి+ఒందెన్= మనసు వికసించింది; మూఁపులు+తనరెన్= భుజాలు విజృంభించినవి; మొగంబు+అలరెన్= ముఖం సంతోషంతో వెలిగింది (వికసించింది).

**తాత్పర్యం:** అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో 'ఓ రాజా! బలరాముడు రాగానే నీ కుమారుడికి మనస్సు వికసించింది. భుజాలు అదిరినవి. మొగం సంతోషంతో నిండింది.

**వ. ఇట్లు ప్రీతుం డై యాతండు ధర్మనందనుం జూచి 'శమంతపంచకంబు ప్రజాపతియుత్తరవేది యనఁ బ్రసిద్ధం బైన పుణ్యస్థలం; బయ్యెడం బ్రధనంబున నిధనంబు నొందినవారికి సద్గతి యగుట ధ్రువం బని విందు; మిప్పటి పొలికలనికిం బోవుద' మనిన నతం డాద్వైపాయనహ్రదం బాసీమలోనిది గామి యెఱుంగుం గావున నమ్మాట కియ్యకొని తదభిముఖుం డైపోవ నాదుర్యోధనుండును గదాకలనంబున నంసపీఠంబు పొలుపార మత్తగజేంద్రయానంబున సమరప్రస్తూయమానుం డగుచుఁ జన శంఖభేరీప్రముఖతూర్య స్వనంబులు సెలంగె; నిట్లు పాండవపరివృతుండై యచటికి నీ కొడుకు నడచి యమర్ష సముజ్జ్వలుం డై. 229**

**ప్రతిపదార్థం:** ఇట్లు ప్రీతుండు+ఐ= ఈ విధంగా సంతోషపడి; ఆతండు; ధర్మనందనున్+చూచి= ధర్మరాజును చూచి; శమంతపంచకంబు= శమంతపంచక మనే చోటు; ప్రజాపతి= బ్రహ్మకు; ఉత్తరవేది= ఉత్తరదిక్కునందలి యజ్ఞవేది; అనన్+ ప్రసిద్ధంబు= అనగా ప్రఖ్యాతమైనది; ఐన పుణ్యస్థలంబు= అయినట్టి పవిత్రమైన చోటు; ఆ+ఎడన్+ప్రధనంబునన్= ఆ చోట

యుద్ధంలో; నిధనంబును+ఒందినవారికిన్= మరణించినవారికి; సద్గతిఅగుట= మంచిగతి కలుగుట (పుణ్యం కల్గటం); ధ్రువంబు+అని విందుము= నిశ్చయ మని వింటాము; ఇప్పటిపోలికలనికిన్+పోవుదము+అనినన్= మామూలుగా యుద్ధం చేసే చోటికిపోదాము అనగా; అతండు+ఆ ద్వైపాయనహ్రదంబు= ఆత డా ద్వైపాయనమనే మడుగు; ఆ సీమలోనిది+కామి ఎఱుంగున్+కావునన్= ఆ ప్రాంతంలోనికి కాకుండటం తెలియును గనుక; ఆ+మాటకున్+ఇయ్యకొని= ఆ మాటకు కట్టుపడి; తదభిముఖుండు+ఐ పోవన్= దానివైపునకు వెళ్ళగా; ఆ దుర్యోధనుండును= ఆ దుర్యోధనుడు; గదాకలనంబునన్= గదతో కూడుటచేత; అంసపీఠంబు పొలుపు+ఆరన్= భుజపీఠం అందగించగా; మత్తగజేంద్రయానంబునన్= మదపుటేనుగు నడకతో; అమరప్రస్తూయమానుండు+అగుచున్= దేవతల పొగడ్తల నందుతూ; చనన్= వెళ్ళగా; శంఖ భేరీ ప్రముఖ తూర్యస్వనంబులు= శంఖాలు నగారాలు మొదలైన కొమ్ముబూరల శబ్దాలు; చెలంగెన్= మ్రోగాయి; ఇట్లు= ఈ విధంగా; పాండవ పరివృతుండు+ఐ= పాండవులచేత చుట్టుకొనబడిన వాడై; అచటికిన్= ఆ చోటునకు; నీ కొడుకు నడచి= నీ కుమారుడు వెళ్ళి; అమర్ష సముజ్జ్వలుండు+ఐ= కోపంతో వెలిగినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా సంతోషించి దుర్యోధనుడు ధర్మరాజుతో 'శమంతపంచకం బ్రహ్మకు ఉత్తరదిక్కున యజ్ఞవేదిక అని ప్రఖ్యాతిగల పుణ్యభూమి. ఆ చోటులో యుద్ధంలో చనిపోయిన వారికి సద్గతి కలుగుట నిశ్చయం అని విన్నాము. ఎప్పుడూ యుద్ధం చేస్తున్న చోటికి వెళ్ళుదాము.' అనగా నాత డా ద్వైపాయనమనే మడుగు ఆ ప్రాంతంలోనిది కాదు గనుక ఆ మాటకు ఒప్పుకొన్నాడు. ఆ దిక్కునకు పోగా దుర్యోధనుడు గదతో కూడిన భుజబలం ఒప్పుతుండగా మదపుటేనుగు నడకతో యుద్ధానికి సిద్ధమగుతూ దేవతలు పొగడుతుండగా శంఖభేరీ కాహళాది వాద్యాల శబ్దాలు ఒప్పారాయి. ఈ ప్రకారంగా పాండవులు చుట్టుకొనగా ఆ స్థలానికి నీ కుమారుడు వచ్చి, గర్వంతో ప్రకాశిస్తూ - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **నిలిచిన సకలజనులు నెడ । గవిసి బలసి నిలిచి రపుడు గదయుఁ బసిఁడి క**
**త్తళము మెఱయ నతనియెదురఁ । జెలువొందె బకారి హేమశిఖరియుఁ బోలెన్.** **230**

**ప్రతిపదార్థం:** నిలిచినన్= నిలువగా; సకలజనులు= జనులంతా; అపుడు= ఆ సమయంలో; ఎడ గవిసి= ఆ ప్రక్కకు చేరిపోయి; బలసి నిలిచిరి= గుమిగూడి నిలిచారు; అపుడు= ఆ సమయంలో; గదయున్= గదయూ; పసిఁడి కత్తళము మెఱయన్= బంగారు కవచం ప్రకాశించగా; అతని+ఎదురన్= ఆ దుర్యోధనుడికి ఎదురుగా; బక+అరి= బకుడనే రాక్షసుడికి శత్రువు (భీమసేనుడు); హేమశిఖరియున్+పోలెన్= బంగారు కొండవలె, మేరుశైలం మాదిరి; చెలువు+ఒందెన్= అందగించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు నిలువగా జనులందరునూ ఒకదిక్కుగా కలిసి నిలిచారు. అపుడు గద, బంగారు కవచం మెరయగా భీమసేనుడు బంగారు శైలంవలె దుర్యోధనుడి కెదురుగా సొగసుగా నిలిచాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ.** **కనుఁగొని దర్పమంథరము గా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజ**
**న్మునకు 'వడిం బెనంగఁగ సనుం బవనాత్మజుఁ జూచు వేడ్క ని**
**జ్జనతతి యంతకంత కిటు సందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్ముదెం**
**చునొ? యుపవేశనిశ్చలతఁ జూచిన మే లఖిల ప్రియంబుగన్.'** **231**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; దర్పమంథరముగాన్= గర్వం తక్కువ అగునట్లుగా; పాండవ+అగ్రజన్మునుకున్= ధర్మరాజుతో; అతఁడు+ఇట్లనున్= ఆ దుర్యోధనుడు+ఇట్లంటున్నాడు; వడిన్+పెనంగఁగన్= త్వరగా యుద్ధం చేయటానికై; చనున్= తగును; పవన+ఆత్మజున్ చూచువేడ్కన్= భీమసేనుడిని చూచే ఆసక్తితో; ఈ+జనతతి= ఈ జన సమూహం; అంతకంతకున్+ఇటు సందడిగాన్= అంతకంతకూ ఈ విధమైన సందడి కాగా; తన+ఇచ్చన్+క్రమ్మిదెంచునొ?= స్వేచ్ఛగా క్రమ్మికొనునో; అఖిల ప్రియంబుగన్= అందరికినీ మేలగునట్లుగా; ఉపవేశనిశ్చలతన్= సందడి లేకుండా నిశ్చలంగా మార్చుండేటట్లు; చూచినన్= చూచినట్లయితే; మేలు= మంచిది.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పొగరుబోతుతనం తగ్గగా ధర్మరాజును చూచి, ఇట్లా అన్నాడు- 'త్వరలో యుద్ధం చేయటానికి వస్తున్న నన్నూ భీముడిని చూచే వినోదంతో ఈ జనసమూహం స్వేచ్ఛగా మూగుతారేమో? వాళ్ళు కదలకుండా కూర్చుండి మా యుద్ధాన్ని చూస్తే అందరికీ మేలు.'

**వ. అని భూపాలుర నెల్ల నాలోకించినం బాంచాలాదు లగు నయ్యందఱను ధర్మనందనుండు గూర్చుండ నియోగించి, బలదేవ వాసుదేవ సహితంబుగఁ దాను నాసీనుం డయ్యె; నమ్మహీనాథమండలంబున సితప్రభుం డైన యన్నీలాంబరుండు తారకామధ్యవర్తియై మెఱయుమృగాంకు ననుకరించె; నట్టియెడ భీమసేనుండును దుర్యోధనుండును. 232**

**ప్రతిపదార్థం:** అని భూపాలురన్+ఎల్లన్+ఆలోకించినన్= అంటూ రాజులనందరినీ బాగా చూడగా; పాంచాల+ఆదులైన+ అందఱును= పాంచాలాది దేశాల రాజులైన వారందరినీ; ధర్మనందనుండు= ధర్మరాజు; కూర్చుండన్ నియోగించి= కూర్చుండుడని ఉత్తరువుచేసి; బలదేవ, వాసుదేవ సహితంబుగాన్= బలరాముడితోను, శ్రీకృష్ణుడితోను కలిసి; తానున్+ఆసీనుండు+అయ్యెన్= తానూ కూర్చున్నాడు; ఆ+మహీనాథమండలంబునన్= ఆ రాజులోకంలో; సితప్రభుండు+ఐ= తెల్లనికాంతి కలవాడై; ఆ+నీల+అంబరుండు= నీలవస్త్రధారిఅయిన ఆ బలరాముడు; తారకామధ్యవర్తి+ఐ= నక్షత్రాల నడుమనున్నవాడైన; మెఱయు మృగాంకున్+అనుకరించెన్= ప్రకాశించే చంద్రుడిని అనుకరించాడు(చంద్రుడివలె ఉన్నాడు); అట్టి+ఎడన్= ఆ సమయంలో; భీమసేనుండును; దుర్యోధనుండును.

**తాత్పర్యం:** (దుర్యోధనుడు) రాజుల నందరినీ చూస్తూ ఉండగా పాంచాలం మొదలైన దేశాల రాజులనందరినీ కూర్చుండుడని ధర్మజు డాజ్ఞాపించాడు. బలరాముడితోనూ శ్రీకృష్ణుడితోనూ తానూ కూర్చున్నాడు. అపుడు బలరాముడు తెల్లనిమేనిరంగుతో నక్షత్రాల నడుమ వెలిగే చంద్రుడివలె వెలిగాడు. ఆ సమయంలో భీమసేనుడు, దుర్యోధనుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. ఆభీల గర్జన శోభితదేహు లై । యుద్ధటవృషములయొప్పుఁ దాల్చి,**
**రోష మహావిషభీషణవదను లై । చండోరగంబుల చంద మొంది**
**మదసముజ్జృంభితమండితాకారు లై । భద్రద్విపంబుల పగిదిఁ బొల్చి,**
**చారుగదాశృంగ సందీప్త మూర్తు లై । మహితపర్వతములమాడ్కి మెఱసి,**

**ఆ. వాసుదేవయుగము వరుణద్వయంబు వై । శ్రవణయుగ్మకంబు రామయమము**
**పోలె దర్శనీయలీల వహించి యం । భోధియుగళ మనఁగఁ బొంగు మిగిలి. 233**

**ప్రతిపదార్థం:** ఆభీల= భయంకరమైన; గర్జన= సింహగర్జనలతో; శోభితదేహులు+ఐ= సుందరశరీరులుఅయి; ఉద్భటవృషముల+ ఒప్పున్+తాల్చి= ఏపైన గిత్తల హొయల నంది; రోష= కోపంతో; మహావిషభీషణ వదనులు+ఐ= పెద్ద విషంతో; మిక్కిలి భయమును కలిగించే ముఖాలతో; చండ+ఉరగంబుల చందము+ఒంది= భయంకరాలయిన పెనుబాములవలె ఉండి; మద= గర్వంతో; సముజ్జృంభిత= మిక్కిలి పేట్రేగినందున; మండిత+ఆకారులై= అలంకరించబడిన శరీరాలు కలవారై; భద్రద్విపంబుల పగిదిన్ పొల్చి= మదపుటేనుగువలె ఒప్పి; చారు గదా శృంగ సందీప్త మూర్తులు+ఐ= గొప్పగదలనే శిఖరాలతో ప్రకాశిస్తున్న ఆకారాలు కలవారై; మహిత పర్వతముల మాడ్కిన్= గొప్ప పర్వతాలవలె; మెఱసి; వాసుదేవయుగము= ఇద్దరు వాసుదేవులు; వరుణద్వయంబు= ఇద్దరు వరుణులు; వైశ్రవణయుగ్మకంబు= కుబేరులజంట; రామయమము= ఇద్దరు శ్రీరామచంద్రులు; పోలెన్= వలె; దర్శనీయలీలన్ వహించి= చూడదగిన సొంపుకలిగి; అంబోధి= సముద్రముల; యుగళము+అనఁగన్= జంటయో అనగా; పొంగు= పొంగు(దర్పం); మిగిలి= మించి.

**తాత్పర్యం:** భయంకర గర్జనలతో కూడిన అందమైన శరీరాలు కలిగి, మదించిన ఎద్దుల అందంతో ఒప్పి, కోపమనే విషంతోఉన్న ముఖాలతో భయంకరమైన పాముల పద్ధతిని కలిగి, మదంతో వికసించే ఆకారాలు మదించిన ఏనుగుల మాదిరి ఉండి అందమైన గదల కొమ్ములతో ప్రకాశిస్తూ పెనుగొండలవలె ఇర్వురు వాసుదేవులవలె, వరుణులిద్దరివలె, కుబేరద్వయంవలె, శ్రీరాములిర్వురవలె అందంగా కనుపిస్తూ, దర్పాతిశయంతో రెండు సముద్రాలవలె పొంగారి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. ఒండొరులం జుఱచుఱం జూచుచుఁ, బరస్పరహృదయ విదారణంబు లగు దారుణభాషణంబు లెసఁగ శుంభదవష్టంభంబునం బొలిచి నిలిచి; రనిన విని యాంబికేయుండు. 234**

**ప్రతిపదార్థం:** ఒండొరులన్ చుఱచుఱన్+చూచుచున్= ఒకరిని మరొకరు కోపంతో చూస్తూ; పరస్పర హృదయ విదారణంబులు+అగు దారుణ భాషణంబులు+ఎసఁగన్= ఒకరొక్కరి గుండెలు పగిలేటట్లు తీవ్రపదజాలంతో కూడిన మాటలు ఎక్కువగా మాటాడుతూ; శుంభత్+అవష్టంభంబునన్+పొలిచి= పెనుగర్వంతో ఒప్పి; నిలిచిరి= నిలిచారు; అనినన్= అనగా; విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఒకరినొకరు కొరకొర చూస్తూ, ఒకరిగుండెలు చీలేటట్లు మఱొక్కరు తీవ్రపదాలతో మాటాడుతూ పెనుగర్వంతో నిలిచారు. అనగా విని ధృతరాష్ట్రుడు - (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'తనుఁ బదునొకఁ డక్షౌహిణు । లనూనవిభవమునఁ గొలువ నఖిలనృపులుఁ బం**
**చినపని సేయ నెగడునా । తనయుం డేకాకియుం బదాతియు నయ్యెన్. 235**

**ప్రతిపదార్థం:** తనున్+పదునొకఁడు+అక్షౌహిణులు= తనను పదకొండక్షౌహిని సేనలు; అనూన= సాటిలేని; విభవమునన్+ కొలువన్= ఐశ్వర్యంతో సేవించగా; అఖిలనృపులున్= రాజులందఱును; పంచిన పని చేయన్= చెప్పినపని చేయగా; నెగడు= ఒప్పారే; నా తనయుండు= నా కుమారుడు; ఏకాకియున్= ఒక్కడును; పదాతియున్+అయ్యెన్= కాలిబంటు అయ్యాడు.

**తాత్పర్యం:** పదకొండక్షౌహిణుల సేనలు సాటిలేనట్లుగా వైభవంగా సేవించగా రాజులంతా తన ఆజ్ఞను శిరసావహించగా ఉండే నా కుమారుడు ఏకాకీ పదాతీ అయ్యాడు.

**తే. సకల ధరణికి నాథుఁడై సంపదలకు । నెల్ల భాజన మగు కౌరవేంద్రుఁ డనద**
**తనము దోఁపంగ గదఁ జేతఁ గొని వినిశ్చ । యమునఁ బోరికి నమరెనే? యక్క టకట! 236**

**ప్రతిపదార్థం:** సకల ధరణికిన్ నాథుఁడు+ఐ= భూమికిన్+అంతకును రాజు+ఐ; సంపదలకున్+ఎల్లన్= ఐశ్వర్యాలంతటికీ; భాజనము+అగు= స్థానమైన; కౌరవేంద్రుఁడు= కౌరవరాజు(దుర్యోధనుడు); అనదతనము తోఁపంగన్= దిక్కులేని విధం కానరాగా; గద చేతన్+కొని= చేతిలో గదను పట్టుకొని; వినిశ్చయమునన్= నిశ్చయం లేకుండా; అక్కట+అకట!= అయ్యయ్యో!; పోరికిన్= యుద్ధానికి; అమరెనే?= సిద్ధమైనాడా?

**తాత్పర్యం:** సమస్తభూమికిని రాజుగా సంపదలకు తావలమైన కౌరవరాజు దుర్యోధనుడు దిక్కు లేని అనాథ మాదిరిగా గదచేత పట్టుకొని విగతనిశ్చయుడై పాదచారిగా యుద్ధానికి సిద్ధమైనాడా? అయ్యయ్యో!

**వ. ఏ మనం గలదు సంజయా! దైవంబ నేర్చుం గాక!' యని పనవి యూర కుండె; నట్లున్న యమ్మానవపతికి సూతసూనుం డి ట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** సంజయా!= ఓ సంజయుడా!; ఏమనన్+కలదు= చెప్పటానికేమున్నది?; దైవంబు నేర్చున్+కాక= దేవుడికే తెలియును; అని= అంటూ; పనవి= దుఃఖించి; ఊరకుండెన్= మిన్నకున్నాడు; అట్లు+ఉన్న= ఆ విధంగా మాట్లాడకున్న; ఆ+మానవపతికిన్= ఆ రాజైన ధృతరాష్ట్రుడికి; సూతసూనుండు+ఇట్లు+అనియెన్= సూతుడి కుమార డయిన సంజయుడు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సంజయా! ఏమనగలను? అంతా దైవానికే ఎరుక.' అని అంటూ దుఃఖిస్తూ ఊరకున్నాడు. అట్లున్న ఆ ధృతరాష్ట్ర మహారాజుతో సంజయుడు ఈ విధంగా అన్నాడు:

**క. 'నీసుతుఁడు సమర విషయో । ల్లాసంబున నంగకంబులం బొం గారం**
**గా సుస్వరమున నాకుం । తీసూనునిఁ బిలిచె నుద్ధతిన్ రణమునకున్.' 238**

**ప్రతిపదార్థం:** నీ సుతుఁడు= నీకొడుకు; సమరవిషయ+ఉల్లాసంబునన్= యుద్ధానికి సంబంధించిన ఉత్సాహంతో; అంగకంబులన్= శరీరావయవాలలో; పొంగు+ఆరంగాన్= గర్వం అతిశయించగా; సుస్వరమునన్= గంభీరస్వరంతో; ఆ కుంతీసూనునిన్= కుంతీకుమారుడైన భీమసేనుడిని; రణమునకున్= యుద్ధానికి; ఉద్ధతిన్= గర్వంతో; పిలిచెన్= పిలిచాడు.

**తాత్పర్యం:** యుద్ధం మీది ఉత్సాహంతో నీ కొడుకు శరీరం ఉప్పొంగగా స్పష్టమైన కంఠంతో భీమసేనుడిని యుద్ధానికి పిలిచాడు.

**వ. ఆ సమయంబున. 239**

**ప్రతిపదార్థం:** ఆ సమయంలో.

**తాత్పర్యం:** అప్పుడు.

**క. ఉర్వీవలయము వడఁకెను, । బర్వము గాకయును రాహు భానునిఁ బట్టెం,**
**బర్వతము లురిలె, వఱులు । సర్వదిశల నఱచె, నభము శర్కర గురిసెన్. 240**

**ప్రతిపదార్థం:** ఉర్వీవలయము= భూగోళం; వడఁకెను= వణకింది; పర్వము= అమావాస్యాపర్వదినం; కాకయును= కాకుండగనే; రాహు భానునిన్ పట్టెన్= రాహువు సూర్యుడిని పట్టుకొన్నాడు; (సూర్యగ్రహణం అమావాస్య పర్వదినాన జరుగుతుంది); పర్వతములు+ఉరిలెన్= సప్తకులపర్వతాలు దొర్లినవి; నఱళులు= నక్కలు; సర్వదిశలన్+అఱచెన్= అన్ని దిక్కులలోను అరచాయి; నభము= ఆకాశం; శర్కరన్+కురిసెన్= ఇసుక వాన కురిసింది (ఇవి అన్నీ అపశకునాలే).

**తాత్పర్యం:** భూగోళం వణకింది, అమావాస్యా పర్వదినం కాకుండగనే సూర్యుడిని రాహువు పట్టుకొన్నాడు. కొండలు దొర్లాయి. నక్క లన్ని దిక్కులలో అరచాయి. ఆకాశంనుండి ఇసుక వాన కురిసింది.

**వ. మఱియు నిర్ఘాతపాతప్రభృతి మహోత్పాతంబులు గలిగె; వాని నెల్ల ననుసంధించి గంధవహనందనుండు గాంధారీనందనుం జూపి ధర్మనందనున కిట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; నిర్ఘాతపాత= పిడుగులు రాలుట; ప్రభృతి= మొదలయిన; మహా+ఉత్పాతంబులు కలిగెన్= అపశకునాలు కలిగాయి; వానిన్+ఎల్లన్= ఆ అన్నింటినీ; అనుసంధించి= కలిపికొని; గంధవహనందనుండు= వాయుసూనుడైన భీమసేనడు; గాంధారీనందనున్+చూచి= గాంధారి కొడుకైన దుర్యోధనుడిని చూచి; ధర్మనందనునకున్ ఇట్లు+అనియెన్= ధర్మరాజుతో ఈవిధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఇంకనూ పిడుగులు రాలటం మొదలైన అపశకునాలు కలిగాయి. వాటి నన్నిటినీ సమన్వయించి భీమసేనుడు దుర్యోధనుడిని చూపిస్తూ ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు:

**సీ. 'అశ్రమంబున గెల్వ నగు నాకుఁ జూపఱు । గొనియాడఁ బోరాడి కూల్చి తొడలు**
**పొడిసేసి యిన్నీచుఁ బొలియింతు మద్గదా । దండసముద్దండతావిభూతి**
**యవధరింపుము; వీని యాయువు దెగటాఱె; । నిక్కులపాంసను నిట్టు లేను**
**గదిసియుఁ గ్రమ్మఱఁ గరిపురంబునకుఁ బో । నిత్తునే? ధృతరాష్ట్రుఁ డింక వగలఁ**

**ఆ. బొగులువాఁడు గాక! పోఁడిమితో నుండు । వాఁడె? వీఁడు మనల వాలి పఱుపఁ**
**దొల్లి పడినపాటు లెల్ల వెలారింతు । నధిప! నీమనమున హర్ష మెసఁగ.' 242**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ధర్మజా!); అశ్రమంబునన్= అనాయాసంగా; నాకున్+గెల్వన్+అగు= జయించగలను; చూపఱు కొనియాడన్= చూచేవారు పొగడగా; పోరాడి కూల్చి= యుద్ధంచేసి పడగొట్టి; తొడలు= తొడలను; పొడి+చేసి= నుగ్గునుగ్గుగా చేసి; ఈ+నీచున్= ఈ దుష్టుడిని; పొలియింతున్= చంపుతాను; మత్+గదాదండ= నాగదయొక్క; సముద్దండతావిభూతి= మిక్కిలి గొప్పదైన శక్తిని; అవధరింపుము= చూడుము; వీని= ఇతడియొక్క; ఆయువు+తెగటాఱెన్= ఆయుస్సు నశించింది; ఈ+కులపాంసనున్= వంశానికి చెడు పేరు తెచ్చిన వీడిని; ఇట్టులు+ఏను+కదిసియున్= ఈ విధంగా నేను తలపడి; క్రమ్మఱన్= మరల; కరిపురంబునకున్+పోనిత్తునే?= హస్తినాపురికి పోనిస్తావా?; ధృతరాష్ట్రుఁడు+ఇంకన్ వలగన్+పొగులువాఁడుగాక= ఇంక ధృతరాష్ట్రుడు దుఃఖాలతో కుమిలిపోగలడు; పోఁడిమితోన్+ఉండువాడె?= సౌఖ్యంతో ఉండగలడా?; నీ మనమునన్ హర్షము ఎసఁగన్= నీ మనసునకు సంతోషం కలుగగా; వీఁడు= ఇతడు; మనలన్= మనలనందరను; వాలి= విజృంభించి; పఱుపన్= కష్టపెట్టగా; తొల్లిపడిన పాటులు+ఎల్లన్= మునుపు పడిన కష్టాలనన్నింటినీ; వెలారింతున్= పోగొట్టుతాను.

**తాత్పర్యం:** 'చూచేవారు పొగడగా అనాయాసంగా పోరాడి పడగొట్టి తొడలు పొడిచేసి ఈ నీచుడిని హతమారుస్తాను. నా గదాదండం యొక్క ఆధిక్యాన్ని చూడుము. వీడి యాయువు నశించింది. ఈ కులనాశకుని దగ్గరకు చేరిన నేను

ఈ విధంగా మరల ఇతడిని హస్తినాపురికి పోనిస్తానా? ధృతరాష్ట్రుడింక దుఃఖంతో కుములకుండా సంతోషంగా ఉండగలడా? వీడు మనలను అల్లరిపాలు చేయగా మనం పడిన కష్టాలన్నిటినీ ఓ రాజా! నీ మనసునకు సంతోషం కలిగేటట్లు పోగొట్టుతాను.'

**వ. అని పలికి దుర్యోధనాభిముఖుం డై. 243**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పుచూ; దుర్యోధన+అభిముఖుండై= దుర్యోధనునకు ఎదురై.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడికి ఎదురై నిలిచి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నెఱి మాలి వీరి నీతఁడు । పఱిచినపాటులకుఁ దగినఫల మగు నని 'యి**
**త్తెఱఁగునకు నియ్యకొని చూ । పఱుపొగడఁగ నిన్ను నిపుడ పడవైచుటకున్. 244**

**ప్రతిపదార్థం:** నెఱి మాలి= నీతి మాలి; వీరిన్= ఈ అందరను; ఈతఁడు= వీడు; పఱిచిన పాటులకున్= పెట్టిన కష్టాలకు; తగిన ఫలము+అగున్+అని= సరియైన ఫలితం అవుతుందని; ఈ+తెఱఁగునకున్= ఈ పద్ధతికి; ఇయ్యకొని= ఒప్పుకొని; చూపఱు+పొగడఁగన్= చూచే వారు కీర్తించగా; నిన్నున్; ఇపుడు+అ= ఇప్పుడే; పడవైచుటకున్= పడగొట్టటానికి.

**తాత్పర్యం:** 'నీతిమాలి వీరి నందరినీ ఈ దుష్టుడు పెట్టిన కష్టాలకు తగినవిధంగా బుద్ధిచెప్పుతాను.' అంటూ, 'దుర్యోధనా! అందరూ పొగడుతూ ఉండగా నిన్ను ఇప్పుడే పడగొట్టటానికి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. అమరి యున్నాఁడ; నాబారి కగ్గ మైతి; । పడుదుగా కింక; నీకు నెక్కడకుఁ బోవ**
**వచ్చు?' ననవుడు నిది 'యేల పెచ్చు పెరిఁగి । యాల మెడసేసి యనిలజ! ప్రేలె దిట్లు?' 245**

**ప్రతిపదార్థం:** అమరి+ఉన్నాఁడన్= సిద్ధంగా ఉన్నాను; నాబారికిన్+అగ్గము+ఐతి(వి)= నా హింసకు చిక్కావు; పడుదు(వు)+కాక= చస్తావు గాక; ఇంకన్ నీకున్+ఎక్కడకున్+పోవన్ వచ్చున్?= ఇక నీవే దిక్కుకు పోగలవు?; అనవుడున్= అనగా; అనిలజ!= ఓ భీమా!; ఇది ఏల?; పెచ్చుపెరిఁగి= పేట్రేగి; ఆలము+ఎడన్+చేసి= యుద్ధం మాని; ఇట్లు ప్రేలెదు?= ఈ విధంగా వాగుతున్నావు?

**తాత్పర్యం:** నేను సిద్ధంగా ఉన్నాను. నా చేతికి చిక్కావు. ఇంక నీవెక్కడకు పోగలవు? నీకేది దిక్కు?' అని భీముడు అనగా, 'ఓ భీమసేనా! ఎందుకు పేట్రేగి ప్రేలుతున్నావు? యుద్ధానికి ఆలస్యం చేస్తున్నావు?'

**వ. అని కురువిభుండు వెండియు నిట్లనియె. 246**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; కురువిభుండు= దుర్యోధనుడు; వెండియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అంటూ దుర్యోధనుడు ఇంకా ఈ విధంగా పలికాడు.

**క. 'పలుకుల వెఱపించెద వా । కొలఁదియె? దుర్యోధనుం దకుంఠితబాహా**
**బలుఁ; డిదె యవలీల నినుం । బొలియించెడిఁ; బలుకు లుడిగి పోరాడు ధృతిన్. 247**

**ప్రతిపదార్థం:** పలుకులన్= మాటలతో; వెఱపించెదవు= భయపెట్టుతున్నావు; ఆ కొలఁదియె?= అంతేనా?; దుర్యోధనుండు; అకుంఠిత బాహాబలుఁడు= మొక్కవోని భుజబలండున్నవాడు; ఇదె= ఇపుడే; అవలీలన్= అనాయాసంగా; నినున్+పొలియించెడిన్= నిన్ను చంపుతున్నాడు; పలుకులు+ఉడిగి= మాటలు మాని; ధృతిన్= ధైర్యంతో; పోరాడు(ము)= యుద్ధం చేయుము.

**తాత్పర్యం:** 'మాటలతో బెదిరిస్తున్నావు. అంతమాత్రమేనా? కుంటుపడని భుజబలంతో దుర్యోధను డిదే అనాయాసంగా నిన్ను చంపగలడు. మాటలు మాని ధైర్యంగా యుద్ధం చేయుము.

**శా. వ్యూహాభావము సూచి నన్నసదుగా నూహించెదో భీమ! మ**
**ద్బాహాచండిమసారదుర్దమగదాదండంబు దృప్యద్భవ**
**ద్దేహోల్లాసము నెట్లు దీనదశకుం దే నోర్చునో చూడుమీ!**
**యాహా పుట్టెడు లాఁతి చూపఱకు; హాహా పుట్టు మీ వారికిన్. 248**

**ప్రతిపదార్థం:** భీమ!= ఓ భీమసేనా!; వ్యూహ+అభావము+చూచి= సైన్యంలేకుండాన్ని చూచి; నన్నున్+అసదుగాన్+ఊహించెదో?= నన్ను బలహీనుడిగా భావిస్తున్నావా?; మత్+బాహా చండిమసార= నా భుజబలంయొక్క శక్తి; దుర్దమ= అణచరాని; గదాదండంబు= గదాయుధం; దృప్యత్= గర్వించిన (బలంచేత); భవద్దేహ+ఉల్లాసమున్= ఒడలి ఉత్సాహాన్ని; ఎట్టు దీనదశకున్+తేన్+ఓపునో= ఏ విధంగా శోచనీయమైన స్థితికి తెస్తుందో; చూడుమీ!= చూడుమా!; లాఁతి చూపఱకున్= ఇతరులైన చూపరులకు; ఆహా పుట్టెడున్= ఆశ్చర్యం కలుగుతుంది; మీవారికిన్= మీవారందరికీ; హాహా పుట్టున్= దుఃఖం కలుగుతుంది.

**తాత్పర్యం:** నాకు సేనా సమూహం లేకుండటాన్ని చూచి నన్ను బలహీనుడవనుకొన్నావా? భీమసేనా! నా భుజబలసారమైన గదాదండం జయించరానిది. గర్వంతో నిండిన ఉత్సాహంతో కూడిన నీ శరీరాన్ని ఏ విధంగా దీనస్థితికి తెస్తుందో చూడుము. అది చూచే ఇతరులకు ఆశ్చర్యం కలుగుతుంది. మీవారందరికీ దుఃఖం కలుగుతుంది.

**ఉ. నా కెదురై పినాకియుఁ బినాకము వట్టక యుద్ధతిన్ గదా**
**భీకరవృత్తి చూపుటకుఁ బేర్చిన నెక్కుడు వేర్చి చీరికిం**
**గైకొన కే పడంచి భుజగర్వసమున్నతి నిర్వహింతు; నీ**
**కే కడ డాఁగ వచ్చు? గద నే నని సేయుటకుం గడంగినన్.' 249**

**ప్రతిపదార్థం:** గదన్= గదతో; ఏను= నేను; అని+చేయుటకున్+కడంగినన్= యుద్ధం చేయటానికి మొదలుపెట్టితే; నాకున్+ఎదురై= నన్నెదుర్కొని; పినాకియున్= ఈశ్వరుడుకూడా; పినాకము+పట్టక= పినాకమనే వింటిని పట్టుకోకుండా; ఉద్ధతిన్= గర్వంతో; గదా భీకరవృత్తిన్= భయంకరమైన గదయొక్క చేష్టను; చూపుటకున్= ప్రదర్శించుటకు; పేర్చినన్= విజృంభించగా; ఎక్కుడు పేర్చి= మిక్కిలి విజృంభించి; చీరికిన్+కైకొనక= లెక్కచేయకుండా; ఏపు+అడంచి= పొగరును పోకార్చి; భుజగర్వసమున్నతి నిర్వహింతున్= భుజములయొక్క గర్వాధిక్యాన్ని ప్రదర్శిస్తాను; (ఇపుడు) నీకున్+ఏకడన్+డాఁగన్+వచ్చున్= నీవు ఎక్కడ దాగటానికి సాధ్యమౌతుంది?

**తాత్పర్యం:** నేను గదతో యుద్ధం చేయటం మొదలుపెట్టితే ఈశ్వరుడు కూడా తన ధనుస్సయిన పినాకమును పట్టుకోకుండా భయంకరమైన గదాయుద్ధానికి విజృంభిస్తే, నేను అంతకంటె ఎక్కువ విజృంభించి లెక్క చేయకుండా శత్రువు పొగరును పోకార్చి భుజబలగర్వాధిక్యమును నడుపుతాను. నీ వెక్కడ దాగగలవు?'

**విశేషం:** అలం: అతిశయోక్తి, కావ్యార్థాపత్తి.

**వ. అని మఱియును.** **250**

**ప్రతిపదార్థం:** అని మఱియును= అంటూ ఇంకను.

**తాత్పర్యం:** అంటూ ఇంకా.

**క. 'గదఁగయ్య మెన్నఁడొకొ చే । యుదు భీమునితోడ? ననుచు నుల్లంబునఁ గో**
**రుదు నెపుడు; నిప్పడు నా । కది యొదవెన్ విధికృతిం; గృతార్థుఁడ నైతిన్.** **251**

**ప్రతిపదార్థం:** భీముతోడన్= భీముడితో; గదన్= గదతో; కయ్యము= యుద్ధం; ఎన్నఁడొకో?= ఏ దినమో?; చేయుదున్= చేసెదను; అనుచున్= అంటూ; ఉల్లంబునన్= మనసులో; ఎప్పుడున్= అన్నివేళలా; కోరుదున్= కోరుకొంటాను; విధికృతిన్= బ్రహ్మ పనివలన; ఇప్పుడు నాకున్+అది+ఒదవెన్= ఈ సమయాన నాకది సిద్ధించింది; కృతార్థుఁడన్+ఐతిన్= ధన్యుడనయ్యాను.

**తాత్పర్యం:** గద చేతబట్టి భీమసేనుడితో యుద్ధ మెపుడు చేస్తానా? - అని నా మనసులో ఎప్పుడూ కోరుకొంటాను. విధివశాన ఇపుడు నా కది సిద్ధించింది. ధన్యుడనయ్యాను.

**వ. నీ విట చక్కనయి రమ్ము.'** **252**

**ప్రతిపదార్థం:** నీ విట చక్కనయి రమ్ము= నీవు+ఈ కడకు సరిగా రమ్ము.

**తాత్పర్యం:** నీవు ఇక్కడకు సిద్ధంగా రమ్ము.'

**చ. అన విని యెల్లవారు భవదాత్మజు మెచ్చి నుతించి; రయ్యశో**
**ధనుఁ డరివీరు లట్లు ప్రథితంబుగఁ దన్ బొగడం బ్రమోది యై**
**వినుచుఁ బ్రవర్ధితం బయిన వీరగుణంబున నుల్లసిల్లె నా**
**తనిపయి భీముఁ డుద్యతగదాస్ఫురణన్ నడచెన్ నరేశ్వరా!** **253**

**ప్రతిపదార్థం:** నరేశ్వరా!= ఓ రాజా!; అనన్ విని= అనగా విన్నవారై; ఎల్లవారున్= అందరునూ; భవదాత్మజున్= నీ కుమారుడైన దుర్యోధనుడిని; మెచ్చి= మెచ్చుకొని; నుతించిరి= కీర్తించారు; ఆ+యశోధనుఁడు= ఆ కీర్తిసంపన్నుడు; అరివీరులు= శత్రువీరులు; అట్లు= ఆ విధంగా; ప్రథితంబుగన్+తన్+పొగడన్= ప్రఖ్యాతిగా తనను పొగడగా; ప్రమోది ఐ= సంతోషం కలవాడై; వినుచున్= వింటూ; ప్రవర్ధితంబు+అయిన= పెరిగిన; వీరగుణంబునన్= శౌర్యంతో; ఉల్లసిల్లెన్= సంతోషించాడు; ఆతని పయిన్= ఆతడి మీదకు; భీముఁడు= భీమసేనుడు; ఉద్యతగదాస్ఫురణన్= పైకెత్తిన గదయొక్క స్ఫూర్తితో; నడచెన్= తలపడటానికి నడచాడు.

**తాత్పర్యం:** (దుర్యోధనుడు యుద్ధానికి సిద్ధమై రమ్ము) అనగా విని అందరూ అతడిని మెచ్చుకొని పొగిడారు. ధృతరాష్ట్రమహారాజా! ఆ కీర్తిసంపన్నుడు (దుర్యోధనుడు) శత్రువీరులు ఆవిధంగా ప్రఖ్యాతిగా తనను పొగడగా ఆనందించి వింటూ వీరత్వపు పెంపుతో ఉల్లసిల్లినాడు. ఆతనిపై భీమసేనుడు గద పైకెత్తి నడచినాడు.

**వ. అప్పుడు కుంజరబృంహితంబులును హయహేషలునుం జెలంగె; నిట్లు తన మీఁద నడచు వడముడిం జూచి నీకొడు కదల్చుచు గదాసముల్లాసంబు భాసమానంబుగ వీఁక నెదుర్కొని తాఁకిన. 254**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయాన; కుంజరబృంహితంబులును= ఏనుగుల ఘీంకారశబ్దాలున్నూ; హయహేషలును= గుఱ్ఱాల సకిలింతలున్నూ; చెలంగెన్= ఒప్పినవి; ఇట్లు= ఈ విధంగా; తనమీఁదన్ నడచు= తనపైకి దూకుతున్న; వడముడిన్+ చూచి= భీమసేనుడిని చూచి; నీ కొడుకు= నీ కుమారుడు; అదల్చుచున్= బెదరిస్తూ; గదాసముల్లాసంబు= గదతో కూడిన సంతోషం; భాసమానంబుగన్= ప్రకాశించగా; వీఁకన్+ఎదుర్కొని తాఁకినన్= పరాక్రమంతో ఎదుర్కొని తాకగా.

**తాత్పర్యం:** ఆ సమయాన ఏనుగుల ఘీంకారాలూ, గుఱ్ఱాల సకిలింతలూ ధ్వనించాయి. ఈ ప్రకారంగా తనమీదకు దూకుతున్న భీమసేనుడిని చూచి, నీ కుమారుడు బెదరిస్తూ గదతో కూడిన సంతోషపు వెలుగుతో పరాక్రమంతో ఎదుర్కొని తాకగా. (తరువాతి పద్యంతో అన్వయం).

### భీమసేన దుర్యోధనుల గదాయుద్ధము (సం. 9-56-1)

**సీ. చండగదాపరస్పర ఘట్టనంబుల । మింటఁ బె ల్లడరెడుమంటగములఁ**
**బరమఘోరము లగు పదతాడనంబుల । నొలయు వసుంధరాచలనములను**
**నుద్భటక్రోధ సముద్రేకములఁ జూడ్కు । లం దుల్లసిల్లెడు నరుణరుచుల**
**దారుణధ్వను లగుతర్జనలీలలఁ । బరఁగుపర్వత గుహాప్రతిరవముల**

**తే. ననిమిషుల దృష్టు లిఱుమిట్లు గొనఁగ భుజగ । పతియుఁ గూర్మంబు సంకటపడఁగఁ దరణి**
**కిరణములు వెల్కఁ బాఱ దిక్కరులు బెదర । నొప్పె నత్తొలితాకు మహోగ్ర మగుచు. 255**

**ప్రతిపదార్థం:** చండగదా= భయంకరమైన గదల; ఘట్టనంబులన్= రాపిడులతో; మింటన్= ఆకాశాన; పెల్లు+అడరెడు= మిక్కిలి ఎక్కువైన; మంట గములన్= మంటల గుంపులచేతను; పరమ ఘోరములు+అగు= మిక్కిలి భయంకరాలు+అయిన; పదతాడనంబులన్= కాళ్ళతో కొట్టటంవలన; ఒలయు వసుంధరాచలనములను= భూకంపములచేతను; ఉద్భటక్రోధ సముద్రేకములన్= ఎక్కువైన కోపంతో కూడి ఉద్రేకాలతో; చూడ్కులందున్= చూపులలో; ఉల్లసిల్లెడు= ఒప్పే; అరుణరుచులన్= ఎఱ్ఱని కాంతులచేతను; దారుణధ్వనులు+అగు= భయంకరమైన శబ్దములుగల; తర్జనలీలలన్= బెదరింపులతో; పరఁగు= వ్యాపించిన; పర్వతగుహా ప్రతిరవములన్= కొండగుహల ప్రతిధ్వనులచేతను; అనిమిషుల దృష్టులు= రెప్పపాటులేని దేవతల చూపులు; మిఱుమిట్లు+కొనఁగన్= చెదరిపోగా; భుజగపతియున్= ఆదిశేషుడును; కూర్మంబున్= ఆదికూర్మమును (భూమిని మోయునటువంటి తాబేలు); సంకట పడఁగన్= కష్టపడగా (కలతనందగా); తరణి కిరణములు= సూర్యకిరణాలు; వెల్కన్+పారన్= (వెలుక+పాఱు) వెలవెలబోగా; దిక్కరులు బెదరన్= దిగ్గజాలు బెదిరిపోగా; ఆ+తొలితాఁకు= ఆ తొలిసారి ఎదుర్కొనటం (తొలిదెబ్బ); మహా+ఉగ్రము+అగుచున్= మిక్కిలి భయంకరంగా; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** భయంకరమైన గదలయొక్క తాకిడులతో, ఆకసంలో ఎక్కువగా మండే మంటల గుంపుచేత, మిక్కిలి ఘోరమైన కాలితాకిడికి భూకంపంతోను, ఎక్కువైన కోపం యొక్క ఉద్రేకాలతో ఎఱ్ఱని కంటి కాంతులచేతను, భయంకరమైన శబ్దాలు కలిగిన బెదరింపులతో ప్రతిధ్వను లిచ్చే కొండ గుహలచేతను, రెప్పపాటులేని దేవతల చూపులు బెదరిపోయేటట్లుగాను, భూభారం వహిస్తున్న ఆదిశేషుడు, తాబేలు కష్టపడేటట్లుగాను సూర్యకిరణాలు వెలవెలపోయేటట్లుగాను, దిగ్గజాలు భయపడగా, ఆ తొలితాకు భయంకరంగా ఒప్పింది.

**విశేషం:** అతిశయోక్తి.

**వ.** **ఇట్లు తలపడి మండలప్రచార వివిధ ప్రకారంబులం బుడమికిం జిత్రగదాసారణ బహుభంగుల నింగికిం గ్రొత్త యొ ప్పొలయం దమలావును వేగంబును నేర్పును దర్పంబును జూపఱకు వెఱఁగుఁ బుట్టింప నంతకంతకు నెక్కుడగు మదంబులం బొదలెడు బాహుదండంబుల బలనైపుణంబు లగ్గింపం బేర్చు బీరంబుల నొండొరుల సంరంభంబుల సరకుగొనక యక్కురుపాండవపుంగవులు జంభవాసవులచందంబునం బెనంగినం బలుదెఱంగు లైన గదా ప్రహతులం దునియలుఁ బఱియలుఁ దుముళ్ళునై సీసకంబులు కత్తళంబులు ధరాతలంబునం దొఱంగె; నట్టియెడ.** **256**

**ప్రతిపదార్థం:** ఇట్లు తలపడి= ఈ విధముగా ఎదుర్కొని; మండల ప్రచార వివిధ ప్రకారంబులన్= వలయాకారంగా విధాలుగా తిరుగుతూ; పుడమికిన్= భూమికి; చిత్ర+గదా+ఆసారణ+బహుభంగులన్= గదను త్రిప్పటంలో అనేకవిధాల చిత్రమైన పద్ధతిలో; నింగికిన్ క్రొత్త ఒప్పు+ఒలయన్= ఆకసానికి క్రొత్తసొగసు రాగా; తమ లావును వేగంబును= తమ తమ బలము, త్వర; నేర్పును దర్పంబును= ప్రజ్ఞయు, గర్వంబును; చూపఱకున్ వెఱఁగు+పుట్టింపన్= చూచేవారికి ఆశ్చర్యం కలిగించగా; అంతకున్+అంతకున్; ఎక్కుడు+అగు మదంబులన్ పొదలెడు= ఎక్కువైన గర్వాలతో ఒప్పిన; బాహుదండంబుల= దండములవంటి భుజాలయొక్క; బలనైపుణంబులు+అగ్గింపన్= బలం, నేర్పరితనం మెచ్చుకొనగా; పేర్చు= విజృంభించే; బీరంబులన్= ప్రగల్భాలతో ఒండొరుల సంరంభంబులన్= ఒకళ్ళొకళ్ళ గొప్పను లెక్కచేయక; ఆ+కురుపాండవ పుంగవులు= ఆ కురువంశ పాండవశ్రేష్ఠులు; జంభవాసవుల చందంబునన్= జంభాసుర ఇంద్రులవలె; పెనంగినన్= పోట్లాడగా; పలు తెఱంగులు+ఐన= అనేక విధాలైన; గదాప్రహతులన్= గదల దెబ్బలచేత; తునియలున్= ముక్కలుగను; పఱియలున్= బద్దలుగను; తుముళ్ళును+ఐ= చిన్నముక్కలుగను మారి; సీసకంబులు= కిరీటాలు; కత్తళంబులు= కవచాలు; ధరాతలంబునన్= భూమిపైన; తొఱంగెన్= దొర్లాయి; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదుర్కొని, చక్రాకారంగా పలురకాలుగా విచిత్రంగా గదలను త్రిప్పుతూ, భూమికి ఆకాశానికి ఒక క్రొత్త సొగసు ఒప్పేటట్లుగా తమ బలాన్ని వేగాన్ని తెలివిని గర్వాన్ని చూచేవారికి ఆశ్చర్యం కలిగేటట్లుగా అప్పటప్పటికి ఎక్కువైన అహంకారంతో ఒప్పిన భుజబలం యొక్క నేర్పరితనాన్ని పొగడగా విజృంభించి, వీరత్వంతో ఒకరు మరియొకరి ఉత్సాహాన్ని లెక్కచేయక, ఆ కౌరవ పాండవశ్రేష్ఠులు జంభేంద్రుల వలె పోట్లాడగా పలు రకాలైన గదల దెబ్బలచేత ముక్కలు ముక్కలైన కిరీటాలు, కవచాలు భూమిమీద దొర్లాయి. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ.** **ఒకది క్కుద్ధతిఁ బూన్చి యొండుదెస వ్రేయున్ మేను వంచించి వ్రేఁ**
**తకుఁ దప్పన్ వడివ్రేయు నొడ్డనమునం దప్పించి వేగంబు గుం**
**దక నొప్పించుఁ జలం బెలర్పఁగ గదాదండంబు దూలించుఁ బాం**
**డుకుమారుం డుఱ కట్లు కౌరవవిభుండుం గేలి సల్పుం దగన్.** **257**

**ప్రతిపదార్థం:** ఒక దిక్కు+ఉద్ధతిన్+పూన్చి= ఒక వంక గర్వంతో చూపి; ఒండు దెసన్ వ్రేయున్= ఇంకో దిక్కునకు విసరును; మేను వంచించి= ఒడలను తప్పించి; వ్రేఁతకున్= వేసిన దెబ్బకు; తప్పన్= తప్పిపోగా; వడిన్ వ్రేయున్= శీఘ్రంగా దెబ్బకొట్టును; ఒడ్డనమునన్ తప్పించి= వ్యూహం నుండి తప్పించి; వేగంబు+కుందక= తొందర తగ్గకుండా; నొప్పించున్= బాధపెట్టుతాడు;

చలంబు= మాత్సర్యం; ఎలర్పఁగన్= తెలియగా; గదాదండంబున్= గదను; తూలించున్= ఆడించును; పాండు కుమారుండు= భీమసేనుడు; ఉఱక= లక్ష్యపెట్టక; అట్లు= అదే ప్రకారంగా; కౌరవవిభుండున్= దుర్యోధనుడుకూడ; తగన్= తగినట్లుగా; కేళిసల్పెన్= యుద్ధక్రీడను చేశాడు.

**తాత్పర్యం:** ఒక ప్రక్కకు చూపి మరొక ప్రక్కకు వేస్తూ శరీరాన్ని తప్పించి దెబ్బ తప్పగా శీఘ్రంగా వేస్తూ వ్యూహం నుండి తప్పించి త్వరతగ్గకుండా బాధిస్తూ, మత్సరం అతిశయించగా గదాదండాన్ని ఆడిస్తూ భీమసేనుడు అట్లా దూకగా, దుర్యోధనుడు కూడా తగినట్లుగా యుద్ధం చేశాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి.

**వ. మఱియును శిక్షావిశేషంబులు వెలయ నుల్లసిల్లి. 258**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను; శిక్షావిశేషంబులు= తమ తమ అభ్యాసాల యొక్క గొప్ప; వెలయన్= ప్రఖ్యాతంకాగా; ఉల్లసిల్లి= విజృంభించి.

**తాత్పర్యం:** ఇంకా ఇరువురూ తమ తమ విద్యాభ్యాసాలు ప్రకాశించగా విజృంభించి.

**మ. గదతోడన్ గద చుట్టి రాఁ దిగుచుచున్ గం డొప్ప లంఘించి మా**
**ఱు దెసల్ గైకొనుచుం గడంగి పలుమాఱుం దాఁకుచుం బాయుచుం**
**బదబాహాకటిమధ్యవక్షముల సంభావ్యత్వరాచిత్రితో**
**న్మదనానాగతరేఖలన్ మెఱయ భీమత్వత్సుతుల్ దీప్తు లై. 259**

**ప్రతిపదార్థం:** గదతోడన్ గద చుట్టిరాన్= గదతో గద తిరిగి రాగా (అనగా త్రిప్పెడు గదతో మరియొకని గదకూడ త్రిప్పుచు); తిగుచుచున్= లాగుతూ; గండు+ఒప్పన్= మగటిమి అతిశయించగా; లంఘించి= దూకి; మాఱుదెసన్ కైకొనుచున్= దిక్కులు మారుస్తూ; కడంగి= ప్రయత్న పూర్వకంగా; పలుమాఱున్= అనేక పర్యాయాలు; తాఁకుచున్ పాయుచున్= తగులుతూ దూరమౌతూ; పద= పాదాలు; బాహా= చేతులను; కటిమధ్య= నడుముభాగాన; వక్షములన్= గుండెలలోను; సంభావ్యత్వరా= కలిగే సంభ్రమంతో; చిత్రిత= బొమ్మవలె; ఉన్మద= దర్పంయొక్క; నానాగత రేఖలన్= అనేక విధాలైన గుర్తులతో; మెఱయ= ప్రకాశించే; భీమ= భీమసేనుడును; త్వత్+సుతుల్= నీ కుమారుడును; దీప్తులై= వెలుగుతూ.

**తాత్పర్యం:** గదతో గద చుట్టుకొని రాగా లాగుతూ, మగటిమి అతిశయించగా దూకుతూ, ప్రక్కదిక్కులు చూస్తూ, ప్రయత్నంతో అనేక పర్యాయాలు ఒకరిని మరొకరు తాకుతూ, దూరంగా పోతూ, పడగా భుజాలను, నడుము మధ్యభాగాన గుండెపైన వేగిరపాటుతో కూడిన బొమ్మ గీసినట్లు అనేక రకాలైన చేష్టలతో, దర్పంతో మెరిసే భీమసేనుడూ, నీ కుమారుడూ ప్రకాశించినవారై - (తరువాతి పద్యంతో న్వయం.)

**విశేషం:** అలం: స్వభావోక్తి. ఇక్కడ 'మెఱయు' క్రియకాదు. ధాతుజ విశేషణం.

**ఉ. తప్పినయప్డు వ్రేటు దముఁ దాఁకినయప్పు డనేక భంగులై**
**యొప్పలు బల్పులున్ మెఱయ నుల్లములన్ సకలాంగకంబులం**

**గప్పఁ దలిర్చు కోపములఁ గ్రమ్మెడు రక్తములన్ సురవ్రజం**
**బప్పటి కప్డు వింత యగునచ్చెరు వొందఁగఁ బోరి రేపునన్.** **260**

**ప్రతిపదార్థం:** తప్పినఅప్డు= తమ గురి తప్పినప్పుడు; వ్రేటు= దెబ్బ; తమున్+తాఁకిన అప్డు= తమను తాకినప్పుడు; అనేక భంగులు+ఐ= నానావిధాలుగా; ఒప్పులు బల్పులున్= ఒప్పుట అధిక్యాలూ; ఉల్లములన్= మనసులలో; మెఱయన్= ప్రకాశించగా; సకల+అంగకంబులన్ కప్పన్= శరీరాలలోని అన్ని భాగాలను క్రమ్ముకోగా; తలిర్చు కోపములన్= కానవచ్చే కోపాలతోను; క్రమ్మెడు రక్తములన్= క్రమ్ముకున్న నెత్తుటితోను; అప్పటికప్పుడు= వెనువెంటనే; సురవ్రజము= దేవతాసమూహం; వింత అగు= వింత అయిన; అచ్చెరువు+ఒందఁగన్= ఆశ్చర్యాన్ని పొందగా; ఏపునన్ పోరిరి= పరాక్రమంతో పోట్లాడినారు.

**తాత్పర్యం:** తమ గురిపెట్టిన దెబ్బ తప్పినప్పుడు ఆ దెబ్బ తమను తాకినప్పుడు అనేకవిధాలయిన ఒప్పు, బలుపు వికసించగా మనస్సులను, శరీరంలోని భాగాలన్నీ కప్పుకొనగా చిగిర్చిన కోపాలవలన క్రమ్ముకొనే నెత్తుటిని చూచి దేవతా సమూహాలు ఆశ్చర్యంతో అప్పటికప్పుడు వింతగా చూస్తుండగా పౌరుషంతో యుద్ధం చేశారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి.

**వ. ఆ సమయంబున.** **261**

**తాత్పర్యం:** అప్పుడు.

**సీ. వితతవీరాగ్రహావేశాదిదర్పిత । చిత్తులై యొండొరు నొత్తరించు**
**నుగ్రమహోద్ధతి నుద్భటాటోపతీ । వ్రములగు సమరవిభ్రమము లంగ**
**సంగతంబులు గాఁగ జయవాంఛనాత్మర । క్షణములవలని నైపుణము లెడలు**
**టయు, ననర్గళ నిరూఢప్రహారంబులం । దంద బెట్టిరువురయందు సూడు**

**తే. పడఁగఁ దాఁకిన శోణిత ప్రసరణంబు । నిరతిశయ మైన వెడ సోలి నిలిచి గదలు**
**వామకరముల నూఁదియు వారు మగుడఁ । బోరి కెలయుట నిర్భరాద్భుతము సేసె.** **262**

**ప్రతిపదార్థం:** వితత= విస్తారమైన; వీర= వీరత్వమును; ఆగ్రహ+ఆవేశ= కోపం, ఉద్వేగం; ఆది= మొదలైన దానిచేత; దర్పిత చిత్తులు+ఐ= గర్వంతో కూడిన మనస్సు కలవారై; ఒండొరున్= ఒకరికొకరు; ఒత్తరించున్= అతిశయించును(ఆక్రమించును); ఉగ్రమహా+ఉద్ధతిన్= భయంకరమైన దర్పంతో; ఉద్భట ఆటోప తీవ్రములు+అగు= గర్వముయొక్క ఆర్భాటంచేత తీవ్రములైన; సమరవిభ్రమములు= యుద్ధపు చేష్టలు; అంగసంగతంబులు కాఁగన్= శరీరంతో కూడి ఉండగా; జయవాంఛన్= జయంపై కోరికతో; ఆత్మరక్షణముల వలని= తననుతాను కాపాడుకొనే; నైపుణములు= నేర్పరితనాలు; ఎడలుటయున్= పోవటమును; అనర్గళ= అడ్డులేని; నిరూఢ ప్రహారంబులు= గట్టిదెబ్బలు; అందంద= అక్కడక్కడ; ఇరువుర అందున్= భీమదుర్యోధను లిద్దరియందును; బెట్టు= మిక్కిలి; సూడుపడఁగన్= గాయమయ్యేటట్లు; తాఁకినన్= తగులగా; శోణిత-ప్రసవణంబు= రక్తస్రావం; నిరతిశయము+ఐనన్= ఎక్కువకాగా; వెడ= ఇంచుక; సోలి= మూర్ఛిల్లి; నిలిచి= ఆగి; గదలు= చేలియందలి గదాయుధాలు; వామకరములన్+ఊఁదియున్= ఎడమచేతులతో నొక్కిపట్టియు; వారు; మగుడన్+పోరికిన్+ఎలయుట= మరల యుద్ధమునకు ప్రయత్నించుట; నిర్భర+అద్భుతము చేసెన్= ఎక్కు వైన ఆశ్చర్యాన్ని కలిగించింది.

**తాత్పర్యం:** విస్తారమైన వీరత్వంతో కోపావేశాలతో మదించిన మనస్సులతో ఒకరినొకరు తప్పించుకొంటూ భయంకరమయిన గర్వాధిక్యం, ఆర్భాటపు ఆధిక్యం కలిగిన యుద్ధపు వికారాలు శరీరంతో కలసిపోగా జయవాంఛతో తమను కాపాడుకొనే నేర్పరితనం సడలిపోగా సాటిలేని గదలయొక్క దెబ్బలవలన అక్కడక్కడ ఇద్దరి శరీరాలలో గాయాలు తగులగా ఆ గాయాలనుండి కారే నెత్తురు వలన ఇంచుక సొమ్మసిల్లి నిలిచి గదలను ఎడమచేతితో ఊదుకొని కూడా మరల వారు యుద్ధానికి ప్రయత్నించటం మిక్కిలి అద్భుతంగా కానవచ్చింది.

**విశేషం:** అలం: స్వభావోక్తి.

**వ. ఇట్లు ధైర్యధుర్యోత్సాహంబులం బొదలి. 263**

**తాత్పర్యం:** ఈ విధంగా ధైర్యంతోడి ఉత్సాహంతో ఒప్పి.

**శా. రౌద్రోల్లాసము మూర్తి సంకలన ఘోరంబై పొరిం బేర్చె నా**
**నుద్రిక్తం బగునూత్నరక్తమున మగ్నోన్మగ్నతం బొల్చి త**
**ర్జద్రూపోగ్రగదాయుగంబు విసరత్సంధ్యాంబుదద్వంద్వభా**
**స్వద్రేఖాలలితంబు చెన్నువడసెన్ వారిద్దఱుం బోరఁగన్. 264**

**ప్రతిపదార్థం:** వారు+ఇద్దఱున్= భీమదుర్యోధను లిరువురూ; పోరఁగన్= యుద్ధం చేస్తూ ఉండగా; రౌద్ర+ఉల్లాసము= కోపముయొక్క ఉత్సాహం; మూర్తి సంకలన ఘోరంబు+ఐ= ఆకారంతో కూడుకొనియుండుటచేత భయంకరమై; పొరిన్ పేర్చెన్+నాన్= మిక్కిలి అతిశయించినదా అన్నట్లు; ఉద్రిక్తంబు+అగు= ఉద్రేకంతో కూడిన; నూత్నరక్తమునన్= క్రొత్తనెత్తుటిలో; మగ్న+ఉన్మగ్నతన్+పొల్చి= మునిగి తేలటంతో ఒప్పి; తర్జత్+రూప= భయపెట్టుచున్న ఆకారంచేత; ఉగ్రగదాయుగంబు= భయంకరమైన గదల జంట; విసరత్= విశేషంగా కదలుతున్న; సంధ్యా+అంబుద= సంధ్యాకాల మేఘాల; ద్వంద్వ= జంటయొక్క; భాస్వత్+రేఖా - లలితంబు= ప్రకాశిస్తున్న విలాసంచేత మనోహరమయినది; చెన్ను+పడసెన్= అందం పొందింది.

**తాత్పర్యం:** ఆకృతి వహించిన రౌద్రంయొక్క ఉత్సాహం రూపందాల్చటంచే భయంకరంగా యుద్ధంలో విజృంభించినదా? అన్నట్లు వెలికి వచ్చే క్రొత్తనెత్తుటిలో మునిగి తేలటంతో ఒప్పి బెదరించుచున్న తగిన భయంకరమైన గదల జంట సంధ్యాకాలంలో వ్యాపించిన మేఘాల జతయొక్క ప్రకాశించే రేఖలచేత వారిద్దరు పోట్లాడగా అందాన్ని సంతరించుకొన్నది.

**విశేషం:** ఉత్ప్రేక్ష, ఉపమ.

**క. సుర లచ్చెరువును మెచ్చును । బిరికొనుచిత్తములతోడఁ బెద్దయుఁ బ్రొ ద్ద**
**య్యిరువుర గెలుపోటమి తెఱఁ । గరసి నిరూపింపనేరరైరి నరేంద్రా! 265**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా!; సురలు= దేవతలు; అచ్చెరువును= ఆశ్చర్యమూ; మెచ్చును= మెప్పుకోలూ; పిరికొను చిత్తములతోడన్= పెనవేసుకొన్న మనస్సులతో; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; ఆ+ఇరువుర గెలుపు, ఓటమి తెఱఁగు+అరసి= ఆ ఇద్దరి యొక్క జయాపజయాల విధమును గుర్తించి; నిరూపింపనేరరైరి= చెప్పలేకపోయారు.

**తాత్పర్యం:** ఓ రాజా! దేవతలు ఆశ్చర్యాన్ని, మెప్పును పెనవేసుకొన్న మనస్సులతో చాలాసేపు వారిద్దరి జయాపజయాలను చూచి ఇదమిత్థమని నిర్ణయించలేకపోయారు.

**తే.** **అప్పు డప్పుడ తలపడినట్టు లప్ప। డేచి విలసిల్లు మేనుల యెఱ్ఱచెలువు**
**గలయఁ బూచిన నడ మ్రోదువులఁ దలంపఁ। బట్టుగా నొప్పె నధిప! నీపట్టిదోయి.** **266**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; అప్పుడప్పుడ తలపడినట్టులు= అపుడపుడే ఎదురుకొన్నట్లుగా; అప్పుడు= ఆ సమయాన; ఏచి= విజృంభించి; విలసిల్లుమేనుల= ప్రకాశించే శరీరాలయొక్క; ఎఱ్ఱచెలువు= ఎఱ్ఱని అందం; కలయన్+పూచిన= అంతటా విరబూచిన; నడమ్రోదువులన్+తలంపన్= నడచే మోదుగుచెట్లతోడి పోలికను తలపించటానికి స్థానంగా; పట్టు కాన్; నీ పట్టిదోయి= నీ కుమారద్వయం; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** ఓ రాజా! అపుడపుడే ఎదురయినట్లుగా ఆ సమయంలో విజృంభించి ప్రకాశించే ఒడళ్ళు ఎఱ్ఱగా అందంగా విరబూచిన నడయాడు మోదుగుచెట్లను తలపించేటట్లు ఒప్పాయి. నీ కొడుకులు ఇద్దరూ అట్లా వెలిగారు.

**విశేషం:** అలం: స్మృతి.

**వ.** **ఇవ్విధంబున నొండొరులకు వట్రపడక యమ్మేటిమగలు సాటోపసంరంభంబులం బెనంగి; రందు గాంధారీనందనుండు వలపలించి చుట్టుకొని రా నది సరకుసేయక బకవైరి దాపలించి తిరిగినం బెరిఁగిన యీరసంబున నుల్లసితుం డై యాభూవల్లభుం డతనిబరియెముక లగల వ్రేసిన, నవ్వీరుం డక్కౌరవపతి కరంబుతో నగ్గద బీఱువోవ వ్రేయం బాయక మగుడం బూన్చి సారించినం దోరంపు మెఱుంగు లెసంగం జెలంగుశబ్దంబులు నింగి ముట్ట బెట్టిదంబుగఁ దా వెరవునం దిరిగి యద్ధరణీశుండు శిరస్తాడనంబు సేసెఁ, జేసినం గౌంతేయుండు గంపింపమి యక్కజం బై యుండె; నంత నగ్గలం బగునలుక నవ్వడముడి పుడమి ఱేనివెడఁద యురం బుపలక్షించి లాఘవఘోరంబుగ గదాదండంబు ద్రిప్పి వైన, నాతం డది మేనినుసులునం దప్పింప నది యిల చలింపం బడిన నన్నుసులు తెఱపిన యురికి యద్భుతవేగుం డగు నావాయుపుత్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు తదీయ వక్షఃస్థలంబు దారుణప్రహారంబున నొప్పించిన నతండు పాండవపాంచాలుర చిత్తంబులు దూలసోలియు, నాలోనన తెలివొంది బలవిక్రమంబులు మెఱయ నమ్మేదినీపతి పార్శ్వభాగంబు బెట్టడిచిన మ్రోఁకరిలంబడియును వీఁక చెడక యెగసి యజ్జగతీపతి తన్ను నగుచు నార్చుపగతురు సిగ్గువడ నగ్గలికసొంపు పొంపిరివోవఁ బవనతనయుఫాలకర్ణ మధ్యప్రదేశంబు పటుప్రహతిం బగిల్చిన నొల్లంబోయి శీఘ్రంబునం దేరి యమ్మహాబలనందనుండు గండతలంబునం దొరుఁగునెత్తు రనుమదంబున మత్తకరి ననుకరించుచుఁ దుండంబు చందంబునం జెలు వొందుగద యల్లార్చి పేర్చి వ్రేటుగొనిన మెడకెలను దాఁకి నీకొడుకు మహాపవనపతితం బగు సాలంబు పోలికిం గూలినం గని ధర్మ పుత్రప్రముఖులు ప్రమోదంబు నొందిరి; గ్రక్కున లేచి కాలాకారుం డై ధాత్రీనాథుఁడు చిత్రభ్రమణంబుల వెగడుపఱిచి పలువ్రేటుల నొప్పించినం గిమ్మీరవైరి వసుధం ద్రెళ్ళుటయు నది సొవుగాఁ గొని**

**యక్కురుసింహుండు సింహనాదంబు సేయ నవ్వాయుసుతుండు సావమి యెఱింగి యాభూపతి పెనంగుభంగియుఁ గనుంగొని మెచ్చి సురప్రకరంబులు పుష్పవర్షంబు గురియం బరులకుం భయం బొలసె; నంతం దెలిసి భీమసేనుం డుద్వృత్తలోచనుం డై వీరావష్టంభంబునం బొలిచె; నప్పుడు సాత్యకి ధృష్టద్యుమ్న నకులసహదేవు లే లేమి? యని సుయోధను సంగ్రామంబునకుం బిలిచిన విని యా వృకోదరుండు వారల వల దని వారించి విగతఖేదుం డగుచు నాకేశుండు నముచిం దాఁకిన తెఱంగున రారాజుం దలపడి బహుచిత్రగతులం జరింపం జూచి సవ్యసాచి జనార్దనున కి ట్లనియె. 267**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ఒండొరులకున్+వశపడక= ఒకరికొకరు వశపడకుండా; ఆ+మేటిమగలు= ఆగొప్పవీరులు; సాటోప సంరంభంబులన్+పెనంగిరి= ఆర్భాటంతో తొందరతో యుద్ధం చేశారు; అందున్+గాంధారీ నందనుండు= వారిలో దుర్యోధనుడు; వలపలించి= కుడివైపు నుండి; చుట్టుకొనిరాన్= తిరిగిరాగా; అది సరకు చేయక= దానిని లెక్కపెట్టకుండా; బకవైరి= భీమసేనుండు; దాపలించి= ఎడమవైపునుండి; తిరిగినన్= తిరిగిరాగా; పెరిఁగిన ఈరసంబునన్= ఎక్కువైన కోపంతో; ఉల్లసితుండు+ఐ= ఉత్సాహిఅయి; ఆ భూవల్లభుండు= ఆ దుర్యోధనుడు; అతని బరిఎముకలు= ఆ భీముడి ప్రక్క ఎముకలు; అగలన్+వ్రేసినన్= విరిగేటట్లు కొట్టగా; ఆ+వీరుండు= ఆ భీముడు; ఆ+కౌరవపతి= ఆ దుర్యోధనుడి; కరంబుతోన్= చేతితో; ఆ+గద బీఱు+పోవన్+వ్రేయన్+పాయక= ఆ గద వ్యర్థమయ్యేటట్లు కొట్టినను, విడువక; మగుడన్+ పూన్చి= మరల ప్రయత్నించి; సారించినన్= విసరగా; తోరంపు మెఱుంగులు= దట్టమయిన నిప్పురవ్వలు; ఎసంగన్+చెలంగు శబ్దంబులు= ఎక్కువగా మ్రోసే శబ్దాలు; నింగి ముట్టన్= ఆకాశమంటి తాకగా; బెట్టిదంబుగన్= గట్టిగా; తాన్+వెరవునన్+తిరిగి= తాను ఉపాయంతో మరలి; ఆ+ధరణీశుండు= ఆ దుర్యోధనుడు; శిరస్తాడనంబు+చేసెన్= తలతో కొట్టెను; చేసినన్= చేయగా; కౌంతేయుండు= భీమసేనుడు; కంపింపమి+అక్కజంబు+ఐ+ఉండెన్= భయంతో వణకకుండటం ఆశ్చర్యంగా ఉండినది; అంతన్= ఆ మీద; అగ్గలంబు+అగు+అలుకన్= ఎక్కువైన కోపంతో; ఆ+వడముడి= ఆ భీమసేనుడు; పుడమిఱేని= రాజైన దుర్యోధనుడి; వెడఁదఉరంబు+ఉపలక్షించి= విశాలమైన ఎదురురొమ్మును గురిచూచి; లాఘవ ఘోరంబుగన్= తేలికగా భయమును కలిగిచేటట్లుగా; గదాదండంబు త్రిప్పి వైవన్= గదను గిరగిర త్రిప్పికొట్టగా; ఆతండు= దుర్యోధనుడు; అది= ఆ దెబ్బను; మేనిన్+నుసులునన్+తప్పింపన్= శరీరాన్ని లాఘవంతో తప్పించగా; అది= ఆ గద; ఇల చలింపన్+పడినన్= భూమి కదలగా క్రింద పడగా; ఆ నుసులు తెఱపిన= ఆ లాఘవపు అవకాశంలో; ఉఱికి= దూకి; అద్భుత వేగుండు+అగు= ఆశ్చర్యము కల్గించే త్వర కలవాడైన; ఆ+వాయుపుత్రుండు= ఆ భీముడు; గద పుచ్చుకొని= గదను తీసికొని; తిరుగు సందునన్= తిరిగే వ్యవధిలో; దుర్యోధనుండు తదీయ వక్షస్+స్థలంబున్= దుర్యోధను డా భీముడి గుండెలను; దారుణ ప్రహారంబునన్= భయంకరమైన దెబ్బతో; నొప్పించినన్= బాధించగా; అతండు= ఆ భీముడు; పాండవ పాంచాలుర చిత్తంబులు= పాండవులయు, పాంచాలురయు, మనసులు; తూలన్= తూలిపోగా; సోలియున్= సొమ్మసిల్లినప్పటికినీ; ఆలోనన= అంతలోనే; తెలివి+ఒంది= ప్రజ్ఞ తెలిసి; బలవిక్రమంబులు మెఱయన్= బలమును, శౌర్యమును ప్రకాశించగా; ఆ+మేదినీపతి= ఆ దుర్యోధనుడి; పార్శ్వభాగంబున్= ప్రక్కలను; బెట్టు+అడిచినన్= మిక్కిలిగా కొట్టగా; మ్రోఁకరిలన్+పడియున్= బోరగిల క్రిందబడినను; వీఁక చెడక= పరాక్రమం చెదరకుండా; ఎగసి= మీదకు ఎగిరి; ఆ+జగతీపతి= ఆ రాజు; తన్ను నగుచున్+ ఆర్చుపగతురు= తన్ను జూచి పరిహసిస్తూ గర్జనం చేసే శత్రువులు; సిగ్గుపడన్= సిగ్గుతో తలవంచగా; అగ్గలిక సొంపు= దూకుడుపాటి యొక్క సొగసు; పొంపిరి పోవన్= నశించగా; పవనతనయు ఫాల కర్ణ మధ్య ప్రదేశంబు= భీమసేనుడి వెన్నుదురు, చెవులయొక్క నడిమిభాగం; పటు ప్రహతిన్+పగిల్చినన్= పెనుదెబ్బతో పగిలేటట్లు కొట్టగా; ఒల్లన్+పోయి= మూర్ఛిల్లి; శీఘ్రంబునన్+తేఱి= త్వరగా తేరుకొని; ఆ+మహాబలనందనుండు= ఆ వాయుదేవకుమారుడైన భీముడు; గండతలంబునన్+తొరుఁగు నెత్తురు= చెంపలనుండి జాలువారే నెత్తురు; అను మదంబునన్= అనే మదధారతో; మత్తకరి ననుకరించుచున్= మదపుటేనుగును అనుకరిస్తూ; తుండంబు చందంబునన్= తొండంవలె; చెలువొందు= సొగసైన; గదఅల్లార్చి=

గదను ఆడించి; పేర్చి= విజృంభించి; వ్రేటుకొనినన్= దెబ్బవేయగా; మెడకెలనున్ తాఁకి= మెడ ప్రక్క తగిలి; నీకొడుకు= నీ కుమారుడు; మహాపవనపతితంబు+అగు= పెనుగాలికి క్రిందపడిన; సాలంబు పోలికిన్+కూలినన్= మద్దిచెట్టువలె పడిపోగా; కని= చూచి; ధర్మపుత్రప్రముఖులు= ధర్మరాజు మొదలైన వారు; ప్రమోదంబున్+ఒందిరి= సంతోషించారు; గ్రక్కునన్ లేచి= శీఘ్రంగా లేచి; కాల+ఆకారుండు+ఐ= యముడివలె; ధాత్రీనాథుఁడు= దుర్యోధనుడు; చిత్రభ్రమణంబులన్= చిత్రంగా తిరగటం వలన; వెగడుపఱిచి= భయం కలిగించి; పటువ్రేటులన్ నొప్పించినన్= పెక్కు దెబ్బలతో బాధించగా; కిమ్మీరవైరి= కిమ్మీరునకు శత్రువైన భీముడు; వసుధన్+త్రెళ్ళుటయున్= భూమిమీద పడగా; అది చావుగాన్+కొని= అది చావటంగా భావించి; ఆ+కురుసింహుండు= ఆ దుర్యోధనుడు; సింహనాదంబు చేయన్= సింహగర్జనం చేయగా; ఆ+వాయుసుతుండు= ఆ భీముడు; చావమి ఎఱింగి= చనిపోకుండటం తెలిసికొని; ఆ భూపతి= ఆ రాజు; పెనంగు భంగియున్= పెనగులాడేవిధాన్ని; తెలిసికొని= తెలిసికొన్నవారై; మెచ్చి= మెచ్చుకొని; సురప్రకరంబు= దేవతల సమూహాలు; పుష్పవర్షంబు కురియన్= పూలవాన కురిపించగా; పరులకున్ భయంబు+ఒలసెన్= ఇతరులకు భయము కలిగింది; అంతన్+తెలిసి= అంతలో ప్రజ్ఞ వచ్చినవాడై; భీమసేనుండు= భీముడు; ఉద్వృత్తలోచనుండు+ఐ= వెలికి ఉబ్బిన కన్నులు కలవాడై; వీర+అవష్టంభంబునన్+పొలిచెన్= వీరాహంకారంతో వెలిగాడు; అప్పుడు= ఆ సమయంలో; సాత్యకి ధృష్టద్యుమ్న నకుల సహదేవులు= సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, నకులుడు, సహదేవుడును; ఏమి+అని= ఏమిరా అంటూ; సుయోధను సంగ్రామంబునకున్ పిలిచినన్= దుర్యోధనుడిని యుద్ధానికి పిలువగా; విని= విన్నవాడై; ఆ వృకోదరుండు= ఆ భీముడు; వారలన్+వలదు+అని వారించి= వద్దని వారిని అడ్డుకొని; విగత ఖేదుండు+అగుచున్= కష్టంలేనివాడై; నాకేశుండు= ఇంద్రుడు; నముచిన్+తాఁకిన తెఱంగునన్= నముచిఅనే రాక్షసుడిని ఎదుర్కొన్నట్లుగా; రారాజున్+తలపడి= దుర్యోధనుడిని ఎదుర్కొని; బహుచిత్ర గతులన్+చరింపన్= అనేక విధాలుగా తిరుగగా; చూచి= చూచినవాడై; సవ్యసాచి= అర్జునుడు; జనార్దనునకున్+ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఒకరికొకరు తీసిపోకుండా ఆ మొనగాళ్ళు ఈ విధంగా ఆటోపసంరంభాలతో పోట్లాడారు. వారిలో దుర్యోధనుడు కుడివైపునకు చుట్టుకొని రాగా దానిని లెక్కించకుండా భీముడు ఎడమవైపునకు తిరుగగా ఈర్ష్యతో ఉత్సాహం కలవాడై ఆ రాజు వాని ప్రక్క ఎముకలను విరిగేటట్టుకొట్టాడు. అందుకా వీరుడైన భీముడు ఆ దుర్యోధనుడిని ఆ దెబ్బను వృథా చేశాడు. వదలకుండా మరల పూనికతో విసరివేయగా కలిగిన దట్టమైన శబ్దాలు ఆకాశన్నంటాయి. అందు భీముడేమాత్రం జంకలేదు. అది అందరికీ ఆశ్చర్యంగా తోచింది. అంతట ఎక్కువ కోపంతో ఆ భీముడు రాజుయొక్క విశాలమైన వక్షఃస్థలాన్ని గురిగా చేసి భయంకరమైన గదాదండాన్ని త్రిప్పి కొట్టగా అతడు దానిని శరీరాన్ని త్రిప్పటంవలన తప్పించుకొన్నాడు. అది భూమిని గడగడలాడించింది. ఆ స్వల్ప వ్యవధానంలో మిక్కిలి వేగంగా భీముడు గదతో తిరిగే సమయాన దుర్యోధనుడు వాడిగుండెను దారుణ మయిన దెబ్బతో బాధించాడు. అందు కాతడు పాంచాల పాండవుల మనస్సులు తూలిపోగా సోలికూడా, అంతలోనే ప్రజ్ఞ దెలిసి బలపరాక్రమములు వికసించగా నా దుర్యోధనుడి ప్రక్కలలో తీవ్రమైన దెబ్బ కొట్టగా బోర్లపడికూడా ధైర్యం చెడకుండా రారాజు, తనను అపహసించే శత్రువులు సిగ్గుపడగా సొగసు నశించగా, భీమసేనుడి నుదురు చెవి మధ్య భాగాన్ని తీవ్రమైన దెబ్బతో పగులకొట్టగా మూర్ఛిల్లాడు. అయినా వెంటనే తేరికొని ఆ భీముడు చెంపలమీద జాల్వారే నెత్తురనే మదజలంతో కూడిన మదపుటేనుగును అనుకరిస్తూ, తొండంవలె అందంగా ఒప్పారే పెద్ద గదను త్రిప్పుతూ విజృంభించాడు. అది అప్పటికే దెబ్బతిన్న మెడ ప్రక్కభాగాన్ని తాకగా, నీ కొడుకు పెనుగాలికి క్రిందపడిన మద్దిచెట్టువలె కూలిపోయాడు. అది చూచి ధర్మరాజు మొదలైనవారు సంతోషించారు. అపుడు వెంటనే లేచి యముడివలె రారాజు విచిత్ర గతులతో బెదిరించి పెక్కు దెబ్బలతో బాధించగా భీముడు భూమిమీద పడగా,

దానిని చావుగా తలచి ఆ దుర్యోధనుడు సింహనాదం చేశాడు. భీముడు చావకుండా ఉండటం గ్రహించి, దుర్యోధనుడు యుద్ధం చేసిన విధాన్ని చూచి మెచ్చి దేవతా సమూహాలు పూలవాన కురిపించగా శత్రువులకు భయం కలిగింది. అంత ఒళ్ళు తెలిసి భీముడు పైకి సుళ్ళు తిరుగుతున్న చూపులతో వీరత్వం ఉట్టిపడగా ఒప్పారాడు. ఆ సమయంలో సాత్యకి ధృష్టద్యుమ్న నకుల సహదేవులు ఏమి! ఏమి! అని దుర్యోధనుడిని యుద్ధానికి పిలువగా విని భీముడు వారలను వలదని వారిస్తూ దుఃఖంలేనివాడయి, ఇంద్రుడు నముచిని ఎదుర్కొన్న విధంగా రారాజుతో తలపడి వివిధగతులతో పోరుతూ ఉండగా చూచి అర్జునుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: స్వభావోక్తి, ఉపమ.

### శ్రీకృష్ణుఁ డర్జునునితో భీమదుర్యోధనుల తారతమ్యంబు చెప్పుట (సం. 9-57-2)

**క. 'భీముని సుయోధనుని సం । గ్రామంబు తెఱంగుఁ జూడఁ గా నెవ్వరి యం**
**దేమే నధికతఁ దోఁచెడి? । నీమది నున్నట్లు చెప్పు నీరజనాభా!' 268**

**ప్రతిపదార్థం:** నీరజనాభా!= పద్మనాభుడా! (శ్రీకృష్ణా!); భీముని సుయోధనుని= భీముడియొక్క, సుయోధనుడియొక్క; సంగ్రామంబు తెఱంగున్+చూడఁగాన్= యుద్ధగతిని చూడగా; ఎవ్వరి అందున్+ఏమేని+అధికత+తోఁచెడిన్?= ఎవ్వరిలో ఏ గొప్పతనం తోస్తున్నది?; నీమదిన్+ఉన్నట్లు= నీ మనస్సులో ఉన్నవిధంగా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! భీమదుర్యోధనుల యుద్ధగతిని చూస్తే ఎవరిలో ఏయే గొప్పతనం కానవస్తున్నదో నీ మనసులో ఉన్నదున్నట్లు చెప్పుము.'

**చ. అన విని శౌరి యిట్లనియె నర్జునుతోడ 'గురూపదేశ సం**
**జనితసమన్వయంబు సదృశంబ తలంపఁగ నిద్దఱందుఁ; బా**
**వని మెయి లావు పెద్ద; కురువల్లభుఁ డారయఁ గౌశలంబు పెం**
**పున నధికుండు తత్పరతఁ బూని శ్రమం బధికంబు సేయుటన్. 269**

**ప్రతిపదార్థం:** అనన్ అని= ఆ విధంగా అర్జును డనగా విన్నవాడై; శౌరి ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణు డిట్లా అన్నాడు: అర్జునుతోడన్= అర్జునుడితో; గురూపదేశ సంజనిత సమన్వయంబు= గురువు నేర్పటంవలన కలిగిన సమన్వయశక్తి; తలంపఁగన్= యోచించిచూడగా; ఇద్దరు+అందున్= ఇరువురిలో; సదృశంబు+అ= సమానమే; పావని మెయిలావు పెద్ద= భీమసేనుని శరీరబలం గొప్పది; ఆరయన్= చూడగా; కురువల్లభుఁడు= దుర్యోధనుడు; తత్పరతన్= పట్టుదలతో; పూని= ప్రయత్నంతో; శ్రమంబు= గదాయుధానికి చెందిన విద్యాపరిశ్రమం; అధికంబు+చేయుటన్= ఎక్కువగా చేసినందున; కౌశలంబు పెంపునన్= నేర్పరితనంలోని ఆధిక్యంచేత; అధికుండు= మిన్న.

**తాత్పర్యం:** అర్జునుడి ప్రశ్నకు శ్రీకృష్ణు డీవిధంగా బదులు చెప్పాడు: 'గురూపదేశం ఇరువురికీ సమానమే. యోచనచేయగా ఇరువురిలో భీముడికి బలంగల శరీర మున్నది. పరిశ్రమ, పట్టుదల కారణంగా దుర్యోధనుడు నేర్పరితనంలో భీముడికంటె అధికుడు.

**ఆ.** **లావు గలిగి మొక్కలమ్మునఁ గీచకా । రాతి సొచ్చి ధార్తరాష్ట్రు వెరవు**
**వలన నొచ్చుచున్నవాఁడు గావున ధర్మ । సంగరమున నరిది జయము గొనుట. 270**

**ప్రతిపదార్థం:** లావుకలిగి= బలం కలిగి; మొక్కలమ్మునన్= మొరకుగా (మూర్ఖంగా); కీచక+అరాతి= భీముడు; చొచ్చి= దూరి; ధార్తరాష్ట్ర వెరవువలనన్= దుర్యోధనుడి నేర్పరితనంవలన; నొచ్చుచున్నవాఁడు= బాధపడుతున్నాడు; కావునన్= అందువలన; ధర్మసంగరమునన్= ధర్మయుద్ధంలో; జయమున్+కొనుట= (భీముడు)జయంపొందటం; అరిది= అరుదు.

**తాత్పర్యం:** శారీరకమైన బలమున్నది కనుక భీముడు మూర్ఖపు పట్టుతో దూరి, నేర్పూ ఉపాయమూ కల దుర్యోధనుడి దెబ్బకు నొచ్చుకొంటున్నాడు. కాబట్టి ధర్మయుద్ధంలో అతడు జయం పొందటం అరుదు.

**వ.** **అన్యాయంబునం జంపువాఁ డింతియ మాయలు గల పగఱ మాయాప్రకారంబులం బరిమార్చుటయ తగు; నింద్రునివృత్ర వధ వ్యాపారంబు వినమె? జూదంబునప్ప డనిలసుతుండు సుయోధనుతొడలు విఱుగ నడుచువాఁడ నని ప్రతిన వట్టినవాఁ; డది యట్లుండె; గదా యుద్ధంబు నాభికి దిగువ యైన శరీరభాగంబు నొప్పించుట ధర్మంబుగా దది యొండుమైఁ గండడఁచి మఱి పరిభవరూపంబుగ నూరుభంగంబు సేసి ప్రతిజ్ఞ నెఱపువాఁ; డిది తలంపునం బెట్టక పెనంగె నేని ధర్మనందనునకు దైన్యంబు దెచ్చు; నట్లగుటఁ బూనికి పేర నూరులు భంజించి వధియించుట తప్ప నొం డుపాయంబు లేదు; ధర్మనందనునివలన మనకు భయం బావహిల్లె; నెట్లనిన భీష్మద్రోణప్రముఖబలవదరాతులం బొలియించుటం జేసి జయంబును యశంబునుం జేకుఱి యున్న యెడ నవి సందిగ్ధంబు లైనయట్లు గా నొకని జయించి సామ్రాజ్యంబు గొనుమని దుర్యోధనుతోడం బలికి, యతనితోడం గదాసమరంబునకు భీమసేనుం జొనిపె; నింత నిర్బుద్ధి యగునె? హతబంధుమిత్ర పరివారుండై రాజ్యంబునం దాస విడిచి మడువు సొచ్చినవాని వెదకి వెలార్చి యెక్కటికయ్యంబునకుఁ బిలుతురే? పదుమూఁడు వత్సరంబులు మత్సరాధికుం డగునగ్గాంధారేయుండు భీము జయించుటకయి గదాపరిశ్రమం బాచరించె; నూర్ధ్వతిర్యగ్గతి సముల్లాసంబున మెఱయు చున్నవాఁ; డీభీమునకుం బెద్దకాలం బేని శ్రమంబు లే దిమ్మహాభాగుండు ధర్మంబు దొఱంగియైన నిక్కులపాంసనునిం బిలుకుమార్పకున్న నింక నించుక సేపునకుఁ దాన తెగుఁ; దెగిన, మీకు నెల్ల నిప్పాపాత్ముండు రా జగుట కోర్వవచ్చునే?' యనుటయు. 271**

**ప్రతిపదార్థం:** అన్యాయంబునన్+చంపువాఁడు= మోసంతో చంపేవాడు; ఇంతియ మాయలు కల పగఱన్= ఇంతే మోసాలున్న వైరులను; మాయాప్రకారంబులన్= మోసపు పద్ధతుల్లోనే; పరిమార్చుటయ తగున్= చంపుటే తగును; ఇంద్రుని వృత్రవధ వ్యాపారంబు వినమె?= ఇంద్రుడు వృత్రాసురుడిని చంపిన పద్ధతి వినలేదా?; జూదంబు+అప్పుడు+అనిలసుతుండు= జూదమాడిన సమయాన భీముడు; సుయోధను తొడలు విఱుగన్+అడుచువాఁడను+అని= దుర్యోధనుడి తొడలు విరుగగొట్టువాడనని; ప్రతిన పట్టినవాఁడు= శపథం చేశాడు; అది అట్లుండెన్= దానిని ఆవిధంగా ఉండనిమ్ము; గదాయుద్ధంబు, నాభికిన్, దిగువఐన= గదాయుద్ధం బొడ్డుకు క్రిందనున్న; శరీర భాగంబు నొప్పించుట; అది; దానిని; ధర్మంబు+కాదు= ఒడలి భాగాన్ని కొట్టటం న్యాయం కాదు; ఒండుమైన్= వేరొకమార్గాన; గండు+అడఁచి= పొగరు నశింపచేసి; మఱి పరిభవరూపంబుగాన్ ఊరుభంగంబు+చేసి= అవమాన సూచకంగా తొడలు విరిచి; ప్రతిజ్ఞ నెఱపువాఁడు= మాటను నిలుపుకొనగలడు; ఇది తలంపునన్ పెట్టక= ఇది మనసులో జ్ఞాపకం పెట్టుకొనకుండా; పెనంగెనేనిన్= యుద్ధం చేస్తే; ధర్మనందనునకున్+దైన్యంబు

తెచ్చున్= ధర్మరాజునకు దుఃఖం తెస్తాడు; అట్లు+అగుటన్= అందుచేత; పూనిక పేరన్= ప్రతిజ్ఞఅనే మిషతో; ఊరులు భంజించి= తొడలు విరిచి; వధియించుట తప్పన్= చంపటం తప్ప; ఒండు+ఉపాయంబు లేదు= వేరే మార్గంలేదు; ధర్మనందనుని వలనన్= ధర్మజుడి మూలాన; మనకున్; భయంబు+ఆవహిల్లెన్= భయం ఏర్పడింది; ఎట్లు+అనినన్= ఏ విధంగానంటే; భీష్మద్రోణ ప్రముఖ= భీష్ముడు, ద్రోణుడు, మొదలైన; బలవత్+అరాతులన్+పొలియించుటన్+చేసి= బలం కల వైరులను చంపటంవలన; జయంబును, యశంబును= విజయాన్నీ, కీర్తినీ; చేకుఱి+ఉన్న ఎడన్= పొందిన సమయంలో; అవి సందిగ్ధంబులు+ఐన అట్లుగాన్= అవి అనుమానింపదగిన విధంగా; ఒకనిన్ జయించి= ఒక్కడిని గెలిచి; సామ్రాజ్యంబు కొనుము+అని= రాజ్యాన్ని పొందుమని; దుర్యోధనుతోడన్+పలికి= దుర్యోధనుడితో మాట్లాడి; అతడితోడన్ గదాసమరంబునకున్= వాడితో గదాయుద్ధానికి; భీమసేనున్+చొనిపెన్= భీముడిని పంపాడు; ఇంత నిర్బుద్ధి+అగునె?= ఇంతబుద్ధి లేనివాడౌతాడా?; హతబంధుమిత్రు పరివారుండు+ఐ= చనిపోయిన బందుగులు, స్నేహితులు సేవకులు కలిగినవాడై; రాజ్యంబు+ఆస+విడిచి= రాజ్యాపేక్ష లేకుండా; మడువు+చొచ్చినవానిన్= నీటిమడుగులో దాగినవాడిని; వెదకి వెలార్చి= వెదకి బయటకు లాగి; ఎక్కటికయ్యంబునకున్+పిలుతురే?= ఒకరితో ఒక్కరే చేసే యుద్ధానికి పిలుస్తారా?; పదుమూఁడు వత్సరంబులు= పదమూడేండ్లు; మత్సర+అధికుండు+అగు= అసూయాగ్రస్తుడయిన; ఆ+గాంధారేయుండు= ఆ గాంధారీనందనుడు; భీమున్+జయించుటకయి= భీమసేనుడిని జయించటం కొరకు; గదాపరిశ్రమంబు+ఆచరించెన్= గదాపరిశ్రమ చేశాడు; ఊర్ధ్వ తిర్యగ్గతి సముల్లాసంబునన్= పైకి, అడ్డంగాను వెళ్ళే ఉత్సాహంతో; మెఱయుచున్నవాఁడు= ప్రకాశిస్తున్నాడు; ఈ భీమునకున్ పెద్దకాలంబేని= ఈ భీముడికి చాలకాలంగా; శ్రమంబు లేదు= గదాపరిశ్రమ లేదు; ఈ+మహాభాగుండు= ఈ పుణ్యాత్ముడు; ధర్మంబు+తొఱంగి= ధర్మాన్ని వదలి; ఐనన్= అయినప్పటికినీ; ఈ+కులపాంసనునిన్= ఈ వంశనాశకుడిని; పిలుకుమార్పకున్నన్= చంపకుంటే; ఇంక ఇంచుకసేపునకున్= ఇంక కొంతసేపటికి; తాను+అ+తెగున్= తానే చనిపోతాడు; తెగినన్= చావగా; మీకున్= మీ అందరికీ; ఈ+పాప+ఆత్ముండు= ఈ పాపి; రాజు+అగుటకున్= రాజు కావటానికి; ఓర్వన్ వచ్చునే?= సహించవచ్చునా?; అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** మోసంతో చంపేవాడు అంతే మోసమున్న వైరులను మోసపువిధానంతోనే చంపటం తగి ఉంటుంది. ఇంద్రుడు వృత్రుడిని చంపిన పద్ధతి వినలేదా? జూద మాడినప్పుడు వాయునందనుడు దుర్యోధనుడి తొడలు విరుగగొట్టువాడ నని శపథం చేశాడు. దానిని అట్లా ఉండనిమ్ము. గదాయుద్ధంలో బొడ్డుకు క్రిందిభాగంలో నొప్పించటం ధర్మం కాదు. కాబట్టి వేరొక మార్గాన్ని అవలంబించాలి. అవమానం చేసినట్లుగా తొడలను విరిచి, ప్రతిజ్ఞను నెరవేర్చుకొనవచ్చును. దీనిని మనసులో పెట్టుకొనకుండా యుద్ధం చేస్తే ధర్మరాజునకు దుఃఖం తెచ్చిపెట్టినట్లువుతుంది. అందువలన ప్రతిజ్ఞ పేరుతో తొడలు విరిచి చంపటంతప్ప వేరే ఉపాయం లేదు. ధర్మరాజు మూలాన మనకు భయం కల్గుతూ ఉన్నది. ఏమంటే భీష్మద్రోణాది శత్రువులను చంపించటంవలన జయాన్ని, కీర్తినీ పొందికూడా, అవి రెండూ సందేహాస్పదాలు అయ్యేట్లుగా ఒక్కడిని జయించి సామ్రాజ్యాన్నంతనూ తీసికొమ్మని దుర్యోధనుడితో చెప్పి వాడితో గదాయుద్ధం చేయటానికి భీమసేనుడిని నియమించాడు. ఇంత బుద్ధిహీను డయ్యాడా? బంధుమిత్రులందరూ నశించగా రాజ్యంమీది ఆస వదలి మడుగులో దూరిన వాడిని వెదకి వెలికిలాగి ద్వంద్వ యుద్ధానికి పిలువదగనా? పదుమూడు సంవత్సరాలు అసూయతో నిండిన ఆ దుర్యోధనుడు భీముడిని జయించటం కొరకే గదాపరిశ్రమ చేశాడు. పైకి, అడ్డంగానూ తిరుగుతూ సంతోషంతో ప్రకాశిస్తున్నాడు. ఈ భీముడికి చాలాకాలంనుండి గదా పరిశ్రమ లేదు. ఈ ధర్మాత్ముడు ధర్మమును అతిక్రమించి అయినా ఈ కులనాశకుడిని చంపకపోతే ఇంకొంత సేపటికి తానే హతుడౌతాడు. ఇతడు చనిపోతే ఈ పాపి మీకు రాజు అయ్యే దురవస్థను ఓర్వవచ్చునా? మీ కిది ఇష్టమా?' - అనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విని క్రీడి యపుడు మారుత । తనయుఁడు దనుఁ జూడ నూరుతలము కరతలం**
**బున నప్పళించె; నతఁడును । గనికొనియెను సన్న యగుటఁ గౌరవముఖ్యా! 272**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= కురుశ్రేష్ఠుడా!; క్రీడి= అర్జునుడు; విని; అపుడు= ఆ సమయాన; మారుతతనయుఁడు= భీమసేనుడు; తనున్+చూడన్= తనవైపు చూడగా; ఊరుతలము= తొడలపైభాగం; కరతలంబునన్+అప్పళించెన్= చేతితో చరిచాడు; అతఁడును= ఆ భీముడు; కని= చూచి; సన్న= సైగ; అగుటన్= కావటంచేత; కొనియెను= గ్రహించాడు.

**తాత్పర్యం:** కౌరవశ్రేష్ఠా! ఆ సమయంలో భీముడు తనవైపు చూసినపుడు అర్జునుడు తొడలు చేతితో చరిచాడు. ఆ సైగను భీముడు చూచి గ్రహించాడు.

**వ. కనికొని 'యధర్మం బైన నూరుభంగంబు సేయు మని కృష్ణానుమతి జిష్ణుండు పనిచె; నాకు నొండుమెయి నెట్లునుం బగతు పాటు లేక తక్కెనే నవ్విధం బాచరింతుఁ గాక! యని మనంబున నిశ్చయించి, వివిధగతులఁ జరియింపం గురుపతియు బాహుచిత్ర ప్రచారంబుల నుల్లసిల్లఁ దత్సంగ్రామం బామిషార్థిగరుడ ద్వయసమరంబు చందంబున దర్శనీయం బై యుండె; నట్టియెడ. 273**

**ప్రతిపదార్థం:** కనుకొని= చూచి గుర్తించి(సైగను గుర్తించి); అధర్మంబు+ఐనన్= అన్యాయమైనా; ఊరుభంగంబు+చేయుము+ అని= తొడలు విరుగగొట్టుమని; కృష్ణ+అనుమతిన్= కృష్ణుడి ఆమోదంతో; జిష్ణుండు= అర్జునుడు; పనిచెన్= ఆజ్ఞాపించాడు; నాకున్ ఒండుమెయిన్= నాకు ఇంకొక్క విధంగా; ఎట్లునున్= ఏ విధంగానూ; పగతుపాటు లేక తక్కెనేని= శత్రువు పడటం జరగకపోతే; ఆ+విధంబు= ఆ పద్ధతినే; ఆచరింతున్+కాక!= అనుసరిస్తాను గాక!; అని మనంబునన్ నిశ్చయించి= అని మనసులో నిర్ణయించుకొని; వివిధ గతులన్= అనేక పద్ధతులలో; చరియింపన్= తిరుగగా; కురుపతియున్= దుర్యోధనుడును; బాహుచిత్రప్రచారంబులన్= చేతుల వింత తిరుగుళ్ళతో; ఉల్లసిల్లన్= ఉత్సహించగా; తద్+సంగ్రామంబు= ఆ యుద్ధం; ఆమిష+అర్థి= మాంసానికై ఆసపడే; గరుడద్వయ సమరంబు చందంబునన్= రెండు గరుత్మంతుల యుద్ధంవలె; దర్శనీయంబు+ ఐ ఉండెన్= చూడదగి ఉండింది; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** చూచి గుర్తించి, 'అన్యాయమైనా తొడలు విరుగగొట్టుమన్న శ్రీకృష్ణుడి అనుమతిని అర్జునుడు తెలుపగా నాకు వేరొక దారిలో శత్రువును పడగొట్టే వీలుకాకుంటే ఆ పద్ధతినే అనుసరిస్తాను.' అని భీముడు మనసులో నిశ్చయించుకొని అనేక విధాలుగా తిరుగుతుండగా దుర్యోధనుడును చేతుల చిత్రగతులలో తిరుగుతున్నాడు ఆ యుద్ధం చూచేవారికి ఇరువురు గరుత్మంతులు మాంసంకొరకు సాగించే పోరాటంవలె అబ్బురంగా తోచింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఆ. పాండురాజసుతుఁడు పటుతరోల్లాసి యై । వైచుటయును ధరణివల్లభుండు**
**తొలఁగ దాఁటె రయము దలకొని గదఁ బుచ్చి । కొనియె నాబకాంతకుండు నుఱికి. 274**

**ప్రతిపదార్థం:** పాండురాజ సుతుఁడు= పాండురాజ కుమారుడైన భీమసేనుడు; పటుతర= దృఢమైన; ఉల్లాసి+ఐ= ఉత్సాహిగా; వైచుటయును= వేయగా; ధరణివల్లభుండు= రాజయిన దుర్యోధనుడు; తొలఁగదాఁటెన్= తప్పించుకొన్నాడు; ఆ బకాంతకుండు= బకాసురుడిని చంపినవాడైన ఆ భీముడు; ఉఱికి= దూకి; రయము తలకొని= వేగం పుంజుకొని; గదన్+పుచ్చికొనియెన్= గదను తీసికొన్నాడు.

**తాత్పర్యం:** పాండురాజకుమారుడైన భీముడు ఉత్సాహంతో గట్టిగా దెబ్బ వేయగా దుర్యోధనుడు తప్పించుకొన్నాడు. ఆ బకాంతకుడు దూకి వేగంగా గదను తీసికొన్నాడు.

**దుర్యోధనుఁడు భీముగదాదండమునఁ దొడలు విఱిగి పడుట (సం. 9-57-45)**

**క. ఆలోనం గురుధరణీ। పాలుఁ డడరి వ్రేయుటయును బవనసుతునిమై**
**సోలెె; నది గానఁ డాపతి। కేలీవిభ్రమము దోఁపఁ గ్రేళ్ళుఱికె నృపా! 275**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; ఆలోనన్= అంతలోనే; కురుధరణీపాలుఁడు= కురురాజు దుర్యోధనుడు; అడరి వ్రేయుటయును= విజృంభించి కొట్టగా; పవనసుతునిమై= భీముడి ఒడలు; సోలెన్= సొమ్మసిల్లింది; ఆ పతి= ఆ రాజు; అది కానఁడు= దానిని చూడలేదు; కేళీ విభ్రమము తోఁపన్= యుద్ధక్రీడ యొక్క వికాసం తెలియగా; క్రేళ్ళు ఉఱికెన్= ఎగిరి దూకాడు.

**తాత్పర్యం:** దుర్యోధను డంతలోనే వేగంగా కొట్టగా భీముడి ఒడలు సొమ్మసిల్లింది. రాజు దానిని గమనించలేదు. యుద్ధక్రీడా విలాసంతో ఎగిరి దూకాడు.

**చ. ఉఱికినఁ దేఱి పై కుఱికి యుగ్రత భీముఁడు వ్రేయ నవ్విభుం**
**డుఱక మహాద్భుతస్ఫురణ నూర్ధ్వ పరిభ్రమణంబు సేసినం**
**దెఱపి యతండు గాంచి సముదీర్ణరయంబున వైచెఁ బెన్తొడల్**
**విఱిగి నగాగ్ర ముద్భటపవిప్రహతిం బడుచాడ్పునం బడన్. 276**

**ప్రతిపదార్థం:** ఉఱికినన్= దూకగా; ఉగ్రతన్= భయంకరంగా; భీముఁడు= భీమసేనుడు; తేఱి= తేరికొని; పైకిన్+ఉఱికి= పైకిదూకి; వ్రేయన్= కొట్టగా; ఆ+విభుండు= ఆదుర్యోధనుడు; ఉఱక= లెక్కచేయక; మహా+అద్భుతస్ఫురణన్= మిగుల ఆశ్చర్యాన్ని కలిగిస్తూ; ఊర్ధ్వపరిభ్రమణంబుచేసినన్= పైన దిరుగగా; తెఱపి+అతండు+కాంచి= ఆ భీముడు సందు చూచి; నగ+అగ్రము= కొండకమ్ము; ఉద్భట= భయంకరమైన; పవి= వజ్రముయొక్క; ప్రహతిన్= దెబ్బకు; పడు చాడ్పునన్= పడునట్లుగా; పెన్+తొడల్= పెద్దవయిన తొడలు; విఱిగి పడన్= విరిగి క్రింద పడేటట్లుగా; సముదీర్ణరయంబునన్= మిక్కిలి వేగంతో; వైచెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** (దుర్యోధనుడు) దూకగా భీమసేనుడు (మూర్ఛనుండి) తేరికొని మీదికి దూకి భయంకరంగా కొట్టగా ఆ దుర్యోధనుడు లెక్కచేయకుండా మిగులఅబ్బురాన్ని కలిగిస్తూ పై ఎగిరి తిరుగుతూ ఉండగా భీముడు సందు చూచి భయంకరమైన వజ్రపుదెబ్బతో విరిగిపడే కొండ కొన కొమ్ము మాదిరిగా పెద్దవైన తొడలు విరిగి కూలేట్లుగా మిక్కిలి వేగంగా కొట్టాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి, ఉపమ.

**వ. అప్పుడు మహోల్కాపాతంబులును బాంసుమాంస రక్త వర్షంబులును వికృతంబు లగు కరితురగబృంహిత హేషాఘోషంబులును మఱియు ననేకోత్పాతంబులును గలిగిన నట్లు కౌరవపతి వడుటకు నుబ్బునం**

**బొదలిన పాంచాలురుం బాండవులు నుద్విగ్నచిత్తులైరి; వియత్తలం బంతయు నొక్కమ్రోఁతగా నగ్గదాయుద్ధ విశేషంబు లగ్గించుచు సురగరుడఖచరాదులు నిజస్థానంబులకుం జని; రిట్లు తనగదతాఁకునఁ దొడలు విఱిగి సింగంబుచేతం గూలిన గంధశుండాలంబు చందంబునం బడియున్న నీ కొడుకుం జేరం జని భీమసేనుండు. 277**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; మహా+ఉల్కా+పాతంబులును= పెద్దతోక చుక్కలు కింద రాలటం; పాంసుమాంస రక్త వర్షంబులును= దుమ్ము, మాంసం, రక్తం - వీటి వర్షాలు; వికృతంబులు+అగు= వికారమైన; కరితురగ= ఏనుగులయొక్క, గుర్రాలయొక్క; బృంహిత= ఘీంకారాల; హేషా= సకిలింతల; ఘోషంబులును= శబ్దాలు; మఱియున్= ఇంకను; అనేక ఉత్పాతంబులును= ఎన్నో ప్రళయ చిహ్నాలును; కలిగినన్= కలుగగా; అట్లు= ఆ ప్రకారంగా; కౌరవపతిపడుటకున్= దుర్యోధనుడు క్రింద కూలటానికి; ఉబ్బునన్= సంతసంతో; పొదలిన= ఒప్పిన; పాంచాలురున్= పాంచాలురూ; పాండవులును; ఉద్విగ్నచిత్తులైరి= ఉద్వేగంతోడి మనస్సులు గలవారైరి; వియత్+తలంబు+అంతయున్= ఆకాశమంతా; ఒక్కమ్రోఁతగాన్= ఒకే శబ్దంగా; ఆ+గదాయుద్ధ విశేషంబులు= ఆ గదాయుద్ధం యొక్క విశేషాలను; అగ్గించుచున్= పొగడుతూ; సురగరుడ ఖచరాదులు= దేవతలు గరుడులు గగనచరులు మొదలైనవారు; నిజస్థానంబులకున్+చనిరి= తమ తమ చోట్లకు వెళ్ళారు; ఇట్లు= ఈ ప్రకారంగా; తన గదతాఁకునన్= తన గద దెబ్బచేత; తొడలు నిఱిగి= ఊరుభంగమై; సింగంబు చేతన్ కూలిన= సింహముచేత క్రిందపడ్డ; గంధశుండాలంబు= మదపుటేనుగు; చందంబునన్= వలె; పడి ఉన్న= క్రిందపడి ఉన్న; నీ కొడుకున్+చేరన్+చని= నీ కొడుకు దగ్గరకు చేరి; భీమసేనుండు= భీముడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో పెద్ద తోకచుక్కలు నేలకు రాలాయి. దుమ్ము, మాంసఖండాలు నెత్తురు వానలుగా కురిశాయి. ఏనుగుల, గుర్రాల ఘీంకారాలు, సకిలింతల శబ్దాలే కాక అనేకములైన దుశ్శకునాలు కలిగాయి. ఆ విధంగా దుర్యోధనుడు పడినందులకు సంతోషం పొందిన పాంచాలురు, పాండవులు ఉద్విగ్నమనస్కులైనారు. ఆకాశంలో తిరుగులాడే దేవతలు, గరుడులు మొదలైనవారు ఆ గదాయుద్ధాన్ని కీర్తిస్తూ తమ తమ చోట్లకు వెళ్ళారు. ఈ విధంగా గదదెబ్బతో తొడలు విరిగి సింహంచేత కూల్చబడిన మదపుటేనుగువలె పడి ఉన్న నీ కుమారుడిని చేరి భీమసేనుడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. 'ఏకవస్త్రఁ బాంచాలి నట్లీడ్చి తేరఁ । బనిచి సభలోనఁ బఱిచిన పాపఫలము**
**ననుభవింపుము దుష్టాత్మ!' యనుచు వామచరణమున బెట్టిదము గాఁగ శిరము దన్నె. 278**

**ప్రతిపదార్థం:** దుష్టాత్మ!= నీచమైన మనస్సు కలవాడా!; ఏకవస్త్రన్= ఒకే కట్టుగుడ్డ కల(ముట్టైన)దానిని; పాంచాలిన్= ద్రౌపదిని; అట్లు= ఆ విధంగా(కొప్పు పట్టి లాగి); ఈడ్చి తేరన్+పనిచి= లాగికొని తీసికొనిరావటానికి ఉత్తరువు చేసి; సభలోనన్= సభలో; పఱిచిన= అవమానం చేసిన; పాపఫలమున్= పాపముయొక్క ఫలితాన్ని; అనుభవింపుము= పొందుము; అనుచున్= అని అంటూ; వామచరణమునన్= ఎడమకాలితో; శిరమున్= తలను; బెట్టిదముకాఁగన్ తన్నెన్= గట్టిగా తన్నాడు.

**తాత్పర్యం:** 'నీచాత్ముడా! ఏకవస్త్ర(ముట్టైన) అయిన ద్రౌపదిని ఆ విధంగా లాగి తీసికొని వచ్చి, సభలో అవమానం చేసిన పాపానికి తగిన ఫలం అనుభవించుము' అంటూ తన ఎడమ పాదంతో అతడి తలను (భీముడు) గట్టిగా తన్నాడు.

**వ. తన్ని యలుక మలుగక యతని యాననం బాలోకించి. 279**

**ప్రతిపదార్థం:** తన్ని; అలుక మలుగక= కోపం తగ్గక; అతని ఆననంబు= ఆ దుర్యోధనుడి ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** తన్ని ఇంకా కోపం తగ్గక, ఆ దుర్యోధనుడి ముఖంవైపు చూచి.

**క. 'పసు లని యార్చుచు మము ను। ల్లస మాడిన ధర్మహీనులను నృపధర్మం**
**బెసఁగఁగ నే మిదె యిప్పుడు। పసు లని యార్చెదము మగుడ బంధుద్రోహీ! 280**

**ప్రతిపదార్థం:** బంధుద్రోహీ!= బంధువులకు ద్రోహం తలపెట్టేవాడా!; పసులు+అని= పశువులారా! అని; ఆర్చుచున్= అరుస్తూ; మమున్= మమ్ము; ఉల్లసము+ఆడిన= ఎగతాళి చేసిన; ధర్మహీనులను= ధర్మం లేనివారిని; నృపధర్మంబు+ ఎసఁగఁగన్= రాజధర్మం అతిశయించగా; ఏము= మేము; ఇదె= ఇప్పుడే; మగుడన్= మరలా; పసులని ఆర్చెదము= పశువులని పిలుస్తాము.

**తాత్పర్యం:** 'ఓ బంధుద్రోహీ! పశువులని అరుస్తూ మమ్ము పరిహసించిన నీతిమాలినవారిని రాజధర్మం అతిశయించగా- ఇదిగో! ఇప్పుడు మేము మరల 'పశువులారా!' అని మిమ్ములను పిలుస్తూ అరుస్తాము.

**క. విను మేను కల్లసారెలు। గొని కపటపు నెత్త మాడుకుశలతఁ గా దొ**
**ప్పనివారు నేపడంచుట। ఘనబాహు స్వైరకేళిఁ గాని దురాత్మా!' 281**

**ప్రతిపదార్థం:** దురాత్మా!= దుర్మార్గుడా!; వినుము= నా మాట వినుము; ఏను= నేను; కల్లసారెలు+కొని= మోసపు పాచికలను తీసికొని; కపటపు= మోసపు; నెత్తము= జూదము; ఆడు ఆడునటువంటి; కుశలతన్+కాదు= నేర్పుతో కాదు; ఒప్పనివారు= ఇష్టంలేని వారిని(శత్రువులను); ఘనబాహు స్వైరకేళిన్= గొప్ప భుజబలంతో కూడిన యుద్ధక్రీడతో; ఏపు+అడంచుట+కాని= గర్వాన్ని అణచటమే (కాని).

**తాత్పర్యం:** ఓ దుష్టుడా! వినుము. ఇది గొప్పదైన బాహుక్రీడతో శత్రువుల గర్వాన్ని అణచటమేగాని, మోసపుసారెలతో కపటపు జూదంలోని నేర్పరితనంతో కాదు.'

**వ. అని పలికి పెలుచ నవ్వి ధర్మనందనగోవిందపాంచాలప్రకరపార్థసాత్యకినకులసహదేవుల నాలోకించి. 282**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాటాడి; పెలుచన్ నవ్వి= పెద్దగా నవ్వి; ధర్మనందన= ధర్మరాజును; గోవింద= శ్రీకృష్ణుడిని; పాంచాల ప్రకర= పాంచాలుర సమూహమును; పార్థ= అర్జునుడిని; సాత్యకి= సాత్యకిని; నకుల సహదేవులను= నకులుడిని, సహదేవుడిని (వీరందరిని); ఆలోకించి= కలియచూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా మాటాడి పెద్దగా నవ్వి ధర్మజ, శ్రీకృష్ణ, పాంచాలురను, అర్జున, సాత్యకి, నకుల సహదేవులను చూచి.

**ఆ. 'శంక లేక కడఁగి సభ కట్లు పాంచాలి। నంటరానిదాని నొంటిచీర**
**తోన యున్న సాధ్వి వేనలి వట్టి యీ। డ్పించినతనిఁ జూడుఁ డంచుఁ బొదలి. 283**

**ప్రతిపదార్థం:** శంక లేక= అనుమానం లేకుండా; కడఁగి= పూనుకొని; సభకున్= రాజసభకు; అట్లు= ఆ విధంగా; పాంచాలిన్= ద్రౌపదిన్; అంటరానిదానిన్= తాకరాని దానిని; ఒంటిచీరతోన్+అ ఉన్న= ఏకవస్త్ర అయి ఉన్న; సాధ్విన్= పతివ్రతను; వేనలి+పట్టి+ఈడ్చించిన= కొప్పు పట్టి లాగించిన; అతనిన్= అతడిని; చూడుఁడు= చూడండి; అంచున్= అంటూ; పొదలి= ఒప్పి.

**తాత్పర్యం:** 'సందేహించకుండా సభలోకి కావాలనే ఆ విధంగా ద్రౌపదిని తాకరాని దానిని, ఏకవస్త్రను, పతివ్రతను కొప్పుబట్టి లాగించిన వాడిని చూడండి' అని ఉప్పొంగి.

**వ. 'పాంచాలి సేసినతపంబు పెంపున నీశోభనంబు సమకూఱె' ననిన విని వారు ప్రమోదంబు నొంద మిక్కిలి సంతసంబునం దేలి యక్కురుఘస్మరుండు నర్తించుచెన్ను దోఁపఁ జెలంగి. 284**

**ప్రతిపదార్థం:** పాంచాలి= ద్రౌపది; చేసిన తపంబు పెంపునన్= కావించిన తపసు యొక్క గొప్పతనంతో; ఈ శోభనంబు= ఈ మంగళం; సమకూఱెన్= సిద్ధించింది; అనినన్= అనగా; విని= విన్న వారు; ప్రమోదంబునన్+ఒందన్= సంతోషించగా; మిక్కిలి సంతసంబునన్ తేలి= చాల సంతోషంతో తేలియాడి; ఆ+కురు ఘస్మరుండు= ఆ కౌరవులను చంపినవాడు - భీముడు; నర్తించు= నాట్యం చేసే; చెన్ను= సొగసు; తోఁపన్= తోచేటట్లు; చెలంగి= ఆర్చి.

**తాత్పర్యం:** 'పాంచాలి తపఃఫలితంగా ఈ శుభం జరిగింది.' అని భీముడు అనగా దానిని వినిన అందరూ సంతోషించి, కౌరవులను చంపిన భీముడు నాట్యంచేసే విధం తోచగా ఆర్చి -

**చ. 'మును మము గొడ్డువోయి రని ముష్కరతం జెడనాడినట్టి దు**
**ర్జనుల ననిం గడంగి ధృతరాష్ట్రతనూజుల బంధువర్గమి**
**త్రనికరసైన్యకోటిసహితంబుగ గీటడఁగింపఁ గంటి; మిం**
**క నమరలోక మైన నరకం బయినన్ సరి మాకు నారయన్.' 285**

**ప్రతిపదార్థం:** మును= ఇదివరకు; మమున్= మమ్ము; గొడ్డువోయిరని= వ్యర్థులని, పౌరుషహీనులయ్యారని; ముష్కరతన్= మూర్ఖత్వంతో; చెడన్+ఆడి నట్టి= దూషించినటువంటి (తిట్టినటువంటి); దుర్జనులన్= దుష్టులను; ధృతరాష్ట్ర తనూజులన్= ధృతరాష్ట్రుడి కుమారులను; బంధువర్గ= బంధువుల సమూహంతోను; మిత్ర నికర= స్నేహితులతోను కూడుకొన్న; సైన్యకోటి సహితంబుగాన్= పెక్కు సైన్యాలతో సహా; కడంగి= పూని; అనిన్= యుద్ధంలో; గీటడఁగింపన్= చంపటాన్ని; కంటిమి= చూడగలిగాము; ఇంకన్= ఇక; అమరలోకము+ఐనన్= స్వర్గమైనా; నరకంబు+ఐనన్= నరకలోకమైనా; ఆరయన్= చూడగా; మాకున్ సరి= మాకు సమానమే!

**తాత్పర్యం:** 'ఇదివరకు మమ్ము వ్యర్థజీవు లని, పౌరుషహీనులని మూర్ఖతతో తిట్టినటువంటి దుర్మార్గులను, ధృతరాష్ట్రుడి కుమారులను బంధుమిత్రసైన్య సమూహంతో యుద్ధరంగంతో పనిబట్టి నాశం చేయగా చూడగలిగాము. ఇక మాకు స్వర్గమైనా నరకమైనా - ఒకటే!

**క. అని గదఁ జేకొని నృప! నీ । తనయునిమెడ వట్టి యదిమి తల గ్రమ్మఱఁ ద**
**న్నినఁ గని మును దన్నుట నె । మ్మన మెరియ తదగ్రజుం డమర్షముతోడన్. 286**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అని గదన్+చేకొని= అంటూ గద తీసికొని; నీ తనయుని మెడన్= నీ కుమారుడి మెడను; పట్టి అదిమి= పట్టుకొని నొక్కి; తలన్= తలను; క్రమ్మఱన్= మరలా; తన్నినన్= తన్నగా; కని= చూచి; మును తన్నుట= ఇదివరకు తన్నటమే; నెమ్మనము= మనస్సు; ఎరియన్= మండించగా; తదగ్రజుండు= వాని అన్న అయిన ధర్మరాజు; అమర్షముతోడన్= కోపంతో.

**తాత్పర్యం:** ఓ రాజా! ఆ విధంగా గదను చేతిలోనికి తీసికొని నీ కుమారుడి మెడను అదిమిపెట్టి తలను మరల తన్నగా దానిని చూచి, ఇదివరకు తన్నినందులకే మనస్సులో మండుతున్న ధర్మజుడు కోపంతో - (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. హర్షావేశలఘు చారిత్రుం డగు నమ్మారుతపుత్రున కి ట్లనియె. 287**

**ప్రతిపదార్థం:** హర్ష+ఆవేశ= సంతోషం వలన కలిగిన ఆవేశంవలన; లఘుచారిత్రుండు+అగు= అల్ప నడవడిక గల; ఆ+మారుత పుత్రునకున్= ఆ భీమసేనుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సంతోషావేశంతో అల్పమైన ప్రవర్తనం ప్రదర్శించిన ఆ భీమసేనుడితో (ధర్మజుడు) ఇట్లా అన్నాడు:

**చ. 'తల యది యేల తన్నెద? వధర్మము నొందుట కాత్మ రోయఁగా**
**వలవదె? రాజ రా జనుజవర్గముఁ దక్కినబంధుకోటియుం**
**గలపరివారముం దెగిన గౌరవ మేదకఁ బోరి సంగర**
**స్థలమునఁ బడ్డ నీతులువచందముచేఁత జనంబు మెచ్చునే? 288**

**ప్రతిపదార్థం:** తల+అది+ఏలతన్నెదవు?= తలను ఎందుకు తన్నుతున్నావు?; అధర్మమున్+ఒందుటకున్= ధర్మాన్ని అతిక్రమించటానికి; ఆత్మన్ రోయఁగా వలవదె?= మనస్సులో అసహ్యించుకొనవలదా?; రాజరాజు= దుర్యోధనుడు; అనుజవర్గమున్= తమ్ములూ; తక్కిన బంధుకోటియున్= మిగిలిన బంధు సమూహమూ; కల పరివారమున్= ఉన్న సేన అంతా; తెగినన్= నశించిపోగా; గౌరవము+ఏదక= మర్యాదను వదలక; పోరి= యుద్ధం చేసి; సంగర స్థలమునన్ పడ్డన్= యుద్ధరంగంలో పడిపోగా; ఈ తులువ చందముచేఁత= పొగరుబోతు తనపు చేష్ట; జనంబు= జనం; మెచ్చునే?= మెచ్చుకొంటుందా?

**తాత్పర్యం:** 'ఈ తలను తన్నుటమెందుకు? ఇది అధర్మం. ఇటువంటి చేష్ట మనసా అసహ్యించుకొన తగినది; పోగా, సోదరులు, బంధువులు గల సైన్యం నశించినా మర్యాద వదలక రారాజు దుర్యోధనుడు సమరంలో పాల్గొని రణక్షేత్రంలో పడ్డాడు. ఇటువంటి వేళ ఈ పొగరుపోతు చేతను జనులు మెచ్చుకొంటారా?

**క. మును లోకము ధర్మపరుం। డనఁ బరఁగినవాఁడ విట్టు లనుచితకృత్యం**
**బునకుఁ జనఁ దగునె దీనం। గనియెడుఫల మేమి? దూష్యగర్వం బేలా?' 289**

**ప్రతిపదార్థం:** మును లోకము= ఇదివరకు లోకం; ధర్మపరుండు+అనన్= ధర్మాత్ముడన; పరఁగినవాఁడవు= పేరు కలిగినవాడవు; ఇట్టులు= ఈ విధంగా; అనుచిత కృత్యంబునకున్= ఉచితముకాని పనికి; చనన్+తగునే?= పూనుకోవచ్చునా?; దీనన్= ఇందువల్ల; కనియెడు ఫలమేమి?= పొందే ఫలితమేమి?; దూష్య గర్వంబేలా?= నిందింపదగిన పొగరుబోతుతనం ఎందులకు?

**తాత్పర్యం:** ఇదివరలో లోకంలో ధర్మపు నడవడిక కలవాడవనే పేరు పొందావు. ఈ విధమైన అన్యాయమైన పనికి పూనుకొనవచ్చునా? దీనివలన పొందే ఫలితమేమి? నిందనీయమైన అహంకార మెందుకు?'

**వ. అని దూఱి దుర్యోధనుం జూచి బాష్పాకులలోచనుం డై. 290**

**ప్రతిపదార్థం:** అని దూఱి= అని నిందించి; దుర్యోధనున్+చూచి= దుర్యోధనుడి దిక్కు చూచి; బాష్ప+ఆకుల+లోచనుండు+ఐ= కన్నీటితో కలతనొందిన చూపు కలవాడై.

**తాత్పర్యం:** ఈవిధంగా నిందించి, కన్నీటితో నిండిన దృష్టితో దుర్యోధనుడిని చూచి.

**సీ. 'విధి ప్రతికూలుఁ డై వేరంబు పుట్టించి । మాకు నీవును మేము నీకు నలిగి**
**యితరేతరద్రోహమతిఁ దెగి యింతలు । సేయుట గావించె; నీ యధర్మ**
**పరతయు లోభంబు బాల్యంబు మదమును । నిన్ను నింతకుఁ దెచ్చె; నీకతమున**
**నాకు బాంధవ కులనాశంబు వాటిల్లె; । ధృతరాష్ట్రు కోడండ్రు తీవ్రశోక**

**తే. కారి యయినవైధవ్యంబు కారణముగ । నన్ను నిందింతు' రనువచనములు మొదలు**
**గాఁగ బహు విలాపంబులఁ గరుణ మావ । హిల్ల దురపిల్లె నుల్లంబు దల్లడిల్ల.' 291**

**ప్రతిపదార్థం:** విధి= దైవం; ప్రతికూలుఁడు+ఐ= ఎదురుతిరిగి; వేరంబు= శత్రుత్వమును; పుట్టించి= కలిగించి; మాకున్ నీవును= మా యెడ నీవును; మేము నీకున్= మేము నీయందును; అలిగి= కోపించి; ఇతరేతర ద్రోహమతిన్= పరస్పర ద్రోహబుద్ధి; తెగి= తెగించి; ఇంతలు చేయుట= ఇంతపని చేయటం(అనగా యుద్ధం మొదలైనవి); కావించెన్= చేశాడు; నీ అధర్మపరతయున్= నీ యొక్క అధర్మాసక్తి; లోభంబు= అత్యాశ; బాల్యంబు= చిన్నతనం; మదమును= గర్వమును; నిన్నున్ ఇంతకున్+తెచ్చెన్= నిన్నీ స్థితికి తీసికొని వచ్చింది; నీ కతమునన్= నీ కారణంగా; నాకున్; బాంధవ కులనాశంబు+పాటిల్లెన్= బంధువంశనాశం కలిగింది; ధృతరాష్ట్రు కోడండ్రు= ధృతరాష్ట్రుడి కోడళ్ళు; తీవ్రశోకకారి+ఐన= పెనుదుఃఖాన్ని కలిగించేది అయిన; వైధవ్యంబు కారణముగన్= భర్తృహీనత్వం కారణంగా - అనగా వైధవ్యావస్థవలన; నన్నున్; నిందింతురు; అను వచనములు మొదలు కాఁగన్= అనే పలుకులు మొదలుగా; బహువిలాపంబులన్= పలు ఏడ్పులతో; కరుణము ఆవహిల్లన్= కరుణరసం కలుగగా; ఉల్లంబు తల్లడిల్లన్= మనసు కలతపడగా; దురపిల్లెన్= దుఃఖపడినాడు.

**తాత్పర్యం:** 'దైవం వ్యతిరేకించి శత్రుత్వాన్ని కలిగించి మాపై నీవును, నీపై మేమును కోపించి పరస్పరం ద్రోహబుద్ధితో విడిపోయేటట్లు చేసి ఇంత పనిచేయించాడు. నీ అధర్మం, అత్యాశ, పసితనం, గర్వం, ని న్నీస్థితికి తెచ్చాయి. నీ కారణంగా నాకు బంధువంశనాశమైనది. ధృతరాష్ట్రుడి కోడళ్ళు తీవ్ర దుఃఖానికి లోనయ్యే వైధవ్యం కారణంగా నన్ను దూషిస్తారు' అనే పలుకులు మొదలుగా అనేక విధములయిన దుఃఖపుమాటలతో కరుణరసం నిండుకొనగా మనసు తల్లడిల్లగా ధర్మరాజు దుఃఖించాడు.

**వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 292**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్+ఇట్లు+అనియెన్= సంజయుడితో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అనగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా అన్నాడు:

**చ. 'అనిలసుతుం డధర్మమున నమ్మెయిఁ గౌరవమేదినీశ్వరుం**
**దనయెదురన్ వధింపఁగ గదాసమరాఖిలధర్మవేది నాఁ**
**జనిన హలాయుధుండు గని సంజయ! యే మని పల్కె? నంత వాఁ**
**డనుజులకున్ మఱందులకు నట్టియెడ న్మొగమోడ నేర్చునే? 293**

**ప్రతిపదార్థం:** సంజయా!= ఓ సంజయుడా!; అనిలసుతుండు= భీముడు; ఆ+మెయిన్= ఆ ప్రకారంగా; అధర్మమునన్= అన్యాయంగా; కౌరవమేదినీ+ఈశ్వరున్= కురువంశ రాజయిన దుర్యోధనుడిని; తన ఎదురన్= తన ముందు (తనకంటికి ఎదురుగా); వధింపఁగన్= చంపగా; గదాసమర= గదాయుద్ధంలోని; అఖిల ధర్మవేది= అన్ని ధర్మాలను తెలిసినవాడు; నాన్= అనగా; చనిన= ఒప్పిన; హల+ఆయుధుండు= బలరాముడు; కని= చూచి; ఏమని పల్కెన్?= ఏమని మాటాడాడు?; అంతవాఁడు= ఆ గొప్పవాడు; అనుజులకున్= తమ్ములకు; మఱందులకున్= బావమరదులకు; అట్టి ఎడన్= ఆ సమయంలో; మొగమోడ నేర్చునే?= మొగమును తప్పించ కలిగి ఉంటాడా?

**తాత్పర్యం:** 'సంజయా! ఆ విధంగా భీమసేనుడు అధర్మంగా దుర్యోధనుడిని తన కట్టెదుట చంపగా గదాయుద్ధపు సమస్త ధర్మాలు తెలిసినవా డని ప్రసిద్ధిని గడించిన బలరాముడు చూచి ఏమని మాట్లాడాడు? అంత గొప్పవాడు తోబుట్టువుల యెడ, మేనమరదుల పట్ల మొగమాటం వహిస్తాడా?'

**చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రున కప్డు రోహిణీ**
**తనయుఁడు కోపవేగమునఁ దామ్రముఖుం డయి లేచి బాహు లె**
**త్తి 'నృపతులార! చూచితిరె తెల్లముగా బకవైరివిక్రమం**
**బున తెఱఁ? గిట్టివాని మనభూములఁ గంటిమె యెన్నఁ డేనియున్? 294**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతఁడు= ఆ సంజయుడు; అప్డు= ఆ సమయంలో; ఆ+మనుజేంద్రునకున్= ఆ రాజుతో; ఇట్టులు+అనున్= ఈ ప్రకారంగా అన్నాడు; రోహిణీతనయుఁడు= బలరాముడు; కోపవేగమునన్= కోపపు తొట్రుపాటుతో; తామ్రముఖుండు+ఐ లేచి= ఎర్రనైన ముఖంతో లేచి; బాహులు+ఎత్తి= చేతులు పైకెత్తి; నృపతులార!= ఓ రాజులారా!; తెల్లముగాన్= స్పష్టంగా; చూచితిరె?= చూచారా!; బకవైరి విక్రమంబున తెఱఁగు= బకాసురుని చంపినవాడి యొక్క శౌర్యపు పద్ధతి; ఎన్నఁడేనియున్= ఎప్పుడైనా; మన భూములన్= మనదేశాలలో; ఇట్టివానిన్+కంటిమె?= ఇటువంటి వాడిని చూచామా?

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'ఆ సమయంలో రోహిణికుమారుడు కోపాతిశయంతో ముఖం ఎర్రబడగా లేచి, చేతులు పైకెత్తి, చుట్టూ ఉన్న రాజులలో 'బకవిధ్వంసియొక్క పరాక్రమ పద్ధతిని స్పష్టంగా చూచారా? మన దేశంలో ఎప్పుడైనా ఇటువంటి వారిని చూచామా?

**వ. గదాయుద్ధంబున నాభికి దిగువ యగుశరీరభాగంబు నొప్పించుట ధర్మంబుగా దను శాస్త్రోక్తి వినమె? వీఁడు విచ్చలవిడిఁ దెంపు సేసె' నని పలుకు నమ్మహాత్ముని మనంబున రోషానలంబు సముత్థితం బగుటయు నప్పుడు. 295**

**ప్రతిపదార్థం:** గదా యుద్ధంబునన్= గదతో చేసే పోరాటంతో; నాభికిన్ దిగువ అగు శరీరభాగంబున్= బొడ్డునకు క్రిందిదైన శరీరభాగమును; నొప్పించుట= బాధించటం; ధర్మంబు+కాదు= న్యాయం కాదు; అను శాస్త్ర+ఉక్తి= అన్న నీతిశాస్త్రపు మాట; వినమే?= వినలేదా!; వీఁడు= ఈ భీమసేనుడు; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; తెంపు+చేసెన్= సాహసం చేశాడు; అని= అంటూ; పలుకు= మాటాడుతున్న; ఆ+మహాత్ముని= ఆ గొప్పవాడి; మనంబునన్= మనస్సులో; రోష+అనలంబు= రోషాగ్ని; సముత్థితంబు+అగుటయున్= బాగా రేగగా; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** గదాయుద్ధంలో బొడ్డుకు దిగువభాగంలో బాధించటం న్యాయంకాదు- అనే యుద్ధనీతిశాస్త్ర ధర్మాన్ని వినలేదా! ఈ భీముడు విచ్చలవిడిగా తెగించాడు.' అని అంటున్న ఆ మహాత్ముడి (బలరాముడి) మనస్సులో రోషాగ్ని ప్రజ్వలించగా అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నిజరథము మీఁది హలమును । భుజశిఖరమునం దమర్చి భూమి యద్రువ వా**
**యుజుదెసకు నడచె నుద్భట । గజరిపుచంక్రమణ రేఖ గతియం దొలయన్. 296**

**ప్రతిపదార్థం:** నిజరథము మీఁది= తన తేరుమీది; హలమును= నాగలిని; భుజశిఖరమునందు+అమర్చి= భుజం మీద నిలుపుకొని; భూమి+అద్రువన్= భూమి వణకగా; వాయుజు దెసకున్= భీముడి దిక్కునకు; ఉద్భట= భయంకరమైన; గజరిపు= సింగముయొక్క; చంక్రమణరేఖ= తిరిగే పద్ధతి; గతి అందున్= నడకలో; ఒలయన్= కానరాగా; నడచెన్= మీదకు నడచాడు.

**తాత్పర్యం:** (బలరాముడు) తన రథంమీద ఉన్న నాగలిని భుజంపైన పెట్టుకొని, భూమి వణకగా, భయంకరమైన సింహం తిరిగే పద్ధతి నడకలో కానరాగా భీముడి వైపునకు నడచాడు.

## శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ గోపోపశమనంబు చేయుట (సం. 9-59-7)

**వ. దానికిం బవమానసూనుండు సోదరభుజబలనిజబలంబు లేకముఖత్వంబున నెప్పడుం గలుగు మనోబలంబు వలనం జలింప కుండె; నట్టియెడ వేగంబ వినయవినతుం డగుచు నచ్యుతుం డడ్డంబు సొచ్చి దీర్ఘవృత్తపీనంబు లగుబాహువుల హలాయుధుఁ బట్టి కైలాసశైలంబు గదిసిన యంజనమహీధరంబుమాడ్కి నొప్పి యనూనస్వరంబున నతని కిట్లనియె. 297**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ చేష్టకు; పవమాన సూనుండు= భీమసేనుడు; సోదర భుజబల నిజబలంబులు= తన తోబుట్టువుల యొక్క భుజశక్తి, తనశక్తి; ఏకముఖత్వంబునన్= ఒక్కటిగా; ఎప్పుడున్ కలుగు= ఎల్లవేళలా కలుగుతున్న; మనోబలంబువలనన్+ చలింపకుండెన్= మానసిక స్థైర్యం వలన కదలకుండా ఉన్నాడు; అట్టిఎడన్= ఆ వేళ; వేగంబ= శీఘ్రంగా; వినతుండు+అగుచున్= అణకువతో వంగినవాడౌతూ; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అడ్డంబు+చొచ్చి= అడ్డం వచ్చి; దీర్ఘవృత్త పీనంబులు+అగు బాహువులన్= పొడవైన, గుండ్రనైన బలసిన చేతులతో; హలాయుధున్ పట్టి= బలరాముడిని పట్టుకొని; కైలాసశైలంబున్ కదిసిన= కైలాస పర్వతాన్ని సమీపించిన; అంజన మహీధరంబు మాడ్కిన్= కాటుకకొండవలె; ఒప్పి= తగిఉండి; అనూన స్వరంబునన్= పెద్దగొంతుతో; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ బలరాముడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ బలరాముడి పద్ధతికి భీమసేనుడు తనయొక్క, తన తోబుట్టువుల యొక్క శక్తి ఒక్కటై నిలకడతోడి మనఃస్థైర్యంతో స్థిరంగా ఉన్నాడు. అటువంటి సమయంలో త్వరగా వినయంతో కూడినవాడై శ్రీకృష్ణుడు అడ్డంగా

పోయి, పొడవైన, గుండ్రనైన, బలిసిన తన చేతులతో బలరాముడిని పట్టుకొని కైలాసపర్వతాన్ని కాటుకకొండ పట్టుకొన్నట్లుగా ఒప్పి, పెద్దగొంతుతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ. బలరాముడు తెలుపు. అందుచేత అతడికి తెల్లని కైలాసంతో పోలిక, కృష్ణుడు నలుపు. అందుకే అతనికి కాటుకకొండతో పోలిక.

**క. తనవృద్ధియు మిత్రునివ । ర్ధనమును దత్సఖసమృద్ధి ప్రబలుటయును శ**
**త్రునిదెస నిన్నియుఁ జెడుటయు । నను షడ్విధములను దన్ను నతిశుభ మొందున్. 298**

**ప్రతిపదార్థం:** తన వృద్ధియున్= తన ఎదుగుదల; మిత్రుని వర్ధనమును= స్నేహితుడి ఎదుగుదలయును; తద్+సఖ సమృద్ధి= ఆ స్నేహితుల సమృద్ధి; ప్రబలుటయున్= పెరుగుటయు; శత్రుని దెసన్= వైరియెడ; ఇన్నియున్+చెడుటయున్= పైని చెప్పిన వన్నీ నశించి పోవుటయు; అను= అన్నటువంటి; షడ్విధములను= ఆరు పద్ధతుల చేతను; తన్నున్= తన యెడ; అతిశుభము+ ఒందున్= మిక్కిలి మేలు కలిగిస్తుంది.

**తాత్పర్యం:** తాను పెంపుచెందటం, తన మిత్రుడు పెరగటం, ఆ స్నేహితులు దండిగా ప్రబలటం, శత్రువు విషయంలో ఇన్నీ చెడిపోవటం అనే ఆరువిధాలు తనకు మిక్కిలి మేలు కలిగిస్తాయి.

**విశేషం:** తన పెంపూ, తన మిత్రుని పెంపూ, తన మిత్రుల సమృద్ధి అధికం కావటం - అనేవి తన విషయంలోనూ, ఇవన్నీ శత్రువు విషయంలో చెడిపోవటమూ - అంటే - తనకు పెంపు లేమి, తన మిత్రునకు పెంపు లేమి, తనకు మిత్రుల సమృద్ధి అధికం కాకపోవటం - అనే ఈ ఆరు విధాలూ తనకు శుభం కలిగిస్తాయి.

**వ. ఏతత్ప్రకారంబు విపరీతం బగుట యొప్ప; దట్లు గావున మిత్రునకుం గీడు వాటిల్లి నెడ నేర్పు గలుగునేని మైత్రిపరుం డయిన పౌరుషశాలి యది శమింపం జేయు సత్యపరాక్రము లగు పాండవులు మనకుఁ బరమ మిత్రులు; విశేషించి మన మేనత్తకొడుకు, లనీతిపరులచేతం బరిభవింపంబడినవారు గావున వీరల కభ్యుదయంబు గలిగించుట నీకుం గర్తవ్యంబు. 299**

**ప్రతిపదార్థం:** ఏతద్+ప్రకారంబు= ఈ పద్ధతి; విపరీతంబు+అగుట ఒప్పదు= వ్యతిరేకం కావటం తగదు; అట్లు కావునన్= అందుచేత; మిత్రులకున్ కీడు వాటిల్లిన+ఎడన్= స్నేహితులకు కష్టం కలిగినప్పుడు; నేర్పు కలిగెనేని= చేతనైతే; మైత్రి పరుండు+ఐన పౌరషశాలి= స్నేహశీలిఅయిన శక్తి కలవాడు; అది= ఆ కీడును; శమింపన్ చేయు= అణగచేస్తాడు; సత్యపరాక్రములు+అగు పాండవులు= సత్యమైన, వీరం కల పాండవులు; మనకున్+పరమమిత్రులు= మనకు మిక్కిలి స్నేహితులు; విశేషించి= మీదు మిక్కిలి; మన మేనత్త కొడుకులు= మన మేనత్త కుమారులు; అనీతిపరుల చేతన్= నీతిలేని వారి వలన; పరిభవింపఁబడినవారు= అవమానానికి లోనయినవారు; కావునన్= అందువలన; వీరలకున్= ఈ పాండవులకు; అభ్యుదయంబు కలిగించుట= మేలు చేకూర్చటం; నీకున్+కర్తవ్యంబు= నీకు చేయదగిన పని.

**తాత్పర్యం:** పై నీతి విపరీతం కావటం తగదు. అందుచేత మిత్రుడికి కష్టం కలిగినప్పుడు ప్రజ్ఞ కలిగిన, స్నేహపరుడైన, బలవంతుడు దానిని ఆదుకొంటాడు. సత్యపరాక్రములైన పాండవులు మనకు మిక్కిలి స్నేహితులు. మీదుమిక్కిలి మన మేనత్త కొడుకులు కూడా. నీతిలేనివారిచేత అవమానానికి లోనయినవారు. కనుక వీరికి అభ్యుదయం కలిగించటం నీకు చేయవలసిన పని.

**విశేషం:** అంటే పైన చెప్పిన షడ్విధశుభకరములలోను, రెండవది (మిత్రుని వర్ధనం) మూడవది (సఖసమృద్ధి ప్రబలటం) మనం చేయాలి. అప్పుడు మనకు అతిశుభం కలుగుతుంది.

**తే. ప్రతిన నెఱపుట నృపులకుఁ బరమధర్మ । మగుట మనమునఁ జర్చింపు; మనిలసుతుఁడు**
**గద సుయోధను తొడలు భగ్నములు సేయు । వాఁడు గా సభఁ బూనినవాఁడు గాఁడె? 300**

**ప్రతిపదార్థం:** ప్రతిన నెఱపుట= శపథాన్ని నెరవేర్చటం; నృపులకున్= రాజులకు; పరమ ధర్మము+అగుటన్= ఉత్తమ న్యాయంకావటం; మనమునన్+చర్చింపుము= మనస్సులో తలచుకొనుము; అనిలసుతుఁడు= భీమసేనుడు; గదన్= గదతో; సుయోధనుతొడలు= దుర్యోధనుడి తొడలను; భగ్నములు చేయువాఁడుగాన్= విరుగగొట్టేవాడుగా; సభన్= సభలో; పూనినవాఁడు కాఁడె?= ప్రతిజ్ఞ చేసినవాడు కాడా?

**తాత్పర్యం:** రాజులకు ప్రతిజ్ఞ నెరవేర్చటం ఉత్కృష్టధర్మం అనే విషయాన్ని మనస్సులో యోచించుము. వాయు తనయుడైన భీముడు గదతో దుర్యోధనుడి తొడలను విరుగగొట్టుతానని సభలో ప్రతిజ్ఞచేశాడు కదా!

**వ. అట్లుంగాక మైత్రేయమహాముని శాపంబున దుర్యోధనుతొడలు భీమసేనుగదాఘాతంబున భగ్నంబులు గాఁ గలయవి యై యుండె; నిప్పు డట్లయ్యెం గావున దీన దోషంబు దోఁపదు; క్రోధం బుపసంహరింపుము; కుంతీనందనుల యభివృద్ధి మనకు సమృద్ధిఁ జేయు' ననిన నతనికి హలాయుధుం డి ట్లనియె. 301**

**ప్రతిపదార్థం:** అట్లున్ కాక= అంతే కాకుండా; మైత్రేయ మహాముని= మైత్రేయ మహర్షి; శాపంబునన్= ఇచ్చిన శాపం కారణంగా; దుర్యోధను తొడలు= దుర్యోధనుడి తొడలు; భీమసేను= భీముడియొక్క; గదాఘాతంబునన్= గద దెబ్బచేత; భగ్నంబులు+కాన్+కలవిఐ+ఉండెన్= విరిగిపోయేవయి ఉండినవి; ఇప్పుడు+అట్లు+అయ్యెన్= ఇప్పుడు ఆ ప్రకారంగా అయినది; కావునన్= అందువలన; దీనన్= ఈ చేష్టయందు; దోషంబు తోఁపదు= తప్పు కనిపించదు; క్రోధంబు+ఉపసంహరింపుము= కోపాన్ని వదలుము; కుంతీ నందనుల+అభివృద్ధి= కుంతి కుమారులయొక్క పెంపు; మనకున్ సమృద్ధి+చేయున్= మనకు మేలు చేస్తుంది; అనినన్= అనగా; అతనికిన్; హలాయుధుండు+ఇట్లు+అనియెన్= బలరాముడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీముడి శపథం మాత్రమే కాదు. మైత్రేయ మహాముని శాపం కారణంగా కూడా భీముడి గదయొక్క తాకిడికి దుర్యోధనుడి తొడలు విరుగవలసి ఉన్నది. ఇప్పు డది జరిగింది. దీనిలో దోషం లేదు. నీ కోపాన్ని అణగించుకొమ్ము. కుంతికుమారులయొక్క క్షేమం మనకు మంచిని కలిగిస్తుంది' అన్నటువంటి శ్రీకృష్ణుడితో బలరాము డిట్లా అన్నాడు:

**తే. 'ఓపి ధర్మార్థ కామంబు లొకటి నొకటి । నాశ మొందింప కుండంగ నడపవలయుఁ**
**గాక! ధర్మంబు సెడ నర్థకామములను । గోరు పురుషుండు నిందకుఁ గుదురుగాఁడె? 302**

**ప్రతిపదార్థం:** ఓపి= చాలి; ధర్మార్థ కామంబులు+ఒకటిన్+ఒకటి= ధర్మార్థ కామాలు ఒకదాని నొకటి; నాశము+ఒందింపకుండన్ నడపవలయున్= నాశం చేయకుండా నడచుకొనవలయును; కాక= ఆ విధంగా కాకుండా; ధర్మంబు+చెడన్= ధర్మం నశించిపోయేటట్లు; అర్థకామములను కోరు పురుషుండు= సంపదలను, కామములను ఆశించే పురుషుడు; నిందకున్ కుదురు+కాఁడె?= అపకీర్తికి చోటుకదా!

**తాత్పర్యం:** 'ధర్మార్థ కామాలు క్రమంగా ఒకదానినొకటి నాశనం చేయకుండా నడచుకొనవలసి ఉన్నది. అట్లుకాక ధర్మం చెడిపోయేటట్లు అర్థాన్నీ, కామాన్నీ కోరే మానవుడు అపకీర్తికి ఆలవాలం కాడా?

**క. మునిశాపంబును బ్రతినయు । నని చెప్పితి; గలుగుఁ గాక!' యని విను ధర్మం**
**బున వానిన్ నెఱపక యి । ట్లనిలసుతుఁడు గలఁచెఁ గాదె యన్నెఱి యెల్లన్.' 303**

**ప్రతిపదార్థం:** మునిశాపంబును= ముని ఇచ్చిన శాపమూ; ప్రతినయున్= ప్రతిజ్ఞయూ; అని చెప్పితి(వి)= అని చెప్పావు; కలుగున్+కాక!= అవి ఉండవచ్చు గాక; విను= వినుము; అనిన్= యుద్ధంలో; ధర్మంబునన్ వానిన్ నెఱపక= ధర్మంతో ఆ పనులు చేయకుండా; ఇట్లు= ఈ విధంగా; ఆ+నెఱి+ఎల్లన్= ఆ ధర్మము నంతటిని; అనిలసుతుఁడు= భీమసేనుడు; కలఁచెన్+కాదె!= చెడిపెను కదా!

**తాత్పర్యం:** మునీశ్వరుడి శాపం, భీముడి ప్రతిజ్ఞ - అని చెప్పావు. కావచ్చును. కాని, ధర్మవిరుద్ధంగా వ్యవహరించి యుద్ధంలో ఈ విధంగా భీమసేనుడు న్యాయాన్నంతటిని చీకాకు పరచాడు కదా! అర్థకామాలకోసం భీముడు యుద్ధధర్మాన్ని బలి చేశాడు కదా!'

**చ. అన విని కృష్ణుఁ డిట్టు లను 'నాతనికిన్ నిను నిజ్జగంబు ధ**
**ర్మనిరతమానసుండు మధురత్వనిరూఢుఁడు దోషదూరుఁ డం**
**చనిశము సంస్తుతించును మహాత్మ! యడంపుము క్రోధ; మీతఁడుం**
**దనదు ప్రతిజ్ఞ కై రిపు గదాహతుఁ జేసె; నధర్మ మే లగున్? 304**

**ప్రతిపదార్థం:** అనిన్+విని= అనగా వినినవాడై; ఆతనికిన్= ఆ బలరాముడితో; కృష్ణుఁడు+ఇట్టులు+అనున్= శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పాడు; మహాత్మ!= ఓ మహనీయుడా!; నినున్= నిన్ను; ఈ+జగంబు= ఈ లోకం; ధర్మనిరతమానసుండు= ధర్మమునం దాసక్తితోడి మనసున్నవాడు; మధురత్వ నిరూఢుఁడు= తీయదనమగు నడవడియందు పట్టున్నవాడు; దోషదూరుఁడు= దోషం లేనివాడు; అంచున్= అంటూ; అనిశమున్= ఎల్లప్పుడూ; సంస్తుతించును= కీర్తిస్తుంది; క్రోధము= కోపం; అడంపుము= మానుకొనుము; ఈతఁడును= ఈ భీముడు కూడా; తనదు ప్రతిజ్ఞకై= తను చేసిన శపథానికి గాను; రిపున్= వైరిని; గదాహతున్+చేసెన్= గదతో పడగొట్టాడు; అధర్మము+ఏల+అగున్= (అది) న్యాయాతిక్రమణం ఎందు కవుతుంది?

**తాత్పర్యం:** బలరాము డట్లా అనగా విన్న శ్రీకృష్ణుడు ఆతడితో నిట్లా అన్నాడు: 'లోకం నిన్ను ధర్మతత్పరుడుగా తీయని మనసున్నవాడుగా ఎపుడూ కీర్తిస్తుంటుంది. ఓ మహాత్మా! కోపాన్ని మానుకొనుము. ఈ భీముడు తన ప్రతిజ్ఞను నెరవేర్చటానికి శత్రువును గదాహతుడిగా చేశాడు. ఇది ప్రతిజ్ఞానిర్వహణమే కాని ఏ విధంగా అధర్మమౌతుంది?

**వ. అదియును నిలిచి మార్కొన్న యప్పుడును నడచు నెడను గాదు; పొడ వెగసి పై కుఱికినఁ దన్నుం గాచికొనుటయుం బ్రతిన నెఱపుటయును గారణముగా దొరకొనిన నాభికి దిగువ గదా! యని యుడిగి చావ వచ్చునే? గద నూరుభంగంబు సేయుదు నను భీమసేను పూనికి పదుమూఁడు వత్సరంబులేని వేఁచిన యది యక్కులపాంసనుం డేల తలంపకుండె? మఱచెనేనిం జెడుఁగాక! మనకేమి? కలియుగంబు చొరవ యాసన్నం బయ్యె; నివ్విధంబులు ధర్మంబు లై చెల్లకుండునే? యట్లుంగాక పుట్టినంతనుండియుం**

**గపటంబున నపకారంబులు సేయుచున్న వీనిఁ గపటప్రకారంబునఁ బడవైచుట ధర్మహాని యై తోఁపదు; వీఁడు పాండవ యాదవ వంశవర్ధనుం డగు సుభద్రానందనుం దెగటార్చిన తెఱం గెఱుంగమే?' యనిన నా బలదేవుండు బలు మొగంబుతో 'నిట్టి చెనఁట గెలుపు గెలిచిన భీముండు వొగడు వడయుం గాక! రణధర్మంబు దప్పక పెనంగినట్టి ధర్మాత్ముం డైన దుర్యోధనున కుత్తమలోకం బయ్యెడు' మనుచు నతనికిం జెప్పి రథాధిరూఢుం డై పాండవేయపాంచాలయదుప్రవరులు చిన్నంబోవ నిజపురంబున కరిగెఁ; దదనంతరంబ వాసుదేవుండు ధర్మపుత్రు నాలోకించు నెడ నతండు దీనాననంబుతోడ మానసంబు విషాదంబు నొంద నూరకున్న, నారాయణుం డతని కిట్లనియె. 305**

**ప్రతిపదార్థం:** అదియును= అదికూడా - నాభి దిగువ కొట్టటం కూడ; నిలిచి మార్కొన్న అప్పుడు= నిలిచి ఎదుర్కొన్నప్పుడు; నడచున్= జరుగుతుంది; ఎడను కాదు= వేఱయినపుడు కాదు; పొడవు+ఎగసి= పైకి దూకి; పైకి+ఉఱికినన్= మీదకు దూకితే; తన్నున్+కాచికొనుటయున్= తనను కాపాడుకొనటం; ప్రతిన నెఱపుటయును కారణముగాన్= ప్రతిజ్ఞా పాలన చేయుటయు కారణంగా; దొరకొనినన్= పూనుకొన్నచో; నాభికిన్ దిగువన్+కదా!+అని= బొడ్డునకు క్రింది భాగాన కదా! అనుకొంటూ; చావవచ్చునే?= చావనగునా?; గదన్= గదతో; ఊరుభంగంబు చేయుదున్= తొడలను విరుగగొట్టుతాను; అను భీమసేను పూనికి= అన్న భీముడి ప్రతిన; పదుమూఁడు వత్సరంబులు+ఏని వేఁచిన+అది= పదమూడు సంవత్సరాలు కాచుకొన్నది; ఆ+ కులపాంసనుండు= ఆ వంశ నాశకుడు; ఏల= ఎందుకు; తలంపకుండెన్?= తలచుకోకుండా ఉన్నాడు?; మఱచెనేనిన్+ చెడుఁగాక!= మరచిపోతే నాశమగుగాక!; మనకేల?= మనకున్+ఎందుకు?; కలియుగంబుచొరవ= కలియుగ ప్రవేశం; ఆసన్నంబు+అయ్యెన్= దాపయింది; ఈ+విధంబులు= ఈ నడకలు; ధర్మంబులు+ఐ= ధర్మాలుగా; చెల్లకుండునే= నడవకుంటాయా; అట్లున్+కాక= అంతే కాకుండా; పుట్టినంత నుండియున్= జన్మించిన నాటినుండీ; కపటంబునన్= మోసంతో; అపకారంబులు చేయుచున్న వీనిన్= కష్టాలు కలిగిస్తూ ఉన్న వీడికి; కపటప్రకారంబునన్= మోసపు పద్ధతిలో; పడవైచుట= చంపుట; ధర్మహాని+ఐ తోఁపదు= నీతి తప్పుటగా తోచదు; వీఁడు= ఈ దుర్యోధనుడు; పాండవ యాదవ వంశవర్ధనుండు+అగు= పాండవులయు యాదవులయు కులవర్ధనుడైన; సుభద్రా నందనున్ తెగటార్చిన్ తెఱంగు= సుభద్రకుమారుడైన అభిమన్యుడిని చంపిన విధం; ఎఱుంగమే?= తెలియమా?; అనినన్= అనగా; ఆ బలదేవుండు= ఆ బలరాముడు; బలుమొగంబుతోన్= గండుముఖంతో; ఇట్టి చెనఁటి గెలుపు= ఇటువంటి కుత్సితపు గెలుపును; గెలిచిన= గెలిచినట్టి; భీముడు పొగడు+పడయున్+కాక!= భీమసేనుడు కీర్తిపొందుతాడు గాక!; రణధర్మంబు తప్పక= యుద్ధనీతిని వదలక; పెనంగిన+అట్టి= యుద్ధం చేసిన; ధర్మాత్ముండు+ఐన= నీతిపరుడైన; దుర్యోధనునకున్+ఉత్తమ లోకంబు+అయ్యెడున్= పుణ్యలోకం దుర్యోధనుడికి కలుగుతుంది కాక!; అనుచున్= అంటూ; అతనికిన్+చెప్పి= శ్రీకృష్ణుడితో చెప్పి; రథ+అధిరూఢుండు+ ఐ= తేరెక్కినవాడయి; పాండవేయ పాంచాల యదు ప్రవరులు= పాండవులు పాంచాలురు; యాదవముఖ్యులు; చిన్నన్+పోవన్= సిగ్గుపడగా; నిజపురంబునకున్+అరిగెన్= తన ఊరికి వెళ్ళాడు; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ధర్మపుత్రు నాలోకించు+ఎడన్= ధర్మరాజును చూడగా; అతండు= ధర్మరాజు; దీన+ ఆననంబుతోడన్= విషణ్ణమైన మొగంతో; మానసంబు విషాదంబున్+ ఒందన్= మనసు దుఃఖపడగా; ఊరకున్నన్= మిన్నకుండగా; నారాయణుండు+అతనికిన్+ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణు డీవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నిలిచి ఎదుర్కొన్నపుడూ నడచేటప్పుడూ కాకుండా పైకెగసి దూకినపుడు ఆత్మరక్షణకై ప్రతిజ్ఞను నెరవేర్చటం కారణంగా పూనుకొని బొడ్డునకు క్రిందకదా అని ఊరకొని చావవచ్చునా? గదతో తొడలు విరుగగొట్టుతా నన్న భీమసేనుడి ప్రయత్నం పదుమూడు సంవత్సరాలు కాచుకొని ఉండగా ఆ కులనాశకుడు దానిని తలచుకొనకుండా మరచితే నాశనమగుగాక! మన కెందుకు? కలియుగం ప్రవేశించే సమయం సిద్ధమైంది. ఇట్లాంటివి ధర్మబద్ధ మయి చెల్లకుండా ఉంటాయా? అంతే కాదు పుట్టిననాటినుండీ మోసమే నడవడి అయిన ఈతడిని పడవేయటం ధర్మహానిగా

తోచదు. వీడు పాండవ యాదవవంశ దీపకుడైన సుభద్రాతనయుడిని చంపిన పద్ధతి మనకు తెలియదా?' అని అనగా విని, బలరాముడు గండుమొగంతో 'ఈ విధమైన కపటపు గెలుపును గెలిచిన భీముడు ప్రశంసలు పొందుతాడుకాక! యుద్ధధర్మమును అతిక్రమించక యుద్ధం చేసిన ధర్మపరుడైన దుర్యోధనుడికి పుణ్యలోకాలు కలుగుతాయి.' అంటూ కృష్ణుడికి చెప్పి, తేరెక్కి పాండవులు, పాంచాలురు, యాదవులు చిన్నబోవగా తన ఊరికి బలరాముడు వెళ్ళాడు. పిమ్మట శ్రీకృష్ణుడు ధర్మజుడిని చూడగా అతడు దైన్యాన్ని ప్రకటించే మనసుతో దుఃఖపడుతుండగా అతడితో శ్రీకృష్ణు డీ విధంగా అన్నాడు:

**ఆ. 'బంధునాశకుండు పాపాత్ముఁ డీసుయో । ధనుఁడు వీని సమరధరణిఁ గూల్చి**
**శిరము దన్నె భీముఁ; డరయంగ నది యధ । ర్మంబె? నీకు నేల మఱుఁగఁ జెపుమ! 306**

**ప్రతిపదార్థం:** బంధునాశకుండు= బంధువులను నశింపజేసినవాడు; పాపాత్ముఁడు= పాపాలు చేసినవాడు; ఈ సుయోధనుఁడు= ఈ దుర్యోధనుడు; వీనిన్= ఈతనిని; సమరధరణిన్+కూల్చి= యుద్ధభూమిలో చంపి; భీముఁడు= భీముడు; శిరము తన్నెన్= తలను తన్నాడు; అది= ఆ పని; అరయంగన్= చూడగా; అధర్మంబె?= అన్యాయమా?; నీకున్ మఱుఁగన్?= నీవు శోకించటం?; ఏల= ఎందుకు?; చెపుమ!= చెప్పుము.

**తాత్పర్యం:** 'బంధునాశనానికి కారకుడూ, పాపకర్ముడూ అయిన ఈ సుయోధనుడిని యుద్ధభూమిలో పడగొట్టి భీముడు తలను తన్నాడు, అది అధర్మమా? దీనికి నీవు విచారించటమెందుకు? చెప్పుము.

**వ. తలఁ దన్నువాఁడ నను ప్రతిజ్ఞయుఁ గీచకారాతికిం గలదు గాదె?' యనిన విని కుంతీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 307**

**ప్రతిపదార్థం:** తలన్+తన్నువాఁడను+అను ప్రతిజ్ఞయున్= తలను తన్నుతాననే శపథంకూడా; కీచక+అరాతికిన్+కలదు కాదె!= కీచక వైరిఅయిన భీముడికి ఉన్నదికదా!; అనినన్ విని= అనగా విని; కుంతీనందనుండు= కుంతి కుమారుడైన ధర్మజుడు; దేవకీ నందనునకున్= దేవకీ కుమారుడైన శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** తలను తన్నుతానని కూడా కీచకవైరి భీముడు శపథం చేసి ఉన్నాడు కదా!' అను మాటను విన్న ధర్మజుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**క. 'కురుకులము పొలియుటకు మది । యెఱియంగా నున్న నాకు నితఁ డీరాజున్**
**శిర ముఱక తన్ని యిమ్మెయిఁ । బరిభవ మొందింప వగపు పాటిలకున్నే? 308**

**ప్రతిపదార్థం:** కురు కులము పొలియుటకున్= కురువంశం నశించటానికి; మది= మనసు; ఎఱియంగాన్= పరితపించగా; ఉన్ననాకున్= ఉన్నట్టినాకు; ఇతఁడు= ఈ భీముడు; ఈ రాజున్= ఈ దుర్యోధనుడిని; శిరమున్= తలను; ఉఱక తన్ని= ఊఱకతన్ని; ఈ+మెయిన్= ఈవిధంగా; పరిభవము+ఒందింపన్= అవమానించగా; వగపు పాటిలక+ఉన్నే?= దుఃఖం కలుగక ఉంటుందా!

**తాత్పర్యం:** 'కురుకులం నాశనమయినందుకు అసలే మనసు పరితాపం పడుతున్న నాకు భీముడు ఈ రాజును ఈ విధంగా తలను తన్ని అవమానించటం వలన దుఃఖం కలుగకుండా ఉంటుందా?

**తే. ఇతఁడు వఱిచిన పాటులు హృదయకీలి । తంబు లై భీమసేనుండు తగవు మాలె**
**నేమి సేయంగవచ్చుఁ? బోనిమ్ము పుణ్య । పాపచింత యిం కేటికిఁ బద్మనాభ!' 309**

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= శ్రీకృష్ణా!; ఇతఁడు= ఈ దుర్యోధనుడు; పఱిచిన పాటులు= పెట్టిన కష్టాలు; హృదయ కీలితంబులు+ ఐ= గుండె మంటలుకాగా; భీమసేనుడు; తగవు మాలెన్= ధర్మాన్ని వదలాడు; ఏమి+చేయంగ వచ్చున్?= ఏమి చేయగలం?; పోనిమ్ము; పుణ్యాపాపచింత= పుణ్యమో పాపమో దానిని గూర్చి తలచుకొనటం; ఇంకన్+ఏటికిన్= ఇంక ఎందుకు?

**తాత్పర్యం:** ఈ దుర్యోధనుడు పెట్టిన కష్టాలు గుండెను మండింపగా భీముడు సమతాధర్మాన్ని వదలాడు. ఏమి చేయగలం? పోతే పోనిమ్ము. ఓ పద్మనాభా! పుణ్యాపాపాలను గూర్చిన తలపు ఇం కెందుకు?'

**వ. అనుటయు 'నట్లు కాక దీని నింత గొనియాడ నేల?' యని యతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునం బుచ్చె; వివ్వచ్చుండు నెఱయం బ్రియం బందని డెందంబుతోఁ గీడు మే లాడక యూరకుండె; నమ్మారుతి మోదం బెసఁగ మోడ్పుఁగేలు ఫాలతలంబున మోపికొనుచు నుత్ఫుల్లంబు లగు లోచనంబుల నొప్పి నిజాగ్రజుం జేరం జని యి ట్లనియె. 310**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అట్ల+కాక= అంతేకాని; దీనినిన్= ఈ పనిని; ఇంత+కొనియాడన్+ఏల?= ఇంతగా తర్కించటం ఎందుకు?; అని అతండు= అంటూ శ్రీకృష్ణుడు; భీమసేన పక్షపాతంబునన్= భీముడిమీద అభిమానంతో; అతని చింత= ఆ ధర్మజుడి చింతను; గీటునంబుచ్చెన్= తొలగించాడు; వివ్వచ్చుండు= అర్జునుడు; నెఱయన్+ప్రియంబు+ అందని డెందంబుతోన్= నిండుగా సంతసించని మనసుతో; కీడు మేలు+ఆడక= మంచి చెడులను పలుకకుండా; ఊరక+ ఉండెన్= ఊరకుండిపోయాడు; ఆ+మారుతి= ఆ భీముడు; మోదంబు= సంతోషం; ఎసఁగన్= ఎక్కువకాగా; మోడ్పు+కేలు= చేతులుజోడించి; ఫాలతలంబునన్ మోపికొనుచున్= నెన్నుదుటికి తాకించుకొంటూ; ఉత్ఫుల్లంబులు+అగు= వికసించిన; లోచనంబులన్= కన్నులతో; ఒప్పి= తగిఉండి; నిజ+అగ్రజున్+చేరన్+చని= తన అన్నవద్దకు వెళ్ళి.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనగా శ్రీకృష్ణుడు 'దీనిని గూర్చి ఇంతగా మాట్లాడటం ఎందుకు? అని భీముడి పక్షం వహించి, ధర్మజుడికి కలిగిన చింతను తొలగించాడు. అర్జునుడు నిండైన ప్రీతి కలుగని మనసుతో మంచి చెడులను చెప్పక ఊరకున్నాడు. భీమసేనుడు సంతోషంతో రెండు చేతులును జోడించి నమస్కరిస్తూ వికసితనేత్రుడై తన అన్న వద్దకు చేరి, ఈ విధంగా అన్నాడు:

**చ. 'పరిభవకారి యైన కులపాంసనుఁ డాహవభూమిఁ గూలెఁ ద**
**త్పరమతి వైరముం బెనిచి పాపవినిశ్చయ కారకత్వని**
**ష్ఠురు లగు దుస్ససేనుఁడును సూతసుతుండును సౌబలుండుఁ ద్రుం**
**గి రితనికంటె మున్ను; మహికిం బతి వీవ! భరింపు మున్నతిన్.' 311**

**ప్రతిపదార్థం:** పరిభవకారిఐన కులపాంసనుఁడు= అవమాన కారకు డైన కుల నాశకుడు; ఆహవ భూమిన్+కూలెన్= యుద్ధరంగంలో చనిపోయాడు; తత్పరమతిన్= తదేకమైన మనస్సుతో; వైరమున్ పెనిచి= శత్రుత్వాన్ని పెంచి; పాప వినిశ్చయ కారకత్వ నిష్ఠురులు+అగు= పాపపు పనిచేయించటంలో పట్టుదల కలవారైన; దుస్ససేనుఁడును= దుశ్శాసనుడూ; సూతసుతుండును= కర్ణుడూ; సౌబలుండు= శకునీ; ఇతనికంటెన్ మున్ను= ఈ దుర్యోధనుడి కన్న ముందుగా; త్రుంగిరి= చనిపోయారు; మహికిన్+పతివి+ఈవ= భూమికి రాజవు నీవే. ఉన్నతిన్ భరింపుము= ఔన్నత్యాన్ని భరించుము.

**తాత్పర్యం:** అవమానాలకు కారణమైన వాడు, కులనాశకుడు యుద్ధరంగంలో చనిపోయాడు. పట్టుదలతో శత్రుత్వాన్ని పెంచి పాపకార్యాలు చేయించటంలో, కఠినమైన మనసు గల దుశ్శాసన, కర్ణ శకునులు ఇతడికంటె ముందుగా చనిపోయారు. భూమికి రాజువు నీవే. అన్ని విధాలా ఔన్నత్యంతో ఈ రాజ్యభారాన్ని వహించుము.' (అని అన్నతో భీము డన్నాడు).

**వ. అనిన విని ధర్మతనయుం డతని కిట్లనియె. 312**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విన్నవాడైన; ధర్మతనయుండు= ధర్మరాజు; అతనికిన్= ఆ భీముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీముడితో ఇట్లా అన్నాడు:

**క. హరితలఁపు గూడఁ గురుపతిఁ । బరిమార్చితి, ప్రతినతోడఁ బగ దీర్చితి; నీ**
**కరయంగ దైవబలవి । స్ఫురిత భుజాబలము లింత చొప్పడి యున్నే! 313**

**ప్రతిపదార్థం:** హరితలఁపు+కూడన్= శ్రీకృష్ణుడి భావం కూడిరాగా; కురుపతిన్+పరిమార్చితి(వి)= దుర్యోధనుడిని చంపావు; ప్రతినతోడన్= శపథంతో; పగదీర్చితి(వి)= వైరమును తీర్చుకొన్నావు; నీకున్+అరయఁగన్= నీకు చూడగా; దైవబల= దైవబలంచేత విస్ఫురితభుజాబలము= ప్రకాశించే భుజబలం; ఇంత చొప్పడి+ఉన్నే?= ఇంతగా సమకూరిందా?

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడి తలపు సాయం కాగా, నీ వైరం, ప్రతిజ్ఞా తీరేటట్లుగా చేశావు. చూడగా నీకు దైవబలంతోడయిన భుజబలంగా ఇంత సమకూరిందా?

**వ. అని సంభావించె' ననిన విని యాంబికేయుండు సంజయు నుద్దేశించి. 314**

**ప్రతిపదార్థం:** అని సంభావించెన్= అని గౌరవించాడు; అనినన్= అనగా; విని= విన్నవాడై; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయున్+ఉద్దేశించి= సంజయుడితో (ఇట్లా మాట్లాడాడు).

**తాత్పర్యం:** అని గౌరవించాడు అనగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో - (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'అట్లు వడియున్న యక్కౌరవాధినాథుఁ । జూచి పాండుతనూజులు సోమకులును**
**నేమి సేసిరి? నా కది యెఱుఁగఁ జెప్పు' । మనుడు నతఁ డిట్టు లనియె నమ్మనుజపతికి. 315**

**ప్రతిపదార్థం:** అట్లు పడి ఉన్న= ఆ విధంగా (తొడలు విరిగి) పడిఉన్న; ఆ+కౌరవాధినాథున్+చూచి= కురురాజ నాయకుడైన దుర్యోధనుడిని చూచి; పాండుతనూజులు= పాండు రాజకుమారులైన పాండవులు; సోమకులును= సోమకాదులును; ఏమి చేసిరి?= ఏమిచేశారు; నాకున్+అది+ఎఱుఁగన్ చెప్పుము+అనుడున్= నాకది తెలియచేయుమనగా; ఆ+మనుజ పతికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఆతఁడు+ఇట్టులు+అనియెన్= ఆ సంజయుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'యుద్ధ రంగంతో తొడలు విరిగిపడి ఉన్న కురురాజును జూచి పాండవులును పాంచాలురు ఏమి చేశారు? నాకు తెలియజేయుము.' అని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడు అతడితో ఇట్లా అన్నాడు:

**వ. 'దేవా! యేమి సెప్పుదుఁ? బాండవులును బాంచాలురునుం దక్కటి భూపతులునుం గృష్ణసహితంబుగా నుబ్బునం బొంగి చీరలు వీచువారును విండులు విసరువారును గుణధ్వని సేయువారును శంఖంబు లొత్తువారును భేరీపణవాదులు మ్రోగించువారును బెలుచ నార్చువారును నయి పేర్చినం బృథివికి వ్రేఁగగు నట్లుండె నిత్తెఱంగునం జెలంగి మారుతిసూరెలం జేరి యిట్లనిరి. 316**

**ప్రతిపదార్థం:** దేవా! ఏమి చెప్పుదున్?= ప్రభూ! ఏమనగలను?; పాండవులును; పాంచాలురున్+తక్కటి భూపతులునున్= పాండవ, పాంచాలురు మాత్రమే కాక మిగిలిన రాజులు కూడా; కృష్ణసహితంబుగాన్= కృష్ణుడితోకూడా; ఉబ్బునన్+పొంగి= సంతోషంతో ఉప్పొంగి; చీరలు వీచువారును= బట్టలను ఊపేవాళ్ళు; విండులు విసరువారును= ధనుస్సులను ఆడించేవాళ్ళు; గుణ ధ్వనిసేయువారును= అల్లెత్రాటిని మీటేవాళ్ళు; శంఖంబులు+ఒత్తువారును= శంఖధ్వానం చేసేవాళ్ళు; భేరీపణవ+ఆదులు= నగారాలును, కొమ్ములు మొదలైనవాటిని; మ్రోగించువారును= శబ్దం చేసేవారూ; పెలుచన్+ఆర్చువారును= పెద్దగా అరచేవారూ; అయి= అగుచు; పేర్చినన్= విజృంభించగా; పృథివికిన్= భూమికి; వ్రేఁగు+అగునట్లు+ఉండెన్= భారం కలిగే విధంగా ఉండింది; ఈ+తెఱంగునన్+చెలంగి= ఈ విధంగా ఒప్పారి; మారుతి= భీముడి; సూరెలన్+చేరి ఇట్లు+అనిరి= ప్రక్కలలో చేరి ఈ విధంగా అన్నారు:

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఏమని చెప్పగలను? పాండవ, పాంచాల, తదితర దేశాధిపతులును శ్రీకృష్ణుడితో కలిసి సంతసంతో ఉప్పొంగి గుడ్డలు విసరుచున్నవారూ, ధనుష్టంకారాలు చేసేవారూ, శంఖాలు పూరించే వారూ, భేరీభాంకృతుల ధ్వనింపజేసేవారూ, పెద్దగా అరిచేవారూ అయి, విజృంభించి, భూమి అదరేటట్లుగా పై విధంగా తిరిగి భీముడి ప్రక్క చేరి ఇట్లా అన్నారు.

**మ. 'గదనే ర్పెక్కుడు గల్గు దర్పఘనుఁ డీ కౌరవ్యరాజన్యుఁ డు**
**న్మదలీలం బయి నట్లు బె ట్టుటికిన న్వంచించి పో కిట్లుసే**
**యుదె? నీవాటునఁ బెన్దొడల్ విఱిగి వీఁ డుర్విం బడెన్ మాకు నొ**
**ప్ప దలిర్పం బులకాంకురంబు లెసఁగం బో విప్పడుం జూడుమీ! 317**

**ప్రతిపదార్థం:** గద నేర్పు= గదను త్రిప్పటంలో ప్రజ్ఞ; ఎక్కుడుకల్గు= ఎక్కువగా గల; దర్పఘనుఁడు= గర్వంచేత ఘనుడైన; ఈ కౌరవరాజ్యన్యుడు= ఈ కౌరవరాజ శ్రేష్ఠుడు; ఉన్మదలీలన్= మిక్కిలి అహంకారపు చేష్టతో; అట్లు= ఆ విధంగా; బెట్టు+ ఉఱికినన్= మిక్కిలి దూకగా; వంచించిపోక= మోసంతో తప్పించుకొనకుండా; ఇట్లు చేయుదె?= ఈ విధంగా చేసితివా? (బాగా చేశావనుట); నీ పాటునన్= నీ దెబ్బకు; పెన్+తొడల్ విరిగి= పెద్దతొడలు విరిగి; ఈతడు+ఉర్విన్+పడెన్= ఇతడు(దుర్యోధనుడు) భూమిమీద పడ్డాడు; మాకున్= మాకందరికీ; ఒప్పు+తలిర్పన్= సొగసు వికసించగా; పులక+అంకురంబులు= గగుర్పాటు మొలకలు; ఎసఁగన్= ఒప్పారగా; ఇప్పుడున్= ఇప్పుడుకూడా; పోవు= పోకుండా ఉన్నాయి; చూడుమీ!= చూడుము.

**తాత్పర్యం:** 'ఈ దుర్యోధనుడు గదాయుద్ధంలో ఎక్కువ నేర్పుగల గర్వాధికుడు. వీడు గర్వంతో ఆ విధంగా మీదకు దూకగా మోసంతో తప్పించుకొనకుండా ఇట్లా చేశావు గదా! నీదెబ్బకు వీడు తొడలు విరిగి నేలకూలాడు. మాకందరికీ ఒప్పుగా కలిగిన గగుర్పాటు ఇప్పటికీ తగ్గలేదు. నీవే చూడుము.

**ఆ. పరులచేతఁ గాని పని యైనవృత్ర వ । ధంబుఁ బోని యరివధంబు నిర్వ**
**హించియున్న నిన్ను నే మింద్రుఁ గొనియాడు । నమరులట్ల పొగడెదము సెలంగి. 318**

**ప్రతిపదార్థం:** పరులచేతన్= ఇతరులవలన; కానిపనిఐన; వృత్రవధంబున్= వృత్రాసుర సంహారం; పోని= పోలిన; అరివధంబు= వైరి చావును; నిర్వహించి ఉన్న నిన్నున్= కొనసాగించి యున్న నిన్ను; ఏము= మేము; ఇంద్రున్+కొనియాడు= ఇంద్రుడిని పొగడే; అమరులు+అట్లు+అ= దేవతలవలె; చెలంగి= ఒప్పి; పొగడెదము= కీర్తిస్తాము.

**తాత్పర్యం:** ఇతరులకు సాధ్యం కానిపని వృత్రాసురవధ. దానిని పోలిన శత్రుసంహారాన్ని సాగించిన నిన్ను ఇంద్రుడిని దేవతలు పొగడినట్లుగా పొగడుతాము.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **అవమానంబులు సేసిన । యవినీతుల దుస్ససేనుఁ డాదిగఁ గలవా**
**రి వధించి యడుగు పగతుని । యవుదల నిడి; తింతవార లవనిం గలరే?'** **319**

**ప్రతిపదార్థం:** అవమానంబులు చేసిన= అవమానాలు కావించినట్టి; అవినీతులన్= దుర్మార్గులను; దుస్ససేనుఁడు+ఆదిగన్+ కలవారిన్+వధించి= దుశ్శాసనుడు మొదలైన వారిని చంపి; అడుగు= పాదము; అవుదలన్+ఇడితి(వి)= నెత్తిమీద పెట్టావు; ఇంతవారలు= ఇంతటివారు; అవనిన్+కలరే?= భూమిలో ఉన్నారా?

**తాత్పర్యం:** అవమానాలు చేసిన నీతిమాలిన దుశ్శాసనాదులను చంపి, నీ పాదమును శత్రువు నడినెత్తిమీద పెట్టావు. ఇంతటి వారు భూమిలో ఉన్నారా?'

**వ.** **అని మఱియు ననేకప్రకారంబుల బ్రశంసించిరి; భీముచేసిన గదాసమర ధర్మవిరోధంబు లాఁతి రాజులమనంబుల నుండునో? యని శంకించి కృష్ణుం డెల్లరాజులం గలయం గనుంగొని యిట్లనియె.** **320**

**ప్రతిపదార్థం:** అని మఱియున్+అనేక ప్రకారంబులన్+ప్రశంసించిరి= అని ఇంకను అనేక విధాలుగా పొగడారు; భీము చేసిన= భీముడు కావించిన; గదాసమర= గదాయుద్ధంలో; ధర్మవిరోధంబు= ధర్మాతిక్రమణం; లాఁతిరాజుల మనంబులన్+ఉండునో అని= ఇతర రాజుల మనసులలో ఉంటుందేమోఅని; శంకించి= అనుమానపడి; కృష్ణుండు+ఎల్లరాజులన్+కలయన్+కనుంగొని= కృష్ణుడు రాజు లందరిని బాగా చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అంటూ ఇంకా అనేక విధాల పొగడారు. భీముడు కావించిన గదా యుద్ధ ధర్మాతిక్రమణం ఇతర రాజుల మనసులో ఇంకా ఉంటుందేమో అని వారిని తేరిపార చూచి శ్రీకృష్ణు డిట్లా అన్నాడు:

**చ.** **'చక్కటి లేని యాలమునఁ జంపె ననన్ వల; దీదురాత్మకుం**
**డక్కటికంబు లేక సతి నంతలు సేసిననుం గృపారతిం**
**దక్కక తండ్రిపా లడిగె ధర్మజుఁ; డన్నెఱి సేయఁ డయ్యె; వీఁ**
**డుక్కివుఁ; డిట్టి చావునకు యుక్తుఁ డగుం దలపోసి చూడఁగన్.** **321**

**ప్రతిపదార్థం:** చక్కటి లేని ఆలమునన్= ధర్మంలేని యుద్ధంలో; ఈ దురాత్మకున్= ఈ దుర్మార్గుడిని; చంపెన్+అనన్ వలదు= చంపాడని అనవద్దు; అక్కటికంబు లేక= కనికరంలేకుండా; సతిన్+అంతలు చేసినన్= పతివ్రతయైన భార్యను అంత అవమానం చేసినప్పటికిని; కృపారతిన్+తక్కక= దయాసక్తిని వదలకుండా; ధర్మజుఁడు+తండ్రిపాలు+అడిగెన్= తండ్రిభాగమును ధర్మరాజు కోరినాడు; ఆ+నెఱిన్= ఆ ధర్మమును; చేయఁడు+అయ్యెన్= చేసినాడు కాడు; వీఁడు= ఈ దుర్యోధనుడు; ఉక్కివుఁడు= మూర్ఖుడు; తలపోసి= యోచించి; చూడఁగన్= పరిశీలించగా; ఇట్టి చావునకున్= ఈ విధమైనచావునకు; యుక్తుఁడు+అగున్= తగినవాడు.

**తాత్పర్యం:** 'ధర్మం కాని యుద్ధంతో ఈ దుర్మార్గుడిని ఇట్లా చంపా డనవద్దు. కనికరం లేకుండా స్త్రీని పతివ్రతను అంతగా అవమానం చేసినప్పటికినీ, దయతో తమతండ్రిపాలిమ్మని ధర్మజుడు కోరాడు. ఆ ధర్మాన్నీ వీడు నిర్వర్తించలేదు. ఈ దుర్యోధనుడు మోసగాడు. యోచించి చూడగా ఇటువంటి చావుకు వీడు తగినవాడే.

**క. విదురాదులు సెప్పఁగ ను । న్మదుఁ డై యీఁడయ్యెఁ దగినమాత్రయు భూసం**
**పద వీఁడు పాండవుల కిది । యది యగునె బకారి ప్రతిన కగ్గం బైనన్. 322**

**ప్రతిపదార్థం:** విదుర+ఆదులు చెప్పఁగన్; ఉన్మదుఁడు+ఐ= గర్వితుడై; తగిన మాత్రయు భూ సంపదన్= తగినంత భూమిని; పాండవులకున్= పాండవులకు; వీఁడు= ఈ దుర్యోధనుడు; ఈఁడు+అయ్యెన్= ఇచ్చినవాడుకాదు; బకారిప్రతినకున్= బకవైరి శపథానికి; అగ్గంబు+ఐనన్= లోనైతే; ఇది+అది+అగునె= ఏమౌతుంది?

**తాత్పర్యం:** విదురాదు లెందరో చెప్పారు. అయినా ఉన్మాదిఅయి తగినంత మాత్రపు భూమిని కూడా ఇతడు పాండవుల కీయలేదు. బకవైరి ప్రతిజ్ఞకు లొంగిపోతే ఇది అది (ఇది= ఇట్లా చంపటం, అది= అధర్మం) అవుతుందా?

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. నేలఁ గూలి ప్రాను వోలె నిట్లున్నయి । ప్పాపకర్ము గుఱిచి పాడితెఱఁగు**
**తేటపడఁగ మాటలాట దానేల ? మీ ! రెక్కుఁ డరదముల మహీశులారా ! 323**

**ప్రతిపదార్థం:** మహీశులార= ఓ రాజులార!; నేలన్+కూలి= భూమిమీదపడి; ప్రానువోలెన్ ఇట్లు+ఉన్న= వృక్షం మాదిరి ఇట్లా ఉన్నటువంటి; ఈ పాపకర్మున్ గుఱిచి= ఈ దుష్ట చరితుడిని గూర్చి; పాడి తెఱఁగు= ధర్మపద్ధతి; తేట+పడఁగన్= స్పష్టంగాతెలియగా; తాను= ఈ దుర్యోధనుడు; మాటలు+ఆట= మాటాడటం; ఏల?= ఎందుకు? మీరు; అరదములన్= తేరులను; ఎక్కుఁడు= ఎక్కండి.

**తాత్పర్యం:** ఓ రాజులారా! కరాకటి వ్రేళ్ళతో పెల్లగిలబడిన ప్రానువలె భూమిమీద పడిఉన్న ఈ పాపాత్ముడినిగూర్చి ధర్మ పద్ధతి విషయమై మాటలాడనేల? మీరందరును మీమీ రథముల నెక్కండి! (ఈ విషయమై చర్చ అవసరమన్నాడు).

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను నాక్షేపించుట యాకర్ణించి కౌరవేశ్వరుండు గోపాయత్తచిత్తుండై పిఱుంద మోవ లేచి చేతుల భూతలం బూఁదికొని బొమముడితోడి చూడ్కి యతనిపయిం బఱపె, నప్పు డపరభాగంబు విఱుగ వ్రేటు వడి యలిగి తల యెత్తి చూచు మహానాగంబు చందంబు దోఁచె; నట్లు ప్రాణాంతకరణం బైన వేదనాభరంబు దలంపక కూర్చుండి మున్నాకృష్ణుండు జిష్ణుతోడ సంభాషించుటయు, నతం డూరుతలంబుఁ గరపుటంబున నప్పళించుటయు వెడవెడ గనుటం జేసి భీమువాటునం దొడలు విఱిగి పడినప్ప డప్పటి బుడిబుడిమాటలు నా సన్నయు దీనికిం గాకేమి? యని యూహించి, చేయునది లేక యవుడు గఱచుచున్న వాఁ డగుట నగ్గోపాలదేవునితో ని ట్లనియె. 324**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ ప్రకారం; పుండరీకాక్షుండు= శ్రీకృష్ణుడు; తన్నున్+ఆక్షేపించుటయున్= తనను తిరస్కారభావంతో మాట్లాడగా; ఆకర్ణించి= విని; కౌరవ+ఈశ్వరుండు= దుర్యోధనుడు; కోప+ఆయత్తుండు+ఐ= కోపముపొందినవాడై; పిఱుంద మోవన్‌లేచి= పిఱుదులమీద తన బరువును ఊని పైకి లేచి; చేతుల భూతలంబు+ ఊఁదికొని= చేతులను భూమిమీద ఊనుకొని; బొమముడితోడి చూడ్కి= బొమముడితో (కోపంతో) చూపును; అతనిపయిన్+ పఱపెన్= శ్రీకృష్ణుడిమీద ప్రసరింపజేశాడు; అప్పుడు= ఆ సమయంలో; అపరభాగంబు= క్రింది భాగం; విఱుగన్= విరిగిపోగా;

వ్రేటువడి= దెబ్బ తగిలి; తలఎత్తి= తల మీదికెత్తి; చూచు= చూస్తున్న; మహానాగంబు చందంబు తోఁచెన్= పెద్దపాము విధంగా కనబడ్డాడు; అట్లు= ఆ విధంగా; ప్రాణాంతకరణంబు= ప్రాణం పోయే విధంగా; అయిన= అయినట్టి; వేదనాభరంబుతలంపక= బాధను యోచించకుండా; కూర్చుండి= కూర్చున్నవాడై; మున్ను+ఆకృష్ణుండు= ముందుగా శ్రీకృష్ణుడు; జిష్ణుతోడన్ సంభాషించుటయున్= అర్జునుడితో మాటాడటమున్నూ; అతండు= అర్జునుడు; ఊరుతలంబున్= తొడలున్నచోటును; కరపుటంబునన్= ముంజేతితో; అప్పళించుటయున్= చరచుటయున్నూ; వెడవెడన్= ఇంచించుక; కనుటయున్+చేసి= చూచుటవలన; భీమువాటునన్= భీముడిదెబ్బకు; తొడలు విరిగిపడినప్పుడు= తొడలు విరిగిపోయి పడినపుడు; అప్పటి బుడిబుడిమాటలు= ఆ వేళ మాటాడిన తొట్రుపాటుతో కూడిన మాటలను; ఆ సన్నయున్= ఆ సైగయున్; దీనికిన్+కాకేమి అని+ఊహించి= ఇందుకొరకే గదా అని నమ్మి; చేయునది లేక= చేయగల్గింది లేకుండా; అపుడు గఱచుచున్న వాఁడు+ అగుటన్= (కోపంతో) పెదవి కొరుకుతూ ఉండటంవలన; ఆ గోపాలదేవుతోన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** శ్వేతపద్మాలవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు తనను ఆవిధంగా ఆక్షేపించటాన్ని విన్న దుర్యోధనుడు కోపం నిండిన మనసుతో చేతులను నేలనూదుకొని పిరుదులను మోయగా లేచి, తన చూపులను ఆతడిమీదకు వ్యాపింపజేశాడు. అపు డాతడు దెబ్బతిని కోపంతో పడగను పైకెత్తి చూచే మహానాగేంద్రుడివలె కానవచ్చాడు. ఆ విధంగా ప్రాణా లూడబీకుతున్న బాధను కూడా లెక్కచేయకుండా కూర్చుండి, ఇదివరకు శ్రీకృష్ణుడు అర్జునుడితో గుసగుసలాడగా అర్జునుడు తొడలను చేతులతో చరచటాన్ని కొంతకొంత చూడటంవలన భీముడి దెబ్బకు తొడలు విరిగిపడిన విధానం, అపు డాతడిని గేలితనపు మాటలను, సైగను - దీనికి గదా అని తలచుకొని చేయగలిగింది లేకపోవటంతో, (కోపంతో) పెదవి నొక్కుతూ శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తొడలు విఱిగి పడిన దుర్యోధనుఁడు కృష్ణు నాక్షేపించుట (సం. 9-60-27)**

**సీ.** **'కంసదాసునిపుత్ర! కానవు నీ దురా । చారంబుఁ, గృపయు లజ్జయును లేక**
**ప్రేలెదు; నీవు సెప్పినఁ బార్థు చేసిన । సన్న గై కొని గదాసంగరంబు**
**పాడి దొఱంగి యిప్పాపకర్ముఁడు వైచెఁ । గాక; చక్కటి తోడికయ్య మైన**
**లీల మిమ్మందఱ నేలపాలుగఁ జేయ । నే? శిఖండి గడంగి యేసె ననఁగ**

**తే.** **నర్జునుఁడు శాంతనవుఁ గూల్చునట్లు చేసి; । తస్త్రగురుచావునకుఁ బాండవాగ్రజన్ము**
**బొంకు మని పంచి; తరదంబు పుడమిఁ గ్రుంగఁ । గర్ణుఁ జంపించి; తే మనఁ గలదు నిన్ను? 325**

**ప్రతిపదార్థం:** కంసదాసుని పుత్ర!= కంసుడికి బానిసఅయిన వసుదేవుడి కుమారా!; నీ దురాచారంబు కానవు= నీ చెడ్డ ఆచారాన్ని గుర్తించవు; కృపయున్ లజ్జయును లేక ప్రేలెదు= దయ, సిగ్గూ లేకుండా ప్రేలుచున్నావు; నీవు చెప్పినన్= నీవు చెప్పగా; పార్థు చేసిన సన్నన్= అర్జునుడు చేసిన సైగ; కైకొని= స్వీకరించి(తీసికొని); గదా సంగరంబు పాడి= గదా యుద్ధ ధర్మమును; తొఱంగి= వదలి; ఈ+పాపకర్ముఁడు= ఈ పాపాత్ముడు; వైచెన్+కాక= కొట్టాడు కాని; చక్కటి= సరిఅయిన; తోడి కయ్యము+ఐనన్= ఎదురుగా సమానమైన యుద్ధమైతే; లీలన్= ఆటగా; మిమ్మున్+అందఱన్= మీ అందరినీ; నేలపాలుగన్+చేయనే?= మట్టి కరిపించనా?; శిఖండి కడంగి ఏసెన్+అనంగన్= శిఖండి పూనుకొని బాణాలు వేసినట్లు; అర్జునుడు శాంతనవున్+కూల్చునట్లు= భీష్ముడిని అర్జునుడు పడగొట్టేటట్లు; చేసితి(వి)= చేశావు; అస్త్రగురు చావునకున్= ధనురాచార్యుడి చావుకై; పాండవ+అగ్రజన్మున్= పాండవ జ్యేష్ఠుడైన ధర్మరాజును; బొంకుము+అని పంచితి(వి)= అబద్ధమాడేటట్లు చేశావు; అరదంబు= తేరు; పుడమిన్= భూమిలో; క్రుంగన్= క్రుంగిపోగా; కర్ణున్+చంపించి(వి)= కర్ణుడిని చంపించావు; నిన్ను ఏమనన్+కలదు?= నిన్నేమనగలను?

**తాత్పర్యం:** 'ఓ కంసదాసుని కుమారుడా! నీ తప్పుడు చేష్టను గుర్తించవు. కరుణ, దయ లేకుండా వాగుతున్నావు. నీవు చెప్పగా అర్జునుడు చేసిన సైగ నందుకొని గదాయుద్ధధర్మాన్ని తప్పి ఈ పాపాత్ముడు కొట్టాడు కాని న్యాయమైన పోరాటంతో మీ అందరనూ మట్టి కరపించకుండేవాడినా? శిఖండి పూనుకొని వేశాడన్నట్లుగా అర్జునుడు భీష్ముడిని పడగొట్టేటట్లు చేశావు. ధనురాచార్యుడి చావుకై ధర్మజుడిని అబద్ధమాడుమని ఉత్తర్వుచేశావు. రథం భూమిలో కూరుకొనగా కర్ణుడిని చంపించావు. ని న్నేమనవచ్చును?

**క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ । బోరఁగ నేయించి తట్లు; పాడిచీఁకటి నం**
**హోరహితు సైంధవుని నరు । బారిపఱిచి; తిట్టి నీకుఁ బల్కులు సనునే? 326**

**ప్రతిపదార్థం:** భూరిశ్రవుఁడు+ఒక్కనితోన్= భూరిశ్రవుడు వేరొక్కడితో; పోరగన్+ఏయించితి= పోరాడేటట్లు చేయించావు; అట్లు= ఆ విధంగా; పాడిచీఁకటి= అసుర సంధ్యలో; పోరగన్ అంహోరహితున్= పాపాలు లేనివాడిని; సైంధవుని= సైంధవుడనే వాడిని; నరుబారి పఱిచితి(వి)= అర్జునుడికి చిక్కేటట్లు చేశావు; ఇట్టి నీకున్= ఇటువంటి నీకు; పల్కులు= మాటలు; చనునే?= తగునా?

**తాత్పర్యం:** భూరిశ్రవుడొకడితో పోరాడేటప్పుడు (బాణం) వేయించావు. ఆ విధంగా పాడిచీకటిలో పుణ్యాత్ముడైన సైంధవుడిని అర్జునుని బారినపడేటట్లుగా చేశావు. ఇట్టి నీవు మాట్లాడడం తగి యున్నదా?

**క. నను భీష్ము గురుని సూతసు । తుని భూరిశ్రవు జయద్రథుం జక్కటి ద**
**ప్పనియనిఁ గోల్పుచ్చఁగ వ । చ్చునె నీకుం గపటశూర! సుచరితదూరా!' 327**

**ప్రతిపదార్థం:** కపటశూర!= మోసపువీరుడా!; సుచరితదూరా!= సత్ప్రవర్తనలేనివాడా!; నన్నున్= నన్ను; భీష్మున్= భీష్ముడిని; గురునిన్= గురువైన ద్రోణుడిని; సూతసుతునిన్= కర్ణుడిని; భూరిశ్రవున్= భూరిశ్రవుడిని; జయద్రథున్= సైంధవుడిని; చక్కటితప్పని= న్యాయం దప్పిపోని; అనిన్= యుద్ధంలో; నీకున్; కోల్పుచ్చఁగన్+వచ్చునే?= ఓడించనగునా?

**తాత్పర్యం:** మోసపూరితుడ వైన పాపాత్ముడైన కృష్ణా! నీకు నన్ను, భీష్ముడిని, గురువైన ద్రోణుడిని, కర్ణుడిని, భూరిశ్రవుడినీ, సైంధవుడినీ న్యాయం తప్పని యుద్ధంలో ఓడించటం సాధ్యమైన పనియేనా?'

**వ. అనిన విని యచ్యుతుం డతని నవలోకించి 'నీవు భీముని బాలునిఁ బాములం గఱపించియు విషం బిడియు నీటం ద్రోచియుం బలుమాఱుం జంప దెగితివి; గొంతియుఁ గొడుకు లేవురును నిద్రించుసమయంబున జతు గృహంబు దహించితివి; ధర్మోత్తరచరిత్రుం డగు నజాతశత్రుసంపదలఁ గపటద్యూతంబున నపహరించి; తంత దనివిం బోక యాజ్ఞసేని నేకవస్త్ర రజస్వలం గొలువులోపల భంగపెట్టి తాప్రొద్ద నిన్ను నిట్టి దురవస్థకుం దేరం దగి యుండ నట్లు పోయి సమయంబు నడపి నీచేసిన సకల దుష్కృతంబులు సహించిన యిప్పాండవాగ్రజుండు వనుప నేను బుడమిపా లడుగ వచ్చిన నీ నేరవైతి; నీ నేరమి నిట్లైతి; భవదీయం బగులోభంబునం బాపనిశ్చయంబున మదంబున శాంతచిత్తు లగుశాంతనవద్రోణులకుం బ్రాణహాని వాటిల్లె; వినుము! ద్రుపదుని తపోయజ్ఞ ప్రభావంబుల నదియ పనిగా జనియించిన శిఖండిధృష్టద్యుమ్ను లాభీష్మ గురులమరణంబులకుఁ గారణంబులు గాక తక్కుదురే? పెక్కండ్రతోడం బోరి దస్సినసాత్యకిం జంపువాఁ డైన**

**భూరిశ్రవుం జంప కుందుమే? యనేకప్రౌఢ యోధు లొక్కరుని బాలు సౌభద్రుం బొదివి చంపినం బూనినపూన్కి నిఖిలోపాయంబుల నెఱపక పుణ్యాత్మయైన పాంచాలి నరణ్యంబునం బరిభవించిన పాపాత్ముని సైంధవుని బ్రదికిపో విడిచి యర్జునుం డగ్నిం బ్రవేశించునే? యి న్నీతిపరుల చరిత్రంబులు నిర్మలంబులు; ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు నీ వారెల్లం బాఱిన నర్జునుండు నిన్ను విడిపించుట యెఱుంగవే? గాంగేయకుంభజకర్ణాశ్వత్థామ కృపు లుద్దామ సమగ్రసైన్యంబులతోడ నడవ నీవు విరటుని గోవులం బట్టికొని పోవు చోట మీరందఱుఁ దనసమ్మోహనాస్త్రంబున మూర్ఛితులైన సమయంబున నర్జునుండు నిన్నుం గాచుట యెఱుంగ రాదె? నీ వాపాదించిన పాపంబుల కెల్ల మూలం బైన కర్ణునరదంబు ధరణిం గ్రుంగినఁ గవ్వడి వాని నేయ కేల కాచికొని యుండు? నుండె నేనియు భూసుర శాపంబున నట్లైనరథంబునకు విష్కృతి గలుగునే? కావున నన్నీచు సమయించుట సముచితంబు; యుధిష్ఠిరుండు శల్యుం దెగటార్చిన తెఱం గొప్పనొప్ప దని యుగ్గడింపక మేలు సేసితి; పాండునందనులు పుట్టినంతటినుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు; కురుకులంబునకు గుద్దలి గొని దుర్వ్యాతంబు నీవు తొడరితి; దాన నింతలు వుట్టెఁ; బవనుపట్టి పట్టినప్రతిన యెఱుంగవె? గద నూరుభంగంబు సేయుదు నని పలికి పిడికిటం బొడుచునే?' యవి 'యెల్లను వృథాజల్పంబు లూరకుండు' మనుటయు నజ్జననాథుండు జనార్దనున కి ట్లనియె. 328**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అతనిన్+అలోకించి= అతడిని(దుర్యోధనుడిని) చూచి; నీవు భీముని బాలుని= నీవు పసివాడయిన భీముని; పాములన్+కరపించియున్= పాములచేత కరపించి; విషంబు+ఇడియున్= విషమును పెట్టియు; నీటన్+త్రోచియున్= నీళ్ళలో త్రోసియు; పలుమాఱున్= అనేకమార్లు; చంపన్+తెగితివి= చంపటానికి సాహసించావు; గొంతియున్= కుంతి; కుమారులు+ఏవురును= అయిదుగురు కుమారులును; నిద్రించు సమయంబునన్= నిదురించేటపుడు; జతుగృహంబు= లక్కయింటిని; దహించితి(వి)= కాల్చావు; ధర్మోత్తర చరిత్రుండు+అగు= ఉత్తమ ధర్మచరిత్ర కలవాడయిన; అజాతశత్రు సంపదలన్= వైరులులేని వాడైన ధర్మరాజు ఐశ్వర్యమును; కపట ద్యూతంబునన్= మోసపు జూదంతో; అపహరించితి(వి)= కొల్లగొన్నావు; అంత తనివిన్+పోక= అంతటితో తృప్తినందకుండా; యాజ్ఞసేనిని= ద్రౌపదిని; ఏకవస్త్రన్= ఒకే చీరగలదానిని; రజస్వలన్= ఋతుస్నాతను; కొలువులోపల భంగపెట్టితి(వి)= సభలో అవమానం చేశావు; ఆ ప్రొద్దు= ఆ దినమే; నిన్నున్+ఇట్టి దురవస్థకున్= నిన్నీ భంగపాటగు స్థితికి; తేరన్+తగిఉండన్= తీసికొని రా తగిఉండగా; అట్లు పోయి= ఆ విధంగా(అడవులకు) పోయి; సమయంబు నడిపి= ప్రతిజ్ఞ జరుపుకొని; నీ చేసిన సకల దుష్కృతంబులు సహించినన్= నీవు కావించిన పాపాలు ఓర్చుకోగా; ఈ+పాండవ+అగ్రజుండు= ఈ ధర్మరాజు; పనుపన్= పంపగా; ఏను పుడమిపాలు+అడుగన్ వచ్చినన్= నేను భూమిలో భాగం అడుగరాగా; ఈనేరవైతి= ఈయలేకపోయావు; నీ నేరమిన్= నీ ఎరుక లేక పోవుటచేత; ఇట్లు+అయితి(వి)= ఈ విధంగా అయావు; భవదీయంబు+అగు లోభంబునన్= నీయొక్క లోభగుణంవలన; పాపనిశ్చయంబునన్= పాపచింత కారణంచేత; మదంబునన్= గర్వంతో; శాంతచిత్తులు+అగు= శాంత మనస్కులయిన; శాంతనవ= భీష్మ; ద్రోణులకున్= ద్రోణులకును; ప్రాణహాని+పాటిల్లెన్= ప్రాణమునకు ప్రమాదం కలిగింది; ద్రుపదుడి తపోయజ్ఞ ప్రభావంబులన్= ద్రుపదునియొక్క తపస్సు, యజ్ఞముల శక్తులచేత; అదియ పనిగా జనియించిన= ఆ కారణంగా పుట్టిన; శిఖండి ధృష్టద్యుమ్నులు= శిఖండియు ధృష్టద్యుమ్నుడును; ఆ భీష్మగురుల మరణంబులకున్= ఆ భీష్మద్రోణుల చావులకు; కారణంబులు+కాక= నిమిత్తం కాకుండా; తక్కుదురే?= తప్పుకొనగలరా?; పెక్కండ్ర తోడన్+పోరి= చాలమందితో యుద్ధంచేసి; డస్సిన= అలసిన; సాత్యకిన్= సాత్యకిని; చంపువాఁడు+ఐన= చంపపూనుకొన్న; భూరిశ్రవున్+ చంపకుందుమే?= భూరిశ్రవుడిని చంపక ఊరుకొందుమా?; అనేకప్రౌఢయోధులు= మిక్కిలి అనుభవమున్న ప్రౌఢులైన

వీరులు; ఒక్కరునిన్= ఒకడిని; బాలున్= పసివాడిని; సౌభద్రున్+ పొదివి= సుభద్రాతనయుడిని (అభిమన్యుడిని) క్రమ్ముకొని; చంపినన్+పూనిన పూన్కిన్= చంపగా చేసిన ప్రతినను; నిఖిల+ ఉపాయంబులు నెఱపక= అన్ని ఉపాయాలనూ ఉపయోగించకుండా; పుణ్య+ఆత్మ+ఐన పాంచాలిని= పవిత్రమూర్తిఅయిన ద్రౌపదిని; అరణ్యంబునన్= అడవిలో; పరిభవించిన= అవమానించిన; పాపాత్మునిన్= దుష్టుడిని; సైంధవుడిని బ్రదికిపోన్+విడిచి= సైంధవుని బ్రదికిపోనిచ్చి; అర్జునుండు+అగ్నిన్+ప్రవేశించునే?= అర్జును డగ్నిలో దూకునా?; ఈ+నీతిపరుల చరిత్రంబులు= ఈ+నీతిమంతుల చరిత్రలు; నిర్మలంబులు= స్వచ్ఛమైనవి; ఘోషయాత్రన్= ఆవులకొరకు వెళ్లిన యాత్రలో; నిన్నున్ గంధర్వులు పట్టుకొనిపోవునప్పుడు= నిన్ను గంధర్వులు నిర్బంధించి పట్టుకొనిపోయేటపుడు; నీవారు+ఎల్లన్+పాఱినన్= నీ వారంతా పరుగెత్తిపోగా; అర్జునుండు; నిన్నున్ విడిపించుట ఎఱుఁగవే?= నిన్ను తప్పించటం తెలియదా?; గాంగేయ కుంభజ కర్ణాశ్వత్థామ కృపులు= భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడును; ఉద్దామ సమగ్ర సైన్యంబులతోడన్= గొప్ప సన్నద్ధం అయిన సేనలతో; నడవన్= (దండు) వెడలగా; నీవు విరటుని గోవులన్+పట్టుకొనిపోవుచోటన్= నీవు విరటుని ఆలమందను పట్టుకొని పోయేటపుడు; మీరు+అందఱున్= మీరందరును; తన సమ్మోహన+అస్త్రమునన్= తన సమ్మోహనాస్త్రంచేత; మూర్ఛితులు+ఐన సమయంబునన్= మూర్ఛపోయిన సమయాన; అర్జునుఁడు నిన్నున్+కాచుట= నిన్ను కాపాడటం; ఎఱుంగరాదె?= తెలియదా?; నీవు+ఆపాదించిన పాపంబులకున్+ఎల్లన్= నీవు వారిమీద మోపిన పాపాలకంతటికి; మూలంబు+ ఐన= ఆధారమైన; కర్ణు+అరదంబు= కర్ణుడితేరు; ధరణిన్+క్రుంగినన్= భూమిలో దిగబడగా; కవ్వడి వానిన్+ఏయక= సవ్యసాచి వాడిని కొట్టక; ఏల కాచికొనిఉండున్?= ఎందులకు వేచి ఉంటాడు? ఉండెన్+ఏనియున్= ఉన్నప్పటికిని; భూసురశాపంబునన్= బ్రాహ్మణుడి శాపంవలన; అట్లయిన రథంబునకున్= ఆ విధంగా తన తేరునకు; నిష్కృతి కల్గునే?= ప్రాశ్చిత్తం కల్గుతుందా?; కావునన్= కనుక; ఆ+నీచున్+సమయించుట సముచితంబు= ఆ నీచుడిని చంపటం న్యాయం; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; శల్యున్+తెగటార్చిన తెఱంగు= శల్యుడిని చంపిన విధం; ఒప్పున్+ఒప్పదు+అని= తగును-తగదని చెప్పకుండా; మేలుచేసితి= మంచిపని చేశావు; పాండునందనులు= పాండురాజకుమారులు; పుట్టినప్పటినుండి= పుట్టిననాటినుండి; నేఁడు తుది= ఈనాటిదాకా; నీ+ఎడన్= నీ విషయంగా; ధర్మవిరోధంబు= ధర్మానికి వ్యతిరేకంగా (అన్యాయంగా); ఆచరింపరు= చేయరు; కురుకులంబునకున్= కురువంశానికి; గుద్దలికొని= గునపం తీసికొని (కుళ్ళగించుటకు); దుర్ద్యూతంబు= మోసపు జూదానికి; నీవు+అ+తొడరితి(వి)= నీవే పూనుకొన్నావు; దానన్+ఇంతలు+పుట్టెన్= అందుచేత ఇంత జరిగింది; పవన తనయుండు= భీమసేనుడు; పట్టిన= పూనిన; ప్రతిన= శపథమును; ఎఱుంగవే?= తెలియవా?; గదన్= గదతో; ఊరుభంగంబున్+చేయుదును+అని= తొడలు విఱుగగొట్టుతానని; పలికి= చెప్పి; పిడికిటన్+ పొడుచునే?= పిడికిలితో పోటు పొడుస్తాడా?; అవి+ఎల్లను= అవి అంతా; వృథాజల్పంబులు= వ్యర్థమైన మాటలు; ఊరకుండుము= మాట్లాడకుండా ఉండుము; అనుటయున్= అనగా; ఆ+జననాథుండు= ఆ రాజు(దుర్యోధనుడు); జనార్దనునకున్+ఇట్లు+ అనియెన్= శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు దుర్యోధనుడిని చూచి, 'పసివాడయిన భీముడిని పాములచే కరిపించావు. విషాన్నమును పెట్టించావు. నీళ్ళలో త్రోయించావు. అనేక విధాల తెగించావు. కుంతి కుమారులైదుగురితో కలసి నిదురించేటపుడు లక్క ఇంటిని కాల్పించావు. ఉత్తమ ధర్మప్రవర్తనం కలవాడయినవాడూ అజాతశత్రువూ ఐన ధర్మజుడి సంపదను మోసపు జూదంలో కొల్లగొన్నావు. ఏకవస్త్రయు ఋతుస్నాతయుఅయిన ద్రౌపదిని నిండు సభలో అవమానము చేశావు. ఆనాడే నిన్నీ భంగపాటునకు తేవలసి ఉండింది. కాని, ఆ విధంగా (అరణ్య, అజ్ఞాత వాసాలకు) పోయి ప్రతిజ్ఞను నిలుపుకొని, ధర్మజుడు పంపగా భూభాగాన్ని అడగటానికి నేను రాగా ఇచ్చావు కావు. నీకు జ్ఞానం లేకుండటంచేత ఇట్లయిపోయావు. నీ లోభగుణం, పాపం, మదం, అహంకారం, శాంతమనస్కులైన భీష్మద్రోణులకు ప్రాణహాని కలిగించాయి; ద్రుపదుడి తపస్సు, యజ్ఞాలు కారణంగా జన్మించిన శిఖండి ధృష్టద్యుమ్నులు, ఆ

భీష్మగురుల చావులకు నిమిత్తం కాకుండా తప్పుతుందా? చాలామందితో యుద్ధం చేసి అలసిన సాత్యకిని చంపటానికై పూనుకొన్న భూరిశ్రవుడిని చంపకుంటామా? మిక్కిలి పసివాడైన అభిమన్యుడిని ప్రౌఢులు చుట్టుకొని చంపగా చేసిన శపథాన్ని అన్ని ఉపాయాలతో నెరవేర్చుకుంటారా? పతివ్రతఅయిన ద్రౌపదిని అడవిలో అవమానించిన దుర్మార్గుడు - సైంధవుడిని బ్రదికిపోనీయవచ్చునా? పోనిచ్చి అర్జునుడు అగ్గిలో దూకుతాడా? ఈ నీతిమంతుల జీవితాలు స్వచ్ఛములైనవి. ఘోషయాత్రలో గంధర్వులు నిన్ను పట్టుకొని పోగా నీ వారంతా పరుగెత్తారు. అప్పుడు అర్జునుడు నిన్ను విడిపించటం ఎరుగవా? భీష్మద్రోణ కర్ణ, అశ్వత్థామ కృపులు గొప్పసేనతో వెళ్ళగా నీవు విరాటరాజు పశువులను పట్టినపుడు మీరంతా తన సమ్మోహనాస్త్రంవలన మూర్ఛితులు కాగా అర్జునుడు నిన్ను కాపాడటం జ్ఞాపకంలేదా? నీవు కావించిన పాపాలకంతా మూలమైన కర్ణుడి తేరు భూమిలో క్రుంగినపుడు సవ్యసాచి వాడిని చంపకుండా ఎందుకు కాచుకొని ఉండాలి? ఉండెనుపో. బ్రాహ్మణుడి శాపంవలన అట్లా క్రుంగిన తేరునకు విముక్తి ఉంటుందా? కాబట్టి ఆ నీచుని చంపటం న్యాయమే. ధర్మజుడు శల్యుడిని చంపటంలోని ఒప్పుతప్పులను పేర్కొనకుండా వదలిపెట్టి మంచిపనినే చేశావు. పాండవులు పుట్టిన నాటినుండీ నీయెడ ధర్మాతిక్రమణం చేయలేదు. కురువంశాన్ని గునపం తీసికొని కుళ్ళగించిన తీరును నీవు మోసపు జూదానికి పూనుకొన్నావు. అందుచేతనే ఇంత జరిగింది. భీముడు పట్టిన శపథం తెలియదా? గదతో తొడలు విరుగగొట్టుతానని శపథం చేసినవాడు పిడికిలితో పొడుస్తాడా?అని, నీవన్నీ వ్యర్థవాదాలు. ఊరుకొనుము.' అనగా దుర్యోధనుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**చ.** **'చదివితి నెల్ల వేదములు, జన్నము లొప్పఁగ జేసితిన్, రమా**
**స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి, దు**
**ర్మదరిపు గాఢగర్వపరిమర్దన కేళి యొనర్చితిం, దగం**
**దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే?** **329**

**ప్రతిపదార్థం:** ఎల్ల వేదములు= వేదాలన్నీ; చదివితిన్= చదివాను; జన్నముల్= యజ్ఞాలను; ఒప్పఁగన్+చేసితిన్= తగినట్లుగా చేశాను (ధర్మవిధంగా); రమా+ఆస్పదమగు వృత్తిన్+పోల్చి= సందకు తావైన నడవడితో ఒప్పి; నరపాలకులు+ఎల్లన్= రాజులందరూ (సామంతరాజు లంతా); కొల్వన్= సేవించగా; కంటిన్= చూడగలిగాను; దుర్మద రిపు= దురహంకారు లయిన శత్రువులయొక్క; గర్వమర్దనకేళి ఒనర్చితిన్= పొగరును నాశనం చేశాను; తగన్= తగినట్లుగా (పొగడ్తకు తగినట్లు); తుదిన్= చివర; అనిన్= యుద్ధంలో; మిత్రబాంధవులతోన్= బంధువులతోను, స్నేహితులతోను; త్రిదివంబునకున్= స్వర్గానికి; ఏఁగుట+ఒప్పదే?= వెళ్ళటం తగదా!

**తాత్పర్యం:** 'అన్ని వేదాలను చదివాను. యజ్ఞాలు విధిప్రకారం చేశాను. సంపదకు తావలమైన నడవడితో బ్రతికాను. రాజులెందరో సేవించగా చూచాను. దురహంకారగర్వంతో ఉన్న రాజులను యుద్ధంలో జయించాను. తుదకు స్నేహితులతోను, బంధువులతోను కలసి స్వర్గానికి వెళ్ళటం ఒప్పదా?

**వ.** **నీకుం జూడ నెట్టివాఁడ నైనను నా కేమి? మీరింకఁ బశ్చాత్తాపదుఃఖితు లగుచు నుందురు గాక' యనియె; నప్పు డతనిపైఁ బుష్పవర్షంబులు గురిసె, దేవదుందుభులు మొరసె; దిశలు దెలివొందెం; మృదుసమీరణంబు సుగంధి యై వీతెంచె; నంతయు ననుసంధించి యక్కౌంతేయులు దారు ధర్మంబు దొఱఁగి గాంగేయద్రోణ**

**కర్ణశల్యదుర్యోధనాదుల వధించుట యత్తఱిం గ్రొత్తయై తోఁచినఁ, జిత్తంబుల వగయు లజ్జయు మిగులం బొడమి మొగంబులఁ దోఁప విన్ననై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుం జని వారలతో నిట్లనియె. 330**

**ప్రతిపదార్థం:** నీకున్+చూడన్+ఎట్టి వాఁడన్+ఐనను= చూడగా నీ కెటువంటి వాడయినప్పటికినీ; నా కేమి?; మీరింక పశ్చాత్తాప దుఃఖితులగుచున్+ఉందురుగాక= మీ రికమీద పశ్చాత్తాపంతో దుఃఖపడుతూ ఉంటారుగాక; అనియెన్= అన్నాడు; అప్పుడు+అతనిపైన్ పుష్పవర్షంబులు గురిసెన్= అపు డా దుర్యోధనుడి మీద పూలవాన కురిసింది; దేవ దుందుభులు మొరసెన్= దేవతల దుందుభిధ్వానాలు మ్రోగాయి; దిశలు తెలివొందెన్= దిక్కులు తెల్లబడ్డాయి; మృదు సమీరంబు= చల్లని గాలి; సుగంధిఐ వీచెన్= సువాసనలతో వీచింది; అంతయు ననుసంధించి= అన్నిటిని కలిపి; ఆ+కౌంతేయులు= ఆ కుంతీ తనయులు (పాండవులు); తారు= తాము; ధర్మంబుతొఱంగి= ధర్మాన్ని వదలి; గాంగేయ ద్రోణ కర్ణ శల్య దుర్యోధనాదులన్ వధించుట= భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, దుర్యోధనాదులను చంపటం; ఆ+తఱిన్+క్రొత్తఐ తోఁచినన్= ఆ సమయాన క్రొత్తగా కానరాగా; చిత్తంబులన్= మనసులలో; వగయున్= దుఃఖమూ; లజ్జయున్= సిగ్గూ; మిగులన్+పొడమి= మిక్కిలిగా కలిగి; మొగంబులన్+తోఁపన్= ముఖాలలో కానరాగా; విన్ననై+ఉన్నన్+చూచి= దైన్యంతో ఉండగా చూచి; వెన్నుండు= శ్రీకృష్ణుడు; తద్+సమీపంబునకున్+చని= వారి దగ్గరకు వెళ్ళి; వారలతోన్+ఇట్లు+అనియెన్= వారితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నీ దృష్టిలో నేనెటువంటివాడ నైనా కావచ్చును. అయితే నా కేమి? మీ రంతా పశ్చాత్తాప దుఃఖంతో ఉంటారుగాక!' అన్నాడు. అపు డా దుర్యోధనునిమీద పూలవాన కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. దిక్కులన్నీ తెల్లబడ్డాయి. చల్లని గాలి సువాసనలతో వీచింది. వీటినంతా కలుపుకొని కుంతి కుమారులైన పాండవులు తాము ధర్మాతిక్రమణం చేసి భీష్మ ద్రోణ కర్ణ శల్య దుర్యోధనాదులను చంపిన తీరు క్రొత్తగా తోచగా మనసులలోని సిగ్గు, వగపు మొగాలలో తోచి విన్నబోగా శ్రీకృష్ణుడు వారితో ఇట్లా అన్నాడు.

**సీ.** **'గాంగేయ గురు కర్ణ కౌరవపతులఁ జ । క్కటి యనిఁ బరిమార్పఁ గాన మైతి**
**మని మీరు వగవకుఁ; డద్దొర లుగ్రాస్త్ర । వేదులు, ప్రస్ఫుటవిక్రమమున**
**నడరి వారల గెల్చు టరిది గావున నేను । బహువిధోపాయముల్ పన్ని యిట్లు**
**దీర్చితిఁ గాక, యతీవ్రపరాక్రము । లలఁతులఁ బోదురే? యట్లుఁ గాక**

**తే.** **వారి విధి యివ్విధమునఁ జావంగఁ జేసె । దైవఘటనలు దప్పింప మీవశంబె?**
**సురలు దనుజులు గెల్చిన చొప్పు లిట్లు; । సంతసపు సమయంబున వంత లేల? 331**

**ప్రతిపదార్థం:** గాంగేయ గురు కర్ణ కౌరవపతులన్= భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనులను; చక్కటి అనిన్= ధర్మయుద్ధంలో; పరిమార్పన్= చంపగా; కానము+ఐతిమి= చూడలేకపోయాము; అని= అనుకొని; మీరు వగవకుఁడు= మీరు దుఃఖపడవద్దు; ఆ+దొరలు= ఆ రాజులు; ఉగ్ర+అస్త్రవేదులు= భయంకరమైన అస్త్ర రహస్యాలు తెలిసినవారు; ప్రస్ఫుట విక్రమమునన్= స్పష్టమైన శౌర్యంతో; అడరి= అతిశయించి; వారలన్ గెల్చుట= అటువంటివారిని జయించటం; అరిది= ఆశ్చర్యం; కావునన్= కనుక; ఏను= నేను; బహువిధ+ఉపాయముల్+పన్ని= నానా ఉపాయాలను యుద్ధ సన్నద్ధంగా చేసి; ఇట్లు తీర్చితిన్+కాక= ఈ విధంగా చేయగలిగాను కాని; ఆ+తీవ్ర పరాక్రములు= ఆ భయంకర వీరులు; అలఁతులన్+పోదురే= తేలికగా చనిపోతారా?; అట్లున్+కాక= అంతేకాకుండా; వారిన్; విధి= బ్రహ్మ; ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; చావంగన్+చేసెన్= చచ్చేటట్లుగా చేశాడు; దైవఘటనలు= విధి నిర్ణయాలను; తప్పింపన్= తప్పిపోజేయగా; మీ వశంబె?= మీకు సాధ్యమా; సురలు

దనుజులన్= దేవతలు రాక్షసులను; గెల్చినచొప్పున్= జయించిన విధానాలు; ఇట్లు+అ= ఇట్టివే; సంతసపు సమయంబునన్= ఆనందించేవేళలో; వంతలు+ఏల?= దుఃఖం ఎందుకు?

**తాత్పర్యం:** 'భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనులను సవ్యమైన రణకౌశలంతో చంపలేకపోయామని మీరు దుఃఖించవద్దు. వారందరును భయంకరమైన అస్త్రరహస్యాలు తెలిసినవారు. ప్రస్ఫుటమైన శౌర్యంతో వారిని గెలవటం అసాధ్యం. కనుక అనేక ఉపాయాలతో ఈ విధంగా వారిని చంపించాను. లేకుంటే ఆ తీవ్ర పరాక్రమాలు కల ఆ వీరులు సులభంగా పోతారా? అంతే కాదు. వారిని విధి ఈ విధంగా చచ్చేటట్లు చేసినది. దైవనిర్ణయాన్ని తప్పించటం మీకు సాధ్యమా! దేవతలు రాక్షసులను గెల్చిన తీరిటువంటిదే? ఈ సంతోష సమయంలో దుఃఖ మెందుకు?

### పాండవులు గృష్ణసాత్యకులతోఁ గౌరవశిబిరమునకుం బోవుట (సం. 9-61-3)

**వ. కృతకృత్యుల మైతిమి; ప్రొద్దునుం జాల వ్రాలె; సేనయు సైనికవరులును విశ్రమింపవలయుఁ; బోదము లెం' డనినఁ బాండవులు దెలివొందఁ బాంచాలురునుం దక్కిన భూపాలురునుం బ్రమోదంబు నొంది; రప్పుడు కృష్ణుండు పాంచజన్యంబు పూరించిన నర్జునుండు దేవదత్తంబును, యుధిష్ఠిరుం డనంతవిజయంబును భీమసేనుండు పౌండ్రంబును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బూరించిరి. సకలరథికోత్తములును దమతమ శంఖంబు లొత్తిరి. భేరీపణవాదితూర్యంబులు మ్రోసె. నా సముత్థితనినాదంబులు నింగి నిండె; నిఖిలజనంబులుం బాండవేయులం బొగడునులివు దిక్కుల దీటుకొనియె; ని ట్లుబ్బునం జెలంగుచు వార లందఱు నచ్చోటు గదలిరి; కౌంతేయులుఁ గౌరవ శిబిరంబునకుం జనిన సాత్యకి యనుగమనంబు సేసె; ధృష్టద్యుమ్నప్రముఖు లైన ద్రుపదజ్ఞాతులును ద్రౌపదేయులునుం దక్కినధరణీశులును దమవిడిదలలం గాని విశ్రమంబునకు వెరవుగా దని తలంచి తా రందుఁ బోయి నాఁటి రాత్రి నిలిచి రేపకడ గరిపుర ప్రయాణంబున కొదవం జనుదెంచువారుగా విన్నవించి ధర్మతనయు ననుమతి వడసి సైన్య సమేతంబుగాఁ బోయి రట్లు వార లటు వోవ నప్పాండునందనులు సని సంగీత ప్రవర్తక సంఘంబులు విరిసి చనిన రిత్తయై యున్న రంగస్థలంబుచందంబునం బాడరియున్న యాశిబిరంబుఁ బ్రవేశించి, నీనందను నగరు సొచ్చిన, నచ్చట నున్న పరిచారికులును దత్సహవాసులును మణికనకాది వస్తుసంచయాధ్యక్షులును నయ్యుధిష్ఠిరుంగాంచి యాదరణంబు వడసి; రక్కుంతీ నందనులు రథంబులు డిగ్గునవసరంబున వాసుదేవుండు వాసవి నాలోకించి. 332**

**ప్రతిపదార్థం:** కృతకృత్యులము+ఐతిమి= ధన్యుల మైనాము; ప్రొద్దునున్ చాలవ్రాలెన్= ప్రొద్దుకూడా చాలా అయింది. సేనయున్, సైనికవరులును= బలములు, సేనానులును; విశ్రమింపవలయున్= విశ్రాంతిని పొందాలి; పోదము లెండు= పోదాము రండి; అనినన్= అనగా; పాండవులు; తెలివి+ఒందన్= ప్రసన్నులుకాగా; తక్కిన భూపాలురునున్= మిగిలినరాజులు; ప్రమోదంబున్+ ఒందిరి= సంతోషించారు; అప్పుడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; పాంచజన్యంబున్+పూరించినన్= పాంచజన్యాన్ని ఊదగా; అర్జునుండు= అర్జునుడును; దేవదత్తంబును= తనశంఖమైన దేవదత్తమును; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; అనంత విజయంబును= అనంత విజయమనే పేరున్న శంఖాన్ని; భీమసేనుండు పౌండ్రంబును= భీముడు పౌండ్రమనే దానిని; నకుల సహదేవులు సుఘోషమణిపుష్పకంబులును= నకులుడు, సహదేవుడు సుఘోషము, మణిపుష్పకము అనే వాటిని; పూరించిరి=

ఊదారు; సకల రథిక+ఉత్తములును= అందరు సేనా నాయకులును; తమ తమ శంఖంబులు+ఒత్తిరి= తమ తమ శంఖాలను పూరించారు; భేరీపణవ+ఆది తూర్యంబులు మ్రోసెన్= నగారాలు, ఉడుకలు మ్రోగాయి; ఆ సముద్ధత నినాదంబులు= ఆ ఎక్కువయిన శబ్దాలు; నింగి నిండెన్= ఆకాశం దాకా నిండినవి; నిఖిల జనంబులున్= జనులంతా; పాండవేయులన్+ పొగడు+ఉలివు= పాండవులను కీర్తించే శబ్దం; దిక్కుల దీటుకొనియెన్= దిక్కులదాకా తగిలింది; ఇట్లు+ఉబ్బునన్+చెలంగుచున్= ఈ విధంగా సంతోషంతో ఒప్పుతూ; వారలు+అందఱున్+అచ్చోటు కదలిరి= వారంతా ఆ చోటునుండి వెళ్ళారు; కౌంతేయులు= కుంతి కుమారులు; కౌరవ శిబిరంబునకున్+చనినన్= కౌరవుల గుడారాలకు వెళ్ళగా; సాత్యకి అనుగమనంబు చేసెన్= సాత్యకి తోడుగా వెళ్ళాడు; ధృష్టద్యుమ్న ప్రముఖులు+ఐన= ధృష్టద్యుమ్నాది ముఖ్యులును; ద్రుపదజ్ఞాతులును= ద్రుపదుడి దాయాదులును; ద్రౌపదేయులును= ఉపపాండవులును; తక్కిన ధరణీ+ఈశులు= మిగిలిన రాజులును; తమ విడిదలలన్+కాని= తమ విడిదులలో తప్ప; విశ్రమంబునకున్ వెరవుగాదని తలంచి= విశ్రాంతి పొందుటకు తగదని భావించి; తారు+అందున్+ పోయి= తాము+ఆ+చోటికి వెళ్ళి; నాఁటి రాత్రి నిలిచి= ఆ రాత్రికి ఉండి; రేపకడ= తెల్లవారగా; కరిపురప్రయాణంబునకున్= హస్తినాపురికి ప్రయాణం కావటానికి; ఒదవన్+చనుదెంచువారుగాన్= తగునట్లు వచ్చువారుగా; విన్నవించి= చెప్పి; ధర్మతనయు+అనుమతి పడసి= ధర్మరాజు అనుజ్ఞ పొంది; సైన్యసమేతంబుగాన్+పోయిరి= సేనలతో కూడా వెళ్ళారు; వారలు+అటుపోవన్= సేనా సమూహంతో వారావిధంగా వెళ్ళగానే; ఆ+పాండునందనులు చని= ఆ పాండు కుమారులు వెళ్ళి; సంగీత ప్రవర్తక సంఘంబులు= సంగీతం ప్రచారం చేసే సమాజాలు; విరిసి చనినన్= వెళ్ళిపోగా; రిత్తఐ ఉన్న= శూన్యమైపోయిన; రంగస్థలంబు చందంబునన్= నాటక రంగభూమి మాదిరిగా; పాడు+అటి+ఉన్న= బీడువారిన; ఆ శిబిరంబున్+ప్రవేశించి= ఆ గుడారంలోనికి పోయి; నీ నందను నగరున్+చొచ్చిన= నీ కుమారుడి (దుర్యోధనుడి) మేడలోనికి వెళ్ళగా; అచ్చటన+ఉన్న పరిచారకులును= అక్కడ ఉండిన సేవకులును; తత్సహవాసులును= వారి స్నేహితులును; మణికనక+ఆది వస్తు సంచయ+ అధ్యక్షులును= మణులకు బంగారానికిని అధికారులయిన వారును; ఆ+యుధిష్ఠిరున్+కాంచి= ఆ ధర్మజుడిని చూచి; ఆదరణంబు పడసిరి= ప్రేమను పొందినవారయ్యారు; ఆ+కుంతీనందనులు= ఆ పాండవులు; రథంబులు డిగ్గు+అవసరంబునన్= తేరులనుండి దిగే సమయంలో; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; వాసవిన్= అర్జునుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** చేయవలసిన పనిని చేశాము. ధన్యులము. సాయంకాలమైనది. సేనతో సేనానులు కూడా విశ్రాంతి పొందవలసిఉన్నది. పోదాము. లేవండి'- అనగా పాండవులు ప్రసన్నులైనారు. పాంచాలురూ మిగిలిన రాజులూ సంతోషించారు. అపుడు కృష్ణుడు తన శంఖం పాంచజన్యమును ఊదాడు. అర్జునుడు దేవదత్తాన్నీ, ధర్మజుడు అనంతవిజయాన్నీ, భీముడు పౌండ్రాన్నీ, నకులుడు సుఘోషాన్నీ, సహదేవుడు మణిపుష్పకాన్నీ పూరించారు. సేనానాయకు లందరూ తమ తమ శంఖాలను పూరించారు. నగారాలు, తూర్యములు మ్రోగాయి. పైకెగసిన శబ్దాలు ఆకసందాకా నిండింది. జనులంతా పాండవులను పొగడే ప్రశంసలు దిక్కులను తాకాయి. ఈ సంతోషంతో వారంతా ఆ చోటనుండి వెళ్ళారు. కుంతి కుమారులు కౌరవుల గుడారాలకు వెళ్ళగా, సాత్యకి వారి ననుసరించాడు. ధృష్టద్యుమ్నుడు మొదలైన ద్రుపదుడి దాయాదులూ, ఉపపాండవులూ, తక్కిన రాజులును తమ విడిదులకు వెళ్ళి విశ్రాంతి పొందటం మంచిదనుకొని తా మా రాత్రి అక్కడ నిలిచి మరునాటి ఉదయాన హస్తినాపురానికి ప్రయాణమునకు తగినట్లుగా వస్తామని మనవి చేసి, ధర్మరాజు అనుమతి తీసికొని, సైన్యంతో వెళ్ళారు. వా రా విధంగా పోగా, సంగీతాన్ని అందించే బృందాలు వెళ్ళిపోగా చిన్నపోయినట్లు కనుపించే రంగస్థలం వలె వెలవెలపోయే ఆ గుడారం లోనికి పాండవులు పోయి, నీ కుమారు డుండే నగరులోనికి పోగా, ఆ చోటినుండే సేవకులు, వారి అనుయాయులు, మణి కనకాది సమూహాలకు అధికారులు, ఆ యుధిష్ఠిరుడిని చూచి ఆదరణ పొందారు. ఆ కుంతీకుమారులు తేరులు దిగే సమయంలో శ్రీకృష్ణుడు అర్జునుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'కవదొనలును గాండీవము । నవల నిడం బనుపు; ముంద రరదము డిగు; మే**
**న విదప డిగియెద; శుభకర । మవు నవ్విధ; మట్లు సేయు' మనుడు నతండున్. 333**

**ప్రతిపదార్థం:** కవదొనలును= అమ్ములపొదుల జతయూ; గాండీవమున్= గాండీమనే అర్జునుని విల్లునూ; అవలన్= దూరంగా; ఇడన్+పనుపుము= పెట్టుటకై పంపుము; ముందర రథమున్= ముందుగా తేరునుండి; దిగుము; ఏన= నేనే; పిదపన్ డిగియెదన్= ఆ తరువాత దిగుతాను; ఈ+విధము= ఈ పద్ధతి; శుభకరము+అగున్= మేలు ఔతుంది; అట్లు చేయుము= ఆ విధంగా చేయవలసింది; అనుడున్= అనగా; అతండున్= అర్జునుడు కూడా.

**తాత్పర్యం:** 'గాండీవమును ధనుస్సును అమ్ముల పొదుల జంటను ఆవల పెట్టేటట్లు చేయుము. నీవు ముందుగా తేరునుండి దిగుము. నేను తరువాత దిగుతాను. అది క్షేమకరం.' అనగా అర్జునుడు కూడా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ధనువు తూణీరయుగళంబుఁ గొనుచు రథము । డిగుడు, శౌరి పగ్గంబుల నొగల ముడిచి**
**డిగియెఁ; గేతనకపియు భూతగణయుతము । గాఁ దొలంగె; నత్తేరు తత్క్షణమ మండె. 334**

**ప్రతిపదార్థం:** ధనువున్= వింటిని; తూణీరయుగళంబున్= అమ్ములపొది జంటను; కొనుచున్= తీసికొని; రథము డిగుడున్= తేరినుండి దిగగానే; శౌరి= కృష్ణుడు; పగ్గంబులన్= గుర్రాల పగ్గాలను; నొగలన్= తొట్టెలో; ముడిచి= చుట్టి; దిగియెన్= దిగాడు; కేతన కపియున్= జెండా మీది హనుమంతుడుకూడా; భూతగణయుతముగాన్= భూతముల సమూహంతో; తొలంగెన్= తప్పుకొన్నాడు; తద్+క్షణము+అ= వెంటనే; ఆ+తేరు= ఆ రథం; మండెన్= మండిపోయింది.

**తాత్పర్యం:** వింటిని, తూణీరాల జంటను తీసికొని (అర్జునుడు) రథం దిగాడు. శ్రీకృష్ణుడు పగ్గాలను తొట్టెలో ముడిచిపెట్టి క్రిందికి దిగాడు. ధ్వజం మీది ఆంజనేయుడు భూతగణంతో తొలగిపోయాడు. వెంటనే ఆ తేరు మండిపోయింది.

### అగ్నిదత్తం బైన యర్జును రథంబు కాలిపోవుట (సం. 9-61-14)

**క. తురగంబులతోఁ గూడఁగ । నరదము సకలంబు నుజ్జ్వలానలశిఖలన్**
**సురసురఁ బోయినఁ గని య । న్నరుఁ డచ్చెరువంది కృష్ణునకు నభిముఖుఁ డై. 335**

**ప్రతిపదార్థం:** తురగములతోన్+కూడఁగన్= గుర్రాలతో కూడా; అరదము సకలంబున్= తేరు మొత్తంగా; ఉజ్జ్వల+అనలశిఖలన్= ప్రకాశించే కాంతి గల నిప్పు మంటలతో; సురసురన్+పోయినన్+కని= సురసుర శబ్దంతో మండగా చూచి; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; అచ్చెరువు+అంది= ఆశ్చర్యపడి; కృష్ణునకున్+అభిముఖుఁడు+ఐ= కృష్ణుడికెదురుగా (నిలిచి).

**తాత్పర్యం:** గుర్రాలతో కూడిన తేరు మొత్తంగా తీవ్రాగ్నిజ్వాలలతో చురచుర శబ్దం చేస్తూ మండిపోగా చూచిన అర్జునుడు అబ్బురంగా శ్రీకృష్ణుడికి ఎదురుగా (తిరిగి). (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. వినయంబుతోడ మోడ్పుఁగేలు ఫాలతలంబునఁ గదియించి వినతుండై 'దేవా! యిట్టి యాశ్చర్యంబుం గలదె? యీ రథంబు దగ్ధం బగుటకుఁ గారణం బేమి? నాకు వినందగునేని యానతి' మ్మనిన మురారాతి యతని కిట్లనియె. 336**

**ప్రతిపదార్థం:** వినయంబుతోడన్= అణకువతో; మోడ్పు+కేలు ఫాలతంబునన్+కదియించి= జోడించిన చేయి నెన్నుదుటికి చేర్చి; వినతుండు+ఐ= నమస్కారం చేసినవాడై; దేవా!= ఓ స్వామీ!; ఇట్టి ఆశ్చర్యంబు+కలదె?= ఇటువంటి వింత ఉన్నదా?; ఈ రథంబు దగ్ధంబు+అగుటకున్+కారణంబు+ఏమి?= ఈ తేరు కాలిపోవటానికి కల కారణమేమి?; నాకు వినన్+తగునేని= నేను వినదగినదయితే; ఆనతి ఇమ్ము+అనినన్= తెలియజేయుము అనగా; ముర+అరాతి= శ్రీకృష్ణుడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అణకువతో నమస్కరించి వినమ్రుడై 'ఇది చాలా వింతగా ఉన్నది. ఈ తేరు కాలిపోవటానికి కారణమేమి? నేను వినదగినదయితే సెలవీయండి.' అనగా శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు.

**క. 'గురుకర్ణుల యస్త్రాగ్నుల । నెరిసినయది మున్ను; దీని నిటు గాకుండం**
**భరపడి రక్షించితి; సం । గరము దెగినఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్.' 337**

**ప్రతిపదార్థం:** గురు కర్ణుల అస్త్ర+అగ్నులన్+ఎరిసిన అది= ద్రోణుడియొక్క కర్ణుడియొక్క బాణాగ్నులచే మండినది; మున్ను= ముందుగానే; దీనిన్= ఈ తేరును; ఇటు కాకుండన్= ఈ విధంగా నుసి కాకుండా; భరపడి రక్షించితిన్= వహించి కాపాడాను; సంగరము తెగినన్= యుద్ధం పూర్తికాగా; తొలఁగి= తప్పుకొని; ఇపుడు= ఈ సమయంలో; కాలన్= కాలిపోగా; విడిచితిన్= వదలాను.

**తాత్పర్యం:** 'ఈ రథం ద్రోణుడి, కర్ణుడి బాణాగ్నులచేత ఇదివరకే మండింది. ఇది మండకుండా నేను ఇట్లు రక్షించాను. యుద్ధం ముగిసింది. కనుక దీనిని ఈ విధంగా కాలటానికి వదలిపెట్టాను.'

**వ. అని చెప్పి యప్పు డద్భుతరసమగ్నులగుచున్న తక్కటి పాండవులం గనుంగొని యలరుమొగంబున నలంతినవ్వు కాంతి దళుకొత్తఁ గౌంతేయాగ్రజుం గౌఁగిలించికొని 'యే నుపప్లావ్యంబునకు వచ్చి నినుఁ గనిన నీవు నాకు మధుపర్కం బిచ్చి వివ్వచ్చుఁ జూపి 'వీఁడు నీకు రక్షణీయుండు సుమీ!' యని యప్పగించి; తేనును నియ్యకొంటి; నట్ల నాసఖుండును సురక్షితుండై వీరక్షయకరం బగుమహాసంగరంబు భవద్భీమనకుల సహదేవసహితంబుగ నిస్తరించి జయంబు గైకొనియె; నిటమీఁదం జేయ వలయు కార్యంబులు నడపు' మనవుడు నతం డచ్యుతున కిట్లనియె. 338**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఆ విధంగా చెప్పి; అప్పుడు= ఆ సమయంలో; అద్భుతరసమగ్నులు= అద్భుతరసంలో మునుగుతూ ఉండే; తక్కటి పాండవులన్+కనుంగొని= మిగిలిన పాండవులను చూచి; అలరు మొగంబునన్+అలంతినవ్వుకాంతి+తళుకు+ఒత్తన్= వికసించిన మొగంలో చిరునగవు కాంతి మెరయగా; కౌంతేయ+అగ్రజున్= ధర్మరాజును; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; ఏను+ఉపప్లావ్యంబునకున్ వచ్చి= నేను ఉపప్లావ్యానికి వచ్చి; నిన్నున్+కనినన్= నిన్ను చూడగా; నీవు నాకున్ మధుపర్కంబు+ఇచ్చి= నీవు నాకు కొత్తబట్టలు ఇచ్చి; వివ్వచ్చున్+చూపి= అర్జునుడిని చూపించి; వీఁడు నీకు రక్షణీయుండు సుమీ! అని= వీడు నీవు కాపాడవలసినవాడు సుమా! అని; అప్పగించితి(వి)= అప్పగించావు; ఏనును+ఇయ్యకొంటిన్=

నేనుకూడా ఒప్పుకొన్నాను; అట్ల= ఆ విధంగా; నా సఖుండును= నా నేస్తమును; సురక్షితుండు+ఐ= చక్కగా కాపాడబడి; వీర క్షయకరంబు+అగు= వీర నాశకమైన; మహా సంగరంబున్= గొప్పదైన యుద్ధాన్ని; భవద్భీమ నకుల సహదేవ సహితంబుగాన్= నీ భీమ నకుల సహదేవులతోసహా; నిస్తరించి= దాటి; జయంబు+కైకొనియెన్= జయము పొందాడు; ఇటమీఁదన్+చేయవలయు కార్యంబులు= ఇక మీద చేయవలసిన పనులను; నడపుము= సాగించుము; అనవుడున్= అనగా; అతండు= ఆ ధర్మరాజు; అచ్యుతునకున్+ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఆ విధంగా చెప్పి, అద్భుతరసంలో మునిగిన మిగిలిన పాండవులను చూచి, వికసించిన తన మొగంలో చిరునగవు కాంతి మెరయగా, ధర్మజుడిని కౌగిలించుకొని ఇట్లా అన్నాడు. 'నేను ఉపప్లావ్యపురానికి వచ్చి నిన్ను చూచినపుడు నాకు వస్త్రాలను ఇచ్చి అర్జునుడిని చూపి 'వీడు నీవు తప్పక కాపాడవలసిన వాడు సుమా!' అని అప్పగించావు. నేను కూడా ఒప్పుకొన్నాను. ఆ విధంగా నా నేస్తమూ రక్షించబడ్డాడు. వీరనాశకమైన మహాయుద్ధాన్ని ఈ భీమ నకుల సహదేవులతో కలసి విస్తరించాడు. జయమును పొందాడు. ఇక పై చేయవలసిన పనులను నీవు నడపుము.' అనగా ఆతడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **'ద్రోణకర్ణ దివ్యాస్త్రముల్ క్రూరభంగిఁ । గవియునప్పుడు మము నీవు గావకున్న**
**బ్రదుకు టెంతద? వ్వధిక శుభంబులకు భ । వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ!'** **339**

**ప్రతిపదార్థం:** వాసుదేవ!= శ్రీకృష్ణా!; ద్రోణ కర్ణ దివ్య+అస్త్రముల్= ద్రోణుడి, కర్ణుడి, దివ్యాస్త్రాలు; క్రూరభంగిన్= భయంకరంగా; కవియునప్పుడు= క్రమ్ముకొనేటప్పుడు; మమున్ నీవు కావకున్నన్= మమ్ము నీవు కాపాడకుంటే; బ్రతుకుట+ఎంత దవ్వు?= బ్రతుకెంత దూరమో; అధికశుభంబులకున్= మిక్కిలి మేళ్ళకు; భవత్ప్రసాదంబు గని కాదె= నీ యనుగ్రహం గని వంటిది కదా!

**తాత్పర్యం:** 'ఓ వాసుదేవా! ద్రోణ కర్ణుల, దివ్యాస్త్రాలు భయంకరంగా మమ్ము కమ్ముకొన్నపుడు నీవు కాపాడకపోతే మా జీవితాలు ఎంత దూరంలో ఉండేవో! నీ అనుగ్రహమనే నిధి ఉండబట్టి కదా మిక్కిలి మేలునందగలిగాము!'

**వ.** **అని వెండియు.** **340**

**ప్రతిపదార్థం:** అని వెండియున్= అంటూ ఇంకనూ.

**తాత్పర్యం:** అంటూ ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **'మునిపతి కృష్ణద్వైపా । యనుఁడు ప్రబోధించె నన్ను 'నచ్యుతుఁ డే ది**
**క్కున నుండు నెమ్మి నా ది । క్కునకు జయము గల్గు' నని యకుంఠితకరుణన్.** **341**

**ప్రతిపదార్థం:** మునిపతి= ముని నాయకుడు; కృష్ణద్వైపాయనుఁడు= వ్యాసుడు; అచ్యుతుఁడు+ఏ+దిక్కునన్+ఉండున్= శ్రీకృష్ణు డేవైపున ఉంటాడో; ఆ దిక్కునకున్= ఆ వైపునకు; నెమ్మిన్= ప్రీతితో; జయము= విజయం; అకుంఠిత కరుణన్= కుంటువోని దయతో; కల్గున్+అని= కలుగుతుందని; నన్నున్ ప్రబోధించెన్= నాకు తెలియచేశాడు.

**తాత్పర్యం:** 'మునినాయకుడైన వ్యాసుడు నన్ను హెచ్చరించాడు. శ్రీకృష్ణు డేవైపు పుంటాడో జయ మాదిక్కునకే కలుగుతుం' దని విశేషమైన కరుణతో చెప్పాడు.'

**వ. అనుటయు మాధవుం డమ్మనుజేంద్రున కిట్లనియె. 342**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; మాధవుండు= శ్రీకృష్ణుడు; ఆ+మనుజ+ఇంద్రునకున్+ఇట్లు+అనియెన్= ఆ రాజేంద్రుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజుడు అట్లా అనగా శ్రీకృష్ణుడు ఆ రాజేంద్రుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'మనకుం గౌరవులకుఁ బదు । నెనిమిది యక్షౌహిణులు మహీశ్వర! కల; వ**
**ప్పెనుమొన లన్నిటిలో న । ర్జునునకుఁ బాటి యని యొక్కరునిఁ బేర్కొనుమా! 343**

**ప్రతిపదార్థం:** మహీశ్వర!= ఓ రాజా!; మనకున్ కౌరవులకున్= మనకూ కౌరవులకును; పదునెనిమిది యక్షౌహిణులు కలవు= పద్దెనిమిది అక్షౌహిణులున్నాయి(సేనలు); ఆ+పెను మొనలు+అన్నిటిలోన్= ఆ పెద్ద సైన్యమంతలోను; అర్జునునకున్ పాటి అని= అర్జునుడిని సమానుడని; ఒక్కరునిన్= ఒకడిని; పేర్కొనుమా!= పేర్కొనుము.

**తాత్పర్యం:** 'మనకూ కౌరవులకూ కలసి పద్ధెనిమిది అక్షౌహిణుల సేన ఉన్నది. అంతటి పెద్ద సేనలో అర్జునుడికి సమానంగా ఒక్కడిని పేర్కొనగలవా?

**తే. ఈశ్వరుఁడు క్రీడి కస్త్రంబు లిచ్చుచోట । 'మత్సముండవు గ' మ్మని వత్సలత్వ**
**గౌరవంబునఁ బల్కెఁ; నిక్కముగ నంత । వాఁడు గాఁడె నీతమ్ముఁడు వసుమతీశ! 344**

**ప్రతిపదార్థం:** వసుమతీ!+ఈశ!= ఓ రాజా!; ఈశ్వరుఁడు= పరమశివుడు; క్రీడికిన్= అర్జునుడికి; అస్త్రంబులు+ఇచ్చుచోటన్= అస్త్రాలిచ్చేటప్పుడు; మత్సముండవు కమ్ము= నాతో సమానుడవు కమ్ము; అని= అంటూ; వత్సలత్వ గౌరవంబునన్= వాత్సల్యాధిక్యంతో; పల్కెన్= అన్నాడు; నీ తమ్ముఁడు= నీ సోదరుడగు అర్జునుడు; నిక్కముగన్= నిజంగా; అంతవాఁడు కాఁడె?= అంతటివాడే కదా!

**తాత్పర్యం:** పరమశివుడు అస్త్రాలను ఇచ్చినపుడు అర్జునుడితో 'నాతో సమానుడవు నీవు కావాలి' అని అధిక వాత్సల్యంతో చెప్పాడు. ఓ రాజా! నీ తమ్ముడయిన అర్జునుడు అంతటివాడే కదా!

**చ. కరుణ జనించి శాత్రవుల గాండివి సంపఁగ నొల్లఁడయ్యెఁ; నేఁ**
**బరువడిఁ దెల్పి యైక్యపరిభావ నిరూఢము గాఁగఁ జేసినం**
**దిర మయి పోరికిం గృతమతిన్ మఱి చొచ్చి సరిత్సుతాదులన్**
**వెరవున గీటడంచెఁ దనవిక్రమ మెందుఁ బ్రసిద్ధి కెక్కఁగన్. 345**

**ప్రతిపదార్థం:** గాండివి= అర్జునుడు; కరుణ జనించి= దయ గలిగి; శాత్రవులన్= వైరులను; చంపఁగన్= చంపగా; ఒల్లఁడు+అయ్యెన్= ఇష్టపడలేదు; ఏన్= నేను; పరువడిన్= క్రమంగా; తెల్పి= బోధించి; ఐక్యపరిభావ నిరూఢము కాఁగన్= కలిసి ఉండటాన్ని తిరస్కరించే విధంగా; చేసినన్= చేయగా - అనగా గీతోపదేశంచేత - రణోన్ముఖుడిని చేయగా; తిరము+అయి= స్థిరంగా ఉండి; పోరికిన్= యుద్ధానికి; కృతమతిన్= నిశ్చయంతో; మఱి చొచ్చి= ఆ మీద ప్రయత్నించి; సరిత్సుత+ఆదులన్= గాంగేయాదులను; వెరవునన్= ఉపాయంతో; తన విక్రమము= తన శౌర్యం; ఎందున్= ఎక్కడకూడా; ప్రసిద్ధికెక్కఁగన్= కీర్తినందగా; గీటు అడంచెన్= చంపాడు.

**తాత్పర్యం:** అర్జునుడు దయగలిగి శత్రువులను చంపటానికి ఇష్టపడలేదు. ఆ మీద నేను క్రమంగా కలిసి ఉనికిని తిరస్కరించే విధంగా గీతోపదేశం చేసి రణోన్ముఖుడిని చేయగా - దాని వలన తన శౌర్యం ప్రసిద్ధిచెందగా కృతనిశ్చయుడై యుద్ధానికి పూనుకొన్నాడు. భీష్మాదులను చంపాడు.

**క. అచ్చెరువు సంపుటకుఁ దన । యిచ్చఁ జొరక కేలి సలిపె నిన్నాళ్ళును వి**
**వ్వచ్చుఁడు; హిత మేఁ జెప్పినఁ । బొచ్చెము లే కంతరంగమున నిల్పెఁ దగన్. 346**

**ప్రతిపదార్థం:** అచ్చెరువు= ఆశ్చర్యంగా; చంపుటకున్= చంపటానికి; తన ఇచ్చన్+చొరక= తన ఇష్టంతో పూనుకొనక; ఇన్నాళ్ళును= ఇన్ని దినాలూ; కేళి సలిపెన్= యుద్ధం చేశాడు; వివ్వచ్చుఁడు= బీభత్సుడు (అర్జునునకు); హితము+ఏన్+చెప్పినన్= నేను మంచి చెప్పగా(గీతను ఉపదేశించగా); పొచ్చెము లేక= అనుమానం లేకుండా; అంతరంగమునన్= మనసులో; తగన్+ నిల్పెన్= తప్పకుండా నిల్పుకొన్నాడు.

**తాత్పర్యం:** తన మనసులో శత్రువులను చంపటానికి ఇష్టపడకుండానే ఇన్నాళ్ళూ ఆశ్చర్యంగా యుద్ధక్రీడ సాగించాడు. అర్జునుడికి నేను హితాన్ని చెప్పగా సందేహించకుండా మనసులో నిలుపుకొన్నాడు.

**క. ఏ నుపదేశించితి ననఁ । గా నొక పెం పెంచినాఁడు గాని తలంపన్**
**మానవనాథ! సురేశ్వర । సూనుఁడు నాయట్టివాఁడ చు మ్మేపనికిన్. 347**

**ప్రతిపదార్థం:** మానవనాథ!= ఓ ధర్మరాజా!; ఏను+ఉపదేశించితిన్= నేను ఉపదేశం చేశాను; అనఁగాన్; ఒకపెంపు+ ఎఁచినాఁడుగాని= ఒక గొప్పగా అనుకొన్నాడు గాని; తలంపన్= యోచన చేయగా; సురేశ్వర సూనుఁడు= ఇంద్రతనయుడైన అర్జునుడు; ఏ పనికిన్= ఏ పనికైనా; నా+అట్టివాఁడు+అ+చుమ్ము!= నా వంటివాడే సుమా!

**తాత్పర్యం:** ఓ రాజా! నేను ఉపదేశం చేశానని గౌరవంగా భావించాడు కాని యోచన చేసి చూడగా ఇంద్రవర జన్ముడయిన అర్జునుడు కూడా ఏ పని చేయటానికైనా నా అంతటివాడే సుమా!

**క. నిమిషార్ధంబున త్రైలో । క్యమును సురాఘరయుతంబు గా నోర్చుం గో**
**పము పొడమినఁ గవ్వడి క । య్యమునం గురుబలము గెలుచు టరుదే తలఁపన్?' 348**

**ప్రతిపదార్థం:** కోపము పొడమినన్= కోపం కలిగితే; కవ్వడి= అర్జునుడు; కయ్యమునన్= యుద్ధంలో; నిమిష+అర్ధంబునన్= అరనిముసంలో; త్రైలోక్యమును= ముల్లోకాలను; సుర+అసురయుతంబుగాన్= దేవాసురులతో సహా; ఓర్చున్= ఓడిస్తాడు; కురుబలము గెలుచుట= కౌరవసేనను గెలవటం; తలఁపన్ అరుదే?= యోచిస్తే ఆశ్చర్యమా?

**తాత్పర్యం:** కోపం వస్తే అర్జునుడు అరనిముసంలో ముల్లోకాలను ఓడించగలడు. కాగా యుద్ధంలో కౌరవసేనను ఓడించటంలో అబ్బుర మేమున్నది?'

**విశేషం:** అలం: కావ్యార్థపత్తి.

**వ. అని పలికె; నిట్లు సల్లాపసౌఖ్యం బనుభవించి వాహనమోచనం బాచరించిరి; తదనంతరంబ కౌంతేయులు గమనీయాభరణంబులుం గనకరాసులును రత్నసంచయంబులు మొదలుగా మహనీయవస్తు విస్తారంబునం**

**బ్రస్తుతిపాత్రంబైన నీపుత్రు భాండాగారంబుఁ జేకొని, నాఁడు పొలికలనికిం బోవక యున్న రథరథ్యమాతంగ తురంగంబులం జూచికొని దాసదాసీకుబ్జవామనగణంబులం గైకొని, యధిక ప్రమదసమద చేష్టితంబుల నుల్లసిల్లిరి; కొండొకసేపునకు శౌరి వారలతో నిట్లనియె. 349**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= అంటూ మాటలాడాడు; ఇట్లు= ఈ విధంగా; సల్లాపసౌఖ్యంబు+అనుభవించి= సంభాషణ సంతోషాన్ని పొంది; వాహన మోచనంబు+ఆచరించిరి= తమ తమ వాహనములను విడిచారు; తదనంతరంబు+అ= ఆ మీదట; కౌంతేయులు= పాండవులు; కమనీయ+ఆభరణంబులున్= అందమైన నగలును; కనకరాసులును= బంగారు కుప్పలును; రత్నసంచయంబులు= నవరత్న సమూహాలు; మొదలుగాన్= మొదలైన వాటితో; మహనీయవస్తు= గొప్పవస్తువులయొక్క; విస్తారంబునన్= సమృద్ధితో; ప్రస్తుతి పాత్రంబు+ఐన= పొగడదగిన; నీ పుత్రు భాండాగారంబున్ చేకొని= నీ కుమారుడి బొక్కసాన్ని తీసికొని; వాఁడు పొలికలనికిన్+పోవక ఉన్న= ఆనాడు యుద్ధానికి వెళ్ళకుండా ఉన్నట్టి; రథ= తేరులను; రథ్య= గుర్రాలను; మాతంగ= ఏనుగులను; తురంగంబులన్= గుర్రాలను; చూచికొని= చూచుకొంటూ; దాసదాసీ= సేవకులను సేవకురాండ్రను; కుబ్జవామన గణంబులన్= పొట్టివారి గుంపులను; కైకొని= తీసికొని; అధిక ప్రమద చేష్టితంబులన్= మిక్కిలి ఆనందకారణమైన చేష్టలతో; ఉల్లసిల్లిరి= సంతషించారు; కొండొక సేపునకున్= కొంతసేపటికి; శౌరి= కృష్ణుడు; వారలతోన్+ఇట్లు+అనియెన్= వారితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు పాండవులతో తీయని మాటలాడి ఆనందాన్ని పొందాడు. పాండవులు వాహనాలను వదలి బంగారు, రత్నాల రాసులు మొదలయిన గొప్ప సంపదతో నిండి కీర్తిపాత్రమైన నీ కుమారుడి బొక్కసాన్ని కైవసం చేసికొన్నారు. యుద్ధరంగానికి పోకుండా ఉన్న తేరులను, గుర్రాలను, మదపుటేనుగులను చూచికొంటూ దాసదాసీలను, పొట్టివారి సమూహాన్ని తీసికొని మిక్కిలి ఉల్లాసంతో ఉండగా శ్రీకృష్ణుడు వారితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'వీడు పాడు గాన విశ్రాంతి కియ్యెడ । మనము మసలవలదు; మంగళార్థ**
**ముగ శుచిప్రదేశమున కేఁగి యచ్చోట । నుచితవర్తనముల నుండవలయు.' 350**

**ప్రతిపదార్థం:** వీడు= స్కంధావారం; పాడుకానన్= పాడుపడింది కనుక (నాశమైనది కనుక); విశ్రాంతికిన్= విశ్రాంతికై; ఈ+ఎడన్= ఈ చోట; మనము మసలవలదు= మనం నిలువ వద్దు; మంగళ+అర్థముగన్= క్షేమానికై; శుచి ప్రదేశమునకున్+ ఏఁగి= స్వచ్ఛమైన(నిర్మలమైన) చోటునకు వెళ్ళి; ఆ+చోటన్= ఆ స్థలంలో; ఉచితవర్తనములన్= తగిన నడవడులతో; ఉండవలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** 'ఈ సైనిక శిబిరం పాడుపడింది కనుక మన మిక్కడ విశ్రాంతికై ఉండటం సరికాదు. మంగళకరంగా ఉండటానికి వేరొక నిర్మలమైన చోటికి వెళ్ళి అక్కడ తగిన తీరులో ఉందాము.'

**క. అని చెప్పి పాండు నృపనం । దనులం దన తమ్మునిన్ ముదం బెసఁగఁగఁ దో**
**డ్కొని పోయెను వసుదేవుని । తనయుఁడు శిబిరంబు వెడలి ధరణీనాథా! 351**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ఓ రాజా!; అని చెప్పి= అని చెపుతూ; పాండు నృపనందనులన్= పాండు రాజు కుమారులను; తమ్మునిన్= సాత్యకినీ; ముదంబు+ఎసఁగఁగన్= సంతోషం కలుగగా; వసుదేవుని తనయుఁడు= శ్రీకృష్ణుడు; శిబిరంబు వెడలి; తోడ్కొనిపోయెను= పిలిచికొనిపోయినాడు.

**తాత్పర్యం:** ఓ రాజా - ధృతరాష్ట్రా! వాసుదేవుడు ఆ విధంగా చెపుతూ పాండురాజు కుమారులనూ, సాత్యకినీ దుర్యోధనుడి శిబిరమునుండి సంతోషాతిశయంతో తోడ్కొని పోయాడు.

**వ. ఇట్లు వోవునప్పుడు శౌరిసారథి యైన దారకుండు మున్నెప్పుడును విడిదలం దమతేరు నశ్వంబులనుం బరికించి యుండెడువాఁడు బోయలు నీకొడుకు మడువున డాఁగినయునికి చెప్పిన నయ్యెడకు వచ్చు కౌంతేయులతో వీడెల్ల నొక్కతలగా వెడలివేడుకఁ జూడం జనుదేరఁ, దాను నయ్యరదంబున శైబ్యసుగ్రీవ మేఘ పుష్పవలాహకంబులం బూన్చికొని వచ్చుటం జేసి తా నప్పుడు కౌరవ శిబిరంబునకుఁ దోడన యరుగుదెంచెం గావున నొదవి సుకల్పితస్యందనుం డై యుద్దామోదరుదృష్టిపథంబు నిల్చె; ధర్మనందనుండును దమ్ములును సాత్యకియును సముచితవాహనంబులు దెప్పించుకొని యారోహణంబు సేయ నన్నారాయణుండు నిజరథారూఢుం డై యత్తెఱఁగునం బోయి. 352**

**ప్రతిపదార్థం:** ఇట్లు+పోవునప్పుడు= ఈ విధంగా వెళ్ళేటప్పుడు; శౌరిసారథిఐన దారకుండు= శ్రీకృష్ణుడి సారథి అయిన దారకుడనే వాడు; మున్ను+ఎప్పుడును= అంతకుముందు+ఏనాడును; విడిదలన్= విడిది ఉండే చోటులలో; తమతేరు నశ్వంబులనున్+పరికించి= తమతేరి గుర్రాలను తేరిచూచి; ఉండెడువాఁడు= ఉండేవాడు; బోయలు= సేవకులు; నీ కొడుకు మడువునన్ డాఁగిన+ఉనికిన్= నీ కుమారుడు మడుగులో దాగుకొని ఉండటం చెప్పగా; ఆ+ఎడకున్= ఆ చోటికి; వచ్చు= వస్తూ ఉన్న; కౌంతేయులతోన్= పాండవులతో; వీడెల్లన్= ఊరంతటినీ; ఒక్కతలగాన్ వెడలి= ఒక్కటిగా వచ్చి; వేడుక చూడన్+చనుదేరన్= వినోదాన్ని చూడటానికై రాగా; తాను ఆ+అరదంబునన్= (శ్రీకృష్ణుడు) తానే ఆ తేరు మీద; శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకంబులన్ పూన్చికొని వచ్చుటన్+చేసి= ఈ పేర్లుగల గుర్రాలను సిద్ధంచేసి తీసికొనివచ్చుటవలన; తాను+అప్పుడు= తా నా సమయంలో; కౌరవ శిబిరంబునకున్ తోడన+ అరుగుదెంచెన్+కావునన్= కౌరవుల శిబిరానికి వెంటనే వచ్చాడు కనుక; ఒదవి= తగినట్లుగా; సుకల్పిత స్యందనుండు+ఐ= చక్కగా చేసిన తేరు గలవాడుగా; ఆ+దామోదరు దృష్టిపథంబున్+నిల్చెన్= ఆ శ్రీకృష్ణుని దృష్టిలో పడ్డాడు; ధర్మనందనుండును= ధర్మరాజు; తమ్ములును= అతడి సోదరులూ; సాత్యకియును= సాత్యకియు; సముచిత వాహనంబులు తెప్పించుకొని= తగిన వాహనాలను తెప్పించుకొని; ఆరోహణంబు చేయన్= ఎక్కగా; ఆ+నారాయణుండు= ఆ శ్రీకృష్ణుడు; నిజ రథారూఢుండు+ఐ= తన తేరెక్కిన వాడై; ఆ+ తెఱఁగునన్+పోయి= ఆ విధంగా వెళ్ళి.

**తాత్పర్యం:** .... నీ కొడుకు మడుగులో దాగి వుండడాన్ని చెప్పగా ఆ చోటుకు వచ్చు పాండవులతో శిబిరంలోని వారందరూ ఆ వేడుక చూడటానికి బయలుదేరగా తాను (దారుకుడు) ఆ రథానికి శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకములను పూన్చికొని ఉత్సాహంతో వచ్చినాడు కాబట్టి తాను కూడా వారితో పాటు కౌరవ శిబిరానికి వచ్చినందున తగినట్లుగా తీర్చిదిద్దిన రథంతో దామోదరుడు చూపునకు ఎదురుగా నిలిపాడు. ధర్మరాజు, తమ్ములు, సాత్యకి, తగిన వాహనాలు తెప్పించుకొని ఎక్కగా ఆ నారాయణుడు తన తేరెక్కి ఆ విధంగా వెళ్ళి.

**తే. ఓఘవతి యనఁ బరఁగిన యొక్క పుణ్య । తటిని చేరువఁ గల్గిన దానితీర**
**భూమియం దర్ఘ మగుతలమున వసించి । రమ్మహాత్ములు చిత్తంబు లలర నధిప!' 353**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; ఓఘవతి అనన్+పరఁగిన= ఓఘవతి అనే పేరుతో ఉన్నట్టి; ఒక్కపుణ్యతటిని= ఒక పవిత్ర నదియొక్క; చేరువన్ గల్గిన= దగ్గరున్న దాని; తీర భూమి అందున్= దాని గట్టునందు; అర్ఘము+అగు తలమునన్=

అర్హమైన నేలపై; చిత్తంబులు+అలరన్= మనసు సంతోషంతో చిగుర్చగా; ఆ+మహాత్ములు= ఆ మహనీయులు; వసించిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** ఓ మహారాజా! వారంతా సంతోష మనస్కులై ఓఘవతి అనే పేరున్న పుణ్యనదీతీరంలో ఉచితమైన స్థలంలో ఉన్నారు.'

**వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకుఁ బాండవుల విజయంబు తెలంగుఁ జెప్పె నని వైశం పాయనుండు. 354**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు సంజయుండు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడితో; పాండవుల విజయంబు తెలంగున్+చెప్పెన్= పాండవులు గెలిచిన తీరును చెప్పాడు; అని వైశంపాయనుండు.

**తాత్పర్యం:** ఈవిధంగా సంజయుడు ధృతరాష్ట్రుడితో పాండవుల విజయాన్ని వర్ణించా డని వైశంపాయనుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జనమేజయునకు నిట్లను । విను మప్పుడు ధర్మసుతుఁడు విష్ణుని వదనం**
**బునఁ జూడ్కి నిలిపి, 'కరిపుర । మునకుం బోవలయు నీకుఁ బురుషార్థనిధీ!' 355**

**ప్రతిపదార్థం:** జనమేజయునకున్= జనమేజయ చక్రవర్తితో; ఇట్లనున్= ఈ విధంగా అన్నాడు; వినుము; అప్పుడు= ఆ సమయంలో; ధర్మసుతుఁడు= ధర్మరాజు; విష్ణుని వదనంబునన్= శ్రీకృష్ణుడి ముఖంమీద; చూడ్కి నిలిపి= చూపు నిలిపి; పురుషార్థనిధీ!= శ్రీకృష్ణా!; నీకున్= నీవు; కరిపురమునకున్+పోవలయున్= హస్తినాపురికి పోవలసి ఉన్నది.

**తాత్పర్యం:** వైశంపాయనుడు జనమేజయ చక్రవర్తితో ఈ విధంగా అన్నాడు. ధర్మజుడు శ్రీకృష్ణుడిని చూస్తూ 'పురుషార్థాలకు నిధివైన కృష్ణా! ఇప్పుడు నీవు హస్తినాపురికి వెళ్ళాలి.'

**వ. అని ప్రార్థించె; ననుటయు నమ్మనుజపతి యమ్మహీసురవరున కిట్లనియె. 356**

**ప్రతిపదార్థం:** అని ప్రార్థించెన్= అని ప్రార్థించాడు; అనుటయున్= అనగా; ఆ+మనుజపతి= ఆ జనమేజయరాజు; ఆ+మహీసురవరునకున్+ఇట్లు+అనియెన్= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడితో (వైశంపాయనుడితో); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని ప్రార్థించా డని చెప్పగా, జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'అని ధృతరాష్ట్ర నందనుల నందఱ గీ టడఁగించి వేఁడి యా**
**యనకడ కచ్యుతుం బనుపునంతటి కార్య విశేషమేమి గ**
**ల్గెనొ? మునినాథ! యానృపతికిన్ మది నాకు వినంగ వేడ్క వు**
**ట్టినయది యత్తెఱంగు ప్రకటింపు పరిస్ఫుటవాక్యసంపదన్.' 357**

**ప్రతిపదార్థం:** మునినాథ!= ఓ వైశంపాయన మునీశ్వరా!; అనిన్= యుద్ధంలో; ధృతరాష్ట్ర నందనులన్= ధృతరాష్ట్రుడి కుమారులను; అందఱన్= అందరినీ; గీటడఁగించి= రూపుమాపి (సంహరించి); వేఁడి= కోరి; ఆయనకడకున్= ఆ ధృతరాష్ట్రుడి

వద్దకు; అచ్యుతున్+పనుపునంతటి= శ్రీకృష్ణుడిని పంపవలసినంత; కార్యవిశేషము= గొప్ప పని; ఆ+నృపతికిన్= ఆ ధర్మరాజునకు; ఏమి కల్గెనో?= ఏమి కలిగిందో?; నాకున్ వినంగన్= నేను వినవలెననే; వేడ్క= ఆసక్తి; మదిన్= మనసులో; పుట్టిన అది= కలిగింది; పరిస్ఫుట వాక్య సంపదన్= నిండైన స్పష్టమైన; వాక్యసంపదతో; ప్రకటింపు(ము)= తెలియజేయుము.

**తాత్పర్యం:** 'ఓ వైశంపాయన మునీశ్వరా! యుద్ధంలో ధృతరాష్ట్రుడి కుమారులను అందరిని చంపి, అతడివద్దకు శ్రీకృష్ణుడిని వేడుకొని పంపవలసినంతటి ప్రత్యేకమైనపని ధర్మరాజునకు ఏమి కలిగింది? నా మనసులో దానిని తెలిసికొనవలెననే కోరిక కలిగింది. ఆ వైనాన్ని చక్కటి మాటలున్న వాక్యాలలో స్పష్టంగా తెలుపవలసినది.'

**వ. అనవుడు నాసంయమి యిట్లనియె. 358**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆ సంయమి= ఆ తాపసియైన వైశంపాయనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ఆ వైశంపాయనుడు ఇట్లా అన్నాడు:

**ఉ. 'కౌరవముఖ్యు ధర్మగతి గాని తెఱంగునఁ గ్రీడి పంపఁగా**
**మారుతి గూల్చె నట్లగుట మాన్యచరిత్రుఁడు ధర్మసూతి గాం**
**ధారి శపించు దీని విని త మ్మని యాత్మఁ దలంచి యిమ్మెయిం**
**గూరినభీతి నవ్వనితకుం దగుభంగి శమం బొనర్పఁగన్. 359**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యున్= దుర్యోధనుడిని; ధర్మగతిగాని తెఱంగునన్= ధర్మపద్ధతి కాని విధంగా; క్రీడి పంపఁగాన్= అర్జునుడు పంపగా (తెలియజేయగా); మారుతి కూల్చెన్= భీముడు పడవేసినాడు; అట్లు+అగుటన్= ఆ విధంగా అయినందున; మాన్యచరిత్రుఁడు= పూజనీయమైన శీలం కలవాడైన; ధర్మసూతి= ధర్మరాజు; గాంధారి; దీనిన్ విని= ఈ వార్తను విని; తమ్మున్; శపించున్= శపిస్తుంది; అని; ఆత్మన్+తలంచి= మదిలో తలచి; ఈ+మెయిన్+కూరిన భీతిన్= ఈ విధంగా కలిగిన భయంతో; ఆ+వనితకున్= ఆ స్త్రీకి (గాంధారికి); తగు భంగిన్= తగినట్లుగా; శమంబు+ఒనర్పఁగన్= శాంతిని కలిగించటానికి.

**తాత్పర్యం:** కౌరవులలో ముఖ్యుడయిన దుర్యోధనుడిని యుద్ధరంగంలో అర్జునుడి సైగతో భీముడు అధర్మంగా పడగొట్టాడని విన్నందువలన గాంధారి తమ్ము శపిస్తుందని పవిత్రచరిత్రుడైన ధర్మరాజు మనసులో భయపడి ఆమెను ఏ విధంగానైనా శాంతింపజేయటానికి. (తరువాతి వచనంతో అన్వయం).

### శ్రీకృష్ణుఁడు గాంధారి నూఱడింపఁ గరిపురంబునకుఁ బోవుట (సం. 9-61-40)

**వ. పనిచెం గాని ధృతరాష్ట్రు నుద్దేశించి కా; దట యచ్యుతుం డరిగి యప్పటి కుచితం బగువిధంబునఁ గార్యంబు నడపె; నాకర్ణింపు; మట్లు దన్నుఁ బ్రార్థించిన నప్పురుషోత్తముండు పనితెఱం గడిగి, పాండవాగ్రజుండు సెప్ప విని, రథారూఢుం డై యతిరయంబునఁ గరినగరంబున కరిగి, మొగసాల నిలిచి, యాంబికేయునకుఁ దనరాక యెఱిఁగించి పుచ్చి, తగం జొచ్చి యంతక మున్న గాంధారీద్వితీయుండై కొడుకులదెస వగలం బొగులుచున్న యమ్మహీకాంతునివలని కారుణ్యంబున నతనికడకుం జనుదెంచి యున్న**

**కృష్ణద్వైపాయనమహామునిం గని వినయసంభ్రమంబులు దలకొనఁ దత్పాదంబులకుఁ బ్రణమిల్లి యక్కురురాజునకు గాంధారరాజనందనకు నమస్కరించి, కులపతిసన్నిధి యగుట నిలాతలంబునం గూర్చున్న యజ్జననాథు సమీపంబున నాసీనుండై. 360**

**ప్రతిపదార్థం:** పనిచెన్+కాని= (ధర్మజుడు) పంపాడుగాని; ధృతరాష్ట్రున్+ఉద్దేశించి కాదు= ధృతరాష్ట్రుడిగురించి కాదు; అట= పిమ్మట; అచ్యుతుండు+అరిగి= శ్రీకృష్ణుడు వెళ్ళి; అప్పటికిన్= ఆ సమయానికి; ఉచితంబు+అగు విధంబునన్= తగినట్లుగా; కార్యంబు నడపెన్= పనిని సాగించాడు; ఆకర్ణింపుము= వినుము; అట్లు తన్నున్ ప్రార్థించినన్= ఆ విధంగా తనను ప్రార్థన చేయగా; ఆ+పురుషోత్తముండు= ఆ శ్రీకృష్ణుడు; పనితెఱఁగు+అడిగి= చేయవలసిన పని పద్ధతిని అడిగి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; చెప్పన్ విని= చెప్పగా విన్నవాడై; రథ+ఆరూఢుండు+ఐ= తెరెక్కినవాడై; అతిరయంబునన్= మిక్కిలి వేగంగా; కరినగరంబునకున్+అరిగి= హస్తినాపురికి వెళ్ళి; మొగసాలన్ నిలిచి= తలవాకిటిలో నిలిచి; ఆంబికేయునకున్= ధృతరాష్ట్రుడికి; తన రాక ఎఱిఁగించి పుచ్చి= తాను వచ్చుటను తెలియజేసి; తగన్+చొచ్చి= తగిన విధంగా లోనికి వెళ్ళి; అంతకమున్ను+అ= అంతకంటె ముందుగానే; గాంధారీ ద్వితీయుండు+ఐ= గాంధారితో కూడి ఉన్నవాడై; కొడుకులదెసన్= తన కుమారుల విషయంలో; వగలన్+పొగలుచున్న= దుఃఖంతో కుములుతూ ఉండే; ఆ+మహీకాంతుని వలని= ఆ రాజు దెసకు; కారుణ్యంబునన్= దయతో; అతని కడకున్+చనుదెంచి ఉన్న= అతని యొద్దకు (ధృతరాష్ట్రుడి వద్దకు) వచ్చి ఉన్నట్టి; కృష్ణద్వైపాయన మహామునిన్+కని= వ్యాసమహామునిని చూచి; వినయ సంభ్రమంబులు తలకొనన్= అణకువ, ఆశ్చర్యం కలుగగా; తద్+పాదంబులకున్+ప్రణమిల్లి= ఆయన కాళ్ళకు నమస్కరించి; ఆ+కురురాజునకున్= ఆ కురువంశ రాజునకు; గాంధార రాజ నందనకున్= గాంధారీదేవికి; నమస్కరించి; కులపతి సన్నిధి+అగుటన్= తమ ఇంటి పెద్దయైన వ్యాసుడు సమీపస్థుడు అగుటచే; ఇలాతలంబునన్= నేలపై; కూర్చున్న; ఆ+జననాథు= ఆ రాజుకు; సమీపంబునన్= దగ్గరలో; ఆసీనుండు+ఐ= కూర్చుండి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడిని పంపాడు గాని, అది ధృతరాష్ట్రుడిని మనసులో పెట్టుకొనికాదు. దానికి కృష్ణుడు తగినవిధమైన కార్యాన్ని జరిపాడు-అని జనమేజయుడికి వైశంపాయనుడు చెప్పాడు. ధర్మరాజు ప్రార్థించగా శ్రీకృష్ణుడు తాను చేయవలసిన పని ఏమో చెప్పుమని అడిగాడు. తన రథంపై చాలవేగంగా హస్తినకు వెళ్ళి వీథివాకిట నిలిచి ధృతరాష్ట్రుడికి తాను వచ్చిన విషయం తెలియజేశాడు. తగు విధంగా లోనికి వెళ్ళాడు. గాంధారితో కలసి కుమారులను తలచుకొని దుఃఖిస్తూ ఉన్న ఆ మహారాజుమీద దయతో ఆయన వద్దకు వచ్చి ఉన్న వ్యాసమహర్షిని చూచి, వినయంతో కూడిన తొట్రుపాటుతో ఆయన పాదాలకు నమస్కరించాడు. ఆ ధృతరాష్ట్ర గాంధారీదేవులకు నమస్కారంచేసి, కులాధిపతి వ్యాసుడు ప్రత్యక్షమైనందున భూమి మీద కూర్చొని ఉన్న ఆ రాజునకు (ధృతరాష్ట్రుడికి) దగ్గరగా కూర్చున్నారు.

**ఆ. అన్నరేంద్రు పాణి యల్లన తనకరా । బ్జమునఁ గీలుకొల్పి బహుళబాష్ప**
**కలితవదనుఁ డగుచు గళమున నెలుఁ గురి । యాడ వగచి యమ్మురాంతకుండు. 361**

**ప్రతిపదార్థం:** ఆ+నర+ఇంద్రు పాణిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుచేతిని; అల్లనన్= నెమ్మదిగా; తనకర+అబ్జములన్= తన హస్తపద్మాలతో; కీలు+కొల్పి= ఉంచి; బహుళబాష్పకలిత వదనుఁడు+అగుచున్= మిగుల కన్నీటితో కూడిన మొగం కలవాడై; గళమునన్= కంఠంతో; ఎలుఁగు= శబ్దం; ఉరి ఆడన్= ఊగిసలాడగా - డగ్గుత్తిక పడగా; వగచి= దుఃఖపడి; ఆ+ముర+ అంతకుండు= ఆ శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రరాజు చేతులను నెమ్మదిగా తన చేతులలోనికి తీసికొని, మిక్కిలి కన్నీళ్ళతో గొంతు బొంగురుపోగా, శ్రీకృష్ణుడు దుఃఖించి.

**వ. తత్ప్రదేశంబున నున్న కనకకలశజలంబుల ముఖప్రక్షాళనంబు సేసి యెలుంగు నూలుకొనం జేసి యిట్లనియె. 362**

**ప్రతిపదార్థం:** తద్+ప్రదేశంబునన్+ఉన్న= ఆ చోటులో ఉన్నట్టి; కనక కలశ జలంబులన్= బంగారుపాత్రలోని నీటితో; ముఖప్రక్షాళనంబు+చేసి= మొగం కడిగికొని; ఎలుంగున్= మాటను; నూలుకొనన్+చేసి= బాగా సరి చేసికొని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ ప్రక్కనే ఉన్న బంగారుచెంబులోని నీటితో మొగం కడిగికొని, గొంతు సరి చేసికొని, ఇట్లా అన్నాడు.

**చ. అకట! కులం బకారణము యంతయు నాశము నొందె; నిట్టిదా**
**నికిఁ జొర నొల్ల రైరి మహనీయచరిత్రులు నాఁడు పాండవు;**
**ల్సకలము నీ వెఱుంగుదు చలంబును నీసును దక్కి నన్ను సం**
**ధికి నిట రా నొనర్చుట మదిం దలపోయు మదెట్టిశాంతియో!' 363**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో! కులంబు= వంశం; అంతయున్= మొత్తంగా; అకారణము+అ= నిష్కారణంగా; నాశమున్+ ఒందెన్= నాశమయింది; ఇట్టిదానికిన్= ఇటువంటి స్థితికి; మహనీయ చరిత్రులు= ఉదార గుణశీలురైన పాండవులు; చొరన్+ ఒల్లరు+ఐరి= పూనుకొనినవారు కారు; సకలము= మొత్తం; నీవు+ఎఱుంగుదు(వు)= నీకు తెలియును; చలంబునున్= పట్టుదలయు; ఈసును= అసూయయు; తక్కి= వదలి; నన్నున్; సంధికిన్+ఇట+రాన్+ఒనర్చుటన్= సంధికై ఇక్కడకు వచ్చేటట్లు చేయటం; నీవు మదిన్ తలపోయుము= నీవు మనసులో జ్ఞాపకానికి తెచ్చుకొనుము (ఊహించుము); అది+ఎట్టి శాంతియో!= అది ఏ ఎంతటి శాంతియో (నీకు అర్థం కాగలదు).

**తాత్పర్యం:** 'అయ్యో! మీ వంశమంతా నిష్కారణంగా నాశమైంది. ఇటువంటి స్థితికి ఏ మాత్రమూ ఇష్టపడకుండా మహనీయ చరిత్ర కల పాండవు లానాడు నన్ను రాయబారం పంపారు. ఆ సంగతి అంతా నీకు తెలుసు. పట్టుదల, అసూయ వదలి నీ వద్దకు సంధికై నేను వచ్చేటట్లు చేశారు. ఆ శాంతి ఎంతటిదో నీవు మనసులో తలపోయుము. (అని శ్రీకృష్ణుడు అన్నాడు).

**వ. అని యంత నిలువక. 364**

**ప్రతిపదార్థం:** అని+అంతన్ నిలువకన్= అంటూ, అంత మాత్రంతో నిలువకుండా.

**తాత్పర్యం:** అంటూ, అంతమాత్రంతో ఆగకుండా.

**క. 'గెలువరె జూదము లెందును? । గలదే తలఁబట్టి పుణ్యకాంతఁ గొలువులో**
**పలి కీడ్చి తెచ్చి వలువల । నొలుచుట? యే మనఁగవచ్చు నుర్వీనాథా! 365**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ రాజా!; జూదములు; ఎందును= ఎక్కడా; గెలువరె?= జూదాలు ఆడి గెలువరా?; పుణ్యకాంతన్= పవిత్రమయిన స్త్రీని; తలన్+పట్టి= జుట్టు పట్టుకొని; కొలువులోపలికిన్+ఈడ్చి తెచ్చి= సభలోనికి లాగి తీసికొనివచ్చి; వలువలన్+ఒలుచుట= కట్టుగుడ్డలను విప్పటం; కలదే= ఉన్నదా?; ఏమి+అనఁగవచ్చున్= ఏమనవచ్చును?

**తాత్పర్యం:** 'ఓ రాజా! జూదా లాడి గెలువరా! ఎక్కడనైనా పవిత్రకాంతలను తలపట్టి ఈడ్చి లాగికొని వచ్చి కట్టుగుడ్డలను ఊడదీయటం ఉన్నదా? దీనిని ఏమనవచ్చును?

**క. దానికి నొచ్చినమనముల । తో నడవికిఁ బోయి బహుళదుఃఖంబుల న**
**ట్లూని విరాటుపురిం బడఁ । గానియిడుమ పడియు వారు గనలర? కంటే. 366**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ పనికి; నొచ్చిన మనములతోన్= నొప్పి కలిగిన మనస్సులతో; అడవికిన్+పోయి= అరణ్యానికి పోయి; బహుళదుఃఖంబులన్= అనేక దుఃఖాలను; అట్లు+ఊని= ఆ ప్రకారం వహించి; విరాటుపురిన్= విరటుడి నగరంలో; పడన్+కాని+ఇడుమ పడియున్= పడరాని పాట్లు పడికూడా; వారు= ఆ పాండవులు; కనలర?= కోపించనే లేదు; కంటే?= గమనించావా?

**తాత్పర్యం:** ఆ పనికి మనసులో బాధ కలిగి అడవులకు పోయి అనేక దుఃఖాలననుభవించి ఆ విధంగా విరటుడి నగరంలో పడరాని పాట్లు పడిన ఆ పాండవులు కోపించనే లేదు. చూచావా?

**ఉ. ఏవుర కుండ నొక్కొకటి యిమ్మని యూళులు వేఁడి కాన రై**
**రే వలన దన్న నీ కొడుకు లెమ్మెయి మానర లోభ గర్వముల్;**
**నీవును నట్ల కాక మహనీయమతుల్ విదురాదిబాంధవుల్**
**వేవురు సెప్పరే? యధిప! వింటె తగం బలు కొక్కఁ డేనియున్? 367**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; ఏవురకున్= అయిదుగురుకిని; ఉండన్= ఉండటానికి; ఒక్కొకటి ఇమ్మని= ఒక్కొకదానిని ఇమ్మని; ఊళులు= ఊర్లను; వేఁడి= అర్థించి; కానరైరి= పొందలేకపోయారు; నీ కొడుకులు= నీ కుమారులు; ఏన్+వలదు+ అన్నన్= నేను వద్దనినను; లోభగర్వముల్= పిసినారితననాన్నీ, అహంకారాన్నీ; ఏ+మెయిన్= ఏ విధంగాను; మానరు+అ= వదలనే లేదు; నీవును= నీవు కూడా; అట్లుకాక= అంతే; మహనీయమతుల్= గొప్పమనసున్నవారు; విదురాది బాంధవుల్= విదురుడు మొదలయిన బంధువులు; వేవురు చెప్పరే?= వేయిమంది చెప్పలేదా?; తగన్= తగిన విధంగా; పలుకు+ ఒక్కఁడు+ఏనియున్= ఒక్కమాటనయినా; వింటె?= విన్నావా?

**తాత్పర్యం:** ఓ రాజా! అయిదుగురికి ఉండటానికై, తలకొక ఊరిమ్మని అర్థించి పొందలేకపోయారు. నేను వద్దన్నా నీ కొడుకులు అహంకారాలను ఏ విధంగానూ మానలేదు. నీవు కూడా అంతే. మహనీయులైన విదురాది బంధువులు అనేకులు చెప్పలేదా? ఒక మాటనైనా తగిన విధంగా విన్నావా?

**క. కాలోపహత మనస్కుఁడు । మేలు తెరువు వట్టు నెట్లు? మెయికొని యది యిం**
**కేల తలపోయ? నుడుపం । జాలుదురే నరులు దైవసంపాదితముల్?' 368**

**ప్రతిపదార్థం:** కాల+ఉపహత మనస్కు(డు= కాలవైపరీత్యంవలన దెబ్బతిన్న మనసు కలవాడు; మెయికొని= ఇష్టంతో; మేలు తెరువు= మంచిమార్గం; ఎట్లు+పట్టున్?= ఏ విధంగా అనుసరిస్తాడు?; అది= దానిని; ఇంకేల తలపోయన్?= ఇక యోచించటం ఎందుకు?; నరులు= మనుష్యులు; దైవ సంపాదితముల్= దైవప్రాప్తాలను; ఉడుపన్+చాలుదురే?= ఆపగలరా?

**తాత్పర్యం:** కాలవైపరీత్యంవలన మనుష్యుడు మంచిమార్గాన్ని ఏ విధంగా ఇష్టంతో అనుసరించగలడు? ఇక దానినిగూర్చి ఆలోచించటం దేనికి? విధి నిర్ణయాన్ని మానవులు ఆపగలరా?'

**వ. అని వెండియు నిట్లనియెఁ 'బాండవులు గల్మషాయత్త చిత్తులు గామియు, మీరు నెఱిలేమియు విచారింపుము; మేను మ్రొక్కి వేఁడికొనియెద; వారలదెసఁ గోపంబు లేకుండవలయు; నట్లుం గాక నీకును గాంధారికిని వలయు పరలోకక్రియాకలాపంబులు వారయంద నిలిచెం గావున వారికి శుభంబు గోరుట లెస్స! మీ చిత్తంబు నొప్పించితి నని యెప్పాట దురపిల్లెడునో ధర్మజుతెఱం గెఱింగెదు గాక' యని పల్కి గాంధారరాజనందన నుద్దేశించి. 369**

**ప్రతిపదార్థం:** అని వెండియున్+ఇట్లు+అనియెన్= అంటూ ఇంకా ఈ విధంగా అన్నాడు; పాండవులు కల్మష+ఆయత్త చిత్తులు కామియున్= పాండవులు పాపంతో నిండుకొన్న మనసుకలవారు కాకుండుటయును; మీరు నెఱి లేమియున్= మీరు ధర్మం లేకుండుటయును; విచారింపుము= యోచింపుము; ఏను మ్రొక్కివేఁడికొనియెదన్= నేను ప్రార్థించి వేడుకొంటాను; వారల దెసన్= వారిమీద (పాండవుల మీద); కోపంబు లేకుండ వలయున్= కోపం లేకుండా ఉండవలెను; అట్లున్+కాక= అంతేకాక; నీకును గాంధారికిని= నీకూ గాంధారికినీ; వలయు= అవసరమైన; పరలోక క్రియా కలాపంబులు= పరలోక కార్యక్రమాలు; వారియందున్+అ నిలిచెన్= వారి మీదనే ఉన్నవి; కావున వారికిన్ శుభంబు కోరుట లెస్స!= మేలు!; మీ చిత్తంబు నొప్పించితిని+అని= మీ మనసుకు కష్టం కలిగించానని; ఏ+పాట దుఱపిల్లెడునో= ఎంతగా దుఃఖిస్తాడో; ధర్మజుతెఱంగు= ధర్మజుడి మనసు; ఎఱింగెదు(వు)+కాక= తెలిసికొనగలవు గాక; అని పల్కి= అంటూ మాట్లాడి; గాంధార రాజనందనన్+ఉద్దేశించి= గాంధారీదేవిని ఉద్దేశించి.

**తాత్పర్యం:** ఇంకా ఈ విధంగా కృష్ణుడు అన్నాడు. 'పాండవులు కపటచింతన లేనివారూ, మీరు న్యాయపరులు కాకపోవుటా ఆలోచించుము. వారి మీద కోపం లేకుండా ఉండాలని నేను ప్రార్థనాపూర్వకంగా వేడుకొంటున్నాను. అంతేకాకుండా నీకూ గాంధారీదేవికిని పరలోక క్రియలు చేయవలసిన బాధ్యత వారిమీద ఉన్నది. కాబట్టి వారికి మేలు కోరుకొనుము. అది మంచిది. మీ మనసునకు కష్టం కలిగించినా నని ధర్మరాజు ఎంతగా దుఃఖిస్తున్నాడో తెలియగలవు.' అని, గాంధారి నుద్దేశించి - (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'నీ కెన వచ్చు రాజరమణిన్ ధరనెందును గంటిమే? నృపా**
**నీకము వించు నుండ సుతునిం దగు పల్కుల నంత యొత్తుదే?**
**నా కది సిక్కెఁ జిత్తమున నాఁటి ప్రియం బగుచుండ నిప్పడున్**
**లోకవిరుద్ధ వృత్తి చపలుం డితఁ డి మ్మెఱుఁగండ యేమియున్. 370**

**ప్రతిపదార్థం:** నీకున్+ఎనవచ్చు= నీకు సమానమైన; రాజరమణిన్= రాజకాంతను; ధరన్+ఎందునున్+కంటిమే?= భూమిలో ఎక్కడనైనా చూచామా?; నృప+అనీకము వించున్+ఉండన్= రాజ సమూహం వింటూ ఉండగా; సుతునిన్= నీ కొడుకును (దుర్యోధనుడిని); అంత+ఒత్తుదే?= అంత బలవంతం చేస్తావా?; నాకున్+అది= నాకు ఈ నడవడి; చిత్తమునన్= మనసులో;

చిక్కెన్= తగిలింది; ఇప్పుడున్= ఈదినం కూడా; చిత్తమునన్ నాటి= మనసులో హత్తుకొని; ప్రియంబు+అగుచుండున్= ప్రీతిని కలిగిస్తూ ఉన్నది; ఇతఁడు= దుర్యోధనుడు; లోక విరుద్ధవృత్తి= లోకానికి వ్యతిరేకమైన నడవడిచేత; చపలుండు= చంచల మనస్కుడు; ఇమ్ము= మేలు; ఏమియున్ ఎఱుఁగండు+అ= తన కేది మేలో ఎంతమాత్రమూ తెలియనే తెలియడు.

**తాత్పర్యం:** నీకు సరి అయిన రాజకాంతను లోకంలో ఎక్కడను చూడలేము. లేకపోతే రాజులందరూ వింటూ ఉండగా కుమారుడిని అంతగా ఒత్తిడిచేస్తావా? ఇప్పటికినీ అది (అనగా నీ నడవడి) నా మనసులో హత్తుకొని ఉన్నది, ప్రీతిని కలిగిస్తూ ఉన్నది. కాని, ఆ చపలప్రవృత్తి కల ఆ దుర్యోధనుడు ఏ మాత్రమూ తనకేది మేలో తెలియనే తెలియనివా డయ్యాడు.

క. **నీమాటకు దుర్యోధనుఁ । డామెయిఁ దాఁద్రుళ్ళిపడక యవుఁ గా కని నాఁ**
**డే మేనిఁ గొంత యక్కట! భూమి యొసఁగెనేని యింత పుట్టదు సుమ్మీ!** **371**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; నీ మాటకున్= నీ మాట ప్రకారం; దుర్యోధనుఁడు+ఆమెయిన్= దుర్యోధనుడు ఆ విధంగా; త్రుళ్ళిపడక= గర్వించకుండా; అవున్+కాకని= సరే అని; నాఁడు= ఆ దినం; ఏమి+ఏని= ఏదో; కొంత= కొంచెమైనా; భూమిని= భూభాగాన్ని; ఒసఁగెన్+ఏని= ఇచ్చి ఉన్నట్లయితే; ఇంత+పుట్టదు సుమ్మీ!= ఇంత జరిగి ఉండదు సుమా!

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆ దినం గర్వాన్ని వీడి, నీ మాటకు సరే అని కొంత భూమిని ఇచ్చిఉంటే ఇంత దూరం వచ్చి ఉండేది కాదు.

వ. **కీడు వుట్టునని నీవు సెప్పితి; చెప్పిన మాటయుం దలకూడెఁ; బాండవులవలనం దప్పు లే దని యెఱుంగుదు గాదె! వారల కలుగ కుండునది; నీ వలిగి చూచినం ద్రిలోకంబులు భస్మీభూతంబు లగునట్టి తపఃప్రభావంబునం బ్రసిద్ధవు గావున నిన్నుం బ్రార్థించెద' నని పల్కిన నద్దేవి 'యది యంతయు నీ చెప్పినట్టిద' యని వెండియు.** **372**

**ప్రతిపదార్థం:** కీడు+పుట్టునని నీవు చెప్పితి(వి)= చెడు కలుగుతుందని నీవు చెప్పావు; నీవు చెప్పిన మాటయున్= నీ మాటకూడా; తలకూడెన్= సిద్ధించింది; పాండవులవలనన్+తప్పు లేదు+అని ఎఱుంగుదు(వు)= పాండవులయందు తప్పులేదని నీకు తెలియును కదా!; వారలకున్+అలుగకుండునది= వారి మీద కోపించకుండా ఉండుము; నీవు+అలిగిచూచినన్= నీవు కోపంతో చూచినట్లయితే; త్రిలోకంబులు= ముల్లోకాలు; భస్మీభూతంబులు+అగును= బూడిద అవుతాయి; అట్టి తపః ప్రభావంబునన్= అటువంటి తపశ్శక్తిచే; ప్రసిద్ధవు= పేరున్నదానవు; కావునన్= అందుచేత; నిన్నున్+ప్రార్థించెదన్= నీకు ప్రార్థన చేస్తున్నాను; అని పల్కినన్= అని చెప్పగా; ఆ+దేవి= ఆ గాంధారీదేవి; అది అంతయున్= ఆ చరిత్ర అంతా; నీ చెప్పినట్టిది+అ= నీవు చెప్పిన విధమైనదే; అని వెండియున్= అని ఇంకను.

**తాత్పర్యం:** కీడు కలుగుతుందని నీవు చెప్పావు. ఆ మాట సిద్ధించింది. పాండవులపట్ల ఏ తప్పూ లేదు అనే విషయం నీకూ తెలియును. వారిని కోపగించవద్దని నిన్ను వేడుకొంటున్నాను. నీవు కోపంతో చూస్తే మూడు లోకాలూ బూడిద అవుతాయి. నీ తపశ్శక్తి అంతటిది. కాబట్టి నిన్ను ప్రార్థిస్తున్నాను' అనగా ఆ గాంధారీదేవి 'అంతా నీవు చెప్పిన విధంగానే జరిగింది' అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'విపులవిషాదతాపమున వేదన నొందు మదీయ బుద్ధి కుం**
**దపగత మయ్యె నీదువచనామృతసేచనఁ జేసి యిట్టిచో**
**నపరిమిత ప్రభావ! విను మంధుఁడు దీనుఁడు వృద్ధు నైన యీ**
**నృపు నరయంగఁ బాండవులు నీవును యుక్తులు గారె! యెమ్మెయిన్.' 373**

**ప్రతిపదార్థం:** అపరిమిత ప్రభావ!= కొలువ సాధ్యం కాని శక్తి కలవాడా!; విపుల విషాద తాపమునన్= మిక్కిలి దుఃఖంవలని వేడిమివలన; వేదనన్+ఒందు= బాధపడుతున్న; మదీయబుద్ధి= నా బుద్ధి (మనసులోని); కుందు= దుఃఖం; నీదు వచన+అమృత సేచన చేసి= నీ మాటలనే అమృతపు తడుపుచేత; అపగతము+అయ్యెన్= తొలగిపోయింది; ఇట్టిచోన్= ఈ సమయంలో; వినుము= నా మాటను వినుము; అంధుఁడు= గ్రుడ్డివాడు; దీనుఁడు= దీనస్థితిలో ఉన్నవాడు; వృద్ధు= ముసలివాడూ; ఐన= అయినట్టి; ఈ నృపున్= ఈ రాజును; అరయంగన్= రక్షించటానికి; పాండవులు నీవును= నీవును పాండవులు కూడా; ఏ+ మెయిన్= ఎటుచూచినను; యుక్తులు కారె!= తగినవారు కాదా!

**తాత్పర్యం:** 'విస్తారమైన దుఃఖాగ్నిచేత బాధపడుతున్న నాకు నీ వచనామృతం వలన దుఃఖం తొలగింది. అపరిమిత ప్రభావా! ఈ సమయంలో గ్రుడ్డివాడు, ముదుసలి, దీనావస్థలో ఉన్నవాడు ఐన ఈ రాజును పాండవులూ నీవూ రక్షించటానికి ఏ విధంగా చూచినా తగినవారు కారా?'

**వ. అని పయిచీరచెఱంగు మొగంబున నదిమికొని యేడ్చినఁ గృష్ణుండు వివిధ వాక్యంబుల నద్దేవిం దేర్చి ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగాఁ బలికె; నట్టియెడ నశ్వత్థామ యుత్సాహం బమ్మహాత్మునకు హృదయగోచరం బగుటయు, దిగ్గన లేచి పారాశర్యు చరణంబులకు వినతుం డై యవ్విభునకుం బ్రణమిల్లి యతనితో నిట్లనియె. 374**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; పయిచీరచెఱంగు మొగంబునన్+అదిమికొని= మీది చీరకొంగును మొగమున ఒత్తుకొని; ఏడ్చినన్= దుఃఖపడగా; కృష్ణుండు= శ్రీకృష్ణుఁడు; వివిధవాక్యంబులన్= అనేక విధాలయిన మాటలతో; ఆ+దేవిని= ఆ గాంధారీదేవిని; తేర్చి= ఓదార్చి; ధృతరాష్ట్రునకున్ మనస్తాప+ఉపశనంబుగాన్+పల్కెన్= ధృతరాష్ట్రుడికి మనసు చల్లనఅయ్యేటట్లుగా మాటాడాడు; అట్టి యెడన్= అటువంటి సమయంలో; అశ్వత్థామ ఉత్సాహంబు= అశ్వత్థామ యొక్క ఉత్సాహం; ఆ+ మహాత్మునకున్= ఆ శ్రీకృష్ణుడికి; హృదయ గోచరంబు+అగుటయున్= మనసునకు తోచగా; దిగ్గన లేచి= ఉన్నపళంగా లేచి; పారాశర్యుచరణంబులకున్ వినతుండు+ఐ= వ్యాసుడి పాదాలకు నమస్కారం చేసిన వాడై; ఆ+విభునకున్+ప్రణమిల్లి= ఆ ధృతరాష్ట్రుడికి నమస్కారం చేసి; అతనితోన్ ఇట్లు+అనియెన్= అతడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** గాంధారి తన పైటకొంగును ముఖమున ఒత్తుకొని దుఃఖపడగా శ్రీకృష్ణుడు నానావిధ ఉపశమన వాక్యాలతో ఆమెను ఓదార్చాడు. ధృతరాష్ట్రుడికి మనస్తాపం పోయేటట్లు మాటాడాడు. ఆ సమయంలో అతడికి అశ్వత్థామ సమరోత్సాహం గోచరించింది. అంత దిగ్గన లేచి వ్యాసుడికి ధృతరాష్ట్రుడికి నమస్కరించి ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు:

**క. 'గురుసుతుఁడు పాండవులకుం । గర మల్గును; వారిఁ బొదువఁగా నతఁ డీ ప్రొ**
**ద్దురవడిఁ గదియును; బోయెద । దురపిల్లకుమయ్య మది విధూతకళంకా! 375**

**ప్రతిపదార్థం:** విధూతకళంకా!= పాపం లేనివాడా!; గురుసుతుఁడు= అశ్వత్థామ; పాండవులకున్+కరము+అల్గును= పాండవుల మీద మిక్కిలి కోపిస్తాడు; వారిన్+పొదువన్+కాన్= వారిని కమ్ముకొనగా; అతఁడు= ఆ అశ్వత్థామ; ఈ ప్రొద్దు+ఉరవడి= ఈ దినం త్వరగా; కదియును= దగ్గరచేరును; పోయెదన్= వెళ్ళుతాను; మదిన్= మనసులో; దురసిల్లకుము+అయ్య= దుఃఖపడవద్దు.

**తాత్పర్యం:** అశ్వత్థామ పాండవులమీద మిక్కిలి కోపిస్తాడు. వారిని కమ్ముకొనటానికై అతడు త్వరగా వారి వద్దకు చేరుతాడు. నేను వెళ్ళివస్తాను. పాపరహితుడా! మనసులో దుఃఖపడవద్దు.'

**చ. అన విని రాజు దేవులు మురారికి నిట్లని 'రెంతయున్ రయం**
**బునఁ జనుమయ్య! పాండునృపపుత్రుల నెమ్మెయి నైనఁ గాచికోల్**
**వినుతి గదయ్య నీకు! నిను వేయి విధంబుల నాశ్రయించు టె**
**ల్లను ఫల మొందఁ జేయఁగఁ దలంచుట పెంపు సుమయ్య కేశవా! 376**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని కృష్ణుడు అనగా విన్నవారై; రాజు, దేవులు= ధృతరాష్ట్రుడును, గాంధారియు; ముర+అరికిన్+ఇట్లు+అనిరి= శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నారు; కేశవా!= కృష్ణా!; ఎంతయున్ రయమునన్= ఎంతో వేగంగా; చనుము+అయ్య!= వెళ్ళవయ్యా!; పాండు నృప పుత్రులను= పాండురాజ కుమారులను; ఏ+మెయిన్+ఐనన్= ఏ విధంగానయినా; కాచికోల్= కాపాడుకోవటం; నీకున్+వినుతి కదయ్య!= నీకు కీర్తింపదగినది కదయ్యా! (ధర్మం కదా!); నినున్= నిన్ను; వేయివిధంబులన్= ఎన్నో విధాలుగా; ఆశ్రయించుట= ఆశ్రయించటం; ఎల్లను= అంతా; ఫలమున్+ఒందన్+చేయఁగన్+తలంచుట= ఫలితాన్ని పొందేటట్లు చేయటాన్ని తలచుకోవటం; పెంపు సుమయ్య!= గౌరవమే కదయ్యా!

**తాత్పర్యం:** అని కృష్ణు డనగా గాంధారీధృతరాష్ట్రులు అతడితో ఇట్లా అన్నారు. 'శీఘ్రంగా వెళ్ళవయ్యా! కేశవా! పాండురాజ కుమారులను కాపాడటం నీకు న్యాయం కదా! నిన్ను వారు వేయి విధాలుగా ఆశ్రయించటాన్ని సఫలం చేయదలచటం నీకు పెంపు గదా!

### శ్రీకృష్ణుండు కరిపురంబుననుండి పాండవులయొద్దకు వచ్చుట (సం. 9-62-72)

**వ. పొమ్ము, పునర్దర్శనమయ్యెడు' మని వీడ్కొల్పిన వాసుదేవుండు వెడలెం; దదనంతరంబ వేదవ్యాసమునీశ్వరుండు వారలతో 'మీకు శోకోపశమనంబుగ నిప్పుడు శౌరి సెప్పిన వచనంబు లాదరణీయంబులు సుండీ!' యని యుపదేశించి వెండియు వలయు వాక్యంబుల వారికి నాశ్వాసంబు గావించి యంతర్ధానంబు సేసె; నిత్తెఱంగున గోవిందుండు కృతకృత్యుండై వెలువడి యరదం బెక్కియతి త్వరితగతి నోఘవతీతీరంబున కరిగి, పాండవులం గని, తాను ధృతరాష్ట్ర సన్నిధి గాంధారిం గనుటయు, వారలకు 'దుర్యోధనుండు దెగియె' నని నెట్టనం జెప్పక బెరసుంబల్కులుగా నయ్యాంబికేయుని యుపేక్షనుం గొడుకుల కీడునం దత్కులంబునకు సంక్షయంబు వాటిల్లుట యుగ్గడించుటయు, నాసందునఁ బాండవుల వలనఁ బాపంబు లేమి దెల్పుటయును, నారాజును దేవులును వారిం గోపింపకుండం బ్రార్థించుటయు నుపచారవచనంబుల చందంబున వార లా వృద్ధులకు నిస్తారకు లని పటుకుటయు, విశేషించి గాంధారికి నుచితభాషణంబుల నత్యంతోపశాంతి గలిగించుటయు, నప్పలుకు లన్నింటను దుది నయ్యిరువురు దయచేసినది సామాన్యంబున ననుష్ఠించిన**

**యాపత్సమయ సమాగమంబుగాఁ గొనినమాత్రయ కాని యొండెఱుంగక యునికియు, నగ్గాంధారరాజనందన దనకు మగని నప్పగించుటయు నెఱింగించి, యంతక మున్న వచ్చి యావిచిత్రవీర్యపుత్రుకడం బారాశర్యుం డున్న వాఁ డమ్మహాత్ముం డే నిట వచ్చిన పిదప నాదంపతులకు నాయొనర్చిన యుపదేశంబు దృఢం బగునట్టి మాట లాడనోపు ననియు, నతని యునికి యట్లుగాఁ దన పోయినపని సఫలం బగుటయుఁ, బాండునందనులకుఁ దెలియఁ జెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 377**

**ప్రతిపదార్థం:** పొమ్ము= వెళ్ళుము; పునః+దర్శనము+అయ్యెడున్= మరల కానవత్తువు గాక; అని వీడ్కొల్పినన్= అని పంపగా; వాసుదేవుండు వెడలెన్= శ్రీకృష్ణుడు వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ మీదట; వేదవ్యాస మునీశ్వరుండు= వేదవ్యాస ఋషి; వారలతోన్= ఆ గాంధారీ ధృతరాష్ట్రులతో; మీకున్ శోక+ఉపశమనంబుగన్= మీకు దుఃఖంలేకుండేటట్లు; ఇప్పుడు= ఈ సమయంలో; శౌరి చెప్పిన వచనంబులు= శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు; ఆదరణీయంబులు= గౌరవించదగినవి; సుండు+ఈ!= సుమండీ!; అని ఉపదేశించి= అని తెలియజేసి; వెండియున్= ఇంకను; వలయు వాక్యంబులన్= అవసరమైన మాటలతో; వారికిన్ ఆశ్వాసంబు కావించి= వారికి ఓదార్పు కలిగించి; అంతర్ధానంబు చేసెన్= అంతర్ధానమయ్యాడు; ఈ+ తెఱంగునన్ గోవిందుఁడు= ఈ విధంగా శ్రీకృష్ణుడు; కృతకృత్యుండు+ఐ= చేయదగు పనిచేసిన వాడుగా; వెలువడి= బయటకు వచ్చి; అరదంబు+ఎక్కి= తేరెక్కి; అతి త్వరితగతిన్= మిక్కిలి వేగంగా; ఓఘవతీ తీరంబునకున్+అరిగి= ఓఘవతీ నది గట్టునకు చేరి; పాండవులన్+కని= పాండవులను చూచి; తాను ధృతరాష్ట్రు సన్నిధిన్ గాంధారిన్+కనుటయున్= తాను ధృతరాష్ట్రుడి వద్ద గాంధారిని చూచిన విధాన్నీ; వారలకున్= ఆ ఇద్దరకును; దుర్యోధనుండు తెగియెన్+అని= దుర్యోధనుడు చనిపోయాడని; నెట్టన చెప్పక= వెంటనే తెలుపకుండా; బెరసు+పల్కులుగాన్= క్రూరమైన మాటలుగా; ఆ+ఆంబికేయుని= ఆ ధృతరాష్ట్రుడి; ఉపేక్షను= అశ్రద్ధను; కొడుకుల కీడును= కొడుకుల పాపమును; తద్+కులంబునకున్= వారి వంశానికి; సంక్షయంబు పాటిల్లుట= నాశం కలగటం; ఉగ్గడించుటయున్= చెప్పటమూ; ఆ సందునన్= ఆ సందర్భంలో; పాండవులవలనన్= పాండవుల దెస; పాపంబు లేమిన్= తప్పులేకుండటం; తెల్పుటయును= తెలియజేయటం; ఆ రాజును దేవులును= ఆ గాంధారీ ధృతరాష్ట్రులు; వారిన్+కోపింపకుండ ప్రార్థించుటయున్= పాండవులమీద కోపపడకుండా ప్రార్థన చేయటం; ఉపచార వచనంబుల చందంబుగన్= ఓదార్పు మాటల మాదిరిగా; వారలు= పాండవులు; ఆ వృద్ధులకున్= ఆ ముదుసలివారికి; నిస్తారకులని పలుకుటయున్= తరింపజేసే వారని చెప్పటమూ; విశేషించి= ఎక్కువగా; గాంధారికిన్= గాంధారీదేవికి; ఉచిత భాషణంబులన్= తగిన మాటలతో; అత్యంత+ఉపశాంతి కలిగించుటయున్= మిక్కిలి ఓదార్పు చేకూర్చుటయును; ఆ+పలుకులు+ అన్నింటను= ఈ మాటలన్నిటిలోను; తుదిని= కడకు; ఆ+ఇరువురు= ఆ ఇద్దరును (గాంధారీ ధృతరాష్ట్రులు); తన చేసినది= తాను కావించినది; సామాన్యంబునన్= సాధారణంగా; అనుష్ఠించిన= ఆచరించినట్టి; ఆపద్+సమయ సమాగమంబుగాన్= కష్టకాలంలో కలవడంగా; కొనిన మాత్రయ కాని= గ్రహించడమే కాని; ఒండు+ఎఱుంగక ఉనికియున్= వేరే తెలియకుండటమునూ; ఆ+గాంధారరాజనందన= ఆ గాంధారీదేవి; తనకున్ మగనిన్+అప్పగించుటయున్= శ్రీకృష్ణుడికి భర్తను (ధృతరాష్ట్రుని) ఒప్పగించటం; ఎఱింగించి= తెలియచేసి; అంతక మున్ను వచ్చి= అంతకంటే ముందుగానే వచ్చి; ఆ విచిత్రవీర్య పుత్రుకడన్= ఆ ధృతరాష్ట్రుడి వద్ద; పారాశర్యుండు ఉన్నవాఁడు= వ్యాసుడు ఉన్నాడు; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు; ఏన్+ఇటన్ వచ్చిన పిదపన్= నేనీ దిక్కునకు వచ్చిన తరువాత; ఆ దంపతులకున్= ఆ భార్యా భర్తలకు (గాంధారీ ధృతరాష్ట్రులకు); నా ఒనర్చిన ఉపదేశంబు= నేను చేసిన ఉపదేశం; దృఢంబు+అగునట్టి= నిశ్చయమైనటువంటి; మాటలాడన్+ఓపును+అనియున్= మాటలాడి ఉంటాడని; అతని+ఉనికి= ఆయన ఉండుట; అట్లుగాన్= ఆ విధంగా కావడంవల్ల; తనపోయిన పని= తాను వెళ్ళిన పని; సఫలంబగుటయున్= సిద్ధినందుటయును; పాండునందనులకున్= పాండవులకు; తెలియన్+చెప్పెనని= తెలిపాడని; వైశంపాయనుండు= వైశంపాయన ముని; జనమేజయునకున్= జనమేజయ చక్రవర్తితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** గాంధారీ ధృతరాష్ట్రులు 'వెళ్ళిరమ్ము. మరలా చూద్దాముగాక!' అని శ్రీకృష్ణుడికి వీడ్కోలిచ్చారు. ఆయన కూడా వెళ్ళాడు. ఆ తరువాత వేదవ్యాస మునీశ్వరుడు గాంధారీ ధృతరాష్ట్రులతో 'మీకు దుఃఖశాంతికై కృష్ణు డీ సమయంలో చెప్పినమాటలు ఆచరించటం గౌరవించటం తగును' అని ఉపదేశించాడు. ఇంకా అవసరమైన మాటలను వారిని ఓదార్చటానికై చెప్పి తానంతర్ధానమయ్యాడు. శ్రీకృష్ణుడు తాను వచ్చిన పనిని ఈ విధంగా చేసి, ఆ మీదట తన తేరుమీద వేగంగా ఓఘవతీ తీరానికి వెళ్ళి, పాండవులను చూచి, తాను ధృతరాష్ట్రుని సమక్షంలో గాంధారిని చూచిన విధమునూ, దుర్యోధనుడి చావును, వెంటనే వారికి తాను తెలుపకుండా కఠినమైన మాటలతో ధృతరాష్ట్రుడి అశ్రద్ధనూ, కొడుకుల తప్పు వల్ల జరిగిన కులనాశమునూ చెప్పటం, ఆ విషయంలో పాండవులు దోషం చేయలేదని చెప్పి ఆ ఇరువురునూ పాండవులను కోపగించరాదని ప్రార్థించటమూ, ఉపచారవచనాలవలె పాండవులు, ఆ వృద్ధుల్ని తరింపజేసే వారని పల్కడమూ, విశేషించి గాంధారీ దేవికి తగుమాటలతో మిక్కిలి ఉపశాంతి కల్గించడమూ, ఆ మాటల చివరని ఆ ఇరువురు తాను చేసినది ఆపత్సమయ సమాగమంగా భావించడమేగానీ మరొకటి తెలియకుండయు వేరేమీయూ కాదని ఆ గాంధారీదేవి తనకు ధృతరాష్ట్రుడిని అప్పగించిన తీరును తెలియజేశాడు. తనకన్న ముందుగా వ్యాసుడు, ధృతరాష్ట్రుడి వద్ద నున్న విషయమునూ, తానిట్లువచ్చిన తరువాత ఆ మహర్షి ఆ వృద్ధదంపతులకు తాను కావించిన ఉపదేశాన్ని వివరించి ఉంటాడనీ చెప్పి, తాను సఫలీకృతుడైనట్లు పాండవులకు తెలిపాడు - అని వైశంపాయనుడు జనమేజయుడితో చెప్పాడు.

**క. విను మోఘవతీతీరం। బున కమ్మెయిఁ బాండురాజపుత్రులు ప్రీతిం**
**జనిన తెఱఁగు సంజయుచే। విని ధృతరాష్ట్రుండు శోకవిహ్వలుఁ డగుచున్. 378**

**ప్రతిపదార్థం:** వినుము; ఓఘవతీ తీరంబునకున్= ఓఘవతీ తీర్థం దరికి; ఆ+మెయిన్= ఆ విధంగా; పాండురాజ పుత్రులు= పాండవులు; ప్రీతిన్+చనిన తెఱఁగు= ప్రీతితో వెళ్ళిన విధమును; సంజయుచేన్+విని= సంజయుడివలన విని; ధృతరాష్ట్రుండు; శోకవిహ్వలుఁడు+అగుచున్= దుఃఖంతో స్వాధీనం తప్పినవాడై.

**తాత్పర్యం:** నేను చెప్పేది వినుము. పాండురాజకుమారులు ఆ విధంగా ఓఘవతీ తీరానికి వెళ్ళిన విధమును సంజయుడివలన విని ధృతరాష్ట్రుడు స్వాధీనం తప్పినవాడై మిక్కిలి దుఃఖంతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అతని కిట్లనియె. 379**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సంజయుడిని ఈ విధంగా అడిగాడు.

**ఆ. 'తొడలు విఱిగి నేలఁబడియుండఁ దలదన్ని। నట్టి భీమసేనుఁ డగ్రజుండు**
**ననుజచయముఁ దాను నరిగినపిమ్మట! నెట్టు లయ్యె నమ్మహీశ్వరుండు?' 380**

**ప్రతిపదార్థం:** తొడలు విఱిగి= తొడలు విరిగిపోయి; నేలన్+పడిఉండన్= భూమిమీద పడిఉండగా; తలన్+తన్నినట్టి భీమసేనుఁడు= తలను తన్నిన భీముడు; అగ్రజుండున్= అన్నగారైన ధర్మరాజు; అనుజచయమున్= తమ్ముల సమూహమును; తానున్= తానుకూడా; అరిగిన పిమ్మటన్= వెళ్ళిన తరువాత; ఆ+మహీశ్వరుండు= ఆ దుర్యోధనుడు; ఎట్టులు+అయ్యెన్?= ఏమైనాడు?

**తాత్పర్యం:** 'తొడలు విరిగి నేలమీద పడినవాని తలను తన్నిన భీముడు, అన్నగారితోనూ తమ్ములతోనూ కలసి వెళ్ళిన మీదట ఆ దుర్యోధనుడు ఏమైనాడు?'

**వ. అని యడిగిన నమ్మానవపతికి నాసూతనూనుం డిట్లను 'నేను బొదలో నుండి, యుధిష్ఠిరుండు యుద్ధ సమయంబు నిశ్చయించిన నీ కొడుకు పొలికలనికి నడచునప్పుడు వెడలి, పాండవపరిజనంబులం గలసి వారు నన్ను డాసినదృష్టిం గనుంగొన నక్కురపతికిం బొడసూపక చని, గదారణం బనుసంధించి యునికింజేసి యక్కౌంతేయు లరిగినయనంతరంబ యమ్మహీకాంతునికడకుం బొగులుచుఁ బోయితిఁ; బోయిన నతండు ధూళి పొదివిన వదనంబుపై నెఱసిన వెండ్రుకలు వాయంద్రోచికొని, నా మొగంబుఁ జూచి, ధర్మనందను నిందించుచు నవుడు గఱచి కన్నీరు గ్రమ్మ నిట్టూర్పు నిగిడించి. 381**

**ప్రతిపదార్థం:** అని అడిగినన్ ఆ+మానవపతికిన్= (తొడలు విరిగి నేలమీద పడిన దుర్యోధను డేమైనాడని అడిగిన ఆ ధృతరాష్ట్రుడికి) ఆ విధంగా అడుగగా ఆ రాజునకు; ఆ సూతసూనుండు+ఇట్లనున్= ఆ సంజయుడు ఈ విధంగా అన్నాడు; నేను పొదలోన్+ఉండి= నేను పొదలో దాగి ఉండి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; యుద్ధసమయంబున్= యుద్ధానికి వేళను; నిశ్చయించినన్= నిర్ణయించగా; నీ కొడుకు= నీ కుమారుడు; పొలికలనికిన్= యుద్ధభూమికి; నడచునప్పుడు= వెడలేటప్పుడు; వెడలి= బయల్పడి వెళ్ళి; పాండవ పరిజనంబులన్+కలసి= పాండవుల సేవకులను కలిసికొని; వారు నన్ను డాసిన దృష్టి కనుంగొనన్= వారు నన్ను సమీపించగా గమనించి; ఆ+కురుపతికిన్+పొడసూపక= ఆ దుర్యోధనుడికి కానరాకుండా; చని= వెళ్ళి; గదారణంబు+అనుసంధించి ఉనికిన్+చేసి= గదా యుద్ధమును పరిశీలించియున్నందువల్ల; ఆ+కౌంతేయులు= ఆ కుంతీ తనయులు; అరిగిన+అనంతరంబు+అ= వెళ్ళిన తరువాత; ఆ+మహీకాంతుని కడకున్= ఆ రాజువద్దకు; పొగులుచున్= పరితపిస్తూ; పోయితిన్= వెళ్ళాను; పోయినన్= పోగా; అతండు= ఆ రాజు; ధూళి పొదివిన వదనంబుపైన్= దుమ్ము క్రమ్మిన ముఖాన; నెఱసిన= వ్యాపించిన (చిందర వందరగా పడిఉన్న); వెండ్రుకలు= వెంట్రుకలను; పాయన్+త్రోచికొని= తొలగద్రోచికొని; నా మొగంబు చూచి= నా ముఖం చూచి; ధర్మనందనున్ నిందించుచున్= ధర్మరాజును దూషిస్తూ; అవుడుకఱచి= క్రింది పెదవిని తొక్కిపట్టి; కన్నీరు క్రమ్మన్ నిట్టూర్చి= కన్నీరు క్రమ్ముకోగా నిట్టూర్పు వదలి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు అడిగిన దానికి సంజయుడు సమాధానంగా ఇట్లా చెప్పాడు. 'నేను పొదలో దాగికొనిఉండి ధర్మరాజు యుద్ధసమయాన్ని నిశ్చయించటం వలన నీ కుమారుడు కదనరంగానికి వెళ్ళేటప్పుడు పాండవుల సేవకులను కలిసి వాళ్ళు నా దగ్గరకు రావటాన్ని గుర్తించి, ఆ సుయోధనుడికి కానరాకుండా వెళ్ళి గదాయుద్ధాన్ని పరిశీలించి యున్నందువల్ల కుంతీతనయులు వెళ్ళిన తదుపరి వెళ్ళాను. అతడు దుమ్ముకమ్ముకొన్న ముఖం మీద చిందరవందరగా పడిఉన్న వెంట్రుకలను తొలగించుకొని నా ముఖం చూచి కన్నీళ్ళతో ధర్మరాజును దూషిస్తూ పెదవి కరచిపట్టి నిట్టూర్పు వదలి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'నేల నాలుగు సెఱఁగులు నేలి భీష్మ । గురుకృపాదులపైఁ గార్యభరము నిల్పి**
**యున్న వానికి దుది నిట్టు లుండవలసెఁ । గాల సంప్రాప్త మేరికిఁ గడప వచ్చు? 382**

**ప్రతిపదార్థం:** నేల నాలుగు చెఱఁగులున్+ఏలి= నేల నాలుగు దిక్కులను పాలించి; భీష్మగురు కృపాదులపైన్= భీష్మ ద్రోణ కృపులమీద; కార్య భరము నిల్పి= పనిచేసే బాధ్యతను నిలిపి; ఉన్న వానికిన్= ఉన్నటువంటి ఆతనికి; తుదిన్+ఇట్టులుండవలసెన్= చివరకు ఈ విధంగా ఉండవలసి వచ్చింది; కాలసంప్రాప్తము= విధిని; ఏరికిన్ గడపవచ్చున్?= ఎవరికి దాటటానికి సాధ్యం?

**తాత్పర్యం:** 'నాలుగు దిక్కులకూ వ్యాపించిన రాజ్యాన్ని పాలించి, భీష్మద్రోణకృపాదులకు కార్య భారాన్ని అప్పజెప్పి ఉన్న వాడికి చివరకు ఇట్టి అవస్థ కలిగింది. విధి ఇట్లున్నది. దైవనిర్ణయాన్ని అతిక్రమించటం ఎవరికి సాధ్యం?

**విశేషం:** అర్థాంతరన్యాసం. విశేషాంశాన్ని సామాన్యాంశం సమర్థిస్తున్నది.

**క. ననుఁ బదునొకఁ డక్షౌహిణు । లనూనవిభవమునఁ గొల్వ నఖిల నృపులు పం**
**చిన పని సేసి మెలఁగి; ర । ట్లునికి గనిన నీవ యిట్టు లునికియుఁ గంటే? 383**

**ప్రతిపదార్థం:** పదునొకఁడు+అక్షౌహిణులు= పదకొండ క్షౌహిణీ సేన; ననున్= నన్ను; అనూనవిభవమునన్= గొప్ప వైభవముతో; కొల్వన్= సేవించగా; అఖిల నృపులు= రాజులందరును; పంచిన పనిచేసి= చెప్పిన పనిని చేసి; మెలఁగిరి= తిరిగారు; అట్లు+ ఉనికిన్+కనినన్= ఆ విధంగా ఉండటాన్ని చూచిన; నీవ= నీవే; ఇట్టులు+ఉనికియున్+కంటే?= ఇట్లా ఉండటాన్ని చూచావా?

**తాత్పర్యం:** పదకొండు అక్షౌహిణులసేన ఎంతో వైభవంగా కొల్వగా సాటిలేని వైభవంతో రాజులందరూ సేవించగా ఆ విధంగా ఉన్న నన్ను చూచావు. ఇపుడు ఈ విధంగా ఉండటాన్ని చూస్తున్నావా?

**ఆ. వాయునందనుఁడు గదాయుద్ధధర్మంబు । నుజ్జగించి నింద కోర్చి యిట్లు**
**సేసె నిత్తెఱంగు సెప్పుమీ! సంజయ! । మనకు నిపుడు గల్గుజనుల కెల్ల. 384**

**ప్రతిపదార్థం:** సంజయ!= ఓ సంజయుడా!; వాయునందనుఁడు= భీమసేనుడు; గదా యుద్ధ ధర్మంబున్= గదా యుద్ధపు నియమాన్ని; ఉజ్జగించి= తప్పిపోయి; నిందకున్+ఓర్చి= లోకనిందను భరించటానికి సిద్ధపడి; ఈ+తెఱంగు= ఈ విధాన్ని; మనకున్ ఇపుడు కల్గు జనులకున్+ఎల్లన్= మన కిపు డున్న మనుజుల కందరికీ; చెప్పుమీ= చెపుమా.

**తాత్పర్యం:** ఓ సంజయా! భీముడు గదాయుద్ధ నియమాల నతిక్రమించి ఈ విధంగా చేశాడనీ, లోక నిందను భరించటానికి సిద్ధమైనాడనీ మిగిలి ఉన్న మన వారికందరకూ చెప్పుము.

**చ. అనిమిషవాహినీతనయు నస్త్రకళాగురు సౌమదత్తిఁ గ**
**ర్ణుని రణధర్మహీనతకు రోయక చంపినభంగులున్ మరు**
**త్తనయుఁడు నేఁడు సేసిన విధంబును లోకులు పాండురాజనం**
**దనతతిఁ బ్రువ్వఁ దిట్టరె? వృథావిజయం బిది యెంత యొప్పెడున్? 385**

**ప్రతిపదార్థం:** అనిమిష వాహినీ తనయున్= దివ్య నదిఅయిన గంగా తనయుడైన భీష్ముడిని; అస్త్రకళా గురున్= ధనురాచార్యుడిని (ద్రోణుడిని); సౌమదత్తిన్= భూరిశ్రవుడిని; కర్ణునిన్; రణ ధర్మహీనతకున్= యుద్ధ ధర్మమును తప్పటానికి; రోయక= అసహ్యపడక; చంపిన భంగులున్= చంపిన పద్ధతులును; మరుత్+తనయుఁడు= వాయునందనుడైన భీముడు; నేఁడు చేసిన విధంబును= ఈ దినం కావించిన పద్ధతిని; లోకులు= లోకమందరి వారు; పాండురాజనందనతతిన్= పాండుకుమారుల సమూహాన్ని; ప్రువ్వన్= పురుగులు పడగా (నాశమందగా); తిట్టరె!= నిందించరా; వృథావిజయంబు= వ్యర్థమైన విజయం; ఇది= ఈ పొందినది; ఎంత ఒప్పెడున్?= ఎంత తగి ఉన్నది?

**తాత్పర్యం:** భీష్మద్రోణ భూరిశ్రవ కర్ణులను యుద్ధధర్మాన్ని పాటించకుండా నీచంగా చంపిన తీరును, ఈరోజు వాయునందనుడు కావించిన పద్ధతిని లోకులంతా పాండవులను పురుగులు పడగా తిట్టరా? ఈ వృథా విజయం-- ఏ మాత్రం తగి ఉన్నది?

**క. అనిలజుఁడు పోలెఁ గపటపు । టనువునఁ బగవారి నోర్చి హర్షంబునఁ దే**
**లునె? తూలపోనిమగఁటిమి । దనకుఁ గలుగునట్టి కీర్తి తత్పరుఁ డెందున్. 386**

**ప్రతిపదార్థం:** తూలపోని= చలించని; మగఁటిమి= పరాక్రమం; తనకున్; కలుగునట్టి; కీర్తితత్పరుఁడు= కీర్తి కావాలనుకొనేవాడు; ఎందున్= ఎక్కడైనా; అనిలజుఁడు+పోలెన్= భీముడివలె; కపటపు+అనువునన్= మోసపు పద్ధతిలో; పగవారిన్= శత్రువులను; ఓర్చి= ఓడించి; హర్షంబునన్= సంతోషంతో; తేలునె?= తేలిపోతాడా?

**తాత్పర్యం:** వాయుతనయు డైన భీముడివలె మోసంతో విరోధుల నోడించినవాడు సంతోషంతో తేలియాడగలడా? తూలిపోని మగతనం కలవాడు కీర్తి కాముకుడైన వాడు ఎక్కడనైనా అట్లా ఉంటాడా?

**చ. మఱియు నొకండు వింటె? పవమాన తనూజుని చెయ్విఁ బెన్దొడల్**
**విఱిగి ధరిత్రిఁ బడ్డయెడ వేగమె వచ్చి శిరంబుఁ దన్నె నే**
**డ్తెఱ గలయప్డు శత్రు నవధీరితుఁ జేయుట యొప్పుఁ గాక యే**
**పఱినఁ బరాభవించిన జనావళి నవ్వదె? నొవ్వదే మదిన్? 387**

**ప్రతిపదార్థం:** మఱియున్+ఒకండు= ఇంకొక్కటి; వింటె?= విన్నావా?; పవమానతనూజుని చెయ్విన్= భీముడి పనిచేత; పెన్+తొడల్ విఱిగి= పెద్ద తొడలు విరిగిపోయి; ధరిత్రిన్+పడ్డయెడన్= భూమిమీదపడినప్పుడు; వేగమె వచ్చి= త్వరగా వచ్చి; శిరంబున్+తన్నెన్= తలను తన్నాడు; ఏడ్తెఱ+కల యప్డు= ఆధిక్యం కలిగినపుడు; శత్రున్= వైరిని; అవధీరితున్+చేయుట= తిరస్కరించటం; ఒప్పున్+కాక= తగునుగాక; ఏపు+అఱినన్= ఆధిక్యం నశించగా; పరాభవించినన్= అవమానం కావిస్తే; జనావళి నవ్వదె?= జనసమూహం నవ్వదా?; మదిన్ నొవ్వదే?= మనసులో నొచ్చుకోదా?

**తాత్పర్యం:** ఇంకను భీముడి చేష్ట మరొకదానిని విన్నావా? తొడలు విరిగిపడి ఉన్నపుడు శీఘ్రంగా వచ్చి నా తలను తన్నాడు. ఆధిక్యమున్నపుడు తిరస్కారభావంతో చూడవచ్చును. అంతవరకు తగును గాని ఆధిక్యం నశించిన సమయంలో అవమానిస్తే జనసమూహం నవ్వదా? మనసులో నొచ్చుకోదా?

**క. మనరాజును దేవులు భం । డనము తగవు నేర్పరించుటకు నేర్తురు; భీ**
**ముని చేసినయది సంజయ! । వినిపింపుము వారలకు సవిస్తారముగన్. 388**

**ప్రతిపదార్థం:** సంజయా!; మనరాజును+దేవులు= ధృతరాష్ట్రుడు, రాణులు; భండనము తగవు= యుద్ధ ధర్మమును; ఏర్పరించుటకున్= వివరించటానికి; నేర్తురు= తెలిసి ఉన్నారు; భీముడి చేసిన+అది= భీముడు కావించిన దానిని; వారలకున్= వాళ్ళకు; సవిస్తారముగన్= వివరంగా; వినిపింపుము= తెలుపుము.

**తాత్పర్యం:** ఓ సంజయా! మన రాజును, రాణులును యుద్ధధర్మమును విశ్లేషించటం తెలిసినవారు. భీముడు చేసిన పనిని వారలకు విస్తారంగా వివరించుము.

**వ. మఱియును.** **389**

**ప్రతిపదార్థం:** మరియును= ఇంకను.

**తాత్పర్యం:** ఇంకా.

**మ. చెలులం జుట్టలఁ బ్రోచి యర్థిజనులన్ శ్రీమంతులన్ జేసి, వి**
**ప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పేరుం బెంపు శోభిల్ల ని**
**ట్టలపుం ద్యాగము దానమున్ నడపి నిష్ఠం బెక్కు సెల్లించి యు**
**జ్జ్వలతేజంబున నిద్ధభూతి భుజగర్వస్ఫూర్తిఁ బొల్పారితిన్.** **390**

**ప్రతిపదార్థం:** చెలులన్+చుట్టలన్+ప్రోచి= స్నేహితులను బంధువులను రక్షించి; అర్థిజనులన్= ఆశ్రయించిన వారిని; శ్రీమంతులన్+చేసి= ఐశ్వర్యవంతులను కావించి; విప్రులన్= బ్రాహ్మణులను; భవ్యస్థితిన్= యోగ్యమైన స్థితిలో; మన్చి= కాపాడి; పేరున్+పెంపు శోభిల్లన్= కీర్తి గొప్పతనం ప్రకాశించగా; యాగములు; ఇట్టలపున్+త్యాగము+దానమున్ నడపి= మిక్కిలి త్యాగంతో దానాలు చేసి; నిష్ఠన్+పెక్కు+చెల్లించి= నియమంతో చాలా వాటిని చేసి; ఉజ్జ్వలతేజంబునన్= మిక్కిలి ప్రకాశంతో; ఇద్ధభూతిన్= గొప్ప సంపదతో; భుజగర్వస్ఫూర్తిన్= భుజబలంతో; పొల్పు+ఆరితిన్= ఒప్పి ఉన్నాను.

**తాత్పర్యం:** స్నేహితులను బంధువులను రక్షించి, ఆశ్రయించినవాళ్ళను శ్రీమంతులనుగా చేశాను. బ్రాహ్మణులను క్షేమంగా ఉండగా కాపాడాను. కీర్తి ప్రతిష్ఠలు పెరుగగా యాగాలు చేశాను. మిక్కిలి ప్రకాశవంతమైన తేజస్సుతో సాటిలేని సంపదతో భుజబలంతో స్థిరంగా వెలిగాను.

**క. పగవారి నాశ్రయింపక । మగఁటిమియును బ్రాభవంబు మానము నెందుం**
**బొగడొంద నుల్లసిల్లితిఁ । దెగునంతకు లక్ష్మితోఁ బ్రదీప్తుఁడ నైతిన్.** **391**

**ప్రతిపదార్థం:** పగవారిన్+ఆశ్రయింపక= వైరులను ఆశ్రయించక; మగఁటిమియును= వీరత్వమును; ప్రాభవంబున్= గొప్పదనమును; మానమున్= అభిమానమును; ఎందున్+పొగడొందన్= ఎక్కడ కూడా కీర్తింపబడగా; ఉల్లసిల్లితిన్= ఆనందంగా ఉన్నాను; తెగు+అంతకున్= క్రిందపడిపోవుదాకా; లక్ష్మితోన్= సంపదతో; ప్రదీప్తుడను+ఐతిన్= ప్రకాశించాను.

**తాత్పర్యం:** క్రిందపడేదాకా శత్రువులను ఆశ్రయించకుండా వీరత్వంతో గొప్ప అభిమానంతో అంతటా పొగడబడుతూ సంతోషంతో వెలిగాను.

**క. సమరము శమంతపంచక । సమీపమున ధర్మవృత్తిఁ జలుపఁగ నత్యు**
**త్తమ లోకము సమకూఱెను; । విమలాత్ముఁడ నైతి; నొండు వేయును నేలా?** **392**

**ప్రతిపదార్థం:** శమంత పంచక సమీపమునన్= శమంత పంచకం దగ్గర; సమరమున్= యుద్ధంలో; ధర్మవృత్తిన్+చలుపఁగన్= న్యాయంగా చేయగా; అత్యుత్తమ లోకము= మిగుల పవిత్రమైన లోకము; సమకూఱెను= సిద్ధించింది; విమల+ఆత్ముఁడన్+ఐతిన్= నిర్మలమనస్కుడ నైనాను; ఒండు= వేరు; వేయున్+ఏలా?= వేయి మాటలెందుకు?

**తాత్పర్యం:** శమంతపంచకం దగ్గర యుద్ధం ధర్మంగా చేయగా పుణ్యలోకాలు ప్రాప్తించాయి. నిర్మల మనస్కుడ నైనాను. వేయి మాట లెందుకు?

**క. ఎదిరి పెనగంగఁ జాలక నిదురవోవ । నొంచు తెఱఁగున, విషము వెట్టించు పగిది,**
**నింటఁ జిచ్చిడు చాడ్పున, నిట్లు సేసి । పడయుదురుగాక రాజ్య మప్పాండుసుతులు!' 393**

**ప్రతిపదార్థం:** ఆ+పాండుసుతులు= ఆ పాండురాజు కొడుకులు; ఎదిరి పెనగంగన్+చాలక= ఎదుర్కొని యుద్ధం చేయలేక; నిదుర+పోవన్= నిదుర పోతుండగా; నొంచు తెఱఁగునన్= బాధించే విధంగా; విషము పెట్టించు పగిదిన్= విషం పెట్టించిన విధంగా; ఇంటన్+చిచ్చిడు చాడ్పునన్= ఇంటికి అగ్గిపెట్టిన విధంగా; ఇట్లు చేసిన= ఈ విధంగా చేసి (మోసంగా కొట్టి); రాజ్యము= రాజ్యమును; పడయుదురుగాక!= పొందుదురు గాక!

**తాత్పర్యం:** ఆ పాండురాజు కొడుకులు ఎదుర్కొని పోరాడలేక నిద్రించేవాడిని బాధించిన విధంగాను, విషప్రయోగం చేసినట్లూ - ఇంటికి అగ్గిపెట్టినట్లుగాను, ఈ విధంగా (మోసంతో) రాజ్యాన్ని పొందుదురుగాక!'

**వ. అని యంత నిలువక. 394**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; అంతన్ నిలువక= అంతటితో ఆగకుండా.

**తాత్పర్యం:** అంటూ అంతటితో ఆగకుండా - (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'పాపకర్ము లయినపాండుతనూజులు । సమరధర్మ మెడలి జయము గొనుట**
**గురుసుతునకుఁ గృపునకుం గృతవర్మ కు । దేట పఱుపు నాదుమాట గాఁగ. 395**

**ప్రతిపదార్థం:** పాపకర్ములు+అయిన= పాపాత్ములయిన; పాండు తనూజులు= పాండురాజు కుమారులు; సమరధర్మము+ఎడలి= యుద్ధ నీతిని అతిక్రమించి; జయము+కొనుట= గెలవటాన్ని; గురుసుతునకున్= అశ్వత్థామకు; కృపునకున్= కృపాచార్యుడికి; కృతవర్మకున్= కృతవర్మకును; నాదుమాట కాఁగన్= నా మాటగా; తేట+పఱుపు(ము)= స్పష్టంగా చెప్పుము.

**తాత్పర్యం:** 'పాపాత్ము లయిన పాండురాజు కుమారులు యుద్ధ ధర్మాన్ని అతిక్రమించి జయమందిన పద్ధతిని అశ్వత్థామ, కృప, కృతవర్మలకు స్పష్టంగా నా మాటగా తెలియజేయుము.

**క. దేవవ్రతగురుకర్ణుల । దేవసములఁ బాడి దొఱఁగి తెగటార్చుటయున్**
**నీవు దలఁపించి వారల । తో వెండియు నిట్టు లనుము దుర్జనదూరా! 396**

**ప్రతిపదార్థం:** దుర్జనదూరా!= చెడ్డవారికి దూరంగా ఉండేవాడా!; దేవవ్రత= భీష్మ; గురు= ద్రోణాచార్య; కర్ణులన్= కర్ణులను; దేవసములన్= దేవతాసములను; పాడిన్+తొఱఁగి= ధర్మం తప్పి; తెగటార్చుటయున్= చంపటాన్నీ; నీవు తలఁపించి= నీవు జ్ఞాపకం చేసి; వారలతోన్= అశ్వత్థామ, కృప, కృతవర్మలతో; వెండియున్= ఇంకను; ఇట్టులు+అనుము= ఈ విధంగా చెప్పుము.

**తాత్పర్యం:** పాపదూరుడా! దేవసమాను లయిన భీష్మ ద్రోణ కర్ణులను ధర్మాతిక్రమణం చేసి చంపటాన్ని నీవు (వారికి) జ్ఞాపకం చేసి, అశ్వత్థామ, కృప, కృతవర్ములతో ఇంకా ఇట్లా చెప్పుము.

**ఆ. కపటధర్మకంచుకంబున వెలసిరి । గాని సత్యపురుషకారపరులు**
**గారు పాండుసుతులు; వారల నమ్మంగఁ । గాదు సేత గుండెకాయ యుడిన. 397**

**ప్రతిపదార్థం:** పాండుసుతులు= పాండురాజ కుమారులు; కపట= మోసమయిన; ధర్మకంచుకంబునన్ వెలసిరికాని= ధర్మమనే కవచంతో (ముసుగుతో) ఉన్నారు కానీ; సత్యపురుషకారపరులుకారు= సత్యమైన మగటిమి కలవారు కారు; గుండెకాయ= గుండెకాయను (మనసును); చేతన్= చేతిలో; ఇడినన్= పెట్టినప్పటికిని; వారలన్ నమ్మంగన్ కాదు= వారలను నమ్మరాదు.

**తాత్పర్యం:** పాండురాజు కుమారులు సత్య ప్రయత్నపరులుకారు. మోసపు ధర్మమనే కవచంతో బ్రతికారు. అరచేతిలో గుండెకాయను తీసి పెట్టినప్పటికినీ వారిని నమ్మరాదు.

**వ. ఇది నామాట గాఁ జెప్పు' మని పలికె నప్పు డచ్చేరువపల్లెలవారు దన్నుం జూడ వచ్చిన నజ్జనంబులఁ గలయం గనుంగొని గాంగేయుండును గుంభసంభవుండును మొదలైన బంధుమిత్రులను లక్ష్మణుండు లోనుఁగాఁ గల కుమారులను బేరుకొని వారు మున్న సనుటం జెప్పి, వారు సనినలోకంబ తనకుఁ బాటిల్లుట యుగ్గడించి, తన దేవులును దుస్సలయు నాదిగాఁ గల యబలలు దాసు లేనిపిమ్మటఁ బొందుదురవస్థలు వాక్రుచ్చి పనవిన విని వారలు గన్నీరొలుక నుమ్మలికంబు గూరునుల్లంబులతోఁ జని; రందుఁ గొంద అశ్వత్థామ ప్రముఖరథికత్రయం బయ్యెడ మెలంగుట యెఱింగి వారలకు రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి కరుదెంచి యరదంబు డిగ్గి. 398**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ విషయం; నా మాటగాన్+చెప్పుము= నేను చెప్పినట్లుగా తెలుపుము; అని పలికెన్= అని చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+చేరువ= ఆ సమీపంలోఉన్న; పల్లెవారు= జానపదులు; తన్నున్+చూడవచ్చినన్= తనను (దుర్యోధనుడిని) చూడరాగా; ఆ+జనంబులన్+కలయన్+కనుంగొని= ఆ జనులను బాగుగా చూచి; గాంగేయుండును= భీష్ముడును; కుంభ సంభవుండును= ద్రోణుండును; మొదలైన బంధుమిత్రులును; లక్ష్మణుండు లోనుగాగల కుమారులను= లక్ష్మణుడు మొదలైన కుమారులను; పేరుకొని= పేర్కొని; వారు మున్ను చనుటన్+చెప్పి= వా రంతకు ముందుగానే చనిపోవటాన్ని తెల్పి; వారు చనిన లోకంబు+ఆ= వారువెళ్ళిన లోకమే; తనకున్+పాటిల్లుట ఉగ్గడించి= తనకూ సిద్ధించుటను చెప్పి; తన దేవులును, దుస్సలయున్ ఆదిగాన్+కల ఆబలలు= తనరాణులు, తోడబుట్టువగు దుస్సల మొదలైన ఆడవారు; తాను లేని పిమ్మటన్= తానులేకున్న తరువాత; పొందు దురవస్థలు= అనుభవించే కష్టాలను; వాక్రుచ్చి= చెప్పి; పనవినన్ విని= దుఃఖించగా విన్నవారై; వారలు= ఆ జానపదులు; కన్నీరు+ఒలుకన్= కళ్ళలో నీరు చిందగా; ఉమ్మలికంబు కూరు+ ఉల్లంబులతోన్= దుఃఖంనిండిని మనసులతో; చనిరి= వెళ్ళారు; అందున్= వారిలో; కొందఱు= కొంతమంది; అశ్వత్థామ ప్రముఖ= అశ్వత్థామ మొదలైన ముఖ్యులయిన; రథికత్రయంబు= సేనానులు ముగ్గురు; ఆ+ఎడన్+మెలంగుటన్= ఆ ప్రాంతంలో తిరుగుతూ ఉండటం; ఎఱింగి= తెలిసి; వారలకున్= ఆ రథిక త్రయానికి; రాజరాజు= దుర్యోధనుడి; వార్త= విషయం; చెప్పినన్= చెప్పగా; వారలు= ఆ రథికులు; సత్వరంబునన్= వేగంగా; అచ్చటికిన్+అరుగుదెంచి= ఆ చోటునకు వచ్చి; అరదంబులు డిగ్గి= తేరులు దిగి.

**తాత్పర్యం:** (దుర్యోధనుడు సంజయుడితో) 'ఈ చెప్పేది నా మాటలుగా చెప్పుము' అన్నాడు. ఆ సమయాన అక్కడకు దగ్గరగా ఉండే జనపదాలలోని వారంతా తనను చూడడానికై రాగా వారినంతా తేరిపారచూచి, భీష్మద్రోణాది ముఖ్యులైన బంధుమిత్రులను, లక్ష్మణుడు మొదలయిన కుమారులను తలచుకొని వారంతా ముందుగా చనిపోవటాన్ని తెలిపి, వారు పోయిన లోకాలు తనకు కూడా సిద్ధిస్తాయని చెప్పి, తన రాణులు, దుస్సల మొదలయిని స్త్రీలు. తాను లేని తరువాత పొందే కష్టాలను తెలిపి దుఃఖించగా వారు కన్నీటితో కుములుతున్న మనసులతో వెళ్ళారు. వారిలో

కొంతమంది అశ్వత్థామ మొదలయిన ముఖ్య సేనానులు ముగ్గురూ ఆ ప్రాంతంలో తిరగటాన్ని విని, వారి కా రాజరాజు స్థితిని తెలుపగా వా రతివేగంగా ఆ చోటికి వచ్చి తమ రథాలు దిగి.

### కృప కృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం జేరి విలపించుట (సం. 9-64-3)

**సీ. కడుబెట్టిదం బగు గాలిచేఁ గూలిన । మహనీయసాలభూరుహము పోల్కిఁ,**
**బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్ళిన । రాజితవన్యవారణము మాడ్కిఁ,**
**గల్పాంత వాయుసఖస్ఫురణంబున । నివిరి పోయిన మహార్ణవము కరణిఁ,**
**గాలపర్యయమునఁ దూలి మేదినిమీఁదఁ । బడిన పూర్ణేందు బింబంబు పగిది.**

**తే. దుఃస్థుఁ డై యుండియును నొప్పు దొరుఁగకున్న । యన్న రేశ్వరుఁ గనుఁగొని యడలు నెడల**
**తోడ మేనులు దూలఁగఁ దొట్రుపడుచుఁ । జేరి యాతని చుట్టు వాసీను లైరి. 399**

**ప్రతిపదార్థం:** కడు బెట్టిదంబగు గాలిచేన్= మిక్కిలి భయంకరమైన గాలి మూలంగా; కూలిన= పడిపోయిన; మహనీయ= గొప్పదైన; సాలభూరుహము పోల్కిన్= మద్దిచెట్టుమాదిరిగను; ప్రబల= బలవంతులైన; కిరాతమార్గణములన్= బోయవారి బాణములవలన; త్రెళ్ళిన= పడిన; రాజిత= అందమైన; వన్యవారణము మాడ్కిన్= అడవి ఏనుగువలెను; కల్పాంత= ప్రళయకాలమునందలి; వాయుసఖ= అగ్ని యొక్క; స్ఫురణమునన్= విజృంభణంతో; ఇవిరిపోయిన= ఎండిపోయినవంటి; మహార్ణవము కరణిన్= పెను సంద్రము మాదిరిగను; కాలపర్యయమునన్= కాలం మారటంచేత; తూలి= తూలిపోయి; మేదినిమీఁదన్+పడిన= భూమి మీదపడిపోయిన; పూర్ణ+ఇందు బింబంబు పగిదిన్= నిండు చందురుడి మాదిరిగను; దుఃస్థుడైఉండియును= దుఃఖంలో ఉన్నవాడై కూడా; ఒప్పు= సొగసు(శోభ); తొరుఁగకున్న= తొలగిపోకుండా ఉన్నట్టి; ఆ+నరేశ్వరున్+కనుఁగొని= ఆ రాజరాజును చూచి; అడలు= బాధనొందు; ఎడల తోడన్= గుండెలతో; మేనులు= శరీరాలు; తూలఁగన్= తూలిపోగా; తొట్రుపడుచున్= తడబడుతూ; చేరి= ఆ చోటు చేరి; అతని చుట్టున్= అతడి చుట్టూరా; ఆసీనులు+ఐరి= కూర్చున్నారు.

**తాత్పర్యం:** మిక్కిలి పెనుగాలికి కూలి పడిపోయిన మద్దిచెట్టువలెను, బలవంతులయిన బోయల బాణాల దెబ్బలకు పడిపోయిన అడవి ఏనుగు వలెను, ప్రళయకాలంలోని అగ్నివలన ఎండిపోయిన పెనుసంద్రంవలెను, కాలం తలక్రిందులు కావటంచేత తూలిపోయి భూమిమీద పడిన నిండు చందురుడివలెను, దుఃఖితుడై కూడా శోభ తొలగకుండా ఉన్న ఆ రాజరాజును చూచి దుఃఖంతో అదురుతున్నట్టి గుండెలతో కూడి, తూలిపోయే శరీరాలు వణకుతుండగా ఆ దుర్యోధనుడి చుట్టూ కూర్చున్నారు.

**విశేషం:** అలం: మాలోపము.

**వ. ఆసీనులైన యెడ నగ్గురుసుతుండు. 400**

**ప్రతిపదార్థం:** ఆసీనులైన ఎడన్= కూర్చున్న సమయంలో; ఆ+గురుసుతుండు= ఆ అశ్వత్థామ.

**తాత్పర్యం:** ఆ కృపకృతవర్మాశ్వత్థామలు కూర్చోగా, వారిలో అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'అక్కట! యెప్డుఁ బల్వురు ధరాధిపతుల్ గొలువంగ నుండు నీ**
**వొక్కరుఁ డున్నవాఁడవు; మహోన్నతపీఠ మలంకరించు నిన్**
**దెక్కలిఁ దాఁకి ధాత యిలఁ ద్రెళ్ళెడునట్లుగఁ జేసె; నీబలం**
**బెక్కడఁ బోయె? సైన్యపతు లేరొకొ యిక్కడ రారు? భూవరా! 401**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ రాజా!; అక్కట!= అయ్యో!; ఎప్డున్= అన్ని సమయాలలోనూ; పల్వురు= చాలామంది; ధరాధిపతుల్= రాజులు; కొలువంగన్= సేవించగా; ఉండు నీవు= ఉండే నీవు; ఒక్కరుడు+ఉన్న వాఁడవు= ఒక్కడవే ఉన్నావు; మహా+ఉన్నత పీఠము+అలంకరించు= మిక్కిలి ఎత్తైన గద్దెపై అందంగా కూర్చుంటూ ఉండే; నిన్= నిన్ను; తెక్కలి తాఁకి= మోసంగా ఎదుర్కొని; ధాత= విధి; ఇలన్= భూమిమీద; త్రెళ్ళెడునట్లుగన్+చేసెన్= పడేటట్లుగా చేశాడు; నీ బలంబు+ఎక్కడన్+పోయెన్?= నీ శక్తి ఎటు పోయింది?; ఇక్కడన్= ఈ చోటికి; సైన్యపతులు= సేనా నాయకులు; ఏల+రారు+ఒకొ?= ఎందుకు రావటం లేదు?

**తాత్పర్యం:** 'ఓ రాజా! అన్ని సమయాలలోనూ పెక్కురాజులు సేవించగా ఉండే నీవు, ఇప్పుడు ఒక్కడవే ఉన్నావు. మహోన్నతమైన గద్దెను అలంకరిచే నిన్ను విధి మోసంగా తాకి భూమిపై పడేటట్లుగా చేశాడు. నీబలం అంతా ఎక్కడకు పోయింది? సేనాపతులు రారేమి?

**తే. కడలుకొనఁ జుట్టుఁ బట్టెడు గొడుగు లెవ్వి? । యెసక మెసఁగంగ సీవురు లేల పట్ట**
**రంగమున? నాననంబున నవని ధూళి । గదిరె; జలక మే లాడవు కౌరవేంద్ర? 402**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కురురాజా!; కడలుకొనన్= అతిశయంగా; చుట్టును= నీ చుట్టూ; పట్టెడు= పట్టుకొనే; గొడుగులు+ఏవి?= గొడుగులు ఏవి?; ఎసకమెసఁగంగన్= మిక్కిలిగా (అతిశయంగా); సీవురులు= వింజామరలు; ఏల పట్టరు?= ఎందుకు పట్టుకోరు?; అంగమునన్= ఒంటిమీద; ఆననంబునన్= ముఖాన; అవనిధూళి= భూమిమీద దుమ్ము; కదిరెన్?= ఉన్నది; జలకము= స్నానం; ఏల+ఆడవు?= ఎందుకు చేయవు?

**తాత్పర్యం:** ఓ కౌరవేంద్రా! ఎల్లవేళలా నీ చుట్టూ పట్టుకొనే గొడుగు లేవి? అతిశయ మైన వింజామరలను ఎందుకు పట్టుకోరు? ఒడలిమీద, ముఖాన దుమ్ము ఉన్న దేమి? స్నాన మెందుకు చేయవు?

**చ. అనిమిషవాహినీ తనయుఁ డస్త్ర గురుండును నీకు నెప్పుడుం**
**గనువెలుఁ గై చరింతురు వికర్ణుఁడు దుస్ససేనుఁడున్;**
**నిను నొకయప్డుఁ బాయ రవినీతు లొకో నృప! వార లెల్ల నె**
**మ్మనమున శంక లేక యొకమాటును నిక్కడఁ జేర రెవ్వరున్. 403**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ రాజా!; అనిమిష వాహినీ తనయుఁడు= గాంగేయుడు (దేవనది తనయుడు); అస్త్రగురుండును= ధనురాచార్యుడును; ఎప్పుడున్= అన్ని సమయాలలో; నీకున్ కనువెలుఁగై చరింతురు= ఎల్లవేళలా నీకు కంటివెలుగుగా తిరిగేవారు; వికర్ణుఁడు, దుస్సేనుఁడున్= వికర్ణ, దుశ్శాసనులు; నినున్= నిన్ను; ఒకయప్డున్+పాయరు= ఒక్క పర్యాయంకూడా వదలివెళ్ళరు; వారలు+ఎల్లన్ అవినీతులొకో?= వారు దుర్నీతులా?; నెమ్మనమునన్ శంకలేక= మనసులో అనుమానించకుండా (చెప్పుము); ఒకమాటును= ఒక మారుకూడా; ఇక్కడన్= ఈ చోట; చేరరు= చేరినారు కారు.

**తాత్పర్యం:** భీష్మ ద్రోణులు అన్ని వేళలలోనూ నీకు కంటికి వెలుగుగా తిరిగేవారు. వికర్ణ, దుశ్శాసనులు నిన్నెపుడూ వదలి ఉండరు. వారంతా నీతి బాహ్యులా? ఓ రాజా! వారు ఎవరు కానీ ఇక్కడ ఒక పర్యాయం కూడా చేరకున్నారే! నీ మనసులో అనుమానం లేకుండా (వారిని గూర్చి) చెప్పుము.

**క. నీయెడఁ జంచల యయ్యెను । శ్రీ యెవ్వరి నచలవృత్తిఁ జెందెడు విధి య**
**ట్లై యున్నవారి నిట్టులు । సేయఁడె? యే నింక నేమి సేయుదు నధిపా! 404**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; నీ+ఎడన్= నీయందు; శ్రీ= లక్ష్మి; చంచల+అయ్యెను= అస్థిరయైనది; అచలవృత్తిన్= స్థిరంగా; ఎవ్వరిన్= ఎవరి యెడ; చెందెడున్= చేరునో; నిధి= దైవం; అట్లైఉన్న వారి నిట్టులు= ఆ విధంగా ఉన్న వారినీ విధంగా (అనగా ఐశ్వర్యవంతులను విధి ఈ విధంగా); చేయఁడె?; ఏను+ఇంకన్+ఏమి చేయుదున్?= నే నింక ఏమి చేయగలను?

**తాత్పర్యం:** నీపట్ల లక్ష్మి అస్థిరయైనది. మరెవ్వరి వద్ద స్థిరపడబోతున్నదో? విధి సంపదగలవారిని లేనివారినిగా చేయదా? ఓ రాజా! నే నింక ఏమి చేయగలను?'

**తే. అని విలాపంబు సేసిన విని విభుండు । గన్నుఁగవ నశ్రు లురలంగఁ గరపుటములఁ**
**దుడిచికొనుచు డగ్గుత్తి దొడరు నెలుఁగు । నెట్టకేలకు నూల్కొల్పి యిట్టు లనియె. 405**

**ప్రతిపదార్థం:** అని విలాపంబు చేసినన్= అని దుఃఖించగా; విని= విన్నవాడై; విభుండు= రాజయిన దుర్యోధనుడు; కన్నుఁగవన్= రెండుకళ్ళలో; అశ్రులు+ఉరులంగన్= నీరు దొర్లగా; కరపుటములన్= దొప్పలవంటి చేతులతో; తుడిచికొనుచున్= తుడిచివేసికొంటూ; డగ్గుత్తిన్= బొంగురుపోయిన గొంతు; తొడరు= కలుగు; ఎలుఁగున్= కంఠస్వరాన్ని; ఎట్టకేలకున్= తుదకు; నూల్కొల్పి= సరిచేసి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ విధంగా దుఃఖించగా, రాజు కన్నీళ్ళు దొర్లుతుండగా చేతులతో తుడిచికొంటూ గద్గదికమైన కంఠస్వరాన్ని సరిచేసికొని ఇట్లా అన్నాడు.

**క. 'మనుజులకు నిట్టిచందము । ముని ధాత సృజించినది; ప్రమోదము ఖేదం**
**బున వచ్చును బర్యాయం । బున; దీని నెఱుంగవలదె పురుషుం డనఘా!;' 406**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; మనుజులకున్= మానవులకు; ఇట్టి చందము= ఈ స్థితి; మును= ఇదివరకే; ధాత సృజించినది= విధి (బ్రహ్మ) కల్పించిఉన్నదే; ప్రమోదము= సంతోషం; ఖేదంబును= దుఃఖమూ; పర్యాయంబునన్= ఒకదాని వెంట నొకటి; వచ్చును= కలుగుతాయి; పురుషుండు= మానవుడు; దీనిన్ ఎఱుంగ వలదె?= దీనిని తెలియవద్దా?

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఈ స్థితిని మానవులకు విధాత ఇదివరకే నిర్ణయించాడు. సుఖ దుఃఖాలు పర్యాయంగా కలుగుతాయి. దీనిని మానవుడు తెలిసికొనవద్దా?'

**వ. అని యారథికవరుల నాలోకించి. 407**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ఆ రథిక వరులన్= ఆ సైనిక శ్రేష్ఠులను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఈ విధంగా పలికి, ఆ ముగ్గురినీ చూచి.

**సీ.** **'పయిపయి నెంత లాపదలు వచ్చిన నైన । నుత్సాహ మెడలక యుద్ధ మరులు**
**సేద్పడునట్లుగాఁ జేసెడి బంధులు । మిత్రులు సోదరుల్ పుత్రులట్లు**
**బలసమేతంబు భండనంబునఁ ద్రుంగ । నొక్కఁడు నిల్చుట యొప్పు నెట్లు?**
**మద్బాహువీర్యంబు మహిత ధైర్యంబును । దలమున్కలైన సధర్మవృత్తి**

**తే.** **సంగరంబు సేయఁ జాలక శత్రు లిట్లు । నొంప సద్గతి వడయుట సొంపు గాదె**
**యదియుఁ గాక విద్విషులచే నాజిఁ బడక । యుండ మిముఁ గాంచునమ్మేలు నొదవె నాకు. 408**

**ప్రతిపదార్థం:** పయిపయిన్= ఒక దానిమీద ఇంకొకటిగా; ఎంతలు+ఆపదలు= ఎంతటి కష్టాలు; వచ్చినన్= వచ్చినను; ఐనన్= అయినప్పటికిని; ఉత్సాహము= ధైర్యం; ఎడలక= సడలిపోకుండా; యుద్ధము= యుద్ధమును; అరులు= వైరులు; చేద్పడునట్లుగాన్= నాశమయ్యేటట్లుగా; చేసెడి బంధులు మిత్రులు, సోదరుల్, పుత్రులు= చేసే బంధువులు, స్నేహితులు, తోబుట్టువులు, కుమారులును; అట్లు= ఆ విధంగా; బలసమేతంబుగాన్= సేనతో కూడా; భండనంబునన్= యుద్ధంలో; త్రుంగన్= నశించగా; ఒక్కఁడు నిల్చుట= ఒకడు మాత్రము నిలిచి యుండటం; ఎట్లు= ఏ విధంగా; ఒప్పున్= తగును?; మత్+బాహువీర్యంబున్= నా భుజబలమూ; మహిత ధైర్యంబును= మహిమగల శక్తీ; తలమున్కలు+ఐనన్= అధికంగా కాగా; సధర్మవృత్తిన్= న్యాయంగా; సంగరము చేయన్+చాలక= యుద్ధం చేయలేక; శత్రులు+ఇట్లు నొంపన్= వైరులు ఈ విధంగా బాధించగా; సద్గతి పడయుట= పుణ్యగతనిని పొందటం; సొంపు+కాదె= సొగసుకదా!; అదియున్+కాక= అంతేకాక; విద్విషుల చేన్= వైరులవలన; అనిన్= యుద్ధంలో; పడకఉండెన్= పడిపోకుండా ఉండగా; మిమ్మున్+కాంచు= మిమ్ములను చూచే; ఆ+మేలు= ఆ అదృష్టం; నాకున్+ఒదవెన్= నాకు కలిగింది.

**తాత్పర్యం:** ఒక దానిమీద మరొకటిగా ఎంతటి ఆపదలు వచ్చినా ధైర్యం వదలకుండా యుద్ధం చేసి శత్రువులను హతమార్చే బంధువులు, స్నేహితులు, కుమారులు, సోదరులు, సైన్యంతో కూడా ఆ విధంగా యుద్ధంలో చనిపోగా ఒక్కడు మాత్రం బ్రతికి ఉండటం ఒప్పునా? నా భుజబలం, ధైర్యం తలమున్కలైనాయి. ధర్మబద్ధంగా శత్రువులు యుద్ధం చేయలేక ఈ విధంగా బాధించగా పుణ్యగతిని పొందటం సొగసు కదా! కానీ, శత్రువులచేత యుద్ధరంగంలో చనిపోకుండా ఉన్న మిమ్ములను చూచే అదృష్టం నాకు దక్కింది.

**చ.** **వినుఁడు మహానుభావుఁ డగు విష్ణు నెఱింగి యెఱింగి యే మిముం**
**గొని వెఱ పేది కాదె పగకుం దలకొంట; జయంబు గోరి మీ**
**రును బలశౌర్య సంపదనురూపముగాఁ బొగడొందు భంగులం**
**బెనఁగితి; రేమి సేయుదురు బెట్టిదుఁ డై విధి తప్పఁ జూచినన్? 409**

**ప్రతిపదార్థం:** వినుఁడు= మీరు వినండి; మహానుభావుడుగ విష్ణున్= గొప్పవాడైన విష్ణుమూర్తిని; ఎఱింగి ఎఱింగి= తెలిసి తెలిసి; ఏన్= నేను; మిమున్+కొని= మిమ్ము స్వీకరించి; వెఱపు+ఏదికాదె= భయములేకుండా కదా; జయంబున్+కోరి= విజయమును ఆశించి; పగకున్+తలకొంటిన్= వైరానికి పూనుకొన్నాను; మీరును= మీరుకూడా; బలశౌర్యసంపదనురూపముగా= శక్తీ, వీరత్వమూ అనే సంపదకు తగినట్లుగా; పొగడొందుభంగులన్= పొగడ్తలు పొందే విధంగా; పెనఁగితిరి= యుద్ధం చేశారు (అయినను); విధి= దైవం; బెట్టిదుఁడు+ఐ= క్రూరుడై; తప్పన్+చూచినన్= వేరుగా తలంచితే; ఏమి చేయుదురు?= ఏమి చేయగలరు?

**తాత్పర్యం:** మహానుభావుడైన విష్ణుమూర్తిని తెలిసితెలిసీ మిమ్ముగొని భయమును వదలి జయం ఆశించి పూనుకొన్నాను. మీరు కూడా బలశౌర్య సంపదలకు తగినట్లుగా కీర్తనీయంగా యుద్ధం చేశారు. అయినా దుర్విధి బలవంతుడై వేరుగా చూచినపుడు మీ రేమి చేయగలరు?

**వ. వగవ కుండుం' డని యేఁ బొదలోనం బొంచి యున్నది మొదలుగ గదాయుద్ధంబు పాడి విడిచి వడముడి పుడమిఁజేనిం బడవైచి తలదన్నుట తుదిగా నైన వృత్తాంతం బెల్ల నప్పు డారథికవరులకుఁ దేటపడం బలికిన విని పాండవుల దెస నీసును రోసంబు నెత్తి గురునందనుం డరుణాననుం డగుచు నవుడు గఱచి కఠినాక్షరకలితంబు గా నక్కౌరవేశ్వరున కి ట్లనియె. 410**

**ప్రతిపదార్థం:** వగవక+ఉండుండు= దుఃఖించకుండా ఉండండి; అని= అంటూ; పొదలోనన్+పొంచి ఉన్నది మొదలుగన్= పొదలోపల దాగికొని ఉండటం మొదలుగా; గదాయుద్ధంబుపాడిన్= గదాయుద్ధ ధర్మమును; విడిచి= వదలి; వడముడి= భీమసేనుడు; పుడమి+ఁజేనిన్+పడవైచి= రాజునునేలపై పడద్రోసి; తలన్+తన్నుట తుదిగాన్+ఐన= తలను దన్నటం వరకు అంతటినీ; అప్పుడు+ఆ రథికవరులకున్= ఆ సమయాన ఆ సేనా నాయక శ్రేష్ఠులకు; తేటపడన్+పలికినన్= తెలిసేటట్లు చెప్పగా; విని= విన్నవారై; పాండవులదెసన్= పాండవుల మీద; ఈసును= ఈర్ష్యయు; రోసంబున్+ఎత్తి= కోపం కలిగి; గురునందనుండు+అరుణ+ఆననుండు+అగుచున్= అశ్వత్థామ ఎఱ్ఱనైన ముఖం కలవాడౌతూ; ఔడుగఱచి= పెదవిని నొక్కిపట్టుకొని; కఠినాక్షర కలితంబుగాన్= తీవ్రమైన మాటలతో కూడినవిగా; ఆ+కౌరవేశ్వరునకున్+ఇట్లనియెన్= ఆ కౌరవరాజయిన దుర్యోధనుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుఃఖపడవద్దు' - అని సంజయుడు పొదలో దాగికొని ఉన్నప్పటినుండి గదాయుద్ధంలో న్యాయం వదలి భీముడు దుర్యోధనుడిని క్రిందపడదోసి తలను తన్నుట తుదిగా సాగిన విషయాన్నంతటినీ ఆ రథిక శ్రేష్ఠులకు స్పష్టంగా తెలిసేటట్లుగా చెప్పగా విని పాండవుల ఎడ అసూయ, కోపం కలిగి అశ్వత్థామ ముఖం జేగురు రంగు కలది కాగా క్రిందిపెదవిని నొక్కి కరచిపట్టికొని తీక్షణమగు మాటలతో ఆ కౌరవరాజుతో ఇట్లా అన్నాడు.

**ఉ. 'పాండవ లట్లు మజ్జనకుఁ బాపవిధిఁ దెగఁ జూచినప్పుడుం
జండతర ప్రకోపము నసహ్యపు శోకము నిట్లు చిత్త మొం
డొండఁ గలంప నే నిపుడ యొక్కఁడుఁ దక్కక యుండ వారి ను
ద్దండ మదస్త్రవహ్నిఁ బరిదగ్ధులఁ జేయక యెట్టు లుండుదున్? 411**

**ప్రతిపదార్థం:** పాండవులు+అట్లు= పాండవులు ఆ విధంగా; మత్+జనకున్= నా తండ్రిఅయిన ద్రోణుడిని; పాపవిధిన్= చెడుమార్గంతో; తెగన్+చూచినప్పుడున్= చనిపోయేటట్లుగా చేసినప్పుడును; చండతరప్రకోపమున్= తీవ్రమైన కోపమును; అసహ్యపు శోకము= భరించరాని దుఃఖమును; ఇట్లు= ఈ విధంగా; చిత్తమున్= మనసును; ఒండొండన్= ఒకటొకటిగా; కలంపన్= చీకాకు పరచగా; నేను= నేను; ఇపుడు= ఇప్పుడే; ఒక్కడున్ తక్కక ఉండన్= ఒకడు కూడా మిగుల కుండా; వారిన్= పాండవులను; ఉద్దండ= భయంకరమైన; మదస్త్రవహ్నిన్= నా బాణాగ్నిచేత; పరిదగ్ధులన్+చేయక= బాగా కాల్చకుండా; ఎట్టులు+ఉండుదున్= ఏ విధంగా ఉండగలను.

**తాత్పర్యం:** 'పాండవులు ఆ విధంగా నా తండ్రిని దుర్మార్గంగా చంపినప్పుడుకూడా, తీవ్రమైన కోపాన్ని, భరించరాని దుఃఖాన్ని ఒకటొకటిగా ఈ విధంగా మనసును కలత పెట్టవు. ఇప్పుడే ఒక్కడు కూడా మిగులకుండా వారిని (పాండవులను) భయంకరమైన నా బాణాగ్నిచేత పూర్తిగా దహించక ఏ విధంగా ఉండగలను?

**తే. వినుము సత్యంబు వల్కెద మనుజనాథ! । యడరి యందఱఁ బాంచాలు రాదిగాఁగఁ**
**గలుగు బాంధవమిత్ర సంఘములతోడఁ । గూడ నేఁ డిదె కృష్ణుండు సూడఁ ద్రుంతు. 412**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ఓ రాజా!; సత్యంబు పల్కెదన్ వినుము= నిజమే చెపుతున్నాను వినుము; అడరి= అతిశయించి; పాంచాలురు+ఆదిగాఁగన్= పాంచాలురు మొదలుగా; అందఱన్= అందరినీ; కలుగు= ఉన్నట్టి; బాంధవ మిత్ర సంఘంబు తోడన్= బంధు మిత్ర సమూహంతో; కూడన్= కలియగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; చూడన్= చూస్తుండగా; నేఁడు= ఈ దినం; ఇదె= ఇదిగో; త్రుంతున్= చంపుతాను.

**తాత్పర్యం:** ఓ రాజా! నేను నిజమే చెప్పుతున్నాను వినుము. విజృంభించి పాంచాలురు మొదలుగా ఉన్నట్టి బంధుమిత్ర సమూహమును శ్రీకృష్ణుడు చూస్తూండగా ఇదిగో నేడు హతమారుస్తాను.

**వ. పనుపు' మనిన హృష్టుండై యజ్జనపతి గృపాచార్యుం గనుంగొని యొక్క కలశంబున జలంబు నినిచికొని రమ్మనుటయు, నమ్మహీసురవరుండు దమ్ముం జూడ వచ్చి యచ్చట నున్న సమీపాశ్రమమునికుమారులం బ్రార్థించి యొక్కకలశంబు దెప్పించి దానిం దోయపూర్ణంబుఁ గావించి తెచ్చిన. 413**

**ప్రతిపదార్థం:** పనుపుము= ఆజ్ఞాపింపుము; అనినన్= అనగా; హృష్టుండు+ఐ= సంతోషమంది; ఆ+జనపతి= ఆ రాజైన దుర్యోధనుడు; కృపాచార్యున్+కనుంగొని= కృపాచార్యుడిని చూచి; ఒక్క కలశంబునన్= ఒకపాత్రలో; జలంబున్= నీటిని; నినిచికొని= నింపుకొని; రమ్మనుటయు= రావలసినదని కోరగా; ఆ+మహీసూరవరుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; తమ్మున్+ చూడవచ్చి= తమను చూడటానికై వచ్చిన; అచ్చటన్+ఉన్న= ఆ చోటులోనుండే; సమీప= దగ్గరి; ఆశ్రమ ముని కుమారులన్+ ప్రార్థించి= తపోవనంలోని ఋషికుమారులను ప్రార్థించి; ఒక్కకలశంబు తెప్పించి= ఒక పాత్రను తెప్పించుకొని; దానిన్+ తోయపూర్ణంబు కావించి తెచ్చినన్= దానిని నీటితో నింపి తీసుకొనిరాగా.

**తాత్పర్యం:** (అశ్వత్థామ) ఆజ్ఞాపింపు' మనగా ఆ రాజు సంతోషించి కృపాచార్యుడితో ఒక చెంబునిండా నీరు తెప్పించు మన్నాడు. ఆ బ్రాహ్మణుడు తమను చూడవచ్చిన - అక్కడకు సమీపాన ఉన్న మున్యాశ్రమంలోని మునికుమారులను ప్రార్థించి ఒక కలశాన్ని తెప్పించి దాని నిండా నీరు తీసికొని రాగా.

**చ. అతనికి నెమ్మి నిట్లనియె నమ్మనుజేంద్రుఁడు 'నీవు వేగ మం**
**చితముగ ద్రోణపుత్రు నభిషిక్తునిఁ జేయుము ప్రీతి మచ్చమూ**
**పతియఁగ భూసురుండు నృపుపంపునఁ గయ్యముసేఁత లోకవి**
**శ్రుత మగుధర్మ మట్లగుటఁ జూవె యొనర్చెద నవ్విశేషమున్.' 414**

**ప్రతిపదార్థం:** ఆ+మనుజ+ఇంద్రుఁడు= ఆ రాజు దుర్యోధనుడు; అతనికిన్= ఆ కృపుడితో; నెమ్మిన్= ప్రీతితో; ఇట్లు+అనియెన్; నీవు; వేగము= శీఘ్రంగా; అంచితముగన్= ఒప్పుగా; ద్రోణపుత్త్రున్= అశ్వత్థామను; ప్రీతిన్= ఇష్టంతో; మత్+చమూపతియున్+ కాన్= నా సేనాపతిగా; అభిషిక్తునిన్= అభిషేకించబడినవాడినిగా; చేయుము; భూసురుండు= బ్రాహ్మణుడు; నృపు పంపునన్=

ఆ రాజాజ్ఞతో; కయ్యము+చేఁత= యుద్ధం చేయటం; లోకవిశ్రుతము+అగు ధర్మము= జగత్ప్రసిద్ధమైన ధర్మం; అట్లు+అగుటన్+ చూవె= అందుచేతనే సుమా!; ఆ విశేషమున్= బ్రాహ్మణుడిని సేనాపతిని అభిషేకించటం అనే విశేషాన్ని; ఒనర్చెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు కృపునితో ఇట్లా అన్నాడు: 'వెంటనే నీవు ద్రోణుడి కుమారుడిని నాసేనా నాయకుడుగా ప్రీతితో అభిషేకించుము. బ్రాహ్మణుడు రాజాజ్ఞమెయి యుద్ధం చేయటం లోకప్రఖ్యాతమైన ధర్మం. అందువలన ఆ విశేషమైన పనిని చేస్తాను.

**వ. అనవుడు నతండు సంప్రీతుం డై యగ్గురునందనునకు సేనాధిపత్యాభిషేకం బాచరించిన. 415**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; అతండు సంప్రీతుండు+ఐ= అతడు ఆనందించి; ఆ+గురునందనునకున్= అశ్వత్థామకు; సేనాధిపత్య+అభిషేకంబున్+ఆచరించినన్= సేనాధిపతిగా అభిషేకం చేయగా.

**తాత్పర్యం:** అనగా విని కృపుడు సంతోషించి అశ్వత్థామను సేనాధిపతిగా అభిషేకించగా.

**ఉ. ఆ రథికోత్తముం డధికహర్షముఁ బొందుచు నమ్మహీశ్వరున్**
**గారవ మొప్పఁ గ్రుచ్చి యిఱిగౌఁగిటఁ జేర్చి యుదాత్తసింహనా**
**దారవ ముల్లసిల్లఁగఁ బ్రియంబుమెయిం గృప యాదవోత్తముల్**
**సేరి కెలంకులం జనఁగఁ జెచ్చెర నేఁగె నుదగ్రమూర్తి యై. 416**

**ప్రతిపదార్థం:** ఆ రథిక+ఉత్తముండు= ఆ సేనానాయక శ్రేష్ఠుడు - అశ్వత్థామ; అధిక హర్షమున్+పొందుచున్= మిక్కిలి సంతోషిస్తూ; ఆ+మహీశ్వరున్= ఆ దుర్యోధనుడిని; గారవము+ఒప్పన్= గౌరవం తగునట్లుగా; క్రుచ్చి ఇఱికౌఁగింటన్+చేర్చి= గట్టిగా హత్తుకొని కౌగిలో చేర్చుకొని; ఉదాత్త= పెద్ద; సింహనాదా రవము= సింహగర్జనం; ఉల్లసిల్లఁగన్= ఒప్పగా; ప్రియంబుమెయిన్= ప్రీతితో; కృప= కృపుడును; యాదవ+ఉత్తముల్= యాదవ ముఖ్యులు; చేరి= కూడి; కెలంకులన్+చనఁగన్= ప్రక్కల వెళ్ళగా; ఉదగ్రమూర్తిఐ= భయంకర మూర్తిగా; చెచ్చెరన్+ఏఁగెన్= వెంటనే వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ సేనాని చాలా సంతోషంతో ఆ రాజును గౌరవంతో బిగియార కౌగిలించుకొని గొప్పదైన సింహనాదం ఒప్పగా ప్రీతితో కృపుడూ, యాదవ ప్రముఖులూ ప్రక్కలలో చేరి నడవగా భయంకరమూర్తి అయి వెంటనే వెళ్ళాడు.

**వ. ఇ ట్లశ్వత్థామ కృప కృతవర్ములును మహోద్యోగంబున. 417**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అశ్వత్థామ, కృప కృతవర్ములును= ఈ విధంగా అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ; మహా+ఉద్యోగంబునన్= పెను ప్రయత్నంతో.

**తాత్పర్యం:** ఈ విధంగా అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా గొప్పదైన ప్రయత్నంతో - (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అరినిరవశేషనిరసన । పరమానంద ప్రచరిత పాండవ పుత్త్రో**
**త్కర బాంధవనికర పరి । స్ఫురణాఢ్య తదీయశిబిరమున కభిముఖు లై. 418**

**ప్రతిపదార్థం:** అరి నిరవశేష నిరసన= శత్రువుల నిశ్శేష నిరసనం (నాశనం) చేత; పరమ+ఆనంద ప్రచరిత= గొప్ప సంతోషం కలిగి ఉన్న; పాండవ - పుత్ర+ఉత్కర= పాండవుల కుమారుల సమూహముయొక్కయు; బాంధవ - నికర= చుట్టాల సమూహం యొక్కయు; పరిస్ఫురణ= విజృంభణంచేత; ఆఢ్య= సంపన్నమైన; తదీయ= వారిదైన; శిబిరమునకున్= గుడారమునకు; అభిముఖులు+ఐ= ఉన్ముఖులై.

**తాత్పర్యం:** శత్రువులను నిశ్శేషంగా కూల్చటంవలని పరమానందం కల పాండవపుత్ర సమూహంయొక్కయు, చుట్టాల సమూహంయొక్కయు విజృంభణంచేత సంపన్నమైన పాండవశిబిరమునకు ఉన్ముఖులై.

**వ.** **చని రని యిట్లు ధృతరాష్ట్రునకు సంజయుం డశ్వత్థామోత్సాహంబు తెఱం గెఱింగించె నని వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుం డట మీఁది వృత్తాంతం బెఱింగింపు మని యడుగుటయు.** **419**

**ప్రతిపదార్థం:** చనిరి= వెళ్ళారు; అనిఇట్లు= అని ఆ విధంగా; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడితో; సంజయుండు= సంజయుడు; అశ్వత్థామ= అశ్వత్థామయొక్క; ఉత్సాహంబు= వేడుకయొక్క; తెఱంగు= విధమును; ఎఱింగించెన్= తెలిపాడు; అని వైశంపాయనుండు చెప్పినన్= అని వైశంపాయన ముని చెప్పగా; విని= విన్నవాడై; జనమేజయుండు= జనమేజయ చక్రవర్తి; అటుమీఁది వృత్తాంతంబు= ఆపై సమాచారాన్ని; ఎఱింగింపుము+అని= తెలియజేయుమని; అడుగుటయున్= అడుగగా.

**తాత్పర్యం:** ఆ రథికత్రయం అట్లా వెళ్ళారని సంజయుడు ధృతరాష్ట్రుడికి ఈ రీతిగా అశ్వత్థామ ఉత్సాహాన్ని తెలిపాడు అని వైశంపాయనుడు చెప్పగా ఆ తరువాతి సమాచారాన్ని తెలియజేయుమని జనమేజయుడు అడిగాడు.

## ఆశ్వాసాంతము

**మ.** **శ్రుతివాక్యార్థమయ ప్రభావ! మునిసంస్తుత్యానుభావా! శచీ**
**పతిముఖ్యానిమిషాభివాద్య నిరసద్భావైకవేద్యా! మహో**
**న్నత హేతుత్వవిరాజమానచరణా! నమ్రాపదుత్తారణా!**
**సతతోన్నిద్ర విధైకభక్తసులభా! సంవిత్ప్రభావల్లభా!** **420**

**ప్రతిపదార్థం:** శ్రుతివాక్య+అర్థ మయ ప్రభావ!= వేదార్థరూపమైన శక్తి కలవాడా! (వేదవాక్యాల కున్న అర్థమే రూపెత్తినవాడా!); మునిసంస్తుత్య+అనుభావా!= మునులచేత ప్రార్థించదగిన ప్రభావం కలవాడా!; శచీపతి ముఖ్య= ఇంద్రుడు మొదలైన; అనిమిష= దేవతలచేత; అభివాద్య= నమస్కరించదగినవాడా!; నిరసద్భావ+ఏకవేద్యా!= ఇది కాదు. ఇది కాదు అనునట్టి రూపాన్ని భావంచేతనే తెలియదగినవాడా!; మహా+ఉన్నత= మిక్కిలి గొప్పదైన; హేతుత్వ= కారణమవటంచేత; విరాజమాన= వెలుగుతున్నట్టి; చరణా!= పాదాలుకలవాడా!; నమ్ర+ఆపదుత్తారణా!= విధేయులయిన భక్తులను ఆపదలనుండి దాటించేవాడా!; సతత= ఎల్లప్పుడూ; ఉన్నిద్రవిధా+ఏక= అన్ని సమయాలలో ప్రజ్ఞావంతులై ప్రమాదాలకు లోనుకాకుండా ఒక్కటి ఐన; భక్త సులభా!= భక్తులకు వశ్యుడా!; సంవిత్ప్రభావల్లభా!= జ్ఞానచైతన్య శక్తికి వల్లభుడా!

**తాత్పర్యం:** వేదాలలోని వాక్యార్థాల శక్తి స్వరూపుడవు. ఋషులంతా నీ మహత్త్వాన్ని పొగడుతున్నారు. ఇంద్రాదిదేవతలంతా నీకు నమస్కరిస్తున్నారు. నీవు ఇదికాదిది కాదనేతత్త్వం (నేతి నేతివాదం) వలన తెలియదగిన వాడవు. నీ పాదాలు అత్యున్నతమైన హేతువులుగా ప్రకాశిస్తాయి. నీవు వినమ్రులయిన వారి ఆపదలను తొలగిస్తావు. నిన్ను మరువని భక్తులకు నీవు సులభుడవు.

**విశేషం:** అలం: ప్రతిపాదంలోనూ అంత్యానుప్రాసాలంకారం. నిరసద్భావైకవేద్యా - దీనికి వా. ప్రతిలో పాఠాంతరమున్నది. అది - నిరహంభావైక వేద్యా= అహంభావశూన్యు లైనవారిచేతనే తెలియదగినవాడా - అహంకారశూన్యులకు మాత్రమే తెలియదగినవాడా!

**క.** **సిత నీలాదిక వర్ణా! హితవై కృత దూర! మానసేజ్యాధారా**
**శతదళభవసత్యవతీ । సుతాదిబుధ మతిలతా ప్రసూనాకారా!** **421**

**ప్రతిపదార్థం:** సిత నీల+ఆదిక వర్ణా!= తెల్లని, నల్లని మొదలైన రంగులు కలవాడా! (శివుడు తెల్లని వర్ణం కలవాడు, విష్ణువు నల్లని కలువవంటి రంగు కలవాడు); హితవైకృతదూర!= ఆప్తులయిన తాపసులకు వికారమైన రూపాలకు దూరమైనవాడా! (భక్తులకు స్వస్వరూపంలో కానవచ్చేవాడా!); మానస+ఇజ్యాధారా!= మనసునందు కావించే యజ్ఞానికి ఆధారమైనవాడా! (అంతస్సున మానసిక యజ్ఞానికి ఆధారమైనవాడని); శతదళ భవ= బ్రహ్మకును (పద్మం నుండి పుట్టినవాడు బ్రహ్మ); సత్యవతీసుత= సత్యవతి కుమారుడైన వ్యాసుడు; ఆది= మొదలయిన; బుధ= పండితులయొక్క (తాపసులయొక్క); మతిలతా= బుద్ధిఅనే తీగకు; ప్రసూన+ఆకారా!= పూవువంటివాడా! (తపస్వుల బుద్ధి అనే తీగలకు వికసించే పూవును పోలినవాడా).

**తాత్పర్యం:** (పరబ్రహ్మతత్త్వమును వర్ణించటం) తెల్లని నల్లని రంగులు కలవాడా! ఆత్మీయులైన ఋషులకు యథార్థంగా దర్శనమిచ్చేవాడా! మహనీయులయిన యోగులు తమ మనసులలో చేసే యజ్ఞానికి ఆధారమైనవాడా! స్రష్ట అయిన బ్రహ్మకు, వేదవ్యాసుడికి, ఇతరపండితులకు గల బుద్ధి అనే తీగకు పూవువంటివాడా!

**విశేషం:** అలం: రూపకం, అంత్యానుప్రాసం.

**మాలిని.**

**భరిత వికసనాంతః పద్మనిశ్రేణికాసం**
**చరణ పరిణతత్వశ్లాఘనీయ క్రమోద్య**
**న్మరుదుపగమలీలా మథ్యమానేందు బింబ**
**క్షరదమృత వికారోత్సారణానంద రూపా!** **422**

**ప్రతిపదార్థం:** భరిత= నిండైన; వికసన= వికాసంకల; అంతః పద్మ= శరీరంలోని పద్మాల (షట్చక్రాల) ఆకారం కల; నిశ్రేణికా= (వరుసలు) నిచ్చెనవంటి దానిమీద; సంచరణ= సంచరించటం మూలాన సిద్ధించినట్టి; పరిణతత్వ= పరిపాకం వలన; శ్లాఘనీయ= పొగడదగినట్టి; క్రమ+ఉద్యత్+మరుత్+ఉపగమ+లీలా= వరుసగా పైకి లేచే ప్రాణవాయువునకు పొందిక అయిన క్రీడచేత; మథ్యమాన= త్రచ్చుటమూలాన (మథింపబడుచున్న); ఇందుబింబ= చంద్రబింబంనుండి; క్షరత్= జాలువారుచున్న; అమృతవికార= అమృతాకారంతో; ఉత్సారణ+ఆనంద రూపా!= కదలుతున్న ఆనందస్వరూపా!

**తాత్పర్యం:** పరమేశ్వరా! యోగీశ్వరులు తమ యోగాభ్యాసం మూలంగా సునిశిత పరిశీలనంతో తమ శక్తిని మూలాధారాది స్థానాలతో నిచ్చెన ఎక్కినట్లు అధిరోహించి, వరుసగా వికసింపజేసి, దానినుండి జాలువారే అమృతాన్ని అనుభవించి ఆనందసాగరంలో మునుగజేసే నిత్యానందరూపా!

**విశేషం:** ఈ పద్యంలో తిక్కనగారికి గల యోగశాస్త్ర పరిచయాన్ని పాఠకులు గుర్తించవలసి ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున శల్యపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమై సంస్కృతాంధ్రోభయకవులకు మిత్రుడైనవాడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, పండితుల ప్రశంసలచేత ప్రకాశించేవాడూ (పండితులను సేవించటంలో రాణించేవాడూ) అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీమహాభారతంలోని శల్యపర్వం మొత్తం ముగిసిన రెండవ అశ్వాసం.

**శల్యపర్వంలో రెండవ ఆశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్రమహాభారతంలో శల్యపర్వం ముగిసింది.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీమ త్కౌస్తుభ రత్నో । ద్దామారణ రశ్మి భూతి ధవళ మరీచి**
**స్తోమ పరభాగ రమ్య మ । హా మహిత స్ఫురిత వక్ష! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీమత్= శోభావంతమైన; కౌస్తుభ రత్న= కౌస్తుభ మనే పేరుగల మణి యొక్క; ఉద్దామ= మిక్కిలి; అరుణ= ఎర్రనైన; రశ్మి= కాంతుల యొక్కయు; భూతి= బూది (విభూతి) యొక్క; ధవళ= తెల్లనైన; మరీచి= కాంతుల యొక్కయు; స్తోమ= సమూహము యొక్క; పరభాగ= అతిశయంచేత; రమ్య= అందమైన; మహత్ (మహా)= మిక్కిలి; మహిత= గొప్పదియు; స్ఫురిత= ప్రకాశించినదియు అగు; వక్ష!= రొమ్ముగలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథు డనే పేరుగల దైవమా!

**తాత్పర్యం:** శోభావంతమైన కౌస్తుభమణి చిమ్మే ఎర్రటి కాంతుల అతిశయంవలన, శరీరానికి పూసుకొన్న విభూతి చిమ్మే తెల్లటి కాంతుల అతిశయం వలన అందమై మిక్కిలి గొప్పదీ, ప్రకాశించేదీ అయిన వక్షఃస్థలం గల ఓ హరిహరనాథా!

**విశేషం:** అలం: యథాసంఖ్యం. ఈ పద్యంలో హరి స్వరూపం, హరస్వరూపం- ఈ రెండూ ఏకమైన హరిహరనాథుడి మూర్తిని కవి వర్ణిస్తున్నాడు. హరి తన వక్షఃస్థలంపై కౌస్తుభమణిని ధరిస్తాడు. హరుడు తన వక్షఃస్థలానికి విభూతి పూసుకొంటాడు. కౌస్తుభం ఎర్రటి కాంతులను, విభూతి తెల్లటి కాంతులనూ చిమ్ముటవలన హరిహరనాథుడి వక్షఃస్థలం అందంగా ప్రకాశిస్తోంది అని భావం.

లక్ష్మీనివాసం కావడం చేతను, సర్వమంగళా స్వరూపం అగుటవల్లనూ హరిహరనాథుని ఉరఃస్థలం సంపదకూ, వైరాగ్యానికీ ఉపలక్షణం అయింది. అందువలన హరిహరనాథస్వామి భౌతిక ఆధ్యాత్మిక ఆనందాలను ప్రసాదించేవాడని ధ్వని.

కౌస్తుభమణి అరుణరశ్ములు హరికీ, భూతి ధవళమరీచులు హరుడికీ చెందటం వలన ఈ పద్యంలోని అలంకారం యథాసంఖ్యం.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= ఆ పేరు గల వ్యాస శిష్యుడు; జనమేజయునకున్= పరీక్షిన్మహారాజు పుత్రుడైన జనమేజయుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వ్యాస శిష్యుడైన వైశంపాయనమహర్షి జనమేజయ మహారాజుతో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** దేవా! అనేది కృతికర్త అయిన తిక్కన కృతిపతి అయిన హరిహరనాథుడిని సంబోధించిన పదం. వైశంపాయనుడు వ్యాసుడి శిష్యుడు. ముని. జనమేజయుడు ఉత్తరాభిమన్యుల కుమారుడయిన పరీక్షిత్తు కొడుకు. వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పినట్లు తిక్కన హరిహరనాథుడితో భారత కథ చెప్తున్నాడు.

**తే.** **సంజయునిచేత గురుసుతోత్సాహ మట్లు । వినిన ధృతరాష్ట్రుఁ డిట్లను; 'వీరవర్యుఁ**
**డనఁగఁజాలు నశ్వత్థామయును, సహాయ । రథికులును విక్రమించిన క్రమము సె పుమ!'** **3**

**ప్రతిపదార్థం:** సంజయుని చేతన్= సంజయుడి ద్వారా; గురుసుత+ఉత్సాహము= గురుడైన ద్రోణాచార్యుడి కుమారుడైన అశ్వత్థామ యొక్క యుద్ధోత్సాహం; అట్లు= ఆ విధంగా; వినిన= విన్నవాడైన; ధృతరాష్ట్రుఁడు; ఇట్లు; అనున్= ఈ విధంగా అన్నాడు; వీరవర్యుఁడు= వీరులలో శ్రేష్ఠుడు; అనఁగన్+చాలు= అనదగిన; అశ్వత్థామయును; సహాయ రథికులును= అతడికి తోడుపడే రథికులూ (కృపాచార్య కృతవర్మలూ); విక్రమించిన క్రమము= పరాక్రమించిన విధం; చెపుమ!= చెప్పుమా!

**తాత్పర్యం:** సంజయుడి ద్వారా అశ్వత్థామ పొందిన శత్రుసంహారోత్సాహాన్ని ఆ రీతిగా విన్న ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు. 'సంజయా! వీరశ్రేష్ఠు డనదగిన అశ్వత్థామా, అతడికి తోడుపడే రథికులూ ఎట్లా పరాక్రమించారో చెప్పుము.'

**విశేషం:** గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడికి ఎప్పటికప్పుడు యుద్ధ విశేషాలు చెపుతూ ఉండడానికి వ్యాసుడు సంజయుడిని నియమించాడు. అందువలన యుద్ధ వార్తలు అతడు ఎప్పటికప్పుడు ధృతరాష్ట్రుడికి నివేదిస్తూ ఉంటాడు.

**వ.** **అనుటయు నమ్మానవపతి కా సూతసేనుం డి ట్లను; 'నవ్విధంబునఁ గురుపతి యశ్వత్థామ కభిషేకంబు సేయిం చిన నా కృపాచార్యుండును గృతవర్మయు గురుపుత్రు నుత్సాహంబున కుపోద్బలకం బగు నుద్యోగంబునం బొదలి; రమ్మువ్వురు మహీపాలుండు పాండవులం బరిమార్చుటకుం బనిచిన నట్లు పూని దక్షిణంబు ముట్టి పడమట నున్న పాండవ శిబిరంబున కభిముఖు లై చని; రత్తెఱంగున నవ్వీటి కెలని కనతి దూరంబుగాఁ జని యా రథికవరు లాలించి.** **4**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధృతరాష్ట్రు డనగా; ఆ+మానవపతికిన్= ఆ రాజుకు (ధృతరాష్ట్రుడికి); ఆ సూతసూనుండు= ఆ సూతపుత్రుడైన సంజయుడు; ఇట్లు+అనున్= ఇట్లా చెపుతున్నాడు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; కురుపతి= కౌరవ రాజయిన దుర్యోధనుడు; అశ్వత్థామకున్; అభిషేకంబు= సేనాధిపత్యాభిషేకం; చేయించినన్= చేయించగా; ఆ కృపాచార్యుండును; కృతవర్మయున్; గరు పుత్రు+ఉత్సాహంబునకున్= ద్రోణుడి కొడుకైన అశ్వత్థామ యొక్క ఉత్సాహానికి; ఉపోద్బలకంబు+అగు= ప్రోత్సాహకరమైన; ఉద్యోగంబునన్= ప్రయత్నంలో; పొదలిరి= ప్రవర్తిల్లారు; ఆ+మువ్వురున్= అశ్వత్థామ; కృపాచార్యుడు; కృతవర్మ అనే ఆ ముగ్గురూ; మహీపాలుండు= రాజు (దుర్యోధనుడు); పాండవులన్; పరిమార్చుటకున్= చంపడానికి; పనిచినన్= పంపగా; అట్లు; పూని= కడగి; దక్షిణంబున్= దక్షిణ దిక్కును; ముట్టి= ఆక్రమించి; పడమటన్= పడమటి దిక్కునందు; ఉన్న; పాండవ శిబిరంబునకున్= పాండవుల విడిదికి; అభిముఖులు+ఐ= ఎదురు ముఖాలు కలవారయి; చనిరి= వెళ్ళారు; ఆ+తెఱంగునన్= ఆ విధంగా; ఆ+వీటి కెలనికిన్= ఆ విడిది ప్రక్కకు; న+అతి దూరంబుగాన్= దగ్గరగా; చని= పోయి; ఆ రథికవరులు= ఆ రథికశ్రేష్ఠులు; ఆలించి= విని.

**తాత్పర్యం:** అని అనగా ఆ ధృతరాష్ట్ర మహారాజుతో సంజయుడు ఇట్లా అన్నాడు. 'ఆ విధంగా దుర్యోధనుడు అశ్వత్థామకు సేనాధిపత్యాభిషేకం చేయించగా ఆ కృపాచార్యుడూ, కృతవర్మా, అశ్వత్థామయొక్క శత్రు సంహారో త్సాహానికి ప్రోత్సాహకరమైన పనియందు ప్రవర్తిల్లారు. ఆ ముగ్గురూ-దుర్యోధనుడు తమను పాండవులను చంపటానికి పంపగా, ఆ రీతిగా పూని, దక్షిణ దిక్కుకు వెళ్ళి, ఆ తర్వాత పడమటగా ఉన్న పాండవుల శిబిరం వైపు వెళ్ళారు. ఆ విధంగా ఆ శిబిరానికి దగ్గరగా పోయి, ఆ రథిక శ్రేష్ఠులు విని.

**వ.** **అందలి వార లెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం**
**దంద చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం**
**బందినయట్టి మ్రోఁత విని యక్కడ వోవఁగ నుల్కి రప్డు ద**
**మ్ముం దడవన్ వడిన్ వెడలు మూఁకలు మ్రోయుటగాఁ దలంచుచున్.** **5**

**ప్రతిపదార్థం:** అందలివారలు= ఆ శిబిరంలో ఉన్నవాళ్ళు; ఎల్లనున్= అందరూ; జయంబునన్= గెలుపుతో; పొంగుచున్= ఉబ్బుతూ; పేరు+ఎలుంగులు= పెద్ద కంఠస్వరాలు; అందంద= అక్కడక్కడా; చెలంగఁగాన్= మ్రోయగా; పలుకన్= మాటలాడగా; అర్వఁగన్= అరవగా; ఒత్తిలి= బిగ్గరగా; నవ్వన్= నవ్వగా; ఆకసంబు+అందిన= ఆకాశాన్ని తాకిన; అట్టి= అటువంటి; మ్రోఁతన్= ధ్వనిని; విని; అప్డు= అప్పుడు; తమ్మున్= తమను; తడవన్= పట్టుకొనడానికి; వడిన్= వేగంగా; వెడలు= బయలుదేరునట్టి; మూఁకలు= సేనలు; మ్రోయుటగాన్= ధ్వని చేయటంగా; తలంచుచున్= భావిస్తూ; అక్కడ+పోవఁగన్= అక్కడికి వెళ్ళడానికి; ఉల్కిరి= భయపడ్డారు.

**తాత్పర్యం:** ఆ శిబిరంలో ఉన్నవాళ్ళందరూ జయోత్సాహంతో పొంగిపోతూ పెద్ద పెద్ద కంఠస్వరాలు మ్రోగుతుండగా, అరుపులూ, అట్టహాసాలూ చేశారు. మిన్నుముట్టే ఆ ధ్వనిని విని అప్పుడు తమను వెదకటానికి వేగంగా వెళ్ళే సేనలు చేసే ధ్వనిగా భావించి, ఆ ముగ్గురు వీరులూ అక్కడికి వెళ్ళటానికి భయపడ్డారు.

**విశేషం:** తప్పుపని చేసేవాడు ఎవ డేమి చేసినా తనను కనిపెడుతున్నాడని తన నీడ చూచికొని తనే భయపడుతుంటాడు. అట్లాగే అశ్వత్థామాదులు పాండవ శిబిరంలో సైన్యం జయానందంతో పెట్టే కేకలూ, నవ్వే నవ్వులూ విని అవన్నీ తమను పట్టుకొనటానికి వాళ్ళు చేసే శబ్దాలు అని భ్రమించి అక్కడికి పోవటానికి భయపడ్డారని భావం.

**వ.** **ఉలికి యట వోవు టుడిగి యెచ్చటి కేనియుం దొలంగి నిలిచి మఱి కర్జంబుఁ జూచికొనువారై యా రథికవరులు మగిడి తూర్పుదెస కొంతదవ్వరిగి'రనిన నమ్మాటలు వెడవెడ వినుచుం దనకుం బాటిల్లిన దురవస్థ చింతించుచు నాంబికేయుం డి ట్లనియె.** **6**

**ప్రతిపదార్థం:** ఉలికి= భయపడి; అట+పోవుట+ఉడిగి= అక్కడికి పోవటానికి భయపడి; ఎచ్చటికిన్+ఏనియున్+తొలంగి= ఎక్కడికో తప్పుకొని నిలిచి; మఱి= పిమ్మట; కర్జంబున్= పనిని; చూచికొనువారు+ఐ= ఆలోచించుకొనేవారై; ఆ రథికవరులు= ఆ రథిక శ్రేష్ఠులు (కృపాశ్వత్థామ కృతవర్మలు); మగిడి= వెనుదిరిగి; తూర్పుదెస= తూర్పు దిక్కుగా; కొంత దవ్వు+అరిగిరి= కొంతదూరం వెళ్ళారు; అనినన్= అని సంజయుడు చెప్పగా; ఆ+మాటలు; వెడవెడ వినుచున్= నిరుత్సాహంతో వింటూ; తనకున్; పాటిల్లిన= సంభవించిన; దురవస్థ= దుస్థితిని గురించి; చింతించుచున్= విచారిస్తూ; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు (అంబిక కొడుకు); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఆ వీరులు భయంతో అక్కడికి పోవటం మాని ఎక్కడికో తప్పుకొని నిలిచి, తరువాత తాము చేయవలసిన పనిని గూర్చి ఆలోచించుకొంటూ తిరిగి తూర్పు దిక్కుగా కొంతదూరం వెళ్లారు' అని సంజయుడు చెప్పే మాటలను ఆసక్తి లేకుండా వింటూ, తనకు సంభవించిన దుస్థితిని గూర్చి తలచుకొంటూ ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడికి తమ వీరులు ఓడిపోతున్నారనే మాటలు రుచించవు. అందుచేతనే సంజయుడి మాటలను అనాసక్తితో వినటం జరిగింది.

**వ.** **'సంజయ! కురురాజు సమయునే యిట్లు భీమునిచేత? బలశౌర్యముల నజయ్యుఁ**
**డని నమ్మియుండితిఁ; దనయులు నూర్వురు మడియుట నినియు నా మనము పెక్కు**
**పఱియలై పోవనిభంగిఁ జూడఁగ ఱాత నొనరించినదిగాఁగ నోపు. నింక**
**నడియరితనమున నప్పాండవుల నాశ్రయింపఁగఁజాల; నే నెక్కడేనిఁ**

**ఆ.** **బోదుఁ గాక; యట్టి భూపాలు తండ్రినై, । ప్రాభవమునఁ బేర్చి పరమ దైన్య**
**వృత్తి కోర్వఁదగునె? విన వశమే మాట । లా మరుత్తనూజుఁ డాడ నాకు? 7**

**ప్రతిపదార్థం:** సంజయ!= ఓ సంజయా!. కురురాజు= దుర్యోధనుడు; ఇట్లు= ఈ విధంగా; భీమునిచేతన్= భీమునిచేతిలో; సమయునే?= చనిపోతాడా?; బల శౌర్యములన్= బలపరాక్రమాల విషయంలో; అజయ్యుఁడు+అని= జయించరానివాడని; నమ్మి+ఉండితిన్= నమ్మి ఉంటిని; తనయులు= కొడుకులు; నూర్వురున్= నూరుమందీ; మడియుట= చావటం; వినియున్= విని కూడా; నా మనసు= నా మనస్సు; పెక్కు పఱియలు+ఐ= పోవని భంగిన్= ముక్కలయిపోవని విధం; చూడఁగన్= చూస్తే; ఱాతన్= రాతితో; ఒనరించినది కాఁగన్ ఓవున్= చేసినదై వుండాలి; ఇంకన్= ఇకపై; అడియరితనమునన్= దాస్యంతో; ఆ+పాండవులన్= ఆశ్రయింపఁగన్+చాలన్= ఆశ్రయించలేను; నేను; ఎక్కడ+ఏనిన్= ఎక్కడికైనా; పోదున్+కాక= పోతాను కాని; అట్టి భూపాలు తండ్రిన్+ఐ= అటువంటి మహారాజుకు తండ్రినై; ప్రాభవమునన్= దొరతనంతో; పేర్చి= అతిశయించి; పరమ దైన్య వృత్తికిన్= మిక్కిలి దీనమైన పరిస్థితికి; ఓర్వన్+తగునె?= సహించగలనా?; ఆ మరుత్+తనూజుఁడు= ఆ భీముడు (వాయువు కొడుకు); మాటలు+ఆడన్= నిందించగా; నాకున్; వినన్+వశమే?= వినటానికి సాధ్యమా?

**తాత్పర్యం:** 'ఓయి సంజయా! దుర్యోధనుడు ఈ విధంగా భీముడిచేత దెబ్బతిని చనిపోతాడా? అతడు బలపరాక్రమాలలో ఇతరులకు జయించరానివాడని నమ్మి ఉన్నాను. నూరుగురు కొడుకుల చావు విని కూడా నా మనస్సు ముక్కలు ముక్కలై పోకపోవటం చూస్తే అది రాతితో నిర్మించబడి ఉండాలి. ఇకమీద దాస్యభావంతో ఆ పాండవులను ఆశ్రయించలేను. నేను అటువంటి మహారాజుకు తండ్రినై దొరతనంతో వెలిగి పరమ దైన్యంతో ప్రవర్తించగలనా? ఆ భీముడు పలికిన నిందావాక్యాలు నేను వినగలనా?

**విశేషం:** ధృతరాష్ట్రుడి పలుకులలో, దుర్యోధనుడిమీద అతడికిగల ప్రేమా, భీముడిపై గల ద్వేషమూ స్పష్టపడతాయి.

**వ.** **అని పలికి 'యశ్వత్థామ ప్రభృతు లేమిసేసి?' రనుటయు నజ్జనపతికి సంజయుం డిట్లనియె. 8**

**ప్రతిపదార్థం:** అని; పలికి; అశ్వత్థామ ప్రభృతులు= అశ్వత్థామ మొదలైన వారు; ఏమి+చేసిరి; అనుటయున్; ఆ+జనపతికిన్= ఆ రాజుకు (ధృతరాష్ట్రుడికి); సంజయుండు; ఇట్లు; అనియెన్= సంజయుడు ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని పలికి ధృతరాష్ట్రుడు 'అశ్వత్థామ మొదలైన వీరులు తరవాత ఏం చేశా?' రని అడుగగా అతడితో సంజయుడు ఇట్లా అన్నాడు.

**క. ఇమ్మెయి నా రథికవరులు । గ్రమ్మఱి చని యడవి సొచ్చి కని రొక మడు; వం**
**దిమ్ముల సూతజనులు ర । థ్యమ్ముల నీళ్ళకును దిగువ నప్పుడు దారున్. 9**

**ప్రతిపదార్థం:** ఆ రథిక వరులు= ఆ రథిక శ్రేష్ఠులు; ఈ+మెయిన్= ఈ రీతిగా; క్రమ్మఱి= మరలి; చని= పోయి; అడవి+చొచ్చి= అడవిలో ప్రవేశించి; ఒక మడువున్= ఒక మడుగును; కనిరి= చూశారు; అందున్= ఆ మడుగులో; ఇమ్ములన్= ప్రీతితో; సూత జనులు= రథంతోలేవాళ్ళు; రథ్యమ్ములన్= గుఱ్ఱాలను; నీళ్ళకును= నీళ్ళకోసం; తిగువన్= విడువగా; అప్పుడు; తారున్= తామును (ఆశ్వత్థామాదులునూ).

**తాత్పర్యం:** ఆ అశ్వత్థామాది రథికశ్రేష్ఠులు ఈ రీతిగా మరలిపోయి అడవిలో ప్రవేశించి, ఒక మడుగును చూశారు. రథచోదకులు గుఱ్ఱాలను నీళ్ళ కోసం విడిచిపెట్టగా అప్పుడు తామును. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. రథంబులు డిగ్గి యంబుపానంబు నేసి యామ్రోఁతదెస నాలించుచుండిరి. 10**

**ప్రతిపదార్థం:** రథంబులు; డిగ్గి= దిగి; అంబు పానంబు+చేసి= నీళ్ళు త్రాగి; ఆ మ్రోఁత దెసన్= ఆ ధ్వని వైపు; ఆలించు చున్+ఉండిరి= వింటూ ఉన్నారు.

**తాత్పర్యం:** (అశ్వత్థామాదులు) రథాలు దిగి, నీళ్ళు త్రాగి, ఆ చప్పుడు వచ్చే దిశవైపు చెవులొగ్గి వింటున్నారు.

**తే. అంతఁ బశ్చిమ ధరణీధరాగ్ర పశ్చి । మంబునకుఁ బోయె మార్తాండమండలంబు;**
**సాంధ్యసమయ కృత్యంబులు సలిపి రపుడు । రథికవర్యులు ముప్వురు రాజముఖ్య! 11**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= ఓ రాజశ్రేష్ఠుడా!; ధృతరాష్ట్రా!; అంతన్= తరువాత; మార్తాండ మండలంబు= సూర్యబింబం; పశ్చిమ ధరణీధర+అగ్ర పశ్చిమంబునకున్= పడమటి కొండ కొనవెనుకకు; పోయెన్; అపుడు; రథికవర్యులు ముప్వురున్= రథిక శ్రేష్ఠులు ముగ్గురూ (కృపాశ్వత్థామ కృతవర్మలు); సాంధ్యసమయ కృత్యంబులు= సాయంకాల సంధ్యాసమయోచితాలైన పనులు - సంధ్యావందనాదులు; సలిపిరి= చేశారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అంత సూర్యాస్తమయం అయింది. అప్పుడు ఆ రథికశ్రేష్ఠులైన కృపాశ్వత్థామ కృతవర్మలు ముగ్గురూ సాయంకాల సంధ్యావందనాది కార్యక్రమాలు నిర్వర్తించారు.

**వ. సలిపి నా రొక్క వటవిటపి సమీపంబున నాసీను లై; రా సమయంబున. 12**

**ప్రతిపదార్థం:** సలిపి= చేసి; వారు; ఒక్క వట - విటపి - సమీపంబునన్= ఒక మఱ్ఱిచెట్టు దగ్గర; ఆసీనులు+ఐరి= కూర్చొన్నారు; ఆ సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా చేసి వాళ్ళు ఒక మర్రిచెట్టు దగ్గర ఆసీనులయ్యారు. అప్పుడు (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **వారిముఖమండలములతో వారిజములు । మొగిడె; శోకతమంబుతో నిగిడెఁ దిమిర**
**పటలి; బహు విచారములతోఁ బరఁగఁ బొల్చె । భూత బేతాళ గణములు భూపవర్య! 13**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజశ్రేష్ఠుడవైన ధృతరాష్ట్రా!; వారి ముఖ మండలములతోన్= ఆ ముగ్గురి ముఖబింబాలతోపాటు; వారిజములు= పద్మాలు; మొగిడెన్= ముడుచుకొన్నాయి!; శోకతమంబుతోన్= దుఃఖాంధకారంతోపాటు; తిమిర పటలి= చీకట్ల సమూహం; నిగిడెన్= వ్యాపించింది; బహు విచారములతోన్= (వారికి కలిగిన) పెక్కు ఆలోచనలతోపాటు; భూత బేతాళ గణములు= దయ్యాల, పిశాచాల గుంపులు; పరఁగన్= ఒప్పుగా; పొల్చెన్= ఒప్పాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! ఆ సమయంలో ఆ ముగ్గురి ముఖబింబాలతో పాటు పద్మాలు ముడుచుకొన్నాయి. దుఃఖాంధకారంతోపాటు చీకట్లు వ్యాపించాయి. అనేక ఆలోచనలతోపాటు భూతాలు, పిశాచాలు ఒప్పాయి.

**విశేషం:** అలం: సహోక్తి. కర్తవ్యం బోధపడక ఆ ముగ్గురి ముఖాలూ ముడుచుకొన్నాయి. సాయంసమయం కాబట్టి తామరపువ్వులు ముకుళించాయి. వాళ్ళ ముఖాలు పద్మాలవలె ఉన్నాయన్నమాట. ఏం చేయాలో తోచక వాళ్ళు దుఃఖించారు. చీకట్లు అలముకొన్నాయి. వాళ్ళ దుఃఖం చీకటివలె ఉందన్నమాట. వాళ్ళ మనస్సులలో ఎన్నో ఆలోచనలున్నాయి. భూతాలూ పిశాచాలూ విజృంభించాయి. వాళ్ళ ఆలోచనలు భూతపిశాచాలవలె ఉన్నాయన్నమాట. ఈ విధంగా ఉపమేయోపమానాలకి సహ భావం ఉంది. కాబట్టి ఇందులోని అలంకారం సహోక్తి. ఇట్లా కథతో ప్రకృతిని జోడించి వర్ణించటం బాగు.

**క.** **కలుగు గురుసుతున కెట్లుం । బని చూడ నమరగణ మధికకుతూ**
**హలమున వచ్చెనొ యనఁ జు । క్కలు దోఁచెన్ గగనవీథిఁ గౌరవనాథా!. 14**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కురువంశ రాజా! ధృతరాష్ట్రా!; గురు సుతునకున్= ద్రోణకుమారుడైన అశ్వత్థామకు; ఎట్టున్= ఏ విధంగా అయినా తప్పక; కలహంబు= యుద్ధం; కలుగున్= జరుగుతుంది అని; అమరగణము= దేవతల సమూహం; అధిక కుతూహలమునన్= మిక్కిలి ఆసక్తితో; చూడన్= చూడటానికి; వచ్చెనొ= వచ్చిందా?; అనన్= అన్నట్లు; చుక్కలు= నక్షత్రాలు; గగన వీథిన్= ఆకాశప్రదేశంలో; తోఁచెన్= కనబడ్డాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! 'అశ్వత్థామకు ఎట్లాగూ యుద్ధం సిద్ధిస్తుంది' అని దేవతల సమూహం మిక్కిలి వేడుకతో చూడాలని వచ్చిందా - అన్నట్లుగా ఆకాశంలో నక్షత్రాలు కనబడ్డాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఇందులో ఉపమేయమైన దేవతలను ఉపమానమైన చుక్కలుగా కవి సంభావించాడు కాబట్టి అలంకారం ఉత్ప్రేక్ష. ఇక్కడ కూడా కవి ప్రకృతిని కథతో మేళవించి వర్ణించటం చూడవచ్చు.

**వ.** **ఇట్లు రాత్రి యగుట దివాచరంబు లైన జంతువు లుపశాంత వర్తనంబు లయ్యె; రాత్రించరంబు లైనవి సంచరింపం దొడంగె; నప్పడమ్మువ్వురు నెవ్వగలఁ గూరిన మనంబులతోఁ గురుబలం బకారణంబ పొలియుట**

**యుగ్గడించి తత్సంబంధకలితంబులైన భాషణంబులు సెల్లుచుండనుండి డప్పి గూరి కొండొకసేపునకు మహీ తలంబున మేనులు వైచి వందురుచుండి; రందుఁ గృపకృతవర్ములు నిద్రవొందిరి; గురునందనుండు క్రోధా తిశయంబునం జేసి నిదురవోవక వటవిటపంబు గలయం గనుంగొనువాఁడు తదీయశాఖోపశాఖల నానా కాకంబులు నిలీనంబులై నిద్రించుచుండ నాలోకించె; నయ్యవసరంబున. 15**

**ప్రతిపదార్థం:** ఇట్లు రాత్రి అగుటన్= ఈ విధంగా రాత్రికావటంతో; దివాచరంబులు+ఐన జంతువులు= పగలు సంచరించే ప్రాణులు; ఉపశాంత వర్తనంబులు+అయ్యెన్= ఉడిగిన వ్యాపారాలు గలవి అయినాయి. రాత్రి చరంబులు+ఐనవి= రాత్రి సంచరించేవి; సంచరింపన్+తొడంగెన్= తిరగనారంభించాయి; అప్పుడు ఆ+ముప్పురున్ నెవ్వగలన్ (నెఱ+వగలన్)= మిక్కిలి చింతలతో; కూరిన= నిండిన; మనంబులన్= మనస్సులతో; కురు బలంబు= కురుసేన; ఆకారణంబు+అ= నిష్కారణంగానే; పొలియుట= చావటం; ఉగ్గడించి= చెప్పి; తద్+సంబంధ కలితంబులు+ఐన భాషణంబులు= ఆ సంబంధంతో కూడుకొన్న మాటలు; చెల్లుచున్+ ఉండన్+ఉండి= సాగుతుండగా ఉండి; డప్పి= శ్రమ; కూరి= చెంది; కొండొక సేపునకున్= కొంతసేపటికి; మహీతలంబునన్= నేలమీద; మేనులు= శరీరాలు; వైచి= వేసి; వందురుచున్+ఉండిరి= విచారిస్తూ ఉండినారు; అందున్= వారిలో; కృప కృత వర్ములు= కృపాచార్యుడూ; కృతవర్మా; నిద్ర+పొందిరి= నిద్రపోయారు; గురు నందనుండు= గురుసుతుడు (అశ్వత్థామ); క్రోధ+అతిశయంబునన్+చేసి= కోపాధిక్యంచేత; నిదుర+పోవక= నిద్రించక; వట విటపంబున్= మర్రిచెట్టును; కలయన్= అంతటా; కనుంగొనువాఁడు=చూచేవాడు; తదీయ శాఖా+ఉపశాఖలన్= దాని శాఖలందును ఉపశాఖలందును; నానాకాకంబులు= పెక్కు కాకులు; నిలీనంబులు+ఐ= దాగినవయి; నిద్రించుచున్+ఉండన్= నిద్రిస్తూ ఉండగా; ఆలోకించెన్= చూశాడు; ఆ+ అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఇట్లా రాత్రి అవటంచేత పగలు సంచరించే ప్రాణులు సంచరించటం మానివేశాయి. రాత్రి తిరిగేవి తిరుగనారంభించాయి. అప్పుడు ఆ ముగ్గురూ దుఃఖాక్రాంత మనస్కులై కౌరవసేన నిష్కారణంగా చావటానికి సంబంధించిన మాటలు మాట్లాడుకొంటూ ఉండి, శ్రమచెంది, కొంతసేపటికి నేలమీద మేనులు వాల్చి దుఃఖిస్తూ ఉండిపోయారు. వాళ్ళలో కృపాచార్యుడూ, కృతవర్మడూ నిద్రించారు. కాని, అశ్వత్థామ కోపాతిశయంచేత నిద్రపోక మర్రిచెట్టు అంతటా చూస్తూ దాని శాఖోపశాఖలలో దాగి నిద్రిస్తూ ఉన్న ఎన్నో కాకులను చూచాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** కృపకృతవర్మలకంటె అశ్వత్థామకు బాధ అధికం. ఎందుచేత నంటే అతడి తండ్రిని ధృష్టద్యుమ్నుడు అన్యాయంగా చంపాడు. పైగా తా నిప్పుడు సేనాధిపతి. అందుచేత బాధ్యతకూడా ఉన్నది. ఆ కారణంగా కృప కృతవర్మలు హాయిగా నిద్రపోయారు. కాని అశ్వత్థామకు మాత్రం నిద్రపట్టలేదు.

**సీ. మిడుఁగుఱుగములు గ్రమ్మినయట్లు నిగిడెడు రోచులు గల మిడిగ్రుడ్లుదనర**
**మెఱుఁగారు కెంజాయ మెఱసిన యెఱకల మోపున నెసఁగు పెన్ మ్రోంతతోడఁ**
**గాకుల భీషణాకారత వేళ్ళతో లీలమై నెగసిన శైలమనఁగఁ;**
**గర ముగ్రమగు మొగ మిరుదెస మురియించి యామిషంబుల యిక్క లరసికొనుచు;**

**తే. నచటి బయలెల్లఁ దానయై యక్కజంపుఁ । జందమును, ఘోరమైన నిస్వనముఁ, జండ**
**గతియు భూతవితానభీకరముగా ను । లూక మొక్కటి వచ్చె భూలోకనాథ! 16**

**ప్రతిపదార్థం:** భూలోకనాథ!= రాజా! ధృతరాష్ట్రా!; మిగుఁగుఱు గములు= అగ్నికణాల సమూహాలు; క్రమ్మిన+అట్లు= వ్యాపించిన విధంగా; నిగిడెడు= వెలువడే; రోచులు= కాంతులు; కల= ఉన్న; మిడిగ్రుడ్లు; తనరన్= ఒప్పగా; మెఱుఁగారు (మెఱుఁగు+ఆరు)= మిక్కిలి ప్రకాశించే; కెంజాయన్ (కెంపు+చాయన్)= ఎర్రటి కాంతిచేత; మెఱసిన= మెరిసినట్టి; ఎఱకల= ఈకల యొక్క; మోపునన్= సమూహంచేత; ఎసఁగు= కలిగే; పెన్ మ్రోఁతతోడన్= పెద్దధ్వనితో; కాళుల= కాళ్ళయొక్క; భీషణ+ఆకారతన్= భయంకర స్వరూపంచేత; వేళ్ళతోన్= మూలములతో; లీలమైన్= అలవోకగా; ఎగసిన= ఎగిరిన; శైలము= కొండ; అనఁగన్= అనగా; కరము= మిక్కిలి; ఉగ్రము+అగు= భయంకరమైన; మొగము= ముఖం; ఇరుదెసన్= రెండువైపులకు; మురియించి= త్రిప్పి; ఆమిషంబుల+ఇక్కలు= మాంసములుండే చోట్లు; అరసి కొనుచున్= చూచుకొంటూ; అచటి బయలు+ ఎల్లన్= అక్కడి బహిఃప్రదేశమంతా; తాను+ఆ+ఐ= తానే అయి; అక్కజంపు+చందమును= ఆశ్చర్యకర రూపమూ; ఘోరము+ ఐన= భయంకరమైన; నిస్వనమున్= ధ్వనీ; చండ గతియున్= తీవ్రమైన గమనమూ; భూత వితాన భీకరము+కాన్= ప్రాణికోటికి వెరవు కలిగించేది కాగా; ఉలూకము+ఒక్కటి= ఒక గ్రుడ్లగూబ; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అగ్నికణాల సమూహం వ్యాపించినట్లు వెలువడే కాంతులుగల మిట్టగ్రుడ్లు ఒప్పగాను, మిక్కిలి ప్రకాశించే ఎర్రటికాంతితో మెరిసిపోయే ఈకల సమూహంచేత కలిగే పెద్దధ్వనితోనూ, కాళ్ళ భయంకరాకారంతో సమూలంగా అలవోకగా ఎగిరిన కొండ మాదిరిగానూ, మిక్కిలి భయంకరమైనముఖం రెండువైపులకూ త్రిప్పి, మాంసఖండాలు పడి ఉన్న ప్రదేశాలను అన్వేషిస్తూ అక్కడి బయలంతా తనే అయి, ఆశ్చర్యకరమైన రూపమూ, భయంకరమైన ధ్వనీ, తీవ్రమైన గమనమూ ప్రాణికోటికి వెరపూ పుట్టించగా ఒక గ్రుడ్లగూబ వచ్చింది.

**విశేషం:** అలం: స్వభావోక్తి. కవి గ్రుడ్లగూబని స్వభావసిద్ధంగా వర్ణించాడు. కాబట్టి ఇందులోని అలంకారం స్వభావోక్తి. 'కాళుల..శైల మనఁగ' అనేచోట అలంకారం సంబంధాతిశయోక్తి. ఆకారాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించటం తిక్కన ప్రత్యేకత.

### అశ్వత్థామ యులూకంబు కాకంబులఁ జంపుట నాలోకించుట (సం.10-1-39)

**వ. వచ్చి యన్వటవిటపంబు నూఁది యక్కాకంబుల నాలోకించి యంగంబుల యుద్భటత్వం బుడిసికొని గమ నంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని నాక్రమించి. 17**

**ప్రతిపదార్థం:** వచ్చి; ఆ+వట విటపంబున్= ఆ మర్రిచెట్టుకొమ్మని; ఊఁది= ఆధారంగా చేసికొని; ఆ+కాకంబులన్= ఆ కాకులను; ఆలోకించి= చూచి; అంగంబుల= అవయవాలయొక్క; ఉద్భటత్వంబు= ఆధిక్యాన్ని; ఉడిపికొని= తగ్గించుకొని; గమనంబు= నడక; తిన్నఁదనంబు= మెల్లనితనం; తలకొనన్= ఒప్పగా; చొచ్చి= ప్రవేశించి; వానిన్= ఆ కాకుల్ని; ఆక్రమించి= చుట్టుకొని.

**తాత్పర్యం:** ఆ విధంగా గుడ్లగూబ వచ్చి ఆ చెట్టుకొమ్మను ఆధారంగా చేసికొని ఆ కాకులను చూచి తన అవయవాల అధిక్యాన్ని తగ్గించుకొని, మెల్లగా నడుస్తూ ప్రవేశించి వాటిని చుట్టుకొని (ఆక్రమించుకొని). (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** గుడ్లగూబ అవయవాలు విరివిగా ఉంటే కాకులు ఎగిరిపోతాయి. కాబట్టి అది వాటిని ముడుచుకుంది. అట్లాగే గమనం ప్రచండంగా ఉంటే కాకులు పసిగట్టి ఎగిరిపోతాయి కాబట్టి అది మెలకువతో మెల్లగా నడిచి వచ్చి వాటిని పట్టుకున్నది.

ఉ. కొన్నిటి కంఠముల్ నులుపుఁ, గొన్నిటి కాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటి పక్షముల్ నఱకుఁ గొన్నిటి పొట్టలు వ్రచ్చు లీలమైఁ.
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు, నిట్టు ల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా! 18

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా! ధృతరాష్ట్రా!; కొన్నిటి కంఠముల్= కొన్ని కాకుల పీకలు; నులుపున్= పిసుకుతుంది; కొన్నిటి కాళులు= కాళ్ళు; ఉగ్రతన్= భయంకరత్వంతో; త్రుంచున్= విరగ్గొడుతుంది; పక్షముల్= రెక్కలు; నఱకున్= నరుకుతుంది; లీలమైన్= విలాసంగా; కొన్నిటి; పొట్టలు; వ్రచ్చున్= చీల్చుతుంది; అప్పళించుకొని= అదిమిపట్టుకొని; కోలెముకల్ (కోల+ఎముకల్)= వెన్నెముకలు; నుఱుమాడున్= పొడిచేస్తుంది; ఇట్టులు= ఈ విధంగా; ఆ+అన్నిటిన్= ఆ కాకులను అన్నింటినీ; ఆ+ఉలూకము= ఆ గ్రుడ్లగూబ; రయంబు= వేగం; ఎసఁగన్= అతిశయించగా; వధియించెన్= చంపింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! కొన్ని కాకుల పీకలు నులిమీ, కొన్నింటి కాళ్ళు భయంకరంగా విరుగకొట్టీ, కొన్నింటి రెక్కలు నరికీ, కొన్నిటి పొట్టలు అలవోకగా చీల్చీ, కొన్నిటిని అదిమి పట్టుకొని వెన్నెముకలు పొడిచిచేసీ -ఈ విధంగా ఆ గ్రుడ్లగూబ ఆ కాకులను అన్నింటినీ అతివేగంగా చంపింది.

వ. ఇవ్విధంబున నిద్రావివశంబు లైన యవ్వాయసంబుల వివిధంబులగు వధంబుల గీటడఁగించి యా కౌశికంబు శత్రువులం బొదివి సమయించిన మేటి మగని మాడ్కి మోదంబు నొందినం గని యగ్గురునందనుం డాచందం బొనర్చుటకు డెందంబున నుత్సాహంబు వొడమి పొంగి తనలోన. 18

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; నిద్రా వివశంబులు+ఐన= నిద్రకు స్వాధీనమైన; నిద్రపోతూ ఉన్న; ఆ+వాయసంబులన్= ఆ కాకులను; వివిధంబులు+అగు వధంబులన్= రకరకాల చంపటాలతో; గీటడఁగించి= నాశనంచేసి (చంపి); ఆ+కౌశికంబు= ఆ గ్రుడ్లగూబ; శత్రువులన్= విరోధులను; పొదివి= ఆక్రమించి; సమయించిన= చంపిన; మేటి మగని మాడ్కిన్= గొప్ప శూరునివలె; మోదంబున్= సంతోషం; ఒందినన్= పొందగా; కని= చూచి; ఆ+గురు నందనుండు= ఆ గురు సుతుడు (అశ్వత్థామ); ఆ+చందంబు= ఆ విధంగా; ఒనర్చుటకున్= చేయటానికి; డెందంబునన్= హృదయంలో; ఉత్సాహంబు= వేడుక; పొడమి= పుట్టి; పొంగి= ఉత్సహించి; తనలోనన్= తనలో.

**తాత్పర్యం:** ఆ గ్రుడ్లగూబ ఈ విధంగా నిద్రపోతూ ఉన్న ఆ కాకులను రకరకాలుగా చంపి విరోధులను ఆక్రమించి చంపిన గొప్పవీరుడివలె సంతోషించటం చూచి, ఆ అశ్వత్థామ తాను కూడా ఆ రీతిగా చేయటానికి మనస్సులో వేడుకపడి ఉత్సాహంతో తనలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ. 'ఆ కౌశికంబు...మోదంబు నొందినన్' ఇందులోని అలంకారం పూర్ణోపమ. నిద్రపోతూ ఉన్న కాకులను చంపిన గ్రుడ్లగూబను శత్రువులను చంపిన మేటి వీరుడితో పోల్చటంవలన, మేటివీరుడైన తనుకూడా తన శత్రువులను నిద్రపోతూండగా చంపాలనే కర్తవ్యాన్ని అశ్వత్థామ తెలిసికొన్నాడు కాబట్టి ఈ అలంకారాని కిక్కడ ఎంతో ఔచిత్యం ఉన్నది.

తే. 'ఇవ్విహంగమ ముపదేశ మిచ్చె నాకు । నిద్రవోవంగ శత్రుల నిగ్రహింతు;
నింత లెస్సగునే! ముంద రేమి తెఱఁగు । గాననైతిని నా పూను కార్యమునకు.' 20

**ప్రతిపదార్థం:** ఈ+విహంగమము= ఈ పక్షి; నాకున్; ఉపదేశము+ఇచ్చెన్= ఉపదేశించింది; శత్రులన్= విరోధుల్ని; నిద్ర+పోవంగన్= నిద్రపోతూ ఉండగా; నిగ్రహింతున్= చంపుతాను; ఇంత లెస్స+అగునే!= ఇంత మంచిదౌనా!; నా పూను కార్యము నకున్= నేను పూనుకొన్న పనికి; ముందర= మొదట్లో; ఏమి తెఱఁగు= ఏ విధమూ; కానన్+ఐతిని= కానలేకపోయాను.

**తాత్పర్యం:** 'ఈ పక్షి నాకు కర్తవ్యాన్ని ఉపదేశించింది. శత్రువులను నిద్రపోతూ ఉండగా చంపుతాను. ఈ ఆలోచన ఎంత బాగున్నది! నేను చేపట్టిన పనికి ఇంతకు ముందు ఏం చేయాలో తెలిసింది కాదు.'

**వ. అని వెండియు. 21**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని ఇంకా.

**ఉ. పాండునరేంద్రనందనుల బాంధవ పుత్త్రయుతంబుగాఁగ ను**
**ద్దండత నే వధింతు నని దర్పమెలర్పఁగఁ గౌరవాధినా**
**థుండు వినంగఁ బల్కితిని; దుర్దమ దోర్బలు లమ్మహాత్మకుల్**
**గండున బెట్టు పైఁ బడుట కార్యము గాదు తలంచి చూడఁగన్. 22**

**ప్రతిపదార్థం:** పాండు నర+ఇంద్ర నందనులన్= పాండురాజుకొడుకులైన పాండవులను; బాంధవ పుత్ర యుతంబు కాఁగన్= బంధు పుత్రసహితంగా; ఉద్దండతన్= తెగువతో; ఏన్= నేను; వధింతున్+అని= చంపుతానని; దర్పము= గర్వం; ఎలర్పఁగన్= అతిశయించగా; కౌరవ+అధినాథుండు= కురుపతి దుర్యోధనుడు; వినంగన్= వినేటట్లు; పల్కితివి= అన్నాను; ఆ+మహాత్మకుల్= ఆ మహాత్ములైన; పాండవులు; దుర్దమ దోర్బలులు= అణచరాని భుజబలం గలవాళ్ళు; తలంచి చూడఁగన్= ఆలోచించగా; గండు నన్= గర్వంతో; బెట్టు= గట్టిగా; పైన్+పడుట= మీదపడటం; కార్యము+కాదు= చేయవలసినది కాదు (ప్రయోజనంలేదు).

**తాత్పర్యం:** 'పాండవులను సబంధుపుత్రంగా చంపుతానని నేను తెగించి గర్వాతిశయంతో దుర్యోధనుడితో అన్నాను. ఆ మహాత్ములు అణచరాని భుజబల సంపన్నులు. ఆలోచించగా గర్వంతో గట్టిగా వాళ్ళమీద పడటం మంచిదికాదు.'

**క. అరవాయి గొనక బెట్టుగఁ । బరిగొని యక్కడిఁది మగలపై నడరుట యు**
**ద్ధురగతి నగ్నిజ్వాలో । త్కరముపయిన్ మిడుత యుఱుకు కరణియ కాదే? 23**

**ప్రతిపదార్థం:** అరవాయి కొనక= సందేహించకుండా; బెట్టుగన్= శీఘ్రంగా; పరిగొని= చుట్టుముట్టి; ఆ+కడిఁది మగలపైన్= ఆ మహావీరులపై; అడరుట= విజృంభించటం; ఉద్ధుర గతిన్= తటాలున; అగ్ని జ్వాలా+ఉత్కరము; పయిన్= అగ్నిజ్వాలల సమూహం మీద; మిడుత; ఉఱుకు కరణి+అ+కాదే?= ఉరికే విధమేకదా?

**తాత్పర్యం:** 'సందేహించకుండా శీఘ్రమే చుట్టుముట్టి ఆ మహావీరులమీద విజృంభించటం తటాలున అగ్నిజ్వాలలలో మిడుత ఉరకటం లాంటిదే కదా!'

**విశేషం:** అలం: నిదర్శన 'అక్కడిఁది మగలపై...కరణియ' ఉపమాన వాక్యార్థానికీ ఉపమేయ వాక్యార్థానికీ అభేదం చెప్పటంచేత ఇందులోని అలంకారం నిదర్శన. ఇచ్చట అగ్నిజ్వాలలు పాండవులు, మిడుత అశ్వత్థామ-అనే ధ్వని కన్పడుతూ ఉన్నది.

**వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక మఱిచేసిన నారాజు నిర్గత ప్రాణుండైన నాకెలసం బెవ్వరికెక్కడుఁ? జక్కటితోడి బవరంబున నబ్బలుమగల గెలువరాదని యిట్లురియాడు నా చిత్తంబు చింతాపరంపర వాయ నీ పక్షి విచేష్టితంబు లోచనగోచరంబయ్యెఁ బగతురఁ దెగటార్చునెడ నన్యాయంబనక యుపాయం బెయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్రసిద్ధంబ కాదే? యెట్లనిన. 24**

**ప్రతిపదార్థం:** పాండవులన్; పరిమార్చు పని= చంపే పని; నేఁడు+అ= ఈ రోజే; చేయక= చేయకుండా; మఱి= తరువాత; చేసినన్= చేస్తే; ఆ రాజు= దుర్యోధనుడు; నిర్గత ప్రాణుండు+ఐనన్= చచ్చిపోతే; నా కెలసంబు= నేను చేసినపని; ఎవ్వరికిన్= ఎవరికి; ఎక్కెడున్?= నచ్చుతుంది?; చక్కటి తోడి బవరంబునన్= ధర్మయుద్ధంతో; ఆ+బలు మగలన్= ఆ మహావీరులను; గెలువన్+ రాదు+అని= గెలవటం అశక్యమని; ఇట్లు= ఈ రీతిగా; ఉరియాడు= తటపటాయించే; నా చిత్తంబు= నా మనస్సు లోని; చింతా పరంపర= ఆలోచనల వరుస; పాయన్= పోయేటట్లు; ఈ పక్షి విచేష్టితంబు= ఈ పక్షియొక్క చేష్ట; లోచన గోచరంబు+అయ్యెన్= కనబడింది; పగతురన్= శత్రువుల్ని; తెగటార్చు+ఎడన్= చంపేటప్పుడు; అన్యాయంబు+అనక= అధర్మం అనకుండా; ఉపాయంబు+ఏ+అది= ఏ ఉపాయం; దొరకొనినన్= లభిస్తే; దానన్= దానిలో; ఉత్సహింపన్+వలయుట= ఉత్సాహం చూపాలనటం (ప్రయత్నించటం); శాస్త్ర సిద్ధంబు+అ= శాస్త్రంచేత సిద్ధించేది; కాదే?= కాదా?; ఎట్లు+అనినన్= ఎట్లా అంటే.

**తాత్పర్యం:** పాండవులను నేడు చంపక, తరువాత ఎప్పుడో చంపితే ఈ లోగా దుర్యోధనుడు కన్నుమూస్తే నేను చేసినపనిని ఎవరు మెచ్చుకొంటారు? ధర్మయుద్ధంలో ఆ మహావీరులను చంపటం అశక్యం అని ఇట్లా కళవళపడే నా మనస్సులోని చింత పోయేటట్లు ఈ పక్షి చేష్ట నా కంటపడింది. శత్రువులను చంపేటప్పుడు అధర్మం అనకుండా లభించిన ఉపాయంతో ఉత్సహించాలనటం శాస్త్రసమ్మతమే కాదా! ఎట్లా అంటే. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఉస్మానియా యూనివర్శిటీ వారి ప్రతులలోని...'గోచరం బయ్యు' ననే పాఠంకంటె, తె.వి. ప్రతిలోని '...గోచరం బయ్యెననే పాఠం మేలనిపించింది.

**తే. ఎత్తినప్పుడు, విడియుచో, నిఱుకటంపుఁ । దెరువునందు, నడవు సెడి తిరుగఁబడిన**
**యట్టియెడ, నిద్రవోయెడు నవసరమున । శాత్రవుల బెట్టు పైఁబడి చంపవలయు. 25**

**ప్రతిపదార్థం:** ఎత్తినప్పుడున్ (ఎత్తిన+అప్పుడున్)= దండెత్తినప్పుడూ; విడియుచోన్= విడిదిచేసినప్పుడూ; ఇఱుకటంపుఁ; దెరువునందున్ (ఇఱుకటము+తెరువు)= ఇరుకైన దారిలోనూ; నడపుసెడి= నడక నశించి; తిరుగఁబడిన+అట్టి+ఎడన్= తిరగ బడినప్పుడూ; నిద్ర+ పోయెడు+అవసరమునన్= నిద్రించేటప్పుడూ; శాత్రవులన్= విరోధులను; బెట్టు= క్రూరంగా; పైఁబడి= మీదపడి; చంపవలయున్;

**తాత్పర్యం:** దండెత్తినప్పుడూ, విడిది చేసినప్పుడూ, ఇరుకైన దారిలోనూ, గతిలేక తిరగబడినప్పుడూ, నిద్రించేటప్పుడూ శత్రువులను క్రూరంగా మీదపడి చంపాలి.

**వ. అను నీతివాక్యంబులు విందు; నంగీకృతక్షత్రధర్మ్మం డగు వానికి నిట్టివి కర్తవ్యంబు; లట్లుఁగాక పాండవేయులు పితామహగురులైన భీష్మద్రోణులఁ దెగటార్చునెడం జక్కటిగల తెఱంగున సంగరంబు చేసిరె? యంగరాజును, రారాజును బరిమార్చిన భంగులఁ దలంపంగూడునె? కావునఁ గల్మషోపాయులగు కౌంతేయుల నిద్రా సమయంబున గొబ్బున నిగ్రహించుట నీతియ కాని నింద్యంబుగా' దని నిశ్చయించె; నట్లు క్రూరవ్యవసాయుం డగు నగ్గురుసుతుండు దన మామను, గృతవర్మను మేలుకొల్పి యిట్టి సమయంబున నిద్రించితిమని లజ్జించు చున్న యా రథికవరులతో నిట్లనియె. 26**

**ప్రతిపదార్థం:** అను నీతి వాక్యంబులు= అనే నీతివాక్యాలు; విందున్= వింటాను; అంగీకృత క్షత్రధర్మ్మండు+అగు+వానికిన్= క్షత్రియ ధర్మాన్ని అవలంబించిన వాడికి; ఇట్టివి= ఇటువంటివి; కర్తవ్యంబులు= చేయదగ్గవి; అట్లుఁగాక= అదీగాక; పాండవేయులు= పాండవులు; పితామహగురులు+ఐన= తాతా, గురువూ అయిన; భీష్మ ద్రోణులన్= భీష్మ్ముడినీ, ద్రోణుడినీ; తెగటార్చు+ఎడన్= చంపేటప్పుడు; చక్కటి+కల-తెఱంగునన్= న్యాయమైన విధంగా; సంగరంబు= యుద్ధం; చేసిరె?= చేశారా?; అంగరాజును= కర్ణుడిని; రారాజును= దుర్యోధనుడినీ; పరిమార్చిన భంగులన్= చంపిన పద్ధతులను; తలంపన్+కూడునె?= అనుకోవచ్చా?; కావునన్= కాబట్టి; కల్మష+ఉపాయులు+అగు కౌంతేయులన్= దుష్టమైన ఉపాయాలు గల పాండవులను; నిద్రాసమయంబునన్= నిద్రించే సమయంలో; గొబ్బునన్= వెంటనే; నిగ్రహించుట= చంపటం; నీతి+అ= నీతే కాని; నింద్యంబు= నిందింపదగింది; కాదు+అని= కాదని; నిశ్చయించెన్= నిర్ణయించుకొన్నాడు; అట్లు క్రూర వ్యవసాయుండు+అగు= క్రూరమైన ప్రయత్నం గలవాడైన; ఆ+గురుసుతుండు= ఆ గురుపుత్త్రుడైన అశ్వత్థామ; తన మామను= తన మేనమామ అయిన కృపాచార్యుడిని; కృతవర్మను; మేలుకొల్పి= లేపి; ఇట్టి సమయంబునన్= ఇటువంటి క్లిష్టసమయంలో; నిద్రించితిమి+అని= నిద్రపోయామని; లజ్జించుచున్+ఉన్న= సిగ్గు పడుతూ ఉన్న; ఆ రథికవరులతోన్= ఆ రథికోత్తములతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఏ పద్ధతిని అనుసరించి అయినా శత్రువులను చంపవచ్చును- అనే నీతివాక్యాలు విన్నాను. క్షత్రియధర్మం అవలంబించినవాడికి ఇట్లాంటి పనులు చేయదగినవి. అదీకాక పాండవులు తాత అయిన భీష్మ్ముడిని, గురువైన ద్రోణుడినీ చంపేటప్పుడు న్యాయమార్గంలో యుద్ధం చేశారా? కర్ణుడినీ, దుర్యోధనుడినీ చంపిన రీతులని మనసులోనైనా అనుకొనవచ్చునా? కాబట్టి దుష్టమైన ఉపాయాలు గల పాండవులను నిద్రించేటప్పుడు ఆకస్మికంగా చంపటం నీతే కాని నిందించదగింది కాదని నిర్ణయించుకొన్నాడు. ఆ విధంగా క్రూరమైన ప్రయత్నాన్ని తలపెట్టిన ఆ అశ్వత్థామ తన మేనమామ అయిన కృపాచార్యుడినీ, కృతవర్మనూ మేలుకొలిపి, ఇటువంటి క్లిష్టసమయంలో నిద్రపోయామని సిగ్గుపడుతూ ఉన్న ఆ రథికశ్రేష్ఠులతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** శిఖండిని ముందుపెట్టుకొని భీష్మ్ముడినీ, అస్త్రత్యాగం చేసిన ద్రోణుడిని చంపటంలో పాండవులు న్యాయాన్ని వదలిపెట్టారని ధ్వని.

**సీ. 'మొగ దప్పితిమి రణమున మన మకట! ము । వ్వురము; రారాజు నొక్కరునిఁ బాండు**
**తనయులు దమవారుఁ దారును బెక్కండ్రు । గూడి చుట్టును ముట్టి గుల్లపఱచి;**
**రేకాదశాక్షౌహిణీశ్వరుఁ డట్లొంటి । మెయిఁ జిక్కి పోరుచుండియును బాడి**
**దప్పం; డవ్విభుని నధర్మ విక్రమమునఁ । బాపాత్మకుండగు బకవిరోధి**

ఆ. గూల్చె; నంతఁ బోక కురుదేశ రాజ్యాభి । షిక్తమైన యతని శిరము దన్నెఁ;
బరిభవంబు నొంచెఁ బ్రాణాంతకరవేద । నాతిశయముకంటె నన్నరేంద్రు. 27

**ప్రతిపదార్థం:** అకట! అయ్యో!; మనము ముప్వురమున్= మనం ముగ్గురమూ; రణమునన్= యుద్ధంలో; మొగదప్పితిమి= మొగంతప్పించాము; రారాజున్+ఒక్కరునిన్= దుర్యోధనుడిని ఒక్కడినీ; పాండు తనయులు= పాండురాజు కొడుకులు; తమవారున్= తమవాళ్ళూ; తారును= తామూ; పెక్కండ్రు= అనేకులు; కూడి= కలిసి; చుట్టును ముట్టి= చుట్టుముట్టి; గుల్లపటిచిరి= అవమానిం చారు; ఏకాదశాక్షౌహిణీశ్వరుఁడు= పదకొండు అక్షౌహిణులకు ప్రభువైన దుర్యోధనుడు; అట్లు= ఆ విధంగా అతిదీనంగా; ఒంటిమెయిన్= ఒంటరివాడయి; చిక్కి= నిలిచి; పోరుచున్+ఉండియును= యుద్ధం చేస్తూ ఉన్నప్పటికీ; పాడి= ధర్మం; తప్పఁడు; ఆ+విభునిన్= ఆ రాజును; అధర్మ విక్రమమునన్= అన్యాయమైన పరాక్రమంతో; పాపాత్మకుండు+అగు= దుర్మార్గుడైన; బక విరోధి= బకాసురుడి శత్రువైన భీముడు; కూల్చెన్= పడగొట్టాడు; అంతన్+పోక= అంతటితో ఊరుకోక; కురు దేశరాజ్య+ అభిషిక్తము+ఐన= కురుదేశ రాజ్యమందు అభిషేకించబడిన; అతని శిరమున్= అతడి తలను; తన్నెన్= తన్నివాడు; ఆ+ నర+ఇంద్రున్= ఆ రాజును (దుర్యోధనుడిని); ప్రాణ+అంతకర వేదనా+అతిశయముకంటెన్= ప్రాణంతీసే బాధాధిక్యం కన్నా; పరిభవంబు= అవమానము; నొంచెన్= బాధించింది.

**తాత్పర్యం:** 'అయ్యో! మనం ముగ్గురం యుద్ధంలో దుర్యోధనుడిదగ్గర లేకుండా మొగం తప్పించాము. రాజరాజును ఒక్కడినీ పాండవులు తమ వాళ్ళూ తామూ అనేకులు కలిసి చుట్టుముట్టి అవమానించారు. పదకొండు అక్షౌహిణుల బలానికి ప్రభువైన ఆ రాజరాజు ఆ విధంగా ఒంటరివాడై నిలిచి పోరుతున్నప్పటికీ ధర్మం తప్పడు. అట్లాంటి వాడిని దుర్మార్గుడైన భీముడు అధర్మపరాక్రమం చూపి కూల్చాడు. అంతటితో ఊరుకొనక కురుదేశ రాజ్యాభిషిక్తమైన అతడి శిరస్సును తన్నాడు. ఆ రాజును ప్రాణం తీసే బాధాధిక్యం కంటె. అవమానం అధికంగా బాధించింది.

**విశేషం:** దుర్యోధనుడు ఎంతటి అభిమానవంతుడో అశ్వత్థామ మాటలవలన తెలుస్తుంది.

క. లావును వెరవును గలుగు మ । హా వీరు లనేకు లట్టు లన్నిదినము లా
'భూవిభునకై పెనఁగి జయ । మీ వలఁతులు గాకపోయి రే మనవచ్చున్? 28

**ప్రతిపదార్థం:** లావును= బలమూ; వెరవును= ఉపాయమూ; కలుగు= కల; మహత్+వీరులు= గొప్ప వీరులు; అనేకులు= పెక్కుమంది; అట్టులు= ఆ రీతిగా; అన్ని దినములు= అన్నిరోజులు; ఆ భూవిభునకున్+ఐ= ఆ రాజుకోసం; పెనఁగి= యుద్ధంచేసి; జయము= గెలుపు; ఈన్= ఇవ్వటానికి; వలఁతులు= సమర్థులు; కాకపోయిరి; ఏమి+అనన్+వచ్చున్?= ఏమనాలి?

**తాత్పర్యం:** బలమూ, ఉపాయమూ ఉన్న మహావీరులు అనేకులు ఆ విధంగా అన్ని రోజులు ఆ రాజుకోసం పోరాడి అతడిని గెలిపించలేకపోయారు. ఏమనాలి?

ఆ. ఎవ్వరెంతఁ జేసిరేనియు విధియొండు । దలఁప నా ఫలంబు దలఁగ కేల
యుండు? నిట్లు గాఁగ నున్నది గా; కేమి । యెసకమెసఁగు కౌరవేంద్రు మనువు?' 29

**ప్రతిపదార్థం:** ఎవ్వరు; ఎంతన్= ఎంతటిసాయం; చేసిరి+ఏనియున్= చేసినప్పటికీ; విధి= దైవం; ఒండు= ఇంకొకటి; తలఁపన్= తలిస్తే; ఆ ఫలంబు= ఆ ఫలం; తలఁగక+ఏల+ఉండున్= తొలగకుండా ఎట్లా ఉంటుంది?; ఇట్లు+కాఁగన్+ఉన్నది+కాక= ఇలా కావాలని ఉన్నదికాక; కౌరవ+ఇంద్రు మనువు= దుర్యోధనుడి రక్షణ; ఏమి+ఎసకము+ఎసఁగున్= ఏమి ఒప్పుతుంది?

**తాత్పర్యం:** ఎవరెంత చేసినప్పటికీ దైవం వేరుగా తలిస్తే, ఫలం ఎట్లా దక్కుతుంది? దుర్యోధనుడి రక్షణ ఇట్లా కావలసి ఉండగా, ఏమి ఒప్పుతుంది?

**వ. అని పలుమాటలాడి 'మీ మది కలంగకున్నదేని యీ మహావ్యసనంబునకుఁ గర్తవ్యం బెద్ది చెప్పవలయు' నని నఁ గృపాచార్యుండు ధనురాచార్యనందను మొగంబు గనుంగొని 'నీవు చెప్పఁదలఁచిన యంత వట్టు నుం జెప్పి కార్యం బడిగితేని నాకుఁ దోఁచిన దానిం జెప్పెద విను' మని యిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** అని పలు మాటలు+ఆడి= పెక్కు పలుకులు పలికి; మీ మది= మీ మనస్సు; కలంగక+ఉన్నది+ఏనిన్= చేయదగినదేది; చెప్పవలయున్= చెప్పాలి; అనినన్= అనగా; కృపాచార్యుండు; ధనురాచార్య నందను మొగంబు= ద్రోణుడి కొడుకైన అశ్వత్థామ ముఖం; కనుంగొని= చూచి; నీవు చెప్పన్+తలఁచిన= అంత+పట్టునున్= చెప్పాలనుకున్నదంతా; చెప్పి; కార్యంబు= చేయవలసిన దానిని; అడిగితి(వి)+ఏనిన్= అడిగినట్లయితే; నాకున్ తోఁచిన దానిన్= చెప్పెదన్ వినుము; అని ఇట్లు అనియెన్.

**తాత్పర్యం:** అని పెక్కు పలుకులు పలికి 'మీ మనస్సు కలతచెందక పోతే, ఈ మహాకష్టానికి ఏం చెయ్యాలో చెప్పాలి' అనగా, కృపాచార్యుడు అశ్వత్థామ ముఖం చూచి 'నీవు చెప్పాలనుకున్నదంతా చెప్పి ఏం చేయాలో అడిగితే నాకు తోచింది నేను చెపుతాను. వినుము' అని ఇట్లా అన్నాడు:

### కృపాచార్యుఁ డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱింగించుట (సం.10-2-1)

**సీ. 'ప్రారంభములకెల్లఁ బౌరుషమ్మును దైవ। మును సాధనమ్ములు వినుము వాని**
**లోన నొక్కటి చేతఁ గానేర వనఘ! త। త్ఫల సిద్ధు; లెట్లన్నఁ. దఱచు వాన**
**కారు పొలంబునఁ గల్గె నేనియుఁ గొల్చు। గావింప నేర్చునే? కల విధమున**
**వల నేర్పడఁగ దున్నఁ బొలములో నైన వ। ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె?**

**ఆ. కాఁపు లావు వెరవు గల్గి కర్శనము సే। యంగ, వృష్టి దగినయట్లు గలుగ**
**ఫలము గల్గు; నట్లు పౌరుషంబునకు దై। వంబు తోడుపాటు వలయు నెందు. 31**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా!= ప్రారంభములకున్+ఎల్లన్= ప్రయత్నాలకన్నిటికీ; పౌరుషమ్మును= పురుషకారమూ; దైవమును= దైవమూ; సాధనమ్ములు= సాధనాలు; వినుము; వానిలోనన్= వాటిలో; ఒక్కటిచేతన్= ఒకదానిచేత; తద్+ఫల సిద్ధులు= ఆ ఫలం సిద్ధించటాలు; కాన్+నేరవు= కాజాలవు; ఎట్లు+అన్నన్= ఎట్లా అంటే; తఱచు= అధికంగా; వానకారు= వర్షం; పొలంబునన్= పొలంలో; కల్గెన్+ఏనియున్= కలిగినప్పటికీ; కల విధమునన్= ఎలాగయినా; కొల్చు= ధాన్యం; కావింపన్+నేర్చునే= చేయగలదా?; వలను= నేర్పు; ఏర్పడఁగన్= స్పష్టపడేటట్లు; దున్నన్= దున్నివా; పొలములోన్; ఐన వర్షంబు= కావలసిన వాన; లేక+ఉన్నన్= లేకపోతే; ధాన్యంబులు అగునె?= ధాన్యం పండునా?; కాఁపు= రైతు; లావు= శక్తీ; వెరవు= ఉపాయమూ; కల్గి= కలిగి; కర్శనము+చేయంగన్= దున్నితే; వృష్టి= వర్షం; తగిన+అట్లు= తగినవిధంగా; కలుగన్= కలిగితే; ఫలము కల్గున్= ఫలితం కలుగుతుంది; అట్లు= ఆ విధంగా; ఎందున్= ఏ విషయంలోనైనా; పౌరుషంబునకున్= పురుషప్రయత్నానికి; దైవంబు= దైవంయొక్క; తోడుపాటు= సహాయం; వలయున్= అవసరం.

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన అశ్వత్థామా! అన్ని ప్రయత్నాలకూ పురుషకారమూ, దైవమూ సాధనాలు, వినుము. ఆ రెండింటిలో ఒక దానిచేతనే ఫలసిద్ధి కాజాలదు. ఎట్లా అంటే తరచుగా పొలంలో వానలు కురిసినప్పటికీ రైతు ఏ విధంగానూ ధాన్యం పండించగలడా? నేర్పుతో దున్నినా పొలంలో వర్షం తగినంత కురిస్తేనే ఫలం లభిస్తుంది. అట్లా ఎక్కడైనా పురుషప్రయత్నానికి దైవం తోడుపడాలి.'

**విశేషం:** దైవ ముండి పురుషకారం లేకపోయినా పురుషకార ముండి దైవం లేకపోయినా కార్యం సిద్ధించదు. ఏ కార్యమైనా సిద్ధించాలంటే దైవం పౌరుషం - ఈ రెండూ ఉండాల్సిందే. దైవ పౌరుషాల్లో ఏ ఒక్కదానివలన కార్యసిద్ధి జరుగదు. రెండూ ఉండాలనే సామాన్యాంశం కర్షకుడి కృషీ వానా అనే విశేషాంశంచేత సమర్థింప బడింది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**వ. 'అదియునుం గాక.' 32**

**తాత్పర్యం:** 'అదీ గాక.'

**క. 'తగుపని కుద్యోగించుచుఁ, । దగ వెఱిఁగెడు హితుల కనుమతంబుగఁ జేయన్**
**జగతీ సురవర! కార్యము । లగు; వారికిఁ గలుగు విధి సహాయత్వంబున్.' 33**

**ప్రతిపదార్థం:** జగతీసురవర!= బ్రాహ్మణోత్తమా! అశ్వత్థామా!; తగు పనికిన్= తగినపనికి; ఉద్యోగించుచున్= ప్రయత్నంచేస్తూ; తగవు+ఎఱిఁగెడు హితులకున్= ధర్మవేత్తలైన శ్రేయోభిలాషులకు; అనుమతంబుగన్= సమ్మతంగా; చేయన్= చేస్తే; కార్యములు= పనులు; అగున్= అవుతాయి; వారికిన్; విధి సహాయత్వంబున్= దైవం తోడుపాటు కూడా; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణోత్తమా! అశ్వత్థామా! తగిన పనికి ప్రయత్నిస్తూ ధర్మం తెలిసిన శ్రేయోభిలాషులకు సమ్మతంగా చేసినట్లయితే పనులు నెరవేరుతాయి. వాళ్ళకు దైవం కూడ తోడుపడుతుంది.'

**క. 'ధర్మము దప్పక నయగతిఁ । గర్మాచరణంబు నడపఁగా ఫలసిద్ధిన్**
**నిర్మలయశ మగుఁ; దప్పినఁ, । బేర్మి సెడదె నింద రా నభేద్యోత్సాహా!' 34**

**ప్రతిపదార్థం:** అభేద్య+ఉత్సాహా!= చెక్కు చెదరని ఉత్సాహం కలవాడా - అశ్వత్థామా!; ధర్మం= న్యాయం; తప్పక= తప్పకుండా; నయ గతిన్= నీతిమార్గాన; కర్మాచరణంబున్= కార్యనిర్వహణం; నడపఁగాన్= జరిపినట్లయితే; ఫలసిద్దిన్= ఫలసిద్ధీ; నిర్మల యశము= స్వచ్ఛమైన కీర్తీ; అగున్ తప్పినన్= అలా కాకుంటే; నిందరాన్= అపకీర్తి కలుగగా; పేర్మి= గౌరవం; చెడదె?= నశించదా? (చెడుతుందని భావం).

**తాత్పర్యం:** చెక్కు చెదరని ఉత్సాహం గల అశ్వత్థామా! ధర్మం తప్పకుండా నీతితో పని చేసినట్లయితే ఫలసిద్ధీ, సత్కీర్తీ లభిస్తాయి. అట్లా కాకుంటే అపకీర్తి కలుగుతుంది. గౌరవమూ నశిస్తుంది.

**విశేషం:** 'నీ ఉత్సాహం అభేద్యమే కాని దానిని ధర్మయుక్తమైన పనియెడ చూపించుము. లేకపోతే అపకీర్తి కలిగి గౌరవం నశిస్తుం' దని అశ్వత్థామకు కృపాచార్యుడి హెచ్చరిక. 'దప్పదు పేర్మి సెడదె నిందరా దభేద్యోత్సాహ' అనే ఉస్మానియా యూనివర్శిటీ ప్రతి పాఠముకంటే, నా..తె.వి. ప్రతులలలోని దప్పినఁ బేర్మి సెడదె నిందరా నభేద్యోత్సాహ' అనే పాఠమే మేలనిపించింది.

**ఉ.** **'నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం**
**బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు; భూజను**
**ల్వేతురు; చేటు చేఁతలు ఫలింపక తక్కిన, మున్న వచ్చు న**
**త్యాతురతాస్పదంబు లగు నాపద; లిద్ధ వివేకవైభవా!'** **35**

**ప్రతిపదార్థం:** ఇద్ధ వివేక వైభవా!= మంచి వివేకసంపద గలవాడా! అశ్వత్థామా!; నీతి; తొఱంగి= విడిచి; కార్యములన్= పనులను; నెట్టన= అనాలోచితంగా; ఆగ్రహ వృత్తిన్= పట్టుదలతో; చేసినన్= చేస్తే; ప్రీతిగన్= సంతోషం కలిగేటట్లు; సిద్ధిన్+పొందినను= ఫలించినప్పటికీ; భీతియున్= భయమూ; కుత్సయున్= నిందా; పుట్టున్; భూ జనుల్= ప్రజలు; వేతురు= బాధిస్తారు; చేటు చేఁతలు= దుష్కార్యాలు; ఫలింపక తక్కినన్= ఫలించకపోతే; అత్యాతురతాస్పరంబులు+అగు= అధికమైన బాధకు చోటుఅయిన; ఆపదలు; మిక్కిలి బాధ కలిగించే కష్టాలు; మున్ను+అ= ముందుగానే వచ్చున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** 'మంచి వివేక సంపదగల అశ్వత్థామా! నీతిమాలిన పనులు అనాలోచితంగా వట్టి పట్టుదలతో చేస్తే, సంతోషం కలిగేటట్లు ఒకవేళ అని సిద్ధించినా, భయమూ, నిందా కలుగుతాయి. ప్రజలు బాధిస్తారు. ఆ దుష్కార్యాలు నెరవేరకపోతే మిక్కిలి బాధలకు చోటయిన ఆపదలు ముందు సంభవిస్తాయి.'

**విశేషం:** 'ఇద్ధ వివేకవైభవా! అని అశ్వత్థామని సంబోధించడంలో మంచి వివేకంగల నీవు ఈ సమయంలో పట్టుదలే ప్రధానంగా అనాలోచితంగా పాడుపని చేస్తే దుష్ఫలితాలు అనుభవిస్తావు. అందుచేత వివేకంతో ప్రవర్తించు' మని అతడికి కృపాచార్యుడి ఉపదేశం'....నాపద సిద్ధ వివేక వైభవా' అనే ఉ.యూ.ప్రతులలోని పాఠంకంటె. తె.వి.ప్రతిలోని..నాపద లిద్ధవివేక వైభవా అనే పాఠమే మేలనిపించింది.

**ఉ.** **'క్రోధము, లోభమున్, భయముఁ గూరిన చిత్తముతోడ దుష్క్రియా**
**సాధనవృత్తి దుర్జనుఁడు సజ్జను లాఁగఁగఁ జేయు కార్యముల్**
**బాధలఁ బెట్టకున్నె? సిరి పాయఁగఁ జేయకయున్నె వానిఁ? దీ**
**వ్రాధి నితాంత దుఃఖ హృదయత్వము దేరకయున్నె వానికిన్?'** **36**

**ప్రతిపదార్థం:** క్రోధమున్= కోపమూ; లోభమున్= దురాశా; భయమున్= భయమూ; కూరిన= నిండిన; చిత్తముతోడన్= మనస్సుతో; దుర్జనుఁడు= చెడ్డవాఁడు; సత్+జనులు= మంచివాళ్ళు; అఁగఁగన్= వద్దంటూండగా; దుష్క్రియా సాధన వృత్తిన్= పాడు పనిని సాధించే ప్రవర్తనతో; చేయు కార్యముల్= చేసే పనులు; బాధలన్+పెట్టక+ఉన్నె?= బాధించకుండా ఉంటాయా?; వానిన్= ఆ దుర్మార్గుడిని; సిరి= సంపద; పాయఁగన్+చేయక+ఉన్నె?= కోల్పోయేటట్లు చేయకుండా ఉంటాయా?; వానికిన్= వాడికి; తీవ్ర+అది నితాంత దుఃఖ హృదయత్వము= అధికమైన మనోవ్యాధిచేత మిక్కిలి దుఃఖంతో కూడిన హృదయం; తేరక+ఉన్నె?= తేకుండా ఉంటుందా? కలిగించకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** కోపమూ, దురాశా, భయమూ నిండిన మనస్సుతో దుర్మార్గుడు మంచివాళ్ళు వద్దని వారిస్తున్నా, పాడుపనిని సాధించాలనే అభిప్రాయంతో చేసే పనులు బాధించకుండా ఉంటాయా? ఆ దుర్మార్గుడు సిరిని కోల్పోయేటట్లు చేయకుండా ఉంటాయా? వాడికి తీవ్రమైన మనోవ్యాధితో మిక్కిలి దుఃఖితమైన మనస్సును కలిగించకుండా ఉంటాయా? (తప్పక అట్లా చేస్తాయని భావం).

**చ. వినుము కురుక్షితీశుఁడు వివేక విదూరుఁడు క్రోధలోభముల్**
**మనమునఁ బేర్చినన్ దురభిమానమునన్ హితులెంత చెప్పిన**
**న్వినక బహుప్రకారముల నిందకు నోర్చి పరాభవించె స**
**జ్జనులగు పాండుపుత్రుల; నసత్పథవృత్తికిఁ జేటు దప్పునే?' 37**

**ప్రతిపదార్థం:** వినుము; కురుక్షితి+ఈశుఁడు= కురురాజు దుర్యోధనుడు; వివేక విదూరుఁడు= వివేకానికి మిక్కిలి దూరమైన వాడు; క్రోధ లోభముల్= కోపమూ, దురాశా; మనమునన్= మనస్సులో; పేర్చినన్= అతిశయించగా; దురభిమానమునన్= దుర్గర్వంతో; హితులు= శ్రేయోభిలాషులు; ఎంత చెప్పినన్= ఎంత చెప్పినా; వినక; బహు ప్రకారములన్= అనేకవిధాల; నిందకున్; ఓర్చి= సహించి; సత్+జనులు+అగు= మంచివాళ్ళైన; పాండుపుత్రులన్= పాండవులను; పరాభవించెన్= అవమానించాడు; అసత్+ పథవృత్తికిన్= దుర్మార్గంతో నడిచేవాడికి; చేటు= నాశం; తప్పునే?= తప్పుతుందా?

**తాత్పర్యం:** 'అశ్వత్థామా! వినుము. దుర్యోధనుడు అవివేకి. కోపమూ, దురాశా మనస్సులో అతిశయించగా దుర్గర్వంతో శ్రేయోభిలాషు లెంత చెప్పినా వినిపించుకొనక అనేక విధాల నిందలు పడి, ఉత్తములైన పాండవులను పరాభవించాడు. దుర్మార్గంలో నడిచేవాడికి నాశం తప్పుతుందా?' (తప్పదని భావం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. దుర్యోధనుడు దుర్మార్గుడై పాండవులను పరాభవించి నశించాడనే విశేషాంశం దుర్మార్గుడికి చేటు తప్పదనే సామాన్యాంశం చేత సమర్థించబడింది కాబట్టి ఇక్కడ అలంకారం అర్థాంతరన్యాసం.

**వ. అని పలికి తమ్మునతండు 'మీ మది గలఁగకయున్నదేనిఁ గర్తవ్యంబుఁ జెప్పవలయు' నని యడిగినమాట లుగ్గడించి 38**

**ప్రతిపదార్థం:** అని పలికి; అతండు= అశ్వత్థామ; మీ మది= మీ మనస్సు; కలఁగక+ఉన్నది+ఏనిన్= కలతచెందకున్నట్లయితే; కర్తవ్యంబున్= చేయదగినదానిని; చెప్పన్+వలయున్= చెప్పాలి అని; తమ్మున్= తమను; అడిగిన మాటలు; ఉగ్గడించి= పలికి.

**తాత్పర్యం:** అని పలికి, అశ్వత్థామ 'మీ మనస్సు కలత చెందకున్నట్లయితే చేయదగినదానిని చెప్పా'లని తమను అడిగిన మాటలు గుర్తుచేసి.

**క. 'జగ మెఱుఁగఁగ దుశ్శీలుం। డగు భూనాథుండు వోయినట్టులె పోఁగాఁ**
**దెగడుం జేటుఁ గలిగి వగ। మిగులను మది గలఁగదే యమిత్రధ్వంసీ!' 39**

**ప్రతిపదార్థం:** అమిత్ర ధ్వంసీ!= శత్రునాశకుడా - అశ్వత్థామా!; జగము= లోకం; ఎఱుఁగఁగన్= ఎరిగేలాగా; దుశ్శీలుండు= దుష్టస్వభావుడు; అగు; భూనాథుండు= రాజు; పోయిన+అట్టులు+ఎ+పోఁగాన్= నశించినట్లే నశించగా; తెగడున్= నిందా; చేటున్= కీడూ; కలిగి; వగ= దుఃఖం; మిగులను= అతిశయించగా; మది= మనస్సు; కలఁగదే?= కలతచెందదా?

**తాత్పర్యం:** 'శత్రునాశంకరుడవైన అశ్వత్థామా! లోక ప్రసిద్ధంగా దుష్టస్వభావుడైన రాజు పోయినట్లే పోగా, నిందా, కీడూ కలిగి దుఃఖం అతిశయిస్తే మనస్సు కలతచెందదా? (తప్పక కలత చెందుతుందని భావం.)

**వ. 'అది యట్లుండె మన కిప్పు డిది కర్తవ్యం బని నిశ్చయింప మన మేమి నేర్తుము? తగవు తెఱంగెఱింగిం చెద నాకర్ణింపుము.' 40**

**ప్రతిపదార్థం:** అది; అట్లు+ఉండెన్; మనకున్= మనకు; ఇప్పుడు; ఇది; కర్తవ్యంబు= చేయదగినది అని; నిశ్చయింపన్= నిర్ణయించటానికి; మనము; ఏమి; నేర్తుము?= ఎరుగుదుము?; తగవు తెఱంగు= ధర్మప్రకారం; ఎఱింగించెదన్= తెలుపుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అది అట్లా ఉండనిమ్ము. ఇప్పుడు ఇదీ కర్తవ్యం అని మనం ఏమి నిర్ణయించగలం? ధర్మ ప్రకారం చెపుతాను వినుము.

**క. 'మన మందఱమును ధృతరా । ష్ట్రుని కడకుం బోయి కార్యసూత్ర మతనిచే**
**వినవలయు; నాతఁ డెయ్యది । గని పలికిన నదియ మనకుఁ గర్తవ్య మగున్.' 41**

**ప్రతిపదార్థం:** మనము; అందఱమును; ధృతరాష్ట్రుని కడకున్= ధృతరాష్ట్రుడి దగ్గరకు; పోయి= వెళ్ళి; అతనిచేన్= అతడినుంచి; కార్యసూత్రము= కర్తవ్యం యొక్క క్రమం; వినన్+వలయున్= వినాలి; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; ఎయ్యది= ఏది; కని= చూచి; పలికినన్= చెపితే; అది+అ= అదే; మనకున్= మనకు; కర్తవ్యము+అగున్= చేయదగినది అవుతుంది.

**తాత్పర్యం:** 'మనం అందరం ధృతరాష్ట్రుడి దగ్గరకు పోయి అతడివలన కర్తవ్యం వినాలి. అతడు ఆలోచించి ఏమి చెపితే అదే మనకు కర్తవ్యం అవుతుంది.'

**వ. అమ్మహీకాంతుండు. 42**

**ప్రతిపదార్థం:** ఆ+మహీ కాంతుండు= ఆ రాజు - ధృతరాష్ట్రుడు

**తాత్పర్యం:** అని పలికి, అశ్వత్థామ 'మీ మనస్సు కలత చెందకున్నట్లయితే చేయదగినదానిని చెప్పా'లని తమను ఆ ధృతరాష్ట్రుడు అడిగిన మాటలు గుర్తుచేసి.

**క. తానును గాంధారియు నె । ద్దానిం గార్యంబు గాఁగఁ దలఁచి పనిచినన్**
**దానికిఁ గా దన వలవదు; । పూని యనుష్ఠింత; మదియ పొగ డొందించున్. 43**

**ప్రతిపదార్థం:** తానును= ఆ ధృతరాష్ట్రుడూ; గాంధారియున్= అతడి భార్య గాంధారీ; ఏ+దానిన్= దేనిని; కార్యంబు+కాఁగన్= కర్తవ్యంగా; తలఁచి= ఎంచి; పనిచినన్= ఆజ్ఞాపించినా; దానికిన్; కాదు+అనన్+వలవదు= కాదనవద్దు; పూని= ప్రయత్నించి; అనుష్ఠింతము= చేద్దాం; అది+అ= అదే; పొగడు= కీర్తి; ఒందించున్= పొందేటట్లు చేస్తుంది.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడూ, అతడి భార్య గాంధారీ ఏది కర్తవ్యమని చూచి ఆనతిస్తే దానిని కాదనకుండా పూనికతో ఆచరిద్దాము. అదే మనకు కీర్తి కలిగిస్తుంది.

**వ. వారలకడ విదురుండు నుండు నమ్మువ్వురు విచారించి చెప్పిన కార్యంబునకు నిందగలుగ; దట్లుంగాకయెట్లు పొరలినను దైవోపహతంబు లగు కార్యంబులు సిద్ధిఁ బొందునె? యడిచిపడవలవదు. విచారించి కొంద' మనవుడు శోక దందహ్యామానమానసుం డగుచు నగ్గురపుత్రుండు కృతవర్మను నతని నాలోకించి. 44**

**ప్రతిపదార్థం:** వారల కడన్= ఆ గాంధారీ ధృతరాష్ట్రులదగ్గర; విదురుండున్= విదురుడుకూడా; ఉండున్= ఉంటాడు; ఆ+ మువ్వురున్= ఆ ముగ్గురు-గాంధారీ ధృతరాష్ట్ర విదురులు; విచారించి= ఆలోచించి; చెప్పిన కార్యంబునకున్= చెప్పిన కర్తవ్యానికి; నింద కలుగదు; అట్లున్+కాక= అదీకాక; ఎట్లు= ఎట్లా; పొదలినను= దొర్లినా (శ్రమపడ్డా); దైవ+ఉపహతంబులు= దైవంచేత కొట్టబడినవి అగు; కార్యంబులు= పనులు; సిద్ధిన్+పొందునె?= ఫలిస్తాయా?; అడిచిపడన్+వలవదు= తొందరపడవద్దు; విచారించికొందము= ఆలోచించుకుందాము; అనవుడున్= అనగానే; శోక దందహ్యమాన మానసుండు= దుఃఖంచేత దహింపబడుతూ ఉన్న మనస్సు గలవాడు; అగుచున్= అవుతూ; ఆ+గురు పుత్రుండు= ఆ అశ్వత్థామ; కృతవర్మను= కృతవర్మనూ; అతనిన్= కృపాచార్యుడినీ; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** 'ఆ గాంధారీ ధృతరాష్ట్రుల దగ్గర విదురుడు కూడా ఉంటాడు. ఆ ముగ్గురూ ఆలోచించి చెప్పిన పనికి నింద ఉండదు. అదీగాక ఎంత శ్రమించినా దైవదూషితాలైన కార్యాలు ఫలిస్తాయా? తొందరపడవద్దు. ఆలోచించుకుందాము.' అనగానే దుఃఖంచేత దహించబడుతూన్న మనస్సుగల అశ్వత్థామ కృతవర్మనీ, కృపాచార్యుడినీ చూచి

అశ్వత్థామ కృపాచార్య కృతవర్మలతోఁ దనపూన్కి స్థిరీకరించుట (సం.10-3-1)

**సీ.** **వెరవిట్టి తెఱఁ గిది వెంగలితనమని, । యెల్లవాఁడును దన యెఱిఁగినట్టి**
**తెఱఁగున నిజకార్య దృష్టియ కయికొను । నొరుల నేర్పులు పట్టనొల్లఁ; దాత్మ**
**బుద్ధియ మే లని పొగడు; నన్యుల చిత్త । వృత్తుల నిందించు; వివిధగతులఁ**
**జెందెడు నాత్మీయ చేతః ప్రవర్తన । మరయఁడు; దాన బాల్యమున దలఁచు**

**ఆ.** **తలఁపు గీడుచేసి, యెలప్రాయమున నొండు । తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి;**
**ముదిమి వచ్చినతఱి నదియును విడిచి య । న్యంబు లైన నేర్పు లాచరించు.** **45**

**ప్రతిపదార్థం:** వెరవు= నేర్పు; ఇట్టి తెఱఁగు= ఈ విధమైనది; ఇది; వెంగలితనము= వెర్రితనము అని; ఎల్లవాఁడును= ప్రతీవాడూ; తన+ఎఱిఁగిన+అట్టి= తనకు తెలిసినట్టి; తెఱఁగునన్= విధంగా; నిజ కార్యదృష్టి+అ= తన పనియందు చూపే; కయికొనున్= స్వీకరిస్తాడు; ఒరుల నేర్పులు= ఇతరుల నేర్పులు; పట్టన్= స్వీకరించటానికి; ఒల్లఁడు= ఇష్టపడడు; ఆత్మబుద్ధి+అ= తన తలపే; మేలు+అని= మంచిదని; పొగడున్= పొగడుకుంటాడు; అన్యుల= ఇతరుల; చిత్తవృత్తులన్= మనోభిప్రాయాలను; నిందించున్= తిట్టుతాడు, ఒప్పుకోడు; వివిధగతులన్+చెందెడు= అనేకవిధాలుగా ఉండే; ఆత్మీయ చేతన్+ ప్రవర్తనము= తన చిత్తవృత్తిని; అరయఁడు= చూడడు; తాను+అ= తనే; బాల్యమునన్= చిన్నతనంలో; తలఁచు తలఁపు= చేసే ఆలోచనను; కీడుచేసి= తిరస్కరించి; ఎల ప్రాయమునన్= యౌవనంలో; ఒండు తలఁపు+అందున్= ఇంకో అభిప్రాయంపై; ప్రీతిన్= ఇష్టాన్ని; పట్టుకొలుపున్= నిలుపుతాడు; ముదిమి= ముసలితనం; వచ్చిన; తఱిన్= వచ్చినప్పుడు; అదియును= ఆ అభిప్రాయాన్ని; కూడా; విడిచి; అన్యంబులు+ఐన= వేరైన; నేర్పులు; ఆచరించున్= చేస్తాడు.

**తాత్పర్యం:** నేర్పు ఈ విధమైనది. ఇది వెర్రితనం అని ప్రతీవాడూ తనకు తెలిసిన విధంగా తన పనియందలి చూపే మంచిదని భావిస్తాడు. ఇతరుల నేర్పులను అంగీకరించడు. తన తలపే మంచిదని పొగడుకొంటాడు. ఇతరుల మనోభిప్రాయాలను నిందిస్తాడు. తన ఆలోచనలు నిలకడగా ఉండక రకరకాలుగా ఉండటం గమనించడు.

తమ చిన్నతనంలో ఏర్పరచుకొన్న అభిప్రాయాలను తిరస్కరించి, యౌవనం వచ్చాక వేరే అభిప్రాయంపై మక్కువ చూపుతాడు. ముసలితనం వచ్చినప్పుడు అదికూడా విడిచిపెట్టి వేరే నేర్పులను ఆచరిస్తాడు.

**విశేషం:** 'నా పరిస్థితిని నా చూపుతో అర్థం చేసికొని నా అభిప్రాయాలను మన్నించు' మని అశ్వత్థామ కృపాచార్యుడిని సాధారణీకరించి వేడుకొనటం గమనార్హం.

**క. ఆపదఁ బడి యొక్కఁడు స । ద్వ్యాపారము గాఁగఁ జూచి దాని నడవు; శ్రీ**
**ప్రాపించిన నరుఁ డొండొక । చూపున వర్తించు నది విశుద్ధపదముగన్. 45**

**ప్రతిపదార్థం:** నరుఁడు= మనుష్యుడు; ఆపదన్= ఆపదలో; పడి= చిక్కుకొని; ఒక్కఁడు= ఒక్కటి- ఒక పనిని; సద్వ్యాపారము+కాఁగన్+చూచి= మంచి పనిగా భావించి; దానిన్= ఆ పనిని; నడపున్= ఆచరిస్తాడు; శ్రీ= సంపద; ప్రాపించినన్= కలిగితే; ఒండొక= వేరొక; చూపునన్= దృష్టితో; అది= ఆ చూపు; విశుద్ధ పదముగన్= మిక్కిలి పవిత్రమైనదిగా అత్యుత్తమమైనదిగా వర్తించున్= ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** మానవుడు ఆపదలో ఉన్నప్పుడు ఒకపని మంచిదని భావించి దానిని ఆచరిస్తాడు. సంపద వచ్చినప్పుడు వేరే చూపుతో అది ప్రశస్తమని భావించి ప్రవర్తిస్తాడు.

**విశేషం:** 'యుద్ధంలో తండ్రిని అన్యాయంగా కోల్పోయి నేను ఆపదలో ఉన్నాను. నా చూపు ఒక విధంగా ఉంటుంది. అది మంచిదని నా అభిప్రాయం. నీ కట్లాంటి ఆపదలేదు. కాబట్టి నీ చూపు వేరుగా ఉంటుంది. అదే మంచిదని నీ అభిప్రాయం. నా పరిస్థితిని బట్టి నా చూపును అర్థం చేసికొనుము' అని అశ్వత్థామ కృపుడిని వేడుకొంటున్నాడు.

**క. తగునని మరణాదులకై । తెగువదెసన్ మానవుండు దృఢనిశ్చయతం**
**దగిలినయది పరమహితం । బుగ వదలక నడుపు నన్యబుద్ధులు గొనమిన్. 47**

**ప్రతిపదార్థం:** మానవుండు= మనుష్యుడు; మరణ+ఆదులకై= చావూ మొదలైన వాటికి; తెగువదెసన్= సాహసంవైపు; తగున్+అని= తగినదని; దృఢనిశ్చయతన్= గట్టి నిర్ణయంతో; తగిలిన+అది= ఇష్టపడినది; పరమ హితంబునన్= మిక్కిలి మేలయినదని; వదలక= విడువక; అన్యబుద్ధులు= ఇతరుల తలంపులు; కొనమిన్= స్వీకరించిక పోవడం; నడుపున్= చేస్తాడు (అన్యబుద్ధులను స్వీకరించడు).

**తాత్పర్యం:** మనుష్యుడు మరణాదులకు కూడా తెగించి ఒక పని మంచిదని దృఢనిశ్చయంతో ఇష్టపడి, దానిని మిక్కిలి మేలయినదని వదలక, ఇతరుల తలంపులను తోసి పుచ్చుతాడు.

**వ. 'మీ రెఱుంగనియది లేదు. నాకుం దోఁచిన కర్జంబు మన కందఱకును శోకనాశంబగునట్టిది, దాని వినుండు చెప్పెదఁ బ్రజాపతి ప్రజల సృజించి విప్రునకు దమంబును, క్షత్రియునకుఁ దేజంబును, వైశ్యునకు దక్షత్వంబును, శూద్రునకుఁ ద్రివర్ణానుకూలతయు వలయు గుణంబులుగా విధించెం గావున శాంతుండు గాని విప్రుండును, దేజస్విగాని రాజును, దక్షుండుగాని వైశ్యుండును, ద్రివర్ణానుకూలుండుగాని శూద్రుండును నిందం బడుదు; రదియట్లుండె; నేనును విప్రకులంబునందు జన పూజితం బైవ వంశంబునందు జనియించిభాగ్యహీనతవలన**

**రాజోచిత ధర్మం బనుష్ఠించితి, నడుమ నా నిష్ఠ వదలి విప్రధర్మంబు మహనీయంబైన, నది యాచరించు వాడనగుట నా మదికిం జూడమేలై యుండ దదియుంగాక. 48**

**ప్రతిపదార్థం:** మీరు; ఎఱుంగని+అది= తెలియనిది లేదు; నాకున్= నాకు; తోచిన కర్జంబు= తోచిన కార్యం; మనకున్= అందఱకును; శోకనాశంబు+అగు+అట్టిది= శోకాన్ని పోగొట్టేది; దానిన్; వినుండు; చెప్పెదన్; ప్రజాపతి= బ్రహ్మ; ప్రజలన్= ప్రజలను; సృజించి= పుట్టించి; విప్రునకున్= బ్రాహ్మణుడికి; దమంబును= ఇంద్రియ నిగ్రహమూ; క్షత్రియునకున్= రాజుకు తేజంబును; వైశ్యునకున్= కోమటికి; దక్షత్వంబును; సామర్థ్యమూ; శూద్రునకున్; త్రివర్ణ+అనుకూలతయున్= మూడు వర్ణాల వారికీ అనుకూలంగా ఉండటమూ; వలయు గుణంబులు+కాన్= కావలసిన గుణాలుగా; విధించెన్= ఏర్పరిచాడు; కావునన్; శాంతుండు+కాని= శాంతగుణంలేని; విప్రుండును= బ్రాహ్మణుడూ; తేజస్వి+కాని రాజును= తేజస్వంతుడు కాని రాజూ; దక్షుండు+కాని వైశ్యుండును= సమర్థుడుకాని కోమటీ; త్రివర్ణ+అనుకూలుండు+కాని శూద్రుండును= మూడు వర్ణాల వారికీ అనుకూలుండు కాని శూద్రుడూ; నిందన్+పడుదురు= నింద్యులవుతారు; అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉండగా; ఏనును= నేనుకూడా; విప్ర కులంబు+అందున్= బ్రహ్మణకులంలో; జనపూజితంబు+ఐన= జనులు పూజించే; వంశంబు+ అందున్= వంశంలో; జనియించి= పుట్టి; భాగ్య హీనతవలనన్= దౌర్భాగ్యవశంచేత; రాజు+ఉచిత ధర్మంబు= క్షత్రియుడికి ఉచితమైన ధర్మం; అనుష్ఠించితిన్= ఆచరించాను; నడుమన్= మధ్యలో; ఆ నిష్ఠ= ఆ బ్రాహ్మణాచారాన్ని వదలి; విప్రధర్మంబు= బ్రాహ్మణధర్మం; మహనీయంబు+ఐనన్= గొప్పది కదా అని; అది ఆచరించువాఁడన్+అగుట= అనుష్ఠించే వాడిని కావటం; నా మదికిన్+చూడన్= నా మనస్సుకి చూస్తే; మేలు+ఐ+ఉండదు= బాగా ఉండదు; అదియున్+కాక= అదీగాక.

**తాత్పర్యం:** మీకు తెలియనిది లేదు. నాకు తోచినకార్యం మన కందరికీ శోకం పోగొట్టేది. దానిని వినండి, చెపుతాను. బ్రహ్మ ప్రజలను సృష్టించి బ్రాహ్మణుడికి ఇంద్రియనిగ్రహమూ, క్షత్రియుడికి తేజస్సూ, కోమటికి దక్షతా, శూద్రుడికి త్రివర్ణానుకూలతా ఉండవలసిన గుణాలుగా నిర్ణయించాడు. కాబట్టి, శాంతగుణం లేని బ్రాహ్మణుడూ, తేజస్వంతుడు కాని క్షత్రియుడూ, దక్షతలేని కోమటీ, త్రివర్ణానుకూలత లేని శూద్రుడూ నింద్యులవుతారు. అది అట్లా ఉండనిమ్ము. నేను కూడా జనులు పూజించే బ్రాహ్మణ వంశంలో పుట్టి నా దౌర్భాగ్యవశంచేత క్షత్రియోచిత ధర్మం ఆచరించాను. మధ్యలో ఆ ఆచారం వదలి, బ్రాహ్మణధర్మం మహనీయమైనది కదా! అని మళ్ళీ దానిని ఆచరించటం నాకు నచ్చదు. అదీగాక. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'మేటి విల్లును దివ్యాస్త్ర కోటియును ధ । రించి మెఱయంగ నాజి వధించెఁ దండ్రి**
**నొకఁడు; వాఁడును రూపుతో నుండు నట్టె । యెట్లు తలయెత్తి మెలఁగుదు నేను జెపుఁడ?' 49**

**ప్రతిపదార్థం:** మేటి విల్లును= గొప్ప ధనుస్సునూ; దివ్య+అస్త్ర కోటియును= దివ్యాలైన అస్త్రాల సమూహాన్నీ, ధరించి= తాల్చి; మెఱయంగన్= ప్రకాశిస్తూ ఉండగా; తండ్రిన్= నా తండ్రియైన ద్రోణుడిని ఒకడు; ఆజిన్= యుద్ధంలో; వధించెన్= చంపాడు; వాడును; రూపుతోన్= రూపంతో; సజీవుడై; ఉండున్+అట్టె!= ఉన్నాడట!; నేను; ఎట్లు; తల+ఎత్తి= తలెత్తుకుని సిగ్గుతో; తలవంచుకోకుండా; మెలఁగుదున్= ఉంటాను; చెపుఁడ?= చెప్పండి?

**తాత్పర్యం:** గొప్ప విల్లూ, దివ్యాస్త్రాలూ ధరించి మెరిసిపోతూ ఉండగా నా తండ్రిని యుద్ధంలో ఒకడు చంపాడు. వా డింకా సజీవుడై ఉన్నాడు. నేను సిగ్గుతో తలవంచుకొనకుండా ఎట్లా తలెత్తుకొని తిరుగుతానో మీరే చెప్పండి.

**విశేషం:** అశ్వత్థామ తన తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుడి పేరు ఉచ్చరించటానికి కూడా అసహ్యించుకొంటున్నాడు. అందుచేతనే అతడి పేరు చెప్పకుండా 'ఒకడు' అని మాత్రం అన్నాడు.

**క. వాఁడు మొదలుగాఁ బగతుర । వాఁడి గలుగు తూపుగముల వలన మెఱసి యే**
**నేఁడు వధింతును; నెవ్వగ । వేఁడిమిఁ బడఁజాల కొక్క వెరవుఁ దలఁచితిన్. 50**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ పితృహంత అయిన దుర్మార్గుడు ధృష్టద్యుమ్నుడు; మొదలు+కాన్= మొదలుకొని; పగతురన్= శత్రువులను; వాఁడి= పదును; కలుగు; తూపుగముల= బాణ సమూహాల; వలన; మెఱసి= ప్రకాశించి; ఏన్= నేను; నేఁడు= ఈ వేళ; వధింతును= చంపుతాను; నెఱ+వగ= నిండు దుఃఖంయొక్క; వేఁడిమిన్; పడన్+చాలక= భరించలేక; ఒక్క వెరవు= ఒక ఉపాయం; తలఁచితిన్= ఆలోచించాను.

**తాత్పర్యం:** ఆ దుర్మార్గుడైన ధృష్టద్యుమ్నుడు మొదలుగా శత్రువులను పదునుగల అస్త్రాల సముదాయంతో నేర్పు ప్రకటించి నేను ఈ వేళ వధిస్తాను. దుఃఖాగ్నితాపం భరించలేక ఒక ఉపాయం ఆలోచించాను.

**క. లే దింకం బగ యని ధను । రాదుల దెస వాహనముల యందును సంత్య**
**క్తాదరులై పగతురు నేఁ । డాదమఱచి నిద్రవోదు; రని తఱి పాడునన్. 51**

**ప్రతిపదార్థం:** పగతురు= శత్రువులు; ఇంకన్; పగ= వైరం; లేదు అని; ధనురాదుల దెసన్= విల్లులు మొదలైన వాని విషయంలోనూ; వాహనముల+అందును= వాహనాల విషయంలోనూ; సంత్యక్త+అదరులై= విడిచి పెట్టబడిన జాగ్రత్త కలవారయి; నేఁడు= ఈ నాడు; ఆదమఱచి= ఏమరుపాటు గలిగి; నిద్ర+పోదురు= నిద్రపోతున్నారు; అది; పాడునన్= చంపటానికి; తఱి= సమయం.

**తాత్పర్యం:** శత్రువులు ఇంక పగ లేదని విల్లులు మొదలైన వాటి విషయంలోనూ, వాహనాల విషయంలోనూ జాగ్రత్తపడకుండా ఈనాడు ఏమరుపాటుతో నిద్రపోతున్నారు. చంపటానికి ఇది తరుణం.

**ఆ. ఓడిపోయి దప్పినూని గట్టును చెట్టుఁ । జేరి యొదిఁగి యున్నవారిఁ గాఁగ**
**మనలఁ దలఁతు రరులు; మనముల నావంత । శంకలేదు; సంతసంబు ఘనము. 52**

**ప్రతిపదార్థం:** ఓడిపోయి; డప్పిన్+ఊని= దప్పిచెంది; గట్టును+చెట్టున్= గట్టూ చెట్టూ; చేరి; ఒదిఁగి+ఉన్నవారిన్+కాఁగన్= దాగియున్న వాళ్ళనుగా; అరులు= శత్రువులు; మనలన్= మనలను; తలఁతురు= భావిస్తారు; అవ+అంత= అవగింజంతైనా-కొంచెంకూడా; శంక= అనుమానం లేదు; సంతసంబు= సంతోషం; ఘనము= అధికం.

**తాత్పర్యం:** యుద్ధంలో ఓడిపోయి, దప్పిచెంది గట్టూచెట్టూ పట్టి దాగుకొని ఉన్నామని మనలను శత్రువులు భావిస్తారు. వాళ్ళకి ఆవంతైనా అనుమానం లేదు. పైగా సంతోషం అధికం.

**చ. మదమునఁ దేలి యేనుఱిన మార్తుర దాడిగఁ బోయి బెట్టు ము**
**ట్టెద; శరజాల సత్వర పటిష్ఠతఁ బల్వురఁ ద్రుంతుఁ; గొందఱం**

**జదువుదు నుల్లసత్పరిఘసంహననంబునఁ; గొన్ని కంఠముల్**
**చిరుముదు నేల రక్తపరిషిక్తముగాఁ గరవాల ధారలన్. 53**

**ప్రతిపదార్థం:** (నేను-కర్త); మదమునన్= గర్వంతో; తేలి= ఆనందించి; ఏమఱిన మార్తురన్= పరాకుపడియున్న శత్రువులను; దాడిగన్+పోయి= దండెత్తిపోయి; బెట్టు= శీఘ్రంగా; ముట్టెదన్= తాకుతాను; శరజాల సత్వర పటిష్ఠతన్= బాణ సమూహంయొక్క వేగంతో కూడిన అమిత పటుత్వంతో; పల్వురన్= అనేకులను; త్రుంతున్= ఖండిస్తాను; కొందఱన్= కొంతమందిని; ఉల్ల సత్+పరిఘ సంహననంబునన్= ప్రకాశించే శూలాయుధాల సముదాయంతో; చదుపుదున్= చంపుతాను; కొన్ని కంఠముల్= కొన్ని పీకలు; నేల= భూమి; రక్త పరిషిక్తము+కాన్= రక్తంతో తడిసింది కాగా; కరవాల ధారలన్= కత్తుల అంచులతో; చిదుము దున్= కోస్తాను.

**తాత్పర్యం:** జయగర్వంతో తేలిపోతూ పరాకుగా ఉన్న శత్రువులపైకి నేను దండెత్తిపోయి శీఘ్రంగా తాకుతాను. బాణాల సత్వరమైన పటుత్వంతో అనేకులను ఖండిస్తాను. కొందరిని ప్రకాశించే ఇనుపగుదియల సమూహంతో చంపుతాను. నేల రక్తంతో తడిసేటట్లుగా కొన్ని పీకలను కత్తులతో కోస్తాను.

**తే. గెలుపు నూఱట నొదవు నగ్గలపు నిద్రఁ। బీనుఁగులుఁ బోలె నున్న యా బిరుదుమగలఁ**
**జంపి పీనుంగుఁబెంట గావింపవలయు। శిబిర మెల్లను భూతముల్ సెలఁగుచుండ. 54**

**ప్రతిపదార్థం:** గెలుపు+ఊఱటన్= జయంవల్ల కలిగిన ఓదార్పుతో; ఒదవు= పుట్టే; అగ్గలపు నిద్రన్= అధికమైన నిద్రతో; పీనుఁగులున్+పోలెన్= శవాలలా; ఉన్న; ఆ బిరుదు మగలన్= ఆ శక్తివంతులైన; వీరులను; చంపి; శిబిరము+ఎల్లను= విడిది అంతా; భూతముల్= పిశాచాలు; చెలఁగుచున్+ఉండన్= విజృంభిస్తూండగా; పీనుంగు పెంట= పీనుగుల పెంట; కావింపన్+ వలయున్= చేయాలి;

**తాత్పర్యం:** జయంవలన కలిగిన ఓదార్పుతో పుట్టే అధికమైన నిద్రపొంది శవాలవలె ఉన్న సమర్థులైన వీరులను చంపి విడిది మొత్తం పిశాచాలు విజృంభించేటట్లు పీనుగులపెంట చేయాలి.

**వ. అని వెండియు. 55**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని పలికి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కరి హయ నర శవముల భ। గ్న రథంబుల నెరసి ద్రుపదనందనగాత్రో**
**త్కరము పడియుండఁ జూడక। పరిభవతాపోపశాంతి వడయఁగ నగునే? 56**

**ప్రతిపదార్థం:** కరి హయ నర శవములన్= ఏనుగుల, గుర్రాల, మనుష్యుల పీనుగులతోనూ; భగ్న రథంబులన్= విరిగి పోయిన రథాలతోనూ; నెరసి= నిండి; ద్రుపద నందన గాత్ర+ఉత్కరము= ద్రుపదుడి కొడుకైన ధృష్టద్యుమ్నుడి అవయవాల సమూహం; పడి+ఉండన్= పడి ఉండగా; చూడక= చూడకపోతే; పరిభవ తాప+ఉపశాంతి= అవమానం వల్ల కలిగే తాపం యొక్క ఉపశమనం; పడయఁగన్+అగునే?= పొందటానికి శక్యమా?

**తాత్పర్యం:** ఏనుగుల, గుర్రాల, మనుష్యుల పీనుగులోనూ, విరిగిన రథాలతోనూ నిండి ధృష్టద్యుమ్నుడి అవయవాల సమూహం పడి ఉండటం చూడకపోతే అవమానాగ్ని తాపం చల్లారుతుందా? (చల్లారదని భావం).

**శా. ధృష్టద్యుమ్నుని ముట్టి పట్టుదు; మదోద్రేకం బడంగింతు; ను**
**త్కృష్టాస్త్రంబులఁ జంప; నల్క పశుభంగిం జంపినం గాని పో;**
**దిష్టావాప్తి యనంగ నా కిదియె కాదే యిప్డు? కౌంతేయులన్**
**గష్టస్వైరవిధాభియోగమృతులం గావింతు నుగ్రాకృతిన్. 57**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నునిన్= ధృష్టద్యుమ్నుడిని; ముట్టి= తాకి; పట్టుదున్= పట్టుకుంటాను; మద+ఉద్రేకంబు= గర్వాతిశయం; అడంగింతున్= అణచివస్తాను; ఉత్కృష్టాస్త్రంబులన్= గొప్పవైన బాణాలతో; చంపన్= చంపను; అల్క= (నాకు వాడిమీద ఉన్న) కోపం; పశుభంగిన్= పశువులా; చంపినన్+కాని= చంపితేకాని; పోదు= నశించదు; ఇప్డు= ఇప్పుడు; ఇష్ట+అవాప్తి= కోరిక ఫలించటం; అనంగన్= అంటే; నాకున్= ఇదియె= ఇదే; కాదే?= కాదా?; కౌంతేయులన్= కుంతీ పుత్రులను - పాండవులను; ఉగ్ర+ఆకృతిన్= భయంకరాకారంతో; కష్టస్వైర విధా+అభియోగ మృతులన్= క్రూరమూ, స్వేచ్ఛతో గూడినదీ అగు ప్రకారం గల ముట్టడి వలన చచ్చినవారినిగా; కావింతున్= చేస్తాను.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడిని తాకి పట్టుకుంటాను. వాడి గర్వాతిశయం అణచివేస్తాను. వాడిని గొప్ప అస్త్రాలతో చంపను. పశువును చంపినట్లు చంపితే కాని వాడిపై నాకున్న కోపం చల్లారదు. ఇప్పుడు నా కోరిక నెరవేరటం అంటే ఇదే కదా! పాండవులను భయంకరాకారంతో క్రూరంగానూ, ఇష్టం వచ్చినట్లుగానూ ముట్టడించి చంపుతాను.

**క. అలిగిన పినాకి చందం । బలవడ శిబిరంబుఁ జొచ్చి యందఱఁ బగఱం**
**బొలియించెద; శుద్ధుఁడఁ గా వలదే జనకునకు నాదు వల నేర్పడఁగన్? 58**

**ప్రతిపదార్థం:** (నేను-కర్త); అలిగిన పినాకి చందంబు= కోపించిన ఈశ్వరుడి విధం; అలవడన్= ఒప్పగా; శిబిరంబున్= విడిదిని; చొచ్చి= ప్రవేశించి; అందఱన్+పగఱన్= శత్రువుల నందరిని; పొలియించెదన్= చంపుతాను; జనకునకున్= తండ్రికి; నాదు వలను= నా సామర్థ్యం; ఏర్పడఁగన్= స్పష్టపడగా; శుద్ధుఁడన్= పవిత్రుడిని - పితృణ విముక్తుడిని; కావలదే= కావద్దా?

**తాత్పర్యం:** నేను కోపించిన పినాకపాణిలాగా శత్రువుల శిబిరంలో ప్రవేశించి పగవారి నందరినీ చంపుతాను. తండ్రికి నా శక్తిని స్పష్టపరిచి పితృణ విముక్తుడినయి పవిత్రుడిని కావద్దా? (కావాలని భావం).

**క. పాండవులం । బాంచాలురఁ । జండ భుజా విభవ మెసఁగ సమయించి కృతా**
**ర్థుండ నయి పెంపుఁ దేజము । గండును; దక్కొండు లేదు కార్యము దలఁపన్. 59**

**ప్రతిపదార్థం:** (నేను-కర్త); పాండవులన్= పాండవులను; పాంచాలురన్= పాంచాల దేశీయులను - ధృష్టద్యుమ్నాదులనూ; చండ భుజా విభవము= తీవ్రమైన భుజబల సంపద; ఎసఁగన్= అతిశయించగా; సమయించి= చంపి; కృత+అర్థుండన్+అయి= కృతకృత్యుడినయి; పెంపున్= గొప్పతనమూ; తేజము= తేజస్సూ; గండును= పౌరుషమును - పొందుతాను; తలఁపన్= ఆలోచించగా; తక్కు+ఒండు= ఇంకొక; కార్యము= పని; లేదు.

**తాత్పర్యం:** నేను పాండవులనూ, పాంచాలురనూ తీవ్ర భుజబల సంపద అతిశయించగా చంపి కృతకృత్యుడనయి గొప్పతనమూ, తేజస్సూ పొందుతాను. ఆలోచించగా ఇంతకంటె వేరే పని లేదు.

**వ. అనవుడుఁ గృపాచార్యుం డి ట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అశ్వత్థామ అనగానే; కృపాచార్యుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని అశ్వత్థామ అనగానే కృపాచార్యు డిట్లా అన్నాడు:

**సీ. పఱిచిన వారికిఁ బగమాఱు పఱుపంగ । నుత్సహించుట కడు నొప్పగాదె?**
**దైవయోగంబునఁ దగిన యుద్యోగంబు । నీ మానసంబున నెలవుకొనియె;**
**మాకు నీ పూన్కి సమ్మత; మేము దీనికి । నీ తోడివారము; నీవు డస్సి**
**యున్నవాఁడవు నిద్రయును లేకయున్నది; । నెడఁగురు పడియె దీ యడవిలోన**

**ఆ. నెమ్మి డప్పిదేఱ నిద్రించి వేగినఁ । దెలివితోడ నత్యుదీర్ణవృత్తిఁ**
**గరఁగి యేము దోడ నడతేర నడరిన, । నరిగణంబు గెలుతు వశ్రమమున. 61**

**ప్రతిపదార్థం:** పఱిచిన వారికిన్= బాధించినవాళ్ళకు; పగన్= వైరంతో; మాఱు పఱుపంగన్= ప్రత్యపకారం చేయటానికి; ఉత్సహించుట= వేడుకపడటం; కడున్= మిక్కిలి; ఒప్పు; కాదె?= కాదా?; దైవ యోగంబునన్= దైవవశాత్తు; తగిన ఉద్యోగంబు= తగిన కార్యం; నీ మానసంబునన్= నీ మనస్సులో; నెలవుకొనియెన్= చోటు చేసుకుంది; మాకున్; నీ పూన్కి= నీ ప్రయత్నం; సమ్మతము= ఇష్టం; ఏము= మేము; దీనికిన్; నీతోడివారము= నీతోపాటు ఉండేవాళ్ళం; నీవు; డస్సి+ఉన్నవాఁడవు= అలసిపోయి ఉన్నావు; నిద్రయును= నిద్రకూడా; లేక+ఉన్నది= లేకుండా పోయింది; ఈ+అడవితోనన్; వెడఁగురు పడియెదు= జడత్వం పొందుతావు; నెమ్మిన్= సుఖంగా; డప్పి+తేఱన్= దప్పితీరేటట్లు; నిద్రించి; వేగినన్= తెల్లవారగానే; తెలివితోడన్= మెలకువతో; అతి+ఉదీర్ణ వృత్తిన్= మిక్కిలి ఉద్రేకంతో కూడిన ప్రవర్తనతో; కడఁగి= పూని; ఏము= మేమిద్దరం; తోడన్= కూడా; నడతేరన్= రాగా; అడరినన్= విజృంభిస్తే; అరిగణంబున్= శత్రుసమూహాన్ని; అశ్రమమునన్= అనాయాసంగా; గెలుతువు.

**తాత్పర్యం:** బాధించినవాళ్ళకు పగతో ప్రత్యపకారం చేయటానికి ఉత్సాహపడటం ఎంతో మంచిదికదా! అదృష్ట వశాత్తూ తగినకార్యం నీ మనస్సులో చోటు చేసికొన్నది మాకు నీ ప్రయత్నం సమ్మతమే. మేము దీనికి నీతోపాటు ఉంటాము. నీవు అలసిపోయి ఉన్నావు. నిద్రకూడా పోని నీవు ఈ అడవిలో జడత్వం పొందుతావు. (బద్ధకంగా ఉంటావు). అలసట తీరేటట్లు సుఖంగా పండుకొని తెల్లవారగానే మెలకువతో మంచి ఉద్రేకం పొంది, పూని, మేమిద్దరం నీవెంట రాగా విజృంభించుము. అప్పుడు నీవు శత్రు సమూహాన్ని అనాయాసంగా గెలుస్తావు.

**విశేషం:** శబ్దరత్నాకరంలో 'వెడఁగురుపడు' శబ్దానికి 'జడత్వమునొందు' అని అర్థం ఇవ్వబడింది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'వెడఁగురుపడు' ఉన్నది కాని 'వెడగరవడు' లేదు. 'వెడఁగురువడు' అనేదానికి జడత్వము నొందు, కాంతిహీనమగు - అనే అర్థాలు ఇచ్చి దీనినే ఉదాహరణగా ఇచ్చారు. అందుచేత దీనినే స్వీకరించడమయినది.

**మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ పైఁ బోన, ను**
**ద్ధురలీలం గృతవర్మయుం గృపుఁడు నుద్యోగస్ఫురన్మూర్తులై**
**వెరవుం జేవయుఁ జూపి తో నడవ, దోర్వీర్యోద్ధతిన్ మార్కొనన్**
**నరయోధావళి గాదు దేవతతికి న్రా దెమ్మెయిం జూడఁగన్. 62**

**ప్రతిపదార్థం:** వర దివ్య+అస్త్ర విదుండు= శ్రేష్ఠములూ, దివ్యములూ అయిన అస్త్రాలు తెలిసినవాడు; బాహు ఘనుఁడు= భుజబలంలో గొప్పవాడూ (అయిన); అశ్వత్థామ; పైన్+పోవన్= దండెత్తిపోగా; ఉద్ధురలీలన్= సమర్థంగా; కృతవర్మయున్-కృపుఁడున్= కృతవర్మా, కృపాచార్యుడూ, ఉద్యోగ స్ఫురత్+మూర్తులు+ఐ= కార్యాచరణంలో ప్రకాశిస్తూన్న ఆకారాలు కలవారై; వెరవున్= ఉపాయమూ; చేవయున్= సామర్థ్యమూ; చూపి; తోన్+నడవన్= కూడా నడవగా; దోర్వీర్య+ఉద్ధతిన్= భుజపరాక్రమాతి శయంతో; మార్కొనన్= ఎదుర్కొనటానికి; ఏ+మెయిన్= ఏ విధంగా; చూడఁగన్= చూసినా; నరయోధ+అవళి కాదు= మానవ వీరుల సమూహం కాదు; దేతతికిన్= దేవతల సమూహానికి కూడా; రాదు= శక్యంకాదు.

**తాత్పర్యం:** వరదివ్యాస్త్రవేత్తా, భుజబలఘనుడూ అయిన అశ్వత్థామ దండెత్తిపోతే, కృతవర్మా, కృపాచార్యుడూ సమర్థంగా కార్యాచరణంలో ప్రకాశిస్తూన్న ఆకారాలతో కూడా నడవగా, భుజపరాక్రమాతిశయంతో ఎదుర్కొనటానికి ఏవిధంగా చూచినా మానవవీరులకే కాదు దేవతలకు కూడా శక్యం కాదు.

**వ. అని మఱియును. 63**

**తాత్పర్యం:** అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'విను కృతవర్మ దివ్యశరవేది బలాఢ్యుడు శౌర్యశాలి, యే**
**మను సమరోద్యమంబునకు నూల్కొనఁజాలుట నీ వెఱుంగు, 'ది**
**ట్లని గణతింపరాదు గురునట్టిఁడ యీతఁ' డనంగవచ్చు ని**
**న్ననఘచరిత్ర! యిట్టి రథికావలి వైరుల నెట్లుఁ జేయదే!' 64**

**ప్రతిపదార్థం:** అనఘ చరిత్ర!= పాపరహితమైన చరిత్రగలవాడా! అశ్వత్థామా!; విను; కృతవర్మ; దివ్య శర వేది= దివ్యాస్త్ర విదుడు; బల+ఆఢ్యుఁడు= బలసంపన్నుడు; శౌర్యశాలి= పరాక్రమ సంపన్నుడు; ఏనును= నేను కూడా; సమర+ఉద్యమంబునకున్= యుద్ధకార్యానికి; నూల్కొనన్+చాలుట= పూనుకోగలగడం; నీవు+ఎఱుంగుదు(వు)= నీ వెరుగుదువు; నిన్నున్; ఈతఁడు= ఈ అశ్వత్థామ; ఇట్లు+అని= ఇలాంటివాడిని; గణుతింపన్ రాదు= పరిగణించరాదు; గురునట్టిఁడ= ద్రోణుడంతటివాడే; అనంగన్+వచ్చున్= అనవచ్చు; ఇట్టి; రథిక+అవలి= ఇటువంటి రథికుల సమూహం; వైరులన్= శత్రువులను; ఎట్లున్+చేయదే= ఏమయినా చేయదా?

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన అశ్వత్థామా! వినుము. కృతవర్మ దివ్యాస్త్రవిదుడూ, బలాఢ్యుడూ, శౌర్య సంపన్నుడూ. నేను కూడా యుద్ధం ఎట్లా చేస్తానో నీకు తెలుసు. ఇక నీవు 'నిన్ను ఇట్లాంటివాడూ అట్లాంటివాడూ అవటానికి వీల్లేదు. సాక్షాత్తు ద్రోణుడంతటివాడే' అని చెప్పవచ్చు.

**వ. 'కావునఁ గోదండంబుఁ నెక్కుడించి, కంకటం బూడ్చి, నిద్రింపు మేము నిద్రాగమనంబున జడులమై యున్న వారము; ప్రభాతం బగుటయు నెల్లవారలకు నుల్లంబు దెలివొందు; నప్పుడు గడంగి యోధులం బొదినిపేరు వాడి పొలియింతము; మనము పాంచాల సహితంబుగాఁ బాండవులం దెగటార్చుటయొండె, వారి చేతం దెగుట యొండె నయ్యెడుం గాక, రిత్త మరలుదుమే?' యనిన మామకు నశ్వత్థామ యిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కోదండంబు నెక్కుడించి (కోదండంబు+ఎక్కు డించి)= వింటిని నారిలేకుండా చేసి; కంకటంబు= ఊడ్చి= కవచం తీసివేసి; నిద్రింపుము= నిద్రపొమ్ము; ఏమున్= మేముకూడా; నిద్ర+ఆగమనంబునన్= నిద్ర రావటంచేత; జడులము+ఐ+ఉన్నవారము= బద్ధకంగా ఉన్నాము; ప్రభాతంబు+అగుటయున్= తెల్లారగానే; ఎల్లవారలకున్= అందరికీ; ఉల్లంబు= మనస్సు; తెలివొందున్= నిర్మలంగా ఉంటుంది; అప్పుడు; కడంగి= పూని; యోధులన్= వీరులను; పొదివి= ఆక్రమించి; పేరువాడి= పేర్కొని-బాహాటంగా; పొలియింతము= చంపుదాము; మనము; పాంచాల; సహితంబుగాన్= పాంచాలురతో కూడా; పాండవులన్= పాండవులను; తెగటార్చుట+ఒండెన్= చంపడమో; వారిచేతన్; తెగుట+ఒండెన్= చావటమో; అయ్యెడున్+కాక= అగుగాక; రిత్త మరలుదుమే?= ఊరికే తిరిగి వస్తామా?; అనినన్= మామకున్= కృపాచార్యుడికి; అశ్వత్థామ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'కాబట్టి, నీవు వింటినుండి నారి తొలగించి, కవచం తీసివేసి నిద్రపొమ్ము, మేముకూడా నిద్రచేత బద్ధకంగా ఉన్నాము. తెల్లవారగానే అందరికీ మనస్సు నిర్మలంగా ఉంటుంది. అప్పుడు యుద్ధానికి పూని వీరులను ఆక్రమించి బాహాటంగా చంపుదాము. మనం పాంచాలసహితంగా పాండవులను చంపటమో, లేక వాళ్ళచేత చావటమో చేస్తాము గాని ఊరికే తిరిగివస్తామా?' అన్న మామతో అశ్వత్థామ ఇట్లా అన్నాడు;

**తే. 'అలుక యెత్తినవానికి, నర్థచింత । కునకు, నాతురునకుఁ, గామ గోచరాత్ము**
**నికిని వచ్చునే, విను నిద్ర? నీవు నెఱుఁగు । దెఱిఁగియుండి యి ట్లేడిటికి నేఁప నన్ను?' 66**

**ప్రతిపదార్థం:** విను; అలుక+ఎత్తినవానికిన్= కోపం అతిశయించినవాడికీ; అర్థచింతకునకున్= డబ్బును గూర్చి ఆలోచించేవాడికీ; ఆతురునకున్= వ్యాధిగ్రస్తుడికీ; కామ గోచర+ఆత్మునికిని= కామం ఆవేశించిన మనస్సు గలవాడికీ; నిద్ర వచ్చునే?; నీవున్+ఎఱుఁగుదు= నువ్వు ఎరుగుదువు; ఎఱిఁగి+ఉండి= ఎరిగికూడా; నన్నున్; ఇట్లు= ఈవిధంగా; ఏఁపన్= బాధించటం; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** 'వినుము కోపం అతిశయించినవాడికీ, డబ్బును గూర్చి ఆలోచించేవాడికీ, వ్యాధిగ్రస్తుడికీ, కామోద్రిక్తుడికీ నిద్రవస్తుందా? నీవూ ఎరుగుదువు. ఎరిగికూడా నన్ను ఇట్లా బాధించటం ఎందుకు?

**క. ఎన్నఁబడి జనులెఱిఁగిన । యిన్నాలుగు తెఱఁగులందు నెయ్యదియైనన్**
**గన్ను మొగుడ నీదటె నా । కిన్నియుఁ గలుగంగ నిద్రయేటికి వచ్చున్? 67**

**ప్రతిపదార్థం:** ఎన్నఁబడి= గణించబడి; జనులు+ఎఱింగిన= మనుష్యులెరిగిన; ఈ+నాలుగు తెఱగుల+అందున్= ఈ నాలుగు విధాలైన కారణాలలోనూ; ఏ+అది+ఐనన్= ఏ ఒక్కటైనా; కన్ను మొగుడనీదు+అటె= కన్నుమూతపడనీయదట. నిద్రపట్టనీయదట; నాకున్= నాకు; ఇన్నియున్= ఈ నాలుగూ; కలుగంగన్= ఉండగా; నిద్ర; ఏటికిన్= ఎందుకు; వచ్చున్?= వస్తుంది?

**తాత్పర్యం:** మనుష్యు లెరిగిన ఈ నాలుగు విధాలైన కారణాలలోనూ ఏ ఒక్కటైనా నిద్రపోవనీదంటే, ఇవన్నీ ఉన్న నాకు నిద్ర ఎట్లా పడుతుంది? (పట్టదని భావం.)

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి తన కా నాలుగూ ఎట్లా ఉన్నాయో అశ్వత్థామ తరువాతి పద్యంలో వివరిస్తున్నాడు. వాటిలో ఏ ఒక్కటి ఉన్నా నిద్రపట్టదంటే ఇంక ఆ నాలుగూ ఉన్నప్పుడు నిద్రపట్టదని వేరే చెప్పాలా? - అనటంచేత ఇక్కడ అలంకారం కావ్యార్థాపత్తి.

**చ.** **'గురుదెసవంత నాతురతఁ గూరెద, వైరిఁ దలంచి కోప సం**
**భరితుఁడ నయ్యెదన్, సమర భంగి నిరూపణచింత నొందెదం,**
**గురుపతికిం బ్రియం బెసఁగఁ గోరుట నుత్తలపాటు సెందెదం**
**బురుషనరేణ్య! యే నిదురవోవఁగ నెమ్మెయి నేర్తుఁ జెప్పుమా.'** **68**

**ప్రతిపదార్థం:** పురుష నరేణ్య!= మనుష్యులలో శ్రేష్ఠుడా! - కృపాచార్యా!; గురుదెస వంతన్= తండ్రి విషయమైన దుఃఖంవలన; ఆతురతన్= పీడతో; కూరెదన్= క్రుంగి ఉన్నాను; వైరిన్= శత్రువుని; తలంచి= స్మరించి; కోప సంభరితుఁడన్+అయ్యెదన్= కోపంతో నిండినవాడిని అయి ఉన్నాను; సమరభంగి నిరూపణ చింతన్= యుద్ధప్రకారం నిర్ణయించే చింతను; ఒందెదన్= పొంది ఉన్నాను; కురుపతికిన్= దుర్యోధనుడికి; ప్రియంబు+ఎసఁగన్= సంతోషం అతిశయించటానికి; కోరుటన్= కోరటంచేత; ఉత్తలపాటు+చెందెదన్= కలతచెంది ఉన్నాను; ఏన్= నేను; నిదుర+పోవఁగన్= నిద్రించటానికి; ఏ+మెయిన్= ఏ విధంగా; నేర్తున్= సమర్థుడిని అవుతాను; చెప్పుమా.

**తాత్పర్యం:** పురుషశ్రేష్ఠుడవైన ఓ కృపాచార్యా!. నాకు నిద్రపట్టకపోవటానికి గల కారణాలు నాలుగూ ఉన్నాయి. ఎట్లా అంటే - తండ్రి అన్యాయంగా చచ్చిపోయాడే అని ఆతురతతో క్రుంగి ఉన్నాను. శత్రువును తలచుకొని కోపంతో నిండి ఉన్నాను. ఎట్లాంటి యుద్ధం చేసి శత్రువులపై కసి తీర్చుకోవాలా - అనే చింత కలిగి ఉన్నాను. దుర్యోధనుడికి సంతోషాతిశయం కూర్చాలనే కోరిక అధికమయి కలతచెంది ఉన్నాను. ఇట్లా నాలుగూ కలిగి ఉన్న నే నెట్లా నిద్రపోగలనో నీవే చెప్పుము.

**శా.** **'సారాచారనిరూఢుఁ డైన ధనురాచార్యున్ వధింపంగఁ గ**
**న్నారం జూచితి నీవుఁ; దత్పరిభవం బట్లుండె; భగ్నోరుఁడై**
**రారా జెంతయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా విన్న యే**
**నీ రే యూరక నిద్రవోదునటె! యిట్లే లంటి, వీరోత్తమా?** **69**

**ప్రతిపదార్థం:** వీర+ఉత్తమా!= వీరశ్రేష్ఠుడా కృపాచార్యా!; సారాచార నిరూఢుఁడు+ఐన= శ్రేష్ఠమైన ప్రవర్తనంచేత ప్రసిద్ధి వహించినవాడైన; ధనురాచార్యున్= ధనుర్విద్యాగురువైన ద్రోణుడిని; వధింపంగన్= చంపగా; ఈవున్= నీవుకూడా; కన్ను+అరన్= ప్రత్యక్షంగా; చూచితి= చూశావు; తత్+పరిభవంబు= ఆ పరాభవం; అట్లు+ఉండెన్= అట్లా ఉండనిమ్ము; రారాజు= దుర్యోధనుడు; భగ్న+ ఊరుఁడు+ఐ= విరిగిన తొడలు గలవాడయి; ఎంతయున్= ఎంతో; దీనవృత్తిన్= దీనంగా; చెవులు+అరన్= చెవులారా; పల్కఁగాన్= పలకగా; విన్న= విన్నట్టి; ఏను= నేను; ఈ రే= ఈ రాత్రి; ఊరక= ఉపేక్షాభావంతో; నిద్రపోదునటె!= నిద్రపోతానా?; ఇట్లు+ఏల+అంటి(వి)?= ఇట్లా ఎందుకన్నావు?

**తాత్పర్యం:** 'వీరశ్రేష్ఠుడవైన కృపాచార్యా!; సదాచార సంపన్నతలో ప్రసిద్ధి వహించిన ధనుర్విద్యాగురుడిని ద్రోణుడిని చంపటం నీవుకూడా కళ్ళారా చూశావు. ఆ పరాభవం మాట ట్లో ఉండనిమ్ము. రాజరాజు తొడలు విరిగి ఎంతో దీనంగా పలికిన పలుకులు చెవులారా విన్న నేను ఈ రాత్రి ఉపేక్షాభావంతో నిద్రపోతానా? ఇట్లా ఎందుకంటావు?'

**విశేషం:** 'వీరోత్తమా!' అని కృపాచార్యుడిని సంబోధించటంలో 'ఇట్లా అనటం వీరుడి లక్షణమా! నీవు కేవలవీరుడివి కావు. వీరోత్తముడివే. నువ్విట్లా అనటం భావ్యమా!? అనే ఎత్తిపొడుపు ధ్వనిస్తుంది.

**ఆ. 'మనము వినఁగ రాజు పనవిన భంగి కే। క్రూరచిత్తుఁడైన గుందకున్నె?**
**కరుణ లేకయున్న పురుషున కేనిఁ గ। న్నీరు దొరుఁగకుండునే, మహాత్మ?' 70**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= మహానుభావా, కృపాచార్యా!; మనము; వినఁగన్= వింటూండగా; రాజు= దుర్యోధనుడు; పనవిన భంగికిన్= దుఃఖించిన రీతికి; ఏ క్రూరచిత్తుఁడు+ఐనన్= ఏ కఠినాత్ముడైనా; కుందక+ఉన్నె?= బాధపడకుండా ఉంటాడా?; కరుణ= దయ; లేక+ఉన్న= లేనట్టి; పురుషునకున్+ఏనిన్= పురుషుడికైనా; కన్నీరు తొరుఁగక+ఉండునే= కారకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** మహానుభావా కృపాచార్యా! మనం వింటూండగా దుర్యోధనుడు దుఃఖించిన రీతికి ఎటువంటి కఠినాత్ముడైనా బాధపడకుండా ఉంటాడా? ఎంత నిర్దయుడైన పురుషుడైనా కన్నీరు కార్చకుండా ఉంటాడా?

**విశేషం:** 'దుర్యోధనుడి దీనాలాపాలు విన్న మనం అంత క్రూరచిత్తులం, నిర్దయులం కామే! బాధపడకుండా, కన్నీరుపెట్టకుండా ఉండగలమా?' అని అశ్వత్థామ కృపుడిని రెచ్చగొడుతున్నాడు.

**చ. అతఁడు మదీయ సఖ్యవరుఁ, డక్కట! యేఁ గసుగందకుండ నా**
**క్షితిపతి యిమ్మెయిం బరులచేతఁ బరాభవ మొందె; దానిఁ జూ**
**చితి; మును లోకు లవ్విభుని చేటును, బాండుతనూజకోటి యు**
**న్నతియును జెప్పవింటి; నది నా మది సూడెఁడు; నిద్రవచ్చునే? 71**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ దుర్యోధనుడు; మదీయ సఖ్యవరుఁడు= నా మిత్రులలో శ్రేష్ఠుడు; అక్కట!= అయ్యో!; ఏన్= నేను; కసుగందక+ఉండన్= చెక్కుచెదరకుండా ఉంటూండగా; ఆ క్షితిపతి= ఆ రాజు; ఈ+మెయిన్= ఈ విధంగా; పరుల చేతన్= శత్రువులచేత; పరాభవము= అవమానము; ఒందెన్= పొందాడు; దానిన్= ఆ ఘోరాన్ని; చూచితిన్= చూశాను; మును= ఇదివరకు; లోకంబు= జనం; ఆ+విభుని చేటును= ఆ రాజు చేడ్పాటూ; పాండు తనూజ కోటి= పాండురాజు కొడుకుల యొక్క; ఉన్నతియును= ఔన్నత్యమూ; చెప్పన్= చెప్పగా; వింటిన్= విన్నాను; అది; నామదిన్= నా మనస్సును; సూడెడున్= దహిస్తోంది; నిద్రవచ్చునే?= నిద్రపడుతుందా? (పట్టదని భావం.)

**తాత్పర్యం:** 'ఆ దుర్యోధనుడు నాకు మంచి చెలికాడు. అయ్యో! నేను నిక్షేపంవలె ఏ అపాయమూ లేకుండా ఉంటూండగా, ఆ రాజు ఈ విధంగా శత్రువులచేత అవమానం పొందాడు. ఆ ఘోరాన్ని నేను చూచాను. ఇదివరకు లోకులు ఆ రాజు చేడ్పాటూ, పాండవుల ఔన్నత్యమూ చెప్పగా విన్నాను. అది నా మనస్సును దహించివేస్తున్నది. నాకు నిద్ర ఎట్లా పడుతుంది?

**విశేషం:** అశ్వత్థామ మాటలలో అతడి ప్రభుభక్తి పరాయణతా, మిత్రప్రేమా స్పష్టపడుతున్నాయి.

**వ. అదియునుం గాక. 72**

**తాత్పర్యం:** అదీకాక.

**ఉ. కవ్వడియున్ ముకుందుఁడును గావలిగా భయమేదియున్న వీ**
**డెవ్వరికైన ముట్టుకొని యే నని పేర్చి జయింపవచ్చునే?**
**యెవ్విధి నైననుం బగఱ యే పడఁగించుట పౌరుషంబ; యే**
**నొవ్వక గెల్తు రాత్రిమెయి నూల్కొని తాఁకితినేని మాతురా! 73**

**ప్రతిపదార్థం:** మాతులా= మామా! కృపాచార్యా!; కవ్వడియున్= అర్జునుడూ; ముకుందుఁడును= కృష్ణుడూ; కావలిగాన్= కాపుగా; భయము+ఏది+ఉన్న వీడు= భయం లేకున్న శిబిరం; ఎవ్వరికిన్+ఐనన్= ఎవరికైనా; ముట్టుకొని= మార్కొని; ఏను+అని= నేనని; పేర్చి= విజృంభించి; జయింపన్+వచ్చునే= గెలువతరమా?; ఏ+విధిన్+ఐననున్= ఏ రీతిగానైనా; పగఱ= శత్రువులయొక్క; ఏవు= విజృంభణ; అడఁగించుట= అణచటం; పౌరుషంబు+అ= మగతనమే; ఏన్= నేను; రాత్రి మెయిన్= రాత్రియందు; నూల్కొని= పురికొని; తాఁకితిన్+ఏనిన్= తలపడితే!; నొవ్వక= అశ్రమంగా; గెల్తున్= జయిస్తాను.

**తాత్పర్యం:** 'మామా! అర్జునుడూ, కృష్ణుడూ రక్షకు లవటంచేత భయమనేది లేకుండా ఉన్న శిబిరంపై దండెత్తి నేనని విజృంభించి ఎవడైనా గెలువగలడా? ఎట్లా అయినా శత్రువుల విజృంభణం అణచటం మగతనం. నేను రాత్రివేళ పురికొని తలపడితే అశ్రమంగా గెలుస్తాను.'

**ఆ. ఇట్లు నిశ్చయించి యెసకంపుఁ గడఁకతో । నున్నవాఁడ; నిట్టి నన్ను మాన్ప**
**రామి యెఱుఁగ కంటి; రారాజు మన్నన । వమ్ము చేసి మరలవచ్చు నెట్లు? 74**

**ప్రతిపదార్థం:** ఇట్లు; నిశ్చయించి= నిర్ణయించుకుని; ఎసకంపున్+కడఁకతోన్= అధికమైన ప్రయత్నంతో; ఉన్నవాఁడన్= ఉన్నాను; ఇట్టి నన్నున్= ఇట్లాంటి నన్ను; మాన్పన్+రామి= విరమింపజేయలేకపోవటం; ఎఱుఁగక= తెలియక; అంటి(వి)= అన్నావు; రారాజు మన్నన= దుర్యోధనుడి ఆదరం; వమ్ముచేసి= వ్యర్థం చేసి; మరలన్+వచ్చున్+ఎట్లు= తిరిగిపోవటం ఎట్లాసాధ్యం?

**తాత్పర్యం:** ఇట్లా నిర్ణయించుకొని పెద్ద ప్రయత్నంతో ఉన్నాను. ఇట్లాంటి నన్ను వారించలేనని తెలియక అట్లా అన్నావు. దుర్యోధనుడు చూపిన ఆదరం వ్యర్థం చేసి తిరిగిపోవటం ఎట్లా సాధ్యం?

**క. సమయింతుం బొదివి సొప్తిక । సమయంబున నెల్లభంగిఁ జతురంగసమే**
**తముగాఁగఁ బాండునృపసుత । సముదయమును ద్రుపదభూపసంతానంబున్. 75**

**ప్రతిపదార్థం:** పాండు నృప సుత సముదయమును= పాండురాజు కొడుకుల సమూహాన్నీ; ద్రుపద భూప సంతానంబున్= ద్రుపద రాజు సంతతినీ; చతురంగ సమేతము+కాఁగన్= రథగజ తురగ పదాతు లనే నాలుగువిధాలైన బలాలతో కూడా; ఎల్లభంగిన్= సర్వవిధాలా; సౌప్తిక సమయంబునన్= నిద్రించేవేళ; పొదివి= చుట్టుముట్టి; సమయింతున్= చంపుతాను.

**తాత్పర్యం:** పాండవులనూ, ద్రుపదరాజు సంతతినీ చతురంగ బలాలతో కూడా సర్వవిధాలా నిద్రాసమయంలో చుట్టుముట్టి చంపుతాను.

**వ. సమయించి మఱి విశ్రమించియు నిద్రించియు సుఖించెద; నీవు నిద్ర పేరు సెప్పి యుద్యోగంబు మాన్పి మర ల్పఁ జూచెద; విది తగ వగునే?' యనిన గురునందనునకు గౌతముం డిట్లనియె: 76**

**ప్రతిపదార్థం:** సమయించి= చంపి; మఱి= మరీ; విశ్రమించియున్= విశ్రమించీ; నిద్రించియున్= నిద్రించీ; సుఖించెదన్= సుఖపడతాను; నీవు; నిద్రపేరు+చెప్పి= నిద్ర అంటూ; ఉద్యోగంబు= పూనిక; మాన్పి= విరమింపజేసి; మరల్పన్+చూచెదవు= మరలించాలని చూస్తున్నావు; ఇది; తగవు= న్యాయం; అగునే?= అవుతుందా?; అనినన్= అని అశ్వత్థామ అనగా; గురునందనునకున్= గురు పుత్రుడైన అశ్వత్థామకు; గౌతముండు= కృపాచార్యుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'చంపి మరీ విశ్రమించీ, నిద్రించీ సుఖిస్తాను. నీవు నిద్ర నిద్ర అంటూ ఆ పూనికను మాన్పి నన్ను మరలించాలని చూస్తున్నావు. ఇది నీకు న్యాయమా?' అనిన అశ్వత్థామతో కృపాచార్యు డిట్లా అన్నాడు.

### కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంపఁదగదని యశ్వత్థామకు హితవు చెప్పుట (సం.10-5-1)

**చ. అలుక మనంబునం గదిరినాతఁడు దాను నెఱుంగఁ డొడ్లచేఁ**
**దెలియఁడు కార్యతంత్రములు; ధీమహితుండగువాని కైననుం**
**జెలులును జుట్టలుం దగిలి చెప్పఁగఁ జొప్పడుఁగాక తక్కు ని**
**ర్మలమగు నీతితంత్రము దిరం బయి చిత్తమునందు నిల్చునే? 77**

**ప్రతిపదార్థం:** కార్య తంత్రములు= కార్యాచరణవిధానాలు; అలుక= కోపం; మనంబునన్= మనసులో; కదిరిన+అతఁడు= అతిశయించినవాడు; తానున్+ఎఱుంగఁడు= తనూ ఎరుగడు; ఒడ్లచేన్= ఇతరులచేతనూ; తెలియఁడు= తెలిసికోడు; ధీ-మహితుండు+అగు= బుద్ధిచేత గొప్పవాడైన; వానికిన్+ఐననున్= వాడికైనా; తక్కు= ఇతరమైన; నిర్మలము+అగు= స్వచ్ఛమైన; నీతి తంత్రము= నీతికార్య విధానం; చెలులును= మిత్రులూ; చుట్టలున్= చుట్టాలూ; తగిలి - చెప్పఁగన్= వెంటబడిచెపితే; చొప్పడున్+కాక= తెలుస్తుంది కాని; తిరంబు+అయి= నిలకడ కలిగి; చిత్తము+అందున్= మనసుతో; నిల్చునే= నిలుస్తుందా?

**తాత్పర్యం:** కార్యాచరణ పద్ధతులు కోపావిష్ట మనస్కుడు తనూ ఎరగడు, ఇతరులు చెప్పినా తెలిసికొనలేడు. మంచి బుద్ధిమంతుడికి కూడా తక్కిన నీతికార్య విధానం మిత్రులూ, చుట్టాలూ వెంటబడి చెపితే తెలుస్తుంది కాని మనసులో సుస్థిరంగా నాటుకొనదు.

**విశేషం:** 'నీ మనస్సు కోపంతో నిండి ఉన్నది కాబట్టి కర్తవ్యం నీకు తోచదు. నావంటివాడు చెప్పినా తెలియదు. నీవంటి బుద్ధిమంతుడికి హితులమైన మేము చెపితే నీతితంత్రం తెలుస్తుంది కాని అది మనసు కోపోద్రిక్తమైనపుడు స్థిరంగా ఉండదు. అందుచేత నీవు కోపం విడిచిపెట్టాలి' అని కృపాచార్యుడు అశ్వత్థామకు బోధించ ప్రయత్నిస్తున్నాడు.

**క. మతి నెప్పుడుఁ దా ధర్మ । స్థితి నూహించుచును, హితులు సెప్పెడి వెర వు**
**ద్ధతి దక్కి యాచరించుచు । జితేంద్రియత గలిగి నడవఁ జెందు శుభంబుల్. 78**

**ప్రతిపదార్థం:** తాన్= తాను; ఎప్పుడున్= ఎప్పుడూ; మతిన్= మనసులో; ధర్మస్థితిన్= ధర్మంయొక్క ఉనికిని; ఊహించుచును= భావిస్తూ; హితులు= మిత్రులు; చెప్పెడి వెరవు= చెప్పే ఉపాయం; ఉద్ధతి+తక్కి= గర్వం విడిచిపెట్టి; ఆచరించుచున్= చేస్తూ; జిత+ఇంద్రియత కలిగి= ఇంద్రియజయం కలిగి; నడవన్= నడుచుకుంటే; శుభంబుల్= మేళ్ళు; చెందున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ఎప్పుడూ మనస్సులో ధర్మస్థితిని భావిస్తూ మిత్రులు చెప్పే ఉపాయాన్ని గర్వం విడిచిపెట్టి ఆచరిస్తూ, ఇంద్రియాలను జయించి నడుచుకొంటే మేలు కలుగుతుంది.

**విశేషం:** 'నీకు మేలు కలగాలంటే నీవు ధర్మాన్నే భావించాలి. కోపం విడిచి నేను చెప్పే మంచిని ఆచరించాలి. జితేంద్రియుడవు కావాలి అని అశ్వత్థామకు కృపుడి బోధ.

**తే. దుష్పథంబులఁ జొరనీక తొలఁగఁ దివుతు । రాప్త జనములు దగ వశ్యు లయినవార**
**లందుఁ బుణ్యంబు దొలఁగని యతఁడు దొలఁగు; । దొలఁగ నేరఁడు భాగ్యంబు దొలఁగువాఁడు. 79**

**ప్రతిపదార్థం:** ఆప్తజనములు= ఇష్టజనులు; తగన్= తగినవిధంగా; దుష్పథంబులన్= అపమార్గాలలో; చొరనీక= ప్రవేశించనీయకుండా; తొలఁగన్+తిపుతురు= తొలగేటట్లు నెట్టుతారు; వశ్యులు+అయిన-వారల+అందున్= తమకు వశులైన వాళ్ళలో; పుణ్యంబు; తొలఁగని+అతఁడు= తొలగనివాడు; తొలఁగున్= ఆ మార్గం నుంచి తొలగుతాడు; భాగ్యంబు+తొలఁగువాఁడు= నిర్భాగ్యుడు; తొలఁగన్+నేరఁడు= తొలగలేదు, అపమార్గంలోనే నడుస్తాడు.

**తాత్పర్యం:** ఆప్తులైన వాళ్ళు తగినవిధంగా తమ మిత్రులను అపమార్గం పట్టిపోకుండా ఇవతలకి లాగుతారు. కాని, ఆ వశులైన వాళ్ళలో పుణ్యాత్ముడు దుర్మార్గం నుంచి తొలగుతాడు. నిర్భాగ్యుడు తొలగలేడు.

**క. మతిమంతు లైనవారికి । హితులగు వెరవుగలవార లెఱిఁగింతురు దు**
**స్థితి గాకుండఁగఁ గార్యము । గతి యొత్తియుఁ దప్ప లిడియుఁ గడవఁ బలికియున్. 80**

**ప్రతిపదార్థం:** మతిమంతులు+ఐన వారికిన్= బుద్ధిమంతులైన వాళ్ళకు; హితులు+అగు వెరవు+కలవారలు= మిత్రులైన ఉపాయశాలులు; దుస్థితి; కాక+ఉండఁగన్= కాకుండా; కార్యము గతి= కార్యపద్ధతి; ఒత్తియున్= పీడించే; తప్పులు+ఇడియున్= అపరాధం మోపీ; కడవన్+పలికియున్= తొలగిపోయేటట్లు మాటలు అనీ; ఎఱిఁగింతురు= బోధిస్తారు.

**తాత్పర్యం:** మిత్రులైన ఉపాయశాలులు బుద్ధిమంతులైన వాళ్ళకు చెడిపోకుండా కార్యపద్ధతిని పీడించీ, అపరాధం మోపీ, తొలగిపోయేటట్లు మాటలను అనీ బోధిస్తారు.

**క. నా పలుకునట్టి యాగ్రహ । దీపితుఁ డగు టుడిగి మదికిఁ దిన్నఁదనము నీ**
**వాపాదింపుము చలమును, । గోపముఁ గ్రౌర్యంబు విడువు గుణరత్ననిధీ! 81**

**ప్రతిపదార్థం:** గుణ రత్న విధీ!= రత్నాలవంటి గుణాలకు - సద్గుణాలకు నిధానమైనవాడా! అశ్వత్థామా!; నా పలుకు+పట్టి= నా మాట విని; ఆగ్రహ దీపితుఁడు+అగుట= కోపంతో మండిపడేవాడు అవటం; ఉడిగి= మాని - కోపోద్రేకం విడిచిపెట్టి; మదికిన్= మనస్సుకి; నీవు; తిన్నఁదనము= ఋజుత్వం - నిర్వక్రత; ఆపాదింపుము= కలిగించుము; చలమును= పట్టుదలా; కోపమున్= కోపమూ; క్రౌర్యంబున్= క్రూరత్వమూ; విడువు(ము)= విడిచిపెట్టుము.

**తాత్పర్యం:** సద్గుణనిధీ - అశ్వత్థామా!; నా మాట విని, కోపోద్రేకం విడిచిపెట్టి, నీ మనస్సుకు తిన్నదనాన్ని కలిగించుము. పట్టుదలా, కోపమూ క్రూరత్వమూ విడిచిపెట్టుము.

**వ. 'అట్లైనం బశ్చాత్తాపంబునం బడవు, నిద్రించినవానిని, నాయుధంబులు విడిచినవానిని, వాహన వైకల్యంబు నొందినవానిని, శరణుసొచ్చినవానిని, దలవీడినవానిని వధియించుట ధర్మంబుగా; దీ సమయంబున సమస్త సైన్యంబును, బాండవ పాంచాలురు నిద్రవోవుదురు. నిదుర సావునట్టిదికాదె? పీనుంగులుం బోలెఁ బడి యున్న వారిం బొడిచి పాపంబు గట్టుకొని నరకంబునఁ బడుట మేలె? మహాస్త్రవిదులగు రథికముఖ్యుల యందు మేటి యనంబరఁగి యింతకు మున్నేమిటం గల్మషంబు లేని నీయట్టివాని కిట్టి దుష్కర్మంబు గర్తవ్యం బగునె? యిది మడుఁగుఁ జీరయందు మసి దాఁకినట్లయ్యెడు. సూర్యసంకాశుండవగు నీవు సూర్యోదయ సమయంబునఁ బ్రకాశప్రకారం బైన పరాక్రమంబున కుపక్రమింపు' మనవుడు నశ్వత్థామ గృపాచార్యున కిట్లనియె; 82**

**ప్రతిపదార్థం:** అట్లు+ఐనన్= అట్లా అయ్యే పక్షంలో; పశ్చాత్తాపంబునన్+పడవు= అను తాపంలో పడవు - తరువాత దుఃఖించాల్సిన పని నీకుండదు; నిద్రించినవానిని= నిద్రపోతున్నవాడినీ; ఆయుధంబులు విడిచినవానిని= నిరాయుధుడైన వాడినీ; వాహన వైకల్యంబున్+ఒందినవానిని= వాహనం విరిగిపోయిన వాడినీ; శరణ+చొచ్చినవానిని= శరణన్నవాడిని; తలవీడిన వాడిని= జుట్టుము వీడిన వాడినీ; వధియించుట= చంపటం; ధర్మంబు కాదు= న్యాయం కాదు; ఈ సమయంబునన్= ఇప్పుడు; సమస్త సైన్యంబును= సైన్యం అంతా; పాండవ పాంచాలురున్= పాండవులూ, పాంచాలదేశీయులూ; నిద్ర+పోవుదురు= నిద్రిస్తూ ఉంటారు; నిదుర= నిద్ర; చావు+అట్టిది కాదె?= చావులాంటిదే కాదా?; పీనుంగులున్+పోలెన్= శవాలవలె; పడి+ఉన్నవారిన్= పడి ఉన్నవాళ్ళను; పొడిచి= వధించి; పాపంబు+కట్టుకొని= పాపం మూటకట్టుకొని; నరకంబునన్+పడుటమేలె?= నరకంలో పడటం మంచిదా?; మహాస్త్రవిదులు= గొప్ప అస్త్రాలు తెలిసినవాళ్ళు; అగు; రథిక ముఖ్యుల+అందున్= రథికశ్రేష్ఠులలో; మేటి= గొప్పవాడు; అనన్+పరఁగి= అనేటట్టు ఒప్పి; ఇంతకున్+మున్ను= ఇంతకుముందు; ఏమిటన్= ఏ విషయంలోనూ కల్మషంబు= కళంకం; లేని; నీ+అట్టివానికిన్= నీలాంటి వాడికి; ఇట్టి దుష్కర్మంబు= ఇటువంటి పాడుపని; కర్తవ్యంబు+అగునె= చేయదగిందా?; ఇది; మడుఁగు+చీర+అందున్= పరిశుద్ధమైన వస్త్రంపై; మసి= మరక; తాఁకిన+అట్లు+అయ్యెడున్= అంటుకున్నట్లు అవుతుంది; సూర్య సంకాశుండవు+అగు నీవు= సూర్యుడితో సమానుడవైన నీవు; సూర్య+ఉదయ సమయంబునన్= సూర్యుడు ఉదయించేవేళ; ప్రకాశ ప్రకారంబు+ఐన= ప్రకాశించే విధంగల; పరాక్రమంబునకున్= పరాక్రమానికి; ఉపక్రమింపుము= ఆరంభించుము; అనవుడున్= అనగానే; అశ్వత్థామ, కృపాచార్యునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు;

**తాత్పర్యం:** 'ఆ పక్షంలో నీకు తరువాత విచారించవలసిన పని ఉండదు. నిద్రించినవాడినీ, నిరాయుధుడైన వాడినీ, వాహనం విరిగిపోయిన వాడినీ, శరణన్నవాడినీ, జుట్టుముడివీడిన వాడినీ వధించటం ధర్మంకాదు. ఇప్పుడు సైన్యం అంతా, పాండవులూ, పాంచాలురూ నిద్రపోతూంటారు. నిద్ర చావువంటిదే కాదా! శవాలవలె పడి ఉన్నవాళ్ళను చంపి పాపం మూటకట్టుకొని నరకంలో పడటం మంచిదా? అస్త్రవిద్యాపారంగతులైన రథికశ్రేష్ఠులలో గొప్పవాడు అని పేరుపొంది ఇంతవరకూ ఏ విషయంలోనూ కళంకంలేని నీవంటివాడికి ఇటువంటి పాడుపని చేయదగినదా? ఇది పరిశుద్ధమైన వస్త్రంమీద మరక ఏర్పడినట్లు ఉంటుంది. సూర్యుడితో సమానుడైన నీవు సూర్యోదయ సమయంలో ప్రకాశించే విధంగా పరాక్రమించటానికి ఆరంభించుము.' అనగానే అశ్వత్థామ కృపాచార్యుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: లుప్తోపమ. 'ఇదే మడఁగు జీరయందు మది దాఁకినట్లయ్యెడు' - ఇందులో ఇది ఉపమేయం మడుఁగుఁ జీరయందు - దాఁకుట' ఉపమానం 'అట్లు' ఉపమావాచకం. సామాన్యధర్మం లోపించింది. కాబట్టి ఇక్కడ అలంకారం లుప్తోపమ.

**సీ.** **'నీ చెప్పినది యెల్ల నిజము; శాసింపంగఁ । దగువాఁడవై హితం బగు తెఱంగు**
**నా కెఱింగించితి; నీ కేను జెప్పెద । నేర్పడ వినుమయ్య యెల్ల నృపులు**
**గనుఁగొనుచుండ మజ్జనకుని సన్న్యస్త । శస్త్రుని నట్లు పాంచాల రాజ**
**సుతుఁడు ధృష్టద్యుమ్నుఁ డతి పాతకం బని । కొంకక తల పట్టుకొని వధించె;**

**ఆ.** **భీష్ము నా శిఖండి పేరఁ గృత్రిమ సమ । రమున నర్జునుండు సమయఁజూచె;**
**నరద ముర్విఁ గ్రుంగి యనువు దప్పిన డిగ్గి । యెత్తుచుండఁ గర్ణు నేసె నరుఁడు.'** **83**

**ప్రతిపదార్థం:** నీ చెప్పిన+అది+ఎల్లన్= నువ్వు చెప్పినదంతా; నిజము; శాసింపంగన్+తగు వాఁడవు+ఐ= ఆజ్ఞాపించదగిన వాడవయి; హితంబు+అగు తెఱంగు= మేలయినరీతి; నాకున్; ఎఱింగించితి వి= తెలిపావు; నీకున్; ఏన్; చెప్పెదన్; ఏర్పడన్= స్పష్టంగా; వినుమయ్య= వినుము; ఎల్ల నృపులున్= రాజులందరూ; కనుఁగొనుచున్+ఉండన్= చూస్తూండగా; మత్+జనకునిన్= నా తండ్రిని (ద్రోణుడిని); సన్న్యస్త - శస్త్రునిన్= సన్న్యసించిన శస్త్రాలు గలవాడిని - శస్త్రాలు విడిచిపెట్టినవాడిని; అట్లు= ఆ విధంగా; పాంచాల రాజ సుతుఁడు= పాంచాల రాజయిన ద్రుపదుడి కొడుకు; ధృష్టద్యుమ్నుఁడు; అతి పాతకంబు+అని= మిక్కిలి పాపం అని; కొంకక= సందేహించకుండా; తలపట్టుకొని; వధించెన్= చంపాడు; అర్జునుండు; భీష్మున్; ఆ శిఖండి పేరన్= ఆ శిఖండి మిషతో; కృత్రిమ సమరమునన్= మోసపు యుద్ధంలో; సమయన్+చూచెన్= చంపాడు; అరదము= రథం; ఉర్విన్= భూమిలో; క్రుంగి= దిగబడి; అనువు+తప్పినన్= వీలు తప్పితే; డిగ్గి= దిగి; ఎత్తుచున్+ఉండన్= ఎత్తుతూ ఉండగా; నరుఁడు= అర్జునుడు; కర్ణున్= కర్ణుడిని; ఏసెన్= చంపాడు.

**తాత్పర్యం:** 'నీవు చెప్పినదంతా నిజం. ఆజ్ఞాపించదగినవాడవై నాకు హితం ఉపదేశించావు. నీకు నేను చెపుతాను సావధానంగా వినుము. రాజులందరూ చూస్తూండగా నా తండ్రిని - అస్త్రసన్న్యాసం చేసినవాడిని ఆ విధంగా ద్రుపదుడి కొడుకు ధృష్టద్యుమ్నుడు మహాపాపం అని సందేహించక తలపట్టుకొని చంపాడు. అర్జునుడు భీష్ముడిని ఆ శిఖండి వంకతో మోసపు యుద్ధంలో చంపాడు. రథం భూమిలో కూరుకుపోయి వీలు తప్పితే దిగి దానిని ఎత్తుతూండగా అర్జునుడు కర్ణుడిని చంపాడు.

**ఆ.** **చేయి నరుఁడు దునుమఁ బ్రాయోపవేశ ప్ర । వృత్తిమైఁ బ్రశాంత చిత్తుఁడైన**
**పుణ్యపురుషు నట్టి భూరిశ్రవునిఁ గృష్ణు । ననుజుఁ డట్లు సంపె నాగ్రహమున.** **84**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; చేయి; తునుమన్= ఖండించగా; ప్రాయోపవేశ ప్రవృత్తిమైన్= ఆమరణ నిరాహారదీక్షతో; ప్రశాంత చిత్తుఁడు+ఐన= మిక్కిలి శాంతంగల మనస్సుగలవాడైన; పుణ్యపురుషున్= పుణ్యాత్ముడిని; అట్టి= అటువంటి; భూరిశ్రవునిన్; కృష్ణ+అనుజుఁడు= కృష్ణుడి తమ్ముడు - సాత్యకి; ఆగ్రహమునన్= కోపంతో; అట్లు= ఆ విధంగా; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** అర్జునుడు చేయి నరకగా, ఆమరణ నిరాహారదీక్షపూని ప్రశాంత మనస్సుతో ఉన్న పుణ్యాత్ముడు భూరిశ్రవుడిని కృష్ణుడి తమ్ముడు సాత్యకి కోపంతో ఆ రీతిగా చంపాడు.

**చ. పలువురు గూడి కౌరవనృపాలకు నొక్కరుఁ జుట్టుమట్టి వి**
**చ్చలవిడిఁ బాపకర్మ మనుశంక యొకించుకయేని లేక యూ**
**రులు గద నుగ్గుసేయఁగ మరుత్సుతునిం బురికొల్పి; రిన్ని భం**
**గుల మును వారె కాదె చెడఁగ్రొచ్చిరి సంగరధర్మసేతువున్? 85**

**ప్రతిపదార్థం:** పలువురు+కూడి= అనేకులు కూడి; కౌరవనృపాలకున్+ఒక్కరున్= కురురాజైన దుర్యోధనుడిని ఒక్కడినీ; చుట్టుముట్టి= ముట్టడించి; విచ్చలవిడిన్= నిరాటంకంగా; పాపకర్మము= దుష్కృత్యం; అను శంక= అనే సంశయం; ఒకించుకయేనిన్= కొంచెంకూడా; లేక; గదన్= గదతో; ఊరులు= తొడలు; నుగ్గు+చేయఁగన్= విరుగగొట్టడానికి; మరుత్సుతునిన్= వాయుపుత్రుడిని - భీముడిని; పురికొల్పిరి= ప్రేరేపించారు; ఇన్ని భంగులన్= ఇన్నివిధాలుగా; మును= పూర్వం; సంగరధర్మ సేతువున్= యుద్ధధర్మం అనే వంతెనను; వారెకాదె!= వారేకదా!; చెడఁగ్రొచ్చిరి= పాడుచేశారు.

**తాత్పర్యం:** 'అనేకులు కలిసి దుర్యోధనుడిని ఒక్కడినీ ముట్టడించి నిరాటంకంగా దుష్కృత్య మనే సంశయం కొంచెంకూడా లేకుండా గదతో తొడలు విరుగగొట్టు మని భీముడిని ప్రేరేపించారు. ఇన్నివిధాలుగా ముందు వాళ్ళే కదా యుద్ధధర్మం అనే వంతెనను పాడుచేసింది.

**విశేషం:** అలం: రూపకం. 'సంగరధర్మ సేతువున్' అనేచోట సంగరధర్మం అనే సేతువుని అని ఉపమేయోపమానాలకి అభేదం చెప్పబడటం చేత అలంకారం రూపకం.

**వ. వారి నెట్లు నిందింపవు! మమ్ము నెట్లు వారించెద? వాలింపుము. 86**

**ప్రతిపదార్థం:** వారిన్= ఆ పాండవుల్ని; ఎట్లు నిందింపవు?= తిట్టవెందుచేత?; మమ్మున్; ఎట్లు; వారించెదవు?= అడ్డగిస్తున్నావు; ఆలింపుము= వినుము.

**తాత్పర్యం:** వాళ్ళని నిందించవేమి? మమ్మల్ని అడ్డగిస్తావేమి? వినుము.

**అ. 'తొడలు విఱిగి నేలఁ బడియుండి ననుఁ గని । మానవేంద్రుఁ డట్లు దీనవృత్తి**
**నాడెఁ గొన్ని మాట; లవి యంతరంగంబు । నందుఁ జిక్కి కినుక యలఁత సేసె.' 87**

**ప్రతిపదార్థం:** తొడలు; విఱిగి; నేలన్= నేలమీద; పడి+ఉండి; మానవేంద్రుఁడు= నరపతి - దుర్యోధనుడు; ననున్+కని= నన్ను చూచి; అట్లు= ఆ రీతిగా; దీనవృత్తిన్= విచారంతో; కొన్ని మాటలు; అడెన్= పలికాడు; అవి= ఆ మాటలు; అంతరంగంబునందున్= నా మనస్సులో; చిక్కి= నాటుకొని; కినుక= కోపం; అలఁత= బాధ; చేసెన్= కలిగించాయి.

**తాత్పర్యం:** 'తొడలు విరిగి నేలమీద పడి ఉండి నన్ను చూచి దుర్యోధనుడు ఆ రీతిగా విచారంతో కొన్ని మాటలు పలికాడు. అవి నా మనస్సులో నాటుకొని కోపం తెప్పించి బాధను కలిగించాయి.

**వ. వాని వెలార్పవలయు; మజ్జనక హనన సంతుష్టుండగు ధృష్టద్యుమ్నుండు లోనైన యప్పాపాత్ములఁ బాపంబు తెరువున రూపుమాపెద; దీనంజేసి కీటజన్మంబు పాటిల్లినను మేల కాని యీ కడంక మానసేర; నన్ను వారింప నెవ్వరి వశంబగు?' నని దిగ్గనలేచి యగ్గురుతనయుండు రథంబెక్కినం గనుంగొని యగ్గౌతముం డును గృతవర్ముండు. 88**

**ప్రతిపదార్థం:** వానిన్= వాటిని; వెలార్పవలయున్= బయలుపరచాలి; మత్+జనక హనన= నా తండ్రిని చంపటంచేత; సంతుష్టుండు+అగు= సంతుష్టుడయిన; ధృష్టద్యుమ్నుండు; లోను+ఐన= మొదలైన; ఆ+పాప+ఆత్ములన్= ఆ దురాత్ములను; పాపంబు తెరువునన్= అధర్మమార్గంలో; రూపుమాపెదన్= చంపుతాను; దీనన్+చేసి= ఇందువల్ల; కీట జన్మంబు= పురుగు పుట్టుక; పాటిల్లినన్= కలిగినా; మేలు+అ= మంచిదే; కాని; ఈ కడంకన్= ఈ ప్రయత్నం; మానన్+నేరన్= మానలేను; నన్నున్= నన్ను; వారింపన్= అడ్డగించటానికి; ఎవ్వరి వశంబు+అగున్?+అని= ఎవరి తరమౌతుందని; దిగ్గనన్+లేచి= తటాలున లేచి; ఆ+గురు తనయుండు= ఆ గురుపుత్రుడు అశ్వత్థామ; రథంబు; ఎక్కినన్= ఎక్కగా; కనుంగొని= చూచి; ఆ+గౌతముండును= ఆ కృపాచార్యుడూ; కృతవర్ముండున్= కృతవర్మా-

**తాత్పర్యం:** 'ఆ మాటలను బయలుపరచాలి. నా తండ్రిని చంపి సంతోషించే ధృష్టద్యుమ్నుడూ మొదలైన ఆ దురాత్ములను అధర్మమార్గంలో చంపుతాను. దానివలన నాకు పురుగు పుట్టువు కలిగినా మంచిదే కాని ఈ ప్రయత్నం మానలేను. నన్ను ఆపడం ఎవరితనం? అని తటాలున లేచి అశ్వత్థామ రథం ఎక్కటం చూసి కృపాచార్యుడూ, కృతవర్మా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ధృష్టద్యుమ్నాదులు 'పాపాత్ములు' కావున వాళ్ళను 'పాపంబు తెరువు' ననే రూపుమాపుతానని అశ్వత్థామ సమర్థన. అశ్వత్థామ మాటలలో అతడి దృఢనిశ్చయత్వం తెలుస్తుంది.

**ఆ. 'ఏక నిశ్చయమున నిట యేఁగుదెంచితి । మనఘ! నీవు నేము నధిపు పనికి;**
**నిట్టి మమ్ము వేఱు పెట్టి యెక్కటి కార్య । మాచరించువాఁడ వగుట దగునె?' 89**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపంలేనివాడా! అశ్వత్థామా!; నీవున్+ఏమున్= నీవూ, మేమూ; అధిపు పనికిన్= రాజు పనిమీద; ఏక నిశ్చయమునన్= ఒకే నిర్ణయంతో; ఇట ఏఁగుదెంచితిమి= ఇక్కడికి వచ్చాము; ఇట్టి మమ్మున్= ఇటువంటి మమ్ములను; వేఱుపెట్టి= వేరుచేసి; ఎక్కటి= నీవు ఒక్కడివే; కార్యము= పని; ఆచరించువాఁడవు+అగుట= చేసేవాడివవటం; తగునె?= ఉచితమా?

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన అశ్వత్థామా! నీవూ, మేమూ రాజు పనిమీద ఇక్కడికి ఏకాభిప్రాయంతో వచ్చాము. ఇటువంటి మమ్మల్ని వేరుచేసి నీవు ఒక్కడివే పనిచేయటం తగునా?'

**చ. అనవుడు నాతఁడిట్టులను నమ్మహితాత్ముల కే నవశ్యముం**
**జని ద్రుపదాత్మజుం బొదివి చంపెద దుర్గతిఁబోవుచావుగా**
**ఘనభుజశక్తి శౌర్యము నకంపిత ధైర్యమునున్ వెలుంగ; మీ**
**రును దెలివొంది కూడికొన రూఢికి నెక్కుద మెల్ల భంగులన్.' 90**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; అతఁడు= అశ్వత్థామ; ఆ+మహిత+ఆత్ములకున్= ఆ మహాశయులతో - కృపకృతవర్మలతో; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అంటాడు; ఏను= నేను; అవశ్యమున్= తప్పకుండా; చని= వెళ్ళి; ద్రుపద+ఆత్మజున్= ద్రుపద పుత్రుడైన ధృష్టద్యుమ్నుడిని; పొదివి= ఆక్రమించి; ఘన భుజశక్తి= గొప్ప భుజబలమూ; శౌర్యమున్= పరాక్రమమూ; అకంపిత ధైర్యమునున్= చలించని ధైర్యమూ; వెలుంగన్= ప్రకాశించగా; దుర్గతిన్+పోవు చావు+కాన్= దుర్గతికి పోయే చావుగా; చంపెదన్= చంపుతాను; మీరును= మీరుకూడా; తెలివొంది= తెలివికలిగి; కూడికొనన్= నాతో కలిస్తే; ఎల్ల భంగులన్= అన్ని విధాలా; రూఢికిన్+ఎక్కుదము= ప్రసిద్ధి కెక్కుతాం.

**తాత్పర్యం:** కృపకృతవర్మ లట్లా అనగానే అశ్వత్థామ ఆ మహాశయులతో ఇట్లా అన్నాడు: 'నేను తప్పకుండా వెళ్ళి ధృష్టద్యుమ్నుడిని చుట్టుముట్టి, గొప్ప భుజబలమూ, పరాక్రమమూ, చలించని ధైర్యమూ ప్రకాశించగా, వాడు దుర్గతికి పోయే చావు చచ్చేటట్లు చంపుతాను. మీరుకూడా తెలివికలిగి నాతో కలిస్తే అన్నివిధాలా ప్రసిద్ధికెక్కుతాం.'

**విశేషం:** ఆ పనిలో వాళ్ళు తనతో కలవటం తెలివీ, కలవకపోవటం అజ్ఞానమూ అని అశ్వత్థామ అంటున్నాడు. 'మీరు తెలివిగా నాతో కలిస్తే కలవండి. మీరు కలవకపోయినా నేనొక్కడినే నా పరాక్రమం చూపి వాడిని దుర్మరణం పాలు చేస్తా' నని అశ్వత్థామ తన నిశ్చితాభిప్రాయం చెపుతున్నాడు.

**ఆ. 'ఒండు తలఁపు లుడిగి రం' డని పోవ, నా । రథికవరులు గడఁగి రథము లెక్కి**
**మొనసి చనిరి వారు ముువ్వురు నగ్నిత్ర । యంబుఁ బోలి యొప్పి యప్ప డధిప! 91**

**ప్రతిపదార్థం:** ఒండు తలఁపులు= వేరే ఆలోచనలు; ఉడిగి= మాని; రండు; అని; పోవన్= అశ్వత్థామ వెళ్ళగా; అధిప!= ఓ రాజా! ధృతరాష్ట్రా! అప్పుడు; ఆ రథికవరులు= ఆ రథిక శ్రేష్ఠులిద్దరూ; కడఁగి= పూని; రథములు+ఎక్కి; మొనసి= సంసిద్ధులై; వారు ముువ్వురున్= వాళ్ళు ముగ్గురూ; అగ్ని త్రయంబున్= మూడగ్నులను పోలి; ఒప్పి; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** 'వేరే ఆలోచనలు మాని నాతో రండి' అని అశ్వత్థామ పోతూ ఉంటే ధృతరాష్ట్రా! అప్పుడు ఆ రథిక శ్రేష్ఠులిద్దరూ పూని, రథాలెక్కి సంసిద్ధులై, ముగ్గురూ త్రేతాగ్నులవలె ఒప్పి వెళ్ళారు.

**విశేషం:** అలం: ఉపమ. అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా - ఈ ముగ్గురూ మూడగ్నులతో పోల్చబడ్డారు కాబట్టి ఇక్కడ అలంకారం ఉపమ. అగ్నిత్రయం - గార్హపత్యం, దక్షిణాగ్ని, ఆహవనీయం.

**వ. అట్లు చని నిద్రావివశం బైన పాండవ శిబిరంబు డగ్గఱి' రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 92**

**ప్రతిపదార్థం:** అట్లు; చని= వెళ్ళి; నిద్రా వివశంబు+ఐన= నిద్రతో ఒళ్ళు తెలియనిదైన; పాండవ శిబిరంబున్= పాండవుల బిడారాన్ని; డగ్గఱిరి= సమీపించిరి; అనినన్= అని సంజయుడు చెప్పగా; విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఆ రీతిగా వెళ్ళి, నిద్రతో ఒళ్ళు తెలియక పడి ఉన్న పాండవుల సేనను సమీపించారు' అని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'రాజుఁ గూల్చి జయముఁ దేజంబుఁ బొందిన । యత్యుదగ్ర విభవు లైన యరుల**
**శిబిర మాక్రమింపఁ జిత్తంబులందుఁ దెం । పొదవి ముప్పురట్లు గదియు టరిది! 93**

**ప్రతిపదార్థం:** రాజున్= రాజును - దుర్యోధనుడిని; కూల్చి= పడగొట్టి; జయమున్= గెలుపూ; తేజంబున్= తేజస్సూ; పొందిన; అతి+ఉదగ్ర విభవులు+ఐన= మిక్కిలి గొప్ప వైభవం; కలవారైన; అరుల= శత్రువులయొక్క; శిబిరము= బిడారం - స్కంధావారం; ఆక్రమింపన్= ముట్టడించటానికి; చిత్తంబుల+అందున్= మనస్సులలో; తెంపు= సాహసం; ఒదవి= కలిగి; ముప్పురు; అట్లు; కదియుట= సమీపించటం; అరిది!= ఆశ్చర్యం!

**తాత్పర్యం:** 'దుర్యోధనుడిని పడగొట్టి గెలుపూ, తేజస్సూ పొందిన మహావైభవోపేతులైన శత్రువుల స్కంధావారాన్ని ఆక్రమించటానికి మనస్సులలో సాహసం కలిగి ముగ్గురూ అట్లా సమీపించటం ఆశ్చర్యకరం.

**విశేషం:** తన వాళ్ళు శత్రువులపై పరాక్రమించారంటే ధృతరాష్ట్రుడికి చాలా సంతోషం.

**వ. వారు చేసిన విధంబు వివరింపు' మనిన నా సూతసుతుండు విచిత్రవీర్యనందనున కి ట్లనియె. 'నట్ల శిబిర ద్వార ప్రదేశంబునకు నడచి సహాయులం గడచి యశ్వత్థామ యుద్దామరభసంబునఁ జన నుత్సహించె, నట్టియెడ. 94**

**ప్రతిపదార్థం:** వారు చేసిన విధంబు వివరింపుము; అనినన్= ఆ సూతసుతుండు= అసూతపుత్రుడు సంజయుడు; విచిత్రవీర్య నందనునకున్= విచిత్రవీర్యుడి కొడుకైన ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు; శిబిర ద్వార ప్రదేశంబునకున్= శిబిర ద్వార దేశానికి; నడచి; సహాయులన్= తోడుగా వచ్చిన వాళ్ళని - కృపకృతవర్మలను; కడచి= అతిక్రమించి; అశ్వత్థామ; ఉద్దామ రభసంబునన్= అధికమైన కోపావేశంతో; చనన్= పోవటానికి; ఉత్సహించెన్= యత్నించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** వాళ్ళు ఏం చేశారో వివరంగా చెప్పుము' అంటే, ఆ సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'అట్లా శిబిర ద్వారం దగ్గరికి నడచి తనకు తోడుగా వచ్చిన కృపకృతవర్మలను అతిక్రమించి అశ్వత్థామ మిక్కిలి కోపావేశంతో పోవాలని యత్నించాడు. ఆ సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం).

### అశ్వత్థామకు శివుఁడు భూతాకృతియై తోఁచుట (సం. 10-6-1)

**సీ. క్షరితశోణితమగు శార్దూల చర్మంబు । పరిధానకరణి విభాసితముగ;**
**నురగాత్మకములైన యుపవీతములు హార । ములు నంగదంబులు పొలుపుమిగుల;**
**వివృతవిశాలాస్యవివరంబు నిశిత దం । ష్ట్రానికరంబు ఘోరంబు గాఁగ;**
**భాసుర కాంతి వికాసంబు లగు లోచ । నంబులు బహుసహస్రంబు లొప్ప;**

**తే.** **నుగ్రమును సుందరంబును నుజ్జ్వలంబు । నై మహాకార మద్భుత మావహింప**
**భూత మొక్కటి భీషణ స్ఫురణ మెసక । మెసఁగ నగ్గురుపుత్రు కట్టెదుర నిలిచె. 95**

**ప్రతిపదార్థం:** క్షరిత శోణితము+అగు= కారిన రక్తం కలదైన; శార్దూల చర్మంబు= పులితోలు; పరిధాన కరణిన్= వస్త్రం లాగా; విభాసితముగన్= ప్రకాశించగాను; ఉరగాత్మకములైన= పాములే అయిన; ఉపవీతములున్= జందెములూ; హారములున్= ముత్యాపేరులూ; అంగదంబులు= భుజకీర్తులూ; పొలుపు మిగులన్= ప్రకాశించగాను; వివృత విశాల+అస్య వివరంబు= తెరవబడ్డ పెద్ద ముఖరంధ్రమూ; నిశిత దంష్ట్రా నికరంబు= వాడి కోరల సమూహమూ; ఘోరంబు+కాఁగన్= భయంకరంగా ఉండగాను; భాసుర కాంతి వికాసంబులు= ప్రకాశించే కాంతుల మెరుపులు గలవి; అగు; లోచనంబులు= కళ్ళు; బహు సహస్రంబులు= పెక్కువేలు; ఒప్పన్= ఒప్పగాను; ఉగ్రమును= భయంకరమూ; సుందరంబును= అందమైనదీ; ఉజ్జ్వలంబున్+ఐ= ప్రకాశించేదీ అయి; మహాకారము= పెద్దరూపం; అద్భుతము= ఆశ్చర్యం; ఆవహింపన్= కలిగించగాను; భూతము+ఒక్కటి= ఒక భూతం; భీషణ స్ఫురణము= భయంకరస్ఫూర్తి; ఎసకము+ఎసఁగన్= కలిగేటట్లు; ఆ+గురుపుత్రు= ఆ అశ్వత్థామ; కడు+ఎదురన్= ఎట్టయెదుట; నిలిచెన్.

**తాత్పర్యం:** రక్తం కారే పులితోలు వస్త్రంవలె ప్రకాశిస్తూండగా; పాములు జందెములుగా, ముత్యాలపేరులుగా, భుజకీర్తులుగా ఒప్పుతూ ఉండగా; తెరచుకొన్న పెద్ద నోటి రంధ్రమూ, అందులోని వాడికోరల సమూహమూ భయంకరం కాగా, ప్రకాశించే కాంతులతో మెరిసే వేలకొద్దీ కళ్ళు ఒప్పగా, భయంకరమూ, సుందరమూ ప్రకాశించేదీ అయి పెద్ద రూపం ఆశ్చర్యం కలిగిస్తూ ఉండగా ఒక భూతం వెరపు కలిగించేటట్లు ఆ అశ్వత్థామ ఎట్టఎదుట ప్రత్యక్షమైనది.

**క.** **విను మా భూతం బిట్టిది । యని కలరూ పేర్పఱింప నమరులకు వశం**
**బె? నరేంద్ర! తదాకృతి గనుఁ । గొనినన్ భేదిల్లవలయుఁ గొండకు నైనన్ 96**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా!; ధృతరాష్ట్రా!; వినుము; ఆ భూతంబు; ఇట్టిది= ఇటువంటిది; అని; కలరూపు= యథార్థం; ఏర్పఱింపన్= నిరూపించటానికి; అమరులకున్= దేవతలకైనా; వశంబు+ఎ?= తరమా?; తద్+ఆకృతి= దాని ఆకారం; కనుంగొనినన్= చూస్తే; కొండకున్+ఐనన్= కొండకైనా; భేదిల్లన్ వలయున్= బ్రద్దలవాల్సిందే.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! వినుము. ఆ భూతం ఇటువంటిదని యథార్థ్యం నిర్ణయించటానికి దేవతలకు కూడా తరంకాదు. దాని ఆకారం చూస్తే కొండ అయినా బ్రద్దలవాల్సినదే.

**విశేషం:** 'అమరులకు వశంబె' - అమరులకు కూడా తరం కాదన్నప్పుడు మర్త్యులమాట. వేరే చెప్పాలా? అని ధ్వనించటం చేత కావ్యార్థాపత్త్యలంకార ధ్వని. అలాగే 'కొండకు నైనన్ భేదిల్లవలయున్' అనటంచేత స్థిరస్వరూపమైన కొండే భేదిల్లితే చరస్వరూపాలైన మనుష్యులమాట వేరే చెప్పనక్కరలేదని ధ్వనించటం వలన అక్కడకూడా కావ్యార్థాపత్త్యలంకార ధ్వని.

**వ.** **ఇ ట్లతని యగ్రభాగంబున నావిర్భూతం బైన యమ్మహాభూతంబు నాస్యకుహరంబున, నాసికా వివరంబులఁ, జెవులఁ, గన్నుల, నన్నింట మంటలు వెడలి మింట నడరఁ దదీయతనుతేజోమరీచిసంఘంబుల శంఖ చక్రగదాహస్తులై హృషీకేశు లనేకులు వెడలి; రి ట్లఖిలభూతభయంకరంబగు నమ్మహాభూతంబు నాలోకించి యవ్వీరవరుండు. 97**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అతని; అగ్రభాగంబునన్= ఎదుట; అవిర్భూతంబు+ఐన= పుట్టిన; ఆ+మహత్ భూతంబు+అస్య కుహరంబునన్= ఆ మహాభూతంయొక్క గుహవంటి నొటిలోనూ; నాసికా వివరంబులన్= ముక్కు రంధ్రాలలోనూ; చెవులన్; కన్నులన్; అన్నింటన్= మంటలు; వెడలి; మింటన్= ఆకాశంలో; అడరన్= విజృంభించగా; తదీయ తను తేజస్+మరీచి సంగంబులన్= దానిదైన శరీరకాంతి కిరణాల సమూహాల్లోంచి; శంఖ చక్ర గదా హస్తులు+ఐ= శంఖం, చక్రం, గద, చేతుల్లో గలవారై; హృషీకేశులు= విష్ణులు; అనేకులు= పెక్కుమంది; వెడలిరి; ఇట్లు= ఈ విధంగా; అఖిల భూత భయంకరంబు+అగు= ఎల్ల ప్రాణులకు వెరపు కలిగించే దయిన; ఆ+మహా+భూతంబున్= ఆ మహాభూతాన్ని; ఆలోకించి= చూచి; ఆ+వీరవరుండు= ఆ వీరశ్రేష్ఠుడు - అశ్వత్థామ.

**తాత్పర్యం:** ఈ రీతిగా అతడి యెదుట పుట్టిన ఆ మహాభూతం గుహలాంటి నోట్లోనూ, ముక్కు రంధ్రాల్లోనూ, చెవుల్లోనూ, కన్నులలోనూ - అన్నిటిలోనూ మంటలు వెలువడి ఆకాశంలో విజృంభించగా, దాని శరీరకాంతి కిరణాల్లోనుండి శంఖం, చక్రం, గదా, ధరించిన విష్ణువు లనేకులు వెలువడ్డారు. ఇట్లా సర్వప్రాణులకూ వెరవు పుట్టించే ఆ మహాభూతాన్ని చూసి ఆ వీరశ్రేష్ఠుడైన అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **హృదయమునం గలంక యొకయించుక యేనియు లేక వీర సం**
**పద యలరంగ భల్లముఖ బాణతతుల్ నిగిడింపఁ బెద్దగా**
**వదనంము విచ్చి భూత మనివార్య విధంబునఁ ద్రావె బాడబం**
**బుదధిజలంబు ద్రాగెడు మహోగ్ర సముద్ధతి వాని నన్నిటిన్.** **96**

**ప్రతిపదార్థం:** హృదయమునన్= మనస్సులో; కలంక= జంకు; ఒక+ఇంచుక+ఏమనియున్= కొంచెంకూడా; లేక; వీర సంపద= పరాక్రమ సంపద; అలరంగన్= ఒప్పేటట్లు; భల్లముఖ బాణతతుల్= భల్లమూ మొదలైన బాణాల సమూహాలు; నిగిడింపన్= ప్రయోగించగా; భూతము; పెద్దగాన్; వదనమున్= నోటిని; విచ్చి= తెరచి; బాడబంబు= బడబాగ్ని; ఉదధి జలంబు= సముద్రపునీరు; త్రాగెడు= త్రాగే; మహోగ్ర సముద్ధతిన్= మిక్కలి భయంకరమైన ఆటోపంతో; వానిన్+అన్నిటిన్= ఆ బాణాలనన్నింటినీ; అనివార్య విధంబునన్= నివారించరాని రీతిగా; త్రావెన్= త్రాగింది.

**తాత్పర్యం:** మనసులో ఏ మాత్రమూ బెదురులేకుండా పరాక్రమ సంపద ఒప్పేటట్లు భల్లమూ మొదలైన బాణ సమూహాలు ప్రయోగించగా, భూతం నోరు పెద్దది చేసి, బడబాగ్ని సముద్రపునీటిని అతి భయంకరంగా త్రాగే టట్లు, వాటి నన్నిటినీ నివారించరాని విధంగా మ్రింగింది.

**విశేషం:** అలం: ఉపమ. 'బాడబం..వానినన్నిటిన్' భూతము త్రావె' అనటంలో అలంకారం ఉపమ. అశ్వత్థామ భల్లాలను ఉదధి జలంతో పోల్చటం వలన వాటి అసంఖ్యాకత్వమూ, భూతాన్ని బాడబంతో పోల్చటం వలన దాని అనివార్యతా, భీషణత్వమూ తెలుస్తాయి.

**చ.** **అతుల శరంబు లట్లు వృథయైనఁ గనుంగొని ద్రౌణి రశ్మి మం**
**డిత మహనీయశక్తి నిగిడించిన భూతముఁ దాఁకి యంత్యకా**
**లతిమిరవైరి మండల విలగ్న మహోల్కయుఁ బోలెఁ బిన్న పి**
**న్న తునియలై యడంగె నరనాథ! యతండు విషాద మందఁగన్.** **99**

**ప్రతిపదార్థం:** నరనాథ!= రాజా! ధృతరాష్ట్రా!; అట్లు= ఆ రీతిగా; అతుల శరంబులు= సాటిలేని బాణాలు; వృథ+ఐనన్= వ్యర్థం కాగా; ద్రౌణి= అశ్వత్థామ; కనుంగొని= చూసి; రశ్మి మండిత మహనీయ శక్తిన్= కిరణాలచేత అలంకరించబడిన గొప్ప శక్త్యాయుధాన్ని; నిగిడించినన్= ప్రయోగించగా; (అది); భూతమున్; తాఁకి; అంత్యకాల= ప్రళయసమయపు; తిమిరవైరి= చీఁకట్ల శత్రువు అగు సూర్యుడియొక్క; మండల= బింబానికి; విలగ్న= గురిపెట్టబడిన; మహోల్కయున్+పోలెన్= గొప్ప ఉల్కవలె; అతండు= అశ్వత్తామ; విషాదము+అందఁగన్= విచారం పొందగా; పిన్న పిన్న తునియలు+ఐ= చిన్న చిన్న ముక్కలై; అడంగెన్= నశించింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఆ రీతిగా సాటిలేని బాణాలు వ్యర్థం కాగా అశ్వత్థామ చూచి కాంతులతో ప్రకాశించే గొప్ప శక్త్యాయుధాన్ని ప్రయోగించాడు. అది భూతాన్ని తాకి ప్రళయ కాలపు సూర్యబింబాన్ని తాకిన గొప్ప ఉల్కవలె చిన్న చిన్న ముక్కలై నశించింది. దానికి అశ్వత్థామ చింతించాడు.

**విశేషం:** అలం: ఉపమ. భూతం ప్రళయకాల సూర్యబింబంతోనూ, అశ్వత్థామ శక్తి చిన్న ఉల్కతోనూ పోల్చబడటంచేత ఇక్కడ అలంకారం ఉపమ. దీనివలన భూతం భయంకరత్వమూ, శక్తి అల్పత్వమూ స్పష్టమవుతున్నాయి.

**చ. అలఘుతరాత్మసారుఁడగు నగ్గురుపుత్త్రుఁడు ఘోరఖడ్గమున్**
**బిలగతసర్పముం దిగిచి భీషణరేఖ నటించుభంగి న**
**గ్గలపు రయంబునం బెటికి గాఢవిముక్తము గాఁగ వైచినం**
**బొలుపఱి పోయె దూదిక్రియ భూతశరీరసమాగమంబునన్. 100**

**ప్రతిపదార్థం:** అలఘుతర+ఆత్మసారుఁడు+అగు= మిక్కిలి ఎక్కువ మనోబలంగలవాడైన; ఆ+గురుపుత్రుఁడు= ఆ అశ్వత్థామ; ఘోర ఖడ్గమున్= భయంకరమైన కత్తిని; బిలగత సర్పమున్= కన్నంలోని పాము అయినదానిని; తిగిచి= (ఒరలోంచి) లాగి; భీషణ రేఖ= భయంకరత్వం; నటించు భంగిన్= తోచే విధంగా; అగ్గలము+రయంబునన్= అమితవేగంతో; పెటికి= విసిరి; గాఢవిముక్తము+కాఁగన్= పూర్తిగా విడుపబడినదిగా, వైచినన్= ప్రయోగించగా, భూత శరీర సమాగమంబునన్= భూతం శరీరంతో కలవటంచేత; దూదిక్రియన్= దూదివలె; పొలుపు+అఱి పోయెన్= నశించినది.

**తాత్పర్యం:** గొప్ప మనోబలం కల ఆ అశ్వత్థామ కన్నంలోనుండి పాము వలె ఒరలోనుంచి భయంకరమైన ఖడ్గాన్ని లాగి, వెరపు తోచే విధంగా అమితవేగంతో గట్టిగా విసరగా, అది భూతం శరీరాన్ని తాకి దూదివలె కాలి నశించింది.

**విశేషం:** అలం: రూపకం. ఉపమ. 'ఘోరఖడ్గమున్ బిలగత సర్పమున్'-అనేచోట ఉపమేయోపమానాలకి అభేదం చెప్పబడినది కాబట్టి, అలంకారం రూపకం. 'దూదిక్రియ' అనేచోట ఉపమేయోపమానాలకి మంచి సాదృశ్యం చెప్పబడింది కాబట్టి అలంకారం ఉపమ.

**తే. సరభసంబుగఁ దోమర సమితిఁ జక్ర। వితతిఁ బరఁగించి పేర్చె నవ్వీరవర్యుఁ;**
**డదియు నదియును దోడ్తోడ నల్ల నగుచు। మ్రింగె నమ్మహాభూతంబు మేదినీశ! 101**

**ప్రతిపదార్థం:** మేదినీశ!= రాజా! ధృతరాష్ట్రా!; ఆ+వీరవర్యుఁడు= ఆ వీరశ్రేష్ఠుడు అశ్వత్థామ; సరభసంబుగన్= కోపావేశంతో; తోమర సమితిన్= ఇనుపగుదియల సమూహాన్నీ; చక్ర వితతిన్= చక్రాయుధాల సమూహాన్నీ; పరఁగించి= ప్రయోగించి; పేర్చెన్= అతిశయించాడు; ఆ+మహాభూతంబు= ఆ గొప్ప భూతం; అల్లన్= మెల్లగా; నగుచున్= నవ్వుతూ; తోడ్తోడన్= వెంటనే; అదియున్+అదియును= దానినీ, దానినీ మ్రింగెన్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! ఆ వీరోత్తముడైన అశ్వత్థామ కోపావేశంతో తోమర సమూహాన్నీ చక్ర సమూహాన్నీ ప్రయోగించి విజృంభించాడు. ఆ మహాభూతం చిరునవ్వుతో వెంటనే దానినీ దానినీ మ్రింగివేసింది.

**క. అలిగి యతండు నితాంతో । జ్జ్వల గద వైచుటయు నదియు సత్వరలీలన్**
**జలచర మామిషముంగొను । పొలుపు నెఱయ మెఱయ మ్రింగె భూతం బధిపా! 102**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! ధృతరాష్ట్రా!; అతండు= అశ్వత్థామ; అలిగి= కోపించి; నితాంత+ఉజ్జ్వల గదన్= మిక్కిలి ప్రకాశించే గదను; వైచుటయున్= ప్రయోగించగా; భూతంబు; సత్వర లీలన్= వెంటనే; జలచరము= చేప; అమిషమున్= మాంసాన్ని; కొను= గ్రహించే, పొలుపు= విధం; నెఱయన్= బాగుగా; మెఱయన్= ప్రకాశించగా; అదియున్ మ్రింగెన్= దానిని కూడా మ్రింగింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! అశ్వత్థామ కోపంతో మిక్కిలి ప్రకాశించే గదను ప్రయోగించగా, భూతం వెంటనే దానిని కూడా చేప మాంసాన్ని గ్రహించే విధంగా మ్రింగింది.

**విశేషం:** అలం: ఉపమ. 'జలచర మామిషముం గొను పొలుపు నెఱయ మెఱయ - నదియు మ్రింగె భూతంబు' - ఉపమేయోపమానాలకి మంచి సాదృశ్యం చెప్పబడింది కాబట్టి అలంకారం ఉపమ.

**ఆ. ఇవ్విధమున సకల హేతులు వమ్మయి । పోవ నతివిషణ్ణబుద్ధి యగుచు**
**నట్టు నిట్టుఁ జూచు నతనికి బహు జనా । ర్దనులు దోఁచి రంబరమున నెల్ల. 103**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ రీతిగా; సకల హేతులున్= అన్ని ఆయుధాలూ; వమ్ము+అయి పోవన్= వ్యర్థమయిపోగా; అతి విషణ్ణ బుద్ధి= మిక్కిలి విచారంతో కూడిన మనస్సు కలవాడు; అగుచున్= అవుతూ; అట్టున్+ఇట్టున్= అటూ ఇటూ; చూచు+అతనికిన్= చూచే అశ్వత్థామకు; అంబరమునన్+ఎల్లన్= ఆకాశంలో అంతటా; బహు జనార్దనులు= ఎందరో విష్ణువులు; తోఁచిరి= కనబడ్డారు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆయుధాలన్నీ వ్యర్థమయిపోగా మనస్సులో మిక్కిలి బాధపడుతూ అటూ ఇటూ చూచే అశ్వత్థామకు ఆకాశంలో అంతటా ఎంతోమంది విష్ణువులు కనబడ్డారు.

**ఉ. భీకర విష్ణురూపములు పెక్కిటు లొక్కటఁ దోఁపఁ దీవ్రతా**
**పాకులమానసుండగుచు నగ్గురుసూనుఁడు 'దుర్మదంబునన్**
**జేకొననైతి నట్లు కృపు చెప్పిన సత్యహితోపదేశముల్;**
**నా కిది పెద్దయే?' యని మనంబున నిట్లని వల్కె వెండియున్. 104**

**ప్రతిపదార్థం:** భీకర విఘ్న రూపములు= భయంకర విఘ్నమూర్తులు; పెక్కు= అనేకం; ఇటులు= ఈ విధంగా; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; తోఁపన్= కనబడగా; ఆ+గురు సూనుఁడు= ఆ అశ్వత్థామ; తీవ్ర తాప+ఆకుల మానసుండు+అగుచున్= అధికమైన దుఃఖంచేత కలిగిన మనస్సు కలవాడు అవుతూ; అట్లు= ఆ రీతిగా; కృపు చెప్పిన= కృపుడు చెప్పిన; సత్య హిత+ఉపదేశముల్= సత్యాలూ; శ్రేయస్కరాలూ అయిన హితోపదేశాలు; దుర్మదంబునన్= పాడుగర్వంతో; చేకొనన్+ఐతిన్= వినిపించుకొలేదు; నాకున్; ఇది= ఈ దురవస్థ; పెద్దయే= ఎక్కువా?; అని; వెండియున్= మళ్ళీ; మనంబునన్= మనస్సులో; ఇట్లు+అని+పల్కెన్= ఇట్లా తలపోశాడు.

**తాత్పర్యం:** భయంకర విఘ్నమూర్తులు ఈ విధంగా ఒక్కుమ్మడిగా కనబడగా అశ్వత్థామ అధిక దుఃఖంచేత మనస్సు కలిగినవాడై 'ఆ విధంగా కృపుడు చెప్పిన సత్యాలూ, శ్రేయస్కరాలూ అయిన హితోపదేశాలు దుర్గర్వంతో వినిపించుకొనలేదు. నాకీ శాస్తి ఎక్కువేమీ కాదు' అని మనస్సులో మళ్ళీ ఇట్లా తలపోశాడు.

**విశేషం:** 'చేతులు కాలాక ఆకులు పట్టుకొనటం వలె ఉన్నది' అశ్వత్థామ పశ్చాత్తాపం.

**ఆ.** **'మహిత శాస్త్ర కలిత మార్గంబు విడిచి ని । జేచ్ఛఁ బగఱ గెలువ నెవ్వఁ డరుగు**
**వాని నయ్యధర్మవర్తన క్రౌర్యమ । యెవ్విధమునఁ జెఱుచు నింత నిజము.'** **105**

**ప్రతిపదార్థం:** ఎప్పుడు; మహిత శాస్త్ర కలిత మార్గంబున్= గొప్పదైన శాస్త్రోక్త పద్ధతిని; విడిచి; నిజేచ్ఛన్= తన ఇష్టప్రకారం; పగఱన్= శత్రువులను; గెలువన్= జయించటానికి; అరుగున్= వెడతాడో; వానిన్= వాడిని; ఏ+విధమునన్= ఏ విధంగానైనా సరే; ఆ+అధర్మ వర్తన+క్రౌర్యము= ఆ ధర్మరహిత ప్రవర్తనతోడి క్రూరత్వమే; చెఱుచున్= నశింపజేస్తుంది; ఇంత నిజము= ఇది నిజం.

**తాత్పర్యం:** శాస్త్ర విహిత పద్ధతిని విడిచిపెట్టి తన ఇష్టం వచ్చినట్లు శత్రువులను జయించటానికి పూనుకొనే వాడిని, ఎట్లాగయినా సరే ఆ ధర్మేతరమైన క్రూరప్రవర్తనే నశింపజేస్తుంది ఇది నిజం.

**సీ.** **గోవు, బ్రాహ్మను, బాలకుని, వృద్ధు, నంధుని, । సఖుఁ, దోడఁబుట్టువు, జడుఁ బ్రమత్తు,**
**మత్తుని, గురుని, నున్మత్తుని, సుప్తుని, । నంగన, భీతుని నస్త్రశస్త్ర**
**నిహతి నొప్పించుట విహితంబు గాదని । యార్యులు సెప్పుదు; రట్టి ధర్మ**
**మార్గంబు దొఱఁగి దుర్మంత్రంబుమైఁ బగ । యడఁగింపఁ గడఁగిన నసురవృత్తిఁ**

**ఆ.** **జేట గాక కార్యసిద్ధి గా నేర్చునే? పెద్ద యెత్తికొనిన భీతి మగుడఁ**
**బడుట కష్టసరణి; బలిమి దయ్యముతోడఁ । జెల్ల; దింక నేమి సేయువాఁడ?** **106**

**ప్రతిపదార్థం:** గోవున్= అవునూ; బ్రాహ్మణున్; బాలకునిన్= బాలుడినీ; వృద్ధున్= ముసలివాడినీ; అంధునిన్= గ్రుడ్డివాడినీ; సఖున్= చెలికాడినీ; తోడఁబుట్టువున్= సోదరుడినీ; జడున్= మందుడినీ; ప్రమత్తున్= ఏమరుపాటుగా ఉన్నవాడినీ; మత్తునిన్= మైకంలో ఉన్నవాడినీ; గురునిన్= ఉపాధ్యాయుడినీ; ఉన్మత్తునిన్= పిచ్చివాడినీ; సుప్తునిన్= నిద్రించినవాడినీ; అంగనన్= స్త్రీనీ; భీతునిన్= భయపడినవాడినీ; అస్త్ర శస్త్ర నిహతిన్= అస్త్రాల శస్త్రాల దెబ్బచేత; నొప్పించుట= బాధించటం; విహితంబు= చేయదగినది; కాదని; ఆర్యులు= పూజ్యులు; చెప్పుదురు; అట్టి ధర్మమార్గంబు= అటువంటి ధర్మమార్గం; తొఱఁగి= విడిచి;

దుర్మంత్రంబుమైన్= దురాలోచనతో; అసురవృత్తిన్= రాక్షస ప్రవృత్తితో; పగ= వైరం; అడఁగింపన్= నశింపచేయటానికి; కడఁగినన్= ప్రయత్నిస్తే; చేటు+ఆ+కాక= కీడేగాని; కార్యసిద్ధి; కాన్+నేర్చునే= కాగలదా?; పెద్ద ఎత్తికొనిన భీతిన్= మిక్కిలి అతిశయించిన భయంతో; మగుడఁ బడుట= మరలటం; కష్ట సరణి= కష్టమార్గం; బలిమి= శౌర్యం; దయ్యముతోడన్= దైవంతో; భూతంతో; చెల్లదు= పనికిరాదు; ఇంకన్+ఏమి చేయువాఁడన్= ఇంకేమి చేస్తాను?

**తాత్పర్యం:** ఆవునూ, బ్రాహ్మణుడినీ, బాలుడినీ, ముసలివాడినీ, గ్రుడ్డివాడినీ, చెలికాడినీ, సోదరుడినీ, మందుడినీ, ఏమరినవాడినీ, మైకంలో ఉన్నవాడినీ, గురుడినీ, పిచ్చివాడినీ, నిద్రపోతూన్నవాడినీ, ఆడదానినీ, భయపడినవాడినీ, అస్త్రశస్త్రాలతో కొట్టి బాధించటం చేయదగింది కాదని పెద్దలంటారు. అటువంటి ధర్మమార్గం విడిచిపెట్టి దురాలోచనతో రాక్షస ప్రవృత్తితో వైరం అణచటానికి ప్రయత్నిస్తే కీడే కాని కార్యం నెరవేరుతుందా? మిక్కిలి అతిశయించిన భయంతో మరలగలగటం కష్టం. బలం దైవం ముందు (భూతం ముందు) పనికిరాదు. ఇంకేమి చేయటం?

**ఉ. అక్రమవృత్తి గీడుతెరువై ఫలియింపద; ద్రోణసూతి దు**
**ర్విక్రమనింద కర్హుఁడె? సవిస్మయ మైనమనంబు భూతవృ**
**త్తిక్రమవేదిగాదు; గణుతింపఁగ నేమియొ యిమ్మహాద్భుత**
**ప్రక్రియ కాదికారణము? పాపనిరూఢుఁడు నీతిఁగాంచునే? 107**

**ప్రతిపదార్థం:** అక్రమవృత్తి= అధర్మప్రవర్తన; కీడు తెరువు+ఐ= చేటుకు మార్గమై; ఫలియింపదు!అ= ఫలించనే ఫలించదు; ద్రోణసూతి= ద్రోణుడికొడుకు; దుర్విక్రమ నిందకున్= దుష్టపరాక్రముడు అనే నిందకు; అర్హుఁడు+ఎ?= తగినవాడా?; సవిస్మయము+ఐన మనంబు= గర్వంతో కూడుకున్న మనస్సు; భూతవృత్తి క్రమ వేది+కాదు= భూతం ప్రవర్తన క్రమం తెలిసికొనేది కాదు; గణుతింపఁగన్= ఎంచగా; ఈ+మహత్(మహా)+అద్భుత ప్రక్రియకున్= ఈ మహాశ్చర్యకరమైన కార్య విధానానికి; ఆదికారణము= మూలకారణం; ఏమియొ?= ఏమిటో?; పాప నిరూఢుఁడు= పాపంలో ప్రసిద్ధుడు; నీతిన్= కార్యపద్ధతిని; కాంచునే= తెలిసికొంటాడా?

**తాత్పర్యం:** అధర్మ ప్రవర్తన చేటుకి మార్గమై ఎప్పటికీ ఫలించదు. ద్రోణుడి కొడుకునైన నేను దుష్టపరాక్రముడనే నింద కర్హుడినా? గర్వితమైన మనస్సు భూతం ప్రవర్తన క్రమం తెలిసికొనలేదు. ఎంచగా మహాశ్చర్యాన్ని కలిగించే ఈ కార్యవిధానానికి మూలకారణ మేమిటో? పాపకార్యాలలో ప్రసిద్ధుడైనవాడు కార్యపద్ధతిని తెలిసికొనగలడా?'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. అశ్వత్థామ పశ్చాత్తాపం చూడదగ్గది. నీవు పశ్చాత్తాపపడవలసి వస్తుందని కృపుడు చెప్పనే చెప్పాడు. 'పాప నిరూఢుడు నీతిఁగాంచునే?' అనే సామాన్యాంశంచేత 'అశ్వత్థామ పాపకార్యం మూలంగా భూతం ప్రవర్తనకి కారణమేమిటో తెలుసుకోలేకపోతున్నా' డనే విశేషాంశం సమర్థించబడుతున్నది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**వ. అని పెక్కు భంగుల వగచి పల్లటిల్లిన చిత్తంబుఁ బట్టుకొల్పి యిట్లని నిశ్చయించె. 108**

**ప్రతిపదార్థం:** అని; పెక్కు భంగులన్= అనేకవిధాల; వగచి= చింతించి; పల్లటిల్లిన చిత్తంబున్= చెదరిన మనస్సును; పట్టుకొల్పి= కుదుటపరుచుకుని; ఇట్లు+అని; నిశ్చయించెన్= నిర్ణయించాడు.

**తాత్పర్యం:** అని అనేకవిధాల చింతించి, చెదరిన మనస్సును కుదుటపరచుకొని ఇట్లా నిర్ణయించాడు.

**వ. భావం బేకముఖంబుఁ జేసికొని యావద్ధ్వాంతభానున్, మహా**
**దేవుం, బర్వత కన్యకాప్రియు, దయార్ద్రీభూత చేతస్కు లో**
**కావిర్భావ వివర్ధనా లయకృతి వ్యాపార పారంగతున్.**
**దేవేంద్ర ప్రముఖామరార్చితుని భక్తి ప్రౌఢతం గొల్చెదన్. 109**

**ప్రతిపదార్థం:** భావంబు= మనస్సు; ఏకముఖంబున్= ఒకటే ఉద్దేశం; గలదానినిగా చేసికొని; ఆపద్+ధ్వాంతభానున్= ఆపదలనే చీకట్లకు సూర్యుడైనవాడూ, పర్వతకన్యకా ప్రియున్= హిమవత్పర్వత పుత్రిక అయిన పార్వతికి భర్త అయినవాడూ; దయా+అర్ద్రీభూత చేతస్కున్= దయారసంచేత తడిసినదిగా అయిన మనస్సుగలవాడూ; లోక= లోకాలయొక్క; అవిర్భావ= పుట్టుకా; వివర్ధనా= పోషణా; లయ కృతి= నాశంకరణం; (అనే); వ్యాపార= పనులందు; పారంగతున్= ఆవలి ఒడ్డును పొందినవాడూ, ఆరితేరినవాడూ; దేవ+ఇంద్ర= దేవేంద్రుడు; ప్రముఖ= మొదలైన; అమర= దేవతలచేత; అర్చితునిన్= పూజింపబడినవాడూ (అయిన); మహాదేవున్= పరమేశ్వరుడిని; భక్తిప్రౌఢతన్= భక్త్యతిశయంతో; కొల్చెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** నేను నా మనస్సును కేంద్రీకరించుకొని ఆపదలనే చీకట్లకు సూర్యుడైనవాడూ, పార్వతీపతీ, దయారసంచేత తడిసిన మనస్సుకలవాడూ, లోకాలను పుట్టించటం, పోషించటం, నశింపజేయటం అనే పనులలో ఆరితేరినవాడూ, దేవేంద్రాది దేవతలచేత పూజింపబడేవాడూ అయిన మహాదేవుడిని అధికభక్తితో సేవిస్తాను.

**విశేషం:** అలం: రూపకం. భావం బేకముఖంబుఁ జేసికొని - చంచలమైన మనస్సుని ఏకాగ్రం చేసికొని. అపద్ధ్వాంత భానున్ - ఆపదలకీ - చీకట్లకీ; మహాదేవుడికీ - భానుడికీ అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం.

**ఆ. అఖిల దేవతామయాత్ముఁ డద్దేవుఁ; డ । ట్లగుట నిఖిలదైవికాపదుదయ**
**నిరసనం బొనర్చు; నియతి నప్పరమేశుఁ । గొలిచి, యుపుడ కీడు దొలఁగఁ ద్రోతు.' 110**

**ప్రతిపదార్థం:** ఆ+దేవుడు= ఆ పరమేశ్వరుడు; అఖిల దేవతా మయ+ఆత్ముఁడు= ఎల్ల దేవతలతోనూ నిండిన స్వరూపం గలవాడు; అట్లు+అగుటన్= అందుచేత; నిఖిల దైవిక+ఆపద్+ఉదయ నిరసనంబు= దైవికంగా వచ్చే అన్ని ఆపదల తొలగింపూ; ఒనర్చున్= చేస్తాడు; నియతిన్= నియమంతో; ఆ+పరమ+ఈశున్= ఆ పరమేశ్వరుడిని; కొలిచి= సేవించి; ఇపుడు+అ= ఇప్పుడే; కీడు= ఆపద; తొలగన్+త్రోతున్= పోగొట్టుకుంటాను.

**తాత్పర్యం:** ఆ దేవుడు సర్వదేవతామయ స్వరూపుడు. అందుచేత అతడు దైవికంగా వచ్చే అన్ని ఆపదలనూ తొలగిస్తాడు. నేను ఆ పరమేశ్వరుడిని నియమంతో సేవించి ఇప్పుడే ఆపద పోగొట్టుకొంటాను.'

**విశేషం:** ఆధ్యాత్మికాలూ, ఆధిదైవికాలూ, ఆధిభౌతికాలూ అని ఆపదలు మూడు రకాలు. వీటినే తాపత్రయం అంటారు. ఆధ్యాత్మికాలంటే మనశ్శరీరాదుల వలన కలిగేవి. శోకమోహ జ్వరాది దుఃఖాలు. ఆధిదైవికాలంటే అగ్నీ, వాయువూ మొదలైన దేవతల వలన కలిగేవి. ఆధిభౌతికాలంటే వ్యాఘ్ర సర్పాది ప్రాణుల వలన కలిగేవి. ఇక్కడ అశ్వత్థామకు కలిగిన ఆపద ఏమిటో అంతుపట్టని ఒక భూతం వలన కలిగింది కాబట్టి ఆధిదైవికం. దానిని తొలగించుకొనాలంటే - అఖిల దేవతామయాత్ముడైన పరమేశ్వరుడే శరణ్యం. అందుచేతనే అతడినే కొలుస్తానంటున్నాడు అశ్వత్థామ.

**వ. అని యిట్లు నిశ్చయించి నియతుండై రథంబు డిగ్గి ధరణీతలంబునం గూర్చుండి భావంబున భూతనాథు నెల కొలిపి యక్కుంభజసంభవుండు. 111**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; నిశ్చయించి; నియతుండు+ఐ= నియమం గలవాడై; రథంబున్; డిగ్గి= దిగి; ధరణీతలంబునన్= నేలమీద; కూర్చుండి; భావంబునన్= హృదయంలో; భూతనాథున్= ఈశ్వరుడిని; నెలకొలిపి= స్థాపించి; ఆ+కుంభజ సంభవుండు= ఆ ద్రోణ పుత్రుడు - అశ్వత్థామ.

**తాత్పర్యం:** అని ఈ రీతిగా నిర్ణయించి నియమవంతుడై రథం దిగి నేలపై కూర్చొని హృదయంలో ఈశ్వరుడిని స్థాపించికొని ఆ అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

అశ్వత్థామ శివున కాత్మోపహారం బొసంగ నిశ్చయించుట (సం. 10-7-4)

**సీ. 'స్థాణు, నుగ్రుని, శివు, శర్వు, నీశానుని, । భద్రప్రదుని, శంభు, రుద్రు, గిరిశు,**
**నవ్యయు, శ్రీకంఠు, హరుఁ, బరమేశ్వరుఁ, । బురహరు, నజుని, శంకరుఁ, ద్రినేత్రు,**
**బహురూపు, విశ్వరూపత్వసంవ్యాప్తుని. । నంబికా హృదయేశు, నమరవంద్యు,**
**గణనాథు, విభు, శూలఖట్వాంగధరు, జటా । మండలాలంకృతమౌళి, నభవు**

**ఆ. నాశ్రయించి యతని కాత్మోపహార మ । ర్పించువాఁడఁ గాక పెక్కు తలఁపు**
**లేల నాకు నమ్మహేశ్వరేశ్వరుఁ డెట్టి । గతి యొనర్చి నది సుఖంబ కాదె?' 112**

**ప్రతిపదార్థం:** స్థాణున్; ఉగ్రునిన్; శివున్; శర్వున్; ఈశానునిన్; భద్రప్రదునిన్= శుభాలు ఇచ్చేవాడిని; శంభున్; రుద్రున్; గిరిశున్= కొండమీద పరుండేవాడివి - ఈశ్వరుడిని; అవ్యయున్= నాశనం లేనివాడివి; శ్రీకంఠున్= విషకంఠుడిని; హరున్; పరమేశ్వరున్; పురహరున్= పురత్రయాన్ని హరించినవాడిని; అజునిన్= పుట్టుకలేనివాడిని; శంకరున్= శుభాలు కలిగించేవాడిని; త్రినేత్రున్= ముక్కంటిని; బహురూపున్= అనేకరూపాలు గలవాడిని; విశ్వరూపత్వ సంవ్యాప్తునిన్= విశ్వరూపంతో బాగా వ్యాపించిన వాడిని; అంబికా హృదయ+ఈశున్= పార్వతీ హృదయాధినాథుడిని; అమరవంద్యున్= దేవతలచేత నమస్కరించదగిన వాడిని; గణనాథున్= ప్రమథాధిపతిని; విభున్= ప్రభుని; శూలఖట్వాంగ ధరున్= త్రిశూలమూ; ఖట్వాంగమనే ఆయుధమూ ధరించేవాడినీ; జటామండల+అలంకృత మౌళిన్= జడల గుంపుచేత అలంకరించబడిన శిరస్సుగలవాడిని; అభవున్= పుట్టుక లేనివాడిని; ఆశ్రయించి; అతనికిన్; ఆత్మ+ఉపహారము= ఆత్మబలిదానం; అర్పించువాఁడన్+కాక= ఇచ్చే వాడినికాని - ఇస్తాను కాని; పెక్కు తలఁపులు+ఏల?= అనేకాలోచనలు ఎందుకూ?; నాకున్; ఆ+మహేశ్వర+ఈశ్వరుఁడు= ఆ పరమేశ్వరుడు; ఎట్టి గతిన్= ఏగతి; ఒనర్చెన్= చేశాడో; అది, సుఖంబు+అ+కాదె!= మేలేకదా!

**తాత్పర్యం:** 'స్థాణుడినీ, ఉగ్రుడినీ, శివుడినీ, శర్వుడినీ, ఈశానుడినీ, శుభప్రదుడినీ, శంభుడినీ, రుద్రుడినీ, గిరిశుడినీ, అవ్యయుడినీ, శ్రీకంఠుడినీ, హరుడినీ, పరమేశ్వరుడినీ, పురహరుడినీ, అజుడినీ, శంకరుడినీ, త్రినేత్రుడినీ, బహురూపుడినీ, విశ్వరూపంతో అంతా వ్యాపించినవాడినీ, పార్వతీ హృదయేశ్వరుడినీ, అమరవంద్యుడినీ, ప్రమథాధిపతినీ, విభుడినీ, శూలమూ ఖట్వాంగమూ ధరించేవాడినీ, జటామండల విభూషిత శిరస్కుడినీ, అభవుడినీ ఆశ్రయించి అతడికి నేను ఆత్మబలిదానం ఇస్తాను. పలు ఆలోచన లెందుకూ? నాకు ఆ పరమేశ్వరుడు ఏ గతి నిర్ణయిస్తే అదే సుఖం కాదా!'

**వ. అని తలంచి భూతకృత్యం బైన పరాక్రమ ప్రతిబంధ రూపం బుగ్గడించి. 113**

**ప్రతిపదార్థం:** అని; తలంచి; భూతకృత్యంబు+ఐన= భూతం చేసే పనిఅయిన; పరాక్రమ ప్రతిబంధ రూపంబు= పరాక్రమానికి ఆటంకం అయినది; ఉగ్గడించి= చెప్పి.

**తాత్పర్యం:** అని తలచి తన పరాక్రమానికి ఆటంకం కలిగించే భూతం పనిని చెప్పి (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏ నీ యాపదఁ గడచిన । నానా భూతోపహార నవ్యార్చన నీ**
**శానునిఁ బ్రీతుం జేసెదఁ । బూని ప్రమథగణము నన్నుఁ బొగడునటులుగన్.' 114**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఈ+ఆపదన్; కడచినన్= దాటితే; ప్రమథ గణము= ప్రమథుల సమూహం; నన్నున్= పొగడునటులుగన్= పొగిడేటట్లు; పూని= ప్రయత్నించి; నానా భూత+ఉపహార - నవ్య+అర్చనన్= అనేక ప్రాణుల బలిదానం అనే కొత్త పూజచేత; ఈశానునిన్= శివుడిని ప్రీతున్+చేసెదన్= తృప్తి పరుస్తాను.

**తాత్పర్యం:** 'నేను ఈ ఆపదనుంచి గట్టెక్కితే ప్రమథగణాలు నన్ను పొగిడేటట్లు పూని, అనేక ప్రాణుల బలిదానం కొత్త రకమైన పూజతో ఈశ్వరుడిని తృప్తిపరుస్తాను.

**చ. అని హృదయంబునం బలుకు నమ్మహనీయచరిత్రు ముందటం**
**గనకపువేది దోఁచె నధికద్యుతిజాలము లుల్లసిల్ల; నం**
**దనలము విస్ఫురత్పటుశిఖావలి నొప్పి వెలింగె; దానికి**
**న్మనము దలిర్ప; నిశ్చయమునం దెలివొందె నతండు నెంతయున్. 115**

**ప్రతిపదార్థం:** అని; హృదయంబునన్= మనస్సులో; పలుకు; ఆ+మహనీయ చరిత్రు= ఆ గొప్ప చరిత్ర గలవాడియొక్క-అశ్వత్థామయొక్క; ముందటన్= ఎదుట; అధికద్యుతి జాలములు= పెక్కుకాంతుల సమూహాలు; ఉల్లసిల్లన్= ప్రకాశించగా; కనకము+వేది= బంగారపుటరుగు; తోఁచెన్= కనబడింది; అందున్= ఆ వేదిమీద; ఆనలము= అగ్ని; విస్ఫురత్+పటు శిఖా+ఆవలిన్= ప్రకాశించే తీక్షణమైన జ్వాలల వరుసతో; ఒప్పి; వెలింగెన్; దానికిన్; అతండు= అశ్వత్థామ; మనము; తలిర్పన్= పల్లవించగా - సంతోషించగా; నిశ్చయమునన్= నిర్ణయంతో; ఎంతయున్= మిక్కిలి; తెలివి+ఒందెన్= ప్రకాశించేడు.

**తాత్పర్యం:** అని మనస్సులో తలచే ఆ మహనీయ చరిత్రుడైన అశ్వత్థామకు ఎదుట పలుకాంతుల సమూహంతో ఒప్పే బంగారు అరుగు కనబడింది. దానిమీద ప్రకాశించే తీక్షణ జ్వాలలతో ఒప్పి అగ్ని వెలిగింది. దానికి మనస్సు పల్లవించగా అతడు నిర్ణయంతో ఎంతో ప్రకాశించాడు.

**వ. అప్పుడు ప్రదీప్తవదనులుఁ, బ్రజ్వలిత నేత్రులు, నేకపాదులుఁ, గరితురంగ సింహసూకరానన సమాన ముఖులును, దీవ్ర దంష్ట్రాకరాళాస్యులును మఱియు ననేక ప్రకారంబులగు వక్త్రంబులం బొలుచువారును, వక్రాంగులు, దీర్ఘదేహులు, హ్రస్వశరీరులు, నతి స్థూలకాయులుఁ, గృశమూర్తులుఁ, బింగళగాత్రులు, నీలతనులు,**

**మఱి నా నావర్ణంబులు గలుగువారును, బంచశిఖులును, జటాధారులును, గిరీటధరులును, మఱియు బహుభంగి కంబులైన మౌళితలంబులం బొలుపొందువారును లోనుగా వివిధ విశేష వికృతస్వరూపులగు నసంఖ్యాత ప్రమథులు చిత్రాంబర మాల్యాంగరాగంబులు, రత్నకనకమయ భుజగాస్థిమాలా భూషణం బులును, ధనుస్తూణ కృపాణ ముసల ముద్గర పరశు భిండివాల శూల ప్రభృతి స్ఫార ప్రహరణంబులు మెఱయ మృదంగ పణవ డమరు ఘంటా గోముఖాది తూర్యంబులు మొరయ విస్ఫుర ద్ధ్వజ పతాకాకుంచికలు శోభిల్లఁ బాడుచు, నాడుచు, నార్చుచు, బొబ్బలిడుచు, నవుడుగఱచుచుఁ, ద్రుళ్ళుచు, గురువులువాఱుచుఁ, గరటి బృంహితంబులుఁ, గంఠీరవగర్జితంబులు, శంఖరవంబులు, భేరీధ్వనులుంబోని యెలుంగులు సెలంగ,బెట్టి దంబులగు పలుదెఱంగుల పలుకు లెసంగ, బ్రహ్మద్వేషు లగువారి మాంసరుధిరంబులఁ బూర్ణంబు లగు కపాలంబులు గరతలంబులం గొని యాభీలంబు లగు భక్షణపానంబు లాచరించుచు, సోమపాన శమదమ తపోబ్రహ్మచర్య ప్రముఖుంబు లగు తమ విశిష్టకర్మంబులకు భవుండు విస్మయంబు నొందుంగాని యష్ట గుణంబగు నైశ్వర్యంబు నొందియుఁడారువిస్మితులుగాని యట్టిమహానుభావు లద్దేవునకు గౌరికి గజముఖ షణ్ముఖులకంటె నర్మిలికిం బట్టగు భవ్యులు దివ్యజనస్తవ్య బఁయ్యస్త్ర గురుతనూభవు తెంపెఱుంగుటకు సౌప్తిక వ్యాపార ఘోరత్వంబుఁ గనుంగొని వినోదించుటకు వచ్చి యతని చిత్తంబునకు బెదరు పుట్టించువారై భీషణా కారంబుల నుల్లసిల్లిన నాధైర్యధుర్యుండు. 116**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ప్రదీప్త వదనులున్= మిక్కిలి ప్రకాశించే ముఖాలు కలవారూ; ప్రజ్వలిత నేత్రులున్= మిక్కిలి మండే కళ్ళు కలవారూ; ఏకపాదులున్= ఒకే పాదం కలవారూ; కరి తురంగ సింహ సూకర+ఆనన సమానముఖులును= ఏనుగు, గుర్రం, సింహం, పంది వీటి ముఖాలవంటి ముఖాలు కలవారూ; తీవ్ర దంష్ట్రా కరాళ+ఆస్యులును= తీక్షణములైన కోరలచే భయంకరాలైన ముఖాలు కలవారూ; మఱియున్; అనేక ప్రకారంబులు+అగు= బహువిధాలైన; వక్త్రంబులన్= ముఖాలతో; పొలుచువారును= ఒప్పేవారూ; వక్ర+అంగులు= వంకర మైన శరీరాలు కలవారూ; దీర్ఘ దేహులున్= పొడవైన శరీరాలు కలవారూ; హ్రస్వ శరీరులున్= పొట్టి శరీరాలు కలవారూ; అతిస్థూలకాయులున్= మిక్కిలి లావైన శరీరాలు కలవారూ; కృశమూర్తులున్= సన్నటి శరీరాలు కలవారూ; పింగళ గాత్రులున్= గోరోచనపు వర్ణం కల శరీరాలు కలవారూ; నీల తనులున్= నల్లటి శరీరాలు కలవారూ; మఱి= ఇంకా; నానా వర్ణంబులు+కలుగువారును= పెక్కు రంగులు కలవారూ; పంచ శిఖులును= అయిదు సిగలు కలవారూ; జటాధారులును= జడలు ధరించినవారూ; కిరీట ధరులును= కిరీటాలు ధరించినవారూ; మఱియున్= ఇంకనూ; బహు భంగికంబులు+ఐన= అనేకవిధాలయిన; మౌళి తలంబులన్= శిరః ప్రదేశాలతో; పొలుపు+ ఒందువారును= ఒప్పేవారూ; లోనుగాన్= మున్నుగా; వివిధ విశేష వికృత స్వరూపులు= రకరకాల మిక్కిలి వికృతాలైన స్వరూపాలు కలవారూ; అగు; అసంఖ్యాత ప్రమథులు= లెక్కలేనంతమంది ప్రమథులు; చిత్ర-అంబర మాల్య+అంగరాగంబులు= రంగు రంగుల వస్త్రాలూ, దండలూ, మైపూతలూ, రత్న కనకమయ భుజ+అస్థి మాలా భూషణంబులును= మణులతోటీ, బంగారంతోటీ చేయబడ్డ అలంకారాలూ, సర్పాలంకారాలూ, ఎముకల దండల అలంకారాలూ, ధనుస్తూణ కృపాణ ముసల ముద్గర పరశు భిండివాల శూల ప్రభృతి స్ఫార ప్రహరణంబులున్= విండ్లూ, అమ్ములపొదలూ, ఖడ్గాలూ, ముసలాలూ, ముద్గరాలూ, గండ్రగొడ్డళ్ళూ, భిండివాలాలూ, శూలాలూ మొదలైన ఎన్నో ఆయుధాలు; మెఱయన్= ప్రకాశించగా; మృదంగ పణవ డమరు ఘంటా గోముఖ+అది - తూర్యంబులున్= మద్దెల, పణవం, డమరువు, గంట, గోముఖం మొదలైన వాద్యాలు; మొరయన్= ధ్వనించగ; విస్ఫురత్+ధ్వజ పతాకా కుంచికలు= ప్రకాశించే జెండాకర్రలూ, జెండాలూ, గుంజలూ, శోభిల్లన్= ఒప్పగా; పాడుచున్= పాటలు పాడుతూ; ఆడుచున్= ఆటలాడుతూ; ఆర్చుచున్= అరుస్తూ; బొబ్బలు+ఇడుచున్= కేకలు పెడుతూ; అవుడు+కఱచుచున్= పెదవులు కొరుక్కుంటూ; త్రుళ్ళుచున్= ఎగిరిపడుతూ; గురువులు+పాఱుచున్= పరుగెత్తుతూ;

కరటి బృంహితంబులున్= ఏనుగు ఘీంకారాలనూ; కంఠీరవ గర్జితంబులున్= సింహగర్జనలనూ; శంఖ రవంబులున్= శంఖ ధ్వనులనూ; భేరీ ధ్వనులున్= భేరీ ధ్వనులనూ; పోని= పోలిన; ఎలుంగులు= కంఠస్వరాలు; చెలంగన్= మ్రోయగా; బెట్టిదంబులు+అగు= పలు+తెఱంగుల పలుకులు= పరుషాలైన అనేక విధాల మాటలు; ఎసంగన్= అతిశయించగా; బ్రహ్మద్వేషులు+అగు వారి= బ్రాహ్మణద్వేషం కలవారియొక్క; మాంస రుధిరంబులన్= మాంసాలతోనూ, రక్తాలతోనూ; పూర్ణంబులు+అగు= నిండినవైన; కపాలంబులు= పుర్రెలను; కరతలంబులన్= చేతులతో; కొని; అఖిలంబులు+అగు= భయంకరాలైన; భక్షణ పానంబులు= తినటం, త్రాగటం; ఆచరించుచున్= చేస్తూ; సోమపాన శమ దమ తపస్(ః)+బ్రహ్మచర్య ప్రముఖంబులు+అగు= సోమరసం త్రాగటం శాంతం, ఇంద్రియనిగ్రహం, తపస్సు, బ్రహ్మచర్యం మొదలైనవైన తమ విశిష్ట కర్మంబులకున్= తమ ఉత్తమ కర్మలకు; భవుండు= ఈశ్వరుఁడు, విస్మయంబున్+ఒందున్+కాని= ఆశ్చర్యపడతాడు కాని; అష్టగుణంబు+అగు+ఐశ్వర్యంబున్= అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం వశిత్వం అనే ఎనిమిది విధాలైన విభూతిని; ఒందియున్= పొందికూడా; తారు= తాము; విస్మితులు= గర్వితులు; కాని+అట్టి మహానుభావులు= కానట్టి మహాత్ములు; ఆ+దేవునకున్= ఆ శివుడికీ; గౌరికిన్= పార్వతికీ; గజముఖ షణ్ముఖులకంటెన్= వినాయక కుమారస్వాములకన్నా; అర్మిలికిన్= ప్రేమకి; పట్టు+అగు= స్థానమైన; భవ్యులు= యోగ్యులు; దివ్య జన స్తవ్యులు= దేవతలచేత స్తుతించదగినవారు; ఆ+అస్త్ర గురుతనూభవు తెంపు= ఆ అశ్వత్థామ సాహసకార్యం; ఎఱుంగుటకున్= తెలిసికోవటానికి; సౌప్తిక వ్యాపార ఘోరత్వంబున్= నిద్రించే శత్రువులను చంపే పనియొక్క దారుణాన్ని; కనుంగొని= చూచి; వినోదించుటకున్= ఆనందించటానికీ; వచ్చి; అతని చిత్తంబునకున్= అతడి మనస్సుకి; బెదరు= భయం; పుట్టించువారు+ఐ= కలిగించేవారై; భీషణ+ఆకారంబులన్= భయంకర రూపాలతో; ఉల్లసిల్లినన్= ఒప్పగా; ఆ ధైర్యధుర్యుండు= ఆ ధైర్యభారం వహించేవాడు- మహాధీరుడు ఆ అశ్వత్థామ.

**తాత్పర్యం:** అప్పుడు ప్రకాశించే ముఖాలూ, మండే కళ్ళూ కలవారూ, ఒకే పాదం కలవారూ, ఏనుగు, గుర్రం, సింహం, పంది ముఖాలవారూ, వాడికోరలతో భయంకరాలైన ముఖాలు కలవారూ, ఇంకా బహువిధాలైన ముఖాలతో ఒప్పేవారూ, వంకర, పొడుగు, పొట్టి శరీరాలు కలవారూ, మిక్కిలి లావుపాటివారూ, సన్నటివారూ, గోరోచనం రంగువారూ, నల్లటివారూ, ఇంకా నానావర్ణాలవారూ, అయిదు సిగలు కలవారూ, జడలు ధరించినవారూ, కిరీటాలు ధరించినవారూ, ఇంకా పలురకాలైనా శిరస్సులతో ఒప్పేవారూ - ఈ రీతిగా రకరకాల మిక్కిలి వికృత స్వరూపాలు కలవారూ అయిన లెక్కలేనంతమంది ప్రమథులు రంగురంగుల వస్త్రాలూ, దండలూ, మైపూతలూ, మణిమయాలంకారాలూ, సువర్ణాలంకారాలూ, సర్పాలంకారాలూ, ఎముకల దండల అలంకారాలూ ధరించి, విండ్లూ, అరసపొదులూ, ఖడ్గాలూ, ముసలాయుధాలూ, ముద్గరాలూ, గండ్రగొడ్డళ్ళూ, భిండివాలాలూ, శూలాలూ మొదలైన ఎన్నో ఆయుధాలు ప్రకాశించగా, మద్దెల, పణవం, డమరవు, గంట, గోముఖం మొదలైన వాద్యాలు ధ్వనించగా, ప్రకాశించే ధ్వజాలూ, పతాకలూ, గుంజలూ ఒప్పగా, పాటలు పాడుతూ, ఆటలు ఆడుతూ, అరుస్తూ, కేకలు పెడుతూ, పెదవులు కొరుక్కొంటూ, ఎగిరిపడుతూ, పరుగెత్తుతూ, ఏనుగుఘీంకారాలనూ, సింహగర్జనలనూ, శంఖధ్వనులనూ, భేరీనాదాలనూ పోలిన కంఠస్వరాలు మ్రోయగా, అనేక విధాల పరుషవాక్కులు అతిశయించగా, బ్రాహ్మణద్వేషుల మాంసరక్తాలతో నిండిన పుర్రెలను చేతులతో పట్టుకొని భయంకరంగా తింటూ, త్రాగుతూ, సోమపానం, శమదమాలూ, తపస్సు, బ్రహ్మచర్యం మొదలైన తమ మంచిపనులకు ఈశ్వరుడు ఆశ్చర్యపడతాడు కాని, అణిమాద్యష్ట విధవిభూతులనూ పొందికూడా గర్వించని మహాత్ములు, ఆ శివుడికీ, పార్వతికీ వినాయక కుమారస్వాముల కంటే కూడా ప్రేమాస్పదులై యోగ్యులూ, దేవతలచేత స్తుతింపదగినవారూ ఆ అశ్వత్థామ సాహసకార్యం తెలిసికొనటానికీ, నిద్రించే శత్రువులను సంహరించే దారుణాన్ని చూచి ఆనందించటానికీ వచ్చి,అతడి మనస్సుకు భయం పుట్టించాలని భయంకర స్వరూపాలతో ఒప్పగా, మహాధీరుడైన ఆ అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** కరటి బృంహితంబులఁ గంఠీరవ గర్జితంబులు శంఖరవంబులు భేరీధ్వనులుం బోని యెలుంగులు.. 'అలంకారం మాలోపమ.

**మ. వెఱ పావంతయులేక వారిఁ గలయన్ వీక్షించి నెమ్మోమునం**
**జిఱునవ్వున్, మదిఁ దెంపుసొంపు వెలయం, జెల్వంబురెట్టింప, నం**
**దఱుఁ గీర్తింప, రథంబుమీఁది ఘనకోదండంబు చేనంది, చి**
**చ్చఱుకం జేరె నుదాత్తభంగి మహనీయోత్సాహ సందీప్తుఁడై. 117**

**ప్రతిపదార్థం:** వెఱవు= భయం; అవ+అంతయున్= కొంచెంకూడా; లేక; వారిన్= ఆ ప్రమథుల్ని; కలయన్= బాగుగా; వీక్షించి= చూచి; నెఱ+మోమునన్= నిండుముఖంలో; చిఱునవ్వున్= చిరునవ్వూ; మదిన్= మనస్సులో; తెంపు సొంపున్= సాహసపు విధమూ; వెలయన్= స్పష్టపడగా; చెల్వంబు= అందం; రెట్టింపన్= ఇనుమడించగా; అందఱున్= అందరూ; కీర్తింపన్= పొగడగా; రథంబుమీఁది= రథంమీద ఉన్న; ఘనకోదడంబు= గొప్ప విల్లు; చేన్+అంది= చేతితో పుచ్చుకొని; మహనీయ= అధికమైన; ఉత్సాహ= వేడుకచేత; సందీప్తుఁడు+ఐ= మిక్కిలి ప్రకాశించినవాడై; ఉదాత్తభంగిన్= ఒప్పైన విధంగా; చిచ్చు+ఉఱుకన్= అగ్గిలో ఉరకటానికి; చేరెన్= సమీపించాడు.

**తాత్పర్యం:** కొంచెంకూడా భయంలేకుండా ఆ ప్రమథులను బాగా చూచి, ముఖంలో చిరునవ్వూ, మనస్సులో సాహసంచేసే విధమూ స్పష్టపడగా, అందం ఇనుమడించగా, అందరూ పొగడుతూండగా, రథంమీదున్న గొప్పవిల్లు చేతితో పుచ్చుకొని మంచి ఉత్సాహంతో ఒప్పైన రీతిలో అగ్గిలో ఉరకటానికి సమీపించాడు.

**ఆ. ఇవ్విధమునఁ జేరి యవ్వేది లోపల । భాసమానుఁడైన పావకుండు**
**దేహమొక్క యాహుతిగఁ జేయుటకుఁ దగు । నంత లేకయునికి నతఁడు సూచి. 118**

**ప్రతిపదార్థం:** అతఁడు= అశ్వత్థామ; ఈ+విధమునన్= ఈ విధంగా; చేరి= సమీపించి; ఆ+వేదిలోపలన్= ఆ అరుగులోపల; భాసమానుఁడు+ఐన= ప్రకాశిస్తూన్న; పావకుండు= అగ్నిదేవుడు; దేహము= శరీరం; ఒక్క+ఆహుతిగన్= ఒకే వేలిమిగా; చేయుటకున్; తగు+అంత= చాలినంత; లేక+ఉనికిన్= లేకపోవటం చూచి.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఈ విధంగా వేదిని సమీపించి, దానిలోపల వెలిగే అగ్ని తన దేహాన్ని ఒక్క వేలిమిగా చేయటానికి చాలినంత లేకపోవటం చూచి.

**క. తన యరదముమీఁదం గల । ధనుర్వితానము, లసత్ప్రదర జాలములం**
**గొనివచ్చి వేదియం దిం । ధనములుగాఁ జేర్చి తెంపు దలకొనుమదితోన్. 119**

**ప్రతిపదార్థం:** తన+అరదము మీఁదన్= తనరథంమీద; కల= ఉన్న; ధనుస్(:)+వితానమున్= విండ్ల సమూహాన్ని; లసత్+ప్రదర-జాలములన్= ప్రకాశిస్తూన్న బాణాల సమూహాలనూ; కొనివచ్చి; వేదియందున్= తిన్నెమీద; ఇంధనములు+కాన్= కట్టెలుగా; పేర్చి= అమర్చి; తెంపు= సాహసం; తలకొను మదితోన్= అతిశయించే మనస్సుతో.

**తాత్పర్యం:** తన రథంమీద ఉన్న విండ్ల సమూహాన్నీ, మెరిసే బాణ సమూహాలనూ తీసికొనివచ్చి వేదిమీద కట్టెలుగా పేర్చి, సాహసం అతిశయించే తలంపుతో.

**వ. పేర్చి యప్పరమేశ్వరు నుద్దేశించి. 120**

**ప్రతిపదార్థం:** పేర్చి= విజృంభించి; ఆ+పరమేశ్వరున్= ఆ పరమేశ్వరుడిని; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** విజృంభించి, ఆ పరమేశ్వరుడిని గురించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'తెఱఁ గెట్టిదియో నా మది । నెఱుఁగ మదాత్మోపహార మిచ్చెద నీకుం**
**గఱకంఠ! వరము నాకుఁ బ । గఱఁ బరిమార్పంగ శక్తి గలుగుటయ చుమీ!;' 121**

**ప్రతిపదార్థం:** కఱకంఠ= గరళకంఠా! - ఈశ్వరా!; తెఱఁగు= విధం; ఎట్టిదియో= ఏదో; నా మదిన్= నా మనస్సులో; ఎఱుఁగన్= ఎరుగను; నీకున్; మత్+ఆత్మ+ఉపహారము= నా ఆత్మబలిదానం; ఇచ్చెదన్; నాకున్; పగఱన్= శత్రువులను; పరిమార్పంగన్= చదవటానికి; శక్తి= సామర్థ్యం; కలుగుట+అ= కలగటమే; వరము= వరం; చుమీ= సుమీ!

**తాత్పర్యం:** 'పరమేశ్వరా! ఏమి చేయాలో నా మనస్సుకు తట్టటం లేదు. నీకు నేను ఆత్మబలిదానం చేస్తాను. నాకు శత్రువులను చంపే శక్తి కలగటమే వరం సుమా!'

**వ. అని ప్రార్థించి. 122**

**తాత్పర్యం:** అని కోరి.

**క. 'ఆంగిరస కుల జనిత మీ । యంగము శిఖియందు దీని నాహుతిగాఁ జే**
**యం గంటి భవద్భక్తి సు । సంగతిమతితోఁ గృతార్థజన్ముఁడ నైతిన్.' 123**

**ప్రతిపదార్థం:** ఈ+అంగము= ఈ శరీరం; ఆంగిరస కుల జనితము= అంగిరసుని వంశంలో పుట్టినది; దీనిన్; భవత్+భక్తి సుసంగత మతితోన్= నీయందలి భక్తితో కూడిన మనస్సుతో; శిఖియందున్= అగ్నిలో; ఆహుతి+కాన్= హోమంగా; చేయన్+కంటిన్= చేయగలిగాను; కృతార్థ జన్ముఁడన్+ఐతిన్= ధన్యమైన పుట్టుక గలవాడిని అయ్యాను.

**తాత్పర్యం:** 'ఈ నా శరీరం అంగిరసుడి వంశంలో పుట్టింది. దీనిని నీ అందలి భక్తితో కూడిన మనస్సుతో అగ్నిలో హోమం చేసే అదృష్టాన్ని పొందాను. నా పుట్టుక ధన్యమైనది.'

**క. అని పలుకుచుఁ బరమేశ్వరు । మనమున నిడి యూర్ధ్వ బాహు మహితాకారుం**
**డును ఘనసమాధి యగుచున్ । విను ముఱికెను గురుసుతుండు వేదికపైకిన్. 124**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము (ధృతరాష్ట్రా)!; అని; పలుకుచున్= అంటూ; పరమేశ్వరున్; మనమునన్+ఇడి= మనస్సులో పెట్టుకొని; గురుసుతుండు= అశ్వత్థామ; ఊర్ధ్వ బాహుమహిత+ఆకారుండును= చేతులు పైకెత్తిన గొప్ప రూపం కలవాడూ; ఘనసమాధి= గొప్పధ్యానం కలవాడూ; అగుచున్; వేదికపైకిన్= వేదికమీదికి; ఉఱికెను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! వినుము. ఈ విధంగా అంటూ అశ్వత్థామ పరమేశ్వరుడిని మనసులో నిలుపుకొని పైకి చేతులుగల గొప్ప ఆకారమూ, గొప్పధ్యానమూ కలవాడవుతూ వేదికమీదికి ఉరికాడు.

**ఆ. ఉఱికి మంటలోన నుల్లంబు తెలివొక । యింతయేనిఁ గుంద కిద్ధమూర్తిఁ**
**దేజరిల్ల నున్న ధీరవర్యునకుఁ బ్ర । త్యక్షమయ్యెఁ శివుఁడు దయదలిర్ప. 125**

**ప్రతిపదార్థం:** మంటలోనన్; ఉఱికి; ఉల్లంబు తెలివి= మనోవికాసం; ఒక+ఇంత+ఏనిన్= కొంచెమైనా; కుందక= తగ్గక; ఇద్ధమూర్తిన్= కాంతిమంతమైన రూపంతో; తేజరిల్లన్+ఉన్న= ప్రకాశిస్తూన్న; ధీరవర్యునకున్= ధైర్యవంతులలో శ్రేష్ఠుడైన అశ్వత్థామకు; శివుఁడు; దయ తలిర్పన్= దయ అతిశయించగా; ప్రత్యక్షము+అయ్యెన్= సాక్షాత్కరించాడు.

**తాత్పర్యం:** మంటలో ఉరికి, తెలివి కొంచెమైనా తగ్గక, కాంతిమంతమైన ఆకారంతో ప్రకాశిస్తూన్న ధీరశ్రేష్ఠుడైన అశ్వత్థామకు శివుడు దయాతిశయంతో సాక్షాత్కరించాడు.

అశ్వత్థామకు శివుఁడు ప్రత్యక్షంబై ఖడ్గం బొసంగుట (సం. 10-7-59)

**వ. ఇ ట్లెదురు నిల్చిన భక్తవత్సలుం డగు భవానీవిభుండు దరహసిత ముఖుండగుచు దివ్యావలోకనామృతంబు వెల్లిగొల్పిన నవ్వేదియందుఁ గమలాకరంబులో నున్న చందంబునఁ బ్రమోదంబు నొందియున్నయన్నరోత్తము నకు నారాయణప్రియుం డిట్లనియె. 126**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఎదురన్= ముందర; నిల్చిన; భక్తవత్సలుండు+అగు= భక్తులపై ప్రేమకలవాడైన; భవానీవిభుండు= పార్వతీపతి; దరహసిత ముఖుండు+అగుచున్= చిరునవ్వుమొగం కలవాడు అవుతూ; దివ్య+అవలోకన+అమృతంబున్= దివ్యమైన దృష్టి అనే అమృతాన్ని; వెల్లి+కొల్పినన్= ప్రవహింపచేయగా; ఆ+వేది+అందున్= ఆ అరుగుమీద; కమలాకరంబులోన్= సరస్సులో; ఉన్న చందంబునన్= ఉన్న విధంగా; ప్రమోదంబున్= సంతోషాన్ని; ఒంది+ఉన్న= పొంది ఉన్నట్టి; ఆ+ నర+ ఉత్తమునకున్= ఆ మానవశ్రేష్ఠుడైన అశ్వత్థామకు; నారాయణ ప్రియుండు= విష్ణుప్రియుడైన శివుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా ప్రత్యక్షమైన భక్తవత్సలుడు పరమేశ్వరుడు చిరునవ్వుతో దివ్యదృష్టి అనే అమృతం ప్రవహించేటట్లు చేయగా, ఆ అరుగుమీద సరస్సులో ఉన్నవిధంగా సంతోషంతో ఉన్న ఆ మానవశ్రేష్ఠుడైన అశ్వత్థామతో విష్ణుసఖుడైన ఈశ్వరుడు ఈ రీతిగా అన్నాడు:

**విశేషం:** అలం: రూపకం, ఉత్ప్రేక్ష. దివ్యావలోకనామృతంబు - దివ్యావలోకనం అనే అమృతం - ఉపమేయోపమానాలకి అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం. అవ్వేదియందుఁ గమలాకరంబులో నున్న చందంబున - కమలాకరంలో ఉన్నట్లు సంభావించబడుతున్నాడు కాబట్టి అలంకారం ఉత్ప్రేక్ష. నారాయణ ప్రియుడు - విష్ణుప్రియుడు శివుడు. శివప్రియుడు విష్ణుడు.

**క. 'ఇమ్మెయి నీ దగు సత్క । ర్మమ్ము విశేషమునఁ జేసి మానస మత్యం**
**తమ్ము ప్రియమందె నీకు వ । రమ్మొసఁగఁగ వచ్చితిన్ ధరాసురవర్యా!' 127**

**ప్రతిపదార్థం:** ధరా-సురవర్యా= బ్రాహ్మణశ్రేష్ఠుడా - అశ్వత్థామా!; ఈ+మెయిన్= ఈ విధంగా; నీది+అగు= నీదయిన; సత్+కర్మమ్ము విశేషమునన్+చేసి= మంచి పనియొక్క విశేషంచేత; మానసము= (నా) మనస్సు; అత్యంతమ్ము= మిక్కిలి; ప్రియము+అందెన్= సంతోషించినది; నీకున్= వరమ్ము; ఒసఁగఁగన్= ఇవ్వటానికి; వచ్చితిన్= వచ్చితిని.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణోత్తమా అశ్వత్థామా! ఈ రీతిగా నీ సత్కార్య విశిష్టతచేత నా మనస్సు ఎంతో సంతోషించింది. నీకు వరం ఇవ్వటానికి వచ్చాను.'

**వ. అనవుడు. 128**

**తాత్పర్యం:** శివుడు ఈ రీతిగా అనగానే.

**తే. తనువు పులకల ప్రోవుగా, మనము గాఢ । సంభృతానందముగ శరాచార్యసుతుఁడు**
**వితత సంభ్రముఁడై వేది వెడలి సాఁగి । మ్రొక్కి లేచి ఫాలంబున మొగిచెఁ గేలు. 129**

**ప్రతిపదార్థం:** శర+ఆచార్య సుతుఁడు= అస్త్రగురుడైన ద్రోణుడి కొడుకు - అశ్వత్థామ; తనువు= శరీరం; పులకల ప్రోవు+కాన్= గగుర్పాటుల రాశి కాగా; మనము= మనస్సు; గాఢ - సంభృత+ఆనందము+కన్= అధికంగా కలిగిన సంతోషం కలదికాగా; వితత- సంభ్రముఁడు!== ఎక్కువ వేగిరపాటు కలవాడై; వేదిన్+వెడలి= అరుగునుంచి లేచి; సాఁగి-మ్రొక్కి= సాష్టాంగ నమస్కారం చేసి; లేచి; ఫాలంబునన్= నుదుటిమీద; కేలు మొగిచెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ మేను పులకలతో నిండగా, మనస్సు అధికానందం కలది కాగా, మిక్కిలి వేగిరపాటుతో వేదిమీదనుండి వచ్చి, సాష్టాంగపడి లేచి, నుదుటిమీద కేలుమోడ్చాడు.

**వ. అప్పుడు. 130**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ. అతని మొగంబుమీఁద నొలయన్ మధురంబగు చూడ్కి పార్వతీ**
**పతి మృదురీతి నిట్టు లను; 'భవ్యములైన తపంబు, సత్యము,**
**ధృతియును, శౌచముం గలిగి నిశ్చలభక్తి నొనర్చుఁ గృష్ణుఁ డ**
**ప్రతిమసపర్య నాకు; ననురక్తుఁడ నేనును నమ్మురారికిన్.' 131**

**ప్రతిపదార్థం:** అతని మొగంబు మీఁదన్= ఆ అశ్వత్థామ ముఖంమీద; మధురంబు+అగు చూడ్కి= ఇంపయిన చూపు; ఒలయన్= వ్యాపించగా; పార్వతీపతి= పార్వతిభర్త - పరమేశ్వరుడు; మృదురీతిన్= మెత్తగా; ఇట్టులు+అనున్= ఇట్లా అంటాడు; భవ్యములు+ఐన= యోగ్యాలైన; తపంబున్; సత్యమున్; ధృతియును= యజ్ఞమూ; శౌచమున్= పవిత్రతా; కలిగి; కృష్ణుఁడు; నాకున్; అప్రతిమ-సపర్యన్= సాటిలేని పూజ; నిశ్చలభక్తిన్= అచంచలమైన భక్తితో; ఒనర్చున్= చేస్తాడు; నేనును; ఆ+మురారికిన్= ఆ కృష్ణుడికి; అనురక్తుఁడన్= ఇష్టుడను.

**తాత్పర్యం:** ఆ అశ్వత్థామ ముఖంమీద తన ఇంపయిన చూపు వ్యాపించగా పరమేశ్వరుడు మృదువుగా ఇట్లా అన్నాడు: 'యోగ్యములైన తపస్సూ, సత్యమూ, యజ్ఞమూ, పవిత్రతా కలిగి కృష్ణుడు నాకు అచంచలమైన భక్తితో సాటిలేని పూజ చేస్తాడు. నేనుకూడా ఆ కృష్ణుడికి ఇష్టుడను.

**విశేషం:** ఈ పద్యంలో 'నిశ్చల భక్తి యొనర్చుఁ గృష్ణుఁ డప్రతిమ సపర్య నాకు' అనే పాఠంకంటె, 'నిశ్చలభక్తి నొనర్చుఁ గృష్ణుఁ డప్రతిమ సపర్య నాకు' అనే పాఠం ఉంటే అన్వయం సుగమంగా ఉంటుంది అనిపించింది. కాని, ఆ పాఠం

ఎందులోనూ కనబడలేదు. అయినా - పెద్దమార్పేమీ కాదుగదా అని స్వతంత్రించి ఆ విధంగా మార్చటం జరిగింది. సహృదయులు అర్థం చేసికొనగలరు. 'ధృతియును' అనే పదానికి తపస్సత్యశౌచాలతో దీటుగా ఉంటుందని ప్రకరణోచితంగా 'యజ్ఞ' మని అర్థం చెప్పబడింది. యజ్ఞమనే అర్థంకూడా నిఘంటువులలో ఇవ్వబడింది.

**క. అతనికి సన్మానము సే । యు తలంపున భూతరూప యుక్తుఁడనై వ**
**చ్చితి నినుఁ బాంచాలురపై । నతి స్ఫురణఁ బోవనీక యడ్డం బైతిన్. 132**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ కృష్ణుడికి; సన్మానము+చేయు తలంపునన్= గౌరవం చేసే ఉద్దేశంతో; భూత రూప యుక్తుఁడన్+ఐ= భూతాకారంతో కూడినవాడినయి; వచ్చితిన్; నినున్; పాంచాలురపైన్= పాంచాలురమీదికి; అతి స్ఫురణన్= మిక్కిలి విజృంభణంతో; పోవనీక= పోనీకుండా; అడ్డంబు+ఐతిన్= అడ్డగించాను.

**తాత్పర్యం:** ఆ కృష్ణుడికి గౌరవం చేద్దామనే ఉద్దేశంతో భూతాకారం తాల్చి వచ్చాను. నిన్ను పాంచాలురమీదికి మిక్కిలి విజృంభణంతో దండెత్తకుండా అడ్డగించాను.

**తే. తెల్లముగ నీదు చిత్తంబు తెఱఁ గెఱుంగ । వలసి నే ని ట్లనేకమాయలు పొనర్చి,**
**యస్త్రశస్త్ర నిరాసంబు నాచరించి, । కేలి సలిపితి వేయును నేల చెపుమ.' 133**

**ప్రతిపదార్థం:** నీదు చిత్తంబు - తెఱఁగు= నీ మనఃప్రకారం; తెల్లముగన్= స్పష్టంగా; ఎఱుంగన్ - వలసి= తెలుసుకోవాలని; నేను; ఇట్లు; అనేకమాయలు= ఎన్నోమాయలు; పొనర్చి= చేసి; అస్త్ర శస్త్ర నిరాసంబున్= అస్త్రాల శస్త్రాల ఖండనం; ఆచరించి= చేసి; కేలి-సలిపితిన్= క్రీడించాను; వేయునున్+ఏల-చెపుమ= వేయి మాటలెందుకు చెప్పుము.

**తాత్పర్యం:** నీ మనోభిప్రాయం స్పష్టంగా తెలిసికొనాలని నేను ఇట్లా అనేక మాయలు పన్ని, నీ అస్త్రాలనూ, శస్త్రాలనూ ఖండించి క్రీడించాను. వేయుమాట లెందుకు చెప్పుము.

**వ. 'కృష్ణ సన్మానంబును గృతంబయ్యెఁ; బాంచాలురకుఁ గాలంబు డగ్గఱియె; నేఁడు దెగుదురు; నీవు నా యనుగ్రహంబు వడసి' తని యొక్క మహనీయఖడ్గం బవ్విప్రు ని చేతి కిచ్చుచు నతండెఱుంగకుండఁ దేజోరూపంబున నతని తనువున నావేశించె; నిట్లు రుద్రుండొలసిన యగ్గురునందనుండమంద హర్షమయమూర్తియై యతులప్రభనొప్పె; మున్ను భూతంబుచేత నపహృతంబులైన యస్త్రశస్త్రంబులును, బిదప వేదియం బిడిన యాయుధంబులు నమ్మహావీరుని తేరిపైఁ బూర్వ ప్రకారంబున నుండె; నప్పుడు ప్రమథగణంబు లదృష్టాకారంబులై యమ్మహాత్మునిఁ బరమాత్ముఁ గొలుచుచందంబునబలసి రా రథారూఢుండై పాండవ శిబిరంబునకు నాతండు నడవఁ దోడన కృపకృతవర్ములు నడచి'; రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 134**

**ప్రతిపదార్థం:** కృష్ణ సన్మానంబును= కృష్ణుని సమ్మానమూ; కృతంబు+అయ్యెన్= చేయబడినది; పాంచాలురకున్; కాలంబు డగ్గఱియెన్= పోగాలం సమీపించింది; నేఁడు= ఈవేళ; తెగుదురు= చస్తారు; నీవు; నా+అనుగ్రహంబు+పడసితి(వి)= నా అనుగ్రహం పొందావు; అని; ఒక్క; మహనీయ ఖడ్గంబు= గొప్ప ఖడ్గం; ఆ+విప్రుని చేతికిన్= ఆ బ్రాహ్మణుడి చేతికి;

ఇచ్చుచున్; అతఁడు; ఎఱుఁగక+ఉండన్= తెలియకుండా; తేజస్(;)+ రూపంబునన్= తేజోరూపంలో; అతని తనువునన్= అతడి శరీరంలో; ఆవేశించెన్= ప్రవేశించాడు; ఇట్లు; రుద్రుండు+ఒలసిన+ఆ+గురునందనుండు= రుద్రుడు ఆవేశించిన ఆ అశ్వత్థామ; అమంద హర్షమయమూర్తి+ఐ= అధికమైన సంతోషంతో నిండిన ఆకారం కలవాడై; అతుల ప్రభన్= సాటిలేని కాంతితో; ఒప్పెన్; మున్ను= ఇంతకుముందు; భూతంబుచేతన్= అపహృతంబులు+ఐన= అపహరించబడ్డ; అస్త్ర శస్త్రంబులును= అస్త్రాలూ, శస్త్రాలూ; పిదపన్= తరువాత; వేదియందున్; ఇడిన= పెట్టిన; ఆయుధంబులున్= ఆ+మహావీరుని తేరివైన్= ఆ గొప్పవీరుడైన అశ్వత్థామయొక్క రథంమీద; పూర్వ ప్రకారంబునన్= మునుపటివలె; ఉండెన్; అప్పుడు; ప్రమథ-గణంబులు; అదృష్ట+ఆకారంబులై= కనబడని ఆకారాలు కలవారై; ఆ+మహాత్ముని= ఆ మహనీయుడిని- అశ్వత్థామను; పరమాత్మున్= దేవుడిని; కొలుచు చందంబునన్= కొలిచేవిధంగా; బలసి-రాన్= పరివేష్టించి రాగా; రథారూఢుండై= రథం ఎక్కినవాడై; పాండవ శిబిరంబునకున్= పాండవుల బిడారానికి; అతండు= అశ్వత్థామ; నడవన్= నడుస్తూండగా; తోడన్+ఆ= వెంట; కృప కృతవర్ములు= కృపుడూ, కృతవర్మా; నడచిరి; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'కృష్ణుడి సమ్మానంకూడా జరిగింది. పాంచాలురకు పోగాలం దాపురించినది. ఈవేళ చస్తారు. నువ్వు నా అనుగ్రహం పొందావు' అని ఒక గొప్ప ఖడ్గాన్ని ఆ బ్రాహ్మణుడి చేతి కిస్తూ, అతడికి తెలియకుండా తేజోరూపంలో అతడి శరీరంలో ప్రవేశించాడు. ఇట్లా రుద్రు డావేశించిన ఆ అశ్వత్థామ చాలా సంతోషించి, సాటిలేని కాంతితో వెలుగొందాడు. పూర్వం భూతంచేత అపహరించబడ్డ అస్త్రశస్త్రాలూ, తరువాత వేదిమీద పెట్టిన ఆయుధాలూ ఆ మహావీరుడి రథంమీద ఇదివరకువలె ఉన్నాయి. అప్పుడు ప్రమథగణాలు కనిపించని ఆకారాలతో ఆ మహాత్ముడిని పరమాత్ముడిని కొలిచేటట్లు పరివేష్టించి వస్తూండగా, రథం ఎక్కి పాండవుల శిబిరానికి అతడు నడుస్తూంటే కూడా కృపుడూ, కృతవర్మా నడిచారు' అని చెప్పగా విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**చ. అతఁ డటు లేపునం జనఁగ నా కృపుఁడుం గృతవర్మయున్ 'మహో**
**న్నత వరలాభ గర్విత మనస్కుఁడు ద్రోణసుతుండు వోవఁగా,**
**నితని క్రియన్ బలోద్ధతి సహిష్ణుత గల్గునె యొడ్ల? కంచు సం**
**భృత భయ చిత్తవృత్తులయి పెంపఱఁ బోరు గదా పిఱిందికిన్?' 135**

**ప్రతిపదార్థం:** అతఁడు= అశ్వత్థామ; అటులు= ఆ విధంగా; ఏపునన్= విజృంభణతో; చనఁగన్= వెళ్ళగా; మహత్+ఉన్నత= మిక్కిలి గొప్పదైన; వర= వరంయొక్క; లాభ= ప్రాప్తిచేత; గర్విత= గర్వించిన; మనస్కుఁడు= మనస్సు కలవాఁడు(అయిన); ద్రోణసుతుండు= అశ్వత్థామ; పోవఁగాన్= పోతోంటే; ఇతని క్రియన్= ఇతడిలాగ; ఒడ్లకున్= ఇతరులకు; బల+ఉద్ధతి= బలగర్వమూ; సహిష్ణుత= ఓర్పూ; కల్గునె?= ఉంటాయా?; అంచున్= అని; కృపుఁడున్+కృతవర్మయున్= కృపుడూ, కృతవర్మా; సంభృత భయ చిత్తవృత్తులు+అయి= భయంతో నిండిన మనోవ్యాపారాలు గలవారై; పెంపు+అఱన్= గొప్పతనం నశించగా; పిఱిందికిన్= వెనక్కి; పోరు+కదా= వెళ్ళరుకదా!

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ విధంగా విజృంభించి వెళ్ళగా, 'మిక్కిలి గొప్పవరం లభించటంచేత గర్వించిన మనస్సుకల అశ్వత్థామ పోతోంటే, ఇతడివలె ఇతరులకు బలగర్వమూ, ఓర్మి ఉంటాయా?' అని భయం నిండిన మనస్సులు కలవారై, తమ గొప్పతనం నశించేటట్లు కృపుడూ, కృతవర్మా వెనుకకు వెళ్ళిపోరు గదా!'

**వ. మఱియును.** **136**

**తాత్పర్యం:** ఇంకనూ.

**వ. పటువేగంబున ముట్టి ద్రోణసుతుఁ డప్పాంచాలలోకంబుఁ ద**
**క్కటి భూపాలుర, ద్రౌపదీతనయ వర్గంబున్ భూజాఖేలనో**
**ద్భట ఖడ్గోల్లసనంబు పాల్పఱిచి తద్ధాత్రీతలం బెల్ల నె**
**త్తుట జొత్తిల్లఁగఁ జేసెనే రిపుచమూ దుర్వార ఘోరాకృతిన్?** **137**

**ప్రతిపదార్థం:** ద్రోణ సుతుఁడు= అశ్వత్థామ; రిపు= శత్రువులయొక్క; చమూ= సేనలకు; దుర్వార= వారించడానికి శక్యంకాని; ఘోర+ఆకృతిన్= భయంకరాకారంతో; పటు వేగంబునన్= తీవ్రమైన వేగంతో; ముట్టి= తాకి; ఆ+పాంచాల లోకంబున్= ఆ పాంచాలుర సమూహాన్నీ; తక్కటి= మిగిలిన; భూపాలురన్= రాజులనూ; ద్రౌపదీ తనయ వర్గంబున్= ద్రౌపది కొడుకుల సమూహాన్నీ; భుజా= బాహువులయొక్క; ఖేలన= కదలికచేత; ఉద్భట= ఉగ్రమైన; ఖడ్గ= కత్తియొక్క; ఉల్లసనంబు= ప్రకాశానికి; పాల్పఱిచి= ఆధీనమయ్యేటట్లు చేసి; తద్+ధాత్రీ తలంబు+ఎల్లన్= ఆ భూప్రదేశమంతా; నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లఁగన్+చేసెనే?= ఎర్రబడేటట్లు చేశాడా?

**తాత్పర్యం:** 'అశ్వత్థామ శత్రుసేనలకు వారించశక్యం కాని భయంకరాకారంతో తీవ్రవేగంతో ముట్టడించి ఆ పాంచాలుర సమూహాన్నీ, తక్కిన రాజులనూ, ఉపపాండవులనూ బాహువుల కదలికచేత ఉగ్రమైన ఖడ్గపు ప్రకాశానికి ఆధీనమయ్యేటట్లు చేసి, ఆ భూభాగమంతా రక్తంతో ఎర్రబడేటట్లు చేశాడా?'

**విశేషం:** అశ్వత్థామ పాండవపక్ష వీరులను ఎట్లా చంపాడో తెలిసికొనటానికి ధృతరాష్ట్రుడి అత్యాసక్తి గమనించదగ్గది. అతడు దానిని ధర్మంగా చేశాడా?, అధర్మంగా చేశాడా? అనేది అతడికి అనవసరం.

**క. పాండవ శిబిరముఁ జొచ్చి య । ఖండిత పౌరుషము వెలయఁగాఁ గలశజపు**
**త్రుం డది యంతయు మత్పు । త్రుం డరిగెడి తెరువునం దరుగఁజేసెఁ గదే?** **138**

**ప్రతిపదార్థం:** కలశజ పుత్రుండు= కంభజుడి (ద్రోణుడి) కొడుకు అశ్వత్థామ; పాండవ శిబిరమున్= పాండవుల స్కంధావారం; చొచ్చి= ప్రవేశించి; అఖండిత పౌరుషము= మొక్కవోని పరాక్రమం; వెలయఁగాన్= ఒప్పేటట్లు; అది+అంతయున్= ఆ మారణహోమం అంతా; మత్+పుత్రుండు= నా కొడుకు దుర్యోధనుడు; అరిగెడి తెరువునందున్= వెళ్ళేదారిలో - అనుకున్న రీతిలో; అరుగన్+చేసెన్+కదే= వెళ్ళేటట్లు చేశాడు కదా!

**తాత్పర్యం:** అశ్వత్థామ పాండవుల స్కంధావారం ప్రవేశించి అకుంఠిత పరాక్రమం ఒప్పేవిధంగా ఆ మారణహోమం అంతా నా కొడుకు అరిగే మార్గంలోనే - అనుకున్నట్లుగానే జరిగేటట్లు చేశాడు కదా!

**వ. సమరప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱిఁగింపు మనుటయు నతం డి ట్లనియె.** **139**

**ప్రతిపదార్థం:** సమర ప్రకారంబు+అంతయున్= యుద్ధం తీరు అంతా; సవిస్తరంబుగాన్= వివరంగా; ఎఱిఁగింపుము+ అనుటయున్= చెప్పమనగా; అతండు= ఆ సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** యుద్ధం జరిగిన తీరంతా వివరంగా చెప్పు' మనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**తే.** **ఇవ్విధంబున గరురుసుతుఁ డేపు మిగిలి। చనఁగఁ గృపుఁడును గృతవర్మయును దలిర్చు**
**కడఁక నతనితో నడచిరి గాని వారి। వలన నించుకయును నరవాయి లేదు.** **140**

**ప్రతిపదార్థం:** గురు సుతుఁడు= అశ్వత్థామ; ఈ+విధంబునన్= ఈ విధంగా; ఏపు మిగిలి= విజృంభణం అతిశయించి; చనఁగన్= వెళ్ళగా; కృపుఁడును, కృతవర్మయును; తలిర్చు కడఁకన్= చిగిర్చిన పూనికతోన్= ఆ అశ్వత్థామతో; నడచిరి+కాని= నడిచారు కాని; వారి వలనన్= వాళ్ళ విషయంలో; ఇంచుకయును= కొంచెంకూడా; అరవాయి లేదు= వెనుకతీత లేదు.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఈ విధంగా అతిశయించిన విజృంభణంతో వెళ్ళగా కృపుడూ, కృతవర్మా చివురించిన పూనికతో అతడి వెంట నడిచారు కాని, వారి విషయంలో ఏమాత్రం వెనుకపాటులేదు.

**వ.** **ఇట్లు తన కెలంకుల నడచు నవ్వీరుల నాలోకించి యాచార్యసుతుఁడు సంతోషించి.** **141**

**ప్రతిపదార్థం:** ఇట్లు; తన కెలంకులన్= తన ప్రక్కల; నడచు= నడిచే; ఆ+వీరులన్= ఆ వీరులను-కృపకృతవర్ములను; ఆలోకించి= చూచి; ఆచార్యసుతుఁడు= గురుపుత్రుడు - అశ్వత్థామ; సంతోషించి.

**తాత్పర్యం:** ఈ విధంగా తన కిరుప్రక్కలా నడిచే ఆ వీరులను చూసి అశ్వత్థామ సంతోషించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **'మీరును దెంపుసొం పెసఁగ మిక్కిలి బీరము లావు చూపఁగాఁ**
**గోరి కడంగి పైఁబడుటకుం దగి యుండదు వీడు మీ బలో**
**దారత ప్రాపునం జని యుదగ్ర భుజావిభవంబు పెంపు సొం**
**పారఁగ నవ్విరోధి నిచయంబు సమస్తము నేన త్రుంచెదన్.'** **142**

**ప్రతిపదార్థం:** మీరును= మీరుకూడా; తెంపు సొంపు+ఎసఁగన్= సాహసపు తీరు అతిశయించగా; మిక్కిలి; బీరమున్= పరాక్రమమూ; లావు= బలము; చూపఁగాన్+కోరి= చూపించగోరి; కడంగి= పూని; పైన్+పడుటకున్= మీద పడటానికి; వీడు= శిబిరం; తగి+ఉండదు= తగినట్టుగా ఉండదు; మీ బల+ఉదారత ప్రాపునన్= మీ పరాక్రమాతిశయం అండగా; చని= వెళ్ళి; ఉదగ్ర బుజా విభవంబు పెంపు సొంపు+అరఁగన్= తీవ్రమైన బాహుబల సంపదయొక్క అధిక్యం అందగించగా; ఆ+విరోధి నిచయంబున్= ఆ శత్రువర్గాన్ని; సమస్తమున్= సర్వాన్నీ; నేను+అ= నేనొక్కడినే; త్రుంచెదన్= ఖండిస్తాను.

**తాత్పర్యం:** మీరు కూడా సాహసాతిశయంతో మిక్కిలి పరాక్రమం, బలం చూపించగోరి పూని మీద పడటానికి శత్రుశిబిరం తగినట్లుగా ఉండదు. మీ బలాధిక్యం అండగా వెళ్ళి, నా తీవ్రమయిన బాహుబల సంపద చూపి, ఆ శత్రుసమూహం సర్వం నే నొక్కడినే ఖండిస్తాను.

**వ.** **అని యిట్లు వారి నగ్గించి వాకిట నిలిపి మహనీయ బాణ బాణాసనంబులు వహించి సుప్రసుప్త సకల జనంబైన యా శిబిరంబుఁ జొచ్చి తాను మున్న గతాగతజనంబులవలనఁ బ్రసంగాధీనతం జేసి యవ్విడిదల తెఱంగు లిట్టిట్టివి వారి సన్నివేశంబు లిచ్చటిచ్చట నని సాభిజ్ఞానంబుగా వినియునికి కతంబున నరసికొనిపోవ**

**నేర్చి తొలుత ధృష్టద్యుమ్ను సదనంబునకు నరిగి బాణబాణాసన సహితంబై యున్న రథంబు డిగి రుద్రు నుద్దేశించి మానసంబున. 143**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; వారిన్; అగ్గించి= కొనియాడి; వాకిటన్= ద్వారం దగ్గర; నిలిపి; బాణ బాణాసనంబులు= అమ్ములూ, విండ్లూ; వహించి= తాల్చి; సుప్రసుప్త సకల జనంబు+ఐన= బాగా నిద్రపోయిన ఎల్లజనులు కలిగిన; ఆ శిబిరంబున్+చొచ్చి= ఆ శిబిరంలో ప్రవేశించి; తాను; మున్ను+అ= ముందే; గత+అగత - జనంబులవలనన్= పోయి వచ్చే జనాలవలన; ప్రసంగాధీనతన్+చేసి= సంభాషణవశంచేత; ఆ+విడిదిల తెఱంగులు= ఆ శిబిరం వైనాలు; ఇట్టి+ఇట్టి+అని= ఇట్లాటినిట్లాటివి; వారి సన్నివేశంబులు= వారి విడిదలలు; ఇచ్చటన్+ఇచ్చటన్+అని= ఇక్కడ ఇక్కడ అని; సాభిజ్ఞానంబుగాన్= గుర్తుండే విధంగా; విని+ఉనికి కతంబునన్= విని ఉండటంచేత; అరసికొనిపోవన్+చేర్చి= చూచికొనిపోగలిగి; తొలుతన్= మొదట; ధృష్టద్యుమ్ను-సదనంబునకున్= ధృష్టద్యుమ్నుడి శిబిరానికి; అరిగి= వెళ్ళి; బాణ బాణ+అసన సహితంబు+ఐ+ఉన్న= అమ్ములతోనూ, విండ్లతోనూ కూడియున్న; రథంబున్+డిగి= రథం దిగి; రుద్రున్+ఉద్దేశించి= శివుడిని గురించి; మానసంబునన్= మనస్సులో.

**తాత్పర్యం:** అని ఇట్లా వారిని కొనియాడి వాకిట్లో నిలిపి, గొప్పవైన అమ్ములూ, విండ్లూ పుచ్చుకొని, బాగా నిద్రపోతూ ఉన్న జనులుగల శిబిరంలో ప్రవేశించి, తను ఇంతకుముందే వచ్చేపోయే జనులవలన సంభాషణవశంచేత ఆ శిబిరం వైనాలు ఇట్లాంటి విట్లాంటివి, వాళ్ళ విడిదలలు ఇక్కడిక్కడ అని గుర్తులతో విని ఉండటంచేత చూచికొని పోగలిగి, మొదట ధృష్టద్యుమ్నుడి శిబిరానికి వెళ్ళి, బాణాలూ, విండ్లూ కల రథం దిగి రుద్రుడిని గురించి మనస్సులో, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పూనితి నిష్ఠమెయి న్నిను । నానా భూతోపహార నవ్యార్చన నీ**
**కే నొనరించెద; నది యీ । శానా! కైకొనుము; సుప్రసన్నుఁడ వగుమీ.' 144**

**ప్రతిపదార్థం:** ఈశానా!= ఈశ్వరా!; నినున్= నిన్ను; నిష్ఠమెయిన్= నిష్ఠతో; పూనితిన్= తలచాను; నీకున్; ఏను= నేను; నానా భూత+ఉపహార నవ్య+అర్చనన్= అనేక ప్రాణుల బలిదానమనే క్రొత్త పూజను; ఒనరించెదన్= చేస్తాను; అది= ఆ పూజ; కైకొనుము= స్వీకరించు; సుప్రసన్నుఁడవు+అగుమీ= మిక్కిలి దయగలవాడవు కమ్ము.

**తాత్పర్యం:** 'ఈశ్వరా! నిన్ను నేను నిష్ఠతో ధ్యానించాను. నీకు అనేక ప్రాణుల బలిదాన మనే పూజ చేస్తాను. అది స్వీకరించి నన్ను దయచూడుము.'

**వ. అనుచు నరిగి 145**

**తాత్పర్యం:** అంటూ వెళ్ళి.

**తే. అచటి జనములు పగలింటి యాహవమున । శ్రమముఁ బొందియు, నిశ్శేషశత్రు నాశ**
**నమున నూఱటఁ జేసియు నమితనిద్ర । నొంది యత్యంతవివశులై యుండ నతఁడు. 146**

**ప్రతిపదార్థం:** అచటి జనములు= అక్కడి జనులు; పగలింటి - ఆహవమునన్= పగటి యుద్ధంచేత; శ్రమమున్+పొందియున్= అలసిపోయీ; నిశ్శేష శత్రు నాశనమునన్= సంపూర్ణ శత్రునాశనంచేత; ఊఱటన్+చేసియున్= ఊరటచెందీ; అమిత నిద్రన్= గాఢనిద్రను; ఒంది= పొంది; అత్యంత వివశులు+ఐ= మిక్కిలి ఒళ్ళు తెలియనివారై; ఉండన్= ఉండగా; అతఁడు= అశ్వత్థామ.

**తాత్పర్యం:** అక్కడి జనులు పగలు చేసిన యుద్ధం వలన అలసిపోయీ, సంపూర్ణంగా శత్రునాశనం అయింది గదా అని ఊరట చెందీ, బాగా నిద్రపట్టి ఒళ్ళు తెలియని స్థితిలో ఉండగా అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. మందగతిం బ్రవేశించి యన్వేషించి. 147**

**ప్రతిపదార్థం:** మందగతిన్= మందగమనంతో; ప్రవేశించి; అన్వేషించి= వెదకి.

**తాత్పర్యం:** మెల్లగా ప్రవేశించి వెదకి.

**చ. తెరయును, మేలుకట్లుఁ, దగు దీవియలుం జెలు వొంద మేటిచ**
**ప్పరమునఁ జాల హృద్యమగు పాన్పున నూఱడి నిద్రపోవు న**
**గ్గురువధికారిఁ గాంచి మదిఁ గ్రోధము మోదము సందడింప సు**
**స్థిరతఁ బదప్రహారమునఁ దెల్పెఁ దృణీకరణాభిరాముఁడై. 148**

**ప్రతిపదార్థం:** తెరయును= తెరా; మేలుకట్లున్= చాందినీలూ; తగు దీవియలున్= తగిన దీపాలూ; చెలువు+ఒందన్= ఒప్పగా; మేటి చప్పరమునన్= పెద్ద గుడారంలో; చాలన్+హృద్యము+అగు పాన్పునన్= మిక్కిలి హృదయానందకరమైన శయ్యమీద; ఊఱడి= ఊరటచెంది; నిద్ర+పోవు= నిద్రపోతూన్న; ఆ+గురు వధకారిన్= ఆ గురుహంతయైన - ధృష్టద్యుమ్నుడిని; కాంచి= చూచి(అతఁడు); మదిన్= మనస్సులో; క్రోధమున్= కోపమూ; మోదమున్= సంతోషమూ; సందడింపన్= అతిశయించగా; సుస్థిరతన్= మంచి నిలకడతో, మంచి ధైర్యంతో; తృణీకరణ+అభిరాముఁడు+ఐ= అలక్ష్యం చేయడం చేత మనోహరుడై; పదప్రహారమునన్= కాలి దెబ్బతో - తన్నుతో; తెల్పెన్= లేపాడు.

**తాత్పర్యం:** తెరా, చాందినీలూ, తగిన దీపాలూ ఒప్పుతుండగా పెద్ద గుడారంలో మిక్కిలి హృదయానందకరమైన పాన్పుమీద నిశ్చింతగా నిద్రపోతూన్న ఆ గురుహంతను-ధృష్టద్యుమ్నుడిని చూచి మనస్సులో కోపమూ, సంతోషమూ అతిశయించగా మంచి ధైర్యంతో, లెక్కచేయని భావంతో అందగించి, కాలితో తన్ని లేపాడు.

**వ. తెలిపినఁ గనువిచ్చి తన్నుం జూచి యెఱింగియుఁ గలంగక రణదుర్మదుండైన యా ద్రుపదనందనుఁడు దిగ్గన లేచినం దనచేతివిల్లు విడిచి యతని తలఁబట్టుకొని పెడమఱలఁ దిగిచి యబ్బలియుండు. 149**

**ప్రతిపదార్థం:** తెలిపినన్= లేపగా; - కనువిచ్చి= కళ్ళు తెరిచి; తన్నున్+చూచి= తనని (అశ్వత్థామని) చూసి; ఎఱింగియున్= తెలిసికూడా; కలంగక= కలతచెందక; రణ దుర్మదుండు+ఐన= యుద్ధగర్వితుడైన; ఆ ద్రుపదనందనుఁడు= ఆ ద్రుపదపుత్రుడు - ధృష్టద్యుమ్నుడు; దిగ్గనన్= గబుక్కున; లేచినన్= లేవగా; ఆ+బలియుండు= ఆ బలశాలి - అశ్వత్థామ; తన చేతి విల్లు విడిచి; అతని తలన్; పట్టుకొని; పెడమఱలన్+తిగిచి= వెనుకకు త్రిప్పి.

**తాత్పర్యం:** లేపితే కళ్ళు తెరిచి తనను చూసి ఫలానా అని తెలిసికూడా కలతచెందక యుద్ధగర్వితుడైన ఆ ధృష్టద్యుమ్నుడు తటాలున లేచాడు. అప్పుడు బలశాలియైన ఆ అశ్వత్థామ తన చేతివిల్లు పడవేసి అతడి తల పట్టుకుని వెనుకకు మెలిపెట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. నేలపయిం బడం దిగిచి నిష్ఠురభంగి నురఃస్థలంబు మో**
**కాల నొగిల్చి యేపున మొగం బతిదారుణ ముష్టి నొంచె ని**

**ద్రాలసవృత్తి నంగములయందు బలంబును బుద్ధి నేర్పునుం**
**జాలని యవ్విరోధి వివశత్వముఁ బొందఁగఁ జేసె వ్రేల్మిడిన్. 150**

**ప్రతిపదార్థం:** నేలపయిన్; పడన్+తిగిచి= పడేటట్లు లాగి; నిష్ఠుర భంగిన్= మోటతనంగా; ఉరస్+స్థలంబున్= వక్షఃస్థలాన్ని; మోకాలన్= (తన) మోకాలితో; నొగిల్చి= బాధించి; ఏపునన్= విజృంభణంతో; అతి దారుణ ముష్టిన్= మిక్కిలి క్రూరమైన పిడికిలితో; నొంచెన్= బాధించాడు; నిద్రా+అలస వృత్తిన్= నిద్రమైకంలో ఉండటంచేత; అంగములయందున్= అవయవాలలో; బలంబును; బుద్ధి-నేర్పునున్= బుద్ధిపటుత్వమూ; చాలని; ఆ+విరోధిన్= ఆ శత్రువును - ధృష్టద్యుమ్నుడిని; వ్రేల్మిడిన్= చిటికలో; వివశత్వమున్= ఒళ్ళు తెలియనితనం; పొందఁగన్+చేసెన్= పొందించాడు.

**తాత్పర్యం:** నేలమీద పడేటట్లు లాగి మోటతనంగా అతడి వక్షఃస్థలాన్ని తన మోకాలితో పొడిచి, విజృంభణంతో మిక్కిలి క్రూరమైన పిడికిలితో పొడిచి బాధించాడు. నిద్రమత్తులో ఉండటంచేత అవయవాల పటుత్వమూ, బుద్ధిబలమూ చాలని ఆ శత్రువును - ధృష్టద్యుమ్నుడిని ఒక చిటికలో స్పృహతప్పేటట్లు చేశాడు.

**వ. ఇవ్విధంబున నతనిచేత ధృష్టద్యుమ్నుండు. 151**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అతని చేతన్= అశ్వత్థామచేత; ధృష్టద్యుమ్నుండు.

**తాత్పర్యం:** ఈ రీతిగా అశ్వత్థామచేత ధృష్టద్యుమ్నుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. వివశత భీతిఁ బొంది కడు విహ్వలుఁడై తనుఁ జూడ ద్రోణసం**
**భవుఁడు వెసన్ శరాసనము వాపి గుణంబు తదీయకంఠముం**
**దవులఁగఁ జేర్చి వాగురవిధం బొడఁగూర్చి మనంబు విక్రమో**
**త్సవమున నుబ్బఁగాఁ బశువుఁ జంపెడు చాడ్పునఁ జంపు వేడుకన్. 152**

**ప్రతిపదార్థం:** వివశతన్= ఒళ్ళు తెలియనితనంతో; భీతిన్+పొంది= భయపడి; కడున్= మిక్కిలి; విహ్వలుఁడు+ఐ= అధైర్యపడినవాడై; తనున్+చూడన్= తనను చూడగా; ద్రోణ సంభవుఁడు= ద్రోణుడి కొడుకు - అశ్వత్థామ; వెసన్= శీఘ్రంగా; గుణంబు= అల్లెత్రాడు; శరాసనము+పాపి= వింటినుంచి ఊడదీసి; తదీయ కంఠమున్= వాడి పీకకు; తవులఁగన్+చేర్చి= తగిలించి; వాగుర- విధంబు+ఒడఁగూర్చి= ఉరితాడులా చేసి; మనంబు= (తన) మనస్సు; విక్రమోత్సవమునన్= పరాక్రమపు వేడుకతో; ఉబ్బఁగాన్= పొంగగా; పశువున్; చంపెడు - చాడ్పునన్= చంపే విధంగా; చంపు వేడుకన్= చంపేకోరికతో.

**తాత్పర్యం:** ఒళ్ళు తెలియనితనంతో భయపడి మిక్కిలి అధైర్యపడిన వాడై తనను చూడగా, అశ్వత్థామ శీఘ్రంగా అల్లెత్రాడును వింటినుండి ఊడదీసి వాడి కంఠానికి బిగించి ఉరిత్రాడువలె చేసి మనస్సు పరాక్రమపు వేడుకతో పొంగగా పశువును చంపేవిధంగా చంపే కోరికతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. ఉరంబును మెడయును నిరుగాలం ద్రొక్కినఁ ద్రోచియు దైన్యంబు దోఁప గోళ్ళ గీఱియు నిస్తరింపలేక యెలుంగు వెడలకున్న నెట్టకేలకు మాట వెడవెడ యెఱుంగవచ్చు తెఱంగునఁ బాంచాలవరుం డమ్మహీసుర వరున కిట్లనియె. 153**

**ప్రతిపదార్థం:** ఉరంబును= రొమ్మూ; మెడయును= మెడా; ఇరుకాలన్= రెండు కాళ్ళతో; త్రొక్కినన్= త్రొక్కగా; త్రోచియున్= (వాడు) గెంటీ; దైన్యంబు+తోఁపన్= దీనత్వం తోచేటట్టు; గోళ్ళన్= గోళ్ళతో; గీఱియున్= రక్కీ; నిస్తరింపన్+లేక= నెట్టలేక; ఎలుంగు= కంఠస్వరం; వెడలక+ఉన్నన్= పెగలకుంటే; ఎట్టకేలకున్= చివరకి; మాట; వెడవెడ= కొద్దికొద్దిగా; ఎఱుంగన్+వచ్చు= తెలుంగునన్= తెలిసేటట్టు; పాంచాలవరుండు= పాంచాలరాజు - ధృష్టద్యుమ్నుడు; ఆ+మహీసుర వరునకున్= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** రొమ్మూ, మెడా రెండు కాళ్ళతో త్రొక్కగా, వాడు గెంటీ, దైన్యంతో గోళ్ళతో గీరీ నెట్టలేక, కంఠస్వరం పైకి రాకుంటే, చివరకు మాట కొంచెం తెలిసేటట్లు ధృష్టద్యుమ్నుడు ఆ బ్రాహ్మణోత్తముడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'గురుపుత్ర! శస్త్ర నిహతిం । బొరిపుచ్చుము; తడయ నేల? పుణ్యగతికిఁ జె**
**చ్చెరఁ బోవునట్లు సేయుట । పరికింపఁగ మేలకాదె పగతురకైనన్?' 154**

**ప్రతిపదార్థం:** గురుపుత్ర= అశ్వత్థామా!; శస్త్ర నిహతిన్= శస్త్రముల దెబ్బచే; పొరిపుచ్చుము= చంపుము; తడయన్+ఏల?= ఆలస్యం ఎందుకూ?; పరికింపఁగన్= చూడగా; పగతురకున్+ఐనన్= శత్రువులకైనా; పుణ్య గతికిన్= ఉత్తమగతికి; చెచ్చెరన్= శీఘ్రంగా; పోవు+అట్లు= పోయేటట్టు; చేయుట; మేలు+అ+కాదె!= మంచిదే కదా!

**తాత్పర్యం:** 'అశ్వత్థామా! శస్త్రంతో కొట్టి చంపుము. ఆలస్యం ఎందుకూ? విచారించగా శత్రువులకైనా ఉత్తమగతికి వెంటనే పోయేటట్లు చేయటం మంచిదేకదా!'

**వ. అనిన విని యశ్వత్థామ యతని మొగంబు చూచి. 155**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అశ్వత్థామ; అతని మొగంబు= అతడి ముఖం; చూచి.

**తాత్పర్యం:** అనగా విని అశ్వత్థామ అతడి ముఖం చూచి.

**క. 'వినుము గురుద్రోహికిఁ గ । ల్గునె యుత్తమ గతి? నితాంత కుత్సితభంగిం**
**దునిమితివి నీవు గురు; నే । నను దుర్విధకరణమున నినుం దెగఁ జూతున్.' 156**

**ప్రతిపదార్థం:** వినుము; గురుద్రోహికిన్= గురువుకు ద్రోహం చేసిన వాడికి- గురుహంతకు; ఉత్తమగతి= సద్గతి; కల్గునె?= కలుగుతుందా?; నీవు; గురున్; నితాంత కుత్సిత భంగిన్= అత్యంతం నింద్యమైన పద్ధతిలో; తునిమితివి= చంపావు; నేనును; నినున్; దుర్విధ కరణమునన్= దుర్మార్గపు చేతతో; తెగన్+చూతున్= చంపజూస్తాను.

**తాత్పర్యం:** 'వినుము. గురువుకు ద్రోహం చేసినవాడికి సద్గతి లభిస్తుందా? నీవు గురువును అత్యంత నింద్యమైన మార్గంలో చంపావు. నేను కూడా నిన్ను దుర్మార్గంగానే చంపజూస్తాను.'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం; ఇందులో 'గురుద్రోహికిఁ గల్గునె యుత్తమగతి?' అనే సామాన్యాంశం, 'నితాంత కుత్సిత భంగిం దునిమితివి నీవు గురు' అని విశేషాంశంచేత సమర్థించబడుతున్నది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**ఆ. అనుచుఁ బెలుచ నొంప నచ్చటి జనములు । గలఁగి యపుడు మేలుకాంచి చూచి**
**భయము దోఁపఁ గడిఁది బలుగాముగాఁ దమ । యుల్లములఁ దలంచి యొదిఁగియుండ. 157**

**ప్రతిపదార్థం:** అనుచున్; పెలుచన్= అధికంగా; నొంపన్= బాధించగా; అచ్చటి జనములు= అక్కడున్న జనులు; కలఁగి= కలత చెంది; అపుడు; మేలుకాంచి= నిద్రలేచి; చూచి; భయము+తోఁపన్= భయం కలుగగా; కడిఁది - బలు - గాముగాన్= క్రూరుడైన గొప్ప పిశాచంగా; తమ+ఉల్లములన్= తమ మనస్సులలో; తలంచి; ఒదిఁగి+ఉండన్= తప్పుకుని ఉండగా.

**తాత్పర్యం:** అంటూ మిక్కిలి బాధించగా అక్కడి జనులు కలతచెంది అప్పుడు మేలుకొని చూచి, భయంతో క్రూరుడైన మేటి రాక్షసుడని మనస్సులలో భావించి తొలగగా.

### అశ్వత్థామ నిద్రాపరవశుండగు ధృష్టద్యుమ్నుం జంపుట (సం. 10-8-21)

**ఉ.** **కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం**
**బోలుచుఁ బేర్చి యాద్రుపద భూపసుతున్ సమయించె వేదనన్**
**ఱోలఁగ రోఁజఁగాఁ బలుమఱుం బొరలంబడి లాలగ్రక్కన**
**వ్వాలుమగండు ప్రాక్పరిభవంబుఁ దలంచుచుఁ గ్రౌర్యధుర్యుఁడై.** **158**

**ప్రతిపదార్థం:** ఆ+వాలు మగండు= ఆ గొప్పవీరుడు - అశ్వత్థామ; గంధకరిన్= మదగజాన్ని; తెగటార్చు= చంపే; సింహమున్+ పోలుచున్= సింహాన్ని పోలుతూ; పేర్చి= విజృంభించి; ప్రాక్పరిభవంబున్= పూర్వపు పరాభవాన్ని; తలంచుచున్= తలచుకుంటూ; క్రౌర్యధుర్యుఁడు+ఐ= క్రూరత్వపు భారం వహించినవాడయి- అధికకోపం గలవాడై; వేదనన్= బాధతో; ఱోలఁగన్= బాధతో అరుస్తూండగా; రోఁజంగాన్= ఆయాసపడుతూండగా; పలుమఱున్= చాలాసార్లు; పొరలంబడి= దొర్లి; లాల క్రక్కన్= చొంగ కార్చగా; ఆ ద్రుపద భూపసుతున్= ఆ ద్రుపదరాజు కొడుకును - ధృష్టద్యుమ్నుడిని; కాలను+కేలనున్= కాలుతోనూ, చేతితోనూ, చదిపి= చితుకగొట్టి; సమయించెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఆ వీరశ్రేష్ఠుడైన అశ్వత్థామ మదగజాన్ని చంపే సింహాన్ని పోలుతూ, విజృంభించి, పూర్వపు పరాభవాన్ని తలచుకొంటూ, అధిక కోపంతో ఆ ధృష్టద్యుమ్నుడిని బాధతో అరుస్తూ అతడు ఆయాసపడుతూండగా, మాటిమాటికి దొర్లి చొంగ కార్చగా, కాలుతోనూ, చేతితోనూ చితకగొట్టి చంపాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'గంధకరిం దెగటార్చు సింహముం బోలుచు' - అశ్వత్థామను సింహంతోనూ, ధృష్టద్యుమ్నుడిని గంధకరితోనూ పోల్చి ఉపమేయోపమానాలకు రమణీయమైన సాదృశ్యం చెప్పబడింది కాబట్టి, ఇక్కడ అలంకారం ఉపమ. తెగటార్చటం సామాన్యధర్మం. పోలుచున్ - ఉపమావాచకం. నాలుగంశాలూ ఉన్నాయి కనుక ఇది పూర్ణోపమ.

**క.** **ధృష్టద్యుమ్నుని నిట్లతి । కష్టవిధిప్రాప్తమరణుఁ గావించి మహా**
**వష్టంభోజ్జ్వలుఁడును సం । హృష్టాత్ముఁడు నగుచు వింట నిడియె గుణంబున్.** **159**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ధృష్టద్యుమ్నునిన్; అతి కష్ట విధి ప్రాప్త మరణున్= మిక్కిలి బాధాకరమైన విధానంచేత పొందబడిన చావు గలవాడిని; కావించి= చేసి; మహా+అవష్టంభ+ఉజ్జ్వలుఁడును= గొప్ప గర్వంతో ప్రకాశించేవాడునూ; సంహృష్ట+ఆత్ముఁడున్= సంతోషించిన మనస్సు గలవాడునూ; అగుచున్; గుణంబున్= అల్లెత్రాటిని; వింటన్= వింటియందు; ఇడియెన్= అమర్చాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధృష్టద్యుమ్నుడిని మిక్కిలి బాధాకరమైన విధానంచేత చంపి, ఎంతో గర్వంతో ప్రకాశిస్తూ, మనస్సులో సంతోషిస్తూ అల్లెత్రాడు వింటికి అమర్చాడు.

**వ. ఇట్లు సజ్యం బయిన చాపంబు ముష్టి నమర్చి యాచార్యనందనుండు. 160**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సజ్యంబు+అయిన= అల్లెత్రాటితో కూడుకొన్న; చాపంబున్= వింటిని; ముష్టిన్= పిడికిట్లో; అమర్చి= ఉంచి; ఆచార్య నందనుండు= గురుపుత్రుడు - అశ్వత్థామ.

**తాత్పర్యం:** ఈ విధంగా అల్లెత్రాడు బిగించిన వింటిని పిడికిలితో పట్టుకొని అశ్వత్థామ.

**ఆ. చప్పరంబు వెడలి చనుదెంచి యల్లని । నగవు నెఱయ సూతు మొగమునందుఁ**
**జూడ్కి పొలయ రత్నసుందరం బగు నిజ । స్యందనంబు పైకిఁ జనియె నధిప! 161**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్రా!; చప్పరంబున్= గుడారంలోనుండి; వెడలి; చనుదెంచి= వచ్చి; అల్లని నగవు= చిరునవ్వు; నెఱయన్= వెలయగా; సూతు-మొగమునందున్= సారథిముఖంపై; చూడ్కి= చూపు; పొలయన్= ప్రసరించగా; రత్న సుందరంబు+ అగు= మణులచేత అందమైన; నిజ స్యందనంబు పైకిన్= తనదైన రథంమీదికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! గుడారంలోనుండి బయటికి వచ్చి చిరునవ్వు నవ్వుతూ, సారథి ముఖంవైపు చూస్తూ, మణులచేత మనోహరమైన తన రథం మీదికి వెళ్ళాడు.

**మ. అదరం బిమ్మెయి నెక్కి యుబ్బి, శిబిరం బాప్రొద్ద నిశ్శేషతం**
**బొరయం జేయుకుతూహలంబు మది నుప్పొంగన్, లసన్నేమి ని**
**ష్ఠుర నాదంబు ప్రమోదముం బెనుప రక్షోభూతచిత్తంబులం**
**బరవీరావలి యిండ్ల కందవ లెడం బాటించుచుం బోయినన్. 162**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; అదరంబు= రథం; ఎక్కి; ఉబ్బి= సంతోషించి; ఆ ప్రొద్దు= ఆ వేళే; శిబిరంబు= స్కంధావారం; నిశ్శేషతన్= మిగలకపోవటం; పొరయన్+చేయు= పొందించే, కుతూహలంబు= వేడుక; మదిన్= మనస్సులో; ఉప్పొంగన్= అధికం కాగా; లసత్+నేమి నిష్ఠురనాదంబు= ప్రకాశించే రథచక్రాల పట్టాలయొక్క పరుషమైన ధ్వని; రక్షోభూత చిత్తంబులన్= రాక్షసుల, పిశాచాల మనసుల్లో; ప్రమోదమున్= సంతోషాన్ని; పెనుపన్= వృద్ధి పొందించగా; పరవీర+ఆవలి= శత్రువీరుల వరుసయొక్క; ఇండ్ల కందువలు= ఇళ్ళ జాడలు; ఎడన్= హృదయంలో; పాటించుచున్= తెలిసికొంటూ; పోయినన్= పోగా.

**తాత్పర్యం:** ఈ విధంగా రథ మెక్కి సంతోషించి, ఆవేళే శిబిరం మొత్తం తుడిచిపెట్టేయాలనే కోరిక ఎక్కువకాగా, రథచక్రాల పట్టాల పరుషధ్వని రాక్షసుల, పిశాచాల మనసులలో సంతోషాన్ని వృద్ధి పొందించగా, శత్రువీరుల ఇళ్ళ జాడలు మనస్సులో గుర్తు చేసికొంటూ వెళ్ళగా.

**తే. పీనుఁగై యున్న పాంచాలసూనుఁ జూచి । రక్షకులును, దదీయ పురంధ్రులును స**
**మగ్ర శోకాంధకార నిమగ్నచిత్త । వృత్తులై యేడ్చి రెలుఁగులు మిన్నుముట్ట. 163**

**ప్రతిపదార్థం:** పీనుఁగు+ఐ= శవమై; ఉన్న; పాంచాల సూనున్= పాంచాల రాజు కొడుకును - ధృష్టద్యుమ్నుడిని; చూచి; రక్షకులును= కాపలావాళ్ళూ; తదీయ పురంధ్రులును= వారి ఆడవాళ్ళూ; సమగ్ర= సంపూర్ణమైన; శోక+అంధకార= దుఃఖ

మనే చీకటిలో; నిమగ్న= మునిగిన; చిత్త వృత్తులు+ఐ= మనస్సుల వర్తనం కలవారై; ఎలుంగులు= కంఠధ్వనులు; మిన్ను ముట్టన్= ఆకాశాన్ని అంటగా; ఏడ్చిరి.

**తాత్పర్యం:** శవమై పోయిన ధృష్టద్యుమ్నుడిని చూచి కాపలాదారులూ, వారి ఆడువారూ సంపూర్ణ దుఃఖాంధకారంలో మునిగిపోయిన మనస్సులు కలిగి, కంఠధ్వనులు మిన్నుముట్టేటట్టు ఏడ్చారు.

**క. ఆ కలకలమున మేల్కని । యా కెలఁకుల యిండ్ల రాజు లది యే మనుచున్**
**వే కదియం గని యా జను । లాకులరవ మెసఁగ నిట్టు లనిరి నరేంద్రా! 164**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆ కలకలమునన్= ఆ పెద్దమ్రోఁతచేత; మేల్కని= మేలుకొని; ఆ కెలఁకుల ఇండ్ల రాజులు= ఆ ప్రక్క ఇళ్ళల్లోని రాజులు; అది; ఏమి; అనుచున్; వే= శీఘ్రంగా; కదియన్= సమీపించగా; కని= చూచి; ఆ జనులు; ఆకులరవము= కలగిన ధ్వని; ఎసఁగన్= అతిశయించగా; ఇట్టులు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** రాజా! ధృతరాష్ట్రా! ఆ పెనుమ్రోతకు మేలుకొని ఆ ప్రక్క ఇళ్ళల్లోని రాజులు అదేమిటంటూ వడివడిగా సమీపించగా చూచి అక్కడి జనులు రోదనధ్వని అతిశయించగా ఈ విధంగా అన్నారు.

**క. 'రక్కసుఁడో, మానిసియో । నిక్క మెఱుంగము; వధించె నృపసూనుని వీఁ**
**డొక్కరుఁ డుదగ్రుఁడై, రథ । మెక్కి యరిగెడున్; దురాత్ము నెయిదుఁడు కడఁకన్.' 165**

**ప్రతిపదార్థం:** రక్కసుఁడో= రాక్షసుడో; మానిసియో= మనుష్యుడో; నిక్కము+ఎఱుంగము= నిజం ఎరగం; వీఁడు+ఒక్కరుఁడు= వీడొక్కడూ; ఉద్రగుఁడు+ఐ= భయంకరుడై; నృప సూనునిన్= రాజపుత్రుడిని-ధృష్టద్యుమ్నుడిని; వధించెన్= చంపాడు; రథము+ఎక్కి; అరిగెడున్= వెళ్ళిపోతున్నాడు; దురాత్మున్= దుర్మార్గుడిని; కడఁకన్= పూనికతో; ఎయిదుఁడు= వెంబడించండి.

**తాత్పర్యం:** 'రాక్షసుడో, మనుష్యుడో మాకు నిజం తెలవదు. వీడు ఒక్కడూ భయంకరుడై ధృష్టద్యుమ్నుడిని చంపాడు. రథం ఎక్కి పోతున్నాడు. దుర్మార్గుడిని ప్రయత్నంతో వెంబడించండి.'

**వ. అనిన విని యన్నరపతులు తల లెత్తి చూచి 'పోనీక పొదువుం' డనుచు సపరివారంబుగా నడరి యశ్వత్థామం బొదివిన నుద్దామప్రకారంబునం దిరిగి మూఁపులు పెరుఁగ గొనయంబు సారించి. 166**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+నరపతులు= ఆ రాజులు; తలలు+ఎత్తి; చూచి; పోనీక పొదువుండు= వెళ్ళకుండా పట్టుకొనండి; అనుచున్= అంటూ; సపరివారంబుగాన్= పరివార సహితంగా; అడరి= విజృంభించి; అశ్వత్థామన్= అశ్వత్థామను; పొదివినన్= పట్టుకోగా; ఉద్దామ ప్రకారంబునన్= భయంకరమైన రీతిలో; తిరిగి= మరలి; మూఁపులు= భుజాలు; పెరుఁగన్= పొంగగా; గొనయంబు= వింటిత్రాడు; సారించి= లాగి.

**తాత్పర్యం:** అనగా విని ఆ రాజులు తలలు పైకెత్తి చూచి 'వెళ్ళకుండా పట్టుకోండి' అంటూ పరివార సమేతంగా విజృంభించి అశ్వత్థామని పట్టుకోగా అతడు భయంకరమైన విధంగా మరలి భుజాలు పొంగగా వింటినారి సారించి (తరువాతి పద్యంతో అన్వయం).

మ. ఖరనారాచపరంపరా విహరణ క్రౌర్యంబునన్ శాత ని
ష్ఠుర భల్ల ప్రవిసారదారుణతర క్షోణీశులం, దద్భటో
త్కరముం గేలియవోలె గీటడఁచె దోర్గర్వం బఖర్వంబుగా
వెరవుం జేవయు భూతముల్ వొగడ నవ్వీరుండు ధీరోద్ధతిన్. 167

**ప్రతిపదార్థం:** ఆ+వీరుండు= ఆ వీరుడైన అశ్వత్థామ; ధీర+ఉద్ధతిన్= గంభీరమైన గర్వంతో; ఖర= వాడియైన; నారాచ= బాణాలయొక్క; పరంపరా= వరుసయొక్క; విహరణ= తొలగించటంలోని; క్రౌర్యంబునన్= క్రూరత్వంతో; దోస్(ః)+గర్వంబు= భుజబలగర్వం; అఖర్వంబు+కాన్= అతిశయించగా; వెరవున్= ఉపాయమూ; చేవయున్= బలమూ; భూతముల్= పిశాచాలు; పొగడన్= కొనియాడగా; శాత= వాడివీ; నిష్ఠుర= పరుషమైనవీ(అయిన); భల్ల= అస్త్రాలయొక్క; ప్రవిసార= విశేష ప్రసారంచేత; దారుణతర= మిక్కిలి భయంకరులైన; క్షోణీ+ఈశులన్= భూపతులనూ; తద్+భట+ఉత్కరమున్= వాళ్ళ వీరుల సమూహాన్నీ; కేలి+అ+పోలెన్= ఆటే అనేటట్టు; గీటఁడచెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఆ వీరుడైన అశ్వత్థామ ధీరోద్ధతుడై వాడిబాణాల పరంపరను నివారించే క్రూరత్వంతో, తన భుజబలం అతిశయించగా, తన ఉపాయాన్నీ, చేవనూ పిశాచాలు కొనియాడగా, వాడివీ పరుషమైనవీ అయిన బాణాలను విశేషంగా ప్రయోగించే అతిభయంకరులైన రాజులనూ, వాళ్ళ భటసమూహాన్నీ చంపాడు.

**విశేషం:** అశ్వత్థామకు శత్రురాజులను చంపటం ఒక ఆట - వినోదం. భూతాలు పొగడటం, శత్రువులను చంపి అతడు తమకు విందు చేస్తాడు గదా అని. ధీరోద్ధతిన్ - అశ్వత్థామ ధీరోద్ధతుడే కాని ధీరోదాత్తుడు కాడని సూచన.

వ. తదనంతరంబ యుత్తమౌజునిలోఁగిలి చొచ్చికృపాణపాణియై యరదంబు డిగ్గి యరసికొని యతని యభ్యంతర మందిరంబుఁ బ్రవేశించి. 168

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాతనే; ఉత్తమౌజుని= ఉత్తమౌజుడియొక్క; లోఁగిలి+చొచ్చి= ఇంట్లో (శిబిరం) ప్రవేశించి; కృపాణపాణి+ఐ= చేతితో కత్తి పుచ్చుకొని; అదరంబున్+డిగ్గి= రథం దిగి; అరసికొని= చూచికొని; అతని; అభ్యంతర మందిరంబున్= అంతఃపురగృహం; ప్రవేశించి.

**తాత్పర్యం:** ఆ వెంటనే ఉత్తమౌజుడి గుడారంలో ప్రవేశించి కత్తి పుచ్చుకొని రథం దిగి చూచికొని అతడి అంతః పుర గృహంలోకి వెళ్ళి.

సీ. అలికిడి మేల్కనునతని ధృష్టద్యుమ్నుఁ। బట్టిన క్రియఁ దలపట్టి యీడ్చి
యాతనిఁ జంపిన యట్టులు పశుమర। ణాతి కౌతుకమున నవనిఁ బెట్టి
చంప, నచ్చేరువఁ జప్పరంబున శయ। నించు యుధామన్యుఁ డెఱిఁగి కడఁగి
చనుదెంచి రాక్షసుఁడని తలంచియుఁ గొంకు। పెట్టక పెనుగద బెట్టు వ్రేయ

ఆ. వ్రేటువడి చలింప కాటోపదీపితుఁ। డగుచు గురుతనూజుఁ డక్కుమారు
నగ్రజన్ముంబోలె నుగ్రత వధియించెఁ। గాని ఖడ్గలీల గలుగదయ్యె. 169

**ప్రతిపదార్థం:** అలికిడిన్= చప్పుడుచేత; మేల్కను+అతనిన్= మేలుకొనే అతడిని - ఉత్తమౌజుడిని; ధృష్టద్యుమ్నున్; పట్టిన క్రియన్= పట్టిన విధంగా; తలపట్టి+ఈడ్చి= తలపట్టుకొని ఈడ్చి; ఆతనిన్= ధృష్టద్యుమ్నుడిని; చంపిన+అట్టులు= చంపిన

విధంగా; పశుమరణ+అతి కౌతుకమునన్= పశువుచావుపై గల గొప్ప వేడుకతో; అవనిన్= నేలమీద; పెట్టి; చంపన్= చంపగా; ఆ+చేరువన్= ఆ సమీపంలో; చప్పరంబునన్= గుడారంలో; శయనించు= పండుకొన్న; యుధామన్యుఁడు; ఎఱిఁగి= తెలిసి; కడఁగి= పూని; చనుదెంచి= వచ్చి; రాక్షసుఁడు+అని; తలంచియున్= భావించీ; కొంకు పెట్టక= సంకోచించక; పెను గదన్= పెద్ద గదతో; బెట్టు వ్రేయన్= గట్టిగా కొట్టగా; వ్రేటు+పడి= దెబ్బతిని; చలింపక= కదలక; ఆటోప దీపితుఁడు= విజృంభణంచేత ప్రకాశించినవాడు; అగుచున్= అవుతూ; గురు తనూజుఁడు= గురు పుత్రుడు అశ్వత్థామ; ఆ+కుమారున్= ఆ కుమారుడిని, యుధామన్యుడిని; అగ్రజన్మున్+పోలెన్= అన్న అయిన ఉత్తమౌజుడివలె; ఉగ్రతన్= భయంకరంగా; వధియించెన్= చంపాడు; కాని; ఖడ్గలీల= ఖడ్గవినోదం; కలుగదు+అయ్యెన్= కలగలేదు.

**తాత్పర్యం:** అలికిడికి మేలుకొన్న ఆ ఉత్తమౌజుడిని ధృష్టద్యుమ్నుడిని పట్టుకున్నట్లుగానే తలపట్టి ఈడ్చి, అతడిని చంపిన విధంగానే బలిపశువువలె చంపాలనే అత్యాసక్తితో నేలమీద పడవైచి చంపగా, అక్కడే గుడారంలో పరున్న యుధామన్యుడు తెలిసి పూని వచ్చి రాక్షసుడని భావించీ, సంకోచించక పెద్ద గదతో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బ తినినా అశ్వత్థామ చలించక విజృంభణంతో ప్రకాశిస్తూ, ఆ కుమారుడిని యుధామన్యుడిని - అన్న అయిన ఉత్తమౌజుడివలె క్రూరంగా చంపాడు. కాని, అతడికి ఖడ్గవినోదం కలగలేదు.

**వ. ఇట్లు ద్రుపదపుత్త్రుల నొక్కుమ్మడి నిరువుర గీటడంచి యబ్బలుమగండు. 170**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ద్రుపద పుత్త్రులన్= ద్రుపదుడి కొడుకులను; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కమాటుగా; ఇరువురన్= ఇద్దరినీ; గీటు+అడంచి= చంపి; ఆ+బలు+మగండు= ఆ మహావీరుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రుపదుడి కొడుకులను ఇద్దరినీ చంపి ఆ మహా వీరుడైన అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. కాలాకారతఁ బేర్చి దోర్లసిత ఖడ్గస్ఫారసాంద్రప్రభా**
**జాలం బొప్పఁగ నిట్లు సొచ్చి లఘుసంచారంబు శోభిల్లఁ బాం**
**చాల వ్రాతముఁ గ్రీడమైఁ దునిమె రక్షశ్శ్రేణి మాంసంబుఁ గీ**
**లాలంబుం గబళించి త్రావి మదలీలాలోలతం గ్రాలఁగన్. 171**

**ప్రతిపదార్థం:** కాల+ఆకారతన్= యముడి రూపం వంటి రూపంతో; పేర్చి= విజృంభించి; దోస్(ః)+లలిత= బాహువునందు ప్రకాశించే; ఖడ్గ= కత్తియొక్క; స్ఫార= అధికమూ; సాంద్ర= దట్టమూ (అయిన); ప్రభా= కాంతులయొక్క; జాలంబు= సమూహం; ఒప్పఁగన్; ఇట్లు= ఈ విధంగా; చొచ్చి= ప్రవేశించి; లఘు సంచారంబు= వడిగల సంచారం; శోభిల్లన్= ఒప్పగా; రక్షస్+శ్రేణి= రాక్షసుల సమూహం; మాంసంబున్; కీలాలంబున్= నెత్తురూ; కబళించి= తిని; త్రావి= త్రాగి; మదలీలా లోలతన్= గర్వంయొక్క విలాసంపైగల అత్యాసక్తితో; క్రాలఁగన్= ప్రవర్తిల్లగా; పాంచాల వ్రాతమున్= పాంచాలుర సమూహాన్ని; క్రీడమైన్= లీలతో; తునిమెన్= చంపాడు.

**తాత్పర్యం:** యముడి రీతిగా విజృంభించి, చేతిలోని కత్తియొక్క మిక్కిలి దట్టమైన కాంతుల సమూహం ఒప్పగా, ఈ విధంగా ప్రవేశించి, వడిగా సంచరిస్తూ, రాక్షసుల సమూహం మాంసం తినీ, రక్తం త్రాగీ, గర్వంతో ప్రవర్తిల్లగా (అశ్వత్థామ) పాంచాల వీరుల సమూహాన్ని లీలగా చంపాడు.

**విశేషం:** 'కాలాకారతన్' - ఇక్కడ ఆకార శబ్దాన్ని ఇవార్థకంగా భావించవచ్చును. అప్పుడు అలంకారం ఉపమ. 'మాంసంబుఁ గబళించి, కీలాలంబుం ద్రావి' అని క్రమాన్వయం.

**వ. అట్టియెడ. 172**

**తాత్పర్యం:** అట్టి+ఎడన్= అటువంటి సమయంలో.

**శా. నిద్రాసక్తునిఁ, గొంత మేల్కనిన వానిన్, సుప్రబుద్ధాత్ముఁడై**
**యుద్రేకంబును శౌర్యసారమును బాహూల్లాసముం జూపఁ జం**
**చద్రేఖం దిరమైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాఁకి యు**
**న్నిద్రస్వైర సముద్ధతిన్ మెఱయువానిం దున్మె నేకాకృతిన్. 173**

**ప్రతిపదార్థం:** నిద్రా+సక్తునిన్= నిద్రావశుడినీ; కొంత మేల్కనినవానిన్= కొంచెం మేలుకున్నవాడినీ; సుప్రబుద్ధ+ఆత్ముఁడు+ఐ= బాగా మెలకువ వచ్చినవాడై; ఉద్రేకంబును= ఆవేశమూ; శౌర్య సారమును= పరాక్రమోన్నతీ; బాహు+ఉల్లాసమున్= భుజబల ప్రకాశాన్నీ; చూపన్= చూపించటానికి; చంచత్+రేఖన్= చలిస్తూన్న విలాసంతో; తిరము+ఐన వానిన్= నిలకడగల వాడినీ; తనున్= తనని; ఉత్సాహ+ఉగ్రతన్= ఉత్సాహాతిశయంతో; తాఁకి= ఎదిరించి; ఉన్నిద్ర స్వైర సముద్ధతిన్= జాగరూకమూ; స్వేచ్ఛగలదీ(అగు) విజృంభణంతో; మెఱయు వానిన్= ప్రకాశించేవాడినీ; ఏక+ఆకృతిన్= ఒక్కడూ; తున్మెన్= వధించాడు.

**తాత్పర్యం:** నిద్రావశుడినీ, కొంచెం మేలుకొన్నవాడినీ, బాగా మేలుకొని ఆవేశంతో శౌర్యోన్నతినీ, భుజబల ప్రకాశాన్నీ చూపాలని ఉబలాటపడుతూన్నవాడినీ, తనను అత్యుత్సాహంతో తాకి జాగరూకతతో ఇష్టం వచ్చినట్లు విజృంభించేవాడినీ అశ్వత్థామ ఒక్కడూ వధించాడు.

**వ. మఱియు నతండు. 174**

**తాత్పర్యం:** ఇంకా ఆ అశ్వత్థామ.

### అశ్వత్థామ కరితురంగంబులపై కుఱికి నఱకుట (సం. 10-8-39)

**స్రగ్ధర. తుండంబుల్ నుగ్గునుగ్గై తొరఁగఁగఁ జులుకం ద్రుంచుఁ, గుంభస్థలంబు**
**ల్ఖండించున్ మౌక్తికంబు ల్గలయఁగఁ జెదరం, గాయముల్ ప్రేవుఁబ్రోవుల్**
**చండంబుల్ సాంద్రరక్త స్రవమున బెరయన్ జాల్పడన్, వ్రేయు నిమ్మై**
**శుండాలశ్రేణి మాయించుచు, వెలిఁగి, హయస్తోమశాలాగతుండై. 175**

**ప్రతిపదార్థం:** తుండంబుల్= తొండాలు; నుగ్గునుగ్గు+ఐ= ముక్కలు ముక్కలై; తొరుఁగఁగన్= రాలగా; చులుకన్= సులభంగా; త్రుంచున్= ఖండిస్తాడు; మౌక్తికంబులు= ముత్యాలు; కలయఁగన్= అంతటా; చెదరన్= ఇటూ అటూ పడగా; కుంభ స్థలంబుల్; ఖండించున్= త్రుంచుతాడు; కాయముల్= శరీరాలు; ప్రేవుఁబ్రోవుల్= పేగుల రాశులు; చండంబుల్= తీవ్రమైనవి- భయంకరమైనవి; సాంద్ర రక్త స్రవమునన్= దట్టమైన రక్తప్రవాహంతో; బెరయన్= కూడుకోగా; జాలు+పడన్= ప్రవహించగా; వ్రేయున్= కొడతాడు; ఈ+మైన్= ఈ విధంగా; శుండాల శ్రేణిన్= ఏనుగుల వరసను; మాయించుచున్= చంపుతూ; వెలిఁగి= ప్రకాశించి; హయస్తోమ శాలా గతుండు+ఐ= గుర్రాల సమూహం ఉండే శాలలోకి వెళ్ళిన వాడై.

**తాత్పర్యం:** తొండాలు ముక్కలు ముక్కలై రాలేటట్టు అనాయాసంగా ఖండించాడు. ముత్యాలు అంతటా చెదరిపడేటట్టు కుంభస్థలాలు పగలగొట్టాడు. శరీరాలూ, ప్రేగుల పోగులూ భయంకరాలై దట్టమైన రక్తప్రవాహంతో కూడి పారేటట్లు కొట్టాడు. ఈ రీతిగా ఏనుగుల గుంపును చంపుతూ ఒప్పి గుఱ్ఱాలశాలకు వెళ్ళి.

**విశేషం:** స్రగ్ధరలో నాలుగు పాదాలుంటాయి. ఒక్కొక్కపాదంలో మ,భ,ర,న,య,య,య అనే గణాలుంటాయి. 1-8-15 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉంటుంది.

**ఉ.** **కొన్నిటి పాదముల్ నఱుకుఁ; గొన్నిటి మోరలు సెక్కు లీలమైఁ**
**గొన్నిటి కంఠముల్ దునుముఁ; గొన్నిటి వీఁపులు వ్రచ్చు నుబ్బునం**
**గొన్నిటి సర్వగాత్రములు క్రూరవిచేష్టితవిక్రమంబు దోఁ**
**ప న్నుఱుమాడుఁ బ్రౌఢబలభాసితభూరిభుజావిహారుఁడై.** **176**

**ప్రతిపదార్థం:** ప్రౌఢ= గొప్పదైన; బల= బలంచేత; భాసిత= ప్రకాశించిన; భూరి= అధికమైన; భుజా= బాహువులయొక్క; విహారుఁడు+ఐ= క్రీడగలవాడయి; కొన్నిటి పాదముల్= కొన్ని గుఱ్ఱాల కాళ్ళు; నఱుకున్= తెగగొట్టాడు; కొన్నిటి మోరలు= కొన్నింటి ముట్టెలు; లీలమైన్= విలాసంగా-అవలీలగా; చెక్కున్= చెక్కాడు; ఉబ్బునన్= సంతోషంతో; కొన్నిటి కంఠముల్= కొన్నిటి పీకలు; తునుమున్= ఖండించాడు; కొన్నిటి వీఁపులు; వ్రచ్చున్= చీరాడు; క్రూర విచేష్టిత విక్రమంబు= భయంకరపు పనులు చేసే పరాక్రమం; తోఁపన్= తోచేటట్లు; కొన్నిటి సర్వ గాత్రములు= కొన్నిటి అన్ని అవయవాలూ; నుఱుమాడున్= ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** (అశ్వత్థామ) గొప్పబలంతో ప్రకాశించే అధికబాహుబలంతో క్రీడిస్తూ కొన్ని గుఱ్ఱాల కాళ్ళు తెగగొట్టాడు. కొన్నింటి ముట్టెలు అనాయాసంగా చెక్కాడు. కొన్నిటి పీకలు సంతోషంతో ఖండించాడు. కొన్నిటి వీపులు చీరాడు. భయంకర పరాక్రమం తోచేటట్లు కొన్నిటి అవయవాలన్నీ ముక్కలు చేశాడు.

**విశేషం:** ఇందులోని నఱుకు, చెక్కు, తునుము, వ్రచ్చు, నుఱుమాడు అనే తద్ధర్మార్థక క్రియలన్నీ భూతార్థకాలని గ్రహించాలి. 'నఱుకున్= నరికెను, నరికాడు' - ఇత్యాదిగా గ్రహించాలి.

**వ.** **ఇబ్భంగిఁ బీనుంగుపెంటలైన పాంచాలుర విడిదల వెడలి విజయోద్దాముండగు నశ్వత్థామ చల్లడము, దట్టి మొదలయిన పరికరంబులు పాటించియున్న గనపలోఁగిళ్ళకుం జని, తొలుత దొరలం దునుముచుఁ, బరిజన మాతంగ తురంగ మండలముల ముట్టి, విదళన వినోదంబులు సలుపుచు, నొక్కొక్కయెడ మార్తురు మేల్కని పన్ని మార్కొనిన, మారి మసంగినట్లు, మృత్యుదేవత గెరలిన చాడ్పున, జముండు నలిరేఁగిన కరణిఁ, గనుపుగొట్టి, కాలుకాలం బెనంగిన పీనుంగులను, గనక రత్నవలయంబులఁ జెలువందు చేతులను, దునిసిపడిన కరికరంబులతో సరసమాడు చెలువునం జలనంబు నొందు చరణంబులను, నావులించు తలలను, వేదండ దంత ఖండంబులను, ఘోటక ముఖలేశంబులను, రథావయవ శకలంబులను, మడువులు గట్టు నెత్తురులను, గుప్పలు గొను కండలను, బెనంగొను ప్రేవులను, బెనుతిట్టలగు నెమ్ములను, మూర్తిమంతంబు లయినట్టి యద్భుతంబునకు, భయానకంబునకు, బీభత్సంబునకు, నన్నేల నెలవగునట్లుగాఁ**

**జేయుచుఁ, జెలంగి చెలంగి మలంగి మలంగి తన కరవాల లీలలు భూతబేతాళంబులకుఁ బ్రీతిఁ బెనుపఁ జతురంగంబులం బాఱినను, బీఱువోయినను మరలినను, దెరలినను, గలంగినను, దొలంగినను, దఱిమినను, నఱిమినను, గిట్టినను, ముట్టినను, దాను వానిం బొదివి పొలియించుచు, బలువిడియు, నుబ్బును, వెరవును, బరుసఁదనంబు, నొక్కచందంబునఁజెల్ల నందొక్కటినైనను దక్కనీక యంతకంతకు నెక్కుడగు కోపంబున నాటోపంబు దీపింప, వాదరఁ జిక్కిన యెముకతునుకలు గోఱదౌడల కైవడి గలిగి రుధిరానులేపనంబున నాభీలంబగు నసిపట్టిక ఘోరాకారయైన రాక్షసి పగతుర గీటడంగించుటకుఁ దనకుఁ దోడువచ్చిన తెఱంగున మెఱయఁ జేదిసైన్య సన్నివేశంబు లోనుగాఁగల బలుచోట్లఁ గమలాకరంబు సొచ్చిన ఘనలులాయంబు రేఖయుఁ, గేలివనంబుఁ దఱిసిన మత్తశుండాలంబు పోల్కియును, గాంతారంబు దరికొను దావపావకు విధంబును దోఁప విహరించుచు, వలయుతఱి రథం బెక్కుచుఁ, బాదచారియై విక్రమించుచు, వెరవు దొరకొననప్పుడు నగ్గలికమై బెరయఁ బెనంగి రక్తంబున సిక్తంబైన శరీరంబు దారుణ ప్రకారంబున నుల్లసిల్లఁ, దన్ను సకల జనులు దానవుండని తలంపఁ, బెంపారు భీషణోద్ధతిఁ బ్రవర్తిల్లు పరాక్రమక్రీడ నతిశయిల్లి, రాజమందిరంబు సొర నప్పళించుచుఁ, దద్ద్వారంబున కభిముఖుండై యరిగె నట్టియెడ. 177**

**ప్రతిపదార్థం:** ఈ+భంగిన్= ఈ విధంగా; పీనుంగు పెంటలు+ఐన; పాంచాలుర విడిదలన్= పాంచాలురున్న శిబిరం; వెడలి; విజయ+ఉద్దాముండు+అగు= గెలుపుచేత భయంకరుడైన అశ్వత్థామ; చల్లడము= లోపలిలాగు; దట్టి= కాసెకోక; మొదలు+అయిన పరికరంబులు= మున్నగు నడికట్లు; పాటించి= ధరించి; ఉన్న గనప లోఁగిళ్ళకున్= మిగిలిన పెద్ద ఇళ్ళలోనికి; చని= వెళ్ళి; తొలుతన్= మొదట; దొరలన్= ప్రభువులను; తునుముచున్= చంపుతూ; పరిజన మాతంగ తురంగ మండలంబులన్= బలగాన్నీ, ఏనుగుల గుర్రాల సమూహాలనూ; ముట్టి= తాకి; విదళన వినోదంబులు= ముక్కలు చేసే వేడుకలు; సలుపుచున్= చేస్తూ; ఒక్కొక్క+ఎడన్= ఒక్కోసారి; మార్తురు= శత్రువులు; మేల్కని= మేలుకొని; పన్ని= తలపడి; మార్కొనినన్= ఎదిరిస్తే; మారి మసంగిన+అట్లు= మిక్కిలి విజృంభించిన విధంగా; మృత్యుదేవత; కెరలిన చాడ్పునన్= చెలరేగిన రీతిని; జముండు= యముడు; నలిరేఁగిన కరణిన్= విజృంభించిన తీరుగా; కనుపు+కొట్టి= సంహరించి; కాలు కాలన్+పెనంగిన పీనుంగులను= కాలు కాలితో పెనవేసికొన్న శవాలతోనూ; కనక రత్న వలయంబులన్= మణులు పొదిగిన బంగారపు మురుగులతో; చెలువు+ అందు చేతులను= ఒప్పే చేతులతోనూ; తునిసిపడిన= ముక్కలైపడ్డ; కరి కరంబులతోన్= ఏనుగులతొండాలతో; సరసము+ఆడు చెలువునన్= హాస్యమాడే రీతిగా; చలనంబున్+ఒందు చరణంబులను= కదలాడే కాళ్ళతోనూ; ఆవులించు తలలను= ఆవలించే తలలతోనూ; వేదండ దంత ఖండంబులను= ఏనుగుల దంతాల ముక్కలతోనూ; ఘోటక ముఖ లేశంబులను= గుర్రాల ముఖాల ముక్కలతోనూ; రథ+అవయవ శకలంబులను= రథాల భాగాల ముక్కలతోనూ; మడువులు+కట్టు నెత్తురులను= ప్రవాహాలైన రక్తాలతోనూ; కుప్పలు+కొను కండలను= రాశులైన కండలతోనూ; పెనంగొను ప్రేవులను= ఒకదానితో ఒకటి పెనవేసికొన్న ప్రేగులతోనూ; పెనుతిట్టలు+అగు ఎమ్ములను= పెద్ద గుట్టలైన ఎముకలతోనూ; మూర్తిమంతంబులు+ అయిన+అట్టి= రూపుదాల్చినట్టి; అద్భుతంబునకున్= అద్భుతరసానికీ; భయానకంబునకున్= భయానక రసానికీ; బీభత్సంబునకున్= బీభత్సరసానికీ; ఆ+నేల= ఆ ప్రదేశం; నెలవు+అగు+అట్లు+కాన్= స్థానం అయ్యేటట్లుగా; చేయుచున్= చేస్తూ; చెలంగి చెలంగి= మిక్కిలి విజృంభించి; మలంగి మలంగి= తిరిగి తిరిగీ; తన కరవాల లీలలు= తన ఖడ్గవిలాసాలు; భూత బేతాళంబులకున్= దయ్యాలకూ పిశాచాలకూ; ప్రీతి= సంతోషం; పెనుపన్= పెంచగా; చతుర్(ః)+ అంగంబులన్= రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బంటులూ అనే నాలుగు విధాల సేనలనూ; పాఱినను= పారిపోయినా; బీఱు+పోయినను=

వెనుదీసినా; మరలినను= మరలిపోయినా; తెరలినను= జంకినా; కలంగినను= భయపడినా; తొలంగినను; తఱిమినను= కవిసినా; అఱిమినను= ఎదుర్కొనినా; కిట్టినను= సమీపించినా; ముట్టినను= తాకినా; తాను; వానిన్= ఆ బలాలను; పొదివి= ఆక్రమించి; పొలియించుచున్= చంపుతూ; బలువిడియున్= పరాక్రమమూ; ఉబ్బును= గర్వమూ; వెరవును= ఉపాయమూ; పరుసందనంబున్= కాఠిన్యమూ; ఒక్క చందంబునన్= ఒక్కలా; చెల్లన్= సాగగా; అందున్= ఆ బలాలలో; పొదివి= ఆక్ర మించి; పొలియించుచున్= చంపుతూ; బలువిడియున్= పరాక్రమమూ; ఉబ్బును= గర్వమూ; వెరవును= ఉపాయమూ; పరుసం దనంబున్= కాఠిన్యమూ; ఒక్క చందంబునన్= ఒక్కలా; చెల్లన్= సాగగా; అందున్= ఆ బలాలలో; ఒక్కటిన్+ఐనను= ఏఒక్క దానినీకూడా; తక్కనీక= మిగలనివ్వక; అంతకంతకున్= క్రమ క్రమంగా; ఎక్కుడు+అగు= అధికమయ్యే; కోపంబునన్= కోపంతో; ఆటోపంబు= గర్వం; దీపింపన్= ప్రకాశించగా; వాదరన్= కత్తి అంచున; చిక్కిన= తగులుకున్న ఎముక; తునుకలు= (ఎముకల) ముక్కలు; కోఱ దౌడల కైవడి= కోరలు గల దౌడల విధం; కలిగి; రుధిర+ అనులేపనంబునన్= నెత్తురు పూతచే; ఆభీలంబు+అగు= భయంకరమైన; అసిపట్టిక= కత్తి; ఘోర+ఆకార+ఐన+రాక్షసి= భయంకరరూపంగల రాక్షసి; పగతురన్= శత్రువులను; గీటడంగించుటకున్= చంపటానికి; తనకున్; తోడువచ్చిన తెఱంగునన్= సాయపడటానికి వచ్చినట్లుగా; మెఱయన్= ప్రకాశించగా; చేది సైన్య సన్నివేశంబు లోనుగాన్ కల= చేదిదేశపు సైన్యం గుడారం మొదలుగా గల; పలుచోట్లన్= అనేక ప్రదేశాలలో; కమలాకరంబు= సరస్సు; చొచ్చిన= ప్రవేశించిన; ఘన లులాయంబు రేఖయున్= పెద్ద దున్నపోతు విధమూ; కేళివనంబున్= ఉద్యానవనాన్ని; తఱిసిన= ప్రవేశించిన; మత్తశుండాలంబు+పోల్కియును= మదించిన ఏనుగు విధమూ; కాంతారంబున్= అడవిని; దరికొను= కాల్చే; దావ పావకు విధంబును= కార్చిచ్చు విధమూ; తోఁపన్= స్ఫురించగా; విహరించుచున్= సంచరిస్తూ; వలయు తఱిన్= అవసరమయినప్పుడు; రథం+ఎక్కుచున్= రథం ఎక్కుతూ; పాదచారి+ఐ= నడుస్తూ; విక్రమించుచున్= పరాక్రమిస్తూ; వెరవు దొరకొనన్= ఉపాయం లభించగా, వీలు చిక్కగా; అప్పుడు= ఆ సమయంలో; అగ్గలికమైన్= విజృంభణంతో; బెరయన్= ఒప్పి; పెనంగి= యుద్ధంచేసి; పగతుర రక్తంబునన్= శత్రువుల నెత్తుటితో; సిక్తంబు+ఐన= తడిసిన; శరీరంబు; దారుణ ప్రకారంబునన్= భయంకరమైన రీతిగా; ఉల్లసిల్లన్= ప్రకాశించగా; తన్నున్= తనను; సకల జనులున్= అందరూ; దానవుండు+అని= రాక్షసుడని; తలంపన్= భావించగా; పెంపారు= అతిశయించే; భీషణ+ఉద్ధతి= భయంకరమైన గర్వంతో; ప్రవర్తిల్లు= ఉండు, సాగు; పరాక్రమ క్రీడన్= విక్రమ లీలతో; అతిశయిల్లి= మించి; రాజమందిరంబు= రాజభవనం; చొరన్= ప్రవేశించటానికి; అప్పళించుచున్= ఉత్సహిస్తూ; తద్+ద్వారంబునకున్= దాని ద్వారానికి; అభిముఖుండు+ఐ= ఎదురై; అరిగెన్= వెళ్ళాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా పీనుగుపెంట అయిన పాంచాల వీరుల శిబిరంలోనుండి వచ్చి జయ గర్వితుడైన అశ్వత్థామ చల్లడమూ, కాసెకోకా ధరించి మిగిలిన పెద్ద శిబిరాలలోకి వెళ్ళి మొదట ప్రభువులను చంపి, తరువాత పరిజనులనూ ఏనుగుల, గుర్రాల సమూహాలనూ తాకి ముక్కలుగా చేస్తూ, ఒక్కోసారి శత్రువులు మేలుకొని తలపడితే మిక్కిలి విజృంభించి మృత్యుదేవత చెలరేగిన విధంగా, యముడు విజృంభించిన రీతిగా వాళ్ళను సంహరించి, కాలు కాలితో పెనువేసుకున్న శవాలతోనూ, ముక్కలై పడిన ఏనుగు తొండాలతో సరసమాడే రీతిగా కదలాడే కాళ్ళతోనూ, ఆవులించే తలలతోనూ, ఏనుగుదంతాల ముక్కలతోనూ, గుర్రాల ముఖాల శకలాలతోనూ, రథభాగాల ముక్కలతోనూ, మడుగులు కట్టే నెత్తురుతోనూ, రాశులైన కండలతోనూ, ఒండొంటితో పెనవేసికొనిపోయిన ప్రేగులతోనూ, పెద్ద గుట్టలయిన ఎముకలతోనూ, రూపుతాల్చిన అద్భుత భయానక బీభత్స రసాలకు ఆ ప్రదేశం స్థానమయ్యేటట్లు చేస్తూ, మిక్కిలి విజృంభించీ, తిరిగి తిరిగీ, తన ఖడ్గ విలాసాలు భూతబేతాళాలకు ప్రీతి పెంచుతూండగా, చతురంగబలాలను, పారిపోయినా, వెనుదీసినా, మరలిపోయినా, జంకినా, కలగినా, తొలగినా, కవిసినా, మార్కొన్నా, సమీపించినా, తాకినా, ఆక్రమించి చంపుతూ, పరాక్రమమూ, గర్వమూ, ఉపాయమూ, కాఠిన్యమూ

ఒక్కటై సాగగా, ఆ బలాలలో ఏ ఒక్క దానినీ మిగలనివ్వక, పోను పోను ఎక్కువయ్యే కోపంతో ప్రకాశించగా, అంచుకు అంటుకొన్న ఎముకల ముక్కలు కోరల దౌడలలో ఉండి, నెత్తురు పూతచే భయంకరమైన కత్తి శత్రువులను చంపటంలో తనకు తోడు పడటానికి వచ్చిన భయంకరాకార అయిన రాక్షసివలె ప్రకాశించగా, చేదిసైన్యం ఉన్న గుడారం మొదలుకొని పెక్కుచోట్ల సరస్సులో ప్రవేశించిన పెనుదున్నపోతువలె, ఉద్యానవనం ప్రవేశించిన మత్తేభం వలె, అడవిని కాల్చే కార్చిచ్చువలె విహరిస్తూ, అవసరమయినప్పుడు రథం ఎక్కి, నడిచీ, పరాక్రమిస్తూ, వీలు చిక్కినప్పుడు విజృంభిస్తూ యుద్ధం చేసి శత్రువులనెత్తురుతో తడిసిన శరీరం భయంకరంగా ప్రకాశించగా, తనను అందరూ రాక్షసుడని భావించగా, అతిశయించే భయంకరౌద్ధత్యంతో సాగే విక్రమక్రీడతో మించి, రాజభవనం ప్రవేశించటానికి ఉత్సహిస్తూ, దాని ద్వారంవైపు వెళ్ళాడు. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, ఉపమ, భ్రాంతిమంతం. 'మృత్యు దేవత గెరలిన చాడ్పున', 'జముండు నలిరేఁగిన కరణి'- అలంకారాలు ఉత్ప్రేక్షలు. 'తునిసి పడిన కరి కరంబులతో సరసమాడు చెలువునం జలనంబు నొందు చరణంబులను' - అలంకారం ఉత్ప్రేక్ష. 'వాదరఁ జిక్కిన యెముక తునుకలు గోఱదౌడలకైవడి గలిగి'- అలంకారం ఉపమ. 'అసిపట్టిక ఘోరాకారయైన రాక్షసి పగతుర గీటడంగించుటకుఁ దనకుఁ దోడు వచ్చిన తెఱంగున మెఱయ' - అలంకారం ఉత్ప్రేక్ష. 'కమలాకరంబు సొచ్చిన ఘన లులాయంబు రేఖయుఁ, గేలివనంబుఁ దఱిసిన మత్త శుండాలంబు పోల్కియును, గాంతారంబు దరికొను దావపావకు విధంబును దోఁప'- మూడూ మూడు ఉపమలు. 'తన్ను సకల జనులు దానవుండని తలంప' అలంకారం భ్రాంతిమంతం.

**సీ.** **కలయంగ వీడుమేల్కని యమ్మహావీరుఁ । డొక్కఁడ మెలఁగుటయు, నతండు**
**దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తద్బంధు సం । తతి గీటడఁచి యోధదంతితురగ**
**చయముల నెల్లను సమయంగఁ జూచుచు । రాకయుఁ, గర్ణ పరంపరావ**
**గతమున సన్నాహగాఢమై యెక్కడె । క్కడయని కడఁగి శిఖండి ద్రౌప**

**తే.** **దేయులును దానుఁ బన్ని యుద్వృత్త శౌర్య । మాన తుంగ ప్రభద్రక మాత్స్య తతులు**
**తోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణ తనయు । ముట్టి శస్త్రాస్త్రచయముల ముంచుటయును. 178**

**ప్రతిపదార్థం:** వీడు= శిబిరం; కలయంగన్= అంతటా; మేల్కని= మేలుకుని; ఆ+మహావీరుఁడు= ఆ గొప్పవీరుడు - అశ్వత్థామ; ఒక్కఁడు+అ= ఒక్కడే; మెలఁగుటయున్= సంచరించటమూ; అతండు; తొలుతన్= మొదట; ధృష్టద్యుమ్నున్; త్రుంచి= చంపి; తద్+బంధు సంతతిన్= ఆతడి చుట్టాలసమూహాన్ని; గీటు+అడఁచి= చంపి; యోధ దంతి తురగ చయములన్+ఎల్లను= వీరుల, ఏనుగుల, గుర్రాల-సమూహాలన్నిటినీ; సమయంగన్+చూచుచున్ రాకయున్= చంపుతూ రావటమూ; కర్ణ పరంపరా+అవగతమునన్= వినికి వరుసచే తెలియటంచేత; సన్నాహగాఢము+ఐ= యుద్ధ ప్రయత్నంలో మునిగినదయి; ఎక్కడ+ఎక్కడ+అని; కడఁగి= పూని; శిఖండి; ద్రౌపదేయులును= ద్రౌపది కొడుకులూ; తానున్; పన్ని= వ్యూహంగా ఏర్పడి; ఉద్వృత్త శౌర్యమాన తుంగ ప్రభద్రక మాత్స్యతతులు= అధికమైన పరాక్రమంచేతా, పౌరుషంచేతా, ఉగ్రులైన ప్రభద్రకుల, మాత్స్యుల సమూహాలు; తోడన్= కూడా; బలువిడిన్= పరాక్రమంతో; తఱుమంగన్= తరమగా; ద్రోణ తనయున్= అశ్వత్థామను; ముట్టి= తాకి; శస్త్ర+అస్త్ర చయములన్= శస్త్రాల, అస్త్రాల సమూహాలతో; ముంచుటయును= ముంచగా.

**తాత్పర్యం:** శిబిరం అంతా మేలుకొని, ఆ మహావీరుడైన అశ్వత్థామ ఒక్కడే సంచరించటమూ, అతడు మొదట ధృష్టద్యుమ్నుడిని చంపి, అతడి చుట్టాలను చంపి, వీరులనూ, ఏనుగులనూ, గుర్రాలనూ చంపుతూ రావటమూ, ఆనోటా ఆనోటా విని యుద్ధ ప్రయత్నంలో మునిగి, ఎక్కడెక్కడని పూని, శిఖండీ, ఉప పాండవులూ వ్యూహంగా ఏర్పడి, అధిక పరాక్రమం చేతా, పౌరుషంచేతా ఉగ్రులైన ప్రభద్రకులూ, మాత్స్యులూ తమతో కూడ వచ్చి పరాక్రమంతో తరమగా, అశ్వత్థామను తాకి శస్త్రాలతోనూ, అస్త్రాలతోనూ ముంచగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శిఖండి పూర్వజన్మలో అంబ. ఈమె భీష్ముడి మీది కోపంతో అతడిపై పగ తీర్చుకొనాలని ఈశ్వరుడిని గురించి తపస్సుచేసి వరం పొంది మరుజన్మలో ద్రుపదుడికి కూతురై పుట్టింది. ఆ తరువాత శిఖండిగా రూపాంతరం చెందింది. స్త్రీతోనూ పూర్వం స్త్రీరూపం గలవారితోనూ షండుడితోను తాను యుద్ధం చేయనని నియమం. అది తెలిసి అర్జునుడు శిఖండిని ముందు పెట్టుకొని భీష్ముడితో యుద్ధానికి రాగా భీష్ముడు అస్త్రసన్న్యాసం చేస్తాడు. అర్జునుడు అప్పుడు భీష్ముడిని జయిస్తాడు.

**వ. వారల నేర్పడ నాలోకించి. 179**

**ప్రతిపదార్థం:** వారలన్= శిఖండి మొదలుగా గల శత్రువీరులను; ఏర్పడన్= బాగా; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** (అశ్వత్థామ) శిఖండి మొదలైన వాళ్ళను బాగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. అగ్గురునందనుండు హరిణావలిఁ గాంచి కుభృత్తటంబు వే**
**డిగ్గు మృగేంద్రు చాడ్పునఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా**
**డిగ్గి రథంబు చోద్యపువడిం గలయన్ బెరసెం గరంబులం**
**దగ్గల మైన ఖేటకము నద్భుతఖడ్గముఁ దేజరిల్లఁగన్. 180**

**ప్రతిపదార్థం:** ఆ+గురు నందనుండు= ఆ గురుపుత్రుడు-అశ్వత్థామ; హరిణ+ఆవలిన్= లేళ్ళవరసను; కాంచి= చూచి; కుభృత్+తటంబున్= పర్వత ప్రదేశంనుండి; వే= శీఘ్రంగా; డిగ్గు= దిగే, మృగ+ఇంద్రు-చాడ్పునన్= సింహంలా; కడింది-మగంటిమి= గొప్పపరాక్రమం; ఉల్లసిల్లఁగాన్= ప్రకాశించగా; రథంబున్+డిగ్గి= రథందిగి; కరంబులందున్= చేతులలో; అగ్గలము+ఐన= అతిశయించిన; ఖేటకమున్= డాలూ; అద్భుత ఖడ్గమున్= ఆశ్చర్యకరమైన కత్తీ; తేజరిల్లఁగన్= ప్రకాశించగా; చోద్యము+వడిన్= వింతయైన వేగంతో; కలయన్= అంతటా; బెరసెన్= కవిశాడు.

**తాత్పర్యం:** ఆ అశ్వత్థామ లేళ్ళను చూచి కొండపైనుండి గబగబా దిగే సింహంవలె, గొప్ప పరాక్రమం ఒప్పగా, రథం దిగి, చేతులలో మంచి డాలూ, ఆశ్చర్యకరమైన కత్తీ ప్రకాశించగా మహావేగంతో అంతటా వ్యాపించాడు.

**విశేషం:** అలం: ఉపమ.'కుభృత్తటంబు వే డిగ్గు మృగేంద్రుచాడ్పున'- అలంకారం ఉపమ. దీనివలన శత్రువుల అల్పత్వమూ, అశ్వత్థామ ఘనతా తెలుస్తాయి.

**మహాస్రగ్ధర.**

**చతురంగచ్ఛేద కేళీ సరభస కలనాశ్చర్య ధౌరేయ నానా**
**గతులం ద న్నెల్లవారుం గడిఁది యసుర నాఁగా నతిక్రూర చేష్టో**

**ద్ధతి యొప్పం జొచ్చి సైన్యాస్త్రముల నతని యస్త్రంబులం ద్రుంచి వీఁకం**
**బ్రతివింధ్యుం గిట్టి రెండై పడఁగఁ దునిమెఁ దద్భాసమానాంగయష్టిన్. 181**

**ప్రతిపదార్థం:** చతుః+అంగ+ఛేద= రథ గజ తురగ పదాతులనే నాలుగు రకాల సైన్యాన్నీ ఖండించటం (అనే); కేళీ= క్రీడలో; సరభస కలనా= వేగంతో కూడుకున్న; ఆశ్చర్య ధౌరేయ= ఆశ్చర్యభారం వహించిన-మిక్కిలి ఆశ్చర్యకరమైన; నానాగతులన్= అనేకవిధాలచేత; తన్నున్= తనను; ఎల్లవారున్= అందరూ; కడిఁది+అసుర నాఁగాన్= క్రూర రాక్షసుడనగా; అతి క్రూర చేష్టా+ఉద్ధతి= మిక్కిలి క్రూరములైన పనుల తీవ్రత; ఒప్పన్= ఒప్పగా; చొచ్చి= ప్రవేశించి; సైన్య+అస్త్రములన్= (శత్రు) సైన్యపు అస్త్రాలను; అతని+అస్త్రంబులన్= ప్రతివింధ్యుడి అస్త్రాలతో; త్రుంచి= ఖండించి; వీఁకన్= పరాక్రమంతో; ప్రతివింధ్యున్= ప్రతివింధ్యుడనేవాడిని - ధర్మరాజు కొడుకును; కిట్టి= సమీపించి; తద్+భాసమాన+అంగయష్టిన్= అతడి ప్రకాశిస్తూ ఉన్న కర్రవంటి శరీరాన్ని; రెండు+ఐ= పడఁగన్= రెండు ముక్కలై పడేటట్లు; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** చతురంగబలాలనూ ఛేదించటం అనే ఆటలో వేగంతో కూడుకొన్న మహాశ్చర్యకరాలైన పెక్కు విధాలవలన తనను అందరూ మహారాక్షసు డని భావించగా, మిక్కిలి క్రూరములైన చేష్టల తీవ్రత ఒప్పుగా ప్రవేశించి శత్రుసేనల అస్త్రాలను తన అస్త్రాలతో ఖండించి, పరాక్రమంతో ప్రతివింధ్యుడిని సమీపించి, వాడి మెరిసే దేహయష్టిని రెండు ముక్కలై పడేటట్లు ఖండించాడు.

**విశేషం:** మహాస్రగ్ధరలో నాలుగు పాదాలుంటాయి. ఒక్కొక్క పాదంలో స,త,త,న,స,ర,ర,గ అనే గణాలుంటాయి. 1-9-16 అక్షరాలకు యతిమైత్రి. ప్రాస నియమం ఉంటుంది.

**వ. ఇవ్విధంబున ధర్మతనయనందనుని నడుము దెగనడిచి యార్చి పేర్చిన. 182**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ధర్మతనయ-నందనుని= ధర్మరాజు కొడుకుయొక్క; ప్రతివింధ్యుడియొక్క నడుము; తెగన్+అడిచి= తెగగొట్టి; ఆర్చి= అరచి; పేర్చినన్= విజృంభించగా;

**తాత్పర్యం:** ఈ రీతిగా ప్రతివింధ్యుడి నడుము తెగగొట్టి అరచి విజృంభించగా.

**మహాస్రగ్ధర.**

**అతిశోక క్రోధవేగవ్యథిత హృదయుఁడై యశ్వసాదిత్వ వీరో**
**ద్ధతిఁ బ్రౌఢస్ఫూర్తి సెల్వొందఁగ సబళముఁ దద్గాత్రముఁ జొన్పఁ బూఁచె**
**న్శ్రుతసోముం; డల్లఁ బట్టె న్గురుసుతుఁ డదియున్; స్రుక్కు చెన్నార, నల్క**
**న్ధృతఖడ్గుండైనఁ, జేయు న్శిరముఁ దురగము న్వేల్మిడిం ద్రుంచి వైచెన్. 183**

**ప్రతిపదార్థం:** శ్రుతసోముండు= భీముడి కొడుకైన శ్రుతసోముడు; అతి= మిక్కిలి; శోక= దుఃఖంయొక్క; క్రోధ= కోపంయొక్క; వేగ= ఉద్రేకంచేత; వ్యథిత= బాధపడిన; హృదయుఁడు+ఐ= హృదయం గలవాడై; అశ్వ సాదిత్వ వీర+ఉద్ధతిన్= గుర్రపురౌతైన వీరుడియొక్క ఔద్ధత్యంతో; ప్రౌఢస్ఫూర్తి= గొప్ప ప్రకాశం; చెల్వు+ఒందఁగన్= అందగించగా; సబళమున్= సబళ మనే ఆయుధాన్ని; తద్+గాత్రమున్= అతడి (అశ్వత్థామయొక్క) శరీరాన్ని; చొన్పన్(చొనుపన్)= గ్రుచ్చుకొనేటట్లు; పూఁచెన్= ప్రయోగించాడు; గురుసుతుఁడు= అశ్వత్థామ; అదియున్= దానినికూడా; అల్లన్= మెల్లగా; పట్టెన్= పట్టుకున్నాడు; స్రుక్కు=

దుఃఖం; చెన్ను+ఆరన్= ఒప్పగా, కలుగగా; అల్కన్= కోపంతో; ధృతఖడ్గుండు+ఐనన్= (శ్రుతసోముడు) కత్తి పట్టుకున్నవాడు కాగా; చే+ఉన్= చేతినీ; శిరమున్= తలనూ; తురగమున్= గుఱ్ఱాన్నీ; వ్రేల్మిడిన్= చిటికెలో; త్రుంచివైచెన్= (అశ్వత్థామ) నరికివేశాడు.

**తాత్పర్యం:** భీముడి కుమారుడైన శ్రుతసోముడు అమిత శోక క్రోధముల ఉద్రేకంచేత హృదయం వ్యథ చెందగా గుఱ్ఱాన్ని అధిరోహించిన వీరుడి ఔద్ధత్యంతో, గొప్ప స్ఫూర్తి అందగించగా, సబళం అనే ఆయుధాన్ని అశ్వత్థామ శరీరానికి గ్రుచ్చుకొనేటట్టు ప్రయోగించాడు. అశ్వత్థామ దానిని మెల్లగా పట్టుకోవటంతో అతడు దుఃఖించి కోపంతో ఖడ్గం ధరించాడు. అప్పుడు అశ్వత్థామ అతడి చేతినీ, శిరస్సునూ, గుఱ్ఱాన్నీ ఒక్క చిటికెలో నరికివేశాడు.

**విశేషం:** తెలుగులో భీముడి కొడుకు పేరు 'శ్రుతసోము' డని ఉండగా, సంస్కృత భారత ప్రతులలో 'సుతసోము' డని ఉన్నది.

**వ. ఇవ్విధంబునఁ జిత్రవధంబునకు గోచరుండైన కీచకాంతకతనయుం గనుంగొని. 184**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; చిత్రవధంబునకున్+గోచరుండు+ఐన= చిత్రవధకు గురి అయిన; కీచక+అంతక తనయున్= కీచకుడిని చంపిన భీముడి కొడుకుని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఈ రీతిగా చిత్రవధకు గురి అయిన భీమపుత్రుడిని- శ్రుతసోముడిని చూచి. (తరువాత పద్యంతో అన్వయం).

**మహాస్రగ్ధర**

**'నినుఁగూడన్ వీఁడె వచ్చెన్ నృపుఁ' డనుచు శతానీకుఁ డాభీల చక్రం**
**బున నశ్వత్థామ వక్షంబునను రుధిరముం బొంగఁగాఁ జేయ నప్పా**
**టున నీడంబోక బల్వేటున నిలఁ బడ నాటోపముం జూపి యంతం**
**దనివో కా దుర్జయుం డాతని శిరమును దద్గాత్రముం బాపె లీలన్. 185**

**ప్రతిపదార్థం:** నినున్+కూడన్= నిన్ను కలియటానికి-నీతో పోరాడటానికి; నృపుఁడు= రాజు; వీఁడె; వచ్చెన్= ఇదే వచ్చాడు; అనుచున్= అంటూ; శతానీకుఁడు= నకులుడి కొడుకైన శతానీకు డనేవాడు; ఆభీల చక్రంబునన్= భయంకరమైన చక్రాయుధంతో; అశ్వత్థామ వక్షంబునను= అశ్వత్థామయొక్క రొమ్మునుండి; రుధిరమున్= రక్తాన్ని; పొంగఁగాన్+చేయన్= పొంగేటట్టు చేయగా; ఆ దుర్జయుండు= గెలవశక్యంకాని ఆ అశ్వత్థామ; ఆ+పాటునన్= ఆ కష్టంచేత; ఈడంబోక= వెనుదీయక; బల్+వేటునన్= పెద్దదెబ్బతో; ఇలన్= నేలమీద; పడన్= పడేటట్లు; ఆటోపమున్= విజృంభణం; చూపి; అంతన్= దానితో; తనివి+పోక= తృప్తిపడక; లీలన్= సులభంగా; ఆతని శిరమును= ఆ శతానీకుడి తలను; తద్+గాత్రమున్= అతడి శరీరం నుండి; పాపెన్= తొలగించాడు.

**తాత్పర్యం:** 'నీతో పోరాడటానికి రాజు ఇదే వచ్చా'డంటూ నకులుడి పుత్రుడైన శతానీకుడు భయంకరమైన చక్రాయుధంతో అశ్వత్థామ రొమ్మునుండి రక్తం పొంగేటట్లు చేశాడు. గెలువశక్యం కాని అశ్వత్థామ ఆ దెబ్బకు వెనుదీయక, గట్టిదెబ్బతో వాడు నేలపై పడేటట్లు విజృంభించి, దానితో తృప్తి పడక, వాడి శిరస్సును శరీరం నుంచి అవలీలగా వేరుచేశాడు.

**వ. ఇట్లు నకుల సూనుఁడు సమసిన. 186**

**ప్రతిపదార్థం:** ఇట్లు; నకుల సూనుఁడు= నకులుడి కొడుకు-శతానీకుడు; సమసినన్= చావగా.

**తాత్పర్యం:** ఇట్లా నకులుడి కొడుకైన శతానీకుడు చావగా.

**మహాస్రగ్ధర.**

**శ్రుతసేనుం డప్డు గోపస్ఫురదరుణమరీచుల్ దలిర్పంగఁ జక్షు**
**ర్ద్వితయంబుం గెంపునం బొందిన చెలువము సందీప్త ఘోరంబుగా బె**
**ట్టతనిం జంచద్గదన్ వ్రేయఁగ నుఱక తదాస్యచ్ఛిదాస్ఫారకేళీ**
**చతురుండై యక్కుమారున్ జముకడ కనిచెం జండదోర్దర్ప మొప్పన్. 187**

**ప్రతిపదార్థం:** అప్డు= అప్పుడు; శ్రుతసేనుండు= సహదేవుడి కొడుకైన శ్రుతసేనుడు; కోపస్ఫురత్+అరుణ మరీచుల్= కోపంతో ప్రకాశించే ఎర్రటికాంతులు; తలిర్పంగన్= కన్పట్టగా; చక్షుస్(ః)+ద్వితయంబున్= రెండుకళ్ళూ; కెంపునన్+పొందిన చెలువము= ఎర్రబడ్డ అందం; సందీప్త ఘోరంబు+కాన్= వెలుగొంది భయంకరం కాగా; అతనిన్= అశ్వత్థామను; బెట్టు= గట్టిగా; చంచత్+గదన్= చలిస్తూన్న గదతో; వ్రేయఁగన్= కొట్టగా; ఉఱక= (అశ్వత్థామ) లెక్కచేయక; తద్= ఆ శ్రుతసేనుడియొక్క; ఆస్య= ముఖంయొక్క; ఛిదా= నరకడం అనే; స్ఫార= అధికమైన; కేళీ= క్రీడయందు; చతురుండు+ఐ= నేర్పుగలవాడయి; ఆ+కుమారున్= ఆ బాలుడిని; చండ దోస్(ః)+దర్పము= తీవ్రమైన భుజగర్వం; ఒప్పన్= ఒప్పుగా; జము కడకున్+అనిచెన్= యముడి దగ్గరకు పంపాడు - చంపాడు.

**తాత్పర్యం:** అప్పుడు సహదేవుడి కొడుకైన శ్రుతసేనుడు కోపంతో నేత్రద్వయం ఎర్రబడి భయంకరం కాగా, అశ్వత్థామను గదను తిప్పుతూ గట్టిగా కొట్టాడు. అశ్వత్థామ లక్ష్యపెట్టక వాడి ముఖ ఖండన క్రీడలో నేర్పుగలవాడయి ఆ కుమారుడిని భుజపరాక్రమగర్వం ఒప్పుగా యమసదనానికి పంపాడు.

**విశేషం:** సహదేవుడి కొడుకు తెలుగులో శ్రుతసేను డని ఉండగా, సంస్కృత భారతంలో శ్రుతకర్ముడని ఉన్నది.

**వ. ఇత్తెఱంగున వికృతాననుండై పడి మృతుండైన సహదేవ సుతుం జూచి రోషంబునం బేర్చి. 188**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; వికృత+ఆననుండు+ఐ= విరూపమైన ముఖం గలవాడయి; పడి; మృతుండు+ఐన= చచ్చిన; సహదేవ సుతున్= సహదేవుడి కొడుకును- శ్రుతసేనుడిని; చూచి; రోషంబునన్= కోపంతో; పేర్చి= విజృంభించి.

**తాత్పర్యం:** ఈ విధంగా వికృతమైన ముఖంతో పడి చచ్చిన సహదేవుడి కొడుకును - శ్రుతసేనుడిని చూచి కోపంతో విజృంభించి.

**మహాస్రగ్ధర.**

**వితతజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్యమేపార బాణ**
**ప్రతితం దన్ముంప, వీఁకం బలుక జడియుచున్ బల్విడిం బేర్చి చంచ**

**ద్గతిఁ గ్రీడం దంతి హేలాదళనరతమృగేంద్ర స్ఫురన్మూర్తి దోఁపన్**
**శ్రుతకీర్తిం గిట్టి కంఠత్రుటనవిలసనారూఢి నవ్విప్రుఁ డొప్పెన్. 189**

**ప్రతిపదార్థం:** (శ్రుతకీర్తి-కర్త) వితత జ్యా నాదము= అధికమైన వింటినారిధ్వని; ఆశా వితతిన్= దిక్కుల సమూహంలో; నినిచి= నిండించి; దోస్(ః)+వీర్యము= భుజపరాక్రమం; ఏపారన్= అతిశయించగా; బాణ ప్రతతిన్= బాణాల సమూహంతో; తన్+ముంపన్= తనని ముంచగా; ఆ+విప్రుఁడు= ఆ బ్రాహ్మణుడు - అశ్వత్థామ; వీఁకన్= ఉత్సాహంతో; పలుకన్= డాలును; జడియుచున్= తిప్పుతూ; బలు+విడిన్= పరాక్రమంతో; పేర్చి= విజృంభించి; చంచత్+గతిన్= కదులుతున్న గమనంతో; క్రీడన్= ఆటతో; దంతి= ఏనుగుయొక్క; హేలా= అనాయాసపు; దళన= చీల్చుటయందు; రత= ఆసక్తమయిన; మృగ+ఇంద్ర= సింహంయొక్క; స్ఫురత్+మూర్తి= ప్రకాశిస్తున్న ఆకారం; తోఁపన్= తోచేటట్టు; శ్రుతకీర్తిన్= అర్జునుడి కొడుకైన శ్రుతకీర్తిని; కిట్టి= సమీపించి; కంఠ= కంఠంయొక్క; త్రుటన= ఖండనంయొక్క; విలసన= ప్రకాశంయొక్క; ఆరూఢిన్= గొప్పతనంతో; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అర్జునుడి కొడుకైన శ్రుతకీర్తి అధికమైన వింటినారిధ్వనిని దిక్కులందు నిండించి, భుజపరాక్రమం అతిశయించగా బాణ సమూహంతో అశ్వత్థామను ముంచగా, ఆ బ్రాహ్మణుడు ఉత్సాహంతో డాలు తిప్పుతూ, పరాక్రమంతో విజృంభించి, ఆటతో, ఏనుగును చీల్చటంలో ఆసక్తికరమైన సింహంవలె శ్రుతకీర్తిని సమీపించి కంఠం ఖండించాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'దంతి హేలా దళన రత మృగేంద్ర స్ఫురన్మూర్తి దోఁపన్' - అలంకారం ఉపమ.

ఈ దారుణ మహామారణ క్రియాభివర్ణనంలో పాండవ సుత పంచకహనన క్రియాబీభత్సాన్ని 'మహాస్రగ్ధర' లలోనే వర్ణించివుండడం ఒక విశేషం.

**వ. ఇట్లు ద్రౌపదీ తనయ పంచకంబు పంచత్వంబు నొందినఁ గ్రోధాతిరేకంబునఁ బ్రభద్రకులును, శాంతనవాంతకుండును ధృష్టద్యుమ్నాంతకుఁ జుట్టుముట్టి. 190**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ద్రౌపదీ తనయ పంచకంబు= ద్రౌపది కొడుకు లైదుగురూ; పంచత్వంబున్+ఒందినన్= చావగా; క్రోధ+అతిరేకంబునన్= కోపాతిశయంతో; ప్రభద్రకులును; శాంతనవ+అంతకుండును= భీష్ముడిని అంతమొందించిన శిఖండీ; ధృష్టద్యుమ్న+అంతకున్= ధృష్టద్యుమ్నుడిని సంహరించిన అశ్వత్థామను; చుట్టుముట్టి= ముట్టడించి.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రౌపదికొడుకులు అయిదుగురూ చావగా, కోపాతిశయంతో ప్రభద్రకులూ, శిఖండీ అశ్వత్థామను ముట్టడించి.

**చ. శరములఁ దోమరంబులను జగ్రములన్ వెసఁ గప్పి బెట్టు ము**
**ద్గర కరవాల కుంతముఖ దారుణ హేతుల నొంప, నాతఁ డు**
**ద్ధుర గతులం బ్రభద్రకులఁ ద్రుంచుచుఁ గేళి యొనర్పఁగా, శిఖం**
**డి రుచిర మార్గణంబు భ్రుకుటిస్థలి నొంచె సముద్భటోన్నతిన్. 191**

**ప్రతిపదార్థం:** శరములన్= బాణాలతోనూ; తోమరంబులను= చిల్లకోలలతోనూ; చక్రములన్= చక్రాయుధాలతోనూ; వెసన్= శీఘ్రంగా; కప్పి; బెట్టు= మిక్కిలి ఎక్కువగా; ముద్గర కరవాల కుంత ముఖ దారుణ హేతులన్= ముద్గరాలూ, కత్తులూ,

బల్లెములూ మొదలైన భయంకరాయుధాలతో; నొంపన్= బాధించగా; ఆతఁడు= అశ్వత్థామ; ఉద్ధుర గతులన్= తీవ్రములైన ప్రకారాలతో; ప్రభద్రకులన్; త్రుంచుచున్= వధిస్తూ; కేళి= క్రీడ; ఒనర్పఁగాన్= చేయగా; శిఖండి రుచిర మార్గణంబు= శిఖండియొక్క మనోహరమైన బాణం; సముద్భట+ఉన్నతిన్= అతిశయమైన ఉన్నతితో; భ్రుకుటి స్థలిన్= బొమముడి ప్రదేశాన్ని; నొంచెన్= బాధించింది.

**తాత్పర్యం:** బాణాలతోనూ, తోమరాలతోనూ, చక్రాలతోనూ శీఘ్రంగా కప్పి, మిక్కిలి ఎక్కువగా ముద్గరాలూ, కత్తులూ, కుంతాలూ మొదలైన భయంకరాయుధాలతో బాధించారు. అశ్వత్థామ తీవ్ర ప్రకారాలతో ప్రభద్రకులను ఖండిస్తూ విహరించాడు. శిఖండి తన మనోహరమైన బాణంతో అతడి బొమముడి స్థలాన్ని మిక్కిలి గట్టిగా కొట్టి బాదించాడు.

### అశ్వత్థామ శిఖండిం బొదివి చంపుట (సం. 10-8-66)

**క. గురుసుతుఁడు క్రోధమయమగు । బరవసమున నప్పు డా ద్రుపదనందను మే**
**నిరువఱియ గాఁగ నేసెను । శిరము నుదగ్రతఁ గృపాణశిక్ష మెఱయఁగన్. 192**

**ప్రతిపదార్థం:** గురుసుతుఁడు= అశ్వత్థామ; క్రోధ మయము+అగు= కోపంతో నిండిన; బరవసమునన్= ఉత్సాహంతో; అప్పుడు; ఆ-ద్రుపద నందను మేను= ఆ ద్రుపద పుత్రుడైన శిఖండియొక్క శరీరం; ఇరు+వఱియ కాఁగన్= రెండు ముక్కలయ్యేటట్టు; శిరమున్= తలను; ఉదగ్రతన్= భయంకరంగా; కృపాణ శిక్ష= ఖడ్గవిద్య; మెఱయఁగన్= ప్రకాశించగా; ఏసెను= నరికాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ కోపంతో నిండిన ఉత్సాహంతో అప్పుడు ఆ శిఖండి శరీరం రెండు ముక్కలయ్యేటట్టు అతడి తలను భయంకరంగా ఖడ్గవిద్య ప్రకాశించే విధంగా నరికాడు.

**వ. ఇవ్విధంబున దొరలు దెగినను బాంచాల ప్రభద్రక మత్స్యసైన్య శేషంబులు వోక పెనంగిన నతండు మాతంగ వితాన విదళనం బప్పుడు సలిపిన కంఠీరవంబు తనమీఁద హరిణకులంబు గవిసిన నెట్టిదగు నట్టివాఁడగుచుఁ బేర్చి యార్చె; నత్తెఱంగు తుములంబునఁ బొడగానమిఁ బాండునందనులు కృష్ణసాత్యకులును నా శిబిరమున లేకయునికి యెఱింగె; నప్పుడు గనుంగొను జనంబులకు నితం డశ్వత్థామ యనుబుద్ధి వొడమె; నది యెట్టనినఁ గురుపాండవులు భండనంబుఁ జేయందొడంగినయది మొదలుగా రాత్రులచ్చటి జనులు నీలతనువును, రక్తాస్యనయనయు, రక్తాంబరధరయు, రక్తమాల్యానులేపనయు నగు లేమ యొక్కతి దమవీటివారు నిద్రపోవుచుండఁ దలలు వీడ మేనులు వికృతంబులై వ్రేలం బాశంబులఁ గరితురగ సహితంబుగా బంధించి ఘోరసంరంభంబునం దెచ్చి తెచ్చి యశ్వత్థామ యగ్రభాగంబునం బెట్ట నుగ్ర భావంబున నతండు దునుముచు నార్చు చునికిఁ గలలు గాంతు; రట్లగుటం జేసి నిద్రాసక్తులం జంపుటయు నవ్విధంబునార్పును నేర్పడ ననుసంధించి యక్కలల ఫలంబు గాకేమి యని తలంచి చొచ్చి పోటునకు నయ్యరాతి రాత్రిమై వచ్చుట నిశ్చయించి యశ్వత్థామగా నెఱింగె; రవ్వీరుండు మెఱుంగు మెఱచినట్లు వివిధగతులఁ జరించినం జెండాడినం జూచియు నీడంబోక రణక్రీడ సల్పిన, నబ్బలుమగండు సముద్దండ బాహుదండవిలాసుండై. 193**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్; దొరలు= రాజులు (నాయకులు); తెగినను= చచ్చినా; పాంచాల ప్రభద్రక= పాంచాలురయొక్కయు; ప్రభద్రకుల యొక్కయు; మత్స్య= మాత్స్యులయొక్కయు; సైన్య శేషంబులు= సేనలలో మిగుళ్ళు; పోక పెనంగినన్= పోవకుండా పోరితే; అతండు= అశ్వత్థామ; మాతంగ వితాన విదళనంబు= ఏనుగుల గుంపుల ఖండనం; అప్పుడు; సలిపిన= చేసిన; కంఠీరవంబు= సింహం; తన మీఁదన్; హరిణ కులంబు= లేళ్ళ సమూహం; కవిసినన్= పడితే; ఎట్టి+అది+అగున్= ఎటువంటిది అవుతుందో; అట్టి-వాఁడు+అగుచున్= అటువంటివాడు అవుతూ; పేర్చి= విజృంభించి; ఆర్చెన్= అరిచాడు; ఆ+తెఱంగు తుములంబునన్= ఆ విధమైన దొమ్మియుద్ధంలో; పొడగానమిన్= కనబడకపోవటంచేత; పాండు నందనులు= పాండవులూ; కృష్ణ సాత్యకులును= కృష్ణుడూ, సాత్యకీ; ఆ శిబిరమునన్= ఆ విడిదలలో; లేక+ఉనికి= లేకపోవటం; ఎఱింగెన్= తెలిసికొన్నాడు; అప్పుడు; కనుంగొను జనంబులకున్= చూసే జనులకు; ఇతండు; అశ్వత్థామ; అను బుద్ధి= అనే తలంపు; పొడమెన్= పుట్టింది; అది ఎట్టు+అనినన్= అది ఎట్లా అంటే; కురు పాండవులు= కౌరవులూ, పాండవులూ; భండనంబున్= యుద్ధం; చేయన్+తొడంగిన+అది= మొదలుగాన్= చేయటం ప్రారంభించినది మొదలుకొని; రాత్రులు= రాత్రివేళలలో; అచ్చటి= జనులు; నీల తనువును= నల్లటి శరీరంగలదీ; రక్త+ఆస్య నయనయున్= ఎర్రటి ముఖమూ, కళ్ళూ కలదీ; రక్త+అంబర ధరయున్= ఎర్రటి బట్టలు ధరించినదీ; రక్తమాల్య+అనులేపనయున్= ఎర్రటి దండలూ, పూతలూ కలదీ అగు; లేమ ఒక్కతి= స్త్రీ ఒక్కర్తె; తమ వీటి వారు= తమ ప్రదేశంలో ఉన్నవాళ్ళు; నిద్రపోవుచున్+ఉండన్= నిద్రపోతూండగా; తలలు వీడన్= శిరోజాలు విడిపోగా; మేనులు= శరీరాలు; వికృతంబులు+ఐ వ్రేలన్= విరూపాలయి వ్రేలాడుతూ ఉండగా; పాశంబులన్= త్రాళ్ళతో; కరి తురగ సహితంబుగాన్= ఏనుగులతోనూ, గుర్రాలతోనూ; బంధించి= కట్టి; ఘోర సంరంభంబునన్= భయంకరమైన ఆటోపంతో; తెచ్చి తెచ్చి= తెగతెచ్చి; అశ్వత్థామ+అగ్ర భాగంబునన్= అశ్వత్థామ ఎదుట; పెట్టన్= పెట్టగా; అతండు= అతడు; ఉగ్రభావంబునన్= కోపంతో; తునుముచున్= ముక్కలు చేస్తూ; ఆర్చుచున్+ఉనికిన్= అరుస్తూండటం; కలలు+కాంతురు= కలలుకంటారు; ('కాంతురు' అనే ఈ తద్ధర్మక్రియ భూతార్థకమే- 'కాంచారు' అని అర్థం); అట్లు+ అగుటన్+చేసి= అందుచేత; నిద్రాసక్తులన్= నిద్రపోతూన్నవాళ్ళను; చంపుటయున్= చంపటమూ; ఆ+విధంబు+ఆర్పును= ఆ రీతి అరుపూ; ఏర్పడన్= స్పష్టంగా; అనుసంధించి= సమన్వయించుకొని; ఆ+కలల ఫలంబు కాకేమి= ఆ కలలఫలమే అని; తలంచి; చొచ్చి= ప్రవేశించి; పోటునకున్= యుద్ధానికి; ఆ+అరాతి= ఆ శత్రువు; రాత్రిమైన్= రాత్రివేళ; వచ్చుట= రావటం; నిశ్చయించి; అశ్వత్థామన్+కాన్= అశ్వత్థామనుగా; ఎఱింగిరి= తెలిసికొన్నారు; ఆ+వీరుండు= ఆ శూరుడు (అశ్వత్థామ); మెఱుంగు= మెరుపు; మెఱచిన+అట్లు= మెరిసిన విధంగా; వివిధ గతులన్= రకరకాలుగా; చరించినన్= ప్రవర్తించినా; చెండాడినన్= వధించినా; చూచియున్= చూచికూడా; ఈడంబోక= వెనుదీయక; రణక్రీడ= యుద్ధం; సల్పినన్= చేయగా; ఆ+బలు మగండు= ఆ మహావీరుడు (అశ్వత్థామ); సముద్దండ బాహుదండ విలాసుండు+ఐ= మిక్కిలి అధికమైన భుజాదండాల లీల కలవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా నాయకులు చచ్చినా, పాంచాల ప్రభద్రక మత్స్య సేనలలో మిగిలినవాళ్ళు పోక పోరితే, అతడు ఏనుగుల గుంపు నప్పుడు చంపిన సింహం తనమీదికి లేళ్ళగుంపు ఉరికితే ఎట్లా అవుతుందో అట్లా అవుతూ విజృంభించి అరిచాడు. ఆ రీతి దొమ్మియుద్ధంలో కనబడకపోవటంచేత పాండవులూ, కృష్ణార్జునులూ ఆ శిబిరంలో లేరని తెలిసికొన్నాడు. అప్పుడు చూచే జనాలకు ఇతడు అశ్వత్థామ అనే తలంపు కలిగింది. అది ఎట్లా అంటే, కౌరవులూ, పాండవులూ యుద్ధం చేయటానికి ప్రారంభించింది మొదలుకొని రాత్రివేళలలో అక్కడివాళ్ళు నల్లటి శరీరమూ, ఎర్రటిముఖమూ, కళ్ళూ, ఎర్రటి వస్త్రమూ, ఎర్రటి దండలూ, పూతా కల స్త్రీ ఒకతె తమ ప్రదేశంలో నిద్రపోతూన్నవాళ్ళను జుట్టువిడిపోయి, శరీరాలు విరూపాలయి వేలాడగా త్రాళ్ళతో ఏనుగులతోనూ, గుర్రాలతోనూ సహా బంధించి భయంకరాటోపంతో తెచ్చి తెచ్చి అశ్వత్థామ ఎదుట పెట్టగా కోపంతో అతడు ఖండిస్తూ అరుస్తూ ఉన్నట్లు కలలు కన్నారు. అందుచేత నిద్రిస్తూన్న వాళ్ళను చంపటం, ఆ విధంగా అరవటం బాగా సమన్వయించుకొని

అది అంతా ఆ కలల ఫలమే అని నిశ్చయించి, యుద్ధానికి ఆ శత్రువు రాత్రివేళ రావటం నిశ్చయించి అశ్వత్థామ అని గుర్తించారు. ఆ వీరుడైన అశ్వత్థామ మెరుపు మెరిసినట్లు రకరకాలుగా ప్రవర్తించటం, వధించటం చూచికూడా వెనుదీయక యుద్ధం చేయగా, ఆ మహావీరుడు గొప్ప భుజబలం కలవాడై.

**విశేషం:** అలం: ఉపమ. 'అతండు మాతంగ వితాన విదళనం బప్పుడు సలిపిన కంఠీరవంబు తన మీఁద హరిణకులంబు గవిసిన నెట్టిదగు నట్టివాఁ డగుచు' అలంకారం ఉపమ.

**మహాస్రగ్ధర.**

> **తలలన్ హస్తమ్ములం బాదములఁ దనువులం దత్ప్రదేశంబు గప్పం;**
> **దొలఁగించున్ వానిఁ గ్రొన్నెత్తురు వఱపి, హయస్తోమదంతిప్రతానం**
> **బుల మేదోమాంస ఖండంబుల దనుజమహాభోజనం బావహించు,**
> **న్మలఁగం బాఱుం, జెలంగు, న్నలి నెసఁగు, జయోన్మత్తుఁడై మానవేంద్రా! 194**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్రా!= ఓ రాజా! ధృతరాష్ట్రా!; (పూర్వవచనంలోని 'అబ్బలుమగండు'-కర్త); జయోన్మత్తుఁడు+ఐ= గెలుపుచేత మిక్కిలి గర్వించినవాడై; తద్+ప్రదేశంబు= ఆ చోటిని; తలలన్= తలలతోనూ; హస్తమ్ములన్= చేతులతోనూ; పాదములన్= కాళ్ళతోనూ; తనువులన్= శరీరాలతోనూ; కప్పున్= కప్పాడు; క్రొత్త+నెత్తురు= క్రొత్తరక్తం; పఱపి= పారించి; వానిన్= ఆ తలలూ మొదలైన వాటిని; తొలఁగించున్= కొట్టుకుపోయేటట్లు చేశాడు; హయ-స్తోమ= గుర్రాల సమూహంయొక్క; దంతి ప్రతానంబుల= ఏనుగుల సమూహంయొక్క; మేదస్(ః)+మాంసఖండంబులన్= మెదడుతోనూ, మాంసపు ముక్కలతోనూ; దనుజ మహత్(మహా)+భోజనంబు= రాక్షసుల గొప్ప ఆహారం; ఆవహించున్= కల్పించాడు; మలఁగన్+పాఱున్= సంచరించాడు; చెలంగున్= సింహనాదం చేశాడు; నలిన్= ఉత్సాహంతో; ఎసఁగున్= అతిశయించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! ఆ అశ్వత్థామ విజయగర్వంతో ఆ యుద్ధరంగాన్ని తలలతోనూ, చేతులతోనూ, కాళ్ళతోనూ, శరీరాలతోనూ కప్పివేశాడు. క్రొత్త నెత్తురు పారించి వాటిని కొట్టుకుపోయేటట్టు చేశాడు. గుర్రాల, ఏనుగుల గుంపుల మేదస్సులతోనూ, మాంసపు ముక్కలతోనూ రాక్షసులకు గొప్ప ఆహారం కల్పించాడు. అతడు తిరిగాడు, సింహనాదం చేశాడు. ఉత్సాహంతో అతిశయించాడు.

**విశేషం:** ఇందులోని సమాపక క్రియలన్నీ తద్ధర్మార్థకాలయినా, భూతార్థస్ఫోరకాలు.

**తే.** **అట్లు విహరించి హతశేషులైన జనులు । పాఱఁ గనుఁగొని రథమెక్కి పటురయమున**
> **వారి వెనుకొని మెఱుఁగు వాలారు తూపు । గములు పరఁగించి యందఱ సమయఁజూచి. 195**

**ప్రతిపదార్థం:** (పూర్వవచనంలోని 'అబ్బలుమగండు'-కర్త); అట్లు= ఆ రీతిగా; విహరించి= క్రీడించి; హతశేషులు+ఐన జనులు= చావగా మిగిలిన జనులు; పాఱన్+కనుఁగొని= పారిపోవటం చూచి; రథము+ఎక్కి; పటు రయమునన్= తీవ్రవేగంతో; వారిన్= ఆ పారిపోతూన్నవాళ్ళను; వెనుకొని= వెంటాడి; మెఱుఁగు వాలారు తూపు గములు= ప్రకాశించే వాడి బాణాల సమూహాలు; పరఁగించి= ప్రయోగించి; అందఱన్= అందరనీ; సమయన్+చూచి= చచ్చేటట్టు చూచి.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ రీతిగా క్రీడించి, చావగా మిగిలిన జనులు పారిపోతూ ఉంటే చూచి రథం ఎక్కి, తీవ్రవేగంతో వాళ్ళను వెంబడించి, ప్రకాశించే వాడి బాణాల సమూహం ప్రయోగించి, అందరినీ చంపి. (తరువాతి పద్యంతో అన్వయం).

క. 'ఆ కలన నట్లు సేసి మ । హాకుల జనతతులు గాఁగ నన్యస్థలులున్
భీకరరథగతుల నుద । గ్రాకృతియై మెఱసి యమ్ము లడరింపంగన్. 196

**ప్రతిపదార్థం:** (193 వచనంలోని 'అబ్బలుమగండు' - కర్త); ఆ కలనన్= ఆ ప్రదేశంలో; అట్లు+చేసి= ఆ విధంగా చేసి; అన్యస్థలులున్= ఇతర ప్రదేశాలు కూడా; మహా+ఆకుల జన తతులు+కాఁగన్= మిక్కిలి కలతచెందిన మనుష్యుల గుంపులు కలిగినవి కాగా; భీకర రథగతులన్= భయంకరమైన రథ గమనాలతో; ఉదగ్ర+ఆకృతి+ఐ= భయంకరాకారుడై; మెఱసి= ప్రకాశించి; అమ్ములు= బాణాలు; అడరింపంగన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ ప్రదేశంలో ఆ విధంగా చేసి, ఇతర స్థలాలు కూడా కలత చెందిన జనులు కలవి అవుతూఉండగా, భయంకర రథగమనాలతో, భయంకరాకారుడై ప్రకాశించి బాణాలు ప్రయోగించగా. (తరువాతి వచనంతో అన్వయం).

వ. ఇట్లెసఁగు బహుళకోలాహలంబున హయంబులు నిభంబులుఁగట్లు దెంచుకొని కలయంబాఱెఁ; బాఱుటయు గోడిగలకై దంతపాతకలహంబులం గెరలుగుండ్లక్రందునను, నొండొంటి మదగంధంబులు సహింపక మార్కొని పోరాడు సామజంబుల సమ్మర్దంబునను, గాళ్ళు దునిసియుఁ, జేతులు నలసియు, నురంబు లవిసియు, వెన్నులు విఱిగియుఁ, బ్రక్కలు నొగిలియుఁ, దలలు పగిలియుఁ, జాఁపకట్టువడి చదిసియుఁ, గ్రంతలనిఱుకటంపుఁ జోట్ల మానవకోట్లు పీనుంగు తిట్టలగుచుండఁ బలకయు వాలునుం గొని యవ్వాలుమగండు వేడుకం దేరుడిగ్గి యగ్గజంబులను ఘోటకంబులను బొదివి పాటవాటోపం బొప్పవిపాటన వినోదంబు సలిపె; నప్పుడు గొందఱు నెఱయ మేల్కనని భ్రమను, భయంబునను బాదంబులు గుదివడఁబాఱలేక నెలవెడలిన యెలుంగుల నస్తవ్యస్తపుమాటలాడఁ, గొందఱు జనకసహోదరాదులగు బంధువులఁ బేరుపేరం బిలుచుచుం దిరిగి కనుదిరిగి తమవారు గానివారల చెట్టలు పట్టుకొని చనఁ, గొందఱు కైదువులు గొని కదిసి నిదురకన్నులం బొదువు చెలులను జుట్టంబులను బగఱ యని సమయింపఁ, గొందఱెదురుగాఁ జనుదెంచినవా 'రిదియేమి?' యని యడుగ, 'నశ్వత్థామసొచ్చిపొడుచుచున్నవాఁ'డనిన, 'వాసుదేవార్జునులు శిబిరంబున లేమి నప్పాపాత్ముక కిట్లు సేయవచ్చెంగాక వారున్నఁదన్ను గాసిసేయరే?' యని పలుకఁ, గొందఱు 'బీభత్సుం డిట్టి పరాక్రమంబు సేసినం జూచి మనంబున రోయకుండునే? యతండెన్నఁ డేనియు వాహన వికలుఁడైనవానిని, చేత నాయుధంబులు లేని వానిని, దలవీడిన వానిని, వెఱచినవానిని, వెఱఁగుపడినవానిని, నిద్రించువానిని నొంచునే?' యని యర్జును నగ్గింప, నయ్యందఱ నగ్గురునందనుండు గురుతరంబయిన కురురాజు పరిభవంబు నప్పటప్పటికిఁ దలంపఁ బెంపారు దారుణ క్రూరత్వంబునఁ గోలుమసంగి, యించుక యరవాయిఁగొనక, చెండియుం, ద్రుంచియుం, జించియుఁ, దుంగమడుఁగుఁ జొచ్చిన మాతంగంబు పగిది బడలువడం జేసె; నా సమయంబున. 197

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఎసఁగు= ఈ విధంగా అతిశయించే; బహుళ కోలాహలంబునన్= అధికమైన కలకలంతో; హయంబులున్= గుర్రాలూ; ఇభంబులున్= ఏనుగులూ; కట్లు తెంచుకొని= బంధనాలు తెంపుకొని; కలయన్+పాఱెన్= అన్నివైపులకూ పరుగెత్తాయి; పాఱుటయున్= పరుగెత్తగా; గోడిగలకై= ఆడగుర్రాలకోసం; దంత పాత కలహంబులన్= పళ్ళూడే పోట్లాటలలో; కెరలు= ఎగిరిపడే; గుండ్ల= రాళ్ళవలని; క్రందునను= ఉపద్రవంచేతా; ఒండొంటి మద గంధంబులు= పరస్పర మదవాసనలు;

సహింపక= ఓర్వక; మార్కొని= ఎదుర్కొని; పోరాడు= కలహించే; సామజంబుల= ఏనుగుల; సమ్మర్దంబునను= త్రొక్కుళ్ళచేతా; కాళ్ళు; తునిసియున్= ముక్కలయీ; చేతులు; నలిసియున్= విరిగీ; ఉరంబులు= రొమ్ములు; అవిసియున్= బ్రద్దలయీ; వెన్నులు= వెన్నుపూసలు; విఱిగియున్= విరిగీ; ప్రక్కలు; నొగిలియున్= నలిగీ; తలలు; పగిలియున్= పగిలీ; చాఁపకట్టు+పడి= నేలమట్టంగా పడి; చదిసియున్= చచ్చీ; క్రంతలన్= సందులలో; ఇఱుకటము+చోట్లన్= ఇరుకు ప్రదేశాలలో; మానవకోట్లు= మనుష్యుల సమూహాలు; పీనుంగు తిట్టలు+అగుచున్+ఉండన్= పీనుగుల ప్రోగులు అవుతూండగా; పలకయున్= డాలూ; వాలునున్= కత్తీ; కొని= పుచ్చుకొని; ఆ+వాలు మగండు= ఆ శూరుడు(అశ్వత్థామ); వేడుకన్= సంతోషంతో; తేరు= రథం; డిగ్గి= దిగి; ఆ+గజంబులను= ఆ ఏనుగులను; ఘోటకంబులను= గుర్రాలను; పొదివి= చుట్టుకొని; పాటవ+ఆటోపంబు= నేర్పుయొక్క అతిశయం; ఒప్పన్= ఒప్పగా; విపాటన వినోదంబు= ఖండించే వేడుక; సలిపెన్= చేశాడు; అప్పుడు; కొందఱు; నెఱయన్= పూర్తిగా; మేల్కనని= మేలుకొనని; భ్రమను= భ్రాంతి చేతనూ; భయంబునను= భయంతోనూ; పాదంబులు= కాళ్ళు; గుదివడిన్= కట్టువడిగా; పాఱన్+లేక= పరుగెత్తలేక; నెలవు+ఎడలిన+ఎలుంగులన్= పట్టుతప్పిన స్వరాలతో; అస్తవ్యస్తపు మాటలు ఆడన్= తారుమారు మాటలు మాటాడగా; కొందఱు; జనక సహోదర+ఆదులు+అగు= తండ్రి, సోదరుడు మొదలైన; బంధువులన్= చుట్టాలను; పేరపేరున్= పేరుపేరు వరుసను; పిలుచుచున్= పిలుస్తూ; తిరిగి= సంచరించి; కనుదిరిగి= కళ్ళు తిరిగి; తమవారు+కానివారల= తమ బంధువులు కాని వాళ్ళయొక్క; చెట్టలు+పట్టుకొని చనన్= చేతులు పట్టుకొని వెళ్ళగా; కొందఱు; కైదువులు+కొని= కత్తులు పుచ్చుకొని; కదిసి= సమీపించి; నిదుర కన్నులన్= నిద్రకళ్ళతో; పొదువు= చుట్టూఉన్న; చెలులను= మిత్రులనూ; చుట్టంబులను= చుట్టాలను; పగఱ+అని= శత్రువులని; సమయింపన్= చంపగా; కొందఱు; ఎదురుగాన్+చనుదెంచి వారు= ఎదురుగా వచ్చినవాళ్ళు; ఇది+ఏమి+అని+అడుగన్= ఇదే మిటని అడుగగా; అశ్వత్థామ; చొచ్చి= ప్రవేశించి; పొడుచుచున్+ఉన్నవాఁడు+అనినన్= చంపుతున్నాడని చెప్పగా; వాసుదేవార్జునులు= కృష్ణుడూ, అర్జునుడూ; శిబిరంబునన్= విడిదలలో; లేమిన్= లేకపోవటంచతే; ఆ+పాప+ఆత్మునకున్= ఆ దుర్మార్గుడికి; ఇట్లు= ఈ రీతిగా; చేయన్+వచ్చెన్+కాక= చేయడం సాధ్యమయింది కాని; వారు+ఉన్నన్= ఆ కృష్ణార్జునులు ఉంటే; తన్నున్= తనను; గాసి+చేయరే= నాశనం చేయరా; అని పలుకన్= అని పలుకగా; కొందఱు; బీభత్సుండు= అర్జునుడు; ఇట్టి పరాక్రమంబు చేసినన్= ఇటువంటి దుష్టమైన పరాక్రమం చేస్తే; చూచి; మనంబునన్= మనస్సులో; రోయక+ఉండునే= అసహ్యించుకోకుండా ఉంటాడా?; అతండు= అర్జునుడు; ఎన్నఁడు+ఏనియున్= ఎప్పుడైనా; వాహన వికలుఁడు+ఐన వానిని= భగ్న రథుడినీ; చేతన్= చేతిలో; ఆయుధంబులు లేని వానిని= ఆయుధాలు లేనివాడినీ; తలవీడినవానిని= జుట్టు ముడివీడిన వాడినీ; వెఱచిన వానిని= భయపడినవాడినీ; వెఱఁగు పడిన వానిని= నిశ్చేష్టుడైన వాడినీ; నిద్రించువానిని= నిద్రపోతూన్న వాడినీ; నొంచునే?= బాధిస్తాడా?; అని; అర్జునున్; అగ్గింపన్= పొగడగా; ఆ+అందఱన్= వాళ్ళందరినీ; ఆ+గురు నందనుండు= ఆ గురుపుత్రుడు అశ్వత్థామ; గురుతరంబు+అయిన= మిక్కిలి గొప్పదైన; కురురాజు పరిభవంబు= దుర్యోధనుడి పరాభవం; అప్పటప్పటికిన్= మాటిమాటికి; తలంపన్= స్మరించగా; పెంపు+ఆరు= ఎక్కువయ్యే; దారుణ క్రూరత్వంబునన్= భయంకరమైన క్రౌర్యంతో; కోలుమసంగి= విజృంభించి; ఇంచుక+అరవాయి+కొనక= కొంచెమైనా సందే హించక; వెండియున్= మళ్ళీ; త్రుంచియున్= ఖండించీ; చించియున్= నరికీ; తుంగ మడుగున్= తుంగగడ్డి అలమిన మడుగును; చొచ్చిన= ప్రవేశించిన; మాతంగంబు పగిదిన్= ఏనుగువలె; బడలు+పడన్+చేసెన్= అలయించాడు; ఆ సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా అతిశయించే అధికమైన కలకలంలో గుర్రాలూ, ఏనుగులూ కట్లు తెంచుకొని అన్నివైపులకూ పరుగెత్తాయి. ఆడగుర్రాలకొరకు పళ్ళూడిపోయే పోట్లాటలలో ఎగిరిపడే రాళ్ళవలన కలిగే ఉపద్రవంచేతా, ఒకదాని మదవాసన ఇంకోదానికి సరిపడక ఒకదాని నొకటి ఎదుర్కొని పరుగెత్తే ఏనుగుల త్రొక్కిళ్ళచేతా కాళ్ళు ముక్కలయీ, చేతులు విరిగీ, రొమ్ములు బ్రద్దలయీ, వెన్నులు విరిగీ, ప్రక్కలు నలిగీ, తలలు పగిలీ నేలమట్టంగా పడి చచ్చీ, సందులలోనూ, ఇరుకుప్రదేశాలలోనూ మనుష్యుల సమూహాలు పీనుగులు గుట్టలుగుట్టలవుతూ ఉండగా, ఆ

శూరుడు డాలూ, కత్తీ పట్టుకొని సంతోషంతో రథం దిగి ఆ ఏనుగులనూ, గుర్రాలనూ చుట్టుముట్టి నేర్పు అతిశయించగా ఖండించి వినోదించాడు. అప్పుడు కొందరు పూర్తిగా మెలకువరాక భ్రాంతిచేతా, భయంతోనూ, కాళ్ళు కట్టుపడి పరుగెత్తలేక పట్టుతప్పిన స్వరాలతో తారుమారు మాటలు పలికారు. కొందరు తండ్రి, సోదరుడు మొదలైన చుట్టాలను పేరు పేరు వరసన పిలుస్తూ సంచరించి కళ్ళుతిరిగి తమ బంధువులు కానివాళ్ళ చేతులు పట్టుకొని వెళ్ళారు. కొందరు కత్తులు పుచ్చుకొని సమీపించి నిద్రకళ్ళతో చుట్టూ ఉన్న మిత్రులనూ, చుట్టాలనూ శత్రువు లనుకొని చంపారు. కొందరు ఎదురుగా వచ్చినవాళ్ళు ఇదేమి టని అడుగగా, అశ్వత్థామ వచ్చి చంపుతున్నా డని చెప్పగా, కృష్ణార్జునులిద్దరూ శిబిరంలో లేకపోవటంచేత ఆ దుర్మార్గుడు ఈ విధంగా చేయగలిగాడు కాని, వాళ్ళే ఉంటే అతడిని నాశనం చేసేవారుకారా అని అన్నారు. కొందరు ఇట్లాంటి దుష్పరాక్రమం చూపితే అర్జునుడు అసహ్యించుకొనకుండా ఉంటాడా? అతడెప్పుడైనా భగ్నరథుడినీ, నిరాయుధుడినీ, ముక్తకేశుడినీ, భీతుడినీ, నిశ్చేష్టుడినీ, నిద్రితుడినీ బాధిస్తాడా? అని అర్జునుడిని పొగిడారు. వాళ్ళందరినీ ఆ గురుపుత్రుడు - గురుతరమైన దుర్యోధనుడి పరాభవం మాటిమాటికి గుర్తుకు రాగా, ఎక్కువయ్యే భయంకర క్రౌర్యంతో విజృంభించి కొంచెమైనా సందేహించక మళ్ళీ త్రుంచీ చించీ తుంగగడ్డి అలుముకొన్న మడుగును ప్రవేశించిన ఏనుగువలె అలయించాడు. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ. 'తుంగ మడుగుఁ జొచ్చిన మాతంగంబు పగిది బడలువడం జేసె.' - అలంకారం ఉపమ.

**సీ.** **ఆ యోధవరు బారి కగ్గంబు గాక ద । వ్వుల భీతిఁ దలల చీరలును వీడఁ**
**బాదంబులట దొట్రువడఁ బాఱి కొందఱు । మానవాధీశులు సైనికులును**
**విడిదల వాకిట వెడలుచోఁ గృప కృత । వర్మలఁగని వఱువట్లు వట్టు**
**పెదవులు దడుపుచు 'సదయతఁ గావరే' । యనుచు మ్రొక్కఁగ నమ్మహాత్ము లపుడు**

**తే.** **రాక్షసావేశ సంభృత క్రౌర్యులగుట । నధిప! యాత్మీయ మానుషహాని దలఁప**
**లేక వారలఁ బొదివి యనేకభల్ల । దారితులఁ జేసి రందఱుఁ దరతరంబ.** **198**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! ధృతరాష్ట్రా!; కొందఱు-మానవ+అధి+ఈశులున్= కొంతమంది రాజులూ; సైనికులును= సైనికులూ; ఆ యోధవరు బారికిన్= ఆ వీరశ్రేష్ఠుడి హింసకు; అగ్గంబు+కాక= లోనుకాక; దవ్వులన్= దూరంగా; భీతిన్= భయంతో; తలల చీరలును వీడన్= తలపాగాలు ఊడిపోగా; పాదంబులు= కాళ్ళు; అట= అక్కడ; తొట్రు+పడన్= తడబడగా; పాఱి= పరుగెత్తి; విడిదల వాకిటన్+వెడలుచోన్= శిబిరం వెలుపలికి వెళ్ళేటప్పుడు; కృపకృతవర్మలన్+కని= కృపుడినీ; కృతవర్మిడినీ చూచి; వఱువట్లు+పట్టు= మిక్కిలి యెండిపోయిన; పెదవులు; తడుపుచున్= తడిచేసికొంటూ; సదయతన్= దయతో; కావరే= రక్షించరా, అనుచున్; మ్రొక్కఁగన్= నమస్కరించగా; ఆ+మహాత్ములు= ఆ మహనీయులు-కృపకృతవర్మలు; అపుడు; రాక్షస+ఆవేశ-సంభృత క్రౌర్యులు+అగుటన్= రాక్షసుల ఆవేశంతో కూడుకొన్న క్రూరత్వం గలవారవటంచేత; ఆత్మీయ మానుష హాని= తమ మనుష్యుల నాశనం; తలఁపన్+లేక= ఓర్చుకోలేక; వారలన్= వాళ్ళని; పొదివి= చుట్టుముట్టి; అందఱున్= అందరినీ; తరతరంబు+అ= క్రమక్రమంగా; అనేక భల్ల దారితులన్= పెక్కు బాణాలచేత చీల్చబడినవారిని; చేసిరి.

**తాత్పర్యం:** ఓ రాజా! ధృతరాష్ట్రా! కొంతమంది రాజులూ, సైనికులూ ఆ అశ్వత్థామ చేసిన హింసకు లోనుగాక దూరంగా భయంతో తలపాగాలు వీడీ, కాళ్ళు తడబడీ పరుగెత్తి, శిబిరంలో నుండి బయటికి వచ్చే కృపకృతవర్మలను

చూచి, మిక్కిలి ఎండిపోయే పెదవులను తడుపుకొంటూ 'దయతో రక్షించరా' అంటూ మ్రొక్కితే, ఆ మహాత్ములు అప్పుడు రాక్షసావేశక్రూరులై తమ పక్షీయుల నాశనం ఓర్వలేక చుట్టుముట్టి అందరినీ క్రమక్రమంగా పెక్కు బాణాలతో చీల్చివేశారు.

**క. ధరణి నెఱిదప్ప నొఱగిన । కరిహయనరచయము లొఱలఁగాఁ గరుణము భూ**
**వర! యొరసె శిబిరమునఁ దన । కరయఁగఁ జేరుగడ లేమి నది వృథ యయ్యెన్. 199**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా! ధృతరాష్ట్రా!; ధరణిన్= నేలమీద; నెఱి+తప్పన్= ఒప్పు తప్పేటట్టు; ఒఱగిన= వ్రాలిన; కరిహయ నర చయములు= ఏనుగుల, గుర్రాల, మనుష్యుల గుంపులు; ఒఱలఁగాన్= అరవగా; శిబిరమునన్= విడిదలలో; కరుణము= కరుణరసం; ఒరసెన్= వ్యాపించింది; అరయఁగన్= చూడఁగా; తనకున్; చేరుగడ= ఆశ్రయం; లేమిన్= లేకపోవటంచేత; అది= ఆ కరుణ రసం; వృథ+అయ్యెన్= వ్యర్థమయింది.

**తాత్పర్యం:** ఓ రాజా! ధృతరాష్ట్రా! నేలమీద ఒప్పు తప్పి వ్రాలిన ఏనుగుల, గుర్రాల, మనుష్యుల గుంపులు అరవగా శిబిరంలో కరుణరసం వ్యాపించింది. చూడగా తనకు ఆలంబనం లేకపోవటంచేత ఆ కరుణరసం వ్యర్థమయిపోయింది.

**విశేషం:** కరుణరసం శిబిరంలో వ్యాపించింది కాని దానికి ఆలంబన విభావం లేకపోవటం చేత - అంటే శిబిరం శూన్యం అవటంచేత అది వ్యర్థమయిపోయింది.

**వ. అట్టియెడ. 200**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**మహాస్రగ్ధర.**

**దనుజవ్రాతంబు కాంతాతతియును బ్రజలుం దారు; నానా విధోగ్ర**
**ధ్వను లాకాశావకీర్ణత్వ మహిమఁ బొరయం, దంష్ట్ర లత్యంత ఘోర**
**త్వనిరూఢిం బొంద నార్చుం; దఱచుగ నగు; నుత్తారసల్లాపముల్ సే**
**యు; నలిం గ్రందారఁ బైపై నురవడిఁ గవియున్ హుంకృతాభీలభంగిన్. 201**

**ప్రతిపదార్థం:** దనుజ వ్రాతంబు= రాక్షసుల సమూహం; కాంతా తతియును= భార్యల సమూహమూ; ప్రజలున్= బిడ్డలూ; తారున్= సంచరించింది; నానా విధ= పెక్కుభంగులైన; ఉగ్ర= భయంకరాలయిన; ధ్వనులు; ఆకాశ= ఆకాశంలో; అవకీర్ణత్వ= వ్యాప్తియొక్క; మహిమన్= గొప్పతనం; పొరయన్= పొందేటట్లూ; దంష్ట్రలు= కోరలు; అత్యంత ఘోరత్వ నిరూఢిన్= మిక్కిలి భయంకరత్వ ప్రసిద్ధిని; పొందన్= పొందేటట్లూ; ఆర్చున్= అరిచింది; తఱచుగన్= మాటిమాటికి; నగున్= నవ్వింది; ఉత్తార సల్లాపముల్= మిక్కుటమైన ధ్వనిగల సంభాషణలు; చేయున్= చేసింది; నలిన్= ఉత్సాహంతో; హుంకృత+ఆభీల భంగిన్= హుంకారంయొక్క భయంకర ప్రకారంతో; క్రందారన్= అతిదారుణమైన ధ్వని నిండగా; పైపైన్= మిక్కిలి; ఉరవడిన్= విజృంభణతో; కవియున్= ఉరికింది.

**తాత్పర్యం:** రాక్షస సమూహం తన భార్యలతో బిడ్డలతో సంచరించింది. అనేక విధాలయిన భయంకర ధ్వనులు ఆకాశంలో వ్యాపించేటట్లూ, కోరలు మిక్కిలి భయంకరంగా కనిపించేటట్లూ అరిచింది. మాటిమాటికి నవ్వింది. మిక్కుటమైన ధ్వనితో సంభాషించింది. ఉత్సాహంతో అతిదారుణధ్వనితో భయంకరంగా హుంకరిస్తూ మిక్కిలి విజృంభణంతో ఉరికింది.

**విశేషం:** ఇందులోని సమాపకక్రియలన్నీ తద్ధర్మార్థకాలయినా, అవి అన్నీ భూతార్థ స్ఫోరకాలు.

**వ.** **ఇవ్విధంబున వివిధ వికారాననంబులు బహుళ భంగిక కరపాదంబులు గలుగు నపరిమిత క్రవ్యాదులు గవిసి మేదో మాంస మస్తిష్క మజ్జంబు లానుచుం జవియైన వానిం బుత్ర మిత్ర కళత్రాదుల కొసంగుచు నన్యకోటి బెరసిన యెడఁ ద్రోద్రోపు లాడి యవియుఁ గైకొనుచుం గీలాల పానంబున మత్తిల్లి నృత్యంబులు సేయుచు మఱియు ననేకప్రకారంబుల విహారంబు సలుపుచు నుల్లసిల్లిరి. పదంపడి యఱపీనుఁగు లొఱలుటయును దానవగణంబు కలకలంబును డిందువడియె నప్పుడు జగంబులు గొని కాలిన కాలాగ్నియుం బోలెఁ బాండవ శిబిరంబు నిరవశేషంబుగా సమయించి శమియించి చాపాచార్య నందనుండు మే నెత్తుట జొత్తిల్లి మోహాంధ్యంబుతోఁ గలసి యునికింజేసి సాంద్రతర రక్తసిక్తంబు లైన బాహుఖడ్గంబు లేక ద్రవ్యంబు చందంబు నొంద మరలి తాను బ్రవేశించు తఱి నెట్లుండె నట్ల నిశ్శబ్దం బైన యవ్విడిదల వెడలు చుండఁ దెలతెలవేగె; నిట్లు ప్రతిన నెఱపి కృపకృతవర్మల పాలికిం జనుదెంచి వారలతో నిట్లనియె.** **202**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; వివిధ వికార ఆననంబులు= రకరకాలుగా వికృతాలైన ముఖాలు; బహుళ భంగిక కర పాదంబులు= పెక్కు విధాలైన చేతులు, కాళ్ళు; కలుగు; అపరిమిత క్రవ్యాదులు= అసంఖ్యాక రాక్షసులు; కవిసి= వ్యాపించి; మేదస్(ః)+మాంస మస్తిష్క మజ్జంబులు= మేదస్సూ, మాంసమూ, మస్తిష్కమూ, మజ్జా; ఆనుచున్= తింటూ; చవి+ఐన వానిన్= రుచిగలవాటిని; పుత్ర మిత్ర కళత్ర+ఆదులకున్= కొడుకులూ, స్నేహితులూ, భార్యలూ మొదలైన వారికి; ఒసంగుచున్= ఇస్తూ; అన్య కోటి= ఇతరుల సమూహం; బెరసిన+ఎడన్= కూడినప్పుడు; త్రోద్రోపులు+ఆడి= ఒకదాని నింకొకటి త్రోసుకుని; అవియున్= అవికూడా; కైకొనుచున్= తీసికొంటూ; కీలాల పానంబునన్= రక్తం త్రాగటంచేత; మత్తిల్లి= మదించి; నృత్యంబులు+చేయుచున్= నృత్యాలు చేస్తూ; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= పలు విధాల; విహారంబు సలుపుచున్= విహరిస్తూ; ఉల్లసిల్లిరి= సంతోషించారు; పదంపడి= పిమ్మట; అఱపీనుఁగులు= ప్రాణావశిష్టులైన ప్రాణులు; ఒఱలుటయును= మూలగగా; దానవ గణంబు కలకలంబును= రాక్షసుల గుంపు సందడీ; డిందు+పడియెన్= అణగింది; అప్పుడు; జగంబులు+కొని కాలిన కాల+అగ్నియున్+పోలెన్= లోకాలను ముట్టి కాలిన ప్రళయాగ్నిలాగా; పాండవ శిబిరంబున్= పాండువుల విడిదలను; నిరవశేషంబు+కాన్= పూర్తిగా; సమయించి= చంపి; శమియించి= శాంతించి; చాప+ఆచార్య నందనుండు= ధనుర్గురు పుత్రుడు - అశ్వత్థామ; మే= శరీరం; నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లి= ఎర్రబడి; మోహ+ఆంధ్యంబుతోన్= మోహం అనే చీకటితో; కలిసి+ఉనికిన్+చేసి= కలిసియుండటంచేత; సాంద్రతర రక్తసిక్తంబులు+ఐన= మిక్కిలి ఎక్కువైన రక్తంతో తడిసిన వైన; బాహు ఖడ్గంబులు= చేయీ, కత్తీ; ఏకద్రవ్యంబు చందంబున్+ఒందన్= ఒక్క వస్తువులాగే ఉండగా; మరలి= తిరిగి; తాను; ప్రవేశించు+తఱిన్= ప్రవేశించునప్పుడు; ఎట్లు+ఉండెన్= ఎట్లా ఉందో; అట్లు+అ= అట్లే; నిశ్శబ్దంబు+ఐన= చప్పుడు లేని; ఆ+విడిదలన్= ఆ శిబిరంలోనుండి; వెడలుచున్+ఉండన్= బయటికి వస్తూంటే; తెలతెల వేగెన్= తెల్లవారింది; ఇట్లు; ప్రతిన= శపథం; నెఱపి= నెరవేర్చి; కృప కృతవర్మల పాలికిన్= కృపాచార్య కృతవర్మల దగ్గరకు; చనుదెంచి= వచ్చి; వారలతోన్= వారితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఈ విధంగా రకరకాలుగా వికృతాలైన ముఖాలూ, పెక్కురీతులైన చేతులూ కాళ్ళూ కలిగిన పెక్కుమంది రాక్షసులు గుమిగూడి మేదస్సూ, మాంసమూ, మస్తిష్కమూ, మజ్జా భుజిస్తూ రుచిగా ఉన్నవాటిని కొడుకులకూ, స్నేహితులకూ, భార్యలకూ ఇస్తూ, పరాయివాళ్ళు చేరితే గెంటివేసి వాటిని కూడా తీసికొంటూ, రక్తం త్రాగటంచేత మదించి నాట్యాలు చేస్తూ, ఇంకా అనేక విధాలుగా విహరిస్తూ ఒప్పారు. తరువాత ప్రాణావశిష్టులైన ప్రాణులు

మూల్గగా రాక్షస సమూహం సందడికూడా తగ్గింది. అప్పుడు లోకాలను తగులబెట్టే ప్రళయాగ్నివలె పాండవ శిబిరంలోని వాళ్ళను యావన్మందినీ చంపి శాంతించి అశ్వత్థామ శరీరం రక్తంతో ఎర్రబడి మోహపుచీకటితో కలిసి ఉండటంచేత అధిక రక్తంతో తడిసిన చేయీ కత్తీ ఒకే వస్తువువలె కనబడగా, మళ్ళీ తను ప్రవేశించినప్పుడు ఎట్లా ఉందో అలాగే నిశ్శబ్దంగా ఉన్న ఆ శిబిరంలోనుండి బయటకు వస్తూంటే తెల్లవారింది. ఇట్లా శపథం నెరవేర్చి కృపకృతవర్మల దగ్గరికి వచ్చి వాళ్ళతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** మోహాంధ్యము - మోహమనే ఆంధ్యం - రూపకం. 'జగంబులు గొని కాలిన కాలాగ్నియుంబోలె' - అలంకారం ఉత్ప్రేక్ష.

### అశ్వత్థామ పాండవ శిబిరంబు వెడలి కృపకృతవర్మలఁ గూడికొనుట (సం. 10-8-140)

**సీ.** **'సకల పాంచాలురు సమసిరి పాంచాలి । కొడుకు లందఱు జముకడకుఁ జనిరి;**
**చేది మాత్స్య ప్రభద్రాది బలంబులు । నిరవశేషంబుగా నేలఁ గలిసె;**
**మాటలు పెక్కేల? మానిసి గుఱ్ఱ మే । నుం గను పేరెల్లఁ ద్రుంగెఁ బాండు**
**భూవరనందను లేవురుఁ గృష్ణుఁడు । సాత్యకియును నెందుఁ జనిరొ కాని**

**తే.** **తండ్రియును నేలినాతఁడు దైన్యపడిన । దాని కరులపై వచ్చి యీశాను వరము**
**గాంచి మీరలు పెనుఁబ్రాపు గాఁగ వీడు । దఱియుటకు నెంతదగునంత పఱుపఁగంటి.'** **203**

**ప్రతిపదార్థం:** సకల పాంచాలురున్= పాంచాలు రందరూ; సమసిరి= చచ్చారు; పాంచాలి కొడుకులు+అందఱున్= ద్రౌపది కొడుకు లందరూ; జముకడకున్= యముడి దగ్గరకు; చనిరి= వెళ్ళారు, చచ్చిపోయారు; చేది మాత్స్య ప్రభద్ర+ఆది బలంబులు= చేది బలాలూ, మాత్స్యబలాలూ, ప్రభద్రకుల బలాలూ మొదలైనవి; నిరవశేషంబుగాన్= ఏమీ మిగలకుండా; నేలన్+కలిసెన్= నశించాయి; మాటలు పెక్కు+ఏల?= ఇన్ని మాటలెందుకు?; మానిసి= మనుష్యుడు; గుఱ్ఱము; ఏనుంగు+అను పేరు+ఎల్లన్= ఏనుగు అనే మాట సర్వం; త్రుంగెన్= నశించింది; పాండు భూవర నందనులు+ఏవురున్= పాండురాజు కొడుకు లైదుగురూ; కృష్ణుఁడున్; సాత్యకియును; ఎందున్+చనిరొ కాని= ఎక్కడికి వెళ్ళారో కాని; తండ్రియును= నా తండ్రియైన ద్రోణుడూ; ఏలిన+ఆతఁడున్= రాజైన దుర్యోధనుడూ; దైన్యపడిన దానికిన్= దీనత్వం పొందిన దానికి; అరులపైన్= శత్రువులపైకి; వచ్చి; ఈశాను వరము= ఈశ్వరుడి వరం; కాంచి= పొంది; మీరలు= మీరిద్దరూ; పెను+ప్రాపు+కాఁగన్= పెద్ద అండకాగా; వీడు= శిబిరం; తఱియుటకున్= సమీపించటానికి; ఎంత+తగున్= ఎంత తగుతుందో; అంత= అంతా; పఱుపన్+కంటిన్= బాధించగలిగాను.

**తాత్పర్యం:** 'పాంచాలు రందరూ చచ్చారు. ద్రౌపది కొడుకులు అందరూ నశించారు. చేది మాత్స్య ప్రభద్రకాదుల సేనలు ఏమీ మిగలకుండా నశించాయి. ఇన్ని మాటలెందుకు? మనుష్యుడు, గుర్రం, ఏనుగు అనే మాటలేకుండా పోయింది. పాండవు లైదుగురూ, కృష్ణుడూ, సాత్యకీ ఎక్కడకు వెళ్ళారో కాని, నా తండ్రీ, నా ప్రభువూ దైన్యం పొందినందుకు శత్రువులపై దండెత్తి వచ్చి, ఈశ్వరుడి వరం పొంది, మీరు పెద్ద అండకాగా, నేను శిబిరం ప్రవేశించటానికి ఎంత తగుతుందో అంతా చేసి బాధించాను.'

**వ. అని చెప్పిన వినుచు మున్ను రాక్షసావేశంబునం జేసి నీచపరాక్రమంబు లాచరించి తదనంతరంబ తెలిసి యా రథికవరులు వగం బొగులుచున్నవారు గావున నగ్గురునందన నగ్గింపం దలంపక యూరకుండి తమ మనోవికృతి యతం డెఱుంగకమున్న తలలు వంచుకొని తగు తెఱంగునఁ బొగడిన నతండు. 204**

**ప్రతిపదార్థం:** అని; చెప్పినన్; వినుచున్; మున్ను= మొదట; రాక్షస+ఆవేశంబునన్+చేసి= రాక్షసు డావేశించటం చేత; నీచ పరాక్రమంబులు= తుచ్ఛ పరాక్రమాలు; ఆచరించి= చేసి; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మటనే; తెలిసి= గ్రహించి; ఆ రథికవరులు= ఆ రథికశ్రేష్ఠులైన కృపకృతవర్మలు; వగన్= పశ్చాత్తాపంతో; పొగులుచున్+ఉన్నవారు+కావునన్= బాధపడుతున్నారు కాబట్టి; ఆ+గురునందనున్= ఆ గురుపుత్రుడిని-అశ్వత్థామను; అగ్గింపన్+తలంపక= పొగడనెంచక; ఊరక+ఉండి; తమ మనన్(ః)+వికృతి= తమ మనస్సులోని మార్పు; అతండు; ఎఱుంగక మున్ను+అ= తెలిసికోవటానికి ముందే; తలలు వంచుకొని; తగు తెఱంగునన్= తగిన విధంగా; పొగడినన్= పొగడగా; అతండు= అశ్వత్థామ.

**తాత్పర్యం:** అని చెప్పగా వింటూ మొదట రాక్షసు డావేశించటం చేత తుచ్ఛంగా పరాక్రమించి, ఆ వెంటనే గ్రహించికొని ఆ రథిక శ్రేష్ఠులైన కృపకృతవర్మలు పశ్చాత్తాపంతో తపిస్తున్నారు కాబట్టి ఆ గురుపుత్రుడిని పొగడటానికి ఇచ్ఛగించక ఊరుకొని తమ మనస్సు మార్పు అతడు గ్రహించటానికి ముందే తలలు వంచుకుని సముచిత రీతిని పొగడితే, అతడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'పాండుతనయులు నాచేతఁ బట్టువడుట । తెగుట గలిగిన ననుఁ గొంత పొగడఁ దగును;**
**జలముమై రిత్తవాండ్రను జంపు టరయ । మీరు గొనియాడు నంతటి పౌరుషంబె?' 205**

**ప్రతిపదార్థం:** పాండు తనయులు= పాండురాజు కొడుకులు- పాండవులు; నాచేతన్; పట్టువడుట= చిక్కటం; తెగుట= చావటం; కలిగినను= సంభవిస్తే; ననున్= నన్ను; కొంత; పొగడన్+తగును= పొగడటం మంచిది; చలముమైన్= పట్టుదలతో; రిత్తవాండ్రను= పనికిమాలినవాళ్ళను- అల్పులను; చంపుట; అరయన్= చూడగా; మీరు; కొనియాడు+అంతటి= పొగిడేటంత; పౌరుషంబు+ఎ?= పౌరుషమా? (కాదనుట).

**తాత్పర్యం:** 'పాండవులు నా చేత చిక్కటం, చావటం సంభవిస్తే నన్ను ఏదో కొంత పొగడటం మంచిది. పట్టుపట్టి పనికిమాలిన వాళ్ళను చంపటం 'మీరు పొగిడేటంతటి పౌరుషమా?'

**వ. అనిన విని వారలు 'ధృష్టద్యుమ్న ప్రముఖ పాంచాలురను బ్రతివింధ్యాది ద్రౌపదేయులను బేరుకొని వారివారి బలంబులను మాత్స్యానీకప్రభృతి సైన్యంబులను నొక్కరూపేనియుఁ ద్రిక్కకుండ నొక్కరుండవ రెండు జాములలో నేలం గలిపితి; కరం బచ్చెరువుగాదె!' యని యతనిం గౌఁగిలించుకొని రనుటయు సంజయునకు ధృతంరాష్ట్రుం డిట్లనియె: 206**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; వారలు; ధృష్టద్యుమ్న ప్రముఖ పాంచాలురను= ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలురనూ; ప్రతివింధ్య+ఆది-ద్రౌపదేయులను= ప్రతివింధ్యుడూ మొదలైన ద్రౌపదీకుమారులనూ; పేరుకొని= పేర్కొని; వారి వారి బలంబులను= వారి వారి సేనలనూ; మాత్స్య+అనీక ప్రభృతి సైన్యంబులను= మాత్స్య సైన్యం మొదలైన సైన్యాలనూ; ఒక్కరూపు+ఏనియున్+త్రిక్కక+ఉండన్= ఒక్క మనిషికూడా మిగలకుండా; ఒక్కరుండవు+అ= ఒక్కడివే; రెండు జాములలో; నేలన్+కలిపితి(వి)= నశింపజేశావు; కరంబు= మిక్కిలి; అచ్చెరువు+కాదె?= ఆశ్చర్యం కాదా?; అని; అతనిన్= అతడిని; కౌఁగిలించుకొనిరి; అనుటయున్; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని వాళ్ళు 'ధృష్టద్యుమ్నాది పాంచాలురనూ, ప్రతివింధ్యాది ద్రౌపదీ కుమారులనూ పేర్కొని వారి వారి సేనలనూ మాత్స్యసైన్యం మొదలైన సైన్యాలనూ ఒక్కడు కూడా మిగలకుండా ఒక్కడవే రెండు జాములలో రూపుమాపావు. ఇది అత్యంతం ఆశ్చర్యకరం కాదా?' అని అతడిని కౌగలించుకొన్నారు. అని చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇలా అన్నాడు:

**క. 'కురుపతికి జయము గోరెడు । గురుపుత్త్రుఁడు మున్న యేలొకో యిటు తఱికిం**
**జొరక యెడ మడిసినను మఱి । వెరవుం జేవయును జూప వేడుక వడియెన్.' 207**

**ప్రతిపదార్థం:** కురుపతికిన్= కురురాజునకు- దుర్యోధనుడికి; జయము; కోరెడు; గురుపుత్త్రుఁడు= అశ్వత్థామ; మున్న= ముందే; ఏల+ఒకో= ఎందుచేత; ఇటు= ఈ రీతిగా; తఱికిన్+చొరవ= సమయానికి పూనుకోక; ఎడ మడిసినను= అదను తప్పగా; మఱి= తరువాత; వెరవున్= ఉపాయమూ; చేవయును= బలమూ; చూపన్= ప్రదర్శించటానికి; వేడుక పడియెన్= ఉత్సహించాడు.

**తాత్పర్యం:** 'దుర్యోధనుడికి జయం కోరే అశ్వత్థామ ముందే ఎందుకో ఈ రీతిగా సమయానికి పూనుకోక, సమయం మించిన తరువాత ఉపాయమూ, బలమూ ప్రదర్శించటానికి ఉత్సహించాడు.'

**వ. అనిన యమ్మహీపతి కతం డిట్లనియె. 208**

**ప్రతిపదార్థం:** అనిన+ఆ+మహీపతికిన్= అని పలికిన ఆ ధృతరాష్ట్రుడికి; అతండు= సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అట్లా అడిగిన ఆ ధృతరాష్ట్రుడితో సంజయు డిట్లా అన్నాడు:

**ఉ. 'పాండు నృపాలనందనుల బాహుబలంబున కోడి యాతఁడు**
**ద్దండతఁ గుంది యుండి వసుధావరునూరులు నుగ్గుసేసి భీ**
**ముండు దదుత్తమాంగము సముద్ధతిఁ దన్నిన దాన శోకముం**
**జండతర ప్రకోపము నసహ్యపు వేదన సేయ నత్తఱిన్. 209**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= అశ్వత్థామ; పాండు నృపాల నందనుల= పాండురాజు కొడుకులయొక్క; బాహు బలంబునకున్= భుజపరాక్రమానికి; ఓడి= భయపడి; ఉద్దండతన్= అధికంగా; కుంది+ఉండి= బాధపడి ఉండి; భీముండు; వసుధావరు+ఊరులు= రాజు (దుర్యోధనుడి) తొడలు; నుగ్గు+చేసి= విరుగగొట్టి; తద్+ఉత్తమాంగమున్= అతడి శిరస్సును; సముద్ధతిన్= మిక్కిలి గర్వంతో; తన్నినన్= తన్నితే; దానన్= ఆ కారణంచేత; శోకమున్= దుఃఖమూ; చండతర ప్రకోపమున్= మిక్కిలి తీవ్రమైన కోపమూ; అసహ్యము+వేదన= దుస్సహమైన బాధ; చేయన్= చేయగా; ఆ+తఱిని= అప్పుడు.

**తాత్పర్యం:** 'అశ్వత్థామ పాండవుల భుజపరాక్రమానికి వెరచి అధికంగా బాధపడుతూ ఉండి, భీముడు దుర్యోధనుడి తొడలు విరుగగొట్టి అతడి శిరస్సును తన్నిన కారణంచేత, దుఃఖమూ, తీవ్రమైన కోపమూ దుస్సహమైన వేదనా కలుగగా, అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. గురుని చావు తెఱఁగు క్రొత్తయై మనమున । నావహిల్లుటయు మహాగ్రహమున**
**బాసయిచ్చి రాజు పనుపును బడసి యు । దగ్రవృత్తి నరిగి యట్లు సేసె. 210**

**ప్రతిపదార్థం:** (పూర్వపద్యంలోని 'ఆతఁడు' కర్త) గురుని చావు తెఱఁగు= తండ్రి మరణవిధం; క్రొత్త+ఐ= అపూర్వమై; మనమునన్= మనస్సులో; ఆవహిల్లుటయున్= ఉండగా; మహా+ఆగ్రహమునన్= మిక్కిలి కోపంతో; బాస+ఇచ్చి= శపథంచేసి; రాజు పనుపును= దుర్యోధనుడి ఆనతిని; పడసి= పొంది; ఉదగ్ర వృత్తిన్= భయంకరవ్యాపారంతో; అరిగి= వెళ్ళి; అట్లు+చేసెన్= ఆ విధంగా చేశాడు.

**తాత్పర్యం:** తండ్రి చచ్చిన విధం అపూర్వమై మనస్సులో నాటగా మహాక్రోధంతో శపథం చేసి, రాజానుమతిని పొంది, భయంకరోద్యోగంతో వెళ్ళి ఆ రీతిగా చేశాడు.

**ఉ. తా వెసఁ బోవునప్డు బలదర్ప సమగ్రులు పాండుపుత్రు ల**
**చ్చో వసియింపకున్కిఁ దనచూచిన కార్య మతం డొనర్చె; దే**
**వావలికైన నత్తెఱఁగు నాక్రమలీలలు సెల్ల నేర్చునే?**
**భూవర! వారలున్న విధిపోకలఁ బోవుట గాక యంతయున్.' 211**

**ప్రతిపదార్థం:** తాన్= తాను(అశ్వత్థామ); వెసన్= శీఘ్రంగా; పోవు+అప్డు= వెళ్ళినపుడు; బల దర్ప సమగ్రులు= పరాక్రమ గర్వంతో నిండినవారు(అగు); పాండుపుత్రులు= పాండురాజు కొడుకులు; ఆ+చోటన్= ఆ ప్రదేశంలో; వసియింపక+ఉన్కిన్= ఉండకపోవటంచేత; అతండు= అశ్వత్థామ; తన చూచిన కార్యము= తను అనుకున్న పని; ఒనర్చెన్= చేశాడు; భూవర!= ఓ రాజా! ధృతరాష్ట్రా!; వారలు+ఉన్నన్= పాండవులు ఆ సమయంలో అక్కడ ఉన్నట్లయితే; ఆ+తెఱఁగు+ఆక్రమ లీలలు= ఆ విధమైన ఆక్రమణపు తీరులు; దేవావలికైనన్= దేవతల సమూహానికైనా; చెల్లన్+నేర్చునే= సాగగలిగేవా?; అంతయున్= అంతా; విధి పోకలన్= దైవగతులలో; పోవుట+కాక= పోవుటమే కదా!

**తాత్పర్యం:** అశ్వత్థామ శీఘ్రంగా వెళ్ళినప్పుడు పరాక్రమగర్వంతో నిండిన పాండవులు అక్కడ లేకపోవటంచేత అశ్వత్థామ తాననుకొన్న పని చేశాడు. ధృతరాష్ట్రా! దైవగతి ననుసరించి అంతా నడవటం తప్ప, పాండవులు అక్కడే ఉన్నట్లయితే అశ్వత్థామ చేసిన ఆ విధమైన ఆక్రమణపు తీరులు దేవతల సమూహానికి కూడా సాగగలిగేవా?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. విధి నిర్ణయంవలన అంతా అట్లా జరిగింది కాని పాండవులు అక్కడే ఉన్నట్లయితే అశ్వత్థామ చేసిన ఆక్రమణలు దేవతలు కూడా చేయగలిగేవారు కారని భావం. దేవతలకు కూడా సాధ్యం కాదంటే, అశ్వత్థామ మాట వేరే చెప్పాలా? అనటంచేత అలంకారం కావ్యార్థాపత్తి.

**వ. అని చెప్పి విను మట్లు కృపకృతవర్మలచేత సంభావితుండై కుంభసంభవసంభవుండు వారలతో మనమిఁక 'మనుజపతి కడకుఁ దడయక పోవలయుఁ బుణ్యంబున మనము వోపునంతకుం బ్రాణంబులు గలిగి యుండెనేని యిత్తెఱం గెఱింగింత' మనుటయు వార లట్లకాక యని యచ్చోటు గదలి యమ్మువ్వురును భూవల్లభసల్లాప కుతూహలంబున రయంబునం జనుదెంచి. 212**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; వినుము; అట్లు; కృప కృతవర్మల చేతన్; సంభావితుండు+ఐ= ఆదరింపబడినవాడయి; కుంభసంభవ సంభవుండు= ద్రోణుడి కొడుకు-అశ్వత్థామ; వారలతోన్= ఆ కృపకృతవర్మలతో; మనము; ఇఁకన్; మనుజపతి కడకున్=రాజు

(దుర్యోధనుడి) దగ్గరకు; తడయక= ఆలస్యం చేయకుండా; పోవలయున్= వెళ్ళాలి; పుణ్యంబునన్= అదృష్టం వలన; మనము; పోవు+అంతకున్= వెళ్ళేటప్పటికి; ప్రాణంబులు+కలిగి+ఉండెన్+ఏని= బ్రదికి ఉన్నట్లయితే; ఈ+తెఱంగు= ఈ విధం; ఎఱింగింతము= చెపుదాము; అనుటయున్= అనగా; వారలు; అట్లు+అ కాక= అట్లాగే అని; ఆ+చోటు= ఆ ప్రదేశం; కదలి; ఆ+ముప్వురును= ఆ ముగ్గురూ; భూ వల్లభ సల్లాప కుతూహలంబునన్= రాజుతో సంభాషించే కోరికతో; రయంబునన్= వేగంగా; చనుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** అని చెప్పి, ధృతరాష్ట్రా! వినుము. ఆ రీతిగా కృప కృతవర్మల చేత ఆదరించబడినవాడయి అశ్వత్థామ వాళ్ళతో 'ఇంక మనం దుర్యోధనుడి దగ్గరికి వెంటనే వెళ్ళాలి. అదృష్టవశంచేత మనం వెళ్ళే సరికి అతడు బ్రదికి ఉంటే, జరిగినదంతా చెపుదాము' అనగా, వాళ్ళు అట్లే అన్నారు. ఆ ముగ్గురూ అక్కడినుండి బయలుదేరి రాజుతో మాట్లాడాలనే కోరికతో వేగంగా వచ్చి.

### అశ్వత్థామాది రథికత్రయంబు దుర్యోధనుం గనుంగొనుట (సం. 10-9-1)

**తే.** **రక్త సంసిక్తమైన ధరాతలమున । నార్తిఁ బొరలుచు నూర్పు లందంద సంద**
**డింప జీవంబు వెడల నుంకింపఁ జేష్ట । లొయ్యనొయ్యన యడఁగంగ నున్న యధిపు.** **213**

**ప్రతిపదార్థం:** రక్త సంసిక్తము+ఐన= రక్తంతో బాగా తడిసిన; ధరాతలమునన్= నేలమీద; ఆర్తిన్= బాధతో; పొరలుచున్= అటూ ఇటూ దొర్లుతూ; ఊర్పులు= శ్వాసలు; అందంద= మిక్కిలి; సందడింపన్= అధికంకాగా; జీవంబు= ప్రాణంబు; వెడలన్+ఉంకింపన్= పోవటానికి సిద్ధమవగా; చేష్టలు; ఒయ్యనొయ్యన= క్రమక్రమంగా; అడఁగంగన్= ఉడుగగా; ఉన్న+అధిపున్= ఉన్న రాజును- దుర్యోధనుడిని.

**తాత్పర్యం:** నెత్తుటితో తడిసిన నేలమీద బాధతో అటూ ఇటూ దొర్లుతూ, మిక్కిలి ఆయాసపడుతూ, ప్రాణం పోవటానికి సిద్ధపడి, క్రమక్రమంగా చేష్టలుడిగిన దుర్యోధనుడిని. (తరువాత పద్యంతో అన్వయం).

**మహాస్రగ్ధర.**
**కని శోకం బాత్మలం దగ్గలముగ రథముల్ గ్రక్కునన్ డిగ్గి, భూమిన్**
**ధనువుల్ వోవైచి, భాష్పోద్గమము వొదువు వక్త్రంబులన్ విప్రలాపం**
**బును దైన్యం బావహిల్లం బొరలుచుఁ బొరి నా భూవిభున్ శాంతదృష్టిం**
**గనుఁగొంచుం జేరి, కే లంగముపయి నిడుచుం గౌఁగిటం జేర్చుకొంచున్.** **214**

**ప్రతిపదార్థం:** కని= చూచి; శోకంబు= దుఃఖం; ఆత్మలందున్= మనస్సులలో; అగ్గలముగన్= అధికంకాగా; రథముల్; గ్రక్కునన్= శీఘ్రంగా; డిగ్గి= దిగి; భూమిన్= నేలమీద; ధనువుల్= విల్లులు; పోన్+వైచి= పడవేసి; బాష్ప+ఉద్గమము= కన్నీటిపొంగు; పొదువు వక్త్రంబులన్= ఆక్రమించే ముఖాలలో; విప్రలాపంబును= ప్రేలాపనా; దైన్యంబు= విచారం; ఆవహిల్లన్= కలుగగా; పొరలుచున్= ఉంటూ; పొరిన్= మాటికి; ఆ భూవిభున్= ఆ రాజును-దుర్యోధనుడిని; శాంతదృష్టిన్= శాంతమైన చూపుతో; కనుఁగొంచున్= చూస్తూ; చేరి= సమీపించి; కేలు= చేయి; అంగముపయిన్= అతడు శరీరంమీద; ఇడుచున్= పెడుతూ; కౌఁగిటన్+చేర్చుకొంచున్= కౌగిలించుకుంటూ.

**తాత్పర్యం:** చూచి మనస్సులలో దుఃఖం అధికంకాగా, వెంటనే దిగి నేలమీద విల్లులు పడవైచి, కన్నీళ్ళు క్రమ్మే వదనాలలో ప్రేలాపనా, దుఃఖమూ కలుగగా, మాటి మాటికి ఆ రాజును శాంతదృష్టితో చూస్తూ, చేరి, చేయి అతడి శరీరంమీద ఉంచుతూ, కౌగిలించుకొంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. పురపురఁ బొక్కి యా నృపతిపుంగవు చుట్టును నుండి 'యక్కటా!**
**ధరణి సమస్తమున్ భవదుదారమహాజ్ఞకు లోను సేసి యి**
**ప్పరుసున నీవు దీనతకు భాజనమైతి; విధాత కెందు దు**
**ష్కర మగు కార్యముం గలదె? కౌరవనాయక! మ మ్మెఱుంగుదే?' 215**

**ప్రతిపదార్థం:** పురపురన్+పొక్కి= పురపుర ఏడ్చి; ఆ నృపతి పుంగవు చుట్టునున్+ఉండి= ఆ రాజశ్రేష్ఠుడి చుట్టూ ఉండి; అక్కటా!= అయ్యో!; ధరణిన్+సమస్తమున్= భూమినంతనూ; భవత్+ఉదార మహా+ఆజ్ఞకున్= నీ తిరుగులేని ఆజ్ఞకు; లోను+చేసి= వశంచేసి; ఈ+పరుసునన్= ఈ రీతిగా; నీవు; దీనతకున్= దైన్యానికి; భాజనము+ఐతి(వి)= పాత్రుడవయ్యావు; విధాతకున్= బ్రహ్మకు; ఎందున్= ఎక్కడైనా; దుష్కరము+అగు= చేయరాని; కార్యమున్= పని అంటూ; కలదె?= ఉందా?; కౌరవనాయక!= కురురాజా!; మమ్మున్+ఎఱుంగుదే?= మేమెవరమో తెలుసా?

**తాత్పర్యం:** పురపురా ఏడ్చి ఆ రాజోత్తముడి చుట్టూ ఉండి 'అయ్యో! భూమినంతనూ నీ తిరుగులేని ఆనకు వశం చేసి ఈ విధంగా నీవు దైన్యం పొందావు. బ్రహ్మకు చేయరాని పనంటూ ఎక్కడైనా ఉన్నదా? కురురాజా! మమ్ములను గుర్తుపట్టావా?'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'విధాత కెందు దుష్కరమగు కార్యముం గలదె?' అనే సామాన్యంచేత విశేషం సమర్థించబడినది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**క. అన నప్పలుకులు వెడ వెడ । విని యా విభుఁ డల్లఁ గన్ను విచ్చిన వదనం**
**బునఁ జూడ్కి నిలిపి కలశజ । తనయుం డి ట్లనియె గద్గదగళుం డగుచున్. 216**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; ఆ+పలుకులు= ఆ మాటలు; వెడవెడ విని= అశ్రద్ధగా; విని; విభుఁడు= రాజు-దుర్యోధనుడు; అల్లన్= మెల్లగా; కన్ను విచ్చినన్= కళ్ళు తెరువగా; కలశజ తనయుండు= కుంభజుడి కొడుకు- అశ్వత్థామ; వదనంబునన్= (అతడి) ముఖంపై; చూడ్కిన్= చూపును; నిలిపి; గద్గద గళుండు+అగుచున్= డగ్గుత్తిక పడిన కంఠంగలవాడు అవుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ఆ మాటలు అశ్రద్ధగా విని దుర్యోధనుడు మెల్లగా కళ్ళు తెరవగా, ఆ అశ్వత్థామ అతడి ముఖంమీద చూపు నిలిపి డగ్గుత్తికపడ్డ స్వరంతో ఇట్లా అన్నాడు:

**చ. 'అమితబలంబు దర్పమును నద్భుత ధీరతయున్ గదాపరి**
**శ్రమముఁ బొగడ్త కెక్కు నినుఁ జక్క నెదుర్చుట గాక పోర రం**
**ధ్రముగని యొక్కఁ డుద్ధతి గదం దెగటార్చుట గల్లెనట్టె యిం**
**క మగల కెట్టివారలకుఁ గల్గ దపాయము దైవ మల్గినన్? 217**

**ప్రతిపదార్థం:** అమిత బలంబున్= అపార పరాక్రమమూ; దర్పమును= గర్వమూ; అద్భుత ధీరతయున్= ఆశ్చర్యకరధైర్యమూ; గదా పరిశ్రమమున్= గదా విద్యాభ్యాసమూ; పొగడ్తకున్+ఎక్కు నినున్= ప్రశంసనీయుడవైన నిన్ను; చక్కన్= చక్కగా; ఎదుర్చుట+కాక= ఎదిరించకుండా; పోరన్= యుద్ధంలో; రంధ్రము+కని= సందు కనిపెట్టి; ఒక్కఁడు; ఉద్ధతిన్= ఔద్ధత్యంతో;

గదన్= గదతో; తెగటార్చుట= వధించటం; కల్గెన్+అట్టె= సంభవించిందట; దైవము= విధి; అల్గినన్= ఆగ్రహిస్తే; ఇంకన్; మగలకున్+ఎట్టి వారలకున్= ఎటువంటి శూరులకైనా; అపాయము= హాని; కల్గదు?= సంభవించదు?

**తాత్పర్యం:** 'అపార పరాక్రమమూ, అహంకారమూ, ఆశ్చర్యకర ధైర్యమూ, గదాయుద్ధాభ్యాసమూ ప్రశంసనీయాలై ఉన్న నిన్ను చక్కగా యుద్ధంలో ఎదిరించాలే కాని యుద్ధంలో అవకాశం గమనించి, ఒకానొకడు ఔద్ధత్యంతో గద పుచ్చుకొని కొట్టటం సంభవించిందట! దైవానుగ్రహం లేకపోతే, ఇంక ఎంతటి శూరులయితే మాత్రం అపాయం సంభవించకుండా ఉంటుందా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. భీముడు సందు కనిపెట్టి తొడలు విరగ్గొట్టి దుర్యోధనుడిని నేల కూలుస్తాడు. దుర్యోధనుడు నేలకూలటం దైవం ఆగ్రహించటంవల్లనే కాని, పరాక్రమలోపంవలన కాదని అశ్వత్థామ ప్రశంస. ఇందులో సామాన్యాంశంచేత విశేషాంశం సమర్థించబడింది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**చ. దురమునఁ బెంపుఁ జేవయును దుర్దమలీల వెలుంగుచుండ సు**
**స్థిరత శమంతపంచక విశిష్ట తలంబునఁ బోరి సద్గతిన్**
**బొరసెదు; నీకునై వగపు పుట్టదు; బంధులు, రాజు, దేవులుం**
**దిరియుదు రింక; వారి దగు దీనత కోర్వక యుమ్మలించెదన్. 218**

**ప్రతిపదార్థం:** దురమునన్= యుద్ధంలో; పెంపున్= గొప్పతనమూ; చేవయును= బలమూ; దుర్దమలీలన్= అణచరాని విధంగా; వెలుంగుచున్+ఉండన్= ప్రకాశిస్తూండగా; సుస్థిరతన్= నిలకడతో; శమంతపంచక విశిష్ట తలంబునన్= శమంతపంచకం అనే ప్రత్యేకస్థలంలో; పోరి= యుద్ధంచేసి; సత్+గతిన్= ఉత్తమ గతిని; పొరసెదు= పొందుతావు; నీకున్+ఐ= నీ విషయంలో; వగపు పుట్టదు= విచారం కలుగదు; ఇంకన్= ఇకమీద; బంధులున్= చుట్టాలు; రాజున్= రాజూ (ధృతరాష్ట్రుడూ); దేవులున్= రాణులూ; తిరియుదురు= యాచకులవుతారు; వారిదగు (వారిది+అగు)= వారిదైన; దీనతకున్= దైన్యానికి; ఓర్వక= సహించక; ఉమ్మలించెదన్= విచారిస్తున్నాను.

**తాత్పర్యం:** యుద్ధంలో పెంపూ, చేవా అణచరాని విధంగా ఒప్పుతూండగా సుస్థిరత్వంతో శమంతపంచకమనే ప్రత్యేక స్థలంలో యుద్ధంచేసిన నీవు ఉత్తమగతిని పొందుతావు. నీకొరకు విచారించను. బంధువులూ, రాజూ, రాణులూ ఇంక బిచ్చమెత్తుకొంటారు. నేను వారి దైన్యానికి ఓర్చుకొనలేక విచారిస్తున్నాను.

**విశేషం:** శమంత పంచకం - పరశురాముడు వైరి రాజులను సంహరించి, ఆ రక్తాన్ని అయిదు మడుగులుగా చేసి పితృతర్పణం చేశాడు. తత్సమీప ప్రదేశానికి శమంతపంచకం అనిపేరు. అక్కడే కురుపాండవులు యుద్ధం చేయటం వలన దానికి కురుక్షేత్రం అనికూడా పేరు. 'ఉమ్మలించెదన్' అనే తద్ధర్మార్థక రూపం వర్తమానార్థకం. 'ఉమ్మలించుచున్నాను' అని అర్థం.

**ఉ. సీరి యనారతంబుఁ దన శిష్యులలోపల నెల్ల నిన్ను దు**
**ర్వార పరాక్రమాఢ్యుఁడని వర్ణన సేయుట గేలిచేసి యా**
**మారుతికిన్ జయం బొసఁగె మాల విధాతృఁడు; వాని గెల్పుకో**
**లేరికి సమ్మతంబగునె యిట్టిది? దీనను బెంపు గల్గునే? 219**

**ప్రతిపదార్థం:** సీరి= బలరాముడు; అనారతంబున్= ఎల్లప్పుడూ; తన శిష్యులలోపలన్+ఎల్లన్= తన శిష్యులందరిలోనూ; నిన్నున్; దుర్వార పరాక్రమ+ఆఢ్యుఁడు+అని= అవార్య పరాక్రమ సంపన్నుడని; వర్ణన+చేయుటన్= పొగడటాన్ని; గేలిచేసి= పరిహరించి; మాల విధాతృఁడు= చండాలపు బ్రహ్మ; ఆ-మారుతికిన్= ఆ భీముడికి; జయంబు+ఒసఁగెన్= గెలుపు చేకూర్చాడు; వాని-గెల్పుకోలు= ఆ భీముడి గెలుపు; ఇట్టిది= ఇటువంటిది; ఏరికిన్= ఎవరికైనా; సమ్మతంబు+అగునె?= అంగీకారం అవుతుందా?; దీనను= దీనిచేత; పెంపు+కల్గునే?= గొప్పతనం కలుగుతుందా?

**తాత్పర్యం:** బలరాము డెప్పుడూ నిన్ను తన శిష్యులందరిలోనూ అవార్య పరాక్రమ సంపన్నుడవని పొగడటాన్ని పరిహసించి మాలదైవం ఆ భీముడికి గెలుపు చేకూర్చాడు. అతడి ఇటువంటి గెలుపు ఎవరికైనా అంగీకారం అవుతుందా? దీనివలన అతడికి గొప్పతనం కలుగుతుందా?

**చ. కురువర! నీ మగంటిమియుఁ గోల్తలయున్ బలముం జలంబు దు**
**స్తరగతిఁ బేర్చి భీమునకుఁ జావక పోవఁగరాని యట్టిదై**
**నరు బెదరించి కేశవు మనంబు గలంచి యధర్మవృత్తికిం**
**జొరుఁడని పంచె; దీని దివిజుల్ గని; రిం కిటవేయు నేటికిన్? 220**

**ప్రతిపదార్థం:** కురువర!= కురుపతీ-దుర్యోధనా!; నీ మగంటిమియున్= నీ పరాక్రమమూ; కోల్తలయున్= యుద్ధమూ; బలమున్= బలమూ; చలంబున్= పట్టుదలా; దుస్తర గతిన్= దాటశక్యంకాని విధంగా; పేర్చి= విజృంభించి; భీమునకున్; చావకపోవఁగన్-రాని+అట్టిది+ఐ= చావు అనివార్యం అన్నటువంటి దయి; నరున్= అర్జునుడిని; బెదరించి= భయపెట్టి; కేశవు మనంబు= కృష్ణుడి మనస్సు; కలంచి= కలతచెందేటట్టు చేసి; అధర్మ వృత్తికిన్= అన్యాయ ప్రవర్తనకు; చొరుఁడు+అని= పూనుకొనండి అని; పంచెన్= నియోగించింది; దీనిన్; దివిజుల్= దేవతలు; కనిరి= చూశారు; ఇంకన్; ఇటన్= ఈ విషయంలో; వేయున్+ఏటికిన్= వేయి మాటలెందుకు?

**తాత్పర్యం:** దుర్యోధనా! నీ పరాక్రమమూ, యుద్ధనైపుణ్యమూ, బలమూ, పట్టుదలా దాట శక్యంకాని విధంగా విజృంభించి భీముడికి చావుతప్పదు అన్నటువంటివై, అర్జునుడిని భయపెట్టి, కృష్ణుడి మనస్సును కలత చెందించి, అన్యాయ ప్రవృత్తికి పూనుకొనేటట్లు చేశాయి. ఇదంతా దేవతలు కనిపెట్టారు. ఇంక ఈ విషయంలో వేయి మాట లెందుకు?

**ఉ. ధర్మము మాని యూరులు గదం బొడి సేసినయంతఁ బోక దు**
**ష్కర్ముఁడు వాయుజుం డెడమకాల శిరంబటు దన్నెఁ జూచి యా**
**ధర్మసుతుండు శాస్తిఁ దగ దానికిఁ జేయఁడ; యాతఁడెప్డు నం**
**తర్మదదుష్టుఁ; డీ గెలుపు దైన్యము సేయదె? కీర్తి మాయదే? 221**

**ప్రతిపదార్థం:** దుష్కర్ముఁడు= చెడ్డపనులు చేసేవాడైన; వాయుజుండు= భీముడు; ధర్మము మాని= ధర్మం విడిచి; ఊరులు= తొడలు; గదన్= గదతో; పొడి+చేసిన+అంతన్+పోక= నుగ్గుచేసి, అంతటితో ఊరుకోక; ఎడమకాలన్= ఎడమకాలితో; శిరంబు= తల; అటు= ఆ రీతిగా; తన్నెన్= తన్నాడు; ఆ ధర్మసుతుండు= ఆ ధర్మరాజు; చూచి; దానికిన్; శాస్తిన్= శిక్షను; తగన్= తగినవిధంగా; చేయఁడు+అ= చేయనేలేదు; ఆతఁడు= ఆ ధర్మరాజు; ఎప్డున్= ఎప్పుడూ; అంతర్మదదుష్టుఁడు= లోపల గర్వం గల దుర్జనుడు; ఈ గెలుపు= ఇటుంటి జయం; దైన్యము+చేయదె?= నైచ్యం కలిగించదా?; కీర్తి మాయదే= కీర్తి నశించదా?

**తాత్పర్యం:** దుర్మార్గుడైన భీముడు ధర్మం తప్పి నీ తొడలు గదతో విరుగగొట్టి అంతతో ఊరుకోక ఎడమకాలితో నీ శిరస్సు ఆ విధంగా తన్నాడు. ఆ ధర్మరాజు అది చూచి కూడా దానికి తగిన శాస్తి చేయనే లేదు. అత డెప్పుడూ పైకి కనిపించని గర్వంగల దుర్జనుడు. ఈ గెలుపు అతడికి నైచ్యం కలిగించదా? దానివలన కీర్తి నశించదా?

**క. కౌరవనాయక! నీదు గ । దారణ గౌరవము సకల ధరణీజన చే**
**తోరంజనమై నిర్మల । సారయశోధనము నీకు సంపాదించెన్.' 222**

**ప్రతిపదార్థం:** కౌరవనాయక!= కురురాజా! దుర్యోధనా!; నీదు గదా రణ గౌరవము= నీ గదాయుద్ధ మహత్త్వం; సకల ధరణీ జన చేతస్(ః)+రంజనము+ఐ= ఎల్ల భూజనుల మనస్సులకీ ఆనందాన్ని కలిగించేదయి; నీకున్; నిర్మలసార యశస్(ః)+ ధనమున్= పవిత్రమూ, శ్రేష్ఠమూ అయిన కీర్తిధనాన్ని; సంపాదించెన్= సంపాదించిపెట్టింది.

**తాత్పర్యం:** దుర్యోధనా! నీ గదాయుద్ధ మహత్త్వం ఎల్ల జనుల మనస్సుల ఆనందం కలిగించేదయి నీకు నిర్మలమూ, సారవంతమూ అయిన కీర్తిధనాన్ని సంపాదించిపెట్టింది'.

**వ. అని పలికి తన మానుషంబు తెఅం గూహించి. 223**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; తన మానుషంబు తెఅంగు= తన గౌరవపురీతి; ఊహించి= తలచి.

**తాత్పర్యం:** అని పలికి తన గౌరవం సంగతి తలచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'కుడువఁగఁ గట్ట, బంధులకుఁ గోటి విధంబులఁ బెట్ట, జన్నము**
**ల్నడుప, ననేక ధర్మవిధులం బొగ డొందఁగఁ జాలునట్టి యె**
**క్కుడు సిరి యిచ్చి పేర్మి నొక కొండగ మన్చిన నీవు సావఁగా**
**నొడ లిటు లోమితిం; గురుకులోత్తమ ! యేనొక సేవకుండనే?' 224**

**ప్రతిపదార్థం:** కుడువఁగన్= తినటానికీ; కట్టన్= ధరించటానికీ; బంధులకున్= చుట్టాలకు; కోటి విధంబులన్= అనేక రీతులుగా; పెట్టన్= పెట్టటానికీ; జన్నముల్= యజ్ఞాలు; నడుపన్= చేయించటానికీ; అనేక ధర్మవిధులన్= పెక్కు ధర్మకార్యాలలో; పొగడు+ఒందఁగన్= పేరు పొందటానికీ; చాలును+అట్టి= సరిపడేటటువంటి; ఎక్కుడు సిరి+ఇచ్చి= అధికమైన సంపదనిచ్చి; పేర్మిన్= ప్రేమతో; ఒక కొండగన్= ఒక కొండలా; మన్చిన నీవు= పోషించిన నువ్వు; చావఁగాన్= చచ్చిపోగా; ఇటులు= ఈ ఇధంగా; ఒడలు+ఓమితిన్= శరీరం తాల్చాను-బ్రదికి ఉన్నాను; కురు-కుల+ఉత్తమ!= కురువంశ శ్రేష్ఠుడా-దుర్యోధనా!; ఏను= నేను; ఒక సేవకుండనే= ఒక ఉత్తమ సేవకుడనా?

**తాత్పర్యం:** 'తినటానికీ, కట్టుకొనటానికీ, బంధువులకు అనేక విధాల పెట్టటానికీ, యజ్ఞాలు చేయించటానికీ, పెక్కు ధర్మకార్యాలలో పేరు గాంచటానికీ సరిపడేటంత అధికమైన సంపద నిచ్చి ప్రేమతో ఒక కొండవలె నన్ను సాకిన నీవు చచ్చిపోతూ ఉంటే నే నిట్లా బ్రదికి ఉన్నాను. కురువంశశ్రేష్ఠా! నేనూ ఒక సేవకుడనా?'

**వ. అని తన్నుఁ దాన నిందించుకొనుచు మఱియు. 225**

**ప్రతిపదార్థం:** అని; తన్నున్+తాను+అ= తనని తనే; నిందించుకొనుచున్= తిట్టుకుంటూ; మఱియున్= ఇంకా.

**తాత్పర్యం:** అని తనను తాను నిందించుకొంటూ, ఇంకా (ఇట్లా అన్నాడు).

**ఉ. 'న్యాయము దప్పకుండఁగ రణం బొనరించి దివంబు గైకొనం**
**బోయెద; వందు రాఁదగిన పుణ్యము సేయుటలేదు గాని, మా**
**చేయు మనంబునుం దనియఁ జెండఁగఁ బడ్డ విరోధివర్గమున్**
**నీయెడ కిం పొనర్పఁగ గణింపఁగ భాగ్యము గల్గె భూవరా! 226**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా! దుర్యోధనా!; న్యాయము= ధర్మం; తప్పక+ఉండఁగన్= తప్పకుండా; రణంబు= యుద్ధం; ఒనరించి= చేసి; దివంబు= స్వర్గం; కైకొనన్+పోయెదవు= పొందబోతున్నావు; అందున్= అక్కడికి; రాన్+తగిన= నిన్ను అనుసరించి వచ్చే; పుణ్యము= సుకృతము; చేయుట లేదు= మేము చేసింది లేదు; కాని; మా చేయున్= మా చెయ్యీ, మనంబునున్= మనస్సూ; తనియన్- తృప్తిపడేటట్లు; చెండఁగన్+పడ్డ= ఖండించబడిన; విరోధివర్గమున్= శత్రుసమూహాన్ని; నీ+ఎడకున్= నీ హృదయానికి; ఇంపు+ఒనర్పఁగన్= ఆనందం కలిగేటట్టు; గణింపఁగన్+భాగ్యము+కల్గెన్= లెక్కపెట్టే అదృష్టం కలిగింది.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! నీవు ధర్మం తప్పకుండా యుద్ధంచేసి (వీర)స్వర్గం అలంకరింపబోతున్నావు. అక్కడ రాదగిన పుణ్యం నీతో మేము చేయాలి కాని, మా చెయ్యీ, మనస్సూ తృప్తి పడేటట్టు దొరికిన శత్రువులను మట్టుబెట్టి; నీ మనస్సుకు ఆనందం కలిగేటట్లు లెక్కపెట్టే అదృష్టం మాకు కలిగింది. దొరికిన శత్రువులను చంపి నీ మనస్సుకు ఆనందం కలిగించే అదృష్టం మాకు దక్కింది.

**విశేషం:** ఉస్మానియా ప్రతిలోని 'చెందగఁబడ్డ' అనే పాఠం కంటె వావిళ్ళప్రతిలోని 'చెండగఁబడ్డ' పాఠం సమంజసమని గ్రహించబడింది.

**ఆ. పుణ్యలోకమునకుఁ బోయినయప్పుడు । ద్రోణుఁ గాంచి నీకు ద్రోహియైన**
**జనవినింద్య చరితుఁ జంపె దృష్టద్యుమ్ను । నీ తనూజఁ డనుము తొలుత. 227**

**ప్రతిపదార్థం:** పుణ్య లోకమునకున్= పుణ్యలోకానికి - స్వర్గానికి; పోయిన+అప్పుడు= నువ్వు వెళ్ళినప్పుడు; ద్రోణున్= ద్రోణుడిని; కాంచి= చూచి; తొలుతన్= మొదట; అనఘ!= ఓ పాపరహితుడా!; నీకున్; ద్రోహి+ఐన= ద్రోహం చేసిన; జన వినింద్య చరితున్= జనులచేత విశేషంగా నిందింపదగిన నడవడిగల వాడిని; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; నీ తనూజుఁడు= నీ కుమారుడైన అశ్వత్థామ; చంపెన్+అనుము= చంపాడని చెప్పుము.

**తాత్పర్యం:** నీవు పుణ్యలోకానికి పోయినప్పుడు ద్రోణుడిని చూచి మొదట 'ఓ పాపరహితుడా! నీకు ద్రోహం చేసిన దుశ్చరితుడిని-ధృష్టద్యుమ్నుడిని నీ కొడుకు చంపా'డని చెప్పుము.

**వ. అని నా మాఱుగా నమస్కరించి కౌఁగిలించుకొనుము. మఱియు వలయు సల్లాపంబులు సేయుము. బాహ్లిక సోమదత్తభూరిశ్రవస్సైంధవప్రముఖ భవదీయ బాంధవజనంబులతో నా చేసిన కుశలప్రశ్నంబుగా సంభావింపు మది యట్లుండె రేయింటి తెఱం గెఱింగించెద. 228**

**ప్రతిపదార్థం:** అని; నా మాఱుగాన్= నాకు బదులుగా; నమస్కరించి; కౌఁగిలించుకొనుము; మఱియున్; వలయు సల్లాపంబులు= చేయవలసిన సంభాషణలు; చేయుము; బాహ్లిక సోమదత్త - భూరిశ్రవస్+సైంధవ-ప్రముఖ-భవదీయ- బాంధవ-జనంబులతోన్= బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవసుడూ, సైంధవుడూ మొదలైన నీ చుట్టాలను; నా చేసిన కుశల ప్రశ్నంబుగా= నేను క్షేమం అడిగినట్టుగా; సంభావింపుము= మన్నించుము; అది+అట్లు+ఉండెన్= అది అలా ఉండనీ; రేయింటి-తెఱంగు= రాత్రి జరిగిన విధం; ఎఱింగించెదన్= చెపుతాను.

**తాత్పర్యం:** అని నాకు బదులుగా నమస్కరించి కౌగిలించుకొమ్ము. ఇంకా చేయవలసిన సంభాషణలు చేయుము. బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ, సైంధవుడూ మొదలైన నీ చుట్టాలను నేను క్షేమం అడిగినట్లు చెప్పి మన్నించుము. అది అట్లా ఉండనిమ్ము. రాత్రి జరిగిన విధం చెప్పుతాను. వినుము.

**విశేషం:** బాహ్లికుడు - ప్రతీపుడి కొడుకు. శంతనుడి సోదరుడు. సోమదత్తుడి తండ్రి. సోమదత్తుడు- బాహ్లికుడి కొడుకు. భూరిశ్రవుడు - సోమదత్తుడు కొడుకు. సైంధవుడు - దుర్యోధనుడి బావ. దుస్సల భర్త. వీళ్ళందరూ దుర్యోధనుడి పక్షాన పాండవులతో యుద్ధం చేసిన వీరులు.

**సీ.** **అమృతంబు నింపు కర్ణములకు నొసఁగెడు । మాట లాకర్ణింపు మనుజనాథ!**
**శాత్రవ శిబిరంబు సౌప్తికవేళఁ బ్ర । వేశించి నీచుఁ గిల్బిషమయాత్ముఁ**
**దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచితిఁ బశుమర । ణంబుగాఁ దదనంతరంబ కవిసి**
**వాని బంధులనెల్ల వరుస గీటడఁగించి । ద్రౌపదీసుతుల నందఱను బొదివి**

**తే.** **మిడుక మిడుకంగఁ జంపి యప్పుడమి యెల్లఁ । దునియ పెంటగఁ గరివాజిమనుజతతుల**
**నెల్ల నఱికితిఁ బాండవు లేవురును ము । రారియును సాత్యకియును నా బారిఁ బడరు'.** **229**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా! దుర్యోధనా!; కర్ణములకున్= చెవులకు; అమృతంబు నింపు= అమృత సమృద్ధి; ఒసఁగెడు= ఇచ్చేటి; మాటలు; ఆకర్ణింపు(ము)= విను; సౌప్తికవేళన్= నిద్రించే సమయంలో; శాత్రవ శిబిరంబున్= శత్రువుల శిబిరాన్ని; ప్రవేశించి= చొచ్చి; నీచున్ కిల్బిషమయ+ఆత్మున్ - ధృష్టద్యుమ్నున్= తుచ్ఛుడూ, పాపాత్ముడూ అయిన ధృష్టద్యుమ్నుడిని; తొలుతన్= మొదట; పశుమరణంబు+కాన్= పశువును చంపేటట్లు; త్రుంచితిన్= వధించాను; తద్+ అనంతరంబు+అ= ఆ వెంటనే; కవిసి= పైబడి; వాని బంధులన్+ఎల్లన్= వాడి చుట్టాల నందరినీ; వరుసన్= వరుసగా; గీటడఁగించి= చంపి; ద్రౌపదీసుతులన్+అందఱను= ద్రౌపది కొడుకుల నందరినీ; పొదివి= మార్కొని; మిడుక మిడుకంగన్= త్రుళ్ళిపడుతూండగా; చంపి; ఆ+పుడమి+ఎల్లన్= ఆ యుద్ధభూమి అంతా; తునియ పెంటగన్= పెంట తుక్కుతో నిండినదిగా; కరి వాజి మనుజ తతులన్+ఎల్లన్= ఏనుగుల, గుర్రాల, మనుష్యుల సమూహాలన్నిటినీ; నఱికితిన్= నరికాను; పాండవులు+ఏవురును= పాండవులయిదుగురూ; మురారియును= కృష్ణుడూ; సాత్యకియునూ= సాత్యకీ; నా బారిన్+పడరు= నా హింసకు లోనుకారు.

**తాత్పర్యం:** రాజా! దుర్యోధనా! నీ చెవులకు అమృతసమృద్ధిని సమకూర్చే మాటలు చెపుతాను వినుము. నిద్రించే సమయంలో నేను శత్రువుల శిబిరం ప్రవేశించి, తుచ్ఛుడూ, పాపాత్ముడూ అయిన ధృష్టద్యుమ్నుడిని మొదట పశువును వధించేటట్టు వధించాను. ఆ వెంటనే, పైబడి వాడి చుట్టాల నందరినీ వరుసగా చంపి, ద్రౌపది కుమారుల నందరినీ మార్కొని, త్రుళ్ళిపడుతూండగా చంపి, ఆ యుద్ధభూమి అంతా పెంట తుక్కుతో నిండేటట్లు ఏనుగుల, గుర్రాల, మనుష్యుల సమూహాలనన్నిటినీ నరికాను. పాండవులయిదుగురూ, కృష్ణుడూ, సాత్యకీ నా హింసకు లోను కాలేదు'.

**వ. అని చెప్పి** **230**

**తాత్పర్యం:** అని పలికి.

**ఉ. 'ఏ మటు పోక శౌరి మది నేర్పడ మున్ గని డాఁగురించెనో**
**యేమిటి కెందుఁ బోయిరొ నరేంద్ర! యెఱుంగము ధర్మదూష్య సం**
**గ్రామ విధంబులం జయము గల్గియు వారికి దక్కదయ్యె వా**
**రేమయి రేమి మా కెలస మెక్కె నెఱుంగుము మమ్ము ముప్వురన్.** **231**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా! దుర్యోధనా!; ఏము+అటు+పోక= మేము అటు వెళ్ళటం; శౌరి= కృష్ణుడు; మదిన్= మనస్సులో; ఏర్పడన్= స్పష్టంగా; మున్= ముందుగా; కని= కనిపెట్టి; డాఁగురించెనో= దాచాడో; ఏమిటికిన్= ఎందుకోసం; ఎందున్+పోయిరొ= ఎక్కడికి వెళ్ళారో; ఎఱుంగము= మేమెరుగం; ధర్మ దూష్య సంగ్రామ విధంబులన్= ధర్మబాహ్యాలైన యుద్ధ విధానం వలన; జయము+కల్గియున్= జయం లభించినప్పటికీ; వారికిన్; దక్కదు+అయ్యెన్= లభించనట్టే అయింది; వారు+ఏమి+అయిరి+ఏమి= వాళ్ళు ఏమయితే నేమి?; మా కెలసము+ఎక్కెన్= మాకు కావలసినపని నెరవేరింది; మమ్మున్+ముప్వురన్= మా ముగ్గురినీ; ఎఱుంగుము= తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** 'రాజా! దుర్యోధనా! మేము అట్లా వెళ్ళటం కృష్ణుడు ముందుగానే బాగా ఊహించి దాచిపెట్టాడో! వాళ్ళు ఎందుకోసం ఎక్కడికి వెళ్ళారో మాకు తెలియదు. ధర్మబాహ్యమైన యుద్ధవిధానాల వలన వాళ్ళకు జయం లభించినా లభించనట్లే. వాళ్ళు ఏమయితేనేమి? మా అభీష్టం నెరవేరింది. మా ముగ్గురినీ తెలిసికొమ్ము.'

**వ. అని కలిపికొని పలికి కృపకృతవర్మల వలనుం జూచి.** **232**

**ప్రతిపదార్థం:** అని; కలిపికొని= వాళ్ళను కూడా కలుపుకొని; పలికి; కృపకృతవర్మల వలనున్+చూచి= కృపకృతవర్మలవైపు చూచి.

**తాత్పర్యం:** అని వాళ్ళను కూడా కలుపుకొని పలికి, కృపకృతవర్మలవైపు చూచి.

**క. 'వీరి పెనుఁబ్రాపు వడసినఁ । గౌరవకులనాథ! యేన కా దరయంగాఁ**
**జీరికిఁ బోవని వారును । వైరుల సమయంగఁ జేయ వలఁతుల కారే?'** **233**

**ప్రతిపదార్థం:** కౌరవ కులనాథ!= కురువంశపతీ! దుర్యోధనా!; వీరి పెనుఁబ్రాపు+పడసినన్= ఈ కృపకృతవర్మల పెద్ద తోడ్పాటు పొందితే; ఏను+అ+కాదు= నేనేకాదు; అరయంగాన్= చూడగా; చీరికిన్+పోవని వారును= ఎందుకూ పనికిరానివాళ్ళు కూడా; వైరులన్= శత్రువులను; సమయంగన్+చేయన్= చంపటానికి; వలఁతులు+అ+కారే= సమర్థులే కారా?

**తాత్పర్యం:** 'దుర్యోధనా! ఈ కృపకృతవర్మల గొప్ప తోడ్పాటు లభిస్తే నేనే కాదు, చూడగా ఎందుకూ పనికిరాని వాళ్ళు కూడా శత్రువులను చంపటానికి సమర్థులు కారా?'

**వ. అనిన నమ్మాటలు మనఃప్రియంబులై నాలుకకు లావిచ్చిన నా భూవరుం డమ్మహీసురవరున కిట్లనియె.** **234**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+మాటలు= ఆ పలుకులు; మనస్(ః)+ప్రియంబులు+ఐ= మనస్సుకు సంతోషం కలిగించేవయి; నాలుకకున్; లావు+ఇచ్చినన్= శక్తినివ్వగా; ఆ-భూ-వరుండు= ఆ రాజు-దుర్యోధనుడు; ఆ+మహీసురవరునకున్= ఆబ్రాహ్మణశ్రేష్ఠుడికి- అశ్వత్థామకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా, ఆ మాటలు మనస్సుకు ఆనందం కలిగించి నాలుకకు శక్తి నివ్వగా దుర్యోధనుడు అశ్వత్థామతో ఇట్లా అన్నాడు;

**క. 'నీవును నీ యోధవరులు । నావైరులఁ బఱిచినంత యాచార్యుండున్,**
**దేవవ్రతుండుఁ బఱిచిరె? । భావింపఁగ దుష్కరంపుఁ బని యిది యనఘా! 235**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! అశ్వత్థామా!; నీవును; ఈ యోధవరులున్= ఈ వీరశ్రేష్ఠులూ - కృపాచార్య కృతవర్మలూ; ఆ వైరులన్= ఆ శత్రువులను; పఱచిన+అంత= బాధించినంతగా; ఆచార్యుండున్= గురుడూ-ద్రోణుడూ; దేవవ్రతుండున్= భీష్ముడూ; పఱిచిరె?= బాధించారా?; భావింపఁగన్= తలచగా; ఇది; దుష్కరంపుఁబని= కష్టసాధ్యమైన పని.

**తాత్పర్యం:** 'పాపరహితుడైన అశ్వత్థామా! నీవు, ఈ వీరశ్రేష్ఠులైన కృపకృతవర్మలూ ఆ శత్రువులను బాధించినంతగా, ద్రోణాచార్యుడూ భీష్ముడూ బాధించారా? ఆలోచించగా ఇది చాలా కష్టసాధ్యమైన పని.

**ఆ. కర్ణు మనము పెద్దగాఁ గొనియాడుదు; । మతనికంటె శల్యుఁ దధికుఁడందు;**
**రతఁడు నతఁడు నిట్టి యాక్రమంబున నాకుఁ । బ్రియము సేయఁ జూచిరే మహాత్మ!' 236**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= మహానుభావా! అశ్వత్థామా!; మనము; కర్ణున్= కర్ణుడిని; పెద్దగాన్= అధికంగా; కొనియాడుదుము= పొగడుతాము; శల్యుఁడు; అతనికంటెన్= కర్ణుడికన్నా; అధికుఁడు+అందురు= గట్టివాడంటారు; అతఁడున్+అతఁడున్= ఆ కర్ణుడూ; ఆ శల్యుడూ; ఇట్టి ఆక్రమంబునన్= ఇటువంటి ఆక్రమణంలో; నాకున్; ప్రియము+చేయన్+చూచిరే= ప్రీతి కలిగించనెంచారా?

**తాత్పర్యం:** మహాత్మా! అశ్వత్థామా! మనం కర్ణుడిని చాలా గొప్పవాడని ప్రశంసిస్తాము. శల్యుడు అతడికన్నా గట్టివాడని అంటాము. కాని, అతడూ అతడూ ఇటువంటి ఆక్రమణంలో నాకు ప్రీతిని కలిగించనెంచారా?'

**వ. అని యమ్ముువ్వుర మొగంబులు గలయం గనుంగొని 'మీరు కృతకృత్యులరు. సుఖులరై యుండుఁడు, పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుఁగాక. వగలు మాని పొం' డని పల్కి ప్రాణంబులు విడిచిన, వారలవ్వసుమతీ పతిఁ గౌఁగిలించుకొని వలగొని వచ్చి మరలి మరలి చూచుచు నరదంబు లెక్కియరిగి; రంత నుదయగిరి శిఖరంబునకు ఖరకరుండు వచ్చె, నేను నిత్తెఱంగు నీకెఱింగింపవచ్చితి; నాహవప్రకారం బంతయు నీకు వినిపించుటకు నాఁడు మునీశ్వరుండు నన్నుఁబనిచి యొసంగిన దివ్యదర్శనత్వంబు నీ కొడుకు తోడిదయయ్యె' నని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు నశ్వత్థామాది రథికత్రయ వ్యాపార కథనపూర్వకంబుగా దుర్యోధను లోకాంతరగమనంబు సెప్పెఁ; ననిన విని 'యటమీఁదఁ బాండునందను లెవ్విధంబునం బ్రవర్తించి?' రని యడుగుటయు. 237**

**ప్రతిపదార్థం:** అని; ఆ+ముువ్వురమొగంబులు= ఆ ముగ్గురి ముఖాలూ; కలయన్+కనుంగొని= బాగుగా చూచి; మీరు; కృతకృత్యులరు= పని నెరవేర్చినవారు; సుఖులరు+ఐ ఉండుఁడు= సుఖంగా ఉండండి; పునర్+దర్శనంబు= మళ్ళీచూడడం; త్రిదివంబునన్+అయ్యెడున్+కాక= స్వర్గంలో అగుగాక!; వగలుమాని= దుఃఖం విడిచి; పొండు; అని; పలికి; ప్రాణంబులు విడిచినన్; వారలు, ఆ+వసుమతీ పతిన్= ఆ రాజును; కౌఁగిలించుకొని; వలగొని వచ్చి= ప్రదక్షిణంచేసి; మరలి మరలి చూచు

చున్= తిరిగి తిరిగి చూస్తూ; అరదంబులు+ఎక్కి= రథాలెక్కి; అరిగిరి= వెళ్ళారు; అంతన్= తరువాత; ఖరకరుండు= సూర్యుడు; ఉదయగిరి శిఖరంబునకున్= తూర్పుకొండ శిఖరానికి; వచ్చెన్; ఏనున్= నేనూ; ఈ+తెఱంగు= ఈ విధం; నీకున్; ఎఱింగింపన్+వచ్చితిన్= చెప్పటానికి వచ్చాను; ఆహవ ప్రకారంబు+అంతయున్= యుద్ధ విధానం అంతా; నీకున్; వినిపించుటకున్; నాఁడు= అప్పుడు; ముని+ఈశ్వరుండు= మునిశ్రేష్ఠుడైన వ్యాసుడు; నన్నున్; పనిచి= ఆజ్ఞాపించి; ఒసంగిన= ఇచ్చిన; దివ్యదర్శనత్వంబు= దివ్యదర్శనం; నీ కొడుకుతోడిది+అ= నీ కుమారుడితోపాటిదే అయింది; అని; ఇట్లు= ఈ విధంగా; సంజయుండు= సంజయుడు; ధృతరాష్ట్రునకున్; అశ్వత్థామ+ఆది రథిక త్రయ వ్యాపార కథన పూర్వకంబుగాన్= అశ్వత్థామ మొదలగు ముగ్గురు వీరుల పని తీరు చెప్పటం మొదలుకొని; దుర్యోధను= దుర్యోధనుడియొక్క; లోక+అంతర గమనంబు= అన్యలోకానికి పోవటం; చెప్పెన్; అనినన్; విని; అటమీఁదన్= ఆ తరువాత; పాండు నందనులు= పాండవులు; ఏ+విధంబునన్= ఎట్లా; ప్రవర్తించిరి+అని+అడుగుటయున్= ప్రవర్తించారని అడుగగా.

**తాత్పర్యం:** అని ఆ ముగ్గురి ముఖాలు బాగా చూచి, 'మీరు కృతార్థులు. సుఖంగా ఉండండి. మళ్ళీ స్వర్గంలో కలిసికొందాం. దుఃఖించక పొండి' అని పలికి ప్రాణాలు విడిచాడు. వాళ్ళు ఆ రాజును కౌగిలించుకొని, అతడికి ప్రదక్షిణం చేసి, మళ్ళీ మళ్ళీ చూస్తూ రథా లెక్కి వెళ్ళారు. అంత సూర్యోదయం అయింది. నేనూ ఈ వృత్తాంతం నీకు చెప్పాలని వచ్చాను. యుద్ధక్రమం అంతా నీకు వినిపించటానికి అప్పుడు వ్యాసమునీంద్రుడు నన్నాదేశించి ఇచ్చిన దివ్యదర్శనం నీ కుమారుడితోపాటిదే అయింది' అని ఇట్లా సంజయుడు ధృతరాష్ట్రుడికి అశ్వత్థామాది రథికులు ముగ్గురూ చేసిన పని చెప్పటం మొదలుకొని దుర్యోధనుడు లోకాంతరం వెళ్ళటం దాకా చెప్పాడు. అని చెప్పగా విని తరువాత పాండవులు ఎట్లా ప్రవర్తించారని వైశంపాయనుడిని జనమేజయుడు అడుగగా (ద్వితీయాశ్వాసంలోని వచనంతో అన్వయం).

**విశేషం:** ధృతరాష్ట్రుడు భారతయుద్ధ విశేషాలు తెలిసికొనగోరితే, వ్యాసుడు సంజయుడికి ఒక దివ్యశక్తిని అనుగ్రహించాడు. ఆ శక్తివలన సంజయుడు యుద్ధభూమిలో బాణాలు తగలక, ఎవ్వరిచేతా చూడబడక, తను ప్రతివారి సంభాషణా వినగలిగాడు. అతడు అట్లా తెలిసికొంటూ ధృతరాష్ట్రుడికి ఎప్పటికప్పుడు యుద్ధ విశేషాలు చెప్పుతూ వచ్చాడు. ఆ శక్తి దుర్యోధనమరణంతో నశించింది.

## ఆశ్వాసాంతము

**మహాస్రగ్ధర.**

> **పరమజ్ఞేయ స్వభావా! భవభయ హరణ ప్రౌఢనామానుభావా!**
> **కరఖేలచ్చక్రశూలా! కలుషహృదయ సాంగత్య వైముఖ్యశీలా!**
> **కరుణాయత్తాంతరంగా! కమలభవ మనఃకంజసంవాస భృంగా!**
> **దురిత ధ్వాంత ప్రదీపా తుల నిరసన సంస్తుత్య నిర్భాసరూపా!** **238**

**ప్రతిపదార్థం:** పరమజ్ఞేయ స్వభావా!= మిక్కిలి తెలిసికొనదగిన స్వభావం కలవాడా!; భవ= సంసారమువలని; భయ= భీతి యొక్క; హరణ= పోగొట్టడంలో; ప్రౌఢ= నేర్పుగల; నామ= పేరుయొక్క; అనుభావా!= ప్రభావం కలవాడా!; కర= చేతిలో; ఖేలత్= ఆడుతున్న; చక్ర= సుదర్శన చక్రమూ; శూలా= త్రిశూలమూ కలవాడా!; కలుష= దుష్టమైన; హృదయ= హృదయం కలవారితోడి; సాంగత్య= కూటమికి; వైముఖ్య= విముఖత్వం కల; శీలా!= స్వభావం కలవాడా!; కరుణా+ఆయత్త+అంతరంగా!= దయకు అధీనమైన మనస్సుకలవాడా!; కమలభవ= బ్రహ్మయొక్క; మనస్(ః)+కంజ= మనస్సు అనే పద్మంలో; సంవాస=

నివాసంకల; భృంగా!= తుమ్మెద అయినవాడా!; దురిత= పాపం అనే; ధ్వాంత= చీకటికి; ప్రదీప= గొప్పదనం యొక్క; అతుల= సాటిలేని; నిరసన= తిరస్కారంచేత; సంస్తుత్య= మిక్కిలి పొగడదగిన; నిర్భాస రూపా!= అతిశయమైన కాంతితోడి ఆకారం కలవాడా!; (ఇవన్నీ హరిహరనాథుడికి విశేషణాలు).

**తాత్పర్యం:** మిక్కిలి తెలిసికొనదగిన స్వభావం కలవాడా! సంసారభీతిని పోగొట్టటంలో నిపుణమైన నామ ప్రభావం కలవాడా! చేతిలో క్రీడిస్తున్న చక్ర శూలాలు గలవాడా! దుష్టుల తోడి సాంగత్యానికి విముఖమైన శీలం కలవాడా! దయాధీనమైన మనస్సు కలవాడా! బ్రహ్మ మనఃపద్మంలో నివసించే తుమ్మెద అయినవాడా! పాపాంధకార ప్రదీపాన్ని సాటిలేని విధంగా తిరస్కరించే పొగడబడిన కాంత్యతిశయం కల రూపం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** పరమ.....స్వభావా= హరిహరనాథుడికి స్వభావం కంటె తెలిసికొనదగినది ఇంకొకటి లేదు. భవ......భావా= అతడి నామ మహిమ సంసారభయాన్ని పోగొట్టడంలో గొప్పది. కర....శూలా= ఆ దేవుడు హరిహరనాథుడు కాబట్టి హరిచేతిలో చక్రమూ, హరుడిచేతిలో త్రిశూలమూ ఉన్నాయి. కలుష......శీలా= అతడి శీలం దుర్జనసాంగత్యానికి విముఖమైనది. కరుణా.... రంగా= అతడి అంతరంగం దయాధీనమైనది. కమలభవ.....భృంగా= అతడు బ్రహ్మ మనఃపద్మంలో ఉండే తుమ్మెద. దురిత.....రూపా= అతడి రూపం పాపాంధకారాన్ని పారద్రోలే ప్రదీపాన్ని సాటిలేని విధంగా తిరస్కరించే సంస్తుత్యమైన కాంత్యతిశయం కలది. 'కమల భవ మనఃకంజ సంవాసభృంగా' - అలంకారం రూపకం, 'దురితధ్వాంత.......' అలంకారం రూపకం.

**క.** **పరిణామగమ్య! నిగమా । పర నిష్ఠా సంపదచల భావన రమ్యా!**
**నిరుపమ సౌందర్య! తప । శ్చరణ నిరత హృదయ కమల సముదిత సూర్యా!** **239**

**ప్రతిపదార్థం:** పరిణామ గమ్య= విశ్వరూప పరిణతిచేతనే తెలియదగినవాడా!; నిగమ= వేదములయందలి; అపర= ఉత్తరభాగము అనగా ఉపనిషద్భాగమునందలి; నిష్ఠా= యోగనిష్ఠ అనే; సంపద్= సంపదచేత; అచలభావన= నిశ్చలధ్యానంచేత; రమ్యా!= అందమైనవాడా!; నిరుపమ సౌందర్య!= సాటిలేని శోభకలవాడా!; తపస్+చరణ= తపస్సు నాచరించటంలో; నిరత= మిక్కిలి ఆసక్తమైన; హృదయ కమల= హృదయమనే పద్మానికి; సముదిత= స్ఫుటంగా ఉదయించిన; సూర్యా!= సూర్యుడైనవాడా!;

**తాత్పర్యం:** విశ్వరూప పరిణతిచేతనే తెలియదగినవాడా! వేదముల ఉత్తరభాగములైన ఉపనిషద్భాగములందలి యోగనిష్ఠ అనే సంపద తోడి నిశ్చలధ్యానంచేత రమ్యమైనవాడా! నిరుపమాన సౌందర్యం గలవాడా! తపస్సు నాచరించటంలో ఆసక్తమైన హృదయకమలానికి లెస్సగా ఉదయించిన సూర్యుడైనవాడా! హరిహరనాథా!

**విశేషం:** 'తపశ్చరణ సూర్యా!' తపస్సునాచరించేవారి హృదయపద్మాలను వికసింపజేసేవాడా- అలంకారం రూపకం.

**మాలిని.**

**చరణ యుగళకాంతి స్ఫారలీలా! నిరూఢా**
**దర సుఖమయయుక్తా! ధర్మ శీలానురక్తా!**
**సుర సముదయ రక్షా! సువ్రతా సంగ హేలా**
**కర మహిమ కటాక్షా! గాఢ సర్వానుపేక్షా!** **240**

**ప్రతిపదార్థం:** చరణ యుగళ= పాదద్వంద్వం యొక్క; కాంతి= శోభచే; స్ఫార= విపులమగు; లీలా!= విలాసం కలవాడా!; (సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడి పాదద్వంద్వచ్ఛాయ విశ్వమంతటా వ్యాపించి వెలుగుతోంది అని భావం); నిరూఢ= స్థిరమూ

అనగా శాశ్వతమూ; అదర= భయరహితమూ; అయిన; సుఖమయ= ఆనందరూపములతో; యుక్తా!= కూడినవాడా!; (నిరూఢ+ఆదర అని విభజిస్తే; గొప్ప ఆదరం వలన కలిగే సుఖం అని చెప్పవచ్చు); ధర్మశీల= ధర్మస్వభావం కలవాళ్ళపై, పుణ్యపురుషులపై; అనురక్తా!= అనురాగం కలవాడా!; సుర= దేవతలయొక్క; సముదయ= సమూహంయొక్క; రక్షా!= రక్షణకలవాడా! -దేవతలను రక్షించేవాడా!; సువ్రత= ఉత్తమ సంకల్పంలో; ఆసంగ= ఆసక్తిగల సాధుపురుషులకు; హేలాకర= ఆనందం కలిగించే; మహిమ కటాక్షా!= గొప్పశక్తికల క్రీగంటి చూపుకలవాడా! (పరమేశ్వరుడి కటాక్షప్రసారం సువ్రతాసక్తులగు సాధుపురుషుల కానందం కలగజేస్తుందని భావం); గాఢ సర్వ+అనుపేక్షా!= సమస్త జగద్వ్యాపారమునందూ అతిశయమైన అనుపేక్షాభావం(శ్రద్ధ) కలవాడా!

**తాత్పర్యం:** పాదద్వంద్వకాంతిచేత విశ్వాన్నంతనూ ప్రకాశింపజేసేవాడా! శాశ్వతమూ, భయరహితమూ అయిన గొప్ప ఆదరంతో కూడిన ఆనంద రూపాలతో కూడినవాడా! ధర్మస్వభావం కలవారియెడ అనురాగం కలవాడా! దేవతా సమూహాన్ని రక్షించేవాడా! ఉత్తమవ్రతాలలో ఆసక్తిగల సాధుపురుషులకు ఆనందం కలిగించే క్రీగంటి చూపు కలవాడా! సమస్త జగద్వ్యాపారములందునూ అతిశయమైన శ్రద్ధకలవాడా! హరిహరనాథా!

**విశేషం:** మాలినికి నాలుగు పాదాలుంటాయి. ప్రతిపాదంలోనూ న,న,మ,య,య అనే గణాలుంటాయి. 1-9 అక్షరాలకు యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున సౌప్తిక పర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది; శ్రీమత్+ఉభయకవిమిత్ర= శ్రీమంతుడైన ఉభయకవిమిత్ర బిరుదం కలవాడూ; కొమ్మన+అమాత్య పుత్ర= కొమ్మనమంత్రి కుమారుడూ; బుధ+ఆరాధన విరాజి= పండితుల-దేవతల-పూజచే ప్రకాశించేవాడూ (అయిన); తిక్కన సోమయాజి= తిక్కన అనేపేరుగల సోమయాజిచేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీమహాభారతంబునన్= శ్రీమహాభారతంలో; సౌప్తిక పర్వంబునందున్= సౌప్తికమనే పేరుగల పర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసము.

**తాత్పర్యం:** ఇది శ్రీమంతుడైన ఉభయకవిమిత్ర బిరుదం కలవాడూ, కొమ్మనమంత్రి కుమారుడూ, పండితుల పూజలచేత ప్రకాశించేవాడూ, (దేవతలను, పండితులను పూజించటం వలన రాణించేవాడూ), అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీ మహాభారతంలోని సౌప్తికపర్వంలో మొదటి ఆశ్వాసం.

**సౌప్తికపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం**

### కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

### సంపుటము - 12

### శాంతిపర్వము

(మొదటిభాగం 1,2,3 ఆశ్వాసములు)


కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

డా॥ యస్. గంగప్ప

డా॥ దావులూరి కృష్ణకుమారి

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Shanti parvamu of Tikkana Somayaji
Vol. XII.
Part-1 (1,2,3 Cantos)

Commentary by
**Dr. G.V.Subrahmanyam - 1st Canto**
**Dr. S. Gangappa - 2nd Canto**
**Dr. Davuluri Krishna kumari - 3rd Canto**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Publications Series No.611
First Edition : 2005
First Re-print : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D., Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారి సేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

**నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,**

**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.**

కవిత్రయ ఆంధ్రమహాభారతంలో శాంతిపర్వం ఒక ప్రముఖ పర్వం. మహాభారత యుద్ధం సమాప్తి అయిన తర్వాత పాండవులు తమకు మిగిలిన దానిని, తాము గెలిచిన దానిని బేరీజువేసుకొనే ఘట్టం. దుర్యోధనుడు తన దుర్గుణసహితంగా, అంతమొందిన తరువాత గెలిచింది ధర్మమే అయినా అంత గొప్పగా, ఆకర్షణీయంగా కనపడకపోయింది. అందువల్లనే ధర్మజునికి వైరాగ్యం ముంచుకొచ్చింది. దాన్ని తొలగించి రాజ్యపరిపాలనా రంగంలో ఆయన ఆసక్తి కనపరిచేటట్లు సహోదరులు నచ్చజెప్పడమేగాక, కృష్ణుడు, వ్యాసుడు మార్గదర్శనం చేయడం అనేవి ఒక ఎత్తు అయితే ఆ తరువాత భీష్ముడు దీర్ఘంగా ఉపదేశించే రాజధర్మం, ఆపద్ధర్మం, మోక్షధర్మాలు, ధర్మజునికి శేషజీవిత మార్గదర్శక సూత్రాలు మరోఎత్తు అయినాయి. అవే పాఠకులకు ధర్మప్రబోధాలయినాయి. భీష్ముడిలాంటి భక్తుడు, నీతిశాస్త్రకోవిదుడు, తత్త్వం తెలిసినవాడు, కురువృద్ధుడై సమాజాన్ని చూసినవాడు, ఇక్కడ ధర్మసూక్ష్మాలను చెప్పడం అవశ్య మాచరణీయంగా కనబడుతుంది.

శాంతిపర్వంలో ధర్మ వివరణం, ధర్మనిరూపణలకు, ఆలంబనంగా వేరువేరు ఉపకథలు వస్తాయి. వీటినన్నింటిని సంగ్రహంగాను, స్వారస్యంగాను తొలిసారిగా తెలుగులో తెలియపరచిన మహాకవి తిక్కన.

ఆరు ఆశ్వాసాల శాంతిపర్వానికి ఆరుగురు విద్వాంసులు వ్యాఖ్యానాన్ని సమకూర్చారు. డా॥ యస్. గంగప్ప, డా॥ దావులూరి కృష్ణకుమారి, డా॥ ఆకురాతి పున్నారావు, డా॥ బేతవోలు రామబ్రహ్మం. ఈ నలుగురు మహాభారత ఘట్టాలను విద్యార్థులకు బోధించి పేరుపొందినవారు. మహాభారతానికి ప్రధాన సంపాదకులు డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారు, ఎడిటోరియల్ సెల్ సభ్యులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు. వీరిరువురు కూడ శాంతిపర్వానికి వ్యాఖ్యానాన్ని రచించారు. అందువల్ల శాంతిపర్వానికి న్యాయము, వ్యాఖ్యానానికి గుణాధిక్యము కలిగింది. వీరికి దేవస్థానం పక్షాన కృతజ్ఞతలు.

శాంతిపర్వాన్ని రెండు సంపుటాలుగా ప్రచురిస్తున్నాము. మొదటి మూడు ఆశ్వాసాల్ని ఒక సంపుటంగాను, తర్వాతి మూడు ఆశ్వాసాల్ని రెండవ సంపుటంగాను ముద్రించి పాఠకమహాశయుల ముందు ఉంచుతున్నాం. ఇది శాంతిపర్వంలో మొదటి సంపుటం.

ఇక మిగిలిన పర్వషట్కం కూడ త్వరలో వెలువరించేందుకు కృషి జరుగుతున్నది. ఎప్పటిలాగా ఈ పుస్తకాలను శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసాదంగా ప్రీతితో చదువరులు స్వీకరిస్తారని భావిస్తున్నాము.

కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యానుగ్రహంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

**పూర్వరంగం:**

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమస్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాది కార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

**నన్నయ భారత ప్రాజెక్టు:**

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు రాజరాజనరేంద్రుని కోరిక ననుసరించి ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 - 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) అనే పుస్తకాలను 'నన్నయ వ్యాస పీఠము' అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జూలై, 11వ తేదీన హైదరాబాదు బాలాజీభవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం:**

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్యపర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధకములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అరసున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసియున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్ల

వేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను.''

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్వురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ'' కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది. ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిగమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగా పర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది. ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జూలై 3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన:**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డిగారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి. ఓరియంటల్ కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక''ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం:**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యవంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥ కె. సర్వోత్తమరావు** | **శ్రీ డి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటి దొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥ రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీ కాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంత ప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం:**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు'

'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జూలై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీ డి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు:**

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీ స్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలోని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం:**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్ల కొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పంద్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నపుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులుబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి. విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి".

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిని పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాస్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికముగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదకమండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

## సంపాదకమండలి సభ్యులు

| | |
|---|---|
| డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు | శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు |
| డా॥ ఎస్.బి. రఘునాథాచార్య | డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య |
| డా॥ కె.జె. కృష్ణమూర్తి | డా॥ కె. సర్వోత్తమరావు |

## సలహామండలి సభ్యులు

| | |
|---|---|
| పౌరసంబంధాధికారి, తి.తి.దే. | డా॥ బిరుదురాజు రామరాజు |
| అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్, తి.తి.దే. | డా॥ ఎం. కులశేఖరరావు |
| ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే. | డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు |
| | డా॥ ఎం. బుద్ధన్న |

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ఆఫీస్' లో పై రెండు మండలులలోని సభ్యులయొక్క సంయుక్తసమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటాలన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆయా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్త పాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ప్రథమ సంపుటం-ఆదిపర్వం (రెండుభాగాలు), ద్వితీయ సంపుటం-సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి. సుబ్బారావుగారి తరువాత కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణను గురించి ఆసక్తితో గమనిస్తూ అన్ని విధాల సహకరించి ఆది, సభాపర్వాల విడుదలకు ఏర్పాటుచేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ ప్రణాళిక వ్యాఖ్యా సహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. అప్పట్లో తీవ్రతరం అయిన ప్రయత్నంతో గోదావరి పుష్కరాల సమయానికి ఆరణ్యపర్వం (2భాగాలు), విరాటపర్వం విడుదల అయ్యాయి. తర్వాత శ్రీ అజేయ కల్లంగారు కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన వెనువెంటనే ఈ మహాభారత వ్యాఖ్యాన సహిత ప్రచురణ ప్రణాళికను మరింత వేగిరపరచి కృష్ణాపుష్కరాల లోపల యుద్ధపంచకాన్ని విడుదల చేయాలనీ, 2004 సంవత్సరం చివరకు మిగిలిన పర్వాష్టకము వెలుగు చూడాలనీ నిర్ణయించడం జరిగింది. 2004 కృష్ణాపుష్కరాలసమయంలో ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వాలు వెలువడ్డాయి. కర్ణపర్వం ఒక సంపుటంగాను, తరువాతి పర్వాలైన శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు మూడింటిని కలిపి ఒకే సంపుటంగా ముద్రించుటకు సిద్ధం చేయడం జరిగింది. మిగిలిన పర్వాలన్నిటిని వీలైనంత తొందరగా విడుదల చేయడానికి సర్వయత్నాలు సాగుతున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారత' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తృమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. లోగడ తి.తి. దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా వున్న శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహానికి కృతజ్ఞతాభివందనాలు. ఈ మహాగ్రంథం వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ.ఎ.పి.వి.ఎన్. శర్మ ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. తి.తి.దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి సాహిత్యప్రియులూ ఐన శ్రీ ఎన్. ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్., గారు మరింత ప్రోత్సాహం ఇచ్చి ప్రాజెక్టు పనిని వేగవంతం చేస్తున్నారు. వారికి వందనములు.

సంబంధిత విభాగాధిపతిగా, సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన డా॥పి. రంగారావు, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి-వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయ సహకారాలందించిన తదితర అధికారిగణానికి నమస్సులు. ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధానపాత్ర వహించిన-వ్యాఖ్యాతలు, పై ఉభయమండలుల (సంపాదకమండలి, సలహామండలి) విద్యావేత్తలకు, ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి - నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి.దేవస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడంలో వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్ కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానిక పండితవర్యుల ఉప సంఘం (ఎడిటోరియల్ సెల్) నిర్మాణానికి సిఫారసు చేస్తే దేవస్థానం ఆ మేరకు **పండితవరేణ్యులు డా॥ కె. సర్వోత్తమరావు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యులు** గారలతో ఎడిటోరియల్‌సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈ సెల్ ఉపకారం అద్వితీయమైనది, మరువరానిది. వర్క్‌షాపువలె నిర్వహింపబడుతున్న కవిత్రయ మహాభారత యజ్ఞంలో వీరు పాలుపంచుకుంటున్నారు. ఆ కారణంగానే తక్కిన పర్వాలను త్వరితంగా గుణాత్మకంగా వెలువరించగలుగుతున్నాం.

"సప్తగిరి" సంపాదకులుగా, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి అమరులయ్యేవరకూ ప్రముఖ పాత్ర వహించిన కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥ కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్-ఎడిటర్లు డాక్టర్ కె. రాధారమణ, డాక్టర్ అల్లాడి సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్-ఎడిటర్ శ్రీ బి.ఎన్. శ్రీనివాసన్ గారలకు, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది పాఠకులకు తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయాధికారి శ్రీ ఐ. పార్వతీశ్వరరావుగారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహ విశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

**డా॥ ఎన్.ఎస్. రామమూర్తి**

కన్వీనర్

సంపాదకుడు - సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదక మండలి

**అధ్యక్షులు**

**శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ ఐ.ఏ.ఎస్.,**

**కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి.**

**ప్రధాన సంపాదకుడు: ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**

**సంపాదకమండలి సభ్యులు**

శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఆచార్య కె. సర్వోత్తమరావు

**సలహామండలి సభ్యులు**

డా॥ బిరుదురాజు రామరాజు

ఆచార్య ఎం. కులశేఖరరావు

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

ఆచార్య ఎం. బుద్ధన్న

డా॥ పి. రంగారావు, పౌరసంబంధాధికారి (ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ మేడసాని మోహన్, డైరెక్టర్

అన్నమాచార్య ప్రాజెక్టు, (ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద, కార్యదర్శి

ధర్మప్రచారపరిషత్తు (ఎక్స్ అఫిషియో సభ్యులు)

**కన్వీనర్**

**డా॥ ఎన్.ఎస్.రామమూర్తి,**

"సప్తగిరి" సంపాదకులు, తి.తి.దేవస్థానములు, తిరుపతి.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| | వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|---|
| 1. | డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. | డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా. 1 |
| 3. | డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా. 1,2 |
| 4. | డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ. ఆశ్వా. 1,2 |
| 5. | డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా. 1 |
| 6. | డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. | శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా. 2 |
| 8. | డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా. 4 |
| 9. | డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా. 5 |
| 10. | డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. | శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. | శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. | డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. | డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. | డాక్టర్ కె. రాజన్న శాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. | శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. | డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. | డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. | డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. | డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా. 1; స్వర్గా-1 |
| 21. | డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. | డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. | డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. | డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. | డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | అను. ఆశ్వా. 1,2 |
| 27. | డాక్టర్ శలాక రఘునాథశర్మ | అను. ఆశ్వా. 3,4 |
| 28. | డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | అను. ఆశ్వా. 5 |
| 29. | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. | డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| అను. | – | అనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |

| | | |
|---|---|---|
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభ విక్రీడితం |
| శా. | – | శార్దూల విక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# శాంతిపర్వ కథాసారం

(మొదటి భాగం)

**1. ధర్మజ విషాదం:**

మహాభారత యుద్ధం ముగిసిన తరువాత పాండవులు గంగానదీతీరంలో విడిదిచేసి, యుద్ధంలో చనిపోయిన వారికి ధర్మోదకాలు విడిచి, అశౌచం తీరేంత వరకు ఒక నెలపాటు అక్కడ ఉన్నారు. యుద్ధంలో ధర్మవిజయాన్ని సాధించిన ధర్మరాజును అభినందించి ఆశీర్వదించటానికి నారదాది మహర్షులు శిష్యులతో సహా అక్కడికి వచ్చారు. మునులందరి పక్షాన నారదుడు పాండవుల యోగక్షేమాల నడిగి, అన్నదమ్ములందరు కలిసి యుద్ధం చేసినందుకూ, రణరంగంలో పంతాలూ మాత్సర్యాలు పెరిగినా ధర్మమార్గం తప్పనందుకూ, ఆ ధర్మనిష్ఠవలన ధర్మరాజాదులు పొందిన మానసికవేదనకూ మెచ్చుకొన్నారు. ధర్మరాజు వారికి వినయంగా సమాధానం చెప్పాడు. 'మా విజయానికి శ్రీకృష్ణదేవుడి కృపాదృష్టీ, బ్రాహ్మణుల అనుగ్రహం, భీమాదుల బాహుబలం ప్రధానకారణాలు. రాజ్యమంతా మాకు దక్కినా జ్ఞాతులనందరినీ చంపినందుకూ, అభిమన్యుడూ, పాంచాలీసుత పంచకం మాకు దక్కనందుకూ, కుంతీదేవి మొదటిబిడ్డ అయిన కర్ణుడిని చంపుకొని జలతర్పణాలు ఇవ్వవలసి వచ్చినందుకూ నా మనస్సు నిప్పులలో పొరలినట్లున్నది' అని వాపోయాడు. కర్ణవధకు విశేషించి విలపించాడు. కర్ణుడి జన్మవృత్తాంతాన్ని కుంతి మొదట్లో దాచినందుకూ, ఆపైన కర్ణుడు తనకు తెలిసినా బయటపెట్టనందుకూ, దానివలన పాండవులు అతడు కౌంతేయుడని తెలియలేనందుకూ అంతటి విపత్తు కలిగిందని విచారించాడు. కర్ణుడి మాటలూ చేష్టలూ కోపం కలిగించినా ఆతడి పట్ల ధర్మరాజుకు కోపం రాని జన్మాంతర సౌహృదాన్ని స్మరించి ధర్మజుడు విలపించాడు. పూర్వస్మృతులతో దుఃఖిస్తూ కర్ణుడితో కూడి ఉన్నట్లయితే పాండవులు దేవగణాలను కూడ జయించి ఉండేవారని పలవించాడు.

నారద మహర్షి కర్ణుడి వృత్తాంతం సంగ్రహంగా చెప్పి

చ. 'వినుము నరేంద్ర! విప్రుఁ డలివెన్, జమదగ్ని సుతుండు శాప మి
చ్చె, నమరభర్త వంచనము సేసె, వరం బని కోరి కుంతి మా
న్చె నలుక, భీష్ముఁ డర్ధరథుఁజేసి యడంచెఁ, గలంచె మద్రరా
జనుచిత మాడి, శౌరి విధియయ్యెఁ, నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్' **(శాంతి. 1. 35)**

అని ముగించాడు. ఆ మాటలు విని ధర్మరాజు శోకవ్యాకులు డయ్యాడు. అప్పుడు కుంతి ధర్మరాజును సమీపించి 'ఆనాడు కర్ణుడికి అతడి జన్మరహస్యం చెప్పగా. సూర్యుడు కూడా అది నిజమని పలికాడు. అయినా, అతడు మా మాట వినక దుర్యోధనుడిని ఆశ్రయించి నీ పక్షం రావటానికి నిరాకరించాడు! అటువంటి కర్ణుడికొరకు నీ వెందుకు మనోవేదన పొందుతా'వని ఓదార్చింది. కుంతి వర్తనకు వెగడు చెందిన ధర్మరాజు 'ఆడవారి నోళ్ళలో రహస్యాలు దాగకుండా ఉండేటట్లు' శపించాడు. కర్ణుడితోపాటు చనిపోయిన బంధుమిత్రులు జ్ఞాపకం రాగా ధర్మజుడు శోకతీవ్రతతో తూలిపడబోయాడు.

**2. ధర్మజ వైరాగ్యం:**

బంధుక్షయం చేసిన తనకు రాజ్యస్వీకారం సమ్మతం కాదనీ, వనానికిపోయి, భిక్షతో జీవిస్తూ, బంధువధవలన కలిగిన పాపాన్ని పోగొట్టుకొనాలనే భావంతో అర్జునుడి మొగంచూచి ఇట్లా అన్నాడు. 'అర్జునా! మనకెందు కీ రాజ్యం? మరొక జనస్థానానికి వెళ్ళి బిచ్చమెత్తుకొని బ్రదుకుదాం. అది మనకు సుఖకరం. జ్ఞాతులను చంపటం ఆత్మవధతో సమానం. అహింస, సత్యం, ఓర్పు, అనసూయ వంటి గుణాలు వనవాసులకు ఉత్తమమైనవి. కుక్కలు మాంసఖండం కొరకు ఎగబడి కొట్టాడుకొన్నట్లు మన రాజులు

రాజ్యంకొరకు యుద్ధం చేసి వంశాన్నంతా నాశనం చేసికొని హేయంగా వ్యవహరించారు. దీనివలన కలిగిన దుఃఖం ముల్లోకాల నేలే ప్రభుత్వం స్వీకరించినా నాకు సంతోషాన్ని కలిగించదు. ధృతరాష్ట్రుడిచేత వారించబడని దుర్యోధనుడు కులనాశనకారకు డయ్యాడు. అతడిని చంపటం వలన కోపం మాత్రం చల్లారింది; కాని, శోకం దుర్భరంగా మారింది. అందువలన నేను రాజ్యత్యాగం చేసి పరిశుద్ధుడ నౌతాను. మీరు రాజ్యం స్వీకరించి వర్ణాశ్రమ ధర్మాలను రక్షించండి. నేను తపోవనానికి పోయి మునిజనగణంతో సుఖంగా ఉంటాను' అని అన్నాడు.

ధర్మజుడి మాటలకు అర్జునుడు విస్తుపోయాడు. 'ఘోరయుద్ధం చేసి రాజ్యాన్ని గడించింది బిచ్చమెత్తుకొనటానికా? నీ కటువంటి సంకల్పమే ఉంటే ఇంతమందిని ఎందుకు చంపావు? దీనచర్య క్షత్రియులకు తగదు. వనాలకుపోతే అందరూ నవ్వుతారు. సంపదలేనివాడు నడపీనుగువంటివాడుగా పరిగణించబడుతాడు. కాబట్టి ధనసంపాదన, బంధుమిత్రులను సంతోషపెట్టటం రాజుల కర్తవ్యం. సగోత్రీకులైన దానవులు చావటంవలననే కదా దేవతలు అభివృద్ధి చెందారు. క్షత్రియులు బల పరాక్రమాలతో రాజ్యాలను గెలుచుకొని, సంపదలు గడించి, పర్జన్యాదులను యజ్ఞాలతో సంతోషపెట్టి స్వర్గాదిలోకాలను పొందుతారని వేదాలు కూడా చెప్పాయి. దిలీపాది చక్రవర్తులు నడచిన బాట అదే. ఆ బాటలోనే నీవు కూడా నడువుము. పాపాలన్నీ పోయేటట్లు అశ్వమేధయాగం చేసి అవభృథ స్నానంతో పవిత్రుడవు కమ్ము' అన్నాడు.

**ధర్మరాజు** : (కొంతసేపు మౌనంగా ఉండి) నీరసమైన సంసారసుఖాలను వదలి అడవికి పోయి, మునుల బోధలు విని, ద్వంద్వాతీత ప్రవృత్తిని సాధించి, భిక్షపై జీవిస్తూ ఉంటాను. అట్లాకాక కర్మమార్గంలో కూరుకుంటే మోక్షసుఖానికి దూరమై పోతాను.

**భీముడు** : ధర్మజా! నీ కిప్పుడు కలిగిన దుఃఖాలచేత రాజధర్మాలమీద అసూయ కలిగింది కాని, ఈ అనాసక్తి మొదటినుండి ఉంటే రాజులందరూ ప్రాణాలతో బ్రతికి ఉండేవారు. అస్త్ర జీవులమైన మేమంతా గర్వోన్నతిని వదలి బిచ్చమెత్తుకొనే దీన పద్ధతిలో ప్రవేశించి ఉండేవాళ్ళం. అంత యుద్ధంచేసి ఈ విధంగా అడవికి పోతే అందరూ అవహేళన చేస్తారు. మా అసమర్థతను ఎగతాళిచేస్తారు. ప్రజలు దుఃఖిస్తారు. ధర్మరాజా! కర్మరాహిత్యమే మోక్షదాయకమైతే, కొండలు, చెట్లు ముక్తిని పొందగలిగి ఉండేవే. అడవిలో ఉండటమే మోక్షకారి కాదు. విధ్యుక్త కర్మలను ఆచరించాలి. బ్రహ్మార్పణభావంతో సాగించాలి. ఆత్మతత్త్వజ్ఞాన సాధనకు పూనుకొంటే కర్మరాహిత్యం తనంతటతాను కలుగుతుంది. కాబట్టి కర్మరాహిత్యం మోక్షకారకం కాదు.

**అర్జునుడు** : ఒక ఇతిహాసం వినుము. బ్రాహ్మణ బ్రహ్మచారులు ఇదివరలో కులాచారాలను వదలి అడవులకు వెళ్ళారు. ఇంద్రుడు జాలిపడి పక్షిరూపంలో వారికి గోచరించి, కర్మలు మానకూడదనీ, బ్రహ్మార్పణభావంతో చేసే సత్కర్మలు బ్రహ్మానందాన్ని కలిగిస్తాయనీ' బోధించాడు. వా రామాటలు విని ఇండ్లకు తిరిగివెళ్ళి గృహస్థధర్మాలు నిర్వహించారు. ఇది అందరికీ వర్తిస్తుంది. కాబట్టి నీవు రాజ్యాన్ని పాలించుము. ప్రీతితో యజ్ఞాలు నిర్వహించుము.

**నకులుడు** : యజ్ఞాది కర్మలు మానివేయటం అసంగ మనిపించుకొనదు. గృహస్థధర్మం మిగిలిన ఆశ్రమధర్మాల కంటె గొప్పది. హింసవలన పాపం కలుగుతుందనే అనుమానం వద్దు. శత్రువులను చంపకుండా ఏ రాజు రాజ్యాన్ని పాలించాడు? వాడికి పాపం కలిగిందా? వారు ఉత్తమ గతులు పొందారు కదా! అట్లా నీవు కూడా వ్యవహరించుము. ప్రజారక్షణ చేయకపోవటమే రాజుకు మహా పాపం. ఆ ధర్మాన్ని వదలి అడవికిపోవటం ఉత్తమ క్షత్రియ లక్షణం కాదు.

**సహదేవుడు** : ధర్మరాజా! శరీర సుఖం జీవితానికి ప్రథమాధారం. అరణ్యానికి వెళ్ళినా శరీరపోషణం తప్పదు. అయినప్పుడు అడవికి పోవటం దేనికి? మన్వాదులు ఈ సత్యం తెలిసి రాజ్యం చేశారు. నీవూ ఆ మార్గాన నడువుము. నీవే మాకు తల్లివి, తండ్రివి, గురుడవు, దైవానివి కాబట్టి నా ప్రార్థన మన్నించుము. రాజ్యాన్ని పాలించుము.

**ధర్మరాజు** : (తమ్ముల మాటలు విని మౌనంగా ఉండిపోయాడు)

**ద్రౌపది** : ధర్మరాజా! అరణ్యవాసాజ్ఞాతవాసాలలో అనేక కష్టాలు అనుభవించి, ఘోరయుద్ధంచేసి, రాజ్యాన్ని పొంది ఇప్పుడు సుఖాన్ని కోరుతున్న నీ తమ్ములకు ఊరట కల్పించుము. ఈ తరుణంలో రాజ్యత్యాగం చేస్తాననటం అధర్మం, అన్యాయం, రాజు దిక్పాలకాంశ సంభూతుడు. అగ్ని ఒకరినే కాలుస్తుంది. రాజాగ్ని వంశాన్నే దహిస్తుంది. కౌరవులు నిన్ను అవమానించి సర్వనాశనమయ్యారు. బ్రహ్మ రాజునందు దండనీతిని ప్రతిష్ఠించాడు. రాజు అపరాధాలను బట్టి శిక్షలు విధిస్తాడు. ఆనాడు కౌరవ సభలో నా చీరలొలిచి జుట్టుపట్టి లాగిన దుశ్శాసనుడిని, తొడచూపిన దుర్యోధనుడిని, నిందించిన కర్ణుడిని సముచితంగా చంపి దండనీతిని నీవు ప్రదర్శించావు. విషంపెట్టిన వాడినీ, ఇల్లు తగులబెట్టినవాడినీ, రాజకీయతంత్ర రహస్యాలను బయటపెట్టినవాడినీ, పరసతులను హరించేవాడినీ చంపటం రాజధర్మం. ఆ పని నీవు చేశావు. నావలె కష్టాలే పడిన వనిత లెక్కడైనా ఉన్నారా? ఇటువంటి నేను ఎన్ని కష్టాలు వచ్చినా నీ గృహస్థధర్మాన్ని రక్షిస్తూనే ఉన్నాను. కౌరవులు వారిపాపం పండి వారు నశించారు. వారి చావుకు వారే కారకులు కాగా నీకు పాపం ఎట్లా కలుగుతుంది? కాబట్టి, నీ విచారం మాని రాజ్యపాలన చేపట్టుము. విశ్వశ్రేయస్సు కొరకు అనేక యజ్ఞాలు చేయుము.

**అర్జునుడు** : పాలకుడు సమర్థుడై దండనీతిని పాటించకపోతే సన్న్యాసులు కూడా అక్రమాలు చేయటం మొదలు పెట్టుతారు. దేశం అరాజక మౌతుంది. దండనీతి నాశ్రయించిన వాడికి హింస చేయక తప్పదు. ఆహార పానీయాలలో ఎన్నో సూక్ష్మజీవులను లోకులు హింసిస్తున్నారు. కాబట్టి యోగ్యమైన హింస అహింసగానే పరగణించబడుతుంది. యజ్ఞాలలోని జంతుబలులు హింసలు కావు. యుద్ధంలో శత్రువీరులను చంపటం హింస కాదు. మన తండ్రి పాండురాజు పాలించిన ఈ రాజ్యాన్ని నీవు ఆశించటంలో తప్పేముంది? నీ వీ రాజ్యాన్ని గ్రహించటం ధర్మమో, అధర్మమో ఆ దేవు డెరుగును. నీవు మాత్రం ఈ ప్రయత్నాన్ని మానుకొమ్ము.

**భీముడు** : (కోపంతో) ధర్మనిర్ణయంలో నీ అంతటి వాడు మరొకడు లేడు. చేజిక్కిన సామ్రాజ్యాన్ని జారవిడుచుకొంటే అందరూ నిన్ను పిరికివా డంటారు. మమ్ములను ఛీకొట్టుతారు. కౌరవులవలన పడిన కష్టాలు తీరేటట్లుగా విజయాన్ని సాధించి రాజ్యాన్ని పొందావు. దీనిని వదలటం నింద్యం. కాబట్టి మేమందరం నీ చెప్పిన పనులు చేస్తూ ఉండగా దుర్మార్గులను శిక్షిస్తూ, సన్మార్గులను రక్షిస్తూ యాగాలు నిర్వహిస్తూ రాజ్యాన్ని పాలిస్తూ కురువంశకులోత్తముడిగా ప్రకాశించుము.

**ధర్మరాజు** : భీమా! రాజ్యపాలనం దుఃఖహేతువని పెద్దలంటారు. దానివలన చేప ఎరను తగులుకొన్నట్లే అనిపిస్తుంది. రాజ్యపాలన తరువాత రాజుకు నరకం ధ్రువం. నరుడు చేసిన కర్మలను బట్టి బంధాలలో ఇరుక్కొంటాడు. వికారాలను వదలితే ముక్తసంగు డౌతాడు. మిథిలానగరం తగులబడుతున్నా విషాదం పొందని జనకమహారాజు చరిత్ర తెలుసుకదా! జ్ఞాని సంసారమగ్నులైనవారిని కొండమీద ఉన్నవాడు నేలమీద తిరిగేవారిని వలె చూస్తాడు.

**అర్జునుడు** : ధర్మరాజా! నీవు చెప్పిన జనకమహారాజు కూడా రాజ్యపాలన వదలి భిక్షావృత్తి స్వీకరించాలని అనుకొన్నప్పుడు అతడి భార్యచేసిన హితబోధ గమనించదగింది. రాజు వనానికిపోయి బిచ్చమెత్తుకొంటూ ఉంటే, ఇంటిపట్టున అతిథిపూజలు ఏమి కావాలి? అన్నదానం ఏమి కావాలి? అన్ని ధర్మాలలో అన్నదానం శ్రేష్ఠం. గృహస్థాశ్రమ ధర్మం దప్పిగొన్న వారికి చలిపందిరివంటిది. ఆకొన్నవారికి పండ్లు కాసిన చెట్టువంటిది. కాబట్టి గృహస్థధర్మాన్ని వదలి పోవటం ధర్మవిరుద్ధం. అడవికిపోవటం వలన మోక్షం కలుగుతుంది అనుకొనటం అబద్ధం.

**ధర్మరాజు** : అర్జునా! నీ వాదం ఆమోద యోగ్యం కాదు. వేదాలు ప్రవృత్తి, నివృత్తి ధర్మాలను రెండింటినీ చెప్పాయి. అందులో జ్ఞానులు నివృత్తినే గౌరవిస్తారు. కర్మఫల త్యాగరూపమైన నివృత్తి గొప్పదా? ధనవాంఛ గొప్పదా? కర్మమార్గాన్ని అనుసరించేవారు అది గొప్పదని కొంతకాలం, కాదని కొంతకాలం భావిస్తారు. వాళ్ళు అల్పబుద్ధులు. శమ, దమ, త్యాగాది గుణాలు ఆనందహేతువులని జ్ఞానులు భావిస్తారు. వివేకవంతులు దానిని అంగీకరిస్తారు.

**దేవస్థానుడు (ముని)**: ధర్మరాజా! అర్జునుడు ధర్మంగా పలికాడు. యోగసిద్ధి పొందాలంటే మెట్లదారి నాశ్రయించాలి. ధనాన్ని భోగాలకొరకు ఆర్జిస్తే తప్పు. కాని, యజ్ఞం కొరకు చేస్తే బ్రహ్మప్రాప్తికి నిచ్చెనవలె తోడ్పడుతుంది. యజ్ఞంలో వాడిన ధనాన్ని వినియోగిస్తే శమదమాలు కలుగుతాయి. వాటివలన బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. అందువలన దక్షిణలు విరివిగా ఇచ్చే యజ్ఞాలు చేయుము. శివుడూ, బ్రహ్మ, దేవతలూ, మరుత్తులూ, చక్రవర్తులూ అందరూ భూమిని పాలిస్తూ యజ్ఞాలు చేసి రాణించారు. అరిషడ్వర్గాలను జయించి ప్రజలను కాపాడే రాజును సమస్త గుణాలూ తమంతట తామే వచ్చి చేరతాయని బృహస్పతి చెప్పాడు. కాబట్టి కులధర్మాన్ని కాపాడుకొంటూ భూమిని పాలించుము. పూర్వ చక్రవర్తులవలె గృహస్థాశ్రమాన్ని నిర్వహించి చివరకు జ్ఞానబోధతో వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించుము (ఈ మాటలు విని ధర్మరాజు నిర్వేదంలో మునిగిపోయాడు).

**అర్జునుడు** : ధర్మరాజా! రాజధర్మాన్ని అనుసరించి యుద్ధం చేశావు. శత్రువులను చంపావు. రాజనీతిలో పాపాలు చేయటం ఉండదని పెద్దలంటారు. శత్రువులు ఉత్తమలోకాలకు వెళ్ళారు. నీకు దానివలన పాపం లేదు. కాబట్టి ధర్మానుసారం రాజ్యాన్ని స్వీకరించి, సత్కార్యాలు చేయుము. (ఈ మాటలకు ధర్మరాజు మారుపలకకుండా ఉండిపోయాడు).

**వ్యాసమహర్షి** : ధర్మరాజా! అర్జునుడి మాటలు నిజాలు. గృహస్థ ధర్మంకంటె రాజులకు మరొక పరమధర్మం లేదు. పరిపాలనలో ప్రజలను రక్షించకుండా వదలివేయటం రాజుకు పాపహేతువు. రాజుకు దండనీతికంటె మించిన ధర్మం మరొకటి లేదు. సుద్యుమ్నుడనే రాజు దండనీతిని అనుష్ఠించటం వలననే మోక్షం పొందాడు (అని అతడి కథ చెప్పాడు). న్యాయశాస్త్రం బాగా తెలిసి, ప్రజల మనోభావాలను గమనించి, మంచి చెడ్డల తారతమ్యం పట్టిచూచి దండనీతిని పాటించే రాజుకు మేలు జరుగుతుంది. హయగ్రీవుడనే రాజు యుద్ధంచేసి విశాలమైన రాజ్యాన్ని స్వాధీనపరచుకొని, ప్రజలను పాలించి, యజ్ఞాలు చేసి క్రమంగా శరీరవ్యామోహం వదలి ఉత్తమలోకాలు పొందాడు. రాజులకు యుద్ధాలు హానికరం కావు. కాబట్టి హింసను గూర్చిన అనుమానం వదలి అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతులనే క్షత్రియోచిత ధర్మాలను నిర్వహించుము.

**ధర్మరాజు** : మహర్షీ! భర్తలను కోల్పోయిన మహిళలు కన్నీరు మున్నీరుగా విలపిస్తుంటే నాలో రగులుతున్న దుఃఖం నాకు కలత కలిగిస్తూ ఉంటే మనస్సు శాంతిగా ఎట్లా ఉంటుంది? నేను రాజ్యాన్ని ఎట్లా పాలించగలను?

**వ్యాసుడు** : చావుపుట్టుకలు, హానివృద్ధులు మొదలైనవన్నీ కాలానికి లోబడి ఉంటాయి. అందువలన నీవు బాధపడవలసిన అవసరం లేదు. పూర్వం సేనజిత్తు అనే రాజు పుత్రమరణంవలన మిక్కిలి బాధపడి ఆత్మబోధవలన తేరుకొని, తా నెరిగిన దానిని లోకానికి చెప్పాడు. (వ్యాసు డా వృత్తాంతాన్ని చెప్పాడు). కాబట్టి కులధర్మం అవశ్య కర్తవ్యం.

**ధర్మరాజు** : మహర్షీ! అభిమన్యుడినీ, ఉపపాండవులనూ, కర్ణుడినీ, విరాటుడినీ, ద్రుపదుడినీ, ధృష్టద్యుమ్నుడినీ, భీష్ముడినీ, ద్రోణుడినీ చంపి పొందిన ఈ రాజ్యం శోకాన్నే తప్ప నాకు సుఖాన్ని కలిగిస్తుందా? పుత్రశోకంతో కుమిలిపోయే ద్రౌపదిని చూడగలనా? (అని బంధుమరణ శోక వ్యాకులు డయ్యాడు).

**వ్యాసుడు** : ధర్మజా! లోకంలో పదార్థాలు పెరగటం విరగటం కొరకే. మిత్రకార్యాలు సుఖాన్నిస్తాయనీ, శత్రుకార్యాలు దుఃఖాన్ని కలిగిస్తాయనీ, ధనమే సమృద్ధికి కారణమనీ, ధనం భోగాలకు సాధనమనీ - అనుకొనటం విధివ్రాతను కాదనటమే. కాబట్టి నిన్ను బ్రహ్మ ఏ ధర్మాచరణం కొరకు సృష్టించాడో, దానిని నిర్వహించి ధర్మరాజువు కమ్ము (దీనికి ఉపబలకంగా అశ్మకుడు జనకమహారాజుకు చేసిన బోధలను వినిపించాడు). (అయినా ధర్మజుడు మారుపలకలేదు. అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు).

**అర్జునుడు** : కృష్ణా! బంధుమరణంవలన కలిగిన శోకం కారణంగా ధర్మరాజు వివేకం బాగా దెబ్బతిని, మనస్సు వికలమైంది. వాటిని నీ హితోక్తులతో తేరికొనేటట్లు చేయుము.

**శ్రీకృష్ణుడు** : ధర్మరాజా! నీ వంటివాడు బాధతో ఇట్లా క్రుంగిపోవటం న్యాయమా? రణరంగంలో కన్నుమూసిన వారందరూ స్వర్గస్థులయ్యారు. ఒకరాజులే ఏమిటి? భూమిమీద ఎవరు శాశ్వతంగా నిలిచారు? సృంజయుడనే రాజు పుత్రశోకంతో మనోవేదన పడుతుంటే నారదుడు ఓదారుస్తూ మహాత్ములైన షోడశచక్రవర్తులు కూడా చివరకు మట్టిలో కలిసిపోవలసి వచ్చిందని వివరించి చెప్పాడు. దానితోపాటు పర్వతనారదుల వృత్తాంతం, సువర్ణష్ఠీవి కథా వినిపించాడు.

**నారదుడు** :
‘ హరియుఁ బరాశరాత్మజుఁడు నాదరణాతిశయంబునన్ సవి
స్తరణ నుపన్యసించిన వచఃప్రకరంబు మహార్థగాథ; మి
ప్పరమహితోపదేశములు పాటిగఁబట్టి వసుంధరా ధురా
ధరణ మొనర్పు; మయ్యెడు నుదాత్తయశంబును ధర్మవృద్ధియున్’. **(శాంతి. 1.273)**

**వ్యాసుడు** : ప్రజారక్షణంకంటె ఉత్తమధర్మం రాజుకు మరొకటి లేదు. దానివలన బ్రాహ్మణుల వేదవిహిత కర్మలు మెరుగుగా ఉంటాయి. లేకపోతే పాడవుతాయి. వేదవిహిత కర్మలు బాగుంటే పుణ్యమూ, చెడిపోతే పాపమూ రాజుకు అధికంగా కలుగుతాయి. కనుక ప్రజారక్షణం చేయుము.

**ధర్మరాజు** : రాజ్యసంపాదన చేయాలనే కోరిక ఎక్కువై చంపకూడని వారిని ఎంతోమందిని చంపాను. అంతులేని ఆ క్రూరత్వం నా అంతరాత్మను తపింపచేస్తున్నది. అంతేకాని మీరంతా ఇంతగా చెప్పగా సందేహించటం మంచిదా?

**వ్యాసుడు** : ధర్మరాజా! మానవులు చేసే కర్మలన్నీ భగవంతుడి ఆజ్ఞమేరకే వర్తిస్తాయి. గొడ్డలితో చెట్టును నరికితే గొడ్డలికి పాపం వస్తుందా? అన్నింటినీ చేయించేవాడు భగవంతుడు. మానవుడు ఉపకరణం మాత్రమే. అందువలన మానవుడికి పాపమంటదు. అట్లే నీకూ. ఇష్టం లేకపోయినా తన కులానికి నిర్దేశించిన కర్మచేయటం ఉత్తమగతిని కలిగిస్తుంది. తనదికాని పని అంగీకరిస్తే పాపకారకమౌతుంది. కాబట్టి నీవు క్షత్రియ ధర్మాన్నే నిర్వర్తించుము. శత్రువులను చంపటం పాపమని నీ కనిపిస్తే దానికి తగిన పరిహారం చేసికొమ్ము. సంసారాన్ని వదలటం మంచిది కాదు. పై పెచ్చు అశుభం కూడా.

**ధర్మరాజు** : ఎందరో రాజులు, బంధువులు నా వలన చనిపోయారు. వారి భార్యలు కూడా ఆ మహాదుఃఖంతో చనిపోతే స్త్రీ హత్యాదోషం కూడా కలుగుతుంది. ఈ పాపం పోవాలంటే నే నేం చేయాలి? ఈ బాధతో భూభారాన్ని మోయటానికి ఎట్లా పూనుకొనగలను? ఘోరతపస్సు చేసి శరీరాన్ని వీడటం తప్ప నాకు మార్గాంతరం కనపడటం లేదు.

**వ్యాసుడు** : ధర్మరాజా! నీవు బాధపడకుము. యుద్ధంలో చనిపోయిన వారంతా రాజ్యంకొరకు, కీర్తికొరకు, అసూయతో యుద్ధంచేసి చనిపోయారు. వారు చేసిన పాపం నీ కంటదు. అంతేకాదు. వారి చావుకు వారి కర్మలే కారణం. ఆ కర్మలు నీకు తెలియవు. యముడికి తెలుసు. కాలం తీరితే చాలు యముడు చంపివేస్తాడు. దానికి నీవు కారణమని బాధపడటం వెర్రితనం. ఇది కారణంగా ఇల్లు వదలి పోతాననటం మరింత వెర్రితనం. కాలం ఆడించే బొమ్మలే

మానవులు. మరణించిన రాజుల రాజ్యాలను ధర్మబద్ధంగా వారి వారసులకు ఇచ్చివేయుము. సోదరులైన రాక్షసులను చంపిన ఇంద్రుడు పూజించబడుతున్నాడు కదా! నీ కిష్టమైతే ఆ ఇంద్రుడివలె యజ్ఞాలు ఆచరించుము. ముందుగా అశ్వమేధ యాగం చేయుము.

వ్యాసుడు చెప్పిన మాటలకు ధర్మరాజు మనసులో కలత దీరి సంతోషించాడు. పాపకర్మలను, వాటి పరిహారాలను గురించి వ్యాసుడిని అడిగాడు. ఆ ముని వివరంగా పేర్కొన్నాడు. అశ్వమేధయాగంలోని అవభృథ స్నానపు నీటిలో మునిగిన వారు కూడా పాపాలన్నీ పోగొట్టుకొని పవిత్రులౌతారు. అశ్వమేధయాగకర్త లోకపూజితు డౌతాడు.

**ధర్మరాజు** : ఏ విధంగా ధర్మమార్గాన్ని ఆధారం చేసికొని రాజ్యపాలన వ్యవహారాన్ని నిర్వర్తించి పాపం కలుగకుండా ఎట్లా నెగ్గగలనో తెలియజెప్పాలి. రాజధర్మాలు, వర్ణ ధర్మాలూ, ఆశ్రమధర్మాలూ, ఆపద్ధర్మాలు మొదలైన ధర్మాలనన్నిటిని తెలియచెప్పాలి. నాకు రాజ్యపాలనా, ధర్మాచరణా ఒకదాని కొకటి వ్యతిరేకమైనవిగా కనపడుతున్నాయి. దీనిని వివరించండి.

**వ్యాసుడు** : కురువంశంలోని వారందరికీ పెద్దదిక్కు భీష్ముడు. ఇంద్రాదులకు కూడా ఆయన పూజ్యుడు. చ్యవనాది మహర్షులవద్ద ధర్మబోధ పొందాడు. అతడికి ధర్మాలన్నీ కరతలామలకం వంటివి. ఉత్తమజ్ఞాని అయిన భీష్ముడు నీ వడిగిన అంశాలన్నీ వివరించగలడు. భీష్ముడు పై లోకాలకు వెళ్ళే సమయం సమీపిస్తున్నది. ఆలసించక నేను చెప్పినట్లు చేయుము.

**ధర్మరాజు** : ఎంతోమంది బంధువులను యుద్ధంలో చంపి మహాపాపం చేశాను. ఇప్పుడు ఆ మహాత్ముడి ఎదుటికి ఏ మొగంపెట్టుకొని పోయేది? ధర్మోపదేశం చేయుమని ఎట్లా అడిగేది?

**శ్రీకృష్ణుడు** : మహర్షి చెప్పిన మాట పాటించుము. నీకు మేలు కలుగుతుంది. ఏదయినా శోకంతో చేయట మెందుకు? ఇప్పుడు నగరానికి వెళ్ళి మరొకమారు వద్దాం పద! ప్రజలు నీ కొరకు మేఘం కొరకు చాతక పక్షులవలె ఎదురుచూస్తున్నారు. వారిని సంతోషపెట్టుము.

ధర్మరాజు సుముఖుడై పరివారం పరివేష్టించి రాగా చుక్కలలో చంద్రుడివలె వెలుగొందాడు. మరునాడు ఉదయం రథారూఢుడై కొలువుకూటానికి బయలుదేరాడు. ధర్మరాజు అధిరోహించిన రథానికి భీముడు సారథ్యం వహించాడు. అర్జునుడు వెల్లగొడుగు పట్టాడు. నకుల సహదేవులు వింజామరలు విసిరారు. పంచాగ్నులవలె పాండవులు ఆ రథంలో ప్రకాశించారు. మంగళవాద్యాలు సముద్రఘోషవలె మ్రోగాయి.

### 3. ధర్మజ పట్టాభిషేకం:

ధర్మరాజు హస్తినాపుర ప్రవేశయాత్ర మొదలయింది. గాంధారీ ధృతరాష్ట్రులు గొప్ప పల్లకీలో కూర్చుండి ముందుగా బయలుదేరారు. ఆ వెనుక ధర్మరాజు, ఆ వెనుక సాత్యకి శ్రీకృష్ణులు రథంలో సాగారు. ప్రక్కన ఒక రథంలో యుయుత్సుడూ, ఉచితవాహనాలలో కుంతీదేవ్యాదులను వెంటగొని విదురుడూ పయనమయ్యారు. రాజులందరూ సైన్యాలలో అన్నివైపులా పరివేష్టించి రాగా ధర్మరాజు యాత్ర సాగించాడు. పురం శోభాయమానంగా అలంకరించబడింది. అంగనలు పూలవాన కురిపించారు. ధర్మరాజును పౌరజనులు పలురకాలుగా కీర్తించారు. రాజపత్నులలో ద్రౌపదికి సాటి మరెవ్వరు లేరని పొగిడారు. నగరం చంద్రోదయ సమయంలోని సముద్రంవలె సంతోషంతో ఎగసిపడుతున్నది. ధర్మరాజు రాజప్రాసాదం వాకిలిని సమీపించాడు. బ్రాహ్మణులూ, స్త్రీలూ సమర్పించే మంగళద్రవ్యాలను ఆమోదించాడు. ముఖశాల దగ్గర దిగి ధౌమ్యధృతరాష్ట్రులు ముందు నడుస్తూ ఉండగా అంతఃపుర ప్రవేశానికి ఉపక్రమించాడు. ఇలవేల్పులను ముందుగా పూజించాడు. బయలు ప్రదేశానికి వచ్చి నగరదేవతలను

అర్చించటానికి తగిన వారిని నియోగించాడు. ఎన్నో దానధర్మాలు చేశాడు. బ్రాహ్మణాశీస్సులూ, మంగళవాద్యాలూ మారుమ్రోగాయి. ఆ తరువాత జనులందరూ నిశ్శబ్దంగా నిలబడి ధర్మరాజువైపు చూస్తున్నారు.

ఆ సమయంలో దుర్యోధనుడి మిత్రుడైన చార్వాకుడు బ్రాహ్మణుల మధ్యనుండి లేచి ఇట్లా అన్నాడు. 'ధర్మరాజా! బ్రాహ్మణులంతా కలిసి నన్ను పంపారు. ఘోరపాపం చేసిన ధర్మరాజు ఏమిరాజు? చంపేటప్పుడు తండ్రి, కొడుకు, సోదరుడు, గురువు, మిత్రుడు అని కూడా జంకలేదు. వీడిని తగలబెట్టినా తప్పులేదు. ఇట్లా మంచివారు ఏవగించుకునే ఆ రాజ్యం చేయటమెందుకు? బంధువధ చేసి ఎటువంటి భోగాలు అనుభవిస్తావు? నీవు మహాపాపివి' అన్నాడు. ఆ మాటలు విని బ్రాహ్మణులు కలవరపడ్డారు. ధర్మరాజు సిగ్గుతో తలవంచుకొన్నాడు. ధర్మరాజు నుదుటిపై చేతులు జోడించి 'నేను మునులందరిచేత ఆజ్ఞాపించబడి దృఢమైన నిర్ణయంతో వచ్చాను' అని ప్రకటించాడు. చార్వాకుడు తమ ప్రతినిధి కాడని బ్రాహ్మణులు పేర్కొన్నారు. ధర్మార్జితమైన రాజ్యం ధర్మజుడు కలకాలం అనుభవించగలుగుతాడని దీవించారు. దివ్యదృష్టితో ఆ చార్వాకుడిని గమనించి, దుర్యోధనుడి మిత్రుడిగా గుర్తించి, కంటిమంటలలో అతడిని పిడుగుపాటుకు పడిన వృక్షంవలె నేలగూలేటట్లు చేశారు. శ్రీకృష్ణుడు చార్వాకుడి శాపవృత్తాంతాన్ని చెప్పి, బ్రాహ్మణులను ప్రశంసించాడు. ధర్మరాజును పట్టాభిషేకానికి సిద్ధం కమ్మని పలికాడు.

పట్టాభిషేకానికి కావలసిన సంభారాలను సమాయత్తం చేయించారు. ఆరుబయట పెద్దకొలువు తీర్చారు. ధర్మరాజుకు ఎత్తైన బంగారపు సింహాసనాన్ని ఏర్పాటు చేశారు. మిగిలిన వారికి తగిన ఆసనాలను సమకూర్చారు. ధర్మరాజు తన మనస్సులో బాధనంతా దిగమ్రింగి, సంకల్పబలంతో తేరికొని, సింహాసనంమీద తూర్పు ముఖంగా ఆసీనుడయ్యాడు. ఆయనకు ఎదురుగా సాత్యకి సహిత శ్రీకృష్ణుడు బంగారు గద్దెపై కూర్చున్నాడు. భీమార్జునులు రత్నసింహాసనాలపై కుడిఎడమవైపులలోనూ, వెనుక ప్రక్క నకుల సహదేవులూ, మిగిలినవారు సముచిత స్థలాలలో, సముచిత ఆసనాలలో కూర్చున్నారు. పురప్రముఖులు కొలువుతీరారు. సభ చాల ప్రకాశించింది.

ధౌమ్యుడు ఈశాన్యదిక్కున పల్లంగా ఉన్నచోట వేదికను సిద్ధంచేశాడు. దానిమీద రత్నభద్ర పీఠాన్ని స్థాపించాడు. దానిమీద పులితోలు కప్పాడు. బంగారుదండలతో కూడుకొన్న శంఖాన్ని పవిత్రస్థలంలో నిలిపి పూజించాడు. దానిచుట్టూ మట్టి, బంగారు, వెండి, మణి కలశాలలో గంగాజలం నింపి, శుభద్రవ్యాలను అందులో ఉంచారు. మంత్రాలను పఠిస్తూ ధర్మరాజును భద్రపీఠంమీద కూర్చుండ బెట్టారు. మంగళాలంకార శోభిత అయిన ద్రౌపదిని ఆతడి ఎడమ ప్రక్కగా కూర్చుండబెట్టారు. ముందుంచిన అగ్నిలో దేవయజ్ఞ తంత్రం పూర్తి చేశారు. శుభసమయంలో శ్రీకృష్ణుడు అక్కడ పూజలో ఉన్న శంఖాన్ని తీసి 'ఈ భూమికి రాజువు కమ్ము' అని ప్రీతితో అభిషిక్తుడిని చేశాడు. ధృతరాష్ట్రాది ప్రముఖులందరూ ఆయాకలశాలలోని పవిత్ర జలాలతో ధర్మరాజును అభిషేకించారు. ధర్మరాజు చక్రవర్తి పదవిని స్వీకరించి యోగ్యులైన జనులకు అధిక సంపదలను దానాలు చేశాడు. ప్రజల ప్రశంసలకు కృతజ్ఞతలు చెప్పి, ధృతరాష్ట్రుడి పెద్దరికాన్ని పునరుద్ఘాటించాడు. ప్రజలనూ, ధృతరాష్ట్రాదులనూ సముచిత స్థలాలకు సాగనంపాడు. భీముడిని యువరాజుగా, షాడ్గుణ్య వివేకానికి విదురుడినీ, ఆదాయ వ్యయాలు తెలపటానికి సంజయుడినీ, సైన్యవ్యవహారాలు, జీతబత్యాలు చూడటానికి నకులుడినీ, శత్రురాజ్యాలను ఆక్రమించటానికి అర్జునుడినీ, పురోహిత కార్యాలకు ధౌమ్యుడినీ, రాజరక్షకుడిగా సహదేవుడినీ నియమించాడు.

ఆ తరువాత బ్రాహ్మణుల అనుమతితో మృత బంధువులందరికీ భక్తి ప్రపత్తులతో శ్రాద్ధకర్మలు నిర్వహించాడు. దుర్యోధనాదులకు ధృతరాష్ట్రుడిచేత శ్రాద్ధకర్మలు చేయించాడు. అన్నదానాలూ, జలదానాలూ, మణిదానాలూ చేశాడు. పితౄణం తీర్చికొని పరిశుద్ధుడయ్యాడు.

## 4. భీష్మ సందర్శనం:

ఒకనాడు ఉచిత సమయంలో శ్రీకృష్ణుడిని సందర్శించి వినయంతో నమస్కరించి ఇట్లా స్తుతించాడు. 'కృష్ణా! నీ అనుగ్రహం వలన వంశక్రమానుగతంగా పొందదగిన ప్రశస్త సామ్రాజ్యాన్ని నేను పొందగలిగాను ధన్యుడిని. విష్ణుదేవుడవైన నీవు మమ్ములను

బావలనీ, మరదులనీ పిలుస్తూ బంధుత్వాన్ని పాటిస్తూ, ప్రేమతో రక్షించావు. నీరక్షలో మేము భయంలేని జీవితం నడిపాము. నీ మహిమను కీర్తించటానికి మే మెంతవారం? నీవు సృష్టికి ఆద్యుడవని వేదాలు చెప్తున్నా, నీవు ఇటువంటివాడవని చెప్పలేకపోతున్నాయి. అవాఙ్మానసగోచరుడవైన నీ మహిమ తెలియటం సాధ్యంకాదు. నీ నామాలను భక్తితో కీర్తించే వారికి భోగాలనూ, మోక్షాన్నీ ప్రసాదించగలవు. నీ నామాలు అనంతాలు, నీ మహిమలు అమోఘాలు!' అని కీర్తించగా శ్రీకృష్ణుడు ధర్మరాజును గుణకీర్తనంతో అనుగ్రహించాడు. ఆ తరువాత కొలువు చాలించాడు.

అప్పుడు తమ్ములను చూచి, వా రిదివరలో పడిన కష్టాలను పేర్కొని, వారి కృషిని అభినందించి, రాజ్యాంగ సప్తకాన్ని రక్షిస్తూ రాజభోగాలను అనుభవించండని అనుమతించాడు. ధర్మరాజు దుర్యోధనుడి భవనం భీముడికి, దుశ్శాసనుడి మందిరం అర్జునుడికి, దుర్మర్షణుడి నివాసం నకులుడికి, దుర్ముఖుడి భవనం సహదేవుడికీ ఇచ్చి, యుయుత్సుడికీ, సంజయుడికీ, ధౌమ్యుడికీ వారి వారి గృహాలనే ఇచ్చాడు. శ్రీకృష్ణుడినీ, సాత్యకినీ అర్జునుడి గృహంలో విడిది చేయించాడు. అందరూ ఆనందంగా ఉన్నారు.

ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్ర విదురులకు రాజ్యాన్ని సమర్పించి, వారి అనుమతితో పరిపాలన సాగించసాగాడు. ఒకనాటి తెల్లవారుజామున శ్రీకృష్ణుడి విడిది మందిరానికి వెళ్ళి ఆతడి దివ్య మంగళవిగ్రహాన్ని దర్శించి, 'త్రిలోక వ్యాప్త విక్రముడవైన నీ కటాక్షంతోనే రాజ్యాన్ని పొంది త్రిలోక గౌరవాన్ని పొందాను' అంటూ సమీపించాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు ధ్యానమగ్నుడై ఉన్నాడు. ఆ పరిపూర్ణ ధ్యానస్థితికి ధర్మజుడు ఆశ్చర్యపడి, 'నిశ్చలదీప ప్రకాశంగా' నిలిచిన ఆ స్థితికి కారణ మేమిటని ప్రశ్నించాడు. శ్రీకృష్ణుడు ఆ సమాధి స్థితిని విరమించి సంభాషణ సాగించాడు.

**శ్రీకృష్ణుడు** : గంగాపుత్రుడైన భీష్ముడు సమాధిలో ఉండి నన్ను స్మరించాడు. నా మనస్సు అతడిలో లీనమయింది. నీ వా మహాత్ముడి వద్దకు వెళ్ళి సమస్త ధర్మాలను అడిగి తెలిసికొని సందేహనివృత్తిని చేసికొమ్ము.

**ధర్మరాజు** : నీవు ముందుండగా పితామహుడిని దర్శించాలని భావిస్తున్నాను. నీ సన్నిధి భీష్ముడికి కూడా ఆనందదాయకమౌతుంది. ఉత్తరాయణ పుణ్యకాలానికై ఎదురుచూస్తున్న భీష్ముడు పరబ్రహ్మ స్వరూపుడవైన నీ సన్నిధానాన్ని అభిలషిస్తూ ఉంటాడు. అతడిపై గల దయతో, నాపై ఉన్న ఆదరంతో భీష్ముడికి నీ దర్శనాన్ని కలిగించుము.

భీష్ము డాసమయంలో నవగ్రహాలచేత చుట్టబడిన చంద్రుడివలె నారదాది మహామునులు చుట్టూ పరివేష్టించి ఉండగా, అస్తమించబోతున్న సూర్యుడివలె ఉండి ఎలుగెత్తి విష్ణుసహస్ర నామస్తోత్రాన్ని పఠించాడు. చివరకు 'నమః కృష్ణాయ' అంటూ తలవంచి మ్రొక్కాడు. (భీష్ముడి స్తుతి స్తవరాజమనబడుతుంది. దీని పఠనంవలన సుగతి కలుగుతుంది.) ప్రశాంతాత్ముడై నిశ్శబ్దంగా ఉండిపోయాడు. మునులు భీష్ముడినీ, విష్ణుదేవుడినీ ప్రశంసించారు.

భీష్మస్తవాన్ని దివ్యశక్తితో స్వీకరించిన శ్రీకృష్ణుడు దయాంతఃకరణుడై శయ్యనుండి దిగి ధర్మజుడి వద్దకు వెళ్ళి, అతడిని ప్రబోధించి తన తమ్ముడైన సాత్యకితోనూ, భీమాదులతోను కలిసి భీష్ముడి వద్దకు రథాలపై పయనమయ్యారు. మార్గమధ్యంలో శమంత పంచకాలను చూచి శ్రీకృష్ణుడు ధర్మరాజుకు పరశురాముడి చరిత్రాన్ని విస్తరించి చెప్పాడు. ఓఘవతీ నదీ తీరంలో అంపశయ్యమీద పరుండి ఉన్న భీష్ముడిని అందరూ దర్శించారు, నమస్కరించి ఆతడి చుట్టూ కూర్చున్నారు.

### 5. శ్రీకృష్ణానుగ్రహం:

**శ్రీకృష్ణుడు** : మహానుభావా! నీ మనస్సు కలతలేకుండా ఉన్నదా? మానసిక బాధకంటె శరీరబాధ మిన్న అని అంటారు. శరీరంలో ఒక బాణమున్నా బాధిస్తుంది. కాగా, అనేక బాణాలు నాటిన నీ శరీరబాధను గురించి అడగాలా? ఇట్లా ఉన్న నీకు బాధ కలగలేదంటే దానికి నీ తండ్రి ఇచ్చిన వరమే కారణం. నీవు దేవతలకు సైతం ఉపదేశించగల సమర్థుడవు. మహర్షులవలె ద్వంద్వాతీతుడవు. బ్రహ్మచర్య దీక్షచేత మన్మథుడిని జయించినవాడవు, శరతల్పంమీద పడుకొని

స్వేచ్ఛామరణం ప్రకటించ గలిగిన వ్యక్తిని ముల్లోకాలలో ఎక్కడా ఇంతవరకు వినలేదు, కనలేదు. నీవు తపస్సంపన్నుడవు. లోకాలలోని సమస్త విషయాలను తెలిసికొన్న విజ్ఞుడవు. యుద్ధంలో చనిపోయిన బంధుమిత్రులను స్మరించి ధర్మరాజు శోకతప్తుడై ఉన్నాడు. నీ పుణ్యతమస్ఫుట వాక్యపద్ధతితో అతడి బాధను తొలగించుము. చతుర్వర్ణాల ప్రజలు చతురాశ్రమాలతో చేయవలసిన వేదవిహితమైన ధర్మాలన్నీ నీకు తెలుసును. ప్రవృత్తి నివృత్తి మార్గాలూ, సాంఖ్యయోగాలు, పురాణేతిహాసాలూ, ధర్మశాస్త్రాలూ నీకు కరతలామలకాలే. నీవు సర్వ సంశయాలను తీర్చగల సమర్థుడవు. నీవు ధర్మరాజును ఆదరించుము. నీవంటివారి సామర్థ్యం శోకమోహాలతో బాధపడే ప్రజలను తరింపచేయటమే ప్రయోజనం కదా!

**భీష్ముడు** : (కొద్దిగా కృష్ణుడివైపు ముఖం త్రిప్పి నమస్కరించి) లోకాలకు కర్తవు భర్తవు సంహర్తవు అయినవాడా! ఆశ్రితజనార్తి నిరాస నిపుణా! యోగీశ్వరా! కృష్ణా! నా కేది మేలో నీ మనస్సులో సంకల్పించుము.

**శ్రీకృష్ణుడు** : భీష్మతపస్స్వరూపుడా! నాయందు నీకెప్పుడూ అచంచలభక్తి నిలిచి ఉంటుంది. భక్తి ఆర్జవం కలిసి ఉన్న నీ హృదయంలో నా రూపు సదా ప్రత్యక్షమౌతుంది. నేటినుండి ఏబది ఆరు రోజులలో సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశిస్తాడు. నీవు మోక్షాన్ని పొందుతావు. నీవు లోకాంతరగతుడ వైతే ఈ లోకంలో జ్ఞానం మరుగైపోతుంది. నీవలన ధర్మవివేకాలతో కూడిన జ్ఞానాన్ని పొందటానికి వీరంతా వచ్చారు. వీరిలో ధర్మరాజుకు జ్ఞానోపదేశం చేయుము. పురుషార్థ వివేకాన్ని ప్రసాదించుము.

**భీష్ముడు** : సకలదైవ స్వరూపుడవైన శ్రీకృష్ణా! నీ తీయని మాటలు చెవులలో పడగానే అమృతరస ప్రవాహంవలె నాకు ఆనందాన్ని కలిగించాయి. వచోనైపుణ్యం నీ సొత్తు. నీ ముందు మాటలాడటం బ్రహ్మకు కూడా సాధ్యంకాదు. ఇక నేనెట్లా సమాధానా లిచ్చేది? విషాగ్నులతో దీటైన బాణాలు గ్రుచ్చుకొని నా దేహానికి కలిగిస్తున్న బాధ అపారం. మాటాడే శక్తి లేదు. దుర్బలత్వంతో నా నాలుక స్పష్టంగా పలుకలేకపోతున్నది. అందువలన నా అశక్తతకు మన్నించుము. ధర్మరాజుకు ఏది హితమో దానిని నీవే బోధించుము. నీ వుండగా నేను చెప్పటం గురు వుండగా శిష్యుడు చెప్పినట్లుంటుంది.

**శ్రీకృష్ణుడు** : భీష్మా! నీవు భగవత్తత్త్వవేదివి. కురువంశ భారం నీమీద ఆధారపడి ఉన్నది. నీకు మూడువరా లిస్తున్నాను. గుచ్చుకొన్న బాణాలవలన నీకు మూర్ఛగానీ, అలసటగానీ, నొప్పిగానీ కలుగకుండా సుఖాత్ముడవు ఔతావు. ఆకలిదప్పులు లేకుండా శక్తిమంతుడవుగా ఎల్లప్పుడూ ఉంటావు. సకలప్రాణుల వర్తనాలూ నీకు బుద్ధిగోచరమయి అతిశయజ్ఞానాన్ని కలిగిస్తాయి. వీటివలన కలిగే మహిమాతిశయంతో వర్ధిల్లుము.

వ్యాసాది మహర్షులందరూ శ్రీకృష్ణుడిని ప్రశంసించారు. దేవతలు పూలవాన కురిపించారు. సాయంకాలం కావటంచేత శ్రీకృష్ణాదులందరూ భీష్ముడికి నమస్కరించి మరునాడు ఉదయం తిరిగి వస్తామని చెప్పి హస్తినాపురానికి తిరిగి వెళ్ళారు. మరునాటి ఉదయం పెద్దలనూ పిన్నలనూ వెంటబెట్టుకొని ధర్మరాజు భీష్ముడిని దర్శించాడు. మహర్షి గణం వచ్చింది. 'నారదుడు సమస్త ధర్మపద్ధతులను అడిగి తెలిసికొనండి' అని అందరినీ ఉద్దేశించి చెప్పాడు. శ్రీకృష్ణుడు భీష్ముడిని అడిగి తెలిసికొనటానికి ధర్మరాజును మాత్రమే నిర్దేశించాడు. భీష్ముడి యోగక్షేమాలు కనుగొన్నాడు.

**భీష్ముడు** : కృష్ణా! నీవు దివ్యచిత్తంలో నన్ను భావించటంచేత నేను వృద్ధుడనైనా బాలుడివలెనయ్యాను. నీ ఆదేశానుసారం పాండవులకు చెప్పగోరినవన్నీ వివరించి చెప్పుతాను. అయినా పాండవులకు శుభప్రదమైన వాటిని నీ వెందుకు చెప్పవు? నీ అభిప్రాయ మేమిటి? చెప్పుము.

**శ్రీకృష్ణుడు** : భీష్మా! లోక శ్రేయస్సుకు, కీర్తికి నేనే మూలకారణం. అందులో సందేహం లేదు. ఇది నాకు వచ్చే క్రొత్తదైన కీర్తి కాదు. అత్యుత్తమ కీర్తి నీకు ప్రసాదించాలని నా జ్ఞానాన్ని నీ బుద్ధిలో ప్రవేశపెట్టుతున్నాను. నీ కీర్తి ఈ భూమి ఎంతకాలం ఉంటుందో అంతవరకు నశించకుండా ఉంటుంది. నీ మాటలన్నీ వేదాలతో సమానంగా గౌరవించబడతాయి. నీ వాక్య సముదాయాన్ని ధర్మరాజు వినటం ఉభయతారకం. చిరకీర్తి నీకు కలగాలని భావించి ఇట్లా చేశాను. నీ ధర్మ విజ్ఞాన వివేకం వలన పాండవులే కాక ఇక్కడ ఉన్న అందరూ కృతార్థు లౌతారు.

**భీష్ముడు** : తన జన్మకారణంగా మునీంద్రులందరికి మోక్షాన్ని కలిగించినవాడూ, భరతవంశీయులలో సాటిలేని వ్యక్తిత్వం కలవాడూ, సత్య, శౌచ, శాంతి, కాంతులకు ప్రకాశాన్ని కలిగించినవాడూ, పాత్రదానం, యజ్ఞాచరణం, బంధురక్షణం మొదలైన ఉత్తమ ధర్మాల నాచరించటంలో సంతోషాన్ని పొందేవాడూ, కామంవలన కాని, అర్థంవలన కాని, భయంవలన కాని అవినీతి మార్గంలో ప్రవేశించనివాడూ అయిన ఉత్తమగుణశోభితుడు ధర్మరాజు ఇక అడుగదలచుకొన్నవన్నీ అడుగవచ్చును.

**శ్రీకృష్ణుడు** : ధర్మరాజు యుద్ధంలో గురువులూ, బంధువులూ, మిత్రులూ అని లెక్కించక వాడి బాణాలతో అందరినీ సంహరించాడు. అనేకులు రణంలో నిహతులయ్యారు. అందువలన అతడు క్రూరుడని భావిస్తావేమో అని నీ ఎదుటపడటానికి భయపడుతున్నాడు.

**భీష్ముడు** : కృష్ణా! విద్యాబోధనం, దానాలిస్తూ యాగాలుచేయటం - బ్రాహ్మణులకు ఎట్లాగో, రాజులకు యుద్ధంచేయటం అట్లా సహజధర్మం. పాపవర్తనులు బంధువులైనా వారిని చంపటం రాజధర్మం. ధర్మాన్ని విడనాడి లోభగుణంతో అన్యాయమార్గవర్తులైనవారిని ఎవరినైనా యుద్ధంలో చంపటం పుణ్యకార్యమే. దుర్మార్గులను రణరంగంలో చంపి రక్తపుటేరులు పారించటం ధర్మపరుడైన రాజుకు అర్హమైన కార్యం.

ఆ మాటలు విని ధర్మరాజు చేతులు మోడ్చి నమస్కరించి, పాదాలకు తన తల తాకించి మ్రొక్కాడు. భీష్మ డాతడిని అభినందించి, అతడి తలను తనముఖానికి ఆనించి ప్రేమతో ఆఘ్రాణించి ఆదరించాడు. సంకోచం లేకుండా అడుగుమని కోరాడు. ధర్మరాజు శ్రీకృష్ణుడికి, పెద్దలకు, మునీంద్రులకు అభివాదనంచేసి, భీష్ముడికి ఎదురుగా కూర్చుండి ప్రశ్నించటం ప్రారంభించాడు.

## 6. ప్రశ్నోత్తర మాలిక:

ప్రశ్న 1. **ధర్మరాజు:** రాజు ధర్మస్వరూపు డని ధర్మవేత్త లంటారు. కాని, ధర్మ నిర్వహణం అతికష్ట సాధ్యమని భావిస్తాడు. కాబట్టి ముందుగా రాజధర్మరీతులను వినిపించుము (2.162).

**భీష్ముడు** : ధర్మరాజా! రాజధర్మాన్నీ చెప్పుతాను. ఆయా సందర్భాలలో ఆపద్ధర్మ, మోక్ష ధర్మాలను తెలియపరుస్తాను. రాజుకు దైవానుగ్రహం, పురుషయత్నం రెండూ కార్యసాధనకు కావాలి. దాంతీ, శాంతీ కలరాజు శ్రీమంతుడు, యశస్వి కాగలడు. సప్త ప్రకృతులను గుర్తించి సక్రమంగా నిర్వహించేటట్లు చేయాలి. బ్రాహ్మణులను నాశనం చేయదలిస్తే రాజే నశిస్తాడు. దోషంచేస్తే విప్రుడినైనా శిక్షించాలి. శాంతపరుడైన రాజును ప్రజలు ఆడిస్తారు. కోపిష్ఠి అయితే ప్రజలు కోపోద్రిక్తులౌతారు. సప్తరాజ్యాంగాలైన స్వామి, అమాత్యుడు, మిత్రుడు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం - అనే వాటికి వినాశకారి అయిన ఎవ్వడినైనా శిక్షించాలి. బృహస్పతి మరుత్తుడికి చెప్పిన నీతి వాక్యాలు స్మరించదగినవి. రాజు ఎవరినీ పూర్తిగా నమ్మరాదు. నమ్మకపోరాదు. ఏ అంశాన్నైనా ఉచితానుచితాలు తానే పరిశీలించి గ్రహించాలి. ప్రజారక్షణం చేయని రాజు అధ్యయనం చేయని ఋత్విజుడి వంటివాడు. శత్రుసంహారం అవశ్య రాజధర్మం. అల్పుడైన శత్రువు సైతం నిప్పువలె, విషంవలె నాశనంచేస్తాడు. కనుక ధీరుడైన రాజు శత్రుశేషం లేకుండా చేసికొనాలి. రాజ్యాన్ని రక్షించాలి.

**ప్రశ్న 2.** : పరాక్రమ తేజస్వి అయిన రాజు బుద్ధిమంతులైన ప్రజలను ఏవిధంగా వశంచేసికొంటాడు? సంరక్షిస్తాడు? నాశనంచేస్తాడు? విష్ణువుతో సమానంగా ఎట్లా గౌరవించబడతాడు? (2. 197).

**భీష్ముడు** : బ్రహ్మదేవుడు లోకంలో రక్షాస్థితి నేర్పరచటానికి సప్తసోపానాలు, దండనీతి ద్వాదశరాజమండలాలు, పంచోపాయాలు మొదలైనవాటిని, వాటి లక్షణాలను, అవి పురుషార్థకాలుగా ఉండేటట్లు, లక్ష అధ్యాయాల నీతిశాస్త్రాన్ని నిర్మించాడు. అది క్రమంగా మానవ లోకానికి అనుగుణంగా సంక్షిప్తం చేయబడింది. దానిని అభ్యసించి, ఆచరణలో పెట్టి, పెట్టించగలిగిన మానస పుత్రుడిని విష్ణువు సృష్టించాడు. అతడు విరజుడు. అతడు దండనీతిని పాటించటానికి భయపడ్డాడు. అతడి మనుమడు అనంగుడు దండనీతిని అమలుజరిపాడు. ఇట్లా రాజులలో కొందరు దండనీతిని పాటించక అసమర్థ లయ్యారు. పాటించి విష్ణుతేజులయ్యారు. ఆ వంశంలోనే వేనుడి చరిత్ర ప్రసిద్ధమైనది. వేనుడు ప్రజావిరుద్ధుడయ్యాడు. మునులు అతడిని మంత్రించి కుడితొడను మథించారు. నిషాదులు పుట్టి దండనీతి విరహితులయ్యారు. మరల కుడిబాహువు మథించారు. ఒక మహాపురుషుడు పుట్టాడు అతడిని దండనీతి ఆశ్రయించింది. అతడే వైన్యుడు. అతడు మునుల బోధ విన్నాడు. దురహంకారం, లోభం, కామక్రోధాలు అనే దుర్గుణాలను వదిలినవాడూ, సమస్త ప్రాణుల పట్ల సమభావంతో శాస్త్రసమ్మతంగా రాజధర్మాన్ని రక్షించేవాడూ, పక్షపాతం లేక కర్తవ్య పాలనం చేసేవాడూ, దండనీతిని అనుసరించి ధర్మసంరక్షణమే దైనందిన విధి అని నియమనిష్ఠలతో జీవించేవాడూ, వేదధర్మాన్ని రక్షించి, వర్ణసాంకర్యం పరిహరించి దయాంతఃకరణంతో ప్రజలను పాలించేవాడూ రాజు అనబడతాడు. ఆ ప్రతిజ్ఞను పాటించేవాడే పట్టాభిషేక యోగ్యుడు. అతడికి బ్రాహ్మణ సహాయ సహకారాలు అత్యవసరం. వైన్యుడు ఆ లక్షణాలన్నీ సాధించి సమస్త దేవతల యొక్క అనుగ్రహాన్ని పొందాడు. శాస్త్రోక్తంగా దండనీతితో ధర్మానురక్తుడై, సత్యవ్రతుడై, పరిపాలన సాగించాడు. అతడి సంతానం దండనీతిని అనుష్ఠించింది. శ్రీ మహావిష్ణువు ఫాలభాగంలో పుట్టిన లక్ష్మి ధర్మదేవుడి భార్య అయి, అర్థమనే పుత్రుడిని పొందింది. ఆ ముగ్గురూ రాజును ఆశ్రయిస్తారు. అందుకే రాజు, ఇతరులవంటివాడు కాక, విష్ణు సన్నిభుడుగా పరిగణించబడ్డాడు. వేదాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ, చతుర్వర్ణాలూ, చతురాశ్రమాలూ వాటి రక్షణా రాజాజ్ఞకు లోనై ఉంటాయి. రాజులు దేవతలతో సమానులని అందుకే అంటారు.

**ప్రశ్న 3.** : ధర్మరాజు - తాతా! నాలుగు వర్ణాలూ, నాలుగు ఆశ్రమాలూ, వాటిని ఆచరించే పద్ధతులూ వివరించి, రాజధర్మాలను విపులీకరించుము. (2.219).

**భీష్ముడు** : నాలుగు వర్ణాలవారికి సామాన్య గుణాలు - కోపంలేకుండా శాంతంగా ఉండటం, సత్యాన్నే చెప్పటం, స్వభార్యయందే రమించటం, పరిశుద్ధత, రహస్యగోపనం, ద్రోహచింతలేకపోవటం అనే ఉత్తమగుణాలు.

బ్రాహ్మణ లక్షణాలు:- ఇంద్రియ నిగ్రహం శ్రేష్ఠ ధర్మం, వేదాధ్యయనం నిత్యకృత్యం. వేద విహిత కర్మలు సదా నిష్ఠతో నిర్వహించాలి. సన్మార్గవర్తనం, దయాంతఃకరణం, శాంతస్వభావం, అధిక ధనం లభిస్తే తన సంతానానికి కాక అర్హులైన వారికి పంచిపెట్టటం అర్హ లక్షణాలు.

క్షత్రియ లక్షణాలు :- ఆజ్ఞాచరణం, దానకర్మ, వేదాధ్యయనం, దొంగలను (నేరగాళ్ళను) శిక్షించటం, ప్రజానురాగంతో పాలించటం, యుద్ధంలో ఓడిపోతానని భయం లేకుండా పరాక్రమించటం రాజధర్మాలు. వీటన్నింటిలో యుద్ధమనేది ఉత్తమ ధర్మం.

వైశ్యలక్షణాలు :- వేదాధ్యయనం, దాన యజ్ఞాచరణం, న్యాయార్జనం, పశుపాలనం.

శూద్రలక్షణం :- బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సముచిత రీతిలో పనులు చేస్తూ ఉండటం. రాజాజ్ఞతో ధనధాన్యాలు సమకూర్చుకొనాలి, రాజాజ్ఞ లేకుండానే దానధర్మాలు నిర్వహించవచ్చును. త్రివర్ణాలవారూ యజ్ఞకార్యాల్లో శ్రద్ధ కలిగి ఉండాలి. యజ్ఞకార్యం కర్మలన్నింటిలోనూశ్రేష్ఠం. యజ్ఞకర్త వర్ణాలవారందరి కంటె శ్రేష్ఠుడు.

**చతురాశ్రమ లక్షణాలు:**

బ్రహ్మచర్యాశ్రమం:- గురుసేవ, వేదాధ్యయనం, గోష్ఠులపట్ల, అలంకారాలపట్ల అనాసక్తి, భిక్షాన్నంతో జీవించటం, రాగ ద్వేషాలకు దూరమై సమభావంలో ఉండటం.

గృహస్థాశ్రమ ధర్మాలు: - స్వభార్యాసక్తి, దయ, సత్యనిష్ఠ, ఓర్పు, సజ్జనసాంగత్యం, దేవతల పితృదేవతల అతిథుల సమర్చనం, సమస్తాశ్రమ నిర్వాహకులను శక్త్యనుసారం పోషించటం.

వానప్రస్థాశ్రమ ధర్మాలు:- సంతానంపట్ల మమకారం వదలటం, తానొక్కడు గానీ, భార్యాసమేతంగా గానీ, ఘోరారణ్యానికి వెళ్ళటం, అభిమానాహంకారాలను వదలిపెట్టటం, జడలు ధరించి ఇంద్రియ నిగ్రహం పాటించటం, శాస్త్రాధ్యయనం చేయటం, జ్ఞానుల గోష్ఠిలో పాల్గొనటం.

సన్న్యాసాశ్రమ ధర్మాలు:- మమకార విరహితుడై ఎక్కడో ఒక్కచోట ఉంటూ, ఆకలైనప్పుడు ఏదో ఒకటి తింటూ, ఎక్కడ ఉన్నప్పుడు రాత్రి అవుతుందో అక్కడే పడుకొంటూ, అగ్నికార్యాలను త్యజించి నడుచుకొంటూ, తనంతటతాను ఏదీ కోరకుండా ఉంటూ, ఇంద్రియ నిగ్రహానికి ఉపకరించే పద్ధతులను మెచ్చుకొంటూ, నమస్కారాలను అంగీకరించకుండా ఉంటూ జీవితం గడపాలి.

చతుర్వర్ణాలవారెవరైనా ఈ నాలుగాశ్రమాలను చేపట్టవచ్చును. ఆశ్రమలక్షణాల కనుగుణంగా వర్తించవచ్చును. ధర్మాలన్నింటిలో రాజధర్మం శ్రేష్ఠమైనది. రాజంటే ధర్మదేవతే కాని వేరు కాదు. దీనికి ఉపబలకంగా మాంధాతృ చరిత్రాన్ని స్మరించవచ్చును.

ధర్మరాజా! కామక్రోధాలను దహించి, ఆశ్రమధర్మాలను రక్షిస్తూ, ప్రజలను దండనీతితో సమంగా కాపాడుతూ రాజ్యం చేయటం మంచిది. భిక్షాటన మొదలైన వాటివలన కలిగే మేలూ, శ్రేష్ఠమైన ధర్మాలవలన సమకూరే శ్రేయస్సు క్రమంగా రాజుకు లభిస్తాయి. రాజు 'నా శరీర రక్షణం ముఖ్యం' అనుకొనకుండా 'ప్రజారక్షణం కర్తవ్యం' అనే స్థిరసంకల్పంతో ఉండటంవలన సమస్త ధర్మనిర్వహణం వలన కలిగే ప్రయోజనాలన్నీ సిద్ధిస్తాయి.

**ప్రశ్న 4.** : రాష్ట్ర ప్రజలు ఏ కార్యాలు ఆచరిస్తే సుఖులౌతారు? (2.254).

**భీష్ముడు** : ధర్మరాజా! ఉత్తమగుణ విలసితుడైన రాజును అభిషేకించుకొని, ఆ రాజు మూలాన సమస్త కార్యాలను నిర్వర్తింపజేసికొంటూ ప్రజలు మిక్కిలి సుఖిస్తారు. రాజ్యపాలనం లేకపోతే ప్రజలు దుర్మార్గవర్తనులై పరస్పరం భార్యలను, సంపదలను దొంగిలించటం ప్రారంభిస్తారు. పెద్ద చేపలు చిన్న చేపలను మ్రింగినట్లుగా, బలవంతులు బలహీనులను బలిగొంటారు (హింసిస్తారు). రాజు లేకుండా ప్రజలు జీవించలేరు. వ్యవసాయం, వర్తకం, గోరక్షణం మొదలైన జీవనోపాధి మార్గాలు ధ్వంసమౌతాయి. దీనికి మనువు చరిత్ర దృష్టాంతం. ప్రజలు గౌరవించని ప్రభువును శత్రువులు లెక్కచేయరు. రాజు ప్రజలను తండ్రిగా కాపాడాలి. విరోధిజనభయంకరుడుగా ప్రకాశించాలి. అప్పుడే గౌరవం.

**ప్రశ్న 5** : రాజు రక్షకుడే కాక దైవస్వరూపుడనే అంశం మరింత ధ్రువీకరించుము. (2. 264).

ఉత్తరం : బృహస్పతి వసునందనుడనే రాజుకు చెప్పిన రాజధర్మ ప్రకారం మరికొన్ని విశేషాలను వెల్లడిస్తుంది. వాటిల్లో కొన్ని- రాజులేకపోతే నీరు ఎండిపోయిన మడుగులో జలచరాలవలె ప్రజలు ఇక్కట్ల పాలౌతారు. రాజు లేని రాజ్యంలో ప్రజలు భయాందోళనలకు గురి అయి, హాహాకారాలు చేస్తూ తల్లడిల్లిపోతారు. రాజు లేకపోతే బంధుమిత్రులు లేనట్లే, రాజు ఉంటే సంపద, సంరక్షణ ఉన్నట్లే. రాజు చారచక్షువు. లోకాన్ని రక్షించేటప్పుడు సూర్యుడు. దుష్టులను సంహరించటంలో యముడు. కాబట్టి రాజు దైవస్వరూపుడు. ప్రజలు రాజుకు శరీరంవంటివారు. ప్రజలకు రాజు ఆత్మవంటివాడు. అందుచేత రాజు ప్రజలను సంరక్షించటంలోనూ, ప్రజలు రాజును సేవించటంలోనూ పరస్పరం విధ్యుక్త ధర్మాలను నెరవేరుస్తూ ప్రకాశించాలి.

ప్రశ్న 6 : రాజు గ్రామీణ ప్రజలను ఎట్లా పాలించాలి? శత్రుసంహారం ఎట్లా చేయాలి? (2. 275).

**ఉత్తరం** : రాజు మొట్టమొదట తనను తాను జయించుకొనాలి. అంటే ఇంద్రియ నిగ్రహం సాధించాలి. రాజు ఆ తరువాత శత్రువులను జయించాలి. రాజు తిరిగే చోట్లలో భద్రత కలిగించాలి. గూఢచారులతో శత్రు మిత్ర రహస్యాలను తెలిసికొని తగినట్లు వ్యవహరించాలి. తాను బలహీనుడని శత్రువులు గ్రహించకముందే, తనకంటె బలవంతుడైన శత్రువుతో వెంటనే సంధిచేసికొనాలి. చివరకు శత్రువును ధనమిచ్చి అయినాసరే తన రాజ్యాన్ని రక్షించుకొనాలి. శత్రువు మైమరచి ఉన్నప్పుడు దండెత్తాలి, లేదా సంక్షోభం కలిగించాలి. అనవసరంగా యుద్ధానికి దిగరాదు. ఒకవేళ యుద్ధమే అవసరమైతే సామదానభేదాలు విఫలమైనప్పుడే యుద్ధం ప్రకటించాలి.

స్వామి, అమాత్యుడు, జనపదం, ధనాగారం, సైన్యం, మిత్రులు, దుర్గం - అనే రాజ్యాంగ సప్తకాన్ని పరిశీలించాలి. సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సమాశ్రయం - అనే ఆరు రాజ్యతంత్రాలను రాజనీతితో నిర్వర్తిస్తూ ధర్మార్థకామాలను నిర్వర్తించాలి. మంత్రం, ప్రభువు, ఉత్సాహం అనే శక్తిత్రయాన్ని స్వాధీనం చేసికొని గుణత్రయంతో ధర్మానుగుణమైన సేవ చేయటం రాజనీతి.

ప్రశ్న 7 : రాజూ, దండనీతి - ఈ రెండూ కార్యసిద్ధి కలిగించే పద్ధతులు చెప్పుము. (2. 286).

**ఉత్తరం** : ధర్మరాజా! ఆయాయుగాలలో రాజనీతిని బట్టి ధర్మం కొనసాగుతుంది. కృతయుగంలో వలె రాజు ధర్మాన్ని మూడు పాదాల నిర్వహిస్తే, అదే రీతిగా ధర్మం అభివృద్ధి చెందుతుంది. లేని పక్షంలో - అంటే త్రేతా ద్వాపర కలియుగాలలో వలె క్రమంగా రాజు అనుసరించే దండనీతి ప్రకారం ధర్మం నశిస్తూ ఉంటుంది.

ప్రశ్న 8 : ఎటువంటి నడవడి కల రాజుకు శుభాలు కలుగుతాయి? (2. 295)

**ఉత్తరం** : ప్రజల తప్పులను పరిశీలించేవాడూ, ప్రజలు చేసిన పనులను గుర్తించేవాడూ, మదం, లోభం, ఆవేశం లేనివాడూ, దొంగ కానివాడూ, ఆత్మస్తుతి విముఖుడూ, నియమబద్ధమైన జీవితం గడిపేవాడూ, దానశీలి, పరాక్రమవంతుడు, నిగర్వి, కుత్సితుడు కానివాడు, పరస్త్రీ విముఖుడు, క్రోధరహితుడు అయిన రాజు మిక్కిలి ప్రకాశిస్తాడు. తోటమాలి కావలసిన పుష్పఫలాలను కోసుకొన్నట్లు రాజు కూడా జాగరూకుడై కప్పాలను గ్రహించాలి. అట్లాకాక ఫలపుష్పాల నిచ్చే చెట్లను నరికీ తగలబెట్టి బొగ్గులుగా మారిస్తే భూమి నాశనమౌతుంది. కాబట్టి తోటమాలివలె రాజు జాగరూకుడై ప్రజలను సంరక్షిస్తూ కప్పం గ్రహించేవాడికి మేలు కలుగుతుంది. ప్రజలను రక్షించటమే రాజుకు ప్రధాన ధర్మం. తపోయాగకర్మల కంటె అది ఉత్తమం. ప్రజారక్ష చేసే రాజుకు విజయంతో పాటు సంపద, కీర్తి ఉత్తమ గతులు లభిస్తాయి. (దీనికి ఉపబలకంగా భీష్ముడు పురూరవుడికి వాయుదేవుడు చెప్పిన రాజధర్మాలను కూడా తెలిపాడు).

**ప్రశ్న 9** : ఏ పనులు చేస్తే పురోహితుడు మాన్యుడౌతాడు? (2. 304).

**ఉత్తరం** : పురోహితుడి విషయంలో శుక్రుడి వాక్యాలు కొన్ని వినుము. పురోహితుడి బుద్ధిబలంచేత నిర్వహించబడే యజ్ఞయాగాదులవలన రాజు అమర, గరుడ, గంధర్వ, విద్యాధరులు మొదలైన సమస్త దేవలోక వాసులకు సంతృప్తి కలిగించి శుభపరంపరలను పొందుతాడు. శాంతి పౌష్టిక కార్యాలూ, శత్రువినాశనమూ మంత్రవేత్త అయిన ఉత్తమ పురోహితుడి వలననే సాధ్యమని బృహస్పతి సైతం పేర్కొన్నాడు. బ్రాహ్మణ క్షత్రియులు అన్యోన్యులై అనుకూలంగా సరైన మార్గంలో రాజ్యకార్యకలాపాలు నిర్వర్తిస్తే బ్రహ్మాది దేవతలూ, బ్రాహ్మణాది సమస్త వర్ణాలవారూ మిక్కిలి సంతోషిస్తారు. ఈ అంశానికి ఉపబలకంగా ఐలుడికీ కశ్యపప్రజాపతికీ మధ్య సాగిన సంభాషణమనే ఇతిహాసం వినదగింది, అంతేకాక కుబేరుడికీ ముచుకుందుడికీ సాగిన సంవాదం స్మరించతగింది.

**ప్రశ్న 10** : రాజ ధర్మాలలో పరమ సంపదనూ, పుణ్యలోక ప్రాప్తినీ ప్రసాదించగల ధర్మమేది? (2. 326).

**ఉత్తరం** : ధర్మరాజా! అత్యంతభీతులైన ఉత్తమ జనులకు అభయమిచ్చి, వారికి సమస్త సుఖాలు ప్రాప్తింపజేసి, సంతోషాంత రంగులను చేయటంకంటె పుణ్యలోకప్రాప్తిని కలిగించే ధర్మం మరొకటి లేదు.

**ప్రశ్న 11** : బ్రాహ్మణాది వర్ణాలవారు తమతమ వర్ణధర్మాలను తప్పితే ఏ మౌతుంది? (2. 330).

**ఉత్తరం** : ఆపద సమయాలలో ఆయా వర్ణాలవారు స్వజాతి ధర్మాలను వదలినా నిందార్హులుకారు. శస్త్రోపజీవులైన రాజులు ఆచరించే ధర్మాలను బ్రాహ్మణులు ఆచరించి, బ్రాహ్మణ్యాన్ని కోల్పోయి, రాజుతో సమానులౌతారు. నిత్యకృత్యాలైన అగ్నిష్టోమాది కార్యాలను వదలిపెట్టి ధనలోభులై శూద్రులవలె ప్రవర్తించి శూద్రులతో సమానులౌతారు. అట్లాగే ఇతర వర్ణాలవారు తమతమ ధర్మాలను వదలిపెట్టి ఇతర ధర్మాచరణంచేత తమ వర్ణాలకంటె హీనులైన వారౌతారు. అట్లాంటివారు ఉత్తమ కార్యాలను ఆచరించటానికి అర్హులు కారు. ఈ అంశాలను రాజు జాగరూకుడై గుర్తించి, ఆయా వర్ణాలవారిని తగిన రీతిలో సంరక్షించటం రాజుకు ఉత్తమ ధర్మం. ప్రజలు ధర్మాచరణంవలన సంపాదించుకొనే పుణ్యంలో రక్షకుడైన రాజుకు నాలుగవవంతు వస్తుంది. పాపంలోకూడా అంతే. కొందరు ప్రజల పాపమంతా రాజుకు దక్కుతుందంటారు.

**ప్రశ్న 12** : ఓ తాతా! అనేక పాపాలకు ఆకరమైన రాజ్యభారాన్ని అంగీకరించలేను. దండనీతి ప్రయోగం మిక్కిలి కఠినమైనది. దానిని నేను నిర్వహించలేను. ప్రశాంతమైన తపోవనంలో ముక్కుమూసికొని జీవించాలని కోరుకొంటున్నాను. (2. 333).

**ఉత్తరం** : ధర్మరాజా! ఇది నీలోని జడత్వమే కాని వేరు కాదు. కాకపోతే ఇది క్షత్రియ ధర్మమా? నీ మనసు మిక్కిలి మెత్తనిదని నాకు తెలుసు. అయినా రాజు కుండవలసిన లక్షణమా ఇది? నీకు నచ్చచెప్పటానికి నీ తండ్రి పాండురాజుగానీ, విచిత్రవీర్య శంతను మహారాజులుగానీ ఇప్పుడు లేరు కదా! వారు చెప్పితేనన్నా వింటావేమో? వారందరూ క్షత్రియోచిత ధర్మపాలన చేశారు. దండనీతితో రాజ్యం పాలించారు. ఆ పూర్వరాజుల సంప్రదాయాన్ని పాటించటం నీకూ ధర్మమే. రాజధర్మాలు చేయకుండా మానితే నరకప్రాప్తి తప్పదు. రాజధర్మం నిర్వహిస్తే ఇహపరసుఖాలు లభిస్తాయి. దీనిని తేటపరిచే కేకయరాజ రాక్షస సంవాదమనే ఇతిహాసం తప్పక విని దాని తాత్పర్యాన్ని గ్రహించి ఆచరించాలి.

**ప్రశ్న 13** : జీవనం కొనసాగించటం కష్టమైనప్పుడు క్షత్రియోచిత కర్మానుష్ఠానం నెరపలేని బ్రాహ్మణుడు ఎట్లా జీవించాలి? (2. 343).

**ఉత్తరం** : బ్రాహ్మణుడు తన వృత్తిలో జీవించలేనప్పుడు ఆపద్ధర్మంగా వైశ్యవృత్తిని స్వీకరించి జీవించవచ్చును. అయితే అధిక ధనం లభిస్తుందన్న ఆశతో ఉప్పు, నువ్వులు, మాంసం, గోవులు, ఎద్దులు, అన్నం, కల్లు, నేయి, నూనె, తేనె, గుర్రాలు మొదలైనవి అమ్మరాదు.

**ప్రశ్న 14** : యజ్ఞాలు ఏవిధంగా పవిత్రాలు (సత్యసమ్మతాలు- సమీచీనాలు) ఔతాయి? (2. 345)

**ఉత్తరం** : యజ్ఞకర్తకు శ్రద్ధ అత్యంతావశ్యకం. బూటకాలు పనికిరావు. వేదాలను అవమానించి తిరస్కరించరాదు. అంతేకాదు. యజ్ఞాలలో ఋత్విజుల కిచ్చే భూరిదక్షిణలు వేదమంత్రార్థాలకు మిక్కిలి పుష్టిని, తుష్టిని చేకూరుస్తాయి అని పెద్ద లంటారు.

**ప్రశ్న 15** : నమ్మకమైన స్నేహితులు లేకపోతే రాజకార్యం నీతిమార్గంలో సాగటం కష్టం. ఎట్లాంటివాడిపట్ల మిక్కిలి నమ్మకం కలిగి ఉండాలి? (2. 350).

**ఉత్తరం** : నమ్మకపోవటం మృత్యుసమానం. అతిగా నమ్మటం అపమృత్యువువంటిది. కాబట్టి నమ్మీ నమ్మక పనులు సాధించాలి. ఎల్లప్పుడూ సూక్ష్మబుద్ధితో మిత్రుల వర్తనలను సమీక్షించుకొంటూ ఉండాలి. ఈ అంశంలో కాలక వృక్షీయ క్షేమదర్శుల సంవాదమనే ఇతిహాసం ప్రసిద్ధం.

**ప్రశ్న 16** : మంత్రి ఎటువంటి వాడుగా ఉండాలి? (2. 368).

**ఉత్తరం** : జ్ఞానధనుడూ, పౌరజానపదులకు ఆప్తుడూ, కార్యవేత్తా, ధైర్యపరాక్రమాలలో గొప్పవాడూ, క్రౌర్యంలేనివాడు, పరిశుద్ధాత్ముడూ, రాజుపట్ల భక్తి గౌరవాతిశయాలతో సుఖదుఃఖాలను సమంగా స్వీకరించగలవాడై, చెమటను రక్తంగా భావించి, తెలియక తనపై దోషారోపణ చేసినా, కోపంతో దూషించినా, ఏ మాత్రం కలత చెందక, అనునయంతో రాజుపొందు చెడకుండా మసలుకొనగలిగినవాడూ, తమదోషాలను కప్పిపుచ్చుతూ, శత్రువుల లోపాలను గుర్తించి వాళ్ళను చిక్కులపాలు చేయగల నైపుణ్యం కలవాడూ అయిన విశాలబుద్ధి మంత్రిగా ఉండటానికి అర్హుడు.

**ప్రశ్న 17** : ప్రజలలో కలిగే వివాదాలలో తీర్పుచెప్పేటప్పుడు రాజునకు ఎట్లాంటి నిందా, పాపం సోకకుండా ఉండేమార్గం ఏది? (2. 373).

**ఉత్తరం** : రాజుకు వ్యవహార శుద్ధి అవసరం. అది ప్రజల మన్ననలను పొందుతుంది. నిత్యసత్య వచనులూ, ధర్మాత్ములూ అయిన బ్రాహ్మణులూ, రాజూ కలిసి సమభావంతో ప్రజల వివాదాలు తీర్చేటప్పుడు, ఇరుపక్షాలవారి వాదాలనూ పక్షపాతం లేకుండా విని, ధనాశతో ధనవంతులవైపు మొగ్గకుండా, న్యాయమైన తీర్పు చెప్పి, శిక్షించవలసి వచ్చినప్పుడు ఉచితమైన శిక్ష విధించాలి. పక్షపాతబుద్ధితో తీర్పు చెప్పితే డేగను చూచిన పక్షులు చెల్లాచెదరై పోయినట్లు ప్రజలు రాజాశ్రయానికి దూరమౌతారు.

**ప్రశ్న 18** : రాజధాని ఏ తీరులో ఉంటే మంచిది? (2. 382).

**ఉత్తరం** : విశాలమూ లోతూ అయిన అగడ్తతో, పొడవూ దిట్టమూ అయిన కోటను కలిగి, కోటకు తగిన ద్వారాలు కలిగి, వాటికి గట్టి కాపలాతో మనోహరమైన భవన సముదాయమూ, వీథులు, అంగళ్ళూ, వివిధ వస్తువులు శోభిల్లుతూ ఉండగా, సజ్జన సమూహంతో నిండి ఉండగా, వివిధ ధాన్యరాశులూ, రసద్రవ్యాలూ, పలు యంత్రాలూ, తగిన ఆయుధాలూ, మేటి యోధులూ, ఉత్తమ విద్వాంసులూ, విలాసినీమణులూ, దూతలూ మొదలైన పరివారాలూ నిండి ఉండగా

ఉత్సవాలూ, పండుగలూ, పబ్బాలూ వైభవంగా జరుగుతూ ఉంటే రాజధాని రాణిస్తుంది. అందులో నవరత్నాలు, బంగారంవంటి విలువగల వస్తువులకు, బంధువులకు నగరం సురక్షిత కోశంవలె ఉండాలి.

**ప్రశ్న 19** : కోశాభివృద్ధిని కలిగించే మార్గాలు తెలుపుము.? (2. 390).

**ఉత్తరం** : రాజుకు ధనం సమకూర్చుకొనటంలో కృషీవలులు, వర్తకులు, గోపాలురు ముఖ్యమైన వనరులు. ధనధాన్యాలను ఉత్పత్తి చేసే స్థానాలకు ఏ మాత్రం భంగం కలుగని విధంగా మిక్కిలి నైపుణ్యంతో రాజు కోశాభివృద్ధిని సాధించాలి. ఆకలితో ఉన్న పులి తన పిల్లలను తానే తిన్నట్లుగా రాజు ధనాశతో ప్రజలనుండి పన్నులు వసూలుచేస్తే ప్రజాగ్రహంతో కోశాభివృద్ధి దెబ్బతింటుంది. ప్రజలకు బాధ కలుగకుండా జలగ నెత్తురు పీల్చినట్లు పన్నులు వసూలు చేయాలి. రాజు ధనసంపాదనకు ఉచితమైన మార్గాలను అన్వేషించాలి. అంతేకాని, కపటోపాయాలతో నైపుణ్యం ప్రదర్శించటం సమంజసం కాదు. ఈ రంగంలో పూర్వం ఉతథ్యుడు మాంధాతకు చెప్పిన హితవాక్యాలు తెలిసికొనదగినవి.

**ప్రశ్న 20** : ధర్మమార్గానువర్తనంతో ఏ రీతి ప్రఖ్యాతిని పొందవచ్చును? (2. 407)

**ఉత్తరం** : పూర్వం వసుమను డనే కోసలరాజు ఇదేవిధంగా అడుగగా వామదేవమహర్షి చెప్పిన వాక్యాలే నీ ప్రశ్నకు తగిన ప్రత్యుత్తరమౌతుంది. ఆ వాక్యాల తాత్పర్య మేమంటే - ధనం కూడబెట్టటమే లక్ష్యంగా భావించి ధర్మాన్ని లెక్కచేయకపోతే, ఆ రాజు సంపాదించిన ధనం నాశనం కావటమే కాక, అతడికి దుష్కీర్తీ, నరకప్రాప్తీ సంభవిస్తాయి.

**ప్రశ్న 21** : శత్రువులను జయించే సందర్భంలో యుద్ధనీతి ఎట్లా ఉండాలి? (2. 419).

**ఉత్తరం** : ధర్మరాజా! యుద్ధంలో శత్రువు సైన్యాలతో సిద్ధమై ఎదుర్కొంటే, నీవూ సైన్యంతో ఎదిరించాలి. శత్రువు ఎక్కటి కయ్యానికి సిద్ధమైతే నీవూ అసహాయశూరుడవై యుద్ధం చేయాలి. మాయోపాయాలతో శత్రువు యుద్ధం చేయటం ప్రారంభిస్తే నీవూ కపటోపాయాలతో ఎదిరించి విజయాన్ని సాధించాలి. వెన్నిచ్చి పారిపోయినా, ఏమరుపాటున పడిపోయినా, ఆయుధం భగ్నమైనా, శరణువేడుకొన్నా, మ్రొక్కినా, గుర్రాలు నేలపై కూలినా, పారిపోయినా, వేరొకడితో యుద్ధం చేస్తున్నా ఎట్లాంటి శత్రువునైనా చంపరాదు. అధర్మంగా శత్రువును చంపటం కంటె ధర్మయుద్ధ విహారంలో చావటం మంచిది. రాజు పడకమీద మరణించటం పనికిరాదు. అందుకని యుద్ధంలో ఓడిపోరాదు. శత్రువుపై దండెత్తిపోయి అతడి పట్టణాన్ని నాశనం చేసేటప్పుడు ప్రజలను మాత్సర్యంతో బాధించరాదు. కొల్లగొట్టేటప్పుడు బ్రాహ్మణగృహాలను, దేవాలయాలను దోచుకొనరాదు.

**ప్రశ్న 22** : తాతా! రాజధర్మంకంటె పాపకార్యం మరొకటి లేదనిపిస్తున్నది. ఎట్లా చూచినా 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అని తేలుతున్నది. ఏమంటావు? (2. 425).

**ఉత్తరం** : శరణాగతులను సంరక్షించి, యుద్ధంలో శత్రువుల బాధలకు గురి అయిన వారిని తెచ్చి. వారికి తగిన సేవలు చేసి, బ్రాహ్మణులను పోషించి, అనేక యజ్ఞాలను నిర్వహించి, రాజు పాపాలను పరిహరించుకొనవచ్చును.

**ప్రశ్న 23** : యుద్ధంలో వెనుదీయక పరాక్రమాలను ప్రదర్శించి ప్రాణాలను కోల్పోయిన వారికి ఎట్లాంటి లోకాలు కలుగుతాయి? (2. 427)

**ఉత్తరం** : నీ ప్రశ్నకు సమాధానంగా ఇంద్రాంబరీష సంవాదం చెప్పుతాను అందులోని ముఖ్యాంశాలు - ఎన్ని యజ్ఞయాగాదులైనా యుద్ధయజ్ఞానికి సమానం కావు. వీరుల తలలరాశులే వేదికగా, ఖడ్గబాణాది సాధనాలు సమిధలుగా, రక్తమే నేయిగా, మాంసం పురోడాశంగా, వీరమనే వ్రతం పూనిన వాడు యుద్ధమనే యజ్ఞాన్ని

సలిపి, రక్తమనే జలంతో కూడిందీ, మెదళ్ళనే బురద కలిగిందీ, వెంట్రుకలనే పాచి కలదీ, పేగులనే నురుగుకలదీ, యుద్ధభేరులనే కప్పలు కలదీ, ఖడ్గాలనే చేపలు కలదీ, ఏనుగుల మృతకళేబరాలనే ఇసుక దిబ్బలు కలదీ అయిన స్వర్గగంగలో అవభృథస్నానం చేసినా స్వర్గలోకంలో శాశ్వత పదవిని పొందగలుగుతారు. పుణ్యాత్ముడు కావటానికి యజ్ఞాలు చేయనక్కరలేదు. యుద్ధంలో సాహసోపేతంగా పోరాడటమే చాలు. ఇది యుద్ధాచరణం వలన కలిగే పుణ్యం.

**ప్రశ్న 24** : పోరుకు పోవటానికి వీలైన కాలనిరూపణం మొదలైన ఉపాయాలను తెలియచెప్పుము. (3.2)

**ఉత్తరం** : వానలు పడేటప్పుడు, చలిలో వణికేటప్పుడు, బాగా ఎండలు కాసేటప్పుడు కాక, పంటలు పండేకాలంలో శత్రువులపైకి దండెత్తిపోవాలి. పచ్చికా, కట్టెలూ, నీళ్ళూ దొరికే త్రోవలో దండును నడిపించుకొని పోవటం మంచిది. పగవారు కలవరపడేటట్లు జెండాలూ, కవచాలూ, డాళ్ళూ, ధనుస్సులూ మొదలైన ఆయుధాలనూ, రథాల, ఏనుగుల, గుర్రాల వాహనాలను ఇంతకుముందు కనీవినీ ఎరుగని రీతిలో అమర్చుకొనాలి. హోరెత్తించే మంచి శంఖాలూ, మంచి బాకాలూ, మంచి డప్పులు మొదలైన చర్మవాద్యాలూ ఉండటం మంచిది. సైన్యం బసచేసేచోటు సమతల ప్రదేశంగా ఉండాలి. చారులను పంపించి విరోధుల మార్గాలను గూర్చి తెలిసికొనాలి. అప్పటికే వారు దండెత్తి వస్తుంటే కాలుమోపటానికి వీలులేని త్రోవలలో కాని, అలసిన సమయాలలోకాని, దండు విడిసినప్పుడు గానీ వాళ్ళను చంపటం తగిన పద్ధతి.

**ప్రశ్న 25** : యుద్ధభటులుగా ఎట్లాంటి వారు ఉండాలి? (3. 9).

**ఉత్తరం** : ఏనుగు వంటి బలం, పులిసింహాలవంటి భీకరత్వం, చాకచక్యం గలవారు భటులుగా ఉండాలి. ఆయాదేశాలకు చెందిన వీరుల ప్రత్యేకతలను బట్టి వారిని సేనలో చేర్చుకొని ఆయా రంగాలలో ఉపయోగించుకొనాలి. ఉదాహరణకు గాంధార సింధుదేశీయులు గొడ్డళ్ళ, ఈటెల యుద్ధంలో, తూర్పుదేశంవారు ఏనుగుల నెక్కి చేసేయుద్ధంలో నిపుణులు, యవనులు కాంభోజులు అశ్వయుద్ధంలో, ఔశీనరదేశీయులు అన్ని ఆయుధాలతో చేసే యుద్ధాలలో ప్రసిద్ధులు. ఇట్లా వారివారి నేర్పుల నెరిగి వారి సేవలు వినియోగించుకొనాలి.

**ప్రశ్న 26** : జయం సాధించే సేన ఎటువంటి లక్షణాలతో ఉంటుంది? (3. 11).

**ఉత్తరం** : విజయం సాధించే సేన మంచి ఉత్సాహంగా ఉంటుంది. గుర్రాల సకిలింతలు చెవికి ఇంపుగా ఉంటాయి. ఏనుగుల సేన విజృంభిస్తుంది. ఇవి విజయ సూచకాలు.

**ప్రశ్న 27** : రాజు విరోధుల విషయంలో ఎట్లా ప్రవర్తించాలి? (3. 19).

**ఉత్తరం** : పగవాడిని తుదముట్టించాలన్నా, పాడుచేయాలన్నా అదనుకొరకు వేచి ఉండాలి. అంతేకాని, కరుకుగా, వ్యర్థంగా మాటలాడికాని, పుల్లవిరుపు పలుకులు పలికి గాని వాళ్ళను మోసగించని రీతిలో నమ్మినట్లు మాటలతో కనపరచాలి. కాని, లోపల ఏ మాత్రమూ నమ్మకం పెట్టుకొనకూడదు. ఒక్కసారి ఎక్కువమందిమీద ద్వేషం పెట్టుకొనకూడదు. తగ్గి ఉన్న పగవాడిపై పగపట్టాలి. కాని, మిగతా శత్రువులతో ఆత్మీయంగా మెలగాలి.

**ప్రశ్న 28** : సొంతబలగంవలననో, ఇతరులవలననో రాజ్యం కోల్పోయి అగచాట్లు పడే రాజు తన బాధను ఎట్లా దిగమ్రింగు కొంటాడు? (3. 26).

**ఉత్తరం** : కోసలదేశరాజు క్షేమదర్శి విదేహరాజు చేతిలో రాజ్యాన్ని కోల్పోయి చాల దుఃఖించాడు. అంతకుముందు తనకు మంత్రిగా ఉండి, అడవులలోనికి వెళ్ళిన కాలవృక్షీయుడి నీడపట్టున చేరి నీ వడిగినట్లే అడిగాడు. ఆ రాజుకు ఆ ముని

చెప్పిన మాటలే నీ ప్రశ్నకు తగిన సమాధానం. ఆ తాత్పర్యం ఇది. అయిపోయిన దానిని గూర్చి విచారించి ప్రయోజనం లేదు. కాబోయే వాటిని గూర్చి ఆశ పనికిరాదు. దైన్యాన్ని దరిదాపులకు రానీయరాదు. దైవం ఎట్లా నడిపిస్తే అట్లా నడవక తప్పదనే నిశ్చయానికి రావాలి. రాజులకు జయాపజయాలు అనుభావ్యాలు, మద విషాదాలు అనాదరణీయాలు.

**ప్రశ్న 29** : పరిజనంలోని గణజనులను పాలించే పద్ధతి తెలపండి. (3. 37).

**ఉత్తరం** : గణజనులు ఒక తెగకు చెందినవారైనా మంచిచెడ్డలు తెలియనివాళ్ళై, వారివారి తెలివిని, పౌరుషాన్నీ, గౌరవాన్నీ గూర్చి లెక్కచేయరు. అందువలన ఎట్లాంటి వారితో అయినా విరోధం పెట్టుకొంటారు. ఆ కారణంగా లోపలలోపల విభేదాలు వస్తాయి. దానిని ఆసరాగా తీసికొని శత్రువులు చేరదీస్తారు. గణజనంతో ఇట్లాంటి మనఃస్పర్థలు ఏర్పడితే మూలగద్దెకే ముప్పు వస్తుంది. కాబట్టి ఇదంతా రాకముందే వారినందరినీ రాజు మంచి మాటలు చెప్పి, దాన ధర్మాలు చేసి గౌరవించి ఆదరించాలి. వారిలో వారు విడిపోకుండా చూచుకొంటూ చక్కదిద్దుకొనాలి. చీలికలు వస్తే మాత్రం రాజ్యం కుప్పకూలిపోతుంది.

**ప్రశ్న 30** : ధర్మాలు ఎన్నో రూపాలలో ఉన్నాయి. వాటన్నిటినీ ఆచరించటం సాధ్యం కాదు. కనుక ఏ ధర్మాన్ని ఆచరిస్తే మానవుడు ఇహపరాలలో సుఖిస్తాడు? (3. 42).

**ఉత్తరం** : తల్లీ, తండ్రీ, గురువూ నిత్యం సేవించదగినవారు. ఎంతో భక్తితో వారికి సేవలందిస్తూ వా రేది చెప్పితే దానిని ఆచరణలో పెట్టటం ఉత్తమ ధర్మం. ఈ ముగ్గురూ వేదత్రయం వంటివారు, త్రేతాగ్నులవంటివారు, ముల్లోకాల వంటివారు, త్రిమూర్తులవంటివారు. వీరిలో తల్లికే ఎక్కువ గౌరవం. తల్లిదండ్రుల మీద అభిమానం కలవాడు ఇహపరలోక సుఖాలు పొందుతాడు. గురువును సేవించుకొనేవాడు అవ్యయానందాన్ని పొందుతాడు.

**ప్రశ్న 31** : లోకంలో నిజానిజాలు సిద్ధమై ఉన్నాయి. వాటి విషయంలో మనిషి తనకు తానుగా ఏ విధంగా ధర్మానికి బద్ధుడై ఉండాలి? (3. 44).

**ఉత్తరం** : ధర్మాలలో కెల్ల ఉత్తమ ధర్మం నిజం చెప్పటం. పాపాలలో కెల్ల మహాపాపం అబద్ధాలాడటం. విశేషమేమంటే - పరాయివాడి సొమ్మును, ఉసురునూ దోచుకొనాలనుకొనే పాపులతో నిజం చెప్పటం కన్నా చేటు మరొకటి లేదు. అబద్ధాలు ఆడైనా సరే అటువంటి వారిని బాధించటం ఎంతో న్యాయం. అంతేకాదు ప్రజలకు మేలు చేసే అబద్ధాలన్నీ పుణ్యాలు (ధర్మాలు) ఔతాయి. సాటి జీవులను వేధించే సత్యాలన్నీ పాపాలు (అధర్మాలు) ఔతాయి. అందరిలోనూ ఉన్న మంచి చెడులను అతిసూక్ష్మమైన వివేకంతో తెలిసికొనాలి.

**ప్రశ్న 32** : ఎట్లాంటివారు తమ పాపాలనుండి విముక్తులు కాగలరు? (3. 46)

**ఉత్తరం** : వర్ణాశ్రమాచార నియమాలను పాటించేవారూ, ఇంద్రియ నిగ్రహం కలవారూ, నిందించగా నిందించనివారూ, ఉదారగుణం కలవారూ, అతిథులను ఆదరించేవారూ, వేదాలను వల్లించేవారూ, యుద్ధంలో తెగించి పోరాడేవారూ, దేవతారూపాలనన్నింటిని సమంగా భావిస్తూ మనసుకు నచ్చిన రూపాన్ని కొలిచేవారూ పాపమనే కొండలను సులభంగా దాటగలరు.

**ప్రశ్న 33** : లోకంలో సౌమ్యులు అసౌమ్యులుగానూ, అసౌమ్యులు సౌమ్యులుగానూ కనిపిస్తుంటారు. వారి అసలు స్వరూపాన్ని తెలిసికొనటం ఎట్లా? (3. 52).

**ఉత్తరం** : ఈ ప్రశ్నకు వ్యాఘ్రగోమాయు సంవాదమనే ఇతిహాసం చక్కని సమాధానం. దానివలన తెలిసే తాత్పర్య మేమంటే రాజు ఇతరులు చెప్పే మాయమాటలలో పడి మోసపోకుండా మంచీచెడ్డా తానే యోచించుకొనాలి. ఇది మంచిది, మంచిదికాదు అని విడివిడిగా తెలిసికొనగల సామర్థ్యం కలిగి ఉండాలి. అపుడే పరిపాలకుడు సరైన నిర్ణయం తీసికొనగలడు.

**ప్రశ్న 34** : రాజు ఎట్లా నడచుకొంటే సుఖపడతాడు? (3. 82)

**ఉత్తరం** : ఏమరుపాటు లేకుండా ఎదుటివారి సాయం కావాలి అని అనుకొనేవాడు తప్పక సుఖాలు పొందుతాడు. ఒంటె నక్కల కథ ఇందుకు తార్కాణం.

**ప్రశ్న 35** : శత్రురాజు అధిక బలవంతుడైతే, అల్పబలంగలరాజు ఆపదలనుండి ఎట్లా గట్టెక్కగలుగుతాడు? (3. 85).

**ఉత్తరం** : బలహీనుడైన రాజు తన బలాన్నీ, ఎదుటివాడి బలాన్నీ అంచనావేసికొని, మొండిగా పోరుకు దిగకుండా, పగవాడి మిడిసిపాటును యుక్తియుక్తంగా తొలగించుకొనాలి (దాటివేయాలి). అపుడే ఆ రాజు ఎట్లాంటి చెరుపూ లేకుండా నిలబడగలుగుతాడు. ఈ వాస్తవానికి సముద్ర సరిత్సంవాదం అద్దంపట్టుతుంది.

**ప్రశ్న 36** : మంచి కులంలో పుట్టిన సేవకుడు పదవికి తగ్గట్లుగా జతపడకపోతే రాజు ఏం చేయాలి? (3. 91)

**ఉత్తరం** : సామర్థ్యం తెలిసికొనకుండా కేవలం కులాన్ని మాత్రమే ప్రమాణంగా పెట్టుకొని సేవకులకు పదవు లివ్వరాదు. యోగ్యుడికి కులంతో పనిలేదు. దీనికి చిన్నకంతలలోకైనా దూసుకొని పోయేకాంతికిరణాలవలె చాతుర్యంగల పరిజనులను ఎక్కడబడితే అక్కడ ప్రవేశపెట్టాలి. రహస్యంగా ఎదుటివారి పనులన్నింటినీ ఎప్పటికప్పుడు చాల మెలకువగా పసికట్టాలి. సూర్యుడివలె వెలగటం రాజుకు తగును. దీనికి 'మునీ, కుక్కా' కథ ఒక చక్కని ఉదాహరణం.

**ప్రశ్న 37** : రాజులకు దండం సర్వసాధారణం. దాని స్వరూపాన్ని తెలియజేయుము. (3. 108)

**ఉత్తరం** : దండనీతి మంచివాళ్ళను మెప్పిస్తుంది. చెడ్డవాళ్ళ పొగరును అణచివేస్తుంది. కత్తి, గద, తోమరం, విల్లమ్ములు, రోకలి, చక్రం, ఈటే, చిల్లకోల, త్రిశూలం, గొడ్డలి మొదలైనవి పదకొండు ధర్మనీతికి పనిముట్లు. దాని ఒంటిరంగు నల్లటినలుపు. దానికి నాలుగు కోరలూ, నాలుగు చేతులూ, ఎనిమిది కాళ్ళూ ఉంటాయి. పెక్కు చెవులూ కళ్ళూ ఉంటాయి. చూచేవారికి భయం కలిగించే ఎర్రటి ముఖం, గోరోచనంతో ఉండే జడలూ ఉంటాయి. ఇవీ దండం రూపరేఖలు. వసుహోముడు మాంధాతకి చెప్పిన దండోత్పత్తి ప్రకారం తెలిసికొన దగింది.

**ప్రశ్న 38** : ధర్మార్థ కామాలతో ఎట్లా నడుచుకొంటే మంచిది? (3. 123)

**ఉత్తరం** : పూర్వం కామందకుడనే ముని అంగరిష్ఠుడనే రాజుకు తెలిపిన అంశం దీనికి తగిన సమాధానం. ధర్మం దక్కించుకొనటానికి ఆధారం అర్థం. ఆ అర్థం పట్ల నిష్ఠతో ఎట్లాగైనా ధర్మాపేక్షను విడనాడకూడదు. కామబుద్ధితో కాక లభ్యమైన తగిన సౌఖ్యాలను అనుభవిస్తూ రాజ్యాన్ని పాలించేవాడు ఉత్తముడు.

**ప్రశ్న 39** : శీలం గొప్పదని లోకం మెచ్చుకొంటుంది. దాని స్వరూపం తెలుపుము. (3. 126).

**ఉత్తరం** : మంచి ప్రవర్తన కలిగి ఉండటమే శీలం. శీలవంతుడు సంపదలతో తులతూగుతాడు - ధర్మరాజువలె, ప్రహ్లాదుడివలె. త్రికరణశుద్ధిగా ప్రాణులకు ఎట్లాంటి హాని చేయకుండా ఉండటమే శీలం. శీలం వలన ధర్మం, ధర్మంవలన సత్యం, సత్యంవలన ప్రవర్తన, ప్రవర్తనవలన బలం, బలంవలన సంపత్తి రాణిస్తాయి. కనుక అన్ని శుభాలకూ శీలం మూలం.

**ప్రశ్న 40** : ఆశను అణచటం కష్టం కదా! (3. 150).

**ఉత్తరం** : మనసును ఆశకు వశంచేస్తే, ఆశలు నిరంతరంగా కొనసాగుతూనే ఉంటాయి. కాబట్టి ఆశను చంపుకొనటమే సుఖం. ఆశ నెరవేరకపోయినా బాధపడవద్దు. సుమిత్రుడనే రాజు చరిత్రం ఈ నీతిని బోధిస్తుంది.

**ప్రశ్న 41** : ఎన్ని విన్నా తనివి తీర లేదు; తాతా! మరికొన్ని ధర్మపద్ధతులు చెప్పుము? (3. 169).

**ఉత్తరం** : 1. రాజు తనదేశంలోనూ, శత్రుదేశంలోనూ ధనం సంపాదించుకొనాలి. ఏలుబడికీ, పుణ్యపురుషార్థాలకూ మూలం ఆ ధనమే. అయినా, రాజుకు శక్తికిమించిన యత్నం కూడదు.

2. ధనం లేని రాజును ప్రజలూ, కుటుంబ సభ్యులూ లక్ష్యపెట్టరు, పగవారు ఆదరించరు.

3. దారిదోపిడీ దొరలను రాజు తన సైన్యంలో చేర్చుకొనరాదు.

4. న్యాయాన్ని పట్టించుకొనని సైన్యం యుద్ధంలో గెలుపొందదు. దీనికి ఉపబలకంగా కాపవ్యోపాఖ్యానం తెలియదగినది.

5. దూరదృష్టితో పనిని ముందుగానే తెలిసికొని తగిన జాగ్రత్తతో దానిని చక్కదిద్దుకొనాలి. లేకపోతే మూర్ఖుడై విపత్తుకు గురి ఔతాడు. అప్పటికి తట్టినట్లు ఉపాయంతో అపాయాన్ని ధైర్యంగా ఎదుర్కొని పనిచేసేవాడు ఎప్పుడూ సందేహంతో ఊగిసలాడే బ్రతుకు బ్రతుకుతాడు. రాబోయే పనిని ముందుగా ఊహించుకొని సమర్థంగా ఆపనిని యుక్తిగా చేసికొనే నీతిమంతుడు సుఖంగా ఉంటాడు. ఈ నీతికి ఉదాహరణంగా దీర్ఘసూత్రుడు, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘదర్శి అనే మూడు చేపల కథను స్మరించాలి.

**ప్రశ్న 42** : ఎంతోమంది శత్రువులచేత చిక్కి బలం కోల్పోయిన రాజు ఆ ఆపదనుండి ఎట్లా గట్టెక్కుతాడు? (3. 202)

**ఉత్తరం** : దీనికి తగిన ఉపాయం చెప్పేకథ 'మార్జాల మూషిక సంవాదం'. దాని తాత్పర్యం - తొందర పడక సరైన తరుణంలో చేసిన ప్రయత్నమే పరిపూర్ణంగా సఫలమౌతుంది. బలవంతుడైన శత్రువుతో అవసరం కొద్దీ స్నేహం చేసినా, ఆ అవసరం తీరగానే అతడి స్నేహాన్ని వదలుకొనాలి. ఒకవేళ నమ్మితే చివరకు ఆపదపొందక తప్పదు. నమ్మతగని వాళ్ళను నమ్మనే కూడదు. నమ్మదగ్గవాళ్ళనైనా తగినంతగానే నమ్మాలి. ఇతరులు నమ్మేటట్లు నడచుకొంటూనే తాను వాళ్ళను నమ్మకపోవటం నీతి. బలంగల శత్రువుల వలన కలిగే ఆపదలను తొలగించుకొనటానికి అల్పుడైన శత్రువునైనా తనతో కలుపుకొని జీవించవచ్చును.

**ప్రశ్న 43** : ఎవడినీ నమ్మకపోతే మనస్సుకు ఊరట కలుగదు. నమ్మితే పాపాలు సంభవిస్తాయి. నమ్మటం నమ్మకపోవటం - అనే రెంటిలో ఏది ముఖ్యంగా ఆచరించతగిందో పేర్కొనుము. (3. 244)

**ఉత్తరం** : ఈ అంశాన్ని తేటపరిచేది బ్రహ్మదత్తుడికీ పూజని అనీ పేరుగల గోరువంకకూ సాగిన సంవాదం. దాని తాత్పర్యం - ప్రజలెవరినీ రాజు గట్టిగా నమ్మకూడదు. అప్పుడే తననూ, తన సంపత్తినీ సంరక్షించుకొనగలుగుతాడు. ఈ సందర్భంలో కణికుడు శత్రుంజయుడికి ఉపదేశించిన హితవచనాలను గమనించాలి. వాటి సారమేమంటే - సమయాన్నిబట్టి శత్రువును భుజాలమీద ఎక్కించుకొని మొయ్యాలి. సమయం కనిపెట్టి రాతినేలమీద కుండను ఎత్తి బ్రద్దలు కొట్టినట్లు నేర్పుగా శత్రువును నశింపచేయాలి. రాజు తాను తలపెట్టిన పని సానుకూలపడేదాకా ఎవ్వరూ తెలిసికొనలేని వాడుగా ఉండాలి. ప్రజల విషయంలో విన్నా విననివాడివలె, చూచినా చూడనివాడివలె నడుచుకొనాలి.

**ప్రశ్న 44** : కరువు కాటకాలలో తిండి దొరకనప్పుడు బ్రాహ్మణాది మూడు వర్ణాల వారు ఏ విధంగా ప్రాణాలు రక్షించుకొనాలి? (3. 298).

**ఉత్తరం** : ఈ సందేహాన్ని తీర్చేది విశ్వామిత్ర చండాల సంవాదం అనే ఇతిహాసం. ప్రాణం పోకుండా రక్షించుకొనటానికి, మరేం ఉపాయం లేనప్పుడు, దొంగతనం చేసి ఊపిరి నిలుపుకొనటం ధర్మమే ఔతుంది. అప్పుడు నీచుడి సొమ్మైనా పుచ్చుకొనటం ప్రశస్తమైనదే ఔతుంది.

**ప్రశ్న 45** : శరణన్నవారిని ఆదుకొనాలి అనుకొనే వారికి ఏ పాటి ఫలితం దక్కుతుంది? (3. 304).

**ఉత్తరం** : పూర్వం శుక్రాచార్యుడు ముచుకుందుడనే రాజుకు చెప్పిన బోయవాడు పావురం కథ (లుబ్ధకపోతో పాఖ్యానం) ఈ ప్రశ్నకు ప్రచ్ఛన్న సమాధానం. ఆ కథా తాత్పర్యమిది - ఆదుకొనే వారికి ఆవును చంపిన పాపం కూడా పోతుంది. ఆదుకొననివాడు ఎన్నడూ వీడని పాపాన్ని అనుభవిస్తాడు.

**ప్రశ్న 46** : తెలియకుండా చుట్టుకొన్న పాపాన్ని సజ్జనులు ఎట్లా పోగొట్టుకొనాలి? (3. 343).

**ఉత్తరం** : పరీక్షిన్మహారాజు కొడుకు జనమేజయుడు తనకు తెలియకుండానే బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొన్నాడు. దానిని ఆతడు పోగొట్టుకొన్న కథ పురాణాలలో ప్రసిద్ధి కెక్కింది. దాని తాత్పర్యం ఇది - పాపం చేసి పరితపించినా, ఇక మీదట ఇట్లాంటి పాపాలకు ఒడిగట్టనని అనుకొన్నా, న్యాయంగా మెలగటం ఉత్తమం అని నిర్ణయించుకొన్నా, పుణ్యం పొందాలని అపేక్షపడి ఉపకారం చేసినా, వీటి అన్నిటివలన కానీ, ఏ ఒక్క అంశంవలన కానీ, పాపపంకం క్రమ క్రమంగా తుడిచిపెట్టుకొని పోతుంది. ఇందులో ఏమీ అనుమానం లేదు. జనమేజయుడు తీర్థయాత్రలు చేసి పుణ్యవంతు డయ్యాడు; అశ్వమేధయాగంచేసి రాజ్యాన్ని పాలించాడు. ఇంకా గృధ్రజంబుకోపాఖ్యానం కూడా వినుము. దాని తాత్పర్యం - కష్టాలలో ఉన్నవాళ్ళ కన్నీళ్ళు తుడవటం రాజుల కర్తవ్యం. స్వార్థపరుల పన్నాగాలను మాయగాళ్ళ మాటకారితనాన్నీ తెలిసికొని తెలివిగా వ్యవహరించాలి. ఇంకొక కథ 'పవన శాల్మలీ తరు సంవాదం' వినుము. దీనివలన మహాబలవంతుడితో బలహీనుడు తలపడి పగపెట్టుకొంటే తన వైభవాన్ని కోల్పోతాడని స్పష్టమౌతుంది.

**ప్రశ్న 47** : పాపానికి మూలం ఏది? ఆ పాపం ఉండే స్థానాన్ని తెలియ చెప్పుము. (3. 398).

**ఉత్తరం** : పాపాలన్నిటికీ మూలం పేరాశ. అది కోరికలపట్ల నిలకడలేనితనాన్నీ, కోపాన్నీ, పగనూ, హింసాభావాన్నీ, ఇతరుల ఆస్తులపట్ల, స్త్రీలపట్ల కోరికనూ, దీనత్వాన్నీ, సిగ్గు ఓర్పు నిజాలపట్ల ఏవగింపునూ పుట్టిస్తుంది. న్యాయాన్ని చెరుస్తుంది. నిందలను లెక్కపెట్టకుండా ప్రతిదానికీ అత్యాశపడేవాడినిగా మనిషిని తయారు చేస్తుంది. కాబట్టి లోభులను విడిచిపెట్టాలి.

**ప్రశ్న 48** : విపత్తులకూ, చెడునడతకూ అజ్ఞానమే ఆధారం అని విన్నాను. ఆ అజ్ఞానం తీరు తెన్నులను తెలుపుము. (3. 400).

**ఉత్తరం** : కోపం, దుఃఖం, ప్రేమ, పగ, అహంకారం, గర్వం, తొందరపాటు, మందకొడితనం - వీటి సంపర్కమే అజ్ఞానం అని పండితు లంటారు. పేరాస పడటం, తెలివి లేకపోవటం - ఈ రెండూ ఒకేరకమైన ఫలాన్ని ఇస్తాయి. లోభంవలన అజ్ఞానం పుట్టుతుంది.

**ప్రశ్న 49** : ధర్మం నానాప్రకారంగా వింటుంటాం. విశిష్టమైన ధర్మ మేది? (3. 403).

**ఉత్తరం** : ధర్మాలన్నిటిలో దమం ఉత్తమం. అది ముక్తిదాయకం. సకలధర్మసారం; దమం కలవాడు కామక్రోధలోభ మదమాత్సర్యాలను జయిస్తాడు. పరబ్రహ్మమును చేరతాడు.

**ప్రశ్న 50** : తపస్సు తీరును వివరించుము. (3.411)

**ఉత్తరం** : ధర్మాలకన్నిటికీ తపస్సే మూలం. ఆహార నియమమే తపస్సు. అదే మహాధర్మం. తపస్సువలన పంచమహాపాతకాలు మొదలైన పాపాలన్నీ పటాపంచలౌతాయి. సత్యం, శుచి మొదలైనవి అలవడతాయి. సమస్తకార్యసిద్ధులూ సులభంగా అందుబాటులోకి వస్తాయి.

**ప్రశ్న 51** : దేవతలూ, పితృదేవతలూ, బ్రాహ్మణులూ మొదలైనవారంతా సత్యాన్ని మెచ్చుకొంటారు. దాని స్వరూపాన్నీ, దానిని అవలంబించే తీరునూ చెప్పుము. (3. 416).

**ఉత్తరం** : సమత, దమము, తితిక్ష, అమత్సరం, సిగ్గు, ధైర్యం, అనసూయ, ఆర్యత్వం, అహింస, దానం, క్షమ, యజనం, నిజం చెప్పటం - అనేవి సత్య స్వరూపాలు. నిత్యానుష్ఠానపరులకు ఈ గుణాలు సులభంగా, సుఖదంగా అలవడుతాయి. సత్యం అన్ని ధర్మాలకూ పాదువంటిది. సత్యంవలననే యోగక్షేమాలు కలుగుతాయి. అసత్యంకంటె వేరేపాపం లేదు. ఆలోచించగా ఒక్క సత్యంతో వేయి అశ్వమేధయాగాలు చేసిన ఫలంకూడా సాటిరాదు.

**ప్రశ్న 52** : అరిషడ్వర్గం దేనివలన పుట్టుతాయి? దేనివలన గిట్టుతాయి? (3. 420).

**ఉత్తరం** : కామం సంకల్పం నుండి పుట్టుతుంది. దాని రూపం ఇట్లాంటిదని తెలిసికొంటే ఆ కోరిక పోతుంది. ఇతరులుచేసిన తప్పువలన కోపం వస్తుంది. తరగని ఓర్పు వలన అది తగ్గిపోతుంది. ప్రాణకోటి శాశ్వతం కాదు అనే తెలివి లేకపోవటం వలన లోభం పుట్టుతుంది. ఆ తెలివి పొందితే అది పోతుంది. అవివేకంవలన మోహం కలుగుతుంది. అధర్మం జోలికి పోకపోతే అది నశిస్తుంది. కులం, చదువూ, సంపదలవలన మదం ఏర్పడుతుంది. వాటి పెంపుదలను తలపోస్తే అదే దూరమవుతుంది. సాత్త్వికగుణం కొరవడటం వలన పగపుట్టుతుంది. మంచివాళ్ళను సేవించటంవలన అది తొలగుతుంది.

**ప్రశ్న 53** : రాజునకు కావలసినవారూ, అక్కరలేనివారూ ఎట్లాంటివారు? (3. 467).

**ఉత్తరం** : ఓర్పుకలవారు, ధర్మశాస్త్రాలు తెలిసినవారు, సత్యవంతులు, చపలచిత్తం లేనివారు, పొగరుగానీ, పేరాశగానీ లేనివారూ, చక్కటి నడవడి కలవారూ, మాటకారితనం, పనులలో శ్రద్ధ, ఎంతో ఆనుకూల్యం కలిగిన సేవకులు యజమానికి సకల సంపదలు పొందిస్తారు. క్రూరులు, పేరాశపరులు, మూర్ఖులు, చాడీలు చెప్పేవారు, మందకొడులు, చేసిన మేలు మరిచిపోయేవారు, తెలివి మాలినవారు, అబద్ధాలాడేవారు, నిందపడేవారు, పిరికివారు, తెగింపులేనివారు, నీతిమాలినవారు, మితిమించిన చెడు అలవాట్లు కలవారు రాజునకు దగ్గరగా ఉంటే ఆపద ముంచుకొస్తుంది. నీచులలో కెల్లా చేసిన మేలు మరచిపోయేవారు (కృతఘ్నులు) అసలే తగినవారు కారు. దీనిని చెప్పే కాశ్యప గౌతమాఖ్యానం (నాడీ జంఘుడి చరిత్రం) ప్రసిద్ధం. బ్రాహ్మణహత్య చేసినవారికైనా పాపనిష్కృతి ఉన్నది కాని, కృతఘ్నుడికి మాత్రం పాపవిముక్తి లేదు. మిత్రద్రోహం కృతఘ్నత కంటె ఘోరమైనపాపం. మిత్రుడు ఇహపరలోకాల సౌఖ్యాన్ని అందించగలడు. ధనంకంటె మిత్రుడే మిన్న. మంచి మిత్రులను పొందటంవలన మేలు కలుగుతుంది.

(తృతీయాశ్వాసంలో 3. 428 - 440 పద్యాలలో లోకనీతులు, 3. 441 -452 పద్యాలలో నకులు డడుగగా భీష్ముడు చెప్పిన ఖడ్గమహిమ, ధర్మరాజ విదురాదుల సంభాషణలలో ధర్మార్థ కామాల తారతమ్య వివేచనం (3. 453 - 466) చెప్పబడి ఉన్నాయి.)

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము

### (మొదటి భాగము)

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ సంక్రామణనిపుణ వి । లాస కటాక్షా! నివృత్తి లంపటచిత్తో**
**ల్లాసన దక్షా! వేద । వ్యాస వచోవిభవ లక్ష్య! హరిహరనాథా ! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సంపదను; సంక్రామణ= కలుగజేయటంలో; నిపుణ= మంచి నేర్పరి అయిన; విలాస కటాక్షా!= అందమైన క్రీగంటిచూపు కలవాడా!; నివృత్తి లంపట= సంసారబంధంనుండి విరక్తి చెందటంలో ఆసక్తమయిన; చిత్త= మనస్సుకు; ఉల్లాసన దక్షా!= ఉత్సాహాన్ని కలిగించటంలో సమర్థుడా!; వేదవ్యాస= వేదవ్యాసముని యొక్క; వచో విభవ= వాక్యసంపదకు అంటే ఆ మహర్షి రచించిన బ్రహ్మసూత్రాలలో, మహాభారత పురాణాదులలో గల వాఙ్మయవైభవాని కంతా; లక్ష్య!= లక్ష్యమైనవాడా!, గురి అయినవాడా!, హరిహరనాథా!= ఓ హరిహరనాథస్వామీ!

**తాత్పర్యం:** భక్తులకు కోరిన సంపద లన్నింటిని ప్రసాదించే నిపుణమైన అందమైన క్రీగంటి చూపులు కలవాడవూ, సంసారబంధాలను వదలి వైరాగ్య చిత్తవృత్తితో ఉన్న విరక్తుల హృదయాలకు ఎల్లప్పుడూ ఆనందోత్సాహాలను కలిగించేవాడవూ, వేదవ్యాస మునీంద్రులవారి వాఙ్మయ వైభవానికంతా గమ్యమైన వాడవూ అయిన ఓ హరిహరనాథస్వామీ! (సావధానంతో నేను చెప్పబోయే ఈ కావ్యార్థాలను అవధరించుము.)

**విశేషం:** ఆశ్వాసారంభంలో కృతిపతిని సంబోధిస్తూ కందపద్యం చెప్పటం ఆంధ్రకావ్య సంప్రదాయం. అందులో వాడబడే విశేషణాలు ఒక్కొక్కసారి ఆశ్వాస కథార్థాలను వ్యంజింపజేస్తూ ఉండవచ్చును. పాండవులకు శ్రీకృష్ణుడి కటాక్షం వలన రాజ్యసంపదలు దక్కటం, ధర్మరాజుకు మనస్తాపం పోగొట్టే ఉపదేశాలు వ్యాస శ్రీకృష్ణాదులు చేయటం, ధర్మజుడు శ్రీకృష్ణుడిని స్తుతించటం మొదలైన అంశాలున్న ఈ ప్రథమాశ్వాసానికి తగినట్లుగా హరిహరనాథుడికి విశేషణాలు తిక్కన వేయటం విశేషం.

### మహర్షులు పాండవులం జూడవచ్చుట (సం. 12-1-1)

వ. **దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నట్లు సకల బంధుమిత్త్ర జనంబులకు నుదకకర్మం బాచరించి పాండవులు గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకయి యొక్కసమస్థలంబునం బటకుటీర సంవిధానంబు సేయించి, ధృతరాష్ట్ర విదుర సర్వభరత భార్యాసమేతంబుగా నచ్చట మాసమాత్రంబు నిలిచి; రట్టియెడం గృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను కణ్వులు మొదలుగాఁగల మునీంద్రు లనేకులు శిష్యవర్గ సహితంబుగా ధర్మనందను సందర్శనంబునకుం జనుదెంచిన, నజ్జననాథుండు ప్రత్యుత్థాన ప్రణామ పాద్యాస నాకలనంబులను దత్కాలోచితార్చనంబులను నమ్మహాత్ములం బ్రీతులం గావించి, కృష్ణనిజానుజయుక్తంబుగా వారల నుపాసించి యుండ, వారలు బహువిధంబులగు ప్రియవచనంబుల నక్కురువంశసత్తము సంభావింప నారదుం డమ్మహనీయద్విజులం గలయం గనుంగొని యక్కౌంతేయాగ్రజుతోడం దాను గుశల ప్రశ్నంబు లగుమాట లాడంగలవాఁ డగుట వారి కెఱింగించి యమ్మహీపతియాననం బాలోకించి. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయ మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా (అంటే వెనుకటి పర్వంలో చెప్పిన విధంగా అని); సకల బంధుమిత్ర జనంబులకున్= బంధువులందరికీ, స్నేహితుల బృందాల కందరికీ; ఉదకకర్మంబు= నీటితో ఇచ్చే తర్పణాలు అనే అపరకర్మల విధానాన్ని; ఆచరించి= నిర్వహించి; చేసి; పాండవులు= పాండవులు; గంగాతీరంబునన్= గంగానది ఒడ్డున; అశుచిత్వంబున్= మైలను (మృతాశౌచాన్ని); అపనయించుటకయి= తొలగించుకొనటం కొరకు; ఒక్క సమస్థలంబునన్= మిట్ట పల్లాలు లేని ఒక నేలమీద; పటకుటీర సంవిధానంబు= గుడ్డతో చేసిన గుడారాలను కట్టించటం; చేయించి= జరిపి; ధృతరాష్ట్ర, విదుర, సర్వభరత భార్యాసమేతంబుగాన్= ధృతరాష్ట్రుడితో, విదురుడితో సమస్త భరత వంశీయుల భార్యలతో సహా; అచ్చటన్= ఆ ప్రదేశంలో; మాసమాత్రంబు= నెలరోజులు మాత్రమే; నిలిచిరి= ఉన్నారు; అట్టి+ఎడలన్= ఆ సందర్భంలో; కృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాణు కణ్వులు మొదలుగాన్+కల ముని+ఇంద్రులు+అనేకులు= వ్యాసుడు, నారదుడు, దేవలుడు, దేవస్థాణుడు, కణ్వుడు మొదలైన మహామునులు అనేకులు; శిష్యవర్గ సహితంబుగాన్= శిష్యుల సమూహాలతో కూడుకొని; ధర్మనందనుని సందర్శనంబునకున్= ధర్మరాజును దర్శించుకొనటానికి; చనుదెంచినన్= రాగా; ఆ+జననాథుండు= ఆ రాజు (ధర్మరాజు); ప్రత్యుత్థాన, ప్రణామపాద్య+ఆసన+ ఆకలనంబులను= అతిథులకు నిలిచి ముందేగి ఆహ్వానం చెప్పటం, నమస్కారం చేయటం, కాళ్ళకు నీళ్ళివ్వటం, కూర్చోవటానికి ఆసనమివ్వటం చేతనూ; తత్+కాల+ఉచిత+అర్చనంబులను= ఆ సమయానికి తగిన అనేక అతిథి పూజావిధుల చేత; ఆ+మహాత్ములన్= ఆ వచ్చిన గొప్పవారిని; ప్రీతులన్+కావించి= సంతుష్టులనుగా చేసి; కృష్ణ నిజ+అనుజయుక్తంబుగాన్= శ్రీకృష్ణుడితోనూ, తన సోదరులతోనూ కూడికొని; వారలన్= పెద్దలను; ఉపాసించి+ఉండన్= సేవిస్తూ ఉండగా; వారలు= అక్కడ చేరిన పెద్దలు; బహువిధంబులు+అగు= పలు రకాలైన; ప్రియవచనంబులన్= మంచి మాటలతో; ఆ+కురువంశ సత్తమున్= కురువంశంలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజును; సంభావింపన్= గౌరవింపగా; నారదుండు= నారదమహర్షి; ఆ+మహనీయ ద్విజులను= పెద్దలైన ఆ బ్రాహ్మణులను; కలయన్+కనుంగొని= తేరిపార చూచి; ఆ+కౌంతేయ+అగ్రజుతోడన్= కుంతీపుత్రులలో పెద్దవాడైన ఆ ధర్మరాజుతో; తాను= తాను (నారదుడు); కుశల ప్రశ్నంబులు+అగు మాటలు= యోగక్షేమాలు తెలిసికొనే మాటలు; ఆడన్+కలవాఁడు+అగుటన్= మాట్లాడాలని అనుకొంటున్న వాడనే సంగతి; వారికిన్= అక్కడి పెద్దలకు; ఎఱింగించి= తెలిపి; ఆ+మహీపతి ఆననంబు= ఆ రాజుమొగం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! జనమేజయ మహారాజుకు వైశంపాయన మహర్షి ఈ విధంగా చెప్పాడు - పాండవులు తమ చనిపోయిన బంధుమిత్రుల కందరికీ జలతర్పణాలను ఇచ్చారు. మృతాశౌచాన్ని పోగొట్టుకొనటానికి గంగానదీ తీరంలో ఒక సమతల ప్రదేశంలో గుడ్డల గుడారాల నెత్తించారు. ధృతరాష్ట్ర, విదురాదులనూ, భరతవంశీయుల భార్యలనూ ఆ గుడారాలలో ఒక నెలరోజులు ఉంచారు. ఆ సందర్భంలో ధర్మరాజును దర్శించటానికి వ్యాసుడు, నారదుడు, దేవలుడు, దేవస్థాణుడు, కణ్వుడు మొదలైన మునీంద్రు లెందరో శిష్యులతో సహా విచ్చేశారు. ధర్మరాజు వారందరికీ ఎదురుపోయి, నమస్కరించి, అర్ఘ్యపాద్యాది పూజావిధులతో సత్కరించి వారిని సంతోషపెట్టాడు. శ్రీకృష్ణుడూ, సోదరులూ ఎల్లప్పుడూ తనతో కలిసి ఉంటూ ఉండగా ఆ మహర్షులను ధర్మజుడు సేవించాడు. ఆ రాజును వారందరు ప్రియవచనాలతో పలకరించారు. ఆ తరువాత ఆ మహాత్ములందరి పక్షాన ధర్మరాజును కుశల ప్రశ్నలతో కూడిన మాటలతో సమ్మానించటానికి నారదుడు ముందుకు వచ్చాడు. ఆ మహర్షి పెద్దల నందరిని కలయజూచి ధర్మరాజు ముఖంవైపు చూచి ఇట్లా అన్నాడు:

**విశేషం:** పితృకర్మలు చేసి పవిత్రులైన పాండవులను ఆశీర్వదించి భావి శుభాలను నిర్దేశించటానికి మునిపరిషత్తు నారదముఖంగా మాట్లాడుతున్నది.

**శా.** **' గోవిందుం డనిశంబు శోభన మెదం గోరంగఁ బార్థుండు ద**
**ర్పావేశోజ్జ్వల బాహుసార మహనీయస్ఫూర్తి శోభిల్ల గాం**
**డీవోల్లాస విభాసియై సమరపాండిత్యంబు వాటింప సం**
**భావింపన్ జగమెల్ల రాజ్య మిటు లొప్పం గొంటె రాజోత్తమా!** **3**

**ప్రతిపదార్థం:** రాజ+ఉత్తమా!= రాజులలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; గోవిందుండు= శ్రీకృష్ణుడు; అనిశంబున్= ఎల్లప్పుడు; శోభనము= శుభమును; ఎదన్= మనస్సులో; కోరంగన్= (నీకు కలుగుతూ ఉండాలని) సంకల్పించగా; దర్ప= గర్వంచేత; ఆవేశ= ఉత్సాహంచేత; ఉజ్జ్వల= ప్రకాశించే; బాహుసార= భుజబలంయొక్క; మహనీయస్ఫూర్తి = గొప్పదైన స్ఫూర్తితో; శోభిల్లన్ = ప్రకాశించగా; పార్థుండు= అర్జునుడు; గాండీవ+ఉల్లాస విభాసి ఐ= గాండీవం వలన కలిగే ఉత్సాహం చేత ప్రకాశించినవాడై; సమరపాండిత్యంబు= యుద్ధవిద్యా నైపుణ్యం; పాటింపన్= ఒప్పారగా; జగము+ఎల్లన్= లోకమంతా; సంభావింపన్= నిన్ను గౌరవిస్తూ ఉండగా; ఇటులు= ఈ విధంగా (కురుక్షేత్ర యుద్ధంలో విజయాన్ని సాధించి - అని భావం); రాజ్యము= రాజ్యాన్ని లేదా ప్రభుత్వాన్ని; ఒప్పన్= ఉచితమైన విధంగా; కొంటె!= తీసికొన్నావు కదా!

**తాత్పర్యం:** 'ధర్మజా! నీ అదృష్ట మేమని చెప్పాలి! అటు శ్రీకృష్ణుడు సదా తన మనస్సులో నీకు మేలు కలగాలని కోరుతూ ఉండగా, ఇటు గర్వోత్సాహాలతో ఉప్పొంగే బాహుబలంతో ప్రకాశించే పార్థుడు గాండీవ పరాక్రమంతో యుద్ధ విద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ ఉండగా, ప్రజలందరూ నిన్ను గౌరవిస్తూ ఉండగా నీవు ఈ రాజ్యాన్ని ఈ విధంగా సగౌరవంగా సార్థకంగా పొందావు.

**విశేషం**: ధర్మరాజు విజయానికి గల హేతువులను చెప్తుతూ, అతడి రాజ్యప్రాప్తిలో ఉన్న ఒప్పిదాన్ని ప్రశంసించటం ఇందులోని విశేషం.

**చ.** **' భువన భయంకరంబు లగు పోరులఁ దమ్ములతోడఁ గూడ నీ**
**వు వెడలఁబాటు లెస్స; యలవుం జలమున్ వెలయించుచోట ధ**
**ర్మువున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయుమేలు; దీనఁ గౌ**
**రవకులముఖ్య! యుమ్మలిక గ్రాఁచితె? చిత్తముఁ బ్రీతిఁ బొందెనే?'** **4**

**ప్రతిపదార్థం:** కౌరవకులముఖ్య!= కౌరవకులంలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; ఈవు= నీవు; భువనభయంకరంబులు+అగు పోరులన్= భూలోకానికంతా లేదా లోకాల కన్నింటికీ భయాన్ని కలిగించే యుద్ధాలలో; తమ్ముల తోడన్+కూడన్= తమ్ముళ్ళందరితో; వెడలన్+పాటు= బయటపడటం; లెస్స=మంచిది, ఒప్పిదమైనది; అలవున్= బలాన్నీ; చలమున్= మాత్సర్యాన్నీ; వెలయించు చోటన్= ప్రదర్శించేటప్పుడు కూడా; ధర్మువునకున్= ధర్మమార్గానికి; ఒకింతయున్= ఏమాత్రంకూడా; తొలఁగన్+త్రొక్కమి= అడుగు ప్రక్కకు వేయకుండా ఉండటం; ఎంతయున్ మేలు= ఎంతయో శ్రేష్ఠం; దీనన్= దీనివలన; ఉమ్మలికన్=దుఃఖమును; క్రాఁచితె= తొలగించుకున్నావా; చిత్తమున్= మనస్సు; ప్రీతిన్= సంతోషాన్ని, తృప్తిని; పొందెనే?= పొందిందా?

**తాత్పర్యం:** 'కురువంశంలో ప్రసిద్ధుడా! ధర్మరాజా! లోకాల నన్నింటినీ భయపెట్టగలిగే భయంకర యుద్ధాలు సంభవించినప్పుడు నీ తమ్ములతో బయటపడడం మంచిది. యుద్ధాలలో పంతాలు పెరిగి బలాలనూ, మాత్సర్యాలనూ ప్రదర్శించే పట్టులలో సైతం ధర్మమార్గం నుండి ఏమాత్రం తప్పకుండా ఉండే నీ నియతి నీలోని ఎంతో మంచిగుణం. ధర్మరాజా! మరి - దీనివల్ల నీ దుఃఖాన్ని తొలగించుకున్నావా; ఇప్పుడు నీ మనస్సు సంతోషాన్ని పొందిందా?'

**విశేషం:** యుద్ధావేశంలో కూడా ధర్మం వీడని నియతి ధర్మజుడికి ఇక్కట్టులు తెచ్చిపెట్టినా, ఆ నియతీ, పాండవుల ఐకమత్యమూ చివరకు విజయాన్ని సాధించిపెట్టాయని నారదుడు ధర్మజుడిని అభినందించాడు. ధర్మజుడిది ధర్మయుద్ధమని (కలహాభోక్త) నారదుడు ప్రశంసించటం ఇందులోని విశేషం.

**వ. అనిన విని యజ్జనవిభుం డమ్ముని విభున కిట్లనియె. 5**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+జన విభుండు= ఆ ధర్మరాజు; విని; ఆ+ముని విభునకున్= మునిపతియైన ఆ నారదుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** నారదుడి మాటలు విని ధర్మరాజు అతడితో ఇట్లా అన్నాడు:

**సీ. ‘ కృష్ణుండు మామీఁదఁ గృపసేయుటయు, బ్రాహ్మ । ణానుగ్రహంబున ననిల పుత్త్ర**
**పార్థుల పటు బాహు బలమున మేదిని । యంతయుఁ జేకుఱునట్టి దయ్యెఁ;**
**నైనను నతిఘోర మగు నఖిల జ్ఞాతి । వధ మొనరించుట వలన నధిక**
**గుణుని సౌభద్రునిఁ గుల భూషణంబుఁ బాం । చాలీ తనూజ పంచకముఁ గోలు**

**తే. పోకఁ జేసియు గెల్పు గెల్పుగ మదీయ । బుద్ధి గైకొన దయ్యెడు సిద్ధముఖ్య!**
**యదియుఁ గాక వేఱొక్కండు మదిఁ గలంచు । చున్నయది; దాని నేర్పడ విన్నవింతు. 6**

**ప్రతిపదార్థం:** సిద్ధముఖ్య!= ముని శ్రేష్ఠుడవైన నారదా!; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; మామీఁదన్= మామీద (పాండవులమీద); కృపచేయుటయున్= దయచూపటం; బ్రాహ్మణ+అనుగ్రహంబునన్= బ్రహ్మవేత్తలయొక్క దయవలన; అనిలపుత్ర పార్థుల పటు బాహుబలమునన్= భీమార్జునుల గొప్పదైన భుజబలంచేత; మేదిని+అంతయున్= రాజ్యమంతా; చేకుఱునట్టిది+అయ్యెన్= చేతికి దక్కేదిగా అయింది; ఐనను= అయినప్పటికి; అతిఘోరము+అగు= మిక్కిలి దారుణమైన; అఖిల జ్ఞాతివధము= జ్ఞాతుల నందరినీ చంపటం; ఒనరించుటవలనన్= చేయటంవలన; అధికగుణునిన్= ఉత్తమగుణాలు కలవాడైన; కులభూషణంబున్= వంశానికి అలంకారమైన; సౌభద్రునిన్= అభిమన్యుడినీ; పాంచాలీ తనూజ పంచకమున్= ద్రౌపదికి పుట్టిన పుత్రపంచకాన్నీ; కోలుపోకన్+చేసియున్= కోల్పోవటంవలన; మదీయబుద్ధి= నా బుద్ధి; గెల్పు= ఈ గెలుపును; గెల్పుగన్= విజయంగా; గైకొనదు+అయ్యెడున్= గ్రహించజాలకపోతున్నది; అదియున్+కాక= అంతేకాక; మదిన్= నా మనస్సును; వేఱు+ఒక్కండు= మరొకటి; కలంచుచున్న అది= కలతపెట్టుతున్నది; దానిన్= ఆ సంగతిని; ఏర్పడన్= స్పష్టంగా; విన్నవింతున్= మనవి చేస్తాను.

**తాత్పర్యం:** ‘ఓ మునీంద్రా! శ్రీకృష్ణుడు మామీద సదా కృపాదృష్టి ప్రసరిస్తూ ఉండటం చేతనూ, బ్రహ్మజ్ఞుల అనుగ్రహం చేతనూ, భీమార్జునుల మహాబాహుబలంతోనూ ఈ రాజ్యమంతా మాకు దక్కింది. అయినా, జ్ఞాతుల నందరినీ యుద్ధంలో అతిదారుణంగా వధచేయటం వలనా, వంశభూషణుడు, గుణవంతుడు అయిన అభిమన్యుడిని, పాంచాలీపుత్ర పంచకాన్నీ కోల్పోవటం వలనా నాకు కలిగిన విజయాన్ని విజయంగా స్వీకరించటానికి నా బుద్ధి అంగీకరించటంలేదు. అంతేకాక నా మనస్సును మరొక్క విషయం కలత పెట్టుతున్నది. దానిని మీకు స్పష్టంగా విన్నవించుకొంటాను.

**చ. ఘనభుజ విక్రమోన్నతుఁడు, కౌరవకోటికిఁ బట్టుకొమ్మ మ**
**మ్మని మొనఁ దూలపుచ్చిన మహాత్ముఁడు గర్ణుఁడు గొంతి తొల్తచూ**
**లని యుదక ప్రదాన సమయంబున నాయమచేత వింటి; నా**
**తని కుదకంబు లిచ్చుటకుఁ దా మముఁ బంచుట గోరి చెప్పినన్. 7**

**ప్రతిపదార్థం:** ఘనభుజ విక్రమ+ఉన్నతుఁడు= గొప్పవైన భుజాల పరాక్రమంలో శ్రేష్ఠుడు అయినవాడు; కౌరవకోటికిన్= కౌరవబృందానికి; పట్టుకొమ్మ= ఆధారమైనవాడు; మమ్మున్= మమ్మల్ని (పాండవులను); అని మొనన్= యుద్ధవ్యూహాగ్రంలో; తూలపుచ్చిన= చిన్నపుచ్చిన; మహాత్ముఁడు= గొప్పవాడు అయిన; కర్ణుఁడు= కర్ణుడు; గొంతితొల్తచూలు+అని= కుంతికి పుట్టిన మొదటి బిడ్డ అని; తాన్= తాను (ఆ కుంతి); ఆతనికిన్= కర్ణుడికి; ఉదకంబులు= తర్పణాలు; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; మమున్= మమ్మల్ని (పాండవులను); పంచుటన్= పంపించటంకొరకు; కోరి= ఆసక్తితో, కావలెనని; చెప్పినన్= చెప్పగా; ఉదకప్రదాన సమయంబునన్= తర్పణాలిచ్చే సమయంలో; ఆయమచేతన్= కుంతిచేతనే; వింటిన్= విన్నాను.

**తాత్పర్యం:** తన భుజపరాక్రమంతో కౌరవుల కందరికీ ఆదరువుగా ఉన్నవాడూ, మమ్మల్ని రణరంగంలో చిన్నపుచ్చినవాడూ అయిన కర్ణుడు కుంతీదేవి మొదటిబిడ్డ అనే సంగతి తెలిపి, కర్ణుడికి జలతర్పణాలివ్వాలని మాకు చెప్పాలని కోరికపడి స్వయంగా వచ్చి మేము తర్పణాలిచ్చే సమయంలో ఆమె చెప్పితే విన్నాను.

**వ.** **అప్పుడు దొడంగి యంతరంగంబు నిప్పులం బొరఁటినట్లయ్యెడి; నక్కుంతీమహాదేవి దాను దివాకరువరంబున నప్పురుషవరుం బడసి పాఱవైచుటయుం, బిదప నతండు ధార్తరాష్ట్రులపాల దొరయైయుండ మాకును వారికిం గలహంబు పుట్టిన నది మాన్పించుటకై యక్కొడుకు కడకుం జని యేకాంతంబునం బుట్టువు దెలుపుటయు, లోనయిన తద్విషయ వార్త లనుదినంబును జెప్పుచుండు.** **8**

**ప్రతిపదార్థం:** అప్పుడు+తొడంగి= అప్పటినుండి; అంతరంగంబు= మనస్సు; నిప్పులన్= నిప్పుకణాలలో; పొరఁటినట్లు+అయ్యెడిన్= పొరలించినట్లుగా అవుతున్నది; ఆ+కుంతీ మహాదేవి= ఆ కుంతీమహాదేవి; తాను= స్వయంగా; దివాకరుని వరంబునన్= సూర్యుడి వరంతో; ఆ+పురుషవరున్= ఆ పురుషశ్రేష్ఠుడైన కర్ణుడిని; పడసి= కని, పొంది; పాఱవైచుటయున్= (నీటిలో) వదలిపెట్టటమున్నూ; పిదపన్= ఆ తరువాత; అతండు= కర్ణుడు; ధార్తరాష్ట్రులపాలన్= ధృతరాష్ట్రుడి పుత్రులైన కౌరవుల కడ; దొర ఐ= రాజై (అంగదేశాధిపతి అయి); ఉండన్= ఉండగా; మాకును= మాకూ (పాండవులకూ); వారికిన్= వారికి (కౌరవులకూ); కలహంబు= తగాదా; పుట్టినన్= కలుగగా; అది= దానిని; మాన్పించుటకై= శాంతింపచేయటానికి; ఆ+కొడుకు కడకున్= కొడుకైన ఆ కర్ణుడి వద్దకు పోయి; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్నప్పుడు; పుట్టువు= అతడి జన్మను గురించిన విషయం; తెలుపుటయున్= తెలియచెప్పటమున్నూ; లోనయిన= మొదలయిన; తద్విషయవార్తలు= అతడి సంగతులకు సంబంధించిన విశేషాలు; అనుదినంబును= ప్రతిరోజూ; చెప్పుచుండున్= చెపుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** అప్పటినుండి నా మనస్సు నిప్పులలో దొరలించినట్లుంటుంది, ఆ కుంతీదేవి సూర్యవరప్రసాదంతో ఆ మహాత్ముడిని కని నీటిలో విడిచిపెట్టిన సంగతీ, ఆ తరువాత కర్ణుడు కౌరవుల వద్ద అంగరాజై ఉండగా వారికీ, మాకూ యుద్ధంరాగా, దానిని మాన్పించటానికై ఆమె ఒంటరిగా ఆ కొడుకు దగ్గరికి పోయి అతడి జన్మరహస్యం చెప్పిన సంగతీ, మొదలైన ఎన్నో అతడి విశేషాలను గురించి ప్రతిరోజూ మాకు చెపుతూ ఉంటుంది.

**సీ.** **ఆ యమ దనపుత్రుఁ డవుట యెఱింగించి । 'తమ్ములలోనికి రమ్ము నీవు'**
**నావుడు నాతండు 'నాకుఁ గృతఘ్నత । వాటిల్లదే కురుపతిఁ దొఱంగి**
**వచ్చిన; నదిగాక వాసవితోడి క । య్యంబున కితఁ డోడె ననరె; యతఁడు**
**బెరయ నొండెను నన్ను బెరసి యొండెను నేవు; । రింతియకాని నీ వెపుడు నీకుఁ**

**ఆ.** **దనయు లార్వు రనకు' మనియె; నిద్దేవి 'ద । క్కనుజు లెల్లవారి కభయ మొసఁగు'**
**మనిన 'నట్ల కాక' యని మమ్ము నలువురఁ । బట్టెఁ గాని తెగఁడ ప్రాణములకు.** **9**

**ప్రతిపదార్థం:** ఆ+అమ్మ= ఆమె, కుంతి; తన పుత్రుఁడు+అవుట= తన కుమారు డౌతాడని; ఎఱింగించి= కర్ణుడికి తెలిపి; తమ్ములలోనికిన్= నీకు తమ్ములైన పాండవులలోకి; నీవు; రమ్ము= వచ్చిచేరుము; నావుడున్= అనగా విని; ఆతండు= కర్ణుడు; కురుపతిన్= దుర్యోధనుడిని; తొఱఁగి వచ్చినన్= వదలివస్తే; నాకున్= నాకు; కృతఘ్నత= ఉపకారికి అపకారం చేసిన దోషం; పాటిల్లదే!= కలుగదా? (కలుగుతుందని భావం.); అది+కాక= అంతేకాకుండా; ఇతఁడు= ఇతడు (కర్ణుడు); వాసవితోడి కయ్యంబునకున్= అర్జునుడితోడి యుద్ధానికి; ఓడెన్= భయపడ్డాడు; అనరె?= అనరా? (అంటారని భావం); అతఁడు= అర్జునుడు; బెరయన్+ఒండెను= కలిసికొని; నన్నున్= నన్ను (కర్ణుడిని); బెరసి+ఒండెను= కలిపికొని గాని; ఏవురు= అయిదుమంది; అంతియకాని= అంతేకాని; నీవు= నీవు(కుంతి); ఎపుడున్= ఎప్పుడైనా సరే; నీకున్= నీకు (కుంతికి); తనయులు= కుమారులు; ఆర్వురు= ఆరుగురు; అనకుము= అని చెప్పవద్దు; అనియెన్= అన్నాడు; ఈదేవి= కుంతీదేవి; తక్కు= మిగిలిన; అనుజులు= తమ్ములు; ఎల్లవారికిన్= అందరికి; అభయము= భయంలేదు అనేమాట; ఒసఁగుము= ఇమ్ము; అనినన్= అని అనగా; అట్లు+అ+కాక!= ఆ విధంగానే అగుగాక!; అని; మమ్మున్ నలువురన్= మా నలుగురను; పట్టెన్= బంధించాడు కాని; ప్రాణములకున్= ప్రాణాలు తీయటానికి అంటే చంపటానికి; తెగఁడు+అ= సాహసించనేలేదు.

**తాత్పర్యం:** కర్ణుడు తన కుమారు డనే విషయం అతడికి తెలిపి 'నీవు నీ తమ్ములలోనికి వచ్చి చేరు' మని అడిగింది. ఆ మాట కతడు ఇట్లా సమాధానం చెప్పాడు: 'నేను దుర్యోధనుడిని వదలివస్తే కృతఘ్నతాదోషం కలుగుతుంది. అంతేకాక నేను అర్జునుడితో యుద్ధం చేయటానికి జంకి ఆ వైపు వచ్చా నని కూడా అంటారు. నన్ను కలుపుకొని కాని, లేదా అర్జునుడిని కలుపుకొని కాని నీకు కొడుకు లెప్పుడైనా అయిదుగురే కాని ఆరుగురని మాత్రం అనబోకుము.' ఆ మాటలు విని కుంతి 'ఆ మిగిలిన కొడుకులకు అభయాన్ని ఇమ్ము' అని కర్ణుడిని కోరింది. ఆయన 'అట్లాగే కాని' మ్మని వరమిచ్చాడు. ఆ వాగ్దానం మేరకు మమ్ములను నలుగురినీ పట్టి బాధించాడే కాని, ప్రాణాలు తీసే ప్రయత్నం చేయలేదు.

**విశేషం:** కర్ణుడి సత్యవాక్య నిష్ఠను, తల్లిపై చూపిన గౌరవాన్నీ, అతడి ఉదాత్త ప్రవృత్తినీ ఇందులో ధర్మజుడు వ్యంగ్యంగా కీర్తించాడు.

**ఆ. తొల్లి తాన దాఁచెఁ దల్లి; పదంపడి । యతఁడు సెప్పవలవ దనఁగ దాఁచె;**
**నిట్లుగాఁగ నెఱుఁగ మేవురమును నతం । డిట్టిఁ డగుట; దాన నింత వుట్టె. 10**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం, మొదట్లో; తల్లి= కుంతీదేవి; తాన్+అ= తానే స్వయంగా; దాఁచెన్= రహస్యంగా ఉంచింది; పదంపడి= తరువాత; అతఁడు= కర్ణుడు; చెప్పన్ వలవదు= చెప్పవద్దు; అనఁగన్= అన్నట్లుగా; దాఁచెన్= రహస్యంగా ఉంచింది; ఇట్లుకాఁగన్= ఈ విధంగా కావటంచేత; అతండు= కర్ణుడు; ఇట్టిఁడు= ఇటువంటివాడు - అంటే కుంతీమహాదేవి మొదటి సంతానమైన వాడు కర్ణుడు; అగుటన్= కావటం; ఏవురమును= అయిదుగురం (పాండవులం); ఎఱుఁగము= ఎరుగం; దానన్= దానివలన; ఇంత= ఇంతటి వైపరీత్యం; పుట్టెన్= పుట్టింది.

**తాత్పర్యం:** కర్ణుడి జన్మవృత్తాంతాన్ని మొదట్లో తల్లి అయిన కుంతీదేవి స్వయంగా తానే రహస్యంగా ఉంచింది. ఆ తరువాత కర్ణుడు చెప్పటం సమంజసం కాదన్నట్లుగా గోప్యంగా దాచి ఉంచింది. అట్లా కావటంచేత కర్ణుడు కౌంతేయు డన్న సత్యాన్ని మే మైదుగురం తెలిసికొనలేకపోయాం. దానివలన ఇంతటి విపత్తు వాటిల్లింది.

**విశేషం:** ధర్మజుడి విషయవిశ్లేషణ వివేకం ఇందులో స్పష్టం.

**క. ఆతఁడు దుర్యోధనునకుఁ । బ్రీతిగ జూదంబునాఁడు పెక్కాడెను ధ**
**ర్మేతరములు; వానికి మ । చ్చేతోగతి కోపభరము సెందక యుండున్. 11**

**ప్రతిపదార్థం:** జూదంబునాఁడు= ద్యూతం ఆడే రోజున; ఆతఁడు= కర్ణుడు; దుర్యోధనునకున్= దుర్యోధనుడికి; ప్రీతిగన్= సంతోషమయ్యేటట్లు; ధర్మ+ఇతరములు= అధర్మాలు; పెక్కు= అనేకాలు; ఆడెను= మాట్లాడాడు; వానికిన్= ఆ అధర్మవాక్యాలకు; మత్+చేతో గతి= నా చిత్తవృత్తి; కోపభరము= కోపతీవ్రతను; చెందక= పొందకుండా; ఉండున్= ఉండేది.

**తాత్పర్యం:** అలనాడు కురుసభలో కపటపుజూదం జరిగిన నాడు కర్ణుడు దుర్యోధనుడిని సంతోషపెట్టటానికి అధర్మాల నెన్నింటినో పలికాడు. అయినా అతడి మాటలకు నా మనస్సు కోపాతిశయాన్ని పొందకుండానే ఉండేది.

**విశేషం:** రక్తసంబంధం వలన కర్ణుడిపట్ల ధర్మజుడి అంతఃకరణం ఆర్ద్రంగా స్పందించేది; కాని, ఆ సంబంధం ఏమిటో ఆయనకు తెలిసేది కాదు. అది ఇప్పుడు తెలిసింది. గతంలోని అనుభవాలను అతడు మననం చేసుకొంటున్నాడు.

**ఆ.** **అతనిమేను కుంతి యట్టుల కైవడి । యరయ నేను జూచి యాత్మ నెద్ది**
**కారణంబొ యిట్లుగా ననుచుండుదు ;। నేమి సేయువాఁడ నింకఁ జెపుము!** **12**

**ప్రతిపదార్థం:** అరయన్= చూడగా; అతని మేను= కర్ణుడి శరీరం; కుంతి+అట్టుల= కుంతివలె; కైవడి= పోలిక (కలిగింది); నేను= నేను (ధర్మరాజు); చూచి= దానిని గమనించి; ఇట్లు+కాన్= ఈ విధంగా కావటానికి; ఎద్దికారణంబొ= కారణ మేమిటో అని; ఆత్మన్= నా హృదయంలో; అనుచుండుదున్= అనుకొంటూ ఉంటాను; ఇంకన్= ఇంత జరిగిపోయిన తరువాత ఇప్పుడు; ఏమి చేయువాఁడన్+చెపుము!= ఏం చేసేది చెప్పండి నారదా!

**తాత్పర్యం:** చూస్తే కర్ణుడి శరీరం కుంతి పోలికలు కలిగి ఉండేది. నేను దానిని గమనించి అట్లా కావటానికి కారణ మేమై ఉంటుందా? అని మనస్సులో మథనపడుతుండేవాడిని. కాని, అంతా అయిపోయిన తరువాత ఇప్పుడు ఏమి చేసేది చెప్పండి నారదా!

**క.** **కౌరవులు సేయు నవమతి । కారణముగఁ గోప మెత్తుఁ, గర్ణుని వదనాం**
**భోరుహముం గనుఁగొన శమ । మారున్ నావశముగాక యంతన బుద్ధిన్.** **13**

**ప్రతిపదార్థం:** కౌరవులు= ధార్తరాష్ట్రులు; చేయు= చేసేటటువంటి; అవమతి= అవమానం; కారణముగన్= నెపంగా; కోపము= కోపం; ఎత్తున్= మెండుగా కలిగేది; కర్ణుని= కర్ణుడియొక్క; వదన+అంభోరుహమున్= పద్మంవంటి ముఖాన్ని; కనుఁగొనన్= చూడగానే; అంతన్+అ= వెంటనే; నా వశము+కాక= నా వశంతప్పి; బుద్ధిన్= నా మనస్సులో; శమము+ఆరున్= శాంతి కలుగుతుంది, శాంతి నిండుతుంది.

**తాత్పర్యం:** కౌరవులు చేసే అవమానాలకు నాకు కోపం బాగా రెచ్చిపోతుండేది, కాని, కర్ణుడి ముఖకమలం చూస్తే చాలు. వెంటనే నాకు తెలియకుండానే నా మనస్సులో శాంతం నిండిపోతుండేది.

**విశేషం:** రక్తసంబంధం ఉండటం చేత కర్ణుడిపట్ల ధర్మజుడికి కోపం రాకపోగా, అతడి ముఖం చూస్తే మనస్సులో ఒకవిధమైన శాంతి కలిగేది. ఇది ధర్మజుడి నిర్మలమైన అంతఃకరణ ప్రవృత్తిని తెలుపుతున్నది.

**ఉ.** **గాండివి నొవ్వఁబల్కి తిటు; 'గర్ణునిఁ జంపక వచ్చితేని త**
**మ్ముండవు గావు నాకు' నని మూర్ఖత; సోదరఘాతి నైన క**
**ష్టుండ; మనంబునం బెఱుగు శోకము నెట్లు సహింతుఁ? దప్పె; నా**
**తండును నేము నైన విబుధప్రకరంబును మాకు నడ్డమే!'** **14**

**ప్రతిపదార్థం:** కర్ణునిన్= కర్ణుడిని; చంపక= చంపకుండా; వచ్చితి(వి)+ఏని= యుద్ధభూమినుండి తిరిగివచ్చావా; నాకున్= నాకు (ధర్మరాజుకు); తమ్ముండవు కావు= సోదరుడవు కావు; అని; మూర్ఖతన్= తెలిసి తెలియనితనంతో, తెలివితక్కువతనంతో; ఇటు= ఈ విధంగా; గాండివిన్= అర్జునుడిని; నొవ్వన్= బాధపడేటట్లు; పల్కితిన్= మాట్లాడాను; సోదరఘాతిని+ఐన= సోదరుడిని చంపిన (వాడినైన); కష్టుండన్= పాపిష్ఠిని; మనంబునన్= హృదయంలో; పెఱుగు= పెంపొందే; శోకమును= దుఃఖాన్ని; ఎట్లు= ఏ విధంగా; సహింతున్?= భరించగలిగేది? (భరించలేనని భావం); తప్పెన్= అంతా తారుమారయింది లేదా మాకా అదృష్టం తప్పింది; ఆ తండునున్= ఆ కర్ణుడూ; ఏమున్= మేమునూ; ఐనన్= కలిసిఉన్నట్లయితే; మాకున్= మా అందరికి; విబుధ ప్రకరంబును= దేవతల గణాలు కూడా; అడ్డమే?= ఎదురు నిలువగలిగేవా? లేదా, మా కొక లెక్కా?

**తాత్పర్యం:** 'కర్ణుడిని చంపకుండా రణరంగంనుండి తిరిగి వచ్చావా? నీవు నాకు తమ్ముడివే కా' వని తెలివితక్కువతనంతో అర్జునుడు నొచ్చుకొనేటట్లు మాట్లాడాను. నిజంగా నేను అన్నను చంపిన పాపిష్ఠిని. నా హృదయంలో పెల్లుబుకే ఈ దుఃఖాన్ని నే నెట్లా ఓర్చుకొనేది? అంతా తారుమారైంది. ఆ కర్ణుడూ, మేమందరమూ కలిసి ఉంటే ఆ దేవతాగణాలు సైతం మాకు అడ్డం నిలువగలిగేవా?'

**విశేషం:** కర్ణుడి మరణానికి తన ప్రేరణ కారణమైనదని భావించిన ధర్మరాజు తాను చేసిన పాపానికి నిష్కృతి లేదని తీరని వేదన పడుతున్నాడు. ఈ మాటలలో ధర్మజుడి ఋజువర్తనం, బంధుప్రీతి, భ్రాతృప్రేమ, ధర్మనిరతి, ఆర్ద్రచిత్తవృత్తి, పరితాప పశ్చాత్తాపాలు కనపడుతున్నాయి.

**వ.** **అని పలికి, 'మునీంద్రా! యమ్మార్తాండనందను రథచక్రంబు భూమిం గ్రుంగుటకుం గారణం బెద్ది? దాని, న వ్వీరుండు పరశురామునిచేత శప్తుండయిన తెఱంగును నెఱింగింప వలయు; భువనంబుల వర్తనంబులు నీకుం దేటపడనియవి లేవు; గావున ని న్నడిగెద' నని ప్రార్థించుటయు, 'నవ్విధంబంతయు వివరించెద విను' మని యమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె:** **15**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ముని+ఇంద్రా!= ముని శ్రేష్ఠుడవైన ఓ నారదా!; ఆ+మార్తాండ నందను= సూర్యుడి కుమారుడైన ఆ కర్ణుడియొక్క; రథచక్రంబు= రథచక్రం; భూమిన్= నేలలో; క్రుంగుటకున్= క్రుంగటానికి; కారణంబు+ఎద్ది?= కారణం ఏది?; దానిన్= దానిని; ఆ+వీరుండు= పరాక్రమ వంతుడైన ఆ కర్ణుడు; పరశురామునిచేతన్= పరశురాముడివలన; శప్తుండు= శపించబడిన వాడయిన; తెఱంగును= విధానాన్ని; ఎఱింగింపన్ వలయున్= తెలియజేయాలి; భువనంబుల= (పదునాల్గు) లోకాలలో; వర్తనంబులు= జరిగే విశేషాలలో; నీకున్= నీకు; తేటపడనిఅవి= తెలియనివి; లేవు= ఉండవు; కావునన్= కాబట్టి; నిన్నున్= నిన్ను (నారదుడిని); అడిగెదన్= అడుగుతున్నాను; అని; ప్రార్థించుటయున్= వేడుకోగా; ఆ+విధంబు+అంతయున్= ఆ జరిగిన విధమంతటినీ; వివరించెదన్= వివరంగా చెపుతాను; వినుము; అని; ఆ+మహాత్ముండు= ఉత్తముడైన ఆ నారదుడు; ఆ+మహీపతికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'నారదమునీంద్రా! ఆ కర్ణుడి రథచక్రం రణరంగంలో భూమిలో క్రుంగిపోవటానికి గల కారణ మేమిటి? ఆ వీరుడు పరశురాముడి చేత శపించబడిన విధం ఎటువంటిది? నాకు తెలియజెప్పండి. మీకు పధ్నాలుగు లోకాలలో జరిగే విశేషాలన్నీ తెలిసికొనే శక్తి ఉన్నది కాబట్టి ఈ సంగతిని మిమ్ముల నడుగుతున్నాను' అని ప్రార్థించాడు ధర్మరాజు. అతడు అడిగిన విధంగా నారదుడు ఆ విశేషాలను వివరించటానికి పూనుకొని ఇట్లా అన్నాడు.

**నారదుడు ధర్మరాజునకుఁ గర్ణుని చరితంబు సెప్పుట (సం. 12-2-1)**

**సీ.** **' మునిదత్త మగు మంత్రమున గొంతి కన్నియ । నాఁడు వేడుక దినవాథుఁ దనకుఁ**
**బ్రత్యక్షముగఁ జేసి పడయుటఁ దా సిగ్గు ।  పెంపున సుతు వెలయింప దయ్యెఁ ;**
**కన్యాత్వవికలత గాకుండఁ దా సూర్య । వరము గల్గుటఁ జేసి వంశవర్య**
**యై పొల్చె; దేవరహస్య మిత్తెఱఁ, గిట్లు । పాఱవైవఁగఁ బడ్డ పట్టి సూతుఁ**

**తే.** **డెత్తికొనిపోయె; సూతజుం డితఁ డనంగఁ । బెరిఁగి కర్ణుండు నీ నేర్పు భీములావు**
**నరుని విలుబల్మి యతనికి హరికిఁ గలుగు । చెలిమి గని తద్ద వగఁ బొందుఁ జిత్త మెరియ.** **16**

**ప్రతిపదార్థం:** గొంతి= కుంతి; కన్నియనాఁడు= కన్నెగా ఉన్నప్పుడు; ముని దత్తము+అగు మంత్రమునన్= దుర్వాస మహర్షి చేత ప్రసాదించబడిన మంత్రంతో; వేడుకన్= ఆసక్తితో; దినవాథున్= సూర్యుడిని; తనకున్= తనకు (కుంతికి); ప్రత్యక్షముగన్+చేసి= ఎదుట తోచువాడినిగా చేసికొని; సుతున్= కొడుకును; పడయుటన్= పొందటంచేత; తాన్= తాను(కుంతి); సిగ్గుపెంపునన్= మిక్కిలిసిగ్గుచేత; వెలయింపదు+అయ్యెన్= బయటపెట్టలేకపోయింది; కన్యాత్వ వికలత= (కొడుకును కన్న తరువాత కూడా) కన్యాత్వం భగ్నంకావటం;  కాకుండన్= జరుగకుండా; సూర్యవరము= సూర్యుడిచ్చిన వరం; కల్గుటన్+చేసి= ఉండటం చేత; తాన్= తాను (కుంతి); వంశవర్య+ఐ= వంశంలో ఉత్తమురాలై, ఉత్తమ ఇల్లాలై; పొల్చెన్= ఒప్పారింది; ఈ+తెఱఁగు= ఈ విధంగా కావటం; దేవరహస్యము= దేవతలకు మాత్రమే తెలిసిన రహస్యం; ఇట్లు= ఈ విధంగా; పాఱవైవఁగన్+పడ్డ= త్యజించబడిన, వదలిపెట్టబడిన; పట్టి= కొడుకును; సూతుఁడు= రథసారథి ఒకడు; ఎత్తికొనిపోయెన్= పెంచుకొనటానికి తీసికొనిపోయాడు; ఇతఁడు= కర్ణుడు; సూతజుఁడు= సూతుడికి పుట్టినవాడు; అనంగన్= అని పేరుపడి; పెరిఁగి= పెద్దవాడై; కర్ణుండు= కర్ణుడు; నీ నేర్పు= నీకున్న నేర్పరితనం; భీములావు= భీముడిబలం; నరుని విలుబల్మి= అర్జునుడి కోదండపటిమ; అతనికిన్= అర్జునుడికి; హరికిన్= శ్రీకృష్ణుడికి; కలుగు= ఉండే; చెలిమి= స్నేహం; కని= చూచి; చిత్తము= మనస్సు; ఎరియన్= బాధపడేటట్లు, మండేటట్లు; తద్ద= అమితంగా; వగన్= చింతను; పొందున్= పొందుతూ ఉండేవాడు.

**తాత్పర్యం:** కుంతీదేవి కన్నెగా ఉన్నకాలంలో దుర్వాసోమహర్షి ఇచ్చిన మంత్ర ప్రభావం వలన సూర్యదేవుడిని ఆసక్తితో ప్రత్యక్షం చేసికొని కొడుకును కన్నందువలన మిక్కిలిసిగ్గుతో ఆ వాస్తవాన్ని ప్రకటించలేకపోయింది. కొడుకును కన్నప్పటికీ ఆమెకు కన్యాత్వం భగ్నం కాకుండా ఉండేటట్లు సూర్యదేవుడివరం ఉండటం వలన ఆమె ఉత్తమ గృహిణిగా ప్రసిద్ధి కెక్కింది. ఇదంతా దేవరహస్యం.  ఆ విధంగా కుంతిచేత నదిలో విడువబడిన ఆమె కొడుకును సూతుడు చూచి ఇంటికి ఎత్తుకొనిపోయాడు. అందువలన కర్ణుడు సూతుడికి పుట్టినవాడనీ, సూతకులంలో పుట్టినవాడనీ లోకంలో ప్రసిద్ధి కెక్కుతూ పెరిగాడు. ధర్మరాజు నేర్పరితనం, భీముడి బాహుబలం, అర్జునుడి కోదండపాండిత్యం, అర్జునుడికీ శ్రీకృష్ణుడికీ గల స్నేహం - ఇవన్నీ చూచి హృదయం మండి కర్ణుడు బాగా బాధపడుతూ ఉండేవాడు.

**క.** **నకుల సహదేవ నయ శా । స్త్ర కళావేదిత్వమునకు జను లనురాగా**
**ధికులై మిమ్ముం గొనియా । టకు నాతఁడు మనసు చేద్పడం జింతిల్లున్.** **17**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= కర్ణుడు; నకుల సహదేవ= నకులసహదేవుల; నయశాస్త్ర కళావేదిత్వమునకున్= నీతి శాస్త్రాలయందు, కళలయందూ గల పాండిత్యానికీ; జనులు= ప్రజలు; అనురాగ+అధికులు+ఐ= మిక్కిలి ప్రీతి గలవారై; మిమ్మున్= మిమ్మల్ని (పాండవులను); కొనియాటకున్= మెచ్చుకొంటూ ఉంటున్నందుకు; మనసు= హృదయం; చేద్పడన్= బాధపడగా, కలతచెందగా; చింతిల్లున్= విచారపడుతూ ఉండేవాడు.

**తాత్పర్యం:** నకుల సహదేవుల కుండే నీతి, శాస్త్రకళాపాండిత్యాన్నీ ప్రజలు మిక్కిలి ప్రీతితో (మిమ్ములను) మెచ్చుకొంటూ ఉండటం కర్ణుడికి నచ్చేదికాదు. అతడు దానికి మనసు కలతపడగా బాధపడుతూ ఉండేవాడు.

**వ. ఇది తదీయ స్వభావం: బట్లుగాక దైవఘటనంబు నట్టిద; యమ్మాత్సర్యంబున నక్కర్ణుండు మీయెడ నీసు గలవాఁడయి దుర్యోధనుం గూడికొనియెఁ; బదంపడి ధనంజయు ధనుర్విద్యాతిశయం బుపలక్షించి, కుంభసంభవు పాలికిం జని, యేకాంతంబునందనకు బ్రహ్మాస్త్రంబు సాంగోపాంగంబుగా నుపదేశింప వలయు నని యడిగి, 'యేను సమరంబున సవ్యసాచికి సమానుండ నగుటఁ గోరి వచ్చితి; నీవు సర్వశిష్య సమాదరుండవు; భవత్ప్రసాదంబునగృతాస్త్రుండ నయి వెలయవలదే?' యనవుడు నద్దిననాథనందనునకు నగ్గురుం డిట్లనియె. 18**

**ప్రతిపదార్థం:** ఇది= ఇటువంటిది; తదీయ= అతడి (కర్ణుడి); స్వభావంబు= నైజం; అట్లు+కాక= అంతేకాకుండా; దైవఘటనంబును= విధి సంవిధానంకూడా; అట్టిది+అ= అటువంటిదే; ఆ+కర్ణుండు= అటువంటి కర్ణుడు; ఆ+మాత్సర్యంబునన్= అటువంటి ద్వేషంతో; మీఎడన్= మీపట్ల; ఈసు= అసూయ; కలవాఁడు+అయి= పొందినవాడై; దుర్యోధనున్+కూడుకొనియెన్= దుర్యోధనుడితో చేరాడు; పదంపడి= ఆ తరువాత; ధనంజయు= అర్జునుడియొక్క; ధనుః+విద్యా+అతిశయంబు= విలువిద్యలోని మేటి తనాన్ని; ఉపలక్షించి= గమనించి; కుంభసంభవుపాలికిన్+చని= ద్రోణాచార్యుడి వద్దకుపోయి; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్నప్పుడు; తనకున్= తనకు (కర్ణుడికి); బ్రహ్మ+అస్త్రంబు= బ్రహ్మమంత్రంతో ప్రయోగించే బాణాన్ని; స+అంగ+ఉప+అంగంబుగాన్= అంగ ఉపాంగాలతో సహా (ప్రయోగ ఉపసంహరణాదులతో సహా అని భావం); ఉపదేశింపన్ వలయున్= ఉపదేశించుము; అని అడిగి= అని ప్రార్థించి; ఏను= నేను(కర్ణుడు); సమరంబునన్= యుద్ధం చేయటంలో; సవ్యసాచికిన్= అర్జునుడికి; సమానుండన్= సమమైన నేర్పు కలవాడిని; అగుటన్= కావాలని; కోరి= అభిలాషపడి; వచ్చితిన్= వచ్చాను; ఈవు= నీవు (ద్రోణాచార్యుడు); సర్వశిష్యసమ+ఆదరుండవు= శిష్యులనందరిని సమంగా ఆదరించే వాడివి; భవత్+ప్రసాదంబునన్= నీ దయచేత; కృత+అస్త్రుండన్+అయి= మంత్ర సహిత మహాబాణమైన బ్రహ్మాస్త్రాన్ని పొందినవాడనయి; వెలయన్ వలదే?= ప్రకాశించవద్దా? (తప్పక ప్రకాశించాలి అని భావం); అనవుడున్= అనగా విని; ఆ+దిననాథ నందనునకున్= ఆ సూర్యకుమారుడైన కర్ణుడితో; ఆ+గురుండు= ఆ ఆచార్యుడైన ద్రోణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అది అతడి స్వభావం. అంతేకాక విధి సంవిధానం కూడా అటువంటిదే. మీమీది ద్వేషంతో ఆ కర్ణుడు అసూయ పెంచుకొని, దుర్యోధనుడితో చేతులు కలిపాడు. ఆ తరువాత అర్జునుడి విలువిద్యలోని మేటితనాన్ని గమనించి ఒకసారి ద్రోణాచార్యుడి వద్దకు వెళ్ళాడు. ఆయన ఏకాంతంగా ఉన్నప్పుడు తనకు బ్రహ్మాస్త్రాన్ని సాంగోపాంగంగా ఉపదేశించుమని కోరాడు. 'నేను యుద్ధం చేయటంలో అర్జునుడికి సమానుడను కావాలని కోరి వచ్చాను. నీవా - శిష్యులనందరినీ సమానంగా చూచేవాడవు. కాబట్టి నీదయవలన బ్రహ్మాస్త్రాన్ని పొంది ప్రకాశించవద్దా!' అని అన్నాడు. ఆ మాటలు విని కర్ణుడితో ద్రోణు డిట్లా అన్నాడు:

**తే. ' వ్రత సమన్విత భూసుర వర్యుఁ డొండె । నిరుపమాన తపః పుణ్యనృపతి యొండెఁ**
**గాని యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుఁ । బాత్రములు గారు; నీకు నీఁబాడి గాదు.' 19**

**ప్రతిపదార్థం:** వ్రత= వేదశాస్త్రాలలో చెప్పబడిన విధివిధానాలతో; సమన్విత= కూడుకొన్న (జీవితవిధానం గల); భూసురవర్యుఁడు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; ఒండు+ఎన్= ఒక్కడు మాత్రమే; నిరుపమాన= సాటిలేని; తపః= తపస్సువలన కలిగిన; పుణ్య= పుణ్యచిత్తవృత్తిగల;

నృపతి= రాజు (క్షత్రియుడు); ఒండు+ఎన్= ఒక్కడు మాత్రమే; కాని= వీరిద్దరు తప్ప; అన్యులు= ఇతరులు; బ్రహ్మ+అస్త్ర దానమునకున్= బ్రహ్మాస్త్రాన్ని ఇవ్వటానికి; పాత్రములు= యోగ్యులు; కారు= కారు (కాజాలరు కాబట్టి); నీకున్= నీకు (కర్ణుడికి); ఈన్= ఇవ్వటానికి; పాడి= న్యాయం, ధర్మం; కాదు.

**తాత్పర్యం:** 'వేదోక్త విధి విధానాలను జీవితవ్రతంగా పాటించే బ్రాహ్మణ శ్రేష్ఠుడుగాని, సాటిలేని తపఃప్రభావం వలన పుణ్యశీలుడైన రాజు కాని బ్రహ్మాస్త్రాన్ని దానం చేస్తే స్వీకరించటానికి యోగ్యులౌతారు కాని ఇతరులుకారు. కాబట్టి నీకు నేను బ్రహ్మాస్త్రాన్ని దానం చేయటం ధర్మంకాదు.'

**వ. అనుటయు, నట్లకాక యని నిజమందిరంబునకుం జని, మఱునాఁడు గదలి మహేంద్రమహీధరంబున కరిగి పరశురామునిం గాంచి, వినయంబునం బ్రణమిల్లి, 'యేను బ్రాహ్మణుండ, భృగువంశజాతుండ, నస్త్రవిద్యాపేక్ష నిన్నాశ్రయింప వచ్చితి' ననిన నమ్మునివరుండు ప్రీతుండై కర్ణుం బరిగ్రహించి, యస్త్రపరిశ్రమంబు సేయించుచుండె; నట్టియెడ నాశ్రమ పరిసరంబున నొక్కచోఁ దనయంతన లాఘవాభ్యాసంబు సేయుచుండ నొక్క మహాద్విజుని హోమధేనువు వత్సంబడ్డంబు వాఱి బాణగోచరంబై మృతిం బొందిన గని యవ్విప్రుండు గోపంబున శాపం బిచ్చిన, దానం దేరు ధరణిం గ్రుంగె; జామదగ్న్యుండు శపించిన తెఱంగునుం జెప్పెద; నవ్వీరుం డతనికి భక్తుండై పరిశ్రమం బాచరింప నతండు బ్రహ్మాస్త్రంబు లోనుగా ననేకాస్త్రంబు లొసంగెఁ; బదంపడి యొక్కనాఁడు. 20**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ఆ విధంగా ద్రోణు డనగా కర్ణుడు విని; అట్లు+అ కాక అని= అట్లాగే కానివ్వండి అని; నిజమందిరంబునకున్= తన (కర్ణుడి) ఇంటికి; చని= వెళ్ళి; మఱునాఁడు= ఆ మరుసటిరోజున; కదలి= ప్రయాణమై; మహేంద్ర మహీధరంబునకున్= మహేంద్రపర్వతానికి; అరిగి= వెళ్ళి; పరశురామునిన్+కాంచి= పరశురాముడిని దర్శించి; వినయంబునన్= అణకువతో; ప్రణమిల్లి= నమస్కరించి; ఏను= నేను(కర్ణుడను); బ్రాహ్మణుండన్= విప్రుడను; భృగువంశజాతుండన్= భృగుడి వంశంలో పుట్టినవాడను; అస్త్రవిద్యా+అపేక్షన్= మంత్ర సహితాలైన బాణవిద్యల మీది కోరికచేత; నిన్నున్= నిన్ను (పరశురాముడిని); ఆశ్రయింపన్= అండగొనుటకు; వచ్చితిన్= వచ్చాను; అనినన్= అని చెప్పగా; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడైన పరశురాముడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; కర్ణున్= కర్ణుడిని; పరిగ్రహించి= శిష్యుడిగా స్వీకరించి; అస్త్రపరిశ్రమంబు= మంత్ర సహితమైన బాణాల అభ్యాసం; చేయించుచుండెన్= చేయిస్తూ ఉన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆశ్రమ పరిసరంబునన్= ఆశ్రమ సమీపంలో; ఒక్కచోన్= ఒకచోట; తన అంతన్+అ= తనంతటతాను, స్వయంగా; లాఘవ+అభ్యాసంబు= నేర్పుకొరకు చేసే అలవాటు పరిశ్రమ; చేయుచున్+ఉండన్= చేస్తూ ఉండగా; ఒక్క మహాద్విజుని= ఒక మహిమాన్వితుడైన బ్రాహ్మణుడియొక్క; హోమధేనువు వత్సంబు= యజ్ఞకార్యాదులకు పాలు, పెరుగు, నెయ్యి మొదలైన ద్రవ్యాలను అందించే ఆవుయొక్క దూడ; అడ్డంబు+పాఱి= అడ్డంగా పరుగెత్తి; బాణగోచరంబు+ఐ= బాణానికి విషయమై -అంటే బాణం తగిలినదై; మృతిన్+పొందినన్= చనిపోగా; ఆ+విప్రుండు= ఆ హోమధేనువు యజమానుడు అయిన బ్రాహ్మణుడు; కని= చూచి; కోపంబునన్= కోపంతో; శాపంబు+ఇచ్చినన్= శాపం ఇవ్వగా; దానన్= దానిచేత; తేరు= (కర్ణుడి)రథం; ధరణిన్= భూమిలో; క్రుంగెన్= దిగబడింది; జామదగ్న్యుండు= జమదగ్ని కుమారుడైన పరశురాముడు; శపించిన తెఱంగునున్= శపించిన విధానాన్ని కూడా; చెప్పెదన్= చెప్పెదను; ఆ+వీరుండు= ఆ వీరుడైన కర్ణుడు; అతనికిన్= పరశురాముడికి; భక్తుండు+ఐ= భక్తుడై; పరిశ్రమంబు= బాణవిద్యాభ్యాసాన్ని; ఆచరింపన్= చేయగా; అతండు= పరశురాముడు; బ్రహ్మ+అస్త్రంబు లోనుగాన్= బ్రహ్మాస్త్రం మొదలుగా; అనేక+అస్త్రంబులు= మంత్రసహితమైన బాణాలను పెక్కింటిని; ఒసంగెన్= ఇచ్చాడు; పదంపడి= తరువాత; ఒక్కనాఁడు= ఒకరోజున.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు అట్లా అనగానే మంచిదని కర్ణుడు తన ఇంటికి తిరిగిపోయి, మరునాడు బయలుదేరి మహేంద్రపర్వతానికి వెళ్ళి పరశురాముడిని దర్శించి వినయంతో నమస్కరించాడు. 'నేను బ్రాహ్మణుడిని,

భృగువంశంలో పుట్టాను. అస్త్రవిద్య నేర్చుకొనాలన్న కోరికతో నిన్ను ఆశ్రయించటానికి వచ్చాను' - అని అన్నాడు. ఆ మాటలకు సంతోషపడి పరశురాముడు కర్ణుడిని శిష్యుడిగా స్వీకరించాడు. ఆపైన కర్ణుడు అస్త్రవిద్యలో అభ్యాసం చేస్తూ ఉన్నాడు. ఒకనాడు అతడు ఆశ్రమసమీప ప్రదేశంలో అస్త్రవిద్యాభ్యాసం చేస్తూ ఉండగా అతడి బాణం ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడి హోమధేనువు దూడకు తగలటంచేత అది చనిపోయింది. దానికి ఆ బ్రాహ్మణుడు కోపించి కర్ణుడికి శాపంపెట్టాడు. దానివలన అతడి రథం నేలలో క్రుంగిపోయింది. ఇది ఇట్లా ఉండగా పరశురాముడు కూడా కర్ణుడిని శపించిన విధాన్ని వివరిస్తాను. కర్ణుడు భక్తుడై పరశురాముడిని సేవించటం వలన ఆయన అతడికి బ్రహ్మాస్త్రం మొదలుకొని అనేకాస్త్రాలను నేర్పాడు. ఆ తరువాత ఒకనాడు.

**తే.** **కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి , । గురుఁడు నిద్రింప వికృతాతి ఘోరరూప**
**మళక మనియెడు నొకకీట మద్దినేంద్ర । తనయ క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ.** **21**

**ప్రతిపదార్థం :** గురుఁడు= గురువైన పరశురాముడు; కర్ణుని= కర్ణుడియొక్క; ఉత్సంగమునన్= తొడమీద; మస్తకంబున్= తలను; చేర్చి= ఉంచి; నిద్రింపన్= నిదురపోవగా; వికృత+అతిఘోరరూపము= వికారమైన; అతి భయంకరమైన ఆకారంగల; అళకము+అనియెడు= అళకం అనేపేరుగల; ఒక కీటకము= ఒక పురుగు; ఆ+దిన+ఇంద్రతనయున్= ఆ సూర్యుడి కుమారుడైన కర్ణుడియొక్క; క్రీఁదొడన్= క్రింది తొడభాగాన్ని; సత్వరము+కాఁగన్= వేగంగా; తొలిచెన్= తొలిచింది.

**తాత్పర్యం:** పరశురాముడు కర్ణుడి తొడమీద తలపెట్టి నిద్రపోయాడు. వికారమైన, భయంకరమైన ఆకారం కలిగిన అళకం అనే పురు గొకటి కర్ణుడి క్రిందితొడభాగాన్ని వడివడిగా తొలిచివేసింది.

**వ.** **అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యంబునం గీటకృతంబున కోర్చి యచలుండై యుండె; నెత్తు రొండొండ పరఁగి పరశురామ శరీరంబు సోఁకిన, నమ్మహాత్ముండు మేల్కని 'రక్తం బెక్కడి' దని యడిగినఁ, దొడయెత్తి కీటంబుం జూపి 'యిది దొలుఁచుచుండ మీనిదుర సెడుటకుం జాలక కదలకుండితి' ననియె; నమ్ముని గనుంగొనిన నక్కీటంబు.** **22**

**ప్రతిపదార్థం:** అతండును= కర్ణుడుకూడ; గురునకున్= గురువైన పరశురాముడికి; నిద్రాభంగంబు+అగుటకున్= నిదురచెడి పోవటానికి; ఓర్వక= సహించక; ధైర్యంబునన్= ధైర్యంతో; కీటకృతంబునకున్= పురుగు చేసినదానికి; ఓర్చి= సహించి; అచలుండు+ఐ= చలించనివాడై (స్థిరుడై); ఉండెన్= ఉన్నాడు; నెత్తురు= రక్తం; ఒండు+ఒండన్= క్రమక్రమంగా; పరఁగి= వ్యాపించి; పరశురామ శరీరంబు సోఁకినన్= పరశురాముడి దేహాన్ని తాకగా; ఆ+మహా+ఆత్ముండు= గొప్పవాడైన ఆ పరశురాముడు; మేల్కని= నిద్రనుండి లేచి; రక్తంబు+ఎక్కడిది?= ఈ నెత్తురు ఎక్కడిది?; అని అడిగినన్= అని ప్రశ్నించగా; తొడ+ఎత్తి= తొడను పైకెత్తి; కీటంబున్+చూపి= తొడక్రింద నున్న పురుగును చూపి; ఇది= ఈ పురుగు; తొలుఁచుచున్+ఉండన్= తొలుస్తూ ఉండగా; మీ నిదుర= మీ నిద్ర; చెడుటకున్= పాడగుటకు; చాలక= ఇష్టపడక; కదలక+ఉండితిన్= కదలకుండా ఉండిపోయాను; అనియెన్= అని అన్నాడు; ఆ+ముని= ఆ పరశురాముడు; కనుఁగొనినన్= చూచినవెంటనే; ఆ+కీటంబు= ఆ పురుగు.

**తాత్పర్యం:** కర్ణుడు గురువుకు నిద్రాభంగం కావటానికి ఇష్టపడక, ధైర్యంతో ఆ పురుగు చేసే కొరుకుడుకు సహించి కదలకుండా ఉన్నాడు. నెత్తురు కారటం మొదలుపెట్టి క్రమంగా సాగి పరశురాముడి శరీరాన్ని తాకింది. ఆ స్పర్శకు పరశురాముడు మేల్కొని 'ఈ రక్తం ఎక్కడిది?' అని అడిగాడు. కర్ణుడు తొడ ఎత్తి కీటకాన్ని చూపి 'ఇది తొలుస్తూ ఉండగా మీ నిద్ర చెడకుండా ఉండాలని ఆ బాధను సహించి నేను కదలకుండా కూర్చున్నాను' అన్నాడు. పరశురాముడు ఆ కీటకాన్ని చూడగానే (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మృతిఁబొంది రాక్షసుండై । ఖతలంబున నుండి పలుకుఁ 'గరుణాకర! నీ**
**కతమున దారుణ శాప । ప్రతిహతి వాటిల్లె; నిపుడు ప్రకృతి వడసితిన్. 23**

**ప్రతిపదార్థం:** మృతిన్+పొంది= (ఆ పురుగు) చనిపోయి; రాక్షసుండు+ఐ= రాక్షసరూపాన్ని పొంది; ఖతలంబునన్+ఉండి= ఆకాశప్రదేశంలో నిలువబడి; పలుకున్= ఈ విధంగా మాట్లాడింది; కరుణాకర!= దయామయా!; నీకతమునన్= నీ కారణంగా; దారుణ శాపప్రతిహతి= భయంకరమైన శాపముయొక్క నివృత్తి; పాటిల్లెన్= కలిగింది; ఇపుడు= శాపం తొలగిపోయిన తరువాత; ప్రకృతి= నిజరూపాన్ని; పడసితిన్= పొందాను.

**తాత్పర్యం:** పరశురాముడు చూడగానే ఆ పురుగు చనిపోయి రాక్షసరూపం పొంది ఆకాశప్రదేశంలో నిలిచి ఇట్లా పలికింది. 'ఓ దయామయా! నీ కారణంగా నాకు భయంకరమైన శాపం నివృత్తి చెందింది. నేను నా పూర్వరూపాన్ని పొందగలిగాను.

**విశేషం:** ఈ పద్యంలో పరశురాముడి చూపులకే అంత శక్తి ఉండగా, ఆతడి వచస్సుకు ఎంతటి శాపానుగ్రహశక్తి ఉంటుందో ధ్వనిమయంగా కథకుడు సూచిస్తున్నాడు.

**వ. ' గ్రస్తుం డనుపేరం బరఁగు నొక్క రక్కసుండ; భృగుపత్ని నపహరించి తదీయశాపంబునఁ గీటంబనై యుండి, భవదీయ విలోకనామృత సేకంబున సుఖి నైతి' నని చెప్పి, నమస్కరించి నిజేచ్ఛం జనియె; రాముండు రాధేయుధైర్యంబు మనంబున నిరూపించి యతనితోడ. 24**

**ప్రతిపదార్థం:** గ్రస్తుండు+అనుపేరన్+పరఁగు= గ్రస్తుడు అనే పేరుతో ఒప్పారే; ఒక్కరక్కసుండన్= ఒక రాక్షసుడను; భృగుపత్నిన్= భృగుమహర్షిభార్యను; అపహరించి= దొంగిలించి; తదీయశాపంబునన్= అతడి శాపంవలన; కీటంబను+ఐ+ఉండి= పురుగునై ఉండి; భవదీయ= నీయొక్క; విలోకన= చూపులనెడి; అమృతసేకంబునన్= అమృతపు చిలకరింపుచేత; సుఖిని+ఐతిన్= సుఖం కలవాడనైనాను; అని చెప్పి= అని తన కథను చెప్పి; నమస్కరించి= దండాలు పెట్టి; నిజ+ఇచ్ఛన్+చనియెన్= తన ఇష్టం వచ్చిన విధంగా వెళ్ళిపోయాడు; రాముండు= పరశురాముడు; రాధేయుధైర్యంబున్= కర్ణుడి ధీరభావాన్ని; మనంబునన్= హృదయంలో; నిరూపించి= లెక్కకట్టి; అతనితోడన్= కర్ణుడితో.

**తాత్పర్యం :** గ్రస్తుడు అనే పేరుతో పిలువబడే ఒక రాక్షసుడిని నేను. భృగుమహర్షి భార్యను అపహరించి అతడి శాపానికి గురి అయి కీటకంగా ఉంటూ వచ్చాను. ఓ పరశురామా! నీ చూపులనే అమృతపు చిలకరింపుల వలన నేను మరల నిజరూపాన్ని పొంది సుఖంగా ఉన్నాను' - అని చెప్పి నమస్కరించి స్వేచ్ఛగా వెడలిపోయా డా రాక్షసుడు. ఆ తరువాత పరశురాముడు కర్ణుడు ప్రదర్శించిన అపూర్వధైర్యాన్ని మనసులో లోతుగా భావించి అతడితో- (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: రూపకం.

**క. ' ఈతాల్మి లేదు బ్రాహ్మణ । జాతికి; నీ వెవ్వఁడవు నిజం' బనవుడు 'నే**
**సూతజుఁడ' ననియె వెఱచుచు । నాతం; డా మునివరేణ్యుఁ డతి కుపితుండై. 25**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణజాతికిన్= బ్రాహ్మణజాతికి; ఈ తాల్మి= ఇటువంటి ఓర్పు; లేదు= ఉండదు; నిజంబు= నిజంగా; నీవు+ఎవ్వఁడవు?= నీవు ఎవరవు?; అనవుడున్= అనగా విని; ఏన్= నేను; సూతజుఁడన్= సూతపుత్రుడను - అని; ఆతండు= కర్ణుడు; వెఱచుచున్= భయపడుతూ; అనియెన్= అన్నాడు; ఆ మునివరేణ్యుండు= ఆ మునిశ్రేష్ఠుడైన పరశురాముడు; అతికుపితుండు+ఐ= మిక్కిలి కోపించినవాడై.

**తాత్పర్యం :** 'బ్రాహ్మణజాతికి ఇటువంటి ఓర్పు ఉండదు. నిజంగా నీ వెవడవు?' అని అడుగగా 'నేను సూతపుత్రుడ' నని కర్ణుడు భయపడుతూ సమాధానం చెప్పాడు. అందుకు పరశురాముడు మిక్కిలి కోపించి.

**వ. 'నీవు బ్రాహ్మణుండ నని కపటంబున మత్పరిగ్రహంబు వడసితివి; తత్ఫలం బనుభవింపు' మని యస్త్రవిద్యావిభవంబు వికలంబుగా శపియించెఁ; గర్ణుండునుం జేయునది లేక వగచుచు వచ్చి దుర్యోధనుం గాంచి. 26**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణుండను+అని= నేను బ్రాహ్మణుడను అని; నీవు= నీవు(కర్ణుడు); కపటంబునన్= వంచనతో; మత్+పరిగ్రహంబున్= నా శిష్యత్వమును; పడసితివి= పొందావు; తద్+ఫలంబు= దాని ఫలితాన్ని; అనుభవింపుము= పొందుము; అని= అని పలికి; అస్త్ర విద్యావిభవంబు= మంత్ర బాణవిద్యావైభవం; వికలంబు+కాన్= భగ్నమై పోయేటట్లు; శపియించెన్= శాపం పెట్టాడు; కర్ణుండునున్= కర్ణుడు కూడా; చేయునది లేక= చేయగలిగిందేమీ లేక; వగచుచున్= విచారపడుతూ; వచ్చి= తిరిగివచ్చి; దుర్యోధనున్= దుర్యోధనుడిని; కాంచి= చూచి.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణుడను అని పలికి నీవు వంచనతో నా శిష్యత్వాన్ని గ్రహించావు. దాని ఫలితాన్ని అనుభవించుము. నా వలన నేర్చుకొన్న అస్త్రవిద్యా సంపద మొత్తం భగ్నమైపోవుగాక!' అని శపించాడు. కర్ణుడుకూడా చేయగలిగిం దేమీ లేక విచారపడుతూ వచ్చి దుర్యోధనుడిని చూచి.

**ఆ. 'అధిప! పరశురాము నాశ్రయించితిఁ; గృతా । స్త్రుండ నైతి, నన్ను భండనమున**
**మార్కొనంగ లేరు మగ లిజ్జగంబున' । ననుడు నతఁడు ప్రముదితాత్ముఁ డయ్యె. 27**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభూ! దుర్యోధనా!; పరశురామున్+ఆశ్రయించితిన్= పరశురాముడిని శరణువేడాను; కృత+అస్త్రుండను+ఐతిన్= గైకొనబడిన అస్త్రములు కలవాడి నైనాను (అస్త్రవిజ్ఞానాన్ని పొందాను); ఈ జగంబునన్= ఈ లోకంలో; మగలు= వీరులు; భండనమునన్= యుద్ధంలో; నన్నున్; మార్కొనంగన్‌లేరు= ఎదుర్కొనలేరు; అనుడున్= అనగా విని; అతఁడు= దుర్యోధనుడు; ప్రముదిత+ఆత్ముఁడు= సంతోషించిన హృదయం కలవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** 'ప్రభూ! నేను పరశురాముడిని ఆశ్రయించి అస్త్రవిద్యను గడించాను. ఇప్పు డీలోకంలో వీరు లెవ్వరూ యుద్ధంలో నన్ను ఎదుర్కొనేవారు లేరు' అని అనగా విని దుర్యోధనుడు సంతుష్టాంతరంగు డయ్యాడు.

**విశేషం:** కర్ణుడు అబద్ధా లాడటంలో వెనుకాడ డని మరొకసారి రుజువైంది - అవి సుయోధనుడికి సంతోషం కలిగిస్తే చాలు.

**వ. ఇవి మీ యన్న వోయిన పోక; లిట్లు దుర్యోధనునకు ననుంగైయుండఁ, గళింగపతి యగు చిత్రాంగదుండు శుభాంగి యను నిజపుత్రికి స్వయంవర మహోత్సవంబు సేయించువాఁడై చాటించిన, శిశుపాలుండును, నీలుండును, జరాసంధుండును, రుక్మియు లోనుగా రాజు లనేకులు తదీయరాజధాని యగు రాజపురంబునకుం జనిరి; దుర్యోధనుండును దోహలంబున సముచిత చతురంగ బలసమేతుండును గల్పిత రథారూఢుండును గర్ణసహాయుండునునై యరిగె; నట్లు గూడిన భూపతులకుం దగుసంవిధానంబు లాచరించి. 28**

**ప్రతిపదార్థం:** ఇవి= ఇప్పుడు చెప్పినవి; మీ+అన్న= మీ అన్న అయిన కర్ణుడు; పోయినపోకలు= నడచిన విధాలు; ఇట్లు= ఈ విధంగా; దుర్యోధనునకున్= దుర్యోధనుడికి; అనుంగు+ఐ+ఉండన్= ప్రియస్నేహితుడై ఉండగా; కళింగపతి+అగు చిత్రాంగదుండు= కళింగదేశానికి రాజైన చిత్రాంగదుడు; శుభాంగి+అను నిజపుత్రికిన్= శుభాంగి అనే పేరుగల తన కొమార్తెకు; స్వయంవర మహా+ఉత్సవంబు= స్వయంగా కన్యవరుడిని నిండుసభలో ఎన్నుకొనే వేడుకను; చేయించువాఁడు+ఐ= నిర్వహింపదలచి;

చాటించినన్ ప్రకటన చేయించగా; శిశుపాలుండును, నీలుండును, జరాసంధుండును, రుక్మియున్; లోనుగాన్= మొదలుగా; రాజులు+అనేకులు= పెక్కుమంది రాజులు; తదీయ రాజధాని+అగు= చిత్రాంగదుడి రాజధాని అయిన; రాజపురంబునకున్+చనిరి= రాజపురానికి వెళ్ళారు; దుర్యోధనుండును= దుర్యోధనుడు కూడా; దోహలంబునన్= ఉత్సాహంతో; సముచిత= యోగ్యమైన; చతుః+అంగబలసమేతుండును= రథగజ అశ్వపదాతులనే నాలుగు అంగాలుగల సైన్యంతో కూడుకొని; కల్పితరథ+ఆరూఢుండును= సిద్ధం చేయబడిన రథాన్ని ఎక్కినవాడై; కర్ణసహాయుండును+ఐ= కర్ణుడి సహాయం తీసికొన్నవాడుకూడా అయి; అరిగెన్= వెళ్ళాడు; అట్లు= ఆ విధంగా; కూడిన భూపతులకున్= సమావేశమైన రాజులకు; తగు సంవిధానంబు= ఉచితమైన సదుపాయాలు; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** మీ అన్న అయిన కర్ణుడు నడచిన విధా లటువంటివి. ఆ విధంగా కర్ణుడు దుర్యోధనుడికి ఆప్తమిత్రుడై ఉండగా కళింగరాజ్యాన్ని పరిపాలించే చిత్రాంగదుడనే రాజు తన పుత్రిక శుభాంగికి స్వయంవర మహోత్సవాన్ని చాటాడు. దానికి శిశుపాలుడు, నీలుడు, జరాసంధుడు, రుక్మి మొదలైన రాజు లెందరో చిత్రాంగదుడి రాజధానీ నగరమైన రాజపురానికి చేరారు. దుర్యోధనుడు కూడా ఉత్సాహంతో చతురంగ బలాలను వెంటబెట్టుకొని, కర్ణసహాయుడై, రథమెక్కి రాజపురానికి వెళ్ళాడు. అట్లా సమావేశమైన రాజులకందరికీ చిత్రాంగదుడు సముచిత సత్కారాలు చేసి.

**సీ.** **కాళింగుఁ డాత్మీయ కన్యాస్వయంవర । కార్యంబు నడప, నక్కన్య సఖులు**
**దాదులు పేర్వేర ధరణీపతులఁ జూపి । చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్ప**
**మాలిక యొప్పఁ దన్మధ్య వీథికి నల్ల । నడచుచుఁ గురుపతిఁ గడచిపోయె;**
**నతఁ డల్గి యచ్చపలాక్షిఁ బోనీ కాఁగి । పట్టి, రథంబుపైఁ బెట్టఁ బనిచి**

**ఆ.** **యేఁగుచున్న, రాజు లెల్ల సంక్షోభించి, । కూడుకొని యుదగ్ర ఘోరభంగిఁ**
**దాఁకి; రవ్విభుండుఁ దలఁకక బలశౌర్య । ములు పొగడ్త కెక్కఁ బోరె నధిప!** **30**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; కాళింగుఁడు= కళింగదేశాధిపతి చిత్రాంగదుడు; ఆత్మీయకన్యా స్వయంవర కార్యంబు= తన కూతు స్వయంవరోత్సవ కార్యక్రమాన్ని; నడపన్= నిర్వహించగా; ఆ+కన్యసఖులు, దాదులు= స్వయంవరకన్య అయిన శుభాంగి యొక్క చెలికత్తెలు; పెంచిన దాదులు; పేరు+పేరన్= ఒక్కొక్కరి పేరు చెప్పుతూ; ధరణీపతులన్= రాజులను; చూపి= చూపించి; చెప్పంగన్= పరిచయం చేయగా; చూచుచున్= (శుభాంగి వారిని) చూస్తూ; చేతన్+పుష్పమాలిక ఒప్పన్= చేతిలో కల్యాణపుష్పమాల ఒప్పారగా; తద్+మధ్యవీథికిన్= రాజుల నడుమనున్న బాటలో; అల్లన్= మెల్లగా; నడచుచున్= ముందుకు సాగుతూ; కురుపతిన్= దుర్యోధనుడిని; కడచిపోయెన్= దాటిపోయింది; అతఁడు= దుర్యోధనుడు; అల్గి= కోపించి; ఆ+చపలాక్షిన్= చలించేకన్నులు గల ఆ శుభాంగిని; పోనీక= ముందుకు పోకుండ; ఆఁగిపట్టి= ఆపి పట్టుకొని; రథంబుపైన్= రథంమీద; పెట్టన్= ఉంచటానికి; పనిచి= ఆజ్ఞాపించి; ఏఁగుచున్నన్= సభను వీడిపోతూ ఉండగా; రాజులు+ఎల్లన్= రాజులందరూ; సంక్షోభించి= కలతచెంది; కూడుకొని= ఒక్కటై; ఉదగ్రఘోరభంగిన్= అతి భయంకరమైన విధంగా; తాఁకిరి= ఎదుర్కొన్నారు; ఆ+విభుండున్= ఆ రాజు(దుర్యోధనుడు) కూడ; తలఁకక= భయపడక; బలశౌర్యములు= బలపరాక్రమాలు; పొగడ్తకెక్కన్= కీర్తించబడేటట్లుగా; పోరెన్= యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! చిత్రాంగదుడు తన కూతురైన శుభాంగికి స్వయంవర మహోత్సవ కార్యాన్ని నిర్వహిస్తున్నాడు. చెలికత్తెలు, దాదులు పేరుపేరున రాజులను చూపి పరిచయం చేస్తూ ఉండగా ఆ కన్య వారిని చూస్తూ చేతిలో

కల్యాణపుష్పమాలను ధరించి రాజుల నడుమనున్న దారిని మెల్లగా నడుస్తూ దుర్యోధనుడిని దాటిపోయింది. అందుకు రారాజుకు కోపం వచ్చింది. ఆమెను ముందుకు సాగకుండా ఆపి పట్టి, రథంమీద ఉంచటానికి ఆజ్ఞాపించి, తాను సభను వీడి వెళ్ళనారంభించాడు. సభలోని రాజులందరూ కలవరపడి, గుమిగూడి అతిభయంకరమైన విధంగా అతడిని ఎదుర్కొన్నారు. దుర్యోధనుడు కూడా వెనుకాడక అందరూ అతడి బలపరాక్రమాలను పొగడేటట్లు యుద్ధం చేశాడు.

**వ. అట్టియెడ.** **30**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**శా. భల్లంబుల్ పరఁగించి యుగ్రముగ భూపాలోత్తమాంగంబులన్**
**డొల్లం జేయుచుఁ, జిత్ర లాఘవము నాటోపంబు దర్పంబు రా**
**జిల్లం గుంభిఘటారథవ్రజ హయశ్రేణీ పదాతి ప్రతా**
**నోల్లాసంబుల రూపుమాపుచు నవార్యుం డయ్యెఁ గర్ణుం డనిన్.** **31**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; కర్ణుండు= కర్ణుడు; భల్లంబులన్= బల్లెములను; పరఁగించి= ప్రయోగించి; ఉగ్రముగన్= భయంకరంగా; భూపాల+ఉత్తమ+అంగంబులన్= రాజుల తలలను; డొల్లన్+చేయుచున్= నేలరాలేటట్లు చేస్తూ; చిత్రలాఘవమున్= అద్భుతమైన నేర్పును; ఆటోపంబున్= వేగిరపాటును; దర్పంబున్= గర్వం; రాజిల్లన్= ప్రకాశించగా; కుంభిఘటా= ఏనుగుల గుంపులయొక్క; రథవ్రజ= రథసమూహాలయొక్క; హయశ్రేణీ= గుర్రాలవరుసలయొక్క; పదాతిప్రతాన= కాల్బలాల సముదాయంయొక్క; ఉల్లాసంబులన్= అతిశయాలను; రూపుమాపుచున్= అణస్తూ; అవార్యుండు= వారించటానికి శక్యం కానివాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** బల్లెములను ప్రయోగించి రాజుల శిరస్సులను భయంకరంగా నేల రాలేటట్లు చేస్తూ, విచిత్రమైన నేర్పు, వేగం, గర్వం ప్రకాశించేటట్లు చేస్తూ ఏనుగుల, రథాల, గుర్రాల, పదాతుల సమూహాలను మట్టుపెట్టుతూ, అందరికీ వారించటానికి శక్యం కానివాడుగా కర్ణుడు యుద్ధరంగంలో నిలిచాడు.

**వ. ఇవ్విధంబున విక్రమించు నవ్వీరవర్యుని శౌర్యబాహువీర్యంబులకు భయంబుఁగొని హతశేషులైన భూపతులు పఱచినం బ్రీతుం డగుచు నక్కురుకుమారుండు గన్యారత్నంబుఁ గొని కరినగరంబున కరుగుదెంచె; నప్పగ మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కమలబంధుపుత్త్రు నెక్కటిపోరికిం బిలిచినం బోయి.** **32**

**ప్రతిపదార్థం:** ఈవిధంబునన్= పైన చెప్పిన విధంగా; విక్రమించు= పరాక్రమం ప్రదర్శించే; ఆ+వీరవర్యుని= ఉత్తమ వీరుడైన ఆ కర్ణుడియొక్క; శౌర్యబాహు వీర్యంబులకున్= పరాక్రమానికీ, భుజబలానికీ; భయంబున్+కొని= భయపడి; హతశేషులు+ఐన భూపతులు= చావగా మిగిలిన రాజులు; పఱచినన్= పరుగెత్తగా, పారిపోగా; ఆ+కురుకుమారుండు= ఆ దుర్యోధనుడు; ప్రీతుండు+అగుచున్= సంతోషించినవాడౌతూ; కన్యారత్నంబున్= శ్రేష్ఠురాలైన ఆ కన్యను (శుభాంగిని); కొని= గ్రహించి; కరినగరంబునకున్= హస్తినాపురానికి; అరుదెంచెన్= వచ్చాడు; జరాసంధుండు= జరాసంధుడు; ఆ+పగన్= ఆ కచ్చెను; మనంబునన్= మనసులో; పెట్టికొని= ఉంచుకొని; పదంపడి= ఆ తరువాత ఒకసారి; కమలబంధు పుత్రున్= సూర్యుడి కుమారుడైన కర్ణుడిని; ఎక్కటి పోరికిన్= ఒంటరిగా చేసే పోరుకు (అంటే ద్వంద్వయుద్ధానికి); పిలిచినన్= ఆహ్వానించగా; పోయి.

**తాత్పర్యం:** ఆ విధంగా బలపరాక్రమాలను ప్రదర్శించే వీరవర్యుడైన కర్ణుడిని చూచి, చావగా మిగిలిన రాజులు భయపడి పలాయనం చిత్తగించారు. దుర్యోధనుడు సంతోషించి కన్యారత్నమైన శుభాంగిని తీసికొని హస్తినాపురానికి చేరుకొన్నాడు. అయితే, అప్పటి పగను మనసులో పెట్టుకొన్న జరాసంధుడు కర్ణుడిని ఒంటరిపోరుకు (ద్వంద్వయుద్ధానికి) ఆహ్వానించాడు. కర్ణుడు వెళ్ళాడు.

**సీ. ఎక్కటెక్కటిపోరి యిద్ధదివ్యాస్త్ర సం । చయవంతుఁ డగు జరాసంధు బాణ**
**ధనురాది వివిధసాధనములు దనచేతఁ । దన యస్త్రశస్త్రసంతాన మెల్ల**
**నాతనిచే మడియంగ రథంబులు । డిగ్గి పెంపారెడు నగ్గలికల**
**నాతండుఁ దాను బాహాసంగరమునకుఁ । జొచ్చి పెనంగఁగ నొచ్చి యతని**

**ఆ. యంగసంధి వికల మగుటయుఁ బోరు సా । లించి యతఁడు గారవించి తనకు**
**మహితవిభవ మైన మాలినీ నగర మీ । నధికతేజ మెసఁగ నరుగుదెంచె. 33**

**ప్రతిపదార్థం :** ఎక్కటి+ఎక్కటి= ఒంటరొంటరిగా; పోరి= యుద్ధంచేసి; ఇద్ధ దివ్య+అస్త్ర సంచయవంతుఁడు+అగు= ప్రకాశించే మహిమాన్వితాలైన మంత్రపూరిత బాణ సమూహాలతో కూడుకొన్నవాడైన; జరాసంధు= జరాసంధుడియొక్క; బాణధనుః+ఆది వివిధ సాధనములు= బాణాలు, విల్లమ్ములు మొదలైన పలురకాలైన పనిముట్లు; తనచేతన్= తన (కర్ణుడి) చేతను; తన+అస్త్ర శస్త్ర సంతానము+ఎల్లన్= కర్ణుడి మంత్రసహితబాణాలయొక్కయు, మంత్రరహిత బాణాలయొక్కయు సమూహాలన్నింటిని; ఆతనిచేన్= జరాసంధుడిచేతను; మడియంగన్= ధ్వంసంకాగా; ఆతండున్+తానున్= జరాసంధుడూ, కర్ణుడూ; రథంబులు= రథాలను; డిగ్గి= దిగి; పెంపు+ఆరెడు= అతిశయించే; అగ్గలికలన్= పూనికలతో, బాహాసంగరమునకున్= బాహుయుద్ధానికి; చొచ్చి= ప్రవేశించి; పెనంగఁగన్= ద్వంద్వయుద్ధం చేయగా; నొచ్చి= నొప్పిచెంది; అతని+అంగసంధి= జరాసంధుడి శరీరంలోని కీలు; వికలము+అగుటయున్= విరగగా; పోరు= యుద్ధం; చాలించి= మాని; అతడు= జరాసంధుడు; గారవించి= సన్మానించి; తనకున్= కర్ణుడికి; మహితవిభవము+ఐన= అధికసంపద కలిగినదైన; మాలినీనగరము= మాలిని అనే పేరుగల పట్టణాన్ని; ఈన్= ఈయగా; అధికతేజము= మిక్కిలి పరాక్రమం; ఎసఁగన్= ఒప్పారగా, ప్రకాశించగా; అరుగుదెంచెన్= తిరిగి వచ్చాడు.

**తాత్పర్యం:** కర్ణ జరాసంధు లిరువురూ అసహాయవీరులై యుద్ధంచేశారు. కర్ణుడు జరాసంధుడి దివ్యాస్త్ర సముదాయాన్ని, ధనురాది సాధనాలనూ ధ్వంసం చేశాడు. జరాసంధుడు కూడా కర్ణుడి అస్త్రశస్త్రాలను వమ్ముచేశాడు. ఆపైన ఇరువురూ రథాలపై నుండి నేలమీదకు దిగి, పెరిగిన పట్టుదలతో బాహాబాహీ యుద్ధానికి పూనుకొని తలపడ్డారు. జరాసంధుడు బాధపొంది కీలు విరుగగొట్టుకొన్నాడు. అంతటితో పోరు ఇరువురూ చాలించారు. జరాసంధుడు కర్ణుడి పౌరుషానికి మెచ్చి గారవించి, అధిక సంపదలకు నిలయమైన మాలినీనగరాన్ని అతడి కిచ్చాడు. కర్ణుడు అమిత తేజంతో తిరిగి వచ్చాడు.

**వ. ఈ రెండ వదానంబులు నీవును గొంత యెఱుంగు; దిట్లు ప్రసిద్ధబలపరాక్రముండైన కర్ణు నుదీర్ణత్వంబు సెఱుచుటకునై సహజ కవచకుండలంబులు భిక్షించి పుచ్చుకొని నాకలోకపతి నీకు హితం బాచరించె; దానంజేసి ధనంజయుం డతనిం దెగటార్పం జాలె' నని చెప్పి వెండియు. 34**

**ప్రతిపదార్థం:** ఈరెండు+అవదానంబులు= జరిగిన ఈ రెండు మంచి పనులు; నీవును= నీవుకూడ; కొంత+ఎఱుంగుదు(వు)= కొంత తెలిసికొని ఉంటావు; ఇట్లు= పైన చెప్పబడిన విధంగా; ప్రసిద్ధబల పరాక్రముండు+ఐన= ప్రకటమైన బలపరాక్రమాలు కలవాడైన; కర్ణు= కర్ణుడియొక్క; ఉదీర్ణత్వంబు= గొప్పతనమును; చెఱుచుటకునై= పాడుచేయటానికై; నాకలోకపతి= స్వర్గలోకాధిపతిఅయిన

ఇంద్రుడు; సహజ కవచకుండలంబులు= పుట్టుకతో నైజంగా వచ్చిన కవచాన్నీ, కుండలాలనూ; భిక్షించి= అడిగికొని; పుచ్చుకొని= తీసికొని; నీకున్= నీకు (ధర్మరాజుకు); హితంబు= మేలు; ఆచరించెన్= చేశాడు; దానన్+చేసి= అది కారణంగా; ధనంజయుండు= అర్జునుడు; అతనిన్= కర్ణుడిని; తెగటార్పన్+చాలెన్= చంపగలిగాడు; అని చెప్పి= ఈ విధంగా చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** జరిగిన ఈ రెండు మంచి పనులు నీకు కూడా కొంత తెలిసి ఉండవచ్చును. అట్లా బలపరాక్రమాలలో జగత్ప్రసిద్ధుడైన కర్ణుడి గొప్పతనాన్ని ధ్వంసం చేయదలచి ఇంద్రుడు అతడి కవచకుండలాలను భిక్షగా అడిగి పుచ్చుకొన్నాడు. దానివలన ధర్మజా! నీకు మేలు జరిగింది. దానివలననే అర్జునుడు కర్ణుడిని సంహరించగలిగాడు' - అని చెప్పి, మరల ఇట్లా అన్నాడు:

**చ.** **' వినుము నరేంద్ర! విప్రుఁ డలిగెన్, జమదగ్నిసుతుండు శాప మి**
**చ్చె, నమరభర్త వంచనము సేసె, వరం బని కోరి కుంతి మా**
**న్పె నలుక, భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ, గలంచె మద్రరా**
**జనుచిత మాడి, శౌరి విధి యయ్యెఁ, నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్.** **35**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ధర్మరాజా!; వినుము= గ్రహించుము; విప్రుఁడు= బ్రాహ్మణుడు; అలిగెన్= కోపగించాడు; జమదగ్నిసుతుండు= జమదగ్నిమహర్షి కుమారుడైన పరశురాముడు; శాపము+ఇచ్చెన్= శాపం పెట్టాడు; అమరభర్త= దేవతల రాజైన ఇంద్రుడు; వంచనము= మోసం; చేసెన్= చేశాడు; కుంతి= కుంతీదేవి; వరంబు+అని= వర మనే పేరుతో; కోరి= అడిగి; అలుకన్= తన పుత్రులమీది కోపాన్ని; మాన్పెన్= తగ్గించింది; భీష్ముఁడు= భీష్ముడు; అర్ధరథున్= ఒక రథికుడితో కూడ సమంగా పోరలేని వీరుడిగా; చేసి= నిర్ణయించి; అడంచెన్= అణచాడు; మద్రరాజు= మద్రదేశ ప్రభువు శల్యుడు; అనుచితము+ఆడి= అయోగ్యాలైన మాటలు మాట్లాడి; కలంచెన్= హృదయాన్ని కలవరపెట్టాడు; శౌరి= కృష్ణుడు; విధి= తలవ్రాత; అయ్యెన్= అయ్యాడు; అనిన్= యుద్ధంలో; నరుండు= అర్జునుడు; కర్ణునిన్= కర్ణుడిని; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! నేను చెప్పేది విని గ్రహించుము. బ్రాహ్మణుడు కర్ణుడిని కోపగించి శపించాడు. ఆ తరువాత పరశురాముడు శాపం పెట్టాడు. ఇంద్రుడు మోసంచేసి సహజకవచకుండలాలను గ్రహించాడు. కుంతి వరమనే నెపంతో కోరి కోపాన్ని మాన్పింది; భీష్ముడు కర్ణుడిని అర్ధరథుడిగా చేసి అగౌరవపరిచాడు; శల్యుడు అనుచిత సంభాషణలతో కర్ణుడి హృదయాన్ని కలతపెట్టాడు. కృష్ణుడు అతడికి దాటరాని విధిగా నిలిచాడు. ఇన్ని జరుగగా అర్జునుడు కర్ణుడిని రణరంగంలో వధించగలిగాడు!

**విశేషం:** కర్ణుడి జీవితాన్నంతా ఒక్క పద్యంలో ఇమిడ్చిన రచన ఇది. పండిత లోకంలో అమిత ప్రచారంలో ఉన్న పద్య మిది. ఎంతటి మహాత్ముడైనా దైవబలం లేకపోతే ఎట్లా కుప్పకూలిపోతాడో చెప్పటానికి విజ్ఞులు ఈ పద్యాన్ని ఒక స్ఫూర్తిగా సంభాషణలలో వాడుకొంటూ ఉంటారు.

**వ.** **అట్లుంగాక.** **36**

**తాత్పర్యం:** అట్లా కాకపోతే.

**క.** **హర సురపతి యమ వరుణులు । గురుకృపులును దివ్యబాణకోటు లొసఁగుటన్**
**నరుశక్తి కర్ణుతేజ । స్ఫురణము నార్పంగఁ జాలెఁ జువ్వె నృపాలా! '** **37**

**ప్రతిపదార్థం**: నృపాలా!= ధర్మరాజా!; హర, సురపతి, యమ, వరుణులు, గురుకృపులును= శివుడు, ఇంద్రుడు, యముడు, వరుణుడు, ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు; దివ్యబాణకోటులు= మహిమాన్వితాలైన లెక్కకు మించిన బాణాలను; ఒసంగుటన్= ఇవ్వటంవలన; నరుశక్తి= అర్జునుడి పరాక్రమం; కర్ణుతేజః+స్ఫురణమున్= కర్ణుడియొక్క ప్రతాపదీప్తిని; ఆర్పంగన్+చాలెన్+చువ్వె!= ఆర్పగలిగింది సుమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! శివుడు, ఇంద్రుడు, యముడు, వరుణుడు, ద్రోణుడు, కృపుడు మొదలైనవారందరూ లెక్కకు మించిన దివ్యబాణాలను ఉపదేశించటంవలన అర్జునుడి ప్రతాపతేజం కర్ణుడి పరాక్రమతేజాన్ని ఆర్పగలిగింది సుమా!'

**వ. అనిన విని శోకవ్యాకులుండైన యన్నరపతి గన్నీరొలుక నిట్టూర్పు నిగిడించినం దత్సమీపంబున నున్న కుంతి గనుంగొని యడ లుడుపుటకై యతనితో నిట్లనియె. 38**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; శోకవ్యాకులుండు+ఐన= దుఃఖంచేత కలతచెందినవాడైన; ఆ+నరపతి= ఆ రాజైన యుధిష్ఠిరుడు; కన్నీరు+ఒలుకన్= కన్నీరు కారగా; నిట్టూర్పు నిగిడించినన్= దీర్ఘనిశ్వాస వదలగా; తద్+సమీపంబునన్= ఆ సమీపప్రాంతంలో ఉన్న; కుంతి= కుంతీదేవి; కనుంగొని= చూచి; అడలు= దుఃఖాన్ని; ఉడుపుటకున్+ఐ= ఉపశమింపచేయటానికి; అతనితోన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** అని నారదుడు చెప్పగా విని తీవ్రమైన దుఃఖంచేత కలతచెంది ధర్మరాజు కన్నీరు మున్నీరు కాగా, దీర్ఘనిశ్వాస విడుస్తూ ఉండగా అతడి సమీపంలో ఉన్న కుంతీదేవి అతడి అవస్థను చూచి, అతడి శోకాన్ని మాన్పాలని అతడితో ఇట్లా అన్నది:

**చ. ' జననముఁ దెల్పి యేఁ బిలువ 'సత్యము సుమ్మిర కుంతి భాషణం'**
**బని తనుజత్వజాతకృప నంబుజమిత్రుఁడు వల్కె; నేమిటన్**
**గొనకొన నేరఁడయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి; యట్టి క**
**ర్ణున కయి నీవు నేటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రకా!' 39**

**ప్రతిపదార్థం:** పుత్రకా!= కుమారా! (ధర్మరాజా!); ఏన్= నేను (కుంతి); జననమున్+తెల్పి= పుట్టుకను గూర్చిన సత్యాన్ని తెలియజెప్పి; పిలువన్= (పాండవుల పక్షంలో చేరుమని) పిలువగా; అంబుజమిత్రుఁడు= సూర్యుడు; తనుజత్వ జాత కృపన్= కన్నకొడుకనే భావంతో కలిగిన కరుణతో; కుంతిభాషణంబు= కుంతీదేవిమాటలు; సత్యము సుమ్మిర!= నిజం సుమా!; అని; పల్కెన్= పలికాడు; (కాని); సుయోధనున్+పట్టి= దుర్యోధనుడిని ఆశ్రయించి; నినున్= నిన్ను (ధర్మరాజుతో); కూడన్= చేరటానికి; ఏమిటన్= ఏ విధంగా కూడా; గొనకొనన్ నేరఁడు+అయ్యెన్= యత్నించజాలకపోయాడు; అట్టి= అటువంటి; కర్ణునకున్+అయి= కర్ణుడి గురించి; నీవు; ఇట్లు= ఈ విధంగా; మనోవ్యథన్= మానసిక వేదనను; పొందఁగన్+ఏటికిన్?= పొందటం ఎందుకు?

**తాత్పర్యం:** 'కుమారా! పుట్టుకను గురించిన నిజాన్ని చెప్పి అతడిని నీవైపు నేను ఆహ్వానించినప్పుడు, ఆ సూర్యభగవానుడు కూడా కన్నకొడుకనే భావంతో కలిగిన కరుణతో 'కుంతి చెప్పిన మాట నిజం; నమ్ము నాయనా!' అని పలికాడు. కాని, కర్ణుడు దుర్యోధనుడిని ఆశ్రయించి నీవైపు రావటానికి ఏ విధంగానూ ప్రయత్నం చేయలేకపోయాడు. కాబట్టి అటువంటి కర్ణుడికొరకు నీ వెందుకు ఈ విధంగా మానసిక వేదనను పొందుతావు?' (వలదని భావం).

**వ. అనుటయు నవ్వచనంబులు దనకు నసహ్యంబు లైనం గటకటంబడి యద్దేవి నాలోకించి 'భవదీయ మంత్రకార్య గోపనంబునం గాదె యింత పుట్టె' నని పలికి, యంత నిలువక 40**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కుంతీదేవి పలుకగా; ఆ+వచనంబులు= ఆ మాటలు; తనకున్= ధర్మరాజుకు; అసహ్యంబులు+ఐనన్= ఏవగింపు కలిగించినవి కాగా; కటకటంబడి= బాధచెంది; ఆ+దేవిన్= ఆ రాణిని (కుంతిని); ఆలోకించి= చూచి; భవదీయ= నీయొక్క; మంత్రకార్య= రాజనీతి చర్యలను; గోపనంబునన్= రహస్యంగా ఉంచటం వలన; కాదె!= కాదా!; ఇంత= ఇంతటి విపరీతపరిణామం; పుట్టెన్= కలిగింది; అని పలికి= అని చెప్పి; అంతన్ నిలువక= అంతటితో ఆగక.

**తాత్పర్యం:** అని మాట్లాడిన కుంతీదేవి పలుకులు ధర్మరాజుకు ఏవగింపు కలిగించటంతో అతడు బాధపడి కుంతీదేవిని చూచి ఇట్లా అన్నాడు: 'నీవు నిర్వహించిన ఈ రాచకార్యాన్ని రహస్యంగా ఉంచటం వలననే ఇంతటి విపరీత పరిణామం కలిగింది' అని అంటూ అంతటితో ఆగక - (తరువాతి పద్యంతో అన్వయం).

### ధర్మరాజు స్త్రీలకు రహస్య రక్షణంబు లేకుండ శపియించుట (సం. 12-6-11)

**తే.** **' అంగనాజనమ్ములకు రహస్య రక్ష। ణంబునందలి శక్తి మనంబులందుఁ**
**గలుగకుండెడు మెల్లలోకముల' నని శ। పించె నా ధర్మదేవతాప్రియసుతుండు. 41**

**ప్రతిపదార్థం:** ఆ ధర్మదేవతాప్రియనందనుండు= యమధర్మరాజు ప్రియకుమారుడు ఆ ధర్మరాజు; ఎల్ల లోకములన్= అన్ని లోకాలలోనూ; అంగనాజనమ్ములకున్= స్త్రీజనులకు; రహస్యరక్షణంబునందలి శక్తి= గోప్యంగా ఉంచదగినవాటిని రహస్యంగా ఉంచి కాపాడే విధానంలో ఉండే బిగువు; మనంబుల+అందున్= మనస్సులలో; కలుగక+ఉండెడు(ఉండెడున్+ఎల్ల= ఉండెడుమెల్ల) కలుగకుండా ఉండుగాక!; అని శపించెన్= అని శాపంపెట్టాడు.

**తాత్పర్యం:** అన్ని లోకాలలో ఉండే ఆడవారికి రహస్యాలను రహస్యంగా కాపాడే శక్తి వారి మనస్సులలో లేకుండా పోవుగాక! అని ధర్మరాజు శపించాడు.

**విశేషం:** 'ఆడవారి నోళ్ళల్లో ఆవగింజైనా నానదు' అనే సామెత ఇట్లా పుట్టిందేమో!

**వ.** **ఇట్లు మహాతేజోధనుం డగు నజ్జననాథుం డట్లు శపియించి కుంతి చేసిన కర్ణగోపనంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడిన కార్యంబులదెస నిగుడం దనకతంబున మృతిఁబొందిన యుభయపక్ష బంధుమిత్రకోటులం దలంచి యుమ్మలించి విశేషించి కర్ణుచావునకుఁ దూరవగచి విహ్వలించి వివ్వచ్చునాననం బాలోకించి యిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మహాతేజోధనుండు+అగు= గొప్పదైన ప్రకాశం (ప్రతాపం) ధనంగా కలవాడైన; ఆ+జననాథుండు= ఆ ధర్మరాజు; అట్లు= ఆ విధంగా; శపియించి= శాపంపెట్టి; కుంతి= కుంతీదేవి; చేసిన= ఒనర్చిన; కర్ణగోపనంబు= కర్ణుడిని గురించిన అంశాలను రహస్యంగా ఉంచిన అంశం; ప్రసంగంబుగాన్= చర్చనీయాంశం కాగా; అంతరంగంబు= మనస్సు; కృతము+పడిన= కడచిన; కార్యంబులదెస= పనులవైపు; నిగుడన్= ప్రసరించగా; తన కతంబునన్= తన కారణంగా; మృతిన్+పొందిన= చనిపోయిన; ఉభయపక్ష= రెండు (కౌరవ పాండవ) పక్షాలకు చెందిన; బంధుమిత్ర కోటులన్= అసంఖ్యాకులైన బంధువులను, మిత్రులను; తలంచి= స్మరించి; ఉమ్మలించి= శోకించి; విశేషించి= అధికంగా; కర్ణుచావునకున్= కర్ణుడి మరణానికి; తూరన్ వగచి= నొచ్చేటట్లుగా దుఃఖించి; విహ్వలించి= దుఃఖాతిశయం వలన శరీరం వశం తప్పినవాడై; వివ్వచ్చు+ఆననంబు= అర్జునుడి ముఖాన్ని; ఆలోకించి= చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** తేజోవంతుడైన ధర్మరాజు ఆ విధంగా శపించి, కుంతీదేవి కర్ణుడి విషయాలు దాచి ఉంచటమనే అంశం చర్చనీయాంశం కాగా, అతడి మనస్సు కడచిన కార్యములపట్ల ప్రసరించింది. అది కారణంగా కౌరవపాండవ

పక్షాలలో అసంఖ్యాకంగా ప్రాణాలు కోల్పోయిన బంధుమిత్రులు జ్ఞాపకం వచ్చారు. దానికి అమితంగా దుఃఖించాడు. విశేషించి కర్ణుడి మరణం అతడి మనస్సును గాయపరచింది. శోకతీవ్రతచేత శరీరం తూలినట్లయింది. అప్పుడు ధర్మరాజు అర్జునుడి మొగంవైపు చూచి ఈ విధంగా అన్నాడు:

**క. ' మన కేటిరాజ్య? మొండొక । జనపదమున కేఁగి భైక్షచర్యావిధి జీ**
**వనము నడిపికొనియుండుద । మనఘా! యట్లయిన సుఖుల మవుదుము సుమ్మీ!' 43**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! అర్జునుడా!; మనకున్= మనకు (పాండవులకు); ఏటిరాజ్యము?= రాజ్యమేమిటికి? (ఎందుకు? అని భావం; వలదు అని తాత్పర్యం); ఒండు+ఒక= మరియొక; జనపదమునకున్= జనస్థానానికి; ఏఁగి= వెళ్ళి; భైక్షచర్యావిధిన్= బిచ్చమెత్తుకొనే కార్యక్రమంతో; జీవనము= బ్రదుకు; నడిపికొని+ఉండుదము= సాగించుకొంటూ ఉందాము; అట్లు+అయినన్= ఆ విధంగా చేసినట్లయితే; సుఖులము= సుఖించినవారం; అవుదుము= అవుతాము; సుమ్మీ!= సుమా!

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన పార్థుడా! మన కెందుకీ రాజ్యం? మరొక జనస్థానానికి వెళ్ళి అక్కడ బిచ్చమెత్తుకొనే కార్యక్రమంతో బ్రదుకును సాగించుకొంటూ ఉందాము. అట్లాగైతే మనం సుఖంగా ఉంటాము సుమా!'

**విశేషం:** ధర్మజుడు శోకతీవ్రత చేత విరక్తిని ప్రకటిస్తున్నాడు.

**వ. అని వెండియు. 44**

**తాత్పర్యం:** అని ఇంకా (ఇట్లా అన్నాడు ధర్మజుడు).

**సీ. ' జ్ఞాతుల నందఱఁ జంపితి, మది యాత్మ । వధమ కాదే! రాజవర్తనంబుఁ**
**గాల్పు; మహింస నిక్కము దాల్మి మత్సర । వర్జన మిది వనవాసజనుల**
**కాగమ విహితంబు లటె; యింత యొప్పునే? । వనమున వసియింపవలయు వింటె;**
**యసుఖదంబైన రాజ్యామిషంబునకుఁ గు । క్కల భంగిఁ దమలోనఁ గాటులాడి**

**తే. కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు । బ్రదుకు వచ్చెనె యను వగపాలు వడఁగఁ**
**బ్రమద మొసఁగదు త్రైలోక్యరాజ్య మైనఁ; । గాన నే నొల్ల మహి; మీర కైకొనుండు. 45**

**ప్రతిపదార్థం:** జ్ఞాతులన్+అందఱన్= సగోత్రికులనందరిని; చంపితిమి= ప్రాణాలు తీశాము; అది= ఆ విధంగా చేయటం; ఆత్మవధము+అ= మనలను మనం చంపుకొనటమే; కాదే!= కాదా!; రాజవర్తనంబున్= క్షత్రియధర్మాన్ని; కాల్పుము= కాల్చివేయుము; (అనగా దానిని తిరస్కరించుము అని భావం); అహింస= హింసచేయకుండటం; నిక్కము= ఋజువర్తనం; సత్యాన్ని పాటించటం; తాల్మి= ఓర్పు; మత్సర వర్జనము= అసూయను విడనాడటం; ఇది= ఇటువంటి గుణాలు కలిగి ఉండే వర్తనం; వనవాస జనులకున్= తపోవనాలలో నియమనిష్ఠలతో నివసించేవారికి; ఆగమ విహితంబులు+అటె!= వేద సమ్మతాలట కదా!; అంత+ఒప్పునే?= ఎంత సముచితంగా ఉంది?; వనమునన్+వసియింపన్ వలయున్= మనం వనంలోనే (తపోవనంలోనే) నివసించాలి; వింటివి+ఎ?= విన్నావా? (గ్రహించావా, తెలిసిందా? అని భావం); అసుఖదంబు+ఐన= దుఃఖాన్ని కలిగించేదైన; రాజ్య+ఆమిషంబునకున్= రాజ్యమనే మాంసం కొరకు; కుక్కలభంగిన్= కుక్కలవలె; తమలోనన్= తమలోతాము; కాటులాడి= కరచుకొని (తగాదాలాడుకొని); కులమున్+ఎల్లన్= వంశాన్నంతటిని; పొలియింపన్= నశింపచేయటానికి; కుత్సితంపుబ్రదుకు= హేయమైన జీవితం జీవించవలసి; వచ్చెనె?= వచ్చిందా?; అను= అనే విధమైన; వగ= దిగులు; పాలుపడఁగన్= పొందేటట్లుండే; త్రైలోక్యరాజ్యము+ఐనన్= మూడులోకాలను (భూలోకం, స్వర్గలోకం, పాతాళలోకం) పాలించే పరిపాలనమైనా; ప్రమదము= సంతోషాన్ని; ఒసఁగదు= కలిగించదు; కానన్= కాబట్టి; ఏన్= నేను (ధర్మరాజు); మహిన్= రాజ్యాన్ని; ఒల్లన్= కోరను; మీరు+అ= మీరే; కైకొనుండు= తీసికొనండి.

**తాత్పర్యం:** 'సగోత్రికుల నందరినీ చంపాను, అది ఆత్మవధ కాదా? ఈ క్షత్రియధర్మాన్ని తగులబెట్టుము. అహింస, సత్యం, ఓర్పు, అనసూయ - ఇటువంటి గుణాలు వనవాసం చేసేవారి కుండదగిన వని వేదాలు చెప్పాయి. నిజంగా, ఎంత సముచితంగా ఉంది! మనం వనంలో నివసిద్దాం; గ్రహించావా? సుఖాన్నివ్వని రాజ్యమనే మాంసఖండం కొరకై కుక్కలు ఎగబడి కాట్లాడుకొన్నట్లుగా తమలో తాము యుద్ధం చేసికొని, వంశాన్నంతా నాశనం చేసికొనే హేయమైన బ్రదుకు బ్రదుకవలసి వచ్చెనే అనే దుఃఖం మిగిలించేదై ముల్లోకాల నేలే ప్రభుత్వమైనా నాకు సంతోషాన్ని కలిగించదు. కాబట్టి నేను రాజ్యాన్ని స్వీకరించను, మీరే తీసికొనండి.

**మ. ధృతరాష్ట్రుండు దనూజుకీడు సమబుద్ధిం జూడ కన్నీచుఁ డే**
**గతిఁ జన్నం జననిచ్చెఁ గాని మగుడంగాఁ దివ్వఁ డయ్యెన్; నిరా**
**కృతశీలుండగు నా సుయోధనుఁడు సంక్షీణంబు సేసెం గులం;**
**బతనిం జంపఁగఁ గోపమాఱె; మది శోకాక్రాంత మయ్యెం దుదిన్. 46**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సమబుద్ధిన్= సమదృష్టితో; తనూజు కీడు= కుమారుడైన దుర్యోధనుడికి కాగల ఆపదను; చూడక= గమనించక; ఆ+నీచుఁడు= ఆ అధముడైన దుర్యోధనుడు; ఏగతిన్= ఏవిధంగా; చన్నన్= నడిస్తే, వ్యవహరిస్తే; చనన్+ఇచ్చెన్= నడవనిచ్చాడు, వ్యవహరించనిచ్చాడు; కాని; మగుడంగాన్+తివ్వఁడు+అయ్యెన్= మరలింపజేయటానికి యత్నించినవాడు కాడు; నిరాకృతశీలుండు+అగు= నిరాకరించబడిన శీలంగలవాడైన; ఆ+సుయోధనుఁడు= ఆ దుర్యోధనుడు; కులంబు= వంశాన్ని; సంక్షీణంబు+చేసెన్= బాగా నాశనం చేశాడు; అతనిన్= ఆ దుర్యోధనుడిని; చంపఁగన్= యుద్ధంలో చంపివేయగా; కోపము= కోపం; ఆఱెన్= చల్లారింది; తుదిన్= చివరకు; మది= హృదయం; శోక+ఆక్రాంతము+అయ్యెన్= తీవ్రమైన దుఃఖంతో నిండినదైపోయింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ధర్మాధర్మాలయందు పక్షపాతం లేని సమదృష్టితో చూడక తన కొడుకైన దుర్యోధనుడికి రాబోయే కీడును వారించలేకపోయాడు. నీచుడైన ఆ సుయోధనుడు ఎట్లా నడిస్తే అట్లా నడవనిచ్చాడే కాని మరల్చటానికి ఎన్నడూ ప్రయత్నం చేయలేదు. గర్హించదగిన శీలంగల ఆ దుర్యోధనుడు వంశాన్నంతా నాశనం చేసి పెట్టాడు. అతడిని చంపటంవలన కోపంమాత్రం చల్లారింది. కాని, చివరకు మనసు శోకంతో నిండి దుర్భరమైపోయింది.

**విశేషం:** పగవలన బంధుజన హింసవలన కలిగే శోకం యుద్ధసమయంలో ధర్మరాజుకు గోచరించలేదు; ఆ తరువాత జ్ఞాతులకు ఉత్తరకర్మలు చేస్తున్నప్పుడు అతడి హృదయం శోక సముద్రమై పోయింది. పగ తీరిన తరువాతి వగ ఇది.

**వ. ఆ దుర్జనుండు కర్జం బెఱుంగక దుర్మానంబు వాటించిన సైరించి తొలంగనైతి; రాజ్యపరిగ్రహపరత్వంబు మచ్చిత్తంబునం గలిమింజేసి కిల్బిషం బత్యంతంబు నాచరింప వలసెఁ; బరిగ్రహ దోషంబు పరిగ్రహత్యాగంబునం గాని పోదు; పరిగ్రహత్యాగశీలుండు జన్మమరణ దుఃఖంబులం బొరయం డని శ్రుతులు సెప్పెడు; నొకనికి సకలధర్మంబులు ననుష్ఠింప శక్యం బగునే? యపరిగ్రహం బొక్కటన శుద్ధుండ నయ్యెద; మీరు భూమిపాలన పరిగ్రహ తత్పరత్వంబున వర్ణాశ్రమధర్మరక్షణంబు సేయుం; డేను గాననంబునకుం జని మునిజన సకాశంబున సుఖినై యుండెద' ననిన విని యింద్రాంశసంజనితతత్వకలితతేజోధనుం డగు నర్ధనంజయుండు దనయూష్మలత్వంబునకు నవ్వాక్యంబులు దుస్సహంబు లైనం బదరి దరస్మితంబునఁ దద్వికారంబుఁ గప్పి యప్పుడమిఱేని కిట్లనియె: 47**

**ప్రతిపదార్థం:** ఆ దుర్జనుండు= ఆ దుర్మార్గుడైన దుర్యోధనుడు; కర్జంబు= చేయదగిన కార్యం; కర్తవ్యం; ఎఱుంగక= తెలియజాలక; దుర్మానంబు= దురభిమానాన్ని; పాటించినన్= అనుసరించగా; సైరించి= దానిని ఓర్చి; తొలంగన్+ఐతిన్= పట్టువీడలేకపోయాను; రాజ్యపరిగ్రహపరత్వంబు= రాజ్యాన్ని గ్రహించాలన్న ఆసక్తి; మత్+చిత్తంబునన్= నా మనసులో; కలిమిన్+చేసి= కలిగి ఉండటంచేత; కిల్బిషంబు= పాపాన్ని; అత్యంతంబున్= అత్యధికంగా; ఆచరింపన్ వలసెన్= చేయవలసి వచ్చింది; పరిగ్రహదోషంబు= రాజ్యస్వీకరణదోషం; పరిగ్రహత్యాగంబునన్+కాని= స్వీకరించినదానిని వదలివేయటం వలనగాని; పోదు= తొలగిపోదు; పరిగ్రహత్యాగశీలుఁడు= స్వీకరించినదానిని త్యాగం చేయగల మనఃప్రవృత్తి (స్వభావం) కలవాడు; జన్మమరణదుఃఖంబులన్= పుట్టుకచావుల వలన కలిగే శోకాలను; పొరయండు+అని= పొందడని; శ్రుతులు= వేదాలు; చెప్పెడున్= చెపుతూ ఉంటాయి; ఒకనికిన్= ఒంటరివాడికి; సకలధర్మంబులున్= ధర్మాలనన్నింటిని; అనుష్ఠింపన్= ఆచరించటానికి; శక్యంబు+అగునే!= సాధ్యం అవుతుందా?; అపరిగ్రహంబు= స్వీకరించకుండటం-త్యాగం; ఒక్కటన్+అ= ఒక్కదానిచేతనే; శుద్ధుండన్+అయ్యెదన్= పవిత్రుడనౌతాను; మీరు= మీరు(భీమాదులు); భూమిపాలన పరిగ్రహ తత్పరత్వంబునన్= నేలను పాలించే ధర్మాన్ని స్వీకరించటంలోని ఆసక్తితో; వర్ణ+ఆశ్రమ ధర్మరక్షణంబున్= వర్ణాలను, ఆశ్రమధర్మాలను కాపాడటం; చేయుండు= నిర్వహించండి; ఏను= నేను(ధర్మరాజు); కాననంబునకున్= అడవికి; చని= వెళ్ళి; మునిజన సకాశంబునన్= ఋషుల సమూహాలసమీపంలో; సుఖిని+ఐ= సంతోషం కలవాడనై; ఉండెదన్= ఉంటాను; అనినన్= అని పలుకగా; ఇంద్ర+అంశసంజనితత్వ కలిత తేజోధనుండు+అగు= ఇంద్రుడియొక్క కళతో పుట్టిన స్వభావంతో కూడుకొన్న పరాక్రమమనే సంపద కలవాడైన; ఆ+ధనంజయుండు= ఆ అర్జునుడు; తన= తనయొక్క; ఊష్మలత్వంబునకున్= ఉబ్బరికాన్ని, పరాక్రమానికి; ఆ+వాక్యంబులు= ఆ ధర్మరాజు పలికిన మాటలు; దుస్సహంబులు+ఐనన్= సహింపజాలనివి కాగా; పదరి= కోపించి; దరస్మితంబునన్= చిరునవ్వుతో; ఆ+వికారంబున్= ఆ మనోభావాన్ని; కప్పి= కప్పిపుచ్చి; ఆ+పుడమితేనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'దుర్మార్గుడైన ఆ దుర్యోధనుడు కర్తవ్యాన్ని తెలిసికొనకుండా దురభిమానంతో వ్యవహరించినా సహించి, కర్తవ్యంనుండి నేను వైదొలగలేదు. రాజ్యాన్ని పొందాలనే ఆసక్తి నామనసులో బలంగా ఉండటంచేత అమితమైన పాపాన్ని ఆచరించవలసి వచ్చింది. రాజ్య స్వీకారదోషం రాజ్యపరిత్యాగంవలన గాని పోదు. త్యాగశీలుడు జననమరణ దుఃఖాలను పొందడని వేదాలు చెప్పుతున్నాయి. ఒక్కడికి ధర్మాలన్నీ చేయటం సాధ్యపడదు. నేను (రాజ్య)త్యాగం వలన పరిశుద్ధుడనౌతాను. మీరు రాజ్యపాలన స్వీకరించి ఆసక్తితో వర్ణాశ్రమ ధర్మరక్షణం చేయండి. నేను తపోవనానికి వెళ్ళి మునిజనసమూహ సన్నిధానంలో సుఖంగా ఉంటాను' - అని ధర్మరాజు అనగా ఇంద్రతేజోధనుడైన అర్జునుడు తన పరాక్రమానికి ఆ వాక్యాలు సహింపశక్యంగానివి కాగా కోపించి, చిరునవ్వుతో ఆ మనోవికారాన్ని కప్పిపుచ్చి, ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు:

**అర్జునుఁడు ధర్మజున కుచిత వచనంబుల మనస్తాపోపశమంబు సేయుట: (సం. 12-8-1)**

**క. ' ఓహో! యిట్టివి గలవే? । బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి తుదిన్**
**మాహాత్మ్యం బెడలఁగ భి । క్షాహారత నొందఁ దలఁప నగునె నరేంద్రా! 48**

**ప్రతిపదార్థం:** ఓహో!= ఆహా! (ఆశ్చర్యార్థకం); ఇట్టివి కలవే?= ఇటువంటివి (మాటలు) ఎక్కడైనా ఉన్నాయా? (ఇటువంటి మాటలు నేనెన్నడూ వినలేదనీ, వినదగినవి కావనీ భావం; సహజవిరుద్ధమని భావం); బాహాదర్పమునన్= భుజబలగర్వంచేత; పరులన్= శత్రువులను; పరిమార్చి= చంపి; నర+ఇంద్రా!= రాజువైన ధర్మరాజా!; తుదిన్= చివరకు; మాహాత్మ్యంబు= ఆ గొప్పతనమంతా; ఎడలఁగన్= తొలగిపోయేటట్లుగా; భిక్షా+ఆహారతన్= తిరిపెమెత్తి భుజించటాన్ని; ఒందన్= పొందటానికి; తలఁపన్= కోరటం; అగునె?= న్యాయమా? (కాదని భావం).

**తాత్పర్యం:** 'ఓహో నా కాశ్చర్యం వేస్తున్నది. ఇటువంటి మాటలు ఎక్కడైనా ఉంటాయా? భుజబలంతో శత్రువులను యుద్ధంలో చంపి, చివరకు ఆ గొప్పతనమంతా కుప్పకూలేటట్లు బిచ్చమెత్తుకొనటాన్ని కోరటం నీకు తగునా ధర్మరాజా!

**సీ.** **ధర్మపథంబున ధరణి సేకుఱినఁ బా । లింపక సత్త్వంబు పెంపు మాలి**
**విడుచుట యొప్పునే; విను: మిట్టులైన ము । న్నేల భూపాలుర నెల్లఁ జంపి?**
**తడలి రాజ్యము దక్కి యడవికిఁ జనిన బే । లందురు గాక, మే లండ్రె జనులు?**
**కిల్బిషశంక గల్గిన నశ్వమేధాది । పుణ్యకర్మంబులఁ బోదె? వంశ**

**ఆ.** **ధర్మ మెడలఁ గృపణకర్మంబుఁ గోరి; త । ర్థంబు సువ్వె సకలధర్మకారి;**
**'యొడమి లేనివాఁడ నడపీనుఁ' గను నహు । షోక్తి వినమె? దాని నూఁద వలదె?** 49

**ప్రతిపదార్థం:** ధర్మపథంబునన్= న్యాయమార్గంలో; ధరణి= రాజ్యం; చేకుఱినన్= సమకూరగా; పాలింపక= ఏలకుండా; సత్త్వంబుపెంపు= బలగౌరవాన్ని; మాలి= వదలి; విడుచుట= రాజ్యపాలనాన్ని వదలిపెట్టటం; ఒప్పునే?= న్యాయమౌనా? (కాదని భావం); వినుము= నేను చెప్పే మాటలు శ్రద్ధగా విని గ్రహించుము; ఇట్టులు+ఐనన్= ఈ విధంగా రాజ్యాన్ని త్యాగం చేసేటట్లయితే; మున్ను= పూర్వం; భూపాలురన్+ఎల్లన్= రాజుల నందరినీ; ఏల= ఎందుకు; చంపితి?= చంపావు?; అడలి= భయపడి; రాజ్యము తక్కి= రాజ్యాన్ని కాదని; అడవికిన్= (తపో) వనానికి; చనినన్= వెళ్ళినట్లయితే; జనులు= ప్రజలు; బేల= పిరికిపంద అని; అందురు= అంటారు; కాక= అట్లు కాక; మేలు= శుభం, యోగ్యం; అండ్రె?= అని అంటారా? (అనరని భావం); కిల్బిషశంక= పాపం కలుగుతుందనే అనుమానం; కల్గినన్= కలిగినట్లయితే; (అది); అశ్వమేధ+అది= అశ్వమేధయాగం మొదలైన; పుణ్యకర్మంబులన్= పుణ్యకార్యాలతో; పోదె?= తొలగిపోదా?; వంశధర్మము= వంశపరంపరగా వస్తున్న రాజ్యపాలనమనే ధర్మం; ఎడలన్= దూరమయ్యేటట్లు; కృపణకర్మంబు= దీనులు ఆచరించే ధర్మాన్ని; కోరితి(వి)= కోరావు; సకలధర్మకారి= సర్వ ధర్మాలను నెరవేర్చేది; అర్థంబు+చువ్వె!= సంపదయే (ధనమే) సుమా!; ఒడమి లేనివాఁడు+అ= ధనం లేనివాడు మాత్రమే; నడపీనుఁగు= నడుస్తున్న పీనుఁగు వంటివాడు (బ్రదికి ఉండికూడా చచ్చినవాడితో సమానమైనవాడు; ఏమీ సాధించలేని నిరర్థకు డని భావం); అను= అని ప్రసిద్ధికెక్కిన; నహుష+ఉక్తి= నహుషుడి సూక్తి (సుభాషితం); వినమె?= వినమా? (ప్రసిద్ధమని భావం); దానిని= ఆ మాటను; ఊఁదవలదె?= ఊతగా తీసికొనవలదా? (గణించవద్దా? అని భావం).

**తాత్పర్యం:** ధర్మమార్గంలో రాజ్యం వశమైతే దానిని పాలించకుండా, పరాక్రమాతిశయాన్ని ప్రదర్శించకుండా వదలివేయటం న్యాయం కాదు. నీ కిటువంటి సంకల్పమే ఉంటే ముందుగా రాజులనందరినీ ఎందుకు చంపావు? భయపడి రాజ్యం వదలి అడవులకు పోతే, నిన్ను బేలవని అందరూ గేలిచేస్తారు. జనులెవ్వరూ నీ పనిని మెచ్చుకోరు. పాపం కలిగిందన్న అనుమానం ఏర్పడితే అశ్వమేధయాగంవంటి పుణ్యకార్యాలు చేస్తే అది తొలగిపోదా? మన వంశధర్మం వీగి పోయేటట్లు ఈ దీనమైన చర్యను నీ వెన్నుకొన్నావు. సకలధర్మాలను నెరవేర్చగలిగింది సంపదయే కదా! ధనంలేనివాడు నడపీనుగువంటివాడనే నహుషవాక్యం లోక ప్రసిద్ధం. దానిని గణించవలదా?

**విశేషం:** ప్రయత్న పూర్వకంగా సాధించుకొన్న రాజ్యాన్ని అనుభవించాలి - అనే తనప్రతిపాదనకు చంద్రవంశజులలో ప్రసిద్ధుడై, ఇంద్రపదవి నధిష్ఠించిన నహుషుడి సూక్తిని ప్రమాణంగా చూపాడు అర్జునుడు. అర్జునుడి వాక్యాలు తర్కబద్ధంగా సాగుతున్నాయి.

**క.** **సరిగా నెన్నుదు రార్యులు । దరిద్రునిం బతితునిం గృతఘ్నుని జడునిన్**
**దొరకొను ధర్మముఁ గామముఁ । బరమగతియు నర్థమునన పౌరవముఖ్యా!** 50

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశజులలో గొప్పవాడవైన ఓ ధర్మరాజా!; ఆర్యులు= ఉత్తములు; దరిద్రునిన్= ధనంలేనివాడిని; పతితునిన్= భ్రష్టుడైనవాడిని; కృతఘ్నునిన్= మేలు చేసినవారి మేలు మరచుటయే కాక వారికి అపకారం చేసేవాడిని; జడునిన్= మూర్ఖుడిని; సరిగాన్= సమానంగా; ఎన్నుదురు= లెక్కిస్తారు; అర్థమునన= ధనంచేతనే; ధర్మమున్, కామమున్, పరమగతియున్= ధర్మకామమోక్షాలు; దొరకొనున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** బీదవాడినీ, పతితుడినీ, కృతజ్ఞత లేనివాడినీ, మూర్ఖుడినీ సమంగా భావిస్తారు ఉత్తములు. కాబట్టి ఓ ధర్మరాజా! ధన ముంటేనే పురుషార్థాలు ఫలిస్తాయి.

**క. కలిమియ చుట్టలఁ జేర్చుం; । గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో**
**జ్జ్వలుఁ డనిపించుం; గలిమియ । పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. 51**

**ప్రతిపదార్థం:** కలిమి+అ= సంపదయే; చుట్టలన్= బంధువులను (చుట్టాలకు రూపాంతరం); చేర్చున్= కూరుస్తుంది; కలిమి+అ= సంపదయే; చెలులను= మిత్రులను; ఘటించున్= సమకూరుస్తుంది; కలిమి+అ= సంపదయే; శౌర్య+ఉజ్జ్వలుఁడు+అనిపించున్= ప్రతాపంచేత వెలుగొందేవాడని భావింప జేస్తుంది; కలిమి+అ= సంపదయే; సద్బుద్ధి+అనఁగన్+పరఁగన్+చేయున్= మంచిబుద్ధిగలవాడని వలె ఒప్పేటట్లు చేస్తుంది.

**తాత్పర్యం:** సంపదయే చుట్టాలను రప్పిస్తుంది; సంపదయే మిత్రులను సమకూరుస్తుంది; సంపదయే ప్రతాపాన్ని ప్రకాశించేటట్లు చేస్తుంది; సంపదయే సద్బుద్ధి అని ఒప్పేటట్లు చేస్తుంది.

**విశేషం**: ఇందులో 'కలిమియ' అనే పదం నాలుగుసార్లు ప్రయోగించటం దాని ప్రాధాన్యం నొక్కి చెప్పటానికే; వినేవాడి మనసుపై గాఢమైన ప్రభావం వేయటానికే. అర్జునుడి అనునయవాక్యశిల్పం తిక్కన కవితలో తళుక్కుమంటున్నది.

**క. ఏవాని బంధుమిత్రులు । జీవధనంబులును డప్పిఁ జెందును గృశునిం**
**గా వాని నెన్నఁగాఁ దగుఁ, । గేవల తనుకార్శ్యయుతుఁడు గృశుఁడె నరేంద్రా! 52**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా! ధర్మరాజా!; ఏవాని= ఎవడియొక్క; బంధుమిత్రులు= చుట్టాలు, స్నేహితులు; జీవధనంబులును= ప్రాణాలు, సంపదలు (ప్రాణాలతో ఉన్న సంపదలు - అంటే ఆశ్రితులు అని కూడా గ్రహించవచ్చును); డప్పిన్+చెందును= దాహంతో పరితపిస్తారో(దప్పిక కొనుట - అనేది తెలుగు నుడికారం. కనీసపౌకర్యాల కొరకు అర్రులు సాచటాన్ని ఇక్కడ డప్పిగొనటంగా గ్రహించాలి); వానిన్= అటువంటి వాడిని; కృశునిన్+కాన్= చిక్కినవాడిగా, క్షీణించినవాడిగా, బలహీనుడిగా; ఎన్నఁగాన్+తగున్= లెక్కించతగుతుంది; కేవల తను కార్శ్యయుతుఁడు= ఒడలు మాత్రమే సన్నబడినవాడు; కృశుఁడె?= చిక్కినవాడా?; కృశించినవాడా?; బలహీనుడా? (కాడని భావం).

**తాత్పర్యం:** ఓ రాజా! ఎవడి బంధుమిత్రులు ఆశ్రితులు ప్రాణాలు సంపదలు దప్పికతో కృశించి కొట్టుమిట్టాడుతుంటారో అతడు నిజంగా బలహీను డనబడతాడు కాని ఒడలు చిక్కి సన్నబడినవాడు కాడు.

**వ. కావున నర్థోపార్జనంబును బంధుమిత్త్రపరితోషంబును భూపతులకుం బరమ పురుషార్థం; బదియునుం గాక. 53**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అర్థ+ఉపార్జనంబును= ధనం సంపాదించటమున్నూ; బంధుమిత్రపరితోషంబును= చుట్టాల, మిత్రుల సంతోషమున్నూ; భూపతులకున్= రాజులకు; పరమ పురుషార్థంబు= ముఖ్యంగా సాధింప దగింది (అదే వారికి మోక్షమనే అర్థం చమత్కారం); అదియునున్+కాక= అంతేకాకుండా (ఇది మరొక అంశానికి ఉపక్రమణిక).

**తాత్పర్యం:** కాబట్టి ధనసంపాదన, బంధుమిత్రులను సంతోషపెట్టటం రాజులకు ప్రధానకర్తవ్యం (మోక్షప్రదం). అంతేకాక (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **జ్ఞాతి నాశనమునఁ గాదె సకల దేవ । తలు ప్రవర్ధన మొందుట; ధనము లడిచి**
**పొడిచి యొప్పనివారిచేఁ బుచ్చికొనక । యడఁగియుండంగఁ జేరునే యంద్రు బుధులు. 54**

**ప్రతిపదార్థం:** జ్ఞాతి నాశనమునన్+కాదె= సగోత్రికులు చనిపోవటం వలననే కాదా!; సకల దేవతలు ప్రవర్ధన మొందుట= సమస్త దేవతలు వృద్ధి పొందటం; ధనములు= సంపదలు; అడిచి= కొట్టి; పొడిచి= పోట్లాడి; ఒప్పనివారిచేన్= శత్రువులచేత; పుచ్చికొనక= గ్రహించక; అడఁగి+ఉండంగన్= అణకువతో ఉంటే; చేరునే= సంపదలు వస్తాయా?; అని; బుధులు= పండితులు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** సగోత్రికులు చావటంవలన కదా దేవతలు సైతం అభివృద్ధి చెందారు. సంపదలను కొల్లగొట్టి, పోరు చేసి శత్రువులనుండి గ్రహించక అణగిమణగి ఉంటే సంపదలు సమకూరుతాయా? - అని పండితులు అంటారు.

**వ.** **వేదంబులు నిట్లు సెప్పుఁ బృథివి బలువునం గైకొని పార్థివు లర్థంబు లుపార్జించి పర్జన్యాదులగు నాదిత్యుల నధ్వరక్రియాజాతంబునం బ్రీతులంజేసి యుత్తమలోకంబులు వడయుదు; రిట్టితెరువు వట్టి దిలీప నృగ నహుషాంబరీష మాంధాతలు నడచుట వినమె? తత్పదవి నీ కొదవి యున్నయది; తదీయ ప్రకారంబున బహుళదక్షిణవిధానంబుగాఁ బ్రభూతంబైన యజ్ఞంబు సేయవైతేనిఁ జూవె నకిల్బిషుండ వగుట; యశ్వమేధంబు సేసిన రాజు లెల్ల నవభృథంబునం బరిపూతాత్ము లగుదు' రని పలికిన న య్యజాతశత్రుండు. 55**

**ప్రతిపదార్థం:** వేదంబులును= వేదాలుకూడా; ఇట్లు+చెప్పున్= ఈ విధంగా చెప్పుతాయి; పార్థివులు= క్షత్రియులు, రాజులు; పృథివిన్= రాజ్యాన్ని; బలువునన్= బలంతో; కైకొని= ఆక్రమించి, గ్రహించి; అర్థంబులు= సంపదలు, ధనాలు; ఉపార్జించి= సంపాదించి; పర్జన్య+ఆదులు+అగు= పర్జన్యుడు మొదలైన; ఆదిత్యులన్= వేల్పులను; అధ్వరక్రియాజాతంబునన్= యజ్ఞక్రియల సముదాయంచేత; ప్రీతులన్+చేసి= సంతుష్టులను చేసి; ఉత్తమలోకంబులు+పడయుదురు= పుణ్యలోకాలను పొందుతారు; ఈ+తెరువు+పట్టి= ఈ త్రోవననుసరించి; దిలీప, నృగ, నహుష, అంబరీష, మాంధాతలు అనే మహారాజులు; నడచుట= ప్రవర్తించటం; వినమె?= వినమా? ప్రసిద్ధి కాదా?; తద్+పదవి= అటువంటి అధికారం; నీకున్+ఒదవి+ఉన్న అది= నీకు కలిగి ఉన్నది; తదీయ ప్రకారంబునన్= అదే విధంగా; బహుళదక్షిణ విధానంబుగాన్= అనేకవిధాలైన దక్షిణ లిచ్చే పద్ధతిలో; ప్రభూత= శ్రేష్ఠమైన; దైవయజ్ఞంబు= దేవసంబంధమైన యజ్ఞాన్ని; చేయవైతివి+ఏనిన్+చూవె!= చేయకపోతే సుమా!; అకిల్బిషుండవు+అగుటన్= పాపం లేనివాడ వగుటచేత; అశ్వమేధంబు+చేసినరాజులు+ఎల్లన్= అశ్వమేధయాగం చేసిన రాజులందరూ; అవభృథంబునన్= యజ్ఞం ముగిసిన తరుణంలో చేసే పవిత్రమంత్ర జలస్నానంవలన; పరిపూతులు+అగుదురు= పవిత్రు లౌతారు; అని పలికినన్= ఈ విధంగా అర్జునుడు పలుకగా; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** వేదాలు కూడా ఇట్లా చెప్పుతున్నాయి. క్షత్రియులు బల పరాక్రమాలతో రాజ్యాలను గెలుచుకొని, సంపదలు సంపాదించి, పర్జన్యుడు మొదలైన దేవతలను యజ్ఞకార్య సముదాయంతో సంతోషపెట్టి స్వర్గాదిలోకాలను పొందుతారు. అదే పద్ధతి నాశ్రయించి దిలీపుడు, నృగుడు, సగరుడు, నహుషుడు, అంబరీషుడు, మాంధాత మొదలైన రాజులు నడచుకొనటం వినలేదా? అటువంటి ఉత్తమగతి నీకు అనువై ఉన్నది. వారు నడచిన మార్గంలోనే నీవు కూడా నడచి అనేక దక్షిణలతో కూడిన బహుళ యజ్ఞాలు చేయకపోతే పుణ్యాత్ముడవు కావు. అశ్వమేధయాగం చేసిన రాజు లందరూ అవభృథస్నానంతో పవిత్రు లౌతా' రని పలుకగా విని, ధర్మరాజు (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **వెడవెడ నప్పలుకులు చెవి । నిడి, కొండొకసేపు చింత యెసకంబున పా**
**ల్పడి యూరకుండి చిత్తం । బడలునఁ జిక్కువడ నిట్టు లను నర్జునుతోన్.** **56**

**ప్రతిపదార్థం:** ఆ+పలుకులు= ఆ విధంగా అర్జునుడు పలికిన మాటలను; వెడవెడన్= మందంగా (అంత ఆసక్తి లేకుండా); చెవిన్+ఇడి= విని; కొండొకసేపు= కొంతసేపు; చింత= దిగులు యొక్క; లేదా ఆలోచనయొక్క ఎసకంబున పాల్పడి = అతిశయానికిలొంగి; ఊరక+ఉండి= మాటలాడక కూర్చుండి; చిత్తంబు= మనస్సు; అడలునన్= దుఃఖంతో; చిక్కు+పడన్= కలతపడగా; అర్జునుతోన్= అర్జునుడితో; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు మాట్లాడిన మాటలను యుధిష్ఠిరుడు అనాసక్తంగానే విన్నాడు. కొంతసేపు దిగులులో, ఆలోచనాతిశయంలో మునిగిపోయాడు. మనస్సు దుఃఖంతో కలతచెందగా అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** తిక్కన మానసికావస్థలను అభినయసుందరంగా వ్యక్తీకరించటానికి ఈ పద్యం ఉదాహరణం. 'చెవి నిడి' - అనే ప్రయోగంతో ధర్మజుడు చెవు లొప్పగించి విన్నా మనసార వినలేదని సూచన; మరికొంతసేపు ఆలోచనలో మునిగిపోవటం అతడిలో మార్పు రాలేదనటానికి చిహ్నం.

**క.** **' నేమపుఁ దెరు వొక్కటి గల; । దే మెచ్చితి దాని; నడుగు మెయ్యది యని సు**
**త్రామసుత! యడుగకున్నను । నేమి? వినుము చెప్పెదను మునీంద్రుల కెక్కన్.** **57**

**ప్రతిపదార్థం:** సుత్రామసుత!= ఇంద్రుడి పుత్రుడవైన అర్జునా!; నేమము+తెరువు= నియమమార్గం; ఒక్కటి= ఒకటి; కలదు= ఉన్నది; దానిన్= ఆ మార్గాన్ని; ఏన్= నేను; మెచ్చితిన్= అభిమానించాను; ఏ+అది+అని= అది యేమిటని; అడుగక+ఉన్నను= ప్రశ్నించకపోయినా; ఏమి?= ఏమైనది?; ముని+ఇంద్రులకున్+ఎక్కన్= ఋషి శ్రేష్ఠులకు నచ్చేటట్లుగా; చెప్పెదను వినుము= చెప్పుతాను వినుము.

**తాత్పర్యం:** అర్జునా! నాకొక నియమమార్గం నచ్చింది. అది ఏమిటని నీవు అడుగక పోయినా మునీంద్రులు మెచ్చేటట్లు చెప్పుతాను వినుము.

**విశేషం:** ధర్మజుడి మనసులోని అనిష్టం మాటవెటకారంలో ధ్వనిస్తున్నది.

**సీ.** **' సారహీనము లగు సంసారసుఖములు । విడిచి, యేకాకి నై యడవి కేఁగి,**
**తాపస వాక్యామృతములు వీనులఁ గ్రోలి, । చెలిమి వేర్పాటను చిరమరలకుఁ**
**జొరక, నిందాస్తుతుల్ సరిగాఁ గొనుచుఁ గత్తి । నొకఁడు వ్రేసినను వేఱొక్కరుండు**
**చందనం బలఁదిన దెంద మయ్యిరువుర । యెడ సమంబుగ మూఁగజడుఁ డనంగ**

**తే.** **మెలఁగి, తగువేళఁ బర్ణశాలలకు నరిగి । యెత్తఁగా భిక్ష యెవ్వార లెట్టు లేమి**
**యిడినఁ గైకొని నాలుగే నెడల మాత్రఁ । గన్నదానఁ దృప్తుండనై యున్న మేలు.** **58**

**ప్రతిపదార్థం:** సారహీనములు+అగు= నీరసములైన; సంసారసుఖములు= సంసారానికి సంబంధించిన అనేక సుఖాలు; విడిచి= వదలిపెట్టి; ఏకాకిని+ఐ= ఒంటరిగా; అడవికిన్+ఏఁగి= అరణ్యానికి పోయి; తాపసవాక్య+అమృతములు= మునులయొక్క అమృతంవంటి వాక్యాలను; వీనులన్= చెవులతో; క్రోలి= త్రావి; చెలిమి వేర్పాటను= స్నేహం,విరోధం,అనురెంటిలో; చిరమరలకున్= భేదభావాలకు; చొరక= ప్రవేశించక; నిందాస్తుతుల్= నిందలను, ప్రశంసలను; సరిగాన్+కొనుచున్= సమచిత్తంతో గ్రహిస్తూ; ఒకఁడు+కత్తిన్+వ్రేసినను= ఒకడు కత్తితో నరికినా (హింసించినా); వేఱు+ఒక్కరుండు= మరొకడు; చందనంబు+అలఁదినన్=

మంచి గంధం పూసినా (సేవించినా); ఆ+ఇరువుర ఎడన్= ఆ ఇద్దరిపట్ల; డెందము= హృదయం; సమంబుగన్= సమభావంతో మెలగేటట్లు; మూఁగజడుఁడు+అనంగన్= మాటలు రాని మూర్ఖుడో మొద్దో అన్నట్లు; తగువేళన్= తగినసమయంలో; పర్ణశాలలకున్+అరిగి= ఆశ్రమవాసులు నివసించే పూరిళ్ళకు వెళ్ళి; భిక్ష+ఎత్తఁగాన్= భిక్ష అడుగగా; ఏ+వారలు= ఎటువంటివారైనా; ఎట్టులు= ఏ విధంగానైనా; ఏమి+ఇడినన్= ఏది భిక్షగా ఇచ్చినా; కైకొని= స్వీకరించి; నాలుగు+ఏను+ఎడల మాత్రన్+కన్నదానన్= నాలుగు అయిదుచోట్ల (ఇండ్లలో) కలిగిన (లభించిన) దానితో; తృప్తుండను+ఐ= తృప్తి పొందినవాడనై; ఉన్నన్+మేలు= ఉండటం మంచిది.

**తాత్పర్యం:** నీరసాలైన సంసారసుఖాలను వదలి ఒంటరివాడనై అడవికిపోయి, మునుల బోధామృతాలను చెవులారా వింటూ, స్నేహవైరాలపట్ల కలత చెందకుండా, నిందలను, ప్రశంసలను సమచిత్తంతో గ్రహిస్తూ, ఒకడు కత్తితో గాయం చేసినా, మరొకడు మంచిగంధంతో పూతలు పూసినా వారిరువురిపట్లా సమంగా స్పందిస్తూ, మూగవాడైన మూర్ఖుడివలె మెలగుతూ, తగిన వేళలలో ఆశ్రమాలలో భిక్షనడిగికొని, ఎవరేదిపెడితే దానిని తీసికొని, నాల్గుదిక్కులలో కలిగిన దానితో తృప్తిపడుతూ ఉండటం మేలు.

**విశేషం:** అలం: ఉపమ. ద్వంద్వాతీతమైన చిత్తంతో, అసంగుడై స్థితప్రజ్ఞుడివలె మునివృత్తితో జీవించటం ఉత్తమధర్మమని యుధిష్ఠిరుడు వివరించి చెప్పాడు.

**క. అటుగాక కర్మగతి లం । పటుఁడ నగుదు నేని నల్పఫల భాగితమై**
**నట యిట దిరుగుచు మోక్ష ని । కట వృత్తికి బాహిరుండఁ గానె కుమారా! 59**

**ప్రతిపదార్థం:** అటు+కాక= అట్లా కాకుండా; కర్మగతిన్= కర్మలను ఆచరించే పద్ధతిలో; కుమారా!= వత్సా! , అర్జునా!; లంపటుఁడన్= అత్యాసక్తి కలవాడను; అగుదున్+ఏనిన్= అయినట్లయితే; అల్పఫలభాగితము+ఐ= స్వల్పమైన ఫలమిచ్చేది కావటంచేత; అట+ఇట+తిరుగుచున్= పెక్కురకాలుగా నిలకడలేక తిరుగుతూ; మోక్షనికట వృత్తికిన్= మోక్షానికి సమీపంలో ఉన్న చిత్తవృత్తికి; బాహిరుఁడన్= దూరమయినవాడిని; కానె?= కానా? (ఔతానని భావం).

**తాత్పర్యం:** అట్లా కాకుండా కర్మమార్గంలో కూరుకొనిపోతే ఓ అర్జునా! అది స్వల్పఫలా న్నిచ్చేదే కాబట్టి నేను పరిపరివిధాల తిరుగుతూ మోక్షప్రవృత్తికి దూరమైపోయేవాడిని కానా?

**వ. కావున నాకు దొరకొన్న విమలప్రజ్ఞామృతం బనుభవింపక తక్కుదునే? యిది శాశ్వతపదప్రదం' బనిన విని యనిలతనయుం డతని కిట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నాకున్= నాకు(ధర్మరాజుకు); దొరకొన్న= కలిగిన; సిద్ధించిన; విమలప్రజ్ఞా+అమృతంబు= అమృతంవంటి నిర్మలజ్ఞానాన్ని; అనుభవింపన్= అనుభవించకుండా; తక్కుదునే?= విడువగలనా?; ఇది= ఈ జ్ఞానం; శాశ్వతపదప్రదంబు= మోక్షా న్నిచ్చేది; అనినన్+విని= అనగా విని; అనిలతనయుండు= వాయుపుత్రుడైన భీముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కాబట్టి నాకు సిద్ధించిన అమృతంవంటి నిర్మలజ్ఞానాన్ని అనుభవించకుండా ఉండగలనా? ఈ జ్ఞానం మోక్షా న్నిచ్చేది' - అని ధర్మరాజు పలుకగా భీము డా మాటలు విని ఇట్లా అన్నాడు.

**క. 'శ్రుతివిహిత కర్మజాత । స్థితి యోగ్యుఁడ వైన నీకుఁ జేయఁగ వశమే**
**యతిలోకజ్ఞానసమ । న్వితయతిజనకృత్య? మటు వివేకింపు మెదన్. 61**

**ప్రతిపదార్థం:** శ్రుతివిహిత= వేద సమ్మతమైన; కర్మజాతస్థితియోగ్యుఁడవు= కర్మల సమూహముయొక్క ఉనికికి తగినవాడవు; ఐన నీకున్= అయిన నీకు; అతిలోకజ్ఞానసమన్విత= ఆధ్యాత్మజ్ఞానంతో కూడుకొన్న; యతిజనకృత్యము= మునిజనుల ఆచారం; నీకున్= నీకు; చేయఁగన్+వశమే?= ఆచరించటం సాధ్యమౌతుందా?; అటు= ఆ విధంగా; ఎదన్= చిత్తమునందు; వివేకింపుము= ఆలోచించుము.

**తాత్పర్యం:** వేదాలలో చెప్పిన కర్మలను ఆచరించే స్థితికి యోగ్యుడవైన నీకు లోకాతీతజ్ఞాన సమన్వితమైన మునుల ఆచారాన్ని అవలంబించడం సాధ్యమౌతుందా? నీవే నీ మనస్సులో ఆలోచించుకొనుము!

**చ.** **అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు ని**
**ప్పుడు; మును నిస్పృహుండ వయి పోవఁగఁ గన్నఁ గులంబువారు ని**
**ప్పుడమి నృపాలురున్ బ్రతికిపోదురు నెమ్మది; నట్టులైన నే**
**ముడుగుదు మస్త్రజీవన సముద్ధతిఁ, జొత్తుము భైక్షవృత్తికిన్.** **62**

**ప్రతిపదార్థం:** అడలునన్= దుఃఖంచేత; నీకున్= నీకు (ధర్మరాజుకు); ఇప్పుడు= ఈ తరుణంలో; రాజధర్మముల+అందున్= రాజులు(క్షత్రియులు) నిర్వహించే ధర్మాలపట్ల; అసూయ= ఈర్ష్య; జనించెన్= పుట్టింది; మును= పూర్వం; నిస్పృహుఁడవు+అయి= అనాసక్తుడవై; పోవఁగన్+కన్నన్= పోయిఉన్నట్లయితే; కులంబువారు= క్షత్రియులు, వంశజులు; ఈ పుడమి నృపాలురున్= ఈ భూమిపై గల రాజులు; నెమ్మదిన్= ప్రీతితో; బ్రతికిపోదురు= ప్రాణాలతో బ్రతికిపోయి ఉండేవారు; అట్టులు+ఐనన్= అదే విధంగా జరిగి ఉన్నట్లయితే; ఏము= మేము (భీమాదులని భావం); అస్త్రజీవన సముద్ధతిన్= ఆయుధాలనుపట్టి జీవించే గర్వోన్నతిని; ఉడుగుదుము= వదలిఉండే వాళ్ళం; భైక్షవృత్తికిన్= బిచ్చమెత్తి బ్రతికే వృత్తిలో; చొత్తుము= ప్రవేశించేవారం.

**తాత్పర్యం:** 'నీ కిప్పుడు కలిగిన దుఃఖంచేత రాజధర్మాలమీద అసూయ కలిగింది కాని, ముందుకాలంలో నిజంగా నీవు అనాసక్తుడవై ఉన్నట్లయితే మనవంశజులు, భూమిని పాలించే రాజులూ ప్రాణాలతో బ్రతికిపోయి ఉండేవారు. మే మీ అస్త్రజీవన గర్వోన్నతిని వదలి ఉండేవాళ్ళం; బిచ్చమెత్తుకొని బ్రతికే పద్ధతిలో ప్రవేశించి ఉండేవాళ్ళం.

**క.** **వాఁడి యగు నలుక లోకము । పోఁడిమి సెడఁ గయ్య మట్లు పొడిచి వనటమై**
**నేఁ డింక నడవికిం జను । వాఁడం గా కనినఁ బుడమివారలు నగరే!** **63**

**ప్రతిపదార్థం:** వాఁడి+అగు+అలుకన్= తీక్ష్ణమైన కోపంతో; లోకము పోడిమి+చెడన్= లౌకిక సుఖాలు, సంపదలు చెడేటట్లుగా; కయ్యము= యుద్ధమును; అట్లు= అంత భీకరంగా; పొడిచి= పోట్లాడి, యుద్ధంచేసి; నేఁడు= ఈనాడు; వనటమైన్= దుఃఖంచేత; ఇంకన్= ఇకమీదట; అడవికిన్= అరణ్యానికి; చనువాఁడన్+కాక+అనినన్= వెళ్తాను సుమా అని అంటే; పుడమివారలు= లోకులు; నగరే?= నవ్విపోరా? ఎగతాళిచేయరా?

**తాత్పర్యం:** ఆనాడు అంత తీవ్రమైన కోపంతో లౌకిక సుఖాలు చెడిపోయేటట్లు అంత భీకరంగా యుద్ధం చేసి, నేడు అడవికి పోతున్నానని అంటే లోకులు అవహేళన చేయరా?

**సీ.** **పనివడి త్రవ్వి కూపమునందు నుదకంబు । పానంబు సేయని వాని భంగి,**
**యున్నతతరు వెక్కి జున్ను సేకుఱఁ గొని । తేనియ యానని వాని భంగి,**
**యాఁకొని యొడఁగూర్చి యన్నంబు తళియకు । వచ్చినఁ గుడువనివాని భంగి,**
**తమకించి యొకభంగిఁ దనవశంబుగఁ జేసి । మానినిఁ గవయని వాని భంగి,**

**ఆ. గాదె కురువరేణ్య! ఘనశక్తి శౌర్య సం। పన్నులైన పగఱ భండనమున**
**నోర్చి పూజ్యరాజ్య మొల్లక యడవికి। నేఁగు; టీవ యెఱుఁగు దిత్తెఱంగు. 64**

**ప్రతిపదార్థం:** పనివడి= అక్కరపడి; త్రవ్వి= లోతుగా త్రవ్వి; కూపమునందున్= బావిలోని; ఉదకంబు= నీరు; పానము+చేయనివాని భంగి= త్రాగనివాడి విధమూ; ఉన్నతతరువు+ఎక్కి= ఎత్తైన చెట్టును ఎక్కి; జున్ను+చేకుఱన్+గొని= తేనెతెట్టెను సాధించి; తేనియ+ఆననివాని భంగి= తేనెను రుచిచూడని వాడి విధమూ; ఆఁకలి+కొని= ఆకలి వేసి; ఒడఁగూర్చి= సమకూర్చుకొని; అన్నంబు= ఆహారం; తళియకున్= కంచంలోనికి; వచ్చినన్= రాగా; కుడువని వాని భంగి= తిననివాడి విధమూ; తమకించి= త్వరపడి; ఒక భంగిన్= ఒక ఉపాయంతో; తన వశంబుగన్+చేసి= తనకు లొంగేటట్లు సిద్ధంచేసి; మానినిన్= స్త్రీని; కవయనివాని భంగి= కూడనివాడి విధమూ; కాదె?= కాదా? (అగును అని భావం); ఘనశక్తి శౌర్యసంపన్నులు+అయిన= అపారమైన బలపరాక్రమ సంపద గలవారైన; పగఱన్= శత్రువులను; భండనమునన్= యుద్ధంలో; ఓర్చి= జయించి; పూజ్య= గౌరవించదగిన; రాజ్యము= ప్రభుత్వమును; ఒల్లక= అంగీకరించక; అడవికిన్+ఏఁగుట= అడవికి పోవటం; కురువరేణ్య!= కురువంశజులలో శ్రేష్ఠుడవైన ధర్మరాజా!; ఈవ= నీవే; ఈ+తెఱంగు= ఈ విధాన్ని; ఎఱుఁగుదు(వు)= తెలిసినవాడవు.

**తాత్పర్యం:** అక్కరపడి బావి త్రవ్వి అందులోని నీటిని త్రాగనివాడి విధంగా, ఎత్తైన చెట్టు నెక్కి తేనెతెట్టెను పట్టి తేనెను రుచిచూడని వాడి విధంగా, ఆకలివేయగా సమకూర్చుకొన్న అన్నం కంచంలో ఉంచుకొని తిననివాడి విధంగా, త్వరపడి ఒక ఉపాయంతో వనితను తనకు వశంచేసికొని కూడా ఆమెను కూడని వాడి విధంగా, అపార బలసంపన్నులైన శత్రువులను యుద్ధంలో జయించి, సాధించిన పూజ్యమైన సామ్రాజ్యాన్ని గ్రహించకుండా అడవికి పోవటం కూడా అటువంటిదే కదా! కురుశ్రేష్ఠుడవైన ధర్మరాజా! ఈ సంగతి నీకు కూడా తెలుసు.

**విశేషం:** అలం: ఉపమ. మాలోపమతో ప్రతిపాద్యాంశాన్ని సమర్థించే ఈ వాక్య విన్యాసం. భీముడి స్వభావాన్నీ, అన్నగారి మనసును మార్చటానికి చేస్తున్న తీవ్రయత్నాన్నీ ధ్వనింపజేస్తున్నది.

**క. నీ వడవి కరుగ నొడఁబడి। నీ వెనుకన వచ్చునపుడు నిందింతురు మ**
**'మ్మీ వెఱ్ఱు లితని మాన్పం। గా వలఁతులు గార' యని జగజ్జను లధిపా! 65**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (ధర్మజుడు); అడవికిన్= అరణ్యానికి; అరుగన్= వెళ్ళటానికి; ఒడఁబడి= అంగీకరించి; నీ వెనుకన్+అ= నీ వెంటనే; వచ్చునపుడు= వచ్చే సందర్భంలో; అధిపా!= ఓ రాజా!; జగత్+జనులు= లోకులు; ఈ వెఱ్ఱులు = ఈ వెర్రివారు (భీమాదులు); అతనిన్= ధర్మరాజును; మాన్పంగాన్= అడవులకు పోకుండా మానేటట్లు చేయటానికి; వలఁతులు+కారు+అ= సమర్థులు కారు; అని= అనిఅంటూ; మమ్మున్= మమ్ములను (భీమాదులను); నిందింతురు= దూషిస్తారు.

**తాత్పర్యం:** నీవు అడవికి పోవటానికి అంగీకరించి, నీ వెనుక మేముకూడా కలిసి వస్తున్నప్పుడు - ఓ ధర్మరాజా! లోకు లందరూ 'ఈ వెర్రివాళ్ళు ధర్మరాజును అడవికి పోకుండా మాన్పే సామర్థ్యం లేనివారు' అని మమ్మల్ని నిందిస్తారు.

**విశేషం:** భీముడి అభిమానం ఈ మాటలలో ధ్వనిస్తున్నది.

**క. భోగములఁ బాపి నిందా। భాగులఁగాఁ జేసి యడవి పాల్పఱిచెదవే**
**నీ గారవంపుఁ దమ్ముల। సాగరవృతధరణిఁ గలుగు జనములు వగవన్.' 66**

**ప్రతిపదార్థం:** నీ గారవంపు+తమ్ములన్= నీ అనుగు తమ్ములను; భోగములన్= సంపదలనుండి; పాపి= దూరంచేసి; నిందాభాగులన్+కాన్+చేసి= నిందల పాలయ్యే వారినిగా చేసి; సాగరవృత= సముద్రంచేత చుట్టబడిన; ధరణిన్= భూమిపై; కలుగు= నివసించే; జనులు= ప్రజలు; వగవన్= దుఃఖించగా; అడవిపాల్+పఱిచెదనే?= అడవులపాలు చేస్తావా?

**తాత్పర్యం:** నీ అనుగు తమ్ములను భోగాలనుండి దూరంచేసి, నిందల పాలయ్యే వారినిగా చేసి, అడవులపాలు చేస్తావా? నాలుగు సముద్రాలచేత చుట్టబడిన ఈ భూమిమీద నివసించే ప్రజలంతా దుఃఖిస్తారు.

**క.** **' కేవల నిష్కర్మత మో । క్షావహ మగునేని గిరులు నవనీజములున్**
**భూవర! ముక్తిం బడయం । గా వలవదె; యడవి నునికి కైవల్యదమే?** **68**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా! (ధర్మరాజా!); కేవల నిష్కర్మత= నిష్ఫలమైన కర్మరాహిత్యం (నిరర్థకమైన పనిలేనితనం); మోక్ష+ఆవహము+అగునేని= ముక్తిని కలిగించేదే అయితే; గిరులున్= పర్వతాలూ; అవనీజములున్= చెట్లూ; ముక్తిన్= మోక్షాన్ని; పడయంగాన్+వలవదె?= పొందవద్దా?; అడవిన్= అడవిలో; ఉనికి= ఉండటం; కైవల్యదము+ఏ?= మోక్షాన్ని ఇచ్చేదా? (కాదని భావం).

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఏ ప్రయోజనం లేని కర్మరాహిత్యమే మోక్షాన్ని కలిగించేదైతే కొండలూ, చెట్లూ ముక్తిని పొందగలిగి ఉండాలి కదా! కాబట్టి అడవిలో ఉండటమే మోక్షం కలిగించే దవుతుందా?

**క.** **ఫలములయెడ బ్రహ్మార్పణ । కలనపరుం డగుచుఁ గార్య కర్మము నడపన్**
**వలయుం; దత్త్వజ్ఞానము । దలకొనినం గర్మశమము దానై కలుగున్.** **69**

**ప్రతిపదార్థం:** ఫలముల ఎడన్= కర్మఫలాలపట్ల; బ్రహ్మ+అర్పణ కలనపరుండు+అగుచున్= బ్రహ్మమునకు (దైవానికి) సమర్పించాలనే స్పృహతో కూడుకొన్నవాడు ఔతూ; కార్యకర్మము= లౌకిక వ్యవహారాలు, వేదవిహిత కర్మము= వేదాలలో విధించబడిన విధిని; నడపన్+వలయున్= ఆచరించాలి; తత్త్వజ్ఞానము= ఆత్మ తత్త్వాన్ని గూర్చిన జ్ఞానం కొరకు; తలకొనినన్= పూనుకొంటే; కర్మశమము= కర్మలు ఉపశమించటం; తానై= తనంతట తానే; కలుగున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** విధ్యుక్తకర్మలను ఫలంమీద కోరికలేకుండా బ్రహ్మార్పణభావంతో సాగించాలి. ఆత్మతత్త్వజ్ఞాన సాధనకు పూనుకొంటే కర్మరాహిత్యం తనంతట తానే కలుగుతుంది.

**వ.** **కావునం గర్మహీనత్వం బపవర్గకరంబుగా' దనవుడు నర్జునుండు ధర్మనందను నుద్దేశించి 'దేవా! యొక్కయితిహాసంబు గల దవధరింపు' మని యిట్లనియె.** **70**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కర్మహీనత్వంబు= కర్మలు చేయకుండా ఉండటం; అపవర్గకరంబు+కాదు= మోక్షాన్ని కలిగించేది కాదు; అనవుడున్= అని భీముడు అనగా; అర్జునుండు= అర్జునుడు; ధర్మనందనున్+ఉద్దేశించి= ధర్మరాజుతో; దేవా!= ప్రభూ!; ఒక్క+ఇతిహాసంబు= పరంపరగా చెప్పుకొనే కథ ఒకటి; కలదు= ఉన్నది; అవధరింపుము= విను, చిత్తగించుము; అని+ఇట్లు+అనియెన్= అని ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కాబట్టి కర్మలు చేయకపోవటం మోక్షాన్ని కలిగించ లేదు' అని భీము డనగా, ఆ తరువాత అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'రాజా! ఒక ఇతిహాసం ఉన్నది. చెప్తుతాను వినుము.'

**విశేషం:** భీమవాక్యాలకు దృష్టాంతరూపమైన ఇతిహాసాన్ని చెప్తుతూ అర్జునుడు మిత్రసమ్మితంగా హితవును బోధిస్తున్నాడు.

**సీ.** **' కొందఱు బ్రాహ్మణుల్ గొండుక లాత్మ కు । లోచితాచారంబు లుడిగి కాన**
**లకుఁ జన్న వజ్రి వారికిఁ గృప చేసి ప । తత్త్రిరూపమునఁ దత్పార్శ్వమునకు**
**నరిగి, 'మీ కైకొన్న తెరు వొప్ప' దనవుడు । విని, వా రఖిల మార్గవేది యద్భు**
**తాస్పద మీపక్షి యని దాని కభిముఖు । లై 'సత్పథం బెద్ది యనఘ! చెపుమ!'**

**తే.** **యనిన 'నలుగాలివాన గోవును, నశేష । శబ్దముల మంత్రమును, లోహజాతిఁ గాంచ**
**నమును, మనుజుల విప్రుండు సమధికత్వ । భాజనము లండ్రు వేదప్రపంచవిదులు.'** **71**

**ప్రతిపదార్థం:** కొందఱు బ్రాహ్మణుల్+కొండుకలు= కొందరు బ్రాహ్మణ బ్రహ్మచారులు; ఆత్మకుల+ఉచిత+ఆచారంబులు= తమ కులానికి అనువైన ఆచారాలను; ఉడిగి= వదలి; కానలకున్= అడవులకు; చన్నన్= పోగా; వజ్రి= ఇంద్రుడు; వారికిన్= వారిఅందు; కృపచేసి= దయచూపి; పతత్త్రిరూపమునన్= పక్షి ఆకారంలో; తద్+పార్శ్వమునకున్+అరిగి= వారి దగ్గరకు వెళ్ళి; మీ కైకొన్న తెరువు+ఒప్పదు= మీరు ఎన్నుకొన్న మార్గం ఉచితమైనది కాదు; అనవుడున్= అనగా విని, వారు= ఆ బ్రాహ్మణులు; ఈపక్షి= (పక్షిరూపంలో ఉన్న ఇంద్రుడు) ఈ పక్షి; అఖిలమార్గవేది= సర్వ ధర్మమార్గాలను తెలిసినది; అద్భుత+ఆస్పదము= ఆశ్చర్యాన్ని కలిగించేది; అని= అని అనుకొని; దానికిన్= ఆ పక్షికి; అభిముఖులు+ఐ= ఎదురుగా నిలిచినవారై; అనఘ!= ఓ పాపరహితుడా!; సత్+పథంబు= ఉత్తమమార్గం; ఎద్ది= ఏదో; చెపుమ!= చెప్పుము!; అనినన్= అనగా; నలు+కాలివానన్= నాలుగు కాళ్ళ జంతువులలో; గోవును= ఆవును; అశేషశబ్దములన్= అనంత శబ్దాలలో; మంత్రమును= బీజాక్షరసహితమైన మంత్రాన్నీ; లోహజాతిన్= లోహసముదాయంలో; కాంచనమును= బంగారాన్ని; మనుజులన్= మానవులలో; విప్రుండు= బ్రాహ్మణుడు; వేదప్రపంచ విదులు= వేదజగత్తుకు సంబంధించిన జ్ఞానం కలవారు; సమధికత్వ భాజనములు+అండ్రు= ఆధిక్యానికి ఆలంబనాలని అంటారు.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణ బ్రహ్మచారులు కొందరు తమ కులాచారాలను వదలి అడవులకు వెళ్ళారు. ఇంద్రుడు వారిని చూచి జాలిపడి ఒక పక్షిరూపం దాల్చి వారి సమీపానికి చేరి, 'మీ రెన్నుకొన్న మార్గం మంచిదికాదు' అని అన్నాడు. ఆ పక్షిమాటలు విని ఆ బ్రాహ్మణబాలురు 'ఈ పక్షి అనేక ధర్మమార్గాలు తెలిసింది, అద్భుత' మని దానిముందు చేరి 'పుణ్యాత్మా! సన్మార్గం ఏమిటో చెప్పు' మని కోరారు. అప్పు డా పక్షి ఇట్లా చెప్పనారంభించింది. 'నాలుగు కాళ్ళున్న జంతువులలో గోవు, అనంత శబ్దరాశిలో మంత్రం, లోహజాతిలో బంగారం, మానవులలో బ్రాహ్మణుడు అధికులు అని వేదవిదులు పేర్కొంటారు'.

**విశేషం:** మనుజుల విప్రుండు - అజడమైన మనుజశబ్ద సప్తమికి ద్వితీయ రావడం విశేషం. సూ. కొన్ని యెడల నజడంబు తృతీయా సప్తములకును ద్వితీయ చూపట్టెడి. ప్రౌఢ కారక - 18. 'జకంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగు - బాలవ్యా. కారక. 22 అనుసూత్రమునకు సవరింపు.

**వ.** **ఇ ట్లుత్తముం డైన విప్రుం డుత్తమ మంత్రోపాశ్రితంబులగు విహిత కర్మంబులు నడపుట రత్నకాంచన సాంగత్యంబునుం బోలె లోకసంస్తుత్యంబై యుండు; నాలస్యంబునఁ గ్రోధంబున శోకంబునఁ దదనుష్ఠానంబు విడుచుట పాతకం; బజ్ఞానులగు నర్థహీనులు సన్న్యాసకాల వివేకంబు లేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు; గృహస్థ ధర్మంబున వర్తించి యతిథి దేవ పితృసంతృప్తి సేయుచు శిష్టాన్న భోజన పరులగు పుణ్యులకుం బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె?; బ్రహ్మార్పితం బయిన సత్కర్మకలాపంబు మహానందంబుఁ జేయు ననుటయు.** **72**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఉత్తముండు+ఐన= శ్రేష్ఠుడైన; విప్రుండు= బ్రాహ్మణుడు; ఉత్తమ మంత్ర+ఉప+ఆశ్రితంబులు+ అగు= శ్రేష్ఠములైన మంత్రాలను; ఆశ్రయించిన వైన; విహితకర్మంబులు= యోగ్యములైన ఆచరణములను; నడపుట= సాగించటం; రత్న కాంచన సాంగత్యంబునున్+పోలెన్= రత్నానికీ, బంగారానికీ ఏర్పడిన కలయికవలె; లోక సంస్తుత్యంబు+ఐ+ఉండున్= జనులచేత కీర్తించదగినదై ఉంటుంది; ఆలస్యంబునన్= అలసభావంచేతగాని; క్రోధంబునన్= కోపంవలనగాని; శోకంబునన్= దుఃఖతీవ్రతవలనగానీ; తద్+అనుష్ఠానంబు= దానిని ఆచరించటం; విడుచుట= వదలిపెట్టటం; పాతకంబు= పాపం; అజ్ఞానులు+అగు= మూఢులైన; అర్థహీనులు= ప్రయోజనం లేనివారు, ధనంలేనివారు; సన్న్యాసకాల వివేకంబు లేక= సన్న్యాసం ఎప్పుడు తీసికొనాలో తెలియనివారై; వేగిరపడి= తొందరపడి (సన్న్యాసాశ్రమం తీసికొని); ఉభయ భ్రష్టులు+అగుదురు= ఇహపరాలకు చెందని పతితులౌతారు; గృహస్థ ధర్మంబునన్= గృహస్థాశ్రమ ధర్మంలో; వర్తించి= కర్మలను ఆచరించి; అతిథి దేవపితృసంతృప్తి+చేయుచున్= అతిథులను, దేవతలను, పితృదేవతలను సంతోషపెట్టుతూ; శిష్ట+అన్నభోజనపరులు= శుద్ధమైన అన్నాన్ని భుజించటంలో ఆసక్తి గలవారైన; పుణ్యులకున్= పుణ్యాత్ములకు, పవిత్రులకు; పుణ్యలోకంబులు= పుణ్యులు పొందే స్వర్గాదిలోకాలు; అరచేతిలోనివి= అరచేతిలో ఉన్నట్లు అందుబాటులో ఉండేవి; కావె?= కావా?; బ్రహ్మ+అర్పితంబు+అయిన= పరమాత్మకు నివేదించిన; సత్+కర్మకలాపంబు= పుణ్యకర్మల సమూహం; మహా+ఆనందంబున్= గొప్పదైన ఆనందాన్ని (బ్రహ్మానందాన్ని); చేయును= కలిగిస్తుంది; అనుటయున్= అని అనగా.

**తాత్పర్యం:** ఈ విధంగా బ్రాహ్మణోత్తముడు ఉత్తమమంత్రాల నాశ్రయించిన యోగ్యమైన కర్మలను అనుష్ఠించటం రత్నానికీ, బంగారానికీ పొత్తు కుదిరినట్లు శ్లాఘించదగినదై ఉంటుంది. అలసత్వం వలనగాని, క్రోధంవలనగాని, శోకం వలనగాని ఆ కర్మలను చేయకుండా వదలటం పాపం. అజ్ఞానులైన అర్థహీనులు సన్న్యాసం ఎప్పుడు తీసికొనాలో తెలియక త్వరపడి ఇహపరాలకు భ్రష్టులౌతారు. గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్వర్తించి అతిథులనూ, దేవతలనూ, పితృదేవతలనూ సంతృప్తి పరుస్తూ, శిష్టమైన ఆహారాన్ని భుజిస్తూ జీవితం సాగించే పుణ్యాత్ములకు స్వర్గాది పుణ్యలోకాలు కరతలామలకాలు. బ్రహ్మార్పణభావంతో చేసే సత్కర్మలు బ్రహ్మానందాన్ని కలిగిస్తాయి' - అని అనగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. విని వారు దెలిసి మరలం। జనిరి గృహస్థత్వ ధర్మ సదనుష్ఠానం**
**బునకు; నటు లగుట నేలుము। జనవల్లభ! పుడమి; నడపు జన్నము లెలమిన్.' 73**

**ప్రతిపదార్థం:** వారు= ఆ బ్రాహ్మణులు; విని= ఆ మాటలు విని; తెలిసి= వాటి అర్థాన్ని తెలిసికొని; గృహస్థత్వ ధర్మసత్+అనుష్ఠానంబునకున్= గృహస్థాశ్రమానికి సంబంధించిన ధర్మాలను లెస్సగా అనుష్ఠించటానికి; మరలన్+చనిరి= తిరిగి తమ నివాసాలకు వెళ్ళారు; అటులు+అగుటన్= అది న్యాయం కాబట్టి; జనవల్లభ!= ఓ రాజా! (ధర్మరాజా!); పుడమిన్= రాజ్యాన్ని; ఏలుము= పాలించుము; ఎలమిన్= ప్రీతితో; జన్నములు= యజ్ఞాలు; నడపు= సాగించుము.

**తాత్పర్యం:** ఈ విధంగా వా రామాటలు విని, తాత్పర్యాన్ని గ్రహించి, గృహస్థాశ్రమంలో నిర్వహించవలసిన ధర్మాలను ఆచరించటానికి ఇండ్లకు తిరిగి వెళ్ళిపోయారు. అది అందరికీ వర్తిస్తుంది. కాబట్టి ఓ రాజా! నీవు రాజ్యాన్ని పాలించుము; ప్రీతితో యజ్ఞాలను నడపించుము.'

**వ. అని చెప్పె; నప్పుడు నకులుం డన్నరనాథున కిట్లనియె. 74**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= అని అర్జునుడు చెప్పాడు; అప్పుడు= ఆ తరువాత; నకులుండు= నకులుడు; ఆ+నరనాథునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పిన తరువాత నకులుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**నకులుఁడు ధర్మజునకు మనస్తాపోపశమంబు సేయుట (సం. 12-12-1)**

**సీ. ' దేవతల్ వేదవిధి ప్రవర్తకులు; బ్రా । హ్మణులును వారలయట్ల శ్రుతుల**
**కింకరులై కాదె కిల్బిషంబులఁ బాసి । వారిచందమున శాశ్వత విభూతి**
**నొందుట; యజ్ఞాదు లుడుగుట సంపరి । త్యాగమే?; పాడిమై నర్థముల ను**
**పార్జించి దేవతా బ్రాహ్మణ పూజగా । నిడుచుఁ దత్ఫలకోటి విడుపుగాక;**

**ఆ. క్రోధశోకహర్ష కోటుల గృహముతో । విడిచి యోగ మూఁది వృక్షమూల**
**వాసనిరతి నుండువాఁడెపో సంపరి । త్యాగి; నృపుల కది సమర్థ మగునె? 75**

**ప్రతిపదార్థం:** దేవతల్= దేవతలు; వేదవిధి ప్రవర్తకులు= వేదాలలో చెప్పబడిన విధులను (నియమాలను) ప్రవర్తింపచేసేవారు; బ్రాహ్మణులును= బ్రాహ్మణులు కూడా; వారల+అట్లు+అ= దేవతలవలెనే; శ్రుతులకింకరులు+ఐ= వేదాలకు దాసులై; కాదె= కాదా; కిల్బిషంబులన్+పాసి= పాపాలనుండి విముక్తులై; వారి చందమునన్= దేవతల విధంగా; శాశ్వత విభూతిన్+ఒందుట= నిత్యమైన మహిమను పొందటం; యజ్ఞ+ఆదులు+ఉడుగుట= యజ్ఞాలు మొదలైనవి వదలిపెట్టటం; సంపరిత్యాగమే?= సన్న్యాసమౌతుందా? (కాదని భావం); పాడిమైన్= న్యాయంగా; అర్థములన్+ఉపార్జించి= సంపదలను గడించి; దేవతా బ్రాహ్మణ పుజగాన్+ఇడుచున్= దేవతలకు, బ్రాహ్మణులకు చేసే అర్చనగా వాటిని అర్పణం చేస్తూ; తత్ఫలకోటి విడుపు కాక= వాటివలన కలిగే అనేక ఫలాలను త్యాగం చేయటమే సంపరిత్యాగం అవుతుంది; క్రోధశోక హర్ష కోటులన్= కోపాల, తాపాల, సంతోషాల సమూహాన్ని; గృహముతోన్= గృహస్థాశ్రమంతోపాటు; విడిచి= పరిత్యజించి; యోగము+ఊఁది= యోగాన్ని ఆశ్రయించి; వృక్షమూలవాస నిరతిన్= చెట్ల మొదళ్ళలో నివసించే ఆసక్తితో; ఉండువాఁడె పో!= ఉండేవాడే సుమా!; సంపరిత్యాగి= నిస్సంగుడు; నృపులకున్= రాజులకు; అది= ఆ నిస్సంగత్వం; సమర్థము= యోగ్యమైనది; అగునె?= అవుతుందా? (కాదని భావం).

**తాత్పర్యం:** వేదవిధిని ప్రవర్తింపచేసేవారు దేవతలు. వారివలె బ్రాహ్మణులుకూడా వేదకింకరులై పాపవిముక్తులై నిత్యమహిమను పొందుతారు. యజ్ఞాదులను మానివేయటం అసంగమౌతుందా? న్యాయంగా సంపదలు గడించి దేవతలకు, బ్రాహ్మణులకు పూజలుగా ఇస్తూ, తత్ఫలాలను విడవటమే నిస్సంగప్రవృత్తి అవుతుంది. క్రోధం, శోకం, హర్షం మొదలైన భావాలతోపాటు గృహస్థాశ్రమాన్ని వదలి యోగాన్ని ఆశ్రయించి వృక్షమూలంలో నివసిస్తూ ఉండేవాడే సంపరిత్యాగి. రాజులకు అది యోగ్యం అవుతుందా? (కాదని భావం).

**క. తక్కిన మూఁ డాశ్రమములు, । నొక్కదెస గృహస్థ ధర్మ మొకదెసఁ దులయం**
**దెక్కింప వానితో న । య్యొక్కటి సరిదూఁగె నందు రుర్వీశ! బుధుల్. 76**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ!= భూపాలా! ధర్మరాజా!; తుల అందున్= త్రాసులో; ఒక్క దెసన్= ఒకవైపున; తక్కిన మూఁడు+ఆశ్రమములు= గృహస్థాశ్రమం కాక మిగిలిన మూ డాశ్రమాలూ (బ్రహ్మచర్య, సన్న్యాస, వానప్రస్థాశ్రమాలు); ఒక దెసన్= మరియొక వైపున; గృహస్థ ధర్మము= గార్హస్థ్యాశ్రమం; ఎక్కింపన్= ఎత్తి ఉంచగా; వానితోన్= ఆ మూడింటితో; ఆ+ఒక్కటి= ఆ గార్హస్థ్యాశ్రమం ఒక్కటి; సరి+తూఁగెన్= సమంగా తూగిందని; బుధులు= పండితులు; అందురు= అంటారు.

**తాత్పర్యం:** ఒక త్రాసులో ఒకవైపు బ్రహ్మచర్య, సన్న్యాస, వానప్రస్థాశ్రమాలను మూడింటిని, మరొకవైపు గృహస్థాశ్రమ ధర్మాన్నీ ఎక్కించగా ఆ మూడింటితో ఇది ఒక్కటి సరితూగిందని పండితులంటారు ధర్మరాజా!

**విశేషం:** మహాభారతం గృహస్థాశ్రమధర్మ ప్రాశస్త్యాన్ని ప్రతిపాదించటానికే పుట్టిందని ఇటువంటి సూక్తుల వలన ధ్వనించబడుతున్నది.

**వ. కావున గృహస్థ ధర్మంబ యాదరణీయం; బట్లుంగాక. 77**

**తాత్పర్యం:** కాబట్టి గృహస్థధర్మం గౌరవించదగింది. అట్లా కాక (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జతనంబున నర్థము సం। చితముగఁ గావించి క్రతువిశేషంబుల దే**
**వతలం దృప్తులఁ జేయమి। యతికిల్బిషకారి యందు రాగమవేదుల్. 78**

**ప్రతిపదార్థం:** జతనంబునన్= ప్రయత్నంతో; అర్థము= ధనాన్ని; సంచితముగన్= కూడబెట్టేదిగా; కావించి= చేసి; క్రతువిశేషంబులన్= యజ్ఞవిశేషాలతో; దేవతలన్= దేవతలను; తృప్తులన్+చేయమి= సంతృప్తులుగా చేయకుండా ఉండటం; అతికిల్బిషకారి= మిక్కిలి పాపహేతువని; ఆగమవేదుల్= వేదవిద్వాంసులు; అందురు= అంటారు.

**తాత్పర్యం:** ప్రయత్నపూర్వకంగా ధనాన్ని కూడబెట్టి విశేషక్రతువులు చేసి దేవతలను తృప్తి చేయకపోతే మిక్కిలి పాపం కలుగుతుందని వేదవిదులు అంటారు.

**చ. వినుము! తమోమయం బయిన విశ్వముఁ దా వెలిఁగించు నీశ్వరుం**
**డన నొకరుండు; వర్ణతతి నాశ్రమకోటిని వాఁడుఁ గాదె చే**
**సె; నిఖిల కర్మయోగ సవిశేషత గల్గుటయుం దదీయ క**
**ల్పనను; తదాజ్ఞకుం దొలఁగఁ బాడియె శోకము గారణంబుగన్. 79**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! వినుము; తమోమయంబు+అయిన= అంధకారంతో నిండినదయిన; విశ్వమున్= జగత్తును; ఈశ్వరుండు+అనన్+ఒకరుండు= ఈశ్వరు డనే పేరు కలిగిన ఒకడు; తాన్+వెలిఁగించున్= తన ప్రకాశంతో వెలుగు నింపుతాడు; వర్ణతతిన్= వర్ణాలను; ఆశ్రమ కోటిని= ఆశ్రమ సమూహాన్ని; వాఁడు+కాదె+చేసెన్= వాడేకదా ఏర్పరిచింది; తదీయ కల్పనను= ఆతడి కల్పనచేతనే; నిఖిల కర్మయోగ సవిశేషత= సమస్త కర్మయోగ విశేషభావం; కల్గుటయున్= ఏర్పడటం కూడా; తద్= అటువంటి ఆ ఈశ్వరుడియొక్క; ఆజ్ఞకున్= శాసనానికి; శోకము+కారణంబుగన్= శోకం కారణంగా; తొలఁగన్= దూరం కావటం; పాడియె?= న్యాయమా? (కాదని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. అంధకార బంధురమైన ఈ విశ్వంలో ఈశ్వరుడనే వాడొకడు వెలుగును ప్రసాదిస్తాడు. అతడే కదా వర్ణ సముదాయాన్నీ, ఆశ్రమకోటినీ ఏర్పరచింది! సమస్త కర్మయోగ విశేషభావం కలగటం ఆయన కల్పనయే. శోకం కారణంగా ఆతడి ఆజ్ఞను మీరటం న్యాయమా? (కాదని భావం).

**వ. హింసాదోషంబు గలుగునను శంకకుం బనిలే; దవధరింపుము. 80**

**తాత్పర్యం:** హింసచేసిన పాపం కలుగుతుందనే అనుమానం పడవలసిన పని లేదు; వినుము.

**క. పరుల వధింపక యెవ్వఁడు। ధర యేలెం జెపుమ పూర్వ ధరణీశులలోఁ?**
**బొరయదు పాపము సుగతిక। యరిగిరి వా; రీవు నట్ల యగు టొప్పు నృపా! 81**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా! (ధర్మరాజా!); పూర్వధరణీ+ఈశులలోన్= మున్నున్న రాజులలో; ఏ+వాఁడు?= ఎవడు?; పరులన్= శత్రువులను; వధింపక= చంపక; ధర= భూమిని; ఏలెన్= పాలించాడో; చెపుమ= తెల్పుము; పాపము= దోషం; పొరయదు= (వారికి) కలుగదు; వారు= ఆ పూర్వ చక్రవర్తులు; సుగతికిన్+అ= ఉత్తమ గతికే (మోక్షానికే); అరిగిరి= వెళ్ళారు; నీవున్= నీవు కూడా; అట్లు+అ= ఆ విధంగానే; అగుట= కావటం; ఒప్పున్= సబబు.

**తాత్పర్యం:** రాజా! పూర్వ చక్రవర్తులలో శత్రువులను చంపకుండా ఎవడు రాజ్యాన్ని పాలించాడో చెప్పుము. వారికి పాపం కలుగలేదే! వారు ఉత్తమగతులనే పొందారు. కాబట్టి నీవు కూడా ఆ విధంగా కావటం సముచితం.

**క.** **రక్ష ప్రజ గోరు నిజయో । గక్షేమార్థముగ; జన సుఖస్థితి నడపన్**
**దక్షుఁ డగు రాజు నడప కు । పేక్షించినఁ బాప మొందదే కురుముఖ్యా!** **82**

**ప్రతిపదార్థం:** కురుముఖ్యా!= కురుశ్రేష్ఠుడవైన ధర్మరాజా!; నిజయోగక్షేమ+అర్థముగన్= తమ యోగక్షేమాల కొరకు; ప్రజ= ప్రజలు; రక్షన్= రక్షణను; కోరున్= కోరుతూ ఉంటారు; జనసుఖస్థితి= ప్రజలు సుఖంగా జీవించే వ్యవస్థను; నడపన్= సాగించటానికి; దక్షుఁడు+అగు= సమర్థుడైన; రాజు= ప్రభువు; నడపక= నిర్వహించక; ఉపేక్షించినన్= నిర్లక్ష్యం చేస్తే; పాపము+ఒందదా?= పాపం కలుగదా?.

**తాత్పర్యం:** తమ యోగక్షేమాల కొరకు ప్రజలు రక్షను కోరుతుంటారు. ప్రజలు సుఖంగా ఉండగలిగే వ్యవస్థను నడపగలిగిన సమర్థుడైన ప్రభువు దానిని నిర్వహించకుండా నిర్లిప్తంగా ఉంటే పాపం పొందదా ధర్మరాజా!

**తే.** **గోవులను ఘోటకంబులఁ గుంజరముల । దాసులను బ్రీతి నిమ్మెల్ల ధాన్యములను**
**గ్రామముల మందిరముల నిష్కముల పెక్కు । నొసఁగు తత్తత్సుపాత్రత్వయుక్త విధుల.** **83**

**ప్రతిపదార్థం:** గోవులను= ఆవులను; ఘోటకంబులన్= గుర్రాలను; కుంజరములన్= ఏనుగులను; దాసులను= సేవకులను; ఎల్లధాన్యములను= అన్ని రకాలైన ధాన్యాలను; గ్రామములన్= ఊళ్ళను (అగ్రహారాదులు); మందిరములన్= గృహాలను; నిష్కములన్= బంగారు నాణెములను; పెక్కు= అధిక సంఖ్యలో; తద్+తద్+సుపాత్రత్వయుక్త విధులన్= దానం చేస్తున్న ఆయా వస్తువులను స్వీకరించదగినవారి ఉత్తమ యోగ్యతలతో కూడుకొన్న నియమాలతో; ప్రీతిన్= సంతోషంగా; ఇమ్ము= దానమిమ్ము.

**తాత్పర్యం:** ఆవులను, గుర్రాలను, ఏనుగులను, సేవకులను, బహుధాన్యాలను, గ్రామాలను, గృహాలను, బంగారు నాణెములను, అవి దానం చేయదగిన అర్హత ఉన్నవారికి విధివిధానంగా నీవు దానం చేయుము.

**వ.** **వీని నన్నింటి రిత్తవో విడిచి పోయెద ననుట నీ యట్టి మహానుభావునకుం దగునే?' యని పలికినం దదనంతరంబ సహదేవుం డమ్మహీపతి కిట్లనియె.** **84**

**ప్రతిపదార్థం:** వీనిన్= పైన చెప్పిన వాటినన్నింటిని; రిత్త+పో+విడిచి= నిష్ప్రయోజనంగా వదలిపెట్టి; పోయెదన్+అనుట= (అడవికి) పోతాననటం; నీ+అట్టి= నీ వంటి; మహా+అనుభావునకున్= ఉత్తముడికి; తగునే?= యోగ్యమౌతుందా?; అని పలికినన్= అని మాట్లాడగా; తదనంతరంబు+అ= ఆ తరువాతనే; సహదేవుండు= సహదేవుడు; ఆ+మహీపతికిన్= ఆ రాజుకు (ధర్మరాజుతో); ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** వీటినన్నింటిని వదలి అడవికి పోతాననటం నీవంటి ఉత్తములకు తగునా?' అని పలుకగా ఆ తరువాత సహదేవుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీముడు, అర్జునుడు, నకులుడు పలికిన మాటలు ఆయా పాత్రల స్వభావానికి అనుగుణంగా ఉండటం గమనించదగిన అంశం. వక్తల మాటల తీరులు వేరైనా వక్తవ్యాంశ తాత్పర్యం ఒక్కటే!

**సీ.** **'వెలి వెలి వస్తువుల్ విడిచెఁబో నరుఁడు గ। ర్మిష్ఠతం గాదె శరీర యాత్ర**
**నడపువాఁ; డది మోక్షణంబు గానేరదు;। శారీర సౌఖ్యసంసక్తి వదలి**
**బాహ్యపదార్థముల్ పాటించి నిజవంశ। ధర్మముల్ వదలక తగఁ జరింపు**
**మమత బంధంబు నిర్మమత మోక్షంబును। జేయు; నింత యెఱింగి చేసి రధిప!**

**తే.** **రాజ్య మెలమి మన్వాదు; లరణ్యమునకు। నరిగి నీ వందు వలయు ద్రవ్యముల మీఁదఁ**
**జేయవలదె మమత్వంబు; వేయు నేల?। యదియు సంసార చక్రవాహకము గాదె? 85**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; నరుఁడు= మానవుడు; వెలివెలి వస్తువుల్= పైపై పదార్థాలు; విడిచెన్+పో= విడిచిపెట్టా డనుకొన్నా; శరీరయాత్ర= జీవితయాత్ర; కర్మిష్ఠతన్+కాదె= కర్మలయందలి నిష్ఠతోనే కదా; నడుపువాఁడు= సాగించేవాడు; అది= ఆ విధం; మోక్షణంబు= మోక్షం (బంధవిముక్తి); కానేరదు= కాజాలదు; శారీర సౌఖ్యసంసక్తి= శరీర సుఖం మీది రక్తి; వదలి= త్యజించి; బాహ్యపదార్థముల్= లౌకిక విషయాలను; పాటిస్తూ= ఆచరిస్తూ; నిజవంశధర్మముల్= తన వంశంలో చేయవలసిన కర్తవ్యాలను; వదలక= వీడక; తగన్= ఒప్పునట్లు; చరింపు= వర్తించుము; మమత= మోహం; బంధంబు= సంసార సంగమును కలిగించేది; నిర్మమత= మోహం లేకపోవటం; మోక్షంబును+చేయున్= మోక్షాన్ని కలిగిస్తుంది; ఇంత= ఈ తాత్పర్యాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; మను+ఆదులు= మనువు మొదలైనవారు; రాజ్యము= పరిపాలనం; ఎలమిన్= ప్రీతితో; చేసిరి= నిర్వహించారు; నీవు= నీవు (ధర్మరాజు); అరణ్యమునకున్= అడవికి; అరిగి= వెడలి; వలయు ద్రవ్యముల మీఁదన్= కావలసిన వస్తువులమీద; మమత్వంబున్= మమకారాన్ని; చేయన్‌వలదె?= చేయవద్దా? (పెంచుకొనవద్దా? అని భావం); వేయున్+ఏల?= పలుమాట లెందుకు?; అదియున్= ఆ విధంగా అరణ్యంలో నివసించటం; సంసార చక్రవాహకము+కాదె?= సంసార చక్రపు (చావు పుట్టుకల వలయానికి) ఇరుసువంటిది కాదా?

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! మానవుడు పైపై విషయాలను ఎన్ని వదలినా కర్మరుడై శరీరయాత్ర సాగిస్తూ ఉంటాడు. అది మోక్షం కాజాలదు. శరీరసుఖ ఆసక్తిని మానుకొని బాహ్య విషయాలను పాటిస్తూ స్వీయవంశానుగుణాలైన ధర్మాలను విడువకుండా తగునట్లు జీవితాన్ని సాగించుము. మమకారం బంధాన్నీ, నిర్మోహం మోక్షాన్నీ కలుగజేస్తాయి. మన్వాదులు దీనిని తెలిపి రాజ్యం చేశారు. నీవు అరణ్యానికి వెడలినా అక్కడ జీవించటానికి కావలసిన ద్రవ్యాలమీద మమత్వాన్ని కలిగి ఉండవలసిందే కదా! వేయిమాట లెందుకు? అదే సంసారచక్రానికి ఆధారం కదా!

**తే.** **నీవ చుట్టంబుఁ బక్కంబు, నీవ చెలియు,। నీవ తల్లియుఁ దండ్రియు, నీవ గురువు,**
**నీవ దైవంబుఁ గావున నా విషాద। భాషణంబులు సైరింపు భరతముఖ్య!. 86**

**ప్రతిపదార్థం:** భరతముఖ్య!= భరతవంశ శ్రేష్ఠుడవైన ధర్మరాజా!; నీవు+అ= నీవే (ధర్మరాజే); చుట్టంబు= బంధువు; పక్కంబు= తోడు; నీవ చెలియున్= నీవే నెచ్చెలివి; నీవ తల్లియున్= నీవే అమ్మవు; తండ్రియున్= జనకుడవు; నీవ గురువు= నీవే ఆచార్యుడవు; నీవ దైవంబు= నీవే వేల్పువు; కావునన్= కాబట్టి; నా విషాద భాషణంబులు= నా కన్నీటి మాటలు; సైరింపు(ము)= మన్నించుము.

**తాత్పర్యం:** ఓ భరతవంశశ్రేష్ఠా! నీవే నా బంధువవు, నీవే నా తోడువు, నీవే నా నెచ్చెలివి, తల్లివి, తండ్రివి, గురువవు, దైవానివి. కాబట్టి నా కన్నీటి మాటలను మన్నించుము.

క. **తథ్యము లైనను దలఁప న । తథ్యము లైనను సభక్తి తాత్పర్యము వై**
**తథ్యంబుఁ బొరయకుండఁగఁ । బథ్యంబుగఁ గొనుము నాదు పలుకులు కరుణన్.'** **87**

**ప్రతిపదార్థం:** నాదు పలుకులు= నా మాటలు; తథ్యములు+ఐనను= సత్యాలైనా; తలఁపన్= ఆలోచించగా; అతథ్యములు+ఐనను= అసత్యాలైనా; సభక్తి తాత్పర్యము= భక్తిభావంతో కూడుకొని ఉన్నవి; వైతథ్యంబున్= అసత్యభావాన్ని; పొరయక+ఉండఁగన్= కలుగకుండగా; కరుణన్= దయతో; కొనుము= స్వీకరించుము (అంగీకరించుము).

**తాత్పర్యం:** నా మాటలు సత్యాలైనా, అసత్యాలైనా భక్తిభావంతో కూడికొని ఉన్నాయి. కాబట్టి వాటికి అసత్యస్వభావం కలుగకుండా దయతో అంగీకరించుము'.

**విశేషం:** సహదేవుడు భక్తితో ధర్మజుడిని అనునయించే యత్నం చేశాడు. చివరి రెండు పద్యాలు శరణాగతభావాన్ని వెలువరిస్తున్నట్లున్నాయి. భక్తుల కోర్కెలను మన్నించే దైవం వాటిలోని సత్యాసత్యాలను పరిగణించడని పలికి సహదేవుడు వేస్తున్న ముందుకాళ్ళకు బంధాలు ఈ మాటలు. ధర్మజుడిపై ఆతడికి గల భక్తి, అనురక్తి ఇందులోని వ్యంగ్యం.

వ. **అనియె; నిట్లు దమ్ము లందఱును బోధించు పలుకులు విని ధర్మనందనుం డూరక యుండె; నతనియెడ సవిశేష బహుమానయు, నతనిచేత సంతతోపలాలితయు, ధర్మాధర్మ నిదర్శన శీలయు నగు పాంచాలి భద్రగజప్రతిమానులైన యప్పవమానతనయ ధనంజయ నకుల సహదేవుల మధ్యంబున యూథపతివోలె నున్న యన్నరేంద్రు నల్లన చేరి, 'యేనును నా యెఱింగినంత సెప్పెద' నని యనుజ్ఞఁ గొని యవ్విభు వదనంబున నిజ విశాలలోచన రోచులు పరఁగ వినయం బాననంబున నతిశయిల్ల నిట్లనియె.** **88**

**ప్రతిపదార్థం:** అనియెన్= సహదేవు డట్లా పలికాడు; ఇట్లు= ఈ విధంగా, క్రమంగా; తమ్ములు+అందఱును బోధించు పలుకులు విని= తమ్ములందరు ప్రబోధిస్తూ చెప్పిన మాటలు విని; ధర్మనందనుండు+ఊరక+ఉండెన్= ధర్మరాజు మిన్నక ఉన్నాడు; అతని యెడన్= ధర్మరాజుపట్ల; సవిశేషబహుమానయున్= అతిశయించిన గౌరవమర్యాదలు కలది; అతనిచేతన్= ధర్మరాజుచేత; సంతత+ఉపలాలితయున్= ఎల్లప్పుడూ బుజ్జగించబడుతూ ఉండేది; ధర్మ+అధర్మ నిదర్శన శీలయును+అగు= ధర్మాన్నీ అధర్మాన్నీ నిరూపించగల స్వభావం కలది అయిన; పాంచాలి= ద్రౌపది; భద్రగజప్రతిమానులు+ఐన= శ్రేష్ఠమైన ఏనుగులతో సమానులైన; ఆ+పవమాన తనయ ధనంజయ నకుల సహదేవుల మధ్యంబునన్= ఆ భీమార్జున నకుల సహదేవుల నడుమ; యూథపతివోలెన్+ఉన్న= గజరాజువలె ఉన్న; ఆ+నరేంద్రున్= ఆ రాజును; అల్లన చేరి= మెల్లగా సమీపించి; ఏనును= నేను కూడా; నా+ఎఱింగినంత= నా తెలిసినంత; చెప్పెదన్= చెప్పుతాను; అని= అని; అనుజ్ఞన్+కొని= అనుమతిని తీసికొని; ఆ+విభువదనంబునన్= ధర్మజుడి ముఖమునందు; నిజవిశాల లోచన రోచులు= తన విశాలమైన కనుచూపుల కాంతులు; పరఁగన్= వ్యాపించగా; వినయంబు= అణకువ; ఆననంబునన్= ముఖంలో; అతిశయిల్లన్= వికసించగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ విధంగా తమ్ములందరూ బోధించిన మాటలు విని ధర్మరాజు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ధర్మరాజుపట్ల అధికమైన గౌరవమర్యాదలు కలదీ, అతడిచేత ఎల్లప్పుడూ లాలించబడుతూ ఉండేదీ, ధర్మాధర్మాలను నిరూపించే స్వభావం కలదీ అయిన ద్రౌపది భద్రగజాలతో సమానులైన ఆ భీమార్జున నకుల సహదేవుల నడుమ గజయూథపతివోలె నున్న ధర్మరాజును మెల్లగా సమీపించి 'నేను కూడా నా తెలిసినంత చెప్పుతాను' అని అనుమతి తీసికొని ధర్మజుడి ముఖంపై తన విశాలనేత్రాల చూపుల వెలుగులు వ్యాపింపచేసి వినయం ముఖాన వికసించగా ఇట్లా అన్నది.

**విశేషం:** అలం: ఉపమ. భీమాదులు పలికినప్పటికంటె ద్రౌపది పలికేటప్పుడు అభినయాన్ని విశేషంగా వర్ణించటం తిక్కనగారి పాత్రోచిత నాటకీయ ఫణితి.

**ద్రౌపది ధర్మజునకు హితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట (సం. 12-14-1)**

**సీ. ' శోకాగ్ని దనికిన సొగయు నీ తమ్ముల । నుపపన్న వాక్యామృతోపయుక్తిఁ**
**దేర్పుము; గానలం ద్రిమ్మరునాఁడు వీ । రాయాసములఁ బడు టవధరించి**
**సమయ కాలము సన్నఁ జని సుయోధనుఁ జంపి । భోగంబులను బహుత్యాగములను**
**యాగంబులను సద్విహారముల్ సలుపుద । మని యూరడింపవే; యరిగణంబుఁ**

**తే. ద్రుంచి రాజ్యంబు సేకొంటి; తొఱఁగి పోదు । గాక యని యిప్డు దుడికింప నీకుఁ దగునె?**
**ధర్మమును సత్యమును నుచితంబు నిన్నుఁ । గడవ నెఱిఁగెడువారలు గలరె యధిప!' 89**

**ప్రతిపదార్థం:** అధిప!= ప్రభూ! (ధర్మరాజా!); శోక+అగ్ని= శోకమనే అగ్ని; తనికినన్= సమీపించగా, తాకగా; సొగయు= చొక్కు; నీ తమ్ములన్= నీ సోదరులైన భీమాదులను; ఉపపన్న వాక్య+అమృత+ఉపయుక్తిన్= ఉపపత్తులు కలిగిన వాక్యాలనే అమృతమును ఉపయోగించటం వలన; తేర్పుము= తేటపడేటట్లు చేయుము, తేరుకొనేటట్లు చేయుము; కానలన్= అరణ్యాలలో; త్రిమ్మరునాఁడు= తిరుగాడే సమయంలో; వీరు= భీమాదులు; ఆయాసములన్= కష్టాలను; పడుట= పొందటం; అవధరించి= గమనించి; సమయకాలము= నియమసమయం; చన్నన్= కడచిపోగా; చని= (దండెత్తి)పోయి; సుయోధనున్+చంపి= దుర్యోధనుడిని చంపి; భోగంబులను= సంపదలను అనుభవించుటలను; బహుత్యాగములను= పలురకాల త్యాగాలను; యాగంబులను= యజ్ఞాలను; సత్+విహారముల్= ఉచితములైన విలాస క్రీడలతో వేడుకగా తిరుగుటలు; సలుపుదుము+అని= చేద్దామని; ఊరడింపవే?= బుజ్జగించలేదా?; అరిగణంబున్= శత్రు సమూహాన్ని; త్రుంచి= చంపి; రాజ్యంబు= ప్రభుత్వాన్ని; చేకొంటి(వి)= చేపట్టావు; తొఱఁగిపోదున్+కాక!= దానిని వదలిపోతాను సుమా!; అని= అని; ఇప్పుడు= ఈ సమయంలో; ఉడికింపన్= తపింపచేయటం, ఎదుటివారికి ఉలుకు పుట్టించటం; నీకున్= నీకు (ధర్మరాజుకు); తగునె?= ఉచితమా? (కాదని భావం); ధర్మమును= ధర్మాన్నీ; సత్యమును= సత్యాన్నీ; ఉచితంబు= ఔచిత్యాన్నీ గురించి; నిన్నున్+కడవన్= నిన్ను మించేటట్లుగా; ఎఱిఁగెడువారలు= తెలిసినవారు; కలరె?= కలరా?(లేరని భావం).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! శోకాగ్ని సోకటంవలన బాధపడుతున్న నీ తమ్ములను సోపపత్తికాలైన అనునయ వాక్యాలనే అమృత సేచనంతో ఓదార్చుము. అరణ్యావాసంలో వీరు అనేక కష్టాలను అనుభవించటాన్ని తెలిసికొని, నియమసమయం ముగిసిపోగా దుర్యోధనుడిని చంపి, భోగాలను, అనేక త్యాగాలను, యజ్ఞాలను, వినోదవిహారాలను చేద్దామని వీరిని ఊరడించలేదా!. శత్రువులను సంహరించి రాజ్యాన్ని స్వీకరించావు, ఇప్పుడు 'రాజ్యాన్ని త్యజించి పోతాను సుమా!' అని వీరిని తపింపచేయటం న్యాయమా? ధర్మమును గురించి, సత్యాన్ని గురించి, ఔచిత్యాన్ని గురించి నిన్ను మించి తెలిసినవా రున్నారా?' (లేరని భావం).

**విశేషం:** భీమాదులు ఉపక్రమించే పద్ధతిలోనూ, ద్రౌపది మొదలు పెట్టే విధంలోనూ కొట్టవచ్చిన మార్పు గమనించతగింది. ఆమె 'ధర్మాధర్మ నిదర్శన శీల' అని నిరూపితమయ్యేటట్లు మాటలనేర్పు కూర్పబడింది.

**వ. అని ముట్టనాడి, మఱియును. 90**

**తాత్పర్యం:** అని మర్మం తాకేటట్లుగా (గుండెకు గుచ్చుకొనేటట్లు) మాట్లాడి, (ఇంకా ఇట్లా అన్నది).

**క. ' పేదమన సగుట ధర్మువు। గాదు నరేంద్రునకు; జగము గావం బ్రోవం**
**గాదె నృపు లోకపాలాం। శోదితుcగాc జేసెc బద్మయోని చతురతన్. 91**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రునకున్= రాజునకు; పేదమనసు+అగుట= బేల అయిన మనసు కలవాడు కావటం; ధర్మువు+కాదు= సహజధర్మం కాదు; పద్మయోని= బ్రహ్మ; చతురతన్= నేర్పుతో; నృపున్= క్షత్రియుడిని, రాజును; జగమున్= లోకమును; కావన్= రక్షించటానికి; ప్రోవన్= పోషించటానికికాదా?; లోకపాల+అంశ+ఉదితున్+కాన్= దిక్పాలకుల అంశతో పుట్టినవాడయ్యేటట్లుగా; చేసెన్= సృష్టించాడు.

**తాత్పర్యం:** రాజు ధైర్యస్థైర్య గుణాలను కోల్పోయిన బేల అయిన మనసు కలవాడుగా ఉండటం ధర్మం కాదు. బ్రహ్మ నైపుణ్యంతో రాజును లోకాన్ని రక్షించటానికీ, పోషించటానికీ కదా దిక్పాలకాంశంతో సృష్టించాడు!

**క. నరరూపంబునc బరcగెడు। పరదేవత గాక నృపుcడు బాలుc డయిన న**
**ప్పురుషు నెడ నేమి పొమ్మని। తిరిగిన దుర్మతులc బొందదే కీ డధిపా! 92**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; నృపుcడు= రాజు; నరరూపంబునన్= మానవాకారంతో; పరcగెడు= విహరించే; పరదేవత= శ్రేష్ఠమైన దైవం; కాక= కాకుండా; బాలుcడు= పసివాడు (అప్రౌఢుడని భావం); అయినన్= అయితే; ఆ+పురుషుని+ఎడన్= ఆతడిపట్ల; ఏమి+పొమ్ము+అని= ఏమి లాభమని (జాతీయం) నిర్లక్ష్య భావంతో; తిరిగిన= చరించే, వర్తించే; దుర్మతులన్= దుర్మార్గులవలన; కీడు= ఆపద; పొందదే?= కలుగదా? (కలుగుతుంది అని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! ప్రభువు మానవాకారంతో నడయాడే పరదైవంవలె కాకుండా బాలుడివలె అప్రౌఢుడైతే ఆతడిపట్ల నిర్లక్ష్యాన్ని ప్రదర్శించే దుర్మార్గులవలన కీడు తప్పక వాటిల్లుతుంది.

**ఉ. నేరక చేర నొక్కనిన నీఱుగc జేయుc గృశానుc డిద్ధ ధా**
**త్రీరమణాగ్ని గాల్చు నతితీవ్రత వంశము నెల్ల; నిట్లుగాc**
**గౌరవకోటి దర్పమునc గానక నిన్నుc బరాభవించి దు**
**ర్వారభవత్ప్రకోపశిఖిc గ్రాcగె; మదిన్ వగ పేల దీనికిన్. 93**

**ప్రతిపదార్థం:** కృశానుcడు= అగ్ని; నేరక= తెలియక; చేరన్= సమీపించగా; ఒక్కనిన= ఒకడిని మాత్రమే; నీఱుగన్= బూదిగా; చేయున్= చేస్తాడు; ఇద్ధ= ప్రకాశితమైన; ధాత్రీరమణ+అగ్ని= రాజు అనెడి అగ్ని; అతి తీవ్రతన్= అత్యంతమైన వేడిమితో (పరాక్రమంతో); వంశమును+ఎల్లన్= కులాన్నంతా - వెదురు; కాల్చున్= కాల్చివేస్తుంది; ఇట్లుకాన్= ఈ విధంగానే; కౌరవకోటి= కౌరవసమూహం; దర్పమునన్= గర్వంచేత; కానక= వెనుక ముం దాలోచించక; నిన్నున్= నిన్ను (ధర్మరాజును); పరాభవించి= అవమానించి; దుర్వార= ఆపుటకు వీలుకాని; భవత్+ప్రకోప శిఖిన్= నీ యొక్క క్రోధమనే అగ్నిలో; క్రాcగెన్= తగులబడింది; దీనికిన్= ఈ జరిగిన దానికి; మదిన్= హృదయంలో; వగపు= దుఃఖం; ఏల?= ఎందుకు?.

**తాత్పర్యం:** లోకంలో అగ్ని దగ్గరకు ఎవరైనా తెలియక సమీపిస్తే అతడి నొక్కడినే అది బూది చేసివేస్తుంది. కాని, ప్రకాశవంతుడైన రాజనే అగ్ని అతితీవ్రతతో వంశాన్నే (వెదురు) కాల్చివేస్తుంది. అందువలననే ని న్నా కౌరవులు గర్వాతిశయంతో కన్నుమిన్నుగానక అట్లా అవమానించి నీ తిరుగులేని కోపాగ్నిలో దగ్ధమై పోయారు. ఈ జరిగిన దానికి నీ మనస్సులో దుఃఖ మెందుకు?

**విశేషం:** ఇందులో రూపకానుప్రాణితోపమాలంకారం సార్థకంగా వాడబడింది. 'వంశ' శబ్దంలో శ్లేషాలంకారం. వంశము= (నానా) కులము, వెదురు.

**సీ.** **నృపునందు విధి దండనీతి ప్రతిష్ఠించెఁ । గావున నపరాధగతి యెఱింగి**
**దండించు నృపతికి రెండు లోకంబులుఁ । జేకుఱుఁ; దోషంబు సేయ నుదుట**
**నచ్చొత్తి వెడలంగ నడుచు విప్రుని నైన । భూవరుం; డిది మెచ్చు దేవకోటి;**
**సభ నేకవస్త్ర రజస్వల యనక నన్ । దలపట్టి యీడ్చిన తప్పుఁ; దనదు**

**తే.** **తొడలు సూపిన తప్పును, దుష్ట కష్ట । తర వచనములఁ బఱిచిన తప్పు, ననుజు**
**నందు దుర్యోధనునియందు ననుఁగు నందుఁ । గాంచి దండించి; తిట్టిది కల్మషంబె?** **94**

**ప్రతిపదార్థం:** నృపునందున్= రాజునందు; విధి= బ్రహ్మ; దండనీతి= దుష్టులను శిక్షించే పద్ధతి; ప్రతిష్ఠించెన్= స్థాపన చేశాడు; కావునన్= కాబట్టి; అపరాధగతి= చేసిన నేరము యొక్క విధమును; ఎఱింగి= తెలిసికొని; దండించు= శిక్షించే; నృపతికిన్= రాజుకు; రెండు లోకంబులున్= ఇహపరలోకాలు; చేకుఱున్= సిద్ధిస్తాయి; భూవరుండు= రాజు; దోషంబు+చేయన్= పాపంచేస్తే; విప్రునిన్+ఐనన్= బ్రాహ్మణుడిని సైతం; నుదుటన్+అచ్చొత్తి= (జాతీయం) ముఖాన ముద్రవేసి, (దొంగలకు వేసే ఒక శిక్ష); వెడలంగన్ అడుచున్= బహిష్కరిస్తాడు; అది= ఆ పనిని; దేవకోటి= దేవతల సమూహం; మెచ్చున్= కీర్తిస్తుంది; సభన్= (ఆనాటి కపట ద్యూత) సభలో; ఏకవస్త్ర= ఒకచీర తాల్చిన; రజస్వల= ఋతుమతి; అనక+నన్= అనిభావించక నన్ను (ద్రౌపదిని); తల+పట్టి= జుట్టుపట్టుకొని; ఈడ్చిన తప్పున్= లాగిన దోషాన్ని; తనదు తొడలు+చూపిన తప్పునున్= (ద్రౌపదిని కూర్చుండుమని సైగ చేస్తూ) తొడను చూపించిన దోషాన్ని; దుష్టకష్టతర వచనములన్= దుర్మార్గాలు, అమితమైన బాధను కలిగించేవి అయిన మాటలతో; పఱిచిన తప్పున్= పాటుపడజేసిన దోషాన్ని; అనుజునందున్= తమ్మునందును (దుర్యోధనుడి తమ్ముడైన దుశ్శాసనుడి అందు); దుర్యోధనుని అందున్= సుయోధను నందును; అనుఁగునందున్= దుర్యోధనుడికి ప్రీతిపాత్రుడైన కర్ణుడియందు; కాంచి= చూచి; దండించితి(వి)= శిక్షించావు; ఇట్టిది= ఇటువంటిది; కిల్బిషంబె?= పాపమా? (కాదని భావం).

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు రాజునందు దండనీతిని ప్రతిష్ఠించాడు. కాబట్టి అతడు అపరాధం చేసినవారి పద్ధతుల ననుసరించి అనువుగా దండిస్తే ఇహపరాలూ సిద్ధిస్తాయి. తప్పు చేస్తే బ్రాహ్మణుడిని సైతం ముఖంమీద ముద్రకొట్టి దేశంనుండి వెడలగొట్టుతాడు. దీనిని దేవతలు మెచ్చుతారు. ఆనాడు ఆ సభలో ఒంటి చీర తాల్చినదానిని, రజస్వలను అయిన నన్ను జుట్టుపట్టి ఈడ్చిన తప్పు, తన తొడలు చూపిన తప్పు. దుష్టములైన, అత్యంత కష్టములైన మాటలాడి పాటుబడజేసిన తప్పు గణించి వరుసగా తమ్ముడైన దుశ్శాసనుడిని, దుర్యోధనుడిని, అతడి ప్రియమిత్రుడైన కర్ణుడిని దండించావు; ఇది పాప మెట్లా అవుతుంది?

**క.** **గరదుని, గృహదాహకు, మం । త్రరహస్య విభేది, వధవిధాయిఁ, బరసతీ**
**హరు, బంధుఘాతిఁ, బరధన । హరణ పరునిఁ, జంపి పుణ్యుఁ డగు నృపుఁ డనఘా!** **95**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవైన పుణ్యాత్ముడా! (ధర్మరాజా!); గరదునిన్= విషం పెట్టేవాడిని; గృహదాహకున్= ఇల్లు తగులబెట్టేవాడిని; మంత్రరహస్య విభేదిన్= రాజకీయ తంత్రమర్మాలను బయటపెట్టేవాడిని; వధ విధాయిన్= వధను విధించేవాడిని; పరసతీహరున్= ఇతరుల భార్యలను దొంగిలించేవాడిని; బంధుఘాతిన్= బందుగులను చంపేవాడిని; పరధనహరణపరునిన్= ఇతరుల ధనాన్ని దొంగిలించటంలో ఆసక్తి కలవాడిని; చంపి= ప్రాణాలు తీసి; నృపుఁడు= రాజు; పుణ్యుఁడు= పుణ్యుడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** విషం పెట్టేవాడినీ, ఇల్లు తగులబెట్టేవాడినీ, రాజకీయ తంత్ర రహస్యాలను బయటపెట్టేవాడినీ, వధను విధించే వాడినీ, పరసతులను హరించే వాడినీ, బంధువులను చంపేవాడినీ, ఇతరుల సంపదలు దొంగిలించేవాడినీ చంపి రాజు పుణ్యుడౌతాడు ధర్మజా!

**విశేషం:** ఈ విశేషణాలన్నీ దుర్యోధనుడికి వర్తించటం గమనించదగిన అంశం.

**క. దండార్హులైన వారల । దండింపకయున్నఁ జువ్వె ధాత్రీవిభు నా**
**ఖండల సన్నిభు నైనఁ బ్ర । చండపుఁ గిల్బిషము వొందు జగతీనాథా! 96**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= భూనాథా! ధర్మజా!; దండ+అర్హులు+ఐన వారలన్= దండింప (శిక్షింప) దగినవారిని; దండింపక+ఉన్నన్= శిక్షించకుండా ఉంటే; ఆఖండల సన్నిభున్+ఐనన్= ఇంద్రుడితో సమానమైనవాడైనా; ధాత్రీవిభున్= రాజును; ప్రచండము+కిల్బిషము= మహాపాపం; పొందున్= కలుగుతుంది; చువ్వె!= సుమా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! శిక్షించదగిన వారిని శిక్షించక ఉంటే ఇంద్రతుల్యుడైన ప్రభువునకు సైతం మహాపాపం కలుగుతుంది సుమా!

**క. పేదలకును సాధులకును । వేదములకుఁ దాపసులకు వేయేల సమ**
**స్తాదిత్యులకును దండమ । కాదె బ్రదుకుఁ జేయు రాజు గావింపంగన్. 97**

**ప్రతిపదార్థం:** రాజు= ప్రభువు; కావింపంగన్= వర్తింపజేయగా; దండము+అ= దుష్టులను శిక్షించటమే; పేదలకును= బీదవారికీ; సాధులకును= మంచివారికీ; వేదములకున్= వేదాలకూ; వేయి+ఏల= పలుమాట లెందుకు?; సమస్త+ఆదిత్యులకున్= వేల్పులందరికీ; బ్రతుకున్+చేయున్+కాదె!= సుఖంగా జీవించేటట్లు చేస్తుంది కదా! (రక్షణ కల్పిస్తుంది కదా అని భావం).

**తాత్పర్యం:** రాజు ప్రవర్తింపజేసే దండం పేదలకూ, మంచివారికీ, వేదాలకూ, ఇన్ని మాట లెందుకు? దేవత లందరికి కూడా సుఖజీవనాన్ని కలిగించే రక్షగా రూపొందుతుంది కదా!

**వ. కావున. 98**

**తాత్పర్యం:** కాబట్టి.

**ఆ. ఉచిత దండవృత్తి నుర్వీ ప్రజాభి ర । క్షణము నోపి చేఁత గాక రాజ**
**వంశజునకు ధర్మువా? భూసురార్హంబు । లైన శమదమాదు లాత్మ నిడుట.' 99**

**ప్రతిపదార్థం:** ఉచిత దండవృత్తిన్= యోగ్యమైన దండ ప్రవృత్తితో; ఉర్వీ ప్రజా+అభిరక్షణమును= భూ ప్రజలను రక్షించటం; ఓపి= సామర్థ్యంతో; చేఁతగాక= చేయుటకాక; రాజవంశజునకున్= రాజవంశంలో పుట్టిన వాడికి; భూసుర+అర్హంబులు+ఐన= బ్రాహ్మణులకు యోగ్యాలైన; శమదమ+ఆదులు= అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహాదులను; ఆత్మన్+ఇడుట= మనస్సులో ఉంచుకొనటం; ధర్మువా?= ధర్మమా? (కాదని భావం).

**తాత్పర్యం:** పాపాత్ములను సముచితంగా శిక్షించే ప్రవృత్తి కలిగి, భూప్రజలను రక్షించే బాధ్యతను సామర్థ్యంతో చేయటంకాక రాజవంశజులు బ్రాహ్మణు లనుసరించే అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహాదులను మనసునందు పోషించటం ధర్మమా?' (ధర్మం కాదని భావం).

**వ. అని యంత నిలువక చనవు మెఱసి మేలంపుఁ జందంబున. 100**

**ప్రతిదార్థం:** అని= అని మాట్లాడి; అంతన్+నిలువక= అంతటితో ఆగక; చనవు మెఱసి= అనురాగం ఒలుకబోసి (ఎంతో సన్నిహిత భావం వెలుగొందేటట్లు మెలగి); మేలపుఁ జందంబునన్= (మేలము+చందంబునన్)= పరిహాసమాడుతున్నట్లు.

**తాత్పర్యం:** ఈ మాటలు పలికి, అంతటితో ఆగకుండా, బాగా చనవు తీసికొని పరిహాసమాడుతున్నట్లు (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. ' వైదిక ధర్మచారి జనవత్సల! నీ మదిఁ బట్టుకొన్న యు**
**న్మాదము హీనమానవు మనంబునఁ బుట్టిన వెఱ్ఱివోలె న**
**స్యాదులఁ దీర్చు టొప్పదు; నిజానుజ వర్గము మీఁదఁ గల్గిన**
**త్యాదర సాంద్రసార కరుణామృత మానఁగ నిమ్ము నెమ్మదిన్.' 101**

**ప్రతిపదార్థం:** వైదిక ధర్మచారి జనకవత్సల!= వైదిక ధర్మాలను ఆచరించే ప్రజలయందు దయాభావం కలవాడా! ధర్మరాజా!; నీ మదిన్= నీ మనస్సు; పట్టుకొన్న= ఆవహించిన; ఉత్+మాదము= పిచ్చి; హీనమానవు మనంబునన్= నీచుడైన మనిషియొక్క మనస్సులో; పుట్టిన= కలిగిన; వెఱ్ఱి పోలెన్= పిచ్చివలె; నస్యాదులన్= నస్యము మొదలైన వాటితో(పొడుములు పీల్చటం వలన); తీర్చుట= పోగొట్టటం, తీర్చటం; ఒప్పదు= తగదు; నెఱ+మదిన్= నిండు మనస్సుతో; నిజ+అనుజవర్గము మీఁదన్= నీ సోదర బృందం మీద; కల్గు+అతి+ఆదర= కలిగి ఉండే మిక్కిలి మర్యాద వలన; సాంద్ర= దట్టమైన; సార, కరుణా+అమృతము= చిక్కని దయ అనెడి అమృతం; ఆనఁగన్+ఇమ్ము= ఆస్వాదించేటట్లు చేయుము.

**తాత్పర్యం:** ' వైదికధర్మాలను ఆచరించే జనులపై ప్రేమకల ధర్మరాజా! నీ మనస్సున ఆవహించిన పిచ్చి సామాన్య మానవుడి మనస్సులో కలిగిన పిచ్చివలె పొడుములు పీల్చటం మొదలైన వాటివలన పోగొట్టటం సాధ్యంకాదు. నీ నిండు మనస్సును (మనసారా) నీ తమ్ముళ్ళపై ఉన్న అధికమైన చిక్కని దయ అనే అమృతాన్ని త్రాగనిమ్ము'. (నీకు కలిగిన పిచ్చికి మందు సోదరప్రేమే అని భావం).

**విశేషం:** అలం: ఉపమ. నస్యాదుల్ని పీల్పించి వెర్రిని కుదర్చటం లోక విదితమే!

**వ. అని పలికి యిట్లనియె. 102**

**తాత్పర్యం:** అని చెప్పి, (ద్రౌపది) మరల ఇట్లా అన్నది.

**క. ' నాయట్లు పడిన యంగన। లేయెడలం గలరె? యిట్టి యేనును ధర్మా**
**పాయము నీకగు, నను వెఱఁ। బాయన గృహధర్మవృత్తిఁ బౌరవముఖ్యా!' 103**

**ప్రతిపదార్థం:** పౌరవ ముఖ్యా!= పురువంశంలో పుట్టిన వారిలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; నా+అట్లు= నా వలె; పడిన= అగచాట్లు పడ్డ; అంగనలు= స్త్రీలు; ఏ+ఎడలన్= ఎక్కడకూడా; కలరు+ఎ?= ఉన్నారా? (లేరని భావం); ఇట్టి= ఇటువంటి; ఏనును= నేను కూడా; నీకున్= నీకు (ధర్మరాజుకు); ధర్మ+అపాయము= ధర్మహాని; అగున్= ఔతుంది; అను= అనే; వెఱన్= భయంతో; గృహధర్మ వృత్తిన్= కుటుంబ ధర్మాన్ని నిర్వహించే స్వభావాన్ని; పాయను+అ= వదలిపెట్టను.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నా వలె కష్టాలు పడిన వనితలు ఎక్కడైనా ఉన్నారా? ఇటువంటి నేను నీ కెక్కడ ధర్మలోపం కలుగుతుందో అనే భయంతో గృహస్థ ధర్మపద్ధతిని వీడకుండా ఉన్నాను'.

**వ. అని వెండియు. 104**

**తాత్పర్యం:** అని మరల (ఇట్లా అన్నది).

**క. ' కౌరవులు దమదురితమునఁ । దా రెరిసిరి; కల్మషంబు దానఁ గలదె? భూ**
**భారము వహింపు, బహుయ । జ్ఞారంభణ మాచరింపు మఖిలహితముగన్. 105**

**ప్రతిపదార్థం:** కౌరవులు= దుర్యోధనాదులు; తమ, దురితమునన్= తాము చేసికొన్న పాపంవలన; తారు= తాము; ఎరిసిరి= నశించారు; దానన్= దానివలన (వారి కర్మంవలన వారు చనిపోయినందు వలన); కల్మషంబు= పాపం; కలదె?= (నీకు) కలుగుతుందా? (కలుగదని భావం); భూభారము= రాజ్యభారాన్ని (పరిపాలన బాధ్యతలను; వహింపు(ము)= పూనుము; అఖిల, హితముగన్= అందరికీ మేలు జరిగేటట్లుగా (లోక కల్యాణం కొరకు); యజ్ఞ+ఆరంభణము= యజ్ఞాలు మొదలు పెట్టి; ఆచరింపుము= చేయుము.

**తాత్పర్యం:** కౌరవులు తమ పాపం పండి తాము నశించారు. వారి చావునకు వారే కారకులైనప్పుడు నీకు పాపం ఎట్లా కలుగుతుంది? కాబట్టి విచారం మాని, రాజ్యపరిపాలనాన్ని చేపట్టుము; సర్వలోక కల్యాణం కలిగేటట్లు అనేక యజ్ఞాలను ఆరంభించి నిర్వహించుము.

**క. సురగురుఁడును శుక్రుండును । బరిపాటిగ దండనీతిఁ బలికిరి దానం**
**బరిణతుఁడవు; నీ వనుజులు । పరికరముగ నడపు ధర్మభాసుర! దానిన్.' 106**

**ప్రతిపదార్థం:** ధర్మభాసుర!= ధర్మాచరణంచేత ప్రకాశించేవాడా! ధర్మరాజా!; సురగురుఁడును= దేవతలకు గురువైన బృహస్పతీ; శుక్రుండును - (రాక్షస గురువైన) శుక్రాచార్యుడూ; దండనీతిన్= యుద్ధంలో పాటించవలసిన రాజనీతిని గురించి; పరిపాటిగన్= క్రమంగా; పలికిరి= చెప్పి ఉన్నారు; దానన్= ఆ రాజనీతిలో; పరిణతుఁడవు= పండితుడవు (మంచి అనుభవమున్నవాడవు); దానిన్= ఆ రాజనీతిని; నీవు= (ధర్మరాజా!); అనుజులు= తమ్ములు (భీమాదులు); పరికరముగన్= సాధనంగా, ఉపకరణంగా; నడపు(ము)= సాగించుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! బృహస్పతీ, శుక్రాచార్యుడూ యుద్ధనీతిని ప్రచురంగా తెలియచెప్పారు. ఆ నీతిలో నీవు మంచి అనుభవజ్ఞుడవు. దానిని నీ తమ్ములను ఉపకరణాలుగా చేసికొని ఆచరణలో పెట్టుము'.

**వ. అనినం బాంచాలితో మఱుమాట లాడక యూరకయున్న యన్నరేంద్రునకు నింద్రనందనుం డిట్లనియె. 107**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పాంచాలితోన్= ద్రౌపదితో; మఱు మాటలు+ఆడక= సమాధానపు మాటలు పలుకకుండా; ఊరక+ఉన్న= మిన్నకున్న; ఆ+నర+ఇంద్రునకున్= ఆ రాజుకు - ధర్మరాజుతో; ఇంద్రతనయుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పాంచాలి అనగా, ఆమెతో మారుపలుక కుండా ధర్మరాజు మిన్నకున్నాడు. అప్పుడు ఆయనతో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**సీ. ' దక్షుఁడై భూపతి దండనీతి నయింప । కున్న సన్న్యాసులు నుత్పథ ప్ర**
**వర్తను లగుదురు; వావిరి నన్యోన్య । ధనధాన్య పశుభూమి దారహరణ**
**మాచరింతురు జను; లప్పాప మవ్విభు । నొందు; దండము హింసయుఁగఁ దలంప**
**వలదు; దుర్వృత్తుల వధియించు రుద్రుని । గోవిందు వాసవు గుహునిఁ జూడు;**

**తే. మా మహాత్ములు దక్కు నున్మార్గ చరుల । దండితులఁ జేఁత వినమె! యధర్మ మడంగు;**
**ధర్మ మెసఁగు దండమున నర్థంబుఁ గామ । ముని నదూష్యంబులై సిద్ధిఁ బొందు నధిప! 108**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! (ధర్మరాజా!); భూపతి= రాజ్యాన్ని పాలించే రాజు; దక్షుఁడు+ఐ= సమర్థుడై; దండనీతి= యుద్ధనీతిని; నయింపక+ఉన్నన్= ఆచరించకపోతే (నడిపించకపోతే); సత్+న్యాసులున్= సన్న్యాసాశ్రమం తీసికొన్న వారుకూడా; ఉత్+పథ, ప్రవర్తనులు= గర్వమార్గంలో నడిచేవారు; అగుదురు= ఔతారు; జనులు= ప్రజలు; వావిరిన్= అధికంగా; అన్యోన్య, ధన, ధాన్య, పశు, భూమి, దార హరణము= ఒకరి ధనాన్ని, పంటలను, పశువులను, భూమిని, భార్యను మరొకరు దొంగిలించటం; ఆచరింతురు= చేస్తారు; ఆ+పాపము= ఆ విధంగా ప్రజలుచేసే పాపం; ఆ+విభున్= ఆ రాజును; ఒందున్= పొందుతుంది; దండము= యుద్ధం చేయటం - దండోపాయం; హింసయుఁగన్= హింసగా; తలంపన్‌వలదు= భావించవద్దు; దుః+వృత్తులన్= దుర్మార్గులను; వధియించు= చంపే; రుద్రునిన్= రుద్రుడిని; గోవిందున్= విష్ణువును; వాసవున్= ఇంద్రుడిని; గుహునిన్= కుమార స్వామిని; చూడుము= కనుగొనుము; ఆ+మహాత్ములు= ఆ గొప్పవారు; తక్కున్= మిగిలిన; ఉత్+మార్గచరులన్= చెడునడవడికతో మెలగే వారిని; దండితులన్+చేఁత= శిక్షింపబడిన వారినిగా చేయటం; వినము+ఎ?= విని ఉండలేదా?; దండమునన్= దండంచేత; అధర్మము= అన్యాయం; అడఁగున్= నశించిపోతుంది; ధర్మము+ఎసఁగున్= ధర్మం అతిశయిస్తుంది; అర్థంబున్= ధనసంపాదన రూపమైన అర్థ పురుషార్థం; కామమును= కామపురుషార్థం; అదూష్యంబులు+ఐ= నిందలేనివై; సిద్ధిన్+పొందున్= ఫలితాన్ని పొందుతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! పాలకుడు సమర్థుడై దండనీతిని పాటించకపోతే సన్న్యాసులు కూడా అక్రమమార్గాలను అనుసరిస్తారు. ప్రజలు ఒకరి ధనాన్ని, ధాన్యాన్ని, పశువులను, భూమిని, భార్యలను మరొకరు అపహరిస్తారు. వాటివలన కలిగే పాపం ఆ రాజుకు చెందుతుంది. దండనీతిని హింసగా భావించవద్దు. రుద్రుడు, విష్ణువు, ఇంద్రుడు, గుహుడు మొదలైనవారిని చూడుము - ఎట్లా అవినయ ప్రవృత్తులైనవారిని దండిస్తారో? ఆ మహాత్ములు ఆ విధంగా మిగిలిన దుర్మార్గులను దండించటం చేతనే ఆయా గౌరవాలను పొందుతున్నారు. దండనీతివలన అధర్మం అణగారుతుంది. ధర్మం వర్ధిల్లుతుంది. అర్థకామాలు నిందలపాలు కాకుండా ఫలవంతా లౌతాయి.

**వ. దండంబున సకలజన శ్రీరక్షణంబు సేయంబూనిన భూనాథునక యేల యోగ్యహింసకుం దొలంగ నెట్టివారికి వశంబుగా; దవధరింపుము. 109**

**ప్రతిపదార్థం:** దండంబునన్= దండనీతిచేత; సకల, జన, శ్రీ, రక్షణంబు= ప్రజలందరి సంపదను కాపాడటం; చేయన్+పూనిన= చేయటానికి పూనుకొన్న; భూనాథునకున్+అ= రాజునకు మాత్రమే; ఏల?= ఎందుకు? (రాజుకు మాత్రమే కాదని భావం); యోగ్యహింసకున్= ఉచితమైన హింసనుండి; తొలంగన్= ప్రక్కకు పోవటానికి; ఎట్టివారికిన్= ఎటువంటి వారికైనా సరే; వశంబు, కాదు= వీలుకాదు; అవధరింపుము= (దానికి సమాధానం నేను చెప్తుతాను) వినుము.

**తాత్పర్యం:** దండనీతి నాశ్రయించి ప్రజలందరి సంపదను రక్షించే రాజుకే కాదు ఉచితమైన హింసనుండి తప్పించుకొనటానికి ఎవరికైనా వీలుండదు. ఎందువలన అంటే నేను చెప్తుతాను వినుము.

**ఉ. కాయలఁ బండ్ల నీళులను గల్గవె సూక్ష్మపు జంతువుల్? మునుల్**
**సేయరె హింస వాని? నుపజీవితఁ ద్రవ్వరె కందమూలముల్?**
**నీ యెడఁ జూడు! ప్రాణములు నిల్వఁగ నేర వహింస నేరికిన్;**
**వేయును నేల? భక్ష్యముగ వేధ విధింపఁడె ప్రాణిఁ బ్రాణికిన్? 110**

**ప్రతిపదార్థం:** సూక్ష్మపు జంతువుల్= (నులి) చిన్న పురుగులు సూక్ష్మజీవులు; కాయలన్= చెట్ల కాయలలో; పండ్లన్= పండ్లలో; నీళులను= నీళ్ళలో; కల్గవె?= ఉండవా?; మునుల్= ఋషులు; వానిన్= ఆ సూక్ష్మజీవులను; హింస, చేయరె?= చంపరా?;

కందమూలముల్= కందమూలాలను, దుంపలను; ఉపజీవితన్= వాటిమీద వారు ఆధారపడి ఉండటంచేత; త్రవ్వరె?= వాటిని త్రవ్వివేయరా?; నీ+ఎడన్= నీ పక్షంలో; చూడు(ము)= గమనించుము; ఏరికిన్= ఎవ్వరికీ; అహింసన్= హింసచేయకుండా ఉండటంచేత; ప్రాణములు= ప్రాణాలు; నిల్వఁగన్ నేరవు= నిలువజాలవు; వేయును+ఏల?= పెక్కుమాట లెందుకు?; వేధ= బ్రహ్మదేవుడు; ప్రాణికిన్= ఒక ప్రాణికి; ప్రాణిన్= మరొక ప్రాణిని; భక్ష్యముగన్= తినదగిన ఆహారంగా; విధింపఁడె?= నియమించడా?

**తాత్పర్యం:** కాయలలో, పండ్లలో, నీళ్ళలో సూక్ష్మజీవులు పుట్టవా? వాటిని మునులు హింసించరా? వారు కందమూలాలను త్రవ్వి వాటిపై జీవించటం లేదా? ఇక నీ పక్షంలో చూడుము. అహింస పాటించినట్లయితే ఎవరికైనా ప్రాణాలు నిలుస్తాయా? ఇంక పలుమాట లెందుకు? బ్రహ్మదేవుడే ఒకప్రాణికి మరొక ప్రాణిని ఆహారంగా ఏర్పాటు చేయలేదా?

**క. విను! పశుహింసా కృతయా । గ నిరూఢుని ధర్మపరునిఁగా వేదంబుల్**
**గొనియాడెడు సముచిత హిం । సన మరయ నహింస గాన జగతీనాథా! 111**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= రాజా! ధర్మరాజా!; విను= వినుము; అరయన్= పరిశీలించగా; సముచిత, హింసనము= యోగ్యమైన హింస; అహింస= అహింసయే; కాన= కాబట్టి; పశు, హింసా, కృత, యాగ, నిరూఢునిన్= జంతువులను బలిఇస్తూ చేసే యజ్ఞాలను చేయటంలో నిమగ్నుడైనవాడిని; ధర్మపరునిన్+కాన్= ధర్మాన్ని ఆచరించే వాడిగా; వేదంబుల్= వేదాలు; కొనియాడెడున్= కీర్తిస్తాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. పరిశీలించి చూస్తే యోగ్యమైన హింస అహింసయే ఔతుంది. అందువలననే, జంతుబలు లిచ్చే యాగాలను చేసే నిష్ఠాపరులను వేదాలు ధర్మపరులుగానే కొనియాడుతున్నాయి.

**క. అరివీరుల ఘోరంబగు । దురమున వధియించుటేల దోసం బయ్యెన్?**
**ధరణీశ! పాండు పాలిత । ధరావలయ మాసపడుట దగదే నీకున్? 112**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= ప్రభువా! - ధర్మరాజా!; ఘోరంబు+అగు= దారుణమైన; దురమునన్= యుద్ధంలో; అరివీరులన్= శత్రువీరులను; వధియించుట= చంపటం; ఏల= ఎట్లా; దోసంబు+అయ్యెన్?= తప్పు అయింది?; పాండు, పాలిత, ధరా, వలయము= పాండురాజుచేత పాలించబడిన భూ మండలాన్ని; నీకున్= నీకు; ఆసపడుట= కోరటం; తగదు+ఏ?= తగదా? న్యాయం కాదా?

**తాత్పర్యం:** ధర్మరాజా! భయంకరమైన యుద్ధంలో శత్రువీరులను చంపటం దోషం ఎట్లా ఔతుంది? పాండురాజు పాలించిన భూమండలాన్ని నీవు ఆశించటం న్యాయం కాదా? (న్యాయమే అని భావం).

**క. ఇల నీ కైకొన్న తెఱఁగు । దలఁపఁగ ధర్మంబొ కాదొ దైవం బెఱుఁగున్;**
**వలవని చింత యుడిగి ధృతి । దలకొని పాలింపు యజ్ఞదక్షుఁడ వగుచున్.' 113**

**ప్రతిపదార్థం:** ఇలన్= ఈ నేలను, రాజ్యాన్ని; నీ+కైకొన్న= నీవు తీసికొన్న; తెఱఁగు= విధానం; తలఁపఁగన్= ఆలోచించగా; ధర్మంబు+ఒ? కాదు+ఒ?= న్యాయమో?, అన్యాయమో?; దైవంబు+ఎఱుఁగున్= దేవుడికి తెలుసు; వలవని= కూడని; చింత= విచారాన్ని; ఉడిగి= మాని; ధృతి= ధైర్యం; తలకొని= వహించి; యజ్ఞదక్షుఁడవు+అగుచున్= యాగాలు చేయటంలో సమర్థుడవౌతూ; పాలింపుము= రాజ్యాన్ని ఏలుము.

**తాత్పర్యం:** ఈ నేలను నీవు గ్రహించిన విధానం ధర్మమో, అధర్మమో ఆ దేవు డెరుగును. కూడని ఈ విచారాన్ని మానుకొమ్ము. యజ్ఞాలను నిర్వహిస్తూ సామర్థ్యంతో ధైర్యంతో రాజ్యాన్ని పాలించుము'.

**క. అని పలుకు పార్థు పలుకులు । విని పలుకక యున్న మనుజవిభుదెసఁ గోపిం**
**చిన తన మది వెడఁ గుడుపుచు । ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్. 114**

**ప్రతిపదార్థం:** అని పలుకు, పార్థు, పలుకులు= అని అంటున్న అర్జునుడి మాటలు; విని; పలుకక+ఉన్న= మాటాడకుండా ఉన్న; మనుజ విభు దెసన్= రాజు (ధర్మరాజు) మీద; కోపించిన= కోపపడిన; తనమదిన్= తన మనస్సును; వెడఁగు+ఉడుపుచున్= వికారాన్ని పోగొట్టుకుంటూ; అనిలసుతుండు= భీముడు; అతనితోడన్= ధర్మరాజుతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అనునయంగా చెప్పిన అర్జునుడి మాటలు విని మాట్లాడకుండా ఉన్న ధర్మరాజు పట్ల కోపం తెచ్చుకొన్న తన మనోవికారాన్ని వదలి భీముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**ఉ. ' నీవు సమస్త ధర్మ పరినిశ్చయవేదివి; నీ చరిత్ర మే**
**మే వసుధేశ! వంక యని మెచ్చక చక్కఁగఁ జేయువార మే**
**నీ వచన ప్రపంచముల కింకఁ జొరం జొర నంచు నుండియున్**
**వావిరిఁ జెప్పఁగా వలసె వాలిన దుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్. 115**

**ప్రతిపదార్థం:** వసుధా+ఈశ= భూమిపతీ! ధర్మరాజా!; నీవు; సమస్త ధర్మ= అన్ని ధర్మాలను; పరినిశ్చయ= పూర్తిగా (చక్కగా, సరిగా) నిర్ధారించటంలో; వేదివి= పండితుడవు; ఏమే= మేమా; నీ చరిత్రము= నీ నడవడికను; వంక+అని= నెపం (కారణం) అని, లోపమని; మెచ్చక= మెచ్చుకొనక; చక్కఁగన్= ముక్కు సూటిగా; చేయువారము?= చేయగలిగినవారము (కామని భావం); ఏను= నేను; ఈ వచన ప్రపంచములకున్= ఈ వాక్యసమూహాలకు; ఇంకన్= ఇటుపైన; చొరన్+చొరన్= ప్రవేశింపనే ప్రవేశింపను; అంచున్+ఉండియున్= అంటూ ఉండి కూడా; వాలిన దుఃఖము= పైన కమ్మిన శోకం (బాధ); తాల్మిన్= ఓర్పును; క్రాఁచినన్= మరుగుపెట్టగా; వావిరిన్= క్రమంగా, నెమ్మదిగా; చెప్పఁగాన్+వలసెన్= చెప్పవలసి వచ్చింది. (మాటాడక తప్పలేదని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! నీవు అన్నిధర్మాలూ సంపూర్ణంగా నిర్ధారించటం తెలిసినవాడవు. మేమా, నీ చరిత్రకు వంకపెట్టి చక్కబెట్టేవాళ్ళం! నేను (భీముడు) నీ మాటల విస్తారంలో ఇంక జోక్యం కలగజేసికొనగూడదని ఉండి కూడా, అమితమైన దుఃఖం నా ఓర్పును నశింపజేయటంవలన చెప్పవలసి వచ్చింది.

**వ. అవధరింపుము. 116**

**తాత్పర్యం:** వినుము.

**క. ఒడఁగూడిన సామ్రాజ్యము । నడలున దిగఁ ద్రావి చనిన నఖిల జనులు నిన్**
**గడుఁ బేదమనసువాఁ డని । చెడనాడుదు రనిన, మము నిసీయను టరుదే! 117**

**ప్రతిపదార్థం:** ఒడఁగూడిన= సమకూరిన; సామ్రాజ్యము= విశాలమైన రాజ్యం; అడలునన్= భయంతో; దిగన్+త్రావి= దిగవిడిచి, వదలి; చనినన్= పోతే; నిఖిలజనులు= ప్రజలందరూ; నిన్= నిన్ను; కడున్+పేదమనసువాఁడు+అని= మిక్కిలి పిరికి మనసు కలవాడని; చెడన్+ఆడుదురు= తిట్టుతారు; అనినన్= అనగా; మమున్= మమ్ములను; ఇసీ!= ఛీ! అని; అనుట= అనటం; అరుదే?= అరుదా? ఆశ్చర్యమా?

**తాత్పర్యం:** లభ్యమైన సామ్రాజ్యాన్ని భయంతో వదలి వెళ్ళినట్లైతే, ప్రజలంతా నిన్ను పిరికివాడని చులకనగా మాట్లాడతారు. అటువంటప్పుడు మమ్ములను ఛీత్కరించటంలో ఆశ్చర్యం ఉండదు.

**మ. కపటద్యూతమునం బరాభవము రాఁగా సూనృతం బూఁది భూ**
**మిప! మమ్ముం జులుకంగఁ జేసి నినుఁ బేర్మిం బాపికొంచున్ దురం**
**తపు దుఃఖంబుల కోర్చి పోయి; తది యుద్ధక్రీడ నప్పాపక**
**ర్మపు జాతిం దెగటారఁ జేయఁగఁ బ్రకీర్త్యం బయ్యె లోకంబులన్. 118**

**ప్రతిపదార్థం:** భూమిప! రాజా! ధర్మరాజా!; కపట ద్యూతమునన్= వంచనతో కూడిన జూదంలో; పరాభవము= అవమానం; రాఁగాన్= కలుగగా; సూనృతంబు= పుణ్యాన్ని, సత్యాన్ని; ఊఁది= ఊతగా తీసికొని; మమ్మున్= మమ్ములను; చులుకంగన్+చేసి= తేలికపరిచి; నినున్= నిన్ను; పేర్మిన్= ప్రీతితో, గొప్పతనం నుండి; పాపికొంచున్= దూరం చేసికొంటూ; దురంతపు(ము)= భరించరాని; దుఃఖంబులకున్= కష్టాలకు; ఓర్చి= సహించి; పోయితి(వి)= వెళ్ళావు; అది= ఆ విధంగా కష్టాలకు ఓర్వటం; యుద్ధక్రీడన్= యుద్ధమనే ఆటలో; ఆ+పాపకర్మపు జాతిన్= ఆ పాపిష్టి వర్గాన్ని (కౌరవ సమూహాన్ని); తెగటారన్+చేయఁగన్= చంపటంచేత; లోకంబులన్= లోకాలలో; ప్రకీర్త్యంబు+అయ్యెన్= గొప్పగా కీర్తించదగినదైనది.

**తాత్పర్యం:** ధర్మరాజా! మాయాద్యూతంలో ఓడిపోవటం వలన అవమానాల పాలు కాగా, సత్యాన్ని అవలంబించి గ్రహించి, మమ్మలను చులకన చేసి, నీ ఘనతను వదలుకొని, భరించలేని కష్టాలను సహించావు, యుద్ధక్రీడలో దుష్కర్మలు చేసినవారిని చంపటంతో, నీ సత్యనిరతి అన్ని లోకాలలో కీర్తించ దగినదయింది.

**వ. దుర్జయులగు విరోధుల నిర్జించి యుపార్జించిన పృథివీప్రముఖ పదార్థంబులు నిరర్థకంబులు సేసి వనంబునకుం జను చులుకఁదనం బేమిటం బాపికొనువాఁడ? వట్లుం గాక. 119**

**ప్రతిపదార్థం:** దుర్జయులు+అగు= జయించ సాధ్యంకానివారైన; విరోధులన్= శత్రువులను; నిర్జించి= జయించి; ఉపార్జించిన= సంపాదించిన; పృథివీ, ప్రముఖ, పదార్థంబులు= భూమి (రాజ్యం) మొదలైన వస్తువులను; నిరర్థకంబులు చేసి= పనికిమాలిన వాటినిగా చేసి; వనంబునకున్= అరణ్యానికి; చను= వెళ్ళే; చులుకఁదనంబు= తేలికతనం; ఏమిటన్= దేనితో; పాపికొనువాఁడవు?= పోగొట్టుకొంటావు?; అట్లున్+కాక= అట్లా కాకుండా, అంతే కాకుండా.

**తాత్పర్యం:** అసాధ్యులైన శత్రువులను జయించి సంపాదించిన సామ్రాజ్యం మొదలైన పదార్థాల నన్నింటినీ పనికిమాలిన వాటినిగా చేసి అరణ్యానికి (వెళ్ళటం అని భావించే) చులుకనతనాన్ని ఏ విధంగా పోగొట్టుకొంటావు? అంతేకాక. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ఆ సభలోఁ బడినట్టి బన్నంబును, । నడవులఁ దిరిగెడు నవుడు దుష్ట**
**దైత్యులచేత సైంధవునిచే నొఱపులఁ । బడ్డ విషాదంబుఁ, బరమ దైన్య**
**మున కోర్చి కొలిచి మాత్స్యుని పాల నున్న । దుఃఖంబును, ద్రోహులఁ గనుపుగొట్టి**
**వెలువరించెద నని తలఁచి కృష్ణుని నిశ్చ । యంబూఁది ధర్మంబ యగుటఁ దెలిసి**

**తే. రణ మొనర్చితి; నిను ధార్తరాష్ట్రు లొండె । నీవు వారల నొండెను జావఁ జూడ**
**వలయు టప్పు డెఱుంగవే వసుమతీశ! । యిప్పు డడలుట నింద్యంబ; యింత నిజము. 120**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూమికి ప్రభువైనవాడా! ధర్మరాజా!; ఆ+సభలోన్= అలనాటి (మాయాద్యూత) సభలో; పడినట్టి= పొందిన; బన్నంబును= అవమానమున్నూ; అడవులన్= అరణ్యాలలో; తిరిగెడు+అపుడు= తిరిగేటప్పుడు; దుష్టదైత్యుల చేతన్= దుర్మార్గులైన రాక్షసుల వలన; సైంధవునిచేన్= సైంధవుడివలన; ఒఱపులన్+పడ్డ= ఇబ్బందులు పడిన; విషాదంబున్=

దుఃఖాన్నీ; పరమ, దైన్యమునకున్+ఓర్చి= మిక్కిలి తక్కువతనానికి సహించి; కొలిచి= సేవించి; మాత్స్యుని పాలన్+ఉన్న= మత్స్యదేశానికి రాజైన విరాటుడి వద్ద (కొలువులో) ఉన్నప్పటి; దుఃఖంబును= బాధనూ; ద్రోహులన్= మనకు కీడుచేసిన (కౌరవులను) వారిని; కనుపు+కొట్టి= ఖండించి, సంహరించి; వెలువరించెదన్+అని= తొలగించి వేస్తానని; తలఁచి= అనుకొని; కృష్ణుని, నిశ్చయంబు+ఊఁది= శ్రీకృష్ణుడి నిర్ణయాన్ని ఆధారంగా చేసికొని; ధర్మంబు+అ= న్యాయమే; అగుటన్= అయి ఉండటాన్ని; తెలిసి= గ్రహించి; రణము= యుద్ధాన్ని; ఒనర్చితి(వి)= చేశావు; నినున్= నిన్ను (ధర్మరాజును); ధార్తరాష్ట్రులు+ఒండెన్= కౌరవులు కాని; నీవు= (ధర్మరాజు); వారలన్+ఒండెన్= కౌరవులను గాని; చావన్+చూడన్వలయుట= చావగా తప్పక చూడాలని అనుకొనటం; అప్పుడు= ఆ యుద్ధం మొదలు పెట్టేటప్పుడు; ఎఱుంగవు+ఏ?= ఎరుగవా? (తెలియదా?); ఇప్పుడు= ఈ సమయంలో; (ఇంత జరిగిన తరువాత); అడలుట= దుఃఖించటం; నింద్యంబు+అ= నిందించదగిందే; ఇంత= ఇది మాత్రం; నిజము= సత్యం.

**తాత్పర్యం:** ఆనాటి కౌరవసభలో పడిన కష్టం, అరణ్యాలలో తిరిగే సమయంలో, దుర్మార్గులైన రాక్షసులు, సైంధవుడు పెట్టిన బాధలవలన కలిగిన దుఃఖం, మిక్కిలి హీనత్వాన్ని ఓర్చుకొని మత్స్యదేశపు రాజైన విరటుడి కొలువులో ఉన్నప్పటి శోకం, తమకు కీడుచేసిన కౌరవులను సంహరించి పోగొట్టాలని అనుకొని, కృష్ణుడి నిర్ణయాన్ని అవలంబించి, అది ధర్మమే కావటం తెలిసి యుద్ధం చేశావు. నిన్ను కౌరవులో, నీవు కౌరవులనో చంపటం తప్పదన్న సంగతి నీకప్పుడు తెలియదా? ఇప్పుడు దుఃఖించటం నింద్యం. ఇది నిజం.

**క. పను లేము సేయఁగా దు । ర్జనులం జెఱుచుచును, సాధుజనుల మనుచుచున్**
**జననాథ! మహాయజ్ఞము । లొనర్చుచును, వెలయు కురు కులోత్తంసమవై'. 121**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా! ధర్మరాజా!; ఏము= మేము (భీమాదులు); పనులు= చేయవలసిన పనులు; చేయఁగాన్= చేస్తూ ఉండగా; దుర్జనులన్= దుర్మార్గులను; చెఱుచుచును= నశింపచేస్తూ; సాధుజనులను= మంచివారిని; మనుచుచున్= రక్షిస్తూ; మహాయజ్ఞములు+ఒనర్చుచును= గొప్ప గొప్ప యజ్ఞాలుచేస్తూ; కురుకుల ఉత్తంసమవు+ఐ= కురువంశంలో శ్రేష్ఠుడవై; వెలయు(ము)= ప్రకాశించుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! మేమందరమూ నీవు చెప్పిన పనులను చేస్తూ ఉండగా, నీవు దుర్మార్గులను చెండాడుతూ, మంచివారిని రక్షిస్తూ గొప్ప గొప్ప యాగాలను చేస్తూ కురువంశంలో శ్రేష్ఠుడవై ప్రకాశించుము'.

**వ. అనిన విని ధర్మతనయుం డిట్లనియె. 122**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు ఇట్లా అన్నాడు:

**చ. ' మదమును రాగమున్ భయము మానము లోనగు కిల్బిషంబులన్**
**హృదయముఁ జొన్పి భూజనుల నేలుట మేలని పల్కెː దార్తికా**
**స్పదమని రార్యు లామిషముపై తగు; లిమ్మహియెల్ల నేలినం**
**దుది నరకం బొకండ; నృపతుల్ సుఖులే? యుపశాంతి యొప్పదే! 123**

**ప్రతిపదార్థం:** మదమును= గర్వమూ; రాగమున్= అనురాగమూ, అభిలాష; భయము= భయమూ, వెరపూ; మానము= అభిమానం, అహంకారం; లోన్+అగు= మొదలైన; కిల్బిషంబులన్= దోషాలలో; హృదయమున్+చొన్పి= మనసును ప్రవేశపెట్టి; భూజనులన్= ప్రజలను; ఏలుట= పాలించటం; మేలు+అని= మంచిదని; పల్కెదు= (నీవు) పలుకుతావు; (కాని) ఆర్యులు= పెద్దలు;

ఆమిషముపైన్= మాంసంమీది; తగులు= ఆసక్తి; ఆర్తికిన్= దుఃఖానికి; ఆస్పదము+అనిరి= చోటైనదని అన్నారు; ఈ+మహి+ఎల్లన్= ఈ భూమినంతా; ఏలినన్= పాలించినప్పటికీ; తుదిన్= చివరకు; నరకంబు= నరకం(పొందటం); ఒకండు+అ= ఒక్కటే (మిగిలేది); నృపతుల్= రాజులు; సుఖులే?= సుఖంగా ఉండగలరా? (కాదని, దుఃఖితులని భావం); ఉపశాంతి= శమనం (అంతరింద్రియ నిగ్రహం); ఒప్పదే?= తగదా? (తగునని భావం).

**తాత్పర్యం:** గర్వం, అనురాగం, భయం, అహంకారం అనే దోషాలను మనస్సులో నింపుకొని ప్రజలను పాలించటం మేలని నీవు పలుకుతావు. పెద్దలు రాజ్యపాలనం దుఃఖానికి చోటైనదని అంటారు. రాజ్యపాలనమంటే చేప ఎరను ఆశించి తగులుకొన్నట్లే అనిపిస్తుంది. ఒకవేళ, ఇవన్నీ పరిగణించకుండా, భూమినంతా పాలించినా చివరకు నరక మొక్కటే మిగిలేది. నిజానికి రాజులకు సుఖమెక్కడ ఉన్నది? వారికి శాంతి తగదా?

**తే. కామభోగముల్ మేలనం గాదు; వాని । విడిచి చూడుము; పొందెదు విపుల సుఖము;**
**కాయలాకులు నీళ్ళును గాలి యనుభ । వించియున్న మునీంద్రులు వెఱ్ఱివారె! 124**

**ప్రతిపదార్థం:** కామభోగముల్= కోర్కెలూ, భోగాలూ అనుభవించటాలు; మేలు+అనన్+కాదు= మంచివి అనలేము; వానిన్= ఆ కామభోగాలను; విడిచి= వదలిపెట్టి; చూడుము= గమనించుము; విపుల సుఖము= విస్తారమైన సంతోషాన్ని (అనంతమైన ఆనందాన్ని); పొందెదు(వు)= పొందుతావు; కాయలు+ఆకులు= పండ్లు, ఆకుకూరలు; నీళ్ళును= నీటినీ; గాలి= గాలీ; అనుభవించి+ఉన్న= తిని జీవించి ఉన్న; ముని+ఇంద్రులు= ఋషిశ్రేష్ఠులు; వెఱ్ఱివారె?= పిచ్చివారా? (తెలివి తక్కువవారా?) (కారని భావం).

**తాత్పర్యం:** కోరికలను తీర్చికొనటం మంచిది అనటానికి వీలులేదు. కామభోగాలను విడిచిపెడితే పొందే అనంతమైన ఆనందాన్ని నీవు గమనించుము. కాయలు, ఆకులు, నీళ్ళు, గాలి మాత్రమే తింటూ కలకాలం ఉన్న మునిశ్రేష్ఠులు పిచ్చివారా? (కాదని భావం).

**క. దుర్మతు లామిషగత మగు । కర్మము వాటించి బంధకలితు లగుదు; ర**
**య్యూర్మి గడచి సువిచారులు । నిర్మమతను ముక్తివడయ నేర్తురు వత్సా! 125**

**ప్రతిపదార్థం:** వత్సా!= చిన్నవాడా! భీమసేనా!; దుర్మతులు= చెడు తలపులు కలవారు; అమిషగతము+అగు= ఎరలో ఉన్న; కర్మము= చేసిన కర్మను; పాటించి= అనుసరించి; బంధ, కలితులు+అగుదురు= సంసార బంధాలతో కూడికొన్నవారు ఔతారు; సువిచారులు= జ్ఞానులు; ఆ+ఊర్మి= కెరటం, కడచి= దాటి; నిర్మమతను= మమకారాలు లేని చిత్త వృత్తితో; ముక్తిన్= మోక్షాన్ని; పడయన్ నేర్తురు= పొందగలుగుతారు.

**తాత్పర్యం:** నాయనా! భీమసేనా! చెడ్డవారు శరీర సంబంధమైన తాము చేసిన కర్మల ననుసరించి బంధాలలో ఇరుక్కొన్నవా రవుతారు. ఎరుక గలిగినవారు ఆ వికారాలకు లోనుకాక వాటిపై మమకారం లేని వారై ముక్తసంగు లౌతారు.

**విశేషం:** ఊర్మి= బంధకారకమైన కోరిక. ఇది ఆరు విధాలు: 1. క్షుత్, 2. తృష్ణ, 3. శోకం, 4. మోహం, 5. జర, 6. మరణం.

**వ. జనకుని వచనంబులు వినమే! వాని నీకుం జెప్పెద నాకర్ణింపుము. 126**

**ప్రతిపదార్థం:** జనకుని= జనకమహారాజు యొక్క; వచనంబులు= మాటలు; వినము+ఏ?= మనం వినలేదా?; వానిన్= ఆ మాటలు; నీకున్= నీకు; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** జనకుడు (అనే రాజర్షి) చెప్పిన మాటలు మనం వినమా? (ప్రసిద్ధే కదా!) వాటిని నీకు చెప్పుతాను వినుము.

**ఆ. ' ఒకటి దెసను దృష్ణ యొలయదు గావున । నేమి యర్థములును లేమి లేదు?**
**కాలఁ జొచ్చె మిథిల గాలదు నాకు నం । దొక్కఁ డైన; నింత నిక్కువంబు.' 127**

**ప్రతిపదార్థం:** ఒకటి దెసనున్= ఒకదానివైపు కూడా; తృష్ణ= కోరిక, ఆశ; ఒలయదు= ప్రసరించదు, పొందదు; కావునన్= కాబట్టి; ఏమి= ఎటువంటి; అర్థములును= సంపదలు కూడా; లేమి= లేకపోవటం అనేది; లేదు= లేదు; మిథిల= మిథిలానగరం; కాలన్+చొచ్చెన్= తగలబడసాగింది; (అయినా); నాకున్= నాకు, నా దృష్టిలో; అందున్= ఆ మిథిలలో; ఒక్కఁడు+ఐనన్= ఒక్కటి కూడా; కాలదు= తగలబడదు; ఇంత= ఇంతవరకు మాత్రం; నిక్కువంబు= నిజం.

**తాత్పర్యం:** 'దేనిమీదా కోరిక కలగదు కాబట్టి ఎటువంటి సంపదా, ప్రయోజనమూ లేకపోవట మనేది లేదు. అంటే అన్నీ ఉన్నట్లే ఉంటుంది. మిథిలానగరం తగలబడుతున్నా నా దృష్టిలో మాత్రం అందులో ఏ ఒక్క వస్తువూ తగలబడదు. ఇది నిజం'.

**క. అని పలుకు జనకుఁ దెగడిరె । జను? లుల్లము శాంతిఁ బొంది సంసారం బొ**
**ల్లనివాఁడు నింద కర్హుం । డని పలుకుట నీక యొప్పు నధికవిచారా! 128**

**ప్రతిపదార్థం:** అని, పలుకు= అని చెప్పే; జనకున్= జనక మహారాజును; జనులు= ప్రజలు; తెగడిరె?= నిందించారా?; అధిక విచారా!= మిక్కిలి జిజ్ఞాస కలవాడా!(ఆలోచనాపరుడా!); ఉల్లము= మనస్సు; శాంతిన్+పొంది= ప్రశాంతతనుపొంది; సంసారంబు+ఒల్లనివాఁడు= సంసారాన్ని కోరనివాడు; నిందకున్= అపకీర్తికి, పాపానికి; అర్హుండు+అని పలుకుట= యోగ్యుడని చెప్పటం; నీకున్+అ= నీకే; ఒప్పున్= తగి ఉన్నది.

**తాత్పర్యం:** అని చెప్పిన జనకమహారాజును ప్రజలు కాదన్నారా? నిందించారా? కాబట్టి ఓ ఆలోచనాశీలీ! మనస్సు శాంతిని పొంది సంసారబంధాన్ని త్రెంచుకొన్నవాడు నిందపొందటానికి యోగ్యుడని పలకటం నీకే తగింది.

**తే. వినుము! ప్రజ్ఞాధిరూఢుఁడై వనట । దక్కి సంసృతిక్లేశపరుల భూస్థలిఁ జరించు**
**వారి నచలంబుపై నున్నవాఁడు । సూచునట్ల చూచుట సూవె నే ర్పమలహృదయ!' 129**

**ప్రతిపదార్థం:** అమలహృదయ!= నిర్మలమైన మనస్సు కలవాడా! భీమసేనా!; వినుము; ప్రజ్ఞా+అధిరూఢుఁడు+ఐ= జ్ఞాని అయి; వనట+తక్కి= దుఃఖం వదలి; సంసృతి క్లేశపరులన్= సంసార దుఃఖాలలో ఆసక్తి కలవారిని; భూస్థలిన్= నేలమీద; చరించు వారిన్= తిరిగే వారిని; అచలంబుపైన్= కొండమీద; ఉన్నవాఁడు; చూచు+అట్లు+అ= చూచే విధంగానే; చూచుట= చూడటం; నేర్పు= తెలివి; చూవె!= సుమా!

**తాత్పర్యం:** మంచి మనసుగల భీమసేనా! వినుము. దుఃఖంనుండి దూరమై ప్రజ్ఞావంతుడైన జ్ఞాని సంసార దుఃఖాలలో ఆసక్తికలవారిని కొండమీద ఉన్నవాడు నేలమీద తిరుగుతున్నవారిని చూచేటట్లు చూడటమే నేర్పు సుమా!'

**జనకున కతని సతితో నైన సంవాదం బర్జునుఁడు ధర్మజునికిఁ జెప్పుట (సం. 12-18-1)**

**వ. అని పలికి మఱి పలుకకున్న యప్పుడమి తేనికిం గవ్వడి యిట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** అని పలికి; మఱి= మరల; పలుకక+ఉన్న= మాట్లాడకుండా ఉన్న; ఆ+పుడమిఱేనికిన్= ఆ రాజుకు, ధర్మరాజుకు; కవ్వడి= అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని పలికి మరిం కేమీ మాట్లాడకుండా ధర్మరాజు మిన్నకుండగా అర్జునుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**క. ' జననాథ! నీవు సెప్పిన । జనక నృపాలునకు నతివిశదమానస యా**
**తని భార్యకు నీ క్రియ న । య్యెను సంవాదంబు; దాని నేర్పడ వినుమా! 131**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా! ధర్మరాజా!; నీవు+చెప్పిన= నీవు పేర్కొన్న; జనక నృపాలునకున్= జనక మహారాజుకూ; అతి, విశద, మానస= మిక్కిలి నిర్మలమైన మనస్సు కలిగిన; అతని, భార్యకున్= జనకుడి భార్యకూ; సంవాదంబు= సంభాషణం; ఈ క్రియన్= ఈ విధంగా; అయ్యెన్= అయింది; దానిన్= ఆ సంవాదాన్ని; ఏర్పడన్= స్పష్టమయ్యేటట్లు; వినుమా!= వినుము!

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీవు పేర్కొన్న ఆ జనకమహారాజుకు, నిర్మలమైన మనస్సు గల అతడి భార్యకూ నడుమ ఈ క్రింది విధంగా సంవాదం జరిగింది. దానిని తేటపడేటట్లు చెప్పుతాను వినుము.

**వ. అమ్మహీపతి పూజ్యరాజ్యం బొల్లక విడిచి భిక్షావృత్తికి వెడలఁ జూచినం దదీయ భార్య యతని కిట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** ఆ+మహీపతి= ఆ రాజు - జనక మహారాజు; పూజ్య, రాజ్యంబు= గౌరవించదగిన రాజ్యాన్ని; ఒల్లక= అంగీకరించక; విడిచి= వదలిపెట్టి; భిక్షావృత్తికిన్= బిచ్చమెత్తుకొనటానికి; వెడలన్+చూచినన్= పోబోగా; తదీయ= అతడి; భార్య= ఇల్లాలు; అతనికిన్= అతడితో (జనకుడితో); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఆ రాజు గౌరవించదగిన రాజ్యాన్ని గ్రహించకుండా, వదలి బిచ్చమెత్తుకొని జీవించటానికి పూనుకొనగా, ఆతడి భార్య అతడితో ఇట్లా అన్నది.

**సీ. ' పుడమి యేలుట డిగ్గవిడిచి భిక్షార్థివై । పోయిన నతిథి సంపూజనంబు,**
**దేవ తర్పణ పితృదేవతర్పణములుఁ । గలుగునే? కాషాయములు ధరించి**
**ముండుఁడై నతఁ డన్నమునకు గృహంబుల । కరుగక యున్నె? గృహస్థుఁ డెల్ల**
**వారికి నన్నంబు గారుణ్యమునఁ బెట్టు । నన్నదానము సేఁత యధికధర్మ**

**ఆ. మనుట వినమె? పెట్టు నతనిఁ జేయొడ్డెడు, । వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు**
**వాఁడ యగుట నిక్కువం; బింత సూడక । యిట్లు దీనవృత్తి కేఁగఁ దలఁతె? 133**

**ప్రతిపదార్థం:** పుడమి+ఏలుట= రాజ్యాన్ని పాలించటం; డిగ్గ విడిచి= వదలివేసి; భిక్షా+అర్థివి+ఐ= బిచ్చం అడుగుకొనే వాడివై; పోయినన్= పోతే; అతిథి, సంపూజనంబు= ఇంటికి వచ్చిన అతిథులను గౌరవించటం; దేవతర్పణ, పితృదేవతర్పణములున్= దేవతలకిచ్చే మంత్ర జలాలూ, పితృదేవతలకిచ్చే తర్పణాలూ; కలుగును+ఏ?= ఏర్పడతాయా?; అతఁడు= రాజ్యమేలవలసినవాడు; ముండుఁడు+ఐ= తలగొరిగించుకొన్నవాడై; కాషాయములు= కావిబట్టలు (కాషాయపు రంగు దుస్తులు); ధరించి= కట్టుకొని; అన్నమునకున్= భిక్షకొరకు; గృహంబులకున్= గృహస్థాశ్రమ వాసులు నివసించే ఇండ్లకు; అరుగక+ఉన్నె?= వెళ్ళకుండా ఉంటాడా?; గృహస్థుఁడు= గృహస్థాశ్రమంలో ఉన్న కుటుంబి (పెళ్ళాం బిడ్డలతో కలిసి ఉండేవాడు); ఎల్లవారికిన్= అందరికీ; కారుణ్యంబునన్= దయతో; అన్నంబు= అన్నాన్ని (భిక్షను); పెట్టున్= పెట్టుతాడు; అన్నదానము+చేఁత= అన్నాన్ని దానం చేయటం (అడిగినవారికి పెట్టటం); అధిక ధర్మము= గొప్పధర్మం; అనుటన్= అనటం; వినము+ఎ?= వినమా?; పెట్టు+అతనిన్= అన్నం పెట్టే వాడినీ;

చేయి+ఒడ్డెడు వానిన్= చేయి చాచేవాడినీ; తలఁపన్= భావించగా; అందున్= వారిద్దరిలో; పెట్టువాఁడు= అన్నం పెట్టేవాడు; వరుఁడు= శ్రేష్ఠుడు; అగుట= కావటం; నిక్కువంబు= నిజం; ఇంత, చూడక= ఈ మాత్రం గమనించకుండానే; ఇట్లు= ఈ రీతిగా; దీన వృత్తికిన్= జాలిగొలిపే పద్ధతికి; ఏఁగన్+తలఁతె?= వెళ్ళాలని భావిస్తావా?

**తాత్పర్యం:** 'రాజ్యపరిపాలనను జారవిడిచి బిచ్చమెత్తుకొనే వృత్తిని స్వీకరిస్తే నీ ఇంటిపట్టున అతిథిపూజ లేమి కావాలి? దేవతలకూ, పితృదేవతలకూ నీ విచ్చే మంత్రజలాలూ, తర్పణాలూ ఎవ రివ్వాలి? గృహస్థుడు తలగొరిగించుకొని, కాషాయాంబరాలు కట్టుకొనికూడా భిక్షకొరకు ఇంటింటికి తిరగకుండా ఉండగలడా? గృహస్థాశ్రమంలో ఉన్న సంసారి దయతో అందరికీ అన్నం పెట్టుతాడు. ధర్మాలన్నింటిలో అన్నదానమే ఉత్తమ ధర్మం - అని లోకంలో ప్రసిద్ధంగా వినమా? అన్నం పెట్టేవాడిని, చేయి సాచేవాడినీ సరితూస్తే వారిలో అన్నం పెట్టేవాడే శ్రేష్ఠ డనటం నిజం. ఈ మాత్రం గమనించకుండా ఈ విధంగా దీనుడవై పోవాలని భావిస్తావా?

**క. త్రైవిద్యులగు మహాత్ములు । నీ వలనన బ్రదుకఁ దలఁప నిష్క్రియత మెయిన్**
**నీ విందఱఁ జెఱిచెద; విది । దేవా! ధర్మంబు గాదు; దీని నుడుగవే! 134**

**ప్రతిపదార్థం:** త్రైవిద్యులు+అగు= మూడు వేదాలు తెలిసినవారైన; మహాత్ములు= గొప్పవారు; నీ వలనన్+అ= నీ వలననే; బ్రదుకన్+తలఁపన్= జీవించాలని భావించగా; నిష్క్రియత మెయిన్= క్రియారాహిత్యంతో; నీవు; ఇందఱన్= ఇంతమందిని; చెఱిచెదవు= బ్రతుకులు పాడుచేస్తావు - నిరాశా పరులను చేస్తావు; దేవా!; ప్రభూ! జనక మహారాజా!; ఇది= ఈ పని; ధర్మంబు+కాదు= న్యాయం కాదు; దీనిన్= దీనిని; ఉడుగవే= వదలి పెట్టుము.

**తాత్పర్యం:** వేదత్రయ విదులైన మహాత్ములు నీవలననే బ్రతుకులు సాగించాలని ఆశపడుతున్నారు. నీవు క్రియారహితుడ వైతే ఇంతమంది నిరాశకు గురికాక తప్పదు. వారి బ్రతుకులు పాడుచేయకుము. ఇది ధర్మం కాదు. కాబట్టి మానుము.

**తే. అధిప! మీ తల్లియుల్లంబు నడలు వెల్లి । ముంచి, సతి శోకసంతాపమూర్తిఁ జేసి**
**వంశవిహిత ధర్మంబుల వదలి వెడలి । పోయి యేగతిఁ బోయెదవో యెఱుంగ. 135**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! జనకమహారాజా!; మీ తల్లి ఉల్లంబు= మీ కన్నతల్లి మనసు; అడలు వెల్లిన్= దుఃఖప్రవాహంలో; ముంచి= ముంచి; సతిన్= భార్యను; శోక సంతాప మూర్తిన్+చేసి= దుఃఖంచేత వేదన పొందే ఆకారం కలదానిగా చేసి; వంశ విహిత ధర్మంబులన్= వంశ మర్యాదకు యోగ్యమైన ధర్మాలను; వదలి= మాని; వెడలి పోయి= దూరంగా వెళ్ళి; ఏ గతిన్= ఏ విధంగా; పోయెదవో?= ముందుకు పోగలవో? (జీవితాన్ని ఎట్లా కొనసాగిస్తావో?); ఎఱుంగన్= తెలియజాలను (నాకు తెలియటం లేదు).

**తాత్పర్యం:** రాజా! నీ కన్నతల్లి మనసును దుఃఖసముద్రంలో ముంచి, నీ భార్యను శోకంతో వేదనపొందే ఆర్తమూర్తిగా చేసి, వంశమర్యాద ననుసరించి చేసే ధర్మకర్మ లన్నింటినీ వదలి, దూరంగా తొలగిపోయి ఏ విధంగా నీ జీవితాన్ని సాగిస్తావో నాకు తెలియకుండా ఉన్నది.

**క. చలిపందిరి చందంబున । ఫలభరితంబైన తరువుభంగిఁ బ్రజల డ**
**ప్పులు దీర్ప నమరియుండెడు । నలఘుచరిత్రునకు లఘుత యగునే కోరన్. 136**

**ప్రతిపదార్థం:** చలిపందిరి= ఎండా కాలంలో దప్పిక తీర్చటానికి ఏర్పరచిన తాటాకు పందిరి (చలివేంద్రం) పానీయశాల; చందంబునన్= వలె; ఫల భరితంబు+ఐన= పండ్లతో నిండినదైన; తరువు భంగిన్= చెట్టువలె; ప్రజల= జనులయొక్క; డప్పులు=

దప్పికలు; తీర్పన్= తీర్చటానికి; అమరి+ఉండెడు= ఏర్పాటై ఉన్న; అలఘు చరిత్రునకున్= గొప్పదైన శీలం కలవాడికి; లఘుత= అల్పత్వాన్ని; కోరన్= కోరటం; అగునే?= తగునా? (తగదని భావం).

**తాత్పర్యం:** ప్రజల దప్పిని, ఆకలిని తీర్చటానికి అనువుగా చలిపందిరి విధంగా, పండ్లతో నిండుగా ఉన్న చెట్టువలె అమరి ఉండిన (ఇది గృహస్థాశ్రమ ధర్మం) ఉత్తమ శీలవంతుడు అల్పత్వాన్ని కోరటం తగునా?

**విశేషం:** అలం: ఉపమ. చలిపందిరి దప్పి తీరుస్తుంది. ఫలవృక్షం ఆకలి తీరుస్తుంది. గృహస్థుడు రెండూ తీరుస్తాడు.

**వ. ఇది ధర్మవిరోధంబు, దీన మోక్షంబు గలుగుననుట నాకుం జూడ సందియం' బని చెప్పె; ననవుడు నయ్యజాతశత్రుండు పురుహూత పుత్రున కిట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** ఇది= రాజ్యపాలనను త్యజించటం; ధర్మవిరోధంబు= ధర్మానికి వ్యతిరేకం; దీనన్= దీనివలన; మోక్షంబు= మోక్షం; కలుగును+అనుట= కలుగుతుందనటం; నాకున్+చూడన్= నా దృష్టిలో; సందియంబు= అనుమానం; అని, చెప్పెను= అని అన్నది; అనవుడున్= అనగా; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు; పురుహూత పుత్రునకున్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** రాజ్యత్యాగం ధర్మవిరోధం. దీనివలన మోక్షం కలుగుతుందని అనటం నాకు చూడగా అనుమానంగా ఉన్నది' అని జనకుడి భార్య అన్నదని అర్జునుడు తెలిపాడు. ఆ మాటలు విని ధర్మరాజు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**మ. 'శ్రుతి వాక్యంబులు కర్మనిష్ఠ వినుతించున్; నిష్క్రియత్వంబు స**
**ద్గతిఁ గావించుట యూఁది చెప్పు; నిటు చిత్త ప్రక్రియల్ రెండు చో**
**దితముల్; వానిని వింటిమన్న కలుచన్ దీపించునే తత్త్వ సం**
**గత బోధంబు? సుకర్మతం గలుగు నాకం బాత్తవీరవ్రతా! 138**

**ప్రతిపదార్థం:** ఆత్తవీరవ్రతా!= పొందబడిన (సహజమైన) వీరవ్రతం కలవాడా! అర్జునా!; శ్రుతి వాక్యంబులు= వేదవాక్యాలు; కర్మనిష్ఠన్= కర్మాచరణంలోని దీక్షను; వినుతించున్= కీర్తిస్తాయి; నిష్క్రియత్వంబు= కర్మలు చేయకుండా ఉండటం; సద్గతిన్= ఉత్తమలోక స్థితిని; కావించుట= కలిగించటం; ఊఁది= గట్టిగా నొక్కి; చెప్పున్= చెప్పుతాయి; ఇటు= ఈ విధంగా; చిత్తప్రక్రియల్= మానసిక ప్రవృత్తులు; రెండు= రెండు రకాలుగా; చోదితముల్= ప్రేరేపించబడతాయి; వానినిన్= వాటిని; వింటిమి+అన్న కలుచన్= విన్నామనే కలతవలన; తత్త్వసంగత బోధంబు= జ్ఞానంతో కూడికొన్న తెలివి; దీపించునే?= ప్రకాశిస్తుందా?; సుకర్మతన్= సత్కర్మలు చేయటంవలన; నాకంబు= స్వర్గం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'అర్జునా! వేదవాక్యాలు కర్మమార్గంలో నిష్ఠామయమైన జీవితం గడిపే విధానాన్ని బాగా కీర్తించాయి. అంతేకాదు. నిష్క్రియత్వం సద్గతిని కలిగిస్తుందని కూడా నొక్కి వక్కాణించాయి. ఈ విధంగా రెండు రకాలుగా చిత్తవృత్తులను వేదాలు ప్రేరేపిస్తున్నాయి. వీటి నన్నింటిని విని మనసు కలతపెట్టుకొంటే జ్ఞానవివేకం మన బుద్ధిలో వెలుగొందుతుందా? నిజానికి మంచి కర్మలు చేస్తే స్వర్గం లభిస్తుంది.

**తే. తత్త్వబోధంబు గలుగు నతండు నన్నుఁ। దెగడనేరఁడు; నీవు భ్రాతృత్వ సౌహృ**
**దమునఁ గర్మంబు విడుచు టధర్ము వనిన। పలుకు ప్రియమ జగన్న్యాయ పథము గనుట. 139**

**ప్రతిపదార్థం:** తత్త్వబోధంబు కలుగు నతండు= జ్ఞానబోధ కలవాడు; నన్నున్= నన్ను - ధర్మరాజును; తెగడన్ నేరఁడు= తిట్టలేడు, నిందించలేడు; నీవు= నీవు - అర్జునుడు; భ్రాతృత్వ సౌహృదమునన్= సోదర ప్రేమతో; కర్మంబు విడుచుట= కర్మ పరిత్యాగం;

అధర్మ్మవు+అనిన= అధర్మం అన్న; పలుకు= మాట; జగత్+న్యాయ పథము= లోకన్యాయ మార్గం; కనుటన్= పొందటంచేత; ప్రియము+అ= సంతోషకరమే.

**తాత్పర్యం:** జ్ఞానబోధ కలవాడు నన్ను తప్పుపట్టడు. నీవు సోదరప్రేమతో కర్మపరిత్యాగం అధర్మం అన్నమాట లోకన్యాయాన్ని అనుసరించి ఉండటం చేత సంతోషకరమే.

**సీ.** **వడముడియును నీవు వాయు వాసవుల। శక్తులు ధరియించిన దుర్జయులరు;**
**హరి కరుణాతిశయమునఁ దత్తేజంబు। మీయందుఁ దగ సంక్రమించి యుండు;**
**మీరు సంగరశాస్త్ర సారపారగులరు। గాక తత్త్వజ్ఞాన ఘనమతులరె?**
**యనఁటికంబమునట్ల యనిరి నిస్సారత। సంసార మనఁగ నిస్సం ప్రబుద్ధు**

**తే.** **లది ప్రసిద్ధము; విను తృష్ణ యడఁచి కర్మ। వృత్తి విడిచి నిరాలంబచిత్తుఁ డైన**
**యాతఁడో సుఖి దోషదుఃఖాకరంబు। లగు ధనంబులు గోరెడు నతఁడొ? చెపుమ!** **140**

**ప్రతిపదార్థం:** వడముడియును= భీముడూ; నీవున్= నీవూ (అర్జునుడు); వాయు వాసవుల= వాయుదేవుడియొక్క, ఇంద్రుడియొక్క; శక్తులు= బలాలు, మహిమలు; ధరియించిన= వహించిన; దుర్జయులరు= జయించటానికి శక్యం కానివారు; హరి= శ్రీకృష్ణుడియొక్క కరుణ+అతిశయమునన్= దయా విశేషంచేత; తద్+తేజంబు= ఆతడి శక్తి ప్రకాశం; మీ+అందున్= మీలో; తగన్= ఒప్పునట్లుగా; సంక్రమించి+ఉండున్= కలిగి ఉంటుంది; మీరు= (భీమార్జునులు); సంగరశాస్త్ర సార పారగులరు= యుద్ధశాస్త్రంలోని తాత్పర్యంలో తీరం ముట్టిన వారు (పండితులు); కాక= ఔతారు కాని; తత్త్వజ్ఞాన ఘనమతులరె?= వేదాంత జ్ఞానంలో గొప్పపండితులా?; సంసారము= ఈ సంసారం; అనఁగన్= అంటే; నిస్సారత= సారం లేకపోవటంలో; అనఁటి కంబము+అట్లు+అ= అరటిబోదె వంటిదే అని; నిస్సంప్రబుద్ధులు= పరిపూర్ణమైన ఎరుక గలవారు; అనిరి= అన్నారు; అది= ఆ మాట; ప్రసిద్ధము= అందరికీ బాగా తెలిసిందే; విను= వినుము; తృష్ణ= కోర్కె, ఆశ; అడఁచి= అణచికొని; కర్మ వృత్తి= కర్మలయందు వర్తించటం (చేయటం); విడిచి= వదలి; నిరాలంబచిత్తుఁడు+ఐన= ఆధారంలేని మనఃప్రవృత్తి కలవాడైన; ఆతఁడో= వాడో; దోష దుఃఖ+ఆకరంబు+అగు= పాపాలకూ, దుఃఖాలకూ ఆధారాలైన; ధనంబులు= సంపదలను; కోరెడు+అతఁడొ= కోరేవాడో; సుఖి= సుఖంగా ఉండేవాడు; చెపుమ!= చెప్పుము.

**తాత్పర్యం:** భీముడు, వాయుదేవుడి శక్తిని, నీవు ఇంద్రుడి మహత్త్వాన్ని ధరించి శత్రువులకు గెలవటానికి వీలుకానివారు. అంతేకాక, శ్రీకృష్ణుడి దయావిశేషంచేత అతడి ప్రకాశంకూడా మీలో చేరి ఉన్నది. మీరు యుద్ధవిద్యలో పండితులే కాని, వేదాంత తత్త్వజ్ఞానంలో గొప్పవారు కాదు కదా! సారహీనంగా ఉండటంలో ఈ సంసారం అరటిబోదెవంటిదని ఆత్మజ్ఞానం కలిగినవారు అన్నమాట అందరికీ తెలిసినదే. కోరికలు వదలి, కర్మల నాచరించటం (కర్మసంగం) వదలి చిత్తము దేనిపై లగ్నంచేయకుండా ఉండేవాడు సుఖంగా ఉంటాడా? లేక సమస్తదోషాలకూ, బాధలకూ, నిలయమైన ధనం కోరేవాడు సుఖంగా ఉంటాడా? జాగ్రత్తగా విని (ఆలోచించి) చెప్పుము.

**ఉ.** **ఆదటఁ బూర్వశాస్త్రముల యర్థము లారఁగఁ గ్రోలి తత్త్వసం**
**వేద సుధారసంబున చవిం జిరసౌఖ్యముఁ బొంద నేర కి**
**మ్మేదిని నెందునుం దిరిగి మేలని కర్మము యూఁది చెప్పుచుం**
**గా దని శాంతి యొప్పనిదిగాఁ జెడనాడుదు రల్పబోధనుల్.** **141**

**ప్రతిపదార్థం:** అల్పబోధనుల్= మిడిమిడి జ్ఞానం కలవారు (అల్పజ్ఞానులు); ఆదటన్= ప్రేమతో, భక్తితో; పూర్వశాస్త్రముల+అర్థములు= ప్రాచీన శాస్త్రగ్రంథాలలోని తాత్పర్యాలను; ఆరఁగన్= నిండుగా, పూర్తిగా; క్రోలి= ఆస్వాదించి; తత్త్వ సంవేద సుధారసంబున=

వేదాంత జ్ఞానమనే అమృత రసంలోని; చవిన్= రుచిచేత; చిరసౌఖ్యమున్= దీర్ఘకాల సుఖాన్ని; పొందనేరక= పొందలేక; ఈ+మేదినిన్= ఈ భూమియందు; ఎందునున్+తిరిగి= ఎక్కడైనా సంచరించి; కర్మము+అ= కర్మమార్గమే; మేలు+అని= మంచిదని; ఊఁది చెప్పుచున్= నొక్కి చెప్పుతూ; కాదు+అని= అది కాదని; శాంతి= శాంతం; ఒప్పనిదిగాన్= తగినది కానట్లుగా; చెడన్+ఆడుదురు= నిందిస్తారు.

**తాత్పర్యం:** శ్రద్ధగా పూర్వమీమాంసా శాస్త్రాలన్నీ పూర్తిగా చదివి, వాటి అర్థాన్ని సంపూర్ణంగా ఆస్వాదించి కూడా, జ్ఞానబోధ కొద్దిగా మాత్రమే కలిగినవారు, తత్త్వజ్ఞానం అనే అమృతంలోని రుచి కారణంగా శాశ్వతసుఖాన్ని (ఆనందాన్ని) పొందలేక, భూమండలంపై ఎక్కడెక్కడో తిరిగి, కర్మమార్గమే మంచిదని నొక్కి వక్కాణిస్తూ, మరల కాదని చెపుతూ శాంతి తగదంటూ చెడుమాటలు మాట్లాడుతూ ఉంటారు.

**విశేషం:** ఊరక గ్రంథాలు చదివినా, వాటి అర్థం తెలిసికొన్నా ప్రయోజనం లేదు. 'బోధము' అంటే ఈ గ్రంథాలన్నీ దేని గురించి చెపుతున్నాయో ఆ జ్ఞానం ఆత్మను వెలిగించి అనుభూతం కావటం. అది 'స్వల్పం' కనుక, 'తత్త్వము' అనగా అసలు విషయం తెలియక అయోమయంలో పడి, కొంతకాలం మంచిదన్నదానినే తరువాత కాదనటం జరుగుతుంది. అందుకే 'అల్పబోధనుల'నే మాట ప్రయోగించటం జరిగింది.

**క. విమల జ్ఞానులు శమమును। దమమును ద్యాగంబు శాశ్వత ప్రచురానం**
**దమునకు మూలము లండ్రు; ని। జముగాఁ గైకొందు రవి ప్రసన్నవివేకుల్.' 142**

**ప్రతిపదార్థం:** విమల జ్ఞానులు= అచ్ఛమైన జ్ఞానం కలవారు; శమమును= అంతరింద్రియ నిగ్రహమూ; దమమును= బహిరింద్రియ నిగ్రహమూ; త్యాగంబు= త్యాగశీలమూ; శాశ్వత= స్థిరమైన; ప్రచుర= మిక్కుటమైన; ఆనందమునకున్= ఆనందం పొందటానికి; మూలములు= మొదళ్ళు, కారణాలు; అండ్రు= అంటారు; ప్రసన్న+వివేకులు= కార్యాకార్య విచక్షణా జ్ఞానం కలిగినవారు; అవి= ఆ మాటలు; నిజము+కాన్= నిజమే అని; కైకొందురు= స్వీకరిస్తారు, అంగీకరిస్తారు.

**తాత్పర్యం:** అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహం, త్యాగబుద్ధీ శాశ్వతమైన అధికమైన ఆనందాన్ని కలిగించటానికి హేతువులని అచ్ఛమైన జ్ఞానం కలవారు చెప్పారు. చక్కని విచక్షణాజ్ఞానం కలవా రామాటలు వాస్తవమని అంగీకరిస్తారు'.

**వ. అనిన విని దేవస్థానుం డమ్మానవపతి కిట్లనియె. 143**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; దేవస్థానుండు= దేవస్థానుడు అనే పేరు కల ముని; ఆ+మానవపతికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలను విన్న దేవస్థానుడనే ముని ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

### దేవస్థానుం డను ముని ధర్మజునకు హితోపదేశంబు సేయుట (సం. 12-20-1)

**సీ. ధనము లుత్కృష్టంబు లను ధనంజయు మాట। పాటిగాఁ గొనుము; సోపానభంగి**
**నున్నది మార్గంబు యోగసమారోహ। ణమునకు; దానన నడచి కాక**
**వడి నుల్కిపడ నీకు వచ్చునే? ధనసంగ్ర। హంబు భోగార్థ కృతంబు దుష్ట**
**మగుటయుఁ గలదు; యజ్ఞార్థ కృతంబైన। నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద;**

**తే. యజ్ఞపరిశిష్ట ధనభోగ మాత్మకలఁక । యుడుపు; నమ్మెయి శమదమయుక్తి గలుగు;**
**శమము దమమును దత్త్వ విజ్ఞానదములు । గాన దక్షిణాధిక యజ్ఞకర్త వగుము. 144**

**ప్రతిపదార్థం:** ధనములు= సంపదలు; ఉత్కృష్టంబులు+అను= శ్రేష్ఠమైనవి అనే; ధనంజయు= అర్జునుడి; మాట= పలుకును; పాటిగాన్= న్యాయమైనదిగా; కొనుము= గ్రహించుము; యోగసమారోహణమునకున్= యోగసిద్ధి పొందటానికి ఎక్కవలసిన; మార్గంబు= దారి; సోపాన+భంగిన్= మెట్లవలె; ఉన్నది= ఉన్నది; దానన్+అ= ఆ మెట్ల దారిలోనే; నడచి+కాక= పయనించినట్లయితే తప్ప; నీకున్; వడిన్+ఉల్కిపడన్= వేగంగా భయంతో కంపించటంవలన; వచ్చునే= (యోగసిద్ధి) లభిస్తుందా?; భోగ+అర్థకృతంబు= అనుభవించటమే ప్రయోజనంగా చేసిన; ధన సంగ్రహంబు= ధనాన్ని సంపాదించి కూడబెట్టటం; దుష్టము= చెడ్డది; అగుటయున్+కలదు= అవటం కూడ ఉన్నది; యజ్ఞ+అర్థ+కృతంబు+ఐన= యజ్ఞం కొరకు చేసినదైతే; అది+అ= అదే; బ్రహ్మపదమున్+ఒందన్= బ్రహ్మలోక ప్రాప్తికి; నిచ్చెన; యజ్ఞ= యాగములందు; పరిశిష్ట= మిగిలిన; ధనభోగము= ధనమును అనుభవించటం; ఆత్మ కలఁక= ఆత్మలోని కలతను; ఉడుపున్= పోగొట్టుతుంది; ఆ+మెయిన్= ఆ పద్ధతిలో; శమ+దమ+యుక్తి+కలుగన్= అంతరింద్రియ, బాహ్యేంద్రియ నిగ్రహం; దమమును= బాహ్యేంద్రియ నిగ్రహం; తత్త్వ విజ్ఞానదములు= పరతత్త్వ (బ్రహ్మ)సంబంధమైన జ్ఞానాన్ని ఇస్తాయి; కాన= అందువలన; దక్షిణా+అధిక= అధిక దక్షిణలతో యజ్ఞకర్తవు= యజ్ఞం చేసినవాడవు; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సంపదలు శ్రేష్ఠమైనవి అని చెప్పిన అర్జునుడి మాటలు తప్పక పాటించుము. యోగసిద్ధి (జీవాత్మ పరమాత్మల కలయిక) ఎక్కటానికి చక్కని మెట్లదారి ఉన్నది. ఆ దారిలో వెళ్ళితేనే తప్ప యోగసిద్ధి లభ్యంకాదు. ధనసముపార్జనం తాను భోగాల ననుభవించటానికి చేస్తే తప్పు. యజ్ఞంకొరకు చేస్తే బ్రహ్మపదం పొందటానికి నిచ్చెనవలె ఉపయోగపడుతుంది. యజ్ఞంలో వాడగా మిగిలిన ధనం వాడటం మనోవ్యాకులతను పోగొట్టుతుంది. అట్లా చేయటంవలన శమదమాలు కలుగుతాయి. శమదమాలు బ్రహ్మజ్ఞానాన్నిస్తాయి. అందువలన దక్షిణ లెక్కువగా ఉండే యజ్ఞం చేసినవాడవు కమ్ము.

**చ. హరుఁడును సర్వమేధ మను యాగమునం బ్రచుర ప్రకాశతం**
**బొరయఁగ వేడ్కఁ జేసె విధిపూర్వ దిగీశముఖామరుల్ మహా**
**ధ్వరములఁ గాదె పేర్కొనుట ధాత్రి సధర్మత నేలి యజ్ఞ త**
**త్పరత వెలుంగరే నృపులు, పార్థివముఖ్య! మరుత్త ముఖ్యులున్. 145**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్య!= రాజశ్రేష్ఠా! ధర్మరాజా!; హరుఁడును= శివుడుకూడా; సర్వమేధము+అను= సర్వమేధము అనే పేరుగల; యాగమునన్= యజ్ఞంతో; ప్రచుర ప్రకాశతన్+పొరయఁగన్= అధికమైన తేజాన్ని పొందటానికి; వేడ్కన్= వేడుకతో, సంబరంగా; చేసెన్= నిర్వహించాడు, చేశాడు; విధి, పూర్వదిగీశముఖామరుల్= బ్రహ్మ, ఇంద్రుడు మొదలయిన దేవతలు అందరు; మహా+అధ్వరములన్= గొప్పయజ్ఞాలవలన, కాదె= కదా!; పేర్కొనుట= కీర్తి పొందింది; మరుత్త ముఖ్యులున్= మరుత్తు మొదలైన; నృపులు= రాజులు; ధాత్రిన్= భూమిని; సధర్మతన్= ధర్మంతో, ధర్మమార్గంలో; ఏలి= పరిపాలించి; యజ్ఞతత్పరతన్= యజ్ఞం చెయ్యటంలో నిమగ్నులై; వెలుంగరే?= ప్రకాశించటం లేదా?

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడవైన ధర్మరాజా! శివుడు కూడ సర్వమేధం అనే పేరున్న యాగాన్ని చేసి కీర్తిని, తేజాన్ని పొందాడు. బ్రహ్మ, ఇంద్రుడు, మొదలైన దేవతలందరూ గొప్ప యజ్ఞాలు చేసి కదా పేరుపొందింది! మరుత్తు మొదలైన చక్రవర్తులందరూ భూమిని ధర్మమార్గంలో పాలిస్తూ యజ్ఞాలు చేసి ప్రకాశించారు కదా!

**వ. వినుము దివస్పతి యడుగ బృహస్పతి సన్మార్గ నిర్దేశకుండై చెప్పిన మార్గంబు. 146**

**ప్రతిపదార్థం:** దివస్పతి= ఇంద్రుడు; అడుగన్= ప్రశ్నించగా; బృహస్పతి= దేవగురువు; సన్మార్గ= మంచి దారిని; నిర్దేశకుండు+ఐ= చూపించినవాడై; చెప్పిన= బోధించినటువంటి; మార్గంబు= పద్ధతి; వినుము= వినుము.

**తాత్పర్యం:** ఇంద్రుడు అడిగితే బృహస్పతి మంచి మార్గాన్ని సూచిస్తూ చెప్పిన పద్ధతిని వినుము.

**ఉ. కామముఁ గ్రోధమున్ మనసుఁ గాడఁగఁ బాఱుట మాన్చి యింద్రియ**
**స్తోమ విమార్గ వర్తనము ద్రుంచుచు నెవ్వగ లేక రక్షణం**
**బేమర కెవ్వరిం జెనకి యించుక నొంపక లోక మేలఁగా**
**నా మహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు వాసవా! 147**

**ప్రతిపదార్థం:** వాసవా!= ఇంద్రుడా!; కామము= కోరిక; క్రోధమున్= కోపమూ; మనసున్= మనస్సును; కాఁడఁగన్+పారుట= కలత పెట్టటం; మాన్చి= మానిపించి, ఆపి; ఇంద్రియస్తోమ= ఇంద్రియాల సమూహం యొక్క; విమార్గ వర్తనము= చెడ్డదారులలో నడవటం; త్రుంచుచున్= (తెగవేస్తూ) అరికట్టుతూ; నెఱ+వగ= అధికమైన బాధను; లేక= పొందక; రక్షణంబు= ప్రజాసంరక్షణం, ప్రజలను కాపాడటం; ఏమరక= అశ్రద్ధ చేయక; ఎవ్వరిన్= ఎవరినీ; చెనకి= ఎదిరించి; ఇంచుక= కొద్దిగా కూడా; నొంపక= బాధించక; లోకము+ఏలఁగాన్= భూమిని పరిపాలించినట్లైతే; ఆ మహితాత్మున్= ఆ మహాత్ముడిని, ఆ మహానుభావుడిని; సర్వ= సమస్తమైన; మహిమ+అతిశయింబును= గొప్పతనం యొక్క ఆధిక్యం; చెందును= ప్రాప్తిస్తుంది.

**తాత్పర్యం:** అరిషడ్వర్గాలలోనివైన కామక్రోధాలను మనస్సులో వర్తించకుండా ఆపి, ఇంద్రియాలను పక్కదారులు పట్టకుండా అరికట్టి, తాను శోకం పొందకుండా ఉండి, ప్రజలను కాపాడటంలో అప్రమత్తుడై ఉండి ఎవ్వరినీ కొద్దిగా కూడా బాధించక, లోక పరిపాలన చేసే మహాత్ముడిని సమస్తమైన మహత్తరగుణాలు తమంత తాముగా వచ్చి చేరుతాయి.

**వ. అనియె మఱియు నాకర్ణింపుము. 148**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; మఱియున్= ఇంకా; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఈ మాటలు చెప్పి, ఇంకా వినుమని ఇట్లా అన్నాడు దేవస్థానుడు.

**ఉ. కర్మము మేలు నా విగతకర్మము మేలన రెండు నొప్పునే?**
**కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁ జేఁత స**
**ద్ధర్మముగా కనంగ వివిధంబగు ధర్మపథంబులోన మేల్**
**ధార్మికవర్య! యేర్పఱుపఁ దా వశమే వగ బుద్ధి గుందఁగన్. 149**

**ప్రతిపదార్థం:** ధార్మికవర్య!= ధర్మమార్గంలో నడిచేవారిలో శ్రేష్ఠుడా!; కర్మము= కర్మాచరణం; మేలు= మంచిది; నాన్= అనగా; విగతకర్మము= కర్మాచరణం లేకుండటం; మేలు= మంచిది; అనన్= అనగా; రెండున్= రెండూ; ఒప్పునే?= కుదురుతాయా?; తగన్= చక్కగా; కర్మఫలంబున్= చేసిన కర్మల యొక్క ఫలితాన్ని; ఈశ్వరున్+అందున్= పరమాత్మయందు; అర్పితముగాన్= సమర్పించే విధంగా; చేఁత= చేయటం; సత్+ధర్మము+కాక= మంచి ఆచరణీయ పద్ధతి అవుతుంది; అనంగన్= అంటూ ఉండగా; వివిధంబు+అగు= అనేకంగా విస్తరించిన; ధర్మపథంబులోనన్= ధర్మమార్గంలో; మేల్= ఇది మంచిది అని;

ఏర్పఱుపన్= నిర్ధారించటానికి; తాన్= తాను; వగన్= శ్రమతో; బుద్ధిన్= మనస్సులో; కుందఁగన్= బాధపడటం; వశమే?= శక్యమా? వీలవుతుందా?

**తాత్పర్యం:** 'ధర్మమార్గానువర్తివైన ధర్మరాజా! కర్మానుచరణం మంచిది, కర్మత్యాగం మంచిది అంటే - రెండూ సరైనవి ఎట్లా అవుతాయి? కర్మల నాచరిస్తూ, కర్మఫలాన్ని పరమాత్మయందు సమర్పించటం మంచి ధర్మం అవుతుంది. వివిధమైన రూపాలుగా విస్తరించిన ధర్మమార్గంలో ఏది మంచిది? అని మనసులో ఎంత విచారించినా, నిర్ధారించటం వీలవుతుందా?

**విశేషం:** ఇది ధర్మం అని నిర్ధారించటం కష్టం. కర్మ త్యాగంకన్నా, కర్మఫల త్యాగం శ్రేష్ఠమని చెప్పటం తాత్పర్యం.

**ఉ.** **కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ మెయ్యెడన్**
**వావిరిఁ జేయ కేలు భువనంబు భవత్కుల ధర్మరక్షివై!**
**భూవరు లిట్లు సేసి, తుదిఁ బుత్రుల గద్దియలందు నిల్పి కా**
**దే వనవాసు లైరి దృఢదీప్త నిరంజన బోధసంపదన్.** **150**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; సిద్ధి+అసిద్ధుల= కార్యం సిద్ధించినప్పుడు, సిద్ధించనప్పుడూ (జయాపజయాలలో); వికారమున్+పొందక= మనోవికారం (జయానికి పొంగటం, అపజయానికి క్రుంగటం) పొందకుండా; ద్రోహము= నమ్మించి మోసగించటం; ఏ+ఎడన్= ఎక్కడా కూడా; వావిరిన్= క్రమంగా; చేయక= చెయ్యకుండా; భవత్+కుల+రక్షివి+ఐ= నీ కులధర్మాన్ని కాపాడుతున్నవాడివై; భువనంబున్= లోకమును, భూమిని; ఏలు= పాలించుము; భూవరులు= రాజులు; ఇట్లు+చేసి= పైన చెప్పిన విధంగానే ఆచరించి; తుదిన్= చివరకు; పుత్రులన్= కుమారులను; గద్దియల+అందున్= సింహాసనాలపై; నిల్పి= కూర్చోపెట్టి; దృఢ, దీప్త, నిరంజన, బోధ, సంపదన్= స్థిరమైన, ప్రకాశవంతమైన, అమలిన, జ్ఞానబోధ అనే సంపదతో; వనవాసులు+ఐరి= వానప్రస్థాశ్రమానికి వెళ్ళారు; కాదు+ఏ!= కదా!.

**తాత్పర్యం:** ధర్మరాజా! అందువలన, జయాపజయాలు కలిగినప్పుడు పొంగిపోవటం, క్రుంగిపోవటం వంటి మనోవికారాలు పొందకుండా - అంటే చిత్త స్థైర్యంతో ఎవరినీ నమ్మించి మోసం చేయకుండా, నీ కులధర్మాన్ని కాపాడుకొంటూ భూమిని పరిపాలించవలసింది. పూర్వపు రాజులందరూ ఇదే విధంగా ప్రవర్తించి చివరకు కుమారులను సింహాసనంపై నిల్పి స్థిరమైన ప్రకాశవంతమైన అమలినమైన జ్ఞానబోధ అనే సంపదతో వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించారు కదా!'

**వ.** **అనిన విని నిర్విణ్ణమానసుండై యున్న యన్నకు నర్జునుం డిట్లనియె.** **151**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; నిర్విణ్ణమానసుండు+ఐ= నిర్వేదంతో కూడుకొన్న మనస్సు కలవాడై; ఉన్న= ఉండిపోయిన; అన్నకున్= అన్న అయిన ధర్మరాజుతో; అర్జునుండు+ఇట్లనియెన్= అర్జును డీ విధంగా మాట్లాడాడు.

**తాత్పర్యం:** దేవస్థాను డనే ముని మాట్లాడిన మాటలను విని, నిర్వేదంతో ఉన్న ధర్మరాజును చూచి; అర్జునుడు ఈ విధంగా మాట్లాడాడు.

**సీ.** **' క్షత్రియ ధర్మ నిష్ఠాపరత్వంబున । సమరంబు సేసితి; శస్త్రనిహతిఁ**
**బూతాత్ములై రిపుల్ వోయిరి సద్గతి; । కమ్మెయి రాచకర్మ మ్మొనర్చు**
**విప్రునకైనను సుప్రశస్తం; బది । రౌద్రం బగుట బాలురకును దెల్ల**
**మైనను నిట్లుండు నార్యోక్తి; నృపనీతి । దురితంబు సేయునే? యొరుఁడు వెట్టఁ**

**ఆ. గుడువ నృపతి మాత్రకునకును గాదన్న । గౌరవాన్వయాగ్రగణ్యుఁ డైన**
**నీకుఁ దగునె? విడువు శోకంబు; వజ్రస । న్నిభము గాదె నృపుల నెమ్మనంబు. 152**

**ప్రతిపదార్థం:** క్షత్రియ ధర్మ నిష్ఠాపరత్వంబునన్= రాజధర్మం పాటించటంలో నిమగ్నుడవై ఉండి; సమరంబు= యుద్ధం; చేసితి(వి)= చేశావు; శస్త్ర= ఆయుధాలచేత; నిహతిన్= చంపబడటంచేత; పూత+ఆత్ములు+ఐ= పరిశుద్ధం చేయబడిన ఆత్మలు కలవారై; రిపుల్= శత్రువులు; సత్+గతికిన్= ఉత్తమ లోకాలకు; పోయిరి= వెళ్ళారు; ఆ+మెయి= ఆ పద్ధతి; రాజకర్మమ్ము= రాచరికం; ఒనర్చు= చేసేటువంటి; విప్రునకున్+ఐనను= బ్రాహ్మణుడికి అయినా; సు+ప్రశస్తంబు= బాగా మేలైన విషయం; అది= రాజ్యపాలన, యుద్ధం చేసే విషయం; రౌద్రంబు+అగుట= మిక్కిలి భయంకరమైనది అనే సంగతి; బాలురకును= పిల్లలకు కూడా; తెల్లము= స్పష్టం, బాగా తెలుసు; ఐనను= అయినా కాని; నృపనీతి= రాజనీతి; దురితంబు= పాపం; చేయును+ఏ?= చేస్తుందా?; అని; ఆర్యోక్తి= పెద్దలమాట; ఇట్లు+ఉండున్= ఈ విధంగా ఉన్నది; ఒరుఁడు= ఇతరుడు; పెట్టన్= పెట్టగా; కుడువన్= తినటం; నృపతి మాత్రకునకును= మామూలు రాజైనవాడికి; కాదు+అన్నన్= కుదరదు అనగా; కౌరవ+అన్వయ+అగ్రగణ్యుఁడు+ఐన= కురువంశంలో మొదట లెక్కింపదగినవాడైన; నీకున్= ధర్మరాజుకు; తగునె?= సరి అయినదా? (సరిపడ దని భావం); శోకము= విచారం; విడువు= వదలిపెట్టుము; నృపుల= రాజుల; నెఱ+మనంబు= నిండుమనస్సు; వజ్ర+సన్నిభము= వజ్రాయుధంతో సమానమైనది; కాదు+ఏ= కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజధర్మాన్ని అనుష్ఠించటంలో భాగంగా యుద్ధం చేశావు. ఆ యుద్ధంలో ఆయుధాలు తగలటంతో పవిత్రులైన శత్రువులు ఉత్తమ లోకప్రాప్తిని పొందారు. ఈ విధమైన రాజధర్మ నిర్వహణ రాజ్యభారం నిర్వహించే బ్రాహ్మణుడికైనా శ్రేష్ఠమైనది. రాజ్యభారం వహించటం, యుద్ధం చేయటం, రౌద్రరసంతో కూడుకొన్నవనే సంగతి పిల్లలకైనా తెలుసు. రాజనీతిలో పాపాలు చేయటం ఉండదని ఆ పెద్దలు చెప్పేమాట. మామూలు రాజుకైనా ఇతరులు పెడుతుండగా తినటం తగదు. అటువంటిది, కౌరవవంశంలో శ్రేష్ఠుడవైన నీకు అది తగింది కాదు. కనుక శోకం వదలిపెట్టుము. రాజుల మనస్సులు వజ్రంతో సమంగా ఉండాలి సుమా! (రాజుల మనసులు వజ్రంవలె కఠినంగా మొక్కవోనివిగా ఉండాలని భావం).

**వ. అట్లుంగాక. 153**

**తాత్పర్యం:** అంతేకాక.

**ఉ. వైరివధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరానిదై**
**వైరులకున్ భవత్సమరవాంఛన సద్గతి కేఁగఁ బాలి దై**
**చేరె విధాతృ సంఘటనఁ; జింతకుఁ గారణమేమి? ధర్మ వి**
**స్తార విదుండ వీ; వకట! ధైర్య సమగ్రుఁడవై వెలుంగవే. 154**

**ప్రతిపదార్థం:** విధాతృ= బ్రహ్మయొక్క; సంఘటనన్= కూర్పువలన (ఏర్పాటు వలన); వైరివధంబు= శత్రు సంహారం; అవశ్యమున్= తప్పక; చేయకపోవరానిది+ఐ= చేయకుండ వీలులేనిదై; నీకునున్= నీకూ (ధర్మరాజుకు); భవత్= నీతో; సమర వాంఛన్+అ= యుద్ధం చేసే కోరికతోనే; సద్గతికిన్+ఏఁగన్= మంచి లోకాలకు వెళ్ళటానికి; వైరులకున్= శత్రువులకు; పాలిది+ఐ= భాగస్థమై, వంతుగా; చేరెన్= కూడాయి (సంఘటిల్లాయి); చింతకున్= బాధపడటానికి; కారణము= హేతువు; ఏమి= ఏముంది; అకట!= అయ్యో!; ఈవు= నీవు; ధర్మ విస్తార విదుండవు= ధర్మ స్వరూపం బాగా తెలిసినవాడివి; ధైర్య సమగ్రుఁడవు+ఐ= ధైర్యంతో కూడుకొన్న వాడివై; వెలుంగవు+ఏ= ప్రకాశించుము.

**తాత్పర్యం:** శత్రువధ చేయక తప్పనట్లు నీకూ నీతో యుద్ధం చేయాలనే కోరికతోనే ఉత్తమగతులకు వెళ్ళటం నీ శత్రువులకూ వంతులుగా చక్కగా సంఘటిత పరచాడు బ్రహ్మ. ఇందులో బాధపడవలసిన దేముంది? నీకు ధర్మస్వరూపం బాగా తెలుసు. అందువలన ధైర్యాన్ని కూడగట్టుకొని ప్రకాశించుము.

**వ. రాజధర్మోపాత్తంబై భవదాయత్తంబైన పూజ్యసామ్రాజ్యంబుఁ బరిపాలించుచుఁ బుణ్యక్రియానుష్ఠాన పరుండ వగు' మని పలికిన మఱుమాట పలుక కున్న యన్నరేంద్రునకు మునీంద్ర వర్యుం డగు పారాశర్యుం డిట్లనియె. 155**

**ప్రతిపదార్థం:** రాజధర్మ+ఉపాత్తంబు+ఐ= క్షత్రియ ధర్మంతో పొందబడినదై; భవత్+ఆయత్తంబు+ఐన= నీ అధీనం అయిన; పూజ్య= పూజించదగిన; సామ్రాజ్యంబున్= మహా సామ్రాజ్యాన్ని; పరిపాలించుచున్= చక్కగా పాలనచేస్తూ; పుణ్యక్రియా= మంచి పనులు; అనుష్ఠాన పరుండవు= ఆచరించటంలో నిమగ్నుడవు; అగుము= కమ్ము; అని పలికినన్= అంటూ అర్జునుడు చెప్పగా; మఱుమాట= మరొక మాట; పలుకక+ఉన్న= మాట్లాడకుండా ఉన్న; ఆ+నర+ఇంద్రునకున్= ఆ రాజశ్రేష్ఠుడితో (ధర్మరాజుతో); ముని+ఇంద్ర+వర్యుండు+అగు= మునులలో శ్రేష్ఠుడైన; పారాశర్యుండు= వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** రాజధర్మానుసారం నీవు పొంది, నీ అధీనంలో ఉన్న మహా సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ, సత్కార్యాలు చేయటంలో నిమగ్నుడవై ఉండవలసింది' అని అర్జును డన్న మాటలకు మారుమాట్లాడకుండా ఉన్న ధర్మరాజుతో వ్యాసమహర్షి ఇట్లా అన్నాడు.

**సీ. ' అర్జును పలుకు సత్యంబు సమీచీన; । మార్యజనంబు గృహస్థ ధర్మ**
**ముత్తమం బని చెప్పు నుర్వీశ! పశుపక్షు । లాదిగ జీవుల కాశ్రయంబు;**
**నృపులకు నది దక్కఁ దపమును దమమును । బ్రహ్మచర్యమును ధర్మములు గావు;**
**ధనములఁ దనియుట యని కోహటించుట । ప్రజల రక్షింపమి రాజకోటి**

**ఆ. కరయఁ బాతకంబు లండ్రు; నీ వక్కడ । వేదచోదనా ప్రవీణ మయిన**
**మనసు నేల యిట్లు మార్గవృత్తికిఁ జౌర । నిచ్చె; దోపి ధరణి యేలు మనఘ! 156**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ!= భూమీపతీ! ధర్మరాజా!; అర్జును పలుకు= అర్జునుడు చెప్పిన మాటలు; సత్యంబు= నిజం, వాస్తవం; సమీచీనము= యుక్తం; ఆర్యజనంబు= పూజ్యులైనవారు, పెద్దలు; గృహస్థధర్మము= గృహస్థాశ్రమ ధర్మం; ఉత్తమంబు+అని= శ్రేష్ఠమని; చెప్పును= చెపుతారు; పశు+పక్షులు+ఆదిగాన్+జీవులకున్= జంతువులు, పక్షులు మొదలైన సమస్త ప్రాణులకు; ఆశ్రయంబు= శరణమైనట్టిది (అయిన); అది= ఆ గృహస్థాశ్రమధర్మం; తక్క= కాక; నృపులకున్= రాజులకు; తపమును= తపస్సును; దమమును= ఇంద్రియ నిగ్రహం; బ్రహ్మచర్యమును= బ్రహ్మచర్యాశ్రమమును పాలించటం (వివాహం చేసికొని గృహస్థాశ్రమ ధర్మాన్ని స్వీకరించక, వేదాధ్యయన పరుడై ఉండిపోవటం); ధర్మములు+కావు= ఆచరించవలసిన విధులు కావు; ధనములన్= సంపదలవలన; తనియుట= సంతృప్తిచెందటం; అనికిన్= యుద్ధానికి; ఓహటించుట= వెనకాడటం; ప్రజలన్= పాలితులను; రక్షింపమి= కాపాడకుండా ఉండటం (అనేవి); అరయన్= పరిశీలించి చూడగా; రాజకోటికిన్= రాజసమూహానికి; పాతకంబులు= నివృత్తి లేని పాపాలు; అండ్రు= అంటారు; అక్కట!= అయ్యో!; నీవు= నీవు; వేద+చోదనా+ప్రవీణము+అయిన+మనసున్= వేదములు చెప్పిన మార్గంలో నడవటంలో నేర్పుగల నీ మనస్సును; ఇట్లు= ఈ విధంగా; అమార్గవృత్తికిన్= కూడని దారిలో చరించటానికి (అపమార్గంలో నడవటానికి); ఏల= ఎందుకు; చౌరన్+ఇచ్చెదు?= వెళ్ళనిస్తావు?; అనఘ!= పాపరహితుడ వైన ధర్మరాజా!; ఓపి= సామర్థ్యంతో; ధరణి= భూమిని; ఏలుము= పరిపాలించుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! అర్జునుడు చెప్పిన మాటలు నిజమైనవి, తగినవి. పూజనీయులైన పెద్దలు గృహస్థాశ్రమ ధర్మమే అన్నింటికన్న గొప్పది అని చెపుతారు. ఎందుకంటే, పశు పక్ష్యాది సమస్త ప్రాణులకు అది ఆధారం. గృహస్థ ధర్మం నిర్వహించటంకంటె రాజులకు మరొక పరమధర్మం లేదు. తపస్సు, ఇంద్రియ నిగ్రహం, బ్రహ్మచర్యం రాజధర్మాలు కావు. ఉన్న ధనంతో తృప్తి చెంది ఊరుకొనటం, యుద్ధానికి వెనకాడటం, తనపాలనలోని ప్రజలను రక్షించకుండా వదలెయ్యటం, రాజులకు నివృత్తిలేని పాపహేతువు లవుతాయి. వేద విహితమైన మార్గంలో నడవటంలో నేర్పరివైన నీవు ఈ విధంగా నీ మనస్సును అపమార్గంలోనికి పోనిస్తున్నావెందుకు? పాపరహితుడవైన ధర్మరాజా! సమర్థతతో భూమిని పాలించుము.

**విశేషం:** చతురాశ్రమాలు: 1. బ్రహ్మచర్యం - విద్యార్జనాకాలం; 2. గృహస్థం - వివాహితుడై ప్రజాతంతువును అవిచ్ఛిన్నంగా కొనసాగించే కాలం; 3. వానప్రస్థం - తన విధులు, బాధ్యతలు తీరినకాలం; 4. సన్న్యాసం - అన్నింటిని భగవంతుడియం దుంచి, సమస్తమున పరమాత్మను దర్శిస్తూ గడిపే కాలం. సనాతన ధర్మం మానవుని జీవితాన్ని ఈ నాలుగు భాగాలుగా విభజించింది.

**క. నీ వార్యబోధితుండవు। గావే! వర్ణాశ్రమ ప్రకారములు వినం**
**గావలయునె ధర్మంబులు। భూవరునకు దండనీతిఁ బోలంగలవే! 157**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (ధర్మరాజు); ఆర్యబోధితుండవు= పూజ్యులచేత జ్ఞాన బోధను పొందినవాడవు; కావు+ఏ?= కావా ఏమి? వర్ణ+ఆశ్రమ+ప్రకారములు= చతుర్వర్ణాల, చతురాశ్రమాల పద్ధతులు; వినంగాన్+వలయును+ఎ?= వినవలసి ఉన్నదా ఏమి?; భూవరునకున్= భూపాలకుడైన రాజునకు; ధర్మంబులు= ఇతర ధర్మాలన్నీ; దండనీతిన్= రాజనీతితో; పోలన్+కలవే?= సమానం కాగలవా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీవు పెద్దలవద్ద జ్ఞానాన్ని పొందలేదా? వర్ణాశ్రమధర్మాలు, పద్ధతులు తెలిసికొనవలసి ఉన్నదా? రాజునకు దండనీతిని (రాజ్యపాలన, యుద్ధనీతి మొదలైనవాటిని) మించిన ధర్మం మరొక్కటి లేదు.

**విశేషం:** 1. ధర్మరాజు అజ్ఞానంతో ప్రవర్తిస్తే ఆ తప్పు విద్యా బోధన చేసిన గురువుది అనటం ధర్మరాజు గురువును చులకన చేయటం - అది ధర్మరాజు సహించలేడు కదా!

2. మానవ జీవిత కాలాన్ని చతురాశ్రమాలుగా విభజించినట్లే, సమాజం మానవుల వృత్తి, ప్రవృత్తుల రీత్యా నాలుగు భాగాలుగా విభజించబడింది. అవే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు. ఈ వర్ణాలు ఈనాడు సమాజంలో అమలులో ఉన్న కులాలు ఒకటి కావు. రెంటికీ హస్తిమశకాంతరం ఉన్నది.

3. రాజ్యపాలనకు సంబంధించిన అంశాలన్నీ దండనీతిలో భాగం.

**వ. సుద్యుమ్నుండను ధరణీశుండు దండనీతిని కాదె యపవర్గంబు వడసె' ననుటయు, నజాతశత్రుం 'డాసుద్యుమ్ను వృత్తాంతంబు వినవలతు నానతి' మ్మనిన నమ్మహీపతి కమ్మునిపతి యిట్లనియె. 158**

**ప్రతిపదార్థం:** సుద్యుమ్నుండు+అను= సుద్యుమ్నుడు అనే పేరున్న; ధరణీ+ఈశుండు= రాజు; దండనీతిన్+అ= దండనీతి వలననే; కాదు+ఏ= కదా; అపవర్గంబు= మోక్షం; పడసెన్= పొందాడు; అనుటయున్= అనగా; అజాతశత్రుండు= ధర్మరాజు; ఆ సుద్యుమ్ను వృత్తాంతంబు= ఆ సుద్యుమ్నుడనే పేరుగల రాజు చరిత్ర; వినవలతున్= వినాలని కోరుకొంటున్నాను; ఆనతి+ఇమ్ము+అనినన్= సెలవీయవలసింది అనగా; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు (ధర్మరాజుకు); ఆ+మునిపతి= ఆ మునిశ్రేష్ఠుడైన వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'సుద్యుమ్ను డనేరాజు దండనీతిని అనుష్ఠించటం వలననే మోక్షం పొందాడు' అని వ్యాసుడు చెప్పగానే ధర్మరాజు 'ఆ సుద్యుమ్నుడి చరిత్ర వినాలనుకొంటున్నాను చెప్పుము' అని ప్రార్థించగా, ధర్మరాజుకు వ్యాసుడు ఇట్లా చెప్పసాగాడు.

**పారాశర్యుఁడు సుద్యుమ్ను చరితంబు ధర్మజునకుఁ జెప్పుట (సం. 12-24-1)**

**క. ' విను శంఖుండును లిఖితుం । డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ దమ్ముం**
**డును గలరు బాహుదాతీ । ర నివాసులు ధర్మతత్పర మనోవృత్తుల్. 159**

**ప్రతిపదార్థం:** విను= ధర్మరాజా! వినుము; బాహుదాతీర నివాసులు= బాహుదా నదీ తీరంలో నివసించే వారైన; ధర్మ+తత్పర+మనోవృత్తుల్= ధర్మమార్గంలో నడవటంలో లగ్నమైన మనోధర్మం కలవారైన; అన్నయున్+తమ్ముండును= అన్నదమ్ములైన; శంఖుండును+లిఖితుండు+అనన్= శంఖుడు, లిఖితుడు అనే పేర్లు కల; ఇరువురు= ఇద్దరు; విప్రవర్యులు= బ్రాహ్మణోత్తములు; కలరు= ఉన్నారు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వినుము. బాహుదానదీ తీరంలో, ధర్మమార్గ ప్రవర్తనులైన శంఖుడు, లిఖితుడు అనే పేర్లు కల అన్నదమ్ములైన బ్రాహ్మణోత్తములు ఇద్దరు ఉన్నారు.

**సీ. వారి యాశ్రమముల భూరిపుష్ప ఫలాభి । వృద్ధి నొప్పారెడి వివిధ భూరు**
**హంబులు గల; వొకయపుడు శంఖుండు గృహమ్మున లేకుండ ననుజుఁ డచటి**
**కరిగి యందొక మ్రాన నారఁబండిన పండ్లు । గని వేడ్కమై గోసికొని తినంగ,**
**నయ్యన్న యేతెంచి 'యనుజ! యీ ఫలము లె । క్కడియవి చెప్పు' నావుడును వార్చి**

**తే. ప్రణతుఁడై 'యిచ్చటివ'యని పలికె లిఖితుఁ; । డాతఁ 'డనుమతి లేక కోయంగఁ దగునె?**
**మ్రుచ్చిమియ కాదె యది? పాప మచ్చుపడియె; । నృపతిచే దండితుండవై నీఁగికొనుము. 160**

**ప్రతిపదార్థం:** వారి= ఆ శంఖలిఖితుల; ఆశ్రమములన్= ఆశ్రమాలలో; భూరి= అధికమైన; పుష్ప+ఫల+అభివృద్ధిన్= పూలు పండ్లు పెంపొందటంచేత; ఒప్పు+ఆరెడి= అందగించే; వివిధ= అనేకములైన; భూరుహంబులు= వృక్షాలు; కలవు= ఉన్నాయి; ఒక+అపుడు= ఒక సమయంలో; శంఖుండు= అన్నగారైన శంఖుడు; గృహమ్మునన్= ఇంటిలో; లేక+ఉండన్= లేకపోగా; అనుజుండు= తమ్ముడు; అచటికిన్+అరిగి= అన్న ఆశ్రమానికి వెళ్ళి; అందున్= అక్కడ; ఒక మ్రానన్= ఒక చెట్టుకు; ఆరన్+పండిన= విరగ కాసిన; పండ్లు+కని= పళ్ళనుచూచి; వేడ్కమైన్= వేడుకతో, ముచ్చటపడి; కోసికొని= తెంపుకొని; తినంగన్= తినగా; ఆ+అన్న= ఆ అన్న అయిన శంఖుడు; ఏతెంచి= వచ్చి; అనుజ!= తమ్ముడా!; ఈ ఫలములు= ఈ పళ్ళు; ఎక్కడి+అవి?= ఎచటివి?; చెప్పు= తెలుపుము; నావుడును= అని అనగా; లిఖితుఁడు= తమ్ముడైన లిఖితుడు; వార్చి= ఆచమించి; ప్రణతుఁడు+ఐ= అన్నకు నమస్కరించినవాడై; ఇచ్చటివి+అ= ఇక్కడివే; అని+పలికెన్= అని చెప్పాడు; ఆతండు= అన్న అయిన శంఖుడు; అనుమతిలేక= అనుజ్ఞ తీసికొనక; కోయంగన్+తగునె?= పళ్ళు కోయవచ్చునా?; అది= అట్లా అనుమతి లేకుండా కోయటం; మ్రుచ్చిమి+అ= దొంగతనమే; కాదు+ఎ?= కాదా?; పాపము= దోషం; అచ్చుపడియెన్= స్పష్టపడింది; నృపతిచేన్= రాజుచేత; దండితుండవు+ఐ= శిక్షించబడినవాడవై; నీఁగికొనుము= పోగొట్టుకొనుము.

**తాత్పర్యం:** ఆ విప్రసోదరులు శంఖ లిఖితుల ఆశ్రమాలు పూలతోనూ, పళ్ళతోనూ నిండిన చెట్లు కలిగి ఉండి అందగిస్తున్నాయి. ఒకసారి శంఖుడు ఇంట లేనప్పుడు లిఖితుడు అక్కడికి వెళ్ళి, ఒక చెట్టున ఉన్న ఆరముగ్గిన పళ్ళను చూచి, ముచ్చటపడి కోసికొని తిన్నాడు. అంతలో అక్కడికి వచ్చిన శంఖుడు 'ఆ పళ్ళెక్కడివి?' అని

ప్రశ్నించాడు. దానికి లిఖితుడు ఆచమించి, అన్నకు నమస్కరించి, 'ఇచ్చటివే' అని జవాబిచ్చాడు. దానికి శంఖుడు 'అనుమతి లేకుండా పళ్ళు కోయవచ్చా? అది దొంగతనం కాదా? పాపం చేసినట్లు నిర్ధారణ అయింది. రాజుచేత శిక్షించబడి పాపాన్ని పోగొట్టుకొనుము.

**వ. రయంబున రాజసన్నిధికిం జని, భవత్కర్మం బుపన్యసించి దండించుట వేఁడు' మని పలికినం దెలిసి 'యట్లకాక' యని లిఖితుండు సుద్యుమ్నుఁ గానంబోయి నగరి వాకిట నిలిచినం, బ్రతిహారు లమ్మహాత్ము నరుగుదెంచుట యమ్మహీపతి కెఱింగించిన, నతండు సంభ్రమంబున సామాత్యుండై యాసంశితవ్రతుం డున్నయెడకుం జని వినయంబు సేసి 'మీర లిచ్చటికి వేంచేసిన ప్రయోజనం బేమి? యానతిండు; మీ చెప్పినట్ల చేసెద' నని విన్నవించిన నా విప్రవర్యుం డాతని కిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** రయంబునన్= వేగంగా (వెంటనే); రాజ సన్నిధికిన్= రాజ సమ్ముఖానికి (రాజు వద్దకు); చని= వెళ్ళి; భవత్కర్మంబు= నీవు చేసిన పని; ఉపన్యసించి= చెప్పి; దండించుట= శిక్షించటాన్ని; వేడుము= ప్రార్థించుము; అని పలికినన్= అని చెప్పగా; తెలిసి= తప్పు తెలిసికొని; అట్లు+అ+కాక+అని= అట్లే జరుగును గాక అని (సరే అని); లిఖితుండు; సుద్యుమ్నున్= సుద్యుమ్నుడిని; కానన్+పోయి= చూడటానికి వెళ్ళి; నగరి వాకిటన్= రాజద్వారం వద్ద; నిలిచినన్= నిలువగా; ప్రతిహారులు= ద్వారపాలకులు; ఆ+మహాత్మున్= ఆ మహానుభావుడియొక్క; అరుగుదెంచుట= రాకను; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు; ఎఱింగించినన్= తెలియ చెప్పగా; అతండు= ఆ రాజు; సంభ్రమంబునన్= తత్తరపాటుతో (వెనువెంటనే); స+అమాత్యుండు+ఐ= మంత్రులతో కూడుకొన్నవాడై; ఆ సంశిత వ్రతుండు= అనుమానించబడని దీక్ష కలవాడు; ఉన్న+ఎడకున్= నిలిచి ఉన్నచోటికి; చని= వెళ్ళి; వినయంబు+చేసి= వినయంతో; మీరలు= మీరు; ఇచ్చటికిన్= ఇక్కడికి; వేంచేసిన= వచ్చిన; ప్రయోజనంబు+ఏమి?= కారణం ఏమిటి? (ఉద్దేశం ఏమిటి?); ఆనతి+ఇండు= ఆజ్ఞాపించండి; మీ చెప్పిన+అట్లు+అ= మీరు చెప్పిన విధంగానే; చేసెదన్= చేస్తాను; అని విన్నవించినన్= అని ప్రార్థించగా; ఆ విప్రవర్యుండు= ఆ బ్రాహ్మణోత్తముడు; ఆతనికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'రాజు వద్దకు వెళ్ళి, నువ్వు చేసిన పని చెప్పి, దండించుమని అడుగు అని తమ్ముడితో అన్నాడు. అతడు తన తప్పు తెలిసికొన్నవాడై, సరేనని సుద్యుమ్నుడనే రాజును కలవటానికి వెళ్ళి రాజద్వారం వద్ద నిలిచాడు, ప్రతిహారు లాసంగతి రాజునకు తెలుపగా అతడు హడావుడిగా మంత్రులందరితో కలిసి లిఖితు డున్న చోటికి వచ్చి వినయంగా 'మీ రిచ్చటికి ఏ ప్రయోజనాన్ని ఆశించి వచ్చారు? మీరు చెప్పినట్లుగా నడచుకొంటాను' అని ప్రార్థించాడు. అప్పు డా లిఖితుడు రాజుతో ఈ విధంగా చెప్పాడు.

**ఆ. ' చెప్పినట్ల యేను జేసెద నని యొడం । బడినవాఁడ వింకఁ బలుకు దిరుగఁ**
**గామి మఱవ కుండఁగా నీకు వలయుఁ జు । మ్మయ్య దండధారకాగ్రగణ్య!' 162**

**ప్రతిపదార్థం:** దండధారక+అగ్రగణ్య!= పాలనా దండాన్ని ధరించిన రాజులలో శ్రేష్ఠుడా! సుద్యుమ్నా!; ఏనున్= నేను; చెప్పిన+అట్లు+అ= చెప్పిన విధంగానే; చేసెదన్+అని= చేస్తానని; ఒడంబడినవాఁడవు= అంగీకరించావు; నీకున్= నీకు; ఇంకన్= ఇకపై; పలుకు= మాట; తిరుగన్= వెనక్కితీసికొనటం; కామిన్= వీలుకాదని; మఱవక+ఉండఁగాన్= మరచిపోకుండా; వలయున్+చుమ్ము+అయ్య!= ఉండాలి సుమా!

**తాత్పర్యం:** 'రాజదండాన్ని ధరించిన వారిలో శ్రేష్ఠుడవైన సుద్యుమ్న రాజా! 'నేను చెప్పినట్లు చేస్తానని ఒప్పుకొన్నావు. ఇక మాట తప్పటానికి వీలులేదని మరవవద్దు'.

**వ. అని యూఁది పలికి, 'మద్గురుని యనుమతి లేక తదీయ తరుఫలంబులు గోసికొని యుపయోగించితి; నది ద్రుచ్చిమి; ద్రుచ్చుల దండించు తెఱంగున దండించి నన్ను గతకల్మషుం జేయుము; రాజదండితునకు యమదండంబు లేదని పెద్దలు సెప్పుదురు; నిన్నును దండధారణ వైకల్య కిల్బిషంబు వొరయకుండ వలయు' నని తేటపడ నాడిన, నమ్మాటలకు మనంబున విషాంబు నొంది, యమ్మేదినీవరుండు భూసురవరుం బ్రార్థించి. 163**

**ప్రతిపదార్థం:** అని+ఊఁది పలికి= అంటూ నొక్కి వక్కాణించి; మత్+గురుని= నా అన్నయొక్క; అనుమతి లేక= అనుజ్ఞ లేకుండా; తదీయ= అతడియొక్క; తరు= చెట్టుయొక్క; ఫలంబులు= పళ్ళు; కోసికొని+ఉపయోగించితిన్= కోసికొని తిన్నాను; అది= అట్లా చేయటం; ద్రుచ్చిమి= దొంగతనం; ద్రుచ్చులన్= దొంగలను; దండించు+తెఱంగునన్= శిక్షించే తీరులో; దండించిన్= శిక్షించి; నన్నున్= నన్ను; గతకల్మషున్= పోయిన పాపం కలవాడినిగా; చేయుము= చేయుము; రాజదండితునకున్= రాజుచేత శిక్షించబడినవాడికి; యమదండంబు= యముడిచేతి శిక్ష; లేదు+అని= ఉండదని; పెద్దలు= ఆర్యులు; చెప్పుదురు= చెప్పుతారు; నిన్నును= నిన్ను కూడా; దండధారణ= రాజదండాన్ని ధరించి కూడా; వైకల్య కల్బిషంబు= వికలత్వం (సరిగా నిర్వహించకపోవటం) అనే పాపం; పొరయక+ఉండవలయును+అని= పొందకుండా ఉండాలి అని; తేటపడన్= స్పష్టపడేటట్లుగా; ఆడినన్= మాటాడగా; ఆ+మాటలకున్= లిఖితుడు పలికిన మాటలకు; మనంబునన్= మనస్సులో; విషాదంబున్+పొంది= దుఃఖాన్నిపొంది; ఆ+మేదినీవరుండు= ఆ రాజు; భూసురవరున్= బ్రాహ్మణోత్తముడిని; ప్రార్థించి= వేడి.

**తాత్పర్యం:** అంటూ గట్టిగా చెప్పి, 'నా అన్న అనుమతిలేకుండా, అతడి చెట్టుపళ్ళు కోసికొని తిన్నాను. అట్లా చేయటం దొంగతనమే. కనుక నన్ను దొంగలను శిక్షించే తీరులో దండించి పాపరహితుడిని చేయుము. రాజదండన పొందిన వాడికి యమదండన ఉండదని పెద్ద లంటారు. అట్లా చేస్తే నీకు దండధారివై కర్తవ్యం నుండి తొలగిన పాపం అంటకుండా ఉంటుంది' అని తేట తెల్లంగా చెప్పాడు. ఆ మాటలు విన్న రాజు మనసులో చాలా బాధపడి ఆ విప్రుడిని ప్రార్థించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. ' అనఘచరిత! యిట్లు నను నియోగించుట । యుడుగు' మని యమాత్యయుతము గాఁగ**
**భక్తి మెఱసి యెన్నిభంగులఁ జెప్పిన । నియ్యకొనక యున్న నెట్టకేని. 164**

**ప్రతిపదార్థం:** అనఘ చరిత!= పాపంలేని పవిత్రమైన నడవడిక కలవాడా! లిఖితుడా!; ఇట్లు= ఈ విధంగా; ననున్ నియోగించుట= నన్ను ఆజ్ఞాపించటం; ఉడుగుము+అని= మానుమని; అమాత్యయుతము+కాఁగన్= మంత్రులతో కూడుకొని; భక్తి మెఱసి= భక్తి ప్రకటమయ్యేటట్లు; ఎన్ని భంగులన్= ఎన్ని విధాలుగా; చెప్పినన్= చెప్పినా కాని; ఇయ్యకొనక= అంగీకరించక; ఉన్నన్= ఉండగా; ఎట్టకేని= చిట్టచివర కేదో విధంగా.

**తాత్పర్యం:** 'పాపరహితమైన (నిర్మలమైన) నడవడిక కలిగిన విప్రోత్తమా! నన్ను ఈ విధంగా ఆజ్ఞాపించటం మానుము' అని మంత్రులతో కలిసి భక్తితో ఎన్నో విధాలుగా వేడుకొన్నా అంగీకరించకపోవటంతో, చిట్టచివరికి. (తరువాతి వచనంతో అన్వయం).

### లిఖితుండు సుద్యుమ్నునిచేత నికృత్తకరుం డగుట (సం. 12-24-19)

**వ. నిశ్చయించి సముచిత దండనీతి వ్రతశీలుండగు నన్నరపాలుం డమ్మహాద్విజునిం గరయుగచ్ఛేదనంబున దండింతుం జేసిన, నతం డతని దీవించి మగిడి చని శంఖునిం గని నికృత్తంబు లైన హస్తంబులు సూపి 'సమ్యగనుభూత దండితుండ నైతి' ననిన నాతండు ప్రీతుండై. 165**

**ప్రతిపదార్థం:** నిశ్చయించి= నిర్ణయించుకొని (లిఖితుడు కోరినట్లు చేయటానికి నిశ్చయించుకొని); సముచిత= బాగా తగిన; దండనీతి వ్రతశీలుండు+అగు= దండనీతిని అమలు పరచే స్వభావం కలిగినవాడైన; ఆ+నరపాలుండు= ఆ సుద్యుమ్న రాజు; ఆ+మహాద్విజునిన్= ఆ గొప్ప విప్రుడిని; కరయుగ= రెండు చేతులను; ఛేదనంబునన్= ఖండించటంతో; దండితున్+చేసినన్= శిక్షించబడిన వాడినిగా చేయగా; అతండు+అతనిన్= లిఖితుడు సుద్యుమ్నుడిని; దీవించి= ఆశీర్వదించి; మగిడి చని= తిరిగివెళ్ళి; శంఖునిన్+కని= తన అన్న అయిన శంఖుడిని చూచి; నికృత్తంబులు+అయిన= ఖండించబడిన; హస్తంబులు= చేతులను; చూపి= చూపించి; సమ్యక్= చక్కగా; అనుభూత= అనుభవించిన; దండితుండన్+ఐతిన్= శిక్షపొందిన వాడినయ్యాను; అనినన్= అనగా; ఆతండు= ఆ శంఖుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై.

**తాత్పర్యం:** ఒక నిశ్చయానికి వచ్చినవాడై, దండనీతిని చక్కగా అమలు పరిచే స్వభావం కల సుద్యుమ్నుడు ఆ మహానుభావుడైన లిఖితుడి చేతులు రెంటినీ ఖండించి శిక్షించాడు. ఆ లిఖితుడు రాజును ఆశీర్వదించి అన్నగారి వద్దకు వెళ్ళి తన తెగిన చేతులు చూపి, చక్కని దండనను అనుభవించానని చెప్పగా, శంఖుడు సంతోషించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదుగాన । వలసె నిష్కృతి కులమెల్ల వెలసె నీ క**
**తమున సురముని పితృ తర్పణములు సేయు । మరిగి బాహుదాపుణ్యతోయముల ననఘ.** **166**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! (ఇక్కడ ఈ ప్రయోగం సార్థకం); ధర్మమార్గము= ధర్మముయొక్క పద్ధతి; ఉల్లంఘింపన్= దాటటం; తగదు= ఉచితం కాదు (కూడదు); కాన= అందువలన; నిష్కృతి= చేసిన దానికి ప్రాయశ్చిత్తం; వలసెన్= చేయవలసి వచ్చింది; నీ కతమునన్= నీ కారణంగా; కులము+ఎల్లన్= వంశమంతా; వెలసెన్= ప్రకాశించింది; అరిగి= వెళ్ళి; బాహుదా పుణ్యతోయములన్= పవిత్రమైన బాహుదా నది నీళ్ళలో; సుర+ముని+పితృ= దేవతలకు, మునులకు, పితరులకు; తర్పణములు= జలాంజలులు; చేయుము= చేయవలసినది.

**తాత్పర్యం:** 'పాపాలను పోగొట్టుకొన్న లిఖితుడా! ధర్మమార్గాన్ని ఎవరూ తప్పకూడదు. కనుక ప్రాయశ్చిత్తం అవసరమైనది. నీవలన మన వంశమంతా ప్రకాశిస్తున్నది. వెళ్ళి బాహుదానదిలోని పుణ్యప్రదమైన నీటిలో దేవతలకు, మునులకు, పితరులకు తర్పణా లిమ్ము.

**వ.** **వినుము.** **167**

**తాత్పర్యం:** (ఇంకా) వినుము.

**తే.** **కల్లు ద్రావుట, గురుపత్నిఁ గవయుటయును, । విప్రుఁ జంపుట, బ్రహ్మ స్వవిషయ మైన**
**ముచ్చిలుటయును నివి గల క్రూరజనులఁ । బ్రీతిఁబొందుటయును మహాపాతకములు.** **168**

**ప్రతిపదార్థం:** కల్లు+త్రావుట= సురాపానం; గురుపత్నిన్= గురువు యొక్క (అన్న, పెద్దవాడు, విద్యా బోధన చేసినవాడియొక్క) భార్యను; కవయుటయును= కూడటం; విప్రున్= బ్రాహ్మణుడిని; చంపుట= చంపటం; బ్రహ్మస్వవిషయము+ఐన= బ్రాహ్మణుడికి చెందిన ధనమునకు సంబంధించిన; ముచ్చిలుటయును= దొంగిలించటం; ఇవి+కల= ఈ నాలుగు లక్షణాలు ఉన్న; జనులన్= మానవులతో; ప్రీతిన్= ఇష్టంతో; పొందుటయును= కలిసి ఉండటం; మహాపాతకములు= పెద్దపాపపు పనులు.

**తాత్పర్యం:** సురాపానం, గురుపత్నిని కూడటం, బ్రాహ్మణుడిని చంపటం, బ్రాహ్మణుల ధనము దొంగిలించటం- ఈ నాలుగు లక్షణాలు కలవారితో ఇష్టంతో కలిసి ఉండటం మహాపాతకాలు (నిష్కృతిలేని పాపాలు).

**వ.** **ఇమ్మహాపాతకంబు లేనింటిలోన నెద్ది సేసిన నే జాతివాఁడును దండనీయుండ, విశేషించి తస్కరుండు శారీరదండ యోగ్యుండు; రాజదండితులు సుకృత వంతుల భంగిఁ బుణ్యలోక ప్రాప్తులగుదురు; నీవమ్మహారాజు చేత దండింప బడుటం బుణ్యాత్ముండవును వంశోద్ధారణ సమర్థుండవు నైతివి; సంతోషింపుము పొ'మ్మనినం బోయి లిఖితుండు. 169**

**ప్రతిపదార్థం:** ఈ+మహాపాతకంబులు= ఈ గొప్ప పాపకార్యాలు; ఏనింటిలోనన్= ఐదింటిలో; ఎద్ది+చేసినన్= ఏది ఆచరించినా; ఏ జాతివాఁడును= ఏ వర్ణస్థుడైనా; దండనీయుండు+అ= శిక్షార్హుడే; విశేషించి= ప్రత్యేకంగా; తస్కరుండు= దొంగ; శారీరదండ యోగ్యుండు= శారీరకమైన శిక్షకు తగినవాడు; రాజదండితులు= రాజుచేత శిక్షించబడినవారు; సుకృతవంతుల భంగిన్= పుణ్యకార్యాలు చేసినవారివలె; పుణ్యలోక+ప్రాప్తులు= సత్కార్యాలు చేసినవారు పోయే లోకాలను పొందినవారవుతారు; నీవు= నీవు; ఆ+మహారాజుచేతన్= ఆ సుద్యుమ్నుడిచేత; దండింపఁబడుటన్= శిక్షించబడి ఉండటంచేత; పుణ్యాత్ముండవును= సుకృతివి; వంశ+ఉద్ధరణ+సమర్థుండవును= కులపావనుడవు; ఐతివి= అయ్యావు; సంతోషింపుము= ఆనందించుము; పొమ్ము= వెళ్ళుము; అనినన్= అనగా; లిఖితుండు= లిఖితుడు; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** 'ఈ ఐదు మహాపాతకాలలో ఏ ఒక్కటిచేసినా, ఏ వర్ణస్థుడైనా దండించ తగినవాడే. ప్రత్యేకించి దొంగ శరీరదండనకు అర్హుడు. రాజదండన పొందినవారు పుణ్యాత్ములవలె పుణ్యలోకాలకే పోతారు. నీవు సుద్యుమ్న మహారాజుచేత దండన పొందావు కనుక పుణ్యాత్ముడివి. వంశపావనుడివి అయ్యావు. దీనికి సంతోషించుము. ఇక వెళ్ళుము' అన్నాడు. లిఖితుడు అన్న చెప్పినట్లుగా వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **బాహుదానదియం దవగాహనంబు । సేయఁ బ్రభవించె నాతని చేతు లపుడ**
**విస్మయం బంది యతఁడు వేవేగ వచ్చె । నన్నపాలికి మగుడఁ బ్రహర్షమెసఁగ. 170**

**ప్రతిపదార్థం:** బాహుదానదియందున్= బాహుదానదిలో; అవగాహనంబు+చేయన్= మునుగగా; అపుడు+అ= అప్పుడే; ఆతని చేతులు= ఆతడి చేతులు; ప్రభవించెన్= పుట్టాయి, మొలిచాయి; అతఁడు= ఆ లిఖితుడు; విస్మయంబు+అంది= ఆశ్చర్యపోయి; వేవేగ= మిక్కిలి వేగంగా; మగుడన్= తిరిగి; ప్రహర్షము+ఎసఁగన్= మిక్కిలి సంతోషం విజృంభించగా; అన్నపాలికిన్= అన్న దగ్గరికి; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** బాహుదానదిలో మునుగగానే లిఖితుడికి చేతులు మొలిచాయి. అతడు ఆశ్చర్యంతో, ఎక్కువైన ఆనందంతో వేగంగా అన్న దగ్గరకు తిరిగి వచ్చాడు.

**విశేషం:** బాహు= చేతులు; ద= ఇచ్చునది అనే పేరు ఈ సంఘటనతో ఆ నదికి సార్థకం అయింది.

**వ.** **వచ్చి యరుణ కమలంబులం దెగడు తన కరంబులం జూపిన నతండు 'దీనికి నచ్చెరు పడనేల? యిది మదీయ తపోవిభవంబున దైవకృతం బైన విశేషంబు; నీవు శుచి వగుట దైవంబున కెక్కె; సుద్యుమ్నుండును నీ పుణ్యానుష్ఠానంబున నిజపితృవర్గ సహితంబుగా నిర్మలాత్ముండయ్యె' ననియె; నట్లగుటం జేసి. 171**

**ప్రతిపదార్థం:** వచ్చి; అరుణ= ఎర్రని; కమలంబులన్= తామరలను; తెగడు= తిరస్కరించే; తనకరంబులన్= తన చేతులను; చూపినన్= చూపించగా; అతండు= ఆ శంఖుడు; దీనికిన్= ఈ చేతులు తిరిగి రావటానికి; అచ్చెరువడన్+ఏల?= ఆశ్చర్యపడటం ఎందుకు?; ఇది= ఈ విషయం; మదీయ= నా దైన; తపోవిభవంబునన్= తపస్సుయొక్క గొప్పతనం కారణంగా; దైవకృతంబు+ఐన= భగవంతుడు చేసిన; విశేషంబు= ప్రత్యేకాంశము; నీవు= నువ్వు (లిఖితుడు); శుచివి= పరిశుద్ధుడవు; అగుట= అవటం;

దైవంబునకున్= భగవంతుడికి; ఎక్కెన్= నచ్చింది; సుద్యుమ్నుండునున్= సుద్యుమ్నుడు కూడా; ఈ పుణ్య+అనుష్ఠానంబునన్= ఈ పుణ్యకార్యాన్ని ఆచరించటం వలన; నిజ= తన; పితృవర్గ+సహితంబుగాన్= పితరుల సమూహంతో కూడ; నిర్మల+ఆత్ముండు+అయ్యెన్= పవిత్రాత్ముడయ్యాడు; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; అగుటన్+చేసి= అవటంచేత.

**తాత్పర్యం:** అన్నవద్దకు వచ్చి ఎర్రతామరలకన్న అందంగా ఉన్న తన చేతులను చూపించగా, ఆ శంఖుడు తమ్ముడితో 'దీనికంత ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ఇది నా తపోవిభవం కారణంగా భగవంతుడు చేసిన అద్భుతం. నీవు పరిశుద్ధుడ వని పరమాత్మకు తెలిసింది. ఈ పుణ్యకార్యాచరణవలన సుద్యుమ్నుడు కూడా తన పితరులతో సహా పవిత్రుడయ్యాడు' అన్నాడు. అందువలన - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **జననుత! నీవునుం దగఁ బ్రజాపరిరక్షణ మాచరింపు; నీ**
**యనుజునిమాట వేదవచనార్థ నిరూఢము; రాజనీతి దం**
**డనమునఁ గాని యొండున నొడంబడ దెన్నఁడు నార్యకోటియం**
**దును వగదక్కు మేలు మిలఁ దుష్టిగఁ జేయుము మేటి జన్నముల్.'** **172**

**ప్రతిపదార్థం:** జననుత!= ప్రజలచేత కీర్తించబడే ధర్మరాజా!; నీవునున్= నీవు కూడా; తగన్= చక్కగా; ప్రజాపరిరక్షణము= ప్రజలను చక్కగా కాపాడటాన్ని; ఆచరింపు= చేయుము; నీ+అనుజుని+మాట= నీ తమ్ముడు చెప్పినమాట; వేదవచన+అర్థనిరూఢము= వేదవాక్కులలోని అర్థాన్ని తెలియజెప్పేది; ఆర్యకోటి+అందును= పూజనీయులైనవారిలో కూడా; రాజనీతి= రాజ్యపాలనలోని న్యాయం; దండనమునన్+కాని= దండనచేత కాని; ఒండునన్= మరొక విధంగా; ఎన్నడున్= ఎప్పుడూ; ఒడంబడదు= కుదరదు; వగన్= బాధను; తక్కుము= వదలుము; ఇలన్= భూమిని; ఏలుము= పాలించుము; మేటి= గొప్ప; జన్నముల్= యజ్ఞాలు; తుష్టిగన్= తృప్తిగా; చేయుము.

**తాత్పర్యం:** 'ప్రజలచేత కీర్తించబడే ధర్మరాజా! నీవు కూడా చక్కగా ప్రజలను పాలించుము. నీ తమ్ముడు చెప్పినమాట వేదార్థంతో నిండింది. పూజ్యులైనవారు కూడా రాజనీతిలో దండనమున తప్ప మరొకరీతిగా రక్షణం ఏర్పడదు. కనుక శోకాన్ని వదలుము; భూమిని పాలించుము, గొప్ప గొప్ప యజ్ఞాలను తృప్తిగా చేయుము'.

**వ.** **అని చెప్పి మఱియు నిట్లనియె.** **173**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఈ విధంగా చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పారాశర్యు డీ విధంగా చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ.** **' అడవుల మీరున్నయపుడు నీ తమ్ములు । వివిధ మనోరథావేశ కలిత**
**హృదయులై యుండుదు; రదయత వీరి । నుపేక్షింప కిల యేలి యెల్లభోగ**
**ములకును భాజనంబులఁగా నొనర్పుము । తురగ మేధాది క్రతు ప్రయుక్తిఁ**
**బరఁగుము; వీరలు బహుయజ్ఞములు సేయు । వా రటమీఁద నిర్ద్వంద్వవృత్తి**

**తే.** **వెడలెదవు గాక విను మేము వెట్టివార; । మే మహీశ్వర నీ మది మేలుగంటి**
**మతిథి సుర పితృ విషయము నప్పు చిక్కు । గలిగియుండంగ నది నీకుఁ గాదు గాని.** **174**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశ్వర!= భూపతీ! ధర్మరాజా!; వినుము= వినవలసింది; అడవులన్= అరణ్యాలలో; మీరు; ఉన్న+అపుడు= నివసించినప్పుడు; నీ తమ్ములు= నీ అనుజులు; వివిధ= అనేకమైన; మనోరథ+ఆవేశ+కలిత+హృదయులు+ఐ= కోరికలతోనూ,

ఆవేశాలతోనూ కూడుకొన్న మనస్సులు కలవారై; ఉండుదురు= ఉండి ఉంటారు; అదయతన్= దయలేకుండగ; వీరిన్= నీ తమ్ములను; ఉపేక్షింపక= నిర్లక్ష్యం చేయక, పట్టించుకొనక పోవటం మాని; ఇల= భూమిని; ఏలి= పాలించి; ఎల్లభోగములకును= అన్ని భోగాలకు; భాజనంబులన్+కాన్= అర్హులయ్యేటట్లుగా; ఒనర్పుము= చేయుము; తురగమేధ+ఆది= అశ్వమేధం మొదలైన; క్రతు= యజ్ఞాలయొక్క; ప్రయుక్తిన్= ప్రయోగంలో (చేయటంవలన); పరఁగుము= నిమగ్నుడవు కమ్ము; వీరలు= నీ తమ్ములు; బహు= అనేకమైన; యజ్ఞములు= యాగాలు; చేయువారు= చేస్తారు; అటమీఁదన్= ఆ తరువాత; నిర్ద్వంద్వవృత్తి= ద్వంద్వాతీతమైన ప్రవృత్తిచేత; వెడలెదవుగాక= ముక్తిని పొందెదవుగాక; ఏము= మేము; వెఱ్ఱివారము+ఏ?= తెలివిలేని వారమా?; నీ మది= నీ మనస్సులో; మేలు+కంటిమి= శ్రేయస్సు ఏదో చూచాము; అతిథి సుర పితృ విషయమున్= అతిథుల, దేవతల, పితృదేవతల విషయంలో; అప్పు= ఋణం; చిక్కు= బాధ; కలిగి+ఉండఁగన్= మిగిలిపోయి ఉంటే; అది= ఆ ఋణ శేషం; నీకున్= నీకు; కాదు+కాని= తగదు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వినుము. మీరు వనవాసం చేసేటప్పుడు నీ తమ్ములు పెక్కు కోరికలను, ఆవేశాలను పొంది ఉంటారు. నిర్దయతో వారిని నిర్లక్ష్యం చేయవద్దు. భూమిని పాలించి వారికి భోగాలన్నీ అందేటట్లు చూడుము. అశ్వమేధాది యాగాలు చేయుము. నీ తమ్ములు కూడా అనేక యజ్ఞాలు చేస్తారు, ఆ తరువాత ద్వంద్వాలకు అతీతమైన నడవడికతో ముక్తిని పొందగలవు. మేము తెలివిలేని వాళ్ళమా? నీ మదికి హితమైన దానిని గమనించాము, అతిథి, దేవ, పితృ ఋణాల బాధ మిగిలి ఉండటం నీకు తగదు. (వాటిని తీర్చటం మంచిదని సూచన).

**విశేషం:** అన్నమాట మీద తమ కోరికలను, ఆవేశకావేశాలను, కోపాలను అణచుకొన్న తమ్ములమాట వినటం ధర్మరాజు ధర్మం అని వ్యాసుడి సూచన.

**ఆ. న్యాయశాస్త్రవేదియై యింగితాకార । చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట**
**తావిశేష మరసి దండనీతి యొనర్చు । పతికి నెల్ల మేలుఁ బడయవచ్చు. 175**

**ప్రతిపదార్థం:** న్యాయశాస్త్రవేది+ఐ= న్యాయశాస్త్రాన్ని బాగా తెలిసినవాడై; జనుల= ప్రజల; ఇంగిత= మనసులోని భావనయొక్క; ఆకార= రూపమును; చేష్టలు= చేతలును; ఎఱిఁగి= తెలిసి; శిష్టదుష్టతావిశేషము= మంచితనం, చెడ్డతనాలలోని విశేషాలను; అరసి= పరికించి; దండనీతి+ఒనర్చు= దండనీతిని అమలు పరచే; పతికిన్= రాజునకు; ఎల్లమేలున్= అంతా శుభమునే; పడయవచ్చున్= పొందవీలవుతుంది.

**తాత్పర్యం:** న్యాయశాస్త్రం బాగా తెలిసి, ప్రజలమనోభావనలు (అభిప్రాయాలు) వాటి రూపరేఖలు, చేష్టలు, మంచి చెడుల తారతమ్యం పట్టిచూసి దండనీతిని అమలు పరిచే రాజునకు అంతా మేలు జరుగుతుంది.

**క. అరి యాఱవపాలు గొనుచుఁ । గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా**
**చరణంబునఁ బాలించుట । పరమ పదముఁజేర్చు విడువు భయసంశయముల్. 176**

**ప్రతిపదార్థం:** అరి= పన్ను, కప్పం; ఆఱవపాలు= ఆరవవంతు; కొనుచున్= తీసికొంటూ; కరుణ+కలిగి= దయ కలిగినవాడై; ప్రజలన్= పౌరులను; తండ్రిగతిన్= కన్న తండ్రివలె; మధ్యస్థ+ఆచరణంబునన్= పక్షపాతం లేని వర్తనంతో; పాలించుట= పరిపాలన చేయటం; పరమపదమున్= మోక్షానికి; చేర్చున్= చేరుస్తుంది; భయ సంశయముల్= భయాన్ని, అనుమానాన్ని; విడువు= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** ప్రజల ఆదాయం నుండి ఆరవభాగం పన్నుగా తీసికొంటూ, ప్రజలను కన్నతండ్రివలె కరుణా హృదయంతో పక్షపాతం లేని వర్తనంతో పాలనచేస్తే, అది మోక్షపదవికి చేరుస్తుంది. భయాన్ని, సందేహాన్ని వదలుము.

**ఆ. ఇవ్విధంబు గాక క్రొవ్వి కామ క్రోధ । కలిత చిత్తవృత్తిఁ దొలఁగ నడచు**
**పతికి నగుఁ జతుర్థ భాగంబు ప్రజసేయు । పాపములఁ గులప్రదీపచరిత! 177**

**ప్రతిపదార్థం:** కులప్రదీపచరిత!= వంశాన్ని బాగా ప్రకాశింపచేసే నడతకల ధర్మరాజా!; ఈ+విధంబు= ఈ పద్ధతి; కాక= కాకుండా; క్రొవ్వి= పొగరెక్కి, అహంకరించి; కామ= కామంచేత; క్రోధ= కోపంచేత; కలిత= కూడుకొన్న; చిత్తవృత్తిన్= మనోవ్యాపారంతో; తొలఁగన్= తప్పి; నడచు= ప్రవర్తించే; పతికిన్= రాజునకు; ప్రజ+చేయు= పౌరులు చేసే; పాపములన్= పాపకార్యాలలో, చెడుపనులలో; చతుర్థభాగంబు= నాలుగవ వంతు; అగున్= అవుతుంది (వర్తిస్తుంది, చెందుతుంది).

**తాత్పర్యం:** వంశప్రతిష్ఠను పెంచే ధర్మరాజా! ఈ చెప్పిన పద్ధతిలో కాక, రాజు ననే అహంకారంతో కామక్రోధాలతో కూడుకొన్న మనోవ్యాపారం కలిగి, పద్ధతి తప్పి నడచుకొంటే, ప్రజలు చేసే పాపాలలో నాలుగవవంతు రాజునకు చెందుతుంది.

**చ. క్రమమున నైన శాత్రవులఁ గ్రందున నైనను జావఁ జేఁత ధ**
**ర్మము విను పాపకర్ములగు రాజులతోఁ దగ సంధి సేఁత దో**
**షము విభుఁ డుర్వి యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ గూడునే**
**సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండు ధర్మముల్. 178**

**ప్రతిపదార్థం:** విను= ధర్మరాజా! వినుము; క్రమమునన్+ఐన= వరుసగా (ఒక పద్ధతిలో) అయినా; క్రందునన్+ఐనను= సందడిగా (ఒక్కసారిగా) అయినా; శాత్రవులన్= వైరులను; చావన్+చేఁత= చచ్చేటట్లు చేయటం; ధర్మము= చేయవలసిన విధి; పాపకర్ములు+అగు= చెడ్డపనులు చేసే వారైన; రాజులతోన్= రాజులతో; తగన్= చక్కగా; సంధి+చేఁత= సంధిచేయటం; దోషము= తప్పు; విభుఁడు= రాజు; ఉర్వి= భూమిని; అమ్ముకొని= విక్రయించి; సంగరమున్= యుద్ధాన్ని; తొలఁగింపన్+కూడును+ఏ?= తీసివేయటం (ఆపటం) తగినదా?; సమరజిత= యుద్ధంలో గెలువబడిన; అవనీభరణశాలితన్= భూభార దక్షతను; ఒండు ధర్మముల్= ఇతర ధర్మాలు (విధులు); పోలును+ఏ?= సరిపోతాయా?

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. నెమ్మది నెమ్మదిగా నైనా, ఒక్కసారిగా అయినా శత్రువులను మట్టుపెట్టటం విధ్యుక్తధర్మం. దుర్మార్గులైన రాజులతో సంధి చేసికొనటం తప్పు. భూమిని అమ్ముకొని యుద్ధాన్ని తొలగించటం (అంటే యుద్ధం చేయకుండా ఉండటం కోసం శత్రువులకు కొంతభూమిని ఇచ్చేయటం), వలన కలిసిరాదు కదా! యుద్ధంలో గెలిచిన రాజ్యభారాన్ని వహించగల సామర్థ్యంతో పోల్చగల ధర్మం మరొక్కటి లేదు.

**వ. కావున. 179**

**తాత్పర్యం:** అందువలన.

**క. పో రుడుగను సమకూరద । కౌరవపతితోడ సంధి గావింపమి హిం**
**సారుచి నైతి ననుట యవి । చారత నృపవంశకలితజని యగు నీకున్. 180**

**ప్రతిపదార్థం:** నృపవంశ కలిత జని= రాజవంశముతో కూడుకొన్న పుట్టువు కలవాడవు; అగు= అయిన; నీకున్= నీకు; పోరు= యుద్ధం; ఉడుగను= మానటం; సమకూరదు+అ= కుదరదు (సిద్ధించదు); కౌరవపతితోడన్= దుర్యోధనుడితో; సంధి+కావింపమిన్= సంధి చేయకపోవటం వలన; హింసారుచిన్= హింసయందు ఇష్టం కలవాడిని; ఐతిన్= అయ్యాను; అనుట= అనుకొనటం; అవిచారత= ఆలోచించకపోవటమే.

**తాత్పర్యం:** ధర్మరాజా! రాజవంశంలో జన్మించిన నీకు యుద్ధం మానటం కుదరదు. దుర్యోధనుడితో సంధిచేయకపోవటంవలన హింసయందు అభిరుచి కలవాడిని అయ్యాను అనుకొనటం ఆలోచనారాహిత్యమే.

**శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలం బ్రోవంగ దండింపనుం**
**గావన్ నేర్చి మఖక్రియల్ నడపి సంగ్రామాగ్ని కాజ్యాహుతుల్**
**గా వైరిక్షతజంబు వేల్చి తనుషంగక్షేపకుండై హయ**
**గ్రీవుం డుత్తమసిద్ధిఁ బొందె; రణముల్ గీడే నృపశ్రేణికిన్? 181**

**ప్రతిపదార్థం:** హయగ్రీవుండు= హయగ్రీవుడనే రాజు; భూవిస్తారమున్= విస్తృతమైన భూమిని; ఆక్రమించి= స్వాధీన పరచుకొని; ప్రజలన్= జనులను; ప్రోవంగన్= కాపాడగా; దండింపనున్= శిక్షింపగాను; కావన్= రక్షించగాను; నేర్చి= తెలిసికొని; మఖక్రియల్= యజ్ఞకార్యాలు; నడపి= నిర్వర్తించి; సంగ్రామ+అగ్నికిన్= యుద్ధమనే అగ్నికి; ఆజ్య+ఆహుతుల్= నేతితోడి హోమద్రవ్యాలు; కాన్= అయ్యేటట్లు; వైరి= శత్రువుల; క్షతజంబు= నెత్తురును; వేల్చి= హోమంచేసి; తనుషంగక్షేపకుండు+ఐ= శరీర వ్యామోహం వదలినవాడై; ఉత్తమసిద్ధిన్= ఉత్తమగతిని; పొందెన్= పొందాడు; నృపశ్రేణికిన్= రాజ సమూహానికి; రణముల్= యుద్ధాలు; కీడు+ఏ?= హానికరాలా? (కావు అని భావం).

**తాత్పర్యం:** హయగ్రీవు డనే పేరుగల రాజు విశాలమైన సామ్రాజ్యాన్ని స్వాధీనపరచుకొని, ప్రజలను కాపాడటం, శిక్షించటం, రక్షించటం తెలిసికొని యజ్ఞాలు చేసి, యుద్ధ మనే అగ్నికి శత్రువుల రక్తమనే నేతితో కూడిన హోమ ద్రవ్యం అయ్యేటట్లుగా హోమంచేసి, శరీర వ్యామోహం వదలినవాడై ఉత్తమలోకాలు పొందాడు. రాజులకు యుద్ధాలు హానికరాలు కావు కదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విశేషాంశాన్ని సామాన్యాంశం సమర్థిస్తున్నది.

**వ. సంగరంబునం జంపుటయుం జచ్చుటయును బ్రజాపరిపాలనంబును దగిన తెఱంగున దండించుటయును నుత్తమ క్షత్త్ర ధర్మంబులు గావున హింసవలని శంక విడిచి యాన్వీక్షకీ త్రయీవార్తా దండనీతు లను రాజవిద్యలయందును బ్రవీణులగు సహాయులతోడం గూడి సర్వ వ్యవహారంబులు నిర్వహింప నిర్వాణం బనతిదూరం బగుఁ; గలంక దక్కు' మని పలికె; సకల లోక గ్రాహ్యవచనుండగు నమ్మహాముని యిట్లు సెప్పం దెలివొందక యున్న ధర్మనందనుం గనుంగొని పురందరనందనుం డుల్లంబునం గోపంబు గదుర మొగంబునం దోఁపనీక యుండె; నప్పాండవాగ్రజుం దత్తపోతధనవర్యు వదనంబునం జూడ్కి నిలిపి నిభృతంబుగా నిట్లనియె. 182**

**ప్రతిపదార్థం:** సంగరంబునన్= యుద్ధంలో; చంపుటయున్= చంపటమూ; చచ్చుటయును= చనిపోవటమూ; ప్రజాపరిపాలనంబును= జనులను పాలించటమూ; తగిన తెఱంగునన్= ఉచితమైన రీతిలో; దండిచుటయును= శిక్షించటమూ; ఉత్తమ క్షత్త్రధర్మంబులు= శ్రేష్ఠులైన రాజులు ఆచరించవలసిన విధులు; కావునన్= కనుక; హింసవలని= హింసను గూర్చిన; శంక= సంశయం; విడిచి= వదలి; ఆన్వీక్షకీ= విజ్ఞానాన్ని తెలిపే విద్య; త్రయీ= ధర్మాధర్మాలు తెలిపే విద్య; వార్తా= అర్థానర్థాలను తెలిపే విద్య; దండనీతులను= దండనీతి నయానయాలను తెలిపే విద్య అనే; రాజవిద్యల+అందును= క్షత్రియ ఉచితమైన విద్యలలో; ప్రవీణులు= పారంగతులు; అగు= అయినటువంటి; సహాయులతోడన్+కూడి= తోడ్పడేవారితో కలిసి; సర్వ= సమస్తమైన; వ్యవహారంబులు= పనులు; నిర్వహింపన్= చక్కగా చేయగా; నిర్వాణంబు= ముక్తి; అనతి దూరంబు+అగున్= దగ్గర అవుతుంది; కలంక= కలత, విచారం; తక్కుము= వీడుము; అని పలికెన్= అంటూ చెప్పాడు (వ్యాసుడు); సకల= సమస్త; లోక= లోకాలవారిచేత; గ్రాహ్య= గ్రహించదగిన,

స్వీకరించదగిన; వచనుండు+అగు= మాటలు కలవాడైన; ఆ+మహాముని= ఆ గొప్పముని; ఇట్లు= ఈ విధంగా; చెప్పన్= చెప్పగా; తెలివి+ఒందక+ఉన్న= బోధకలుగక ఉన్న; ధర్మనందనున్= ధర్మరాజును; కనుంగొని= చూచి; పురందర నందనుండు= ఇంద్రజుడైన అర్జునుడు; ఉల్లంబునన్= మనస్సులో; కోపంబు= కోపం; కదురన్= కలిగినా; మొగంబునన్= ముఖాన; తోఁపనీక= కనబడనీయక; ఉండెన్= ఉన్నాడు; ఆ+పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; ఆ+తపోధనవర్యు= తపస్సే ధనంగా కలవారిలో శ్రేష్ఠుడైన వ్యాసుడి; వదనంబునన్= ముఖమునందు; చూడ్కి= చూపు; నిలిపి= స్థిరంగా ఉంచి; నిభృతంబు+కాన్= వినయంగా, స్పష్టంగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** యుద్ధంలో చంపటం, చనిపోవటం, ప్రజలను పాలించటం, ఉచితమైన రీతిలో దండించటం శ్రేష్ఠమైన రాజధర్మాలు. అందువలన హింసను గూర్చిన సంశయం వదలి, విజ్ఞానాన్ని తెలిపే ఆన్వీక్షకి, ధర్మాధర్మాలు తెలిపే త్రయీ, అర్థానర్థాలను తెలిపే వార్త, నయానయాలను తెలిపే దండనీతి అనబడే నాలుగు క్షత్రియోచిత విద్యలలోనూ పండితులైనవారి సాహాయ్యంతో అన్ని కార్యాలను చక్కగా నిర్వర్తిస్తే మోక్షం అతి సమీపంలో ఉంటుంది. విచారం వదలిపెట్టుము' అన్నాడు వ్యాసుడు. అన్ని లోకాల వారిచేత గ్రహించదగిన మాటలు (అన్ని లోకాలవారు సమ్మతించే మాటలు) కల ముని శ్రేష్ఠుడైన వ్యాసు డీ విధంగా చెప్పగా, వివేకం కలుగకుండా ఉన్న ధర్మరాజును చూచి అర్జునుడికి మనస్సులో కోపం కలిగింది కాని ముఖం మీద దానిని కనబడనీయలేదు. అప్పు డా ధర్మరాజు తపోధనశ్రేష్ఠుడైన వ్యాసుడి ముఖంపై తన చూపు నిలిపి (ముఖంలోకి చూస్తూ) వినయంగా ఈ విధంగా పలికాడు.

**క. ' పతులు మృతులైనఁ బొగిలెడు । సతుల విలాపములు శోక సంతాపం బు**
**త్థితముగఁ జేయఁగ నే వసు । మతి యేలిన కలఁచుకలఁక మానునె బుద్ధిన్?' 183**

**ప్రతిపదార్థం:** పతులు= భర్తలు; మృతులు+ఐనన్= మరణించగా; పొగిలెడు= కుమిలిపోయే; సతుల= భార్యల; విలాపములు= ఏడుపులు; శోక= విషాదంవలన; సంతాపము= రగులుతున్న బాధను; ఉత్థితముగన్= పైకెగసేటట్లు; చేయఁగన్= చేస్తుండగా; ఏన్= నేను; వసుమతి= భూమిని; ఏలిన= పాలించినట్లైతే; కలఁచు= బాధపెట్టే; కలఁక= కలత; బుద్ధిన్= మనస్సులో; మానును+ఎ?= తగ్గుతుందా? (తగ్గదని భావం).

**తాత్పర్యం:** 'మహర్షీ! భర్తలు మరణించగా కుమిలిపోయే భార్యల రోదనలు నాలో రగులుతున్న దుఃఖాలవలన పైకి ఎగదట్టుతుండగా, భూమిని నేను పరిపాలిస్తే అది మనసులోని కలతని పోగొట్ట గలదా?' (పోగొట్టలేదు).

**వ. అనుటయు నమ్మునివరుం డతని కిట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+మునివరుండు= ఆ మునులలో ఉత్తముడైన వ్యాసుడు; అతనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ విధంగా ప్రశ్నించగా, మునిశ్రేష్ఠుడైన వ్యాసు డాతడితో ఇట్లా అన్నాడు.

**సీ. ' దుఃఖంబుఁ బొమ్మని త్రోవ, సుఖంబు ర । మ్మని తెచ్చికొన వశమయ్య? వానిఁ**
**దొలుబామునందలి దుష్కృతంబును సుకృ । తంబు హేతువులుగఁ దగిలి చేయుఁ**
**బురుషుని కాలంబు; దిరములు గా వవి; పొరిఁ । బొరి వచ్చుచుఁ బోవుచుండు;**
**నర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు । నగు కాలమున; నార్యులయ్యుఁ గాని**

ఆ. కాలమున ఘటింపఁగా నేర; వనిల వ । ర్షాతపేందురుచులు నధిప! కాల
కల్పితములు; మంత్రశిల్పౌషధంబులు । మేలుసేఁత కాలకీలితంబు. 185

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; దుఃఖంబున్= బాధను; పొమ్ము+అని= వెడలిపొమ్మని; త్రోవన్= త్రోసివేయటానికి; సుఖంబు= సౌఖ్యాన్ని; రమ్ము+అని= రారమ్మని; తెచ్చికొనన్= తీసికొనిరావటానికి; వశము+అయ్య?= మనవశమా నాయనా?; వానిన్= ఆ సుఖ దుఃఖాలను; తొలుబామునందలి= పూర్వ జన్మయందలి; దుష్కృతంబును= చెడుపనులును, పాపకృత్యాలు; సుకృతంబు= మంచిపనులు, పుణ్యకార్యాలు; హేతువులుగన్= కారణాలుగా; పురుషుని= మానవుడిని; కాలంబు= కాలం, విధి; తగిలి చేయున్= పూనికతో చేస్తుంది; అవి= ఆ సుఖదుఃఖాలు; తిరములు= స్థిరమైనవి, శాశ్వతమైనవి; కావు; పొరిన్+పొరిన్= మరల మరల; వచ్చుచున్= వస్తూ; పోవుచున్= పోతూ; ఉండున్= ఉంటాయి; అగుకాలము= అయిన కాలంలో, కాలం కలిసి వచ్చినప్పుడు; దుర్బుద్ధికిన్+ఐనను= దురాత్ముడికైనా; అర్థముల్= సంపదలు; సిద్ధించున్= లభిస్తాయి; కాని కాలమునన్= కాలం కలిసి రాకపోతే; ఆర్యులు+అయ్యున్= సత్ప్రవర్తన కలిగిన వారికైనా; ఘటింపనేరవు= (ధనములు) లభించవు; అనిల= వాయువు; వర్ష= వాన; ఆతప= ఎండ; ఇందురుచులు= చంద్రకాంతులు, వెన్నెల; కాల కల్పితములు= కాలం కూర్చినట్టివి; మంత్ర= మంత్రాలు, ఆలోచనం; శిల్ప= బొమ్మలు (ఆకృతులు విగ్రహాలు); ఔషధంబులు= మందులు; మేలు+చేఁత= మంచిచేయటం; కాలకీలితంబు= కాలం యొక్క ఏర్పాటే.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! బాధలను పొమ్మని తోసివెయ్యటం, సుఖాలను రమ్మని తీసికొనిరావటం, మనవశంలో లేదు. పూర్వజన్మలో చేసిన మంచి చెడు పనుల కారణంగా, కాలమే సుఖదుఃఖాలను తగినట్లుగా కలిగిస్తుంది. ఆ సుఖదుఃఖాలు కలకాలం నిలిచేవి కావు. మాటి మాటికి వస్తూ, పోతూ ఉంటాయి. కాలం కలిసివస్తే ఎంతటి దుర్మార్గుడికైనా సంపదలు సిద్ధిస్తాయి. కాలం కలిసిరాకపోతే సచ్ఛీలుడికైనా సంపదలు రావు. గాలి, వాన, ఎండ, వెన్నెల మొదలైనవన్ని కాలంచేత చేయబడినవే. ఆలోచన లేక మంత్రములుకాని, కూర్పులు, లేక శిల్పాకృతులు కాని, మందులుకాని ఫలించి మేలు చేయటం కాలఘటనమే.

**విశేషం:** మంత్రాలు, యంత్రాలు, మందులు పనిచేశాయని మానవులు భ్రమపడతారు. వాస్తవానికి కాలం కలిసి వచ్చినప్పుడే అవి సత్ఫలితాల నిస్తాయి. ఇంకా సరిగా చెప్పాలంటే కాలం కలిసివచ్చినప్పుడే వాటిని ఆశ్రయించటం జరుగుతుంది.

క. కమలంబులుఁ దొవలు వికా । సముఁ బొందుట, లతలుఁ దరులు సకుసుమ ఫలభా
వముఁ బొందుట, పక్షులును మృ । గములును మదకలము లగుట కాలకలితముల్. 186

**ప్రతిపదార్థం:** కమలంబులున్= తామరలు; తొవలు= కలువలు; వికాసమున్+పొందుట= విచ్చుకొనటం; లతలున్= తీగలు; తరులు= వృక్షాలు; సకుసుమ+ఫల+భావమున్+పొందుట= పూలతోనూ, పళ్ళతోనూ కూడుకొన్న స్థితిని పొందటం; పక్షులును= పిట్టలూ; మృగములును= జంతువులూ; మదకలములు= మదంతో కూడినవి కావటం - సంతానోత్పత్తికి సిద్ధంగా ఉండటం; కాలకలితముల్= కాలంయొక్క కల్పనలే.

**తాత్పర్యం:** ధర్మరాజా! తామరలు, కలువలు విచ్చుకొనటం (ఇవి సూర్యోదయ చంద్రోదయ సూచకాలు), తీగలూ వృక్షాలూ, పూలతోనూ, పళ్ళతోనూ నిండి ఉండటం (ఇవి ఋతువులకు సూచకాలు), పక్షులూ, మృగాలూ సంతానోత్పత్తికి సిద్ధంకావటం కాలంయొక్క కల్పనలే.

వ. మఱియు జనన మరణంబులును, హానివృద్ధులును, లోనుగా సకలంబును గాలాధీనంబ కావున నీకు శోకింపం బనిలేదు; తొల్లి సేనజిత్తను మానవపతి పుత్ర మరణ శోకార్తుండై యుండి తనలోనన తెలిసి సజ్జన సన్నిధి నుపన్యసించిన వాక్యంబు లాకర్ణింపుము. 187

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ వినుము; జనన+మరణంబులును= పుట్టుక, చావు; హానివృద్ధులును= నశించటం, పెరగటం; లోనుగాన్= మొదలైన; సకలంబును= సమస్తమూ; కాల+అధీనంబు+అ= కాలానికి లోబడి ఉంటుంది; కావునన్= కనుక; నీకున్; శోకింపన్= బాధపడే; పని లేదు= అవసరం లేదు; తొల్లి= పూర్వం; సేనజిత్తు+అను= సేనజిత్తు అనే పేరుగల; మానవపతి= రాజు; పుత్రమరణ= కుమారుడి చావువలన; శోక+ఆర్తుండు+ఐ= విషాదంతో బాధపడిన వాడై; ఉండి; తనలోనన్+అ= తనమనస్సులోనే; తెలిసి= ఎరిగినవాడై, జ్ఞానబోధ పొంది; సత్+జన= ఆర్యుల; సన్నిధిన్= సమక్షంలో; ఉపన్యసించిన= మాటాడిన; వాక్యంబులు= వచనాలు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! అంతేకాదు. చావు పుట్టుకలు, ఎదుగుదల, తరుగుదలలు మొదలైన సర్వమూ కాలానికి లోనై ఉంటాయి సుమా! అందువలన నీవు బాధపడవలసిన పనిలేదు. పూర్వం సేనజిత్తు అనే రాజు పుత్రమరణం వలన మిక్కిలి బాధపడి, జ్ఞానబోధను తనలోనుండే పొందాడు. (బయటినుండి ఎవరూ అతడికి బోధ చేయలేదు). తానెరిగిన దానిని పెద్దల సాన్నిధ్యంలో చెప్పాడు. ఆ మాటలు వినుము.

**విశేషం:** జ్ఞానం ఎప్పుడూ మనిషికి అంతరంగంలో నిక్షిప్తమై ఉంటుంది. బాహ్యమైన బోధలు దోహదం మాత్రం చేస్తాయి. జ్ఞానబోధ 'తన' (ఆత్మ)లో నుండి మాత్రమే కలుగుతుంది. ఈ వాస్తవాన్ని వ్యాసుడు ధర్మరాజుకు కూడా తెలిపాడు.

### పారాశర్యుఁడు ధర్మజునకు సేనజిత్తువాక్యంబు లుపన్యసించుట (సం.12-26-18)

**సీ.** **' తారు గొందఱకు బాధకు లయి నడచుట । పరులచే బాధలఁ బడుట గలుగు;**
**నివి కాలభావ్యంబు; లెఱుక కల్గిన నొరుఁ । బఱిచితి నొరులచేఁ బడితి ననుచుఁ**
**బురుషుండు ప్రియశోకములఁ బొందఁ; డర్థ దా । రాపత్య బాంధవహాని కాత్మఁ**
**గుందంగ నడలుట మందబుద్ధిత్వంబు; । వగఁ గీడు మానునే? వలవ దడల;**

**తే.** **శోకభయకారణంబులు లోకమున న । నేకములు; దానఁ దలసూపు శోకములకు**
**భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు । మూఢుఁడవి త్రోవనేరండు మునుఁగు వగల. 188**

**ప్రతిపదార్థం:** తారు= తాము; కొందఱకున్= కొంతమందికి; బాధకులు+అయి= బాధించేవారై; నడచుట= ప్రవర్తించటం; పరులచేన్= ఇతరులచేత; బాధలుపడుట= కష్టపడటం; కలుగున్= జరుగుతాయి; ఇవి= ఈ కష్టపెట్టటం, కష్టపడటం అనేవి; కాలభావ్యంబులు= కాల స్వరూపంగా భావించదగినవి; ఎఱుక కల్గినన్= ఈ జ్ఞానం ఉంటే; పురుషుండు= మానవుడు; ఒరున్= పరుని; పఱిచితిన్= నేలకూల్చాను; ఒరులచేన్= ఇతరులచేత; పడితిన్= బాధపడ్డాను; అనుచున్= అంటూ; ప్రియశోకములన్= సంతోషాన్ని, దుఖాన్ని; పొందఁడు= కలిగి ఉండడు; అర్థ= ధన; దార= భార్య; అపత్య= సంతతి; బాంధవ= చుట్టాలయొక్క; హానికిన్= నష్టానికి; ఆత్మన్= మనసులో; కుందంగన్= కుమిలిపోయేటట్లు; అడలుట= ఏడ్వటం; మంద బుద్ధిత్వంబు= తెలివితక్కువతనం; వగన్= బాధవలన; కీడు= చేటు; మానును+ఏ?= తగ్గుతుందా?; అడలన్= దుఃఖించటం; వలవదు= కూడదు; లోకమునన్= లోకంలో; శోక, భయ, కారణంబులు= దుఃఖానికి, భయానికి, కారణాలు; అనేకములు= ఎన్నో ఉన్నాయి; దానన్= ఆ కారణంగా; పండితుండు= జ్ఞాని; తల+చూపు= పొడగట్టే, కనిపించే; శోకములకున్= దుఃఖాలకు; భయములకున్= భయాలకు; బుద్ధిన్= మనసులో; ఎడ+ఈఁడు= చోటుఇవ్వడు; మూఢుఁడు= మూర్ఖుడు; అవి= వాటిని; త్రోవనేరండు= తొలగ త్రోయలేడు; వగలన్= బాధలలో; మునుఁగున్= మునిగిపోతాడు.

**తాత్పర్యం:** 'లోకంలో తాము కొందరిని బాధించటం, కొందరు తమనే బాధపెట్టటం జరుగుతాయి. ఇవన్నీ కాలప్రభావాలనే భావించాలి. ఈ జ్ఞానం ఉన్న మానవుడు తాను బాధించాననో, బాధపడ్డాననో సంతోషాన్ని, దుఃఖాన్ని

పొందడు. ధనం, భార్య, సంతానం, బంధువులు పోయినప్పుడు మనసు కష్టపడేటట్లు బాధ పడటం తెలివితక్కువతనం అవుతుంది. బాధపడితే జరిగిన నష్టం పోతుందా? కనుక బాధపడకూడదు. భయానికి, శోకానికి లోకంలో కారణాలు అనేకం. అందువలననే జ్ఞాని అయినవాడు తన మనస్సులో భయశోకాలకు తావీయడు. మూర్ఖుడు వాటిని తొలగించలేక, బాధలలో మునిగిపోతాడు.

**క. వినుఁ డీ సుఖమును దుఃఖము । ననిత్యములు గాన వానియాగమ కాలం**
**బున ముదమును శోకము మొగ । కొనమియ చు మ్ముఱవు శాంతి గోరు జనులకున్. 189**

**ప్రతిపదార్థం:** వినుఁడు+ఈ= వినవలసింది; సుఖమును= సంతోషం; దుఃఖమును= బాధా; అనిత్యములు= శాశ్వతాలు కావు, తాత్కాలికాలు; కాన= కనుక; శాంతిన్= మనశ్శాంతిని; కోరు= కావాలనుకొనే; జనులకున్= మానవులకు; వాని= ఆ సుఖదుఃఖాల; ఆగమ కాలంబునన్= వచ్చే సమయంలో; ముదమును= సంతోషానికి; శోకమును= బాధకు; మొగకొనమి+అ= అభిముఖం కాకపోవటమే; ఉరవు= ఉచితం; చుమ్ము= సుమా!

**తాత్పర్యం:** సుఖదుఃఖాలు తాత్కాలికాలు కనుక, శాంతికాముకులైన జనులు సుఖం వచ్చినప్పుడు సంతోషాన్నీ, దుఃఖం వచ్చిప్పుడు బాధనూ పొందకుండా ఉండటం ఉచితం.

**తే. మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమ వి । వేకులును సుఖు; లట్టులు గాక కొంత**
**ప్రజ్ఞగలవారలై యపప్రతిభు లైన । జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు.' 190**

**ప్రతిపదార్థం:** మూఢతమ బుద్ధులు+అగువారు= మిక్కిలి మూర్ఖమైన బుద్ధికలవారూ; ప్రౌఢతమవివేకులును= మిక్కిలి ఘనమైన, గాఢమైన విచక్షణాజ్ఞానం కలిగినవారూ; సుఖులు= సుఖపడతారు; అట్టులు= ఆ విధంగా; కాక= కాకుండా; కొంత= కొద్ది; ప్రజ్ఞకలవారలు+ఐ= స్వతస్సిద్ధమైన తెలివి కలిగినవారై; అపప్రతిభులు+ఐన= సరైన ప్రతిభ లేని వారైనటువంటి; జనులు= మానవులు; దుఃఖ+ఆర్తులు= శోకంతో బాధపడేవారు; అగుట= అవటం; నిస్సంశయంబు= నిస్సందేహం, తప్పనిసరి.

**తాత్పర్యం:** మూర్ఖచక్రవర్తులూ (ఏమీ తెలియనివారు) జ్ఞానశ్రేష్ఠులూ (అన్నీ తెలిసినవారు) సుఖజీవులు. అట్లా కాకుండా తెలివి ఉండి, ప్రతిభ సరైన దారిలో లేనివారు మాత్రం దుఃఖంతో బాధపడటం తప్పదు'.

**విశేషం:** తెలిసీ తెలియని వారికే దుఃఖం కలుగుతుంది. మిడిమిడి జ్ఞానం భయహేతువు.

**వ. అనియె; నాసేనజితుం డుదాత్త వివేక నిరూఢుం; డతని వచనంబులు విద్వదాదరణీయంబు; లిందలి యర్థంబు నీ చిత్తంబున నలవరింపుము; వగ యుజ్జగింపు' మని వెండియు. 191**

**ప్రతిపదార్థం:** ఉదాత్త= అధికమైన; వివేక= విచక్షణాజ్ఞానం (మంచి చెడ్డలను నిత్యానిత్యాలను ఏర్పరచి చూడగల తెలివి)లో; నిరూఢుండు= బాగా పాతుకొని స్థిరపడిన వాడైన; ఆ సేనజితుండు= ఆ సేనజితుడు అనేరాజు; అనియెన్= పలికాడు; అతని వచనంబులు= అతడి మాటలు; విద్వత్= పండితులచేత; ఆదరణీయంబులు= ఆదరించదగినవి, అంగీకరించదగినవి; ఇందలి= ఈ మాటలలోని; అర్థంబు= భావం; నీ చిత్తంబునన్= నీ మనస్సులో; అలవరింపుము= అనుసరించుము; వగ= బాధను; ఉజ్జగింపుము= వదలుము; అని= పలికి; వెండియున్= తిరిగి, ఇంకనూ.

**తాత్పర్యం:** నిత్యానిత్య వివేకజ్ఞానాన్ని చక్కగా నిరూపించినవాడైన సేనజిత్తు ఆ విధంగా ఉపన్యసించాడు. అతడి మాటలు పండితులు ఆదరించదగినవి. ఆ మాటలలోని భావాన్ని నీ మనస్సుకు కాస్త పట్టనిమ్ము. శోకాన్ని వదలిపెట్టుము.' అని చెప్పి వ్యాసుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. ' వర్ణముల నాశ్రమంబుల వలను మెఱసి । యరసి చక్కని తెరువున నరుగఁ జేసి**
**ధరణి పాలింపు సముచిత దండధరణ । మాచరింపుము; నీ కిది యర్హవృత్తి. 192**

**ప్రతిపదార్థం:** వర్ణములన్+ఆశ్రమంబులన్= చతుర్వర్ణాలనూ, చతురాశ్రమాలనూ, వలను= వీలు; మెఱసి= ప్రకాశించి, కలిగి; అరసి= పరికించి, చూచి; చక్కని= సరైన, తిన్ననైన; తెరువునన్= దారిలో; అరుగన్+చేసి= నడచేటట్లుచేసి; ధరణి= భూమిని; పాలింపు= పాలనచేయుము; సముచిత= చక్కగా తగినటువంటి; దండధరణము= దండనీతిని వహించటం; ఆచరింపుము= చేయుము; నీకున్; ఇది= భూ పరిపాలనే; అర్హవృత్తి= తగినటువంటి జీవన విధానం.

**తాత్పర్యం:** నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలు సరైన దారిలో నడిచేటట్లుగా వాటి ఆనుపానులు బాగా పరికించి తెలిసికొని భూమిని పాలించుము; చక్కని దండనీతిని అమలు పరచుము; నీకు తగిన జీవన విధానం ఇదే.

**క. దివికిం జనినను నెవ్వని । వివిధ గుణము లఖిల జనులు వినుతింతురు వాఁ**
**డవనీశ్వర! సత్పురుషుం । డవునని కయికొంద్రు బుద్ధి నార్యజనంబుల్. 193**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ్వర!= రాజా!; దివికిన్= స్వర్గానికి; చనిననున్= వెళ్ళినా, (స్వర్గస్థుడైనా); ఎవ్వని= ఎవరి; వివిధ= అనేకమైన; గుణములు= సద్గుణాలను; అఖిలజనులు= జనులందరు; వినుతింతురు= కీర్తిస్తారో; వాఁడు= అతడు; సత్+పురుషుండు+అవును+అని= సజ్జనుడవుతాడని; ఆర్యజనంబుల్= పెద్దలు; బుద్ధిన్= మనస్సులో; కయికొంద్రు= అంగీకరిస్తారు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! స్వర్గస్థుడైన తరువాత కూడా ఎవరి సద్గుణాలను లోకంలోని వారంతా కీర్తిస్తుంటారో, అట్టివాడు సజ్జను డని పెద్దలు అంగీకరిస్తారు.

**వ. కావున సకల జనహృదయ ప్రియహితం బగు పృథ్వీపరిరక్షణంబు నీకుం గులధర్మంబై కర్తవ్యం బగుట యుఱవుగాదె!' యనిన యమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డిట్లనియె. 194**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; సకల= సమస్తమైన; జన= ప్రజల; హృదయ= మనసులకు; ప్రియ= ఇష్టము; హితంబు= మేలు; అగు= అయిన; పృథ్వీ= భూమియొక్క; పరిరక్షణంబు= కాపాడటం; నీకున్= నీకు; కులధర్మంబు+ఐ= నీవు జన్మించిన రాజవంశం యొక్క విధి అయి ఉండి; కర్తవ్యంబు+అగుట= నీవు చేయవలసిన పని అయి ఉండటం; ఉఱవు= ఉచితం; కాదు+ఎ!= కదా!; అనిన= అన్న; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ మునిశ్రేష్ఠుడితో; ఆ+మనుజ+ఇంద్రుండు= రాజశ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కనుక సమస్తమైన ప్రజల హృదయాలకు, ఇష్టాన్నీ, మేలునూ కలిగించే రాజ్యపాలనం. నీకు జన్మతః ప్రాప్తించిన కులధర్మం అయి, తప్పక నిర్వర్తించవలసిన కర్తవ్యంగా ఉన్నది' అని ముని అన్నమాటలు విని రాజు ఈ విధంగా పలికాడు.

**తే. మఱవవచ్చునె నా కభిమన్యు ద్రౌప । దేయులను గర్ణు మత్స్య భూనాయకుండు**
**ద్రుపద నృపతియు ధృష్టకేతుండు మాన । సమునఁ బాయుదురే యెట్లు శాంతి గలుగు? 195**

**ప్రతిపదార్థం:** నాకున్; అభిమన్యున్= అభిమన్యుడినీ; ద్రౌపదేయులను= ద్రౌపది పుత్రులైన ఉపపాండవులనూ; కర్ణున్= కర్ణుడినీ; మఱవన్+వచ్చును+ఎ= మరవటం వీలవుతుందా; మత్స్యభూనాయకుండు= మత్స్యదేశరాజు అయిన విరటుడు; ద్రుపదనృపతియున్= ద్రుపద మహారాజూ; ధృష్టకేతుండు= ధృష్టద్యుమ్నుడు; మానసమునన్= మనస్సునందుండి; పాయుదురు+ఎ?= పోగలరా?; ఎట్లు= ఏ విధంగా; శాంతి= మనశ్శాంతి; కలుగున్?= కలుగుతుంది?

**తాత్పర్యం:** 'మహర్షీ! నాకు అభిమన్యుడినీ, ఉపపాండవులనూ, కర్ణుడినీ మరవటం వీలవుతుందా? (మరవలేనని భావం). విరాటరాజును, ద్రుపదమహారాజును, ధృష్టద్యుమ్నుడినీ మనసులోనుండి తొలగించగలనా? (మరవలేనని భావం). అట్టి స్థితిలో నాకు శాంతి ఎట్లా కలుగుతుంది?

**సీ.** **తొడలపై నర్మిలి నిడికొని న న్నుప । లాలించుచుండు బాల్యమున నట్టి**
**భీష్మునిఁ జంపితి; బీభత్సు భల్లముల్ । దనువు సెక్కంగ నాతఁడు శిఖండిఁ**
**జూచుచు నుండుటఁ జూచితి; నది యుల్ల । మలమటఁ బెట్టెడి; నట్లుగాక**
**యా భంగి నున్నప్పు డాతఁ డాద్రుపదజు । నేయమిఁ దలఁచిన నెరియు మనసు;**

**తే.** **పరశురాముని నోర్చిన బల్లిదుండు, । కాశిరాజ కన్యకలకుఁ గాఁగఁ బుడమి**
**నరపతుల నెల్ల గెలిచిన బిరుదు గలన । నాఅడియ పడు టూహింప నడలు గదురు.** **196**

**ప్రతిపదార్థం:** బాల్యమునన్= పసితనంలో; తొడలపైన్= ఒడిలో; అర్మిలిన్= ప్రేమతో; ఇడికొని= కూర్చుండపెట్టుకొని; నన్నున్+ఉపలాలించుచున్+ఉండు= నన్ను బుజ్జగిస్తూ ఉండే; అట్టి= అటువంటి; భీష్మునిన్= పితామహుడిని; చంపితిన్= చంపాను; బీభత్సు= అర్జునుడి; భల్లముల్= బాణాలు; తనువు= శరీరాన్ని; చెక్కంగన్= నాటుకొనగా; ఆతఁడు= ఆ భీష్ముడు; శిఖండిన్= శిఖండిని; చూచుచున్= చూస్తూ; ఉండుటన్= ఉండటం; చూచితిన్= చూచాను; అది= ఆ దృశ్యం; ఉల్లమున్= మనస్సును; అలమటన్= బాధ, చింత; పెట్టెడిన్= పెట్టుతుంది; అట్లు+కాక= అదేకాక; ఆ భంగిన్= ఆ విధంగా; ఉన్నప్పుడు= ఉన్న సమయంలో; ఆతఁడు= ఆ భీష్ముడు; ఆ ద్రుపదజున్= శిఖండిని; ఏయమిన్= బాణాలతో కొట్టకపోవటాన్ని; తలఁచినన్= తలచుకొంటే; మనసు= మనస్సు; ఎరియున్= కష్టపడుతుంది; పరశురామునిన్= భార్గవరాముడిని; ఓర్చిన= ఓడించిన; బల్లిదుండు= వీరుడు; కాశిరాజ కన్యకలకున్+కాఁగన్= కాశీరాజు కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికల కొరకు; పుడమి= భూలోకంలోని; నరపతులన్= రాజులను; ఎల్లన్= అందరినీ; గెలిచిన= ఓడించిన; బిరుదు= ప్రఖ్యాతుడు; కలనన్= యుద్ధంలో; ఆఅడి+అ= కష్టమే, ఇబ్బంది; పడుట= పడటం; ఊహింపన్= తలచుకొంటే; అడలు= బాధ; కదురున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** చిన్నతనంలో ప్రేమగా ఒడిలో కూర్చోపెట్టుకొని బుజ్జగించి ముద్దుచేసిన భీష్ముడిని చంపించాను. అర్జునుడి బాణాలు శరీరంలో నాటుకొంటూ ఉండగా, శిఖండివంక చూస్తూ ఉన్న దృశ్యం నా మనస్సును కష్టపెట్టుతూనే ఉంటుంది. ఆయన ఆ స్థితిలో శిఖండిపై బాణాలు వేయకుండా ఉండటం తలచుకొంటే మనసుకి కష్టంగానే ఉంటుంది. పరశురాముడంతటి వాడినే గెలిచిన యోధుడు, అంబ, అంబిక, అంబాలికలకై భూతలంపై ఉన్న రాజులందరినీ గెలిచిన ప్రసిద్ధుడు అయినటువంటి వాడు యుద్ధభూమిలో ఇరుకున పడటం తలచుకొంటే బాధ కలుగుతుంది.

**ఆ.** **అల్పకాల భోగ్యమైన రాజ్యమునకుఁ । గా ననల్పకీర్తిఘనుని జరఠ**
**సింహకల్పు వంశశేఖరజన్ముఁ ద్రుం । చితి మనంబు వగలఁ జివుక కున్నె.** **197**

**ప్రతిపదార్థం:** అల్పకాల= కొద్దికాలం; భోగ్యము+ఐన= అనుభవించదగినదైన; రాజ్యమునకున్+కాన్= రాజ్యంకొరకు; అనల్ప= తక్కువ కాని, అధికమైన; కీర్తిఘనుని= కీర్తిచే గొప్పవాడైన; జరఠ= ముసలిదైన; సింహకల్పున్= సింహంతో; సమానమైనవాడిని; వంశశేఖరజన్మున్= కులంలో తలమానికమై జన్మించినవాడిని; త్రుంచితిన్= సంహరించాను; మనంబు= మనస్సు; వగలన్= బాధలతో; చివుకక+ఉన్నె?= చీకిపోకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** అశాశ్వతమైన రాజ్యభోగంకొరకు గొప్పకీర్తి కలవాడు, గట్టి వృద్ధసింహంతో సమానుడు, కురువంశానికి తలమానికమైనవాడు అయిన భీష్ముడిని సంహరించాను. దానికి నా మనస్సు బాధతో చివికి పోకుండా ఉంటుందా? (ఉండదని భావం).

**మ. జన సంపూజ్య పదారవిందుఁ డగు నాచార్యుండు శోకించి నం**
**దను చొప్పారయ వేఁడి పెద్దయు ననుం దా నమ్మి యర్థింపఁ జా**
**వని వానిం గరిచావు బుద్ధి నిడి యశ్వత్థామ సచ్చెన్ నిజం**
**బని యే బొంకితి మేదినీభరణ మర్హంబే గురుద్రోహికిన్? 198**

**ప్రతిపదార్థం:** జన= జనులందరిచేత; సంపూజ్య= చక్కగా పూజించదగిన; పద+అరవిందుఁడు+అగు= పాదపద్మాలు కలవాడైన; ఆచార్యుండు= గురువు; శోకించి= బాధపడి; నందను= పుత్రుడి; చొప్పు+ఆరయన్= జాడతెలుసుకొనగా; వేఁడి= ప్రార్థించి; పెద్దయున్= అధికంగా; ననున్= నన్ను; తాన్= అతడు; నమ్మి= విశ్వసించి; అర్థింపన్= కోరగా; చావనివానిన్= చనిపోనివాడిని; కరిచావు= ఏనుగు మరణాన్ని; బుద్ధిన్+ఇడి= మనస్సులో పెట్టుకొని; అశ్వత్థామ+చచ్చెన్= అశ్వత్థామ చచ్చిపోయాడు; నిజంబు= నిజం; అని; ఏన్= నేను; బొంకితిన్= అబద్ధమాడాను; గురు ద్రోహికిన్= గురువుకు ద్రోహం చేసిన పాపికి; మేదినీభరణము= భూభారం వహించటం; అర్హంబు+ఏ?= తగినదా?

**తాత్పర్యం:** ప్రజలందరిచేత బాగా పూజింపబడే పాదపద్మాలు కల గురువైన ద్రోణుడు, తనకుమారుడి జాడ తెలియక బాధపడి, నాపై నమ్మకంతో వెదకుమని కోరగా - చచ్చిన ఏనుగును మనస్సులో పెట్టుకొని, చావని గురుపుత్రుడి గురించి 'అశ్వత్థామ చనిపోయాడు. ఇది నిజం.' అని అబద్ధమాడాను. గురుద్రోహికి భూభారం వహించే అర్హత ఉంటుందా? (ఉండదని భావం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**ఆ. రాజ్యలాభ లోభరతుఁ డయి కడుఁ బాప । మైన బొంకు మాటలాడి గురునిఁ**
**గూల్పనేర్చినట్టి క్రూరాత్ముఁ డేగతిఁ । బోవువాఁడు సెపుమ బుధవరేణ్య! 199**

**ప్రతిపదార్థం:** బుధవరేణ్య!= పండితోత్తముడా!; రాజ్యలాభ= రాజ్యం పొందాలనే; లోభరతుఁడు+అయి= లోభబుద్ధికలవాడై; కడున్= మిక్కిలి; పాపము+ఐన= దుష్కర్మమైన; బొంకుమాటలు= అబద్ధపు పలుకులు; ఆడి= పలికి; గురునిన్= ఆచార్యుడిని; కూల్పన్= పడగొట్టటం; నేర్చిన+అట్టి= తెలిసికొన్నటువంటి; క్రూర+ఆత్ముఁడు= దుర్బుద్ధి; ఏగతిన్= ఏ గతికి; పోవువాఁడు= వెళ్ళుతాడో; చెపుము+అ= చెప్పుము.

**తాత్పర్యం:** అన్నీ తెలిసిన పండితులలో ఉత్తముడైనవాడా! రాజ్యం పొందాలనే దురాశతో నిండిన మనసు కలవాడై మిక్కిలి పాపకార్యమైన అసత్యం పలికి, గురువును చంపటం నేర్చుకొన్న కఠినాత్ము డేగతి పొందుతాడో చెప్పుము.

**క. భ్రాత మహాత్ముఁడు గర్ణుం । డాతనిఁ జంపించి యేలు నవనీరాజ్యం**
**బాతురత సేయుఁ గాక సు । ఖాతిశయము మతికి నొసఁగునయ్య మునీంద్రా! 200**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునివర్యా!; కర్ణుండు= కర్ణుడు; భ్రాత= సోదరుడు; మహా+ఆత్ముఁడు= మహానుభావుడు; ఆతనిన్= ఆ కర్ణుడిని; చంపించి= చంపేటట్లు చేసి; ఏలు= పాలించే; అవనీరాజ్యంబు= ధరణీరాజ్యం; ఆతురత= కల్లోలం,

బాధ; చేయున్= కలిగిస్తుంది; కాక= తప్ప; సుఖ+అతిశయము= అధికమైన సుఖాన్ని; మతికిన్= మనస్సుకు; ఒసగును+అయ్య!= ఇస్తుందా? (ఇవ్వదని భావం).

**తాత్పర్యం:** మునీంద్రా! మహానుభావుడు, సోదరుడు అయిన కర్ణుడిని చంపించి చేసే రాజ్యపాలన బాధకలిగిస్తుందే కాని మనసుకు అధికమైన సుఖాన్ని ఇవ్వగలదా?

**చ.** **కడిఁది మగండు కుంభజుఁడు గావఁగ నొప్పిన మంటవోలె నుం**
**డెడి మొనఁ జూచి చూచి యిది డెప్పర మ న్వగ లేక పంచితిం**
**గొడుకుఁ జొరంగ; నత్తెఱఁగు క్రూరత సైఁప సుభద్ర యట్లుఁ గ**
**వ్వడిక్రియ నేర్తురే యొరులు? వల్లభుఁ డేలగు నట్టిఁ డుర్వికిన్.** **201**

**ప్రతిపదార్థం:** కడిఁది= అధికమైన, గొప్ప; మగండు= శూరుడు; అయిన; కుంభజుఁడు= ద్రోణుడు; కావఁగన్= కాపాడుతుండగా; ఒప్పిన= పెద్దదైన; మంట+పోలెన్= అగ్నిజ్వాలవలె; ఉండెడి= ఉన్నటువంటి; మొనన్= సైన్యాన్ని; చూచి= పరికించి; ఇది= ఈ సైన్యం; డెప్పరము= దుస్సహం; అను= అనే; వగ= బాధ; లేక; కొడుకున్= కుమారుడిని, అభిమన్యుడిని; చొరంగన్= దూరుటకు, ప్రవేశించటానికి; పంచితిన్= పంపాను; ఆ+తెఱఁగు= ఆ విధమైన; క్రూరత= కాఠిన్యం; సుభద్ర+అట్లు= సుభద్రవలె; కవ్వడి+క్రియన్= అర్జునుడివలె; ఒరులు= ఇతరులు; సైఁపన్= సహించటం; నేర్తురే?= నేర్వగలరా?; అట్టిఁడు= అట్టివాడు (అట్టి క్రూరుడు); ఉర్వికిన్= భూమికి; వల్లభుఁడు= భర్త, రాజు; ఏల+అగున్?= ఏవిధంగా కాగలడు?

**తాత్పర్యం:** చాల గొప్ప శూరుడైన ద్రోణుడు కాపాడుతుండగా, పెద్ద అగ్నిజ్వాలవలె ఉన్న సైన్యాన్ని పరికించి కూడా దీనిని తట్టుకొనటం చాల కష్టం అనే బాధ లేక, కుమారుడైన అభిమన్యుడిని అందులో ప్రవేశించటానికి పంపించాను. అటువంటి నా క్రూరత్వాన్ని సుభద్రార్జునులవలె సహించగలవా రెవరైనా ఉంటారా? పసిబాలుడిని యుద్ధానికి పంపినటువంటి క్రూరుడు భూమిని పరిపాలించటానికి అర్హుడెట్లా అవుతాడు? (అభిమన్యుడిని యుద్ధానికి పంపి, మరణానికి కారణం అయినందువలన తనకు రాజ్యార్హత లేదని భావం.)

**చ.** **అడ లెదఁ బొందఁగాఁ దగనియట్టిది ద్రోవది మేరుకల్పులం**
**గొడుకుల నేవురన్ జముఁడు గొన్న నలందురఁ జూడనేర్తునే?**
**పుడమి గిరీంద్ర పంచకము పోయినఁ బాడటినట్టు లున్న య**
**ప్పడఁతుక యెట్టులోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁగన్.** **202**

**ప్రతిపదార్థం:** అడలు= భయం; ఎదన్= మనసులో; పొందఁగాన్= పొందటానికి; తగని+అట్టిది= వీలుకానిది అయిన; ద్రోవది= ద్రౌపది; మేరు కల్పులన్= మేరుపర్వతంతో సమానమైన వారైన; కొడుకులన్= కుమారులను; ఏవురన్= ఐదుగురిని; జముఁడు= యముడు; కొన్నన్= తీసికొనిపోగా; అలందురన్= దుఃఖిస్తుండగా; చూడ నేర్తునే?= చూడగలనా?; పుడమి= భూమిపై; గిరీంద్ర పంచకము= ఐదు పర్వతరాజాలు; పోయినన్= పోగా; పాడటినట్టులు+ఉన్న= పాడుపడినట్లుగా ఉన్నటువంటి; ఆ+పడఁతుక= ఆ స్త్రీ, ద్రౌపది; గృహభారము= ఇంటి బాధ్యత; నెఱ+మదిన్= నిండుమనసుతో, మనఃపూర్వకంగా; నిర్వహింపఁగన్= మోయటం; ఎట్టులు+ఓర్చున్?= ఎట్లా భరించగలుగుతుంది?

**తాత్పర్యం:** భయం బాధ మొదలైనవి మనసులో సహించలేనిది అయిన ద్రౌపది మేరుపర్వతంవలె గంభీరులు ఉన్నతులు అయిన కుమారులు ఐదుగురినీ యముడు తీసికొని పోగా, దుఃఖిస్తుండగా, నేను చూడగలనా? (ద్రౌపది

దుఃఖాన్ని చూడలేనని భావం). గొప్ప పర్వతాలు అయిదింటిని కోల్పోవటంవలన పాడుపడినట్లుగా ఉన్న భూదేవివలె ఉన్న ద్రౌపది గృహభారాన్ని మనఃస్ఫూర్తిగా నిర్వహించగలదా? (లేదేమో నని భావం).

**విశేషం:** అలం: ఉపమ.

**క. ప్రాయోపవేశమున ని । క్కాయంబు దొఱంగు తలఁపు గదిరెడి; సంతా**
**పాయత్తచిత్తు నకటక । టా యని పోనిండు నను దృఢవ్రతయుక్తిన్. 203**

**ప్రతిపదార్థం:** ప్రాయోపవేశమునన్= మరణంకొరకు ఎదురుచూస్తూ ఆహారం తీసికొనకుండా ఉండటం అనే పద్ధతితో; ఈ+కాయంబున్= ఈ శరీరాన్ని; తొఱంగు= వదిలే; తలంపు= ఆలోచన; కదిరెడిన్= కలుగుతున్నది; సంతాప+ఆయత్త+చిత్తున్= మిక్కిలి బాధతో సిద్ధపడిన మనస్సు కలవాడిని; అకట+అకటా+అని= అయ్యయ్యో అనుకొని; దృఢవ్రతయుక్తిన్= గట్టి నియమంతో కూడినవాడనైన; ననున్= నన్ను; పోనిండు= వెళ్ళనివ్వండి.

**తాత్పర్యం:** నిరశనదీక్షతో మరణంకొరకు ఎదురు చూచి శరీరం వదలాలనే ఆలోచన కలుగుతున్నది. ఎంతో బాధవలన దానికి సిద్ధపడిన మనసుకలవాడినై, స్థిరమైన నియమంతో ఉన్న నన్ను అయ్యో అని జాలిపడి వెళ్ళనివ్వండి'.

**వ. అని పలికి బంధుమరణ శోక వ్యాకులుం డయి యున్న యున్నరనాథవరేణ్యుతో నమ్మునినాథ వరేణ్యుం డిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఈ విధంగా మాటాడి; బంధుమరణ= చుట్టముల చావువలన కలిగిన; శోక= విషాదంతో; వ్యాకులుండు+అయి= కలతపడినవాడై; ఉన్న= ఉన్నటువంటి; ఆ+నరనాథవరేణ్యుతోన్= ఆ రాజశ్రేష్ఠుడితో; ఆ+మునినాథవరేణ్యుండు= ఆ మునీశ్వరులలో శ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా మాట్లాడి, చుట్టాలందరు చనిపోవటంతో బాధపడి కలతచెందిన మనస్సు కల రాజోత్తముడైన ధర్మరాజుతో మునిసత్తముడైన వ్యాసు డిట్లా అన్నాడు.

**ఆ. ' ఇట్లనంగఁ దగునె? యిమ్మెయి నడల నీ । యట్టి ధైర్యఘనున కగునె యనఘ!**
**బుద్ధి సెప్పవలసెఁ బునరుక్తభాషలఁ । జెవులు మదియుఁ గూడఁ జేర్చి వినుము. 205**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడవైన ధర్మరాజా!; ఇట్లు= ఈ విధంగా; అనంగన్= అనటం; తగునె?= న్యాయమా?; నీ+అట్టి= నీ వంటి; ధైర్య ఘనునకున్= ధైర్యంచేత గొప్పవాడైనవాడికి; ఈ+మెయిన్= ఈ విధంగా; అడలన్= భయపడటం; అగును+ఎ?= తగునా?; పునః ఉక్త= మళ్ళీ చెప్పిన; భాషలన్= మాటలతో; బుద్ధి+చెప్పవలసెన్= కర్తవ్యబోధ చేయాల్సి వచ్చింది; చెవులు= కర్ణాలూ; మదియున్= మనస్సునూ; కూడన్+చేర్చి= కలిసేటట్లుగా చేర్చి; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'పుణ్యశీలివైన ధర్మరాజా! నీవీ విధంగా మాట్లాడటం తగదు. నీ వంటి ధైర్యశాలికి ఇట్లా భయపడటం కూడదు. మళ్ళీ మళ్ళీ నీకు కర్తవ్య బోధచేయవలసి వస్తున్నది. ఈ మారు చెవులూ మనసును కూడా చేర్చి వినుము.

**తే. పొదలుఁ దఱుఁగుటకై, పొడవొదవుఁ బడుట । కై, కడుం జేరుఁ బాయుటకై, జనించుఁ**
**బొలియుటకునై సుఖంబులఁ బొందు దుఃఖ । మొందుటకునై పదార్థము లెందు నధిప! 206**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఎందున్= ఎక్కడైనా; పదార్థములు= వస్తువులు; తఱుఁగుటకై= తగ్గటానికి (నశించటానికి); పొదలున్= వృద్ధిపొందుతాయి; పడుటకై= పతనం కావటానికే; పొడవు+ఒదవున్= రూపొందుతాయి; పాయుటకై= వదలి వెళ్ళటానికే;

కడున్= మిక్కిలి; చేరున్= (దగ్గర) సమీపం అవుతాయి; పొలియుటకునై= చనిపోవటానికే; జనించున్= పుట్టుతాయి; దుఃఖము= బాధ; ఒందుటకునై= పొందటానికి; సుఖంబులన్= సుఖాలను; పొందున్= కలిగి ఉంటాయి.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఎక్కడైనా పదార్థం వృద్ధిపొందటం నశించటానికే, ఎత్తుపెరగటం విరగటానికే. దగ్గరకావటం దూరమవటానికే, పుట్టటం గిట్టటానికే, సుఖపడటం కష్టాలు పొందటానికే.

**ఉ. మిత్రులచేఁతలన్ సుఖము మేకొను నంటయుఁ, జెందు దుఃఖముల్**
**శత్రులచెయ్ది నంటయును, సన్మతి దా ధనమూల మంటయున్,**
**గోత్రవరేణ్య! భోగములకున్ ధనముల్ గరణంబు లంటయుం,**
**జిత్రచరిత్రుఁడైన విధి చేష్ట దొఱంగిన నీటివ్రా లగున్. 207**

**ప్రతిపదార్థం:** గోత్రవరేణ్య!= రాజోత్తమా! ధర్మరాజా!; మిత్రుల= హితుల; చేఁతలన్= పనులవలన; సుఖము= సౌఖ్యం; మేకొనున్= కలుగుతుంది; అంటయున్= అనటమూ; శత్రుల= వైరుల; చెయ్దిన్= చేతవలన; దుఃఖములు= కష్టాలు; చెందున్= వస్తాయి; అంటయును= అనటమూ; సత్+మతి= సద్బుద్ధి; తాన్= అది; ధనమూలము= ధనం మొదలుగా కలది; అంటయున్= అనటమూ; భోగములకున్= సుఖానుభవాలకు; ధనముల్= సంపదలు; కరణంబులు= సాధనాలు; అంటయున్= అనటమూ; చిత్ర చరిత్రుఁడు+ఐన= మానవమేధకు అంతుచిక్కని నడత కలవాడైన; విధి= విధాత; చేష్ట= కార్యం; తొఱంగిన= విడిచిన, కాదనిన; నీటివ్రాలు= నీటిపైన వ్రాత; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠా! ధర్మరాజా! మిత్రులు చేసే పనులవలన సుఖాలు కలుగుతా యని, శత్రువుల పనులవలన దుఃఖాలు కలుగుతా యని, సద్బుద్ధికి ధనం కారణమని, భోగాలకు ధనం సాధనమవుతుందని, అనటం - చిత్రమైన నడత కలవాడైన బ్రహ్మచేతలను కాదన్నచో; నీటి మీద వ్రాసిన వ్రాత అవుతుంది (కల్ల అవుతుంది).

**వ. కావున నెవ్వగ నొందం బనిలేదు. 208**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నెఱ+వగన్= ఎక్కువ బాధను; ఒందన్= పొందవలసిన; పని లేదు= అక్కర లేదు.

**తాత్పర్యం:** అందువలన ఎక్కువ బాధపడవలసిన పని లేదు.

**ఆ. ధాత నిన్ను నేమి ధర్మంబు నడపుట । కై సృజించె దాని నాచరించి**
**యుండు; నీవు నీక యొడయుండవే? ధాతృ । నోదిత ప్రవర్తనుఁడవు గాక!' 209**

**ప్రతిపదార్థం:** ధాత= సృష్టికర్త; నిన్నున్= నిన్ను; ఏమి ధర్మంబు= ఏ ధర్మాన్ని; నడపుటకై= ప్రవర్తింపచేయటానికి; సృజించెన్= సృష్టించాడో; దానిన్= ఆ ధర్మాన్ని; ఆచరించి= అమలు జరిపి; ఉండు= ఉండుము; ధాతృనోదిత= బ్రహ్మచేత ప్రేరేపింపబడిన; ప్రవర్తనుఁడవు+కాక= ప్రవర్తన (నడవడిక) కలిగిన వాడవు అవక; నీకున్+అ= నీకే; నీవు= నీవు; ఒడయుండవు+ఏ?= రాజువా?

**తాత్పర్యం:** నిన్ను బ్రహ్మ ఏ ధర్మాచరణకొరకు సృష్టించాడో, దానిని అమలు జరపవలసి ఉన్నది. నీకు నీవే రాజు వనుకొంటున్నావా? బ్రహ్మచేత నిర్దేశించబడిన నడత కలవాడివి కాక నీకు నీవే అధిపతివా?' (కావు - అని భావం.)

**విశేషం:** విధివ్రాత ననుసరించి ప్రవర్తిస్తారే కాని మానవులు స్వయంగా చేయలేరు అని భావం.

**వ. అని పలికి యప్పారాశర్యుండు వెండియు నిట్లను 'విదేహరా జగు జనకుండు వివేకపరిపాకంబు నొందక మున్నొకసమయంబున బంధువియోగంబు వాటిల్ల విషాదంబు నొంది, గృహంబు దొఱంగి వెడలు వాఁడయ్యె; నట్టియెడ నతని పాలికి నశ్మకుం డను విప్రవర్యుండు వచ్చిన నవ్వసుమతీపతి సముచిత ప్రకారంబునం బూజితుం జేసి. 210**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఇట్లా చెప్పి; ఆ+పారాశర్యుండు= ఆ పరాశరాత్మజుడు వ్యాసుడు; వెండియున్= ఇంకా; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; విదేహరాజు+అగు= విదేహరాజ్యాధిపతి అయిన జనకమహారాజు; వివేకపరిపాకంబున్= నిత్యానిత్య వివేకంలో పరిణతి (పరిపక్వత)ని; ఒందకమున్ను= చెందక ముందు; ఒక సమయంబునన్= ఒకసారి; బంధువియోగంబు= చుట్టాలను కోల్పోవటం; పాటిల్లన్= కలుగగా; విషాదంబును= దుఃఖాన్ని; ఒంది= పొంది; గృహంబు= ఇంటిని; తొఱంగి= వదలి; వెడలువాఁడు+అయ్యెన్= వెళ్ళిపోవటానికి సిద్ధమయ్యాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; అతని పాలికిన్= ఆ జనకుడి వద్దకు; అశ్మకుండు+అను= అశ్మకుడనే పేరుగల; విప్రవర్యుండు= బ్రాహ్మణోత్తముడు; వచ్చినన్= రాగా; ఆ+వసుమతీపతి= ఆ రాజు (జనకుడు); సముచిత= తగిన; ప్రకారంబునన్= పద్ధతిలో; పూజితున్+చేసి= పూజించి.

**తాత్పర్యం:** ఈ విధంగా మాట్లాడి వ్యాసుడు ఇంకా ఇట్లా చెప్పాడు. 'ధర్మజా! విదేహరాజైన జనకుడు తత్త్వజ్ఞాన పరిపూర్ణుడు కాకముందు, ఒకసారి బంధువులను కోల్పోవటం జరిగి, ఆ బాధతో ఇల్లు వదలి పోదలచాడు. ఆ సమయంలో అశ్మకుడనే బ్రాహ్మణుడు జనకుడివద్దకు వచ్చాడు. జనకు డాతనిని తగినట్లుగా పూజించాడు (తరువాతి పద్యంతో అన్వయం).

**జనకున కశ్మకుండు సెప్పిన నీతి వ్యాసుఁడు ధర్మజునకుఁ జెప్పుట (సం. 12-28-2)**

**తే. ' అర్థములు బంధువులుఁ గల్గినపుడు తద్వి । యోగమైనట్టి యెడను మర్త్యునకు నెద్ది**
**తలఁపుమై నున్న మదవిషాదంబు లడర । కుండుఁ జెప్పవె యది కృపాయుక్తి ననఘ!' 211**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; అర్థములు= ధనములు, సంపదలు; బంధువులున్= చుట్టాలు; కల్గినపుడు= ఉన్నప్పుడూ; తద్= వాటి; వియోగము= ఎడబాటు; ఐన+అట్టి+ఎడను= కలిగిన సందర్భంలోనూ; మర్త్యునకున్= మానవుడికి; ఎద్ది= ఏది; తలఁపుమైన్= ఆలోచనలో, బుద్ధిలో; ఉన్నన్= ఉంటే; మద విషాదంబులు= అహంకారం, దుఃఖం; అడరక+ఉండున్= విజృంభించకుండ ఉంటాయో; అది= దానిని; కృపాయుక్తిన్= దయతో కూడిన వాడవై; చెప్పవు+ఎ?= తెలియచెప్పవా? (చెప్పుమని ప్రార్థన).

**తాత్పర్యం:** 'మానవుడి బుద్ధిలో ఏది ఉంటే, ధనం, బంధువులు కలిగినపుడు అహంకారం, అవి పోతే దుఃఖం కలుగకుండా ఉంటాయో దానిని దయతో నాకు తెలియజెప్పుము'.

**వ. అని యడిగిన నాతం డిట్లనియె. 212**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; అడిగినన్= అడుగగా; ఆతండు= ఆ అశ్మకుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** జనకు డట్లా అడగగానే అశ్మకు డీ విధంగా జవా బిచ్చాడు.

**సీ. ' దుఃఖంబు సుఖమును దోడివ సంసార । మునకుఁ; దద్వశగతిఁ బోవు నరుని**
**యాత్మ నంబుదము గా ద్రపహరించిన విధం । బున నవి సెఱుచు; నేపున సుఖైక**
**భాగియు దుఃఖైకభాగియు లేమి లో । కంబునం దెలియంగఁ గనుట మందు**
**వానికి; విను జర రానీక త్రోవంగఁ । జావక యుండ వశంబె జలధి**

**తే.** **వలయ వేష్టిత క్షితి నేలు వానికైన । నధిప! యెద్ది వాటిల్లిన ననుభవించు**
**నపుడు ప్రాప్తవ్య మిది యని యంతరంగ । విభ్రమము లేక యునికి వివేక సరణి. 213**

**ప్రతిపదార్థం:** అధిప!= జనక మహారాజా!; దుఃఖంబు= శోకం; సుఖమును= సంతోషమూ; సంసారమునకున్= గృహస్థజీవనానికి; తోడివి+అ= కలిసి ఉండేవే; తద్= వాటికి; వశగతిన్= లొంగిన విధంగా; పోవు= వర్తించే; నరుని= మానవుడిని; ఆత్మన్= మనస్సును; అంబుదము= మేఘాన్ని; గాడ్పు= గాలి, వాయువు; అపహరించిన విధంబునన్= మాయం చేసినట్లుగా; అవి= ఆ సుఖదుఃఖాలు; చెఱుచున్= చెడగొడతాయి; ఏపునన్= అధికంగా, మిక్కిలి; సుఖ+ఏక+భాగియున్= సుఖమును మాత్రమే అనుభవించే వాడు కాని; దుఃఖ+ఏక+భాగియున్= దుఃఖాన్ని మాత్రమే అనుభవించే వాడు కాని; లోకంబునన్= లోకంలో; లేమి= లేకపోవటం; తెలియంగన్+కనుట= తెలిసేటట్లు చూడటం (తెలిసికొనటం); వానికిన్= ఆ సుఖదుఃఖాలకు; మందు= ఔషధం, ప్రతిచర్య; విను= వినుము; జలధి+వలయ+వేష్టిత= సముద్రమనే వలయంచేత చుట్టబడిన; క్షితిన్= భూమిని; ఏలువానికిన్+ఐనన్= పాలించే చక్రవర్తికైనా; జర= ముసలితనమును; రానీక= రానీయక; త్రోవంగన్= ఆవలకు నెట్టటం; చావక= మరణించక; ఉండన్= ఉండటం; వశంబు+ఎ?= చేతులలో ఉన్నదా? వీలవుతుందా?; ఎద్ది= ఏది; పాటిల్లినన్= సంభవించినా, వచ్చినా; అనుభవించు+అపుడు= అనుభవించే సమయంలో; ఇది= ఆ వచ్చినది; ప్రాప్తవ్యము= పొందదగింది; అని= అనుకొని; అంతరంగ విభ్రమము=మనస్సు భ్రమపడటం, చెదరటం; లేక= లేకుండా; ఉనికి= ఉండటం; వివేకసరణి= జ్ఞానమార్గం, తెలిసినవారి పద్ధతి.

**తాత్పర్యం:** 'జనక మహారాజా! సుఖదుఃఖాలు సంసార జీవనంలో కలిసే ఉంటాయి. గాలి మేఘాన్ని చెదరగొట్టినట్లు, వాటికి లోనై వర్తించే మానవుడి ఆత్మను అవి చెదరగొడతాయి. లోకంలో అధికమైన సుఖాలు మాత్రమే అనుభవించే వారు కాని, దుఃఖాలు మాత్రమే అనుభవించేవారు కాని లేరని తెలిసికొనటమే వాటికి తగిన మందు. సముద్రం చేత చుట్టబడిన భూమండలాన్నంతటినీ పరిపాలించే చక్రవర్తికి అయినా వార్ధకాన్ని దగ్గరకు రానీయక దూరంగా నెట్టటం కాని, చనిపోకుండా ఉండటం కాని వశమా? (కాదు కదా!) ఏది ఘటిల్లినా, అది ప్రాప్తం అనుకొని చిత్తం చెదరకుండా ఉండటం జ్ఞానుల పద్ధతి.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **నరవర! సరసాన్నంబులుఁ । బరిమళ సద్వస్తువులును బరమశయన వి**
**ష్టరములుఁ గాలాధీనత । నరుఁ బొందుం, బాయు; వాని నమ్మమియ యుఱున్. 214**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; సరస+అన్నంబులున్= ఆరు రుచులతో కూడిన ఆహారాలు; పరిమళ= సువాసనలు చిమ్మే; సత్+వస్తువులును= మంచి పదార్థాలు; పరమ= ఉత్తమోత్తమమైన; శయనవిష్టరములున్= శయ్యలు, ఆసనాలు; కాల+అధీనతన్= కాలానికి లోబడి; నరున్= మానవుడిని; పొందున్= చేరుతాయి; పాయున్= వదలిపోతాయి; వానిన్= వాటిని; నమ్మమి+అ= నమ్మక పోవటమే; ఉఱున్= తగును.

**తాత్పర్యం:** రాజా! షడ్రసోపేతమైన ఆహారాలు, సుగంధభరితమైన అనేక ద్రవ్యాలు, ఉత్తమోత్తమమైన శయ్యలు, ఆసనాలు, కాలానుగుణంగా మానవులకు దొరుకుతూ ఉంటాయి, పోతూ ఉంటాయి. వాటిని నమ్మకుండా ఉండటమే మంచిది.

**చ.** **వల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మం**
**దుల నొడఁగూర్ప నేర్చి తనదోషము లారయ బుద్ధి గల్గి యా**
**ర్తులకుఁ జికిత్స సేసెదరు; రోగము వాయమి లేదె? వారు రో**
**గు లగుట గానమెట్లు ప్రతికూలవిధిన్ నరునేర్పు ద్రోచునే? 215**

**ప్రతిపదార్థం:** వలను= వీలు, అనుకూల్యం; అధికంబు+కాన్= ఎక్కువగా; కలుగు= కలిగిన; వైద్యులు= భిషక్కులు; శాస్త్రములు= రోగనిదానానికి సంబంధించిన శాస్త్రాలను; అభ్యసించి= చదివి; మందులన్= ఓషధులను; ఒడన్+కూర్పన్= తగిన విధంగా కలపటం; నేర్చి= అభ్యసించి; తనుదోషములు= వాత, పిత్త, కఫాది శరీర దోషాలు; ఆరయన్= గుర్తించే; బుద్ధి= తెలివి; కల్గి= ఉండి; ఆర్తులకున్= బాధపడుతున్నవారికి; చికిత్స= వైద్యం; చేసెదరు= చేస్తారు; రోగము= వ్యాధి; పాయమి= పోకపోవటం; లేదు+ఎ?= లేదా;? వారు= ఆ వైద్యులు; రోగులు+అగుట= వ్యాధి పీడితులవటం; కానము+ఎట్లు?= చూడటం లేదా?; నరునేర్పు= మానవుడి కౌశలం; ప్రతికూలవిధిన్= విధివైపరీత్యాన్ని; త్రోచును+ఏ?= నెట్టివేయగలదా? (లేదని భావం).

**తాత్పర్యం:** అవకాశం అధికంగా కలిగిన వైద్యులు వైద్యశాస్త్రాన్ని బాగా అధ్యయనం చేసి, మందులను సరిగా తయారుచేయటం నేర్చుకొని, శరీరదోషాలను గుర్తించే తెలివి కలిగి ఉండి, రోగులకు వైద్యం చేస్తారు. అయినా, రోగం తగ్గకపోవటం ఉంటుంది కదా! ఆ వైద్యులే రోగులవటం కూడా చూస్తున్నామే. మానవుడి నేర్పు విధివైపరీత్యాన్ని తొలగించలేదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. మానవుడి మేధకన్న విధి బలీయమని అందరూ విధికి తల ఒగ్గవలసినవారేనని చెప్పటం.

**సీ.** **సద్వంశ జన్మంబు సౌందర్యమును బలం ।బును సుభగతయును భోగములును**
**భవితవ్యతానురూపంబులు పేదలై । పెంచుట కలయంగఁ బెల్లు పుట్టు**
**దురు ప్రజ లెంతయు సిరిగలవారు గో । రంగఁ బుట్టరు; దరిద్రపు జనంబు**
**లాఁకటం దిని ఱాలు నఱిగించు కొందరు; । భోజ్య సంపన్నులు భోజనంబుఁ**

**తే.** **బూర్ణముగఁ జేయఁజాలరు భూపవర్య! । వెలఁది జూదంబు పానంబు వేఁట యతిని**
**షేవితములు గాఁదగ దని చెప్ప వినుచు । వలను గలవార చెడుదురు వానివలన.** **216**

**ప్రతిపదార్థం:** సద్వంశ జన్మంబు= కులీనత; సౌందర్యమును= అందచందాలు; బలంబును= శక్తి; సుభగతయును= సౌభాగ్యం, అదృష్టం; భోగములును= అనుభవించదగిన సంపదలూ; భవితవ్యతా+అనురూపంబులు= సుకృతానికి తగినటువంటివి; పేదలు+ఐ= బీదవారై; పెంచుటకున్= పెద్దచేయటానికి; అలయంగన్= అలసిపోతుండగా; ప్రజలు= సంతానం; పెల్లు= అధికంగా; పుట్టుదురు= జన్మిస్తారు; సిరిగలవారు= ధనవంతులు; ఎంతయున్= ఎంతగానో; కోరంగన్= కావాలని కోరుకొన్నా; పుట్టరు= కలుగరు; దరిద్రము+జనంబులు= బీదవారైన మనుష్యులు; ఆఁకటన్= ఆకలితో; ఱాలున్= రాళ్ళను; తిని= తిని; అఱిగించుకొందురు= జీర్ణంచేసికొంటారు; భోజ్యసంపన్నులు= ఆహార సంపద ఎక్కువ ఉన్నవారు; భోజనంబున్ అన్నం తినటం; పూర్ణముగన్= పూర్తిగా, నిండుగా; చేయన్+చాలరు= చేయలేరు; భూపవర్య!= రాజోత్తమా!; వెలఁది= స్త్రీ; జూదంబు= ద్యూతం; పానంబు= సురాపానం; వేఁట= మృగయా వినోదం; అతి= పరిమితిని మించి; నిషేవితములు= సేవించదగినవి, అనుభవించదగినవి; కాన్+తగదు+అని= కాదని; చెప్పన్= (పెద్దలు) చెప్పగా; వినుచున్= వింటూ; వలను+కలవారు+అ=తగినవారు; వానివలనన్= ఆ వ్యసనాల కారణంగా; చెడుదురు= నశిస్తారు.

**తాత్పర్యం:** ఓ జనక మహారాజా! కులీనత, చక్కదనం, బలం, అదృష్టం, భోగాలు సుకృతానికి తగినట్లు లభిస్తాయి. పెంచటానికి కష్టపడే పేదలకు పిల్లలు ఎంతోమంది కలుగుతారు. కావాలని కోరే ధనవంతులకు సంతానం కలుగదు. బీదలు ఆకలితో రాళ్ళు తిని అరిగించుకొంటారు. సంపన్నులు కడుపునిండా తినలేరు. స్త్రీలు, జూదం, సుర, వేట మొదలైనవి మితిమీరి అనుభవించకూడదని పెద్దలు చెప్పగా వింటూ అన్నీ తగినవారు కూడా వాటివలన నశిస్తూ ఉంటారు.

**విశేషం:** జ్ఞానం కలిగి ఉండటం, దానిని అమలు పరచటం ఒకటి కాదు.

**వ. అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్ట ప్రాప్తులకుం గారణంబులు గనికొనలేవు; బాంధవలాభంబును దద్వియోగంబును వఱదం గాష్ఠంబులు సంగతంబులై పదంపడి పాసిన చందంబు. 217**

**ప్రతిపదార్థం:** అట్టివి= అటువంటివి; దైవకృతంబులు= భగవంతుడిచేత చేయబడినవి (మానవులు చేసినవి కావు); కావునన్= అందువలన; ఇష్ట+అనిష్ట+ప్రాప్తులకున్= ప్రియమైనవి, అప్రియమైనవి పొందటానికి; కారణంబులు= హేతువులు; కనికొనలేవు= కనిపెట్టలేవు; బాంధవ లాభంబును= బంధువుల ప్రాప్తియు, (చుట్టాలను కలిగి ఉండటం); తద్+వియోగంబును= వారి ఎడబాటును; వఱదన్= ప్రవాహంలో; కాష్ఠంబులు= కట్టెలు; సంగతంబులు+ఐ= కలసికొని; పదంపడి= తరువాత; పాసిన= దూరమైన; చందంబు= తీరు.

**తాత్పర్యం:** అటువంటివి విధికృతాలు. మానవులు చేసినవి కావు. అందువలన మనం ఇష్టమైనవి పొందటం, ఇష్టం లేనివి ప్రాప్తించటం అనేవాటికి హేతువును కనిపెట్టలేవు. బంధుప్రాప్తి, వారి ఎడబాటు ప్రవాహంలో కొట్టుకొని పోతూ కట్టెలు కలిసికొని, విడిపోవటం వంటిదే.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. మాతృ పితృ దార పుత్త్రక భ్రాతృ శతస । హస్రకంబులు సంసృతి ననుభవింపఁ**
**బడియె; నిందులో నెవ్వరి కడలువాఁడు । నరుఁ డనిత్యత యూహించు టరయ నుఱవు. 218**

**ప్రతిపదార్థం:** మాతృ+పితృ+దార+పుత్రక+భ్రాతృ+శత సహస్రకంబులు= తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, సోదరుల వందలవేలు (లక్షలు); సంసృతిన్= సంసారంలో; అనుభవింపఁబడియెన్= అనుభవించబడ్డారు; ఇందులోన్= ఈ లక్షల బంధుత్వాలలో; ఎవ్వరికిన్= ఎవ్వరికొరకు; నరుఁడు= మానవుడు; అడలువాఁడు?= బాధపడుతాడు?; అనిత్యత= అశాశ్వతత్వాన్ని, నిలకడలేనితనాన్ని; ఊహించుట= భావన చేయటం; అరయన్= పరికించగా; ఉఱవు= ఉచితం; తగినది.

**తాత్పర్యం:** ఈ జననమరణ చక్రరూపమైన సంసారంలో (అనేక జన్మలలో) లక్షలకొద్ది తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, సోదరుల బంధం అనుభవించబడింది. ఇందులో ఎవరికొరకని మనిషి బాధపడగలడు? దీనిని లెస్సగా భావించి మానవజీవితం ఎంత అశాశ్వతమైనదో తెలిసికొనటం సముచితం.

**విశేషం:** సంసారం అంటే జననమరణ చక్రం అనీ జీవితంలోబంధుత్వాదులు అశాశ్వతమనీ తెలియటం జ్ఞానమనీ తాత్పర్యం.

**క. జనన జరామరణ గ్రా । హనిబిడ కాలాబ్ధి మగ్నమని జగము నెఱిం**
**గినవాఁడు ధర్మవర్తన । మున నుండుం జింత దక్కి భూపవరేణ్యా! 219**

**ప్రతిపదార్థం:** భూపవరేణ్యా!= రాజులలో ఎన్నదగినవాడా!; జనన= పుట్టుక; మరణ= చావు అనే; గ్రాహ= మొసళ్ళచేత; నిబిడ= దట్టమైన; కాల+అబ్ధి= కాలమనే సముద్రంలో; మగ్నము+అని= మునిగినదని; జగమున్= లోకమును; ఎఱింగినవాఁడు= తెలిసికొన్నవాడు; చింతన్+తక్కి= శోకమును వదలి; ధర్మవర్తనమునన్= ధర్మమార్గ ప్రవర్తన కలిగి; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** జనకమహారాజా! ఈ లోకం చావు పుట్టుకలనే మొసళ్ళతో బాగా నిండిపోయి ఉన్న కాలం అనే సముద్రంలో మునిగిపోయి ఉన్నది - అని తెలిసికొన్న మానవుడు శోకాన్ని వదలి, ధర్మమార్గంలో నడుస్తాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క. తన యొడ లెరవనినను మను । జునకును బంధుతతి సతమె? శోకించిన వ**
**చ్చునె చచ్చిన జంతువు? నె । మ్మన మధికము నొచ్చుఁ గాక మహితవివేకా! 220**

**ప్రతిపదార్థం:** మహిత వివేకా!= గొప్ప విచక్షణా జ్ఞానం కల జనక మహారాజా!; మనుజునకున్= మానవుడికి; తన= తనయొక్క; ఒడలు= శరీరం, తనువు; ఎరవు+అనినను= తిరిగి ఇచ్చివేయటానికి అరువుగా అడిగి (యాచించి) తెచ్చుకొన్నది అనగా; బంధుతతి= బంధువర్గం; సతము+ఎ?= శాశ్వతమా?; చచ్చిన= చనిపోయిన; జంతువు= ప్రాణి; శోకించినన్= ఏడ్చినంత మాత్రాన; వచ్చును+ఎ= తిరిగి వస్తుందా?; నెఱ+మనము= నిండుమనసు (బాధపడటం వలన); అధికము= ఎక్కువగా; నొచ్చున్+కాక= బాధపడుతుంది తప్ప!

**తాత్పర్యం:** వివేకవంతుడవైన జనకమహారాజా! మానవుడికి తన శరీరమే అడిగి, అప్పుగా తెచ్చుకొన్నటువంటిది. అటువంటప్పుడు బంధువులు శాశ్వతమా? ఎంత బాధపడినా చచ్చిన జీవి తిరిగి రాదు కదా! అట్లా బాధపడటం వలన మనసు మరింత నొచ్చుకొనటం తప్ప ప్రయోజనం లేదు.

**విశేషం:** జీవుడు శరీరధారి మాత్రమే. ప్రతి జన్మలోనూ జీవుడు తను నివసించటానికి వీలుగా ఒక శరీరం కావాలని అడిగి తెచ్చుకుంటాడు. జీవుడు శరీరం కాదు; శరీరం జీవుడు నివసించే ఇల్లు వంటిది. ఇక బంధుత్వాలు తాత్కాలికాలే.

**ఉ. కావున నెవ్వగల్ విడువు; గైకొను మాత్మకులార్హ కర్మ సం**
**సేవన తత్పరత్వము; విశిష్టజనంబుల సంగతిన్ భవ**
**ద్భావము కల్మషంబు దెగఁ బాచి శుచిత్వముఁ బొందు; లోకసం**
**భావిత కీర్తి వయ్యెదు నృపాలక! నా పలు కూఁదు పాటిగాన్.' 221**

**ప్రతిపదార్థం:** నృపాలక!= రాజా!; కావునన్= అందువలన; నెఱ+వగల్= నిండు బాధలు; విడువు= వదలిపెట్టుము; ఆత్మకుల= నీ వంశానికి; అర్హ= తగిన; కర్మసంసేవన= పనిని బాగా చేయటంలో; తత్పరత్వమును= ఆశను, ఇష్టమును; కైకొనుము= స్వీకరించుము; విశిష్టజనంబుల= గొప్ప వ్యక్తుల, మహాత్ముల; సంగతిన్= సాంగత్యంలో; భవత్= నీ; భావము= ఆలోచన (ఊహ) లోని; కల్మషంబు= మలినాన్ని; తెగన్=+పాచి= పోయేటట్లు చేసి; శుచిత్వమున్= పవిత్రతను, నిర్మలత్వాన్ని; పొందు(ము)= సముపార్జించుకో; లోకసంభావిత= లోకంలోని అందరిచేత గౌరవించదగిన; కీర్తివి= కీర్తి కలవాడివి; అయ్యెదు= అవుతావు; నా పలుకు= నా మాట; పాటి+కాన్= తగినదని; ఊఁదు(ము)= గట్టిగా పట్టుకో, ఆచరించుము, నమ్ముము.

**తాత్పర్యం:** ఓ జనకమహారాజా! అందువలన బాధపడటం మానుము. నీ వంశానుగుణమైన పని (రాజ్యపాలన) ఆచరించటంలో నిమగ్నుడవు అయిపొమ్ము! సత్పురుషుల సాంగత్యంలో నీ మనసులోని మాలిన్యాన్ని పోగొట్టుకొని పవిత్రతను సంతరించుకొమ్ము. అపుడు లోకులందరిచేత గౌరవించబడే కీర్తి కలవాడి వవుతావు. నా మాటను తప్పక నమ్మి పాటించుము'.

**వ. అనుటయుం దెలిసి జనకుం డమ్మునిని నామంత్రితుంజేసి నిజకర్మతంత్ర నిర్వహణంబునకై గృహంబున నిలిచె; నీవు నట్ల యుమ్మలికం బుజ్జగింపు ముత్తమ క్షాత్ర సరణి సాధితంబైన భూవలయంబుఁ బాలింపుము; తక్కటి తలంపులు దక్కు'మని పలికిన విని పలుక కున్న యగ్రజుం జూచి సవ్యసాచి జనార్దనుతో నిట్లనియె.222**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; తెలిసి= వివేకం కలిగినవాడై; జనకుండు= జనకమహారాజు; ఆ+మునిన్= అశ్మకమునిని; ఆమంత్రితున్+చేసి= వీడుకొలిపి; నిజకర్మ= తన పని అయిన; తంత్ర= స్వరాష్ట్ర పాలన; నిర్వహణంబునకున్+ఐ= వహించటానికి;

గృహంబునన్= ఇంటియందు; నిలిచెన్= ఉండిపోయాడు; నీవును= నీవు కూడా; అట్లు+అ= అదే విధంగా; ఉమ్మలికంబు= శోకం; ఉజ్జగింపుము= వదలుము; ఉత్తమ= శ్రేష్ఠమైన; క్షాత్రసరణి= క్షత్రియోచిత పద్ధతిలో; సాధితంబు+ఐన= పొందినది అయిన; భూవలయంబున్= భూమండలాన్ని; పాలింపుము= ఏలుము; తక్కటి= మిగిలిన; తలంపులు= ఆలోచనలు; తక్కుము= వదలుము; అని; పలికినన్= చెప్పగా; విని= ఆలకించి; పలుకక+ఉన్న= మాటాడక ఉన్న; అగ్రజున్= అన్నగారిని; చూచి= కని; సవ్యసాచి= అర్జునుడు; జనార్దనుతోన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అశ్మకు డన్న ఆ మాటలతో జ్ఞానం కలిగినవాడై జనకమహారాజు ఆ మునికి వీడ్కోలు పలికి, తన విధ్యుక్తధర్మమైన రాజ్యపాలనా తంత్రాన్ని నిర్వర్తించటానికి ఇంట్లోనే ఉండిపోయాడు. నీవు కూడా అదేవిధంగా విషాదాన్ని వదలి, రాజధర్మానికి తగిన పద్ధతిలో సంపాదించిన భూమండలాన్ని ఏలుము. మిగిలిన ఆలోచనలను వదలుము' అని వ్యాసుడు చెప్పగా విని, మారు మాటాడని అన్నగారిని చూచి అర్జునుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**క.** **' బహుబంధుమరణ శోక । ప్రహత వివేకమయి ధర్మరాజునకు మనో**
**మహిమ వికలమయ్యెం; । బర । మహిత వచోవృత్తిఁ దేర్పు మహితవిచారా! 223**

**ప్రతిపదార్థం:** మహితవిచారా!= గొప్ప ఆలోచన కలిగిన శ్రీకృష్ణా!; ధర్మరాజునకున్; బహు= పెక్కు; బంధుమరణ= చుట్టాల చావువలన కలిగిన; శోక= విషాదంచేత; ప్రహత= బాగా దెబ్బతిన్న; వివేకము+అయి= విచక్షణాజ్ఞానం కలిగి; మనోమహిమ= మనసుయొక్క గొప్పతనం; వికలము= చెదరినది; అయ్యెన్= అయింది; పరమహిత= అన్నింటికన్న గొప్పదైన మేలు కలిగించే; వచోవృత్తిన్= మాటల తీరుతో; తేర్పు= తేటపడేటట్లు చేయుము.

**తాత్పర్యం:** 'గొప్ప భావనలు కల కృష్ణా! బహుబంధుమరణంవలన కలిగిన శోకం కారణంగా ధర్మరాజు వివేకం బాగా దెబ్బతిని, మనసు వికలమైంది. దానిని పరమ శ్రేయోదాయకమైన నీ హితోక్తులతో తేరుకొనేటట్లు చేయుము'.

**వ.** **అనిన నచ్యుతుండు పాండవాగ్రజుఁ జేరంజని, యభివందనం బాచరించి, యతని కరంబు వట్టికొని, వదనంబు విరిదమ్మి చందంబు నొంద మధురాక్షర విన్యాసంబుగా నిట్లనియె. 224**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అచ్యుతుండు= నాశరహితుడైన శ్రీకృష్ణుడు; పాండవ+అగ్రజున్= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజును; చేరన్+చని= సమీపించి; అభివందనంబు+ఆచరించి= నమస్కారం చేసి; అతని= ధర్మరాజు;కరంబు= చేతిని; పట్టికొని= చేతితో పట్టుకొని; వదనంబు= ముఖం; విరిదమ్మి= విచ్చిన తామరపూవు; చందంబును+ఒందన్= వలెకాగా; మధుర+అక్షర+విన్యాసంబు+కాన్= తియ్యని మాటల కూర్పుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అర్జును డట్లా అడగగానే శ్రీకృష్ణుడు ధర్మరాజు దగ్గరకు వెళ్ళి, నమస్కరించి, అతడి చేతిని పట్టుకొని, వికసించిన తామరపూవువలె ఉన్న ముఖంతో, తియ్యగా ఈ విధంగా మాట్లాడాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**మ.** **' పురుషవ్యాఘ్ర! మనంబు గుంద వగలం బొందంగ నీకేల? సం**
**గరకేలిన్ భవదీయబంధు లతిలోకంబైన తెంపొప్పఁ బో**
**యిరి నాకంబున; కట్లుగాక కలగాదే రాజవృత్తంబు దా**
**నరయన్ రాజుల యేల? యేజనులు నిత్యాయుర్ధనుల్ సెప్పుమా! 225**

**ప్రతిపదార్థం:** పురుషవ్యాఘ్ర!= మనుజోత్తమా! ధర్మరాజా!; నీకు= నీవంటివాడికి; మనంబు= మనస్సు; కుందన్= కుంగిపోయేటట్లు; వగలన్= బాధలను; పొందంగన్= అనుభవించటం; ఏల?= ఎందుకు?; సంగరకేలిన్= యుద్ధమనే ఆటలో; భవదీయ= నీ; బంధులు= చుట్టాలు; అతిలోకంబు+ఐన= మానవాతీతమైన; తెంపు+ఒప్పన్= సాహసం ప్రకటమయ్యేటట్లు; నాకంబునకున్= స్వర్గానికి; పోయిరి= వెళ్ళారు; అట్లు+కాక= ఆ విధంగా కాకపోయినా; రాజవృత్తంబు= రాచకరికము; తాన్= అది; కలగాదే= స్వప్నమే కదా!; అరయన్= పరికించి చూస్తే; రాజులు+అ= రాజులే; ఏల= ఎందుకు?; ఏ జనుల్= ఏ మనుష్యులు; నిత్య+ఆయుర్ధనుల్= శాశ్వతమైన ఆయువనే ధనం కలవారో; చెప్పుమా?= చెప్పుము!

**తాత్పర్యం:** కృష్ణు డిట్లా అన్నాడు: 'పురుషశ్రేష్ఠుడవైన ధర్మరాజా! నీ వంటివాడు బాధలతో క్రుంగిపోవటం ఎందుకు? రణరంగంలో, కేళీప్రాయంగా నీ బంధువులు మానవాతీతమైన శౌర్యాన్ని ప్రదర్శించి స్వర్గస్థులయ్యారు. రాచరికం అన్నది కలకాక వాస్తవం కాదు కదా! ఒక్క రాజులే ఏమిటి? శాశ్వతమైన ఆయుర్దాయం కల మనుష్యు లెక్కడ ఉన్నారు చెప్పుము'.

**వ. అని పలికి వెండియు. 226**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= మాటాడి; వెండియున్= తిరిగి, ఇంకా.

**తాత్పర్యం:** శ్రీకృష్ణు డీ విధంగా మాటాడి ఇంకా ఇట్లా అన్నాడు- (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ' తొల్లి సృంజయుఁ డను మహీవల్లభుండు । పుత్రశోకాతురత్వంబుఁ బొందియున్న**
**నుపశమంబుగఁ బ్రాక్తననృపులఁ జెప్పి । తెలిపె నిమ్మౌని యంతకు బలిమి కలిమి.' 227**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; సృంజయుఁడు+అను= సృంజయు డనే పేరుగల; మహీవల్లభుండు= భూభర్త (రాజు); పుత్రశోక+ఆతురత్వంబున్= పుత్రశోకంవలని బాధను; పొంది+ఉండి= కలిగి ఉండగా; ఈ+మౌని= ఈ ముని - నారదుడు; ఉపశమంబుగన్= ఓదార్పుగా; ప్రాక్తన= ప్రాచీన; నృపులన్= రాజులను (వారి చరిత్రలను); చెప్పి= పలికి; అంతకు= యముడి; బలిమి కలిమి= బలాధిక్యాన్ని; తెలిపెన్= తెలియచెప్పాడు.

**తాత్పర్యం:** 'పూర్వం సృంజయుడనే రాజు పుత్రశోకంతో బాగా బాధపడుతూ ఉంటే, నారదమహర్షి అతడికి ఓదార్పు కలగటంకొరకు, ప్రాచీన రాజులనుగురించి, యముడి సామర్థ్యాన్ని గురించి తెలియజెప్పాడు'.

**వ. అని యెఱింగించి నారదుం జూపి 'యిమ్మహాత్ముం డట్లు మరుత్తసుహోత్రాదులగు రాజుల పరమోత్కృష్ట కర్మంబులును, నట్టివారికిం గాలవశత్వంబునం బొందకుండ రామియుం దెలియ నుపన్యసించిన వాక్యంబు లభిమన్యు మరణశోక వ్యాకులుండ వగు నీకుం దాపోపశమంబుగాఁ గృపాతిశయంబునం బరిపాటి వీరలు సెప్పి'రని పారాశర్యమునీశ్వరు నిర్దేశించి, 'వీరి వచనంబుల యేనునుం జెప్పెద నాకర్ణింపు' మని యిట్లనియె. 228**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ఎఱిగించి= బోధపరచి; నారదున్+చూపి= నారద మహర్షిని చూపించి; ఈ+మహాత్ముండు= ఈ మహానుభావుడు; అట్లు= ఆ విధంగా; మరుత్తసుహోత్ర+ఆదులు+అగు= మరుత్తుడు, సుహోత్రుడు మొదలైన; రాజులు= చక్రవర్తుల; పరమ+ఉత్కృష్ట+కర్మంబులును= మిక్కిలి శ్రేష్ఠమైన కార్యాలను; అట్టివారికిన్= అటువంటి వారికి కూడా; కాలవశత్వంబునన్+పొందక+ఉండ+రామియున్= కాలధర్మాన్ని (మరణాన్ని) చెందకుండా ఉండకపోవటాన్నీ; తెలియన్= బోధపడేటట్లు; ఉపన్యసించిన= పలికిన; వాక్యంబులు= మాటలు; అభిమన్యు+మరణ+శోక= అభిమన్యుడి మరణం వలన కలిగిన

బాధచేత; వ్యాకులుండవు+అగు= కల్లోల పడినవాడవైన; నీకున్= నీకు; తాప+ఉపశమంబు+కాన్= బాధా నివారిణి అయ్యేటట్లు; కృపా+అతిశయంబునన్= అధికమైన దయతో; పరిపాటిన్= క్రమంగా; వీరలు= వీరు; చెప్పిరి+అని= చెప్పారని; పారాశర్యముని+ఈశ్వరున్= వ్యాసమునిని; నిర్దేశించి= చెప్పి (చూపి); వీరి వచనంబులు+అ= వీరి మాటలే; ఏనునున్= నేను కూడా; చెప్పెదన్= చెప్తుతాను; ఆకర్ణింపుము= వినుము; అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఈ విధంగా చెప్పి, బోధచేసి, నారదమహర్షిని చూపించి, 'ఈ మహానుభావుడు సృంజయుడికి మరుత్తు, సుహోత్రుడు మొదలైన చక్రవర్తులు చేసిన మహత్కార్యాలన్నీ చెప్పి, వారుకూడా కాలధర్మం చెందటాన్నీ తెలిసేటట్లు చెప్పిన మాటలనే ఇప్పుడు వీరు అభిమన్యుడి మరణంవలన కలతచెందిన నీకు బాధ తగ్గించటానికి ఎంతో దయతో చెప్పారు' అని వ్యాసమహర్షిని చూపించి 'వీరు చెప్పిన మాటలే నేను కూడా చెప్తుతాను వినుము' అని ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు.

### ధర్మరాజునకుఁ గృష్ణుఁడు షోడశరాజుల చరిత్రంబులు సెప్పుట (సం. 12-29-16)

**సీ.** **' సంవర్తుఁ డను మహాసంయమి దేవతా । గురుతోడి యీసున నరుగుదెంచి,**
**పూని యుపద్రష్టయై నడపంగ హి । మాచలపాదంబునందు శక్ర**
**వరుణ ప్రభృతులైన సురలు మహామునీం । ద్రులును సహాయులై మెలఁగుచుండ**
**శాలా ప్రముఖ భవ్యసాధనమ్ములు గన । కనకమయంబులుగ వస్త్రకాంచనాజ్య**

**ఆ.** **దధిపయః ఫలాది తర్పణ ద్రవ్యస । మృద్ధి సకలజనులు మెచ్చఁ బెక్కు**
**లధ్వరములు సేసె; నట్టి మరుత్తుండు । నిత్యపదవి నుండ నేర్చెనయ్య?'** **229**

**ప్రతిపదార్థం:** సంవర్తుఁడు+అను= సంవర్తుడనే పేరుగల; మహాసంయమి= గొప్పముని; దేవతాగురుతోడి= దేవగురువైన బృహస్పతితో; ఈసునన్= అసూయతో, ఈర్ష్యతో; అరుగుదెంచి= వచ్చి; పూని= పట్టుపట్టి; ఉపద్రష్ట+ఐ= కార్యనిర్వాహకుడై; నడపంగన్= జరిపించగా; హిమ+అచల= హిమవత్పర్వతముయొక్క; పాదంబున+అందున్= మొదట్లో; శక్ర= ఇంద్రుడు; వరుణ= వరుణుడు; ప్రభృతులు+ఐన= మొదలైన; సురలు= దేవతలూ; మహాముని+ఇంద్రులును= గొప్ప ఋషి వరులూ; సహాయులు+ఐ= తోడుపడేవారై; మెలఁగుచున్+ఉండన్= ప్రవర్తిస్తూ ఉండగా; శాలాప్రముఖ= యజ్ఞశాల మొదలైన; భవ్యసాధనమ్ములు= శుభప్రదమైన యజ్ఞోపకరణాలు; కనకమయంబులుగన్= బంగారపువిగా; వస్త్ర= వస్త్రములు; కాంచన= బంగారు; ఆజ్య= నేయి; దధి= పెరుగు; పయః= పాలు; ఫల= పండ్లు; ఆది= మొదలైన; తర్పణ= దేవతల తృప్తికొరకు సమర్పించే; ద్రవ్య సమృద్ధి= వస్తువుల ఆధిక్యం; సకల జనులు= సమస్త ప్రజలు; మెచ్చన్= పొగడగా; పెక్కు= అనేకమైన; అధ్వరములు= యజ్ఞాలు; చేసెన్= చేశాడు; అట్టి= అటువంటి; మరుత్తుండు= మరుత్తుడు అనే చక్రవర్తి; నిత్యపదవిన్= శాశ్వతమైన స్థానంలో; ఉండన్+నేర్చెన్+అయ్య?= ఉండగలిగాడా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! పూర్వం సంవర్తుడనే గొప్పముని దేవగురువైన బృహస్పతిపై అసూయచెంది పట్టుదలగావచ్చి, హిమవన్నగం మొదట తనపర్యవేక్షణలో మరుత్తుచేత ఎన్నో యజ్ఞాలు చేయించాడు; ఆ యజ్ఞాలకు ఇంద్రుడు వరుణుడు మొదలైన దేవతలు, మహర్షులు సహాయులుగా ఉన్నారు. ఆ యజ్ఞశాల, యజ్ఞోపకరణాలు మొదలైనవన్నీ బంగారంతో చేయబడ్డవే. దేవతల తృప్తికొరకు అర్పించిన వస్త్రాలు, బంగారం, నెయ్యి, పాలు, పెరుగు, పళ్ళు మొదలైనవి సమస్త జనాలు మెచ్చుకొనేటంత అధికంగా ఉన్నాయి. అటువంటి గొప్పయజ్ఞాలు చేసిన మరుత్తుడు శాశ్వతంగా తనపదవిలో (రాజుగా) ఉండగలిగాడా? (లేదు కదా అని భావం).

**సీ. ' సన్మార్గమున రాజ్య సంపద నొంది భూ । సురపూజ లొనరించి సువ్రతముల**
**బృందారకులఁ బ్రీతిఁ బొందింపఁ, దన కర్థిఁ । బర్జన్యుఁ డేఁటేఁటఁ బసిఁడి వాన**
**కనకమయములైన కర్కట ఝష నక్ర । కూర్మచయముతోడఁ గురియుచుండ**
**నయ్యర్థ మెల్ల ధనార్థుల కిచ్చుచుఁ । గురుజాంగలంబునఁ బరమనిష్ఠ**

**ఆ. నశ్వమేధ ముఖములైన రాజార్హయ । జ్ఞములు పెక్కు సేసి సకల జనులు**
**పొగడునట్టి పాట నెగడె సుహోత్రుఁ; డ । వ్విభుఁడు దెగియె ననుట వినమె యధిప!' 230**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! (ధర్మరాజా!); సుహోత్రుఁడు= సుహోత్రుడనే పేరుగల చక్రవర్తి; సత్+మార్గమునన్= మంచిదారిలో, సత్ప్రవర్తనతో; రాజ్యసంపదన్+ఒంది= రాజ్యమనే సంపదను పొంది; భూసుర+ బ్రాహ్మణ; పూజలు+ఒనరించి= పూజలు చేసి; సువ్రతములన్= మంచి వ్రతాలతో, పూజాదికాలతోనూ, మంచి ప్రవర్తనతోను); బృందారకులన్= దేవతలను; ప్రీతిన్+పొందింపన్= సంతసింపజేయగా; తనకున్= సుహోత్రునకు; అర్థిన్= ఇష్టంతో; పర్జన్యుఁడు= ఇంద్రుడు; ఏఁట+ఏఁటన్= ప్రతి ఏడాది; కనకమయములు+ఐన= బంగారంతోచేయబడినవైన; కర్కట= పీతల; ఝష= చేపల; నక్ర= మొసళ్ళ; కూర్మ= తాబేళ్ళ; చయముతోడన్= సమూహంతో; పసిఁడివాన= బంగారువాన; కురియుచున్+ఉండన్= కురిపిస్తూ ఉండగా; ఆ+అర్థము+ఎల్లన్= ఆ ధనమునంతా; ధన+అర్థులకున్= ధనంకోరిన వారికి; ఇచ్చుచున్= ఇస్తూ; కురుజాంగలంబునన్= ఉత్తర కురుభూములలో; పరమ నిష్ఠన్= మిక్కిలి నియమ నిష్ఠలతో; అశ్వమేధముఖములు+ఐన= అశ్వమేధం మొదలైన; రాజ+అర్హ= రాజులకు తగిన; యజ్ఞములు= యాగాలు; పెక్కు= అనేకం; చేసి= ఆచరించి; సకలజనులు= ప్రజలందరు; పొగడు+అట్టి= మెచ్చుకొనేటటువంటి; పాటన్= విధంగా; నెగడెన్= వర్ధిల్లాడు; ఆ+విభుఁడున్= ఆ రాజుకూడా; తెగియెన్= మరణించాడు; అనుట= అనటం; వినము+ఎ?= వినలేదా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! సుహోత్రుడనే చక్రవర్తి మంచి ప్రవర్తన కలవాడై రాజ్యాన్ని పొంది, బ్రాహ్మణులను పూజించి, మంచి ప్రవర్తనతో, వ్రతాలతో దేవతలను మెప్పించాడు. మెచ్చిన ఇంద్రుడు ప్రతి ఏడాది బంగారు పీతలు, చేపలు, మొసళ్ళు, తాబేళ్ళతో నిండిన బంగారు వాన కురిపించేవాడు. సుహోత్రు డా ధనాన్ని కోరినవారికి ఇస్తూ, ఉత్తర కురుదేశాలలో గొప్ప నిష్ఠాపరుడై రాజోచితాలైన అశ్వమేధాది యజ్ఞాలనెన్నింటినో చేశాడు. ప్రజల మెప్పు పొందే విధంగా ప్రవర్తించాడు. అటువంటి సుహోత్రుడు కూడా చనిపోయాడని విన్నాము కదా!'

**సీ. ' కాంచనాలంకార కాంతంబులై రూఢి । కెక్కిన గజములు పెక్కు వేలు,**
**జవసత్త్వ రూపాది సకల గుణములఁ । బెం పెసఁగిన హయము లనేక లక్ష,**
**లమలిన స్వర్ణమయములగు కొమ్ములం । గొమరారు పశువులు గోటు, లూర్జి**
**తాంగక విలసదజావికంబులు గణ । నాతీతములు గన్య లప్రమేయ,**

**ఆ. లఖిల రత్న విరచితాభరణంబు ల । నల్పములు మహీసురావళులకు**
**నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు నంగుఁ । డతఁడు నన్యలోకగతుఁడు గాఁడె!' 231**

**ప్రతిపదార్థం:** అంగుఁడు= అంగుడనే రాజు; కాంచన+అలంకార= బంగారు నగలతో; కాంతంబులు+ఐ= ఆకర్షణీయాలై; రూఢికిన్+ఎక్కిన= ప్రశస్తి వహించిన; గజములు= ఏనుగులు; పెక్కువేలు= ఎన్నో వేలు; జవ= వేగం; సత్త్వ= బలం; రూప+ఆది= చక్కని ఆకారం మొదలైన; సకల= అన్ని; గుణములన్= సద్గుణాలతో; పెంపు+ఎసఁగిన= ఆధిక్యం వహించిన; హయములు= గుర్రాలు; అనేక లక్షలు= ఎన్నో లక్షలు; అమలిన= స్వచ్ఛమైన; స్వర్ణమయములు+అగు= బంగారంతో చేయబడినవైన; కొమ్ములన్=

శృంగాలతో; కొమరారు= అందగించే; పశువులు= గోవులు; కోటులు= కోట్లు; ఊర్జిత= దృఢమైన; అంగక= అవయవాలతో; విలసత్= ఒప్పే; అజ+అవికంబులు= మేకలు, గొర్రెలు; గణన+అతీతములున్= లెక్కపెట్టటానికి వీలుకానన్ని; కన్యలు= వివాహయోగ్యలైన యువతులు; అప్రమేయలు= మితిలేనంత మందిని; అఖిల= సమస్త; రత్నవిరచిత+ఆభరణంబులు= రత్నాలతో తయారు చేయబడిన నగలు; న+అల్పములు= తక్కువ కానన్ని (అధిక సంఖ్యాకాలు); మహీసుర+ఆవళులకున్= బ్రాహ్మణ బృందాలకు; ఇచ్చి= ఒసగి; క్రతువులు= యజ్ఞాలు; ఎన్ని+ఏనియున్= ఎన్నో; చేసెన్= చేశాడు; అతఁడున్= ఆ అంగుడు కూడా; అన్యలోక గతుఁడు= పరలోక గతుడు, మరణించినవాడు; కాఁడు+ఎ?= కాలేదా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! అంగుడనే చక్రవర్తి ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఆ యజ్ఞాలలో, బంగారు నగలతో ఆకర్షణీయంగా ఉండి ప్రశస్తమైన పెక్కువేల ఏనుగులను, మంచి వేగం, బలం, రూపాలతో గొప్పవైన అనేక లక్షల గుర్రాలను, మంచి బంగారంతో అలంకరించిన కొమ్ములతో అందగించే కోట్లకొలది గోవులను, దృఢమైన శరీరావయవాలతో ఒప్పే అసంఖ్యాకమైన మేకలను, గొర్రెలను,అంతులేనంతమంది వివాహ యోగ్యలైన యువతులను, నవరత్న ఖచితాలైన నగలను అధిక సంఖ్యలో బ్రాహ్మణబృందాలకు ఇచ్చాడు. ఆ అంగుడు కూడా మరణించాడు కదా!'

**సీ.** **' ఏడు దీవులయందుఁ గ్రీడాగతులఁ దన । రథము చరింప, నరాతు లనఁగ**
**వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ । బ్రజల నొప్పింపని పరమపుణ్య**
**కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన । కక్షయ సాధనము ఫాలాక్షుఁ డొసఁగ**
**నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్ట జ । నాకీర్ణములుగఁ బె క్కాచరించెఁ;**

**ఆ.** **దారకములు వృష్టిధారలు లెక్కింప । వచ్చుఁ గాని యతని యిచ్చుగోవు**
**లెన్నఁ గొలఁది గాదు; సన్నుతిపాత్ర మా । శిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు?'** **232**

**ప్రతిపదార్థం:** ఏడుదీవుల+అందున్= సప్తద్వీపాలలో; క్రీడాగతులన్= ఆటలకైపోయిన విధంగా; తన= శిబిచక్రవర్తియొక్క; రథము= తేరు; చరింపన్= తిరుగగా; అరాతులు+అనఁగన్= శత్రువులు అనే మాట; వినియున్= వినికూడా; ఎఱుంగక= తెలియక; విభవము= సంపద; ఆర్జించుచోన్= సంపాదించేటప్పుడు; ప్రజలన్= పౌరులను; నొప్పింపని= బాధించని; పరమపుణ్యకర్మంబునకున్= మిక్కిలి మంచి ప్రవర్తనకు; మెచ్చి= మెచ్చుకొని; ఫాలాక్షుఁడు= నిటలనేత్రుడు, శివుడు; తనకున్= శిబికి; గారవంబునన్= ఆదరంతో; అక్షయ ధనము= (నశించని) తరగని సంపదను; ఒసఁగన్= ఇయ్యగా; జాహ్నవి పొంతన్= గంగ ఒడ్డున; శిష్టజన+ఆకీర్ణంబులుగన్= సజ్జనులతో నిండి ఉండేటట్లుగా; అశ్వమేధములు= అశ్వమేధ యజ్ఞాలు; పెక్కు= అనేకాలు; ఆచరించెన్= చేశాడు; తారకములు= చుక్కలు; వృష్టిధారలు= వానలోని చాళ్ళు; లెక్కింపన్+వచ్చున్= లెక్కపెట్టవచ్చును; కాని; అతని+ఇచ్చు= శిబి దానం చేసే; గోవులు+ఎన్నన్= ఆవులను లెక్కపెట్టటం; కొలఁది+కాదు= వీలుకాదు; సన్నుతి పాత్రము= బాగా పొగడదగిన వాడైన; ఆ శిబికిన్= ఆ శిబిచక్రవర్తికి; ఉర్విన్= భూమిపై; ఉనికి= అస్తిత్వం, ఉండటం; ఎట్లు= ఏ విధంగా; చెల్లెన్?= చెల్లింది?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! శిబిచక్రవర్తి ఏడు ద్వీపాలలో యథేచ్ఛగా తన రథాన్ని నడపగలిగేవాడు. అతడికి శత్రువులన్న మాటే వినబడదు. ధనసంపాదనకై ప్రజలను బాధించని అతడి మంచి ప్రవర్తనకు మెచ్చి శివుడు నశించని ధనాన్ని ప్రసాదించాడు. దానితో గంగాతీరంలో సజ్జనులతో నిండి ఉండేటట్లుగా అనేక అశ్వమేధాలు చేశాడు. నక్షత్రాలను, వర్షధారలను అయినా లెక్కించవచ్చును కాని, శిబి దానం చేసిన ఆవులను లెక్కించటం సాధ్యంకాదు. అటువంటి పొగడదగిన శిబికి భూమిపై కాలం ఎట్లా చెల్లింది?'

**సీ. ' యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి । పంపున నరిగిన పెంపుకలిమి,**
**సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొన । ర్చిన మర్త్యలోక పావన విభూతి**
**త్రైలోక్యకంటకు దశముఖు బంధు యు । క్తంబుగాఁ జంపిన కలితనమ్ము,**
**బాలుర మరణంబు పాటిల్లకుండఁగఁ । జేసిన యత్యంత చిత్రమహిమ,**

**ఆ. గలిగి యశ్వమేధములు మున్నుగా ననే । కాధ్వరము లొనర్చి యఖిల జనులఁ**
**దల్లివోలె నరసి దశరథరాముండు । కాలవశత నొందెఁ గాదె యధిప! 233**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; దశరథ రాముండు= దశరథ పుత్రుడైన శ్రీరామచంద్ర చక్రవర్తి; తండ్రి పంపునన్= తండ్రి ఆనతి మేరకు; యౌవనంబునన్= తరుణ వయస్సులో; తపము+ఆచరింపఁగన్= తపస్సు చేయటానికి; అరిగిన= వెళ్ళిన; పెంపు కలిమి= ఆధిక్యమనే సంపద; జలధిన్= సముద్రంలో; సేతువు= వారధిని; ప్రఖ్యాతంబు+కాన్= ప్రతిష్ఠాత్మకంగా; ఒనర్చిన= నిర్మించిన; మర్త్యలోక= మానవలోకాన్ని; పావనవిభూతి= పవిత్రీకరించిన వైభవం; త్రైలోక్య కంటకున్= ముల్లోకాలను బాధించే; దశముఖున్= దశకంఠుడైన రావణుడిని; బంధుయుక్తంబు+గాన్= చుట్టాలందరితో కూడా; చంపిన= సంహరించిన; కలితనమ్ము= సామర్థ్యం; బాలుర= పసిపిల్లల; మరణంబు= చావు; పాటిల్లక+ఉండంగన్= సంభవించకుండా; చేసిన= చేసినటువంటి; అతి+అంత= అధికమైన; చిత్రమహిమన్= అద్భుతావహమైన మహత్తును; కలిగి= కలిగి ఉండి; అశ్వమేధములు మున్నుగాన్= హయమేధం మొదలైన; అనేక+అధ్వరములు= ఎన్నో యజ్ఞాలు; ఒనర్చి= చేసి; అఖిల జనులన్= ప్రజలందరినీ; తల్లి+పోలెన్= తల్లివలె; అరసి= చూచి, కాపాడి (కూడ); కాలవశతన్+ఒందెన్= కాలధర్మాన్ని చెందాడు; కాదు+ఎ!= కదా!

**తాత్పర్యం:** 'ధర్మరాజా!; దశరథ పుత్రుడైన శ్రీరాముడు, తండ్రి ఆజ్ఞానుసారం యౌవనంలో తపస్సు చేయటానికి వెళ్ళటం అనే ఘనత కలిగి, లోకమంతా మెచ్చేవిధంగా సముద్రంలో వారధి నిర్మించి, మానవలోక పావనమనే వైభవాన్ని కలిగి, ముల్లోకాలను బాధించే రావణుడిని బంధువులతో కలిపి సంహరించిన సామర్థ్యం కలిగి, పసివారి మరణాలు జరగకుండా చేసిన అద్భుత మహత్తు కలిగి, అశ్వమేధం మొదలైన ఎన్నో యజ్ఞాలు చేసి, ప్రజలను కన్నతల్లివలె సంరక్షించి కూడా కాలధర్మం చెందాడు కదా!'

**సీ. ' పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ । నవని భాగీరథి యనఁగఁ బఱపి,**
**శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి । యప్రతిహతముగ నశ్వమేధ**
**యాగంబు లొనరించు నప్పుడు వేయి వే । ల రదంబులందుఁ గన్యల నలంకృ**
**తలఁ జేసి యునిచి, రథంబు రథంబున । కిభములు నూఱు నూఱేసి యేనుఁ**

**తే. గేనుఁగునకు గుఱ్ఱములు వేయేసి పాటి । హయముహయమున కట్ల గోచయ మమర్చి**
**భూరి భూరి యుతంబుగ భూసురులకు । నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె?' 234**

**ప్రతిపదార్థం:** పూర్వవంశ్యులన్= తమ వంశంలోని పూర్వులను; కావన్+పూని= రక్షించాలని (ఉద్ధరించాలని) దీక్ష వహించి; వియత్+గంగన్= ఆకాశగంగను; అవనిన్= భూమిపై; భాగీరథి+అనఁగన్= భగీరథుడిచేత తీసికొనిరాబడినదనే పేరు పొందేటట్లుగా; పఱపి= ప్రవహింపచేసి; శక్రుండు= ఇంద్రుడు; మెచ్చన్= పొగడే విధంగా; పరాక్రమంబునన్= శౌర్యంతో; అతిశయించి= మించి; అప్రతిహతముగన్= ఎదురులేని విధంగా; అశ్వమేధ యాగంబులు= అశ్వమేధ యజ్ఞాలు; ఒనరించు+అప్పుడు= చేసే సమయంలో; వేయివేల రదంబుల+అందున్= పదిలక్షల రథాలలో; కన్యలన్= వివాహయోగ్యలయిన యువతులను; అలంకృతలను= సర్వాభరణ భూషితలను; చేసి= కావించి; ఉంచి= నిలిపి; రథంబు రథంబునకున్= ప్రతి రథానికి; ఇభములు= ఏనుగులు; నూఱు+నూఱేసి= నూరేసి చొప్పున; ఏనుఁగు+ఏనుఁగునకున్= ఒక్కొక్క ఏనుగుకు; గుఱ్ఱములు= గుర్రాలు; వేయేసి= వెయ్యి చొప్పున; హయము

హయమునకున్= ప్రతి గుర్రానికి; అట్ల= అదే విధంగా, అంటే వెయ్యి చొప్పున; గోచయము= ఆవుల సముదాయం; అమర్చి= ఏర్పాటుచేసి; భూరి= గొప్ప; అధికమైన= భూరియుతంబుగన్= బంగారంతో కూడుకొని ఉండేటట్లుగా; భూసురులకున్= బ్రాహ్మణులకు; ఒసఁగిన+అట్టి= దానం చేసినటువంటి; భగీరథుండు= భగీరథ చక్రవర్తి; ఉన్నవాఁడె?= జీవించి ఉన్నాడా? (లేదు కదా అని భావం).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! తన వంశంలోని పూర్వులకు (సగర పుత్రులు) సద్గతులు కల్పించాలని సమకట్టి ఆకాశగంగను భూమిపై భాగీరథి అనే పేరుతో ప్రవహింపచేసి, ఇంద్రుడిని మెప్పించేటంత పరాక్రమంతో అతిశయించి, అశ్వమేధ యాగాలు చేసే సమయంలో పదిలక్షల రథాలపై అలంకృతకన్యల నుంచి ఒక్కొక్క రథంతో నూరేసి ఏనుగులను, ఒక్కొక్క ఏనుగుతోపాటు వెయ్యేసి గుర్రాలను, ఒక్కొక్క గుర్రంతో పాటు వెయ్యేసి గోవులను కూర్చి, అంతులేని బంగారంతో జతపరచి బ్రాహ్మణులకు దానమిచ్చిన వితరణశీలి అయిన భగీరథుడు జీవించి ఉన్నాడా? (లేదు కదా అని అర్థం)'.

**విశేషం:** పదివేల మంది బ్రాహ్మణులకు ఒక్కొక్కరికి ఒక రథం, పదివేల ఏనుగులు, కోటి గుర్రాలు, వెయ్యికోట్ల గోవులను బంగారంతో సహా దానం చేశాడట భగీరథుడు.

**సీ.** **' అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగు గం । ధర్వులు హృద్య వాదన మొనర్ప,**
**నప్సరో నికురంబ మాటలుఁ బాటలు । నై వినోదింపఁగ, నమర గణము**
**బహు విధాలంకార భంగుల విన్నాణు । వులు సూప దివ్యమునులు నుతింప,**
**మనుజ లోకంబెల్లఁ గన కాన్న వస్త్ర భూ । షణ దానములఁ దృప్తి సనఁగ నశ్వ**

**ఆ.** **మేధ సమితిఁ జేసి మెప్పించె నింద్రుని । శతతమాధ్వరమున; నతఁడు హయము**
**నాసపడిన నిచ్చె; నాదిలీపునిఁ జూపు । మా! ధరిత్రి నిపుడు మనుజనాథ!'** **235.**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా! ధర్మరాజా!; అర్థిన్= కోరికతో, ఇష్టంతో; విశ్వావసుండు+ఆదిగాన్= విశ్వావసుడు మొదలుగా; కలుగు= ఉన్న; గంధర్వులు= గంధర్వులనే దేవజాతి; హృద్య= మనోహరమైన; వాదనము+ఒనర్పన్= వాద్యాలు మ్రోయిస్తుండగా; అప్సరోనికురంబము= అప్సరసల సమూహం; ఆటలు+పాటలును+ఐ= నృత్యగానాలతో; వినోదింపఁగన్= ఆనందిస్తుండగా; అమరగణము= దేవతాబృందం; బహువిధ= అనేక విధాలైన; అలంకారభంగుల= అలంకారాల (నగలును, ఉపమాది అర్థాలంకారాలు శబ్దాలంకారాలును) రీతులలో; విన్నాణువులు= నేర్పులు; చూపన్= ప్రదర్శిస్తుండగా; దివ్యమునులు=దేవఋషులు; నుతింపన్= పొగడుతుండగా; మనుజలోకంబు+ఎల్లన్= మానవ సముదాయమంతా; కనక+అన్న+వస్త్ర+భూషణ దానములన్= బంగారం, ఆహారం, వస్త్రాలు, ఆభరణాల దానాలతో; తృప్తి+చనఁగన్= సంతృప్తి పొందగా; అశ్వమేధ సమితిన్= అశ్వమేధ యాగాల సముదాయాన్ని; చేసి= ఆచరించి; శతతమ+అధ్వరమునన్= నూరుదాటిన తరువాతి యజ్ఞంలో; ఇంద్రునిన్= శతమఖుడిని; మెప్పించెన్= సంతోషపరచాడు; అతఁడు= ఆ ఇంద్రుడు; హయమును= గుర్రమును; ఆసపడినన్= కోరగా; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ దిలీపునిన్= అటువంటి దిలీప చక్రవర్తిని; ఇపుడు= ఇప్పుడు; ధరిత్రిన్= భూమిపై; చూపుమా!= చూపించుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! దిలీపచక్రవర్తి అనేక అశ్వమేధయాగాలు చేశాడు. ఆ యాగాలలో విశ్వావసుడు మొదలైన గంధర్వులు ఎంతో ఇష్టంగా మనోహరమైన వాద్యాలు వాయించేవారు. అప్సరసలు నృత్యగానాలతో వినోదింపచేసేవారు. దేవతలు ఎన్నో శబ్ద, అర్థాలంకారాలలో (కవితలలో) భూషణాలను తాల్చే రీతులలో తమ నేర్పును ప్రదర్శించేవారు. దేవర్షులు పొగడుతూ ఉండేవారు. బంగారు, ఆహార, వస్త్ర, ఆభరణ దానాలతో

మానవులు తృప్తి పడుతూ ఉండేవారు. ఇంద్రుడిని కూడా ఆతడు మెప్పించాడు. ఇంద్రుడు అశ్వాన్ని కోరితే ఇచ్చాడు. అటువంటి దిలీపచక్రవర్తిని ఈనాడు భూమిపై చూపించుము' (చూపించలేడని అతడు గతించాడని భావం).

**సీ. ' జననమాదిగఁ బాకశాసను కరమునఁ । బ్రభవించు నేయును బాలు ద్రావి,**
**ద్వాదశదినము లాతఁడు గారవింపంగ । వర్ధిల్లి పండ్రెండు వత్సరముల**
**ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి । యర్కుని యుదయంబు నస్తమయము**
**నగుపట్లు పొలిమేరలైన మహాక్షేత్ర । మంతయు నొక్కండ యనుభవించె;**

**ఆ. నన్నపర్వతముల నాజ్యనదుల విప్ర । భోజనము లొనర్చి రాజసూయ**
**ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ । డింద నిలిచెనే నరేంద్రముఖ్య!' 236**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రముఖ్య!= రాజోత్తమా! ధర్మరాజా!; జననము+ఆదిగన్= పుట్టినప్పటినుండి; పాకశాసను= ఇంద్రుడి; కరమునన్= చేతిలో; ప్రభవించు= పుట్టే; నేయును= నేతిని; పాలున్= పాలను; త్రావి= క్రోలి; ద్వాదశదినములు= పన్నెండు రోజులు; ఆతఁడు= ఆ ఇంద్రుడు; గారవింపంగన్= ఆదరించగా; వర్ధిల్లి= పెరిగి; పండ్రెండు వత్సరముల ప్రాయము+ఐ= పన్నెండు ఏడుల వయసు కలవాడై; రాజ్యసంప్రాప్తికిన్= రాజ్యమును పొందటానికి; ఏతెంచి= వచ్చి; అర్కుని= సూర్యుడి; ఉదయంబున్+అస్తమయమున్+అగుపట్లు= ఉదయించే, అస్తమించే చోట్లు - తూర్పుకొండ, పడమటికొండలు; పొలిమేరలు+ఐన= సరిహద్దులైన; మహాక్షేత్రము+అంతయున్= గొప్పదైన భూమి సమస్తమును; ఒక్కండు+అ= ఒక్కడే; అనుభవించెన్= పాలించాడు; అన్నపర్వతములన్= అన్నపు కొండలతో; ఆజ్యనదులన్= నేతి నదులతో; విప్రభోజనములు+ఒనర్చి= బ్రాహ్మణులకు భోజనాలుపెట్టి; రాజసూయములును; అశ్వమేధములున్; చేసెన్= ఆచరించాడు; మాంధాతృఁడు= అటువంటి మాంధాతృ చక్రవర్తి; ఇందున్+అ= ఈ నేలపైనే?; నిలిచెన్+ఏ= జీవించి ఉన్నాడా? (జీవించి లేడని భావం).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! మాంధాతృ చక్రవర్తి పుట్టినప్పటి నుండి పన్నెండు రోజులు ఇంద్రుడి చేతినుండి పుట్టిన పాలు నెయ్యి త్రాగి పెరిగాడు. పన్నెండు సంవత్సరాల వయసులో రాజ్యాన్ని స్వీకరించాడు. సూర్యోదయ సూర్యాస్తమయాలయ్యే తూర్పు పడమర కొండలే తన రాజ్యానికి సరిహద్దులుగా భూమినంతా ఒక్కడే పాలించాడు. అశ్వమేధ రాజసూయ యాగాలు చేసి, అన్నపు కొండలు, నేతినదులతో బ్రాహ్మణ సంతర్పణం చేశాడు. అట్టి మాంధాత భూమిపై ఇప్పటివరకు జీవించి లేడు కదా!

**సీ. ' అనిమిషాసురయుద్ధమున నసురావలి । సమయించి, వర్ణాశ్రమముల నేర్ప**
**రించి, భూమి యలంకరించి యగ్నిష్టోమ । హయమేధ వాజపేయాతిరాత్ర**
**పౌండరీకము లనఁ బరఁగిన యధ్వరం । బు లనేకములు సేసి, భూసురులకు**
**నఖిల భూములఁ గల యర్థంబు లెల్లను । దనకని యేమియు నునుప కిచ్చె;**

**ఆ. శుక్రు నల్లుఁ డనఁగ శోభిల్లి తనయందు । ధర్మతత్త్వ మూర్జితముగ నియమ**
**నిష్ఠుఁడై యయాతి నెగడె; శాశ్వతుఁ డయ్యె । నే నృపాల యమ్మహీశ్వరుండు?' 237**

**ప్రతిపదార్థం:** నృపాల!= ఓ ధర్మరాజా! యయాతి; అనిమిష= దేవతల; అసుర= రాక్షసుల; యుద్ధమునన్= రణంలో; అసుర+ఆవలి= రాక్షస సమూహాలను; సమయించి= సంహరించి, చంపి; వర్ణ+ఆశ్రమములన్+ఏర్పరించి= నాలుగు వర్ణాల

నాలుగు ఆశ్రమాల ధర్మాలను విస్పష్టంగా నిర్ధారించి; భూమి+అలంకరించి= ధరణికి సొగసులు కూర్చి (చక్కగా పాలించి); అగ్నిష్టోమ, హయమేధ, వాజపేయ, అతిరాత్ర, పౌండరీకములు; అనన్+పరఁగిన= అనే పేర్లతో ప్రఖ్యాతి పొందిన; అధ్వరంబులు+అనేకములు= లెక్కలేనన్ని యజ్ఞాలు; చేసి= ఆచరించి; అఖిల= సమస్తమైన; భూములన్= ప్రదేశాలలో; కల= ఉన్నటువంటి; అర్థంబులు+ఎల్లను= ధనాలు అన్నీ; తనకున్+అని= తన కొరకు అంటూ; ఏమియున్+ఉనుపక= ఏమీ ఉంచుకొనక; భూసురులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చెన్= దానం చేశాడు; శుక్రు= శుక్రాచార్యుడి; అల్లుఁడు+అనంగన్= అల్లుడుగా; శోభిల్లి= ఒప్పి; తన+అందున్= తనలో; ధర్మతత్త్వము= ధర్మంయొక్క స్వభావం; ఊర్జితముగన్= దృఢంగా నిలువగా; నియమ నిష్ఠుఁడు+ఐ= నియమాలయందు నిష్ఠగలవాడై; నెగడెన్= వర్ధిల్లాడు; ఆ+మహీ+ఈశ్వరుండు= ఆ రాజు; శాశ్వతుఁడు= నిత్యుడు; అయ్యెను+ఏ?= అయ్యాడా? (కాలేదు కదా అని భావం).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! యయాతి దేవాసుర యుద్ధంలో రాక్షసులను సంహరించాడు. వర్ణాశ్రమ ధర్మాలను స్థిరపరిచాడు. రాజ్యానికి సొగసులు కూర్చాడు. అగ్నిష్టోమం, అశ్వమేధం, వాజపేయం, అతిరాత్రం, పౌండరీకం మొదలైన యజ్ఞాలు అనేకం చేశాడు. అపుడు అన్ని దేశాలలో ఉన్న ధనాలను గ్రహించినా, తన కంటూ ఏమీ ఉంచుకొనకుండా, బ్రాహ్మణులకు దానం చేశాడు, శుక్రాచార్యుడి అల్లుడుగా పేరొంది, ధర్మస్వభావాన్ని తనలో స్థిరంగా నిలిపి, నియమనిష్ఠలు కలవాడై ఒప్పారాడు. అటువంటి యయాతి భూమిపై శాశ్వతంగా ఉండగలిగాడా?' (లేదని భావం).

**సీ.** **'ఓర్వక పెక్కండ్రు రుర్వీశు లొక్కటఁ । బైనెత్తి వచ్చిన భండనమున**
**వారిహేతిచ్ఛత్ర వాహనధ్వజములు । నఱికిన నడునడ నడిఁకి వార**
**లభయంబు వేఁడిన నందఱఁ గృపఁగాచి । యేచి యీపెన్నేల యెల్లఁ దాన**
**కొని యధ్వరములు పె క్కొనరించి వేడుకఁ । బాయసంబులు నపూపములు మోద**

**ఆ.** **కములు లోనుగాఁగఁ గల వంటకముల ను । ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి,**
**దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన । యంబరీషుఁ డేమి య య్యెఁ జెపుమ!' 238**

**ప్రతిపదార్థం:** ఓర్వక= అసూయతో; పెక్కండ్రు= అనేకులు; ఉర్వీ+ఈశులు= భూపతులు, రాజులు; ఒక్కటన్= ఒక్కసారిగా; పైన్+ఎత్తివచ్చినన్= తనపై దండెత్తిరాగా; భండనమునన్= యుద్ధంలో; వారి= ఆ అందరు రాజులయొక్క; హేతి= ఆయుధాలు; ఛత్ర= గొడుగులు; వాహన= వాహనాలు; ధ్వజములు= జెండాలు; నఱికినన్= ఖండించగా; నడునడ నడిఁకి= గడగడ వణికి; వారలు= ఆ రాజులు; అభయంబు= శరణం; వేడినన్= కోరగా; అందఱన్= వారినందరినీ; కృపన్= దయతో; కాచి= కాపాడి; ఏచి= విజృంభించి; ఈ+పెను+నేల= ఈ విశాలమైన భూమిని; ఎల్లన్= అంతటిని; తాను+అ= తానే; కొని= స్వీకరించి; అధ్వరములు= యజ్ఞాలు; పెక్కు= అనేకం; ఒనరించి= చేసి; వేడుకన్= ఇష్టంతో; పాయసంబులున్= పరమాన్నాలు; అపూపములు= పిండివంటలు; (అప్పాలు మొదలైనవి); మోదకములు= కుడుములు; లోనుకాఁగన్+కల= మొదలైన; వంటకములను= పాకాలను; ఉర్వీసుర+ఆవళులకున్= బ్రాహ్మణ సమూహాలకు; ప్రీతిన్= సంతోషంగా; చేసి= కల్పించి, కూర్చి; దక్షిణలుగన్= కానుకలుగా; మణివితానంబులు= రత్నాల రాసులను; ఇచ్చిన= ఇచ్చినటువంటి; అంబరీషుఁడు= అంబరీష చక్రవర్తి; ఏమి+అయ్యెన్= ఏమయ్యాడో; చెపుమ!= చెప్పుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! అసూయ చెందిన రాజులందరూ ఒక్కటై తన పైకి దండెత్తిరాగా, యుద్ధంలో వారందరి ఆయుధాలను, గొడుగులను, వాహనాలను, జెండాలను తెగగొట్టగా, వారందరూ గడగడవణకిపోయి శరణు కోరగా, దయతో వారందరినీ కాపాడి, భూమండలాన్నంతా తానొక్కడే పరిపాలించి, ఎన్నో యజ్ఞాలు చేసి, సంతోషంగా

బ్రాహ్మణులకు పరమాన్నాలు, పిండివంటలు, కుడుములు మొదలైన పాకాలను కల్పించి (చేయించి పెట్టి), రత్నాలరాసులను దక్షిణలుగా ఇచ్చిన అంబరీషు డేమయ్యాడో చెప్పుము?' (శాశ్వతంగా నిలిచి లేడు కదా! శరీరం వదలక తప్పలేదే అని భావం).

**సీ. ' లక్ష భార్యల నుపలాలించి, యొక్కొక్క । వెలఁదికి వేవురు వేవురాత్మ**
**జులు గాఁగఁ బదికోటు లలఘుమూర్తులఁ గాంచె; । వారును దోర్బలోజ్జ్వలులు నార్య**
**చరితులునై పేర్చి తురగ మేధంబు లం । దఱు బహు దక్షిణోదాత్త భంగిఁ**
**జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ । దానును విశ్రుతాధ్వరము లొప్పఁ**

**తే. బెంపు సొంపును సువ్రత సంపదయును । నిర్మల శ్రద్ధయును గర్మ నిపుణతయును**
**నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె నతఁడు । వడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు?' 239**

**ప్రతిపదార్థం:** శశిబిందుఁడు= శశిబిందుడనే చక్రవర్తి; లక్షభార్యలన్= లక్షమంది భార్యలను; ఉపలాలించి= బుజ్జగించి; ఒక్కొక్క వెలఁదికిన్= ఒక్కొక్క స్త్రీకి; వేవురు వేవురు= వెయ్యిమంది చొప్పున; ఆత్మజులు కాఁగన్= కుమారులుగా; పదికోటులు= పది కోట్లమంది; అలఘుమూర్తులన్= గొప్పరూపంకలవారిని; కాంచెన్= పొందాడు; వారును= ఆ కొడుకులు కూడా; అందఱున్= అంతమంది; దోర్బల+ఉజ్జ్వలులు= బాహుబలంతో ప్రకాశించేవారు; ఆర్యచరితులును= మంచి నడతకలవారు; ఐ= అయి ఉండి; పేర్చి= అతిశయించి; బహు= అనేక; దక్షిణా= కానుకలతో; ఉదాత్తభంగిన్= గొప్పగా; తురగమేధంబులు= అశ్వమేధయాగాలు; చేయుచున్= చేస్తూ; తనపంపు= తన ఆదేశాన్ని; చేసి= అనుసరించి; వర్తింపంగన్= నడుచుకొంటూ ఉండగా; తానును= తనుకూడా; పెంపుసొంపును= తన ఆధిక్యంయొక్క చందము; సువ్రత సంపదయును= మంచి ప్రవర్తన అనే సంపద; నిర్మల శ్రద్ధయును= అచ్చపు ఆసక్తి; కర్మ నిపుణతయును= పనులయందు నేర్పరితనమూ; నెఱయన్= నిండగా (పూర్ణంగా ఉండగా); విశ్రుత+అధ్వరములు= పేరెన్నికగన్న యజ్ఞాలు; ఒప్పన్= చక్కగా; ఒనరించి= చేసి; నెగడెన్= వర్ధిల్లాడు; అతఁడు= అట్టి ఘనుడైన శశిబిందుడు; ఎన్నఁడు= ఎప్పటికీ; చెడని= నశించని; ఒడలు= శరీరమును; పడయన్+చాలెను+ఎ= పొందగలిగాడా? (లేదని భావం).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! శశిబిందుడనే చక్రవర్తి లక్షమంది భార్యలను చక్కగా లాలించి, ఒక్కొక్కరివలన వెయ్యిమంది చొప్పున పదికోట్లమంది ఉత్తమ కుమారులను పొంది, వారందరూ తన ఆజ్ఞమేరకు సత్ప్రవర్తన కలవారై, బాహుబలంతో ప్రకాశిస్తూ ఎన్నో అశ్వమేధ యాగాలు భూరిదక్షణలిచ్చి చేయగా, తాను కూడా సత్ప్రవర్తన కలవాడై, ఎంతో ఆసక్తితో నేర్పరితనంతో చెప్పుకొన దగ్గవిధంగా యజ్ఞాలు చేశాడు. అట్టి వాడు కూడా శాశ్వతమైన శరీరం పొంద గలిగాడా?' (అతడు కూడా శరీరం వదిలాడు కదా అని భావం).

**సీ. ' అధిక తపంబున నగ్ని నారాధించి । ప్రత్యక్షమగుటయు బ్రహ్మచర్య**
**వృత్తంబు దమమును వేదవిత్త్వము నహిం । సయుఁ బాత్రదానంబు శమము వరము**
**గాఁ గోరికొని వేదికాస్థలి మణికన । కాత్మిక యై ముప్పదాఱు యోజ**
**నముల దైర్ఘ్యము నంత కమరు విస్తారంబుఁ । గలుగంగ నొనరించి క్రతువు సేసి**

**తే. విప్ర తతికి దాని నతి ప్రియమున । నిచ్చెఁ; దనపేర గయ నుతి కెక్క వటము;**
**పొగడు వడయంగఁ బుణ్యుఁడై నెగడె గయుఁడు । భూవరోత్తమ! యతఁ డెందు బోయెఁ జెపుమ!'240**

**ప్రతిపదార్థం:** భూవర+ఉత్తమ!= రాజవర్యా! ధర్మరాజా!; గయుఁడు= గయుడనే పేరుగల చక్రవర్తి; అధిక= మిక్కిలి అయిన; తపంబునన్= తపస్సుతో; అగ్నిన్+ఆరాధించి= అగ్నిదేవుడిని (అర్చించి) సేవించి; ప్రత్యక్షము+అగుటయున్= ఆ అగ్ని

సాక్షాత్కరించగా; బ్రహ్మచర్య వృత్తంబు= బ్రహ్మచారిగా నడుచుకొనే పద్ధతి; దమమును= బహిరింద్రియ నిగ్రహమును; వేదవిత్త్వమున్= వేదాలను తెలిసికొనగలగటం (వేదసారాన్ని తెలిసికొనటం); అహింసయున్= హింసచేయకుండటం; పాత్రదానంబు= అర్హులకు దానం చేయటం; శమము= అంతరింద్రియ నిగ్రహం; వరము గాన్= వరము లయ్యేటట్లుగా; కోరికొని= ప్రార్థించి; మణి+కనక+ఆత్మక+ఐ= రత్నములు బంగారుతో కూర్చినదై; ముప్పదారుయోజనముల= ముప్పది ఆరు యోజనాల; దైర్ఘ్యము= పొడవు; అంతకు+అమర= దానికి తగిన; విస్తారంబున్= వైశాల్యం; కలుగంగన్= ఉండేటట్లుగా; వేదికాస్థలిన్= తిన్నెను; ఒనరించి= ఏర్పాటుచేసి; క్రతువు+చేసి= యజ్ఞంచేసి; విప్రతతికిన్= బ్రాహ్మణ సమూహానికి; దానము; అతిప్రియముగన్+ఇచ్చెన్= ఎంతో ఇష్టంతో ఇచ్చాడు; తనపేరన్= తన పేరుతో; గయ= గయలో; నుతికిన్+ఎక్కన్= కీర్తి కలిగేటట్లు; వటము= మర్రిచెట్టు; పొగడు+పడయంగన్= మెప్పుపొందగా; పుణ్యుఁడు+ఐ= సత్కర్మలు ఆచరించినవాడై; నెగడెన్= వర్ధిల్లాడు; అతఁడు= ఆ గయుడు; ఎందున్+పోయెన్?= ఎక్కడికి వెళ్ళాడు?; చెపుము+అ= చెప్పుమా!.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! గయుడనే చక్రవర్తి ఎంతో తపస్సుచేసి అగ్ని నారాధించి, ప్రత్యక్షం చేసికొన్నాడు. బ్రహ్మచర్యవృత్తిని, అనగా బ్రహ్మచారిగానే ఉండిపోవటాన్ని, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహాన్ని, వేదజ్ఞానం కలిగి ఉండటాన్ని, అహింసను, పాత్రత ఎరిగి దానం చేయటాన్ని వరాలుగా కావాలని ప్రార్థించి పొందాడు. ముప్పది ఆరు యోజనాల పొడవు, దానికి తగిన వైశాల్యం కలిగిన మణులతో బంగారంతో కూడిన వేదికను నిర్మింపచేసి యజ్ఞంచేసి, బ్రాహ్మణులకు దానిని ఎంతో ఇష్టంతో దానం చేశాడు. ఆ ప్రదేశం అతడి పేరు మీదుగా గయ వటవృక్షం ప్రఖ్యాతి చెందగా, గయుడెన్నో సత్కర్మలు చేసి వర్ధిల్లాడు. మరి, అత డెక్కడికి పోయాడు? చెప్పుము'.

**విశేషం:** యోజనము= నాలుగు కోసుల దూరం - ఎనిమిది మైళ్ళ దూరం. (కోసు= రెండువేల విండ్ల దూరం).

దైవం ప్రత్యక్షమైతే ఎవరైనా కోరేవి భోగభాగ్యాలు. కాని, గయుడు కోరినవి తద్భిన్నమైనవి. అందునా పొందటానికి కష్టమైన వరం బ్రహ్మచర్యం. మానవుడు గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలను క్రమంగా పాటించాలి. ఆ క్రమం తప్పటానికి వేదవిహితమైన వర్ణాశ్రమధర్మం అంగీకరించదు. కనుక ఆ బ్రహ్మచర్యాశ్రమాన్ని పాటించటం వరంగా పొందవలసి వచ్చింది. వేదం చదవటం మానవ ప్రయత్నం, దాని సారం లేక తత్త్వం తెలియటం మాత్రం భగవదనుగ్రహమే.

**సీ.** **'ఇరువది వేవురు పరిణతపాచకు । లభ్యాగతులకును నతిథులకును**
**బాటించి క్రొత్తగాఁ బవలును రేయును । వలయు నన్నము లిడ వెలసి పశువు**
**లర్థి నుత్తమ గతికై తార చనుదేర । విశసించు చమరులు వేడ్కతోడఁ**
**బొడసూపి కడుపారఁ గుడువ హవిర్భాగ । ములు వెట్టు నివ్విధంబున మహాద్ధ్వ**

**తే.** **తముగ నొనరించె సత్త్రయాగము తదుత్స । వంబు గొనియాడ వచ్చిన వార లెల్లఁ**
**బ్రచుర పుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ; । డవ్విభునకును వలసె లోకాంతరంబు.'** **241**

**ప్రతిపదార్థం:** రంతిదేవుఁడు= రంతిదేవుడనే చక్రవర్తి; ఇరువది వేవురు= ఇరువది వేలమంది; పరిణతపాచకులు= నేర్పరులైన వంటవారు; అభ్యాగతులకును= భోజన సమయానికి వచ్చిన వారికీ; అతిథులకును= ఆహూతులకూ; పాటించి= శ్రద్ధగా; క్రొత్తగాన్= అప్పటికప్పుడు; పవలును రేయును= పగటివేళల, రాత్రివేళల; వలయు= కావలసిన, తగిన; అన్నములు= ఆహారాలు; ఇడన్= పెట్టుతుండగా; పశువులు= యజ్ఞపశువులు; అర్థిన్= కోరికతో; ఉత్తమగతికిన్+ఐ= సద్గతులు పొందటానికి; తారు+అ= తమంతట తామే; చనుదేరన్= రాగా, వచ్చిచేరగా; విశసించుచున్= సంహరిస్తూ, బలిఇస్తూ; అమరులు= దేవతలు; వేడ్కతోడన్= వేడుకతో, ఇష్టంతో; పొడ+చూపి= రూపుకట్టి, ప్రత్యక్షమై; కడుపారన్= కడుపునిండుగా; కుడువన్= తినుచుండగా; హవిర్భాగములు+పెట్టన్=

యజ్ఞంలో హోమద్రవ్యాలు సమర్పించేవాడూ; ఈ+విధంబునన్= ఈ పద్ధతిలో, ఈ తీరుగా; మహా+అద్భుతముగన్= మిక్కిలి ఆశ్చర్యకరంగా; సత్త్రయాగము= ఎన్నో సంవత్సరాలపాటు జరిపే పెద్ద యాగమును; ఒనరించెన్= చేశాడు; తద్= ఆ; ఉత్సవంబున్= వేడుకను; కొని+ఆడన్= కీర్తించటానికి; వచ్చినవారలు+ఎల్లన్= వచ్చినవారందరూ; ప్రచుర= అధికమైన; పుణ్య+ఆత్ముఁడు= పవిత్ర స్వభావం కలవాడు; అనన్+ఒప్పెన్= అనేటట్లుగా ప్రకాశించాడు; ఆ+విభునకును= ఆ రాజుకు కూడా; లోక+అంతరంబు= పరలోకం; వలసెన్= తప్పలేదు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! రంతిదేవుడనే చక్రవర్తి సత్త్రయాగం నిర్వహించాడు. ఇది ఎన్నో సంవత్సరాల పాటు జరిగే యజ్ఞం. అంతకాలం ఆహూతులైనవారికి, భోజనసమయానికి పిలవక వచ్చేవారికి, అందరికీ రాత్రిపవలూ అప్పటికప్పుడు కావలసిన ఆహారం పెట్టటానికని ఇరవైవేల మంది పాకకళాప్రవీణులైన వంటవారిని నియమించాడు. ఆ యజ్ఞంలో బలిపశువులుగా ఉంటే తమకు ఉత్తమ గతులు లభిస్తాయని కోరి వచ్చిన పశువులనే చంపాడు. అత డర్పించే యజ్ఞభాగాలు స్వీకరించటానికి దేవతలు స్వయంగా వచ్చి కడుపారా భుజించేవారు. ఆశ్చర్యపడేటట్లుగా జరిగిన ఆ సత్త్రయాగం చూచిన వారంతా రంతిదేవుడిని పుణ్యాత్ముడని ఎంతో పొగడారు. అట్టి రంతిదేవుడు కూడా లోకాంతర గతుడయ్యాడు కదా!'

**సీ.** **' శరభ సింహోత్యుగ్ర సత్త్వచయంబుల । నేడిక లెట్లట్ల యెక్కియాడి,**
**కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున । దమియింపఁగా సర్వదమన నామ**
**మిడియె నమ్ముని; పదంపడి మహారాజ్య । పదస్థుఁడై కాళిందితటమునందు**
**భాగీరథీ తీరభాగంబునను సర । స్వతి సమీపమునను వాజిమేధ**

**తే.** **రాజసూయాది వివిధాధ్వరము లొనర్చి । కనక నిర్మిత కరితురంగమ రథంబు**
**లసదృశ ప్రీతి విప్రుల కొసఁగె భరతుఁ; । డన్నరేంద్రచంద్రుండును జన్నవాఁడ.'** **242**

**ప్రతిపదార్థం:** భరతుఁడు= భరతుడనే చక్రవర్తి; శరభ= మీగండ్ల మెకము; సింహ= సింహం మొదలైన; అతి+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; సత్త్వచయంబులన్= మృగ సమూహాలను; ఏడికలు+ఎట్లు+అట్లు= పొట్టేళ్ళవలె; ఎక్కి= అధిరోహించి; ఆడి= క్రీడించి; కట్టుచున్= ఆ మృగాలను కట్టివేస్తూ; విడుచుచున్= వదలివేస్తూ; కణ్వ+ఆశ్రమంబు= కణ్వుడి ఆశ్రమంలో; దమియింపఁగాన్= నిగ్రహించగా; ఆ+ముని= ఆ కణ్వమహాముని; సర్వదమన= అన్నిటిని నిగ్రహించేవాడు అని 'సర్వదమనుడు' అనే; నామము+ఇడియెన్= పేరు పెట్టాడు; పదంపడి= తరువాత; మహారాజ్య పదస్థుఁడు+ఐ= గొప్ప సామ్రాజ్య పదవి పొందినవాడై; కాళింది తటమునందున్= యమునా నదీ తీరంలోనూ; భాగీరథీ= గంగానది; తీరభాగంబునను= తటాలలోనూ; సరస్వతి= సరస్వతీనది; సమీపమునను= దగ్గరలోనూ; వాజిమేధ= అశ్వమేధ; రాజసూయ+ఆది= రాజసూయం మొదలైన; వివిధ= అనేకమైన; అధ్వరములు= యజ్ఞాలు; ఒనర్చి= చేసి; కనకనిర్మిత= బంగారంతో చేయబడిన; కరి= ఏనుగులు; తురంగమ= గుర్రాలు; రథంబులు= రథాలను; అసదృశ= పోలిక చెప్పటానికి వీలుకాని, సాటిలేని; ప్రీతిన్= తృప్తితో; విప్రులకున్= బ్రాహ్మణులకు; ఒసఁగెన్= ఇచ్చాడు; ఆ+నర+ఇంద్ర చంద్రుండును= ఆ రాజోత్తముడు కూడా; చన్నవాఁడు+అ= వెళ్ళినవాడే, చనిపోయినవాడే కదా!

**తాత్పర్యం:** 'ధర్మరాజా! కణ్వాశ్రమంలో శరభాలు సింహాలు మొదలైన భయంకరమైన మృగాలను గొర్రెపొట్టేళ్ళను ఎక్కినంత సులభంగా ఎక్కి, వాటిని బంధిస్తూ వదలుతూ, తన అధీనంలో ఉంచుకొన్న భరతుడికి, కణ్వుడు సర్వదమనుడని పేరు పెట్టాడు. తరువాత అతడు రాజ్యపదవిని పొంది, యమున, గంగ, సరస్వతీ నదీతీరాలలో అశ్వమేధం, రాజసూయంవంటి అనేక యజ్ఞాలు చేసి బంగారు ఏనుగులను, గుర్రాలను, రథాలను బ్రాహ్మణులకు ఇష్టంతో దానం చేశాడు. అటువంటి రాజశ్రేష్ఠుడైన భరతుడు కూడా పరలోకవాసి అయ్యాడు కదా!'

**సీ. ‘ మిట్టు పల్లంబునై మెలఁగఁగఁ దనరథ । ప్రముఖ వాహనములఁ బఱప ననువు**
**గాకున్న మేదినిఁ గని సమస్థలియుగ । వెరవున నొనరించి విశ్రుతముగఁ**
**దనపేరఁ బృథివి నాఁ జనఁజేసి గోరూప । మైన యివ్వసుమతి నమరనగముఁ**
**బనిచి యోషధులును బహురత్నములుఁ । బిదికించి జనంబుఁ బోషించెఁ బృథుఁడు;**

**తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల? । సకల ధాత్రి బ్రాహ్మణులకు సత్కరించె;**
**నమ్మహానుభావునకును నతులయశమ । కాక సుస్థిరమయ్యెనే కాయ మనఘ! 243**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! ధర్మరాజా!; మిట్టు పల్లంబును+ఐ= ఎత్తుపల్లాలుగా ఉండి; మెలఁగఁగన్= కదలటానికి; తన రథ ప్రముఖ= తనవైన రథాలు మొదలైన; వాహనములన్= వాహనాలను; పఱపన్= నడిపించటానికి; అనువు+కాక+ఉన్న= వీలుకాకుండా ఉన్నటువంటి; మేదినిన్= భూమిని; కని= చూచి; సమస్థలియుఁగన్= చదునైన ఉపరితలం కలదిగా; వెరవునన్= ఉపాయంతో; ఒనరించి= చేసి; తనపేరన్= తన పేరుమీదుగా; పృథివినాన్= పృథివి (అనగ) అనే పేరుతో; విశ్రుతముగన్= ప్రఖ్యాతి చెందేటట్లు; చనన్+చేసి= చెల్లేటట్లుగా చేసి; గోరూపము+ఐన= ఆవు ఆకృతి ధరించిన; ఈ+వసుమతిన్= ఈ భూమిని; అమరనగమున్= హిమవత్పర్వతాన్ని; పనిచి= పంపి; ఔషధులును= తరు, లతా, గుల్మాదులైన చెట్లను; బహు= అనేకమైన; రత్నములున్= మణులను; పిదికించి= పిదికేటట్లు చేసి; జనంబున్= ప్రజలను; పోషించెన్= బ్రదికించాడు; నానా+అధ్వరములు= అనేక యజ్ఞాలు; చేసెన్= చేశాడు; అవి= వాటిని; చెప్పన్+ఏల?= చెప్పవలసిన పనిలేదు; సకల= సమస్తమైన; ధాత్రిన్= భూమిఅందలి; బ్రాహ్మణులకున్= విప్రులకు; సత్కరించెన్= సన్మానంచేశాడు; ఆ+మహానుభావునకున్= ఆ మహాత్ముడికి; అతుల= పోలిక చెప్పటానికి వీలుకానంత; యశము+అ= కీర్తిమాత్రమే; కాక= తప్ప; కాయము= శరీరం; సుస్థిరము+అయ్యెను+ఏ?= శాశ్వతమయిందా?

**తాత్పర్యం:** ‘పాపరహితుడవైన ధర్మరాజా! పూర్వం భూమి ఎత్తుపల్లాలుగా ఉండి మనుష్యులు తిరగటానికి, రథాలు మొదలైన వాహనాలు నడవటానికి అనువుగా లేకపోతే, చూచి భూమిని చదునుగా ఉండేటట్లు చేశాడు పృథుచక్రవర్తి, అప్పటి నుండి అతడి పేరుమీద పృథ్వి అనే పేరు భూమికి చలామణి అయింది. గోరూపమైన భూమినుండి హిమవంతుడిని దూడగాచేసి ఓషధులను, మణులను పితికి ప్రజలను పోషించాడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. వాటిని గురించి చెప్పలేము. భూలోకంలోని బ్రాహ్మణులందరినీ సన్మానించాడు. ఆ మహానుభావుడికి అంతులేని కీర్తి తప్ప శరీరం స్థిరంగా నిలిచిందా? (కీర్తి మిగిలి, శరీరం నశించింది కదా!)’.

**సీ. ‘ బ్రహ్మ విద్వేషంబుఁ బరికించి కోపించి । యవిజేయుఁడైన సహస్రబాహుఁ**
**బరిమార్చి నృపతులఁ దరమిడి తునుమాడె । నిరువదియొక్క మా టెల్లచోట**
**నందఱయేలెడు నన్ని భూములుఁ దాన । యేలె ధర్మోజ్జ్వల పాలనమున;**
**రాజయోగ్యములు ధరామరార్హంబులు । నగు నధ్వరములు పె క్కాచరించెఁ;**

**ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యను పేరఁ । జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యు**
**వినమె యామహాత్ముఁడును ససంతోష వి । భ్రాంతి గలిగెనేని బ్రదుక లేఁడు.’ 244**

**ప్రతిపదార్థం:** బ్రహ్మవిద్వేషంబున్= బ్రాహ్మణద్వేషాన్ని (బ్రహ్మజ్ఞానాన్ని ద్వేషించటం); పరికించి= గమనించి; కోపించి= కోపం కలవాడై; అవిజేయుఁడు+ఐన= గెలవటానికి వీలుకానటువంటి; సహస్రబాహున్= వేయిచేతులుగల కార్తవీర్యార్జునుడిని; పరిమార్చి= చంపి; నృపతులన్= రాజులను; ఇరువదిఒక్కమాఱు= ఇరవై ఒక్కసార్లు; తరమిడి= వరసపెట్టి; తునుమాడెన్= సంహరించాడు; ఎల్లచోటన్= అన్నితావుల; అందఱు+ఏలెడు= అందరూ పరిపాలించే; అన్ని భూములున్= అన్ని రాజ్యాలనూ; తాను+అ= తానే; ధర్మ+ఉజ్జ్వల+పాలనమునన్= ధర్మపద్ధతిలో మిక్కిలి ప్రకాశించే పరిపాలనతో; ఏలెన్= పాలించాడు; రాజ యోగ్యములు= రాజులకు

తగినవి; ధరా+అమర+అర్హంబులున్= బ్రాహ్మణులకు తగినవి; అగు= అయిన; అధ్వరములు= యజ్ఞాలు; పెక్కు+ఆచరించెన్= ఎన్నో చేశాడు; ఉర్విన్= భూమిని; కశ్యపునకున్= కశ్యప ప్రజాపతికి; ఇచ్చి= ఒసగి, దానంచేసి; కాశ్యపి+అనుపేరన్= కాశ్యపి అనే పేరుతో; చనఁగన్+చేసెన్= చెల్లుబాటయ్యేటట్లు చేశాడు; జామదగ్న్యున్= అటువంటి జమదగ్ని పుత్రుడైన పరశురాముడిని గూర్చి; వినము+ఎ= వినలేదా?; ఆ+మహా+ఆత్ముఁడును= ఆ మహానుభావుడు కూడా; స+సంతోష విభ్రాంతిన్= సంతోషంతో కూడిన విభ్రమం; కలిగెన్+ఏని= పొందినప్పటికీ; బ్రదుకలేఁడు= బ్రతుకజాలడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! జమదగ్ని పుత్రుడైన పరశురాముడు బ్రహ్మద్వేషీ, జయించ శక్యం కానివాడూ అయిన వేయి చేతుల కార్తవీర్యుడిని చంపి, వరుసగా ఇరవై ఒక్కమారు రాజులందరినీ సంహరించి, వారందరి రాజ్యాలనూ తానొక్కడే ధర్మ బద్ధంగా పరిపాలించి, రాజులు చేయదగినవీ, బ్రాహ్మణులు చేయదగినవీ అయిన యజ్ఞాలు అనేకం చేసి, భూమినంతటినీ కశ్యపప్రజాపతికి దానంచేసి, భూమికి కాశ్యపి అనే పేరు స్థిరపరిచాడు. అవన్నీ మనం విన్నాం కదా! ఆ మహానుభావుడు కూడా సంతోష దుఃఖాలతో కూడిన బ్రతుకుతో కలకాలం జీవించలేకపోయాడు'.

**వ. అని చెప్పిన యప్పుండరీకాక్షునితోఁ బాండవాగ్రజుండు 'సృంజయ సుతుండైన సువర్ణష్ఠీవిజన్మంబును, వాఁడు మృతుం డయిన విధంబును వినినది యయినను, సువ్యక్తంబుగా వినవలతుం జెప్పవే!' యనిన నతం డతని కిట్లను 'నీకు నాఁడు కృష్ణద్వైపాయనుం డక్కుమారు వృత్తాంతంబు నారదు నధీనంబగుటం జేసి తద్వ్యాపారంబు సెప్పెఁ; బర్వతునిం జెప్పండు గాని పర్వతుండును సహకారి; యత్తెఱం గాకర్ణింపుము.' 245**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; చెప్పిన= చెప్పిన; ఆ+పుండరీక+అక్షునితోన్= తెల్లతామరలవంటి కన్నులు కల శ్రీకృష్ణుడితో; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; సృంజయ సుతుండు+ఐన= సృంజయుడి కుమారుడైన; సువర్ణష్ఠీవి; జన్మంబును= పుట్టుకనూ; వాఁడు= ఆ సువర్ణష్ఠీవి; మృతుండు+ఐన= చనిపోయిన; విధంబును= ప్రకారమూ; వినినన్+అది= విన్నదే; అయినను= అయినా; సువ్యక్తంబుగాన్= బాగా తెలిసేవిధంగా (అర్థం అయ్యేటట్లు); వినవలతున్= వినాలని కోరుకొంటున్నాను; చెప్పుము+ఏ= చెప్పవలసింది; అనినన్= అనగా; అతనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనున్= (శ్రీకృష్ణుడు) అన్నాడు; నీకున్; నాఁడు= అప్పుడు; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ఆ+కుమారు= ఆ బాలుడి; వృత్తాంతంబు= చరిత్ర; నారదు+అధీనంబు+అగుటన్+చేసి= నారదుడికి చెంది ఉండటం వలన; తద్+వ్యాపారంబు= ఆ నారదుడి వ్యవహారం; చెప్పెన్= చెప్పాడు; పర్వతునిన్= పర్వతుడి గురించి; చెప్పండు= చెప్పలేదు; కాని; పర్వతుండును= పర్వతుడు కూడా; సహకారి= తోడ్పడినవాడు; ఆ+తెఱంగు= ఆ క్రమం; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పిన కృష్ణుడితో ధర్మరాజు 'సృంజయుడి కుమారుడైన సువర్ణష్ఠీవి పుట్టుక, అతడు మరణించిన విధం విన్నదే అయినా, మరింత బాగా తెలిసేటట్లు వినా లనుకొంటున్నాను, చెప్పవలసింది' అన్నాడు. దానికి శ్రీకృష్ణు డిట్లా చెప్పటం ప్రారంభించాడు. 'నీకు ఆనాడు వ్యాసుడు ఆ బాలుడి వృత్తాంతం నారదుడికి చెందినది అవటంచేత అతడికి సంబంధించిన విషయమే చెప్పాడు. పర్వతుడిని గురించి చెప్పలేదు. కాని ఈ విషయంలో పర్వతుడుకూడా సహకరించాడు. ఆ విధం అంతా చెప్పుతాను వినుము'.

### శ్రీకృష్ణుఁడు ధర్మజునకుఁ బర్వత నారదుల వృత్తాంతంబు సెప్పుట (సం. 12-30-4)

**సీ. ' అధిప! నారదు చెలియలి కొడు కప్పర్వ । తుం డిద్దఱును మహీమండలమునఁ**
**ద్రిమ్మరు వేడుక దివినుండి యొక్కటఁ । జనుదెంచి తమలోన సమయ మధిక**
**నిష్ఠమైఁ జేసిరి నిజ చిత్తవృత్తు 'లొం । డొరులకు దాఁపక యుండువార;**
**మటుకాక దాఁప శాపార్హత వాటిల్లఁ । గలయది' యని యిట్లు గలయఁ బలికి**

**తే. యుచిత వర్తనమున నుండి యొక్కనాఁడు । సృంజయునిఁ గాంచి యతఁడు విశిష్ట భక్తి నర్చనము సేసినను 'భవదాలయమున । ననఘ! వసియింతుమే కొన్ని దినము' లనిరి. 246**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; ఆ+పర్వతుండు= ఆ పర్వతుడు; నారదు= నారదుడియొక్క; చెలియలికొడుకు= చెల్లెలి కుమారుడు; ఇద్దఱును= నారద పర్వతులు; మహీమండలంబునన్= భూలోకంలో; త్రిమ్మరువేడుకన్= యథేచ్ఛగా విహరించాలనే కోరికతో; దివినుండి= దేవలోకం నుండి; ఒక్కటన్= ఒకేసారి; చనుదెంచి= వచ్చి; తమలోనన్= తమమధ్య; సమయము= ఒప్పందం, ఒడంబడిక; అధికనిష్ఠమైన్= మిక్కిలి గట్టిగా; చేసిరి= చేసికొన్నారు; నిజ= తమయొక్క; చిత్తవృత్తులు= మనోభావాలు; ఒండొరులకున్= పరస్పరం; దాఁపక+ఉండువారము= దాచుకొనకుండా ఉందాం; అట్లుకాక= ఆ విధంగా కాక; దాఁపన్= దాచినట్లయితే; శాప+అర్హత= శాపంపొందే అర్హత; పాటిల్లన్+కల+అది= కాగలదు; అని= ఈ విధంగా; కలయన్+పలికి= ఇరువురూ కలిసి అనుకొని; ఉచిత= తగిన; వర్తనమునన్= నడవడికతో; ఉండి= ప్రవర్తించి; ఒక్కనాఁడు= ఒకరోజు; సృంజయుని; కాంచి= చూచి; అతఁడు= ఆ సృంజయుడు; విశిష్టభక్తిన్= విశేషమైన భక్తితో; అర్చనము= పూజ, సేవ; చేసినను= చేయగా; అనఘ!= పాపరహితుడా!; భవత్+ఆలయమునన్= నీ గృహంలో; కొన్ని దినములు= కొద్ది రోజులు; నివసింతుము+ఏ?= ఉండమా?; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పర్వతుడు నారదుడి చెల్లెలి కుమారుడు. వారిద్దరూ భూలోకంలో కొంతకాలం విహరించాలనే కోరికతో ఒకేసారి భూలోకం వచ్చారు. తమ మనోభావాలను దాచకుండా ఒకరితో ఒకరు చెప్పుకొనాలని, దాచినట్లైతే శాపార్హు లౌతారని ఒప్పందం చేసికొన్నారు. దానికి తగినట్లుగా ప్రవర్తిస్తూ ఒకనాడు సృంజయుడిని చూచారు. అతడు ప్రత్యేకమైన భక్తితో సేవించగా, అతడి ఇంట కొద్దికాలం ఉండమా? - అన్నారు.

**వ. అని పలికిన నా పృథ్వీపతి ప్రియంబంది సుకుమారి యనుపేరం బరఁగిన నిజనందన రావించి 'యిక్కన్నియ మీకుం బరిచర్య సేయ సమాధానంబున నుండుం'డని యన్నెలంతతో 'నీవు దేవోపచారంబుల వీరి నారాధింపు' మని నియోగించి వలయు వస్తువులు సమగ్రంబులుగా సమకట్టినం, బ్రీతులై యమ్మునులు సుఖంబున్న సమయంబున. 247**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= ఈ విధంగా అడుగగా; ఆ పృథ్వీపతి= ఆ రాజు, సృంజయుడు; ప్రియంబు+అంది= సంతోషపడి; సుకుమారి+అను+పేరన్+పరఁగిన= సుకుమారి అనే పేరుగల; నిజనందనన్= తనకుమార్తెను; రావించి= పిలిపించి; ఈ+కన్నియ= ఈ కన్య, ఈ బాలిక; మీకున్= మీకు; పరిచర్య+చేయన్= సేవలు చేస్తుండగా; సమ్+ఆ ధానంబునన్+ఉండుండు= అంగీకరించి ఉండండి; అని= పలికి; ఆ+నెలంతతోన్= ఆ బాలికతో; నీవు; దేవ+ఉపచారంబులు= దేవతలకు చేసే ఉపచారాలతో; వీరిన్= ఈ మునులను; ఆరాధింపుము+అని= సేవించుము (పూజించుము) అని; నియోగించి= ఆజ్ఞాపించి; వలయు= కావలసిన; వస్తువులు= పదార్థాలు; సమగ్రంబులు+కాన్= పరిపూర్ణంగా; సమకట్టినన్= సిద్ధపరచగా; ప్రీతులు+ఐ= సంతసించినవారై; ఆ+మునులు= ఆ ఋషులు; సుఖంబు+ఉన్న= హాయిగా ఉన్నటువంటి; సమయంబున= కాలంలో.

**తాత్పర్యం:** అని పర్వతనారదాదులు అంటే ఆ సృంజయుడు సంతోషపడి, సుకుమారి అనే పేరున్న తన కుమార్తెను పిలిపించి 'ఈ కన్య మీకు ఉపచారాలు చేస్తుంది. అంగీకరించండి' అని చెప్పి, ఆమెతో 'నీవు ఈ మునులను దేవతలకు చేసే ఉపచారాలతో (షోడశోపచారాలతో) సేవించుము' అని ఆజ్ఞాపించి, కావలసిన పదార్థాల నన్నింటిని పరిపూర్ణంగా ఏర్పాటు చేయగా, ఆ మునులు సుఖంగా ఉన్న సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁజూచు । నడపు కాంతికి వింత తొడవు గాఁగ,**
**వెడవెడ నూఁగారు వింతయై యేర్పడఁ । దారనివళులలో నారు నిగుడ,**
**నిట్టలు ద్రోచుచు నెలవులకల మేర । లెల్లను బిగియెక్కి యేర్పడంగఁ,**
**దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు । తారకంబులఁ గల్కితనము దొడరఁ**

**ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు । జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు**
**చునికిఁ దెలుప సృంజయుని పుత్రి మెలఁగు వి । ధంబు నారదునకుఁ దగు లొనర్చె. 248**

**ప్రతిపదార్థం:** అల్లఁదనంబున= నెమ్మదితనంతో; అనువు= వీలు, ఉపాయం; మైకొనన్+చూచు= అంగీకరించ ప్రయత్నించే; నడపు= గమనం; కాంతికిన్= జిగికి, శోభకు; వింత= క్రొత్తదైన; తొడవు+కాఁగన్= అలంకారం కాగా; వెడవెడ= కొద్దిగా; నూఁగారు= రోమాళి; వింతఐ= క్రొత్తదిగా; ఏర్పడన్= కలుగగా; తారని= కలువని (ఇంకా సరిగా ఏర్పడని) వళులలోన్= త్రివళులలో; ఆరు= నూగారు; నిగుడన్= వ్యాపించగా; నిట్టలు= స్థానాలు (తమ తమ); త్రోచుచున్= ఆవలకు నెట్టుతూ; నెలవులకున్= స్థానాలకు; అల= ఆ; మేరలు= హద్దులు; ఎల్లను= అన్ని; బిగి+ఎక్కి= బిగువు కలిగి; ఏర్పడంగన్= తయారుకాగా; తెలుపును= తెల్లదనం; కప్పును= నల్లదనం; వెలయంగన్= ఒప్పగా; మెఱుఁగు+ఎక్కు= కాంతి ఎక్కువ అవుతున్న; తారకంబులన్= కను గ్రుడ్లలో; కల్కితనము= మనోహరత్వం, గడుసరితనం; తొడరన్= అతిశయించగా; చరణములును= పాదాలూ; నడుమున్= నడుమూ; చన్నులున్= వక్షోజాలూ; కన్నులు= నయనాలూ; జవ్వనంబు= యౌవనము యొక్క; చెన్ను= అందం; నివ్వటిల్లుచున్= అతిశయిస్తూ; ఉనికి= ఉండటాన్ని; తెలుపన్= ప్రకటించగా; సృంజయుని పుత్రి= సుకుమారి; మెలఁగు విధంబు= ప్రవర్తించే తీరు; నారదునకున్= నారద మహర్షికి; తగులు+ఒనర్చి= మోహాన్ని కలిగించింది.

**తాత్పర్యం:** నెమ్మదితనంతో వీలు చూచుకొని అతిశయించే నడక ఆ సుకుమారి శోభకు క్రొత్త అందాన్ని కూర్చగా, అప్పుడే స్వల్పంగా రూపు కడుతున్న నూగారు, ఇంకా స్పష్టంగా ఏర్పడని త్రివళుల (పొట్టపై అందగత్తెలకుండే మూడు ముడుతలు)లో వ్యాపించగా, (శరీరావయవాలు) తమతమ స్థానాలను దాటి (విస్తరించి), క్రొత్త హద్దులను స్థిరపరచగా, తెలుపునలుపులతో మరింత కాంతిమంతమౌతున్న కంటిపాపల మనోహరత్వం అతిశయించగా, పాదాలు, నడుము, వక్షోజాలు, కన్నులు యౌవన సౌందర్యం అధికమవటాన్ని తెలుపుతుండగా సృంజయుడి కుమార్తె సుకుమారి ప్రవర్తించే తీరు నారదమహర్షికి ఆకర్షణ కలుగజేసింది.

**విశేషం:** అలం: యథాసంఖ్యం

**క. నారదుఁడు మదనబాణా । సారము దనుఁ బొదువ ధైర్యసారమెడలి దు**
**ర్వార మనోవ్యథవంతం । గూరి క్రమంబునఁ గృశాంగకుండయ్యె నృపా! 249**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; నారదుఁడు= నారదమహర్షి; మదనబాణ+ఆసారము= మన్మథబాణాల జడివాన; తనున్= తనను; పొదువన్= క్రమ్మగా; ధైర్యసారము= ధైర్యంయొక్క బలం; ఎడలి= కోల్పోయి, దుర్వార= వారించరాని; ఆపలేని; మనోవ్యథ వంతన్= మానసికతాపం వలని బాధలో; కూరి= కూరుకుపోయి; క్రమంబునన్= నెమ్మది నెమ్మదిగా; కృశ+అంగకుండు= క్షీణించిన శరీరావయవాలు కలవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! నారదమహర్షి మన్మథబాణాల జడివాన తనను ముంచెత్తగా, ధైర్యం కోల్పోయినవాడై, నివారించలేని మనోవికార బాధలో కూరుకొనిపోయి నెమ్మదిగా చిక్కిపోయాడు.

**వ. అట్లు కామునిబారిం బడి నలంగియుఁ దనతో నుగ్గడింప సిగ్గువడి. 250**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కాము+బారిన్+పడి= మన్మథబాధ పాలబడి; నలంగియున్= బాధపడి కూడా; తనతోన్= పర్వతుడితో; ఉగ్గడింపన్= చెప్పటానికి; సిగ్గు+పడి= సిగ్గిల్లి.

**తాత్పర్యం:** ఆ విధంగా మన్మథుడి బాణాలకు ఎర అయి, బాధపడుతూ కూడా తనతో చెప్పటానికి సిగ్గుపడి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. వెనుఁబడు చిత్తవృత్తియును, వెల్వెలఁ బాఱెడు నాననంబు నై**
**యనిశముఁ గుందు, మామఁ గని యల్లుఁ 'డితం డిటు లేల వంతఁ బొం**
**దెనొ!' యనుచింత నొంది, తన దివ్యమతిం బరికించి కాంచి 'కూ**
**డునె సమయంబు దప్పఁగఁ? గడుం గుటిలాత్ముఁడవైతి నా యెడన్.' 251**

**ప్రతిపదార్థం:** వెనుఁబడు= విషాదానికి లోనైన; చిత్తవృత్తియును= మనోభావమూ; వెల్వెలన్+పాఱెడు= పాలిపోయిన; ఆననంబును+ఐ= ముఖం కలవాడై; అనిశమున్= నిరంతరం; కుందు= బాధపడుతున్న; మామన్+కని= మేనమామ అయిన నారదుడిని చూచి; అల్లుఁడు= పర్వతుడు; ఇతండు= ఈ నారదుడు; ఇటులు= ఈ విధంగా; ఏల= ఏ కారణంగా; వంతన్= బాధను; పొందెను+ఒ?= పొందాడో?; అను చింతన్+ఒంది= అనే ఆలోచన కలిగి; తన దివ్యమతిన్= తన దివ్యదృష్టితో; పరికించి= చూచి; సమయంబున్= ఒప్పందాన్ని; తప్పఁగన్= తప్పటం; కూడును+ఎ?= తగినదా?; నా+ఎడన్= నా పట్ల; కడున్= మిక్కిలి; కుటిల+ఆత్ముఁడవు= దుర్బుద్ధి కలవాడివి; ఐతి(వి)= అయ్యావు.

**తాత్పర్యం:** మనసులో విషాదం, పాలిపోయిన ముఖం కలిగి నిరంతరం బాధపడుతూ ఉన్న తన మేనమామ నారదుడిని చూచి పర్వతుడు తనమామ ఎందుకు అంత బాధపడుతున్నాడా? అని ఆలోచించి, దివ్యదృష్టితో తెలిసికొన్నాడు. 'మాటతప్పి, నా పట్ల దుర్బుద్ధివి అయ్యావు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. రాచకూఁతు మీఁద రాగంబు పుట్టుట । నాకుఁ జెప్పవైతి; నీకు శాప**
**మిత్తు; నమ్మృగాక్షి నీవు వరింపక । నిలువలేవు మరుఁడు బలియుఁడగుట. 252**

**ప్రతిపదార్థం:** రాచకూఁతు+మీఁదన్= రాజకుమార్తెపై; రాగంబు పుట్టుట= ప్రేమ కలగటం; నాకున్ చెప్పవు+ఐతి(వి)= నాకు చెప్పలేదు; నీకున్; శాపము+ఇత్తున్= శాపం ఇస్తాను; మరుఁడు= మన్మథుడు; బలియుఁడు= బలవంతుడు; అగుటన్= కావటం వలన; ఆ+మృగ+అక్షిన్= ఆ లేడి కళ్ళవంటి కళ్ళుగల సుకుమారిని; వరింపక= వివాహమాడక; నిలువలేవు= ఉండలేవు.

**తాత్పర్యం:** రాజకుమార్తెపై నీకు అనురాగం కలిగిందని నాకు చెప్పలేదు. నిన్ను శపిస్తాను. మన్మథుడి ప్రాబల్యం కారణంగా నీ వా సుకుమారిని పరిణయం చేసికొనక ఉండలేవు.

**వ. పాణిగ్రహణానంతరంబ వానర వదనుండ వగు' మనవుడు నారదుండు 'నీకు నాకలోకంబునకుం జనుట లేకుండెడు' మని ప్రతిశాపం బిచ్చినం, బర్వతుం డచ్చోటు వాసిపోయి భూజనంబులు పూజింపఁ బ్రవర్తిల్లుచుండె. 253**

**ప్రతిపదార్థం:** పాణిగ్రహణ+అనంతరంబు+అ= వివాహం తరువాత వెంటనే; వానర వదనుండవు= కోతిమొగం కలవాడివి; అగుము= కమ్ము; అనవుడున్= అనగా; నారదుండు; నీకున్= పర్వతుడికి; నాకలోకంబునకున్= స్వర్గలోకానికి; చనుట= వెళ్ళటం; లేక+ఉండెడున్= లేక ఉందువుగాక; అని= అంటూ; ప్రతిశాపంబు= ఎదురు శాపం; ఇచ్చినన్= ఇవ్వగా; పర్వతుండు; ఆ+చోటు=

ఆ ప్రదేశాన్ని; పాసి= వీడి; పోయి= వెళ్ళి; భూజనంబులు= భూలోక ప్రజలు; పూజింపన్= ఆరాధిస్తుండగా; ప్రవర్తిల్లుచుండెన్= నడుచుకొంటూ ఉన్నాడు.

**తాత్పర్యం:** వివాహం అయిన వెంటనే కోతి మొగం కలవాడివి అవుతావు' అని పర్వతుడు అనగానే, 'నీవు స్వర్గలోకానికి వెళ్ళకుందువుగాక!' అని నారదుడు ఎదురు శాపం ఇచ్చాడు. పర్వతుడు ఆ ప్రదేశం వదలి వెళ్ళి భూలోకంలోని ప్రజలచేత పూజలందుకొంటూ తిరుగసాగాడు.

**శా. శాప ప్రాప్తికి నోర్చి తా నడిగి యా చంద్రాస్య నన్నారదుం**
**డా పృథ్వీపతి యీఁ బ్రియంబున వివాహం బయ్యె నమ్మాత్రలో**
**భూపా! యమ్ముని వానరాననతమైఁ బొల్పేద నక్కాంత త**
**ద్రూప ప్రాప్తి విరక్తగాక తగఁ బ్రీతుం జేయుచుండెం బతిన్. 254**

**ప్రతిపదార్థం:** భూపా!= ధర్మరాజా!; ఆ+నారదుండు= ఆ నారదమహర్షి; శాపప్రాప్తికిన్= శాపం పొందటాన్ని కూడా; ఓర్చి= సహించి; తాన్= తానే; ఆ+చంద్ర+ఆస్యన్= చంద్రుడివంటి ముఖం కల సుకుమారిని; అడిగి= వేడి; ఆ పృథ్వీపతి= ఆ రాజు (సృంజయుడు); ఈన్= ఒసగగా; ప్రియంబునన్= ఇష్టంతో; వివాహంబు+అయ్యెన్= వివాహం చేసికొన్నాడు; ఆ+మాత్రలోన్= అంతలో; ఆ+ముని= ఆ నారదుడు; వానర+ఆననత+మైన్= కోతిమొగం కలిగి ఉండటంతో; పొల్పు+ఏదన్= అందంపోగా; ఆ+కాంత= ఆ సుకుమారి; తద్+రూప+ప్రాప్తిన్= ఆ కోతి రూపం పొందినందువలన; విరక్త+కాక= అనిష్టాన్ని పెంచుకొనకుండా; తగన్= చక్కగా; పతిన్= భర్తను; ప్రీతున్= సంతృప్తి చెందినవాడిని; చేయుచున్+ఉండెన్= చేస్తున్నది.

**తాత్పర్యం:** ధర్మరాజా! నారదమహర్షి తనకు శాపం వచ్చినా సహించి, సృంజయుడిని తానే అడిగి, సుకుమారిని ఎంతో ఇష్టంగా వివాహం చేసికొన్నాడు. మరుక్షణం కోతిముఖం పొంది తన అందాన్ని కోల్పోయాడు. నారదుడు అటువంటి వికారమైన రూపం పొందినా ఆ సుకుమారి భర్తపై అనిష్టం ప్రకటించకుండా అతడిని సుఖపెట్టుతూ ఉన్నది.

**వ. ఇట్లు పతివ్రతయై సుకుమారి నారదు నారాధించుచుండెఁ;బదంపడి యొక్క నాఁ డేమేనియుం బనికి వనంబునకు నారదుండు వోయినయెడం బర్వతుండు డబ్బాటు గాంచి నమస్కరించి 'నాకిచ్చిన శాపంబు మరల్పవే!' యనుటయు నారదుండు 'నీవు గావె మున్ను శపించిన వాఁడవు; ముందర నీ యిచ్చిన శాపంబు మరల్పందగు' నని పలికిన, నతం 'డట్లకాక' యనియె; నివ్విధంబున నొడంబడి యిరువురు నొండొరువుల శాపంబులు మరల్చి; రయ్యెల్లుండును మామతోడన వచ్చి మందిర ప్రవేశంబు సేయు సమయంబున నా రాజనందన నిజపురుషుం జూచి పరపురుషుండ కాఁ దలంచి, మఱచూడక మాఱుమొగంబు వెట్టికొని పోవుటయు. 255**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పతివ్రత+ఐ= పతిని అనుసరించే ప్రవర్తన కలదై; సుకుమారి= సృంజయుడి కుమార్తె, నారదున్= నారదుడిని; ఆరాధించుచున్+ఉండెన్= సేవించుకొంటూ ఉన్నది; పదంపడి= తరువాత; ఒక్కనాఁడు= ఒక రోజు; ఏమి+ఏనియున్= ఏదో ఒక; పనికిన్= కార్యానికి; నారదుండు; వనంబునకున్= అరణ్యానికి; పోయిన+ఎడన్= వెళ్ళినప్పుడు; పర్వతుండు; డబ్బాటు= అకస్మాత్తుగా; కాంచి= చూచి; నమస్కరించి= మ్రొక్కి; నాకున్+ఇచ్చిన= నాకొసంగిన; శాపంబు= శాపాన్ని; మరల్పుము+ఏ?= వెనక్కు తీసికొనవా?; అనుటయున్= అనగా; నారదుండు; మున్ను= ముందు; శపించినవాఁడవు= తిట్టినవాడివి; నీవు+కావు+ఎ!= నీవే కదా!; ముందర= ముందు; నీ+ఇచ్చిన= నీ విచ్చిన; శాపంబు= తిట్టు; మరల్పన్+తగున్= వెనుకకు తీసికొనటం తగి ఉంటుంది;

అనిపలికినన్= అంటూ మాట్లాడగా; అతండు= ఆ పర్వతుడు; అట్లు+అ+కాక= అట్లే అగుగాక; అనియెన్= అన్నాడు; ఈ+విధంబునన్= ఈ తీరుగా; ఒడంబడి= అంగీకరించి; ఇరువురున్= ఇద్దరూ; ఒండొరువుల= పరస్పర; శాపంబులు= శాపాలను; మరల్చిరి= వెనుద్రిప్పారు; ఆ+అల్లుండును= ఆ పర్వతుడు కూడా; మామతోడన= నారదుడితోనే; వచ్చి= ఏతెంచి; మందిర ప్రవేశంబు+చేయు= ఇంటిలో అడుగుపెట్టే; సమయంబునన్= తరుణంలో; ఆ రాజనందన= ఆ రాకుమారి - సుకుమారి; నిజపురుషున్= తన భర్తను; చూచి= కని; పరపురుషుండు= పరాయి మగవాడు; కాన్+తలంచి= అయి ఉంటా డనుకొని; మఱిచూడక= మళ్ళీ చూడకుండా; మాఱుమొగంబు= ఎడమొగం; పెట్టికొని= పెట్టుకొని; పోవుటయున్= వెళ్ళిపోగా.

**తాత్పర్యం:** భర్త కురూపి అయినా సుకుమారి పతివ్రత అయి భర్తను సేవిస్తూ ఉన్నది. ఒకరోజు ఏదో పనిమీద నారదుడు అడవికి వెళ్ళగా హఠాత్తుగా పర్వతుడు చూచి నమస్కరించి తన కిచ్చిన శాపాన్ని వెనుకకు తీసికొనుమని అడిగాడు. దానికి నారదుడు 'ముందుగా శపించినది నీవు కనుక నీవే ముందు మరల్చాలి' అన్నాడు. దానికా పర్వతుడు సరేనన్నాడు. ఈ విధంగా ఇద్దరూ పరస్పరం శాపాలు మరల్చారు. మామా అల్లు ళ్ళిద్దరూ వచ్చి ఇంటిలో ప్రవేశించబోతూ ఉండగా, సుకుమారి తన భర్త అయిన నారదుడిని పరాయివాడిగా భావించి తిరిగిచూడక పెడమొగం పెట్టుకొని పోయింది.

**ఆ. నగుచుఁ బర్వతుండు 'నాతి! నీపతి యగు । విశ్వసింపు'మని సవిస్తరముగ**
**శాపములును మోక్షసంవిధానములును । జెప్పి తీర్చె దాని చిత్తవృత్తి. 256**

**ప్రతిపదార్థం:** పర్వతుండు; నగుచున్= నవ్వుతూ; నాతి!= ఓ సుకుమారీ!; నీపతి+అగు= (ఇతడు) నీ భర్తయే (అయి ఉన్నాడు); విశ్వసింపుము+అని= నమ్ముమని; సవిస్తరముగన్= అన్ని వివరాలతో; శాపములును= ఒకరినొకరు శపించుకొనటం;మోక్షసంవిధానములును= శాపావసానపు తీరులూ; చెప్పి= తెలిపి; దాని= ఆ సుకుమారి యొక్క; చిత్తవృత్తిన్= మనసును; తేర్చెన్= కలత తీర్చాడు.

**తాత్పర్యం:** అపుడు పర్వతుడు నవ్వుతూ, 'సుకుమారీ! ఇతడు నీ భర్త అని నమ్ముము' అని శాపాలవృత్తాంతం, అవి పోయిన వృత్తాంతం వివరంగా చెప్పి ఆమె మనసులోని కలతను తీర్చాడు.

**వ. ఇట్లు నారదుండును బర్వతుండును బరస్పర ప్రియకారులైరి; కౌరవోత్తమా! నీ యడిగిన సువర్ణష్ఠీవి వృత్తాంతంబు నిమ్మునివరుండు దేటపడం జెప్పెడు' నని సృంజయ పుత్ర చరిత్ర కథనంబు నారదు కృత్యంబుగాఁ బలుకుచు నతనిం జూపిన, నాతం 'డిప్పుడు శౌరి చెప్పినయంతయు నిట్టిద' యక్కుమారు తెఱంగుఁ జెప్పెద నాకర్ణింపు'మని యప్పాండవాగ్రజున కభిముఖుండై యిట్లనియె. 257**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నారదుండును, పర్వతుండును; పరస్పర= ఒకరికొకరు; ప్రియకారులు= మేలు చేసికొన్నవారు; ఐరి= అయ్యారు; కౌరవ+ఉత్తమా!= కౌరవులలో శ్రేష్ఠుడవైన ధర్మరాజా!; నీ+అడిగిన= నీవు అడిగినటువంటి; సువర్ణష్ఠీవి; వృత్తాంతంబున్= చరిత్రను; ఈ+మునివరుండు= ఈ ఋషి శ్రేష్ఠుడు నారదుడు; తేటపడన్= స్పష్టమయ్యేటట్లు; చెప్పెడున్= చెప్పుతాడు; అని= అంటూ; సృంజయ పుత్ర చరిత్ర= సృంజయుడి కుమారుడైన సువర్ణష్ఠీవి కథ; కథనంబు= చెప్పటం; నారదు కృత్యంబు+కాన్= నారదుడు చేయవలసిన పని అని; పలుకుచున్= చెప్పుతూ; అతనిన్= ఆ నారదుడినే; చూపినన్= చూపగా; ఆతండు= ఆ నారదుడు; ఇప్పుడు; శౌరి= కృష్ణుడు; చెప్పిన+అంతయున్= చెప్పినదంతా; ఇట్టిది+అ= అటువంటిదే, నిజమే; ఆ+కుమారు= ఆ బాలుడి; తెఱఁగున్= విధం; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము; అని= పలికి; ఆ+పాండవ+అగ్రజునకున్= ఆ ధర్మరాజుకు; అభిముఖుండు+ఐ= ఎదురుగా నిలిచినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ విధంగా నారదుడు పర్వతుడు ఒకరికొరకు ఒకరు ఉపకారం చేసికొన్నారు. నీవు అడిగిన సువర్ణష్ఠీవి వృత్తాంతాన్ని మునివర్యుడైన నారదుడు మీకు తేటతెల్లంగా వినిపిస్తాడు. సువర్ణష్ఠీవి కథ చెప్పటం నారదుడి పని' అని చెప్పి శ్రీకృష్ణుడు నారదుడిని చూపగా, అతడు 'కృష్ణుడు చెప్పినదంతా వాస్తవమే' అని, 'ఇక సువర్ణష్ఠీవి కథ విను' మని ధర్మరాజు ఎదుట నిలిచి ఇట్లా చెప్పటం ప్రారంభించాడు.

**సీ.** **' అవ్విధంబున నేను నల్లుండు సంప్రీతి । సృంజయుపాల వసింపఁ గొన్ని**
**సంవత్సరంబులు సనినఁ, దదాశ్రిత । బ్రాహ్మణోత్తముల సంప్రార్థనంబు**
**గలుగంగ మాకును గమనేచ్ఛ పుట్టంగ । నా రాజునకు నుపకార మొకటి**
**సేయఁ దలంచి యే మాయన సన్నిధి । కరిగి కోరుము వరమంటి మనిన**

**ఆ.** **నతఁడు 'మీరు ప్రీతులయినకంటెను నొండు । గలవె వరము?' లనిన గారవించి**
**యనిమిషులను మిగులు తనయునిఁ బడయంగ । వలచియుండు దట్టి వానిఁ గనుము. 258**

**ప్రతిపదార్థం:** ఆ+విధంబునన్= ఆ విధంగా; నేనును+అల్లుండున్= నేనూ నా మేనల్లుడైన పర్వతుడూ; సంప్రీతిన్= మిక్కిలి ఇష్టంతో; సృంజయపాలన్= సృంజయుడివద్ద; వసింపన్= నివసించగా, ఉండగా; కొన్ని సంవత్సరంబులు= కొన్ని ఏళ్ళు; చనినన్= కడవగా; తద్+ఆశ్రిత= ఆ సృంజయుడిని ఆశ్రయించుకొని ఉన్న; బ్రాహ్మణ+ఉత్తముల= విప్రవర్యుల; సంప్రార్థనంబు= విన్నపం; కలుగంగన్= ఉండగా; మాకును= మాకు కూడా; గమన+ఇచ్ఛ= వెళ్ళాలనే కోరిక; పుట్టంగన్= కలుగగా; ఆ రాజునకున్= ఆ సృంజయుడికి; ఉపకారము+ఒకటి= ఒక మేలు; చేయన్+తలంచి= ఒనరించా లనుకొని; ఏము= మేము; ఆయన సన్నిధికిన్= ఆ సృంజయుడి వద్దకు; అరిగి= వెళ్ళి; కోరుము వరము= వరంకోరుకొనుము; అంటిమి= అన్నాము; అనినన్= అనగా; అతడు= ఆ సృంజయుడు; మీరు; ప్రీతులు+అయిన= సంతసించినవారు అయిన; కంటెను= దానికన్న; ఒండు= వేరు; వరములు= కోరదగినవి; కలవు+ఎ?= ఉన్నాయా?; అనినన్= అనగా; గారవించి= ఆదరించి; అనిమిషులను= దేవతలను; మిగులు= అతిశయించే; తనయునిన్= కుమారుడిని; పడయంగన్= పొందాలని; వలచి= కోరి; ఉండుదు(వు)= ఉన్నావు; అట్టివానిన్= అటువంటి కుమారుడిని; కనుము= పొందుము.

**తాత్పర్యం:** ఆ విధంగా నేనూ నా మేనల్లుడూ ఆ సృంజయుడి వద్ద కొన్ని ఏళ్ళు ఉన్న తరువాత అతడి ఆశ్రయంలో ఉన్న బ్రాహ్మణులు కోరగా, మాకూ వెళ్ళుదామనే కోరిక కలగటంతో సృంజయుడికి ఏదైనా మేలు చేయాలనే ఉద్దేశంతో ఆయన వద్దకు వెళ్ళి వరం కోరుకొమ్మన్నాము. అతడు 'మీరు సంతుష్టులవటానికి మించిన వరాలు ఇంకేమున్నాయి?' అన్నాడు. అతడిని గౌరవించి 'దేవతలను మించిన కొడుకును పొందాలని కోరుకొంటున్నావు కనుక అట్టి కొడుకును పొందుతావు.'

**వ.** **అంటి: మట్టియెడ నింద్ర తేజో రక్షణాయత్త చిత్తుండగు నప్పర్వతుం డప్పుడమిఱేనితో 'విను మక్కుమారుండు దీర్ఘాయురుపేతుండు గాకుండు' ననియె దానికి నమ్మానవపతి యుమ్మలించి యమ్మహాత్ము నాననంబునం జూడ్కి నిలిపి 'యి ట్లేల యుష్మ దనుగ్రహం బనూనంబు గావలవదే?' యని ప్రార్థించిన నమ్మాట కమ్ముని మఱుమాట వలుకకున్న నే నన్నరనాథుపైఁ గలుగు కరుణావిశేషంబున. 259**

**ప్రతిపదార్థం:** అంటిమి= అన్నాము; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఇంద్రతేజోరక్షణ= ఇంద్రుడియొక్క తేజమును రక్షించటంలో; ఆయత్త= సిద్ధపడిన; చిత్తుండు= మనసు కలవాడు; అగు= అయిన; ఆ+పర్వతుండు= ఆ పర్వతుడు; ఆ+పుడమి ఱేనితోన్= ఆ రాజుతో; వినుము= వినుము; ఆ+కుమారుండు= ఆ బాలుడు; దీర్ఘ+ఆయుః+ఉపేతుఁడు= అధికమైన ఆయుస్సుతో కూడుకొన్నవాడు; కాక+ఉండున్= కాకపోతాడు; అనియెన్= అన్నాడు; దానికిన్= ఆ మాటలకు; ఆ+మానవపతి= ఆ రాజు;

ఉమ్మలించి= బాధపడి; ఆ+మహాత్ముం= ఆ మహానుభావుడైన పర్వతుడి; ఆననంబునన్= ముఖంపై; చూడ్కి= చూపు; నిలిపి= కేంద్రీకరించి; ఇట్లు+ఏల= ఈ విధంగా ఎందుకు; యుష్మత్+అనుగ్రహంబు= మీ అనుగ్రహం; అనూనంబు= తక్కువ కానిది; కావలదు+ఏ!= అయి ఉండాలి కదా!; అని; ప్రార్థించినన్= వేడగా; ఆ+మాటకున్= ఆ పలుకునకు; ఆ+ముని= ఆ పర్వతుడు; మఱుమాట= మారుమాట; పలుకక= మాట్లాడక; ఉన్నన్= ఉండగా; ఏన్= నేను; ఆ+నరనాథుపైన్= ఆ రాజుమీద; కలుగు= ఉన్న; కరుణా విశేషంబునన్= దయావిశేషంవలన.

**తాత్పర్యం:** అని అన్నాం. ఆ సమయంలో ఇంద్రుడి మహత్త్వాన్ని రక్షించటంలో నిమగ్నమైన మనసున్న పర్వతుడు ఆ రాజుతో 'వినుము - ఆ బాలుడు దీర్ఘాయువు కలవాడు కాకుండా ఉంటాడు' అన్నాడు. దానికి ఆ రాజు బాధపడి పర్వతుడి ముఖంపై చూపు కేంద్రీకరించి, 'ఇట్లా ఎందుకు అన్నారు? మీ దయలో లోటు ఉండకూడదు కదా!' అని వేడుకొన్నాడు. ఆ మాటలకు పర్వతుడు మారుపలుక లేదు. నేను ఆ రాజుపై ఉన్న ప్రత్యేకమైన దయతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **వలదు శంకింప నింద్రుని వలనఁ బుట్టు । నెడరు వొందక యుండంగఁ గొడుకు నోపి**
**నంత గావుము; గావంగనైన చావు । నపుడు నన్నుఁ దలంపు;మే నది మరల్తు.** **260**

**ప్రతిపదార్థం:** శంకింపన్= అనుమానించ; వలదు= వద్దు; ఇంద్రునివలనన్= ఇంద్రుడి నుండి; పుట్టు= కలుగబోయే; ఎడరు= ఆపద; పొందక+ఉండంగన్= కలుగకుండా ఉండేటట్లు; కొడుకున్= కుమారుడిని; ఓపిన+అంత= చేతనైనంత; కావుము= కాపాడుము; కావంగన్= కాపాడుతున్నా; ఐన= కలిగిన; చావునపుడు= మరణ సమయంలో; నన్నున్= నన్ను (నారదుడిని); తలంపుము= తలచుకొమ్ము; ఏన్= నేను; అది= ఆ మరణాన్ని; మరల్తున్= తిప్పికొడతాను.

**తాత్పర్యం:** రాజా! నీవు అనుమానించవద్దు. ఇంద్రుడివలన కలిగే ఆపద నీ కుమారుడిని సమీపించకుండా నీకు చేతనైనంత కాపాడు. ఎంత రక్షించినా, మరణం సంభవిస్తే ఆ సమయంలో నన్ను తలచుకొమ్ము. నే నా చావును వెనక్కి తిప్పుతాను.

**వ.** **అక్కుమారుండు నిజనిష్ఠీవ నాదులు సువర్ణమయంబు లగుటంజేసి సువర్ణష్ఠీవి యనం బరఁగుఁ;బ్రమోదంబునం బొందుము.'** **261**

**ప్రతిపదార్థం:** నిజ= తన; నిష్ఠీవన+ఆదులు= ఉమ్మి మొదలైనవి; సువర్ణమయంబులు= బంగారపువి; అగుటన్+చేసి కావటంవలన; ఆ+కుమారుండు= ఆ బాలుడు; సువర్ణష్ఠీవి; అనన్+పరఁగున్= అని ప్రసిద్ధుడవుతాడు; ప్రమోదంబునన్ పొందుము= సంతోషము కలిగి ఉండుము.

**తాత్పర్యం:** నీకు పుట్టబోయే కుమారుడి ఉమ్మి మొదలైనవి బంగారంతో నిండినవి కావటంవలన సువర్ణష్ఠీవి అనే పేరుతో ప్రసిద్ధుడౌతాడు. నీవు సంతోషంగా ఉండుము.

**క.** **అని యూఱడిల్లఁ బలికిన । విని యాతఁడు సంతసంబు వెల్లిం దేలెం**
**జని యే మీప్సితవర్తన । మున నుండితి; మవ్విభుండు పుత్రునిఁ గాంచెన్.** **262**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; ఊఱడిల్లన్= ఓదార్పు పొందేటట్లుగా; పలికినన్= పలుకగా; విని= ఆకర్ణించి; ఆతఁడు= ఆ సృంజయుడు; సంతసంబు= ఆనందపు; వెల్లిన్= ప్రవాహంలో; తేలెన్= తేలియాడాడు; ఏము= మేము; చని= వెడలి; ఈప్సిత+వర్తనమునన్= యథేచ్ఛగా; ఉండితిమి= ఉన్నాం; ఆ+విభుండు= ఆ రాజు; పుత్రునిన్= కుమారుడిని; కాంచెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఓదార్పుమాటలు పలుకగా, ఆ సృంజయుడు ఆనంద ప్రవాహంలో తేలియాడాడు. మేము యథేచ్ఛగా సంచరిస్తూ ఉన్నాం. ఆ రాజు కుమారుడిని పొందాడు.

**వ. వాఁడును మలమూత్ర లాలాశ్రు స్వేదంబులు గనక మయంబులయి తొరుఁగం బెరుఁగుచుండె; నా సమయంబున నెడరువేచి వెంగలు లగు మ్రుచ్చు లబ్బాలుం బట్టి నోరం జీర దుఱిమి, యడవికిం గొనిపోయి యొడలు జల్లించి పసిండి గానక పీనుంగు వైచి పోయిరి. సృంజయుండును దనకొడుకు నింద్రుం డపహరించె నను తలంపున శోకార్తినొంది పలవించుచు నన్నుం దలంచినం బోయి నీకుం బుండరీకాక్షుం డిప్పుడు సెప్పిన యాది రాజ విషయంబు లగు శోకోపశమన వచనంబులు సెప్పి, యంకిలి దేర్చి యవిచారపరులగు తస్కరు లా శిశువుం జంపుట యెఱింగించి. 263**

**ప్రతిపదార్థం:** వాఁడును= ఆ బాలుడు కూడా; మల; మూత్ర; లాలా= ఉమ్మి; అశ్రు= కన్నీరు; స్వేదంబులు= చెమట; కనకమయంబులు+అయి= బంగారువి అయి; తొరుఁగన్= స్రవించుచుండగా; పెరుఁగుచున్+ఉండెన్= పెద్దవాడవుతూ ఉన్నాడు; ఆ సమయంబునన్= ఆ సమయంలో; ఎడరు= అవకాశంకొరకు; వేచి= ఎదురుచూచి; వెంగలులు= అవివేకులు; అగు= అయిన; మ్రుచ్చులు= దొంగలు; ఆ+బాలున్= ఆ పసివాడిని; పట్టి= పట్టుకొని; నోరన్= నోటియందు; చీర= వస్త్రం; తుఱిమి= కూరి, చొనిపి; అడవికిన్= అరణ్యానికి; కొనిపోయి= తీసికొనివెళ్ళి; ఒడలు= శరీరం; జల్లించి= శోధించి; పసిండిన్= బంగారాన్ని; కానక= చూడక; పీనుంగు= శవాన్ని; వైచి= పారవైచి; పోయిరి= వెళ్ళిపోయారు; సృంజయుండును= సృంజయుడు కూడా; తనకొడుకున్= తన కుమారుడిని; ఇంద్రుండు; అపహరించెను= దొంగిలించాడు; అను= అనే; తలంపునన్= ఆలోచనతో; శోక+ఆర్తిన్= దుఃఖం వలన బాధను; ఒంది= పొంది; పలవించుచున్= దుఃఖిస్తూ; నన్నున్= నన్ను; తలంచినన్= తలచుకొనగానే; పోయి= వెళ్ళి; నీకున్= నీకు (ధర్మరాజుకు); పుండరీక+అక్షుండు= తెల్లతామరలవంటి కన్నులు కల శ్రీకృష్ణుడు; ఇప్పుడు= ఈ సమయంలో; చెప్పిన= చెప్పినటువంటి; ఆది= పూర్వపు; రాజవిషయంబులు+అగు= రాజులకు చెందినవి అయిన; శోక= దుఃఖాన్ని; ఉపశమన= తగ్గించే; వచనంబులు= మాటలు; చెప్పి= పలికి; అంకిలి= కలత; తేర్చి= తీర్చి; అవిచారపరులు+అగు= అవివేకులు అయిన; తస్కరులు= దొంగలు; ఆ శిశువున్= ఆ పసివాడిని; చంపుట= చంపటం; ఎఱింగించి= తెలియపరచి.

**తాత్పర్యం:** ఆ సృంజయుడి కుమారుడైన సువర్ణష్ఠీవి తన మలమూత్రాలు, ఉమ్మి, చెమట, కన్నీరు మొదలైనవి బంగారు మయములుగా స్రవిస్తూ ఉండగా, పెరిగి పెద్దవాడవుతూ ఉన్నాడు. ఆ సమయంలో అవకాశంకొరకు ఎదురుచూచి అవివేకులైన దొంగలు ఆ బాలుడిని పట్టుకొని నోట్లో గుడ్డలు కుక్కి, అడవిలోకి తీసికొనిపోయి, ఒడలంతా వెదకి బంగారం కనబడకపోవటంతో ఆ శవాన్ని పారేసి వెళ్ళిపోయారు. సృంజయుడు తన కొడుకును ఇంద్రుడే దొంగిలించాడనే ఆలోచనతో బాధపడి విచారిస్తూ నన్ను తలచుకొన్నాడు. నేను వెళ్ళి, నీ కిప్పుడు శ్రీకృష్ణుడు చెప్పినటువంటి పూర్వ రాజచరిత్రలు - శోకాన్ని తగ్గించేవి, చెప్పి అతడి బాధను తగ్గించి, ఆ బాలుడిని అవివేకులైన దొంగలు సంహరించిన విషయం తెలియ చెప్పాను.

**క. మ్రుచ్చుల మూఢత్వమునం । జచ్చి నరకవాసమునకుఁ జనిన తనయు నేఁ**
**దెచ్చి మగుడంగ వే నీ । కిచ్చెద; వగ పుడుగు మింకనేనియు నధిపా!' 264**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; మ్రుచ్చుల= దొంగల; మూఢత్వమునన్= అజ్ఞానంవలన; చచ్చి= మరణించి; నరకవాసమునకున్= నరకలోకానికి; చనిన= వెళ్ళిన; తనయున్= కుమారుడిని; ఏన్= నేను; తెచ్చి= తీసికొనివచ్చి; మగుడంగన్= తిరిగి; వే= వేగంగా; నీకున్+ఇచ్చెదన్= నీకు ఇస్తాను; ఇంకన్+ఏనియున్= ఇకనైనా; వగపున్= దుఃఖాన్ని; ఉడుగుము= వదలుము.

**తాత్పర్యం:** రాజా! సృంజయా! దొంగల మూర్ఖత్వంవలన చనిపోయిన యమలోకంలో ఉన్న నీ కుమారుడిని నేను వేగంగా తెచ్చి నీకు తిరిగి ఇస్తాను. ఇకనైనా నీ శోకాన్ని వదలిపెట్టుము'.

**వ. అని చెప్పి యేనును. 265**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; చెప్పి= పలికి; ఏనును= నేను కూడా.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పి నేను కూడా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. భావమున నమ్మెయికిఁ దగు । దీవన యిచ్చుటయు, నరుగుదెంచె సువర్ణ**
**ష్ఠీవి గడు నద్భుతమ్ముగ; । నా విభుఁడుఁ బ్రమోద సంభృతాత్ముం డయ్యెన్. 266**

**ప్రతిపదార్థం:** భావమునన్= మనసులో; ఆ+మెయికిన్= దానికి; తగు= తగినటువంటి; దీవన= ఆశీస్సు; ఇచ్చుటయున్= ఇవ్వగానే; సువర్ణష్ఠీవి; కడున్= మిక్కిలి; అద్భుతమ్ముగన్= ఆశ్చర్యం కలిగించేటట్లు; అరుగుదెంచెన్= వచ్చాడు; ఆ విభుఁడున్= ఆ సృంజయుడు కూడా; ప్రమోద సంభృత+ఆత్ముండు= సంతోషంతో నిండిన మనస్సు కలవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** మనస్సులో దానికి (సువర్ణష్ఠీవి తిరిగి రావటానికి) తగినటువంటి ఆశీస్సు ఇవ్వగానే, ఎంతో ఆశ్చర్యం కలిగేటట్లు సువర్ణష్ఠీవి తిరిగి వచ్చాడు. సృంజయుడి మనస్సు సంతోషంతో నిండిపోయింది.

**తే. అతని వీడ్కొని సంప్రీతి నరుగుచుండి । 'యింద్రుచేఁత గా దిది విను! మిక్కుమారుఁ**
**జంప నింద్రుఁడు వేచు రక్షణము మఱవ । వలదు నీ'వని చెప్పితి వసుమతీశ! 267**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూమిపతీ!, ధర్మరాజా!; అతని= ఆ సృంజయుడిని; వీడ్కొని= సెలవుదీసికొని; సంప్రీతిన్= ఇష్టంతో; అరుగుచున్+ఉండి= వెళ్ళబోతూ; విను= వినుము; ఇది= ఈ పని; ఇంద్రుచేఁత= ఇంద్రుడి పని; కాదు; ఈ+కుమారున్= ఈ బాలుడిని; చంపన్= చంపటానికి; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; వేచున్= ఎదురుచూస్తూ ఉంటాడు; నీవు; రక్షణము= కుమారుడిని కాపాడటం; మఱవ వలదు= మరచిపోవద్దు; అని= అంటూ; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ సృంజయుడివద్ద సెలవు తీసికొని బయలుదేరుతూ ఇట్లా చెప్పాను. 'సృంజయా! వినుము. ఈ పని చేసింది ఇంద్రుడు కాదు. కాని, ఇంద్రుడు ఈ పసివాడిని చంపటానికి అవకాశంకొరకు ఎదురుచూస్తూ ఉంటాడు. కుమారుడి రక్షణ విషయం మరువవద్దు'.

### శార్దూలంబుచేఁ జచ్చిన సువర్ణష్ఠీవి నారదువలనఁ బునర్జీవితుఁ డగుట (సం. 12-31-41)

**వ. ఏను బోయిన కొండొక కాలంబునకు నాఖండలుం డక్కుమారుండు దన్ను మిగులునని శంకించి చంపింపం దలంచి నన్నుం బర్వతునిం దలంచి పుయిలోడి బృహస్పతితో విచారించిన, నతం డతని భయం బుడిపె; నతండును దివ్యంబగుట సబుద్ధికంబైన వజ్రంబు నాలోకించి 'నీవు శార్దూల రూపంబున సృంజయ సుతుండగు సువర్ణష్ఠీవిం జంపు' మనుటయు నప్పని పూని యది సను సమయంబున. 268**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; పోయిన= వెళ్ళిన; కొండొక= కొద్ది; కాలంబునకున్= కాలానికి; ఆఖండలుండు= ఇంద్రుడు; ఆ+కుమారుండు= ఆ బాలుడు; తన్నున్= తనను; మిగులును+అని= మించుతాడు అని; శంకించి= అనుమానించి; చంపింపన్= చంపించాలని; తలంచి= అనుకొని; నన్నున్= నన్ను (నారదుడిని); పర్వతునిన్; తలంచి= గుర్తుచేసికొని; పుయిలోడి= వెనుకాడి;

బృహస్పతితో= దేవగురువుతో; విచారించినన్= ఆలోచన చేయగా; అతండు= ఆ బృహస్పతి; అతని= ఇంద్రుడి; భయంబు= భయాన్ని; ఉడిపెన్= పోగొట్టాడు; అతండును= ఆ ఇంద్రుడు కూడా; దివ్యంబు+అగుటన్= దేవలోకానికి చెందినవి కావటంవలన; సబుద్ధికంబు+ఐన= విచక్షణాజ్ఞానం కలిగిన; వజ్రంబున్= వజ్రాయుధాన్ని; ఆలోకించి= చూచి; నీవు; శార్దూలరూపంబునన్= పెద్దపులి ఆకారంలో; సృంజయ సుతుండు+అగు= సృంజయుడి కుమారుడైన; సువర్ణష్ఠీవిన్= సువర్ణష్ఠీవిని; చంపుము= సంహరించుము; అనుటయున్= అనగా; ఆ+పని= ఆ కార్యాన్ని; పూని= వహించి; అది= ఆ వజ్రాయుధం; చను= వెళ్ళే; సమయంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** ఆవిధంగా చెప్పి నేను వెళ్ళిన కొద్దికాలానికి ఇంద్రుడు ఆ సువర్ణష్ఠీవి తనను మించిపోతాడని అనుమానించి చంపించా లనుకొని, నారదుడినీ, పర్వతుడినీ తలచుకొని వెనుకాడి బృహస్పతితో ఆలోచించాడు. దేవగురువు ఇంద్రుడి భయాన్ని పోగొట్టాడు. అపు డా ఇంద్రుడు దివ్యమైనది కావటంవలన విచక్షణాజ్ఞానం కలిగిన వజ్రాయుధాన్ని చూచి, 'నీవు పెద్దపులి రూపంలో సృంజయుడి పుత్రుడైన సువర్ణష్ఠీవిని చంపుము' అన్నాడు. ఆ కార్యభారం వహించి వజ్రాయుధం వెళ్ళుతున్న సమయంలో.

**సీ. సృంజయుం డుజ్జ్వల శ్రీసముల్లాస ప్ర। హర్ష మొప్పంగఁ బ్రియాంగనలును**
**దానుఁ గుమార యుక్తముగ భాగీరథీ। తీరకాంతార ప్రదేశనిత్య**
**వసనేచ్ఛమెయి నుండి కుసుమాపచయముఖ। బహువిధ కేళితత్పరత నొంది**
**యొండుదలంపు లేకుండ నద్దంభోళి। వంచన నయ్యెడఁ బొంచి నిలిచి**

**తే. తెఱపి గాంచి శార్దూలమై యుఱికి వార। ణేంద్రసమయాను నమ్మానవేంద్ర తనయు**
**వ్రచ్చి యంతర్హితం బయ్యెఁ; జచ్చె వాఁడు;। దాది యాక్రోశమున నార్తనాద మెసఁగ. 269**

**ప్రతిపదార్థం:** సృంజయుండు; ఉజ్జ్వల= ప్రకాశమానమైన; శ్రీ= సంపదల; సమ్+ఉల్లాస= చక్కని సంతోషంతో; ప్రహర్షము= చిక్కని ఆనందం; ఒప్పఁగన్= విలసిల్లగా; ప్రియ+అంగనలును= ప్రేమా స్పదలైన భార్యలు; తానున్= తాను; కుమార యుక్తముగన్= కొడుకుతో కలిసి; భాగీరథీ= గంగానది; తీర= ఒడ్డున ఉన్న; కాంతార ప్రదేశ= అరణ్యా సీమలలో; నిత్యవసన+ఇచ్ఛ మెయిన్= సతతమూ ఉండాలనే కోరికతో; ఉండి= నిలిచి; కుసుమ= పూలు; అపచయ= కోయటం; ముఖ= మొదలైన; బహువిధ= అనేక విధాలైన; కేలి+తత్పరతన్= క్రీడలలోమగ్నులై ఉండటాన్ని; ఒంది= పొంది; ఒండు= వేరు; తలంపు= ఆలోచన; లేక+ఉండన్= లేకుండా ఉండగా; ఆ+దంభోళి= ఆ వజ్రాయుధం; వంచనన్= మోసంతో; ఆ+ఎడన్= ఆ సమీపంలో; పొంచి= దాగికొని; నిలిచి= నిలబడి; తెఱపి= వీలు; కాంచి= చూచి; శార్దూలము+ఐ= బెబ్బులిగా మారి; ఉఱికి= దుమికి; వారణ+ఇంద్ర సమానయానున్= గజేంద్రుడి నడకతో సమమైన నడకగలవాడైన; ఆ+మానవ+ఇంద్ర+తనయున్= ఆ రాజు పుత్రుడిని; వ్రచ్చి= చీల్చి (సంహరించి); అంతర్హితంబు+అయ్యెన్= మాయమయింది; వాఁడు= ఆ సువర్ణష్ఠీవి; చచ్చెన్= చనిపోయాడు దాది= ధాత్రి; ఆక్రోశమునన్= ఆవేదనతో; ఆర్తనాదము+ఎసఁగన్= భయంతో పెట్టిన కేక వ్యాపించగా.

**తాత్పర్యం:** సృంజయుడు మిక్కిలి ప్రకాశించే సంపదల విలాసంతో ఆనందంగా ప్రియురాండ్రతో కలిసి కుమారుడితోకూడా గంగానదీ తీర అరణ్య ప్రదేశాలలో ఉండాలని వెళ్ళి, పుష్పాపచయం వంటి అనేక క్రీడలలో నిమగ్నమై వేరే ఆలోచనలేకుండా ఉన్నాడు. అపు డా వజ్రాయుధం మోసంతో అక్కడే నక్కి ఉండి వీలుచూచుకొని బెబ్బులిగా మారి గజేంద్రగమనుడైన సువర్ణష్ఠీవిపై దుమికి, చీల్చి మాయమయింది. ఆ బాలుడు మరణించాడు. భయంతో దాది పెట్టిన కేక అందరికీ వినిపిస్తుండగా.

**క. విని సృంజయుండును బ్రియా। జనములు వే పాఱుదెంచి చచ్చిన బాలుం**
**గని బహులశోకపూరం। బున మునిఁగిరి విప్రలాపములు పెల్లెసఁగన్. 270**

**ప్రతిపదార్థం:** విని= ఆ దాదిపెట్టిన కేక విని; సృంజయుండును; ప్రియాజనములు= అతడి భార్యలును; వే= వేగంగా; పాఱుదెంచి= పరుగునవచ్చి; చచ్చిన= మరణించిన; బాలున్= పసివాడిని; కని= చూచి; విప్రలాపములు= ఏడుపులు; పెల్లు+ఎసఁగన్= ఎక్కువ కాగా; బహుల= ఎక్కువైన; శోకపూరంబునన్= నిండుశోకంలో; మునిఁగిరి= మునిగిపోయారు.

**తాత్పర్యం:** (దాది పెట్టిన కేక) విని సృంజయుడు, అతడి భార్యలు వేగంగా పరుగున వచ్చి చనిపోయిన శిశువును చూచి ఏడుపులు ఎక్కువ కాగా, అధికమైన శోకసముద్రంలో మునిగిపోయారు.

**ఆ. అట్టి యవసరమున నమ్మహీపతి నన్నుఁ। దలఁచె; నప్పు డేను బలవిరోధి**
**మది విరోధ ముడిపి మసలక వచ్చి య। బ్బాలు ప్రాణ మెత్తి ప్రమద మెసఁగ. 271**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; అవసరమునన్= సందర్భంలో; ఆ+మహీపతి= ఆ రాజు-; సృంజయుడు; నన్నున్= నన్ను (నారదుడిని); తలఁచెన్= భావన చేశాడు; అప్పుడు= ఆ సమయంలో; ఏను= నేను; బలవిరోధి= ఇంద్రుడి; మది= మనసులో; విరోధము= శత్రుభావాన్ని, వైరాన్ని; ఉడిపి= పోగొట్టి; మసలక= ఆలసించక; వచ్చి; ఆ+బాలు= ఆ సువర్ణష్ఠీవి; ప్రాణము= జీవం; ఎత్తి= తీసి (కలిగించి); ప్రమదము= సంతోషం; ఎసఁగన్= ఎక్కువ కాగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో సృంజయచక్రవర్తి నన్ను తలచుకొన్నాడు. నేను ఇంద్రుడి మనస్సులోని వైరాన్ని పోగొట్టి, ఆలస్యం చేయకుండా వచ్చి, ఆ రాజు సంతోషం ఎక్కువ అయ్యే విధంగా ఆ బాలుడికి ప్రాణం పోసి. (తరువాతి పద్యంతో అన్వయం)

**వ. ఉచిత సల్లాపంబుల నించుకసేపు నిలిచి, యన్నరపతి యనుమతి సేయ నరిగితి; సువర్ణష్ఠీవియుం దండ్రికి సంతసం బెసంగు తెఱంగునం బ్రవర్తిల్లి యతని పిమ్మటం బృథ్వీభారంబు పూని శిష్టానుగ్రహ దుష్ట నిగ్రహంబులు నడపుచు, జన్నంబులు సేయుచు, శతాధిక సహస్రవర్షంబులు రాజ్యంబు సేసె'నని చెప్పి నారదుండు వెండియు. 272**

**ప్రతిపదార్థం:** ఉచిత= తగిన; సల్లాపంబులన్= మంచిమాటలతో; ఇంచుకసేపు= కొద్ది సమయం; నిలిచి= ఉండి; ఆ+నరపతి= ఆ రాజు; అనుజ్ఞ+చేయన్= అనుమతీయగా; అరిగితిన్= వెళ్ళాను; సువర్ణష్ఠీవియున్= సువర్ణష్ఠీవి కూడా; తండ్రికిన్= జనకుడికి; సంతసంబు= సంతోషం; ఎసంగు= ఎక్కువ అయ్యే; తెఱంగునన్= పద్ధతిలో; ప్రవర్తిల్లి= నడచుకొని; అతని పిమ్మటన్= తండ్రి తరువాత; పృథ్వీభారంబు= భూభారాన్ని; పూని= వహించి; శిష్ట= సజ్జనులను; అనుగ్రహ= దయచూడటం; దుష్ట= దుర్జనులను; నిగ్రహంబులు= దండించటం; నడపుచున్= నిర్వర్తిస్తూ; జన్నంబులు= యజ్ఞాలు; చేయుచున్= చేస్తూ; శతాధిక సహస్ర వర్షంబులు = పదకొండువేల సంవత్సరాలు; రాజ్యంబు+చేసెన్= రాజ్యపరిపాలన చేశాడు; అని= అంటూ; చెప్పి= పలికి; నారదుండు; వెండియున్ = తిరిగి.

**తాత్పర్యం:** సమయానుగుణంగా మాట్లాడుతూ కొద్దిసేపు ఉండి, సృంజయుడు అనుమతించగా నేను వెళ్ళిపోయాను, సువర్ణష్ఠీవి తండ్రికి సంతోషం కలిగేటట్లు నడుచుకొంటూ అతడి తరువాత రాజ్యభారాన్ని వహించి శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేస్తూ యజ్ఞాలు చేస్తూ, లక్ష సంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు' అని నారదుడు చెప్పి ఇంకా - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **' హరియుఁ బరాశరాత్మజుఁడు నాదరణాతిశయంబునన్ సవి**
**స్తరత నుపన్యసించిన వచః ప్రకరంబు మహార్థ గాఢమి**
**ప్పరమహితోపదేశములు పాటిగఁ బట్టి వసుంధరాధురా**
**ధరణ మొనర్పు మయ్యెడు నుదాత్తయశంబును ధర్మవృద్ధియున్.'** **273**

**ప్రతిపదార్థం:** హరియున్= శ్రీకృష్ణుడును; పరాశర+ఆత్మజుఁడున్= పరాశరుడి కుమారుడైన వ్యాసుడును; ఆదరణ+అతిశయంబునన్= ప్రేమాధిక్యంతో; సవిస్తరతన్= విపులంగా; ఉపన్యసించిన= పలికిన; వచఃప్రకరంబు= మాటల సముదాయం; మహా= గొప్ప; అర్థ= భావంతో; గాఢము= నిండినది, లోతైనది; ఆ పరమ= ఆ ఉత్తమమైన; హిత= మేలుకలిగించే; ఉపదేశములు= బోధలు; పాటిగన్+పట్టి= ప్రమాణంగా గ్రహించి; వసుంధరా ధురా= భూభారాన్ని; ధరణము= వహించటం; ఒనర్పుము= కావించుము; ఉదాత్త= అధికమైన; యశంబును= కీర్తియు; ధర్మవృద్ధియున్= ధర్మం పెంపొందటమునూ; అయ్యెడున్= జరుగుతాయి.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! శ్రీకృష్ణుడు, వ్యాసుడు నీ మీద ప్రేమాతిశయంతో చెప్పిన మాటలన్నీ గొప్పలోతైన భావాలతో నిండి ఉన్నాయి. ఆ ఉత్తమమైన మేలు కలిగించే బోధనలను మనసున పెట్టుకొని, భూభారాన్ని వహించవలసినది. దానివలన గొప్ప కీర్తి, ధర్మవృద్ధి సిద్ధిస్తాయి'.

**వ.** **అనిన నజాతశత్రుం డూరకున్నఁ బరాశరపుత్రుండు పరమకరుణావిధేయచిత్తుండై యతని నుద్దేశించి యిట్లనియె.** **274**

**ప్రతిపదార్థం:** అనినన్= నారదు డీ విధంగా పలుకగా; అజాతశత్రుండు= ధర్మరాజు; ఊరక+ఉన్నన్= మాటాడక మిన్నకుండగా; పరాశర పుత్రుండు= పరాశరుడి కుమారుడైన వ్యాసుడు; పరమ= మిక్కిలి; కరుణా విధేయ చిత్తుండు+ఐ= కరుణకు లోనైన మనస్సు కలవాడై; అతనిన్= ఆ ధర్మరాజును; ఉద్దేశించి= ఉపలక్షించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా నారదుడు చెప్పిన మాటలు విని మిన్నకున్న ధర్మజుడిని ఉద్దేశించి, అధికమైన కరుణ నిండిన మనస్సు కలవాడై వ్యాసుడు ఈ విధంగా అన్నాడు.

**సీ.** **' క్షత్రియులకుఁ బ్రజాసంరక్షఁ గడచిన । ధర్మంబు గలుగునే? దాని వలన**
**వేద సంచోదిత విప్రకర్మంబులు । లెస్సలయ్యెడు; నదిలేక యున్నఁ**
**జెడియెడు; లెస్సైనఁ జెడినను రాజున । కగుఁ బుణ్యపాపంబు లగ్గలములు;**
**గాన జనాభిరక్షణ మొనరింపుము' । నావుడు నన్నరనాథుఁ 'డిట్లు**

**తే.** **మీరు సెప్పంగ నురియాట మేలె రాజ్య । కాంక్ష మిగిలి, యేఁ జంపంగఁ గాని యట్టి**
**వారిఁ బలువురఁ జంపిన క్రూరతా వి । శేష మాత్మదహించుటఁ జేసి గాక!'** **275**

**ప్రతిపదార్థం:** క్షత్రియులకున్= రాజవంశీయులకు; ప్రజాసంరక్షన్= ప్రజలను చక్కగా కాపాడటాన్ని; కడచిన= మించిన; ధర్మము= చేయవలసిన కర్తవ్యం; కలుగును+ఏ?= ఉన్నదా?; దానివలనన్= ఆ ప్రజా సంరక్షణ వలన; వేద= వేదాలచేత; సంచోదిత= చక్కగా నడపబడే; విప్రకర్మంబులు= బ్రాహ్మణులు ఆచరించే కర్మలు అనగా అధ్యయన, అధ్యాపన, యజన యాజనాదులు; లెస్సలు= మంచివి, శ్రేష్ఠమైనవి; అయ్యెడున్= అవుతాయి; అది= ఆ ప్రజాపరిరక్షణ; లేక+ఉన్నన్= లేకపోతే; చెడియెడున్= బ్రాహ్మణ ధర్మాలు పాడవుతాయి; లెస్స+ఐనన్= బాగా ఉన్నా; చెడినను= పాడయినా; రాజునకున్= రాజునకు; అగు= అయ్యే, కలిగే; పుణ్యపాపంబులు=

పుణ్యం, పాపం; అగ్గలములు= అధికం; కాన= అందువలన; జన+అభి రక్షణము= ప్రజలను చక్కగా కాపాడటం; ఒనరింపుము= చేయుము; నావుడున్= అనగా; ఆ+నరనాథుఁడు= ఆ రాజు (ధర్మరాజు); ఇట్లు+ ఈ విధంగా; మీరు= మీరందరూ; చెప్పంగన్= చెప్పగా; రాజ్యకాంక్ష= రాజ్యం సంపాదించాలనే కోరిక; మిగిలి= ఎక్కువై; ఏన్= నేను; చంపఁగన్+కాని= చంపకూడని; అట్టివారిన్= అటువంటి వారిని; పలువురన్= అనేకులను; చంపిన= సంహరించినటువంటి; క్రూరతా= క్రూరత్వపు; విశేషము= ప్రత్యేకత, ఆధిక్యం; ఆత్మ= ఆ మనసును (అంతరాత్మను); దహించుటన్= తపింపచేయటంచేత; కాక= కాకపోతే; ఉరియాట= ఉట్టివలె ఊగిసలాడటం, సందేహించటం; మేలు+ఎ?= మంచిదా?

**తాత్పర్యం:** 'రాజులకు ప్రజలను రక్షించటాన్ని మించిన ధర్మం మరొక్కటి ఉన్నదా? ఆ ప్రజాసంరక్షణంవలన బ్రాహ్మణులు వేద విహిత కర్మలు మెరుగుగా ఉంటాయి. లేకపోతే పాడవుతాయి. వేదవిహిత కర్మలు బాగుంటే పుణ్యమూ, చెడిపోతే పాపమూ రాజునకు అధికంగా కలుగుతాయి. కనుక ప్రజారక్షణం చేయవలసినది' అని వ్యాసు డీమాటలనగా, ధర్మరాజు ఇట్లా బదులు చెప్పాడు. 'రాజ్యసంపాదన చేయాలనే కోరిక ఎక్కువై చంపకూడని వారిని ఎంతోమందిని చంపాను. అంతులేని ఆ క్రూరత్వం నా అంతరాత్మను తపింపచేస్తున్నది. అంతేకాని మీరంతా ఇంతగా చెప్పాక సందేహించటం మంచిదా?' (కాదని భావం).

**విశేషం:** తమిళంలో ఉట్టిని 'ఉరి' అంటారు.

**వ. అనిన విని యమ్మునిపతి యమ్మహీపతి కిట్లనియె. 276**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+మునిపతి= ఆ మునివర్యుడైన వ్యాసుడు; ఆ+మహీపతికిన్= ఆ రాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అన్నమాటలు విన్న వ్యాసుడు అతడితో ఈ విధంగా అన్నాడు.

**చ. ' మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు**
**న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మొం**
**దునొకొ! కుఠారమున్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం**
**డనియెడి నిశ్చయంబు దృఢమై మది నిల్చినఁ జాలు భూవరా! 277**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; చేయను= కర్మలు ఆచరించటానికి; మనుజులు= మానవులు; ఎవ్వరు?= ఎవరు?; సమస్తమున్= సకలం; ఈశ్వరు+ఆజ్ఞన్= పరమాత్ముడి ఆనతితో; చెల్లెడున్= నడుస్తుంది; వినుము= ఆలకించుము; కుఠారపాణి= గొడ్డలి ధరించినవాడు; ధరణీరుహముల్= చెట్లను; నఱకంగన్= ఛేదించగా; కుఠారమున్= గొడ్డలికి; పాపము+ఒందున్+ఒకొ!= పాపం వస్తుందా!; కర్త= అన్నింటినీ చేసేవాడు; ఈశ్వరుండు+అనియెడు= పరమాత్మయే అనేటటువంటి; నిశ్చయము= దృఢమైన భావం; మదిన్= మనస్సునందు; నిల్చినన్= ఉన్నట్లయితే; చాలున్= సరిపోతుంది; జనులు= మానవులు; దోసమున్= పాపాన్ని; పొందరు= కలిగి ఉండరు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! పనులు చెయ్యటానికి మనుష్యు లెవ్వరు? (మానవులు తమంత తాము కర్మలు ఆచరిస్తున్నా మనుకొనటం అజ్ఞానం) అంతా భగవంతుడి ఆజ్ఞమేరకు వర్తిస్తూ ఉంటుంది. గొడ్డలిని చేతపట్టినవాడు చెట్టును నరికితే ఆ పాపం గొడ్డలికి వస్తుందా చెప్పుము; అన్నింటినీ చేయించేవాడు పరమాత్ముడే అనే భావం మనసులో గట్టిగా ఉంటే చాలు, మానవులకు ఎటువంటి పాపమూ అంటదు.

**విశేషం:** బంధుమరణానికి తానే కారకుడని అనుకొంటున్నాడు ధర్మరాజు. అందువలన అతడికి బాధ కలుగుతున్నది. ఆ పనికి తాను సాధనం మాత్రమే అని గుర్తిస్తే ఆ బాధ ఉండదు. ఈ బోధను అర్జునుడికి సంగ్రామ క్షేత్రంలోనే అందించాడు శ్రీకృష్ణుడు.

**వ. కర్మఫలం బీశ్వరుని యదియ; తదర్పణ బుద్ధి సహితంబుగాఁ బ్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు. 278**

**ప్రతిపదార్థం:** కర్మఫలంబు= చేసిన పనుల ఫలితం; ఈశ్వరుని+అది+అ= భగవంతుడిదే; తద్= అతడికి; అర్పణ= సమర్పిస్తున్నామనే; బుద్ధి సహితంబుగాన్= వివేకంతో కూడుకొని; ప్రబుద్ధులు= జ్ఞానులైనవారు; వేద చోదిత= వేదం నిర్దేశించిన (వేద విహిత); కర్మంబులు= కార్యాలు; అనుష్ఠింతురు= ఆచరిస్తారు.

**తాత్పర్యం:** కర్తృత్వంతోపాటు కర్మఫలం కూడా పరమాత్మకే చెందుతుంది. విశేషమైన ఆత్మజ్ఞానం కలిగినవారు వేదవిహిత కర్మలనన్నింటిని భగవదర్పితంగానే చేస్తారు.

**తే. ఒప్పకున్నను నాత్మకులోక్తకర్మ । మూర్ధ్వగతిఁ జేర్చుఁ; బరకర్మ మొప్పెనేని**
**నార్యజనములు గిల్బిషమండ్రు దానిఁ; । గాన నడపుము నిజవంశకర్మ మధిప! 279**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; ఆర్యజనులు= పెద్దలు; ఒప్పక+ఉన్ననున్= అంగీకారం కాకపోయినా, ఇష్టం లేకపోయినా; ఆత్మ= తన; కుల= వంశానికి; ఉక్త= చెప్పబడిన, నిర్దేశించబడిన; కర్మము= పని; ఊర్ధ్వగతిన్= పైలోకాలకు; చేర్చున్= చేర్చుతుంది; పరకర్మము= తనదికాని పని; ఒప్పెన్+ఏనిన్= మంచిదైనా; దానిన్= ఆ పనిని; కిల్బిషము= పాపం; అండ్రు= అంటారు; కాన= కనుక; నిజవంశ కర్మము= నీ కుల ధర్మాన్ని; నడపుము= నిర్వర్తించుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఇష్టంలేకపోయినా తన కులానికి చెప్పబడిన కర్మ చేయటం ఉత్తమగతిని (మోక్షాన్ని) కలిగిస్తుందనీ, తనది కాని పని అంగీకరిస్తే పాపకారకమని అంటారు పెద్దలు. అందువలన నీ కులధర్మాన్ని నిర్వర్తించుము.

**క. అరివధము పాప మని మది । మెరమెర గలిగినను, దగిన మెయిఁ జేయుము భూ**
**వర! ప్రాయశ్చిత్తము గృహ । ధుర యుడుగుట మేలె కీడుతోఁ జన నగునే!' 280**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; అరి= శత్రువులను; వధము= చంపటం; పాపము+అని= కిల్బిషమని; మదిన్= మనసులో; మెరమెర= మనోవ్యథ; కలిగినను= కలిగినప్పటికీ; తగినమెయిన్= దానికి తగిన విధంగా; ప్రాయశ్చిత్తము= పరిహారం; చేయుము; గృహధుర= సంసారభారం; ఉడుగుట= వదలటం; మేలు+ఎ?= మంచిదా? (కాదని భావం); కీడుతోన్+అశుభమైన దానితో; చనన్= ప్రవర్తించటం; అగును+ఏ?= తగునా? (తగదని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! శత్రువులను చంపటం పాపం అనే బాధ నీ మనసులో ఉంటే దానికి తగిన పరిహారం చేసికొనుము. అంతేకాని సంసార భారాన్ని వదలటం మంచిదికాదు. అశుభవర్తనం కూడదు'.

**వ. అనుటయుఁ గౌంతేయాగ్రజుండు సాత్యవతేయు నాననం బాలోకించి పుత్త్రులుం బౌత్త్రులు నన్నలుం దమ్ములు జనకులుం దాతలు మామలు గురువులు సంబంధులు సఖులు నల్లురు బావలు మఱందులు మఱియుఁ బవిత్రులగు ధాత్రీపతులు నాచేత మడిసిరి; తదీయ స్త్రీజనంబులు పతిసుత సోదర పితృ మరణశోకసంతాపాతిశయంబునం బలవించి పలవించి ప్రాణంబులు విడుతురు గావున దాని సూక్ష్మంబుగా**

**విచారించిన వనితావధ పాతకంబునుం బాటిల్లె నెయ్యది కడగా నిష్కల్మషుండ నగుదు? నను వెగడున మునింగిన మనంబు మహీభరణంబున కెట్లు సొచ్చు? నుగ్రంబైన తపంబునం దనువు దొఱంగుట దక్క నొండు విధంబు నాకుం జూడ లేకున్న యది' యనిన విని యమ్మునీశ్వరుండు నిజబుద్ధి నిపుణంబుగా నిరూపించి యన్నరపతి కిట్లనియె. 281**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో పెద్దవాడైన ధర్మరాజా!; సాత్యవతేయున్= సత్యవతీ పుత్రుడైన వ్యాసుడి; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి; పుత్రులున్= కుమారులు; పౌత్రులున్= మనుమలు; అన్నలున్+తమ్ములు= సోదరులు; జనకులున్= తండ్రులు; తాతలు= పితామహులు, మాతామహులు; మామలు= మామలు; గురువులు= విద్యాబోధ చేసిన గురువులు; సంబంధులు= చుట్టాలు; సఖులున్= స్నేహితులు; అల్లురు= జామాతలు, మేనల్లురు; బావలు+మఱందులు= బావ మరదులు; మఱియున్= ఇంకా; పవిత్రులు+అగు= నిర్మలులైన; ధాత్రీపతులు= రాజులు; నా చేతన్= నావలన, నా కారణంగా; మడిసిరి= మరణించారు; తదీయ= వారి; స్త్రీజనంబులు= ఆడువారు; పతి= భర్త; సుత= కొడుకు; సోదర= అన్నదమ్ములు; పితృ= తండ్రి; మరణ= చనిపోవటం అనే; శోక= విషాదం వలన కలిగిన; సంతాప= అధికమైన బాధయొక్క; అతిశయంబునన్= ఆధిక్యం వలన; పలవించి పలవించి= ఏడ్చి ఏడ్చి; ప్రాణంబులు విడుతురు= ప్రాణాలు వదలుతారు, మరణిస్తారు; కావున= కనుక; దానిన్= ఈ విషయాన్నంతా; సూక్ష్మంబుగాన్= నిశితంగా; విచారించినన్= ఆలోచిస్తే; వనితావధ= స్త్రీలను చంపటం అనే; పాతకంబును= మహాపాపం కూడా; పాటిల్లెన్= వచ్చింది; ఎయ్యది= ఏది; కడగాన్= దిక్కుకాగా (ఆశ్రమించగా); నిష్కల్మషుండన్= పాపరహితుడిని; అగుదున్= అవుతాను; అను= అనే; వెగడునన్= తల్లడపాటున; మునింగిన= మునిగిపోయిన; మనంబు= మనస్సు; మహీభరణంబునకున్= భూభారాన్ని వహించటానికి; ఎట్లు= ఏ విధంగా; చొచ్చున్?= పూనుకొంటుంది?; ఉగ్రంబు+ఐన= భయంకరమైన; తపంబునన్= తపస్సుతో; తనువున్+తొఱంగుట= శరీరాన్ని వదలటం; తక్క= తప్ప, కాక; ఒండు విధంబు= మరొక పద్ధతి; నాకున్= నాకు; చూడన్= పరికించగా; లేక+ఉన్న+అది= లేదు, కనబడదు; అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+ముని+ఈశ్వరుండు= ఆ మునిశ్రేష్ఠుడైన వ్యాసుడు; నిజ= తన; బుద్ధి= తెలివి; నిపుణంబు+కాన్= నేర్పరితనంతో; నిరూపించి= చూపించి, నిర్ధారించి; ఆ+నరపతికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పలికిన వ్యాసుడి ముఖంలోకి చూస్తూ ధర్మరాజు ఇట్లా అన్నాడు: ' కొడుకులు, మనుమలు, అన్నలు, తమ్ములు, తండ్రులు, తాతలు, మామలు, గురువులు, చుట్టాలు, మిత్రులు, అల్లురు, బావలు, మరదులు, నిర్మలులైన రాజులు నా కారణంగా చనిపోయారు. వారి ఆడవారు, భర్తలు, పిల్లలు, సోదరులు, తండ్రులు మరణించటం అనే విషాదం వలన కలిగిన అధికమైన దుఃఖంతో ఏడిచి, ఏడిచి ప్రాణాలు వదలుతారు. కనుక నిశితంగా పరిశీలిస్తే స్త్రీవధ అనే మహాపాపం కూడా నాకు చెందుతుంది. దేనిని ఆశ్రయిస్తే పాపరహితుడ నవుతాను?- అనే బాధలో మునిగిపోయిన మనసు భూభారాన్ని మోయటానికి ఎట్లా పూనుకొంటుంది? తీవ్రమైన తపస్సు చేసి శరీరం వదలటం తప్ప మరో మార్గం నాకు కనబడటంలేదు'. ఆ మాటలు విని వ్యాసుడు తన బుద్ధికౌశలంతో పరికించి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. ' విడువు ముమ్మలికంబు వినుము నీ చెప్పిన। యందఱు భూముల కాసపడియుఁ**
**బెంపును దేజంబుఁ బేరును గోరియు। నీసున సమరంబు సేసి చచ్చి**
**రాపని కిల్బిషం బగునె నీ కట్లును। గాక వారల నెట్టి కర్మగతులు**
**మృతులఁ గావించెనో మతి నెఱుంగుదె వాని। నెఱుఁగుఁ గాలుఁడు చావనేరి కెద్ది**

**తే. తఱి యతం డప్డు దెగటార్చు దాని నీవు। సేసినాఁడవుగా మదిఁ జింత సొనిపి**
**యుడుకు టొక వెఱ్ఱి దీనిపై నొల్లగృహము। విడుతుఁ గా కనుటిది పెద్ద వెఱ్ఱి యధిప! 282**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఉమ్మలికంబు= బాధపడటం; విడువుము= వదలిపెట్టుము; నీ చెప్పిన= నీవు పేర్కొన్న; అందఱు= అంతమంది; భూములకున్= రాజ్యాలకు; ఆసపడియున్= ఆశించి; పెంపును= వృద్ధిని; తేజంబున్= పరాక్రమాన్ని; పేరును= కీర్తిని; కోరియున్= కోరుకొని; ఈసునన్= అసూయతో; సమరంబు= యుద్ధం; చేసి= ఒనరించి; చచ్చిరి= చనిపోయారు; ఆ పని= ఆ కార్యం (అట్లు వారు చచ్చుట); నీకున్= నీకు (ధర్మరాజుకు); కిల్బిషంబు= పాపం; అగును+ఎ?= అవుతుందా?; అట్లును+కాక= అంతే కాక; వారలన్= ఆ రాజులను; ఎట్టి= ఎటువంటి; కర్మగతులు= పనితీరులు; మృతులన్= చనిపోయిన వారినిగా; కావించెను+ఓ?= చేశామో? మతిన్= బుద్ధిలో; ఎఱుంగుదు(వు)+ఎ?= తెలిసికొన్నావా?; కాలుఁడు= యముడు; వానిన్= ఆ కర్మగతులను; ఎఱుంగున్= తెలియును; చావన్= చావటానికి; ఏరికిన్= ఎవరికి; ఎద్ది= ఏది; తఱి= సమయమో; అతండు= ఆ యముడు; అప్డు= ఆ సమయంలో; తెగటార్చున్= సంహరిస్తాడు; దానిని= ఆచరించటం; నీవు; చేసినవాఁడవు+కాక= చేశావని; మదిన్= మనస్సులో; చింత= బాధ; చొనిపి= ప్రవేశపెట్టి; ఉడుకుట= తపించటం; ఒక వెఱ్ఱి= పిచ్చితనం; దీనిపైన్= ఆ పిచ్చి కారణంగా; గృహము= ఇల్లు; ఒల్లన్= అంగీకరించను; విడుతున్+కాక= వదలుతాను; అనుట= అనటం; ఇది= అనేది; పెద్దవెఱ్ఱి= ఇంకా పెద్ద పిచ్చితనం.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! బాధపడటం వదలిపెట్టుము. నీవు చెప్పిన వారంతా రాజ్యంకొరకు ఆశపడి, గొప్పతనాన్ని, పరాక్రమాన్ని, కీర్తిని కోరుకొని, అసూయతో యుద్ధంచేసి చనిపోయారు. వారు చేసినపనికి పాపం నీ కెట్లా వస్తుంది? అంతే కాదు. వారి కర్మగతులే వారిని చంపాయి. వారి కర్మలు నీకు తెలియవు. యముడికి తెలుసు. యముడు ఎవరికి చనిపోయే సమయం ఎప్పుడో, అప్పుడు వారిని చంపుతాడు. ఆ సంహారం నీవు చేశావని నీ మనసులో బాధపడటం పిచ్చితనం. ఆ కారణంగా ఇల్లు వద్దని వదలిపెడతా ననటం ఇంకా పెద్ద పిచ్చితనం.

**క. నేర్పరి పెక్కువిధంబుల । నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడు చందం**
**బేర్పడఁ గాన్పుము కాల స । మర్పిత కార్యకరు లైన మానవుల దెసన్. 283**

**ప్రతిపదార్థం:** నేర్పరి= నిపుణుడైనవాడు; పెక్కు విధంబులన్= బహుభంగుల; ఆర్పఁగన్= ఆడించగా; బొమ్మలు= ప్రతిమలు; కడంగి= పూని; ఆడెడు= కదిలే; చందంబు= తీరు; ఏర్పడన్= స్పష్టమయ్యే విధంగా; కాలసమర్పిత= కాలంచేత చక్కగా అప్పగించబడిన; కార్యకరులు+ఐన= పనులు నిర్వర్తించే వారైన; మానవుల దెసన్= మానవులవైపు; కాన్పుము= చూడుము.

**తాత్పర్యం:** నిపుణుడైనవాడు అనేక విధాలుగా ఆడిస్తుంటే కదిలే బొమ్మలను చూచినట్లే, కాలం చెప్పిన పని చేసే మనుషులను కూడా చూడుము.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. నీకుం బాపంబునకుం బనిలేదు పనిగా కుండుంగాక! 284**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; పాపంబునకున్= పాపానికి; పనిలేదు= అవసరం లేదు; పని= అవసరం; కాక+ఉండున్+కాక= అవకుండును గాక.

**తాత్పర్యం:** ధర్మరాజా! అందువలన నీకు పాపం లేదు. ఇక రాకుండా ఉండుగాక!

**క. ఇచ్చు కృప కల్మి యెప్పదె? । చచ్చిన నరపతుల యేలు జనపదములు నీ**
**విచ్చెదవు గాక మనమునఁ । బొచ్చెము లేక తగ వారిపుత్త్రుల కధిపా! 285**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; చచ్చిన= మరణించిన; నరపతుల= రాజుల; ఏలు= పాలించే; జనపదములు= గ్రామాలు; మనమునన్= మనస్సులో; పొచ్చెము= కపటం; లేక= ఉండక; తగన్= తగినట్లు; వారి= ఆ రాజుల; పుత్రులకున్= కుమారులకు; నీవు= నీవు; ఇచ్చెదవు+కాక= ప్రసాదించెదవు కాక; ఇచ్చు= ఇచ్చే; కృప= దయ అనే; కల్మి= సంపద; ఒప్పదు+ఎ?= తగిఉంటుంది కదా!

**తాత్పర్యం:** ధర్మరాజా! మరణించిన రాజుల ఏలుబడిలోని గ్రామాలను మనసులో ఎటువంటి కపటం లేనివాడవై వారి కొడుకులకు ఇద్దువు గాని. ఇవ్వటం అనేది దయ అనే సంపదవలన కలుగుతుంది కదా!

**ఆ.** **కొడుకు లేనిచోటఁ గూఁతుఁ బ్రతిష్ఠింపు; । దానఁ జేసి వారి తల్లు లధిక**
**హర్ష మొందుదురు; ప్రియంబును నీ కగుఁ; । బుణ్యమును యశంబుఁ బొందు నిన్ను.** **286**

**ప్రతిపదార్థం:** కొడుకు= కుమారుడు; లేనిచోటన్= ఉండని తావున; కూఁతున్= కుమార్తెను; ప్రతిష్ఠింపుము= నిలుపుము; దానను+చేసి= అది కారణంగా; వారి తల్లులు= ఆ కుమార్తెల తల్లులు; అధిక= ఎక్కువ; హర్షము= సంతోషం; ఒందుదురు= పొందుతారు; నీకున్; ప్రియంబును= సంతోషం; అగున్= కలుగుతుంది; నిన్ను; పుణ్యము= సుకృతం; యశంబున్= కీర్తి; పొందున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! కుమారుడు లేని రాజ్యంలో కుమార్తెను సింహాసనంపై నిలుపుము. దానివలన వారి తల్లులు ఎంతో సంతసిస్తారు. నీకు కూడా సంతోషం, సుకృతం, కీర్తి కలుగుతాయి.

**మ.** **అనుమానింపకు తోడఁబుట్టువులు గారా తున్మితూఁటాడె నెం**
**దును గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్?**
**మును లవ్వీరు భజింపరే? క్రతువు లామోదంబుతో నమ్మహా**
**త్మునిఁ జేయింపరె? యూర్ధ్వలోక మదిగాదో? యేలఁడో నాకమున్?** **287**

**ప్రతిపదార్థం:** అనుమానింపకు= శంకించవలదు; ఇంద్రుండు= దేవేంద్రుడు; ఉగ్రతన్= భీకరంగా; ఎందును= ఎచట చూచినా; క్రొత్త+నెత్తురులు= అపుడే స్రవించిన నెత్తురులు; ఏఱులు+ఐ= ప్రవాహాలుగా; పఱవన్= ప్రవహించగా; దైత్యులన్= రాక్షసులను; తున్మితూఁటాడెన్= ముక్కలు చేసి సంహరించాడు; తోడన్+పుట్టువులు= (వారు) సహజన్ములు; కారా?= కాకపోయారా? (సహజన్మలే కదా అని భావం); మునులు= ఋషులు; ఆ+వీరున్= ఆ పరాక్రమశాలిని; భజింపరు+ఏ?= సేవించటం లేదా?; ఆమోదంబుతోన్= అంగీకారంతో, ఇష్టంతో; ఆ+మహా+ఆత్మునిన్= ఆ మహానుభావుడిని ఉద్దేశించి; క్రతువులు= యజ్ఞాలు; చేయింపరు+ఏ?= జరిపించటం లేదా?; నాకమున్= స్వర్గాన్ని; ఏలఁడు+ఓ?= పాలించటం లేదా?; అది= అతడు పాలించే స్వర్గం; ఊర్ధ్వలోకము= ఉన్నతమైన లోకం; కాదు+ఓ?= కాకపోయిందా?

**తాత్పర్యం:** ధర్మరాజా! నీవు శంకించ పనిలేదు. దేవేంద్రుడు రాక్షసులను నెత్తురుటేరులు ప్రవహించేటట్లుగా భయంకరంగా నరికి సంహరించాడు. ఆ రాక్షసులు ఇంద్రుడికి సోదరులే కదా! మునులు ఆ శూరుడిని పూజిస్తూనే ఉన్నారు కదా! ఆ ఘనుడిని ఉద్దేశించి యాగాలు చేస్తున్నారు కదా! అతడు స్వర్గాన్ని పరిపాలించటం లేదా? ఆ స్వర్గం పై లోకమే కదా!

**విశేషం:** సోదరులను చంపిన ఇంద్రుడు పూజించబడుతూ, అతడికై యజ్ఞాలు చెయ్యబడుతూ, భూలోకాని కన్న ఉన్నతలోకాన్ని పాలిస్తున్నాడు అనే పోలిక బంధువధ పాపం అనే భావం పోగొట్టటానికి చెప్పటం జరిగింది.

**శా. నీవున్ ధర్మవిరోధులైన జనతా నింద్యాత్ములం బుణ్యమా**
**ర్గావష్టంభము దేజరిల్ల నృపవంశాచార మొప్పారఁ దో**
**డై వీరానుజు లుల్లసిల్లఁగ మహోగ్రాజిం దెగం జూచి తా**
**దేవాధీశుఁడ పోలె శిష్టపరిషత్సేవ్యుండ వై తా పనిన్. 288**

**ప్రతిపదార్థం:** నీవున్= నీవు కూడా; ధర్మవిరోధులు+ఐన= ధర్మమార్గానికి వ్యతిరేకులైన; జనతా= ప్రజలచేత; నింద్య+ఆత్ములన్= నిందింపదగిన స్వభావం కలవారిని; పుణ్యమార్గ+అవష్టంభము= ధర్మమార్గం యొక్క ఊత; తేజరిల్లన్= ప్రకాశించగా, ఒప్పగా; నృపవంశ+ఆచారము= రాజవంశమువారికి అలవాటైన ప్రవర్తన; ఒప్పారన్= తగి ఉండగా; తోడు+ఐ= అందగించగా; వీర+అనుజులు= పరాక్రమవంతులైన తమ్ములు; ఉల్లసిల్లఁగన్= సంతోషించగా; మహా+ఉగ్ర+ఆజిన్= గొప్ప, భయంకరమైన రణంలో; తెగన్+చూచితి= చనిపోయేటట్లు చేశావు; ఆ దేవ+అధీశుఁడు+అ= ఆ దేవేంద్రుడి; పోలెన్= వలె; ఆపనిన్= శత్రుసంహార కార్యం వలన; శిష్ట= సజ్జనుల; పరిషత్= సముదాయంచేత; సంసేవ్యుండవు+ఐతి(వి)= బాగా సేవించదగినవాడ వయ్యావు.

**తాత్పర్యం:** ధర్మరాజా! నీవు కూడా అధర్మవర్తనులను, ప్రజలచేత నిందించదగిన గుణం కలవారినీ వీరులైన తమ్ముల సహకారంతో భయంకరమైన యుద్ధంలో ధర్మమార్గాన్ని ఊతగా గ్రహించి రాజధర్మానికి తగినట్లు సంహరించావు. ఈ పనివలననే దేవేంద్రుడివలె నీవు కూడా సజ్జనుల సముదాయంచేత సేవించ తగిన వాడివయ్యావు.

**ఆ. వలయునేని యధిప! వాసవుచాడ్పునఁ । గ్రతుపరుండ వగుము; రాజధర్మ**
**కలితమైన పుడమిఁ గైకొమ్ము; తొలిదొలి । యశ్వమేధయాగ మాచరింపు.' 289**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వలయున్+ఏని= కావాలంటే; వాసవు= ఇంద్రుడి; చాడ్పునన్= వలె; క్రతుపరుండవు= యజ్ఞాలు చేయటంలో నిమగ్నుడవు; అగుము= కమ్ము; రాజధర్మ కలితము+ఐన= రాజధర్మంతో కూడుకొన్న; పుడమిన్= భూమిని; కైకొమ్ము= గ్రహించుము; తొలితొలి= మున్ముందు; అశ్వమేధయాగము; ఆచరింపు(ము)= చేయుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! నీ కిష్టమయితే ఇంద్రుడివలె యజ్ఞాలు చేయటంలో ఆసక్తిని చూపించుము. క్షత్రియోచిత ధర్మంగా రాజ్యాన్ని స్వీకరించుము. ముందుగా అశ్వమేధయాగం చేయుము'.

**వ. అనిన విని యంకిలి దేఱిన డెందంబుతో ధర్మనందనుం డెట్టి కర్మంబులు పాపంబు; లేపాపంబున కెద్ది ప్రాయశ్చిత్తంబు? మునీంద్రా! యెఱింగింపవే యనుటయు, నతనికి నమ్మహాత్ముం డి ట్లనియె. 290**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; అంకిలి= కలత; తేరిన= తీరిన; డెందంబుతోన్= హృదయంతో; ధర్మనందనుండు= ధర్మరాజు; ముని+ఇంద్రా!= మునులలో ఉత్తముడవైన వ్యాసమహర్షీ!; ఎట్టి కర్మంబులు= ఎటువంటి పనులు; పాపంబులు= చెడ్డవి; ఏపాపంబునకున్= ఏ చెడ్డపనికి; ఎద్ది= ఏది; ప్రాయశ్చిత్తంబు= పాపపరిహార ప్రక్రియ; ఎఱింగింపుము+ఏ!= తెలియపరచుమా!; అనుటయున్= అనగా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఆ+మహా+ఆత్ముండు= ఆ మహానుభావుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసుడు చెప్పిన మాటలతో కలత తీరిన హృదయంతో ధర్మరాజు వ్యాసుడి నీ విధంగా అడిగాడు. 'మునీంద్రా! ఏ పనులు పాపం? ఏ పాపానికి పరిహారం ఏమిటి? తెలియపరచవలసింది'? అని. దానికి వ్యాసుడీ విధంగా జవాబు చెప్పాడు.

## కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు ధర్మాధర్మంబు లెఱింగించుట (సం. 12-35-1)

**ఆ. ' ఆగమోక్త కర్మ మాచరింపమియు, ని । షిద్ధమైన దానిఁ జేయుటయును,**
**బ్రాజ్ఞజనులు ధరణిపాలవరేణ్య! చె । ప్పుదురు పాపములుగ బోధ్యతతికి. 291**

**ప్రతిపదార్థం:** ధరణిపాలవరేణ్య!= రాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; ఆగమ= వేదాలు; ఉక్త= చెప్పిన; కర్మము= పని; ఆచరింపమియున్= చేయకపోవటమూ; నిషిద్ధము+ఐన దానిన్= చేయవద్దని చెప్పినదానిని; చేయుటయునున్= చేయటమూ; పాపములుగన్= పాపాలుగా; ప్రాజ్ఞ జనులు= బాగా తెలిసినవారు; బోధ్యతతికిన్= శిష్యగణాలకు; చెప్పుదురు= చెప్తుతారు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వేదవిహితమైన కర్మలు చేయకపోవటం, కూడనివి చేయటం పాపాలు అని తెలిసినవారు శిష్యగణాలకు చెప్తుతారు.

**వ. ఇది కల్మష సామాన్య నిర్దేశంబు; విశేషంబు వినుము. 292**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ మాట; కల్మష= పాపముల గూర్చి; సామాన్య= సాధారణమైన; నిర్దేశము= చెప్పటం (చెప్పినమాట); విశేషంబు= మఱింత (పాపంలోని తేడాలు); వినుము= ఆకర్ణించుము.

**తాత్పర్యం:** ఈ మాట పాపం గురించి మామూలుగా చెప్పేది. అందులోని తేడాలు కూడా వినుము.

**సీ. ఆదిత్యు నుదయాస్తమయ కాలముల నిద్రఁ । బొందుటయును, బాత్రభూతుఁ డింటి**
**కరుగుదెంచినఁ బూజ యాచరింపమియును, । బరదారగమనంబు, గురుల కెదురు**
**సేఁతయు, గ్రామంబు సెఱుచుటయును, వేద । విక్రయంబును, రసవిక్రయంబు,**
**భృత్యుఁ బ్రోవమియు, నసత్యోపచారంబు, । గహనదాహము, నన్యకర్మకృతియుఁ,**
**తే. దనదుకర్మంబు విడుచుటయును, వృథాప । శు ప్రహరణంబు, మేదినీసురుల కలిమిఁ**
**గొనుటయును, శరణార్థిఁ జేకొనమి, విప్ర । వధయుఁ బాపంబు లందురు బుధజనములు. 293**

**ప్రతిపదార్థం:** ఆదిత్యున్= సూర్యుడి; ఉదయ+అస్తమయ కాలములన్= ఉదయించే, అస్తమించే సమయాలలో; నిద్రన్+పొందుటయును= నిద్రించటమూ; పాత్ర భూతుఁడు= యోగ్యుడు; ఇంటికిన్= గృహానికి; అరుగుదెంచినన్= రాగా; పూజ+ఆచరింపమియును= పూజించకపోవటమూ; పరదారగమనంబు= ఇతరుల భార్యల పొందూ; గురులకున్= పెద్దలకు; ఎదురు+చేఁతయున్= వ్యతిరేకంగా ఆచరించటం; గ్రామంబు= జనపదం; చెఱుచుట= పాడుపెట్టటం; వేద విక్రయంబును= వేదమును (చదువును) అమ్ముకొనటం; రసవిక్రయంబున్= ఉప్పు,బెల్లం (మొదలగువాటిని) అమ్మటం; భృత్యున్= సేవకుడిని; ప్రోవమియున్= రక్షించకుండా ఉండటం; అసత్య+ఉపచారంబు= కపటమైన సేవ లేదా అబద్ధమును సేవించటం; గహనదాహమున్= అడవులను తగులబెట్టటం; అన్య కర్మ కృతియున్= ఇతరుల పనిని చేయటం; తనదుకర్మంబు= తనదైనపనిని; విడుచుటయును= వదలిపెట్టటం; వృథా= అనవసరంగా; పశుప్రహరణంబు= జంతువులను కొట్టటం; మేదినీ సురుల= బ్రాహ్మణుల; కలిమిన్= సంపదను; కొనుటయును= తీసికొనటం; శరణ+అర్థిన్= శరణు కోరినవాడిని; చేకొనమి= రక్షించకపోవటం; విప్రవధయున్= బ్రాహ్మణుడిని చంపటం; (అనేవి) బుధజనులు= పండితులు; పాపంబులు= దుష్కృతాలు; అందురు= అంటారు.

**తాత్పర్యం:** సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో నిద్రపోవటం, అర్హుడైనవాడు ఇంటికి వచ్చినప్పుడు సేవించకపోవటం, పరుల భార్యలను పొందటం, పెద్దలు చెప్పినదానికి వ్యతిరేకంగా ఆచరించటం, ఊరును నాశనంచేయటం, వేదాలను (చదువును) అమ్ముకొనటం, ఉప్పు,బెల్లం మొదలగువాటిని అమ్ముకొనటం, సేవకులను కాపాడకపోవటం,

కపటపు సేవ, అడవులను తగులపెట్టటం, తనదికానిపని చెయ్యటం, తనపని చేయకపోవటం, అనవసరంగా జంతువులను కొట్టటం (హింసించటం), బ్రాహ్మణుల సంపదలను తీసికొనటం, శరణుకోరిన వారిని ఆదరించకపోవటం పాపకార్యాలని పండితులు చెప్పుతారు.

**వ. పాపంబులుంబోలె నుండియు దూష్యంబులు గాని వానిం జెప్పెద నాకర్ణింపుము. 294**

**ప్రతిపదార్థం:** పాపంబులున్= పాపకార్యాలు; పోలెన్= వలె; ఉండియున్= ఉండికూడా; దూష్యంబులు= నిందించ దగినవి; కాని వానిన్= కాని విషయాలను; చెప్పెదన్= చెపుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** పాపకార్యాలవలె కనపడుతున్నా నిందించ తగినవి కానివాటిని చెప్పుతాను వినుము.

**క. దురమునఁ గైదువుఁ గొని తనుఁ । బొరిగొన నేతెంచునట్టి పురుషుని వేదాం**
**త రహస్యవేది నయినను । బొరిగొనినను గిల్బిషంబు వొందదు వత్సా! 295**

**ప్రతిపదార్థం:** వత్సా!= నాయనా!; దురమునన్= యుద్ధంలో; కైదువున్= ఆయుధాన్ని; కొని= పట్టి; తనున్= తనను; పొరిగొనన్= చంపటానికి; ఏతెంచు+అట్టి= వచ్చేటటువంటి; పురుషునిన్= మానవుడిని; వేదాంత= ఉపనిషత్తులలోని; రహస్య= అంతరార్థాన్ని; వేదిన్= ఎరిగినవాడిని; అయినను= అయినాసరే; పొరిగొనినమున్= చంపినా; కిల్బిషంబు= పాపం; పొందదు= రాదు.

**తాత్పర్యం:** నాయనా! ధర్మరాజా! యుద్ధంలో చేత ఆయుధం పట్టి తనను సంహరించటానికి వస్తున్నవాడు ఉపనిషత్తుల పరమార్థం తెలిసిన పండితుడయినా సరే, చంపితే పాపం రాదు.

**క. ధరణీసురవిత్తము నప । హరింపఁగాఁ గని వధించు నతఁడు దురితముం**
**బొరయఁ డొక యించుకయు నని । నరేంద్ర! చెప్పుదురు ధర్మనానార్థవిదుల్. 296**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ధర్మరాజా!; ధరణీసుర= బ్రాహ్మణుల; విత్తములన్= ధనాన్ని; అపహరింపఁగాన్= దొంగిలించగా; కని= చూచి; వధించు= చంపే; అతఁడు= వాడు; ఒక+ఇంచుకయున్= కొద్దిగా కూడా; దురితమున్= పాపాన్ని; పొరయఁడు= పొందడు; అని= అంటూ; ధర్మ= ధర్మమార్గం యొక్క; నానా= అనేకమైన; అర్థవిదుల్= తత్త్వం తెలిసినవారు; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రాహ్మణుల ధనాన్ని దొంగిలిస్తుండగా చూచిన దొంగను చంపినవాడికి పాపం కొద్దిగా కూడా రాదని ధర్మమార్గం యొక్క పద్ధతులు బాగా తెలిసినవారు చెప్పుతారు.

**క. జీవిత సంశయవేళను । భూవర! యొం డన్నపానములు దొరకమిఁ గల్**
**ద్రావినఁ, గల్లగు టెఱుంగక । త్రావిన నద్దురితమధిక ధర్మమునఁ జెడున్. 297**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; జీవిత సంశయవేళను= బ్రదకటం అనుమానాస్పదంగా ఉన్న సమయంలో; ఒండు= వేరు; అన్నపానములు= తినేవి, త్రాగేవి; దొరకమిన్= లభించకపోవటంతో; కల్= కల్లు; త్రావినన్= త్రాగినా; కల్లు+అగుట= కల్లు అని; ఎఱుంగక= తెలియక; త్రావినన్= త్రాగిన; ఆ+దురితము= ఆ పాపం; అధిక= ఎక్కువ; ధర్మమునన్= పుణ్యం చేయటంవలన; చెడున్= నశిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ప్రాణం నిలవదనే పరిస్థితులలో తినటానికి, త్రాగటానికి వేరే ఏమీ దొరకనప్పుడు (ప్రాణం నిలపటం కొరకు) కల్లు త్రాగిన పాపం, త్రాగినది కల్లు అని తెలియక త్రాగిన ఆ పాపం అధికమైన పుణ్యకార్యాలు చేయటంతో నశిస్తుంది.

**క. గురుసంరక్షణమునకును । బరమాపదయైన యెడను బ్రాహ్మణధనముల్**
**విరహితములుగాఁ బెఱచోఁ । జొరఁగానగు మ్రుచ్చిమికి వసుమతీనాథా! 298**

**ప్రతిపదార్థం:** వసుమతీనాథా!= ధరణీపతీ! ధర్మరాజా!; గురుసంరక్షణమునకును= గురువును, పెద్దలను రక్షించటానికి; పరమ= గొప్ప; ఆపద= కష్టం; ఐన+ఎడన్= కలిగినప్పుడు; బ్రాహ్మణ ధనముల్= విప్రుల సొత్తులు; విరహితములు+కాన్= విడువబడినవై; పెఱచోన్= పరాయిచోటికి; చొరగాన్+అగు= పోయే; మ్రుచ్చిమికిన్= దొంగతనానికి.

**తాత్పర్యం:** ధర్మరాజా! గురువులను, పెద్దలను రక్షించటానికి, పెద్ద ఆపద కలిగినప్పుడు, బ్రాహ్మణుల ధనాలు వారినుండి అపహరించబడిన సమయంలోనూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ప్రాణహాని దప్పించుచోఁ, బరిణయంబు । నందు గురుజన కార్యార్థమయ్యు నంగ**
**నా జనముతోడి సంభాషణమున సర్వ । ధనముఁ జెడియెడు నెడ బొంకఁ జను నృపాల! 299**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా!; ప్రాణహానిన్= ప్రాణనష్టాన్ని; తప్పించుచోన్= తప్పించే సమయంలో; పరిణయంబున్+అందున్= వివాహంలో; గురుజన= పెద్దల; కార్య+అర్థము+అయ్యున్= ప్రయోజనంకొరకు; అంగనాజనము= స్త్రీల; తోడి= తోటి; సంభాషణమునన్= మాట్లాడటంలో; సర్వధనమున్= సంపద అంతా; చెడియెడు+ఎడన్= నశించే సమయంలో; బొంకన్+చనున్= అబద్ధం చెప్పవచ్చును.

**తాత్పర్యం:** ధర్మరాజా! ప్రాణనష్టాన్ని తప్పించటానికి, వివాహంలో పెద్దల పనికొరకు, స్త్రీలతోడి మాటలలో, సంపద అంతా కోల్పోయే సమయంలో అసత్యం చెప్పవచ్చును.

**క. కలలోనఁ జరమధాతు । స్ఖలనము గలిగినను బ్రహ్మచర్యము సెడ దు**
**జ్జ్వలవహ్ని నేయి వేల్చినఁ । దొలఁగుం గిల్బిషము దురితదూరచరిత్రా! 300**

**ప్రతిపదార్థం:** దురిత= పాపాలకు; దూర= దూరమైన; చరిత్రా!= నడవడిక కలిగిన ధర్మరాజా!; కలలోనన్= స్వప్నంలో; చరమధాతు స్ఖలనము= వీర్యస్ఖలనం; కలిగినను= జరిగినట్లైతే; బ్రహ్మచర్యము= బ్రహ్మచర్యదీక్ష;చెడదు= పాడవదు, చెడిపోదు; ఉజ్జ్వల= బాగామండే; వహ్నిన్= అగ్నిలో; నేయి= ఘృతమును; వేల్చినన్= హోమం చేస్తే; కిల్బిషము= పాపం; తొలఁగున్= పోతుంది.

**తాత్పర్యం:** పాపరహితమైన నడవడిక కల ధర్మరాజా! కలలో వీర్యస్ఖలనం జరిగితే బ్రహ్మచర్యదీక్ష చెడదు. బాగా మండుతున్న అగ్నిలో నేతితో హోమం చేస్తే ఆ పాపం పోతుంది.

**ఆ. అన్న పతితుఁడైన నటుగాక సన్న్యాసి । యయ్యెనేని తమ్ముఁ డాతఁ డుండ**
**దార సంగ్రహంబుఁ దాఁ జేసి పాపంబుఁ । బొరయఁ దండ్రు బుధులు కురువరేణ్య! 301**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశోత్తముడవైన ఓ ధర్మరాజా!; అన్న= జ్యేష్ఠసోదరుడు; పతితుఁడు+ఐనన్= అధర్మవర్తనుడైనా; అటు+కాక= ఆ విధం గాకపోయినా; సన్న్యాసి+అయ్యెన్+ఏని= సన్న్యాసం పుచ్చుకొని సంసారం వదలినా; ఆతఁడు+ఉండన్=

అన్న జీవించి ఉండగానే; తమ్ముఁడు; దారసంగ్రహంబు= అతడి భార్యను స్వీకరించటం; తాన్+చేసి= తనే చేసి; పాపంబున్= దురితం; పొరయఁడు= పొందడు; అండ్రు= అంటారు; బుధులు= పండితులు.

**తాత్పర్యం:** ధర్మరాజా! అన్న అధర్మవర్తనుడైనా, సన్న్యాసం స్వీకరించినా అతడి భార్యను, అతడు ఉండగానే తమ్ముడు స్వీకరిస్తే పాపం కాదు అని పండితులు అంటారు.

**తే.** **అడవి గోవులకై కాల్చు టధ్వరమునఁ । బశువుఁ, జంపుట, దాన మపాత్రభూతుఁ**
**డగు టెఱుంగక యిచ్చుట, దగనిబంటుఁ । బ్రోవకుండుట గీడులు గావు వత్స! 302**

**ప్రతిపదార్థం:** వత్స!= కుమారా! ధర్మజా!; అడవి= వనాన్ని; గోవులకున్+ఐ= ఆవులకొరకు; కాల్చుట= తగులబెట్టటం; అధ్వరమునన్= యజ్ఞంలో; పశువున్= జంతువును; చంపుట= చంపటం; అపాత్రభూతుఁడు= యోగ్యతలేనివాడు; అగుట= అవటం; ఎఱుంగక= తెలియక; ఇచ్చుట= ఇవ్వటం; తగని= అనర్హుడైన; బంటున్= సేవకుడిని; ప్రోవక= కాపాడక; ఉండుట= ఉండటం; కీడులు= చెడుపనులు, పాపాలు; కావు= అవవు.

**తాత్పర్యం:** కుమారా! ధర్మజా! గోవులకొరకు వనాన్ని తగులబెట్టటం, యజ్ఞంలో జంతువును చంపటం, అయోగ్యుడని తెలియక దానం ఇవ్వటం, అనర్హుడైన సేవకుడిని రక్షించకుండా వదలటం పాపాలు కావు.

**వ.** **తపంబుల దానంబుల మఱియునుం దగిన పుణ్యకర్మంబులనుం బాపంబులు పరిక్షీణంబు లగు నను నిది సామాన్య వచనంబు; ప్రాయశ్చిత్త విశేషంబు లెఱింగించెద. 303**

**ప్రతిపదార్థం:** తపంబులన్= తపస్సులచేత; దానంబులన్= దానములు చేయటంచేత; మఱియునున్= ఇంకా; తగిన= యుక్తమైన; పుణ్యకర్మంబులనున్= సత్కార్యాచరణాలవలన; పాపంబులు= దురితాలు; పరిక్షీణంబులు= బాగా కృశించినవి; అగును= అవుతాయి; అను+ఇది= అనే ఈ మాట; ప్రాయశ్చిత్త= పాపపరిహార; విశేషంబులు= భేదాలు; ఎఱింగించెదన్= తెలియచెప్పుతాను.

**తాత్పర్యం:** తపస్సు, దానం, ఇంకా ఇతర సత్కర్మాచరణం వలన పాపాలు బాగా తగ్గుతాయి అనేది మామూలు మాట. ఇంక పాపపరిహార ప్రక్రియలలోని భేదాలు చెప్పుతాను.

### వ్యాసుఁడు ధర్మజునకుఁ బ్రాయశ్చిత్త విశేషంబు లెఱింగించుట (సం. 12-36-1)

**సీ.** **వినుము! కర్మము దెల్పుచును గపాలంబున । నెత్తిన భైక్షాన్న మేకకాల**
**మశనంబు గొనుచు ఖట్వాంగ చిహ్నము బ్రహ్మ। చర్యంబునై యధశ్శయన మాచ**
**రించుచు నిట్లు పండ్రెండు వర్షంబులు । వ్రతవృత్తి నడపంగ బ్రహ్మహత్య**
**కిల్బిషంబు దొలఁగుఁ; గృచ్ఛ్రముల్ నడపిన । నాఱు వత్సరముల నడఁగు మూఁడు**

**తే.** **హాయనంబులు నడపఁ జాంద్రాయణములఁ । బోవు నిష్ఠానిరతి మాస భోజియైన**
**నబ్దమునఁబాయు; నటుగాక యశ్వమేధ । యాజి యగునేని వలదు భిక్షాదు లధిప! 304**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వినుము; కర్మమున్= చేసిన పనిని; తెల్పుచును= ప్రకటించుకొంటూ; కపాలంబునన్= పుర్రెలో; ఎత్తిన భిక్షాన్నము= తిరిపె మెత్తి తెచ్చిన ఆహారం; ఏకకాలంబు= ఒక్కమారు; అశనంబున్= ఆహారాన్ని; కొనుచున్= తింటూ;

ఖట్వాంగచిహ్నము= మంచపుకోడు ఆకారంలో ఉన్న ఆయుధం గుర్తుగా; బ్రహ్మచర్యంబును+ఐ= బ్రహ్మచర్య ధర్మాన్ని పాటిస్తూ; అధశ్శయనము= నేలమీద పడుకొనటం; ఆచరించుచున్= చేస్తూ; ఇట్లు= ఈ విధంగా; పండ్రెండు వర్షంబులు= పన్నెండు సంవత్సరాలు; వ్రతవృత్తిన్= నియమబద్ధమైన జీవితం; నడపంగన్= గడపగా; బ్రహ్మహత్య కిల్బిషంబు= బ్రహ్మహత్యాపాపం (బ్రాహ్మణవధ చేసిన పాపం); తొలఁగున్= పోతుంది; కృచ్ఛ్రముల్= సాంతపనాదివ్రతాలు; నడపినన్= ఆచరించితే; ఆఱు వత్సరములన్= ఆరేళ్ళలో; అడఁగును= నశిస్తుంది; మూడు హాయనంబులు= మూడు సంవత్సరాలు; నడపన్= ఆచరించగా; చాంద్రాయణములన్= చాంద్రాయణ వ్రతాలవలన; పోవును= పోతుంది; నిష్ఠానిరతిన్= నియమాలయందు ఆసక్తితో; మాసభోజి+ఐనన్= భుజిస్తే; అబ్దమునన్= సంవత్సరంలో; పాయున్= పోతుంది; అటు+కాక= ఆ విధంగా కాకపోతే; అశ్వమేధయాజి= అశ్వమేధ యజ్ఞం చేసినవాడు; అగున్+ఏని= అయినట్లయితే; భిక్షా+ఆదులు= భిక్షాన్నం తినటం మొదలైనవి; వలదు= అక్కరలేదు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము; బ్రహ్మహత్యాదోషం పోవటానికి ప్రాయశ్చిత్తా లివి. తను చేసిన పని అందరికీ చెప్పుతూ, పుర్రెలో భిక్షాటన చేసి తెచ్చిన ఆహారాన్ని రోజుకు ఒక్కసారి మాత్రమే తింటూ, ఖట్వాంగాన్ని గుర్తుగా గ్రహించి, బ్రహ్మచర్య ఆశ్రమధర్మాన్ని పాటిస్తూ నేలమీద పడుకొంటూ పన్నెండు సంవత్సరాలు నియమబద్ధ జీవితం గడపాలి. లేదా సాంతపనాది వ్రతాలు ఆరు సంవత్సరాలు ఆచరించాలి. లేకుంటే మూడు సంవత్సరాలు చాంద్రాయణ వ్రతం చేయాలి. అదీ కాకుంటే నిష్ఠగా మాసభోజి అయి ఒక్క ఏడాది ఉండాలి. అశ్వమేధయాగం చేస్తే మిగిలిన వేవీ చేయనక్కరలేదు.

**విశేషం:** 1. కృచ్ఛ్రము: మూడు రోజులు పగలు భోజనం చేసి, మూడురోజులు రాత్రిభోజనం చేసి, మూడురోజులు అడగకుండా లభించింది తిని, మూడు రోజులు అస లేమీ తినకుండా నిట్టుపవాసం ఉండే వ్రతం. పంచగవ్యము, కుశోదకం మాత్రమే స్వీకరించి, ఒకరాత్రి ఉపవసించే వ్రతాన్ని కృచ్ఛ్రము అంటారు. పంచగవ్యం అంటే గోవుకు సంబంధించిన 5 పదార్థాలు. 1. నేయి, 2. పాలు, 3. పెరుగు, 4. మూత్రం, 5. పేడ. గోమూత్రాన్ని మట్టిమూకుడులో ఇగిర్చి మిగిలినది లవణరూపంలో స్వీకరిస్తారు. ఆవుపేడను పుటంపెట్టి, నీటిలో బాగా కడిగి, ఆపై దానిపై తేర్చిన నీటిరూపంలో స్వీకరిస్తారు. ఇది ఒక్కనాటి నియమం. దీనిని ఆరు సంవత్సరాలు పాటించాలి.

2. చాంద్రాయణము: పూర్ణిమనాడు పూర్తిగా ఆహారం తీసికొని, కృష్ణపక్షంలో రోజుకొక్క ముద్దచొప్పున తగ్గిస్తూ, అమవాస్యనాడు పూర్తిగా ఉపవసించి, మరునాటి నుండి శుక్లపక్షంలో రోజు కొక్క ముద్ద చొప్పున హెచ్చిస్తూ పూర్ణిమనాటికి పూర్తిగా ఆహారం తీసికొనటం అనే వ్రతం.

3. మాస భోజి: రోజుకొక్క మాస ప్రమాణం మాత్రమే ఆహారం తీసికొనటం. రెండున్నర చిన్నాల ఎత్తు బరువును మాసం అంటారు. ఇది బంగారాన్ని తూచే బరువు. అంటే అంత తక్కువ ఆహారం.

ఈ వ్రతాలన్నింటిలోనూ ఆహారనియమం, శరీరశోషణం ముఖ్యాంశాలు. శరీరంతో చేసిన పాపానికి శరీరశోషణం అవసరం కదా!

**క. అవనీశ! యశ్వమేధము । నవబృథమున నీరఁ గ్రుంకి యన్యుఁడు శుద్ధుం**
**డవుఁ బాపుఁ డైనఁ; దత్క । ర్త విశేషము లోక పూజితం బగు టరుదే! 305**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ!= ఓ రాజా!; అశ్వమేధము-అవభృథమునన్= అశ్వమేధయాగంలోని దీక్షాంతమున చేసే స్నానంలో; నీరన్= నీటిలో; క్రుంకి= మునిగి; అన్యుఁడు= ఇతరుడు; పాపుఁడు+ఐనన్= పాపం చేసినవాడైనా; శుద్ధుండు+అవున్= పవిత్రుడౌతాడు; తద్+కర్త= అశ్వమేధం చేసినవాడు; విశేషము= అధికంగా; లోకపూజితంబు= లోకంలోని అందరిచేత; పూజితంబు= పూజించబడటం; అరుదు+ఏ?= వింతయా? (వింతకాదు)

**తాత్పర్యం:** ధర్మరాజా! అశ్వమేధయాగంలోని దీక్షాంత స్నానపునీటిలో మునిగిన ఇతరు డెవరైనా, ఎంతటిపాపి అయినా పవిత్రుడౌతాడు. అటువంటిది ఆ అశ్వమేధయాగం చేసినవాడు లోకపూజితు డవటంలో ఆశ్చర్యం లేదు కదా!

సం॥ 35-10

**తే.** పుష్టగోలక్ష యొండెఁ గాంభోజవాజి । శతక మొండెను భూసురతతికి నొసఁగఁ
బాయు బ్రాహ్మణార్థాహవ ప్రాణహాని । యైన నొండెను జెడు బ్రహ్మహత్యకీడు. 306

**ప్రతిపదార్థం:** పుష్ట= బలిసిన; గోలక్ష= లక్షగోవులు; ఒండెన్= కాని; కాంభోజవాజి= కాంభోజదేశంలోని శ్రేష్ఠమైన గుర్రాలు; శతకము= వంద; ఒండెను= కాని; భూసురతతికిన్= బ్రాహ్మణుల సముదాయమునకు; ఒసఁగన్= దానం చేయగా; బ్రాహ్మణ+అర్థ= బ్రాహ్మణుల కొరకు చేసిన; ఆహవ= యుద్ధమందు; ప్రాణ, హాని, ఐనన్= ప్రాణములను పోగొట్టుకున్నా; బ్రహ్మహత్యకీడు= బ్రహ్మహత్యా పాతకం; పాయున్= పోతుంది; ఒండెను= అయినా; చెడున్= పోతుంది.

**తాత్పర్యం:** బ్రాహ్మణులకు పుష్టిగా ఉన్న లక్ష గోవులను, కాంభోజదేశానికి చెందిన వంద గుర్రాలను దానం చేసినా, బ్రాహ్మణులకోసం చేసిన యుద్ధంలో ప్రాణాలు పోగొట్టుకున్నా బ్రహ్మహత్యాపాతకం తొలగిపోతుంది.

**సీ.** **కల్లుద్రావిన పాతకం బది యగ్నివ । ర్ణముగాఁగఁ గాఁచి పానంబు సేయఁ**
**గనుమూసి యుఱుకంగ ననలంబుఁ జొర మహా । ప్రస్థాన మాచరింపంగఁ బాయు**
**నట్లును గాక బృహస్పతి సవనమ । న్క్రతు వొనరించిన నతివిశిష్ట**
**భూమిదానమునను బోవు నక్కీడ్గురు । తల్పగుం డనలప్రతప్త మైన**

**ఆ.** **యాయసాంగనాంగ మాలింగనము సేసి । యైనఁ గోసి కరమునందు మేహ**
**నము ధరించి యంబరముఁ జూచు చరిగియే । నియును జచ్చి యఘము నిస్తరించు.** **307**

**ప్రతిపదార్థం:** కల్లున్+త్రావిన= మద్యం సేవించిన; పాతకంబు= మహాపాపం; అది= ఆ మద్యం; అగ్నివర్ణము+కాఁగన్= మంటవలె ఎర్రని రంగు వచ్చేదాకా; కాఁచి= మరిగించి; పానంబు+చేయన్= తాగగా; కనుమూసి= కళ్ళు మూసికొని; అనలంబున్= అగ్నిలో; చొరన్= ప్రవేశించగా; ఉఱుకంగన్= దుముకగా; మహాప్రస్థానము= తిరిగిరాని ప్రయాణం (శరీరం పడిపోయేదాకా అవిశ్రాంతంగా ఉత్తరాభిముఖుడైవెళ్ళి శరీరత్యాగం చేయటం); ఆచరింపంగన్= చేయగా; పాయున్= పోతుంది; అట్లును+కాక= అట్లా కాకపోతే; బృహస్పతి సవనము= బృహస్పతి యజ్ఞం; అన్+క్రతువు= అనే యజ్ఞం; ఒనరించినన్= చేసినా; అతివిశిష్ట= చాలా ఎక్కువైన; భూమిదానంబునను= భూమిని దానం చేయటం వలనా; ఆ+కీడు= కల్లు త్రావిన పాపం; పోవున్= పోతుంది; గురుతల్పగుండు= గురుదారగమనం చేసినవాడు; అనల= అగ్నిలో; ప్రతప్తము+ఐన= బాగా కాలిన; ఆయస= ఇనుప; అంగనా= స్త్రీ; అంగము= దేహం; ఆలింగనము+చేసి= కౌగిలించుకొని; ఐనన్= అయినా; మేహనము= మేఢ్రమును; కోసి= నరికి; కరమునందున్= చేతిలో; ధరించి= పట్టుకొని; అంబరమున్= ఆకాశాన్ని; చూచుచున్= చూస్తూ; అరిగి= వెళ్ళి; చచ్చి= మరణించి; ఏనియును= అయినా; అఘమున్= పాపాన్ని; నిస్తరించున్= పోగొట్టుకొంటాడు.

**తాత్పర్యం:** కల్లు సేవిస్తే వచ్చే పాతకం ఆ మద్యాన్ని ఎర్రగా కాచి తాగినా, కళ్ళు మూసికొని నిప్పులలో దూకినా, మహాప్రస్థానం చేసినా, బృహస్పతి సవనం అనే యజ్ఞం చేసినా, చాలా అధికమైన భూదానం చేసినా పోతుంది. గురుపత్నిని పొందినవాడు ఆ పాపం పోవటానికి బాగా కాల్చిన ఇనుపస్త్రీమూర్తిని కౌగిలించుకొనాలి. లేదా తన మేఢ్రాన్ని (ఆ పాపం చేయటానికి మూలం అదే కనుక) కోసి చేతిలో పట్టుకొని ఆకాశం వంక చూస్తూ పోయి మరణించాలి.

**క.** **గురుతల్పగుండు రణమున । గురునకునై చచ్చియేని కురువర ధరణీ**
**సురులకు సర్వధనము భ । క్తి రతి నొసఁగియేని పాతకిత్వముఁ దొఱఁగున్. 308**

**ప్రతిపదార్థం:** కురువర!= కురువంశరాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; గురుతల్పగతుండు= గురుపత్నితో వ్యభిచరించినవాడు; రణమునన్= యుద్ధంలో; గురునకున్+ఐ= గురువు కొరకు; చచ్చి+ఏని= చనిపోయి కాని; ధరణీసురులకున్= విప్రులకు; సర్వధనము= సంపదనంతా; భక్తిరతిన్= భక్తితో, ఇష్టంతో; ఒసఁగి+ఏని= దానం చేసికాని; పాతకిత్వమున్= పాపభావాన్ని; తొఱఁగున్= పోగొట్టుకొంటాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! గురుపత్నీగమనం చేసినవాడు యుద్ధంలో ఆ గురువుకొరకు ప్రాణా లర్పించినా, తన ధనాన్నంతా విప్రులకు దానం చేసినా ఆ పాపం పోతుంది.

**క.** **ధరణీసురుస్వర్ణము నప । హరించినతఁ డంత కనక మట్టిద వినయో**
**త్తరుఁడై మగుడఁగ నిచ్చినఁ । బరిహృత మగుఁ గల్మషంబు పౌరవముఖ్యా! 309**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశ శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; ధరణీసురు= విప్రుడి; స్వర్ణమున్= బంగారం; అపహరించిన= దొంగిలించిన; అతఁడు= వాడు; అంత కనకము= అంతే బంగారం; అట్టిది+అ= అటువంటిదే; వినయ+ఉత్తరుఁడు+ఐ= వినయంతో కూడుకొన్నవాడై; మగుడఁగన్= మరల; ఇచ్చినన్= ఇవ్వగా; కల్మషంబు= పాపం; పరిహృతము= పోగొట్టబడింది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** పౌరవవంశోత్తముడ వైన ధర్మరాజా! బ్రాహ్మణుడి బంగారాన్ని దొంగిలించిన వాడు అంతే బంగారం, అటువంటిదే వినయంతో తిరిగి ఇస్తే ఆ పాపం పోతుంది.

**క.** **అనృతోపచారకలనం । బునఁ బుట్టిన పాతకంబు వోవుం దా నె**
**వ్వని నపచరించెఁ దగ నా । తనిఁ బ్రీతుంజేయ ధర్మతత్త్వప్రవణా! 310**

**ప్రతిపదార్థం:** ధర్మతత్త్వప్రవణా!= ధర్మంయొక్క స్వభావం బాగా తెలిసిన ఓ ధర్మరాజా!; అనృత= అసత్యానికి; ఉపచార= సేవ; కలనంబునన్= చేయటం వలన; పుట్టిన= జనించిన; పాతకంబు= పాపం; ఎవ్వనిన్= ఎవరికి; అపచరించెన్= అపచారం చేశాడో; తగన్= చక్కగా; ఆతనిన్= ఆ వ్యక్తిని; ప్రీతున్= సంతసించినవాడినిగా; చేయన్= చేసినచో; పోవున్= పోతుంది.

**తాత్పర్యం:** ధర్మతత్త్వం బాగా తెలిసిన ఓ ధర్మరాజా! అబద్ధాన్ని ఆడటంవలన కలిగిన పాపం, ఎవరికి అపచారం చేశాడో ఆ వ్యక్తిని సంతోషపెట్టితే పోతుంది.

**క.** **గురువునకు మాఱువల్కుటఁ । బొరసిన కల్మషము వాసిపోవు నతనికిం**
**బరితోషముగా వినయపు । వెరవున నుపహార మిచ్చి వినతుం డయినన్. 311**

**ప్రతిపదార్థం:** గురువునకున్= ఆచార్యుడికి; మాఱుపల్కుటన్= ఎదురుచెప్పటం వలన; పొరసిన= కలిగిన; కల్మషము= పాపం; అతనికిన్= ఆ గురువుకు; పరితోషముగాన్= సంతోషం కలిగేటట్లు; వినయము+వెరవునన్= వినయంతో కూడిన ఉపాయంతో; ఉపహారము= కానుక; ఇచ్చి= ఒసగి; వినతుండు= నమస్కరించినవాడు; అయినన్= అయితే; పాసిపోవున్= తొలగిపోతుంది.

**తాత్పర్యం:** గురువును ఎదిరించటంవలన కలిగిన పాపం, ఆ గురువుకు సంతోషం కలిగేటట్లు వినయంతో నమస్కరించి కానుక ఇస్తే తొలగిపోతుంది.

**క. పరదార గమనదోషము । పరిహృతమగు నొక్కయేఁడు పరమ నియతుఁడై**
**చరియించినఁ గృచ్ఛ్రంబులు । గురుకుల జలనిధి శశాంక! గుణమణి నికరా! 312**

**ప్రతిపదార్థం:** కురుకుల= కురువంశమనే; జలనిధి= సముద్రానికి; శశాంక= చంద్రుడి వంటివాడా!; గుణమణి= శ్రేష్ఠమైన రత్నాలవంటి గుణాలకు; నికరా!= ప్రోగువంటివాడా!, ధర్మరాజా!; పర= ఇతరుల; దార= భార్యను; గమన= పొందిన; దోషము= పాపం; ఒక్కఏఁడు= ఒక్క సంవత్సరం; పరమ= మిక్కిలి; నియతుఁడు+ఐ= నియమాలు కలవాడై; కృచ్ఛ్రంబులు= సాంతపనాది వ్రతాలు; చరియించినన్= ఆచరించగా; పరిహృతము+అగున్= పరిహరించబడుతుంది.

**తాత్పర్యం:** కురువంశ చంద్రమా! సద్గుణరాశీ! ధర్మరాజా! ఇతరుల భార్యలను పొందిన పాపం ఒక్క సంవత్సరం అధికమైన నియమంతో కృచ్ఛ్రవ్రతాలను ఆచరిస్తే పోతుంది.

**విశేషం:** కృచ్ఛ్రముల వివరం 304వ పద్యంలో ఇవ్వబడింది.

**ఆ. వావి గానియట్టి వనితఁ బొందినపాప । మాఱునెలలఁ బాయు నార్ద్రవస్త్ర**
**ధరణ భస్మశయన పరతఁ బాటించుచు । నియతి నుండెనేని నృపవరేణ్య! 313**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజోత్తమా!; వావి= వరుస; కాని+అట్టి= కానిదైన; వనితన్= స్త్రీని; పొందిన= కూడిన; పాపము= దురితం; ఆర్ద్రవస్త్రధరణ= తడిబట్టలు ధరించటం; భస్మశయనపరతన్= బూడిదలో పడుకొనటం; పాటించుచున్= అనుసరిస్తూ (చేస్తూ); నియతిన్= నియమంతో; ఉండెన్+ఏని= ఉన్నట్లయితే; ఆఱునెలలన్= ఆరునెలలలో; పాయున్= పోతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! వరుసకాని స్త్రీని కూడిన పాపం - తడిబట్టలు కట్టుకొనటం, బూడిదలో పడుకొనటం అనే నియమాలను శ్రద్ధగా పాటిస్తే ఆరునెలలలో పోతుంది.

**క. పరపురుష సంగమంబునఁ । బరిహృతయై యున్నయట్టి భామిని శుద్ధిం**
**బొరయు రజస్వలయై కం । చరయఁగ భస్మమున శుద్ధమైన విధమునన్. 314**

**ప్రతిపదార్థం:** పరపురుష= పరాయి పురుషుడి; సంగమంబునన్= పొందువలన; పరిహృత+ఐ= వదలబడినదై; ఉన్న+అట్టి= ఉన్నటువంటి; భామిని= స్త్రీ; అరయఁగన్= పరికించి చూడగా; కంచు= కాంస్యం; భస్మమునన్= బూడిదతో; శుద్ధము= మలినం లేనిది; ఐన విధమునను= అయ్యే పద్ధతిలోనే; రజస్వల+ఐ= నెలసరి ఋతువు కలిగినదై; శుద్ధిన్= స్వచ్ఛతను; పొరయున్= పొందుతుంది.

**తాత్పర్యం:** పరపురుషుడి పొందువలన వదలబడిన స్త్రీ, బూడిదతో కంచు నిర్మలత్వాన్ని పొందిన విధంగా, రజోదర్శనంతో మాలిన్యం పోయి పవిత్రమౌతుంది.

**ఆ. నఱకఁదగని ప్రాను నఱకినఁ, దిర్యగ్వ । ధంబుఁ జేసినను, నఘంబుఁ బాచి**
**కొనునరుండు మూఁడు దినములఁ దనచేఁత । పలుకుచును సమీరభక్షుఁ డయిన.' 315**

**ప్రతిపదార్థం:** నఱకన్+తగని= కొట్టివేయకూడని; ప్రానున్= చెట్టును; నఱకినన్= కొట్టినా; తిర్యక్+వధంబున్= జంతులను చంపటం; చేసిననున్= చేసినా; అఘంబున్= ఆ పాపాన్ని; మూఁడు దినములు= మూడు రోజులు; తనచేఁత= తాను చేసిన పని; పలుకుచును= చెప్తుతూ; సమీరభక్షకుండు+అయినన్= గాలిని ఆహారంగా తింటూ ఉన్నట్లయితే; నరుండు= మానవుడు; పాచికొను= పోగొట్టుకుంటాడు.

**తాత్పర్యం:** నరకకూడని చెట్టును కొట్టినా, జంతువులను చంపినా, వచ్చిన పాపాన్ని మనిషి మూడురోజులపాటు తాను చేసిన పనిని చెప్పుకొంటూ గాలి మాత్రమే తింటూ (అన్న పానీయాలు మాని) ఉండి పోగొట్టుకొంటాడు.'

**వ. అని చెప్పి వెండియు. 316**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఈ మాటలు చెప్పి వ్యాసుడు ఇంకా (ఇట్లా అన్నాడు):

**క. ' మితభోజియై వివిక్త । క్షితి సావిత్రీజపంబు సేయునది యహ**
**స్థితియు నిశాసీనత్వము । మతి నేమఱకట్టులైన మడియు నఘంబుల్. 317**

**ప్రతిపదార్థం:** మిత= పరిమితంగా; భోజి+ఐ= తినేవాడవై; వివిక్త= పవిత్ర (ఏకాంత); క్షితిన్= భూమిలో; సావిత్రీజపంబు=గాయత్రీమంత్రజపాన్ని; చేయునది= చేయాలి; అహః+స్థితియున్= పగలు నిలుచుండి మేల్కొని ఉండుటను; నిశా+ఆసీనత్వము= రాత్రియందు విశ్రయించుటయు కూర్చుండి ఉన్నప్పుడు; మతిన్= మనసులో; ఏమఱక= మరచిపోక; అట్టులు+ఐనన్= అట్లా చేసినట్లయితే; అఘంబుల్= పాపాలు; మడియున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** 'ఆహారం మితంగా తీసికొంటూ, ఏకాంతస్థలంలో పగలు అయ్యేప్పుడు (ఉదయ సంధ్యలో) రాత్రి ఉన్నప్పుడు (సాయంసంధ్యలో) మనసులో ఏమరుపాటు లేక గాయత్రీమంత్రజపం చేస్తే పాపాలన్నీ నశిస్తాయి.

**విశేషం:** గాయత్రీమంత్రాధిదేవత సావిత్రి. సావిత్రీజపం అంటే గాయత్రి జపం అని భావం.

**తే. పుణ్యకర్మముల్ సేయుచు భూసురులకు । వివిధ ధనములు ప్రీతితో వినయ మొప్ప**
**నొసఁగుచుండెడువారు పూర్వోపచితము । లైన కిల్బిషములఁ బాతు రవనినాథ! 318**

**ప్రతిపదార్థం:** అవనినాథ!= భూమీపతీ!; పుణ్యకర్మముల్= మంచిపనులు; చేయుచున్= చేస్తూ; భూసురులకున్= విప్రులకు; వివిధ= అనేకములైన; ధనములు= సంపదలు; ప్రీతితోన్= ఇష్టంతో; వినయము+ఒప్పన్= వినమ్రత ప్రకాశించగా; ఒసఁగుచున్+ఉండెడువారు= ఇస్తూ ఉండేవారు; పూర్వ+ఉపచితములు= ఇంతకుముందు సంపాదించి పెట్టుకొన్నవి; ఐన= అయినటువంటి; కిల్బిషములన్= పాపాలను; పాతురు= పోగొట్టుకొంటారు.

**తాత్పర్యం:** సత్కర్మలు ఆచరిస్తూ, బ్రాహ్మణుల కనేకమైన సంపదలను ఇష్టంతో, వినయంతో దానం చేస్తూ ఉండేవారు పూర్వజన్మలలో కూడబెట్టిన పాపాలను కూడా పోగొట్టుకొంటారు.

**క. విను మాస్తికతా శ్రద్ధా । వినయంబులు గలుగువారు వీనికి నెల్లన్**
**జననాథ! యర్హు; లవి లే । నినరులు పాపములఁ దొలఁగ నేర్తురె యెట్లున్. 319**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా!; విను= ఆలకించుము; ఆస్తికతా= భగవంతుడి యందు విశ్వాసబుద్ధి; శ్రద్ధా= ఆసక్తి; వినయంబులు= వినయం; కలుగువారు= ఉన్నవారు; వీనికిన్= ఇంతకుముందు చెప్పిన ప్రాయశ్చిత్తాదులకు; ఎల్లన్= అన్నింటికీ; అర్హులు= యోగ్యత ఉన్నవారు; అవి= ఆస్తికతా, శ్రద్ధా వినయాలు; లేని నరులు= లేనటువంటి మానవులు; ఎట్లున్= ఏ విధంగా; పాపములన్= పాపాలను; తొలఁగన్+నేర్తురు+ఎ?= పోగొట్టుకొనగలుగుతారు? (పోగొట్టుకొనలేరని భావం.)

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. భగవంతుడి పట్ల విశ్వాసం, శ్రద్ధ, వినయం ఉన్నవాళ్ళే ప్రాయశ్చిత్తా లన్నింటికీ అర్హులు. అవి లేనివారు పాపాలను ఎట్లా పోగొట్టుకొంటారు?

**వ. ఆస్తికతా శ్రద్ధా వినయంబులు నీకు సహజంబులు గావే! కావునఁ బ్రాయశ్చిత్తంబు లల్పంబు లైననుం బాపంబులం బాపనోపుఁ; బాపం బని నీవు శంకించు కర్మంబు భారతయోధ వధంబ కాదె! యది యాత్మరక్షణంబునకై చేయుటం జేసియు, నుత్తమక్షత్రధర్మం బగుట నిరూపింపం బాపంబుం బొరయకున్న యది; యట్లుంగాక భవదంతఃకరణంబున జనియించిన కరుణయుం, బశ్చాత్తాపంబును, నిన్నుం బరిశుద్ధునింజేసె; నీవు ప్రాణబాధకంబు లగు తపశ్చరణంబులకుం జొరం జూడకుము; కురుకుల చూడామణిత్వంబునకు మూలంబయిన మహీపాలనం బాచరింపు' మనిన నబ్బాదరాయణుతో నమ్మేదినీరమణుం 'డపేయంబులు నభోజ్యంబులు నెయ్యవి? యపాత్రభూతపురుషు లెట్టివారు? మహాపురుషా! యెఱింగింపవే' యని యడిగిన నతం డిట్లనియె. 320**

**ప్రతిపదార్థం:** ఆస్తికతా= భగవంతుడియందు విశ్వాసబుద్ధి; శ్రద్ధా= ఆసక్తి; వినయంబులు= వినమ్రత; నీకున్= నీకు (ధర్మరాజుకు); సహజంబులు= స్వభావసిద్ధమైనవి; కావు+ఏ!= కదా!; కావునన్= కనుక; ప్రాయశ్చిత్తంబులు= పాపపరిహార కర్మలు; అల్పంబులు+ఐననున్= తక్కువవి అయినా; పాపంబులన్= దురితాలను; పాపన్= పోగొట్టటానికి; ఓపున్= సమర్థములై ఉన్నాయి; పాపంబు+అని= అఘమని; నీవు శంకించు= నీవు అనుమానించే; కర్మంబు= పని; భారత= భరతవంశానికి చెందిన; యోధ= వీరుల; వధంబు+అ= సంహారమే; కాదు+ఎ!= కదా!; అది= ఆ పని; ఆత్మరక్షణంబునకున్+ఐ= తనను తాను రక్షించుకొనటానికి; చేయుటన్+చేసియున్= చేయటం వలన; ఉత్తమ= శ్రేష్ఠమైన; క్షత్రధర్మంబు= రాజోచిత కర్తవ్యం; అగుట= అవటం; నిరూపింపన్= నిరూపించటం వలన; పాపంబున్= దురితాన్ని; పొరయన్= పొందక; ఉన్న+అది= ఉన్నది; అట్లున్+కాక= అంతేకాక; భవత్= నీ; అంతఃకరణంబునన్= మనస్సులో; జనియించిన= పుట్టిన; కరుణయున్= దయయూ; పశ్చాత్తాపంబును= చేసిన పనికి బాధపడటం; నిన్నున్= నిన్ను; పరిశుద్ధునిన్= పవిత్రుడిగా; చేసెన్= చేశాయి; నీవు; ప్రాణబాధకంబులు+అగు= ప్రాణానికి కష్టం కలిగించేవి అయిన; తపశ్చరణంబులకున్= తపస్సు చేయటం మొదలైన పనులు; చొరన్+చూడకుము= మొదలుపెట్టాలనుకొనవద్దు; కురుకుల= కురువంశంయొక్క; చూడామణిత్వంబునకున్= ఉన్నతమైన గౌరవార్హమైన స్థితికి; మూలంబు+అయిన= కారణమైన; మహీపాలనంబు= భూమిని పరిపాలించటం; ఆచరింపుము= చేయుము; అనినన్= అనగా; ఆ+బాదరాయణుతోన్= ఆ వ్యాసుడితో; ఆ+మేదినీరమణుండు= ఆ రాజు; అపేయంబులున్= తాగకూడనివి; అభోజ్యంబులున్= తినకూడనివి; ఏ+అవి?= ఏవి?; అపాత్రభూత= అనర్హులైన; పురుషులు= మానవులు; ఎట్టివారు?= ఎటువంటివారు?; ఎవరు?; మహాపురుషా!= మహానుభావా!; ఎఱింగింపుము+ఏ?= తెలియచేయవా? అని; అడిగినన్= అడుగగా; అతండు= ఆ వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆస్తిక్యబుద్ధి, శ్రద్ధ, వినయం నీ నైజాలే కదా! కనుక స్వల్ప ప్రాయశ్చిత్తాలు పాపాలను పోగొట్టుతాయి. నీవు పాపం అని సందేహించేది భరతవంశవీరుల సంహారమే కదా! అది ఆత్మరక్షణకొరకు చేసిందే కాక ఉత్తమమైన రాజధర్మం అని నిరూపించబడటం వలన పాపం కాదు. అంతేకాదు. నీ మనస్సులో కలిగిన దయ, పశ్చాత్తాపాల కారణంగా నీవు నిర్మలుడ వయ్యావు. అందువలన నీవు తపస్సు మొదలైన పనులు ప్రారంభించకుము. కురువంశం సర్వశ్రేష్ఠంగా గౌరవించబడటానికి కారణమైన రాజ్యపాలనం నిర్వర్తించుము' అని చెప్పిన వ్యాసుడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'మహానుభావా! తాగకూడనివి, తినకూడనివి ఏవి? ఎటువంటివారు అయోగ్యులు? తెలియచెప్పవలసినది'. దానికి వ్యాసు డిట్లా చెప్పటం మొదలుపెట్టాడు.

**క. తురగియు నుష్ట్రియు ఖరియును । గురిసిన దుగ్ధములు నింద్యకోటి గణితముల్**
**ధరణీసురాది జను ల । ప్పొరువునఁ బోయిన నఘంబుఁ బొందుదు రధిపా! 321**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; తురగియున్= ఆడగుర్రం; ఉష్ట్రియున్= ఆడ ఒంటె; ఖరియును= ఆడ గాడిద; కురిసిన= స్రవించిన; దుగ్ధములు= పాలు; నింద్య= నిందించదగిన; కోటి= సముదాయంగా; గణితముల్= పరిగణించబడ్డాయి; ధరణీసుర= బ్రాహ్మణ; ఆది= మొదలైన; జనులు= మానవులు; ఆ+పొరువునన్= వాటి సమీపానికి; పోయినన్= వెళ్ళినట్లయితే; అఘంబు= పాపం; పొందుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఆడ గుర్రం, ఆడ ఒంటె, ఆడ గాడిద ఇచ్చినపాలు నిందించ తగినవిగా పరిగణిస్తారు. బ్రాహ్మణులు మొదలైనవారు వాటి సమీపానికి వెళ్ళితే పాపం పొందుతారు.

**సీ. మానుషక్షీరంబు, నీనిన పదినాళ్ల । లోనిధేనువుల పాలును నపేయ**
**ములు; ప్రేతవిషయాన్నమును, సూతకాన్నంబుఁ, । దలవరియన్నంబుఁ, గులటయన్న**
**మును, వనితోపజీవనశీలు నన్నంబు, । నాడెడు పాడెడునట్టివాని**
**యన్నంబు, జూదరియన్నంబు, సూనరి । యన్నంబు బహివెట్టినతని యన్న**

**ఆ. మును, నిజాగ్రజునకు మును పెండ్లియాడిన । పురుషు నన్నమును, నభోజ్య మండ్రు;**
**వందియన్న మధిక నిందాస్పదంబు; ప । ర్యుషిత శుష్కములను నుడుగవలయు. 322**

**ప్రతిపదార్థం:** మానుషక్షీరంబు= మానవులపాలు; ఈనిన= ప్రసవించిన; పదినాళ్ళ= పదిరోజుల; లోని= లోపు; ధేనువుల= ఆవుల; పాలునున్= పాలునూ; అపేయములు= త్రాగకూడనివి; ప్రేతవిషయ= శవసంబంధమైన; అన్నమును= ఆహారం; సూతక+అన్నంబున్= అశౌచాలలోని (జాత అశౌచం - పురుడు, మృత అశౌచం - మైల) ఆహారం; తలవరి= తలారి; అన్నంబును= ఆహారం; కులట= వేశ్య అయిన స్త్రీ; అన్నమును= ఆహారం; వనిత= స్త్రీని; ఉపజీవనశీలుని= అనుసరించి జీవనం గడిపేవాడి (జీవనానికి స్త్రీపై ఆధారపడినవాడి); అన్నంబున్= ఆహారం; ఆడెడు= ఆడుతూ; పాడెడు= పాడుతూ ఉండే; అట్టివాని= అటువంటివాడి; అన్నంబు= ఆహారము; జూదరి= జూదగాడి; అన్నంబు= ఆహారం; సూనరి= పూలమ్మి బతికేవాడి; అన్నంబు= ఆహారం; బహి+పెట్టిన+అతని= వెలివేసినవాడి; అన్నమును= ఆహారం; నిజ= తన; అగ్రజునకున్= అన్నకన్న; మును= ముందుగా; పెండ్లి+ఆడిన= వివాహం చేసికొన్న; పురుషుని= మానవుడి; అన్నమునున్= ఆహారం; అభోజ్యము= తినతగనిది; అండ్రు= అంటారు; వంది= భట్టు (స్తుతి చేసి జీవించేవాడు); అన్నము= ఆహారం; అధిక= ఎక్కువగా; నిందా+ఆస్పదంబు= నిందకు తగినవి; పర్యుషిత= నిలవచేయబడినవి; శుష్కములనున్= ఎండినవి (వరుగులు); ఉడుగవలయున్= వదలివేయాలి.

**తాత్పర్యం:** మనిషిపాలు, ఈనిన పదిరోజుల లోపుగా ఆవుపాలు త్రాగకూడనివి. శవసంబంధమైనది అశౌచమైన (పురుడు, మైల సంబంధమైన)ది, తలారి ఇచ్చినది, కులట ఇచ్చినది, బ్రతుకు తెరువుకు స్త్రీపై ఆధారపడిన వాడు ఇచ్చినది, ఆడుతూ పాడుతూ ఉండేవాడు ఇచ్చినది, జూదగాడిచ్చినది, పూలమ్ముమవాడు ఇచ్చినది, వెలివేసినవాడు ఇచ్చినది, అన్నకంటె ముందు పెండ్లి చేసికొన్నవాడు ఇచ్చినది అయిన ఆహారం తినకూడనిది. స్తుతి చేసి జీవించేవాడి ఆహారం మరీ నిందించ తగినది. పాచిపోయినది (నిలవది), ఎండినది అయిన ఆహారాన్ని వదలివేయాలి.

**క. విను! సురతోఁ గూడఁగఁ దె । చ్చినయట్టిది యెద్దియును భుజింప రభోజ్య**
**త్వ నిరూపణ నిపుణతగల । మనుజోత్తము లఖిలలోకమాన్యచరిత్రా! 323**

**ప్రతిపదార్థం:** అఖిల= సమస్త; లోక= లోకంచేత; మాన్య= గౌరవించదగిన; చరిత్రా!= నడవడిక కలవాడా!; విను= ఆలకించుము; సురతోన్= కల్లుతో; కూడఁగన్= కలిపి; తెచ్చిన+అట్టిది= తీసికొనివచ్చినటువంటిది; ఎద్దియును= ఏదికూడ; అభోజ్యత్వ= తినకూడనివి; నిరూపణ= నిర్ధారించే; నిపుణత= నేర్పరితనం; కల= ఉన్న; మనుజ+ఉత్తములు= మానవశ్రేష్ఠులు; భుజింపరు= తినరు.

**తాత్పర్యం:** లోకంలో అందరిచేతా గౌరవించబడే ప్రవర్తన కల ధర్మరాజా! వినుము. తినకూడని వాటిని నిర్ధారించే చాతుర్యం ఉన్న ఉత్తములైనవారు కల్లుతో కలిపి తెచ్చిన వస్తువు ఏదైనా తినరు.

**క. పులగముఁ బాయస మట్టులుఁ । బలలము నర్చనకుఁ గాక పక్వములయినం**
**గలుగు నభోజ్యత్వము వి । చ్చలవిడి వంటకము సేసి చనదు భుజింపన్.' 324**

**ప్రతిపదార్థం:** పులగమున్= ముద్గాన్నము (పెసరపప్పు బియ్యం కలిపి వండిన అన్నం); పాయసము= పరమాన్నం; అట్టులు= అపూపములు; పలలము= నువ్వులపొడి (మాంసం అనే అర్థం కూడా ఉన్నది); అర్చనకున్+కాక= దేవతారాధనకు కాక; పక్వములు= వండినవి; అయినన్= అయితే; అభోజ్యత్వము= తినగూడకపోవటం; కలుగున్= కలుగుతుంది; విచ్చలవిడి= యథేచ్ఛగా; వంటకము= వండిన పదార్థాన్ని; చేసి= తయారుచేసి (వండి); భుజింపన్= తినటం; చనదు= కూడదు.

**తాత్పర్యం:** పులగం (పొంగలి), పరమాన్నం, అప్పాలు మొదలైన పిండివంటలు, నువ్వులపిండి మొదలైనవి దేవతార్చనకే వండాలి. అట్లా కాకపోతే అవి తినగూడనివి అవుతాయి. కనుక యథేచ్ఛగా వండి తినకూడదు.'

**వ. అని వెండియు. 325**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా చెప్పి; వెండియున్= తిరిగి, ఇంకా.

**తాత్పర్యం:** వ్యాసు డీ విధంగా చెప్పి ఇంకా (ఇట్లా అన్నాడు):

**తే. అతిథి పితృదేవతా పూజ లాచరించి । కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడువఁ**
**దగదు; యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ । నార్యజనములు సెప్పుదు రధిపవర్య! 326**

**ప్రతిపదార్థం:** అధిపవర్య!= రాజోత్తమా! ధర్మరాజా!; అతిథి= విందుల (ఇంటికి వచ్చిన వాళ్ళు); పితృదేవతా= పితృదేవతల; పూజలు= అర్చనలు; ఆచరించి కాని= చేసికాని; గృహమేధులకున్= ఇంటి యజమానులకు; భోజ్యము+ఐనన్= తినదగినదైనా; కుడువన్= తినటం; తగదు= కూడదు; యజ్ఞవిశిష్టంబు= యజ్ఞంలో మిగిలినది (ప్రసాదం); అమృతంబు+కాఁగన్= అమృతమౌతుందని; ఆర్యజనులు= పెద్దలు; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! గృహస్థాశ్రమ ధర్మాన్ని పాటించేవారు అతిథిపూజ, పితృదేవతాపూజ, దేవతాపూజ చేసికొని గాని తినదగిన దానినైనా తినరాదు. యజ్ఞంలో మిగిలినది (యజ్ఞప్రసాదం) అమృతమౌతుం దని పెద్దలు చెప్పుతారు.

**క. ఆలును బిడ్డలు బంధులు । నై లీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త**
**ల్లోలత్వరహిత చిత్తత । మేలుగ నలవఱుపవలయు మీఁ దెఱిఁగి నృపా!' 327**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; గృహస్థుఁడు= యజమాని; ఆలును= భార్య; బిడ్డలు= పిల్లలు; బంధులున్= చుట్టాలు; ఐ= అయి; లీలన్= క్రీడాప్రాయంగా; చరించుచును= ప్రవర్తిస్తూ; మీఁదు= తదుపరి రాబోయేది; ఎఱిఁగి= తెలిసికొని; తద్+తద్= ఆయా; లోలత్వరహిత= ఊగిసలాట లేని, స్థిరమైన; చిత్తత= మనసు కలిగించటాన్ని; మేలుగన్= బాగుగా; అలవఱుప వలయున్= అలవాటు చేయాలి, ప్రవర్తించాలి.

**తాత్పర్యం:** రాజా! గృహస్థుడు (గృహస్థాశ్రమ ధర్మం పాటించేవాడు) భార్య, పిల్లలు, చుట్టాలు అంటూ క్రీడాప్రాయంగా చరిస్తూనే, తరువాత రాబోయేది (పరం) గుర్తించి, ఆ బంధాలలో పూర్తిగా నిమగ్నం కాని మనస్సు కలిగి ఉండటాన్ని అలవాటు చేసికొనాలి (సాధన చేయాలి). ఇహంలో ఉంటూ అందులో మునిగిపోక పరం గుర్తించి సాధన చేయాలి'.

**కృష్ణద్వైపాయనుఁడు ధర్మజునకు నపాత్రపురుషుల నెఱింగించుట (సం. 12-37-23)**

**వ. అని యిట్లు చెప్పి 'యపాత్రభూతపురుషుల నాకర్ణింపు'మని పలికి. 328**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ఇట్లు= ఈ విధంగా; చెప్పి= పలికి; అపాత్రభూతపురుషులన్= దాన యోగ్యత లేని వారయిన మానవులను గూర్చి; ఆకర్ణింపుము= వినుము; అని పలికి= అని మాట్లాడి.

**తాత్పర్యం:** వ్యాసు డీ విధంగా చెప్పి 'దాన యోగ్యత లేని మానవులను గూర్చి చెప్పుతాను వినుము'. అని పలికి- (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. పాడియు నాడియు బ్రదుకు వారలఁ బరి । హాసకు దుర్జను నంగహీను**
**మత్తుని మ్రుచ్చు నున్మత్తు నపుంసకుఁ । జెనఁటి మాటలఁ దేల్చు మనుజుఁ గులము**
**చాలమి వేదంబు చదువమి నిజవృత్తి । హాని దుర్వృత్తి గలట్టి వాని**
**దానపాత్రంబులుగా నియ్యకొనరు పె । ద్దలు; దీనుఁడును విపద్బాధితుండు**

**తే. నీగి కర్హులు; దయపేర్మి నిచ్చుచోట । నైన నవగుణ మెక్కుడై కానఁబడిన**
**నిందితాత్ముల కిచ్చుట నిష్ఫలంబు; । పాత్ర నిశ్చయ మిట్టిది పౌరవేంద్ర! 329**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర= పురువంశోత్తమ!; పాడియున్= గానంచేసి; ఆడియున్= నృత్యంచేసి; బ్రదుకు= జీవించే; వారలన్= వారిని; పరిహాసకున్= విదూషకుడిని; దుర్జనున్= దుష్టుడిని; అంగహీనున్= అంగవైకల్యం కలవాడిని; మత్తునిన్= మదించిన వాడిని; మ్రుచ్చున్= దొంగను; ఉన్మత్తున్= పిచ్చివాడిని; నపుంసకున్= షండుడిని; చెనఁటి= కుత్సితపు; మాటలన్= మాటలతో; తేల్చు= తేలియాడునట్లు చేసే; మనుజున్= మానవుడిని; కులము= వంశం; చాలమి= చాలకపోవటం; (సద్వంశసంజాతుడు కాకపోవటం); వేదంబు చదువమి= వేదాధ్యయనం చేయకపోవటం; నిజవృత్తి= తనదైన ధర్మానికి; హాని= చేటు; దుస్+వృత్తి= చెడువర్తనం; కల+అట్టి= కలిగినటువంటి; వానిన్= వ్యక్తిని; పెద్దలు= ఆర్యులు; దానపాత్రంబులు+కాన్= దానం చేయటానికి అర్హులనుగా; ఇయ్యకొనరు= అంగీకరించరు; దీనుఁడును= శోచనీయమైన స్థితిలో ఉన్నవాడు; విపద్+బాధితుండును= ఆపదలచేత కష్టపడుతున్నవాడు; ఈగికిన్= దానానికి; అర్హులు= యోగ్యులు; దయపేర్మిన్= ఎక్కువకరుణతో; ఇచ్చు+చోటన్+ఐనన్= ఇచ్చేటటువంటి చోట అయినా; అవగుణము= దుర్గుణం; ఎక్కుడు+ఐ= అధికంగా; కానఁబడిన= కనబడిన; నిందిత+ఆత్ములకున్= దూష్యులకు; ఇచ్చుట= దానం చేయటం; నిష్ఫలంబు= వృథ; పాత్ర నిశ్చయము= యోగ్యతను నిర్ణయించటం; ఇట్టిది= ఇటువంటిది.

**తాత్పర్యం:** పురువంశశ్రేష్ఠుడవైన ధర్మరాజా! ఆటపాటలతో జీవనం సాగించే గాయకులు నటులు, విదూషకులు, దుష్టులు, అంగవికలులు, మదించినవారు, దొంగలు, పిచ్చివారు, నపుంసకులు, కుత్సితమైన మాటలతో మోసం చేసేవారు, కులహీన, విద్యావిహీనులై, కులవృత్తిని వదలి, చెడునడత కలిగినవారు - వీరినందరను పెద్దలు దానానికి అర్హులుగా అంగీకరించరు. దీనులు, ఆపదలలో కొట్టుమిట్టాడుతున్నవారు దానానికి అర్హులు. దయపెచ్చుపెరిగి ఇచ్చేప్పుడు కూడా దుర్గుణాలు ఎక్కువగా ఉన్న నిందార్హులకు దానం చేయటం నిష్ఫలం. దానపాత్రత నిర్ణయం ఇది.

**క. శిల చేవమ్రాను దెప్పగ । జలనిధిఁ గడవ దొరకొనిన చాడ్పగుఁ బాత్రం**
**బులు గానియెడల దానం । బులఁ బాపము నిస్తరింప బుద్ధిఁ దలఁచినన్. 330**

**ప్రతిపదార్థం:** పాత్రంబులు= అర్హములు; కాని= కానట్టి; ఎడలన్= తావుల; దానంబులన్= దానం చేయటం వలన; పాపము= దురితాన్ని; నిస్తరింపన్= దాటటానికి (పోగొట్టుకొనటానికి); బుద్ధిన్= మనసులో; తలఁచినన్= ఆలోచించినట్లయితే; శిల= రాయి; చేవమ్రానున్= బాగా ముదిరిన చెట్టు; తెప్పగన్= తెప్పకొయ్య (నదిని దాటటానికి ఉపయోగించే కొయ్య)గా చేసికొని; జలనిధిన్= సముద్రాన్ని; కడవన్= దాటటం; దొరకొనిన= పూనుకొన్న; చాడ్పు= తీరు; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** అనర్హులైన వారికి దానం చేసి దానివలన పాపం పోగొట్టుకోవాలనుకోవటం - రాతిని, ముదిరిన చెట్టుకొయ్యను తెప్పగా చేసికొని సముద్రం దాటాలనుకోవటం అవుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ । ళ్ళధిక నిందఁ బొరయునట్లు దుష్ట**
**మై యపాత్ర విషయ మగు నీగి వృథవోవు । నిచ్చుచోటఁ బాత్ర మెఱుఁగవలయు. 331**

**ప్రతిపదార్థం:** పునుకన్= కపాలం (పుర్రెలో); కుక్కతిత్తిన్= నికృష్టమైన తోలుసంచిలో; పోసిన= ఉంచిన; పాలు= క్షీరం; నీళ్ళు= జలం; అధికనిందన్= ఎక్కువ దోషాన్ని; పొరయున్+అట్లు= పొందే విధంగా; దుష్టము+ఐ= చెడ్డదై; అపాత్ర విషయము+అగు= అనర్హులైన వారికి ఇచ్చిన; ఈగి= దానం; వృథ+పోవున్= వ్యర్థం అవుతుంది; ఇచ్చుచోటన్= దానం చేసే తావున; పాత్రము= అర్హతను; ఎఱుఁగన్+వలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** కపాలంలోనూ, నికృష్టమైన (కుక్క) తోలుసంచిలోనూ పోసిన పాలు, నీళ్ళు దోషభూయిష్ఠం అయినట్లే, చెడ్డదైన అపాత్రదానం నిష్ఫలం. కనుక దానం చేసేటప్పుడు పాత్రతను తెలిసికొనాలి.

**తే. షండునకు బిడ్డ నిచ్చిన చందమొందు, । బూదిలో నేయి వేల్చుటఁ బోలు, నోటి**
**కడవ నీళ్ళులు వెట్టిన కరణియగు న । పాత్రజనులకుఁ బెట్టుట పౌరవేంద్ర! 332**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర!= పురువంశోత్తమా! ధర్మరాజా!; అపాత్రజనులకున్= అనర్హులైనవారికి; పెట్టుట= ఇవ్వటం (దానం చేయటం); షండునకున్= నపుంసకుడికి; బిడ్డను= పిల్లను; ఇచ్చిన= ఒసగిన; చందము= తీరు; ఒందున్= అవుతుంది; బూదిలోన్= బూడిదలో; నేయి= ఆజ్యం; వేల్చుటన్= హోమం చేయటాన్ని; పోలున్= పోలుతుంది; ఓటికడవన్= ఓటికుండలో; నీళ్ళులు= నీళ్ళు; పెట్టిన= ఉంచిన; కరణి= తీరు; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** పురువంశోత్తమా! ధర్మరాజా! అయోగ్యులకు దానం చేయటం అనేది నపుంసకుడికి కన్య నిచ్చినట్లు, బూడిదలో నేతిని హోమం చేసినట్లు, ఓటికుండలో నీళ్ళు పోసినట్లు నిష్ఫలం అవుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. దానవిధి యరయ నసమీ । చీనంబగునేని కీడు సేయుం గురుధా**
**త్రీనాథ! మఱియుఁ బాత్రం । బైనను గొన్నతని కిచ్చునతనికి నెట్లున్. 333**

**ప్రతిపదార్థం:** కురుధాత్రీనాథ!= కురురాజా!; అరయన్= పరికించి చూడగా; దానవిధి= దానపద్ధతి; అసమీచీనంబు= తగినది కానిది; అగును+ఏని= అయినట్లయితే; కీడు= హాని; చేయున్= చేస్తుంది; మఱియున్= ఇంకా; పాత్రంబు+ఐనను= తగినది

అయితే; కొన్న+అతనికిన్= దానం స్వీకరించినవాడికి; ఇచ్చు+అతనికిన్= ఇచ్చినవాడికి; ఎట్లున్= ఏ విధమో; (అదే విధమైన మేలు జరుగుతుందని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! దాన పద్ధతి తగినది కాకపోతే కీడు కలిగిస్తుంది. అదే తగినదైతే దానం చేసిన వ్యక్తివలె పుచ్చుకొన్న వ్యక్తికి కూడ అవుతుంది. అంటే మేలు జరుగుతుంది.

**క. కావున విను పాత్రము మే । లై విహితాచరణ సౌమ్యమగు దానము ధా**
**త్రీవర! దాత్రాదాతల । దా వెలయించు భువనద్వితయరంజకతన్.' 334**

**ప్రతిపదార్థం:** ధాత్రీవర!= రాజా!; విను= ఆలకించుము; కావునన్= అందువలన; పాత్రము= యోగ్యత; మేలు+ఐ= శ్రేష్ఠమై; విహిత= విధ్యుక్తంగా; ఆచరణ= చేయబడింది; సౌమ్యము= తిన్ననిది; అగు= అయిన; దానము= ఈవి; దాత్రాదాతలన్= దానం పుచ్చుకున్న వారిని, ఇచ్చినవారిని; తాన్= తాను; భువనద్వితయ= రెండులోకాలలోనూ (ఇహపరాల్లో); రంజకతన్= సంతోషాన్ని; వెలయించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. యోగ్యమై చక్కగా విధ్యుక్తంగా చేసిన దానం పుచ్చుకొన్నవాడికి ఇచ్చినవాడికి ఇరువురికీ ఇహపరాలలో సంతోషాన్ని కలిగిస్తుంది.'

**వ. అని చెప్పి 'యేను నీకు బుద్ధులు సెప్పంజొచ్చి సంక్షేపరూపంబునం గీడు మే లెఱింగించితి; నిప్పలుకులు పాటిగాఁ గొని విహితానుష్ఠానపరుండ వగు' మనుటయు, నమ్మనుజపతి యమ్మునిపతితో 'మహాత్మా! భవదనుగృహీతంబు లైన యివ్వాక్యంబులు హర్షంబు నావహించె; నెప్పాట ధర్మంబగు మార్గం బవలంబించి రాజ్యతంత్రంబు నడపి, యశుభంబునం దొడరక జయింతు; నట్టి తెఱంగు గలుగం గృపసేసి రాజధర్మంబులుం దక్కునుం గలుగు వర్ణాశ్రమ ధర్మంబులు నాపద్ధర్మంబులును లోనుగా నెఱుంగం దగు ధర్మంబులెల్ల నెఱింగింపవే! నాకుం జూడ రాజ్యంబును ధర్మచర్యయును బరస్పర విరుద్ధంబు లయినట్లున్నవి గావున నివ్విధంబున విన్నవింప వలసె'నని చెప్పుటయు, నత్తాపసోత్తముండు ప్రీతచిత్తుండై యతండు విన నారదుతోడ 'నీ భూపతి భీష్ము పాలికిం బోవలయు; నయ్యార్యవర్యు చేత సకల ధర్మంబులు వినువాఁ డగుట యర్హప్రకారం' బనవుడు నారదుం 'డిది లెస్స'యని పలికిన నప్పరాశరపుత్త్రుం డయ్యజాతశత్రున కిట్లనియె. 335**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; చెప్పి= పలికి; ఏను= నేను; నీకున్; బుద్ధులు= జ్ఞానబోధ; చెప్పన్= చెప్పటం; చొచ్చి= మొదలుపెట్టి; సంక్షేపరూపంబునన్= క్లుప్తంగా; కీడు= హాని; మేలు= మంచి; ఎఱింగించితిని= తెలియచెప్పాను; ఈ+పలుకులు= ఈ మాటలు; పాటి+కాన్= ప్రమాణంగా; కొని= గ్రహించి; విహిత= విధ్యుక్తమైన; అనుష్ఠాన పరుండవు+అగుము= నియమాలను ఆచరించేవాడివి కమ్ము; అనుటయున్= అనగా; ఆ+మనుజపతి= ఆరాజు (ధర్మరాజు); ఆ+మునిపతితోన్= ఆ వ్యాసుడితో; మహా+ఆత్మా!= మహానుభావా!; భవత్+అనుగృహీతంబులు+ఐన= నీవు దయ చేసినటువంటి; ఈ+వాక్యంబులు= ఈ మాటలు; హర్షంబును= సంతోషాన్ని; ఆవహించెన్= కలిగించాయి; ఏ+పాటన్= ఏ విధంగా; ధర్మంబు+అగు= వేదోక్తమైన ధర్మరూపంగల; మార్గంబు= పద్ధతి; అవలంబించి= పాటించి; రాజ్యతంత్రంబు= రాజ్యపాలనా వ్యవహారం; నడపి= నిర్వర్తించి; అశుభంబునున్= అమంగళం; తొడరక= కలగక; జయింతున్= నెగ్గుతాను; అట్టి= అటువంటి; తెఱంగు= పద్ధతి; కలుగన్= ఉండేటట్లు; కృప+చేసి= అనుగ్రహించి; రాజధర్మంబులున్= రాజులు ఆచరించవలసిన విధులు; తక్కునుం+కలుగు= మిగిలిన; వర్ణ+ఆశ్రమ ధర్మంబులు= చాతుర్వర్ణ్య చతురాశ్రమ ధర్మాలు; ఆపద్+ధర్మంబులును= ఆపదలలో చేయదగిన విధులు; లోనుగాన్= మొదలైన; ఎఱుంగన్+తగు= తెలిసికొనదగిన; ధర్మంబులు+ఎల్లన్= ధర్మాలు అన్నీ; ఎఱింగింపుము+ఏ?= తెలియచెప్పవా? (చెప్పవలసినదని భావం); నాకున్= నాకు; చూడన్= చూడగా; రాజ్యంబును= రాజ్యపరిపాలనను; ధర్మచర్యయును= ధర్మాచరణం; పరస్పర= ఒకదాని కొకటి;

విరుద్ధంబులు= వ్యతిరేకాలు; అయిన+అట్లు= అయిన విధంగా; ఉన్నవి= ఉన్నాయి; కావునన్= కనుక; ఈ+విధంబునన్= ఈ తీరులో; విన్నవింప= వేడుకొన; వలసెన్= వలసి వచ్చింది; అని= అంటూ; చెప్పుటయున్= చెప్పగా; ఆ+తాపస+ఉత్తముండు= ఆ తపస్వులలో శ్రేష్ఠుడైన వ్యాసుడు; ప్రీతచిత్తుండు+ఐ= సంతసించిన మనసు కలవాడై; అతండు= ఆ ధర్మరాజు; వినన్= వింటూ ఉండగా; నారదుతోడన్= నారద మహర్షితో; ఈ భూపతి= ఈ రాజు; భీష్మపాలికిన్= భీష్ముడి వద్దకు; పోవలయున్= వెళ్ళవలసి ఉన్నది; ఆ+ఆర్యవర్యుచేతన్= ఆ పూజనీయులలో శ్రేష్ఠుడైన భీష్ముడిచేత; సకల ధర్మంబులు= సమస్తమైన విధులు; వినువాఁడు= ఆలకించినవాడు; అగుట= అవటం; అర్హ= తగిన; ప్రకారంబు= పద్ధతి; అనవుడున్= అనగానే; నారదుండు; ఇది= ఈ మాట; లెస్స= మంచిది; అని+పలికినన్= అని అనగానే; ఆ+పరాశర పుత్రుండు= ఆ పరాశరుడి కుమారుడైన వ్యాసుడు; ఆ+అజాతశత్రునకున్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అంటూ చెప్పి, 'నేను నీకు జ్ఞానబోధ చేయటం మొదలుపెట్టి క్లుప్తంగా మంచిచెడులు తెలియపరిచాను. నేను చెప్పిన ఈ మాటలు ప్రమాణంగా గ్రహించి విధ్యుక్తధర్మాలను ఆచరించటంలో నిమగ్నుడవు కమ్మ' అనగా, ధర్మరాజు వ్యాసుడితో ఇట్లా అన్నాడు: 'మహానుభావా! నీవు దయచేసిన ఈ మాటలు సంతోషాన్ని కలిగించాయి. ఏ విధంగా ధర్మమార్గాన్ని ఆధారం చేసికొని రాజ్యపాలనావ్యవహారాన్ని నిర్వర్తించి అమంగళం (పాపం) కలుగకుండా నెగ్గగలనో ఆ పద్ధతి దయతో తెలియజెప్పి, రాజులు ఆచరించవలసిన విధులు, మిగిలిన వర్ణ, ఆశ్రమధర్మాలు, ఆపదలలో పాటించవలసిన ధర్మాలు, మొదలైన తెలిసికొనదగిన ధర్మా లనన్నింటిని తెలియపరచాలి. నాకు రాజ్యపాలన, ధర్మాచరణ ఒకదానికొకటి వ్యతిరేకమైనవిగా కనపడుతున్నాయి. కనుక ఈ విధంగా ప్రార్థించవలసి వచ్చింది' అనటంతో ఆ తపోధనుడు మనసులో సంతసించి ధర్మరాజు వింటూ ఉండగా నారదుడితో 'ఈ రాజు (ధర్మరాజు) భీష్ముడి దగ్గరకు వెళ్ళవలసి ఉన్నది. ఆ పూజనీయుడినుండి సమస్తధర్మాలు వినటం తగిన పద్ధతి' అన్నాడు. నారదుడు 'అదే మంచిది' అని అనగా వ్యాసుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**ఆ.** **కురుపితామహుండు గురుబుద్ధి నింద్రాదు । లకును మాననీయుఁ డకుటిలాత్మ**
**కుండు పరశురాము కోదండవిద్యాది । సుగుణములకు నెల్లఁ జొచ్చినిల్లు.** **336**

**ప్రతిపదార్థం:** కురుపితామహుండు= కురువంశంలోని వారి కందరకు పెద్ద అయిన భీష్ముడు; గురు= గొప్ప, ఘనమైన; బుద్ధిన్= మతిలో, తెలివిలో; ఇంద్ర+ఆదులకును= ఇంద్రుడు మొదలైన వారికి కూడ; మాననీయుఁడు= గౌరవించదగినవాడు; అకుటిల+ఆత్మకుండు= కుత్సితంలేని మనస్సు కలవాడు; పరశురాము= భార్గవరాముని యొక్క; కోదండ విద్య= విలువిద్య; ఆది= మొదలైన; సుగుణములకున్= మంచి లక్షణాలకు; ఎల్లన్= అన్నింటికి; చొచ్చిన+ఇల్లు= మెట్టినిల్లు.

**తాత్పర్యం:** 'కురువంశంలోని వారందరికి పెద్దదిక్కు అయిన భీష్ముడు తన గొప్ప మేధవలన ఇంద్రుడు మొదలైన వారికి కూడా పూజనీయుడు. నిర్మలమైన మనస్సుకలవాడు. పరశురాముడి విలువిద్య మొదలైన సద్గుణాలకన్నిటికీ నిలయమైనవాడు. (పరశురాముడి విద్యలు, సద్గుణాలు శిష్యుడైన భీష్ముడి వద్ద స్థిరనివాసం చేశాయి.)

**క.** **సురతటినీ పుణ్యతమో । దరమున జన్మించినాఁ డుదాత్తవ్రతత**
**త్పరుఁ డతని కెల్ల ధర్మముఁ । గరస్థలామలక సన్నికాశం బధిపా!** **337**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; సురతటినీ= సురగంగ; పుణ్యతమ= మిక్కిలి పుణ్యప్రదమైన; ఉదరమునన్= గర్భాన; జన్మించినాఁడు= పుట్టాడు; ఉదాత్త= గొప్ప; వ్రతతత్పరుఁడు= నియమాచరణంలో నిష్ఠకలవాడు; అతనికిన్= ఆ భీష్ముడికి; ఎల్లధర్మమున్= ధర్మశాస్త్రమంతా; కరస్థల= అరచేతియందుంచబడ్డ; ఆమలక= ఉసిరికతో; సన్నికాశంబు= సమానం.

**తాత్పర్యం:** ధర్మరాజా! మిక్కిలి పుణ్యవంతమైన సురగంగాగర్భానపుట్టాడు. గొప్పదైన నియమాన్ని నిష్ఠగా ఆచరిస్తున్నవాడు. ఆ భీష్ముడికి ధర్మాలన్నీ కరతలామలకం వంటివి.

**క. చ్యవనుఁడు మార్కండేయుం । డు వసిష్ఠుఁడు లోనుఁగా బటు ప్రాజ్ఞులు గా**
**రవమున వినిపింపఁగఁ దెలి । య వినియె ధర్మప్రపంచ మతఁ డఖిలంబున్. 338**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భీష్ముడు; చ్యవనుఁడు; మార్కండేయుండు; వసిష్ఠుఁడు; లోనుగాన్= మొదలైన; పటు= గట్టి; గొప్ప; ప్రాజ్ఞులు= తెలిసినవారు; గారవమునన్= ఆదరంతో; వినిపింపఁగన్= చెప్పగా; తెలియన్= బాగా బోధపడేటట్లుగా; ధర్మప్రపంచము= ధర్మం యొక్క విస్తృతిని; అఖిలమున్= అంతటినీ; వినియెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** చ్యవనుడు, మార్కండేయుడు, వసిష్ఠుడు మొదలైన గొప్ప పండితులు ఆదరంతో బాగా బోధచేయగా ఆ భీష్ముడు ధర్మంయొక్క సమగ్రస్వరూపాన్ని తెలిసికొన్నాడు.

**తే. శాంతమానసుఁడైన యా శాంతనవుఁడు । విస్మయావహ చరితుండు; వినుము వలసి**
**నపుడు విడుచుటకై ప్రాణ మాఁగినాఁడు । గాదె! యొరు లంతవా రెందుఁ గలరె నరులు. 339**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! వినుము; శాంతమానసుఁడు+ఐన= రాగద్వేషాదులు లేని ప్రశాంతమైన మనస్సు; కలవాడైన; శాంతనవుఁడు= శంతనుడి కుమారుడు భీష్ముడు; విస్మయ+ఆవహ= ఆశ్చర్యం కలిగించే; చరితుండు= చరిత్ర కలవాడు; వలసిన+అపుడు= ఇష్టమైన (తగిన) సమయంలో; విడుచుటకున్+ఐ= వదలటంకొరకు; ప్రాణము= శరీరంలో జీవాన్ని; ఆఁగినాఁడు= నిలిపాడు; కాదు+ఎ!= కదా!; నరులు= మానవులు; ఒరులు= ఇతరులు; అంతవారు= అంతటి వారు; ఎందున్= ఎక్కడైనా; కలరు+ఎ?= ఉన్నారా? (లేరని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. ప్రశాంత చిత్తం కలవాడైన భీష్ముడి చరిత్ర ఆశ్చర్యం కలిగిస్తుంది. తగిన సమయంలో వదలటానికి ప్రాణాలు నిలిపి ఉన్నాడు. ఎక్కడైనా ఇతర మానవులు అంతటి వారున్నారా? (లేరు కదా అని భావం).

**చ. అతనికి నీ పయిం గరుణ యగ్గల; మట్లగుటం గురుక్షమా**
**పతివర! పొమ్ము నీ వతనిపాలికి; నాతఁడు నిన్ను సంప్రబో**
**ధితుఁడుగఁ జేయు ధర్మములు దేటపడంగ నుపన్యసించు; మా**
**మత మిది; దీనఁ గీర్తియు సమంచిత ధర్మముఁ బెంపు నొందెడున్. 340**

**ప్రతిపదార్థం:** కురుక్షమాపతి వర!= కురువంశరాజులలో ఉత్తముడవైన ధర్మరాజా!; అతనికిన్= అట్టి భీష్ముడికి; నీపయిన్= నీమీద; కరుణ= దయ; అగ్గలము= అధికం; అట్లు= ఆ విధంగా; అగుటన్= కావటం వలన; నీవు; అతనిపాలికిన్= ఆ భీష్ముడి వద్దకు; పొమ్ము= వెళ్ళుము; ఆతఁడు= ఆ భీష్ముడు; నిన్ను; సం+ప్రబోధితుడుగన్= బాగా బోధపడినవాడినిగా (తెలిసినవాడిగా); చేయున్= చేస్తాడు; ధర్మములు= విధులు; తేటపడంగన్= స్పష్టమయ్యేటట్లుగా; ఉపన్యసించున్= వివరిస్తాడు; ఇది; మా మతము= మా అభిప్రాయం; దీనన్= ఈ పనివలన; కీర్తియున్= యశం; సమంచిత= చక్కని; ధర్మమున్= వేదచోదిత ధర్మం కూడా; పెంపున్= వృద్ధిని; ఒందెడున్= పొందుతుంది.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠుడవైన ధర్మరాజా! అట్టి జ్ఞానవంతుడైన భీష్ముడికి నీమీద దయ చాల ఎక్కువ. కనుక నీ వతడి వద్దకు వెళ్ళుము. అతడు నీకు బాగా జ్ఞానప్రబోధ చేసి, ధర్మాలు మరింత తేలికగా అర్థమయ్యే

విధంగా వివరిస్తాడు. ఇది మా అభిప్రాయం. ఈ పనివలన నీకు మంచి కీర్తి, చక్కని వేదచోదితధర్మం వృద్ధి పొందుతాయి.

**వ. అయ్యుత్తమోత్తమునకు నూర్ధ్వలోక గమనంబునకు సమయం బాసన్నంబగుచు వచ్చెం; దడయ కట్లు సేయు' మనిన విని యవ్వసుమతీపతి 'మునీంద్రా! బహుబంధు వధపాతకం బాచరించి యమ్మాననీయాత్ము నెదిరి కెట్లు వోదు? నట్లుం గాక యకృత్రిమ సమరశీలియగు నగ్గుణశాలిం గృత్రిమ సమరంబునం గూల్చి, క్రమ్మఱ నమ్మహాత్ము మొగంబు సూచి, నాకు ధర్మంబు లుపదేశింపవే యని యడుగ నేర్తునే?' యనుటయు నజ్జననాథునకు జనార్దనుం డిట్లనియె. 341**

**ప్రతిపదార్థం:** ఆ+ఉత్తమ+ఉత్తమునకున్= ఆ శ్రేష్ఠాతిశ్రేష్ఠుడికి; ఊర్ధ్వలోక= పైలోకాలకు; గమనంబునకున్= వెళ్ళటానికి; సమయంబు= కాలం; ఆసన్నంబు+అగుచున్= దగ్గరవుతూ; వచ్చెన్= వచ్చింది; తడయక= ఆలసించక; అట్లు= మేము చెప్పినట్లు; చేయుము; అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+వసుమతీ+పతి= భూభర్త, ధర్మరాజు; ముని+ఇంద్రా!= మునివర్యా!; బహు= అనేక; బంధు= చుట్టాలను; వధ= చంపటం అనే; పాతకంబు= పాపం; ఆచరించి= చేసి; ఆ+మాననీయ+ఆత్మ= ఆ మహాత్ముడి; ఎదిరికిన్= ఎదుటికి; ఎట్లు= ఏ విధంగా; పోదున్?= వెళ్ళగలను?; అట్లున్+కాక= అంతేకాక; అకృత్రిమ= అసహజంకాని; సమరశీలి అగు= యుద్ధం చేసే స్వభావం కలవాడైన; ఆ+గుణశాలిన్= ఆ గుణవంతుడిని; కృత్రిమము+ఐన= అసహజమైన; సమరంబునన్= యుద్ధంలో; కూల్చి= పడగొట్టి; క్రమ్మఱన్= తిరిగి; ఆ+మహాత్మ= ఆ మహానుభావుడి; మొగంబు= ముఖం; చూచి= ఆలోకించి; నాకున్; ధర్మంబులు= ధర్మపద్ధతులు; ఉపదేశింపవు+ఏ?= బోధ చేయవా?; అని= అంటూ; అడుగన్= అడగటానికి; నేర్తును+ఏ?= సమర్థుడనవుతానా?; అనుటయున్= అనగా; ఆ+జననాథునకున్= ఆ రాజునకు; జనార్దనుండు= శ్రీ కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ శ్రేష్ఠుడైన భీష్ముడు పై లోకాలకు వెళ్ళే సమయం సమీపిస్తున్నది. ఆలసించక మేము చెప్పినట్లు చేయుము' అని వ్యాసు డనగా విని ధర్మరాజు 'మునివరా! ఎంతోమంది బంధువులను వధించటం అనే మహా పాపాన్ని చేసి ఆ మహాత్ముడి ఎదుటికి ఎట్లా వెళ్ళగలను? అంతేకాదు. న్యాయంగా యుద్ధం చేసే స్వభావం కలిగిన ఆ సద్గుణరాశిని అధర్మయుద్ధంలో పడగొట్టి, తిరిగి ఆ ధర్మాత్ముడి మొగం చూచి, నాకు ధర్మోపదేశం చేయుమని ఏ విధంగా అడుగగలను?' అన్నాడు. అప్పుడు ధర్మరాజుతో కృష్ణు డిట్లా అన్నాడు:

**తే. ' ఇంత నిర్బంధ మేటికి 'నిమ్మునీంద్రు। పనుపు సేయుదు గాక! యిప్పాట నెల్ల**
**పెనుపులకుఁ బాత్రమయ్యెదు; వనటతోడ। నెద్దియును నేల? పురమున కేఁగు మిపుడు. 342**

**ప్రతిపదార్థం:** ఇంత= ఇంతటి; నిర్బంధము= తప్పనిసరి; ఏటికిన్?= ఎందుకు?; ఈ+ముని+ఇంద్రు= ఈ మునివరుడైన వ్యాసుడి; పనుపు= ఆజ్ఞ; చేయుదు+కాక!= చేస్తావు సుమా!; ఈ పాటన్= పద్ధతితో; ఎల్ల= అన్ని; పెనుపులకున్= వృద్ధులకు, అభ్యుదయాలకు; పాత్రము= అర్హుడవు; అయ్యెదు= అవుతావు; వనటతోడన్= శోకంతో; ఎద్దియున్= ఏది అయినా; ఏల?= ఎందుకు?; ఇపుడు= ఇప్పుడు; పురమునకున్= నగరానికి; ఏఁగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఇంత తప్పనిసరి అనటం ఎందుకు? వ్యాసుడు ఆనతిచ్చినది నీవు చేస్తావు సుమా! ఈ పనివలన నీవన్నివిధాలా వృద్ధిలోకి రావటానికి అర్హత కలవాడివి అవుతావు. ఏదయినా శోకంతో చేయటం ఎందుకు? ఇప్పుడు నగరానికి వెళ్ళుము.

**వ. మరల గాంగేయు కడకు వత్త; మదిమేలు, లె' మ్మని పలికి వెండియు. 343**

**ప్రతిపదార్థం:** మరలన్= తిరిగి; గాంగేయు= గంగాపుత్రుడైన భీష్ముడి; కడకున్= వద్దకు; వత్తము= వద్దాము; అది= ఆ పని; మేలు= మంచిది; లెమ్ము= బయలుదేరుము; అని= అంటూ; పలికి= చెప్పి; వెండియున్= తిరిగి; ఇంకా.

**తాత్పర్యం:** భీష్ముడివద్దకు మరొకమారు వద్దాము. అదే మంచిది. లెమ్ము' (నగరానికి వెళ్ళటానికి) అని చెప్పి శ్రీకృష్ణుడు ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ' తమ్ములును విప్రవరులును ధరణిఁ గల్గు । బహువిధంబుల ప్రజలును బార్థివేంద్ర**
**చాతకప్రకరములు పర్జన్యుఁ గోరు । నట్లు నినుఁ గోరుదురు కృప నాదరింపు. 344**

**ప్రతిపదార్థం:** పార్థివ+ఇంద్ర!= రాజోత్తమా! ధర్మరాజా!; తమ్ములును= సోదరులు; విప్రవరులును= బ్రాహ్మణశ్రేష్ఠులు; ధరణిన్= భూమిపై; కల్గు= ఉన్న; బహువిధంబుల= అనేకములైన (వివిధ వర్ణాలకు, జాతులకు చెందిన); ప్రజలును= మానవులు; చాతక= వానకోయిల; ప్రకరములు= గుంపులు; పర్జన్యున్= మేఘుడిని; కోరు+అట్లు= కోరే విధంగా; నినున్= నిన్ను; కోరుదురు= కావాలనుకొంటారు; కృపన్= దయతో; ఆదరింపు(ము)= కాపాడుము (చేరదీయుము).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీ తమ్ములు, బ్రాహ్మణోత్తములు, ఇంకా భూమిపై ఉన్న నానావిధ జాతివర్ణాలకు చెందిన జనులు వానకోయిలలు మేఘంకొరకు ఎదురు చూచే విధంగా, నిన్నే కావాలనుకొంటున్నారు. వారిని దయతో ఆదరించుము.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఈ సర్వజనంబుల మనోరథంబును సఫలంబులు సేయు' మని ప్రార్థించె; నివ్విధంబునం గృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను కృష్ణులు లోనుగాఁ బెక్కండ్రు పెక్కుదెఱంగులఁ జెప్పిన వాక్యంబులఁ జిత్తంబు కలంకదేఱి, కౌంతేయాగ్రజుండు రాజ్యభారనిర్వహణోత్సాహం బంకురింప, శిశిరాపగమ సమయ కమలంబు ననుకరించు నాననంబుతో నప్పారాశర్య ప్రముఖ మునివరులకుం బ్రదక్షిణంబును దండప్రణామంబును నాచరించి, వారల వలన వసుమతీ వహనానుజ్ఞయు వివిధాశీర్వాదంబులుం బడసి వెలింగె; వారును నిజస్థానంబులకుం జనిరి; తదనంతరంబ. 345**

**ప్రతిపదార్థం:** ఈ సర్వజనంబుల= ఇప్పుడు చెప్పిన అందరు జనుల; మనోరథంబును= కోరికను; సఫలంబు= ఫలవంతం; చేయుము; అని= అంటూ (శ్రీకృష్ణుడు); ప్రార్థించెన్= వేడుకొన్నాడు; ఈ విధంబునన్= ఈ తీరుగా; కృష్ణద్వైపాయన= వ్యాసుడు; నారద; దేవల; దేవస్థాను; కృష్ణులు; లోనుగాన్= మొదలైన; పెక్కండ్రు= అనేకులు; పెక్కు= బహు; తెఱంగులన్= భంగుల; చెప్పిన= బోధించిన; వాక్యంబులన్= మాటలతో; చిత్తంబు= మనస్సు; కలంక= కలత (బాధ); తేఱి= తేరుకొని; కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; రాజ్యభార= రాజ్యపరిపాలన అనే బాధ్యతను; నిర్వహణ= మోయాలనే; ఉత్సాహంబు= ఆసక్తి; అంకురింపన్= మొలకెత్తగా; శిశిర= శిశిర ఋతువు యొక్క; అపగమ= వెనుదిరిగే; సమయ= కాలంలోని; కమలంబు= పద్మాన్ని; అనుకరించు= పోలిఉన్న; ఆననంబుతోన్= ముఖంతో; ఆ+పారాశర్య ప్రముఖ= వ్యాసుడు మొదలైన; మునివరులకున్= ఋషి శ్రేష్ఠులకు; ప్రదక్షిణంబు= వలగొనుట; దండప్రణామంబును= సాష్టాంగ దండ ప్రణామం (సాగిలి మొక్కటం); చేసి= ఆచరించి; వారలవలనన్= ఆ మునులనుండి; వసుమతీ వహన= భూభార నిర్వహణానికి; అనుజ్ఞయున్= అనుమతిని; వివిధ= అనేక; ఆశీర్వాదంబులున్= ఆశీస్సులను; పడసి= పొంది; వెలింగెన్= ప్రకాశించాడు; వారును= ఆ మునులును; నిజ= తమ; స్థానంబులకున్= తావులకు; చనిరి= వెళ్ళారు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** నిన్ను కోరే అందరు జనుల కోరికను తీర్చుము' అని శ్రీకృష్ణుడు ధర్మరాజును వేడుకొన్నాడు. ఈ విధంగా వ్యాసుడు, నారదుడు, దేవలుడు, దేవస్థాణుడు, కృష్ణుడు మొదలైన అనేకులు అనేకవిధాలుగా బోధించగా ఆ మాటతో మనస్సులో కలతపాటుపోయి, ధర్మరాజుకు రాజ్యపాలన చేయాలనే ఆసక్తి మొలకెత్తింది. శిశిర ఋతువు వెళ్ళిపోయి వసంత ఋతువు ప్రవేశించిన కాలంలో ఉన్న పద్మంవలె వికసించిన ముఖం కలవాడై, వ్యాసుడు మొదలైన మునులకు ప్రదక్షిణలు, సాష్టాంగ దండప్రణామాలు చేసి, వారినుండి భూభారనిర్వహణానికి అనుమతిని, అనేక ఆశీస్సులను పొంది రాణించాడు. ఆ మునులు మొదలైనవారంతా తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు. ఆ తరువాత.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ.** **దేవభూదేవ పూజావిశేషము లాచరించి । యక్కురుకులశ్రేష్ఠుఁ డుర్వి**
**నెడనెడ బ్రుంగుడువడి యున్నరాజులు । సనుదెంచి కను నవసరము వేచి**
**యునికి కృష్ణునిచేత విని పూసి తొడి కట్టి । కొలువిచ్చి, మణిహేమకుంజరాశ్వ**
**కాంతాదులగు తగుకానికల్ గైకొని, । యాన్నృపాలురకుఁ బ్రియం బొనర్చి,**

**తే.** **యమ్ముకుందుండు వారును దమ్ముగమియుఁ । దక్కుఁగల బంధుమిత్త్రులు ధౌమ్య ముఖ్య**
**సూరిజనములు బలయంగఁ దారకముల । మధ్యమున చొప్పుచంద్రుని మాడ్కిఁ బొలిచె.** **346**

**ప్రతిపదార్థం:** ఆ+కురుకులశ్రేష్ఠుఁడు= ఆ కురువంశోత్తముడు; దేవ= దేవతలకు; భూదేవ= బ్రాహ్మణులకు; పూజావిశేషంబులు= ప్రత్యేక పూజలు మొదలైనవి; ఆచరించి= చేసి; ఎడన్+ఎడన్= అక్కడక్కడా; బ్రుంగుడు+పడి= దాగుకొని (యుద్ధానికి రాక); ఉన్న= ఉన్నటువంటి; రాజులు; చనుదెంచి= వచ్చి; కను+అవసరము= దర్శించటానికి తగిన సమయం కొరకు; వేచి+ఉనికి= ఎదురుచూస్తూ ఉండటం; కృష్ణునిచేతన్= కృష్ణుడు చెప్పగా; విని= ఆలకించి; పూసి= చందనాదులు అలదికొని; తొడి= అలంకరించుకొని; కట్టి= వస్త్రధారణచేసి; కొలువు+ఇచ్చి= తన ఆస్థానంలో స్థానమిచ్చి; మణి= మణులు; హేమ= బంగారం; కుంజర= ఏనుగులు; అశ్వ= గుర్రాలు; కాంతా= స్త్రీలు; ఆదులు+అగు= మొదలైన; తగు= యోగ్యమైన; కానికల్= ఉపహారాలు; కైకొని= స్వీకరించి; ఆ నృపాలురకున్= ఆ రాజులకు; ప్రియంబు= ఇష్టాన్ని; ఒనర్చి= కలిగించి; ఆ+ముకుందుండు= ఆ శ్రీకృష్ణుడు; వారును= ఆ రాజులు; తమ్ముగమియున్= సోదరబృందం; తక్కుఁగల= మిగిలిన; బంధు= చుట్టాలు; మిత్త్రులు= స్నేహితులు; ధౌమ్యముఖ్య= ధౌమ్యుడు మొదలైన; సూరిజనములు= పండితులు; బలయంగన్= పరివేష్టించి ఉండగా; తారకముల= నక్షత్రాల; మధ్యమునన్= మధ్యలో; ఒప్పు= అందగించే; చంద్రుని= చంద్రుడి; మాడ్కిన్= వలె; పొలిచెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఆ కురుకులోత్తముడైన ధర్మరాజు దేవబ్రాహ్మణ పూజలు విశేషంగా చేసి, అక్కడక్కడా దాగుకొని ఉన్న (యుద్ధంలో పాల్గొనక తప్పించుకొన్న) రాజులు వచ్చి దర్శించటానికి తగిన సమయంకొరకు కాచుకొని ఉన్నారని శ్రీకృష్ణుడు చెప్పగా విని, సంభ్రమంగా మైపూతలు, వస్త్రాలు ధరించి, వారికి ఆస్థానంలో తా విచ్చి, వా రిచ్చిన మణులు, బంగారం, ఏనుగులు, గుర్రాలు, స్త్రీలు మొదలైన యోగ్యమైన కానుకలను స్వీకరించి, ఆ రాజులకు సంతోషాన్ని కలిగించి, ఆ సామంతరాజులు, తమ్ముల బృందం, మిగిలిన బంధువులు, స్నేహితులు, ధౌమ్యుడు మొదలైన పండితులు తనను పరివేష్టించి ఉండగా చుక్కలమధ్య చంద్రుడివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **మఱునాఁడు కల్యంబునం గాలోచితకృత్యంబు లాచరించి ధవళానులేపన మాల్యవస్త్రాభరణంబుల నలంకృతుండై.** **347**

**ప్రతిపదార్థం:** మఱునాఁడు= మరుసటిరోజు; కల్యంబునన్= వేకువనే; కాల+ఉచిత= సమయానికి తగిన; కృత్యంబులు= పనులు; ఆచరించి= చేసి; ధవళ= తెల్లని; మాల్య= పూలదండలు; వస్త్ర= వస్త్రములు; ఆభరణంబులన్= నగలతోను; అలంకృతుఁడు+ఐ= అలంకరించబడినవాడై.

**తాత్పర్యం:** మరుసటిరోజు వేకువనే సమయోచితమైన పనులు (కాలకృత్యాదులు) నిర్వర్తించి, తెల్లని పూలదండలు, వస్త్రాలు, నగలు అలంకరించుకొని (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **నవమగు రథమున షోడశ । ధవళహరులఁ బూన్పఁ బనిచి ధరణిపుఁడు విధుం**
**డవిరళ సుధారథం బె । క్కువిధము దోఁపంగ నెక్కెఁ గురువంశనిధీ! 348**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ= కురువంశానికి పెన్నిధివంటి జనమేజయ చక్రవర్తీ!; నవము+అగు= క్రొత్తది అయిన; రథమునన్= రథానికి; షోడశ= పదునారు; ధవళ= తెల్లని; హరులన్= గుర్రాలను; పూన్పన్= పూన్చుమని; పనిచి= ఆజ్ఞాపించి; ధరణిపుఁడు= రాజు, ధర్మరాజు; విధుండు= చంద్రుడు; అవిరళ= ఎడబాయని; సుధారథంబు= వెన్నెల అనే రథాన్ని; ఎక్కు= అధిరోహించే; విధము= తీరు; తోఁపంగన్= అనిపించగా; ఎక్కెన్= అధిరోహించాడు.

**తాత్పర్యం:** జనమేజయ చక్రవర్తీ! ధర్మరాజు కొత్తరథానికి పదహారు తెల్లని గుర్రాలను పూన్చుమని ఆజ్ఞాపించి, ఆ రథాన్ని చంద్రుడు తనని ఎడబాయని వెన్నెలరథాన్ని ఎక్కిన విధం తలపింపచేస్తూ అధిరోహించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**శా.** **సారథ్యంబు వహింప భీముఁడు, సితచ్ఛత్రంబు గాండీవి సె**
**ల్వారం బట్టఁగఁ, జామరల్ గవ లిడన్ హారిప్రభంబయ్యెఁ న**
**త్తేరం దేవురు నగ్నిపంచకము వేదిం బొల్చునట్లొప్పి రం**
**భోరాశిధ్వనివోలెఁ దూర్యనికరంబుల్ మ్రోసె నొక్కుమ్మడిన్. 349**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీమసేనుడు; సారథ్యంబు+వహింపన్= రథచోదనం చేయగా; గాండీవి= అర్జునుడు; సితచ్ఛత్రంబు= తెల్లగొడుగు; చెల్వారన్= అందమతిశయించగా; పట్టఁగన్= పట్టుకొనగా; కవలు= నకుల సహదేవులు; చామరల్= వింజామరాలను; ఇడన్= పట్టుకోగా (వీచగా); ఆ+తేరు+అందున్= ఆ రథంలో; హారి= మనోహరమైన; ప్రభంబు+అయ్యెన్= కాంతికలిగిన దయింది (ప్రకాశించింది); ఆ+తేరు+అందున్= ఆ రథంలో; ఏవురున్= అయిదుగురు (పాండవులు); అగ్నిపంచకము= పంచాగ్నులు; వేదిన్=అందు; యజ్ఞవేదికయందు; పొల్చున్+అట్లు= వెలిగేటట్లు; ఒప్పిరి= అందగించారు; అంభోరాశి= సముద్రపు; ధ్వని= శబ్దం; పోలెన్= వలె; తూర్యనికరంబుల్= వాద్య సముదాయాలు; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; మ్రోసెన్= మ్రోగాయి.

**తాత్పర్యం:** ధర్మరాజు అధిరోహించిన రథానికి భీముడు సారథ్యం వహించాడు. అర్జునుడు వెల్లగొడుగును అంద మొప్పుగా పట్టాడు. నకుల సహదేవులు వింజామరలు పట్టుకొని వీస్తున్నారు. వారితో ఆ రథం మనోహరమై ఒప్పారింది. పంచాగ్నులు యజ్ఞవేదికపై పొలుపారినట్టు పాండవులైదుగురూ ఆ రథంలో ప్రకాశించారు. సముద్రఘోషవలె వాద్యాలన్నీ ఒక్కసారిగా మ్రోగాయి.

**విశేషం:** అలం: ఉపమ. పంచాగ్నులు: 1. ఆహవనీయాగ్ని, 2. దక్షిణాగ్ని, 3. గార్హపత్యాగ్ని, 4. సభ్యాగ్ని, 5. అపసధ్యాగ్ని - ఇవి యజ్ఞవేదికి తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఈశాన్య దిక్కులం దుంటాయి.

ధర్మరాజు సపరివారంబుగాఁ గరినగరంబుఁ బ్రవేశించుట: (సం. 12-38-34)

**వ. ఇట్లు నితాంతకాంతిప్రకారుండై పాండవాగ్రజుండు పాండురాజాగ్రజు నతని దేవిం బ్రభూతాందోళికారూఢులం జేసి పురస్కరించుకొని శైబ్య సుగ్రీవ మేఘపుష్పవలాహకంబు లను వాహంబులు పూనినరథంబున సాత్యకి సహితుండయి వెలుంగు వెన్నునిం బిఱింది దెసం బెట్టికొని, యతని కెలన మనోజవంబులగు హయంబులం బూన్చిన యవదాత స్యందనంబున యుయుత్సుం డరుగుదేర, నుచిత వాహనారూఢుండై విదురుండు కుంతీప్రముఖ కురుస్త్రీజనంబుల నందలంబుల నిడికొని వెనుకనడవ, నరేంద్రులు నానాముఖంబులం దమతమ సేనల తోడం గూడఁ గొలిచి చనుదెంచుచుండం జనునప్పుడు. 350**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవ+అగ్రజుండు= పాండు రాజకుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; నితాంత= ఎడతెగని, అంతులేని; కాంతి ప్రకారుండు+ఐ= వెలుగుతో కూడినవాడై; పాండురాజ+అగ్రజున్= పాండురాజు అన్న అయిన ధృతరాష్ట్రుడిని; అతని దేవిన్= అతడి భార్య అయిన గాంధారిని; ప్రభూత= ఉన్నతమైన, గొప్ప; ఆందోళికా= పల్లకీని; ఆరూఢులన్= అధిరోహించిన వారినిగా; చేసి= ఒనర్చి; పురస్కరించుకొని= వారిని ముందుండేటట్లుగా చేసి; శైబ్య= శైబ్యం ; సుగ్రీవ= సుగ్రీవం; మేఘపుష్ప= మేఘపుష్పం; వలాహకంబులు= వలహకం; అను= అనే పేర్లుగల; వాహంబులు= గుర్రాలు; పూనిన= పూన్చిన; రథంబునన్= తేరుపై; సాత్యకి సహితుండు+ఐ= సాత్యకితో కూడుకొన్నవాడై; వెలుంగు= ప్రకాశించే; వెన్నుని= శ్రీకృష్ణుడి; పిఱిందిదెసన్= వెనుకవైపు; పెట్టికొని= ఉంచుకొని; అతని= ధర్మరాజు; కెలనన్= పార్శ్వాన; మనోజవంబులు+అగు= మనసంతటి వేగంకల; హయంబులన్= గుర్రాలను; పూన్చిన= పూనిన; అవదాత= శ్రేష్ఠమైన, స్వచ్ఛమైన; స్యందనంబునన్= రథంలో; యుయుత్సుండు; అరుగు+తేరన్= వస్తుండగా; ఉచిత= తగిన; వాహన+ఆరూఢుండు+ఐ= రథాన్ని అధిరోహించినవాడై; విదురుండు; కుంతీప్రముఖ= కుంతీదేవి మొదలైన; కురుస్త్రీజనంబులన్= కౌరవస్త్రీలను; అందలంబులన్= పల్లకీలలో; ఇడికొని= ఉంచి; వెనుక నడువన్= వెనుకగా వస్తుండగా; నరేంద్రులు= రాజులు; నానా ముఖంబులన్= అన్ని వైపులనుండి; తమతమ= తమయొక్క; సేనలతోడన్= సైన్యాలతో; కూడన్= కలిసి; కొలిచి= సేవించి; చనుదెంచుచుండన్= వస్తూ ఉండగా; చను+అప్పుడు= వెళ్ళే సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు అంతులేని ప్రకాశంతో వెలిగిపోతూ ధృతరాష్ట్రుడినీ, గాంధారినీ గొప్ప పల్లకిలో కూర్చుండబెట్టి తన ముందుంచుకొని, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలు అనే గుర్రాలను పూన్చిన రథంపై సాత్యకితో కలిసి శ్రీకృష్ణుడు వెనుక వస్తుండగా, ప్రక్కనే మనోవేగంతో పరుగెత్తే గుర్రాలను పూన్చిన శ్రేష్ఠమైన రథంపై యుయుత్సుడు వస్తుండగా, తనకు యోగ్యమైన వాహనాన్ని తా నధిరోహించి, కుంతీదేవి మొదలైన అంతఃపుర స్త్రీలను పల్లకీలలో ఉంచి, విదురుడు వెనుక వస్తుండగా, రాజులు అన్ని వైపుల నుండి తమ సైన్యాలతో కలిసి సేవిస్తుండగా, బయలుదేరే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ద్విరదంబుల నరదంబులఁ । దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబుల సీ**
**గిరులన్ గొడుగులఁ బడగలఁ । బరిస్ఫురిత మయ్యె నతని పయనంబు గడున్. 351**

**ప్రతిపదార్థం:** అతని పయనంబు= ఆ ధర్మరాజు ప్రయాణం; ద్విరదంబులన్= ఏనుగులతో; అరదంబులన్= రథాలతో; తురగంబులన్= గుర్రాలతో; కాల్బలములన్= బంటులతో; తూర్యంబులన్ సీగిరులన్= వింజామరలతో; గొడుగులన్= ఛత్రాలతో; పడగలన్= ధ్వజాలతో; కడున్= మిక్కిలి; పరిస్ఫురితము+అయ్యెన్= ప్రకటితం అయింది.

**తాత్పర్యం:** ఆ విధంగా సాగుతున్న ధర్మరాజు ప్రయాణం ఏనుగులు, రథాలు, గుర్రాలు, బంటులు, వాద్యాలు,వింజామరలు, ఛత్రాలు, ధ్వజాలతో అధికంగా ప్రకటిత మయింది.

**వ. మఱియును. 352**

**తాత్పర్యం:** అంతేకాక, ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. వందిజనులుఁ బారకులుం । గ్రందుకొనం బొగడఁ జదువఁగా మాగధు లా**
**నందముగఁ బాడ నుచితపు । మందత్వము గమనమునకు మహిమ యొనర్పన్. 353**

**ప్రతిపదార్థం:** వందిజనులు= భట్టులు; పాఠకులున్= వేదపాఠం చదివేవారు; క్రందుకొనన్= అతిశయించినట్లు; పొగడన్= కీర్తిస్తుండగా; చదువఁగాన్= పఠిస్తుండగా; మాగధులు= వంశకీర్తనం చేసేవారు; ఆనందముగన్= సంతోషంగా; పాడన్= పాడుతుండగా; ఉచితము+మందత్వము= తగినటువంటి నెమ్మదితనం; గమనమునకున్= నడకకు; మహిమ= గొప్పదనం; ఒనర్పన్= కూర్చగా.

**తాత్పర్యం:** రాజును పొగడి జీవించే వందులు కీర్తిస్తుండగా, వేదపాఠం చదివేవారు పఠిస్తుండగా, వంశచరిత్రను, ప్రతిష్ఠను కీర్తించే మాగధులు సంతోషంగా పాడుతుండగా, తగిన నెమ్మదితనం ప్రయాణానికి గొప్పతనాన్ని కూర్చగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. అన్నరనాథుండు నడచి నాగనగరంబు ప్రవేశించె; నంతకుమున్న యందలి జనంబులు గలువడములును దోరణంబులను గ్రముక కదళీస్తంభపూర్ణకుంభ స్థాపనంబులను కస్తూరి కలయంపులను గర్పూరపు మ్రుగ్గులను బుష్పోపహారంబులను బ్రాలంబమాలికలను నొప్పు మిగుల నప్పురం బలంకరించి, యాబాల వృద్ధంబుగాఁ బరమాంబరానులేపన మాల్య భూషణంబులం బొలిచి, బహుల ప్రమదంబున సమ్మర్దంబులగు సంచారంబులం జారుత్వవిశేషంబు వహించి రక్కురు రాజోత్తముండు రాజమార్గంబు దఱిసి చనుసమయంబున. 354**

**ప్రతిపదార్థం:** ఆ+నరనాథుండు= ఆ రాజు; నడచి= వెడలి; నాగపురంబు= హస్తినాపురంలో; ప్రవేశించెన్= అడుగుపెట్టాడు; అంతకుమున్న+అ= అంతకన్న ముందే; అందలి= అచటి; జనంబులు= ప్రజలు; కలువడములును= వేడుకగా ధ్వజస్థంభాలకు వేలాడగట్టిన కలువపూదండలు; తోరణంబులను= మంగళచిహ్నాలైన మామిడాకుల దండలు; క్రముక= పోక; కదళీ= అరటి; స్తంభ= బోదెలతోను; పూర్ణకుంభ స్థాపనంబులను= నిండైన కలశాలను శుభచిహ్నంగా నిలపటం; కస్తూరి కలయంపులను= కస్తూరి కలిపి చల్లిన కళ్ళాపులతోను; కర్పూరము+మ్రుగ్గులను= కర్పూరంతో వేసిన రంగవల్లికలతోను; పుష్ప+ఉపహారంబులను= పూల కానుకలతో (పుష్పగుచ్ఛాలు మొదలైనవి); ప్రాలంబ మాలికలను= బాగా వేలాడుతున్న దండలతోను; ఒప్పు+మిగులన్= అందం అతిశయించగా; ఆ+పురంబు= ఆ నగరాన్ని; అలంకరించి= సింగారించి; ఆ బాల వృద్ధంబుగాన్= పిల్లలు మొదలు పెద్దలవరకు అందరునూ; పరమ= శ్రేష్ఠమైన; అంబర= వస్త్రాలు; అనులేపన=మైపూతలు; మాల్య= పూలమాలలు; భూషణంబులన్= నగలతో; పొలిచి= చక్కనై, అలంకరించుకొని; బహుల ప్రమదంబునన్= ఎంతో సంతోషంతో; సమ్మర్దంబులు+అగు= ఒకరితో ఒకరు రాజుకుంటున్నట్లు; సంచారంబులన్= కదలికలతో (తిరుగాడుతూ); చారుత్వ విశేషంబుల= ఒప్పిదమైన అతిశయాన్ని; వహించిరి= కలిగి ఉన్నారు; ఆ+కురురాజ+ఉత్తముండు= ఆ కురువంశ రాజులలో శ్రేష్ఠుడైన ధర్మరాజు; రాజమార్గంబు= రాచబాటను; తఱిసి= సమీపించి; చను సమయంబునన్= వెళ్ళే సమయంలో.

**తాత్పర్యం:** ధర్మరాజు నడచి హస్తినాపురంలో ప్రవేశించాడు. అంతకన్న ముందుగా హస్తినాపురజనులు ధ్వజస్తంభాలకు కలువపూల దండలను వ్రేలాడగట్టి, మంగళతోరణాలు కట్టి, పోక అరటిబోదెలను, పూర్ణకలశాలను స్థాపించి, కస్తూరితో కళ్ళాపి చల్లి, కర్పూరపు రంగవల్లులు తీర్చి, పూలగుత్తులతోనూ, చక్కగా వ్రేలాడుతున్న పూలదండలతోను ఎంతో అందంగా ఆ నగరాన్ని అలంకరించారు. పసిపిల్లల నుండి వృద్ధులవరకు అందరూ ఎంతో శ్రేష్ఠమైన వస్త్రాలను, మై పూతలను, పూలదండలను, నగలను ధరించి చక్కదనంతో ఒప్పారుతూ ఎంతో ఆనందంగా ఒకరినొకరు

ఒరుసుకొంటూ (వీథులలో ఎడంలేని విధంగా జనులతో నిండాయని భావం.) చాలా సంబరంగా తిరుగుతున్నారు. అప్పుడు ధర్మరాజు రాచబాటను సమీపించి వెళ్ళే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. హర్మ్యములనుండి పణ్యపుణ్యాంగనాని । కరము లక్షతయుత, మౌక్తికముల సేస**
**లొలుకఁ గల్పలతాచయంబులును పుష్ప । వృష్టి పెల్లుగఁ గురిసిన విధము దోఁచె. 355**

**ప్రతిపదార్థం:** హర్మ్యములనుండి= భవనములపై నుండి; పణ్య+పుణ్య+అంగనా= వేశ్యాస్త్రీల, పుణ్యస్త్రీల; నికరములు= సముదాయాలు; అక్షతయుత= అక్షతలతో (నలగని పూలతో); కూడిన; మౌక్తికముల= ముత్యాల; సేసలు+ఒలుకన్= అక్షతలు చల్లగా; కల్పలతా= కల్పవృక్షాల; చయంబులు= గుంపులు; పుష్పవృష్టి= పూలవాన; పెల్లుగన్= అధికంగా; కురిసిన విధము= కురిసినట్లుగా; తోఁచెన్= అనిపించింది.

**తాత్పర్యం:** భవనాల పైనుండి వేశ్యాంగనలు, పుణ్యస్త్రీలు గుంపులుగా చేరి ముత్యాలతో కూడిన నలగని పూలు అక్షతలుగా చల్లుతుండగా కల్పవృక్షాల సముదాయం అధికంగా పూలవాన కురిపించినట్లుగా అనిపించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడఁ జూడం బఱతెంచిన పౌరజానపద జనంబులు దమలోన. 356**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; చూడన్= చూడటానికి; పఱతెంచిన= వచ్చిన; పౌర= పురజనులు; జానపదజనంబులు= జానపదులు; తమలోనన్= తమలోతాము.

**తాత్పర్యం:** ఆ సమయంలో అక్కడికి చూడటానికి వచ్చిన నగరవాసులు, గ్రామవాసులు అయిన ప్రజలు తమలో తాము. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ‘ దిగ్విజయంబునం దేజస్వి యయ్యు న । జాతశత్రుం డనఁ జను నితండె;**
**రాజసూయ మహాధ్వరము సేసి విప్రులఁ । గనక రత్నాదులఁ దనిపె నితఁడె;**
**నిత్యవ్రతంబుగా సత్యంబు పాలించు । నిష్ఠ యస్థలితగా నెఱపె నితఁడె;**
**ధర్మైక నిరతుఁ డీతం డొక్కరుఁడ చువ్వె । యని పల్కుటకుఁ బాత్ర మయ్యె నితఁడె;**

**తే. బలముఁ దగవును ధర్మంబు వెలయఁ బగఱ । ననవశేషంబుగాఁ దెగటార్చె నితఁడె’**
**యనఁగ మఱియును వివిధ కీర్తనల హర్ష । వచనముల నుల్లసిల్లు రవంబు మిగిలె. 357**

**ప్రతిపదార్థం:** ఇతండు+ఎ= ఇతడు మాత్రమే; దిగ్విజయంబునన్= అన్ని దిక్కులు జయించటంతో; తేజస్వి= కాంతిమంతుడు; అయ్యున్= అయి ఉండికూడ; అజాతశత్రుండు= పుట్టని శత్రువులు గలవాడు; అనన్= అనగా; చనున్= చెల్లుతున్నాడు; ఇతఁడు+ఎ= ఇతడే; రాజసూయ మహా+అధ్వరము= రాజసూయం అనే పేరున్న గొప్పయజ్ఞం; చేసి= ఒనరించి; విప్రులన్= బ్రాహ్మణులను; కనక= బంగారం; రత్న= మణులు; ఆదులన్= మొదలైన వాటితో; తనిపెన్= సంతృప్తి పరిచాడు; ఇతఁడు+ఎ= ఇతడే సుమా!; నిత్య= ఎల్లప్పుడూ; వ్రతంబు+కాన్= ఆచరించవలసిన పద్ధతిగా; సత్యంబు= సత్యవాక్యాన్ని; పాలించు= అనుసరించే; నిష్ఠ= నియమం; అస్థలిత+కాన్= చెక్కుచెదరకుండా; నెఱపెన్= అమలు జరిపాడు; ఇతఁడు+ఎ= ఇతడే, ఈ ధర్మరాజే; ధర్మ+ఏక+నిరతుఁడు= వేదచోదిత మార్గంలో అనన్యనిష్ఠ కలవాడు; ఈతండు= ఈ ధర్మరాజు; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; చువ్వె= సుమా!; అని పల్కుటకున్= అంటూ చెప్పటానికి; పాత్రము= అర్హుడు; అయ్యెన్= అయ్యాడు; ఇతఁడు+ఎ= ఇతడే;

బలమున్= శక్తి; తగవును= న్యాయం; ధర్మంబు= వేదోక్తవిధి నిర్వహణం; వెలయన్= ఒప్పగా; పగఱన్= శత్రువులను; అనవశేషంబు+కాన్= మిగలకుండా; తెగటార్చెన్= సంహరించాడు; అనఁగన్= అనేట్లుగా; మఱియును= ఇంకా; వివిధ కీర్తనలన్= అనేక విధాలైన పొగడ్తలతోను; హర్షవచనములన్= సంతోషంతో కూడిన మాటలతోను; ఉల్లసిల్లు= అతిశయించే; రవంబు= ధ్వని; మిగిలెన్= ఎక్కువయింది.

**తాత్పర్యం:** 'అన్ని దిక్కుల రాజులను జయించి కీర్తిమంతుడై కూడ 'అజాతశత్రుడు' అని ప్రసిద్ధి కెక్కింది ఇతడే. రాజసూయం అనే గొప్ప యజ్ఞం చేసి బ్రాహ్మణులను బంగారం, రత్నాలు మొదలైన వాటితో తృప్తి పరచిం దితడే. సత్యవాక్య పరిపాలనను నిరంతరం ఆచరించే నియమంపట్ల ఉన్న లగ్నత చెక్కుచెదరనీయనిది ఇతడే. ధర్మాచరణంలో అనన్యనిష్ఠ గలవా డితడొక్కడే సుమా! అని చెప్పటానికి తగిన అర్హత కలవా డితడే. శక్తి, న్యాయం, ధర్మం ఒప్పేటట్లుగా శత్రువులను నిశ్శేషంగా చంపింది ఇతడే' అంటూ, ఇంకా అనేక పొగడ్తలతోనూ, సంతోషంతో కూడిన మాటలతోనూ అధికమైన శబ్దం అతిశయించింది.

**విశేషం:** అజాతశత్రుడు: పుట్టని శత్రువులు కలవాడు. అంటే ధర్మరాజు ఎవరినీ తన శత్రువులుగా భావించడు. ఇతరులు ధర్మరాజును శత్రువు అనుకుంటే అనుకొనవచ్చును. అంతశ్శత్రువుల పుట్టుక తనలో లేనివాడు. దిగ్విజయం చేసికూడా అజాతశత్రువు అనే బిరుదాన్ని నిలుపుకొన్న ఘనత ధర్మరాజుకే దక్కింది.

**క. లావులు వెరవులుఁ దాల్ములుఁ। జేవలు నస్ఖలితములుగఁ జెల్లు పనులు నా**
**నా విధములఁ బేర్కొనుచుం। బావని నరుఁ గవలఁ బొగడు పటురవ మెసఁగెన్. 358**

**ప్రతిపదార్థం:** లావులు= బలాలు; వెరవులున్= ఉపాయాలు; తాల్ములున్= ఓర్పులూ; చేవలున్= సామర్థ్యాలూ; అస్ఖలితములుగన్= జారనివిగా (చెక్కుచెదరక); చెల్లు= నడిచే; పనులు= కార్యాలు; నానావిధములన్= అనేక తీరులుగా; పేర్కొనుచున్= ఏకరువు పెట్టుతూ; పావనిన్= భీముడిని; నరున్= అర్జునుడిని; కవలన్= నకుల సహదేవులనూ; పొగడు= కీర్తించే; పటు= గొప్ప; రవము= ధ్వని; ఎసఁగెన్= ఎక్కువైంది.

**తాత్పర్యం:** బలాలు, ఉపాయాలు, ఓర్పులు, సామర్థ్యాలు ఏమాత్రం చెదరకుండ (తక్కువకాకుండా) నిర్వర్తించిన ఘనకార్యాలనన్నింటిని అనేక విధాలుగా చెప్పుకొంటూ (పౌరులు) భీమార్జున నకుల సహదేవులని పొగడుతున్న ధ్వనులు మిన్నుముట్టుతున్నాయి.

**విశేషం:** అలం: యథాసంఖ్యం. భీమాదులందరిలో సమష్టిగా నాలుగు గుణాలు చూస్తున్నా, ప్రత్యేకించి భీముడిలో బలం, అర్జునుడిలో ఉపాయం, నకులుడిలో ఓర్పు, సహదేవుడిలో సామర్థ్యం గమనించి ప్రజలు కీర్తించారని క్రమాలంకారం వలన గ్రహించవచ్చును.

**క. 'వ్రతచర్యయు భాగ్యంబును। ధృతియు మతియు నరయ ద్రౌపదికి నెనయగు భూ**
**పతివల్లభాజనము లీ। క్షితిఁ గలరే' యనురవంబు సెలఁగెం గలయన్. 359**

**ప్రతిపదార్థం:** వ్రతచర్యయున్= ఉపవాసాది పుణ్యకర్మలు, నోములు మొదలైనవి ఆచరించటం; భాగ్యంబును= అదృష్టం, పతుల అనురాగం; ధృతియున్= ధైర్యం; మతియున్= తెలివి; అరయన్= చూడగా; ద్రౌపదికిన్= ద్రౌపదితో; ఎన+అగు= సాటి అయిన; భూపతివల్లభాజనములు= రాజపత్నులు; ఈక్షితిన్= ఈ భూమిలో; కలరు+ఏ?= ఉన్నారా? (లేరని భావం); అను= అనే; రవంబు= ధ్వని; కలయన్= అంతటా; చెలఁగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** 'పుణ్యకర్మలు, నోములు చేయటంలోనూ, అదృష్టం, ధైర్యం, తెలివి కలిగి ఉండటంలోనూ, రాజపత్నులెవ్వరూ ద్రౌపదికి సాటి అయినవారు ఈ భూమిలో ఉన్నారా?' (లేరు అని భావం) అనే ప్రశంసల సవ్వడి అంతటా వ్యాపించింది.

**వ. ఇట్లు పెల్లయిన మ్రోఁతను దరంగితము లైన నెరవుల పెంపునఁ బురంబు చంద్రోదయ ఘూర్ణమానంబైన మహార్ణవంబు ననుకరించె; నా ధర్మరాజు రాజమందిరద్వారంబు సేరంజనియె; నప్పుడు బహువిధంబులగు శోభనద్రవ్యంబులు గరంబులంగొని భవ్యభూసురులును బుణ్యాంగనలును నెదుర్కొన, వాని నెల్లం గైకొనుచుం బ్రవేశించి యతం డేనుంగు మొగసాల నరదంబు డిగ్గి, ధౌమ్య ధృతరాష్ట్ర పురస్సరంబుగా నభ్యంతర నివాసంబు సొచ్చి, గృహదేవతలం బూజించి, మగుడ బహిరంగణ భూమికి వచ్చి, నగర దేవతా పూజలు సేయింపం దగువారలం బనిచి, బ్రాహ్మణ సంఘంబులం గానిపించుకొని, కనకంబులును గోవులు మొదలైన వివిధ వస్తువులు నొసంగె; నప్పు డాశీర్వాద నాదంబులను శంఖభేరీ ప్రముఖ మంగళ తూర్యరవంబులను రోదసి పిక్కటిల్లెఁ; దదనంతరంబ నిశ్శబ్దంబై యున్న సకల జనంబులును నజ్జనపాలు నాననం బాలోకించు చుండి; రట్టియెడ దుర్యోధన సఖుండైన చార్వాకుం డను నొక్క రక్కసుండు విప్రాకారంబు గైకొని త్రిదండి వేషం బలవడ నయ్యవనీదేవతాకోటిలో నిల్చి యన్నరనాథున కిట్లనియె. 360**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పెల్లు+అయిన= అధికమైన; మ్రోఁతను= ధ్వనితో; తరంగితములు+ఐన= ఉప్పొంగిన; నెరవుల= మార్గాల; పెంపునన్= ఆధిక్యంతో; పురంబు= నగరం; చంద్ర+ఉదయ= చంద్రోదయ సమయంలో; ఘూర్ణమానంబు+ఐన= ఎగసిపడుతున్న; మహా+అర్ణవంబును= గొప్ప సముద్రాన్ని; అనుకరించెను= పోలి ఉన్నది; ఆ ధర్మరాజు; రాజమందిర ద్వారంబు= రాజప్రాసాదపు వాకిలిని; చేరన్+చనియెన్= సమీపించపోయాడు; అప్పుడు= ఆ సమయంలో; బహువిధంబులు+అగు= వివిధ ప్రకారాలైన; శోభనద్రవ్యంబులు= మంగళ ద్రవ్యాలు; కరంబులన్= చేతులలో; కొని= పట్టుకొని; భవ్యభూసురులును= శుభప్రదులైన బ్రాహ్మణులు; పుణ్య+అంగనలునున్= పుణ్యస్త్రీలు, ముత్తైదువలు; ఎదుర్కొనన్= ఎదురురాగా; వానిన్+ఎల్లన్= వాటినన్నింటిని; కైకొనుచున్= గ్రహిస్తూ; ప్రవేశించి= అడుగిడి; ఏనుంగు= పెద్దదైన; మొగసాలన్= ముఖశాలలో; అరదంబు= రథం; డిగ్గి= దిగి; ధౌమ్య= ధౌమ్యుడు; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడు; పురస్సరంబు+కాన్= ముందు నడుస్తుండగా; అభి+అంతర, నివాసంబు= అంతఃపురం; చొచ్చి= ప్రవేశించి; గృహదేవతలన్= తమ ఇంటి దైవాలను (కులదైవాలను); పూజించి= అర్చించి; మగుడన్= తిరిగి; మరల; బహిః+అంగణ భూమికిన్= ముంగిలికి వెలుపల ఉన్న ప్రదేశానికి; వచ్చి= చేరి; నగరదేవతా= నగరాధిదేవత; పూజలు= అర్చనలు; చేయింపన్= నిర్వర్తించటానికి; తగువారలన్= తగినవారిని; పనిచి= పంపి; బ్రాహ్మణ సంఘంబులన్= విప్రగణాలను; కానిపించుకొని= దర్శించుకొని; కనకంబులును= బంగారాలు; గోవులు= ఆవులు; మొదలు+ఐన= ఆదిగా; వివిధ+ అనేకమైన; వస్తువులున్= సంభారాలను; ఒసంగెన్= ఇచ్చాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆశీర్వాదనాదంబులను= ఆశీర్వచనాలతోనూ; శంఖ= శంఖాలు; భేరీ= దుందుభులు; ప్రముఖ= మొదలైన; మంగళ= శుభప్రదమైన; తూర్య= వాద్యాల; రవంబులను= ధ్వనులతో; రోదసి= అంతరిక్షం; పిక్కటిల్లెన్= పూర్తిగా నిండిపోయింది; తద్= ఆ; అనంతరంబు+అ= తర్వాత; నిశ్శబ్దంబు+ఐ= శబ్దం లేనిదై; ఉన్నన్= ఉండగా; సకల= సమస్తమైన; జనంబులునున్= ప్రజలు; ఆ+జనపాలున్= ఆ రాజుయొక్క; ఆననంబు= ముఖం; ఆలోకించుచున్+ఉండిరి= చూస్తూ ఉండిపోయారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; దుర్యోధన సఖుండు= దుర్యోధనుడి మిత్రుడైన; చార్వాకుండు+అను= చార్వాకుడు అనే; ఒక్కరక్కసుండు= ఒక రాక్షసుడు; విప్ర+ఆకారంబున్= బ్రాహ్మణరూపం; కైకొని= గ్రహించి; త్రిదండి= సన్న్యాసి; వేషం= అలంకారం; అలవడన్= ధరించి; ఆ+అవనీదేవతాకోటిలోన్= బ్రాహ్మణ సముదాయంలో; నిల్చి= ఉండి; ఆ+నరనాథునకున్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అత్యధికమైన ధ్వనులతో ఉప్పొంగిన బాటల అతిశయంతో ఆ నగరం చంద్రోదయ సమయంలో ఎగసిపడుతున్న మహాసముద్రం వలె ఉన్నది. అప్పు డా ధర్మరాజు రాజప్రాసాదాల వాకిలి సమీపించాడు. ఆ సమయంలో ఎన్నో రకాల మంగళద్రవ్యాలు చేతులలో ధరించి శుభప్రదులైన బ్రాహ్మణులు, పుణ్యస్త్రీలు ఎదురు రాగా ఆ మంగళద్రవ్యాల నన్నింటినీ గ్రహిస్తూ నగరులో ప్రవేశించి, చాల పెద్దదైన ముఖశాల (గజశాల) వద్ద

రథం దిగి, ధౌమ్యుడు, ధృతరాష్ట్రుడు ముందు నడుస్తుండగా అంతఃపురం ప్రవేశించి, తమ ఇలవేల్పులను అర్చించి, తిరిగి వెలుపలి ప్రదేశానికి వచ్చి, నగర దేవత పూజలు చేయించటానికి అర్హులైనవారిని ఏర్పాటు చేయించి, బ్రాహ్మణులను దర్శించుకొని, వారికి బంగారం, గోవులు మొదలైన అనేక సంభారాలు దానం చేశాడు. అప్పుడు ఆ బ్రాహ్మణులు చేసిన ఆశీస్సుల ధ్వనులతోనూ, శంఖం భేరీ మొదలైన మంగళ వాద్యాల ఘోషతోనూ ఆకాశం మారుమ్రోగింది. ఆ తరువాత జనులంతా శబ్దం చేయకుండా ధర్మరాజు ముఖం చూస్తూ ఉండిపోయారు. అటువంటి సమయంలో దుర్యోధనుడి మిత్రుడైన చార్వాకుడు అనే పేరుగల రాక్షసు డొకడు బ్రాహ్మణరూపం ధరించి సన్న్యాసి వేషం వేసికొని, బ్రాహ్మణసమూహంలో నిలబడి ఆ రాజుతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ. త్రిదండి= మనోదండం, వాగ్దండం, కర్మదండం అనే మూడు దండాలు ఉన్నవాడు సన్న్యాసి.

**చార్వాకుం డను రాక్షసుఁడు బ్రాహ్మణ నిగ్రహంబునఁ జచ్చుట (సం. 12-39-22)**

**చ.** **' వినుము నరేంద్ర! సర్వమగు విప్రజనంబును గూడి నన్నుఁ బం**
**చిన విధ 'మీతఁ డేటిపతి? సేసిన పాపము పెద్ద; చంపుచో**
**జనకుఁడు భ్రాత పుత్త్రుఁడను శంక యొకించుక లేదు; సద్గురుం**
**డనియెడి కొంకు బుద్ధి నిసుమంతయుఁ బుట్టదు; వీనిఁ గాల్పనే!'** **361**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; సర్వము+అగు= సమస్తమైన; విప్రజనంబును= బ్రాహ్మణసమూహం; కూడి= కలిసి; నన్నున్= నన్ను; పంచిన= పంపిన; విధము= పద్ధతి, కారణం; వినుము= ఆలకించుము; ఈతఁడు= ఈ ధర్మరాజు; ఏటి పతి?= ఎటువంటి రాజు?; చేసిన పాపము= ఆచరించిన దుష్కృత్యం; పెద్ద= ఘనం; చంపుచోన్= చంపే సమయంలో; జనకుఁడు= తండ్రి; భ్రాత= సోదరుడు; పుత్త్రుఁడు= కుమారుడు; అను= అనే; శంక= అనుమానం, సందేహం; ఒక+ఇంచుక= కొద్దిగా కూడ; లేదు= లేకపోయింది; సత్+గురుండు= మంచిగురువు; అనియెడి= అనే; కొంకు= భయం; బుద్ధిన్= మనసులో; ఇసుమంతయున్= అతి స్వల్పంగా కూడ; పుట్టదు= కలగలేదు; వీనిన్= ఈ ధర్మరాజును; కాల్పను+ఏ?= తగులబెట్టాలా? (ఏం చేసినా తప్పులేదు నిష్ప్రయోజనం అనే భావం ప్రకటించటానికి వాడే ప్రయోగం).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! బ్రాహ్మణులంతా కలిసి నన్ను పంపిన కారణం వినుము. ఘనమైన పాపం చేసిన ఇతడేం రాజు? చంపే సమయంలో తండ్రి, సోదరుడు, కొడుకు అని కూడ సందేహించలేదు. విద్య నేర్పిన గురువని మనసులో కొంచెం కూడ భయపడలేదు. వీడిని తగలపెట్టినా తప్పులేదు కదా!'

**వ.** **అను మని రని పలికి వెండియు.** **362**

**ప్రతిపదార్థం:** అనుము= అనవలసినది; అనిరి; అని= అన్నారని; పలికి= మాట్లాడి; వెండియున్= తిరిగి, ఇంకా.

**తాత్పర్యం:** అనుమని అన్నారు' అని చెప్పి ఇంకా - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ.** **' ఇట్లు శిష్టజనము లేవగింపఁగఁ జేయు । రాజ్య మేల బంధురాజి నెల్లఁ**
**బొలియఁజేసి యెట్టి భోగంబు లనుభవిం । చెదవు? కల్మషంబు చిక్కె నీకు.** **363**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శిష్టజనములు= సజ్జనులు; ఏవగింపఁగన్= అసహ్యించుకుంటూ ఉండగా; చేయు= చేసే; రాజ్యము+ఏల?= రాజ్యపాలన ఎందుకు?; బంధు= చుట్టాల; రాజిన్= సమూహాన్ని; ఎల్లన్= అంతటినీ; పొలియన్+చేసి= చంపి; ఎట్టి= ఎటువంటి; భోగంబులు= సుఖాలు; అనుభవించెదవు?= అనుభవిస్తావు?; నీకు; కల్మషంబు= పాపం; చిక్కెన్= కలిగింది.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఈ విధంగా సజ్జనులు అంతా అసహ్యించుకొంటూ ఉండగా రాజ్యం చెయ్యటం ఎందుకు? బంధువుల నందరినీ చంపి నీవు ఎటువంటి భోగాలు అనుభవిస్తావు? నీకు పాపం కలిగింది.'

**వ. అనిన విని యవ్విప్రు లత్యంత వ్యథితాంతఃకరణు లగుచు నొండొరుల మొగంబులు సూచి 'యిట్లు వుట్టం బని యేమి?' యను వచంబులతోఁ దిరుగుడు వడిరి; ధర్మనందనుండు లజ్జావనత వదనుండై యూరకుండి, వారలవలను గనుంగొని కేలు మొగిచి ఫాలభాగంబునఁ గదియించి యిట్లనియె. 364**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+విప్రులు= ఆ బ్రాహ్మణులు; అతి+అంత= మిక్కిలి; వ్యథిత= బాధపడిన; అంతఃకరణులు= మనస్సు కలవారు; అగుచున్= ఔతూ; ఒండొరుల= పరస్పరం; మొగంబులు= ముఖాలు; చూచి= ఆలోకించి; ఇట్లు= ఇటువంటిది; పుట్టన్= కలగటానికి; పని+ఏమి?= కారణం ఏమిటి?; అను= అనే; వచనంబులతోన్= మాటలతో; తిరుగుడు+పడిరి= కల్లోల పడ్డారు; ధర్మనందనుండు= ధర్మరాజు; లజ్జ= సిగ్గుచేత; అవనత= క్రిందికి దించిన; వదనుండు+ఐ= ముఖం కలవాడై; ఊరక+ఉండి= మిన్నకుండి; వారల= వారి; వలను= దిక్కు, వైపు; కనుంగొని= చూచి; కేలు మొగిచి= చేతులు జోడించి; ఫాలభాగంబునన్= నుదుట; కదియించి= కీలించి, ఉంచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ చార్వాకుడు అన్నమాటలు విని అక్కడ ఉన్న బ్రాహ్మణులంతా మనస్సులలో ఎంతో బాధపడినవారై ఒకరి మొగం ఒకరు చూచుకొంటూ 'ఇటువంటి మాట రావటానికి కారణం ఏమిటి?' అని అనుకొంటూ కల్లోలపడ్డారు. ధర్మరాజు సిగ్గుతో తలవంచుకొని, వారివంక చూచి, చేతులు జోడించి నుదుట ఉంచి, ఇట్లా అన్నాడు:

**తే. 'మ్రొక్కి వేఁడెద నను మీరు ధిక్కరింప। కాదరింపుఁడు; మునిసమూహానుమతుఁడ**
**నై వినిశ్చియ పరికలితాంతరంగ। వర్తనముతోడ నిచటికి వచ్చినాఁడ.' 365**

**ప్రతిపదార్థం:** (మీకు) మ్రొక్కి= నమస్కరించి; వేఁడెదన్= ప్రార్థిస్తున్నాను; నను= నన్నున్; మీరు; ధిక్కరింపక= ఎదిరించక, వ్యతిరేకించకుండా; ఆదరింపుఁడు= మన్నించండి; ముని సమూహ= మునుల సముదాయంచేత; అనుమతుఁడను+ఐ= ఆజ్ఞపొందినవాడినై; వినిశ్చయ= గట్టి నిర్ణయంతో; పరికలిత= బాగా కూడుకొన్న; అంతరంగ వర్తనముతోడన్= మనః ప్రవృత్తితో; ఇచటికిన్= ఇక్కడికి; వచ్చినాఁడన్= వచ్చాను.

**తాత్పర్యం:** 'మీకు నమస్కరించి ప్రార్థిస్తున్నాను. నన్ను కాదనక మన్నించండి, మునులందరిచేత ఆజ్ఞాపించబడి, దృఢమైన నిర్ణయంతో కూడుకొన్న మనఃప్రవృత్తితో ఇక్కడికి వచ్చాను'.

**వ. అనవుడు భయ సంభ్రమ భరితు లగుచు నా భూసురులు 'దేవా! యీ వాక్యంబులు మావలనం బుట్టినవి గా' విది యేమియో కాని, నీ వుత్తమ క్షత్త్రధర్మంబున సముపార్జించిన యుజ్జ్వలశ్రీ సుస్థిరతం బొందెడు' మని యతనికి నాశ్వాసం బొనర్చి, యమ్మాయాభిక్షువు నాలోకించి, పరమబోధనంబున నప్పురుషాధము నెఱింగి, యమ్మహీపతితో 'వీఁడు దుర్యోధన సఖుం డగు రాక్షసుండు సన్న్యాసి వేషంబున నేతెంచి యతనికి హితం బాచరించువాఁడై యీ దుర్వచనంబు లాడె; నీ కుక్క మొఱఁగిన యంతన పాలమున్నీరుం బోని నీకుం గలంగ నేల? ధర్మాత్ములగు తమ్ములు పనుపు సేయం బూజ్యంబగు సామ్రాజ్యంబు వహింపు'మని యాదరించి. 366**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; భయ= బెదరు; సంభ్రమ= తడబాటు; భరితులు= నిండుగా కలిగినవారు; అగుచున్= అవుతూ; ఆ భూసురులు= ఆ బ్రాహ్మణులు; దేవా!= ప్రభూ!; ఈ వాక్యంబులు= ఈ మాటలు; మావలనన్= మా నుండి; పుట్టినవి కావు= పుట్టలేదు; ఇది= ఈ మాటలు పుట్టటం; ఏమి+ఓ+కాని= ఏమైనా అవనీ (పట్టించుకొనవద్దని భావం); నీవు; ఉత్తమ= గొప్ప;

క్షత్ర+ధర్మంబునన్= రాజోచితమైన పద్ధతిలో; సముపార్జించిన= సంపాదించిన; ఉజ్జ్వలశ్రీ= ప్రకాశించే సంపద (రాజ్యం, కీర్తి మొదలైనవన్నీ); సుస్థిరతన్= శాశ్వతత్వాన్ని; పొందెడున్+అని= పొందుదువుగాక!; (ఎడుతల ద్రుతంబున కచ్చు పరంగునపుడు మకారంబగు. అయ్యెడున్+అని= అయ్యెడుమని, కావుతన్+అని= కావుతమని); అని= అని పలికి; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఆశ్వాసంబు= సాంత్వనం; ఒనర్చి= కలిగించి; ఆ+మాయాభిక్షువున్= ఆ కపట సన్న్యాసిని; ఆలోకించి= చూచి; పరమబోధంబునన్= దివ్యమైన జ్ఞానంతో (దివ్యదృష్టితో); ఆ+పురుష+అధమున్= మనవులలో నీచుడిని; ఎఱింగి= గుర్తించి; ఆ+మహీపతితోన్= ఆ ధర్మరాజుతో; వీఁడు= ఈ మాయావి; దుర్యోధన సఖుండు+అగు= దుర్యోధనుడి మిత్రుడైన; రాక్షసుండు= రక్కసి; సన్న్యాసివేషంబునన్= యతి వేషంలో; ఏతెంచి= వచ్చి; అతనికిన్= దుర్యోధనుడికి; హితంబు= మేలు; ఆచరించువాఁడు+ఐ= చేసేవాడై; ఈ దుర్వచనంబులు= ఈ చెడు మాటలు; ఆడెన్= పలికాడు; ఈ కుక్క= ఈ నీచుడు; మొఱఁగిన+అంతన= అరచినంత మాత్రాన; పాలమున్నీరున్+పోలు= పాలసముద్రంవంటి; నీకున్= నీకు; కలంగన్= బాధ పడటం; ఏల?= ఎందుకు?; ధర్మ+ఆత్ములు= ధర్మబుద్ధికలవారు; అగు= అయిన; తమ్ములు= అనుజులు; పనుపు= నీ ఆజ్ఞను; చేయన్= అమలు జరుపుతూ ఉండగా; పూజ్యంబు+అగు= పవిత్రమైన; సామ్రాజ్యంబు= రాజ్యభారాన్ని; వహింపుము= నిర్వహించుము; అని= అని పలికి; ఆదరించి= మన్నించి.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా పలుకగా బ్రాహ్మణులు భయంతో కంగారుగా 'ప్రభూ! ఈ మాటలు మా నుండి రాలేదు. అవి ఏమైనా కానిమ్ము (పాటించవద్దని భావం), నీవు శ్రేష్ఠమైన రాజోచిత మార్గంలో సంపాదించిన ప్రకాశించే సంపదను అంటే రాజ్యం కీర్తి మొదలైనవన్నీ కలకాలం నిలిచి ఉంటాయి' అని ధర్మరాజుతో సాంత్వన వచనాలు పలికారు. ఆ కపటయతిని చూచి, దివ్యదృష్టితో ఆ నీచుడిని గుర్తించి, ధర్మరాజుతో ఈ విధంగా పలికారు. 'వీడు దుర్యోధనుడి స్నేహితుడైన ఒక రాక్షసుడు. దుర్యోధనుడికి మేలు చేయా లని ఈ చెడుమాటలు పలికాడు. ఈ నీచుడు కుక్కవలె మొరిగినంత మాత్రాన పాలసముద్రంవలె స్వచ్ఛంగా ఉన్న నీవు బాధపడలసిన పని లేదు. ధర్మమార్గంలో నడిచే నీ తమ్ముళ్ళు నీ ఆజ్ఞను అమలు జరుపుతుండగా, పవిత్రమైన రాజ్యభారం వహించుము' అని ఆదరించారు.

**క.** **ఆ రాక్షసుఁ గనుఁగొని కో । పారంజిత నేత్రు లగుచు నవ్విప్రులు హుం**
**కార ముఖరు లగుటయు, నతి । ఘోరాకృతితోడ వాఁడు గూలెం బుడమిన్. 367**

**ప్రతిపదార్థం:** ఆ రాక్షసున్= ఆ చార్వాకుడిని; కనుఁగొని= చూచి; కోప= కోపంతో; ఆరంజిత= బాగా ఎర్రబడిన; నేత్రులు+అగుచున్= కన్నులు కలవారై; ఆ+విప్రులు= ఆ బ్రాహ్మణులు; హుంకారముఖరులు= హుం అనే ధ్వనిచేస్తున్న నోరు కలవారు; అగుటయున్= కావటంతో; అతిఘోర+ఆకృతితోడన్= మిక్కిలి భయంకరమైన రూపంతో; వాఁడు= ఆ రక్కసి; పుడమిన్= భూమిపై; కూలెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణులు చార్వాకుడిని చూచి కోపంతో కన్నులు ఎర్రబడగా, హుంకారంచేయటంతో వాడు భయంకరమైన రూపంతో నేల కూలాడు.

**తే.** **బ్రహ్మతేజో నిహతి నిట్లుపడి మహాశ । నిప్రహతి పాతితోర్వీజనిభత నొంది**
**యున్న యద్దానవునిఁ జూచి యన్నరేంద్రుఁ । డెలమి సొంపు వహించెఁ దమ్ములును దాను. 368**

**ప్రతిపదార్థం:** బ్రహ్మ= బ్రాహ్మణ; తేజోనిహతిన్= తేజస్సువలన చంపబడి; ఇట్లు= ఈ విధంగా; పడి= నేలకూలి; మహా+అశని= గొప్ప పిడుగుయొక్క; ప్రహతిన్= దెబ్బచేత; పాతిత= పడగొట్టబడిన (నేలకూలిన); ఉర్వీజ= చెట్టు; నిభతన్= పోలికను; పొంది= కలిగి; ఉన్న= ఉండిన; ఆ+దానవునిన్= ఆ రాక్షసుడిని; చూచి= కని; ఆ+నర+ఇంద్రుఁడు= ఆ రాజశ్రేష్ఠుడు; తాను= తను; తమ్ములును= సోదరులూ; ఎలమి= వికాసం; సొంపు= సంతోషం; వహించెన్= పొందాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుల తేజస్సువలన చంపబడి నేలకూలి, పెద్దపిడుగుపాటుతో నేలకూలిన వృక్షంవలె ఉన్న ఆ రాక్షసుడిని చూచి ధర్మరాజు తమ్ములతో కూడి వికాసాన్నీ, సంతోషాన్నీ పొందాడు.

**వ. ఇట్లు ప్రీతుండై యజాతశత్రుం డవ్విప్రసమూహంబునకు సవిశేషార్చనం బొనర్చి వీడుకొలిపె; నప్పు డచ్యుతుండు బ్రాహ్మణస్తుతి సేసి యజ్ఞనపతితో నిట్లనుఁ; 'గృతయుగంబునం జార్వాకుం డనుదైత్యుండు తపం బొనరించి పద్మభవుండు ప్రత్యక్షంబయిన నఖిల భూతంబుల వలనను నభయంబు వేఁడిన నద్దేవుండు భూదేవతల కనిష్టంబులైన పనులు సేయకుండు వాఁడవు; చేసితేని యదియ నీకుఁ దుది యని' పలికి యవ్వరం బొసంగె నట్లు లబ్ధవరుండై వాఁడు గర్వించి గీర్వాణుల బాధింపం దొడంగిన, వారు విరించిం గాంచి యా రక్కసుండు సేయు బాధలు సెప్పిన, 'నమ్మహాత్ముం డేను మున్న యెఱింగి యొనర్చినవాఁడు దుర్యోధనుం డను రాజునకు నెచ్చెలియై యచ్చపలుండు తత్కార్యం బాదరింపంజొచ్చి మహీసురులకు మనోవ్యథాకరంబగు కర్మంబు సేయు; నప్పనికారణంబుగా వారల కోపంబునం గూలం గలవాఁ డని పలికె; నద్దానవుండు నేఁ డిట వచ్చి తన దుర్వినయంబున బ్రహ్మదండ నిహతుండై పడియున్నవాఁ'డని చెప్పి, యప్పీనుంగు వెడలవైపించి, యా భూపాలు నుద్దేశించి వెండియు. 369**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; అజాతశత్రుండు= ధర్మరాజు; ఆ+విప్ర సమూహంబునకున్= ఆ బ్రాహ్మణుల సముదాయానికి; సవిశేష= ప్రత్యేకమైన; అర్చనంబు= పూజ; ఒనర్చి= చేసి; వీడుకొలిపెన్= సెలవుతీసికొని పంపించాడు; అప్పుడు= ఆ సమయంలో; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; బ్రాహ్మణ= బ్రాహ్మణులను; స్తుతి+చేసి= కీర్తించి; ఆ+జనపతితోన్= ఆ రాజుతో (ధర్మరాజుతో); ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; కృతయుగంబునన్= కృతయుగంలో; చార్వాకుండు= చార్వాకుడనే పేరుగల; దైత్యుండు= రాక్షసుడు; తపంబు= తపస్సు; ఒనరించి= చేసి; పద్మభవుండు= బ్రహ్మ; ప్రత్యక్షంబు+అయినన్= దర్శన మీయగా; అఖిల= సమస్తమైన; భూతంబుల వలననున్= ప్రాణులనుండి; అభయంబు= భయంలేకపోవటాన్ని; వేఁడినన్= ప్రార్థించగా; ఆ+దేవుండు= ఆ దేవతా ముఖ్యుడు; భూ దేవతలకున్= బ్రాహ్మణులకు; అనిష్టంబులు+ఐన= ఇష్టంకాని, కష్టం కలిగించే; పనులు= చేతలు; చేయక+ఉండువాఁడవు= చేయకుండా ఉండుము; చేసితి(వి)+ఏని= చేసినట్లైతే; అది+అ= అదే; నీకున్+తుది= నీకు చివర (అంతం); అని= అంటూ; పలికి= చెప్పి; ఆ+వరంబు= అత డడిగిన వరం; ఒసంగెన్= ఇచ్చాడు; అట్లు= ఆ విధంగా; లబ్ధవరుండు+ఐ= వరం పొందినవాడై; వాఁడు= ఆ చార్వాకుడు; గర్వించి= అహంకరించి; గీర్వాణులన్= దేవతలను; బాధింపన్= కష్టపెట్టటం; తొడంగినన్= ప్రారంభించగా; వారు= ఆ దేవతలు; విరించిన్= బ్రహ్మను; కాంచి= దర్శించుకొని; ఆ రక్కసుండు= ఆ రాక్షసుడు; చేయు= చేసే, పెట్టే; బాధలు= కష్టాలు; చెప్పినన్= చెప్పగా; ఆ+మహా+ఆత్ముండు= ఆ మహానుభావుడు; ఏను= నేను; మున్ను+అ= ముందే; ఎఱింగి= తెలిసి; ఒనర్చినవాఁడన్= చేశాను; దుర్యోధనుండు+అను= దుర్యోధనుడనే పేరుగల; రాజునకున్= రాజునకు; నెఱ+చెలి= మంచి మిత్రుడు; ఐ= అయి; ఆ+చపలుండు= ఆ స్థిరబుద్ధిలేనివాడు; తద్+కార్యంబు= అతడి పని; ఆచరింపన్+చొచ్చి= చేయటం మొదలుపెట్టి; మహీసురులకున్= బ్రాహ్మణులకు; మనోవ్యథాకరంబు= మనస్సుకు బాధకలిగేది; అగు= అయిన; కర్మంబు= పని; చేయున్= చేస్తాడు; ఆ+పని= ఆ చేష్ట; కారణంబుగాన్= నిమిత్తంగా; వారలకోపంబునన్= వారి కోపంతో; కూలన్+కలవాఁడు= చనిపోగలడు; అని పలికెన్= అని చెప్పాడు; ఆ+దానవుండు= ఆ రాక్షసుడు; నేఁడు= ఈ రోజు; ఇట= ఇక్కడికి; వచ్చి= అరుదెంచి; తన= తన యొక్క; దుస్+వినయంబునన్= అవినీతితో; బ్రహ్మదండ= బ్రాహ్మణుల దండన చేత; నిహతుండు+ఐ= చంపబడిన వాడై; పడి+ఉన్నవాఁడు= నేలకూలాడు; అని+చెప్పి= అంటూ తెలియచేసి; ఆ+పీనుంగున్= ఆ శవాన్ని; వెడల= దూరంగా; వైపించి= వేయించి; ఆ భూపాలున్= ఆ రాజును; ఉద్దేశించి= లక్షించి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఈ విధంగా సంతోషించిన ధర్మరాజు ఆ బ్రాహ్మణ సమూహానికి విశేషమైన పూజలు చేసి వీడ్కోలు పలికాడు, అప్పుడు శ్రీకృష్ణుడు బ్రాహ్మణులను కీర్తించి, ధర్మరాజుతో ఈ విధంగా పలికాడు. 'కృతయుగంలో చార్వాకుడనే పేరున్న రాక్షసుడు తపస్సుచేసి బ్రహ్మను ప్రత్యక్షంచేసికొని తనకు సమస్తప్రాణుల వలన భయంలేకుండా ఉండేటట్లు వరం కోరాడు. బ్రాహ్మణులకు అనిష్టమైన పనులు చేయకుండా ఉండుము. అట్లా చేస్తే అదే నీకు ఆఖరు (ఆపై నీవుండవు). అని చెప్పి అతడు కోరిన వరం ప్రసాదించాడు. వాడు ఆ విధంగా

వరం పొంది అహంకరించి దేవతలను బాధించటం మొదలు పెట్టాడు. దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి ఆ రాక్షసుడు పెట్టే బాధలు చెప్పారు. ఆ మహానుభావుడు 'నే నీ సంగతి ముందే తెలిసికొని తగినట్లుగా ఏర్పాటు చేశాను. దుర్యోధనుడనే రాజుకు మిత్రుడై ఆ బుద్ధిస్థిరతలేని చార్వాకుడు ఆ దుర్యోధనుడి పని చేయాలనుకొని బ్రాహ్మణులకు బాధ కలిగించే పని చేస్తాడు. ఆ చార్వాకుడు ఈ రోజు ఇక్కడికి వచ్చి తన వినయరాహిత్యంవలన బ్రాహ్మణుల దండనచేత చంపబడ్డాడు' ఆ శవాన్ని బయటపారవేయుమని చెప్పి ధర్మరాజుతో ఇంకా ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ.** **' మాఱుకొన్నవారి నీఱు సేయుము; ప్రజ । నరసి మనుపు; ధరణిసురులఁ బ్రోవు;**
**మఖిల బంధుజనుల నాశ్రితులను సుఖ । వృత్తి మనుపు పెంపు వెలయ నధిప! 370**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; మాఱుకొన్నవారిన్= ఎదిరించినవారిని; నీఱు= బూడిద; చేయుము= కావించుము; ప్రజన్= పౌరులను; అరసి= విచారించి (కనుగొని); మనుపు= కాపాడుము; ధరణి సురులన్= బ్రాహ్మణులను; ప్రోవుము= కాపాడుము; పెంపు= ఆధిక్యం, గొప్పతనం; వెలయన్= ఒప్పగా; అఖిల= సమస్తమైన; బంధుజనులన్= చుట్టాలను; ఆశ్రితులను= శరణు జొచ్చినవారిని; సుఖవృత్తిన్= సుఖంగా ఉండేటట్లు; మనుపు= కాపాడుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఎదిరించిన వాళ్ళను మసిచేయుము. ప్రజల కష్టసుఖాలు విచారించి రక్షించుము. నీ గొప్పతనం ప్రకటమయ్యే విధంగా బంధువులను, ఆశ్రయించుకొన్నవారిని సుఖంగా ఉండేటట్లు కాపాడుము.

**వ.** **రాజ్యాభిషేక శోభనం బనుభవింపు' మని పలికి, యాభిషేచనిక ద్రవ్యానయనంబునకుం దగువారిం బనిచి బయలి పెద్దకొలువుకూటంబున నమ్మహీపతికి మహోన్నత హేమమయ సింహాసనంబు పెట్టించి, వెలయువారలకెల్ల సముచిత సమంచిత పీఠంబు లుపచరింప నియోగించిన, నప్పాండవాగ్రజుం డుల్లంబు కలంక యెల్ల డిగ్గఁద్రావి, యిచ్చం దెలివొంది, చెలువొందు నిజపీఠంబునం బూర్వాభిముఖుండై కూర్చుండె; నతని కట్టెదురం గనత్కాంచ నాసనంబున సాత్యకి సమేతంబుగా శౌరియు, వలపటను దాపటను మణిపీఠంబుల వడముడియుఁ గవ్వడియును, వెనుకం గనకాయుత కుబ్జాసనంబులం గవల నిరువంకల నునిచికొని కుంతీమహాదేవియు దామోదరుని దక్షిణ దిక్కున నర్చిస్సముజ్జ్వలం బగు నాసనంబున ధృతరాష్ట్రుండును దదీయ ప్రాక్ప్రదేశంబునం బ్రస్ఫురిత పీఠంబుల విదురుండునుధౌమ్యుండును, ధృతరాష్ట్రుని పిఱుంద నర్హపీఠంబుల గాంధారీ యుయుత్సు సంజయులునుం గూర్చుండి; రా సమయంబున నంబుజాక్షుండు గృపావిశేషంబునఁ గృపాచార్యుం దగుతెఱంగున నయ్యజాతశత్రుం గానిపించి యోగ్యాసనంబున ధౌమ్యు సమీపంబున నతని నునిచె; నంత నప్పుడమిఱేఁడు సిత కుసుమాక్షత కాంచన రజత రత్న గర్భాస్పర్శనం బాచరించెఁ; దదనంతరంబ. 371**

**ప్రతిపదార్థం:** రాజ్య+అభిషేక= పట్టాభిషేకం అనే; శోభనంబు= వైభవం; అనుభవింపుము= పొందుము; అని+పలికి= అంటూ చెప్పి; ఆభిషేక సంబంధమైన; ద్రవ్య= సంభారాల; ఆనయనంబునకున్= తీసికొనిరావటానికి; తగువారిన్= అర్హులైన వారిని; పనిచి= పంపి; బయలి= ఆరుబయట; పెద్ద= విశాలమైన; కొలువు కూటంబునన్= సభాస్థలియందు; ఆ+మహీపతికిన్= ఆ రాజుకు (ధర్మరాజుకు); మహా= ఘనమైన; ఉన్నత= ఎత్తైన; హేమమయ= బంగారంతో చేయబడిన; సింహాసనంబు= సింహపు ముఖం ఉన్న ఎత్తైన బంగారు ఆసనం, రాజోచితమైనది; పెట్టించి= ఏర్పరచి; వలయువారలకున్= అయినవారికి, ఆప్తులకు; ఎల్లన్= అందరికీ; సముచిత= బాగా తగిన; సమంచిత= గొప్పవైన; పీఠంబులు= ఆసనాలు; ఉపచరింపన్= సన్మానించటానికి, సేవించటానికి;

నియోగించినన్= ఏర్పాటుచేయగా; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; ఉల్లంబు కలంక= మనస్సులోని బాధ; ఎల్లన్= అంతటినీ; డిగ్గన్+త్రావి= దిగమ్రింగి; ఇచ్చన్= కోరికతో, సంకల్పంతో; తెలివి+ఒంది= ఎఱుక కలిగి; చెలువు+ఒందు= అందగించే; నిజ= తన; పీఠంబునన్= సింహాసనం మీద; పూర్వ+అభిముఖుండు+ఐ= తూర్పుదిక్కుగా ముఖం కలవాడై; కూర్చుండెన్= అధివసించి ఉన్నాడు; అతని= ఆ ధర్మరాజు; కడు+ఎదురన్= ఎట్టఎదురుగా; కనత్= ప్రకాశించే; కాంచన= బంగారు; ఆసనంబునన్= పీఠంమీద; సాత్యకి సమేతంబుగాన్= సాత్యకితో కూడుకొన్నవాడై శౌరియున్= కృష్ణుడును; వలపటను= కుడిప్రక్కన; దాపటను= ఎడమప్రక్కన; మణిపీఠంబులన్= రత్నమయ ఆసనాలపై; వడముడియున్= భీముడూ; కవ్వడియును= అర్జునుడు; వెనుకన్= వెనుక ప్రక్కగా, కనక+ఆయత+కుబ్జ= బంగారపు విశాలమైన పొట్టిది అయిన; ఆసనంబులన్= పీఠాలమీద; కవలన్= నకుల సహదేవులను; ఇరువంకలన్= రెండువైపులా; ఉనిచికొని= కూర్చుండబెట్టుకొని; కుంతీమహాదేవియున్= కుంతీదేవి; దామోదరు= కృష్ణుడు; దక్షిణ దిక్కునన్= కుడిప్రక్క; అర్చిస్= కాంతులతో; సముజ్జ్వలంబు= బాగా ప్రకాశించే; ఆసనంబునన్= పీఠంపై ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడు; తదీయ= అతడికి; ప్రాక్+ప్రదేశంబునన్= తూర్పువైపున; ప్రస్ఫురిత= బాగా ప్రకాశించే; పీఠంబులన్= ఆసనాలపై; విదురుండును= విదురుడు; ధౌమ్యుండును= పురోహితుడైన ధౌమ్యుడు; ధృతరాష్ట్రుని పిఱుందన్= ధృతరాష్ట్రుడి వెనుక ప్రక్క; అర్హపీఠంబులన్= తగిన ఆసనాలమీద; గాంధారీ, యుయుత్సు, సంజయులునున్= గాంధారీదేవి, యుయుత్సుడు, సంజయుడు; కూర్చుండిరి= ఆసీనులై ఉన్నారు; ఆ సమయంబునన్= అట్టి సమయంలో; అంబుజ+అక్షుండు= పద్మాలవంటి కన్నుల కల శ్రీకృష్ణుడు; కృపావిశేషంబునన్= దయాతిశయంతో; కృప+ఆచార్యున్= కృపాచార్యుడిని; తగు= తగిన; తెఱంగునన్= తీరులో; ఆ+అజాతశత్రున్= ఆ ధర్మరాజుకు; కానిపించి= కనబడచేసి; యోగ్య+ఆసనంబునన్= ఉచితాసనంపై; ధౌమ్య= పురోహితుడైన ధౌమ్యుడిని; సమీపంబునన్= చేరువలో, ప్రక్కనే; అతనిన్= ఆ కృపాచార్యుడిని; ఉనిచెన్= కూర్చుండచేశాడు; అంతన్= అప్పుడు; ఆ+పుడమిఱేఁడు= ఆ భూపతి, ధర్మరాజు; సిత= తెల్లని; కుసుమ= పూలు; అక్షత= అక్షతలు; కాంచన= బంగారు; రజత= వెండి; రత్నగర్భ= భూమి; స్పర్శనంబు= తాకటం; ఆచరించెన్= చేశాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** పట్టాభిషేక వైభవాన్ని అనుభవించుము' అని శ్రీకృష్ణుడు చెప్పి అభిషేకానికి కావలసిన వస్తు సంభారాలను తీసికొని రావటానికి అర్హులైన వారిని పంపాడు. ఆరుబయట పెద్ద కొలువుతీర్చి, ధర్మరాజుకు గొప్ప ఎత్తైన బంగారు సింహాసనాన్ని ఏర్పాటుచేసి, అయినవారందరికీ తగిన, ఘనమైన ఆసనాలు ఏర్పాటుచేయుమని అర్జునుడికి చెప్పాడు. అప్పుడు ధర్మరాజు తన మనస్సులోని బాధనంతా దిగమ్రింగి, సంకల్పంతో తేరుకొని, ప్రకాశిస్తున్న తన ఆసనం మీద తూర్పుముఖంగా కూర్చున్నాడు. అతడికి ఎదురుగా బంగారు పీఠంపై సాత్యకితో కలిసి శ్రీకృష్ణుడు కూర్చున్నాడు. రత్నమయ పీఠాలపై కుడిఎడమల భీముడు, అర్జునుడు, వెనుక ప్రక్క విశాలములు, పొట్టివి అయిన బంగారు ఆసనాల మీద నకుల సహదేవులు చెరొకప్రక్క ఉండగా; కుంతీదేవి, కృష్ణుడికి కుడి ప్రక్కగా కాంతులతో ప్రకాశించే పీఠంమీద ధృతరాష్ట్రుడు, అతడికి తూర్పువైపు వెలిగిపోయే ఆసనాలమీద విదురుడు, ధౌమ్యుడు, ధృతరాష్ట్రుడికి వెనుకగా ఉచితాసనాలమీద గాంధారి, యుయుత్సుడు, సంజయుడు ఆసీనులై ఉన్నారు. ఆ సమయంలో తన కరుణా విశేషంతో శ్రీకృష్ణుడు ధర్మరాజుకు కృపాచార్యుడి దర్శనం కలిగించి, ధౌమ్యుడి ప్రక్కన ఉచితాసనంపై అధివసింపచేశాడు. ఆ ధర్మరాజు తెల్లని పూలను, అక్షతలను, బంగారాన్ని, వెండిని, భూదేవిని స్పృశించాడు. ఆ తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **విద్వత్సమూహంబు, వివిధ దేశాధీశ। సంఘంబుఁ, గార్యవిచారపరులు,**
**నర్థార్జనాది కృత్యంబుల వారలు, । బహుపరిచర్యలఁ బరఁగు జనులు,**
**వైశ్యప్రముఖ పౌరవర్గంబులును, ముఖ్య। హాలికాది జానపదావలులును,**
**వైణిక గాయక వాంశికాది వినోద। కరులును, వారసుందరులు లోను**

**ఆ. గాఁగఁ దగినవారు గాంచి యవ్విభుని స । త్కారములఁ బ్రమోదితాత్ము లగుచు**
**భావములు దలిర్ప సేవించియుండ న । క్కొలువు సాల నొప్పెఁ గురువరేణ్య! 372**

**ప్రతిపదార్థం:** కురువరేణ్యా!= జనమే జయమహారాజా!; విద్వత్= పండితుల; సమూహంబు= గణము; వివిధ= అనేక; దేశ+అధీశ= రాజుల; సంఘంబున్= సమూహం; కార్యవిచారపరులు= మంత్రులు; అర్థ+ఆర్జన= ధనసముపార్జన; ఆది= మొదలైన; కృత్యంబుల వారలు= పనులు చేసేవారు; బహు= నానా; పరిచర్యలన్= సేవలలో; పరఁగు= ఒప్పే; జనులు= వారు (మానవులు); వైశ్యప్రముఖ= వైశ్యులు మొదలైన; పౌరవర్గంబులును= పురజనుల గణాలు; ముఖ్య= ప్రధానమైన; హలిక+ఆది= కృషీవలులు మొదలైన; జానపద+ఆవలులును= గ్రామీణజన సమూహాలు; వైణిక= వీణ వాయించేవారు; గాయక= పాడేవారు; వాంశిక= వేణువూదేవారు; ఆది= మొదలైన; వినోద కరులును= వినోదం కలిగించేవారు; వారసుందరులు= వేశ్యాస్త్రీలు; లోను+కాఁగన్= మొదలుగా; తగినవారు= యోగ్యులు; కాంచి= దర్శించుకొని; సత్కారములన్= సన్మానాలతో; ప్రమోదిత= మిక్కిలి సంతోషపెట్టబడిన; ఆత్ములు= మనస్సులు కలవారు; అగుచున్= ఔతూ; భావములు= తలపులు; తలిర్పన్= సంతోషంతో అతిశయించగా; సేవించి+ఉండన్= కొలువుతీరి ఉండగా; ఆ+కొలువు= ఆ సభ; చాలన్= అధికంగా; ఒప్పెన్= అందగించింది.

**తాత్పర్యం:** జనమేజయా! పండితుల సమూహం, వివిధ దేశాల రాజుల సముదాయం, మంత్రులు, ధనార్జన మొదలైనవి చేసేవారు, వివిధ పరిచర్యలు చేసే సేవకజనం, వైశ్య ప్రముఖులు మొదలైన పౌరులు, కృషీవలులు మొదలైన గ్రామీణులు, వీణ వేణువు మొదలైన సంగీత వాద్యాలను పలికించటంలో నేర్పరులు, గాయకులు, వేశ్యలు మొదలైనవారంతా ధర్మరాజును దర్శించుకొని, అతడిచేత సన్మానాలు పొంది, మనసులో ఎంతో సంతసిస్తూ కొలువు తీర్చి ఉండగా ఆ సభ చాల ప్రకాశించింది.

**విశేషం:** రాజ్యపాలనకు కావలసిన అంగాలన్నీ (మంత్రం, ధనం, కార్యాచరణం, సేవ), సుఖస్థితికి వలసినవి (వ్యాపారం, పాడిపంట) వినోదం - అన్నీ సమకూడి ఉన్నాయి సభలో.

## ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము (సం. 12-40-9)

**వ. అంత నాభిషేచనిక ద్రవ్య సంచయంబు సన్నిహితం బగుటయు, మాధవానుమతుండై ధౌమ్యుండు ప్రాగు దక్ప్లవనంబైన వేదికాతలం బలంకరించి యందు జాతరూప నవరత్న ఖచితంబును దృఢపాదంబు నగు భద్రపీఠంబు ప్రతిష్ఠించి, శార్దూల చర్మాస్తరణ శోభితంబు సేసి యర్చించి, కాంచనదామజుష్టం బగు నుత్కృష్టఘన శంఖంబు సమంచిత స్థండిలంబున నిలిపి పూజించి, దానను దానిచుట్టునుం బార్థివంబులు హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నగు కుంభంబు లొనర్చి వానను గాంగంబులగు జలంబులు నినిచి యన్నింటికి రత్నమంగళతరు త్వక్పల్లవ కుసుమంబులను బంచగవ్యంబులను సమంత్రకంబుగా సంస్కారంబు నిర్వర్తించి. 373**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; ఆభిషేచనిక= అభిషేక సంబంధమైన; ద్రవ్యసంచయంబు= వస్తుసముదాయం; సన్నిహితంబు= బాగా దగ్గరకు వచ్చినది; అగుటయున్= కావటంతో; మాధవ+అనుమతుండు+ఐ= కృష్ణుడిచేత అనుజ్ఞపొందినవాడై; ధౌమ్యుండు= పురోహితుడైన ధౌమ్యుడు; ప్రాక్+ఉదక్ (ప్రాగుదీచీ పాఠాంతరం)= తూర్పు, ఉత్తరం, అనగా ఆ దిక్కుల మధ్య ఉండే ఈశాన్యం; ప్లవనంబు+ఐన= పల్లంగా ఉన్న; వేదికాతలంబు= వేదికను; అలంకరించి= అలంకారం చేసి; అందున్= అచట; జాతరూప= బంగారుమయమైనవి; నవరత్న ఖచితంబును= నవరత్నాలతో తాపటం చేయబడింది; దృఢపాదంబును= స్థిరమైన బలమైన కాళ్ళు కలిగినది; అగు= అయిన; భద్ర= శుభప్రదమైన; పీఠంబు= ఆసనం, పీట; ప్రతిష్ఠించి= స్థాపించి; శార్దూలచర్మ= పులితోలు; ఆస్తరణము= పరుపుతో; శోభితంబు+చేసి=

అలంకరించి; అర్చించి= పూజించి; కాంచన= బంగారు; దామ= దండతో; జుష్టంబు+అగు= చేరినదైన; ఉత్కృష్ట= శ్రేష్ఠమైన; ఘన= పెద్ద; శంఖంబు= శంకువుని; సమంచిత= బాగా తగిన; స్థండిలంబునన్= వ్రతము కొరకు దర్భాదులచేత సంస్కరించబడిన స్థలమున; నిలిపి= నిలబెట్టి; పూజించి= అర్చించి; దానన్= దానియందు; దానిచుట్టునన్= ఆ శంఖం చుట్టూ; పార్థివంబులు= మట్టివి; హైమంబులు= బంగారపువి; రాజతంబులు= వెండివి; రత్నమయంబులున్= రత్నాలతో చేయబడినవి; అగు= అయిన; కుంభంబులు= కలశాలు; ఒనర్చి= ఏర్పాటుచేసి, పెట్టి ఉంచి; వానను= ఆ కలశాలలో; గాంగంబులు+అగు= గంగానదివైన; జలంబులు= నీరు; నినిచి= నింపి; అన్నింటికిన్= ఆ కలశాలన్నింటికీ; రత్న= మణులతోను; మంగళతరు= శుభప్రదమైన చెట్ల; త్వక్+పల్లవ+కుసుమంబులను= బెరడులు, చిగుళ్ళు, పూలతోను; పంచగవ్యంబులను= గోసంబంధమైన అయిదు వస్తువులతోను (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, పేడ); సమంత్రికంబు+కాన్= మంత్రపూతంగా; సంస్కారంబు= సంస్కరణ; నిర్వర్తించి= చేసి.

**తాత్పర్యం:** ఆ విధంగా కొలువుతీరిన సమయంలో పట్టాభిషేకానికి కావలసిన సంభారాలు రావటంతో, కృష్ణుడు ఆజ్ఞాపించగానే పురోహితుడైన ధౌమ్యుడు ఈశాన్యదిక్కున పల్లంగా ఉన్న (ఇది వాస్తు శాస్త్రాన్ని అనుసరించి శుభం) వేదికను అలంకరించాడు. ఆ వేదికపై నవరత్నాలు పొదిగిన బలమైన కాళ్ళుగల బంగారపు భద్రపీఠాన్ని స్థాపించి, ఆ పీఠంపై పులితోలు పరచి అలంకరించి, పూజించి, బంగారు దండలతో కూడుకొని ఉన్న శ్రేష్ఠమైన గొప్ప శంఖాన్ని యజ్ఞార్థం దర్భాదులచేత సంస్కరించబడి బాగా ఒప్పే స్థలంలో నిలబెట్టి పూజించి, ఆ స్థలంలోనూ దానిచుట్టూ మట్టి, బంగారు, వెండి, మణి కలశాలనుంచి, ఆ కలశాలలో గంగాజలం నింపి, ఆ కలశాల నన్నింటిని రత్నాలతోను, శుభప్రదమైన వృక్షాల బెరడులు, చిగుళ్ళు, పూలతోనూ, పంచగవ్యాలతోనూ మంత్రపూతంగా సంస్కరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **వీర్యవంతములగు వివిధ మంత్రంబుల । తోఁ గూడ సద్విజస్తోమ పరివృ**
**తునిఁ జేసికొని రాజుఁ దోడ్కొనియేఁగి యా । వినుత పీఠంబున నునిచి, శోభ**
**నాలంకరణమున నభిరామ యైన పాం । చాలిఁ దద్వామపార్శ్వమున సహస**
**మాసీనఁ గావించి, యగ్నిముఖము సేసి । కొని హోమ తంత్ర వర్తన మొనర్చె;**

**తే.** **నంత నూర్జిత శుభవేళ యగుడు శంఖ । చక్రధరుఁ డా సమర్చిత శంఖ మెత్తి**
**' పృథివి కధిపతి వగు' మని ప్రీతి నా పృ । థాసుతుని నభిషిక్తునిఁ జేసె నధిప! 374**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! జనమేజయా!; వీర్యవంతములు+అగు= శక్తిమంతాలైన; వివిధ= అనేక; మంత్రంబులతోన్= మంత్రాలతో; కూడ= కూడి; సత్+ద్విజస్తోమ= మంచి బ్రాహ్మణ గణంతో; పరివృతునిన్= చుట్టబడినవాడుగా, పరివేష్టింపబడినవాడుగా; చేసికొని= చేసి; రాజున్= ధర్మరాజును; తోడ్కొని= వెంట తీసికొని; ఏఁగి= వెళ్ళి; ఆ వినుత పీఠంబునన్= ఆ బాగా కీర్తించబడిన ఆసనంపై; ఉనిచి= నిలిపి; శోభన+అలంకరణమునన్= మంగళకరమైన సింగారాలతో; అభిరామ+ఐన= మనోహరంగా ఉన్న; పాంచాలిన్= పాంచాలరాజపుత్రి అయిన కృష్ణను; తద్+వామపార్శ్వమునన్= ధర్మరాజుకు ఎడమ ప్రక్క; సహసమాసీనన్= కలిసి చక్కగా కూర్చున్న దానిగా; కావించి= చేసి; అగ్ని ముఖము= అగ్నికి ఎదురుగా ఉండేటట్లు; చేసికొని= ఏర్పాటు చేసికొని; హోమతంత్రవర్తనము= దేవయజ్ఞ పద్ధతి ఆచరణం; ఒనర్చెన్= నిర్వర్తించాడు; అంతన్= అప్పుడు; ఊర్జిత= దృఢమని నిశ్చయించిన; శుభవేళ= మంగళకాలం; అగుడున్= అవగానే; శంఖ చక్రధరుఁడు= శంఖచక్రాలు ధరించిన వాడైన శ్రీకృష్ణుడు; ఆ సమర్చిత శంఖము+ఎత్తి= ఆ పూజించబడిన శంఖాన్ని ఎత్తి; పృథివికిన్= భూమికి, రాజ్యానికి; అధిపతివి= రాజువు; అగుము= కమ్ము; అని= పలికి; ప్రీతిన్= ఇష్టంతో; పృథాసుతునిన్= కుంతీపుత్రుడైన ధర్మజుడిని; అభిషిక్తునిన్= పట్టాభిషిక్తుడిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** శక్తిమంతాలైన మంత్రాలు చదువుతున్న సద్బ్రాహ్మణులతో పరివేష్టించబడినవాడినిగా చేసి, ఆ ధర్మరాజును వెంటబెట్టుకొని తీసికొనివెళ్ళి బహుధా స్తుతించబడిన ఆ ఆసనంపై కూర్చొనపెట్టి, మంగళాలంకార శోభిత అయి మనోహరంగా ఉన్న ద్రౌపదిని ధర్మరాజు ఎడమప్రక్క కూర్చుండబెట్టి, అగ్నిని ఎదురుగా ఉంచుకొని దేవయజ్ఞ తంత్రం పూర్తిచేసి, నిశ్చయించిన శుభసమయంలో శ్రీకృష్ణుడు, అంతకు ముందు పూజించిన శంఖాన్ని తీసి దానితో 'ఈ భూమికి రాజువు కమ్ము' అని ఇష్టంతో ధర్మరాజును అభిషిక్తుడిని చేశాడు.

**విశేషం:** అగ్నిముఖం= జీడిచెట్టు, అగ్నిముఖుడు= బ్రాహ్మణుడు, వేలుపు. శంఖంలోని నీటితో అభిషేకించినవాడు శంఖచక్రధరుడనటం సందర్భోచితం.

**వ. అప్పుడు చిత్తం బుత్తమ ప్రకారంబై యాంబికేయుండు ప్రసన్నవదనుం డగుచుం బ్రతిష్ఠితంబు లయిన కలశంబులలో నుజ్జ్వలం బగు నొక్కటి ధౌమ్యుం డంది యీ నెత్తి యా భూపోత్తము నభిషేకించె; మఱియుం బ్రభూతాత్ము లగు రాజులును, బ్రకృతులలోనం దగువారును,, దదభిషేక శోభనం బాచరించిరి; శంఖానక దుందుభి ప్రభృతి మంగళతూర్యంబులు గంభీర నాదంబులం జెలంగె; నివ్విధంబున సుహృజ్జన హృదయంబు లానందింప ధర్మనందనుండు సామ్రాజ్య పదస్థుండై భూసుర దీనానాథ ప్రముఖ పాత్రంబులకు వివిధ బహుధనంబు లొసంగె; నట్టియెడ విద్యా విశిష్ట బ్రాహ్మణాది పురుష సత్తము లక్కురుసత్తమున కభిముఖులై 'దేవా! దైవ మానుషంబుల కలిమి నతిమానుషంబగు నీ విజయంబును వసుధాధిపత్య సంప్రాప్తియు నింత యొప్పునే!' యనిన విని వారలతో నవ్వసుంధరా వల్లభుండు. 375**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; చిత్తంబు= మనస్సు; ఉత్తమ ప్రకారంబు+ఐ= శ్రేష్ఠమైన తీరులో ఉండగా; ఆంబికేయుండు= అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుడు; ప్రసన్నవదనుండు+అగుచున్= నిర్మలమైన ముఖం కలవాడై; ప్రతిష్ఠితంబులు+అయిన= స్థాపించబడిన; కలశంబులలోన్= కుంభాలలో; ఉజ్జ్వలంబు+అగు= ప్రకాశించే, మెరుగైన; ఒక్కటి= ఒక్కదానిని; ధౌమ్యుండు; అంది+ఈన్= అందించగా; ఎత్తి= పై కెత్తి; ఆ భూప+ఉత్తమున్= ఆ రాజవరుడైన ధర్మరాజును; అభిషేకించెన్= అభిషేకించాడు; మఱియున్= ఇంకా; ప్రభూత+ఆత్ములు+అగు= మహాత్ములైన; రాజులును= భూపతులు; ప్రకృతులలోన్= పౌరులలో; తగువారును= అర్హులైనవారు; తద్= ఆ; అభిషేకశోభనంబు= అభిషేకమనే శుభకార్యాన్ని; ఆచరించిరి= చేశారు; శంఖ= శంఖాలు; ఆనక= తప్పెటలు; దుందుభి= భేరులు; ప్రభృతి= మొదలైన; మంగళతూర్యంబులు= మంగళవాద్యాలు; గంభీర నాదంబులన్= ఘనమైన ధ్వనులతో; చెలంగెన్= వ్యాపించాయి; ఈ+విధంబునన్= ఈ తీరున; సుహృద్+జన= మిత్రులు; ఆప్తులు అయిన వారి; హృదయంబులు= మనసులు; ఆనందింపన్= సంతసించగా; ధర్మనందనుండు= ధర్మరాజు; సామ్రాజ్యపదస్థుండు+ఐ= చక్రవర్తి పదవియందున్నవాడై; భూసుర= బ్రాహ్మణులు; దీన= దీనులు; అనాథ= దిక్కులేనివారు; ప్రముఖ= మొదలైన; పాత్రంబులకున్= అర్హులైనవారికి; వివిధ= అనేక విధాలైన; బహు= అధికంగా; ధనంబులు= సంపదలు; ఒసంగెన్= ఇచ్చాడు; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో; విద్యావిశిష్ట= గొప్పవిద్యావంతులైన; బ్రాహ్మణ= బ్రాహ్మణులు; ఆది= మొదలైన; పురుష+సత్తములు= మానవోత్తములు; ఆ+కురుసత్తమునకున్= కౌరవోత్తముడైన ధర్మరాజుకు; అభిముఖులు+ఐ= ఎదురుగా నిలిచినవారై; దేవా!= ప్రభూ!; దైవ= దేవతా; మానుషంబుల= మానవ సంబంధమైన శక్తుల; కలిమిన్= సంపదతో; అతిమానుషంబు+అగు మానవాతీతమైన; ఈ విజయంబును= ఈ గెలుపూ; వసుధా+ఆధిపత్య+సంప్రాప్తియున్= రాజ్యపాలన లభించటం; ఇంత= ఇంతగా; ఒప్పును+ఏ?= అందగిస్తాయా?; అనినన్= అనగా; విని= ఆలకించి; వారలతోన్= బ్రాహ్మణాదులతో; ఆ+వసుంధరావల్లభుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** అటుపై మంచి మనసుతో ధృతరాష్ట్రుడు నిర్మలమైన ముఖంకలవాడై ప్రతిష్ఠించిన కలశాలలో మేలైన దాని నొకదానిని ధౌమ్యుడు తనకు అందించగా, దానిని ఎత్తి ధర్మరాజు నభిషేకించాడు. ఇంకా మహాత్ములైన రాజులు, ప్రముఖులైన పౌరులు కూడా ఆ అభిషేక శుభకార్యాన్ని నిర్వర్తించారు. శంఖాలు, తప్పెటలు, భేరులు

మొదలైన మంగళవాద్యాల గొప్ప ధ్వనులు బాగా వ్యాపించాయి; ఈ విధంగా ఆప్తుల హృదయాలు సంతసించగా ధర్మరాజు చక్రవర్తి పదవి నధిష్ఠించి బ్రాహ్మణులు, దీనులు, దిక్కులేనివారు మొదలైన దానయోగ్యులకు అనేక విధాలైన అధికమైన సంపదలు దానం చేశాడు. ఆ సమయంలో పండితులు, బ్రాహ్మణులు మొదలైన మనుజశ్రేష్ఠులు ధర్మరాజు కెదురుగా నిలిచి 'ప్రభూ! దేవమానవ శక్తులు బాగా కలిగి ఉండటం వలన ప్రాప్తించిన నీ విజయం, రాజ్యపాలన ప్రాప్తి ఎంత యోగ్యంగా ఉన్నాయి! (తమ ఊహనుమించి అందగించాయని భావం)' అనగా విని వారితో ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ' కలిగె లేకుండె ని ట్లలఘు గుణంబులు । వాక్రుచ్చి మీయంత వార లిట్లు**
**గొనియాడఁ బాండునందనులు ధన్యాత్ములు' । యని పల్కి యంబికాతనయుఁ జూపి**
**' తండ్రియు గురువును దైవంబు నీతఁడ । మాకు; మీ రెల్ల నీ మనుజవిభుని**
**పనుపు సేయుటయు, నీతనికిఁ బ్రియంబు గా । వించుటయును, మమ్ము వేనవేల**

**తే. విధులఁ బ్రీతులఁ జేఁత యుర్వీజనులుఁ । బౌరులును మీరలును దొంటిభంగిఁ దప్ప**
**కిమ్మహారాజునెడ వినయమ్ముతోడ । నడచుచుంటయు యెంతయు నాకుఁ బ్రియము. 376**

**ప్రతిపదార్థం:** కలిగెన్= ఉన్నవో; లేకుండెన్= లేవో; ఇట్లు= ఈ విధంగా; అలఘు= గొప్ప; గుణంబులు= సద్గుణాలు; వాక్రుచ్చి= పేర్కొని; మీ+అంతవారలు= మీ అంతటి పెద్దలు; ఇట్లు; ఈ విధంగా; కొనియాడన్= కీర్తించగా; పాండునందనులు= పాండురాజు పుత్రులు; ధన్య+ఆత్ములు+అ= అదృష్టవంతులే; అని పలికి= అని చెప్పి; అంబికాతనయున్= ధృతరాష్ట్రుడిని; చూపి= చూపించి; మాకున్= పాండవులకు; తండ్రియున్= జనకుడు; గురువును= పెద్ద; దైవంబున్= దైవం; ఈతఁడు+అ= ఇతడే; మీరు+ఎల్లన్= మీరంతా; ఈ మనుజ విభుని= ఈ రాజుయొక్క; పనుపు= ఆజ్ఞ; చేయుటయున్= అమలు జరపటం; ఈతనికిన్= ఈ ధృతరాష్ట్రుడికి; ప్రియంబు= ఇష్టమైనది; కావించుటయును= చేయటం; మమ్మున్= మమ్ములను (పాండవులను); వేనవేల= వేలాది; విధులన్= తీరులలో; ప్రీతులన్= సంతసించినవారినిగా; చేఁత= చేయటం (ఔతుంది); ఉర్వీజనులన్= భూప్రజలు; పౌరులును= పురజనులు; మీరలును= మీరందరూ; తొంటిభంగిన్= పూర్వంవలెనే; తప్పక= కాదనక, పొరబడక; ఈ+మహారాజు+ఎడన్= ఈ చక్రవర్తిపట్ల; వినయమ్ముతోడన్= వినమ్రతతో; నడచుచున్+ఉంటయున్= నడుస్తూ ఉండటం; నాకున్; ఎంతయున్= ఎంతో; ప్రియంబు= ఇష్టం.

**తాత్పర్యం:** 'ఈ గొప్ప సద్గుణాలు ఉన్నాయో లేవో కాని వాటిని పేర్కొని, మీ అంతటి పెద్దలు ఈ విధంగా పొగడుతుంటే పాండవులు అదృష్టవంతులే' అని పలికి, ధృతరాష్ట్రుడిని చూపించి ఇట్లా అన్నాడు: 'మాకు తండ్రి, గురువు, దైవం ఈ ధృతరాష్ట్రుడే. ఈతడి ఆజ్ఞ అమలు చేయటం, ఇతడికి ఇష్టమైనది చేయటం వేలాది తీరులలో మమ్మల్ని సంతోషపెట్టటం అవుతుంది. దేశప్రజలు, పౌరులు, మీరు అందరూ పూర్వంవలె (ధృతరాష్ట్రుడు పరిపాలిస్తున్న కాలంలో వలె) ఈ ధృతరాష్ట్రుడి పట్ల వినమ్రతతో నడుచుకొనటం మాకు ఎంతో ఇష్టం.

**క. జ్ఞాతివధ మట్లు సేసియు । నీతనిఁ గొల్చుటకుఁ గాఁగ నీ గృహధర్మో**
**పేతత్వము బొరసితి భూ । భూతికి మనకు విభుఁ డీ ప్రభువ మఱవకుఁడీ!' 377**

**ప్రతిపదార్థం:** జ్ఞాతివధము= దాయాదులను చంపటం; అట్లు= ఆ విధంగా; చేసియున్= చేసికూడా; ఈతనిన్= ఈ ధృతరాష్ట్రుడిని; కొల్చుటకున్= సేవించటానికి; కాఁగన్= మాత్రమే; ఈ గృహధర్మ= గృహస్థాశ్రమ ధర్మంతో; ఉపేతత్వమున్= కూడి ఉండటాన్ని; పొరసితిన్= పొందాను; భూభూతికిన్= ఈ భూమిపైగల ఐశ్వర్యానికి; మనకు= మనకు; ఈ ప్రభువు+అ= ఈ రాజే; విభుఁడు= అధిపతి; మఱవకుఁడీ!= మరచిపోవద్దు సుమా!

**తాత్పర్యం:** ఆ విధంగా దాయాదులను చంపి కూడా గృహస్థాశ్రమ ధర్మాన్ని అనుష్ఠించటం, ఈ ధృతరాష్ట్రుడిని సేవించటంకొరకే. భూమిపై ఉన్న ఐశ్వర్యానికి, మనకు అధిపతి ఈ రాజే అని మరవవద్దు సుమా!'

**వ.** **అని చెప్పినిజేచ్ఛ వర్తించి సుఖంబుండు వారుగాఁ బ్రార్థించి, వినయంబుతో ధృతరాష్ట్ర గాంధారుల నగరిలోని కనిచి, పౌరులను జానపదులను బోవంబనిచి, సగౌరవంబుగాఁ గృపాచార్యు నిజనివాసంబున కరుగ వీడ్కొలిపి, యువరాజ పదంబున భీమసేను నిలిపి, కర్తవ్య విచారంబునకుఁ దదీయ నిశ్చయంబునకును సంధివిగ్రహాది షాడ్గుణ్య చింతనంబునకును విదురునిం బ్రియవచన పూర్వకంబుగా నియోగించి, వలయుపనులు వెనుక ముంద రరసి యెఱింగించుటకు నాయవ్యయంబు లెఱింగించుటకునై సంజయుం జొనిపి, సేనల కొలందులను గనుంగొనుటకు భృత్యులకు జీవితంబులు వెట్టుటకుఁ గర్మకలాపంబులు సేయించుటకును నకులు నాజ్ఞాపించి, దర్పితుల మర్దించుటకుఁ బరచక్రంబు లాక్రమించుటకు నర్జును నిర్దేశించి, బ్రాహ్మణకార్యంబులకు శ్రౌత స్మార్తకృత్య సమనుష్ఠానంబునకు ధౌమ్యుం జాలించి, సహదేవుం జూచి 'నీవు మదీయ గోపనపరుండవై సర్వావస్థల యందును మత్సమీపంబున నిల్చునది' యని పలికి, మఱియుం గరణీయంబు లగు నధికారంబుల నెల్లను గల్పించి , వీరల మీఁదన పెట్టి, యుయుత్సుం గనుంగొని, విదుర సంజయుల నాలోకించి 'మీర లనుదినంబును నవధానంబు గలిగి రాచవారి యోగక్షేమంబు లేనెట్లట్ల నిర్వహింప వలయుఁ బురజనంబుల భూజనంబుల కర్జంబులు రాచవారి కెఱింగించి, పంచినట్లు నడపంగలవార'లని యప్పగించి యభ్యంతర మందిరంబునకు విజయంచేయు'మని కుంతీదేవినిం బాంచాలీ సహితంబుగాఁ బుచ్చి.** **378**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; చెప్పి= పలికి; నిజ+ఇచ్ఛన్= తమ ఇష్టం వచ్చినట్లు; వర్తించి= ప్రవర్తించి, నడచి; సుఖంబు+ఉండువారు+కాన్= హాయిగా జీవించేవారు కమ్మని; ప్రార్థించి= వేడుకొని; వినయంబుతోన్= వినమ్రతతో; ధృతరాష్ట్ర గాంధారులన్= ధృతరాష్ట్రుడినీ, గాంధారినీ; నగరిలోనికిన్= రాజప్రాసాదంలోకి; అనిచి= పంపి; పౌరులను= పురజనులను; జానపదులను= గ్రామప్రజలను; పోవన్+పనిచి= వీడ్కొలిపి; కృప+ఆచార్యున్= కృపాచార్యుడిని; సగౌరవంబుగాన్= గౌరవపురస్సరంగా; నిజనివాసంబునకున్= తన (కృపాచార్యుడి) ఇంటికి; అరుగన్= వెళ్ళటానికి; వీడ్కొలిపి= వీడుకోలు చెప్పి; యువరాజ పదంబునన్= యువరాజ పదవిలో; భీమసేనున్= భీముడిని; నిలిపి= ఉంచి; కర్తవ్య= చేయవలసినది; విచారంబునకున్= ఆలోచించటానికి; తదీయ= దానిని; నిశ్చయంబునకును= నిర్ణయించటానికి; సంధి విగ్రహ+ఆది= సంధి విగ్రహం మొదలైన; షాడ్గుణ్య= ఆరు గుణాల; చింతనంబునకును= ఆలోచనకు; విదురునిన్= విదురుడిని; ప్రియవచన పూర్వకంబుగాన్= మంచిమాటలతో; నియోగించి= ఒప్పించి (ఆజ్ఞాపించి); వలయు= అవసరమైన; పనులు= కార్యాలు; వెనుక ముందు= వరుస క్రమం; అరసి= చూచి; ఎఱింగించుటకున్= తెలియచెప్పటానికి; ఆయవ్యయంబులు= ఆదాయం, ఖర్చు; ఎఱింగించుటకును= తెలియపరచటానికి; సంజయున్= సంజయుడిని; చొనిపి= ప్రవేశపెట్టి; సేనల= సైన్యం; కొలందులు= పరిమితులు, లెక్కలు; కనుంగొనుటకున్= చూడటానికి; భృత్యులకున్= సేవకులకు; జీవితంబులు= జీతాలు; పెట్టుటకున్= ఇవ్వటానికి; కర్మకలాపంబులు= పనిపాటలు; చేయించుటకున్= చేయించటానికి; నకులున్+ఆజ్ఞాపించి= నకులుడిని నియోగించి; దర్పితులన్= అహంకరించినవారిని; మర్దించుటకున్= నుగ్గుచేయటానికి; పరచక్రంబులు= ఇతర రాజ్యాలను; ఆక్రమించుటకున్= స్వాధీనం చేసికొనటానికి; అర్జునున్= అర్జునుడిని నియమించి; బ్రాహ్మణకార్యంబులకున్= విప్రుల పనులకు; శ్రౌత= వేదసంబంధమైన; స్మార్త= స్మృతులకు సంబంధించిన; కృత్య= కార్యాలు; సమనుష్ఠానంబునకున్= చక్కగా నిర్వర్తింపబడటానికి; ధౌమ్యున్= ధౌమ్యుడిని; చాలించి= నియోగించి; సహదేవున్= సహదేవుడిని; చూచి= కని; నీవు; మదీయ= నా; గోపన పరుండవు+ఐ= నా రక్షణ చూచే వాడవై; సర్వ+అవస్థలఅందున్= అన్ని స్థితులలోను; మత్= నా; సమీపంబునన్= చేరువలో; నిల్చునది= నిలవవలసింది; అని= అంటూ; పలికి= మాటాడి; కరణీయంబులు+అగు= చేయదగినవి అయిన; అధికారంబులన్= పెత్తనాలు; ఎల్లను= అన్నింటినీ;

కల్పించి= కలుగచేసి; వారలమీఁదను+అ= వారి మీదే; పెట్టి= ఉంచి; యుయుత్సున్= యుయుత్సుడిని; కనుంగొని= చూచి; విదుర సంజయులన్= విదురుడినీ, సంజయుడినీ; ఆలోకించి= చూచి; మీరలు= మీరు; అనుదినంబును= ప్రతిరోజూ; అవధానంబు= హెచ్చరిక; కలిగి= కలిగి ఉండి; రాచవారి= రాజవంశంవారి; యోగక్షేమంబులు= లాభం, మేలు; ఏను= నేను; ఎట్లు+అట్లు+అ= ఎట్లో అట్లే; నిర్వహింపవలయున్= నిర్వర్తించాలో; పురజనంబుల= పౌరుల; భూజనంబుల= ప్రజల; కర్జంబులు= కార్యాలు; రాచవారికిన్= పాలకులకు; ఎఱింగించి= తెలియజేసి; పంచిన+అట్లు= ఆజ్ఞాపించినట్లుగా; నడపన్+కలవారలు= నడిపించగలరు; అని= పలికి; అప్పగించి= అప్పచెప్పి; కుంతీదేవినిన్= కుంతీదేవిని; పాంచాలీ సహితంబుగాన్= ద్రౌపదితోపాటు; అభ్యంతర మందిరంబునకున్= అంతఃపురానికి; విజయం చేయుము+అని= వేంచేయుమని; పుచ్చి= పంపి.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పి తమ ఇచ్ఛవచ్చినట్లు నడచి సుఖంగా ఉండండని వారిని ప్రార్థించాడు. గాంధారీధృతరాష్ట్రులను వినమ్రంగా రాజప్రాసాదానికి పంపాడు. పురజనులను, గ్రామీణులను వెళ్ళండని సెలవిచ్చాడు. కృపాచార్యుడిని గౌరవపురస్సరంగా స్వగృహానికి వెళ్ళటానికి వీడ్కోలు చెప్పాడు. భీముడిని యువరాజు స్థానంలో నిలిపాడు. కర్తవ్యం ఆలోచించి నిర్ణయించటానికి శత్రువుతో పొందు, యుద్ధం మొదలైన ఆరు రాజగుణాలు ఆలోచించటానికి మంచి మాటలతో విదురుడిని అంగీకరింపచేసి, చేయవలసిన పనుల వరుసక్రమం చూచి చెప్పటానికి, ఆదాయం వ్యయం తెలపటానికి సంజయుడిని నియమించి, సైన్యం వివరాలు తెలిసికొని, సేవకులకు జీతాలు ఇవ్వటానికి, వారిచేత పనులు చేయించటానికి నకులుడిని నియమించి. అహంకరించినవారిని అణచటానికి, శత్రురాజ్యాలు ఆక్రమించటానికి అర్జునుడిని నియోగించి, బ్రాహ్మణుల పనులను, వేద, స్మృతి సంబంధి కార్యాచరణను ధౌమ్యుడికి అప్పగించి, సహదేవుడి వంక చూచి 'నీవు నన్ను రక్షిస్తూ, ఎల్లవేళలా నా చేరువలో ఉండు' మని ఆజ్ఞాపించి, చేయదగిన పనులను తగిన పెత్తనం కల్పించి తగిన వారికి అప్పగించాడు. యుయుత్సుడిని, విదురుడిని, సంజయుడినీ చూచి 'మీరు ఎప్పుడూ హెచ్చరికతో ఉండి రాజవంశంవారి లాభాన్నీ మంచినీ నేను చూడాల్సిన విధంగా చూస్తూ, పురజనుల, సర్వజనుల పనులు పాలకులకు చెప్పి, ఆజ్ఞాపించిన విధంగా పనులు నిర్వర్తించగలరు' అన్నాడు. కుంతీదేవిని ద్రౌపదితో కూడా అంతఃపురానికి పంపాడు.

**విశేషం:** షడ్గుణాలు= సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధము, ఆశ్రయం. సంధి= శత్రువుతోపొత్తు - ఇది మూడు విధాలు: 1. కోశప్రధాన హేతుకం, 2. దండప్రధానహేతుకం; 3. భూమిప్రధాన హేతుకం.

**తే.** **ప్రేమ సంప్రీతి వినయ మిశ్రిత విలోక । నంబు గృష్ణుని ముఖకమలంబునందు**
**మాసరంబగు వికసన మధువునకు మ । ధువ్రతంబయి నిగుడ నా సువ్రతుండు.** **379**

**ప్రతిపదార్థం:** ప్రేమ= అనురాగం; సంప్రీతి= మిక్కిలి ఇష్టం; వినయ= వినమ్రత; మిశ్రిత= కలిసిన; విలోకనంబు= చూపు; కృష్ణుని= శ్రీకృష్ణుడి; ముఖ= ముఖమనే; కమలంబునందున్= పద్మంలో; మాసరంబు+అగు= అధికమైన వికసన= వికాసమనే; మధువునకున్= తేనెకొరకు; మధువ్రతంబు+అయి= తేనె త్రాగే తుమ్మెద అయి; నిగుడన్= ఒప్పారగా; ఆ సువ్రతుండు= ఆ సదాచారి.

**తాత్పర్యం:** అనురాగం, ఎంతో ఇష్టం, వినయం కలిసిన ధర్మరాజు చూపులు కృష్ణుడి ముఖమనే పద్మంలో వృద్ధిపొందే తేనెకొరకు తుమ్మెదవలె ప్రసరిస్తుండగా ఆ ధర్మరాజు. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **అమ్మహాత్మ్ముని సాత్యకి సహితంబుగా వీడుపట్టున కనుప ననుజన్ముల ననిచి, యుచితవర్తనంబున నుండి పదంపడి భండనంబునం జచ్చిన వారిం జిత్తంబున నిరూపించి తొడంగి.** **380**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్మునిన్= ఆ ఘనుడైన శ్రీకృష్ణుడిని; సాత్యకి సహితంబుగాన్= సాత్యకితో సహా; వీడుపట్టునకున్= ఇంటికి; అనుపన్= పంపటానికి; అనుజన్ములన్= తమ్ములను; అనిచి= పంపి; ఉచిత= తగిన; వర్తనంబునన్= నడవడికతో, ఉండి; పదంపడి= తరువాత; భండనంబునన్= యుద్ధంలో; చచ్చినవారిన్= మరణించినవారిని; చిత్తంబునన్= మనస్సులో; నిరూపించి= గుర్తించి; తొడంగి= ప్రారంభించి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడిని సాత్యకితో కూడా విడిదికి పంపండని తమ్ములను ఆజ్ఞాపించి, యోగ్యమైన నడవడికతో ఉండి, తరువాత (కొంతకాలానికి) యుద్ధంలో మరణించిన వారిని మనసులో గుర్తించి, పూనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **బ్రాహ్మణానుజ్ఞతోఁ గూడ బంధుజనుల। కందఱకు వేఱువేఱు మహావిభూతి**
**వెలయ నంచిత శ్రాద్ధ క్రియలు సభక్తి। కముగ రత్న హేమాది దానములు మెఱయ. 381**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ= విప్రుల; అనుజ్ఞతోన్= అనుమతితో; కూడన్= తగినట్లుగా; బంధుజనులకున్= చుట్టాలకు; అందఱకున్= అంతమందికి; వేఱువేఱు= విడి విడిగా; మహా= గొప్ప; విభూతి= వైభవం; వెలయన్= ఒప్పగా; అంచిత= గౌరవించదగిన విధంగా; రత్న= మణులు; హేమ= బంగారం; ఆది= మొదలైన; దానములు= దానాలు; మెఱయన్= వెలుగుతుండగా; శ్రాద్ధక్రియలు= అపరకర్మలు; సభక్తికముగన్= భక్తితో.

**తాత్పర్యం:** బ్రాహ్మణుల అనుమతిలో తగినట్లుగా, బంధువులందరికీ విడి విడిగా శ్రాద్ధకర్మలను వైభవంతో, భక్తిపూర్వకంగా, మణులు రత్నాలు దానంగా ఇస్తూ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **అనుష్ఠించి ద్రోణాచార్య ద్రుపద తద్బంధు విరాట తదీయ జ్ఞాతులకును బ్రత్యేకంబ కర్ణాభిమన్యు ప్రభృతుల కెట్లట్ల సర్వదక్షిణ సామగ్రి వెలయం బరలోక క్రియలు నిర్వర్తింపంజేసి, దుర్యోధనాదులకు నంతకంటె విభవం బెసంగ ధృతరాష్ట్రుం డౌర్ధ్వదైహిక విధు లాచరించునట్లుగా నొనర్చి, తా నెఱింగిన వారల కెల్ల లగ్గు సేయుటకుఁ, దగు బంధులు లేని వసుంధరాధిపుల నెల్ల నుద్దేశించి యంచితదానంబులతోఁ జేయ ధౌమ్యుం బనిచె; మఱియును. 382**

**ప్రతిపదార్థం:** అనుష్ఠించి= ఆచరించి; ద్రోణ+ఆచార్య= ద్రోణుడికి; ద్రుపద= ద్రుపద మహారాజునకు; తద్+బంధు= ద్రుపదుడి బంధువులకు; విరాట= విరాటరాజుకు; తదీయ= అతడి; జ్ఞాతులకును= దాయాదులకు; ప్రత్యేకంబ= విశేషంగా; కర్ణ= కర్ణుడు; అభిమన్యు= అభిమన్యుడు; ప్రభృతులకున్= మొదలైనవారికి; ఎట్లు+ఎట్లు+అ= ఏ విధమో అదే విధంగా; సర్వ= సమస్తమైన; దక్షిణ సామగ్రి= దాన సమయంలో ఇచ్చే దక్షిణకు ఉపయోగించే వస్తువులు; వెలయన్= ఒప్పగా, ఉండగా; పరలోక క్రియలు= ఉత్తర క్రియలు; నిర్వర్తింపన్+చేసి= చేయించి; దుర్యోధన+ఆదులకున్= దుర్యోధనుడు మొదలైనవారికి; అంతకంటెన్= మిగిలిన వారికంటె; విభవంబు= వైభవం; ఎసంగన్= అధికంకాగా; ధృతరాష్ట్రుండు; ఔర్ధ్వదైహిక= పరలోక; విధులు= క్రియలు; ఆచరించునట్లుగాన్= చేసేటట్లుగా; ఒనర్చి= చేసి; తాన్= తాను; ఎఱింగిన= తెలిసిన; వారలకున్+ఎల్లన్= వారందరికీ; లగ్గు= శుభం; చేయుటకున్= చేయటానికి; తగు= తగిన; బంధులు= చుట్టాలు; లేని= లేనటువంటి; వసుంధరా+అధిపులన్= రాజులకు; ఎల్లన్= అందరినీ; ఉద్దేశించి= లక్షించి; అంచిత= గౌరవించతగిన, గొప్ప; దానంబులతోన్= దానాలతో; చేయన్= చేయటానికి; ధౌమ్యున్= ధౌమ్యుడిని; పనిచెన్= నియోగించాడు; మఱియును=ఇంకా.

**తాత్పర్యం:** శ్రాద్ధకర్మలు నిర్వర్తించాడు ద్రోణుడికీ, ద్రుపదుడికీ అతడి బంధువులకు, విరాటరాజుకు అతడి జ్ఞాతులకు, కర్ణాభిమన్యులకు విశేషంగాను అన్ని దక్షిణలు మొదలైన వాటితో ఉత్తరలోక క్రియలు జరిపించాడు. దుర్యోధనాదులకు

అంతకన్న గొప్ప వైభవంగా పరలోక క్రియలు ధృతరాష్ట్రుడిచేత చేయించాడు. తనకు తెలిసినవారి కందరికీ శుభం కలిగించాలని అనుకొని ఉత్తర క్రియలు చేసే తగిన వారసులు లేని రాజులందరికొరకు తగిన దానాదులతో పరలోక క్రియలు నిర్వర్తించటానికి తనపురోహితుడైన ధౌమ్యుడిని నియోగించాడు. అంతేకాక.

**క. చలివందిరులును సత్త్రం । బులుఁ బెట్టించెను, దటాకములు దేవగృహ**
**మ్ములుఁ గల్పించెను, బంధుజ । నులకు సుగతి యగుటకై వినుతభంగి నృపా! 383**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; బంధుజనులకున్= చుట్టాలకు; సుగతి= మంచిగతులు; అగుటకున్+ఐ= కలగటానికి; చలిపందిరులును= చలివేంద్రాలు (దాహార్తులకు నీటిని పోసేచోట్లు); సత్త్రంబులును= బాటసారులకు భోజనంపెట్టేచోటులు; పెట్టించెను= ఏర్పాటు చేశాడు; తటాకములు= చెరువులు; దేవగృహమ్ములు= దేవాలయాలు; కల్పించెను= నిర్మించాడు.

**తాత్పర్యం:** బంధువులకు ఉత్తమ లోకాలు ప్రాప్తించాలని ధర్మరాజు చలివేందరాలు సత్త్రాలు (మనిషికి అవసరమైన అన్నపానీయాలు అందరికీ అందించే తావులు) ఏర్పాటు చేశాడు. చెరువులు, దేవాలయాలు నిర్మాణం చేశాడు.

**క. లోకమునఁ గలుగు భూసుర । లోకమునకు నెల్ల గోవులుం బసిఁడియు నా**
**నా కల్పంబులు బంధుల । కై కోటివిధముల నిచ్చె నతులిత భక్తిన్. 384**

**ప్రతిపదార్థం:** నానాకల్పంబులు= అనేక కల్పముల కాలం; బంధువులకున్+ఐ= చుట్టాల సద్గతులకొరకు; లోకమునన్= జగత్తులో; కలుగు= ఉన్న; భూసుర= బ్రాహ్మణ; లోకమునకున్= సమూహానికి; ఎల్లన్= అందరికీ; గోవులున్= ఆవులును; పసిఁడియున్= బంగారం; కోటి విధములన్= ఎన్నో తీరులుగా; అతుల భక్తిన్= సాటిలేని భక్తిభావంతో; ఇచ్చెన్= దానం చేశాడు.

**తాత్పర్యం:** ఎన్నో కల్పాలకాలం తన బంధువులకు సద్గతులు లభించాలని, లోకంలో ఉన్న బ్రాహ్మణ సమూహం అంతటికీ, గోవులు, బంగారం ఎన్నో విధమైన పద్ధతులలో భక్తిభావంతో దానం చేశాడు.

**వ. ఇట్లు సకలబాంధవసుహృజ్జనంబులకుం బారలౌకికక్రియలు సేసి యనృణత్వంబున వెలింగి జగంబులచేతం బొగడు వడసి, గృతకృత్యంబుఁ బొందె; నివ్విధంబునఁ బ్రాప్తసామ్రాజ్యుం డయిన పాండవాగ్రజుం డొక్క సముచితావసరంబున గోవిందున కభిముఖుం డయి వినయంబునం గేలు మొగిచి. 385**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సకల= అందరు; బాంధవ= బంధువులు; సుహృత్+జనంబులకున్= మిత్రులకు; పారలౌకిక క్రియలు= ఉత్తర క్రియలు; చేసి= ఆచరించి; అనృణత్వంబున= ఋణంలేకపోవటంతో; వెలింగి= ఒప్పి; జగంబులచేతన్= లోకాలన్నిటి చేత; పొగడు+పడసి= కీర్తిని పొంది; కృతకృత్యతన్= ధన్యతను; పొందెన్= పొందాడు; ఈ విధంబునన్= ఈ తీరుగా; ప్రాప్త= పొందిన; సామ్రాజ్యుండు+ఐన= రాజ్యం కలవాడైన; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; ఒక్క= ఒక; సముచిత+అవసరంబునన్= తగిన సమయంలో; గోవిందునకున్= కృష్ణుడికి; అభిముఖుండు+అయి= ఎదురు నిలిచినవాడై; వినయంబునన్= వినమ్రంగా; కేలు మొగిచి= చేతులు జోడించి.

**తాత్పర్యం:** ఈ విధంగా బంధువులకు స్నేహితులకు ఉత్తరక్రియలు నిర్వర్తించి, ఋణం లేనివాడై ఒప్పి లోకాలన్నిటిచేత కీర్తించబడినవాడై ధన్యుడయ్యాడు. ఈ విధంగా రాజ్యం పొందినవాడైన ధర్మరాజు తగిన సమయంలో శ్రీకృష్ణుడి ఎదుట నిలిచి వినయంతో నమస్కరించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మానవుడికి మూడు ఋణాలుంటాయి. 1. దేవఋణం, 2. ఋషిఋణం, 3. పితౄణం. పితౄణం చనిపోయినవారికి ఉత్తరక్రియలు నిర్వహించటంద్వారా తీరుతుంది. కనుక ధర్మరాజు బంధుమిత్రులందరికీ శ్రాద్ధకర్మలు నిర్వర్తించి ఋణవిముక్తుడయ్యాడు.

## ధర్మజుఁడు శ్రీకృష్ణు నుచిత వచనంబుల స్తుతించుట (సం. 12-43-1)

**తే.** **అమల భవదీయ సుప్రసాదమునఁ జేసి । పితృపితామహక్రమయోగ్య పీఠ మైన**
**వినుత సామ్రాజ్యమున కేను విభుఁడనై కృ । తార్థతానంద పూర్ణుండ నైతిఁ గృష్ణ!' 386**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= కృష్ణా!; అమల= స్వచ్ఛమైన; భవదీయ= నీ యొక్క; సుప్రసాదమునన్+చేసి= అనుగ్రహంచేత పితృపితామహక్రమ= తండ్రి, తాతల వరుసలో; యోగ్య= అర్హ (పొందదగిన); పీఠము+ఐన= ఆసనమైన; వినుత= కీర్తనీయమైన; సామ్రాజ్యమునకున్= ఈ మహారాజ్యానికి; ఏను= నేను; విభుఁడను+ఐ= రాజునై; కృత+అర్థతా= కోరినది నెరవేరటం అనే; ఆనంద= సంతోషంతో; పరిపూర్ణుండను+ఐతిన్= పూర్తిగా నిండినవాడి నయ్యాను.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! అచ్ఛమైన నీ అనుగ్రహంవలన తాత తండ్రులచేత వరుసగా (వంశక్రమానుగతంగా) పొందదగినదైన ప్రశస్తమైన సామ్రాజ్యానికి నేను రాజునయ్యాను. ధన్యతనొందటంవలన కలిగిన ఆనందంతో పూర్తిగా నిండిపోయాను'.

**వ.** **అని మఱియును. 387**

**తాత్పర్యం:** అని చెప్పి, ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **' బావలు మఱఁదులు ననుచును । నీవు కృపాతిశయ మెసఁగ నెమ్మిని మమ్ముం**
**గావను బ్రోవను దలఁచి ర । మావర! కలిపికొని తిరిగి మన్నించుటలన్. 388**

**ప్రతిపదార్థం:** రమావర!= లక్ష్మీపతీ!; నీవు; కృపా+అతిశయము= కరుణయొక్క; ఆధిక్యం; ఎసఁగన్= మించగా; బావలు, మఱఁదులున్= మేనత్త కొడుకులు; అనుచును= అంటూ; కలిపికొని= చేరదీసి; తిరిగి= కలిసివర్తించి; మన్నించుటలన్= ఆదరించటాలతో; నెమ్మిని= ప్రేమతో; మమ్మున్= మమ్మల్ని (పాండవులను); కావను= కాపాడాలని; ప్రోవను= రక్షించాలని; తలఁచి= అనుకొని.

**తాత్పర్యం:** లక్ష్మీపతివైన శ్రీకృష్ణా! మమ్మల్ని బావలూ, మరదులూ అంటూ నీతో కలుపుకొని ప్రవర్తించటం, కరుణాతిశయంతో, ప్రేమతో మమ్ములను కాచి రక్షించాలని తలంచి.

**వ.** **తేఁకువలేక మెలంగితిమి గాక! భవదీయ మహానుభావం బున్నరూపెఱుంగను దగం గొనియాడను నే మెంతటి వారమ?'మని పలికి వెండియు. 389**

**ప్రతిపదార్థం:** తేఁకువ= భయం; లేక= లేకుండ; మెలంగితిమి= జీవించాము; కాక; భవదీయ= నీ; మహా+అనుభావంబు= మాహాత్మ్యం; ఉన్నరూపు= కలరూపు, వాస్తవం; ఎఱుంగనున్= తెలిసికొనటానికి; తగన్= చక్కగా; కొని+ఆడనున్= పొగడటానికి; ఏము= మేము; ఎంతటివారము?= ఎంత? చాలగలమా?; అని= అంటూ; పలికి= మాటాడి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** (ఆ కారణంచేతనే) మేము భయం లేకుండ జీవించాము కదా! నీ గొప్పతనం, నీ నిజరూపం తెలిసికొనటానికి, చక్కగా కీర్తించటానికి మేమెంతటి వారం? (సమర్థులం కాము అని భావం)' అంటూ మాటాడి, ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ' ఆదిమ పురుషుఁడ వగుటను। వేదంబులు సెప్పు నవియు వెఱచుఁ బలుకఁగా**
**నీదృక్ప్రకారుఁ డని దా। మోదర! నీ పెం పెఱుంగ నొరుల కలవియే? 390**

**ప్రతిపదార్థం:** దామోదర!= కృష్ణా!; వేదంబులు= వేదాలు; ఆదిమ పురుషుఁడవు+అగుటను= సృష్టిలో మొట్టమొదటి శరీరధారివి; అగుటను= కావటం; చెప్పున్= చెపుతాయి; ఈదృక్+ప్రకారుఁడు+అని= ఈ విధమైనవాడు అని; పలుకఁగాన్= చెప్పటానికి; అవియున్= ఆ వేదాలు కూడా; వెఱచున్= భయపడతాయి; ఒరులకున్= ఇతరులకు; నీ పెంపు= నీ ఘనత; ఎఱుంగన్= తెలియటం; అలవి+ఏ= సాధ్యమౌతుందా?

**తాత్పర్యం:** 'కృష్ణా! నీవు సృష్టికి ఆద్యుడవని వేదాలు చెప్పుతున్నాయి. కాని, నీ విటువంటివాడివని ఇదమిత్థంగా చెప్పటానికి ఆ వేదాలే భయపడుతున్నాయి. అటువంటప్పుడు ఇతరులకు నీ ఘనత తెలిసికొనటం సాధ్యమా? (కాదు అని భావం).

**క. దురితములఁ జెఱుప శుభములఁ। బెరిఁగింపం జాలునట్టి పేళ్ళులు నీకుం**
**బురుషోత్తమ! కడుఁ బె క్కవి। పరమార్థ ద్యోతకములు భావింపంగన్. 391**

**ప్రతిపదార్థం:** పురుష+ఉత్తమ!= జీవులలో శ్రేష్ఠుడా!; దురితములన్= పాపాలను; చెఱుపన్= పోగొట్టటానికి; శుభములన్= శ్రేయములను; పెరిఁగింపన్= వృద్ధిచేయటానికి; చాలునట్టి= సమర్థమైన; పేళ్ళులు= నామాలు, బిరుదులు; నీకున్= నీకు; కడున్= మిక్కిలి; పెక్కు= ఎక్కువ; అవి= ఆ పేరులు; భావింపంగన్= భావనచేస్తే, బాగా మననం చేస్తే; పరమ+అర్థ= ఉత్కృష్టమైన ప్రయోజనాన్ని (పరమాత్మను); ద్యోతకములు= ప్రకాశింపచేసేవి (తెలియచెప్పేవి).

**తాత్పర్యం:** పురుషోత్తముడవైన శ్రీకృష్ణా! పాపాలు పోగొట్టేవీ పుణ్యాలు పెంచేవీ అయిన పేరులు నీకు ఎన్నో ఉన్నాయి. వాటిని భావన చేస్తే అవి పరమాత్మను తెలియచేస్తాయి.

**విశేషం:** పురుషోత్తముడు అనేది సార్థక ప్రయోగం. పురుషుడు అంటే శరీరధారి, ప్రాణి అని అర్థం. పురుషోత్తముడు అంటే జీవులన్నింటిలోను ఉత్కృష్టుడు అని సామాన్యార్థం. దానినే 'భావన' చేస్తే సర్వజీవులలోనూ ఉత్తమపురుష (నేను, తాను - ఆత్మను) గా ఉండేవాడని ద్యోతకం అవుతుంది (స్ఫురిస్తుంది).

భావన= ఒక భావాన్ని మననం చేసి చేసీ అదే తాను అయిపోవటం.

పరమార్థం= పురుషార్థాలకు పైన ఉన్నది.

భగవంతుడికి ఉన్న నామాలు స్వల్ప ప్రయోజనాలను ఆశించినవారికి (పాపాలు పోవటం, పుణ్యాలు కలగటం వంటివి) అంతే అందజేస్తాయి. వాటి పరమార్థం తెలిసి భావించినవారికి పరమార్థాన్నే స్ఫురింపచేస్తాయి. ఈ విషయం నిరూపించటానికి పురుషోత్తమ అనే నామమే ఉదాహరణ. సామాన్యార్థం శ్రేష్ఠుడు అని పరమార్థం - సర్వవ్యాపి, అంతర్యామి అయిన పరమాత్మ అని.

**తే.** **ప్రయతు లగు సద్విజులు వానిఁ బరమభక్తి । యుక్తి నెపుడుఁ బఠించుచు భక్తి ముక్తి**
**దాయి వగు నిన్ను సతతంబుఁ దలఁచుచును న । మస్కృతులు సేసి యవ్యయ మహిమఁగంద్రు.'392**

**ప్రతిపదార్థం:** ప్రయతులు+అగు= పరిశుద్ధులైన; సత్+ద్విజులు= సత్‌బ్రాహ్మణులు; వానిన్= ఆ నామాలను; పరమ= ఉత్కృష్టమైన ; భక్తియుక్తిన్= భక్తికలిగి; ఎపుడున్= ఎల్లప్పుడు, సదా; పఠించుచున్= చదువుతూ, పారాయణచేస్తూ; భుక్తి= భోజనం, భోగం; ముక్తి= మోక్షం; దాయివి+అగు= ఇచ్చేవాడివైన; నిన్నున్; సతతంబున్= ఎల్లప్పుడూ; తలఁచుచును= భావిస్తూ; నమస్కృతులు= కైమోడ్పులు; చేసి= ఆచరించి; అవ్యయ= వ్యయం కాని, స్థిరమైన; మహిమన్= మాహాత్మ్యాన్ని; కంద్రు= పొందుతారు.

**తాత్పర్యం:** బహిరంతర శుద్ధులైన సద్బ్రాహ్మణులు ఆ నీ నామాలను చాలా గొప్పదైన భక్తితో వల్లెవేస్తూ భోగాలనూ, మోక్షాన్నీ ప్రసాదించే నిన్ను సదా భావిస్తూ నీకు నమస్కరిస్తూ ఉండి నశించని శాశ్వతమైన మహత్త్వాన్ని పొందుతారు'.

**వ.** **అని పలికి విష్ణు విశ్వాత్మ జిష్ణు శర్వ హంస దామోదర శంభు ప్రముఖంబులగు ప్రభూత నామంబులం బ్రస్తుతించినఁ బ్రీతుండై పుష్కరాక్షుండు పుష్కలంబైన వాగ్విశేషంబుల నా ధర్మనందను నభినందించెఁ; దదనంతరంబ కొల్చియున్న జనంబుల నిజనివాసంబులకుం బోవం బనిచి, యక్కురుసత్తముండు దమ్ముల నాలోకించి. 393**

**ప్రతిపదార్థం:** అనిపలికి= అంటూ మాటాడి; విష్ణు= వ్యాపనశీలం కలిగి విశ్వమంతా వ్యాపించినవాడు; విశ్వ+ఆత్మ= విశ్వానికి ఆత్మ అయినవాడు, విశ్వమే తాను (ఆత్మ) అయినవాడు; జిష్ణు= జయశీలి, జయించే లక్షణం కలవాడు; శర్వ= సంహారసమయంలో సకల ప్రాణులను రుద్రరూపంలో సంహరించేవాడును; హంస= ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమైన ప్రాణంగా, ఓంకారంగా జీవులలో ఉండేవాడు; దామోదర= దామము(మాల)ఉదరమునందు కలవాడు; శంభు= సుఖాన్ని (భక్తులకు) కలిగించేవాడు; ప్రముఖంబులు+అగు= మొదలైన; ప్రభూత= గొప్ప; నామంబులన్= పేరులతో; ప్రస్తుతించినన్= కీర్తించగా; ప్రీతుండు+ఐ= సంతసించినవాడై; పుష్కర+అక్షుండు= తామరలను పోలిన కన్నులు కలవాడు అయిన శ్రీకృష్ణుడు; పుష్కలంబు+ఐన= సమృద్ధిగా ఉన్న; వాక్+విశేషంబులన్= విశేషమైన మాటలతో; ఆ ధర్మనందనున్= ఆ ధర్మరాజును; అభినందించెన్= పొగిడాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; కొల్చి+ఉన్న= కొలువు తీర్చి ఉన్న; జనంబులన్= ప్రజలను; నిజనివాసంబులకున్= తమ ఇళ్ళకు; పోవన్= వెళ్ళండని; పనిచి= ఆజ్ఞాపించి; ఆ+కురుసత్తముండు= ధర్మరాజు; తమ్ములన్= అనుజులను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని మాటాడి ధర్మరాజు కృష్ణుడిని విష్ణువు, విశ్వాత్ముడు, జిష్ణువు, శర్వుడు, హంసుడు, దామోదరుడు, శంభుడు మొదలైన పవిత్ర నామాలతో కీర్తించాడు. దానికి సంతసించిన శ్రీకృష్ణుడు సమృద్ధమైన మాటలతో విశేషంగా ధర్మరాజును అభినందించాడు. ఆ తరువాత కొలువుతీరి ఉన్న ప్రజలనందరినీ తమ తమ ఇళ్ళకు వెళ్ళుడని పంపించాడు. అప్పుడు తమ్ములను చూచి.

**మ.** **' అటవీదేశములందు గాఢబహులాయాసంబులం గంది, దు**
**ర్ఘట మత్స్యేశ్వరు సేవఁ గుంది, బహుసంగ్రామంబులన్ విద్విష**
**త్పటు నానాస్త్ర మహోగ్ర శస్త్రచయ నిర్ఘ్నాంగతం బొంది యు**
**త్కట దుఃఖంబుల మీర లొందితి రభేద్యస్థైర్యులై నాకుఁగాన్. 394**

**ప్రతిపదార్థం:** 'మీరలు= మీరు; నాకున్+కాన్= నాకొరకు; అభేద్య స్థైర్యులు+ఐ= మొక్కవోని స్థిరత్వం కలవారై; అటవీ దేశముల+అందున్= అరణ్య ప్రదేశాలలో; గాఢ= తీవ్రమైన; బహుల= అనేక; ఆయాసంబులన్= శ్రమలతో; కంది= బాధపడి; దుర్ఘట= కలగకూడనటువంటి; మత్స్య+ఈశ్వరు= మత్స్యదేశరాజైన విరటుడి; సేవన్= కొలువులో; కుంది= వగచి; బహు= అనేక; సంగ్రామంబులన్= యుద్ధాలలో; విద్విషత్= శత్రువుల; పటు= పటిష్ఠమైన; నానా= బహు; అస్త్ర= మంత్రపూతంగా ప్రయోగించే ఆయుధాల వలన; మహా+ఉగ్ర= గొప్ప భయంకరమైన; శస్త్రచయ= ఆయుధ సమూహంవలన; నిర్భగ్న+అంగతన్= మిక్కిలి దెబ్బతిన్న శరీరం; పొంది= కలిగి ఉండి; ఉత్కట= అధికమైన; దుఃఖంబులన్= శోకాలను; ఒందితిరి= పొందారు.

**తాత్పర్యం:** 'మీరు నా కొరకు స్థైర్యం చెదరనివారై అడవులలో తీవ్రమైన కష్టాలు ఎన్నో అనుభవించి బాధపడ్డారు. దురదృష్టవశాత్తు విరటుడి కొలువులో సేవచేసి కష్టపడ్డారు. అనేక యుద్ధాలలో అస్త్రశస్త్రాలచేత దెబ్బతిన్న అవయవాలు కలవారయ్యారు. అధికమైన శోకాన్ని పొందారు.

**వ. నన్నుం గృతకృత్యునిం జేసితిరి; కృష్ణ ప్రసాద లబ్ధంబయిన యీ జయశోభనంబు నిజేచ్ఛాకలిత సుఖావాప్తి లీల ననుభవించుచు నాత్మప్రియ ప్రకారంబుల వర్తించుచు, నవధానంబుతో రాజ్యాంగ సప్తకం బరయుం'డని చెప్పి యాంబికేయు ననుజ్ఞతోడ. 395**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; కృతకృత్యునిన్= ధన్యుడిని; చేసితిరి= చేశారు; కృష్ణ= శ్రీకృష్ణుడి; ప్రసాద= అనుగ్రహంవలన; లబ్ధంబు+ఐన= లభించిన; ఈ జయశోభనంబు= ఈ విజయంయొక్క వైభవం; నిజ+ఇచ్ఛా కలిత= మీమీ కోరికలతో కూడుకొన్న; సుఖ+అవాప్తి= సుఖమును పొందటం అనే; లీలన్= విలాసాన్ని; అనుభవించుచున్= అనుభూతిచెందుతూ; ఆత్మ ప్రియ ప్రకారంబులన్= మనసుకు నచ్చిన తీరులలో; వర్తించుచున్= మెలగుతూ; అవధానంబుతోన్= హెచ్చరికతో; రాజ్యాంగ సప్తకంబు= రాజ్యపాలనాతంత్రంలోని ఏడు అంశాలు; అరయుండు= చూస్తూ ఉండండి; అని= అంటూ; చెప్పి= పలికి; ఆంబికేయు= ధృతరాష్ట్రుడి; అనుజ్ఞ+తోడన్= అనుమతితో.

**తాత్పర్యం:** 'అట్లా కష్టపడి నన్ను ధన్యుడిని చేశారు. శ్రీకృష్ణుడి అనుగ్రహంవలన లభించిన ఈ విజయ వైభవాన్ని మీమీ ఇష్టాలతో కూడిన సుఖాన్ని పొందటం అనే క్రీడను అనుభవిస్తూ, మీకు నచ్చిన విధంగా నడుచుకొంటూ హెచ్చరికతో (జాగరూకులై) రాజ్యాంగసప్తకాన్ని చూడండి (పట్టించుకొండని భావం)' అని చెప్పి ధృతరాష్ట్రుడి అనుమతితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** రాజ్యాంగ సప్తకం: 1. ప్రభువు, 2. మంత్రము, 3. ధనాగారం, 4. దుర్గం, 5. సైన్యం, 6. రాష్ట్రం (ప్రజలు), 7. మిత్రులైన రాజులు.

**సీ. బహురత్నమయ ఘనప్రాసాదమండప । దాసదాసీ జనోద్భాసితంబుఁ,**
**దత్తుల్య వైభవ తదధిక ధనధాన్య । ముఖవస్తు సంచయ సుఖకరంబుఁ,**
**గిన్నర వల్లభ గృహసమానత్వ మ । హావిభూతి స్ఫురణాంచితంబు,**
**సర్వసంపత్స్ఫూర్తి చారు వామాక్షీ ప్ర । చార సంశోభిత స్థలచయంబు,**

**తే. నైనవాని రారాజుని ల్లనిలజునకు, । దుస్ససేను మందిరము పార్థునకు, వరుస**
**తోడ దుర్మర్షణునియును దుర్ముఖునియు । నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె నృపతి. 396**

**ప్రతిపదార్థం:** నృపతి= రాజు; బహు= నానా; రత్నమయ= మణులతో నిండిన; ఘన= గొప్ప; ప్రాసాద= నగరు; మండప= మంటపం; దాసదాసీజన= సేవకులు, సేవకురాండ్రతో; ఉత్+భాసితంబు= బాగా పైకి వెలిగేది; తద్+తుల్య= దానితో సమానమైన; వైభవ= విభవం; తద్+అధిక= దానికన్న ఎక్కువైన; ధన, ధాన్య= ధనం, ధాన్యం; ముఖ= మొదలైన; వస్తుసంచయ= వస్తు సముదాయంతో; సుఖకరంబున్= హాయిగొలిపేది; కిన్నరవల్లభ= కుబేరుడి; గృహ= ఇంటితో; సమానత్వ= సమానమైన; మహా= గొప్ప; విభూతి= వైభవం; స్ఫురణ= గుర్తుకు తెచ్చే; అంచితము= ఒప్పుకలది; సర్వ= సమస్త; సంపద్= సంపదల; స్ఫూర్తి= ప్రకటమవటంచేత; చారు= మనోహరమైన; వామ+అక్షి= అందమైన కన్నులు కల స్త్రీల; ప్రచార= కదలికలతో; సంశోభిత= బాగా అందమైన; స్థలచయంబున్= అనేక ప్రదేశాలు కలిగినది; ఐనవానిన్= అయినటువంటివాటిని; రారాజు= దుర్యోధనుడి; ఇల్లు= భవనం; అనిలజునకున్= భీముడికి; దుస్ససేనుమందిరము= దుశ్శాసనుడి భవనం; పార్థునకున్= అర్జునుడికి; వరుసతోడన్= క్రమంగా; దుర్మర్షణునియును దుర్ముఖునియును= దుర్మర్షణ, దుర్ముఖుల; ఇండ్లు= మందిరాలు; కవలకున్= నకుల సహదేవులకు; సంప్రీతిన్= మిక్కిలి ఇష్టంతో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు దుర్యోధనుడి భవనం భీముడికి, దుశ్శాసనుడి మందిరం అర్జునుడికి, దుర్మర్షణుడి నివాసం నకులుడికి, దుర్ముఖుడి నికేతనం సహదేవుడికి ఇష్టంగా ఇచ్చాడు. ఆ భవనాలు మణిమయాలు. గొప్ప అంతఃపురాలు, మండపాలు, దాసదాసీజనాలతో ప్రకాశిస్తున్నాయి. ఆ వైభవాన్ని మించి ధనధాన్యాదులైన సంభారాలతో సుఖాన్ని కల్పిస్తాయి. కుబేరుడి ఇంటితో సమానమైన గొప్ప వైభవాన్ని కలిగి దానిని గుర్తుకు తెచ్చేవి, సమస్త సంపదలను ప్రకటించే అందగత్తెలు అటునిటు తిరుగుతూ ఉండగా కళకళలాడే ప్రదేశాలెన్నో కలిగినవి - ఆ మందిరాలు.

**వ. మఱియు విదుర యుయుత్సు సంజయ ధౌమ్యుల వదనంబు లాలోకించి 'మీ మీ నికేతనంబుల మీరలు గైకొనుం' డని నియోగించి, పెద్ద నగరిలోన ధృతరాష్ట్రుండు మున్ను పన్నుగా వసియించు హర్మ్యంబున నజ్జనపతి నునిచె; నివ్విధంబున గృహంబులు విభజించి యిచ్చి కృష్ణ సాత్యకుల సవ్యసాచి సదనంబున నిల్చునట్లుగా నిర్దేశించి, యందఱం బోవం బనిచి యభ్యంతర మందిరంబున కరిగె; నా భీమసేనాదు లమ్మహనీయ వాసంబులు సేకొని యందుఁ బ్రభూతాన్న పానాద్యనుభవంబుల సుఖించియుండ నవ్విభుండు నిజేచ్ఛ విహరించె'నని యిట్లు ధర్మపుత్రు చరిత్రంబు సెప్పిన విని 'యబ్భంగిం బ్రాప్త సామ్రాజ్యుండై పాండవాగ్రజుండు పదంపడి యెత్తెఱంగున వర్తించె? సకల జగద్గురుం డగు కృష్ణుండు మఱి యెట్లుండె? నెఱింగింపు' మనుటయు. 397**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; విదుర; యుయుత్సు; సంజయ; ధౌమ్యుల; వదనంబులు= ముఖాలు; ఆలోకించి= చూచి; మీమీ నికేతనంబులు= మీమీ భవనాలు; మీరలు= మీరు; కైకొనుండు= స్వీకరించండి; అని; నియోగించి= పనిచి; పెద్ద నగరిలోన= ప్రధాన ప్రాసాదంలో; ధృతరాష్ట్రుండు; మున్ను= పూర్వం; పన్నుగాన్= చక్కగా; వసియించు= నివసించే; హర్మ్యంబునన్= భవనంలో; ఆ+జనపతిన్= ఆ ధృతరాష్ట్రుడిని; ఉనిచెన్= ఉంచాడు; ఈ+విధంబునన్= ఈ రకంగా; గృహంబులు= భవనాలు; విభజించి= విభాగంచేసి (కేటాయించి); ఇచ్చి= ఒసగి; కృష్ణసాత్యకుల= శ్రీకృష్ణుడిని, సాత్యకిని; సవ్యసాచి= కవ్వడి; సదనంబునన్= భవనంలో; నిల్చునట్లుగాన్= ఉండేటట్లు; నిర్దేశించి= సూచించి; అందఱన్= అందరినీ; పోవన్+పనిచి= వెళ్ళుడని పంపి; అభి+అంతర+మందిరంబునకున్= తన ఏకాంత మందిరానికి; అరిగెన్= వెళ్ళాడు; ఆ భీమసేన+ఆదులు= ఆ భీముడు మొదలైనవారు; ఆ+మహనీయ వాసంబులు= ఆ ఘనమైన గృహాలు; చేకొని= స్వీకరించి; అందున్= ఆ భవనాలలో; ప్రభూత= అధికమైన; అన్న, పాన+ఆది+అనుభవంబులన్= భోజనాలు పానీయాలు మొదలైనవి అనుభవిస్తూ; సుఖించి= సుఖపడుతూ;

ఉండన్= ఉండగా; ఆ+విభుండు= ఆ రాజు (ధర్మరాజు); నిజ+ఇచ్ఛన్= తనకు నచ్చినట్లు; విహరించెన్= చరించాడు; అని= అంటూ; ఇట్లు= ఈ విధంగా; ధర్మపుత్రు= ధర్మరాజు; చరిత్రంబు= చరిత; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; ఆ+భంగిన్= ఆ విధంగా; ప్రాప్త= పొందిన; సామ్రాజ్యుండు+ఐ= మహాసామ్రాజ్యం కలిగినవాడై; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; పదంపడి= తరువాత; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; వర్తించెన్= చరించాడు? (ప్రవర్తించాడు); సకల= సమస్తమైన; జగత్= లోకాలకు; గురుండు= ఉపదేష్ట; అయిన= అయినటువంటి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; మఱి= ఇంకా; ఎట్లు+ఉండెన్?= ఏ విధంగా ఉన్నాడు?; ఎఱింగింపుము= తెలియజెప్పుము; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** ఇంకా విదురుడినీ, యుయుత్సుడినీ, సంజయుడినీ, ధౌమ్యుడినీ చూచి 'మీరు మీమీ ఇళ్ళను (అంతకు ముందు వారు నివాసం చేసినవి) స్వీకరించండి' అని చెప్పాడు. ప్రధానప్రాసాదంలో ధృతరాష్ట్రుడు ఇంతకుముందు ఉంటున్న ఇంటిలో అతడిని ఉంచాడు. ఈ విధంగా భవనాలను అందరికీ కేటాయించి ఇచ్చి, కృష్ణుడూ, సాత్యకీ అర్జునుడి గృహంలో ఉండేటట్లు ఏర్పాటు చేశాడు. అందరిని వెళ్ళుడని పంపి, తాను తన అభ్యంతర మందిరానికి వెళ్ళాడు. భీముడు మొదలైనవారంతా ఆ ఘనమైన మందిరాలను స్వీకరించి, అచట సిద్ధంగా ఉన్న పవిత్రమైన భోజనపానీయాలను అనుభవిస్తూ ఆనందంగా ఉన్నారు. ధర్మరాజు కూడా తనకు నచ్చినవిధంగా ఉన్నాడు. ఈ విధంగా ఉన్న ధర్మరాజు చరిత్రను వైశంపాయనుడు చెప్పగా విన్న జనమేజయుడు 'ఈ విధంగా రాజ్యం పొందిన ధర్మరాజు ఆ తరువాత ఏ విధంగా నడుచుకొన్నాడు? అన్నిలోకాలవారికి గురువైన శ్రీకృష్ణు డే విధంగా ఉన్నాడు? తెలియచెప్పుము' అని అనగా. (తరువాతి ఆశ్వాసంలోని రెండవ వచనంతో అన్వయం).

## ఆశ్వాసాంతము

**శా.** **భక్తాంభోరుహ బాలసూర్య! దనుజ ప్రధ్వంసనాచార్య! సు**
**వ్యక్తావ్యక్త నిజప్రకార! సదయ వ్యాపార! దాంతిక్షమా**
**సక్త నిత్య స్వీకృత! వేదపరిషత్సంస్తుత్య! మాయా విని**
**ర్ముక్త ద్యోతన! తార్క్ష్యశాక్వర మహామూర్తి స్ఫురత్కేతనా!** **398**

**ప్రతిపదార్థం:** భక్త= భక్తులు అనే; అంభోరుహ= పద్మాలకు; బాలసూర్య!= ఉదయసూర్యుడి వంటివాడా!; దనుజ= రాక్షసులను; ప్రధ్వంసన= సమూలంగా నశింపచేయటంలో; ఆచార్య!=చేసేవాడా! ప్రముఖుడా! సువ్యక్త= బాగా తెలియబడే; అవ్యక్త= ఏమీ ప్రకటంకాని; నిజ= నీ దైన; ప్రకార= పద్ధతి కలవాడా!; సదయ= కరుణతో కూడిన; వ్యాపార!= చేతలు కలవాడా?; దాంతి= ఇంద్రియ నిగ్రహమందునూ; క్షమా= ఓర్పునందునూ; అసక్త= అసక్తులైన వారిచేత; స్వీకృత= స్వీకరించబడిన; నిత్య= శాశ్వతుడా!; వేదపరిషద్= వేదసభలలో; సంస్తుత్య= బాగా కీర్తించబడేవాడా!; మాయా= అవిద్య; వినిర్ముక్త= బాగా తొలగించుకొన్నవారికి; ద్యోతన= దర్శనమిచ్చువాడా!; తార్క్ష్య= గరుడుడు; శాక్వర= ఎద్దు(నందిఅను); మహామూర్తి= గొప్ప ఆకృతులచే; స్ఫురత్= ప్రకాశించు; కేతనా!= జెండాలు కలవాడా! (హరిహరనాథా! -అని భావం).

**తాత్పర్యం:** భక్తుల హృదయపద్మాలకు ఉదయసూర్యుడివంటివాడా! రాక్షసులను సంహరించడంలో గొప్పవాడా! నీ చేతలలో ప్రకటం అవుతూనే, కాకుండా ఉండేవాడా! దయతో వర్తించేవాడా! ఇంద్రియనిగ్రహంలోనూ క్షమలోనూ

ఆసక్తి కలవారిచే గ్రహించబడిన నిత్య స్వరూపుడా! వేదపరిషత్తులచేత నుతింపబడేవాడా!, అవిద్యను వదలినవారికి దర్శనమిచ్చేవాడా! గరుడుడు, నంది అను గుర్తులు కల జెండాలు కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** 'శాక్వరమహామూర్తి' అనే పాదానికి 'శాశ్వతమహామూర్తి' అనే పాఠం కొన్ని ప్రతులలో కానవస్తున్నది. కాని ఇక్కడ శాక్వర (శాక్కర) శబ్దమే ఉచితమైనది. శాక్వర - శాక్కర (ఆప్టే నిఘంటువు). హరిహరనాథుడు గరుత్మంతుడిచేత, వృషభంచేత ప్రకాశించే కేతనం కలవాడు.

**క. భవదుఃఖ భరనిరాస । ప్రవీణ! నానాభిధాన! పారాశర్య**
**స్తవనీయ ఓరుగంటి గుణ నిధాన! స । మవబోధ నిరంతరా విదాత్మాధీనా! 399**

**ప్రతిపదార్థం:** భవదుఃఖ భార= సంసారదుఃఖ భారాన్ని; నిరాస= పోగొట్టటంలో; ప్రవీణ!= నేర్పరి అయినవాడా!; నానా+అభిధాన= ఎన్నో పేర్లు కలవాడా!; పారాశర్య= పరాశరుడి పుత్రుడైన వ్యాసుడిచేత; స్తవనీయ!= పొగడబడినవాడా!; గుణ= అన్ని గుణాలకు; నిధాన!= నిలయమైనవాడా!; సమ్+అవబోధ= నిరంతరా ఎడతెగనిజ్ఞానమే స్వరూపముగా కలవాడా!; విద్+ఆత్మ= బోధకలిగినవారికి; అధీనా!= లోబడి ఉండేవాడా! (హరిహరనాథా!)

**తాత్పర్యం:** జననమరణ స్వరూపమైన సంసార దుఃఖభారాన్ని పోగొట్టటంలో నేర్పరీ! ఎన్నో నామాలు కలవాడా! (అన్ని నామాలూ ఆయనవే), వ్యాసుడిచేత కీర్తించబడినవాడా! (పురాణ, ఉపపురాణ, మహాపురాణ, బ్రహ్మసూత్రాలలో) సమస్త గుణాలకు నిలయమైనవాడా!, ఎల్లప్పుడూ మేలుకొని ఉండేవాడా! (నిత్య జాగరమూర్తీ), ఎరుకగలవారికి అధీనుడవు అయినవాడా! (హరిహరనాథా!)

**మాలిని:**

**ప్రకృతి పురుష యోగీ! భక్తతాత్పర్య రాగీ! । సకృప హృదయపద్మా! శాంతి చిత్తైక సద్మా!**
**వికృతి రహితమూర్తీ! విశ్వభూత ప్రవర్తీ! । సుకృత ఫలమయాత్మా! సుస్థిరానంద వర్త్మా! 400**

**ప్రతిపదార్థం:** ప్రకృతి= పంచభూతాత్మకమూ, త్రిగుణాత్మకమూ అయిన వ్యక్త సృష్టి; పురుష= పరమ పురుషుడు (అవ్యక్తుడు); యోగీ!= చక్కగా కలిసిన రూపమైనవాడా!; భక్త= భక్తుల; తాత్పర్య= అభిప్రాయం (తత్పరత) అందు; రాగీ!= అనురాగం కలవాడా!; సకృప= దయతోకూడిన; హృదయపద్మా!= పద్మంవంటి హృదయం కలవాడా!; శాంతి= కల్లోలంలేని, ప్రశాంతమైన; చిత్త= మనస్సు; ఏకసద్మా!= ఒకే ఒక నివాసంగా కలవాడా!; విశ్వ= లోకమందలి; భూత= ప్రాణులను; ప్రవర్తీ!= నడిపించేవాడా!; సుకృత= పుణ్యాల; ఫలమయ= ఫలస్వరూపమైన; ఆత్మ!= రూపం (మనస్సు) కలవాడా!; సుస్థిర= మిక్కిలి స్థిరమైన; ఆనంద వర్త్మా!= ఆనంద మార్గం కలవాడా!; (హరిహరనాథా!).

**తాత్పర్యం:** ప్రకృతి, పురుషుడు కలిసినట్టి రూపం కలవాడా! భక్తతత్పరతయందు అనురాగం కలవాడా! దయతో కూడిన హృదయపద్మం కలవాడా!, ప్రశాంతమైన చిత్తమే నివాసమైనవాడా!, మార్పుచెందని రూపం కలవాడా!, లోకాలన్నింటినీ, ప్రాణులందరినీ నడిపించేవాడా!, పుణ్య స్వరూపమైన మనస్సు, శాశ్వతమైన ఆనంద స్వరూపం కలవాడా! (హరిహరనాథా!).

**విశేషం:** ఈ వృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, న, మ, య, య గణాలుంటాయి. 9వ అక్షరం యతిస్థానం - ప్రాసనియమం నియతం.

**గద్యము**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున శాంతి పర్వంబు నందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఇప్పటివరకు చెప్పింది; శ్రీమత్= శుభప్రదమూ; ఉభయకవిమిత్త్ర= ఉభయ కవిమిత్రుడనే బిరుదు కలిగినవాడు, శైవ, వైష్ణవ, దేశిమార్గ కవులందరికీ హితుడైనవాడూ; కొమ్మన+అమాత్య పుత్త్ర= కొమ్మనామాత్యుడి కుమారుడైనవాడూ; బుధ= పండితులను, దేవతలను; ఆరాధన= పూజించటంచేత; విరాజి= ప్రకాశించేవాడూ (పండితులు తనను గౌరవించటంచేత రాణించేవాడూ) అయిన; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కన; ప్రణీతంబు+అయిన= చెప్పిన; శ్రీమహాభారతంబున= శ్రీ మహాభారతంలోని; శాంతిపర్వంబు అందున్= శాంతిపర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇప్పటివరకు చెప్పినది శుభప్రదమైన, ఉభయకవిమిత్రుడనే బిరుదు కలిగినవాడూ, కొమ్మనామాత్యుడి కుమారుడైనవాడూ, పండితులను, దేవతలను పూజించి ప్రకాశించేవాడూ (పండితులచేత గౌరవించబడి రాణించేవాడూ అయిన) తిక్కనసోమయాజిచేత చెప్పబడిన శ్రీమహాభారతంలో శాంతిపర్వంలోని మొదటి ఆశ్వాసం.

**శాంతిపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీ శుచితాధృతి కరణ క। లా శౌండ కటాక్షలీల! లౌల్యరహిత! లో**
**లా శక్తిత్రయ సమయు। క్త్యాశోభిత రూపహేల! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= ఐశ్వర్యం; శుచితా= త్రికరణ శౌచం; ధృతి= ధీరత్వాలను; కరణ= కలుగజేయటం అనే; కలా= విద్యయందు; శౌండ= ప్రసిద్ధమగు; కటాక్షలీల!= కడగంటిచూపుల విలాసం కలవాడా!; లౌల్య-రహిత= చపలత్వము లేనివాడా!; లోలా= లక్ష్మీరూపమగు; శక్తిత్రయ= మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ రూపములగు మూడు శక్తులతో; సమ= తుల్యముగా; యుక్తి= కూడుటచేత; ఆశోభిత= అంతటా ప్రకాశించు; రూప-హేల!= సౌందర్యము, విలాసము గలవాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీ కటాక్షప్రసారంచేతనే జనులకు సంపద, త్రికరణశుద్ధి, ధైర్యం కలుగుతాయి. నీవు స్థిరమైనవాడవు. బ్రహ్మవిష్ణు శివరూపాన సరస్వతీ, లక్ష్మీ, గౌరీ రూప శక్తిత్రయంతో కూడి విశ్వవ్యవహారానికి, అనేక సుందరరూపాలతో కూడి ఉంటావు. లేదా ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులనుబట్టి అనేకావతారాలతో శోభిల్లుతావు.

### ధర్మనందనుని ప్రవర్తన (సం. 12-45-3)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నిట్లు సమధిగత సామ్రాజ్యుండై ధర్మనందనుండు దేజో విశేషంబున మహోజ్జ్వలత్వంబునొంది మహీసురుల నాశ్రితజనంబుల నర్థులం గృతార్థులం గావించి, ధృతరాష్ట్ర గాంధారీ విదురులకు రాజ్యంబు సమర్పించి, 'మీరలింతటికి నొడయుల రేను మీ పనిచిన పని సేసి పెట్టిన యట్లు గుడిచి యుండం గలవాఁడ' నని పలికి, నిత్యంబును వారల యనుమతి గొని భవ్యమార్గంబునం బ్రజలం బాలించుచు, వారికిం బూర్వప్రకారంబుకంటె నతిశయిల్ల నెల్ల వర్తనంబులు సంప్రీతిం జెల్లించుచు విపతులైన సతుల నుమ్మలికంబు వొరయకుండం గరుణ నరయుచుఁ, గృప యుయుత్సు సంజయులకుం గౌరవామాత్యులకు మన్ననలు సలుపుచుఁ, గుంతీదేవికి శుశ్రూష యాచరించుచుఁ, బాంచాలికి సౌమనస్యం బాపాదించుచు ధౌమ్యునకు సగౌరవంబుగా సకల సంపదలు నొసంగి, తన్ముఖంబున దేవ పితృ పూజనంబులు నతిథి తర్పణంబులు వైదేశిక విప్రార్చనంబులు దీనానాథ పోషణంబులుం బరమ సంతోషంబుతో నడపుచుం గృష్ణు నారాధించుచు సమస్తపౌరజనపదకోటుల మనంబులం బ్రమోదంబు పరిపూర్ణంబగునట్లుగా నివ్విధంబునఁ బ్రవర్తిల్లుచుండి, యొక్కనాఁడు రేపకడ కృష్ణుని యున్న మందిరంబునకుం బోయి. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వ్యాసమహర్షికి శిష్యుడైన వైశంపాయనుడు; జనమేజయునకున్= పరీక్షిన్మహారాజు పుత్రుడైన జనమేజయునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఇట్లు= ఈ విధంగా; సమ్+అధిగత సామ్రాజ్యుండు+ఐ= రాజ్యాన్ని పొందినవాడై; ధర్మనందనుండు= ధర్మరాజు; తేజః+విశేషంబునన్= రాజ్యాభిషిక్తుడు కావటం వలన పొందిన విశేషమైన కాంతిచేత; మహా+ఉత్+జ్వలత్వంబున్+ఒంది= గొప్పదైన మిక్కిలి ప్రకాశాన్ని పొంది; మహీసురులన్=

భూదేవతలైన బ్రాహ్మణులను; ఆశ్రితజనంబులన్= ఆశ్రయించిన ప్రజలను; అర్థులన్= కోరికతో వచ్చినవారిని; కృత+అర్థులన్+కావించి= తీరిన కోర్కెలు గలవారినిగా చేసి; ధృతరాష్ట్ర గాంధారీ విదురులకున్= ధృతరాష్ట్రుడికి, గాంధారికి, విదురుడికి; రాజ్యంబు సమర్పించి= రాజ్యాన్ని ఇచ్చి; మీరలు= మీరు; ఇంతటికిన్+ఒడయులరు= దీనికంతటికి ప్రభువులు; ఏను= నేను (ధర్మరాజు); మీ పనిచిన పని+చేసి= మీరు ఆజ్ఞాపించిన పనిని చేసి; పెట్టిన+అట్లు= పెట్టిన రీతిగా; కుడిచి= తిని; ఉండన్+కలవాఁడను= ఉండగలను; అని పలికి= అని చెప్పి; నిత్యంబును= ప్రతి దినమూ; వారల+అనుమతిన్= వారి అనుజ్ఞను; కొని= తీసికొని; భవ్యమార్గంబునన్= సరైన పద్ధతిలో; ప్రజలన్+పాలించుచున్= ప్రజలను ఏలుతూ; వారికిన్= వారికి; పూర్వప్రకారంబు కంటెన్= ముందటి పద్ధతికంటె; అతిశయిల్లన్= మించేటట్లుగా; ఎల్ల వర్తనంబులు= అన్ని కార్యాలను; సంప్రీతిన్= సంతోషం కలిగించే విధంగా; చెల్లించుచున్= చేస్తూ; విపతులు+ఐన= భర్తలను పోగొట్టుకొన్న; సతులన్= స్త్రీలను; ఉమ్మలికంబు+పొరయకుండన్= దుఃఖం కలుగకుండా; కరుణన్= దయతో; అరయుచున్= గమనిస్తూ; కృప యుయుత్సు సంజయులకున్= కృపాచార్య, యుయుత్సు, సంజయులకు; కౌరవ+అమాత్యులకున్= కౌరవుల మంత్రులకు; మన్ననలు+చలుపుచున్= గౌరవిస్తూ; కుంతీదేవికిన్= తల్లిఅయిన కుంతీదేవికి; శుశ్రూష+ఆచరించుచున్= సేవ చేస్తూ; పాంచాలికిన్= ద్రౌపదికి; సౌమనస్యంబు+ఆపాదించుచున్= సంతోషాన్ని కలిగిస్తూ; ధౌమ్యునకున్= పాండవ పురోహితుడైన ధౌమ్య మహర్షికి; సగౌరవంబుగాన్= గౌరవ పూర్వకంగా; సకల సంపదలున్+ఒసంగి= సర్వ సంపదల నిచ్చి; తద్+ముఖంబునన్= ఆయన ఆధ్వర్యవంలో; దేవ పితృ పూజనంబులున్= దేవతల, పితృదేవతల పూజాదికాలు; అతిథి తర్పణంబులు= అతిథులకు తృప్తి; వైదేశిక= ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన; విప్ర+అర్చనంబులు= బ్రాహ్మణులకు పూజలు; దీన+అనాథ పోషణంబులున్= దీనుల, అనాథల యొక్క సంరక్షణలు; పరమ= మిక్కిలి; సంతోషంబుతోన్= ఆనందంతో; నడుపుచున్= నిర్వర్తిస్తూ; కృష్ణున్+ఆరాధించుచున్= శ్రీకృష్ణుడిని పూజిస్తూ; సమస్త= ఎల్ల; పౌర= పుర ప్రజలను; జనపదకోటుల= గ్రామీణ ప్రజా సముదాయాల; మనంబులన్= మనసులలో; ప్రమోదంబున్= ఆనందాన్ని; పరిపూర్ణంబు+ అగునట్లుగాన్= నిండేటట్లుగా; ఈ+విధంబునన్= ఈ రీతిగా; ప్రవర్తిల్లుచున్+ఉండి= నడుచుకొంటూ ఉండి; ఒక్కనాఁడు= ఒకానొక రోజు; రేపకడ= తెల్లవారుజామున; కృష్ణుని+ఉన్న మందిరంబునకున్+పోయి= శ్రీకృష్ణుడి విడిది మందిరానికి వెళ్ళి.

**తాత్పర్యం:** వైశంపాయనుడు జనమేజయుడికి ఈ విధంగా చెప్పాడు: ఓ రాజా! ఈ రీతిగా ధర్మరాజు రాజ్యాన్ని పొందినవాడై విశేషకాంతిచేత మిక్కిలి ప్రకాశిస్తూ బ్రాహ్మణుల, ఆశ్రయించిన వారల, కోరికతో తన వద్ద చేరిన వారల కోర్కెల్ని తీర్చి, గాంధారీ ధృతరాష్ట్ర విదురులకు రాజ్యాన్ని సమర్పించి 'మీరు దీనికంతటికీ ప్రభువులు, నేను మీరు చెప్పిన పనిని చేసి, మీరు పెట్టిన దానిని తింటూ ఉండగలను' అని పలికాడు. ప్రతిరోజూ వారి అనుమతి తీసికొని సరైన పద్ధతిలో ప్రజలను పాలిస్తూ వారందరికీ పూర్వంకంటె అధికమైన జీవనభృతులను కల్పిస్తూ, భర్తలను పోగొట్టుకొన్న స్త్రీలకు దుఃఖం కలుగకుండా దయతో గమనిస్తూ, కృపాచార్య, యుయుత్సు సంజయులను, కౌరవమంత్రులను గౌరవిస్తూ, తల్లి అయిన కుంతిని సేవిస్తూ, ద్రౌపదికి సంతోషాన్ని కలిగిస్తూ, ధౌమ్యమహర్షికి సకల సంపదల నిచ్చి ఆయన ఆధ్వర్యవంలో దేవతల, పితృదేవతల పూజాదికాలు నిర్వర్తించి, అతిథులకు సంతృప్తి కలిగిస్తూ, ఇతర ప్రాంతాల నుండి వచ్చిన బ్రాహ్మణులను అర్చిస్తూ, దీనులను, అనాథలను సంరక్షిస్తూ శ్రీకృష్ణుడిని పూజిస్తూ, సమస్త నగరవాసుల, గ్రామీణుల మనసులను పరిపూర్ణంగా ఆనందంతో నిండింపజేస్తూ ఉన్నాడు. ఈ విధంగా ప్రవర్తిస్తున్న సమయంలో ఒకనాడు తెల్లవారుజామున ధర్మరాజు శ్రీకృష్ణుడి విడిది మందిరానికి వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఈ వచనంలో 'సమధిగత సామ్రాజ్యుండై ధర్మనందనుండు' అని చెప్పటంలో శత్రువులైన కౌరవులను కురుక్షేత్ర ధర్మయుద్ధంలో జయించి ధర్మరాజు రాజ్యాన్ని పొందినట్లు విదితమవుతుంది. తాను ధర్మబద్ధంగా సాధించుకొన్న రాజ్యాన్ని ధృతరాష్ట్ర గాంధారీ విదురులకు సమర్పించి, వారినే తన ప్రభువులుగా, తానే వారి సేవకుడుగా భావించటంలో ధర్మరాజు వినయం స్పష్టం కావటమే కాక, పుత్రశోక సంతప్తులైన గాంధారీ ధృతరాష్ట్రులకు సంతోషాన్ని చేకూర్చినట్లు వెల్లడవుతున్నది. భర్తృహీనలై దుఃఖితమతు

లైన స్త్రీలను బాధ్యతాయుత ప్రవర్తనతోపాటు ధర్మరాజు దయతో చూచిన తీరు స్పష్టమవుతున్నది. పెద్దలపట్ల, అతిథులపట్ల, దేవబ్రాహ్మణుల, దీనుల, అనాథల, పురజనుల, గ్రామీణుల పట్ల రాజుగా తన ధర్మాన్ని ధర్మరాజు నిర్వర్తించిన తీరులో ఆయన వ్యక్తిత్వం ప్రదర్శితమవుతున్నది.

### ధ్యానాసక్తుఁడైన శ్రీకృష్ణునింగని ధర్మజుఁడు సంభాషించుట (సం.12-45-13)

**సీ. మణిహేమ పర్యంక మహితోపవేశుని సురుచిరాభరణ విస్ఫురితగాత్రుఁ,**
**గౌస్తుభరత్న వికాసి వక్షస్థలుఁ, బీతకౌశేయ సంవీతమూర్తి,**
**మేరు తటీగత మేఘసంకాశు నక్షత్రగణావృత గగన సదృశు,**
**నూతనోదిత రవి ద్యోతితోదయ గిరి నిభు రుక్మ బద్ధేంద్రనీల తుల్యు,**

**ఆ. నమ్మురారిఁ గని కృతాంజలి యై భక్తిఁ । జిత్తవృత్తి గరము జొత్తిలంగ**
**నంతకంత కాననాంబుజ మలరంగ । నిట్టు లనియెఁ దియ్య మెసక మెసఁగ. 3**

**ప్రతిపదార్థం:** మణి= మణులతో కూడిన; హేమ= బంగారు మయమైన; పర్యంక= పాన్పుమీద; మహిత= బాగుగా; ఉపవేశునిన్= కూర్చున్న వాడిని; సురుచిర= మిక్కిలి కాంతిమంతమైన; ఆభరణ= అలంకారాలతో; విస్ఫురిత= ఎక్కువగా ప్రకాశిస్తున్న; గాత్రున్= శరీరం కలవాడిని; కౌస్తుభరత్న= కౌస్తుభమనెడి రత్నంచేత; వికాసి= ప్రకాశిస్తున్న; వక్షస్థలున్= ఉరో భాగం కలిగినవాడిని; పీత= పచ్చని; కౌశేయ= పట్టు వస్త్రాన్ని; సంవీతమూర్తిన్= హారంవలె ధరించిన స్వరూపం కలవాడిని; మేరుతటీ= మేరుపర్వత ప్రదేశంలో; గత= ఉన్న; మేఘ= మేఘంతో; సంకాశున్= సమానమైన వాడిని; నక్షత్రగణ= చుక్కల గుంపులచేత; ఆవృత= కప్పబడిన; గగన= ఆకాశంతో; సదృశున్= సమానమైనవాడిని; నూతన= అప్పుడే; ఉదిత= పుట్టిన; రవి= సూర్యునియొక్క; ద్యోతిత= కాంతితో కూడిన; ఉదయగిరి= ఉదయ పర్వతంతో; నిభున్= సమానమైన వాడిని; రుక్మ= బంగారంలో; బద్ధ= కూర్చబడిన (ఖచిత); ఇంద్రనీలతుల్యున్= ఇంద్రనీలంతో సమానమైనవాడిని; ఆ+ముర+అరిన్+కని= ఆ ముర అనే రాక్షసుడికి శత్రువైన శ్రీకృష్ణుడిని చూచి; కృత+అంజలి+ఐ= నమస్కరించిన వాడై; భక్తిన్= భక్తితో; చిత్తవృత్తి= మనోవృత్తి; కరము= మిక్కిలి; జొత్తిలంగన్= రంజిల్లగా; అంతకున్+అంతకున్= అంతకంతకు; ఆనన+అంబుజము= పద్మమువంటి ముఖము; అలరంగన్= ఒప్పుతూ ఉండగా; తియ్యము+ఎసక మెసఁగన్= ప్రేమ అతిశయింపగా; ఇట్టులు+అనియెన్= (ధర్మరాజు) ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** మిక్కిలి కాంతిమంతమైన అలంకారాలతో ప్రకాశిస్తున్న శరీరం కలిగిన వాడూ, కౌస్తుభమనే రత్నాన్ని ఉరోభాగాన ధరించినవాడూ, పచ్చని పట్టు వస్త్రాన్ని హారంలా వేసుకొన్నవాడూ, మేరుపర్వత ప్రాంతంలో ఉన్న మేఘంతో సమానమైనవాడూ, చుక్కల గుంపులతో చుట్టబడిన ఆకాశంతో సమానమైనవాడూ, అప్పుడే ఉదయించిన సూర్యకాంతితో కూడిన ఉదయపర్వతంతో సమానమైనవాడూ, బంగారంలో పొదగబడిన ఇంద్రనీలమణితో సమానమైనవాడూ, మణులతోకూడి బంగారుమయమైన పాన్పుమీద ప్రశస్తంగా కూర్చున్నవాడూ అయిన శ్రీకృష్ణుడిని చూచి ధర్మరాజు నమస్కరించి తన మనస్సు భక్తినిమగ్నం కాగా అంతకంతకూ తన ముఖపద్మం ప్రకాశిస్తూ ఉండగా అతిశయించిన ప్రేమతో ఈ విధంగా పలికాడు.

**విశేషం:** సామాన్యంగా తిక్కన శైలి అలతి అలతి పద ప్రయోగంతో ఉంటుంది. కానీ ఇక్కడ శ్రీకృష్ణుని వ్యక్తిత్వ విశిష్ట వివరణకు సంస్కృత శబ్దాలను గ్రహించాడు. 'మహితోపవేశుని' అని ప్రయోగించటంలో తిక్కన శ్రీకృష్ణుడు గంభీరంగా కూర్చొని ఉన్న తీరు స్పష్టం చేశాడు.

మురారి: మురాసురుడనే రాక్షసుడికి శత్రువు అయిన కృష్ణుడు.

మురాసురుడు బ్రహ్మనుగూర్చి తపస్సు చేసి తన అరచేతిని ఎవడిపయి పెడితే వాడు భస్మమయ్యే వరాన్ని పొందాడు. విర్రవీగిన మురుడు విష్ణువును సంహరింపదలచాడు. ఆ సంగతి గుర్తించిన విష్ణువు, నీ గుండెలేల తటపటా కొట్టుకుంటున్నాయని అనగానే, లేదే అంటూ తన గుండెపయి తన అరచేతిని ఉంచుకొనగానే మురాసురుడు భస్మమయిపోయాడు.

**తే.** **'కడపితే రాత్రి సులభసౌఖ్యంబుగా? మ । నంబు గాఢప్రసన్నమే యంబుజాక్ష!**
**దైవి యగు నీదు బుద్ధి కతమునఁ గాదె । ధర్మగతిఁ బ్రాభవంబుఁ బొందదంగఁ గంటి. 4**

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్ష!= పద్మాలవంటి కన్నులు కలిగిన శ్రీకృష్ణా!; సులభ సౌఖ్యంబుగాన్= హాయిగా (సుఖంగా); రాత్రిన్= రాత్రి; కడపితి+ఏ?= గడపావు కదా; మనంబు= నీ మనస్సు; గాఢ= మిక్కిలిగా; ప్రసన్నమే?= ప్రశాంతంగా ఉన్నదా?; దైవి+అగు= దైవసంబంధమైన; నీ+బుద్ధి కతమునన్= నీ బుద్ధి విశేషం వలన; ధర్మగతిన్= ధర్మమార్గంలో; ప్రాభవంబున్= రాజ్యాధికారాన్ని; పొందంగన్+కంటిన్= పొందితిని; కాదె!= కదా!

**తాత్పర్యం:** 'ఓ శ్రీకృష్ణా! రాత్రి సుఖంగా గడిపావు కదా! నీ మనసు మిక్కిలి ప్రశాంతంగా ఉంది కదా! దేవుడవే అయిన నీ బుద్ధివిశేషంవలన నేను ధర్మమార్గంలో రాజ్యాధికారాన్ని పొందగలిగాను కదా! (అని ధర్మరాజు పలికాడు.)

**విశేషం:** తిక్కన సహజశైలికి చక్కటి నిదర్శన మీ పద్యం. చిన్న చిన్న వాక్యాలలో సన్నిహితులను పలకరించే తీరును వ్యక్తం చేసిన తిక్కన లోకజ్ఞత ఇక్కడ వ్యక్తమవుతున్నది. 'దైవియగు' అని వాచ్యం చేసి శ్రీకృష్ణుడిని కేవలం బావగానే కాక, తనకు కూర్చు నెయ్యుడే కాక, భగవంతుడుగా గుర్తించటం ధర్మరాజు విజ్ఞతకు నిదర్శనం.

**వ.** **త్రిభువన వ్యాప్త విక్రముండ వగు నీ కటాక్షంబున కలిమిం గాదె జగత్త్రయ సంభావనీయుండనై వెలింగితి' ననుచుం జేరంబోయి. 5**

**ప్రతిపదార్థం:** త్రిభువన= ముల్లోకాలలో; వ్యాప్త= వ్యాపించిన; విక్రముండవు+అగు= పరాక్రమం కలిగిన వాడవైన (ముల్లోకాలను ఆక్రమించిన వామనుడని అర్థాంతరం); నీ= నీయొక్క; కటాక్షంబున కలిమిన్+కాదె= కటాక్షం యొక్క కలిమిచేతనే కదా! (ఉండుటచేతనే కదా అని అర్థాంతరం); జగత్త్రయ= ముల్లోకాలచేత; సంభావనీయుండను+ఐ= గౌరవించదగినవాడనై; వెలింగితిని= ప్రకాశించాను; అనుచున్= అని పలుకుతూ; చేరన్+పోయి= సమీపించి.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! ముల్లోకాలలో వ్యాపించిన పరాక్రమం కలిగిన నీ దయవలననే ముల్లోకాల చేత గౌరవించదగిన వాడనై ప్రకాశించాను' అని అంటూ ధర్మరాజు శ్రీకృష్ణుడిని సమీపించి.

**విశేషం:** దశావతారాలలో వామనరూపంలో బలిచక్రవర్తిని మూడడుగు లడిగి ముల్లోకాలు వ్యాపించి బలిని అణచిన త్రివిక్రముడు శ్రీకృష్ణుడు కావటం వలన ఆ సంగతిని గుర్తుచేసి, శ్రీకృష్ణుడు త్రివిక్రముడు కావటం వలనే తనను (ధర్మరాజును) ముల్లోకాలలోను గౌరవనీయుడుగా ప్రకాశించేటట్లు చేయగలిగాడని ధర్మరాజుచేత పలికించటం వలన తిక్కన సాభిప్రాయ పదప్రయోగ దక్షత వ్యక్తమవుతున్నది.

**క.** **తన యుచితాలాపములకు । మనుజేశ్వర! మాధవుండు మఱుమాట యొకం**
**డును బలుకక భవ్య ధ్యా । న నిరూఢత నున్న యపుడు నరపతి యతనిన్. 6**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= ఓ జనమేజయ మహారాజా! తన= తన (ధర్మరాజు) యొక్క; ఉచిత= తగిన; ఆలాపములకున్= మాటలకు; మాధవుండు= శ్రీకృష్ణుడు; మఱుమాట+ఒకండును= బదులుమాట కూడా; పలుకక= మాటలాడక; భవ్య= శ్రేష్ఠమైన; ధ్యాన నిరూఢతన్+ఉన్న= విశిష్ట ధ్యానంలో ఉన్న; అపుడు= ఆ సమయంలో; నరపతి= రాజైన ధర్మరాజు; అతనిన్= ఆ శ్రీకృష్ణుడితో.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ధర్మరాజు తగిన రీతిలో పలికిన ఆ పలుకులకు కృష్ణుడు మరేమీ మాటలాడక శ్రేష్ఠమైన, విశిష్టమైన ధ్యానంలో ఉండగా అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణుడిని.

**వ. నిరూపించి యిట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** నిరూపించి= శ్రీకృష్ణుడిని చూచి; ఇట్లు+అనియెన్= ధర్మరాజు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు శ్రీకృష్ణుడిని చూచి ఈ విధంగా అన్నాడు.

**సీ. 'పంచాత్మకంబైన పవనంబు నిగృహీత మైనది, భవదింద్రియములు మనము**
**నందాఁగఁ బడ్డవి, యవియును నదియును । బుద్ధియం । దొదిఁగించి శుద్ధమైన**
**నాలవ తెరువున లోలతారహితముల్ । గాఁగ నిన్నియును సంకలితములుగ**
**నంచిత క్షేత్రజ్ఞునందుఁ గూర్చినవాఁడ । వీ పరమధ్యాన మేమి కతన**

**తే. నొలసెనొకొ! లోకములకు నొండొక్క వింత । లేక నెమ్మది యున్నదియే? కరంబు**
**విస్మయముఁ బొందె నా మది; వినఁగ నర్హ । మేని వినిపింపవే నాకు నిత్తెఱంగు.' 8**

**ప్రతిపదార్థం:** పంచ+ఆత్మకంబు+ఐన పవనంబు= పంచ ప్రాణాలతో (ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం) కూడిన గాలి (ప్రాణవాయువు); నిగృహీతము+ఐనది= నిగ్రహించ బడింది; భవత్+ఇంద్రియములు= నీయొక్క ఇంద్రియాలు (శ్రోత్ర, చర్మ, చక్షుస్, జిహ్వ, నాసిక - అనే జ్ఞానేంద్రియాలు, వాక్కు, హస్త, పాద, పాయువు, ఉపస్థ - అనే కర్మేంద్రియాలు); మనంబునన్= మనసునందు; ఆఁగఁబడ్డవి= నిల్పబడ్డాయి; అవియును= ఆ ఇంద్రియాలూ; అదియును= ఆ మనస్సూ; బుద్ధి+అందు+ఒదిఁగించి= బుద్ధియందు చేర్చి; శుద్ధము+ఐన= స్వచ్ఛమైన; నాలవ తెరువునన్= నాలుగవదైన మార్గంలో (జాగ్రత్, స్వప్న, సుషుప్తి కాక నాలుగవదైన ధ్యాన మార్గంలో); లోలతా రహితముల్+కాఁగన్= చలనం లేకుండునట్లు కాగా; ఇన్నియును= వీటన్నింటిని; సంకలితములుగన్= కూడుకొన్నట్లుగా; అంచిత= తగినట్లు; క్షేత్రజ్ఞునందున్= జీవుడి యందు; కూర్చినవాఁడవు= చేర్చినవాడవు; ఈ పరమ ధ్యానము= ఇట్లాంటి శ్రేష్ఠమైన ధ్యానం; ఏమి కతనన్= ఏ కారణం వలన; ఒలసెన్+ఒకొ!= కలిగిందో కదా!; లోకములకున్= సమస్త లోకాలకు; ఒండు+ఒక్క= వేరొక; వింతలేక= ఎలాంటి విచిత్రమూ లేకుండా; నెమ్మది+ఉన్నదియే?= ప్రశాంతంగా ఉన్నదా?; నా మది= నా మనస్సు; కరంబు= మిక్కిలి; విస్మయమున్+పొందెన్= ఆశ్చర్యాన్ని పొందింది; వినఁగన్+అర్హము+ఏని= వినదగిన విషయమైతే (రహస్యం కాకుంటే); నాకున్= నాకు (ధర్మరాజునకు) ఈ+తెఱంగున్= ఈ పద్ధతిని; వినిపింపవే= తెలియజేయవా?

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! అయిదు విధాలయిన వాయువు బంధించబడింది. నీ ఇంద్రియాలు మనసులో నిల్ప బడ్డాయి. మనసును బుద్ధియందు చేర్చి స్వచ్ఛమైన ధ్యాన మార్గంలో చలన రహితంగా, తగిన రీతిలో జీవుడి యందు వీటన్నిటినీ చేర్చావు. ఇటువంటి శ్రేష్ఠమైన ధ్యానం ఎందుకు చేస్తున్నావు? సమస్తలోకాలలో ఎట్లాంటి వింత జరగకుండా ప్రశాంతతతో ఉన్నది కదా! అందుకే నా మనసు ఎంతో ఆశ్చర్యాన్ని పొందింది. రహస్యం కాకుంటే ఈ నీ ధ్యానస్థితికి కారణం నాకు తెలియ జేస్తావా? అని ధర్మరాజు అడిగాడు.

**విశేషం:** మూలంలో శ్రీకృష్ణుడి ధ్యానాన్ని వర్ణిస్తున్న సందర్భంలో వ్యాస భగవానుడు చెప్పిన 'స్థాణుకుడ్య శిలాభూతో నిరీహశ్చాసి' అనే పలుకులను సముచితం కాదని భావించి తిక్కన 'లోల రహితముల్ గాఁగ' అని మార్చాడు. ఇక్కడ స్థాణు, కుడ్య, శిలాభూతః అనటం నిశ్చైతన్య ద్యోతకమని భావించి 'లోల రహితముల్ గాఁగ' అంటే చైతన్యవంతుడైన ఆ మహనీయుడు సమస్తమూ స్తంభింపజేసి ధ్యాననిమగ్నుడైనట్లు వర్ణించటంలో తిక్కన ప్రతిభ గోచరిస్తున్నది.

ఆది శంకరాచార్య విరచితమైన నిర్వాణషట్క స్తోత్రంలోని

శ్లో: "మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం । న(శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణ నేత్రే
న చ వ్యోమ భూమి ర్న తేజో న వాయు । శ్చిదానంద రూప శ్శివోఽహం శివోఽహమ్"

అనే శ్లోకభావాన్ని తిక్కన ఈ పద్యంలో పొదిగాడా అని అనిపిస్తుంది. ధర్మరాజు శ్రీకృష్ణుడి ధ్యాననిష్ఠలోని విశేషాన్ని తెలిసికొనాలనే కుతూహలంతో 'వినఁగ నర్హమేని వినిపింపవే' అని అడగటంలో ఎంతో మర్యాద, మనస్సంస్కారమూ విదితమై, తిక్కన లోకజ్ఞతను ప్రకటిస్తున్నది.

**వ. అని యిట్లు ధర్మనందనుండు నివాతనిశ్చలదీప ప్రకారంబున నున్న యప్పరమపురుషుం బ్రార్థించి మఱియును. 9**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ఇట్లు= ఈ విధంగా; ధర్మనందనుండు= ధర్మరాజు; నివాత= గాలి లేకపోవటంవలన; నిశ్చల= కదలిక లేని; దీప ప్రకారంబునన్+ఉన్న= దీపంవలె ఉన్న; ఆ+పరమ పురుషున్= ఆ పురుషోత్తముడిని; ప్రార్థించి= ప్రార్థించి (వేడుకొని); మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** అని పలికి ఈ విధంగా ధర్మరాజు "గాలి లేనందువలన కదలకుండా ఉన్న దీపంవలె ప్రకాశిస్తున్న ఆ పురుషోత్తముడైన శ్రీకృష్ణుడిని ప్రార్థించి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'క్షరము నక్షరమును నీవ; కర్తయును వి । కర్తయును నీవ; యాద్యంత గతులు నీవ;
యొక్కఁడై వెలిఁగెడు పురుషోత్తమాభి । ధాన వాచ్య వినమ్ర వాత్సల్య కల్య! 10**

**ప్రతిపదార్థం:** నీవు+అ= నీవే (శ్రీకృష్ణుడవు); క్షరమున్= నశించెడి వాడవు; అక్షరమును= నాశరహితుడవు; నీవు+అ= నీవే; ఆది+అంతగతులు= మొదలు తుద అయిన వాడవు; వినమ్ర= వినయంతో కూడిన; వాత్సల్య= ప్రేమచేత; కల్య!= నేర్పరి అయిన వాడా!; (నీవు); ఒక్కఁడై= సమస్తమూ ఒక్కడివే ఐ; వెలిగెడు= ప్రకాశించే; పురుష+ఉత్తమ+అభిధాన వాచ్య!= పురుషోత్తముఁడనే పేరుతో పిలువబడుతున్నవాడా!

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! నశించేవాడవు, నాశరహితుడవు నీవే. ఈ సమస్తసృష్టికి కర్తవు నీవే. సర్వవినాశకారివి నీవే; ఈ సృష్టికి ఆది, అంతమూ నీవే. అంతకు మించి వాత్సల్యాన్ని వర్షిస్తూ పురుషోత్తముడని పిలువబడుతూ సమస్తంలో ఏకస్వరూపంతో వెలిగే మహనీయుడవు నీవే.

**విశేషం:** ఈ పద్యం వ్యాస భారతంలోని "త్వం హి కర్తా వికర్తా చ త్వం క్షరమ్ చాక్షరం చా హి" అనే శ్లోకానికి యథాతథానువాదం. అంతే కాకుండా భగవద్గీతలోని పదిహేనవ అధ్యాయంలో 16, 17, 18 శ్లోకాలలో వివరించిన క్షర, అక్షర, పురుషోత్తమ శబ్దాల విశిష్టతను ప్రతిబింబిస్తున్నది.

**వ. ప్రసన్నుండ వగుము; నా డెందంబు సందియంబు వాయం జేయవే!' యని విన్నవించినం బాంచజన్యధరుండు బుద్ధియు మనంబు నింద్రియంబులును గోచరత్వ సంప్రాప్తంబులు గావించి, కొంచెపు నగవున నెమ్మొగం బొప్ప నప్పుడమితేని నాలోకించి యిట్లనియె. 11**

**ప్రతిపదార్థం:** ప్రసన్నుండవు+అగుము= శాంత చిత్తుడవు కమ్ము; నా డెందంబు= నా హృదయంయొక్క; సందియంబు+ పాయన్+చేయవే!= అనుమానాన్ని తొలగించవా?; అని విన్నవించినన్= అని తెలుపగా; పాంచజన్యధరుండు= పాంచజన్య మనే శంఖాన్ని ధరించినవాడైన శ్రీకృష్ణుడు; బుద్ధియున్= బుద్ధిని; మనంబున్= మనసును; ఇంద్రియంబులును= ఇంద్రియాలను;

గోచరత్వ సంప్రాప్తంబులు+కావించి= కనిపించేటట్లు సహజస్థితికి తెచ్చి; కొంచెము+నగవునన్= చిరునవ్వుతో; నెఱ+మొగంబు+ఒప్పన్= అందమైన ముఖంతో అలరారుతూ; ఆ+పుడమి ఱేనిన్= ఆ ధర్మరాజును; ఆలోకించి= చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణుడితో 'నీవు శాంతచిత్తుడవై, నా హృదయంలోని అనుమానాన్ని తొలగించవా?' అని ప్రార్థించగా పాంచజన్యధరుడైన శ్రీకృష్ణుడు తన మనోబుద్ధీంద్రియాలను సహజస్థితికి తెచ్చి - అంటే ధ్యానాన్ని విరమించి - చిరునవ్వుతో, ప్రసన్నవదనంతో ఆ ధర్మరాజును చూచి ఇట్లా అన్నాడు.

**సీ.** **'గంగ యెవ్వనిఁ 'దన గర్భంబునం దతి । శ్లాఘా సమేతయై సంభరించె;**
**భార్గవుం డెవ్వనిఁ బరమశిష్యుఁడు గాఁగఁ । బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె;**
**నారాముఁ డెవ్వనితో రాసి యిరువది । మూఁడు దినములకు వాఁడి దఱిఁగెఁ;**
**గాశీశు కన్యలు గారణంబుగఁ బోరి । యెవ్వని కోడి రనేక నృపులు;**

**తే.** **వేదములు నాలుగును ధనుర్వేదమును మ । హాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె**
**నట్టి భీష్ముండు న న్నిప్పు డాత్మఁ దలఁచు । చునికిఁ దద్గతమయ్యె నా మనము నధిప! 12**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; ఎవ్వనిన్= ఎవడిని; తన గర్భంబునందున్= తన గర్భంలో; అతి= మిక్కిలి; శ్లాఘాసమేతము+ఐ= ప్రశంసతో కూడినదై; గంగ= గంగాదేవి; సంభరించెన్= చక్కగా భరించిందో; ఎవ్వనిన్= ఎవడినైతే= పరమశిష్యుఁడు+కాఁగన్= ఉత్తమ శిష్యుడిగా; పడసి= పొంది; భార్గవుండు= భృగువంశజుడైన పరశురాముడు; గురుత్వము= గురుస్థానం; ఎక్కుడుగన్=ఎక్కువగా; నెగడెన్= ప్రసిద్ధి పొందాడో; ఎవ్వనితోన్= ఎవడితో; రాసి= ఎదుర్కొని; ఇరువది మూఁడు దినములకున్= ఇరవై మూడు రోజులకు; ఆ రాముఁడు= ఆ పరశురాముడు; వాఁడి+తఱిఁగెన్= పరాక్రమాన్ని కోల్పోయాడో; అనేక నృపులు= రాజులు పెక్కుమంది; కాశీ+ఈశు కన్యలు= కాశీరాజు పుత్రికల; కారణంబుగన్= నిమిత్తంగా; పోరి= యుద్ధంచేసి; ఎవ్వనికిన్+ఓడిరి= ఎవడితో ఓడిపోయారో; వేదములు నాలుగును= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణం అనే వేదాలు నాలిగింటిని; ధనుః+వేదమును= ధనుర్వేదాన్ని (విలువిద్యను); మహా+అస్త్రములున్= గొప్పవైన బాణాలను (మంత్ర పూర్వకంగా ప్రయోగించేవి); చెంది= పొంది; ఎవ్వని+అందున్= ఎవనియందు; వెలిఁగెన్= ప్రకాశించెనో; అట్టి= అటువంటి; భీష్ముండు= భీష్ముడు; నన్నున్+ఇప్పుడు+ఆత్మన్+తలఁచుచున్+ఉనికిన్= ఆత్మలో న న్నిప్పుడు స్మరిస్తూ ఉండటంవలన; నా మనమున్= నా మనస్సు కూడా; తద్+గతము+అయ్యెన్= అతడియందు లీనమైనది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ప్రశంసనీయమైన గంగాదేవి ఎవడిని గర్భాన భరించిందో, ఎవడు తనకు శిష్యుడు కావటంవలన పరశురాముడు గురుశ్రేష్ఠుడయ్యాడో, ఆ పరశురాముడే ఎవడితో ఇరవై మూడు రోజులు యుద్ధంచేసి పరాక్రమాన్ని కోల్పోయాడో, కాశీరాజపుత్రికల కారణంగా పెక్కుమంది రాజులు ఎవడితో పోరాడి ఓడిపోయారో, చతుర్వేదాలు, ధనుర్వేదం, మహాస్త్రాలు పొంది ఎవడియందు అవి ప్రకాశించాయో అట్లాంటి భీష్ముడు ఈ సమయంలో నన్ను మదిలో స్మరించటంవలన నా మనస్సు అతడియందు లీనమైనది.

**విశేషం:** శంతనుడివలన గంగాదేవి భీష్ముడిని పుత్రునిగా పొందింది. లోకంలో గురువులకు ఎంతో మంది శిష్యులుంటారు. కాని, భీష్ముడు పరశురాముడికి శిష్యశ్రేష్ఠుడు కావటం వలన పరశురాముడి గురుత్వం లోక ప్రసిద్ధంగా వెలిగింది. అంటే గురువు వలన శిష్యుడికి ప్రఖ్యాతి రావటం లోక సహజం. కాని, ఇక్కడ భీష్ముడి వలన గురువైన పరశురామునికి కీర్తి సిద్ధించటం విశేషం. గురువైన పరశురాముడు అంబకు అభయ మిచ్చి శిష్యుడైన భీష్ముడితో ఇరవైమూడు రోజులు పోరాడి పరాక్రమహీను డయ్యాడు. ఇక్కడ

భీష్ముడు గురువును మించిన శిష్యుడయ్యాడు. అయినా 'శిష్యా దిచ్ఛేత్ పరాజయమ్' అన్న న్యాయాన్ని అనుసరించి పరశురాముడు గురుశ్రేష్ఠు డయ్యాడు. బహుశః ఏ గురువుకు ఇట్లాంటి గౌరవం దక్కలేదేమో! కాశీరాజు తన పుత్రికలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరాన్ని ప్రకటించగా భీష్ముడు తన సోదరులైన చిత్రాంగద, విచిత్రవీర్యులకు వివాహం గావించటానికి సమస్త రాజులను తా నొక్కడే జయించి కాశీరాజు పుత్రికలను తెచ్చిన పరాక్రమ సంపన్నుడు భీష్ముడు. చతుర్వేదాలను, ధనుర్వేదాన్ని, మహాస్త్రాలను పొందటం వలన ఒక వ్యక్తి ప్రకాశిస్తాడు. కాని, ఇవన్నీ భీష్ముడి వశం కావటం వలన అవే ప్రశస్తంగా వెలుగొందాయి - అని తిక్కన చెప్పటంలో భీష్ముని పరాక్రమవైశిష్ట్యం వ్యక్తమవుతున్నది. ఇక్కడ భక్తితత్త్వం భీష్ముడిలో, భక్తపరాధీనత శ్రీకృష్ణుడిలో స్పష్టమవుతున్నాయి.

**క. అనలము శమించు చాడ్పున । ననఘ! యతండు పరమోన్ముఖాత్ముండై తా**
**ననుఁ దలఁచె నింద్రియంబులు । మనమునఁ దగ నిగ్రహించి మహిత సమాధిన్. 13**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడైన ఓ ధర్మరాజా!; అతండు= ఆ భీష్ముడు; పరమ+ఉత్+ముఖ+ఆత్ముండు+ఐ= నాకు మిక్కిలి అభిముఖమైన ఆత్మ కలిగినవాడై; అనలము= అగ్ని; శమించు చాడ్పునన్= అణగినట్లు; తాన్= ఆ భీష్ముడు; ఇంద్రియంబులు= కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలను; మనమునన్= మనస్సునందు; తగన్= ఉచిత రీతిని; నిగ్రహించి= అణచిపెట్టి; మహిత= శ్రేష్ఠమైన; సమాధిన్= మనోలయస్థితిలో; ననున్+తలఁచెన్= నన్ను స్మరించాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ భీష్ముడు సమాధినిష్ఠలోని ఆసక్తిచేత, నిప్పు అణగిపోయినట్లు, జ్ఞాన, కర్మేంద్రియాలను మనస్సు నందు నిగ్రహించి, అత్యంత సమాధినిష్ఠలో ఉంటూ నన్ను స్మరించాడు.

**విశేషం:** సమాధి అష్టాంగాలలో ఒకటి. అష్టాంగాలు: యమం, నియమం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం, ధారణ, మననం, సమాధి.

ధర్మరాజు శ్రీకృష్ణుడిని దర్శించి సంభాషించినప్పుడు సమాధినిమగ్నుడనై ఉన్నా నని, దీనికి కారణం పరమ కృష్ణభక్తుడైన భీష్ముడు తనను స్మరించటం వలననే తాను సమాధిగతుడనయ్యానని కృష్ణుడు బదులు చెప్పాడు. అంతేకాక భీష్ముడు యుద్ధరంగంలో అగ్నివలె జాజ్వల్యమానంగా ప్రకాశించి ఇప్పుడు శరతల్పగతుడై అగ్ని అణగినట్లు సమాధిగతుడై తనను ధ్యానించాడని ధర్మరాజుకు తెలిపి భీష్ముడి భక్తితత్త్వాన్ని వివరించాడు.

**క. శరతల్పగతుం డతఁడే । శరణంబుగ నాశ్రయించి సద్భావ వ్యా**
**ప్తిరతుం డగుటను విను త । త్పరత నతనియందు నాదు భావం బెలసెన్. 14**

**ప్రతిపదార్థం:** విను= (ఓ ధర్మరాజా!) వినుము; శరతల్పగతుండు= బాణాలతో చేయబడిన పాన్పునందు పరుండిన; అతఁడు= ఆ భీష్ముడు; ఏన్= నేను; శరణంబుగన్+ఆశ్రయించి= రక్షకుడని ఆశ్రయించి; సత్+భావ= శ్రేష్ఠమైన మనస్సు నందు; వ్యాప్తి రతుండు+అగుటను= అంతట వ్యాప్తిచేత! ఆసక్తు డగుట వలన; అతని+అందున్= ఆ భీష్ముడి అందు; నాదు భావంబు= నా మనస్సు; తత్పరతన్= పారవశ్యంతో; ఎలసెన్= చేరి ఉన్నది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వినుము. శరతల్పగతుడై ఆ భీష్ముడు నన్నే శరణుగా భావించి నన్ను సమాధి నిష్ఠతో ధ్యానించటం వలన భక్త పరాధీనుడ నైన నేను ఆ భీష్ముడి మనస్సునందు సంలీనుడినై ఉన్నాను.

**వ. ఇది మదీయ ధ్యానంబు తెఱం; గమ్మహాత్ముండు వసిష్ఠ శిష్యుండు, భూత భవిష్య ద్వర్తమానవేది, సర్వ విద్యా ధార భూతుం డాతం డస్తమించిన ధాత్రి యస్తమిత సుధాగభస్తి యగు రాత్రియుంబోలె నగు; సకలజ్ఞానంబులు ననాశ్రయంబులై పొనుంగు పడుం; గావున నీ వతని పాలికిం బోయి నీ యడుగం దలంచిన యఖిల ధర్మంబులు**

**నడిగి చెప్పించుకొని నిశ్శేష నిరస్త సంశయుండవు గావలయు'నని యానతిచ్చిన నమ్మానవపతి గద్గద కంఠుం డగుచు నా వైకుంఠున కి ట్లనియె. 15**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ పైని చెప్పబడినది; మదీయ= నా యొక్క; ధ్యానంబు= ధ్యానం యొక్క; తెఱంగు= విధం; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడైన భీష్ముడు; వసిష్ఠ శిష్యుండు= వసిష్ఠుడి శిష్యుడు; భూత= గతకాలం; భవిష్యత్= రాబోయే కాలం; వర్తమాన= నడుస్తున్న కాలం; వేది= తెలిసినవాడు (అంటే త్రికాల వేది); సర్వ విద్యా+ఆధారభూతుండు= సమస్త విద్యలకు ఆధారమైన వాడు; ఆతండు+అస్తమించినన్= ఆ భీష్ముడు కన్ను మూస్తే; ధాత్రి= భూమి; అస్తమిత= అడగిపోయిన లేదా అంతరించిన; సుధా= చల్లనైన; గభస్తి+అగు= కిరణాలు కలిగిన చంద్రుడు గల; రాత్రియున్+పోలెన్+అగున్= రాత్రివలె ఔతుంది; సకల జ్ఞానంబులు= సమస్త జ్ఞానాలు (మోక్షేధీర్జ్ఞానమ్ - జ్ఞాయతే అనే నేతి జ్ఞానం జ్ఞా అవబోధనే. దీనిచేత నెరుగబడును. మోక్షసాధనమైన బుద్ధి పేరు, ధీః ధ్యాయం త్యనయేతి ధీః ధ్యై చింతాయాం. దీని చేత ధ్యానము చేయుదురు. గురుబాల ప్రబోధిక పుటలు 111, 114, అంటే ధ్యానం ద్వారా మోక్షసాధనమైనదే జ్ఞానం. ఇంతేకాక శ్రీసూర్య రాయాంధ్ర నిఘంటువులో 1. (వేదాంత) పదార్థములను గ్రహించెడు మానసిక వృత్తి, బోధము, ఎఱుక; 2. పరమాత్మ విషయమైన వివేచనము; 3. తత్త్వ జ్ఞానము; 4. పరమాత్మ జ్ఞాన సాధనమైన శాస్త్రాదుల వలన కలిగిన ఆత్మసాక్షాత్కారము; 5. వేద వేదాంగార్థ విషయమైన యెరుక; 6.ఆత్మ స్వరూప ప్రకాశనము; 7. మోక్ష ఫలకమైన బుద్ధి - అని అనేక రీతుల జ్ఞాన శబ్దార్థాలున్నాయి. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' త్తై. ఉప. 2-1) (బ్రహ్మము సత్యము జ్ఞానము అనంతమును) అనంతమైన బ్రహ్మము సత్యజ్ఞానమని అంటే (బ్రహ్మజ్ఞానమే జ్ఞానం) ఇన్ని జ్ఞానాలు; న+ఆశ్రయంబులై= అనాశ్రయంబులై= ఆశ్రమ రహితాలై; పొనుంగుపడున్+కావున(న్)= నిస్తేజమవుతాయి, శూన్యమవుతాయి, లేదా నశిస్తాయి కనుక; నీవు+అతని పాలికిన్+పోయి= నీవు ఆ భీష్ముడివద్దకు వెళ్ళి; నీ+అడుగన్+తలంచిన= నీవు అతడిని అడుగదలచిన; అఖిలధర్మంబులన్+అడిగి= అన్ని ధర్మాలను అడిగి; చెప్పించుకొని; నిశ్శేష= శేషరహితంగా అంటే ఏమీ మిగలకుండా; నిరస్త= పోయినటువంటి; సంశయుండవు= సందేహం కలవాడవు, సందేహ రహితుడవు కావలసి ఉన్నది; అని+ఆనతిచ్చినన్= అని ఆజ్ఞాపించగా; ఆ+మానవపతి= ఆ ధర్మరాజు; గద్గద కంఠుండు+అగుచున్= డగ్గుత్తిక కలవాడై; ఆ వైకుంఠునకున్+ఇట్లు+అనియెన్= ఆ వైకుంఠుడైన శ్రీకృష్ణుడితో ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** పై పద్యాల్లో చెప్పిన రీతిగా అది శ్రీకృష్ణుడి ధ్యాన పద్ధతి అని ధర్మరాజునకు తెలియజెప్పాడు. వసిష్ఠ శిష్యుడు, త్రికాలవేది, సమస్త విద్యలకు నిలయుడు అయిన భీష్ముడు స్వర్గతుడైతే ఈ భూమి చంద్రరహితమైన రాత్రివలె అవుతుంది. సర్వజ్ఞానాలు - అంటే వేద వేదాంతాలు తత్త్వ జ్ఞానాదులన్నీ ఆశ్రయరహితాలై అదృశ్యమై పోతాయి. అందువలన భీష్ముడివద్దకు వెళ్ళి నీవు అడుగదలచిన సమస్త ధర్మాలను అడిగి తెలిసికొని సందేహ నివృత్తిని పొందవలసిం'దని శ్రీకృష్ణుడు ఆనతివ్వగా, ఆ ధర్మరాజు డగ్గుత్తికతో శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీష్ముడు వసిష్ఠుడివలన సకలవేదాలను, శాస్త్రాలను చదివాడు. పరశురాముడివద్ద అస్త్రవిద్యాపారీణు డయ్యాడు. ఆత్మవిజ్ఞానంలో సనత్కుమారునంతటివాడు. సర్వశాస్త్ర విద్యా నైపుణ్యంలో బృహస్పతిని పోలినవాడు. ఈ విషయాలను తిక్కన సూచించాడు.

**ఉ.** **'శంతనుసూనుగౌరవము సర్వము మున్నును వింటి విప్రు ల**
**త్యంతము వేడ్కఁ జెప్ప నతఁ డట్టిఁడ; యాతని నీవు మున్నుగా**
**నెంతయు భక్తిఁ గాంచుటకు నే మదిఁ గోరెద నమ్మహాత్ముఁడున్**
**సంతసమందు నీదయిన సన్నిధిఁ గాంచిన భక్తవత్సలా! 16**

**ప్రతిపదార్థం:** భక్తవత్సలా!= భక్తులయందు వాత్సల్యం కలవాడా!; విప్రులు+అత్యంతము= బ్రాహ్మణులు మిక్కిలి; వేడ్కన్+చెప్పన్= సంతోషంతో చెప్పగా; శంతనుసూను= శంతను మహారాజు పుత్రుడైన భీష్ముడి యొక్క; గౌరవమున్= గొప్పతనాన్ని; సర్వమున్= సమస్తమూ; మున్నును= ముందే; వింటిన్= విన్నాను; అతఁడు+అట్టి+వాఁడు+అ= ఆ భీష్ముడు అంత గొప్పవాడే; నీవు మున్నుగాన్= నీవు ముందుండగా అంటే నీతోపాటు; ఎంతయున్ భక్తిన్= ఎంతో భక్తితో; ఆతనిన్= ఆ మహనీయుని; కాంచుటకున్+ఏన్+మదిన్+కోరెదన్= దర్శించటానికి నేను నా మనస్సులో కోరుకొంటున్నాను; నీదు+అయిన= నీ యొక్క; సన్నిధిన్+కాంచినన్= చేరువను అంటే సామీప్యాన్ని చూస్తే; ఆ+మహా+ఆత్ముఁడున్= ఆ మహనీయుడు కూడా; సంతసము+అందున్= సంతోషిస్తాడు.

**తాత్పర్యం:** భక్తవత్సలుడ వైన ఓ శ్రీకృష్ణా! ఇంతకు ముందే బ్రాహ్మణోత్తములు వివరించగా శంతను మహారాజు పుత్రుడైన ఆ భీష్ముడి గౌరవ మెంతటిదో నేను గుర్తించాను. నీవు చెప్పినట్లు భీష్మ డంతటి మహనీయుడే. సందేహం లేదు. నీవు ముందుండగా ఆ మహాత్ముడిని దర్శించటానికి కుతూహల చిత్తుడనయి ఉన్నాను. నీ సన్నిధిని కాంచిన భీష్ముడు కూడా ఆనందిస్తాడు.' అని ధర్మరాజు శ్రీకృష్ణుడితో చెప్పాడు.

**వ. ఉత్తరాయణంబు వేచికొని యున్న యన్నరోత్తముండు బ్రహ్మమయనిధి యయిన నీ సందర్శనంబు గోరు; నా మీఁది యనుగ్రహంబునను నతని యెడం గలుగు పరిగ్రహంబునను దేవా! నీ విట్లు సేయవలయు' ననుటయు, నద్దేవకీ నందనుండు సమీప గతుం డగు సాత్యకిం గనుంగొని 'రథంబు సమకట్టుమని దారుకునకుం జెప్పుము; భీమార్జున నకుల సహదేవులను గృప యుయుత్సు సంజయులను రావింపు' మనిన నతం డట్ల చేసె దారుకుండునుం దే రాయితంబు గావించె. 17**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ శ్రీకృష్ణా!; ఉత్తర+అయనంబు= ఉత్తరాయణం అంటే ఉత్తర దిక్కులోని సూర్యగమనం (సంవత్సరంలో ఆరు నెలలపాటు సూర్యుడు ఉత్తర, దక్షిణ దిక్కులలో ఉంటాడు); వేచికొనిఉన్న= ప్రతీక్షిస్తున్న; ఆ నర+ఉత్తముండు= ఆ మానవ శ్రేష్ఠుడు అయిన భీష్ముడు; బ్రహ్మ+మయ నిధి+అయిన= బ్రహ్మమయమైన నిధి; నీ సందర్శనంబున్= నిన్ను చూడటాన్ని; కోరున్= కోరుకొంటున్నాడు; నా మీఁది+అనుగ్రహంబుననున్= నాపైని దయవలననూ; అతని యెడన్+కలుగు= ఆ భీష్మునిపై కలిగే; పరిగ్రహంబుననున్= ప్రీతితో స్వీకరించటంతోనూ; నీవు+ఇట్లు+చేయవలయున్+అనుటయున్= నీవీ విధంగా చేయాలని ధర్మరాజు చెప్పగా; ఆ+దేవకీ నందనుండు= ఆ దేవకీదేవి పుత్రుడు శ్రీకృష్ణుడు; సమీప గతుండు+అగు= దగ్గరలోనే ఉన్నటువంటి; సాత్యకిన్+కనుంగొని= తమ్ముడైన సాత్యకిని చూచి; రథంబు= రథాన్ని; సమకట్టుము+అని= సిద్ధం చేయుమని; దారుకునకున్+చెప్పుము= సారథియైన దారుకునకు చెప్పు; భీమ+అర్జున నకుల సహదేవులను+కృప యుయుత్సు సంజయులను= భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు, కృపుడు, యుయుత్సుడు, సంజయుడు అనేవారిని; రావింపుము+అనినన్= పిలిపించుమని చెప్పగా; అతండు+అట్లు చేసెన్= ఆ సాత్యకి అట్లా చేశాడు; దారుకుండునున్+తేరు+ఆయితంబు+కావించె(న్)= సారథి అయిన దారుకుడు రథం సిద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! తనువు చాలించాలని ఉత్తరాయణం కొరకు ఎదురుచూస్తున్న ఆ మహనీయుడైన భీష్ముడు పరబ్రహ్మ స్వరూపుడవు, అన్నిటికీ నిధివైన నీ సాన్నిధ్యాన్ని అభిలషిస్తూ ఉంటాడు. అతడిపై గల దయతోను, నా మీది ఆదరంతోను నీ వా మహాత్ముడి వద్దకు వెళ్ళవలసిం' దని కోరుతున్నానని ధర్మరాజు వేడుకొన్నాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు అభ్యర్థనను గుర్తించి, తన సమీపంలోనే ఉన్న తమ్ముడైన సాత్యకిని పిలిచి 'వెంటనే రథం సిద్ధం చేయవలసిం దని సారథి అయిన దారుకుడితో చెప్పుము. భీమార్జున నకుల సహదేవులను, కృపాచార్య,

యుయుత్సు, సంజయులను వెనువెంటనే రప్పించుము' అని సెలవిచ్చాడు. వెంటనే సాత్యకి అన్న మాటలను పాటించాడు. దారుకుడు రథం ఆయత్తం చేశాడు.

**విశేషం:** సంవత్సరంలో ఆరేసి నెలలపాటు సూర్యుడు ఉత్తర దక్షిణ దిక్కులలో పయనిస్తూ ఉంటాడు.

ఉత్తరాయణం: మకర సంక్రాంతి మొదలుకొని కర్కాటక సంక్రాంతి వరకు గల కాలాన్ని ఉత్తరాయణ మంటారు. ఉత్తరాయణ పుణ్యాకాలంలో పరమపదిస్తే ఉత్తమ గతులు కలుగుతాయని విశ్వాసం. అందుకే భీష్ముడు ఉత్తరాయణం కోసం వేచి ఉన్నాడు.

బ్రహ్మలవికారం: బ్రహ్మ నవబ్రహ్మలని ప్రతీతి. భృగువు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అంగిరసుడు, దక్షుడు, అత్రి, మరీచి, వసిష్ఠుడు - అనీ వీరే కాక బాల, కుమార, అర్క, వీర, విశ్వ, తారక, గరుడ, స్వర్గ, పద్మ బ్రహ్మలనీ నవబ్రహ్మలు.

బ్రహ్మమయోనిధిః అనే మూల ప్రయోగాన్ని తిక్కన 'బ్రహ్మమయనిధి' అని యథాతథంగా వాడుకొన్నాడు. పరబ్రహ్మ స్వరూపుడు, సమస్తనిధి అయిన శ్రీకృష్ణుడు అని అర్థం.

**క. అది రత్నరుచుల పెల్లున । నుదితార్కునిఁ బోలి వెలుఁగుచుండెను జవసం**
**పదుదీర్ణ సత్త్వ సారా । స్పద సుగ్రీవాదిరథ్య సంశోభిత మై. 18**

**ప్రతిపదార్థం:** అది= ఆ రథం (దారుకుడు ఆయత్తం చేసి తెచ్చిన శ్రీకృష్ణుడి రథం); జవ= వేగంయొక్క; సంపద్= సంపద అంటే ఆధిక్యం చేత; ఉదీర్ణ= గొప్పదయినట్టి; సత్త్వ= బలం యొక్క; సార= సారానికి (చేవకు); ఆస్పద= ఆటపట్టయిన; సుగ్రీవ+ఆది= శ్రీకృష్ణుడి రథానికి పూన్చిన గుర్రాలలో (సుగ్రీవం, శైబ్యం, మేఘ పుష్పం, వలాహకం అనే నాలుగింటిలో) ఒకటైన సుగ్రీవమనే గుర్రం మొదలుకొని; రథ్య= గుర్రాలచేత; సంశోభితము+ఐ= మిక్కిలి అందమైనదై; రత్న= మణుల యొక్క (నవరత్నాలు: మౌక్తికం, పద్మరాగం, వజ్రం, వైడూర్యం, ప్రవాళం, మరకతం, నీలం, గోమేధికం, పుష్యరాగం); రుచుల= కాంతుల యొక్క; పెల్లునన్= ఆధిక్యంచేత; ఉదిత= అప్పుడే ఉదయించిన; అర్కునిన్+పోలి= సూర్యుడివలె; వెలుఁగుచుండెను= ప్రకాశిస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** ఆ విధంగా దారుకుడు ఆయత్తంచేసి తెచ్చిన శ్రీకృష్ణుడి రథం అత్యంత వేగవంతమూ, దేహదార్ఢ్యమూ కలిగిన సుగ్రీవం మొదలైన శ్రీకృష్ణ రథాశ్వాలతో శోభావహమై, నవరత్న శోభితమై ఉండటంచేత, అప్పుడే ఉదయించిన సూర్యుడివలె ప్రకాశిస్తూ మనోహరమై ఒప్పుతూ ఉండింది.

**వ. ఆ సమయంబున నక్కడం బారాశర్య నారద దేవల దేవస్థాను వాత్స్య దేవరాత ప్రభృతి పరమ మునీంద్ర పరివేష్టనంబు గలిగి గాంగేయుండు గ్రహగణ పరివృతుండైన చంద్రుండునుంబోలెఁ దల్పీభూత శాతశరశతంబుల చేత శోభిల్లి సందర్శనీయగభస్తి వితానుండగు నస్తమయ సమయ భానుం గ్రేణిసేయుచుఁ గృష్ణుం జిత్తంబున నిరతిశయ నిష్ఠ నిలిపికొనియుండి చేతులు మొగిడ్చి సుపుష్టస్వరంబున నిట్లని స్తుతియించె. 19**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ దారుకుడు శ్రీకృష్ణుడి రథం సిద్ధంచేసి తెచ్చినప్పుడు; అక్కడన్= శరతల్పగతుడై భీష్ముడున్న ప్రదేశంలో; పారాశర్య నారద దేవల దేవస్థానువాత్స్య దేవరాత= పరాశరుని పుత్రుడైన వ్యాసుడు, నారదుడు, దేవలుడు, దేవస్థానుడు, వాత్స్యుడు, దేవరాతుడు; ప్రభృతి= మొదలైన; పరమ ముని+ఇంద్ర= శ్రేష్ఠులైన ముని నాథులచేత; పరివేష్టనంబు+కలిగి= చుట్టు ఉన్నటువంటి వారిని కలిగి ఉన్న; గాంగేయుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; గ్రహగణ= నవగ్రహాల సమూహంచేత; పరివృతుండు+ఐన= చుట్టబడిన వాడైన; చంద్రుండునున్+పోలెన్= చంద్రుడివలె; తల్పీభూత= పాన్పుగా చేయబడిన; శాత= వాడి అయిన; శరశతంబుచేతన్= నూరు బాణాలచేత; శోభిల్లి= ప్రకాశించినవాడై; సందర్శనీయ= చూడటానికి వీలయిన; గభస్తి=

సూర్య కిరణములయొక్క; వితానుండగు= సమూహమును కలిగినవాడయి; అస్తమయ= అస్తమించే; సమయ= కాలమందలి భానున్= సూర్యుని; శ్రేణి+చేయుచున్= పరిహసిస్తూ; కృష్ణున్= కృష్ణుడి; చిత్తంబునన్= మనస్సునందు; నిరతిశయ నిష్ఠన్= మిక్కిలి నిష్ఠతో; నిలిపికొనిఉండి= ఉంచుకొని; చేతులు మొగిడిచి= (నమస్కార పూర్వకంగా) చేతులు జోడించి; సుపుష్ట స్వరంబునన్= ఉచ్చైస్స్వరంతో; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతించెన్= స్తోత్రం చేశాడు.

**తాత్పర్యం:** దారుకుడు సిద్ధంచేసి రథం తెచ్చిన సమయంలో భీష్ముడు శరతల్పగతుడై ఉన్న ప్రదేశంలో వ్యాసుడు, నారదుడు, దేవలుడు, దేవస్థాణుడు, వాత్స్యుడు, దేవరాతుడు ప్రభృతులయిన మహాముని శ్రేష్ఠులచేత చుట్టబడిన భీష్ముడు నవగ్రహాల సమూహంచేత చుట్టబడిన చంద్రుడివలె వాడి అయిన అనేక బాణాలచేత చేయబడిన పాన్పుమీద ప్రకాశిస్తూ చూడటానికి వీలయిన అస్తమయసూర్యుడిని పరిహసిస్తూ శ్రీకృష్ణుడిని నిరతిశయమైన నిష్ఠతో తన మనస్సునం దుంచుకొని ఉండి, చేతులు జోడించి ఉచ్చైస్స్వరంతో ఈ విధంగా స్తుతించాడు.

**విశేషం:** అలం: ఉపమ. మహర్షుల జాబితా మూలంలో ఎక్కువగా ఉండగా తిక్కన దాన్ని సంక్షిప్తంచేసి వ్యాస, నారద, దేవల, దేవస్థాణు, వాత్స్య, దేవరాత ప్రభృతి మహామునిశ్రేష్ఠులు అని మాత్రం పేర్కొన్నాడు. మునులచేత చుట్టబడిన భీష్ముడు గ్రహగణాలతో చుట్టబడిన చంద్రుడివలె ఉన్నాడని చెప్పటంలో భీష్ముడు పండిపోయిన రీతి స్పష్టమవుతుంది. ఇంకా స్వర్గతుడు కావటానికి సిద్ధంగా ఉండి ఉత్తరాయణం కొరకు ఎదురు చూస్తున్న భీష్ముడి "సందర్శనీయ గభస్తి వితానుండగు నస్తమయ సమయ భానుంగ్రేణి సేయుచు" - అని సముచితంగా వర్ణించాడు తిక్కన.

### భీష్ముఁడు శ్రీకృష్ణుని భక్తియుక్తుండై స్తుతించుట (సం. 12-47-7)

**సీ.** **'శుచియును హంసుండు శుచిషత్తుఁ బరముండుఁ। బరమేష్ఠియును నగు భవ్యుఁ గొలుతు;**
**మునులును సురలు నెవ్వనియున్నరూపెఱుం। గరు సర్వవిదుని నప్పురుషుఁ గొలుతు;**
**శ్రుతులు సెప్పఁగ మహామతులు దుఃఖౌషధం। బుగ నెఱింగెడు పుణ్యమూర్తిఁ గొలుతు;**
**లోకంబు లెల్లఁ గల్గుట నిల్చు టొదుఁగుట। తనయంద యగు మహోత్తరునిఁ గొలుతు;**

**తే.** **బక్షి రత్నచయంబు బుష్ప వ్రజంబుఁ। బంజరము త్రాడు నార యుపాశ్రయముగ**
**నుండు చాడ్పున విశ్వంబు నుండుటకు సు। ఖాస్పదం బగు పుండరీకాక్షుఁ గొలుతు.** **20**

**ప్రతిపదార్థం:** శుచియును= శుచి అయిన అగ్ని; హంసుండున్= సూర్యుడు; శుచిషత్తున్= శుచి అయిన ప్రదేశాలలో నివసించే వాడైన బ్రహ్మ; పరముండున్= పరమాత్ముడూ; పరమేష్ఠియున్= పరబ్రహ్మ; అగు= అయినట్టి; భవ్యున్= శ్రేష్ఠుడయిన శ్రీకృష్ణుడిని; కొలుతున్= పూజిస్తాను; మునులును= మహర్షులూ; సురలున్= దేవతలూ; ఎవ్వని= ఎవడియొక్క; ఉన్నరూపు= నిజమైన స్వరూపాన్ని; ఎఱుంగరు= తెలియరో అట్టి; సర్వవిదునిన్= సమస్తం తెలిసిన; ఆ+పురుషున్= ఆ పరమ పురుషుడైన శ్రీకృష్ణుడిని; కొలుతున్= అర్చిస్తాను; శ్రుతులు= వేదాలు; చెప్పఁగన్= (ఎవరిని గురించి) చెప్తున్నాయో; మహామతులు= జ్ఞాన సంపన్నులు (బుద్ధిమంతులు); దుఃఖ= దుఃఖమనే రోగానికి; ఔషధంబుగన్= మందువలె; ఎఱింగెడు= తెలిసికొనేటటువంటి; పుణ్యమూర్తిన్= పుణ్య పురుషుడైన శ్రీకృష్ణుడిని; కొలుతున్= ప్రార్థిస్తాను; లోకంబులు+ఎల్లన్= జగత్తులన్నీ; కల్గుట= సృజించబడటం; నిల్చుట= నిలబడటం (స్థితి); ఒదుఁగుట= నాశనం కావటం (లయం); తనయందు+అ+అగు= తనలోనే ఉన్న; మహా+ఉత్తరున్= మహాశ్రేష్ఠుడైన ఆ శ్రీకృష్ణుడిని; కొలుతున్= కొలుస్తాను; పక్షి= పిట్ట; రత్నచయంబున్= మణుల యొక్క సమూహమూ; పుష్ప వ్రజంబున్= పువ్వుల సమూహమూ; పంజరమున్= పంజరం వలననూ; త్రాడున్= దారం వలననూ; నారయున్= నార వలననూ;

ఉప+ఆశ్రయముగన్= ప్రాపుగా; ఉండు చాడ్పునన్= ఉన్నట్లుగా; విశ్వంబు= ఈ ప్రపంచమంతా; ఉండుటకున్= (సువ్యవస్థితమై) నిలవటానికి; సుఖ+ఆస్పదంబు+అగు= సుఖమయం - ఏ విధమైన ఇబ్బంది లేకుండా ఉండే ఆశ్రయమైన; పుండరీక+అక్షున్= తెల్ల తామరల వంటి కన్నులు కలిగిన శ్రీకృష్ణుడిని; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** శుచి, హంసుడు, శుచిషత్తు, పరమాత్ముడు, పరబ్రహ్మ అయిన శ్రీకృష్ణుడిని పూజిస్తాను, మహర్షులు దేవతలు కూడా ఎవడి కలరూపు తెలిసికొనలేకపోయారో అట్లాంటి పరమ పురుషుడైన శ్రీకృష్ణుడిని అర్చిస్తాను. ప్రాజ్ఞులు దుఃఖరోగానికి ఎవరినయితే ఔషధంగా భావించారో ఆ పుణ్యపురుషుడైన శ్రీకృష్ణుడిని ప్రార్థిస్తాను. ఈ జగత్తులన్నింటి సృష్టి స్థితి లయములకు కారణ మెవ్వడో ఆ మహాశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడిని కొలుస్తాను. పక్షి పంజరాన్ని, రత్నసమూహం దారమునూ, పూలు నారనూ ప్రాపుగా గొని ఉన్నట్లుగానే ఈ ప్రపంచం సువ్యవస్థితమై నిలవటానికి ఉత్తమాశ్రయమైన పుండరీకాక్షు డైన శ్రీకృష్ణుడిని స్మరిస్తాను.

**విశేషం:** అలం: యథాసంఖ్యం. పరబ్రహ్మ వరకు సమస్త దేవతామయుడై సర్వజగత్తుల సృష్టి స్థితి లయ కారణ భూతుడయి సమస్తమూ తానే అయిన శ్రీకృష్ణుడిని భీష్ముడు స్తుతించాడు. సమస్తకారణభూతుడు కృష్ణుడు అనటానికి ఈ పద్యంలోని ప్రతి పదమూ ఉపకరిస్తుంది.

**ఆ. హరి సహస్ర శీర్షుఁ బరము సహస్రాక్షు । వేదమయు సహస్రపాదు నలఁతు**
**లైన వారి కంటె నలఁతి పెద్దలకును । జాలఁబెద్ద యగు దయాళుఁ గొలుతు. 21**

**ప్రతిపదార్థం:** హరిన్= శ్రీకృష్ణుడిని; సహస్ర శీర్షున్= వేయి తలలు కలవాడిని; పరమున్= శ్రీకృష్ణుడిని; సహస్ర+అక్షున్= వేయి కన్నులు కలవాడిని; వేదమయున్= సమస్త వేదములూ తానే అయినవాడిని; సహస్రపాదున్= వేయి పాదాలు కలవాడిని; అలఁతులైన వారి కంటెన్= మిక్కిలి చిన్నవారికంటె; అలఁతిన్= చిన్న వానిని; పెద్దలకున్+చాలఁక+పెద్ద అగు= మిక్కిలి పెద్దలైన వారికంటె మిక్కిలి పెద్దవాడైన; దయాళున్= దయామయుడైన శ్రీకృష్ణుడిని; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** వేయి తలలతో, వేయి కన్నులతో, వేయి పాదాలతో, వేదమయుడై పరమశ్రేష్ఠుడైన హరిని, చిన్నవారికంటె మిక్కిలి చిన్నవాడైన వాడిని, పెద్దలకంటె మిక్కిలి పెద్దవాడయిన వాడిని దయామయుడైన శ్రీకృష్ణుడిని స్మరిస్తాను.

**విశేషం:** సహస్ర శీర్షాదిగా పురుష సూక్తంలోను విష్ణు సహస్రనామ స్తోత్రంలోనూ, విష్ణువును గూర్చి చెప్పబడిన అంశాలను, "అణోరణీయాన్ మహతో మహీయాన్" అన్న విశేషాలను వ్యాస మహర్షి ప్రయోగించాడు. అదే రీతిగా తిక్కన ఈ చిన్న పద్యంలోనూ కూర్చటం విశేషం.

**క. అమృతమయు, ఋగ్యజు స్సా । మముల యుపనిషద్వచ స్సమాజములకు వా**
**చ్యమయిన పురుషోత్తము, ని । క్కము రూపగు వాని భక్తిగమ్యుఁ దలంతున్. 22**

**ప్రతిపదార్థం:** అమృతమయున్= నాశరహితుడిని; ఋక్+యజుః+సామముల= ఋగ్వేద, యజుర్వేద, సామవేదాల యొక్క; ఉపనిషత్+వచః+సమాజములకున్= ఉపనిషత్తులలోని వాక్య సమూహానికి; వాచ్యము+అయిన= అభివ్యక్తీకరించే (తెలియజేసే); నిక్కము రూపు+అగు వానిన్= సత్య స్వరూపమైన వాడిని; భక్తి గమ్యున్= భక్తితో పొంద దగినవాడిని; పురుషోత్తమున్= పురుషోత్తముడైన శ్రీకృష్ణుడిని; తలంతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** అమృతమయుడు, వేదాలు, ఉపనిషత్తుల వాక్య సమూహాలచేత వాచ్యుడు, సత్యస్వరూపుడు, భక్తితో పొంద దగినవాడూ అయిన పురుషోత్తముడిని ధ్యానిస్తున్నాను.

**విశేషం:** భగవంతుడు భక్తపరాధీనుడు అనే అంశాన్ని తెలియచేయటానికే తిక్కన 'భక్తిగమ్యుఁడు' అనే మాట ప్రయోగించాడు.

**ఆ. అరణి నగ్ని వొడము కరణి దేవకి యందు । విప్రకర్మయజ్ఞ వేద గుప్తి**
**కై జనించె నెవ్వఁ డవ్వసుదేవ నం । దను భజింతు నేకతానిరూఢి. 23**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఎవడైతే; అరణిన్= త్రచ్చి నిప్పు పుట్టించే కొయ్యవలన; అగ్ని= అగ్నిదేవుడు; పొడము కరణిన్= పుట్టిన రీతిగా; దేవకి+అందున్= దేవకీదేవి గర్భమందు; విప్రకర్మయజ్ఞ= బ్రాహ్మణులయొక్క కర్తవ్యమైన యజ్ఞాలయొక్క; వేద= వేదాలయొక్క; గుప్తికయి= సంరక్షించుటకయి; జనించెన్= పుట్టాడో; ఆ+వసుదేవ నందనున్= ఆ వసుదేవ పుత్రుడైన శ్రీకృష్ణుడిని; ఏకతా నిరూఢిన్= ఏకాగ్ర చిత్తంతో; భజింతున్= కొలుస్తాను.

**తాత్పర్యం:** అరణుల రాపిడివలన అగ్నిదేవుడు ఉద్భవించినట్లు దేవకీదేవి వసుదేవులకు సుతుడుగా, బ్రాహ్మణ కర్తవ్యమైన యజ్ఞ వేదాలను సంరక్షించటంకొరకు జన్మించిన శ్రీకృష్ణుడిని ఏకాగ్రచిత్తంతో స్మరిస్తాను.

**విశేషం:** అలం: ఉపమ. పరిశుద్ధమైన అగ్నివలె శ్రీకృష్ణుడు సైతం యజ్ఞ వేదాల సంరక్షకుడిగా పరిశుద్ధుడనే అంశాన్ని కవి ఈ పద్యంలో స్పష్టం చేశాడు. 'ఏకతానిరూఢి' అంటే జ్ఞాన కర్మేంద్రియాలను మనస్సునందు సమైక్యం చేసికొని భీష్ముడు శ్రీకృష్ణుడిని స్తుతించాడని భావం.

**తే. ఒకఁడు పండ్రెండు మూర్తులై యుండునట్లు । గా హిరణ్య వర్ణంబగు గర్భ మదితి**
**దాల్చి యెవ్వానిఁ గనియె దైత్యఘ్ను నట్టి । దేవు సూర్యాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు. 24**

**ప్రతిపదార్థం:** ఒకఁడు= ఒక్కడే; పండ్రెండు మూర్తులు+ఐ= పండ్రెండుగురు ఆదిత్యులై; ఉండునట్లుగాన్= ఉండే రీతిగా; అదితి= కశ్యప ప్రజాపతి భార్య అయిన అదితి; హిరణ్య వర్ణంబు+అగు= బంగారు రంగు కలిగిన; గర్భము+తాల్చి= గర్భం ధరించి; ఏ+వానిన్+కనియెన్= ఎవడిని కన్నదో; అట్టి దైత్యఘ్నున్= రాక్షసుడైన బలిచక్రవర్తిని సంహరించిన అట్టి వామనుడనే వాడిని; దేవున్= భగవంతుడిని; సూర్య+ఆత్మకునిన్= ద్వాదశ సూర్యాత్మకుడైన; విష్ణు(న్)= శ్రీ మహా విష్ణువును; ప్రణుతింతున్= నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యం:** విష్ణువు ద్వాదశ సూర్యాత్మకుడు. బలిచక్రవర్తి సంహారార్థం అదితి గర్భంలో వామనమూర్తిగా జన్మించిన శ్రీ మహావిష్ణువును దేవదేవుడిగా సంస్మరిస్తాను.

**విశేషం:** ద్వాదశాదిత్యులు: అంశుడు, భగుడు, మిత్రుడు, వరుణుడు, ధాత, అర్యముడు, జయంతుడు, భాస్కరుడు, త్వష్ట, పూషుడు, ఇంద్రుడు, విష్ణువు. ద్వాదశాదిత్యులలో ఒకడు విష్ణువు. సూర్యాత్మకు డైన శ్రీకృష్ణుడిని స్మరిస్తున్నాడు భీష్ముడు.

**క. సురపితృకోట్లం బూర్వా । పర పక్ష దినముల నమృత పాన ప్రీతిం**
**బొరయం జేయుచు వెలిఁగెడు । హరి సోమాత్మకునిఁ గొల్తు నాత్మేశ్వరునిన్. 25**

**ప్రతిపదార్థం:** సురపితృకోట్లన్= దేవతలయొక్క, పితరుల యొక్క సమూహాలకు; పూర్వ+అపర పక్ష దినములన్= నెలలో శుక్ల, కృష్ణ పక్ష దినాలలో; అమృతపాన= అమృతాన్ని త్రాగటమునందలి; ప్రీతిన్= ఇష్టంతో; పొరయన్+చేయుచున్= పొందజేస్తూ; వెలిఁగెడు= ప్రకాశించునట్టి; ఆత్మ+ఈశ్వరునిన్= నా హృదయాధీశ్వరుడైన; సోమ+ఆత్మకునిన్= చంద్రాత్మకుడైన హరిని; కొల్తున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** నెలలోని శుక్లపక్షంలో దేవతలను, కృష్ణ పక్షంలో పితృదేవతలను తన అమృతాన్ని ప్రీతితో ఇచ్చి పోషించే ఓషధీరూపు డైన వాడిని, నా హృదయాధీశ్వరు డైన చంద్రాత్మకు డైన హరిని ధ్యానిస్తాను.

**విశేషం:** దక్షుడు శపించిన సందర్భంలో శివుని ఆశ్రయించగా తగవు తీర్చటానికి బ్రహ్మ చంద్రుడిని రెండుగా విభజించి శివుడి తలపై సగమూ, హిమవత్పర్వతంలో సగమూ ఉండేటట్లు నిర్ణయించాడు. దక్షుడి శాపం అన్యృతం కాకుండటానికి తారల కిచ్చిన భాగం వృద్ధి క్షయాలు పొందుతూ ఉండేది. ఆ వృద్ధి క్షయాలలో శుక్లపక్షంలో దేవతలను, కృష్ణపక్షంలో పితరులను సంతోషపరుస్తూ చంద్రుడు ఉంటాడు. అట్లాంటి చంద్రాత్మకుడైన శ్రీ మహావిష్ణువును భీష్ముడు స్తుతిస్తున్నాడు.

**తే.** **విశ్వసృజులను మునులచే వితతమగు స । హస్ర వత్సర కలిత మహాధ్వరమునఁ**
**గశ్యపబ్రహ్మ యెవ్వానిఁ గనియెఁ గనక । పక్షు దార్క్ష్యాత్ముఁ దలఁతు నప్పద్మనాభు.** **26**

**ప్రతిపదార్థం:** విశ్వసృజులు+అను= విశ్వ సృష్టికర్తలు (నవ బ్రహ్మలు) అనే; మునులచేన్= మహర్షులచేత; వితతము+అగు= విస్తృతమైన; సహస్ర వత్సర కలిత= వేయేండ్లతో కూడినట్టి; మహా+అధ్వరమునన్= గొప్ప యజ్ఞమందు; కశ్యపబ్రహ్మ= కశ్యపుడనే ప్రజాపతి; ఏ+వానిన్= ఎవ్వడినైతే; కనియెన్= కన్నాడో అట్లాంటి ; కనక పక్షున్+తార్క్ష్య+ఆత్మున్= బంగారు రెక్కలు కలిగినట్టి గరుత్మంతుడిని ఆత్మగా గల; ఆ+పద్మనాభున్= పద్మం నాభియందు గల ఆ మహావిష్ణువును; తలఁతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** విశ్వసృజు లనబడే మహర్షులు వేయి సంవత్సరాలపాటు చేసిన యజ్ఞంలో కశ్యప్రజాపతికి సువర్ణపక్షుడైన గరుత్మంతుడు జన్మించాడు. అట్లాంటి గరుడుని ఆత్మగా గల శ్రీ మహావిష్ణువును స్మరిస్తాను.

**విశేషం:** 'విశ్వసృక్' అన్నది విష్ణు సహస్ర నామాలలో ఒకటి. విష్ణువు నవబ్రహ్మాత్మకుడు. అందువలన నవబ్రహ్మలు చేసిన వెయ్యేండ్ల యాగ సమయంలో కశ్యపప్రజాపతికి గరుత్మంతుడు వినతవలన జన్మించాడు.

**క.** **సువ్యక్త క్షేత్రంబున । నవ్యక్తాకృతి నిరూఢి నాసీనుం డై**
**భవ్యత నుండెడు క్షేత్రా । త్మ వ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్.** **27**

**ప్రతిపదార్థం:** సువ్యక్త= స్పష్టంగా తెలియవస్తున్న; క్షేత్రమునన్= జీవుడుండే శరీరమందు; అవ్యక్త+ఆకృతి నిరూఢిన్= తెలియరానట్టి ఆకారంతో ప్రసిద్ధంగా; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; భవ్యతన్+ఉండెడు= యోగ్యమైన రీతిలో ఉండే (అంటే యోగంలో ఉండే); క్షేత్ర+ఆత్మ+వి+అపదిష్టున్= క్షేత్రాత్ముడని పిలువబడుతున్న ప్రసిద్ధుడైన; దామ+ఉదరున్= తులసిమాలను ఉదరమందు కలిగిన శ్రీమహావిష్ణువును; ప్రణుతింతున్= ప్రార్థిస్తున్నాను.

**తాత్పర్యం:** స్పష్టంగా తెలిసే దేహమందు తెలియరానట్టి యోగంలో ఉండే క్షేత్రాత్ముడుగా ప్రసిద్ధుడైన దామోదరుడైన ఆ శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తున్నాను.

**విశేషం:** విష్ణు సహస్రనామాలలో విష్ణువు క్షేత్ర క్షేత్రజ్ఞుడిగా చెప్పబడుతున్న అంశాన్ని ఇక్కడ గుర్తించవలసి ఉన్నది.

**క.** **ప్రకృతి వికృతులను షోడశ । వికారముల బెరసి ప్రకృతి వికృతిత్వము లొం**
**దక యుండఁ గాంతు రెవ్వని । సకల మునులు దలఁతు నట్టి సాంఖ్యాత్ము హరిన్.** **28**

**ప్రతిపదార్థం:** ప్రకృతి వికృతులను= సహజమైన ప్రకృతులు, వాటి వ్యతిరేకమైన వికారాలు అనే; షోడశ వికారముల బెరసి= పదహారు వికారాలతో కూడి; ప్రకృతి వికృతిత్వములు+ఒందక ఉండన్= ప్రకృతిని కాని, వికృతిని కాని ఏ మాత్రం పొందకుండేటట్లుగా; ఏ+వానిన్= ఎవ్వడిని; సకలమునులు= సమస్త మహర్షులు; కాంతురు= చూడగలరో (దర్శించగలరో); అట్టి= అటువంటి; సాంఖ్య+ఆత్మున్+హరిన్= యోగాత్ముడైన శ్రీకృష్ణుడిని; తలఁతున్= ప్రార్థిస్తాను.

**తాత్పర్యం:** సహజమూ, తద్వ్యతిరేకమూ అయిన ప్రకృతి వికృతులను పదహారు వికారాలతో కూడి ఉండి కూడా, ప్రకృతి వికృతులను ఏ మాత్రమూ పొందకుండేటట్లు మహర్షి సత్తములు ఎవ్వడినైతే దర్శిస్తారో అటువంటి సాంఖ్యాత్ముడైన ఆ శ్రీమహావిష్ణువును స్మరిస్తాను.

**విశేషం:** ప్రకృతులు: అష్ట ప్రకృతులు= అవ్యక్తం, బుద్ధి, అహంకారం, పంచతన్మాత్రలు; శబ్ద స్పర్శ రూప రస గంధాలు; వికారము (సాంఖ్య) మూల ప్రకృతి నుండి పుట్టినవి; ఇవి పదహారు; షోడశ వికారాలు: పంచ జ్ఞానేంద్రియాలు ( శ్రోత్రం, చర్మం, చక్షువు, జిహ్వ, నాసిక), పంచ కర్మేంద్రియాలు (వాక్కు, హస్తం, పాదాలు, పాయువు, ఉపస్థ), పంచేంద్రియార్థాలు (ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం)+మనస్సు.

సాంఖ్యం: షడ్దర్శనాలు (సాంఖ్యం, యోగం, న్యాయం, వైశేషికం, మీమాంస, వేదాంతం)లో ఒకటి. పంచవింశతి తత్త్వాల (ఇరవై ఐదు తత్త్వాలలో ప్రకృతి పురుషుడు, బుద్ధి, అహంకారం, మనస్సు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచ మహాభూతాలు; పంచ తన్మాత్రలు) ఇందులో ప్రకృతి పురుషులను గూర్చి చెప్పేదే సాంఖ్యం. ఇక్కడ వేదాంతం అంగీకరించిన రీతిగా భగవంతుడే సృష్టి స్థితి లయ కారకుడన్న అంశాన్ని సాంఖ్యం అంగీకరించదు. పైపెచ్చు ఈ సమస్తానికి ప్రకృతే మూలమని నిరూపిస్తుంది.

**క. అంతశ్చర మారుతములు । శాంతములుగఁ జేసి యనలసత్వము శమమున్**
**దాంతియు గల జనములు గను । నంతర్వితుఁ గొలుతు జలశయను యోగాత్మున్. 29**

**ప్రతిపదార్థం:** అంతః+చర+మారుతములు= శరీరంలోపల ఉండే ప్రాణవాయువులు (ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం); శాంతములుగన్+చేసి= శాంతింపజేసి (చలనం లేకుండా చేసి); అనలసత్వమున్= ఏకాగ్రతతో, అలసత్వం లేకుండా; శమమున్= నిగ్రహం (జ్ఞానేంద్రియ నిగ్రహం); దాంతి= కర్మేంద్రియ నిగ్రహం; కల= కలిగినటువంటి; జనములు= యోగులు; కను= చూడగలిగినటువంటి; అంతర్వితున్= ఇంద్రియ నిగ్రహంచేత అంతర్ముఖీనుడైన వాడిని; జలశయనున్= నీటియందు శేషుడిని పాన్పుగ చేసికొని ఉన్నటువంటి వాడిని; యోగ+ఆత్మున్= యోగముద్రలో ఉన్నటువంటి శ్రీమహావిష్ణువును; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** పంచ ప్రాణాలను శాంతింపజేసి అలసత్వం లేని శాంతి దాంతులతో ఒప్పుతున్న యోగులు చూడగలిగిన అంతర్ముఖీనుడై ప్రళయాంతంలోని మహాజలాలలో శేషశయనుడై యోగనిద్రాముద్రితుడై ఉన్న శ్రీమహావిష్ణువును పూజిస్తాను.

**విశేషం:** శమము= జ్ఞానేంద్రియ నిగ్రహం; దాంతి= కర్మేంద్రియ నిగ్రహం.

**క. ఉపరమముం బ్రాపించిన । యపుణ్య పుణ్యములు గలుగు నతిశాంతులు భ**
**వ్యపుగతిఁ బొందెడు నానం । దపు రూపుని విష్ణుఁ దలఁచెదను మోక్షాత్మున్. 30**

**ప్రతిపదార్థం:** ఉపరమమున్+ప్రాపించిన= సమస్త విషయ సంబంధమైన కోరికలను వదలిపెట్టిన (విషయ వైరాగ్యాన్ని పొందిన); అపుణ్య పుణ్యములు+కలుగు= పుణ్యాపుణ్యములు సమంగా చూడగలిగే; అతిశాంతులు= జ్ఞాన కర్మేంద్రియాది నిగ్రహం కలిగిన మహాత్ములు; భవ్యము+గతిన్+పొందెడు= శ్రేష్ఠమైన మార్గాన్ని పొందేటటువంటి; ఆనందపు రూపుని(న్)= ఆనందమే (బ్రహ్మానందమే) స్వరూపంగా కలిగిన; మోక్ష+ఆత్మున్= మోక్ష స్వరూపుడు అయిన; విష్ణున్= శ్రీ మహావిష్ణువును; తలఁచెదను= స్మరిస్తాను.

**తాత్పర్యం:** విషయ వైరాగ్యాన్ని పొందిన ద్వంద్వాతీతులైన తపస్వులు శ్రేష్ఠమైన పద్ధతిలో పొందే బ్రహ్మానంద స్వరూపుడైన వాడును, మోక్షప్రదాత అయిన శ్రీ మహావిష్ణువును స్మరిస్తాను.

**విశేషం:** విషయ వాంఛా రహితులైన విరాగులు, పుణ్యాపాపాలకు అతీతులు. ద్వంద్వాతీతులు వారే. అటువంటి మహాత్ములే అతి శాంతులు. అటువంటి మహనీయులు 'భవ్యపు గతిన్' అంటే విష్ణుసహస్ర నామావళిలో ఒకటైనది భవ్యశబ్దం కనుక, అటువంటి గతిని పొందగలిగే బ్రహ్మానంద స్వరూపుడు శ్రీమహావిష్ణువు.

**తే. చరణ నాభి శీర్షంబులు ధరయు నంత । రిక్షమును దివమును జగచ్చక్షు రగ్ని**
**దిశలు దృఙ్ముఖ శ్రోత్రముల్ దీప్తు లెమ్మ । హాంగునకు నట్టి హరిని లోకాత్ముఁ దలఁతు. 31**

**ప్రతిపదార్థం:** ఏ+మహా+అంగునకున్= సమస్తాన్ని శరీరంగా కలిగిన ఏ మహాత్ముడికి; ధరయున్+అంతరిక్షమున్+దివమును= భూమి, ఆకాశం, స్వర్గం, క్రమంగా; చరణనాభి శీర్షంబులు= పాదాలు, బొడ్డు, తల అయి ఉన్నాయో అట్లాగే; జగత్+చక్షుః+అగ్ని దిశలు= సూర్యుడు, అగ్ని, దిక్కులు క్రమంగా; ముఖ+శ్రోత్రముల్+దీప్తుల్= ముఖం, చెవులు, కాంతులు అయి ఉన్నాయో; అట్టి లోక+ఆత్మున్= జగత్తులన్నింటిని ఆత్మగా కలిగిన వాడైన శ్రీమహావిష్ణువును; తలఁతున్= స్మరిస్తాను (పూజిస్తాను).

**తాత్పర్యం:** ఈ భూమి, ఆకాశం, స్వర్గం, ముల్లోకాలు వరుసగా శ్రీమహావిష్ణువునకు పాదాలు, బొడ్డు, తల. సూర్యుఁడు, కళ్ళు, అగ్ని, దిక్కులు శ్రీ మహావిష్ణువునకు. చూపులు, ముఖం, చెవులు, కాంతులు అయి ఒప్పుతున్నాయి. అట్టి లోకాత్ముడూ మహాంగుడూ అయిన శ్రీమహావిష్ణువును స్మరిస్తాను.

**విశేషం:** కవి ఇందులో శ్రీ మహావిష్ణువు యొక్క విశ్వస్వరూపాన్ని వివిధ రీతుల, అదే మహాశరీరంగా అభివర్ణించాడు.

**క. భూతముల మ్రింగి, లోక । వ్రాతము జలమయముఁ జేసి, వశ్యాత్మత ని**
**ద్రాతిశయంబున బాలుం । డై తేలెడు వానిఁ దలఁతు హరి మాయాత్మున్. 32**

**ప్రతిపదార్థం:** భూతములన్ మ్రింగి= ప్రాణులనన్నింటిని తనలో ఇముడ్చుకొని; లోక వ్రాతమున్= జగత్తుల సమూహాలను; జలమయమున్+చేసి= నీటి మయంచేసి; వశ్య+ఆత్మతన్= తన అధీనం చేసికొన్న ఆత్మతో (సమస్త ఇంద్రియాల నిగ్రహంతో); నిద్రా+అతిశయంబునన్= అధికమైన యోగ నిద్రతో; బాలుండు+ఐ= పసిపాపడై; తేలెడు వానిన్= నీటిపై మఱ్ఱియాకుపై తేలియాడుతుండే; మాయా+ఆత్మున్= యోగమాయ ఆత్మగా కలిగిన; హరిన్= శ్రీ మహావిష్ణువును; తలఁతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** ప్రళయాంతంలో సమస్త ప్రాణికోటిని తనయందే సంలీనం చేసికొని, ప్రపంచమంతటినీ నీటిలో మగ్నంచేసి, తన ఆత్మను అధీనం చేసుకొని యోగనిద్రలో నీటిపై మఱ్ఱియాకుమీద పసిపాపడై తేలియాడే మాయాత్ముడైన ఆ శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తాను.

**విశేషం:** ప్రళయాంతంలో సమస్త ప్రాణికోటి నశించి పోతుంది. సర్వాంతర్యామి అయిన ఆ మహావిష్ణువు సమస్తాన్ని తనలో ఇముడ్చుకొని ఏమీ తెలియని పసివాడివలె నీటిపై తేలియాడుతుంటాడనే అంశం పురాణప్రసిద్ధమే. అదంతా శ్రీ మహావిష్ణువు యొక్క మాయ అన్నది విశేషార్థం.

**తే. అంబుదంబులు గేశంబులందు, నదులు । సర్వ తనుసంధులందును, జలధు లుదర**
**దేశమున యందు నున్నట్టి దేవదేవుఁ । గొలుతుఁ దోయాత్ము దేవకికొడుకుఁ గృష్ణు. 33**

**ప్రతిపదార్థం:** అంబుదంబులు= నీటి నొసగే మేఘాలు; కేశంబులందున్= తలలోని కురులందు; నదులు= నదులు; సర్వతను సంధులందును= సమస్త శరీరంయొక్క కలయికలోను; జలధుల్+ఉదరదేశమున+అందున్= సముద్రాలు కడుపు ప్రదేశంలోనూ; ఉన్న+అట్టి= ఉన్నట్టి; దేవదేవున్= దేవతలకు దేవుడైన; తోయ+ఆత్మున్= జలస్వరూపుడైన; దేవకి కొడుకున్= దేవకీదేవి కుమారుడైన; విష్ణున్= శ్రీ మహావిష్ణుమూర్తిని; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** వర్షపు మేఘాలను తలనీలాలలోను, నదులను అన్ని శరీరావయవ సంధులలోనూ, సముద్రాలను కుక్షిలోనూ కలిగిన దేవాదిదేవుడు, నారాయణుడు, దేవకీదేవిపుత్రుడైన శ్రీకృష్ణమూర్తిని పూజిస్తాను.

**తే.** **వదన బాహూరు పదము లెవ్వాఁడు విప్ర । రాజ వైశ్య శూద్రులకు సంప్రభవ దేశ**
**ములుగ వెలుఁగొందు నమ్మహామూర్తి విభవ । దీప్తు వర్ణాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు.** **34**

**ప్రతిపదార్థం:** ఏ+వాఁడు= ఎవ్వడైతే; వదన బాహు+ఊరు పదముల్= ముఖం, భుజాలు, తొడలు, పాదాలు (క్రమంగా); విప్ర రాజ వైశ్య శూద్రులకున్= బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనేవారికి; సంప్రభవ దేశములుగన్= పుట్టిన ప్రదేశాలుగా కలిగి; వెలుఁగొందున్= ప్రకాశిస్తున్నాడో; ఆ+మహామూర్తిన్= ఆ మహా స్వరూపుడిని; విభవ దీప్తున్= వైభవకాంతిమంతుడిని; వర్ణ+ఆత్మకునిన్= నాలుగు వర్ణాలను ఏర్పరచిన వాడిని; విష్ణున్= శ్రీమహావిష్ణువును; ప్రణుతింతున్= స్తుతిస్తాను.

**తాత్పర్యం:** శ్రీ మహావిష్ణువు ముఖం నుండి బ్రాహ్మణులు, భుజాల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదాల నుండి శూద్రులు అనే నాలుగు వర్ణాలవారు ఉద్భవించారు. అట్లాంటి చతుర్వర్ణాత్మకుడైన శ్రీ మహావిష్ణువును స్తుతిస్తాను.

**విశేషం:** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు విష్ణువు ముఖం, బాహువులు, ఊరువులు, పాదాల నుంచి ఉద్భవించారన్న ఈ అంశం పురుష సూక్తంలోను,

> **"బ్రాహ్మణోz స్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః**
> **ఊరూతదస్యయ ద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత"**

అని చెప్పబడింది. నాలుగు వర్ణాలు తానే సృష్టించానని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన అంశం తెలిసిందే. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః" (4-13)

**క.** **మాసర్త్వయనాబ్దమయో । ద్భాసిత రూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం**
**జేసి పొలుపారు శౌరి ను । పాసింతును యోగి భోగ్యబలుఁ గాలాత్మున్.** **35**

**ప్రతిపదార్థం:** మాస+ఋతు+అయన= (సంవత్సరంలో) నెలలు (పండ్రెండు) ఋతువులు (ఆరు) అయనాలు (ఉత్తరాయన దక్షిణాయనాలు (రెండు); అబ్దమయ= (అరవై) సంవత్సరాలతో కూడి; ఉద్భాసిత+రూపుఁడు+అయి= ప్రకాశిస్తున్న స్వరూపం కలిగి; సృష్టిన్+ప్రళయంబున్+తగన్+చేసి= కాలాత్మకుడై ఈ ప్రపంచాన్ని సృష్టించి వినాశనం చేసి; పొలుపు+ఆరి= ఒప్పి; యోగి భోగ్య బలున్+కాల+ఆత్మున్= మహాయోగీ (సమస్తాన్ని అనుభవించే మహాబల సంపన్నుడూ, కాలస్వరూపుడూ అయిన); శౌరిన్= శూర వంశీయుడైన శ్రీమహావిష్ణువును; ఉపాసింతును= పూజిస్తాను.

**తాత్పర్యం:** నెలలు, ఋతువులు, ఉత్తర దక్షిణాయనాలు, సంవత్సరాలు తానే అయి, సృష్టి ప్రళయాలకు కర్త అయి, కాలస్వరూపుడై యోగి భోగి అయి ఒప్పుతూ ఉన్న ఆ శ్రీమహావిష్ణువును భజిస్తాను.

**క.** **ముని దివిజాదిక లోకము । లనంతుఁ డన జగతి కెల్ల నాధారం బై**
**పెనుపొందెడు శేషాత్ముని । వినుతింతున్ విష్ణుభక్తి విభవ విధాయిన్.** **36**

**ప్రతిపదార్థం:** ముని= మహర్షులయొక్క; దివిజ+ఆదిక లోకముల్= దేవతలయొక్క లోకమైన స్వర్గం మొదలుకొని; జగతికిన్ ఎల్లన్= సమస్త జగత్తునకు; అనంతుఁడు+అనన్= అంతంలేని వాడైన శేషుడనే ప్రసిద్ధుడు; ఆధారంబు+ఐ= భరించే ఆధారభూతమై;

పెనుపొందెడు= అతిశయిల్లుతున్న; విష్ణుభక్తి విభవ విధాయిన్= విష్ణుభక్తి వైభవాన్ని విధించే వాడైన; శేష+ఆత్మునిన్= ఆదిశేషస్వరూపుడైన శ్రీమహావిష్ణువును; వినుతింతున్= స్తుతిస్తాను.

**తాత్పర్యం:** మునులలోకం, దేవలోకమైన స్వర్గం మొదలుకొని సమస్త లోకాలను అనంతుడన్న పేరుతో మోస్తూ అతిశయిల్లుతూ ఉన్న విష్ణుభక్తి వైభవాన్ని విధించే ఆదిశేషాత్ముడైన శ్రీమహావిష్ణువును స్తుతిస్తాను.

**క. ఆదిత్య మరుద్వసురు । ద్రాదిదివిజ గణము లెల్ల నవయవ రూపో**
**త్పాదకలితు లెవ్వానికి । నా దేవుని సంస్తుతింతు హరి దేవాత్మున్. 37**

**ప్రతిపదార్థం:** ఏ+వానికిన్= ఎవడికైతే; ఆదిత్య= ద్వాదశాదిత్యులును; మరుత్= మరుద్గణాలూ; వసు= అష్టవసువులూ; రుద్రులు= ఏకాదశ రుద్రులూ; ఆది= మొదలైన; దివిజ గణములు= సమస్త దేవతా సమూహాలు; అవయవ= శరీరంలోని అవయవములచేత; రూప+ఉత్పాదక= రూప నిర్మాణానికి; కలితులు= కూడి ఉన్నటువంటి వారో; అట్టి= ఆ; దేవునిన్= భగవంతుడిని; దేవ+ఆత్మున్= సమస్త దేవతలను ఆత్మగా కలవాడైన; హరిన్= శ్రీమహావిష్ణువును; సంస్తుతింతున్= ప్రార్థిస్తాను.

**తాత్పర్యం:** ద్వాదశాదిత్యులు, మరుత్తులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, మొదలైన దేవగణాలన్నీ శ్రీమహావిష్ణువునకు అంగభూతులో అట్లాంటి దేవాత్మకూడా ఆ మహాదేవుడైన విష్ణువును సంస్తుతిస్తాను.

**విశేషం:** ద్వాదశాదిత్యులు: ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.

మరుత్తులు: దితి కశ్యపుల సంతానం మరుద్గణం,

అష్ట వసువులు: ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, విభావసుడు.

ఏకాదశ రుద్రులు: అజుడు, ఏకపాదుడు, శంభుడు, హరుడు, త్ర్యంబకుడు, అహిర్బుధ్నుడు, త్వష్ట, రుద్రుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు.

ఇవన్నియూ దేవగణాలు.

**క. సర్వము నందును దానున్ । సర్వముఁ దనయందు నుండు సంచారంబున్**
**సర్వమునకుఁ దన వలనన । సర్వాత్మకు నట్టి వృష్ణిసత్తముఁ దలఁతున్. 38**

**ప్రతిపదార్థం:** సర్వమునందున్+తానున్= సమస్తమునందును భగవంతుడు; సర్వమున్ తనయందున్+ఉండున్= సమస్తం భగవంతుడియందు ఉన్నట్టి; తన వలనన= భగవంతుడి వలనే; సర్వమునకున్= సమస్తానికి; సంచారంబున్= సంచరించటం; ఉండున్= ఉండునో; సర్వ+ఆత్మకున్= సమస్తానికి ఆత్మగా కలిగిన; అట్టి= అటువంటి; వృష్ణి సత్తమున్= వృష్ణి వంశంలో శ్రేష్ఠుడైన శ్రీమహావిష్ణువును; తలఁతున్= ప్రార్థిస్తాను.

**తాత్పర్యం:** సమస్తమూ భగవంతుడిలోనూ, సమస్తమూ భగవంతుడి యందు సమస్తమునకు తనవలెనే మెలగుట జరుగునో అట్లాంటి సర్వాత్మకుడైన శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తాను.

**క. మీనయి తా నతలగతం । బైన నిగమ చయముఁ దెచ్చి యజునకు నొసఁగం**
**గా నేర్చిన సుమనస్స । మ్మానిత విగ్రహు భజింతు మత్స్యాత్ము హరిన్. 39**

**ప్రతిపదార్థం:** తాన్= తాను (భగవంతుడైన విష్ణువు); మీను+అయి= చేప అయి; అతలగతంబు+ఐన= అధో లోకానికి చేరిన; నిగమ చయమున్+తెచ్చి= వేద సమూహాన్ని తెచ్చి; అజునకున్= బ్రహ్మకు; ఒసగంగాన్+నేర్చిన= తెచ్చి ఇచ్చే నేర్పు కలిగిన వాడును; సుమనస్+సం+మానిత+విగ్రహున్= దేవతలచేత సమ్మానింపబడిన స్వరూపుడైన; మత్స్య+ఆత్మ(న్)= మత్స్యావతారుడైన శ్రీమహావిష్ణువును; భజింతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** అనాదికాలంలో సోమకు డనే రాక్షసుడు వేదాలను అపహరించుకొని సముద్రంలో అధోలోకానికి వెళ్ళిపోగా, సోమకాసురుడిని సంహరించి మళ్ళీ ఆ వేదాలను బ్రహ్మకు తెచ్చి ఇచ్చి దేవతలచేత కొనియాడ బడిన మత్స్యావతారు డయిన శ్రీమహావిష్ణువును పూజిస్తాను.

**క. అమృత మథనమున మంథన । గము లీలోద్ధరణకేళిఁ గైకొని సురసం**
**ఘమునకుఁ బ్రియ మొనరించిన । యమేయుఁ గూర్మాత్ము నంబుజాక్షుం గొలుతున్. 40**

**ప్రతిపదార్థం:** అమృతమథనమునన్= అమృతం కొరకు పాల సముద్రాన్ని చిలికినప్పుడు; మంథనగమున్= మంథర పర్వతాన్ని; లీల= విలాసంతో; ఉద్ధరణ కేళిన్= ఎత్తుట అనే ఆటగా; కైకొని= గ్రహించి; సుర సంఘమునకున్= దేవతల సమూహానికి; ప్రియము+ఒనరించిన= ప్రీతి కూర్చిన (ఆనందాన్ని కలిగించిన); అమేయున్= అపరిమితుడు అయిన విష్ణువును; అంబుజ+అక్షున్= పద్మాక్షుడిని; కూర్మ+ఆత్మన్= కూర్మావతార మెత్తిన విష్ణువును; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** మంథరపర్వతాన్ని కవ్వంగా చేసికొని పాలసముద్రాన్ని దేవతలు, రాక్షసులు చిలికిన సందర్భంలో మంథర పర్వతం సముద్రంలో మునిగిపోకుండా విలాసంగా ఎత్తి పట్టుకొని దేవతా సమూహానికి అత్యంతమూ ఆనందం కూర్చిన కూర్మావతారరూపుడైన శ్రీమహావిష్ణువును ప్రార్థిస్తాను.

**క. వారాహ రూపమునఁ బెం । పారిన తన దంష్ట్ర నొకట నవని సగిరికాం**
**తారంబుగ నెత్తిన యా । శౌరిం గ్రోడాత్ముఁదలఁతు సమ్యగ్భక్తిన్. 41**

**ప్రతిపదార్థం:** వారాహ రూపమునన్= వరాహ అవతారంలో; పెంపు+ఆరిన= అతిశయించిన; తన= తనదైన; ఒకటన్= ఒక్కటి అయిన; దంష్ట్రన్= కోరచేత; సగిరి కాంతారంబుగన్= పర్వతాలు, అరణ్యాలతో కూడిన; అవనిన్= భూమిని; ఎత్తిన= ఎత్తినట్టి; క్రోడా+ఆత్మన్= వరాహాన్ని ఆత్మగా కలిగిన; ఆ శౌరిన్= ఆ శ్రీమహావిష్ణువును; సమ్యక్+భక్తిన్= సముచితమైన భక్తితో; తలఁతున్= స్మరిస్తాను (భావిస్తాను).

**తాత్పర్యం:** వరాహావతార మెత్తి పర్వతారణ్యాలతో కూడిన భూమి నంతటిని బలోపేతమైన తన ఒకే దంష్ట్రచేత ఉద్ధరించిన వరాహాత్ముడైన శ్రీమహావిష్ణువును సదా భక్తితో పూజిస్తాను.

**ఆ. నారసింహవపు రుదార భావము నొంది । ఘను హిరణ్యకశిపు ఖర నఖముల**
**వ్రచ్చి దీప్తమూర్తి వఱలు నృసింహాత్ము । నాత్మభవుని భక్తి నాశ్రయింతు. 42**

**ప్రతిపదార్థం:** నారసింహ= సగం నరుడు, సగం సింహము అయిన; వపుః= శరీరంతో; ఉదార భావమును+ఒంది= ఉదార స్వభావమును పొంది; ఘనున్= గొప్పవాడయిన; హిరణ్య కశిపున్= హిరణ్య కశిపుడిని; ఖరనఖములన్= వాడి అయిన గోళ్ళచేత; వ్రచ్చి= చీల్చి; దీప్తమూర్తిన్= తేజస్వంతుడిని; వఱలు= ప్రకాశించునటువంటి; నృసింహ+ఆత్మన్= నృసింహస్వరూపం కలిగినవాడిని; ఆత్మభవునిన్= స్వయంగా పుట్టినవాడైన విష్ణువును; భక్తిన్= భక్తితో; ఆశ్రయింతున్= శరణువేడుతాను.

**తాత్పర్యం:** నరసింహావతారమెత్తి మదించిన హిరణ్యకశిపుడిని వాడి అయిన తన గోళ్ళతో చీల్చి ప్రసిద్ధిపొందిన నరసింహాత్ము డైన శ్రీమహావిష్ణువును ఆశ్రయిస్తాను.

**క. వామన రూపంబున ను। ద్దామ బలున్ బలి నడంచి త్రైలోక్యాతి**
**క్రామితఁ బేర్చిన యద్భుత। ధాముం గ్రాంతాత్ముఁ దలఁతు దామోదరునిన్. 43**

**ప్రతిపదార్థం:** వామన రూపంబునన్= వామనావతారంలో; ఉద్దామబలున్= అత్యంత బలం కలవాడైన; బలిన్= బలిచక్రవర్తిని; అడంచి= అణచివైచి; త్రైలోక్య+అతిక్రామితన్= ముల్లోకాల ఆక్రమణంతో; పేర్చిన= అతిశయించిన; అద్భుతధామున్= ఆశ్చర్యకరమైన నివాసం కలవాడై; క్రాంత+ఆత్మున్= ఆక్రమించిన ఆత్మగా కలిగి; దామ+ఉదరునిన్= శ్రీమహావిష్ణువును; తలఁతున్= భావిస్తాను.

**తాత్పర్యం:** వామనావతారమెత్తి, అత్యంత బలాఢ్యుడైన బలిచక్రవర్తిని మూడడుగు లడిగి ముల్లోకాలు ఆక్రమించుకొని బలిచక్రవర్తిని త్రొక్కిపెట్టి అణచి వేసిన వామన స్వరూపుడైన శ్రీమహావిష్ణువును సంస్మరిస్తాను.

**ఆ. పరశురాముఁ డనఁగ భవ్యుఁడు జమదగ్ని। కుద్భవించి యిరువదొక్కమాఱు**
**మనుజపతుల నెల్లఁ దునిమిన క్రోధాత్ము। నధిక భక్తి శార్ఙ్గినాశ్రయించు 44**

**ప్రతిపదార్థం:** పరశురాముఁడు+అనఁగన్= పరశురాముడనగ; భవ్యుఁడు= శ్రేష్ఠుడైన; జమదగ్నికిన్+ఉద్భవించి= జమదగ్ని మహర్షికి జన్మించి; ఇరువది+ఒక్కమాఱు= ఇరవై ఒక్కసార్లు; మనుజపతులన్+ఎల్లన్= సమస్త రాజులను; తునిమిన= సంహరించిన; క్రోధ+ఆత్మున్= క్రోధ స్వభావుడైన; శార్ఙ్గిన్= శార్ఙ్గమును ధరించిన వాడైన శ్రీమహావిష్ణువును; అధిక భక్తిన్= అమితమైన భక్తితో; ఆశ్రయింతున్= ఆశ్రయిస్తాను.

**తాత్పర్యం:** శ్రీమహావిష్ణువు పరశురాముడనే పేరుతో మహర్షి సత్తముడైన జమదగ్నికి జన్మించి ఇరవై ఒక్కసార్లు రాజని పేరున్న వారిని అందరిని సంహరించి క్రోధాత్ముడైన శ్రీమహావిష్ణువును అమితమైన భక్తితో ఆశ్రయిస్తాను.

**క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ। పుత్రున్ శ్రీరాముఁ డనఁగఁ బొలిచిన దేవున్**
**శత్రుభయదు రావణు నొక। మాత్రం దునుమాడినట్టి మధుసూదనునిన్. 45**

**ప్రతిపదార్థం:** దశరథ పుత్రున్= దశరథ మహారాజు కుమారుడైన; శ్రీరాముఁడు+అనఁగన్= శ్రీరాము డనే పేరుతో; శత్రు భయదున్= శత్రువులకు భయం కలిగించేవాడైన; రావణున్= రావణాసురుడిని; ఒక మాత్రన్= ఒక్కత్రుటిలో; తునుమాడినట్టి= సంహరించినట్టి; పొలిచిన= అతిశయించిన; దేవున్= దేవుడిని; క్షత్ర+ఆత్మున్= క్షత్రస్వరూపుడైన; మధుసూదనునిన్= మధు అనే రాక్షసుడిని సంహరించిన వాడైన శ్రీమహావిష్ణువును; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** దశరథ మహారాజు కుమారుడు శ్రీరాముడుగా జన్మించి, శత్రుభయంకరుడైన రావణాసురుడిని అవలీలగా సంహరించిన క్షత్రాత్ముడైన శ్రీమహావిష్ణువును పూజిస్తాను.

**క. హల ముసల ధరునిఁ గరుణా। నిలయ హృదయు రాము రౌహిణేయు సితాంగున్**
**జలద నిభాంబరుని శుచిం। దలఁతును గోవిందు శౌర్యధను భోగాత్మున్. 46**

**ప్రతిపదార్థం:** హల ముసల ధరునిన్= నాగలి, రోకలి ఆయుధాలుగా కలిగినవాడిని; కరుణా నిలయ హృదయున్= దయకు ఆటపట్టయిన హృదయం కలవాడిని; రౌహిణేయున్= రోహిణీదేవియొక్క కుమారుడైన; సిత+అంగున్= తెల్లనయిన శరీరం కలవాడిని; జలద నిభ+అంబరునిన్= మేఘంతో సమానమైన నీలవస్త్రం కలవాడిని; శుచిన్= పరిశుద్ధుడైన వాడిని; శౌర్యధనున్= పరాక్రమమే ధనంగా కలవాడిని; భోగ+ఆత్మున్= భోగాత్ముడైన; రాముని= బలరాముడిని; గోవిందున్= శ్రీమహావిష్ణువును; తలఁతును= భావిస్తాను.

**తాత్పర్యం:** నాగలిని, రోకటిని ఆయుధాలుగా కలిగిన వాడిని, దయాంతఃకరణుడు, రోహిణీదేవి పుత్రుడు, తెల్లని శరీరం కలవాడు, మేఘంతో సమాన మైన వస్త్రం కలవాడు, పరిశుద్ధుడు, శౌర్యధనుడు భోగాత్ముడు శ్రీమహావిష్ణువు అయిన బలరాముడిని తలుస్తాను.

**మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి, దు**
**ర్మద దైత్యావలిఁ గూల్చి, పార్థునకు సారథ్యంబు త్రైలోక్య స**
**మ్మద మారంగ నొనర్చి, దేవముని సమ్మానోద్ధృతిన్ భూభరం**
**బు దొలంగించిన చక్రి నంబురుహనాభుం గొల్తుఁ గృష్ణాత్మునిన్. 47**

**ప్రతిపదార్థం:** యదువంశంబునన్= యాదవ వంశంలో; వాసుదేవుఁడు+అనన్= వసుదేవ కుమారుడై; క్రీడా+అర్థంబు= వినోదార్థం; జన్మించి= పుట్టి; దుర్మద దైత్య+ఆవలిన్= దుర్మార్గులైన రాక్షసుల సమూహాన్ని; కూల్చి= నాశనం చేసి; పార్థునకున్= అర్జునుడికి; సారథ్యంబున్= రథచోదకత్వం; త్రైలోక్య సమ్మదము+ఆరంగన్= ముల్లోకాలకు ఆనందం కలిగేటట్లుగా; ఒనర్చి= చేసి; దేవముని సమ్+మాన+ఉద్ధృతిన్= దేవతల, మునులయొక్క గౌరవాధిక్యంతో; భూభరంబు+తొలంగించిన= భూభారాన్ని తొలగించిన; చక్రిన్= చక్రాయుధుడిని; అంబురుహ నాభున్= పద్మం నాభియందు కలవాడిని; కృష్ణాత్మునిన్= కృష్ణపరమాత్మను; కొలుతున్= పూజిస్తాను.

**తాత్పర్యం:** యాదవ వంశంలో దేవకీ వసుదేవులకు పుత్రుడై వినోదార్థంగా పుట్టి దుర్మార్గులైన రాక్షస సమూహాన్ని నాశనం చేసి ముల్లోకాలు హర్షించేటట్లు అర్జునుడికి సారథ్యంచేసి దేవమునులకు మిక్కిలి గౌరవం చేకూరుస్తూ భూభారాన్ని తొలగించిన పద్మనాభుడు, కృష్ణస్వరూపుడైన శ్రీమహావిష్ణువును కొలుస్తాను.

**క. కలికాల చలిత ధర్మము । నిలుపంగల యట్టి విష్ణునిం గల్క్యాత్ముం**
**దలఁతుఁ దురగ వాహను మ్లే । చ్ఛుల నెల్లం గీటడంచు శుభచారిత్రున్. 48**

**ప్రతిపదార్థం:** కలికాల చలిత ధర్మము నిలుపన్= కలియుగంలో చలించే - నాశమయ్యే; ధర్మమున్= ధర్మాన్ని; నిలుపన్ కల= నిలుప సమర్థుడైనట్టి; తురగ వాహనున్= అశ్వారూఢుడూ (గుర్రం వాహనంగా కలవాడూ); మ్లేచ్ఛులన్+ఎల్లన్= మ్లేచ్ఛజాతివారి నందరిని; గీటడంచు= నాశనం చేసే; శుభ చారిత్రున్= ఉత్తమ చరిత్ర కలవాడును; కల్కి+ఆత్మున్= కల్క్యవతారుడిని; విష్ణునిన్= శ్రీమహావిష్ణువును; తలఁతున్= సంస్మరిస్తాను.

**తాత్పర్యం:** కలియుగంలో విచలితమయిపోయే ధర్మాన్ని నిలబెట్ట గలిగినట్టివాడూ, మ్లేచ్ఛజాతినంతటిని సర్వనాశనం చేయగలవాడూ, అశ్వవాహనం కలవాడూ, శుభప్రదమైన చరిత్ర కలవాడూ, కల్క్యవతారుడూ అయిన శ్రీమహావిష్ణువును భావిస్తాను.

**ఆ. క్షరము లైన భూత సంఘంబులం దెల్ల । నక్షర స్వరూపుఁడై వెలుంగు**
**సకల బుద్ధివృత్తి సాక్షి సాక్ష్యాత్ము న । స్పందబోధఘను ముకుందుఁ దలఁతు. 49**

**ప్రతిపదార్థం:** క్షరములు+ఐన= నశించి పోయేటటువంటివైన; భూత సంఘంబులు+ఎల్లన్= సమస్త ప్రాణికోటులందును; అక్షర స్వరూపుఁడు+ఐ= వినాశంలేని మూర్తిమంతుడై; వెలుంగు= ప్రకాశించే; సకల బుద్ధి వృత్తి సాక్షి= సమస్త జ్ఞాన వ్యాపారాలకు సాక్షీభూతుడైన; సాక్ష్య+ఆత్మున్= సాక్ష్యాత్ముడైన; న+స్పంద= చలనంలేని; బోధ= జ్ఞానంచేత; ఘనున్= గొప్పవాడైన; ముకుందున్= శ్రీమహావిష్ణువును; తలఁతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** నశించిపోయే సమస్త ప్రాణికోటి యందును నాశరహితుడై మూర్తిమంతుడై ప్రకాశించే సమస్త బుద్ధి వ్యాపారాలకు సాక్షీభూతుడైన సాక్షాత్తు సాక్ష్యాత్ముడై స్థిరమైన జ్ఞానంచేత గొప్పవాడైన శ్రీమహావిష్ణువును భావిస్తాను.

**సీ.** **పరమేశ పుణ్య, సుబ్రహ్మణ్య, భక్తవ । త్సల, మహాదేవ, విశ్వప్రకాశ**
**కరణ, హృషీకేశ, వరద నారాయణ, । రాజీవనయన, హిరణ్యనాభ,**
**యఖిల లోక నమస్కృతాంఘ్రి సరోరుహ । యజ్ఞాంగ, యచ్యుత, యమృతరూప!**
**నీకు మ్రొక్కెదఁ గరుణింపవే యతసీ కు । సుమ వర్ణ పీతాంబరము ధరించి**

**ఆ.** **యున్న నిన్ను నెవ్వ రుల్లంబునందుఁ ద । లంతు రట్టి వారలకు భయంబు**
**గలుగదెందు నేమి కార్యంబులం దెప్డు । వినుత మంగళాయతనమ వగుట.** **50**

**ప్రతిపదార్థం:** ఎందున్= ఎక్కడైనా; ఏమి కార్యంబులందున్= ఎట్లాంటి పనులలోఅయినా; ఎప్పుడున్= ఎప్పుడైనా; వినుత మంగళ+ఆయతనమవు+అగుటన్= కొనియాడబడే శుభానికి నివాసం కావటం వలన; పరమ+ఈశ!= దేవాధిదేవుడా!; పుణ్య!= పుణ్యాత్ముడా!; సుబ్రహ్మణ్య!= సుబ్రహ్మణ్య స్వరూపుడా!; భక్తవత్సల!= భక్తులయందు వాత్సల్యం కలవాడా!; మహాదేవ!= ఘనమైన దైవమా!; విశ్వప్రకాశ కరణ!= జగత్తున కంతటికిని కాంతిని ప్రసాదించేవాడా!; హృషీక+ఈశ!= ఇంద్రియాలకు ఈశ్వరుడైన వాడా!; వరద!= వరాలనిచ్చేవాడా!; నారాయణ!= నీటిని స్థానంగా కలవాడా!; రాజీవ నయన!= పద్మనయన!; హిరణ్యనాభ!= బంగారుమయమైన బొడ్డు కలవాడా!; అఖిల= సమస్త; లోక= లోకాలచేత; నమస్కృత= నమస్కరింపబడుతున్న; అంఘ్రి సరోరుహ!= పాదపద్మాలు కలిగినవాడా!; యజ్ఞ+అంగ= యజ్ఞమందలి హవిర్భాగాలను గ్రహించేవాడా!; అచ్యుత!= నాశంలేని వాడా!; అమృతరూప!= అమృతమయ స్వరూపా!; అతసీ కుసుమ వర్ణ!= అవిసె పూవు వర్ణం కలవాడా!; పీత+అంబరము ధరించి ఉన్న నిన్నున్= పచ్చని వస్త్రం ధరించి ఉన్న నిన్ను; ఎవ్వరు+ఉల్లంబునందున్= ఎవ్వరయితే మనస్సులో; తలంతురు= స్మరిస్తారో; అట్టివారలకున్= అట్లాంటి వారికి; భయంబు కలుగదు= భయముండదు.

**తాత్పర్యం:** ఎప్పుడైనా, ఎక్కడైనా, ఏ కార్యంలోనైనా మంగళప్రదుడవగుటచేత భక్తవత్సల, నారాయణ, అచ్యుతాది నామాదులచేత ప్రసిద్ధుడై అతసీ పుష్ప సంకాశుడవయి, పీతాంబరధరుడవయి సమస్తలోకాలచేత నమస్కరించ బడుతున్న పాదపద్మాలు కలవాడా! నిన్ను స్మరించే వారందరికి ఎట్లాంటి భయం కలుగదు.

**విశేషం:** మూలంలోని అనేక శ్లోకాలను సంక్షిప్తంచేసి శ్రీమహావిష్ణువు నామ సంస్మరణం భీష్మునిచేత తిక్కన చేయించాడు.

**క.** **మంగళము విష్ణుదేవుఁడు । మంగళ మెమ్మెఁ దలంప మధురిపుఁ డుద్య**
**న్మంగళ మంభోజాక్షుఁడు । మంగళ మఖిలము విహంగమ ధ్వజుఁ డరయన్.** **51**

**ప్రతిపదార్థం:** అరయన్= చూడగా; ఏ+మెయిన్+తలంపన్= ఏ విధంగా ఆలోచించినా విష్ణుదేవుడు; మంగళము= శుభంకరుడు; మధురిపుఁడు= మధుడనే రాక్షసుడి శత్రువైన విష్ణువు మంగళ ప్రదుడు; అంభోజ+అక్షుఁడు= నీటినుండి పుట్టిన తామరలవంటి

కన్నులు కలవాడు; ఉద్యత్+మంగళము= అత్యంత శుభప్రదుడు; విహంగమ ధ్వజుఁడు= గరుత్మంతుడిని ధ్వజంగా కలిగిన శ్రీమహావిష్ణువు; అఖిలము= సమస్తం; మంగళము= మంగళం కూర్చువాడు.

**తాత్పర్యం:** ఎన్నివిధాల ఆలోచించినా విష్ణుదేవుడు, మధురిపుడు, అంభోజాక్షుడు, విహంగమధ్వజుడు అని ప్రసిద్ధుడైన శ్రీమహావిష్ణువు శుభంకరుడు.

**క. నారాయణ పరములు నిజ । మారయ బ్రహ్మంబుఁ బరము నంచిత సత్యో**
**దార తపంబులుఁ గావున । నారాయణపరత వీని నాల్గిటి నిచ్చున్. 52**

**ప్రతిపదార్థం:** నిజము+ఆరయన్= వాస్తవం పరిశీలించగా; బ్రహ్మంబున్= పరబ్రహ్మం; పరమున్= మోక్షం; అంచిత సత్య= అత్యుత్తమ సత్యం; ఉదార తపంబులున్= ఉన్నత తపస్సు అనేవి; నారాయణ పరములు= శ్రీమన్నారాయణుడి అధీనాలు; కావునన్= అందుచేతనే; నారాయణ పరత= విష్ణుభక్తి; వీనిని+నాల్గిటిన్+ఇచ్చున్= ఈ నాలుగింటిని ప్రసాదిస్తుంది.

**తాత్పర్యం:** పరబ్రహ్మం, మోక్షం, అత్యున్నత సత్యం, తపస్సు అన్నవి శ్రీమహావిష్ణువు పరమై ఉన్నాయి. కాబట్టి విష్ణువును ధ్యానించేవారికి ఆ శ్రీమహావిష్ణువు ఈ నాలిగింటిని ప్రసాదిస్తాడు.

**తే. విష్ణుమయ మగ్ని, హవియును విష్ణుమయము, । విష్ణుమయము సర్వంబును విశదబుద్ధి**
**నిట్లగుటఁ గందుఁ గావున నించుకేనిఁ । గల్మషము నాకు లేకున్కి గానవచ్చు. 53**

**ప్రతిపదార్థం:** అగ్ని విష్ణుమయము= అగ్ని స్వరూపుడు విష్ణువు; విష్ణుమయము హవియును= హవిస్సుకూడ విష్ణుమయమే; సర్వంబును విష్ణుమయము= విష్ణువు సమస్తంలోను ఉండేవాడు; ఇట్లు+అగుటన్= ఈ విధమగుటచేత; విశద బుద్ధిన్+కందున్= విస్పష్టమైన మనస్సుతో చూస్తున్నాను. కావునన్= అందువలననే; ఇంచుకేనిన్= కొంచెమైనా; కల్మషము లేకున్కి= పాపం లేకపోవటం; నాకు కానవచ్చున్= నాకు కనిపిస్తుంది.

**తాత్పర్యం:** అగ్ని స్వరూపుడు, హవిస్స్వరూపుడు, సమస్త స్వరూపుడు శ్రీమహావిష్ణువు కావటంచేత, విస్పష్ట జ్ఞానంతో చూడగలుగుతున్నాను. నాకు ఏ పాపం అంటదు. కనుక ఆ మహావిష్ణువు  కనిపిస్తున్నాడు.

**క. శరణాగతుండ భక్తుఁడఁ । బరమ పదవిఁ గోరెదను శుభంబుగ నన్నుం**
**బరికించి యేది మే ల । య్యిరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా! 54**

**ప్రతిపదార్థం:** కమల+అక్ష!= కమలములవంటి కన్నులు కల ఓ శ్రీమహావిష్ణూ!; శరణాగతుండన్= శరణని వేడుకొంటున్నాను; భక్తుఁడన్= నీ పరమ భక్తుడను; పరమపదవిన్+కోరెదన్= మోక్షపదవిని కోరుతున్నాను; శుభంబుగన్= శుభం కలిగేటట్లుగా; నన్నున్+పరికించి= నన్ను పరిశీలించి; ఏది మేలు+ఆ+ఇరవు= ఏది మంచిదో ఆ చోటు (విధానం); దొరకొనంగన్= ఒప్పునట్లుగ; తలఁపవే= భావించవా!.

**తాత్పర్యం:** ఓ కమలాక్షా! నీకు పరమభక్తుడనయి, శరణాగతుడనయి ఉన్నాను. మోక్షపదవిని కోరుకొంటున్నాను. మంగళప్రదమై ఏది ఉత్తమమైన స్థానమౌతుందో దానిని తగిన రీతిగా నాకు అనుగ్రహించుము.

**తే. తపమునకు విద్యకును జనుస్థానమైన । జనన రహితుని యజ్ఞాత్మ శౌరి వాఙ్మ**
**యాధ్వరార్చితుఁ జేసితి; నా జనార్ద । నుండు మద్భజనమునఁ బ్రీతుండు గాత!' 55**

**ప్రతిపదార్థం:** తపమునకున్= తపస్సునకు; విద్యకును= సర్వ విద్యలకును; జనుః+స్థానము+అయిన= పుట్టుకకు నిలయమైన; జనన రహితునిన్= పుట్టుకలేని వాడిని; యజ్ఞ+ఆత్మున్= యజ్ఞస్వరూపుడిని; శౌరిన్= శూరవంశజుడైన శ్రీమహావిష్ణువును; వాఙ్మయ+అధ్వర+అర్చితున్+చేసితిన్= మాటలనే యాగంచేత పూజితుడిగా; చేసితిన్= చేశాను; ఆ జనార్దనుండు= ఆ శ్రీమహావిష్ణువు; మత్+భజనమునన్= నా భక్తివలన; ప్రీతుండు గాత!= సంప్రీతుడగుగాక!

**తాత్పర్యం:** శ్రీమహావిష్ణువు సమస్త తపస్సులకు, సర్వ విద్యలకు పుట్టుక స్థానమైనవాడు. పుట్టుక లేనివాడు. యజ్ఞస్వరూపుడు. అటువంటి మహావిష్ణువును నా వాక్కులనే - అంటే స్తవరాజం అనే - యాగంచేత పూజించాను. ఆ మహావిష్ణువు నా పూజకు సంప్రీతుడై నాకు మోక్షమొసగుగాక!

**క. అని యి ట్లతుల స్తోత్రం । బున హరిఁ బూజించి గంగపుత్రుఁడు మదిలో**
**న నమః కృష్ణాయ యనుచు । వినతశిరస్కుఁ డయి మ్రొక్కె విశ్రుతభక్తిన్. 56**

**ప్రతిపదార్థం:** అని; గంగ పుత్రుఁడు= గంగాసుతుడైన భీష్ముడు; ఇట్లు+అతుల స్తోత్రంబునన్= సాటిలేని స్తవరాజంచేత; హరిన్+పూజించి= శ్రీమహావిష్ణువును పూజించి; మదిలోనన్= మనసునందే; కృష్ణాయ నమః= కృష్ణుడికి నమస్కారం; అనుచున్= అంటూ; వినత శిరస్కుఁడు+అయి= తలవంచినవాడయి; విశ్రుత భక్తిన్= ప్రసిద్ధమైన భక్తితో; మ్రొక్కెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** అని భీష్ముడు సాటిలేని మేటి స్తోత్రంతో శ్రీమహావిష్ణువును పూజించి మనస్సులోనే 'కృష్ణుడికి నా నమస్కార' మంటూ శిరస్సు వంచి, ప్రసిద్ధమైన భక్తితో ప్రార్థించాడు.

**వ. అని పలికె నని చెప్పి వైశంపాయనుం డిట్లనియె. 57**

**తాత్పర్యం:** అని భీష్ముడు తెలిపాడని వైశంపాయనుడు ఇట్లా పేర్కొన్నాడు.

**క. స్తవరాజం బనఁగ ముని । స్తవనీయం బైన యీ వృషాకపి భవ్య**
**స్తవనామృతార్ణవము సం । స్తవనంబున నిచ్చు సుగతి జగతీనాథా! 58**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= జగత్తునకు నాథుడైన ఓ జనమేజయ మహారాజా!; స్తవరాజంబు+అనఁగన్= స్తోత్రాలలో శ్రేష్ఠమైనదనబడే; ముని స్తవనీయంబు+ఐన= మహర్షులచేత స్తుతించదగినదైన; వృషాకపి= శ్రీమహావిష్ణువుయొక్క; భవ్య= శ్రేష్ఠమైన; స్తవన= స్తోత్రమనే; అమృత+అర్ణవము= అమృత సాగరం; సంస్తవనంబునన్= మిక్కిలి స్తుతించుటవలన; సుగతిన్= మోక్షాన్ని; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! ఈ స్తవరాజం మహర్షులచేత స్తుతించదగింది. ఆ శ్రీమహావిష్ణువు శ్రేష్ఠమైన స్తోత్రమనే అమృతసాగరాన్ని సంస్తుతించటం వలన అందరికీ మోక్షం ప్రాప్తిస్తుంది.

**విశేషం:** శరతల్పగతుడైన భీష్ముడు మోక్షార్థమై ఉత్తరాయణం కొరకు వేచిఉండి శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుడిని స్తవరాజమనే ఈ స్తోత్రరాజంతో స్తుతించాడు.

**క. విను జనమేజయ భూవర! । యనుత్తమంబయిన యిమ్మహా స్తవము పఠిం**
**చిన వినినను వ్రాసిన శ్రీ । యును నాయువుఁ బెంపుఁ బేరు నొసఁగు జనులకున్. 59**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ జనమేజయ మహారాజా!; వినుము; అనుత్తమంబు+అయిన= అతిశ్రేష్ఠమైన; ఈ+మహాస్తవము= ఈ స్తవరాజమును; పఠించినన్= చదివినా; వినినన్= విన్నా; వ్రాసినన్= వ్రాసినా; శ్రీయును= సంపదను; ఆయువున్= ఆయుస్సును; పెంపున్= అభివృద్ధిని; పేరును= ప్రఖ్యాతిని; జనులకున్+ఒసఁగున్= ప్రజలకు ప్రసాదిస్తుంది.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! భీష్మకృత మైన అత్యుత్తమమైన ఈ స్తవరాజాన్ని పఠించినా, విన్నా, వ్రాసినా వారికి సంపదను, ఆయుస్సును, పేరు ప్రఖ్యాతులను ప్రసాదిస్తుంది.

**వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె. 60**

**తాత్పర్యం:** అని పలికి, వైశంపాయనుడు మరల ఈ విధంగా అన్నాడు.

**తే. అట్లు హరిఁ బ్రస్తుతించి శాంతాత్మవృత్తి । నూరకున్న శాంతనవుని భూరితేజు**
**న మ్ముకుందునిఁ గీర్తించి రచట నున్న । పరమ మునులు గద్గదికతోఁ గురువరేణ్య! 61**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశశ్రేష్ఠుడైన ఓ జనమేజయ మహారాజా!; అట్లు= పైన పేర్కొన్న రీతిగా; హరిన్= శ్రీమహావిష్ణువును; ప్రస్తుతించి= స్తోత్రం చేసి; శాంత+ఆత్మ+వృత్తిన్= ప్రశాంతమైన మానసిక స్థితిలో; ఊరక+ఉన్నన్= మాట్లాడకుండగా; శాంతనవునిన్= శంతన మహారాజు పుత్రుడైన భీష్ముడిని; భూరితేజున్= అత్యంత తేజశ్శాలిని; ఆ+ముకుందునిన్= ఆ శ్రీమహావిష్ణువును; అచటన్+ఉన్న= అక్కడున్న; పరమ మునులు= ముని శ్రేష్ఠులు; గద్గదికతోన్= డగ్గుత్తికతో; కీర్తించిరి= ప్రస్తుతించారు.

**తాత్పర్యం:** శ్రీమహావిష్ణువును స్తవరాజంతో స్తుతించి ప్రశాంతాత్ముడై మాటాడక ఊరకున్న శాంతనవుడిని, తేజశ్శాలి అయిన శ్రీమహావిష్ణువును, మహామునులు డగ్గుత్తికతో ప్రశంసించారు.

**వ. అంత నిక్కడ. 62**

**తాత్పర్యం:** అంతట ఇక్కడ. (ధర్మరాజాదులతో కూడిన శ్రీకృష్ణు డున్న ప్రదేశంలో)

**ఉ. ఆ దివిజాపగాతనయు నంచిత భక్తికిఁ బ్రీతిఁ బొంది దా**
**మోదరుఁ డప్పు డన్నరవరోత్తముచి త్తమునందు సర్వలో**
**కాదృత దివ్యబోధ మహిమాతిశయం బుదయింపఁ జేయుచుం**
**దా దయతోడ సెజ్జ డిగి ధర్మజుమోమునఁ జూడ్కి పర్వఁగన్. 63**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; దామ+ఉదరుఁడు= శ్రీకృష్ణుడు; ఆ దివిజ+ఆపగా= ఆ దేవతా సంబంధమైన గంగానదియొక్క; తనయు= పుత్రుడి (భీష్ముడి); అంచిత భక్తికిన్= అకుంఠిత భక్తికి; ప్రీతిన్+పొంది= సంతోషించి; ఆ నరవర+ఉత్తము= ఆ రాజశ్రేష్ఠుడైన భీష్ముడియొక్క; చిత్తమునందున్= మనస్సునందు; సర్వలోక= సమస్త జగత్తులచేత ఆదృత= ఆదరింపబడిన; దివ్యబోధ= శ్రేష్ఠమైన జ్ఞానబోధ యొక్క; మహిమ+అతిశయంబు= అతిశయించిన మాహాత్మ్యం; ఉదయింపన్+చేయుచున్= కలిగింపచేస్తూ; తాన్+దయతోడన్= శ్రీకృష్ణుడు కరుణతో; సెజ్జ డిగి= పాన్పునుండి దిగి; ధర్మజుమోమునన్= ధర్మరాజుయొక్క ముఖము నందు; చూడ్కి పర్వఁగన్= చూపులు వ్యాపించగా.

**తాత్పర్యం:** భీష్ముడు శ్రీకృష్ణుడిని ప్రగాఢభక్తితో స్తుతించగా శ్రీకృష్ణుడు పరమానందభరితుడై ఆ భీష్ముడి మనస్సునందు సమస్త లోకాలకు చేసిన ప్రబోధాతిశయాన్ని ప్రసాదిస్తూ దయాంతఃకరణుడై పాన్పునుండి దిగి ధర్మరాజు ముఖ మవలోకించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శ్రీమహావిష్ణువునందు సమస్తలోకాలు ఉన్నాయి. కనుక భీష్మ స్తవరాజం వలన సంప్రీతుడైన శ్రీకృష్ణుడు సమస్తలోకాలకు ఆదర పూర్వకంగా చేసిన దివ్యప్రబోధంయొక్క అతిశయాన్ని చూడగలిగాడు. ఆ వెనువెంటనే ధర్మజుడి ముఖాన్ని అవలోకించాడు.

**వ. 'భీష్ము పాలికిం బోదము ర' మ్మని పలికి కృతపరికరబద్ధుండై వెడలి రథం బెక్కి,సాత్యకిం దన పిఱింది వలనం బెట్టికొనియె; ధర్మనందన ధనంజయు లొక్క తేరును మారుతి నకుల సహదేవు లొక్క యరదంబును గృప యుయుత్సు సంజయు లొక్కస్యందనంబును నెక్కి తదీయంబులగు నేమీ నినాదంబులు దిక్కులం బిక్కటిల్ల నుచిత పరివార పరివృతులై నడచి; ర ట్లరిగి యస్థికేశ బహులంబును బహు ద్విప కుంభ ఖండ నర కపాల పాళి నిబిడంబును నై ప్రేతపత్యనుభూతోజ్ఝితం బైన యాపాన భూభాగంబు ననుకరించు, కురుక్షేత్రంబు దఱియు సమయంబున నయ్యంబుజాక్షుండు పాండవాగ్రజుతోడ. 64**

**ప్రతిపదార్థం:** (శ్రీకృష్ణుడు); భీష్మపాలికిన్+పోదము రమ్ము+అని పలికి= భీష్ముడివద్దకు పోదాం రమ్మని చెప్పి; కృత= చేయబడిన; పరికర= సాధనాలచేత; బద్ధుండు+అయి= ప్రయాణ సన్నద్ధుడయి, వెడలి; రథంబు+ఎక్కి= తేరును ఎక్కి; సాత్యకిన్= తమ్ముడైన సాత్యకిని; తన పిఱింది వలనన్= తన వెనుక; పెట్టుకొనియెన్= కూర్చుండబెట్టుకొన్నాడు; ధర్మనందన ధనంజయులు= ధర్మరాజు, అర్జునుడు; ఒక్కతేరును= ఒక్క రథాన్ని; మారుతి నకుల సహదేవులు= భీముడు, నకుల, సహదేవులు; ఒక్క రథంబును= వేరొక రథాన్ని; కృప యుయుత్సు సంజయులు= కృపుడు, యుయుత్సుడు, సంజయుడు ముగ్గురు; ఒక్క స్యందనంబును= మరొక రథాన్ని, ఎక్కి; తదీయంబులు+అగు= ఆ రథాలయొక్క; నేమీ నినాదంబులు= రథ చక్రాల శబ్దాలు; దిక్కులన్+పిక్కటిల్లన్= దిశలన్నిట అతిశయించగా; ఉచిత పరివార పరివృతులు+అయి= తగిన పరివారంచేత చుట్టబడిన వారై; నడచిరి= వెళ్ళారు; అట్లు+అరిగి= అట్లా వెళ్ళి; అస్థికేశ బహులంబును= ఎముకలు, వెంట్రుకలయొక్క సమూహం కలది; బహు= అనేకములైన; ద్విప= ఏనుగుల యొక్క; కుంభ= కుంభస్థలాలయొక్క; ఖండ= ముక్కలతోను; నర= మనుష్యులయొక్క; కపాలపాళి= పుర్రెల సమూహం చేత; నిబిడంబును+అయి= దట్టంగా వ్యాపించినది అయి; ప్రేతపతి= ప్రేతాలకు అధిపతి అయిన యమధర్మరాజు చేత; అనుభూత= అనుభవించి; ఉజ్ఝితము+అయిన= వదలివేయబడిన; ఆపాన భూభాగంబున్+అనుకరించు= పానభూమి- అంటే మద్యపానశాలవలె కనిపిస్తున్న; కురుక్షేత్రంబు+తఱియు= కురుక్షేత్రాన్ని సమీపించే; సమయంబునన్= ఆ సమయంలో; అంబుజ+అక్షుండు= తామరలవంటి కన్నులు కల ఆ శ్రీకృష్ణుడు; పాండవ+అగ్రజుతోడన్= ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు 'భీష్ముడివద్దకు పోదము ర'మ్మని ధర్మరాజుతో చెప్పి ప్రయాణ సన్నద్ధుడై, రథం అధిరోహించి సాత్యకిని తన రథంలో వెనుకనే కూర్చుండబెట్టుకొన్నాడు. ధర్మరాజు, అర్జునుడు ఇద్దరు ఒక రథంలోనూ, భీమ నకుల సహదేవులు మరొక రథంలోనూ, కృపుడు, యుయుత్సుడు, సంజయుడు మరొక రథంలోనూ, ఎక్కి కూర్చున్నారు. రథాలు వెళ్ళుతూ ఉండగా ఆ వేగానికి రథచక్రాల శబ్దాలు దశదిశల వ్యాపించాయి. తమతోపాటు తగిన పరివారం బయలుదేరి వెళ్ళింది. వెళ్ళుతూ మహాభారత యుద్ధం జరిగిన కురుక్షేత్రాన్ని దర్శించారు. ఆ కురుక్షేత్రం ఎముకలు, వెంట్రుకల సమూహంతోనూ, అనేకమైన ఏనుగుల కుంభస్థలాల ముక్కలతోను, మానవుల కపాలాల సమూహంతోను దట్టమై, యముడు అనుభవించి త్రావి వదలినట్టి పానశాలాప్రదేశాన్ని అనుకరిస్తూ కనిపించింది. అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తే. 'దూరమున నైదు మడువులు దోఁచుచున్న। యవి నరేశ్వర! మును వీనియందుఁ గాదె**
**పరశురాముండు సేసెఁ దర్పణము నృపుల। రక్తమున భూరితర పితృభక్తి వెలయ. 65**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= ఓ ధర్మరాజా! దూరమునన్= దూరంగా; అయిదు మడువులు= ఐదు నీటి కుంటలు; తోఁచుచున్నఅవి= కనిపిస్తున్నాయి; మును= పూర్వం; పరశురాముండు= జమదగ్ని పుత్రుడైన పరశురాముడు; భూరి తరపితృభక్తి=

ప్రగాఢమైన పితృభక్తి; వెలయన్= ఒప్పునట్లు; నృపుల రక్తమునన్= రాజుల రక్తంతో; తర్పణము= పితరులకర్పించే తర్పణం; వీనియందున్= ఈ అయిదు మడుగులలో; చేసెన్+కాదె!= చేశాడు కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఈ కురుక్షేత్రంలో దూరంగా అయిదు మడుగులు కనిపిస్తున్నాయి. పూర్వం పరశురాముడు రాజులపై ఇరవై ఒక్కసార్లు దండెత్తి వెళ్ళి, వాళ్ళను సంహరించి వారి రక్తంతో అత్యంత పితృభక్తిని ప్రకటించి ఈ ఐదుమడుగులలోనే తర్పణం చేసి సంతృప్తు డయ్యాడు కదా!

**విశేషం:** త్రేతా ద్వాపర సంధి యుగంలో ఇరవై ఒక్కమార్లు శత్రుసంహారం చేసి, ఈ ప్రదేశంలో ఐదు మడుగులు చేసి, శత్రువుల రక్తంతో ఈ ఐదు మడుగులలో పితృతర్పణం చేశాడు పరశురాముడు. పితృప్రార్థనంతో పరశురాముడి కోపం ఉపశాంతించటం జరిగింది. అందువలననే ఈ ప్రాంతం శమంతక పంచకమని ప్రసిద్ధి పొందింది. కురుక్షేత్రంలోని భాగ మది.

**మ. క్షితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగా నేకవిం**
**శతి వారంబులు ద్రుంచి యాతఁడు దుదిన్ శాంతత్వముం బొందె సు**
**వ్రతుఁడై' నావుడు నమ్మహీశుఁ 'డతఁ డీ క్రౌర్యంబు సేయంగ నే**
**ల తొడంగెన్? నృపు లెట్లు గల్గి రిల యెల్లం గైకొనం గ్రమ్మఱన్?' 66**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ పరశురాముడు; సువ్రతుఁడు+ఐ= క్షత్రియ సంహారమే వ్రతంగా కలవాడయి; క్షితిన్+ఎందున్+చరియించి= భూమి అంతట తిరిగి; ఏక వింశతి వారంబులు= ఇరవై ఒక్కమారులు; భూపతులన్= రాజులను; నిశ్శేషంబుగాన్= మిగులకుండ; త్రుంచి= చంపి; తుదిన్= చివర; శాంతత్వమున్+పొందెన్= శాంతిని పొందాడు; నావుడున్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; ఆ+మహీశుఁడు= ఆ భూమిపతి అయిన ధర్మరాజు; అతడు+ఈ క్రౌర్యంబు+చేయంగన్= ఆ పరశురాముడు ఈ క్రూర కార్యం చేయటానికి; ఏల తొడంగెన్?= ఎందుకు ప్రయత్నించాడు?; ఇల+ఎల్లన్+కైకొనన్= ఈ భూమినంతటిని గ్రహించటానికి; క్రమ్మఱన్= మరల; ఎట్లు నృపులు కల్గిరి?= ఏ విధంగా రాజులు జన్మించారు? అని ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** పరశురాముడు భూమి నంతటను తిరిగి ఇరవై ఒక్కమారులు రాజులందరిని శత్రుశేషం లేకుండా సంహరించి చిట్టచివరకు శాంతాత్ముడయ్యాడు' అని శ్రీకృష్ణుడు చెప్పగా ధర్మరాజు విని 'ఈ క్రూరకార్యాన్ని పరశురాముడు ఎందుకు చేయవలసి వచ్చింది? క్షత్రియులందరిని సంహరించగా ఎట్లా పునరుజ్జీవితు లయ్యారు? ఈ భూమినంతటిని మళ్ళీ ఎట్లా ఆక్రమించారు?'

**విశేషం:** మూలమందలి ఆరు శ్లోకాలను సంక్షిప్తీకరించి తిక్కన ఈ పద్యంలో పరశురాముడు క్షత్రియ సంహారంచేసిన విషయాన్ని వివరించాడు.

**వ. అనుటయు నచ్యుతుండు 'నప్పరశురామ జన్మప్రపంచంబును, దదీయ క్రోధ కారణంబును, నృపలోక మారణంబును, భూపాల వంశ పునస్సంభవ ప్రకారంబును మునులవలన వినిన చొప్పునం జెప్పెద' నని యజ్ఞనపతి కి ట్లనియె. 67**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అడుగగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ఆ+పరశురామ+జన్మ ప్రపంచంబును= ఆ పరశురాముడి యొక్క జనన వివరణను; తదీయ క్రోధ కారణంబును= ఆయన కోప హేతువును; నృపలోక మారణంబును= రాజ సమూహము యొక్క సంహారాన్ని; భూపాల వంశ= రాజులయొక్క వంశాల యొక్క; పునః+సంభవ ప్రకారంబును= మరల జన్మించిన విధాన్నీ; మునుల వలనన్= మహర్షుల వలన; వినిన చొప్పునన్+చెప్పెదన్= వినిన రీతిగా వివరిస్తాను; అని+ఆ+జనపతికిన్= అని ఆ ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ క్రింది విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు సమాధానంగా శ్రీకృష్ణుడు 'పరశురాముడి జననరీతిని, ఆయనకు కలిగిన కోపహేతువును, రాజ సమూహ సంహారాన్ని, మళ్ళీ రాజులు జనించిన రీతిని మహర్షులవలన విన్న విధానాన్ని చెపుతున్నా'నని ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ బరశురాముని చరిత్రంబు చెప్పుట (సం. 12-49-1)**

**సీ.** **కలఁడు జహ్నుం డనఁగాఁ దొల్లి యొక మహీ । పతి యుజహ్నుండు దత్సుతుఁడు; వాని**
**కుదయించె వల్లభుం డుర్వీశ! యాతని । కొడుకు తపోనిష్ఠఁ గుశికుఁ డింద్రు**
**మెచ్చించి జగముల మేటినాఁ దగుపుత్త్రు । వేఁడిన దాన నవ్విభున కుద్భ**
**వమ్మయి కౌశికుఁ డిమ్మహి గాధి నా । మమ్మునఁ బరగె నమ్మనుజవిభుఁడు**

**తే.** **సత్యవతి యను తన కన్య సంప్రమోద । మున ఋచీకున కిచ్చె; నమ్ముని సుకర్మ**
**నిరతి సంతాన వాంఛమైఁ జరు యుగంబుఁ । దనకు మామకునై కల్పితముగఁ జేసి.** **68**

**ప్రతిపదార్థం:** ఉర్వీశ!= ఓ ధర్మరాజా! తొల్లి= పూర్వం; జహ్నుండు+అనఁగాన్= జహ్నుడనే పేరుతో; ఒక మహీపతి= ఒకరాజు; కలఁడు= ఉండేవాడు; తత్సుతుఁడు ఉజహ్నుండు= ఆతడి కుమారుడు ఉజహ్నుడు; వానికి; వల్లభుండు ఉదయించెన్= అతడికి వల్లభుడనేవాడు జన్మించాడు; ఆతని కొడుకు= ఆ వల్లభుడి కుమారుడు; కుశికుఁడు= కుశికుడనే పేరు కలవాడు; తపః+నిష్ఠన్= తపోనిష్ఠచేత; ఇంద్రున్+మెచ్చించి= దేవేంద్రుడిని మెప్పించి; జగములన్ మేటి నాన్ తగు= లోకంలో అన్నిట సాటిలేని మేటి అనదగిన; పుత్రున్+వేడినన్= కుమారుడిని వేడుకొనగా; దానన్+ఆ+విభునకున్= ఆ ఇంద్రుడి వరంవలన కుశికుడనే రాజునకు; కౌశికుఁడు+ఉద్భవంబు+అయి= కౌశికుడు జన్మించి; ఈ+మహిన్= ఈ భూలోకంలో; గాధి నామంబునన్+పరఁగెన్= గాధి అనే పేరుతో ప్రసిద్ధు డయ్యాడు; ఆ+మనుజ విభుఁడు= ఆ రాజైన గాధి; సత్యవతి+అను= సత్యవతి అనే; తన కన్యన్= తన కూతురును; సంప్రమోదమునన్= అత్యంత ఆనందంతో; ఋచీకునకున్+ఇచ్చెన్= ఋచీకుడనే మునికి ఇచ్చి పెండ్లి చేశాడు; ఆ+ముని= ఆ ఋచీక మహర్షి; సుకర్మ నిరతిన్= ఉత్తమ కర్మాచరణాసక్తితో; సంతాన వాంఛమైన్= సంతానం మీది కోరికతో; చరు యుగంబున్= హవిస్సుల జంటను; తనకున్ మామకున్= తనకు మామకును; కల్పితంబుగన్+చేసి= కల్పించి.

**తాత్పర్యం:** పూర్వం జహ్ను డనే రాజు ఉండేవాడు. అతడి కుమారుడు ఉజహ్నుడు. అతడి పుత్రుడు వల్లభుడు. అతడి కుమారుడు కుశికుడు. ఈ కుశికుడు ఘోరతపం చేసి ఇంద్రుడిని మెప్పించి లోకా లన్నిట సాటిలేని మేటి అయిన పుత్రుడిని ఇమ్మని వేడుకొనగా, ఇంద్రవరం వలన కౌశికుడు ఉద్భవించాడు. అతడే గాధి అనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు. ఈ గాధి తన పుత్రిక అయిన సత్యవతిని సంతోషంగా ఋచీకు డనే ముని కిచ్చి పెండ్లి చేశాడు. ఆ ఋచీకమహర్షి ఉత్తమ తపఃకర్మ లాచరించి సంతానాన్ని వాంఛించాడు. అందుకు తనకే కాక మామకు కూడా సంతానాన్ని ఆశించి హవిస్సుల జంటను కల్పించాడు.

**విశేషం:** 'ఉజహ్నుండు' పాఠాంతరంలో వావిళ్ళ ప్రతిలో అజహ్నుడు అని ఉండగా, మరొక ప్రతిలో ఉజహ్నుడు అని ఉన్నది. మూలంలో మాత్రం 'ఉజహ్నుడు' అని ఉన్నది. కాబట్టి ఆ పాఠమే గ్రహించబడింది. వావిళ్ళ ప్రతిలో పల్లవుడని ఉండగా తక్కిన ప్రతులలో వల్లభుడని ఉన్నది. మూలంలో వల్లభుడని ఉన్నది.

**వ.** **ఆ భృగునందను డచ్చరువులు నిజభార్య ముందట నిడి 'క్షత్రియాజేయుండును క్షత్రియ సూదనుండును నగు క్షత్రియోత్తముం డిచ్చరువున జన్మించు; దీని మీ తల్లికి నిమ్ము; తపోధృతి శమంబుల నుత్కృష్టుండగు ద్విజ శ్రేష్ఠుండు దీని వలనం బుట్టు; నిది నీ వుపయోగింపు' మని వాని నేర్పరించి 'భవజ్జననీ జనకు లిప్పుడు వచ్చెద'**

**రని చెప్పి నదీ స్నానార్థియయి యరిగెం; దదనంతరంబ తదాశ్రమంబునకుం దీర్థయాత్రాపరుండయి గాధి గృహిణీ సహితంబుగాఁ జనుదెంచిన, సత్యవతియు నిజ భర్త గావించిన చరుద్వయంబు మాతకుం జూపి తత్ప్రభావ భేదం బుపన్యసించినం బ్రీత యై యద్దేవి పరమపావనస్నానం బాచరించి చరువుపయోగించు నప్పుడజ్ఞానంబునం దన చరువు కూఁతున కిచ్చి కూతుచరువు దానుపయోగించె; నయ్యువతియుం దలంపులేమి నా లేమ యిచ్చిన భంగిన కుడిచె; నంత భార్గవుండు వచ్చి పత్నిం జూచి దివ్య బోధనంబు నెఱింగి 'క్షత్రియాంతకరం బగు గర్భంబు ధరియించినదాన' వనవుడు నత్తరుణియుఁ దత్పాదంబులకుం బ్రణతయై 'మీ రిట్లానతీఁ దగునె?' యని వడవడ వడంకుచుఁ గేలు మొగిచి నిలిచిన, నత్తపోధనుం డత్తెఱవతో 'నత్తెఱంగు నా తలంపున వచ్చినది గాదు; భవన్మాతృ బుద్ధిహానిం జేసి చరు వ్యత్యాసంబున నయ్యెఁ; నీకుఁ గ్రూరకర్ముండును మహాబలుండును నగు పుత్రుం డుద్భవించు; నా యమకు బ్రహ్మభూతుండు దపోధనుండును నగువా డుదయించు; నేను దపంబున విశ్వబ్రహ్మంబు నచ్చరువున నావహించినవాఁడ'నని పలుకుటయు. 69.**

**ప్రతిపదార్థం:** ఆ భృగు నందనుండు= ఆ భృగు వంశీకుడైన ఋచీకుడనే మహర్షి; ఆ+చరువులు= ఆ రెండు హవిస్సులను; నిజభార్యముందటన్+ఇడి= తన భార్య ముందట ఉంచి; క్షత్రియ+అజేయుండును= రాజులచేత జయింపబడని వాడును; క్షత్రియ సూదనుండును= రాజులను వధించేవాడును; అగు= అయిన; క్షత్రియ+ఉత్తముండు= రాజశ్రేష్ఠుడు; ఈ+చరువునన్= ఈ హవిస్సునందు; జన్మించున్= జన్మిస్తాడు; దీనిన్= ఈ మొదటి హవిస్సును; నీ తల్లికిన్+ఇమ్ము= మీ అమ్మకు ఇమ్ము; తపః+ధృతి శమంబులన్= గొప్ప తపస్సు శాంతులచేత; ఉత్కృష్టుండు+అగు= గొప్పవాడైన; ద్విజశ్రేష్ఠుండు= బ్రాహ్మణోత్తముడు; దీనివలనన్= ఈ మరొక హవిస్సు వలన పుట్టుతాడు; ఇది నీవు+ఉపయోగింపుము= దీనిని నీవు భుజింపవలసిందని; వానిని= ఆ హవిస్సులను; ఏర్పరించి= విభజించి; భవత్+జననీ జనకులు= మీ తల్లిదండ్రులు; ఇప్పుడు వచ్చెదరు= కొద్దిసేపటిలో వస్తారని తెలిపి; నదీ స్నాన+అర్థి+అయి= నదిలో స్నానం చెయ్యటం కొరకు(ఋచీకుడు); అరిగెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; తద్+ఆశ్రమంబునకున్= ఆ ఆశ్రమానికి; తీర్థయాత్రాపరుండు+ఐ= తీర్థయాత్రలలో ఆసక్తి కలవాడై; గాధి= ఋచీకుడి మామ అయిన గాధి; గృహిణీ సహితంబుగాన్= భార్యతోపాటు; చనుదెంచినన్= రాగా; సత్యవతియున్= ఆ దంపతుల పుత్రి అయిన సత్యవతి; నిజభర్త= తన భర్త అయిన ఋచీకుడు; కావించిన= చేసిన; చరుద్వయంబు= హవిస్సుల జంటను; మాతకున్+చూపి= తల్లికి చూపెట్టి; తత్ప్రభావ భేదంబున్+ఉపన్యసించినన్= ఆ హవిస్సుల జంట యొక్క మహిమల భేదాన్ని వివరించగా; ఆ+దేవి= ఆ సత్యవతి తల్లి; ప్రీత+ఐ= సంతుష్ట అయి; పరమపావన స్నానంబు+ఆచరించి= మిక్కిలి పవిత్రమైన స్నానం చేసి; చరువు+ఉపయోగించునప్పుడు= ఆ హవిర్భాగాన్ని ఉపయోగిస్తున్నప్పుడు; న+జ్ఞానంబునన్= తెలివి తక్కువ వలన; తన చరువు కూఁతునకున్+ఇచ్చి= తాను భుజించవలసిన హవిర్భాగాన్ని పుత్రికకు ఇచ్చి; కూఁతు చరువు= కూతురు గ్రహించవలసిన హవిర్భాగాన్ని; తాన్+ఉపయోగించెన్= తాను గ్రహించింది; ఆ+యువతియున్= ఆ సత్యవతియు; తలంపు లేమిన్= గుర్తులేకపోవటంచేత; ఆ లేమ యిచ్చిన భంగిన= ఆ తల్లి ఇచ్చిన విధంగానే; కుడిచెన్= స్వీకరించింది; అంతన్= అంతలోపల; భార్గవుండు వచ్చి= భృగు వంశీకుడైన ఋచీకుడు వచ్చి; పత్నిన్ చూచి= భార్య అయిన సత్యవతిని చూచి; దివ్యబోధనంబునన్+ఎఱింగి= దివ్య జ్ఞానంతో తెలిసికొని; క్షత్రియ+అంతకరంబు+అగు= రాజ వినాశకమైన; గర్భంబున్+ధరించినదానవు= గర్భం ధరించావు; అనవుడన్= అని చెప్పగా; ఆ+తరుణియున్= ఆ సత్యవతి; తద్+పాదంబులకున్= ఆతడి కాళ్ళకు; ప్రణతఅయి= నమస్కరించినదై; మీరు+ఇట్లు+ఆనతి+ఈన్+తగునె?= మీరు ఈ విధంగా అనటం సమంజసం కాదు; అని వడవడ వడంకుచున్= గజగజ వణకుతూ; కేలు మొగిచి= చేతులు జోడించి; నిలిచినన్= నిలువగా; ఆ+తపోధనుండు= తపస్సే ధనంగా కల ఆ ఋచీకుడు; ఆ+తెఱవతోన్= ఆ సత్యవతితో; ఆ+తెఱంగు= ఆ విధం; నా తలంపున వచ్చినది కాదు= నా ఎరుకతో వచ్చినది కాదు (కావాలని చేసినది కాదు); భవత్+మాతృ+బుద్ధిహానిన్+చేసి= నీ తల్లి బుద్ధిలేమితనంవలన; చరు వ్యత్యాసంబునన్+అయ్యెన్= హవిస్సులు మారటం వలన జరిగింది;

నీకున్= నీకు; క్రూర కర్మండును= ఘోరకృత్యాలు చేసేవాడును; మహాబలుండును= మిక్కిలి పరాక్రమవంతుడును; అగు= అయిన; పుత్రుండు= కుమారుడు; ఉద్భవించున్= పుట్టుతాడు; ఆయమకున్= నీ తల్లికి; బ్రహ్మభూతుండు= బ్రహ్మజ్ఞాని; తపోధనుండు= తపస్సే ధనంగా కలవాఁడు; అగువాడు= అయినవాడు; ఉద్భవించున్= పుట్టుతాడు; ఏను= నేను; తపంబునన్= తపస్సుచేత; విశ్వ బ్రహ్మంబున్= పరబ్రహ్మమును; ఆ+చరువునన్= ఆ హవిస్సునందు; ఆవహించినవాఁడను= ప్రవేశపెట్టాను; అని పలుకుటయున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** ఆ ఋచీకుడు రెండు హవిర్భాగాలను, భార్య సత్యవతికి చూపించి 'రాజులచేత జయించబడనివాడు, క్షత్రియ సంహారకుడు అయిన ఉత్తమ క్షత్రియుడు మొదటి హవిర్భాగంవలన జన్మిస్తాడు. ఇది మీ తల్లికి ఇమ్ము. తపస్సంపన్నుడైన బ్రాహ్మణోత్తముడు రెండవ హవిస్సువలన జన్మిస్తాడు. దీనిని నీవు స్వీకరించుము' అని చెప్పి 'త్వరలోనే నీ తల్లిదండ్రులు ఇక్కడకు వస్తా' రని చెప్పి నదీస్నానానికై వెళ్ళిపోయాడు. కొంతసేపటికి తీర్థయాత్రలు చేస్తూ గాధి భార్యాసమేతంగా ఆ ఆశ్రమానికి వచ్చాడు. సత్యవతి ఆ హవిర్భాగాలను చూపి భర్త చెప్పిన విషయాన్ని తెలుపగా తల్లి సంతోషించి, సత్యవతి స్వీకరింపవలసిన హవిస్సును తాను, తాను భుజింపవలసింది సత్యవతి వ్యత్యస్తంగా భుజించారు. ఆ వెనుక ఋచీకుడు వచ్చి బ్రహ్మజ్ఞానంతో 'నీగర్భంలో క్రూరకర్ముడు ఉన్నా' డని చెప్పగా సత్యవతి 'ఇట్లా అనుగ్రహిస్తారా?' అని గజగజ వణికిపోయింది. అప్పుడు ఋచీకుడు తాను ఆ విధంగా భావించ లేదని మీ తల్లి బుద్ధిలేమితనంవల్ల హవిర్భాగాల వ్యత్యస్తం జరిగిందని చెప్పాడు. 'నీకు క్రూరకర్ముడు, మహాబలుడు అయిన పుత్రుడు ఉద్భవిస్తాడు. ఆవిడకు బ్రహ్మజ్ఞాని, తపస్సంపన్నుడైనవాడు పుట్టుతాడు. నేను ఘోరతపస్సుచేసి పరబ్రహ్మను ఆ హవిర్భాగంలో ఆవహింపచేశాను' అని చెప్పాడు.

**క. అమ్ముగ్ధ యతని కిట్లను । 'నిమ్మూఁడు జగములు మీర లితరంబులుగాఁ**
**గ్రమ్మనఁ జేయఁగఁ జాలుదు; । రెమ్మెయి నైనఁ గృపసేయరే నా మీఁదన్. 70**

**ప్రతిపదార్థం:** ఆ+ముగ్ధ= ఆ ముద్దరాలైన సత్యవతి; అతనికిన్+ఇట్లు+అనున్= భర్త అయిన ఋచీకుడితో ఇట్లాఅన్నది; మీరలు= మీరు; ఈ+మూఁడు జగములు= ఈ ముల్లోకాలను; ఇతరంబులుగాన్= వేరుగా; క్రమ్మనన్= వెనువెంటనే; చేయఁగన్+చాలుదురు= చేయగల సమర్థులు; ఏ+మెయిన్+అయినన్= ఏ విధంగా నైనా సరే; నా మీఁదన్= నాపై; కృప చేయరే!= దయ చూపించరా!

**తాత్పర్యం:** వెనువెంటనే ముగ్ధ అయిన సత్యవతి భర్తతో ఇట్లా అన్నది - 'ఈ ముల్లోకాలను మార్చగలిగిన సమర్థులు మీరు. ఏ విధంగానైనా నా మీద దయతో అనుగ్రహించరా!

**వ. క్రూరుండగు కొడుకుం గనుట కోర్వ' ననుటయు ననుగ్రహాతిశయంబున నమ్మహాముని 'యవ్విశేషంబు నా పుత్రునకు లేకుండెడు; బౌత్రునియం దావహిల్లెడు; నీ కెట్లు ప్రియం బట్లకాఁగలయది' యనియె; నట్ల యత్తన్వి తపో నిరతుండును, దాంతుండును, శాంతుండును నైన జమదగ్నిం గనియె; బ్రహ్మర్షి సదృశుం డగు విశ్వామిత్రుని గాధిపత్ని గాంచె. 71**

**ప్రతిపదార్థం:** క్రూరుండు+అగు= భయంకరుడైన; కొడుకున్+కనుటకున్+ఓర్వన్+అనుటయున్= కుమారుడిని పొందటానికి సహించనని సత్యవతి చెప్పగా; అనుగ్రహ+అతిశయంబునన్= అధికమైన దయతో; ఆ+మహాముని= ఆ మహర్షి శ్రేష్ఠుడు; ఆ+విశేషంబు= క్రూరుడై పుట్టే విశేషం; నా పుత్రునకున్ లేకుండెడున్= నా కుమారుడికి లేకుండుగాక!; పౌత్రుని యందున్+ఆవహిల్లెడున్= మనుమని యందు కలుగుతుంది; నీకున్+ఎట్లు ప్రియంబు+అట్లకాన్+కల అది= నీకు ప్రియమైన దేదో అదే రీతిగా జరుగుతుంది; అనియెన్= అని ఋచీకుడు అనుగ్రహించాడు; అట్లు+అ+తన్వి= అదే రీతిగా ఆ సత్యవతి;

తపః+నిరతుండును= తపస్సు నందతిశయమైన ఆసక్తి కలవాడు; దాంతుండును= కర్మేంద్రియ నిగ్రహం కలవాడు (తపః క్లేశాలకు ఓర్చుకొనేవాడు); శాంతుండునున్= కర్మేంద్రియ నిగ్రహం కలవాడు; ఐన= అయినట్టి; జమదగ్నిన్+కనియెన్= జమదగ్ని అనే కుమారుడిని పొందింది; బ్రహ్మర్షి సదృశుండు+అగు= బ్రహ్మవేత్త అయిన మహర్షితో సమానుడైన; విశ్వామిత్రుని= విశ్వామిత్రుడనే పేరు కలిగినవాడిని; గాధి పత్ని+కాంచెన్= గాధి భార్య పొందింది.

**తాత్పర్యం:** క్రూరాత్ముడైన కుమారుడిని పొందటానికి నేను అంగీకరించ నని సత్యవతి చెప్పింది. ఆ మహర్షి సత్తముడైన ఋచీకుడు ఆ క్రూరాత్మత పుత్రుడియందు గాక, మనుమని యందుంటుందనీ, ఆమె కోరిన రీతిగా జరుగుతుందని అనుగ్రహించాడు. అట్లాగే సత్యవతి తపస్సంపన్నుడు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ నిగ్రహం కలవాడు అయిన జమదగ్నిని పుత్రుడిగా పొందింది. గాధి భార్య బ్రహ్మర్షి సమానుడైన విశ్వామిత్రుడిని కన్నది.

**క. జమదగ్ని సర్వ విద్యా। సమేతుఁడు నుదారగుణుఁడుఁ జాపాగమవే**
**దిమతియు నగు రామునిఁ గాం। చె మహీపతి హనన శీలు శిఖినిభమూర్తిన్. 72**

**ప్రతిపదార్థం:** జమదగ్ని= జమదగ్ని మహర్షి; సర్వవిద్యా సమేతుఁడు= సమస్త విద్యలను కలిగినవాడూ; ఉదార గుణుఁడు= ఔదార్యవంతుడూ; చాప+ఆగమవేదిమతియున్= ధనుర్వేదమునందు బుద్ధిమంతుడూ; మహీపతి హనన శీలున్= రాజులను సంహరించగల సమర్థుడూ; శిఖి నిభమూర్తిన్= అగ్ని శిఖతో సమానమైన స్వరూపం కలవాడూ; అగు= అయినట్టి; రామునిన్+కాంచెన్= పరశురాముడిని పుత్రుడిగా పొందాడు.

**తాత్పర్యం:** జమదగ్ని సమస్తవిద్యలను నేర్చినవాడూ, ఉదారస్వభావుడూ, ధనుర్వేదాన్ని గ్రహించిన బుద్ధిమంతుడూ, రాజులను సంహరించగల సమర్థుడూ అగ్ని సమానుడూ అయిన పరశురాముడిని కుమారుడిగా పొందాడు.

**వ. అక్కాలంబునందు హైహయ వంశవరుండు. 73**

**ప్రతిపదార్థం:** ఆ+కాలంబునందున్= అదే కాలంలో; హైహయ వంశవరుండు= హైహయ వంశంలో శ్రేష్ఠుడైనవాడు.

**తాత్పర్యం:** అదే కాలంలో హైహయవంశశ్రేష్ఠుడైనవాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. దుర్జయ విక్రమోజ్జ్వలుఁడు దోష వివర్జిత బుద్ధి కార్తవీ**
**ర్యార్జునుఁ డేడుదీవులు నయాన్విత శూరత నేలుచుండ ధ**
**ర్మార్జనలోల బుద్ధియు మహాస్త్రబలంబు సహస్ర బాహుతా**
**స్ఫూర్జనమున్ వెలుంగఁగ నృపుల్ దన యాజ్ఞఁ దలన్ వహింపఁగన్. 74**

**ప్రతిపదార్థం:** దుర్జయ విక్రమ+ఉత్+జ్వలుఁడున్= జయించటానికి వీలు గాని పరాక్రమంతో ప్రకాశిస్తున్నవాడు; దోష వివర్జిత బుద్ధి= పాపాన్ని వదలిన బుద్ధి కలవాడు (అయిన); కార్తవీర్య+అర్జునుఁడు= కార్తవీర్యార్జును డనే పేరు కలిగిన హైహయరాజు; ధర్మ+ఆర్జన లోల బుద్ధియున్= పురుషార్థాలలో ఒకటైన ధర్మ సంపాదనమునందు ఆసక్తమైన బుద్ధితో; మహా+అస్త్రబలంబున్= గొప్ప బాణవిద్యయొక్క బలంతోను; సహస్ర బాహుతా స్ఫూర్జనమున్= వేయి చేతులు గలిగియుండుటవలని ప్రకాశాతిశయంతోను (స్ఫూర్తితోను); వెలుంగఁగన్= ప్రసిద్ధమై వెలుగగా; నృపుల్= (సామంత) రాజులు; తన ఆజ్ఞన్+తలన్ వహింపఁగన్= ఆ కార్తవీర్యార్జునుడి ఆనతి ఔదల దాల్చగా; నయ+అన్విత శూరతన్= నీతితో కూడిన అంటే నీతిమంతమైన పరాక్రమంతో; ఏడు దీవులు= ఏడు దీవుల రాజ్యాన్ని; ఏలుచుండున్= పరిపాలిస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** శత్రువులకు జయించరానంతటి పరాక్రమంతో ఎట్లాంటి పాపమూ లేనట్టి బుద్ధి సంపన్నుడు అయిన హైహయవంశ రాజు అయిన కార్తవీర్యార్జునుడు ధర్మంలో ఆసక్తమైన బుద్ధిచేతను, అస్త్రవిద్యాబల సంపన్నత చేతను, వేయిచేతుల బలాఢ్యతతోనూ, ప్రకాశిస్తూ రాజులందరూ తన ఆజ్ఞను శిరసావహిస్తుండగా నీతియుత పరాక్రమంతో సప్తద్వీపాలతో కూడిన భూమిని పాలిస్తూ ఉండేవాడు.

**విశేషం:** కార్తవీర్యార్జునుడు; హైహయ వంశీకుడైన కృతవీర్యుడి కుమారుడు కార్తవీర్యుడు. అతడి పేరు అర్జునుడు. కార్తవీర్యార్జునుడు. ఇతడు దత్తాత్రేయుడిని సేవించి, ఆతడి వరప్రసాదంవలన సహస్ర బాహువులు, యుద్ధంలో విజయమేగాని ఓటమిలేనట్లు, వరాలు పొందాడు.

**క.** **ఆ రాజు నగ్నిదేవుఁడు । గారవమున నడుగ నతఁడు గడుఁబెంపున నా**
**హారముగ నిచ్చె గిరినగ । రారణ్య గ్రామ ఖర్వటాదు లతనికిన్.** **75**

**ప్రతిపదార్థం:** అగ్నిదేవుఁడు= సర్వభక్షకుడైన అగ్నిదేవుడు; ఆ రాజున్= హైహయ వంశీకుడైన కార్తవీర్యార్జునుడిని; గారవమున్= గౌరవంతో (ప్రీతితో); అడుగన్= అడుగగానే; అతఁడు+కడున్+పెంపునన్= ఆ కార్తవీర్యార్జునుడు మిక్కిలి అతిశయంతో; అతనికిన్= ఆ అగ్నికి; గిరి నగర+అరణ్య గ్రామ ఖర్వట+ఆదుల్= పర్వతాలు, నగరాలు, అడవులు, గ్రామాలు, అన్ని వృత్తులవాళ్ళు ఉండే పల్లెలు మొదలైన వాటి నన్నింటిని; ఆహారముగన్+ఇచ్చెన్= ఆహారంగా స్వీకరించటానికి ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఒకానొకరోజు క్షుధార్తుడయిన అగ్నిదేవుడు కార్తవీర్యార్జునుడి వద్దకు వెళ్ళి ప్రార్థించగా పర్వతాలు, అరణ్యాలు, పట్టణాలు, గ్రామాలు, వృత్తిపనులవా ళ్ళుండే పల్లెటూళ్ళు అగ్నిదేవుడికి ఆహారంగా ఇచ్చాడు.

**వ.** **ఇచ్చిన నగ్నిదేవుం డాహారంబుగాఁ గొను తరువాత మిత్రావరుణనందను నాశ్రమకాననం బతండు లేని సమయంబున సమసిన నమ్మహాత్ముం డెఱింగి వచ్చి యా సర్వభక్షకునకు రక్షణం బాచరించుచు వర్తించు కార్తవీర్యునిం గని కనలి 'నీవు మదీయ తపోవనంబు పరిహరింపక గహన సామాన్య బుద్ధిం గాల్చితి; నీ బాహులు రాముండు నఱకువాఁ'డని శాపం బిచ్చె; సహస్రబాహుండును దానికి విషాదంబు నొంది యధిక తాత్పర్యంబుతో ధర్మకార్యంబుల నడుపుచుండె.** **76**

**ప్రతిపదార్థం:** ఇచ్చినన్= కార్తవీర్యార్జునుడు దానమివ్వగా; అగ్నిదేవుండు+ఆహారంబుగాన్= సర్వభక్షకుడైన అగ్నిదేవుడు ఆహారంగా; కొను తరువాత= స్వీకరించిన వెనుక; మిత్రావరుణ నందనున్= మిత్రావరుణుల యొక్క కుమారుడు (వసిష్ఠ మహర్షి); ఆశ్రమ కాననంబు= ఆశ్రమాటవి; అతండు లేని సమయంబునన్= అతడు లేని సమయంలో; సమసినన్= నాశనమై పోగా; ఆ+మహాత్ముండు= ఆ మహర్షి వసిష్ఠుడు; ఎఱింగి వచ్చి= తెలిసికొని వచ్చి; ఆ సర్వభక్షకునకున్= సర్వాన్ని తినే వాడైన అగ్నికి; రక్షణంబు+ఆచరించుచున్= కాపాడుతూ; వర్తించు= నడుచుకొంటున్నటువంటి; కార్తవీర్యునిన్+కని= కార్తవీర్యార్జునుడిని చూచి; కనలి= కోపించి; నీవు= (కార్తవీర్యార్జునుడు); మదీయ తపోవనంబు= నా ఆశ్రమాన్ని; పరిహరింపక= వదలిపెట్టక; గహన సామాన్య బుద్ధిన్= సాధారణ అరణ్యమనే భావనతో; కాల్చితి(వి)= కాల్చివేశావు?; నీ బాహులు= నీ వేయి చేతులు; రాముండు నఱకువాఁడు+అని= పరశురాముడు ఖండిస్తాడని; శాపంబు+ఇచ్చెన్= శపించాడు; సహస్ర బాహుండును= వెయ్యి చేతులుగల కార్తవీర్యార్జునుడును; దానికిన్= అందుకు; విషాదంబున్+ఒంది= దుఃఖించి; అధిక తాత్పర్యంబుతోన్= ముందుకంటె మరింత అభినివేశంతో; ధర్మకార్యంబులన్= ధర్మగుణంతో సమస్తమైన పనులను; నడుపుచుండెన్= చేస్తూ ఉండేవాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు యాచించగానే కార్తవీర్యార్జునుడు సమస్తమూ ఇచ్చివేయగా, ఆహారంగా స్వీకరించాక వసిష్ఠాశ్రమాన్ని సైతం అతడు లేని సమయాన అగ్నిదేవుడు సమస్తమూ భక్షించాడని తెలిసికొన్న వసిష్ఠమహర్షి

అగ్నిదేవుడికి రక్షకుడైన కార్తవీర్యార్జునుడిని చూచి మిక్కిలి కోపించి, 'నీవు తపోవనాన్ని మిగల్చకుండా సామాన్యమైన అరణ్యంగా భావించి కాల్పించావు. పరశురాముడు నీ బాహువులను ఖండిస్తా'డని శాపమివ్వగా అందుకు కార్తవీర్యార్జునుడు దుఃఖించినప్పటికి మరింత అభినివేశంతో ధర్మకార్యాలు నిర్వర్తిస్తూనే వచ్చాడు.

**క. శాపము గారణముగ నా । భూపతి కవినీతులైన పుత్రులు సబలా**
**టోపాత్ములు పలువురు సిం । హోపములు జనించి ధాత్రి నుద్ధటవృత్తిన్. 77**

**ప్రతిపదార్థం:** శాపము కారణముగన్= వసిష్ఠుని యొక్క శాపకారణంచేత; ఆ భూపతికిన్= ఆ రాజైన కార్తవీర్యార్జునుడికి; సబల+ఆటోప+ఆత్ములు= బలంతో కూడి ఉండటం వలన వేగిరపాటు కల బుద్ధితో ఉన్నవారు; సింహ+ఉపములు= సింహాలతో సమానమైనవారు; పలువురు= అనేకులు; జనించి= పుట్టి; ధాత్రిన్= భూమిపై; ఉద్భట వృత్తిన్= భయంకరమైన నడవడితో.

**తాత్పర్యం:** వసిష్ఠుడు ఇచ్చిన శాపం మూలంగా కార్తవీర్యార్జునుడికి నీతిలేనివారు, అత్యంత బలం వలన వేగిరపాటు కలవారు, సింహ పరాక్రములు అయిన అనేక పుత్రులు జన్మించారు. పుట్టి భూమిని భయంకర వృత్తితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** దహించివేయబడిన ఆశ్రమంవలె కార్తవీర్యార్జునుని వేయి చేతులు ఖండించబడతాయని వసిష్ఠుడి శాపం. కాని, శాపం కారణంగా అని తిక్కన మూలంలో లేని శాపకారణాన్ని పేర్కొన్నాడు. అందువలననే దుర్మార్గులైన అనేక పుత్రులు కార్తవీర్యార్జునుడికి కలిగారు. బహుశః వినీతుడైన కార్తవీర్యార్జునుడికి నాశముండదని, అందువలననే అవినీతులైన పుత్రులు జన్మించారని తిక్కన భావించి ఉండవచ్చును.

**వ. ఎందునుం జరియించు వా రొక్కనాఁడు జమదగ్ని యాశ్రమంబునకుం బోయి యతండునుం జామదగ్న్యుండును నయ్యెడ లేకుండ హోమధేనువును వత్సంబునుం దమ మందిరంబునకుం గొనివచ్చి; రిట్లు దెచ్చుట సహస్ర బాహుం డెఱుంగఁడు. 78**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకనొక రోజు; ఎందునున్+చరియించువారు= (పెరిగి పెద్దవారైన కార్తవీర్యార్జునుడి పుత్రులు) ఎక్కడెక్కడో తిరుగుతూ; జమదగ్ని+ఆశ్రమంబునకున్+పోయి= జమదగ్ని మహర్షి తపోవనానికి వెళ్ళి; అతండునున్+జామదగ్న్యుండునున్= ఆ జమదగ్నియు ఆతని కుమారుడైన పరశురాముడూ; ఆ+ఎడన్= ఆ తపోవనంలో; లేక+ఉండన్= లేకుండగా; హోమధేనువును= యాగ సంబంధమైన ఆవును; వత్సంబునున్= దాని దూడను; తమ మందిరమునకున్= వారి అంతఃపురానికి; కొనివచ్చిరి= పట్టి తెచ్చారు; ఇట్లు తెచ్చుటన్= ఈ విధంగా తీసికొనిరావటం; సహస్ర బాహుండు+ఎఱుంగఁడు= వేయి చేతులు కల కార్తవీర్యార్జునుడికి తెలియదు.

**తాత్పర్యం:** కార్తవీర్యార్జునుడి పుత్రులు ఎక్కడెక్కడో తిరిగి, జమదగ్ని తపోవనానికి వెళ్ళి, జమదగ్నీ అతని కుమారుడైన పరశురాముడూ లేని సమయంలో వారి యాగధేనువును, దూడను పట్టి తెచ్చి తమ అంతఃపురంలో కట్టివేశారు. ఈ తెచ్చిన విషయం కార్తవీర్యార్జునుడికి తెలియదు.

**క. అట రాముఁ డెఱిఁగి పరమో । ద్భట మగు కోపమునఁ జాప పరశుముఖ మహో**
**త్కట శస్త్రాస్త్రంబులతోఁ । బటుగతి వచ్చెను సహస్రబాహుని మీఁదన్. 79**

**ప్రతిపదార్థం:** అటన్= ఆ తపోవనంలో; రాముఁడు+ఎఱిఁగి= పరశురాముడు తెలిసికొని; పరమ+ఉద్భటము+అగు= మిక్కిలి సంభ్రమంతో కూడిన; కోపమునన్= కోపంతో; చాప పరశు ముఖ మహా+ఉత్కట శస్త్ర+అస్త్రంబులతోన్= విల్లు, గండ్రగొడ్డలి

మొదలైన అత్యంత భయంకరమైన ఆయుధాలు మంత్ర పూతమైన బాణాలతో; సహస్ర బాహుని మీఁదన్= కార్తవీర్యార్జునుడి పైకి; పటుగతిన్= మిక్కిలి ఉద్ధతితో; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆశ్రమంలో తాములేని సమయంలో యాగధేనువును, దూడను దుర్మార్గులైన కార్తవీర్యార్జునుడి పుత్రులు తీసికొనిపోయారన్న విషయాన్ని తెలిసికొని పరశురాముడు సంభ్రమంతో కూడిన కోపంతో ధనుస్సు, గండ్రగొడ్డలి మొదలైన శస్త్రాస్త్రాలతో కార్తవీర్యార్జునుడిపైకి ఉద్ధతుడై దాడికి వెళ్ళాడు.

### పరశురాముఁడు కార్తవీర్యార్జునునిఁ జంపుట (సం. 12-49-41)

**ఆ. వచ్చి ముట్టి కయ్య మిచ్చిన నవ్విభు । నొంచి బాహు వనముఁ జంచ దుగ్ర**
**పరశు ఘోరధారపాల్ సేసి పోయి ని । జేచ్ఛ నుండె మేదినీశవర్య! 80**

**ప్రతిపదార్థం:** మేదినీ+ఈశవర్య!= భూమికి అధిపతులైన వారిలో శ్రేష్ఠుడైన ఓ జనమేజయ మహారాజా!; వచ్చి= క్రుద్ధుడై వచ్చిన పరశురాముడు; ముట్టి= ఎదుర్కొని; కయ్యము+ఇచ్చినన్= యుద్ధం చేసి; ఆ+విభున్+నొంచి= ఆ రాజైన కార్తవీర్యార్జునుడిని బాధించి; బాహువనమున్= చేతులనే అరణ్యాన్ని; చంచత్+ఉగ్ర పరశు ఘోరధార పాల్+చేసి పోయి= ప్రకాశిస్తున్న భయంకరమైన గండ్రగొడ్డలియొక్క వాడి అయిన వాదరకు బలిచేసి తిరిగిపోయి; నిజ+ఇచ్ఛన్+ఉండెన్= స్వేచ్ఛగా ఉండిపోయాడు.

**తాత్పర్యం:** జమదగ్ని అతడికుమారుడు పరశురాముడూ ఆశ్రమంలో లేని సమయంలో ధేనువును, దూడను బలాత్కారంతో తెచ్చి అంతఃపురంలో ఉంచుకొన్నాడు కార్తవీర్యార్జునుడు. ఆ సంగతి తెలిసిన పరశురాముడు కుపితుడై కార్తవీర్యార్జునుడిపై దండెత్తిపోయి తన పరశువుతో అతడిని సంహరించి యాగధేనువును, దూడను గ్రహించి తిరిగి ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

**చ. అతఁడు సమిత్కుశాభిహరణార్థము గానకు నేఁగియుండఁగా**
**నతి కుపితాత్ము లై కడఁగి యర్జునుసూనులు వోయి ముట్టి త**
**త్పితృశిరమున్ వెసం దునిమి ప్రీతిమెయిం జనుదెంచి; రమ్మహో**
**ద్ధతుఁ డట వచ్చి వారి చరితం బెఱిఁగెం దమ తల్లి సెప్పఁగన్. 81**

**ప్రతిపదార్థం:** అతఁడు= పరశురాముడు; సమిత్+కుశ+అభిహరణ+అర్థము= సమిధలను, దర్భలను తీసికొని రావటం కొరకు; కానకున్+ఏఁగి+ఉండఁగాన్= అడవికి వెళ్ళి ఉండగా; అర్జును సూనులు= కార్తవీర్యార్జునుడి పుత్రులు; అతి కుపిత+ఆత్ములు+ఐ= మిక్కిలి కోపంతో కూడిన మనస్సు కలవారై; కడఁగి= పూనికతో జమదగ్ని ఆశ్రమానికి పోయి; ముట్టి= ఎదుర్కొని; తద్+పితృశిరమున్= ఆ పరశురాముడి తండ్రి జమదగ్ని యొక్క తలను; వెసన్+తునిమి= వెంటనే ఖండించి; ప్రీతిమెయిన్+చనుదెంచిరి= సంతోషంతో తిరిగి వచ్చారు; ఆ+మహా+ఉద్ధతుఁడు= ఆ పరాక్రమ వంతుడైన పరశురాముడు; అటన్+వచ్చి= ఆశ్రమానికి తిరిగివచ్చి; తమ తల్లి+చెప్పఁగన్= పరశురాముడి తల్లి రేణుకాదేవి చెప్పగా; వారి చరితంబు+ఎఱింగెన్= కార్తవీర్యార్జునుడి పుత్రుల దుర్మార్గ చరిత్రను తెలిసికొన్నాడు.

**తాత్పర్యం:** సమిధలు, దర్భలు తీసికొని రావటానికై అరణ్యానికి పరశురాముడు వెళ్ళి ఉండగా, కార్తవీర్యార్జునుడి పుత్రులు క్రోధాత్ములై ఆ ఆశ్రమానికి వెళ్ళి, జమదగ్ని తల నరికి హాయిగా వెనుదిరిగి వచ్చారు. అప్పుడు పరాక్రమ సంపన్నుడైన పరశురాముడు ఆశ్రమానికి తిరిగివచ్చి దుష్టులైన కార్తవీర్యార్జునుడి పుత్రులు చేసిన పనిని తల్లివలన తెలిసికొన్నాడు.

**వ. అ ట్లెఱింగి.** **82**

**తాత్పర్యం:** ఆ విధంగా తెలిసికొని - (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. రాముం డుద్ధత రోషపావక శిఖాప్రస్ఫీతుఁడై తున్ముదున్**
**భూమీశాలిఁ గుఠారధార నని విస్ఫూర్జద్గతిన్ హైహయ**
**స్తోమంబాదిగఁ జొచ్చి రాజకులముం దున్మాడి చేసెన్ సము**
**ద్దామ క్రీడను రౌద్ర మొప్ప నిల రక్తస్యంద సంసిక్తఁగన్.** **83**

**ప్రతిపదార్థం:** రాముండు= పరశురాముడు; ఉద్ధత రోషపావక శిఖా ప్రస్ఫీతుఁడు+ఐ= ఎక్కువైన కోపమనే అగ్ని శిఖలతో ప్రకాశిస్తున్న వాడై; భూమీ+ఈశ+ఆలిన్= రాజుల సమూహాన్ని; కుఠారధారన్= గండ్రగొడ్డలి వాదరచేత; తున్ముదున్+అని= సంహరిస్తానని; విస్ఫూర్జత్+గతిన్= అత్యంతం ప్రకాశించేవేగంతో; హైహయ స్తోమంబు+ఆదిగన్= హైహయ రాజ సమూహం మొదలుకొని; చొచ్చి= చంపటానికి ప్రవేశించి; రాజకులమున్ తున్మాడి= సమస్త రాజ సమూహాలను సంహరించి; రౌద్రము+ఒప్పన్= వీరోచితంగా; సమ్+ఉద్దామ క్రీడను= ఏ మాత్రం ఎదురులేని ఆటగా; ఇలన్= భూమి; రక్తస్యంద సంసిక్తఁగన్= రక్తం చిందించటంచేత తడిసి పోయేటట్లుగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** తన తండ్రి తలను కార్తవీర్యార్జునుడి పుత్రులు నరికివెళ్ళిన సంగతి తెలిసిన పరశురాముడు అత్యంత భయంకరమైన అగ్నిశిఖవలె జాజ్వల్యమానంగా వెలుగొందుతూ, తన గండ్రగొడ్డలితో సమస్త క్షత్రియ సమూహాన్ని సంహరిస్తానంటూ వెళ్ళి హైహయ వంశరాజులను మొదలుకొని సమస్త క్షత్రియ రాజులను తుదముట్టించి అత్యంత రౌద్రంతో రాజుల రక్తంతో భూమిని తడిపివేశాడు.

**విశేషం:** తిక్కన అలతి అలతి పదాలతో రచించటమే అతని సహజశైలి. అయినా, వీర రసోదంచితంగా శార్దూల వృత్తంలో శబ్దఝుడితిని పరశురాముడి కుఠారం ఝుళిపించినట్లు రౌద్రోచితంగా రచించటం తిక్కన "రసాభ్యుచిత బంధం''.

**వ. ఇట్లు సేసి పరమకృపావిష్ట హృదయుండై తపోవనంబునకుం జనియెఁ; బదంపడి బహువత్సరంబులు సనిన విశ్వామిత్ర పౌత్రుండైన పరావసు వనురాజు దుర్వినీతుండై గర్వోద్రేకంబునం బరశురాము నధిక్షేపించి, రాజులకు వెఱచి డాఁగి యున్నవాఁడ వని విశిష్ట జన సన్నిధిం బలికి బాల వృద్ధ భావంబున నుపేక్షితులై యతని చేత మున్నుచావక యున్న ప్రతర్దనాదుల నుగ్గడించి.** **84**

**ప్రతిపదార్థం:** ఇట్లు+చేసి= ఈ విధంగా భయంకరమైన రాజ సంహారం చేసి; పరమకృపా+ఆవిష్ట+హృదయుండు+ఐ= అత్యున్నతమైన దయతో కూడిన హృదయం కలవాడై; తపః+వనంబునకున్= తపస్సుకొరకైన అరణ్యానికి; చనియెన్= వెళ్ళిపోయాడు; పదంపడి= ఆ తరువాత; బహువత్సరంబులు+చనినన్= అనేక సంవత్సరాలు గడిచిపోగా; విశ్వామిత్ర పౌత్రుండు+ఐన= విశ్వామిత్రుడియొక్క మనుమడైన; పరావసువు+అనురాజు= పరావసువనే పేరుగల రాజు; దుః+వినీతుండు+అయి= దుష్టనీతిగలవాడై; గర్వ+ఉద్రేకంబునన్= పొగరుమోతు తనంతో కూడిన కోపంతో;పరశురామున్+అధిక్షేపించి= పరశురాముడిని హేళనచేసి; రాజులకున్ వెఱచి= రాజులకు భయపడి; డాఁగి+ఉన్నవాఁడవు= తపోవనంలో ఎట్లా దాక్కొన్నావు అని; విశిష్టజన సన్నిధిన్+పలికి= ఉత్తమ జనుల ఎదుట చెప్పి; బాలవృద్ధ భావంబునన్= పసిపిల్లలు, ముది వగ్గులు అనే భావంతో; ఉపేక్షితులు+అయి= లెక్కచేయబడనివారయి; అతని చేతన్= ఆ పరశురాముడిచేత; మున్ను చావకఉన్న= ముందు చావకుండా బ్రతికి ఉన్నట్టి; ప్రతర్దన+ఆదులన్= ప్రతర్దనుడనే రాజు మొదలైనవారిని; ఉగ్గడించి= చెప్పి.

**తాత్పర్యం:** పరశురాముడు సమస్త రాజ సంహారం చేసి ఆ తరువాత మిక్కిలి దయాంతఃకరణుడై తపస్సు నిమిత్తం ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. తరువాత అనేక సంవత్సరాలు గడచిపోయాయి. ఆ వెనుక విశ్వామిత్రుడి మనుమడైన పరావసువు అనే రాజు నీతిమాలినవాడై గర్వంతో ఉద్రేక పూరితుడై, చేసిన ప్రతిజ్ఞను మరచి రాజులకు భయపడి తపోవనంలో దాక్కొన్నాడని ఆర్యుల ఎదుట పరశురాముడిని పరిహసించాడు. చిన్న పిల్లలు, ముసలివాళ్ళనే భావంతో అప్పుడు సంహరించక వదలిపెట్టబడిన ప్రతర్దనుడు మొదలైన రాజులను ఉదాహరించి చెప్పాడు.

**ఆ. 'నృపులు గారె వారు? నీవు మిధ్యా ప్రతి । జ్ఞాభిమాని' వనుడు నతఁడు మగుడ**
**రోషమెత్తి కడఁగి క్రూరత నాబాల । వృద్ధముగ నరేంద్ర వితతి నఱకె. 85**

**ప్రతిపదార్థం:** వారు; నృపులు+కారె?= పైన పేర్కొన్న ప్రతర్దనాదులు రాజులు కారా?; నీవు= ఓ పరశురామా! నీవు; మిథ్యా ప్రతిజ్ఞా+అభిమానివి+అనుడున్= అసత్యమైన ప్రతిజ్ఞయందు అభిమానం కలవాడవు (ప్రతిజ్ఞచేసి నెరవేర్చుకొనలేనివాడవు); అనుడున్= అని పరావసువు పలుకగా; అతఁడు= ఆ పరశురాముడు; మగుడన్= మరల; రోషము+ఎత్తి= కోపంవచ్చి; కడఁగి= ప్రయత్నించి; ఆ బాల వృద్ధముగన్= పిల్లలు మొదలుకొని ముసలి వాళ్ళవరకు; నర+ఇంద్ర+వితతిన్= రాజశ్రేష్ఠుల సమూహాన్ని; క్రూరతన్= మిక్కిలి క్రూరభావంతో; నఱకెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** 'ప్రతర్దనుడు మొదలుకొని ఉన్న వారందరు రాజులు కారా? చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకొనలేని వాడవు అని పరావసు డనే రాజు పలుకగా, పరశురాముడు కోపోద్రిక్తుడై బాలురు వృద్ధులు అని లెక్కచేయక సమస్త రాజ లోకాన్ని క్రూరాత్ముడై సంహరించాడు.

**వ. గర్భంబుల నున్న యర్భకులను మఱియు వివిధ ప్రకారంబులఁ బోరం దప్పిపోయి పుడమి యేలు రాజులం గాలాంతరంబుల వెదకి వెదకి వధియించె; నిట్లిరువది యొక్క మాఱు నేల నిః క్షత్రంబు గావించి యశ్వమేధ యాగంబు సేసి, దక్షిణగా నీ క్షితి యంతయుం గశ్యపున కిచ్చెఁ; బదంపడి యమ్ముని యా జామదగ్న్యుతో ని ట్లనియె.** 86

**ప్రతిపదార్థం:** గర్భంబులన్+ఉన్న+అర్భకులను= తల్లుల కడుపులందున్న పసికూనలను; మఱియున్= అంతేకాక; వివిధ ప్రకారంబులన్= అనేక రీతులుగా; పోరన్+తప్పిపోయి= యుద్ధంలో తప్పించుకొనిపోయి; పుడమి+ఏలు రాజులన్= భూమినేలుతున్న రాజులను; కాల+అంతరంబులన్= వివిధ కాలాలలో; వెదకి వెదకి= రాజులను వెదకి వెదకి; వధియించెన్= సంహరించాడు; ఇట్లు+ఇరువది ఒక్కమాఱు= ఈ విధంగా ఇరవై ఒక్కసార్లు; నేలన్= భూమిని; నిః+క్షత్రంబు కావించి= రాజులు లేకుండా చేసి; అశ్వమేధ యాగంబు+చేసి= అశ్వమేధ మనే యజ్ఞాన్ని చేసి; ఈ క్షితి+అంతయున్= ఈ భూమినంతటిని; కశ్యపునకున్= కశ్యప ప్రజాపతికి; దక్షిణగాన్+ఇచ్చెన్= దానం చేశాడు; పదంపడి= ఆ తరువాత; ఆ+ముని= ఆ కశ్యప ప్రజాపతి; ఆ జామదగ్న్యుతోన్= ఆ జమదగ్ని కుమారుడైన పరశురాముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** తల్లుల గర్భాల్లో ఉన్న శిశువులను అనేక రీతులుగా యుద్ధంలో తప్పించుకొనిపోయి రాజ్యమేలుతున్న రాజులను అనేక సంవత్సరాలపాటు వెదకి వెదకి పరశురాముడు సంహరించాడు. ఆ విధంగా ఇరవై ఒక్కసార్లు ఈ భూమిపై రాజులు లేకుండా చేసి అశ్వమేధయాగం చేసి, ఈ భూమినంతటిని కశ్యప ప్రజాపతికి దానమిచ్చాడు. ఆ కశ్యపుడు పరశురాముడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అశ్వమేధ యాగంబున నవని యెల్ల । నాకు దక్షిణగా నిచ్చినాఁడ; వింక**
**నాధిపత్యంబు నీకు లే దరుగు దక్షి । ణాబ్ధిపారదేశమునకు నసఘచరిత! 87**

**ప్రతిపదార్థం:** న+అఘ చరిత్ర!= ఓ పాప రహితుడైన పరశురామా!; అశ్వమేధ యాగంబునన్= అశ్వమేధయాగంలో; అవని+ఎల్లన్= భూమినంతటిని; నాకున్ దక్షిణగాన్+ఇచ్చినాఁడవు= నాకు దానం చేశావు; ఇంకన్= ఇక మీదట; నీకున్; ఆధిపత్యంబు= అధికారం; లేదు= లేదు; దక్షిణ+అబ్ధి+పారదేశమునకున్= దక్షిణ సముద్రతీర దేశానికి; అరుగు= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన ఓ పరశురామా! అశ్వమేధయాగం చేసి ఈ భూమినంతటిని నాకు దానం చేశావు. ఇంక ఈ భూమిమీద నీకు అధికారం లేదు. కాబట్టి దక్షిణసముద్రం హద్దుగా కలిగిన ప్రదేశానికి వెళ్ళుము' అని కశ్యపప్రజాపతి పలికాడు.)

**వ. అని పలికి యెందేని నేమేనియుం దెఱంగున శేషించినరాజ పింఛంబునకు నిశ్శేషత్వంబు వాటిల్లకుండం బరిహరించు బుద్ధిం బలికిన నప్పురుష సింహుండు 'నట్ల కాక' యని పోవ, నతని వలని వెఱపున నవ్వలని సముద్రుండు శూర్పాకార ప్రదేశంబు బెరయం గొంతదేశం బతనికి విహారస్థానంబు గావించె; నివ్విధంబునం గశ్యప మునీంద్రుండు పరిగ్రహించి భూమి భూసుర ప్రకరంబుల కిచ్చి తపోవనంబున కరిగె; భూమియు నతనిపేరఁ గాశ్యపి యన నెగడెఁ; గొండొక కాలంబునకు వైశ్య శూద్ర ప్రముఖులు దర్పితులై వివిధ ప్రకారంబుల విప్రదారధన ధాన్యాదు లపహరింపం దొడంగిరి. 88**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఎందున్+ఏనిన్+ఏమి+ఏనియున్+తెఱంగునన్= ఎక్కడైనా ఎట్లాంటి విధంగానైనా; శేషించిన= మిగిలిన అంటే పరశురాముడు వధించగా మిగిలిన; రాజ పింఛంబునకున్= రాజుల సమూహానికి; నిఃశేషత్వంబు+పాటిల్లకుండన్= ఏ మాత్రమూ మిగులు లేకుండాపోవటాన్ని; పరిహరించుబుద్ధిన్+పలికినన్= నివారించదలచి చెప్పగా; ఆ+పురుష సింహుండు= పురుషులలో శ్రేష్ఠుడైన ఆ పరశురాముడు; అట్లకాక+అనిపోవన్= అట్లాగేనని పోగా; అతని వలని వెఱపునన్= ఆ పరశురాముడి వలన భయంతో; ఆ+వలని= దక్షిణ దిక్కునందలి; సముద్రుండు= సాగరుడు; శూర్ప+ఆకార ప్రదేశంబు బెరయన్= చేట ఆకారంతోటి స్థలం కలిగిన; కొంత దేశంబు= కొంత భూమిని; అతనికిన్= ఆ పరశురాముడికి; విహార స్థానంబు+కావించెన్= మసలటానికి తగిన ప్రదేశంగా చేశాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; కశ్యపముని+ఇంద్రుండు= మహర్షి శ్రేష్ఠుడైన కశ్యపుడు; పరిగ్రహించి= పరశురాముడి వలన దానంగా పొంది; భూమిన్= భూమినంతటిని; భూసుర ప్రకరంబులకున్+ఇచ్చి= బ్రాహ్మణ సమూహాలకు ఇచ్చి; తపః+వనంబునకున్+అరిగెన్= తపస్సుకై వనానికి వెళ్ళిపోయాడు; భూమియున్= (అప్పటి నుండి) ఈ భూమి; అతని పేరన్= ఆ కశ్యప ప్రజాపతి దానంగా గ్రహించి రాజులకు ఇవ్వటం వలన; కాశ్యపి+అనన్+నెగడెన్= కాశ్యపి అని ప్రసిద్ధి పొందింది; కొండొక కాలంబునకున్= కొంతకాలానికి; వైశ్య శూద్ర ప్రముఖులు= వైశ్యులలో, శూద్రులలో ముఖ్యులైన వాళ్ళు; దర్పితులు+ఐ= గర్వించి; వివిధ ప్రకారంబులన్= అనేక రీతులుగా; విప్రదార ధన ధాన్య+ఆదులన్= బ్రాహ్మణుల భార్యలూ, ధనమూ, ధాన్యమూ మొదలైన వాటిని; అపహరింపన్+తొడంగిరి= దొంగిలించ నారంభించారు.

**తాత్పర్యం:** కశ్యపప్రజాపతి అవశేషం లేకుండా రాజలోకం నశించి పోతుందేమోనన్న శంకతో దానంగా నా కిచ్చిన రాజ్యంపైన నీకు అధికారం లేదని పరశురాముడిని దక్షిణసముద్రం ఎల్లగా ఉన్న ప్రదేశంలోని తపోవనానికి పొమ్మన్నాడు. అదేరీతి అతడు వెళ్ళిపోయాడు. పరశురాముడివలన భయంతో దక్షిణసముద్రుడు అతడు విహరించటానికి చేట ఆకారంతో కొంత భూమి నిచ్చాడు. పరశురాముడి వలన దానంగా పొందిన భూమి నంతటిని బ్రాహ్మణుల సమూహానికి సమర్పించి, కశ్యపుడు తపోవనానికి వెళ్ళిపోయాడు. అప్పటి నుండి భూమి 'కాశ్యపి' అనే ప్రసిద్ధి పొందింది. కొంత కాలానికి వైశ్య శూద్రులలో శ్రేష్ఠులైన వాళ్ళు మిక్కిలి గర్వించి అనేక రీతులుగా బ్రాహ్మణుల భార్యలను, ధనధాన్యాలను మొదలైన వాటిని దొంగిలించటం మొదలు పెట్టారు.

**సీ.** **పదపడి విప్రులు పథము దప్పి వధంబు । మద్యపానంబు సన్మార్గ వర్తు**
**లైన సాధుల ధన మపహరించుటయును । మొదలుగాఁగ నకృత్యములకుఁ జొచ్చి**
**రధ్వరాదిక సత్క్రియల్ ప్రవర్తింపక । తెక్కలిబంది యే దిక్కులందు**
**దఱుచయ్యె నిమ్మెయి ధర్మంబు సెడి యధ । ర్మంబు వర్తించి యరాజకత్వ**

**ఆ.** **దోష జాతమైన దురిత బాహుళ్యంబు । గుతిలపెట్ట భూమి యతలమునకుఁ**
**బోవ నెఱిఁగి కశ్యపుఁడు నిజోరువు నెఱి । గ్రుచ్చి దాపు గాఁగ నిచ్చి యెత్తె.** **89**

**ప్రతిపదార్థం:** పదపడి= ఆ వెనుక; విప్రులు= బ్రాహ్మణులు; పథము+తప్పి= ధర్మ మార్గాన్ని తప్పి; వధంబు= హత్యను; మద్యపానంబు= మద్యం సేవించటం; సత్+మార్గవర్తులు+అయిన= ఉత్తమ మార్గంలో నడచుకొంటున్న; సాధుల= ఉత్తములయొక్క; ధనము+అపహరించుటయును= ద్రవ్యాన్ని దొంగిలించటం; మొదలుకాఁగన్= మొదలుకొని; అకృత్యములకున్+చొచ్చిరి= దుర్మార్గ ప్రవర్తనలకు పూనుకొన్నారు; అధ్వర+ఆదిక+సత్+క్రియల్= యాగం మొదలైన ఉత్తమ కార్యాలు; ప్రవర్తింపక= జరగక; తెక్కలి= దొంగిలించటం; బంది= చెరబట్టటం; ఏ దిక్కులందున్= అన్నిచోట్ల; తఱుచు+అయ్యెన్= అతి సామాన్యమై పోయింది; ఈ+మెయిన్= ఈ విధంగా; ధర్మంబు+చెడి= ధర్మం చెడిపోయి; అధర్మంబు వర్తించి= అధర్మం అధికమై; అరాజకత్వ దోష జాతము+అయినన్= రాజులు లేమి వలన కలిగిన దోషంవలన ఏర్పడిన; దురిత బాహుళ్యంబు= దుర్మార్గం అధికమై; కుతిల పెట్టన్= కుంగదీయగా; భూమి= భూమాత; అతలమునకున్+పోవన్= భూమి కిందటి లోకానికి వెళ్ళగా; కశ్యపుఁడు= కశ్యప ప్రజాపతి తెలిసికొని; నిజ+ఊరువున్= తన తొడను; నెఱి గ్రుచ్చి= చక్కగా సంధించి; దాపు+కాఁగన్+ఇచ్చి+ఎత్తెన్= ఆధారం కాగా భూమిని ఎత్తి పట్టాడు.

**తాత్పర్యం:** కశ్యప ప్రజాపతి బ్రాహ్మణసమూహానికి రాజ్యం అప్పగించి వెళ్ళిపోయాడు. ఆ తరువాత బ్రాహ్మణులు ధర్మమార్గాన్ని వదలిపెట్టి కారణరహితంగా వధించటం, మద్యం సేవించటం, ఉత్తమమార్గంలో నడుస్తూ ఉన్న సాధుజనుల భార్యలను ధనధాన్యాలను దొంగిలించటం మొదలైన పనులు చేస్తూ అధర్మానికి పాలుపడ్డారు. తాము నిర్వహించవలసిన యజ్ఞయాగాది కర్మలు వదలిపెట్టి ఇతరులను దోచుకొనటం, చెరపట్టటం సామాన్యమైపోయింది. ఈ విధంగా అధర్మమార్గమే ప్రధానమై రాజులు లేకుండటంవలన అరాజకత్వంవలన కలిగిన అనేక దోషజాలం భూమిని క్రుంగదీసింది. భూమి భరించలేక కిందికి వెళ్ళిపోయింది. ఈ విషయాన్ని తెలిసికొన్న కశ్యపప్రజాపతి తన ఊరువులను ఆధారంగా చేసి భూమిని పైకి ఎత్తాడు.

**వ.** **అది కారణంబుగా ధరణి యుర్వి యనం బ్రసిద్ధి వహించె; నయ్యుద్ధరణ సమయంబునం గాశ్యపి గశ్యపుని వేఁడుకొని యుత్తమ క్షత్రియులు దండనీతి ప్రయోగంబునం జేసి ధర్మంబు రక్షించి తన్ను సురక్షితం జేయువారుగా వరంబు వడయుటకై యమ్మహామునితో ని ట్లనియె.** **90**

**ప్రతిపదార్థం:** అది కారణంబుగాన్= రసాతలానికి వెళ్ళిన భూమిని కశ్యప ప్రజాపతి తన ఊరువులు ఆధారంగా, ఎత్తి పట్టటమనే కారణం వలన; ధరణి= ఈ భూమి; ఉర్వి+అనన్= ఉర్వి అనే పేరుతో; ప్రసిద్ధి వహించెన్= ప్రఖ్యాతి చెందింది; ఆ+ఉద్ధరణ సమయంబునన్= ఆ విధంగా ఉద్ధరించబడిన సమయంలో; కాశ్యపి= కాశ్యపి అనబడే భూమి; కశ్యపుని వేఁడుకొని= కశ్యప ప్రజాపతిని ప్రార్థించి; ఉత్తమ క్షత్రియులు= శ్రేష్ఠులైన రాజులు; దండనీతి ప్రయోగంబునన్+చేసి= దండోపాయమనే నీతి మార్గంవలన (సామ, దాన, భేద, దండోపాయాలనే చతురుపాయాలలో ఒకటైన దండోపాయం వలన); ధర్మంబు రక్షించి= ఉత్తమ ధర్మాన్ని పరిరక్షించి; తన్ను= భూమిని; సురక్షితన్+చేయువారుగాన్= భయంలేని దానినిగా చేయగలవారుగా; వరంబున్+పడయుటకై= వరం పొందటానికై; ఆ మహామునితోన్= ఆ మహర్షితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పింది.

**తాత్పర్యం:** కశ్యపుడు కిందికి వెళ్ళిన భూమిని తన ఊరువు ఆధారంగా పైకి ఎత్తటంవలన ఈ భూమి ఉర్వి అని ప్రసిద్ధి కెక్కింది. ఆ సమయంలోనే ఉత్తమ రాజులు దండనీతి మార్గాన్ననుసరించి ధర్మాన్ని రక్షించి తనను సురక్షితను చేయగలవారుగా కశ్యపుడివలన వరం పొందటానికి ఆ మహర్షితో ఇట్లా అన్నది.

**భూదేవి కశ్యపునితోఁ బరశురామునిచేఁ జావనిరాజులఁ జెప్పుట. (సం. 12-49-66)**

**క. 'నాయందచట నచట రా। మాయత బాహా విభూతి కగపడని ఘనుల్**
**ధీయుక్తులు గల; రన్నర। నాయకులను వినుము పనుపు నను రక్షింపన్.' 91**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ కశ్యప ప్రజాపతీ! వినుము; నా యందున్+అచటన్+అచటన్= భూమిమీద అక్కడక్కడ; రామ= పరశురాముడి యొక్క; ఆయత= పొడవైన; బాహా= చేతుల యొక్క; విభూతికిన్= సంపదకు; కనపడని= కనిపించని; ఘనుల్= గొప్పవారు; ధీయుక్తులు= బుద్ధిశాలులు; కలరు= ఉన్నారు; ఆ+నరనాయకులను= ఆ రాజులను; నను రక్షింపన్= నన్ను రక్షించటానికి; పనుపు(ము)= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** 'ఓ కశ్యప ప్రజాపతీ! పరశురాముడి బాహు పరాక్రమ సంపదకు కనిపించకుండా తప్పించుకొన్న రాజులు అక్కడక్కడ ఉన్నారు. అటువంటి ప్రజా నాయకులను నా సంరక్షణార్థం పంపుము' (అని భూదేవి ప్రార్థించింది.)

**వ. అని పలికి యద్దేవి తన సురక్షితత్వంబున హైహయులు గొందఱు చావునకుం దప్పుటయు, పౌరవాన్వయ ప్రభావుండగు విదూరథ సుతుండు ఋక్షవత్పర్వతంబున ఋక్షంబులచేత రక్షితుం డగుటయు, సౌదాసవంశ జనితుం డొక్కరుండు పరాశర సంయమి వరు నధ్వర కాలంబునంఁ జేరినఁ గారుణ్యాతిశయంబున నమ్మహాత్ముండు వాని శూద్ర ప్రవర్తనంబున సర్వ కర్మంబులుఁ జేయించుకొని రక్షింప సర్వకర్ముం డనం బరఁగుటయు, శిబి మనుమఁడు గోపతి యనువాఁడు, వనంబున గోవులు రక్షించిన బ్రతికియునికియుం, బ్రతర్దన పుత్రుడు వత్సాభిధానుండు వత్సంబులు గోష్ఠంబున రక్షణం బాచరింప సంచరించుటయు, దివిరథ తనయుం డగు దధివాహను కొడు కంగుం డనువాఁడు గంగా కూలంబుల గౌతమ మునీంద్రుని రక్షం జేసి నిర్భయుండై వర్తిల్లుటయు, బృహద్రథ కులజాతుండు భూరి నామధేయుండు గృధ్రకూట శైలంబున గోలాంగూలంబులు రక్షించుట వలనఁ గలిగి యుండుటయు, మరుత్త సంతాన సంభవులు చతుర్వర్ష వయస్కులగువారు ముప్పురు సముద్రుండు రక్షకుండై పెనుపం దత్తీరంబునం బెరుఁగుటయుం జెప్పి వా రుత్తమ క్షత్రియులు వారలు సమ్యక్పరిపాలనంబున న న్నరయువారుగా ననుగ్రహించిన నచలితనై యుండెద. 92**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఆ+దేవి= ఆ భూదేవి; తన సురక్షితత్వంబునన్= తాను రక్షించగా; కొందఱు హైహయులు= కొంత మంది హైహయరాజులు; చావునకున్+తప్పుటయున్= మరణం నుండి తప్పించుకొనటం వలన; పౌరవ+అన్వయ+ప్రభవుండు+ అగు= పూరు వంశంలో జన్మించిన వాడగు; విదూరథ సుతుండు= విధూరథు డనే వాడి కుమారుడు; ఋక్షవత్పర్వతంబునన్= ఋక్షవంతమనే పర్వతంలో; ఋక్షంబులచేతన్= ఎలుగుబంట్ల చేత; రక్షితుండు+అగుటయున్= కాపాడబడి; సౌదాసవంశ జనితుండు= సుదాస వంశస్థుడు; ఒక్కరుండు= ఒక్కడు; పరాశర సంయమి వరు+అధ్వర కాలంబునన్+చేరినన్= మునిశ్రేష్ఠుడైన పరాశరుడియొక్క యాగకాలంలో చేరగా; కారుణ్య+అతిశయంబునన్= దయాతిశయంతో; ఆ+మహాత్ముండు= ఆ మహాత్ముడైన పరాశరుడు; వాని= వానియొక్క; శూద్ర ప్రవర్తనంబునన్= శూద్రోచితమైన నడవడికతో; సర్వకర్మంబులును= సమస్త కార్యాలను

చేయించుకొని; రక్షింపన్= రక్షించగా; సర్వకర్ముండు+అనన్+పఁరగుటయున్= సర్వకర్ముడని పిలువ బడటమూ; శిబిమనుమఁడు= శిబిచక్రవర్తి మనుమడు; గోపతి= గోపతి అనేవాడు; వనంబునన్= అరణ్యంలో; గోవులు రక్షించినన్= గోవులను రక్షించటం వలన; బ్రతికి+ఉనికియున్= జీవించి ఉండటమూ; ప్రతర్దన పుత్రుఁడు= ప్రతర్దనుడనే వాడి కుమారుడు; వత్స+అభిధానుఁడు= వత్సుడనే పేరుతో; వత్సంబులు= దూడలు; గోష్ఠంబునన్= గోశాలలో; రక్షణంబు+ఆచరింపన్= సంరక్షించగా; సంచరించుటయున్= తిరుగటమూ; దివిరథ తనయుండు+అగు= దివిరథుడియొక్క కుమారుడు అయిన; దధివాహను కొడుకు= దధి వాహనుడి కొడుకు అయిన; అంగుండు+అనువాఁడు= అంగుడనేవాడు; గంగా+కూలంబునన్= గంగానదీ తీరంలో, గౌతమ+ముని+ఇంద్రుని+రక్షన్+చేసి= గౌతమ ముని శ్రేష్ఠుని రక్షణవలన; నిర్భయుండు+అయి= భీతిలేనివాడై; వర్తిల్లుటయున్= జీవించటమూ; బృహద్రథ కుల జాతుండు= బృహద్రథుని వంశంలో పుట్టిన వాడైన; భూరి నామధేయుండు= భూరి అనే పేరు కలవాడు; గృధ్ర కూట శైలంబునన్= గృధ్ర కూటమనే పర్వతంలో; గోలాంగూలంబులు= కొండముచ్చులు; రక్షించుట వలనన్+కలిగిన= రక్షించటంచేత బ్రతికి ఉండటమూ; మరుత్త సంతాన సంభవులు= మరుత్తుడనే వాడి సంతానం వలన కలిగిన; చతుర్+వర్ష+వయస్కు+లగువారు= నాలుగు సంవత్సరాల వయస్సు కలిగిన వారైన; ముప్వురు= ముగ్గురు; సముద్రుండు= సాగరుడు; రక్షకుండై పెనుపన్= రక్షకుడై పోషింపగా; తద్+తీరంబునన్= ఆ తీరంలో; పెఱుంగుటయున్+చెప్పి= పెరగటాన్ని తెలియజేసి; వారు+ఉత్తమ క్షత్రియులు= పైన పేర్కొన్న వారందరు ఉత్తమరాజులు; వారలు= వారందరు; సమ్యక్+పరిపాలనంబునన్= మంచి ఏలుబడితో; నన్నున్+అరయువారుగాన్= నన్ను జాగ్రత్తగా చూసేవారుగా; అనుగ్రహించినన్= ప్రసాదిస్తే; అచలితన్+అయి+ఉండెదను= స్థిరంగా ఉండగలను.

**తాత్పర్యం:** ఆ భూదేవి సంరక్షించగా చావునుండి తప్పించుకొని, హైహయవంశరాజులు కొందరు చావకుండా బతికిపోయారు. కురువంశంలో జన్మించిన విదూరథుడి కుమారుడు ఋక్షవంతమనేపర్వతంలో ఎలుగుబంట్లచేత రక్షించబడ్డాడు. సుదాసు వంశంలో జన్మించిన ఒకడిని యాగకాలంలో పరాశరుడు దయతలచి అతడిచేత శూద్రకులోచితంగా సర్వకర్మలు చేయించుకొనటం వలన సర్వకర్ముడనే ప్రసిద్ధిపొంది మిగిలిపోయాడు. శిబిచక్రవర్తి మనుమడైన వాడు అరణ్యంలో గోవులు రక్షింప బ్రతికిపోయాడు. ప్రతర్దనకుమారుడైన వత్సుడనే పేరు కలిగినవాడు దూడలను గోశాలలో సంరక్షింప బ్రతికిపోయాడు. దివిరథుని కుమారుడైన దధివాహనుడనే వాడికొడుకైన అంగుడనే వాడు గంగాతీరంలో గౌతమమహర్షి సంరక్షించటంవలన జీవించాడు. బృహద్రథవంశంలో పుట్టిన భూరి అనే పేరు కలవాడు గృధ్రకూట పర్వతంలో కొండముచ్చుల రక్షణలో బ్రతికి బట్టకట్టాడు. మరుత్తుయొక్క సంతానంవలన పుట్టిన నాలుగేళ్ళ వయస్సున్న ముగ్గురు సముద్రుడి రక్షణలో పెరిగి పెద్దవారయ్యారు - అని చెప్పి 'వాళ్ళంతా ఉత్తమ క్షత్రియులు. సముచితమైన పరిపాలనలో పాలించగలవారినిగా నాకు ప్రసాదించండి. అప్పుడు నేను స్థిరంగా ఉండగలను'

**క. వారల పెద్దలు నాకై । పోరఁ బరశురాము చేతఁ బొలిసిరి; నాకున్**
**వారి నధిపతులఁ జేయుట । గోరందగుఁ గాన యిట్లు గోరితి ననఘా!' 93**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాప రహితుడైన కశ్యప ప్రజాపతీ! వారల పెద్దలు= పైన పేర్కొన్న వారు పెద్దలు; నాకై పోరన్= భూమికొరకు యుద్ధం చేయగా; పరశురాము చేతన్+పొలిసిరి= పరశురాముడిచేత చనిపోయారు; నాకున్+వారిన్+అధిపతులన్+చేయుట= నాకు వారిని అధినేతలుగా చేయటం; కోరన్+తగున్= కోరతగినదే; కాన= కావున; ఇట్లు+కోరితిన్= అందుకే నేనిట్లా ప్రార్థించాను.

**తాత్పర్యం:** అనేక విధాలుగా రక్షించబడిన రాజవంశజుల పెద్దలందరు భూమికొరకు పోరాడిన వారే. అయితే వారందరు పరశురాముడి చేత సంహరించబడ్డారు. అందుకే వారు రాజ్యాధిపతులు కాదగిన వారని ఇట్లా కోరుకొన్నాను.'

**తే. అనిన విని వారి రావించి య మ్మునీంద్రుఁ । డందఱను జూచి యాధిపత్యమున కిమ్మ**
**హాభుజులు దగు వారని యవనిఁ దగిన । యట్లు విభజించి యభిషేక మాచరించె. 94**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని పలుకగా విని; వారిన్ రావించి= వారిని రప్పించి; ఆ+ముని+ఇంద్రుఁడు= ఆ మునిశ్రేష్ఠుడైన కశ్యపుడు; అందఱను+చూచి= వచ్చిన రాజులందరిని పరిశీలించి చూచి; ఆధిపత్యమునకున్= అధికారానికి; ఈ+మహాభుజులు= ఈ మహా పరాక్రమ సంపన్నులు; తగువారు+అని= అర్హులని; తగిన+అట్లు= ఉచితమైన రీతిని; అవనిన్= భూమిని; విభజించి= పంచి; అభిషేకము+ఆచరించెన్= వారందరిని రాజ్యాభిషిక్తులను చేశాడు.

**తాత్పర్యం:** ఆ కశ్యపప్రజాపతి భూదేవివలన తెలిసికొని రాజులందరిని పిలిపించి చూచి, రాజ్యాధిపత్యానికి అర్హులని భావించి, ఉచితమైన రీతిగా భూమిని విభాగించి వారిని రాజ్యాభిషిక్తులను చేశాడు.

**క. ఆ నృపుల వంశముల నా । నా నృపతులు పుట్టి; రిట్లు నరవర! నృప సం**
**తానములు పెక్కు గలిగి మ । హీనాథత్వమున వ్రాలె నెందును గలయన్. 95**

**ప్రతిపదార్థం:** నరవర!= ఓ రాజశ్రేష్ఠుడవైన ధర్మరాజా!; ఆ నృపుల వంశములన్= ఆ రాజుల వంశాల మూలాన; నానా నృపతులు= అనేక రాజులు; పుట్టిరి= జన్మించారు; ఇట్లు= ఈ విధంగా; నృప సంతానములు= రాజ సంతతులు; పెక్కు+కలిగి= అనేకం పుట్టి; ఎందునున్+కలయన్= భూమి అంతటను; మహీనాథత్వమునన్+వ్రాలెన్= రాజ్యాధికారంలో ప్రవేశించారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ పైన పేర్కొన్న రాజవంశాలలో పెక్కుమంది రాజులు పుట్టారు. ఈ విధంగా రాజవంశాలు పుట్టి పెరిగి భూమి అంతట రాజ్యాధికారంలో ప్రవేశించారు.

**క. అప్పరుసునఁ బెరిఁగిన నృపు । లిప్పుడు భారత రణోపహృతులై పలువుర్**
**గుప్పలు గొనఁబడి; రనికిం । దప్పిన వాఁడొకఁ డొకండ ధర నంతంతన్. 96**

**ప్రతిపదార్థం:** ఆ+పరుసునన్= ఆ విధంగా; పెరిఁగిన నృపులు= వృద్ధిపొందిన రాజులు; భారతరణ+ఉపహృతులు+అయి= భారత యుద్ధంలో సంహరించబడినవారై; పలువుర్= అనేకులు; కుప్పలు గొనన్+పడిరి= కుప్పలుగా పడి ఉన్నారు; ధరన్= భూమిపై; అంతన్+అంతన్= అక్కడక్కడ; ఒకఁడు+ఒకండు= ఒక్కొక్కడు; అనికిన్= యుద్ధానికి గురికాక; తప్పినవాఁడు= తప్పించుకొన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా అభివృద్ధి చెందిన రాజులు భారతయుద్ధంలో సంహరించబడి కుప్పలుగా కూలి పడి ఉన్నారు. భూమిమీద అక్కడక్కడ ఒక్కొక్కడుగా యుద్ధంలో తప్పించుకొని ఉన్నారు.

**వ. నీ వడిగిన పూర్వ వృత్తాంతంబు చిత్తాయత్తంబుగా నెఱింగించితి; ననవుడు ధర్మనందనుండు గోవిందు తోడఁ 'బరశురాముఁ డింతటి వాఁడగునే? కోపంబును, విక్రమాటోపంబును జిత్రంబుగా ధాత్రి నిఃక్షత్రంబు సేసె' నని పలికె; వెండియు. 97**

**ప్రతిపదార్థం:** నీవు+అడిగిన= నీవు అడిగిన; పూర్వ వృత్తాంతంబు= పూర్వ చరిత్ర; చిత్త+ఆయత్తంబుగాన్= మనస్సుకు హత్తుకొనేటట్లుగా; ఎఱింగించితిన్= తెలిపాను; అనవుడున్= అనగానే; ధర్మనందనుండు= ధర్మరాజు; గోవిందు తోడన్= కృష్ణుడితో; పరశురాముఁడు+ఇంతటివాఁడు+అగునే?= పరశురాముడు ఇంత గొప్పవాడా?; కోపంబును= కోపమూ; విక్రమ+ఆటోపంబును= పరాక్రమాతిశయమూ; చిత్రంబుగాన్= ఆశ్చర్యం కొల్పగా; నిః క్షత్రంబుగాన్+చేసెన్= రాజులు లేకుండా చేశాడు; అని పలికెన్= అని అన్నాడు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ధర్మరాజుతో 'నీవు అడిగిన పూర్వకథ - అంటే పరశురాముడిచేత సమస్తరాజులు సంహరించబడిన ఈ భూమి మీద రాజులు ఎట్లా పుట్టారని నీవు అడిగిన ప్రశ్నకు సమాధానంగా పూర్వకథ - అంతటిని మనస్సుకు హత్తుకొనేటట్లు తెలిపాను' - అని చెప్పాడు. ధర్మరాజు ఆశ్చర్య చకితుడై 'పరశురాముడు ఇంత గొప్పవాడా? అత్యంత కోపంతో పరాక్రమంతో భూమిని అంతటిని క్షత్రియ రహితంగా చేయగలిగా'డని ప్రశంసించాడు.

**తే.** **'ధరణియును ఋక్షములుఁ బరాశరుఁడు గో స । మూహములు వత్సములు గౌతముండు గపులుఁ**
**దోయధియు నింత పుణ్యంబు సేయునే? జ । నంబు భాగ్యంబు నభివర్ణనమున కెక్కె'** **98**

**ప్రతిపదార్థం:** ధరణియును= భూమి; ఋక్షములు= ఎలుగు బంట్లు; పరాశరుఁడు= పరాశరుడు; గో సమూహములు= ఆలమందలు; వత్సములు= దూడలు; గౌతముండు= గౌతమ మహర్షి; కపులున్= కోతులు; తోయధియున్= నీటికి నిధి అయిన సముద్రుడు; ఇంత పుణ్యంబు+చేయునే?= ఇంత పుణ్యం సంపాదిస్తాయా?; జనంబు భాగ్యంబున్= ప్రజల అదృష్టం; అభివర్ణనమునకున్+ఎక్కెన్= పొగడ్తకు తగినదయింది.

**తాత్పర్యం:** పరశురాముడి కుఠారానికి బలికాకుండా రాజులను రక్షించిన భూమి, ఎలుగుబంట్లు, ఆవుల మందలు, దూడలు, కోతులు, సముద్రం మాత్రమే కాక పరాశర మహర్షి, గౌతమ ముని కూడా ఇంత పుణ్యానికి నోచుకున్నారా? నిజంగా ఇది ప్రజల అదృష్టంగా అభివర్ణించదగింది'.

**వ.** **అని యిట్లు సల్లాపంబు సేయుచు మాధవ ధర్మజు లరిగి, యోఘవతీ తీరంబున శరతల్పగతుం డై గాంగేయుం డున్నెడ కనతి దూరంబున రథావతరణంబు సేసిన, భీమసేన ప్రముఖులుం గృపాదులు నరదంబులు డిగ్గి, రిట్లందఱు నంతరంగంబు లేకాగ్రంబులు సేసికొని చేరం జని, సాత్యవతేయ ప్రభృతి మునీంద్రులకుం బ్రణమిల్లి, మఱి భీష్ముం గాంచి రట్లు సముచిత ప్రకారంబునం గని యతనిం బరివేష్టించి యాసీనులై రప్పు డచ్యుతుం డమ్మహాత్ము నాలోకించి యుమ్మలించుచు నతనితోడ.** **99**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; సల్లాపంబు+చేయుచున్= సంభాషించుకొంటూ; మాధవ ధర్మజులు+అరిగి= కృష్ణ ధర్మరాజులు వెళ్ళి; ఓఘవతీ తీరంబునన్= ఓఘవతీ నది ఒడ్డున; శరతల్ప గతుండు+అయి= అమ్ముల పాన్పునందు పడుకొన్న వాడై; గాంగేయుండు+ఉన్న+ఎడకున్= భీష్ముడు ఉన్న ప్రదేశానికి; అనతి దూరంబునన్= దగ్గరలోనే; రథ+అవతరణంబు+చేసినన్= రథంలో నుండి దిగగానే; భీమసేన ప్రముఖులున్= భీముడు మొదలైనవారును; కృప+ఆదులున్= కృపాచార్యుడు మొదలైన వారును; అరదంబుల్+డిగ్గిరి= రథాల నుండి దిగిపోయారు; ఇట్లు+అందఱున్= ఈ విధంగా అందరూ; అంతరంగంబులు+; ఏక+అగ్రంబులు+చేసికొని= హృదయాలను ఏకాగ్రతతో ఉంచుకొని; చేరన్+చని= సమీపించి; సాత్యవతేయ ప్రభృతి ముని+ఇంద్రులకున్= సత్యవతీ పుత్రుడైన వ్యాసుడు మొదలైన మునిశ్రేష్ఠులకు; ప్రణమిల్లి= నమస్కరించి; మఱి= ఆ వెనుక; భీష్మున్+కాంచిరి= భీష్ముడిని సందర్శించారు; అట్లు= ఆ రీతిగా; సముచిత ప్రకారంబునన్+చని= తగినట్లుగా వెళ్ళి; అతనిన్= ఆ భీష్ముడిని; పరివేష్టించి= చుట్టుముాగి; ఆసీనులు+ఐరి= కూర్చున్నారు; అప్పుడు+అచ్యుతుండు= ఆ సందర్భంలో శ్రీకృష్ణుడు; ఆ+మహాత్మున్= ఆ భీష్ముడిని; ఆలోకించి= చూచి; ఉమ్మలించుచున్= బాధపడుతూ; అతనితోడన్= ఆ భీష్ముడితో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణ ధర్మరాజులు మాటలాడుకొంటూ వెళ్ళి ఓఘవతీ నదీతీరంలో అమ్ములపాన్పుపై పడుకొని భీష్ముడు ఉన్న ప్రదేశానికి దగ్గరలోనే రథం నుండి దిగారు. అట్లాగే భీముడు, కృపుడు మొదలైనవారు రథాలనుండి

దిగారు. అందరూ హృదయాలను స్వాయత్తపరచుకొని సమీపించి వ్యాసుడు మొదలైన మునిశ్రేష్ఠులకు నమస్కరించి ఆ వెనుక భీష్ముడిని దర్శించారు. ఆ విధంగా భీష్ముడిని దర్శించి చుట్టూ కూర్చున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు ఆ మహనీయుడిని పరిశీలించి బాధ పడుతూ - (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'నీకు మున్పోలె నవ్యాకులమై యున్న । యదియె చిత్తంబు? దేహంబు పీడ**
**ఘనము మనఃపీడకంటె నందురు బుధు । లొక ముల్కి యొడలిలో నున్న నలఁత**
**సేయు; నెమ్మెయి బహుసాయక కీలిత । మైన యంగంబు నొ వ్వడుగ నేల?**
**యిట్టు లుండియు నించుకేనియు దుఃఖంబుఁ । బొరయమి పితృవరస్ఫూర్తిఁ గాదె!**

**ఆ. దేవతలకు నైన నీ వుపదేశింతు । కలిమి లేములకు వికార మొంద**
**కుండ బోధ వృద్ధు లొరులు నిన్ దేర్పంగ । వలవ కునికి నిజ మవార్యతేజ! 100**

**ప్రతిపదార్థం:** అవార్యతేజ!= వారించటానికి వీలులేని తేజస్సు కల ఓ భీష్ముడా!; నీకున్= నీకు; మున్+పోలెన్= ముందువలెనే; చిత్తంబు= మనస్సు; అవ్యాకులము+అయి ఉన్న అదియె?= కలత లేకుండా ఉన్నది కదా!; బుధులు= పెద్దలు; మనఃపీడకంటెన్= మానసిక బాధకంటె; దేహంబు పీడ= శారీరకమైన బాధ; ఘనంబు+అంద్రు= గొప్పది అంటారు; ఒక ముల్కి+ఒడలిలోన్+ఉన్నన్= ఒకే ఒక్క బాణం శరీరంలో ఉంటేనే; నలఁత చేయున్= బాధిస్తుంది; ఏ+మెయిన్= ఏ విధంగా; బహుసాయక కీలితము+అయిన= అనేక బాణాలచేత గుచ్చుకొనబడ్డ; అంగంబు= శరీరంయొక్క; నొవ్వు+అడుగన్+ఏల?= బాధ ఎట్లా ఉన్నది అని అడుగనక్కరలేదు కదా! ఇట్టులు+ఉండియున్= నీ శరీరంలో ఇన్ని బాణాలున్నా; ఇంచుక+ఏనియున్= కొంచెమైనా; దుఃఖంబు+పొరయమి= దుఃఖం కలుగకుండా ఉండటానికి; పితృవర స్ఫూర్తిన్+కాదె!= మీ తండ్రి అయిన శంతను మహారాజు ఇచ్చిన వరంయొక్క గొప్పతనం కదా!; దేవతలకున్+ఐనన్= దేవతలకు కూడా; నీవు+ఉపదేశింతు(వు)= ఉపదేశించుటకు సమర్థుడవు; కలిమి లేములకున్= ధనమున్నా, లేకున్నా; వికారము+ఒందకుండన్= వ్యతిరేక భావం పొందకుండా; ఒరులు= ఇతరులైన; బోధవృద్ధులు= జ్ఞానవృద్ధులు, పెద్దలు; నిన్నున్+తేర్పంగ వలవక+ఉనికి= నిజం నీకు బోధించవలసిన అవసరం లేని మాట వాస్తవం.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు భీష్ముడితో ఇట్లా అన్నాడు - 'ఓ మహానుభావా! నీ మనస్సు ఇదివరలోవలెనే కలత లేకుండా ఉన్నది కదా! మానసిక బాధకంటె శరీర బాధ గొప్పదని పెద్దలు చెప్తుతారు. శరీరంలో ఒక బాణమున్నా బాధిస్తుంది. కాగా, అనేక బాణాలు నాటిన నీ శారీరకబాధను గురించి అడగాలా? ఈ విధంగా ఉన్నప్పటికి నీకు బాధ కలగలేదంటే దానికి మీ తండ్రి వరమే కారణం. దేవతలకు సైతం నీవు ఉపదేశించగల సమర్థుడవు. నీకు బాధ ఉన్నా లేకున్నా నీకు ఏ పెద్దలు ప్రబోధించ నక్కరలేదు.

**విశేషం:** భీష్ముడు తన తండ్రికి సత్యవతిని భార్యగా చేయటంలో జీవితాంతం బ్రహ్మచర్యాన్ని పూనుతున్నట్లు శపథం చెయ్యటం మూలాన శంతనుడు మెచ్చుకొని భీష్ముడికి స్వచ్ఛంద మరణం వరంగా ప్రసాదించాడు. ఆ కారణంగానే శరతల్పగతుడైన భీష్ముడు యుద్ధంలో నాటిన శస్త్రాస్త్రాలు ఏ విధమైన బాధను కలిగించలేదని మన మిక్కడ గ్రహించవలసి ఉన్నది. తిక్కనలో సూక్తులు ఉన్నాయి. 'బుధులు మనః పీడకంటె దేహంబు పీడ ఘనము' అందురు. 'ఒక ముల్కి యొడలిలోనున్న నలఁత సేయు నెమ్మెయి బహుసాయక కీలితమైన యంగంబు నొ వ్వడుగ నేల?' ఇవి చక్కటి సామెతలు. కృష్ణుడి ఈ సమాశ్వాస వాక్యాలతో భీష్ముడు ఆనందించాడు. ఇక్కడ మనఃపీడకంటె దేహపీడ ఎక్కువంటాడు శ్రీకృష్ణుడు. కాని, లోకంలో మనోవేదన గొప్పదని గదా ప్రసిద్ధం? మరి ఏ న్యాయాన్ని అనుసరించి కృష్ణుడు అట్లా ప్రయోగించాడో తెలియదు. సమయానికి తగు మాటలాడు వైఖరి అంటే ఇదేనేమో!

**క. భూతంబుల సంసరణము । భూత భవద్భావి కార్యములు గర్మ సము**
**ద్యోతన భంగియు నీ యఱ । చేతివి కావె కురువంశశేఖరజన్మా! 101**

**ప్రతిపదార్థం:** కురువంశ శేఖర జన్మా!= కురువంశమునందు శ్రేష్ఠమైన జన్మం కలిగిన ఓ భీష్మా!; భూతంబుల= సర్వప్రాణికోటియొక్క; సంసరణము= జీవనమూ; భూత= కడచిన; భవత్= జరుగుతున్న; భావి కార్యములు= భవిష్యత్ కాలమునకు సంబంధించిన కార్యములు; కర్మసమ్+ఉద్యోతన భంగియున్= కర్మలయొక్క అత్యంతంగా ప్రకాశించే రీతి; నీ+అరచేతివి కావే!= నీ కరతలాధీనాలే కదా!

**తాత్పర్యం:** ప్రాణికోటుల జీవనరీతి, త్రికాలాలలో చేసే కార్యకలాపాలు, కర్మానుష్ఠానంవలన ప్రకాశమానమై వెలుగొందే విధానం - ఓ భీష్మా! నీకు కరతలామలకమే కదా!' అని శ్రీకృష్ణుడు భీష్ముడిని ప్రశంసించాడు.

**వ. అని వెండియు. 102**

**తాత్పర్యం:** అని చెప్పి మరల - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'రా జటె! రాగహీనుఁ డటె! రాజిత సుందరమూర్తి యట్టె! వి**
**భ్రాజిత సంపదున్నతి విభాసిత వర్తనుఁ డట్టె! కామినీ**
**రాజి మనోజ్ఞభంగి చతురత్వ ధనుండటె! బ్రహ్మచర్యదీ**
**క్షా జిత మన్మథుండు నటె! జన్మము లిట్టివి యెందు గల్గనే? 103**

**ప్రతిపదార్థం:** రాజు+అటె!= రాజట కదా!; రాగహీనుఁడు+అటె!= రాగరహితుడట కదా; రాజిత సుందరమూర్తి+అట్టె!= ప్రకాశిస్తున్న సౌందర్యమూర్తి కూడానట కదా!; విభ్రాజిత సంపద్+ఉన్నతి= ప్రకాశమనే సంపదయొక్క ఔన్నత్యం చేత; విభాసిత= వెలుగొందుతున్న; వర్తనుఁడు+అట్టె!= నడవడిక కలవాడట!; కామినీ రాజి మనోజ్ఞ భంగి చతురత్వ ధనుండు+అటె!= స్త్రీ సమూహానికి మనోహరమైన రీతిలో, నైపుణ్యమనే సంపద కలవాడట కదా!; బ్రహ్మచర్య దీక్షా జిత మన్మథుండున్+అటె!= బ్రహ్మచర్యమనే పట్టుదలతో జయించబడిన మన్మథుడు కలవాడట!; ఇట్టివి జన్మముల్= ఇట్లాంటి పుట్టుకలు; ఎందున్+కలుగునే?= ఎక్కడైన సంభవిస్తాయా?

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు భీష్ముడిని ఉద్దేశించి ఈ విధంగా ప్రశంసించాడు; 'క్షత్రియుడుగా జన్మించాడు. మహర్షులవలె ద్వంద్వాతీతుడయ్యాడు, ప్రకాశిస్తున్న సౌందర్యమూర్తి. విభ్రాజమానమై అత్యున్నతంగా వెలుగొందే నడవడిక కలవాడు; స్త్రీసమూహానికి మనోహరమైన నైపుణ్యసంపద కలవాడు; బ్రహ్మచర్యదీక్షచేత మన్మథుడిని జయించినవాడు; ఇట్లాంటి జన్మలు మరెక్కడైనా సంభవిస్తాయా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. శ్రీకృష్ణుడు భీష్ముడిని ఉత్తమ గుణగణాలను మిక్కిలి ప్రశంసించాడు. అట్లాంటి గుణాలు కలవాడు కావటంవలన ధర్మజుడికి సమస్తధర్మాలను ప్రబోధించగలిగాడు భీష్ముడు. మూల శ్లోకాలకు వన్నె తెచ్చేరీతిలో మనోహరంగా రచించాడు తిక్కన. భీష్ముడి గొప్పతనాన్ని ప్రశంసిస్తూ చేసిన ఈ పద్యరచన తిక్కన శైలీవిన్యాసాని కొక మచ్చు తునక.

**క. సురలును నసురులు యక్షులు । నురగులు గంధర్వులును మహోద్ధతిఁ బై పై**
**నురవడి వచ్చిన నొకఁడవ । పరాజితులఁ జేయు దుగ్ర బాహా స్ఫురణన్. 104**

**ప్రతిపదార్థం:** సురలునున్= దేవతలును; అసురులున్= రాక్షసులును; యక్షులున్= యక్షులును; ఉరగులున్= నాగులును; గంధర్వులును; మహా+ఉద్ధతిన్= గొప్ప పరాక్రమంతో; పైపైన్= మీది మీదికి; ఉరవడిన్వచ్చినన్= మహావేగంతో వస్తే; ఒకఁడవు+అ= ఒక్కడవే; ఉగ్రబాహా స్ఫురణన్= భయంకరమైన బాహు పరాక్రమ స్ఫూర్తితో; పరాజితులన్+చేయుదు(వు)= ఓడించగలవు.

**తాత్పర్యం:** దేవతలు, రాక్షసులు, నాగులు, యక్షులు, గంధర్వులు మహాపరాక్రమంతో, మహావేగంతో మీది కెత్తి వచ్చినా లెక్కచేయక ఒక్కడవే ఎక్కటికయ్యంలో భయంకరమైన బాహుపరాక్రమంతో పరాజితులను చేయగల సమర్థుడవు.

**చ.** **దమమును సత్యముం దపము దానము వేదములందుఁ జాపవే**
**దమునను గల్గు నైపుణియు, ధర్మవిధిజ్ఞతయున్, విరోధి భూ**
**రమణ విమర్దన క్రమ విరాజిత శౌర్యము నీకుఁ బోలె నై**
**జము లగువాఁడు వేఱొకఁడు శంతనునందన! పుట్టఁ డెన్నఁడున్.** **105**

**ప్రతిపదార్థం:** శంతను నందన!= ఓ శంతను మహారాజు కుమారుడవైన భీష్మా!; దమమును= కర్మేంద్రియాల నిగ్రహం; సత్యమున్+తపమున్= సత్యం, తపస్సు; దానమున్= దానం; వేదములందున్+చాప వేదమునను= చతుర్వేదాలలోను, ధనుర్వేదంలోను; కల్గు= కలిగినట్టి; నైపుణియున్= నైపుణ్యం; ధర్మవిధిజ్ఞతయున్= ధర్మగుణం యొక్క జ్ఞానం; విరోధి= శత్రువులైన; భూరమణ= భూపతులను; మర్దన= సంహరించే; క్రమ= పద్ధతిచేత; విరాజిత= ప్రకాశిస్తున్న; శౌర్యమున్= పరాక్రమం; నీకున్+పోలెన్= నీకువలె; నైజములు+అగువాఁడు= సహజసిద్ధమైన వాడూ; ఎన్నఁడున్= ఏ కాలంలోనూ; వేఱు+ఒఁకడు= మరొకడు; పుట్టఁడు= జన్మించడు.

**తాత్పర్యం:** ఓ భీష్మా! దమమూ, సత్యం, తపోదానాలు, వేదాలలోనూ ధనుర్వేదంలోను అత్యంత నైపుణ్యం, ధర్మోచితమైన జ్ఞానం, శత్రురాజులను వధించి విరాజిల్లే పరాక్రమం - నీవలె సహజసిద్ధంగా కలవాడు, ఏ కాలంలోనూ జన్మించడు.'

**విశేషం:** తిక్కన పద్యరచనా శైలికి నిదర్శనం ఈ పద్యం. భీష్ముడి ఉత్తమ గుణగణాలను శ్రీకృష్ణుడు ఏకరువు పెట్టాడు ఈ పద్యంలో. తిక్కన రచనారీతిలో చక్కటి శైలీ విన్యాసంతో 103 పద్యంవలె మనోహరంగా రచించాడు. మూలంలోని మూడు శ్లోకాలను తిక్కన ఈ పద్యంలో సముచితంగా మనోహరంగా రచించాడు.

**క.** **వేయేల? సంభవించునె । సాయక తల్పమున నుండి చావఁగ నొల్లన్**
**నా యిచ్చఁ గాక? యను నరుఁ । డే యుగమునఁ జూడ వినఁగ నెచ్చట నైనన్.** **106**

**ప్రతిపదార్థం:** వేయి+ఏల?= వేయి మాట లెందుకు?; సాయక తల్పమునన్+ఉండి= అమ్ముల పాన్పునందుండి, శయనించి ఉండి; నా ఇచ్చన్+కాక= నా ఇష్టప్రకారం కాక; చావఁగన్+ఒల్లన్= మరణించ నిష్టపడను; అను= అనే; నరుఁడు= మానవుడు; ఏ యుగమునన్= ఏ యుగంలోనైనా; ఎచ్చటన్+ఐనన్= ముల్లోకాలలో ఎక్కడైనా; చూడన్ వినఁగన్= చూడగా, వినగా; సంభవించునె?= కలుగుతాడా?

**తాత్పర్యం:** ఏమైనా, శరతల్పగతుడై ఉండి, నా ఇష్టానుసారంగానే నేను మరణిస్తాను అని చెప్పగల మానవుడిని గూర్చి ఇంతకు ముందు యుగాలలోనూ, ముల్లోకాలలోనూ, ఎప్పుడైనా, ఎక్కడైనా వినబడటం గానీ, చూడబడటం గానీ జరిగిందా?

**తే.** **వసువులందును బెద్దవు, వాసవాది । సురుల మిగులుదు గుణముల, ధరణిసురులు**
**సెప్ప విందు, నీ మహిమ నా చిత్తమునను । గందు ననుపమతేజ! గంగాతనూజ!'** **107**

**ప్రతిపదార్థం:** అనుపమ తేజ!= సాటిలేని తేజస్సు కలవాడా; గంగా తనూజ!= గంగాదేవికి పుత్రుడైన భీష్మా!; వసువులందును+పెద్దవు= అష్టవసువులందరిలోను పెద్దవాడవు; గుణములన్= ఉత్తమ గుణగణాలలో; వాసవ+ఆది= ఇంద్రుడు మొదలుకొని; సురులన్=

దేవతలలో; మిగులుదు(వు)= శ్రేష్ఠుడనిపించు కొంటావు; నీ మహిమ= నీ మాహాత్మ్యాన్ని గూర్చి; ధరణి సురులు= భూ దేవతలైన బ్రాహ్మణులు; చెప్పన్ విందున్= పొగడగా విన్నాను; నా చిత్తమునను+కందున్= నా మనస్సులోను నే నెరుగుదును.

**తాత్పర్యం:** సాటిలేని తేజస్సంపన్నుడా! పవిత్ర గంగాదేవి పుత్రుడవైన ఓ భీష్మా! అష్టవసువులలో పెద్దవాడవు. ఉత్తమ గుణగణాలలో శ్రేష్ఠుడవైన నీతో ఇంద్రాది దేవతలు సైతం చాలరు. బ్రాహ్మణులు నీ మహిమను గూర్చి పొగడగా విన్నాను. నేను సైతం నా మనస్సులో గుర్తించాను'.

**విశేషం:** అష్టవసువులు: ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు - అని ఎనిమిది మంది అందులో ప్రభాసుడే భీష్ముడుగా జన్మించాడు. ఒకానొక సమయంలో అష్టవసువులు భార్యా సమేతులై వశిష్ఠాశ్రమానికి వెళ్ళారు. వశిష్ఠుని హోమధేనువు పాలుతాగితే జరామరణాలు ఉండవని తెలిసి దాన్ని అష్టవసువులు అపహరిస్తారు. ఈ విషయం తెలుసుకొన్న వశిష్ఠుడు అష్టవసువులను మానవులుగా జన్మించమని శపిస్తాడు. అందులో ప్రభాసుని భార్య ఈ హోమధేనువు అపహరణకు మూలమని తెలిసి భూలోకంలో సంతాన రహితుడై చిరకాలం జీవించేటట్లు శపించాడు. అతడే భీష్ముడు.

**వ. అని పలికి పాండవాగ్రజుం జూపి. 108**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని శ్రీకృష్ణుడు మాటలాడి; పాండవ+అగ్రజున్+చూపి= పాండవులలో మొదటి వాడైన ధర్మరాజును భీష్మునకు చూపించి.

**తాత్పర్యం:** అని శ్రీ కృష్ణుడు పలికి ధర్మరాజుకు భీష్ముడిని చూపించి - (తరువాతి పద్యంతో అన్వయం).

### కృష్ణుఁడు ధర్మజునకు ధర్మము లుపదేశింప భీష్ము నియమించుట (సం. 12-50-29)

**ఉ. 'నీవు తపో విశేష మహనీయతఁ జేసి జగంబు లన్నియున్**
**భావమునం గనుంగొని నృపాల మహోత్తర! చాలు; దీతఁ డ**
**త్యావిల చిత్తుఁడయ్యె సుహృదాప్తమృతిన్ దురటిల్లు నెవ్వగం**
**బోవగఁ ద్రోవు నీ దయిన పుణ్యతమస్ఫుట వాక్య పద్ధతిన్. 109**

**ప్రతిపదార్థం:** నృపాల మహా+ఉత్తర=రాజులలో మహాశ్రేష్ఠుడైన ఓ భీష్మా!; నీవు; తపః+విశేష+మహనీయతన్+చేసి= విశిష్టమైన తపస్సు యొక్క, గొప్పతనం వలన; భావమునన్= మనస్సునందే; జగంబులు+అన్నియున్= లోకములన్నింటిని; కనుంగొని= తెలిసికొని; చాలుదు(వు)= సమర్థుడవై ఉంటావు; ఈతఁడు= ఈ ధర్మరాజు; సుహృద్+ఆప్తమృతిన్= స్నేహితుల, బంధువుల యొక్క మరణంచేత; అతి+ఆవిలచిత్తుఁడు+అయ్యెన్= అత్యంత బాధతో కూడిన చిత్తం కలవాడు అయ్యాడు; దురటిల్లున్= తపిస్తున్నాడు; నెఱ+వగన్= మిక్కిలి బాధను (ధర్మరాజుయొక్క బాధను); నీదు+అయిన= నీదైన; పుణ్యతమ స్ఫుట వాక్య పద్ధతిన్= మహా పుణ్యంతో కూడుకొని స్పష్టమైన మాటల రీతితో; పోవఁగన్+త్రోవు(ము)= తొలగి పోయేటట్లుగా చేయవలసింది. (శ్రీకృష్ణుడు కోరుతున్నాడు).

**తాత్పర్యం:** 'ఓ రాజశ్రేష్ఠుడైన భీష్మా! నీవు అత్యంత తపస్సంపన్నుడవు. అందువలననే లోకాలలో జరిగే సమస్త విషయాలను మనస్సునందే గ్రహించగలవు. ఈ ధర్మరాజు మిత్రులు, బంధువులు అందరు మరణించగా దుఃఖంతో బాధాతప్తుడై ఉన్నాడు. నీ ఉత్తమమైన మాటల పోహళింపుచేత ధర్మరాజు బాధను తొలగించవలసిందని కోరుతున్నాను.

**విశేషం:** 'నృపాలమహోత్తర' - అని తిక్కన భీష్ముడికి విశేషణం వాడటంతో భీష్ముడి రాజధర్మాన్ని, రాజనీతిని గుర్తింపచేస్తున్నాడు. అట్లాగే 'తపోవిశేష మహనీయత చేసి' అనే ప్రయోగంవలన భీష్ముడి తపోనిరతి, దాని మూలంగా సమస్త లోకజ్ఞత వ్యక్తం చేయటం జరిగింది. 'పుణ్యతమస్ఫుట వాక్యపద్ధతిన్' అనటంవలన దుఃఖితమతి అయిన ధర్మరాజును ప్రస్ఫుటమైన చక్కటి మాటల నీటుతో భీష్ముడు ఊరడించగల డని సంభావించవచ్చును.

**వ. నాలుగు వర్ణంబులకును నాలుగాశ్రమంబులకు నిట్టిట్టివి యర్హంబులని నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులు నీకు విదితంబులు; ప్రవృత్తి నివృత్తులును సాంఖ్యయోగంబులును బురాణేతిహాసంబులు ధర్మశాస్త్రంబులు నవగతంబులు; సర్వసంశయచ్ఛేదన దక్షుండ; వీ వీక్షితిపతి నాదరింపుము; శోక మోహగ్రస్తం బగు జనంబు నిస్తరింపంజేయుట గదా మిము బోటుల బుద్ధి విస్తారంబునకు ఫలం' బనిన విని మొగం బించుక యెత్తి కృతాంజలి యై గాంగేయుండు గోవిందున కిట్లనియె. 110**

**ప్రతిపదార్థం:** నాలుగు వర్ణంబులకును= చతుర్వర్ణాలకు; నాలుగు+ఆశ్రమంబులకున్= మానవుడు ఆచరించవలసిన నాలుగు ఆశ్రమాలకు; ఇట్టివి+ఇట్టివి= ఇట్లాంటివి; అర్హములు+అని= తగినవని; నాలుగు వేదంబులన్= నాలుగు వేదాలలోను; చెప్పిన= చెప్పబడిన; ధర్మంబులు= సమస్త ధర్మాలు; నీకు విదితంబులు= నీకు తెలుసును కదా; ప్రవృత్తి నివృత్తులును= ప్రవృత్తి నివృత్తులనే చిత్తవృత్తులు; సాంఖ్య యోగంబులును= సాంఖ్య యోగాదులూ; పురాణ+ఇతిహాసంబులును= పురాణాలూ, ఇతిహాసాలూ; ధర్మశాస్త్రంబులును= ధర్మశాస్త్రాదులూ; అవగతములు= నీకు తెలిసినవే; ఈవు= నీవు; సర్వ సంశయ+ఛేదన దక్షుండవు= అన్ని సందేహాలను నివృత్తి చేయగల సమర్థుడవు; ఈక్షితిపతిన్+ఆదరింపుము= ఈధర్మరాజును ఆదరించుము; మిముబోటుల= మీలాంటి వారి; బుద్ధి విస్తారంబునకున్= విస్తృతమైన జ్ఞానానికి; శోక మోహ గ్రస్తంబు+అగు= దుఃఖ మోహాలతో కూడిన; జనంబున్= ప్రజలను; నిస్తరింపన్+చేయుట+ఫలంబు కదా!= ఊరడింపచేయటమే ప్రయోజనం కదా!; అనినన్ విని= అని చెప్పగా విని; మొగంబు+ఇంచుక+ఎత్తి= ముఖం కొద్దిగా పైకెత్తి; కృత+అంజలి+ఐ= చేతులు జోడించిన వాడై; గాంగేయుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; గోవిందునకున్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** చతుర్వర్ణాల ప్రజలు, చతురాశ్రమాలలో ఆయా ప్రజలు చేయవలసిన అర్హమైన కార్యకలాపాలు, చతుర్వేదాలలో చెప్పబడిన అన్ని ధర్మాలు నీకు తెలుసు. ప్రవృత్తినివృత్తి మార్గాలు, సాంఖ్యయోగాలు, పురాణేతిహాసాలు, ధర్మశాస్త్రాలు నీకు కరతలామలకాలే. నీవు సర్వసంశయాలను నివృత్తి చేయగల సమర్థుడవు. నీవు ఈ ధర్మరాజును ఆదరించుము. మీవంటి వారి సర్వసమర్థతకు, బుద్ధివిస్తారతకు, శోకమోహాలతో బాధా సంతప్తులైన ప్రజలను తరింపచేయటమే ప్రయోజనం కదా!' అని కృష్ణుడు పేర్కొనగా విని భీష్ముడు కొద్దిగా కృష్ణుడివైపు ముఖం తిప్పి, నమస్కరించి శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** నాలుగు వర్ణాలు: బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు.
నాలుగు ఆశ్రమాలు: బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం
నాలుగు వేదాలు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం

**క. 'కర్తయును భర్తయును సం । హర్తయు జగములకు నీవ! యాశ్రిత జన ఘో**
**రార్తి నిరాస నిపుణ సం । కీర్తన! యోగీశ్వరేశ! కృష్ణ వరేణ్యా!' 111**

**ప్రతిపదార్థం:** యోగి+ఈశ్వర+ఈశ!= యోగులలో శ్రేష్ఠులకు శ్రేష్ఠుడైన వాడా!; కృష్ణవరేణ్యా!= శ్రేష్ఠుడవైన ఓ కృష్ణా!; ఆశ్రిత= ఆశ్రయించిన; జన= జనులయొక్క; ఘోర+ఆర్తి= భయంకరమైన దుఃఖాన్ని; నిరాస నిపుణ సంకీర్తన= తొలగించుట యందు నిపుణుడవై కీర్తింపబడుతున్నవాడా; జగములకున్= లోకాలకు; కర్తయును= సృష్టికర్తా; భర్తయును= సంరక్షకుడును; సంహర్తయున్= వినాశకుడు; నీవ= నీవే.

**తాత్పర్యం:** 'యోగిశ్రేష్ఠుడవైన ఓ శ్రీకృష్ణా! ఆశ్రయించిన ప్రజల దుఃఖాన్ని పోగొట్టటంలో నిపుణుడవైనవాడా! జగత్తులన్నింటికీ సృష్టి స్థితి లయ కారకుడవు నీవే కదా!'

**విశేషం:** ఈ పద్యంలో శ్రీకృష్ణుడు సర్వశక్తి మంతుడని, కనుకనే ధర్మరాజు దుఃఖాన్ని పోగొట్టేవాడని ధ్వనింపచేస్తున్నాడు. కృష్ణుడు భీష్ముడిని పొగడినదంతా ఒక ఎత్తైతే శ్రీకృష్ణుడిని భీష్ముడు పొగడటం ఒక ఎత్తు.

మూలంలోని తొమ్మిది శ్లోకాలలో భీష్ముడు శ్రీకృష్ణుని గూర్చి పలికిన ప్రశంసా వాక్యాలను తిక్కన చిన్న కందపద్యంలో చక్కగా ధ్వనింపచేశాడు. ఇంతకు క్రితం చేసిన స్తవరాజంలోని కొన్ని శ్లోకాల పునరుక్తులు మూలంలోని ఈ భాగంలో ఉన్నాయి. వాటిని పునరుక్తి చేయకుండా ఒకే పద్యంలో వివరించాడు తిక్కన.

**వ. అని మఱియు ననేక ప్రకారములం బ్రశంసించి నాకు మేలెయ్యది దానిని నీ దివ్య చిత్తంబునం దలంపు మనవుడు నద్దేవుం డిట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** అని మఱియున్= అని చెప్పి మరల; అనేక ప్రకారంబులన్= వివిధ రీతులలో; ప్రశంసించి= పొగడి; నాకు మేలు+ఏ+అది= నాకు ఏది మంచిదో దానిని; నీ దివ్య చిత్తంబునన్+తలంపుము= నీ దేవతా సంబంధమైన మనస్సులో ఆలోచించుము; అనవుడున్= అనగానే; ఆ+దేవుండు+ఇట్లు+అనియెన్= ఆ దేవుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని భీష్ముడు శ్రీకృష్ణుడిని అనేక రీతులుగా పొగడి 'నా కేది మేలో నీ మనస్సునందే ఆలోచించుము' అని చెప్పగా ఆ శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు.

**తే. 'అచల భక్తి నిత్యంబు నాయందు నీకుఁ । గలిమిఁ జేసి నీ యంతరంగమున నాదు**
**దివ్యరూపంబు నొలయించితిం బ్రమోద । భాజనం బైతి భీష్మ తపస్స్వరూప! 113**

**ప్రతిపదార్థం:** భీష్మ తపస్స్వరూప!= భయంకరమైన తపస్సే స్వరూపంగా కలిగిన ఓ భీష్మా!; నాయందున్= నాపై; అచలభక్తి= ప్రగాఢతమమైన భక్తి; నీకున్+కలిమిన్+చేసి= నీకుండటంచేత; నీ అంతరంగమునన్= నీ మనస్సునందు, హృదయంలో; నాదు= నా యొక్క; దివ్యరూపంబున్= దైవ స్వరూపాన్ని; ఒలయించితిన్= సంకల్పించాను; ప్రమోద భాజనంబు+అయితి= సంతోషానికి అర్హుడ వయ్యావు.

**తాత్పర్యం:** 'కఠినమైన శపథం చేసి ఘోరమైన తపస్సే రూపు దాల్చిన ఓ భీష్మా! ఎల్లప్పుడు నాయందు నీ భక్తి ప్రగాఢమై ఒప్పుతుంది. అందువలననే నీ హృదయంలో నా దైవస్వరూపాన్ని నిలిపాను. అత్యంత సంతోషానికి అర్హుడవయ్యావు.'

**వ. మేలు వేఱ తలంప నేల?' యని వెండియు. 114**

**ప్రతిపదార్థం:** మేలు= శ్రేయస్సు; వేఱ+తలంపన్+ఏల?= మరొక మారు ప్రత్యేకంగా ఆలోచించటం ఎందుకు?; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు మెచ్చుకొంటూ మళ్ళీ మేలును గూర్చి ఆలోచింపనవసరం లేదని చెప్పి, మరల ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'భక్తియు నార్జవమును సం । యుక్తము లై యున్న యట్టి యుల్లంబున నా**
**సక్తి నిలుతు; నిందొకఁడు వి । యుక్తం బైనను వసింప నుర్వీనాథా! 115**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ రాజా భీష్మా!; భక్తియున్= భక్తియును; ఆర్జవమును= ఋజు మార్గమును; సంయుక్తములు+అయి+ ఉన్న+అట్టి= కలిసి ఉన్నటువంటి; ఉల్లంబునన్= మనస్సునందు; ఆసక్తిన్= నిలుతున్= మిక్కిలి ఆసక్తితో నివసిస్తూ ఉంటాను; ఇందున్+ఒకఁడు= వీటిలో ఏ ఒక్కటి; వియుక్తంబు+ఐనను= కలవకుండా పోయినట్లయితే; వసింపను= నివసించను.

**తాత్పర్యం:** 'ఓ భీష్మా! భక్తి, ఆర్జవము రెండు కలిసి ఉన్న మనస్సునందు నేను నివసిస్తాను. ఇందులో ఏ ఒక్కటి లేకపోయినా నేను ఉండను'

**విశేషం:** భక్తి, ఆర్జవము రెండూ భీష్ముని మనస్సులో ఉండటంవలననే శ్రీకృష్ణుడు ఆసక్తితో భీష్ముడి మనస్సునందు దైవస్వరూపాన్ని అధివసింప చేశాడు.

**తే.** **అనఘ! యినుఁ డింక నేఁబది యాఱు దివస । ములకుఁ దా నుత్తరాయణమునఁ జరింపఁ**
**దొడఁగు; నీ వప్డు దేహంబు విడిచి యేఁ గు । దపునరావృత్తి పదమున కభినుతముగ.** **116**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ భీష్మా!; ఇనుఁడు= సూర్యుడు; ఇంకన్= ఇటు తరువాత; ఏన్+పది యాఱు దివసములకున్= ఏబది ఆరు రోజులకు; తాన్+ఉత్తరాయణమునన్= తాను ఉత్తరాయణమునందు; చరింపన్+తొడఁగున్= ప్రవర్తించటం ప్రారంభిస్తాడు; నీవు+అప్పుడు= నీవు ఆ సందర్భంలో; దేహంబున్ విడిచి= ఈ భౌతిక శరీరాన్ని వదలి; అపునః+ఆవృత్తి పదమునకున్= మరల జన్మలేని మోక్షపదవికి; అభినుతముగన్= పొగడ దగినట్లు; ఏగుదు(వు)= వెళ్ళిపోతావు.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడవైన భీష్మా! ఇప్పటి నుంచి ఏబది ఆరు రోజులలో సూర్యుడు ఉత్తరాయణంలో సంచరించటం ప్రారంభిస్తాడు. నీవు అప్పుడు ప్రశంసార్హమైన రీతిలో ఈ భౌతికదేహాన్ని వదలిపెట్టి "పునరపి జననం పునరపి మరణం" అనే ఆవృత్తి లేకుండా జనులు నుతించేటట్లు మోక్షం పొందుతావు.

**వ.** **వీరె వసువులు విమానంబులతో నంతరిక్షంబున నంతర్హితులై నీ రాక ప్రతీక్షించి యున్న వా; రది యట్లుండె; నీవు సన్న నీ లోకంబున నెఱుక పొనుంగుపడుం గావున వీ రెల్ల సకల ధర్మవివేక లబ్ధికినయి యరుగుదెంచి పరివేష్టించి యున్నవా' రని తత్కాల సమాగత యోగ్యజనంబులం జూపి, ధర్మపుత్త్రు నుపలక్షించి, 'శోకోపహత బహుశ్రుతుం డగు నితండు దెలివొందునట్లుగా ధర్మార్థ సమాధి యుక్తంబులగు నుక్తి విశేషంబుల ననుగ్రహింప వలయు' ననుటయు నద్దేవకీనందనునకు దేవవ్రతుం డి ట్లనియె.** **117**

**ప్రతిపదార్థం:** వీరె వసువులు= వీరే వసువులు; విమానంబులతోన్= విమానాలలో కూర్చుండి; అంతరిక్షంబునన్= ఆకాశంలో; అంతర్హితులు+అయి= అదృశ్యులై; నీ రాకన్= నీ రాకను; ప్రతీక్షించి+ఉన్నవారు= వేచి ఉన్నారు; అది+అట్లు+ఉండెన్= ఆ విషయం అట్లా ఉండనీ; నీవు+చన్నన్= నీవు స్వర్గానికి వెళ్ళిపోతే; ఈ లోకంబునన్= ఈ జగత్తులో; ఎఱుక= జ్ఞానం; పొనుంగు పడున్= మరుగున పడిపోతుంది; కావునన్= అందుకే; వీరు+ఎల్లన్= వీరందరూ; సకలధర్మ వివేక లబ్ధికిన్+అయి= సమస్త ధర్మాలు వాటి విచక్షణలను పొందటానికై; అరుగుదెంచి= వచ్చి; పరివేష్టించి+ఉన్నవారు= చుట్టూ ఉన్నారు; అని= అనిచెప్పి; తద్+కాలసమాగత= ఆ సమయంలో వచ్చిన; యోగ్య జనంబులన్= అర్హులైన జనాన్ని చూపెట్టి; ధర్మపుత్రున్+ఉపలక్షించి= ధర్మరాజును ఉద్దేశించి; శోక+ఉపహత బహుశ్రుతుండు+అగు= బాధచేత దెబ్బతీయబడిన గొప్పపండితుడు; అయిన; ఇతండు= ఈ ధర్మరాజు; తెలివి+పొందునట్లుగాన్= తెలిసికొనేటట్లుగా; ధర్మ+అర్థ+సమాధియుక్తంబులు+అగు= పురుషార్థాలలో ధర్మం, అర్థం మోక్షమనే వాటికి తగిన రీతిగా; ఉక్తి విశేషంబులన్= సూక్తుల విశిష్టతతో; అనుగ్రహింపన్ వలయున్= దయచేయవలసింది; అనుటయును= అని ప్రార్థించగా; ఆ+దేవకీనందనునకున్= దేవకీ కుమారుడైన శ్రీకృష్ణుడితో; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అరుగో వసువులు ఆకాశంలో విమానారూఢులై అదృశ్యంగా నీ రాక కోసం ఎదురు చూస్తున్నారు. అది అట్లు ఉండనీ. నీవు దివంగతుడ వైతే ఈ లోకంలో జ్ఞానం మరుగున పడిపోతుంది. నీవలన ధర్మవివేకాలతో కూడిన జ్ఞానాన్ని పొందటానికి వీళ్ళంతా వచ్చారు' అని చెప్పి చుట్టూ చేరిన జనాన్ని చూపి ప్రత్యేకించి ధర్మరాజును ఉద్దేశించి 'బాధాతప్త హృదయుడైన ఇతడికి జ్ఞానోపదేశం చేయుము; ధర్మార్థ మోక్షాలను ఉచితరీతిని సూక్తిసుధతో దయచేయుము' అని కృష్ణుడు భీష్ముడిని ప్రార్థించాడు. అప్పుడు కృష్ణుడితో భీష్ముడు ఇట్లా అన్నాడు.

**క. 'శివ! నారాయణ! యచ్యుత! । భవదీయము లైన మధుర భాషణములు నా**
**చెవు లానిన నమృత రస । ప్లవనంబునఁ బోలెఁ బ్రమద భరితుఁడ నైతిన్. 118**

**ప్రతిపదార్థం:** శివ!= శుభప్రదాతా!; నారాయణ!= సర్వవ్యాపకా!; అచ్యుత!= శ్రీకృష్ణా!; భవదీయములు+ఐన= నీయొక్క; మధుర భాషణంబులు= తియ్యని మాటలు; నా చెవులు+ఆనినన్= నా చెవులలో సోకగానే; అమృత రసప్లవనంబునన్+పోలెన్= అమృతరసంలో తేలియాడుతున్నట్లు; ప్రమద భరితుఁడన్+ఐతిన్= సంతోష భరితుడ నయ్యాను.

**తాత్పర్యం:** 'శుభప్రదాతవూ, సర్వవ్యాపకుడవూ అయిన ఓ శ్రీకృష్ణా! నీ మధురమైన మాటలు నా చెవులలో పడగానే అవి అమృతరసప్రవాహంవలె ఉండగా సంతోషభరితుడను అయ్యాను.

**తే. వాగ్విభుఁడ వైన నీ వచో వైభవంబు । లో సమస్తంబు నుండుట లోకనాథ!**
**నీదు సన్నిధిఁ బలుకంగ నేర రాదు । పద్మభవునకు; నే నెట్లు పలుకువాఁడ? 119**

**ప్రతిపదార్థం:** లోకనాథ!= అన్ని లోకాలకు అధిపతివైన ఓ శ్రీకృష్ణా!; వాక్+విభుఁడవు+ఐన= మాటల వైభవం కలిగిన; నీ వచః+వైభవంబులోన్= నీ మాటల నైపుణ్యమందు; సమస్తంబున్+ఉండుటన్= సర్వమూ ఉండటం వలన; నీదు సన్నిధిన్= నీ ఎదుట; పద్మ భవునకున్= పద్మం నుంచి పుట్టిన బ్రహ్మకైనా; పలుకంగన్ నేరన్‌రాదు= మాటలాడటం సాధ్యం కాదు; నేను+ఎట్లు, పలుకువాఁడన్?= నే నే విధంగా మాటలాడగలను?

**తాత్పర్యం:** వాగ్విభవుడవైన ఓ శ్రీకృష్ణా! నీ మాటల నైపుణ్యంలో సమస్తమూ ఉంటుంది. అటువంటి నీ ముందు మాటలాడటం బ్రహ్మకు కూడా సాధ్యం కాదు. నీకు నే నెట్లా సమాధానం ఇవ్వగలను?

**వ. విషానల సదృశంబు లగు శరంబులు సేయు వేదనం జేసి యంగంబులు నంతరంగంబు నవశంబులై యున్న యవి; ప్రతి సంభాషణ క్షమ లేదు; దౌర్బల్యంబున నెలుంగును నాలుకయుం బ్రస్ఫుట వర్తనంబులు గా;వే నెవ్విధంబున భాషింప నుత్సహింతుఁ? బ్రతిభాషా శక్తిలేమి సహించి నా దెసం బ్రసన్నుండ వగుము; ధర్మపుత్రున కెయ్యది హితం బది నీవ చెప్పుము; నీ వుండ నేను జెప్పుట గురుం డుండ శిష్యుండు సెప్పిన విధంబు గాదె' యనిన విని భక్తార్తిహరుం డైన హరి యతనితో నిట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** విష+అనల సదృశంబులు+అగు= విషంతోను, అగ్నితోను, సమానమైన; శరంబులు+చేయు= బాణాలు కలిగించే; వేదనన్+చేసి= బాధవలన; అంగంబులున్= అవయవాలు; అంతరంగంబున్= మనస్సును; అవశంబులు+ఐ+ఉన్న+అవి= నా వశం తప్పి ఉన్నవి; ప్రతి సంభాషణ క్షమ లేదు= ప్రత్యుత్తర మిచ్చే సామర్థ్యం లేదు; దౌర్బల్యమునన్= దుర్బలత్వం వలన; ఎలుంగును= కంఠధ్వని; నాలుకయును= నాలుక; ప్రస్ఫుట వర్తనంబులు+కావు= స్పష్టరీతిని మెలగటం లేదు; ఏను+ఏ+విధంబునన్= నేను ఏ రీతిగా; భాషింపన్= మాటలాడ; ఉత్సహింతున్?= ఉత్సాహ పడతాను?; ప్రతి భాషా శక్తి లేమిన్= ప్రత్యుత్తర మిచ్చే

శక్తి లేకపోవటం వలన; సహించి= ఓర్చుకొని; నా దెసన్= నా యందు; ప్రసన్నుండవు+అగుము= దయచూపించుము; ధర్మ పుత్రునకున్= ధర్మరాజుకు; ఏ+అది= ఏది; హితంబు+అది= మేలైనదో దానిని; నీవు+అ చెప్పుము= నీవే చెప్పుము; నీవు+ఉండన్= నీవు ఉండగా; నేను చెప్పుట= నేను చెప్పటం; గురుండు+ఉండన్= గురువు ఉండగా; శిష్యుండు+చెప్పిన విధంబు+కాదె!= శిష్యుడు చెప్పినట్లు అవుతుంది గదా; అనినన్ విని= అని పలుకగా విని; భక్త+ఆర్తి+హరుండు+ఐన= భక్తుల యొక్క దుఃఖాన్ని తొలగించే వాడైన; హరి= శ్రీకృష్ణుడు; అతనితోన్= ఆ భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** విషముతో, అగ్నితో సమానమైన బాణాలు శరీరంమీద గుచ్చుకొని కలిగిస్తున్న బాధ శరీరంతోపాటు మనస్సును కూడా వశవర్తి కానీయటం లేదు. మీతో సంభాషించే సామర్థ్యం నాకు లేదు. ఈ దుర్బలత్వం వలన నా కంఠధ్వని నాలుక, స్పష్టతను కోల్పోయాయి. అట్లాంటి నేను మాటలాడటానికి ఎట్లా పూనుకొనేది? ప్రత్యుత్తరం ఇచ్చే శక్తి లేకపోవటం వలన నన్ను క్షమించి దయతో చూడుము. ధర్మరాజుకు ఏది మంచిదో అది నీవే చెప్పుము. నీవు ఉండగా నేను చెప్పటం అనేది - గురువు ఉండగా శిష్యుడు చెప్పినట్లు అవుతుంది' అని శ్రీకృష్ణుడితో భీష్ముడు చెప్పగా భక్తుల దుఃఖాలను పోగొట్టే శ్రీకృష్ణుడు భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**క. 'కురువంశ ధురంధరుఁ డగు । పరమార్థజ్ఞునకు వినయఫణితిం దగు ని**
**ర్భర శరవేదన సెప్పితి; । వరములు మూఁడిత్తు గొనుము వసుధాధీశా! 121**

**ప్రతిపదార్థం:** వసుధా+అధి+ఈశా!= భూమికి అధిపతివైన ఓ భీష్మా!; నిర్భర శర వేదన= భరింపశక్యం కాని బాణాల యొక్క బాధను గూర్చి; తగు= తగిన విధంగా; వినయ ఫణితిన్= వినయ మార్గంలో; చెప్పితి(వి)= చెప్పావు; కురువంశ ధురంధరుఁడు+అగు= కురువంశ భారాన్ని మోసేవాడవైన నీకు; పరమ+అర్థజ్ఞునకున్= భగవత్తత్త్వజ్ఞుడవైన నీకు; వరములు మూఁడు= మూడు వరాలను; ఇత్తున్= ఇస్తాను; కొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** 'ఓ భీష్మా! భరింపశక్యం కాని వేదనను గూర్చి వినయంతో తెలిపావు. కురువంశభారం నీమీద ఆధారపడి ఉన్నది. భగవత్తత్త్వ జ్ఞానివి. అటువంటి నీకు మూడు వరాలు ఇస్తున్నాను. స్వీకరించుము'.

**క. శరముల వలనను మూర్ఛం । బొరయక యొక్కింత డప్పిబొరయక నొప్పిం**
**బొరయక యవిద్ధ గాత్రుని । కరణి సుఖాత్ముఁడవు గమ్ము కౌరవనాథా! 122**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓ భీష్మా; శరముల వలనను= బాణాల వలన; మూర్ఛన్+పొరయక= మూర్ఛపొందకుండా; ఒక్కింత= కొంచెమైనా; డప్పిన్+పొరయక= అలసట చెందకుండా; నొప్పిన్+పొరయక= బాధ పొందకుండా; అవిద్ధ గాత్రుని కరణిన్= బాధించబడని శరీరం కలవాడుగా; సుఖ+ఆత్ముఁడవు+కమ్ము= కష్ట రహితుడవై ఉండుము.

**తాత్పర్యం:** ఓ భీష్మా! గ్రుచ్చుకొన్న బాణాల వలన మూర్ఛగానీ, అలసటగానీ, నొప్పిగానీ కలుగకుండా బాధా రహితమైన శరీరంతో సుఖంగా ఉండుము'.

**ఆ. అనఘ! నీరువట్టు నాఁకలియును నెప్డుఁ । బొరయకుండునట్టి భూరి శక్తి**
**నీకుఁ గలుగ నేను నెమ్మనంబునఁ దలం । చితిఁ; దదీయ పీడఁ జెందకుండు. 123**

**ప్రతిపదార్థం:** న+అఘ!= పాపరహితుడా! ఓ భీష్మా!; ఎప్పుడున్= ఏ సమయమందైనా; నీకున్; నీరువట్టున్= దప్పిక; ఆఁకలియున్= ఆకలీ; పొరయక+ఉండునట్టి= కలుగనట్టి; భూరిశక్తి కలుగన్= మిక్కిలి శక్తి కలిగే విధంగా; ఏను= నేను; నెఱ+మనంబునన్= నిండు మనస్సులో; తలంచితిన్= భావించాను; తదీయపీడన్= ఆ బాధను; చెందకుండు(ము)= పొందకుండా ఉండుము.

**తాత్పర్యం:** పాప రహితుడవైన ఓ భీష్మా! ఎప్పుడూ నీకు ఆకలి దప్పులు కలుగకుండా ఉండేటట్లుగా నీకు మహాశక్తి కలగాలని నా మనసులో సంకల్పించాను. వాటి పీడ నీకు ఉండదు.

**క. విను! సకల భూతముల వ ၊ ర్తనములు గను నపుడు బుద్ధి దవులఁ బడక యెం**
**దును బరఁగి దివ్యబోధం ၊ బున నలవడునట్టి పెంపుఁ బొందు మనింద్యా! 124**

**ప్రతిపదార్థం:** అనింద్యా!= పాపరహితుడా!; విను= వినుము; సకల భూతముల= సమస్త ప్రాణులయొక్క; వర్తనములు= నడవడికలను; కనునపుడు= గమనించే సమయంలో; బుద్ధి= నీ మనస్సు; ఎందునున్= ఏ విధంగానూ; తవులన్+పడక= వాటిలో చిక్కకుండా; పరఁగి= ఒప్పి; దివ్య బోధంబునన్+అలవడు+అట్టి= దివ్య జ్ఞానంతో ఒప్పారుతూ ఉండునట్టి; పెంపున్+పొందుము= అట్లాంటి అతిశయాన్ని పొందుము.

**తాత్పర్యం:** ఓ భీష్మా! సకలప్రాణుల నడవడికలను గమనించేటప్పుడు నీ మనస్సు వాటికి అంటకుండా దివ్య ప్రబోధాన్ని పొందుతావు. అట్లాంటి శక్తితో అతిశయజ్ఞానాన్ని పొందుము.

**వ. మత్ప్రసాదంబున నీదృశప్రభావ నిరూఢుండ వయి నెగడు' మని పల్కుటయుం, బారాశర్యాది పరమార్యు లప్పద్మనాభుం బ్రశంసించిరి; దివంబున దేవదుందుభులు మొరసె; మురారి భీష్మ ధర్మజుల మీఁదం గుసుమ వర్షంబు గురిసె; నప్సరోగణ గానంబు వీతెంచె; నచ్చటి యందఱు నాశ్చర్య ప్రమోదభరిత హృదయు లైరి. తదనంతరంబ యంబుజాప్తుం డపరగిరి శిఖరం బలంకరించె; నప్పు డమ్మును లచ్యుత గాంగేయ కౌంతేయాగ్రజుల నామంత్రితులం జేసి గమనోన్ముఖు లగుటయు, న మ్మాధవ యుధిష్ఠిరులును, సాత్యకియును భీమార్జున యమళులును, గృప యుయుత్సు సంజయులును వారలకుం బ్రణమిల్లిరి; వారలును రేపు వచ్చెద మని నిజస్థానంబులకుం జనిరి; కృష్ణాదులును దేవవ్రతున కభిముఖు లగుచు నట్ల పలికి, వలగొని యరిగి యరదంబు లెక్కిరి; వారి పిఱుంద మున్ను వచ్చిన వారణ రథ తురగ పదాతులు బలసి కొల్చి పోవం బురంబునకు వారు వోవు సమయంబున. 125**

**ప్రతిపదార్థం:** మత్+ప్రసాదంబునన్= నా అనుగ్రహంతో; ఈదృశప్రభావ నిరూఢుండవు+అయి= ఇట్లాంటి మహిమాతిశయం కలవాడవై; నెగడుము= ప్రసిద్ధుడవు కమ్ము; అని పల్కుటయున్= అని శ్రీకృష్ణుడు చెప్పగా (అనుగ్రహించగా); పారాశర్య+ఆది= పరాశరుని కుమారుడైన వ్యాసుడు మొదలుకొని; పరమ+ఆర్యులు= ఆర్యశ్రేష్ఠులు; ఆ+పద్మనాభున్= ఆ శ్రీకృష్ణుడిని; ప్రశంసించిరి= ప్రస్తుతించారు; దివంబునన్= స్వర్గంలో; దేవదుందుభులు మొరసెన్= దేవతా సంబంధమైన భేరులు మ్రోగాయి; ముర+అరి భీష్మ ధర్మజులమీఁదన్= శ్రీకృష్ణుడు, భీష్ముడు, ధర్మజులమీద; కుసుమ వర్షంబు కురిసెన్= పూలవాన కురిసింది; అప్సరోగణ గానంబు= అప్సరసల బృందగానం; వీతెంచెన్= వినిపించింది; అచ్చటి+అందఱున్= అక్కడ ఉన్న వారంతా; ఆశ్చర్యప్రమోద భరిత హృదయులు= ఆశ్చర్యంతో కూడిన సంతోష మనస్కులు; ఐరి= అయ్యారు; తద్+అనంతరంబ= ఆ తరువాత; అంబుజ+ఆప్తుండు= పద్మబంధువైన సూర్యుడు; అపరగిరి శిఖరంబు= పడమటి కొండ శిఖరమును; అలంకరించెన్= అలంకరించాడు; అప్పుడు+ఆ+మునులు= ఆ సమయంలో అక్కడున్న మహర్షులు; అచ్యుత గాంగేయ కౌంతేయ+అగ్రజులన్= శ్రీకృష్ణ, భీష్మ, ధర్మరాజాదుల వద్ద; ఆమంత్రితులను చేసి= అనుజ్ఞపొంది; గమన+ఉన్ముఖులు+అగుటయున్=వెళ్ళిపోవటానికి సిద్ధం కాగా; ఆ+మాధవ+యుధిష్ఠిరులును సాత్యకియు, భీమార్జున యమళులును గృప యుయుత్సు సంజయులును= శ్రీకృష్ణ, ధర్మజ, సాత్యకి, భీమార్జునులు, కవలలైన నకుల సహదేవులు, కృప, యుయుత్సు, సంజయులును; వారలకున్= ఆ మహర్షులకు; ప్రణమిల్లిరి= నమస్కరించిరి; వారలను= ఆ మహర్షులును; రేపు వచ్చెదము+అని= ఉదయాన్నే వస్తామని; నిజస్థానంబులకున్+చనిరి= వాళ్ళ నివాసాలకు వెళ్ళారు; కృష్ణ+ఆదులును= కృష్ణుడు మొదలైనవారునూ; దేవవ్రతునకున్= భీష్మునకు; అభిముఖులు+ అగుచున్=ఎదురుగా నిలబడి; అట్లు+పలికి= అదే విధంగా పలికి; వలగొని= ప్రదక్షిణించి;

అరిగి= వెళ్ళి; అరదంబులు+ఎక్కిరి= రథాలు అధిరోహించారు; వారి పిఱుందన్= వారి వెనుకనే; మున్ను వచ్చిన= ముందే వచ్చిన; వారణ రథ తురగ పదాతులు= ఏనుగులు, రథాలు, గుర్రాలు, కాల్బలం; బలసి= గుమికూడి; కొల్చిపోవన్= అనుసరించి పోతూ ఉండగా; వారు= శ్రీకృష్ణాదులు; పురంబునకున్= హస్తినాపురానికి; పోవు సమయంబునన్= వెళ్తూ ఉన్న సందర్భంలో.

**తాత్పర్యం:** నా అనుగ్రహంతో పైన పేర్కొన్న మూడు వరాలవలన మహిమాతిశయుడవై వర్థిల్లు'మని శ్రీకృష్ణుడు భీష్ముడితో చెప్పాడు. వ్యాసాది మహర్షులంతా శ్రీకృష్ణుడిని ప్రశంసించారు. స్వర్గంలో దేవదుందుభులు మ్రోగాయి. కృష్ణుడు, భీష్ముడు, ధర్మరాజు మొదలైనవారి మీద పూలవాన కురిసింది. అప్సరోభామినుల బృందగానం వినిపించింది. అక్కడున్న వాళ్ళందరి హృదయాలు ఆశ్చర్యసంతోషాలతో నిండిపోయాయి. సూర్యుడు అస్తగిరి శిఖరాన్ని చేరాడు. అక్కడ ఉన్న మహర్షులంతా శ్రీకృష్ణ భీష్మ ధర్మరాజులవద్ద సెలవుపుచ్చుకొని పోవటానికి సిద్ధమయ్యారు. కృష్ణ ధర్మరాజ సాత్యకులు, భీమార్జున నకుల సహదేవులు. కృప, యుయుత్సు, సంజయులు మహర్షులకు నమస్కరించారు. ఆ మహర్షులును ఉదయాన్నే వస్తామని చెప్పి తమ నివాసాలకు వెళ్ళిపోయారు. కృష్ణుడు మొదలైనవారు భీష్ముడికి అభిముఖులై ఉదయాన్నే వస్తామని చెప్పి ప్రదక్షిణించి, రథాధిరోహణం చేశారు. అంతకు ముందే వచ్చినట్టి చతురంగబలాలు వారిని సేవిస్తూ వారి వెనుక హస్తినాపురానికి వెళ్ళుతూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. దినమున నెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ బీల్వ వం**
**దిన సకలౌషధి ప్రవితతిం దెలివొందఁగఁజేయు నేర్పు గ**
**ల్గిన తన రశ్మిజాలమున లీలఁ జకోరములన్ మదింపఁ జే**
**య నుదయమై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్పు సేయుచున్. 126**

**ప్రతిపదార్థం:** దినమునన్+ఎల్లన్= పగలంతా; ఉష్ణకరదీప్తులు= వేడి అయిన కిరణాలు కలిగిన సూర్యుడి యొక్క కాంతులు; పర్వి= వ్యాపించి; రసంబు+పీల్వన్= ఓషధుల రసాన్ని పీల్చి వేయగా; వందిన= వాడిపోయిన; సకల+ఓషధి ప్రవితతిన్= సమస్తమైన ఓషధుల సమూహాన్ని; తెలివి+ఒందఁగన్= మళ్ళీ చైతన్యవంతమయ్యేటట్లుగా; చేయునేర్పు+కల్గిన= చేయగల నేర్పరి తనంఉన్నటువంటి; తన రశ్మి జాలమునన్= తనదైన వెన్నెల సమూహంతో; లీలన్= విలాసంతో; చకోరములన్= చకోర పక్షులను; మదింపన్+చేయన్= బలాన్ని పుంజుకొనేటట్లు చేయటానికై; అమృత+అంశుఁడు= చల్లని కిరణాలు కలిగిన చంద్రుడు; ఉదయము+ఐ= ఉదయించి; సేనకున్= సైన్యానికి; తన్పు+చేయుచున్= సంతోషాన్ని కలిగిస్తూ; వెలింగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** పగలంతా సూర్యుడి వేడిమి ఓషధుల రసాన్ని పీల్చివేయగా కందిపోయినటువంటి ఆ ఓషధుల సమూహాలకు ప్రాణవంతం చేయగల నేర్పున్న తన వెన్నెలల చల్లదనంతో ఆ కిరణాలను ఆహారంగా స్వీకరించి చకోరాలు మదించేటట్లుగా చేయటానికై చంద్రుడు ఉదయించి సైన్యానికి సంతోషం కలిగిస్తూ ప్రకాశించాడు.

**విశేషం:** "తతః పురస్తాత్..... గుణేన యోజయన్" అనే మూలశ్లోకానికి వన్నెలు దిద్దుతూ తిక్కన ఈ వృత్తాన్ని రచించాడు. మూలంలో ఓషధులను మళ్ళీ పునర్జీవితులను చేస్తున్నా నన్నాడే కానీ చకోర పక్షుల ప్రస్తావన లేదు. చంద్రకిరణాలను భక్షించి చకోరాలు జీవిస్తాయన్న అంశాన్ని చక్కగా వర్ణించాడు తిక్కన.

**వ. ఇట్లుదయించి సుధామరీచి లోచనప్రీతి యాచరింపం బెంపు సుభగంబుగా శౌరి ప్రముఖులు పుర ప్రవేశంబు సేసి నిజ నివాసంబుల నుచిత వర్తనంబుల నా రాత్రి గడపి ప్రభాతం బగుటయు. 127**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఉదయించి= ఈ విధంగా పుట్టిన; సుధామరీచి= చల్లనైన కిరణాలు కలవాడైన చంద్రుడు; లోచనప్రీతి+ఆచరింపన్= కన్నుల పండువు చేయగా; పెంపు సుభగంబుగాన్= అతిశయితమైన మనోహరంగా; శౌరి ప్రముఖులు= శ్రీకృష్ణుడు మొదలైనవారు; పుర ప్రవేశంబు+చేసి= హస్తినాపురంలోకి వెళ్ళి; నిజ నివాసంబులన్= స్వగృహాలలో; ఉచిత వర్తనంబులన్= తగిన పనులతో; ఆ రాత్రి గడపిరి= ఆ రాత్రి సుఖంగా గడిపారు; ప్రభాతంబు+అగుటయున్= తెల్లవారగానే.

**తాత్పర్యం:** ఆ రీతిగా చంద్రుడు ఉదయించి కన్నుల పండువు చేయగా శ్రీకృష్ణాదులు మిక్కిలి సంతోషంతో హస్తినాపుర ప్రవేశం చేసి స్వగృహాలలో తగిన రీతిగా ఆ రాత్రి గడిపారు. అంతలో తెల్లవారింది.

**తే.** **మంజుపాఠక రవమును మధురమాగ । ధస్వనంబును వినుచు మాధవుఁడు మేలు**
**కాంచి తత్కాల సముచిత కర్మ జాత । మాచరించి భూసురులకు నర్చ లిచ్చి. 128**

**ప్రతిపదార్థం:** మంజుపాఠక రవమును= మనోహరమైన పాఠకులయొక్క శబ్దాలను; మధుర మాగధ స్వనంబును= తియ్యనైన మాగధుల యొక్క కంఠధ్వనిని వింటూ; మాధవుఁడు= శ్రీకృష్ణుడు, మేలుకాంచి= మేలుకొని; తద్+కాల= ఆ ఉదయకాలమందలి; సముచిత కర్మజాతము+ఆచరించి= తగిన కార్యక్రమాన్ని చేసి; భూసురులకున్= భూదేవు లైన బ్రాహ్మణులకు; అర్చలు ఇచ్చి= పూజలు చేసి.

**తాత్పర్యం:** మనోహరమైన వందిజన స్తోత్రాలను, శ్రుతిసుభగమైన మాగధుల కంఠధ్వనులను వింటూ శ్రీకృష్ణుడు మేల్కొని ఉదయాన్నే చేయవలసిన అర్హమైన కార్యకలాపాలను పూర్తిచేసి భూదేవతలను పూజించి.

**వ.** **మంగళప్రకారంబున నలంకరించి నిజాకృతి యాదర్శంబునందు దర్శించి యప్పుడు సన్నిహితుండైన సాత్యకి వదనం బవలోకించి భీష్ము పాలికిం బోవుటకుం బాండవాగ్రజుం డాయితంబగుట యెఱింగి 'మన వెలువడు చునికి యెఱింగింపు' మని పనిచె; నంతకు మున్న యక్కురుపుంగవుండు బుణ్య సంకీర్తనాశీర్వాదంబులను భద్రగాన నాదంబులను వీనులు వికసిల్ల మేలుకాంచి సమయ కృత్యంబు లనుష్ఠించి యుండ నా కృష్ణానుజుం డతనిం గని గాంగేయు కడ కరుగుటకై రథంబు సన్నద్ధంబు సేయించి 'నీరజనాభుఁడు నీ రాక వార్చి యున్న వాఁ'డని చెప్పుటయు, నమ్మనుజపతి పార్శ్వగతుం డగు పార్థుం గనుంగొని 'మనయరదంబు సంఘటింపుము; నేఁడు మొదలుగా నయ్యెడకు సైనికుల రానీకు; మంతః పరివారంబు వచ్చు టుడుపుము; శాంతనవుండు సందడింబడ నర్హుండు గాఁడు విశేషించి పరమ గుహ్యార్థంబు లగు వాక్యంబులు మనకు ననుగ్రహింపం గలవాఁడు గావున నిస్సమ్మర్దంబుగా నుపాసింప వలయు'నని పలికి యొక్కింత విచారించి తగు రాజులం గొందఱం బేరుకొని ధృతరాష్ట్ర విభుండును వారును వచ్చువారు; వారిం బిలువం బంపు' మనవుడుఁ బిలిపించి యతండు. 129**

**ప్రతిపదార్థం:** మంగళ ప్రకారంబునన్+అలంకరించి= శుభప్రదంగా అలంకారం చేసికొని; నిజ+ఆకృతి= శ్రీకృష్ణుడు తన రూపాన్ని; ఆదర్శంబునందున్= అద్దంలో; దర్శించి= చూచికొని; అప్పుడు= వెంటనే; సన్నిహితుండు+ఐన= దగ్గరలోనే ఉన్న; సాత్యకి+వదనంబు+అవలోకించి= సాత్యకి ముఖాన్ని చూచి; భీష్ముపాలికిన్+పోవుటకున్= భీష్ముడి వద్దకు వెళ్ళటానికి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ఆయితంబు+అగుట+ఎఱింగి= సిద్ధమై ఉన్న విషయాన్ని తెలిసికొని; మన వెలువడుచున్+ఉనికి= మనం బయలుదేరుతున్న విషయాన్ని; ఎఱింగింపుము+అని+పనిచెన్= తెలియచేయవలసిందని పంపాడు; అంతకు మున్న= అంతకు ముందే; ఆ +కురుపుంగవుండు= ఆ కౌరవ శ్రేష్ఠుడైన ధర్మరాజు; పుణ్యసంకీర్తన+ఆశీర్వాదంబులను= పుణ్యప్రదమైన సంకీర్తనాత్మకమైన ఆశీస్సు; భద్రగాన నాదంబులను= మంగళకర సంగీత నాదాలతో; వీనులు వికసిల్లన్= చెవులకు ఇంపు కొల్పగా; మేలు కాంచి= నిద్ర లేచి; సమయ కృత్యంబులు+అనుష్ఠించి+ఉండన్= కాలకృత్యాలు చేసి ఉండగా; ఆ కృష్ణ+అనుజుండు= ఆ శ్రీకృష్ణుడి తమ్ముడైన సాత్యకి; అతనిన్+కని= ధర్మరాజును దర్శించి; గాంగేయు కడకున్+అరుగుటకున్+ఐ= భీష్ముడి వద్దకు

వెళ్ళటానికి; రథంబు సన్నద్ధంబు+చేయించి= రథం సిద్ధంచేయించి; నీరజనాభుఁడు= పద్మనాభుడైన శ్రీకృష్ణుడు; నీ రాక వార్చి+ఉన్నవాఁడు+అని= నీ రాక కొరకు వేచి ఉన్నాడని; చెప్పుటయున్= చెప్పగా; ఆ+మనుజపతి= ఆ ధర్మరాజు; పార్శ్వగతుండు+అగు= పక్కనే ఉన్నటువంటి; పార్థున్+కనుంగొని= అర్జునుడిని చూచి; మన+అరదంబు= మన రథాన్ని; సంఘటింపుము= సిద్ధం చేయుము; నేడు మొదలుగాన్= ఈనాటినుండి; ఆ+ఎడకున్= అక్కడకు; సైనికులన్ రానీకుము= దండు రానీయకుండా చూడుము; అంతఃపుర పరివారంబును= అంతఃపురంలోని సేవకులను; వచ్చుట+ఉడుపుము= రానీయకుము; శాంతనవుండు= శంతను పుత్రుడైన భీష్ముడు; సందడిన్+పడన్+అర్హుండు కాఁడు= జన సమ్మర్దానికి తగినవాడు కాడు; విశేషించి= ప్రత్యేకించి; పరమ గుహ్య+అర్థంబులు+అగు వాక్యంబులు= మిక్కిలి రహస్యమైన అర్థాలు గల మాటలు; మనకున్+అనుగ్రహింపన్+కలవాఁడు= మనకు ప్రసాదిస్తాడు; కావునన్= అందుకని; నిః+సమ్మర్దంబుగాన్= సందడి లేకుండా ఉపాసింపన్+వలయును+అని= పూజించవలసిందని; పలికి= చెప్పి; ఒక్క+ఇంత= కాస్త; విచారించి= ఆలోచించి; తగురాజులన్= అర్హులైన రాజులను; కొందఱన్ పేరుకొని= కొందరిని పేర్కొని; ధృతరాష్ట్ర విభుండును= ధృతరాష్ట్ర మహారాజు; వారును= పైన పేర్కొనబడ్డ రాజులు; వచ్చువారు= వస్తారు; వారిన్+పిలువన్+పంపుము= వారిని పిలిపించుము; అనవుడున్= అని చెప్పగా; అతండు= ఆ అర్జునుడు; పిలిపించి= పిలిపించి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు శుభప్రదంగా అలంకరించుకొని, తన మూర్తిని అద్దంలో చూచుకొని దగ్గరే ఉన్న సాత్యకిని చూచి భీష్ముడి వద్దకు పోవటానికి ధర్మరాజు సిద్ధమైన సంగతి తెలిసికొని మనం ప్రయాణమవుతున్న సంగతి చెప్పుమని పంపించాడు. అంతకుముందే ధర్మరాజు పుణ్యాత్ముల సంకీర్తనాశీస్సులూ, శుభప్రదమైన సంగీత నాదాలూ చెవి కింపు గొల్పుతుండగా నిద్ర లేచి, కాలకృత్యాలు తీర్చుకొని ఉండగా సాత్యకి ఆ ధర్మరాజును చూచి భీష్ముడి వద్దకు పోవటానికి రథం సిద్ధంచేయించి శ్రీకృష్ణుడు నీ రాకకొరకు ఎదురు చూస్తున్నాడని చెప్పాడు. వెంటనే ధర్మరాజు పక్కనే ఉన్న అర్జునుడిని చూచి 'మన రథాన్ని సిద్ధం చేయుము. ఈ రోజు నుండి అక్కడకు సైనికులను అంతఃపుర పరివారాన్ని రానీయకుము. భీష్ముడు జనసమ్మర్దాన్ని తట్టుకొనే స్థితిలో లేడు. పైపెచ్చు మనకు రహస్యార్థాలను తెలియచేయనున్నాడు. కాబట్టి సందడి లేకుండా మనం భీష్ముడిని సేవించవలసి ఉన్నది' అని చెప్పి, కొంత ఆలోచించి కొందరు రాజులపేర్లను చెప్పి, 'ధృతరాష్ట్ర మహారాజుతోపాటు వారిని కూడా పిలిపించవలసిం' దని చెప్పగా అర్జునుడు యథారీతిగా ఆచరించాడు.

### ధర్మరాజు కృష్ణాదులతోడ భీష్ము పాలికింబోవుట (సం. 12-53-27)

**క.** **అరదము వన్నిన నా భూ । వరుఁ డతఁడును దాను నెక్కి వడముడి వేఱొ**
**క్క రథమునఁ బిన్న తమ్ముల । నిరువురఁ గలపికొని యెలమి నేతేరంగన్.** **130**

**ప్రతిపదార్థం:** అరదము+పన్నినన్= రథాన్ని ఆయత్తం చేయగా; ఆ భూవరుఁడు= ధర్మరాజు; అతఁడును= అర్జునుడూ; తానున్= తానును (ధర్మరాజు); ఎక్కి= అధిరోహించి; వేఱు+ఒక్క రథమునన్= మరొక రథంలో; వడముడి= భీముడు; పిన్నతమ్ములన్+ఇరువురన్= చిన్న తమ్ములైన నకుల సహదేవు లిద్దరిని; కలపికొని= తనతో కలుపుకొని; ఎలమిన్+ఏతేరంగన్= సంతోషంతో బయలుదేరగా.

**తాత్పర్యం:** రథాన్ని ఆయత్తం చేయగా ధర్మరాజు అర్జునుడితోపాటు రథ మెక్కగా మరొక రథంలో భీముడు నకుల సహదేవులను కలుపుకొని సముచిత రీతిని బయలుదేరాడు.

**క.** **వినుము! మహా భూతము లే । నును సమధిక రూపమున వినుతభంగిఁ దగం**
**జను తెఱఁగు దోఁప నెలమిం । జనియెను వసుదేవసుతుని సదనంబునకున్.** **131**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ మహారాజా! వినుము (జనమేజయుడితో వైశంపాయనుడు చెప్పటం); మహాభూతముల్+ఏనును= పంచభూతాలు అయిదును; సమ్+అధిక రూపమునన్= చక్కటి రూపంతో; వినుత భంగిన్= ప్రశంసించ తగిన రీతిగా; తగన్+చను తెఱఁగు+తోఁపన్= సముచితంగా వెళ్ళుతున్న పద్ధతి స్పష్టమయ్యేట్లు; ఎలమిన్= బాగుగా; వసుదేవ సుతుని= వసుదేవుడి కుమారుడైన శ్రీకృష్ణుడి; సదనంబునకున్= భవనానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** పంచభూతాలు సముచితరూపంతో ప్రశంసనీయమైన రీతిలో సముచితంగా వెళ్ళుతూ ఉన్న పద్ధతి స్పష్టమయ్యేటట్లుగా ధర్మరాజు తమ్ములతో కూడి తాము అయిదుగురూ శ్రీకృష్ణుడి భవనానికి వెళ్ళారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. రథగమన రవంబునం గృప యుయుత్సు సంజయులుం గూడుకొని; రంత. 132**

**ప్రతిపదార్థం:** రథగమన రవంబునన్= రథం వెళ్ళుతున్న శబ్దంవలన; కృప యుయుత్సు సంజయులున్= కృపాచార్యుడు, యుయుత్సుడు, సంజయుడు ముగ్గురు; కూడుకొనిరి= కలిసికొన్నారు; అంతన్= ఆ తరువాత.

**తాత్పర్యం:** ధర్మరాజాదులు వెళ్ళుతున్న రథగమన శబ్దాలను గుర్తించి కృపుడు, యుయుత్సుడు, సంజయుడు ముగ్గురు వచ్చి కలిసికొన్నారు. ఆ వెనుక - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దారుకుఁడు వన్ని తెచ్చిన । తేరను వెలువడియె వాసుదేవుండును; న**
**తేరులు నాలుగు నేమిక । లా రవ మెసఁగంగ బెరసి యరిగె నరేంద్రా! 133**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= జనమేజయ మహారాజా!; దారుకుఁడు+పన్ని+తెచ్చిన= శ్రీకృష్ణుడి రథసారథి అయిన దారుకుడు సిద్ధం చేసి తెచ్చిన; తేరను= రథమందు; వాసుదేవుండును= వసుదేవుడి కుమారుడైన శ్రీకృష్ణుడును; వెలువడియెన్= బయలుదేరి వచ్చాడు; ఆ+తేరులు నాలుగున్= ఆ నాలుగు రథాలు; నేమి+కలారవము+ఎసఁగంగన్= చక్రాల అతిశయమైన శబ్దం చేస్తూ ఉండగా; బెరసి+అరిగెన్= కలిసి బయలుదేరి వెళ్ళాయి.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! శ్రీకృష్ణుడి సారథి అయిన దారుకుడు సిద్ధం చేసి తెచ్చిన రథంలో శ్రీకృష్ణుడు బయలుదేరాడు. అర్జునుడితో ధర్మజుడు బయలుదేరిన రథమూ, నకుల సహదేవులతో భీముడు అధిరోహించిన రథమూ, కృప యుయుత్సు సంజయుల రథమూ. శ్రీకృష్ణుడు బయలుదేరిన రథమూ నాలిగింటి యొక్క చక్రాల శబ్దం అతిశయిస్తూ ఉండగా బయలుదేరి వెళ్ళాయి.

**క. జనమేజయ నృప! యంతకు । మును నారద ముఖ్యులైన మునివర్యులు శాం**
**తనవుని పాలికి వచ్చిరి । వనజభవుని కడకు సురలు వచ్చు విధమునన్. 134**

**ప్రతిపదార్థం:** జనమేజయ నృప!= ఓ జనమేజయ మహారాజా!; అంతకుమును= అంతకు ముందే; నారద ముఖ్యులు+ఐన= నారద ప్రముఖులైన; ముని వర్యులు= మునిశ్రేష్ఠులు; వనజభవుని కడకున్= పద్మంనుండి పుట్టినవాడైన బ్రహ్మ వద్దకు; సురలు వచ్చు విధమునన్= దేవతలు వచ్చే విధంగా; శాంతనవుని పాలికిన్ వచ్చిరి= శంతను మహారాజు కుమారుడైన భీష్ముడి వద్దకు వచ్చారు.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! అంతకుముందే అంటే ఆ శ్రీకృష్ణాదులు రాకముందే నారదుడు మొదలైన మునిశ్రేష్ఠులు బ్రహ్మవద్దకు దేవతలు వచ్చినట్లుగా భీష్ముడి వద్దకు వచ్చారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్లు సంయమి వర పరిషత్పరివృతుండై యున్న య ద్దేవ వ్రతుని కడ చేర నరిగి శౌరి ప్రముఖులు రథంబులు డిగ్గి. 135**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; సంయమి వర పరిషత్+పరివృతుండు+ఐ+ఉన్న= మునిశ్రేష్ఠుల సమూహంతో చుట్టబడి ఉన్న; ఆ+దేవవ్రతుని కడ+చేరన్+అరిగి= ఆ భీష్ముడి దగ్గరకు వెళ్ళి; శౌరి ప్రముఖులు= కృష్ణుడు మొదలైన ముఖ్యులు; రథంబులు డిగ్గి= రథాలలోనుండి దిగి.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠుల సమూహంతో చుట్టబడి ఉన్న భీష్ముడి సమీపానికి వెళ్ళి, శ్రీకృష్ణాదులు రథాలలోనుండి దిగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. తత్సమీపమునకు ధర్మనందన పుర । స్సరత నరిగి తొలుత సకల మునులఁ**
**బ్రణతిఁ దెలచి కదిసి బలసి యుపాసించి । రన్నదీతనూజు నధికభక్తి. 136**

**ప్రతిపదార్థం:** తద్+సమీపమునకున్= వారి దగ్గరకు; ధర్మనందన పురస్సరతన్+అరిగి= ధర్మరాజును ముందుగా ఉంచుకొని వెళ్ళి; తొలుతన్= మొదట; సకల మునులన్= సమస్త మహర్షులను; ప్రణతిన్= నమ్రతతో; తెలచి= మొక్కి, నమస్కరించి; కదిసి= సమీపించి; బలసి= చుట్టుచేరి (పరివేష్టించి); ఆ+నదీ తనూజున్= ఆ గంగానదీ పుత్రుడైన భీష్ముడిని; అధిక భక్తిన్= అత్యంత భక్తితో; ఉపాసించిరి= పూజించారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణాదులు భీష్మాదు లున్న సమీపానికి ధర్మరాజును ముందుంచుకొని వెళ్ళి, మొదట సకల మహర్షులకు నమస్కరించి, అంతా పరివేష్టించి భీష్ముడిని మిక్కిలి భక్తితో పూజించారు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విన్న జనమేజయ మహారాజు; వైశంపాయనునకున్+ఇట్లు+అనియెన్= వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా వినిన జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**మ. 'శరతల్పంబునఁ బొల్చు భీష్మకడకున్ సంప్రీతి న క్కౌరవే**
**శ్వరుఁడుం దమ్ములు గృష్ణుఁడుం జని మునివ్రాతంబుతోఁ గూడ న**
**ప్పరమోదాత్తుని చుట్టు నున్న యెడ నెబ్భంగిం బ్రవర్తించె వి**
**స్తర మాధుర్య మనోజ్ఞ సత్కథలు విస్పష్టంబుగాఁ జెప్పవే!' 138**

**ప్రతిపదార్థం:** శరతల్పంబునన్+పొల్చు= అమ్ముల పాన్పుపై ప్రకాశించే; భీష్మకడకున్= భీష్ముడి వద్దకు; సంప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; ఆ+కౌరవ+ఈశ్వరుఁడున్= కౌరవశ్రేష్ఠుడైన ధర్మరాజు; తమ్ములున్= తమ్ములును (అయిన భీమార్జున నకుల సహదేవులు); కృష్ణుఁడున్= శ్రీకృష్ణుడును; చని= వెళ్ళి; ముని వ్రాతంబుతోన్+కూడన్= మునుల యొక్క సమూహంతో కూడా; ఆ+పరమ+ఉదాత్తుని చుట్టున్= ఆ పరమోన్నతుడైన భీష్ముడి చుట్టూ; ఉన్నఎడన్= ఉన్న సమయంలో; ఏ+భంగిన్+ప్రవర్తించెన్= ఏ రీతిగా నడుచుకొన్నాడో; విస్తర మాధుర్య మనోజ్ఞ సత్కథలు= విపులమై, తియ్యనై, మనోహరమైన ఉత్తమ కథలు; విస్పష్టంబుగాన్+చెప్పవే!= విశదంగా చెప్పుము.

**తాత్పర్యం:** 'శరతల్పగతుడై ఒప్పుతున్న భీష్ముడి వద్దకు అత్యంత ప్రీతితో ధర్మరాజు, అతడి తమ్ములు, భీమార్జున నకుల సహదేవులు, శ్రీకృష్ణుడు మహర్షి గణంతో కూడా వెళ్ళి అతడిని ఉండగా ఆతడి ప్రవర్తన ఎట్లా ఉన్నది? విపులమూ, మధురమూ, మనోహరమూ అయిన ఆ కథలు వివరంగా చెప్పు'మని జనమేజయుడిని వైశంపాయనుడు కోరాడు.

**వ. అని యడిగిన నమ్మహీవిభునకు వైశంపాయనుం డిట్లనియె; మున్ను ధర్మపుత్రుండు రావించిన ధృతరాష్ట్రుండును రాజులు నతనిపజ్జ నరిగి వారును గాంగేయు నుచిత ప్రకారంబునం గాంచి కొల్చి యుండి; రట్టియెడ నారదుండు ధర్మపుత్రాదుల న మ్మేదినీపతులం గలయం గనుంగొని. 139**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని అడుగగా; ఆ+మహీవిభునకున్= ఆ జనమేజయ మహారాజునకు; వైశంపాయనుండు+ఇట్లు+ అనియెన్= వైశంపాయనుడు ఇట్లా అన్నాడు; మున్ను= ఇంతకు ముందే; ధర్మపుత్రుండు రావించిన= ధర్మరాజు పిలిపించిన; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్ర మహారాజూ; రాజులున్= ఇతర రాజులూ; ఆతనిపజ్జన్+అరిగి= ఆతని దగ్గరకు వెళ్ళి; వారును= వారందరూ; గాంగేయున్= గంగాదేవి పుత్రుడైన భీష్ముడిని; ఉచిత ప్రకారంబునన్+కాంచి= తగిన రీతిగా దర్శించి; కొల్చి ఉండిరి= సేవిస్తూ ఉన్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; నారదుండు= నారద మహర్షి; ధర్మపుత్ర+ఆదులన్= ధర్మరాజు మొదలైన వారిని; ఆ+మేదినీ పతులన్= ఆ రాజులను; కలయన్+కనుంగొని= కలయచూచి.

**తాత్పర్యం:** ధర్మరాజాదులు భీష్ముడి చుట్టూ చేరినప్పుడు భీష్ముని ప్రవర్తన ఎట్లుందో చెప్పుమని జనమేజయ మహారాజు అడుగగా వైశంపాయనుడు ఇట్లా చెప్పాడు: అంతకు ముందే ధర్మరాజు పిలిపించినట్టి ధృతరాష్ట్రుడు, తక్కిన రాజులు భీష్ముడి వద్దకు వెళ్ళి భీష్ముడిని తగిన రీతిగా దర్శించి సేవిస్తూ ఉన్నారు. ఆ సమయంలో నారద మహర్షి ధర్మరాజాదులనూ తక్కిన రాజులనూ కలయచూచి ఇట్లా అన్నాడు.

**క. 'శంతను నందనుఁ డపరది । గంత ప్రాప్తరవి యట్టిఁడయ్యె నితఁడు లో**
**కాంతరగతుఁ డగుటకు ము । న్నంతఃకరణముల సంశయము వాయంగన్. 140**

**ప్రతిపదార్థం:** శంతను నందనుఁడు= శంతను మహారాజు కుమారుడైన భీష్ముడు; ఇతఁడు= ఈ భీష్ముడు; అపర దిక్+అంతప్రాప్తరవి+ అట్టి+వాఁడు+అయ్యెన్= పడమటి దిక్కుయొక్క అంతమును చేరిన సూర్యుడివంటి వాడు అయ్యాడు; లోక+అంతరగతుఁడు+ అగుటకున్= ఈ భూలోకం వదలి స్వర్లోకానికి వెళ్ళటానికి; మున్ను= ముందు; అంతః+కరణముల= మనస్సుతోపాటు జ్ఞాన కర్మేంద్రియాలయొక్క; సంశయము+పాయంగన్= సందేహాలు తొలగి పోయేటట్లుగా.

**తాత్పర్యం:** 'ఈ భీష్ముడు పశ్చిమదిక్కును చేరుతున్న సూర్యుడివలె ఒప్పుతున్నాడు. ఈ లోకం వదలిపెట్టి స్వర్గలోకానికి వెళ్ళే ముందు మనస్సుతోపాటు జ్ఞానకర్మేంద్రియాల సందేహాలు తొలగిపోయేటట్లుగా.

**విశేషం:** అలం: ఉపమ. పరలోకగతుడు కానున్న భీష్ముడిని అపరదిగభిముఖుడైన సూర్యుడితో పోల్చటం అత్యంతం సముచితంగా ఉన్నది.

**వ. సకల ధర్మ ప్రకారంబు నడిగి తెలిసికొం'డనినఁ బ్రశ్నపాటవంబు లేమి నందఱు నొండొరువుల మొగంబులు సూచుచుండఁ బాండవాగ్రజుండు పుండరీకాక్షున కిట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** సకల ధర్మప్రకారంబున్+అడిగి= సమస్త ధర్మ పద్ధతులను అడిగి; తెలిసికొండు+అనినన్= తెలసికొనవలసిందని నారదుడు చెప్పగా; ప్రశ్న పాటవంబు లేమిన్= ప్రశ్నించే పటుత్వం లేకపోవటం వలన; అందఱున్+ఒండొరువుల= అందరూ ఒకళ్ళొకళ్ళ; మొగంబులు చూచుచుండన్= ముఖాలు చూస్తుండగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; పుండరీక+అక్షునకున్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సమస్త ధర్మపద్ధతులనూ భీష్ముడిని అడిగి తెలిసికొనండని నారదుడు చెప్పగా ప్రశ్నించే తీరు తెలియక అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూస్తూ ఉన్న సమయంలో ధర్మరాజు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'నీవు దక్కంగ మందాకినీ తనూజు। తోడి సల్లాపములకు నుక్తులు ముకుంద!**
**కలరె యెందును? ధర్మవేదులకు నెల్ల। గురుఁడ వీవ; సంభాషణపరుఁడ వగుము.' 142**

**ప్రతిపదార్థం:** ముకుంద!= ఓ కృష్ణా!; మందాకినీ తనూజు తోడి= గంగాదేవి పుత్రుడైన భీష్ముడితో; సల్లాపములకున్= మంచి మాటలకు (సంభాషణకు); నీవు తక్కంగన్= నీవు తప్ప; ఉక్తులు కలరె?= చెప్పగలవా రున్నారా?; ఎందునున్= ఎక్కడైనా; ధర్మవేదులకున్+ఎల్లన్= ధర్మమెరిగిన వారందరికి; ఈవ= నీవే; గురుఁడవు; సంభాషణ పరుఁడవు+అగుము= మాట్లాడటం ప్రారంభించుము.

**తాత్పర్యం:** 'భీష్ముడితో సంభాషించటానికి నీవు తప్ప అర్హులు లేరు. ధర్మవేత్తలందరికి నీవు గురుడవు. నీవు సంభాషణ ప్రారంభించుము.

**విశేషం:** 'ఉక్తులు' అనటానికి బదులు 'శక్తులు' అనే పాఠాంతరం సముచితం.

**వ. అనుటయు నచ్యుతుండు భీష్మున కత్యాసన్నుండై శారీర మానస కుశల ప్రశ్నంబుఁ జేసిన నతండు. 143**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; భీష్మునకున్+అతి+ఆసన్నుండు+ఐ= భీష్ముడికి మిక్కిలి సమీపంలో కూర్చున్నవాడై; శారీర మానస కుశల ప్రశ్నంబున్+చేసినన్= శరీరానికి సంబంధించి మనస్సుకు సంబంధించి క్షేమాన్ని గూర్చి అడుగగా; అతండు= ఆ భీష్ముడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు ప్రార్థించగా శ్రీకృష్ణుడు భీష్ముడికి మిక్కిలి సమీపంలో ఉంటూ అతడిని శరీరానికి మనస్సుకు సంబంధించిన క్షేమాన్ని గూర్చి ప్రశ్నించాడు. అప్పుడు భీష్ముడు ఇట్లా అన్నాడు.

**ఉ. 'దేవ! భవత్ప్రసాదమునఁ దీఱె శరీరము నొప్పి డప్పి, మ**
**ద్భావము నింద్రియంబులును బాటవ సంపద నొందె, వేద వి**
**ద్యా విభవంబు నాకుఁ బరతత్త్వ పరిస్ఫుట బోధ యుక్తమై**
**భావితమయ్యెఁ నాత్మఁ బరిపక్వ దయాకరచిత్త మాధవా! 144**

**ప్రతిపదార్థం:** పరిపక్వ దయాకర చిత్త!= పండిన కరుణకు నెలవైన చిత్తం కలవాడా!; మాధవా!= ఓ కృష్ణా!; దేవ!= మహానుభావా! భవత్+ప్రసాదమునన్= నీ అనుగ్రహంతో; శరీరము నొప్పి= శారీరకమైన బాధ; దప్పి= అలసట; తీఱెన్= తొలగిపోయాయి; మత్+భావంబున్= నా మనస్సును; ఇంద్రియంబులును= జ్ఞాన కర్మేంద్రియాలును; పాటవ సంపదన్+ఒందెన్= పటుత్వ సంపదను పొందాయి; నాకు; ఆత్మన్= ఆత్మలో; వేద విద్యా విభవంబు= చతుర్వేదాల విద్యయొక్క వైభవమూ; పరతత్త్వ

పరిస్ఫుట బోధయుక్తమై= పరమాత్మయొక్క స్పష్టమైన జ్ఞానంతో కూడినదయి; భావితము+అయ్యెన్= సంభావితమయింది (తెలిసికొన్నాను).

**తాత్పర్యం:** ఓ కృష్ణా! పరిపూర్ణ కరుణాకరా! నీ అనుగ్రహంతో శరీర సంబంధమైన నొప్పి, అలసట తీరిపోయాయి. నా మనస్సు, జ్ఞాన కర్మేంద్రియాలూ పాటవ సంపదతో ఒప్పారుతున్నాయి. నాకు నా ఆత్మలో వేదవిద్యా వైభవం స్పష్టమైన పరమాత్మ జ్ఞానంతో కూడినదై స్పష్టంగా తెలిసింది.

**విశేషం:** మూలంలోని ఎనిమిది శ్లోకాల భావాన్ని ఈ పద్యంలో తిక్కన కుదించి రచించాడు. ఆ ఎనిమిది శ్లోకాలలో భావాన్ని జారిపోనీయకుండా భీష్ముని మాటలుగా ఈ పద్యంలో మనోహరంగా చిత్రించాడు.

**వ. దేవర దివ్య చిత్తంబున నన్నుం దలంచిన దానంజేసి బృంహితుండ నయ్యును గొండుక ప్రాయంబు వాఁడునుం బోలె నయితిఁ; జెప్ప వలయు వాని నెల్లం జెప్పెదఁ; బాండవ శుభకరంబైన వాని నీ వేల చెప్పవు? నీ తలం పేమి? సెప్పవే!' యనినఁ గృష్ణుండు గాంగేయున కిట్లనియె. 145**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; దేవర దివ్య చిత్తంబునన్= భగవంతుడవైన నీ దివ్యమైన మనస్సులో; తలంచిన దానన్+చేసి= నన్ను తలంచటంవలన; బృంహితుండన్+అయ్యును= వృద్ధుడనైనప్పటికి; కొండుక ప్రాయంబు వాఁడునున్+పోలెన్+అయితిన్= చిన్న బాలుడివలె అయిపోయాను; చెప్పవలయు వానిన్+ఎల్లన్= చెప్పదగిన వాటి నన్నింటిని; చెప్పెదన్= వివరిస్తాను; పాండవ శుభకరంబు+ఐన దానిన్= పాండవులకు మంగళప్రదమైన దానిని; ఈవు+ఏల+చెప్పవు= నీవు ఎందుకు చెప్పవు; నీ తలంపుఏమి?= నీ అభిప్రాయం ఏమి?; చెప్పవే+అనినన్= చెప్పవలసిందని భీష్ముడు ప్రశ్నించగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; గాంగేయునకున్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** "నీ దివ్య చిత్తంలో నన్ను భావించటంచేత నేను వృద్ధుడనైనప్పటికీ, చిన్న బాలుడివలె అయిపోయాను. నీ ఆదేశానుసారం పాండవులకు చెప్పదలచినవన్నీ సవిస్తరంగా చెప్తాను. అయినా పాండవులకు శుభప్రదమైన వాటిని నీ వెందుకు చెప్పవు? నీ భావ మేమి? చెప్పుము' అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అనఘ! శ్రేయస్సునకు యశంబునకు నేను । మూలకందంబ; విను! చంద్రముండు శీత**
**కిరణుఁడను మాట విస్మయకరమె? చెపుమ; । యశ ముపార్జింపఁ గ్రొత్తపెం పగునె నాకు? 146**

**ప్రతిపదార్థం:** న+అఘా!= పాపరహితుడవైన ఓ భీష్మా!; విను= వినుము; శ్రేయస్సునకున్= మేలునకు; యశంబునకున్= కీర్తికిని; ఏను= నేను; మూల కందంబన్= మూలాధారమైనవాడిని; చంద్రముండు= చంద్రుడు; శీత కిరణుడు+అనుమాట= చల్లనైన కిరణాలు కలవాడనే మాట; విస్మయకరమె= ఆశ్చర్యకరమా; చెపుమా= చెప్పు; నాకు; యశము+ఉపార్జింపన్= కీర్తిని సంపాదించటం; క్రొత్త పెంపు+అగునె= క్రొత్త అభివృద్ధి అవుతుందా?

**తాత్పర్యం:** 'ఓ భీష్మా! ప్రజాశ్రేయస్సుకు, కీర్తికి నేనే మూలకారణం. సందేహం లేదు. చంద్రుడు చల్లని కిరణాలు కలవాడనటంలో విచిత్రం లేదు కదా! అట్లాంటి నాకు కీర్తి సంపాదన కొత్తగా తెచ్చుకొన్న అభివృద్ధి అవుతుందా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. సామాన్యాంశం విశేషాంశం చేత సమర్థించబడుతున్నది.

**క. పరమ మగు యశము నీకును । ధరణిం గలిగింపఁ బూని తాత్పర్యమునం**
**బురుషవర! నాదు బుద్ధి । స్ఫురణము నీ మనమునందుఁ జొనిపితి నెనయన్. 147**

**ప్రతిపదార్థం:** పురుషవర!= ఓ మానవోత్తముడైన భీష్మా!; ధరణిన్= ఈ భూమి మీద; పరమము+అగు యశము= శ్రేష్ఠమైన కీర్తిని; నీకును కలిగింపన్+పూని= నీకు సంప్రాప్తింపచేయటానికి ప్రయత్నించి; తాత్పర్యమునన్= మనస్సునందు లేదా అభిమతంలో; నాదు= నా యొక్క; బుద్ధి స్ఫురణమున్= నా బుద్ధి జ్ఞానాన్ని; ఎనయన్= తగునట్లు; నీ మనమునందున్+చొనిపితిన్= నీ మనస్సునందు ఆపాదించాను.

**తాత్పర్యం:** ఓ మానవోత్తముడవైన భీష్మా! అత్యుత్తమ కీర్తిని నీకు కూడా ప్రసాదించదలచి తదనుగుణంగా నా జ్ఞానాన్ని నీ మనస్సులో ప్రవేశపెట్టాను.

**విశేషం:** చందమామకు వెన్నెల సహజమైన రీతిగా నాకు కీర్తి సహజమే. అయితే అత్యుత్తమ కీర్తిని భీష్మునికి సైతం ప్రసాదించాలన్న కోరికతో ఆ జ్ఞానాన్ని అతడి మనస్సులో ప్రవేశపెట్టినట్లు కృష్ణుడు చెప్పటంలో ఎంతో విశేషమున్నది.

**తే.** **ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు । కీర్తి యందాఁక నక్షయస్ఫూర్తిఁ దాల్చి**
**నడవఁ గలయది నీవు సెప్పెడి సువాక్య । ములును వేదతుల్యంబులై వెలయుచుండు.** **148**

**ప్రతిపదార్థం:** ధరణి= ఈ భూమి; ఎంత+దాఁకన్= ఎంతకాలం దాకా; సుస్థిరతన్+ఉండున్= స్థిరమై ఉంటుందో; అంత+దాఁకన్= అంతవరకు; నీదు కీర్తి= నీ కీర్తి; అక్షయ స్ఫూర్తిన్+తాల్చి= నశించనిదై; నడవన్+కల+అది= కొనసాగుతుంది; నీవు+చెప్పెడి= నీవు ప్రబోధించబోయే; సువాక్యములును= మంచి మాటలును; వేద తుల్యంబులు+ఐ= వేదాలతో సమానమై; వెలయుచుండున్= ఒప్పారుతూ ఉంటాయి.

**తాత్పర్యం:** ఈ భూమి ఎంతకాలం సుస్థిరంగా ఉంటుందో నీ కీర్తి నశించనిదై అంత వరకు కొనసాగుతుంది. నీవు చెప్పే మంచి మాటలన్నీ వేదాలతో సమానమై ఒప్పారుతూ ఉంటాయి.

**క.** **ధర్మజునకు నీ చెప్పెడు । ధర్మస్థితి వాక్య సమితి తాత్పర్యముతో**
**నిర్మలు లై కొనియాడెడు । ధార్మికులకు నుభయజగదుదాత్తత కలుగున్.** **149**

**ప్రతిపదార్థం:** ధర్మజునకున్= ధర్మరాజునకు; నీ చెప్పెడు= నీవు ప్రబోధించే; ధర్మస్థితి= ధర్మపద్ధతియొక్క; వాక్య సమితి= మాటల సమూహం; తాత్పర్యముతోన్= ఏకాగ్రతతో; నిర్మలులు+ఐ= పరిశుద్ధులై; కొనియాడెడు= ప్రశంసించే; ధార్మికులకున్= ధర్మాత్ములకు; ఉభయ జగత్+ఉదాత్తత= ఇహపరాలలోను, ఉత్తమత్వము; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజుకు నీవు చెప్పే ధర్మంతో కూడిన వాక్యసమూహ సారం ఏకాగ్రతతో పరిశుద్ధులై ప్రశంసించే ధర్మాత్ములకు ఉభయతారకమై ఒప్పుతుంది.

**వ.** **కావున నిట్లు సేసితి; భవదీయ ధర్మవేదిత్వంబును సవిశేష ప్రకారంబుగా నీ మనుమలు ధర్మజ భీమార్జున నకుల సహదేవులు భద్ర భాజనంబులుగా నీ యున్న మహీపతులు విని కృతార్థజన్ములుగా నఖిల ధర్మ ప్రకారబోధకంబు లగు వాక్యంబులు సెప్పు' మనుటయు శాంతనవుం 'డట్ల చేసెద' నని పలికి యాదరభరితుం డయి యిట్లనియె.** **150**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుకని; ఇట్లు+చేసితిన్= ఇలా నిర్ణయించాను; భవదీయ= నీ యొక్క; ధర్మవేదిత్వంబును= ధర్మసంబంధమైన జ్ఞానాన్ని; సవిశేష ప్రకారంబుగాన్= విశేషంతో కూడిన పద్ధతితో; నీ మనుమలు= నీ మనుమలైన; ధర్మజ భీమ+అర్జున నకుల సహదేవులు= ధర్మరాజు భీముడు అర్జునుడు నకులుడు సహదేవు డనే ఐదుగురు; భద్ర భాజనంబులు

గాన్= శుభార్హులయ్యేట్లుగా; ఈ+ఉన్న= ఇక్కడ గుమిగూడి ఉన్న; మహీపతులు= రాజులు; కృత+అర్థ జన్మములు+కాన్= పుట్టుకలు సఫలమయ్యేటట్లుగా; అఖిల ధర్మప్రకార బోధకంబులు+అగు= అన్ని ధర్మవిశేషాలను ప్రబోధించే; వాక్యంబులు+చెప్పుము+ అనుటయును= మాటలు చెప్పుమని శ్రీకృష్ణుడు కోరగా; శాంతనవుండు+అట్లు+చేసెదన్+అని= భీష్ముడు అట్లాగే చేస్తానని చెప్పి; ఆదరభరితుండు+అయి+ఇట్లు+అనియెన్= ప్రేమతో నిండినవాడై ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ భీష్మా! భూమి ఉన్నతంకాలం అపారకీర్తి నీకే రావాలని భావించి ఇట్లా చేశాను. నీ ధర్మ సంబంధమైన విజ్ఞాన విశేషాన్ని నీ మనుమలైన ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు శుభార్హులయ్యేటట్లుగా, ఇక్కడ పరివేష్టించి ఉన్న రాజుల పుట్టువు సఫలమయ్యేటట్లుగా సమస్త ధర్మవిశేషాలను బోధించే వాక్యాలను చెప్పవలసిం'దని శ్రీకృష్ణుడు కోరగా భీష్ముడు అట్లాగే చేస్తా'నని చెప్పి సంతోష భరితుడై ఇట్లా అన్నాడు.

**సీ.** **'ఎవ్వఁడు పుట్టిన నెల్ల మునీంద్రులు । నత్యంత సంప్రమోదాత్ము లైరి,**
**పరమ ధార్మికులైన భరతుల యందును । నెవ్వరు నెవ్వని నెనయ లేరు,**
**సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు । నలవడి యెవ్వనియందు వెలయుఁ,**
**బాత్రదానాధ్వర బంధు రక్షాది ధ । ర్మంబు లెవ్వనికిఁ బ్రియంబు లెపుడుఁ,**

**తే.** **గామమున నైన విపులార్థ కారణమున । నైన భయమున నైనను నపథ వర్త**
**నంబునకుఁ జొరఁ డెవ్వాఁడు నన్ను నేమి । యడుగఁ దలఁచె నా ధర్మజుం డడుగుఁ గాక!'** **151**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు పుట్టినన్= ఎవ్వడు పుట్టటం వలన; ఎల్ల ముని+ఇంద్రులున్= ముని శ్రేష్ఠులందరు; అత్యంత= మిక్కిలి; సంప్రమోద+ఆత్ములు+ఐరి= సంతోషాంతరంగు లయ్యారో; పరమ ధార్మికులు+ఐన= మిక్కిలి ధర్మగుణం కలవా రయిన; భరతుల యందునున్= భరత వంశంలో పుట్టిన వారి యందు; ఎవ్వరున్= ఎవ్వరు కూడా; ఎవ్వనిన్= ఎవ్వనితో; ఎనయన్+లేరు= సమానులు కారో; సత్యంబున్= సత్యమూ; దాంతియున్= కర్మేంద్రియాల నిగ్రహశక్తి; శౌచంబున్= శుచిత్వం; శాంతియున్= జ్ఞానేంద్రియాల నిగ్రహశక్తి; అలవడి= కలిగి; ఎవ్వనియందున్= ఎవ్వడితో అయితే; వెలయున్= ప్రకాశిస్తూ ఉంటాయో; పాత్రదాన+అధ్వర బంధురక్షా+ఆది= అర్హులైనవారికి దానాలు చెయ్యటం, యజ్ఞాలను బంధువులను రక్షించటం మొదలైన; ధర్మంబుల్= ధర్మాలు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఎవ్వనికిన్= ఎవడికయితే; ప్రియంబులు= ప్రియమయితే; కామమునన్+ఐనన్= కోరికవలన అయితేనేమి; విపుల+అర్థ+కారణమునన్+ఐనన్= విస్తృత ధనం కారణం వలన అయినా; భయమునన్+ఐనన్= భయంవలన అయినా; అపథ వర్తనంబునకున్= చెడు మార్గ ప్రవర్తనకు; ఏ+వాఁడు= ఎవడయితే; చొరఁడు= ప్రవేశించడో; ఆ ధర్మజుండు= ఆ ధర్మరాజు; నన్నున్= నన్ను; ఏమి+అడుగన్+తలఁచెన్= ఏమి అడగాలని అనుకొంటున్నాడో; అడుగున్ కాక!= అది అడగవలసింది.

**తాత్పర్యం:** 'ఎవ్వడి జన్మకారణంగా సమస్త మునీంద్రులు సంతోషాంతరంగు లయ్యారో, పరమధార్మికు లని పేరు పొందిన భరత వంశీయులు కూడా ఎవ్వడితో సాటిరారో, సత్యం, శౌచం, శాంతి దాంతులు ఎవ్వడియందు ప్రకాశిస్తూ ఉంటాయో, పాత్రులైన వారికే దానం చేయటం, యజ్ఞాలనూ, బంధువులను, రక్షించటం మొదలైన ఉత్తమ ధర్మాలన్నీ ఎవడికి సంతోషాన్ని కలిగిస్తుంటాయో, కామంవలన కాని, అర్థంవలన కాని, భయంవలన కాని, అవినీతి మార్గంలో ఎవడయితే ప్రవేశించడో అటువంటి ఉత్తమగుణగణుడైన ధర్మరాజు అడుగదలచుకొన్న అన్నింటిని అడిగి సందేహ నివృత్తి చేసికొని తెలిసికొను గాక!'

**వ. అనుటయు నతనితో నచ్యుతుండు. 152**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు అనగానే; అతనితోన్= ఆ భీష్ముడితో; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** అని చెప్పగా భీష్ముడితో శ్రీకృష్ణుడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'గురులను బంధుమిత్రులను గ్రూరశరంబులఁ గూల్చె నుగ్రతన్,**
**నరుల ననేకకోటుల రణంబునఁ దాఁ దెగటార్చెఁ గాన యి**
**క్కురుపతి నీ సమక్షమునకుం గదియం బుయిలోడెడుం గృపా**
**విరహిత కార్య కర్మరుఁడు వీఁ డని యాడుదొ యన్ తలంపునన్.' 153**

**ప్రతిపదార్థం:** ఈ+కురుపతి= ఈ ధర్మరాజు; గురులను= గురువు లైన పెద్దలను; బంధుమిత్రులను= చుట్టాలను, స్నేహితులను; క్రూర శరంబులన్+కూల్చెన్= ఘోరమైన బాణాలతో పడగొట్టాడు; ఉగ్రతన్= కోపంతో; తాన్= ధర్మరాజు; నరులన్+అనేక కోటులన్= అనేకులైన మానవులను; తెగటార్చెన్= తెగ నరికాడు; కృపా విరహిత కార్య కర్మరుఁడు= దయారహిత కార్య నిర్వాహకుడు; వీఁడు+అని= ఇతడని; ఆడుదొ+అన్+తలంపునన్= అంటావేమో అనే భావంతో; నీ సమక్షమునకున్+కదియన్= నీ ఎదుటకు రావటానికి; పుయిలోడెడున్= సంకోచిస్తున్నాడు.

**తాత్పర్యం:** 'ఈ ధర్మరాజు యుద్ధంలో గురువులూ, బంధువులూ, మిత్రులూ అని లెక్కించక, భయంకరమైన బాణాలతో అందరినీ కూల్చాడు. అనేక మానవ కోటులను యుద్ధంలో సంహరించాడు. కనుక ఇతడు దయాంతఃకరణుడు కాడని అంటావేమో నని భావించి నీ ఎదుట పడటానికి సంకోచిస్తున్నాడు'.

**వ. అనిన విని వాసుదేవునకు దేవవ్రతుం డి ట్లనియె. 154**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా విని; వాసుదేవునకున్= శ్రీకృష్ణుడికి; దేవవ్రతుండు+ఇట్లు+అనియెన్= భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అనగా విని భీష్ముడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'విప్రుల కధ్యయన ప్రదానాధ్వరా । ద్యము లగు కర్మము లట్ల రాజు**
**లకు సంగరము తండ్రులను బుత్ర పౌత్రుల । గురుల నైనను బాపపరులఁ బోరఁ**
**జంపుట ధర్మంబు; సమయంబు విడిచి లో । భంబున నన్యాయ పథము నందు**
**వర్తించువారి నెవ్వరి నాహవంబునఁ । బొరివుచ్చఁగలిగినఁ బుణ్య కృతియ**

**ఆ. యట్లు గాక శోణితాంబుపూరముఁ గేశ । శైవలంబుఁ గాఁగ సమర భూమి**
**నక్కజపు నదీచయం బొనర్చిన రాజు । ధర్మవిదుఁ డనంగఁదగు ముకుంద!' 155**

**ప్రతిపదార్థం:** ముకుంద!= ఓ శ్రీకృష్ణా!; విప్రులకున్= బ్రాహ్మణులకు; అధ్యయన ప్రదాన+అధ్వర+ఆద్యములు+అగు= వేదాధ్యయనమూ, దానమూ, యజ్ఞమూ మొదలైన; కర్మములు+అట్లు= కర్మాచరణ ఉన్న రీతిగానే; రాజులకున్ సంగరంబు= రాజులకు యుద్ధం; తండ్రులను; పుత్ర పౌత్రులన్= కుమారులను, మనుమలను; గురులన్+అయినను= గురువులయినప్పటికి; పాప పరులన్= దుర్మార్గులను; పోరన్+చంపుట= యుద్ధమునందు చంపటం; ధర్మంబు= ధర్మం; సమయంబు విడిచి= నీతి మార్గాన్ని వదలి; లోభంబునన్= అత్యాశతో; అన్యాయపథంబు నందు= అన్యాయ మార్గంలో; వర్తించువారిన్= నడుచుకొనే వారిని;

ఎవ్వరిన్= ఎవ్వరినైనా; ఆహవంబునన్= యుద్ధంలో; పొరిపుచ్చన్+కలిగినన్= సంహరించగలిగితే; పుణ్యకృతియ= అదే పుణ్యకార్యం; అట్లున్+గాక= ఆ విధంగా కాకపోతే; సమర భూమిన్= యుద్ధభూమిని; శోణిత+అంబు పూరమున్= రక్త మనే జలప్రవాహం; కేశ శైవలంబున్+కాఁగన్= వెంట్రుక లనే నాఁచు అయ్యేటట్లుగా; అక్కజపు నదీ చయంబు+ఒనర్చినన్= ఆశ్చర్యకర మైన నదీ సమూ హాలుగా చేసిన; రాజు, ధర్మవిదుఁడు+అనంగన్+తగున్= రాజు ధర్మవేత్త అని అనటానికి అర్హుడైన వాడు.

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! వేదాధ్యయనం, దానపూర్వకమైన యాగాది కర్మాచరణం, బ్రాహ్మణులకు ఎట్లాగో అదే విధంగా రాజులకు యుద్ధం సహజం. పాపవర్తను లైన తండ్రులు, పుత్రులు, మనుమలు, గురువులు ఎవరినైనా యుద్ధంలో చంపటం రాజధర్మం. విధ్యుక్త ధర్మాన్ని వదలి లోభగుణంతో అన్యాయమార్గ వర్తనులైన వారిని ఎవరినైనా యుద్ధరంగంలో వధించటం పుణ్యకార్యమే. అంతే కాకుండా యుద్ధభూమిలో దుర్మార్గులను వధించి రక్త మనే జలపూరమూ కేశ పాశాలనే నాచూ నిండి ఉండే నదీసమూహాలుగా చేయటం ధర్మవిదుడైన రాజుకు అర్హమైన కార్యం'.

**విశేషం:** అలం: రూపకం.

### భీష్ముఁడు ధర్మరాజును సప్రేమంబుగా గారవించుట (సం. 12-55-1)

**చ.** **అన విని ధర్మసూనుఁడు కృతాంజలి యై తగ భీష్ము డాయ న**
**ల్లన చని, కేలఁ బాదకమలంబు లమర్చి శిరంబు సోఁక వం**
**దన మొనరించినం, బిలిచి తా నభినందితుఁ జేసి మస్తకం**
**బునఁ గడు నర్మిలిం దనదు మో మిడి మూర్కొని సాదరంబుగన్.** **156**

**ప్రతిపదార్థం:** అనన్ విని= భీష్ముడు శ్రీకృష్ణుడితో రాజ ధర్మాన్ని గూర్చి చెప్పగా విని; ధర్మ సూనుఁడు= ధర్మరాజు; కృత+అంజలిఐ= చేయబడిన నమస్కారం కలవాడై అంటే నమస్కరించి; తగన్= ఉచిత రీతిని; భీష్మున్= భీష్ముడిని; డాయన్+అల్లన చని= సమీపించటానికి మెల్లగా వెళ్ళి; కేలన్= తన చేతులతో; పాద కమలంబుల్+అమర్చి= (భీష్ముడి) పాద పద్మాలను పట్టుకొని; శిరంబు సోఁకన్= తల తాకేటట్లు; వందనము+ఒనరించినన్= నమస్కరించగా; పిలిచి; తాన్+అభినందితున్+చేసి= భీష్ముడు ధర్మరాజును సంతోషింపజేసి; మస్తకంబునన్+కడున్+నర్మిలిన్= ధర్మరాజు తలపై మిక్కిలి ప్రేమతో; తనదు మోము+ఇడి= తన ముఖ ముంచి; మూర్కొని= ఆఘ్రాణించి; స+ఆదరంబుగన్= ఆదరపూర్వకంగా.

**తాత్పర్యం:** ధర్మరాజు చేతులు మొగిడ్చి, భీష్ముడిని సమీపించి, ఆయన పాదపద్మాలను తన చేతులతో పట్టుకొని తన తలను తాకిస్తూ నమస్కరించగా, భీష్ముడు ధర్మరాజును అభినందించి, అతడి తలకు తన ముఖాన్ని ఆనించి ప్రేమతో ఆఘ్రాణించాడు. ధర్మరాజును ఆదరించాడు.

**వ.** **భీష్ముం డాభీమాగ్రజుం గూర్చుండం బనిచి, 'శంకింపక న న్నేమి యైన నడుగు' మనిన నమ్మహీపతి మాధవునకుం బ్రణమిల్లి, పారాశర్యప్రభృతి మునివరులకు నభివాదనం బాచరించి, సర్వకౌరవుల యనుమతి వడసి, యప్పితామహుున కభిముఖుం డై నమస్కరించి యి ట్లనియె.** **157**

**ప్రతిపదార్థం:** భీష్ముండు+ఆ భీమ+అగ్రజున్+కూర్చుండన్+పనిచి= భీష్ముడు ఆ భీముడి అన్న అయిన ధర్మరాజును కూర్చుండగా నియమించి; శంకింపక= సంకోచం లేకుండా; నన్నున్+ఏమి+ఐనన్= నన్ను ఏదయినా; అడుగుము+అనినన్= అడుగు మని చెప్పగా; ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; మాధవునకున్+ప్రణమిల్లి= శ్రీకృష్ణుడికి నమస్కరించి; పారాశర్యప్రభృతి= వ్యాసుడు మొదలైన;

మునివరులకున్= ముని శ్రేష్ఠులకు; అభివాదనంబు+ఆచరించి= మ్రొక్కి; సర్వ కౌరవుల+అనుమతి+పడసి= పెద్దవాడైన ధృతరాష్ట్రుడు మొదలుకొని సమస్త కౌరవుల అనుజ్ఞను పొంది; ఆ+పితామహునకున్+అభిముఖుండు+ఐ= ఆ తాత అయిన భీష్ముడికి ఎదురుగా కూర్చుండి, నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు (అడిగాడు).

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజును కూర్చుండ నియమించి 'సంకోచించకుండా ఏ మేమి అడుగదలచావో సమస్తమూ అడుగు' మని చెప్పాడు. ధర్మరాజు శ్రీకృష్ణుడికి నమస్కరించి వ్యాసాది మహామునిశ్రేష్ఠులకు ఏటికోళ్ళు పట్టి, ధృతరాష్ట్రాది సమస్త కౌరవుల ఆజ్ఞతో భీష్ముడికి అభిముఖుడై నమస్కరించి ప్రశ్నించాడు.

**విశేషం:** అభివాదనం: గోత్ర నామాదులు (ప్రవర) చెప్పి పాదాలు సోకేటట్లుచేసే నమస్కారం. దీనినే ఏటికోళ్ళు అంటారు. పెద్దలను దర్శించినపుడు తనగోత్రనామాలను చెబుతూ పాదాభివందనం చేయటం సంప్రదాయం. అట్లే ధర్మరాజు వ్యాసాది మహర్షులకు అభివాదనం చేశాడు.

**చ. 'అరయఁగ రాజధర్మము సమాశ్రయ మై నడపుం ద్రివర్గమున్**
**గురుతర మోక్షధర్మమునకుం దలఁపం దనప్రాప యూఁత భూ**
**వర! విను ఘోటకంబునకు వాగెయు, దంతికి నంకుశంబు నే**
**కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్. 158**

**ప్రతిపదార్థం:** భూవర!= భూమికి భర్త అంటే రాజా - ఓ భీష్మా!; విను= వినుము; అరయఁగన్= పరిశీలించగా; రాజధర్మము= రాజుకు ఉండవసిన ధర్మం; సమ్+ఆశ్రయము+ఐ= చక్కటి ఆధారమై; త్రివర్గమున్= ధర్మం, అర్థం, కామం అనే మూడింటిని; నడపున్= కొనసాగిస్తుంది; తలఁపన్= ఆలోచించగా; గురుతర= మిక్కిలి గొప్పదైన; మోక్షధర్మమునకున్= పురుషార్థాలలో నాలుగవదైన మోక్షధర్మానికి; తన ప్రాప+ఊఁత= తన అండయే ఆశ్రయమూ, ఆధారమున్నూ; ఏ+మెయిన్= ఎట్లాగైనా; ఘోటకంబునకున్= గుఱ్ఱానికి; వాగెయున్= గుఱ్ఱపు కళ్ళేనికి తగిలించే పగ్గం; దంతికిన్= ఏనుగునకు; అంకుశంబున్= అంకుశం; ఏ కరణిన్= ఏ విధంగా; నివారకంబులు= నిరోధించగలవో; తాను= ఆ రాజధర్మం; జగంబులకున్+అట్టు= ఈ లోకాల కన్నింటికి అదే రీతి (నిరోధం).

**తాత్పర్యం:** 'ఓ తాతా! ప్రజాపరిపాలనా రూపమైన రాజధర్మమే శ్రేష్ఠమైనది. ఈ జీవలోకాని కెల్ల రాజధర్మమే ఆధారం. ధర్మార్థ కామాలు మూడు రాజధర్మంపై ఆధారపడి ఉన్నాయి. గుఱ్ఱానికి పగ్గమూ, ఏనుగుకు అంకుశం వలె లోకాన్ని శాసించేది రాజధర్మమే. ఇందులో సందేహం లేదు.

**విశేషం:** అలం: నిదర్శన.

**క. వ్యాకులతఁ బొంది రూపఱు । లోకస్థితి తొంటిరాజలోకముచే నం**
**గీకృత మగు ధర్మ మనం । గీకృత మగునేని వీతకిల్బిషచరితా! 159**

**ప్రతిపదార్థం:** వీత కిల్బిష చరితా!= పోయిన పాపాలుగల చరిత్ర గలవాడా!, ఓ పవిత్రమైన చరిత్ర గల భీష్మా!; తొంటి= పూర్వపు; రాజలోకముచేన్= రాజసమూహాలచేత; అంగీకృతము+అగు= అంగీకరించబడినదైన; ధర్మము= ధర్మం; అనంగీకృతము+అగున్+ఏని= స్వీకరించి తదుచితంగా పరిపాలన సాగించక పోయినట్లైతే; లోకస్థితి= ఈ లోకపు పరిస్థితి; వ్యాకులతన్+పొంది= కలత చెంది; రూపఱున్= నాశనమైపోతుంది.

**తాత్పర్యం:** ఓ పరిశుద్ధ చరిత్రుడవైన తాతా! పూర్వ రాజులు అంగీకరించిన రాజధర్మాన్ని పాటించకపోతే ఈ లోకపు పరిస్థితి కలత చెంది నాశనమై పోతుంది.

**క. తరణి వొడిచి తమము సెఱుచు । కరణిని లోకమునఁ గలుగు కల్మష మెల్లన్**
**ధరణిపతి ధర్మ మాత్మ । స్ఫురణంబునఁ జెఱుచు విమలబోధనచరితా! 160**

**ప్రతిపదార్థం:** విమల బోధన చరితా!= నిర్మల జ్ఞాన చరిత్రుడా, ఓ తాతా!; తరణి+పొడిచి= సూర్యుడు ఉదయించి; తమము+చెఱుచు కరణిని= చీకటిని పోగొట్టేటట్లు; ధర్మము+ఆత్మ స్ఫురణంబునన్= ధర్మం మనస్సులో కలగగానే; ధరణిపతి= రాజు; లోకమునన్+కలుగు= ఈ లోకంలో ఉన్నట్టి; కల్మషము+ఎల్లన్= పాపమంతటినీ; చెఱుచున్= తొలగిస్తాడు, పోగొట్టుతాడు.

**తాత్పర్యం:** ఓ పితామహా! సూర్యోదయంతో చీకటి తొలగిపోయేటట్లు లోకంలోని పాపాలన్నీ రాజధర్మంచేతనే నాశనమౌతాయి.

**విశేషం:** అలం: ఉపమ. శ్లో॥ **"ఉదయన్ హి యథా సూర్యో నాశయ త్యశుభం తమః**
**రాజ ధర్మ స్తథా లోక్యా మాక్షిప త్యశుభాం గతిమ్"**

అనే సంస్కృత మూల శ్లోకానికి తిక్కన అనువాదం పై పద్యం. దీనికి ఆధారంగా ఉన్న స్మృతిని నీలకంఠీయం ఉదాహరించింది.

**"రాజభిః కృతదండాస్తు శుద్ధ్యంతి మలినా జనాః**
**కృతార్థాశ్చ తతో యాంతి స్వర్గం సుకృతినో యథా॥**

**ఆ. అనఘ! నీదు బుద్ధి యతిలోక మగుటయుఁ । దెలిసికొనఁగ నాకు వలయునట్టి**
**ధర్మకోటి నీవ తగఁ జెప్ప వినవల । యుటయుఁ జెప్పె నంబుజోదరుండు. 161**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాప రహితుడవైన ఓ తాతా!; నీదు బుద్ధి= నీ బుద్ధి; అతిలోకము+అగుటయున్= లోకాతీతం- అసామాన్యం అంటే మానవులకు ఎవ్వరికీ లేని వైశిష్ట్యాన్ని కలిగి ఉండటం చేత; నాకున్; తెలిసికొనఁగన్= తెలిసికొనటానికి; వలయునట్టి= అవసరమైన; ధర్మకోటి= ధర్మాల సమూహం; నీవ= నీవే; తగన్+చెప్పన్= తగిన రీతిగా చెప్పగా; వినవలయుటయున్= నేను వినవలసింది గాను; అంబుజ+ఉదరుండు= పద్మం నాభియందు గలవాడైన ఆ శ్రీకృష్ణుడు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'నిర్మలుడవైన ఓ తాతా! నీవు లోకాతీతమైన బుద్ధిసంపన్నుడ వనీ, నేను తెలిసికొనదగిన రాజధర్మాలు నీవు చెప్పగా నేను గ్రహించాలనీ ఆ శ్రీకృష్ణుడి నిర్ణయం. కాబట్టి సమస్త రాజధర్మాలను వివరించుమని ప్రార్థిస్తున్నాను.

**విశేషం:** .సమస్త రాజ ధర్మాలను అతిలోకజ్ఞుడైన భీష్ముడు ఒక్కడే చెప్పటానికి అర్హుడని విదితం.

**ఆ. ధర్మవిదులు రాజు ధర్మ స్వరూపుఁగాఁ । జెప్ప విందుఁ దద్విశేషవృత్తి**
**భరముగాఁ దలంతు నరవర! చెప్పవే । మున్ను రాజ ధర్మముల తెఱంగు.' 162**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజశ్రేష్ఠుడవైన ఓ పితామహా!; రాజు ధర్మస్వరూపున్+కాన్= సమస్త ధర్మమే రాజుగా రూపం ఎత్తినట్లు; ధర్మవిదులు= ధర్మ స్వరూపాన్ని తెలిసిన వేత్తలు; చెప్పన్= తెలుపగా; విందున్= విన్నాను; తద్+విశేష వృత్తి= ఆ విశిష్ట మార్గం

-అంటే ఆ రాజ ధర్మమార్గం; భరముగాన్= బరువైన దానిగా అంటే ఆ రాజ ధర్మ నిర్వహణం కష్టతరమని; తలంతున్= భావిస్తున్నాను; మున్ను= ముందుగా; రాజధర్మములు= రాజు అనుసరించదగిన ధర్మాల యొక్క; తెఱంగు= విధానాన్ని; చెప్పవే= వివరించుము.

**తాత్పర్యం:** ఓ తాతా! రాజు ధర్మ స్వరూపు డని ధర్మవేత్తలు చెప్పగా విన్నాను. కానీ, ఆ రాజ ధర్మ నిర్వహణం అతికష్ట సాధ్యమని భావిస్తాను. కాబట్టి అటువంటి రాజ ధర్మరీతులను ముందుగా వివరించ గోరుతున్నాను.

**చ. అనుటయు నాపగేయుఁడు మహత్త్వ సమంచిత మైన ధర్మము**
**న్వినుత విధాతృభావ మహనీయుఁడు గృష్ణుని, వేదమూర్తి నాఁ**
**జను ధరణీసురావలిఁ బ్రసక్తిఁ దలంచి నమస్కరించి, య**
**జ్జనపతి వక్త్ర మాదర రసప్లుత దృష్టిని జూచి యిట్లనున్. 163**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధర్మరాజు ప్రార్థించగా; ఆపగేయుఁడు= గంగాపుత్రుడైన భీష్ముడు; మహత్త్వ సమంచితము+ఐన= మహిమతో కూడుకొన్న; ధర్మమున్= ధర్మాన్ని; వినుత= ప్రస్తుతి కొన్న; విధాతృభావ మహనీయుఁడు= బ్రహ్మాభావన చేత మహాత్ముడైన; కృష్ణునిన్= శ్రీకృష్ణుడిని; వేదమూర్తి నాన్+చను= వేదాల స్వరూపమో అనేటట్లు ఒప్పుతూ ఉన్న; ధరణీసుర+ఆవలిన్= భూదేవుల అంటే బ్రాహ్మణుల యొక్క సమూహాన్ని; ప్రసక్తిన్+తలంచి= ప్రస్తావ వశాన భావించి; నమస్కరించి; ఆ+జనపతి వక్త్రము= ఆ ధర్మరాజు ముఖాన్ని; ఆదర రసప్లుత దృష్టిని+చూచి= ఆదరమనే రసం స్రవించే చూపుతో చూచి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** రాజధర్మాలను తెలుపు మని ధర్మరాజు కోరగా భీష్ముడు మహిమాన్వితమైన ధర్మాన్ని, బ్రహ్మకల్ప స్వరూపుడైన శ్రీకృష్ణుడిని, వేదాలే రూపు దాల్చిన బ్రాహ్మణసమూహాన్ని స్మరించి, నమస్కరించి, ఆదర రసప్రవాహ దృష్టితో ధర్మరాజు ముఖాన్ని అవలోకించి ఇట్లా చెప్పాడు.

**విశేషం:** ధర్మం ప్రధానమైంది. దాని సవిస్తర ప్రశంస భీష్ముడు చేయబోతున్నాడు. కనుక మొదట ధర్మాన్ని స్మరించాడు. ఆ వెనుక ఆ సమస్త ధర్మానికి మూలమైన శ్రీకృష్ణుడిని, ఆ తరువాత వేదమూర్తులైన బ్రాహ్మణులను భీష్ముడు తలంచి, నమస్కరించటంలో ఔచిత్యమున్నది.

**"నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే ।**
**బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్" ॥**

అని మూలం. ఇందులో తిక్కన ఆయా విశేషణాలతో 'అజ్జనపతి వక్త్రమాదర రసప్లుత దృష్టిని జూచి' అని కల్పించాడు. దీనివలన భీష్మునికి ధర్మజునిపై గల ప్రేమాదరాలు విదితమవుతాయి.

**క. 'నృపధర్మము లన్నియు నీ । కుపదేశించెద విసంశయోక్తుల; మఱియున్**
**విపులఫలవంత మగు ధ । ర్మపథంబును నడుగునెడఁ గరము వివరింతున్. 164**

**ప్రతిపదార్థం:** నీకు, నృప ధర్మములు+అన్నియున్= నీకు రాజ ధర్మాలన్నింటిని; విసంశయ+ఉక్తులన్= సందేహం లేనట్టి మాటలతో; ఉపదేశించెదన్= బోధిస్తాను; మఱియున్= ఇంకా; విపుల ఫలవంతము+అగు= విస్తారమైన ప్రయోజనకారిఅయిన; ధర్మపథంబునున్= (రాజధర్మంతోపాటు ఆపద్ధర్మం, మోక్షధర్మం మొదలైన) సమస్త ధర్మమార్గాలను; అడుగు+ఎడన్= (నీవు ఆయా సందర్భాలలో) అడిగేటప్పుడు; కరమున్= మిక్కిలిగా; వివరింతున్= విస్పష్టం చేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజ ధర్మాలన్నింటిని ఏ విధమైన సందేహమూ లేని వాక్యాలతో విస్పష్టంగా వివరిస్తాను. అంతేగాక ఆయా సందర్భాలలో నీవు అడిగిన ఎంతో ఫలవంతమైన ఆపద్ధర్మ, మోక్షధర్మాదులను అత్యంత ప్రయోజనాత్మకంగా తెలుపుతాను.

**వ. అవహితమతివై యాకర్ణింపుము. 165**

**ప్రతిపదార్థం:** అవహిత మతివి+ఐ= అవధాన చిత్తుండవై (ఏకాగ్రచిత్తంతో); ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** కాబట్టి ఏ విధమైన వైకల్యమూ లేని ఏకాగ్రచిత్తుడవై వినుము.

**ఆ. మేలు దనకుఁ గోరు మేదినీశుఁడు మున్ను । దేవతలకు భూమిదేవతలకుఁ**
**బూజ యాచరించు నోజ యత్నముఁ జేయ । వలయు రెండు గార్యఫలకరములు. 166**

**ప్రతిపదార్థం:** తనకున్ మేలు+కోరు= తనకు శుభాన్ని కోరుకొనే; మేదినీ+ఈశుఁడు= భూమికి భర్త అయిన రాజు; మున్ను= ముందు; దేవతలకున్= దేవతలకును; భూమిదేవతలకున్= భూమిపై దేవతలైన బ్రాహ్మణులకు; ఓజన్= క్రమంగా; పూజ+ఆచరించు= పూజచేయటానికి; యత్నమున్+చేయవలయున్= ప్రయత్నించవలసి ఉన్నది; రెండున్= దైవతపురుషకారాలు రెండూ; కార్యఫల కరములు= (తలచిన) కార్యసాధనకు ప్రయోజన కారులు.

**తాత్పర్యం:** తనకు శుభం కలగాలని కోరుకొనే రాజు, మొట్టమొదట దేవతలకు, భూదేవతలకు పూజచేయవలసిన ఆవశ్యకత ఎంతేని ఉన్నది. దానిని విస్మరించక ప్రయత్నించాలి. దేవతల అనుగ్రహం, పురుషప్రయత్నం రెండూ రాజుకు కార్యసాధనకు ప్రయోజనకారణా లని గుర్తించాలి.

**మ. విను ముద్యోగము రెంటి యందుఁ బర ముర్వీనాథ! యుద్యోగవం**
**తునకున్ దైవము దోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్; మానుషం**
**బున కొక్కొక్కెడ సిద్ధి దప్పిన వగల్ వొందంగరానీక య**
**ప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హ వృత్తంబగున్. 167**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథ!= భూభర్త అయిన ఓ ధర్మరాజా! వినుము= ఆలకించుము; ఉద్యోగము= మానవప్రయత్నం; రెంటియందున్+పరము= దైవత పురుష కారాల రెంటిలోనూ శ్రేష్ఠమైనది; ఉద్యోగవంతునకున్= ప్రయత్నం చేసే రాజునకు; దైవము+తోడ్పడంగన్= భగవంతుడు సహాయంచేయటం వలన; ఫలసిద్ధుల్+చేకుఱున్= ప్రయోజనమూ; కోరిక లీడేరటం, సమకూరుతాయి; మానుషంబునకున్+ఒక్క+ఒక్క+ఎడన్= మానవ ప్రయత్నానికి ఒక్కొక్క సందర్భంలో; సిద్ధి+తప్పినన్ సిద్ధించక తప్పిపోతే; వగల్+పొందంగన్+రానీక= దుఃఖం పొందనీకుండ; ఆ+పని= కార్యం సిద్ధించకపోయిన ఆ కార్యం; దైవ+ఉపహతంబుగాన్+కనుట= భగవంతుడిచేత నాశనం చేయబడ్డ దానిగా తెలిసికొనటం; భూపాల+అర్హ వృత్తంబు+అగున్= రాజులకు ఉచితమైన వర్తనమవుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! దైవత పురుష కారాలలో మానవప్రయత్నం శ్రేష్ఠమైనది. మానవప్రయత్నం మానక చేసే రాజుకు భగవంతుడు సహాయపడతాడు. అప్పుడు రాజుకు ఫలసిద్ధులు చేకూరుతాయి. కొన్ని సందర్భాలలో మానవప్రయత్నం ఫలించకపోవటమూ జరుగవచ్చును. అటువంటి సమయంలో దుఃఖించక, దైవోపహతంగా భావించటం సముచితరాజధర్మం.

**విశేషం:** దైవానుగ్రహమూ, మానవ ప్రయత్నమూ - ఈ రెంటిలో మానవ ప్రయత్నమే శ్రేష్ఠమైనది. అట్లా ప్రయత్నించే మానవుడికి ఫలసిద్ధులు చేకూరుతాయి. కొన్ని సందర్భాలలో ఫలించకపోతే అందుకు కారణం మానవ ప్రయత్న లోపం కాక భగవంతుడే కారణ మని భావించటం రాజధర్మ మని భీష్ముడి వివరణలోని సారాంశం.

**క. దాంతియు విజితాత్మత్వము । శాంతియు శీలంబుఁగలుగు జగతీశుఁడ శ్రీ**
**మంతుండు యశస్వియు నై । యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా! 168**

**ప్రతిపదార్థం:** ఇభపుర నాథా!= హస్తినాపురానికి అధిపతి వయిన ఓ ధర్మరాజా!; శాంతియున్= ఇంద్రియ నిగ్రహమూ; విజిత+ఆత్మత్వమున్= జయించబడిన ఆత్మత్వాన్ని కలిగి ఉండటం; శాంతియున్= కామక్రోధాది రాహిత్యమూ; శీలంబున్+కలుగు= మంచి నడత కలిగినట్టి; జగతీ+ఈశుఁడు= జగత్తునకు అధిపతి అయిన రాజే; శ్రీమంతుండున్= సంపదగలవాడూ; యశస్వియున్+ఐ= కీర్తిమంతుడూ అయి; ఎంతయున్= మిక్కిలి; సౌఖ్యంబున్+ఒందున్= సుఖాలను పొందగలడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఇంద్రియ నిగ్రహమైన దాంతీ, ఆత్మజయమూ, మనోనిగ్రహమైన అంటే కామక్రోధాది రహితమైన శాంతీ, మంచి నడత కలిగినట్టి రాజు మాత్రమే శ్రీమంతుడూ, కీర్తిమంతుడూ అయి సమస్త సౌఖ్యాలను పొందగలడు'.

**తే. ప్రకృతు లేడింటి నెటి నడపంగ వలయు; । దాని కార్జవ సత్యముల్ దావలములు;**
**దండనీతి విధాన మంతటికి రక్ష; । యర్హ మగు మెల్పుతోఁ జేయ నది వెలుంగు. 169**

**ప్రతిపదార్థం:** ప్రకృతులు+ఏడింటిన్= ప్రకృతులు - స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం - అనే ఏడింటిని; నెటిన్= క్రమంగా (న్యాయంగా); నడపంగన్+వలయున్= నడిపించవలసి ఉన్నది; దానికిన్+ఆర్జవ సత్యముల్= (ప్రకృతు లేడింటిని క్రమంగా నడపటానికి) ఋజుభావం, సత్య మనేవి; తావలములు= ఆధారాలు (మూలాలు); అంతటికిన్= ఈ పై పేర్కొన్న సర్వస్వానికి; దండనీతి విధానము= కామందకాద్యర్థశాస్త్రపద్ధతి; రక్ష= సంరక్షకమైనది; అది; అర్హము+అగు= తగినట్టి; మెల్పుతోన్+చేయన్= జాగరూకతతో (నేర్పుతో) చేస్తే; వెలుంగున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం అనే ఏడు ప్రకృతులను రాజు గుర్తించి, సక్రమంగా నిర్వహించవలసి ఉన్నది. ఆ నిర్వహణకు రాజులో ఋజుభావమూ, సత్యమూ, ఆధార భూతమై ఉండాలి. దీనికి అంతటికి కామందకాదులు చెప్పిన అర్థశాస్త్ర ప్రకారం రాజుకు దండనీతి రక్ష. దానిని నేర్పుతో నిర్వహిస్తే విశిష్టంగా ప్రకాశించగలడు.

**విశేషం:** రాజుకు ఆర్జవ సత్యాలు ముఖ్యం. కామందకుడనే ముని ఆంగరిష్ఠుడనే రాజుకు తెలిపిన దండనీతిని తెలిసికొని ఉండవలసి ఉన్నది. జాగరూకుడైన రాజు కావించే తన్నిర్వహణంతో రాజనీతి విశిష్ట మవుతుం దని భీష్ముడి మాటల సారాంశం.

**వ. అదియును బుద్ధిమంతులు బ్రాహ్మణులవలనం బ్రయోగింప; రయ్యర్థంబునకు మనువాక్యంబులు గల; వాకర్ణింపుము. 170**

**ప్రతిపదార్థం:** అదియును= దానితోపాటు; బుద్ధిమంతులు= నేర్పరులు; బ్రాహ్మణుల వలనన్+ప్రయోగింపరు= బ్రాహ్మణుల పట్ల కొనసాగించరు; ఆ+అర్థంబునకున్= ఆ విషయానికి; మను వాక్యంబులు+కలవు= మనువు చెప్పిన నీతి వాక్యాలు ఉన్నాయి; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** పై రాజధర్మానుగుణులైన రాజులు నేర్పరులైతే బ్రాహ్మణుల విషయంలో దీన్ని కొనసాగించరు. ఈ అర్థాన్ని వివరించే మనువు చెప్పిన వాక్యాలను వినుము.

**ఆ. ఇనుము ఱాత, నీర ననలంబు, విప్రుల । వలన రాజు, లుద్భవంబుఁ బొందు**
**టిది నిజంబు; తత్సమిద్ధ తేజము లెందుఁ । జెల్లుఁ బుట్టినెడలఁ జేటు నొందు. 171**

**ప్రతిపదార్థం:** ఱాతన్= రాతివలన; ఇనుమున్= ఇనుమూ; నీరన్= నీటితో; అనలంబున్= అగ్నీ; విప్రుల వలనన్= బ్రాహ్మణులవలన; రాజులు= రాజులును; ఉద్భవంబున్+పొందుట+ఇది నిజంబు= జన్మించటమనేది వాస్తవం; తద్+సమ్+ఇద్ధతేజంబులు= వాటియొక్క పరిశుద్ధమైన కాంతులు; ఎందున్+చెల్లున్= ఎక్కడైనా ప్రకాశించగలవు; పుట్టిన+ఎడలన్+చేటున్+ఒందున్= కానీ జన్మస్థానాలలో నాశనమవుతాయి.

**తాత్పర్యం:** రాతివలన ఇనుమూ, నీటివలన అగ్ని, బ్రాహ్మణులవలన రాజులు జన్మించటం నిజమే. వాటి పరిశుద్ధ కాంతులు అన్నిచోట్ల ప్రకాశిస్తాయి. కాని, జన్మస్థానాలలో మాత్రం ప్రవర్తించవు.

**విశేషం:** ఒకచోట పుట్టి ఇతరత్రా విశిష్టంగా వెలుగవచ్చును. కాని, తమ జన్మస్థానంలో వాటి శక్తి ఉపకరించదు. దీని వివరణ తరువాతి పద్యంలో ఉన్నది.

**క. శిలఁ ద్రెంపఁబోయి యినుమును । జలములు గొని కాల్పఁగడఁగి చని యనలంబుం**
**బొలియును; రాజును విప్రుల । కలిగి చెఱుపఁబోయి తాన యనయంబుఁ జెడున్. 172**

**ప్రతిపదార్థం:** శిలన్+త్రెంపన్+పోయి= రాతిని ఖండింపబోయి; ఇనుమును= ఇనుమూ; జలములు+కొని= నీటిని గ్రహించి; కాల్పన్+కఁడగి చని= కాల్చివేయ ప్రయత్నించబోయి; పొలియును= అవే నశించిపోతాయి; రాజును= రాజూ; విప్రులకున్+అలిగి= బ్రాహ్మణులపై కోపగించి; చెఱుపన్+పోయి= నాశనంచేయ ప్రయత్నించి; అనయంబున్= ఎప్పుడైనా; తాన= తానే; చెడున్= నాశనమవుతాడు.

**తాత్పర్యం:** రాతిలోనుండి పుట్టిన ఇనుము రాతిని ఖండించబోయి తానే పాడవుతుంది. నీట పుట్టిన నిప్పు ఆ నీటిని గ్రహించి కాల్చబోయి తానే నశిస్తుంది. అదే రీతిగా బ్రాహ్మణులను నాశనం చేయదలిస్తే రాజే నశిస్తాడు.

**విశేషం:** ఈ న్యాయాన్ని అనుసరించి మూలచ్ఛేదం చేయబోతే ఆ చేయప్రయత్నించిన వారే నశిస్తారు. ముఖ్యంగా రాజు కిది చక్కటి నిరూపణ.

**శా. ఈ వాక్యంబులు రెండుఁ జిత్తమున నీ వెల్లప్పుడున్ నిల్పి భూ**
**దేవశ్రేణియెడం గృపాన్వితుఁడవై దీప్తార్హ దండంబు స**
**ద్భావం బొప్పఁగ నొండెడన్ నడపు శాంతక్ష్మాసురోదార జి**
**హ్వా విశ్రాంతము బ్రహ్మ మట్లగుట దైవం బండ్రు విప్రున్ బుధుల్. 173**

**ప్రతిపదార్థం:** ఈవు+ఎల్లప్పుడున్= నీవు అన్ని సమయాలలోను; ఈ వాక్యంబులు రెండున్= పైని పేర్కొన్న న్యాయాలను రెండింటిని; చిత్తమునన్+నిల్పి= నీ మనస్సులో ఉంచుకొని; భూదేవ శ్రేణి యెడన్= బ్రాహ్మణులయొక్క సమూహం పట్ల; కృపా+అన్వితుఁడవు+ఐ= దయ కలవాడవై; దీప్త+అర్హదండంబున్= ప్రకాశిస్తూ అర్హమైన (తగిన) రాజదండమూ; సద్భావంబు+ఒప్పఁగన్= సాధు భావం ఒప్పునట్లుగా; ఒండు+ఎడన్+నడపు= మరొకచోట ప్రవర్తింప చేయవలసింది; బ్రహ్మము= వేదము; శాంత= శాంతగుణ శీలురైన; క్ష్మాసుర= భూదేవతలు బ్రాహ్మణులయొక్క; ఉదార జిహ్వా= గొప్పదైన నాలుకపై; విశ్రాంతము= విశ్రమిస్తూ ఉంటుంది; అట్లు+అగుటన్= అలా ఉండటం చేత; బుధుల్= విద్వాంసులు; విప్రున్= బ్రాహ్మణుడిని; దైవంబు అండ్రు= దేవత అంటారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! పైన పేర్కొన్న రెండు న్యాయాలను మనస్సులో ఉంచుకొని బ్రాహ్మణుల పట్ల దయాంతఃకరణుడవై ఉండుము. సద్భావంతో అర్హమైన రాజదండమును, ఇతరులపట్ల ప్రవర్తింపజేయుము. శాంత స్వరూపులైన బ్రాహ్మణుల నాల్కలపై వేదాలు ఉంటాయి. కనుకనే విద్వాంసులు బ్రాహ్మణులను దేవతలుగా పేర్కొన్నారు.

**వ. విప్రుని దండించు నెడలునుం గలవు; శుక్రుండును జెప్పినవాఁడు; వినుము. 174**

**ప్రతిపదార్థం:** విప్రునిన్= బ్రాహ్మణుడిని; దండించు= శిక్షించే; ఎడలునున్+కలవు= అవకాశాలూ ఉన్నాయి. శుక్రుండునున్+చెప్పిన వాఁడు= శుక్రాచార్యుడు కూడా వివరించాడు; వినుము.

**తాత్పర్యం:** బ్రాహ్మణులను శిక్షించే పట్టులూ ఉన్నాయి. అట్లాంటి సందర్భాలను శుక్రాచార్యుడు వివరించాడు. చెప్పుతాను వినుము.

**భీష్ముఁడు ధర్మరాజునకు విప్రులలో దండార్హుల నిరూపించుట (సం. 12-56-29)**

**క. శాంతుఁడు గా కని నాయుధ । వంతుం డై కవియు విప్రు వసుధేశుఁడు వే**
**దాంతి నయిన హింసించుట । యెంతయు ధర్మంబు; శ్రుతులు నిట్లని చెప్పున్. 175**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; ఆయుధ వంతుండు+ఐ= శస్త్రాస్త్రాలు ధరించి; శాంతుఁడు+కాక= శాంతం లేక; కవియు= ఎదుర్కొనే; వేదాంతిన్+అయినన్= వేదాంతినైనా; విప్రున్= బ్రాహ్మణుడిని; వసుధా+ఈశుఁడు= భూభర్త అయిన రాజు; హింసించుట= సంహరించటం; ఎంతయున్+ధర్మంబు= మిక్కిలి ధర్మం; ఇట్లు+అని= ఇదే ధర్మమని; శ్రుతులు చెప్పున్= వేదాలు చెప్పుతాయి.

**తాత్పర్యం:** యుద్ధంలో శస్త్రాస్త్రాలు ధరించి కోపోద్రిక్తుడై ఎదుర్కొనే బ్రాహ్మణుడు వేదాంతి అయినప్పటికీ అతడిని సంహరించటం రాజుకు పరమధర్మమని వేదాలు చెబుతున్నాయి.

**క. గురుతల్పగు, భ్రూణహనున్, । నరేంద్ర విద్వేషి, బ్రాహ్మణఘ్నునిఁ బెలుచన్**
**ధరణి వెడల నడువ వలయు; । శరీర నిగ్రహము సేయఁ జన దెయ్యెడలన్. 176**

**ప్రతిపదార్థం:** గురుతల్పగున్= గురు భార్యాగతుడయ్యే వాడిని; భ్రూణహనున్= శిశుహంతను; నర+ఇంద్ర విద్వేషిన్= రాజును ద్వేషించే వాడిని; బ్రాహ్మణఘ్నునిన్= బ్రాహ్మణులను సంహరించే వాడిని; పెలుచన్= కఠినంగా; ధరణి వెడలన్+నడువ వలయున్= తన రాజ్యం నుండి వెడలగొట్టవలసి ఉన్నది; ఏ+ఎడలన్= ఎట్లాంటి పరిస్థితిలో అయినా; శరీర నిగ్రహము+చేయన్+చనదు= శరీరాన్ని నాశనం చేయరాదు.

**తాత్పర్యం:** గురుతల్పగుడూ, శిశుహంతా, రాజద్వేషీ, బ్రాహ్మణహంతా అయిన బ్రాహ్మణుడిని రాజు తన రాజ్యం నుండి బహిష్కరించాలి. అంతేగాని అట్లాంటి వారిని వధించరాదు.

**వ. దుర్గంబు లనేక విధంబులు గలవు; వానియందు నర దుర్గంబు వరిష్ఠంబు గావున వర్ణంబులు నాలిగింటి మీఁదను మేదినీశ్వరుండు దయ గలుగవలయుఁ; గేవల క్షమావంతుం డగుటకు సాదుటేనుంగు చందంబై యుండు; నివ్విషయంబున బృహస్పతి వచనంబులు గలవు; తదీయార్థంబులు వివరించెద. 177**

**ప్రతిపదార్థం:** దుర్గంబులు+అనేక విధంబులు+కలవు= కోటలు అనేక పద్ధతులలో - ఆరువిధాలుగా ఉన్నాయి; వానియందున్= ఆ ఆరురకాల దుర్గాలలో; నరదుర్గంబు= చుట్టూ చతురంగ బలాలు గల కోట; వరిష్ఠంబు= మిక్కిలి శ్రేష్ఠమైనది; కావునన్= అందుచేత;

వర్ణంబులు నాలిగింటి మీఁదను= బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగు వర్ణాల మీదా; మేదినీ+ఈశ్వరుండు= భూమి భర్త అయిన రాజు; దయ+కలుగ వలయున్= దయ కలిగి ఉండాలి; కేవల క్షమావంతుండు+అగుటకున్= కేవలం క్షమాగుణం కలిగి ఉండటం; సాదు+టు+ఏనుగు చందంబు+ఐ+ఉండున్= సాధువైన ఏనుగువలె ఉన్నట్లవుతుంది; ఈ+విషయంబునన్= ఈ వివరణకు; బృహస్పతి వచనంబులు+కలవు= బృహస్పతి వాక్యాలు ఉన్నాయి; తదీయ+అర్థంబులు= ఆ బృహస్పతి వచనాలకు అర్థాలను; వివరించెదన్= వివరిస్తాను.

**తాత్పర్యం:** దుర్గాలు పలు రీతులు. వాటిలో నరదుర్గం శ్రేష్ఠమైనది. అందువలన రాజు నాలుగు వర్ణాల ప్రజల మీదను దయాహృదయుడై ఉండటం అవసరం. అయితే రాజు కేవలం దయావంతు డైతే మాత్రం ఏనుగు సాధువై ఉన్నట్లే. ఈ వివరణకు తగిన బృహస్పతి వచనాలు ఉన్నాయి. ఆ వాక్యాలను వివరిస్తాను.

**విశేషం:** దుర్గంకోట - ఆరు రకాలు: ధన్వదుర్గం (నలుప్రక్కలా అయిదామడల మరుభూమిగల కోట), మహీదుర్గం (చుట్టూ మట్టి దిబ్బలు గల కోట), వార్క్షదుర్గం (చుట్టూ వృక్షాలుగల కోట), నరదుర్గం (చుట్టూ చతురంగ బలాలుగల కోట), జలదుర్గం (చుట్టూ నీరుగల కోట), గిరి దుర్గం (చుట్టూ కొండలు గల కోట).

**సీ.** **మేదినీపతి యతిమృదువైన, మావంతుఁ । డేనుంగు నెట్లట్ల యెక్కి యాడఁ**
**జూచుఁ దేఁకువ సెడి నీచపుఁ బ్రజఁక్రూరుఁ । డగునేని లోకంబు బెగడు గుడుచుఁ**
**గాన వసంతంబుభానుని చాడ్పునఁ । దగియెడు పాటితో ధరణి ప్రజల**
**నుచితవర్తనముల నొందించునది; యిది । రాజ ధర్మములకు రాజు సుమ్ము;**

**ఆ.** **కౌరవేంద్ర! యదియుఁ గాక దండము పరీ । క్షా విశుద్ధి పూర్వకముగ వలయుఁ**
**దనతలంపు వెంటఁ దమకించి ప్రజకు నొ । వ్వుగఁ జరించుటయును దగదు పతికి.** **178**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కురువంశ రాజశ్రేష్ఠుడైన ఓ ధర్మరాజా!; మేదినీపతి= పుడమికి అధిపతి అయిన రాజు; అతి మృదువు+ఐనన్= మిక్కిలి మెత్తని వాడైతే; నీచము+ప్రజ= అధములైన ప్రజలు; తేఁకువ+చెడి= భయంలేక; మావంతుండు+ఏనుంగున్+ఎట్లు+అట్లు+ఎక్కి+ఆడన్+చూచున్= మావటీడు ఏనుగుపైకి ఏ విధంగా అయితే ఎక్కి ఆడతాడో అట్లాగే ఆడటానికి ప్రయత్నిస్తాడు; క్రూరుఁడు+అగున్+ఏని= (రాజు) భయంకరుడైతే; లోకంబు= ఈ జగత్తు; బెగడు+కుడుచున్= భయపడుతుంది కానన్= అందుచేత; వసంతంబు భానుని చాడ్పునన్= వసంత ఋతువులోని సూర్యుడివలె; తగియెడు పాటితోన్= అవసరమైనంత మోతాదుతో; ధరణి ప్రజలన్= పౌరులను; ఉచిత వర్తనములన్+ఒందించునది= తగిన నడవడికలతో పాలించవలసింది; ఇది= ఈ పద్ధతి; రాజ ధర్మములకున్= రాజు ఆచరించవలసిన ధర్మాలకు; రాజు సుమ్మ!= శ్రేష్ఠమైనది సుమా!; అదియున్+కాక= అంతేకాక; దండము= చతురుపాయాలైన సామ దాన భేద దండోపాయాలలో చివరిదైన దండోపాయం; పరీక్షా విశుద్ధి పూర్వకముగన్ వలయున్= బహు జాగరూకతతో పరిశీలించాకే చేయవలసింది; పతికిన్= రాజునకు; తన తలంపు వెంటన్= తనకు తోచిన వెంటనే; తమకించి= త్వరపడి, వేగిరపడి; ప్రజకు నొవ్వగన్= ప్రజలకు బాధాకరంగా; చరించుటయును+తగదు= నడుచుకొనటం కూడా సముచితం కాదు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వినుము. శాంతపరు డైన రాజు కోపరహితమైన ఏనుగువలె నీచులకు వశమవుతాడు. అట్లాంటి ఏనుగును మావటీడు తన ఇష్టానుసారం ఆడించునట్లే శాంతపరుడైన రాజును నీచప్రజలు ఆడిస్తారు. రాజు కోపస్వభావుడైతే ప్రజలు భయపడి పారిపోతారు. కాన, రాజు వసంత ఋతువులో సూర్యుడివలె సమభావంతో ప్రజలను పాలించవలసి ఉన్నది. ఇది రాజునకు ఉండవలసిన రాజధర్మాలలో అతిశ్రేష్ఠమైన ధర్మం. ప్రజల ఉపకారాపకారాది గుణాలవలన వ్యక్తమయ్యే శీలవృత్తులను బట్టి బహుజాగరూకతతో పరిశీలించి పరిపాలించవలసి ఉన్నది. తన కోపాన్ని ప్రజలపై రుద్దకుండా, వేగిరపాటు లేక ప్రజలకు బాధ కలిగించని రీతిలో రాజు నడుచుకొనవలసి ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ. మూలంలోని ఆరుశ్లోకాల కీ పద్యం తిక్కన అనువాదం. మూలసార మిందులో నిక్షిప్తం. మూలంలోని "క్షమావాన్" పదానికి మృదువనీ; 'తీక్ష్ణః' శబ్దానికి క్రూరుడైన అనీ తిక్కన ప్రయోగాలు. 'ప్రత్యక్షేణానుమానేన'.... పరీక్ష్య' అనే మాటల అర్థాన్ని తిక్కన 'పరీక్షా విశుద్ధి పూర్వకముగనే' అని ప్రయోగించాడు. 'వాసంతార్క ఇవ' . . . న శీతో నచఘర్మదః' మాటలకు 'వసంతంబు భానుని చాడ్పున దగియెడు పాటితో' అని తిక్కన అనువాదం. 'ఇది రాజధర్మములకు రాజు సుమ్ము' అనే తిక్కన మాట సామెత ఆమెతవలె ఉన్నది. రాజును ఏనుగుతోను, ప్రజలను మావటితోను పోల్చటమూ, ఏనుగునుబట్టి మావటివలె రాజునుబట్టి ప్రజలు ఉంటారని చక్కగా వివరించబడింది.

**క. విను గర్భిణి ప్రజ బ్రదుకున । కనురూపము లైన యట్టి యాహారంబుల్**
**గొనుగతిఁ బతి ధరణీ ప్రజ । మనికికిఁ దగ నడచునది తమకి గా కెపుడున్. 179**

**ప్రతిపదార్థం:** విను= ఓ ధర్మరాజా! ఇంకా వినుము; ఎపుడున్= ఎల్లప్పుడు; తమకి గాక= తమకం (తొందర) పడేవాడు కాక; గర్భిణి= కడుపుతో ఉన్న స్త్రీ; ప్రజ బ్రదుకునకున్= కడుపులో పెరుగుతున్న శిశుపోషణకు; అనురూపములు+ఐన+అట్టి= తగినట్టి; ఆహారంబుల్+కొనుగతిన్= ఆహార పదార్థాలు తినే పద్ధతిలోనే; పతి= రాజు; ధరణీ ప్రజ= పౌరులయొక్క; మనికికిన్+తగన్ నడచునది= మనుగడకు తగినట్లు వర్తించాలి.

**తాత్పర్యం:** గర్భం ధరించిన స్త్రీ తన సంతానం క్రమంగా పెరగటానికై తగిన పథ్యాహార విహారాదులను ఆచరించినట్లే రాజుసైతం తొందరపడక తన ప్రజలకు క్షేమకరమైన రీతిలో వర్తించవలసి ఉంటుంది.

**మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందు భూ**
**వరునాజ్ఞం జన; రీగి మెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁ జొ**
**త్తురు; కౌతూహల వేష భూషణములం దుల్యత్వముం బొంది యే**
**తురు; వా రెల్లపదంబు వేఁడుదురు; సింతుర్ భూమి మాఱొడ్డులన్. 180**

**ప్రతిపదార్థం:** పరిహాసంబునన్+తేలి= పరియాచకాలలో తేలియాడి; భృత్యులఎడన్= సేవకుల యందు; ప్రహ్లాదమున్+పొందు= అత్యంత ఆనందాన్ని పొందే; భూవరున్+ఆజ్ఞన్+చనరు= రాజాజ్ఞ ప్రకారం నడచుకొనరు; ఈగిన్+మెచ్చరు= త్యాగశీలతను మెచ్చుకొనలేరు; పనిన్+వంచింతురు= కార్యాచరణలో మోసగిస్తారు; ఎగ్గు+ఆడన్+చొత్తురు= కీడు మాటలాడ ప్రయత్నిస్తారు; కౌతూహల వేష భూషణములన్= కుతూహలమైన వేష ధారణంలో, మాటలలో; తుల్యత్వమున్+పొంది= (రాజుతో) సమానత్వాన్ని భావించి; ఏతురు= విజృంభిస్తారు; వారు= సేవకులు లేదా ప్రజలు; ఎల్లపదంబు+వేడుదురు= అన్ని పదవులను ఆశిస్తారు; భూమి మాఱు+ఒడ్డులన్= భూమిని ప్రతివ్యూహాలు పన్ని; చింతుర్= పీడిస్తారు.

**తాత్పర్యం:** ప్రజలతో కలిసిమెలసి పరాచకాలాడుతూ ఆనందించే రాజును ప్రజలు లెక్కచేయరు. ఎంత త్యాగశీలు డైనా మెచ్చుకొనరు. తమ కర్తవ్యం ఆచరించక మోసగిస్తారు. కీడు తలపెట్టుతారు. కుతూహలమైన వేషభాషలలో రాజుతో సమానత్వాన్ని భావించి విజృంభిస్తారు. అన్ని పదవులను ఆశిస్తూ ప్రతివ్యూహాలు పన్ని భూమిని పీడిస్తారు.

**వ. కావున భృత్యుల యెడ నత్యంత హర్షంబునం దేలి తేఁకువసెడఁ జరింప వలదు; సప్తాంగంబుల యెడ విరోధం బాచరించువాని నెవ్వని నైనను విడువ వలయు'నని చెప్పి వెండియు. 181**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; భృత్యుల+ఎడన్= సేవకుల యందు; అతి+అంత హర్షంబునన్+తేలి= మిక్కిలి సంతోషంతో తేలియాడి; తేఁకువ+చెడన్+చరింప వలదు= ధైర్యంచెడి మసలుకొనకూడదు; సప్త+అంగంబుల+ఎడన్= ఏడు రాజ్యాంగాలైన-

స్వామి, అమాత్యుడు, మిత్రుడు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం-అనే వాటికి సంబంధించి; విరోధంబు+ఆచరించు వానిన్= విరుద్ధం చేసేవాడిని; ఎవ్వనిన్+ఐనను= ఎవ్వడినైనా; విడువ వలయున్+అని చెప్పి= వదలిపెట్ట వలసిం దని చెప్పి (శిక్షించవలసిం దని చెప్పి); వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** కాబట్టి సేవకులతో కలిసి మెలసి సంతోషంతో తేలియాడుతూ ధైర్యం కోల్పోయేటట్లు నడచుకొనరాదు. సప్తరాజ్యాంగా లైన స్వామి, అమాత్యుడు, మిత్రుడు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం - అనే వాటికి వినాశకారి అయిన వాడి నెవ్వడినైన పరిహరించడమే అంటే శిక్షించటమే సముచిత మని భీష్ముడు ధర్మరాజుతో చెప్పి, మళ్ళీ ఈ విధంగా అన్నాడు.

**క. అవలేపంబునఁ గర్త । వ్య వివేకము లేక వలసినట్టుల యెవ్వం**
**డవినీతి సేయు ధరణీ । ధవుఁడు విడువ వలయుఁ దన కతఁడు గురుఁ డైనన్.' 182**

**ప్రతిపదార్థం:** ధరణీ ధవుఁడు= భూభర్త అయిన రాజు; అవలేపంబునన్= గర్వంతో; కర్తవ్య వివేకము లేక= ఆచరించవలసిన దానియందు విచక్షణ లేకుండా; వలసినట్టుల= తన కిష్టం వచ్చినట్లు; ఎవ్వండు+అవినీతి+చేయున్= అవినీతికి పాల్పడే వాడెవడైనా; తనకున్= రాజునకు; అతఁడు; గురుఁడు+ఐనన్= గురువైనా సరే; విడువ వలయున్= వదలిపెట్టటమే సముచితం.

**తాత్పర్యం:** గర్వంతో కర్తవ్యరహితుడై విచక్షణ లేకుండా ప్రవర్తించే వ్యక్తి ఎవడైనా సరే, చివరికి రాజుకు గురువైనా సరే, వదలిపెట్టటమే రాజు ఆచరించవలసిన ధర్మం.'

**వ. అని మరుత్తుండను మహారాజునకు బృహస్పతి యొడంబడం బలికె; నట్లగుట గురుండు మిత్రుండు పుత్రుండని మన్నింప వలవదు; తప్పు గలిగిన ధరణీపతులకు దండింప వలయు; సగరుండు దనకొడుకు నసమంజసునిం బౌరబాల బాధకుండుగాఁ దెలిసియు నుద్దాలకముని నిజ తనయు శ్వేతకేతుని విప్రులయెడ మిథ్యోపచారకుం డని యెఱింగియుఁ బరిత్యజించి రన వినమె! యిట్టి చరితంబుల రాజు ప్రజారంజకుండు గావలయు; నిక్కంబును జక్కటియునుం గలిగి జనుల చిత్తంబులు నొప్పింపక పెట్టవలయు; నట్టివి దఱి తోన పెట్టుచు సైరణ గలిగి వర్తిల్లు భూవల్లభుం డభివృద్ధి నొంది యతిశయిల్లు. 183**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా చెప్పి; మరుత్తుండు+అను మహారాజునకున్= మరుత్తు డనే పేరు కలిగిన మహారాజునకు; బృహస్పతి; ఒడంబడన్+పలికెన్= అంగీకరించేటట్లు పలికారు; అట్లు+అగుటన్= కాబట్టి; గురుండు మిత్రుండు పుత్రుండు+అని= గురువు, స్నేహితుడు కుమారుడు అనే భావంతో; మన్నింపన్+వలవదు= గౌరవించవలసిన పని లేదు; తప్పు+కలిగినన్= దోషమున్నట్లైతే; ధరణీ పతులకున్= రాజులకు; దండింపన్+వలయున్= శిక్షించటం ఎంతైనా అవసరం; సగరుండు= సగర మహారాజు; తన కొడుకున్+అసమంజసునిన్= అసమంజసు డనే తన కుమారుడిని; పౌరబాల బాధకుండుగాన్+తెలిసియున్= పుర జనులను, పిల్లలను పీడించే వాడని తెలిసికొని; ఉద్దాలక ముని= ఉద్దాలకుడనే మహర్షి; నిజ తనయున్= తన కుమారుడైన; శ్వేతకేతునిన్= శ్వేతకేతు డనే వాడిని; విప్రుల యెడన్ బ్రాహ్మణులపట్ల; మిథ్యా+ఉపచారకుండు+అని= అసత్య సేవాచరణుడు - అంటే ఉపచారం చేయనట్టివాడని; ఎఱింగియున్+పరిత్యజించిరి= తెలిసికొని వదలిపెట్టారు; అనన్+వినమె= అని చెప్పగా తెలిసికొన్నాము గదా; ఇట్టి చరితంబులన్= ఇట్లాంటి వారి చరిత్రలను గుర్తించటం వలన; రాజు ప్రజారంజకుండు+కావలయున్= ప్రజలను సంతోషపెట్టేవాడు కావలసి ఉన్నది; నిక్కంబును+చక్కటియునున్+కలిగి= నిజాన్ని, న్యాయాన్ని కలిగి; జనుల చిత్తంబులు నొప్పింపక పెట్టవలయున్= ప్రజల మనస్సులను బాధించక, కొనసాగించవలసింది; అట్టివి= అలాంటి వాటిని; తఱితోన పెట్టుచున్=

తగిన సమయంలోనే చేస్తూ; సైరణ+కలిగి= క్షమాగుణంతో ఒప్పి; వర్తిల్లు= నడచుకొనే; భూ వల్లభుండు= భూమి భర్త అయిన రాజు; అభివృద్ధిన్+ఒంది+అతిశయిల్లున్= అభ్యున్నతిని పొంది ఆధిక్యంతో వెల్గొందుతాడు.

**తాత్పర్యం:** పై విధంగా మరుత్తుడనే మహారాజుకు బృహస్పతి సమ్మతించేటట్లు వివరించాడు. అందువలన గురువనీ, స్నేహితుడనీ, పుత్రుడనీ ఎవడైనా సరే క్షమించరాదు. తప్పుంటే శిక్షించవలసిందే. తన కుమారుడు పౌరులను, పసిపిల్లలను పీడిస్తున్నాడని తెలిసికొన్న సగరుడు, శ్వేతకేతువనే తన కుమారుడు బ్రాహ్మణులకు అసత్యోపచారం చేస్తున్నాడని తెలిసికొన్న ఉద్దాలక మహర్షి తమ కుమారులే అయినప్పటికి వదలిపెట్టారు. ఇట్లాంటి చరిత్రలను గ్రహించి ప్రజారంజకుడై వర్ధిల్లవలసి ఉన్నది. నిజాయితీ, న్యాయం కలిగి ప్రజల మనస్సులను బాధించక తగిన సమయంలో పీడిస్తూ క్షమాగుణం కలిగిన రాజు మాత్రమే అభ్యున్నతిని పొంది అతిశయిల్లుతాడు.

**విశేషం:** బృహస్పతి దేవగురువు. మరుత్తు అవీక్షిత్తు అనే రాజు కుమారుడు. ఇతడి తల్లి విశాల. మరుత్తు జన్మసమయంలో తుంబురుడు వచ్చి, ఆ బాలుడికి మరుత్తులన్నీ శుభం చేస్తాయని చెప్పాడట. అందుచేత అతడికి మరుత్తుడని పేరు పెట్టారు. చాలా ప్రసిద్ధి పొందిన రాజు. సగరుడు బాహువు (అసితుని) కుమారుడు. ఇతడికి కేసిని అనే భార్యయందు అసమంజసు డనే పుత్రుడు జన్మించి పిశాచకృత్యాలు చేస్తుండగా, పుత్రు డని పరిగణించక నగరంనుండి వెడలగొట్టాడు. ఉద్దాలకుడు ఒక మహర్షి. అతడి కుమారుడు శ్వేతకేతువు దుష్టుడు కాగా పరిత్యజించాడు.

**క. 'తనకీడు వైదికపు వ । ర్తనములఁ గొని యడఁప వలయు; దానిం గడవన్**
**జనపతికి మేలు గలదే? । వినుము చతుర్వర్గ పరత విహిత మతనికిన్. 184**

**ప్రతిపదార్థం:** వినుము= జాగరూకతతో వినుము; జనపతికిన్= రాజునకు; తన కీడు= రాజునకు కలిగే హానిని; వైదికపు వర్తనములన్+కొని= వేద విహితమైన కార్యాచరణతో; అడఁపన్+వలయున్= తొలగించుకొనవలసి ఉన్నది; దానిన్+కడవన్ మేలు+కలదే!= దానిని మించిన మేలున్నదా?; అతనికిన్= ఆ రాజునకు; చతుర్వర్గ పరత విహితము= ధర్మార్థ కామ మోక్షాలపై ఆసక్తి కలిగి ఉండటమే తగింది.

**తాత్పర్యం:** రాజునకు ఎలాంటి కీడు కలగకుండా, వేదవిహితమైన ఆచారాలతో నివారించుకొనవలయును. అంతకంటే వేరే ఉత్తమ మార్గం లేదు. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్వర్గంపై దృష్టి ఉంచి ధర్మాచరణ చేసినప్పుడే రాజు తన ధర్మాన్ని నిర్వర్తించిన వా డవుతాడు. అంటే చతుర్వర్గం రాజుకు విహితం.

**ఆ. సకల వర్ణ ధర్మ సంకర రక్షయు, । సంధి విగ్రహాది షడ్గుణములు,**
**నలయ కరయుటయును నర్థ సమ్యగుపార్జ । నమును నృపతి యెపుడు నడపవలయు. 185**

**ప్రతిపదార్థం:** ఎప్పుడున్= ఎల్లప్పుడు; నృపతి= రాజు; సకల వర్ణ ధర్మ సంకర రక్షణయున్= సమస్తమైన వర్ణాలకు విహితమైన ధర్మాల కలయిక యొక్క సంరక్షణమూ; సంధి విగ్రహ+ఆది షడ్గుణములున్= సంధి విగ్రహం మొదలైన అంటే సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధం, ఆశ్రయం - అనే ఆరు గుణాలను; అలయక+అరయుటయునున్= విసుగు చెందకుండా పరిశీలిస్తూ ఉంటూ; అర్థసమ్యక్+ఉపార్జనమును= సముచితరీతిని ద్రవ్య సంపాదనను; నడపవలయున్= నిర్వర్తించవలసి ఉన్నది.

**తాత్పర్యం:** సమస్త వర్ణాలకు సంబంధించిన ధర్మాలను రక్షించటంలోనూ, సంధి విగ్రహాది ఆరు గుణాలను పాటించటంలోను అలపు లేక పరిశీలిస్తూ సముచితరీతిని ధనార్జన చేస్తూ రాజు తన ధర్మాన్ని నిర్వర్తించాలి.

**విశేషం:** వర్ణాలు: బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు - అనే నాలుగు వర్ణాలు.

షడ్గుణాలు: సంధి (ఒకటి కావటం); విగ్రహం (యుద్ధం చేయటం); యానం (తన శక్తి అధికమైనప్పుడు గానీ, శత్రువు బలం లేదని తెలిసినప్పుడు గానీ జయించటానికై వెళ్ళటం); ఆసనం (దుర్గాదులను సంరక్షించుకొంటూ ప్రయాణ విముఖంగా ఉండటం); ద్వైధం (తనపైకి ఇద్దరు శత్రువులు దండెత్తి వచ్చినప్పుడు ఒకడితో సంధి చేసుకొని, మరొకడితో విరోధించటం); ఆశ్రయం (అశక్తితో బలవంతుడిని ఆశ్రయించటం). ఇవి రాజు గమనించవలసిన షడ్గుణాలు.

**క. పొనరిచి యాడెడు మాటలఁ । గొనఁ దలఁపక దుర్వినీత కోటి ధనంబుల్**
**దన కెక్కినట్టి తప్పులఁ । గొని సుజనుల కీఁగి నృపతి గుణమండ్రు బుధుల్. 186**

**ప్రతిపదార్థం:** పొనరిచి+ఆడెడు మాటలన్= పొసగునట్లుపలికే మాటలను; కొనన్+తలఁపక= గ్రహించటానికి ఆలోచించక; తనకున్+ఎక్కినట్టి తప్పులన్+కొని= తనపై ఆపాదించబడ్డ దోషాలను గ్రహించి; దుర్వినీత కోటి ధనంబుల్= అవినీతి పరులైన పెక్కురి అపరాధుల ధనాన్ని; సుజనులకున్+ఈఁగి= మంచివారికి ఇవ్వటమనేది; నృపతి గుణము= రాజుయొక్క ధర్మ మని; బుధుల్= విద్వాంసులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** తన ఇచ్ఛకాలకై మాటలాడే మాటలను లెక్కించక, తన దృష్టికి వచ్చిన దోషాలను మాత్రమే గ్రహించి దానిని దండనగా గ్రహించిన దుష్టుల ధనాన్ని ఉత్తములకు ఇచ్చి సంతృప్తి పరచటమే రాజధర్మ మని బుధులు అంటా రని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు.

**క. కడు నమ్మి యునికియును నె । క్కుడు నమ్మమియును సుశీల కుశలత గా; దె**
**య్యెడ నైనను బుద్ధి సొనిపి । తడవి కనికొనంగ వలయుఁ దగవుఁ దగమియున్. 187**

**ప్రతిపదార్థం:** కడు నమ్మి+ఉనికియున్= మిక్కిలి నమ్మి ఉండటమూ; ఎక్కుడు నమ్మమియునున్= అధికంగా విశ్వసించక పోవటమూ; సుశీల కుశలత+కాదు= మంచి నడవడికకు క్షేమకరం కాదు; ఏ+ఎడన్+ఐనను= ఎట్టి పరిస్థితులలోనైనా సరే; బుద్ధి+చొనిపి= మనసు పెట్టి; తగవున్+తగమియున్= ఇది ఉచితం, ఇది అనుచితం అని; తడవి= పరిశీలించి; కనికొనంగ వలయున్= తెలిసికొని స్వీకరించవలసి ఉంటుంది.

**తాత్పర్యం:** పూర్తిగా విశ్వసించటం గానీ, ఏ మాత్రమూ నమ్మక పోవటం కానీ రాజు సద్వర్తనకు క్షేమకరం కాదు. ఏ విషయంలోనైనా సరే మనసుపెట్టి బహుజాగరూకతతో ఉచితానుచితాలను పరిశీలించి గ్రహించవలసి ఉన్నది.

**క. ధన మపహరించుటయ తన । కనిశముఁ బని గాఁగ బ్రదుకు నతి లుబ్ధునకున్**
**విను! శత్రులచే నౌటకు । మును దన ప్రజలచేన చేటు మూఁడు నరేంద్రా! 188**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజులలో శ్రేష్ఠుడైన ఓ ధర్మరాజా! వినుము; తనకు+అనిశమున్= ఎల్లప్పుడు తనకు; ధనము+అపహరించుటయ= పరధనాన్ని దొంగలించటమే; పని+కాఁగన్= ముఖ్య ధర్మమని; బ్రదుకు+అతి లుబ్ధునకున్= జీవితం గడిపే మిక్కిలి పిసినారికి; శత్రులచేన్+ఔటకున్ మును= శత్రువుల వలన (కీడు) కలిగే ముందే; తన ప్రజచేన్= తన ప్రజల వలననే; చేటు మూడున్= వినాశం కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! జాగరూకతతో వినుము. ఇతరుల ధనమును అపహరించటమే తన పని అన్నట్లు భావించే పిసినారి రాజుకు ఇతరులవలన కలిగే దానికంటె ముందు తన ప్రజల వలననే వినాశం కలుగుతుంది.

**ఆ. ధర్మరతులు, నర్థ నిర్మాణ చతురులు, । లౌల్యరహితులును, నలంఘితాజ్ఞు**
**లును, సునీతి నిపుణులును, గులజులు నగు । పరిజనములఁ బెనుపు పతికి హితము. 189**

**ప్రతిపదార్థం:** ధర్మరతులున్= ధర్మంపై ఆసక్తి కలవారు; అర్థ నిర్మాణ చతురులున్= ద్రవ్యసంపాదనంలో నిపుణులైనవారు; లౌల్య రహితులునున్= చలించనట్టి వారు - స్థిర చిత్తులైన వారు; అలంఘిత+ఆజ్ఞులునున్= ఆజ్ఞ దాటనివారు; సునీతి నిపుణులును= ఉత్తమ నీతిని గ్రహించటంలో నైపుణ్యం కలవారూ; కులజులున్+అగు= ఉత్తమ కులంలో జన్మించినవారూ అయిన; పరిజనములన్+పెనుపు= పరివారం యొక్క పెంపు చేసికొనటం; పతికిన్= రాజునకు; హితము= ఉచితం.

**తాత్పర్యం:** ధర్మమం దాసక్తి కలవారు, ద్రవ్యాభివృద్ధి నిపుణులు, స్థిరచిత్తులు, రాజాజ్ఞ నతిక్రమించని ఉత్తమ నీతి కోవిదులూ, ఉత్తమ కుల సంజాతులు అయిన పరివారాన్ని పెంపు చేసికొనటమనేది రాజుకు చాలా ముఖ్యమైన ధర్మం.

**చ. కపటము లేక, వైభవము గప్పక, యొండొరుమీఁద రాజుపై**
**నపరిమిత ప్రియం బెసఁగ నల్గక యుండు ముదంబుఁ బొంది యే**
**నృపు విషయంబునం బ్రజ వినిర్మలవృత్తతఁ బుత్రుభంగి నా**
**నృపు నృపుఁ డండ్రు గా కితరునిం దగువా రెద నియ్యకొందురే? 190**

**ప్రతిపదార్థం:** ఏ నృపు విషయంబునన్= ఏ రాజు విషయంలోనైతే; ప్రజ= ప్రజలు; వినిర్మల వృత్తతన్= ఉత్తమ ప్రవర్తనతో; కపటము లేక= మోసం లేకుండా; వైభవము+కప్పక= విభవాన్ని అంటే సంపదను దాచుకొనక; ఒండు+ఒరుమీఁదన్= పరస్పరం ఒకరు మరొకళ్ళమీద; రాజుపైన్= రాజుమీద; అపరిమిత ప్రియంబు+ఎసఁగన్= అత్యంతమైన ప్రేమ అతిశయిల్లగా; అల్గక= కోపించక; ముదంబున్+పొంది= సంతోషం పొంది; పుత్రు భంగిన్= కుమారుడి వలె; ఉండున్= ఉంటాడో; ఆ నృపున్+నృపుఁడు+అండ్రు+కాక= రాజును రాజంటారు కాని; ఇతరునిన్+తగువారు+ఎదన్+ఇయ్యకొందురే?= తదితరమైన రాజును, అర్హులైన వారు హృదయంలో ఒప్పుకొంటారా?.

**తాత్పర్యం:** ఏ రాజు విషయంలో అయితే ప్రజలు ఉత్తమప్రవర్తనతో మోసం లేకుండా సంపదను దాచుకొనక, పరస్పరమూ, రాజు మీద మిక్కిలి ప్రేమతో మసలుకొంటూ, కోపం లేకుండా పుత్రుల వలె ఉంటారో అట్లాంటి రాజే నిజమైన రాజు. తదితరులను అర్హులైనవారు హృదయంలో ఒప్పుకొంటారా?

**క. ధన దారాదికముల నె। వ్వనికిని రక్షించికొనఁగ వసమే రక్షా**
**ఘనుఁ డగు పతి గల్గిన గా। కనఁడే శుక్రుఁడు సుమతు లభినందింపన్. 191**

**ప్రతిపదార్థం:** రక్షాఘనుఁడు+అగు పతి+కల్గినన్+కాక= (ప్రజలను) సంరక్షించటంలో పరాక్రమ వంతుడుగా ఉంటే తప్ప; ధనదార+ఆదికములన్= సంపదలను, భార్య మొదలైన వారిని; ఎవ్వనికిని= ఎవ్వడికైనా; రక్షించుకొనఁగన్ వసమే?= సంరక్షించుకొనటం సాధ్యమా? (అని); సుమతులు+అభినందింపన్= బుద్ధిమంతులు మెచ్చుకొనేటట్లు; శుక్రుఁడు= శుక్రాచార్యుడు; అనఁడే?= అనలేదా?

**తాత్పర్యం:** ప్రజలను సంరక్షించే పరాక్రమసంపన్నుడైన రాజు ఉంటే తప్ప సంపదలను, భార్య, బిడ్డలు మొదలైనవారిని రక్షించుకొనటం సాధ్యం కాదని బుద్ధిమంతులు మెచ్చుకొనేటట్లు శుక్రాచార్యుడు చెప్పలేదా?

**క. అనధీయానుం డితఁ డనఁ। జను ఋుత్విజునట్ల చూవె సంరక్షా క**
**ల్పన హీనుఁడైన నృపుఁడని। మనువు పలికెఁ గాదె బుద్ధిమంతులు మెచ్చన్. 192**

**ప్రతిపదార్థం:** సంరక్షా కల్పన హీనుఁడు+ఐన నృపుఁడు= ప్రజా సంరక్షణ చేయటంలో చేతకానివాడైన రాజు; ఇతఁడు; అనధీయానుండు= అనధ్యయనుడు అంటే చదవని వాడు; అనన్+చను= అన దగిన; ఋుత్విజున్+అట్ల చూవె= యజ్ఞకర్తచేత

ధనం పుచ్చుకొని యజ్ఞం చేయించేవానిలాంటివాడు సుమా; అని; మనువు; బుద్ధిమంతులు; మెచ్చన్= మెచ్చుకొనేటట్లు; పలికెన్+కాదె!= వివరించాడు కదా!

**తాత్పర్యం:** ప్రజాసంరక్షణం చేయటానికి తగిన ప్రయత్నం చేయని రాజు, అధ్యయనరహితుడైన ఋత్విజుడివంటి వాడని, మనువు బుద్ధిమంతులు మెచ్చుకొనేటట్లు వివరించాడు కదా!

**విశేషం:** అలం: ఉపమ. ఋత్విజునకు అధీత బోధాచరణాలు ఎంత ముఖ్యమో రాజనే వాడికి ప్రజలను సంరక్షించటానికి తగిన యత్నం చేయటం అంతముఖ్యం. ఋత్విజులు పదహారుగురు. బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుడు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతివార్త, అచ్ఛావాకుడు, నేష్ట, అగ్నీధ్రుడు, సుబ్రహ్మణ్యుడు, గ్రావస్తుతుడు, ఉన్నేత - అని.

**వ. మఱియు బృహస్పతి మహేంద్ర భారద్వాజ ప్రముఖులగు రాజధర్మానుశాసకులు రాజత్వ మూలకారణంబు ప్రజాసంరక్షయ యనిరి గావున నెత్తెఱంగున నైనను లోకరక్షణంబు రాజున కవశ్య కర్తవ్యంబు. 193**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; బృహస్పతి, మహేంద్ర, భారద్వాజ ప్రముఖులు+అగు= బృహస్పతి, ఇంద్రుడు, భారద్వాజుడు మొదలుగా ముఖ్యులైన; రాజధర్మ+అనుశాసకులు= రాజు అనుసరించవలసిన ధర్మాలను శాసించిన వారు; రాజత్వ మూల కారణంబు= రాజనే వాడికి ఉండవలసిన ప్రధానకారణం; ప్రజా సంరక్షయ+అనిరి= ప్రజలను సుభిక్షంగా పరిపాలించటమే అని పేర్కొన్నారు; కావునన్= కాబట్టి; ఏ+తెఱంగునన్+ఐనను= ఏ విధంగానైనా; లోక రక్షణంబు= లోక సంరక్షణమే; రాజునకున్+అవశ్యకర్తవ్యంబు= రాజునకు తప్పనిసరి అయిన ధర్మం.

**తాత్పర్యం:** కాబట్టి బృహస్పతి, భారద్వాజుడు, ఇంద్రుడు అనే ప్రముఖులైనవారు రాజధర్మాలను శాసించినవారు రాజునకు ప్రథమకర్తవ్యం ప్రజాసంరక్షణమే అని పేర్కొన్నారు. కాబట్టి, ఏ విధంగా పరిశీలించినా రాజునకు లోకసంరక్షణమే అనుసరించదగిన తప్పనిసరి అయిన ధర్మం.

**తే. సంతతోత్సాహవంతుఁడై శత్రుకోటి । నార్జవంబున నైన ననార్జవమున**
**నైనఁ జెఱుపన వలయు; నత్యల్పుఁడైనఁ । బగతుఁ డగ్ని విషంబుల పగిది నొంచు. 194**

**ప్రతిపదార్థం:** సంతత+ఉత్సాహవంతుఁడు+ఐ= ఎల్లప్పుడు ఉత్సాహ పూరితుడై; ఆర్జవంబునన్+ఐనన్+అనార్జవమునన్+ఐనన్= ఋజుత్వం వలనగాని, ఋజుత్వాన్ని వదలిగాని అయినా; శత్రుకోటిన్= శత్రు సమూహాన్ని; చెఱుపన వలయున్= నాశనం చేసి తీరవలసిందే; అతి+అల్పుఁడు+ఐనన్+పగతుఁడు= మిక్కిలి చిన్నవాడైనా సరే శత్రువు; అగ్ని విషంబుల పగిదిన్+నొంచున్= నిప్పువలె, విషంవలె బాధిస్తాడు.

**తాత్పర్యం:** రాజు ఎల్లప్పుడు రాజ్యపాలనంలో ఉత్సాహవంతుడై ఋజుత్వంవలన గాని, తద్వ్యతిరేకంగా గాని, శత్రుసమూహాన్ని నాశనం చేయటమే రాజధర్మం. అందువలన మిక్కిలి అల్పుడైనవా డైనా శత్రువు నిప్పువలె, విషంవలె నొప్పిస్తాడు. కనుక తప్పక రాజు శత్రుసంహారి కావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**క. విను నృప! రాజ్యామిషముం । గొనఁ బలువురచేతఁ బ్రాణగొడ్డంబై యు**
**న్నను ధీరుఁ డేమఱమి నది । దనకును దక్కించుకొను బుధస్తుత్యముగన్.' 195**

**ప్రతిపదార్థం:** విను= వినుము; నృప= ఓ రాజా!; పలువురచేతన్= అనేకుల వలన; ప్రాణగొడ్డంబు+ఐ+ఉన్నను= ప్రాణానికి హింస కలిగించేదైన; ధీరుఁడు= ధైర్యవంతుడు; రాజ్య+ఆమిషమున్= రాజ్యమనే లాభాన్ని; కొనన్= పొందుటయందు; ఏమఱమిన్=

ఏమరుపాటు లేకుండటంచేత; బుధస్తుత్యముగన్= పండితులచేత పొగడబడేటట్లుగా; అది+తనకును= దానిని తనకై; దక్కించుకొనున్= చేజిక్కించుకొంటాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ధీరుడైన రాజు అనేకు లడ్డగించి ప్రాణాంతకం చేసినా లెక్కచేయక రాజ్యమనే లాభాన్ని ఏమరకుండ పండిత ప్రశంసలు పొందేటట్లుగా తనకు చేజిక్కించుకొంటాడు.'

**వ.** **అని చెప్పి భీష్ముం 'డేను రాజధర్మప్రకారంబు సంక్షేప రూపంబున నెఱింగించితి; నీకు సందేహంబు గల యట్టిది యెయ్యది యడుగు' మనిన, ధర్మనందనుం డమ్మహాత్మునితో 'నరుణగభస్తి యస్తగిరి సేరెడు; నేఁటికిం బనివినియెద; రేపు వచ్చి యడిగెద' ననుచుం దత్పాదంబులకుం బ్రణతుండై వీడ్కొనియెఁ; బద్మనాభ ప్రముఖులును వీడ్కొనిరి; వారలందఱును మునులకు నభివాదనంబు లాచరించిరి; మునులు నిజ స్థానంబుల కరుగం దారును దృషద్వతి యను మహానదిం గృతసంధ్యావందనులై చని కరిపుర ప్రవేశంబు సేసి సుఖవృత్తి నా రాత్రి గడపి, కల్యంబునం గాలోచిత కృత్యంబు లాచరించి భీష్ముపాలికిం బోయి, యంతకు మున్న వచ్చి యున్న మునిలోకంబునకు నమస్కరించి సవినయంబును సకుశలప్రశ్నంబునుంగా నగ్గాంగేయునిం గదిసి బలసి కూర్చుండి; రా సమయంబునఁ బాండవాగ్రజుండు ప్రాంజలి యై యతని కిట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= పై విధంగా రాజధర్మాలను గూర్చి ధర్మరాజునకు చెప్పి; భీష్ముండు= శరతల్పగతు డైన భీష్ముడు; ఏను= నేను; రాజధర్మ ప్రకారంబున్= రాజులకు ఉండవలసిన ధర్మ పద్ధతులను; సంక్షేప రూపంబునన్= సంక్షిప్తంగా; ఎఱింగించితిన్= తెలియజేశాను; నీకు; సందేహంబు+కల+అట్టిది+ఏ+అది+అడుగుము+అనినన్= నీకు దేనియందు సందేహం కలదో దానిని అడుగుమని భీష్మ డనగా; ధర్మనందనుండు= ధర్మరాజు; ఆ+మహాత్మునితోన్= ఆ మహనీయుడైన భీష్ముడితో; అరుణ గభస్తి+అస్తగిరి+చేరెడున్= ఎర్రనైన కిరణాలు గల సూర్యుడు పడమటి కొండపై చేరుతున్నాడు; నేఁటికిన్+పనివినియెదన్= ఈ నాటికి నేను వెళ్ళి వచ్చెదను; రేపు వచ్చి+అడిగెదన్= ఉదయమే వచ్చి అడుగవలసినవి అడుగుతాను; అనుచున్= అంటూ; తద్+పాదంబులకున్= ఆ భీష్ముడి పాదాలకు; ప్రణతుండు+ఐ= నమస్కరించినవాడై; వీడ్కొనియెన్= వెళ్ళిపోయాడు; పద్మనాభ ప్రముఖులును= శ్రీకృష్ణుడు మొదలైనవారును; వీడ్కొనిరి= వెళ్ళిపోయారు; వారలు+అందఱును= వారందరు; మునులకున్= మహర్షులకు; అభివాదనంబులు+ఆచరించిరి= నమస్కరించారు; మునులు= మహర్షులు; నిజ స్థానంబులకున్+అరుగన్= తమ ఆశ్రమాలకు వెళ్ళిపోగా; తారును= తామును; దృషద్వతి+అను మహానదిన్= దృషద్వతి అనే మహానదియందు; కృతసంధ్యా వందనులు+ఐ= చేయబడిన సంధ్యావందనాదులు కలవారై; చని= వెళ్ళి; కరిపుర ప్రవేశంబు+చేసి= హస్తినాపురం ప్రవేశించి; సుఖవృత్తిన్= సౌఖ్యంగా; ఆ రాత్రి+కడపి= ఆ రాత్రి గడపి; కల్యంబునన్= వేకువనే; కాల+ఉచిత కృత్యంబులు+ఆచరించి= కాలకృత్యాలు తీర్చుకొని; భీష్మపాలికిన్+పోయి= భీష్ముని వద్దకు వెళ్ళి; అంతకు మున్ను+అ వచ్చి+ఉన్న= అంతకంటే ముందే వచ్చి ఉన్న; ముని లోకంబునకున్= మునుల సమూహానికి; నమస్కరించి; సవినయంబును= వినయంతోడను; సకుశల ప్రశ్నంబునున్+కాన్= క్షేమ సమాచారాన్ని అడుగుట తోడను; ఆ+గాంగేయునిన్+కదిసి= ఆ భీష్ముని సమీపించి; ఒలసి= చుట్టుముట్టి; కూర్చుండిరి= కూర్చున్నారు; ఆ సమయంబునన్= అప్పుడు; పాండవ+అగ్రజుండు= పాండవుల అన్నఅయిన ధర్మరాజు; ప్ర+అంజలి+ఐ= చేతులు మోడ్చినవాడై; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'రాజధర్మాలను వివరించి ఇంక ఏవైన సందేహాలు ఉంటే అడుగవలసిం'దని భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు. అప్పుడు ధర్మరాజు భీష్ముడితో 'ఇప్పుడు సూర్యుడు అస్తమిస్తున్నాడు కనుక ఈ పూటకు నిష్క్రమించి రేపు ఉదయమే వచ్చి అడుగుతాను' అని తెలిపాడు. భీష్ముడి పాదాలకు నమస్కరించి ధర్మరాజు వెళ్ళిపోయాడు. అట్లాగే శ్రీకృష్ణాదులు నమస్కరించారు. మునులు ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. వారు దృషద్వతి అనే నదిలో

సంధ్యావందనాదులు చేసి హస్తినాపురం చేరారు. ఆ రాత్రి సుఖంగా గడపి వేకువ జామున కాలకృత్యాలు ముగించి భీష్ముడివద్దకు వెళ్ళి అంతకుముందే వచ్చిన మహర్షులకు నమస్కరించారు. వినయంతో కుశల ప్రశ్నలతో భీష్ముడిని సమీపించి, అందరు చుట్టూ కూర్చున్నారు. అప్పుడు ధర్మరాజు దోయిలొగ్గి భీష్ముడిని ఇట్లా ప్రశ్నించాడు.

**సీ.** **'రాజనామమునకు భాజనం బై మహా । ద్భుత చరిత్రుం డగు పురుషుఁ డొకఁడు**
**గలిమికి మూలంబు ఘన విశేషము గల్గ । నోపుఁ గౌరవ కుల దీపజనన**
**యది యెఱింగింపవే; యవయవంబులుఁ బ్రాణ । మానసంబులు జన్మ మరణములు శ**
**రీర యాత్రలు నెల్లవారికి నెట్లట్ల । కాని విభేదంబు గాన; మిట్టి**

**ఆ.** **రా జొకండు శూర తేజస్వి బుద్ధి మ । జ్జనుల నెట్లు దన వశంబు సేయ**
**నిలుపఁ జెఱుప నెల్లయిలయును నేల దై । వ నిభుఁడగుచు మ్రొక్కుగొనఁగఁ జాలె. 197**

**ప్రతిపదార్థం:** కౌరవ కులదీప జనన!= కురువంశానికి దీపం వంటి జననం కలవాడా!; రాజనామమునకున్= రాజనే పేరునకు; భాజనంబు+ఐ= పాత్రమై (అర్హమై); మహా+అద్భుత చరిత్రుండు+అగు= మిక్కిలి ఆశ్చర్యకరమైన నడవడిక కలవాడైన; పురుషుఁడు+ఒకఁడు= ఒకానొక పురుషుడు; కలిమికిన్+మూలంబు= సంపదలకు హేతువు; ఘన విశేషము+కల్గన్+ఓపున్= మిక్కిలి ఔన్నత్యానికి తగినట్టి దానికి అర్హుడు; అవయవంబులున్= శరీరమందలి అవయవాలును; ప్రాణమానసంబులున్= ప్రాణం, మనస్సు; జన్మ మరణములున్= పుట్టుట గిట్టుటలును; శరీర యాత్రలున్= దేహ యాత్రలును; ఎల్లవారికిన్+ఎట్లు+అట్ల= అందరికి సమానమే; కాని= అయినప్పటికి; విభేదంబు+కానము= తేడా ఏమి లేదు; శూర తేజస్వి= పరాక్రమంచేత ప్రకాశిస్తున్నవాడు; ఇట్టి+రాజు+ఒకండు= ఇట్లాంటి ఒక రాజు; బుద్ధిమత్+జనులన్= బుద్ధిమంతులైన ప్రజలను; ఎట్లు= ఏ విధంగా; తన+వశంబు+చేయన్= తన వశవర్తులుగా చేసికొనటానికి; నిలుపన్= సంరక్షించటానికి; చెఱుపన్= నాశనం చేయటానికి; ఎల్ల యిలయును= సమస్తమైన భూమండలంలో; దైవ నిభుఁడు+అగుచున్= భగవంతుడితో సమానుడవుతూ; ఏల?= ఎందుకు?; మ్రొక్కు+కొనఁగన్+చాలెన్= నమస్కారానికి అర్హుడగుతున్నాడు; అది+ఎఱింగింపవే?= దాన్ని వివరించవా?

**తాత్పర్యం:** ఓ భీష్ముడా! రాజనే పేరుకు పాత్రమై ఉత్తమచరిత్ర కలవాడైన ఒకానొక మానవుడు సంపదలకు మూలం, ఔన్నత్యానికి అర్హుడు కావచ్చును. మానవు లందరికి ఉన్నట్లు శరీరావయవాలు, ప్రాణం, మనస్సు, పుట్టుట గిట్టుటలు, దేహయాత్రలు, రాజుకు కూడా సమానమే. భేద మేమీ కనిపించటం లేదు. పరాక్రమతేజస్వి అయిన ఒక రాజు బుద్ధిమంతు లైన ప్రజలను ఏ విధంగా తన వశం చేసికొంటాడు, సంరక్షిస్తాడు, నాశనం చేస్తాడు, ఈ భూమిపై ఏ విధంగా భగవంతుడితో సమానంగా పూజార్హుడవుతాడు? - అనే అంశాలను వివరించుము.

### భీష్ముండు ధర్మజునకు దండనీతి జన్మప్రకారం బెఱింగించుట (సం. 12-59-11)

**వ.** **అదియును వినవలతు'నని యడిగిన నమ్మనుజపతి కమ్మహాత్ముం డిట్లనియె. 198**

**ప్రతిపదార్థం:** అదియును వినవలతున్+అని+అడిగినన్= పై విషయాలను వినాలన్న కోరిక ఉన్నదని ధర్మరాజు అడుగగా; ఆ+మనుజపతికిన్+ఆ+మహాత్ముండు+ఇట్లు+అనియెన్= ఆ ధర్మరాజుతో భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విషయాలను వినాలన్న కోరిక ఉన్న' దని ధర్మరాజు అడుగగా భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**క.** **'విను! తొల్లి కృత యుగంబున । మనుజలయెడ దండనీతిమంతుం డై రా**
**జన నొకఁడు గలిగి యరయుట । మనుజేశ్వర! లేదు ధర్మమత మంద్రు తగన్. 199**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= ఓ ధర్మరాజా! వినుము; తొల్లి= పూర్వం; కృతయుగంబునన్= కృతయుగంలో; మనుజుల యెడన్= మానవుల పట్ల; దండనీతి మంతుండు+ఐ= శిక్షావిధి కలవాడై; రాజు+అనన్+ఒకఁడు+కలిగి+అరయుట లేదు= రాజనేవాడు ఒకడుండి పరిశీలించటం జరగలేదు; తగన్= తగినట్లు; ధర్మమతము+అంద్రు= దాన్ని తగినరీతి ధర్మమతమని అంటారు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! జాగరూకతతో వినుము. పూర్వం కృతయుగంలో మానవుల పట్ల శిక్షావిధి విధాయకుడై ఒకానొక రాజు ఉండి దీన్ని పరిశీలించినవాడు లేడు. కేవలం దానిని ధర్మమత మని పెద్దలు చెపుతారు.

**క. ఒండొరులకు రక్షకులై । యుండుదు; రట్లుండ దైన్య మొదవిన లోభం**
**బొండొండు పెరిఁగి ధర్మము । ఖండితమై మొదలుకొని రకార్యంబులకున్. 200**

**ప్రతిపదార్థం:** ఒండు+ఒరులకున్= ఒకరి కొకరు; రక్షకులు+ఐ+ఉండుదురు= రక్షకులై ఉంటూ వచ్చారు; అట్లు+ఉండన్= ఆ విధంగా కొనసాగుతూ ఉండగా; దైన్యము+ఒడవినన్= దీన భావం కలుగగా; లోభంబు+ఒండొండ= పిసినారితనం ఒక్కొక్కటిగా; పెరిఁగి= అతిశయించి; ధర్మము ఖండితము+ఐ= ధర్మం వినాశమై; అకార్యంబులకున్= కానిపనులకు; మొదలుకొనిరి= ప్రారంభించారు.

**తాత్పర్యం:** పరస్పరం ఒకరికొకరు రక్షకులై ఉంటూ వచ్చారు. ఆ విధంగా ఉండగా దీనభావం కలిగి పిసినారితనం ఒక్కొక్కటి పెరిగి ధర్మం వినాశనమైనది. ఆ విధంగా ప్రజలు అకార్యాలకు పాల్పడ్డారు.

**క. క్రమమునఁ గామము రాగము । దమ మనముల నొదవఁగా మదం బెక్కిన వి**
**భ్రమ మొందుచు విచ్చల విడి । విమార్గ చరితముల వేదవిధ్వంసకులై. 201**

**ప్రతిపదార్థం:** క్రమమునన్= వరుసగా; కామము= కోరిక; రాగము= మాత్సర్యం; తమ మనములన్+ఒదఁగాన్= తమ మనస్సులందు కలుగగా; మదంబు+ఎక్కినన్= క్రొవ్వెక్కగా; విభ్రమ మొందుచున్= విభ్రాంతి పొందుతూ, తొట్రుపాటుతో; విచ్చలవిడి= యథేచ్ఛగా; విమార్గ చరితములన్= దుర్మార్గమైన నడవడికలతో; వేద విధ్వంసకులు+ఐ= వేద వినాశకులై.

**తాత్పర్యం:** క్రమంగా కోరిక, మాత్సర్యం తమ మనస్సులందు కలుగగా, క్రొవ్వెక్కి విభ్రాంతులై యథేచ్ఛగా దుర్మార్గ ప్రవర్తనలతో వేదవినాశకులై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మనుజులు ధర్మముఁ బొడవడఁ । చిన వేదముఁ గర్మములును జెడుటకు భయ మం**
**దిన యింద్రాదులు గమలా । సనుఁ గానఁగ మునులుఁ దారుఁ జనిరి నరేంద్రా! 202**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ఓ రాజా!; మనుజులు= మానవులు; ధర్మమున్+పొడవు+అడఁచినన్= ధర్మంయొక్క గొప్పతనాన్ని అణచివేయగా; వేదమున్+కర్మములునున్+చెడుటకున్= వేదాలు చేయవలసిన కర్మాదికాలు చెడిపోవటానికి; భయము+అందిన= భయపడినటువంటి; ఇంద్ర+ఆదులు= ఇంద్రుడు మొదలైన వారు; కమల+ఆసనున్+కానఁగన్= పద్మాన్ని ఆసనంగా కల బ్రహ్మను దర్శించటానికి; మునులున్+తారును+చనిరి= మహర్షులు ఇంద్రాదులు వెళ్ళారు.

**తాత్పర్యం:** ఓ రాజా! మానవులు ధర్మముయొక్క గొప్పతనాన్ని అణచివేయగా, వేదాలు చేయవలసిన కర్మలు చెడిపోవటానికి భయపడిన ఇంద్రుడు మొదలైన దేవతలు బ్రహ్మను సందర్శించటానికి మునులతోపాటు వెళ్ళారు.

**వ. చని యద్దేవునిం గని 'మనుజ లోకంబున వేదంబులు ధర్మంబులుం బొడ వడంగిన నధ్వర రాహిత్యంబున నేమును దుర్బలులమై భయంబంది వచ్చితిమి; రక్షింపు'మని యవ్విబుధులు విన్నవించిన విరించి 'దానికిం బ్రతి విధానంబు సేసెద; మీరు వెఱవ వల' దని పలికి స్వామ్యమాత్య రాష్ట్ర దుర్గ కోశ సుహృద్బలంబులు నాన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతులును, నరి మిత్త్రోదాసీ నాదిక ద్వాదశరాజ మండలంబును, సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులును మొదలుగా వలయు వానికిం బ్రబోధకంబులగు నానావయవంబులుం గలిగి ధర్మార్థకామ మోక్షంబులకు సాధకంబులయి యుండునట్లుగా నూఱువేలధ్యాయంబుల నఖిలలోకహితంబగు నీతిశాస్త్రంబు రచియించి, యిది లోక చరిత్ర నిర్మలీకరణంబునకుం గారణంబగు'నని యనుగ్రహించె నా లోక పితామహు లలాటంబున ననాది నిధనుండును, విశ్వజగత్కర్తయు సర్వ భూతాత్ముండును సనాతనుండును నగు విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యాగ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు సాలవని యుమ్మలించి యమ్మహనీయ తంత్రంబు సంక్షేపరూపంబునం బదివే లధ్యాయంబుల వైశాలాక్షం బన నిర్మించె. 203**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ఆ+దేవునిన్+కని= ఆ బ్రహ్మదేవుడిని సందర్శించి; మనుజలోకంబునన్= భూలోకంలో; వేదంబులున్+ ధర్మంబులున్+పొడవు+అడంగినన్= వేదాలయొక్క, ధర్మాలయొక్క ఆధిక్యం తగ్గిపోగా; అధ్వర రాహిత్యంబునన్= యజ్ఞాలు లేకపోవటం వలన; ఏమును= మేమును; దుర్బలులము+ఐ= బలహీనులమై; భయంబు+అంది వచ్చితిమి= భయపడి వచ్చాము; రక్షింపుము+అని+ఆ+విబుధులు= కాపాడుమని ఆ దేవతలు; విన్నవించిన్= వేడుకొనగా; విరించి= బ్రహ్మ; దానికిన్+ప్రతి విధానంబు+చేసెదన్= అందుకు ప్రతిక్రియ చేస్తాను; మీరు వెఱవ వలదు+అని పలికి= మీరు భయపడవలసిన పనిలేదని చెప్పి; స్వామి+అమాత్య రాష్ట్ర దుర్గ కోశ సుహృద్+బలంబులున్ స్వామి, అమాత్యుడు, రాష్ట్రం, దుర్గం, కోశం, మిత్రులు, సైన్యమూ; ఆన్వీక్షకీ త్రయీ వార్తా దండ నీతులునున్= ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అనే నాలుగు విద్యలను; అరిమిత్ర+ఉదాసీన+ఆదిక ద్వాదశరాజ మండలంబును= శత్రువు, మిత్రుడు, ఉదాసీనుడు మొదలైన పండ్రెండు రాజ మండలాలును; సంధి విగ్రహ యాన+ఆసన ద్వైధీభావ సమాశ్రయంబులును= సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సమాశ్రయం అనే వాటి ఆధారంతో ఉన్నవి; మొదలుగాన్= మొదలుకొని; వలయువానికిన్= కావలసిన వాటికి; ప్రబోధకంబులు+ అగు= వివరణాత్మకాలైన; నానా అవయవంబులున్+కలిగి= అనేక అవయవాలతో ఒప్పి; ధర్మ+అర్థ కామ మోక్షంబులకున్= ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే వాటికి; సాధకంబులు+అయి+ఉండునట్లుగాన్= సాధనా లయ్యేటట్లుగా; నూఱువేల+ అధ్యాయంబులన్= లక్ష అధ్యాయాలతో; అఖిల లోకహితంబు+అగు= సమస్త లోకాలకు మంచిని చేకూర్చేటట్లుగా; నీతి శాస్త్రంబున్ రచియించి= ఈ నీతి శాస్త్ర రచన చేసి; ఇది లోక చరిత్ర నిర్మలీకరణంబునకున్+కారణంబు+అగును+అని+అనుగ్రహించెన్= ఈ నీతిశాస్త్రం లోకంలోని నడవడికలను పరిశుద్ధం చేయటానికి హేతు వవుతుం దని అనుగ్రహించాడు; ఆ లోక పితామహు లలాటంబునన్= ఆ బ్రహ్మయొక్క నొసట; అనాది నిధనుండును= మొదలు, తుదిలేనివాఁడును; విశ్వ జగత్కర్తయున్= విశ్వానికి (లోకాలకు) కర్త అయిన వాడును; సర్వభూత+ఆత్ముండున్= అన్ని ప్రాణులను తన ఆత్మలో కలవాడును; సనాతనుండునున్= శాశ్వతుడును; అగు= అయినటువంటి; విరూప+అక్షుండు= వికృతమైన కన్నులు కలవాడైన శివుడు; విశాల+అక్షుండు అను నామంబునన్= విశాలాక్షుడనే పేరుతో; ఆవిర్భవించి= పుట్టి; ఆ గ్రంథంబు+అధిగమించి= బ్రహ్మరచించిన నీతి శాస్త్రాన్ని చదివి; దానిన్+అభ్యసించుటకున్= దానిని నేర్చుకొనటానికి; మర్త్యులకున్+ఆయుఃబుద్ధులు+ చాలవు+అని+ఉమ్మలించి= మానవులకు ఆయుస్సు బుద్ధి చాల వని చింతించి; ఆ+మహనీయ తంత్రంబున్= ఆ మహిమాన్విత మైన నీతి శాస్త్రాన్ని; సంక్షేప రూపంబునన్= క్లుప్తంగా; పదివేలు+అధ్యాయంబులు= పదివేల అధ్యాయాలతో; వైశాలాక్షంబు+అనన్+నిర్మించెన్= వైశాలాక్షమనే నీతిశాస్త్ర సంగ్రహాన్ని నిర్మించాడు.

**తాత్పర్యం:** ఇంద్రాదులు మునులతోపాటు బ్రహ్మను సందర్శించి 'మానవలోకంలో వేదాలయొక్క, ధర్మాలయొక్క ఆధిక్యం నశించి యజ్ఞయాగాదులు లేకపోవటంవలన తాము బలహీనులం అవుతున్నా'మని తమ భయాన్ని తెల్పి రక్షించు మని ప్రార్థించారు. అందుకు బ్రహ్మ 'దానికి ప్రతిక్రియగా తగిన ఏర్పాటు చేస్తున్నా' నని భయపడవల దని తెల్పి సప్తోపాయాలు, దండనీతి రీతిని, ద్వాదశరాజ మండలాలను, పంచోపాయాలను మొదలైన వాటిని, వాటి వివరణతోపాటు పురుషార్థాలకు సాధకాలుగా ఉండేటట్లు లక్ష అధ్యాయాలతో సకలలోకహితార్థంగా నీతిశాస్త్రాన్ని రచించాడు. నీతి శాస్త్రం లోకంలోని ప్రజల నడవడికలను నిర్మలం చేస్తుం'దని అనుగ్రహించాడు. ఆ బ్రహ్మ నొసటినుండి విరూపాక్షుడు విశాలాక్షు డనే పేరుతో ఆవిర్భవించి, ఆ నీతి శాస్త్రాన్ని తెలిసికొని నేర్చుకొనటానికి కావలసిన ఆయుస్సు, బుద్ధి మనుష్యులకు చాలవని చింతించి ఆ మహిమాన్వితమైన నీతిశాస్త్రాన్ని సంక్షిప్తంగా పదివేల అధ్యాయాలతో 'వైశాలాక్ష' మనే పేరుతో నిర్మించాడు.

**ఆ. హరునివలనఁ బడసి యాశాస్త్ర మమరేంద్రుఁ । డయిదు వేలు సేసె నమరగురుఁడు**
**దేటపడ నొనర్చెఁ ద్రిసహస్రకాధ్యాయ । రూప సమ్మితముగ భూపవర్య! 204**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= భూ భర్తలలో శ్రేష్ఠుడైన ఓ ధర్మరాజా!; హరుని వలనన్+పడసి= విశాలాక్షుడి వలన పొంది; అమర+ఇంద్రుడు= దేవేంద్రుడు; ఆ శాస్త్రమున్= ఆ నీతి శాస్త్రాన్ని; అయిదువేలు+చేసెన్= ఐదువేల అధ్యాయాలకే తగ్గించాడు; అమర గురుఁడు= దేవతల గురువైన బృహస్పతి; త్రి సహస్రక+అధ్యాయ రూప సమ్మితముగన్= మూడువేల అధ్యాయాలతో కూడినట్లుగా; తేటపడన్+ఒనర్చెన్= స్పష్టమయ్యేటట్లు నిర్మించాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! విశాలాక్షుడివలన మహేంద్రుడు ఆ నీతిశాస్త్రాన్ని పొంది ఐదువేల అధ్యాయాలకు కుదించాడు. దానిని బృహస్పతి మూడువేల అధ్యాయాలతో అందరికి అర్థమయ్యే రీతిలో మరీ సంక్షిప్తంగా రచించాడు.

**వ. దాని శుక్రుండు సహస్రాధ్యాయ పరిమితంబుఁ గావించె; మఱియు మనుష్యుల శక్తి యెఱింగి మునులు క్రమంబున సంక్షిప్త రూపంబులుగా గ్రంథంబులు గావించి;రిది నీతి శాస్త్రప్రవర్తన ప్రకారం;బట్లు సుర లమ్మేలు వడసి విశ్వలోకేశ్వరుం డగు విష్ణుపాలికిం జని తగం గని కార్యంబు విన్నవించి, నీతిశాస్త్ర సముద్భవం బెఱింగించి, దీని నధిగమింపను, దదీయాచారంబు నడపను శక్తుం డగు వాని నొక్కరుని నిర్దేశింపవలయు నని యభ్యర్థించిన నద్దేవుండు నిజతేజోమయుండుగా నొక్క మానసపుత్రు నిర్మించి విరజుం డను పేరిడియె; నతండు భూమికిం బ్రభువుగా నొల్లకుండెఁ; దత్సుతుండు కర్దముండు ననపేక్షిత రాజ్యుండై తపంబున కరిగెఁ; దదీయ పుత్రుం డనంగుండు దండనీతి నయించి భూ ప్రజలం బాలించె; నతని కొడుకు నీతి యనువాఁ డమ్మహారాజ్యంబున కభిషిక్తుండై యింద్రియ వశత్వంబు నొందిమృత్యుపుత్రి సునీథ యను కామినిం గమనీయాకార నతిమనోహర గుణ విభాసినిం బరిణయంబైన, దానియందు వేనుండు గలిగి మాతామహదోషంబునం జేసి రాగద్వేషంబులం బ్రజకు విరుద్ధుం డయ్యెఁ; నట్లగుటయు మహామునులు గూడి యేతెంచి మంత్రపూతంబు లగు కుశసంచయంబుల నతనిం బ్రశమితుం జేసి తద్దక్షిణోరుతలంబు మథించిన. 205**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ నీతిశాస్త్రాన్ని; శుక్రుండు= శుక్రాచార్యుడు; సహస్ర+అధ్యాయ పరిమితంబున్+కావించెన్= వేయి అధ్యాయాలకు తగ్గించి రచించాడు; మఱియున్= ఇంకా; మనుష్యుల శక్తి+ఎఱింగి= మానవుల సామర్థ్యాన్ని గుర్తించి; మునులు; క్రమంబున్= వరుసగా; సంక్షిప్త రూపంబులుగాన్= క్లుప్తంగా; గ్రంథంబులు+కావించిరి= గ్రంథాలు రచించారు; ఇది నీతిశాస్త్ర ప్రవర్తన ప్రకారంబు= ఇది నీతిశాస్త్రం ప్రవర్తిల్లిన విధానం; అట్లు= ఆ విధంగా; సురలు+ఆ+మేలు పడసి= దేవతలు ఆ మేలును పొంది; విశ్వలోక+ఈశ్వరుండు+అగు= విశ్వానికి అంతటికి అధిపతియైన; విష్ణుపాలికిన్+చని= విష్ణువు వద్దకు వెళ్ళి; తగన్+కని= ఉచితరీతిని సందర్శించి; కార్యంబు విన్నవించి= తాము వచ్చిన పనిని తెలియజేసి; నీతిశాస్త్ర సముద్భవంబు+ఎఱింగించి= నీతిశాస్త్రం యొక్క పుట్టుకను తెలియ చెప్పి; దీనిన్+అధిగమింపను= దీనిని పఠించటానికి; తదీయ+ఆచారంబు నడపను= నీతిశాస్త్ర సంప్రదాయాన్ని నిర్వర్తించటానికి; శక్తుండు+అగువానిన్+ఒక్కరుని= సమర్థుడైన ఒక వ్యక్తిని; నిర్దేశింప వలయున్+అని+అభ్యర్థించినన్= చూపించవలసింది అని ప్రార్థించగా; ఆ+దేవుండు= ఆ విష్ణువు; నిజ తేజోమయుండు కాన్= తనదైన ప్రకాశం కలవాడైన; ఒక్కమానస పుత్రున్+నిర్మించి= ఒక్క మానసపుత్రుడిని సృష్టించి; విరజుండు+అనుపేరు+ఇడియెన్= విరజు డనే పేరు పెట్టాడు; అతండు= ఆ విరజుడు; భూమికిన్+ప్రభువుగాన్+ఒల్లకుండెన్= భూమికి రాజు కావటానికి ఇష్టపడలేదు. తద్+సుతుండు= అతడి కుమారుడు; కర్దముండున్= కర్దముడనే వాడు; అనపేక్షిత రాజ్యుండు+ఐ= ఇష్టంలేని రాజ్యం కలవాడై (అంటే రాజ్యంపై ఆసక్తిలేనివాడై); తపంబునకున్+అరిగెన్= తపస్సు చేసికొనటానికి వెళ్ళిపోయాడు; తదీయ పుత్త్రుండు+అనంగుండు= ఆ కర్దముడి కుమారుడైన అనంగుడు; దండనీతి నయించి= దండనీతి ననుసరించి; భూప్రజలన్+పాలించెన్= భూలోకంలోని ప్రజలను పరిపాలించాడు; అతని కొడుకు= అతడి పుత్రుడు; నీతి+అనువాఁడు= నీతి అనుపేరుగలవాడు; ఆ+మహారాజ్యంబునకున్+అభిషిక్తుండు+ఐ= ఆ గొప్ప రాజ్యానికి పట్టాభిషిక్తుడై; ఇంద్రియ వశత్వంబున్+ఒంది= ఇంద్రియాలకు లోనయి; మృత్యుపుత్రి= మృత్యువు యొక్క కుమారి అయిన; సునీథ+అను కామినిన్= సునీథ అనే స్త్రీని; కమనీయ+ఆకారన్= మనోహరమైన ఆకారం కలదానిని; అతి మనోహర గుణ విభాసినిన్+ పరిణయంబు+ అయినన్= మిక్కిలి సౌందర్యం, గుణాలచేత ప్రకాశిస్తున్న దానిని వివాహం కాగా; దానియందున్= ఆ సునీథయందు; వేనుండు+కలిగి= వేనుడనే వాడు పుట్టి; మాతామహ దోషంబునన్+చేసి= తల్లి తండ్రి యొక్క దోషం వలన; రాగ ద్వేషంబులన్= అనురాగ ద్వేషాల వలన; ప్రజకున్+విరుద్ధుండు+అయ్యెన్= ప్రజలకు విరోధి అయ్యాడు; అట్లు+అగుటయున్= ఆ విధంగా కావటం వలన; మహామునులు+కూడి+ఏతెంచి= మహర్షులు కలిసి వచ్చి; మంత్ర పూతంబులు+అగు= మంత్రాలచేత పవిత్రీకరించబడిన; కుశ సంచయంబులన్= దర్భల సమూహంతో; అతనిన్+ప్రశమితుం+చేసి= అతడిని ఉపశమింపజేసి; తద్+దక్షిణ+ఊరుతలంబు+మథించినన్= అతడి యొక్క కుడి తొడను మథించగా.

**తాత్పర్యం:** ఆ నీతిశాస్త్రాన్ని శుక్రాచార్యుడు వేయి అధ్యాయాలకు కుదించాడు. మహర్షులు క్రమంగా మానవుల శక్తికి అనుగుణంగా సంక్షిప్తం చేశారు. ఇది నీతిశాస్త్రం ప్రవర్తిల్లిన విధం. దేవతలు విష్ణుసన్నిధికి వెళ్ళి నీతిశాస్త్రం పుట్టుకను వివరించి, దాన్ని అభ్యసించి, తదుచితంగా నడపగల సమర్థుడిని నిర్దేశించుమని ప్రార్థించారు. విష్ణువు తనతో సమాన తేజస్సుగల మానసపుత్రుని సృష్టించి విరజు డని నామకరణం చేశాడు. అతడు రాజు కావటానికి అంగీకరించలేదు. అతడి కుమారుడు కర్దముడు రాజ్యపాలనకు ఇష్టపడక తపస్సుకు వెళ్ళిపోయాడు. అతడి కుమారుడు అనంగుడు దండనీతి ననుసరించి ప్రజలను పాలించాడు. అతడి పుత్రుడు నీతి అనేవాడు రాజ్యాభిషిక్తుడై చక్కటి అందచందాలతో ప్రకాశిస్తూ ఉండిన మృత్యుపుత్రిక అయిన సునీథను పెండ్లాడి ఆవిడయందు వేనుడనే కుమారుడిని పొందాడు. మాతామహుడి దోషంవలన వేనుడు రాగద్వేషాల కారణంగా ప్రజావిరుద్ధు డయ్యాడు. అట్లా కావటంతో మహామునులు కలిసి వచ్చి మంత్రాలతో పవిత్రీకరించిన దర్భలతో అతడిని ఉపశమింపజేసి అతడి కుడితొడను మథించారు.

**క.** **విను కాలిన కొఱవి తెఱం। గున నల్ల దనంబు మిగులు కుఱుచ యొడలు నె**
**ఱ్ఱని కన్నులు నై యశుచి। త్వ నిరూఢుం డొకఁడు పుట్టె ధర్మతనూజా!** **206**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజా!= ఓ ధర్మరాజా! విను= వినుము; కాలిన కొఱవి తెఱంగునన్= కాలిన కొరవివలె; నల్ల దనంబున్= నల్లదనం; మిగులు= అతిశయించే; కుఱుచ+ఒడలున్= మిక్కిలి పొట్టి శరీరమూ; ఎఱ్ఱని కన్నులున్+ఐ= ఎఱ్ఱని కన్నులు కలిగి; అశుచిత్వ నిరూఢుండు+ఒకఁడు= శుచి శుభ్రత లేనివా డొకడు; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! మునులు వేనుడి కుడితొడను మథించగా, కాలిన కొరవివలె నల్లనై, మిక్కిలి పొట్టి శరీరంతో ఎఱ్ఱని కన్నులు కలిగి, అశుచి అయిన ఒకడు జన్మించాడు.

వైన్యుం డనురాజు చరిత్రంబు భీష్ముఁడు ధర్మజునకుం జెప్పుట (సం. 12-59-201)

**వ.** **వానిం జూచి యా ఋషులు 'నిషీద' యని పలికి వర్జించుటం జేసి తత్సంతాన జాతులు నిషాదు లనం బరఁగి వింధ్యాది గిరి వన ప్రదేశంబులఁ గ్రూరత్వంబున వర్తిల్లి; రమ్మునులు మఱియు నా రాజు దక్షిణ బాహువు మథించిన నుజ్జ్వలత్కవచ శరశరాసన భాసమానుండును వేద వేదాంగ ధనుర్వేద పారగుండును నగు పరమాకారవంతుం డుదయించె; సకల దండనీతియు నప్పురుషు నాశ్రయించె; నతం; దమ్మహాత్ముల కభిముఖుండును బ్రాంజలియు నై వినయంబున.** **207**

**ప్రతిపదార్థం:** వానిన్+చూచి= ఆ పొట్టి మనిషిని చూచి; ఆ ఋషులు= ఆ మహర్షులు; నిషీద+అని పలికి= కూర్చుండు మని చెప్పి; వర్జించుటన్+చేసి= వదలిపెట్టటం వలన; తద్+సంతాన జాతులు= ఆ పొట్టిమనిషికి జన్మించిన జాతులు; నిషాదులు+అనన్+పరఁగి= నిషాదులు అనే పేరుతో; వింధ్య+ఆది గిరి వన ప్రదేశంబులన్= వింధ్య మొదలైన పర్వతాలలో, అరణ్యాలలో; క్రూరత్వంబునన్= క్రూర స్వభావంతో; వర్తిల్లిరి= ప్రవర్తిల్లారు; ఆ+మునులు= ఆ మహర్షులు; మఱియున్= మళ్ళీ; ఆ రాజు దక్షిణ బాహువును మథించినన్= ఆ వేనుని కుడి భుజాన్ని మథించగా; ఉజ్జ్వలత్+కవచ శర శరాసన భాసమానుండునున్= ప్రకాశిస్తున్న కవచమూ, బాణాలు, విల్లుతో సూర్యకాంతితో ప్రకాశించే; వేద వేద+అంగ ధనుః+వేద పారగుండునున్+అగు= వేదాలలో వేదాంగాలలో, ధనుర్వేదంలో తుదముట్టి ఎరిగినవాడు అయిన; పరమ+ఆకారవంతుండు+ఉదయించెన్= శ్రేష్ఠమైన స్వరూపంతో జన్మించాడు; సకల దండనీతియున్= సమస్తమైన దండనీతి; ఆ+పురుషున్+ఆశ్రయించెన్= ఆ మహాపురుషుడిని ఆశ్రయించింది; అతండు+ఆ+మహాత్ములకున్= ఆ మహాపురుషుడు ఆ మహనీయులకు; అభిముఖుండును= ఎదురుగా నిలబడ్డవాడు; ప్ర+అంజలియున్+ఐ వినయంబునన్= దోసిలొగ్గినవాడు అయి, వినయంతో.

**తాత్పర్యం:** ఆ పొట్టి మనిషితో మునులు 'నిషీద' అనటంవలన అతడి సంతతి జాతులు నిషాదులై వింధ్యపర్వతం మొదలుకొని ఉన్న వనప్రదేశాలలో క్రూరస్వభావంతో నివసించటం ప్రారంభించారు. ఆ మహర్షులు మళ్ళీ వేనుడి కుడి బాహువును మథించగా వేద వేదాంగాలలోను, ధనుర్వేదంలోను పారంగతుడు - ప్రకాశించే కవచంతో, ధనుర్బాణాలతో మహాపురుషుడు జన్మించాడు. ఆ వెంటనే దండనీతి ఆ మహాపురుషుడిని ఆశ్రయించింది. ఆ పురుషుడు మునుల ఎదుట నిలిచి వినయంతో అంజలి ఘటించాడు.

**తే.** **'వినుఁడు! ధర్మార్థ తత్త్వ ప్రవీణ యగుచు। సూక్ష్మదర్శిని యైనది సుకృతులార!**
**నాదు బుద్ధి; మీ కెప్పని నడపవలయు। దీనిఁ గొని నన్నుఁ బనుపరే దాని' కనిన.** **208**

**ప్రతిపదార్థం:** సుకృతులార!= పుణ్యాత్ములారా!; వినుఁడు= దయతో వినండి; నాదు బుద్ధి= నా యొక్క బుద్ధి; ధర్మ+అర్థ తత్త్వ ప్రవీణ+అగుచున్= ధర్మమూ, అర్థమూ వీటి స్వభావంలో నిపుణమై; సూక్ష్మదర్శిని+ఐనది= సూక్ష్మవివేచనతో ఒప్పుతూ

ఉన్నది; మీకున్+ఏ+పనిన్+నడపవలయున్= మీ కొరకు ఏ పని చేయాలో; దీనిన్+కొని= దీనిని గ్రహించి; దానికిన్= అందుకై; నన్నున్+పనుపరే!= నన్ను ఆజ్ఞాపించరా!; అనినన్= అని ప్రార్థించగా.

**తాత్పర్యం:** 'ఓ మహాత్ములారా! నా మనస్సు ధర్మార్థస్వభావాలలో ప్రవీణమయింది. సూక్ష్మవివేచనతో ఒప్పుతూ ఉన్నది. ఇటువంటి నా బుద్ధిని గ్రహించి, మీకై ఎట్లాంటి మహాకార్యం చేయమంటారో ఆజ్ఞాపించండి' అని ఆ మహాపురుషుడు ప్రార్థించాడు.

**వ. వారునుం దత్సమయ సమాగతు లయిన విబుధులును నవ్వైన్యాభిధాను నభినందించి. 209**

**ప్రతిపదార్థం:** వారునున్= ఆ మునులూ; తద్+సమాగతులు+అయిన= అక్కడికి వచ్చిన; విబుధులును= దేవతలూ; ఆ+వైన్య+అభిధానున్+అభినందించి= ఆ వైన్యుడనే పేరు కలిగిన ఆ మహాపురుషుడిని మెచ్చుకొని.

**తాత్పర్యం:** ఆ మహర్షులూ, అక్కడికి వచ్చిన విద్వాంసులు వైన్యు డనే పేరు కలిగిన ఆ మహాపురుషుడిని మెచ్చుకొని - (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. మాన లోభములఁ గామ క్రోధములఁ బాసి । సర్వ జంతువులకు సముఁడ వగుచు**
**నియత ధర్మము నీవు నిశ్శంక నడపుము; । ప్రియము నప్రియము నుపేక్షఁ గూర్పు;**
**'దండనీత్యాశ్రయ ధర్మంబు నా పని; । దీనిఁ జేయుదు సావధాన వృత్తి;**
**రక్షింతు శ్రుతుల; వర్ణముల సంకరములు । సొరనీ; నదండ్యులు ధరణి దివిజు**

**తే. లరయువాఁడ నే భూప్రజ'నని ప్రతిజ్ఞ । యను మహోన్నత పద మెక్కు మనుడు, నాతఁ**
**'డవనిసురులు సహాయత్వ మాచరించి । రేని న ట్లగుఁ గా' కనియెం గుమార! 210**

**ప్రతిపదార్థం:** కుమార!= మనుమడైన ఓ ధర్మరాజా! మాన లోభములన్+కామ క్రోధములన్+పాసి= మాన లోభాలను, కామ క్రోధాలను వదలిపెట్టి; సర్వ జంతువులకున్= సమస్త ప్రాణులకు; సముఁడవు+అగుచున్= సమానుడ వవుతూ; నియత ధర్మమున్+ఈవు= నియమితమైన ధర్మాన్ని నీవు; నిశ్శంకన్+నడపుము= నిస్సందేహంగా కొనసాగించుము; ప్రియమున్+ అప్రియమున్+ఉపేక్షన్+కూర్పు=ప్రియాప్రియాలను నిర్లిప్తంగా నిర్వహించుము; దండనీతి+ఆశ్రయ ధర్మంబు నా పని= దండనీతిని ఆశ్రయించిన ధర్మమే నేను చేయవలసిన పని; దీనిన్+చేయుదున్= దీనిని నేను చేస్తాను; స+అవధాన వృత్తిన్= ఏకాగ్రతతో కూడిన పద్ధతితో; శ్రుతులన్= వేదాలను; రక్షింతున్= రక్షిస్తాను; వర్ణములన్+సంకరములు= వర్ణసంకరం; చొరనీను= ప్రవేశింప నీయను; ఏను= నేను; ధరణిదివిజులు= బ్రాహ్మణులు; అదండ్యులు= శిక్షార్హులు కానివారైన; భూ ప్రజన్= భూమిలోని ప్రజానీకాన్ని; అరయువాఁడన్= ప్రేమతో చూస్తాను అని; ప్రతిజ్ఞ+అను= ప్రతిజ్ఞ అనే; మహా+ఉన్నత పదము+ఎక్కుము+ అనుడున్= అత్యున్నత పదవిని అలంకరించవలసిందని చెప్పగా; ఆతఁడు= ఆ మహాపురుషుడు; అవని సురులు= భూదేవతలైన బ్రాహ్మణులు; సహాయత్వము+ఆదరించిరి+ఏని= సహాయ సహకారా లందిస్తే; అట్లు+అగున్+కాక+ అనియెన్= మీరుకోరినట్లే ఔతుందని చెప్పాడు.

**తాత్పర్యం:** దురహంకారం, లోభం, కామక్రోధాలు అనే దుర్గుణాలను వదలి సమస్తప్రాణులపట్ల సముడవై, శాస్త్ర విహితంగా రాజధర్మాన్ని అనుక్షణం నిస్సంకోచంగా పరిపాలించవలసింది. ఇష్టానిష్టాలను లెక్కచేయక నిర్లిప్తుడవై కర్తవ్యాన్ని యథావిధిగా నిర్వర్తించాలి. దండనీతిని అనుసరించిన ధర్మసంరక్షణమే నా దైనందిన విధి. ఈ నియమ నిష్ఠలో సావధానుడనై వేదసంరక్షణతో వర్ణాశ్రమాల సాంకర్యం పరిహరిస్తాను. భూప్రజలందరినీ దయాంతఃకరణుడవై

పాలిస్తాననే దృఢప్రతిజ్ఞాసింహపీఠిపై అధిష్ఠితుడవు కావాలి అని మునులు ఆదేశించారు. 'నాకు బ్రాహ్మణులు సహాయసహకారా లందిస్తే అదే రీతిగా ప్రవర్తించగల'నని ఆ వైన్యుడు విన్నవించాడు.

**వ. అనిన విని వారలు ప్రీతచిత్తులై యాతనికి మహీసురులు సహాయత్వం బాచరించువారుగా ననుమతి సేసి; రయ్యవసరంబున వాత్సల్యంబున సకల దివ్య పరివృతులై వచ్చి విష్ణు విధాతలు నమ్మునీశ్వరులును నక్కుమారు నఖిల ధరణీ సామ్రాజ్యాభిషేకంబు నిర్వర్తించి; రవ్విభునకు శుక్రుండు పురోహితుండును వాలఖిల్యుల యందు సారస్వతగణం బమాత్యులును గర్గుండు సాంవత్సరికుండు నై నడచిరి. మున్ను మహి విషమ యగుటయు నమ్మనుజపతి సమమూర్తి గావించుటయు విందుము. కరచరణాద్యవయవములతో నవనియు సాగరంబులును మహాగిరులును నగ్గురు ప్రభావుని భజియించె. 211**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని వైన్యుడు చెప్పగా మహర్షులు విని; వారలు= ఆ మహర్షులు; ప్రీతచిత్తులు+ఐ= మనసులో సంతోషించిన వారై; అతనికిన్= ఆ వైన్యునకు; మహీసురులు= బ్రాహ్మణులు; సహాయత్వంబు+ఆచరించు వారుగాన్= సహాయం చేసేవారుగా; అనుమతి+చేసిరి= అనుమతించారు; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో; వాత్సల్యంబునన్= ప్రేమతో; సకలదివ్య పరివృతులు+ఐ= సమస్త దేవతలతో కూడినవారై; వచ్చి; విష్ణు విధాతలున్= విష్ణువూ, బ్రహ్మ; ఆ+ముని+ఈశ్వరులునున్= ఆ మునీంద్రులు; ఆ+కుమారున్= ఆ వైన్యుడిని; అఖిల ధరణీసామ్రాజ్య+అభిషేకంబున్+నిర్వర్తించిరి= సమస్త భూమికి రాజ్యాభిషిక్తుడినిచేశారు; ఆ+విభునకున్= ఆ వైన్యుడనే రాజుకు; శుక్రుండు పురోహితుండును= శుక్రాచార్యుడు పురోహితుడుగాను; వాలఖిల్యుల+అందున్= వాలఖిల్య మహర్షులలో; సారస్వత గణంబు= సారస్వత గణమనే మునులు; అమాత్యులును= మంత్రులుగానూ; గర్గుండు= గర్గుడు; సాంవత్సరికుండున్+ఐ= జ్యోతిష్కుడై; నడచిరి= ప్రవర్తించారు; మున్ను= పూర్వం; మహి= భూమి; విషమ+అగుటయున్= సమానంగా లేకపోవటం (ఎగుడు దిగుడుగా ఉండటం) వలన; ఆ+మనుజపతి= ఆ రాజు; సమమూర్తి+కావించుటయున్= మిట్ట పల్లాలు లేని సమతలమైన భూమిగా చేయటాన్ని; విందుము= విన్నాము; కరచరణ+ఆది+అవయవంబులతోన్= చేతులు, కాళ్ళు మొదలైన శరీర భాగాలతో; అవనియున్= భూమి; సాగరంబులును= సముద్రాలూ; మహాగిరులునున్= మహాపర్వతాలూ; ఆ+గురుప్రభావుని= గొప్ప మహిమను పొందిన వైన్యమహారాజును; భజియించెన్= సేవించాయి.

**తాత్పర్యం:** అని వైన్యుడు చెప్పగా విన్న మహర్షులు సంతోషచిత్తు లయ్యారు. వారు ఆ వైన్యుడికి బ్రాహ్మణులను సహాయకులుగా అనుమతించారు. ఆ సందర్భంలో ప్రేమతో సమస్తదేవతలతో కూడినవారైన బ్రహ్మవిష్ణువులూ మహర్షులూ సమస్తభూమికీ వైన్యుడిని రాజుగా అభిషేకించారు. ఆ వైన్యుడికి శుక్రాచార్యుడు పురోహితుడుగా సారస్వత్యగణం మంత్రులుగా, గర్గుడు జ్యోతిష్కుడుగా వర్తించారు. అంతకు ముందు భూమి మిట్టపల్లాలతో ఉండగా, వైన్యుడే సమతలం చేశా డని విన్నాం. శరీరావయవాలతో కూడి భూమీ, సప్త సముద్రాలూ, కులపర్వతాలూ ఆ మహానుభావుడిని సేవించాయి.

**క. సురపతి విభవము, మేరువు। హిరణ్యమును, గిన్న రేశుఁ డీడిత సంప
ద్గురుతయు నొసఁగిరి రథ కరి। తురగ భటావళులు తలఁపుతో నొడఁగూడెన్. 212**

**ప్రతిపదార్థం:** సురపతి= దేవతల రాజైన ఇంద్రుడు; విభవమున్= సమస్త వైభవాన్నీ; మేరువు= మేరుపర్వతం; హిరణ్యమును= బంగారాన్నీ; కిన్నర+ఈశుఁడు= కిన్నరులకు రాజైన కుబేరుడు; ఈడిత= ప్రశస్తమైన; సంపద్+గురుతయున్= అధికమైన సంపదనూ; ఒసఁగిరి= ప్రసాదించారు; తలఁపుతోన్= భావించగానే; రథ, కరి, తురగ, భట+ఆవళులు= రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలం యొక్క సమూహం; ఒడఁగూడెన్= సమకూడినది.

**తాత్పర్యం:** ఆ వైన్య మహారాజుకు ఇంద్రుడు సమస్త వైభవాన్నీ, మేరు పర్వతం బంగారాన్నీ, కుబేరుడు ప్రశస్తమూ, అధికమూ అయిన సంపదనూ ప్రసాదించారు. భావించిందే ఆలస్యంగా రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలముల సమూహమూ సమకూరాయి.

**వ. ఇట్లు మహనీయ ప్రభుత్వ పదస్థుండై యమ్మహాత్ముండు శాస్త్రోక్త మార్గంబున దండనీతి పరిపాలనంబు ధర్మతాత్పర్య సమీచీనంబుగా నాచరించె. 213**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మహనీయ ప్రభుత్వ పదస్థుండు+ఐ= మహిమాన్వితమైన అధికార పదవిని పొందినవాడై; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడైన వైన్యుడు; శాస్త్ర+ఉక్తమార్గంబునన్= శాస్త్రాలలో చెప్పబడ్డ రీతిలో; దండనీతి పరిపాలనంబున్= దండనీతితో పాలించటాన్ని; ధర్మతాత్పర్య సమీచీనంబుగాన్+ఆచరించెన్= ధర్మానుగుణంగా, సత్యరీతిగా కొనసాగించాడు.

**తాత్పర్యం:** మహోన్నతమైన అధికార పదవిని అలంకరించిన ఆ వైన్యుడు, శాస్త్రోక్తంగా దండనీతితో ధర్మాను రక్తుడై, సత్యవ్రతుడై పరిపాలన సాగించాడు.

**క. ఉరగాదులవలని భయముఁ । బొరయక యొండొరులతోడఁ బొసఁగి రుజలుఁ జి**
**త్తరుజలు లేక యతని తఱి । ధరణీప్రజ సస్యసంపదయుఁ గల్గి మనున్. 214**

**ప్రతిపదార్థం:** అతని తఱిన్= ఆ వైన్య మహారాజు పరిపాలన సమయంలో; ధరణీ ప్రజలు= భూ ప్రజ; ఒండు+ఒరుల తోడన్+పొసఁగి= పరస్పరం కలసి మెలసి; ఉరగ+ఆదులవలని భయమున్+పొరయక= పాములు మొదలైన వాటి భయంలేకుండా; రుజలున్= శరీర సంబంధమైన రోగాలు; చిత్తరుజలు లేక= మానసిక రోగాలు లేకుండా; సస్యసంపదయున్+కల్గి= పైరు పంటల సంపదతో ఒప్పి; మనున్= జీవిస్తుంది.

**తాత్పర్యం:** ఆ వైన్యుడి పాలనలో ప్రజలంతా కలసి మెలసి పాములు మొదలైన విషపు పురుగుల బాధలు లేకుండా పాడిపంటలతో సుఖంగా జీవించారు.

**తే. బ్రాహ్మణ క్షత సంత్రాణ పరతఁ జేసి । క్షత్రియాభిధానంబు, రంజనము నెల్ల**
**ప్రజకుఁ జేయుట కతమున రాజనామ । మును బ్రవర్తిల్లె నా నృపాలునకు నధిప! 215**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; ఆ నృపాలునకున్= ఆ వైన్య మహారాజుకు; బ్రాహ్మణ= బ్రాహ్మణులను; క్షతసంత్రాణ= వినాశంనుండి రక్షించటంలో; పరతన్+చేసి= ఆసక్తి కలిగి ఉండటంచేత; క్షత్రియ+ఆభిధానంబున్= క్షత్రియుడు అనే పేరును; ఎల్ల ప్రజకున్= సమస్త ప్రజలకూ; రంజనము చేయుట కతమునన్= ఆనందాన్ని కలిగించటం కారణంగా; రాజనామమును= రాజు అనే పేరును; ప్రవర్తిల్లెన్= కలిగాయి.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ వైన్యమహారాజు బ్రాహ్మణులను వినాశనంనుండి రక్షించే ఆసక్తి కలిగి ఉండటంచేత క్షత్రియుడనే పేరునూ, సర్వప్రజలనూ రంజింపచేయటంచేత రాజు అనే పేరునూ పొందాడు.

**వ. తత్సంతతి జాతు లెల్లను దత్కల్పులై రాజత్వంబు వహించి దండనీతి పాలించిరి; రాజని యొకండు కలిగిన తెఱంగును రాజ్యస్థాపనంబును రాజు మిగిలి వర్తింపం దక్కిన జనంబులకు రాకుండుటయు విష్ణు విహితంబులు విష్ణుండు రాజుల నిజ తేజోంశంబులం బ్రవేశించి యుండునట్లగుటంజేసి దైవ నిభుండగుచు రా జెల్ల వారిచేతను**

**మ్రొక్కం గొనజాలుఁ, దద్రక్షణంబును నాచరించు; నొక్కని వశంబున లోకంబంతయు వర్తిల్లుటకు దేవ సంబంధ కలితం బయిన గుణంబు వెలిగా నొండు కారణంబు కలదే? యాకర్ణింపుము. 216**

**ప్రతిపదార్థం:** తద్+సంతతి జాతులు+ఎల్లను= ఆ వైన్యుడనే రాజుయొక్క సంతాన సమూహమంతా; తద్+కల్పులు+ఐ= అతడితో సమానులై; రాజత్వంబు వహించి= రాజ్యాధికారాన్ని పొంది; దండనీతి పాలించిరి= దండనీతితో రాజ్యాన్ని పాలించారు; రాజు+అని+ఒకండు= రాజు అనే పేరుతో ఒకడు; కలిగిన తెఱంగును= సంభవించిన రీతిని; రాజ్యస్థాపనంబును= రాజ్య నిర్మాణాన్ని; తక్కిన జనంబులకున్= తదితర ప్రజలకు; రాజు మిగిలి= రాజును అతిక్రమించి; వర్తింపన్= ప్రవర్తించటానికి; రాకుండుటయున్= వీలుకాకుండా; విష్ణువిహితంబులు= విష్ణువుచేత విధించబడ్డాయి; విష్ణుండు= విష్ణుమూర్తి; రాజుల= రాజులయందు; నిజ తేజః+అంశంబులన్ తన తేజోభాగాలను; ప్రవేశించి+ఉండునట్లు+అగుటన్+చేసి= ప్రవేశించి ఉంటాడు గాన; రాజు; దైవ నిభుండు+అగుచున్= దేవుడితో సమానమైనవాడై; ఎల్లవారిచేతను= సమస్త ప్రజలచేత; మ్రొక్కన్+కొనన్+చాలున్= నమస్కృతు లందు కొనటానికి అర్హుడయ్యాడు; తద్+రక్షణంబునున్+ఆచరించు= ఆ ప్రజలను రక్షిస్తాడు; ఒక్కని వశంబున్= ఒక్కడి వంశంలో; లోకంబు+అంతయున్= లోకమంతా; వర్తిల్లుటకున్= కొనసాగటానికి; దేవ సంబంధ కలితంబు+అయిన గుణంబు= దైవ సంబంధంతో కూడిన గుణం; వెలిగాన్= వేరుగా; ఒండుకారణంబు+కలదే?= ఇతర కారణ ముందా? (లేదు కదా); ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ వైన్యుడి సంతానమంతా అతడితో సమానులై దండనీతిని అనుసరించి రాజ్యం చేశారు. రాజనేవాడు పుట్టిన విధానమూ, రాజ్యస్థాపనమూ, రాజును అతిక్రమించకుండా ప్రజలు ప్రవర్తించటం అనే అంశాలు విష్ణునిర్ణాయకాలే. విష్ణువు రాజులందు తన తేజోభాగాలను ప్రవేశింపజేయటంవలన రాజు దైవసమానుడై ప్రజల నమస్కారాలకు అర్హుడయ్యాడు. ప్రజాసంరక్షణం ఒకడి అధీనంలో ఉండటం అనేది దైవాంశ సంబంధమైన గుణం కాక మరొకటి అవుతుందా? వినుము.

**విశేషం:** ఈ వచనం మూలాను సారంగా సాగింది. మూలంకంటే తిక్కన సరళంగా విపులంగా రచించటం విశేషం. ఈ వచనంలో రాజుకు సంబంధించి విష్ణు ప్రాధాన్యాన్ని చెప్పటానికి 'నా విష్ణుః పృథివీ పతిః' అనే సూక్తి ఆధారం. విష్ణ్వంశలేనివాడు రాజు కాలేడని స్పష్టం.

**మ. హరిఫాలంబునఁ బుట్టి ధర్మమున కాలై యర్థమన్పుత్రకున్**
**సిరి కాంచెన్ దగ వారు ముప్వురును సుస్థేమోన్నతిన్ సంశ్రయిం**
**తురు భూపాలకు నాతఁ డన్యజనతా తుల్యోద్భవుం డెట్లు ని**
**ర్జర లోకార్హ సమగ్ర పుణ్య వితతి ప్రాప్తుండు గా కారయన్. 217**

**ప్రతిపదార్థం:** సిరి= సంపద (లక్ష్మి); హరిఫాలంబునన్= విష్ణువు నొసట; పుట్టి= జన్మించి; ధర్మమునకున్+ఆలై= ధర్మదేవతకు భార్య అయి; అర్థమన్+పుత్రకున్= అర్థమనే కుమారుడిని; కాంచెన్= పొందింది; తగన్= తగిన రీతిలో; వారు ముప్వురును= లక్ష్మి, ధర్మదేవత, అర్థమనే పుత్రుడూ వీళ్ళు ముగ్గురూ; సుస్థేమ+ఉన్నతిన్= మిక్కిలి దృఢంగా; భూపాలకున్= రాజును; సంశ్రయింతురు= ఆశ్రయిస్తారు; ఆరయన్= పరిశీలించగా; ఆతఁడు= ఆ రాజు; నిర్జరలోక+అర్హ= స్వర్గ లోకార్హమైన; సమగ్ర= సంపూర్ణమైన; పుణ్యవితతి= పుణ్యసమూహాన్ని; ప్రాప్తుండు+కాక= పొందినవాడు కాకుండా; అన్యజనతా తుల్య+ఉద్భవుండు+ఎట్లు?= ఇతర ప్రజలతో సమానమైన జననం కలవా డెట్లా అవుతాడు?

**తాత్పర్యం:** శ్రీమహావిష్ణువు ఫాలభాగంలో ఉద్భవించిన లక్ష్మి, ధర్మదేవుడికి భార్యయై, అర్థమనే పుత్రుడిని పొందింది. లక్ష్మి, ధర్మదేవత, అర్థమనే పుత్రుడు - ఈ ముగ్గురూ మిక్కిలి దృఢంగా రాజును ఆశ్రయిస్తారు.

అందుకే రాజు ఎంతో పుణ్యాన్ని పొందినవాడై స్వర్గలోకాన్ని పొందటానికి తగినవా డౌతాడు. అంతేగాని ఇతరులవంటి వాడు కాడు.

**విశేషం:** 'విష్ణోర్లలాటాత్కమలం సౌవర్ణమభవత్తథా, శ్రీస్సంభూతాయతో దేవీ పత్నీ ధర్మస్య ధీమతః' అంటూ సాగిన మూలంలోని నాలుగైదు శ్లోకాలకు యథామూల మీ పద్యం.

**వ. దివంబున నుండి దండనీతి నయించుటకు వచ్చి వాసుదేవ మహత్త్వ భావితుండైన మహానుభావుండు కావున వర్ణంబులు నాశ్రమంబులుం దదాచార ప్రవర్తనంబులైన; వేద పురాణేతిహాసంబులును రాజున కధీనంబులు తదీయ మాహాత్మ్యంబున నతనియందు సౌందర్య శౌర్య చాతుర్యాది గుణంబులు కలుగ జనంబులు తలంతురు; తదాజ్ఞకు లోనై వర్తింతు రిది రాజులు దేవసములైన తెఱంగు; మఱియు నడుగవలయు వాని నడుగు' మనిన నయ్యాపగానందనునకుం బ్రణమిల్లి యప్పాండునందనుం డి ట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** దివంబునన్+ఉండి= స్వర్గం నుండి; దండనీతిన్ నయించుటకున్ వచ్చి= దండనీతిని ప్రాప్తింపజేయటం కొరకు వచ్చి; వాసుదేవ మహత్త్వ భావితుండు+ఐన= శ్రీమహావిష్ణువు మహిమను భావించేవాడైన; మహానుభావుండు+కావునన్= కాబట్టి; వర్ణంబులున్= చతుర్వర్ణాలూ; ఆశ్రమంబులున్= చతురాశ్రమాలూ; తద్+ఆచార ప్రవర్తనంబులు+ఐన= వాటి ఆచారాన్ని నిర్వహింపజేసేవైన; వేద పురాణ+ఇతిహాసంబులును= వేదాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ; రాజునకు+అధీనంబులు= రాజు వశమై ఉంటాయి; తదీయ మాహాత్మ్యంబునన్= వాటియొక్క మహిమచేత; అతని+అందున్= ఆ రాజులో; సౌందర్య, శౌర్య చాతుర్య+ఆది గుణంబులు+కలుగన్= సౌందర్యమూ, పరాక్రమమూ, నైపుణ్యమూ మొదలైన ఉత్తమ గుణాలు ఉన్నాయని; జనంబులు= ప్రజలు; తలంతురు= భావిస్తారు; తద్+ఆజ్ఞకు లోను+ఐ= అందువలననే ఆ రాజాజ్ఞకు లోనై; వర్తింతురు= ప్రవర్తిస్తారు; ఇది రాజులు దేవ సములైన తెఱంగు= ఇది రాజులు దేవతలతో సమానులైన తీరు; మఱియున్= ఇంకా; అడుగవలయువానిన్= అడగవలసిన వాటిని; అడుగుము+అనినన్= అడుగు మని పల్కగా; ఆ+ఆపగా నందనునకున్= ఆ గంగాసుతుడైన భీష్మునకు; ప్రణమిల్లి= నమస్కరించి; ఆ+పాండునందనుండు= ఆ ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దండనీతిని ప్రాప్తింపజేయటానికి స్వర్గం నుండి దిగి వచ్చి శ్రీమహావిష్ణువు మహిమను భావించే మహానుభావుడు కావటంవలన, చతుర్వర్ణాలు, చతురాశ్రమాలు, వీటిని ఆచరించటానికి ఆధారాలైన వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు రాజునకు వశమై ఉంటాయి. వాటి మహిమచేతనే రాజులలో అందమూ, పరాక్రమమూ, నైపుణ్యమూ మొదలైన గుణాలు ఉంటా యని ప్రజలు భావించి రాజాజ్ఞకు లోనై ప్రవర్తిస్తారు. ఇది రాజులు దేవతలతో సమాన మని చెప్పిన తీరు. ఇంకా అడగవలసిన విషయాలు ఉంటే అడుగు'మని భీష్ముడు పల్కినప్పుడు ధర్మరాజు ఆయనకు నమస్కరించి ఇట్లా అన్నాడు.

**తే. 'అనఘ! నాలుగు వర్ణము లాశ్రమములు । నెన్ని కల? వెవ్విధంబుల నన్నిటికిని**
**వర్తనమ్ములు? వేర్వేఱ వానిఁ దెలుపు । విశ్వ రాజధర్మములను విస్తరింపు. 219**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన తాతా!; నాలుగు వర్ణములు= బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగు వర్ణాలూ; ఆశ్రమములున్= బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే నాలుగు ఆశ్రమాలూ; అన్నిటికినీ= వాటన్నిటికీ; వర్తనంబులు= ఆచరించే పద్ధతులు; ఏ+విధంబులన్= ఏ రీతులలో; ఎన్ని కలవు= ఎన్ని ఉన్నాయో; వానిన్= వాటిని; వేర్వేఱన్= వేర్వేరుగా; తెలుపు= వివరించుము; విశ్వ రాజ ధర్మములను= ఈ ప్రపంచంలోని రాజధర్మాలను; విస్తరింపు= వివరంగా చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ తాతా! నాలుగు వర్ణాలూ, నాలుగు ఆశ్రమాలూ వాటన్నిటినీ ఆచరించే పద్ధతులూ ఏ విధంగా ఎన్ని ఉన్నాయో విడి విడిగా వివరించుము. ప్రపంచంలోని రాజధర్మాలను విపులీకరించుము'.

**భీష్ముఁడు ధర్మజునకు వర్ణాశ్రమధర్మంబు లెఱింగించుట (సం. 12-60-1)**

**వ. అని యడిగిన నా దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లనియె. 220**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని అడుగగా; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; ఆ+నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజశ్రేష్ఠుడైన ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగగా ఆ భీష్ముడు నరశ్రేష్ఠుడైన ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**క. 'కోపంబు లేమి, సత్యా । లాపము నిజ దార పర విలాసము శుచితా**
**గోపన మద్రోహం బవ । నీపాలక! సర్వవర్ణ నియత గుణంబుల్ 221**

**ప్రతిపదార్థం:** అవనీపాలక!= ఓ ధర్మరాజా!; కోపంబులేమి= కోపం లేకపోవటం; సత్య+ఆలాపమున్= సత్యం చెప్పటం; నిజదార= తన భార్యయందు; పరవిలాసము= అత్యంతాసక్తి; శుచితాగోపనము= పరిశుద్ధతతో కూడిన రహస్యరక్షణం; అద్రోహంబున్= ద్రోహచింతన లేకుండటం; సర్వవర్ణ నియత గుణంబుల్= సమస్త వర్ణాలకు నియమితమైన ఉత్తమగుణాలు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఎట్లాంటి పరిస్థితిలోనైనా కోపం లేకుండా శాంతంగా ఉండటం, సత్యాన్నే చెప్పటం, స్వభార్యయందు ఆసక్తితో ఉండటం, పరిశుద్ధతతో కూడిన రహస్య రక్షణం, ద్రోహచింతన లేకుండటం అనే ఉత్తమ గుణాలను నాలుగు వర్ణాలవారు పాటించాలి.

**ఆ. బ్రాహ్మణునకు దమము పరమ ధర్మం బవ । శ్యంబుఁ గృత్య మధ్యయనము; దాన**
**సర్వ కర్మములును, శాసితంబులు; వాని । నడపవలయు నిష్ఠ యెడప కతఁడు. 222**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణునకున్= బ్రాహ్మణుడికి; దమము= ఇంద్రియనిగ్రహం; పరమ ధర్మంబు= శ్రేష్ఠమైన ధర్మం; అధ్యయనము= వేదాధ్యయనం; అవశ్యంబున్+కృత్యము= తప్పనిసరిగా చేయవలసిన పని; దానన్= దానివలన; సర్వ కర్మములును= సమస్త విహిత కర్మలూ; శాసితంబులు= శాసించబడ్డాయి; అతఁడు= ఆ బ్రాహ్మణుడు; నిష్ఠ+ఎడపక= నిష్ఠను వదలకుండా; నడపవలయున్= నిర్వహించాలి.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడికి ఇంద్రియనిగ్రహం శ్రేష్ఠధర్మం. వేదాధ్యయనం నిత్యకృత్యం. దానివలన సమస్త విహిత కర్మలూ (అంటే యజ్ఞయాగాది కర్మలూ) నియమించబడ్డాయి. అతడు వాటిని నిష్ఠతో నిర్వర్తించాలి.

**ఉ. కాని పథంబునం జనక, కారుణికత్వము గల్గి, శాంతిమైఁ**
**దా నడవంగ విప్రున కుదాత్తధనం బొడఁగూడె నేని సం**
**తానముఁ గూర్ప నర్థులకు ధర్మ నిరూఢతఁ బంచి పెట్ట దు**
**ర్ధ్యాన విదూరుఁడై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా! 223**

**ప్రతిపదార్థం:** కౌరవ వంశదీపకా!= కురువంశ శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; కాని పథంబునన్+చనక= చెడు మార్గంలో నడవకుండా; కారుణికత్వము+కల్గి= దయ కలిగి; శాంతిమైన్= శాంతంతో; నడవంగన్= ప్రవర్తించగా; విప్రునకున్= బ్రాహ్మణుడికి; ఉదాత్త

ధనంబు+ఒడఁగూడెన్+ఏని= అధిక ధనం లభిస్తే; తాన్= తాను (ఆ బ్రాహ్మణుడు); సంతానమున్+కూర్పన్= సంతానమునకు ఇవ్వటానికి; అర్హులకున్= పాత్రులైనవారికి; ధర్మనిరూఢతన్= ధర్మానుబద్ధంగా; పంచిపెట్టన్= పంచిపెట్టటం వలన; దుర్మాన విదూరుఁడు+ఐ= అవమానాలకు దూరమైనవాడై; పరఁగన్+ప్రాప్తుడు= మెలగటానికి అర్హుడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! దుర్మార్గవర్తనుడు కాక, దయాంతఃకరణుడుగా, శాంతస్వభావుడుగా మెలిగే బ్రాహ్మణుడికి అతిశయిత మైన ధనం లభిస్తే అతడు దానిని సంతానమునకు ఇవ్వటానికి, అర్హులైన వారికి పంచిపెట్టటంకొరకు వినియోగిస్తే అవమాన దూరుడై మెలగటానికి అర్హుడౌతాడు.

**విశేషం:** వావిళ్లవారి ప్రతిలో ' సంతానముఁ గూర్ప కర్హులకు' అని పాఠాంతరం ఉన్నది. అది బాగుగా ఉన్నది. విప్రుడికి అధిక ధనం లభిస్తే దానిని తన సంతానానికి ప్రవర్తింపజేయక అర్హులైనవారికి ధర్మనిరతితో పంచిపెట్టాలనడం బాగుగా నున్నది.

**చ. యజనము దాన కర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం**
**బ్రజ కనురాగ మొందఁ బరిపాలన చేఁతయు సంగరంబున**
**న్విజిత విభీతిమై నురవణించుటయున్ నృపధర్మముల్; కురు**
**వ్రజ తిలకాయమాన! సమరంబు సుధర్ముపు వీనిలోపలన్. 224**

**ప్రతిపదార్థం:** కురువ్రజ తిలకాయమాన!= కురువంశశ్రేష్ఠుడైన ఓ ధర్మరాజా!; యజనము= యజ్ఞాచరణమూ; దాన కర్మమునున్= దానం చెయ్యటమూ; అధ్యయనంబును= వేదాధ్యయనమూ; దస్యుహింసయున్= దొంగలను శిక్షించటమూ; ప్రజకున్+అనురాగము+ఒందన్= ప్రజలకు ప్రేమ కలిగేటట్లు; పరిపాలన చేఁతయున్= పరిపాలించటమూ; సంగరంబునన్= యుద్ధంలో; విజిత విభీతిమైన్= ఓటమి భయం లేకుండా; ఉరవణించుటయున్= పరాక్రమించటమూ; నృపధర్మముల్= రాజధర్మాలు; వీనిలోపలన్= పైన పేర్కొన్న వాటన్నిటిలోను; సమరంబు= యుద్ధం చెయ్యటం; సుధర్ముపు= అత్యుత్తమ ధర్మం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! యజ్ఞాచరణమూ, దానకర్మమూ, వేదాధ్యయనమూ, దొంగలను శిక్షించటమూ, ప్రజానురాగంతో పరిపాలన చేయటమూ, యుద్ధంలో ఓడిపోతా ననే భయం లేకుండా పరాక్రమించటమూ రాజధర్మాలు. వీటన్నిటిలో యుద్ధ మనేది అత్యుత్తమ ధర్మం.

**విశేషం:** మూలంలో 'రాజు యజ్ఞం చెయ్యవచ్చు. యజ్ఞం చేయించకూడదు. దానం చెయ్యవచ్చు. యాచించకూడదు. అధ్యయనం చెయ్యవచ్చు. అధ్యాపనం చెయ్యకూడదు' అనే రీతిలో ఉండగా, నిషిద్ధధర్మాలను పరిహరించి తిక్కన రాజునకు అర్హధర్మాలను మాత్రమే పేర్కొనటంలో ఒక ప్రత్యేకతను ప్రదర్శించా డనవచ్చును.

**తే. అధ్యయన దాన యజ్ఞంబు లధిప! వైశ్యు । నకును గృత్యముల్; శుద్ధార్జనమున ధనము**
**సంచితవ్యంబు పసుల రక్షించువాఁ డ । తండు; వానికి నిది మహా ధర్మ మనఘ! 225**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; వైశ్యునకును= చతుర్వర్ణాలలో మూడవ వాడైన వైశ్యుడికి; అధ్యయన= వేదాధ్యయనం; దాన యజ్ఞంబులు= దానం చేయటమూ, యజ్ఞం చేయటమూ అనేవి; కృత్యముల్= ఆచరించవలసిన కార్యాలు; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; శుద్ధ+ఆర్జనమునన్= పరిశుద్ధమైన అంటే న్యాయ మార్గంలో సంపాదించిన; ధనము సంచితవ్యంబు= ధనం కూడబెట్టుకొనదగింది; అతండు= ఆ వైశ్యుడు; పసుల రక్షించువాఁడు= పశువులను రక్షించేవాడుగా ఉండాలి; వానికిన్+ఇది మహాధర్మము= ఆ వైశ్యుడి కిది ఉత్తమ ధర్మం.

**తాత్పర్యం:** 'పాప రహితుడవైన ఓ ధర్మరాజా! వైశ్యుడికి వేదాధ్యయనమూ, దాన యజ్ఞాచరణాలూ తప్పనిసరిగా ఆచరించవలసిన కార్యాలు. అతడు న్యాయమార్గంలోనే ధనార్జన చేసి కూడబెట్టాలి. పశుపాలనం వైశ్యుడి ప్రముఖ ధర్మం.

**విశేషం:** మూలంలో ఐదు శ్లోకాల్లో వైశ్యుని ధర్మాలు విస్తారంగా చెప్పబడగా తిక్కన ఈ తేటగీతిలో సంక్షిప్తంగా చెప్పాడు.

**క. ఈ మూఁడు వర్ణములకును । దా మంచిగఁ బనులు సేఁత ధర్మువు కురు ధా**
**త్రీ మహిళేశ్వర! శూద్రున । కామెయి జీవనము వాని కజుఁడు విధించెన్. 226**

**ప్రతిపదార్థం:** కురు ధాత్రీ మహిళా+ఈశ్వర!= కురుభూమి అనే స్త్రీకి భర్త అయిన ఓ ధర్మరాజా!; ఈ మూఁడు వర్ణములకును= పైన పేర్కొన్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనే మూడు వర్ణాలకూ; తాన్= తాను (శూద్రుడు); మంచిగన్+పనులు+చేఁత= సముచితంగా పనులు చెయ్యటం; శూద్రునకున్ ధర్మువు= శూద్రుడికి ధర్మం; ఆ మెయిన్= ఆ విధంగా; వానికిన్= ఆ శూద్రుడికి; అజుఁడు= బ్రహ్మ; జీవనము= జీవిత విధానం; విధించెన్= నిర్ణయించాడు.

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సముచిత రీతిలో పనులు చేస్తూ ఉండటం శూద్రుడికి ధర్మం. అతడికి ఆ జీవనవిధిని బ్రహ్మ నిర్ణయించాడు.

**క. ధనధాన్యంబులు కూర్చుట । జనపతి యనుమతము లేక చన;దతనికి దా**
**ననిరూఢి శ్రద్ధ గలిగినఁ । జనునది సుపవిత్ర యగుట జగతీనాథా! 227**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ ధర్మరాజా!; అతనికిన్= ఆ శూద్రుడికి; జనపతి+అనుమతము లేక= రాజానుమతి లేకుండా; ధనధాన్యంబులు+కూర్చుట= ధనసంపాదనమూ, ధాన్యసేకరణమూ చెయ్యటం; చనదు= కూడదు; దాన నిరూఢిన్= దానం చేసి ప్రసిద్ధి పొందటంలో; శ్రద్ధ+కలిగినన్= ఆసక్తి ఉంటే; అది సుపవిత్ర+అగుట= అది మిక్కిలి పవిత్రమయినది కావటం వలన; చనున్= అర్హమైనదే (అంటే రాజానుమతి అవసరం లేదు).

**తాత్పర్యం:** శూద్రుడికి రాజానుమతి లేకుండా ధనధాన్యసేకరణం ఉచితం కాదు. ఉత్తమమార్గం కావటంవలన అతడు రాజానుమతి లేకుండానే దానధర్మాలకొరకు ధనం సంపాదించవచ్చును.

**తే. అధిప! త్రైవర్ణికులకును యజ్ఞవిధుల । శ్రద్ధ కలిమికి మిగులు ధర్మంబు లేదు;**
**యజ్ఞమునకంటె నధికమైనదియుఁ గలదె? । యజ్ఞకర్తయ చూవె సర్వాధికుండు. 228**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; త్రైవర్ణికులకును= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనే మూడు వర్ణాలకు; యజ్ఞవిధులన్= యజ్ఞ కార్యాచరణంలో; శ్రద్ధ కలిమికిన్= ఆసక్తి కలిగి ఉండటం అనే దానికంటె; మిగులు ధర్మంబు లేదు= మించిన ధర్మం లేదు; యజ్ఞమునకంటెన్= యజ్ఞ కార్యంకంటే; అధికమైనదియున్+కలదె?= విశిష్టమైనది ఉన్నదా?; సర్వ+అధికుండు= అందరికంటె గొప్పవాడు; యజ్ఞ కర్తయ చూవె!= యజ్ఞ కర్తయే కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు యజ్ఞకార్యాచరణంలో శ్రద్ధ కలిగి ఉండటం ఉత్తమమైన ధర్మం. యజ్ఞకార్యంకంటె గొప్పది ఏమీ లేదు. అందరికంటె యజ్ఞకర్త గొప్పవాడు.

**వ. ఆశ్రమ ధర్మంబు లాకర్ణింపుము. 229**

**ప్రతిపదార్థం:** ఆశ్రమ ధర్మంబులు+ఆకర్ణింపుము= నాలుగు ఆశ్రమాలు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాలు అనే వాటి ధర్మాలను గూర్చి చెప్పుతాను వినుము.

**తాత్పర్యం:** ఆశ్రమ ధర్మాలు నాలుగు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాలు అనే వాటి ధర్మాలను గూర్చి చెప్పుతాను వినుము.

**మ. గురుశుశ్రూషయు, నాగమాధ్యయనమున్, గోష్ఠీ నిరాసంబుఁ ద**
**త్పరతం బొందొరయంగఁ దాఁ జౌరమియున్, భైక్షాశనత్వంబు, ష**
**ద్వర కర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక, యె**
**వ్వరితోడం బగగాక యున్కియును భవ్య బ్రహ్మచర్యోక్తముల్. 230**

**ప్రతిపదార్థం:** గురు శుశ్రూషయున్= గురువులకు సేవ చేయటమూ; ఆగమ+అధ్యయనమున్= వేదాధ్యయనమూ; గోష్ఠీనిరాసంబున్= సమావేశాలపట్ల నిరాసక్తతా; తత్పరతన్= ఆసక్తితో; పొందు+ఒరయంగన్= స్నేహం పొందడంలో; తాన్+చౌరమియున్= తాను ఆసక్తుడు కాకుండా ఉండటమూ; భైక్ష+అశనత్వంబున్= భిక్షాన్నం భుజిస్తూ; రాగభర గాఢ ద్వేషముల్ లేక= ప్రేమాధిక్యం కానీ, ప్రగాఢమైన విద్వేషంగానీ లేకుండా; ఎవ్వరితోడన్+పగగాక= ఎవ్వరితోనూ శత్రుత్వం లేకుండటం అనే; షట్+వరకర్మంబుల+అందున్= శ్రేష్ఠమైన ఆరు కర్మల యందు; ఉన్కియున్= ఉండడమూ (జీవించటమూ); భవ్య బ్రహ్మచర్యా+ఉక్తముల్= శ్రేష్ఠమైన బ్రహ్మచర్యాశ్రమ విషయంలో చెప్పబడిన ధర్మాలు.

**తాత్పర్యం:** గురుసేవ, వేదాధ్యయనం, సమావేశాల పట్ల అనాసక్తత, అలంకారాల పట్ల ఆసక్తి లేకుండా ఉండటం, భిక్షాన్నంతో బ్రతకటం, మిక్కిలి ప్రేమ, గాఢద్వేషమూ లేకుండా ఎవరితోనూ శత్రుత్వం వహించకుండా ఉండటమూ ఆరు శ్రేష్ఠమైన కర్మలను ఆచరిస్తూ జీవించటమే బ్రహ్మచర్యాశ్రమంలో ముఖ్యధర్మం.

**మ. నిజదారైకపరత్వముం గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్**
**సుజనా సంగము దేవ పిత్రతిథి సంశుద్ధార్చనల్ హవ్య భు**
**గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శక్యప్రక్రియం బ్రోపుఁ బం**
**కజగర్భుండు గృహస్థ ధర్మములుగాఁ గల్పించె నుర్వీశ్వరా! 231**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ్వరా!= భూమికి అధిపతివైన ఓ ధర్మరాజా!; నిజదార+ఏక పరత్వమున్= తన భార్య యందు మాత్రమే ఆసక్తిని కలిగి ఉండటమూ; కరుణయున్= దయ; నిక్కంబునున్= సత్యమూ; తాల్మియున్= ఓర్పు; సుజనా సంగమున్= సజ్జన సాంగత్యం; దేవ పిత్ర+అతిథి సంశుద్ధ+అర్చనల్= దేవతల, పితృదేవతల అతిథుల పరిశుద్ధమైన పూజలు; హవ్యభుక్+భజనంబున్= అగ్నిదేవుడి పూజ; సకల+ఆశ్రమస్థులను= సమస్త ఆశ్రమ ధర్మాలను నిర్వహించే వారిని; శక్య ప్రక్రియన్+ప్రోపు= యథాశక్తి రక్షించటమూ; గృహస్థ ధర్మములుగాన్= గృహస్థాశ్రమ ధర్మాలుగా; పంకజగర్భుండు= కమల భవుడైన బ్రహ్మ; కల్పించెన్= నిర్ణయించాడు.

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! స్వభార్యాసక్తి, దయ, సత్యనిష్ఠ, ఓర్పు, సజ్జనసాంగత్యం, దేవతల, పితృదేవతల, అతిథుల సమర్చనం, అగ్నిపూజ, సమస్త ఆశ్రమధర్మ నిర్వాహకులను శక్త్యనుసారం పోషించటమూ అనేవాటిని గృహస్థాశ్రమ ధర్మాలుగా బ్రహ్మ నిర్ణయించాడు.

**శా. తానున్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁ డైనం జనున్**
**మానాహంకృతులూడ్చు నింద్రియములన్ మర్దించు నచ్చో జడల్**
**పూనుం దాపస శాస్త్రముల్ చదువుఁ జల్పున్ గోష్ఠి తత్‌జ్ఞాళితో**
**వానప్రస్థ విధా ప్రవిష్టుఁడు ప్రజా వాత్సల్య నిష్ప్రాత్మతన్. 232**

**ప్రతిపదార్థం:** వాన ప్రస్థ విధా ప్రవిష్టుఁడు= వానప్రస్థ మనే ఆశ్రమ విధానాన్ని స్వీకరించినవాడు; ప్రజా వాత్సల్య నిష్ప్రాత్మతన్= సంతానం పట్ల మమకారం వదలినవాడై; పేరు+అడవికిన్= ఘోరారణ్యానికి; తానున్ భార్యయున్+ఏఁగున్= భార్యా సహితుడై వెళతాడు; తాను+ఒక్కఁడు+ఐనన్+చనున్= తా నొక్కడుగా నైనా వెళ్ళుతాడు; మాన+అహంకృతులు+ఊడ్చున్= అభిమానం, అహంకారం వదులుతాడు; ఇంద్రియములన్ మర్దించున్= ఇంద్రియాలను నిగ్రహిస్తాడు; అచ్చోన్= ఆ అరణ్యంలో; జడల్ పూనున్= జడలు ధరిస్తాడు; తాపస శాస్త్రముల్ చదువున్= తపస్సంబంధమైన శాస్త్రాలు తెలిసికొంటాడు; తద్+జ్ఞాళితోన్= ఆయా విషయాలలో జ్ఞానవంతులైన వారితో; గోష్ఠి సల్పున్= సమావేశమై చర్చిస్తాడు.

**తాత్పర్యం:** వానప్రస్థాశ్రమం స్వీకరించినవాడు సంతానంపట్ల మమకారాన్ని వదలి, తానొక్కడు గానీ, భార్యా సమేతంగా గానీ ఘోరారణ్యానికి వెళ్ళుతాడు, అభిమానాహంకారాలను వదలిపెట్టుతాడు. ఇంద్రియ నిగ్రహాన్ని కలిగి జడలు ధరిస్తాడు. తపస్సంబంధమైన శాస్త్రాధ్యయనం చేస్తాడు. ఆయా విషయాలలో ప్రవీణులైన జ్ఞానుల గోష్ఠిలో పాల్గొని విషయ చర్చ చేస్తాడు.

**శా. ఎచ్చో నైనను నిల్చు, నాఁకటికి నేమేనిం గొనున్, రాత్రియై**
**నచ్చో నెమ్మి శయించు, నగ్ని పరిచర్యం బాసి వర్తించుఁ, దా**
**నిచ్చం గోరఁ డొకండు, నింద్రియ జయం బేపారు భోగంబులన్**
**మెచ్చున్ మ్రొక్కును నొల్లకుండు యతిపేర్మిన్ నిర్మముండై నృపా! 233**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధర్మరాజా!; యతి= సన్న్యాసాశ్రమం స్వీకరించినవాని; పేర్మిన్= విధంగా; నిర్మముండు+ఐ= మమకార రహితుడై; ఏ+చోటన్+ఐనను నిల్చున్= ఎక్కడైనా ఉంటాడు; ఆఁకటికిన్+ఏమి+ఏనిన్+కొనున్= ఆక లైతే ఏదో ఒకటి తింటాడు; రాత్రి+ఐనన్= రాత్రి కాగా; అచ్చోన్= అక్కడే; నెమ్మిన్‌శయించు= హాయిగా నిద్రిస్తాడు; అగ్ని పరిచర్యన్+పాసి= అగ్ని కార్యాన్ని వదలి; వర్తించున్= నడుచుకొంటాడు; తాన్= తాను; ఇచ్చన్= కావాలని (కోరికతో); ఒకండు= దేన్నీ; కోరఁడు= ఆశించడు (అర్థించడు); ఇంద్రియ జయంబు+ఏపారు భోగంబులన్ మెచ్చున్= ఇంద్రియ నిగ్రహానికి ఉపకరించే భోగాలను మెచ్చుకొంటాడు; మ్రొక్కునున్+ఒల్లకుండున్= నమస్కారాన్ని అంగీకరించడు.

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవాడు మమకారరహితుడై ఎక్కడో ఒకచోట ఉంటూ, ఆక లైనప్పుడు ఏదో ఒకటి తింటూ, ఎక్కడ ఉన్నప్పుడు రాత్రి అవుతుందో అక్కడే హాయిగా పడుకొంటాడు. అగ్నికార్యాలను త్యజించి నడుచుకొంటాడు. తనంతట తానే దేనినీ కోరడు. ఇంద్రియ నిగ్రహానికి ఉపకరించే పద్ధతులను మెచ్చుకొంటాడు. నమస్కారాన్ని స్వీకరించడు.

**విశేషం:** తిక్కన నాలుగు ఆశ్రమ ధర్మాలను రెండు మత్తేభాలు, రెండు శార్దూలాలు అనే నాలుగు వృత్తాల్లో వర్ణించాడు. విషయ గౌరవాన్నిబట్టి వృత్త స్వీకరణం గావించటం తిక్కన కవితావైశిష్ట్యానికి తార్కాణం. సాధారణంగా జాత్యుపజాతులను స్వీకరించే తిక్కన ఈ సందర్భంలో వృత్తాలను స్వీకరించటంలో ఛందస్సు ఔచిత్యాన్ని పాటించా డని చెప్పవచ్చును.

**క.** **ఈ నాలుగాశ్రమములకుఁ । బూని చొరందగినవాఁడు భూదేవుఁడు రా**
**జైనను వీనను వైశ్యుం । డేనియు వర్తించు శుద్ధ హృదయత కల్మిన్. 234**

**ప్రతిపదార్థం:** భూదేవుఁడు= బ్రాహ్మణుడైనా; రాజు+ఐనను= రాజైనా; వైశ్యుండు+ఏనియున్= వైశ్యుడైనా; ఈ నాలుగు+ఆశ్రమములకున్= ఈ నాలుగు ఆశ్రమాలకు; పూని= ప్రయత్నించి; చొరన్+తగినవాఁడు= స్వీకరించదగినవాడు; వీనను= వీటి యందు; శుద్ధ హృదయత కల్మిన్= పరిశుద్ధ హృదయ సంపదతో; వర్తించున్= నడచుకొంటాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడైనా, రాజైనా, వైశ్యుడైనా ఈ నాలుగు ఆశ్రమాలను స్వీకరించవచ్చును. స్వీకరించి తదుచితంగా హృదయనైర్మల్యంతో నడచుకొంటాడు.

**తే.** **సుమతిఁ ద్రైవర్ణికులకు శుశ్రూష సేసి । యాప్తసంతానుఁడయ్యు నిలాధినాథు**
**ననుమతంబున శూద్రున కాశ్రమాంత । రంబు తగుఁ గాదు యతి గాఁగ రాజముఖ్య! 235**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; సుమతిన్= మంచిబుద్ధితో; త్రైవర్ణికులకున్= మూడు వర్ణాలైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు; శుశ్రూష+చేసి= సేవ చేసి; ఆప్త సంతానుఁడు+అయ్యున్= సంతానవంతుడైనా; శూద్రునకున్= శూద్రుడికి; ఇలా+అధినాథు+అనుమతంబున్= రాజానుమతితో; ఆశ్రమ+అంతరంబు+తగున్= ఇతరాశ్రమాలైన బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాలను స్వీకరించవచ్చును; యతి+కాఁగన్ కాదు= సన్న్యాసాశ్రమ స్వీకారం తగదు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! బుద్ధిమంతుడై బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సేవచేస్తూ, సంతానవంతుడై రాజానుమతితో శూద్రుడు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాలను స్వీకరించవచ్చును. కానీ సన్న్యాసాశ్రమాన్ని మాత్రం స్వీకరించకూడదు.

**క.** **నిజధర్మవర్తి యగు స । ద్విజుఁ డగుఁ బాత్రంబు దాన విధి మఖముల క**
**ట్ల జనేశ్వర నృపముఖులకు । నిజవిత్తము లీయ మాననీయత కలుగున్. 236**

**ప్రతిపదార్థం:** జన+ఈశ్వర!= ఓ ధర్మరాజా!; నిజధర్మవర్తి+అగు= తన ధర్మాన్ని నిర్వర్తించే; సత్+ద్విజుఁడు= ఉత్తమ బ్రాహ్మణుడు; దాన విధి మఖములకున్= యజ్ఞ యాగాదులలో దానం స్వీకరించటానికి; పాత్రంబు= అర్హుడు; అగున్= అవుతాడు; అట్ల= అదేవిధంగా; నిజవిత్తములు+ఈయన్= తమ ధనాన్ని సద్బ్రాహ్మణులకు దానం చెయ్యటంవలన; నృపముఖులకున్= రాజశ్రేష్ఠులకు; మాననీయత+కలుగున్= ఖ్యాతి కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించే ఉత్తమ బ్రాహ్మణుడు యజ్ఞ యాగాదులలో దానం స్వీకరించటానికి అర్హుడౌతాడు. అట్లాంటి బ్రాహ్మణులకు తమ ధనాన్ని దానం చెయ్యటంవలన రాజశ్రేష్ఠులకు గౌరవం కలుగుతుంది.

**తే.** **వర్ణములు నాశ్రమంబులు వసుమతీశుఁ । డుక్తపథమున నడపించి యుభయలోక**
**సిద్ధి గనుఁ దప్పఁ ద్రొక్కని శిష్టజనులు । గల నరేంద్రున కింద్రుండుఁ దలఁప సరియె? 237**

**ప్రతిపదార్థం:** వర్ణములున్= చాతుర్వర్ణ్యాలు; ఆశ్రమంబులున్= నాలుగు ఆశ్రమాలు; వసుమతీ+ఈశుఁడు= రాజు; ఉక్త పథమునన్= ఈ చెప్పబడిన మార్గాలలో; నడిపించి= ప్రజలను నడిపించి; ఉభయ లోక సిద్ధి+కనున్= ఇహ పరలోకాలలో ప్రయోజనాన్ని పొందుతాడు; తలఁపన్= ఆలోచించగా; తప్పన్+త్రొక్కని= ఈ మార్గాలను వ్యతిరేకించని; శిష్టజనులు+కల= ఉత్తమ పౌరులు కలిగిన; నర+ఇంద్రునకున్= రాజుకు; ఇంద్రుఁడు= ఇంద్రుడైనా; సరియె?= సమానుడా? (కాడు).

**తాత్పర్యం:** నాలుగు వర్ణాల వారిని నాలుగు ఆశ్రమాల వారిని పైన పేర్కొన్న మార్గంలో నడిపించే రాజు ఇహ పర సుఖాలను పొందుతాడు. ఈ మార్గాలకు వ్యతిరేకంగా నడచుకోని ఉత్తమ పౌరులు గల రాజుకు ఇంద్రుడు కూడా సమానుడు కాడు.

**వ. అదియునుం గాక. 238**

**తాత్పర్యం:** అంతే కాకుండా - (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ఏనుంగు హజ్జలో నెల్ల సత్త్వంబుల । హజ్జలు నడఁగిన యట్ల పోలె;**
**రాజిత క్షత్ర ధర్మమునకు లోనయి । సర్వ ధర్మంబులుఁ జను మఖములు;**
**వేదంబులును శుభవృత్తంబులును దండ । నీతి మాసినఁ జెడు భూతలంబు;**
**సంస్కార రహితమై చాల హీనతఁ బొందు । నట్లైనఁ బ్రజకుఁ జే టావహిల్లు;**

**తే. రాజు లరసిన నెమ్మది బ్రదుకుఁ గాన । రాజు సర్వోత్తముఁడు; ధర్మరాజియందు**
**రాజధర్మంబ యెక్కుడు; రా జనంగ । ధర్మదేవత యన వేఱె ధర్మతనయ! 239**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ!= ఓ ధర్మరాజా!; ఏనుంగు హజ్జలోన్= ఏనుగు పాదముద్రలో; ఎల్లసత్త్వంబుల హజ్జలు= సమస్త ప్రాణుల అడుగులు; అడఁగిన+అట్లపోలెన్= కనబడకుండా పోయినట్లు; రాజిత= ప్రకాశిస్తున్న; క్షత్ర ధర్మమునకు లోనయి= రాజధర్మానికి లోబడి; సర్వధర్మంబులున్+చనున్= ఇతర సమస్త ధర్మాలు ప్రవర్తిస్తాయి; దండనీతి మాసినన్= దండనీతి చెడితే; మఖములు= యజ్ఞాలు; వేదంబులును= వేదాలు; శుభవృత్తంబులును= శుభకార్యాలు; చెడున్= నాశనమవుతాయి; భూతలంబు= భూమండలం; సంస్కార రహితము+ఐ= సంస్కారం లేకుండా; చాల హీనతన్+పొందున్= చాలా అల్పత్వాన్ని పొందుతుంది; అట్లు+ఐనన్= అట్లా జరిగితే; ప్రజకున్+చేటు+ఆవహిల్లున్= ప్రజలకు కీడు కలుగుతుంది; రాజులు+అరసినన్= రాజులు ప్రేమతో చూస్తే; నెమ్మదిన్ బ్రదుకున్+కానన్= ప్రజలు సంతోషంతో బ్రతుకుతారు కాబట్టి; రాజు; సర్వ+ఉత్తముండు= సర్వశ్రేష్ఠుడు; ధర్మరాజి+అందున్= ధర్మసమూహంలో; రాజధర్మంబు+అ+ఎక్కుడు= రాజధర్మమే గొప్పది; రాజు+అనంగన్= రాజన్నా; ధర్మదేవత+అనన్ వేఱె= ధర్మదేవత అన్నా వేరా? (వేరు కాదని భావం.)

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఏనుగు పాదముద్రలలో సమస్త ప్రాణుల అడుగులు అణగిపోయినట్లే విశిష్టరాజ ధర్మానికి సమస్త ధర్మాలు లోబడి ఉంటాయి. దండనీతి చెడితే వేదాధ్యయనం, యజ్ఞాచరణం, శుభకార్యాచరణలకు వినాశనం ఏర్పడుతుంది. ఈ భూమి అంతా సంస్కారరహితమై హీనస్థితిని పొందుతుంది. ప్రజలకు కీడు కలుగుతుంది. రాజు ప్రజలను ప్రేమతో పరిపాలిస్తే హాయిగా బ్రతుకుతారు. రాజు సర్వశ్రేష్ఠుడు. ఈ ధర్మా లన్నింటిలో రాజధర్మం శ్రేష్ఠమైనది. రాజంటే ధర్మదేవతే కాని వేరు కాదు.

**వ. ఆకర్ణింపుము. 240**

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! జాగరూకతతో వినుము - (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. తొల్లి మాంధాతృఁ డను మహీవల్లభుండు । విష్ణు సందర్శనము సేయ వేఁడి యొక మ**
**హాధ్వరము నిష్ఠమైఁ జేయ నమరవిభుఁడు । సన్నిహితుఁ డయ్యెఁ బ్రీతి నజ్జనవిభునకు. 241**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; మాంధాతృఁడు+అను మహీవల్లభుండు= మాంధాతృడనే మహారాజు; విష్ణు సందర్శనము+చేయన్ వేడి= విష్ణువును చూడగోరి; ఒక మహా+అధ్వరమున్= ఒక గొప్ప యజ్ఞాన్ని; నిష్ఠమైన్+చేయన్= మిక్కిలి నిష్ఠతో చేయగా; ఆ+జన

విభునకున్= ఆ రాజునకు; అమర విభుఁడు= దేవతల ప్రభువైన ఇంద్రుడు; ప్రీతిన్= సంతోషంతో; సన్నిహితుఁడు+అయ్యెన్= ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** పూర్వం మాంధాతృ డనే మహారాజు విష్ణువును చూడగోరి గొప్ప నిష్ఠతో ఒక మహా యజ్ఞాన్ని చేశాడు. ఆ రాజునకు ఇంద్రుడు ప్రీతితో ప్రత్యక్షమయ్యాడు.

**వ. అ ట్లింద్రుండు ప్రత్యక్షం బగుటయు. 242**

**తాత్పర్యం:** ఆ విధంగా దేవేంద్రుడు ప్రత్యక్షం కాగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అన్నరపాలుఁడు తానున్ । జన్నమునకు వచ్చినట్టి జగతీశులు భ**
**క్తి న్నమ్రు లైరి దేహము । లు న్నేలయు ముదము మనములుం గలయంగన్. 243**

**ప్రతిపదార్థం:** ఆ+నరపాలుఁడు= ఆ మాంధాతృ డనే మహారాజు; తానున్= తాను జన్నమునకు వచ్చినట్టి= యజ్ఞానికి వచ్చిన; జగతీ+ఈశులున్= రాజులు; భక్తిన్= భక్తి పూర్వకంగా; దేహములున్= శరీరాలూ; నేలయున్= భూమీ; ముదమున్= సంతోషమూ; మనములున్= మనస్సులూ; కలయంగన్= కలసిపోయేటట్లు; నమ్రులు+అయిరి= నమస్కరించారు.

**తాత్పర్యం:** ఆ మాంధాత, యజ్ఞానికి వచ్చిన రాజులూ తమకు ప్రత్యక్షమైన ఇంద్రుడికి భక్తితో సంతోషంగా సాష్టాంగ నమస్కారం చేశారు.

**వ. అట్లు దండ ప్రణామంబులు సేసి లేచి చేతులు మొగిచి నిలిచిన సురేంద్రుఁ డన్నరేంద్రునితో నిట్లనియె. 244**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; దండ ప్రణామంబులు+చేసి లేచి= సాష్టాంగ నమస్కారాలు చేసి లేచి; చేతులు మొగిచి= చేతులు జోడించి; నిలిచినన్= నిలబడగా; సుర+ఇంద్రుఁడున్= దేవేంద్రుడు; ఆ+నర+ఇంద్రునితోన్= ఆ మాంధాతృ మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా సాష్టాంగ నమస్కారాలు చేసి లేచి చేతులు జోడించి నిలబడగా ఆ దేవేంద్రుడు మాంధాతృ మహారాజుతో ఇట్లా అన్నాడు.

**ఆ. విష్ణుఁ జూడ నీవు వేడుక పడితి నా । కైన నజున కైన నరిది విష్ణు**
**దర్శనంబు నీదు తలఁ పెద్ది యెఱిగింపు; । మది యొనర్చెదను మహానుభావ! 245**

**ప్రతిపదార్థం:** మహానుభావ!= ఓ మహానుభావుడవైన మాంధాతా!; ఈవు= నీవు; విష్ణున్+చూడన్= విష్ణు సందర్శనం కొరకు; వేడుక పడితి(వి)= కుతూహల పడ్డావు; విష్ణు సందర్శనంబు= ఆ మహావిష్ణు దర్శనం; నాకున్+ఐనన్= నాకు గానీ (ఇంద్రుడికి); అజునకున్+ఐనన్= బ్రహ్మకుగానీ; అరిది= సులభసాధ్యం కాదు; నీ తలఁపు+ఎద్ది= నీ ఆలోచన ఏమిటి; ఎఱిఁగింపుము= తెలుపుము; అది+ఒనర్చెదను= ఆ తలపు నెరవేరుస్తాను.

**తాత్పర్యం:** 'ఓ మహానుభావా! మాంధాతా! నీవు విష్ణుసందర్శనానికి కుతూహలపడుతున్నావు. విష్ణుదర్శన మనేది నాకుగానీ, బ్రహ్మకుగానీ కష్టసాధ్యం. నీ ఆలోచన ఏమిటో చెప్పితే నేను నెరవేరుస్తాను'.

**క. అనవుడు సాంసారిక వ । ర్తన ముడుపుము, భైక్షచరణ తత్పరత మనం**
**బున దృఢముగ నొందింపుము । ననుఁ జరితార్థునిఁగఁ జేయు నావుడు నగుచున్. 246**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ఇంద్రుడు చెప్పగా; సాంసారిక వర్తనము+ఉడుపుము= నా సంసార జీవితాన్ని తొలగించు; భైక్షచరణ తత్పరతన్= భిక్షమెత్తి జీవించే ఆసక్తిని; మనంబునన్= నా మనసులో; దృఢముగన్+ఒందింపుము= స్థిరీకరించుము; ననున్+చరితార్థు నిగన్+చేయు= నన్ను కృతార్థుడిగా చేయుము; నావుడున్= అని మాంధాత పలుకగా; నగుచున్= ఇంద్రుడు నవ్వుతూ.

**తాత్పర్యం:** అప్పుడు మాంధాత ఇంద్రుడితో సంసార జీవితాన్ని తొలగించి బిచ్చమెత్తుకొని జీవించే ఆసక్తిని మనసులో స్థిరీకరించి కృతార్థుడిగా చేయవలసిందని కోరుకొన్నాడు. ఆ సమయంలో ఇంద్రుడు నవ్వుతూ ఇట్లా అన్నాడు.

**మ. 'ధరణీశా! నృపధర్మ ముత్తమము సద్ధర్మంబులం దెల్ల నే**
**తెరువున్ రా జరయంగఁ గాదె తగ సిద్ధిం బొందుఁ గామంబుఁ గ్రో**
**ధరయంబున్ మగిడించి దండము సమత్వవ్యాప్తిఁ జెల్లించుచున్**
**ధరఁ బాలించిన రాజు వొందుగతిఁ బొందన్ శక్యమే యేరికిన్? 247**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశా!= ఓ రాజా!; సత్+ధర్మంబులందున్+ఎల్లన్= అన్ని ఉత్తమ ధర్మాలలోను; నృప ధర్మము= రాజధర్మం; ఉత్తమము= శ్రేష్ఠమైనది; ఏ తెరువున్= ఏ మార్గమైనా; రాజు+అరయంగన్+కాదె= రాజు రక్షిస్తేనే కదా; తగన్= తగిన విధంగా; సిద్ధిన్+పొందున్= ఫలవంతమవుతుంది; కామంబు= కామాన్ని; క్రోధరయంబున్= కోపావేశాన్ని; మగిడించి= అణచిపెట్టి; దండము= దండనీతిని; సమత్వ వ్యాప్తిన్+చెల్లించుచున్= సమదృష్టితో చేస్తూ; ధరన్+పాలించిన రాజు= రాజ్యమేలిన రాజు; పొందుగతిన్= పొందే మార్గాన్ని పొందటం; ఏరికిన్= ఎవరికైనా; శక్యమే?= సాధ్యమా? (సాధ్యం కాదని భావం).

**తాత్పర్యం:** 'ఓ మాంధాతా! అన్ని ధర్మాలలోనూ రాజధర్మమే శ్రేష్ఠమైనది. ఏ రీతిగా చూసినా ప్రజలను ప్రేమతో పాలిస్తేనే రాజు ఉత్తమసిద్ధి పొందుతాడు. కామక్రోధాలను వర్జించి, దండనీతిని సమంగా అమలు చేస్తూ రాజ్యమేలే రాజు పొందే ఉత్తమగతి ఇతరులకు సాధ్యం కాదు'.

**వ. అని పలికి పురందరుం డందఱు రాజులం గలయం గనుంగొని. 248**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; పురందరుండు= ఇంద్రుడు; అందఱు రాజులన్= అక్కడున్న రాజులందరినీ; కలయన్+కనుంగొని= పరిశీలనగా చూచి.

**తాత్పర్యం:** అని చెప్పి ఇంద్రుడు అక్కడున్న రాజులందరిని చూచి - (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'లోకపాలాత్మ్మలరు మీరు మీకు భైక్ష। చరణ మర్హమే? ప్రజఁ బ్రోపు సమరముక్త**
**దేహు లగుటయు నమ్మేలు తెచ్చు సంశ। యంబు; వలవదు మీ పద మధికతరము. 249**

**ప్రతిపదార్థం:** మీరు= మీరంతా; లోక పాల+ఆత్ములరు= లోక పాలకుల అంశలతో పుట్టారు; మీకున్; భైక్షచరణము+అర్హమే?= భిక్షాటనం తగిందా?; ప్రజన్= ప్రజలను; ప్రోపు= సంరక్షించటమూ; సమరముక్త దేహులు+అగుటయున్= యుద్ధంలో మరణించే శరీరం కలిగిన వారు కావటంవలన; ఆ+మేలు+తెచ్చున్= ఆ మంచిని చేకూరుస్తాయి; సంశయంబు వలవదు= సందేహించవద్దు; మీ పదము+అధిక తరము= మీ రాజ పదవి శ్రేష్ఠతరమైనది.

**తాత్పర్యం:** మీరు పాలకస్వరూపులు. మీకు భిక్షాచరణం తగదు. ప్రజారక్షణం, యుద్ధంలో శరీరత్యాగం, మీకు

శుభప్రదం. ఇందులో సందేహం లేదు. మీ స్థానం చాలా గొప్పది.

**వ. అని చెప్పి దేవేంద్రుండు దివంబునకుం జనియె. 250**

**తాత్పర్యం:** అని తెలిపి దేవేంద్రుడు స్వర్గలోకానికి వెళ్ళాడు.

**చ. అది యొకఁడేల వేదములయందుఁ బురాణములం బ్రసిద్ధకో**
**విదులు బహుప్రదేశముల వేమఱుఁ గాంచి మనుష్యులెల్ల భూ**
**మిదయితుకంటెఁ దక్కువ యమేయ సుధర్మము లీడుగావు ని**
**ర్మదకృత దండనీతి కనరా మనమెల్ల వినంగ నెప్పడున్. 251**

**ప్రతిపదార్థం:** అది+ఒకఁడు+ఏల= అంతేకాదు; వేదముల+అందున్= వేదాలలోనూ; పురాణములన్= పురాణాలలోనూ; ప్రసిద్ధకోవిదులు= ప్రసిద్ధ పండితులు; బహు ప్రదేశములన్= పలుప్రాంతాలలో; వేమఱున్+కాంచి= అనేక పర్యాయాలు గమనించి, మనుష్యులు+ఎల్లన్= మానవులంతా; భూమిదయితు కంటెన్+తక్కువ= రాజుకంటె తక్కువవారు; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; నిర్మదకృత దండనీతికిన్= అహంకార రహితమైన దండనీతికి; అమేయ= కొలతకందని; సుధర్మములు= ఉత్తమధర్మాలు; ఈడు+కావు= సమానం కావని; మనము+ఎల్లన్ వినంగన్= మనమంతా వినే విధంగా; అనరా= చెప్పలేదా?

**తాత్పర్యం:** అంతేకాదు. వేదాలలో, పురాణాలలో, ఇంకా పలుచోట్ల ప్రసిద్ధ పండితులు అనేక పర్యాయాలు పరిశీలించి మానవులంతా రాజుకంటె తక్కువ అని చెప్పారు. మన కందరికీ స్పష్టమయ్యేటట్లు అహంకారరహితమైన దండనీతికి ఇతర ఉత్తమధర్మాలు సమానం కావని చెప్పగా వినలేదా?

**ఉ. కావునఁ గామరోషములఁ గ్రాఁచుచు నాశ్రమకోటిఁ గాచుచున్**
**భూవలయ ప్రజన్ సమతఁ బ్రోచుచు రాజ్యముసేఁత మేలు; భి**
**క్షావిధి లోనుగాఁ గలుగు సారపు ధర్మములన్ ఘటించు మేల్**
**వావిరి నప్రయత్నమున వానికి వచ్చు నృపాల! యెమ్మెయిన్. 252**

**ప్రతిపదార్థం:** నృపాల!= ఓ ధర్మరాజా!; కావునన్= కాబట్టి; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; కామ రోషములన్+క్రాఁచుచున్= కామక్రోధాలను దహిస్తూ; ఆశ్రమకోటిన్+కాచుచున్= ఆశ్రమ ధర్మాలను రక్షిస్తూ; భూవలయ ప్రజన్= భూ మండలంలోని ప్రజలను; సమతన్+ప్రోచుచున్= దండనీతితో సమానంగా పోషిస్తూ; రాజ్యము+చేఁత= రాజ్యాన్ని పాలించటం; మేలు= మంచిది; భిక్షావిధి లోనుగాన్+కలుగు= భిక్షాటనం మొదలైన వాటివలన కలిగేది; సారము+ధర్మములన్= శ్రేష్ఠమైన ధర్మాలతో; ఘటించు= కలిగే; మేల్= శుభం; వావిరి= క్రమంగా; అప్రయత్నమునన్= ప్రయత్నం లేకుండానే; వానికిన్ వచ్చు= ఆ రాజుకు చేకూరుతుంది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! కామక్రోధాలను దహించి ఆశ్రమధర్మాలను రక్షిస్తూ ప్రజలను దండనీతితో సమంగా కాపాడుతూ రాజ్యం చేయటం మంచిది. భిక్షాటనం మొదలైన శ్రేష్ఠమైన ధర్మాలవలన సమకూరే శ్రేయస్సు క్రమంగా అనుకోకుండా రాజుకు లభిస్తుంది.

**విశేషం:** తిక్కన శైలి క్రమక్రమంగా ఉన్నతోన్నతమైనట్లు ఈ పద్యం నిరూపిస్తున్నది. అంత్యప్రాసలతో చెప్పదలచుకొన్న అభిప్రాయాన్ని స్పష్టం చేస్తున్న దీ పద్యం. 'సారపుధర్మములన్' అనే ప్రయోగం చేసి మరొక్కసారి శ్రీకృష్ణ రాయబార ఘట్టంలో శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో రాజధర్మాన్ని గూర్చి చెప్పే సందర్భంలోని 'సారపుధర్మమున్ విమల సత్యము. . . .' అనే పద్యాన్ని గుర్తుచేసి రాజధర్మ విశిష్టతను తిక్కన సోదాహరణంగా వివరించాడు.

**చ. అతిథుల దీనకోటుల ధనార్థిత లేని యతివ్రజంబు స**
**మ్మతిఁ బరికింపు హర్ష మదమాన విషాదములం జొరంగ నీ**
**క తొలఁగఁ ద్రోవు నా యొడలు గావక భూప్రజఁ గాతు న న్విని**
**శ్చిత దృఢ బుద్ధి గల్గు మిది చేయు సమస్త సుధర్మసిద్ధులన్.' 253**

**ప్రతిపదార్థం:** అతిథులన్= అతిథులనూ; దీనకోటులన్= దీన జన సమూహాలనూ; ధన+అర్థిత లేని= ధనాన్ని కోరని; యతి వ్రజంబున్= సన్న్యాసుల సమూహాన్ని; సమ్మతిన్+పరికింపు= మంచి మనసుతో చూడుము; హర్ష= సంతోషం; మద= మదం; మాన= అభిమానం; విషాదములన్+చొరంగనీక= దుఃఖం మొదలైన వాటిని మనసులో ప్రవేశించనీయకుండా; తొలఁగన్+త్రోవు(ము)= తోసిపుచ్చుము; నా+ఒడలు+కావక= నా శరీర సంరక్షణ కాక; భూ ప్రజన్+కాతున్= భూ ప్రజల్ని రక్షిస్తాను; అనే; వినిశ్చిత దృఢబుద్ధిన్= నిశ్చితమూ స్థిరమూ అయిన మనస్సును; కల్గుము= కలిగి ఉండుము; ఇది= ఈ పద్ధతి; సమస్త సుధర్మ సిద్ధులన్= అనేక ఉత్తమ ధర్మాలవలన కలిగే ప్రయోజనాన్ని; చేయున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** అతిథులనూ, దీనులనూ, యతీంద్రులనూ మంచిమనసుతో గమనించుము. సంతోషమూ, అహంకారమూ, అభిమానమూ, దుఃఖమూ అనేవాటిని మనసులోనికి రానీయకుండా తొలగించుము. 'నా శరీర సంరక్షణమే ముఖ్యం' అని భావించక 'ప్రజలను కాపాడతాను' అనే స్థిరసంకల్పంతో ఉండటంవలన సమస్త ఉత్తమధర్మనిర్వహణంవలన కలిగే ప్రయోజనం సిద్ధిస్తుంది.'

**వ. అనిన విని యజాతశత్రుండు 'మహాపురుషా! వర్ణాశ్రమ విధంబులుం దద్రక్షణంబు చొప్పును దాన వచ్చు పెంపును నెఱింగించితి; రాష్ట్ర జనంబు లెయ్యది యాచరించి సుఖు లగుదు; రెఱింగింపవే!' యని యడిగిన నమ్మహీకాంతునకు శాంతనవుం డిట్లనియె. 254**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విని; అజాతశత్రుండు= పుట్టని శత్రువులు గల ధర్మరాజు; మహాపురుషా!= పురుషోత్తమా!; వర్ణ+ఆశ్రమ విధంబులున్= వర్ణాశ్రమ ధర్మాలను; తద్+రక్షణంబు చొప్పును= వాటిని రక్షించే తీరునూ; దానన్= దానివలన; వచ్చు= కలిగే; పెంపును= ఆధిక్యాన్నీ; ఎఱింగించితి(వి)= తెలియజేశావు; రాష్ట్రజనంబులు= రాష్ట్ర ప్రజలు; ఏ+అది+ఆచరించి= దేన్ని చేసి; సుఖులు+అగుదురు= సుఖిస్తారో; ఎఱింగింపవే= తెలియజెప్పవే; అని+అడిగినన్= అని ప్రార్థించగా; ఆ+మహీకాంతునకున్= ఆ ధర్మరాజుతో; శాంతనవుండు+ఇట్లు+అనియెన్= భీష్ముడు ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పిన మాటలను విన్న ధర్మరాజు భీష్ముడితో 'వర్ణాశ్రమ ధర్మాలను, వాటి సంరక్షణ విధానాన్ని, దానివలన కలిగే ఫలితాన్ని తెలియజేశావు. ఇంకా రాష్ట్రప్రజలు ఏ కార్యాచరణంవలన సుఖాన్ని పొందుతారో తెలియజేయుము' అని ప్రార్థించగా, ధర్మరాజుతో భీష్ముడు ఇట్లా అన్నాడు.

### రాష్ట్ర జనుల కర్తవ్యధర్మములు భీష్ముఁడు ధర్మజునకుఁ దెలుపుట (సం. 12-67-2)

**సీ. రాజు నుత్తమగుణ భ్రాజిష్ణు నభిషిక్తుఁ। గావించుకొని, యెల్ల కార్యములును**
**దన్ముఖంబునఁ జెల్లఁ; దద్దయు సుఖముండఁ। బడయుదు; రొకఁడు భూపాలనంబు**
**సేఁతలేకున్న దుశ్చేష్టితు లై జను। లన్యోన్య దారధనాపహరణ**
**మాచరింతురు; మీల యట్టుల బలవంతు। లల్పులఁ దమకు నాహారములుగఁ**

**తే. గొండ్రు; భూపతిలేకున్న మండ్రె జనము?। లధిప! కృషి సేయుటయును బేహార మాడు**
**టయును గోరక్ష గావించుటయును మొదలు। గాఁగఁ బ్రదికెడు తెరువులు గాసిగావె! 255**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; ఉత్తమగుణ భ్రాజిష్ణున్= ఉత్తమ గుణాలచేత ప్రకాశించే రాజును; అభిషిక్తున్+కావించుకొని= రాజుగా అభిషేకించుకొని; ఎల్లకార్యములును= సమస్త కార్యాలనూ; తద్+ముఖంబునన్+చెల్లన్= ఆ రాజానుమతితో నెరవేరుతుండగా; తద్దయున్= మిక్కిలి; సుఖము+ఉండన్+పడయుదురు= సుఖంగా ఉంటారు; ఒకడు భూపాలనంబు+చేఁత లేకున్న= ఒకడు రాజ్యపాలనం చేయకపోతే (రాజు లేకపోతే); జనులు= ప్రజలు; దుశ్చేష్టితులు+ఐ= దుర్మార్గ వర్తనులై; అన్యోన్య= పరస్పరం; దార, ధన+అపహరణము+ఆచరింతురు= భార్యలను, ధనాన్ని దొంగిలిస్తారు; మీల+అట్టులన్= చేపల రీతిగా; బలవంతులు= బలం కలిగినవారు; అల్పులన్= బలహీనులను; తమకున్+ఆహారములుగన్+కొండ్రు= తమకు ఆహారంగా గ్రహిస్తారు; భూపతిలేకున్నన్= రాజు లేకుంటే; జనము= ప్రజలు; మండ్రె?= జీవిస్తారా?; కృషి+చేయుటయును= వ్యవసాయం చేయటమూ; బేహారము+ఆడుటయును= వ్యాపారం చేయటమూ; గోరక్ష కావించుటయును= ఆవులను కాపాడటమూ; మొదలుగాఁగన్= మొదలైన; బ్రదికెడు తెరువులు= జీవించే మార్గాలు; గాసి+కావె?= నాశనమవుతాయి కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఉత్తమగుణవిలసితుడైన రాజును అభిషేకించుకొని, ఆ రాజు మూలాన సమస్త కార్యాలను నిర్వర్తింపజేసికొంటూ ప్రజలు మిక్కిలి సుఖిస్తారు. రాజ్యపాలనం లేకపోతే ప్రజలు దుర్మార్గవర్తనులై పరస్పరం భార్యలను, ధనాన్ని దొంగిలించటం ప్రారంభిస్తారు. పెద్ద చేపలు చిన్న చేపలను మింగినట్లుగా బలవంతులు బలహీనులను ఆహారంగా గ్రహిస్తారు. రాజు లేకుండా ప్రజలు జీవించలేరు. వ్యవసాయమూ, వర్తకమూ, గోసంరక్షణమూ మొదలైన జీవనోపాధి మార్గాలు నాశనమవుతాయి.

**వ. వినుము. 256**

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వినుము.

**సీ. జను లొక్కతఱిఁ దొల్లి సమయంబుఁ దమలోనఁ। జేసి క్రూరతయు ము్రుచ్చిమియు ఱంకు**
**సైఁపక యట్టి దుర్జను నందఱును గూడి। శాసించువారుగాఁ జాలి తమకు**
**నధిపతియుఁగ నొరునాసపడక యుండి। నడవడి బహుకారణములఁ జిక్కు**
**వడిన, విషణ్ణులై బ్రహ్మఁగానఁగఁ బోయి। మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు**

**తే. వలయు రూపింపు; మాతని గొలిచి బ్రదుకు। వార మనుటయు, నజుఁడును వారి వలని**
**కరుణ మనువు నిరూపించె; నరు లసత్య। చరితు లని పాలనమునకుఁ జొరఁడ యతఁడు. 257**

**ప్రతిపదార్థం:** తొల్లి = పూర్వకాలంలో; ఒక్కతఱిన్= ఒకానొక సందర్భంలో; జనులు= ప్రజలు; తమలోనన్+సమయంబున్ చేసి= తమలో ఒక శపథంచేసి; క్రూరతయున్= క్రూరత్వమూ; ము్రుచ్చిమియున్= దొంగతనమూ; ఱంకున్= వ్యభిచారమూ; సైఁపక= సహించలేక; అట్టి దుర్జనున్= అట్లాంటి దుర్మార్గుడిని; అందరును+కూడి= అందరూ కలిసి; శాసించు వారుగాన్+చాలి= అదుపులో పెట్ట గలిగేవారుగా ఉండి; తమకున్+అధిపతియుఁగన్= తమకు ప్రభువుగా; ఒరున్+ఆసపడక+ఉండి= ఇతరు డెవ్వడిని ఇష్టపడక; నడవడి= వారి జీవితం; బహుకారణములన్= అనేక కారణాలవలన; చిక్కు+పడినన్= కష్టాలమయం కాగా; విషణ్ణులు+ఐ= దుఃఖితులై; బ్రహ్మన్+కానఁగన్+పోయి= బ్రహ్మను దర్శించటానికై వెళ్ళి; మాకున్; రక్షకుడుగన్= సంరక్షకుడుగా; మహిపుఁడు+ఒకఁడు వలయున్= ఒకరాజు కావాలి; రూపింపుము= చూపించుము; ఆతనిన్+కొలిచి= అతడిని సేవించి; బ్రదుకువారము= జీవిస్తాం; అనుటయున్= అని ప్రార్థించగా; అజుఁడును= బ్రహ్మ; వారి వలని కరుణన్= వారి మీది దయతో; మనువు నిరూపించెన్= మనువు మీ రాజని చూపించాడు; అతఁడు= ఆ మనువు; నరులు+అసత్య చరితులు+అని= మానవులు అసత్య జీవనులని; పాలనమునకున్+చొరడు= ప్రజలను పాలించటానికి ఇష్టపడ లేదు.

**తాత్పర్యం:** పూర్వకాలంలో ఒకానొక సమయంలో ప్రజలు తమలోనే ఉన్న క్రూరత్వం, దొంగతనం, వ్యభిచారం మొదలైన దుర్గుణాలను సహించక అట్లాంటి పనులను చేస్తున్న దుర్మార్గుడిని అందరూ కలిసి శాసించగలిగి ఉండి, తమకు ఇతరు లెవరూ రాజుగా ఉండ నవసరం లేదని భావించి కొంతకాలం ఉండి, వారి జీవితాలు అనేక కారణాలవలన కష్టాలకు లోను కాగా, దుఃఖితులై బ్రహ్మను దర్శించటానికి వెళ్ళారు. వెళ్ళి 'మాకు రక్షకుడుగా రాజు ఒకడు కావాలి. నిర్దేశించుము. అతడిని సేవించి మేము జీవిస్తాం' అని అనగానే బ్రహ్మ వారి మీద దయతో మనువు అనే రాజును చూపించాడు. నరులు అసత్య వర్తనులు కాబట్టి ఆ మనువు వారిని పాలించటానికి ఇష్టపడలేదు.

**వ. చొరకున్న నజ్జనంబు లమ్మహాత్మునితో 'నీకుం బుయిలోడ నేల? ప్రజలచేతఁ బశువులయందును బసిండిని నేఁ బది యగు నంశంబును, ధాన్యంబున దశమ భాగంబును భండారంబుగాఁ బుచ్చికొని శస్త్రోపజీవుల నెల్ల నీ వారిం జేసికొని బలవంతుండవై దుష్టనిగ్రహ శిష్ట ప్రతిపాలనం బాచరింపు; మే మందఱము ని న్ననుసరించి నీ పనుపు చేయంగల వార; మధర్మ వర్తనులు నీ చేతం జెడువారు; ధర్మవర్తనులు చేసిన ధర్మంబున నాఱవపాలు నిన్నుం జేరంగలయదిగా నొడంబడితి; మింద్రుండు దేవతల రక్షించు మాడ్కి' మమ్ము రక్షించుకొని సుఖంబుండు మనుటయు. 258**

**ప్రతిపదార్థం:** చొరకున్నన్= ఆ మనువు అంగీకరించకపోవటంతో; ఆ జనంబులు= ఆ ప్రజలు; ఆ+మహా+ఆత్మునితోన్= ఆ మహనీయుడైన మనువుతో; నీకున్+పుయిలోడన్+ఏల?= నీకు సంకోచమెందుకు?; ప్రజలచేతన్= ప్రజలవలన; పశువుల+అందును= పశువులలో; పసిండిని= బంగారంలో; ఏఁబది+అగు అంశంబును= సగభాగమూ; ధాన్యంబునన్= పండించిన పంటలో; దశమ భాగంబును= పదవవంతును; భండారముగాన్= ధనకోశం కొరకై; పుచ్చికొని= తీసికొని; శస్త్ర+ఉపజీవులన్+ఎల్లన్= ఆయుధాల వలన జీవించేవారినందరినీ; నీవారిన్+చేసికొని= నీ అధీనంలో ఉంచుకొని; బలవంతుండవు+ఐ= బలసంపన్నుడవై; దుష్టనిగ్రహ= దుష్టశిక్షణ; శిష్ట ప్రతిపాలనంబు+ఆచరింపుము= దుష్టశిక్షణా శిష్ట రక్షణమూ చేయుము; ఏము+అందరమున్= మేమందరమూ; నిన్ను+అనుసరించి= నీకు అనుగుణంగా నడిచి; నీపనుపు+చేయన్+కలవారము= నీ ఆజ్ఞను పాటిస్తూ ఉంటాం; నీ చేతన్= నీ వలన; అధర్మవర్తనులు= దుర్మార్గాలు చేసినవారు; చెడువారు= చెడిపోతారు; ధర్మవర్తనులు= ధర్మాన్ని పాటించేవారు; చేసిన= ఆచరించే; ధర్మంబునన్= ధర్మంలో; ఆఱవపాలు= ఆరోవంతు; నిన్ను+చేరన్+కలయదిగాన్= నీకు చెందే విధంగా; ఒడంబడితిమి= అంగీకరించాం; ఇంద్రుండు= దేవేంద్రుడు; దేవతలన్ రక్షించు మాడ్కిన్= దేవతల్ని రక్షించే విధంగా; మమ్ము రక్షించుకొని= మా సంరక్షణ చేస్తూ; సుఖంబు+ఉండుము+అనుటయున్= సుఖంగా ఉండుము అని చెప్పగా.

**తాత్పర్యం:** మనువు ప్రజలను పాలించటానికి అంగీకరించకపోవటంతో ఆ మహనీయుడితో ప్రజలు ఇట్లా అన్నారు. 'నీకు సంకోచమెందుకు? ప్రజల నుండి పశువులలోను, బంగారంలోనూ సగభాగం నీ సొత్తు. పంటలలో పదవ భాగాన్ని కోశంకొరకు గ్రహించి, ఆయుధాల వలన జీవించేవారి నందరినీ నీవారిగా చేసికొని బలవంతుడవై దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావించుము. మేమంతా నీ ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తాం. దుర్మార్గులు నీవలన నాశనమవుతారు. ధర్మాత్ములు చేసిన ధర్మంలో ఆరోవంతు నీకు చెందేటట్లు అంగీకరిస్తున్నాం. ఇంద్రుడు దేవతలను రక్షించే విధంగా మా రక్షణభారాన్ని స్వీకరించి సుఖంగా ఉండవలసింది' అని పలికారు.

**క. అతఁ డొడఁబడి యత్తెఱఁగున । నతిబలవంతుఁ డయి నీతి నంచిత మగు ను
ద్ధత విక్రమమునఁ దగ నీ । క్షితిఁ బాలించె; సుఖులై రశేష జనములున్. 259**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱఁగునన్= ఆ విధంగా; అతఁడు+ఒడఁబడి= ఆ మనువు అంగీకరించి; అతిబలవంతుఁడు+అయి= మిక్కిలి బలవంతుడై; నీతిన్= దండనీతితో; అంచితము+అగు= ఒప్పుతున్న; ఉద్ధత విక్రమమునన్= పరాక్రమాతిశయంతో; తగన్= తగినరీతిలో; ఈ క్షితిన్= ఈ భూమిని; పాలించెన్= పరిపాలించాడు; అశేష జనములున్= ప్రజలంతా; సుఖులు+ఐరి= సుఖంగా జీవించారు.

**తాత్పర్యం:** ఆ విధంగా మనువు అంగీకరించి మిక్కిలి బలవంతుడై నీతిబద్ధంగా పరాక్రమాతిశయంతో, తగిన రీతిలో ఈ భూమిని పాలించాడు. సమస్తప్రజలూ సుఖజీవనం గడిపారు.

**ఉ. కావున మేలు సేయదె జగజ్జనకోటికి రాజునాజ్ఞమైఁ**
**బోవుట; యాతనిం దగిన పూజలఁ దృప్తునిఁజేఁత; దేవసం**
**భావనఁ గొల్వ తండొకటఁబాడి తొఱంగిన సైఁచు టిట్లు సం**
**భావితుఁ జేయఁగా నతని పంపానరింతురు మ్రొక్కి శత్రులున్. 260**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; రాజు+ఆజ్ఞమైన్+పోవుట= రాజాజ్ఞ చొప్పున నడచుకొనటం; ఆతనిన్= ఆ రాజును; తగిన పూజలన్= అర్హమైన పూజలతో; తృప్తునిన్+చేఁత= సంతృప్తి పరచటమూ; దేవ సంభావనన్+కొల్వు= దైవంతో సమానంగా సేవించటమూ; అతండు= ఆ రాజు; ఒకటన్= ఏదైనా ఒక విషయంలో; పాడి+తొఱంగినన్= న్యాయం తప్పినా; సైఁచుట= ఓర్చుకొనటం; జగత్+జనకోటికిన్= భూ ప్రజ సమూహానికి; మేలు+చేయదె?= శుభకరం కాదా?; ఇట్లు= ఈ విధంగా; సంభావితున్+చేయఁగాన్= ప్రజలు రాజును గౌరవించగా; శత్రులున్= శత్రువులు కూడా; మ్రొక్కి= నమస్కరించి; అతని పంపు+ఒనరింతురు= ఆ రాజాజ్ఞను శిరసావహిస్తారు.

**తాత్పర్యం:** అందువలన రాజానుమతితో నడుచుకొనటం, ఆ రాజును తగిన పూజలతో సంతృప్తి పరచటం, దైవంతో సమానంగా సేవించటం, ఒకవేళ ఏదైనా విషయంలో న్యాయం తప్పినా సహించటం ప్రజలకు మేలే కలిగిస్తుంది. ఈ విధంగా ప్రజలు రాజును గౌరవిస్తే శత్రువులు సైతం వినమ్రులై అతడి ఆజ్ఞను శిరసా వహిస్తారు.

**క. తనవారు పెద్ద సేయని । మనుజేశు నరాతిజనులు మదిని సరకుగాఁ**
**గొన; రది భూప్రజ కొప్పదు । విను! కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. 261**

**ప్రతిపదార్థం:** విను= ఓ ధర్మరాజా! వినుము; తనవారు= తన రాజ్యంలోని ప్రజలే; పెద్ద+చేయని= గౌరవించని; మనుజ+ఈశున్= రాజును; అరాతి జనులున్= శత్రువులు కూడా; మదినిన్= మనసులో; సరకుగాన్+కొనరు= లెక్కచేయరు; అది= ఆ విధంగా రాజును గౌరవించక పోవటమనేది; భూ ప్రజకున్= ప్రజలకు; ఒప్పదు= తగదు; కావునన్= అందువలన; పతికిన్= రాజునకు; ప్రజలు వెఱచుట+ఒప్పున్= ప్రజలు భయపడటమే యుక్తం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! తన ప్రజలే గౌరవించని రాజును శత్రువులు ఏ మాత్రం లెక్క చెయ్యరు. రాజును గౌరవించకపోవటం ప్రజలకు ఉచితం కాదు. కాబట్టి రాజు అంటే ప్రజలు భయపడటమే సముచితం.

**తే. వాహనాసన శయ్యా నివాసములును, । భోజ్య గంధ మాల్యాంబర భూషణములు,**
**గుప్తియును నరపతికి నెక్కుడుగ వలయు । నను తలంపునఁ బ్రజలకు మనుట గుణము. 262**

**ప్రతిపదార్థం:** వాహన= వాహనం; ఆసన= పీఠం; శయ్యా= పడక; నివాసములును= గృహమూ అనేవి; భోజ్య, గంధ, మాల్య+అంబర భూషణములున్= ఆహార పదార్థాలు, చందనాది సుగంధాలు, పుష్పమాలలు,వస్త్రాలు,అలంకారాలు అనేవి; గుప్తియును= రక్షణమూ;

నరపతికిన్+ఎక్కుడుగన్ వలయున్= రాజుకు ఎక్కువ అవసరం; అను తలంపునన్= అనే ఆలోచనతో; మనుట= జీవించటం; భూజనుల గుణము= ప్రజల కుండవలసిన సద్గుణం.

**తాత్పర్యం:** వాహనాలు, సింహాసనాలూ, శయ్యాగృహాలూ, ఆహార పదార్థాలూ, చందనాది సుగంధద్రవ్యాలూ, పుష్పమాలలూ, వస్త్రాలంకారాలూ, రక్షణా రాజుకు మిక్కిలి అవసరమనే సద్భావనతో ప్రజలు జీవించటం అవసరం.

**చ. అతఁడును మందహాస సహితాలపనంబును, సత్యభాషణ**
**వ్రతమును, సంవిభాగ నిరవద్యతయున్, సమభావముం, గృత**
**జ్ఞతయు, జితేంద్రియత్వముఁ, బ్రసాద గుణంబును గల్గి భూమికిం**
**బితృసముఁడై విరోధి జన భీషణ సారత నొప్పఁ బెం పగున్.' 263**

**ప్రతిపదార్థం:** అతఁడును= ఆ రాజుకూడా; మందహాస సహిత= చిరునవ్వుతో కూడిన; ఆలపనంబును= సల్లాపమూ; సత్యభాషణ వ్రతమును= సత్యాన్ని చెప్పే నియమమూ; సంవిభాగ నిరవద్యతయున్= విభజించటంలో ఉత్కృష్టతా; సమభావమున్= అందరిపట్ల సమానమైన భావమూ; కృతజ్ఞతయున్= చేసిన మేలును మరచిపోకుండటమూ; జిత+ఇంద్రియత్వమున్= ఇంద్రియ నిగ్రహమూ; ప్రసాద ఫలంబును= ప్రసన్న గుణమూ; కల్గి= కలిగి ఉండి; భూమికిన్= భూమి ప్రజలకు; పితృసముఁడు+ఐ= తండ్రితో సమానమైన వాడై; విరోధి జన భీషణ= శత్రు ప్రజలకు భయాన్ని కలిగించే రీతిలో; సారతన్= బలంతో (శౌర్యంతో); ఒప్పన్= వెలుగొందితే; పెంపు+అగున్= గొప్పగౌరవం కలుగుతుంది (అభ్యున్నతి కలుగుతుంది).

**తాత్పర్యం:** రాజు చిరునవ్వుతో కూడిన సల్లాపం, సత్య భాషణ నియమం, భాగవిభజనలో ఔన్నత్యం, అన్నిటియందు అందరియందు సమభావం, కృతజ్ఞతా భావం, ఇంద్రియ నిగ్రహం, ప్రసన్న గుణం కలిగి ఉండి భూప్రజలను తండ్రితో సమానంగా చూస్తూ విరోధిజన భయంకరుడై ప్రకాశిస్తే అత్యంత గౌరవం కలుగుతుంది'.

**వ. అనుటయుం గౌంతేయాగ్రజుండు 'మనుష్యుల కెల్ల రా జధిపతియును దైవంబునుంగా విప్రులు చెప్పి; రట్లగుట యేమిటనో? యని యుండుదు;నది మీవలనం బ్రస్ఫుటంబుగా వింటి' నని పలికిన; గాంగేయుఁ 'డింకనుం జెప్పెదఁ దొల్లి వసుమనుం డను మానవేంద్రుండు నీవ పోలె వితర్కించి బృహస్పతి నడిగిన, నతం డతనికిఁ జెప్పిన భంగి యాకర్ణింపు' మని యిట్లనియె. 264**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు చెప్పగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీ పుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; మనుష్యులకున్+ఎల్లన్= మానవు లందరికీ; రాజు+అధిపతియును= రాజును ఏలికగాను; దైవంబునున్+కాన్= దేవుడుగాను; విప్రులు= బ్రాహ్మణులు; చెప్పిరి= చెప్పారు; అట్లు+అగుట+ఏమిటనో+అని+ఉండుదున్= అట్లా కావటం ఎందుకో అనే సందేహంతో ఉన్నాను; అది మీ వలనన్= అది మీ వలన; ప్రస్ఫుటంబుగాన్ వింటిని+అని పలికినన్= స్పష్టంగా విన్నానని చెప్పగా; గాంగేయుండు= భీష్ముడు; ఇంకనున్+చెప్పెదన్= ఇంకా చెప్తుతాను; తొల్లి= పూర్వం; వసుమనుండు+అను= వసుమనుడనే; మానవ+ఇంద్రుండు= మానవులలో శ్రేష్ఠుడైన రాజు; నీవపోలెన్= నీవలెనే; వితర్కించి= సందేహించి; బృహస్పతిన్+అడిగినన్= బృహస్పతిని అడుగగా; అతండు+అతనికిన్+చెప్పిన భంగిన్= ఆ బృహస్పతి వసుమను డనే రాజుకు చెప్పిన రీతిని; ఆకర్ణింపుము+అని= వినవలసిం దని; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'మానవులందరికీ రాజు ఏలిక మాత్రమే కాకుండా దైవస్వరూపుడని బ్రాహ్మణులు చెప్పారు. అ దేమిటో ఎందుకో అనే సందేహం ఉండేది. దానికి సమాధానంగా మీవలన స్పష్టంగా

తెలిసికొన్నాను' అని ధర్మరాజు పలికాడు. అప్పుడు భీష్ముడు 'ఇంకా వివరిస్తాను వినుము. పూర్వం వసుమనుడనే రాజు నీవలెనే వితర్కించి బృహస్పతిని ప్రశ్నించగా అతడు ఆ రాజుతో చెప్పిన విధానాన్ని తెలిసికొ'మ్మని ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**బృహస్పతి వసుమనుండను రాజునకుం జెప్పిన రాజధర్మ ప్రకారము (సం. 12-68-1)**

**తే. లోకములు లోక ధర్మంబులును నృపాల! । రాజ మూలముల్; రాజ విరహిత మైన**
**పుడమి జనులకు నింకిన మడువులోని । జలచరంబులు పడుపాటు సంభవిల్లు. 265**

**ప్రతిపదార్థం:** నృపాల!= ఓ ధర్మరాజా!; లోకములున్= జగాలు; లోకధర్మంబులును= లోకాలలో అనుసరించబడే ధర్మాలు; రాజమూలముల్= రాజుపై ఆధారపడి ఉంటాయి; రాజ విరహితము+ఐన= రాజు లేకుండా పోతే; పుడమి జనులకున్= భూ ప్రజలకు; ఇంకిన మడువులోని= నీరు ఇంకిపోయిన చెరువులోని; జలచరంబులు= నీటిలోని ప్రాణులైన చేపలు; పడుపాటు= పడే కష్టం; సంభవిల్లున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! లోకాలు, లోకధర్మాలు అనేవి రాజుమీద ఆధారపడి ఉంటాయి. రాజు లేకపోతే భూ ప్రజలకు నీ రింకిపోయిన మడుగులోని జలచరాలకు కలిగే కష్టం కలుగుతుంది.

**విశేషం:** అలం: నిదర్శన.

**క. తరణి శశాంకులతేజ । స్స్ఫురణము లేకున్న యట్లు భూజనములు ని**
**ర్భర దురితతఁ జేడ్పడుదురు । నరపాలక విహిత పాలనము లేకున్నన్. 266**

**ప్రతిపదార్థం:** నరపాలక విహిత పాలనము= రాజు విధించిన పరిపాలనం; లేకున్నన్= లేకపోతే; తరణి శశాంకుల= సూర్యచంద్రుల యొక్క; తేజః+స్ఫురణము లేకున్న+అట్లు= కాంతి స్ఫూర్తి లేని రీతిగా; భూజనములు= ప్రజలు; నిర్భరదురితతన్= అత్యంత పాపంతో; చేడ్పడుదురు= బాధలకు గురి అవుతారు.

**తాత్పర్యం:** రాజు విధించే పరిపాలనం లేకుండా పోతే సూర్యచంద్రుల వెలుగులు లేకపోయిన రీతిగానే ప్రజలు మిక్కిలి పాపంతో బాధలకు గురి అవుతారు.

**విశేషం:** అలం: నిదర్శన.

**క. తనధన మిదియని యూఱడి । మనఁ బరిణయ మాదియైన మహితోత్సవముల్**
**కొనియాడ నెవ్వరికి వ । చ్చునె? జనపాలుండు లేనిచో నిర్భయతన్. 267**

**ప్రతిపదార్థం:** జనపాలుండు లేనిచోన్= రాజు లేకుంటే; నిర్భయతన్= భయరహితంగా; ఇది తన ధనము+అని= ఇది తన ధనమని; ఊఱడి= ఉపశమించి; మనన్= బ్రతకటానికి; పరిణయము+ఆది+ఐన= వివాహం మొదలైన; మహిత+ఉత్సవముల్= గొప్ప ఉత్సవాలు; కొనియాడన్= ప్రశంసించటానికి; ఎవ్వరికిన్+వచ్చునె!= ఎవరికైనా సాధ్యమా!

**తాత్పర్యం:** రాజు లేకుండాపోతే నిర్భయంగా ఇది తన ధనమని, ప్రశాంతంగా జీవించటానికిగాని, వివాహాది శుభకార్యాలను మహోత్సాహంతో చేసి ప్రశంసించటానికి గాని ఎవరికీ సాధ్యం కాదు.

**తే. విభుఁడు లేకున్న జనములు సభయ హృదయు । లగుచు హాహా నినాదంబు లడరఁ దల్ల**
**డిల్లుదురు; రాజు లేమియ యెల్లవారు । లేమి; కల్మియ కల్మి దుర్లేపరహిత! 268**

**ప్రతిపదార్థం:** దుర్లేప రహిత!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; విభుఁడు లేకున్నన్= రాజు లేకపోతే; జనములు= ప్రజలు; సభయ హృదయులు+అగుచున్= భయంతో కూడిన మనస్సులు కలవారై; హాహా నినాదంబులు+అడరన్= హాహాకారాలు చేస్తూ; తల్లడిల్లుదురు= సంక్షోభం పొందుతారు; రాజు లేమియ= రాజు లేకపోవటమనేదే; ఎల్లవారు లేమి= అందరూ లేకపోవటమే; కల్మియ= రాజును కలిగి ఉండటమే; కల్మి= నిజమైన సంపద.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడవైన ధర్మరాజా! రాజు లేని రాజ్యంలో ప్రజలు భయాందోళనలతో కూడిన హృదయాలు కలవారై, హాహాకారాలు చేస్తూ తల్లడిల్లి పోతారు. రాజు లేకపోవటం అంటే బంధుమిత్రాదులు లేనట్లే; రాజు ఉంటే అందరూ ఉన్నట్లే.

**క.** **యాగములును, భోగములును, । ద్యాగములును, బహువిధముల ధర్మములు మహా**
**భాగా! నరపతి రక్షా । యోగంబునఁ జెల్లుఁ బ్రజకు నుల్లాసముగన్.** **269**

**ప్రతిపదార్థం:** మహాభాగా!= గొప్ప భాగ్యవంతుడవైన ఓ ధర్మరాజా!; నరపతి రక్షా యోగంబునన్= రాజ సంరక్షణ మనే అదృష్టం వలన; యాగములున్= యజ్ఞాలు; భోగములును= సర్వభోగాలు; త్యాగములును= దానం చేయటం మొదలైన విడుపులు; బహువిధముల ధర్మములున్= పలువిధా లైన ధర్మాలు; ప్రజకున్= ప్రజలకు; ఉల్లాసముగన్= ఉత్సాహంతో కూడి; చెల్లున్= ఒప్పుతాయి.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజసంరక్షణ అనే అదృష్టం లభిస్తే ప్రజలకు యజ్ఞయాగాలు, భోగభాగ్యాలు, దానత్యాగాలు, పలురీతుల ధర్మాలు ఆనందోత్సాహంతో సమకూరుతాయి. అప్పుడు వారంతా ఆనందంగా జీవిస్తారు.

**విశేషం:** భోగాలు ఎనిమిది విధాలు: గృహం, శయ్య, వస్త్రం, ఆభరణం, స్త్రీ, పుష్పం, గంధం, తాంబూలం. ఇవి ప్రవృత్తి భోగాలు. అట్లాగే నివృత్తి భోగాలు ఉన్నాయి.

**క.** **ఒకరునికి నలిగి యాతని । సకల హిరణ్యంబు రత్న సంచయమును బు**
**చ్చుకొనుం, దనవలచిన వా । నికి నిచ్చు ధనేశుఁ డండ్రు నృపు నట్టితఱిన్.** **270**

**ప్రతిపదార్థం:** ఒకరునికిన్+అలిగి= రాజు ఒకానొక శత్రు రాజుపై కోపించి; ఆతని= అతడియొక్క; సకల హిరణ్యంబున్= బంగారాన్నంతటినీ; రత్న సంచయమును= రత్నరాశినీ; పుచ్చుకొనున్= స్వాధీనం చేసికొంటాడు; తన వలచిన వానికిన్+ఇచ్చున్= తాను (ఆ రాజు) తనకు ఇష్టుడైన వాడికి అనుగ్రహిస్తాడు; అట్టి తఱిన్= ఆ సమయంలో; నృపున్= రాజును; ధన+ఈశుఁడు+అండ్రు= ధనానికి అధిపతి అయిన కుబేరుడని (ఆర్యులు) అంటారు.

**తాత్పర్యం:** రాజు ఒకానొక శత్రువుపై ఆగ్రహించి వాడి సమస్త సంపదనూ రత్నరాసులనూ స్వాధీనం చేసికొని, తనకు ఇష్టమైనవాడికి అనుగ్రహిస్తాడు. ఆ సందర్భంలో రాజును కుబేరు డని పెద్దలు అంటారు.

**తే.** **చారచక్షుండై కను నెల్ల జగము; నపుడు । సూర్యుఁ డండ్రు నరేంద్రు నకార్యకరులఁ**
**దునుము నయ్యెడ జముఁడు నాఁజను; నతండు । దేవతాత్మకుఁ డగుట సందియమె యధిప!** **271**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; నర+ఇంద్రున్= మానవశ్రేష్ఠుడైన రాజును; చారచక్షుఁడు+ఐ= చారు లనే (వేగులనే) కన్నులు కలవాడై; ఎల్ల జగమున్= సమస్త లోకాన్ని; కనున్= గమనిస్తాడు కాబట్టి; అపుడు= ఆ సందర్భంలో; సూర్యుఁడు+అండ్రు= సూర్యుడని

(విద్వాంసులు) అంటారు; అకార్యకరులన్= కాని పనులు చేసేవారైన దుర్మార్గులను; తునుమున్= సంహరిస్తాడు; ఆ+ఎడన్= ఆ సందర్భంలో; జముఁడునాన్+చనున్= యముడుగా పిలువబడతాడు; అతండు= అట్లాంటి రాజు; దేవతా+ఆత్మకుఁడు+అగుట= దైవస్వరూపుడు కావటంలో; సందియమె?= సందేహముంటుందా? (ఉండదు).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజు చారులనే కన్నులు కలిగి ఉండటంచేత చారచక్షు డని పిలువబడతాడు. అట్లాంటి చారచక్షువైన రాజు లోకాన్నంతటినీ జాగరూకుడై పరిశీలిస్తూ ఉంటాడు. అప్పుడు పెద్దలు రాజును సూర్యుడని ప్రశంసిస్తారు. దుర్మార్గులను సంహరించినప్పుడు రాజును యము డని విద్వాంసులు వక్కాణిస్తారు. కాబట్టి రాజు దైవస్వరూపుడు అనటంలో సందేహం ఉందా?

**విశేషం:** సర్వలోకసాక్షి సూర్యుడు. కనుకనే తిక్కన సూర్యప్రయోగం సార్థకం. యముడు సమవర్తి. అందుచేత రాజు దైవస్వరూపు డనటం తిక్కన విజ్ఞతకు ఔచిత్యానికి నిదర్శనం.

**క. వినుం నృప! సమ్రాట్టు విరా । ట్టనియెడు శబ్దములఁ బొగడు నాగమములు నె**
**ట్టన భూపాలకునన నా । తనిఁ దగ నర్చింపకుండఁ దగునె యొరులకున్? 272**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ ధర్మరాజా!; విను= జాగ్రత్తగా వినుము; సమ్రాట్టు= తన ఆజ్ఞతో రాజులను శిక్షించి రాజసూయయాగం చేసిన మండలేశ్వరుడు; విరాట్టు+అనియెడు= మిక్కిలి ప్రకాశించే వాడైన క్షత్రియుడు అనే; శబ్దములన్= మాటలచేత; భూపాలకున్= రాజును; నెట్టన= అనివార్యంగా; ఆగమములు= వేదాలు; పొగడున్+అనినన్= ప్రశంసిస్తున్నాయి అంటే; ఒరులకున్= ఇతరులకు అంటే పాలితులైన ప్రజలకు; అతనిన్= ఆ రాజును; తగన్= అర్హమైన రీతిలో; అర్చింపక+ఉండన్+తగునె?= పూజించకుండా ఉండటం సముచితమేనా? (కాదు).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజును విరాట్టు, సమ్రాట్టు అని వేదాలు అనివార్యంగా ఘోషిస్తున్నాయి. అట్లాంటి రాజును ప్రజలు అర్హమైన రీతిలో పూజించకుండా ఉండటం తగునా?

**విశేషం:** **'రాజా భోజా విరాట్సమ్రాట్ క్షత్రియో భూపతి ర్నృపః**

**య ఏభి స్తూయతే శబ్దైః కస్తం నార్చితు మర్హతి।**

అనే మూల శ్లోకానికి పై పద్యం తిక్కన అనువాదం తిక్కన 'రాజా, భోజః క్షత్రియః' అనే మాటలను వదలిపెట్టి 'విరాట్ సమ్రాట్టులను మాత్రం గ్రహించాడు. పై మూల శ్లోకానికి నీలకంఠ వ్యాఖ్య ఇట్లా ఉన్నది. 'రాజేతి రాజా రంజకః, భోజః భోజ్య సుఖానామ్ భోజయితా, వివిధం రాజత ఇతి విరాట్; శ్రీమాన్ సమ్రా డితి రాజ్ఞా మపి రాజ్యేz కుంఠి తైశ్వర్యః'

**క. నియతిమెయి నెవ్వఁ డింద్రియ । జయమును, భక్తియును, జిత్తసారము, దృఢ సం**
**శ్రయముఁ గలిగి కొలుచుం గృప । నయసంపన్నునిఁగఁ జేయు నధిపతి యతనిన్. 273**

**ప్రతిపదార్థం:** నృపున్= రాజును; ఎవ్వఁడు= ఎవడైతే; నియతిమెయిన్= నియమానుసారంగా; ఇంద్రియ జయమును= ఇంద్రియాలను జయించి; భక్తియును= భక్తిగలిగి; చిత్తసారమున్= మానసిక బలమైన; దృఢ సంశ్రయతయున్+కలిగి= స్థిరంగా ఆశ్రయించి; కొలుచున్= సేవిస్తాడో; అతనిన్= అట్లాంటివాడిని; అధిపతి= రాజు; నయసంపన్నునిఁగన్+చేయున్= నీతి సంపదగలవాడిగా సంపన్నుడిగా చేస్తాడు.

**తాత్పర్యం:** ఎవడు జితేంద్రియుడై, భక్తియుక్తుడై, దృఢచిత్తంతో రాజును ఆశ్రయించి నియమానుసారంగా సేవిస్తాడో, అట్లాంటివాడిని రాజు నీతిమంతుడిగా, సంపన్నుడిగా చేస్తాడు.

**విశేషం:** మూలంలోని మూడు శ్లోకాల భావాల్ని సంక్షిప్తీకరించి ముఖ్యాంశాల్ని తిక్కన ఈ కందంలో చెప్పాడు.

**క. రాజునకుఁ బ్రజ శరీరము; । రాజు ప్రజకునాత్మ; కాన రాజుం బ్రజయున్**
**రాజోత్తమ! యన్యోన్య వి । రాజితు లై యుండవలయు రక్షార్చనలన్.' 274**

**ప్రతిపదార్థం:** రాజ+ఉత్తమ!= రాజ శ్రేష్ఠుడ వైన ఓ ధర్మరాజా!; రాజునకున్= రాజుకు; ప్రజ శరీరము= ప్రజలు శరీరంవంటి వారు; రాజు; ప్రజకున్+ఆత్మ= ప్రజలకు ఆత్మవంటి వాడు; కానన్= అందువలన; రాజున్+ప్రజయున్= రాజు, ప్రజలు; రక్షా+అర్చనలన్= క్రమంగా సంరక్షణలోను; పూజించటం అంటే సేవించటంలోనూ; అన్యోన్య= పరస్పరం; విరాజితులు+ఐ= ప్రకాశిస్తూ; ఉండవలయున్= ప్రవర్తించాలి.

**తాత్పర్యం:** 'రాజశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా! ప్రజలు రాజుకు శరీరంవంటి వారు. ప్రజలకు రాజు ఆత్మవంటి వాడు. అందుచేత రాజు ప్రజలను సంరక్షించటంలోనూ, ప్రజలు రాజును సేవించటంలోనూ పరస్పరం విధ్యుక్త ధర్మాలను నెరవేరుస్తూ ప్రకాశించాలి.'

**విశేషం:** అలం: కావ్యలింగం, యథాసంఖ్యం.మూలంలో 'రాజా ప్రజానాం హృదయం గరీయః' అనే మాటలు మాత్రం ఉండగా, తిక్కన స్వతంత్రంగా ఈ పద్యాన్ని సంతరించి తన రాజకీయ చతురతను ప్రకటించుకొన్నాడు. హృదయానికీ ఆత్మకీ గల భేదాన్ని గమనించి ఆత్మ ప్రయోగం చేసి శరీరాత్మలకుగల సంబంధాన్ని ప్రజలకు రాజుకు గల సంబంధంగా నిరూపించాడు. ఆత్మ శరీరాన్ని రక్షించినట్లే శరీరం ఆత్మను పూజించవలసి ఉన్నది. అట్లాగే రాజుకు ప్రజలను సంరక్షించవలసిన బాధ్యత ఉన్నట్లే ప్రజలకు ఆత్మ అయిన రాజును సేవించవలసిన ధర్మం ఉన్నది. కాబట్టి శరీరాత్మలవలె ప్రజలూ రాజూ పరస్పరం ఆధారాధేయాలు. ఇంకా స్వతంత్రించి తిక్కన ' రాజునకు ప్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మ' అని సూక్తులవలె ప్రయోగించి తన సూక్తి వైచిత్రిని స్పష్టం చేశాడు. మూలానికి మెరుగులు దిద్దిన ఈ రచనలో తిక్కన నిగూఢార్థ రాజకీయ ప్రతిభాపాటవం విదితమవుతున్నది.

**వ. అని యిట్లు బృహస్పతి యుపదేశించినం గౌసల్యపతి యగు నవ్వసుమనుండు ప్రయత్నంబునం బ్రజాపాలనం బాచరించె నని చెప్పుటయు ధర్మనందనుండు 'రాజు జనపద పరిపాలనంబును శత్రువధంబును మొదలైన కృత్యంబులు నడుపు తెఱం గెఱింగింపవే!' యనుటయు భీష్ముం డి ట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= అని ఈ విధంగా; బృహస్పతి+ఉపదేశించినన్= బృహస్పతి రాజ ధర్మోపదేశం చేయగా; కౌసల్య పతి+అగున్+ఆ+వసుమనుండు= కోసల దేశాధిపతి అయిన ఆ వసుమనుడనే రాజు; ప్రయత్నంబునన్= ప్రయత్న పూర్వకంగా; ప్రజాపాలనంబు+ఆచరించెన్= ప్రజలను పాలించాడు; అని చెప్పుటయున్= అని భీష్ముడు చెప్పగా; ధర్మనందనుండు= ధర్మరాజు; రాజు= రాజు; జనపద పరిపాలనంబును= గ్రామీణ ప్రజలను పాలించే విధానమూ; శత్రువధంబును= శత్రువులను సంహరించే రీతి; మొదలైన కృత్యంబులు= మొదలైన కార్యాలను; నడపు తెఱంగు= నిర్వర్తించే విధానాన్ని; ఎఱింగింపవే= తెలియజేయుము; అనుటయున్= అని ప్రార్థించగా; భీష్ముండు+ఇట్లు+అనియెన్= భీష్ముడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** రాజనీతిని గూర్చి బృహస్పతి ఉపదేశించగా అదే రీతిలో వసుమనుడనే రాజు బహు జాగరూకుడై ప్రయత్నపూర్వకంగా రాజ్యపాలనం చేశాడని భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'రాజుగా జనపదాలను ఎట్లా పాలించాలి? శత్రుసంహారం ఎట్లా చెయ్యాలి? - మొదలైన కార్యాలను నిర్వహించే తీరును వివరించు' మని భీష్ముడిని ప్రార్థించాడు. అప్పుడు భీష్ముడు ధర్మరాజుకు ఇట్లా వివరించాడు.

**క. 'తనుఁ దాన తొలుత గెలువన్ । మనుజపతికి వలయుఁ; బిదప మార్తుర గెలువన్**
**మనమునఁ దలంచునది; మును । దను గెలువని పతికిఁ గెలువఁ దరమే పగఱన్. 276**

**ప్రతిపదార్థం:** మనుజపతికిన్= రాజునకు; తొలుతన్= మొట్టమొదట; తనున్+తాన= తనను తానే; గెలువన్ వలయున్= జయించవలసి ఉన్నది; పిదప= ఆ తరువాత (తనను తాను జయించిన వెనుక); మార్తురన్ గెలువన్= శత్రువులను జయించటాన్ని గూర్చి; మనమునన్= మనస్సునందు; తలంచునది= ఆలోచించవలసి ఉన్నది; మును= మొదటగా; తను గెలువని పతికిన్= తనను తాను జయించని రాజుకు; పగఱన్= శత్రువులను; గెలువన్+తరమే?= జయించటం సాధ్యమా?

**తాత్పర్యం:** రాజు మొట్టమొదట తన్ను తాను జయించుకొనాలి. అంటే ఇంద్రియనిగ్రహాన్ని సాధించవలసిన అవసరం ఉన్నది. రాజు తనను తాను జయించిన తరువాత శత్రువులను జయించాలి. ముందుగా తనను తాను జయించని రాజుకు శత్రువులను జయించటం సాధ్యం కాదు.

**విశేషం:** తనను తాను జయించటమంటే తనలోని శత్రువులైన అరిషడ్వర్గాలను జయించట మని అర్థం. అంతశ్శత్రువు లైన అరిషడ్వర్గాలను జయించినవాడు మాత్రమే బాహ్యశత్రువులను జయించగలుగుతాడు. అంటే ఇంద్రియనిగ్రహదక్షునికి మాత్రమే శత్రువులను జయించటం సాధ్యమవుతుందని అర్థం. మూలంలోని

> **"ఆత్మాజేయ స్సదా రాజ్ఞా తతో జేయాశ్చ శత్రవః**
> **అజితాత్మా నరపతిః విజయేత కథం రిపూన్"** (12-69-4) అనే శ్లోకానికి తిక్కన పై పద్యాన్ని కూర్చాడు.

**ఆ.** **వినుము! తన్ను గెలుచు టన వేఱొకండె? పం । చేంద్రియములఁ దూలనీక కొలఁది**
**నాఁగుటయ జితేంద్రియత్వంబు గల రాజు । రిపులఁ జెఱుపఁజాలు నృపవరేణ్య!** **277**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా! వినుము= జాగరూకుడవై వినుము; తన్నున్+గెలుచుట+అనన్= తనను తాను జయించటమంటే; పంచ+ఇంద్రియములన్= ఐదు ఇంద్రియాలను (త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము; ఇవి జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము - ఇవి కర్మేంద్రియములు); తూలనీక కొలఁదిన్+అగుటయ= చలించిపోనీక శక్యమయ్యేటట్లు ఆపటమే అంటే నిగ్రహించటమే కాని; వేఱు+ఒకండె?= మరొకటి కాదు; జిత+ఇంద్రియత్వంబు+కలరాజు= ఇంద్రియాలను జయించిన రాజు; రిపులన్= శత్రువులను; చెఱుపన్+చాలున్ నాశనం చేసి జయించగలుగుతాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! తనను తాను జయించట మంటే వేరేమీ కాదు. ఇంద్రియాలను జయించటమే. ఇదే రాజు కర్తవ్యం. అట్లాంటి ఇంద్రియనిగ్రహం కల రాజు శత్రు సంహారం చేసి విజయాన్ని సాధిస్తా డనటంలో సందేహం లేదు. కాబట్టి ఇంద్రియజయ మనేది రాజునకు తప్పనిసరి అయిన గుణం.

**క.** **ఆరామాదిక నిజ సం । చార స్థలములకు, దేశ సంధులకుఁ, బురీ**
**ద్వారములకు, నగరికిని ధ । రా రమణుఁ డొనర్ప వలయు రక్షలు నియతిన్.** **278**

**ప్రతిపదార్థం:** ధరారమణుఁడు= భూమికి భర్త అయిన రాజు; నియతిన్= నియమానుసారంగా (తప్పని సరిగా); ఆరామ+ఆదిక= ఉద్యానవనం మొదలైన; నిజసంచార స్థలములకున్= తన విహార ప్రదేశాలకు; దేశసంధులకున్= రాజ్యం సరిహద్దులకు; పురీద్వారములకున్= పురద్వారాలకు; నగరికిని= అంతఃపురానికి; రక్షలు= సంరక్షలు అంటే - ఎట్లాంటి శత్రుభయం లేకుండా రక్షణలు; ఒనర్పవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** తనకు సంచారయోగ్యాలైన ఉద్యానవనాలు, రాజ్యం సరిహద్దులు, పురద్వారాలు, అంతఃపురాలు మొదలైన అన్నిచోట్ల తగిన సంరక్షకులను నియమించి రాజు ఎల్లప్పుడు జాగరూకుడై సంరక్షించుకొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**తే. అరులకడ, నిజ భూమియం, దనుజ తనుజ। బాంధ వామాత్య మిత్రులపాల వేష**
**ధరుల వేగులఁగాఁ బెట్ట ధరణిపునకు। వలయు నొండొరు నెఱుఁగని వారిఁగాఁగ. 279**

**ప్రతిపదార్థం:** అరులకడన్= శత్రురాజ్యంలోనూ; నిజభూమియందున్= తన రాజ్యంలోనూ; అనుజ తనుజ బాంధవ+అమాత్య మిత్రుల పాలన్= సోదరులు, పుత్రులు, బంధువులు, అమాత్యులు, స్నేహితుల వద్ద; ఒండొరున్= ఒకరినొకరు; ఎఱుఁగనివారిన్+కాఁగన్= తెలియనివారుగా; వేషధరులన్= మారువేషాలను ధరించిన వారిని; వేగులన్+కాన్+పెట్టవలయున్= గూఢచారులుగా నియమించాలి.

**తాత్పర్యం:** శత్రురాజుల సన్నిధిలోనూ, తన దేశంలోను, సోదరులు, పుత్రులు, బంధువులు, మంత్రులు, మిత్రులు అయినవారి వద్ద ఒకరినొకరు గుర్తించని రీతిగా మారువేషాలలో వేగులవారిని నియమించి, వారి వారి రహస్యాలను గుర్తిస్తూ జాగరూకతతో రాజు మెలగాలి.

**క. తను హీనుం డని యెఱుఁగక। మును ప్రబలునితోడ శీఘ్రమున సంధానం**
**బొనరింప వలయు నతనికి। ధనం బొసఁగియైనఁ బతికిఁ దగు నిలఁ గావన్. 280**

**ప్రతిపదార్థం:** తను= తాను (రాజు); హీనుండు+అని+ఎఱుఁగక మును= శత్రువుల కంటె తాను బలహీనుడని శత్రువులు గ్రహించకముందే; ప్రబలునితోడన్= అత్యంత బలసంపన్నుడైన శత్రువుతో; శీఘ్రమునన్= వెంటనే; సంధానంబు+ఒనర్పన్ వలయున్= సంధిచేసికొనాలి; అతనికిన్= ఆ శత్రువుకు; ధనంబు+ఒసఁగి+ఐనన్= ధనమిచ్చి అయినా; ఇలన్+కావన్= తన రాజ్యాన్ని రక్షించటం; పతికిన్+తగున్= రాజునకు తగిన ధర్మం.

**తాత్పర్యం:** తాను బలహీనుడని శత్రువులు గ్రహించకముందే, తనకంటె బలవంతు డైన శత్రువుతో వెనువెంటనే సంధిచేసికొనటం అవసరం. చివరకు శత్రువుకు ధన మిచ్చి అయినా సరే - తన రాజ్యాన్ని సంరక్షించుకొనటం రాజధర్మం.

**విశేషం:** సామ దాన భేద దండోపాయాలలో శత్రువులకంటె తాను బలహీనుడని గుర్తించినప్పుడు సామోపాయం ప్రధానమైనది. దానికి శత్రువు లొంగకపోతే దానోపాయంతో శత్రువును జయించాలని రాజనీతిలో వివరించబడింది.

**క. మత్తుఁ బ్రమత్తుని విషయా। యత్తుని దుర్బలునిఁ జూచి యట్టి పగతుపై**
**నెత్తునది, శిఖి విషాదుల। నుత్తల పెట్టునది యతని యుర్విఁ గడంకన్. 281**

**ప్రతిపదార్థం** మత్తున్= మదించిన వాడిని; ప్రమత్తునిన్= మిక్కిలి మత్తుడైన వాడిని; విషయ+ఆయత్తునిన్= విషయసుఖాలకు అధీనుడైన అంటే విషయలోలుడైన వాడిని; దుర్బలునిన్+చూచి= బలహీనుడిని పరిశీలించి; అట్టి పగతునిపైన్= అట్లాంటి శత్రువుపై; ఎత్తునది= దండెత్తిపోయి యుద్ధంచేయాలి; కడంకన్= ప్రయత్నంతో; అతని+ఉర్విన్= ఆ శత్రురాజ్యాన్ని; శిఖివిషాదులన్= అగ్ని, విషం మొదలైన వాటిచేత; ఉత్తల పెట్టునది= కలత చెందించాలి.

**తాత్పర్యం:** శత్రువు విషయలోలుడై మదించి మైమరచి ఉండగా గుర్తించి అట్లాంటి బలహీనుడిపై దండెత్తాలి. మిక్కిలి ప్రయత్నించి ఆ శత్రురాజ్యానికి నిప్పుపెట్టి, విషప్రయోగం చేసి అత్యంత సంక్షోభంలో ముంచి వేయాలి.

**ఆ. కయ్యమునకు వలదు కాల్ద్రవ్వనధిప! సా। మమున భేదమునను మార్తు మనము**
**మెత్తఁ జేసి చెఱిచి మెయివడిఁ దప్పించు। కొనుతెఱం గెఱింగికొనుట మేలు. 282**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; కయ్యమునకున్= యుద్ధానికి; కాల్రువ్వన్ వలదు= కారణం లేకుండా యుద్ధానికి సిద్ధం కావద్దు; మార్తుమనమున్= శత్రువుయొక్క మనస్సును; సామమునన్ భేదమునన్= సామదానభేద దండోపాయాలనే నాలుగు ఉపాయాలలోనూ సామంవలన గాని, భేదంవలనగాని; మెత్తన్+చేసి= లొంగేటట్లు చేసి; చెఱిచి= నాశనం చేసి; మెయివడిన్= ఆనుకూల్యంతో; తప్పించుకొను తెఱంగు= శత్రువునుంచి తప్పించుకొనే మార్గం; ఎఱింగికొనుట మేలు= తెలిసికొనటం మంచిది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! అనవసరంగా యుద్ధానికి సిద్ధపడకూడదు. ఒకవేళ యుద్ధమే అవసర మనిపిస్తే సామదాన భేద దండోపాయాలలో సామంవలనగాని లేదా భేదోపాయంవలనగాని శత్రువును నయాన భయాన వశంచేసికొని నాశనంచేసి ఆనుకూల్యంతో శత్రువునుంచి తప్పించుకొనే మార్గాన్ని గుర్తించటం మంచిది.

**చ.** **జనకుఁడుఁబోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్ఠభాగముం**
**గొనునది; వారిచేత నరిఁ గోటి విధంబుల నాప్తదక్షులం**
**గని వన గోకులాకర నగ ప్రముఖార్థకరంబు లారయం**
**బనుచుచు నన్నిటన్ ధరణిపాలుఁడు కన్నిడియున్నఁ బెంపగున్.** **283**

**ప్రతిపదార్థం:** ధరణి పాలుఁడు= రాజు; ప్రజన్= ప్రజలను; జనకుఁడున్+పోలెన్= తండ్రివలె; అర్మిలిన్= ప్రేమతో; పరికించుచున్= చూస్తూ; వారిచేతన్= వారి నుండి; అరిన్= పన్నును; షష్ఠభాగమున్+కొనునది= వారి ఆదాయంలో ఆరవభాగం మాత్రమే తీసుకొనేది; కోటివిధంబులన్= అనేక రీతులలో; ఆప్త దక్షులన్+కని= ఆత్మీయులైన వారిలో సమర్థులైన వారిని తెలిసికొని (గుర్తించి); వనగోకుల+ఆకర ప్రముఖ+అర్థకంబులు= అరణ్యాలు, గో సమూహాలు, గనులు మొదలైన ధనా న్నిచ్చే వాటిని; ఆరయన్+పనుచుచున్= పరిపాలించటానికి నియోగిస్తూ; అన్నిటన్= అన్ని వ్యవహారాలను; కన్ను+ఇడి+ఉన్నన్= కనిపెట్టి ఉండటం వలన; పెంపు+అగున్= అభివృద్ధి కలుగుతుంది.

**తాత్పర్యం:** రాజు ప్రజలను తండ్రివలె పరిపాలించాలి. ప్రజల ఆదాయంలో ఆరవభాగాన్ని మాత్రమే పన్నుగా గ్రహించాలి. అనేక రీతులుగా రాజు తన ఆప్తులలో దక్షులైనవారిని మాత్రమే ఆదాయాన్ని పెంచటానికి కారణాలైన అరణ్యాలు, గో సమూహాలు, గనులు మొదలైనవాటిమీద అజమాయిషీకై నియమించి, అన్ని వ్యవహారాలలోనూ ఒక కంట కనిపెట్టి ఉండటం మంచిది. దానివలన అభివృద్ధి కలుగుతుంది.

**సీ.** **కోట యేమఱ కెప్డుఁ బాటించి గడ్డియు । ఖాణంబుఁ గొల్చును గట్టియలును**
**నేయు నూనియయును నాయుధమ్ములు నౌష । ధములు నాభీల యంత్రములుఁ గూప**
**ములు లోనుగా నందు వలయువాని సమగ్ర । ములుగ సంపాదించి భూరి ధైర్య**
**శౌర్యాది గుణముల సడిసన్న యాప్త యో । ధులఁ బె ల్లమర్చుట యలఘునీతి;**

**ఆ.** **పగతుఁ దలిగి నడచు పథమునఁ దృణ కాష్ఠ । ములును ధాన్యతోయములును లేక**
**యుండఁ జేసి మిత్రమండలేశుల నెత్తి । యరుగుదేరఁ బనుచునది విభుండు.** **284**

**ప్రతిపదార్థం:** విభుండు= రాజు; ఎప్డున్= ఎల్లప్పుడు; ఏమరక= అశ్రద్ధ చేయక (జాగరూకతతో); కోట పాటించి= కోటను దృష్టిలో పెట్టుకొని; గడ్డియున్= పశువులకు అవసరమైన గడ్డిని; ఖాణంబున్= అశ్వాదులకు కావలసిన ఉలవలు మొదలైన ఆహార పదార్థాలను; కొల్చునున్= మానవులకు కావలసిన వరిధాన్యాన్ని; కట్టియలును= వంటచెఱకును; నేయున్= నేతినీ; నూనియయున్= నూనెనీ; ఆయుధమ్ములున్= యుద్ధాదులలో ఉపయోగించే ఆయుధాలను; ఔషధములున్= మందులను; ఆభీల= భయంకరమైన;

యంత్రములున్= యంత్రాలను; కూపములున్= బావులనూ; లోనుగాన్= మొదలైన; అందున్ వలయు వానిన్= వాటికి కావలసిన పరికరాలను; సమగ్రములుగన్= సంపూర్ణంగా; సంపాదించి= సమకూర్చుకొని; భూరి= అధికమైన; ధైర్య శౌర్య+ఆది గుణములన్= ధైర్యమూ, పరాక్రమమూ మొదలైన ఉత్తమ గుణాలలో; సడి+చన్న= నిందలేని; ఆప్త యోధులన్= ఆప్తులైన బంటులను; పెల్లు+అమర్చుట= అధికంగా నియమించటం; అలఘునీతి= రాజునకు ఉండవలసిన గొప్ప రాజనీతి; పగతుఁడు= శత్రువు; అలిగి= (రాజుపై) కోపించి; నడచు పథమునన్= ప్రయాణించే మార్గంలో; తృణ కాష్ఠములును= గడ్డి కట్టెలూ; ధాన్య తోయములును= (తినటానికి) ఆహార ధాన్యాలు (తాగటానికి) నీరూ; లేక+ఉండన్+చేసి= (శత్రువులకు) లభించకుండ చేసి; మిత్రమండల+ఈశులన్= తనకు మిత్రులైన (సమీప) మండలాధిపతులను; ఎత్తి+అరుగు దేరన్+పనుచునది= శత్రువులపై దండెత్తి పోయేటట్లు నియమించాలి.

**తాత్పర్యం:** రాజు ఎల్లప్పుడు బహు జాగరూకుడై పశువులకు గడ్డి, అశ్వగజాదులకు కావలసిన ఉలవలు మొదలైన ఆహార పదార్థాలు, ప్రజలకు అవసరమైన ధాన్యాదులు, కట్టెలు, నేయి, నూనె, సమస్తమైన ఆయుధాలు, మందులు, భయంకర యంత్రసామగ్రిని, నీటి బావులను సంపూర్ణంగా సమకూర్చుకొని అత్యంత ధైర్యపరాక్రమాది ఉత్తమ గుణాలతో నిందారహితులైన ఆప్తులైన యోధులను అధికంగా నియమించటం ఉత్తమ రాజనీతి. శత్రువు తనపై కోపించి దండెత్తి వస్తే, ఆ మార్గం తెలిసికొని, ఆ శత్రు సైన్యానికి గడ్డి, కట్టెలు, ధాన్యం, నీరూ లభించకుండా చేసి తనకు మిత్రులైన సమీప మండలాధిపతులను, ఆ శత్రువులపై దండెత్తి పోయేటట్లు పురికొల్పి నియోగించటమనేది ఉత్తమ రాజనీతి.

**వ. మఱియు రాజునకు రక్షింపవలయునది స్వామ్యమాత్య జనపద కోశ సైన్య మిత్ర దుర్గంబులను రాజ్యాంగ సప్తకంబు కన్నిడి యరయ వలయునది; సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులను షాడ్గుణ్యంబు నడపవలయునది; ధర్మార్థ కామంబు లను త్రితయంబు పాటింపవలయునది; మంత్ర ప్రభుత్వోత్సాహంబులను శక్తి త్రయంబు నిజవశవర్తిం జేయవలయునది; సత్త్వరజస్తమంబు లను గుణ త్రికంబు విశేషించి ధర్మసేవ సంతతంబు నాచరింపవలయునది; ప్రమాదంబున నర్థకామంబులు హీనంబు లైనను ధర్మనిష్ఠంజేసి ధరణీపరిపాలనంబు సుస్థిరంబై చెల్లు; నాంగిరస భార్గవాదులగు పెద్ద లిట్లని చెప్పిరి 'త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులను బుద్ధీంద్రియంబులును, వాక్పాణి పాద పాయూపస్థంబులను కర్మేంద్రియంబులును, మనంబునుం గూడ నేకాదశ సంఖ్యంబైన యింద్రియజాతంబు జయించి, కామజంబు లగు నక్ష మృగయా స్త్రీ పానార్థ దూషణంబులునుం, గ్రోధజంబు లగు వాక్పారుష్య దండపారుష్యంబులును నైన సప్తవ్యసనంబు లందగులక, యజ్ఞాధ్యయన దానతత్పరుం డగుచు దుర్మంత్రుల కుటిల వాక్యంబులకు లోనుగాక, నయవిక్రమ క్రమజ్ఞులైన యమాత్యులతో దైవ మానుష చింతనంబు చేయుచు దేవ బ్రాహ్మణ ప్రణామ తర్పణ రక్షణంబులుం జేసి, యశుభ నిరాసనంబును, శుభాపాదనంబును నొనర్చుచుఁ బ్రజలం బాలించు భూపతి యుభయ లోక సిద్ధులం బొందు. 285**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; రాజునకున్ రక్షింప వలయునవి= రాజు రక్షించవలసినవి ఉన్నాయి; స్వామి+అమాత్య జనపద కోశ సైన్య మిత్ర దుర్గంబులు+అను= స్వామి, మంత్రి, జనపదం, ధనాగారం, సైన్యం, మిత్రులు, దుర్గాలు అనే; రాజ్య+అంగసప్తకంబు= రాజ్యానికి భాగాలైన ఏడింటిని; కన్ను+ఇడి+అరయవలయునది= కనిపెట్టి పరిశీలించాలి; సంధి, విగ్రహ యాన+ఆసన ద్వైధీభావ సమాశ్రయంబులు+అను= సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సమాశ్రయం అనే; షాడ్గుణ్యంబున్= ఆరు గుణాలతో; నడపవలయునది= రాజనీతిని నిర్వర్తించాలి; ధర్మ+అర్థ కామంబులు+అను= ధర్మం, అర్థం, కామం అనే; వర్గత్రితయంబు= పురుషార్థాల్లోని ఈ మూడు వర్గాలను; పాటింపవలయునది= నిర్వర్తించాలి; మంత్ర, ప్రభుత్వ+ఉత్సాహంబులు+అను= మంత్రం,

ప్రభువు, ఉత్సాహం అనే; శక్తి త్రయంబున్= మూడు శక్తులను; నిజవశవర్తిన్+చేయవలయునది= స్వాధీనం చేసికొనవలసి ఉన్నది; సత్త్వరజః+తమంబులు+అను= సత్త్వం, రజస్సు, తపస్సు అనే; గుణ త్రికంబున్= మూడు గుణాలను; విశేషించి= ప్రత్యేకించి; సతతమున్= ఎల్లప్పుడు; ధర్మసేవన్= ధర్మానుగుణమైన సేవను; ఆచరింపవలయునది= పాటించాలి; ప్రమాదంబునన్= ప్రమాదవశాత్తు; అర్థ కామంబులు= ధనమూ కోరికలు; హీనంబులు+ఐనను= హీనదశకు వచ్చినప్పటికి; ధర్మనిష్ఠన్+చేసి= ధర్మమునందు ఆసక్తుడై ఉండటం వలన; ధరణీ పరిపాలనంబు= రాజ్యపాలనం; సుస్థిరంబు+ఐ చెల్లున్= స్థిరంగా కొనసాగుతుంది; ఇట్లు+అని= ఇట్లాగని; ఆంగిరస భార్గవ+ఆదులు+అగు= ఆంగిరసుడు భార్గవుడు అనే మహర్షులు మొదలైన; పెద్దలు= వృద్ధులు (ఆర్యులు); చెప్పిరి= పలికారు; త్వక్+చక్షుః+శ్రోత్ర జిహ్వా+ఘ్రాణంబులు+అను= చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు అనే; బుద్ధి+ఇంద్రియంబులును= జ్ఞానేంద్రియాలు ఐదూ; వాక్+పాణి పాద పాయు+ఉపస్థంబులు+అను= వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థం అనే; కర్మ+ఇంద్రియంబులును= కర్మేంద్రియాలు ఐదూ; మనంబునున్+కూడన్= మనసూ కలసి; ఏకాదశ సంఖ్యంబు+ఐన= పదునొకండు సంఖ్యతో కూడినదైన; ఇంద్రియ జాతంబున్+జయించి= ఇంద్రియ సమూహాన్ని గెల్చి; కామజంబులు+అగు= కామం వలన కలిగిన; అక్ష, మృగయా, స్త్రీ, పాన, అర్థ, దూషణంబులున్= ద్యూతం, వేట, స్త్రీలోలత, మద్యపానం, నిరర్థక ధనవ్యయం అనే అయిదు వ్యసనాలూ; క్రోధజంబులు+అగు= కోపంవలన కలిగిన; వాక్పారుష్య దండ పారుష్యంబులునున్+ఐన= వాక్పారుష్యం, దండపారుష్యం అనే రెండు పారుష్యాలు అనే; సప్త వ్యసనంబులన్+తగులక= ఏడు వ్యసనాలకు లొంగక; యజ్ఞ+అధ్యయన దాన తత్పరుండు+అగుచున్= యజ్ఞాలు చేయటంలో, వేదాధ్యయనంలో, దానం చేయటంలో ఆసక్తుడై; దుః+మంత్రుల= దుష్టులైన మంత్రులయొక్క; కుటిల వాక్యంబులకున్= చెడ్డ మాటలకు; లోనుగాక= లొంగక; నయ విక్రమ క్రమజ్ఞులు+ఐన= నీతి పరాక్రమ మెరిగిన వారైన; అమాత్యులతోన్= మంత్రులతో; దైవ మానుష చింతనంబు+చేయుచున్= ఆయా దైవ మానుష వ్యవహారాలు నిర్వర్తిస్తూ; దేవ బ్రాహ్మణ తర్పణ రక్షణంబులన్+చేసి= దేవతలకు బ్రాహ్మణులకు నమస్కరిస్తూ, తర్పణాలిస్తూ వారిని రక్షిస్తూ ఉండటం చేత; అశుభ నిరాసనంబునున్= అశుభాలను తొలగించటమూ; శుభ+ఆధానంబునున్+ఒనర్చుచున్= శుభాలను చేకూరుస్తూ; ప్రజలన్= ప్రజలను; పాలించు భూపతి= పరిపాలించే రాజు; ఉభయలోక సిద్ధులన్+పొందున్= ఇహపరలోకాలు రెండింటిలోను కృతార్థు డౌతాడు.

**తాత్పర్యం:** ఇంకా రాజు జాగరూకతతో సంరక్షించవలసినవాటిని తెలుపుతాను విను మని ధర్మరాజుకు భీష్ముడు వివరించాడు. 'స్వామి, అమాత్యుడు, జనపదం, ధనాగారం, సైన్యం, మిత్రులు, దుర్గం - అనే రాజ్యాంగాలైన ఏడింటిని కనిపెట్టి పరిశీలించవలసిన అవసరం ఉన్నది. సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సమాశ్రయం - అనే ఆరు రాజ్యతంత్రాలను రాజనీతితో నిర్వర్తిస్తూ, ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలను నిర్వర్తించటం రాజధర్మం. మంత్రం, ప్రభువు, ఉత్సాహం అనే శక్తిత్రయాన్ని స్వాధీనం చేసికొని, సత్త్వ రజస్తమోగుణాలనే మూడింటితో ముఖ్యంగా ధర్మానుగుణమైన సేవచేయటం రాజనీతి. ప్రమాదవశాత్తు అర్థకామాలు హీనదశకు చేరినప్పటికీ రాజు ధర్మనిష్ఠాపరుడైతే రాజ్యపాలనం సుస్థిరమై కొనసాగుతుంది. రాజధర్మ మిది - అని ఆంగిరసుడు, భార్గవుడు మొదలైన మహర్షులు చెప్పారు. త్వక్కు, చక్షువు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం అనే ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థం అనే ఐదు కర్మేంద్రియాలు, మనస్సూ కలసి ఏకాదశ సంఖ్య గల ఇంద్రియ సమూహాన్ని జయించి కామంవలన పుట్టిన ద్యూతం, వేట, స్త్రీలోలత, మద్యపానం, నిరర్థకధనవ్యయం అనే ఐదు వ్యసనాలు, క్రోధంవలన కలిగిన వాక్పారుష్యం, దండపారుష్యం అనే రెండు పారుష్యాలు కలసిన సప్తవ్యసనాలకు లొంగక యజ్ఞాలు చేయటంలో, వేదాధ్యయనంలో దానంలో ఆసక్తుడై మంత్రుల కుటిలవాక్యాలకు దూరంగా ఉంటూ, రాజనీతి పరాక్రమం తెలిసిన మంత్రులతో, దైవమానుష చింతనతో, దేవబ్రాహ్మణులకు నమస్సులతో తర్పణలిస్తూ, సంరక్షణచేస్తూ అశుభాలకు దూరంగా సమస్త శుభాలను ప్రసాదిస్తూ ప్రజలను పాలించే రాజు ఇహపరలోకాలు రెండింటిలోను సిద్ధి పొందగలుగుతాడు'.

**తే.** **అనిన విని ప్రీతి ధర్మనందనుఁడు రాజు । దండనీతియు ననఁగ నుదాత్తయుక్త**
**వస్తువులు రెండు నార్య ప్రశస్త కార్య । సిద్ధి గావించు తరములు సెప్పు మనఘ!'** **286**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని రాజ ధర్మాన్ని గూర్చి భీష్ముడు చెప్పగా విని; ధర్మనందనుఁడు= ధర్మరాజు; ప్రీతిన్= సంతోషంతో; అనఘ!= పాపరహితుడవైన తాతా!; రాజు దండనీతియున్= రాజును, దండనీతి; అనఁగన్= అనేటువంటి; ఉదాత్త యుక్తవస్తువులు= శ్రేష్ఠము లైన ఈ అంశాలు; రెండును= రెండూ; ఆర్యప్రశస్తకార్య సిద్ధి కావించు= ఆర్యులయొక్క ప్రసిద్ధమైన కార్యాలు సిద్ధిపొందించే; తరములు= విధములు; చెప్పుము= వివరించుము.

**తాత్పర్యం:** రాజధర్మాన్ని గూర్చి భీష్ముడు విపులంగా వివరించగా విన్న ధర్మరాజు సంతోషంతో భీష్ముడితో 'రాజు, దండనీతి అనే శ్రేష్ఠమైన అంశాలు రెండూ ఆర్యప్రసిద్ధ కార్యసిద్ధిని ఎట్లా కలిగిస్తాయో ఆ పద్ధతులను అన్నిటినీ వివరించుము.'

**వ.** **అని యడిగిన నప్పుడమితేనికి సరిత్సూనుం డిట్లనియె.** **287**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని ధర్మరాజు అడుగగా; ఆ+పుడమి తేనికిన్= ఆ ధర్మరాజుతో; సరిత్+సూనుండు= నదీపుత్రుడైన భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు భీష్ముడిని ప్రార్థించగా నదీసుతుడైన భీష్ముడు ధర్మరాజుతో ఈ విధంగా పలికాడు.

**క.** **'భూరమణుఁడు కాలమునకుఁ । గారణ మెట్లన్న ధర్మగతి పూర్ణత నొ**
**ప్పారంగ దండనీతి స । మారంభము నడపుఁ గృతయుగాగతి నధిపా!** **288**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!; భూరమణుఁడు= భూమికి భర్తఅయిన రాజు; కాలమునకున్= కాలగమనానికి; కారణము+ఎట్లు+అన్నన్= ఏ విధంగా కారణ భూతుడౌతున్నా డంటే; ధర్మగతి= రాజ ధర్మవిధానం; పూర్ణతన్+ఒప్పారంగన్= సంపూర్ణమై విలసిల్లేటట్లుగా; కృతయుగ+ఆగతిన్= కృతయుగం రాకతో; దండనీతి సమారంభమున్= రాజనీతి ప్రారంభం; నడపున్= కొనసాగిస్తున్నాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజు కాలగమనానికి కారణభూతు డెట్లా అవుతున్నా డంటే, ధర్మవిధానం సంపూర్ణంగా విలసిల్లేటట్లు కృతయుగం రాకతో రాజనీతిని ప్రారంభించి కొనసాగించటంవలన మాత్రమే అని గ్రహించాలి' అని వివరించాడు.

**వ.** **అందు.** **289**

**తాత్పర్యం:** ఆ కృతయుగంలో - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **ధర్మంబు పెరుఁగు వైదిక । కర్మఫలము లెసఁగు ఋతునికాయము ప్రజకున్**
**శర్మం బొనర్చు నాయువు । పేర్మిఁ బొరయు దున్నకయును బృథివి ఫలించున్.** **290**

**ప్రతిపదార్థం:** ధర్మంబు పెరుఁగున్= ధర్మం అభివృద్ధి చెందుతుంది; వైదిక కర్మ ఫలముల్+ఎసఁగున్= వేదాధ్యయనం, యజ్ఞయాగాది ధర్మాచరణాల ఫలితాలు అతిశయిస్తాయి; ప్రజకున్= ప్రజలకు; ఋతునికాయము= ఋతు సమూహం; శర్మంబు+ఒనర్చున్= శుభం చేకూర్చుతుంది; ఆయువు= జీవితకాలం; పేర్మిన్+పొరయున్= అతిశయమై ఒప్పుతుంది; దున్నక= దున్నకుండానే; పృథివి= భూమి; ఫలించున్= పండి పంటలిస్తుంది.

**తాత్పర్యం:** కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. వేదాధ్యయనం, యజ్ఞయాగాది ధర్మాచరణ ఫలితాలు అతిశయిస్తుంటాయి. ప్రజలకు ఋతువు లన్నీ సంతోషాన్ని కలిగిస్తాయి. ప్రజలయొక్క ఆయువు అతిశయమై ఒప్పుతుంది. కర్షకులు దున్నకుండానే భూమి పంటలను ప్రసాదిస్తుంది.

**తే. రాజు మూఁడు భాగముల ధర్మంబు నడపుఁ।ద్రేత నమ్మెయి నది ప్రజాప్రీతి సలుపు**
**ద్వాపరంబున నర్ధంబ యోపి చెల్లఁ। జేయు నక్కాల మమ్మాత్రఁ జెందు మేలు. 291**

**ప్రతిపదార్థం:** త్రేతన్= త్రేతాయుగంలో; రాజు; మూఁడు భాగములన్= మూడు భాగాలతో; ధర్మంబు నడపున్= ధర్మాన్ని కొనసాగిస్తాడు; ఆ+మెయిన్+అది= ఆ త్రేతాయుగంలోని పరిస్థితి ఆ విధంగా; ప్రజాప్రీతి+చలుపున్= ప్రజలకు ఆనందాన్ని చేకూరుస్తుంది; ద్వాపరంబునన్= ద్వాపరయుగంలో; అర్ధంబు+అ+ఓపి= ధర్మాన్ని రెండుపాదాలతో మాత్రమే; చెల్లన్+చేయున్= చెల్లుబడి అయ్యేటట్లు చేస్తాడు; ఆ+కాలము= ఆ ద్వాపరయుగంలో; ఆ+మాత్రన్= ఆ మాత్రమే; మేలు= మంచి; చెందున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** త్రేతాయుగంలో రాజు ధర్మాన్ని మూడు పాదాలతో నడిపిస్తాడు. అది ప్రజలకు మిక్కిలి సంతోషాన్ని సమకూరుస్తుంది. ద్వాపరయుగంలో రాజు ధర్మాన్ని రెండు పాదాలతో నడపుతాడు. ఆ ద్వాపరయుగంలో ఆ మాత్రమే మేలు కలుగుతుంది.

**క. నరపతి ధర్మోపేక్షా। పరుఁ డగుఁ గలియుగమునందుఁ బాయును ధర్మ**
**స్ఫురణ మధర్మం బెందును। బరఁగును వర్ణాశ్రమముల పథములు దప్పున్. 292**

**ప్రతిపదార్థం:** కలియుగము నందున్= కలియుగంలో; నరపతి= రాజు; ధర్మ+ఉపేక్షాపరుఁడు+అగున్= ధర్మం పట్ల అశ్రద్ధ వహిస్తాడు; ధర్మస్ఫురణము= ధర్మజ్ఞానం; పాయును= నశిస్తుంది; ఎందునున్= అంతటా; అధర్మంబు పరఁగును= అధర్మం వ్యాపిస్తుంది; వర్ణ+ఆశ్రమముల పథములు= నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలకు సంబంధించిన మార్గాలు; తప్పున్= గతి తప్పుతాయి.

**తాత్పర్యం:** కలియుగంలో రాజు ధర్మంపట్ల శ్రద్ధ వహించడు. ధర్మజ్ఞానం క్రమంగా నశిస్తుంది. అధర్మం అంతటా వ్యాపిస్తుంది. నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలు వాటికి సంబంధించిన పద్ధతులు క్రమంగా గతి తప్పుతాయి.

**వ. కాల ప్రభావం బిట్టిది యైనను. 293**

**తాత్పర్యం:** కాలమహిమ ఇట్లాంటిది అయినప్పటికి - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. విభుని సకలధర్మవృత్తి నత్తఱి కృత। యుగముఁ బోలు ధర్మయుక్తి మాత్ర**
**లరయ విభుల కెట్టులయ్యె నట్టి తెఱంగు। లవుల యుగములట్ల యగు నృపాల! 294**

**ప్రతిపదార్థం:** నృపాల!= ఓ ధర్మరాజా!; ఆ+తఱిన్= ఆ సమయంలో; విభుని సకల ధర్మవృత్తిన్= రాజుయొక్క సమస్త ధర్మ ప్రవృత్తి; కృతయుగమున్+పోలు= కృతయుగంలో వలె; ధర్మయుక్తి మాత్రలు+అరయన్= రాజనీతి విధానాన్ని పరిశీలించగా; విభులకున్= రాజులకు; ఎట్టులు+అయ్యెన్= ఏ విధంగా అయ్యాయో; అట్టి తెఱంగులు= ఆ రీతులు; అవుల యుగముల+అట్లు+అగున్= ఆ తరువాతి యుగాలలో రీతిగానే కొనసాగుతుంది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఆయా యుగాలలో రాజనీతినిబట్టి ధర్మం కొనసాగుతుంది. కృతయుగంలో వలె రాజు ధర్మాన్ని నాలుగుపాదాల నిర్వహిస్తే అదే రీతిగా ధర్మం అభివృద్ధి చెందుతుంది. లేని పక్షంలో అంటే త్రేతా ద్వాపర కలియుగాలలో వలె క్రమంగా రాజు అనుసరించే దండనీతి ప్రకారం ధర్మం నశిస్తూ ఉంటుంది.

**వ. అనుటయు నెట్టివాఁడైన విభుని శుభంబులు పొందు; ననుటయు ధర్మనందనునకు మందాకినీ నందనుం డిట్లనియె. 295**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు చెప్పగా; ఎట్టివాఁడైన= ఎలాంటి వాడైన; విభునిన్= రాజును; శుభంబులు పొందున్= శుభములు చేకూరుతాయి; అనుటయున్= అని అడుగగా; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; మందాకినీ నందనుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఎట్లాంటి నడవడి కలిగిన రాజునకు శుభక్రమం చేకూరుతుందో తెలియజేయు'మని ధర్మరాజు ప్రార్థించగా భీష్ముడు ఇట్లా వివరించాడు.

**మ. అరయుం దప్పు కృతం బెఱుంగు మదలోభావేశముల్ లే వము**
**ష్కరుఁ డాత్మస్తుతి లేదు చేయునియతిం గార్యంబు లీగుల్ ఘన**
**స్థిరముల్ శూరుఁడు గర్విగాఁడశరుఁ డస్త్రీలోలుఁ డక్రోధనుం**
**డరి నొవ్వం గొనఁ డ న్పొగడ్తఁ గను రా జత్యంత దీప్తుం డగున్.' 296**

**ప్రతిపదార్థం:** రాజు= రాజు; తప్పు= తప్పును; అరయున్= పరిశీలిస్తాడు; కృతంబు+ఎఱుంగున్= చేసిన పనిని గుర్తిస్తాడు; మదలోభ+ఆవేశముల్ లేవు= మదం, పిసినారితనం, ఆవేశం మొదలైనవి కలిగి ఉండడు; అముష్కరుఁడు= దుర్మార్గుడు కానివాడు; ఆత్మస్తుతి లేదు= తనను తాను పొగడుకోడు; నియతిన్= నియమబద్ధంగా; కార్యంబులు= విధ్యుక్త ధర్మాలు; ఈగుల్= దాన ధర్మాలు; ఘన స్థిరముల్= అధికంగా పదికాలాలపాటు నిలిచేటట్లు; చేయున్= చేస్తాడు; శూరుఁడు= పరాక్రమవంతుడు; గర్వికాఁడు= గర్వం లేకుండా ఉంటాడు; అశరుఁడు= కుత్సితుడు కానివాడు; అస్త్రీలోలుఁడు= స్త్రీలౌల్యం లేనివాడు; అక్రోధనుండు= కోపంలేనివాడు; అరిన్= కప్పమును; నొవ్వన్= సామంత రాజులకు బాధకలిగేటట్లు; కొనఁడు= గ్రహించడు; అన్+పొగడ్తన్+కనున్= అనే ప్రశంసను పొందుతాడు; అతి+అంత= మిక్కిలి; దీప్తుండు+అగున్= తేజస్వంతుడై ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** రాజు ప్రజల తప్పులను పరిశీలిస్తాడు, చేసిన పనులను గుర్తిస్తాడు. మదమూ, లోభమూ, ఆవేశమూ లేనివాడు. దొంగకానివాడు, ఆత్మస్తుతి చేసికొనడు. నియమబద్ధంగా విధ్యుక్తధర్మాలను ఘనమైన దానాలను పదికాలాలు నిలిచేటట్లు నిర్వహిస్తాడు. పరాక్రమవంతుడు, నిగర్వి, కుత్సితుడు కానివాడు, పరస్త్రీలౌల్యం లేనివాడు, క్రోధరహితుడు, సామంతులను పీడిస్తూ కప్పం గ్రహించడు' అనే పొగడ్తలకు పాత్రుడైనవాడు. అట్లాంటి రాజు మిక్కిలి తేజస్సుతో ప్రకాశిస్తాడు.'

**వ. అని చెప్పి వెండియు. 297**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**ఆ. 'సాంగ వేదవేది యగు పురోహితుఁ డెప్డు। నగర మెలఁగ వలయుఁ దగవుఁ గృపయుఁ**
**జక్కటియును గలుగు సచివునప్పనముల। నరులు నరయఁ బనుచునది విభుండు. 298**

**ప్రతిపదార్థం:** విభుండు= రాజు; సాంగవేదవేది+అగు= అంగాలతో కూడిన వేదాలు తెలసినవాడైన; పురోహితుఁడు= బ్రాహ్మణుని; ఎప్డున్= ఎల్లప్పుడు; నగరమున్+మెలగవలయున్= పట్టణంలో ఉండేటట్లు నియమించాలి; తగవున్= సముచితమైన తీర్పు; కృపయున్= దయ; చక్కటియునున్+కలుగు= న్యాయం కలిగిన; సచివున్= మంత్రిని; అప్పనములున్= కానుకలను; అరులన్= కప్పములను; అరయన్+పనుచునది= పరిగ్రహించటానికి నియమించాలి.

**తాత్పర్యం:** రాజు వేదవేదాంగవేత్త అయిన పురోహితుడిని పట్టణంలో సదా ఉండేటట్లు నియమించాలి. సముచితమైన తీర్పు, దయ, న్యాయం కలిగిన అమాత్యుడిని మాత్రమే ప్రజలు ఇచ్చేకానుకలు కప్పాలు గ్రహించేటట్లుగా నియమించాలి.

**క.** **పరుసఁదనముమెయి నరిగొనఁ । జొరఁదగ; దది పొదుఁగు గోయు చొప్పగు విను పా**
**ల్గురియించుకొనఁ దలంచిన । నరయవలదె గోవుఁ బ్రజయు నట్టిద యధిపా! 299**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా! విను= జాగరూకతతో వినుము; పరుసఁదనము మెయిన్= కాఠిన్యంతో; అరి+కొనన్+చొరన్+తగదు= కప్పం గ్రహించటానికి ప్రయత్నించకూడదు; అది= ఆ విధానం; పొదుఁగు+కోయు చొప్పు+అగున్= (పాలకోసం) ఆవు పొదుగు కోసినట్లవుతుంది; పాల్గుయించుకొనన్+తలంచినన్= ఆవు పొదుగునుండి పాలు పిండుకొనదలిస్తే; గోవున్= ఆవును; అరయవలదె!= జాగరూకతతో కాపాడు కొనాలి కదా!; ప్రజయున్= ప్రజానీకం కూడా; అట్టిది+అ= ఆ ఆవువంటిదే.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ప్రజలపై కాఠిన్యం వహించి కప్పం గ్రహించటానికి ప్రయత్నించకూడదు. కాఠిన్యంతో ప్రవర్తించి కప్పాన్ని గ్రహించటం పాలిస్తున్న ఆవు పొదుగును కోసిన దానితో సమానం. పాలు కావా లనుకొన్నప్పుడు ఆవును జాగ్రత్తగా రక్షించుకొనాలి కదా! అట్లాగే ప్రజలను కూడా పరిరక్షించుకొనాలి'

**ఆ.** **కోరి తోఁటవాఁడు కుసుమ ఫలంబులు । కోయునట్లు రాజు కొనఁగవలయు**
**నప్పనములు; నఱికి యంగారములు చేయు । భంగి యైన భూమి పాడు గాదె? 300**

**ప్రతిపదార్థం:** తోఁటవాఁడు= తోటమాలి; కోరి= ఇష్టపడి; కుసుమ ఫలంబులు= పుష్ప ఫలాలు; కోయునట్లు= కోసేరీతిగా; రాజు= ప్రభువు; అప్పనములు కొనఁగవలయున్= కానుకలు, కప్పాలు గ్రహించాలి; నఱికి= ఖండించి; అంగారములు చేయు భంగి+ఐనన్= నిప్పుపెట్టి బొగ్గులుగా చేసేరీతిలో ప్రవర్తిస్తే; భూమి పాడు+కాదె?= భూమి నాశనం కాదా? (అవుతుంది కదా అని భావం).

**తాత్పర్యం:** తోటమాలి కావలసిన పుష్పఫలాలను కోసుకొన్నట్లుగా రాజు కూడా జాగరూకుడై కప్పాలను గ్రహించాలి. అట్లా కాక ఫలపుష్పాదుల నిచ్చే చెట్లను నరికి నిప్పుపెట్టి బొగ్గలుగా చేస్తే భూమి నాశనమౌతుంది. కాబట్టి తోటమాలివలె రాజు జాగరూకుడై ప్రజలను సంరక్షిస్తూ కప్పం గ్రహించవలసి ఉంటుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **దయఁ బ్రజ రక్షించుటకు, నె । నయె తపములు నధ్వరములు నరవర దానన్**
**జయమును లక్ష్మియునుం గీ । ర్తియు సుగతియుఁ గలుగు వసుమతీనాథునకున్. 301**

**ప్రతిపదార్థం:** నరవర!= నరులలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; వసుమతీ నాథునకున్= భూభర్తఅయిన రాజునకు; ప్రజన్= ప్రజలను; దయన్= దయతో; రక్షించుటకున్= సంరక్షించటంలో; తపములున్= తపస్సులు; అధ్వరములున్= యాగములు; ఎనయె?= సమానమా? (కావు); దానన్= దానివలన; జయమును= విజయమూ; లక్ష్మియున్= సంపద; కీర్తియున్= యశస్సును; సుగతియున్= ఉత్తమ గతులు; కలుగున్= ప్రాప్తిస్తాయి.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ప్రజలను సంరక్షించటమే రాజు ప్రధానధర్మం. కాని, ఆ రాజుచేసే తపస్సులు, యాగాలు, ప్రజలను దయతో సంరక్షించే దానితో సమానం కావు. రాజు రాజధర్మాన్ని అనుసరించి ప్రజలను సంరక్షిస్తే ఆ రాజునకు విజయంతోపాటు సంపద, కీర్తి ఉత్తమగతులు లభిస్తాయి' అని భీష్ముడు వివరించాడు.

**వాయుదేవుఁడు పురూరవునకుఁ జెప్పిన రాజధర్మప్రకారము (సం. 12-73-2)**

**వ. విశేషించి పురోహితుం బాటింపవలయు వినుము. తొల్లి యైలుం డగు పురూరవుండు 'వసుధ విప్రక్షత్త్రియులం దెవ్వాని ధనంబై యుండునని వాయుదేవు నడిగిన నమ్మహాత్ముండు చతుర్ముఖుని ముఖ బాహూరు పాదంబులు బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యశూద్రులకుఁ బ్రభవస్థానంబు లగుట చెప్పి యి ట్లుత్కృష్ట ప్రభవుండై సర్వ వర్ణంబులకు నీశ్వరుం డగు బ్రాహ్మణుం డీ పృథివీ ధన ధాన్యాది సమస్త వస్తువులునుం దా ననుభవింపను నొడ్లకు నొసంగను యుక్తుండు; దండనీతి ధారణంబునకు క్షత్త్రియుం జొనిపె బ్రాహ్మణ శాంతి పరత్వంబున క్షత్త్రియాధిపత్యప్రాప్తి పతిలేమి నంగన దేవరునిం బ్రతిగ్రహించినట్లున్నది; యిది భూమి తెఱం; గి ట్లగుటం జేసి నిజధర్మవ్రతుండును, విద్వాంసుండును శాంతుండును నగు పురోహితునకు సర్వసంపదలును సమర్పించి జనపతి శుశ్రూషా పరుండును, నహంకార రహితుండును నై దండనీతి నయించి యుభయ లోకంబులనుం బెంపు వహించు. 302**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ ధర్మరాజా! వినుము; విశేషించి= ప్రత్యేకించి; పురోహితున్+పాటింపన్ వలయున్= బ్రాహ్మణుని గౌరవించాలి; తొల్లి= పూర్వం; ఐలుండు+అగు= ఇలా పుత్రుడైన; పురూరవుండు= పురూరవుడనే రాజు; వసుధ= ఈ భూమి; విప్ర క్షత్రియులందున్= బ్రాహ్మణ, క్షత్రియులలో; ఏ+వాని ధనంబు+ఐ+ఉండున్+అని= ఎవడి సొత్తై ఉంటుంది అని; వాయుదేవున్+అడిగినన్= వాయుదేవుడిని ప్రశ్నించగా; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు; చతుర్ముఖుని= నాలుగు ముఖాలుగల బ్రహ్మయొక్క; ముఖ, బాహు+ఊరు పాదంబులు= ముఖం, బాహువులు, తొడలు, పాదాలు (క్రమంగా); బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకున్= బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు; ప్రభవస్థానంబులు+అగుట చెప్పి= పుట్టుక స్థానాలు కావటాన్ని వివరించి; ఇట్లు= ఈ విధంగా; ఉత్కృష్ట ప్రభవుండు+ఐ= శ్రేష్ఠమైన జన్మకలవాడై; సర్వవర్ణంబులకున్= అన్ని వర్ణాలకు; ఈశ్వరుండు+అగు బ్రాహ్మణుండు= అధిపతిఅయిన బ్రాహ్మణుడు; ఈ పృథివీ ధన ధాన్య+ఆది సమస్త వస్తువులునున్= ఈ భూమిలోని ధనమూ, ధాన్యమూ మొదలైన అన్ని వస్తువులను; తాన్+అనుభవింపను= తాను అనుభవించటానికి; ఒడ్లకున్+ఒసంగనున్= ఇతరులకు ఇవ్వటానికి; ఉక్తుండు+అగుటన్= నియమించబడి; దండనీతి ధారణంబునకున్= రాజధర్మ నిర్వహణకు; క్షత్రియున్+చొనిపెన్= క్షత్రియుడిని నియోగించాడు; బ్రాహ్మణ శాంతిపరత్వంబున్= బ్రాహ్మణుడికి సహజమైన శాంతి అందలి ఆసక్తివలన; క్షత్రియ+ఆధిపత్య ప్రాప్తి= రాజునకు అధికారం సంప్రాప్తం కావటంవలన; పతి లేమిన్= భర్త లేకపోవటం వలన; అంగన= స్త్రీ; దేవరునిన్= భర్తయొక్క సోదరుడిని; ప్రతిగ్రహించిన+అట్లు+ఉన్నది= భర్తకు బదులుగా గ్రహించినట్లున్నది; ఇది భూమి తెఱంగు= ఇది భూమి క్షత్రియులకు సంప్రాప్తించిన విధానం; ఇట్లు+అగుటన్+చేసి= ఇట్లా జరిగినందువలన; నిజ ధర్మ వ్రతుండును= తనదైన సనాతన ధర్మాన్ని పాటించేవాడు; విద్వాంసుండును= పండితుడు; శాంతుండును= ప్రశాంతమైన మనస్సు కలవాడు; అగు= అయిన; పురోహితునకున్= బ్రాహ్మణుడికి; సర్వ సంపదలును= సమస్త సంపదలను; సమర్పించి= ఇచ్చి; జనపతి= రాజు; శుశ్రూషా పరుండును= బ్రాహ్మణ సేవాసక్తుడూ; అహంకార రహితుండునున్+ఐ= అహంకారం లేనివాడై; దండనీతిన్ నయించి= దండనీతిని ప్రయోగించి; ఉభయ లోకంబులనున్= ఇహపర లోకాలు రెండింటిలో; పెంపున్ వహించున్= అభ్యున్నతిని పొందుతాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజుతో ఈ విధంగా పలికాడు - 'రాజు పురోహితుడిని గౌరవించవలసి ఉంటుంది. పూర్వం పురూరవుడు వాయుదేవుడితో బ్రాహ్మణ క్షత్రియులలో ఈ భూమి ఎవరి సొత్తని ప్రశ్నించాడు. అప్పుడు

వాయుదేవుడు పురూరవుడికి ఇట్లా వివరించాడు. 'బ్రహ్మయొక్క ముఖం, బాహువులు, తొడలు, పాదాల నుండి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు జన్మించారు. ఉత్తమాంగంలో జన్మించిన బ్రాహ్మణుడు అన్ని వర్ణాలకు ఈశ్వరుడివంటివాడు. ఈ భూమిపై ఉన్న ధనధాన్యాది సమస్తవస్తువులను తా ననుభవిస్తూ ఇతరులకు ఇవ్వటానికి అర్హు డయ్యాడు. ఆ బ్రాహ్మణుడు దండనీతిని ధరించటానికి క్షత్రియుడిని నియోగించాడు. బ్రాహ్మణుడు సహజంగా శాంత్యనురక్తుడు కావటంవలన క్షత్రియుడు రాజ్యాన్ని పొందటం భర్త లేని స్త్రీ భర్తయొక్క సోదరుడిని ప్రతిగ్రహించినట్లుగా ఉన్నదని తెలిపాడు. ఇదిభూలోకంలోని క్షత్రియుల విధానం. తన సనాతనధర్మాన్ని సంరక్షిస్తున్నవాడు, విద్వాంసుడు, శాంతుడు అయిన పురోహితుడికి సమస్తసంపదలను సమర్పించి, బ్రాహ్మణుడికి సేవచేస్తూ అహంకారరహితుడై దండనీతిని ప్రయోగించే రాజు ఇహపరలోకాలలో ఉత్తమ గతులను పొందుతాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. రస గంధాద్యనుభవములు । పొసఁగవు భీతమగు చిత్తమున భయముం బా**
**ప సమర్థుఁడు కావున నృపుఁ । డసమానప్రభుతఁ బొందు నవనీనాథా! 303**

**ప్రతిపదార్థం:** అవనీ నాథా!= భూ భర్త అయిన ఓ ధర్మరాజా!; రసగంధ+ఆది+అనుభవములు= రుచి, వాసన మొదలైన అనుభూతులు; పొసఁగవు= ఒప్పవు; భీతము+అగు చిత్తమునన్= భయభ్రాంత మైన మనసునందు; భయమున్+పాపన్= భయాన్ని తొలగించటానికి; సమర్థుఁడు= సామర్థ్యం కలవాడు; కావునన్= కాబట్టి; నృపుఁడు= రాజు; అసమాన ప్రభుతన్+పొందున్= సాటిలేని అధికారాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! రాజునకు రుచి వాసన మొదలైన అనుభూతులు పనికిరావు. భయపడ్డవారి భయాన్ని తొలగించటానికి రాజు సమర్థుడు. అందువలననే సాటిలేని అధికారాన్ని రాజు సంపాదించుకొంటాడు.'

**క. అని వాయుదేవుఁ డి ట్లి । జ్జనపతి బోధించె ననుడు శాంతనవున క**
**మ్మనుజపతి యిట్టు లను 'నే । పనులఁ బురోహితుఁడు మాన్యభావము నొందున్?' 304**

**ప్రతిపదార్తం:** అని ఇట్లు= అని ఈ విధంగా; వాయుదేవుఁడు= వాయుదేవుడు; ఆ+జనపతి= ఆ పురూరవుడికి; బోధించెన్= ప్రబోధించాడు; అనుడున్= అని చెప్పగా; శాంతనవునకున్= భీష్ముడికి; ఆ+మనుజపతి= ఆ నరపతి అయిన ధర్మరాజు; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు; ఏ పనులన్= ఏ పనులతో; పురోహితుఁడు= బ్రాహ్మణుడు; మాన్యభావమున్+ఒందున్?= గౌరవభావాన్ని పొందుతాడు?.

**తాత్పర్యం:** అని వాయుదేవుడు పురూరవుడికి తెలిపినట్లు భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు. అప్పుడు 'ఏ ఉత్తమ కార్యాచరణ వలన బ్రాహ్మణుడు గౌరవభావాన్ని పొందుతాడో తెలుపవలసిం'దని ధర్మరాజు భీష్ముడిని ప్రార్థించాడు.

**వ. అనిన నా ధర్మతనయుతో నద్దేవవ్రతుండు 'పురోహిత విషయంబులుగా శుక్రుండు చెప్పిన వాక్యంబులు గల వుపన్యసించెద నాకర్ణింపు'మని యిట్లనియె. 305**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ ధర్మతనయుతోన్= ఆ ధర్మరాజుతో; ఆ+దేవవ్రతుండు= ఆ భీష్ముడు; పురోహిత విషయంబులుగాన్= పురోహిత విషయమై; శుక్రుండు= శుక్రాచార్యుడు; చెప్పిన వాక్యంబులు+కలవు= చెప్పిన మాటలు ఉన్నాయి; ఉపన్యసించెదన్= ప్రసంగిస్తాను; ఆకర్ణింపుము= వినుము; అని+ఇట్లు+అనియెన్= అని ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పైవిధంగా భీష్ముడు ధర్మరాజుతో చెప్పి, మళ్ళీ శుక్రాచార్యుడు పురోహితవిషయంగా చెప్పిన వాక్యాలను వివరిస్తా ననీ జాగరూకతతో వినవలసిం దనీ భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**తే. 'అమర గరుడ గంధర్వ విద్యాధరాది । దివ్యులకు నధ్వరంబులఁ దృప్తి సేసి**
**పరమ శుభములఁ బొందు భూవరుఁడు; దాని । కెల్ల మూలంబు దగు పురోహితుని బుద్ధి. 306**

**ప్రతిపదార్థం:** భూవరుఁడు= భూమికి భర్త అయిన రాజు; అమర, గరుడ, గంధర్వ విద్యాధర+ఆది= దేవతలు, గంధర్వులు, విద్యాధరులు మొదలైన; దివ్యులకున్= దేవలోకంలో నివసించేవారికి; అధ్వరంబులన్= యజ్ఞయాగాదులచేత; తృప్తి+చేసి= సంతృప్తి కలుగజేసి; పరమశుభములన్+పొందున్= శ్రేష్ఠమైన శుభాలను పొందుతాడు; దానికిన్+ఎల్లన్= దానికంతటికీ; మూలంబు= హేతువు; తగు= అర్హుడైన; పురోహితుని బుద్ధి= పురోహితుడియొక్క ఆలోచనాబలం.

**తాత్పర్యం:** రాజు తా నాచరించే యజ్ఞయాగాదులచేత అమరులు, గరుడ, గంధర్వ, విద్యాధరులు మొదలైన సమస్త దేవలోకవాసులకు సంతృప్తి కలిగించే అత్యంత శ్రేష్ఠమైన శుభపరంపరను పొందుతాడు. దీని కంతటికీ పురోహితుడి బుద్ధి మూలకారణం.

**క. రక్షః పిశాచ గుహ్యక । యక్షాదులు బాధవెట్టు నవనీనాథున్**
**దక్ష పురోహిత మంత్ర సు । రక్షా సంస్కారవిధి విరహితుం డైనన్. 307**

**ప్రతిపదార్థం:** దక్ష= సమర్థుడైన; పురోహిత= పురోహితుడియొక్క; మంత్ర= మంత్రాలచేత; సురక్షా= శ్రేష్ఠమైన సంరక్షణతో కూడిన; సంస్కార విరహితుండు+ఐనన్= సంస్కారం లేనివాడైతే; అవనీనాథున్= భూ భర్తఅయిన రాజును; రక్షః పిశాచ గుహ్యక యక్ష+ఆదులు= రాక్షసులు, పిశాచులు, గుహ్యకులు, యక్షులు మొదలైన వాళ్ళు; బాధ+పెట్టున్= బాధిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** సమర్థుడైన పురోహితుడియొక్క మంత్రాదులచేత శ్రేష్ఠమైన సంరక్షణతో కూడిన సంస్కారం లేకుండా పోయిన రాజును రాక్షసులు, పిశాచులు, గుహ్యకులు, యక్షులు మొదలైనవాళ్ళు పీడిస్తారు.

**క. వివిధోత్పాతంబులకున్ । నవకులలోఁ దోఁచు కీడునకుఁ దోడ్తోఁ శాం**
**తి విధానంబున నిరసన । మవును బురోహితునిచేత ననవద్యముగన్. 308**

**ప్రతిపదార్థం:** వివిధ+ఉత్పాతంబులకున్= అనేక విధాలైన అపశకునాలకు; నవళులలోన్+తోఁచు= అంతఃపురాలలో సంభవించే; కీడునకున్= అశుభానికి; తోడ్తోన్= వెనువెంటనే; అనవద్యముగన్= తిరుగులేకుండా; పురోహితునిచేతన్= పురోహితుడిచేత; శాంతి విధానంబునన్= శాంతికొరకు చేసే పనులవలన; నిరసనము+అవును= నివారణ జరుగుతుంది.

**తాత్పర్యం:** అనేకమైన ఉత్పాతాలకు, అంతఃపురాలలో సంభవించే అశుభాలకూ పురోహితుడి తిరుగులేని శాంతి కార్యాలవలన అశుభాల నివారణ జరుగుతుంది.

**విశేషం:** ఉత్పాతం, అపశకునం, ఇది మూడు విధాలు: దివ్యం (అపూర్వ నక్షత్రాదుల పుట్టుక); అంతరిక్షం: (పరివేషం, ఇంద్రధనుస్సు ఏర్పడటం, పిడుగులు పడటం); భౌమం: (దుఃఖరోగ ప్రదాలైన అపూర్వమైన చరాచర వస్తువులు కలగటం).

**వ. ఈ వాక్యంబులం దాత్పర్యంబు గలుగుము. బృహస్పతియును శాంతికంబును బౌష్టికంబును శత్రునాశంబును మంత్రాఢ్య పురోహిత సాధ్యంబు లనియెం గావున నీవును సంభావితపురోహితుండ వగుము. 309**

**ప్రతిపదార్థం:** ఈ వాక్యంబులన్+తాత్పర్యంబు+కలుగుము= ఈ పైన చెప్పిన మాటలయందు జాగరూకత వహించుము; బృహస్పతియును= బృహస్పతి సైతం; శాంతికంబును= శాంతిని ప్రసాదించటానికి చేసే శాంతి కర్మలు; పౌష్టికంబును= పుష్టిని కలిగించే పౌష్టిక కర్మలు; శత్రునాశంబును= విరోధుల వినాశనమూ; మంత్ర+ఆఢ్య= మంత్రాలచేత సంపన్నుడైన; పురోహిత సాధ్యంబులు+అనియెన్= పురోహితుడి వలననే సాధ్యమవుతుందని చెప్పాడు; కావునన్+ఈవును= కనుక నీవు కూడా; సంభావిత పురోహితుండవు+అగుము= గౌరవించబడిన పురోహితుడిని కలవాడవు కమ్ము.

**తాత్పర్యం:** 'పురోహిత ప్రాధాన్యాన్ని గూర్చి చెప్పిన మాటలను జాగరూకతతో గ్రహించుము. శాంతి పౌష్టిక కార్యాలూ, శత్రువినాశనమూ మంత్రవేత్త అయిన ఉత్తమ పురోహితుడివలననే సాధ్యమవుతుందని బృహస్పతి సైతం వక్కాణించాడు. కాబట్టి నీవు కూడా ఉత్తమపురోహితుడిని చేరదీసి, గౌరవించి, అతడివలన సమస్త శుభాలను పొందుము'.

**క. పరిశుద్ధి లేని కుత్సిత । పురోహితులు నీచదశలఁ బొందుదురు మహీ**
**వర! యల్పమె శుద్ధుండై । పురోహితత్వంబు సేఁత భూపతినగరన్. 310**

**ప్రతిపదార్థం:** మహీవర!= భూ భర్తవైన ఓ ధర్మరాజా!; పరిశుద్ధి లేని= శ్రేష్ఠమైన చిత్తం లేని; కుత్సిత పురోహితులు= నీచులైన పురోహితులు; నీచదశలన్+పొందుదురు= నీచస్థితిని పొందుతారు; భూపతినగరన్= రాజాంతఃపురంలో; శుద్ధుండు+ఐ= పరి శుద్ధాత్ముడై; పురోహితత్వంబు+చేఁత= పౌరోహిత్యం నెరపటం; అల్పమే?= కొంచెపు పని కాదు కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! శ్రేష్ఠమైన చిత్తశుద్ధి లేని కుత్సితులైన పురోహితులు నీచస్థితికి జారిపోయి నాశనమవుతారు. కాని, రాజాంతఃపురాలలో పరిశుద్ధాత్ముడై పురోహితుడు పౌరోహిత్యం నెరపటం అంత తేలిక పని కాదు.

**క. ఆరోగ్యము గల యుత్తముఁ । బౌరోహిత్యంబు నడపఁ బనుచునది ధరి**
**త్రీ రమణుఁ డతఁడు దాను స । మారంభము లెల్ల నేకమతి గను టొప్పున్. 311**

**ప్రతిపదార్థం:** ధరిత్రీ రమణుఁడు= భూమికి భర్త అయిన రాజు; ఆరోగ్యము+కల= పూర్ణారోగ్యవంతుడైన; ఉత్తమున్= శ్రేష్ఠుడిని; పౌరోహిత్యంబు నడపన్+పనుచునది= పౌరోహిత్యం నిర్వహించటానికి ఆజ్ఞాపించవలసి ఉన్నది; అతఁడు+తానున్= ఆ పురోహితుడూ, రాజూ; సమ్+ఆరంభములు+ఎల్లన్= అన్ని ఉత్తమమైన ఆరంభసమయాలలోనూ; ఏకమతిన్+కనుట+ఒప్పున్= ఒకే బుద్ధితో పరిశీలించటం ఎంతైనా మంచిది.

**తాత్పర్యం:** రాజు జాగరూకుడై, పౌరోహిత్యం నెరపటానికి సంపూర్ణారోగ్యవంతుడైన వాడిని మాత్రమే పురోహితుడిగా నియమించాలి. ఆ రాజూ, పురోహితుడూ ఏకమనస్కులై సమస్త శుభకార్యాలలోనూ సమదృష్టి కలిగి మసలుకొనటం ఎంతైనా అవసరం.

**క. బ్రహ్మ క్షత్త్రము లొంది, య । జిహ్మములై కృత్యములు విశిష్టత నడపన్**
**బ్రహ్మాదులు హర్షింతురు; । బ్రాహ్మణ ముఖ వర్ణసమితి ప్రమదముఁ బొందున్. 312**

**ప్రతిపదార్థం:** బ్రహ్మ క్షత్రములు+ఒంది+అజిహ్మములు+ఐ= బ్రాహ్మణ క్షత్రియులు పొందుపడి సరిసమానులై; కృత్యములు= రాజ్యకార్య కలాపాలు; విశిష్టతన్ నడపన్= శ్రేష్ఠమైన రీతిని నిర్వహిస్తే; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మ మొదలుకొని సమస్త దేవతలు; హర్షింతురు= సంతోషిస్తారు; బ్రాహ్మణ ముఖ వర్ణ సమితి= బ్రాహ్మణులు మొదలుకొని సమస్త వర్ణాల సమూహం; ప్రమదమున్+పొందున్= అత్యంత సంతోషాన్ని పొందుతుంది.

**తాత్పర్యం:** బ్రాహ్మణ క్షత్రియులు అన్యోన్యులై అనుకూలంగా, సరైన మార్గంలో రాజ్య కార్యకలాపాలను నిర్వర్తిస్తే, బ్రహ్మమొదలుకొని సమస్త దేవతలు, బ్రాహ్మణులు మొదలుకొని సమస్త వర్ణాలవారు మిక్కిలి సంతోషిస్తారు.

**వ. ఈ యర్థంబునం దైల కశ్యప సంవాదంబను నితిహాసంబు కలదు; వినుమైలుండు గశ్యపుని బ్రహ్మక్షత్ర ప్రకారం బడిగిన నమ్మనుజపతికి నమ్మునీంద్రుం డిట్లనియె. 313**

**ప్రతిపదార్థం:** ఈ+అర్థంబునందున్= ఈ బ్రాహ్మణ క్షత్రియుల పరస్పర అన్యోన్యతను గూర్చిన విషయంలో; ఐల కశ్యప సంవాదంబు+అను= ఐలుడు కశ్యప ప్రజాపతి అనేవారిద్దరి మధ్య జరిగిన సంభాషణమనే; ఇతిహాసంబు+కలదు= పూర్వకథ ఒకటి ఉన్నది; వినుము= జాగరూకతతో వినుము; ఐలుండు+కశ్యపునిన్= ఐలుడు కశ్యప ప్రజాపతితో; బ్రహ్మ క్షత్ర ప్రకారంబు+అడిగినన్= బ్రాహ్మణ క్షత్రియుల సంబంధాన్ని గూర్చి ప్రశ్నించగా; ఆ+మనుజపతికిన్= ఆ ఐలుడనే మహారాజుకు; ఆ+ముని+ఇంద్రుండు= ఆ మహర్షి సత్తముడైన కశ్యప ప్రజాపతి; ఇట్లు+అనియెన్= ఇట్లా వివరించాడు.

**తాత్పర్యం:** ఐల కశ్యపప్రజాపతి సంవాదంలో బ్రాహ్మణ క్షత్రియుల సంబంధానికి సంబంధించిన ఒక పూర్వ కథ ఉన్నది. ఆ కథ చెబుతాను వినుము. బ్రాహ్మణ క్షత్రియుల మధ్య ఉండే సంబంధాన్ని ఐలుడు అడుగగా కశ్యపప్రజాపతి ఈ విధంగా చెప్పాడు.

**ఆ. 'క్షత్రమునకుఁ బుట్టఁగాఁ బట్టు బ్రహ్మంబు । బ్రాహ్మణునకు యోని రాజు గాన**
**యుభయ వర్ధనంబు నొండొంటి విడువమి । వెలుఁగు రెండు మాయు విడిచెనేని. 314**

**ప్రతిపదార్థం:** క్షత్రమునకున్= క్షాత్రానికి (రాజుకు); పుట్టన్+కాన్+పట్టు బ్రహ్మంబు= పుట్టుక స్థానం బ్రాహ్మణుడు; బ్రాహ్మణునకున్= బ్రాహ్మణుడికి; యోని రాజు= జననస్థానం రాజు; కానన్= అందుచేత; ఉభయ వర్ధనంబున్= బ్రాహ్మణ క్షత్రియుల అభివృద్ధి; ఒండొంటిన్= ఒకటినొకటి అంటే బ్రాహ్మణ క్షత్రియులు పరస్పరం; విడువమిన్ వెలుఁగున్= వదలకుండటం వలననే ప్రకాశిస్తాయి; విడిచెన్+ఏని= పట్టువదలితే; రెండు మాయున్= బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు రెండూ నశిస్తాయి.

**తాత్పర్యం:** క్షత్రియుడికి పుట్టుక స్థానం బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడికి జననస్థానం రాజు. అందుచేత బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు రెండూ పరస్పర ఆధారాధేయాలు కావటంవలన ఆ రెండు వర్ణాలు కలిసి సముచిత కార్యకలాపాలు నెరపినప్పుడే అభ్యున్నతితో ప్రకాశిస్తాయి. లేదా పట్టువదలితే పరస్పరం వినాశనమౌతాయి.

**క. తమలోనఁ బొందుగల వి । ప్రమహీశులఁ బ్రజయుఁ బొదువుఁ బ్రజచే మాన్య**
**త్వము వడయఁగ నేరరు భే । దము గలిగిన నలఁతు రొలసి దస్యులు ప్రజలన్. 315**

**ప్రతిపదార్థం:** తమలోనన్+పొందు+కల= క్షత్రియులూ బ్రాహ్మణులూ తమలో తాము అరమరికలు లేకుండా కలసి ఉంటే; విప్ర= బ్రాహ్మణులను; మహీ+ఈశులన్= రాజులను; ప్రజయున్+పొదువున్= ప్రజలు సైతం కలసి మెలసి ఉంటారు; భేదము+కలిగినన్= బ్రాహ్మణ క్షత్రియులలో విభేదం ఏర్పడితే; ప్రజచేన్= ప్రజలచేత; మాన్యత్వము+పడయఁగన్ నేరరు= గౌరవం పొందలేరు; ప్రజలన్= అప్పుడు ప్రజలను; దస్యులు= దొంగలు; ఒలసి= కదిసి (చుట్టుముట్టి ఎదుర్కొని); నలఁతురు= విసిగిస్తారు (పీడిస్తారు).

**తాత్పర్యం:** బ్రాహ్మణ క్షత్రియులు పరస్పరం అరమరికలు లేక కలసి మెలసి ఉంటే ప్రజలు గౌరవిస్తారు. వాళ్ళలో విభేదం ఉంటే మాత్రం అట్లాంటి బ్రాహ్మణ క్షత్రియుల పట్ల ప్రజలకు ఏ మాత్రం గౌరవం ఉండదు. ఇది అదనుగా గ్రహించి దొంగలు ప్రజలను పీడిస్తారు.

**తే. అట్టి దశఁ బుట్టు రుద్రుని యలుక దాన । సకలమునకు వినాశంబు సంభవిల్లుఁ**
**గాన యెల్ల విధంబులఁ గలసి యుండ । వలయు నృపుఁడుఁ బురోధయు వసుమతీశ! 316**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూమికి భర్త అయిన ఓ ధర్మరాజా!; అట్టి దశన్= బ్రాహ్మణ క్షత్రియులకు అన్యోన్యత లేని సమయంలో; రుద్రుని+అలుక పుట్టున్= రుద్రదేవుడికి కోపం కలుగుతుంది; దానన్= ఆ రుద్రదేవుడి ఆగ్రహం వలన; సకలమునకున్= సమస్త ప్రపంచానికీ; వినాశంబు సంభవిల్లున్= విధ్వంసం కలుగుతుంది; కాన= అందుచేత; ఎల్ల విధంబులన్= అన్ని విధాలా; నృపుఁడున్+పురోధయున్= రాజూ, బ్రాహ్మణుడూ; కలసి+ఉండవలయున్= కలసి మెలసి ఉండటమే సముచితం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! బ్రాహ్మణ క్షత్రియులకు అన్యోన్యత లేని సమయంలో రుద్రదేవునికి కోపం కలుగుతుంది. ఆయన ఆగ్రహంవలన సమస్తప్రపంచానికీ నాశనం కలుగుతుంది. అందువలన రాజూ, బ్రాహ్మణుడూ కలిసి మెలసి ఉండటమే సర్వవిధాలా సముచితం.

**క. వినుము విశేషించి జనన । జనితోన్నతి విప్రుఁ డతని జనపతి వినయం**
**బున నడపవలయు దానను । మనుగడ యిరువురకుఁ బ్రజకు మహనీయ మగున్.' 317**

**ప్రతిపదార్థం:** వినుము= సావధానుడవై వినుము; విశేషించి= ప్రత్యేకించి; జనన జనిత+ఉన్నతి విప్రుఁడు= పుట్టుకలోను, పుట్టిన దానిలోను బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు; జనపతి= రాజు; అతనిన్= ఆ బ్రాహ్మణుడి పట్ల; వినయంబునన్= మిక్కిలి వినమ్రతతో (భయ భక్తులతో); నడపవలయున్= జీవితయాత్ర సాగించాలి; దానను= ఆ విధంగా రాజు బ్రాహ్మణుడి పట్ల వినయంతో నడిపిస్తే; ఇరువురకున్+ప్రజకున్= బ్రాహ్మణ క్షత్రియులు ఇద్దరికీ ప్రజలకూ; మనుగడ= జీవితయాత్ర; మహనీయము+అగున్= మహోన్నతమై ఒప్పుతుంది.

**తాత్పర్యం:** పుట్టుకవలన, పుట్టిన తరువాత ఔన్నత్యం కారణంగా కూడా బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. అందువలన రాజు బ్రాహ్మణుడి పట్ల వినయవినమితగాత్రుడై తన జీవితయాత్రను సాగించాలి. ఆ విధంగా గౌరవించటంవలన రాజుకూ, బ్రాహ్మణుడికీ దానివలన ప్రజలకూ జీవనయాత్ర మహోన్నత మౌతుంది.'

### కుబేరునకు ముచుకుందునకుఁ గలిగిన సంవాదము (సం. 12-75-3)

**వ. అని చెప్పి పురోహితుని విశేషంబు ముచుకుందుం డను రాజునకు వైశ్రవణునకుం గలిగిన సంవాదంబునఁ బ్రకటం బయ్యెఁ; నత్తెఱం గెఱింగించెద. 318**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని బ్రాహ్మణ క్షత్రియుల సంబంధాన్ని పై రీతిలో చెప్పి; పురోహితుని విశేషంబున్= పురోహితుడియొక్క విశిష్టతను; ముచుకుందుండు+అను రాజునకున్= ముచుకుందు డనే రాజుకు; వైశ్రవణునకున్+కలిగిన= విశ్రవసుడి పుత్రుడైన వైశ్రవణునకు అంటే కుబేరునకు కలిగిన; సంవాదంబునన్= సంభాషణవలన; ప్రకటంబు+అయ్యెన్= స్పష్టమైనది; ఆ+తెఱంగు+ఎఱింగించెదన్= ఆ పద్ధతినంతటినీ వివరిస్తాను.

**తాత్పర్యం:** బ్రాహ్మణ క్షత్రియులు అన్యోన్యంగా ఉంటూ రాజు బ్రాహ్మణుడిని గౌరవించటమే మంచి' దని తెలిపి, ఇంకా పురోహితుడి విశిష్టతను వివరించే ముచుకుంద మహారాజుకూ కుబేరుడికీ జరిగిన సంవాదంలో వెల్లడైన తీరును వివరిస్తాను వినుమని భీష్ముడు ధర్మరాజునకు తెలిపాడు.

**మ. వినుమారాజు సమస్త దిగ్విజయమున్ విస్ఫూర్తిమైఁ జేసి, తాఁ**
**దన లా వారయు బుద్ధి వైశ్రవణు మీఁదం బోవ నాతండు దై**
**త్యనికాయంబులఁ బంచినం దెరువునం దత్సైన్యముల్ రాజు మూఁ**
**క నతి క్షుభ్యము గాఁగఁ జేయుటయు స్రుక్కంబడ్డ చిత్తంబుతోన్. 319**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ ధర్మరాజా! వినుము; ఆ రాజు= ఆ ముచుకుందు డనే రాజు; విస్ఫూర్తిమైన్= మిక్కిలి పరాక్రమంతో దేదీప్యమానంగా; సమస్త దిక్+విజయమున్= అన్ని దిక్కుల విజయాన్ని; చేసి= సాధించి; తాన్+తనలావు+ఆరయు బుద్ధిన్= ఆ ముచుకుందుడు తన పరాక్రమాన్ని తెలిసికొనాలనే బుద్ధితో; వైశ్రవణు మీఁదన్+పోవన్= కుబేరుడిపై యుద్ధానికి పోగా; ఆతండు= ఆ కుబేరుడు; దైత్యనికాయంబులన్= రాక్షస సమూహాలను; పంచినన్= యుద్ధానికి వెళ్ళండని ఆజ్ఞాపించగా; తెరువునన్= మార్గమధ్యంలోనే; తద్+సైన్యముల్= ఆ కుబేరుడు పంపిన దైత్య సేనలు; రాజు మూఁకన్= ముచుకుందుడనే రాజు సైన్య సమూహాలను; అతి క్షుభ్యము+కాఁగన్= మిక్కిలి సంక్షోభం చెందేటట్లు; చేయుటయున్= బాధించగా; స్రుక్కన్+పడ్డ చిత్తంబుతోన్= కలత చెంది మూర్ఛపడ్డ మనసుతో.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! సావధానంగా వినుము. ముచుకుందు డనే రాజు అన్ని దిక్కుల విజయాన్ని సాధించి తన పరాక్రమాన్ని పరీక్షించుకొనదలచి, కుబేరుడిపై కయ్యానికి కాలుదువ్వాడు. కుబేరుడు దైత్యసైన్యాల ననేకం పంపగా ఆ సైన్యాలు మార్గమధ్యంలోనే ముచుకుందుడి సైన్యాన్ని మట్టికరిపించి సంక్షోభింపజేశాయి. సంక్షుభిత మనస్కుడైన ముచుకుందుడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నృపతి పురోహితు దూఱినఁ। దపముల మంత్రముల దేవతాపూజల వీ**
**ర్యపటుత్వ మతని సేనకు। నపరిమితము సేసె నమ్మహాత్ముం డధిపా! 320**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!; నృపతి= ఆ ముచుకుందుడనే రాజు; పురోహితున్ దూఱినన్= తన పురోహితుడిని నిందించగా; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడైన పురోహితుడు; తపములన్= తపస్సులచేత; మంత్రములన్= మంత్రాలచేత; దేవతాపూజలన్= దైవ పూజాదికాలచేత; అతని సేనకున్= ఆ ముచుకుందుడి సైన్యానికి; వీర్య పటుత్వము= పరాక్రమ తీక్ష్ణతను; అపరిమితము+చేసెన్= సాటిలేనంతగా ప్రసాదించాడు.

**తాత్పర్యం:** ఓటమి చవిచూసిన ముచుకుందు డనే రాజు తన పురోహితుడిని నిందించాడు. వెంటనే ఆ పురోహితుడు ఘోర తపస్సువలన, మహిమాన్విత మంత్రాల వలన, దైవపూజల మూలాన ముచుకుందుని సైన్యాలకు అత్యంత పరాక్రమ పటుత్వాన్ని ప్రసాదించాడు.

**విశేషం:** ఇక్కడ పురోహితుడి మహిమాన్విత శక్తి సామర్థ్యాలూ, అట్లాంటి పురోహిత విరహితంగా రాజు కొనసాగలే డనీ, పురోహిత మహిమ చేతనే రాజు విశిష్టుడు అవుతాడనీ సోదాహరణంగా నిరూపితం. అందువలనే ఈ కథ ఉదాహరించబడింది.

**ఆ. బ్రహ్మశక్తిఁ బేర్చి రాజు సైన్యము దైత్య। సేన బడలు వడఁగఁ జేయ నాతఁ**
**డతి రయమున ముట్టె నలకఁ గుబేరుండు। ననికి వెడలె నిజ బలాన్వితముగ. 321**

**ప్రతిపదార్థం:** బ్రహ్మశక్తిన్+పేర్చి= బ్రాహ్మణుడి యొక్క శక్తి వలన అతిశయించి; రాజు సైన్యము= ముచుకుందుడనే రాజుయొక్క సైన్యం; దైత్యసేన= కుబేరుడు పంపిన దైత్యసైన్యాన్ని; బడలు+పడఁగన్+చేయన్= బలహీనపడేటట్టు చేయగా; ఆతఁడు= ఆ ముచుకుందుడు; అతి రయమునన్= మిక్కిలి వేగంతో; ముట్టెన్= ఎదుర్కొన్నాడు; కుబేరుండు= కుబేరుడు; అలుకన్= కోపంతో; నిజబల+అన్వితముగన్= తన సైన్యాలతో కూడి; అనికి వెడలెన్= యుద్ధానికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడి తపస్సు, మంత్రపూత దైవపూజాదికాలవలన పొందిన శక్తిచేత ముచుకుందుడి సైన్యం కుబేరుడి సైన్యాలను బలహీనపరిచేటట్లు ముచుకుందుడు తన సైన్యాలను పురికొల్పాడు. అందుకు ఆగ్రహించిన కుబేరుడు తన సైన్యసమూహాలతో ముచుకుందుడి సైన్యాలను ఎదుర్కొన్నాడు.

**వ. వెడలి సమరంబు సేయు సమయంబునం గిన్నరేశ్వరుం డన్నరేశ్వరు నాలోకించి. 322**

**ప్రతిపదార్థం:** వెడలి= కుబేరుడు యుద్ధానికి వెళ్ళి; సమరంబు+చేయు సమయంబునన్= యుద్ధం చేసే సమయంలో; కిన్నర+ఈశ్వరుండు= కిన్నరులకు అధిపతిఅయిన కుబేరుడు; ఆ+నర+ఈశ్వరున్+ఆలోకించి= ఆ ముచుకుందుడనే రాజును చూచి.

**తాత్పర్యం:** కుబేరుడు యుద్ధభూమికి వెళ్ళి యుద్ధం చేస్తున్న సమయంలో ముచుకుందుడిని చూచి - (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. 'దక్షుం డై తిటు బ్రహ్మశక్తిన భవద్బాహా విలాసం బమి**
**త్రక్షోభం బొనరించెనే?' యనుడు నాతం డిట్లు 'నీ వంటి బ్ర**
**హ్మ క్షత్రంబుల కేక యోని జననం బ వ్వేధ గల్పించె; యో**
**గ క్షేమాకలనంబు సంగతములై కావింపఁ బంపండొకో! 323**

**ప్రతిపదార్థం:** ఇటు= ఈ విధంగా; బ్రహ్మశక్తిన్= బ్రాహ్మణశక్తి మూలంగానే; దక్షుండు+ఐతి(వి)= పరాక్రమ సంపన్నుడ వయ్యావు; భవత్+బాహా విలాసంబు= నీ యొక్క బాహు పరాక్రమం; అమిత క్షోభంబు+ఒనరించెనే?= శత్రువులకు సంక్షోభం కలిగించగలదా?; అనుడున్= అని పలుకగా; ఆతండు= ఆ ముచుకుందుడు; ఇట్లు= ఈ రీతిగా; నీవంటి= నీవంటి; బ్రహ్మ క్షత్రంబులకున్= బ్రాహ్మణ క్షత్రియులకు; ఏకయోని జననంబు= ఒకే జనన స్థానంలో పుట్టుకను; ఆ+వేధ కల్పించెన్= ఆ బ్రహ్మ సృజించాడు; యోగక్షేమ+ఆ కలనంబున్= ఆ బ్రహ్మ పరస్పర యోగక్షేమాల సంబంధాన్ని; సంగతములు+ఐ= ఒప్పిదమయ్యేటట్లు; కావింపన్+పంపండొకో!= చేయగా పంపడా?

**తాత్పర్యం:** 'ఓ ముచుకుంద మహారాజా! బ్రహ్మతేజశ్శక్తి మూలాన్నే నీకు ఇంతటి అపూర్వ పరాక్రమసామర్థ్యాలు ఒనగూడి, విజృంభించావు గానీ నీకు మామూలుగా ఇంతటి సామర్థ్య మేదీ?' అని కుబేరుడు అధిక్షేపించాడు. అప్పుడు ఆ ముచుకుందుడు ఇట్లా సమాధానం చెప్పాడు. 'బ్రహ్మక్షత్రాలకు ఒకే తేజోరాశిని బ్రహ్మదేవుడు అనుగ్రహించాడు. కనుకనే బ్రాహ్మణక్షత్రియుల యోగక్షేమాల సంబంధంగా ఆ బ్రహ్మ ఉపేక్షించి ఎట్లా ఉండగలడు?; తప్పకుండా ఆ బ్రహ్మ తగిన రీతిలోనే నా విషయంలో అనుగ్రహించాడు' అని వివరించాడు.

**వ. అనుటయు ధనదుండు సాంత్వన స్వరంబున. 324**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ముచుకుందుడు చెప్పగా; ధనదుండు= కుబేరుడు; సాంత్వన స్వరంబునన్= అనునయ పూర్వకమైన కంఠంతో.

**తాత్పర్యం:** ముచుకుందుడు సమాధానం చెప్పగా విన్న కుబేరుడు అనునయంతో కూడిన మాటలతో - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'నాకును నీకు నేటికి రణం బొనరింపఁగ నేను బంప నీ**
**వేక ముఖంబుగా ధరణి యేలుము' నావుడు నవ్వి యవ్విభుం**
**'డీ కుపతిత్వ మొల్ల నొరు నీగి మహత్త్వకరంబె విద్విష**
**ద్భీకర మద్భుజార్జితమ పెంపొనరంగ భుజింతు దిక్పతీ! 325**

**ప్రతిపదార్థం:** నాకును నీకున్= నాకూ నీకూ (కుబేరుడికీ ముచుకుందుడికీ); రణంబు+ఒనరింపఁగన్+ఏటికిన్= యుద్ధం చెయ్యట మెందుకు?; ఏను+పంపన్= నేను ఆజ్ఞాపించగా; ఈవు+ఏకముఖంబుగాన్= నీవే స్వతంత్రంగా; ధరణి+ఏలుము= రాజ్యాన్ని పాలించుము; నావుడున్= అని కుబేరుడు అనగా; ఆ+విభుండు= ఆ ముచుకుంద డనే రాజు; నవ్వి= పరిహాస పూర్వకంగా నవ్వి; ఈ కుపతిత్వము+ఒల్లన్= ఈ కుటిల రాజ్యాధిపత్యం అంగీకరించలేను; ఒరు+ఈగి= ఇతరులు ఇచ్చిన దానం; మహత్త్వ కరంబె?= గొప్పదనాన్ని చేకూర్చగలదా?; విద్విషత్+భీకర= శత్రువులకు భయంకరమైన; మత్= నా యొక్క; భుజ+ఆర్జితము+అ= బాహుబలంతో సాధించిన రాజ్యాన్ని మాత్రమే; పెంపు+ఒనరంగన్= అతిశయించేటట్లుగా; భుజింతున్= అనుభవిస్తాను.

**తాత్పర్యం:** కుబేరుడు అనునయంగా ముచుకుందునితో 'నీకూ నాకూ యుద్ధం చెయ్యవలసిన అవసరంలేదు. నా నియోగంతో నీవు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఈ రాజ్యాన్ని పాలించుకొమ్ము' అని చెప్పగా ఆ ముచుకుందుడు పరిహాసపూర్వకంగా 'ఓ కుబేరా! ఈ కపట రాజ్యాధిపత్యాన్ని నేను అంగీకరించను. ఇతరులు ఇచ్చే దానం స్వీకరిస్తే నాకు మహత్త్వకారణం కాజాలదు. నా బాహుపరాక్రమంతో శత్రుసంహారం చేసి సంపాదించిన రాజ్యాన్నే ఏలుతూ సమస్తభోగాలనూ అనుభవిస్తాను. అదే నాకు సముచితం' అని సమాధానం ఇచ్చాడు.

**విశేషం:** పరాక్రమ సంపన్నుడూ, వీరుడూ అయిన రాజు మహత్త్వానికి కారణం శత్రు సంహారంచేసి రాజ్యం చేజిక్కించుకొనటమేనని, వీరుడైన రాజు ఇతరులు ఇచ్చే దానాదులకు దోయిలొగ్గలేడని, అట్లా దానానికి చేతులు చాచటం అతడి పరాక్రమానికి మచ్చ అనీ, వీరవిస్ఫూర్తి సంపాదిత రాజ్యరమ భోగయోగ్యమని ముచుకుందుడి మాటలవలన విదిత మవుతుంది.

తిక్కన రచించిన ఈ ఉత్పలమాల ముచుకుందుడి వీరోచిత కార్యస్ఫురణకు సముచితంగా సాగింది.

**వ. అనిన విని పౌలస్త్యుండు నీ వధికుండ వట్లు సేయు'మని గారవించిన ముచుకుందుండు ముదితుండై చని సకలోర్వియు నిర్వక్ర విక్రమంబున నేలె నని చెప్పిన విని యజాతశత్రుండు 'రాజధర్మంబులయం దైశ్వర్య ప్రీతి పుణ్యలోకంబులు నిరతిశయంబుగాఁ జేయం జాలునది యెయ్యది?' యని యడిగిన. 326**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని ముచుకుందుడు చెప్పగా విని; పౌలస్త్యుండు= పులస్త్యుడి వంశంలో జన్మించినవాడైన కుబేరుడు; నీవు+అధికుండవు+అట్లు+చేయుము+అని= నీవు గొప్పవాడవు అట్లాగే కానిమ్ము అని; గౌరవించినన్= మన్నించగా; ముచుకుందుఁడు= ముచుకుంద డనే రాజు; ముదితుండు+ఐ+చని= సంతోషంతో వెళ్ళి; సకల+ఉర్వియున్= సమస్త భూమండలాన్ని; నిర్వక్ర విక్రమంబునన్+ఏలెన్+అని చెప్పినన్ విని= సాటి లేని పరాక్రమంతో పరిపాలించా డని చెప్పగా విన్న; అజాత శత్రుండు= పుట్టని శత్రువులు గల ధర్మరాజు (శత్రువులు లేని ధర్మరాజు); రాజధర్మంబుల+అందున్= రాజుకు విహిత మైన ధర్మాలలో; ఐశ్వర్య ప్రీతి పుణ్యలోకంబులు= సంపద యందలి ప్రీతి; శాశ్వత పుణ్యలోక ప్రాప్తి అనే వాటిలో; నిరతిశయంబుగాన్= అత్యధికంగా; చేయన్+చాలునది+ఏ+అది= ఇవ్వగలిగిన ధర్మ మేది? అని+అడిగినన్= అని అడుగగా.

**తాత్పర్యం:** తన పరాక్రమంతో సంపాదించిన రాజ్యం నిర్వక్ర పరాక్రమంతో ఏలుతా' నని చెప్పిన ముచుకుందుడితో కుబేరుడు 'నీ వంటతటి సమర్థుడవు. అట్లాగే చేయుము' అని చెప్పి మన్నించాడు. ముచుకుందుడు సంతోషించి సమస్తభూమండాలన్నీ పరాక్రమోపేతుడై పరిపాలించాడు. ఈ కథను భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'రాజధర్మాలలో పరమ సంపదను, పుణ్యలోకప్రాప్తిని ప్రసాదించగల ధర్మ మేదో' తెలియజేయవలసిందని భీష్ముడిని ప్రార్థించగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అతని కిట్టు లనియె నమర తరంగిణీ । సూనుఁ 'డధిక భీతులైన సజ్జ**
**నులకు నభయ మొసఁగి యలఘు సౌఖ్యాత్ములఁ । జేఁత యెంతయును విశిష్ట మధిప!' 327**

**ప్రతిపదార్థం:** అమర తరంగిణీ సూనుఁడు= దేవనది అయిన గంగాపుత్రుడైన భీష్ముడు; అతనికిన్+ఇట్టు+అనియెన్= ఆ ధర్మరాజుతో ఇట్లా అన్నాడు; అధిప!= ఓ ధర్మరాజా!; అధిక భీతుఁడు+ఐన= ఎక్కువ భయపడిన; సత్+జనులకున్= మంచి జనులకు; అభయము+ఒసఁగి= భయంలేదని చెప్పి, అనుగ్రహించి; అలఘు సౌఖ్య+ఆత్ములన్+చేఁత= మిక్కిలి సుఖాత్ములుగా చేయటం; ఎంతయును= మిక్కిలి; విశిష్టము= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజుతో 'ఓ ధర్మరాజా! అత్యంత భీతులైన ఉత్తమజనులకు అభయ మిచ్చి, వారికి సమస్తసుఖాలు సంప్రాప్తింపజేసి సంతోషాంతరంగులను చేయట మనేది రాజునకు ఉండవలసిన విశిష్టధర్మం' అని పలికాడు.

**వ. అని వెండియు. 328**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'విను! పర్జన్యుఁడు భూతము । లను బండిన మ్రాను పక్షులను బ్రోచువిధం**
**బున నీవు బంధువుల, స । జ్జన యుతముగఁ బ్రోవు; మది ప్రశస్తం బనఘా! 329**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడ వైన ఓ ధర్మరాజా!; విను= శ్రద్ధతో వినుము; పర్జన్యుఁడు= వర్షాధి దేవతఅయిన ఇంద్రుడు; భూతములను= ప్రాణులనూ; పండిన మ్రాను= ఫలాలతో నిండిన చెట్టు; పక్షులను= అనేక పక్షి సంతతిని; ప్రోచు విధంబునన్= సంరక్షించే విధంగానే; ఈవు= నీవు; బంధువులను= చుట్టాలను; సత్+జనయుతముగన్+ప్రోవుము= మంచి జనులతో పాటు రక్షించుము; అది ప్రశస్తంబు= అది సర్వశ్రేష్ఠం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఇంద్రుడు సమస్త ప్రాణికోటిని వర్షధారలతో సంరక్షించినట్లు, ఫలభరితమైన చెట్టు అనేక పక్షిసంతతిని పోషించిన రీతిగా, నీవు మంచివాళ్ళందరినీ చుట్టాలతోపాటు సంరక్షించుము. అది రాజధర్మాలలో మిక్కిలి ప్రశస్తమైనది.

**విశేషం:** అలం: మాలోపమ.

**వ. అనిన విని ధర్మనందనుండు 'విప్రప్రభృతులకు నిజధర్మవర్తనంబుల జీవనంబుల నడవక తక్కిన నెై?' ట్లని యడిగినఁ బితామహుం డతనితో 'నాపద దనికిన నితర జాతి వృత్తంబు గర్హితంబుగా దట్లయినను నాయుధోపజీవనాదిక్షత్ర ధర్మంబులంజేసి బ్రాహ్మణ్యంబు వట్రపడి బ్రాహ్మణులు క్షత్రసము లగుదురు. వాణిజ్య ప్రముఖ వైశ్యక్రియ లాచరించి వైశ్యసము లగుదురు. నిత్యానుష్ఠానంబులు లోనుగాఁ గలయవి డిగవిడిచి**

**ధనలోభ తాత్పర్యంబున శూద్రప్రాయులై చరించి శూద్రసము లగుదురు; దక్కిన జాతులవారందరు దమదమ తారతమ్యంబులతో నిట్ల నిజజాతి విహీను లగుదు; రట్టివారు జాత్యుత్తమ కృత్యంబునకుఁ బాత్రంబులు గారు; భూకాంతుం డింతయు నెఱింగి యర్హప్రకారంబులం బ్రజ నడిపి రక్షించినం బ్రజాకృతం బగు ధర్మంబునందుఁ జతుర్థాంశంబునకు నుక్తుం డగుఁ బ్రజలఁ బాతకంబులం బొరయకుండ నరయం జాలక దండ్యదండన రహితుం డైన మహీవిభుని వారలచేసిన పాతకంబుల నాలవపాలు వొందుఁ; గొందఱు బుధు లంతయుం బొందు నని చెప్పుదు'రనుటయు నమ్మనుజనాథుండు. 330**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విన్న; ధర్మనందనుండు= ధర్మరాజు; విప్ర ప్రభృతులకున్= బ్రాహ్మణులు మొదలైన వర్ణాలవారికి; నిజ ధర్మవర్తనంబులన్= తమ ధర్మానుగుణ వర్తనాలలో; జీవనంబులు నడవక తక్కినన్= జీవితాలను సాగించకపోతే; ఎట్లు+అని+అడిగినన్= ఏమిటి గతి? అని ప్రశ్నించగా; పితామహుండు= కురుపితా మహుడైన భీష్ముడు; అతనితోన్= ఆ ధర్మరాజుతో; ఆపద దనికినన్= విపత్తు సంభవిస్తే; ఇతర జాతి వృత్తంబు= ఇతర వర్ణాల నడవడి; గర్హితంబు+కాదు= నిందించదగ్గది కాదు; అట్లు+అయినను= అట్లా అయినప్పటికి; ఆయుధ+ఉపజీవన+ఆది= ఆయుధాలతో జీవనం మొదులుకొని; క్షత్రధర్మంబులన్+చేసి= రాజధర్మాలవలన; బ్రాహ్మణత్వంబు వ్రటపడి= బ్రాహ్మణత్వం క్షీణించి; బ్రాహ్మణులు క్షత్ర సములు+అగుదురు= బ్రాహ్మణులు రాజులతో సమాను లౌతారు; వాణిజ్య ప్రముఖ= వర్తకం మొదలైన; వైశ్యక్రియలు+ఆచరించి= వైశ్యులకు ఉచితమైన పనులు చేసి; వైశ్య సములు+అగుదురు= వైశ్యులతో సమాను లవుతారు; నిత్య+అనుష్ఠానంబులు= అనునిత్యమూ ఆచరించవలసిన అగ్ని కార్యాదులు; లోనుగాన్+కలయవి= మొదలుకొని గల కార్యా లన్నిటిని; డిగవిడిచి= వదలిపెట్టి; ధనలోభ తాత్పర్యంబునన్= ద్రవ్యంమీది ఆసక్తి మూలంగా; శూద్ర ప్రాయులు+ఐ చరించి= శూద్రులవలె నడుచుకొని; శూద్రసములు+అగుదురు= శూద్రులతో సమాను లవుతారు; తక్కిన జాతులవారు+అందఱున్= ఇతర వర్ణాల వారందరూ; తమతమ తారతమ్యంబులతోన్= వారి వారి తరతమ భేదాలతో; ఇట్లు= ఇదే రీతిగా; నిజ జాతి విహీనులు+అగుదురు= తమ వర్ణాలకంటె నీచులవుతారు; అట్టివారు= అట్లాంటివారు; జాతి+ఉత్తమ కృత్యంబునకున్= ఆయా వర్ణాల శ్రేష్ఠమైన కార్యాలకు; పాత్రంబులు+కారు= అర్హులు కాలేరు; భూకాంతుండు= భూమికి భర్త అయిన రాజు; ఇంతయున్+ఎఱింగి= పైన పేర్కొన్న సమస్తమూ గుర్తించి; అర్హ ప్రకారంబులన్= తగిన పద్ధతులలో; ప్రజన్ నడపి రక్షించినన్= ప్రజలను ఏలుకొని సంరక్షిస్తే; ప్రజాకృతంబు+అగు= ప్రజలు చేసిన; ధర్మంబునందున్= ధర్మంలో; చతుర్థ+అంశంబునకున్+ఉక్తుండు+అగున్= నాలుగో భాగానికి అర్హుడు అవుతాడు; ప్రజలన్= ప్రజలను; పాతకంబులన్+ పొరయకుండన్+అరయన్+చాలక= పాపాలు అంటకుండా పరిపాలించక పోతే; దండ్యదండన రహితుండు+ఐన= శిక్షార్హుడైన వాడిని శిక్షించ లేని; మహీవిభుని= రాజును; వారల చేసిన పాతకంబులన్= ప్రజలు చేసిన పాపాలలో; నాలవ పాలు పొందున్= నాలుగవ వంతు అనుభవిస్తాడు; కొందఱు బుధులు= (అయినా) కొంతమంది పండితులు; అంతయున్+పొందున్+అని చెప్పుదురు= ప్రజలు చేసిన పాపమంతా రాజుకు చెందుతుం దని చెప్తున్నారు; అనుటయున్= అని చెప్పగా; ఆ+మనుజ నాథుండు= ఆ మానవనాథుడైన ధర్మరాజు.

**తాత్పర్యం:** ప్రజలను సంరక్షించటం రాజధర్మాలలో శ్రేష్ఠమైనదని భీష్ముడు చెప్పగా, ధర్మరాజు 'బ్రాహ్మణుడు మొదలుకొని ఆయా వర్ణాలవారు స్వజాతి ధర్మ నిర్వహణం చేయకుండా తప్పితే పరిస్థితి ఏమిటి?' అని ప్రశ్నించాడు. 'ఆపద సమయాలలో ఆయా వర్ణాలవారు స్వజాతి ధర్మాన్ని వదలిపెట్టినా నిందార్హులు కారు. శస్త్రోపజీవులైన రాజులు ఆచరించే ధర్మాలను బ్రాహ్మణులు ఆచరించి, బ్రాహ్మణ్యాన్ని కోల్పోయి, రాజుతో సమానులౌతారు. వైశ్యులకు తగిన వాణిజ్యం మొదలుకొని ధర్మాలను పాటించి వైశ్యులతో సమానులౌతారు. నిత్యకృత్యాలైన అగ్నిష్టోమాది కార్యాలను వదలిపెట్టి, ధనలోభులై శూద్రులవలె ప్రవర్తించి శూద్రులతో సమాను లౌతారు. ఇట్లాగే ఇతర వర్ణాలవారు తమతమ ధర్మాలను వదలిపెట్టి ఇతర ధర్మాచరణచేత తమ వర్ణాలకంటె హీనమైన వారవుతారు. అట్లాంటి వారు

ఉత్తమ కార్యాలను ఆచరించటానికి అర్హులు కాలేరు. ఈ విషయాలను రాజు జాగరూకుడై గుర్తించి, ఆయా వర్ణాలవారిని తగిన రీతిలో సంరక్షించటం రాజుకు ఉత్తమధర్మం. ఆ ప్రజలు చేసే ధర్మానుగుణ ప్రవర్తనవలన వారు సంపాదించుకొనే ధర్మంలో నాలుగవ వంతు ఆ రాజుకు చెందుతుంది. ప్రజలకు ఎట్లాంటి పాపాలంటకుండా పాలించకపోయినా, శిక్షార్హులను దండించకపోయినా ఆ ప్రజలు చేసిన పాపంలో నాలుగవ వంతు రాజు అనుభవిస్తాడని కొందరు పెద్దలు చెప్పుతున్నారు. కాని, మరికొందరు ఆర్యులు అట్లాంటి ప్రజలు దుష్ట కార్యాచరణవలన సంపాదించుకొన్న పాపమంతా రాజే అనుభవించవలసి ఉంటుం దని వక్కాణించారు' అని భీష్ముడు ధర్మరాజునకు వివరించాడు.

**ఆ. 'వినుము! వివిధ సుఖము లనుభవింపఁగ రాజ్య । విభవ యుక్తిఁ దిరుగ వేడ్క లేదు**
**నాకు ధర్మరక్షణము మీఁది భరముఁ ద । ల్లోప భయము మనములోనఁ బెద్ద. 331**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ తాతా వినుము; నాకున్= నాకు (ధర్మరాజుకు); వివిధ సుఖములు+అనుభవింపఁగన్= నాకు అనేక సుఖాలు అనుభవించా లనీ; రాజ్య విభవ యుక్తిన్+తిరుగన్= రాజ్య వైభవోపేతమైన యుక్తియుక్తంగా నడచుకోవాలనీ; వేడ్క లేదు= కోరిక లేదు; మనము లోనన్= నా మనస్సునందు; ధర్మరక్షణము మీఁది భరమున్= ధర్మాన్ని రక్షించే భారం; తద్+లోపభయమున్= తద్విరహితమైన దానివలన భయమూ; పెద్ద= మిక్కిలి పెద్దదిగా తోస్తున్నది.

**తాత్పర్యం:** 'ఓ తాతా వినుము! సమస్త సుఖాలు అనుభవించాలన్న కోరికగానీ, రాజ్య వైభవ సముపేతంగా జీవించాలన్న కుతూహలంగానీ నాకు లేదు. ధర్మరక్షణ చేయటమనే భారమూ, ధర్మరక్షణ చేయకపోవటమనే భయమూ నా మనసును మిక్కిలి పీడిస్తూ ఉంటాయి.

**వ. కావున. 332**

**తాత్పర్యం:** అందువలన.

**చ. అనఘ! యనేక దోష మగునట్టి మహీవహనంబు నొల్ల; దం**
**డన పరుషత్వ మేటికి? దృఢ ప్రశమంబున నేను గానకుం**
**జనియెద' నన్న భీష్ముఁ 'డిది జాడ్యము గాక నృపాలధర్మమే**
**మనుజ వరేణ్య! నీ మనము మార్దవ మగ్గల; మిట్టు నొప్పునే? 333**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాప రహితుడవైన ఓ తాతా!; అనేక దోషము+అగునట్టి= అనేక పాపాలకు నిలయమైన; మహీవహనంబున్+ఒల్లన్= రాజ్యభారాన్ని మోయటానికి అంగీకరించలేను; దండన పరుషత్వము+ఏటికిన్= దండనీతితో కూడిన కాఠిన్యం ఎందుకు?; ఏను= నేను; దృఢ ప్రశమంబునన్= దిట్టమైన ప్రశాంతితో; కానకున్+చనియెదన్= తపోవనానికి వెళ్ళుతాను; అన్నన్= అని ధర్మరాజు తన అభిప్రాయాన్ని వెల్లడించగా; భీష్ముఁడు= తాత అయిన భీష్ముడు; మనుజవరేణ్య!= మానవశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; ఇది జాడ్యము+కాక= ఇదొక రకమైన జడత్వమే కాని; నృపాల ధర్మమే!= క్షత్రియ ధర్మం అవుతుందా?; నీ మనము మార్దవము+అగ్గలము= నీ మనసు మృదుత్వం గొప్పది; ఇట్టున్+ఒప్పునే?= ఈ విధమైతే సముచితమేనా?

**తాత్పర్యం:** 'ఓ తాతా! అనేక పాపాలకు ఆకరమైన రాజ్యభారాన్ని అంగీకరించలేను. దండనీతి ప్రయోగం మిక్కిలి కఠినమైనది. దానిని నేను నిర్వహించలేను. పరమప్రశాంతమైన తపోవనంలో ముక్కుమూసికొని జీవించాలని

కోరుకొంటున్నాను' అని ధర్మరాజు తన దృఢాభిప్రాయాన్ని స్పష్టం చేశాడు. అప్పుడు భీష్ముడు ధర్మరాజు మానవశ్రేష్ఠుడనే విషయాన్ని గుర్తుచేసి 'ఇది నీలోని జడత్వమే గాని వేరు కాదు. కాకపోతే ఇది క్షత్రియధర్మమా? నీ మనసు మిక్కిలి మృదువైందనే విషయం నాకు తెలుసు. అయినా రాజైన వాడికి ఉండవలసిన లక్షణ మిదేనా? ఇది సముచితమేనా?'

**వ. ని న్నొత్తి చెప్పుటకుఁ బాండు విచిత్రవీర్య శంతను లున్నవారే? నా బుద్ధి వినుము. 334**

**ప్రతిపదార్థం:** నిన్నున్+ఒత్తి చెప్పుటకున్= నీకు గట్టిగా ప్రబోధించటానికి; పాండు విచిత్రవీర్య శంతనులు+ఉన్నవారే?= పాండు మహారాజుగాని విచిత్రవీర్య ధరాధిపతిగాని, శంతన మహారాజుగాని ప్రస్తుతం లేరు కదా!; నా బుద్ధిన్ వినుము= నా ఆలోచనను ఆలకించుము.

**తాత్పర్యం:** నిన్ను మిక్కిలి ప్రబోధించటానికి పాండురాజు గానీ, విచిత్రవీర్యుడు గాని, శంతన మహారాజుగాని లేరు కదా! కాబట్టి సహనంతో నా హితవును వినుము.

**విశేషం:** ఇక్కడ భీష్ముడు పాండురాజు, విచిత్రవీర్యుడు, శంతనులను ప్రస్తావించటం ఎంతో సముచితంగా ఉన్నది. సంక్షుభిత మనస్కులైన వారికి పెద్దల పలుకులు ఉపశమనాన్ని కలిగిస్తాయి. ఉత్తమమార్గాన్ని చూపుతాయి. అందుకే రాజ్యాధికారం వద్దంటున్న ధర్మరాజుతో భీష్ముడు 'నీకు ఇప్పుడు గట్టిగా ధర్మబోధ చెయ్యటానికి పాండురాజాది పెద్దలు లేరు. నీకు ఉన్న పెద్ద దిక్కు నేనే. అందుకే నీ హితాన్ని కోరి చెప్పుతున్న నా పలుకులను ఆలకించి ఆచరించుము' అని తన మాటలకు అనుగుణంగా ప్రవర్తించు మని ధర్మరాజుతో చెప్పాడు.

ఈ చిన్ని వచనంలో 'నిన్నొత్తి చెప్పుటకు' అని తిక్కన రచించి 'నిన్ను శాసించటానికి, నీకు తగిన రీతిలో చెప్పటానికి' అనే ప్రత్యేకార్థాలను స్ఫురింపజేసి తన ప్రత్యేకతను ప్రకటించుకొన్నాడు.

**ఆ. ఈఁగ కాలి యంత యేనియు వీసర । పోవకుండ ధర్మమునన నడచి**
**రయ్య! తొంటి రాజుల క్రోధ కామ ప్ర । యుక్త దండధరణ మొప్పుఁ గాక. 335**

**ప్రతిపదార్థం:** అయ్య!= ఓ ధర్మరాజా!; తొంటి రాజులు= పూర్వరాజులు; ఈఁగ కాలి+అంత+ఏనియున్= ఈగ కాలి అంత అంటే అణుమాత్రమైనా; వీసరపోవకుండన్= వెలితి రానీయకుండా; ధర్మమునన్ నడచిరి= రాజధర్మంతోనే నడచుకొన్నారు; అక్రోధ కామ ప్రయుక్త దండ ధరణము= కోపమూ, కామమూ లేని ప్రయోగంతో దండనీతిని ధరించటం; ఒప్పున్+కాక= సముచితం కదా!

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! పూర్వరాజులు అణుమాత్రమైనా వెలితిరానీయక క్షత్రియోచిత ధర్మపాలన సాగించారు. క్రోధాన్ని, కామాన్ని పరిత్యజించి దండనీతితో రాజ్యపాలన చేయటం రాజు వైన నీకు సముచితం'.

**క. దానాధ్యయన యజనముల । తో నుర్వీజనులఁ గావఁ దొడఁగుట పతికిం**
**దా నజ కల్పిత ధర్మము; । దీని విడుపు నరకమునకుఁ దెరు వగు నధిపా! 336**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!; దాన+అధ్యయన యజనములతోన్= దానం చేయటం, వేదాధ్యయనం కొనసాగించటం, యజ్ఞయాగాది కార్యాచరణం - అనే వాటితో; ఉర్వీజనులన్= భూప్రజలను; కావన్+తొడఁగుట= సంరక్షించ నారంభించటం; పతికిన్+తాన్+అజ కల్పిత ధర్మము= రాజునకు అదే బ్రహ్మచేత సృష్టించబడిన ధర్మం; దీని విడుపు= దీన్ని చేయకుండా వదలిపెట్టటం; నరకమునకున్+తెరువు+అగున్= నరకానికి మార్గమవుతుంది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! దాన ధర్మాలు, యజ్ఞయాగాలు, వేదాధ్యయనాదులు నీవంటి ఉత్తమ రాజులకు పరమేష్ఠి విధించిన విహితధర్మం. దీనిని చేయకుండా వదలిపెడితే నరకప్రాప్తి తప్పదు'.

**క. కావున వర్ణాశ్రమముల । నేవిధమున నైన నడపు లెడలక యుండం**
**గావంగ నోపు నృపతికి । లే వలజ ళ్ళుభయలోక లీలలయందున్. 337**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; వర్ణ+ఆశ్రమములన్= నాలుగు వర్ణాలను, నాలుగు వర్ణాలకు తగిన నాలుగు ఆశ్రమాలను; ఏ విధమునన్+ఐనన్= ఎన్ని కష్టాలకైనా ఓర్చి; నడపులు+ఎడలక+ఉండన్= కొనసాగింపులు వదలకుండా; కావంగన్+ఓపు= సంరక్షించే సామర్థ్యంగల; నృపతికిన్= రాజునకు; ఉభయ లోక లీలల యందున్= ఇహపరలోకాలలోని లీలా విశేషాలలో; అలజళ్ళు లేవు= ఎట్లాంటి భయాందోళనలు ఉండవు. (కాగా సర్వ సుఖ ప్రాప్తి కలుగుతుంది).

**తాత్పర్యం:** 'కాబట్టి నాలుగు వర్ణాలను, నాలుగు ఆశ్రమాలను ఎట్లాగైనాసరే నిర్వర్తిస్తే ఆ రాజునకు ఇహపరలోకాలలో ఎట్లాంటి భయాందోళనలు లేక సమస్త సౌఖ్యాలు సమకూరుతాయి అది రాజధర్మం'.

**వ. ఇ ట్లగుటం దెలుపునది యొక్క యితిహాసంబు గల; దాకర్ణింపుము. 338**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అగుటన్+తెలుపునది= ఈ విధంగా జరిగిన దని తెలుపటానికి; ఒక్క+ఇతిహాసంబు+కలదు= ఒక పూర్వకథ ఉన్నది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** 'దీనిని సోదాహరణంగా వివరించే ఒక పూర్వకథ ఉన్నది చెప్పుతాను వినుము' అన్నాడు భీష్ముడు.

### కేకయరాజ రాక్షస సంవాద ప్రకారము (సం. 12-78-6)

**క. పరమ నియతిమైఁ గేకయ । నరపతి యధ్యయన విధి యొనర్పఁగ నటవీ**
**పరిసరమున కేఁగినయెడ । ధరణీశ్వర! పట్టె నొక్క దానవుఁ డతనిన్. 339**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= భూ భర్తవైన ఓ ధర్మరాజా!; కేకయ నరపతి= కేకయరాజు; పరమ నియతిమైన్= శ్రేష్ఠమైన నియమంతో; అధ్యయన విధి+ఒనర్పన్= వేదాధ్యయన విధి నిర్వహణకు; అటవీ పరిసరమునకున్+ఏగిన యెడన్= అరణ్యప్రాంతాలకు వెళ్ళినప్పుడు; అతనిన్= ఆ కేకయ రాజును; ఒక్కదానవుఁడు= ఒకానొక రాక్షసుడు; పట్టెన్= పట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! కేకయరాజు పరమ నియమానుగుణంగా వేదాధ్యయనం నిర్వహించటంకొరకు అరణ్య ప్రాంతాలకు వెళ్ళిన సందర్భంలో ఆ రాజును ఒక రాక్షసుడు పట్టుకొన్నాడు.

**వ. పట్టినఁ బ్రబలుం డగు నద్దనుజునిం ద్రోచిపోవంజాలక యమ్మహీపాలుండు వాని కిట్లనియె. 340**

**ప్రతిపదార్థం:** పట్టినన్= రాక్షసుడు కేకయరాజును పట్టుకొనగా; ప్రబలుండు+అగు= మిక్కిలి బలవంతుడైన; ఆ+దనుజునిన్= ఆ రాక్షసుడిని; త్రోచి పోవన్+చాలక= త్రోసి పుచ్చలేక; ఆ+మహీపాలుండు= ఆ కేకయ రాజు; వానికిన్+ఇట్లు+అనియెన్= ఆ రాక్షసుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు కేకయరాజును పట్టుకొనగా మిక్కిలి బలవంతుడైన ఆ రాక్షసుడిని ఎదిరించలేక ఆ కేకయరాజు రాక్షసుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'ముచ్చిమియును అంకు నెచ్చోట నైన నా । భూమిలోపల లేదు భూమిసురులు**
**వేదాధ్యయన యజ్ఞవిధి దానతత్పరుల్ । రాజులు బ్రాహ్మణారాధనంబు**
**జన్నముల్ సేఁతయు సమరానివర్తన । వ్రతమును గలరు గోరక్షణాది**
**వార్తావినీతులై వైశ్యులు నడపుదు । రమ్మూఁడు జాతుల కధికభక్తి**

**తే. తోడ శుశ్రూషసేసి శూద్రులు చరింతు; । రేమి రంధ్రంబు గాంచి నీ విట్లు వెరవు**
**మాలి పట్టి తత్యుద్ధతలీల నన్నుఁ? । దలఁప నిది నీకుఁ బథ్యమే దానవేంద్ర! 341**

**ప్రతిపదార్థం:** దానవ+ఇంద్ర!= ఓ రాక్షస శ్రేష్ఠుడా!; నా భూమిలోపలన్= నా రాజ్యంలో; ఏ చోటన్+ఐనన్= ఎక్కడైనా; ముచ్చిమియును= దొంగతనమూ; అంకు= వ్యభిచారమూ; లేదు= కనిపించదు; భూమిసురులు= బ్రాహ్మణులు; వేద+అధ్యయన, యజ్ఞవిధి, దాన తత్పరుల్= వేదాధ్యయనం చేయటమూ, యజ్ఞయాగాదులు ఆచరించటమూ, దానధర్మాలు చేయటమూ అనే పనుల్లో ఆసక్తిని కలిగి ఉంటున్నారు; రాజులు= క్షత్రియులు; బ్రాహ్మణ+ఆరాధనంబున్= బ్రాహ్మణులను పూజించటమూ; జన్నముల్+చేతఁయున్= యజ్ఞయాగాదులు చేయించటమూ; సమరానివర్తన (సమర+అని వర్తన)వ్రతమును+కలరు= యుద్ధము నుండి వెనుకకు తిరిగి రాకుండుట అనే వ్రతాలు కలిగి ఉన్నారు; వైశ్యులు; గోరక్షణ+ఆది= గోపాలనం మొదలుకొని; వార్తా వినీతులు+ఐ నడపుదురు= జీవనాన్ని నియమబద్ధంగా సాగిస్తున్నారు; శూద్రులు; ఆ+మూఁడు జాతులకున్= ఆ మూడు వర్ణాలకు; అధిక భక్తి తోడన్= మిక్కిలి భక్తితో; శుశ్రూష చేసి చరింతురు= సేవచేసి జీవిస్తున్నారు; ఇట్లు= ఈ విధంగా; నీవు; ఏమిరంధ్రంబు+కాంచి= ఏ దోషం చూచి; వెరవు మాలి= తెలివిలేనివాడవై; అతి+ఉద్ధతలీలన్= మిక్కిలి గర్వవిలాసంతో; నన్ను పట్టితి(వి)?= నన్ను పట్టుకొన్నావు?; తలఁపన్= ఆలోచించగా; ఇది= ఈ విధంగా నన్ను పట్టుకొనటం; నీకున్+పథ్యమే?= నీకు హితమేనా?

**తాత్పర్యం:** 'ఓ రాక్షసశ్రేష్ఠా! నా రాజ్యంలో ఎక్కడా జారచోర దురాచారాలు లేవు. బ్రాహ్మణులు వేదాధ్యయనంతో యజ్ఞయాగాదులు చేస్తున్నారు. రాజులు బ్రాహ్మణార్చనలతో పాటు యజ్ఞయాగాదులు, యుద్ధంలో పాల్గొనటం అనే వ్రతాలు పాటిస్తున్నారు. వైశ్యులు గోపాలన, వాణిజ్యం నిర్వహిస్తున్నారు. ఈ మూడు వర్ణాలవారిని శూద్రులు పరమభక్తిపరులై సేవిస్తున్నారు. నా రాజ్యంలో ఏ దోషాన్ని పసిగట్టి ఈ విధంగా గర్వించి అకారణంగా నన్ను పట్టుకొన్నావు? నీకిది ఉచితమా?'

**విశేషం:** నాలుగు వర్ణాల వాళ్ళు తమ జాత్యుచిత కార్యకలాపాలలో నిమగ్నులై సుఖజీవనం చేస్తున్నారనీ, అది మచ్చలేని తన రాజ్యపాలనమని కేకయరాజు రాక్షసుడికి తెలిపాడు.

**చ. అనుటయు నమ్మహాదనుజుఁ డాతని కిట్లను 'నట్టి వానిఁగా**
**నినుఁ గని వర్ణరక్షణము నిర్మలచిత్తతఁ జేయు రాజు కీ**
**డునఁబడకున్కి దెల్పఁగఁ గడుం బ్రియమై చనుదెంచితిన్; మహీ**
**జనపరిరక్ష యస్ఖలిత సౌమ్యత నిట్ల యొనర్పు భూవరా!' 342**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కేకయ రాజు పలుకగా; ఆ+మహాదనుజుఁడు= ఆ గొప్ప రాక్షసుడు; అతనికిన్+ఇట్లు+అనున్= ఆ కేకయ రాజుతో ఇట్లా అన్నాడు; భూవరా!= ఓ రాజా!; అట్టివానిన్+కాన్= అట్లాంటి ఉత్తముడిగా; నిన్నున్+కని= నిన్ను చూచి; వర్ణ రక్షణమున్= వర్ణాశ్రమ ధర్మాలను; నిర్మల చిత్తతన్+చేయు= పరిశుద్ధ మనస్సుతో చేసే; రాజు; కీడునన్+పడక+ఉన్కి= ఆపదలపాలు కాకుండా ఉండటాన్ని; తెల్పఁగన్= తెలియజేయటానికి;కడున్+ప్రియమై= మిక్కిలి ప్రీతియై; చనుదెంచితిన్= వచ్చాను;

ఇట్లు= ఈ రీతిగానే; మహీజన పరిరక్ష= భూ ప్రజల సంరక్షణ; అస్ఖలిత= జారుపాటు లేని (తొట్రుపాటులేని లేదా చలించని); సౌమ్యతన్= మంచితనంతో; ఒనర్పు= కొనసాగించుము.

**తాత్పర్యం:** 'నన్నెందుకు బంధించా'వని కేకయరాజు ప్రశ్నించగా ఆ రాక్షసుడు అతనితో 'నీవు ఉత్తముడవని, నాలుగు వర్ణాశ్రమాల ధర్మనిర్వహణం నిర్మలమనస్సుతో చేసే రాజునకు ఎట్లాంటి ఆపదలు రావని తెలుపటానికి మిక్కిలి ప్రీతితో ని న్నీ విధంగా బంధించాను. ఇదే రీతిగా ప్రజలను ఏ మాత్రం తొట్రుపాటు లేని సౌమ్యతతో రాజ్యపాలన కొనసాగించుము'.

**వ.** **అని పలికి సఖ్యంబు సేసి చనియె నని చెప్పినం గౌంతేయాగ్రజుండు సంతోషించి 'జీవనాభావం బైనచో క్షత్రియ కర్మానుష్ఠానంబునకు నశక్తుం డగు విప్రుం డెట్లు బ్రదుకు వాఁ?' డని యడిగిన భీష్ముం డిట్లనియె.** **343**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; సఖ్యంబు+చేసి చనియెన్= స్నేహం చేసికొని వెళ్ళిపోయాడు; అని చెప్పినన్= అని భీష్ముడు ధర్మరాజుతో చెప్పగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; సంతోషించి= ఆనందించి; జీవన+అభావంబు+ఐనచోన్= జీవనం కొనసాగించటం కష్టమైతే; క్షత్రియ కర్మ+అనుష్ఠానంబునకున్= రాజోచిత కర్మాచరణానికి; అశక్తుండు+అగు= శక్తిహీనుడైన; విప్రుండు= బ్రాహ్మణుడు; ఎట్లు బ్రదుకు వాఁడు?+అని+అడిగినన్= ఎట్లా జీవించగలడని ధర్మరాజు అడుగగా; భీష్ముండు+ఇట్లు+అనియెన్= భీష్ముడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కేకయరాజును రాక్షసుడు మెచ్చుకొని స్నేహం చేసి వెళ్ళిపోయాడు. ఈ కథ విన్న ధర్మరాజు సంతోషాంతరంగుడై 'జీవనం కొనసాగించటం కష్టమైనప్పుడు రాజోచిత కర్మానుష్ఠానం నెరపలేని బ్రాహ్మణుడు ఎట్లా జీవించగలడో వివరించు' మని భీష్ముడిని అడుగగా భీష్ముడు ఇట్లా సమాధానం చెప్పాడు.

**చ.** **మనఁ జను నుప్పు నువ్వులును మాంసము గోవు వృషంబుఁ గూడుఁ గ**
**ల్లును ఘృత తైల మాక్షికములున్ ధృతకేసరమైన జంతువున్**
**ధన మధికంబుగాఁ బడయు దానికి నేనియు విక్రయింపఁ గా**
**దనుమతి యూఁది వైశ్యకృతినైనను విప్రున కాపదాగతిన్.'** **344**

**ప్రతిపదార్థం:** విప్రునకున్+ఆపద్+ఆగతిన్= బ్రాహ్మణుడు ఆపత్సమయంలో (అంటే ఆపద్ధర్మంగా); అనుమతి+ఊఁది= అనుజ్ఞ పొంది; వైశ్యకృతిన్+ఐనను= వైశ్య ధర్మాన్ని అవలంబించి అయినా; మనన్+చనున్= జీవించటం సముచితమే (అయితే); ధనము+అధికంబుగాన్+పడయుదానికిన్+ఏనియున్= ధనం ఎక్కువగా పొందటానికి; ఉప్పు, నువ్వులు, మాంసము, గోవు, వృషంబున్+కూడున్+కల్లును= ఉప్పు, నువ్వులు, మాంసము, ఆవు, ఎద్దు, అన్నము, కల్లు; ఘృత తైల మాక్షికములున్= నేయి, నూనె తేనెటీగల వలన తయారైన తేనెలను; ధృతకేసరము+ఐన జంతువున్= వెంట్రుకలు గల జంతువును (గుర్రము మొదలైనవి); విక్రయింపన్+కాదు= అమ్మరాదు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడు స్వకీయవృత్తిలో జీవించలేనప్పుడు ఆపద్ధర్మంగా వైశ్యవృత్తిని స్వీకరించి జీవించవచ్చును. అయితే అత్యధికంగా ధనం లభిస్తుం దన్న ఆశతో ఉప్పు, నువ్వులు, మాంసం, గోవు, ఎద్దు, అన్నం, కల్లు, నేయి, నూనె, తేనెలను కేసరాలు గల జంతువు అంటే గుర్రం మొదలైనవి అమ్మరాదు. ఇది నియమం' అని భీష్ముడు వివరించాడు.

**విశేషం:** మూలంలో సవిస్తరంగా సుమారు 7, 8 శ్లోకాలలో సాగిన వివరణను తిక్కన ఒక చంపకమాలలో సంక్షిప్తసుందరంగా వివరించాడు. మూలంలో తేనె సంగతి లేదు. మహిషమని మూలంలో ఉండగా తిక్కన గోవును పేర్కొన్నాడు. కేసరాలుగల జంతువు

గుర్రమని నీలకంఠ వ్యాఖ్య. కృతాన్నం అంటే పక్వాన్నమని నీలకంఠీయం. అన్నం విక్రయించరా దంటే అన్నం పరబ్రహ్మస్వరూపం-కనుక దానిని విక్రయిస్తే దానికి మూలమైన భూమిని విక్రయించినట్లే భూమి సర్వ దేవతామయం కనుక విక్రయించటం సముచితం కాదని వివరణ. మూలంలో నీటిని విక్రయిస్తే బ్రాహ్మణుడికి నరకప్రాప్తి కలుగుతుందని చెప్పబడింది. కాని ఆ విషయం తిక్కన తడవలేదు. విక్రయించరాదని నిషేధించాడు.

**వ. అనిన విని ధర్మతనయుండు 'యజ్ఞంబు లెట్లయిన సమీచీనంబు లగు?'నని యడిగిన ననిమిష నదీనందనుం డతని కిట్లనియె. 345**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని భీష్ముడు చెప్పగా విని; ధర్మ తనయుండు= ధర్మరాజు; యజ్ఞంబులు+ఎట్లు+అయినన్= యజ్ఞాలు ఏ విధంగా; సమీచీనంబులు+అగున్+అని+అడిగినన్= పరిశుద్ధ మవుతాయో (సత్య సమ్మత మవుతాయో) తెలుపుమని ప్రశ్నించగా; అనిమిష నదీనందనుండు= దేవనది అయిన గంగానది యొక్క పుత్రుడైన భీష్ముడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడు ఆపద్ధర్మంగా వైశ్యవృత్తిని అవలంబించినా అతడు అనుసరించవలసిన నియమాలను భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'యజ్ఞాలు సత్యసమ్మతాలు ఎట్లా అవుతాయో వివరించు' మని ప్రార్థించగా భీష్ముడు ఇట్లా స్పష్టం చేశాడు.

**ఆ. 'శ్రద్ధ వలయు, మిథ్య చనదు, వేదంబులఁ । బరిభవింపఁ దగదు భవ్యయజ్ఞ**
**కర్త కెపుడు; నదియుఁ గాక దక్షిణలు మం । త్రార్థ పోషకంబులందు రధిప! 346**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; భవ్య యజ్ఞ కర్తకున్= శ్రేష్ఠమైన యజ్ఞ కర్తకు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; శ్రద్ధ వలయున్= శ్రద్ధ అవసరం; మిథ్య చనదు= బూటకం పనికిరాదు; వేదంబులన్+పరిభవింపన్+తగదు= వేదాలను అవమానించరాదు; అదియున్+కాక= అంతేకాక (మీదు మిక్కిలి); దక్షిణలు= యజ్ఞయాగాదులలో ఋత్విజులకు ఇచ్చే ధనం; మంత్ర+అర్థపోషకంబులు+ అందురు= వేద మంత్రార్థాలకు అత్యంత పుష్టిని కలిగిస్తుందని పెద్దల సూక్తి.

**తాత్పర్యం:** 'శ్రేష్ఠుడైన యజ్ఞకర్తకు ఎల్లప్పుడు శ్రద్ధ అత్యంతావశ్యకం. బూటకాలు పనికిరావు. వేదాలను అవమానించి తిరస్కరించరాదు. అంతేగాక యజ్ఞాది సమయాలలో ఋత్విజులు ఇచ్చే భూరిదక్షిణలు వేదమంత్రార్థాలకు మిక్కిలి పుష్టిని, తుష్టిని చేకూరుస్తా యని ఆర్యులు వక్కాణించారు.

**క. ఈగతి యెఱింగి చేసిన । యాగము సోమాప్తుఁ జేయు నప్పురుషునిఁ ద**
**ద్యోగ మొనర్చు మహాసుఖ । యోగము సోమాధిరాజ్య యుక్తము శ్రుతులన్. 347**

**ప్రతిపదార్థం:** ఈగతి+ఎఱింగి= ఈ విషయా న్నంతటినీ సంపూర్ణంగా తెలిసికొని; చేసిన యాగము= చేసిన యజ్ఞకార్యం; ఆ+పురుషునిన్= అట్లాంటి యజ్ఞం చేసిన వ్యక్తిని; సోమ+ఆప్తున్+చేయున్= సోమపానంతో కృతకృత్యుడిని చేస్తుంది; శ్రుతులన్= వేదాలలో; తద్+యోగము+ఒనర్చు= ఆ మహాయోగం చేకూర్చే; మహాసుఖయోగము= అత్యంత సుఖయోగం; సోమ+అధిరాజ్య యుక్తము= సోమపాన మనే అధిరాజ్యంతో కూడి ఉంటుంది.

**తాత్పర్యం:** సలక్షణంగా చేసిన యజ్ఞం యజ్ఞకర్తను పునీతం చేస్తుంది. అది మహాసుఖయోగం. శ్రుతులు ఈ అంశాన్ని స్పష్టం చేశాయి. ఇది 'సోమపాన' అధిరాజ్యం. శ్రుతులలో అట్లాంటి ఆ యోగం చేకూర్చే మహాసుఖయోగం సోమపాన మనే అధిరాజ్యంతో కూడి ఉంటుంది'.

**ఆ. అధ్వరంబుకంటె నధికంబు దపము, ద । పం బనంగ మేని ప్రన్నఁదనము**
**నివురఁ జేఁతగా దహింసయు సత్యవా । క్యంబు దమము దయయుఁ గాని యరయ 348**

**ప్రతిపదార్థం:** అరయన్= పరిశీలించగా; అధ్వరంబు కంటెన్= యజ్ఞంకంటె; తపము అధికంబు= తపస్సు శ్రేష్ఠమైనది; తపంబు+అనంగన్= తపస్సంటే; మేని ప్రన్నఁదనమున్+ఇవురన్+చేఁత+కాదు= శరీర మనోజ్ఞతను శుష్కింపచేయటం కాదు; అహింసయున్= హింసచేయకుండటం; సత్యవాక్యంబు= సత్యవచనం; దమము= ఇంద్రియ నిగ్రహం; దయయున్+కాని= దయ మొదలైన ఉత్తమ గుణాలు మాత్రమే.

**తాత్పర్యం:** పరిశీలించి చూడగా యజ్ఞయాగాదులకంటె తపస్సు శ్రేష్ఠమైనది. తపస్సంటే మేని పసలను శుష్కింపచేయటం కాదు. అహింస, సత్యవచనం, ఇంద్రియనిగ్రహం, దయ మొదలైన సద్గుణాలు కలిగి ఉండటమే'..

**వ. అనిన. 349**

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. ప్రియమున ధర్మనందనుడు భీష్మునితో 'నృపు డెట్టిభంగి వా**
**నియెడఁ గరంబు నమ్మఁదగు; నిక్కపు మిత్రుఁడు లేని భర్తకున్**
**నయగతి సెల్లనేర' దనినన్ విని యిట్లను నాతఁ 'డేక బు**
**ద్ధియుతుఁడవై వినన్ వలయుఁ దెల్లముగా నెఱిఁగింతు భూవరా!' 350**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుఁడు= ధర్మరాజు; ప్రియమునన్= ప్రీతితో; భీష్మునితోన్= తాత అయిన భీష్ముడితో; నృపుఁడు+ఎట్టి భంగి వాని యెడన్= రాజు ఎట్లాంటి వాడి పట్ల; కరంబు= మిక్కిలి; నమ్మన్+తగున్= నమ్మకంతో ఉండవచ్చు; నిక్కము+మిత్రుఁడు లేని= నిజమైన (ఆప్తుడైన) స్నేహితుడు లేని; భర్తకున్= రాజునకు; నయగతి+చెల్లనేరదు= నీతి మార్గం సాగదు; అనినన్ విని= అని ప్రశ్నించగా విని; ఆతఁడు= ఆ భీష్ముడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; భూవరా!= ఓ ధర్మరాజా!; తెల్లముగాన్+ఎఱిఁగింతున్= స్పష్టంగా తెలుపుతాను; ఏక బుద్ధి యుతుఁడవై= ఏకాగ్రమైన బుద్ధి కలిగిన వాడవై; వినన్ వలయున్= వినవలసింది.

**తాత్పర్యం:** 'నమ్మకమైన స్నేహితులు లేకపోతే రాజకార్యం నీతిమార్గంలో సాగటం కష్టం. ఎట్లాంటివాడి పట్ల మిక్కిలి నమ్మకం కలిగి ఉండవచ్చో తెలుపవలసిం'దని ధర్మరాజు భీష్ముడిని ప్రార్థించాడు. 'ఆ విషయాలు విశదం చేస్తాను గానీ బహుశ్రద్ధతో వినుము' అని భీష్ముడు ఆదేశించాడు.

**క. 'నమ్మమి మృత్యువు, పెద్దయు । నమ్ముట యపమృత్యు వగుట నరపతి నమ్మీ**
**నమ్మక పనిగొనునది, ని । త్యమ్మును సూక్ష్మ మతిఁ దాను నరయఁగ వలయున్. 351**

**ప్రతిపదార్థం:** నరపతి= రాజు; నమ్మమి= నమ్మకపోవటం; మృత్యువు= మరణంతో సమానం (అంటే వినాశనకారి); పెద్దయున్ నమ్ముట= అధికంగా నమ్మటం; అపమృత్యువు+అగుటన్= అకస్మాత్తుగా కలిగే చావువంటిది కావటంవలన; నమ్మీ నమ్మక= కొంత నమ్మి, కొంత నమ్మక; పని+కొనునది= కార్యాన్ని సాధించుకొనాలి; తాను= రాజు; నిత్యమ్మును= ఎల్లప్పుడు; సూక్ష్మమతిన్= సూక్ష్మబుద్ధితో; అరయఁగన్ వలయున్= పరిశీలిస్తూ ఉండాలి.

**తాత్పర్యం:** రాజు నమ్మకపోవటమంటే మృత్యుసమానం అంటే వినాశకారి. అత్యంతం విశ్వసించటం అపమృత్యువుతో సమానం. కాబట్టి నమ్మీ నమ్మక పనులు సాధించాలి. ఎల్లప్పుడూ సూక్ష్మబుద్ధితో సర్వమూ పరిశీలిస్తూ ఉండవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**తే. తనకు మే లొనరించు నాతండు మిత్త్రుఁ; । డతఁడు నడపంగ నెల్ల కార్యములు శుభము**
**నొందు; నేమిట నేమఱకునికి తోడ । నృపుఁడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుప వలయు. 352**

**ప్రతిపదార్థం:** తనకున్ మేలు+ఒనరించు+ఆతండు మిత్రుఁడు= తనకు (రాజుకు) మేలుచేసేవాడే నిజమైన స్నేహితుడు; అతఁడు= ఆ మిత్రుడు; నడపంగన్= రాజుచేత కార్యాచరణ చేయించగా; ఎల్లకార్యములు= అన్ని పనులు; శుభమున్+ఒందున్= శుభ ప్రదమవుతాయి; నృపుఁడు= రాజు; ఏమిటన్+ఏమఱక+ఉనికితోడన్= దేనియందూ అశ్రద్ధ లేకుండా ఉన్నట్లయితే; మిత్రుపైన్= స్నేహితుడిమీద; కార్యముల్ నిలుప వలయున్= కార్యభారాన్ని మోపాలి.

**తాత్పర్యం:** రాజుకు మేలు చేసేవాడే మిత్రుడు. అట్లాంటి మిత్రుడు నడిపిస్తే సమస్తకార్యాలూ శుభాన్ని చేకూరుస్తాయి. దేనిలోనూ ఏమరుపాటు లేనివాడైన స్నేహితుడిపై కార్యభారాన్ని మోపాలి. అప్పుడు అన్ని పనులు సానుకూలమవుతాయి.

**ఉ. మన్ననకున్ మదింప కవమానము వచ్చిన స్రుక్క కొక్కభం**
**గిన్నెఱిఁ గార్యముల్ విగత కిల్బిషుఁడై తగఁ జేయునట్టి మి**
**త్త్రు న్నరనాయకుండు దనరూపుగ నగ్గలమైన శ్రీయు న**
**త్యున్నతియున్ ఘటించు మహిమోజ్జ్వలుఁ జేఁత సుఖావహం బగున్. 353**

**ప్రతిపదార్థం:** మన్ననకున్ మదింపక= గౌరవం కలిగినప్పుడు గర్వించక; అవమానము వచ్చినన్ స్రుక్కక= అవమానం కలిగినప్పుడు పరితాప పడక; ఒక్కభంగిన్= ఒకేరీతిగా; నెఱిన్= నేర్పుతో (సొగసుగా); విగత కిల్బిషుఁడు+ఐ= పాపరహితుడై (దోష రహితుడై); తగన్= ఉచిత రీతిని; కార్యముల్ చేయునట్టి= పనులు చేసే; మిత్రున్= స్నేహితుడిని; నరనాయకుండు= రాజు; తన రూపుగన్= తనతో సమానంగా (భావించి); అగ్గలము+ఐ= అధికమైన; శ్రీయున్= సంపదను; అతి+ఉన్నతియున్= మిక్కిలి ఔన్నత్యాన్ని; ఘటించు= కలిగించే; మహిమ+ఉజ్జ్వలున్+చేఁత= మహిమతో ప్రకాశితుడిని చేయటం; సుఖ+ఆవహంబు+అగున్= సుఖాలను చేకూరుస్తుంది.

**తాత్పర్యం:** గౌరవానికి గర్వించక, అవమానానికి దుఃఖించక రెండింటినీ ఒకే రీతిగా భావించి, పాపరహితుడై ఉచిత రీతిని కార్యాలను సాధించే మిత్రుడిని, రాజు తనతో సమానంగా భావించి, అత్యధికంగా సంపదను ఇనుమిక్కిలి ఔన్నత్యాన్ని కలిగించగల మహిమాన్వితుడిగా చేయటం సుఖాస్పదం అవుతుంది!

**క. వినుమట్టి మంత్రి గామం । బునఁ గ్రోధంబునను లోభమున భయమునఁ గా**
**ర్య నిరూపణంబు వదలక । వినీతుఁడై నడచు టధిక విభవముఁ జేయున్.' 354**

**ప్రతిపదార్థం:** వినుము= సావధానుడవై వినుము; అట్టి మంత్రి= అట్లాంటి మంత్రి; కామంబునన్= కామంవలన; క్రోధంబునను= కోపంవలన; లోభమునన్= లోభ గుణం వలన; భయమునన్= భయంవలన; కార్య నిరూపణంబు= కార్యాచరణాన్ని; వదలక= వదలిపెట్టక; వినీతుఁడు+ఐ= ఉత్తమ నీతిమంతుడై; నడచుట= నిర్వహించటం అనేది; అధిక విభవమున్+చేయున్= మిక్కిలి వైభవాన్ని చేకూరుస్తుంది.

**తాత్పర్యం:** అట్లాంటి మంత్రి కామక్రోధ లోభ భయాదులవలన కార్య నిరూపణం వదలకుండా ఉత్తమ నీతిమంతుడై నిర్వహించటం అనేది అత్యంత వైభవాన్ని చేకూరుస్తుంది.'

**వ. అని చెప్పి వెండియు. 355**

**తాత్పర్యం:** అని ఈ విధంగా చెప్పి మళ్ళీ - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'అన్నలుఁ దమ్ములుఁ గలుగుట । యున్నతుఁ జేయు నృపు నెంత యొఱపి ళ్ళయినన్**
**మన్ననయు నీగియును సం । పన్నంబులు గాఁగ వారిఁ బాటించు టురున్. 356**

**ప్రతిపదార్థం:** అన్నలున్+తమ్ములున్+కలుగుట= అన్నలనూ తమ్ముళ్ళనూ కలిగి ఉండటం అనేది; నృపున్= రాజును; ఉన్నతున్+చేయున్= గొప్పవాడిని చేస్తుంది; ఎంత+ఒఱపిళ్ళు+అయినన్= ఎంత అయోగ్యులైనప్పటికీ; వారిన్= ఆ అన్నదమ్ములను; మన్ననయున్= గౌరవించటమూ; ఈగియును= ధనమిచ్చి ఆదరించటమూ; సంపన్నంబులు+కాఁగన్= సమృద్ధమయ్యేటట్టు; పాటించుట+ఉరున్= ఆదరించటమే సముచితం.

**తాత్పర్యం:** రాజునకు అన్నలు తమ్ములు ఉండటంవలన అతడు గొప్పవాడుగా గుర్తించబడతాడు. అన్నదమ్ములు ఎంత అయోగ్యులైనప్పటికీ వారిని మన్నించి, ధనమిచ్చి సమృద్ధమయ్యే రీతిలో ఆదరించటమే సముచితం.

**వ. అది యెట్లంటేని. 357**

**తాత్పర్యం:** అదెట్లాగంటే - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. బలఁగము గల భూపాలుఁడు । గెలని మహీశ్వరుల బుద్ధికిని వ్రేఁగగుచున్**
**బలియుఁ డగు; లేని వానిం । జులుకంగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. 358**

**ప్రతిపదార్థం:** బలఁగము+కల= బంధుమిత్రాదులు గల; భూపాలుఁడు= రాజు; కెలని= చుట్టు ప్రక్కల ఉన్న (సమీపంలోని); మహీ+ఈశ్వరుల బుద్ధికిని= రాజుల మనస్సులకు; వ్రేఁగు+అగుచున్= భారమవుతూ; బలియుఁడు+అగున్= బలవంతుడు అవుతాడు; ఎట్టి శూరుండు+ఐనన్= ఎట్లాంటి పరాక్రమవంతుడైనా; లేనివానిన్= బలగం లేనివాడిని; చులుకంగాన్+చూతురు= తేలికగా చూస్తారు.

**తాత్పర్యం:** బంధుమిత్రాదుల బలగం ఉన్న రాజు చుట్టుప్రక్కల ఉన్నవారికి భయంకలిగిస్తూ బలవంతుడవుతాడు. ఎంత పరాక్రమం కలవాడైనా బలగం లేనివాడైతే అతడిని తేలికగా చూస్తారు.

**క. ఎక్కువ తక్కువ మాటలు । నుక్కివములు బంది గీడు లొందించుటలుం**
**బెక్కు దన యన్నదమ్ముల । దిక్కున నన్నియును సైఁపఁ దేజము సేయున్. 359**

**ప్రతిపదార్థం:** ఎక్కువ తక్కువ మాటలు= పెద్దచేసి తక్కువ చేసి మాటలాడే మాటలు; ఉక్కివములు= కపటాలు; బంది+కీడులు+ఒందించుటలున్= నిర్బంధించటమూ ఆపదలు కలిగించటమూ అనే; పెక్కు= పెక్కింటిని; తన అన్న+తమ్ముల దిక్కునన్= తన అన్నదమ్ముల పక్షాన; సైఁపన్= సహించటం; తేజము+చేయున్= తేజస్సును కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఎక్కువ తక్కువ మాటలు, కపటాలు, నిర్బంధించటం, ఆపదలు కలిగించటం మొదలైన అనేకమైన వెన్ని ఉన్నా, అన్నింటిని అన్నదమ్ముల పట్ల సహించటం రాజునకు తేజః కారణ మవుతుంది. అంటే ఎంతో శోభావహం అవుతుం దని అర్థం.

**క. లోపల రాఁజుచుఁ బొగయుచు । బాపంబులు దలఁతు రోపి బలిమియు వెఱపుం**
**జూపక తక్కరు కెలనికి । నేపాటను వారి నడపు టెంతయు నొప్పున్. 360**

**ప్రతిపదార్థం:** లోపలన్= లోలోపలే; రాఁజుచున్+పొగయుచున్= నిప్పు రగులుకొంటూ పొగబారుతున్నట్లు; పాపంబులు= చేసిన తప్పిదాలను; తలఁతురు= ఆలోచిస్తారు; ఓపి= సహించి (శక్తితో); బలిమియున్= బలాన్ని; వెఱపున్+చూపక= భయాన్ని ప్రదర్శించకుండా; తక్కరు= వదలరు; కెలనికిన్= ప్రక్కవారికి; వారిన్= అట్లాంటి వారిని (దుష్టులను); ఏ పాటను= ఏ విధంగానైనా; అడఁపుట+ఎంతయున్+ఒప్పున్= నాశనం చేయటం మిక్కిలి మంచిది.

**తాత్పర్యం:** లోలోపలే నిప్పు రగిలి పొగబారుతున్నట్లు, దుర్మార్గులు రాజు దోషాలను గూర్చి ఆలోచిస్తూ ఉంటారు. వీలు చూచికొని ఓపికతో తమ బలాన్ని చూపి భయపెట్టకుండా ఉండరు. అట్లాంటి దుష్టులైనవారిని ఏ విధంగానైనా నాశనం చేయటం మంచిది. ఇది రాజనీతి.

**తే.** **చాలుదురు వారు నృపతికి మేలు సేయఁ। గీడొనర్పంగఁ; గావునఁ గిల్బిషములఁ**
**బొరయ కుండంగ వారల నరసికొనుచుఁ। బొదివి నడపుట కార్యంబు భూవిభునకు.'** **361**

**ప్రతిపదార్థం:** నృపతికిన్= రాజునకు; వారు= అట్లాంటివారు; మేలు+చేయన్+కీడు+ఒనర్పంగన్ చాలుదురు= మేలు చేయటానికి గానీ ఆపదలు కూర్చటానికి గానీ తగుదురు (సమర్థులు); కావునన్= కాబట్టి; భూ విభునకున్= రాజునకు; కిల్బిషములన్+ పొరయకుండంగన్= పాపాలు సోకకుండా (కలుగకుండా); వారలన్+అరసికొనుచున్= అట్లాంటి వారిని; జాగరూకతతో పరిశీలించుకొంటూ; పొదివి నడపుట= కమ్ముకొని నడిపించటం; కార్యము= కర్తవ్యం.

**తాత్పర్యం:** అట్లాంటివాళ్ళు రాజుకు తామను కొంటే మేలుకానీ, కీడుకానీ చేయటానికి సమర్థులై ఉంటారు. తమ కేమాత్రం పాపం అంటనట్లు వాళ్ళను జాగరూకతతో చూస్తూ కమ్ముకొని నడిపించటమే రాజునకు కర్తవ్యం.'

**వ.** **అనుటయు ధర్మజుండు 'ధనార్జనం బేమిటం బ్రస్ఫుటంబై నడచు?'నని యడిగిన యతనికి భీష్ముం డిట్లనియె.** **362**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు చెప్పగా; ధర్మజుండు= ధర్మరాజు; ధన+ఆర్జనంబు= ధన సంపాదనం; ఏమిటన్+ప్రస్ఫుటంబు+ఐ నడచున్= దేనివలన స్పష్టంగా కొనసాగుతుందో; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; భీష్ముండు+ఇట్లు+అనియెన్= భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** రాజు నడుచుకొనవలసిన తీరునుగూర్చి భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'ధనసంపాదనం ఏ విధంగా ప్రస్ఫుటంగా కొనసాగుతుందో తెలుపు' మని అడిగినప్పుడు భీష్ముడు ఇట్లా సమాధానం చెప్పాడు.

### కాలక వృక్షీయ క్షేమదర్శి సంవాద ప్రకారము (సం. 12-83-1)

**క.** **ఆయతికాఁడు వలయు నర। నాయకునకు వానికెల్ల నరులుం జేటుం**
**జేయఁ దలంతురు దా నవ। ధాయకు డై కావవలయు ధరణిపుఁ డతనిన్.** **363**

**ప్రతిపదార్థం:** నరనాయకునకున్= రాజునకు; ఆయతికాఁడు= ధనార్జనపరుడు; వలయున్= అవసరం; వానికిన్+ఎల్లనరులున్= అట్లాంటి ధనార్జనపరునకు ప్రజలంతా; చేటున్+చేయన్+తలంతురు= కీడు కలిగించటానికి ఆలోచిస్తారు; ధరణిపుఁడు= రాజు; తాన్= తాను; అవధాయకుఁడు+ఐ= ఏకాగ్రత కలవాడై (హెచ్చరిక కలవాడై); అతనిన్= ఆ ధనార్జనుడిని; కావన్ వలయున్= సంరక్షించాలి.

**తాత్పర్యం:** రాజుకు ధనార్జనాపరుడైన వ్యక్తి కావాలి. అట్లాంటి ధనార్జనా పరుడికి కీడు కలిగించటానికి ప్రజలు ఆలోచిస్తూ ఉంటారు. అట్లాంటి విషయాన్ని గ్రహించి రాజు అవధాన పరత్వంతో అతడిని సంరక్షించుకొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**వ. ఈ యర్థంబున నితిహాసంబు గల దాకర్ణింపుము; కాలక వృక్షీయ నామధేయుం డగు నొక్కముని క్షేమదర్శి యనియెడు కోసల భూవిభుని భూమికిం బంజరస్థంబుఁ జేసికొని యొక్క కాకంబుఁ దెచ్చి యిప్పక్షి త్రైకాల్యవేది యని యెల్ల జనంబులకుం జెప్పుచుఁ దిరిగి క్రమంబున రాజుం గని యతని కక్కాకంబుఁ జూపి 'నీయందు దర్థార్జనాది నృప కార్యంబువలన నేమఱుట గలదు; దానం బుట్టిన సేగియెల్ల నిప్పులుఁగు సెప్పి నీకుం దప్పిన మ్రుచ్చులం బట్టింపఁ జాలు' నను పలుకు వలికి యమ్మహీవరు నాదరంబు వడసి వీడుఁ బట్టున కరిగిన. 364**

**ప్రతిపదార్థం:** ఈ+అర్థంబునన్= ఈ విషయాన్ని తెలిపే; ఇతిహాసంబు+కలదు+ఆకర్ణింపుము= ఒక పూర్వ కథ ఉన్నది వినుము; కాలక వృక్షీయ నామధేయుండు+అగున్+ఒక్కముని= కాలక వృక్షీయుడనే పేరు కలిగిన ఒక మహర్షి; క్షేమదర్శి+అనియెడు= క్షేమదర్శి అనే పేరుగల; కోసల భూ విభుని భూమికిన్= కోసల దేశాధిపతిఅయిన క్షేమదర్శి రాజ్యానికి; పంజరస్థంబున్+చేసికొని= పంజరంలో ఉంచుకొని; ఒక్కకాకంబున్+తెచ్చి= ఒక కాకిని తెచ్చి; ఆ+పక్షి= ఆ కాకి; త్రైకాల్యవేది+అని= మూడు కాలాలను తెలిసికొన్నదని; ఎల్ల జనంబులకున్+చెప్పుచున్+తిరిగి= ప్రజలందరికీ తెలియజేస్తూ తిరిగి; క్రమంబునన్= క్రమంగా; రాజున్+కని= క్షేమదర్శి అనే రాజును దర్శించి; అతనికిన్= ఆ రాజునకు; ఆ+కాకంబున్+చూపి= ఆ కాకిని చూపించి; నీ+అందున్+అర్థ+ఆర్జన+ఆది= నీలో ధనార్జన మొదలైన; నృపకార్యంబుల వలనన్= రాజకార్యాలవలన; ఏమఱుట+కలదు= ఏమరుపాటు ఉన్నది; దానన్+పుట్టినసేగి+ఎల్లన్= అందువలన కలిగిన ఆపద నంతటినీ; ఈ+పులుఁగు+చెప్పి= ఈ పక్షి (కాకి) తెలిపి; నీకున్+తప్పిన= నీ నుండి తప్పించుకొన్న; మ్రుచ్చులన్+పట్టింపన్+చాలున్= దొంగలను పట్టించగల సామర్థ్యం దీనికి ఉన్నది; అను పలుకు+పలికి= అనే మాటలు చెప్పి; ఆ+మహీవరు+ఆదరంబు+పడసి= ఆ మహారాజు అభిమానంపొంది; వీడు పట్టునకున్+అరిగినన్= వాసస్థానానికి (విడిదికి) వెళ్ళిపోగా.

**తాత్పర్యం:** ధర్మరాజా! రాజునకు జాగ్రత్త చాలా అవసరం. ఇందుకు తగిన కథ చెప్తుతాను. వినుము. కాలకవృక్షీయుడు ఒక ముని. అతడు కోసలాధిపతి క్షేమదర్శి రాజ్యానికి వెళ్ళాడు. పంజరంలో ఉంచిన చిలుకను చూపుతూ 'ఇది త్రికాలవేది' అనేవాడు. కాకిని రాజుకు చూపెట్టుతూ 'రాజా! నీకు ధనార్జనపట్ల ఏమరుపాటు ఉన్నది. అందువలన అనేకమైన ఆపదలు. కాని, ఈ కాకి ఆవిపత్తు లన్నిటిని నీకు విశదం చేస్తుంది. నీ ఏమరుపాటువలన తప్పించుకొన్న దొంగలను పట్టిస్తుంది' - అన్నాడు. ఆ రాజు ఆదరం పొందాడు. తన నివాసానికి కదలి వెళ్ళాడు.

**క. ఆ రాత్రి యవ్విభుని యధి । కారులు సంపి రొక భంగిఁ గాకము; మఱునాఁ
డా రాజున కవ్విప్రుఁడు । గోరి రహస్యంబుఁ జేసికొని యెఱిఁగించెన్. 365**

**ప్రతిపదార్థం:** ఆ రాత్రి= అదేరోజు రాత్రి; ఆ+విభుని+అధికారులు= ఆ రాజాధికారులు; కాకమున్= కాకిని; ఒక భంగిన్= ఏదో ఒక విధంగా; చంపిరి= చంపారు; మఱునాఁడు= ఆ మరుసటి రోజు; ఆ+విప్రుఁడు= ఆ బ్రాహ్మణుడైన కాలక వృక్షీయుడు; కోరి= ప్రార్థించి; రహస్యంబున్+చేసికొని= రహస్యాన్ని గ్రహించి; ఎఱిఁగించెన్= తెలియజేశాడు.

**తాత్పర్యం:** ఆ రాత్రికి రాత్రే రాజాధికారులు కొంతమంది ఆ కాకిని ఒక ఉపాయంతో చంపారు. ఆ మరుసటిరోజు ఆ బ్రాహ్మణుడైన కాలకవృక్షీయుడు ఆ రహస్యాన్ని గ్రహించి, రాజునకు తెలియజేశాడు.

**వ. అట్లు నియోగుల కపటోపాయంబునం గాకి మృతం బగుట సాభిజ్ఞానంబుగా నెఱింగించి, తన పేరు సెప్పి, 'యేను మీ తండ్రి సఖుండ; నతని పిమ్మట నిచ్చట నిలువ నొల్లక వనంబున కరిగి తపంబు సేయుచుండి, నీ మీఁది యధిక స్నేహంబునంజేసి, నీ దగు యోగక్షేమంబు లరయవేఁడి వచ్చి యీ రాష్ట్రంబునం బురంబునను వర్తించుచు భవదీయ రాజ్యలక్ష్మి మధుర భంగి యయ్యును నధము లగువాని యుక్తులవలనం జోరజన సంవృతంబైన కావేరియుంబోలె నుపయోగ్య గాకునికి యెఱింగి, నీకెఱింగించుటకై మిథ్యాభివర్ణితంబైన కాకంబు నెపంబిడి చొచ్చితి; దుర్మతులైన ద్రోహులు దానిం జంపుట కతంబున లోనం గీడు గలుగుట నీకుం గొంత గాననయ్యెఁ; గనుగలిగి యరసిన నింకనుం దేటపడియెడు నా యాప్తియును, గార్య వివేకంబు కలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపు; మిప్పుడు నన్నాదరింపక విడిచినవాఁడ వగుము; వంచకులైన యధికార పురుషులకు నేర్పుమైఁ గ్రమంబునఁ బరస్పర విరోధంబుఁ గలిగించి సంప్రీతి సెఱిచి నీవలసిన ట్లొక నొకనిం దండింపు' మని వారలం బేరు గ్రుచ్చి యుపదేశించిన. 366**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నియోగుల= రాజాధికారుల; కపట+ఉపాయంబునన్= మోసకృత్యం వలన; కాకి మృతంబు+అగుట= కాకి చనిపోవటం; స+అభిజ్ఞానంబుగాన్+ఎఱింగించి= గుర్తుండేటట్లు తెలిపి; తన పేరు+చెప్పి= తన పేరు తెలిపి; ఏను మీ తండ్రి సఖుండన్= నేను మీ తండ్రి స్నేహితుడిని; అతని పిమ్మటన్= అతడి మరణానంతరం; ఇచ్చట నిలువన్+ఒల్లక= ఈ రాజ్యంలో ఉండటం ఇష్టంలేక; వనంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి; తపంబు+చేయుచుండి= తపస్సు చేస్తూ ఉండి; నీ మీఁది= నీ పైన ఉన్న; అధిక స్నేహంబునన్+చేసి= మిక్కిలి మైత్రివలన; నీది+అగు= నీ యొక్క; యోగక్షేమంబులు+అరయన్ వేఁడి వచ్చి= బాగోగులు తెలిసికొనటానికి వచ్చి; ఈ రాష్ట్రంబునన్+పురంబునను వర్తించుచున్= ఈ రాజ్యంలో నీ పట్టణంలో తిరుగుతూ; భవదీయ రాజ్యలక్ష్మి= నీ రాజ్యలక్ష్మి; మధుర భంగి+అయ్యునున్= మనోహరమైనప్పటికీ; అధములు+అగువాని యుక్తులవలనన్= నీచుల కపటాలోచనలవలన; చోర సంవృతంబు+ఐన కావేరియున్+పోలెన్= దొంగలతో కూడిన కావేరి నదీ ప్రాంతంవలె; ఉపయోగ్య+కాక+ఉనికి+ఎఱింగి= ఉపయోగ పడటం లేదని తెలిసి; నీకున్+ఎఱింగించుటకై= నీకు తెలియజేయటానికి; మిథ్య+అభివర్ణితంబు+ఐన= అబద్ధంగా వివరించిన; కాకంబు నెపంబు+ఇడి చొచ్చితిన్= కాకి కారణంగా వచ్చాను; దుర్మతులు+ఐన ద్రోహులు= దుర్మార్గులైన ద్రోహచింతనా పరులు; దానిన్+చంపుట కతంబునన్= ఆ కాకిని చంపటం కారణంగా; లోనన్+కీడు+కలుగుట= లోలోపలే ఆపద కలగటం; నీకున్+కొంత+కానన్+అయ్యెన్= నీకూ కొంత తెలిసింది; కను+కలిగి+అరసినన్= జాగరూకతతో గమనిస్తే; ఇంకనున్+తేట పడియెడున్= ఇంకా నీకు స్పష్టమౌతుంది; నా+ఆప్తియున్= నేను ఆప్తుడిని కావటమూ; కార్యవివేకంబు కలిమియున్ నమ్మి= కార్యాలోచన అనే వివేక సంపదను విశ్వసించి; మదీయ+ఉపదేశంబున్+ఆదరింపుము= నా ప్రబోధాన్ని మన్నించుము; ఇప్పుడు నన్నున్+ఆదరింపక= ఈ సమయంలో నన్ను గౌరవించక; విడిచినవాఁడవు+అగుము= నన్ను వదలిపెట్టినట్లు నటించుము; వంచకులు+ఐన= మోసకారులైన; అధికార పురుషులకున్= రాజాధికారులకు; నేర్పుమైన్= సామర్థ్యంతో; క్రమంబునన్= క్రమంగా; పరస్పర విరోధంబు+కలిగించి= వారిలో వారికి శత్రుత్వం కల్పించి; సంప్రీతి+చెఱిచి= వారి సంతోషాన్ని చెడగొట్టి; నీవలసిన+అట్లు+ఒకని+ఒకనిన్= నీకు సాధ్యమైన రీతిలో ఒక్కొక్కరిని; దండిపుము+అని= శిక్షించవలసిందని; వారలన్+పేరు+గ్రుచ్చి= ఆ దోషులైనవారి పేర్లు పేర్కొని; ఉపదేశించినన్= బోధించగా.

**తాత్పర్యం:** ఆ విధంగా అధికారుల మోసంవలన కాకి చంపబడటాన్ని ఉదాహరణపూర్వకంగా నిరూపించి, తాను కాలకవృక్షీయుడనే ముని నని చెప్పి, 'మీ తండ్రి మిత్రుడిని. అతడి మరణానంతరం దుష్టులతో నిండిన ఈ దేశంలో జీవించటం ఇష్టంలేక అరణ్యంలో తపస్సు చేసికొంటూ వచ్చాను. నీ మీది వాత్సల్యంతో నీ యోగక్షేమాలు తెలిసికొనగోరి, నీ రాజ్యంలో నీ పట్టణంలో తిరుగుతూ నీ రాజ్యరమ మనోహరమైనా నీచుల నియోగంవలన

దొంగలచేత చుట్టబడ్డ కావేరీ తీరంవలె, ఉపకరించటంలేదని తెలిసికొని, నీకు ఈ విషయం స్పష్టం చేయటానికి కపటోపాయంతో కాకి త్రికాలవేది అనే నెపంతో నీ దగ్గరకు వచ్చాను. దుష్టబుద్ధులైన రాజాధికారులు కొందరు కాకిని చంపటంతో వాళ్ళ దౌష్ట్యం కొంత నీకు తెలిసింది. జాగరూకుడవై పరిశీలిస్తే నీకు ఇంకా విదితమవుతుంది. నేను నీకు లభించటాన్ని, నా కార్యవివేక సంపదను విశ్వసించి నా ప్రబోధాన్ని మన్నించుము. ప్రస్తుతం నన్ను మన్నించక వదలినట్లు నటించుము. మోసకారులైన రాజాధికారులకు నేర్పుతో వాళ్ళలో వాళ్ళకే విరోధాలు కల్పించి, వాళ్ళ సంతోషాన్ని భంగపరచి ఒక్కొక్కళ్ళను శిక్షించుము' అని పేరు పేరున దుష్టులను పేర్కొని ప్రబోధించగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **ఆ రాజు నట్ల చేసి మ । హారాజ్య స్థితికి నెల్ల నవ్విప్రు మహో**
**దారగుణు మంత్రిఁగాఁ గొని । సారధనప్రీతి సుఖ యశంబులు వడసెన్.'** **367**

**ప్రతిపదార్థం:** ఆ రాజు= ఆ క్షేమదర్శి అనే రాజు; అట్ల చేసి= కాలక వృక్షీయ మహర్షి చెప్పినట్లు దుష్టులను శిక్షించి; మహారాజ్య స్థితికిన్+ఎల్లన్= ఆ కోసల రాజ్యానికి అంతటికీ; ఆ విప్రున్= ఆ బ్రాహ్మణుడైన కాలక వృక్షీయుడిని; మహా+ఉదార గుణున్= మిక్కిలి గొప్ప గుణాలు కలవాడిని; మంత్రిన్+కాన్+కొని= మంత్రిగా నియమించి; సారధన ప్రీతి సుఖయశంబులు+పడసెన్= శ్రేష్ఠమైన ధనం, సంతోషం, సుఖం, కీర్తి అనే వాటిని పొందాడు.

**తాత్పర్యం:** క్షేమదర్శి అనే రాజు కాలకవృక్షీయుడి హితబోధను అనుసరించి దుష్టులను శిక్షించి, ఉత్తమగుణఖని అయిన అతడిని మంత్రిగా నియమించి, అతడి సాచివ్యంతో రాజ్యపాలన సాగించి శ్రేష్ఠమైన ధనం, సంతోషం, సుఖం, కీర్తి పొందాడు.'

**వ.** **అనిన విని కౌంతేయాగ్రజుండు 'మంత్రి యెట్టివాఁడు గావలయు నెఱింగింపు' మనుటయు గాంగేయుం డతని కిట్లనియె.** **368**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విని; కౌంతేయ+అగ్రజుండు= కుంతీ పుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; మంత్రి+ఎట్టివాఁడు+కావలయున్= మంత్రి ఎలాంటివాడై ఉండాలో; ఎఱింగింపుము+అనుటయున్= తెలుపవలసిందని కోరగా; గాంగేయుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ధర్మరాజుతో భీష్ముడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు ధర్మరాజు 'మంత్రి ఎట్లాంటి గుణగరిష్ఠుడై ఉండాలో తెలుపు'మని కోరగా భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**సీ.** **'జ్ఞానపరుఁడుఁ బౌర జానపదాప్తుండుఁ । గార్యజ్ఞుఁడును ధైర్యశౌర్యఘనుఁడు**
**నక్రూరుఁడును విశుద్ధాత్ముండుఁ బతియెడ । భక్తను రాగ సంభ్రమము లెసఁగ**
**సమ సుఖదుఃఖుఁడై చెమరు నెత్తురు గాఁగఁ । దలఁచుచు నరయక తప్పు మీఁదఁ**
**బెట్టిన నలుకమ్మెఁ దిట్టినఁ గలఁక దా । నొందక తేర్చుచోఁ బొందు సెడక**

**తే.** **మెలఁగు వాఁడును నిజరంధ్రములకు మాటు । సేయఁ బరరంధ్రములు గని చిక్కువఱుపఁ**
**జాలు నిపుణుండు నైన విశాలబుద్ధి । గావలయు మంత్రిముఖ్యుండు గౌరవేంద్ర!** **369**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; మంత్రి ముఖ్యుండు= మంత్రి శ్రేష్ఠుడు; జ్ఞానపరుఁడున్= ఉత్తమ జ్ఞాన సంపన్నుడూ; పౌరజానపద+ఆప్తుండున్= పౌరులకూ, జానపదులకూ ఆత్మీయుడూ; కార్యజ్ఞుఁడును= కార్యవేత్తా;

ధైర్యశౌర్య ఘనుఁడున్= ధైర్య పరాక్రమాలలో గొప్పవాడూ; అక్రూరుఁడును= క్రౌర్యం లేనివాడూ; విశుద్ధ+ఆత్ముండున్= పరిశుద్ధాత్మ కలవాడూ; పతి+ఎడన్= రాజుపట్ల; భక్తి+అనురాగ సంభ్రమములు+ఎసగన్= భక్తి ప్రేమభావాలు అధికం కాగా; సమసుఖదుఃఖుఁడు+ఐ= సుఖ దుఃఖాలను సమంగా స్వీకరించగల వాడై; చెమరు= చెమట; నెత్తురు+కాఁగన్+తలఁచుచున్= రక్తంగా భావించి; అరయక; తెలియక= తప్పు మీఁదన్+పెట్టినన్= ఏదేని దోషం తనమీద మోపినా; అలుకమైన్= కోపంతో; తిట్టినన్= దూషించినా; తాన్= తాను; కలఁక= కలత; ఒందక= చెందక; తేర్పుచోన్+పొందు+చెడక= అనునయించేటప్పుడు స్నేహం చెడక; మెలఁగువాఁడును= జాగకరూకతతో మసలుకొనేవాడూ; నిజ రంధ్రములకున్= తన రాజ్య సంబంధి దోషాలను; మాటు+చేయన్= కప్పిపుచ్చగల; పరరంధ్రములు+కని= శత్రువుల దోషాలను తెలిసికొని; చిక్కు+పఱుపన్+చాలు నిపుణుండు+ఐన= కష్టాలపాలు చేయగల నేర్పరి అయిన; విశాలబుద్ధి= విస్తృతమైన బుద్ధి సంపన్నుడు; కావలయున్= కావాలి.

**తాత్పర్యం:** 'జ్ఞానధనుడూ, పౌరజానపదులకు ఆప్తుడు, కార్యవేత్త, ధైర్యపరాక్రమాలలో గొప్పవాడూ, క్రౌర్యం లేనివాడు, పరిశుద్ధాత్ముడు, రాజుపట్ల భక్తి గౌరవాతిశయాలతో సుఖదుఃఖాలను సమంగా స్వీకరించగల వాడు, చెమటను రక్తంగా భావించి తెలియక తనపై దోషారోపణ చేసినా, కోపంతో దూషించినా, ఏ మాత్రం కలతచెందక అనునయంతో రాజు పొందు చెడకుండా మసలుకొనగలవాడూ, తమ దోషాలను కప్పిపుచ్చుతూ, శత్రువుల లోపాలను గుర్తించి వాళ్ళను చిక్కులపాలు చేయగల నైపుణ్యంకలవాడూ అయిన విశాలబుద్ధిగలవాడు మంత్రిగా ఉండటానికి అర్హుడు.'

**వ. అని చెప్పి. 370**

**తాత్పర్యం:** అని భీష్ముడు ధర్మరాజుతో చెప్పి.

**క. 'మృదు మధుర వాక్యముల నిం। పొదవెడు చిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స**
**మ్మదము సచివులకుఁ బ్రజలకు। నొదవింపఁగవలయు;నది మహోన్నతిఁ జేయున్. 371**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశుఁడు= రాజు; సచివులకున్+ప్రజలకున్= మంత్రులకు, ప్రజలకు; మృదు మధుర వాక్యములన్= మెత్తని తియ్యనైన మాటలతో; చిఱునవ్వుతోడన్= దరహాసంతో; సమ్మదమున్= సంతోషాన్ని; ఒదవింపఁగన్ వలయున్= కలిగించవలసి ఉన్నది; అది మహా+ఉన్నతిన్+చేయున్= అది గొప్పదనాన్ని చేకూరుస్తుంది.

**తాత్పర్యం:** 'రాజు తన మంత్రులకు, ప్రజలకు మెత్తని తియ్యని మాటలతో సంతోషాన్ని కలిగించే చిరునవ్వుతో సమ్మదం చేకూర్చవలసి ఉన్నది. అది రాజునకు ఎంతో ఔన్నత్యాన్ని కలిగిస్తుంది.

**తే. ఈగియును బ్రియ వచన సంయోగమునన। కాని జనులకు సంతోషకారి గాదు**
**పుచ్చి కొనునప్డు పల్కుల పొందుకలిమి। యెదిరి మదిఁ గందనీ దింత యెఱుఁగు మధిప!' 372**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; ఈగియును= దానంవలనగాని; ప్రియవచన సంయోగమునన కాని= ప్రియమైన మాటలతోగాని; జనులకున్ సంతోషకారి+కాదు= ప్రజలకు సంతోషం కలుగదు; పుచ్చికొనునప్డు= గ్రహించేటప్పుడు; పల్కుల పొందు కలిమి= మాటల పొందిక అనే సంపద; ఎదిరి మదిన్+కందన్+ఈదు= శత్రువుల మనస్సులను పీడించదు; ఇంత+ఎఱుఁగుము= ఈ సంగతి తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! దానంతోగాని, ప్రియమైన మాటలతోగాని ప్రజలకు సంతోషం కలుగదు. స్వీకరించే సమయంలో చక్కని మాటల పొందిక శత్రువుల మనస్సులను బాధించదు. దీనిని జాగరూకుడవై తెలిసికొమ్ము.

**వ. అనుటయు ధర్మతనయుండు 'జనంబుల వివాదం బుడుపు నపుడు పుడమిఱేఁడు దూఱునుం బాపంబును బొరయకుండు తెఱంగు దెలుపవే 'యనిన దేవవ్రతుం డిట్లనియె. 373**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు అనగా; ధర్మతనయుండు= ధర్మరాజు; జనంబుల వివాదంబు+ఉడుపునపుడు= ప్రజల తగాదాలను తీర్చేటప్పుడు; పుడమిఱేఁడు= రాజునకు; దూఱునున్+పాపంబును+పొరయకుండు తెఱంగు+తెలుపవే+అనినన్= నింద, పాపం సోకకుండా ఉండే మార్గం తెలుపుమని అనగా; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ప్రజలలో కలిగే వివాదాలలో తీర్పు చెప్పేటప్పుడు రాజునకు ఎట్లాంటి నింద, పాపం, సోకకుండా ఉండే మార్గం ఏదో తెలుపు' మని ధర్మరాజు అడుగగా భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**సీ. 'వ్యవహారశుద్ధి సర్వ ప్రజా ప్రియకారి; । యదియ భూపతికి ధర్మాతిశయముఁ**
**గీర్తియుఁ జేయు; నక్షీణసత్యులు ధర్మ । పరులును నైన భూసురులు నీవు**
**ద్రాసులుం బోని చిత్తంబుల తోడుత । బ్రజ వివాదము లెడఁ బక్ష ముడిగి**
**విని ధన వాంఛమై ధనికుల దెస వ్రాలి । తీర్పక ధర్మంబు తెరువు దప్ప**

**ఆ. కుండఁ బాడిఁ దీర్చి దండింపఁ దగునెడ । ననుగుణంపు దండ మాచరింపు**
**మొఱఁగఁ బలికితేని నుండదు ప్రజ డేగఁ । గనిన పులుఁగుపిండు కరణిఁ జెదరు. 374**

**ప్రతిపదార్థం:** భూపతికిన్= రాజునకు; వ్యవహారశుద్ధి= వ్యవహారంలో పరిశుద్ధత; సర్వప్రజా ప్రియకారి= సమస్త ప్రజలకూ సంతోషాన్ని గూర్చేది; అదియ= అదే; ధర్మ+అతిశయమున్= ధర్మాధికారాన్ని; కీర్తియున్+చేయున్= యశస్సును చేకూరుస్తుంది; అక్షీణ సత్యులు= ఏ మాత్రం సత్యం దప్పనివారు; ధర్మపరులు+ఐన= ధర్మాత్ములైన; భూసురులున్= భూదేవతలైన బ్రాహ్మణులు; ఈవున్= నీవును; త్రాసులున్+పోని చిత్తంబులతోడుతన్= త్రాసులవంటి మనస్సులతో; ప్రజ వివాదములు+ఎడన్= ప్రజల వివాదాలను పరిష్కరించే సందర్భంలో; పక్షము+ఉడిగి విని= పక్షపాతబుద్ధి లేక విని; ధనవాంఛమైన్= ధనంమీది ఆసక్తితో; ధనికుల దెస వ్రాలి తీర్పక= ధనికుల పక్షం వహించి తీర్పు చెప్పక; ధర్మంబుతెరువు+తప్పకుండన్= ధర్మమార్గం తప్పకుండా; పాడిన్+తీర్చి= న్యాయమైన తీర్పు చెప్పి; దండింపన్+తగున్+ఎడన్= శిక్షించవలసిన సందర్భంలో; అనుగుణము+దండము+ఆచరింపుము= తదుచితమైన శిక్ష విధించవలసింది; ఒఱఁగన్+పలికితి(వి)+ఏనిన్= పక్షపాతబుద్ధితో తీర్పు చెప్పితే; ప్రజ ఉండదు= ప్రజలు రాజాశ్రయంలో ఉండరు; డేగన్+కనిన= డేగను చూచిన; పులుఁగు పిండు కరణిన్+చెదరున్= పక్షుల సమూహంవలె చెదరిపోతారు.

**తాత్పర్యం:** 'వ్యవహారాలలో పరిశుద్ధత రాజునకు అవసరం. అదే సర్వప్రజలకు ప్రీతిని చేకూరుస్తుంది. అందువలన ధర్మాధిక్యమూ, కీర్తీ కలుగుతాయి. నిత్యసత్య వచనులు, ధర్మాత్ములు అయిన బ్రాహ్మణులూ నీవూ త్రాసులతో సమానమైన మనస్సులతో ప్రజల వివాదాలు తీర్చేటప్పుడు పక్షపాతం లేకుండా ఇరుపక్షాలవారి వాదనలను విని ధనాశతో ఐశ్వర్యవంతుల వైపు మొగ్గకుండా, న్యాయమైన తీర్పు చెప్పి శిక్షించవలసిన పట్ల, తదుచితమైన శిక్ష విధించాలి. పక్షపాతబుద్ధితో తీర్పు చెప్పితే డేగను చూచిన పక్షులు చెల్లా చెదరైపోయినట్లు ప్రజలు రాజాశ్రయంలో ఉండరు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. దండించుట దానును. 375**

**తాత్పర్యం:** శిక్షించటంలో తానూ - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నఱకుట యర్థముఁ గొనుటయు । జెఱ నునుచుట కట్టి యడిచి చేడ్పాటొందం**
**బఱచుట మొదలుగఁ గల పలు । దెఱఁగులఁ దగవుమెయి నడచు ధీరవిచారా! 376**

**ప్రతిపదార్థం:** ధీర విచారా!= ధీర విచారుడవైన ఓ ధర్మరాజా!; నఱకుట= ఖండించటం (సంహరించటం); అర్థమున్+కొనుటయున్= ధనం గ్రహించటం; చెఱన్+ఉనుచుట= కారాగారంలో బంధించటం; కట్టి= కట్టివేసి; అడిచి= అణచిపెట్టి; చేడ్పాటు+ఒందన్+పఱచుట= నాశనం చేయటం; మొదలుగన్+కల= మొదలైన; పలుతెఱఁగులన్= అనేక రీతులలో; తగవు మెయిన్= న్యాయమైన రీతిలో; నడచున్= ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** 'ధీరవిచారుడ వైన ఓ ధర్మరాజా! ఖండించటం అంటే శిరశ్ఛేదం, ధనం గ్రహించటం, కారాగారంలో బంధించటం, కట్టివేసి అడచిపెట్టి కీడు కలిగించటం మొదలైన పలురీతులలో న్యాయబద్ధంగా ప్రవర్తిస్తాడు.

**వ. అని చెప్పి భీష్ముండు వెండియు ని ట్లనియె. 377**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని ఈ విధంగా చెప్పి; భీష్ముండు= భీష్ముడు; వెండియున్+ఇట్లు+అనియెన్= మళ్ళీ ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పై రీతిగా వివరించి భీష్ముడు ధర్మరాజుతో మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. 'తన కడకు వచ్చి మొగమో । డని వాఁ డగు దూత పల్కుటకుఁ గోపింపం**
**జనదు జననాథునకు; దూ । తునిఁ జంపిన నరక మగుట ధ్రువ మని రార్యుల్. 378**

**ప్రతిపదార్థం:** తనకడకున్ వచ్చి= తన ఆస్థానానికి వచ్చి; మొగము+ఓడనివాఁడు+అగు= మొగమోట మెరుగనివాడైన; దూత+పల్కుటకున్= దూత మాటలకు; జననాథునకున్= రాజునకు; కోపింపన్+చనదు= కోపగించుకొనటం సముచితం కాదు; దూతునిన్+చంపినన్= దూతను చంపినట్లైతే; నరకము+అగుట ధ్రువము+అని= నరక ప్రాప్తి తప్పదని; ఆర్యుల్= పెద్దలు; అనిరి= పలికారు.

**తాత్పర్యం:** దూత తన ఆస్థానానికి వచ్చి మొగమోటం లేకుండా మాట్లాడినప్పుడు ఆ మాటలకు రాజు కోపగించుకొనకూడదు. దూతను చంపితే నరకం తప్పదని పెద్దలు వక్కాణించారు.

**తే. కులము, శీలంబు, హితవాక్యములును, నేర్పుఁ, । గార్యవాదిత్వ సద్వచో గౌరవంబుఁ,**
**దలఁపు గలుగుట, దక్షత, యలఘు గుణము । లంద్రు దూతకు నియ్యేడు నార్యజనులు. 379**

**ప్రతిపదార్థం:** ఆర్యజనులు= పెద్దలు; దూతకున్= దూతకు (రాయబారికి); కులమున్= ఉత్తమ కులం; శీలంబున్= మంచి నడవడి; హిత వాక్యములును= మంచిని గోరి చెప్పే మాటలు; నేర్పు= నేర్పరితనం; కార్యవాదిత్వ సత్+వచః+గౌరవంబున్= కార్యసాధనకొరకు మంచి మాటలు పల్కటం; తలఁపు+కలుగుట= ఆలోచన కలగటం (సమయస్ఫూర్తి); దక్షత= సమర్థత అనే; ఈ+ఏడున్= ఈ ఏడు; అలఘు గుణములు+అంద్రు= గొప్ప గుణాలని పెద్దలు వక్కాణించారు.

**తాత్పర్యం:** 'ఉత్తమ కులం, మంచినడవడి, మంచినిగోరి చెప్పేమాటలు, నేర్పరితనం, కార్యసాధనకొరకు మంచి మాటలు పలకటం, సమయస్ఫూర్తి, దక్షత - అనే ఈ ఏడుగుణాలూ దూతకు ఉండవలసిన గొప్ప లక్షణాలని' పెద్దలు పలికారు.

**క.** **మొనదీర్చు వెరవు, యంత్రము । లనేకము లొనర్చు నేర్పు, నాయుధముల వి**
**న్ననువును బోటుల కర్జం । బును సేనాపతికి నైజములు గావలయున్. 380**

**ప్రతిపదార్థం:** మొన+తీర్చు వెరవున్= వ్యూహం పన్నే ఉపాయం; యంత్రములు+అనేకములు+ఒనర్చు నేర్పున్= అనేక యంత్రాలను తయారుచేయటంలో నైపుణ్యమూ; ఆయుధముల విన్ననువును= ఆయుధాలను ప్రయోగించటంలో నేర్పూ; పోటుల కర్జంబును= యుద్ధంలో సామర్థ్యం (యుద్ధకార్యాచరణం); సేనాపతికిన్= సైన్యాధిపతికి; నైజములు+కావలయున్= సహజ గుణాలై ఉండాలి.

**తాత్పర్యం:** యుద్ధవ్యూహాలు పన్నే ఉపాయమూ, అనేక యంత్రాల నిర్మాణంలో నైపుణ్యమూ, ఆయుధాలను ప్రయోగించటంలో నేర్పూ, యుద్ధకార్యాలలో సామర్థ్యమూ, సైన్యాధిపతికి ఉండవలసిన సహజగుణాలు.

**క.** **తనయులనైనను నమ్మిన । జనపతి సిరి గోలుపోవుఁ; జతురతమై న**
**మ్మినవాఁడ పోలె నమ్మక । యునికి సకల జనుల యెడల నురవై యుండున్.' 381**

**ప్రతిపదార్థం:** తనయులన్+ఐనను= తన పుత్రులనైనా; నమ్మినన్= విశ్వసించిన; జనపతి= రాజు; సిరి+కోలుపోవున్= సంపదను పోగొట్టుకొంటాడు; చతురతమైన్= యుక్తితో; నమ్మినవాఁడ పోలెన్= విశ్వసించిన వాడివలెనే; నమ్మక+ఉనికి= నమ్మకుండా ఉండటమే; సకల జనుల+ఎడలన్= ప్రజలందరిపట్ల; ఉరవు+ఐ+ఉండున్= సముచితమై ఒప్పుతుంది.

**తాత్పర్యం:** రాజు తన పుత్రులనైనా మిక్కిలి నమ్మితే ఐశ్వర్యాన్ని కోల్పోతాడు. పుత్రులనే కాదు - సమస్త ప్రజలనూ నమ్మినట్లు నటిస్తూ రాజ్యపాలనం చేయటమే రాజునకు సముచిత ధర్మమై ఒప్పుతుంది.'

**తే.** **అనిన విని పాండవాగ్రజుం 'డనఘ! పురము । భంగి యె ట్లైన మేలు? సెప్పంగ వలయు'**
**ననుడు నమ్మహీవిభునకు ననిమిషాప । గా తనూభవుఁ డి ట్లనుఁ బ్రీతితోడ. 382**

**ప్రతిపదార్థం:** అనినన్= విని= అని చెప్పగా విని; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; అనఘ!= పాపరహితుడ వైన ఓ తాతా!; పురము భంగి= రాజధాని పద్ధతి; ఎట్లు+అయినన్ మేలు= ఏ విధంగా ఉంటే శ్రేయస్కరమో; చెప్పంగన్ వలయున్= తెలుపగోరుతున్నాను; అనుడున్= అని పలుకగా; ఆ+మహీవిభునకున్= ఆ మహారాజైన ధర్మరాజుతో; అనిమిష+ఆపగా తనూభవుఁడు= దేవతలనదిఅయిన గంగకుపుత్రుడైన భీష్ముడు; ప్రీతితోడన్= సంతోషంతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కుమారుడు మొదలుకొని ప్రజలవరకూ రాజు ఏ విధమైన నమ్మకంతో ఉండాలో చెప్పగా విన్న ధర్మరాజు 'రాజధాని ఏ తీరులో ఉంటే మంచిదో తెలుపు'మని భీష్ముడిని కోరగా ఆయన సంతృప్తిపడి, ఇట్లా సమాధానం చెప్పాడు.

**సీ.** **'పరపు లోఁతును గల పరిఖతోఁ' బొడవును । ఘనమును నగుకోట గలిగి, తగిన**
**వాకిళ్ళు బలువుఁ, గావలి నొప్ప రమ్య గృ । హవ్రాతములు గొమరారు వీధు**
**లందంబు లగు మేటి యంగళ్ళ నెల్ల వ । స్తువులును శోభిల్లు సుజన బహుళ**
**మై ధాన్యములును ఘృతాది రసద్రవ్య । ములును నానాయంత్రములును బహువి**

**ఆ.** **ధాయుధములు బిరుదు లగు యోధులును బండి । తులు విలాసినులును దూతముఖ్య**
**పరిజనము నెఱయఁ బరమోత్సవంబులు । మెఱయఁ బురము చెలువు మిగుల వలయు. 383**

**ప్రతిపదార్థం:** పరపున్= విరివిగలిగి (విశాలమై); లోఁతును+కల= లోతు కలిగిన; పరిఖతోన్= అగడ్తతో; పొడవును ఘనమునున్= పొడవూ దిట్టమూ అయిన; కోట+కలిగి= కోటతో ఒప్పి; తగిన వాకిళ్ళు= అందుకు తగినట్టి ద్వారాలు; బలుపున్+కావలిన్+ఒప్పన్= వాటి వద్ద బలమైన కాపలా ఒప్పుతుండగా; రమ్యగృహ వ్రాతములు= మనోహరమైన భవన సమూహాలు (భవన సముదాయాలు); కొమరారు వీథులు= మనోజ్ఞమైన వీథులు; అందంబులు+అగు= అందమైన; మేటి+అంగళ్ళన్= పెద్ద పెద్ద దుకాణాలతో; ఎల్ల వస్తువులును శోభిల్లన్= సమస్త వస్తు సముదాయం శోభిస్తూ ఉండగా; సుజన బహుళము+ఐ= సజ్జన సమూహం గలదై; ధాన్యములును= వివిధ ధాన్యరాశులూ; ఘృత+ఆది రసద్రవ్యములును= నేయి నూనె మొదలైన రసద్రవ్యాలు; నానాయంత్రములును= వివిధ యంత్రాలతో; బహువిధ+ఆయుధములున్= అనేక విధాలైన ఆయుధాలూ; బిరుదులు+అగు యోధులును= ధీరులైన వీరులు; పండితులున్= విద్వాంసులు; విలాసినులును= విలాసినీ మణులు; దూత ముఖ్య పరిజనమున్= దూతమొదలైన పరివారమూ; నెరయన్= నిండి; పరమ+ఉత్సవంబులు= శ్రేష్ఠమైన పండుగలు పబ్బాలు; మెఱయన్= ప్రకాశిస్తూ ఉండగా; పురము= రాజధాని; చెలువు మిగులన్ వలయున్= మనోహరమై ఒప్పుతూ ఉండాలి.

**తాత్పర్యం:** విశాలమూ, లోతూ అయిన అగడ్తతో, పొడవూ దిట్టమూ అయిన కోటను కలిగి, ఆ కోటకు తగిన రీతిలో ద్వారాలు వాటికి గట్టి కాపలాతో మనోహరమైన భవన సముదాయమూ, మనోజ్ఞంగా తీర్చిదిద్దబడ్డ రాజవీథులు, అందమైన పెద్ద అంగళ్ళలో సమస్త వస్తు సముదాయమూ శోభిల్లుతూ ఉండగా, సజ్జనసమూహంతో నిండి ఉండగా, వివిధ ధాన్యరాశులు, నెయ్యి, నూనె మొదలైన రసద్రవ్యాలూ పలు యంత్రాలు, తగిన ఆయుధాలు, మేటి యోధులు, ఉత్తమ విద్వాంసులు, విలాసినీ మణులు, దూతలు మొదలైన పరివారమూ నిండి ఉండగా శ్రేష్ఠమైన ఉత్సవాలు, పండుగలు పబ్బాలు ప్రకాశిస్తూ ఉంటే రాజధాని మనోహరమై ఒప్పుతుంది.

**విశేషం:** ఇందులో వర్ణితమైన రాజధాని పూర్వరాజుల జీర్ణమైన కోట పేటలను పరిశీలిస్తే విదితమవుతుంది. మనోజ్ఞమైన భవన సముదాయంతో తీర్చిదిద్దినట్లు ఉండే రాజవీథులతో సమస్త వస్తు రసద్రవ్యాలతో నిండినట్టి దుకాణాలతో జనసమూహంతో, పండితులూ, కళాకారులు, విలాసినీజనం మొదలైన వారితో నగరం ప్రశస్తమై దేవసంబంధమూ, సమాజసంబంధమూ అయిన ఉత్సవాలతో పండగ పబ్బాలతో మనోహరమై రాజధాని ఉండాలని తిక్కన ఒక్క సీసంలో చక్కగా వర్ణించాడు. మూలంలో ఐదు శ్లోకాల్లో రాజధాని వర్ణనం ఉన్నది.

**ఆ. అట్టి పురవరంబునందు రత్న స్వర్ణ । ముఖములగు పదార్థములకు బంధు**
**తతికిఁ బతి సురక్షిత స్థితి సేయువాఁ । డధిప! వినుము భూమి యరయు తెఱఁగు.' 384**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; వినుము= వినుము; అట్టి పురవరంబునందున్= అలాంటి ఉత్తమ నగరంలో; రత్న స్వర్ణ ముఖములు+అగు= నవరత్నాలు బంగారం మొదలైన; పదార్థములకున్= అమూల్య వస్తువులకు; బంధుతతికిన్= బంధు సమూహానికి; పతి= రాజు; సురక్షితస్థితి+చేయువాఁడు= రక్షణ కల్పించినవాడు; భూమి+అరయు తెఱఁగు= రాజ్యపాలన విధానం వినుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! అట్లాంటి ఉన్నత నగరంలో నవరత్నాలు, బంగారం మొదలైన విలువగల వస్తువులకు, బంధువుల సమూహానికి రాజు సురక్షితస్థితిని కల్పించినప్పుడే రాజ్యపాలనం చేసే విధం వినుము.

**వ. అని పలికి మఱియు. 385**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా భీష్ముడు ఇట్లా అన్నాడు.

**క. 'స్థలముఖ్యము లయ్యెడు పే । ర్కల యూళ్ళల నెల్ల వెరవు గలిగిన విశ్వా**
**సులఁ బ్రభుత యిచ్చి భూపతి । నిలుప వలయు వర్ణరక్షణీయత వెలయన్. 386**

**ప్రతిపదార్థం:** భూపతి= రాజు; స్థలముఖ్యములు+అయ్యెడు= ప్రముఖ ప్రదేశాలైన; పేరు+కల+ఊళ్ళులన్+ఎల్లన్= ప్రసిద్ధమైన పట్టణాలన్నిటిలోను; వెరవు+కలిగిన= ఉపాయం కలిగిన; విశ్వాసులన్= నమ్మదగిన వారికి; ప్రభుత+ఇచ్చి= రాజ్యాధికారం ఇచ్చి; వర్ణ రక్షణీయత వెలయన్= వర్ణాశ్రమ ధర్మ సంరక్షణం ప్రకాశించేటట్లు; నిలుప వలయున్= నియమించవలసి ఉన్నది.

**తాత్పర్యం:** రాజు ప్రసిద్ధ పట్టణాలన్నిటిలోను బుద్ధిశాలులూ, ఉపాయశాలులూ, విశ్వసనీయులూ అయినవారికి రాజ్యాధికారం ఇచ్చి వర్ణాశ్రమధర్మ సంరక్షణం ప్రకాశించేటట్లు చేయాలి.

**క. చోరులచేఁ జెడకుండం, । గ్రూరులచేఁ జావకుండఁ గువలయ జనులన్**
**జారులచేఁ బడకుండ ధ । రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 387**

**ప్రతిపదార్థం:** ధరారమణుఁడు= భూమికి భర్త అయిన రాజు; కువలయ జనులన్= భూప్రజలను; చోరులచేన్+చెడకుండన్= దొంగలవలన కీడు పొందకుండా; క్రూరులచేన్+చావక+ఉండన్= క్రూరాత్ములవలన మరణించకుండా; జారులచేన్+పడక+ఉండన్= జారులవలలో పడకుండా; నేర్పున్+కలిగి= జాగరూకతతో, నైపుణ్యంతో; రక్షింపన్+తగున్= సంరక్షించవలసి ఉన్నది.

**తాత్పర్యం:** రాజు తన ప్రజలను చోరులచేత కీడుపొందకుండా, క్రూరాత్ములచేత మరణించకుండా. జారుల వలలో తగులుకొనకుండా జాగరూకతతో సంరక్షించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**క. అవు బేహారముఁ, గృషియు, । న్సవరణలును బసులసొంపునన యట్లగుటన్**
**భువిఁ బసులు గలుగు కాఁపుల । నవనీశుఁడు గన్న ప్రజల య ట్లరయఁ దగున్. 388**

**ప్రతిపదార్థం:** బేహారమున్= వాణిజ్యమూ; కృషియున్= వ్యవసాయమూ; సవరణలును= సేవలును; పసుల సొంపునను అవున్= పశువుల సంవృద్ధి వలననే పెంపొందుతాయి; అట్లు+అగుటన్= అందువలన; అవనీ+ఈశుఁడు= రాజు; భువిన్= తన రాజ్యంలో; పసులు+కలుగు+కాఁపులన్= పశుసంపద కలిగిన రక్షకులను; కన్న ప్రజల+అట్లు+అరయన్+తగున్= కన్న సంతానంవలె చూచుకొనటం మంచిది.

**తాత్పర్యం:** వాణిజ్యమూ, వ్యవసాయమూ, సేవా, పశుసంవృద్ధివలన అభివృద్ధి చెందుతాయి. కాబట్టి రాజు అట్లాంటి పశుసంపద గల వారిని కన్న సంతానంవలె ఏ లోటూ లేకుండా చూచుకొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

**క. అరి మిగులఁ గొనుట, గ్రేపులఁ । బొరిమాలం బిదికినట్ల భూవర! కదుపున్**
**వెరవునఁ బెనిచిన యట్టగు । నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 389**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ ధర్మరాజా!; అరి= పన్ను; మిగులన్+కొనుట= ఎక్కువగా వసూలు చేయుట మనేది; క్రేపులన్= దూడలను; పొరిమాలన్+పిదికిన+అట్లు= పాలు వదలకుండా పిండి చంపినట్లే; నరపతి= రాజు; ప్రజచేతన్= ప్రజలనుండి; అప్పనము+తగన్+కొనినన్= పన్నులు మొదలైన కానుకలు సముచిత రీతిని వసూలు చేస్తే; కదుపున్= ఆలమందలను; వెరవునన్= ఉపాయంతో; పెనిచిన+అట్టు+అగున్= పరిపోషించినట్లే అవుతుంది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ప్రజలనుండి పన్నులు అధికంగా వసూలు చేయటమనేది, పాలు వదలకుండా పిండి దూడలను చంపటం వంటిది. రాజు ప్రజలనుండి పన్నులు మొదలైన కానుకలను సముచిత రీతిలో వసూలు చేస్తే గోసంపదను పరిపోషించిన ట్లవుతుంది'.

**బండారంబు వృద్ధి సేయుతెఱంగు భీష్ముఁడు ధర్మజునకుం జెప్పుట (సం. 12-89-1)**

**వ. అనిన విని పాండవాగ్రజుండు 'బండారంబు గలిగించు వెరవెట్టిది తెలుపు'మని యడిగిన నాపగాతనయుం డతని కిట్లనియె. 390**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని రాజు పన్నులు వసూలు చేసేటప్పుడు జాగరూకుడై ఉండాలని భీష్ముడు చెప్పగా విని; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; బండారంబు= కోశం; కలిగించు వెరవు+ఎట్టిది?= ఏర్పాటు చేసికొని అభివృద్ధి చేసే ఉపాయం ఎట్లాంటిదో; తెలుపుము+అని+అడిగినన్= తెలుపవలసిం దని కోరగా; ఆపగాతనయుండు= ఆ గంగాపుత్రుడైన భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'రాజు ప్రజలనుండి పన్నులు వసూలు చేసేటప్పుడు బహు జాగరూకుడై మసలుకొనాలని భీష్ముడు చెప్పగా, ధర్మరాజు విని, కోశాభివృద్ధికి మార్గాలను తెలుపవలసిందని కోరగా భీష్ముడు ఇట్లా సమాధానం చెప్పాడు.

**క. 'విను కర్షకులును వణిజులు । ననఘా! గోరక్షకులు ధరాధీశునకున్**
**ధన మొడఁ గూడెడు చోటుల । ననేక విధములకు నెల్ల నాద్యస్థలముల్. 391**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; విను= జాగరూకుడవై వినుము; ధరా+అధి+ఈశునకున్= రాజునకు; కర్షకులును= రైతులు; వణిజులు= వర్తకులు; గోరక్షకులు= గోపాలకులు; ధనము+ఒడగూడెడు చోటులన్= ధనం అభివృద్ధి చెందే అంశాలలో; ఎల్లన్= అన్నిచోట్లా; ఆద్య స్థలముల్= ముఖ్యమైన పట్టులు (ఆధారాలు)

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సావధానుడవై వినుము. రాజునకు ధనం సమకూర్చుకొనటంలో కృషీవలులు, వర్తకులు, గోపాలురు ముఖ్యమైన పట్టులు.

**తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తి తలము । లయినవాని కించుకయును హాని గాక**
**యుండఁ దనకును బండార మొదవఁ దగు ను । పార్జనము సేయవలయు భూపాలకుండు. 392**

**ప్రతిపదార్థం:** భూపాలకుండు= రాజు; తనకును= తనకు; ధనములకున్= సంపదలకు; ధాన్యములకున్= పంటలకు; ఉత్పత్తి తలములు+అయిన= వానికి ఉత్పత్తి కారణాలైన ప్రదేశాలకు; ఇంచుకయును= కొంచెమైనా; హాని+కాక+ఉండన్= కీడు కలుగనీయకుండా; బండారము+ఒదవన్+తగు= కోశాభివృద్ధికి తగిన రీతిలో; ఉపార్జనము+చేయన్ వలయున్= సంపాదన చెయ్యాలి.

**తాత్పర్యం:** 'ధనధాన్యాలకు సముత్పత్తిస్థానాలైన పట్టులకు ఏ మాత్రం భంగం కలుగని రీతిలో మిక్కిలి నైపుణ్యంతో కోశాభివృద్ధికి రాజు ప్రయత్నించి తగిన రీతిలో సంపాదించాలి'.

**విశేషం:** ధనోత్పతికి వర్తక వాణిజ్యాలు, ధాన్యాభివృద్ధికి భూమి ఆధారాలు కాబట్టి ఇవి రాజాధీనంలోనే ఉండాలి. వాటికి హాని రానీయకుండా రాజు జాగరూకుడై కోశాభివృద్ధికి ప్రయత్నించాలి.

**క. పులి గూనల దినుచందము। గలిగిన నంతటన నిలుచుఁ గాక ధనంబుల్**
**గలుగునె మీఁదం గావున। జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. 393**

**ప్రతిపదార్థం:** పులి+కూనల+తినుచందము+కలిగినన్= పులి ఈనిన వెంటనే ఆకలితో తన పిల్లలనే తినే తీరు అయితే; ధనంబుల్= సంపదలు; అంతటన= అంతటితోనే; నిలుచున్+కాక= అభివృద్ధిలేక ఆగిపోతాయి కాని; మీఁదన్+కలుగునె?= ఆపైన అభివృద్ధి కలుగుతుందా?; కావునన్= కాబట్టి; ఇలన్= భూమిపై; జలగ+తిగిచినట్లు= జలగ రక్తాన్ని లాగినట్లు; సొమ్ముల్= సంపదను; కొనఁగన్+చనున్= గ్రహించవలసి ఉంటుంది.

**తాత్పర్యం:** ఆకలితో పులి తన పిల్లలను తానే తిన్నట్లుగా, రాజు ప్రజలనుండి పన్నులు వసూలుచెయ్యటం ప్రారంభిస్తే కోశాభివృద్ధి చెందక ఆగిపోతుంది. అందువలన ఇతరులకు బాధకలగనీయకుండా తెలియకుండా జలగ నెత్తురు పీల్చిన రీతిలో రాజు ప్రజలనుండి ధనసంపాదన చేస్తే కోశం అభివృద్ధి చెందుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అరయుటఁ బ్రజ వర్ధింపఁగ। నరి యేఁటఁ గ్రమ ప్రవృద్ధ మౌనట్టులుగా**
**నరపతికిఁ గొనఁగ వచ్చు। న్వెరవులఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. 394**

**ప్రతిపదార్థం:** నరపతికిన్= రాజునకు; ప్రజన్= ప్రజలను; వర్ధింపఁగన్= ప్రవర్ధమానమై వెలిగేటట్లు; అరయుటయున్= జాగరూకతతో చూడటమనే దానివలన; ఏఁటన్= ప్రతి సంవత్సరమూ; అరి= పన్ను; క్రమ ప్రవృద్ధము+ఔనట్టులుగాన్= క్రమాభివృద్ధి పొందేటట్లుగా; కొనఁగన్ వచ్చున్= గ్రహించవచ్చును; వెరవులన్= ఉపాయాలతో; పెంపంగన్= అభివృద్ధి చేస్తే; ధనంబుల్= సంపదలు; చాలన్ నెఱయున్= అధికంగావచ్చి నిండుతాయి.

**తాత్పర్యం:** ప్రజాభివృద్ధికరమైన పనులు చేస్తూ, జాగరూకతతో పరిపాలించే రాజు ప్రతి సంవత్సరమూ క్రమాభివృద్ధి పొందేటట్లుగా గ్రహించవచ్చును. మూర్ఖపు పట్టుదలతోగాక, చక్కటి ఉపాయాలతో అభివృద్ధిచేస్తే తప్పకుండా కోశం ధనంతో నిండుతుంది.

**క. దమియింపఁ దగిన వారల। సమయమున దమించి, వారి సంపదలు మహీ**
**రమణుండు దనదు బండా। రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. 395**

**ప్రతిపదార్థం:** మహీరమణుండు= భూ భర్త అయిన రాజు; దమియింపన్+తగిన వారలన్= అణచివేయవలసిన వారిని; సమయమునన్= తగిన సమయంలో శిక్షించి; వారి సంపదలు= వారి సంపదలన్నిటినీ; జనము= ప్రజలు; రాగిల్లంగన్= సంతోషించేటట్లు; తనదు బండారము+కాన్= తన బొక్కసంగా; సమకూర్చున్= నింపుకొంటాడు.

**తాత్పర్యం:** 'రాజు తగిన సమయంలో శిక్షించవలసినవారిని దండించి, వారి సంపదలన్నింటిని గ్రహించి, ప్రజలు సంతోషించేటట్లుగా తన బొక్కసాన్ని నింపుకోవాలి'.

**క. ఆ పనికిఁ గీడు రోయుచు। భూపాలుఁడు ధనము గలుగు పురుషుల సిరిఁ దా**
**జూ పోపక కొనఁ దగదు, ద। యాపరుఁడై పెంపవలయు నఖిలజనములన్. 396**

**ప్రతిపదార్థం:** భూపాలుఁడు= రాజు; ధనము+కలుగు= ధనమున్నట్టి; పురుషుల సిరిన్= ప్రజల సంపదలకు; చూపు+ఓపక= కన్నుగుట్టి; కొనన్+తగదు= బలవంతంగా స్వాధీనం చేసికొనకూడదు; ఆ పనికిన్+కీడు రోయుచున్= అట్లాంటి పనికి ఆపద

కలుగుతుందని అసహ్యించుకొని; దయాపరుఁడు+ఐ= కరుణాళువై; అఖిల జనములన్= సమస్త ప్రజలనూ; పెంపన్ వలయున్= అభివృద్ధి పరచాలి.

**తాత్పర్యం:** 'రాజు ధనవంతులైన ప్రజల సిరిసంపదలను చూచి ఓర్చుకొనలేక బలవంతంగా, అన్యాయంగా స్వాధీనం చేసికొనకూడదు. అట్లా చెయ్యటంవలన కీడు కలుగుతుందని గ్రహించి దయాంతఃకరణుడై అందరికీ ఆనందం కలిగించే రీతిలో ప్రజలను పాలించాలి'.

**క. ప్రభువుల నుపచారంబుల । విభుఁ డనురాగిల్లఁ జేసి వెదగొనుఁ గాఁపుల్**
**సభయులు గాకుండ ధనం । బుభయ జగత్సిద్ధి పొంటె నుర్వీనాథా! 397**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ రాజా!; విభుఁడు= రాజు; ప్రభువులన్= సామంత రాజులను; ఉపచారంబులన్= తగిన గౌరవాదరాలతో; అనురాగిల్లన్+చేసి= కూరిమి నెరపి; కాఁపుల్= కర్షకులు; సభయులు+కాక+ఉండన్= భయంతో కూడినవారు కాకుండా; (భయ రహితంగా); ఉభయ జగత్+సిద్ధి పొంటెన్= ఇహపరలోకాలలో సిద్ధి పొందటంకొరకు; ధనంబు= సంపదను; వెద+కొనున్= అద నెరిగి గ్రహిస్తాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఉచితజ్ఞుడైన రాజు ఉభయలోకాలలో సిద్ధిపొందటంకొరకు సామంతరాజులను గౌరవాదరాలతో సమాదరించి కూరిమి నెరపి కర్షకులు భయభ్రాంతులు కాకుండా, అద నెరిగి పన్నులు వసూలు చేసి బొక్కసం నింపుకొంటాడు'.

**క. ఆయతి కిమ్మెయిఁ గలుగు ను । పాయంబులు ధర్మమార్గ ఫలితంబులుగాఁ**
**జేయుటయును మేలు నృపతికి । మాయాకృతి నిపుణు డగుట మతిగాదు సుమీ! 398**

**ప్రతిపదార్థం:** నృపతికిన్= రాజునకు; ఆయతికిన్+ ఈ+మెయిన్+కలుగు= ధనసంపాదనకు (రాబడి) ఈ విధంగా కలిగే; ఉపాయంబులు= ఉచిత మార్గాలు; ధర్మమార్గఫలితంబులు+కాన్+చేయుటయును మేలు= ధర్మమార్గ ప్రయోజనాలుగా చేయటమే సముచితం; మాయాకృతి నిపుణుఁడు+అగుట= కపట కార్యాలలో నేర్పరి కావటం; మతి+కాదు సుమీ!= మంచిబుద్ధి లక్షణం కాదు సుమా!

**తాత్పర్యం:** 'రాజు ధనసంపాదనకు ఉచితమైన మార్గాలోచనల ఫలితంగా చేయటమే సముచితం. అంతేగాని, పన్నులు రాబట్టటంలో కపటోపాయాలలో నైపుణ్యం సాధించి ప్రవర్తించటం బుద్ధిమంతుడైన రాజునకు ఎంతమాత్రమూ సమంజసం కాదు'.

**క. ధనము సవరించినఁ బ్రయో । జన మేమి యపాత్రములకుఁ జల్లి చెఱుచు నే**
**ని నరేంద్రముఖ్య! వ్యయములు । విను రక్షయ సిరికిఁ బాత్ర విషయము లైనన్. 399**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర ముఖ్య= రాజశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; విను= సావధానంగా విను; అపాత్రములకున్+చల్లి= అర్హులు కానివారికి వెదజల్లి; చెఱుచున్+ఏని= నాశనం చేసేటట్లయితే; ధనము సవరించినన్= ధనాన్ని సంపాదిస్తే మాత్రం; ప్రయోజనము+ఏమి= ఫలితం ఏమిటి?; పాత్ర విషయములు+ఐనన్= అర్హులైనవారి విషయంలో అయితే; వ్యయములు= వెచ్చించటాలు; సిరికిన్= సంపదలకు; రక్షయ= సంరక్షణమే.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సావధానుడవై వినుము. అపాత్రదానం చేసి ధనం వినాశనం చేసేటట్లయితే ఆ ధన సంపాదనవలన ప్రయోజనం లేదు. అయితే పాత్రదానం చేసి సిరిసంపదలను వెచ్చిస్తే మాత్రం ఆ సంపదకు అది సంరక్షణమేగాని నిష్ప్రయోజనం మాత్రం కాదు. కాబట్టి పాత్రదానం ముఖ్యం.

**విశేషం:** ధనము ఉన్నందుకు దానం చెయ్యటమే ప్రయోజనం. ఊరికే కూడబెట్టినందువలన ప్రయోజనం లేదు. అయితే పాత్రాపాత్రవివేచన కలిగి దానం చెయ్యాలి. అర్హులైన వారికి దానం చేయటమనేది ముఖ్యం. అప్రాతదానం అనుచితం. పాత్రదానం చెయ్యటం వలన ఆ ధనానికి సంరక్షణమే గాని అన్యం కాదు' అని భీష్ముడి భావన.

**వ. ఈ భంగి యైనం గోశ మిత్త్ర రాష్ట్ర బలంబులు వృద్ధిఁ బొందు; నీ విట్టి తెఱంగువాఁడవై ప్రజల రక్షింపుము. రణంబుల కలయక విరోధుల వధియింపుము మఖంబు లొనరింపుము ; దరిద్రులైన ధరణీసురాది సాధుల నరసి కుటుంబ రక్షణంబు సేయుము; మాంధాతృనకు నాంగిరసుం డగు నుతథ్యుండు సెప్పిన హిత వాక్యంబు లుపన్యసించెద; నాకర్ణింపుము. 400**

**ప్రతిపదార్థం:** ఈ భంగి+ఐనన్= ఈ పద్ధతిని నీవు పాటిస్తే; కోశమిత్త్ర రాష్ట్రంబులున్= భండాగారం, స్నేహితులు, రాష్ట్రం, సైన్యబలం మొదలైనవన్నీ; వృద్ధిన్+పొందున్= అభివృద్ధి చెందుతాయి; ఈవు+ఇట్టి తెఱంగువాఁడవు+ఐ= నీవు ఈ మార్గంలో నడుస్తూ; ప్రజలన్ రక్షింపుము= ప్రజలను కాపాడుము; రణంబులకున్+అలయక= యుద్ధాలకు భయపడక; విరోధులన్ వధియింపుము= శత్రువులను సంహరించుము; మఖంబులు+ఒనరింపుము= యజ్ఞయాగాదులు చేయుము; దరిద్రులు+ఐన= దారిద్ర్యంతో బాధపడుతున్న; ధరణీసుర+ఆది సాధులన్+అరసి= భూ దేవులైన బ్రాహ్మణులు మొదలైన సాధువులను గమనించి; కుటుంబ రక్షణంబు+చేయుము= అట్లాంటివారి కుటుంబాలను సంరక్షించుము (ఈ సందర్భంలో); మాంధాతృనకున్= మాంధాత అనే రాజుకు; ఆంగిరసుండు+అగు= అంగిరస వంశీకుడైన; ఉతథ్యుండు= ఉతథ్యుడనే మహర్షి; చెప్పిన హిత వాక్యంబులు= ప్రబోధించిన హిత వచనాలు; ఉపన్యసించెదన్+ఆకర్ణింపుము= ప్రసంగిస్తాను - సావధానంతో వినుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఈ రీతిగా నీవు నడచుకొన్నట్లయితే నీ భాండాగారంతోపాటు మిత్రబృందం, రాష్ట్రం, సైన్యం అభ్యున్నతి పొందుతుంది. కాబట్టి, ఈ మార్గంలో పయనించి ప్రజలను రక్షించుము. యుద్ధాలకు భయపడవద్దు. పరాక్రమాన్ని ప్రదర్శించి శత్రువులను సంహరించుము. యజ్ఞయాగాదులు ఆచరించి, దరిద్రులైన బ్రాహ్మణులు మొదలైన సాధుజనులను పరిశీలించి వారి కుటుంబాలను రక్షించుము. ఈ సందర్భంలో మాంధాతమహారాజునకు ఆంగిరసుడైన ఉతథ్యుడనే మహర్షి చెప్పిన హితవచనాలను ప్రసంగిస్తాను. సావధాన చిత్తుడవై వినుము' అని భీష్ముడు పలికాడు.

### మాంధాతృన కుతథ్యుఁడు సెప్పిన హితవాక్యముల ప్రకారము (సం. 12-91-1)

**తే. భూత వృద్ధులు ధనలాభములును గలుగు। ధర్మమును రాజనువాఁడు ధర్మరక్ష**
**కై జనించెను గావున నతఁ డరోష। కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు. 401**

**ప్రతిపదార్థం:** ధర్మమునను= ధర్మంవలనే; భూతవృద్ధులు= ప్రాణికోటి అభివృద్ధులు; ధనలాభములును+కలుగున్= అత్యధిక ధనాభివృద్ధులు కలుగుతాయి; రాజు+అనువాఁడు= రాజనేవాడు; ధర్మరక్షణకున్+ఐ= ధర్మ సంరక్షణకొరకే; జనించెను= జన్మించాడు; కావునన్= కాబట్టి; అతఁడు= ఆ రాజు; అరోషకాముఁడు+ఐ= అహంకారం, కామం లేనివాడై; ధర్మనిరతుండు+కాఁగన్ వలయున్= ధర్మంపట్ల అత్యంతాసక్తి కలవాడై ఉండటం అవసరం.

**తాత్పర్యం:** 'ధర్మంవలననే ప్రాణికోటి అభివృద్ధి చెందుతుంది. అత్యంత ధనలాభం కలుగుతుంది. రాజనేవాడు ధర్మసంరక్షణకొరకే జన్మించాడు. అందుచేత అహంకార, కామ వివర్జితుడై ధర్మాసక్తుడై రాజు పరిపాలన చేయవలసి ఉంటుంది'.

**క. వినుధర్మమునకు బ్రాహ్మణ । జనము జననదేశ మగుట జనపతి భక్తిం**
**గొనియాడి యసూయా వ । ర్జనుఁడై తగు విప్రకోటి సంభావింపన్. 402**

**ప్రతిపదార్థం:** విను= సావధానుడవై వినుము; ధర్మమునకున్= ధర్మానికి; జననదేశము= పుట్టుకచోటు; బ్రాహ్మణ జనము= బ్రాహ్మణులే; అగుటన్= కావటంవలన; జనపతి= రాజు; అసూయావర్జనుఁడు+ఐ= అసూయను తొలగించుకొన్నవాడై (లేనివాడై); విప్రకోటి(న్)= బ్రాహ్మణ సమూహాన్ని; భక్తిన్+కొనియాడి= భక్తితో ప్రశంసించి; సంభావింపన్+తగున్= గౌరవించటం యుక్తం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సావధానుడవై వినుము. ధర్మానికి జన్మస్థానం బ్రాహ్మణులే. కాబట్టి రాజు అసూయా రహితుడై బ్రాహ్మణ సమూహాన్ని పూజించి గౌరవించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది'.

**చ. అనిమిషులున్ విభీతు లగునట్టి పదంబునఁ బేర్చి మున్ విరో**
**చన తనయుండు భూమిసురజాతి సువృత్తి కసూయచేసి నె**
**ట్టన సిరిఁ బాయడే? బలి దృఢంబగు భక్తివిశేషమూఁదఁగా**
**ననఘ! యతండు దాఁ బిదప నవ్యయసౌఖ్య విభూతి నొందఁడే? 403**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; మున్= పూర్వం; విరోచన తనయుండు= విరోచనుడి కుమారుడు; బలి= బలిచక్రవర్తి; అనిమిషులున్= దేవతలు సైతం; విభీతులు+అగునట్టి= భయపడేటట్లు; పదంబునన్+పేర్చి= పదవిలో అతిశయించి; భూమిసురజాతి= బ్రాహ్మణజాతి; సువృత్తికిన్+అసూయచేసి= ఉత్తమ ధర్మమార్గానికి అసూయపడి; నెట్టన= అనివార్యంగా; సిరిన్+పాయఁడే?= సంపదను పోగొట్టుకొనలేదా?; దృఢంబు+అగు= మిక్కిలి దృఢమైన; భక్తి విశేషము+ఊఁదన్+కాన్= భక్తి ప్రపత్తిని ఆధారం చేసుకొని; పిదపన్= ఆ తరువాత; అతండు= ఆ బలిచక్రవర్తి; తాన్= తాను; అవ్యయ సౌఖ్యవిభూతిన్= స్థిర సుఖ సంపదలను; ఒందఁడే?= పొందలేదా? (పొందాడు కదా!).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! పూర్వం విరోచనపుత్రు డైన బలి దేవతలు సైతం భయభ్రాంతు లయ్యేటట్లు ఉన్నత పదవిలో విజృంభించి, బ్రాహ్మణుల ధర్మప్రవర్తనకు అసూయ పడి సమస్తసంపదలను కోల్పోయాడు. కాని, ఆ పిమ్మట దృఢమైన భక్తిప్రపత్తిని ఆధారం చేసికొనగా అతడే స్థిరమైన సుఖసంపదలను పొందాడు'.

**ఆ. ధర్మమునకు సిరికిఁ దగ జనించినయది । దర్ప; మనిమిషులు నుదాత్తమునులు**
**నైన నగ్గుణమున నూనినఁ జెడుదురు । దాని గెలువవలయు ధరణిపునకు. 404**

**ప్రతిపదార్థం:** ధర్మమునకున్= ధర్మానికి; సిరికిన్= సంపదకు; దర్పము= గర్వం; తగన్ జనించిన అది= పుట్టింది; అనిమిషులున్= దేవతలైనా; ఉదాత్తమునులున్+ఐనన్= ఉత్తమ మహర్షులైనా; ఆ+గుణమునన= ఆ గర్వమనే గుణాన్నే; ఊనినన్= పూనినట్లయితే; చెడుదురు= నాశనమౌతారు; ధరణిపునకున్= రాజు; దానిన్ గెలువన్ వలయున్= దానిని గెలువ వలసి ఉన్నది.

**తాత్పర్యం:** 'ధర్మానికి, సంపదకు దర్పమనే దుర్గుణం పుట్టింది. అయితే దేవతలైనా, మునీశ్వరులైనా ఆ దుర్గుణానికి లోనైతే నాశనమైపోతారు. కాబట్టి రాజు ఈ దర్పమనే దుర్గుణాన్ని నిశ్శేషంగా జయించవలసి ఉంటుంది.'

**మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగఁ ద**
**ద్ధరకున్ వర్షము లేకయుండుఁ; బ్రజకున్ దైన్యంబు వాటిల్లుఁ; బె**
**క్కు రుజల్ పైకొను; నెందునుం గలయ నుక్కుం దేజముం దక్కు ;ను**
**ద్ధుర సైన్యంబుల శత్రు లొత్తుదురు; బంధుశ్రేణికిం జే టగున్. 405**

**ప్రతిపదార్థం:** భూపాలుండు= రాజు; పరనారీగమన+ఆది దోషములు= పరస్త్రీని కోరి పొందటం మొదలైన తప్పిదాలు; చేయంగన్= చేయటంవలన; తద్+ధరకున్= ఆ రాజ్యంలో; వర్షము లేక+ఉండున్= వానలు కురవకుండా పోతాయి; ప్రజకున్= ప్రజలకు; దైన్యంబు+పాటిల్లున్= దీన భావం కలుగుతుంది; పెక్కు రుజల్= అనేక రోగాలు; పైకొనున్= పైబడి వ్యాపిస్తాయి; ఎందునున్+కలయన్= అన్నిచోట్లా వ్యాపించి; ఉక్కున్+తేజమున్+తక్కున్= పరాక్రమమూ, తేజస్సూ నశించిపోతాయి; శత్రులు= శత్రువులు; ఉద్దుర సైన్యంబులన్= బలమైన సైన్యాలతో; ఒత్తుదురు= బాధిస్తారు (నాశనం చేస్తారు); బంధుశ్రేణికిన్= బంధువుల సమూహానికి; చేటు+అగున్= కీడు కలుగుతుంది.

**తాత్పర్యం:** 'రాజు పరస్త్రీలోలత్వం మొదలైన దుర్గుణాలతో ప్రవర్తిస్తే అతడి రాజ్యంలో వర్షాలు కురవవు. ప్రజలు దైన్యానికి లోనవుతారు. అనేక రోగాలు వ్యాపిస్తాయి. అవి అన్నిచోట్లా వ్యాపించటంవలన పరాక్రమమూ తేజస్సూ నశిస్తాయి. శత్రువులు బలమైన సైన్యంతో బాధిస్తారు. బంధుజనులకు కీడు కలుగుతుంది'.

**విశేషం:** కాబట్టి రాజు ఉత్తమ గుణ సంపన్నుడై, దుశ్శీలుడు గాక సమస్త ప్రజానీకానికి ఆదర్శ ప్రాయుడై ఉండి ప్రజలను కన్న సంతానంవలె పోషించాలి. వాస్తవానికి రాజు దుష్టుడైతే ప్రజలు అదే రీతిగా ఉంటారు. ఈ భావానికి మూలం 'యథారాజా తథాప్రజా' అనే సూక్తి.

**క. కాని చెయిదములు సేయ క । నూనపు ధర్మమున నడచు నుర్వీశుఁడు సం**
**తానము బంధులుఁ బ్రజయును । దానును సేనలును శుభము దలకొనఁ బేర్చున్.' 406**

**ప్రతిపదార్థం:** కాని చెయిదములు+చేయక= కానిపనులు చేయకుండా; అనూనపు ధర్మమునన్ నడచు= పరిపూర్ణ ధర్మమార్గంలో నడిచే; ఉర్వీ+ఈశుఁడు= భూమికి భర్త అయిన రాజు; తానును= తానూ; సంతానమున్= పుత్ర పౌత్రాదులూ; బంధువులున్= బంధువులు; ప్రజయునున్= ప్రజలూ; సేనలును= చతురంగ బలాలూ; శుభము+తలకొనన్+పేర్చున్= అత్యంత శుభాలు చేకూరి అతిశయిస్తారు.

**తాత్పర్యం:** 'చెడ్డపనులు చేయకుండా, పరిపూర్ణ ధర్మమార్గంలో నడచుకొనే రాజు సంతానం, బంధుమిత్రులు, ప్రజలు, చతురంగబలాలు మొదలైన సమస్తశుభాలతో కలకాలం సంతోషంగా జీవిస్తారు'.

**విశేషం:** పైన పేర్కొన్నట్లు రాజు ఉత్తమ గుణఖని అయితే సమస్త ప్రజలూ సుఖసంపదలతో విలసిల్లుతారు. రాజు సంతానం, బంధుమిత్రులు ఆనందిస్తారు.

**వ. అని యిట్లు సెప్పిన వాక్యంబులం దెలివొంది ధర్మతత్పరుండై మాంధాతృండు మహావిభూతిం బొంది నెగడె; నీవును నట్ల నెగడు' మనిన ధర్మతనయుండు 'ధర్మంబున నెగడ దొరకొనుట యెట్టి భంగిం గలుగు?'నని యడుగుటయు, నతనితో నక్కురుపితామహుండు దొల్లి కౌసల్యుం డగు వసుమనుం డనురాజు వామదేవ మహామునిని నిట్ల యడిగిన నతం డతనికి నుపదేశించిన తెఱం గెఱింగెద విను మని యిట్లనియె. 407**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు+చెప్పిన వాక్యంబులన్= అని ఈ విధంగా ఉతథ్యుడనే మహర్షి చెప్పిన వచనాల వలన; తెలివి+ఒంది= బుద్ధిమంతు డైన; ధర్మతత్పరుండు+ఐ= ధర్మాసక్తుడై; మాంధాతృండు= మాంధాత అనే రాజు; మహావిభూతిన్+పొంది నెగడెన్= గొప్ప సంపదలను పొంది ప్రసిద్ధి గాంచాడు; ఈవునున్= నీవూ; అట్ల నెగడుము+అనినన్= అదే రీతిగా ప్రసిద్ధి పొందుమని అనగా; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ధర్మంబునన్= ధర్మమార్గంలో; నెగడన్ దొరకొనుట= వర్ధిల్లటానికి పూనుకొనటం; ఎట్టి భంగిన్+కలుగున్+అని+అడుగుటయున్= ఏ విధంగా సాధ్యమౌతుందని అడుగగా; అతనితోన్= ఆ ధర్మరాజుతో; ఆ+కురు పితామహుండు= ఆ కౌరవ పితామహుడైన భీష్ముడు; తొల్లి= పూర్వం; కౌసల్యుండు+అగు= కోసలదేశాధీశు డైన;

వసుమనుండు+అనురాజు= వసుమనుం డనే రాజు; వామదేవ మహామునిన్+ఇట్లు+అ+అడిగినన్= వామదేవుడనే మహర్షిని ఇదే రీతిని అడుగగా; అతండు+అతనికిన్= ఆ వామదేవుడు వసుమనునికి; ఉపదేశించిన తెఱంగు+ఎఱింగించెదన్= ప్రబోధించిన తీరును తెలుపుతాను; వినుము+అని= వినవలసిందని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'రాజు ధర్మవర్తనుడు కావాలని ఉతథుడు చెప్పగా విన్న మాంధాత జ్ఞానవంతుడై ధర్మాసక్తితో నడచుకొని సమస్త సంపదలతో వర్ధిల్లాడు. అదే రీతిగా నీవు సైతం ప్రసిద్ధి పొందవలసిం'దని భీష్ముడు ధర్మరాజుకు ఉపదేశించాడు. అప్పుడు ధర్మరాజు ధర్మమార్గానువర్తనంతో ఏ రీతి ప్రఖ్యాతి పొందవచ్చునో చెప్పవలసిందని కోరగా భీష్ముడు కోసలదేశాధిపతి అయిన వసుమనుడు అనేరాజు వామదేవుడనే మహర్షిని ఇదే రీతిగా ప్రశ్నించినప్పుడు అతనికి ప్రబోధించిన తీరును వివరిస్తాను విను మని చెప్పాడు.'

**వసుమనుం డను రాజునకు వామదేవుండు సెప్పిన ధర్మప్రకారము (సం. 12-93-1)**

**ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ । సిద్ధి; దాన సకల సిద్ధులును బ్ర**
**శస్త భంగిఁ జేరు; శాశ్వత కీర్తియు । సంభవించుఁ; గలుగు సద్గతియును. 408**

**ప్రతిపదార్థం:** అరయన్= పరిశీలించగా; అర్థసిద్ధికంటెన్= ధన సంపాదనకంటె; ధర్మార్థ సిద్ధి ఎక్కుడు= ధర్మాన్ని సిద్ధింపజేసికొనటమే మంచిది; దానన్= దానివలన; ప్రశస్త భంగిన్= ప్రఖ్యాత పద్ధతిలో; సకల సిద్ధులునున్= సమస్తమైన ప్రయోజనాలు; చేరున్= సమకూరుతాయి; శాశ్వత కీర్తియున్ సంభవించున్= శాశ్వత కీర్తికూడా కలుగుతుంది; సత్+గతియును కలుగున్= ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి.

**తాత్పర్యం:** 'పరిశీలించి చూడగా, ధనసంపాదనకంటె ధర్మాన్ని సిద్ధింపజేసికొనటం శ్రేష్ఠం. ధర్మసిద్ధివలన సమస్త ప్రయోజనాలూ సిద్ధిస్తాయి. శాశ్వతకీర్తితోపాటు ఇహపరలోకాలలో సిద్ధి కలుగుతుంది.

**క. ధనమునకై ధర్మము దెస । ననాదరము సేసెనేని నా నృపతికి న**
**ద్ధనమును జెడు; దుర్యశముం । బనుగొనుఁ దుది దుర్గతియును బాటిలు ననఘా! 409**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; ధనమునకున్+ఐ= ధనం కూడబెట్టటం కొరకు; ధర్మము దెసన్= ధర్మాన్ని గూర్చి; అనాదరము+చేసెన్+ఏనిన్= అశ్రద్ధతో ఉన్నట్లయితే; ఆ నృపతికిన్= అట్లాంటి రాజునకు; ఆ+ధనమును+చెడున్= ఆ సంపాదించిన ధనమూ నశిస్తుంది; దుస్+యశమున్+పనుగొనున్= దుష్కీర్తి కలుగుతుంది; తుదిన్= చివరకు; దుస్+గతియున్+పాటిలున్= నరకలోకం ప్రాప్తిస్తుంది.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ధనం కూడబెట్టటమే ధ్యేయంగా భావించి ధర్మాన్ని లెక్కచేయకపోతే, ఆ రాజు సంపాదించిన ధనం నాశనం కావటమే కాక, అతడికి దుష్కీర్తి, నరక ప్రాప్తి సంభవిస్తాయి.

**క. లాభంబు ధర్మముఖ్యము । గా భరపడి మార్గశుద్ధి గనుఁగొని కైకో**
**లా భూవరునకు నిహపర । శోభనములు సేఁత చెప్పు శ్రుతి వాక్యంబుల్. 410**

**ప్రతిపదార్థం:** ధర్మముఖ్యముగాన్= ధర్మ ప్రధానంగా; లాభంబు= ధన లాభాన్ని; భరపడి= భరించి; మార్గశుద్ధి+కనుఁగొని= ఉత్తమ మార్గమని భావించి; కైకోలు= గ్రహించట మనేది; ఆ భూవరునకున్= ఆ రాజునకు; ఇహపర శోభనములు+చేఁత= ఐహికాముష్మిక సుఖాల ప్రాప్తి (అని); శ్రుతి వాక్యంబుల్ చెప్పున్= వేదవాక్యాలు వక్కాణిస్తున్నాయి.

**తాత్పర్యం:** 'ధార్మికదృష్టితో ధనార్జన చేయటం ఉత్తమమార్గంగా భావించే రాజునకు ఇహపరసౌఖ్యాలు దక్కుతాయని శ్రుతివాక్యాలు చెప్పుతున్నాయి.'

**క. ధర్మ ప్రవృత్తియయ్యును । ధర్మము నా కింతకంటెఁ దత్తద్విధులం**
**బేర్మిం బొరయ వలయు నను । ధార్మికతాతృష్ణ నత్యుదాత్తుఁడు వొందున్.' 411**

**ప్రతిపదార్థం:** ధర్మ ప్రవృత్తి+అయ్యును= ధర్మస్వభావం కలిగి ఉండి కూడా; ధర్మము= ధర్మమార్గం; నాకున్+ఇంతకంటెన్= నాకు దీనికంటె; తద్+తద్+విధులన్= ఆయా కార్యకలాపాలలో; పేర్మిన్+పొరయన్ వలయున్+అను= అతిశయితంగా కలగాలని; ధార్మికతా తృష్ణన్= ధర్మమార్గ దాహంతో; అతి+ఉదాత్తుఁడు+పొందున్= మిక్కిలి ఉత్తముడు పొందుతాడు.

**తాత్పర్యం:** 'ధర్మస్వభావం కలవాడైనా తా ననుసరించే ధర్మమార్గం మరింతగా - అంటే ఇబ్బడిముబ్బడిగా, తాను ఆచరించే ఆయా విధులలో మిక్కిలి అతిశయితమై ఒప్పాలని ధర్మంమీది దాహంతో మిక్కిలి ఉదాత్తుడైన రాజు ఉత్తమ ఫలితాలను పొందుతాడు.'

**వ. అని తన వచనంబులం దెలివొందిన వసుమనుండను రాజుతో వామదేవుండు రాజ్యతంత్రంబున కెల్ల నాధార భూతంబు లగు సామ భేద దానదండంబులం బ్రయోగించు తెఱం గెఱింగించెద నాకర్ణింపు మని యిట్లనియె. 412**

**ప్రతిపదార్థం:** అని తన వచనంబులన్= అని వామదేవుడి పలుకులవలన; తెలివి+ఒందిన= గ్రహించిన (తెలిసికొన్న); వసుమనుండు+అనురాజుతోన్= వసుమనుడనేరాజుతో; వామదేవుండు= వామదేవుడనే మహర్షి; రాజతంత్రంబునకున్+ఎల్లన్= రాజ్య వ్యాపార నిర్వహణానికి అంతటికీ; ఆధార భూతంబులు+అగు= ప్రధాన ఆధారమైన; సామభేద దాన దండంబులన్= సామం, భేదం, దానం, దండం అనే చతురుపాయాలను; ప్రయోగించు తెఱంగు+ఎఱింగించెదన్= పాటించే విధానాన్ని వివరిస్తాను; ఆకర్ణింపుము+అని+ఇట్లు+ అనియెన్= సావధానుడవై వినవలసిందని ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'అని వామదేవుడి మాటల సారాన్ని గ్రహించిన వసుమనుడనే రాజుతో వామదేవుడు మళ్ళీ రాజ్యపాలన వ్యవహారాన్ని నడిపించటానికి ప్రధాన ఆధారమైన సామ దాన భేద దండోపాయాలనే చతురుపాయాల ప్రయోగ విధానాన్ని వివరిస్తాను; సావధాన చిత్తుడవై వినవలసిన' దని ఇట్లా వివరించాడు.

**క. మూలబలము సంతుష్టం । బై లాలిత మగుచునున్న యప్పు డసదుఁ జో**
**టాలోకించి నడవ భూ । పాలకునకు దండ మతిశుభం బొనరించున్. 413**

**ప్రతిపదార్థం:** మూలబలము= చతురంగ బలంలోని ప్రధాన సైన్యం; సంతుష్టంబు+ఐ= సంతృప్తి పొంది; లాలితము+అగుచున్+ఉన్న+ అప్పుడు= లాలింపబడుతున్నప్పుడు; అసదు+చోటు+ఆలోకించి= శత్రువుల అసమర్థతను కనిపెట్టి; నడవన్= శత్రువులపై యుద్ధానికి వెళితే; భూపాలకునకున్= రాజుకు; దండము= సామదాన భేద దండాలలో దండనీతి; అతిశుభంబు+ఒనరించున్= మిక్కిలి శుభాన్ని చేకూరుస్తుంది.

**తాత్పర్యం:** 'తన చతురంగ బలాలలో మూలబలం - అంటే ప్రధానసైన్యం - శత్రుసంహారార్థమని భావించి సంతృప్తిపొంది సంతోషంతో దానిని ప్రేమగా చూస్తున్నప్పుడు శత్రువుల అసమర్థతను గమనించి, యుద్ధానికి వెళ్ళితే రాజునకు దండనీతివలన మిక్కిలి శుభం కలుగుతుంది.

**చ. సమరము సాహసం బధిక సంపద లమ్మెయిఁ దెచ్చికోలు ప**
**థ్యమె రిపు లేల కల్గు దురహంకృతి పెంపును నుత్కటంపుఁ గో**
**పము మగిడింపఁజాలు నరపాలున కట్లగుటన్ హితంబు సా**
**మము దనయంతవాఁ డయిన మానవనాథు నెడన్ మహీశ్వరా! 414**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశ్వరా!= ఓ రాజా!; సమరము= యుద్ధమనేది; సాహసంబు= సాహసంతో కూడినపని; ఆ+మెయిన్= ఆ రీతిగా; అధిక సంపదలు= మిక్కిలి సిరిసంపదలను; తెచ్చికోలు పథ్యమె?= సంపాదించటం హితమేమీ కాదు; అహంకృతి పెంపునున్= అతిశయితమైన అహంకారాన్ని; ఉత్కటము+కోపమున్= అత్యధికమైన కోపాన్ని; మగిడింపన్+చాలు= ఉపసంహరించుకొనగల సమర్థుడైన; నరపాలునకున్= రాజునకు; రిపులు+ఏల కల్గుదురు?= శత్రువులు ఎందుకుంటారు?; అట్లు+అగుటన్= అట్లా కావటంవలన; తన+అంతవాఁడు+అయిన= తనతో సమానుడైన; మానవ నాథు+ఎడన్= రాజుపట్ల; సామము హితంబు= సామ దాన భేద దండోపాయాలనే చతురుపాయాలలో మొదటిదైన సామమే సముచితమైనది.

**తాత్పర్యం:** 'ఓ రాజా! యుద్ధమనేది సాహసకృత్యం. యుద్ధం చేసి శత్రు సంహారంవలన సంపాదించే సిరిసంపదలు మేలు కలిగించవు. అతిశయితమైన అహంకారాన్ని, అత్యధికకోపాన్ని తగ్గించుకొనగలిగిన సమర్థుడైన రాజునకు శత్రువులు ఎట్లా ఉంటారు? అందువలన ఎదుటి రాజు తనంతటి శత్రువని గ్రహించినప్పుడు సామోపాయంతో ప్రవర్తించటం శ్రేష్ఠం.'

**క. తన భటులు గలఁగినప్పుడు । ధన మిచ్చి విరోధి నల్పతరు నైనను శాం**
**తునిఁ జేయవలయు దానము । నన యధికునిఁ దేర్చు టురవు నరపతి కెపుడున్. 415**

**ప్రతిపదార్థం:** తన భటులు= తన సైన్యంలోని వీరులు; కలఁగినప్పుడు= కలత చెందినప్పుడు (అంతఃకలహాలతో ఉన్నప్పుడు); అల్ప తరున్+ఐనన్= బలహీనుడైనా సరే; విరోధిన్= శత్రువును; ధనము+ఇచ్చి= ధనాన్ని ఇచ్చి; శాంతునిన్+చేయన్ వలయున్= శాంతుడిని చేయటమే మంచిది; ఎప్పుడున్= ఎల్లప్పుడు; నరపతికిన్= రాజునకు; అధికునిన్= తనకంటె బలవంతుడైన శత్రువును; దానముననన= సామ దాన భేద దండోపాయాలలో దానం చేతనే; తేర్చుట+ఉరవు= సంతృప్తి పరచటమే సముచితం.

**తాత్పర్యం:** 'తన సైన్యంలోని అంతఃకలహాలు చెలరేగితే బలహీనుడైన శత్రువునైనా ధనం ఇచ్చి సంతృప్తి పరచటమే మంచిది. రాజునకు తన కంటె బలవంతుడైన శత్రువును దానం అనే ఉపాయంతో వశం చేసికొనటమే సముచితం'.

**తే. ఆ యుపాయముల్ మూఁటికి ననువుగాని । యట్టి పగతునియెడ భేద మాచరింప**
**వలయు రంధ్రముల్ దగవేచు వలను గలిగి । తత్పరతఁ జేయఁజాలు సాధకులఁ బనిచి. 416**

**ప్రతిపదార్థం:** ఆ+ఉపాయముల్+మూఁటికిన్= ఆ సామ దాన దండోపాయా లనే మూటికి; అనువు+కాని= సాధ్యంకాని; అట్టి పగతుని+ఎడన్= అట్లాంటి శత్రువుపట్ల; రంధ్రముల్= లోపాలను గ్రహించి; తగన్ వేచువలను+కలిగి= తగినట్లు బాధించే అవకాశం కలిగి; తత్పరతన్+చేయన్+చాలు= శ్రద్ధతో చేసే సమర్థులైన; సాధకులన్+పనిచి= కార్యసాధకులను పంపించి; భేదము+ఆచరింపన్ వలయున్= భేదోపాయాన్ని ప్రయోగించవలసి ఉంటుంది.

**తాత్పర్యం:** 'పైన పేర్కొన్నట్లు సామ దాన దండోపాయాలనే మూడింటికి అవకాశం లేనప్పుడు శత్రువుపట్ల కలిగిన లోపాలను పరిశీలించి తగినవిధంగా బాధించే అవకాశం కలిగినప్పుడు శ్రద్ధతో కార్యాన్ని సాధించగలవారిని భేదోపాయానికి నియోగించటం సముచితం'.

**విశేషం:** ఇంతవరకు సామ దాన భేద దండోపాయాలనే నాలుగింటి ప్రయోగం ఎట్లా చేయాలో రాజు శత్రువులపట్ల ఎట్లా ప్రవర్తించాలో విదితం చేయబడింది.

**వ. శుక్రమతంబునం బంచమోపాయంబైన యుపేక్ష వర్తిల్లు దానిం బ్రయోగించు భంగియుం జెప్పెద.417**

**ప్రతిపదార్థం:** శుక్రమతంబునన్= శుక్రాచార్యుడి అభిప్రాయం ప్రకారం; పంచమ+ఉపాయంబు+ఐన+ఉపేక్ష వర్తిల్లున్= సామ దాన భేద దండోపాయాలు కాక ఐదో ఉపాయమైన ఉపేక్షా భావం ఒప్పుతుంది; దానిన్+ప్రయోగించు భంగియున్+చెప్పెదన్= ఆ ఉపేక్షా భావాన్ని ప్రయోగించే విధానాన్ని సైతం వివరిస్తాను.

**తాత్పర్యం:** 'శుక్రాచార్యుడి అభిప్రాయం ప్రకారం సామ దాన భేద దండోపాయాలు కాక, ఉపేక్షా భావమనే మరో ఐదో ఉపాయం ఉన్నది. దానిని ప్రయోగించే తీరు తెన్నులను వివరిస్తాను'.

**మ. కలహంబుల్ దమలోనఁ జేసిన నుపేక్షానైపుణం బొప్ప శ**
**త్రులఁ జూడందగు భూతదానవుల పోరుం జూచిన ట్లెమ్మెయి**
**న్ములు ముంటం దగఁ బుచ్చు భంగి గలుగు న్భూనాథ! కీడైన మం**
**త్రులయేపున్ విభుఁ డిట్ల మాపునది నేర్పుం బెంపుఁ బొల్పారఁగన్. 418**

**ప్రతిపదార్థం:** భూనాథ!= ఓ రాజా!; కలహంబుల్= పోట్లాటలు; తమలోనన్+చేసినన్= తమలో తమకు కలిగినట్లయితే; ఉపేక్షా నైపుణంబు+ఒప్పన్= ఉపేక్షాభావంలో నేర్పు నైపుణ్యం ఒప్పేటట్లుగా; భూత దానవుల పోరున్+చూచిన+అట్లు= భూతాలకు రాక్షసులకు కలిగిన యుద్ధాన్ని చూసినట్లుగా; శత్రువులన్+చూడన్+తగున్= శత్రువులను చూడవలసింది; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; ములు ముంటన్+తగన్+పుచ్చు భంగి+కలుగన్= ముల్లును ముల్లుతో తీసే తీరుగానే చూడాలి; విభుఁడు= రాజు; కీడు+ఐన= ఆపదను కలిగించే; మంత్రులు+ఏపున్= మంత్రుల అతిశయాన్ని; ఇట్లు+ ఇదే విధంగా; నేర్పున్= నేర్పరితనమూ; పెంపున్= ఆధిక్యమూ; పొల్పు+ఆరఁగన్= మిక్కిలి అతిశయించేటట్లుగా; మాపునది= తొలగించేది.

**తాత్పర్యం:** 'ఓ రాజా! వైరం తమలో తమకే కలిగితే భూత రాక్షసులకు యుద్ధం జరిగితే ఉపేక్షించినట్లు, శత్రువులను ఉపేక్షాభావంతో చూడవలసి ఉంటుంది. ఏ విధంగానైనా ముల్లును ముల్లుతో తీసే తీరులోనే చూడాలి. రాజు తనకు ఆపదలు కలిగించే మంత్రుల అతిశయాన్ని ఇదే విధంగా తన నేర్పరితనంతో, ఆధిక్యంతో తొలగించవలసి ఉంటుంది. ఇది సామదానభేద దండోపాయాలనే నాలుగు కాక ఉపేక్ష అనే ఐదో ఉపాయం. ఇది శుక్రనీతి ప్రకారం కొనసాగింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని యత్తెఱంగున వామదేవుండు సెప్పిన హితవచనంబులు వాటించి కోసలపతి భాసమానుండయ్యెఁ; నీవును నట్ల వర్తిల్లి వలెయు'మనినఁ బాండవాగ్రజుండు 'సమరంబున శత్రుల జయించునప్పటి పాడి యెట్లుండు?' ననుటయు భీష్ముం డతని కిట్లనియె. 419**

**ప్రతిపదార్థం:** అని+ఆ+తెఱంగునన్= అని ఆ విధంగా; వామదేవుండు= వామదేవుడనే మహర్షి; చెప్పిన హితవచనంబులు+పాటించి= చెప్పిన హిత వాక్యాలను ఆచరించి; కోసలపతి= కోసలాధిపతి అయిన వసుమను డనే రాజు; భాసమానుండు+అయ్యెన్= తేజస్వంతు డయ్యాడు; ఈవునున్= నీవుకూడా; అట్ల వర్తిల్లి వెలయుము+అనినన్= అదే రీతిగా రాజ్యపాలనం చేసి ప్రసిద్ధి పొందవలసిందని చెప్పగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; సమరంబునన్= యుద్ధంలో; శత్రుల జయించునప్పటి పాడి=

శత్రువులను జయించే సమయంలోని యుద్ధనీతి; ఎట్లు+ఉండున్+అనుటయున్= ఎట్లా ఉంటుందో అని అడుగగా; భీష్ముండు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'అని ఉపేక్షాభావం వహించే తీరును, వామదేవుడనే మహర్షి చెప్పిన హితవచనాలను అనుసరించి కోసలదేశాధిపతి అయిన వసుమను డనే రాజు, సూర్యసమతేజుడై వెలుగొందాడు; నీవూ అదే రీతిగా రాజ్యపాలన చేసి, ప్రకాశించవలసిం'దని చెప్పగా, ధర్మరాజు 'శత్రువులను జయించే సందర్భంలో యుద్ధనీతి ఎట్లా ఉంటుందో చెప్పు' మని అడుగగా భీష్ముడు ఈ విధంగా వివరించాడు.

**ధర్మజునకు భీష్ముండు సమరంబున పాడి దెల్పుట (సం. 12-96-6)**

**సీ. పగవాఁడు బలములఁ బన్ని త్రోచినఁ దాను । సబలుఁడై యొంటిమై సంగరంబు**
**గోరిన నమ్మెయి గొనకొని మాయ లొ । నర్చిన మాయలఁ బేర్చి గెలుపు**
**గొనునది; వెన్నిచ్చినను బ్రమాదంబునం । బడినను గైదువు భగ్నమైన**
**శరణన్న మ్రొక్కినఁ దురగాళి యెడలిన । నొరుతోడఁ బోరుచునున్న నెట్టి**

**ఆ. పగతునైనఁ జంపఁ దగ దధర్మంబునఁ । జంపు కంటె ధర్మసమర కేళిఁ**
**జావు మేలు; రాజు శయ్యఁ జచ్చుట గొఱ । గాదు గాన యోడఁ గాదు పోర. 420**

**ప్రతిపదార్థం:** పగవాఁడు= శత్రువు; బలములన్+పన్ని త్రోచినన్= సైన్యాలతో సిద్ధమై ఎదుర్కొంటే; తానున్ సబలుఁడు+ఐ= తాను కూడా సైన్యాలతో కూడినవాడై; ఒంటిమైన్= ఒంటరిగానే; సంగరంబు+కోరినన్= యుద్ధానికి సిద్ధమైతే; ఆ+మెయి+గొనకొని= అదేరీతిగా ప్రయత్నించి; మాయలు+ఒనర్చినన్= శత్రువులు మాయలు చేస్తే; మాయలన్+పేర్చి= మాయలచేతనే అతిశయించి; గెలుపు+కొనునది= విజయం సాధించాలి; వెన్ను+ఇచ్చినను= పారిపోతూ వీపు చూపినా; ప్రమాదంబునన్+పడినను= యుద్ధరంగంలో ప్రమాదవశాత్తు పడిపోయినా; కైదువు భగ్నమైనన్= ఆయుధం నాశనమైనా; శరణు+అన్నన్= రక్షణకోరినా; మ్రొక్కినన్= నమస్కరించినా; తురగ+ఆళి+ఎడలినన్= గుర్రాల సమూహం వికలమైనా (అంటే చచ్చినా, పారిపోయినా); ఒరుతోడన్= మరొక వ్యక్తితో; పోరుచున్+ఉన్నన్= యుద్ధం చేస్తున్నా; ఎట్టి పగతున్+ఐనన్= ఎట్లాంటి శత్రువునైనా; చంపన్+తగదు= చంపటం న్యాయం కాదు; అధర్మంబున్= ధర్మవిరుద్ధంగా; చంపుకంటెన్= చంపటంకంటే; ధర్మసమరకేలిన్= ధర్మయుద్ధ విహారంలో; చావు మేలు= చనిపోవటమే మంచిది; రాజు; శయ్యన్+చచ్చుట+కొఱగాదు= పడకమీదనే చనిపోవటం ప్రయోజనకారి కాదు; కాన= అందుచేత; పోరన్= యుద్ధంలో; ఓడన్+కాదు= ఓడిపోరాదు.

**తాత్పర్యం:** యుద్ధనీతి భీష్ముడు ధర్మరాజుకు ఉపదేశించాడు. 'యుద్ధంలో శత్రువు సైన్యాలతో సిద్ధమై ఎదుర్కొంటే నీవూ సైన్యంతో ఎదిరించాలి. శత్రువు ఎక్కటి కయ్యానికి సిద్ధమైతే నీవూ అసహాయ శూరుడవై యుద్ధం చెయ్యాలి. మాయోపాయాలతో శత్రువు యుద్ధం చేయటం ప్రారంభిస్తే నీవూ కపటోపాయాలతో ఎదిరించి విజయాన్ని సాధించాలి. వెన్నిచ్చి పారిపోయినా, ఏమరుపాటున పడిపోయినా, ఆయుధం భగ్నమైనా, శరణువేడుకొన్నా, మ్రొక్కినా, గుర్రాలు నేలపైకూలినా, పారిపోయినా, వేరొకడితో యుద్ధం చేస్తున్నా ఎట్లాంటి శత్రువునైనా చంపరాదు. అధర్మంగా శత్రువును చంపటంకంటె ధర్మయుద్ధవిహారంలో చావటం మంచిది. రాజు పడకమీద మరణించటం పనికిరాదు. అందుకని యుద్ధంలో ఓడిపోరాదు.

క. వినుచిల్లయిడిన యాయుధ। మును విషలిప్తమగు శస్త్రమును నెట్టియ మి
త్రునిపై నైనఁ బ్రయోగిం। చిన నరపతి నరకమున వసించు నృపాలా! 421

**ప్రతిపదార్థం:** నృపాలా!= ఓ ధర్మరాజా!; విను= సావధానుడవై వినుము; చిల్ల ఇడిన+ఆయుధమును= అగ్రభాగంలో వంకరగా ఉండే ములికిని ఉంచి తయారుచేసిన ఆయుధాన్ని, విషలిప్తము+అగు= విషంపూసినదైన; శస్త్రమునున్= ఆయుధాన్ని; ఎట్టి+అమిత్రునిపైన్+ఐనన్= ఎట్లాంటి శత్రువుపై అయినా; ప్రయోగించిన= యుద్ధంలో ఉపయోగించిన; నరపతి= రాజు; నరకమున వసించున్= నరకాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! జాగరూకతతో వినుము. అగ్రభాగంలో ములికిని ఉంచి తయారుచేసిన ఆయుధాన్ని, లేదా విషంపూసిన ఆయుధాన్ని ఎట్లాంటి శత్రువుపైనైనా ప్రయోగించకూడదు. అట్లా ప్రయోగించే రాజునకు నరకప్రాప్తి తప్పదు. ఇది యుద్ధనీతిలో భాగం' అని భీష్ముడు వివరించాడు.

క. తనకుం దోడ్పడి యని నొ। చ్చిన వానిం గాంచి కడఁగి చేష్టింపక యు
న్న నరేంద్రుఁ బొందు పాపం। బునకుఁ గొలఁది గలదె భరతపుంగవ! తలఁపన్. 422

**ప్రతిపదార్థం:** భరత పుంగవ!= భరత వంశంలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; తలఁపన్= ఆలోచించగా; తనకున్+తోడ్పడి= తనకు సహాయం చేయవచ్చి; అనిన్= నొచ్చినవానిన్+కాంచి= యుద్ధంలో పీడితుడైన వాడిని చూచి; కడఁగి= పూనుకొని; చేష్టింపక+ఉన్న= పట్టించుకొనకుండా ఉన్న; నర+ఇంద్రున్= రాజును; పొందు పాపంబునకున్= పొందే పాపానికి; కొలఁది+కలదె?= ఇంత అని లెక్క ఉన్నదా?

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఆలోచిస్తే యుద్ధంలో తనకు సహాయం చేయటానికి వచ్చి ఘోరంగా పీడింపబడిన వాడిని పట్టించుకొనకుండా ఉండే రాజు భయంకరమైన పాపాన్ని పొందుతాడు'.

వ. అని చెప్పి వెండియు. 423

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ (ఇట్లా అన్నాడు).

చ. అరిపయిఁ బోయి వాని పుర మగ్గలికం జెఱుపంగఁ దద్ధరం
బరఁగు ప్రజం జలంబు మెయి బాధలఁ బెట్టు టధర్మమట్టి ని
ష్ఠురత యొనర్చుటప్పటికిఁ జూడఁగ మానఁగరాదయేని భూ
సుర గృహదేవగేహముల చూఱ నవశ్యము మాన్చు టొప్పగన్.' 424

**ప్రతిపదార్థం:** అరిపయిన్+పోయి= శత్రువుపై యుద్ధానికి వెళ్ళి; వాని పురము= ఆ శత్రువుయొక్క పట్టణాన్ని; అగ్గలికన్+చెఱుపంగన్= పరాక్రమంతో నాశనం చెయ్యటానికి; తద్+ధరన్+పరఁగు ప్రజన్= ఆ రాజ్యంలో నివసిస్తున్న ప్రజలను; చలంబు మెయిన్= మాత్సర్యంతో; బాధలన్+పెట్టుట+అధర్మము= బాధలకు గురిచేయటం ధర్మంకాదు; అట్టి నిష్ఠురత+ఒనర్చుట= అట్లాంటి కాఠిన్యం వహించటం; అప్పటికిన్+చూడఁగన్= ఆ సమయానికి (పరిశీలించగా); మానఁగన్ రాద+ఏనిన్= మానుకొనటం వీలుకాకపోతే; భూసురగృహ= బ్రాహ్మణుల ఇళ్ళను; దేవగేహములన్= దేవతా గృహాలను (దేవాలయాలను); చూఱన్= కొల్లగొట్టట మనేది; అవశ్యము= తప్పనిసరిగా; మాన్చుట+ఒప్పు+అగున్= వదలిపెట్టటమే సముచితమవుతుంది.

**తాత్పర్యం:** 'శత్రువుపై దండెత్తి పోయి అతడి పట్టణాన్ని నాశనం చేయటానికి అక్కడ నివసిస్తున్న ప్రజలను మాత్సర్యంతో బాధించటం అధర్మం. అట్లాంటి కాఠిన్యాన్ని మానుకొనటం, అప్పటికి వీలుకాకపోతే కనీసం బ్రాహ్మణుల ఇళ్ళను, దేవాలయాలను కొల్లగొట్టటం తప్పనిసరిగా మానుకొనటం సముచితం'.

**వ. అనిన విని యజాతశత్రుండు 'రాజధర్మంబు కంటెం బాపకర్మంబు లేదు పో'మ్మని పలికి 'యిట్లేని రాజున కెట్లును నధోగతి వాటిల్లుఁ గదే!' యనుటయు నాపగాతనయుం డిట్లనియె. 425**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విని; అజాతశత్రుండు= పుట్టని శత్రువులుగల ధర్మరాజు; రాజధర్మంబు కంటెన్= రాజు ఆచరించవలసిన ధర్మంకంటే; పాపకర్మంబు లేదు పొమ్ము+అని పలికి= పాపకార్యం మరొకటి నిశ్చయంగా లేదని పలికి; ఇట్లు+ఏనిన్= ఇట్లాగైతే; రాజునకున్= రాజుకు; ఎట్లునున్= ఏ విధంగానైనా; అధః+గతి= దుర్గతి; పాటిల్లున్+కదే!= ప్రాప్తిస్తుంది కదా!; అనుటయున్= అనగా; ఆపగా తనయుండు+ఇట్లు+అనియెన్= దేవతల నది అయిన గంగ పుత్రుడైన భీష్ముడు ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'యుద్ధనీతిని భీష్ముడు విశదం చేయగా విన్న ధర్మరాజు 'రాజధర్మం కంటె మరొక పాపకార్యం నిశ్చయంగా లే'దని తన అసమ్మతిని తెలిపి, 'ఎట్లా చూచినా రాజుకు నరకప్రాప్తి తప్పటం లేదు కదా!' అని పలికినప్పుడు భీష్ముడు ఇట్లా వివరించాడు.

**క. 'శరణాగతుఁ గాచియు, నని। నరిపోటులఁ బడ్డఁ దెచ్చి యరసియు, ధరణీ**
**సురులం బ్రోచియు, నానా। ధ్వరములు సేసియును రాజు దలుఁగు దురితముల్. 426**

**ప్రతిపదార్థం:** శరణ+ఆగతున్+కాచియున్= శరణుకోరిన వాడిని రక్షించి; అనిన్+అరిపోటులన్+పడ్డన్= యుద్ధంలో శత్రువుల చేత దెబ్బలు తిన్నవాడిని; తెచ్చి+అరసియు= తీసికొని వచ్చి క్షేమాలపట్ల శ్రద్ధ వహించి; ధరణీసురులన్+ప్రోచియున్= భూదేవులైన బ్రాహ్మణులను పోషించి; నానా+అధ్వరములు+చేసియును= అనేక యజ్ఞయాగాలు చేసి; రాజు దురితముల్ తలుఁగున్= రాజు పాపాలను తొలగించుకొనవచ్చును.

**తాత్పర్యం:** 'శరణాగతులను సంరక్షించి, యుద్ధంలో శత్రువుల బాధలకు గురి అయినవారిని తెచ్చి, వారికి తగిన సేవచేసి, బ్రాహ్మణులను పోషించి, అనేక యజ్ఞాలను నిర్వహించి, రాజు పాపాలను పరిహరించుకొనవచ్చును.'

**క. అన విని యమ్మనుజేశ్వరుఁ। 'డని ననివర్తు లయి శౌర్య మభినుతి కెక్కం**
**దనువుఁ దొఱంగిన వారికి। ననఘా! యెబ్భంగి లోక మగు?' నని యడిగెన్. 427**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అని చెప్పగా విని; ఆ+మనుజ+ఈశ్వరుండు= ఆ రాజశ్రేష్ఠుడైన ధర్మరాజు; అనఘా!= పాపరహితుడ వైన తాతా!; అనిన్+అనివర్తులు+అయి= యుద్ధంలో వెనుదిరుగని వారై; శౌర్యము+అభినుతికిన్+ఎక్కన్= పరాక్రమం ప్రఖ్యాతి పొందగా; తనువున్+తొరంగినవారికిన్= శరీరం పోగొట్టుకొన్న వారికి (చనిపోయినవారికి); ఏ+భంగి లోకము+అగున్?= ఎట్లాంటి లోకాలు కలుగుతాయి?; అని+అడిగెన్= అని ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** 'రాజధర్మాన్ని అనుసరించి ప్రజాసంరక్షణ చేస్తే ఉత్తమగతులు కలుగుతా' యని భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'యుద్ధంలో వెనుదీయక అరివీరభయంకరులై పరాక్రమసంపదను ప్రదర్శించి ప్రాణాలు కోల్పోయినవారికి ఎట్లాంటి లోకాలు కలుగుతాయో తెలుపు'మని భీష్ముడిని అడిగాడు.

**వ. అడుగుటయు, నమ్మహీకాంతునితో 'శాంతనవుండు శక్రాంబరీషసంవాదంబు చెప్పెద; దాననీ యడిగినయది దేటపడు నని యిట్లనియె. 428**

**ప్రతిపదార్థం:** అడుగుటయున్= అని అడిగిన; ఆ+మహీకాంతునితోన్= ఆ ధర్మరాజుతో; శాంతనవుండు= భీష్ముడు; శక్ర+అంబరీష సంవాదంబున్= ఇంద్రుడికి అంబరీషుడికి మధ్య జరిగిన సంభాషణను; చెప్పెదన్= చెప్పుతాను; దానన్= దానివలన; నీ+అడిగిన+అది= నీవు అడిగిన ప్రశ్న; తేటపడున్= స్పష్టపడుతుంది; అని+ఇట్లు+అనియెన్= అని ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'అని ప్రశ్నించిన ధర్మరాజుతో భీష్ముడు 'ఇంద్రుడికీ అంబరీషుడికీ మధ్య జరిగిన సంభాషణను విశదం చేస్తాను; దానివలన నీవు అడిగిన ప్రశ్నకు చక్కటి సమాధానం లభిస్తుం'దని ఇట్లా వివరించాడు.

**ఇంద్రాంబరీష సంవాద ప్రకారము (సం. 12-99-1)**

**సీ. అంబరీషుండు నానాధ్వరంబులు సేసి । కడచని వాసవు కడకు నేఁగి,**
**యచట నుజ్జ్వల విమానారూఢుఁ డును మనో । హారి సంక్రీడనోదారచరితుఁ**
**డును నై వెలింగెడు తనదు బంటు సుదేవుఁ । డను వానిఁ జూచి యయ్యనిమిషేంద్రు**
**తోడ మదీయభృత్యుఁడు వీఁడు క్రతుముఖ్య । కర్మముల్ సేయఁ డెక్కారణమున**

**తే. ననఘ! నాకంటెఁ గడుఁ బేర్చి యునికి గలిగె । ననుడు నా జిష్ణుఁ డిమ్మహాత్ముని తెఱంగు**
**సెప్పఁ జిట్టలు వినఁగ వాంఛించితేని । వినుము చెప్పెద' నని యిట్టు లనియెఁ బ్రీతి. 429**

**ప్రతిపదార్థం:** అంబరీషుండు= అంబరీషుడనే రాజు; నానా+అధ్వరంబులు+చేసి= అనేక యజ్ఞాలు చేసి; కడచని= మరణించి; వాసవు కడకున్+ఏఁగి= ఇంద్రునివద్దకు వెళ్ళి; అచటన్= అక్కడనే; ఉత్+జ్వల విమాన+ఆరూఢుఁడును= ప్రకాశిస్తున్న విమానం ఎక్కినవాడు; మనః+హారిసమ్+క్రీడన+ఉదార చరితుఁడును+ఐ= మనోజ్ఞమైన చక్కగా క్రీడిస్తున్న ఉత్తమ ప్రవర్తన కలవాడై; వెలింగెడు= ప్రకాశిస్తున్న; తనదు బంటు= తన సేవకుడు; సుదేవుఁడు+అనువానిన్+చూచి= సుదేవుడనే వాడిని చూచి; ఆ+అనిమిష+ఇంద్రుతోడన్= దేవతలరాజైన ఇంద్రుడితో; అనఘా!= ఓ పాపరహితుడవైన మహేంద్రా!; వీఁడు మదీయ భృత్యుఁడు= యజ్ఞయాగాది కర్మలను ఆచరించలేదు; ఏ+కారణంబునన్= ఏ కారణంవలన; నాకంటెన్+కడున్+పేర్చి= నాకంటె మిక్కిలి అతిశయించి; ఉనికి+కలిగెన్= ఉండగలిగాడు (ఈ ఉన్నత స్థితిని పొందగలిగాడు); అనుడున్= అనగానే; ఆ జిష్ణుఁడు= ఆ ఇంద్రుడు; ఈ+మహాత్ముని తెఱంగు చెప్పన్+చిట్టలు= ఈ మహాత్ముడి గూర్చి చెబితే చాలా ఆశ్చర్యకరం; వినఁగన్ వాంఛించితి(వి)+ఏని= వినాలన్న కోరిక ఉంటే; వినుము చెప్పెదన్= విను చెప్పుతాను; అని ప్రీతిన్ ఇట్టులు+అనియెన్= అని సంతోషంగా ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'అంబరీషుడనే రాజు అనేక యజ్ఞయాగాలు చేసి, ఆ పుణ్యంతో మరణించి స్వర్గలోకానికి, ఇంద్రుడి సన్నిధికి వెళ్ళాడు. అక్కడ ప్రకాశమానమైన విమానంలో అధివసించి మనోజ్ఞ క్రీడావినోదాలలో నిమగ్నుడై ఉన్న సుదేవుడనేవాడిని చూచి ఇంద్రుడితో 'వీడు నా సేవకుడు. యజ్ఞయాగాది ముఖ్యకార్యాలు ఆచరించ లేదు. మరి వీడు ఎట్లా నాకంటె విశిష్టుడై ఉన్నతంగా వెలుగొందుతున్నాడు? అని ప్రశ్నించాడు. 'ఇతడి చరిత్ర మిక్కిలి విచిత్రమైనది. వినాలన్న కోరిక ఉంటే చెప్పుతాను వినుము' అని ఇంద్రుడు ఇట్లా చెప్పాడు.

**వ. శతశృంగుం డనియెడి దానవుని తనూజులు సదముండును విదముండును దముండును ననియెడు వారలు. 430**

**ప్రతిపదార్థం:** శతశృంగుండు+అనియెడి= శతశృంగు డనే; దానవుని తనూజులు= రాక్షసుడి కుమారులు; సదముండును విదముండును దముండునున్+అనియెడు వారలు= సదముడు, విదముడు, దముడు అనేవాళ్ళు.

**తాత్పర్యం:** శతశృంగుడనే రాక్షసుడి కుమారులైన సదముడు, విదముడు, దముడు అనేవాళ్ళు (తరువాతి పద్యంతో అన్వయం).

**శా.** **బాహాగర్వము సూపఁగోరి పటుదర్పం బొప్ప నుగ్రాహవో**
**త్సాహం బూర్జితభంగిగా భయద ఘోషస్ఫీత నానావిధ**
**వ్యూహంబుల్ ధరణీప్రకంపనము లై యుద్దామ సర్వాంగ స**
**న్నాహత్వంబునఁ బేర్చి తోడ నడవ న్సంరంభ శుంభద్గతిన్.** **431**

**ప్రతిపదార్థం:** బాహాగర్వము+చూపన్+కోరి= భుజ పరాక్రమాన్ని ప్రదర్శించటానికి ఇష్టపడి; పటుదర్పంబు+ఒప్పన్= మిక్కిలి గర్వాతిశయంతో; ఉగ్ర+ఆహవ+ఉత్సాహంబు= భయంకరమైన యుద్ధంపట్ల ఉత్సాహంగా; ఊర్జిత భంగి+కాన్= దృఢరీతిగా; భయద ఘోష స్ఫీత నానావిధ వ్యూహంబుల్= భయాన్ని గొల్పుతున్న శబ్దాలతో అధికమైన అనేక యుద్ధ వ్యూహాలు; ధరణీ ప్రకంపనంబులు+ఐ= భూమి సంచలనాలు; ఉద్దామ సర్వ+అంగసన్నాహత్వంబునన్+పేర్చి= అధికమైన అన్ని చతురంగ సైన్యాలతో, పరికరాలతో ఆయత్తమై అతిశయించి; సంరంభ శుంభత్+గతిన్= ఆటోపంతో కూడిన తీవ్రవేగంతో; తోడన్ నడవన్= తమతోపాటు నడుస్తూ ఉండగా.

**తాత్పర్యం:** శతశృంగు డనే రాక్షసుడి పుత్రులైన సదముడు, విదముడు, దముడు అనే ముగ్గురు భుజ పరాక్రమాన్ని ప్రదర్శించదలచి అత్యధిక గర్వంతో భయంకర యుద్ధోత్సాహం అత్యంతమై ఒప్పగా భయంకరమైన శబ్దాడంబరంతో అనేక యుద్ధవ్యూహాలతో భూమి దద్దరిల్లేటట్లుగా ఎదురులేనట్టి చతురంగ బలసమన్వితులై అతిశయించి, ఆటోపంతో కూడిన మహాతీవ్ర వేగంతో తమతో పాటు నడుస్తూ ఉండగా.

**విశేషం:** తిక్కన వీరరసోదంచితంగా ఈ శార్దూలాన్ని రచించి, తన రసాభ్యుచిత బంధశైలిని స్పష్టం చేశాడు.

**ఉ.** **'మంచి మగండ వైన నిను మార్కొను వారయి దాడివెట్టి యొ**
**క్కించుక శంక లేక ప్రజయెల్లను బెగ్గిలముట్టి యర్థముల్**
**గొంచు ధరిత్రి గైకొనుటకుం గన లగ్గల మొంది యీతనిం**
**బంచితి సైన్యయుక్తముగఁ బార్థివ! యిట్లని పల్కి తత్తటిన్.** **432**

**ప్రతిపదార్థం:** పార్థివ!= ఓ అంబరీష మహారాజా!; మంచి మగండవు+ఐన= గొప్ప వీరుడ వైన; నినున్= నిన్ను; మార్కొనువారు+అయి= ఎదిరించేవారై; దాడి+పెట్టి= దండెత్తివచ్చి; ఒక్క+ఇంచుక శంక లేక= కొంచెమైనా సందేహం లేకుండా; ప్రజ+ఎల్లను= ప్రజలంతా; బెగ్గిలన్ ముట్టి= భయ భ్రాంతు లయ్యేటట్లు ముట్టడించి; అర్థముల్+కొంచున్= ధన మపహరిస్తూ; ధరిత్రి+కైకొనుటకున్= రాజ్యం కైవసం చేసికొనటానికి; కనలు+అగ్గలము+ఒంది= కోపం అతిశయించి (కోపాతిశయంతో); ఈతనిన్= ఈ సుదేవు డనే వాడిని; సైన్యయుక్తముగన్= సైన్యసమేతంగా; పంచితి(వి)= పంపించావు; ఆ+తటిన్= ఆ సమయంలో; ఇట్లు+అని పల్కితి= ఈ విధంగా పలికావు.

**తాత్పర్యం:** 'ఓ అంబరీష మహారాజా! గొప్పవీరుడ వైన నిన్ను ఎదిరించే వారై సదముడు, విదముడు, దముడు అనే ముగ్గురు దండెత్తి వచ్చి, ఏ మాత్రం సందేహించక ప్రజలందరినీ భయభ్రాంతులను చేసి ముట్టడించి, బాధించి, ధన మపహరించి రాజ్యం కైవసం చేసికొనటానికి కోపాతిశయంతో నీవు ఈ సుదేవుడిని సైన్యసమేతంగా పంపించావు. ఆ సమయంలో నీవు ఈ విధంగా పలికావు.

**మ.** **పసగన్ వే చని దోర్బలంబున రణప్రావీణ్యముం జూపి నీ**
**వసురానీకముఁ ద్రుంచి భూప్రజలకున్ హర్షంబు గావించి రా**
**క సుమీ రాక; జయంబు లేక ప్రజ దుఃఖంబొందఁగా రాక నీ**
**యసువర్గంబుల పోకగా నెఱుఁగు పె క్కాడంగ నిం కేటికిన్?** **433**

**ప్రతిపదార్థం:** నీవు; పసగన్= చాతుర్యంతో; వేఁ= శీఘ్రంగా; చని= యుద్ధానికి వెళ్ళి; దోస్+బలంబునన్= భుజపరాక్రమంతో; రణ-ప్రావీణ్యమున్= యుద్ధనైపుణ్యాన్ని; చూపి; అమర+అనీకమున్= రాక్షససేనను; త్రుంచి= ఖండించి; భూ-ప్రజలకున్= దేశప్రజకు; హర్షంబు= సంతోషం; కావించి= ఒనగూర్చి; రాక-సుమీ-రాక= రావటమే సుమా రావటం; జయంబు-లేక= గెలుపు లేకుండా; ప్రజ= దేశప్రజ; దుఃఖంబు+ఒందఁగాన్ రాక= దుఃఖం పొందేటట్టు రావడం; నీ+అసువర్గంబుల పోవ+కాన్= నీ ప్రాణసముదాయాల; పోవడంగా; ఎఱుఁగు(ము)= తెలిసికో; పెక్కు+ఆడంగన్= ఇంకెందుకు?

**తాత్పర్యం:** అంబరీషుడు సుదేవుడితో ఇట్లా అన్నాడు: 'ఓయి సుదేవా! నీవు చాతుర్యంతో వెంటనే యుద్ధానికి వెళ్ళి, నీ భుజపరాక్రమంతో యుద్ధనైపుణ్యం చూపి, రాక్షససేనను సంహరించి, దేశప్రజలకు సంతోషం ఒనగూర్చి, తిరిగి రావటమే రావటం. అట్లా కాక గెలుపు లేకుండా ప్రజలు దుఃఖించేటట్లు రావటం అంటే నీ ప్రాణాలు పోవటమే అని తెలిసికొమ్ము. ఇంక పలుమాట లెందుకు?'

**మహాస్రగ్ధర:**

> **అనినన్ సంగ్రామ కేళీవ్యసన రసికుఁడై యట్లకాకంచు నిన్ వీ**
> **డ్కొని యీతం డేఁగి తా నప్డు దనుజతతి యాటోపమున్ గూఢచారుం**
> **డను దృష్టిం జూచి తా నిట్లను మనమున 'సైన్యంబు చే టేల? శత్రుం**
> **గొననీ నేలా? పురారిం గొలుతు నతనికిం గోసియిత్తున్ శిరంబున్.'** **434**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అంబరీషుడు చెప్పగానే; సంగ్రామకేళీ వ్యసన రసికుఁడు+ఐ= యుద్ధ క్రీడలో మిక్కిలి ఆసక్తి కలిగినవాడై; అట్ల కాక+అంచున్= అట్లాగే కానిమ్మని; నిన్ వీడ్కొని= నీవద్ద సెలవు పుచ్చుకొని; ఈతండు+ఏఁగి= ఈ సుదేవుడు యుద్ధానికి వెళ్ళి; తాను+అపుడు= అతడు ఆ సమయంలో; దనుజతతి+ఆటోపమున్= రాక్షసుల సమూహంయొక్క సంభ్రమాన్ని; గూఢచారుండు+అనుదృష్టిన్+చూచి= చారుడు అనుసరించిన దృష్టితో పరిశీలించి; తాన్ మనమునన్ ఇట్లు+అనున్= తాను (ఆ సుదేవుడు) మనసులో ఇట్లా అనుకొన్నాడు; సైన్యంబు చేటు+ఏల?= సైన్యనాశనం దేనికి?; శత్రున్+కొనన్+ఈన్+ఏలా?= శత్రువులు ఈ విజయం పొందేటట్లు చేయటం దేనికి?; పుర+అరిన్+కొలుతున్= శివుడిని పూజిస్తాను; అతనికిన్= ఈశ్వరుడికి; శిరంబున్ కోసి+ఇత్తున్= నా తల నరికి ఇస్తాను (అని భావించాడు).

**తాత్పర్యం:** అంబరీషుడు యుద్ధానికి వెళ్ళుమని ఆదేశించగా యుద్ధమంటే చెవికోసుకొనే సుదేవుడు అట్లాగేనని నీ వద్ద సెలవు పుచ్చుకొని రాక్షసుల యుద్ధాటోపాన్ని గూఢచారులవలన తెలిసికొని మనసులో ఇట్లా భావించాడు. 'సైన్యవినాశనం దేనికి? శత్రువులకు విజయం చేకూర్చటం దేనికి? కాబట్టి ఈశ్వరుడిని పూజిస్తాను. నా తలను నరికి, శివుడికి ఇస్తాను' అని భావించాడు.

**విశేషం:** మహాస్రగ్ధరలో ప్రతిపాదంలోనూ వరుసగా స, త, త, న, స, ర, ర, గ - అనే గణాలుంటాయి. 9, 16వ అక్షరాలతో యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**మ.**

> **అని నిశ్చాయకుఁడై రణం బుడిగి సైన్యంబంతయుం గ్రమ్మఱం**
> **జనగాఁజేసి పరేత భూమికి దృఢోత్సాహంబునం బోయి శం**
> **భునిఁ జిత్తంబున నిల్పి వాలును గళంబుం గూర్చినన్ సత్కృపా**
> **ఘనుఁ డద్దేవుఁడు ముందటన్ నిలిచి ఖడ్గంబుం దొలంగించుచున్.** **435**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; నిశ్చాయకుఁడు+ఐ= నిశ్చయించుకొన్నవాడై; రణంబు+ఉడిగి= యుద్ధాన్ని విరమించి; సైన్యంబు+అంతయున్= సైన్యమంతా; క్రమ్మఱన్+చనఁగాన్+చేసి= వెనుదిరిగి పోయేటట్లు ఆజ్ఞాపించి; పదేత భూమికిన్= శ్మశాన భూమికి; దృఢ+ఉత్సాహంబునన్+పోయి= మిక్కిలి ఉత్సాహంతో వెళ్ళి; శంభునిన్= ఈశ్వరుడిని; చిత్తంబునన్ నిల్పి= మనస్సులో నిల్పుకొని; వాలును= కత్తిని; గళంబున్+కూర్చినన్= కంఠంపై చేర్చుకోగా; సత్+కృపాఘనుఁడు+ఆ+దేవుఁడు= ఉత్తమ దయాధికుడైన ఆ శివుడు; ముందటన్+నిలిచి= తనముందు ప్రత్యక్షమై; ఖడ్గంబున్+తొలంగించుచున్= కత్తిని తొలగిస్తూ.

**తాత్పర్యం:** సుదేవుడు ఈశ్వరుడినిగూర్చి తపస్సుచేసి తన తలను ఆ దేవుడికి నరికి ఇస్తానని నిశ్చయించుకొని, యుద్ధం వదలి సైన్యాన్నంతటినీ తిరిగిపోయేటట్లు ఆజ్ఞాపించి, తాను మిక్కిలి ఉత్సాహంతో శ్మశానభూమికి వెళ్ళి, ఈశ్వరుడిని మనసులో నిలుపుకొని తన కంఠంపై కత్తిని సంధింపగా, అత్యంత దయామయుడైన ఈశ్వరుడు ప్రత్యక్షమై, అతడి కంఠంనుండి కత్తిని తొలగించాడు.

**విశేం:** ఈ పద్యంలో జరిగిన విషయాన్ని క్రమంగా చిన్న చిన్న మాటలతో చెప్పి తిక్కన విషయాన్ని స్పష్టంచేశాడు. విషయావగాహనకు ఉపకరించే రీతిలో పద్యాన్ని నడిపి తన పద్యశైలీ నైపుణ్యాన్ని ప్రకటించాడు.

**మ. "చనునే సాహస మిట్లు సేయ? నిది కర్జంబే? కతం బేమి? యి**
**ప్పని? కన్నం గని చక్కఁజాఁగి ధరయున్ ఫాలంబునుం బొంద వం**
**దనముం జేసి, యితండు నీ పలుకులున్ దైతేయులం దాఁక నొ**
**ల్లనివాఁడైన తెఱంగుఁ జెప్పెశివు నుల్లం బా ర్ద్రతం బొందఁగన్. 436**

**ప్రతిపదార్థం:** ఇట్లు సాహసము+చేయన్ చనునే?= ఈ రీతిగా సాహసం చెయ్యటం తగునా?; ఇది కర్జంబే?= ఇది చేయదగిన పనేనా?; ఈ+పనికిన్= ఈ పని చెయ్యటానికి; కతంబు+ఏమి?= కారణ మేమిటి?; అన్నన్+కని= అనగానే చూచి; చక్కన్+చాఁగి= చక్కగా సాగిలపడి; ధరయున్= భూమియు; ఫాలంబునున్= నొసటి భాగమును; తాఁకన్= తాకగా; వందనమున్+చేసి= నమస్కరించి; ఇతండు= ఈ సుదేవుఁడు; నీ పలుకులున్= నీవు (అంబరీషుడు) చెప్పిన మాటలను; దైతేయులన్+తాఁకన్+ఒల్లనివాఁడు+ఐన తెఱంగున్= రాక్షసులను ఎదుర్కొనటం ఇష్టంలేనివాడైన తీరును; శివు+ఉల్లంబు+ఆర్ద్రతన్+పొందఁగన్= శివుడి మనస్సు కరిగేటట్లుగా; చెప్పెన్= వివరించాడు.

**తాత్పర్యం:** 'ఇంత సాహసకార్యం చేయటం తగునా? ఇది చేయదగినదేనా? ఈ పనికి కారణ మేమిటి? 'అని శివుడు అనగా విని సుదేవుడు శివుడికి సాష్టాంగనమస్కారం చేసి నీవు(అంబరీషుడు) చెప్పిన మాటలను, తాను రాక్షసులను ఎదుర్కొనటానికి ఇష్టపడని అంశాన్ని శివుడి మనసు కరిగేటట్లు వివరించాడు'.

**ఉ. ఆ పరమేశ్వరుం డితని కప్పుడు దివ్య రథోత్తమంబునుం**
**జాపము నస్త్రకోటియుఁ బ్రసన్నత నిచ్చి రణంబునందు నీ**
**యేపున కోర్వ దేవతల కేనియు దైత్యులకేని రాదు పొ**
**మ్మే పగఱేని గెల్చుము; మహిం జరణం బిడకుండు మాజిలోన్. 437**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆ పరమేశ్వరుండు= ఆ శివుడు; ప్రసన్నతన్= దయతో; ఇతనికిన్= ఈ సుదేవుడికి; దివ్యరథ+ఉత్తమంబునున్= దేవతా సంబంధమైన ఉత్తమ రథాన్ని; చాపమున్= వింటిని; అస్త్రకోటియున్= బాణసమూహాన్ని, ఇచ్చి= ప్రసాదించి; రణంబునందున్= యుద్ధంలో; దేవతలకున్+ఏనియున్= దేవతలకైనా; దైత్యులకున్+ఏనిన్= రాక్షసులకైనా; నీ+ఏపునకున్+ఓర్వన్= నీ ధాటికి తట్టుకొనటం; రాదు పొమ్ము= సాధ్యం కాదు పో; ఏ పగఱ+ఏనిన్= ఎట్లాంటి శత్రువులనైనా; గెల్చుము= జయించుము; ఆజిలోన్= యుద్ధంలో; మహిన్+చరణంబు+ఇడక+ఉండుము= భూమిమీద కాలుపెట్టవద్దు (అని చెప్పాడు).

**తాత్పర్యం:** ఆ సమయంలో పరమేశ్వరుడు సుదేవుడిపై అనుగ్రహంతో దేవతాసంబంధమైన ఉత్తమ రథాన్ని, వింటిని, బాణ సమూహాన్ని ప్రసాదించి యుద్ధంలో దేవతలకుగానీ, రాక్షసులకు గానీ నీ ధాటికి నిలవటం సాధ్యంకాదు. ఏ శత్రువునైనా జయించుము. అయితే ఎట్టి పరిస్థితులలోనూ యుద్ధంలో నేలమీద కాలుమోపకుము.' అని శివుడు హెచ్చరించాడు.

**మ. అని వీడ్కొల్పిన నీతఁ డుబ్బు మదిఁ బొంగారంగఁ దే రెక్కి వే**
**చని దైత్యధ్వజినీ ప్రతాప మహిమోత్సాహంబులం జీరికిం**
**గొన కుగ్రోద్ధతిఁ దాఁకి పీనుఁగుల పెంగుప్పల్ గొనం జేసె న**
**య్యనిఁ బైఁ ద్రోచిన నిద్దఱం దునిమె దైత్యాధీశులన్ వ్రేల్మిడిన్. 438**

**ప్రతిపదార్థం:** అని వీడ్కొల్పినన్= అని హెచ్చరించి శివుడు పంపించగా; ఈతఁడు= ఈ సుదేవుడు; ఉబ్బు మదిన్+పొంగారంగన్= ఆనందం మనస్సులో అతిశయించగా; తేరు+ఎక్కి= రథం ఎక్కి; వే చని= వెంటనే వెళ్ళి; దైత్యధ్వజినీ= రాక్షస సైన్యాలయొక్క; ప్రతాప మహిమ+ఉత్సాహంబులన్= పరాక్రమ మాహాత్మ్యమూ, ఉత్సాహాలను; చీరికిన్+కొనక= లెక్కచేయక; ఉగ్ర+ఉద్ధతిన్+తాఁకి= భయంకరమైన అతిశయంతో ఎదుర్కొని; పీనుఁగుల పెన్+కుప్పల్+కొనన్+చేసెన్= శవాలు పెద్ద గుట్టలుగా పడేటట్లు చేశాడు; ఆ+అనిన్= ఆ యుద్ధంలో; పైన్+త్రోచినన్= తనపై దాడిచేసిన; ఇద్దఱన్ దైత్య+అధీశులన్= ఇద్దరు రాక్షసాధిపతులను (సదముడు, దముడు); వ్రేల్మిడిన్= చిటికెలో; తునిమెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** శివుడు అనుగ్రహించి హెచ్చరికతో పంపగా సుదేవుడు అత్యంతానందంతో కూడిన మనస్సుతో రథం ఎక్కి వెంటనే వెళ్ళి, రాక్షససమూహాల పరాక్రమాతిశయోత్సాహాలను లెక్కచేయక మహాభయంకరంగా ఎదుర్కొని వారి శవాలు పెద్ద గుట్టలుగా పడేటట్లు చేశాడు. ఆ యుద్ధంలో తనను ఎదిరించిన రాక్షసాధిపతులైన సదముడు దముడు అనే ఇద్దరినీ చిటికెలో సంహరించాడు.

**వ. ఇ వ్విధంబున సదముండును దముండునుం బడినం గని కోపోద్దీపితుండై. 439**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; సదముండును దముండునున్= సదముడు, దముడు అనే రాక్షసరాజులు; పడినన్= యుద్ధభూమిలో మరణించి పడిపోగా; కని= చూచి; కోప+ఉద్దీపితుండు+ఐ= అతిశయించిన కోపం కలవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా సదముడు దముడు అనే రాక్షస రాజులు యుద్ధంలో మరణించగా చూచి మిక్కిలి కోపంతో విదముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**స్రగ్ధర: వీరోదారోగ్రలీలన్ విదముఁడు సమరోర్విన్ బలోల్లాస మొప్పం**
**జేరెన్ బాహాసముల్లాసిత ఘనరుచిరాసి ప్రభాభాసురుం డై**
**యా రక్షోనాథుపైఁ బేరలుక మఱపుఁ జేయంగ నీతండు డిగ్గెం**
**దే రుద్యత్ఖడ్గదీప్తుల్ దెసల నిగుడ దైతేయవీరుల్ చలింపన్. 440**

**ప్రతిపదార్థం:** విదముఁడు= విదము డనే రాక్షసుడు; వీర+ఉదార+ఉగ్రలీలన్= పరాక్రమాతిశయంతో భయంకరమైన రీతిలో; సమర+ఉర్విన్= యుద్ధ భూమిలో; బల+ఉల్లాసము+ఒప్పన్= పరాక్రమోత్సాహాలు ప్రకాశించగా; బాహా సమ్+ఉత్+లాసిత ఘనరుచిర+అసి ప్రభా భాసురుండు+ఐ= భుజాలపై మిక్కిలి ప్రకాశిస్తూ గొప్పదై ఒప్పుతూ ఉన్న ఖడ్గంయొక్క కాంతిచేత వెలుగొందుతున్నవాడై; ఆ రక్షః+నాథు పైన్= ఆ రాక్షసరాజైన విదముడిపై కలిగిన; పేరు+అలుక= అత్యంత కోపం; మఱపున్+చేయంగన్= శివుడి హెచ్చరికను మరిచేటట్లు చేయగా; ఈతండు= ఈ సుదేవుడు; ఉద్యత్= అతిశయితమైన; ఖడ్గదీప్తుల్= ఆయుధాల కాంతులు; దెసలన్ నిగుడన్= అన్ని దిక్కులకు వ్యాపించగా; దైతేయవీరులు= రాక్షస వీరులు; చలింపన్= సంక్షోభించగా; తేరు డిగ్గెన్= రథం మీదనుండి క్రిందికి దిగాడు.

**తాత్పర్యం:** విదముడనే రాక్షసుడు భయంకరమైన పరాక్రమాతిశయంతో యుద్ధభూమిలో భుజాలమీద ప్రకాశిస్తున్న గొప్పదై ఒప్పుతున్న ఖడ్గకాంతిచేత వెలుగొందుతున్నవాడై కనిపించగా, ఆ రాక్షసరాజుమీది కోపాతిశయంతో సుదేవుడు తన ఖడ్గదీప్తులు అన్ని దిక్కులకు వ్యాపించగా, రాక్షసవీరులు సంక్షోభించే రీతిలో శివుడి హెచ్చరికను (ఎట్టి పరిస్థితులలోనూ రథం దిగి నేలమీద కాలు మోపవద్దు అనే మాటను) మరచిపోయి రథం దిగాడు.

**విశేషం:** తిక్కన సాధారణంగా చిన్న చిన్న తెలుగు మాటలను మాత్రమే ప్రయోగిస్తూ ఉంటాడు. కాని, రసానుగుణంగా పదప్రయోగం చేయటంలో అందెవేసిన చేయి. యుద్ధంలో వీరోత్సాహ ముట్టిపడేటట్లుగా సంస్కృత భూయిష్ఠమైన రచనచేయటంలో కూడా దిట్ట. అందుకు ఈ పద్యం చక్కటి ఉదాహరణ. 'బాహాసముల్లాసిత ఘన రుచిరాసి ప్రభా భాసురుండై' మొదలైన సమాసాలు ఇందుకు సాక్ష్యం. స్రగ్ధరావృత్తంలో ప్రతిపాదానికీ వరుసగా మ, ర, భ, న, య, య, య అనే గణాలు ఉంటాయి. 8, 15 అక్షరాలతో యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ. ఇట్లు విధాతృ వశంబునఁ బాదచారియై. 441**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విధాతృ వశంబునన్= విధినిర్ణయం ప్రకారం; పాదచారిఐ= యుద్ధభూమిలో నడుస్తున్నవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా సుదేవుడు విధినిర్ణయం ప్రకారం శివుడి హెచ్చరికను మరచిపోయి యుద్ధభూమిలో నడచి వెళ్తుండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. దనుజుం దాఁకి కృపాణ ఖేలనము చిత్రంబై వెలుంగొందఁ ద**
**త్తను సంఛేదన కేలిసల్ప నతఁడుం దన్నుం బటుప్రస్ఫుర**
**ద్ఘన కౌక్షేయక ధారఁ జీరఁ బడియెం దా నాతనిం గూల్చెఁ ద**
**క్కిన దైత్యావలి విచ్చె నల్గడఁ బరిక్షీణోద్యమత్వంబునన్. 442**

**ప్రతిపదార్థం:** దనుజున్+తాఁకి= రాక్షసుడైన విదముడిని ఎదుర్కొని; కృపాణ ఖేలనము= ఆయుధ క్రీడ చిత్రంబు+ఐ= విచిత్రంగా; వెలుఁగు+ఒందన్= ప్రకాశిస్తూ ఉండగా; తద్+తను సంఛేదన కేలి సల్పన్= ఆ రాక్షసుడి శరీర ఖండనమనే ఆట ఆడగా; అతఁడున్= ఆ రాక్షసుడూ; తన్నున్= తనను (ఆ సుదేవుని); పటు= మిక్కిలి; ప్రస్ఫురత్= ప్రకాశిస్తున్న; ఘన= గొప్పదైన; కౌక్షేయక ధారన్= కత్తి వాదరచేత; చీరన్= చీల్చగా; పడియెన్= పడిపోయాడు; తాను+ఆతనిన్+కూల్చెన్= ఆ సుదేవుడు విదముని పడగొట్టాడు; తక్కిన దైత్య+ఆవలి= మిగిలిన రాక్షస సేనా సమూహం; పరిక్షీణ+ఉద్యమత్వంబునన్= పూర్తిగా నశించి పోయే పూనికతో; నల్గడన్= నాలుగు దిక్కులకూ విచ్చెన్= చెల్లా చెదరై పోయింది.

**తాత్పర్యం:** సుదేవుడు ఆ రాక్షసుడైన విదముని ఎదుర్కొని తన ఖడ్గనైపుణ్యాన్ని చిత్రవిచిత్రంగా ప్రదర్శించి వెలుగొందుతూ అతడి శరీరాన్ని ఖండించటానికి ప్రయత్నించగా ఆ రాక్షసుడు తనను మిక్కిలి ప్రకాశమానమైన ఖడ్గధారచేత చీల్చగా అదేసమయంలో తానూ ఆ రాక్షసుడిని పడగొట్టి పడిపోయాడు. అప్పుడు మిగిలిన సైన్యం వినాశమౌతామేమో ననే భయంతో అన్ని దిక్కులకూ చెల్లా చెదరైంది.

**వ. ఇట్లు నిశ్శేషంబుగాఁ బరవీరులం బరిమార్చిన నీ రాజ్యంబు పూజ్యంబై వెలసె, భూ ప్రజయుం బ్రమోదంబు నొందె; నిత్తెఱంగున నీ సుదేవుండు సకృతవంతుండై యింతటి పదంబున కర్హుం డయ్యె; నేయజ్ఞంబులును సంగ్రామ యజ్ఞంబునకు సదృశంబులు గావు; వినుము! వీర మస్తకరాశి వేదికగా గృపాణ బాణాది సాధనంబులు సమిత్స్రుక్స్రువంబులుగా శోణితం బాజ్యంబుగా మాంసంబు పురోడాశంబుగా వీరవ్రత దీక్షితుండు సమరాధ్వరంబు సలిపి, రుధిరజల పూరయు మస్తిష్క కర్దమయుఁ గేశ శైవాలయు నాంత్ర ఫేనయు**

**భేరీ మండూకయు హేతి మీనయు గజకళేబర పులినయు నగు నమర పుణ్యనది నవభృథస్నానంబు సేసి మదీయ లోకంబున సుశ్లోకుండై నిత్యస్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లుఁ బుణ్యతముం డగుటకుం దనువు దొఱంగ వలయు నని లేదు; తెగువతోడి యనివర్తన గతియ చాలు; నిట్టిది రణాచరణ ప్రభావం; బేనును బ్రబల దైతేయవ్రాత శాతన సుకృతంబునంగాదె యీ దేవేంద్రత్వంబు నొందితి' నని పలికిన నంబరీషుండు సమర శూరుల సమధిక పుణ్యత్వంబు దెలిసి సంభావించె'నని చెప్పి దేవవ్రతుండు వెండియు. 443**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నిః+శేషంబుగాన్= ఏ మాత్రం మిగలకుండా; పరవీరులన్= శత్రువీరులను; పరిమార్చినన్= చంపగా; నీ రాజ్యంబు= నీ సామ్రాజ్యం; పూజ్యంబు+ఐ= మాన్యమై; వెలసెన్= ప్రకాశించింది; భూ ప్రజయున్= నీ రాజ్య ప్రజ; ప్రమోదంబున్+ఒందెన్= సంతోషించింది; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఈ సుదేవుఁడు= ఈ సుదేవుడనే నీ భృత్యుడు; సుకృతవంతుండు+ఐ= పుణ్యాత్ముడై; ఇంతటి పదంబునకున్+అర్హుండు+అయ్యెన్= ఇంత ఉన్నత పదవికి పాత్రుడు అయ్యాడు; ఏ యజ్ఞంబులును= ఏ యజ్ఞ యాగాలు కూడా; సంగ్రామ యజ్ఞంబునకున్= యుద్ధమనే యజ్ఞానికి; సదృశంబులు+కావు= సమానములు కావు; వినుము= విను; వీరమస్తకరాశి వేదికగాన్= వీరుల తలల సమూహమే యజ్ఞ వేదికగా; కృపాణబాణ+ఆది సాధనంబులు= ఖడ్గం, బాణం మొదలైన ఆయుధాలు; సమిత్+స్రుక్+స్రువంబులుగాన్= తగిన యజ్ఞోపకరణం, యజ్ఞ పాత్రలుగా; శోణితంబు+ఆజ్యంబుగాన్= రక్తం నేయిగా; మాంసం; పురోడాశంబుగాన్= యజ్ఞార్హమైన అపూపంగా; వీరవ్రత దీక్షితుండు= వీర వ్రతమే దీక్షగా గలవాడైన వీరుడు; సమర+అధ్వరంబు+చలిపి= యుద్ధమనే యజ్ఞం పరిపూర్తిచేసి; రుధిరజల పూరయున్= రక్తమనే జలంతో నిండినది; మస్తిష్క కర్దమయున్= మెదళ్ళనే బురద కలదీ; కేశశైవాలయున్= వెంట్రుకలనే నాచు కలదీ; ఆంత్ర ఫేనయున్= పేగులనే నురుగు కలదీ; భేరీ మండూకయున్= యుద్ధ భేరీలు అనే కప్పలు కలదీ ; హేతి మీనయున్= ఖడ్గాలనే చేపలు కలదీ ; గజకళేబర పులినయున్= ఏనుగుల మృతకళేబరాలు అనే ఇసుక దిబ్బలు కలదీ; అగు= అయిన; అమరపుణ్యనదిన్= స్వర్గంగలో; అవభృథస్నానంబు+చేసి= యజ్ఞాంత స్నానం చేసి; మదీయలోకంబునన్= నా లోకంలో (స్వర్గలోకంలో); సుశ్లోకుండు+ఐ= బాగా కీర్తించబడిన వాడై; నిత్యస్థితిన్= శాశ్వతరీతి; అతి+ఉదాత్త పదవిన్= మిక్కిలి శ్రేష్ఠమైన పదవిలో; ప్రవర్తిల్లున్= ప్రవర్తిస్తుంటాడు; పుణ్యతముండు+అగుటకున్= పుణ్యశ్రేష్ఠుడు కావటానికి; తనువు+తొఱంగన్ వలయున్+అనిలేదు= శరీరాన్ని వదలిపెట్టాలని లేదు; తెగువతోడి= సాహసంతో; అనివర్తన గతియ చాలు= వెనుదీయకుండా యుద్ధం చెయ్యటమే చాలు; ఇట్టిది= ఇట్లాంటిది; రణ+ఆచరణ ప్రభావం= యుద్ధాచరణం వలన కలిగే ఫలితం; ఏనును= నేనుకూడా; ప్రబలదైతేయ వ్రాతశాతన సుకృతంబునన్+కాదె?= మిక్కిలి బలవంతులైన రాక్షసుల సమూహాలను సంహరించటమనే పుణ్యం వలననే కదా!; ఈ దేవ+ఇంద్రత్వంబున్+ఒందితిన్= ఈ దేవేంద్ర పదవిని పొందగలిగాను; అని పలికినన్= అని చెప్పగా; అంబరీషుండు= అంబరీషుడనే రాజు; సమర శూరుల సమ్+అధిక పుణ్యత్వంబు+తెలిసి= యుద్ధవీరుల అతిశయితమైన పుణ్య భావాన్ని తెలిసికొని; సంభావించెన్= (సుదేవుడిని) గౌరవించాడు; అని చెప్పి= అని ఈ విధంగా తెలియజేసి; దేవవ్రతుండు= భీష్ముడు; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఈ విధంగా నిశ్శేషంగా శత్రువీరులను సంహరించగా నీ రాజ్యం గౌరవప్రదమైనది. నీ ప్రజలంతా సంతోషించారు. ఈ రీతిగా సుదేవుడు పుణ్యాత్ముడై ఇంతటి ఉన్నత పదవికి పాత్రుడయ్యాడు. ఎన్ని యజ్ఞయాగాలైనా యుద్ధయజ్ఞానికి సమానం కావు. వీరుల తలల రాశులే వేదికగా, ఖడ్గబాణాది సాధనాలు యజ్ఞోపకరణాలైన సమిధలు స్రువములు కాగా రక్తమే నేయిగా, మాంసం పురోడాశంగా వీరమనే వ్రతం పూనినవాడు యుద్ధ మనే యజ్ఞాన్ని సల్పి, రక్తమనే జలంతో కూడినది, మెదళ్ళనే బురద గలది, వెంట్రుకలనే పాచి కలదీ, పేగులనే నురుగు గలదీ, యుద్ధభేరీలనే కప్పలు గలదీ, ఖడ్గాలనే చేపలు గలదీ, ఏనుగుల మృతకళేబరాలనే ఇసుక దిబ్బలు గలదీ అయినటువంటి స్వర్గగంగలో యజ్ఞాంతస్నానం చేసి, నా స్వర్గలోకంలో బాగా కీర్తించబడినవాడై శాశ్వతస్థితిలో అత్యుత్తమ పదవిని పొందగలిగాడు. పుణ్యాత్ముడు కావటానికి శరీరం వదలిపెట్టాలని లేదు. యుద్ధంలో సాహసోపేతంగా వెనుదీయకుండా పోరాడటమేచాలు. ఇది యుద్ధాచరణంవలన కలిగే పుణ్యం. నేను కూడా అనేక రాక్షస సమూహాలను సంహరించటం అనే పుణ్యం వలననే కదా ఈ దేవేంద్ర పదవిని

పొందగలిగాను' అని ఇంద్రుడు చెప్పగా అంబరీషుడనే రాజు యుద్ధవీరుల అత్యంత పుణ్యత్వాన్ని తెలిసికొని సుదేవుడిని గౌరవించాడు' అని పైరీతిగా స్పష్టం చేసి, భీష్ముడు ధర్మరాజుతో మళ్ళీ ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం.

**సమరానివర్తనంబు వలని ఫలము (సం. 12-100-1)**

**క. జనకుఁడు ప్రతర్దనునకుం। దనకును రణమైన యపుడు తన యోధులకున్**
**విను నాకంబును నరకముఁ। గనుఁగొనుఁ డని చూపి చెప్పెఁ గౌరవముఖ్యా! 444**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= కురువంశ శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; విను= శ్రద్ధగా ఆలకించుము; జనకుఁడు= జనక మహారాజు; ప్రతర్దనునకున్= ప్రతర్దనుడనే వాడికి; తనకును= తనకూ; రణము+ఐన+అపుడు= యుద్ధం జరిగినప్పుడు; తన యోధులకున్= తన వీరులకు; నాకంబును= స్వర్గాన్ని; నరకమున్= నరకాన్ని; కనుగొనుఁడు+అనిచూపి చెప్పెన్= చూడుండని చూపించి ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! వినుము. జనకమహారాజుకు ప్రతర్దనుడికి యుద్ధం జరిగింది. ఆ సమయంలో జనకుడు తన వీరులకు స్వర్గనరకాలను చూపించి, వాటిని చూడుం డని ఇట్లా అన్నాడు'.

**తే. పుణ్యతమము భోగాస్పదంబును మనోహ। రాంగనా జనబహులంబు నైనయది ర**
**ణంబు బిరుదులై చేసిన నరుల నెలవు;। దూరఁ బందలచోటిది దుఃఖమయము. 445**

**ప్రతిపదార్థం:** పుణ్యతమము= అధిక పుణ్యాన్ని కలిగించేది; భోగ+ఆస్పదంబును= సమస్త భోగాలకు నిలయమయినది; మనోహర+అంగనాజన బహులంబున్= అనేక సుందరాంగులతో నిండినది; ఐన+అది= అయిన అది; బిరుదులు+ఐ= వీరులై; రణంబు+చేసిన= యుద్ధం చేసిన; నరుల నెలవు= వీరులకు నిలయం (స్వర్గం); ఇది= ఈ నరకం; దూరన్= ప్రవేశించటానికి; పందలచోటు= పిరికివాళ్ళ నిలయం; దుఃఖమయము= దుఃఖంతో నిండింది.

**తాత్పర్యం:** 'అధిక పుణ్యాన్ని అందించేది. సమస్తభోగాలకు నిలయమై అనేకమైన సుందరాంగులతో నిండినదీ అయిన అది స్వర్గం. పిరికివాళ్ళు ప్రవేశించేదీ దుఃఖమయమైనదీ అయిన ఇది నరకం' అని జనకుడు తన వీరులతో చెప్పాడు.

**వ. అని తన మాహాత్మ్యంబునం జూపనోపిన యుభయ స్థలంబులుం జూపం జూచి, యేచి యవ్వీరులు దెంపు వొంపిరి వోవం దటియ నుటికి వైరుల జయించిరి; సమరంబు తెగువ దీప్తలక్ష్మిం గరంబొనర్చుఁ బుణ్యతమ లోకంబు లిచ్చుం గావున శూరుం డధిక పుణ్యోదారుం డని యిట్లు దేవవ్రతుండు ధర్మశూరునకు సమరానివర్తన జనవిశేషం బెఱింగించె నని చెప్పిన విని 'యట మీఁద వారల సంప్రశ్నోత్తరంబులు ప్రవర్తిల్లిన విధంబులు వినిపింపు' మనుటయు. 446**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; తన మాహాత్మ్యంబునన్+చూపన్+ఓపిన= తన మహిమచేత చూపించగలిగిన; ఉభయస్థలంబులున్= స్వర్గ నరకాలు రెండింటిని; చూపన్+చూచి= చూపెట్టగా చూచి; ఏచి= విజృంభించి; ఆ+వీరులు= ఆ జనకమహారాజు యోధులు; తెంపు= సాహసం; పొంపిరి+పోవన్= అతిశయించగా; తటియన్+ఉటికి= శత్రువులను తరమటానికి పరుగెత్తి; వైరుల జయించిరి= శత్రువులను ఓడించారు; సమరంబు తెగువ= యుద్ధంలోని సాహసం; దీప్త లక్ష్మిన్= ప్రకాశించే సంపదను; కరంబు+ఒనర్చున్= మిక్కిలి కలిగిస్తుంది; పుణ్యతమ లోకంబుల్+ఇచ్చున్= ఉత్తమ లోకాలను ప్రసాదిస్తుంది; కావునన్= అందువలన; శూరుండు= వీరుడు; అధిక+పుణ్య+ఉదారుండు+అని= మిక్కిలి పుణ్యవంతుడని; ఇట్లు= ఈ విధంగా; దేవవ్రతుండు= భీష్ముడు; ధర్మశూరునకున్= ధర్మరాజునకు; సమరానివర్తన జనవిశేషంబు+ఎఱింగించెన్= వెనుదీయకుండా యుద్ధంలో పాల్గొనే వీరుల విశేషాన్ని తెల్పాడు; అని చెప్పినన్= అని చెప్పగా; విని; అటమీఁదన్= ఆ తరువాత; వారల సంప్రశ్న+ఉత్తరంబులు= వారి ప్రశ్నలూ

సమాధానాలు; ప్రవర్తిల్లిన విధంబులు= జరిగిన తీరులు; వినిపింపుము+అనుటయున్= వినిపించవలసిం దని కోరగా. (జనమేజయుడు వైశం పాయనుడిని కోరగా).

**తాత్పర్యం:** జనకుడు ఆ విధంగా పలికి తన మహిమచేత స్వర్గ నరకాలను చూపెట్టగా చూచిన అతడిసైన్యం విజృంభించి సాహసంతో శత్రువులను తరమటానికి పరుగెత్తి విజయం సాధించింది. యుద్ధంలోని సాహసం ప్రకాశించే సంపదను ఉత్తమలోకాలను ప్రసాదిస్తుంది. అందువలన వీరుడు మిక్కిలి పుణ్యవంతు' డౌతాడు అని ఈ విధంగా భీష్ముడు ధర్మరాజునకు వెనుదీయకుండా యుద్ధంలో పాల్గొనే వీరుల విశేషాన్ని తెల్పాడు' అని చెప్పగా విన్న జనమేజయుడు వారి ప్రశ్నలూ సమాధానాలు తరువాత ఎట్లా సాగాయో వినిపించవలసిందని వైశంపాయనుడిని కోరాడు.

## ఆశ్వాసాంతము

**మ. పరమాయుః పరమార్థసిద్ధి పరమ ప్రావీణ్య సంపాద నా**
**దర సంభావిత భక్తలోక! నిగమాంతస్ఫీత హర్మ్యాగ్ర సం**
**చరణ ప్రౌఢమయూర! చిత్రమహిమా! సర్వాత్మ విజ్ఞాన సం**
**పరిపాక ప్రకటాకృతీ! శమదమోద్భావాహిత స్వీకృతీ! 447**

**ప్రతిపదార్థం:** పరమ+ఆయుః= ఉత్కృష్టమైన ఆయుస్సు; పరమ+అర్థసిద్ధి= పురుషార్థాల్లో ఉత్తమమైన మోక్షాన్ని సిద్ధింపజేయటంలోను; పరమ ప్రావీణ్య సంపాదన= శ్రేష్ఠమైన నైపుణ్యాన్ని సమకూర్చటంలోను; ఆదర= ఆసక్తివలన; సంభావిత= గౌరవించబడిన; భక్తలోక!= భక్తుల సమూహం గలవాడా!; నిగమ= వేదాలయొక్క; అంత= చివరి భాగాలైన ఉపనిషత్తులనే; స్ఫీత= ఉన్నతమైన; హర్మ్య+అగ్ర= సౌధం పైభాగాన; సంచరణ= విహరిస్తున్నట్టి; ప్రౌఢమయూర!= నిపుణమైన నెమలి అయినవాడా!; చిత్రమహిమా!= ఆశ్చర్యకరమైన మహిమలు కలవాడా!; సర్వ+ఆత్మ= సమస్తమూ తానే ఆత్మ అయినవాడనే; విజ్ఞాన= పరిజ్ఞానంయొక్క; సమ్+పరిపాక= ఉత్తమ పరిపక్వ స్థితివలననే; ప్రకట+ఆకృతీ!= స్పష్టమయ్యే స్వరూపం కలవాడా!; శమదమ+ఉద్భావాహిత స్వీకృతీ!= శాంతిదాంతులతో కూడిన హృదయాలు గలవారిలో ఉంచబడినట్టి స్వీకారం కలవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! 'నీ పరమ భక్తులకు పరిపూర్ణమైన ఆయుస్సును పురుషార్థాలలో శ్రేష్ఠమైన మోక్షాన్ని, సమస్త కార్యాచరణచాతుర్యాన్ని ప్రసాదిస్తావు. వేదాలలో ఉపనిషత్తులలో వివిధవిధాలుగా ప్రశంసించబడ్డ నీవు విశిష్టుడవు. నీ విచిత్రమహిమ సామాన్యులకు అవగతం కాదు. అయినా విశ్వమంతా నీవే నని భావించగల విజ్ఞాన ఖనులకు నీ మహిమ స్పష్టమే. అందుకే అట్లాంటి శమదమాది గుణగరిష్ఠులైనవారిని నీవెంతగానో ఆదరిస్తావు.

**క. యమనియమాద్యష్టాంగ । క్రమాభ్యసన నిర్మథిత వికార సుచేతః**
**కమలామోద మయాత్మా! । సమతా రాహిత్య శస్య! సర్వనమస్యా. 448**

**ప్రతిపదార్థం:** యమనియమ+ఆది= యమం నియమం మొదలుకొని అంటే ఆసనం ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణం, ధ్యానం, సమాధి - అనే; అష్ట+అంగ క్రమ+అభ్యసన= ఎనిమిది అంగాలను క్రమంగా అభ్యసించటంవలన; నిర్మథిత వికార= నశింప జేయబడినట్టి మార్పుగల; సుచేతః కమల= మంచి మనస్సనే పద్మానికి; ఆమోదమయ+ఆత్మా!= సుగంధరూపమైన స్వరూపంగలవాడా!; సమతా రాహిత్య శస్య!= సమత్వం అంటే సమభావం లేకపోవుటచే మాత్రము చెప్పదగినవాడా! అయినవాడా! (అంటే భగవంతుడు సమత్వం ఉన్నవాడు, అయితే ప్రజలచేత వారి వారి జ్ఞానాన్నిబట్టి గ్రహించే తీరులో కనిపించే పద్ధతిలో అసమానత్వమున్నవా డని అర్థం); సర్వనమస్యా!= సమస్త వ్యక్తుల నమస్సులను పొందదగినవాడా!

**తాత్పర్యం:** యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణం, ధ్యానం, సమాధి - అనే అష్టాంగ యోగాభ్యాసం చేయటంవలన పరిశుద్ధమైన మనస్సనే కమలానికి సుగంధమైన స్వరూపం కలవాడా! సమత

కలవాడుగా భగవంతుడు కీర్తించబడతాడు, అయితే భక్తుల మనోవైశిష్ట్యాన్నిబట్టి జ్ఞానాన్ని అనుసరించి తదుచితంగా, అసమానంగా చెప్పదగినవాడా! సర్వులచేత అంటే బ్రహ్మాదులచేత సైతం పూజించబడుతున్నవాడా! హరిహరనాథా!

**విశేషం:** శస్యమనగా పైరు అనగా భోజ్యం. పరమేశ్వరుడు సమరూపంలో ఉన్నప్పుడు లౌకిక రసానుభూతికి విషయం కాకపోవటంచేత, సమతారాహిత్యంలోనే - అనగా కార్యరూపమైన ప్రపంచరూపం పొందినప్పుడే భోజ్యుడవుతున్నాడని చెప్పవచ్చును.

**మాలిని: సమధిక నిరవద్య స్వైరనిత్య ప్రభుత్వా!**
**విమల మహిమ హేలావిర్భవత్సర్వ సత్త్వా!**
**నమదమలినచిత్తౌన్నత్య దీవ్యన్మహత్త్వా!**
**దమమహిత తపస్సద్భావ సంవేద్యతత్త్వా!** 449

**ప్రతిపదార్థం:** సమధిక= అన్నిటికంటే ఉత్తమమూ; నిరవద్య= దోష రహితమూ; స్వైర= స్వేచ్ఛాయుతమూ; నిత్య= శాశ్వతమూ అయినట్టి; ప్రభుత్వా!= ఆధిపత్యం కలవాడా! (సామర్థ్యం కలవాడా!); విమల= స్వచ్ఛమైన; మహిమ= మాహాత్మ్యం యొక్క; హేలా విలాసంవలన; ఆవిర్భవత్= పుట్టుతున్నట్టి; సర్వసత్త్వా!= సమస్త వస్తు సమూహం కలవాడా!; నమత్= నమస్కరిస్తున్న వారై; అమలినచిత్త= పరిశుద్ధమైన మనస్సులు గల మహామునుల; ఔన్నత్య= గొప్పదనంవలన; దీవ్యత్= ప్రకాశిస్తున్న; మహత్త్వా!= మహిమాన్వితుడైనవాడా!; దమ= ఇంద్రియ నిగ్రహంతో కూడిన; మహిత= శ్రేష్ఠమైన; తపః= తపస్సుయొక్క; సత్+భావ= సమున్నత భావంవలన; సమ్+వేద్యతత్త్వా!= విస్పష్టంగా తెలియదగ్గ వాస్తవరూపం కలవాడా!

**తాత్పర్యం:** ‘అన్నిటి కంటే ఉత్తమమూ, దోషరహితమూ, స్వేచ్ఛాయుతమూ, శాశ్వతమూ అయినట్టి ఆధిపత్యం కలవాడా! స్వచ్ఛమైన మాహాత్మ్య విలాసంవలన పుట్టుతున్న సమస్త వస్తుసమూహం కలవాడా! పరిశుద్ధాంతః కరణులై నమస్కరిస్తున్న మహర్షుల ఔన్నత్యంవలన ప్రకాశిస్తున్న మహిమాన్వితుడైనవాడా! ఇంద్రియనిగ్రహంతో కూడిన గొప్ప తపస్సుయొక్క ఉనికివలన విస్పష్టంగా విదితమయ్యే వాస్తవరూపం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** మాలినీవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, న, మ, య, య అనే గణాలుంటాయి. 9వ అక్షరంతో యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర, కొమ్మనా మాత్యపుత్త్ర, బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున శాంతి పర్వంబునందు ద్వితీయాశ్వాసము**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది (ఈ శాంతిపర్వం ద్వితీయాశ్వాసం); శ్రీమత్+ఉభయకవిమిత్త్ర= సంపద్యుక్తమైన ఉభయ కవిమిత్ర బిరుదాంకితుడైన (అంటే సంస్కృతాంధ్ర భాషాకవులకు మిత్రుడైన); కొమ్మన+ఆమాత్యపుత్త్ర= కొమ్మనమంత్రి పుత్రుడైన; బుధ+ఆరాధన విరాజి= విద్వాంసులచేత పూజించబడటంవలన ప్రకాశిస్తున్న; తిక్కన సోమయాజి= యజ్ఞంచేసి సోమయాజి అయిన తిక్కన మహాకవిచేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీమహాభారతంబునందున్= శ్రీమహాభారతంలో; శాంతిపర్వంబునందున్= శాంతిపర్వంలో; ద్వితీయ+ఆశ్వాసము= రెండో ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది సంపద్యుక్తమైన ఉభయకవిమిత్రు డనే బిరుదు గల, కొమ్మనమంత్రి పుత్రుడైన విద్వాంసులచేత ఆరాధించబడి ప్రకాశిస్తున్న, తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీమహాభారతమందలి శాంతిపర్వంలోని ద్వితీయాశ్వాసం.

**శాంతిపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీధుర్యకరణ! సమ్య । గ్బోధాత్మ విహరణ! దివిజ పూజ్యచరణ! యా**
**రాధకభరణ! నిరాధి । వ్యాధికరణ! సౌమ్యకిరణ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీధుర్యకరణ!= సంపదల భారాన్ని మోసేటట్లు చేసేవాడా!; సమ్యక్+బోధ= జ్ఞానవంతుల; ఆత్మ= మనస్సులలో; విహరణ!= విహరించేవాడా!; దివిజ= దేవతలచేత; పూజ్య= పూజింపదగిన; చరణ!= పాదాలు కలవాడా!; ఆరాధక= పూజించే భక్తులను; భరణ!= పోషించేవాడా!; నిరాధివ్యాధికరణ!= మానసిక శారీరక రోగాలను నివారించగలవాడా!; సౌమ్యకిరణ!= చంద్రుడికిరణములవంటి చల్లని కిరణాలు కలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథుడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీవు భక్తులను సుసంపన్నులుగా చేయగల వాడవు. వాళ్ళ హృదయాలలో విహరించేవాడవు. దేవతల పూజలందుకొనే పాదాలు కలవాడవు. భక్తపోషకుడవు. మానసిక, శారీరక వ్యాధులను పారద్రోలేవాడవు తేజస్వంతుడవు.

### కాలనిరూపణాదులగు రణోపాయంబుల ప్రకారము (సం. 12-101-2)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నట్లు శూరులు పుణ్యతమ పురుషు లని విని కుంతీనందనాగ్రజుండు గంగానందనునితోఁ'గాలనిరూపణాదులగు రణోపాయంబు లెఱింగింపు' మనుటయు నతండు భరితాదరుండై. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయ మహారాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ రీతిగా; శూరులు= యోధులు; పుణ్యతమ పురుషులు+అని= ఎంతో పుణ్యాత్ములు అని; విని= ఆలకించి; కుంతీనందన+అగ్రజుండు= కుంతీదేవి కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; గంగానందనునితోన్= గంగాదేవి కొడుకైన భీష్ముడితో; కాలనిరూపణ+ఆదులు+అగు= తగిన కాలాన్ని నిరూపించటం మొదలైన; రణ+ఉపాయంబులు= సమర సన్నాహాలకు అనువైన ఎత్తుగడలను; ఎఱింగింపుము= తెలియచెప్పుము; అనుటయున్= అనటంతోనే; అతండు= భీష్ముడు; భరిత+ఆదరుండు+ఐ= ఎంతో ఆనందించినవాడై.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజునకు వైశంపాయన మహర్షి భారతకథ చెప్పటం ప్రారంభించాడు. ధర్మరాజు 'శూరులు ఏ విధంగా పుణ్యాత్ములో' భీష్ముడి వలన విన్నాడు. 'పోరుకు పోవటానికి వీలైన కాలనిరూపణం మొదలైన ఉపాయాలను తెలియచెప్పు'మని అడిగాడు. భీష్ముడు ఎంతో ఆనందంగా చెప్పటం మొదలు పెట్టాడు.

**సీ.** **'వానయు సీతును వర్జించి మండు వే। సవి గాక మున్న సస్యముల పంట**
**లొదవెడు తఱి నెత్తునది శత్రుపయిఁ। బూరి, గట్టియల్ నీళ్ళులుఁ గలుగు తెరువు**
**గాఁజూచి నడచుట కర్జంబు సిడములుఁ। గంకటంబులును బల్కలును విండ్లు**
**మొదలగు నాయుధంబులు రథగజహయం। బుల సవరణలు నపూర్వభంగి**

**తే.** **నొప్పి యరిభీకరంబులై యుండవలయు। శంఖ కాహళ పటహనిస్సాణ ముఖము**
**లైన తూర్యముల్ మంచివి యైన లెస్స। యధిప విడిదల సమతల మగుట మేలు.** **3**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; వానయున్= వర్షాకాలాన్ని; సీతును= చలికాలాన్ని; వర్జించి= విడిచిపెట్టి; మండు వేసవి= ఎండలు మండేకాలం; కాకమున్న= రాకముందే; సస్యముల పంటలు= పైరుపంటలు; ఒదవెడు తఱిన్= లభించే సమయంలో; శత్రుపయిన్= పగవాళ్ళమీదికి; ఎత్తునది= దండెత్తాలి; పూరి= పచ్చగడ్డి; కట్టియల్= కట్టెలు; నీళ్ళులున్= నీళ్ళను; కలుగు తెరువుగాన్ చూచి= దొరకే మార్గంగా చూచికొని; నడచుట= దండయాత్ర చేయటం; కర్జంబు= కార్యం; సిడములున్= జెండాలూ; కంకటంబులును= కవచాలూ; పల్కలును= డాళ్ళూ; విండ్లు= ధనుస్సులూ; మొదలగు= మొదలైన; ఆయుధంబులు= యుద్ధసాధనాలు; రథగజహయంబుల= రథాల, ఏనుగుల, గుర్రాల; సవరణలున్= వాహనాద్యలంకరణలు; అపూర్వభంగిన్= ఇంతకుముందు లేని రీతిలో కొత్తగా; ఒప్పి= ప్రకాశించి; అరిభీకరంబులు+ఐ= శత్రువులకు జడుపు పుట్టించేవై; ఉండన్ వలయున్= ఉండాలి; శంఖ= శంఖం; కాహళ= బాకా; పటహ= తప్పెట; నిస్సాణ ముఖములు+ఐన= చర్మవాద్యాలు మొదలైన; తూర్యముల్= యుద్ధ వాద్యాలు; మంచివి+ఐన= బాగా మ్రోగేవి అయిన; లెస్స= మంచిది; విడిదల= దండువిడిసే చోటు; సమతలము+అగుట= చదునుగా ఉండటం; మేలు= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** వానలు పడేటప్పుడు, చలితో వణికేటప్పుడు, బాగా ఎండలు కాసేటప్పుడు కాక పంటలు పండేకాలంలో పగవాళ్ళపైకి దండెత్తి పోవాలి. పచ్చికా, కట్టెలూ, నీళ్ళూ దొరికే తోవలో దండును నడిపించుకొని పోవటం మంచిది. శత్రువులు కలవరపడేటట్లు జెండాలూ, కవచాలూ, డాళ్ళూ, ధనుస్సులూ మొదలైన ఆయుధాలను, రథాల ఏనుగుల గుర్రాల వాహనాలను ఇంతకుముందు కనీవినీ ఎరగని రీతిలో అమర్చుకొనాలి. హోరెత్తించే మంచి శంఖాలు, మంచి బాకాలు, మంచి డప్పులు మొదలైన చర్మవాద్యాలు ఉండటం మంచిది. సైన్యం బస చేసేచోటు ఎగుడూ దిగుడూ లేని చదునైన ప్రదేశంగా ఉండాలి.

**క.** **చరులఁ బనిచి యరుల తెఱం। గరయుచు, వా రెదురు నడచునట్టి దయిన దె**
**ప్పరపుందెరువున డప్పిం। బొరసినయెడ విడియుచోటఁ బొడుచు టురవగున్.** **4**

**ప్రతిపదార్థం:** చరులన్= వేగులవాళ్ళను; పనిచి= పంపించి; అరుల తెఱంగు= శత్రువుల నడతను; అరయుచున్= విచారిస్తూ; వారు= ఆ శత్రువులు; ఎదురునడచునట్టిది+అయిన= ఎదుర్కొలుకు బయలుదేరి ఉంటే; దెప్పరము= సహింపరాని; తెరువునన్= తోవలోనూ; డప్పిన్= అలసటను; పొరసినయెడన్= పొంది ఉన్నప్పుడూ; విడియుచోటన్= సైన్యం బసలోనూ; పొడుచుట= యుద్ధం చేయటం; ఉరవు+అగున్= తగినదవుతుంది.

**తాత్పర్యం:** చారులను పంపించి విరోధుల మార్గాలను గూర్చి తెలిసికొనాలి. అప్పటికే వాళ్ళు దండెత్తి వస్తుంటే కాలుమోపటానికి వీలులేని త్రోవలలోగానీ, అలసిన సమయాలలోగానీ, దండు విడిసినపుడు గానీ వాళ్ళను చంపటం తగిన పద్ధతి.

**ఆ.** **నిదురపోవుచోట నీరుదవ్వై వడఁ। బడిన యెడను గూడుదడసి సొలసి**
**నపుడుఁ జెదరియున్న యవసరమునఁ బగ। వారిఁ బొడిచి చెఱుపవలయు నధిప!** **5**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; నిదురపోవుచోటన్= పడుకొని నిద్రపోతున్న చోటులో; నీరు= నీళ్ళు; దవ్వై= దూరమై; వడన్+పడినయెడను= ఎండదెబ్బ తగిలిన సమయంలోనూ; కూడు= తిండి; తడసి= ఆలసించి; సొలసినపుడున్= సొమ్మసిల్లినపుడూ; చెదరిఉన్న అవసరమునన్= సేన అటు ఇటు చెల్లాచెదరై ఉన్నప్పుడూ; పగవారిన్= శత్రువులను; పొడిచి= బాధించి; చెఱుప వలయున్= నశింపచేయాలి.

**తాత్పర్యం:** నిద్రపోతున్నప్పుడూ, నీళ్ళు దరిదాపుల్లో దొరక్క తపిస్తున్నప్పుడూ, తినటానికి తిండిలేక అలసిసొలసినపుడూ, సైన్యం అంతా చెల్లా చెదరైనపుడూ విరోధులను మట్టుబెట్టటం అతి సులభం.

**సీ.** **చెట్టును ఱాయియు మిట్టయుఁ బల్లంబుఁ । గలిగినచోటు గాల్బలము నేల**
**వినుము నీళ్ళును రొంపియును లేక సమవిశా । లమునైన చోటు గుఱ్ఱముల నేల**
**కమ్మి గ్రుంగక గదుగదుప రొంపులు గలు । గమి నొప్పుచోటు రథముల నేల**
**యెడనెడ మ్రాఁకులు మడువులుఁ గల చోటు । కురునాథ! యెఱుఁగుము; కరుల నేల**

**ఆ.** **యే బలంబు దనకు నెక్కుడుఁ గలిగె న । బ్బలమునేల పోరుగలను గాఁగ**
**నినుఁడు సీతుగాలి వెనుకగా మొన నడ । పించి పొడువ సంభవించు జయము.** 6

**ప్రతిపదార్థం:** కురునాథా!= ఓ కౌరవరాజా! వినుము= ఆలకించుము; చెట్టును= మ్రాను; ఱాయియున్= రాయీ; మిట్టయున్= మెరకా; పల్లంబున్= పల్లమూ; కలిగినచోటు= ఉన్న ప్రదేశం; కాల్బలము నేల= కాలినడకన పోయే సైన్యం ఉండే భూమిగాను; నీళ్ళును= జలమును; రొంపియును లేక= బురద లేని; సమవిశాలమున్+ఐన చోటు= చదునుగా విశాలంగా ఉన్న నేల; గుఱ్ఱముల నేల= గుర్రాలు ఉండే స్థలంగానూ; కమ్మి= బండి చక్రం కమ్మి; క్రుంగక= దిగబడిపోకుండా; గదుగదుప రొంపులు= జారుడుగల బురదమట్టి; కలుగమి= ఉండక; ఒప్పుచోటు= తగినచోటు; రథమునేల= రథాలు ఉండే ప్రదేశంగానూ; ఎడనెడన్= అక్కడక్కడ; మ్రాఁకులు= పెద్ద మాకులు; మడువులు= నీటిగుంటలూ; కలచోటు= ఉన్నస్థలం; కరులనేల= ఏనుగులు ఉండే చోటునుగానూ; ఎఱుంగుము= తెలిసికొనుము; ఏ బలంబు= ఏ సైన్యం; తనకున్= తనకు (ఆ రాజునకు); ఎక్కుడు కలిగెన్= అధికంగా ఉండునో; ఆ+బలము నేల= ఆ సైన్యానికి అనువైన భూమిని; పోరుకలను కాఁగన్= యుద్ధభూమిగానూ; ఇనుఁడు= ఎండా; సీతుగాలి= చల్లటి గాలీ; వెనుకగాన్= వెనకబడ్డప్పుడూ అంటే తక్కువగా ఉన్నప్పుడు; మొనన్= సైన్యాన్ని; నడిపించి= తీసికొనివెళ్ళి; పొడువన్= పోరాడగా; జయము= గెలుపు; సంభవించున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ కురునాథా! చెట్లూ, రాళ్ళూ, మెరకలూ, పల్లాలూ ఉండే ప్రదేశాన్ని పదాతిసైన్యానికి ఎంచుకొనాలి. నీళ్ళూ, బురదా లేని సమతల ప్రదేశాన్ని గుర్రాల దండుకు వాడుకొనాలి. రథచక్రాల కమ్మీలు దిగబడని బురదమట్టి నేలను రథబలంకొరకు ఉంచుకొనాలి. అక్కడక్కడా చెట్లూ, నీటి గుంటలూ ఉండేచోట గజసేనను నిలబెట్టాలి. రాజు దగ్గర ఏ సేన ఎక్కువగా ఉంటుందో ఆ సేనకు అనువైన భూమిని యుద్ధరంగం చేయాలి. ఎండ, చలిగాలి తక్కువగా ఉన్న రోజులలో దండెత్తితే జయం తప్పక కలుగుతుంది.

**చ.** **పలకలవార లగ్రమునఁ బన్నఁగ విండులవారి ఘోటకం**
**బులఁ గరులన్ రథంబులను భూవర! వెన్వెనుకం గ్రమంబునన్**
**నిలిపినఁ గూడి నిల్చిన యనీకమునం గడుమంచి యోధులం**
**గలయఁగ నెందు నయ్యయి ప్రకారము వారల నిల్ప బల్పగున్.** 7

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా!; పన్నఁగన్= యుద్ధానికి సిద్ధపడగా; పలకలవారలు= డాలు మొదలైన ఆయుధాలను ధరించిన వాళ్ళు; అగ్రమునన్= ముందునా; వెన్వెనుకన్= ఆ వెనుకాల వెనకాలనే; క్రమంబునన్= ఒకటి తరువాత ఒకటిగా; విండులవారిన్= ధనుర్ధారులను; ఘోటకంబులన్= గుర్రాలను; కరులన్= ఏనుగులను; రథంబులను= రథాలను; నిలిపినన్= మోహరింపచేయగా; కూడి నిల్చిన= చేరి నిల్చున్న; అనీకమునన్= సేనయందు; కడున్= మిక్కిలి; మంచి యోధులన్= వీరభటులను; కలయఁగన్= అంతటా; ఎందున్= ఎక్కడైననూ; ఆ+అయి ప్రకారము= ఆయా తీరుల; వారలన్= వాళ్ళనందరినీ; నిల్పన్= ఉంచటం; బల్పు+అగున్= పుష్టిమంతం అవుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! డాలు మొదలైన ఆయుధసామగ్రిని ధరించినవాళ్ళను సేనలో మొదట నడిపించాలి. ఆ తరువాత విండ్లు ధరించే వాళ్ళనూ, ఆ వెనక గుర్రాలసేననూ, ఆ వెనుకనే గజ బలాన్నీ, ఆ వెనువెనుకనే రథబలాన్నీ నిలబెట్టాలి. వాళ్లల్లో మంచి వీరులను ఏరి అక్కడక్కడా నిలిపినట్లయితే అది మరింత బలాన్ని చేకూరుస్తుంది.

**ఆ. బంటు లుత్సహించి పగఱపోయిరి పోయి । రంచుఁ గడఁగి బొబ్బలార్పు లెసఁగ**
**నతి రయమున నడరు నట్లుగ దొర సము । ద్ధతి యొనర్పవలయుఁ దాఁకుదలల.' 8**

**ప్రతిపదార్థం:** బంటులు= సైనికులు; ఉత్సహించి= విజృంభించి; పగఱ= శత్రువులు; పోయిరి పోయిరి= పారిపోయారు పారిపోయారు; అంచున్= అంటూ; కడఁగి= ప్రయత్నించి (పూనుకొని); బొబ్బలు+ఆర్పులు= పెద్ద అరుపులు; ఎసఁగన్= అతిశయించగా (ఎక్కువ కాగా); అతిరయమునన్= ఎంతో తొందరగా; అడరునట్లుగన్= విజృంభిస్తున్నట్లుగా; తాఁకుదలల= యుద్ధం ప్రారంభంలో; దొర= రాజు; సముద్ధతి= ఎక్కువైన ఉద్ధృతిని (ఆర్భాటాన్ని); ఒనర్పన్ వలయున్= చేయాలి.

**తాత్పర్యం:** యుద్ధం మొదలుకాగానే శత్రువులకు బెదరు పుట్టేటట్లు భటులు 'శత్రువులు పారిపోయారు పారిపోయారు' అంటూ పెద్దపెట్టున అరుపులూ రంకెలూ వేయాలి. రాజు కూడా అపుడే విజృంభిస్తున్నట్లుగా సముద్ధతి చేయాలి'.

**వ. అనుటయుఁ గౌంతేయాగ్రజుండు శాంతనవునితో 'బం ట్లెట్టివారు గావలయు?'నని యడిగిన, నతం డిట్లనియె. 9**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని మాట్లాడగానే; కౌంతేయ+అగ్రజుండు= కుంతి పెద్దకుమారుడు ధర్మరాజు; శాంతనవునితోన్= శంతను పుత్రుడు భీష్మునితో; బంట్లు= యోధులు; ఎట్టివారు, కావలయును= ఎట్లాంటి వాళ్ళను కూర్చుకొనాలి; అని అడిగినన్= అని అడుగగా; అతండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగానే ధర్మరాజు 'యుద్ధ భటులు ఎట్లాంటి వారైతే బాగుంటుంది?' అని అడగగానే భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**తే. ఏనుఁ గేనుంగుఁ బేర్చిన ట్లెసకమెసఁగు । నంగముల సొంపుఁ, బులికిని సింగమునకుఁ**
**బుట్టినట్టి యుగ్రతయును గట్టి మెఱయ । వలనుఁ గల యోధవీరులు వలయు ననికి. 10**

**ప్రతిపదార్థం:** ఏనుఁగు= ఏనుగు; ఏనుంగున్= మరో ఏనుగుతో; పేర్చినట్లు= విజృంభించేటట్లు; ఎసకమెసఁగు= ఉప్పొంగు; అంగముల సొంపున్= అవయవ సమృద్ధిని; పులికిని= పులికీ; సింగమునకున్= సింహానికీ; పుట్టినట్టి= జన్మించినట్టి; ఉగ్రతయును= భీకరత్వమూ; గట్టి మెఱయన్= శౌర్యాన్ని ప్రదర్శించే; వలనున్+కల= నేర్పు ఉన్న; యోధవీరులు= వీరులైన బంట్లు; అనికిన్= యుద్ధానికి; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** ఏనుగు మరో ఏనుగుతో తలపడి విజృంభించేటప్పటి కండబలం, పులికీ సింహానికీ ఉన్నంత భీకరత్వం, తమ పౌరుషాన్ని ప్రదర్శించుకొనగల చాకచక్యం గల బంట్లు యుద్ధంలో అవసరం.

**వ. దేశ విశేషంబు లాకర్ణింపుము: గాంధార సింధు సౌవీరులు కతారంబుల సబళంబులం బరిశ్రమంబు గలిగి బలశౌర్య సమగ్రులై సర్వసమరంబులకుఁ జాలియుండుదు; రౌశీనరు లెల్ల కైదువులకు నేర్చి సత్త్వవంతులై యుండుదురు; ప్రాచ్యు లేనిక కయ్యంబునకు నేర్తురు; కపట యోధులై యుండుదురు; యవనులుఁ గాంభోజులును మధుర చుట్ల దేశంబులవారును గుఱ్ఱపు బవరంబులకు నలవడి యుండుదురు; ఘూర్జరులు బ్రద్దపరుల నడిదంబులం బరిణతులై యుండుదురు; మాళవులు రథంబులు మొదలైన చతురంగ బలంబుల సంగరంబులం జతురులై యొక్కఁ డొక్కండ పెక్కండ్రకైన నోర్చియుండుదురు; గొందఱఁ గొందఱ నిర్దేశించితి; మఱియు ననేకదేశంబులవారు వివిధ ప్రకారంబుల నుండుదు; రయ్యై తెఱంగు లెఱింగి పెనంగించి జయంబు గొనునది' యనిన ధర్మనందనుండు 'జయించు సైన్యంబులం దోఁచు లక్షణంబులు వినవలతు'ననవుడు భీష్ముఁ డతని కిట్లనియె. 11**

**ప్రతిపదార్థం:** దేశవిశేషంబులు= దేశ విశేషాలను గూర్చి; ఆకర్ణింపుము= వినుము; గాంధారసింధు సౌవీరులు= గాంధార సింధు సౌవీరదేశ వీరులు; కతారంబులన్= కత్తులతో; సబళంబులన్= ఈటెలతో; పరిశ్రమంబు+కలిగి= బాగా సాధనచేసి; బలశౌర్య సమగ్రులు+ఐ= పరాక్రమ, పౌరుషశక్తి, సంపన్నులయి; సర్వసమరంబులకున్= ఎన్నిరకాల యుద్ధాలకైనా; చాలి, ఉండుదురు= సమర్థులై ఉంటారు; ఉశీనరులు= ఔశీనరదేశం వాళ్ళు; ఎల్లకైదువులకున్= అన్ని ఆయుధాలను ఉపయోగించటంలో; నేర్చి= పట్టుగలిగి; సత్త్వవంతులు+ఐ= బలిష్ఠులై; ఉండుదురు= ఉంటారు; ప్రాచ్యులు= తూర్పుదేశీయులు; ఏనికకయ్యంబునకున్= గజ యుద్ధంలో; నేర్తురు= ఆరి తేరినవాళ్ళుగాను; కపట యోధులు+ఐ= మోసకారులైన వీరులై; ఉండుదురు= ఉంటారు; యవనులు= యవనదేశస్థులూ; కాంభోజులును= కాంభోజ యోధులూ; మధురచుట్ల దేశంబులవారును= మధుర చుట్టుప్రక్కలప్రాంతం వాళ్ళూ; గుఱ్ఱపుబవరంబులకున్= ఆశ్విక యుద్ధాలకు; అలవడి ఉండుదురు= తగి ఉంటారు; ఘూర్జరులు= ఘూర్జరసేనలు; బ్రద్దపరులన్= ధనుర్విద్యలోనూ; అడిదంబులన్= కత్తికటారులు తిప్పటంలోనూ; పరిణతులు+ఐ= చేయి తిరిగినవాళ్ళై; ఉండుదురు= ఉంటారు; మాళవులు= మాళవభటులు; రథంబులు= రథాలు మొదలైన; చతురంగబలంబులన్= నాలుగు రకాలైన యుద్ధ సైన్యంతో; సంగరంబులన్= యుద్ధాల్లో; చతురులు+ఐ= నేర్పరులై; ఒక్కఁడొక్కండు= ఒక్కొక్కడే; పెక్కండ్రకున్+ఐనన్= చాలామందిని ఎదుర్కొనటానికైనా; ఓర్చి= తాళ కలిగి; ఉండుదురు= ఉంటారు; కొందఱన్+కొందఱన్= కొద్దిమందిని మాత్రమే; నిర్దేశించితిన్= నిరూపించి చెప్పాను; మఱియున్= ఇంకా; అనేక దేశంబులవారు= ఎన్నో దేశాలవాళ్ళు; వివిధ ప్రకారంబులన్= అనేక విధాలుగా; ఉండుదురు= ఉంటారు; ఆ+ఆ+తెఱంగులు= ఆయా పద్ధతులు; ఎఱింగి= తెలిసికొని; పెనంగించి= పోరాడేటట్లు చేసి; జయంబున్= గెలుపును; కొనునది= చేపట్టాలి; అనినన్= అనగానే; ధర్మనందనుండు= ధర్మరాజు; జయించు= విజయం సాధించే; సైన్యంబులన్= సేనలలో; తోఁచు= కనబడే; లక్షణంబులు= ఆనవాళ్ళను; వినవలతున్= వినాలని ఉన్నది; అనవుడున్= అని అనగానే; భీష్ముఁడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు= ఇట్లా; అనియెన్= మాట్లాడాడు.

**తాత్పర్యం:** ఇక ఆయాదేశాల వీరభటుల స్వభావాలు ఎట్లా ఉంటాయో చెప్తాను వినుము. గాంధార, సింధు, సౌవీర దేశవీరులు కత్తులతో ఈటెలతో బాగా సాధన చేసిన వాళ్ళు. వీళ్ళు ఏ యుద్ధం చేయటానికైనా సంసిద్ధులే. ఔశీనరదేశంవాళ్ళు అన్ని ఆయుధాలను పట్టగలిగే సత్తువ కలవాళ్ళు, పుష్టికలవాళ్ళు. తూర్పుదేశం సేనలు ఏనుగులు ఎక్కిచేసే యుద్ధాలలో ఆరితేరినవాళ్ళు. వీళ్ళు గదాయుద్ధంలోనూ మంచి ఘటికులు. యవనులు, కాంభోజులు, మధుర చుట్టూ ఉన్నదేశాలవాళ్ళు గుఱ్ఱాలనెక్కి చేసే యుద్ధంలో మంచి పట్టుగలవాళ్ళు. ఘూర్జరులు బాణం

విసరటంలో, కత్తులూ, కటారులూ తిప్పటంలో చేయితిరిగినవాళ్ళు. మాళవులు రథ, గజ, అశ్వ, పదాతిదళాల పోరులో పండబారిన వాళ్ళు. ఒక్కొక్కడు వేలమంది పెట్టు. ఇంతదాకా నీకు చాలా కొద్ది మందిని గూర్చి మాత్రమే తెలిపాను. ఇంకా అనేక దేశాలసేనలు ఎన్నో యుద్ధవిధానాలలో మంచి నేర్పరులై ఉంటారు. ఆయా యుద్ధపు మెలకువలు తెలిసికొని ఎదిరించి. విజయాన్ని సాధించాలి' - అని అనగానే ధర్మరాజు 'జయం సాధించే సేన ఏ లక్షణాలతో ఉంటుందో చెప్పు'మనగానే భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**ధర్మజునకు భీష్ముఁడు శకునాపశకునములు దెలుపుట (సం. 12-103-2)**

**క. సైనికుల మనము లుత్సా । హానూనము లగుచునుండు, హయహేషణముల్**
**వీనులకును సొగియించు, గ । జానీకము లుబ్బు విజయ మగు సైన్యమునన్. 12**

**ప్రతిపదార్థం:** విజయము+అగు= జయం కలిగే; సైన్యమునన్= సేనలో; సైనికుల= సేనలయొక్క; మనములు= మనస్సులు; ఉత్సాహ= సంతోషంతో; అనూనములు= తక్కువకానివి అంటే మరింత ఆనందించేవి; అగుచున్= అవుతూ; ఉండున్= ఉంటాయి; హయ= గుర్రాల; హేషణముల్= సకిలింతలు; వీనులకునున్= చెవులకు (వినటానికి); సొగియించున్= ఇంపు కలిగిస్తాయి; గజ+అనీకములు= ఏనుగుల దండు; ఉబ్బున్= విజృంభిస్తుంది.

**తాత్పర్యం:** జయం లభించే సేన మంచి ఉత్సాహంగా ఉంటుంది. గుర్రాల సకిలింతలు చెవికి ఇంపుగా వినిపిస్తాయి. ఏనుగుల గుంపు విజృంభిస్తుంది. ఇవి గెలుపునకు సూచకాలు.

**క. మృగములుఁ బక్షులు ననులో । మగతిం జరియించు, వెనుక మందానిలుఁ డిం**
**పుగ వచ్చి మెలఁగుఁ, గడు మే । లగుమాటలు వొడము గెలుచునట్టి బలమునన్. 13**

**ప్రతిపదార్థం:** గెలుచు+అట్టి= జయం ప్రాప్తించే; బలమునన్= సైన్యంలో; మృగములున్= మెకాలూ; పక్షులున్= పిట్టలూ; అనులోమగతిన్= సవ్యం అయిన పోకడలతో; చరియించున్= తిరుగుతాయి; వెనుకన్= తరువాత; మందానిలుఁడు= పిల్లగాలి; ఇంపుగన్= హాయిగా; వచ్చి= తాకి; మెలఁగున్= విసరును; కడుమేలు+అగు= ఎంతో మంచిని కోరే; మాటలు= సల్లాపాలు; పొడమున్= పుట్టుతాయి (వినిపిస్తాయి).

**తాత్పర్యం:** విజయం చేకూరుతుం దనటానికి గుర్తుగా జంతువులూ పక్షులూ అనుకూలంగా తిరుగుతాయి. చిరుగాలులు వీస్తూ సంతోష పెట్టుతాయి. సైన్యంలోనుండి శుభంకరమైన పల్కులే వినిపిస్తాయి.

**క. వెలడు నెడఁ దెలివితో న । గ్నులు వలపల సుడియు శిఖలఁ గొమరగుఁ దూర్యం**
**బులు గంభీరధ్వనులం । జెలఁగును జయము గొనునట్టి సేనఁ గుమారా!' 14**

**ప్రతిపదార్థం:** కుమారా!= ఓ బిడ్డా!; జయము= గెలుపు; కొనునట్టి= చేపట్టే; సేనన్= సైన్యంలో; వెలడు= బయలుదేరే; ఎడన్= సమయంలో; తెలివితోన్= ప్రకాశంతో (తేజస్సుతో); అగ్నులు= నిప్పులు; వలపల= కుడివైపుగా; సుడియు= తిరిగే (వ్యాపించే); శిఖలన్= మంటలతో; కొమరు+అగున్= ఒప్పుతాయి; తూర్యంబులు గంభీరధ్వనులన్= వాద్యాలు పెనుమ్రోతలతో; చెలఁగున్= మార్మోగుతాయి.

**తాత్పర్యం:** ఓ బిడ్డా! విజయం పొందే సేన సమరానికి సాగిపోయేటప్పుడు అగ్నిజ్వాలలు ఎర్రగా కుడివైపుగా మండుతాయి. యుద్ధ భేరీలు ధణధణమంటూ భోరున మ్రోగుతాయి.'

**క. అని చెప్పి మఱియు నతఁ డి । ట్లను 'ముట్టిన పగఱసొంపునడఁచుట యొప్పున్**
**విను కయ్యమునకుఁ గాల్ర్ద । వ్వినఁ బాటిలు దురిత మెట్టి విభునకు నైనన్. 15**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; మఱియున్= మళ్ళీ; అతఁడు= భీష్ముడు; ఇట్లు= ఇట్లా; అనున్= పలికాడు; ముట్టిన= చుట్టుముట్టిన; పగఱ= శత్రువులయొక్క; సొంపున్= పెంపును; అడఁచుట= అణగదొక్కటం (నశింపచేయటం); ఒప్పున్= తగి ఉంటుంది; విను= ఆలకించుము; కయ్యమునకున్+కాల్ర్దవ్వినన్= యుద్ధానికి సిద్ధపడితే; ఎట్టి= ఎంతటి; విభునకున్= దొరకైనా; దురితము= పాపం; పాటిలున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు తిరిగి ఇట్లా అన్నాడు. 'అయితే ఊరకనే ఎదుర్కొన్న శత్రువుల పొగరు అణచటం మంచిదే. ఇంకొక విషయం కూడా బాగా వినుము. తనకు తానై యుద్ధానికి తలపడితే మాత్రం ఎట్లాంటి రాజుకైనా పాపం చుట్టుకొంటుంది.

**క. చెఱువు నడు మవిసినను బెను । వెఱ మెకములు సెదరినను వివేకనిధీ! యు**
**క్కఱి బహుళసైన్య మఱిముఱిఁ । బఱచిన నాఁగంగ రాదు బలియుర కైనన్. 16**

**ప్రతిపదార్థం:** వివేకనిధీ!= జ్ఞానంగల ధర్మరాజా!; చెఱువు= చెరువుకట్ట; నడుము= నట్టనడిమి భాగం; అవిసినను= గండిపడినా; పెనువెఱన్= మిక్కిలి భయంతో; మెకములు= జంతువులు; చెదరినను= అటూ ఇటూ పారిపోయినా; ఉక్కు+అఱి= శక్తిలేక; బహుళసైన్యము= అధికమైన; అఱిముఱిన్= తత్తరపాటుతో ఎక్కడివక్కడ; పఱచినన్= పరుగులు పెట్టినా; బలియురకున్+ఐనన్= ఎంతటి బలవంతులకైనా; ఆఁగంగన్= ఆపటం; రాదు= కుదరదు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నడిగట్టు తెగిన చెరువునీళ్ళను, బెదరి పారిపోయే క్రూరమృగాలను, యుద్ధం చేసే ఓపికలేక పిరికితనంతో పారిపోయే సైన్యాన్ని అడ్డుకొనటం ఎట్లాంటి మహామహుడికైనా తగదు.

**క. విను కొందఱైనఁ గడుఁ దెం । పున మార్కొని కడిమి మీఱి పొంగి యడరినన్**
**మొన యెంతయైన విఱుగుం; । జనునే కయ్యంబు వొడువ శక్తుల కైనన్. 17**

**ప్రతిపదార్థం:** విను= వినవలసింది; కొందఱు+ఐనన్= కొద్దిమంది అయినా; కడున్+తెంపునన్= ఎంతో సాహసంతో; మార్కొని= ఎదురొడ్డి; కడిమిమీఱి= మించిన పరాక్రమంతో; పొంగి= ఉబ్బి; అడరినన్= విజృంభించగా; మొన= సైన్యం; ఎంత+ఐనన్= ఎంత పాటిదైనా; విఱుగున్= ఓడుతుంది; శక్తులకున్+ఐనన్= ఎంతటి సమర్థుల (నేర్పరుల)కైనా; కయ్యంబు= పోరు; పొడువన్+చనునే?= కలిగించటం తగునా?

**తాత్పర్యం:** ఒక విషయం వినుము. సైన్యంలో కొద్దిమంది అయినా తెగించి ఎంతో పరాక్రమంతో ఎంతో ఉత్సాహంతో విరుచుకుపడితే ఆ సైన్యం ఎంత పాటిదైనా చెల్లాచెదరైపోతుంది. ఎంత సామర్థ్యం కలవాళ్ళకైనా పోరాడటం సరైన పద్ధతి కాదు. ఎక్కువ సైన్యం ఉంటేనే జయించటం సాధ్యం అనుకొనకూడదు. (ఒకొక్కప్పుడు తక్కువ సైన్యం ఉన్నా జయించవచ్చని భావం).

**క. క్షమ మేలగు; నైన నతి । క్షమ దైన్యముఁ దెచ్చు నెదురు గర్వించినఁ గ**
**య్యము వొడిచి గెలిచి యరిశే । షమునెడ సదయక్షమా విశదుఁ డగు టొప్పున్.' 18**

**ప్రతిపదార్థం:** క్షమ= ఓర్పు; మేలు+అగున్= మంచిదే అవుతుంది; ఐనన్= అయినా; అతిక్షమ= మితిమీరిన సహనం; దైన్యమున్= తక్కువతనాన్ని; తెచ్చున్= తెచ్చిపెట్టుతుంది; ఎదురు= పగవాడు; గర్వించినన్= గర్వపడితే; కయ్యము+పొడిచి= పోరుపెట్టుకొని; గెలిచి= జయించి; అరిశేషము+ఎడన్= మిగిలిన శత్రువుల విషయంలో; సదయ= కరుణతో కూడిన; క్షమావిశదుఁడు+అగుట= ఎంతో ఓర్పు కలిగి ఉండటం; ఒప్పున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! ఓర్పు వహించటం మంచిదే కాని శ్రుతిమించిన సహనం దైన్యానికి త్రోవతీస్తుంది. పగవాడు పొగరుబోతు అయితే యుద్ధంచేసి గెలవాలి. మిగిలిపోయిన శత్రువులపట్ల ఎంతో శాంతి, దయా కనబరచాలి.'

### రాజు పగఱయెడ నుండవలయు విధము (సం. 12-104-2)

**వ.** **అనిన నప్పాండవోత్తముండు 'పుడమితేఁడు పగఱయెడ నెట్టివాఁడు గావలయు?'ననవుడు నా భూపతితో భీష్ముండు 'బృహస్పతి దివస్పతి కెఱింగించిన తెఱం గుపదేశించెద' నని యి ట్లనియె.** **19**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన భీష్ముడితో; ఆ+పాండవ+ఉత్తముండు= ఆ పాండవులలో ముఖ్యుడైన ధర్మరాజు; పుడమితేఁడు= భూపతి (రాజు); పగఱ+ఎడన్= విరోధులపట్ల; ఎట్టివాఁడు= ఎట్లాంటివాడు; కావలయున్= అయి ఉండాలి; అనవుడున్= అనగానే; ఆ భూపతితోన్= ఆ రాజుతో; భీష్ముండు= భీష్ముడు; బృహస్పతి= దేవతల గురువు; దివస్పతికిన్= స్వర్గానికి రాజైన ఇంద్రుడికి; ఎఱింగించిన= తెలిపిన; తెఱంగు= విధానం; ఉపదేశించెదను= బోధపరుస్తాను; అని= అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడితో ధర్మరాజు 'రాజు విరోధుల విషయంలో ఎట్లా ప్రవర్తించాలి?' అని అడిగాడు. భీష్ముడు 'ఒకప్పుడు బృహస్పతి ఇంద్రుడికి చెప్పినట్లుగానే నీకూ చెప్పుతాను విను'మని ధర్మరాజుతో ఇట్లా చెప్పటం ప్రారంభించాడు.

**చ.** **విను మరిఁ జంపనుం జెఱుప వేచుట లెస్స; ప్రతాప భాషణం**
**బున వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి రేఁ**
**చినఁ దన పూఁపు దప్పు నఱసేయని చందము నమ్మి యున్న చా**
**డ్పును మెఱయంగఁ బల్కుచుఁ గడున్ మది నమ్మకయుండఁ గాఁ దగున్.** **20**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; అరిన్= పగవాడిని; చంపనున్= చంపటానికి; చెఱుపన్= పాడు చేయటానికి; వేచుట= ఎదురు చూడటం; లెస్స= మంచిది; ప్రతాప భాషణంబునన్= కరకు మాటలతోనూ; వెడన్= పొల్లుకూతలతోనూ; ఉల్లికుట్టులను= సూటిపోటి మాటలతోనూ; బొంకులన్= అబద్ధాలతోనూ; వానిన్= పగవాడిని; కలంగన్+చేసి= కలవర పెట్టి; రేఁచినన్= రెచ్చిపోగా; తన= తనదైన; పూఁపు= ప్రయత్నం; తప్పున్= చెడిపోతుంది; అఱ చేయని చందమున్= దగా చేయని పద్ధతితో; నమ్మి+ఉన్న= నమ్మకం పెట్టుకొన్న; చాడ్పును= తీరును; మెఱయంగన్= ఒప్పేటట్లు (వ్యక్తమయ్యేటట్లు); పల్కుచున్= మాట్లాడుతూ; కడున్= మిక్కిలి; మదిన్= మనస్సులో; నమ్మక= విశ్వసించకుండా; ఉండఁగాన్+తగున్= ఉండటం మంచిది.

**తాత్పర్యం:** పగవాడిని తుదముట్టించాలన్నా, పాడుచెయ్యాలన్నా అనువుకొరకు వేచి ఉండాలి. అంతేకాని కరుకుగా మాట్లాడిగాని, వ్యర్థంగా మాటలాడిగానీ, పుల్లవిరుపు మాటలాడిగాని, అబద్ధా లాడిగాని వాళ్ళను కలవరపెట్టకూడదు. అట్లా రెచ్చగొడితే తాను తలపెట్టిన ప్రయత్నాలకు అడ్డుపుల్లలు పడతాయి. వాళ్ళను మోసగించని రీతిలో నమ్మినట్లు మాటలలో కనబరచాలి. కాని, లోపల ఏ మాత్రమూ నమ్మకం పెట్టుకొనకూడదు.

**చ.** **అరిపయి వీఁకనెత్తి చనునప్పుడుఁ దేనియ లుట్టు నట్లుగా**
**నరపతి వాని వారలు వినం బ్రియమాడుట మేలు; పక్షిఁ దాఁ**
**దిరముగఁ జేయఁగా మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త**
**త్స్వరములు సూపికాదె తుదిఁ జంపఁ దెగుం దనబారిఁ బాఱినన్.** **21**

**ప్రతిపదార్థం:** అరిపయిన్= శత్రువుమీదికి; వీఁకన్= పరాక్రమంతో; ఎత్తి= దండెత్తి; చను+అప్పుడున్= వెళ్ళేటప్పుడు; నరపతి= రాజు; వాని వారలు= వాళ్ళవాళ్ళు; వినన్= వినేటట్లు; తేనియలు= తీయదనం; ఉట్టునట్లు+కాన్= ఉట్టిపడేటట్లుగా; ప్రియము= ఇచ్చకాలు; ఆడుట= పలకటం; మేలు= బాగు; వేఁటగాఁడు= బోయ; తనబారిన్= తన గురి (దృష్టి) నుండి; పాఱినన్= తప్పుకొనిపోగా; తాన్= తాను (బోయ); పక్షిన్= పిట్టను; తిరముగన్= స్థిరంగా (కదలకుండేటట్లు); చేయఁగాన్= చేయటానికి; మృగము= జంతువు; తేఁకువ= భయం; పాపను అని= పోగొట్టటానికి; తద్= ఆయా పిట్టలయొక్క, జంతువులయొక్క; స్వరములు= కూతలు(అరుపులు); చూపి= కలిగించి; తుదిన్= చివరకు; చంపన్= ప్రాణం తీయటానికి; తెగున్+కాదె!= సాహసించును కదా!

**తాత్పర్యం:** తన గురినుండి తప్పించుకొని తన స్థానంలో దిటవుగా ఉన్న పక్షికీ, జంతువుకూ కలిగే భీతిని పోగొట్టటానికి ఆయా పక్షుల జంతువుల కూతలూ అరుపులూ పెట్టించి రప్పించి, చివరకు వాటి ప్రాణాలు తీయటానికి బోయవాడు పూనుకొంటాడు. అట్లాగే పగవాడి మీదికి పోయేటప్పుడు రాజు వాళ్ళ దగ్గరి వాళ్ళు వినేటట్లు తీయగా కమ్మగా ఇచ్చకాలాడి తప్పించుకొన్న శత్రువును రప్పించి చంపటం తగిన వ్యవహారం అనిపించుకొంటుంది.

**విశేషం:** అలం: నిదర్శనం.

**ఉ.** **వేమఱు శత్రునిం బరిభవించుట, రిత్తకు రిత్త వైరముం**
**దా మదిఁ బెట్టికోలు సుఖతంత్రము గాదు, సుసంధికాలమున్**
**సీమ దగంగ రూపడఁగఁ జేయుటయున్ వల; దగ్గమైన వాఁ**
**డేమెయి నైన వధ్యుఁ డను నిట్టి వినిశ్చయ మాత్మఁ గల్గుటన్.** **22**

**ప్రతిపదార్థం:** అగ్గము+ఐనవాఁడు= స్వాధీనుడైనవాడు; ఏమెయిన్+ఐనన్= ఎట్లాగైనా; వధ్యుఁడు= చంపదగినట్టివాడు; అను+ఇట్టి= అనేటి; వినిశ్చయము= గట్టి భావం; ఆత్మన్= తనలో; కల్గుటన్= కలిగి ఉండటం వలన; వేమఱు= మాటిమాటికి; శత్రునిన్= పగవాడిని; పరిభవించుట= అవమాన పరచటం; రిత్తకు రిత్త= నిష్కారణ; వైరమున్= విరోధాన్ని (పగను); తాన్= తానుగా; మదిన్= మనస్సులో; పెట్టికోలు= పెట్టుకొనటం; సుఖతంత్రము+కాదు= క్షేమమైన ఉపాయం కాదు; సుసంధికాలమున్= చక్కగా ఒక ఒప్పందానికి వచ్చే సమయానికి; సీమ= ఎల్లను (సరిహద్దును); తగంగన్= ఒప్పిదంగా; రూపు+అడఁగన్+చేయుటయున్= రూపు మాపుచేయటం; వలదు= ఒప్పదు.

**తాత్పర్యం:** చేజిక్కిన శత్రువును ఎట్లాగైనా జయించవచ్చునే గట్టి నిర్ణయాన్ని లోపలపెట్టుకొని పగవాడిని అదే పనిగా అవమానించటం, ఎపుడూ పగతో ఉండటం సరైన సంధి కుదుర్చుకొనే సమయంలో, రాజ్యపు సరిహద్దులను నామరూపాలు లేకుండా చేయటం అనేవి తగని పనులు.

**క.** **కాల విపర్యయమున నర। పాలుఁడు దా మ్రొక్కియైనఁ బగతుఁ గలిసి త**
**చ్ఛీలమెఱిఁగి తఱియైనం। గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్.** **23**

**ప్రతిపదార్థం:** కాల విపర్యయమునన్= కాలం కలిసిరానపుడు; నరపాలుఁడు= రాజు; తాన్+మ్రొక్కి+ఐనన్= తనకు తానుగా నమస్కరించి అయినా; పగతున్+కలిసి= శత్రువుతో కూడి; తద్+శీలమున్= అతడి నడవడిని; ఎఱింగి= తెలిసికొని; తఱి+ఐనన్= సమయం వచ్చినప్పుడు; వానిన్= ఆ విరోధిని; సుకరముగన్= మిక్కిలి తేలికగా; కాలునిపురికిన్= యమునిపట్టణానికి; అనుచునది= పంపాలి.

**తాత్పర్యం:** శత్రువునకు కాలం అచ్చివచ్చినప్పుడు తనకు తానుగానే మొక్కుకొని అయినా లొంగిపోవాలి. అతడితో కలిసిపోవాలి. అతడి నడతను పసిగట్టాలి. తనకు కాలం కలిసిరాగానే పగవాడిని చాల అనాయాసంగా చంపాలి.

**క. అనదతనంబును, బెడిదపుఁ। దనమును లేకుండఁ బరఁగి దరి యొత్తెడు నే**
**ఱునుబోలె నొత్తవలయును। మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా! 24**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; మనుజ+ఇంద్రుఁడు= మనుష్యులలో ఉత్తముడైన రాజు; మార్తురన్= విరోధులను; క్రమంబునన్= మెల్లగా; అనదతనంబును= దీనత్వాన్నీ; బెడిదపుఁ దనమును= కరకు తనాన్నీ; లేక ఉండన్= ఏమాత్రం కనపడనీయకుండా; పరఁగి= ఒప్పి; దరి= ఒడ్డును; ఒత్తెడు= ఒరసికొనే; ఏఱును+పోలెన్= నదివలె; ఒత్తవలయును= ఆక్రమించాలి.

**తాత్పర్యం:** పగవాడిమీద రాజు ఎంతో జాలిపడినట్లుగాని, ఎంతో దురుసుగా ఉన్నట్లుగాని బయటపడకూడదు. ఒడ్డును దాకి మెల్లగా దానిని కోసి విస్తరించే నది మాదిరిగా శత్రువులను మెల్లమెల్లగా ఆక్రమించుకొనాలి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. పెక్కండ్రతోడ నీరస। మొక్క తఱిన కొనక తఱఁగి యున్న పగతుతో**
**నుక్కాడి బంధుభావముఁ। దక్కటి పగఱయెడ వలయుఁ దా నెఱపంగన్. 25**

**ప్రతిపదార్థం:** పెక్కండ్ర తోడన్= చాలా మందితో; ఈరసము= ద్వేషం; ఒక్క తఱిన= ఒకేసారే; కొనక=తెచ్చుకొనక; తఱఁగి+ఉన్న= తగ్గి ఉన్న (బలహీనపడి ఉన్న); పగతుతోన్= శత్రువుతో; ఉక్కాడి= పగగొని; తక్కటి= తక్కిన; పగఱ+ఎడన్= విరోధుల పట్ల; బంధుభావము= చుట్టరికాన్ని; తాన్= తాను; నెఱపంగన్ వలయున్= కనబరచాలి.

**తాత్పర్యం:** ఒకేసారి ఎక్కువమందిమీద ద్వేషం పెట్టుకొనకూడదు. తగ్గి ఉన్న పగవాడిపై పగబట్టాలి. కాని, మిగతా శత్రువులతో ఆత్మీయంగా మెలగాలి.

## కాలకవృక్షీయ మహాముని క్షేమదర్శికిఁ జెప్పిన హితవాక్యములు (సం. 12-105-2)

**వ. అనిన శంతనుపుత్రుతో నజాతశత్రుండు 'నిజపరివారదోషంబున నైనను, బరులచేత నేనియు, సంపద సెడుట నాపదం బొరసిన ధరణీశుండు నెవ్వగ నెవ్విధంబునం బాపికొను? నెఱింగింపు'మనుటయుఁ 'దొల్లి కోసల పతియైన క్షేమదర్శి విదేహపతిచేత భూమిఁ గోల్పోయి వగంబొంది, మున్ను దనకు మంత్రియై యుండి తాను రాజ్యంబు సేయుచుండు బరమశాంతి నొంది వనంబునకుం జనిన కాలకవృక్షీయు నాశ్రయించి, యిట్ల యడిగిన నమ్మనుజపతికి నమ్మునిపతి సెప్పిన వాక్యంబులు సెప్పెద విను మని యక్కురుపితామహుం డిట్లనియె. 26**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; శంతను పుత్రుతోన్= భీష్ముడితో; అజాతశత్రుండు= ధర్మరాజు; నిజపరివార= సొంతపరిజనంయొక్క; దోషంబునన్+ఐనన్= తప్పిదంవలన అయితేనేమి; పరులచేతన్+ఏనియున్= ఇతరుల వలన అయితేనేమి;

సంపద= రాజ్యసంపత్తి; చెడుటన్= కోల్పోవటంచేత; ఆపదన్= కష్టాన్ని; పొరసిన= పొందిన; ధరణీ+ఈశుండు= రాజు; నెఱ+వగన్= ఎక్కువ దుఃఖాన్ని; ఏ విధంబునన్= ఎట్లా; పాపికొనున్?= పోగొట్టుకొంటాడు; ఎఱింగింపుము= తెలియచెప్పుము; అనుటయున్= అనగానే; తొల్లి= ఆనాడు (అపు డెప్పుడో); కోసలపతి+ఐన= కోసలదేశం రాజైన; క్షేమదర్శి= క్షేమదర్శి అనేవాడు; విదేహపతిచేతన్= విదేహదేశపు రాజుచేత; భూమిన్= రాజ్యాన్ని; కోల్పోయి= పోగొట్టుకొని; వగన్+పొంది= విచారించి (బాధపడి); మున్ను= మునుపు; తనకున్= తనకు; మంత్రిఐ+ఉండి= మంత్రిగా ఉండి; తాను రాజ్యంబు చేయుచున్+ఉండన్= తాను పరిపాలిస్తుండగా; పరమ= మిక్కిలి; శాంతిన్+ఒంది= ఓర్పు వహించి; వనంబునకున్= అడవిలోనికి; చనిన= వెళ్ళిన; కాలకవృక్షీయున్= కాలకవృక్షీయుడిని; ఆశ్రయించి= నీడన ఉండి; ఇట్లు= ఇట్లా; అడిగినన్= అడుగగా; ఆ మనుజపతికిన్= ఆ రాజుకు; ఆ+మునిపతి= ఆ మునిరాజు; చెప్పిన= ఆడిన; వాక్యంబులు= మాటలు; చెప్పెదన్= చెప్పుతాను; వినుము+అని= వినవలసినదని; ఆ కురుపితామహుండు= ఆ కురువంశీయుల తాత భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడితో ధర్మరాజు 'సొంత బలగంవలననో ఇతరులవలననో రాజ్యం కూలిపోయి అగచాట్లు పడే రాజు తన బాధను ఎట్లా దిగమింగుకొనాలో చెప్పవలసింది' అనగానే 'కోసలదేశపు రాజు క్షేమదర్శి విదేహదేశపు రాజు చేతిలో రాజ్యాన్ని పోగొట్టుకొని చాలా వెత పొందాడు. ఇంతకు మునుపు తాను పరిపాలించేటప్పుడు మంత్రిగా ఉండి, అడవులలోనికి వెళ్ళిన కాలకవృక్షీయుడి నీడపట్టున చేరి, నీ వడిగినట్లే అడిగాడు. ఆ రాజునకు ఆ ముని చెప్పిన విషయాలే నీకు వినిపిస్తాను. ఆలకించుము అని భీష్ముడు ఇట్లా అన్నాడు.

**తే.** **అర్థవంతుఁడై భోగంబు లనుభవించు । చున్నయప్పుడ యిది యిట్టులుండనేర;**
**దస్థిరమ; తాను లోనుగానని యెఱుంగు । నతఁడు వగఁబొందఁ డేది యెట్లైన నధిప!** **27**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! అర్థవంతుఁడు+ఐ= ధనవంతుడై; భోగంబులు= సుఖాలు; అనుభవించుచున్+ఉన్న+అపుడు+అ= పొందుతున్న సమయంలోనే; అది= ఆ ధనం; ఇట్టులు= ఈ తీరులో; ఉండన్+ఏరదు= ఉండదు; అస్థిరమ= నిలకడలేనిది; తాను= తనకు తానుగా (నాకు నేనుగా); లోనుగాను= లోబడను; అని ఎఱుంగు+అతఁడు= అని తెలిసికొనేవాడు; ఏది ఎట్లు+ఐనన్= ఏది ఎట్లా జరిగినా; వగన్ పొందఁడు= బాధనొందడు (విచారించడు).

**తాత్పర్యం:** ఓ కోసలరాజా! బాగా డబ్బుండి సమస్త సుఖాలూ అనుభవించేటప్పుడు 'డబ్బు ఎపుడూ ఇట్లాగే ఉండదు. అనిత్యమైనది. దానికి నేను బానిసను కాకూడదు' అని అనుకొనే రాజునకు ఏది ఎట్లా జరిగినా అంటే డబ్బు ఉన్నా పోయినా చీకూ చింతా ఉండదు.

**క.** **కానియటు లుండి నెఱిఁ బడు; । నైన తెఱఁగు దోఁచి మాయమగు; నిబ్భంగిన్**
**మానసమున కుబ్బు వగయుఁ । దే నోపుం బనులు; బుధుఁడు దేలఁడు రెంటన్.** **28**

**ప్రతిపదార్థం:** పనులు= కార్యాలు; కాని అటులు+ఉండి= కావేమో అన్నట్లు ఉండి; నెఱిన్+పడున్= సిద్ధిస్తాయి; ఐన తెఱఁగు తోఁచి= పని ఫలిస్తుందేమో అనేటట్లు కనబడి; మాయము+అగున్= కాకపోవచ్చును; ఈ భంగిన్= ఇట్లా; మానసమునకున్= మనస్సునకు; ఉబ్బున్= సంతోషాన్ని; వగయున్= దుఃఖాన్ని; తేన్+ఓపున్= తెచ్చిపెట్టగలవు; బుధుఁడు= పండితుడు; రెంటన్= సుఖదుఃఖాలు రెంటి విషయంలోనూ; తేలఁడు= పైకి తేలడు.

**తాత్పర్యం:** ఒకొక్కపని కాదేమో అనిపించి చటుక్కున నెరవేరుతుంది. ఒకొక్కపని అయితీరుతుం దనిపించి కాకపోవచ్చును. పని ఫలిస్తే మనస్సుకు సంతోషాన్నీ, ఫలించనపుడు విచారాన్నీ కలిగిస్తుంది. మంచీ చెడ్డా తెలిసినవాడు మాత్రం ఈ రెంటి విషయంలోనూ ఎక్కడా బయటపడడు.

**విశేషం:** అలం: యథాసంఖ్యం.

**క. జననీజనకులును సుహృ । జ్జనులును దెగునపుడు గావఁ జనమి దెలియదే
ధనములు వారల కంటెనె । మనుజేశ్వర! వగపు వాని మగిడించునొకో! 29**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= రాజా!; జననీ జనకులును= తల్లిదండ్రులును; సుహృద్+జనులును= స్నేహితులు; తెగు+అపుడు= చచ్చిపోయేటప్పుడు; కావన్+చనమి= కాపాడుకొనలేకపోవటం; తెలియదే?= తెలియదా?; ధనములు= సంపదలు; వారలకంటెన్+ఏ= ఆ తల్లిదండ్రులు మొదలైన వారికంటే ఎక్కువా; వగపు= దుఃఖం; వానిన్= వారిని; మగిడించు+ఒకొ!= మళ్ళిస్తుందా ఏమి? మళ్ళించదు.

**తాత్పర్యం:** ఓ రాజా! చనిపోతున్న తల్లిదండ్రులను ఆప్తులను కాపాడుకొనలేమని తెలిసినపుడు ధనాన్ని ఎట్లా రక్షించుకొనగలం? డబ్బు వారికంటె గొప్పదా? బాధపడినందువలన వారిని తిరిగిపొందలేం. (అశాశ్వతమైన వాటిని గూర్చి వగచి ప్రయోజనంలే దని పిండితార్థం).

**క. గతమునకును వగవ కనా । గతమునకును నోరుదెఱచి కడుఁ గోరక దీ
నతఁ బొందక దైవం బే । గతిఁ బుచ్చిన దానఁ బోదుఁ గా కనవలయున్. 30**

**ప్రతిపదార్థం:** గతమునకును= జరిగిపోయినదానికి; వగవక= విచారించక; అనాగతమునకును= రాబోయే దానినిగూర్చి; నోరు+తెఱచి= ఆశపెట్టుకొని; కడున్+కోరక= ఎక్కువ ఆపేక్షించకుండా; దీనతన్= దీనావస్థను; పొందక= చెందక; దైవంబు= విధి; ఏ గతిన్= ఏ తీరున; పుచ్చినన్= ఆదేశిస్తే; దానన్= దానితో; పోదున్+కాక= నడచుకుంటాను గాక; అనన్ వలయున్= అని అనుకోవాలి.

**తాత్పర్యం:** అయిపోయినదానిని గూర్చి విచారించి ప్రయోజనం లేదు. కాబోయే వాటిని గూర్చి ఆశ పనికిరాదు. దైన్యాన్ని దరిదాపులకు రానీయరాదు. దైవం ఎట్లా నడిపిస్తే అట్లా నడవక తప్పదు - అనే నిశ్చయానికి రావాలి.

**క. వెరవును లావును గలిగిన । పురుషులు లే రెట్లు లోకమున; నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె? యని వగఁ । బొరయఁడు ధీరుండు కలిమి పోకకు నధిపా! 31**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; వెరవును= యుక్తినీ; లావును= శక్తినీ; కల్గిన= కలిగి ఉన్న; పురుషులు= మనుష్యులు; లోకమునన్= ప్రపంచంలో; ఎట్లున్ లేరు= ఎట్లాగైనా ఉండకపోరు; ఏ+వారికిన్= ఎవరికైనా; సిరి= సంపద; శాశ్వతంబె?= నికరమా?; అని= అనుకొని; కలిమి పోకకున్= సిరి తరిగిపోయినందుకు; వగన్= విచారాన్ని; ధీరుండు= ధైర్యం కలవాడు; పొరయఁడు= పొందడు.

**తాత్పర్యం:** ఓ రాజా! లోకంలోని మానవులంతా శక్తియుక్తులు కలిగినవాళ్ళే. వాళ్ళకంతా ఐశ్వర్యం స్థిరంగా అట్లాగే ఉన్నదా! అనుకొని సంపద పోయినందుకు విచారించకుండా గుండె దిటవు కలవాడు ఏ మాత్రం చింతించడు. (లోకంలోని వాళ్ళంతా ధనాన్ని రాజ్యాన్ని విడిచి వెళ్ళిన వాళ్ళేకదా అని తాత్పర్యం).

**క. సారపుసిరి చేటు నరుఁడు । గోరకయే వచ్చునట్లు కోరక యుండన్
శ్రీరాక గలుగు దైవము । కారుణ్యము గలిగెనేని గాఢవివేకా! 32**

**ప్రతిపదార్థం:** గాఢవివేకా!= బుద్ధిమంతుడవైన ఓ కోసలరాజా!; సారపుసిరి= ఎక్కువైన సంపదలు; చేటు= నశించటం; నరుఁడు= మానవుడు; కోరకయే= కోరకుండానే; వచ్చున్= వస్తుంది (కలుగుతుంది); అట్లు= ఆవిధంగా; కోరక+ఉండన్= కోరుకోకుండానే; దైవము= భగవంతుడి; కారుణ్యము= దయ; కలిగెన్+ఏని= కలిగినట్లైతే; శ్రీరాక= సంపదలు సిద్ధించటం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ కోసలరాజా! మనిషి తన సంపదలు సర్వనాశనం కావాలని కోరుకొనకుండానే తుడిచిపెట్టుకుపోతున్నాయి. ధనం పొందాలని ఆశించకుండానే దేవుడిదయవలన వచ్చిపడుతున్నాయి. (డబ్బు రావటం పోవటం అనేది మనిషి చేతిలో లేదని భావం).

**క. సిరివిడుచును బురుషుని విను। పురుషుఁడు సిరిఁ దొరఁగు నిది యపూర్వమె ఫల మూ**
**లరతుండై వాఙ్నియతిం। బొరసియునికి యట్టి చోటఁ బురుషున కమరున్. 33**

**ప్రతిపదార్థం:** విను= వినవలసింది; సిరి= సంపద; పురుషుని= మనిషిని; విడుచును= వదలి పెట్టుతుంది; పురుషుఁడు= మానవుడు; సిరిన్= లక్ష్మిని; తొరఁగున్= విడుచును; ఇది= ఇట్లా జరగటం; అపూర్వమె= కొత్తకాదు కదా!; అట్టిచోటన్= అట్లాంటి సమయాలలో; ఫలమూలరతుండు+ఐ= ప్రయోజనాన్ని ఆశించినవాడై; వాక్+నియతిన్ పొరసి= మాటను కట్టడి చేసికొని; ఉనికి= ఉండటం; పురుషునకున్= మానవుడికి; అమరున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** మనిషి డబ్బును వదలవచ్చును. డబ్బూ మనిషినుండి తొలగిపోవచ్చును. ఇది సర్వసామాన్యమే! ఇట్లాంటి దేమైనా జరిగినప్పుడు మంచి ఫలితాన్ని కోరుకుంటూ మాట్లాడకుండా మౌనంగా ఉండటం ఒప్పిదం అయినపని.

**క. కలఁగిన పెద్దమడువు విను। తెలివిఁ బొరయునట్లు దానధీరుం డ ట్ల**
**గ్గలము లయిన దురితంబులఁ। గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌరవ మొప్పన్.' 34**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించవలసింది; కలఁగిన= కలతపడిన; పెద్దమడువు= పెద్దచెరువు; తాన= తనంతట తానుగా; ఎట్లు= ఏ విధంగా; తెలివిన్+పొరయున్= తేరుకుంటుందో; అట్లు= ఆ విధంగా; ధీరుండు= ధైర్యంకలవాడు; అగ్గలములు+అయిన= ఎక్కువగా కలిగిన; దురితంబులన్= పాపాలచేత; కలఁగియున్= కలతపడీ; గౌరవము= ఆదరువు; ఒప్పన్= కలిగే విధంగా; తన+అంతన్= తనకుతానే; తేఱున్= తేరుకుంటాడు.

**తాత్పర్యం:** పెద్ద మడుగులోని నీళ్ళు కలకబారినా మళ్ళీ కాసేపటికి ఎట్లా తేటపడతాయో ఆ విధంగానే గుండె దిటవు కలవాడు తాను చేసిన పాపాలకు కలవరపడినా తనకు తానుగానే తెప్పరిల్లుతాడు.'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని చెప్పి 'యిది యుపశమన ప్రకారంబు; నీతి యెఱింగించెద; నాకర్ణింపు' మనుటయు నమ్మునివరుతో నమ్మనుజవరుండు 'మహాత్మా! నిన్నుఁ జేరి యేను దురితంబులం దొలంగవలదె? యానతి' మ్మనిన నతం డతని కిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** ఇది ఉపశమన ప్రకారంబు= ఇది బాధను నిమ్మళించుకొనే పద్ధతి; అని చెప్పి= అని చెప్పి; నీతి= రాజధర్మాన్ని; ఎఱింగించెదన్= తెలుపుతాను; ఆకర్ణింపుము= వినుము; అనుటయున్= అనటంతోనే; ఆ+మునివరుతోన్= ఆ ముని శ్రేష్ఠుడితో; ఆ+మనుజవరుండు= ఆ రాజు; మహాత్మా!= గొప్పవాడా!; నిన్నున్+చేరి= నిన్ను ఆశ్రయించి; ఏను= నేను; దురితంబులన్= పాపాలనుండి; తొలంగ వలదె?= తప్పుకొనవద్దా?; ఆనతి+ఇమ్ము= ఆజ్ఞాపించవలసింది; అనినన్= అనగానే; అతండు= ఆ కాలకవృక్షీయ ముని; అతనికిన్= ఆ రాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఇది బాధను తగ్గించుకొనే తీరు. నీతిని గూర్చి చెప్పుతాను ఆలకించుము' - అనగానే ఆ మునితో ఆ రాజు 'ఓ మహానుభావా! నీ అండలో పాపాలను కడుక్కునేందుకు ఆదేశించవలసింది' అని అడగగానే ఆ ముని ఇట్లా అన్నాడు.

**సీ.** **'తద్దయు శాంతుఁడై తక్కువ కోర్చి శ। త్రునిఁ గని యొడఁగూడి మనఁగవలయు;**
**మన్నెరాజుల భూమి మర్దించి సైన్య మ। ల్లన కూర్చి వైరి పైఁ జనఁగవలయుఁ;**
**బ్రబలునిఁ జేరి యారాధించి యాతని। సేనతోడుగ నరిఁ జెఱుపవలయు;**
**విషమున మాంత్రిక విధిఁ బంపుపోటున। నలయక రిపుఁ దెగటార్పవలయుఁ;**

**తే.** **బొంచి భేదంబొనర్చి కలంచియేని। నంగనలఁ గొని వారి మాయలఁ దగిల్చి**
**యైన మఱియును బహువిధోపాయములను। దెగువ డింపక పగతు సాధింప వలయు.'** **36**

**ప్రతిపదార్థం:** తద్దయున్= మిక్కిలి; శాంతుఁడు+ఐ= శాంతం పొంది; తక్కువకున్= చులకన తనానికి; ఓర్చి= ఓర్చుకొని; శత్రునిన్+కని= విరోధిని చూచి; ఒడన్+కూడి= కలిసిమెలసి; మనఁగన్ వలయున్= బ్రతకాలి; మన్నెరాజుల= సామంత రాజుల; భూమిన్= రాజ్యాన్ని; మర్దించి= జయించి; సైన్యమున్= సేనను; అల్లన కూర్చి= మెల్లగా సమకూర్చుకొని; వైరిపైన్= విరోధిపై; చనఁగన్ వలయున్= దండెత్తిపోవాలి; ప్రబలునిన్+చేరి= బలవంతుడి దరిచేరి; ఆరాధించి= సేవించి; ఆతనిసేన తోడుగన్= అతడిసేనల సాయంతో; అరిన్= శత్రువును; చెఱుపన్ వలయున్= నాశనం చేయాలి; విషమునన్= విషంతోనూ; మాంత్రిక విధిన్= గారడీలతోనూ; పంపుపోటునన్= పెట్టుకొన్న పోరుతో; అలయక= శ్రమపడక; రిపున్= శత్రువును; తెగటార్పన్ వలయున్= చంపాలి (నూకలు చెల్లించాలి); పొంచి= వేచి; భేదంబున్+ఒనర్చి= ఒకరి కొకరికి పడకుండా చేసి; కలంచి ఏనిన్= కలతపెట్టి అయినా; అంగనలన్+కొని= స్త్రీలను ఆధారంగా చేసికొని; వారి మాయలన్= (ఆడ)వాళ్ళ కపటాలలో; తగిల్చి+ఐనన్= మోహించేటట్లుచేసి అయినా; మఱియును= మళ్ళీ; బహువిధ= అనేక విధాలైన; ఉపాయములను= విరోధిని లొంగదీసికొనే సాధనాలతో; తెగువ= తెంపు; డింపక= వీడక; పగతున్= పగవాడిని; సాధింపన్వలయున్= పోరుపెట్టుకుంటూ ఉండాలి.

**తాత్పర్యం:** రాజు ఎంతో శాంతంగా తన తక్కువతనాన్ని ఓర్చుకుంటూ పగవాడితో కలిసిమెలసి బ్రతకాలి. సామంతరాజుల బలగాన్ని సంతరించుకొని, వాళ్ళ ద్వారా శత్రువు మీద కత్తి దూయాలి. బలవంతులను కొలిచి, వాళ్ళ అండతో శత్రుస్థావరాలను ఆక్రమించాలి. విషం పెట్టి అయినా, గారడీ చేసి అయినా, కయ్యానికి కాలుదువ్వి అయినాసరే, పగవాడిని దుంపనాశనం చేయాలి. వాళ్ళలో వాళ్ళకు పుల్లలు పెట్టి అయినా, ఆడవాళ్ళ మాయలలో పడేసి అయినా ఇంకా ఎన్నో రకాల ఉపాయాలతో అయినా పట్టువదలకుండా శత్రువును పడగొట్టాలి.'

**వ.** **అని చెప్పె నని చెప్పి, గాంగేయుండు వెండియుఁ జెప్పు 'నా కౌసల్యుం డధర్మోపాయ విధాయకంబు లగు నుపాయంబులకుం జొరంజాల ననిన నమ్ముని తద్విరోధి యగు విదేహవిభు రావించి యేకాంతంబున నా క్షేమదర్శిం బేర్కొని నీ వతని రాజ్యంబుగొని యున్నవాఁడ వన్నరపతి యొండుమ్మైఁ గార్యంబు సూచుట యొప్పదు సంధిసేయుమని వెరవు కలిమి నొడంబఱిచి యిరువురకును సంధి యొనర్చి నెయ్యంబు చాటించి వీడుకొల్పినఁ గౌసల్యుం డొడ్డొని చని, యతనికిఁ దనకూఁతు నిచ్చి కరితురగాది వివిధ పదార్థంబు లొసంగి విదేహ జనవల్లభుం డవ్వసుమతీవల్లభుని నిజపురంబున కనిచిపుచ్చె; రాజులకు జయాపజయంబు లనుభావ్యంబులు; మదవిషాదంబు లనాదరణీయంబు' లనవుడు ధర్మనందనుండు 'పరిజనంబులయందు గణంబులైయున్నవారిం బరిపాలించు సమ్యక్ప్రకారంబు సెప్పు'మనుటయు నమ్మహీకాంతునకు శాంతనవుం డిట్లనియె.** **37**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; చెప్పెన్= చెప్పాడు; అని చెప్పి= అని కాలకవృక్షీయముని కోసలరాజునకు తెలియచెప్పాడని చెప్పి; గాంగేయుండు= భీష్ముడు; వెండియున్= మళ్ళీ; చెప్పున్= చెప్పటం మొదలుపెట్టాడు; ఆ కౌసల్యుండు= ఆ క్షేమదర్శి; అధర్మ=

అన్యాయాన్ని; విధాయకంబులు+అగు= ఆచరించేవి అయినట్టి; ఉపాయంబులకున్= పన్నుగడలను గురించి; చొరన్+చాలను= అనుసరించలేను; అనినన్= అనగానే; ఆ+ముని= ఆ కాలకవృక్షీయుడు; తద్+విరోధి+అగు= ఆ రాజు శత్రువు అయిన; విదేహవిభున్= విదేహరాజును; రావించి= రప్పించి; ఏకాంతంబునన్= రహస్యంగా; ఆ క్షేమదర్శిన్= ఆ కోసలరాజును; పేర్కొని= ప్రస్తావించి; నీవు; అతని రాజ్యంబున్= అతడి పాలనా భాగాన్ని; కొని ఉన్నవాఁడవు= ఆక్రమించుకొన్నావు; ఆ+నరపతి= ఆ రాజు; ఒండుమైన్= మరొక కార్యంబు; చూచుట= పని తలపెట్టటం; ఒప్పదు= తగదు; సంధిచేయుము= రాజీచేసికొనుము; అని; వెరవు కలిమిన్= ఉపాయంగా; ఒడంబఱిచి= ఆమోదింపచేసి (ఒప్పించి); ఇరువురకును= ఇద్దరికీ; సంధి ఒనర్చి= పొత్తు కుదిర్చి; నెయ్యంబు=స్నేహాన్ని; పాటించి= కలిగించి; వీడుకొల్పినన్= వీడ్కోలు ఇవ్వగా (సాగనంపగా); కౌసల్యున్= కోసలాధిపతిని;తోడ్కొని= తీసికొని; చని= వెళ్ళి; అతనికిన్= ఆ రాజుకు; తన కూఁతున్= సొంతకూతురిని; ఇచ్చి= వివాహంచేసి; కరి= ఏనుగులు; తురగ+ఆది= గుర్రాలు మొదలైన; వివిధ పదార్థంబులు= అనేక వస్తువులను; ఒసఁగి= ఇచ్చి; విదేహజనవల్లభుండు= విదేహదేశపురాజు; ఆ+వసుమతీ వల్లభునిన్= ఆ రాజును; నిజపురంబునకున్= అతడి సొంత నగరానికి; అనిచిపుచ్చెన్= పంపించాడు; జయ+అపజయంబులు= గెలుపు ఓటములు; అనుభావ్యంబులు= అనుభవించవలసినవే; మద= గర్వం; విషాదంబులు= దుఃఖాలు; అనాదరణీయంబులు= పాటించరానివి; అనవుడున్= అనగానే; ధర్మనందనుండు= ధర్మరాజు; పరిజనంబుల+అందున్= సేవకులలో; గణంబులు+ఐ ఉన్నవారిన్= గుంపుగా కూడి ఉన్నవాళ్ళను; పాలించు= ఏలుకొనే; సమ్యక్‌ప్రకారంబు= మంచి తోవను; చెప్పుము= చెప్పవలసింది; అనుటయున్= అనటంతోనే; ఆ+మహీకాంతునకున్= ఆ ధర్మరాజునకు; శాంతనవుండు= భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా ఆ ముని కోసలరాజుతో శత్రువును తెగటార్చే ఉపాయం తెలిపినా, క్షేమదర్శి 'నేను ఎట్లాంటి అన్యాయానికి ఒడిగట్టను' అనగానే ఆ ముని శత్రురాజైన విదేహరాజును పిలిపించి ఏకాంతంగా క్షేమదర్శిని గూర్చి వివరించి చెప్పి 'రాజా! నీవు క్షేమదర్శి రాజ్యాన్ని స్వాధీనపరచుకున్నావు. ఆ రాజు ఏదో ఒక అడ్డదారిలో రాజ్యాన్ని తిరిగి సంపాదించుకొనటం తగదు. ఇద్దరూ ఒక ఒప్పందానికి రం'డని యుక్తిగా చెప్పి అంగీకరించేటట్లు చేసి, ఇద్దరికీ పొత్తు కలిపి, స్నేహభావంతో సాగనంపాడు. విదేహరాజు ఆ కోసలరాజుతో వియ్యమంది, అరణంగా ఏనుగులూ, గుర్రాలు మొదలైన ఎన్నో వస్తు వాహనాలను ఇచ్చి, కోసలరాజ్యానికి సాదరంగా పంపాడు. అయినా రాజులకు గెలవటం ఓడటం అనేవి అనుభవించదగినవే. గెలుపొందినపుడు గర్వపడటం, ఓడినప్పుడు బాధపడటం మంచిది కాదు' అనగానే ధర్మరాజు 'పరిజనంలోని గణజనులను ఎట్లా ఏలుకొనాలో ఆ తీరులను విశదం చేయండి' అన్నాడు. అప్పుడు భీష్ముడు ఇట్లా అన్నాడు.

### ధర్మరాజునకు భీష్ముండు గణజనులం బాలించు ప్రకారంబు సెప్పుట (సం. 12-108-10)

**క. 'విను మర్థార్జకులును గా। ర్యనిపుణ మానసులు నాయుధాజీవులుఁ ద**
**క్కును గల పనుల జనులుఁ గల। రనఘా! యొక్కిండ్ల వార లైన జనంబుల్. 38**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పుణ్యాత్ముడా!; వినుము= ఆలకించుము; అర్థార్జకులును= డబ్బును వసూలుచేసి కూడబెట్టేవాళ్ళూ; కార్యనిపుణ మానసులున్= పనులను తీర్చిదిద్దే సామర్థ్యం గలవాళ్ళు (మంత్రులు); ఆయుధ+ఆజీవులున్= ఆయుధ ప్రయోగమే జీవనంగా గలవాళ్ళూ (ఆయుధ సైనికులు); తక్కునుగల= మిగతా; పనులన్= పనులను చేసే; జనులున్= పరిజనులూ; ఒక్క ఇండ్ల వారలు+ఐనన్= ఒకే తెగకు చెందిన వాళ్ళైన; జనంబుల్= సామాన్య జనులు; కలరు= ఉంటారు.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! వినుము. కోశాగారం నింపే కోశాధికారులూ, ఎంతో చాకచక్యంగా పనులను చక్కబెట్టే అమాత్యులూ, ఆయుధధారు లైన సైనికులూ, మిగతా పనులు చేసే పరిజనం గణజను లవుతారు. పరిజనులు ఒకే తరగతికి చెందిన సామాన్యులు.

**విశేషం:** గణము= సమూహం - సేనా విశేషం. 27 ఏనుగులు, 51 గుర్రాలు, 135 పదాతులు కలది.

**క. వారు గదాగణములు పతి । వారలతోఁ గలసి మెలఁగువడువున నయ్యై**
**వారి తెఱఁ గెఱుఁగవలయును । వారికి నెమ్మి గలిగించు వలనొదవుటకున్. 39**

**ప్రతిపదార్థం:** వారు+కదా!= వాళ్ళే కదా!; గణములు= సంఘంలోని జనులు; పతి= రాజు; వారలతోన్+కలసి= వాళ్ళల్లో ఒకడుగా కలసిపోయి; మెలఁగు వడువునన్= మసలుకొనే తీరున; వారికిన్= ఆ గణాలకు; నెమ్మి= శుభం; కలిగించు= ఒనగూర్చే; వలను= ఉపాయం; ఒదవుటకున్= సిద్ధంచేయటానికి; ఆ+ఆ+వారి= ఆయా వాళ్ళ; తెఱఁగు= తీరు; ఎఱుఁగవలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** వాళ్ళనే 'గణజనులు' అంటారు. రాజు వీళ్ళతో కలసి మెలగుతున్నట్లు ఉండాలి. వాళ్ళకు శుభం కలిగించే ఉపాయాన్ని సిద్ధింపచేయటానికి ఆయా వాళ్ళ తీరులను తెలిసికొనాలి.

**సీ. కుల మొక్కఁడైనఁ దేఁకువలేక బుద్ధియు । శౌర్యంబుఁ బెంపును సరకుగొనక**
**యెట్టివారలతోడ నెవ్వరైనను మత్స । రంబు గల్గుదురు గణంబు జనులు**
**దాన నంతర్భేదమైన శత్రులు వాపి । కొండ్రు గొందఱ నది గ్రొచ్చు రాజ్య**
**మూలంబుఁ గావున మున్ను భూపాలుండు । వారినందఱఁ దగు వచన రచన**

**తే. నీగి మన్ననఁ గలఁగంగనీక పొదివి । యధికముగ గణముఖ్యుల నాదరించి**
**పనులు గొనునది తమలోనఁ బాయకుండఁ । బ్రోవు లెడలిన రాజ్యంబు పొలుపు దప్పు. 40**

**ప్రతిపదార్థం:** గణంబు= సంఘంలోని; జనులు= పరిజనులు; కులము+ఒక్కఁడు+ఐనన్= ఒకే జాతికి చెందిన వాళ్ళైనా; తేఁకువ లేక= ఉచితానుచితాలు తెలిసికొనకుండా; బుద్ధియున్= వివేకాన్ని; శౌర్యంబున్= పరాక్రమాన్ని; పెంపును= గౌరవాన్ని; సరకుగొనక= లెక్క చేయక; ఎట్టి వారలతోడన్= ఎట్లాంటి వాళ్ళతో అయినా; ఎవ్వరు+ఐనను= ఎట్లాంటి వాళ్ళైనా; మత్సరంబు కల్గుదురు= ద్వేషం పెట్టుకొంటారు; దానన్= అందువలన; అంతర్భేదము+ఐనన్= వాళ్ళల్లో వాళ్ళకు మనస్పర్ధలు ఏర్పడితే; శత్రులు= ఎదుటి పక్షంవాళ్ళు; కొందఱన్= కొంతమందిని; పాపికొండ్రు= తమలోకి లాగుకొంటారు; అది= విడిపోవటం అనేది; రాజ్యమూలంబున్= మూలరాజ్యాన్నే; గ్రొచ్చున్= పెకలిస్తుంది; కానన్= కాబట్టి; మున్ను= ముందుగానే; భూపాలుండు= రాజు; వారిన్+అందఱన్= వాళ్ళందరిని; తగు= ఉచితం అయిన; వచనరచనన్= మాటల మూటలతోను (సల్లాపాలతో); ఈగి= దానాలతోనూ; మన్ననన్= ఆదరణలతోనూ; కలగంగన్+ఈక= కలత చెందనీక; పొదివి= పట్టి; అధికముగన్= ఎక్కువగా; గణముఖ్యులన్= సంఘ ప్రధానులను; ఆదరించి= మన్నించి (గౌరవించి); పనులుకొనునది= పనులు తీర్చుకొనాలి; తమలోనన్= తమలో తాము; పాయక+ఉండన్= చీలకుండా; ప్రోవులు= గణాలు; ఎడలినన్= వీడిపోతే; రాజ్యంబు= రాజ్యం; పొలుపుతప్పున్= సొంపే పోతుంది.

**తాత్పర్యం:** ఈ గణం జనులు ఒక తెగకు చెందిన వాళ్ళే అయినా మంచి చెడ్డలు లేని వాళ్ళై, వాళ్ళ వాళ్ళ తెలివిని పౌరుషాన్ని, గొప్పతనాన్నిగూర్చి లెక్కపెట్టరు. అందువలన ఎట్లాంటి వాళ్ళతో అయినాసరే విరోధం పెట్టుకొంటారు. ఈ కారణంగా లోపల లోపల విభేదాలు వస్తాయి. ఇది ఆసరా చేసికొని శత్రువులు చేరదీస్తారు. గణజనంలో ఇట్లాంటి మనస్పర్థలు ఏర్పడితే మూలగద్దెకే ముప్పు వస్తుంది. కాబట్టి ఇదంతా రాకముందే వాళ్ళందరిని రాజు మంచి మాటలు చెప్పి, దానధర్మాలు చేసి, గౌరవించి ఆదరించాలి. వాళ్ళలో వాళ్ళు విడిపోకుండా చూచుకొంటూ పనులు చక్కదిద్దుకొనాలి. చీలికలు వస్తే మాత్రం (మొదటికే మోసం వస్తుంది) రాజ్యం కుప్పకూలిపోతుంది.

**క. ఎక్కార్యములను గణజను। లొక్కటి యై మెలఁగుచున్న నుర్వీశునకున్**
**మిక్కిలి సిరియగుఁ గావునఁ। దక్కక యరయంగవలయుఁ దగ గణవిధముల్.' 41**

**ప్రతిపదార్థం:** ఏ+కార్యములను= ఏ పనులను గురించి అయినా; గణజనులు= గుంపులోని వాళ్ళు; ఒక్కటి+ఐ= ఒకమాటమీద; మెలఁగుచున్+ఉన్నన్= ఉంటుంటే; ఉర్వీ+ఈశునకున్= రాజునకు; మిక్కిలి= ఎక్కువగా; సిరి+అగున్= సంపదలు కలుగుతాయి; కావునన్= కాబట్టి; తగన్= ఒప్పేటట్లు; గణ విధముల్= సంఘ పరిజనుల పద్ధతులు; తల+కొని= పూనుకొని; అరయంగన్ వలయున్= గమనించుకొనాలి.

**తాత్పర్యం:** ప్రతి పనిలోనూ గణజనులంతా ఒక్కటిగా ఉంటే ఆ రాజు రాజ్యంలో సిరి తాండవిస్తుంది. కనుక గణవిధానాన్ని పని పెట్టుకొని శ్రద్ధగా పరిశీలించుకొంటూ ఉండాలి'.

### ధర్మరాజునకు భీష్ముండు ధర్మసూక్ష్మత తెలం గెలింగించుట (సం. 12-109-3)

**వ. అనుటయు ధర్మజుండు 'ధర్మంబులు బహుశాఖలు గలిగియుండు; నన్నియు ననుష్ఠింపవచ్చునే? యెయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు?'ననిన మందాకినీనందనుం డతని కిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని మాటాడగానే; ధర్మజుండు= ధర్మరాజు; ధర్మంబులు= పుణ్యాచారాలు; బహుశాఖలు= అనేక విధాలుగా; కలిగి ఉండున్= ఉంటాయి; అన్నియున్= అన్ని; అనుష్ఠింపన్ వచ్చునే?= ఆచరించ వీలవుతుందా?; ఏ+అది= ఏ ధర్మాన్ని; ఆచరించి= చేసి; పురుషుండు= మానవుడు; ఐహిక= ఈ లోకానికి సంబంధించిన; ఆముష్మిక= పై లోకానికి సంబంధించిన; సుఖంబులన్= సౌఖ్యాలను; పొందున్?= అనుభవిస్తాడు?; అనినన్= అనగానే; మందాకినీ నందనుండు= గంగాదేవి పుత్రు డైన భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని అనటంతోనే ధర్మరాజు 'ధర్మాలు ఎన్నో రూపాలలో ఉన్నాయి కదా! వాటన్నిటిని ఆచరించటం సాధ్యం కాదు. కనుక ఏ ధర్మాన్ని ఆచరిస్తే మానవుడు ఈ లోకంలోనూ పై లోకంలోనూ హాయిగా ఉండగలుగుతాడు?' అని అడగగానే భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**సీ. 'విను తల్లియును దండ్రియును గురుండును సేవ। నీయులు సద్భక్తి నిత్యనిరతి**
**వారలఁ గొలుచుచు వా రెద్ది సెప్పిన। నది యాచరించుట యధిక ధర్మ;**
**మాగమత్రయమును నగ్నిత్రయంబు లోక। త్రయంబును దేవతాత్రయంబు**
**ననువస్తువులు వార లందును జనని గౌ। రవమున నెక్కుడు రాజవర్య!**

**తే. యీ జగంబున దివమునం బూజ వడయు। మాతృభక్తుండు పితృభక్తి మానసుండు**
**నట్ల యవ్యయానందసంప్రాపణంబు। గురు పదాబ్జ సమారాధకుండుఁ గాంచు. 43**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= రాజులలో కెల్ల గొప్పవాడా!; విను= వినుము; ఆగమత్రయమునున్= ఋగ్యజుస్సామ వేదాలు మూడూ; అగ్నిత్రయంబు= ఆహవనీయ, దాక్షిణాత్య, గార్హపత్యాగ్నులు మూడూ; లోకత్రయంబును= స్వర్గ, మర్త్య, పాతాళలోకాలు మూడూ; దేవతాత్రయంబున్= బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ; అను వస్తువులు= అనే పదార్థాల వంటి వారు అయిన; తల్లియును= కన్నతల్లీ; తండ్రియును= తండ్రి; గురుండును= గురువూ; సేవనీయులు= కొలవదగ్గవారు; సత్+భక్తిన్= మేలైన భక్తితో; నిత్యనిరతిన్= ఎంతో ఆసక్తితో; వారలన్= వారందరినీ; కొలుచుచున్= సేవిస్తూ; వారు= వాళ్ళు; ఎద్ది= ఏది; చెప్పినన్= చెప్పినా;

అది= ఆ ధర్మాన్ని; ఆచరించుట= ఆచరణలో పెట్టటం; అధిక ధర్మము= గొప్పధర్మం; వారలందును= వారందరిలోకూడా; జనని= తల్లి; గౌరవమునన్= గొప్పతనంలో; ఎక్కుడు= అధికం; ఈ జగంబునన్= ఈ లోకంలోను; దివమునన్= స్వర్గలోకంలోనూ; మాతృభక్తుండు= తల్లిమీద ఆదరం కలవాడు; పితృభక్తి మానసుండు= తండ్రిమీద భక్తి భావం కలవాడు; పూజ పడయున్= ఆదరించబడతాడు; అట్లు= అట్లాగే; గురుపదాబ్జ సమారాధకుండు= గురుపాదసేవకుడు కూడా; అవ్యయ+ఆనంద సంప్రాపణంబున్= బ్రహ్మానంద సంప్రాప్తిని; కాంచున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. తల్లీ, తండ్రీ, గురువూ ఈ ముగ్గురూ నిత్యం సేవించవలసినవారు. ఎంతో భక్తితో వాళ్ళకు సేవలందిస్తూ వా రేది చెప్పితే దానిని ఆచరణలో పెట్టటం ఉత్తమ ధర్మం. ఈ ముగ్గురూ వేదత్రయం వంటివారు. త్రేతాగ్నులవంటివారు, ముల్లోకాలవంటివారు, త్రిమూర్తులవంటి వారు, వీరిలో తల్లికే ఎక్కువ గౌరవం. తల్లిదండ్రులమీద అభిమానం కలవాడు ఇహపరలోకాలలో గౌరవించబడతాడు. గురువును సేవించుకొనేవాడు అవ్యయానందాన్ని పొందుతాడు.

**వ. అనవుడు నజాతశత్రుండు గంగాపుత్రునితో 'సత్యానృతంబులు జగంబులం బరఁగియుండుఁ బురుషుండు వానియెడ నెబ్భంగివాఁడై ధర్మపరుం డగు?' నని యడిగిన నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె. 44**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనటంతోనే; అజాతశత్రుండు= ధర్మరాజు; గంగాపుత్రునితోన్= భీష్ముడితో; సత్య+అనృతంబులు= నిజం, అబద్ధాలు; జగంబులన్= ముల్లోకాలలో; పరగి ఉండున్= ఒప్పి ఉంటాయి; పురుషుండు= మానవుడు; వానిఎడన్= వాటి విషయంలో; ఏ+భంగి వాఁడై= ఏ విధం అనుసరించేవాడై; వాడు+ఐ= తనకు తానై; ధర్మపరుండు+అగున్?= ధర్మానికి కట్టుబడి ఉంటాడు?; అని+అడిగినన్= అని అడుగగా; ఆ+మహీపతికిన్= ఆ రాజుతో; ఆ మహాత్ముండు= ఆ భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడిని 'లోకంలో నిజానిజాలు సిద్ధమై ఉన్నాయి కదా! వాటి విషయంలో మనిషి తనకు తానుగా ఏ విధంగా ధర్మానికి బద్ధుడై ఉండాలో చెప్పు'మనగానే భీష్ముడు ఈ విధంగా చెప్పసాగాడు.

**సీ. 'సత్యంబు వలుకుట సర్వధర్మములకు । మిక్కిలి; యనృతంబు మేటి పాత**
**కము; తద్విశేషంబు గలదు చెప్పెద; నొరు । నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ**
**జూచు; పాతకులతో సూనృతం బాడుట । పాపంబు బొంకులు వలికి యట్టి**
**వారి హింసించుట వరధర్మ మిది యొక్కఁ । డేల భూతములకు హితము సేయు**

**తే. బొంకు లెల్లను ధర్మముల్ భూత బాధ । కంబు లగు నిక్కములు పాతకములు వినుము!**
**భూతముల దుష్ట శిష్టత్వములు వివేక । సూక్ష్మతా వేద్యములు వానిఁ జూడవలయు. 45**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; సర్వధర్మములకున్= అన్ని పుణ్యాలకంటె; సత్యంబు= నిజం; పలుకుట= చెప్పటం; మిక్కిలి= ఎక్కువ; అనృతంబు= అబద్ధం ఆడటం; మేటిపాతకము= ఎంతో పాపం; తద్= దాని విషయంలో (పాపపుణ్యాల విషయంలో); విశేషంబు= చెప్పుకొనవలసింది; కలదు= ఉన్నది; చెప్పెదన్= చెప్పుతాను; ఒరున్= ఇంకొకడి; అర్థంబున్= సొమ్మును; ప్రాణంబున్= ఉసురును; అపహరింపన్+చూచు= దోచుకొనాలనుకునే; పాతకులతోన్= పాపులతో; సూనృతంబు= నిజాన్ని; ఆడుట= పలకటం; పాపంబు= కీడు; బొంకులు+పలికి= అబద్ధాలు ఆడి; అట్టివారిన్= అట్లాంటి వాళ్ళను; హింసించుట= నొప్పించటం; వరధర్మము= మంచి పుణ్యం; ఇది+ఒక్కఁడు+ఏల= ఇదొక్కటే కాదు; భూతములకున్= జీవులకు; హితము చేయు= మేలుచేసే; బొంకులు= అబద్ధాలు; ఎల్లనుధర్మముల్= అన్నీ ధర్మాలు (అవుతాయి); భూత బాధకంబులు+అగు= జీవులను దుఃఖపెట్టేవి అయిన;

నిక్కములు= నిజాలు; పాతకములు= పాపాలు (అవుతాయి); భూతములన్= ప్రాణులలోని; దుష్టశిష్టత్వముల్= చెడూ, మంచీ; వివేక సూక్ష్మతా; వేద్యములు= అతిసూక్ష్మం (అల్పాల్పం) అయిన బుద్ధివలన తెలిసికొనదగినవి; వానిన్ చూడవలయున్= వాటిని జాగ్రత్తగా చూడాలి.

**తాత్పర్యం:** అయితే వినుము. ధర్మాలలోకెల్లా ఉత్తమమైన ధర్మం నిజం చెప్పటం. పాపాలలోకెల్ల మహాపాపం అబద్ధాలాడటం. ఈ రెంటి విషయంగా చెప్పుకొనదగ్గది ఒకటి ఉన్నది చెపుతాను. పరాయివాడి సొమ్మునూ, ఉసురునూ దోచుకొనాలనుకొనే పాపులతో నిజం చెప్పటం కన్నా, చేటు మరొకటి ఉండదు. అబద్ధాలు ఆడైనా సరే అటువంటి వారిని బాధించటం ఎంతో న్యాయం. ఇదే కాదు ప్రజలకు మేలు కలిగించే అబద్ధాలన్నీ పుణ్యాలు (ధర్మాలు) అవుతాయి. సాటి జీవులను వేధించే సత్యాలన్నీ పాపా(అధర్మా)లవుతాయి. అందరిలోను ఉన్న మంచీ చెడూ అనేవి అతిసూక్ష్మమైన వివేకంతో తెలిసికొనాలి.

### పాపనిస్తరణ ప్రకారము (సం. 12-111-2)

**వ. అనినం గౌంతేయాగ్రజుం 'డెట్టివారు దురితంబులు నిస్తరింపనేర్తు?'రని యడిగిన సురనదీసూనుం డిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; కౌంతేయ+అగ్రజుండు= కుంతి పెద్దకుమారుడు - ధర్మరాజు; ఎట్టివారు= ఎట్లాంటివారు; దురితంబులు= పాపాలు; నిస్తరింపన్+నేర్తురు= నెట్టుకొనగలరు; అని+అడిగినన్= అని అడుగగా; సురనదీసూనుండు= దేవనది పుత్రుడైన భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పగానే ధర్మరాజు 'ఎట్లాంటి వారు తమ పాపాలను దాటగలరు?' అనగానే భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**సీ. 'వర్ణాశ్రమాచారవంతులు నవిషయా । సక్తులుఁ బ్రతికారశక్తు లయ్యుఁ**
**దిట్టాటవడి సైఁచు ధీరు లుదారులు । నతిథి పూజకులు నధ్యయనరతులు**
**నగ్నిహోత్రపరులు నాజిఁ బిఱిందికి । నడుగు వెట్టక తెగి నడచువారు**
**సత్యవాదులు సాధుజన పోషకులు సర్వ । దేవతా సములు నై భావ మెందు**

**తే. నిలిచె నమ్మూర్తి భక్తిమైఁ గొలుచువారు । దురిత దుర్గముల్ నిస్తరింతురు పురాణ**
**పురుషుఁ డవిచింత్యుఁ డచలుండు పుండరీక । లోచనుండు సద్భక్తులఁ గాచు నధిప! 47**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వర్ణ+ఆశ్రమ+ఆచారవంతులున్= వర్ణాశ్రమ ధర్మాన్ని పాటించేవారు; అవిషయ+ఆసక్తులున్= ఇంద్రియ విషయాల్లో ఆసక్తి కనబరచని వారు; ప్రతికారశక్తులు++అయ్యున్= తిరిగి ఎదుర్కొనగల సామర్థ్యం కలిగి ఉన్నా; తిట్టాట+పడి= నిందలు పొంది; సైఁచు= భరించే; ధీరులు= దిట్టతనం కలవారు; ఉదారులున్= ఔదార్యం కలవారు; అతిథి పూజకులున్= ఇంటికి వచ్చిన వారిని మర్యాదగా చూచేవారు; అధ్యయన= వేదాలు వల్లించటంలో; రతులున్= ఆసక్తి కలవారూ; అగ్నిహోత్రపరులున్= హోమం వేల్చటమంటే ఇష్టపడే వారూ; ఆజిన్= యుద్ధంలో; పిఱిందికిన్= వెనక్కి; అడుగు పెట్టక= తిరగక; తెగి= సాహసించి; నడుచువారు= ముందుకు వెళ్ళేవారు; సత్యవాదులు= అబద్ధాలు ఆడని వారూ; సాధుజన పోషకులు= మంచివారిని పోషించే వారూ; సర్వదేవతాసములును= అంతమంది దేవతలపట్ల సమభావం (సమానత్వం) కలవారునూ; ఐ= అయి; భావము= ఆలోచన; ఎందున్= ఎక్కడ; నిలిచెన్= ఉంటుందో; ఆ+మూర్తిన్= ఆ రూపాన్ని; భక్తిమైన్= భక్తితో; కొలుచువారు= సేవించేవారునూ;

దురిత= పాపాలనే; దుర్గముల్= మిట్టలను; నిస్తరింతురు= దాటగలుగుతారు; పురాణపురుషుఁడు= ఆదిపురుషుడును; అవిచింత్యుఁడు= ఆలోచనల కందనివాడునూ; అచలుండు= శాశ్వతమైన వాడునూ; పుండరీకలోచనుండు= తెల్లతామరలవంటి కళ్ళు కలవాడునూ అయిన విష్ణువు; సద్భక్తులన్= ఉత్తమ భక్తులను; కాచున్= రక్షిస్తాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వర్ణాశ్రమ ఆచార నియమాలను పాటించేవారు, ఇంద్రియ నిగ్రహం కలవారు, నిందించగా నిందించనివారు, ఉదారగుణం కలవారు, అతిథులను ఆదరించేవారు, వేదాలు వల్లించేవారు, యుద్ధంలో తెగించి పోరాడేవారు, ఏ దేవతల నైనా ఒకేవిధంగా చూస్తూ మనసుకు నచ్చిన రూపాన్ని కొలిచేవారు, పాపం అనే మిట్టలను అనాయాసంగా దాటగలుగుతారు. ఆది పరమేశ్వరుడు, ఆలోచనాతీతుడు, చంచలభావం లేనివాడూ, పద్మాక్షుడు అయిన విష్ణువు భాగవతోత్తముడిని సదా కాపాడుతూనే ఉంటాడు.

**క. విను మగ్గోవిందుఁడు సఖుఁ । డును బంధుఁడుఁ గార్యకర్మఁరుఁడు నై నిన్నుం**
**గొనియాడుచుండ దురితం । బను పేరును గలదె నీకు నసఘచరిత్రా!. 48**

**ప్రతిపదార్థం:** అనఘ చరిత్రా!= పాపంలేని నడవడి కలవాడా!; వినుము= వినుము; ఆ+గోవిందుఁడు= ఆ కృష్ణుడు; సఖుఁడును= స్నేహితుడును; బంధుఁడు= చుట్టమును; కార్యకర్మఠుఁడును+ఐ= పనులలో పోటు బంటూ అయి; నిన్నున్= నిన్ను; కొనియాడుచున్+ఉండన్= ఆదరిస్తూ ఉండగా; నీకున్= నీకు (ధర్మరాజు); దురితంబు+అను= పాపం అనే; పేరును= నామమాత్రం అయినా; కలదె?= ఉంటుందా? ఉండ దని భావం.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్ముడా! ధర్మరాజా! వినవలసింది. నీకు కృష్ణుడు మిత్రుడు, ఆత్మీయుడు, కార్యశూరుడు. ఇట్లాంటివాడు నిన్ను పొగుడుతూ ఉంటే పాపం అనేది పేరునకైనా సరే నీ దరికి రాదు.

**ఆ. ఇంద్రుఁ డజుఁడు విష్ణుఁ డెవ్వాని వైదిక । స్తోత్రములఁ బ్రసాదితునిగఁ జేసి**
**యెలమిఁ గొలుతు రమ్మహేశ్వరుఁ గొలుచు వా । రెందు నెపుడుఁ గీడు నొంద రధిప! 49**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అజుఁడు= బ్రహ్మ; విష్ణుఁడు= విష్ణువు; ఏ+వానిన్= ఎవరిని; వైదికస్తోత్రములన్= వేదమంత్రాలతో; ప్రసాదితునిగన్+చేసి= అలంకరింపబడినవానిగా చేసి; ఎలమిన్= ప్రీతితో; కొలుతురు= సేవింతురో; ఆ+మహేశ్వరున్= ఆ శివుడిని; కొలుచువారు= సేవించేవారు; ఎందున్= ఎక్కడైనా; ఎపుడున్= ఎప్పుడైనా; కీడున్= కష్టాన్ని; ఒందరు= పొందరు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఎవరిని వేదమంత్రాలతో పూజించి ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణువు అలంకరించబడినవానిగా ఆ శివుడిని కొలిచేవారు ఎపుడును ఎక్కడా ఎట్లాంటి ఆపదలూ పొందరు.

**క. విను మివ్వాక్యము లెవ్వఁడు । గొనియాడుఁ బఠించు విప్రకోటికిఁ జెప్పున్**
**జననాథ! వాఁడు దురితం । బను దుర్గము నిస్తరించు నక్లేశమునన్.' 50**

**ప్రతిపదార్థం:** జననాథ!= ఓ రాజా!; వినుము= వినవలసింది; ఈ+వాక్యములు= ఈ వచనాలు; ఎవ్వఁడు= ఎవ్వరు; కొనియాడున్= మెచ్చుకొనునో; పఠించున్= వల్లించునో; విప్రకోటికిన్= బ్రాహ్మణు లకు; చెప్పున్= నేర్పునో; వాఁడు= అట్లాంటివాడు; అ+క్లేశమునన్= ఏమీ కష్టపడకుండా; దురితంబు+అను= పాపం అనే; దుర్గమున్= కొండను; నిస్తరించున్= దాటగలడు.

**తాత్పర్యం:** ఓ రాజా! వినుము. ఈ పై వాక్యాలను ఎవరైతే మెచ్చుకొంటారో, అదే పనిగా వల్లిస్తారో, బ్రాహ్మణు లందరికీ నేర్పిస్తారో, అట్లాంటివారు ఏ మాత్రం అలసిపోకుండానే పాపం అనే కొండను అవలీలగా దాటుతారు'.

**వ. అనిన విని ధర్మనందనుఁడు. 51**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగానే; విని= విని; ధర్మనందనుఁడు= యమధర్మరాజు పుత్రుడైన ధర్మరాజు.

**తాత్పర్యం:** అని చెప్పగానే ధర్మరాజు.

### వ్యాఘ్రగోమాయు సంవాదము (సం. 12-112-2)

**క. 'సౌమ్యు లసౌమ్యుల భంగి న । సౌమ్యులు సౌమ్యుల విధమున జనవర! చిత్తా**
**గమ్యతఁ దోఁతురు; వారిని । సమ్యఙ్నిశ్చయతఁ గాంచు చందము సెపుమా! 52**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా! సౌమ్యులు= తిన్ననివారు; అసౌమ్యుల భంగిన్= తిన్నగా లేనివారివలె; అసౌమ్యులు= తిన్నగా లేనివారు; సౌమ్యుల విధమునన్= తిన్నని వారుగానూ; చిత్త+అగమ్యతన్= మనస్సుకు తెలియరాని రీతిలో; తోఁతురు= అగుపిస్తారు; వారినిన్= అట్లాంటివారిని; సమ్యక్+నిశ్చయతన్= సరిగ్గా ఇట్లాంటివారు అనే గట్టి నిర్ణయంతో; కాంచు చందమున్= తెలిసికొనే తీరును; చెపుమా!= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ తాతా! సౌమ్యులు అసౌమ్యులుగాను, అసౌమ్యులు సౌమ్యులుగాను కనిపిస్తుంటారు. మనసుకు ఏమీ అంతుబట్టకున్నది. వీరు ఇట్లాంటివారని వేర్పాటుచేసి తెలిసికొనాలంటే సులువైన మార్గం ఏమిటో చెప్పుము.'

**వ. అనుటయు నాపగాతనయుం 'డేతత్ప్రయోజనం బైన వ్యాఘ్రగోమాయు సంవాదం బను నితిహాసంబు గల; దాకర్ణింపు'మని యిట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఆపగా తనయుండు= భీష్ముడు; ఏతద్+ప్రయోజనంబు+ఐన= దీనికి ఉపయోగపడేది అయిన; వ్యాఘ్ర= పులి; గోమాయు= నక్కలనడుమ నడచిన; సంవాదంబు+అను= సంభాషణ వృత్తాంతం కలది అయిన; ఇతిహాసంబు= పరంపరగా వస్తున్న కథ; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= ఆలకించుము; అని+ఇట్లు= అని ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'సరిగ్గా నీవడిగిన దానికి పులి నక్కా సంవాద కథ సమాధానమవుతుంది. జాగ్రత్తగా వినుము' అంటూ భీష్ముడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'పురిక యనఁగఁ నెగడు పురిఁ బౌరికుం డను । నృపతి క్రూరకర్మనిష్ఠఁ బరఁగు;**
**నవ్విభుండు సచ్చి యధిప! గోమాయువై । పుట్టెఁ బుట్టెఱుంగు బుద్ధితోడ. 54**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; పురిక+అనఁగన్= పురిక అనే పేరుతో; నెగడు= ప్రసిద్ధికెక్కిన; పురిన్= పట్టణంలో; పౌరికుండు+అను= పౌరికుడనే పేరుగల; నృపతి= రాజు; క్రూరకర్మనిష్ఠన్= కనికరం లేని పనులు చేయటంలో; పరఁగున్= ప్రసిద్ధి చెందాడు; ఆ+విభుండు= ఆ రాజు; చచ్చి= చనిపోయి; పుట్టు+ఎఱుంగు= మునుపటి జన్మ ఎరుకగల; బుద్ధితోడన్= జ్ఞానంతో (తెలివితో); గోమాయువు+ఐ= నక్కగా; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** పురిక అనే నగరాన్ని పౌరికుడు అనే రాజు పాలించేవాడు. అతడు క్రూరకార్యాలు చేయటంలో పేరు పడ్డాడు. కాలవశాన చచ్చిపోయి పూర్వజన్మ జ్ఞాపకాలతో నక్కగా, మరోజన్మ ఎత్తాడు.

**వ. ఇబ్భంగిం బుట్టిన యా నక్క మహితవ్రతశీలం బయి మాంసంబు దినక, హింస సేయక వనంబునం బతిత ఫలంబులుఁ బత్త్రంబులు నాహారంబులుగా వర్తించుచుండఁ, దోడి నక్క 'లిది యేటి వ్రతంబు? మాంసం బేము దెచ్చియిచ్చెద; ముపయోగించి సుఖివై యుండు' మని ప్రార్థించిన, నమ్మెయికిం జొరక దృఢనిశ్చయంబై యుండె; నంత నొక్కనాఁడు మృగంబుల కెల్ల ముఖ్యంబైన శార్దూలం బత్తెఱం గెఱింగి వచ్చి యగ్గోమాయువుతో నిట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** ఈ+భంగిన్= ఈ విధంగా; పుట్టిన= జన్మించిన; ఆ+నక్క= ఆ నక్క; మహిత= గొప్పదైన; వ్రతశీలంబు+అయి= నియమ స్వభావం కలదై; మాంసంబు= మాంసాహారాన్ని; తినక= తీసికొనకుండా; హింస+చేయక= సాటిజీవులను చంపకుండా; వనంబునన్= అడవిలో; పతిత ఫలంబులున్= ముగ్గి రాలిపడ్డ పళ్ళనూ; పత్రంబులున్= ఆకులనూ; ఆహారంబులుగాన్= తింటూ; వర్తించుచున్+ఉండన్= తిరుగుతుండగా; తోడి నక్కలు= సాటినక్కలు; ఇది= ఇది (ఈ కాయగసరులు తినటం); ఏటి వ్రతంబు?= ఏమి నియమం?; మాంసంబున్= మాంసాన్ని; ఏము= మేము; తెచ్చి+ఇచ్చెదము= తీసికొని వస్తాం; ఉపయోగించి= తిని; సుఖివి+ఐ= సంతోషివై; ఉండుము= ఉండాల్సింది; అని= అని; ప్రార్థించినన్= వేడుకొనగా; ఆ+మెయికిన్= ఆ వైనానికి; చొరక= ఒప్పుకొనక; దృఢ నిశ్చయంబు+ఐ= గట్టి అభిప్రాయం కలదై; ఉండెన్= ఉన్నది; అంతన్= అంతలో; ఒక్కనాఁడు= ఒకరోజున; మృగంబులకున్+ఎల్లన్= జంతువులలో కెల్ల; ముఖ్యంబు+ఐన= ప్రధానమైన; శార్దూలంబు= పెద్దపులి; ఆ+తెఱంగున్= ఆ తీరు అంతా; ఎఱింగి వచ్చి= తెలిసికొని వచ్చి; ఆ+గోమాయువుతోన్= ఆ నక్కతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ రాజు అట్లా నక్కగా రూపం ఎత్తి మాంసం ముట్టుకొననని, సాటి జీవులను చంపనని వ్రతం పట్టింది. అడవిలో రాలిపడ్డ ఫలాలూ ఆకులూ అలములూ తింటూ బ్రతుకుగడుపసాగింది. ఇది చూచిన తోడినక్కలు 'ఇదెక్కడి నియమం? మేమంతా మాంసాన్ని తెచ్చి పెట్టుతాం - హాయిగా తిని సుఖించు'మన్నాయి. అయినా నక్క ఆ మాటలు పట్టించుకొనకూడదనే నిర్ణయించుకొన్నది. అంతలో ఇదంతా ఆ అడవి పులిరాజుకు తెలిసి నక్క దగ్గరకు వచ్చి ఈ విధంగా అన్నది.

**క. 'నిను సౌమ్యుఁడ వని యెఱిఁగితి; । ననఘా! ననుఁ జెంది నిలిచి యతుల సుఖము లం**
**దిన మేలు; నన్నుఁ గ్రూరుం । డను లోకం; బిదియు నుడుప నగు నీశిక్షన్. 56**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పుణ్యాత్ముడా!; నినున్= నిన్ను; సౌమ్యుఁడవు+అని= తిన్ననివాడవని; ఎఱిఁగితిన్= గుర్తించాను; ననున్= నాతో; చెంది= కూడి; నిలిచి= ఉండి; అతుల సుఖములు= సాటిలేని సౌఖ్యాలు; అందినన్= పొందితే; మేలు= మంచిది; లోకంబు= జనం; నన్నున్= నన్ను; క్రూరుండు+అనున్= క్రూరమృగం అని అంటున్నది; ఇదియున్= ఈ వాదును; నీ శిక్షన్= నీ ఉపదేశాలతో; ఉడుపన్+అగున్= పోగొట్టవలసింది.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యవంతుడా! నీవు చాలా మంచివాడ వని విన్నాను. నాతో కలిసి ఉండుము. ఎన్నో సౌఖ్యాలు అనుభవించుము. లోకం నన్ను క్రూరజంతు వనుకొంటున్నది. దానిని నీ ఉపదేశాలతో తరిమిగొట్టుము.

**వ. నా తోడి బాంధవంబు సేయు'మనిన నగ్గోమాయు విట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** నాతోడి= నాతో; బాంధవంబున్= స్నేహాన్ని; చేయుము= కావించుము; అనినన్= అనగానే; ఆ+గోమాయువు= ఆ నక్క; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** నాతో మిత్రుడిగా ఉండుము' అనగానే ఆ నక్క ఈ విధంగా చెప్పింది.

**క. ‘నీ వాశ్రయణీయుండవు । గావే! విను భోగపరము గా కున్నది మ**
**ద్భావం బటు గావున నా । కీ వచనము లింపు సేయ విద్ధగుణాఢ్యా! 58**

**ప్రతిపదార్థం:** ఇద్ధగుణ+ఆఢ్యా!= ప్రకాశించే గుణ సంపదగల ఓ పులిరాజా!; నీవు= నీవు; ఆశ్రయణీయుండవు= అండగొనదగినవాడవు; కావే!= కావా!; విను= వినుము; మత్= నాయొక్క; భావంబు= తలంపు; భోగపరము+కాక+ఉన్నది= సుఖంవైపునకు మళ్ళకున్నది; అటు+కావునన్= కాబట్టి; నాకున్= నాకు; ఈ+వచనములు= ఈ మాటలు; ఇంపు+చేయవు= రుచించవు.

**తాత్పర్యం:** ‘ఓ గుణవంతుడా! పులిరాజా! నిజానికి నీవు ఆశ్రయించదగ్గవాడవే. కాని, నా మనస్సు సుఖాలమీదికి పోకుండా ఉన్నది. అందువలన నీ మాటలు నాకు నచ్చటం లేదు.

**వ. అది యట్లుండె; భోగంబులు గాకున్న నేమి? నీకుం గార్యాకార్యంబులు నా యెఱింగిన తెఱంగున నుపదేశించుచు మైత్రి వాటించియునికి గర్హణీయంబై భవదీయ మూలభృత్యు లసూయ సేసి భేదింతురు; దాన నొప్పమి వచ్చు; నీవు వారలు గలంచినఁ గలంగ కుండుటకును నా బుద్ధి పాటించుటకును సమయంబు సేసి నన్నుమన్నించికొని యుండు; మట్లైన నీకడ వర్తించియుండెద’ ననుటయు నావ్యాఘ్రుం బా భంగి నడపంగల యది యై యియ్యకొని. 59**

**ప్రతిపదార్థం:** అది= అది; అట్లు+ఉండెన్= ఆ విషయం అట్లా ఉండనిమ్ము; భోగంబులు= సౌఖ్యాలు; కాక+ఉన్నన్+ఏమి?= పొందకుంటే ఏమి?; నీకున్= నీకు; కార్య+అకార్యంబులు= చేయదగ్గ, చేయకూడని పనులను; నా+ఎఱింగిన తెఱంగునన్= నాకు తెలిసినట్లుగా; ఉపదేశించుచున్= బోధిస్తూ; మైత్రి పాటించి= స్నేహం చేసి; ఉనికి= ఉండటం; గర్హణీయంబు+ఐ= ఆక్షేపించదగినదై; భవదీయ= నీకు సంబంధించిన; మూల భృత్యులు= తాత ముత్తాతలనాటి నుండి వస్తున్న సేవకులు; అసూయ చేసి= ఓర్వ లేక; భేదింతురు= వేరవుతారు; దానన్= అందువలన; ఒప్పమి= వైరం; వచ్చున్= కలుగుతుంది; నీవు= నీవు (పులి); వారలు= ఆ మూలభృత్యులు; కలంచినన్= కలవరపెట్టినా; కలంగక= చలించకుండా; ఉండుటకున్= ఉండటానికీ; నా బుద్ధి= నా ఆలోచనలను; పాటించుటకున్= ఆచరించటానికీ; సమయంబు+చేసి= ప్రతిజ్ఞ చేసి; నన్నున్= నన్ను; మన్నించికొని ఉండుము= గౌరవిస్తూ ఉండుము; అట్లు+ఐనన్= అట్లా అయితేనే; నీ కడన్= నీ దగ్గర; వర్తించి+ఉండెదన్= మసలుకొంటాను; అనుటయున్= అనగానే; ఆ+వ్యాఘ్రుంబు= ఆ పులి; ఆ+భంగిన్= అట్లాగే; నడపంగల+అది+ఐ= జరపా లనుకొన్నదై; ఇయ్యకొని= సమ్మతించి.

**తాత్పర్యం:** అది అట్లా ఉండనిమ్ము, సౌఖ్యాలు అనుభవించకపోతే నేమి? నాకు తెలిసినంత మట్టుకు నీకు మంచీ చెడ్డలు తెలియచెప్పుతూ స్నేహంగా ఉంటాను. మన స్నేహాన్ని నీ మూలభృత్యులు ఓర్వలేక నిందిస్తారు. నిన్ను కలవరపరచి వైరం పెట్టుకుంటారు. అందువలన నీవు వారి మాటలకు చెవి ఒగ్గకుండా నేను చెప్పినట్లు నడచుకొంటేనే నీ దగ్గర ఉంటాను. అట్లాగని బాసచేసి నన్నాదరించుము.’ అనగానే పులి అట్లాగే నడుచుకొంటానని అంగీకరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. సంతసంబుతోడ సమయంబు సేసిన । నెలమిఁబొంది నక్క పులికి బుద్ధి**
**సెప్పికొనుచుఁ దగ వసించెఁ దదీయ ని । కేతనమునఁ బులియుఁ బ్రీతి సలిపె. 60**

**ప్రతిపదార్థం:** సంతసంబుతోడన్= సంతోషంగా; సమయంబు+చేసినన్= ప్రతిజ్ఞచేయగా; ఎలమిన్= ఆనందాన్ని; పొంది= అనుభవించి; నక్క= నక్క; పులికిన్= పెద్ద పులికి; బుద్ధి+చెప్పికొనుచున్= ఉపదేశిస్తూ; తదీయ= పులికి చెందిన; నికేతనమునన్= నివాసస్థానం (గుహ)లో; తగన్= ఒప్పేటట్లుగా; వసించెన్= నివసించింది; పులియున్= పులికూడా; ప్రీతిన్=సంతోషంతో; సలిపెన్= మెలగింది.

**తాత్పర్యం:** పులి ఎంతో సంతోషంగా బాసచేసింది. దానికి నక్క సంతృప్తిచెందింది. పులికి హితవులు చెపుతూ పులిగుహలోనే ఉండిపోయింది. పులికూడా సంతోషంగా మెలగింది.

**వ. కొండొక కాలంబునకు నమ్మృగరాజు మన్నించు విధంబును, నగ్గోమాయువు దదీయ హితాహితంబు లరసి బుద్ధి సాచివ్యంబు సేయు తెఱంగును జూచి చూపోపక యప్పులి మూలభృత్యులు దమలోనం గూడికొని యొక్కనాఁడు. 61**

**ప్రతిపదార్థం:** కొండొక కాలంబునకున్= కొంతకాలానికి; ఆ+మృగరాజు= ఆ పెద్దపులి; మన్నించు విధంబును= ఆదరించే తీరూ; ఆ+గోమాయువు= ఆ నక్క; తదీయ= ఆ పులికి సంబంధించిన; హిత+అహితంబులు= మంచి చెబ్బరలూ; అరసి= విచారించి, తెలిసికొని; బుద్ధి= ఆలోచనతో; సాచివ్యంబు= మంత్రిత్వం; చేయు తెఱంగును= నడిపిన తీరునూ; చూచి= పరిశీలించి; చూపు+ఓపక= చూడలేక; ఆ+పులి= ఆ పెద్దపులి యొక్క; మూలభృత్యులు= తాతముత్తాలనాటి నుండి వస్తున్న సేవకులు; తమలోనన్= వాళ్ళల్లో వాళ్ళు; కూడికొని= గుమికూడి; ఒక్కనాఁడు= ఒకరోజున.

**తాత్పర్యం:** కొంతకాలం గడిచేసరికి నక్కను పులి ఆప్యాయంగా ఆదరించటమూ, నక్క ఎంతో విచక్షణతో మంత్రిత్వాన్ని నిర్వహించటమూ మూలభృత్యులకు గిట్టలేదు. వాళ్ళంతా అనుకొని ఒకనాడు ఒకచోట సమావేశం అయ్యారు.

**క. 'పులి నమలెడు మాంసము వెర। వలవడఁ దా మపహరించి యా నక్కకు ని**
**మ్ములఁ నిల్వం గావించిన। నిలయంబున గొందిఁ బెట్టి నేర్పారంగన్. 62**

**ప్రతిపదార్థం:** పులి= పెద్దపులి; నమలెడు= తినే; మాంసమున్= మాంసాన్ని; తాము= ఆ మూలభృత్యులు; వెరవు= ఉపాయం; అలవడన్= ఒప్పగా; అపహరించి= దొంగిలించి; ఆ నక్కకున్= ఆనక్క కొరకు; ఇమ్ములన్= సంతోషంగా; నిల్వన్= నివసించటానికి (ఉండటానికి); కావించిన= ఏర్పాటు చేసిన (సిద్ధంచేసిన); నిలయంబునన్= నివాసంలో (కొండగుహలో); గొందిన్= మూలగా; పెట్టి= దాచిపెట్టి; నేర్పు+ఆరంగన్= గొప్పదిట్ట తనంతో.

**తాత్పర్యం:** 'ఒకనాడు పెద్దపులి తినే మాంసాన్ని మూలభృత్యులు ఎంతో చాకచక్యంగా ఎత్తుకెళ్ళాయి. నక్క ఉండే కొండగుహలో ఓ మూల దాచిపెట్టాయి. ఎంతో దిట్టతనంతో మసలుకొంటూ ఉండగా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఉన్నంత భక్ష్యపదార్థ పరిరక్షణంబును దానచేయునది గావున నగ్గోమాయు వప్పనికిం జొచ్చి మాంసంబుగానక యెవ్వరేని మ్రుచ్చిలి కొనుటగా నెఱింగినదియై శార్దూలంబున కెఱింగించిన నామ్రుచ్చిమి యప్పులి యరయం దొడంగిన నెప్పటి కపటభృత్యులు గపటోపాయంబు పన్ని. 63**

**ప్రతిపదార్థం:** ఉన్నంతన్= ఉంటున్నంతలో; భక్ష్యపదార్థ= తినుబండారాలను; పరిరక్షణంబు= భద్రపరచటమూ; తాను+అ= తానే; చేయునది+కావునన్= చేస్తుంది కనుక; ఆ+గోమాయువు= ఆ నక్క; ఆ పనికిన్= మాంసాన్ని జాగ్రత్తచేసే పనిమీద; చొచ్చి= వెళ్ళి; మాంసంబు= మాంసం; కానక= కనిపించక; ఎవ్వరేని= ఎవ్వరో; మ్రుచ్చిలి కొనుటగాన్= దొంగతనం చేసిందిగా; ఎఱింగినది+ఐ= తెలిసికొన్నదిఅయి (గమనించినదై); శార్దూలంబునకున్= పెద్దపులికి; ఎఱింగించినన్= తెలుపగా; ఆ మ్రుచ్చిమి= ఆ దొంగతనం గూర్చి; ఆ+పులి= ఆ పెద్దపులి; అరయన్= విచారించటానికి (వెదకటానికి); తొడంగినన్= పూనుకొనగానే; ఎప్పటి కపట భృత్యులు= ఎప్పటివలెనే, మోసగాళ్ళైన సేవకులు; కపట+ఉపాయాన్ని= మాయోపాయాన్ని; పన్ని= పుట్టించి.

**తాత్పర్యం:** రాజు తినే పదార్థాలను భద్రపరిచే పని నక్కదే. కనుక ఎప్పటివలె మాంసాన్ని దాచబోగా కనిపించలేదు. ఎవరో ఎత్తుకుపోయి ఉంటారని గ్రహించుకొని ఆ సంగతి పులి దృష్టికి తెచ్చింది. పులి వెంటనే వెదకటానికి పురమాయించింది. అది పసికట్టిన కపట సేవకులు కుట్ర పన్నినవారై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నెమకు పరివార మమ్మాం । సము గను తెఱఁగును ఘటింప శార్దూలము చి**
**త్తము నక్కవలన విరస । త్వమునొందిన నెఱిఁగి భృత్యతతి యిట్లనియెన్. 64**

**ప్రతిపదార్థం:** ఆ+మాంసమున్= ఆ మాంసాన్ని; నెమకు= వెదకే; పరివారము= సేవకులకు; కను తెఱఁగును= కనపడే విధంగా; ఘటింపన్= చేయగా (కలిగించగా); శార్దూలము= పులి; చిత్తమునన్= మనసులో; నక్కవలన= నక్కమీద; విరసత్వమున్= మైత్రీభేదాన్ని; ఒందినన్= పొందగా; ఎఱిఁగి= తెలిసికొని; భృత్యతతి= సేవకులంతా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** మాంసం వెదకే పరివారానికి అది కంటబడేటట్లు చేశాయి. దానితో పులికి నక్కమీద మనస్సు విరిగిపోయింది. అది కనిపెట్టిన సేవకులు ఈ విధంగా అన్నారు.

**ఆ. 'నక్క కేటి వ్రతము? స్రుక్కక యిమ్మాంస । మపహరించినపుడ యబ్బె నేని**
**నేమి యైనఁ జేయు నిది పాపశీలంబు । గపట ధర్మకంచుకంబు సువ్వె! 65**

**ప్రతిపదార్థం:** నక్కకున్= నక్కకు; ఏటి వ్రతంబు?= ఏమి నియమం?; స్రుక్కక= జంకులేకుండా; ఈ+మాంసమున్= ఈ మాంసాన్ని; అపహరించిన+అపుడ= దొంగలించినపుడే; అబ్బెనేనిన్= దొరికినట్లైతే; ఏమి+ఐనన్+చేయున్= ఇంకా ఏమైనా చేయగలదు; ఇది= ఈ నక్క; పాపశీలంబు= పాపస్వభావం కలది; కపట= మాయదైన; ధర్మకంచుకంబు= ధర్మమనే కవచం కలది; సువ్వె!= సుమా!

**తాత్పర్యం:** 'నక్కఏమిటి? వ్రతంఏమిటి? నీ మాంసం కాజేసినపుడే చేతికి అందుబాటులో ఉన్నట్లైతే సంకోచించకుండా ఇంకా ఏమైనా చేసేది. ఈ నక్క పాపభావాలు కలది. ధర్మమనే మాయతొడుగు తొడుక్కున్నది సుమా!

**క. తా నటె మాంసముఁ దినదటె! । యీ నక్కయు బేలుపెట్టె నిన్నాళ్ళును నీ**
**యాన మఱుమాట వలుకం । గా నోడితి మిదియ నడపఁ గార్యములయెడన్.' 66**

**ప్రతిపదార్థం:** తాను+అటె= నక్క అట; మాంసమున్= మాంసాన్ని; తినదు+అటె= నమలదట; ఈ నక్కయున్= ఈ నక్క; ఇన్నాళ్ళును= ఇంతకాలమూ; బేలుపెట్టెన్= మోసపుచ్చింది; ఇదియ= ఈ నక్కే; నడపన్= జరుపుతుండగా; కార్యముల+ఎడన్= రాచకార్యాలపట్ల; నీ+ఆనన్= నీ ఆజ్ఞచే; మఱుమాట= మరొకమాట; పలుకంగాన్= చెప్పటానికి; ఓడితిమి= వెరచాము.

**తాత్పర్యం:** నక్క అట మాంసాహారి కాదట - ఇంతకాలం ఎంత మోసగించింది! ఈ నక్కే అన్ని రాచకార్యాలు చూచుకొంటుంది కదా! అని మేము మీ శాసనానికి కట్టుబడి పల్లెత్తు మాట అనాలంటే భయపడేవారం'.

**క. అనుటయు మృగపతి మనమునఁ । గన లడరిన నక్కఁ బట్టఁగాఁ బంచి వధిం**
**పను బుచ్చె; దాని నంతయు । విని యప్పులితల్లి గరము వెసఁ జనుదెంచెన్. 67**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అన్నదే తడవుగా; మృగపతి= పెద్దపులి; మనమునన్= మనస్సున; కనలు+అడరినన్= కోపం ఎక్కువకాగా; నక్కన్= నక్కను; పట్టఁగాన్= బంధించటానికి; పంచి= నియోగించి; వధింపను= చంపేయటానికి; పుచ్చెన్=

ఆజ్ఞాపించింది; దానిన్+అంతయున్= ఇదంతా; విని= ఆలకించి; ఆ+పులి తల్లి= ఆ పెద్దపులి తల్లి; కరము= ఎంతో; వెసన్= తొందరగా; చనుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** ఆ మాటలు చెవిని పడగానే పులి కోపంతో మండిపడుతూ 'నక్కను వెంటనే పట్టుకురండి. చంపండి' అంటూ ఆదేశించింది. ఇదంతా పులి తల్లి విని చప్పున కుమారుడి దగ్గరకు వచ్చింది.

**వ. చనుదెంచి యా వ్యాఘ్రువరునితో నిట్లనియె. 68**

**తాత్పర్యం:** వచ్చి, ఆ పులి తల్లి కొడుకుతో ఇట్లా అన్నది.

**క. ఇట్టివి కృత్రిమములు గల । వట్టిదె యానక్క? బేల వైతివి భృత్యుల్**
**పుట్టినకోలెను గుటిలత । లె ట్టెట్టివి సేయ? రకట! యెఱుక గలఁగెనే? 69**

**ప్రతిపదార్థం:** ఇట్టివి= ఇట్లాంటివి; కృత్రిమములు= కల్పితాలు; కలవు= ఉంటాయి; ఆ+నక్క= ఆ నక్క; అట్టిదె?= అట్లాంటిదా?; బేలవు+ఐతివి= వెర్రివాడవయ్యావు; భృత్యుల్= సేవకులు; పుట్టిన కోలెను= పుట్టిననాటినుండి; కుటిలతలు= కపటాలు; ఎట్టు+ఎట్టివి= ఎట్లాంటివి ఎట్లాంటివి; చేయరు= చేయలేదు?; అకట!= అయ్యో! ఎఱుఁక= తెలివి; కలఁగెనే?= కలవర పడిందా?

**తాత్పర్యం:** ఇట్లాంటి లేనిపోని కల్పితాలు కల్పించటం నక్కకు చేతనవుతుందా! ఎంత మూర్ఖుడివి? సేవకులు పుట్టుకతోనే వంచకులు. ఏమి చేయరు? వీరు ఎన్నైనా చేస్తారు. అయ్యో! నీ తెలివి తెల్లారిపోయిందా!

**తే. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు । వలన హీనులు రూపసివలనఁ గొనటి**
**వా రసూయలు సేయుదు రీరసమున । నింత యెఱుఁగంగవలవదే? యీవు గొడుక! 70**

**ప్రతిపదార్థం:** కొడుక!= కుమారుడా!; బుద్ధిమంతునివలనన్= మంచివాడివలన; దుర్బుద్ధులు= చెడ్డవారు; అధికు వలనన్= గొప్పవాడివలన; హీనులు= అల్పులు; రూపసివలనన్= అందగాడివలన; కొనటివారు= కురూపులు; ఈరసమునన్= ఓర్వలేక; అసూయలు+చేయుదురు= లేనివి అంటగడతారు; ఈవు= నీవు; ఇంత= ఇంతమాత్రం; ఎఱుఁగంగన్+వలవదే?= తెలిసికొనవద్దా?

**తాత్పర్యం:** ఓ బిడ్డా! మంచివాళ్ళను చూచి చెడ్డవాళ్ళు, గొప్పవాళ్ళను చూచి తక్కువవాళ్ళు, అందగాళ్ళను చూచి అందం లేనివాళ్ళు సహించలేరు. లేనిపోని దోషాలు ఆరోపిస్తారు. ఈ పాటి విషయాలు నీకు నీవు గ్రహించుకొనవద్దా? (ఎదుటివాళ్ళ ఔన్నత్యాన్ని చూచి సహించలేకపోవటం సంస్కారవంతుల పని కాదని భావం).

**క. ధర్మ మధర్మము భంగి న । ధర్మము ధర్మంబు మాడ్కిఁ దనయా! తోఁచున్**
**నిర్మలమతి నరయవలయు । ధార్మికతన కోరువాఁడు తన కేర్పడఁగన్. 71**

**ప్రతిపదార్థం:** తనయా!= ఓ కొడుకా!; ధర్మము= న్యాయం; అధర్మము భంగిన్= అన్యాయంవలె; అధర్మము= అన్యాయం; ధర్మంబు మాడ్కిన్= న్యాయంవలె; తోఁచున్= కనబడుతుంది; ధార్మికతన+కోరువాఁడు= ధర్మాన్నే తెలిసికొనవలెననుకొనేవాడు; నిర్మలమతిన్= తేటగలబుద్ధితో; తనకున్= తనకు తాను; ఏర్పడఁగన్= స్పష్టపడేటట్లు; అరయన్ వలయున్= పరిశీలించుకొనాలి.

**తాత్పర్యం:** ఓ కొడుకా! ధర్మం అధర్మంవలె, అధర్మం ధర్మంవలె అనిపించవచ్చును. 'ధర్మం ఇదీ' అని తెలిసికొనదలచినవాడు తనకు తేటతెల్లమయ్యేదాకా మంచిమనసుతో ఆలోచించుకొనాలి.

**క. విను మీగోమాయువు వ । చ్చిన యంతటనుండి మనకుఁ జేసిన హితముల్**
**గనికొన వలవదె? యీతర । మున వాఁ డిటు సేయఁ డను సమూహయు వలదే? 72**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఈ+గోమాయువు= ఈ నక్క; వచ్చిన+అంతటన్+ఉండి= వచ్చినప్పటినుండి; మనకున్= మనకు; చేసిన హితముల్= చేసిన మంచిపనులను; కని కొనవలవదె?= విచారించవద్దా?; ఈ తరమునవాఁడు= ఇట్లాంటి మంచివాడు; ఇటు+చేయఁడు= ఈ విధంగా చేయడు; అను+సమూహయున్= అనే మంచి యోచన; వలదే?= వద్దా?

**తాత్పర్యం:** ఈ నక్క వచ్చిన దగ్గరినుండి చేసిన ఉపకారాన్ని చూచి అయినా ఇట్లాంటివాడు ఇట్లా చేస్తాడా? అని ఒక్క క్షణం యోచించుకొనవద్దా?

**క. హితుఁ డగు మంత్రిం గుటిలుల । యతి కపటోపాయములకు నగపడి చెఱుపన్**
**మతిఁ దలఁతురె? పతి సుపరీ । క్షితంబు గావింప కొకటి సేయం దగునే?' 73**

**ప్రతిపదార్థం:** హితుఁడు+అగు= మేలుకోరేవా డైన; మంత్రిన్= మంత్రిని; కుటిలుల= మాయగాళ్ళ; అతి కపట+ఉపాయములకున్= మిక్కిలి మాయోపాయాలకు; అగపడి= లోబడిపోయి; చెఱుపన్= చంపటానికి; మతిన్= మనస్సులో; తలఁతురె?= భావిస్తారా? పతి= రాజు; సుపరీక్షితంబు+కావింపక= సరిగ్గా పరిశీలించకుండానే; ఒకటి= కీడు; చేయన్= తలపెట్టటం; తగునే?= ఒప్పునా? ఒప్పుకాదని భావం.

**తాత్పర్యం:** వంచకుల మాయమాటలలో పడి మన మంచిని కోరే మంత్రిని చంపాలనుకొనటం భావ్యమేనా? రాజైనవాడు వెనుకా ముందూ పరిశీలించుకొనకుండా హానిచేయ పూనుకొనటం సరైన నిర్ణయం కాదు. పరిపాలకుడు ప్రతి పనీ విచారించి అమలు పరచాలి'.

**చ. అనవుడు నక్క రాఁబనిచి యప్పులి కౌఁగిటఁ జేర్చి బాష్పము**
**ల్గనుఁగవఁ గ్రమ్మనుం బలుకులం దగఁ బెద్దయు గారవించిన**
**'న్వినుము మృగేంద్ర! మున్నటుల నీవు సభన్ నను వీఁడు మంచివాఁ**
**డని కొనియాడి యిప్డు దెగటార్చితి పెంపును నాదు మానమున్.' 74**

**ప్రతిపదార్థం:** అనవుడున్= తల్లి చెప్పగానే; నక్క= నక్కను; రాన్ పనిచి= పిలిపించి; ఆ+పులి= ఆ పెద్దపులి; కౌఁగిటన్ చేర్చి= ఆలింగనం చేసి; బాష్పముల్= కన్నీరు; కనుఁగవన్= రెండు కళ్ళను; క్రమ్మనున్= కప్పగా; పలుకులన్= మాటలతో; తగన్ పెద్దయున్= ఎంతో ఎక్కువగా; గారవించినన్= గౌరవించగా; మృగ+ఇంద్ర!= మృగరాజా!; వినుము= వినవలసింది; నీవు; మున్ను+అటులన్= ఇంతకు క్రితం ఆ విధంగా; సభన్= కొలువులో; ననున్= నన్ను; వీఁడు= ఇతడు (ఈ నక్క); మంచివాఁడు= యోగ్యుడు; అని కొనియాడి= అని పొగడి; ఇప్డు= ఈనాడు; నాదు మానమున్= నా ఆత్మాభిమానాన్ని; పెంపును= గౌరవాన్ని; తెగటార్చితి(వి)= మంటగలిపావు. (నాశనం చేశావు).

**తాత్పర్యం:** తల్లి బోధలకు బుద్ధి తెచ్చుకొని పులి నక్కను రమ్మని కబురంపింది. వచ్చిన నక్కను అక్కున చేర్చుకొన్నది. కంటనీరు పెట్టుకొంటూ ఆత్మీయంగా మాట్లాడింది. ఆదరించింది. 'ఓ పులిరాజా! ఒక విషయం వినుము. నీవు ముందు ఒకనాటి సభలో అందరి ఎదుటా నన్ను మంచివాడ వని మెచ్చుకొన్నావు. ఈ రోజున నా అభిమానాన్ని, నా పరువునూ చివరంటా చెరిపేశావు.'

**వ. అని పలికి యగ్గోమాయువు వెండియు. 75**

**ప్రతిపదార్థం:** అనిపలికి= అని చెప్పి; ఆ+గోమాయువు= ఆ నక్క; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని చెప్పి నక్క మళ్ళీ చెప్పటం మొదలు పెట్టింది.

**క. 'నను నీవు పదస్థునిఁగా । ననఘా! చేయంగఁ దలఁచినప్పుడ నీ భృ**
**త్యనికాయము కఱపులఁ బడ । కునికియు నా బుద్ధి వినుటయును మఱవమికిన్. 76**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పుణ్యవంతుడా!; ననున్= నన్ను; నీవు= నీవు; పదస్థునిఁగాన్= పదవి కలవాడినిగా; చేయంగన్= చేయటానికి; తలంచినపుడ= భావించినపుడే; నీ భృత్యనికాయము= నీ పరిజనంయొక్క; కఱపులన్= చెడ్డ బోధనలలో; పడక+ఉనికియున్= చిక్కకుండా ఉండటం; నా బుద్ధిన్= నా అభిప్రాయాన్ని; వినుటయును= చెవిని పెట్టటం; మఱవమికిన్= మరచిపోకుండా ఉండటానికి.

**తాత్పర్యం:** 'ఓ ధర్మాత్ముడా! నీవు నన్ను అధికారిని చేయాలని నిర్ణయించుకొన్నప్పుడే నీ భృత్యుల దురాలోచనలో తలదూర్చక పోవటమూ నా అభిప్రాయాల ప్రకారం నడచుకొనటమూ మర్చిపోకుండా ఉండేటట్లు ప్రమాణం చేశావు కదా! (తరువాతి వచనంతో అన్వయం).

**వ. బాస సేయవే యట్లుంగాక. 77**

**ప్రతిపదార్థం:** బాస+చేయవు+ఏ= ఒట్టుపెట్టుకొనలేదా?; అట్లున్+కాక= అంతేకాకుండా.

**తాత్పర్యం:** ఒట్టుపెట్టుకొనలేదా? అంతే కాకుండా.

**ఆ. ఎఱిఁగి యైన నెఱుఁగ కేనియు నొక్కని । భంగపెట్టి పిదప సంగతుఁడుగఁ**
**జేసికొనుట మేలె సిరిగలవారికి? । నట్టి నిలుపువాని కగునె హితము?' 78**

**ప్రతిపదార్థం:** ఎఱిఁగి+ఐనన్= తెలిసి అయినా; ఎఱుఁగక+ఏనియున్= తెలియకుండా అయినా; ఒక్కనిన్= ఒక్కడిని; భంగపెట్టి= అవమానపరిచి; పిదపన్= ఆ తరువాత; సంగతుఁడుగన్= నేస్తగాడిగా; చేసికొనుట= చేసుకొనటం; సిరిగలవారికిన్= డబ్బుగలవారికి; మేలె?= మంచిదా?; అట్టినిలుపు= అట్టి ఉనికి; వానికిన్= ఉన్నవాడికి; హితము= మేలు; శుభం; అగునె?= కలుగుతుందా?

**తాత్పర్యం:** తెలిసో తెలియకో మరొకడిని చిన్నబుచ్చి ఆ తరువాత స్నేహితుడిగా చేసికొనటం ధనవంతుడికి మంచిదేనా? అట్లా బ్రతికేవాడికీ (అవమానించబడీ తిరిగి ఉండేవాడికి) మంచి జరుగుతుందా?'

**క. అని పాసి యరణ్యమునకుఁ । జని యనశన దీక్ష నొంది సద్భావ ఖ్యా**
**తి నెఱయఁ బరమస్థానం । బున కగ్గోమాయు వరిగెఁ బురుషవరేణ్యా! 79**

**ప్రతిపదార్థం:** పురుషవరేణ్యా!= ధర్మరాజా! అని= అని; ఆ+గోమాయువు= ఆ నక్క; పాసి= ఆ పులిరాజును విడిచి; అరణ్యమునకున్= అడవులలోకి; చని= వెళ్ళి; అనశనదీక్షన్= నిరాహార వ్రతాన్ని; ఒంది= పొంది; సద్భావఖ్యాతి= మంచివాడనే పొగడ్త; నెఱయన్= వెల్లడి కాగా; పరమస్థానంబునకున్= వైకుంఠానికి; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! అట్లా పలికి ఆ నక్క పులిని వదలిపెట్టి అడవులలోకి వెళ్ళింది. నిరాహారదీక్ష పూనింది. తన మంచితనంతో పైలోకాలకు చేరుకొన్నది.

**వ. ఈ కథ పూర్వాపరవాక్యంబుల యందలి తాత్పర్యంబు నిరూపించి. 80**

**ప్రతిపదార్థం:** ఈ కథ= ఈ పులి నక్కా వృత్తాంతం; పూర్వ+అపర వాక్యంబుల అందలి= ముందూ వెనుకా మాటలలోని; తాత్పర్యమును= ఉద్దేశాన్ని; నిరూపించి= నిశ్చయించి.

**తాత్పర్యం:** ఈ పులి నక్కా సంవాదంలోని సారాంశాన్ని వివరంగా తెలిపి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వావిరి మాటలఁ దేలక । భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస**
**ద్భావుని సద్భావుని నవ । నీవర! యేర్పఱుప నెఱుఁగ నేరఁగ వలయున్.' 81**

**ప్రతిపదార్థం:** అవనీవర!= ఓ రాజా!; వావిరి మాటలన్= మాయమాటలచేత; తేలక= మోసపోకుండా; భావంబునన్= ఆలోచనలో; కీడు మేలున్= మంచి చెడ్డలను; పరికించి= పరీక్షించి; అసద్భావునిన్= చెడ్డవాడిని; సద్భావునిన్= మంచివాడిని; ఏర్పఱుపన్= వేరు పరచటం; ఎఱుఁగన్ నేరఁగవలయున్= తెలిసికొనే శక్తి కలిగి ఉండాలి.

**తాత్పర్యం:** ఓ రాజా! రాజయినవాడు ఇతరుల మాయమాటలలో పడి మోసపోకుండా మంచీ చెడ్డా యోచించుకొనాలి. ఇది మంచిది ఇది మంచిది కాదు అని విడివిడిగా తెలిసికొనగల సామర్థ్యం కలిగి ఉండాలి. అపుడే పరిపాలకుడు సరైన నిర్ణయాలు తీసికొనగలుగుతాడు'.

**భీష్ముండు ధర్మజునకు సహాయ సంపన్నత్వం బావశ్యకం బగుట సెప్పుట (సం. 12-113-1,2)**

**వ. అనినవిని సంతోషించి కౌంతేయాగ్రజుం 'డేమిభంగివర్తనంబున భూపాలుండు సుఖియై యుండు' ననుటయు నన్నరపతికిం గురుపితామహుం డిట్లనియె. 82**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; సంతోషించి= ఆనందపడి; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; ఏమి భంగిన్= ఎట్లాంటి; వర్తనంబునన్= నడతచేత; భూపాలుండు= రాజు; సుఖి+ఐ+ఉండున్?= సుఖిస్తాడు?; అనుటయున్= అని మాటలాడగానే; ఆ+నరపతికిన్= ఆ ధర్మరాజుతో; కురుపితామహుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'రాజు ఎట్లా నడచుకుంటే సుఖపడతాడు' అని ధర్మరాజు కోరగానే భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**సీ. 'ఆలస్యమును నసహాయత్వమును నొప్పు । వవిలేని పతి సుఖియై చరించు;**
**విను తొల్లి యొక యుష్ట్ర మనితరసాధ్య త । పంబు సేయఁగ మెచ్చి బ్రహ్మ వచ్చి**
**యర్థించినది 'యేమి?' యనిన నా లొట్టియ । యొప్ప 'నా మెడ శతయోజన ప్ర**
**మాణం బగుట కోర్కి వాణీశ!' నావుడు । న ట్లగుంగా కని యతఁడు సనియె;**

**తే. నదియు వరగర్వమున సహాయంబు నొల్ల । కలసభావంబుతో నుండి వలచియొక్క**
**నాఁడు దన యఱ్ఱుసాఁచి కాననములోన । దీను కొని మేయఁగాఁ బెనువాన వచ్చె. 83**

**ప్రతిపదార్థం:** ఆలస్యమునున్= మాంద్యమునూ; అసహాయత్వమునున్= ఒకరి తోడ్పాటును ఆశించకపోవటం; ఒప్పవు= తగ్గవికావు; అవి లేని పతి= అవి లేని రాజు; సుఖి+ఐ= భోగిఅయి; చరించున్= తిరుగుతాడు; విను= వినవలసింది; తొల్లి= ఒకప్పుడు; ఒక ఉష్ట్రము= ఒక ఒంటె; అనితరసాధ్య తపంబు= ఇతరు లెవ్వరూ చేయ వీలుకానంతగా తపస్సు; చేయఁగన్= చేయగా; మెచ్చి= పొగడి; బ్రహ్మ వచ్చి= బ్రహ్మ ఎదుటకు వచ్చి; అర్థించినది= కోరుకొనేది; ఏమి+అనిన్= ఏమిటి అని అడుగగా; ఆ లొట్టియ= ఆ ఒంటె; వాణీ+ఈశ!= ఓ బ్రహ్మా!; ఒప్పన్= ఒప్పగా; నామెడ= నా మెడకాయ; శతయోజన ప్రమాణంబు= నూరామడల మేరదాకా;

అగుట= పొడవుకావటం; కోర్కి= ఆశ; నావుడున్= అనగానే; అట్లు= అట్లాగే; అగున్+కాక= నెరవేరుతుంది కాక; అని= అని చెప్పి; అతఁడు= బ్రహ్మ; చనియెన్= తనలోకానికి వెళ్ళిపోయాడు; అదియున్= ఆ ఒంటెకూడా; వరగర్వమునన్= బ్రహ్మవలన కోరిక తీరిందనే అహంకారంతో; సహాయంబున్= సాటివాడి సహకారాన్ని; ఒల్లక= కోరక; అలసభావంబుతోన్= సోమరితనంతో; ఉండి= ఉండి; వలచి= కోరి; ఒక్కనాఁడు= ఒకరోజున తన అఱ్ఱు+చాఁచి= తన మెడను సాగించి; కాననములోనన్= అడవిలో; దీనుకొని= చక్కగా; మేయఁగాన్= మేత తినగా; పెనువాన= పెద్ద వర్షం; వచ్చెన్= కురిసింది.

**తాత్పర్యం:** ఏమరుపాటు లేకుండా ఎదుటివాడి సాయం కావాలనుకొనే రాజు తప్పక సుఖాలు పొందుతాడు. వెనకటికి ఒక ఒంటె మరెవరికీ అలవికానంత తపస్సుచేసింది. దానికి బ్రహ్మ మెచ్చుకొని ఎదుటపడి 'నీ కేం కావాలో కోరుకో' మ్మన్నాడు. 'నా మెడ నూరామడల దాకా సాగాలని నా కోరిక' అన్నది. బ్రహ్మ 'అట్లాగే అవుతుం'దని చెప్పి వెళ్ళిపోయాడు. వరం పొందిన ఒంటె అహంభావంతో సాటివాడి సాయాన్ని ఆశించక సోమరితనంతో ఉన్నది. ఒకరోజున కావాలని మరీ తన మెడకాయను పొడిగించి అడవిలో చక్కగా మేత మేస్తున్నది. అంతలో పెద్ద గాలివాన వచ్చింది.

**క. వచ్చినఁ, దన మెడ సాఁగిన । యచ్చటి గుహలోన నుత్తమాంగం బిడి తా**
**నిచ్చమెయి నిదురపోవఁగ । విచ్చలవిడి నొక్క నక్క వెలఁదియుఁ దానున్. 84**

**ప్రతిపదార్థం:** వచ్చినన్= వాన రాగానే; తనమెడ= తన మెడకాయ; సాగిన= సాగినటువంటి; అచ్చటి= అక్కడి; గుహలోనన్= అక్కడే ఉన్న గుహలో; ఉత్తమాంగంబున్= తలను; ఇడి= ఉంచి (పెట్టి); తాన్= తాను; ఇచ్చమెయిన్= ఇష్టం వచ్చినట్లు; నిదుర+పోవఁగన్= నిద్రించగా; ఒక్క నక్క= ఒక నక్క; వెలఁదియున్= దాని భార్యా (ఆడనక్క); తానున్= తానూ; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా.

**తాత్పర్యం:** వాన పడీ పడంగానే ఆ ఒంటె తన మెడకాయను చాచి ఒక గుహలోనికి తలను పెట్టింది. ఆదమరచి హాయిగా నిద్రపోయింది. అంతలో ఒక నక్క దంపతులు ఎలాంటి అడ్డూ ఆపూ లేకుండా. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. ఆ గుహ సొచ్చెం; జొచ్చి యాఁకటిపెల్లున నాలుందానును నొక్కట నాలొట్టెనుఁగు కుత్తుక కబళించి నెత్తురు గండలు నొండొండ మ్రింగందొడంగిన, నదిమేలుకని ఆ లొట్టియ మెడ పొరల్చునంతకు నా నక్కలు నరంబులు ద్రెవ్వం గఱచిన, నెఱి దప్పి యయ్యుష్ట్రంబు నిర్గత ప్రాణం బయ్యెః నట్టి చందంబు గాక నీ వనాలస్యుండవును సహాయ సంపన్నుండవును నై నెగడు' మనిన నజ్జగతీశుం డతనితో 'శత్రుం డధికుం డైన నల్పబలుం డగు రా జేయోజ నాపద నిస్తరించు?' ననవుడు నతండు 'సముద్ర సరిత్సంవాదం బాకర్ణింపుము; దాన నీ యడిగిన యర్థంబు దేటపడియెడు' నని పలికి యిట్లనియె. 85**

**ప్రతిపదార్థం:** ఆ గుహ= ఆ బిలం లోపలకు; చొచ్చెన్= దూరాయి; చొచ్చి= లోనికి వెళ్ళి; ఆఁకటిపెల్లునన్= ఎక్కువ ఆకలితో; ఆలున్+తానున్= పెళ్ళామూ తానూ (ఆ నక్క దంపతులు); ఒక్కటన్= ఒక్కమారుగా; ఆ లొట్టెనుఁగు= ఆ ఒంటె; కుత్తుక= పీకను; కబళించి= పట్టుకొని; నెత్తురున్= రక్తాన్నీ; కండలున్= మాంసపు ముద్దలనూ; ఒండొండన్= ఒకటొకటిగా; మ్రింగన్ తొడంగినన్= తినటం మొదలుపెట్టగా; అది= ఆ ఒంటె; మేలుకని= నిద్రలేచి; ఆ+లొట్టియ మెడ= ఆ ఒంటె మెడకాయను; పొరల్చున్+అంతకున్= అటూ ఇటూ తిప్పుకునేలోగా; ఆ నక్కలు= ఆ జంట నక్కలు; నరంబులు= నాడులు; త్రెవ్వన్= తెగేలా; కఱచినన్= కొరకగా; నెఱి+తప్పి= సత్తువపోయి; ఆ+ఉష్ట్రంబు= ఆ ఒంటె; నిర్గతప్రాణంబు= ప్రాణంపోయింది; అయ్యెన్= అయింది; అట్టి చందంబుగాక= ఆ విధంగా గాక; నీవు= నీవు (ధర్మరాజు); అనాలస్యుండవును= అలస్యం చేయనివాడవుగానూ, సహాయ సంపన్నుండవును= ఇతరుల సాయాన్ని సమకూర్చుకొనే వాడవుగానూ; ఐ= అయి; నెగడుము= నడుచుకొనుము; అనినన్=

అనగానే; ఆ+జగతీ+ఈశుండు= ఆ ధర్మరాజు; అతనితోన్= ఆ భీష్మడితో; శత్రుండు= పగవాడు; అధికుండు+ఐనన్= ఎక్కువ బలం కలవాడైతే; అల్పబలుండు+అగు రాజు= తక్కువ బలం కల రాజు; ఏ యోజన్= ఏ తీరుగా; ఆపదన్= విపత్తును (కష్టాన్ని); నిస్తరించున్?= దాటగలుగుతాడు?; అనవుడున్= అని అడుగగానే; అతండు= భీష్ముడు; సముద్ర సరిత్+సంవాదంబు= సముద్రం నదుల మధ్య జరిగిన వృత్తాంతాన్ని; ఆకర్ణింపుము= ఆలకించుము; దానన్= అది విన్నందువలన; నీ అడిగిన= నీవు కోరిన; అర్థంబు= ప్రయోజనం; తేటపడియెడున్= స్పష్టం కాగలదు; అని పలికెన్= అని చెప్పాడు.

**తాత్పర్యం:** గుహలోకి అడుగుపెట్టిన నక్కలు అప్పటికే ఆకలి మండిపోతూ ఉండటం వలన ఒక్క ఉదుటున ఆ ఒంటె పీకను పట్టుకున్నాయి. నెత్తురును త్రాగుతూ, మాంసం ముక్కలను క్రమక్రమంగా మింగుతుండగా దానికి మెలకువ వచ్చింది. అది మెడను తిప్పుకొంటుండగానే ఆ నక్కలు మెడ నరాలు తెగిపడేటట్లు పటుక్కున కొరికాయి. పట్టుతప్పి ప్రాణాలు విడిచింది ఒంటె. అందువలన నీవు జాగరూకుడవై సాటివారి సాయాన్ని అందుకొంటూ నడుచుకొమ్ము' అన్నాడు. అనగానే ధర్మరాజు 'శత్రురాజు అధికబలం గలవాడైతే, అల్పబలంగల రాజు ఆపదలనుండి ఎట్లా గట్టెక్కగలుగుతాడు?' అని ప్రశ్నించాడు. భీష్ముడు 'సముద్రానికీ నదికీ నడుమ సాగిన సంభాషణ వింటే నీకే తెలుస్తుంది' అని ఇట్లా చెప్పనారంభించాడు.

## సముద్ర సరిత్సంవాదము (సం. 12-114-2)

**తే.** **'ఉదధి సుఖగోష్ఠి నున్నప్డు నదులతోడ । 'మీ తటంబుల తరువులు మీరు పొంగి**
**తటిమిపాటినఁ గూలు వేతసము లేల । పెటికిపో వవి మీ కేమి ప్రియ మొనర్చె? 86**

**ప్రతిపదార్థం:** ఉదధి= సముద్రం; నదులతోడన్= నదులతో; సుఖగోష్ఠిన్= ఆనంద సల్లాపంలో; ఉన్న+అప్డు= ఉన్న సమయంలో; మీరు= మీరు(నదులు); పొంగి= ఉప్పొంగి; తటిమి= వెంటాడి (ఉరవడితో); పాటినన్= ప్రవహించేటప్పుడు; మీ తటంబుల= మీ ఒడ్లమీది; తరువులు= చెట్లు; కూలున్= కుప్పకూలి పోతాయి; వేతసములు= నీటి ప్రబ్బలిచెట్లు (తుంగజాతికి చెందిన మొక్కలు); ఏల= ఎందుకు; పెటికిపోవు?= పెళ్ళగించుకొనిపోవు?; అవి= ఆ వేతసాలు; మీకున్= మీకు; ఏమి= ఎట్లాంటి; ప్రియమున్= ప్రీతిని; ఒనర్చెన్= కలిగించాయి?

**తాత్పర్యం:** సముద్రం నదులతో ఆనందంగా సల్లాపాలు సాగిస్తూ ఇట్లా అడిగింది 'మీరు మంచి ఉరవడితో పొంగిపొర్లి పారేటప్పుడు మీ గట్లమీది చెట్లు కూలిపడిపోతుంటాయికదా! మరి ప్రబ్బలిచెట్లు పడిపోవేమిటి? అవి మీకు ఏమైనా ఒరగపెట్టాయా ఏమిటి? అవి మిమ్మల్ని ఏమైనా సంతృప్తి పరిచాయా ఏమి?'

**వ.** **వాని నున్మూలింప మీకు శక్యంబు గామిం జేసియో వానికిం జేటు వాటిల్ల; దిది యేమి?' యనవుడు నదులందు గంగ యిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ ప్రబ్బలిచెట్లను; ఉన్మూలింపన్= ఊడబెరకటానికి; మీకున్= మీకు; శక్యంబు= సాధ్యం; కామిన్+చేసియో= కాకపోవటం వల్లనో; వానికిన్= ఆ ప్రబ్బలిచెట్లకు; చేటు+పాటిల్లదు= కీడు మూడదు; ఇది+ఏమి?= ఇదేమిటి?; అనవుడున్= అని అడగగానే; నదులందున్ గంగ= నదులలో గంగానది; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** లేక, వాటిని పెల్లగించటం మీవలన కాకపోవటం వలననా? ఏ కారణంగా ఆ ప్రబ్బలిచెట్ల మొదళ్ళు పెకలించబడటం లేదు?' అని అడగగానే గంగానది ఈ విధంగా సమాధానం ఇచ్చింది.

**క. 'బిగు వెడలక నిలిచి పడున్ । నగములు వేతసచయంబు నమ్రంబై పె**
**ల్లగు మా వేగము గడపి యె । స(గు బూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్. 88**

**ప్రతిపదార్థం:** నగములు= చెట్లు; బిగువు= బింకం; ఎడలక= వదలక; నిలిచి= నిలబడి ఉండి; పడున్= కూలిపోతాయి; వేతసచయంబు= ప్రబ్బలిచెట్ల సముదాయం; నమ్రంబు+ఐ= వంగి ఉండి; పెల్లు+అగు= ఉప్పొంగే; మా వేగము= మా ప్రవాహవేగాన్ని (మా ఉరవడిని); కడపి= దాటించి (ఉద్ధృతి తగ్గాక); పూర్వస్థితిన్= వెనుకటి వలెనే; బ్రదుకు= సుఖజీవనం; సమకూరంగాన్= కలుగగా; ఎస(గున్= ఒప్పుతాయి.

**తాత్పర్యం:** 'ఓ సముద్రుడా! మా గట్లమీది చెట్లన్నీ తమ బింకం సడలనీయకుండా నిలబడతాయి. అందువలన నీటి వేగాన్ని తట్టుకోలేక నిట్టనిలువునా కూలిపోతుంటాయి. ప్రబ్బలిచెట్లు ఆ విధంగా కాకుండా నీటి వేగాన్నిబట్టి వంగి ఉండి, ఆ ఉరవడి తగ్గాక ఎప్పటివలె సజీవంగా నిలబడి ఉంటాయి.'

**వ. అనియె నా ప్రబ్బలిచెట్ల తెఱంగు కనికొని. 89**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని గంగ చెప్పింది; ఆ+ప్రబ్బలిచెట్ల= ఆ తుంగజాతివైన ప్రబ్బలిచెట్లయొక్క; తెఱంగు= తీరును; కనికొని= తెలిసికొని.

**తాత్పర్యం:** అని గంగ సమాధానం చెప్పింది. కనుక ఆ నీటి ప్రబ్బలిచెట్ల తీరును గ్రహించుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అరి నృపాలు పెంపు నాత్మీయశక్తియు । నెఱి(గి మూర్ఖవృత్తి నెదురుపడక**
**యుచిత వృత్తి నతని యుద్ధతి మేవడి( । గడపి హీనబలు(డు సెడక నిలుచు. 90**

**ప్రతిపదార్థం:** హీనబలు(డు= తక్కువ బలంకల రాజు; అరినృపాలు= శత్రు రాజుయొక్క; పెంపున్= ఆధిక్యాన్నీ; ఆత్మీయశక్తియున్= తన లావునూ; ఎఱి(గి= తెలిసికొని; మూర్ఖవృత్తిన్= మొరటుగా; ఎదురుపడక= ఎదిరించకుండా; ఉచిత వృత్తిన్= తగిన రీతిలో; అతని= పగవాడియొక్క; ఉద్ధతిన్= మిడిసిపాటును (పొగరును); మేవడిన్= ఉపాయంతో; కడపి= అడ్డుకొని; చెడక= పాడవకుండా; నిలుచున్= నిలదొక్కుకొంటాడు.

**తాత్పర్యం:** బలహీనుడైన రాజు తన బలాన్నీ, ఎదుటివాడి బలాన్నీ అంచనా వేసికొనాలి. మొండిగా పోరుకు దిగకూడదు. పగవాడి మిడిసిపాటును యుక్తిగా తొలగించుకొనాలి (దాటవేయాలి). అపుడే ఆ రాజు ఎట్లాంటి చెరుపూ లేకుండా నిలబడగలుగుతాడు' (సమయానుకూలంగా పనులు చేసుకొనేవాడికి ఎట్లాంటి ఆపదలు రావని భావం).

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'దగుపదంబులకు( గులవంతు లగు పరిజనులు దొరకొనకున్న నరనాథుం డేమి సేయం గలవా(? డని యడిగిన నప్పుడమిఱేనికి భీష్ముం డిట్లనియె. 91**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగానే; విని= విన్నవాడై; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; తగుపదంబులకున్= ఆయా పదవులకు తగ్గ; కులవంతులు+అగు= పెద్ద కులంవారైన; పరిజనులు= సేవకులు; దొరకొనక+ఉన్నన్= దొరకకపోతే; నరనాథుండు= రాజు; ఏమి+చేయన్+కలవా(డు?= ఏమి చేయగలడు?; అని అడిగినన్= అని ధర్మరాజు అడుగగా; ఆ పుడమిఱేనికిన్= ఆ ధర్మరాజుతో; భీష్ముండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అదంతా ఆలకించిన ధర్మరాజు 'మంచి కులస్థుడైన సేవకుడు పదవికి తగ్గట్టుగా జతపడకపోతే రాజు ఏం చేయాలి?' అని అడిగాడు. దానికి భీష్ముడు ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు.

**కుర్కుర నీచత్వముం దెలుపునట్టి యితిహాసము (సం. 12-117-2)**

**సీ.** **'విను మొక్క యితిహాస మనుపమం బగు తపం । బునఁ బేర్చువాఁ డొక్కమునివరేణ్యు**
**నాశ్రమంబునఁ దద్దయావిశేషంబున । నఖిల జంతువులును నచట నచట**
**వసియించి సుఖముండు; వానిలో నొక్క కు । ర్కుర మెప్డు భక్తిమైఁ గొలిచి తిరుగు;**
**నమ్ముని మెలఁగినయచట నెల్లను । దాను వర్తింప నొక దువ్వు వైరమెత్తి**

**తే.** **కఱవ వచ్చిన నమ్మునికడకుఁ బాఱు । తెంచె నా కుక్క నాతఁడు దీప్త రూప**
**మైన దువ్వుఁ గాఁ జేసిన నది గడంగి । కవియ భయమంది పాఱె మున్కవియు దువ్వు.** **92**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఇతిహాసము= ఓ వెనుకటి కథను; వినుము= వినుము; అనుపమంబు+అగు= సాటిలేనిదైన (విశేషమైన); తపంబునన్= తపస్సుచేత; పేర్చువాఁడు= అతిశయించేటటువంటి; ఒక్కమునివరేణ్యు= ఒక మునిముఖ్యుడి యొక్క; ఆశ్రమంబునన్= ముని పల్లెలో (తపోవనంలో); తద్= ఆ మునియొక్క; దయా విశేషంబునన్= ఎంతో దయవలన; అఖిల జంతువులునున్= సమస్త ప్రాణులూ; అచటన్+అచటన్= అక్కడక్కడ; వసియించి= నివసించి; సుఖము= హాయిగా (సంతోషంగా); ఉండున్= ఉంటున్నాయి; వానిలోన్= ఉన్నవాటిలో; ఒక కుర్కురము= ఒక కుక్క; ఎప్డున్= ఎల్లప్పుడూ; భక్తిమైన్= ఆరాధనతో (విశ్వాసంతో); కొలిచి= సేవించి; తిరుగున్= మెలగుతూ ఉన్నది; ఆ+ముని= ఆ ఋషి; మెలఁగిన+అచటన్= తిరిగే చోట; ఎల్లను= అంతటా; తాను వర్తింపన్= తాను నడవగా; ఒకదువ్వు= ఒక పెద్దపులి; వైరము+ఎత్తి= పగబట్టి; కఱవన్= చంపటానికి (కరవటానికి); వచ్చినన్= రాగా; ఆ మునికడకున్= ఆ ముని దగ్గరకు; పాఱుతెంచెన్= పరుగుపెట్టింది; ఆ+కుక్కన్= ఆ కుక్కను; ఆతఁడు= ఆ ముని; దీప్తరూపము+ఐన= ప్రకాశించే రూపంగల; దువ్వుగాన్= పెద్దపులిగా; చేసినన్= చేయగా; అది+కడంగి= అది ధైర్యంగా నిలిచి; కవియన్= కలబడగా; మున్= ముందు; కవియున్= పైబడిన; దువ్వు= పెద్దపులి; భయమున్= పిరికితనాన్ని; అంది= పొంది; పాఱెన్= ఉడాయించింది.

**తాత్పర్యం:** 'దీని గూర్చి ఓ కథ చెప్పుతాను వినుము. పూర్వం ఒక ముని ఎవరూ చేయనలవి కానంతగా తపస్సు చేశాడు. అతగాడు దయాదాక్షిణ్యాలు కలవాడు. అతడి ఆశ్రమంలో అన్ని జంతువులూ హాయిగా చీకూ చింతా లేకుండా బ్రతుకుతుండేవి. వాటిల్లో ఒక కుక్క ఎంతో విశ్వాసంతో ఆ మునిని సేవిస్తూ ఉండేది. ఆ ముని ఎటు వెళ్ళితే అటు వెంబడించి వెళ్ళుతూ ఉండేది. అది చూచి సహించలేక ఒక పులి కుక్కమీద ద్వేషంపెట్టుకొని పంజాతో కొట్టబోయింది. ప్రాణభయంతో ఆ కుక్క ఆ ముని చాటుకుపోయింది. ఆ ముని దానిమీద జాలిపడి, దానికంటె పెద్దదైన పులిగా మార్చాడు. మొదట మీదపడిన అసలు పులి దీనిని చూచి భయపడి పారిపోయింది.

**సీ.** **అట్లు బెబ్బులి వచ్చి యడరిన బెబ్బులిఁ । గాఁ జేసి గెలిపించెఁ గరుణ మెఱయ,**
**నొక మత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన । నుద్ధతకరిఁ జేసి యొసఁగె జయము**
**సింహంబు దెస భీతిఁజెడి పాఱుతెంచిన । ఘనసింహముగఁ జేసి గర్వమిచ్చె,**
**శరభంబు ధాటికిఁ జకితమైన నుదగ్ర । శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె**

**తే.** **నిట్లు దివసక్రమంబున నెక్కుడైన । సత్త్వముగఁ జేయఁగాఁ గుక్క శరభభావ**
**మండితంబయి తిరుగుచునుండి పూర్వ । వాసనా నీచమగు మనోవర్తనమున.** **93**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; బెబ్బులి= పెద్దపులి; వచ్చి= పైబడి; అడరినన్= చెలరేగగా; కరుణమెఱయన్= దయచూపి; బెబ్బులిఁగాన్+చేసి= పెద్దపులిగా మార్చి; గెలిపించెన్= నెగ్గింపచేశాడు; ఒక మత్తకరిన్= ఒక మదించిన ఏనుగును; చూచి= కాంచి; ఓటమైన్= జంకుతో; ఒదిఁగినన్= దాక్కొనగా (చాటుకురాగా); ఉద్ధతకరిన్= దర్పంగల ఏనుగుగా; చేసి= మారు రూపంచేసి; జయము= గెలుపును; ఒసఁగెన్= కలిగించాడు; సింహంబు దెసన్= సింహం వలన; భీతిఁజెంది= భయంతో; చెడి= వెనుకంజ వేసి; పాఱుతెంచినన్= పరుగుపెట్టి రాగా; ఘన= గొప్పదైన; సింహముఁగన్+చేసి= సింహంగా చేసి; గర్వము= అహంభావాన్ని; ఇచ్చెన్= కలిగించాడు; శరభంబు= మీగండ్ల మెకం (సింహంకంటె బలిష్ఠమైన 8 పాదాలు కల జంతువు); ధాటికిన్= దాడికి; చకితము+ఐనన్= భయపడగా; ఉదగ్ర= భయంకరమైన; శరభంబున్+చేసి= మీగండ్లమెకంగా మార్చి; ఉత్సాహిన్= ఉత్సాహం కలదానినిగా; చేసెన్= చేశాడు; ఇట్లు= ఈ విధంగా; దివసక్రమంబునన్= రోజురోజుకు; ఎక్కుడు+ఐనన్= గొప్పదైన; సత్త్వముగన్+చేయఁగాన్= మృగంగా చేయగా; కుక్క= (ఆ గ్రామసింహం) కుక్క; శరభభావ మండితంబు+అయి= శరభ భావంతో వెలిగిపోతూ; తిరుగుచున్+ఉండి= తిరుగుతూ ఉండి; పూర్వవాసనా= ముందటి జాతి స్మృతితో; నీచము+అగు= తక్కువదైన; మనః+వర్తనమునన్= మనస్సుయొక్క నడవడితో.

**తాత్పర్యం:** అట్లా ఆ ముని ఆకుక్కను పెద్దపులి వెంబడిస్తే పులిగాను, ఏనుగు వెంటాడితే మదించిన ఏనుగుగానూ, సింహం తరిమితే సింహంగానూ, శరభం దాడిచేస్తే మరింత ఉత్సాహంకల శరభంగానూ మార్చి, ఎప్పటికప్పుడు భయాన్ని పోగొట్టి గెలిపించాడు. ఇట్లా రోజురోజుకూ ఆ కుక్క మరింత బలం పుంజుకొని శరభమృగంగా ఎంతో గర్వంగా తిరుగుతున్నది. అయినా కుక్క ముందటి తన నీచస్వభావాన్ని పోనిచ్చుకొనలేక పోయింది.

**వ.** **ఇట్లని విచారించె.** **94**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అని= ఈ విధంగా; విచారించెన్= ఆలోచించుకొన్నది.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆలోచించింది.

**చ.** **'ననుఁ గని యొండు సత్త్వము మనంబున బెగ్గిలి పాఱునప్పు డి**
**మ్మునివరుఁ డిట్ల పోలెఁ గృప మొక్కలమై శరభంబుఁ గాఁగఁ జే**
**యునొ తగ దాని నట్లయిన నుద్ధతి నాకుఁ జరింప లేదు గా**
**వున నితనిన్ వధింతు వెరవున్ బలమున్ సరి నుల్లసిల్లఁగన్.'** **95**

**ప్రతిపదార్థం:** ననున్+కని= నన్ను చూచి; ఒండు సత్త్వము= మరొక మృగం; మనంబునన్= లోలోపల; బెగ్గిలి= భయపడి; పాఱు+అప్పుడు= పరుగెత్తేటప్పుడు; ఈ మునివరుఁడు= ఈ మునీశ్వరుడు; ఇట్లు+పోలెన్= ఈ విధంగానే; కృప= దయ; మొక్కలమై= ఎక్కువై; శరభంబున్+కాఁగన్= మీగండ్ల మెకంగా; తగన్= తగునట్లు; దానిన్= ఆ భయపడ్డ జంతువును; చేయునొ= చేస్తాడో? ఏమో?; అట్లు+అయినన్= అట్లా అయితే; నాకున్= నాకు; ఉద్ధతిన్= గర్వంగా; చరింపన్ లేదు= తిరగటానికి వీలవదు; కావునన్= కాబట్టి; వెరవున్= ఉపాయమూ; బలమున్= శక్తీ; సరిన్= సరిసమానంగా; ఉల్లసిల్లఁగన్= ప్రకాశించగా; ఇతనిన్= ఈ మునిని; వధింతున్= చంపుతాను.

**తాత్పర్యం:** 'శరభరూపంలో ఉన్న నన్ను చూచి మరో మృగం భయపడి పారిపోవచ్చును. ఆ జంతువు మీది జాలితో ఈ ముని దానిని నాకంటె మిన్నగా చేయవచ్చును. అట్లా అయితే నేను గర్వంగా తలఎత్తుకొని తిరగలేను. కాబట్టి అట్లాంటి స్థితి రాకుండా నా యుక్తినీ శక్తినీ కలబోసి ఈ మునిని చంపేయాలి' అనుకుంది.

**తే.** **అను విచారంబు దివ్యబోధాఢ్యుఁ డైన । యమ్మునీశ్వరుఁ డెఱిఁగి 'యీ యధమజాతి**
**యున్నత స్థితి యెఱుఁగునే? మున్నపోలెఁ । గుక్క యయి యుండుఁ గా!' కన్నఁ గుక్క యయ్యె.** **96**

**ప్రతిపదార్థం:** అను= మునిని చంపటం అనే; విచారంబున్= ఆలోచనను; దివ్యబోధ+ఆఢ్యుఁడు+ఐన= దివ్యజ్ఞాన సంపన్నుడైన; ఆ మునీశ్వరుఁడు= ఆ మునివరుడు; ఎఱిఁగి= గ్రహించి; ఈ అధమజాతి= ఇట్లాంటి తక్కువజాతిది; ఉన్నతస్థితి= ఉచ్చదశను; ఎఱుఁగునే?= తెలియునా? (తెలియదని భావం); మున్న పోలెన్= మునుపటివలెనే; కుక్క+అయి= శునక రూపాన్ని పొంది; ఉండున్+కాక= ఉంటుంది కాక; అన్నన్= అని అనగానే; కుక్క+అయ్యెన్= కుక్కగా మారింది.

**తాత్పర్యం:** ముని దివ్యదృష్టితో కుక్క చెడ్డ తలంపును గ్రహించాడు. 'నీచజాతి కుక్కకు ఉదాత్త స్వభావం తెలియదు. కనుక ముందటి కుక్క రూపాన్ని మళ్ళీ పొందుతుంది కాక' అనగానే శరభరూపంలో ఉన్న కుక్క మామూలు కుక్కగా మారిపోయింది.

**వ. కావునం గులహీనులు మాననీయులు గా; రట్లుం గాక విశేషం బాకర్ణింపుము. 97**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కులహీనులు= తక్కువ కులంవారు; మాననీయులు కారు= గౌరవించదగ్గవారు కారు; అట్లున్+కాక= అట్లా కాకుండా; విశేషంబు= వేరయింది; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** కాబట్టి తక్కువ జాతివారిని ఎన్నడూ ఎక్కువగా ఆదరించకూడదు. అంతేకాక, మరో విశేషం చెప్పుతాను వినుము.

**చ. కుల మని పట్టి చిత్తమునఁ గూరిన కీ డరయంగ లేక య**
**గ్గలపు విభూతి దుష్టునకుఁ గల్గఁగఁ జేయుట గర్జ మెట్లు భృ**
**త్యుల మదియున్న రూ పరసి యుత్తమ మధ్యమ హీనరూప మా**
**త్రలకుఁ దగంగ నయ్యయి పదంబుల నిల్పుట నీతి భర్తకున్. 98**

**ప్రతిపదార్థం:** చిత్తమునన్= మనస్సులోపల; కూరిన= కలిగిన; కీడు= హానిని; అరయంగన్ లేక= కనిపెట్ట లేక; కులము+అని పట్టి= కులం మాత్రమే కారణంగా; అగ్గలము= ఎక్కువైన; విభూతిన్= సంపదను; దుష్టునకున్= చెడ్డనడత కలవాడికి; కల్గఁగన్+చేయుట= పొందింపచేయటం; ఎట్లు+కర్జము?= ఏ విధంగా చేయదగింది?; భృత్యుల= సేవకుల; మది+ఉన్న రూపు= మానసికస్థితిని; అరసి= జాగ్రత్తగా పట్టి చూచి; ఉత్తమ= ఉన్నతులు; మధ్యమ= మధ్యములు; హీనరూప మాత్రలకున్= నీచులు అయిన వారికి; తగంగన్= ఒప్పుగా; ఆ+ఆ+పదంబులన్= ఆయా స్థానాలలో; నిల్పుట= ఉంచటం; భర్తకున్= రాజునకు; నీతి= ధర్మం.

**తాత్పర్యం:** ఆంతర్యాన్ని తెలిసికొనకుండా కేవలం తన కులంవాడు కదా అని దుష్టుడిని అందలం ఎక్కించకూడదు. సేవకులు ఎట్లాంటివారో చూచుకొని, వారి వారి యోగ్యతలను బట్టి ఉత్తమ, మధ్యమ, అధమ స్థాయి పదవులలో ఉంచటం రాజధర్మం.

**క. శౌర్యము సత్యంబును స । త్కార్య జ్ఞానమును భక్తి తాత్పర్యము గాం**
**భీర్యముఁ గలిగినఁ గురుకుల । వర్య! కులం బేల? సిరికి వాఁ డుక్తుఁ డగున్. 99**

**ప్రతిపదార్థం:** కురుకులవర్య!= కురువంశోత్తమా!; శౌర్యము= పరాక్రమం; సత్యంబును= నిజాయితీ; సత్+కార్యజ్ఞానమును= మంచి చెడుల వివేకాన్ని; భక్తి తాత్పర్యము= సేవాభావం; గాంభీర్యమున్= గుట్టూ; కల్గినన్= కలిగి ఉంటే; కులంబు= వంశం; ఏల?= ఎందుకు?; సిరికిన్= ఐశ్వర్యానికి (అధికారానికి); వాఁడు= అట్లాంటివాడు; ఉక్తుఁడు= తగినవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పరాక్రమం, నిజాయితీ, మంచి చెడుల వివేకం, సేవాభావం, గాంభీర్యం కలవాడు సిరికి యోగ్యుడవుతాడు. అట్లాంటివాడికి కులంతో పని లేదు.

**క. ఇది సిద్ధాంతం బనరా । దుదితయశా! యెట్టులైన నున్నత వంశ్యున్**
**విదితగుణుం డగు పురుషు । న్వెదకి నిలుప వలయు మాననీయపదమునన్. 100**

**ప్రతిపదార్థం:** ఉదితయశా!= ప్రసిద్ధి కెక్కిన కీర్తిమంతుడా!; ఇది= నేను చెప్పినది; సిద్ధాంతంబు= నిర్ణయమైనది; అనరాదు= అనుకోవద్దు; ఎట్టులు+ఐనన్= ఎట్లాగైనా; ఉన్నత వంశున్= గొప్ప కులంవాడిని; విదితగుణుండు+అగు= పేరుపడ్డవాడూ అయిన; పురుషున్= మనిషిని; వెదకి= వెదకి; మాననీయ పదమునన్= గౌరవించదగ్గ స్థానంలో; నిలుప వలయున్= నిలబెట్టాలి,

**తాత్పర్యం:** ధర్మరాజా! అట్లాగని నీవు దీన్నే పరమ ప్రామాణికం అనుకోవద్దు. ఏ విధంగానైనా మంచిగుణవంతుడిని, మంచి కులవంతుడిని వెదకి మరీ పెద్దపదవిలో నిలపటం చాలా మంచిది.

**వ. అది యెట్లంటేని. 101**

**తాత్పర్యం:** అది ఎట్లాగంటే.

**ఉ. ఒక్కటి యేను జెప్పెద మహోగ్రపుఁగేసరి కైనఁ దోడుగా**
**నుక్కును లావునుం గలుగు నుజ్జ్వల సత్త్వచయంబుఁ గొన్నఁ గా**
**కెక్కుడు కృత్యముల్ నడప నెట్లగు నిట్టివి సాలు నంచుఁ దాఁ**
**గుక్కలఁ గూర్చి చేయఁ దనకుం దలఁపుల్ దలకూడ నేర్చునే? 102**

**ప్రతిపదార్థం:** ఒక్కటి= ఒక్కమాట; ఏను= నేను; చెప్పెదన్= చెప్తుతాను; మహోగ్రపుఁగేసరికిన్+ఐనన్= గొప్ప బలంకల సింహానికైనా సరే; ఉక్కును= శక్తీ; లావునున్= సామర్థ్యమూ; కలుగు= ఉన్నట్టి; ఉజ్జ్వల సత్త్వచయంబున్= ప్రకాశించే జంతు సమూహాన్ని; తోడుగాన్= సాయంగా; కొన్నన్+కాక= తీసుకుంటేనే కాని; ఎక్కుడు కృత్యముల్= ఎన్నో ఫలితాలు; నడపన్= అందుకోవటానికీ; ఇట్టివి= ఇట్లాంటివి; చాలును= సరిపోతాయి; అంచున్= అనుకొంటూ; తాన్= తాను; (సింహం); కుక్కలన్= కుక్కలను; కూర్చి= కూడబెట్టి; చేయన్= పనులు చేయటానికి; ఎట్లు+అగున్= ఎట్లా అవుతుంది; తనకున్= తన యొక్క (సింహంయొక్క); తలఁపుల్= ఆలోచనలు; తలకూడన్ నేర్చునే?= ఫలిస్తాయా?

**తాత్పర్యం:** ఇక్క డొకమాట చెప్తుతాను ఆలకించుము. ఎంతో బలంగల సింహం అయినా సరే శక్తిసామర్థ్యాలు ఉండే తమ జాతి సింహాల సహకారంతో ఎన్నో ఫలితాలు సాధిస్తుంది. ఇవి చాల్లే అనుకొని కుక్కలను చుట్టూ చేర్చుకొంటే తా ననుకొన్నవి నెరవేర్చుకొనలేదు.

**చ. వలనుఁ గులంబు లేని పరివారము గోటియు నేల? నేర్పు న**
**గ్గలికయు భక్తి పెంపు మదిఁ గల్గి సుహృజ్జన మిశ్రమౌ బలం**
**బిలువడి గల్గెనేని నిల యెల్లను నేలఁగఁ జాలు వేయు ర**
**జ్జులు విను రాజు నేర్పరియు శూరుఁడుఁ గావలయుంజుమీ నృపా!' 103**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధర్మరాజా! విను= వినవలసింది; వలనున్= నేర్పు; కులంబు లేని= ఉన్నత కులంలేని; పరివారము= పరిజనం; కోటియున్+ఏల?= కోట్లకొద్దీ ఎందుకు?; నేర్పున్= జాణతనం; అగ్గలికయున్= శౌర్యమూ; భక్తి= సేవ; పెంపు= గొప్పతనమూ;

మదిన్= మనస్సునందు; కల్గి= ఉండి; సుహృద్+జనమిశ్రము+ఔ= స్నేహితులతో కలిసిన; బలంబు= బలగం; ఇలువడి కల్గెన్+ఏనిన్= మంచి నడవడీ కలిగి ఉంటే; ఇల+ఎల్లనున్= ఈ ప్రపంచాన్నంతా; ఏలఁగన్+చాలున్= పాలించ సరిపోతాడు; వేయురజ్జులు= పనికిమాలిన మాటలు వేలకొద్దీ ఎందుకు?; రాజు= భూపతి; నేర్పరియున్= సమర్థుడూ; శూరుఁడున్= పౌరుషవంతుడూ; కావలయున్+చుమీ!= కావాలిసుమా!

**తాత్పర్యం:** రాజా! పరిజనానికి నేర్పూ, కులమూ ఉండాలి. అవి లేనివారు కోట్లకొద్దీ ఉన్నా ప్రయోజనం ఉండదు. చాకచక్యం, పౌరుషం, స్వామిభక్తి, గొప్పతనమూ, మనస్సులో కలిగి, స్నేహితుల బలగం, మంచినడతా ఉంటే - ఆ రాజు ఈ ప్రపంచాన్నంతా ఇట్టే ఏలవచ్చును. అనవసరం అయిన మాటలు ఎందుకుగాని ఒకటి వినుము. రాజైనవాడికి జాణతనం, పోటుతనం తప్పనిసరిగా ఉండాలి సుమా!

**వ. అని చెప్పి వెండియు. 104**

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పి మళ్ళీ (అందుకొన్నాడు).

**సీ. 'వినుము మయూరంబు విధమున బహు చిత్ర । భంగులఁ బ్రజ యంతరంగ మాత్మ**
**వశము సేయుచు, మృదువాక్యముల్ వలుకుచు । మంత్రంబునెడఁ దనమాట వెడల**
**కునికి శరత్సమయోచిత క్రియ చాడ్పు । గాఁగ ధర్మంబు శిఖా ప్రకార**
**మొంది తనర్ప, సముల్లాస పక్షమై । యానంబు గైకొంచు నధిక తర స**

**తే. మున్నతత్వంబు సంశ్రయ యోగ్య మగుటఁ । గాంచుచును దఱివచ్చినఁ గారు కాల**
**మేఁచు తెఅఁగున నేచుచు నీచ కుటిల । గతులఁ దునుముచు నెగడుట పతికి నీతి. 105**

**ప్రతిపదార్థం:** (ఈ పద్యంలో నెమలి నడత రాజుకు ఆరోపించబడింది) వినుము= వినవలసింది; మయూరంబు విధమునన్= నెమలివలె; బహుచిత్ర భంగులన్= అనేక తీరులైన విచిత్ర ప్రవర్తనలతో; ప్రజ= జనంయొక్క; అంతరంగమున్= మనస్సును; ఆత్మవశము చేయుచున్= లోబరచుకొంటూ; మృదువాక్యముల్= మెత్తని(నొచ్చుకోని) మాటలు (చెవి ఒగ్గి వినా లనిపించే కేకగల నెమలివలె); పలుకుచున్= మాట్లాడుతూ; శరత్సమయ= శరత్కాలానికి; ఉచిత= తగిన; క్రియచాడ్పుకాఁగన్= చేష్టవలె (శరత్కాలంతో కేక పెట్టక గంభీరంగా ఉండే నెమలివలె); మంత్రంబు+ఎడన్= కార్యాలోచనపట్ల; తనమాట= తన వాక్కును; వెడలక= బైటపడనీయకుండా; ఉనికి= ఉండటం; ధర్మంబు= నీతి; శిఖాప్రకారమున్+ఒంది= నెమలి సిగవలె తలమీద పెట్టుకొని; తనర్పన్= ఒప్పుగా; సముల్లాస పక్షమై= ఎంతో ఉత్సాహంతో ఉప్పొంగే సేనతో; యానంబు= దండయాత్రకు (రెక్కల తళతళల గతులు గల నెమలివలె); కైకొంచున్= పూనుకొంటూ; అధికతర సమున్నతత్వంబు= ఎంతో గౌరవం; సంశ్రయ= ఆశ్రయించటానికి; యోగ్యము+అగుటన్= తగిన దనే విషయాన్ని (నెమలివలె); కాంచుచున్= గుర్తిస్తూ; తఱివచ్చినన్= సమయం రాగానే; కారుకాలము= వానకాలంలో; ఏఁచు తెఱఁగునన్= రెచ్చిపోయే నెమలివలె; ఏఁచుచున్= (రాజు) చెలరేగుతూ; నీచ కుటిల గతులన్= నీచులయొక్క వక్రమార్గ పద్ధతులు (దుష్టమైన పాములను ముక్కలు ముక్కలు చేసే నెమలివలె); తునుముచున్= తునాతునకలు చేస్తూ; నెగడుట= ప్రసిద్ధి చెందటం; పతికిన్= రాజునకు; నీతి= ధర్మం.

**తాత్పర్యం:** 'వింత వింతల రంగుల రచనలుగల నెమలివలె రాజు అనేక రకాలైన నడతలతో ప్రజల హృదయాలను చూరగొనాలి. చెవి కింపు కలిగించే కేక (నెమలి కూత)వలె రాజు ప్రజలతో సౌమ్యంగా నెమ్మదిగా మాట్లాడాలి. వానకాలంలో శరత్కాలంలోను ప్రవర్తించే నెమలివలె రాజు తన మంత్రాంగాన్ని పైకి పొక్కనీయకుండాలి. నెత్తిమీద సిగతో ప్రకాశించే నెమలివలె రాజు ధర్మాన్ని నెత్తిమీద పెట్టుకొనేటట్లు చేయాలి. రెక్కల తళతళలతో నడకలు

గల నెమలివలె రాజు ఉత్సాహంతో ఉరకలు పెట్టే సైన్యంతో దండయాత్రకు బయలుదేరాలి. రంగురంగుల వన్నెలతో తన దగ్గరకు రప్పించుకొనే నెమలివలె రాజు ఎంతో పెద్ద ఎత్తున జనం గౌరవంగా తన నీడపట్టున చేరేటట్లు ఉండాలి. వానకాలంలోనే విజృంభించే నెమలివలె రాజు సమయం తెలిసికొని పగవాడిమీద పడిపోవాలి. విషం కక్కే పాములను ముక్కలు చేసే నెమలివలె రాజు తుచ్ఛుల కుత్రలను ఛేదించాలి. ఇదే రాజధర్మం.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కిరణముల భంగిఁ జతురపుఁ । బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్**
**నిరతంబును గనుఁగొనుచును । దరణి కరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 106**

**ప్రతిపదార్థం:** కిరణముల భంగిన్= కాంతికిరణాలవలె; చతురపు పరిజనములన్= నేర్పరులైన సేవకులను; ఎందున్= ఏ ప్రదేశాలకైనా; చొనిపి= పంపించి; పరకృత్యంబుల్= ఇతరులయొక్క చేతలను; నిరతంబును= ఎల్లప్పుడూ; కనుఁగొనుచును= కనిపెట్టుతూ; తరణి కరణిన్= సూర్యుడివలె; వెలుఁగుట= ప్రకాశించటం; ధరణీశునకున్= రాజునకు; ఒప్పున్= తగును, ఉత్తమం అవుతుంది.

**తాత్పర్యం:** చిన్నకంతలలోకైనా దూసుకుపోయే కాంతులవలె చాతుర్యంగల పరిజనులను ఎక్కడబడితే అక్కడ ప్రవేశపెట్టాలి. రహస్యంగా ఎదుటివాళ్ళ పనులన్నింటినీ ఎప్పటికప్పుడు చాల మెలకువగా పసికట్టాలి. సూర్యుడివలె వెలగటం రాజుకు తగును.

**తే. అలుక గూరిమి ఫలదంబు లగుచునుండఁ । గృత్యములఁ దా నెఱుంగుచు నిత్యవిధుల**
**నాయములును వ్యయంబులు నరసి కోశ । సంపదలు గాంచి యునికి రాజన్య గుణము.' 107**

**ప్రతిపదార్థం:** అలుక= వైరం; కూరిమి= స్నేహం; ఫలదంబులు= ఫలితాలను ఇచ్చేవి; అగుచున్+ఉండన్= అవుతూ ఉండగా; కృత్యములన్= చేసిన పనులను; తాన్= తనకు తానుగా; ఎఱుంగుచున్= తెలిసికొంటూ; నిత్యవిధులన్= నిత్యం చేయాల్సిన కృత్యాలను; ఆయములును= ఆదాయాలను; వ్యయంబులును= వెచ్చాలను; అరసి= పరిశీలించి చూచి; కోశ= బొక్కసం; సంపదలు= ధనధాన్యాది రూప ఐశ్వర్యాలను; కాంచి= జాగ్రత్తగా చూచి; ఉనికి= ఉండటం; రాజన్యగుణము= రాజ వంశీకుల ధర్మం.

**తాత్పర్యం:** వైరం, స్నేహం ఎపుడూ మంచో చెడో ఏదో ఒక ఫలితాన్ని అందిస్తూనే ఉంటాయి. తనకు తానుగా చేసిన పనులలోని మంచీచెడ్డా విచారించుకొనాలి. రోజువారీ పనులను ఆదాయవ్యయాలను బొక్కసాన్ని సంపదలను స్వయంగా చూచుకొనటం రాజధర్మం.'

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'రాజులకు దండంబు సర్వసాధారణంబు; తదీయ స్వరూపంబు వినవలతుం జెప్పు' మనిన న న్నరదేవునకు దేవవ్రతుం డిట్లనియె. 108**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; రాజులకున్= పాలకులకు; దండంబు= రాజనీతి; సర్వసాధారణంబు= అందరికీ తప్పనిసరి; తదీయ స్వరూపంబు= దాని తీరు; వినవలతున్= వినాలని ఉన్నది; చెప్పుము= చెప్పుము; అనినన్= అనగా; ఆ+నరదేవునకున్= ఆ ధర్మరాజునకు; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అదంతా విన్న తరువాత ధర్మరాజు 'దండించటం రాజులకు సామాన్యమైన విషయం కదా! ఆ దండం తీరుతెన్నులను తెలిసికొనాలని అపేక్షగా ఉన్నది' అనగానే భీష్ముడు చెప్పటం మొదలు పెట్టాడు.

భీష్ముఁడు ధర్మరాజునకు దండనీతి ప్రభావం బెఱింగించుట (సం. 12-121-8)

**సీ.** **'అసితోత్పల చ్ఛాయమై దంష్ట్రికాచతు । ష్టయమును, భుజ చతుష్టయము, జిహ్వా**
**కలు రెండుఁ, బాదాష్టకంబును, శంకు క । ర్ణములును, బహునయనములుఁ గల్గి**
**యూర్ధ్వ రోమంబులు నుగ్రారుణాస్యంబుఁ । గపిల జటాజాలకంబు నొప్ప**
**నసి గదా శక్తి శరాసన ముసల చ । క్ర ప్రాస శర తోమర త్రిశూల**

**తే.** **పరశు ముఖ సాధనంబులఁ బాపజనులుఁ । దరతరంబ సంఛేదన తాడనాదు**
**లైన వివిధ ప్రహతుల నే పడఁచుచును జ । రించు దండంబు సుజనులు ప్రియము నొంద. 109**

**ప్రతిపదార్థం:** అసిత+ఉత్పల= నల్లకలువవంటి; ఛాయమై= శరీరకాంతీ; దంష్ట్రికా చతుష్టయమును= నాలుగు కోరలూ; భుజ చతుష్టయమున్= నాలుగు చేతులూ; జిహ్వాకలు రెండున్= రెండు నాలుకలు; పాద+అష్టకంబును= ఎనిమిది పాదాలూ; శంకు కర్ణములును= లెక్కపెట్టలేనన్ని చెవులూ; బహునయనములున్= చాలా కళ్ళూ; కల్గి= ఉండి; ఊర్ధ్వరోమంబులున్= నిక్కబొడుచుకొన్న వెంట్రుకలూ; ఉగ్ర= భయం పుట్టించే; అరుణ+ఆస్యంబున్= ఎఱ్ఱటి ముఖమూ; కపిల జటాజాలకంబున్= గోరోజనం రంగున్న జడల సమూహమూ; ఒప్పన్= ఒప్పుతుండగా; అసి= కత్తి; గదా= గద; శక్తి= తోమరం; శరాసన= విల్లు; ముసల= రోకలి; చక్ర= చక్రాయుధం; ప్రాస= ఈటె; శరం= బాణం; తోమరం= చిల్లకోల, 'కొరడా); త్రిశూలం= మూడు కొనలు ఉండే శూలం; పరశు= గొడ్డలి; ముఖ= మొదలైన; సాధనంబులన్= పనిముట్లతో; పాపజనులున్= పాపులను; తరతరంబ= క్రమంగా; సంఛేదన= నరకటం; తాడనం= కొట్టటం; ఆదులు+ఐన= మొదలైన; వివిధ= అనేక రకాలైన; ప్రహతులన్= దండనలతో; ఏపు+అడఁచుచున్= పొగరు అణచివేస్తూ; సుజనులు= మంచి వాళ్ళు; ప్రియమున్= ప్రీతిని (సంతోషాన్ని); ఒందన్= పొందగా; దండంబు= దండనీతి; చరించున్= వర్తిస్తుంది.

**తాత్పర్యం:** 'దండనీతి మంచివాళ్ళను మెప్పిస్తుంది. చెడ్డవాళ్ళ పొగరును అణచివేస్తుంది. కత్తి, గద, తోమరం, విల్లమ్ములు, రోకలీ, చక్రం, ఈటె, చిల్లకోల, త్రిశూలం, గొడ్డలి మొదలైనవి పదకొండు ధర్మనీతికి పనిముట్లు. దాని ఒంటిరంగు నల్లటి నలుపు. దానికి నాలుగు కోరలూ, నాలుగు చేతులూ, ఎనిమిది కాళ్ళూ ఉంటాయి. (అనేకాలైన చెవులూ, కళ్ళూ ఉంటాయి) చూచీ చూడగానే భయపడేటట్లు ఎఱ్ఱటి ముఖం, గోరోజనం వన్నెతో ఉండే జడలూ ఉంటాయి. ఇవీ దండం రూపరేఖలు.

**సీ.** **పరుఁ డసంగుఁడు ధర్మపాలుండు ధర్ముండు । విజయుండు శాస్త్రంబు విశసనుండు**
**గ్రహమక్షరుఁడు ప్రజాగరము దురాసదుఁ । డతి సత్యగుండు నిత్యగుఁడు శాస్త**
**ప్రాగ్వచనుండు శస్త్రంబు బ్రహ్మము తీక్ష్ణ । వర్ముండు మనువు శివంకరుండు**
**కౌమారి సుతుఁడు శ్రీగర్భుండు వ్యవహార । తంత్రంబు సంగుప్త మంత్ర మనఁగఁ**

**తే.** **బరఁగు పేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ । డైన విష్ణుండ దండమై యావహిల్లు**
**శ్రీసరస్వతి యనునివి శిష్ట దండ । నీతి నామాంతరంబులు నృపవరేణ్య! 110**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= ఉత్తముడ వైన ఓ రాజా!; పరుఁడు= ఉత్తముడూ; అసంగుఁడు= సంసార బంధంలేనివాడూ; ధర్మపాలుండు= నీతిగా పాలించేవాడూ; ధర్ముండు= న్యాయమూర్తీ; విజయుండు= ఓడిపోనివాడూ; శాస్త్రంబు= శిక్షించేవాడూ; విశసనుండు= చంపేవాడూ; గ్రహము= లోకాన్ని ధరించేవాడూ; అక్షరుఁడు= నాశనంలేనివాడూ; ప్రజాగరము= ఎక్కువ జాగరూకుడూ; దురాసదుఁడు= దరిదాపులకు చేరరానివాడూ; అతి సత్యగుండు= ఎంతో సత్యవంతుడూ; నిత్యగుఁడు= ఎప్పటికీ ఒకే విధంగా ఉండేవాడూ; శాస్త= శాసించేవాడూ; ప్రాగ్వచనుండు= వేదవచనాలు వల్లించేవాడూ; శస్త్రంబు= ఆయుధ రూపుడూ;

బ్రహ్మము= తత్త్వం; తీక్ష్ణ వర్మ్ముండు= వాడియైన కవచం ధరించినవాడూ; మనువు= మనువూ; శివంకరుండు= మేలుచేసేవాడూ; కౌమారి సుతుఁడు= కుమారస్వామీ; శ్రీగర్భుండు= లక్ష్మి గర్భంలో కలవాడూ; వ్యవహారతంత్రంబు= వ్యవహారం నడిపే ఉపాయం కలవాడూ; సంగుప్త= రక్షకుడు; మంత్రము= మంత్రం; అనఁగన్= అన్నట్లు; పరఁగు= ఒప్పునట్టి; పేళులన్= పేర్లతో; ఒప్పి= చక్కగా ఉండి; అధ్వరమయ+ఆత్ముఁడు+ఐన= యజ్ఞమయ స్వరూపుడైన; విష్ణుఁడు= విష్ణువే; దండమై= దండరూపంగా; ఆవహిల్లున్= ఉంటాడు; శ్రీ= లక్ష్మి; సరస్వతి= సరస్వతి; అనునివి= అనేవి; శిష్ట= ప్రామాణికుల; దండనీతి= దండనీతికి; నామాంతరంబులు= మారు పేర్లు.

**తాత్పర్యం:** ధర్మరాజా! యజ్ఞరూపధారి విష్ణువే దండరూపంలో ఉంటాడు. ఇతడిని ఉత్తముడూ, సంసారపు తగులాటం లేనివాడూ, న్యాయపాలకుడూ, ధర్మస్వరూపుడూ, ఎపుడూ గెలిచేవాడూ, దగ్గరకు చేరరానివాడూ, శిక్షించేవాడూ, చంపేవాడూ, లోకధారీ, నాశనంలేనివాడూ, ఎక్కువ జాగరూకుడూ, ఎంతో సత్యవంతుడూ, ఎప్పటికీ ఒకేరకంగా ఉండేవాడూ, శాసించేవాడూ, వేదపురుషుడూ, ఆయుధరూపుడూ, తత్త్వం, తీక్ష్ణ కవచధారీ, మనువూ, శుభంకోరేవాడూ, శివకుమారుడూ, లక్ష్మిని గర్భంలో కలవాడూ, వ్యవహార తంత్రం తెలిసినవాడూ, సంరక్షకుడూ, మంత్రమూ అనే పేర్లతో వ్యవహరిస్తారు. శిష్టదండనీతికి శ్రీ, సరస్వతీ అనేవి మారు పేర్లు.

**వ. ధర్మాధర్మంబులు సుఖదుఃఖంబులు నయానయంబులు నర్థానర్థంబులు బలాబలంబులుఁ బ్రమాదాప్రమాదంబులు మొదలైన సకలావస్థలును దండంబున సమ్య గసమ్యక్ప్రకారంబులం గలుగుం గావున సమ్యక్ప్రకారంబుచేత దండంబున రక్షింపంబడిన ప్రజ రాజు నభివృద్ధి నొందించు; నట్లగుట దండంబు రాజునకుం బరాయణంబు. 111**

**ప్రతిపదార్థం:** ధర్మ+అధర్మంబులు= న్యాయాన్యాయాలు; సుఖదుఃఖంబులు= సుఖదుఃఖాలు, నయ+అనయంబులు= నీతి అవినీతులు; అర్థ+అనర్థంబులు= లాభనష్టాలు; బల+అబలంబులున్= శక్తి, అశక్తులూ; ప్రమాద+అప్రమాదంబులు= దయ, నిర్ణయాలూ; మొదలు+ఐన= మొదలుగా గల; సకల అవస్థలును= అన్ని స్థితులూ; దండంబునన్= దండనీతిలో; సమ్యక్+అసమ్యక్ ప్రకారంబులన్= తగిన తగని రీతుల వలన; కల్గున్= కలుగుతాయి; కావునన్= కాబట్టి; సమ్యక్+ప్రకారంబుచేతన్= చక్కటి తీరులో; రక్షింపంబడిన= కాపాడిన; ప్రజ= జనం; రాజు= పాలకుని; అభివృద్ధిన్= పెరుగుదలను (పెంపును); ఒందించున్= కలిగిస్తుంది; అట్లు+అగుటన్= అందుచేత; దండంబు= దండనీతి; రాజునకున్= పాలకుడికి; పరాయణంబు= ఆశ్రయం.

**తాత్పర్యం:** ధర్మం-అధర్మం, కష్టం-సుఖం, నీతి-అవినీతి, లాభం-నష్టం, శక్తి-అశక్తి, ప్రమత్తత-అప్రమత్తత మొదలైన వాటి మొత్తం వివేచన సమస్తమైన అవస్థలూ దండనీతి బాగుగా పాలించటం పాలించకపోవటంవలన పుట్టాయి. బాగా పాలించిన దండనీతివలన ప్రజలు ఎల్లప్పుడూ రాజు అభివృద్ధినే కోరుకొంటారు. అందువలన రాజు తప్పక దండనీతిని ఆశ్రయించాలి.

**క. సత్యప్రకార ధర్మము । నిత్యానుష్ఠేయ; మది సునీత మగుచు నా**
**దిత్యపతిఁ బ్రీతుఁ జేయఁగ । నత్యున్నతి నెసఁగు నాతఁ డన్నప్రదుఁడై. 112**

**ప్రతిపదార్థం:** సత్యప్రకార ధర్మము= సత్యమార్గంగల ధర్మం; నిత్య అనుష్ఠేయము= ఎల్లప్పుడూ ఆచరించ దగింది; అది= ఆ ధర్మం; సునీతము+అగుచున్= సరైన రాజనీతి అవుతూ; ఆదిత్యపతిన్= దేవేంద్రుడిని; ప్రీతున్+చేయఁగన్= సంతుష్టి పరచగా; ఆతఁడు= ఆ ఇంద్రుడు; అతి+ఉన్నతిన్= ఎంతో గొప్పగా; అన్న ప్రదుఁడు+ఐ= అన్నదాత అయి; ఎసఁగున్= ఒప్పుతాడు.

**తాత్పర్యం:** సత్య మార్గంలో ధర్మాన్ని ఎప్పుడూ ఆచరించాలి. దాన్ని ఎంతో చక్కగా అమలు పరిస్తే ఇంద్రుడు సంతృప్తి పడతాడు. వానలు కురిపించి అన్నపానాదులు సమకూరుస్తాడు.

**వ. దానంజేసి దండంబు ప్రసన్నంబై వెలుంగుఁ; దదీయాభిధానంబులు మఱియునుం గల; వాకర్ణింపుము. 113**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= అందువలన; దండంబు= దండనీతి; ప్రసన్నంబు+ఐ= స్వచ్ఛంగా; వెలుంగున్= ఒప్పుతుంది; తదీయ= దండనీతికి సంబంధించిన; అభిధానంబులు= పేర్లు; మఱియున్= ఇంకా; కలవు= ఉన్నాయి; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అందువలననే దండనీతి ఒప్పుతుంది. ఈ నీతిని తెలిపే పేర్లు ఇంకా కొన్ని ఉన్నాయి. ఆలకించుము.

**ఆ. పురుషుఁ డీశ్వరుండు భూతాత్మకుండు జీ । వుండు ప్రాణుఁ డక్షయుండు సత్త్వ**
**మనఁగ నేడు పేరు లష్టమంబు ప్రజాప । తి యనఁ బరఁగు దండదేవు పేరు. 114**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు= పురుషుడు; ఈశ్వరుండు= శివుడూ; భూతాత్మకుండు= భూత స్వరూపుడూ; జీవుండు= జీవుడూ; ప్రాణుఁడు= ప్రాణుడూ; అక్షయుండు= అక్షయుడూ; సత్త్వము= సత్త్వమూ; అనఁగన్= అన్నట్లుగా; ఏడు పేరులు= ఏడు రకాల పేర్లు; అష్టమంబు= ఎనిమిదవది అయిన; దండదేవు పేరు= దండ దేవుడిపేరు; ప్రజాపతి అనన్= ప్రజాపతి అనే పేరుతో; పరఁగున్= ప్రసిద్ధ మవుతుంది.

**తాత్పర్యం:** పురుషుడూ, ఈశ్వరుడూ, భూతస్వరూపుడూ, జీవుడూ, ప్రాణుడూ, అక్షయుడూ, సత్త్వమూ, ప్రజాపతీ అనే ఎనిమిదీ దండదేవుడి పేర్లు.

### వసుహోముఁడు మాంధాతృనకుఁ జెప్పిన దండోత్పత్తి ప్రకారము (సం. 12-122-1)

**వ. దండంబు సాక్షాద్దేవుం; డట్లగుటఁ దెలిపెడునది యొక్క యితిహాసంబు గల; దంగదేశాధీశుండు వసుహోముం డను రాజు హిమశైలంబున ముంజపృష్ఠం బనం బ్రసిద్ధం బగు శృంగంబునకు దేవీ సహితంబుగాఁ జని యందు వసియించి మునిగణ పూజితంబగు వృత్తంబున నుదాత్తుండయి యుండ నమ్మహీపతి కడకు మాంధాతృండు సనుదెంచి సవినయంబుగాఁ బ్రణమిల్లిన, నబ్భూవల్లభునకు నతం డర్ఘ్యపాద్యాదులగు నుపచారంబు లాచరించి, 'వచ్చిన పని యేమి?' యని యడిగిన నప్పుడమితేఁడు 'సవిస్తరంబుగా దండ ప్రకారంబు వినుటకై నిన్నాశ్రయింప వచ్చితి' ననవుడు నమ్మహాత్ముం డతని కిట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** దండంబు= దండనీతి; సాక్షాత్+దేవుండు= ప్రత్యక్ష దైవమే; అట్లు+అగుటన్= అట్లా అవటాన్ని; తెలిపెడు+అది= తెలిపేటటువంటి; ఒక్క ఇతిహాసంబు= ఒక వెనకటి కథ; కలదు= ఉన్నది; అంగదేశ+అధీశుండు= అంగదేశపు రాజు; వసుహోముండు+అను రాజు= వసుహోము డనే పేరుగల రాజు; హిమశైలంబునన్= మంచుకొండమీద; ముంజపృష్ఠంబు+అనన్= ముంజపృష్ఠమని; ప్రసిద్ధంబు+అగు= పేరుపడ్డ; శృంగంబునకున్= పర్వతంపై శిఖరానికి; దేవీసహితంబుగాన్= పట్టపురాణితో కూడా; చని= వెళ్ళి (పోయి); అందున్= ఆ కొండ కొమ్మున; వసియించి= ఉండి; మునిగణపూజితంబు+అగు= మునిజనంచేత గౌరవించదగ్గ; వృత్తంబునన్= నడవడికతో; ఉదాత్తుండు+అయి= గొప్పవాడై; ఉండన్= ఉండగా, ఉన్నట్టి; ఆ+మహీపతి కడకున్= ఆ రాజు దగ్గరకు; మాంధాతృండు= మాంధాత; చనుదెంచి= వచ్చి (చేరి); సవినయంబుగాన్= ఎంతో అణకువగా; ఆ+భూవల్లభునకున్= ఆ రాజునకు; ప్రణమిల్లినన్= మొక్కగా; అతండు= ఆ వసుహోముడు; అర్ఘ్యపాద్యాదులు+అగు= చేతులు కాళ్ళు కడుగు కొనటానికి నీళ్ళు ఇవ్వటం వంటి; ఉపచారంబులు= సేవలు; ఆచరించి= చేసి; వచ్చినపని= రాకకు కారణం; ఏమి?= ఏమిటి?; అని; అడిగినన్= అడుగగానే; ఆ+పుడమితేఁడు= ఆ రాజు; సవిస్తరంబుగాన్= వివరంగా; దండప్రకారంబు= దండనీతి

విధానం; వినుటకున్+ఐ= ఆలకించటానికి; నిన్నున్+ఆశ్రయింపన్= నీ అండకు; వచ్చితిన్= చేరాను; అనవుడున్= అనగానే; ఆ+మహాత్ముండు= ఆ రాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దండం సాక్షాత్తు దైవమే అనటానికి లోగడ జరిగిన కథ ఒకటి చెప్తుతాను వినుము. అంగదేశపు రాజు వసుహోముడు. ఒకసారి అతడు భార్యతోకూడా 'ముంజపృష్ఠ'మనే మంచుకొండ కొమ్ముమీదికి పోయాడు. అక్కడ కొన్నాళ్ళు ఉన్నాడు. తన నడతతో అక్కడి మునుల ఆదరణ పొందాడు. ఒకనాడు మాంధాత ఆ రాజు దగ్గరకు వచ్చి వినయంగా మొక్కాడు. అతడికి రాజు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి 'ఏమి పనిపడి వచ్చారు?' అని అడిగాడు. 'దండనీతి శాస్త్రాన్ని తుదముట్టా వివరంగా వినాలనే కోరికతో నీ అండ చేరాను' అన్నాడు. ఆ వసుహోముడు మాంధాతతో ఈ విధంగా అన్నాడు.

**సీ.** **'అజుఁ డధ్వరంబు సేయంగఁ దలంచి ఋ। త్విజు నాత్మసదృశుని వెదకి యెందుఁ**
**గానక, తా నొక్క గర్భంబు ధరియించి। వేయేండ్లకును దుమ్మి వెలువరించె;**
**క్షుతసంభవతఁ జేసి క్షుతుఁడను పేరిట। బరఁగెడు నా ప్రజాపతియు ఋత్వి**
**జుండుగఁ గ్రతు వొనర్చుచునుండ నంతర్హి। తం బయ్యె వలచు చందమున నడచు**

**ఆ.** **నట్టి దగుట దండ మధిప కార్యాకార్య। తంత్ర భేద మెడలె దానఁజేసి**
**మహి గలంగెఁ గడు నమర్యాద వర్తించెఁ। గమలజుండు విష్ణు కడకుఁ జనియె.** **116**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అజుఁడు= బ్రహ్మ; అధ్వరంబు= యాగం; చేయంగన్= చేయటానికి; తలంచి= సంకల్పించి; ఆత్మసదృశునిన్= తనతో తులతూగే; ఋత్విజున్= యాగకర్తను; వెదకి; ఎందున్+కానక= ఎక్కడా తటస్థపడక; తాను= స్వయంగా; ఒక్కగర్భంబు= కడుపును; ధరియించి= పొంది; వేయేండ్లకున్= వేయి సంవత్సరాలకు; తుమ్మి= తుమ్మి; వెలువరించెన్= (కుమారుడిని) బయటపడేశాడు; క్షుతసంభవతన్+చేసి= తుమ్మువలన పుట్టినవా డవటం వలన; క్షుతుఁడు+అనుపేరిటన్= క్షుతుడనే పేరుతో; పరఁగెడు= ఒప్పుతున్నట్టి; ఆ ప్రజాపతియున్= ఆ క్షుత ప్రజాపతిని; ఋత్విజుండుగన్= యజ్ఞపురోహితుడుగా; క్రతువు= యాగం; ఒనర్చుచున్+ఉండఁగన్= చేస్తుండగా; అధిప!= రాజా!; వలచు చందమునన్= కోరినట్లుగా; నడచునట్టిది+అగుటన్= మసలుకొనేది అవటంవలన; దండము= దండనీతి; అంతర్హితంబు+అయ్యెన్= మాయమయింది; దానన్+చేసి= అందువలన; కార్య+అకార్యతంత్ర భేదము= చేయదగింది చేయదగంది అనే తేడా; ఎడలెన్= పోయింది; మహి= భూమి; కలంగెన్= కలతపడింది; కడున్= ఎంతో; అమర్యాద= అగౌరవం; వర్తించెన్= జరిగింది; కమలజుండు= బ్రహ్మ; విష్ణు కడకున్= విష్ణువు దగ్గరకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** బ్రహ్మ ఒక యాగం చేయతలపెట్టి తనతో దీటైన ఋత్విజుడికొరకు గాలించాడు. ఎక్కడా అట్లాంటివాడే కంటపడలేదు. తానే స్వయంగా వెయ్యేళ్ళు గర్భం మోసి తుమ్మగా ఆ గర్భం బయటపడింది. తుమ్ము కారణంగా పుట్టినవా డవటం వలన అతడికి క్షుతుడనే పేరు పెట్టారు. ఆ క్షుతప్రజాపతి ఋత్విజుడుగా, బ్రహ్మ యాగం చేస్తున్నాడు. ఆ దండం ఇష్టం వచ్చినట్లు నడచుకొనేది కాబట్టి కనబడకుండా పోయింది. దానివలన ఏ పని చేయవచ్చు? ఏ పని చేయకూడ? దనే జ్ఞానం శూన్యమైనది. అందువలన ప్రజలంతా కలవరపడ్డారు. మర్యాద మంటగలిసింది. బ్రహ్మ విష్ణువును ఆశ్రయించాడు.

**క.** **చని సంప్రార్థించి, యతని। గొని రుద్రునిఁ గాంచి 'నీ సఖుం డీతఁడు వ**
**చ్చిన కార్యము గృపతోడను। విను'మని దండంబు తెఱఁగు వినిపించెఁ దగన్.** **117**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; సంప్రార్థించి= వేడుకొని; అతనిన్= విష్ణువును; కొని= తీసికొనివెళ్ళి; రుద్రునిన్= శివుడిని; కాంచి= చూచి; ఈతఁడు= ఇతడు; నీ సఖుండు= నీ మిత్రుడు; వచ్చినకార్యము= వచ్చిన పనిని; కృపతోడను= దయతో; వినుము= వినవలసింది; అని= అని చెప్పి; దండంబు=దండనీతి; తెఱంగు= తీరు; తగన్= ఇంపుగా; వినిపించెన్= వివరించాడు.

**తాత్పర్యం:** బ్రహ్మ విష్ణువును ప్రార్థించి, అతడిని శివుడి దగ్గరకు తీసికొనిపోయి 'ఇతడు నీ మిత్రుడు. అతడు ఏమి పనిమీద వచ్చాడో చెప్పుతాడు; దయతో వినవలసింది' అంటూ దండనీతి విధానం అంతా చెవికి ఇంపుగా చెప్పాడు.

**వ.** **అట్లు లోకరక్షకుం డగు పుండరీకాక్షు దండగొని దండాభావంబున జగంబు గలంగు టెఱింగించిన, నవ్విరించి పలుకులు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండనీతి కాశ్రయుండై పరఁగుచుండె.** **118**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; లోక రక్షకుండు+అగు= లోకాన్ని కాపాడే పుండరీకాక్షు= విష్ణువుయొక్క; దండగొని= అండకొని; దండ+అభావంబునన్= దండం లేకపోవటంచేత; జగంబు= లోకం; కలంగుట= కలవరపడటం; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+విరించి పలుకులు= ఆ బ్రహ్మ మాటలు; మనస్కరించి= ఇష్టపడి; మహాదేవుండు= శివుడు; నిజప్రభావంబున్= తనదైన మహిమను; దండంబుగాన్= దండంగా; కల్పించి= నిర్మించి (చేసి); దండనీతికిన్= దండనీతికి; ఆశ్రయుండు+ఐ= ఆధారభూతుడై; పరఁగుచున్+ఉండెన్= ఒప్పుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా విష్ణువును ఆసరాగా చేసికొని బ్రహ్మ దండనీతి మాయమవటంవలన ప్రపంచం ఎట్లా అల్లకల్లోల మయిందో వివరించి చెప్పాడు. ఆ బ్రహ్మమాటలు శివుడికి మనస్కరించాయి. వెంటనే తన మహిమతో దండాన్ని కల్పించాడు. ఆ దండానికి తానే ఆధారం అయ్యాడు.

**సీ.** **వినుము; ఋగ్వేదాది వేదముల్ నాలుగుఁ, । గల్పాదులైన యంగంబు లాఱు,**
**బెరసి విద్యలు పది పేర్చు; పురాణంబు । లనియును నొక విద్య యధిప! ధర్మ**
**విదులు సెప్పెడు శాస్త్ర వితతియంతయు నొక । విద్య; సర్వన్యాయ విస్తరంబు**
**నొకటి, మీమాంస దానొక్కటి; యిట్టులు । వివరింపఁ బదునాల్గు విద్య లయ్యె**

**తే.** **వైద్య కోదండ గాంధర్వ విద్య, లర్థ । శాస్త్రమగు నీతివిద్య, తత్సహిత వృత్తి**
**వెలయఁగాఁ బదునెనిమిది విద్య లభవుఁ । డేర్పరించె జగత్త్రయహితము పొంటె.** **119**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; వినుము= ఆలకించుము; ఋగ్వేదాది వేదముల్= ఋగ్వేదం మొదలైన వేదాలు; నాలుగున్= నాలుగు; కల్ప+ఆదులు+ఐన= కల్పం మొదలైన; అంగంబులు+ఆఱు= వేదాంగాలు ఆరూ; బెరసి= వెరసి (కలసి); విద్యలు పది= పది విద్య లవుతాయి; పేర్చు= అతిశయించిన; పురాణంబులు= పద్దెనిమిది పురాణాలు; అనియునున్= అనియు; ఒక విద్య= ఒక విద్య అవుతుంది; ధర్మ విదులు= ధర్మశాస్త్రం తెలిసినవారు; చెప్పెడు= చెప్పే; శాస్త్ర వితతి+అంతయున్= శాస్త్రాలన్నీ; ఒక విద్య= ఒక విద్య అవుతుంది; సర్వన్యాయ విస్తరంబున్= సమస్త తర్కశాస్త్రం అంతా; ఒకటి= ఒక్కటి అవుతుంది; మీమాంస= పుర్వోత్తర మీమాంసా శాస్త్రం అంతా; తాను ఒక్కటి= తనకు తానే ఒక్కటి; ఇట్టులు= ఈ విధంగా; వివరింపన్= బాగా తెలుపగా; పదునాల్గు విద్యలు= పధ్నాలుగు విద్యలు; అయ్యెన్= అయ్యాయి; వైద్య= వైద్య విద్య; కోదండ= విలువిద్య; గంధర్వవిద్యలు= సంగీత విద్యలు; అర్థశాస్త్రము+అగు నీతి విద్య= అర్థశాస్త్రమైన నీతి విద్య; తత్సహిత= దానితో కూడుకొన్న; వృత్తి= వివరణా; వెలయఁగాన్= ప్రకాశించగా; పదునెనిమిది విద్యలు= పద్దెనిమిది విద్యలు; జగత్త్రయ= ముల్లోకాల; హితము పొంటెన్= మేలు కొరకు; అభవుఁడు= శివుడు; ఏర్పరించెన్= ఏర్పాటు చేశాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అనే నాలుగు వేదాలూ, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు వేదాంగాలూ కలిసి మొత్తం పది విద్యలవుతాయి. పురాణం, ధర్మశాస్త్రం, న్యాయశాస్త్రం, పూర్వోత్తరమీమాంసా శాస్త్రంతో చేర్చుకొని మొత్తం పధ్నాలుగు విద్యలు అవుతాయి. వైద్యవిద్య (ఆయుర్వేదం), విలువిద్య (ధనుర్వేదం), సంగీతం (గాంధర్వవేదం), నీతివిద్య (అర్థశాస్త్రం) అనే ఉపవేదాంగాలతో కలిపితే మొత్తంగా పద్దెనిమిది విద్యలు అవుతాయి. వీటిని శివుడు ముల్లోకాల మేలుకోరి సృష్టించాడు.

**వ. ఇట్లు సమకట్టి, దండంబును దండనీతి ప్రపంచంబులయిన యవ్విద్యలను విష్ణు వశగతంబులు సేసె; నాసర్వేశ్వరుం డత్తమ్మిచూలికిఁ దుమ్ము ఘటించి యీ భంగిం బ్రజాపతి ప్రసవంబు గావించె; దండనీతి సమగ్ర రూపమై చెల్లె; నెల్ల జగంబులుం బ్రియంబందె; నరవిందభవుని యాగంబును సుప్రయోగంబై నడచె; విష్ణుండు దండనీతి శాస్త్రంబు సకలంబు నాంగిరసున కిచ్చె; నాంగిరసుం డింద్ర మరీచులకు, మరీచి భృగునకు, భృగుం డనేక మునులకు నిచ్చె; నీక్రమంబున నది జగంబులం బరఁగె; దండంబు జాగరణంబున లోకంబు మర్యాదామహితంబై వర్తిల్లెఁ; గపర్ది శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుం డుమాపతి యనుపేళ్ళం బరఁగు నద్దండదేవుని నతులధర్మంబున నయించు భూపాలుం డైహికాముష్మిక సిద్ధులం బొందు. 120**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సమకట్టి= పూనుకొని; దండంబును= దండనీతి శాస్త్రాన్ని; దండనీతి ప్రపంచంబులు+ఐన= దండనీతిని విస్తరింపచేసేవి అయిన; ఆ+విద్యలను= ఆ పద్దెనిమిది విద్యలను; సర్వేశ్వరుండు= ఆ శివుడు; విష్ణువశగతంబులు+చేసెన్= విష్ణుపరం చేశాడు; ఆ తమ్మిచూలికిన్= పద్మంలో పుట్టిన బ్రహ్మకు; తుమ్ము ఘటించి= తుమ్ము కల్పించి; ఈ+భంగిన్= ఈ విధంగా; ప్రజాపతి= క్షుతబ్రహ్మను; ప్రసవంబు కావించెన్= పుట్టించాడు; దండనీతి= దండనీతి; సమగ్రరూపము+ఐ= నిండారిన రూపంతో; చెల్లెన్= చెల్లుబాటయింది; ఎల్లజగంబులున్= సమస్త లోకాలూ; ప్రియంబు= సంతోషాన్ని; అందెన్= పొందాయి; అరవిందభవుని= బ్రహ్మయొక్క; యాగంబును= యాగమూ; సుప్రయోగంబు+ఐ= మంత్ర తంత్రాదులతో; నడచెన్= జరిగింది; విష్ణుండు= విష్ణువు; దండనీతి శాస్త్రంబు= దండనీతి శాస్త్రం; సకలంబున్= మొత్తాన్నీ; ఆంగిరసునికిన్+ఇచ్చెన్= ఆంగిరసుడికి ఇచ్చాడు; ఆంగిరసుడు= ఆ ఆంగిరస మహర్షికి; ఇంద్రమరీచులకున్= ఇంద్రుడికీ, మరీచుడికీ; మరీచి= మరీచి; భృగునకున్= శుక్రాచార్యుడికి; భృగుండు= శుక్రాచార్యుడు; అనేక మునులకున్= ఎంతోమంది మునులకు; ఇచ్చెన్= సమర్పించాడు; ఈ క్రమంబునన్= ఈ రీతిగా; అది= ఆ దండనీతి శాస్త్రం; జగంబులన్= లోకాలన్నిట్లో; పరఁగెన్= ఒప్పింది; దండంబు= దండనీతి; జాగరణంబునన్= ఎచ్చరికతో; లోకంబు= ప్రపంచం; మర్యాదామహితంబు+ఐ= గౌరవంతో ఒప్పినదయి; వర్తిల్లెన్= వ్యవహరించింది; కపర్ది= కపర్దం అనే జటాజూటం కలవాడు; శంకరుండు= సుఖాన్ని కలిగించేవాడూ; రుద్రుండు= శత్రువులను దుఃఖపెట్టేవాడూ; భవుండు= అంతా తానే అయ్యేవాడూ; స్థాణుండు= ప్రళయకాలంలోకూడా ఉండేవాడూ; ఉమాపతి= పార్వతీదేవి భర్త; అనుపేళ్ళన్= అనే ఆరు పేర్లతో; పరఁగు= ఒప్పేటి; ఆ+దండదేవునిన్= ఆ దండదేవుడైన రుద్రుడిని; అతుల ధర్మంబునన్= సాటిలేని ధర్మంతో; నయించు= నడిపే; భూపాలుండు= రాజు; ఐహిక ఆముష్మిక సిద్ధులన్= ఇహలోక పరలోక సంపదలను; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రయత్నించి దండనీతిని పద్దెనిమిది విద్యలను శివుడు విష్ణువునకు అప్పగించాడు. ఆ బ్రహ్మకు తుమ్ము పుట్టించి క్షుతబ్రహ్మను పుట్టించాడు. దండనీతి ప్రపంచంలో వ్యాపించింది. ప్రపంచం మొత్తం సంతోషించింది. బ్రహ్మదేవుడి యాగం శాస్త్రోక్తంగా జరిగింది. తన అధీనంలో ఉన్న దండనీతి శాస్త్రాన్నంతా విష్ణువు ఆంగిరసుడికీ, అతడు దేవేంద్రుడికీ, మరీచికీ, మరీచి భృగుమహర్షికీ తెలియచెప్పారు. భృగుమహర్షి ఎంతో మంది

మునులకు ఉపదేశించాడు. ఇట్లా ఈ దండనీతి శాస్త్రం అన్ని లోకాలలోకి విస్తరించింది. దండనీతితో లోకం ప్రవర్తించటంవలన మర్యాదతో మెలగింది. కపర్ది, శంకరుడు, రుద్రుడు, శివుడు, స్థాణుడు, ఉమాపతి అనే పేళ్ళతో వ్యవహరించే దండనీతిని ధర్మబద్ధంగా నడిపిన రాజు భూలోకంలోనూ, పై లోకంలోనూ సర్వసంపదలను పొందుతాడు'

**క. అని వసుహోముఁడు సెప్పిన । విని మాంధాతృండు దండ విభవజ్ఞుండై**
**యనఘ! మహీపరిపాలన । మొనరించెను నీతిదండయుక్తి వెలయఁగన్. 121**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; అని= ఈ విధంగా; వసుహోముఁడు= అంగదేశపు రాజు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; మాంధాతృండు= మాంధాత; దండ విభవజ్ఞుండు+ఐ= దండనీతి వైభవాన్ని తెలిసికొన్న వాడై; నీతి దండయుక్తి= దండనీతి శాస్త్రంతో కూడి; వెలయఁగన్= ప్రకాశించగా; మహీపరిపాలనమున్= భూపరిపాలనాన్ని; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** రాజా! ఈ విధంగా వసుహోముడు మాంధాత చెప్పిన దండనీతి శాస్త్రం విని' ఆ దండనీతి వైభవంతో రాజ్యాన్ని పాలించాడు.

**క. ఈ యాఖ్యానము విని భూ । నాయకుఁ డెవ్వం డిలాజనంబుల నతుల**
**న్యాయంబున భావించుఁ జి । రాయుస్థిర పుణ్యభాగి యగు నతఁడు నృపా! 122**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; ఈ ఆఖ్యానమున్= ఈ వృత్తాంతాన్ని; ఎవ్వండు భూనాయకుఁడు= ఏ రాజు; విని= విన్నవాడై; ఇలా జనంబులన్= భూప్రజలను; అతులన్యాయంబునన్= సాటిలేని న్యాయంతో; పాలించున్= ఏలుకొంటాడో; అతఁడు= ఆ రాజు; చిరాయుః= చిరంజీవిగా ఉంటాడు; స్థిరపుణ్యభాగి= తరగని పుణ్యసంపదలు కలిగినవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** ఈ కథా వృత్తాంతాన్నంతా విన్న రాజు తన ప్రజలను ధర్మబద్ధంగా పాలిస్తాడు. ఆ రాజు చిరంజీవి అవుతాడు. తరగని పుణ్యసంపదలు అనుభవిస్తాడు'.

### భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మార్థకామంబుల తెఱం గెఱింగించుట (సం. 12-123-3)

**వ. అనిన విని ధర్మనందనుండు 'ధర్మార్థ కామంబుల నడవడి యె ట్లయిన మేలై చెల్లు?' నని యడిగిన, భీష్ముం డిట్లనుఁ 'దొల్లి యాంగరిష్ఠుం డను నరవరుండు కామందక నాముండైన ముని నిట్లని యడుగ నతం డతనికిఁ జెప్పిన భంగిం జెప్పెద నాకర్ణింపుము. 123**

**ప్రతిపదార్థం:** అనినన్= భీష్ముడు పలుకగానే; విని= విని; ధర్మనందనుండు= ధర్మరాజు; ధర్మార్థ కామంబులన్= ధర్మ, అర్థ, కామాల; నడవడి= నడత; ఎట్లు+అయినన్= ఏ విధంగా ఉంటే; మేలు+ఐ= మంచిదై; చెల్లును?= కొనసాగుతుంది?; అని+అడిగినన్= అని అడుగగా; భీష్ముండు= భీష్ముడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; తొల్లి= పూర్వం; ఆంగరిష్ఠుండు= ఆంగరిష్ఠుడనే; నరవరుండు= రాజు; కామందక నాముండు+అయిన= కామందకుడనే పేరుగల; మునిన్= మునిని; ఇట్లు+అని= ఇట్లాగని; అడుగన్= అడగగా; అతండు= ఆ ముని; అతనికిన్= రాజునకు; చెప్పిన భంగిన్= చెప్పినట్లుగానే; చెప్పెదన్= వినిపిస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** 'ధర్మార్థ కామాలతో ఎట్లా నడచుకొంటే మంచిది?' అని ధర్మరాజు అడుగగా, భీష్ముడు 'లోగడ ఆంగరిష్ఠుడనే రాజు కామందకు డనే మునిని ఈ విషయం గూర్చే అడిగాడు. అతడు చెప్పినట్లుగానే నీకూ చెప్పుతాను వినుము.

**చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగుఁ గామతం**
**త్ర నిరతుఁ డైనవాఁడు సుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం**
**డన మొనరింపఁ డట్టిపతి డాయరు సాధులు నార్యులున్ సుహృ**
**జ్జనులును; దానఁ జేటు నగుఁ, జావును బాటిలు నెల్ల భంగులన్. 124**

**ప్రతిపదార్థం:** అనయమున్= ఎపుడూ; పేర్చు= పెరిగే; కామమునన్= కోరికవలన; అర్థమున్= అర్థమూ; ధర్మమున్= ధర్మమూ; క్రాఁగున్= హరిస్తాయి; కామతంత్ర నిరతుఁడు+ఐనవాఁడు= కామోపాయంపట్ల ఆసక్తి ఉన్నవాడు; సుపథ ప్రతిపన్నుఁడు= మంచి మార్గాన్ని చేపట్టేవాడు; కాఁడు= కానేరడు; దుష్టదండనమున్= చెడ్డవాళ్ళను శిక్షించటాన్ని; ఒనరింపఁడు= చేయడు; అట్టిపతి= అట్లాంటి రాజును; సాధులున్= మంచివారు; ఆర్యులున్= పెద్దవారు; సుహృద్ జనులున్= స్నేహితులూ; డాయరు= దరిచేరరు; దానన్= అందువలన; ఎల్లభంగులన్= అన్నివిధాలా; చేటున్+అగున్= నాశనం కలుగుతుంది; చావున్= మరణంకూడా; పాటిలున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! ఎపుడూ భోగం అనుభవించాలనుకొనే రాజునకు ధర్మార్థాలు హరించుకుపోతాయి. కామంలో ఆసక్తిగల రాజు మంచి మార్గంలో ఉండడు. దుష్టులను శిక్షించడు. అట్లాంటి రాజు దగ్గరకు మంచివారు, పెద్దవారు, స్నేహితులు చేరరు. చెడ్డవారే చుట్టూ ఉంటారు. అందువలన అట్లాంటి రాజునకు కీడు కలుగుతుంది. చావూ మూడుతుంది.

**ఉ. కావున ధర్మసిద్ధికి ముఖంబగు నర్థమునందు నిష్ఠమై**
**నేవిధినైన ధర్మరతి యెక్కుడుగా మదిఁ జొన్పుటొప్పుఁ గా**
**మావిలబుద్ధి గాక యుచితాగత సౌఖ్యము లాచరించుచున్**
**భూవిభుఁ డెప్డు భూమిసతిఁ బొంది రమింప మహోన్నతుం డగున్.' 125**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ధర్మసిద్ధికిన్= ధర్మం ఫలించటానికి; ముఖంబు+అగు= ముఖ్యమైనది అయిన; అర్థమునందున్= పురుషార్థాలలో ఒకటైన అర్థంలో; నిష్ఠమైన్= శ్రద్ధతో; ఏ విధిన్+ఐనన్= ఎట్లా అయినాసరే; ధర్మరతి= ధర్మం మీద ఆపేక్ష; ఎక్కుడుగాన్= ఎక్కువ అగునట్లుగా; మదిన్+చొన్పుట= మనసులో నాటటం; ఒప్పున్= మంచిది అవుతుంది; కామ+ఆవిల బుద్ధి+కాక= కామంతో కలకబారిన మనస్సుతో కాక; ఉచిత+ఆగతసౌఖ్యములు= తగినట్టుగా వచ్చిన సుఖాలను; ఆచరించుచున్= పొందుతూ; భూ విభుఁడు= రాజు; ఎప్డున్= నిత్యమూ; భూమిసతిన్= భూకాంతను; పొంది= కలసి; రమింపన్= క్రీడించగా; మహా+ఉన్నతుండు+అగున్= గొప్పవా డవుతాడు.

**తాత్పర్యం:** కనుక, ధర్మం దక్కించుకొనటానికి ఆధారం అర్థం. ఆ అర్థంపట్ల నిష్ఠతో ఎట్లాగైనా ధర్మాపేక్షను విడనాడకూడదు. కామబుద్ధితో కాక లభ్యమైన తగిన సౌఖ్యాలను అనుభవిస్తూ రాజ్యాన్ని ఏలుకునే రాజు గొప్పవాడవుతాడు.

**క. అన విని ధర్మతనూజుఁడు । 'జనమ్ము శీలమ్ము నధిక సంస్తుత్యముగాఁ**
**గొనియాడుఁ; దత్స్వరూపం । బనఘా! వివరింపవే దయారతి నాకున్?' 126**

**ప్రతిపదార్థం:** అనన్= అనగానే; విని= ఆలకించి; ధర్మతనూజుఁడు= ధర్మరాజు; అనఘ!= ఓ పుణ్యవంతుడా!; జనమ్ము= లోకులు; శీలమ్మున్= నడవడిని; అధిక సంస్తుత్యముగాన్= ఎంతో పొగడదగినదిగా; కొనియాడున్= మెచ్చుకుంటారు; నాకున్= నాకు; దయారతిన్= కనికరంతో; తద్+స్వరూపంబున్= దాని కలరూపాన్ని; వివరింపవే?= విశదపరచవా?

**తాత్పర్యం:** 'లోకం శీలాన్ని ఎంతో మెచ్చుకొంటున్నది కదా! దాని స్వరూపాన్ని విప్పిచెప్పు'మని ధర్మరాజు ప్రార్థించాడు.

**వ. అనుటయు నాపగాతనయుండు విను మని యతని కిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఆపగా తనయుండు= భీష్ముడు; వినుము= ఆలకించుము; అని; అతనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** మళ్ళీ భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు.

**క. 'ము న్నింద్రప్రస్థంబున । నున్నతి మెయి ననుజ తనుజయుక్తంబుగ నీ**
**వున్న తెఱఁగు దుర్యోధను । కన్నులు గమరింప నతఁడు గడు వగ నొందెన్. 128**

**ప్రతిపదార్థం:** మున్ను= పూర్వం; ఇంద్రప్రస్థంబునన్= ఇంద్రప్రస్థ నగరంలో; అనుజ= తమ్ములతోను; తనుజ= కొడుకులతోను; యుక్తంబుగన్= కూడుకొని; ఈవు= నీవు; ఉన్నతిమెయిన్= ఉచ్ఛస్థితిలో; ఉన్న తెఱఁగు= ఉన్నతీరును (చూచి); దుర్యోధను= సుయోధనుడి; కన్నులు= కళ్ళు; కమరింపన్= ఉడుకెత్తగా; అతఁడు= ఆ దుర్యోధనుడు; కడు వగన్= ఎంతో దుఃఖాన్ని; ఒందెన్= పొందాడు.

**తాత్పర్యం:** 'నీవు నీ కొడుకులతో తమ్ముళ్ళతో కలిసి ఇంద్రప్రస్థంలో బాగా ఉండే రోజులలో దుర్యోధనుడికి కళ్ళుకుట్టి ఎంతో బాధపడ్డాడు.

**వ. భవదీయ సభ యొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసంబునకును న ట్లసహ్యపడి ధృతరాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చలుం బదివేవురు భూసురులు పసిండి పళ్ళెరంబులం బాయసాహారంబులు గొనుట మొదలుగాఁగ లక్ష్మి పెం పుగ్గడించి తనవగపు దోఁపంబలికిన నతం డతని కిట్లను 'మధురాన్నపాన మణిభూషణ వరవాహనాదులం జేసి యుజ్జ్వలంబై యున్నది గాక నీ యైశ్వర్యం బసదే? పాండవాగ్రజుం డెక్కుడు మెఱసి యునికియుం గలదు; వినుము చెప్పెద. 129**

**ప్రతిపదార్థం:** భవదీయ= నీకు సంబంధించిన; సభ= సమావేశం (మయసభ); ఒప్పునకును= చక్కదనానికి; రాజసూయంబు= రాజసూయ యాగం; చెల్లిన= జరిగిన; ఉల్లాసంబునకునున్= వైభవానికీ; అటు= అట్లా; అసహ్యపడి= ఈర్ష్యపడి; ధృతరాష్ట్రునితోన్= తండ్రితో; భవత్+గృహంబునన్= నీ (ధర్మరాజు) ఇంట్లో; నిచ్చలున్= అనునిత్యం; పదివేవురు= పదివేలమంది; భూసురులు= బ్రాహ్మణులు; పసిండి పళ్ళెరంబులన్= బంగారు పళ్ళెములలో; పాయస+ఆహారంబులు= పరమాన్నం మొదలైన పదార్థాలు; కొనుట= తినటం; మొదలుగాఁగన్= మొదలుపెట్టి; లక్ష్మి పెంపున్= మహా ఐశ్వర్యాన్ని; ఉగ్గడించి= చెప్పి; తనవగపు= తన దుఃఖం; తోఁపన్= కనపడేటట్లు; పల్కినన్= పలుకగా; అతండు= ధృతరాష్ట్రుడు; అతనికిన్= దుర్యోధనుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; మధుర= కమ్మనైన; అన్నపాన= అన్నపానాదులచేత; మణి= మణులచేత; భూషణ= నగలచేత; వరవాహనాదులన్+చేసి= మంచి వాహనాదులచేత; నీ ఐశ్వర్యంబు= నీ సంపద; ఉజ్జ్వలంబు+ఐ ఉన్నది= ప్రకాశిస్తూ ఉన్నది; అసదు+ఏ= తక్కువా; కాక= కాకపోతే; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ఎక్కుడు మెఱసి= ఎక్కువగా ఒప్పి; ఉనికియున్= ఉండుట; కలదు= ఉన్నది; చెప్పెదన్= చెబుతాను విను.

**తాత్పర్యం:** నీ మయసభ అందాన్ని, రాజసూయయాగ ప్రాభవాన్నీ చూచి అసూయపడ్డాడు. ధర్మరాజు ఇంట్లో ఎపుడూ పదివేలమంది బ్రాహ్మణులు బంగారు పళ్ళాలలో పాయసాన్నం తింటుంటారని, ఐశ్వర్యం సంపత్తి అంచనా కట్టుకొని తన దుఃఖాన్ని తండ్రి దగ్గర వెళ్ళబోసుకొన్నాడు. అపుడు ధృతరాష్ట్రుడు 'మధురమైన అన్నపానాలూ,

మణులూ, ఆభరణాలూ, మంచి వాహనాదులచేత నీ ఐశ్వర్యం అంతకన్నా తక్కువదేమీ కాదు. కాకపోతే ధర్మరాజు నీకంటె మిన్నగా ఉండటానికి కారణం చెప్పుతాను వినుము.

**ఆ. శీలవంతులైన సిరిఁ బొందుదురు ధర్మ । తనయునింటి సిరికి నెన యనంగ**
**నెక్కు డనఁగ లక్ష్మి యెసకం బెసఁగ నీవు । శీల మలవరింపు చిత్తమునను. 130**

**ప్రతిపదార్థం:** శీలవంతులు+ఐనన్= మంచి నడత కలవారైతే; సిరిన్= ఐశ్వర్యాన్ని; పొందుదురు= పొందుతారు; ధర్మతనయు= ధర్మరాజు యొక్క; ఇంటి సిరికిన్= ఇంటి సంపదకు; ఎన+అనంగన్= సాటేమో అన్నట్లుగా; ఎక్కుడు+అనఁగన్= ఎక్కువేమో అనేటట్లుగా; లక్ష్మి= సంపద; ఎసకంబు+ఎసఁగన్= పెంపొందటానికి; నీవు= నీవు; చిత్తమునను= మనస్సులో; శీలము= మంచి స్వభావాన్ని; అలవరింపు(ము)= సంపాదించుకొమ్ము.

**తాత్పర్యం:** మంచి ప్రవర్తన కలవారు ఎన్నో సంపదలతో తులతూగుతుంటారు. కనుక ధర్మరాజు దగ్గర శీలం అధికం. ధర్మరాజు ఇంటి సంపదతో సరిసమాన మయ్యేటట్లు అంతకంటే మరింతగా సంపద పెంపొందటానికి నీవు కూడా మంచి స్వభావాన్ని అలవరుచుకొమ్ము.

**వ. మాంధాతృండు, నాభాగుండు మొదలయిన మేదినీపతులు శీలంబునం గాదె యీ లోకంబునం బెంపువడసి; రివ్విషయంబునకు నొక్క యితిహాసంబు గల; దాకర్ణింపుము. 131**

**ప్రతిపదార్థం:** మాంధాతృండు= మాంధాత; నాభాగుండు= నాభాగుడు; మొదలయిన= మొదలైన; మేదినీ పతులు= రాజులు; శీలంబునన్= మంచి ప్రవర్తనచేతనే; కాదె?= కాదా?; ఈ లోకంబునన్= ఈ లోకంలో; పెంపు+పడసిరి= ఎంతో మన్నన పొందారు; ఈ+విషయంబునకున్= ఆ సంగతి తెలిసికొనటానికి; ఒక్క ఇతిహాసంబు= పూర్వం జరిగిన కథ ఒకటి; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** మాంధాతా, నాభాగుడు మొదలైన మహారాజులంతా శీలంవలనే లోకంలో గౌరవం పొందారు. దీనిని గురించి జరిగిన కథ ఒకటి చెప్పుతాను వినుము.

**క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం । డనిమిష పతి రాజ్యలక్ష్మి యతులిత శీలం**
**బునఁ గొని త్రైలోక్యంబును । దనకు వశగతంబు సేసె ధర్మం బలరన్. 132**

**ప్రతిపదార్థం:** దనుజ విభుఁడు= రాక్షసరాజైన; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; అనిమిషపతి= ఇంద్రుడి; రాజ్యలక్ష్మి= రాజ్యాన్ని; అతులిత= సాటిలేని; శీలంబునన్= సత్ప్రవర్తనచేత; కొని= కైవసం చేసికొని; త్రైలోక్యంబును= ముల్లోకాలను; తనకున్= తనకు; ధర్మంబు+అలరన్= న్యాయం ఒప్పేటట్లు; వశగతంబు+చేసెన్= స్వాధీనం చేసికొన్నాడు.

**తాత్పర్యం:** శీలం మూలంగానే ఒకపుడు ప్రహ్లాదుడు ఇంద్రుడి రాజ్యాన్ని లోబరచుకొన్నాడు. ధర్మబద్ధంగా ముల్లోకాలను తన గుప్పిట్లో పెట్టుకొన్నాడు.

**క. దానికి రోసి బృహస్పతి । తో నమరేంద్రుండు మేలు దొరకొను విధమె**
**ట్లో నావుడు భార్గవునిం । గానఁగఁజను మతఁడు సెప్పఁ గరుణాన్వితుఁడై. 133**

**ప్రతిపదార్థం:** దానికిన్= దానికి; రోసి= ఏవగించుకొని; బృహస్పతితోన్= దేవతల గురువుతో; అమర+ఇంద్రుండు= దేవేంద్రుడు; మేలు= మంచి; దొరకొను విధము= కలిగే తీరు; ఎట్లో= ఎట్లాంటిదో (చెప్పవలసింది); నావుడన్= అనగానే; భార్గవునిన్+కానఁగన్=

శుక్రాచార్యుడిని; దర్శించటానికి; చనుము= వెళ్ళుము; అతఁడు= శుక్రాచార్యుడు; కరుణా+అన్వితుఁడు+ఐ= దయకలవాడై; చెప్పున్= చెపుతాడు.

**తాత్పర్యం:** దానికి ఇంద్రుడు రోషపడి దేవతలగురువు బృహస్పతి దగ్గరకు వెళ్ళి 'నాకు మేలు జరిగే ఉపాయం చెప్పు' మన్నాడు. బృహస్పతి 'శుక్రాచార్యుడివలన నీ కన్నీ తెలుస్తాయి వెళ్ళుము అతడు ఎంతో దయతో చెప్పుతాడు'.

**క. అని గురుఁడు పంప నింద్రుఁడు । సని భార్గవుఁ గాంచి 'మేలు సమకూరు తెఱం**
**గనఘా! యుపదేశింపవె' । యనినం 'బ్రహ్లాదుఁ జెందు; మతఁ డెఱిఁగించున్. 134**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; గురుఁడు= బృహస్పతి; పంపన్= పంపగా; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; చని= వెళ్ళి; భార్గవున్= శుక్రాచార్యుడిని; కాంచి= చూచి; అనఘా!= ఓ పుణ్యాత్ముడా!; మేలు= శుభం; సమకూరు తెఱంగు= సమకూరే ఉపాయాన్ని; ఉపదేశింపవె?= తెలియచెప్పవా?; అనినన్= అనగానే; ప్రహ్లాదున్= ప్రహ్లాదుడిని; చెందుము= చేరి అడుగుము; అతండు= ఆ ప్రహ్లాదుడు; ఎఱిఁగించున్= బోధ పరుస్తాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు శుక్రాచార్యుడి దగ్గరకు వెళ్ళి 'అయ్యా! నా రాజ్యలక్ష్మిని తిరిగిపొందే ఉపాయాన్ని చెప్పు' మనగానే అతడు 'ప్రహ్లాదుడి దగ్గరకు వెళ్ళటం శ్రేయస్కరం. అంతా అతడే చెప్పుతాడు' అంటాడు.

**ఆ. అతని నాశ్రయించి యవ్వెర విప్పించి । కొనిన మేలు వొందు' ననియె భార్గ**
**వుండు వజ్రి బ్రాహ్మణుం డయి ప్రహ్లాదుఁ । జేరి శిష్యవిధులు సేయుచుండె. 135**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ ప్రహ్లాదుడిని; ఆశ్రయించి= అండచేరి; ఆ+వెరవు= ఆ ఉపాయాన్ని; ఇప్పించుకొనినన్= పొందగా; మేలు+పొందున్= శుభం కలుగుతుంది (అని); భార్గవుండు= శుక్రాచార్యుడు; అనియెన్= అన్నాడు; వజ్రి= ఇంద్రుడు; బ్రాహ్మణుండు+అయి= బ్రాహ్మణవేషం వేసికొని; ప్రహ్లాదున్+చేరి= ప్రహ్లాదుడి దగ్గరచేరి; శిష్య విధులు= శిష్యులు చేసే పనులు; చేయుచున్+ఉండెన్= చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** 'ప్రహ్లాదుడిని ఆశ్రయించి ఆ ఉపాయాన్ని పొందితే నీకు మంచి జరుగుతుం'దని భార్గవుడు చెప్పాడు. ఇంద్రుడు బ్రాహ్మణవేషంతో ప్రహ్లాదుడి శిష్యుడిగా చేరి శుశ్రూషలు చేస్తూ ఉన్నాడు.

**వ. అంత నద్దానవేంద్రుండు ప్రసన్నుండై భూసురాకృతి యయిన సురపతితో సంభాషించిన నతండు 'నీకుఁ త్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తం బైన కారణం బేమి? యెఱింగింపవే!' యనుటయు. 136**

**ప్రతిపదార్థం:** అంతన్= కొంతకాలం పోయాక; ఆ+దానవ+ఇంద్రుండు= ఆ రాక్షసరాజు ప్రహ్లాదుడు; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహించిన వాడై; భూసుర+ఆకృతి+అయిన= బ్రాహ్మణ వేషంలో ఉన్న; సురపతితోన్= దేవేంద్రుడితో; సంభాషించినన్= మాటాడగా; అతండు= ఇంద్రుడు; నీకున్= నీకు; త్రైలోక్యరాజ్యంబు= ముల్లోకాలు; సంప్రాప్తంబు+ఐన= లభించిన; కారణంబు= హేతువు; ఏమి= ఏమిటో; ఎఱింగింపవే= తెలుపవా; అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** కొంతకాలం గడిచాక ప్రహ్లాదుడు దేవేంద్రుడి మీద జాలిపడి మాటాడాడు. ఇంద్రుడు 'మూడులోకాలూ మీ ఏలుబడికిందికి ఎట్లా వచ్చాయో తెలిసికొనాలని ఉన్నదని అన్నాడు' - అనగానే (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. దనుజనాథుఁ డిట్టులను 'రాజ నను గర్వ । మున ధరామరులకు మనసు గందఁ**
**జేయ నెపుడు నే నసూయాదు లమ్మహా । త్ములకు ధనము లిత్తు నెలమితోడ. 137**

**ప్రతిపదార్థం:** దనుజనాథుఁడు= రాక్షసరాజు; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; ఏన్= నేను; రాజను+అను= రాజును అనే; గర్వమునన్= అహంకారంతో; ధరామరులకున్= బ్రాహ్మణులకు; మనసు+కందన్= మనస్సు బాధపడేటట్లు; అసూయా+ఆదులు= ఈర్ష్య మున్నగువాటిని; చేయన్= చేయను; ఆ+మహాత్ములకున్= ఆ పుణ్యాత్ములకు; ఎలమితోడన్= సంతోషంగా; ధనములు= సంపదలు; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** ప్రహ్లాదుడు ఇట్లా అన్నాడు. 'నేను పాలకుడిని అని చెప్పుకోను. అహంకారంతో, ఈర్ష్యపడి బ్రాహ్మణుల మనస్సును నొప్పించను. ఎంతో భక్తితో ఆ మహానుభావులకు ధనం, ద్రవ్యం ఇచ్చి ఆదరిస్తుంటాను.

**వ. వారలు మెచ్చునట్టి శీలంబునం బ్రవర్తిల్లుదు; దానంజేసి మహోన్నతుండ నైతి. 138**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ బ్రాహ్మణులు; మెచ్చునట్టి= పొగడే; శీలంబునన్= మంచి ప్రవర్తనతో; ప్రవర్తిల్లుదున్= నడచుకుంటాను; దానన్+చేసి= అందువలననే; మహా+ఉన్నతుండన్+ఐతిన్= గొప్పస్థితిమంతుడ నయ్యాను.

**తాత్పర్యం:** నా నడవడిని బ్రాహ్మణులంతా మెచ్చుకున్నారు. కాబట్టి ఇంతటి గొప్పవాడినయ్యాను'.

**క. అనవుడు 'నీ శీలము నా । కనఘా! దయ నొసఁగవే! మహాత్ములఁ దగఁ జెం**
**దినవారు బ్రదుకవలదే?'। యని దీనత దోఁప ననిమిషాధిపుఁ డడిగెన్. 139**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; అనఘా!= పాపం అంటనివాడా!; నీ శీలము= నీ మంచి నడత; నాకున్= నాకు; దయన్= దయతో; ఒసఁగవే= సమర్పించవా; మహాత్ములన్= పుణ్యాత్ములను; తగన్= చక్కగా; చెందినవారు= పొందినవారు; బ్రదుకన్ వలదే?= జీవించవద్దా?; అని; అనిమిష+అధిపుఁడు= దేవేంద్రుడు; దీనతతోఁపన్= జాలిగొలిపేటట్లు; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! నీ ధర్మశీలాన్ని నామీద దయతో ఇప్పించవలసింది. అయినా పుణ్యాత్ములను ఆశ్రయించినవారు బాగా బ్రతకవద్దా?' అని ఎంతో దైన్యంతో ఇంద్రుడు అడిగాడు.

**క. విని ప్రహ్లాదుఁడు గృప దన । మనమునఁ గదురంగ విప్రమాత్రుఁడు గాఁ డీ**
**తని భంగిఁ జూడ నను వెఱ । పును బుట్టఁగ నిచ్చె శీలముం బెం పెసఁగన్. 140**

**ప్రతిపదార్థం:** విని= విని; ప్రహ్లాదుఁడు; కృప= దయ; తన మనంబునన్= తన మనస్సులో; కదురంగన్= కలుగగా; ఈతని భంగిన్= ఈతడి తీరును; చూడన్= చూడగా; విప్రమాత్రుఁడు కాఁడు= బ్రాహ్మణుడు మాత్రమే కాడు; అను వెఱపును పుట్టఁగన్= అనే భయంకూడా కలుగగా; పెంపు+ఎసఁగన్= ఎంతో గౌరవంగా; శీలమున్= మంచి నడతను; ఇచ్చెన్= దానం చేశాడు.

**తాత్పర్యం:** ప్రహ్లాదుడు ఆతడి తీరు చూచి 'ఇతడు బ్రాహ్మణ మాత్రుడు కాడు సుమా!' అనిపించి భయం పుట్టినా, తన శీలాన్ని అతడికి దానం చేశాడు.

**తే. పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ । జనియెఁ; దదనంతరంబ యద్దనుజవరుని**
**తనువునందుండి తేజిష్ఠ తనువిలాసుఁ । డైన పురుషుండు వెడలిన నతఁడు సూచి. 141**

**ప్రతిపదార్థం:** పడసి= శీలాన్ని పొంది; ఇంద్రుండు= దేవేంద్రుడు; శీలసంపన్నుఁడు+అగుచున్= శీలసంపద కలవాడవుతూ; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాతనే; ఆ దనుజవరుని= ఆ రాక్షసోత్తముడి; తనువునందున్+ఉండి= శరీరంనుండి; తేజిష్ఠ= ఎంతో తేజస్వంతమైన; తను విలాసుఁడు+ఐన= శరీర లావణ్యం కల; పురుషుండు= పురుషాకారం; వెడలినన్= బయటకు రాగా; అతఁడు= ఆ ప్రహ్లాదుడు; చూచి= చూచినవాడై.

**తాత్పర్యం:** ప్రహ్లాదుడి శీలాన్నిపొంది ఇంద్రుడు వెళ్ళగానే ప్రహ్లాదుడి శరీరంలో నుండి అందంగా మెరిసిపోతున్న పురుషాకారం బయటపడింది. ఆ పురుషుడిని ప్రహ్లాదుడు చూచి.

**వ. 'నీ వెవ్వండ?' వన నప్పురుషుం 'డేను శీలంబ; నీ విచ్చిన యవ్విప్రుపాల వసియింపం జనియెద'నని చెప్పి పోయెం; దదనంతరంబ క్రమంబునం దేజోమయ రూపంబులు నిజదేహంబున నుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుచు. 142**

**ప్రతిపదార్థం:** నీవు+ఎవ్వండవు?= నీవు ఎవరివి?; అనన్= అని అడగగానే; ఆ+పురుషుండు= ఆ పురుషుడు; ఏను= నేను; శీలంబన్= శీలాన్ని; నీవు+ఇచ్చిన= నీవు దానంచేసిన; ఆ విప్రుపాలన్= ఆ బ్రాహ్మణుడి దగ్గర; వసియింపన్= ఉండటానికి; చనియెదన్= వెళ్ళుతాను; అని చెప్పి; పోయెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మట; క్రమంబుననన్= వరసపెట్టి; తేజోమయ రూపంబులు= ప్రకాశవంతమైన ఆకారాలు; నిజదేహంబునన్+ఉండి= తన శరీర భాగంనుండి; నిర్గమింపన్= వెళ్ళగా (పోగా); ఆ+దానవ+ఈశ్వరుండు= ఆ రాక్షసరాజు; అడుగుచున్= ప్రశ్నిస్తూ.

**తాత్పర్యం:** 'నీవు ఎవ్వడ?'వని ప్రహ్లాదుడు అడిగాడు. 'నేను శీలాన్ని నీవు దానం చేసిన బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్ళిపోతా'నని చెప్పి వెళ్ళిపోయాడు. అట్లా వరసపెట్టి తేజోమయ రూపాలు ప్రహ్లాదుడి శరీరంనుండి వెళ్ళుతుంటే ప్రహ్లాదుడు వారి పేర్లు అడిగి తెలిసికొన్నాడు.

**క. ఉత్తమ ధర్మము సత్యము । వృత్తంబు బలంబు నగుట వినఁబడి బడిఁ ద**
**చ్చిత్తము విషాద మంద మ । హత్తర మూర్తి యొక వారిజానన వెడలెన్. 143**

**ప్రతిపదార్థం:** ఉత్తమ ధర్మము= మేలైన ధర్మం; సత్యము= నిజం; వృత్తంబు= ప్రవర్తన; బలంబును= బలంకూడా; అగుట= కావటం; వినఁబడి= విన్నవాడై; బడిన్= వెంటనే; తద్+చిత్తము= అతడి మనస్సు; విషాదము= దుఃఖాన్ని; అందన్= పొందగా; మహత్తరమూర్తి= మంచిరూపంగల; ఒక వారిజ+ఆనన= ఒక స్త్రీ; వెడలెన్= బయలుదేరింది.

**తాత్పర్యం:** ఆ తేజోమయరూపాలు ఉత్తమ ధర్మం, సత్యం, సద్వర్తనం, బలం, కావటం విని ప్రహ్లాదుడు ఎంతో దుఃఖించాడు. అంతలో ఒక మంచి రూపవతి అతడి శరీరంనుండి బయటపడింది.

**క. వెడలిన 'నీ వెవ్వత?' వని । యడిగిన నాతనికి నిట్టులను దీనత న**
**ప్పడఁతి 'సిరి నేను; బలమె । క్కడకు నరుగు నందుఁ బోవఁ గడఁగి వెడలితిన్.' 144**

**ప్రతిపదార్థం:** వెడలినన్= బయటపడగా; నీవు+ఎవ్వతవు= నీవు ఎవ్వరిదానవు; అని+అడిగినన్= అని అడగగా; ఆతనికిన్= ఆతడితో; ఆ పడఁతి= ఆ స్త్రీ; దీనతన్= దైన్యంతో; ఇట్టులు+అనున్= ఈ విధంగా పలికింది; ఏను= నేను; సిరిన్= లక్ష్మిని; బలము= బలం; ఎక్కడకున్+అరుగున్= ఎటు వెళ్ళుతుందో; అందున్+పోవన్= అక్కడకు వెళ్ళటానికి; కడఁగి= పూనుకొని; వెడలితిన్= బయటకు వచ్చాను.

**తాత్పర్యం:** బయటపడ్డ స్త్రీని చూచి 'నీవు ఎవ్వరిదానవు?' అని అడగగానే ఆ స్త్రీ ఎంతో దైన్యంగా ఈ విధంగా అన్నది: 'నేను సిరిని. బలం ఎక్కడకు పోతుందో నేనూ అక్కడికే పోవా లని బయలుదేరాను'.

**చ. అనిన భయంబు నొంది యతఁ డా సతితోఁ బరమేశ్వరీ! మహా**
**వినయమతిన్ ననుం గొలిచె విప్రవరుం; డతఁ డెవ్వఁ?' డన్న న**
**వ్వనిత 'సురాధినాథుఁడు భవద్ఘన రాజ్యవిభూతి యింతయుం**
**గొనుటకు నిన్నుఁ జెందె; నిటు గోల్పడి తీవును నీదు శీలమున్. 145**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; భయంబున్+ఒంది= భయపడి; అతఁడు= ఆ ప్రహ్లాదుడు; ఆ సతితోన్= ఆ కాంతతో; పరమేశ్వరీ!= ఓ దేవీ!; మహావినయమతిన్= ఎంతో అణకువతో; ననున్= నన్ను; విప్రవరుండు= బ్రాహ్మణోత్తముడు; కొలిచెన్= సేవించాడు; అతఁడు; ఎవ్వఁడు?= ఎవరు?; అన్నన్= అనగానే; ఆ+వనిత= ఆ స్త్రీ; సుర+అధినాథుఁడు= దేవేంద్రుడు; భవత్= నీ యొక్క; ఘన= గొప్పదైన; రాజ్యవిభూతి= రాజ్యసంపద; ఇంతయున్= ఇదంతా; కొనుటకున్= తీసికొనటానికి; నిన్నున్+చెందెన్= నిన్ను చేరాడు; ఈవును= నీవు కూడా; నీదు శీలమున్= నీ మంచి నడతను; ఇటు= ఈ విధంగా; కోల్పడితివి= పోగొట్టుకొన్నావు.

**తాత్పర్యం:** అది విని ప్రహ్లాదుడు భయపడ్డాడు. ఓ దేవీ! ఎంతో వినయంగా నన్ను సేవించిన 'ఆతడు ఎవరు?' అన్నాడు. 'అతడు ఇంద్రుడు. నీ రాజ్యసంపదను కాజేయటానికే నీ దగ్గరకు వచ్చాడు. నీవూ నీ శీలాన్ని అట్లాగే పోగొట్టుకొన్నావు అన్నది ఆ స్త్రీ.

**వ.** **వినుము చెప్పెద 'శీలంబున ధర్మంబు వెలయు; ధర్మంబున సత్యంబు దొరకొను; సత్యంబున వృత్తంబు సొప్పడు; వృత్తంబున బలంబు వాటిల్లు; బలంబున నేను గలుగుదుం; గావున సమస్తంబునకు మూలంబు శీలం'బని చెప్పి, సిరి పురందరుపాలికి ధర్మాదులతోడఁ గూడంజనియె' ననుటయు దుర్యోధనుండు 'శీలం బెట్టి?' దనిన ధృతరాష్ట్రుం డతని కిట్లనియె.** **146**

**ప్రతిపదార్థం:** చెప్పెదన్= ఒక్కటి చెప్పుతాను; వినుము= విను; శీలంబునన్= మంచి ప్రవర్తనవలననే; ధర్మంబు= న్యాయం; వెలయున్= ప్రకాశిస్తుంది; ధర్మంబునన్= ధర్మంతో; సత్యంబు= సత్యం; దొరకొనున్= సిద్ధిస్తుంది; సత్యంబునన్= సత్యంతో; వృత్తంబు= నడవడి; చొప్పడున్= ప్రవేశిస్తుంది; వృత్తంబునన్= నడతవలన; బలంబు= శక్తి; పాటిల్లున్= కలుగుతుంది; బలంబునన్= ఆ శక్తితో; నేను= సిరి; కలుగుదున్= ఉంటాను; కావునన్= కాబట్టి; సమస్తంబునకున్= ఈ మొత్తానికి; మూలంబు= కేంద్రబిందువు; శీలంబు= మంచి ప్రవర్తన; అని చెప్పి= అని పలికి; సిరి= సంపద; పురందరుపాలికిన్= ఇంద్రుడి వద్దకు; ధర్మాదులతోడన్= ధర్మం మొదలైన వాటితో; కూడన్+చనియెన్= కలవటానికి వెళ్ళింది; అనుటయున్= అనగానే; దుర్యోధనుండు= దుర్యోధనుడు; శీలంబు= నడత; ఎట్టిది= ఎటువంటిది; అనినన్= అనగానే; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; అతనికిన్= అతడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అయితే ఒక విషయం చెప్పుతాను వినుము. శీలంవలననే ధర్మం రాణకెక్కుతుంది. ధర్మంవలన సత్యం, ఆ సత్యంవలన ప్రవర్తన, ఆ ప్రవర్తనవలన బలం, ఆ బలంవలన సంపత్తి వెంటనంటి ఉంటాయి. కనుక అన్నిటికీ మూలం శీలమే' అని చెప్పి సిరి ధర్మం మొదలైన వాటితో ఇంద్రుడి దగ్గరకు వెళ్ళిపోయింది, ఇట్లా ధృతరాష్ట్రుడు చెప్పాక దుర్యోధనుడు 'ఇంతకీ శీలం అంటే ఎట్లాంటిది?' అని అడగగానే ధృతరాష్ట్రుడు ఈ విధంగా అన్నాడు.

**క.** **'ఒలసి మనోవాక్కాయం । బుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం**
**గలిమి విను శీల; మది మే । లొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా!** **147**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; మనోవాక్కాయంబులన్= మనస్సూ, వాక్కూ, శరీరం ఈ మూడు; ఒలసి= కలసి; అఖిలభూతముల+ఎడన్= అన్ని జీవులపట్ల; ద్రోహ+అభావము= కీడు కూడదనే ఆలోచన; కలిమి= కలిగి ఉండటం; శీలము= మంచినడత; వినుము= వినుము; అది= ఆ శీలం; మేలు= మంచిని; ఒలయించున్= కలిగిస్తుంది; దానన్= ఆ శీలంపట్ల; ఉల్లమున్= మనస్సును; ఊన్పుము= నిలిపి ఉంచుము.

**తాత్పర్యం:** 'మనసూ, మాటా, శరీరం ఈ మూటిచేత అన్ని ప్రాణులకూ ఎట్లాంటి హాని చేయకుండా ఉండటమే శీలం. ఇది చాలా మేలు కలిగిస్తుంది. దీన్ని మనస్సులో పెట్టుకొమ్ము.

**క. పరహితము సిగ్గుపాటుం। బొరయక యుండంగ నెదిరి బోధించుటయున్**
**నరసముదయంబు వొగడెడు। చరితము శీలమున కంగసంపద వత్సా!' 148**

**ప్రతిపదార్థం:** వత్సా!= బిడ్డా!; పరహితము= ఇతరులకు మేలు చేయటం; సిగ్గుపాటున్= తలవంచుకొనటం; పొరయక= పొందక; ఉండంగన్= ఉండటానికి; ఎదిరి= ఎదుటివాళ్ళకు; బోధించుటయున్= ఉపదేశించటమూ; నర సముదయంబు= ప్రజలంతా; పొగడెడు= మెచ్చుకొనతగిన; చరితము= నడవడి; శీలమునకున్= మంచి ప్రవర్తనకు; అంగసంపద= అవయవ సంపత్తి.

**తాత్పర్యం:** కుమారా! సాటివాడికి తోడుపడటం, సిగ్గుపాటు పనులు చేయకూడదని ఎదుటివాళ్ళకు తెలియచెప్పటం, జనం ఇష్టపడేటట్లు నడచుకోవటం ఇవి శీలానికి అవయవ సంపదలు'.

**క. అనియె నని చెప్పి భీష్ముం। డను ధర్మజుతోడ 'నీకు నది నైజమ యే**
**నును బోధించితి శీలము। మనమ్మునం దిరము సేయు మనుజాధీశా!' 149**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అని చెప్పి= అని పలికి; భీష్ముండు; ధర్మజుతోడన్= ధర్మరాజుతో; అనున్= ఇట్లా అన్నాడు; మనుజ+అధీశా!= రాజా!; నీకున్= నీకు; అది= ఆ శీలం; నైజము+అ= సహజగుణమే; ఏనును= నేను కూడా; శీలము= శీలాన్ని గూర్చి; బోధించితిన్= తెలియ చెప్పాను; మనమ్మునన్= మనసులో; తిరము చేయు(ము)= నిలకడగా ఉంచుకో.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డన్నాడని భీష్ముడు ధర్మరాజుతో ఇంకా ఇట్లా అన్నాడు. 'నీకు శీలం జన్మతః అబ్బిన గుణమే. అయినా నేను శీలాన్ని గూర్చి చెప్పాను కదా! ఆ మంచి ప్రవర్తనను మనసులో స్థిరం చేసికొమ్ము.

**వ. అనిన విని యజ్జనపతి భీష్మునితో 'నాశ యనునది యనంతయైయుండు నది నిరర్థకయైన నయ్యెడు దుఃఖం బధికం బది దుర్యోధనుం బేర్చి కలిసి యుండం జూచితి; నమ్మహాత్ముండు దేఅక మదీయాశఁ గుంఠితంబుఁ జేసి నన్ను దుర్బుద్ధిం గావించె; నది విషాదంబు సేయు; నాశ నడంచుట యరిదిగదే!' యనుటయు 'నాశాదోషనిరాసకం బైన యొక్క యితిహాసంబు గలదు; విను'మని య క్కురుసత్తముం డిట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= విని; ఆ+జనపతి= ఆ ధర్మరాజు; భీష్మునితోన్= భీష్ముడితో; ఆశ= కోరిక; అనునది= అనేది; అనంతఐ= అంతుచిక్కనిదై; ఉండును= ఉంటుంది; అది= ఆ కోరిక; నిరర్థక+ఐనన్= ఫలించకపోతే; అయ్యెడు= కలిగే; దుఃఖంబు= బాధ; అధికంబు= ఎక్కువ; అది= ఆ దుఃఖం; దుర్యోధనున్= దుర్యోధనుడిని; పేర్చి= అతిశయించి; కలిసి+ఉండన్= కలిసి ఉండగా; చూచితిన్= చూచాను; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుండు; తేఅక= ఊరడిల్లక; మదీయ+ఆశన్= నా కోరికను; కుంఠితంబున్+చేసి= వ్యర్థంచేసి; నన్నున్= నన్ను; దుర్బుద్ధిన్= చెడ్డ తలంపు కలవాడినిగా; కావించెన్= చేశాడు; అది= అదే; విషాదంబు= దుఃఖాన్ని; చేయున్= కలిగిస్తుంది; ఆశన్= కోరికను; అడంచుట= తొక్కిపెట్టటం; అరిదిగదే= సాధ్యం కాదు కదా; అనుటయున్= అనగానే; ఆశాదోష= కోరిక అనే దోషాన్ని; నిరాసకంబు+ఐన= నిరసించేది అయిన; ఒక్క= ఒక; ఇతిహాసంబు= వెనకటి కథ; కలదు= ఉన్నది; వినుము= వినుము; అని; ఆ+కురుసత్తముండు= ఆ భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విన్న ధర్మరాజు భీష్ముడితో 'తాతా! ఆశకు అంతూ పొంతూ ఉండదు. ఆ ఆశ తీరకపోతే దానికన్న మించిన బాధ కలుగుతుంది. దుర్యోధనుడిని మంచి దారిలో పెట్టాలనీ ఉమ్మడిగా ఉండాలనే చూశాను. ఆ మహానుభావుడు నా ఆశను తీర్చకపోగా నన్ను దుర్బుద్ధిగా చేశాడు. అదే నాకు బాధగా ఉన్నది. ఆశను అణచుకొనటం చాలా కష్టం' అనగానే భీష్ముడు 'ఆశ అనే దోషాన్ని పోగొట్టుకొనేందుకు ఒక కథ ఉన్నది చెప్పుతాను వినుము' అన్నాడు.

**భీష్ముఁడు ధర్మరాజునకు సుమిత్రుఁడను రాజు చరిత్రంబు సెప్పుట (సం. 12-125-8)**

**సీ. 'హైహయుండు సుమిత్రుఁ డనురాజు వేఁట వో। యిన చోటఁ దనచేత నేటు వడిన**
**మృగ మమ్ముతోఁ బాఱఁ దగిలె వెన్వెంటన;। యదియును నొకమరి యగ్గ మయ్యు**
**నొకమరి దవ్వయ్యు నొకమరి దృష్టి క। గోచరం బయ్యును ఖురపదంబు**
**లరసి పాఱిన నింతనంతఁ దోఁచియు నాశఁ। బెనుచుచుఁ జని మహావనము సొచ్చె;**

**ఆ. నవ్విభుండు డస్సి యచ్చట నొక ముని। పల్లె కేఁగి మునులు ఫలజలములఁ**
**దృప్తుఁ జేయ డప్పిదేఱి యున్నెడ ఋష। భాఖ్యుఁ డైన తపసి యతనితోడ. 151**

**ప్రతిపదార్థం:** హైహయుండు= హైహయ వంశానికి చెందిన; సుమిత్రుఁడు+అనురాజు= సుమిత్రుడనే రాజు; వేఁట+పోయినచోటన్= వేటకొరకు వెళ్లిన అడవిలో; తనచేతన్= తన వలన; ఏటు+పడిన= బాణం దెబ్బతిన్న; మృగము= జంతువు; అమ్ముతోన్= బాణంతో; పాఱన్= పారిపోవగా; వెన్వెంటన= వెంటవెంటనే; తగిలెన్= అనుసరించాడు; అదియునున్= ఆ జంతువునూ; ఒకమరి= ఒకసారి; అగ్గము+అయ్యున్= అందుబాటులో ఉంటూ; ఒకమరి= ఒకసారి; దవ్వు+అయ్యున్= దూరం అవుతూ; ఒకమరి= మరోసారి; దృష్టికిన్= కంటికి; అగోచరంబు+అయ్యును= కనపడని దవుతూ; ఖురపదంబులు= కాలిగిట్టల జాడలు; అరసి= తెలిసికొంటూ; పాఱినన్= పరుగెత్తగా; ఇంతన్+అంతన్= దగ్గరగానూ, దూరంగాను; తోఁచియున్= కంటపడి; ఆశన్= అపేక్షను; పెనుచుచున్= పెంచుతూ; చని= వెళ్ళి; మహావనము= అడవిలోనికి; చొచ్చెన్= చొరబడింది; ఆ+విభుండు= ఆ రాజు; డస్సి= అలసిపోయి; అచ్చటన్= అక్కడ; ఒక మునిపల్లెకున్= ఒక ముని ఆశ్రమానికి; ఏఁగి= వెళ్ళి; మునులు= ఋషులు; ఫలజలములన్= పండ్లచేతా నీటిచేతా; తృప్తున్ చేయన్= సంతుష్టిపరచగా; డప్పి= దప్పికనుండి; తేఱి+ఉన్న+ఎడన్= తెప్పిరిల్లుకొని ఉన్న సమయంలో; ఋషభ+ఆఖ్యుఁడు+ఐన తపసి= ఆ ఋషభుడనే పేరుగల ముని; అతనితోడన్= ఆ రాజుతో.

**తాత్పర్యం:** 'హైహయ వంశపురాజు సుమిత్రుడు. అతడు ఒకనాడు వేటాడబోయాడు. అక్కడ ఒక జంతువును బాణంతో కొట్టాడు. అది బాణంతో పాటు పారిపోయింది. రాజు దాని వెంటబడ్డాడు. అది చేతి కందినట్లే అందుతూ చాలా దూరం పోయేది. మరి కొంతసేపటికి కంటి కానేది కాదు. కాలిగిట్టలను బట్టి దానిజాడ తెలిసికొంటూ పరుగెత్తగా చిటికెలో కంటపడి ఆశపెడుతూ కారడవిలో కలసిపోయింది. అట్లు ఆ జంతువువెంటపడి బాగా అలసిపోయాడు రాజు. దగ్గరలో ఉన్న ఒక ముని పల్లెకు చేరుకొన్నాడు. ఆ మునులు పళ్ళూ నీళ్ళూ ఇచ్చారు. దప్పిక తీరి తేరుకొన్నాడు. అప్పుడు ఋషభు డనే ముని ఆ రాజుతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వనమున నెక్కటి నీ 'వే। పనికై చనుదెంచి? తేల పరమవిషాదం**
**బునఁ బొందెదఁ దనిన నాతం। డను నొక మృగ మమ్ముతోడ నరుగఁగ వెనుకన్. 152**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; వనమునన్= అడవిలోనికి; ఏ పనికై= ఏ పనిమీద; ఎక్కటి= ఒక్కడివే; చనుదెంచితి?= వచ్చావు?; పరమవిషాదంబునన్= ఎంతో దుఃఖాన్ని; పొందెదు= పొందుతున్నావు; ఏల?= ఎందుకు?; అనినన్= అనగా; ఆతండు= ఆ

సుమిత్రుడు; అనున్= ఇట్లా అన్నాడు; ఒక మృగము= ఒక జింక; అమ్ముతోడన్= (కొట్టిన) బాణంతో కూడా; అరుగఁగన్= పారిపోగా; వెనుకన్= దాని వెనకాలే.

**తాత్పర్యం:** 'నీవు ఒంటరిగా అరణ్యంలోకి ఎందుకు వచ్చావు? బాగా దిగులుగా కనిపిస్తున్నావు ఏమిటి? అని చెప్పు' మనగానే రాజు ఇట్లా అన్నాడు. ఒక జంతువు నేను కొట్టిన బాణంతోపాటు పారిపోగా దాని వెనకనే పడి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆసాసల వచ్చితి; నను । గాసింబెట్టి యది యడవిఁ గలసెను; మృగయా**
**వ్యాసక్తుఁడు వగచుం దన । యేసిన మృగ మనఘ! తప్పియేఁగుటకుఁ గడున్. 153**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; ఆసాసలన్= ఎంతో ఆశపడి; వచ్చితిన్= వచ్చాను; ననున్= నన్ను; గాసిన్+పెట్టి= తిప్పటపెట్టి; అది= ఆ జంతువు; అడవిన్+కలసెన్= అడవిలో కలిసిపోయింది; మృగయా= వేటాడటంలో; వ్యాసక్తుఁడు= మిక్కలి ఆసక్తికలవాడు; తన+ఏసిన= తాను బాణంతో కొట్టిన; మృగము= జంతువు; తప్పి ఏఁగుటకున్= తప్పించుకొని పోతే; కడున్= మిక్కిలి; వగచున్= విలపిస్తాడు.

**తాత్పర్యం:** ఎంతో ఆశగా దాని వెంబడిపడి వచ్చాను. అది నన్ను నానా తిప్పలుపెట్టి అడవిలో కలసిపోయింది. వేటాడిన జంతువు చేదాటిపోతే ఆ వేటగాడు ఎంతో నొచ్చుకుంటాడు.

**వ. ఆశ యింత దుర్నివార యగునే?' యనిన నమ్మునిపతి యమ్మనుజపతి కిట్లనియె. 154**

**ప్రతిపదార్థం:** ఆశ= ఆస; ఇంత+దుర్నివార+అగునే= ఇంత వారించ శక్యం కానిది అవుతుందా; అనినన్= అనగానే; ఆ+మునిపతి= ఆ మునిరాజు; ఆ+మనుజపతికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆశ ఇంత తప్పించుకొనలేనిదా!' అని రాజు అడగగానే ఆ ఋషభముని ఈ విధంగా అన్నాడు.

**క. 'విను తీర్థయాత్ర సని యే । ననుత్తమం బైన బదరికాశ్రమమున నొ**
**క్కనిఁ గాంచితిఁ గృశగాత్రునిఁ । దనుఁ డను పేరింటివానిఁ దాపసవర్యున్. 155**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; ఏను= నేను; తీర్థయాత్ర+చని= పుణ్యతీర్థాలకు వెళ్ళి; అనుత్తమంబు+ఐన= అన్నిట్లోకి శ్రేష్ఠమైనదైన; బదరికా+ఆశ్రమమునన్= బదరికా క్షేత్రంలో; కృశగాత్రునిన్= బక్కచిక్కిన శరీరంగల; తనుఁడు అను పేరింటి వానిన్= తనుడని పేరుగల; తాపస వర్యున్= గొప్పమునిని; ఒక్కనిన్= ఒకడిని; కాంచితిన్= చూచాను.

**తాత్పర్యం:** 'రాజా! నేను పూర్వం ఒకప్పుడు తీర్థయాత్రలు చేస్తూ, బదరికాశ్రమంలో తను డనే పేరుగల ఒక తాపసిని చూచాను. బక్కపలచని వాటం అతడిది.

**క. కని భక్తిం బ్రణమిల్లుడు । ముని యాతిథ్యం బొనర్ప మోదంబున నా**
**తని పాల ధర్మఫణితులు । వినుచుండఁగ నొక్కధరణివిభుఁ డేతెంచెన్. 156**

**ప్రతిపదార్థం:** కని= చూచి; భక్తిన్= వినయంతో; ప్రణమిల్లుడున్= మ్రొక్కగా; ముని= ఆ తనుమహర్షి; ఆతిథ్యంబున్= అతిథి సత్కారం; ఒనర్పన్= చేయగా; మోదంబునన్= సంతోషంగా; అతనిపాలన్= ఆ ముని వద్ద; ధర్మఫణితులు= ధర్మవాక్కులు; వినుచున్+ఉండఁగన్= వింటూ ఉండగా; ఒక్క ధరణి విభుఁడు= ఒక రాజు; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ మునిని చూడగానే నమస్కరించాను. అతడు చక్కటి ఆతిథ్యం ఇచ్చాడు. చాలా సంతోషించాను. అతడి దగ్గర ధర్మోపదేశాలు వింటూ ఉన్నాను. అంతలో ఒక రాజు అక్కడకు వచ్చాడు.

**వ. విషాదవివర్ణుం డగుచు సపరివారంబును సదారంబునుగాఁ జనుదెంచి యజ్జనపతి మునిపతిం గాంచిన నతం డతిథిపూజా సత్కారంబులు సేసి యాగమనకారణం బడిగిన నన్నరనాథుండు. 157**

**ప్రతిపదార్థం:** విషాద వివర్ణుండు+అగుచున్= దుఃఖంతో వెలవెలబోతూ; సపరివారంబును= సేవాజనంతోనూ, సదారంబునుగాన్= భార్యతోనూ; చనుదెంచి= వచ్చి; ఆ+జనపతి= ఆ రాజు; మునిపతిన్= మునిశ్రేష్ఠుడిని; కాంచినన్= చూడగా; అతండు= ఆ తాపసి; అతిథి పూజా సత్కారంబులు+చేసి= అర్ఘ్యపాద్యాదులతో అతిథిని ఆదరించి; ఆగమన కారణంబున్= రాకకు కారణాన్ని; అడిగినన్= తెలుపుమని అడుగగా; ఆ నరనాథుండు= ఆ రాజు.

**తాత్పర్యం:** ఆ రాజుముఖం దుఃఖంతో వెలవెలబోతున్నది. వెంట భార్యా, పరిజనం ఉన్నారు. రాగానే మునిని చూచాడు. మునిరాజు ఆ రాజునకు అతిథి మర్యాదలు చేశాడు. ఎందుకు వచ్చారో తెలుపుమన్నాడు. ఆ రాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. తనయుఁ డొకండ; వాఁడు గుణధాముఁడు; క్రీడనవాంఛ సాంద్రకా**
**ననమున కేఁగి కాడుపడినం దడవం జనుదెంచి యెందుఁ గా**
**నను మది యాశ ద్రిప్పికొనినన్ వెగడందుచు వచ్చినాఁడ' న**
**న్న, నతఁడు వల్కకుండె వదనం బొకయించుక వాంచి చింతతోన్. 158**

**ప్రతిపదార్థం:** తనయుఁడు+ఒకండు+అ= (నాకు) కొడుకు ఒక్కడే; వాఁడు= ఆ కొడుకు; గుణధాముఁడు= గుణవంతుడు; క్రీడన వాంఛన్= ఆడుకొనాలనే కోరికతో; సాంద్ర= దట్టమైన; కాననమునకున్= అడవిలోనికి; ఏఁగి= వెళ్ళి; కాడుపడినన్= కనపడకపోతే; తడవన్= వెదకటానికి; చనుదెంచి= వచ్చి; ఎందున్= ఎక్కడా; కానను= చూడలేకపోయాను; మదిన్= మనసును; ఆశ= అపేక్ష; త్రిప్పికొనినన్= క్షోభపెట్టగా; వెగడు+అందుచున్= తల్లడపడుతూ; వచ్చినాఁడను= వచ్చాను; అన్నన్= అనగానే; అతండు= ఆ ముని; వదనంబు= ముఖాన్ని; ఒక+ఇంచుక= కొంచెంగా; వాంచి= వంచుకొని; చింతతోన్= ఆలోచనతో; పల్కక+ఉండెన్= మారుమాట్లాడకుండా ఉన్నాడు.

**తాత్పర్యం:** 'నాకు ఒక్కడే కొడుకు. వాడు చాలా బుద్ధిమంతుడు. ఆడుకొనటానికి ఒకనాడు అడవిలోకి వెళ్ళాడు. తిరిగి రాలేదు. నేను వెతకటానికి వచ్చాను. ఎక్కడా కనపడలేదు. ఆశ తీరలేదనే కలవరపాటుతో ఆదుర్దాపడుతూ వచ్చాను' అన్నాడు. అది విని ముని తలవంచుకొని మౌనం వహించాడు.

**క. చింతించు నతనితో భూ । కాంతుం డిట్లనియె మఱియు 'గాఢతరాశా**
**క్రాంతత దుర్లభఫల యగు । టింత యసహ్య మగునయ్య యెడఁద మునీంద్రా! 159**

**ప్రతిపదార్థం:** చింతించు= విచారించే; అతనితోన్= ఆ మునితో; భూకాంతుండు= రాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; మునీంద్రా!= ఓ మునీశ్వరా!; మఱియున్= మళ్ళీ; గాఢతర ఆశా= ఎంతో ఎక్కువైన ఆశచేత; ఆక్రాంతతన్= ఆక్రమించబడటం వలన; దుర్లభ ఫల+అగుటన్= అందని ప్రయోజనం కలది అవటం వలన; ఎడఁద= మనస్సు; ఇంత= ఈపాటి; అసహ్యము+అగునయ్య= ఓర్చుకోలేనిదవుతుందా!

**తాత్పర్యం:** మౌనంగా ఉన్న మునితో రాజు మళ్ళీ ఈ విధంగా అన్నాడు: 'బాగా ఆశపడ్డప్పుడు ఆ ఆశ అడియాస అయితే మనసు ఇంత తట్టుకోలేని దవుతుందా!'

**వ. అనుటయు నత్తాపసోత్తముం డమ్మహీపతి యాననం బాలోకించి. 160**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఆ+తాపస+ఉత్తముండు= ఆ మునీశ్వరుడు; ఆ మహీపతి= ఆ రాజు; ఆననంబున్= ముఖాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** రాజు చెప్పగానే ముని అతడి వైపు చూస్తూ - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏ నరుఁడు మానసము ధృతి। నూన నుచితవృత్తి నుండు నుదిలగొనక యెం**
**దైనను నెయ్యది యేనియు। వానికి దుర్లభములేదు వసుధాధీశా! 161**

**ప్రతిపదార్థం:** వసుధాధీశా!= ఓ రాజా!; ఏ నరుఁడు= ఏ మానవుడు; ఉదిలగొనక= చలించక; మానసము= మనస్సులో; ధృతిన్= ధైర్యాన్ని; ఊనన్= పొందగా; ఉచితవృత్తిన్= తగిన ప్రవర్తనతో; ఉండున్= ఉంటాడో; వానికిన్= వాడికి; ఎందున్+ఐనన్= ఎక్కడైనా; ఏ+అది+ఏనియున్= ఏ విషయంగా అయినా; దుర్లభము= పొందలేనిది; లేదు= ఉండదు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఎవడైనా ఎక్కడైనా ఏ విషయంగానైనా మనసును దిటవు పరచుకొని తగిన రీతిలో నడచుకొంటే అతడికి లభ్యం కానిది ఉండదు.

**క. అర్థాదులగు ఫలంబులు। ప్రార్థించినచోట సిగ్గువఱుపక తగ న**
**య్యర్థి సులభార్థుఁజేయు కృ। తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిల జగములన్. 162**

**ప్రతిపదార్థం:** అర్థ+ఆదులగు= డబ్బు మొదలుగా గల; ఫలంబులు= దానాలు; ప్రార్థించినచోటన్= అడిగినచోట; తగన్= ఒప్పునట్లుగా; ఆ+అర్థిన్= ఆ యాచకుడిని; సిగ్గు+పఱుపక= అవమానించకుండా; సులభ+అర్థున్+చేయు= సులువుగా కోరినది పొందేలా చేసే; కృతార్థుఁడు= ధన్యుడు; తలఁపన్= ఆలోచించగా; అఖిల జగములన్= ఏడేడు లోకాలలోనూ; దుర్లభుఁడు= లభించడు.

**తాత్పర్యం:** డబ్బు ఆశించే యాచకుడిని చిన్నబుచ్చకుండా కోరుకున్నది సులభంగా పొందేటట్లు సహాయపడే ధన్యుడు అన్ని లోకాలలో వెతికినా దొరకడు'.

**వ. అని పలికి పూర్వాచార స్మారకత్వంబున నిట్లనియె. 163**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాట్లాడి; పూర్వ+ఆచార= మునుపటి నడతను (బ్రతుకు తెరువు); స్మారకత్వంబునన్= గుర్తుకు తెచ్చుకొనటంవలన; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి మునుపటి జీవనసరళి తలపునకు వచ్చి ఇట్లా అన్నాడు.

**క. 'వినుము గుణవంతుఁ డొకరుఁడు। ధనవంతుం డైన యొక్క ధరణీనాథుం**
**దన కూడు సీరకై కాం। చన మడిగి తదీయ బాలిశత్వము పేర్మిన్. 164**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; ఒకరుఁడు గుణవంతుఁడు= ఒక బుద్ధి మంతుడు; ధనవంతుండు+ఐన= బాగా డబ్బుగల; ఒక్క ధరణీనాథున్= ఒక రాజును; తనకూడు చీరకున్+ఐ= తన తిండికీ బట్టకూ; కాంచనమున్= ధనాన్ని; అడిగి= యాచించి; తదీయ= ఆ ధనవంతుడియొక్క; బాలిశత్వము= మూర్ఖత్వం యొక్క; పేర్మిన్= అతిశయం వలన.

**తాత్పర్యం:** 'ఒక గుణవంతుడు తన తిండికీ బట్టకూ కావలసిన డబ్బును సాయంచేయుమని ఒక ధనవంతుడైన రాజును అడిగాడు. ఆ రాజు అతి మూర్ఖత్వంవలన. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విహతాశుండై లజ్జా। మహితం బగు నాశ దొఱఁగు మదితో సకల**
**స్పృహయును నెవ్వనియందును। వహింప నని యతులమైన వ్రతముం బూనెన్.' 165**

**ప్రతిపదార్థం:** విహత+ఆశుండు+ఐ= నెరవేరని ఆశ కలవాడై; లజ్జా= సిగ్గుచేత, అవమానకరమైన; మహితంబు+అగు+ఆశ= గొప్పదైన ఆశను; తొఱఁగు= వదలుకొనాలనే; మదితోన్= మనస్సుతో; సకల స్పృహయునున్= సమస్త ఆశనూ; ఎవ్వనియందును= ఎవ్వడిని గూర్చి అయినా; వహింపను= తాల్చను; అని; అతులము+ఐన= సాటిలేని; వ్రతమున్= నియమాన్ని; పూనెన్= వహించాడు.

**తాత్పర్యం:** ఆశ తీరనివాడై లజ్జాకరమైన పేరాసను వదలుకొనాలనుకొన్నాడు. ఎవరినిగూర్చి ఎట్లాంటి కోరికలు కోర నసే వ్రతం పట్టాడు'.

**వ. అని చెప్పియప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలితప్రయత్నుండై తత్కాలజనిత వైరాగ్యంబునం దపస్వి యగుట తేటపఱిచి వెండియు. 166**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని మాట్లాడి; తొల్లి= ఒకప్పుడు; తాను= తాను; ఆ పార్థివున్= ఆ రాజును; ధనము= డబ్బు; అర్థించి= అడిగి; అఫలితప్రయత్నుండు+ఐ= సిద్ధించని ప్రయత్నం కలవాడై; తద్+కాలజనిత= ఆ సమయంలో కలిగిన; వైరాగ్యంబునన్= విరక్తివలన; తపస్వి+అగుటన్= ముని కావటాన్ని; తేటపఱిచి= స్పష్టంగా తెలిపి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఒకసారి నేను, ఆ రాజును డబ్బు అడిగినా ఫలితం దక్కలేదు. దానితో విరక్తి కలిగి ముని నయ్యాను.' అంటూ స్పష్టపరిచాడు. మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. ఒడఁబడి యీనివానియెడ నుల్లమునందుఁ గృతఘ్నుతం గడుం**
**జెడుగగు దుర్వినీతునెడఁ జిత్తము కోర్కికిఁ బట్టు సేసి లే**
**వడి యగు నీచకాంతయెడ వారక యాసలు సాఁగు నిట్లు పె**
**క్కెడలను బాఱు నాసగమియెల్లఁ దొఱంగుము సౌఖ్య మొందెదున్.' 167**

**ప్రతిపదార్థం:** ఒడఁబడి= సమ్మతించి; ఈనివాని+ఎడన్= దానం చేయనివాడి విషయంలో; ఉల్లమునందున్= మనస్సులోని; కృతఘ్నుతన్= చేసిన మేలును మరచిపోవటం వలన; కడున్= ఎంతో; చెడుగు+అగు= దుష్టుడైన; దుర్వినీతు+ఎడన్= అవినీతిపరుడి విషయంలోనూ; చిత్తము= మనస్సును; కోర్కికిన్= ఆశకు; పట్టు+చేసి= తావలం చేసి; లేవడి+అగు= పేదరాలైన; నీచ కాంత+ఎడన్= నీచ స్త్రీ పట్ల; వారక= ఎపుడూ; ఆశలు సాఁగున్= కోర్కెలు కొనసాగుతూనే ఉంటాయి; ఇట్లు= ఈ విధంగా; పెక్కు ఎడలన్= అనేక విషయాలలోనూ; పాఱు= పరుగెత్తే; ఆసగమి ఎల్లన్= అన్ని ఆశలను; తొఱంగుము= వదలుకొమ్ము; సౌఖ్యము= సుఖం; ఒందెదున్= పొందుతావు.

**తాత్పర్యం:** ఇస్తా నని ఇవ్వని వాడిమీద, కృతఘ్నుడైన దుష్టుడిమీద, మనసును ఆశకు వశం చేసిన పేదరాలైన నీచస్త్రీ పట్లా ఆశలు నిరంతరం కొనసాగుతూనే ఉంటాయి. ఇంకా ఎన్నో విషయాలలో పరుగులు పెట్టే అన్ని ఆశలను వదలుకొమ్ము. సుఖపడతావు'.

**వ. అని యాసపజ్జం బోవమి సుఖకరం బగుటం దెలిపి, యవ్వీరద్యుమ్నునకుం గరుణించి, యతని కొడుకు భూరిద్యుమ్నుం దన తపోమహిమ నాకర్షించి వీడుకొలిపె' నని చెప్పి ఋషభుండు సుమిత్రుని చిత్తంబు మృగయాశాయత్తంబు గాకుండునట్లుగా బోధించెఁ; బాండవాగ్రజా! నీవును నివ్వాక్యంబు లాదరించి సుస్థిరుండవై నిరాశత్వంబున సంతాపంబు దక్కి సుఖివి గ'మ్మని పలికిన భీష్మునితో నబ్భూపతి భవదీయ వచనామృతాస్వాదనంబున మనంబు దృప్తి సన; దింకను ధర్మప్రకారంబులు వివరింపు' మనిన నతం డతని కిట్లనియె. 168**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ఆస పజ్జన్= ఆశ వైపునకు; పోవమి= పోకుండటం (మళ్ళకపోవటం); సుఖకరంబు+అగుటన్= ఎంతో సుఖం కలిగిస్తుందని; తెలిపి= తెలియచెప్పి; ఆ+వీరద్యుమ్నునకున్= ఆ వీరద్యుమ్నుడిని; కరుణించి= కనికరించి; అతనికొడుకు= అతడి కుమారుడైన; భూరిద్యుమ్నున్= భూరిద్యుమ్నుడిని; తన తపోమహిమన్= తన తపశ్శక్తిచే; ఆకర్షించి= రప్పించి; వీడుకొలిపెన్= పంపాడు; అని చెప్పి= అని పలికి; ఋషభుండు= ఋషభ ముని; సుమిత్రుని చిత్తంబు= సుమిత్రుడి మనస్సు; మృగయా+ఆశ= వేటాడాలనే కోరికకు; ఆయత్తంబు+కాక+ఉండునట్లుగాన్= లొంగకుండేటట్లు; బోధించెన్= ఉపదేశించాడు; పాండవ+అగ్రజా!= ఓ ధర్మరాజా!; నీవును= నీవు కూడా; ఈ+వాక్యంబులు= ఈ వాక్కులను; ఆదరించి= మన్నించి; సుస్థిరుండవు+ఐ= దిటవుకలవాడవై; నిరాశత్వంబునన్= అడియాస అయినపుడు; సంతాపంబు దక్కి= బాధను విడిచి; సుఖివి కమ్ము= సుఖం పొందుము; అని పలికినన్= అని చెప్పిన; భీష్మునితోన్= భీష్ముడితో; ఆ+భూపతి= ఆ రాజు; భవదీయ= నీయొక్క; వచన+అమృత= అమృత ప్రాయమైన మాటల; ఆస్వాదనంబునన్= ఆస్వాదించటంచేత; మనంబు= మనస్సు; తృప్తిచనదు= సంతుష్టి పొందదు; ఇంకను= ఇంకా; ధర్మప్రకారంబులు= న్యాయ పద్ధతులు; వివరింపుము= వివరంగా చెప్పవలసినది; అనినన్= అనగానే; భీష్ముండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా ఆశను చంపుకొంటేనే ఎంతో సుఖం' - అని చెప్పి ఆ వీరద్యుమ్నుడి మీద జాలిపడి తన తపోబలంతో ఆతడి కొడుకు భూరిద్యుమ్నుడిని రప్పించాడు. వీడ్కోలుతో సాగనంపాడు. ఓ ధర్మరాజా! ఇట్లా ఋషభముని సుమిత్రుడి మనస్సు మళ్ళీ వేటమీదకు మళ్ళకుండేటట్లు ఉపదేశించాడు. అట్లాగే నీవు కూడా నా వాక్యాలను చెవినిపెట్టుము. మంచిదిట్టవు కమ్ము. ఆశ నెరవేరకపోయినా బాధపడవద్దు సుఖంగా ఉంటావు' అన్నాడు భీష్ముడు. ధర్మరాజు 'నీ వాగమృతాన్ని చవిచూడటం వలన నా మనస్సుకు ఇంకా తనివి తీరలేదు. ఇంకా కొన్ని ధర్మపద్ధతులను వినాలని ఉన్నది. వివరంగా చెప్పవలసిం'దని అనగానే భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**క. 'తన భూమిఁ బరుల భూమిని । ధనము లుపార్జింపవలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం । బునకును మూలమగు ధర్మమునకు నరేంద్రా! 169**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ధర్మరాజా!; ధరణీశునకున్= రాజునకు; తన భూమిన్= తన దేశంలోనూ; పరులభూమిని= పరాయి దేశంలోనూ; ధనములు= డబ్బులు; ఉపార్జింపవలయున్= గడించాలి; రాజ్యంబునకును= దొరతనానికి; ధనములు= సంపద; మూలము= ఆధారం; ధర్మమునకున్= పుణ్యానికీ; మూలము+అగున్= కారణం అవుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! రాజు తన దేశంలోనూ, శత్రుదేశంలోనూ డబ్బును సంపాదించుకొనాలి. ఏలుబడికీ, పుణ్యం పురుషార్థాలకూ మూలం ఆ ధనమే.

**క. అది బెట్టిదంపు వెరవున । మృదుభూతో పాయమునను మెయికొనద ప్రజం
బొదువ వలయు నాజ్ఞా సం । పద గల సాకతముతోడఁ బతి యవహితుడై. 170**

**ప్రతిపదార్థం:** అది= ఆ ధనం; బెట్టిదంపు వెరవునన్= కఠినమైన ఉపాయంచేతగానీ; మృదుభూత= సౌమ్యమైన; ఉపాయముననుం= పద్ధతిచేతగానీ; మెయికొనదు+అ= లభించదు; పతి= రాజు; అవహితుఁడు+ఐ= సావధానుడై; ఆజ్ఞా సంపద కల= ఆదేశానుకూల మైన; సాకతముతోడన్= ఊరడింపులతో; ప్రజన్= ప్రజలను; పొదువ వలయున్= చేరదీయాలి.

**తాత్పర్యం:** ఆ ధనం కాఠిన్యంవలనగాని, మృదుస్వభావంవలనగాని లభించకపోతే. రాజు ప్రజలను ఆదేశిస్తూ ఊరడిస్తూ చేరదీయాలి. ధనార్జనవిషయంలో ఎంతో మెలకువగా ఉండాలి.

**క. విను బండారము పెరుఁగని । జనపతికి బలంబు మిత్రసంపదయును గ**
**ల్గునె? బలమిత్రవిహీనున । కొనరునె రాజ్యంబు విభవ మున్నత మగునే? 171**

**ప్రతిపదార్థం:** విను= వినుము; బండారము= బొక్కసం; పెరుగని= పెంపొందని; జనపతికిన్= రాజునకు; బలంబు= సేన; మిత్ర సంపదయును= మిత్రుల సమృద్ధి; కల్గునె?= సమకూరునా?; బలమిత్ర విహీనునకున్= సైన్యం, స్నేహం లేనివాడికి; రాజ్యంబు= ఏలుబడి; ఒనరునె?= కలుగునా?; విభవము= వైభవం; ఉన్నతము+అగునే?= గొప్పది అవుతుందా?

**తాత్పర్యం:** ధనాగారం పెంపొందని రాజునకు తగినంత సైన్యం ఉండదు. మిత్రుల అండా ఉండదు. బలం మిత్రసంపత్తి లేని ఏలుబడి ఒప్పుకాదు. ఆ రాజ్యవైభవం అంత ఉన్నతంగానూ ఉండదు.

**ఉ. కావున నర్థ సంపదలు గల్మియ యింతకు మూలమైన ను**
**ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తము లైన సముద్యమంబులం**
**దా వెలయం దలంచి సముదగ్రతఁ గైకొను టొప్ప; దవ్విధం**
**బావిభు తొంటి కల్మికిని హాని యొనర్చు, హరించుఁ బ్రాణముల్. 172**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అర్థ సంపదలు= ధనసంపత్తులు; కల్మియ= కలిగి ఉండటమే; ఇంతకున్= దీని కంతకూ; మూలము+ఐనను= ఆధారం అయినా; ఉర్వీవరుఁడు= రాజు; ఆత్మశక్తికిన్= తన శక్తికి; అతిరిక్తములు+ఐన= మించినవి అయిన; సముద్యమంబులన్= చక్కటి పూనికలతో; తాన్= తాను; వెలయన్ తలంచి= ప్రకాశించాలని భావించి; సముదగ్రతన్= ఎంతో గొప్పగా; కైకొనుట= వశపరచుకొనటం; ఒప్పదు= తగదు; ఆ విధంబు= ఆ పద్ధతి; తొంటి కల్మికిని= మూలసంపదకూ; హాని ఒనర్చున్= చేటు కలిగిస్తుంది. ప్రాణముల్= ప్రాణాలను; హరించున్= తీస్తుంది.

**తాత్పర్యం:** అర్థ సంపత్తి ఉండటమే దీని అంతకూ మూలం. అయినా, రాజునకు తన శక్తికి మించిన గొప్ప ప్రయత్నాలు తగవు. తాను వెల్గొందాలనీ వాళ్ళను ఎంతో గర్వంగా వశపరచుకొనాలనీ అనుకొనటం మంచి పద్ధతి కాదు. ఈ తరహా తీరు మూలధనానికే ముప్పు తెస్తుంది, ప్రాణాలను తీస్తుంది.

**క. తన కొలఁది నుపాయంబులు । పొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని**
**ర్ధనుని నిజ ప్రజయును గై । కొనదు విరోధులును సరకుగొనరు కుమారా! 173**

**ప్రతిపదార్థం:** కుమారా!= బిడ్డా!; తన కొలఁదిన్= తన శక్తికొద్దీ; ఉపాయంబులు= సామదానాది ఉపాయములు; పొనరిచి= కూర్చి (చేసి); ధనవంతుఁడు+అగుట= డబ్బుకూడబెట్టటం; భూపగుణము= రాజధర్మం; నిర్ధనునిన్= డబ్బులేనివాడిని; నిజ ప్రజయును= తన ప్రజ అయినా, కన్న సంతానమైనా; కైకొనదు= లెక్కపెట్టదు; విరోధులును= పగవారూ; సరకు గొనరు= లక్ష్యపెట్టరు.

**తాత్పర్యం:** ఏ ఉపాయంచేతనైనా తన శాయశక్తులా డబ్బు సంపాదించటం రాజధర్మం. డబ్బు లేనివాడిని తన ప్రజ, (కన్నసంతానమూ) లక్ష్యపెట్టదు. పగవారూ ఆదరించరు.

**క. తెరవాటున మ్రుచ్చిమి ను। ద్ధురు లగు క్రూరులకు మూఁక దోరంబగు న**
**న్వెరవరిదొరల బలంబుగ। ధరణీశుఁడు గూర్చుకొనుట దైన్యము దెచ్చున్. 174**

**ప్రతిపదార్థం:** తెరవాటునన్= దారిదోపిడీ చేత; మ్రుచ్చిమిన్= దొంగతనంచేత; ఉద్ధురులు+అగు= సమర్థులైన; క్రూరులకున్= దుష్టులకు; మూఁక= సేన; తోరంబు+అగున్= అధికంగా ఉన్నది; ఆ+వెరవరి+దొరలన్= దారి దోపిడీలలో; ఆరితేరిన ఆ నాయకులను; ధరణీశుఁడు= రాజు; బలంబుగన్= సైన్యంగా; కూర్చుకొనుట= సమీకరించుకొనటం; దైన్యము= దీనదశను; తెచ్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** దారిదోపిడీలు, దొంగతనాలు చేసే దుష్టులకు బలగం ఎక్కువే ఉంటున్నది. దారిదోపిడీ దొరలను రాజు తనసైన్యంలో చేర్చుకుంటే దురవస్థను తెచ్చిపెట్టుకొన్నట్లవుతుంది.

**క. అన్యాయంబునఁ బొదలిన। సైన్యముచే సమర జయము సమకూర; దనూ**
**నన్యాయ పరులు గాంతురు। మాన్యత్వము దస్యులైన మనుజాధీశా! 175**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= రాజా!; అన్యాయంబునన్= ధర్మం పాటించకుండా; పొదలిన= ఉన్న; సైన్యముచేన్= సేనచేత; సమరజయము= పోరులో గెలుపు; సమకూరదు= కలుగదు; దస్యులు+ఐనన్= దొంగలైనా; పగవారైనా; అనూనన్యాయ పరులు= అతి ధర్మపరులు (అయితే); మాన్యత్వము= మన్ననను (గౌరవాన్ని); కాంతురు= పొందుతారు.

**తాత్పర్యం:** న్యాయాన్ని పట్టించుకొనని సైన్యం యుద్ధంలో గెలుపొందదు. ఓ రాజా! దొంగలైనా, విరోధులైనా, అతిధర్మపరులైతే గౌరవించబడతారు.

**వ. ఇ ట్లగుటకు నుదాహరణం బగు నొక్క యితిహాసంబు గల; దాకర్ణింపుము. 176**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అగుటకున్= ఇట్లా అవటానికి; ఉదాహరణంబు+అగు= దృష్టాంత మైన; ఒక+ఇతిహాసంబు= ఒక పూర్వగాథ; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇట్లు జరగటానికి ఉదాహరణగా ఒక పూర్వగాథ ఉన్నది వినుము.

### భీష్ముండు ధర్మరాజునకుఁ గాపవ్యోపాఖ్యానము సెప్పుట (సం. 12-91-1)

**సీ. అవనీశ! పారియాత్రాచలంబున నుండు। నొక బోయ ధర్మసంయుక్తబుద్ధి**
**వింట నేర్పరి మృగవితతిప్రకారజ్ఞుఁ। డారణ్య దేశ సంచారశాలి**
**తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై। ఫలమూలమధుమాంసములును మేలి**
**కూడుగూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి। యావహించుచు శయనాసనాదు**

**తే. లగు పదార్థముల్ హృద్యంబులుగ నొనర్చు;। వలయు నాహారములు మునివరుల కిచ్చుఁ;**
**బగఱఁ దోఁచినఁ బరిమార్చు భండనమున। నొకఁడ వేవురనైన మహోగ్రగతుల. 177**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ!= ఓ రాజా!; పారియాత్ర+అచలంబునన్= పారియాత్రం అనే కొండమీద; ఉండున్= ఉండేటటువంటి; ధర్మసంయుక్త= న్యాయంతో కూడిన; బుద్ధి= ఆలోచన కలవాడు; వింటన్= విలువిద్యలో; నేర్పరి= ఆరితేరినవాడు; మృగతతి=

ప్రాణకోటియొక్క; ప్రకారజ్ఞుఁడు= పద్ధతి తెలిసినవాడు; ఆరణ్యదేశ= అటవీ ప్రాంతాలలో; సంచారశాలి= తిరిగే స్వభావంగల; ఒక బోయ= ఒక వేటకాడు; ఉండున్= ఉండేవాడు; (అతడు); తల్లికిన్= తల్లికీ, తండ్రికిన్= తండ్రికీ; తద్దయున్= ఎంతో; భక్తుఁడు+ఐ= సేవకుడై; ఫల= పండ్లు; మూల= కందగడ్డలూ; మధు= తేనె; మాంసములును= మాంసంముక్కలూ; మేలికూడు= మంచి అన్నం; కూరలున్= కూరలు; దొరకొల్పి= సమకూర్చి పెట్టి; వారికిన్= వాళ్ళకు; తృప్తి ఆవహించుచున్= సంతృప్తి కలిగింపచేస్తూ; శయన= పడుకొనటానికి; పక్కలూ; ఆసన= కూర్చొనటానికి పీటలూ; ఆదులు= మొదలైన; పదార్థముల్= వస్తువులను; హృద్యంబులుగన్= మనస్సుకు ఇంపు కలిగించేవిగా; ఒనర్చున్= ఏర్పరుస్తాడు; వలయు= కావాల్సిన; ఆహారములు= భోజనాలు; మునివరులకున్= మునిముఖ్యులకు; ఇచ్చున్= సమర్పిస్తాడు; తోఁచినన్= తడితే; పగఱన్= శత్రువులను; భండనమునన్= యుద్ధంలో; మహా+ఉగ్రగతులన్= ఎంతో భయంకరమైన పోకడలతో; ఒకఁడు+అ= ఒక్కడే; వేవురన్+ఐనన్= వేలమంది నైనా; పరిమార్చున్= చంపుతాడు, రూపుమాపుతాడు.

**తాత్పర్యం:** రాజా! పారియాత్ర పర్వతం మీద ఒక బోయవాడు ఉండేవాడు. అతడు న్యాయపరుడు. విలువిద్యలో మంచి నేర్పరి. జంతువుల తీరు తెన్నులు బాగా ఎరిగినవాడు. అడవులలో తిరగటానికి అలవాటు పడ్డవాడు. తల్లి దండ్రులంటే అతడికి ఎంతో భక్తి. వాళ్ళు తృప్తిపడేటట్లు వాళ్ళకు కావాల్సిన పండ్లూ, కందమూలాలూ, తేనెలు, మాంసం, అన్నం, కూరలు అన్నీ సమకూర్చి పెట్టేవాడు. వాళ్ళు ఇష్టపడేటట్లు పడుకొనటానికి పక్కలూ, కూర్చోవటానికి పీటలూ అన్నీ ఏర్పాటు చేసేవాడు. అక్కడ ఉండే ముని స్వాములందరికీ కావలసిన ఆహార పదార్థాలు అందించేవాడు. పగవా డనిపిస్తే చాలు యుద్ధంలో రుద్రుడై ఒక్కడే వేయిమందిని చంపేవాడు.

**క.** **కాపవ్యుం డను పేరను । దీపించిన యతని భూరితేజముఁ గని ర**
**క్షాపరుఁడు వలయు మనకని । యా పాలమునఁ గల్గు దస్యులందఱుఁ దమలోన్.** **178**

**ప్రతిపదార్థం:** కాపవ్యుండు+అనుపేరను= కాపవ్యుడనే పేరుతో; దీపించిన= పేరుపొందిన (ప్రకాశిస్తున్న); అతని= ఆ బోయవాడి; భూరి తేజము= గొప్ప పరాక్రమాన్ని; కని= చూచి; ఆ పాలమునన్= ఆ పారియాత్ర పర్వత ప్రాంతాన; కల్గు= ఉండే; దస్యులు+అందఱున్= దొంగలందరూ; మనకున్= మనకందరికీ; రక్షాపరుఁడు= రక్షించేవాడు; వలయున్= కావాలి; అని= అనుకొని; తమలోన్= తమలో తాము.

**తాత్పర్యం:** బోయవాడి పేరు కాపవ్యుడు. ఆతడి పరాక్రమాన్ని చూచి ఆ కొండమీద ఉండే దొంగలంతా కూడి మనకందరికీ ఒక రక్షకుడు కావాలనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ.** **అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు । వానిఁగా వరించువారు గాఁగ**
**నిశ్చయించి కూడి నెమ్మిమైఁ జనుదెంచి । కాంచి యిట్టు లనిరి గారవమున.** **179**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ కాపవ్యుడిని; తమకున్+ఎల్లన్= తమకందరికీ; ఆధిపత్యము= పెత్తనం; చేయువానిన్+కాన్= చేసే వాడిగా; వరించువారుకాఁగన్= కోరుకొనువారై; నిశ్చయించి= నిర్ణయించుకొని; కూడి= ఏకమై; నెమ్మిమైన్= సంతోషంతో; చనుదెంచి= వచ్చి; కాంచి= ఆ కాపవ్యుడిని చూచి; గారవమునన్= గౌరవంతో; ఇట్టులు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** తమకు అందరికీ నాయకుడిగా ఉండటానికి కాపవ్యుడిని కోరాలనే నిర్ణయానికి వచ్చి దొంగలంతా కలిసి సంతోషంగా అతడి దగ్గరకు వెళ్ళారు. ఎంతో మర్యాదగా ఈ విధంగా అన్నారు.

**క.** **బలవిక్రమసంపన్నుఁడ వ । లఘుచరిత్రుఁడవు మమ్ము నందఱుఁ బ్రభువై**
**తలకొని రక్షింపుము; నీ । వలచిన పనిగొనుము పుత్రవర్గముఁ బోలెన్.'** **180**

**ప్రతిపదార్థం:** బలవిక్రమ సంపన్నుఁడవు= శక్తి పరాక్రమాల సంపత్తి కలవాడవు; అలఘు చరిత్రుఁడవు= గొప్పనడవడి కలవాడవు అయిన నీవు; ప్రభువు+ఐ= నాయకుడివై; మమ్మున్+అందఱన్= మమ్మల్నందరినీ; పుత్రవర్గమున్+పోలెన్= కన్న కొడుకులవలె; తలకొని= ఒప్పుకొని; రక్షింపుము= కాపాడుము; నీ వలచినపని= నీకు కావాల్సిన పని; కొనుము= చేయించుకొమ్ము.

**తాత్పర్యం:** నీవు బలపరాక్రమాలు రెండూ నిండుగా ఉన్నవాడివి, దొడ్డనడవడి కలవాడవు. మా అందరికీ నాయకుడివై మమ్మల్ని కన్నకొడుకులవలె కాపాడుకొమ్ము. మాచేత నీకు కావాల్సిన పనులు చేయించుకొమ్ము'.

**వ.** **అనిన విని యతఁడు వారల కిట్లనియె.** **181**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; అతఁడు= ఆ కాపవ్యుడు; వారలకున్= దొంగలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అది విన్న కాపవ్యుడు దొంగలతో ఈ విధంగా చెప్పాడు.

**సీ.** **శిశుజన మునిజన స్త్రీజనంబులఁ । జంపఁగాఁ; దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ**
**గవియక పొడుచుట కల్మషం; బంగనఁ । జెఱపట్టఁ దగదు; విశేష మొకఁడు**
**వినుఁ; డెల్ల సత్త్వంబులను బెంటిఁ జంపుట । పాపంబు; గోవుల బ్రాహ్మణులను**
**సంకటపెట్టంగఁ జనదు; తదీయ హి । తము గోరి పూని యుద్ధంబు సేఁత**

**తే.** **యధిక పుణ్యంబు సస్యక్రియావిఘాత । మాచరించుట గడుదోష; మవని ప్రజకు**
**బాధ గావించి కుడిచి శవంబు దొలుచు । పువ్వుగతి నది వొలియంగఁ బొలియు నతఁడు.** **182**

**ప్రతిపదార్థం:** శిశుజన= పసిబిడ్డలను; మునిజన= మునులను; స్త్రీ జనంబులన్= స్త్రీలనూ; చంపన్+కాదు= చంపటం తగదు; ఎట్టివాఁడు+ఐనన్= ఎటువంటివాడైనా; కడఁగి= పూనుకొని; మీఁదన్= పైనబడి; కవియక= కలబడకుండా; పొడుచుట= చంపటం; కల్మషంబు= పాపం; అంగనన్= స్త్రీని; చెఱపట్టన్= బలాత్కరించటం; తగదు= కూడదు; ఒకఁడు విశేషము= ప్రత్యేకమైన మరొక విషయాన్ని; వినుఁడు= వినండి; ఎల్లసత్త్వంబులను= అన్ని జంతువులలోను; పెంటిన్= ఆడజంతువును; చంపుట= చంపటం; పాపంబు= పాపం; గోవులన్= ఆవులను; బ్రాహ్మణులను; సంకటపెట్టంగన్= కష్టపెట్టటం; చనదు= ఒప్పదు; తదీయ= ఆ గో బ్రాహ్మణులయొక్క; హితము కోరి= మేలు కోరుకొని; పూని= తలపెట్టి; యుద్ధంబు+చేఁత= యుద్ధం చేయటం; అధిక పుణ్యంబు= ఎక్కువ పుణ్యం; సస్యక్రియా విఘాతమున్= పంట పైరులకు చెరుపు; ఆచరించుట= చేయటం; కడుదోషము= ఎంతో పాపం; అవని ప్రజకున్= నేలమీది జనాన్ని; బాధ కావించి= హింసపెట్టి; కుడిచి= తిని; శవంబు= పీనుగను; తొలుచు= డొల్లచేసే (తినే); పువ్వుగతిన్= పురుగువలె; అది పొలియంగన్= ఆ సంపాదన నశించగానే; అతఁడు= అతడు (ప్రజలను బాధించి పొట్టపోసికొనేవాడు); పొలియున్= నశిస్తాడు.

**తాత్పర్యం:** 'పసివాళ్ళనూ, మునులనూ, ఆడవాళ్ళనూ చంపకూడదు. మనపై కలబడనివాడి జోలికి పోవటం మహాపాపం. ఆడవాళ్ళను చెరపట్టటం కూడనిపని. ఇంకొక విశేషం కూడా వినండి. క్రూర సాధు జంతువులన్నిట్లో ఆడ జంతువు ప్రాణం తీయకూడదు. ఆవులను, బ్రాహ్మణులను కష్టపెట్టకూడదు. వారి మేలు కోరి యుద్ధం చేస్తే ఎంతో పుణ్యం. పంటపొలాన్ని నాశనం చేయటం ఎంతో పాపం. ప్రజలను బాధించి తన పొట్టనింపుకొనేవాడు శవాన్ని డొలిచే పురుగు శవం నశించగానే తానూ నాశనమైనట్లే ఆ లబ్ధి నశించగానే తానూ నశిస్తాడు.

**వ. అని చెప్పి 'మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱంగున బ్రదికెదరేని మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీ యోగక్షేమంబు లరసెద' ననియె. దానికి వారలందఱు బ్రీతింబొంది, యాతని వశంబున వర్తించి వర్ధిల్లి; రిట్లు కాపవ్యుండు సాధులకు హితం బగునట్లుగా దస్యులం బాపంబులకుం బాపి తానును వారును నిహపర సిద్ధులం బ్రశస్తి వహించె. 183**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; మీరలు= మీరు; ఈ ధర్మ+అధర్మంబులు= ఈ న్యాయాన్యాయాలు; ఎఱింగి= తెలిసికొని; నాపంచిన తెఱంగునన్= నేను చెప్పినట్టు విధంగా; బ్రదికెదరు+ఏని= జీవించేటట్లయితేనే; మీకున్= మీకు; ముఖ్యుండను+అయి= ప్రధాన నాయకుడనై; సఖ్యంబు= స్నేహం; సౌఖ్యంబున్= సుఖమూ; పెనుపన్= పెంపొందేటట్లు; మీ యోగక్షేమంబులు= మీ క్షేమలాభాలు (మంచి చెడ్డలు); అరసెదన్= విచారిస్తాను; అనియెన్= అన్నాడు; దానికిన్= ఈ విషయానికి; వారలు+అందఱున్= వారంతా; ప్రీతిన్+పొంది= సంతోషపడి; ఆతని వశంబునన్= కాపవ్యుడికి విధేయులై; వర్తించి= ఉండి; వర్ధిల్లిరి= వృద్ధిలోకి వచ్చారు; ఇట్లు= ఈ విధంగా; కాపవ్యుండు= బోయవాడు; సాధులకున్= మంచివాళ్ళకు; హితంబు= మేలు; అగునట్లుగాన్= కలిగేట్లు; దస్యులన్= దొంగలను; పాపంబులకున్= పాపపు పనులనుండి; పాపి= తొలగించి; తానును= తానూ (కాపవ్యుడూ); వారును= ఆ దొంగలూ; ఇహ= ఈ లోక సుఖాలు; పర= పరలోక సుఖాలు; సిద్ధులన్= నెరవేరటంవలన; ప్రశస్తిన్= ప్రఖ్యాతిని; వహించెన్= పొందారు.

**తాత్పర్యం:** మీ రంతా న్యాయాన్యాయాలు తెలిసికొని నేను చెప్పినట్లు బ్రతకండి. మీకు నాయకుడినై మీలో స్నేహ సౌఖ్యాలు పెంచుతాను; మీ మంచి చెడ్డలు కనుక్కొంటుంటాను' అని చెప్పాడు. దీనికి ఆ దొంగలు ఎంతో సంతోషించారు. ఆతడికి లోబడి నడచుకుంటూ బాగా అభివృద్ధిలోకి వచ్చారు. ఇట్లా కాపవ్యుడు మంచివాళ్ళకు మేలు జరిగేటట్లు దొంగలను పాపపు పనులనుండి మళ్ళించాడు. తానూ వాళ్ళూ ఇహపరలోక సౌఖ్యాలు సాధించుకొని ఎంతో పేరు పొందారు.

**క. కాపవ్యోపాఖ్యానము । పాపహరము దీని శ్రవణపఠనము లటవీ**
**వ్యాపార క్షేమంకర । రూపములగు దస్యుమృగవిరోధము లడఁచున్. 184**

**ప్రతిపదార్థం:** కాపవ్య+ఉపాఖ్యానము= కాపవ్యుడి కథ; పాపహరము= పాపాలను పోగొట్టుతుంది; దీని శ్రవణ పఠనములు= ఈ కథ వినటం చదవటం అనేవి; అటవీవ్యాపార= అడవులలో చేసే కార్యాలలో; క్షేమంకర రూపములు= శుభాన్ని చేకూర్చేవి; అగున్= అవుతాయి; దస్యు= దొంగల; మృగ= క్రూరజంతువుల వలన కలిగే; విరోధములు= అడ్డంకులను; అడఁచున్= ఆపుతాయి.

**తాత్పర్యం:** ఈ కాపవ్యుడి కథ పాపాలను తుడిచివేస్తుంది. దీనిని విన్నా చదివినా అడవులలో చేసే కార్యాలన్నీ శుభప్రదాలవుతాయి. దొంగలవలనా క్రూరమృగాలవలనా కలిగే ఆటంకాలన్నీ తొలగిపోతాయి.

### భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల తెఱం గెఱింగించుట (సం. 12-135-1)

**వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను 'దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడు జలచర బహుళంబగు నొక్కయేటి మడువునఁ దమలోనం బొందుగలిగి యుండునవి; వేసవిసొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటిని గూడం బిలిచి. 185**

**ప్రతిపదార్థం:** అని; భీష్ముండు; చెప్పి= తెలియచెప్పి; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; దీర్ఘదర్శియున్= దీర్ఘదర్శీ (రాబోయేదాన్ని ముందుగా చూసేవాడు); ప్రాప్తకాలజ్ఞుండును= ప్రాప్తకాలజ్ఞుడు (కాలం ప్రాప్తించినపుడు ఉపాయం

తెలిసికొనేవాడు); దీర్ఘసూత్రుండును= దీర్ఘ సూత్రుడు (మెల్లగా పనులు చేసేవాడు); అను మత్స్యంబులు= అనే చేపలు; మూఁడు= మూడును; జలచర= అనేక నీటి ప్రాణులతో; బహుళంబు+అగు= ఎక్కువగా ఉండేటి; ఒక్క+ఏటి మడువునన్= ఒక్కనది మడుగులో; తమలోనన్= తమలోతాము; పొందు కల్గి= పొత్తు పెట్టుకొని; ఉండున్+అవి= ఉండేటటువంటివి; వేసవి+చొచ్చినన్= ఎండాకాలం రాగానే; దీర్ఘదర్శి= దీర్ఘదర్శి అనే చేప; తక్కటి రెంటిని= మిగతా రెండు చేపలను; కూడన్ పిలిచి= కలుద్దాం రమ్మని.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు మళ్ళీ ఈ విధంగా చెప్పాడు: 'నీటి జంతువులు ఎక్కువగా ఉండే ఒక ఏటి మడుగులో మూడు చేపలు ఉండేవి. అవి దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రుడు అనేవి. ఈ మూడు పరస్పరం ఎంతో స్నేహంగా మెలిగేవి. ఎండాకాలం రాగానే దీర్ఘదర్శి మిగతా రెండు చేపలను కూడగట్టుకొని పిలిచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'మడు వింకఁగఁ బాటెడు; నీ । రెడ త్రెవ్విన నొండు సోటి కేఁగఁగ రా ద**
**ప్పుడు నింకని నీళ్ళులు గల । మడువునకుం బోవవలదె మన కిట్టి యెడన్?' 186**

**ప్రతిపదార్థం:** మడువు= చెరువు; ఇంకఁగన్+పాటెడు= ఇగిరిపోబోతున్న; నీరు= నీళ్ళు; ఎడత్రెవ్వినన్= ఆగిపోతే; ఒండు చోటికిన్= మరొక చోటుకి; ఏఁగఁగరాదు= వెళ్ళలేం; మనకున్= మనకు; ఇట్టి ఎడన్= బాగా ఇంకిపోని ఈ సమయంలో; ఎపుడున్= ఎప్పటికీ; ఇంకని= అడుగంటని; నీళ్ళులు గల= నీళ్ళు ఉండే; మడువునకున్= చెరువులోకి; పోవవలదె= వెళ్ళవద్దా.

**తాత్పర్యం:** 'మనం ఉండే చెరువు ఎండిపోతూ ఉన్నది. నీళ్ళు ఇంకిపోతే మరోచోటికి వెళ్ళలేం. ఇట్లాంటి సమయంలోనే ఎపుడూ నీళ్ళు నిండుగా ప్రవహించే చెరువులోకి చేరుకొనటం మంచిది'.

**తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె 'నేది । ప్రాప్తమయ్యె నక్కార్యంబు భంగి నెఱిఁగి**
**యప్పటికిఁ దగునట్లు సేయంగవలయు । మానితోపాయవృత్తి నేమఱుట లేక. 187**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ప్రాప్తకాలజ్ఞుఁడు= ప్రాప్తకాలజ్ఞుడనే చేప; అనియెన్= ఇట్లా అన్నాడు; ఏది ప్రాప్తము+అయ్యెన్= ఏది (ఎపుడు) సంప్రాప్తిస్తుందో; ఆ+కార్యంబు+భంగిన్= ఆ పనితీరును; ఎఱిఁగి= తెలిసికొని; అప్పటికిన్= ఆ సమయానికి; తగునట్టు= తగిన విధంగా; ఏమఱుట లేక= ఉపేక్షించక; మానిత= సముచితం అయిన; ఉపాయవృత్తిన్= యుక్తిగల నడవడితో; చేయంగ వలయున్= సాధించుకొనాలి.

**తాత్పర్యం:** అనగానే ప్రాప్తకాలజ్ఞుడు ఇట్లా అన్నాడు. 'ఏది సంభవిస్తుందో దాని తీరును తెలిసికొనాలి. ఏ మాత్రం ఏమరకుండా అప్పటికప్పుడు దానికి తగినట్లుగా ఎంతో ఉపాయంగా ఆ పనిని సాధించుకొనాలి'.

**వ. అనిన నయ్యిరుదెఱంగుల పలుకులు విని దీర్ఘసూత్రుం డిట్లనియె. 188**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; ఆ+ఇరు+తెఱంగుల పలుకులు= ఆ చేపల రెండు తీరుల మాటలను; విని= ఆలకించి; దీర్ఘ సూత్రుండు= దీర్ఘసూత్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దీర్ఘదర్శి ప్రాప్తకాలజ్ఞుల మాటలు ఆలకించి దీర్ఘసూత్రుడు వారితో ఈ విధంగా అన్నాడు.

**క. 'జడనిధి చందంబున ని । మ్మడు వొప్పఁగ నిప్పు డేమి మాఁడెనె? యిమ్మై**
**నడిచిపడ రిత్త నెవ్వగ । లుడుగుఁడు; మఱి చూచికొంద మొయ్యన తఱితోన్.' 189**

**ప్రతిపదార్థం:** ఈ+మడువు= ఈ చెరువు; జడనిధి చందంబునన్= సముద్రంవలె; ఒప్పఁగన్= ఒప్పుతుండగా; ఇపుడు= ఇపుడు; ఈ+మెయిన్= ఈ రీతిగా; అడిచిపడన్= తొందరపడటానికి; మాఁడెనె+ఏమి?= ఎండిపోయెనా ఏమి?; రిత్త= పనికిమాలిన; నెఱ+వగలు= అతి విచారణలు; ఉడుగుఁడు= మానండి; ఒయ్యనన్= మెల్లగా; తఱితోన్= సమయాన్ని బట్టి; మఱి= ఆ తరువాత; చూచికొందము= చూచుకుందాం.

**తాత్పర్యం:** 'ఇట్లా తొందరపడటానికి ఈ చెరువు ఎండిపోయిందా ఏమి? సముద్రంవలె ఉన్నది. పనికిమాలిన అతి ఆలోచనలను కట్టిపెట్టండి. అవసరాన్నిబట్టి అపుడు చూచుకొందాం'.

**క. అనుటయు 'నిది కర్జము గా' । దని పల్కుచు దీర్ఘదర్శి అంబుస్రోతో**
**జనితాభయ మగు పథమునఁ । జని జొచ్చెం బెద్ద మడువు సమ్మదలీలన్. 190**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఇది= ఈ చెరువులోనే ఉండటం అనేది; కర్జము+కాదు= చేయాల్సిన పనికాదు; అని పల్కుచున్= అని చెప్పుతూ; దీర్ఘదర్శి= దీర్ఘదర్శి అనే చేప; అంబుస్రోతః= నీటి ప్రవాహంవలన; జనిత= పుట్టిన; అభయము+అగు= భయంలేని; పథమునన్= త్రోవలో; చని= వెళ్ళి; సమ్మదలీలన్= సంతోషంతో; పెద్దమడువున్= పెద్ద చెరువును; చొచ్చెన్= ప్రవేశించింది.

**తాత్పర్యం:** ఇంకా ఈ చెరువులోనే ఉండటం మంచిది కాదనుకొన్నది దీర్ఘదర్శి. నీటి జాలు వెంబడి నిర్భయంగా వెళ్ళి పెద్ద చెరువును సంతోషంగా చేరుకొన్నది.

**వ. తక్కిన రెండును నంద నిలిచె; నిట్లు నిలిచిన యమ్మత్స్యద్వయంబునకు భయంబు జనియింపం గతిపయది వసంబులకు. 191**

**ప్రతిపదార్థం:** తక్కిన రెండునున్= మిగతా రెండు చేపలు (దీర్ఘసూత్రుడు, ప్రాప్తకాలజ్ఞుడు); అంద= ముందటి చెరువులోనే; నిలిచెన్= ఉండిపోయాయి; ఇట్లు= ఈ విధంగా; నిలిచిన= ఉన్న; ఆ+మత్స్యద్వయంబునకున్= ఆ రెండు చేపలకు; కతిపయదివసంబులకున్= కొన్ని రోజులు గడువగా; భయంబు= భయం; జనియింపన్= కలుగగా (పుట్టగా)

**తాత్పర్యం:** దీర్ఘదర్శి కాక మిగతా రెండు చేపలూ ముందటి చెరువులోనే ఉన్నాయి. కొంతకాలానికి వాటికి భయం కలుగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పాఱెడు నీ రెడ త్రెవ్వఁగఁ । దాఱ బెడిద మైన యెండ దనుకఁగ నివురం**
**బాఱె మడు; వంత వేడుక । కాఱులు జాలరులు సొచ్చి క్రందుకొనంగన్. 192**

**ప్రతిపదార్థం:** పాఱెడు నీరు= పారే నీళ్ళు; ఎడత్రెవ్వఁగన్= ఆగిపోగా; తాఱన్= అడగగా; బెడిదము+ఐన= వేడెక్కిన; ఎండ= ఎండ; తనుకఁగన్= తాకగా; మడువు= చెరువు; ఇవురన్+పాఱెన్= ఇంకిపోసాగింది; అంతన్= అంతలోనే; వేడుకకాఱులు= కుతూహలం గల; జాలరులు= చేపలు పట్టేవారు; చొచ్చి= దిగి; క్రందు కొనంగన్= కమ్ముకొనగా.

**తాత్పర్యం:** చెరువులోకి పారే నీళ్ళు ఆగిపోయి తగ్గుముఖం పట్టాయి. మండుటెండలు ముదిరాయి. చెరువులో నీళ్ళు ఇంకిపోసాగాయి. అంతలో చేపలు పట్టే జాలరులు చెరువుచుట్టూ ఉత్సాహంగా కమ్ముకొనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వెరవున నూఁతల నెత్తెలఁ । గరముల మత్స్యములఁ బట్టి కడు సంతసముం**
**బొరయుచుఁ ద్రాళ్ళం గ్రువ్వఁగఁ । గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుండున్. 193**

**ప్రతిపదార్థం:** వెరవునన్= ఉపాయంతో; ఊఁతలన్= చేపలు పట్టే బుట్టలతో; ఎత్తెలన్= చేపలు పట్టే అడ్డువలలతో; కరములన్= విడి చేతులతోనూ; మత్స్యములన్= చేపలను; పట్టి= పట్టుకొని; కడుసంతసమున్= మిక్కిలి సంతోషాన్ని; పొరయుచున్= పొందుతూ; త్రాళ్ళన్= తాళ్ళను; క్రువ్వఁగన్= కూర్చుతుండగా; ప్రాప్తకాలజ్ఞుండున్= ప్రాప్తకాలజ్ఞుడు; మదిన్= మనసులో; కరము+ఊహించి= ఎంతగానో ఆలోచించి.

**తాత్పర్యం:** చేపలు పట్టే బుట్టలతో, అడ్డు వలలతో, విడి చేతులతో ఎంతో నేర్పుగా జాలరులు చేపలను పట్టుకొన్నారు. ఎంతో సంతోషిస్తూ తాళ్ళను కూర్చుతున్నారు. అంతలో ప్రాప్తకాలజ్ఞుడు మనసులో చాలాసేపు ఆలోచించుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఇందొక త్రాడు గఱచి యే । నొందంగా గ్రుచ్చినట్ల యుండెద; వీ రీ**
**క్రందుకొనుట మానంగ న మందత । నది యెడల విడిచి మడువు దఱిసెదన్.' 194**

**ప్రతిపదార్థం:** ఇందున్= ఈ చేపలు కూర్చిన త్రాళ్ళల్లో; ఒకత్రాడు= ఒక తాడును; కఱచి= పళ్ళతో నొక్కిపట్టి; ఏన్= నేను; ఒందంగాన్= చక్కగా గ్రుచ్చిన; అట్ల= గుచ్చినట్లుగానే; ఉండెదన్= ఉంటాను. వీరు= ఈ జాలర్లు; ఈ క్రందుకొనుట= చుట్టూ కమ్ముకొని చేపలు పట్టటం; మానంగన్= ఆపగానే; అమందతన్= ఆలస్యంలేకుండా, వెంటనే; అది= ఆ తాడును; ఎడలవిడిచి= విడిచిపెట్టి, వదలి; మడువు= చెరువును; దఱిసెదన్= చేరుకొంటాను.

**తాత్పర్యం:** 'చేపలు కూర్చిన తాళ్ళలో చక్కగా గుచ్చిన చేపవలె ఒక తాడును కరచి పట్టుకొంటాను. జాలరులు చేపలు పట్టటం ఆపగానే చటుక్కున ఆ తాడును వదలిపెట్టి మడుగును చేరుకొంటాను.'

**క. అని యొక గుదిమీల నడుమ । నెనయంగాఁ దూఱి కఱచి యిరుదౌడలఁ ద్రా**
**డొనరంగ బట్టుకొని గ్రు । చ్చిన చందము దోఁప మూర్ఛఁ జెందిన భంగిన్. 195**

**ప్రతిపదార్థం:** అని= అనుకొని; ఒక గుది= చేపలు గుచ్చిన గుత్తిలోని; మీలనడుమన్= చేపల మధ్యలో; ఎనయంగాన్= పొందికగా; తూఱి= దొరబడి; కఱచి= పళ్ళతో నొక్కిపట్టి; ఇరుదౌడలన్= రెండు దవుడలతో; త్రాడు= తాడును; ఒనరంగన్= ఒప్పునట్లుగా; పట్టుకొని= కరచుకొని; గ్రుచ్చిన చందము తోఁపన్= గుచ్చినట్టే అగపడేటట్లు; మూర్ఛన్+చెందిన భంగిన్= సొమ్మసిల్లిన దానివలె.

**తాత్పర్యం:** అని అనుకొని చేపల గుత్తిలోకి దూరి, రెండు దవుడలతో తాడును కరచి పట్టుకొన్నది. గుచ్చిన చేపలవలె సొమ్మసిల్లిన దానివలె. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. ఉన్నంత వేఁట దీఱి యగ్గుదిగల యతండు. 196**

**ప్రతిపదార్థం:** ఉన్న+అంతన్= ఉండినంతలో; వేఁట తీఱి= చేపలు పట్టటం చాలించి; ఆ+గుది+కల+అతండు= ప్రాప్తకాలజ్ఞుడు ఉండు గుత్తి పట్టుకొన్నవాడు.

**తాత్పర్యం:** ఉండగా ఆ చేపల గుత్తి పట్టుకున్న జాలరివాడు చేపలు పట్టటం ఆపి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. తెలినీట రొంపివోవం । దొలుచు నెడం ద్రాడు విడిచి దురితంబునకుం**
**దొలఁగి పొరదప్పి యందొక । జలచర మున్న యెడకేఁగె సంభ్రాంతగతిన్. 197**

**ప్రతిపదార్థం:** తెలినీటన్= తేటనీళ్ళలో; రొంపి+పోవన్= బురద పోయేటట్లు; తొలుచు+ఎడన్= కడిగేటప్పుడు; త్రాడు= తాడును; విడిచి= వదలి; దురితంబునకున్= ఆపదనుంచి; తొలఁగి= తప్పుకొని; పొర+తప్పి= అపాయాన్ని దాటి; సంభ్రాంతగతిన్= తొట్రుపడుతూ; అందున్= అక్కడ; ఒక జలచరము= మరొక చేప; ఉన్న+ఎడన్= ఉన్నచోటికి; ఏఁగెన్= పోయింది.

**తాత్పర్యం:** మంచి నీళ్ళల్లో బురద పోయేటట్లు జాడించేటప్పుడు తాడును వదలిపెట్టి ఆపదనుండి తప్పించుకొన్నది. ప్రమాదాన్ని దాటి తత్తరపడుతూ అక్కడే మరోచేప ఉన్నచోటికి పోయింది.

**క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం డిట్ట । ట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ**
**బట్టువడెఁ దనదు డెందము । పట్టు వదలి చకిత వికల భావేంద్రియుఁడై. 198**

**ప్రతిపదార్థం:** ముట్టన్+పడి= చుట్టుముట్టబడి; దీర్ఘసూత్రుండు= దీర్ఘసూత్రుడు; ఇట్టు+అట్టు= ఇటువైపు, అటువైపు; అరుగఁగన్= వెళ్ళటానికి; ఉపాయము+ఏది= ఉపాయం లేనిదై; చకిత= భయపడి; వికల= చెదరిన; భావ= మనోవికారం; ఇంద్రియుఁడు+ఐ= చర్మం మొదలైన జ్ఞానేంద్రియాలు కలవాడై; తనదు డెందము= తన గుండె; పట్టు వదలి= దిటవు సడలి; ఒకనిచేన్= ఒక జాలరిచేత; పట్టుపడెన్= చిక్కింది.

**తాత్పర్యం:** జాలర్లు చుట్టుముట్టగా దీర్ఘసూత్రుడు ఎటూ పోయే వీలులేక ఉపాయం తట్టక ఒక జాలరి చేతిలో చిక్కింది. అపుడు భయంతో శరీరం స్వాధీనంలో లేదు. గుండె పట్టు తప్పింది.

**క. విను దౌదవ్వులఁ గార్యము । గనికొని వలయుపని మున్న కావింపఁగ నే**
**రనిజడుఁడు దీర్ఘసూత్రుం । డను నమ్మత్స్యంబు భంగి నాపద నొందున్. 199**

**ప్రతిపదార్థం:** విను= ధర్మరాజా! వినవలసింది; దౌదవ్వులన్= దూరంలో ఉండగానే (చాలా కాలం ఉండగానే); కార్యము= పనిని; కనికొనివలయున్= తెలిసికొనాలి; పని= పనిని; మున్న= ముందుగానే; కావింపఁగనేరని= చేసికొనలేని; జడుండు= మూర్ఖుడు; దీర్ఘసూత్రుండు+అను= దీర్ఘసూత్రుడనే; ఆ+మత్స్యము+భంగిన్= ఆ చేపవలె; ఆపదన్= విపత్తును; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** దూరదృష్టితో పనిని ముందుగానే తెలిసికొనాలి. అట్లా ముందుగా పనిని చక్కదిద్దుకొనలేని మూర్ఖుడు దీర్ఘసూత్రు డనే చేపవలె ఇబ్బందులు పడతాడు.

**తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ । ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు**
**నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యు నట్లపోలెఁ । బరమ సంశయ మయ్యెడు బ్రదుకు గాంచు. 200**

**ప్రతిపదార్థం:** అప్పటికిన్= ఆ సమయానికి; తోఁచినట్టులు= తట్టిన విధంగా; తప్పక ఉండన్= తప్పనిసరిగా; అనువుతోన్= ఉపాయంతో; ధృతి+కల్గి= ధైర్యంతో ఉండి; కార్యంబు= పనిని; నడపున్+అతఁడు= జరిపేవాడు; ప్రాప్తకాలజ్ఞ+ఆఖ్యు+అట్లపోలెన్= ప్రాప్తకాలజ్ఞుడివలె; పరమ సంశయము+అయ్యెడు= ఎక్కువ సందేహానికి చోటిచ్చే; బ్రదుకు= జీవనాన్ని; కాంచున్= పొందుతాడు.

**తాత్పర్యం:** అప్పటికి తట్టినట్లు ఉపాయంతో ధైర్యంగా పనిచేసికొనేవాడు ప్రాప్తకాలజ్ఞుడివలె ఎపుడూ సందేహంతో కూడిన బతుకు బతుకుతాడు.

**క.** **ధుర్యత ననాగతము లగు । కార్యము లూహించి పని తగం జేయు నయా**
**చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును । నార్యస్థితి దీర్ఘదర్శి యను మీను క్రియన్.' 201**

**ప్రతిపదార్థం:** ధుర్యతన్= సమర్థంగా; న+ఆగతములు+అగు+కార్యములు= రాబోయే పనులను; ఊహించి= భావించి; పని= పనిని; తగన్+చేయు= తగినట్లుగా చేసే; నయాచార్యుఁడు= నీతివేత్త; ఆర్యస్థితిన్= మన్నించదగ్గట్లు; దీర్ఘదర్శి+అను= దీర్ఘదర్శి అనే; మీనుక్రియన్= చేపవలె; సౌఖ్యమున్= సుఖాన్ని; పొరయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాబోయే పనిని ముందుగా ఊహించుకొని సమర్థంగా ఆ పనిని యుక్తిగా చేసికొనే నీతిమంతుడు దీర్ఘదర్శి అనే చేపవలె సుఖంగా ఉంటాడు'.

### పలితరోమశు లను మూషిక మార్జాలంబుల సంవాద ప్రకారము (సం. 12-136-18)

**వ.** **అనిన విని ధర్మనందనుండు 'పెక్కండ్రు పగఱకు నగ్గమై హీనబలుం డైన నరపతి యెప్పరుసున నాపద నిస్తరించువాఁ?' డని యడిగిన నప్పుడమిఱేనితో భీష్ముండు 'మార్జాల మూషిక సంవాదం బను నితిహాసంబు గల; దది నీదగు ప్రశ్నంబునకు సదుత్తరం బగు విను' మని యిట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= విని; ధర్మనందనుండు= ధర్మరాజు; పెక్కండ్రు= ఎక్కువమంది; పగఱకున్= పగవాళ్ళకు; అగ్గము+ఐ= లోబడి; హీనబలుండు+ఐన= బలం తగ్గిన; నరపతి= రాజు; ఏ+పరుసునన్= ఏవిధంగా; ఆపదన్= విపత్తును; నిస్తరించువాఁడు?= దాట గలవాడు?; అని; అడిగినన్= అడగగా; ఆ పుడమిఱేనితోన్= ఆ ధర్మరాజుతో; భీష్ముండు= భీష్ముడు; మార్జాల= పిల్లి; మూషిక= ఎలుక; సంవాదంబు+అను= సంభాషణ మనే; ఇతిహాసంబు= మునుపటి కథ; కలదు= ఉన్నది; అది= ఆ కథ; నీదగు= నీకు సంబంధించిన; ప్రశ్నంబునకున్= అడిగినదానికి; సత్+ఉత్తరంబు+అగున్= మంచి సమాధానం అవుతుంది; వినుము= వినవలసింది; అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగానే ధర్మరాజు 'ఎంతో మంది శత్రువులచే చిక్కి బలం కోల్పోయిన రాజు ఆ ఆపదనుండి ఎట్లా గట్టెక్కుతాడు?' అని ప్రశ్నించాడు. భీష్ముడు పిల్లి ఎలుకల సంవాదం అనే పూర్వపు కథ వింటే నీ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. ఆలకించు'మంటూ ఈ విధంగా అన్నాడు.

**సీ.** **'అడవిలో నొక మఱ్ఱియడుగున లాఁగలఁ । బలితుండు నా నొక్క యెలుక యుండు;**
**నమ్మహీజముమీఁద ననిశంబు రోమశుం । డను పిల్లి వసియించు; నా సమీప**
**మున సంజకడ నిత్యమును మృగంబుల । కురులొడ్డి వేకువ వచ్చి యొక్క మాలఁ**
**డగపడ్డ వానిఁ గొం చరుగు; నొకప్పు డా । హారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁ**

**తే.** **బోయి యురిఁ బడియుండఁగఁ బొంచిచూచి । భయము దక్కి యచ్చోటన పలితుఁ డెరకుఁ**
**గ్రుమ్మరఁగఁ జంద్రకుం డను గూబపులుఁగు । హలికుఁ డను ముంగిసయు నింత నంతఁ దోఁచె. 203**

**ప్రతిపదార్థం:** అడవిలోన్= అటవిలో; ఒక మఱ్ఱి= ఒక మర్రిచెట్టు; అడుగునన్= క్రిందిభాగంలో; లాఁగలన్= కలుగులలో; పలితుండునాన్= పలితుడనే పేరుగల; ఒక్క ఎలుక= ఒక ఎలుక; ఉండున్= ఉండేది; ఆ+మహీజముమీఁదన్= ఆ చెట్టు మీద; అనిశంబున్= ఎపుడూ; రోమశుండు అను పిల్లి= రోమశుడనే పేరుగల పిల్లి; వసియించున్= ఉండేది; ఆ సమీపమునన్= ఆ దగ్గరలోనే; సంజకడన్= సాయంవేళలో; నిత్యమును= ప్రతిదినం; మృగంబులకున్= జంతువులకు; ఉరులు= ఉచ్చులు; ఒడ్డి= పన్ని; వేకువ వచ్చి= తెల్లవారుజాముననే వచ్చి; ఒక్కమాలఁడు= ఒక మాలవాడు; అగపడ్డవానిన్= చిక్కిన వాటిని; కొంచున్+అరుగున్=

తీసికొని పోతుండేవాడు; ఒకప్పుడు= ఒకనాడు; ఆహారంబునకున్= తిండికొరకు; పిల్లి; అచటన్= అక్కడకు; తిరుగన్‌పోయి= తిరగటానికి వెళ్ళి; ఉరిన్+పడి= ఉచ్చులో చిక్కుకొని; ఉండఁగన్= ఉండగా; పలితుఁడు= పలితుడనే ఎలుక; పొంచి చూచి= దాగి ఉండి చూచి; భయము దక్కి= భయం వదలి; ఆ+చోటన్+అ= ఆ చెట్టు దగ్గరలోనే; ఎరకున్= తిండికొరకు; క్రుమ్మరఁగన్= తిరుగుతుండగా; చంద్రకుండు+అను= చంద్రకుడనే; గూబపులుఁగు= గుడ్లగూబా; హలికుఁడు+అను= హలికుడనే; ముంగిసయున్= ముంగిసా; ఇంతన్+అంతన్= ఈలోపల; తోఁచెన్= అగపడ్డాయి.

**తాత్పర్యం:** ఒక అడవిలో మర్రిచెట్టు క్రింద ఉన్న కలుగులో పలితు డనే ఎలుక ఉండేది. ఆ చెట్టుపైన రోమశుడనే పిల్లి ఉంటూ ఉండేది. ఈ చెట్టుకు దగ్గరలోనే ఒక మాలవాడు అనునిత్యం సాయంకాలం జంతువులకు ఉచ్చులు పన్నేవాడు. ఆ ఉచ్చులో చిక్కుకొన్న వాటిని తెల్లవారగానే వచ్చి తీసికొని వెళ్ళుతుండేవాడు. ఒకనాడు పిల్లి తిండికొరకు వచ్చి ఆ ఉరుల్లో చిక్కుకొన్నది. దీన్ని పొంచి చూచిన ఎలుక నిర్భయంగా తన ఆహారం కొరకు తిరుగాడసాగింది. అంతలో చంద్రకు డనే గుడ్లగూబా, హలికు డనే ముంగిసా ఎలుక కంటబడ్డాయి.

**వ. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యెలుక యా రెంటి బారికిం దప్పిపోవరామి దలంచి బెగ్గలించియు ధైర్యంబు కలిమిం గార్యం బూహించి యప్పిల్లిం గొండొక సేరం జనుచు దానితో నిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** ఎరలకున్+ఐ= మేతలకై; వచ్చి; ఇట్లు తోఁచినన్= ఇట్లా అగపడగా; ఆ+ఎలుక= ఆ పలితుడు; ఆ రెంటి బారికిన్= ఆ గుడ్లగూబా ముంగిసల ఆపదనుండి; తప్పిపోవరామి= తప్పించుకొని వెళ్ళటానికి వీలు కాదని; తలంచి= తలపోసి; బెగ్గలించియున్= భయపడీ; ధైర్యంబు= దిటవుతనం; కలిమిన్= కలిగి ఉండటంవలన; కార్యంబు= చేయాల్సిన పనిని; ఊహించి= ఆలోచించుకొని; ఆ+పిల్లిన్= ఆ పిల్లిని; కొండొక= కొంచెంగా; చేరన్+చనుచున్= దగ్గరకు వెళ్ళుతూ; దానితోన్= ఆ పిల్లితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** తిండికొరకు వచ్చిన ఎలుకకు గుడ్లగూబా, ముంగిసా కంటబడ్డాయి. వాటి బారినుండి తప్పించుకొని పోయే వీలులేదని గ్రహించుకొన్నది. భయపడింది. ధైర్యం కూడదీసికొన్నది. ఏం చేయాలో ఊహించుకొన్నది. మెల్లగా పిల్లిని సమీపిస్తూ ఈ విధంగా అన్నది.

**క. 'ఉరి ద్రెవ్వఁ గొఱికి యిప్పుడ । వెరవారఁగ నీకు నేను విడుగర సేయం**
**దొరకొనుట నీదు భాగ్యం । బరిత్వము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్. 205**

**ప్రతిపదార్థం:** ఉరి= ఉచ్చును; త్రెవ్వన్= తెగి పోయేటట్లు; కొఱికి= పళ్ళతో కరిచి; ఇప్పుడ= ఇపుడే; వెరవు= నేర్పు; ఆరఁగన్= ఒప్పేటట్లు; నీకున్= నీకు (పిల్లికి); నేను= నేను (ఎలుక); విడుగర= విడుదల; చేయన్+దొరకొనుట= చేయటానికి పూనుకొనటం; నీదు భాగ్యంబు= నీ అదృష్టం; మదిన్= మనసులో; అరిత్వము= పగను; తొఱంగి= మాని; మైత్రిన్= మిత్రభావాన్ని; అలవఱుపు(ము)= నేర్చుకొమ్ము.

**తాత్పర్యం:** 'ఓ రోమశా! నేను నా నేర్పుతో నీ ఉరులను తెగకొరికి నిన్ను విముక్తుడిని చేస్తాను. నేను ఇట్లా చేయటానికి పూనుకొనటం నీ అదృష్టంగా భావించుము. మనస్సులోపలి పగను మానుకొమ్ము. స్నేహభావాన్ని అలవరుచుకొమ్ము.

**క. ముంగికి గూబకు నగపడి । యంగంబులు వడఁకుచున్నయవి నా కిమ్మై**
**సంగతి గలిగిన నీ యు । త్సంగంబున నుండి భయము దక్కుదు నేనున్.' 206**

**ప్రతిపదార్థం:** ముంగికిన్= ముంగిసకూ; గూబకున్= గుడ్లగూబకు; అగపడి= కంటపడి; ఈ+మైన్= ఈ రీతిగా; అంగంబులు= అవయవాలు; వడఁకుచున్+ఉన్నఅవి= వణకిపోతున్నాయి; నాకున్= నాకు (నీతో); సంగతి= స్నేహం; కల్గినన్= కలిగితే; నీ+ఉత్సంగంబునన్+ఉండి= నీ ఒడిలో ఉండి; నేనున్= నేను; భయము= భయాన్ని; దక్కుదున్= పోగొట్టుకొంటాను.

**తాత్పర్యం:** ముంగిసా గుడ్లగూబా కంటబడ్డ దగ్గరనుండి నా శరీరం అంతా వణకుతున్నది. నాతో నీవు జట్టుకట్టితే నీ ఒళ్ళో ఉండి భయం పోగొట్టుకొంటాను'.

**చ.** **అనవుడుఁ బిల్లి యిట్టులను 'నార్తశరణ్యుఁడ వయ్యెః దిట్టి నీ**
**కనఘ! హితంబు సేయ వలదయ్య? జగత్పతిసాక్షిగాఁగ ని**
**ప్పని దగఁ బూనితిన్; వెఱపుఁ బాచి ననుం గదియంగ రమ్ముః వ**
**చ్చిన నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్.' 207**

**ప్రతిపదార్థం:** అనవుడున్= ఎలుక చెప్పగానే; పిల్లి; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నది; ఆర్తశరణ్యుఁడవు= ఆపదలో ఉన్నవాళ్ళను రక్షించేవాడవు; అయ్యెదు= అవుతావు; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; ఇట్టి= ఇట్లాంటి; నీకున్= నీకు; హితంబు= మేలు; చేయవలదు+అయ్య!= చేయవద్దా!; జగత్పతి సాక్షిగాఁగన్= భగవంతుడి సాక్షిగా; ఈ+పనిన్= నిన్ను కాపాడే పనిని; తగన్= ఒప్పేటట్లు; పూనితిన్= చేయపూనుకొన్నాను; వెఱపున్+పాచి= భయాన్ని వదలి; ననున్= నన్ను; కదియంగన్= నా దరి చేరటానికి; రమ్ము= రావలసింది; వచ్చినన్= అట్లా వస్తే; నకులంబు= ముంగిసా; గూబయును= గుడ్లగూబా; నాకున్= నాకు; ఓడుటన్= భయపడటం వలన; చేరఁగన్+నేరవు= దరిదాపులకు రాలేవు.

**తాత్పర్యం:** ఎలుకతో పిల్లి ఇట్లా అన్నది. 'నీవు ఆపదలో ఉన్న వాళ్లను ఆదుకునే స్వభావం కలవాడివి. ఓ పుణ్యాత్ముడా! నీకు ఉపకారం చేయాల్సిందే. దేవుడి సాక్షిగా నిన్ను కాపాడాలనుకొన్నాను. భయపడకుండా నా దగ్గరకు రమ్ము. గుడ్లగూబా ముంగిసా నన్ను చూస్తే భయపడతాయి. కాబట్టి దరిదాపులకు రావు. దూరంగా పారిపోతాయి'.

**ఆ.** **అనిన నట్ల యగుట నాత్మ నెఱింగియ । కాదె సంధియైన నాదు బ్రదుకు**
**నీదు విడుగరయును నిజమగు టూహించి । నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చయంబు. 208**

**ప్రతిపదార్థం:** అనినన్= అట్లా అనగానే; అట్లు+అగుటన్= అట్లా అవుతుందని; ఆత్మన్+ఎఱింగియ+కాదె?= మనసులో గ్రహించుకొని కాదా?; సంధి+ఐనన్= పొత్తు కుదిరితే; నా+బ్రదుకున్= నా జీవనం; నీ+విడుగరయును= నీ విడుదలా; నిజము+అగుటన్= నిజం అవుతుందని; ఊహించి= ఆలోచించి; బుద్ధి నిశ్చయంబు= మనస్సులోని నిర్ణయం; నిన్నున్+చెందెన్= నిన్ను పొందింది.

**తాత్పర్యం:** అట్లా అనగానే ఎలుక, 'అట్లా అవుతుందని గ్రహించుకొనే కదా! నీతో పొత్తు కుదుర్చుకొనాలనుకొన్నాను. దీనివలన నేను బ్రతకటం, నీవు విడుదల అవటం రెండూ తీరతాయని నిర్ణయించుకొనే నిన్ను చేరాను'.

**క.** **అని పలికి పిల్లి పొదిగిట । ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసిం**
**చినఁ జూచి యయ్యులూకం । బును నకులము నచటు వాసి పోయె నిజేచ్ఛన్. 209**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని ఎలుక మాట్లాడి; పిల్లి= పిల్లియొక్క; పొదిగిటన్= పొదిగిలిలో (ప్రక్కకు సందిటికి నడిమి భాగంలో); అనయమున్= ఎపుడూ; నిశ్శంకవృత్తిన్= జంకూ గొంకూ లేని నడవడితో; ఆ+ఎలుక= ఆ పలితుడు; వసించినన్= ఉండగా; చూచి; ఆ+ఉలూకంబును= ఆ గుడ్లగూబా; నకులమున్= ముంగిసా; అచటు= ఆ చోటును; పాసి= వదలి; నిజ+ఇచ్ఛన్= తమ ఇష్టానుసారంగా; పోయెన్= పోయాయి.

**తాత్పర్యం:** అని పలికి ఎలుక ఏమాత్రం సందేహించకుండా పిల్లి పొదిగిట్లో ఉండటం చూచిన ఆ గుడ్లగూబా, ముంగిసా అక్కడినుండి తమ తోవన వెళ్ళిపోయాయి.

**క. నకులము నులూకమును బో । కకు సంతస మందియుండి గ్రక్కున నమ్మూ**
**షిక మయ్యురి చేరులు గొఱు । కక యలసత నల్లనల్లఁ గఱచుచు నుండెన్. 210**

**ప్రతిపదార్థం:** నకులమున్= ముంగిసా (హాలికుడు); ఉలూకమును= గుడ్లగూబా (చంద్రకుడు); పోకకున్= వెళ్ళిపోవటానికి; సంతసమున్= సంతోషాన్ని; అంది+ఉండి= పొంది ఉండి; గ్రక్కునన్= చప్పున; ఆ+మూషికము= ఆ ఎలుక; ఆ+ఉరిచేరులు= ఆ ఉచ్చు తాళ్ళను; కొఱుకక= కొరికివేయక; అలసతన్= ఆలస్యంగా; అల్లన్+అల్లన్= మెల్ల మెల్లగా; కఱచుచున్+ఉండెన్= కొరుకుతూ ఉన్నది.

**తాత్పర్యం:** ముంగిసా, గుడ్లగూబా వెళ్ళిపోవటం చూచి ఎలుక ఎంతో సంతోషించింది. అనుకున్నట్లుగా పిల్లి ఉచ్చులను గబగబ కొరకకుండా మెల్లమెల్లగా కొరుకుతూ జాప్యం చేస్తూ ఉన్నది.

**వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యురిం గొఱుకకుండుట యెఱింగి రోమశుం డిట్లనియె. 211**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ తీరుగా; పలితుండు= ఎలుక; గొనకొని= మొదలుపెట్టి; ఆ+ఉరిన్= ఆ ఉచ్చుతాళ్ళను; కొఱుకక+ఉండుట= కొరక్కుండా ఉండటం; ఎఱింగి= గ్రహించి; రోమశుండు= పిల్లి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ విధంగా ఎలుక ఉరితాళ్ళను తొందరగా కొరకకపోవటాన్ని పిల్లి పసికట్టి ఎలుకతో ఈ విధంగా అన్నది.

**క. 'తగునే యిట్లు? కృతార్థుఁడ । వగు నీ కురి గొఱుక కిట్టు లాలస్యము సేఁ**
**త గటా! కృతఘ్నతకు నెల । వగు టొప్పునె కొఱుకు కడఁక నద్రోహుఁడవై.' 212**

**ప్రతిపదార్థం:** కృతార్థుడవు+అగు= నెరవేరిన ప్రయోజనం కలవాడవగు; నీకున్= నీకు; ఇట్లు+తగునే?= ఇట్లా ఒప్పుతుందా?; ఉరి కొఱుకక= ఉచ్చులను తెగకొరకకుండా; ఇట్టులు= ఈ తీరున; ఆలస్యము+చేఁత= జాగుచేయటం; కటా!= అయ్యో!; కృతఘ్నతకున్= చేసిన మేలు మరవటమనేదానికి; నెలవు+అగుట= ఉనికి పట్టవటం; ఒప్పునె?= తగుతుందా?; అద్రోహుఁడవై= కీడు చేయాలనే తలంపు లేనివాడవై; కడఁకన్= పట్టుదలతో; కొఱుకు(ము)= కొరకవలసింది.

**తాత్పర్యం:** నావలన ప్రయోజనం పొందిన నీకు ఇది తగుతుందా? ఉరులను తెగ కొరకకుండా జాప్యం చేయటం ఒప్పుతుందా? చేసిన మేలు మరచిపోవటం న్యాయమా? కీడు తలపెట్టక పట్టుదలపట్టి కొరుకుము'.

**చ. అనుటయు నెల్క యిట్టు లను 'నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ**
**డునఁ బొరయింతునే? యిది కడుం జెడుగుందన; మేను భీతి నూ**
**నిన మదితోడ నమ్మమిన నెట్టన యియ్యురిఁద్రెంప నియ్యెడన్**
**మనమున నెగ్గుగాఁ గొనకు మాలనిఁ గాంచిన యప్డ త్రెంచెదన్. 213**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఎల్క= ఎలుక; ఇట్టులు+అనున్= ఈ విధంగా పలికింది; ఆశ్రిత రక్షణ శీలున్= అండ చేరినవాళ్ళను కాపాడే స్వభావం గల; నిన్నున్= నిన్ను; కీడునన్= ఆపదను; పొరయింతునే?= కలిగిస్తానా?; ఇది= కీడు తలపెట్టటం;

కడున్= ఎంతో; చెడుగుందనము= చెడ్డది; ఏను= నేను; భీతిన్+ఊనిన= భయం పొందిన; మదితోడన్= బుద్ధితో, మనస్సుతో; నమ్మమిన= నమ్మలేకపోవటం వలననే; నెట్టన= వెంటనే; ఈ ఉరిన్= ఈ ఉచ్చును; త్రెంపన్= నుగ్గు చేయను; ఈ+ఎడన్= ఈ సమయంలో; మనమునన్= మనస్సులో; ఎగ్గుగాన్= తప్పుగా ద్రోహంగా (కీడుగా); కొనకు(ము)= తీసికొనకుము; మాలనిన్= మాలవాడిని; కాంచిన+అప్డ= చూచినప్పుడే; త్రెంచెదన్= తెంపుతాను.

**తాత్పర్యం:** పిల్లి మాటలకు ఎలుక ఇట్లా జవాబిచ్చింది 'ఆశ్రయించినవాళ్ళను కాదనకుండా కాపాడే స్వభావం నీది. అట్లాంటి నీకు ఆపదను కలిగిస్తానా? కీడు తలపెట్టటం మంచిపని కాదు. నా భయంకొద్దీ నిన్ను నేను నమ్మలేక ఉరులు తెంపలేక పోతున్నాను. మనస్సులో తప్పు పట్టవద్దు. మాలవాడిని చూడగానే తాళ్ళను తెగగొరుకుతాను.

**క.** **ఉరిఁ బాసి యేమి దలఁతో । యరిత్వమున వినుము ప్రబలుఁడైన యతనితో**
**వెరవున సంధి యొనర్చియుఁ । గరంబు నమ్మమియ నీతిగాఁ గొంద్రు బుధుల్.** **214**

**ప్రతిపదార్థం:** ఉరిన్ పాసి= ఉచ్చును వదలి; అరిత్వమునన్= శత్రుత్వంతో; ఏమి తలఁతో= ఏం ఆలోచిస్తావో; వినుము= వినవలసింది; బుధుల్= జ్ఞానం కలవారు; ప్రబలుఁడు+ఐన+అతనితోన్= బలవంతుడైన పగవాడితో; వెరవునన్= ఉపాయంగా; సంధి= పొత్తు; ఒనర్చియున్= కుదుర్చుకొని; కరంబు= ఎక్కువ; నమ్మమియ= నమ్మకపోవటమే; బుధుల్= జ్ఞానవంతులు; నీతిగాన్= ధర్మంగా; కొంద్రు= గ్రహిస్తారు.

**తాత్పర్యం:** నీవు ఉచ్చులనుండి బయటపడి పగవలన ఏం ఆలోచిస్తావో? ఒక మాట వినుము. బలవంతుడైనవాడితో ఎంతో ఉపాయంగా పొత్తు పెట్టుకొన్నా, అతడిమీద ఎక్కువ నమ్మకం ఉంచుకొనటం నీతి కాదంటారు తెలిసినవాళ్ళు.

**ఉ.** **మాలనిరాక చూచి భయమర్దిత మైన మనంబుతోడ న**
**క్కాలమునందు నీకుఁ జనఁగావలయున్ వెస భ్రూనిపైకి నా**
**యాలయముం జొరన్ సమయ; మప్పుడ నాకును గాన యత్తఱి**
**న్మేలొనరింతు; నమ్ము మిది నిక్కము గర్జము నీ వెఱుంగవే?'** **215**

**ప్రతిపదార్థం:** మాలని రాక చూచి= మాలవాడు రావటం చూచి; భయమర్దితము+ఐన= భయంతో బాధపడుతున్న; మనంబుతోడన్= మనస్సుతో; ఆ+కాలమునందున్= ఆ సమయంలో; నీకున్= నీకు; వెసన్= వెంటనే; భ్రూనిపైకిన్= చెట్టుమీదికి; చనఁగాన్+వలయున్= వెళ్ళవలసి ఉంటుంది; నాకును= నాకు కూడా; అప్పుడు+అ= అప్పుడే; నా ఆలయమున్= నా నివాసాన్ని (బొరియను); చొరన్= చేరుకొనటానికి; సమయము= తగిన కాలం; కాన= కాబట్టి; ఆ+తఱిన్= అదే సమయంలో; మేలు= ఉపకారాన్ని; ఒనరింతున్= చేస్తాను; నమ్ముము= విశ్వాసం ఉంచుము; ఇది; నిక్కము= నిజంగా; కర్జము= చేయదగిన పని (అని); నీవు; ఎఱుంగవే?= నీకు తెలియదా?

**తాత్పర్యం:** మాలవాడి రాకను చూచి నీవు వణికిపోతూ చెట్టుపైకి పోతావు. అదే సమయంలో నేను కలుగులోకి పోతాను. అదుగో అపుడే నీకు ఉపకారం చేస్తాను. ఇదే నిజానికి చేయదగిన పని. నీకు తెలియనిది కాదు కదా!'

**క.** **అనవుడు నట్లేల తలఁప వినుము భవత్త్రాణరక్ష వెసఁ జేసితి నే**
**ననఘా! నీవును నమ్మెయి నను నాపదఁ బాపవలదె నమ్మి రయమునన్.** **216**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; అనఘా!= ఓ పుణ్యవంతుడా!; అట్లు= ఆ విధంగా; తలఁపన్+ఏల?= అనుకోవటం ఎందుకు?; వినుము= విను; నేన్= నేను; భవత్= నీ యొక్క; ప్రాణరక్ష= ప్రాణాలను కాపాడటం; వెసన్+చేసితిన్= వేగిరపడి చేశాను; నీవును= నీవు కూడా; ఆ+మెయిన్= అట్లాగే ననున్= నన్ను; నమ్మి= విశ్వసించి; రయమునన్= తొందరగా; ఆపదన్= విపత్తును; పాపవలదె?= తొలగించవద్దా!

**తాత్పర్యం:** ఎలుకతో పిల్లి ఇట్లా బదులు పలికింది. 'ఓ పుణ్యాత్ముడా! అట్లా ఎందుకు ఆలోచిస్తావు. నేను నీ ప్రాణాలను వెంటనే కాపాడాను కదా! నీవూ అట్లాగే నా మీద నమ్మకంతో చప్పున ఆపదను గట్టెక్కించవద్దా'.

**ఆ. అనినఁ బిల్లి కిట్టులను నెల్క 'వేగిర । పడకు; ముచితకాలభావ్య మైన**
**యత్నవిధి గదా సమగ్ర ఫలత్వంబు । నొందు; నొండు దలఁప కూరకుండు.' 217**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగానే; పిల్లికిన్= పిల్లికి; ఎల్క= ఎలుక; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నది; వేగిరపడకుము= తొందరపడకుము; ఉచితకాల= తగిన సమయంలో; భావ్యము+ఐన= ఉచితమయిన; యత్నవిధి+కదా= ప్రయత్నం తీరు కదా; సమగ్ర ఫలత్వంబున్= సంపూర్ణ ఫలసిద్ధిని; ఒందున్= పొందుతుంది; ఒండు= మరొకటి; తలఁపక= తలపోయక; ఊరక+ఉండు= మిన్నకుండుము.

**తాత్పర్యం:** తొందరపడవద్దు. 'సరైన తరుణంలో చేసిన ప్రయత్నమే సంపూర్ణంగా సఫలమవుతుంది. మరొకటి ఆలోచించకుండా ఊరుకొమ్ము'.

**వ. అని యి ట్లపప్పలితుండును రోమశుండును నొండొరులతో మాటలాడుచుండ వేకువ యయ్యెఁ; నట్టి యెడ. 218**

**ప్రతిపదార్థం:** అని యిట్లు= అని ఈ విధంగా; ఆ+పలితుండును= ఆ ఎలుకా; రోమశుండును= ఆ పిల్లీ; ఒండొరులతోన్= ఒకళ్ళతో ఒకళ్ళు; మాటలు+ఆడుచున్+ఉండన్= మాట్లాడుకొంటూ ఉండగా; వేకువ+అయ్యెన్= తెల్లవారింది; అట్టి యెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఇట్లా ఎలుకకు పిల్లికి సంవాదం కొనసాగుతుండగానే తెల్లవారింది. అపుడు.

**క. తనతోఁ గొందఱు గుక్కలఁ । గొని యేతేరంగఁ గేలఁ గ్రూర కృపాణం**
**బును భీకరభంగిగ వెసఁ । జనుదెంచెన్ మాలఁ డధికసంరంభమునన్. 219**

**ప్రతిపదార్థం:** తనతోన్= తనతోపాటు; కొందఱు= కొంతమంది వేటగాళ్ళు; కుక్కలన్ కొని= వేటకుక్కలను తీసికొని; ఏతేరంగన్= రాగా; కేలన్= చేతిలో; క్రూరకృపాణంబును= పదునుగల కత్తి; భీకరభంగిగన్= భయం గొలిపేటట్లుండగా; మాలఁడు= మాలవాడు; అధిక సంరంభమునన్= ఎంతో అడావుడిగా; వెసన్= వేగంగా; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** కొంతమంది వేటగాళ్ళు వేటకుక్కలను వెంట తీసుకొని తనతోరాగా మాలవాడు చేత కరకు కత్తి పట్టుకొని భయం పుట్టేటట్లు తొందరతొందరగా ఎంతో ఆటోపంగా వచ్చాడు.

**ఆ. పరిఘునాముఁ డైన పాపాత్ముఁ । గని భయ మడరఁ బిల్లి యిట్టు లనియె**
**'నేమి సేయువాఁడ? నిదె వచ్చె జముదూత । వోలె సత్వరముగ మాలవాఁడు. 220**

**ప్రతిపదార్థం:** పరిఘ నాముఁడు+ఐన= పరిఘుడనే పేరుగల; పాపాత్మున్= పాపిష్ఠిని; కని= చూచి; భయము+అడరన్= భీతి ఎక్కువ కాగా; పిల్లి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నది; ఇంకన్= ఇంకా; ఏమిచేయువాఁడన్= ఏంచేసేది; జముదూత+పోలెన్= యముడి బంటువలె; మాలవాఁడు; సత్వరముగన్= వేగిరంగా; ఇదె వచ్చెన్= ఇదుగో వస్తున్నాడు.

**తాత్పర్యం:** ఆతడిపేరు పరిఘుడు. ఈ పాపిష్ఠిని చూచిన పిల్లి 'యమకింకరుడివలె మాలవాడు ఇటే గబగబా వస్తున్నాడు. ఇంక నేను ఏం చేసేది?' అని మరింత భయపడసాగింది.

**క. అనిన విని 'యోడ కోడకు'। మనుచుం దెగఁ గొఱికె వేగ మయ్యురిఁ బలితుం**
**డనయముఁ జకితాత్ముండై। చనియెన్ రోమశుఁడు నవనిజముపైకి వెసన్. 221**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగానే విన్నవాడై; పలితుండు= ఆ ఎలుక; ఓడకు+ఓడకుము; అనుచున్= భయపడకుము భయపడకుము అంటూ; ఆ+ఉరిన్= ఆ ఉచ్చును; వేగము= చకచక; తెగన్ కొఱికెన్= తుక్కుతుక్కుగా తెగిపోయేటట్లు కొరికింది; రోమశుడు= పిల్లి; అనయమున్= ఎంతో; చకిత+ఆత్ముండు+ఐ= కలవరపడ్డదై; అవనిజముపైకిన్= చెట్టుమీదికి; వెసన్= వడివడిగా; చనియెన్= పోయింది.

**తాత్పర్యం:** ఎలుక అదంతావిన్నది. భయపడకుమని పిల్లితో చెప్పి చకచక ఉచ్చులు కొరికి తెంపేసింది. కలవరపడ్డ మనస్సుతో పిల్లి చకచక చెట్టుమీదకు ఎక్కింది.

**చ. ఎలుకయు బొక్కలోపలికి నేఁగి ముదంబునఁ బొంచి చూడ సం**
**కులముగ నేఁగుదెంచి పరిఘుం డురి నుగ్గగు టెల్లఁ జూచి ని**
**ష్ఫలతకుఁ జిత్తమెంతయు విషాదము వొందఁగఁ బోయెఁ; బిల్లి య**
**య్యెలుకకు నిట్లనుం జెవికి నింపగు రీతి నుదాత్త భంగిగన్. 222**

**ప్రతిపదార్థం:** ఎలుకయున్= ఎలుకా; బొక్కలోపలికిన్= కలుగులోకి; ఏఁగి= వెళ్ళి; ముదంబునన్= సంతోషంగా; పొంచిచూడన్= దాగి ఉండి చూస్తుండగా; పరిఘుండు= ఆ మాలవాడు; సంకులముగన్= సందడిగా; ఏఁగుదెంచి= వచ్చి; ఉరి= ఉచ్చు; ఎల్లన్+నుగ్గగుటన్+చూచి= అంతా నజ్జు నజ్జు కావటం చూచి; నిష్ఫలతకున్= ప్రయోజనంలేకపోవటానికి; చిత్తము= మనస్సు; ఎంతయున్= ఎంతో; విషాదము+పొందఁగన్= దుఃఖాన్ని పొందగా; పోయెన్= వెళ్ళిపోయాడు; పిల్లి; ఆ+ఎలుకకున్= ఆ ఎలుకతో; చెవికిన్ ఇంపగు రీతిన్= వినటానికి తియ్యగా ; ఉదాత్తభంగిగన్= గౌరవభావంతో; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఎలుక కలుగులోకి దూరి సంతోషపడుతూ తొంగిచూస్తుండగా పరిఘుడు ఎంతో సందడిచేస్తూ వచ్చాడు. ఉచ్చులన్నీ నుగ్గునుగ్గయి ఉండటం చూచాడు. ఫలం దక్కలేదని ఎంతో బాధపడ్డాడు. వెనుతిరిగి వెళ్ళాడు. అపుడు ఎలుకతో పిల్లి చెవి కింపైన మాటలను ఎంతో గౌరవభావంతో ఇట్లా మాట్లాడింది.

**ఆ. 'మేలుసేసి తగిన మిత్త్రునిఁ బడసి త। త్సుచరితముల వచ్చు సుఖము లనుభ**
**వింపఁ జూచుటుడిగి వేర్పడి యుండుట। యరయ నీతివిదుల తెరువుగాదు. 223**

**ప్రతిపదార్థం:** మేలు+చేసి= ఉపకారం చేసి; తగిన= తగ్గ; మిత్రునిన్+పడసి= స్నేహితుడిని పొంది; తద్ సుచరితములన్= ఆతడి మంచి నడవడికలచేత; వచ్చు సుఖములు= కలిగే సౌఖ్యాలు; అనుభవింపన్+చూచుట= సుఖించటం; ఉడిగి= మాని; వేర్పడి+ఉండుట= విడివడి ఉండటం; అరయన్= విచారించగా; నీతి విదుల= నీతి శాస్త్ర వేత్తల; తెరువు+కాదు= పద్ధతి కాదు.

**తాత్పర్యం:** 'మంచి ఉపకారం చేసి మంచి మిత్రుడిని సంపాదించుకొని అతడి నడతలవలన కలిగే సౌఖ్యాలు అనుభవించకుండా వేరువేరుగా ఉండటం నీతివేత్తల పద్ధతి కాదు.

**చ. అనఘ! భయంబు నొందు టిది యారయ బేలఁదనంబు; నెమ్మిమై**
**మును నను నమ్మి చెంది భయమోక్షణముం గని నాకుఁ జాల మే**
**లొనరఁగ జేసి తీవు; దుది నుల్లమునం దగ విశ్వసింప కి**
**ట్లునికి సుఖంబె? నాదుసిరి కుక్తుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితోన్. 224**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాప రహితుడా!; భయంబున్= భయాన్ని; ఒందుట= పొందటం; ఇది; ఆరయన్= విచారించగా; బేలఁదనంబు= పిరికితనం; నెమ్మిమైన్= సంతోషంతో; మును= మునుపు; ననున్ నమ్మి= నన్ను నమ్ముకొని; చెంది= చేరి; భయమోక్షణమున్+కని= భయవిమోచనాన్ని పొంది; ఈవు= నీవు; నాకున్= నాకు; చాల మేలు= ఎంతో ఉపకారాన్ని; ఒనరఁగన్= తగ్గట్టుగా; చేసితి= చేశావు; తుదిన్= చివరకు; ఉల్లమునన్= మనస్సునందు; తగన్= ఒప్పేటట్లు; విశ్వసింపక= నమ్మక; ఇట్లు+ఉనికి= ఇట్లా ఉండటం; సుఖంబె?= సంతోషమా?; నాదు సిరికిన్= నా కలిమికి; ఉక్తుఁడవు= తగినవాడివి, యోగ్యుడవు; అయ్యెదు= అవుతావు; ప్రీతితోన్= ప్రేమతో; రమ్ము= రావలసింది.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! భయం కలగటం అనేది ఆలోచిస్తే అది పిరికితనమే. సంతోషంగా ముందు నన్ను నమ్మి భయాన్ని పోగొట్టుకొని నాకు మేలు చేశావు. చివరకు నన్ను నమ్మకపోవటం సంతోషమేనా? నీవే నాకలిమిని అనుభవించదగ్గవాడవు. ప్రీతితో రమ్ము.

**క. బలవంతు లైన చుట్టం। బులు నేనును నీకు మేలు వొనరింపఁగ ని**
**మ్ముల మనుట యొప్పదే? ననుఁ। గలిసి మెలఁగు; విడువు శంకఁ; గను మభిమతముల్.' 225**

**ప్రతిపదార్థం:** బలవంతులు+ఐన= ప్రబలులైన (ప్రసిద్ధులైన); చుట్టంబులు= బంధువులు; నేనును= నేనుకూడా; నీకున్= నీకు; మేలు= ఉపకారం; ఒనరింపఁగన్= అందించగా; ఇమ్ములన్= చక్కగా; మనుట= బతకటం; ఒప్పదే= తగదా; ననున్= నన్ను; కలిసి= కూడి; మెలఁగు= మసలుకొమ్ము; శంకన్= సంశయాన్ని; విడువు= వదలుకొమ్ము; అభిమతముల్= ఇష్టమైనవి; కనుము= పొందుము.

**తాత్పర్యం:** బలవంతులైన చుట్టాలూ నేనూ నీకు మంచి చేస్తాం. నాతో కలిసి మెలసి ఉండుము. చక్కగా బ్రదుకుదాం. సందేహించకుము. నీ కోరికలన్నీ తీర్చుకొమ్ము'.

**వ. అనిన విని యప్పలితుండు రోమశునితో 'నీ పలుకు లుచితంబులు; నా మాటలు విను' మని యిట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని; ఆ+పలితుండు= పలితుడనే ఆ ఎలుక; రోమశునితోన్= పిల్లితో; నీ పలుకులు= నీ మాటలు; ఉచితంబులు= న్యాయమైనవే; నా మాటలు= నా వచనాలు; వినుము+అని= ఆలకించుమని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఎలుక పిల్లితో 'నీ వాక్కులు ఉచితమైనవే. నా మాటలు కూడా వినుము' అన్నది.

**చ. అరులను మిత్త్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకృత్య మ**
**వ్వెర వతి దుర్లభం; బరులు వీ రన నుండియు మిత్త్రభావముం**
**బొరయుటయున్ సుహృజ్జనుల పోలికి గల్గియు శత్రుతాగుణ**
**స్ఫురణ యొకప్డు సూపుటయుఁ జాతుము గాదె ధరిత్రి నెల్లెడన్. 227**

**ప్రతిపదార్థం:** అరులను= పగవాళ్ళను; మిత్రులన్= స్నేహితులను; తెలియన్+ఆరయుట= స్పష్టంగా కనుక్కొనటం; ఎంతయున్= ఎంతో; సూక్ష్మకృత్యము= అతి సూక్ష్మం అయినపని; ఆ+వెరవు= ఆ ఉపాయం; అతిదుర్లభంబు= పొందటం ఎంతో కష్టం; అరులు= పగవాళ్ళు; వీరు+అనన్+ఉండియున్= వీరే అనదగి ఉన్నా; మిత్రభావమున్= స్నేహాన్ని; పొరయుటయున్= పొందటమూ; సుహృద్ జనుల పోలికి+కల్గియున్= మిత్రులవలె ఉంటూ; శత్రుతాగుణ= పగవాడనే భావం; స్ఫురణమున్= తోచటమున్నూ; ఒకప్డు= ఎపుడైనా; చూపుటయున్= ప్రదర్శించటమున్నూ; ధరిత్రిన్= నేలమీద (లోకంలో); ఎల్ల+ఎడన్= అంతటా; చూతుము+కాదె!= చూస్తున్నాం కదా!

**తాత్పర్యం:** 'వీడు పగవాడు, వీడు నేస్తగాడని తెలిసికొనటం సూక్ష్మమైన విషయమే. ఆ నేర్పు అందరికీ లభించదు. శత్రువులు అనుకొన్నవారు మిత్రులవటం, మిత్రులనుకొన్నవారు శత్రువులవటం లోకంలో అంతటా చూస్తున్నాం కదా!

**వ.** **కావున నిన్నుఁ బెద్ద గదియుట గర్జంబు గాదు; నీవును మద్వశగతిం బొందుటఁ జూచితేనియు నేమఱంజన; దెట్లంటేని.** **228**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నిన్నున్= నీ గురించి; పెద్ద+కదియుట= మరింత చేరువ అవటం; కర్జంబు కాదు= తగిన పని కాదు; నీవును= నీవు కూడా; మత్+వశగతిన్+పొందుట= నాకు వశమై ఉండటం; చూచితేనియున్= చూస్తే; ఏమఱన్+చనదు= అజాగ్రత్తగా ఉండటం తగదు; ఎట్లంటేని= ఎట్లాగంటే.

**తాత్పర్యం:** కాబట్టి నిన్ను చేరటం తగదు. నీవు నాకు లోబడి ఉండటం చూచి పరాకుపడటం కూడదు.

**క.** **బలవద్రిపులు ప్రయోజన । ములకై లోఁబడుట గల్గుఁ బొలముల నేనుం**
**గులు దీమంబుల పజ్జఁ ద । గిలి నెట్టన పట్టువడిన క్రియఁ జతురమతీ!** **229**

**ప్రతిపదార్థం:** చతురమతీ!= బుద్ధిమంతుడా!; పొలములన్= అడవులలో; ఏనుంగులు= ఏనుగులు; దీమంబుల పజ్జన్= వేటగాళ్ళు మచ్చిక చేసి ఉంచిన పశువుల వెంటపడి; తగిలి= చిక్కి; నెట్టన= వెంటనే; పట్టువడిన క్రియన్= దొరికిపోయినట్లు; బలవత్+రిపులు= బలవంతులైన శత్రువులు; ప్రయోజనములకున్+ఐ= స్వార్థం కొరకు; లోఁబడుట= వశమవటం; కల్గున్= జరుగుతుంది.

**తాత్పర్యం:** అడవులలో ఏనుగులు వాటిని పట్టుకొనటంకొరకు ఉంచిన ఎరలవలన చిక్కుకొని లొంగినట్లు పగవాళ్ళు తమ స్వార్థం కొద్దీ లోబడుతుంటారు.

**చ.** **అరియెడ మిత్రభావ మొక యప్పుడు కార్యము పొంటెఁ గల్గిన**
**న్వెరవునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివాతికిం**
**గరము దొలంగఁ జేయునరు కర్జము వట్టి చరించుటొప్పదే!**
**పొరుగున నుండి నీకు హితముం దగఁ జేసెద నెప్డు పంచినన్.** **230**

**ప్రతిపదార్థం:** కార్యము పొంటెన్= అవసరాల కొరకు; అరిఎడన్= పగవాళ్ళపట్ల; ఒక+అప్పుడు= ఒకసారి; మిత్రభావము= మిత్రుడనే భావం; కల్గినన్= కలుగగా; పామున్ పట్టు+ఎడన్= పామును పట్టుకొనేటప్పుడు; నిక్కము= నిజంగా; నమ్మక= నమ్మకం లేకుండానే; దాని వాతికిన్= దాని నోటికి; కరము= చేయి; తొలంగన్+చేయు= తీసివేసే; నరుకర్జము+పట్టి= మనుష్యుడి పనిననుసరించి; వెరవునన్= ఉపాయంతో; చరించుట= మెలగటం; ఒప్పదే?= తగదా?; పొరుగునన్= ఇరుగున (ప్రక్కన); ఉండి; ఎపుడు పంచినన్= ఎపుడు కోరినా; నీకున్= నీకు; హితమున్= మేలును; తగన్= ఒప్పిదంగా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** అవసరాన్నిబట్టి ఒకొక్కప్పుడు శత్రువు మిత్రుడుగా అనిపించవచ్చును. పామును పట్టుకొనేటప్పుడు దానిని నమ్మక దాని నోటినుండి చేయిని తొలగించే మనిషివలె ఉపాయంతో ఉండాలి. నీవు ఎప్పుడు కోరితే అపుడు నీ ప్రక్కనే ఉండి నీకు మేలు చేస్తాను.

**మ.** **విను! నీ కామిష మేను; నీ యెడఁ గడున్ విశ్వాసముం బూని చే**
**రిన నీ చిత్త మొకప్పు డుద్ధతవికారీభూతమై దుర్వినో**
**దనహింసారుచి నొందు; నీ సుతసుహృద్బంధువ్రజంబేని మున్**
**ననుఁ గన్నన్ వహియింప దాత్మఁ గరుణ; న్మన్నింపు మి ట్లుండెదన్.** **231**

**ప్రతిపదార్థం:** విను= వినుము; ఏను= నేను; నీకున్= నీకు; ఆమిషము= మాంసాహారాన్ని; నీ+ఎడన్= నీ పట్ల; కడున్+విశ్వాసమున్= ఎక్కువ నమ్మకాన్ని; పూని= పొంది; చేరినన్= చేరువగా ఉన్నట్లయితే; ఒకప్పుడు= ఎప్పుడైనా; నీ చిత్తము= నీ మనస్సు; ఉద్ధత= బయటపడ్డ; వికారీ భూతమై= మార్పు చెందినదై; దుర్వినోదన= చెడ్డ ఆట అనే; హింసా= హింసయందు; రుచిన్= కోరికను; ఒందున్= పొందుతుంది; నీ సుత= నీ కొడుకుల; సుహృద్= నీ మిత్రుల; బంధు= నీ చుట్టాల; వ్రజంబు+ఏనిన్= సమూహమైనా; మున్= ముందే; ననున్+కన్నన్= నన్ను చూస్తే; సహియింపదు= ఓర్వలేదు; ఆత్మన్= మనస్సులో; కరుణన్= జాలితో; మన్నింపుము= అనుగ్రహించు; ఇట్లు= ఇపు డున్నట్లే; ఉండెదను= ఉంటాను.

**తాత్పర్యం:** నేను నీకు మాంసాహారాన్ని. నిన్ను నమ్ముకొని నీతో చేరితే ఎపుడో ఒకప్పుడైనా నీ మనస్సు మారవచ్చును. నాపై హింసాభావం కలగవచ్చును. నీ కొడుకులూ నీ స్నేహితులూ చుట్టాలూ నన్ను చూచి ఓర్చుకొనలేకపోవచ్చును. కాబట్టి నామీద కరుణ చూపి, ఆత్మలో మన్నించుము. నేనిట్లాగే ఉంటాను.'

**వ.** **అని యంత నిలువక.** **232**

**తాత్పర్యం:** అని పలికి, అంతటితో ఆగక - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **'బలుపుటురిఁ జిక్కి పేరా । కలితో రేయెల్ల నున్నకతమున నీకుం**
**జలిది వలసి పిలిచెద; విటు । వలయునె? నీ పలుకు నమ్మి వత్తునె చేరన్?'** **233**

**ప్రతిపదార్థం:** బలుపుటురిన్= గట్టి ఉచ్చుల్లో; చిక్కి= చిక్కుకొని; పేరాఁకలితోన్= నకనకలాడే ఆకలితో; రేయి+ఎల్లన్= రాత్రంతా; ఉన్న కతమునన్= ఉన్న కారణంచేత; నీకున్= నీకు; చలిది= చద్ది బువ్వ; వలసి= కావలసి; పిలిచెదవు= పిలుస్తున్నావు; ఇటు+వలయునె?= ఇది నీకు తగినదేనా?; నీ పలుకు= నీ మాట; నమ్మి= నమ్ముకొని; చేరన్ వత్తునె?= దరి చేరుతానా?

**తాత్పర్యం:** 'రాత్రల్లా గట్టి ఉచ్చులో చిక్కుకొని నకనకలాడుతున్నావు. నీకు చద్దితిండి అవసరమై పిలుస్తున్నావు. ఇది నీకు తగునా? నీ మాట నమ్మి నీ దగ్గరకు వస్తానా?'

**ఆ.** **అనుడు 'నిట్టు దలఁప నగునె మత్ప్రాణ ర । క్షకుఁడ వైన నిన్ను శత్రుఁ గాఁగఁ**
**దలఁతునే? కృతజ్ఞతయుఁ బౌరుషంబును । గలుగ నేను వెఱవ వలవ దనఘ!'** **234**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; అనఘ!= పవిత్రుడా!; ఇట్లు= ఈ విధంగా; తలఁపన్+అగునె?= ఆలోచించటం తగునా?; కృతజ్ఞతయున్= చేసిన మేలు మరచిపోకుండటం; పౌరుషంబును కలుగన్= మగతనం కలిగి ఉండగా; ఏను= నేను; మత్ప్రాణ రక్షకుఁడవు+ఐన= నా ప్రాణాన్ని కాపాడిన; నిన్నున్= నిన్ను; శత్రున్+కాఁగన్= పగవాడిగా; తలఁతునే?= భావిస్తానా?; వెఱవ వలదు= భయపడవద్దు.

**తాత్పర్యం:** అనగానే పిల్లి 'ఓ పాపరహితుడా! ఈ విధంగా ఆలోచించటం తగదు. నీవు చేసిన మేలును మరిచిపోయేవాడిని కాను నేను. పౌరుషం కృతజ్ఞతా కలిగిన వాడిని. నా ప్రాణాన్ని కాపాడిన నిన్ను విరోధిగా భావిస్తానా? భయపడకుము'.

**వ. అనిన రోమశునకుఁ బలితుం డిట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; రోమశునకున్= పిల్లికి; పలితుండు= ఎలుక; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అది విన్న ఎలుక పిల్లితో ఈ విధంగా అంది.

**క. నీ వలన నేను బ్రదికితి; । నీవును నాకతన మాలనికి నగపడవై;**
**తీ విధమునఁ గల్గు సుహృ । ద్భావము చాలు; నినుఁ జేరఁ దగ దిట మీఁదన్. 236**

**ప్రతిపదార్థం:** నీ వలనన్= నీవలన; ఏను= నేను; బ్రదికితిన్= ఉసురుతో ఉన్నాను; నీవును= నీవు కూడా; నాకతనన్= నా మూలంగా; మాలనికిన్= మాలవాడికి; అగపడవు+ఐతి(వి)= కంటబడకపోతివి; ఈ విధమునన్= ఈ రీతిగా; కల్గు= పొందిన; సుహృద్భావము= మైత్రి; చాలున్= చాలు; ఇటమీఁదన్= ఇక మీదట; నినున్= నిన్ను; చేరన్+తగదు= సమీపించటం ఒప్పదు.

**తాత్పర్యం:** 'నీ వలన నేనూ బ్రతికాను. నా వలన నీవూ మాలవాడి కంటబడలేదు. ఈ పాటి స్నేహం చాలును. ఇక ముందు నీ దగ్గరకు రాకూడదు.

**వ. ఇవ్విధంబునకు శుక్రవాక్యంబులుం గల; వాకర్ణింపుము. 237**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునకున్= ఈ పద్ధతికి; శుక్రవాక్యంబులున్= శుక్రాచార్యుడి వచనాలు; కలవు= ఉన్నాయి; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఈ విధానానికి శుక్రవాక్యాలు ఉన్నాయి. వినుము.

**క. బలవంతుఁ డైన శత్రుని । వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమిఁ దాఁ**
**గలిసియు నది గడచనఁగాఁ । దొలఁగ వలయు; నమ్మెనేనిఁ దుదిఁ గీడొలయున్. 238**

**ప్రతిపదార్థం:** బలవంతుఁడు+ఐన= మంచి సత్తువగల; శత్రునివలనన్= పగవాడివలన; ప్రయోజనము= లాభం; కలిగి= ఉండి; వలను కలిమిన్= ఆనుకూల్యం కలిగి ఉండటం వలన; తాన్+కలిసియున్= తను కలిసి ఉన్నా; అది కడచనఁగాన్= అది దాటి పోగానే; తొలఁగవలయున్= తప్పుకొనాలి; నమ్మెన్+ఏనిన్= నమ్మితే; తుదిన్= చిట్టచివరకు; కీడు= విపత్తును; ఒలయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** బలవంతుడైన శత్రువుతో అవసరం కొద్దీ స్నేహం చేసినా ఆ అవసరం తీరగానే అతడి స్నేహాన్ని వదలుకొనాలి. ఒకవేళ నమ్మితే కడకు ఆపద పాలవక తప్పదు.

**ఆ. నమ్మఁ దగనివారి నమ్మక యున్నది, । తగిన వారి నైనఁ దద్ద నమ్మి**
**యుండఁ దగదు; తన్ను నొరులు నమ్మెడు నట్ల । యుండి యొరుల నమ్మకునికి నీతి. 239**

**ప్రతిపదార్థం:** నమ్మన్ తగనివారిన్= నమ్మకూడని వారిని; నమ్మక+ఉన్నది= నమ్మకుండా ఉండాలి; తగినవారిని+ఐనన్= నమ్మదగ్గ వారినైనా; తద్ద= పెద్దగా; నమ్మి+ఉండన్ తగదు= నమ్మి ఉండకూడదు; తన్నున్= తనను; ఒరులు=

పరాయివాళ్ళు; నమ్మెడు+అట్ల= నమ్మేటట్లు; ఉండి; ఒరులన్= ఇతరులను; నమ్మక+ఉనికి= తాను నమ్మకుండా ఉండటం; నీతి= ధర్మం.

**తాత్పర్యం:** నమ్మతగని వాళ్ళను నమ్మనేకూడదు. నమ్మదగ్గవాళ్ళనైనా తగినంతగానే నమ్మాలి. ఇతరులు తనను నమ్మేటట్లు నడుచుకొంటూనే తాను వాళ్ళను నమ్మకపోవటం నీతి.

**వ. ఇట్టిద బ్రదుకుఁదెరు వగుటం జేసి. 240**

**ప్రతిపదార్థం:** ఇట్టిద= ఇట్లాంటిదే; బ్రదుకుఁదెరువు+అగుటన్+చేసి= జీవనోపాయం అవటం వలన.

**తాత్పర్యం:** ఇట్లాంటిదే బ్రతికే మార్గం అవటం వలన. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నినుబోంట్లను నమ్మక యే। నును బ్రదికెద; ననఘ! నీవునుం గని చండా**
**లుని యట్టివారి మాయలు। నినుఁ బొందక యుండ బ్రదుకు; నెఱిఁ బొ మ్మింకన్. 241**

**ప్రతిపదార్థం:** నిను బోంట్లను= నీ బోటివాళ్ళను; నమ్మక= విశ్వసించక; ఏనును= నేనూ; బ్రదికెదన్= జీవిస్తాను; అనఘ!= పాపం తాకనివాడా!; నీవునున్= నీవూ; కని= చూచి; చండాలుని అట్టివారి మాయలు= మాలవాడివంటి వాళ్ళ మోసాలు; నినున్+పొందక= నీకు కలుగకుండా; నెఱిన్= నిండుగా; బ్రదుకు= జీవించుము; ఇంకన్= ఇక; పొమ్ము= వెళ్ళుము.

**తాత్పర్యం:** నీవంటి వారిని నమ్మకుండానే నేనూ బ్రతుకుతాను. నీవు మాలవాడివంటి వారి మాయలలో పడకుండా నిండైన బ్రతుకు బ్రతుకుము. ఇక వెళ్ళుము'.

**క. అనిన విని సిగ్గుపడి తన। చనుచోటికిఁ జనియెఁ బిల్లి; సమ్మతిఁ బలితుం**
**డును వేఱొక తగులాఁగకుఁ। జని సముచిత వర్తనమున సౌఖ్యముఁ బొందెన్. 242**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; పిల్లి; సిగ్గుపడి= లజ్జపడి; తన చనుచోటికిన్= తానుండే తావుకు; సమ్మతిన్= అనుమతితో; చనియెన్= వెళ్ళినది; పలితుండును= ఎలుకా; వేఱొక= మరొక; తగులాఁగకున్= తగినట్టి కలుగులోకి; చని= దూరి; సముచిత వర్తనమునన్= యోగ్యమైన నడవడితో; సౌఖ్యమున్= సుఖాన్ని; పొందెన్= పొందింది.

**తాత్పర్యం:** అని ఎలుక అనగానే పిల్లి చాల సిగ్గుపడి, ఎలుక అనుమతి తీసికొని తన చోటుకు తాను పోయింది. ఎలుక కూడా మరొక కలుగులోకి దూరి తన చక్కని నడవడితో సౌఖ్యాన్ని పొందింది.

**క. బలు పగఱ వలని యాపద। దలఁగుటకును రిపుని హీనతరు నైనఁ దనుం**
**గలిపికొని బ్రదుకుటకు ని। య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెఁ దగన్.' 243**

**ప్రతిపదార్థం:** బలు పగఱవలని= బలంగల పగవారివలన కలిగే; ఆపద= విపత్తు; తొలఁగుటకును= తొలగటానికీ; హీన తరున్ రిపుని+ఐనన్= అల్పుడైన శత్రువునైనా; తనున్= తాను; కలిపికొని= చేర్చుకొని; బ్రదుకుటకున్= జీవించటానికి; ఈ ఎలుకయున్= ఈ ఎలుకా; పిల్లియును= పిల్లీ; తగన్= ఒప్పేటట్లు; వెరవులు= ఉపాయాలు; ఎఱిఁగించెన్= తెలిపాయి.

**తాత్పర్యం:** బలంగల శత్రువులవలన కలిగే ఆపదలను తొలగించుకొనటానికీ అల్పుడైన శత్రువునైనా తనతో కలుపుకొని జీవించటానికి తగిన ఉపాయాన్ని ఎలుకా పిల్లీ తెలిపాయి'.

**వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో 'నెవ్వనియెడ విశ్వసింపకున్నం జిత్తంబునకు విశ్రామంబు గల్గదు; విశ్వసించిన దురితంబులు దొడరు నట్లగుటంజేసి విశ్వసించుటయు విశ్వసింపకయుండుటయు నను రెంటిలోననుం బరమకర్తవ్యం బెయ్యదియో నిశ్చయింప నేర' ననుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె 'నీ యర్థంబు' దేటపఱుచునట్టి యితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 244**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; శాంతనవునితోన్= భీష్ముడితో; ఎవ్వనిఎడన్= ఎవడి పట్లనైనా; విశ్వసింపక+ఉన్నన్= నమ్మక ఉంటే; చిత్తంబునకున్= మనస్సుకు; విశ్రామంబు= ఊరట; కల్గదు= ప్రాప్తించదు; విశ్వసించినన్= నమ్మితే; దురితంబులు= పాపాలు; తొడరున్= కలుగుతాయి; అట్లు+అగుటన్+చేసి= అట్లా అవటంవలన; విశ్వసించుటయున్= నమ్మటం; విశ్వసింపక+ఉండుటయున్= నమ్మకపోవటం; అను రెంటిలోననున్= అనే రెంటిలోపలా; పరమ కర్తవ్యంబు= ఎక్కువ చేయతగ్గది; ఏ+అది+ఓ= ఏదో; నిశ్చయించనేరను= నిర్ణయించలేను; అనుటయున్= అనగానే; ఆ+మహీపతికిన్= ఆ ధర్మరాజుకు; ఆ+మహాత్ముండు= ఆ భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఈ అర్థంబున్= ఈ విధానాన్ని; తేటపఱుచు+అట్టి= తెల్లంజేసేటి; ఇతిహాసంబు= పూర్వ కథ; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగానే ధర్మరాజు ఇట్లా అడిగాడు. 'ఎవడినీ నమ్మకపోతే మనస్సుకు ఊరట కలుగదు. నమ్మితే పాపాలు సంభవిస్తాయి. నమ్మటం, నమ్మకపోవటం అనే రెంటిలో ఏది ముఖ్యంగా ఆచరించ తగ్గదో ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను' అనగానే భీష్ముడు 'ఈ విషయాన్ని తేటపరిచే కథ ఒకటి విను చెప్పుతాను' అన్నాడు.

### బ్రహ్మదత్తునితోఁ బూజని యను శకుని కైన సంవాద ప్రకారము (సం. 12-137-4, 5)

**సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిన నరపతి। నగరఁ బూజని యను నామ మొప్పఁ**
**జతురభాషిణి యొక్క శారిక వర్తించు। నది పిల్లఁ బెట్టి యింపారుపండ్లు**
**దెచ్చి యర్మిలి దాని కిచ్చుచో మేలేఱి। యధిపపుత్త్రున కిచ్చు; నందుఁ గొన్ని**
**వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ। జర్లాటమాడుచు సంచరించు;**

**ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లేకుండ న। ద్దారకుండు పిల్లతల నొగిల్చి**
**చంపె; దాని తల్లి సనుదెంచి కని మది। నిట్టులనియె శోక మెసక మెసఁగ. 245**

**ప్రతిపదార్థం:** బ్రహ్మదత్తుండు+అనన్= బ్రహ్మదత్తు డనే పేరుతో; పరఁగిన= ఒప్పేటటువంటి; నరపతి నగరన్= రాజు పట్నంలో; పూజని అనునామము= పూజని అనే పేరు; ఒప్పన్= ఒప్పుతుండగా; చతుర భాషిణి= ఇంపుగా మాట్లాడే; ఒక్క శారిక= ఒక గోరువంక; వర్తించున్= ఉండేది; అది= ఆ గోరువంక; పిల్లన్+పెట్టి= పిల్లను కని (పెట్టి); ఇంపారు పండ్లు= తీయటి పండ్లను; తెచ్చి= తీసికొనివచ్చి; అర్మిలిన్= ప్రేమతో; దానికిన్= తన పిల్లకు; ఇచ్చుచోన్= పెట్టేటప్పుడు; అందున్ కొన్ని= ఆ పళ్ళల్లో కొన్నింటిని; మేలు+ఏఱి= మంచివి ఎంచి; అధిప పుత్త్రునకున్= బ్రహ్మదత్తుడి కొడుకుకి; ఇచ్చున్= పెట్టుతూ ఉండేది; వాఁడును= ఆ రాజకుమారుడు; మచ్చికన్ వచ్చి= చనువుగా వచ్చి; ఆ పిల్లతోన్= ఆ గోరువంక పిల్లతో; చర్లాటము ఆడుచున్= విలాసంగా ఆడుతూ; సంచరించున్= తిరుగుతుండేవాడు; ఒక్కనాఁడు= ఒక రోజున; దాది= దాసి; ఒద్దలేకుండన్= దగ్గర లేనప్పుడు; ఆ+దారకుండు= ఆ పిల్లవాడు; పిల్ల తలన్= గోరువంక పిల్ల తలకాయను; నొగిల్చి= పగులగొట్టి; చంపెన్= ప్రాణాలు తీశాడు; దానితల్లి= ఆ పిల్ల తల్లి పూజని; చనుదెంచి= వచ్చి; కని= చూచి; మదిన్= మనసులో; శోకము= ఏడుపు; ఎసకమెసఁగన్= ఎక్కువ అవగా; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఒకప్పుడు బ్రహ్మదత్తు డనే రాజు ఉండేవాడు. అతడి పట్టణంలో పూజని అనే గోరువంక ఉండేది. అది మంచి మాటకారి. అది ఒక పిల్లను పెట్టింది. ఆ పిల్లకు ప్రతిదినం తీయటి పళ్ళను తెచ్చి పెట్టేది. వాటిల్లో మంచివి ఎంచి రాజుకొడుకుకీ పెట్టేది. వాడూ ఆ పిల్లను మచ్చిక చేసికొని ఆడుకొనేవాడు. ఒకనాడు ఆ పిల్లవాడు దాది దగ్గరలేనప్పుడు ఆ పిట్ట పిల్ల తలను పగులగొట్టి చంపాడు. కాసేపటికి ఆ పిల్ల తల్లి పూజని వచ్చి చూచి విలవిలలాడింది. పెద్దపెట్టున వాపోతూ ఇట్లా అన్నది.

**తే.** **'అకట! కూడి మెలంగి యే మొకటి యైన । నర్థి నిదియును దానును ననుభవించుఁ**
**బట్టి యాడుచునుండు నిప్పాపజాతి । పడుచు సంపునె యిటు దీని మిడుకమిడుక. 246**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; కూడి మెలంగి= కలసి తిరిగి; ఏమి+ఒక్కటి+ఐనన్= ఏ వస్తువు ఒక్కటిపెట్టినా; అర్థిన్= కోరికచేత; ఇదియును= ఈ గోరువంక పిల్లా; తానునున్= తానూ (రాచబిడ్డా); అనుభవించున్= తింటూ ఉండేవాళ్ళు; పట్టి= పట్టుకొని; ఆడుచున్+ఉండున్= ఆటలాడుతూ ఉండేవాడు; ఈ+పాపజాతిపడుచు= పాపం చేసే రాచకులానికి చెందిన ఈ పిల్లవాడు; దీనిన్= ఈ నా పిల్లను; మిడుక మిడుకన్= సంచరిస్తుండగా; ఇటు+చంపునె?= ఇట్లా చంపుతాడా?

**తాత్పర్యం:** 'అయ్యో! నా పిల్లా, ఆ రాచబిడ్డా కలసి మెలసి తిరిగేవాళ్ళు. ఏది పెట్టినా అరమరికలు లేకుండా తినేవాళ్ళు. ఆడుకొనేవాళ్ళు. అయినా ఈ పాపి నా పిల్లను పొట్టనపెట్టుకున్నాడు.

**ఆ.** **రాచకొడుకుగాఁడె రాచవారికి నేటి । పరిచయంబు వేగ కరుణ విడుచు**
**హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా । త్రములె సమదమతులు క్రౌర్యరతులు.' 247**

**ప్రతిపదార్థం:** రాచకొడుకు+కాఁడె= రాజుకొడుకు గదా; రాచవారికిన్= రాజులకు; పరిచయంబులు= స్నేహం; ఏటి= ఎట్లాంటిది; వేగన్= తొందరగా; కరుణన్= జాలిని; విడుచున్= వదలుతారు; హితవు= మేలును; మఱచున్= మరచినట్టి; సమదమతులు= గర్వపోతులు; క్రౌర్యరతులు= కఠినాత్ములు (అయిన); రాజులు; ఎందును= ఎపుడూ; నమ్మికకున్= నమ్మటానికి; పాత్రములె!= తగినవారా!

**తాత్పర్యం:** రాచబిడ్డ కదా! రాజులకు స్నేహం ఎక్కడిది? వాళ్ళకు జాలి ఉండదు. చేసిన మేలు మరచిపోతారు. గర్వపోతులు. కఠినులు, నమ్మదగ్గవారు కారు.

**వ.** **అని నిందించి. 248**

**తాత్పర్యం:** అని దూషించి - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **ఈ పగ దీర్చెద నంచుం । గోపంబున రాజు కొడుకు గ్రుడ్డులు రెండుం**
**బోపడునట్లుగ గోళ్ళన్ । వే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. 249**

**ప్రతిపదార్థం:** ఈ పగ= ఈ కచ్చను; తీర్చెదను+అంచున్= తీర్చుకొంటాను అంటూ; కోపంబునన్= కోపంతో; రాజుకొడుకు= రాజకుమారుడి; గ్రుడ్డులు= కంటి గుడ్లు; రెండున్= రెండూ; పోపడునట్లుగన్= పోయేటట్లు; గోళ్ళన్= గోళ్ళతో; వే పెఱికి= చప్పున ఊడబీకి; రయమునన్= వేగంగా; గగనవీథికిన్= ఆకాశంలోకి; ఎగసెన్= ఎగిరిపోయింది.

**తాత్పర్యం:** ఈ పగను తీర్చుకొంటాను' అంటూ ఆ గోరువంక తన గోళ్ళతో రాజకుమారుడి రెండు కళ్ళూ ఊడబెరికింది. ఎంతో వేగంగా ఆకాశంలోకి ఎగిరిపోయింది.

**వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుండు విన నిట్లనియె. 250**

**ప్రతిపదార్థం:** ఎగసి= ఎగిరి; ఆ+చోటన్= ఆకాశంలో; నిలిచి= ఉండి; బ్రహ్మదత్తుండు= బ్రహ్మదత్తుడు; వినన్= వినేటట్లు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఆకాశంలోకి ఎగిరి అక్కడినుండి బ్రహ్మదత్తుడు వినేటట్లు ఈ విధంగా పలికింది.

**క. 'చేసె నఘము; దత్ఫలముం । జేసేతం గుడిచెఁ గాని శిశువు నెడన్ నా**
**చేసిన క్రౌర్యము లే; దేఁ । జేసితి మాఁ; ఒండు గీడు సెందదు నన్నున్.' 251**

**ప్రతిపదార్థం:** (నీ బిడ్డ) అఘము= పాపం; చేసెన్= చేశాడు; తత్ఫలమున్= ఆ పాప ఫలాన్ని; చేసేతన్= స్వయంగా; కుడిచెన్= అనుభవించాడు; కాని= అంతేకాని; శిశువు+ఎడన్= పిల్లవాడి పట్ల; నా చేసిన= నేను కోరి చేసిన; క్రౌర్యము లేదు= క్రూరత్వం లేదు; ఏన్= నేను; మాఱు= నా బిడ్డను చంపినందుకు బదులుగా; చేసితిన్= చేశాను; ఒండు కీడు= మరే పాపం; నన్నున్ చెందదు= నన్ను పొందదు.

**తాత్పర్యం:** 'రాజా! నీ బిడ్డ నా బిడ్డను చేజేతులా చంపివేశాడు. దాని ఫలితంగానే కళ్ళు పోగొట్టుకున్నాడు. అంతేకాని నీ కొడుకు పట్ల నేను ఏమీ క్రూరంగా నడచుకొనలేదు. చేసిన దానికి ప్రతీకారం చేశాను. నన్ను ఏ పాపం అంటదు'.

**చ. అనవుడు బ్రహ్మదత్తుఁ 'డది యట్టిద; నీ దెసఁ గీడు లేదు; నీ**
**చనుటకు నా మనం బతివిషాదముఁ బొందెడుఁ; దొంటి యట్ల నె**
**మ్మిన నిలు 'మన్నఁ బూజని' శమించునె యొండొరుచేతఁ బడ్డ యీ**
**పెనుపగ నొంచి మాటపస బేల్పడి క్రమ్మఱఁ జేరు టొప్పునే?' 252**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; బ్రహ్మదత్తుఁడు; అది= నీవు చెప్పింది; అట్టిద= అట్లాంటిదే; నీ దెసన్= నీవైపు; కీడు లేదు= పాపం లేదు; నీ చనుటకున్= నీవు వెళ్ళటానికి; నా మనంబు= నా మనస్సు; అతివిషాదమున్= ఎంతో దుఃఖాన్ని; ఒందెడున్= పొందుతున్నది; తొంటి+అట్ల= మునుపటివలెనే; నెమ్మిన్+అ= మిత్రభావంతోనే; నిలుము= ఉండుము; అన్నన్= అనగానే; పూజని= గోరువంక; ఒండొరు చేతన్= ఒకళ్ళ నొకళ్ళం; నొంచి= నొప్పించుకొని; పడ్డ= అనుభవించిన; ఈ+పెనుపగ= ఈ పెద్ద పగ పోతుందా; మాటపసన్= మాటలనేర్పుతో; బేల్పడి= మోసపోయి; క్రమ్మఱన్= తిరిగి; చేరుట= కలిసి ఉండటం; ఒప్పునే?= తగుతుందా?

**తాత్పర్యం:** అని పూజని చెప్పగానే రాజు 'నీవు అన్నది నిజమే ఈ విషయంగా నీ దోషం ఏమీ లేదు. కాని, నీవు వెళ్ళిపోవటం మాత్రం నా మనస్సుకు ఎంతో బాధగా ఉన్నది. కనుక వెనకటివలెనే స్నేహంగా ఇక్కడే ఉండు' మన్నాడు. దానికి గోరువంక తిరిగి ఈ విధంగా అన్నది. 'ఒకరి నొకరం నొప్పించుకొన్న ఈ పెనుపగ తేలికగా చల్లారిపోదు. అయినా నీ కమ్మని మాటలలో పడి మోసపోయి మళ్ళీకలసి ఉండటం తగినది కాదు'.

**వ. అనిన విని యతండు. 253**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; అతండు= బ్రహ్మదత్తుడు.

**తాత్పర్యం:** అది విన్న బ్రహ్మదత్తుడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'చేసిన దానికి మాఱుగఁ । జేసినఁ బగయంతతోడఁ జెడుఁ గాక గుణుల్**
**డాసిన నమ్మేలు విడిచి । దోసముఁ బట్టుదురె యెట్టి తుచ్ఛులుఁ జతురా! 254**

**ప్రతిపదార్థం:** చతురా!= నేర్పరీ!; చేసిన దానికిన్= నా బిడ్డ చేసిన కీడుకు; మాఱుగన్+చేసినన్= బదులుగా చేసిన; పగ= కచ్చ; అంతతోడన్= అంతటితోనే; చెడున్+కాక= తీరిపోతుంది కాక; ఎట్టి తుచ్ఛులున్= ఎలాంటి నీచులైనా; గుణుల్= బుద్ధిమంతులు మంచివాళ్ళు; డాసినన్= చేరువైతే; ఆ మేలు విడిచి= ఆ ఉపకారాన్ని వదలిపెట్టి; దోసమున్= తప్పును; పట్టుదురే?= మోపుతారా?

**తాత్పర్యం:** 'నా బిడ్డ చేసినదానికి ప్రతిగా నీవు కనుగుడ్లు పీకావు. ఆ పగ అంతటితో తీరిపోతున్నది. ఎట్లాంటి నీచులైనా దగ్గరకు చేరిన బుద్ధిమంతుల మేలును మరచి నింద మోపుతారా!'

**వ. అనిన నతనికి శారిక యిట్లనియె. 255**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; అతనికిన్= అతడితో; శారిక= పూజని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అని అనగా బ్రహ్మదత్తుడితో శారిక ఇట్లా అన్నది.

**క. 'నెయ్యము సెడినను మాటల । తియ్యఁదనము వట్టి పగ మదిన్ మఱచినఁ జా**
**వయ్యెం జేటయ్యె గలఁక । యయ్యె నొకటి మూఁడుఁగాక యది మే లగునే? 256**

**ప్రతిపదార్థం:** నెయ్యము= స్నేహం; చెడినను= చెడిపోయినా; మాటల= పలుకులలోని; తియ్యఁదనము+పట్టి= మాధుర్యాన్నిబట్టి; పగ= వైరం; మదిన్= మనస్సులో; మఱచినన్= మరచిపోతే; చావు+అయ్యెన్= చావు కలుగుతుంది; చేటు+అయ్యెన్= కీడు మూడుతుంది; కలఁక+అయ్యెన్= కలవరం పుడుతుంది; ఒకటి= వీటిల్లో ఒకటి; మూఁడున్+కాక= కలగవచ్చుకాక; అది= అట్లా కలగటం; మేలు+అగునే?= మంచిది అవుతుందా?

**తాత్పర్యం:** 'స్నేహం చెడిపోయినా తియ్యటి మాటలలో పడిపోయి ఆ పగను మర్చిపోవచ్చును. కాని, దానివలన చావు కలుగవచ్చును, కలత పుట్టవచ్చును, కీడు పొందవచ్చును. అంతే కాని మంచి జరగదు.

**ఆ. వినుము! నేల దోఁచికొనినను దాయాదు । లైన మాట మాటకేని నాఁడు**
**వారి యెడను గీడు వారక చేసినఁ । బగ జనించు నిట్లు భంగు లైదు. 257**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; నేల దోఁచికొనినను= భూమిని కాజేయాలనుకొన్నా; దాయాదులు+ఐనన్= జ్ఞాతుల (ఆస్తిలో పాలుపంచుకొనే అధికారం ఉండే ఆడవాళ్ళ మగవాళ్ళు) వల్లనైనా; మాటకున్ మాటకున్+ఏనిన్= మాటామాట వచ్చినా; ఆఁడువారి యెడను= ఆడవారివల్లనైనా; కీడు= చెడు; వారకచేసినన్= విడవకుండా చేసినా; పగ= వైరం; జనించున్= పుట్టుతుంది; ఇట్లు= ఇటువంటి పగ; ఐదు భంగులు= అయిదు విధాలు.

**తాత్పర్యం:** భూమి దురాక్రమణంవలన, దాయాదులవలన, ఆడవారివలన, మాటమాటవచ్చినందువలన, అడ్డూ ఆపూ లేని చెడు తలపెట్టటంవలన పగ పుట్టుతుంది. ఇట్లా ఇది అయిదు తీరులు.

**ఆ. పగయుఁ గల్గెనేని పాయునె గూఢమై । ప్రూన నగ్నియున్న మాడ్కి నుండుఁ**
**గాన నమ్మి బేల కాలాంతరంబున । నైనఁ జెడును సందియంబు వలదు. 258**

**ప్రతిపదార్థం:** పగయున్= విరోధం; కల్గెన్+ఏని= కలిగితే; పాయునె?= పోతుందా?; ద్రుమానన్= చెట్టులో; అగ్ని= నిప్పు; గూఢమై ఉన్నమాడ్కిన్= దాగి ఉన్నట్లుగా; ఉండున్= పగ ఉంటుంది; కానన్= కాబట్టి; నమ్మి= నమ్ముకొని; బేల= తెలివి తక్కువవాడు; కాలాంతరంబునన్+ఐనన్= కొంతకాలం దాటిపోయాక అయినా; చెడును= చెడిపోతాడు (నశిస్తాడు); సందియంబు= సందేహం; వలదు= వద్దు.

**తాత్పర్యం:** పగ పుట్టాక ఒక పట్టాన పోదు. ఇది చెట్టులో దాగి ఉండే నిప్పువలె మనస్సులో దాగి ఉంటుంది. కాబట్టి నమ్ముకొన్న వెర్రివాడు ఎప్పటికైనా చెడిపోతాడు. ఇందులో ఏమీ సందేహం లేదు.

**క. జననీ జనక సహోదర । తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె**
**మ్మనమునఁ బగ గలవారలఁ । జనునే నమ్మంగ విడువు చతురవచనముల్.' 259**

**ప్రతిపదార్థం:** జననీ= తల్లినీ; జనక= తండ్రినీ; సహోదర= తోడబుట్టిన వారినీ; తనూభవులన్= పిల్లలనూ; సఖులన్= నేస్తగాళ్ళనూ; నమ్మన్+తగదు= నమ్ముకొనకూడదు; అనినను= అని నీతి శాస్త్రం అంటూ ఉంటే; నెమ్మనమునన్= నిండు మనస్సుతో; పగ కలవారలన్= విరోధులను; నమ్మంగన్ చనునే?= విశ్వసించవచ్చునా?; చతుర వచనముల్= నేర్పు మాటలను; విడువు= మానుకొమ్ము.

**తాత్పర్యం:** కన్న తల్లిదండ్రులను, తోడబుట్టినవాళ్ళను, కన్న సంతానాన్నీ, స్నేహితులనూ నమ్మకూడదు అంటున్నది నీతిశాస్త్రం. కనుక, మనస్సు నిండా పగపెట్టుకొన్నవాళ్ళను నమ్మవచ్చునా? ఇక నీ చతురోక్తులు చాలించుము.'

**వ. అనుటయు బ్రహ్మదత్తుం డిట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; బ్రహ్మదత్తుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగానే బ్రహ్మదత్తుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'కాలవశంబునఁ గీడు । మ్మేలును జనులకును మూఁడు నీకును నాకున్**
**వాలి యవి సేయ వచ్చునె? । బేలనె యే నంత యేల పెడఁబాయంగన్. 261**

**ప్రతిపదార్థం:** కాలవశంబునన్= కాలానికి లోబడి; కీడున్= చెడును; మేలును= మంచీ; జనులకును= ప్రజలకు; మూఁడున్= కలుగుతుంటాయి; నీకును= నీకూ; నాకున్= నాకూ; వాలి= మితిమించి; అవి= ఆ మంచీ చెడ్డలు; చేయవచ్చునె= చేయకలుగుతాయా?; అంత+ఏల?= అదంతా ఎందుకు?; పెడఁబాయంగన్= వదలిపెట్టి వెళ్ళటానికి; ఏను= నేను; అంత బేలనె?= అంత వెర్రివాడినా?

**తాత్పర్యం:** 'కాలాన్నిబట్టి జనానికి మంచీ చెడులు కలుగుతుంటాయి. వాటిని దాటి చేయటం మన వశమా? అంతెందుకు? నిన్ను వదలుకొనటానికి నే నేమైనా వెర్రివాడినా?'

**వ. అనిన విని శారిక యతని మొగంబు దేఱకొనంజూచి. 262**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగానే విని; శారిక= పూజని అనే గోరువంక; అతని మొగంబు= ఆ బ్రహ్మదత్తుడి ముఖాన్ని; తేఱకొనన్+చూచి= తేరిపార చూచి.

**తాత్పర్యం:** బ్రహ్మదత్తుడి మాటలు విన్న గోరువంక అతడిని తేరిపార చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'విను చల్లని మాటలలో । మునిఁగి యలుక గుబ్బతిలు సముద్ర జలములో**
**నన యుండి యాఱ కెప్పుడు । గనగన మను బాడబాగ్ని కరణి నరేంద్రా!' 263**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; విను= ఆలకించుము; చల్లని మాటలలోన్= నీ ఊరడింపు పలుకులలో; మునిఁగి= దాగిన; అలుక= కోపం; సముద్ర జలములోనన= సముద్రం లోపలనే; ఉండి; ఆఱక= చల్లారక; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; గనగనము+అను= కణకణమని మండే; బాడబాగ్ని కరణిన్= బడబానలంవలె; గుబ్బతిలున్= అతిశయిస్తుంది.

**తాత్పర్యం:** 'నీ చల్లని మాటల మాటున దాగిన కోపం సముద్రంలోపల ఎపుడూ కణకణ మండే బడబాగ్నివలె మండుతూనే ఉంటుంది'.

**క. అని పలికి యవిశ్వాసము । మనమున నెలకొల్పి రాజు మాటలకుం దే**
**లని వెరవుతోడ నా పూ । జని దనకిమ్మైన యెడకుఁ జనియెఁ గుమారా! 264**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; కుమారా!= ధర్మరాజా!; మనమునన్= మనస్సులో; అవిశ్వాసమున్= అపనమ్మకాన్ని; నెలకొల్పి= నిలుపుకొని; రాజు మాటలకున్= బ్రహ్మదత్తుడి మాయమాటలకు; తేలని= బయటపడని; వెరవుతోడన్= ఉపాయంతో; ఆ పూజని= ఆ గోరువంక; తనకున్= తనకు; ఇమ్ము+ఐన ఎడకున్= అనువైన చోటికి; చనియెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ పూజని రాజుపట్ల తనకుగల అపనమ్మకాన్ని బయటపడనీయలేదు. ఆ రాజు మాటలకు లొంగకుండానే ఎంతో ఉపాయంగా తన కనువైన చోటికి వెళ్ళిపోయింది.

**వ. అదియునుం గాక. 265**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**క. జననాథునకు నవిశ్వా । స నిరూఢత వలయు నెల్ల జనములయందుం**
**దనుఁ దనసిరిఁ గాచుటకై । యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. 266**

**ప్రతిపదార్థం:** జననాథునకున్= రాజైనవాడికి; తనున్= తన్ను; తనసిరిన్= తన సంపత్తినీ; కాచుటకై= కాపాడుకొనటానికి; ఎల్ల జనములఅందున్= జనులందరిపట్ల; అవిశ్వాస నిరూఢత= గట్టిగా నమ్మకపోవటం; వలయున్= ఉండాలి; అని; బృహస్పతి ముఖ్యుల్= బృహస్పతి మొదలైన పెద్దలు; నీతులు= రాజనీతులు; చెప్పుదురు= చెప్పుతుంటారు.

**తాత్పర్యం:** ప్రజలెవరినీ రాజు గట్టిగా నమ్మకూడదు. అపుడే తననూ, తన సంపత్తినీ సంరక్షించుకొనగలుగుతాడు. అని బృహస్పతివంటి పెద్దలు రాజనీతులు ఉపదేశిస్తుంటారు.

### కణికుఁడు శత్రుంజయున కుపదేశించిన హితవచనముల ప్రకారము (సం. 12-138-4)

**వ. అవ్వాక్యంబు లాదరింపవలయు నని పల్కి వెండియు భీష్ముండు పాండవాగ్రజుతో 'సౌవీరపతి యగు శత్రుంజయునకు భారద్వాజ వంశవర్యుండైన కణికుం డుపదేశించిన హితవచనంబులు గలవు; వానిం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె. 267**

**ప్రతిపదార్థం:** ఆ+వాక్యంబులు= ఆ మాటలు; ఆదరింప వలయును= పాటించాలి; అని పల్కి= అని చెప్పి; వెండియున్= మళ్ళీ; భీష్ముండు= భీష్ముడు; పాండవ+అగ్రజుతోన్= పాడవులలో పెద్దవాడైన ధర్మరాజుతో; సౌవీరపతిఅగు= సౌవీర దేశపు రాజయిన; శత్రుంజయునకున్= శత్రుంజయుడికి; భారద్వాజ వంశవర్యుండు+ఐన= భారద్వాజ వంశంలో ఉత్తముడైన; కణికుండు; ఉపదేశించిన= బోధించిన; హితవచనంబులు= మేలు పలుకులు; కలవు= ఉన్నాయి; వానిన్+చెప్పెదన్= వాటిని చెప్పుతాను; ఆకర్ణింపుము+అని= ఆలకించుమని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ నీతిమాటలు ఆదరించు' మంటూ భీష్ముడు ధర్మరాజుతో మళ్ళీ ఈ విధంగా అన్నాడు: 'సౌవీరదేశపు రాజు శత్రుంజయుడికి, భారద్వాజ వంశశ్రేష్ఠుడైన కణికుడు ఉపదేశించిన నీతి వాక్యాలను చెప్పుతాను ఆలకించుము.

**క. వికచముఖుఁ డగుచు శాత్రవు । లకు హితు లగునట్టి వారలం గని భూపా**
**లకుఁ డెడ్డ కత్తెరయు నా । లుక బెల్లమునై మనంబులుం గన వలయున్. 268**

**ప్రతిపదార్థం:** భూపాలకుఁడు= రాజు; వికచముఖుఁడు+అగుచున్= విప్పారిన మొగం కలవాడవుతూ; శాత్రవులకున్= పగవారికి; హితులు= ఆప్తులు; అగునట్టి వారలన్= అయినట్టి వారిని; కని= కనిపెట్టి చూచి; ఎడ్డ= హృదయం; కత్తెరయున్= కత్తెరవలె కరకుదనమున్నూ; నాలుక బెల్లమును+ఐ= మాటలు తీపిన్నీ కలిగి; మనంబులున్= మనస్సులను; కనవలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** నవ్వు మొగంతో రాజు పగవాళ్ళకు హితులైనవాళ్ళను కనిపెట్టాలి. వాళ్ళతో తీయని మాటలు మాట్లాడుతూ మనసులో కరుగ్గా ఉండాలి. వాళ్ళ మనస్సులను కనుక్కొనాలి.

**ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రుల నోర్చి యహీన రాజ్యముం**
**బ్రీతి యెలర్పఁ జేకొనిన పిమ్మట సౌఖ్య సమృద్ధి తోషిత**
**జ్ఞాతినికాయుఁడై మది నజస్రము నమ్మక సర్పసంయుతం**
**బై తనరారు రమ్య నిలయంబున నున్నటు లుండగాఁ దగున్.' 269**

**ప్రతిపదార్థం:** జ్ఞాతులన్= దాయాదులను; నమ్మి= నమ్ముకొని (విశ్వసించి); తోడుకొని= వెంట తీసికొని వెళ్ళి; శత్రులన్= పగవాళ్ళను; ఓర్చి= ఓడించి; అహీన రాజ్యమున్= గొప్ప సామ్రాజ్యాన్ని; ప్రీతి ఎలర్పన్= సంతోషంగా; చేకొనిన పిమ్మట= చేజిక్కించుకొన్న తరువాత; సౌఖ్యసమృద్ధి= సుఖపరంపరచేత; తోషిత= సంతోషపెట్టిన; జ్ఞాతినికాయుఁడు+ఐ= దాయాదుల సముదాయం కలవాడై; మదిన్= మనస్సులో; అజస్రము= ఎప్పుడూ; నమ్మక= నమ్మకుండా; సర్పసంయుతంబు+ఐ= పాముతో కూడినదై; తనరారు= శోభిల్లే; రమ్య నిలయంబునన్= చక్కటి మేడలో; ఉన్నటులు= ఉన్న విధంగా; ఉండగాన్+తగున్= ఉండటం ఒప్పుతుంది.

**తాత్పర్యం:** దాయాదులను నమ్మి, వాళ్ళతోడుగా శత్రువులను జయించాలి. రాజ్యం సంపాదించిన తరువాత వాళ్ళకు సకలసౌఖ్యాలను సమకూర్చి సంతోషింపచేయాలి. కాని, మనస్సులో మాత్రం వాళ్ళను ఎప్పుడూ నమ్మకుండా ఉండాలి. పామున్న భవనంలో ఉన్నట్టు ఎపుడూ 'ఏమరక ఉండాలి'.

**వ. అని మఱియును. 270**

**తాత్పర్యం:** అని మాట్లాడి భీష్ముడు మళ్ళీ - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'వినుము తఱి వేచి రిపుమూఁ । పున మోవఁగవలయు సమయముం గనికొని గ్ర**
**క్కునఁ గడవ శిలాస్థలి వై । చిన చాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్. 271**

**ప్రతిపదార్థం:** వినుము= వినవలసింది; తఱి వేచి= సమయం చూచి; రిపున్= శత్రువును; మూఁపునన్= భుజం మీద పెట్టుకొని; మోవఁగవలయున్= మొయ్యాలి; సమయమున్= తగిన కాలాన్ని; కనికొని= తెలిసికొని; గ్రక్కునన్= వెంటనే; కడవ= కుండను; శిలాస్థలిన్= రాతినేలమీద; వైచిన చాడ్పునన్= పడేసినట్లు; నేర్పు మెఱయన్= చాకచక్యం కనబరచేటట్లు; చెఱుచుట= నాశనం చెయ్యటం; ఒప్పున్= తగుతుంది.

**తాత్పర్యం:** సమయాన్నిబట్టి శత్రువును భుజాలమీద ఎక్కించుకొని మొయ్యాలి. సమయం కనిపెట్టి రాతినేలమీద కుండను ఎత్తి బ్రద్దలు కొట్టినట్లు నేర్పుగా శత్రువును నశింపచేయాలి.

**క.** **పానము జూదము వేఁటయు । మానినియును భూపతులకు మధుర వినోద**
**స్థానము లగు నైనను దగ । వైన విధము దక్కఁ దగుల మాపద దెచ్చున్.** **272**

**ప్రతిపదార్థం:** పానము= త్రాగుడు; జూదము= జూదమూ; వేఁటయున్= వేటా; మానినియును= స్త్రీయున్నూ; భూపతులకున్= రాజులకు; మధుర= సొంపైన; వినోదస్థానములు+అగున్= వేడుకలకు ఆటపట్టవుతాయి; ఐనను= అయినా; తగులము= వీటితో సంబంధం; తగవు+ఐన విధము= తగినట్టి రీతిని; తక్కన్= తప్పిపోతే; ఆపద= విపత్తును; తెచ్చున్= తెచ్చిపెట్టుతుంది.

**తాత్పర్యం:** తాగటం, జూదమాడటం, వేటాడటం, ఆడవాళ్ళను కోరటం - అనేవి రాజవినోదాలకు నెలవులు. వీటితో పొత్తు మేర మీరకూడదు. మేర మీరితే మాత్రం ఆపద తెస్తుంది.

**క.** **విని విననివాఁడ పోలెం, । గని కానని వాఁడపోలెఁ గావలయు విభుం**
**డొనరింపఁ దలంచిన పని । కనువగు నంతకు నభేద్యుఁడై జనుల యెడన్.** **273**

**ప్రతిపదార్థం:** విభుండు= రాజు; ఒనరింపన్+తలంచిన పనికిన్= చేయ తలపెట్టిన కార్యానికి; అనువు+అగునంతకున్= సానుకూలపడే వరకూ; అభేద్యుఁడు+ఐ= తెలిసికొనటానికిశక్యం కానివాడై; జనుల+ఎడన్= ప్రజల పట్ల; విని= విన్నప్పటికీ; విననివాఁడ పోలెన్= విననివాడివలె; కని= చూచి; కాననివాఁడపోలెన్= చూడని వాడివలె; కావలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** రాజు తాను తలపెట్టిన పని సానుకూలపడేదాకా ఎవ్వరూ తనను తెలిసికొనలేనివాడుగా ఉండాలి. ప్రజల విషయంలో విన్నా విననివాడివలె చూచినా చూడనివాడివలె నడచుకొనాలి.

**క.** **ఒల్లని కార్యం బాసల । నల్లన కాలగతిఁ గడపునది కాలముచేఁ**
**బెల్లొదవు విఘ్నములు భూ । వల్లభునకు నెపము వెట్టవచ్చుం బిదపన్.** **274**

**ప్రతిపదార్థం:** భూ వల్లభునకున్= రాజైనవాడికి; ఒల్లని కార్యంబున్= తాను ఇష్టపడని పనిని; ఆసలన్= ఆశలు చూపిస్తూ; అల్లనన్= మెల్లగా; కాలగతిన్= కాలం గడిచేటట్లు; కడపునది= వెళ్ళబుచ్చేది; పిదపన్= ఆ తరువాత; కాలముచేన్= కాలంవలన; పెల్లు ఒదవు= ఎక్కువగా కలిగే; విఘ్నములు= ఆటంకాలను; నెపము= మిషగా; పెట్టవచ్చున్= పెట్టవచ్చును.

**తాత్పర్యం:** రాజు తనకు ఇష్టంలేని పనిని చేస్తానని ఆశలు చూపిస్తూ కాలం గడపాలి. కాలాంతరంలో ఎదురయ్యే అడ్డంకులను సాకుగా చూపించి ఆ పనికి మొండిచెయ్యి చూపాలి.

**తే.** **బహుళ మగు గర్వమునఁ గార్యభంగియును న । కార్యసరణియు నెఱుఁగక నార్యవృత్తిఁ**
**గాని తెరువున నడచుచున్నేని గురుని । నైన శాసింపఁగాఁ దగునండ్రు బుధులు.** **275**

**ప్రతిపదార్థం:** బహుళము+అగు గర్వమునన్= ఎంతో పొగరుతో; కార్యభంగియునున్= చేయదగ్గ పనితీరూ; అకార్యసరణియున్= చేయతగని పనితీరూ; ఎఱుఁగక= తెలియక; అనార్య వృత్తిన్= శిష్టులు ఒప్పని నడవడిచేత; కాని తెరువునన్= కూడని మార్గంలో; నడచుచున్ ఉన్నన్+ఏని= నడుస్తూ ఉండేటట్లయితే; గురునిన్+ఐనన్= గురువునైనా; శాసింపగాన్ తగును= దండించవచ్చు (అని); బుధులు= పెద్దలు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** ఇది చేయతగ్గపనీ, ఇది చేయకూడని పనీ అని పొగరుబోతుతనంతో తెలిసికొనలేని వాడిని పెద్దలు పోయే మార్గంలో కాక కానిమార్గంలో నడిచేవాడిని గురువైనా సరే తప్పక దండించాలి అంటారు పెద్దలు.

**క.** **తెగఁ దీర్పక తగ నార్పక । తెగటార్పక కడమ కొంత ద్రిక్కఁగ నున్నన్**
**జగతీశ! యప్పునగ్నియుఁ । బగయును గడుఁ బెరుఁగుఁ గీడు వాటిల్లు దుదిన్.** **276**

**ప్రతిపదార్థం:** జగతీ+ఈశ!= రాజా! తెగన్ తీర్పక= మొత్తం చెల్లించకపోతే; అప్పున్= ఋణం; తగన్+ఆర్పక= అంతా (తగ్గట్టుగా); చల్లార్చకపోతే; అగ్నియున్= నిప్పు; తెగటార్పక= చంపకపోతే; పగయున్= పగా; కడమ= చివరకు; కొంత త్రిక్కఁగన్+ఉన్నన్= కొద్దిగా మిగులు ఉంటే; కడున్= ఎంతో; పెరుఁగున్= పెంపొందుతుంది; తుదిన్= చిట్టచివరకు; కీడు= చెరుపు; పాటిల్లున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** పూర్తిగా తీర్చని అప్పూ, సాంతం చల్లార్చని అగ్గీ, సమూలంగా నాశనంచేయని పగా, దిగబడి ఉంటే బాగా పెరిగిపోయి చివరకు ఆపద కలిగించక మానదు.

**ఆ.** **మార్దవమున మృదువు మర్దింపగా వచ్చు । మార్దవమున పర విమర్దనంబుఁ**
**జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు । గాన మృదువ తలఁప ఖరము సువ్వె.** **277**

**ప్రతిపదార్థం:** మార్దవమునన్= మెతకతనంతో; మృదువున్= మెత్తనైనవాడిని; మర్దింపఁగా వచ్చున్= తుడిచివేయవచ్చు; మార్దవమునన్= మెతకతనంచేత; పర విమర్దనంబున్= శత్రు సంహారమూ; చెల్లున్= జరుగుతుంది; మార్దవమునన్= మెతకదనంచేత; చెల్లని అదిలేదు= నెరవేరనిది ఉండదు; కానన్= కాబట్టి; మృదువు+అ= మెత్తదనమే; తలఁపన్= ఆలోచించగా; ఖరము సువ్వె= వాడిఅయినది సుమా.

**తాత్పర్యం:** మృదుత్వంతో మెత్తనివాడిని తుడిచివేయవచ్చును. మృదుత్వంతో శత్రువులను చంపవచ్చును. మృదుత్వంతో సాధించరానిదంటూ ఉండదు. కాబట్టి మృదుత్వమే అన్నిటిని మించి వాడిఅయినది సుమా!

**వ.** **అనిన విని యజాతశత్రుండు 'ధర్మంబు నడవక యవగ్రహాది దురితంబులు దుస్తరంబు లయిన నాహారంబులు దొరకొనని యట్టిచో ద్విజాతు లేమిభంగిం బ్రాణంబులు రక్షించుకొను వా?' రనుటయు నాపగానందనుండు 'విశ్వామిత్ర చండాల సంవాదం బను నితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరంబై యుండు; నాకర్ణింపు' మని యిట్లనియె.** **278**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; అజాతశత్రుండు= ధర్మరాజు; ధర్మంబు= న్యాయం; నడవక= ప్రవర్తించక; అవగ్రహ+ఆది= కరువు మొదలైన; దురితంబులు= పాపాలు; దుస్తరంబులు= దాటరానివి; అయినన్= అయితే; ఆహారంబులు= తినేతిళ్ళు; దొరకొనని+అట్టిచోన్= దొరకనపుడు; ద్విజాతులు= రెండు పుట్టుకలుగలవారు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు= వీరికి 'ఉపనయనం' రెండో పుట్టుక); ఏమి భంగిన్= ఏ విధంగా; ప్రాణంబులు= ఊపిరులు; రక్షించుకొనువారు= కాపాడుకొనేవారు; అనుటయున్= అనగానే; ఆపగానందనుండు= భీష్ముడు; విశ్వామిత్ర= విశ్వామిత్రుడికీ; చండాల= చండాలుడికీ (జరిగిన); సంవాదంబు=

సంభాషణ; అను= అనే; ఇతిహాసంబు= పరంపరగా చెప్పుకొంటున్న వెనుకటి కథ; భవత్ప్రశ్నంబునకున్= నీవు అడిగిన దానికి; ఉత్తరంబు+ఐ= సమాధానమై; ఉండున్= ఉంటుంది; ఆకర్ణింపుము= వినుము; అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అదంతా విన్న ధర్మరాజు 'ధర్మం సరిగ్గా నడవకపోతే తప్పించుకొనలేని కరువుకాటకాది పాపాలు కలుగుతాయి. కనుక తిండి దొరకదు. బ్రాహ్మణాదులైన మూడు వర్ణాలూ ఎట్లా మనగల్గుతాయో చెప్పు'మన్నాడు. దానికి భీష్ముడు 'విశ్వామిత్రుడికీ మాలవాడికీ మధ్య నడచిన సంవాద' గాథను వింటే నీవడిగిన సందేహం తీరిపోతుంది. అదే నీ ప్రశ్నకు సరైన సమాధానం' ఆలకించుమంటూ ఇట్లా అన్నాడు:

**విశ్వామిత్ర చండాల సంవాదము (సం. 12-139-12)**

**క. ఏపారి తొల్లి త్రేతా । ద్వాపరముల సంధి నొక్క వఱపు ధరిత్రీ**
**తాపంబుఁ జేసె జనముల । పాపంబున వత్సరములు పండ్రెం డధిపా! 279**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; తొల్లి= మునుపు; త్రేతా ద్వాపరముల సంధిన్= త్రేతా ద్వాపరయుగాలు కూడినపుడు; ఒక్కవఱపు= ఒక కరువు; ఏ పారి= అధికమై; జనముల పాపంబునన్= జనం చేసికొన్న పాపంవలన; వత్సరములు పండ్రెండు= పన్నెండేళ్ళపాటు; ధరిత్రీ= భూమికి; తాపంబున్+చేసెన్= పీడ కలిగించింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! త్రేతా ద్వాపరయుగాల సంధికాలంలో జనం చేసికొన్న పాపంకొద్దీ ఒక కరువు వచ్చింది. ఇది ప్రజలను పన్నేండేళ్ళపాటు పీడించింది.

**సీ. ఏఱులుఁ జెఱువులు నివురఁ గర్సనము లెం । దును జెడఁ, దరులతాదులును గమర,**
**భూమియుఁ బసమాల, గోమహిషాది జీ । వధనంబు వొలియ, భూవరులు మేర**
**దప్పి లోకములోని ధాన్యముల్ గొన, నధ । ర్మం బంతకంతకుఁ బ్రబ్బ నధికు**
**లనదలఁ జెఱుపంగ, యాగముల్ దేవతా । పూజలు నెడలంగ, భూసుర ప్ర**

**ఆ. ముఖములైన వర్ణముల చొప్పు దప్ప, నా । హార రహితజనము లచట నచటఁ**
**బడఁగఁ జూడ ఘోర భంగిగాఁ దఱచయ్యెఁ । డొక్కలున్న వారి కెక్క భయము. 280**

**ప్రతిపదార్థం:** ఏఱులున్= నదులూ; చెఱువులున్= మడుగులూ; ఇవురన్= అడుగంటి పోగా; కర్సనములు= సేద్యాలు; ఎందును= అన్నిచోట్లా; చెడన్= పాడుపడగా; తరులతా+ఆదులును= చెట్లు, తీగలూ మొదలైనవి; కమరన్= ఎండిపోగా; భూమియున్= నేలకూడా; పస తూలన్= సారం పోగా; గో+మహిష+ఆది= ఆవులూ గేదెలూ మొదలైన; జీవధనంబు= పశుసంపద; పొలియన్= చచ్చిపోగా; భూవరులు= రాజులు; మేరదప్పి= మర్యాద మీరి; లోకములోని= రాజ్యంలోని; ధాన్యముల్= వడ్లు, మినుములు, పెసలు మొదలైన ధాన్యాలు; కొనన్= కొల్లకొట్టగా; అధర్మంబు= అవినీతి; అంతకున్+అంతకున్= రాను రాను; ప్రబ్బన్= విస్తరిల్లగా; అధికులు= బలవంతులు; అనదలన్= బలహీనులను; చెఱుపంగన్= బాధపెట్టగా; యాగముల్= యజ్ఞాలు; దేవతా పూజలున్= దేవతార్చనలూ; ఎడలంగన్= దూరం అవుతుండగా; భూసుర ప్రముఖులు+ఐన= బ్రాహ్మణులు మొదలైన; వర్ణముల; చొప్పు=తీరు; తప్పన్= తప్పిపోగా; ఆహార రహిత జనములు= తిండిలేని జనాలు; అచటన్+అచటన్= అక్కడక్కడ; పడఁగన్= పడిపోగా, చచ్చిపోగా; ఉన్నవారికిన్= బ్రతికి ఉన్నవాళ్ళకు; చూడన్= చూడటానికి; భయము ఎక్కన్= భయం కలుగగా; డొక్కలు= పీనుగుల పెంటలు; తఱచు+అయ్యెన్= దట్టంగా పడ్డాయి.

**తాత్పర్యం:** ఏరులూ, చెరువులూ అడుగుబట్టాయి. సేద్యం అంతా ఆగిపోయింది. చెట్లూ చేమలూ ఎండిపోయాయి. నేలంతా బీడు పడిపోయింది. గొడ్డూ గోదా చచ్చిపోయాయి. రాజులు మర్యాద తప్పి ప్రజలను కొల్లగొట్టుకొంటున్నారు. అధర్మం అంతకంతకు మితిమీరిపోయింది. బలవంతులు బలహీనులను పీడిస్తున్నారు. యజ్ఞయాగాదులూ దేవతార్చనలూ కట్టిపెట్టారు. బ్రాహ్మణాది కులాలవారు తమ కులధర్మాన్ని తప్పారు. తిండీ తిప్పలూ లేని వాళ్ళు ఎక్కడపడితే అక్కడ పడిపోయారు. బతికి ఉన్నవాళ్ళు భయపడేటట్లు ఎంతో దారుణంగా పీనుగుల కుప్పలు పేరుకుపోయాయి.

**వ. అట్టి సమయమున. 281**

**తాత్పర్యం:** అట్లాంటి తరుణంలో.

**క. మునిపతి విశ్వామిత్రుఁడు । దన యాఁకలి కెందు మెలఁగి ధైర్య మెడలి యో**
**దన మాంస మూల ఫలములు । జనుల నడిగి యెందుఁ బడయఁ జాలక డప్పిన్. 282**

**ప్రతిపదార్థం:** మునిపతి= మునిరాజు; విశ్వామిత్రుఁడు= విశ్వామిత్ర మహర్షి; తన ఆఁకలికిన్= తన ఆకలికి; ఎందున్ మెలఁగి= ఎక్కడెక్కడో తిరిగి; ధైర్యము+ఎడలి= ధైర్యాన్ని కోల్పోయి; ఓదన= అన్నం; మాంస= మాంసం; మూల= కందమూలాలు; ఫలములు= పండ్లూ; జనులన్= లోకులను, జనాన్ని; అడిగి; ఎందున్= ఎక్కడా; పడయన్+చాలక= పొందలేక; డప్పిన్= దప్పికతో.

**తాత్పర్యం:** మునులలో చెప్పుకొనదగ్గవాడు విశ్వామిత్రుడు. అతడు ఆకలికి తట్టుకొనలేక ఎక్కడెక్కడో తిరిగాడు. ధైర్యం సడలింది. అన్నం, మాంసం, కందమూలాలూ, పండ్లూ అన్నీ అందరినీ అడిగాడు. ఎక్కడా ఏమీ దొరకలేదు. దప్పికతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. తూఁగాడుచుం జనువాఁడు. 283**

**ప్రతిపదార్థం:** తూఁగాడుచున్= తూలుతూ; చనువాఁడు= వెళ్ళువాడై.

**తాత్పర్యం:** తూలుతూ పోతున్నవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. పసరపు టెంప ప్రోవులును, బందుల డొక్కలుఁ, గుక్కపుఱ్ఱెలున్**
**ముసుఁగువడంగ భూమితలముం దఱచారఁగఁ గప్పుచున్ మదిం**
**బస యొక యింత లేక పెఱప్రాణులనుం బొరిగొంచు నెప్డు దు**
**ర్వ్యసనతఁ గూరియున్న వెలివాండ్రుర పల్లియఁ జేరి యయ్యెడన్. 284**

**ప్రతిపదార్థం:** పసరము= గొడ్ల; ఎమ్ము+ప్రోవులును= ఎముకల గుట్టలూ; పందుల డొక్కలున్= పందుల పొట్టలూ; కుక్కపుఱ్ఱెలున్= కుక్కల తలపెంకులూ (కప్పెరలూ); ముసుఁగు+పడంగన్= కప్పుపడేటట్లు; భూమితలమున్= నేలను; తఱచు+ఆరఁగన్= బాగా దట్టంగా; కప్పుచున్= కప్పుతూ; మదిన్= మనస్సులో; పస= ప్రేమ; ఒక ఇంతలేక= కొంచెం కూడా లేకుండా; పెఱ ప్రాణులనున్= ఇతర జీవకోటిని; పొరి గొంచున్= చంపివేస్తూ; ఎప్డున్= ఎల్లప్పుడూ; దుర్వ్యసనతన్= చెడ్డ అలవాటుతో; కూరి+ఉన్న= దిగబడి ఉన్న; వెలివాండ్రుర పల్లియన్= మాలపల్లెను; చేరి= సమీపించి; ఆ+ఎడన్= ఆ పల్లెలో.

**తాత్పర్యం:** గొడ్ల ఎముకల గుట్టలు పడి ఉన్నాయి. పందుల డొక్కలూ, కుక్కల పుర్రెలూ నేలపరపుగా దట్టంగా కప్పివేశాయి. మనసులో కొంచెమైనా ప్రేమ లేకుండా అన్నిరకాల జంతువులను అక్కడివారు చంపేస్తుంటారు. ఇట్లాంటి దుర్వ్యసనంతో కూరుకుపోయిన మాలపల్లెకు విశ్వామిత్రుడు చేరుకొని ఆ పల్లెలో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఆర్తినొంది యిటయట వోవం జాలక నేలం బడియుండి ప్రాణంబులు వోవుట యుపేక్షింపం దగదు ప్రాణరక్షణంబ పరమధర్మం బని వితర్కించి తగునుపాయంబు చింతించువాఁ డప్పుడ చంపి తిత్తొలిచి గాలిగొన వైచిన కుక్కకడిమంబుఁ గనుంగొని. 285**

**ప్రతిపదార్థం:** ఆర్తిన్= ఆకలితో బాధ; ఒంది= పొంది; ఇట,అట పోవన్ చాలక= ఎటూ పోను శక్తిలేక; నేలన్= నేలమీద; పడి ఉండి= సొమ్మసిల్లి; ప్రాణంబులు+పోవుట= ఊపిరిపోవటం; ఉపేక్షింపన్+తగదు= మిన్నక ఉండటం ఒప్పదు; ప్రాణరక్షణంబు+అ= ప్రాణంకాపాడుకోవటమే; పరమ ధర్మంబు= ఉత్తమ న్యాయం; అని; వితర్కించి= తలపోసి; తగన్= తగిన; ఉపాయంబున్= యుక్తిని; చింతించువాఁడు= ఆలోచించుకుంటున్నవాడు; అప్పుడు+అ= అప్పుడే; చంపి= ప్రాణంతీసి; తిత్తి ఒలిచి= తోలుతీసి; గాలిగొన వైచినన్= గాలి తగిలేటట్లు ఆరబెట్టిన; కుక్క కడిమంబున్= కుక్క మాంసాన్ని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** బాధపడుతూ ఇటు అడుగు తీసి అటువేయలేక నేలమీద సొమ్మసిల్లి పడిపోయాడు. 'ఊపిరి పోతుంటే ఊరుకొనకూడదు, అనుకొన్నాడు. 'ప్రాణం నిలబెట్టుకొనటమే ఉత్తమ ధర్మం' అని భావించాడు. దానికి తగ్గ ఉపాయాన్ని ఆలోచించుకొంటూ అపుడే చంపి తోలు తీసి, గాలిలో ఆరబెట్టిన కుక్కమాంసాన్ని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఇది దప్ప నిప్పు డియ్యెడ । నొదవదు ప్రాణంబు గావ నొం డొకఁ; డిదియున్**
**మది నూహింపఁగ మ్రుచ్చిమి । నొదవించి కొనంగవలసియున్నది నాకున్. 286**

**ప్రతిపదార్థం:** ఇది తప్పన్= ఈ కుక్కమాంసం తప్ప; ఇప్పుడు= ఈ సమయంలో; ఈ+ఎడన్= ఇక్కడ; ప్రాణంబు+కావన్= ప్రాణం రక్షించుకొనటానికి; ఒండొకఁడు= మరొకటి; ఒదవదు= దొరకదు; ఇదియున్= ఈ మాంసం కూడా; మదిన్= మనస్సులో; ఊహింపఁగన్= ఆలోచించుకొనగా; మ్రుచ్చిమిన్= దొంగతనంచేత; ఒదవించి కొనంగవలసి+ఉన్నది= చిక్కించుకొనవలసి ఉన్నది.

**తాత్పర్యం:** 'ఇపు డిక్కడ ప్రాణం కాపాడుకొనటానికి కుక్కమాంసం తప్ప మరొకటి దొరకదు. ఇదైనా దొంగిలించి దక్కించుకొనవలసిందే.

**తే. ప్రాణములు వోవకుండంగఁ బరిహరింప । నొం డుపాయ మెయ్యదియు లేకుండెనేని**
**మ్రుచ్చిమియు ధర్మ మగు; నధముని ధనంబు । గొనుట యెందును ముఖ్యమై చనుట గలదు. 287**

**ప్రతిపదార్థం:** ప్రాణములు= ఉసురు; పోవక+ఉండంగన్= పోకుండా; పరిహరింపన్= తప్పించుకొనేందుకు అంటే ప్రాణాలు నిలుపుకొనటానికి; ఒండు+ఉపాయము= మరొక సాధనం; ఏ+అదియున్= ఏదీ; లేక+ఉండెనేని= ఉండక పోయినట్లయితే; మ్రుచ్చిమియున్= దొంగతనం కూడా; ధర్మము+అగున్= న్యాయమే అవుతుంది; అధముని= నీచుడి; ధనంబున్+కొనుట= సొమ్మును తీసికొనటం; ఎందును= ఎక్కడైనా; ముఖ్యమై చనుట= ప్రధానమై ఒప్పటం; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** ప్రాణం పోకుండా తప్పించుకొనేందుకు మరే ఉపాయం లేనపుడు దొంగతనంచేసి ఊపిరి నిలుపుకొనటం ధర్మమే అవుతుంది. అపుడు నీచుడి సొమ్మైనా పుచ్చుకొనటం ప్రశస్తమైనదే అవుతుంది.

**వ. కావున చండాలధనంబగు సారమేయ మాంసం బపహరించి ప్రాణహాని పరిహరించి కొందు' నని నిశ్చయించియుండ నర్ధరాత్రం బగుటయుఁ జండాలురెల్ల నిద్రింపనల్లన లేచిచని యమ్మాంసంబు వట్టి తిగిచిన నచ్చేరువ నిద్రించు చండాలుండు విధివశంబున మేలుకని 'నీ వెవ్వండవు? మాంసంబు మ్రుచ్చిలించెదవు? నిద్రవోవంజుమ్ము నిన్నుఁ బొరిగొనియెద' ననుటయు భయపడి గ్రక్కున నమ్మునిపతి 'యేను విశ్వామిత్త్రుండ'నని పలికిన, వాఁడు వినయంబున శయ్య డిగ్గి కరుణం గన్నీ రొలుకం బ్రణమిల్లి కేలు మొగిడ్చి 'మహాత్మా! నీతలం పేమి యని యడిగిన నతండు సాంత్వనవచనంబుల నిట్లనియె. 288**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; చండాల ధనంబు+అగు= చండాలుడి సొమ్ము అయిన; సారమేయ మాంసంబున్= కుక్కమాంసాన్ని; అపహరించి= కాజేసి; ప్రాణహానిన్= ప్రాణానికి వచ్చిన ముప్పును; పరిహరించికొందును= తొలగించుకొంటాను; అని నిశ్చయించి= అని నిర్ణయించుకొని; ఉండన్= ఉండగా; అర్ధరాత్రంబు+అగుటయున్= నడిరేయి అవటంవలన; చండాలురు+ఎల్లన్= చండాలురందరూ; నిద్రింపన్= నిద్రపోగా; అల్లన లేచి= మెల్లగా లేచి; చని= వెళ్ళి; ఆ+మాంసంబున్= ఆ మాంసాన్ని; పట్టి తిగిచినన్= పట్టి లాగగా; ఆ+చేరువన్= ఆ దగ్గరలోనే; నిద్రించు= నిద్రపోయే, కునుకుతీస్తున్న; చండాలుండు= మాలవాడు; విధివశంబునన్= అదృష్టవశాన; మేలుకని= నిద్రలేచి; నీవు; ఎవ్వండవు= ఎవ్వడివి; మాంసంబున్= మాంసాన్ని; మ్రుచ్చిలించెదవు= దొంగిలిస్తున్నావు; నిద్ర+పోవన్+చుమ్ము= నిద్రపోను సుమా; నిన్నున్= నిన్ను; పొరికొనియెదన్= చంపుతాను; అనుటయున్= అనగానే; భయపడి= భీతి చెంది; గ్రక్కునన్= వెంటనే; ఆ+మునిపతి= ఆ మునిరాజు; ఏను= నేను; విశ్వామిత్త్రుండను= విశ్వామిత్ర మహర్షిని; అని పలికినన్= అని పలుకగానే; వాఁడు= ఆ చండాలుడు; వినయంబునన్= అణకువతో; శయ్యడిగ్గి= మంచం దిగి; కరుణన్= జాలితో; కన్నీరు ఒలుకన్= కంటనీరు కారుస్తూ; ప్రణమిల్లి= మొక్కి; కేలు మొగిడ్చి= చేతులు జోడించి; మహాత్మా!= మహనీయా!; నీతలంపు= నీ ఆలోచన; ఏమి?= ఏమిటి?; అని అడిగినన్= అని అడగగా; అతండు= విశ్వామిత్రుడు; సాంత్వనవచనంబులన్= మెల్లని మాటలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కాబట్టి 'చండాలుడి సొత్తు అయినా సరే ఈ కుక్కమాంసాన్ని దొంగిలించి చావును తప్పించుకొంటా' నని నిర్ణయించుకొన్నాడు. అప్పటికే అర్ధరాత్రి అయింది. మాలపల్లె అంతా నిద్రలో మునిగిపోయింది. ఆ సమయంలో మెల్లగా లేచి వెళ్ళి ఆ మాంసాన్ని పట్టి గుంజాడు. ఆ పక్కనే కునుకుతీస్తున్న మాలవాడు అనుకోకుండా మేల్కొన్నాడు. 'నీ వెవ్వడివి? మాంసాన్ని దొంగిలిస్తున్నావు. నేను నిద్రపోవటంలేదు సుమా! నిన్ను చంపేస్తాను' అనగానే విశ్వామిత్రముని భయపడ్డాడు. 'నేను విశ్వామిత్రుడిని' అన్నాడు. అది విన్న చండాలుడు ఎంతో వినయంగా మంచం దిగాడు. జాలిపడి కంటతడిపెట్టుకొంటూ చేతులెత్తి మ్రొక్కాడు. 'మహాత్మా! ఇట్లా చేయటంలో నీ ఉద్దేశం ఏమిటి' అన్నాడు. దానికి ఆ ముని నెమ్మదిగా ఇట్లా చెప్పాడు.

**చ. 'దరికొను నాఁకలిం దనువిదాహము పుట్టినఁ బ్రాణహానికిం**
**బరిహరణంబు సేఁత కిది పాపమ యైనను గుక్కనంజుఁడే**
**భరపడి మ్రుచ్చిలించెద; విభావసుఁ డెంత శుచిత్వ సంపదం**
**బొరసియు సర్వభక్షకతఁ బొందును; నన్నును జూడు మట్లుగన్.' 289**

**ప్రతిపదార్థం:** దరికొను= మండే; ఆఁకలిన్= ఆకలిచేత; తను విదాహము పుట్టినన్= శరీరం దహించుకుపోతూండగా; ప్రాణహానికిన్= ఊపిరి పోకుండా; పరిహరణంబు+చేఁతకున్= ఆపుకొనాలనే కోరికవలన; ఇది= ఈ కుక్కమాంసం తినటం;

పాపము+ఐనన్= పాతకమే అయినా; ఏన్= నేను; భరపడి= ఒప్పుకొని; కుక్కనంజుఁడు= కుక్కమాంసాన్ని; ప్రుచ్చిలించెదన్= దొంగిలిస్తున్నాను; విభావసుఁడు= అగ్ని; ఎంత శుచిత్వ సంపదన్= ఎంతో పరిశుద్ధమైన సంపత్తిని; పొరసియున్= పొంది ఉన్నా; సర్వభక్షకతన్= అన్నీ తినేవాడి భావాన్ని; పొందును= పొందుతాడు; అట్లుగన్= అట్లాగే; నన్నును= నన్నుకూడా; చూడుము= చూడుము.

**తాత్పర్యం:** 'ఆకలిమంటతో శరీరం దహించుకుపోతూ ఉన్నది. ప్రాణం నిలుపుకొనాలనే కోరికవలన కుక్కమాంసం తినటం పాపమే అయినా ఇష్టపడే ఈ కుక్కమాంసాన్ని దొంగిలిస్తున్నాను. అగ్ని పావనుడే అయినా అన్నీ తింటుంటాడు కదా! అట్లాగే నన్ను భావించుము'.

**వ. అనిన విని చండాలుండు. 290**

**ప్రతిపదార్థం:** అనినన్= అట్లా ఆ ముని చెప్పగా; విని= ఆలకించి; చండాలుండు= మాలవాడు.

**తాత్పర్యం:** విశ్వామిత్రుడు చెప్పిన మాటలు ఆలకించిన మాలవాడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'కుక్క మృగములలో నెల్లఁ గుత్సితంబు; । దీనిఁ దిని ధర్మమున కేల హాని సేయ?**
**నొం డుపాయంబు వెదకి కొ మ్ముజ్జ్వలాత్మ!' । యనుడు వానికి ముని యిట్టు లనియె నధిప! 291**

**ప్రతిపదార్థం:** అధిప!= స్వామి!; మృగములలోన్+ఎల్లన్= జంతువులలోకెల్ల; కుక్క; కుత్సితంబు= నీచమైనది; దీనిన్= కుక్కమాంసాన్ని; తిని; ధర్మమునకున్= పుణ్యానికి; హాని+చేయన్+ఏల?= ముప్పు తేవటం ఎందుకు?; ఉజ్జ్వల+ఆత్మ!= మహాత్మా!; ఒండు+ఉపాయంబున్= మరొక ఉపాయం; వెదకి కొమ్ము= వెతుక్కో; అనుడున్= అనగానే; వానికిన్= ఆ చండాలుడితో; ముని= విశ్వామిత్రుడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'జంతువు లన్నిట్లోకి కుక్క చాలా నీచజంతువు. కుక్కమాంసాన్ని తిని ధర్మానికి ముప్పు కలిగిస్తావు ఎందుకు? మ రేదైనా ఉపాయాన్ని వెదకుము' అనగానే చండాలుడితో విశ్వామిత్రుడు ఈ విధంగా చెప్పాడు.

**క. 'విను బ్రహ్మవహ్ని నాకుం । బెను ప్రాపై యుండ నేను వెఱతునె యెట్లై**
**ననుఁ బోవనీక ప్రాణము । దనువున నిల్పుటయ చూవె ధర్మం బరయన్. 292**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; బ్రహ్మవహ్ని= బ్రహ్మ సంబంధమైన అగ్ని; నాకున్= నాకు; పెను ప్రాపు+ఐ+ఉండన్= పెద్ద అండగా ఉండగా; నేను; వెఱతునె?= భయపడతానా?; అరయన్= విచారించగా; ఎట్లు+ఐననున్= ఎట్లాగైనా; ప్రాణమున్+పోవనీక= ఊపిరిని పోనీయకుండా; తనువునన్= బొందిలో; నిలుపుటయ= ఉంచటమే; ధర్మంబు+చూవె!= న్యాయం సుమా!

**తాత్పర్యం:** 'బ్రహ్మాగ్ని నాకు పెద్ద అండగా ఉండగా నేను భయపడను. ఎట్లాగైనా ఈ బొందిలో ప్రాణం నిలబెట్టుకొనటమే న్యాయం సుమా!

**ఆ. బ్రదికియున్న నేఁ దపంబున విద్యను । బాచికొనఁగ నేర్తుఁ బాతకంబు;**
**నట్టు లగుట జీవితాధార మైన యీ । నంజుఁ డిప్పు డెట్లు నమల కుడుగ. 293**

**ప్రతిపదార్థం:** బ్రదికి+ఉన్నన్= జీవించి ఉంటే; ఏన్= నేను; పాతకంబున్= ఈ పాపాన్ని; తపంబునన్= తపోబలంవలన; విద్యను= బ్రహ్మజ్ఞానం వలన; పాచికొనఁగన్+నేర్తున్= పోగొట్టుకొంటాను; అట్టులు+అగుటన్= అట్లా అవటంవలన; ఇపుడు= ఇప్పుడు;

జీవిత+ఆధారము+ఐన= బ్రతకటానికి మూలం అయిన; ఈ నంజుడు= ఈ మాంసాన్ని; ఎట్లున్= ఎట్లాగైనా; నమలక= తినక; ఉడుగన్= మానను.

**తాత్పర్యం:** నేను ప్రాణాలతో ఉంటే ఈ పాపాన్ని తపస్సువలన, జ్ఞానంవలన పోగొట్టుకొనగలను. కనుక ప్రాణాధారం అయిన ఈ మాంసాన్ని తినకుండా ఉండను'.

**చ. అనుటయు నంత్యజుండు నగి 'యట్టి విధం బధమంబు గాక నె**
**ట్టన యది ధర్మమే? కటకటా! మిము బోంట్లకు నిట్లు సేయఁగాఁ**
**జనునొకొ?' యన్న నమ్ముని 'ప్రశస్తుఁ డగస్త్యుఁడు దైత్యు మాంసముం**
**దినఁడె? నశించెనే యతని తేజముఁ బెంపును నంతనుండియున్?' 294**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; అంత్యజుండు= కడజాతివాడు; నగి= నవ్వి; అట్టివిధంబు= కుక్కమాంసం తినటం అనేది; అధమంబు+కాక= నీచమైనది కాక; నెట్టన= పైపెచ్చు; అది ధర్మమే?= అది పాడియా?; కటకటా!= అయ్యయ్యో!; మిము బోంట్లకున్= మీవంటివాళ్ళకు; ఇట్లు= ఇట్లా; చేయఁగాన్= చేయటం; చనునొకొ?= తగుతుందా?; అన్నన్= అనగానే; ఆ+ముని= ఆ విశ్వామిత్రుడు; ప్రశస్తుఁడు= పేరుపొందిన; అగస్త్యుఁడు= అగస్త్యమహర్షి; దైత్యు మాంసమున్= రాక్షసుడి మాంసాన్ని; తినఁడె?= తినలేదా?; అంతన్+ఉండియున్= అప్పటినుండి; అతని తేజమున్= అతడి తేజస్సూ; పెంపున్= గౌరవమున్నూ; నశించెనే?= చెడినాయా?

**తాత్పర్యం:** విశ్వామిత్రుడి మాటలు విన్న చండాలుడు నవ్వి 'అయ్యో! అది నీచమైన పనికాక న్యాయమైనదా! మీ బోటి మునిసాములు ఇట్లా చేయవచ్చా?' అన్నాడు. దానికి ఆ ముని 'ఎన్నో పొగడ్తలు పొందిన అగస్త్యముని రాక్షసమాంసం తినలేదా! ఆనాటినుండి ఆ ముని తేజస్సుకు, గౌరవానికీ ఏమైనా కొరత వచ్చిందా?'

**వ. అనవుడు వాఁ డి ట్లనియె. 295**

**ప్రతిపదార్థం:** అనవుడున్= ముని అనగానే; వాఁడు= ఆ చండాలుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** విశ్వామిత్రుడి మాటలు విన్న చండాలుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'పరహితము సేయఁ బూనిన। పురుషుఁడు పాపంబు సేసి పొందఁడు కీడుం;**
**బరముని యగు నగస్త్యుఁడు। పరోపకారార్థ కృతి నభవ్యుం డగునే?' 296**

**ప్రతిపదార్థం:** పరహితము= ఇతరులకు మేలు; చేయన్+పూనిన= చేయాలని పూనుకొన్న; పురుషుఁడు= మనిషి; పాపంబుచేసి= పాతకం చేసి; కీడున్= చేటును; పొందఁడు= అనుభవించడు; పరమముని+అగు= మునిముఖ్యు డయిన; అగస్త్యుఁడు= అగస్త్యముని; పరోపకారార్థ కృతిన్= ఇతరుల కొరకు చేసే మేలు పనివలన; అభవ్యుండు= దుష్టుడు; అగునే?= అవుతాడా?

**తాత్పర్యం:** 'మరొకడికి ఉపకారం చేయాలనుకొన్నవాడు పాపం చేసినా వాడికి ఏ కీడూ అంటకపోగా పరమముని అవుతాడు. లోకోపకారంగా చేసిన పనులవలన అగస్త్యముని దుష్టుడవుతాడా?' (కాడని భావం.)

**క. నావుడు మదాత్మ బ్రాహ్మణ। తా విద్వత్తాస్పదంబు; దానికిఁగా నే**
**నీ విధి యొనరించుట పా। పావేశము లేదు; దీని కడ్డుపడకువే! 297**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగానే; మత్+ఆత్మ= నా దేహం; బ్రాహ్మణతా= బ్రాహ్మణ ధర్మానికీ; విద్వత్తా= బ్రహ్మజ్ఞానానికీ; ఆస్పదంబు= నిలయం; దానికిన్+కాన్= ఆ దేహం కొరకే; నేను; ఈ విధి= ఈ పని; ఒనరించుట= చేయటం; పాప+ఆవేశము లేదు= పాపానికి ప్రవేశం లేదు; దీనికిన్= మాంసం తినటానికి; అడ్డుపడకువే= ఆటంకపెట్టకుమా.

**తాత్పర్యం:** 'నా దేహం అటు బ్రాహ్మణధర్మానికీ ఇటు బ్రహ్మజ్ఞానానికీ ఆలవాలమైనది. కనుక ఆ దేహంకొరకే నేను ఈ పని చేయాలనుకొన్నాను. ఏ పాపం చొరబారదు. ఈ మాంసం తినటానికి నీవు అడ్డం పడకుము'.

**క.** **అని ముని పల్కిన నంత్యజుఁ । డను 'మాంసము విడువ నోప కనుటగఁ దలఁపం**
**జనునె? భవదీయ తేజో । ధన హానికిఁ గరుణ పుట్టదా యెవ్వరికిన్?'** **298**

**ప్రతిపదార్థం:** అని ముని పల్కినన్= అని విశ్వామిత్రుడు మాటాడగానే; అంత్యజుఁడు= కడజాతివాడు; అనున్= ఇట్లా అన్నాడు; మాంసమున్= మాంసాన్ని; విడువన్= వదలుకొనటానికి; ఓపక= ఇష్టంలేక; అనుటగన్= అన్నట్లుగా; తలఁపన్+చనునే= ఆలోచించటం తగుతుందా; భవదీయ= నీదైన; తేజోధన= తేజస్సంపత్తియొక్క; హానికిన్= నష్టపోవటానికి; ఎవ్వరికిన్= ఎవరికైనా; కరుణ పుట్టదా?= కనికరం కలుగదా?

**తాత్పర్యం:** విశ్వామిత్రుడితో అంత్యజుడు ఈ విధంగా అన్నాడు. 'మాంసం వదలుకొనటం ఇష్టంలేక ఇట్లా అంటున్నా ననుకొనకుము. నీ తేజస్సంపద నష్టమవుతుంటే ఎవరికైనా జాలిపుట్టదా?'

**వ.** **అనవుడు గాధినందనుండు.** **299**

**ప్రతిపదార్థం:** అనవుడున్= చండాలుడు చెప్పగానే; గాధినందనుండు= గాధి కుమారుడైన విశ్వామిత్రుడు.

**తాత్పర్యం:** అని పలికిన చండాలుడితో విశ్వామిత్రుడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **'కరుణ గలవేని బ్రాణంబు గాచికొనఁగఁ । దలఁచు నాకు నిమ్మాంస మి మ్మలఘుచరిత**
**యట్టు లైన మ్రుచ్చిమియు లే దనృతమెడలి । పడయు వస్తువు సేయదు పాతకంబు.'** **300**

**ప్రతిపదార్థం:** అలఘుచరిత!= మహాత్మా!; కరుణ కలవేని= జాలి ఉన్నట్లయితే; ప్రాణంబు+కాచికొనఁగన్= ప్రాణం కాపాడుకొనాలని; తలఁచు= ఆలోచించే; నాకున్= నాకు; ఈ+మాంసము= ఈ కుక్కమాంసాన్ని; ఇమ్ము= ఇవ్వలసినది; అట్టులు+ఐనన్= అట్లా అయితే; మ్రుచ్చిమియున్= దొంగతనమూ; లేదు= ఉండదు; అనృతము= అబద్ధం; ఎడలి= వదలి; పడయు= పొందే; వస్తువు= పదార్థం; పాతకంబు చేయదు= ఎట్లాంటి పాపాన్ని కలిగించదు.

**తాత్పర్యం:** 'ఓ మహాత్మా! నా మీద నిజంగా జాలికలిగితే బ్రతకాలనుకొంటున్న నాకు ఈ కుక్క మాంసాన్ని ఇవ్వు. అట్లాగైతే నాకు దొంగతనం అంటదు. అబద్ధం ఆడకుండా పొందే వస్తువువలన ఏ పాపం కలగదు'.

**వ.** **అనిన విని చండాలుం డి ట్లనియె.** **301**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; చండాలుండు= అంత్యజుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ముని మాటలు విన్న చండాలుడు మళ్ళీ ఈ విధంగా అన్నాడు.

**క.** **'అతిశయిత పుణ్య దీప్తులు । ప్రతిగ్రహము నీచనరుని పాలం జేయన్**
**మతిఁ దలఁపఁ గూడునే? వి । శ్రుతగుణ! యే వెఱతు నింకఁ జూఱచుఱఁ బల్కన్.** **302**

**ప్రతిపదార్థం:** అతిశయిత= మీరుతున్న; పుణ్యదీప్తులు= పుణ్యంచేత ప్రకాశించేవారు; ప్రతిగ్రహమున్= దానం పుచ్చుకొనటాన్ని; నీచనరుని పాలన్+చేయన్= అధముడివలన చేయటానికి; మతి= మనస్సులో అయినా; తలఁపన్+కూడునే= మంచి చెడ్డలను ఆలోచించవచ్చునా, ఆలోచించకూడదని భావం; విశ్రుతగుణ!= వాసికెక్కినవాడా!; ఇంకన్= ఇంతకంటే; చుఱచుఱన్= కటువుగా; పల్కన్= మాట్లాడటానికి; వెఱతున్= జంకుతాను.

**తాత్పర్యం:** 'ఎంతో పుణ్యవంతులైన మీ బోటివారు ఒక అధముడినుండి దానం పుచ్చుకొనాలనే ఆలోచన మనసులోనైనా అనుకొనవచ్చునా? ఓ మహర్షీ! ఇంతకంటె కటువుగా మాట్లాడటానికి జంకుతున్నాను.

**వ. నీ వలచిన యట్లు సేయు' మని సారమేయమాంసం బిచ్చినఁ బుచ్చికొని బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె; నింద్రుండు తదనంతరంబ లోకంబుల వడదేఱ వర్షించె; నంత హర్షించి యత్తపస్విపర్యుండు దపోవిశేషంబున దోషంబు నీఁగికొని మనీషిజనస్తుత్యంబగు నిత్యవ్రతంబున విలసిల్లె; నాపత్సమయసమాచారం బిట్టిద' యని చెప్పిన భీష్మునితో భూవల్లభుండు 'ధర్మసూక్ష్మ ప్రకారం బింత దురవగాహం బగునే? యీ యితిహాసం బాకర్ణించుట నాడెందంబు విషాదంబునొందె' ననవుడు నతండు ధర్మంబు బహుశాఖాసమన్వితంబై యుండు; రాజులకు నెల్లతెఱంగులు నెఱంగవలయు; విషాదం బేల?' యనవుడు నజ్జనవిభుండు. 303**

**ప్రతిపదార్థం:** నీ వలచిన+అట్లు= నీకు ఇష్టమైనట్లు; చేయుము= చేయుము; అని; సారమేయ మాంసంబున్= కుక్కమాంసాన్ని; ఇచ్చినన్= ఇవ్వగా; పుచ్చికొని= తీసికొని; ప్రాణంబులు= ప్రాణాలు; రక్షించుకొని= కాపాడుకొని; విశ్వామిత్రుండు= విశ్వామిత్ర ముని; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబ= ఆ వెంటనే; ఇంద్రుఁడు= ఇంద్రుడు; లోకంబుల= జనుల; వడ+తేఱన్= తాపం తీరగా; వర్షించెన్= వాన కురిపించాడు; అంతన్= ఆ తరువాత; హర్షించి= సంతోషించి; ఆ తపసి వర్యుండు= ఆ ముని శ్రేష్ఠుడు; తపోవిశేషంబునన్= గొప్ప తపస్సుచేత; దోషంబున్= మాంసం తిన్న పాపాన్ని; ఈఁగికొని= పోగొట్టుకొని; మనీషిజన= విద్యావంతులచేత; స్తుత్యంబు+అగు= పొగడదగినదగు; నిత్య వ్రతంబునన్= ఎడతెరిపి లేని తపో నియమాలతో; విలసిల్లెన్= ప్రకాశించాడు; ఆపత్సమయ= విపత్కాలంలో; సమాచారంబు= వృత్తాంతం; ఇట్టిద= ఇట్లాంటిదే; అని చెప్పిన= అని పలికిన; భీష్మునితోన్= భీష్ముడితో; భూవల్లభుండు= ధర్మరాజు; ధర్మసూక్ష్మ ప్రకారంబు= ధర్మంయొక్క సరైన తీరు; ఇంత దురవగాహంబు= ఇంత దుర్బోధమైన; అగునే?= అవుతుందా?; ఈ ఇతిహాసంబు= ఈ కథను; ఆకర్ణించుటన్= వినటంవలన; నా డెందంబు= నా హృదయం; విషాదంబున్= దుఃఖాన్ని; ఒందెన్= పొందింది; అనవుడున్= అనగానే; ధర్మంబు= న్యాయం; బహుశాఖా సమన్వితంబు+ఐ= అనేక విభాగాలతో కూడుకొన్నదై; ఉండున్= ఉంటుంది; రాజులకున్= రాజులకు; ఎల్ల తెఱంగులు= అన్ని ధర్మ విధాలూ; ఎరుంగవలయున్= తెలియాలి; విషాదంబు= చింత; ఏల?= ఎందుకు?; అని బోధించినన్= అని ఉపదేశించగా; ఆ+జనవిభుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** నీకు నచ్చినట్లు చేసికొమ్ము' అంటూ ఆ చండాలుడు కుక్కమాంసాన్ని ఇచ్చాడు. దానిని పుచ్చుకొని విశ్వామిత్రుడు ప్రాణాలు కాపాడుకొని వెళ్ళిపోయాడు. ఆ వెంటనే ఇంద్రుడు ప్రజలందరి తాపం తీరేటట్లు వాన కురిపించాడు. ఆ తరువాత విశ్వామిత్రుడు తన తపోమహిమతో పాపం పోగొట్టుకొన్నాడు. విద్యావంతులంతా మెచ్చుకొనేటట్లు నిత్యవ్రతాలు చేశాడు. ఆపత్కాలంలోని సంగతి ఇట్లాంటిది - అన్నాడు భీష్ముడు. ధర్మరాజు 'సరైన ధర్మంతీరు తెలిసికొనటం ఇంతకష్టమా? ఈ తాతలనాటి కథ విన్న దగ్గరనుండి నాకు చాలా విచారంగా ఉన్నది, అన్నాడు. భీష్ముడు 'ధర్మం ఎన్నో శాఖలతో ఎన్నో తీరులలో ఉంటుంది. వాటన్నిటినీ రాజు తప్పక తెలిసికొనాలి. దానిని గూర్చి చింత ఎందుకు?' అన్నాడు. అప్పుడు ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

భీష్ముఁడు ధర్మజునకు శరణాగత రక్షణ సుకృతం బెఱింగించుట (సం. 12-141-4)

**క.** **'శరణాగతసంరక్షణ । పరులకు సమకూరు నెట్టి పాటి ఫలము? ని**
**ర్భరకరుణాకర! పరమా । దరమున నెఱిఁగింపు నాకు దాని తెఱంగున్.** **304**

**ప్రతిపదార్థం:** నిర్భరకరుణా+ఆకర!= నిలువెల్ల జాలికలవాడా!; శరణాగత= శరణన్న వాడిని; సంరక్షణపరులకున్= ఆదుకునే తత్త్వం కలవారికి; ఎట్టిపాటి= ఎంతమేర; ఫలము= ప్రయోజనం; సమకూరున్= కలుగుతుంది; నాకున్= నాకు; దాని తెఱంగున్= దాని తీరును; పరమ ఆదరమునన్= ఎంతో దయతో; ఎఱిఁగింపు= తెలియచెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ భీష్ముడా! శరణన్నవారిని ఆదుకొనాలి అనుకొనేవారికి ఏ పాటి ఫలితం దక్కుతుంది? దాని తీరంతా నాకు దయతో చెప్పుము'.

**ఆ.** **అనిన భీష్ముఁ డిట్టులను 'ముచుకుందుండు । నాఁగఁ బరఁగు ధరణినాయకుండు**
**దనుజమంత్రిచేత వినినది యొక కథ । యఖిలపాపహరణ మాచరించు.** **305**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మరాజు అనగానే; భీష్ముఁడు; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; ముచుకుందుండు నాఁగన్= ముచుకుందు డనే పేరుతో; పరఁగు= ఒప్పే; ధరణి నాయకుండు= రాజు; దనుజ మంత్రిచేతన్= రాక్షసుల మంత్రి శుక్రాచార్యుడివలన; వినినది= ఆలకించినట్టిది; ఒక కథ= ఒకానొక ఇతిహాసం; అఖిల పాపహరణమున్= సమస్త పాపాలను పోగొట్టటం; ఆచరించున్= చేస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజుతో భీష్ముడు ఇట్లా చెప్పటం మొదలుపెట్టాడు: 'వెనుకటికి ముచుకుందు డనే రాజు, రాక్షసమంత్రి శుక్రాచార్యుడు చెప్పగా విన్న కథ ఒకటి ఉన్నది. ఆ కథ పాపాలన్నిటిని పోగొట్టుతుంది.

**వ.** **అయ్యితిహాసంబు సెప్పెద; దాన నీ యడిగిన యర్థంబు దెలియు; నవహితుండ వై యాకర్ణింపుము.306**

**ప్రతిపదార్థం:** ఆ+ఇతిహాసంబు= ఆ వెనుకటికతను; చెప్పెదన్= చెప్పుతాను; దానన్= ఆ కథ వినటంవలన; నీ+అడిగిన= నీవు కోరిన; అర్థంబు= ప్రయోజనం; తెలియున్= తెలుస్తుంది; అవహితుండవు+ఐ= మనస్సు పెట్టినవాడవై; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ కథంతా చెప్పుతాను. అది నీవు కోరిన ఫలితాన్ని తెలుపుతుంది. మనస్సుపెట్టి వినుము.

**సీ.** **పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి । తినియును బె క్కమ్మికొనియు నదియ**
**బ్రదుకుగా దానికి బహుసాధనంబులు । సవరించుకొని మహాటవిఁ జరింప**
**నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి । సకలజీవులకు నాశంబు పుట్టు**
**నట్టిదియై కానయంతయు జలమయం । బైన బెగ్గిలి యన్నరాధముండు**

**తే.** **వేగ వఱ్ఱోడి యెల్లను వెడలి మిఱుత । నొక వనస్పతి జొంపమై యున్న దానిఁ**
**జెంది రాతిరి యగుటయు శిలయ సెజ్జ । గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర!** **307**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= ధర్మరాజా!; పాప+ఆత్ముఁడు= పాపస్వభావంగల; ఒక బోయ= ఒక బోయవాడు; పక్షులన్= పిట్టలను; వధియించి= చంపి; తినియును= తినీ; పెక్కు+అమ్మికొనియున్= చాలా అమ్ముకొనీ; అదియ= పిట్టలను చంపితినటమే, అమ్ముకోవటమే; బ్రదుకుగాన్= బతుకు తెరువుగా; దానికిన్= ఆ బతుకు తెరువుకు; బహుసాధనంబులు= అనేకమైన పనిముట్లను; సవరించుకొని= కూర్చుకొని; మహా+అటవిన్= పెద్ద అడవిలో; చరింపన్= తిరుగుతుండగా; ఒకనాఁడు= ఒకరోజు; పెనువానయును=

పెద్ద వానా; గాలియును= గాలీ; ముట్టి= తాకి; సకల జీవులకున్= సమస్తమైన జీవరాశికి; నాశంబు పుట్టునట్టిది+ఐ= విపత్తు కలిగించేదై; కాన+అంతయున్= అడవి అంతా; జలమయంబు+ఐనన్= నీటిమయం కాగా; బెగ్గిలి= బెదరి; ఆ+నరాధముండు= నీచుడైన ఆ బోయవాడు; వేగన్= వడిగా; వట్టు+ఓడి= వాన ఉరవడినంతటినీ; వెడలి= దాటి; మిఱుతన్= మెరకమీద; ఒక వనస్పతి= ఒక చెట్టు; జొంపము+ఐ ఉన్నదానిన్= గుబురుగా ఉన్నదానిని; చెంది= చేరి; రాతిరి+అగుటయున్= చీకటి పడటంవలన; శిలయ= బండరాయే; సెజ్జ కాఁగన్= పడక కాగా; శీత+ఆర్తుఁడు+ఐ= చలికి బాధపడుతూ; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** పాపభావాలుగల ఒక బోయవాడు ఉండేవాడు. అతడు పిట్టలను పట్టి కొన్నిటితో పొట్టపోసుకొంటూ ఎక్కువగా అమ్ముకొంటూ బ్రతికేవాడు. అందువలన పిట్టలను పట్టుకొనే పనిముట్లను సమకూర్చుకొని అడవిలో తిరుగుతుండగా ఒకనాడు పెద్ద గాలీవానా వచ్చింది. ఆ వానవలన అన్ని రకాల జీవాలకూ ముప్పు ముంచుకొచ్చేటట్లు అడవంతా నీటిమయమైంది. ఆ బోయవాడు బెదరిపోయాడు. వాన ఉరవడిని తట్టుకొని మెరక చేరాడు. గుబురుగా ఉన్న చెట్టు క్రిందికి చేరాడు. రాత్రి అవటంవలన అక్కడే రాతి బండమీద చలిగాలికి గడగడ వణుకుతూ పడుకొన్నాడు.

**క.** **ఆ లుబ్ధకుఁ డత్తరువర। మాలోకించి కడు భక్తి ననియె 'నిచటి భూ**
**తాలిం గొలిచెదఁ గరుణా। శీలత ననుఁ గాచుటకు విశిష్ట వినీతిన్.'** **308**

**ప్రతిపదార్థం:** ఆ లుబ్ధకుఁడు= ఆ బోయవాడు; ఆ+తరువరమున్= గుబురుగా ఉన్న ఆ పెద్ద చెట్టును; ఆలోకించి= చూచి; కడుభక్తిన్= ఎక్కువైన ఆరాధనా భావంతో; అనియెన్= అన్నాడు; కరుణాశీలతన్= జాలిస్వభావంతో; ననున్= నన్ను; కాచుటకున్= రక్షించటానికి; ఇచటి భూతాలిన్= ఈ అడవిలోని ప్రాణికోటిని; విశిష్ట వినీతిన్= మిక్కిలి వినయంతో; కొలిచెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** (ఆ బోయవాడు) గుబురుగా ఉన్న ఆ పెద్ద చెట్టును చూచి ఎంతో భక్తితో ఇట్లా అన్నాడు: 'నా మీద కనికరం చూపి నన్ను కాపాడటానికి ఈ అడవిలోని జంతువులన్నింటిని ఎంతో వినయంగా సేవిస్తాను'.

**వ.** **అని యి ట్లప్పక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించియుండ నమ్మహీరుహంబు కోటరంబున వసియించియుండునది యొక్కకపోతంబు దనవల్లభ యెటయేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి.** **309**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; ఆ+పక్షిధ్వంసకుండు= పిట్టలను చంపే బోయవాడు; శయనంబు= రాతిపడకను; ప్రాపించి+ఉండన్= పొంది ఉండగా; ఆ+మహీరుహంబు= ఆ చెట్టుయొక్క; కోటరంబునన్= తొర్రలో; వసియించి+ఉండునది= కాపురం ఉండే; ఒక కపోతంబు= ఒక పావురం; తన వల్లభ= తన భార్య; ఎట+ఏని= ఎక్కడకేని; మేఁతకున్ పోయి= తిండి కొరకు పోయి; రాక= రాకుండా; తడసినన్= ఆలసించగా; శోకించి= దుఃఖించి.

**తాత్పర్యం:** అనుకొంటూ బోయవాడు రాతిమీద పడుకొన్నాడు. ఆ చెట్టు మీదే ఒక తొర్రలో ఒక పావురం కాపురం ఉన్నది. ఆ పావురం మేతకు పోయిన తన భార్య ఎంతకూ రాలేదని విచారిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **ఎచట నున్నది యొక్కొ యింత ప్రొ? ద్దొకచోట। నుండునే ననుఁ బాసి యుజ్జ్వలాంగి?**
**యమ్మేను లేకున్న నిమ్మేని కలిమి ని। రర్థకం బధికానురాగయుక్త**
**యగు సతిగుణముల యైహికాముష్మి క। సుఖసాధనంబులు సువ్వె! పతికి**
**యేకారణంబున నే మయ్యెనో వాన। యేపునఁ దెగియెఁ గానోపు నకట!**

**తే. నేమి సేయుదు? మందిరం బిపుడు పాడు । వాఱుచున్నది' యనఁగ నప్పలుకు లెల్ల**
**బోయవలలోన నున్న కపోతి విని మ । నంబు సంతోషపూరమగ్నంబు గాఁగ. 310**

**ప్రతిపదార్థం:** ఉజ్జ్వల+అంగి= మిలమిల మెరిసే శరీరం గల నా భార్య; ఇంత ప్రొద్దు= ఇంతసేపూ; ఎచటన్= ఎక్కడ; ఉన్నది+ఒక్కొ!= ఉన్నదో గదా!; ననున్ పాసి= నన్ను వదలిపెట్టి; ఒక చోటన్+ఉండునే?= ఎక్కడైనా ఉంటుందా?; ఆ మేను= ఆ శరీరం; లేక+ఉన్నన్= లేకపోతే; ఈ మేని కలిమి= ఈ నా దేహసంపద; నిరర్థకంబు= పనికి రానిది అవుతుంది; అధిక+అనురాగయుక్త+అగు= మిక్కిలి ప్రేమతోకూడి ఉండేది అయిన; సతిగుణములన్= భార్య మంచి స్వభావాలే; పతికిన్= పెనిమిటికి; ఐహిక= ఈ లోకంలోనూ; ఆముష్మిక= పరలోకంలోనూ; సుఖసాధనంబులు సువ్వె!= సౌఖ్యానికి ఉపకరించే వస్తువులు సుమా!; ఏ కారణంబునన్= ఏమి నిమిత్తంగా; ఏమి+అయ్యెనో= ఏమైపోయిందో; అకట!= అయ్యో!; వాన ఏపునన్= వాన జోరువలన, జోరువాన వలన; తెగియెన్ కానోపున్= చచ్చిపోయిందేమో; ఏమి చేయుదున్?= ఏమి చేసేది?; ఇపుడు= భార్యలేనప్పుడు; మందిరంబు= ఇల్లు; పాడు పాఱుచున్+ఉన్నది= పాడుపడి పోయినట్టున్నది; అనినన్= అనగానే; ఆ పలుకులు+ఎల్లన్= ఆ మాటలన్నీ; బోయవలలోనన్= బోయవాడి వలలో; ఉన్న= చిక్కి ఉన్న; కపోతి= పెంటి పావురం; విని; మనంబు= మనస్సు; సంతోష పూరమగ్నంబు+కాఁగన్= సంతోషంతో నిండుగా మునిగి పోగా.

**తాత్పర్యం:** 'నా భార్య ఇంతసేపూ ఎక్కడుందో, నన్ను వదలి ఎక్కడా ఉండదు. ఆమె లేని నా బ్రతుకు ఎందుకూ పనికిరాదు. అనురాగవతి అయిన భార్య సుగుణాలే మగడికి ఇహపరలోకాల్లో సుఖసాధనాలు. ఏ కారణంగా ఏమైపోయిందో ఏమో! కుండపోతగా వానపడటంవలన చచ్చిపోయిందేమో! నేను ఏమి చేసేది? ఆమె లేని నా ఇల్లు పాడుపడిపోయినట్లున్నది' అని అంటున్న పావురం మాటలన్నీ పెంటి విన్నది. పట్టలేనంత సంతోషంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పతి మదికి నింత యెక్కిన । యతివ గదా పుణ్యవతి; ప్రియాలాపము లీ**
**గతి వినఁ గాంచిఁ జన్మము । గృతకృత్యం బయ్యె నాకు; గెలిచితి జమునిన్.' 311**

**ప్రతిపదార్థం:** పతి మదికిన్= పెనిమిటి మనస్సుకు; ఇంత ఎక్కిన= ఇంత ఇష్టమైన; అతివ కదా= స్త్రీయే కదా; పుణ్యవతి= పుణ్యాత్మురాలు; ప్రియ+ఆలాపములు= పెనిమిటి మాటలు; ఈ గతిన్= ఇట్లా; వినన్ కాంచితిన్= విన గలిగాను; నాకున్= నాకు; జన్మము= పుట్టుక; కృతకృత్యంబు+అయ్యెన్= ధన్యమైనది; జమునిన్= యముడిని; గెలిచితిన్= జయించాను.

**తాత్పర్యం:** 'పెనిమిటి మెప్పుపొందిన స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. నన్ను గురించి నా మగడి మాటలు చెవులారా వినగలిగాను. నా జన్మ ధన్యమైనది. యముడిని గెలిచాను'.

**వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱంగెఱింగించి, 'విధి కృతంబునకు వగవంబని లే' దని మఱియు నిట్లనియె. 312**

**ప్రతిపదార్థం:** అని; ఉల్లంబునన్+అ= మనస్సులోనే; ఉగ్గడించి= చెప్పుకొని; పతికిన్= పెనిమిటికి; తన తెఱంగున్= తాను ఉన్న తీరును; ఎఱింగించి= తెలిపి; విధి కృతంబునకున్= బ్రహ్మ చేష్టకు; వగవన్= విచారించటం వలన; పనిలేదు= ప్రయోజనం లేదు; అని; మఱియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పింది.

**తాత్పర్యం:** అని మనస్సులో అనుకొంటూ తన ఉనికిని తన పెనిమిటికి తెలిపింది. 'బ్రహ్మ చేష్టకు విచారించి ప్రయోజనం లేదు' అని చెప్తూ మళ్ళీ ఇట్లా అన్నది.

చ. 'శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధిక ధర్మముగా బుధకోటి సెప్పు; నీ
వరసి మహార్తు వీని శరణాగతు నోపినభంగి నాపదం
బొరయకయుండఁజేయుము ప్రభూతపు సీతునఁ గొంకు వోయెడున్. 313

**ప్రతిపదార్థం:** శరణము+చొచ్చినన్= శరణాగతి పొందగా; తగన్= ఒప్పగా; ప్రసన్నతన్= దయతో; కైకొని= అంగీకరించి; రక్షణంబు= ఆశ్రయం; సాదరముగన్= గౌరవంగా; చేయుట= ఆచరించటం; అత్యధిక ధర్మముగాన్= గొప్ప పుణ్యకార్యంగా; బుధకోటి= పండితులు; చెప్పున్= చెప్పుతారు; నీవు; అరసి= విచారించి; మహా+ఆర్తున్= గొప్ప బాధలో ఉన్న; శరణాగతున్= అండ కోరుతున్న; వీనిన్= ఈ బోయవాడిని; ఓపిన భంగిన్= తగినంతలో; ఆపదన్+పొరయక+ఉండన్= ఇక్కట్టు పాలు కాకుండా; చేయుము= చూడుము; ప్రభూతపుసీతునన్= ఎక్కువ అవుతున్న; చలివలన; కొంకుపోయెడున్= కొంకరలు పోతున్నాడు.

**తాత్పర్యం:** 'ఆదుకొనుమంటూ ఆశ్రయించినవాడిని కనికరంతో ఆదరించి ఆదుకొనటంకన్న మించిన పుణ్యం మరొకటి ఉండదంటారు పెద్దలు. గాలివానలో చలికి వణకిపోతున్న ఈ బోయవాడిని నీకు చేతనయినంతలో కాపాడుము'.

క. అని యేర్పడ భాషిం । చిన విని శోకము డిగ్గ విడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని । ట్లనియె మనుజభాషణముల నా లుబ్ధకుతోన్. 314

**ప్రతిపదార్థం:** అని; ఏర్పడన్= తేటతెల్లంగా; భాషించినన్= పెంటి పలుకగా; విని= ఆలకించి; శోకమున్= భార్య ఏమై పోయిందో అనే దుఃఖాన్ని; డిగ్గ విడిచి= వదలిపెట్టి; విహగము= ఆ మగపావురం; కరుణన్= జాలితో; తన జాతిన్= తన (పావురం) తెగను; ఆ+లుబ్ధకుతోన్= ఆ బోయవాడితో; చెప్పి; మనుజ భాషణములన్= మానవుల మాటలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** పెంటి మాటలు స్పష్టంగా మగపావురం చెవిని బడ్డాయి. భార్య ఏమయిందో అనే విచారాన్ని అది వదలిపెట్టింది. బోయవాడిమీద జాలిపడింది. తాను పావురాన్నని చెప్పుకొన్నది. మానవుల మాటలతో అతడితో ఇట్లా అన్నది.

క. 'ఓ యన్న! డస్సినాఁడవు । మా యింటికి నతిథి వైతి; మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం; । బేయది భవదీప్సితార్థ మెఱిఁగింపు తగన్.' 315

**ప్రతిపదార్థం:** ఓ అన్న!= ఓ బోయన్న!; డస్సినాఁడవు= అలసిపోయి ఉన్నావు; మా ఇంటికిన్= మా మందిరానికి; అతిథివి+ఐతి(వి)= అతిథివయ్యావు (అతిథి= రాత్రి మాత్రం ఉండిపోయేవాడు, అకస్మాత్తుగ అన్నంవేళకు వచ్చినవాడు); మసలక= జాగుచేయకుండా; నీకున్= నీకు; ఆతిథ్యంబు= విందును; ఏ+అది= ఎట్లాంటిది; చేయవలయున్= చేయాలి; భవత్+ఈప్సిత= నీవు కోరుకున్న; అర్థమున్= వస్తువును; తగన్= తగినట్లుగా; ఎఱిఁగింపు(ము)= తెలియచెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ అన్నా! నీవు చాలా బడలికతో ఉన్నావు. మా ఇంటికి వచ్చిన అతిథివి నీవు. నీకు ఆలస్యంలేకుండా వెంటనే అతిథి విందు చేయాలి. నీకు కావలసిన వేహో తెలియచెప్పవలసింది'.

చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి 'సీ
తున సకలాంగకంబులుఁ బ్రతున్నము లయ్యెడుఁ; దీనిఁ బాపవే!'
యనిన విహంగమంబు రయమారఁగ నచ్చటి పుల్లలెల్ల ము
క్కునగొని తెచ్చి ప్రోవిడి యకుంఠిత మైన దయాగుణంబునన్. 316

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని మగ పావురం పలుకగానే; ఉల్లము= మనస్సు; ఎంతయున్= ఎంతో; ప్రియంబు= సంతోషం; వహింపఁగన్= పొందగా; పక్షివైరి= పిట్టల విరోధి అయిన బోయవాడు; సీతునన్= చలివలన; సకల+అంగకంబులున్= అన్ని అవయవాలు; ప్రతున్నములు= సలుపుపెట్టబడ్డవి; అయ్యెడున్= అవుతున్నాయి; దీనిన్= ఈ చలిని; పాపవే= పోగొట్టవా; అనినన్= అనగానే; విహంగమంబు= ఆ మగ పావురం; అకుంఠితము+ఐన= మొక్కవోనిదైన; దయాగుణంబునన్= జాలిస్వభావంతో; రయము+ఆరఁగన్= ఎక్కువ వేగంగా, గబగబా; అచ్చటి పుల్లలు+ఎల్లన్= అక్కడి చిదుగు లన్నింటిని; ముక్కునన్= ముక్కుతో; కొనితెచ్చి= కరచితెచ్చి; ప్రోవిడి= కుప్పపోసి.

**తాత్పర్యం:** ఆ గువ్వ పలుకులు విన్నాడు బోయవాడు. సంతోషించాడు. 'ఈ చలికి నా అవయవాలు తీపు పెడుతున్నాయి. కనుక ఈ చలిని పోగొట్టవలసింది' అని అడిగాడు. ఆ పావురం జాలిపడి గబగబా అక్కడి చిదుగులన్ని ఏరి ముక్కుతో కరచి తెచ్చి పోగుపెట్టి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఆ పొంతపల్లియకు రయంబునం జని పుల్లతల సంగతంబైన యింగలంబు. 317**

**ప్రతిపదార్థం:** ఆ పొంత పల్లియకున్= ఆ ప్రక్కనే ఉన్న పల్లెకు; రయంబునన్= గబగబా; చని= వెళ్ళి, పుల్లతల= చిదుగు చివరన; సంగతంబు+ఐన= కూడి ఉన్నట్టి; ఇంగలంబు= అగ్గిని.

**తాత్పర్యం:** ఆ పక్కనే ఉన్న పల్లెకు గబగబా పోయింది. చిదుగు చివరన అంటుకొని ఉన్న నిప్పును. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కొని వచ్చి పుల్ల ప్రోవునఁ। దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని**
**ట్లను బోయతోడ 'మే నీ। యనలంబునఁ గాఁచికొనుటకై లె' మ్మనఘా! 318**

**ప్రతిపదార్థం:** కొనివచ్చి= తీసికొని వచ్చి; పుల్లప్రోవునన్= చిదుగుల కుప్పయందు; తనుకంగాన్ చేసి= (రాజుకొనేటట్లు చేసి)మండింప చేసి; నెమ్మి= సంతోషం; తళుకు ఒత్తఁగన్= ప్రకాశించగా; బోయతోడన్= బోయవాడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది; అనఘా!= పుణ్యాత్ముడా!; మేను= ఒంటిని; ఈ అనలంబునన్= ఈ నిప్పుచేత; కాఁచికొనుటకున్+ఐ= చలికాపు కాచుకొనటానికి; లెమ్ము= లేచిరమ్ము.

**తాత్పర్యం:** తీసికొనివచ్చి పోగేసిన పుల్లలన్నీ ముట్టుకునేటట్లు చేసింది. ఎంతో సంతోషపడుతూ బోయవాడిని చలికాచుకొనటానికి మంట దగ్గరకు రమ్మని పిలిచింది.

**చ. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దనయంగకంబు ల**
**య్యనలశిఖాకలాపమున నల్లన యల్లన కాఁచి శీత బా**
**ధన ముడుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలి చాలఁ దోఁచెఁ; దోఁ**
**చిన నెఱిఁగించె గువ్వ కది సేయ నుపాయము లేక యాత్మలోన్. 319**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; వాఁడు= ఆ బోయవాడు; గువ్వ= అడవి పావురం; హృదయంబు= మనస్సు; అలరన్= సంతోషించేటట్లు; తన+అంగకంబులు= తన అవయవాలన్నీ; ఆ+అనల శిఖా= ఆ నిప్పుల మంటల; కలాపమునన్= సముదాయంచేత; అల్లన అల్లన= మెల్లమెల్లగా; కాఁచి= కాపుపెట్టుకొని; శీత బాధనము= చలి బాధ; ఉడుగంగన్+చేయఁగన్= తీర్చుకొనగా; పదంపడి= వెంటనే; ఆఁకలి; చాలన్+తోఁచెన్= బాగా అనిపించింది; తోఁచినన్= ఆకలి అనిపించగానే; గువ్వకున్= ఆ పావురానికి; ఎఱిఁగించెన్= తెలిపాడు; అది+చేయన్= ఆకలి తీర్చటానికి; ఉపాయము లేక= మార్గం కనపడక; ఆత్మలోన్= తనలో.

**తాత్పర్యం:** గువ్వ సంతోషించేటట్లు ఆ బోయవాడు ఆ మంటలో మెల్లమెల్లగా తన ఒంటిని కాచుకొని చలిబాధ తీర్చుకొన్నాడు. అంతలో ఆకలిగా అనిపించింది. పావురంతో అదే చెప్పాడు. ఆ గువ్వకు అతడి ఆకలి తీర్చే మార్గం ఏమి తోచలేదు. తనలో తాను. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. వగచి వెలవెలంబాఱి తలంచికొని వాని కిట్లనియె. 320**

**ప్రతిపదార్థం:** వగచి= విచారించి; వెల వెలన్+పాఱి= తెల తెల బోయి; తలంచికొని= స్మరించి; వానికిన్= ఆ బోయవాడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** దుఃఖించి వెలవెలపోతూ తలచుకొంటూ ఆ బోయవాడితో ఇట్లా చెప్పింది.

**తే. ఖగములకు జీవనం బనఁ గలదె సంగ్ర। హించినట్టిది యాఁకలి కేమియైన**
**మాకు దొరకొన్నఁ దిందుముగాక!; యైన । నీవు డస్సితి వాతిథ్యనియతి వలయు. 321**

**ప్రతిపదార్థం:** ఖగములకున్= పిట్టలకు; జీవనంబు= బతకడానికి కావలసిన తిండి మొదలైనవి; సంగ్రహించినట్టిది= కూడబెట్టుకొన్నట్టిది; అనన్ కలదె= అనేది ఉన్నదా (ఉండదని భావం); ఆఁకలికిన్= ఆకలికి; ఏమి+ఐనన్= ఏదైనా; మాకు దొరకొన్నన్= మాకు లభిస్తే; తిందుము+కాక= తింటాం కాక; ఐనన్= అయినప్పటికీ; నీవు; డస్సితి(వి)= అలసిపోయావు; ఆతిథ్యనియతి= అతిథి నియమం; వలయున్= తప్పనిసరిగా చేయాలి.

**తాత్పర్యం:** పిట్టల బతుకుల్లో తిండిని కూడబెట్టుకొనటం అనేది ఉండదు. ఆకలికి దొరికింది ఏదైనా తింటాం. అయితే నీవు బాగా అలసిపోయి ఉన్నావు. తప్పనిసరిగా నీ ఆకలి తీర్చాలి.

### కపోతంబు దన శరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట (సం. 12-142, 143)

**వ. నా శరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము.' 322**

**ప్రతిపదార్థం:** నా శరీరంబున్= నా ఒంటిని; ఆహారంబుగాన్= తినటానికి గాను; ఇచ్చెదన్= సమర్పిస్తాను; కొనుము= తీసికొమ్ము'.

**తాత్పర్యం:** నా శరీరాన్ని నీకు ఆహారంగా అర్పిస్తాను. తీసికొమ్ము'.

**క. అని పలికి యగ్ని వలగొని । తన దేహము దానిలోనఁ దడయక యిడినం**
**గని బోయ విస్మయంబున । మనమూనఁగఁ గొంతసేపు మ్రాన్పడి యుండెన్. 323**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాట్లాడి; అగ్నిన్ వలగొని= మంట చుట్టూ తిరిగి; దానిలోనన్= ఆ నిప్పుల మంటల్లో; తడయక= జాగుచేయకుండా; తన దేహము= తన శరీరం; ఇడినన్= పడవేయగా; కని= చూచి; బోయ= బోయవాడు; మనము= మనస్సు; విస్మయంబునన్= ఆశ్చర్యంలో; ఊనఁగన్= తగుల్కొనగా; కొంతసేపు= కొద్దిసేపు; మ్రాన్పడి+ఉండెన్= కొయ్యబారిపోయి ఉన్నాడు.

**తాత్పర్యం:** అని గువ్వ చెప్పి వెంటనే మంటచుట్టూ తిరిగి ఆ నిప్పుల మంటల్లో పడిపోయింది. అది చూచి బోయవాడు నివ్వెరపోయాడు. కొంచెంసేపు కొయ్యబారి పోయినట్లు ఉండిపోయాడు.

**వ. పదంపడి. 324**

**తాత్పర్యం:** ఆ తరువాత - (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. 'కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం గారుణ్య మేపార ని**
**ప్పులుఁ గి ట్లిచ్చునె మేను? నాదు చరితంబుల్ నిందకుం బట్టులై**
**తలఁపన్ వచ్చిన నింత కీ డగునె యేతత్క్రూరతా ఘోర చే**
**ష్టలు మానంగలవాఁడఁ; బక్షి గురువై సంధించె సద్బోధమున్.' 325**

**ప్రతిపదార్థం:** జగతిన్= లోకంలో; ఈ+మెయి పౌరుషంబు= ఈ రీతి సాహసం; కలదే= ఉన్నదా; కారుణ్యము= దయ; ఏపారన్= ఎక్కువ కాగా; ఈ+పులుఁగు= ఈ గువ్వ; ఇట్లు= ఇట్లా; మేనున్= శరీరాన్ని; ఇచ్చునె?= ఇస్తుందా?; నా+చరితంబుల్= నా నడవళ్ళు; నిందకున్= దూషణకు; పట్టులు+ఐ= నెలవులై; తలఁపన్+వచ్చినన్= ఆలోచించగా; ఇంతకీడు= ఇంత పాటి ఆపదను; అగునె= తెచ్చిపెట్టుతుందా; ఏతద్= ఇట్లాంటి; క్రూరతా ఘోరచేష్టలు= దయలేని భయంకరమైన చేతలు; మానన్+కలవాఁడన్= నిలిపివేస్తాను; పక్షి= గువ్వ; గురువై= బోధకుడై; సద్బోధమున్= మంచి తెలివిని; సంధించెన్= పొందించింది.

**తాత్పర్యం:** 'లోకంలో ఇట్లాంటి సాహసం, పురుష ధర్మం ఎక్కడైనా ఉంటుందా? బాగా జాలిపడి ఈ గువ్వ ఈ తీరున తనను అర్పించుకొంటుందా? నా నడవడి ఈ లోకంలో నిందలపాలయింది. ఆలోచించగా నా నడవడి ఇంతటి విపత్తును కలిగిస్తుందా? ఇక ఇట్లాంటి దయాదాక్షిణ్యాలు లేని ఘోరపు పనులు చేయను. ఈ పిట్ట నాకు గురువై మంచి తెలివిని తెప్పించింది'.

**వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు నంత నిలువక. 326**

**ప్రతిపదార్థం:** అని; అంతరంగంబునన్= మనస్సులో; వైరాగ్యంబు= విరక్తి; నిరంతరంబు= ఎడతెగనిది; అగుటయున్= కావటంవలన; అంతన్= అక్కడ; నిలువక= ఉండలేక.

**తాత్పర్యం:** అని మనస్సులో వీడని విరక్తిని పొందాడు. అందువలన అక్కడ ఉండలేక. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. 'ఇది యి ట్లాలిని బంధులం దొఱఁగి తా నీ యగ్నిలోఁ గూలె నొ**
**ప్పిదమై యుండఁగ నిట్టి తెంప యెలయం బెంపారు వైరాగ్య సం**
**పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యత్వ మొం**
**దెద నే నిప్పుడ' యంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁడై. 327**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ గువ్వ; ఇట్లు= ఈ విధంగా; ఆలిని= భార్యను; బంధులన్= చుట్టపక్కాలను; తొఱఁగి= వదలి, విడిచి; ఒప్పిదమై+ఉండఁగన్= యోగ్యమై ఉండగా; తాను= తనకు తానుగా; ఈ అగ్నిలోన్= ఈ నిప్పుల్లోకి; కూలెన్= పడిపోయింది; ఇట్టి= ఇట్లాంటి; తెంపు+అ= తెగువయే; ఎలయన్= కలుగగా; పెంపారు= ఎక్కువవుతున్న; వైరాగ్య సంపదన్= విరక్తి సంపత్తిచేత; పాపంబులన్+ఎల్లన్= పాపాలన్నిటిని; త్రుంపఁగన్= పోగొట్టుకొనటానికి; నేను; ఇప్పుడు+అ= ఇప్పుడే; మహాప్రస్థాన= లోకాంతర యాత్ర అనే; పుణ్యత్వమున్= ధర్మాన్ని; ఒందెదన్= పొందుతాను; అంచున్= అంటూ; మానసము= మనస్సు; శాంతిన్+పొందన్= ఊరట పొందగా; నిర్మోహుఁడు+ఐ= మమకారం లేనివాడై.

**తాత్పర్యం:** ఈ పావురం ఇట్లా తనవారి నందరిని వదలుకొని తనకు తానుగా ఈ నిప్పుల్లోకి దూకింది. ఇట్లాంటి తెగువతనంతో కూడా పాపం పోగొట్టుకొని వైరాగ్యభావంతో ఇప్పుడే దేహయాత్ర చాలిస్తాను. పుణ్యాత్ముడ నవుతాను' అని మనసులో ఊరటపొందాడు. మమకారం లేనివాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వలలోన నున్న పులుఁగుల । వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం**
**గల పక్షి నిహతిసాధన । ములు నచటనె యుండఁ బోయె బోయ నియతుఁడై. 328**

**ప్రతిపదార్థం:** బోయ= బోయవాడు; వలలోనన్= వలలోపల; ఉన్న= ఉన్నట్టి; పులుఁగులన్= పిట్టలను; వెలు పడఁగాన్= బయటపడేటట్లు; విడిచి= వదలి; వలయున్= వలా; వెండియున్= ఇంకా; తనకున్ కల= తనకున్నట్టి; పక్షినిహతిసాధనములున్= పిట్టలను చంపే పరికరాలను; అచటనె+ఉండన్= అక్కడే ఉండగా; నియతుఁడు+ఐ= నియమం కలవాడై; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ బోయవాడు వలలో పట్టి ఉంచిన పిట్టల నన్నిటిని బయటకు వదలిపెట్టాడు. పిట్టలను పట్టి చంపే వలనూ పనిముట్లనూ అక్కడే ఉంచేశాడు. నియమం పూని పోయాడు.

**ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు । శోకవహ్నిఁ జిత్త మాకులముగ**
**నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె । నశ్రుజలతరంగితాస్య యగుచు. 329**

**ప్రతిపదార్థం:** ఆ+కపోతి= ఆ పెంటిపావురం; నాథుఁడు= తన పెనిమిటి; అగ్నిలోన్= నిప్పుల్లో; పడుటకున్= పడినందుకు; శోకవహ్నిన్= దుఃఖాగ్నిచేత; చిత్తము= మనస్సు; ఆకులముగన్= వ్యాకులపాటు చెందగ; ఎలుఁగు= గొంతు; రాలుపడఁగన్= వణకిపోగా; అశ్రుజల తరంగిత= పొంగిపొర్లుతున్న కన్నీరుగల; ఆస్య+అగుచున్= ముఖం కలదవుతూ; ఇట్లు+అని= ఈ విధంగా అని; పలవించెన్= ఏడ్చింది.

**తాత్పర్యం:** బోయవాడి తిండికొరకు నిప్పుల్లో పడ్డ తన పెనిమిటిని గూర్చిన దుఃఖంతో పెంటి మనస్సు కలవరపడింది. గొంతు వణకిపోయింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

**క. 'నా యాఁకలి కోర్వ వెపుడు । వేయైనను నేఁ గొనంగ వెండి యనుభవిం**
**తాయాసపడుటఁ గనుఁగొని । నోయుదు ననుఁ బాసి యిటు సనుట దగ వగునే?' 330**

**ప్రతిపదార్థం:** ఎపుడున్= ఎల్లప్పుడూ; నా+ఆఁకలికిన్= నా ఆకలికి; ఓర్వవు= తాళలేవు; వేయి+ఐనను= ఏది ఏమైనా; నేన్ కొనంగన్= నేను తినగా; వెండి= ఆ తరువాత; అనుభవింతు(వు)= నీవు తినేవాడివి; ఆయాసపడుటన్= కష్టపడటాన్ని; కనుఁగొని= చూచి; నోయుదు(వు)= నొచ్చుకునేవాడివి; ననున్ పాసి= నన్ను వీడి; ఇటు+చనుట= ఇట్లా వెళ్ళటం; తగవు+అగునే?= న్యాయం అవుతుందా?

**తాత్పర్యం:** 'నాకు ఆకలి వేస్తే నీవు ఎపుడూ తట్టుకొనలేకపోయేవాడివి. ఆరునూరైనా నూరు ఆరైనా నేను తిన్న తరువాతనే తినేవాడివి. నేను కష్టపడటం చూచి నొచ్చుకొనేవాడివి. అట్లాంటి నీవు నన్ను వదలిపెట్టి ఇట్లా వెళ్ళటం ధర్మమేనా?'

**వ. అని వెండియు. 331**

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**సీ. 'ఇగురు జొంపంబుల నింపారు విరులను । బలుపైన పొదల క్రేవలకుఁ దార్చి,**
**సెలయేఱులందలి తెలినీటఁ దనువు సొం । పెలసిన గిరుల తెప్పలకుఁ జేర్చి,**
**మావిమ్రోకల నెలదీవలఁ జెన్నొందు । తోటలకడ నలితోడఁ జెంది,**
**యలరు నెత్తమ్ముల కలిమిఁ జెల్వగు డిగ్గి । యల తీరభూముల నల్లఁ బొంది,**

**తే. నన్ను మనమునఁ దేల్చి యానంద మొందఁ। గేలి సలిపెడు నీ దగు లీల మఱవ**
**నావశంబె ప్రాణేశ! ప్రాణంబు లిపుడ। నిన్న కూర్చి యేతెంతు నీ సన్న కడకు. 332**

**ప్రతిపదార్థం:** ఇగురు= చిగురుటాకుల; జొంపంబులన్= గుత్తులచేత; ఇంపారు= అందమైన; విరులను= పూలచేత; బలుపు+ఐన= గుబురుగాగల; పొదల క్రేవలకున్= గుబుళ్ళ పక్కలకు; తార్చి= చేర్చి; సెలయేఱులందలి= కొండకాలవలలోని; తెలినీటన్= తేట నీళ్ళల్లో; తనువు= ఒళ్ళు; సొంపు ఎలసినన్= అందం పొందగా; గిరుల తెప్పలకున్= కొండలమిట్ట నేలల మీదకు; చేర్చి= పొందించి; మావిమ్రోకలన్= లేత మామిడి చెట్ల చేత; ఎల+తీవలన్= లేత తీగలచేత; చెన్ను+ఒందు= అందంగా చక్కగా ఉండే; తోఁటలకడన్= తోపుల దగ్గర; నలితోడన్= ఉత్సాహంతో; చెంది= చేరి; అలరు= విరబూసిన; నెత్తమ్ముల+కలిమిన్= పెద్ద తామరలు ఉండటంవలన; చెల్వగు= అందమైన; డిగ్గియల= దిగుడు బావుల; తీరభూములన్= గట్టులను; అల్లన్‌పొంది= మెల్లగా చేరి; నన్నున్= నన్ను; మనమునన్= హృదయంలో; ఆనందము= సంతోషం; ఒందన్= పొందేటట్లు; తేల్చి= ముంచెత్తించి (ఓలలాడించి); కేలిసలిపెడు= క్రీడించే; నీదగు లీల= నీదైన విలాసం; మఱవన్= మర్చిపోవటం; నా వశంబె!= నా తరమా!; ప్రాణేశ!= ప్రాణనాథా!; ప్రాణంబులు= నా ఊపిరులు; నిన్ను కూర్చి= నీతో చేర్చి; ఇపుడ= ఇప్పుడే; నీ చన్నకడకున్= నీవు పోయిన దగ్గరకు; ఏతెంతున్= వస్తాను.

**తాత్పర్యం:** చిగురుటాకుల గుత్తులతో, పూలతో, గుబురుగా ఉండే పొదలమాటుకు చేర్చేవాడివి. కొండకాలవలలోని తేటనీళ్ళల్లో ఒంటివన్నె ఇనుమడించగా కొండల మెరకలమీదకు తీసికొని వెళ్ళేవాడివి. లేత మామిడిచెట్లతో, లేత తీగలతో చూడచక్కగా ఉండే తోపులలోకి ఉత్సాహంగా చేర్చేవాడివి. బాగా విచ్చుకొన్న తామరపూలతో అందంగా కనిపించే దిగుడుబావుల గట్లమీదకు మెల్లగా చేర్చి ఆనందంలో ముంచెత్తించి క్రీడించేవాడివి. నీ లీలలు మర్చిపోవటం నా వల్లకాదు. ఓ నాథా! ఇపుడే నా ప్రాణాలు తీసికొని నిన్ను చేరుకుంటాను.

**వ. అట్లుంగాక. 333**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**క. తేని యనుమరణమునఁ దన। మేను విడిచినట్టి కాంత మేలిపదవికిం**
**దాను నతండును నరిగి య। నూన స్థిరసుఖము లందుచుండుట విందున్.' 334**

**ప్రతిపదార్థం:** తేని అను మరణమునన్= పెనిమిటితో సహగమనంచేత; తన మేనున్= తన తనువును; విడిచినట్టి= చాలించినట్టి; కాంత= వనిత; తానున్= తానూ (భార్య); అతండునున్= పెనిమిటీ; మేలిపదవికిన్= ఉన్నత దశకు; అరిగి= వెళ్ళి; అనూన= తక్కువ కానట్టి; స్థిర= నిలకడ కలిగినట్టి; సుఖములు= భోగాలు, సౌఖ్యాలు; అందుచున్+ఉండుట= పొందుతూ ఉండటం; విందున్= విన్నాను.

**తాత్పర్యం:** పెనిమిటితోపాటు చితిపొంది చనిపోయిన స్త్రీ అతడితోపాటు ఉత్తమ గతులు పొందుతుందనీ, నిలకడగా అంతులేని భోగాలు అనుభవిస్తుందనీ పెద్దలు చెప్పుతుండగా విన్నాను'.

**క. అని పలికి యపుడ యనలము। ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందం**
**దన వల్లభుఁ దలఁచుచు వల। గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 335**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాట్లాడి; అపుడు+అ= ఆ వెంటనే; అనలమున్= నిప్పును; ఘనముగన్= బాగా; దరికొల్పి= రాజుకునేటట్లు చేసి; మది= మనస్సు; వికాసమున్ పొందన్= సంతోషించగా; తనవల్లభున్= తన పెనిమిటిని; తలఁచుచున్=

తలపోసికొంటూ; వలగొని= నిప్పుచుట్టూ ప్రదక్షిణంచేసి; లీలన్= విలాసంగా; చొచ్చి= అగ్గిలోకి దూకి; అతనిన్= పెనిమిటిని; కూడన్= కలియటానికి; చనియెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** అని మాట్లాడి ఆ వెంటనే నిప్పును బాగా రగులుకొల్పింది. తన పెనిమిటిని తలచుకొంటూ ఆ నిప్పుచుట్టూ తిరిగింది. అతడిని చేరుకొనటానికి ఆనందంగా నిప్పుల్లోకి ఉరికింది.

**క. స్ఫురిత విమానము మీఁద న । మరతతి వేష్టింప రత్నమయ భూషణ సుం**
**దర దివ్యమూర్తి వెలిఁగెడు । వరునిఁ గలిసి పరమ సౌఖ్య వైభవ మెసఁగన్. 336**

**ప్రతిపదార్థం:** స్ఫురిత= ప్రకాశించే; విమానము మీఁదన్= విమానంపై; అమర తతి= దేవతా సమూహం; వేష్టింపన్= చుట్టుకొనగా; రత్నమయ భూషణ= రత్నాలు పొదిగిన నగలచేత; సుందర= మనోహరమైన; దివ్యమూర్తిన్= దేవతా రూపంతో; వెలిఁగెడు= శోభిల్లే; వరునిన్= పెనిమిటిని; కలిసి= కూడి; పరమ సౌఖ్య వైభవము= గొప్ప సుఖసంపత్తి; ఎసఁగన్= ఎక్కువ అవగా.

**తాత్పర్యం:** దేవతాగణం చుట్టూ ఉండగా రత్నాభరణాలతో మనోహరరూపుడై చక్కటి విమానంమీద దేవత్వంతో ఒప్పే పెనిమిటిని కలుసుకొన్నది. ఎనలేని సుఖసంపదలతో తులతూగుతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. లీల మూరిఁబో నచ్చరలేమ పిండు । బలసి యభివందనము సేయఁ బొలిచె నిట్లు**
**సనిన పక్షియుగ్మంబు వర్తనము దోఁచెఁ । బుణ్యవర్తనుఁ డగుట నా బోయ కపుడు. 337**

**ప్రతిపదార్థం:** లీల= విలాసం; మూరిన్ పోన్= అతిశయించగా; అచ్చరలేమ పిండు= దేవతా స్త్రీల సముదాయం; బలసి= కమ్ముకొని; అభివందనము చేయన్= మొక్కుతుండగా; పొలిచెన్= ఒప్పింది; ఇట్లు= ఇట్లా; చనిన= పై లోకాలకు వెళ్ళిన; పక్షియుగ్మంబు= పావురం పిట్టల జంట; వర్తనము= నడవడి; ఆ బోయకున్= ఆ బోయవాడికి; పుణ్య వర్తనుఁడు+అగుటన్= పవిత్రమైన నడవడి కలవా డవటంవలన; అపుడు తోఁచెన్= అప్పుడే తట్టింది.

**తాత్పర్యం:** విలాసం ఎక్కువ కాగా, దేవతాస్త్రీలంతా చుట్టూ గుమిగూడి అభినందించటంవలన ఒప్పిదంగా ఉన్నది (కనబడింది). ఇట్లా పై లోకాలకు పోయిన రెండు పిట్టల నడవడి, పవిత్రంగా జీవిస్తున్న బోయవాడికి అపుడే తెలిసింది.

**వ. తోఁచిన నతండు. 338**

**ప్రతిపదార్థం:** తోచినన్= తట్టిన వెంటనే; అతండు= ఆ బోయవాడు.

**తాత్పర్యం:** అట్లా తట్టిన వెంటనే ఆ బోయవాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏనును ని ట్లగుదు' ననుచు । నూనిన కౌతూహలమున నుల్లము వొదలన్**
**మే నెల్ల ముండ్లు సింపఁగఁ । గానఁ దటిసి గళిత రక్త కలితాకృతియై. 339**

**ప్రతిపదార్థం:** ఏనునున్= నేను కూడా; ఇట్లు+అగుదున్= ఇట్లా పుణ్యలోకాలను పొందినవాడను అవుతాను; అనుచున్= అనుకుంటూ; ఊనిన= పొందిన; కౌతూహలమునన్= ఉత్సాహంతో; ఉల్లము= మనస్సు; పొదలన్= ఒప్పగా; మేను+ఎల్లన్= ఒళ్ళంతా; ముండ్లు చింపఁగన్= ముళ్ళు చీరుకోగా; కానన్+తటిసి= అడవిలోకి కాలిడి; గళిత= కారుతున్న; రక్తకలిత= రక్తంతో కూడుకొన్న; ఆకృతి ఐ= రూపు కలవాడై.

**తాత్పర్యం:** నేనూ అట్లాగే పుణ్యలోకాలు పొందుతాను అనుకుంటూ ఎంతో ఉత్సాహంతో మనస్సు పొంగిపోగా ఆతడు అడవిలోకి చొరబడ్డాడు. ఒళ్ళంతా ముళ్ళతో చీరుకొనిపోయింది. రక్తం కారుతున్న రూపంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అరుగుచుండు వాఁ డొకచో దవానలంబు । గట్టెదిరి కాననం బెల్ల ముట్టి మండ**
**సంప్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి । యొడలు దొఱఁగి దేవత్వంబు వడసి యొప్పె.** **340**

**ప్రతిపదార్థం:** అరుగుచున్+ఉండువాఁడు= వెళ్ళుతున్నవాడల్లా; ఒకచోన్= ఒకచోట; దవ+అనలంబు= కార్చిచ్చు; కడు+ఎదిరి= ఎట్ట ఎదుట ఉన్న; కాననంబు+ఎల్లన్= అడవంతటిని; ముట్టి= ముట్టుకొని; అంటుకొని; మండన్= కాలుతూ ఉండగా; సంప్రమోదిత చిత్తుఁడు+ఐ= గొప్ప ఉత్సాహం పొందిన మనస్సు కలవాడై; చక్కన్+చొచ్చి= తిన్నగా మంటలలో దూకి; ఒడలు తొఱఁగి= తనువు చాలించి; దేవత్వంబు+పడసి= అమరత్వాన్ని పొంది; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** పోతూ ఉండగా ఒక చోట తన ఎదుటనే కార్చిచ్చు అలముకొని అడవి అంతా మండిపోతూ ఉన్నది. అది చూచి బోయ ఎంతో సంతోషించాడు. తాను ఆ దావాగ్నిలో పడి ప్రాణం వదిలాడు. దేవతారూపాన్ని పొందాడు.

**ఉ.** **ఈ యితిహాస మర్థిమెయి నెజ్జనముల్ వినినం బఠించినం**
**బాయు నుదాత్త గోహనన పాతకమైనను భూరిసౌఖ్యముల్**
**వేయి విధంబులం బొరయు విన్ము తగన్ శరణార్థిఁ దోషితుం**
**జేయనివాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్.** **341**

**ప్రతిపదార్థం:** ఈ+ఇతిహాసమున్= ఈ వెనుకటి కథను; అర్థిమెయిన్= ఆసక్తితో; ఏ+జనముల్= ఎట్లాంటి జనం అయినా; వినినన్= విన్నా; పఠించినన్= చదివినా; ఉదాత్త గోహనన= గొప్పదైన గోవును చంపాడనే; పాతకము+ఐనను= పాపం అయినా; పాయును= పోతుంది; భూరిసౌఖ్యముల్= గొప్ప సుఖాలు; వేయి విధంబులన్= అనేక రకాలుగా; పొరయున్= పొందుతాడు; విన్ము= వినుము; తగన్= ఒప్పుగా; శరణార్థిన్= శరణన్నవాడిని; తోషితున్+చేయనివాఁడు= సంతోషపెట్టలేనివాడు; కల్మషమున్+చెందున్= పాపం పొందుతాడు; ఏమిటన్= దేనిచేతనైనా; ఒకప్పుడున్= ఎప్పటికీ; పాయదు= (పాపం) నశించదు.

**తాత్పర్యం:** ఈ కథనంతా ఎవ్వడైనా ఆసక్తిగా విన్నా చదివినా గోవును చంపిన మహాపాపం అయినా పోతుంది. అన్ని విధాలా సుఖంగా ఉంటాడు. కాని, శరణన్నవాడిని ఆదుకోనివాడు మాత్రం పాపం అనుభవిస్తాడు. అతడి పాపం ఏ విధంగానూ ఎన్నటికీ పోదు.'

**వ.** **అని యిట్లు శరణాగత రక్షణ ఫలవిశేష ప్రకటనం బగు లుబ్ధ కపోతాఖ్యానంబు సెప్పిన విని యప్పితామహుని మీఁదం బ్రీతి వినయ విస్తారవిలోకనం బెలయ నప్పాండవాగ్రజుండు.** **342**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఇట్లా; శరణాగత= శరణు కోరినవాడిని; రక్షణ= కాపాడేవాళ్ళకు; ఫలవిశేష= విశిష్ట ప్రయోజనాన్ని; ప్రకటనంబు+అగు= తెలిపేది అయిన; లుబ్ధ కపోత= బోయ, పావురం అనే పేరుగల; ఆఖ్యానంబు= కథను; చెప్పినన్+విని= చెప్పగా విన్నవాడై; ఆ+పితామహుని మీఁదన్= తాత భీష్ముడిమీద; ప్రీతి= సంతోషం; వినయ= అణకువ; విస్తార= విస్తరిల్లిన; విలోకనంబు= చూపు; ఎలయన్= ప్రసరించగా; ఆ+పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడు ధర్మరాజు.

**తాత్పర్యం:** అని శరణన్న వాడిని ఆదుకొనేవాడికి కలిగే పుణ్యాన్ని తెలిపే 'బోయ - పావురం' కథ చెప్పాడు భీష్ముడు. అది విన్న ధర్మరాజు తాత భీష్ముడిపై ప్రీతి, అణకువా కలగలిసిన చూపులు సారిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పాపంబు బుద్ధిపూర్వ । వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం**
**డేపాట దానినంతయుఁ । బాపికొనంజాలు సుజనబాంధవ! చెపుమా!' 343**

**ప్రతిపదార్థం:** సుజన బాంధవ!= మంచివాళ్ళకు నేస్తమా!; పాపంబు= పాపం; బుద్ధిపూర్వ వ్యాపారము+కాక= తెలిసి చేసింది కాకుండా; తొడరిన+అప్పుడు= కలిగేటప్పుడు; మనుజుండు= మనిషి; ఏ పాటన్= ఏ విధంగా; దానిన్+అంతయున్= ఆ పాపాన్నంతా; పాపికొనన్+చాలున్= పోగొట్టుకొనగలుగుతాడు; చెపుమా!= చెప్పుము'.

**తాత్పర్యం:** 'సజ్జనులకు నేస్తమా! తెలియకుండా చేసిన పాపాన్ని ఎట్లా పోగొట్టుకొనాలో తెలుపుము'.

**వ. అని యడిగిన నయ్యార్యవర్యుం డా ధరణీభరణధుర్యునకు నిట్లనియెఁ: 'దొల్లి పరీక్షిత్తనయుం డగు జనమేజయుం డను మహారాజు దన కబుద్ధిపూర్వకబ్రహ్మహత్య వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె; నది పురాణకథయై మునులవలన వినంబడు; నత్తెఱం గెఱింగించెద; నాకర్ణింపుము. 344**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్= అడుగగా; ఆ+ఆర్యవర్యుండు= పెద్దలలో పెద్ద అయిన భీష్ముడు; ఆ ధరణీభరణ ధుర్యునకున్= భూభారాన్ని మోసే ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; తొల్లి= మునుపు; పరీక్షిత్+తనయుండు+అగు=పరీక్షిత్తుడి కొడుకు అయిన; జనమేజయుండు+అను మహారాజు= జనమేజయుడనే మహారాజు; తనకున్= తనకు; అబుద్ధి పూర్వక= తెలియక చేసిన; బ్రహ్మహత్య= బ్రాహ్మణుడిని చంపాడనే పాతకం; పాటిల్లినన్= కలుగగా; తద్+కిల్బిషంబున్= ఆ పాపాన్ని; పాపికొనియెన్= పోగొట్టుకొన్నాడు; అది= ఆ బ్రహ్మహత్యాపాపం పోగొట్టుకొనటం; పురాణ కథఐ= చాలాకాలం నాటి కథగా; మునులవలనన్= ఋషుల వలన; వినంబడున్= ఆలకించబడుతుంది; ఆ+తెఱంగున్= ఆ విధానాన్ని; ఎఱింగించెదన్= తెలుపుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని అడిగిన ధర్మరాజుతో ఆ మహానుభావుడైన భీష్ముడు ఇట్లా చెప్పాడు: 'పరీక్షిన్మహారాజు కొడుకు జనమేజయుడు. ఇతడు మునుపు తనకు తెలియకుండానే చుట్టుకొన్న బ్రహ్మహత్యాపాతకాన్ని పోగొట్టుకొన్నాడు. అదే పురాణాలలో ఒక కథ అయింది. దానినే ముని లంతా వినిపిస్తుంటారు. అది చెప్తాను వినుము'.

**క. పాపంబు దొడరుటయు నా । భూపాలకుఁ బ్రజయ విడిచె; భూసురులును నిం**
**దాపాత్రంబుగఁ జేసిరి; । తాపము మదిఁ గదిరి యతఁడు దల్లడ మందెన్. 345**

**ప్రతిపదార్థం:** పాపంబు= బ్రహ్మహత్యా పాతకం; తొడరుటయున్= కలుగగానే; ఆ+భూపాలకున్= ఆ జనమేజయుడిని; ప్రజయ= జనమే; విడిచెన్= వదలిపెట్టారు; భూసురులును= బ్రాహ్మణులూ; నిందాపాత్రంబుగన్= తిట్టదగ్గవాడినిగా; చేసిరి= చేశారు; అతఁడు= ఆ జనమేజయుడు; మదిన్= మనస్సులో; తాపము కదిరి= దుఃఖాన్ని పొంది; తల్లడము+అందెన్= బాధపడ్డాడు.

**తాత్పర్యం:** బ్రహ్మహత్యాపాపం చుట్టుకొనగానే ఆ రాజును ప్రజలూ పట్టించుకొనలేదు. బ్రాహ్మణులు దోషివన్నారు. దానికి జనమేజయుడు లోలోపల కుమిలిపోయాడు.

**తే. అట్లు జనమేజయుఁడు వగ నారఁగూరి । పురము వెడలి యొక్కరుఁడును బోయి కాన**
**నాంతరము సొచ్చి శౌనకుం డను మునీంద్రు । నాశ్రమము రోసికొని చని యమ్మహాత్ము. 346**

**ప్రతిపదార్థం:** అట్లు= అట్లా; జనమేజయుఁడు= జనమేజయుడు; వగన్= దుఃఖాన్ని; ఆరఁగూరి= ఎక్కువగా పొంది; పురము= పట్టణంనుండి; వెడలి= బయటపడి; ఒక్కరుఁడును= ఒంటరిగా; పోయి= వెళ్ళి; కానన+అంతరము= అడవిలోపలికి; చొచ్చి= దూరి; శౌనకుండు+అను= శౌనకు డనే; మునీంద్రు నాశ్రమమున్= మునీశ్వరుడి పర్ణశాలను; రోసికొని= వెతుక్కొని; చని= పోయి; ఆ+మహాత్మున్= ఆ మహానుభావుడిని.

**తాత్పర్యం:** జనమేజయుడు చాలా దుఃఖించి పట్నంనుండి బయటపడ్డాడు. ఒంటరిగా నట్టడవిలోకి చొరబడ్డాడు. ఆ అడవిలో శౌనకముని కుటీరాన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. ఆ మహాత్ముడిని. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు మొగిచి నిల్చినం జూచి యతండు. 347**

**ప్రతిపదార్థం:** కాంచి= చూచి; దండప్రణాంబులు+ఆచరించి= సాగిలపడి మ్రొక్కి; సవినయంబుగన్= అణకువతో; కరంబులు= చేతులు; మొగిచి= మోడ్చి; నిల్చినన్= నిలబడగా; చూచి= కని; అతండు= ఆ శౌనకముని.

**తాత్పర్యం:** ఆ శౌనకమునిని చూచి సాగిలపడి మ్రొక్కాడు. చేతులు జోడించి నిలబడ్డాడు. అది చూచి ముని. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'పెనుఁ బొల వల్చుచున్న యది పీనుఁగుఁ జూచినయట్టు లయ్యెడున్**
**నినుఁ గనుఁగొన్న నీ యెడకు నీ విది యేటికి వచ్చె? దెక్కడేఁ**
**జనుము; శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలఁగలాఁడ వీ భవం**
**బున తుదిఁ గ్రూరకాకచయముల్ దొలువన్ నరకాధివాసివై.' 348**

**ప్రతిపదార్థం:** పెనుపొల వల్చుచున్+ఉన్నయది= ఎంతో నీచుకంపు కొట్టుతున్నది; నినున్= నిన్ను; కనుఁగొన్నన్= చూస్తుంటే; పీనుఁగున్= పీనుగును; చూచిన+అట్టులు= చూచినట్లుగా; అయ్యెడున్= అవుతుంది; ఈ+ఎడకున్= ఇక్కడకు; నీవు= నీవు; ఇది= ఇట్లా; ఏటికిన్ వచ్చెదు?= ఎందుకు వచ్చావు?; ఎక్కడేన్= ఎక్కడికైనా; చనుము= వెళ్ళుము; ఈ భవంబునన్= ఈ జన్మలోనే; క్రూరకాక చయముల్= బొంతకాకుల మూకలు; తొలువన్= తూట్లు తూట్లుగ పొడుస్తుండగా; తుదిన్= చివరకు; నరక అధివాసివి+ఐ= నరకంలో ఉండే వాడివై; అజస్రమున్= ఎప్పుడూ; శిరంబు క్రిందుగన్= తలక్రిందుగా; వ్రేలన్+కలాఁడవు= వేలాడుతూ ఉంటావు.

**తాత్పర్యం:** నీ వద్ద ఎంతో నీచు వాసన వస్తున్నది. నిన్ను చూస్తుంటే పీనుగును చూసినట్లున్నది. నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావు? మరెక్కడికైనా వెళ్ళిపొమ్ము'. బొంతకాకులు తూట్లు పొడుస్తూ ఉండగా తలకిందుగా వేలాడుతుంటావు. (ఈ పుట్టుకలోనే నరకం అనుభవిస్తావు).

**చ. అనుటయు 'గర్హకర్ముఁ డగునట్టి దురాత్మునిఁ బూజితవ్రతుల్**
**గని యిటు లంట యుక్త మటుగాన కదా భవదీయ పాదవం**
**దన మొనరించి మీవలన దారుణపాపము వాచికొందు నే**
**నను మది వచ్చినాఁడ సదయంబగు చూడ్కిఁ బరిగ్రహింపవే!' 349**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; గర్హకున్= నిందించటానికి; అర్హుఁడు+అగు+అట్టి= తగినట్టి; దురాత్మునిన్= పాపిష్ఠివాడిని; పూజిత వ్రతుల్= గౌరవించతగ్గ నియమాలు కల మీవంటి వారు; కని= చూచి; ఇటులు= ఇట్లా; అంట= అనటం (దూషించటం); యుక్తము= తగినదే; అటుగాన కదా= అందువలనే (అట్లాంటి నిందితుడిని కావటంవలననే) కదా; భవదీయ= మీ పాదవందనము+ఒనరించి= కాళ్ళకు మొక్కి; మీవలనన్= మీ కారణంగా; దారుణపాపము= సహించలేని పాపాన్ని; పాచికొందున్= పోగొట్టుకొంటాను; అను మదిన్= అన్న కోరికతో; నేన్= నేను; వచ్చినవాఁడన్= వచ్చాను; సదయంబు+అగు= కనికరం గల; చూడ్కిన్= చూపుతో; పరిగ్రహింపవే= స్వీకరించవా.

**తాత్పర్యం:** నేను దూషించదగ్గవాడినే. మీబోటి గౌరవార్హులు ఇట్లా నిందించటమూ భావ్యమే. అందువలననే కదా మీ కాళ్ళకు మ్రొక్కుకొని ఈ దారుణమైన పాపాన్ని పోగొట్టుకొనాలని ఆశపడి వచ్చాను. నా మీది దయతో నన్ను స్వీకరించండి'.

**వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగు నత్తపోధనసత్తముం డిట్లనియె. 350**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని; కరుణా+ఆయత్త+చిత్తుండు+అగు= దయకు లోబడ్డ మనస్సు కలవాడయిన; ఆ+తపోధన సత్తముండు= ఆ ముని వర్యుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగానే ఆ శౌనకముని జాలిపడి అతడితో ఇట్లా అన్నాడు.

**క. విను కొంద అల్పబుద్ధులు । నను నెంతయు ధిక్కరింప నవ్వఁగ వారిం**
**గొనక బుధులైన విప్రులు । ననిమిషులును మెచ్చుచుండ' ననియెద నీతోన్. 351**

**ప్రతిపదార్థం:** విను= వినుము; కొందఱు= కొంతమంది; అల్పబుద్ధులు= తెలివి తక్కువ వాళ్ళు; ననున్= నన్ను; ఎంతయున్= ఎంతో; ధిక్కరింపన్= తిరస్కరించగా; నవ్వఁగన్= గేలిచేయగా; వారిన్= అట్లాంటి వాళ్ళను; కొనక= లెక్కపెట్టక; బుధులు+ఐన= పండితు లైన; విప్రులున్= బ్రాహ్మణులూ; అనిమిషులును= దేవతలూ; మెచ్చుచున్+ఉండన్= ఆహా అంటూ ఉండగా; నీతోన్= నీతో; అనియెదన్= అంటాను.

**తాత్పర్యం:** కొంతమంది తెలివితక్కువవాళ్ళు నన్ను కాదని గేలిచేసినా, అట్లాంటి వాళ్ళను లెక్కపెట్టను. పండితులైన బ్రాహ్మణులూ, దేవతలూ మెచ్చుకొనేటట్లు నేను నీతో చెప్పుతాను వినుము.

**క. హీనప్రజ్ఞుఁ డకార్యము । లైనవి సేసి తుది వగచు నతులప్రజ్ఞా**
**సానుమదారూఢుఁడు వగ । నూనఁడు దురిత మను వఱితి కోడక యునికిన్. 352**

**ప్రతిపదార్థం:** హీన ప్రజ్ఞుఁడు= అల్పబుద్ధి కలవాడు; అకార్యములు+ఐనవి+చేసి= చేయకూడని పనులను చేసి; తుదిన్= చివరకు; వగచున్= పశ్చాత్తాప పడతాడు; అతుల ప్రజ్ఞా= సాటిలేని తెలివితో; సానుమత్+ఆరూఢుఁడు= కొండెక్కినవాడు (ఉన్నతికి పోయేవాడు); దురితము+అను= పాపం అనే; వఱితికిన్= వరదకు; ఓడక ఉనికిన్= భయపడకుండా ఉండటానికి; వగన్= విచారాన్ని; ఊనఁడు= పొందడు.

**తాత్పర్యం:** తెలివితక్కువవాడు చేయకూడని పనులు చేసి చివరకు విచారిస్తాడు. ఎక్కడలేని తెలివితో ఉన్నతుడయ్యేవాడు మాత్రం పాపం అనే వరదకు వెరవడు, విచారించడు.

**వ. ప్రజ్ఞాకార్యంబు లైనవి యనుష్ఠింపవలయు; వానిఁ జెప్పెద; నీకుం బాపంబునెడ ననుతాపంబు గలిగి ధర్మ ప్రవణుండ వైతే?' యనుటయు నమ్మనుజనాథుండు. 353**

**ప్రతిపదార్థం:** ప్రజ్ఞాకార్యంబులు+ఐనవి= తెలివిగా చేసే పనులు; అనుష్ఠింప వలయున్= ఆచరించాలి; వానిన్= వాటిని; నీకున్= నీకు; చెప్పెదన్= చెప్పుతాను; పాపంబు+ఎడన్= (చేసిన) పాపం విషయంలో; అనుతాపంబు+కలిగి= పశ్చాత్తాపం పొంది; ధర్మ ప్రవణుండవు+ఐతే?= ధర్మంపట్ల ఆసక్తికలవాడవు అయ్యావా?; అనుటయున్= అని అనగానే; ఆ మనుజనాథుండు= ఆ జనమేజయమహారాజు.

**తాత్పర్యం:** తెలివిగా పనులు చక్కబెట్టుకోవాలి. వాటిగురించి నీకు చెప్పుతాను. అసలు నీవు చేసిన పాపాలకు పశ్చాత్తాపపడుతున్నావా? నీకు ధర్మంపట్ల ఆసక్తి కలిగిందా?' అని ముని అడుగగానే ఆ జనమేజయుడు.

**క. 'తాపసవర! తీవ్రం బగు । పాపాగ్నిజ్వాల చయము పాలుపడి పరీ**
**తాపము నొందుచు ధర్మ । వ్యాపార జలాభిలాషి నై యున్నాఁడన్. 354**

**ప్రతిపదార్థం:** తాపసవర!= మునీశ్వర!; తీవ్రంబు+అగు= ఎక్కువ అవుతున్న; పాప+అగ్నిజ్వాల చయము= పాపం అనే మంటల సముదాయంలో; పాలుపడి= చిక్కుకొని; పరీతాపమున్= సంతాపాన్ని; ఒందుచున్= పొందుతూ; ధర్మవ్యాపార= పుణ్యకర్మలనే; జల= పవిత్రమైన నీటిని; అభిలాషిని+ఐ= కోరుకొంటున్నవాడనై; ఉన్నాఁడన్= ఉన్నాడను.

**తాత్పర్యం:** 'ఓ మునివర్య! తీవ్రమైన పాపపు మంటలలో చిక్కుకొని ఎంతో తపిస్తున్నాను. పుణ్యకార్యాలనే పవిత్రజలంతో ఆ మంటలను చల్లార్చుకొనాలని అనుకొంటున్నాను.

**వ. భవదీయ కృప నాశ్రయింప వచ్చితి; నన్ను రక్షింపవే!' యనవుడు నమ్మునీంద్రుండు. 355**

**ప్రతిపదార్థం:** భవదీయ= మీ; కృపన్= దయను; ఆశ్రయింపన్= అండకోరటానికి; వచ్చితిన్= వచ్చాను; నన్నున్= నన్ను; రక్షింపవే= కాపాడవా; అనవుడున్= జనమేజయుడు అనగానే; ఆ+ముని+ఇంద్రుండు= ఆ శౌనకముని.

**తాత్పర్యం:** నీ దయకొరకు నిన్ను ఆశ్రయించాను. నన్ను ఆదుకొనవలసినది' అని జనమేజయుడు అనగానే ఆ శౌనకమునివర్యుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'భీతి యొకటి గోరుటయును । నీ తలఁపులలోన దీని కిది గతమనఁగా**
**నే తెరువును గలుగదు మ । చ్చేతోగతి ధర్మవృత్తిఁ జిక్కుట దక్కన్. 356**

**ప్రతిపదార్థం:** భీతి= భయం (వెరపు); ఒకటి కోరుటయున్= ఒకటి కోరుతుండగా; మత్+చేతఃగతి= నా మనస్సుపోకడ; ధర్మవృత్తిన్= పుణ్యవ్యాపారంలో; చిక్కుట తక్కన్= పట్టువడి ఉండటం తప్ప; దీనికిన్= దీనికి; ఇది; కతము+అనఁగాన్= కారణం అనటానికి; ఏ తెరువును= ఏ ఉపాయమున్నూ; నీ తలఁపులలోనన్= నీ ఊహలలో; కలుగదు= పుట్టదు.

**తాత్పర్యం:** 'నీవు నీ భయంకొద్దీ ఒకదానిని కోరుకొంటున్నావు. అందువలన దీనికి ఇది కారణం అనే ఉపాయమే నీ ఆలోచనలకు అందదు. నాకు తట్టిన పుణ్యకార్యం ఆచరించాలి తప్ప.

**క. ఆతురత నీవు నా కడ । కేతెంచిన దానఁ జేసి యెలసిన ధర్మ**
**ద్యోతన కౌతూహలమున । నీతోఁ బడవలసె; వినుము నిశ్చలమతివై. 357**

**ప్రతిపదార్థం:** ఆతురతన్= తొందరపాటుతో; నీవు; నా కడకున్= నా దగ్గరకు; ఏతెంచినదానన్+చేసి= వచ్చినందువలన; ఎలసిన= అలముకొన్న; ధర్మద్యోతన= ధర్మం తోచినందువలన కలిగిన; కౌతూహలమునన్= ఉబలాటంతో; నీతోన్= నీతో; పడవలసెన్= అనుభవించవలసి వస్తుంది; నిశ్చలమతివి+ఐ= నిలకడగల బుద్ధికలవాడవై; విను= వినుము.

**తాత్పర్యం:** నీ ఆతురతకొద్దీ నీవు నా దగ్గరకు వచ్చావు కాబట్టి, నాకు ధర్మమార్గం తట్టినందువలన కలిగిన ఉబలాటంకొద్దీ నీతో పడవలసి వచ్చింది. నిలుకడగా వినుము.

**క. భూవిబుధుల కెయ్యది హిత । మావిధమున నడచువాఁడవగునది ద్రోహా**
**భావంబు ప్రతిజ్ఞాతం । బై వెలయఁగవలయు నీకు నా జాతియెడన్.' 358**

**ప్రతిపదార్థం:** భూవిబుధులకున్= బ్రాహ్మణులకు; ఎయ్యది= ఏది; హితము= మేలో; ఆ విధమునన్= అట్లాగున; నడచువాఁడవు= ప్రవర్తించేవాడవు; అగునది= కావాలి; నీకున్= నీకు; ఆ జాతి+ఎడన్= ఆ బ్రాహ్మణుల కులంపట్ల; ద్రోహ+అభావంబు= కీడు తలపెట్టనని; ప్రతిజ్ఞాతంబు+ఐ= ఒట్టుపెట్టుకున్నవాడవై; వెలయఁగవలయున్= ప్రసిద్ధి కెక్కాలి.

**తాత్పర్యం:** బ్రాహ్మణజాతికి మంచి కలిగేటట్లు నడచుకొమ్ము. వాళ్ళకు ఎప్పుడూ అపకారం తలపెట్టనని ఒట్టు వేసుకొమ్ము. నలుగురి మెప్పులు అందుకొమ్ము.'

**చ. అనవుడు 'ధర్మవృత్తము మదాత్మకు నైజము; దోషవృత్తికిన్**
**మునివర! యేను భీతుఁడ; సముజ్జ్వల విప్రకులంబు నాకు మ**
**న్ననలకుఁ బాత్ర; మెవ్విధమునం దెగి ద్రోహము దానియందు నా**
**మనము దలంప; దింతకును మాన్య భవచ్చరణంబు లంటెదన్.' 359**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; మునివర!= మునిసత్తమా!; మత్+ఆత్మకున్= నా మటుకు నాకు; ధర్మవృత్తము= పుణ్యాజీవనం; నైజము= సహజం; దోషవృత్తికిన్= పాపపు నడతకు; ఏను= నేను; భీతుఁడన్= భయస్థుడిని; సముజ్జ్వల= వెలిగిపోతున్న; విప్రకులంబు= బ్రాహ్మణ జాతి; నాకున్= నా; మన్ననలకున్= ఆదరణలకు; పాత్రము= తగినది; ఏ విధమునన్= ఎట్లాగైనా; నా మనము= నా మనస్సు; దాని యందున్= ఆ బ్రాహ్మణుల కులమందు; తెగి= సాహసించి; ద్రోహము= కీడు కలిగించాలని; తలంపదు= ఆలోచించదు, తలపోయదు; ఇంతకును= ఈ సమస్తానికీ; మాన్య= మన్నించదగ్గ; భవత్+చరణంబులు= మీ పాదాలను; అంటెదన్= తాకుతాను.

**తాత్పర్యం:** 'ఓ శౌనకమునివర్యా! ధర్మంగా నడచుకొనటం నాకు పుట్టుకతో వచ్చింది. పాపపు బ్రతుకంటే నాకు వణకు. బ్రాహ్మణజాతి ఎప్పుడూ నా ఆదరణకు తగినది. తెగించి ఎప్పుడూ నా మనస్సు ఆ జాతికి కీడు తలపెట్టదు. ఈ సమస్తానికీ సాక్ష్యంగా నీ పాదాలు తాకి ఒట్టుపెట్టుకొంటాను.'

**వ. అనుచుఁ దదీయ పాదస్పర్శనంబు సేసి యవ్విధంబునం గృతశపథుం డగుటయుఁ గరుణాగోచరంబగు చిత్తంబుతో నత్తపోధనవర్యుం డాదరమేదురావలోకనం బా భూపాలుని మీఁద నొలయ నిట్లను: 'నట్లేనిం జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపుము. 360**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; తదీయపాద= ఆ ముని పాదాలను; స్పర్శనంబు చేసి= తాకి; ఆ+విధంబునన్= ఆ రీతిగా; కృత= చేసిన; శపథుండు+అగుటయున్= ఒట్టుపెట్టుకొన్నవాడవుగా; కరుణాగోచరంబు+అగు= దయకు లోబడ్డ; చిత్తంబుతోన్= మనస్సుతో; ఆ+తపోధనవర్యుండు= ఆ మునివరుడు కౌశికుడు; ఆదరమేదుర= ఎంతో మర్యాదతో కూడిన; అవలోకనంబు= చూపు; ఆ భూపాలుని మీఁదన్= ఆ జనమేజయ రాజుమీద; ఒలయన్= ప్రసరించగా; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అట్లు+ఏనిన్= అట్లాగైతే (బ్రాహ్మణులకు కీడు తలపెట్టనట్లయితే); చెప్పెదన్= చెప్పుతాను; అవహితుండవు+అయి= సావధానుడవై; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** ఆ ముని కాళ్ళు పట్టుకొని అట్లా శపథంచేశాడు. ఆ ముని మనస్సు జాలిపడింది. ఆ జనమేజయుడిని ఎంతో ఆదరంగా చూచి ఇట్లా అన్నాడు. అట్లా బ్రాహ్మణజాతికి కీడు తలపెట్టనన్నావు కనుక చెప్పుతాను. సావధానంగా వినుము.

**సీ.** **శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగు రాజు । భోగంబు దర్పంబుఁ బోవ విడిచి,**
**ధర్మంబు గైకొని, తపమును దానంబు । నధ్యయనంబును యాగవిధులు**
**నాచరింపగఁ జూచి యచ్చెరువడి యను । గ్రహము సేయదె భూతరాజి? యతని**
**కధిప! యయాతివాక్యము నర్థ మెఱిఁగింతు । వినుము! సరస్వతియును దృషద్వ**
**తే.** **తియును నను పుణ్యనదులందుఁ దిరిగి తీర్థ । సేవ సేయుచు నధ్యయనావధాన**
**దాననిర్ధూతరాగత్వదయలు గలిగి । పరఁగఁ బాపకళంకలేపంబు వాయు.** **361**

**ప్రతిపదార్థం:** శ్రీమంతుఁడును= ధనవంతుడునూ; బలశ్రేష్ఠుండును+అగు= మేటి బలశాలిన్నీ అయిన; రాజు= ప్రభువు; భోగంబున్= సౌఖ్యాన్నీ; దర్పంబున్= పొగరునూ; పోవవిడిచి= వదలగొట్టుకొని; ధర్మంబు= న్యాయం; కైకొని= పాటించి; తపమును= తపస్సునూ; దానంబున్= దానాన్నీ; అధ్యయనంబును= వేదం వల్లించటాన్ని; యాగవిధులును= యజ్ఞకర్మలను; ఆచరింపఁగన్= చేయగా; చూచి; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; భూతరాజి= ప్రాణికోటి; అతనికిన్= అతడికి (రాజుకు); అనుగ్రహము+చేయదె?= దయచూపదా; అధిప!= రాజా!; యయాతి వాక్యమున్= యయాతి మాటనూ; అర్థమున్= దాని అర్థాన్నీ; ఎఱిఁగింతున్= తెలుపుతాను; వినుము= వినవలసింది; సరస్వతియును= సరస్వతీనదీ; దృషద్వతియునున్= దృషద్వతీనదీ; అనుపుణ్యనదులందున్= అనే పవిత్ర నదులలో; తిరిగి= తిరుగాడి (సంచరించి); తీర్థసేవ చేయుచున్= పుణ్యక్షేత్రాలను సేవిస్తూ (దర్శించుకొంటూ); అధ్యయన= వేదాలు చదవటంలో; అవధాన= ఏకాగ్రత, దాన= దానం; నిర్ధూత రాగత్వ దయలు= వదలిన మమకారమూ, కనికరమూ; కలిగి= ఉండి; పరఁగన్= ఒప్పగా; పాప= పాపం అనే; కళంకలేపంబు= మకిలి పూత; పాయున్= వీడిపోతుంది.

**తాత్పర్యం:** సంపన్నుడూ, ధీరుడూ అయిన రాజు భోగాన్నీ అహంభావాన్నీ వదలగొట్టుకొనాలి. ధర్మాన్ని పాటించాలి. తపస్సు, దానం, వేదాధ్యయనం, యాగాదికర్మలూ ఆచరించాలి. అప్పుడు ప్రాణికోటి అంతా రాజుమీద దయచూపుతుంది. ఈ విషయంగా యయాతి మాట ఒకటి ఉన్నది. దాని అర్థాన్ని విడమరచి చెప్పుతాను వినుము. సరస్వతి, దృషద్వతివంటి పవిత్ర నదులను సేవించాలి. పుణ్యక్షేత్రాలలో నడయాడాలి. మమకారం వదులుకొనాలి. అధ్యయనమునందే ఏకాగ్రత, దానం, దయలు కలిగి మమకారం లేక ఉండాలి. అపుడు పాపం అనే మకిలి మరక తుడిచిపెట్టుకొనిపోతుంది.

**వ.** **అదియునుంగాక యొక్క పరమస్మృతి సెప్పెద వినుము.** **362**

**ప్రతిపదార్థం:** అదియున్+కాక= అంతేకాకుండా; ఒక్క= ఒకటి; పరమస్మృతి= మేలైన ధర్మశాస్త్రం; చెప్పెదన్= చెప్పుతాను; వినుము.

**తాత్పర్యం:** అంతేకాదు ఒక ధర్మశాస్త్రం చెప్పుతాను వినుము.

**చ.** **దురితము సేసి తాపమునఁ దూలిన నిం కిటు సేయ నన్మతిం**
**బొరసిన ధర్మ సంచరణ బుద్ధియ మేలని యూఁదినం గ్రియా**
**పరుఁ డయి మేలుసేసినను బాదము పాదముగాఁ గ్రమంబునన్**
**విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్.** **363**

**ప్రతిపదార్థం:** దురితము+చేసి= పాపం చేసి; తాపమునన్= పశ్చాత్తాపంతో; తూలినన్= దుఃఖించినా; ఇంకన్= ఇకమీదట; ఇటు+చేయన్= ఇట్లాంటి పాపం చేయను; అను మతిన్= అనే బుద్ధిని; పొరసినన్= పొందినా; ధర్మ సంచరణ బుద్ధియ= ధర్మంతో మెలగాలనే ఆలోచనే; మేలు+అని= మంచిదనీ; ఊఁదినన్= అవలంబించినా; క్రియాపరుఁడు+అయి= పుణ్యకార్యాలలో ఆసక్తి కలవాడై; మేలు చేసినను= ఉపకారం చేసినా; తద్+అభివిష్ట= దానిని పొందిన; కళంకము= మకిలి; సమస్తమున్= అంతా; పాదముపాదముగాన్= అంశం అంశంగా; క్రమంబునన్= వరుసగా; నిర్భయంబుగన్= ఏ జడుపు లేకుండా; విరియున్= తొలగుతుంది.

**తాత్పర్యం:** పాపంచేసి పరితపించినా, ఇకమీదట ఇట్లాంటి పాపాలకు ఒడిగట్టను అనుకున్నా, న్యాయంగా మెలగటం ఉత్తమం అని నిర్ణయించుకొన్నా, పుణ్యం పొందాలని అపేక్షపడి ఉపకారం చేసినా - వీటిల్లో ఏ అంశంవలననైనా పాపపంకిలం క్రమక్రమంగా తుడిచిపెట్టుకొనిపోతుంది. ఇందులో ఏమీ భయపడాల్సింది లేదు.

**చ. నరవర! వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితోఁ**
**బొరయని పాతకంబులు సబుద్ధికపుణ్యములన్ నశించు నం**
**బరమునఁ బట్టినట్టి మలపంకము గారములోన నద్దఁగా**
**విరిసిన యట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్. 364**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; వాసవుండు= ఇంద్రుడు; అడిగినన్= అడుగగా; గురుఁడు= బృహస్పతి; ఇట్లు+అని= ఇట్లాగని; చెప్పెన్= చెప్పాడు; బుద్ధితోన్= ఆలోచనతో; పొరయని= పొందని; పాతకంబులు= పాపాలూ; సబుద్ధిక= బుద్ధి పూర్వకంగా చేసిన; పుణ్యములన్= ధర్మాలవలన; అంబరమునన్= బట్టమీద; పట్టినట్టి= అంటుకొన్నట్టి; మలపంకము= మురికి అనే బురద; కారములోనన్= చౌటి మట్టిలో; అద్దఁగాన్= ముంచగా; విరిసిన+అట్లు= వదులునట్లుగా; నశించున్= పోతాయి; నమ్మము= విశ్వసించుము; ఇది= ఈ విషయం; వేదము+చెప్పినన్= వేదం చెప్పగా; నేనున్= నేనూ; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** ఓ జనమేజయా! ఇంద్రుడు అడిగిన విషయాన్ని బృహస్పతి ఇట్లా చెప్పాడు. బట్టకుపట్టి ఉన్న మురికి చవుడు కారంలో ముంచినపుడు వదలిపోయినట్లుగా చెయ్యాలని చేయని పాపాలు బుద్ధిపూర్వకంగా చేసిన పుణ్యాలవలన పోతాయి. ఈ సంగతి వేదం చెప్పింది. అదే నేను బోధించాను. నన్ను నమ్ముము'.

**విశేషం:** అలం: ఉపమ.

**కృత్వా పాపం పూర్వమబుద్ధి పూర్వమ్**
**పుణ్యాని చేత్కురుతే బుద్ధి పూర్వమ్** -శాం-152-34

**వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగు నత్తాపసోత్తముం డా భూవరు బోధించి, తీర్థసేవాది పునశ్చరణంబులం బరిపూతాత్ముం గావించి,యశ్వమేధంబు సేయించిన నుజ్జ్వలుండయి యజ్జనమేజయుండు నిజరాజ్యంబు పరిపాలనంబు సేసె' నని చెప్పి వెండియు. 365**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఇట్లా; బహుప్రకారంబులన్= అనేక విధాల; కారుణిక+ఉత్తముండు+అగు= గొప్ప జాలికలవాడైన; ఆ+తాపస+ఉత్తముండు= ఆ మునిశ్రేష్ఠుడు; ఆ భూవరున్= ఆ రాజును; బోధించి= మేలుకొలిపి; తీర్థసేవ= పుణ్యక్షేత్రాలు సేవించటం; ఆది= మొదలైనవి; పునశ్చరణంబులు= మాటి మాటికి ఆచరించటంవలన; పరిపూత+ఆత్మున్= మరింత పవిత్రమైన మనస్సు కలవాడినిగా; కావించి= చేసి; అశ్వమేధంబు= అశ్వమేధయాగం; చేయించినన్= చేయించగా; ఉజ్జ్వలుండు+అయి= ప్రకాశించినవాడై; ఆ+జనమేజయుండు= ఆ జనమేజయ మహారాజు; నిజ రాజ్యంబు= తనదేశాన్ని; పరిపాలనంబు+చేసెన్= ఏలాడు; అని చెప్పి= అని పలికి; వెండియున్= మళ్ళీ.

**సతతి పాపం నుదతే కర్మశీల:**

**వాసోయథా మలినం క్షారయుక్తమ్**

**తాత్పర్యం:** జాలిగుండెగల ఆ ముని ఇట్లా ఎన్నో విధాల ఆ జనమేజయుడిని మేలుకొలిపి, ఎన్నో తీర్థయాత్రలు చేయించి, పుణ్యవంతుడిని చేశాడు. అశ్వమేధయాగం చేయించాడు. అట్లా వెలుగొందిన ఆ జనమేజయుడు తన రాజ్యాన్ని ఏలుకొన్నాడు' అని చెప్పి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**భీష్ముఁడు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట (సం. 12-149-1)**

**సీ.** **గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజు । నకు 'విదిశాపట్టణమున నొక్క**

**బాలుండు మృతుఁ డైన బంధులు ప్రేతభూ । మికిఁ గొనిపోయి యమేయశోక**

**వివశాత్ములై పలవింపఁగా గ్రద్ద యొ । క్కటి వచ్చి మీర లిక్కడ భయంబు**

**దక్కి యేడ్చుచునుండఁ దగ; దిదె క్రుంకెడుఁ । బ్రొద్దు రాక్షసులును భూతములుఁ బి**

**తే.** **శాచములు వ్రచ్చి తిన నిపు డేచి వచ్చు; । జనన మరణముల్? వింతలె చన్న శిశువు**

**తోన యందఱుఁ జనుటకుఁ బూనియుండు । వారలే? పొండు పీనుంగు వైచి వేగ. 366**

**ప్రతిపదార్థం:** గాంగేయుఁడు= భీష్ముడు; కౌంతేయ పూర్వజునకున్= కుంతీ సంతానంలో ముందు పుట్టిన ధర్మరాజుకు; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; విదిశాపట్టణమునన్= విదిశానగరంలో; ఒక్కబాలుండు= ఒక పిల్లవాడు; మృతుఁడు+ఐనన్= చచ్చిపోగా; బంధులు= చుట్టాలు; ప్రేత భూమికిన్= వల్లకాటికి; కొనిపోయి= తీసుకొనిపోయి; అమేయశోక= పట్టరాని దుఃఖంతో; వివశ+ఆత్ములు+ఐ= ఒంటిమీద తెలివి తప్పినవారై; పలవింపఁగాన్= విలపించగా; గ్రద్ద= గద్ద; ఒక్కటి వచ్చి= ఒకటి వచ్చి; మీరలు= మీరు; ఇక్కడన్= ఈ వల్లకాట్లో; భయంబు+తక్కి= భయం వదలి; ఏడ్చుచున్+ఉండన్= ఏడుస్తూ ఉండటం; తగదు= కూడదు; ఇదె= ఇపుడే; పొద్దు= సూర్యుడు; క్రుంకెడున్= కనుమరుగు అవుతున్నాడు; రాక్షసులును= రక్కసులు; భూతములున్= భూతాలూ; పిశాచములున్= పిశాచాలూ; వ్రచ్చి= పీనుగును చీల్చి; తినన్= తినటానికి; ఇపుడు= ఈ సమయంలో; ఏచివచ్చున్= చెలరేగి వస్తాయి; జనన మరణముల్= పుట్టటం, గిట్టటం; వింతలె?= కొత్తవా?; చన్న= పోయిన; శిశువుతోన= బిడ్డతోనే; అందఱున్= అంతమందీ; చనుటకున్= చచ్చిపోవటానికి; పూని+ఉండువారలే?= పట్టుదలగా ఉన్నారా?; పీనుంగున్= పీనుగును; వైచి= పాతిపెట్టి; పొండు= వెళ్ళండి.

**తాత్పర్యం:** ధర్మరాజుతో భీష్మ డిట్లా అన్నాడు. విదిశాపట్టణంలో ఒక పిల్లవాడు చచ్చిపోయాడు. వాడిని అతడి చుట్టాలు వల్లకాటికి తీసికొనిపోయారు. వారంతా పట్టలేనంత దుఃఖంతో ఒంటిమీద తెలివితప్పి గోడు గోడుమని ఏడుస్తున్నారు. ఒక గద్ద వచ్చి మీరు ఈ వల్లకాటిలో భయపడకుండా ఏడుస్తూ ఉండటం మంచిదికాదు. చీకటి పడుతున్నది. ఈ సమయంలో రాక్షసులూ, భూతాలూ, పిశాచాలూ పీనుగులను చీల్చుకొని తినటానికి చెలరేగి వస్తాయి. చావుపుట్టుకలు ఇంతకుమునుపు లేనివా ఏమి? చచ్చిపోయిన బిడ్డతో మీరంతా పోవటానికి సిద్ధపడుతున్నారా? తొందరగా పీనుగును పాతేసి వెళ్ళండి.

**క.** **తెగిపోయినవా రేడ్చిన । మగుడుదురే? వెఱ్ఱులార! మానుఁడు మీరుం**

**దెగుదురు తడసిన' నావుడు । నగు నట్టిద కర్జ' మనుచు నందఱు భీతిన్. 367**

**ప్రతిపదార్థం:** ఏడ్చినన్= ఏడిస్తే; తెగిపోయినవారు= చచ్చిపోయినవారు; మగుడుదురే?= తిరిగివస్తారా?; వెఱ్ఱులార!= పిచ్చివాళ్ళులారా!; మానుఁడు= మానుకొనండి; తడసినన్= ఆలస్యం చేస్తే; మీరున్= మీరూ; తెగుదురు= చచ్చిపోతారు; నావుడున్= గద్ద అనగానే; అట్టిద కర్జము= అట్లాంటిపనే; అగును= జరుగుతుంది; అనుచున్= అంటూ; అందఱున్= అంతమంది; భీతిన్= భయంతో.

**తాత్పర్యం:** చచ్చిపోయినవారు ఎంత ఏడ్చినా తిరిగిరారు. పిచ్చిగా ఏడవటం మానుకొనండి. జాగు చేశారంటే మీరూ చావగలరు' అన్నది గద్ద. అక్కడకు వచ్చిన చుట్టాలంతా అట్లాగే జరుగుతుందేమో అనుకొంటూ భయపడి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. శవంబు విడిచి పోవంజూచిన, నొక నక్క బొక్కలోనుండి వెడలి వారలతోడ నిట్లనియె. 368**

**ప్రతిపదార్థం:** శవంబున్= పీనుగును; విడచి= వదలి; పోవన్+చూచినన్= వెళ్ళబోగా; ఒక నక్క; బొక్కలోనుండి= బొరియలోనుండి; వెడలి= బయటకు వచ్చి; వారలతోడన్= వాళ్ళతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** పీనుగును విడిచిపెట్టిపోవాలనుకొంటున్నప్పుడు కలుగులోనుండి అపుడే వెలుపలికి వస్తున్న నక్క ఇట్లా అన్నది.

**సీ. 'గ్రద్ద మాటల కేల కడు భీతిఁ బొందితి। రక్కటా! బాలుని నబ్జవదను**
**నిటు వైచి పోవఁ గా ళ్ళెట్లాడె నేడ్వుఁడు। శోకంబు వోవ నిచ్చోటఁ గొంత**
**ప్రొ ద్దంతలో విధి క్రూరుండు గాకున్నఁ। బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు**
**నో యెఱుంగుదురే; యినుండును నస్తాద్రిఁ। జేరఁడు; వెఱవక మీరు నిలువుఁ'**

**తే. డనిన వారును మనమున నాసపుట్టి। మగిడి వచ్చిన గ్రద్ద 'యిమ్మందబుద్ధి**
**యైన నక్కమాటలు విననగునె? వికృత। మయ్యెఁ బీనుంగు; వచ్చునే యసువు లింక? 369**

**ప్రతిపదార్థం:** గ్రద్ద మాటలకున్= గద్ద పలుకులకు; కడుభీతిన్= మిక్కిలి భయాన్ని; పొందితిరి+ఏల?= పొందారు ఎందుకు?; అక్కట!= అయ్యో!; అబ్జవదనున్= పద్మంవలె విప్పారిన ముఖంగల; బాలునిన్= పిల్లవాడిని; ఇటు వైచి= ఇట్లా పాతిపెట్టి; పోవఁగాన్= వెళ్ళటానికి; కాళ్ళు+ఎట్లాడెన్?=కాళ్ళెట్లావచ్చాయి?; కొంతప్రొద్దు=కొంతసేపు; శోకంబుపోవన్=దుఃఖంపోయేటట్లు; ఇచ్చోటన్=ఈ ఒలుకుల్లోనే(శ్మశానంలోనే); ఏడ్వుఁడు= ఏడ్వండి; అంతలోన్= అంతట్లోకి; విధి= బ్రహ్మ; క్రూరుండు= కసాయి గుండె కలవాడు; కాక+ఉన్నన్= కాకుంటే; ప్రాణంబు= ఊపిరి; క్రమ్మఱన్= తిరిగి; రాక కల్గునో!= రావటం జరుగుతుందేమో!; ఎఱుంగుదురే?= మీకు తెలుసునా?; ఇనుండునున్= సూర్యుడు కూడా; అస్త+అద్రిన్+చేరఁడు= క్రుంకలేదు; వెఱవక= భయపడకుండా; మీరు; నిలువుఁడు= ఆగండి; అనినన్= అని నక్క పలకగానే; వారును= వారూ; (పీనుగు చుట్టాలు); మనమునన్= మనస్సులో; ఆసపుట్టి= ఆశ కలిగి; మగిడి వచ్చినన్= తిరిగి రాగా; గ్రద్ద= గద్ద; ఈ మందబుద్ధిఐన= మందమతి అయిన; నక్కమాటలు= నక్క పలుకులు; వినన్+అగునె?= వినవచ్చునా?; పీనుంగు= పీనుగు వికృతము+అయ్యెన్= వికారం పొందింది; అసువులు= ప్రాణాలు; ఇంకన్= ఇంకా; వచ్చునే?= వస్తాయా?

**తాత్పర్యం:** 'గద్దమాటలకు అంత భయపడటం దేనికి' అయ్యో! చక్కటి పిల్లవాడిని ఇక్కడ పాతిపెట్టి పోవటానికి మీకు కాళ్ళెట్లావచ్చాయి? మీ కడుపుశోకం తీరిపోయేదాకా ఈ వల్లకాటిలోనే కాసేపు ఏడ్వండి. అంతలో బ్రహ్మ దయ ఉంటే ఈ పిల్లవాడు ఊపిరి మళ్ళీ పోసుకొంటాడేమో? మీ రేమి ఎరుగుదురు? ఇంకా సరిగ్గా పొద్దుగ్రుంకనూ లేదు. మీరు భయపడకుండా ఉండండి' అని నక్క చెప్పింది. అప్పుడు అక్కడ ఉన్నవాళ్ళకు ఆశ పుట్టింది. తిరిగివచ్చారు. గ్రద్ద వాళ్ళను చూచి 'ఈ మందమతి నక్కమాటలు వినవచ్చా? పీనుగు రూపం చెడింది. పోయిన ప్రాణాలు మళ్ళీ వస్తాయా ఏమి?

**క. కడు బెట్టిదుండు కాలుఁడు; । మిడుక మిడుక నపహరించు; మీరీ యాసల్**
**విడువుఁడు; బాలునికి సుగతిఁ । బడయుఁడు దానాదు లైన బహుధర్మములన్. 370**

**ప్రతిపదార్థం:** కాలుఁడు= యముడు; కడుబెట్టిదుండు= కటికవాడు; మిడుక మిడుకన్= పరితపిస్తుండగా; అపహరించున్= (ప్రాణాలు) ఎత్తుకొనిపోతాడు; మీరు; ఈ ఆసల్= ప్రాణాలు తిరిగి వస్తాయి అనే ఆశలు; విడువుఁడు= వదులుకొనండి; దాన+ఆదులు+ఐన= దానం చేయటం మొదలైన; బహుధర్మములన్= అనేక పుణ్యాలచేత; బాలునికిన్= ఈ పిల్లవాడికి; సుగతిన్= ఉత్తమ గతిని; పడయుఁడు= కలిగించండి.

**తాత్పర్యం:** యముడు చాలా కటికగుండెవాడు. కుయ్యో మొర్రోమని బాధపడుతుండగా ప్రాణాలు తీసికొని వెళ్ళిపోతాడు. మీ పిల్లవాడు ప్రాణాలతో తిరిగి వస్తాడనే ఆశలు పెట్టుకొనకండి. దానధర్మాలు చేసి ఆ పిల్లవాడికి పుణ్యగతులు కలిగించండి'.

**వ. అని పలికిన నా గృధ్రంబు వచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు వారల నుద్దేశించి. 371**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని మాటలాడిన; ఆ గృధ్రంబు= ఆ గద్ద; వచనంబులు= మాటలు; ఆక్షేపించి= తోసి రాజని; ఆ జంబుకంబు= ఆ నక్క; వారలన్+ఉద్దేశించి= పీనుగు చుట్టాలను గూర్చి.

**తాత్పర్యం:** అని చెప్పిన గద్ద మాటలను నక్క కాదని తోసిపుచ్చింది. ఆ పిల్లవాడి చుట్టాలతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'క్రూరంబు గృధ్ర మిట్టి కు । మారకునిం జూచి చూచి మసలకపోవన్**
**మీ రె ట్లోర్చెదరో క । న్నీ రిటు నను బోటులకును నిలువ కొలికెడున్. 372**

**ప్రతిపదార్థం:** గృధ్రము= గద్ద; క్రూరంబు= కటికది; ఇట్టి కుమారకునిన్= ఇట్లాంటి బిడ్డను; చూచి చూచి= చూస్తూ చూస్తూ; మసలక= ఉండకుండా; పోవన్= వెళ్ళటానికి; మీరు; ఎట్లు+ఓర్చెదరో= ఎట్లా తట్టుకుంటారో; ఇటు= ఇట్లా; ననుబోటులకును= నా బోటి జంతువులకే; కన్నీరు= కళ్ళనీళ్ళు; నిలువక= ఆగక; ఒలికెడున్= కారుతున్నాయి.

**తాత్పర్యం:** 'గద్దది రాతిగుండె. మీరు ఇట్లాంటి బిడ్డను చూస్తూ చూస్తూ వదలివెళ్ళటానికి ఎట్లా తట్టుకుంటారో. నావంటి వాళ్ళకే కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి.

**క. దయమాలి పోవ నేటికిఁ? । బ్రయత్నమునఁ బొదువ దైవబలమున మీకుం**
**బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం । డయినను మఱి పోవరాదె?' యని చెప్పుటయున్. 373**

**ప్రతిపదార్థం:** దయమాలి= పిల్లవాడి మీద జాలిలేకుండా; పోవన్= వెళ్ళటం; ఏటికిన్?= ఎందులకు?; ప్రయత్నమునన్= వదలని పట్టుదలతో; పొదువన్= తలపడగా; దైవ బలమునన్= దైవశక్తిచేత; మీకున్= మీకు; ప్రియము+ఎసఁగన్= సంతోషం కలుగగా; బ్రదుకున్= బ్రతుకుతాడు; బ్రదుకండు అయినను= బతకకపోతే; మఱి= ఆ తరువాత; పోవరాదె?= వెళ్ళరాదా?; అని చెప్పుటయున్= అని నక్క చెప్పగానే.

**తాత్పర్యం:** నిర్దయగా పోవటం ఎందుకు? పంతంపట్టి తలపడండి. దైవం కలసివస్తే మీరంతా సంతోషించేటట్లు ఆ పిల్లవాడు లేచి వస్తాడు. అట్లా కాకపోతే అప్పుడే పోవచ్చును' అని చెప్పగానే.

**వ. గ్రద్ద యిట్లనియె. 374**

**ప్రతిపదార్థం:** గ్రద్ద= గద్ద; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** గద్ద ఈ విధంగా చెప్పింది.

**ఆ. ఏను బుట్టివేయు నిన్నూఱు మున్నూఱు । గలవు వత్సరములు గాన నెందు**
**బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ । జచ్చిపోయి మగిడి వచ్చువాని. 375**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; పుట్టి= ఈ పుట్టుక పుట్టి; వేయున్+ఇన్నూఱు మున్నూరు= పదిహేనువందల; వత్సరములు= ఏళ్ళు; కలవు= అవుతుంది; చచ్చిపోయి= ప్రాణం పోయి; మగిడి= తిరిగి; వచ్చువానిన్= వచ్చేవాడిని; బాలున్= పసివాడిని; యౌవనస్థున్= కుర్రవాడిని; ప్రౌఢునిన్= వయస్సు వచ్చినవాడిని; వృద్ధునిన్= ముసలివాడిని; ఎందున్= ఎక్కడా; కానను= చూడలేదు.

**తాత్పర్యం:** 'నేను పుట్టి 1500ల ఏళ్ళయింది. ఇంత సుదీర్ఘకాలంలోనూ చచ్చి తిరిగి బతికివచ్చిన పసివాడినిగానీ, కుర్రవాడినిగానీ, వయసు వచ్చినవాడినిగానీ, ముసలివాడినిగానీ ఎక్కడా చూడలేదు.

**క. ఒకటి గలదు; వత్తురు వే । టొక గర్భంబునకు మృతులు నుక్కివమౌ న**
**క్కకు నేటి బుద్ధి పీనుఁగు । నకు బ్రదుకటె! కలుగు నిట్టి నవ్వులు గలవే? 376**

**ప్రతిపదార్థం:** ఒకటి కలదు= ఒకసంగతి ఉన్నది; మృతులు= చచ్చినవారు; వేఱొక గర్భంబునకున్= మరొకరి కడుపులోకి; వత్తురు= వస్తారు; ఉక్కివము+ఔ= మాయలమారి అయిన; నక్కకున్= నక్కకు, ఏటి బుద్ధి?= ఇదేమి ఆలోచన?; పీనుఁగునకున్= పీనుగునకు; బ్రదుకు= ప్రాణం; కలుగునటె!= వస్తుందా!; ఇట్టి= ఇట్లాంటి; నవ్వులు= వింతలు; కలవే?= ఉన్నాయా?

**తాత్పర్యం:** ఒక సంగతి ఉన్నది. చచ్చిపోయినవారు మరోజన్మ ఎత్తుతారు. జిత్తులమారి నక్కకు ఇదేమి బుద్ధి? పీనుగు ఎక్కడైనా తిరిగి బ్రతుకుతుందా? ఇట్లాంటి వింత లున్నాయా?'

**సీ. అనవుడు నెగవెక్కి యా బిడ్డవైచి పో । యెడు వారలకు నడ్డపడుచు నక్క**
**'వినుఁడు రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే । మృతుఁడైన భూసుర సుతుని మగుడ?**
**సృంజయు కొడుకు సచ్చిన నారదుఁడు ప్రభా । వంబునఁ గ్రమ్మఱ వానిఁ దేఁడె?**
**యట్టుల యొక సిద్ధుఁ డమరుండు మీ యేడ్పు । లాలించి దయ బాలు నసువు లొసఁగె**

**ఆ. నేని మేల కాదె! యిది యేల పోయెద?' । రనిన వారు మగిడి యరుగుదెంచి**
**శిశువు శవము చుట్టుఁ జేరి పెల్లేడ్చిరి । పనవిపనవి యంత నినుడుఁ గ్రుంకె. 377**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; ఎగ వెక్కి= పైకి ఎక్కిళ్ళుపెట్టి ఏడ్చి; ఆ బిడ్డన్= ఆ పిల్లవాడిని; వైచి= పాతిపెట్టి; పోయెడు వారలకున్= వెళ్ళేవాళ్ళకు; నక్క; అడ్డపడుచున్= అడ్డంగా వస్తూ; వినుఁడు= ఆలకించండి; మృతుఁడు+ఐన= చచ్చిపోయిన; భూసుర సుతునిన్= బాపడి కొడుకును; రాఘవుఁడు= రాముడు; మగుడన్= తిరిగి; నేర్పునన్= సామర్థ్యంతో; బ్రదికింపఁడే= ప్రాణం పోయలేదా; సృంజయు కొడుకు= సృంజయుడి కుమారుడు; చచ్చినన్= చనిపోగా; నారదుఁడు= నారదుడు; ప్రభావంబునన్= తన మహిమచేత; క్రమ్మఱన్= తిరిగి; వానిన్+తేఁడె?= వాడిని తేలేదా?; అట్టుల= ఆ విధంగానే; సిద్ధుఁడు= అణిమాది సిద్ధులు కల; ఒక అమరుండు= ఒక దివ్య పురుషుడు; మీ ఏడ్పులు= మీరు పెట్టే శోకాలు; ఆలించి= విని; దయన్= జాలితో; బాలు= బాలుడి; అసువులు= ప్రాణాలు; ఒసఁగెన్+ఏని= ఇస్తే; ఇది= మళ్ళీ ఊపిరాడటం; మేల కాదె?= మంచిదే కదా?; పోయెదరు ఏల?= వెళ్ళిపోతారు ఎందుకు?; అనినన్= అనగానే; వారు= వారు (పీనుగ చుట్ట పక్కాలు); మగిడి= వెనక్కి తిరిగి; అరుగుదెంచి= వచ్చి; శిశువు= ఆ పిల్లవాడి; శవము చుట్టున్= పీనుగు చుట్టూ; చేరి= పొంది; పనవి పనవి= తలచుకొని తలచుకొని; పెల్లు= పెద్ద పెట్టున; ఏడ్చిరి= రాగాలు తీశారు; అంతన్= అంతలో; ఇనుఁడున్= సూర్యుడూ; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** గ్రద్ద అట్లా అనగానే పైకి వెక్కి వెక్కి ఏడుస్తూ ఆ పిల్లవాడిని అక్కడే పాతిపెట్టి వెళ్ళబోతున్న వాళ్ళకు నక్క అడ్డుపడింది. ఒక్కమాట వినండి అన్నది.'మునుపు రఘురాముడు ప్రాణంపోయిన బాపడి కొడుకును నేర్పుగా

బ్రతికించలేదా? నారదుడు తన మహిమ చూపి స్రుంజయుడనే రాజుకుమారుడికి ప్రాణాలు పోయలేదా? ఆ విధంగానే ఒక సిద్ధుడైన దివ్యపురుషుడు మీ శోకాలు చెవినిబడి మీ పిల్లవాడికి ఊపిరి పోయవచ్చును. ఇది మీకు మంచిదే కదా! వెళ్ళిపోతారేం?' అనగానే ఆ పీనుగు చుట్టపక్కాలు వెనక్కి తిరిగి వచ్చి ఆ పీనుగుచుట్టూ చేరి పేరు పేరున చెప్పుకొంటూ పెద్ద పెట్టున రాగాలు పెట్టి ఏడ్చారు. అంతలో సూర్యుడు అస్తమించాడు.

**వ. ఆ గృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి తాన తాన బాలశవంబు నాహారంబు గొనుటకై యివ్విధంబునం దమ తమ పల్కునేర్పున నజ్జనంబుఁ గ్రమ్మఱించెఁ బ్రొద్దు గ్రుంకినం దా నచ్చోట నిలువనేరదు గావున గ్రద్ద యటమున్న వారు వోవునట్టి తెఱంగు మాటలాడెఁ; రాత్రియైనం దనకు మేలుగావున నక్కవారలు దడయుటకుం దగిన చందంబుఁ జెప్పె; నది వాని తెఱంగు ప్రేతవనవిహారనిరతుం డగు శంకరుండు కరుణాకింకరుండు నగుట నప్పుడు. 378**

**ప్రతిపదార్థం:** ఆ గృధ్రంబును= ఆ గ్రద్దా; జంబుకంబునున్= నక్కా; ఆఁకలిచేత= ఆకలితో; వందురుచున్+ఉండి= నకనకలాడుతూ; తాన తాన= దేనికి అదే; బాలశవంబున్= పిల్లవాడి పీనుగును; ఆహారంబు+కొనుటకై= తినటానికి; ఈ విధంబునన్= ఈ తీరున; తమ తమ= వారి వారి; పల్కునేర్పునన్= మాటకారితనంతో; ఆ+జనంబున్= ఆ పిల్లవాడి చుట్టాలను; క్రమ్మఱించెన్= మళ్ళించాయి; ప్రొద్దు క్రుంకినన్= చీకటి పడితే; గద్ద; తాను; ఆ చోటన్= ఆ వల్లకాట్లో; నిలువనేరదు= ఉండలేదు; కావునన్= కాబట్టి; అట మున్న= అంతకుముందే (చీకటి పడకముందే); వారు= వారు; పోవునట్టి తెఱంగు= వెళ్ళేవిధంగా; మాటలు+ఆడెన్= మాటలాడింది; రాత్రి+ఐనన్= చీకటి పడితే; నక్క; తనకు; మేలు కావునన్= మంచిది కాబట్టి; వారలు= వారు; తడయుటకున్= జాగు చేయటానికి; తగిన చందంబున్= తగ్గట్టుగా; చెప్పెన్= చెప్పింది; అది= అట్లా చెప్పటం; వాని తెఱంగు= వాటి నైజం; ప్రేతవన= శ్మశానవాటికలో; విహార= విహరించటంలో; నిరతుండు+అగు= ఆసక్తికలవాడైన; శంకరుండు= శివుడు; కరుణాకింకరుఁడు= దయకు అధీనమైనవాడు; అగుటన్= అవటం వలన; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ గద్దా నక్కా ఆకలికి నకనకలాడుతూ దేని మట్టుకు అది ఆ పిల్లవాడి పీనుగును పీక్కుతినాలని ఇట్లా తమ మాటకారితనం చూపాయి. ఆ పీనుగు చుట్టాలను వెనుకకు మళ్ళించాయి. చీకటిపడితే గ్రద్ద ఉండలేదు కాబట్టి చీకటి పడకముందే వారు తిరిగి వెళ్ళేటట్లు మాట్లాడింది. రాత్రి అయితే నక్కకు మేలు కాబట్టి వారు ఆలస్యం చేయటానికి అనువుగా చెప్పింది. ఇట్లా చెప్పటం ఆ జంతువుల స్వభావం. ఒలుకులలో విహరించాలనే అపేక్షకల దయాళువైన శివుడు ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అట్లు పనవియేడ్చు నజ్జనంబులకుఁ బ్ర। త్యక్షమై 'వరంబు లడుగుఁ' డనిన**
**సంప్రమోద భక్తి సంభ్రమ భరితులై। చక్క నవనిఁ జాఁగి మ్రొక్కి వారు. 379**

ప్రతిపదార్థం: అట్లు= అట్లా; పనవి= తలచుకొని; ఏడ్చు= దుఃఖించే ; ఆ+జనంబులకున్= ఆ జనానికి; ప్రత్యక్షము+ఐ= ఎదుటపడి; వరంబులు= కోరికలు; అడుగుఁడు= కోరండి; అనినన్= అనగానే; సంప్రమోద= పట్టరానంత సంతోషంతోనూ; భక్తి= ఆరాధనతోనూ; సంభ్రమ= తొట్రుపాటుతోనూ; భరితులు+ఐ= నిండినవారై; చక్కన్= చక్కగా; అవనిన్= నేలమీద; చాఁగి= సాగిలపడి; మ్రొక్కి= మొక్కి; వారు= ఆ పీనుగు చుట్టాలు.

**తాత్పర్యం:** తలచుకొని తలచుకొని ఏడుస్తున్న అక్కడి వారి ఎదుటకు వచ్చి 'మీకేం కావాలో కోరుకొనండి' అనగానే

ఎంతో సంతోషించారు. భక్తి సంభ్రమాలలో తేలిపోతూ నేలమీద సాగిలపడి మొక్కి, వారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. బాల మరణ శోకంబునఁ । దేలకయుండంగఁ గావు దేవోత్తమ! నీ**
**వాలించిన బ్రదికితిమి ద । యాళుహృదయ! పార్వతీప్రియా! చంద్రధరా! 380**

**ప్రతిపదార్థం:** దయాళుహృదయ!= జాలిగుండె కలవాడా!; పార్వతీప్రియా!= గౌరీపతీ!; చంద్రధరా!= చంద్రుడిని తలమీద పెట్టుకొన్నవాడా!; దేవోత్తమ!= దేవతలలో శ్రేష్ఠుడా శివుడా!; నీవు; ఆలించినన్= మా మొర ఆలకించినట్లైతే; బ్రదికితిమి= మేం బతికిపోయినట్టే; బాలమరణ= పిల్లవాడి చావువలన కలిగిన; శోకంబునన్= ఏడ్పులో; తేలక+ఉండంగన్= మునిగి పోకుండేటట్లు; కావు= రక్షించుము.

**తాత్పర్యం:** 'ఓ శివుడా! నీవు జాలిగుండె కలవాడవు. నెలవంకను నెత్తిన పెట్టుకొన్నవాడవు. పార్వతీపతివి. దేవతలలో ఉన్నతుడివి. ఈ పిల్లవాడి చావు అనే దుఃఖంలో మునిగిపోకుండా మమ్మల్ని రక్షించుము. నీవు మా మొర వింటే మేము బ్రతికిపోయినట్టే'.

**వ. అనుచు లేచి నిలుచుటయు శివుం డా శిశుప్రాణంబు లొసంగి 'వీఁడు శతాయుస్సంపన్నుం డగువాఁ'డని యానతిచ్చి, యాగృధ్ర జంబుకంబులకు నాఁకలి యెన్నండును లేకయుండం బ్రసాదించి యంతర్హితుండయ్యెఁ; సంతోషంబున నంతరంగంబులు నంగంబులుం బొదల నజ్జనంబులు బాలునెత్తికొని పలుమఱుం జూచుచు, గౌఁగిలించుచుం జనిరి. గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచుం బోయి తమ తమ కులంబులలోఁ బ్రభూతంబులై ప్రవర్తిల్లె; నార్త జనబాష్ప ప్రమార్జనంబు ప్రభువులకుం గర్తవ్యం బగుటకును నిజకార్యార్థులగు కపటుల నేర్పు మాటల తెరువు లెఱింగికొనుటకును నుదాహరణం బైన యీ గృధ్ర జంబుకోపాఖ్యానంబు. 381**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; లేచి నిలుచుటయున్= వారు లేచి నిలబడగా; శివుండు= శివుడు; ఆశిశు ప్రాణంబులు= ఆ పిల్లవాడి ప్రాణాలు; ఒసంగి= ఇచ్చి; వీఁడు= ఈ పిల్లవాడు; శత= నూరేళ్ళు; ఆయుః+సంపన్నుండు= ఆయుస్సంపద కలవాడు; అగువాఁడు= అవుతాడు; అని; ఆనతి+ఇచ్చి= దయతో చెప్పి; ఆ గృధ్రజంబుకంబులకున్= ఆ గద్ద, నక్కలకు; ఆఁకలి= ఆకలి; ఎన్నండును= ఎప్పటికీ; లేక+ఉండన్= కలగకుండేటట్లు; ప్రసాదించి= కనికరించి; అంతర్హితుండు+అయ్యెన్= కనుమరుగయ్యాడు; ఆ+జనంబులు= ఆ బాలుడి చుట్టాలు; సంతోషంబునన్= సంతోషంతో; అంతరంగంబులున్= మనస్సులున్నూ; అంగంబులున్= శరీరాలున్నూ; పొదలన్= ఉప్పొంగగా; బాలున్= పిల్లవాడిని; ఎత్తికొని= చంకన బెట్టుకొని; పలుమఱున్+చూచుచున్= అదేపనిగా చూచుకొంటూ; చనిరి= వెళ్ళారు; గృధ్రంబును= గద్దా; జంబుకంబును= నక్కా; ముదంబునన్= సంతోషంతో; పొంగుచున్+పోయి= ఉబుకుతూపోయి; తమతమ= వారి వారి; కులంబులలోన్= జాతులలో ప్రభూతంబులై= ముఖ్యులై; ప్రవర్తిల్లెన్= తిరుగాడాయి; ఆర్తజన= బాధలలో ఉన్నవాళ్ళ; బాష్ప= కన్నీటిని; ప్రమార్జనంబు= తుడవటం; ప్రభువులకున్= రాజులకు; కర్తవ్యంబు= చేయవలసినపని; అగుటకున్= అవటానికీ; నిజకార్య+అర్థులు+అగు= తమవైన పనులు చక్కబెట్టుకొనేవారైన; కపటుల= మాయగాళ్ళయొక్క; నేర్పుమాటల= మాటల చాతుర్యం; తెరువులు= తెన్నులు; ఎఱింగికొనుటకునున్= తెలిసికొనటానికిన్నీ; ఉదాహరణంబు+ఐన= మచ్చువంటిదైన; ఈ గృధ్ర జంబుక+ఉపాఖ్యానంబున్= ఈ గద్దా నక్క కథను.

**తాత్పర్యం:** అంటూ వాళ్ళు లేచి నిలబడ్డారు. శివుడు ఆ పిల్లవాడికి ప్రాణంపోసి 'వీడు నిండుగా నూరేళ్ళు బతుకుతాడు' అని చెప్పాడు. ఆ గద్ద నక్కలను కనికరించి ఎన్నటికీ ఆకలి లేకుండేటట్లు చేసి కనుమరుగయ్యాడు.

చెప్పలేనంత సంతోషంతో ఆ పిల్లవాడి చుట్టాలు ఆ పిల్లవాడిని ఎత్తుకొని పదే పదే చూచుకొంటూ కౌగిలించుకొంటూ వెళ్ళారు. గద్దా, నక్కా పట్టలేనంత సంతోషంతో ఉప్పొంగిపోతూ తమ తమ కులంలో మిన్నలయ్యాయి. కష్టాలలో ఉన్నవాళ్ళ కన్నీరు తుడవటం రాజులు చేయాల్సిన పని అనీ, కడుపే కైలాసం అనుకొని తమ పనులు చక్కబెట్టుకొనే మాయగాళ్ళ మాటకారితనాన్ని తెలిసికొనటానికిన్నీ, మాదిరివంటి ఈ గద్దా నక్క కథను. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినినఁ బఠించిన వ్రాసినఁ। గొనియాడిన దురితపీడకుం దొలఁగి నరుం**
**డనుపమధర్మములకు భా। జన మగు; నాయుః ప్రవృద్ధి సంపద నొందున్.' 382**

**ప్రతిపదార్థం:** వినినన్= విన్నా; పఠించినన్= చదివినా; వ్రాసినన్= రాసినా; కొనియాడినన్= పొగడినా; దురిత పీడకున్= పాపం వలన కలిగే బాధకు; తొలఁగి= దూరమై; నరుండు= మనిషి; అనుపమ= సాటిలేని; ధర్మములకున్= పుణ్యాలకు; భాజనము+అగున్= పాత్ర మవుతాడు; ఆయుః ప్రవృద్ధి= ఆయువు పెరగటాన్నీ; సంపదన్= ఐశ్వర్యాన్నీ; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ కథ విన్నా, చదివినా, వ్రాసినా, మెచ్చుకొన్నా, ఆ మనిషికి పాపపు పీడ కలుగదు. ఎంతో పుణ్యం వస్తుంది. జీవితకాలం పెరుగుతుంది. సంపత్తి కలుగుతుంది'.

**భీష్ముఁడు ధర్మజునకుఁ బవనశాల్మలీతరు సంవాదంబులు సెప్పుట (సం. 12-150-1)**

**సీ. అని వినతుం డగు నా ధర్మసుతునకు। ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు**
**నిట్లను నిది యొక్క యితిహాస మధిప! యా। కర్ణింపు: హిమవన్నగంబునందుఁ**
**గల దొక్క బూరువు; గడుఁ బెద్ద కాలంబు। ముదురు శాఖాశోభి మూలదృఢము**
**నారదముని యొక్కనాఁ డత్తరువు పొంతఁ। జనిచని వేడ్క నిట్లనియె: 'నెమ్మి**

**తే. బూరువా! యింతపఱపును బొడవుఁ। గల్గి నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు**
**నునికి గని ప్రీతి నడిగెద ననిలుచేతఁ। బడు నొకప్పుడు తరులు నీ పడమి యెట్లు. 383**

**ప్రతిపదార్థం:** అని; వినతుండు+అగు= వినయంకల; ఆ ధర్మసుతునకున్= ఆ ధర్మరాజుకు; భీష్ముండు= భీష్ముడు; ముదమునన్= సంతోషంతో; చెప్పి; మఱియున్= మళ్ళీ; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అధిప!= ధర్మరాజా!; ఇది= ఈ చెప్పబోయేది; ఒక్క+ఇతిహాసము= ఒక వెనుకటి కథ; ఆకర్ణింపు= వినుము; హిమవత్+నగంబునందున్= హిమాలయపర్వతంమీద; కడున్+పెద్ద కాలంబు= ఎన్నో ఏళ్ళనాటిది; ముదురు= బాగా చేవదేలినది; శాఖాశోభి= కొమ్మలతో అందంగా ఉన్నది; మూలదృఢము= గట్టి బోదెకలది అయిన; ఒక్కబూరువు= ఒక బూరుగుచెట్టు; కలదు= ఉన్నది; ఒక్కనాఁడు= ఒక దినం; నారదముని= నారద మహర్షి; ఆ తరువు పొంతన్= ఆ చెట్టు చెంతకు; చని చని= చేరి; వేడ్కన్= ఉబలాటంతో; నెమ్మిన్= ఆదరంగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; బూరువా!= ఓ బూరుగా!; ఇంత పఱుపును= ఇంత విశాలమునూ; పొడవున్= ఎత్తునూ; కల్గి= ఉండి; నీవు= నీవు; మృగ= జంతువులకు; పక్షి= పిట్టలకు; సంశ్రయణీయము+అగుచున్= ఆశ్రయించదగ్గ దానివి అవుతూ; ఉనికి= ఉండటం; కని= చూచి; ప్రీతిన్= సంతోషంతో; అడిగెదన్= అడుగుతాను; అనిలుచేతన్= గాలితాకిడికి; తరులు= చెట్లు; ఒక్కప్పుడు= ఒక్కసారైనా; పడున్= కూలతాయి; నీ= నీవు; పడమి= పడకుండటం; ఎట్లు?= ఎట్లా?

**తాత్పర్యం:** అని వినయశీలుడైన ధర్మరాజుకు భీష్ముడు సంతోషంగా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు: 'ధర్మరాజా!

ఈ చెప్పబోయేది ఒక పురాణగాథ. వినుము హిమాలయాలమీద ఒక బూరుగుచెట్టు ఉండేది. అది చాలా ముదురు చెట్టు. కొమ్మలతో విస్తరించి ఒప్పిదంగా ఉండేది. దాని బోదె చాల గట్టిది. ఒకనాడు నారదముని ఆ చెట్టు దగ్గరకు వెళ్ళి కుతూహలంతో ఇట్లా అన్నాడు. 'ఓ బూరుగు చెట్టా! ఇంత వైశాల్యం, ఇంత ఎత్తూ ఉన్న నీవు జంతువులకూ, పిట్టలకూ, ఆశ్రయం ఇస్తున్నావు. ఇది చూచి సంతోషంతో అడుగుతున్నాను. గాలి తాకిడికి చెట్లు ఒకసారి కాకపోతే ఒకసారైనా కూలిపోతాయి కదా! నీవు కూలకపోవటానికి కారణం ఏమిటి?

**క. పవనునకును నీకును బాం। ధవము గలదొ? యతఁడు నిన్ను దయ రక్షింపన్**
**సవినయవృత్తిని బ్రతికితొ?। చెవులకు నింపెసఁగ నిజము సెప్పుము నాకున్. 384**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ గాలిదేవుడు; నిన్నున్= నిన్ను; దయన్= జాలితో; రక్షింపన్= కాపాడటానికి; పవనునకును= గాలికినీ; నీకును= నీకూ; బాంధవము= చుట్టరికం; కలదొ?= ఉన్నదా?; సవినయ వృత్తిని= అణకువగల నడవడితో; బ్రతికితి+ఒ?= బతికావా?; చెవులకున్= చెవులకు; ఇంపు+ఎసఁగన్= హితవు కలిగేటట్లు; నాకున్= నాకు; నిజము= ఉన్నది ఉన్నట్లు; చెప్పుము= వచించుము.

**తాత్పర్యం:** గాలిదేవుడు నిన్ను కాపాడటానికి మీ ఇద్దరికీ చుట్టరికం కలిసిందా? అణకువగా మెలగటంవలన బ్రతికిపోయావా? ఉన్నది ఉన్నట్లుగా నాకు వినాలనిపించేటట్లు చెప్పుము'.

**క. అనిన విని బూరు విట్లను। 'ననిలుని బల మస్మదీయమైన బలముతో**
**నెనగా దేర్పడ; విను పదు। నెనిమిది యగు నంశమునకు నెనయ దరయఁగన్. 385**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని; బూరువు= బూరుగు చెట్టు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది; అనిలుని బలము= గాలిసత్తువ; అస్మదీయము+ఐన= నాదైన; బలముతోన్= బలిమితో; ఎన గాదు= సాటి కాదు; ఏర్పడన్= స్పష్టంగా; విను= వినుము; అరయఁగన్= ఆలోచించగా; పదునెనిమిది+అగు+అంశమునకున్= పద్దెనిమిదవ భాగానికీ; ఎనయదు= (గాలి బలం) సరిపోలదు.

**తాత్పర్యం:** నారదమునితో బూరుగు చెట్టు ఇట్లా అన్నది. 'గాలిదేవుడి సత్తువ నా సత్తువతో సాటి రాదు. ఇంకా చెప్పాలంటే నా బలంలో 18వ వంతుకు కూడ సరితూగదు'.

**వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు. 386**

**ప్రతిపదార్థం:** అని; పలుకుటయున్= పలకగానే; ఆ+మునీంద్రుండు= ఆ నారదుడు.

**తాత్పర్యం:** అన్న బూరుగుచెట్టుతో నారదముని - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'అమ్మచెల్ల! యిట్టు లనకుము గొండలు। లోనుగాఁగ బవనుచే నపాస్త**
**మహిమ గలుగు టెఱుఁగుమా భూతముల చేష్టి। తములు వాయువశగతములు గావె? 387**

**ప్రతిపదార్థం:** అమ్మచెల్ల!= అయ్యో!; ఇట్టులు= ఇట్లా; అనకుము= చెప్పకుము; పవనుచేన్= గాలిచేత; కొండలు లోనుగాఁగన్= పర్వతాలు మొదలుగాగలవి; అపాస్త= పోగొట్టబడ్డ; మహిమ కలుగుట= మహాత్మ్యం కలవిగా; ఎఱుఁగుమా!= తెలిసికొనుమా!; భూతముల= అన్ని ప్రాణుల; చేష్టితములు= నడకలు; వాయువశగతములు కావె?= గాలి దేవుడికి లోబడి నడచుకొనేవి కావా?

**తాత్పర్యం:** 'ఔర! ఇట్లా మాట్లాడకుము. గాలిచేత కొండలు కూడా కొట్టుకుపోతాయని తెలిసికొమ్ము. సమస్త జీవరాశి నడకలన్నీ గాలిదేవుడి కింద ఉండేవి కావా?'

**క. అనుటయుఁ 'బెలుచని యెలుఁగున । ఘనమూల ప్రబలశాఖికా దుర్జయు న**
**న్నును దాఁకిన నతని ప్రభం । జనుఁ డను నామంబునకు నసత్యత వచ్చున్.' 388**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; పెలుచని+ఎలుఁగునన్= పెద్దగొంతుతో; ఘనమూల= పెద్ద బోదె; ప్రబలశాఖికా= దిట్టమైన కొమ్మలూ కలిగి; దుర్జయున్= గెలవరాని; నన్నును= నన్నూ; తాఁకినన్= ఎదుర్కొంటే; అతని= ఆ గాలికిగల; ప్రభంజనుఁడు+అను నామంబునకున్= ప్రభంజనుడు (అతి తేలికగా విరగ్గొట్టేవాడు) అనే పేరుకు; అసత్యత= అబద్ధం; వచ్చున్= వస్తుంది.

**తాత్పర్యం:** అనగానే ఆ బూరుగుచెట్టు పెద్ద గొంతుతో 'పెద్ద బోదె, పెద్ద పెద్ద కొమ్మలూ ఉండి ఎదిరించ శక్యంకాని నాతో ఢీకొంటే అతడి కున్న ప్రభంజను డనే పేరు అబద్ధం అవుతుంది సుమా!'

**వ. అని గర్వంపు మాట లాడిన యా శాల్మలిం జూచి సురమునిప్రవరుండు. 389**

**ప్రతిపదార్థం:** అని; గర్వము+మాటలు= పొగరుబోతు పలుకులు; ఆడిన= పలికిన; ఆ శాల్మలిన్= ఆ బూరుగుచెట్టును; చూచి= కని; సురముని ప్రవరుండు= దేవమునులలో మేటి అయిన నారదుడు.

**తాత్పర్యం:** అని పొగరుగా మాటలాడిన ఆ బూరుగుచెట్టును చూచి దేవముని నారదముని. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'మఱవకయుండు నీ బిరుదు మాటలు నీ విటు లంట మారుతుం**
**డెఱిఁగెడు నెట్లు నంచు వెస నేఁగి సమస్తముఁ జెప్ప నాతఁ డే**
**డ్తెఱఁ జనుదెంచి నీ వటు కడిందిమగండవు; నిన్నుఁ దాకినం**
**జెఱుతటె పేరు? బూరుగ నశించితిగా కిటఁ బల్కు లేటికిన్?' 390**

**ప్రతిపదార్థం:** నీ బిరుదు మాటలు= నీ బీరపు పలుకులు; మఱవక+ఉండు= మర్చిపోకుము; నీవు= నీవు; ఇటులు= ఇట్లా; అంట= అనటం; ఎట్లున్= ఎట్లాగైనా; మారుతుండు= గాలిదేవుడు+ఎఱిఁగెడున్= తెలిసికొనగలుగుతాడు; అంచున్= అంటూ; వెసన్= తొందరగా; ఏఁగి= వెళ్ళి; సమస్తమున్= అంతా; చెప్పన్= చెప్పగా; ఆతఁడు= ఆ గాలిదేవుడు; ఏడ్తెఱన్= విజృంభణంతో; చనుదెంచి= వచ్చి; బూరుగ= ఓ బూరుగా; నీవు= నీవు; అటు= అట్లా; కడింది= గొప్ప; మగండవు= శూరుడివి; నిన్నున్= నిన్ను; తాఁకినన్= ఎదుర్కొంటే; పేరు= నా పేరును; చెఱుతటె= మాపివేస్తానన్నావుట; ఇటన్= ఇక్కడ; పల్కులు= మాటలు; ఏటికిన్?= ఎందుకు?; నశించితి+కాక= రూపుమాసిపోతావు గాక.

**తాత్పర్యం:** 'నీవు బింకంగా పలికిన మాటలు మర్చిపోకుము. నీవు ఇట్లా అన్నావని గాలిదేవుడు ఎట్లాగైనా తెలిసికొంటాడు' అంటూ నారదుడు వెళ్ళిపోయాడు. అదంతా ఆ వెంటనే గాలిదేవుడి చెవిని వేశాడు. గాలిదేవుడూ విజృంభించి వచ్చాడు. 'నీవు మహామొనగాడివా? నీ జోలికి వస్తే నా పేరు చెరిపేస్తానన్నావుట? నీవు చెడిపోతావు సుమా! ఇట్లాంటి మాటలు ఎందుకంటావు?'

**మ. అని కోపంబునఁ బల్క నప్పవనుతో నా భూరుహం 'బింత పె**
**ల్చన నీ వాడెదు నంత తక్కువనె? బేలా! లోకసామాన్య వృ**
**క్షనికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చం జూచితే?' యన్న న**
**ల్లని న వ్వొప్పఁగ నా సమీరణుఁడు హేలాస్ఫారుఁ డై యిట్లనున్. 391**

**ప్రతిపదార్థం:** అని; కోపంబునన్= రోషంతో; పల్కన్= మాట్లాడగా; ఆ+పవనుతోన్= ఆ గాలిదేవుడితో; ఆ+భూరుహంబు= ఆ బూరుగు చెట్టు (భూమిలో పుట్టేది భూరుహము); బేలా!= తెలివితక్కువవాడా!; ఇంత= ఇంత; పెల్చన= గట్టిగా; నీవు= నీవు; ఆడెదవు= మాట్లాడుతున్నావు; అంత తక్కువనె?= అంత చవటనా?; లోకసామాన్య= లోకంలో సాధారణం అయిన; వృక్షనికాయంబును= చెట్లన్నిటినీ; నన్నున్= నన్నూ; ఒక్కటిగన్= ఒక్కటిగా; ఇచ్చన్= మనస్సులో; చూచితే?= ఎంచావా?; అన్నన్= అనగానే; అల్లని= మెల్లని; నవ్వు; ఒప్పఁగన్= ప్రకాశించగా; ఆ సమీరణుఁడు= ఆ గాలిదేవుడు; హేలాస్ఫారుఁడు+ఐ= పెద్దగా లెక్కపెట్టనివాడై; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని రోషంగా గాలిదేవుడు మాట్లాడాడు. అతడితో ఆ బూరుగుచెట్టు ఇట్లా అన్నది. 'ఓ వెర్రివాడా! నీవు ఇంత గట్టిగా మాట్లాడుతున్నావు. నేను నీవు అన్నంత బలహీనుడనా? లోకంలోని మిగతా చెట్లవలె నన్నూ ఎంచకుము' అని అనగానే ఆ గాలిదేవుడూ ఆ మాటలను పెద్దగా లెక్కపెట్టకుండా మెల్లగా నవ్వుతూ ఈ విధంగా అన్నాడు.

**క. 'ఒకనాఁ డజుండు నీ నీ। డకు డబ్బా టరుగుదెంచుటయు నమ్మే లా**
**త్మకు వ్రేగై మన్నించిన। మెకమెక పడితిట్ల పలుకుమీ తగరేపున్.' 392**

**ప్రతిపదార్థం:** ఒకనాఁడు= ఒక దినం; అజుండు= బ్రహ్మ; నీ నీడకున్= నీ నీడపట్టుకు; డబ్బాటు= అనుకొనకుండా; అరుగుదెంచుటయున్= రావటమున్నూ; ఆ+మేలు= ఆ నీ ఉపకారం; ఆత్మకున్= మనస్సుకు; వ్రేగై= బరువై; మన్నించినన్= (నిన్ను) ఆదరించగా; మెకమెక పడితి(వి)= మిడిసి పడ్డావు; తగన్= ఒప్పేటట్లు; రేపున్= మరునాడు కూడా; ఇట్ల పలుకుమీ!= ఇట్లానే మాట్లాడు సుమా!

**తాత్పర్యం:** 'ఒకనాడు బ్రహ్మ అనుకొనకుండా నీ నీడపట్టుకు వచ్చాడు. ఆ ఉపకారం ఎంతో బరువుగా అనిపించి నిన్ను ఆదరించాడు. అందుకు నీవు మిడిసిపడ్డావు. రేపుకూడా ఇట్లాగే మాట్లాడుము'.

**వ. అని పలికి బలుమొగంబుతోడం బోయిన నబ్బూరువు దలంకి. 393**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాట్లాడి; బలుమొగంబుతోడన్= కోపంతో; పోయినన్= గాలి వెళ్ళగా; ఆ బూరువు= ఆ బూరుగు చెట్టు; తలంకి= బెదరిపోయి.

**తాత్పర్యం:** అని మాట్లాడి గాలిదేవుడు కోపంగా వెళ్ళిపోయాడు. ఆ బూరుగు చెట్టు భయపడి - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'మనుగడ దప్పు నొక్కొ! మునిమాటలు గైకొన నైతి; నా బలం**
**బన నది యెంత? యుగ్రత మహాబలురాకకు నోర్వఁ జాల; నా**
**తని నొక భంగి గెల్తు'నని తాఁ దలపోసి హరించె నాకులుం**
**గొనలును జొంపముల్ నిడుదకొమ్మలు రే యగుడున్ రయంబునన్. 394**

**ప్రతిపదార్థం:** మనుగడ= నా ఉనికి; తప్పున్+ఒక్కొ!= కోల్పోతానో ఏమో!; ముని మాటలు= నారదముని వాక్కులు; కైకొనన్+ఐతిన్= లెక్కపెట్టకపోయాను; నా బలంబు= నా సత్తువ; అనన్= అనగా; అది+ఎంత?= అది ఎంతపాటిది?; ఉగ్రతన్= హోరుతో వచ్చే; మహాబలురాకకున్= గాలిదేవుడి రాకకు; ఓర్వఁజాలన్= తట్టుకొనలేను; ఆతనిన్= ఆ గాలిదేవుడిని; ఒక భంగిన్=

ఒక విధంగా అయితే; గెల్తున్= జయించగలుగుతాను (అని); అని= అని; తాన్= తాను; తలపోసి= ఆలోచించి; రే+అగుడున్= రాత్రి కాగానే; తాన్= తనకు తానుగా; రయంబునన్= తొందరగా; ఆకులున్= ఆకులను; కొనలును= చిన్న కొమ్మలను; జొంపముల్= ఆకులు మొదలగు వాటి గుబుర్లన్నీ; నిడుదకొమ్మలు= పొడవాటి కొమ్మలను; హరించెన్= విరిచేసికొన్నది.

**తాత్పర్యం:** నా ఉనికిని కోల్పోతానో ఏమో? నారదముని మాటలు చెవిని పెట్టకపోయాను. నా సత్తువ ఏపాటిది? హోరుమని వచ్చే గాలిదేవుడి రాకను నేను తట్టుకొనలేను. కాని, ఆతడిని ఒక విధంగా అయితే ఓడించగల నని ఆలోచించుకొన్నది. చీకటిపడిన తరువాత ఆకులను, కొమ్మలను, రెమ్మలను, గుబుర్లను, పొడవాటి కొమ్మలను తనకు తానే విరుచుకొన్నది.

**వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత వేగుటయు. 395**

**ప్రతిపదార్థం:** అట్లు= అట్లా; తన్నున్ తాన= తనను తానే; విఱుచుకొని= త్రుంచుకొని; ఉన్నంతన్= ఉండగా; వేగుటయున్= తెల్లవారగా.

**తాత్పర్యం:** అట్లా తనకు తానే ఊడ్చుకొని మోడుగా ఉండగా తెల్లగ తెల్లవారింది.

**చ. ప్రతినకు నీడుగా భయదభంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా**
**క్షితిరుహముం గనుంగొని 'యిసీ! యిది నా పని నీవ చేసి తీ**
**ధృతి మతి సంతసింపు మిట తేజముఁ బొందుము నీదు బాంధవ**
**ప్రతతికి నివ్విధంబు సదుపాయము మే లెఱిఁగింపు పెంపునన్.' 396**

**ప్రతిపదార్థం:** ప్రతినకున్= శపథానికి; ఈడుగాన్= దీటుగా; భయద భంగిన్= భయం గొలిపేటట్లు; ప్రభంజనుఁడు= గాలిదేవుడు; ఏఁగుదెంచి= వచ్చి; ఆక్షితిరుహమున్= ఆ బూరుగుచెట్టును; కనుంగొని= చూచి; ఇసీ= ఛీ; ఇది= ఈ మోడురూపం; నా పని= నేను చేయాల్సిన పని; నీవ= నీవే; చేసితి(వి)= చేసికొన్నావు; ఈ ధృతిన్= ఇంతటి దిట్టతనంచేత; మతిన్= మనస్సులో; సంతసింపుము= సంతోషించుము; ఇట= ఈ పని చేసికొన్నందువలన; తేజమున్+పొందుము= వెలుగు వెలుగుము; నీదు బాంధవ ప్రతతికిన్= నీ చుట్ట పక్కాలందరికీ; ఈ+విధంబు= ఇది (ఈ మోడు బారటం అనేది); సదుపాయము= తగినసాధనం; మేలు= మంచిది అని; పెంపునన్= ఇంపుగా; ఎఱిగింపు(ము)= చాటి చెప్పుము.

**తాత్పర్యం:** తన ప్రతిజ్ఞకు దీటుగా భయంకరంగా గాలిదేవుడు రానే వచ్చాడు. ఆ బూరుగుచెట్టును చూచాడు. 'ఛీ! నేను చేయాల్సిన పనిని నీవే చేసికొన్నావు. ఇంతటి ధైర్యం చేశానని నీకు నీవే సంతోషపడుము. నీ చుట్ట పక్కాలందరికీ ఇదే తగిన సాధనం అనీ, మంచిపని అనీ చాటిచెప్పుము'.

**వ. అని యుల్లసంబాడి సముల్లసద్గతి నా సదాగతి సనియె; నట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందెఁ; బ్రబలునితోడ దుర్బలుండు దొడరి మత్సరగ్రస్తుం డయిన నపాస్తవిభవుం డగు నని తెల్పు నప్పవన శాల్మలీ సంవాదంబు పుణ్యప్రదం బయిన యుపాఖ్యానం బని చెప్పిన. 397**

**ప్రతిపదార్థం:** అని ఉల్లసంబు+ఆడి= అని ఎత్తి పొడుపు మాటలు పలికి; సముల్లసత్+గతిన్= మిక్కిలి సంతోషించిన గమనంతో; ఆ సదాగతి= ఆ గాలిదేవుడు; చనియెన్= వెళ్ళాడు; అట్లు= అట్లా; శాల్మలి= బూరుగు చెట్టు; పవను చేతన్= గాలిచేత;

భంగంబున్+ఒంది= అవమానపడి; వగన్= దుఃఖంతో; కుందెన్= కుంగిపోయింది; ప్రబలుతోడన్= మంచి బలవంతుడితో; దుర్బలుండు= బలహీనుడు; తొడరి= తలపడి; మత్సరగ్రస్తుండు+అయినన్= పగబట్టిన వాడయినట్లయితే; అపాస్త= కోల్పోయిన; విభవుండు+అగున్= సంపన్ను డవుతాడు; అని; పుణ్యప్రదంబు+అయిన= పుణ్యం ఇచ్చేటటువంటిది అయిన; ఆ పవన శాల్మలీ సంవాదంబు= ఆ గాలీ - బూరుగు చెట్టూ వాదులాట అనే; ఉపాఖ్యానంబు= కథ; తెల్పును= బోధిస్తుంది.

**తాత్పర్యం:** అని ఎత్తి పొడిచి, సంతోషంగా వీస్తూ గాలిదేవుడు వెళ్ళాడు. అట్లా ఆ బూరుగుచెట్టు గాలిదేవుడిచేత అవమానం పొందిన దుఃఖంతో కుమిలిపోయింది. మహాబలవంతుడితో బలహీనుడు తలపడి పగపెట్టుకొంటే తన వైభవాన్ని కోల్పోతాడు - అని పుణ్యదాయకం అయిన ఈ గాలీ-బూరుగు చెట్టు అనే కథ తెలుపుతుంది' అని చెప్పగానే - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ.** **పాండవాగ్రజుండు 'పాపంబునకు నధి । ష్ఠాన మెద్ది భరతసత్తమాగ్ర**
**గణ్య! దాని నెఱుఁగఁగాఁ జెప్పు' మనుడు నా । తనికి భీష్ముఁ డిట్టు లనియెఁ బ్రీతి.** **398**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; భరతసత్తమ+అగ్రగణ్య!= భరతవంశపు ఉత్తములలో మొదటగ ఎన్నదగ్గ ఓ తాత!; పాపంబునకున్= పాపానికి; అధిష్ఠానము= మూలం; ఎద్ది?= ఏది?; దానిన్= దానిని; ఎఱుఁగఁగాన్= తెలిసేటట్లుగా; చెప్పుము= చెప్పుము; అనుడున్= అనగానే; ఆతనికిన్= ఆ ధర్మరాజుకు; భీష్ముఁడు= భీష్ముడు; ప్రీతిన్= సంతోషంతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు, 'భరతవంశంలోని ఉత్తములలో మొదట ఎంచదగ్గ భీష్ముడా! పాపానికి మూలం ఏది? ఆ పాపం ఉండే స్థానమేదో తెలియచెప్పుము' అనగానే భీష్ముడు సంతోషంగా ఈ విధంగా చెప్పాడు.

**సీ.** **'వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు । లోభంబ; యది గామలోలతయును**
**గ్రోధంబు మత్సర ద్రోహంబులును బర । ధన దార వాంఛలు దైన్యపాటు**
**వ్రీడాక్షమాసత్య విముఖ భావంబును । గలిగించి ధర్మంబు గలఁచి నరునిఁ**
**బ్రయి మాలి యేమిటి కయినను గర్హించు । వానిఁగా సమకట్టుఁ గాన లుబ్ధ**

**ఆ.** **జనులఁ దొఱఁగి లోభ మను తిరిం బడని స । త్యవ్రతులను బరమధార్మికులను**
**బాపభీతమతులఁ బనిగొను లోభంబుఁ । జెంద నీకు నీదు చిత్త వృత్తి.'** **399**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; పాపములకున్+ఎల్లన్= అన్ని పాపాలకూ; అధిష్ఠానంబు= మూలం; లోభంబ= పేరాసయే; అది= ఆ పేరాస; కామలోలతయును= నిలకడతనం లేని కోరికలూ; క్రోధంబున్= కోపాన్ని; మత్సర ద్రోహంబులును= పగనూ హింసాతత్వాన్నీ; పరధన= మరొకరి ఆస్తిపట్ల; దార= మరొకరి పెళ్ళాం పట్ల; వాంఛలున్= కోరికలునూ; దైన్యపాటు= దీనత్వమున్నూ; వ్రీడా= సిగ్గుపట్ల; క్షమా= ఓర్పుపట్ల; సత్య= నిజంపట్ల; విముఖభావంబును= ఏవగింపునూ; కల్గించి= పుట్టించి; ధర్మంబు= న్యాయాన్ని; కలఁచి= (కలుషితంచేసి) చెరచి; నరునిన్= మానవుడిని; ప్రయిమాలి= నిందను లక్ష్యపెట్టకుండా; ఏమిటికిన్+అయినన్= ఎందుకయినా; గర్హించువానిఁగన్= పేరాసపడే వాడినిగా; సమకట్టున్= సిద్ధం చేస్తుంది; కానన్= కాబట్టి; లుబ్ధజనులన్= ఆశగలవారిని; తొఱఁగి= వదలి; లోభము+అను= పేరాస అనే; తిరిన్= సుడిలో; పడని= చిక్కుకోని; సత్య వ్రతులను= సత్యమే వ్రతంగా కలిగినవాళ్ళను; పరమధార్మికులను= మిక్కిలి పుణ్యాత్ములను; పాపభీతమతులన్= పాపం అంటేనే వణకిపోయే వారిని; పనిగొను=

నడిపే; లోభంబున్= పేరాసను; నీదు చిత్త వృత్తిన్= నీ మనోవ్యాపారాన్ని; చెంద నీకు= పొందనీయకు, అంటనీయకు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! పాపాలన్నిటికీ తావలం పేరాసే. అది కోరికలపట్ల నిలకడలేనితనాన్నీ, కోపాన్నీ, పగనూ, హింసాభావాన్నీ, మరొకరి ఆస్తి, మరొకరి పెళ్ళాంపట్ల కోరికనూ దీనత్వాన్నీ, సిగ్గు, ఓర్పు నిజాలపట్ల ఏవగింపునీ పుట్టిస్తుంది. న్యాయాన్ని చెరుస్తుంది. నిందలను లెక్కపెట్టకుండా ప్రతిదానికీ అత్యాశపడే వాడినిగా మనిషిని తయారు చేస్తుంది. కాబట్టి లోభులను విడిచిపెట్టాలి. లోభం అనే సుడిగుండంలో చిక్కుకొనని సత్యవ్రతులను, పుణ్యాత్ములను, పాపభీతులను వశంచేసికొనే లోభాన్ని నీ మనస్సును పొందనీయకుము'.

**వ. అనిన విని యజాతశత్రుం 'డజ్ఞానం బాపదలకును దుర్గతికిని మూలం బని విందు; దాని తెఱం గెఱింగింపు' మనిన నాపగాతనయుం డమ్మనుజపతి కిట్లనియె. 400**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; విని= ఆలకించి; అజాతశత్రుండు= పుట్టని పగవారుగల ధర్మరాజు; అజ్ఞానంబు= తెలియనితనం; ఆపదలకును= విపత్తులకు; దుర్గతికిని= చెడ్డనడతకూ; మూలంబు= ఆధారం; అని విందున్= అని వింటాను; దాని తెఱంగున్= దాని స్వభావాన్ని; ఎఱింగింపుము= తెలియ చెప్పుము; అనినన్= అనగానే; ఆపగాతనయుండు= భీష్ముడు; ఆ మనుజపతికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు 'విపత్తులకూ, చెడునడతకూ అజ్ఞానమే ఆధారం అని విన్నాను. ఆ అజ్ఞానం తీరు తెన్నులను తెలుపుము' అనగానే భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. 'రోషము శోకము రాగ । ద్వేషము లభిమాన దర్ప వేగాలస్యా**
**శ్లేషము లజ్ఞాన మని మ । నీషి జనము సెప్పు మాననీయచరిత్రా! 401**

**ప్రతిపదార్థం:** మాననీయ చరిత్రా!= మన్నించ దగ్గ నడవడి కలవాడా!; రోషము= కోపం; శోకము= దుఃఖం; రాగద్వేషములు= ప్రేమా పగలూ; అభిమాన= అహంకారం; దర్ప= పొగరూ; వేగ= తొందరపాటు; ఆలస్య= మందకొడితనం; శ్లేషములు= వీటి కలయికలు; అజ్ఞానము+అని= తెలియనితనం అని; మనీషి జనము= పండిత లోకం; చెప్పున్= చెప్పుతుంది.

**తాత్పర్యం:** 'కోపమూ, దుఃఖం, ప్రేమా, పగా, అహంకారం, గర్వం, తొందరపాటు, మందకొడితనం. వీటి సంపర్కమే అజ్ఞానం అని పండితులంతా చెప్పుతారు.

**క. విను లోభము నజ్ఞానం । బును సదృశ ఫలప్రదములు; పుట్టును లోభం**
**బున నజ్ఞానము గావున । జననాయక! లోభముడుగ సౌఖ్యము లొందున్.' 402**

**ప్రతిపదార్థం:** జననాయక!= రాజా!; విను= వినుము; లోభమున్= పేరాసా; అజ్ఞానంబును= తెలియని తనమూ; సదృశ ఫల ప్రదములు= సమాన ప్రయోజనాలను ఇచ్చేవే; లోభంబునన్= పేరాసచేత; అజ్ఞానము= అవివేకం; పుట్టును= పుట్టుతుంది; కావునన్= కాబట్టి; లోభము= పేరాస; ఉడుగన్= వదలగా; సౌఖ్యములు= భోగాలు; ఒందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** పేరాసపడటం, తెలివి లేకపోవటం - ఈ రెండూ సమాన ప్రయోజనాన్ని చేకూరుస్తాయి. లోభంవలన అజ్ఞానం పుట్టుతుంది. కాబట్టి ధర్మరాజా! లోభం వదలుకొంటే భోగాలు కలుగుతాయి'.

**ఆ. అనిన ధర్మపుత్రుఁ 'డనఘ! ధర్మంబు నా । నా ప్రకారగతి వినంగఁబడు; మ**

**దీయ చిత్తమునకుఁ దేటపడంగ వి। శిష్ట ధర్మ మెద్ది సెప్పు' మనుడు. 403**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ధర్మపుత్రుఁడు= ధర్మరాజు; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; ధర్మంబు= న్యాయం; నానా ప్రకారగతిన్= అనేక రకాలైన; విధానాలతో; వినంగబడున్= వినబడుతుంది (వాటిల్లో); విశిష్ట ధర్మము= ప్రధానమైన న్యాయం; ఎద్ది= ఏది; మదీయ చిత్తమునకున్= నా మనస్సుకు; తేటపడంగన్= తేటతెల్లమయ్యేటట్లు; చెప్పుము= చెప్పుము; అనుడున్= అనగానే.

**తాత్పర్యం:** భీష్ముడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు. 'ఓ పుణ్యాత్ముడా! న్యాయాన్ని అనేకవిధాలుగా వింటుంటాం. వాటిల్లో ఉత్తమ ధర్మం ఏదో నాకు బాగా విశదమయ్యేటట్లు చెప్పవలసింది' అనగానే. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. ప్రియంబంది భీష్ముఁ డతనికి నిట్లనియె. 404**

**ప్రతిపదార్థం:** ప్రియంబు+అంది= సంతోషాన్ని పొంది; భీష్ముఁడు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సంతోషంగా భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

### భీష్ముఁడు ధర్మరాజునకు దమంబు ప్రభావం బెఱింగించుట (సం.12-154-6)

**క. 'తమతమ కలవడు విజ్ఞా। నముల తెరువు లాదరించి నానాగతులన్**
**సుమతులు ధర్మము తెలిపిరి;। దమము పరాయణము ధీరతమ! యన్నిటికిన్. 405**

**ప్రతిపదార్థం:** ధీరతమ!= ధైర్యవంతులలో మేటి అయిన రాజా!; సుమతులు= పండితులు; తమతమకున్= వారి వారికి; అలవడు= అబ్బేటటువంటి; విజ్ఞానముల= ఆయా శాస్త్రాదుల జ్ఞానాల; తెరువులు= విధానాలు; ఆదరించి= మన్నించి; నానాగతులన్= ఎన్నో తీరులలో; ధర్మము= ధర్మాన్ని; తెలిపిరి= విశదపరిచారు; అన్నిటికిన్= అన్ని ధర్మాలకు; దమము= ఇంద్రియనిగ్రహం; పరాయణము= ఉత్తమమైన ఆశ్రయం.

**తాత్పర్యం:** 'ధైర్యవంతులలో మేటివైన ధర్మరాజా! పండితులు తాము తెలిసికొన్న శాస్త్రజ్ఞానాన్నిబట్టి ఎన్నో విధాలుగా ధర్మాన్ని గూర్చి తెలిపారు. ఈ ధర్మాలన్నిట్లోకి దమం ఉత్తమమైనది.

**తే. దమము నిశ్రేయసము, పుణ్యతమము, ధర్మ। సార; మది వెలిగా ధర్మసంచయంబు**
**సిద్ధి పొందునె? దమముతో బుద్ధిపొందు। గనినఁ బొందని యున్నతుల్ గలవె? యధిప! 406**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; దమము= ఇంద్రియ నిగ్రహం; నిశ్రేయసము= ముక్తిదాయకం; పుణ్యతమము= గొప్ప పుణ్యం; ధర్మసారము= ధర్మాలలోని నిగ్గు; అది వెలిగాన్= ఆ దమం లేకుండా; ధర్మసంచయంబు= పుణ్యాలమూట; సిద్ధి పొందునె?= సాధ్యమవుతుందా?; దమముతోన్= ఇంద్రియ నిగ్రహంతో; బుద్ధి= జ్ఞానం; పొందు కనినన్= కూడుకొంటే; పొందని+ఉన్నతుల్= కలగని మీది దశలు; కలవె?= ఉంటాయా?

**తాత్పర్యం:** దమము ముక్తిదాయకం. గొప్ప పుణ్యం. ఇది ధర్మాలలోని నిగ్గు. ఇది లేకుండా పుణ్యాలమూట దొరుకుతుందా? దమానికి జ్ఞానం తోడైతే అందుకోలేని ఉన్నతదశ లుంటాయా? (ఉండవు.)

**క. దమముం గడచిన సద్ధ । ర్మము లేదని విందు; నాశ్రమము లన్నిటికిన్**
**దమవంతుఁడు గామముఁ గ్రో । ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్. 407**

**ప్రతిపదార్థం:** ఆశ్రమములు+అన్నిటికిన్= బ్రహ్మచర్య, గృహస్థ, సన్న్యాస, వానప్రస్థాది ఆశ్రమాలన్నిటికీ; దమమున్= ఇంద్రియ నిగ్రహాన్ని; కడచిన= మించిన; సద్ధర్మము= మంచి ధర్మం; లేదని విందున్= లేదని విన్నాను; దమవంతుఁడు= నిగ్రహం కలవాడు; కామమున్= కోరికనూ; క్రోధమున్= కోపాన్నీ; లోభమున్= పేరాసనూ; మత్సరంబున్= పగనూ; దర్పమున్= మదాన్నీ; గెల్చున్= జయిస్తాడు.

**తాత్పర్యం:** ఆశ్రమాలు నాలుగింటిలో ఇంద్రియనిగ్రహాన్ని మించిన మంచి ధర్మం లేదని విన్నాను. ఇంద్రియ నిగ్రహం కలవాడు కామ క్రోధ లోభ మద మాత్సర్యాలను జయిస్తాడు.

**క. శీలంబు మైత్రి కరుణ య । లోలుపభావము తితిక్ష లోనగు మునిలో**
**కాలంబనీయ సద్గుణ । జాలంబు దమంబు రూపసంపద యధిపా! 408**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; దమంబు= ఇంద్రియ నిగ్రహం; శీలంబు= నడవడి; మైత్రి= చెలిమి; కరుణ= జాలి; అలోలుపభావము= పేరాస లేకపోవటం; తితిక్ష= ఓరిమి; లోనగు= మొదలైన; మునిలోక= మునులు మొత్తం; ఆలంబనీయ= ఆశ్రయించదగ్గ; సద్గుణ= మంచిస్వభావాల; జాలంబు= సమూహం; రూపసంపద= ఆకార సంపత్తి.

**తాత్పర్యం:** ఓ రాజా! ఈ దమము, నడవడి, చెలిమి, జాలి, పేరాస లేకపోవటం, ఓర్పు మొదలైన మునులందరిని ఆశ్రయించి ఉన్న మేలుగుణాల సమూహానికి ఊత. రూపసంపత్తి.

**క. గుహయందు నిహిత మనియెడు । మహనీయ బ్రహ్మపదము మహిత దమత్వో**
**పహితుం డగువానికి స । న్నిహితం బని చెప్పుదురు మనీషిజనంబుల్.' 409**

**ప్రతిపదార్థం:** గుహయందున్= హృదయంలో; నిహితము= దాచి ఉంచబడినది; అనియెడు= అనేటి; మహనీయ బ్రహ్మపదము= పరమబ్రహ్మపదం; మహితదమత్వ= పూజించదగ్గ ఇంద్రియ నిగ్రహంతో; ఉపహితుండు+అగు వానికిన్= కూడి ఉన్నవాడికి; సన్నిహితంబు= చేరువగా ఉంటుంది; అని; మనీషిజనంబుల్= పండితులు; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** పరమబ్రహ్మపదం హృదయంలో దాగి ఉన్నదంటారు. అది ఇంద్రియనిగ్రహం కలవాడికి మరింత దగ్గరవుతుందంటారు పండితులు'.

**వ. అని విశదంబుగా వివరించె. 410**

**ప్రతిపదార్థం:** అని= అని; విశదంబుగాన్= వివరంగా; వివరించెన్= తెల్లం చేశాడు.

**తాత్పర్యం:** అని విశదపరిచాడు.

**ఆ. అట్లు దమము మహిమ యాదరంబున విని, । యమృతసేవ సేసినట్ల పోలె**
**హర్షమయ మనస్కుఁడై భీష్ము నడిగె నా । ధర్మనందనుండు తపము విధము. 411**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; దమము మహిమ= ఇంద్రియ నిగ్రహం యొక్క; గొప్పతనాన్ని; ఆదరంబునన్= మన్ననతో; విని= ఆలకించి; అమృతసేవ= అమృతపానం; చేసినట్లపోలె= చేసినట్లుగానే; హర్షమయ= ఆనందంతో నిండిన; మనస్కుఁడు+ఐ=

మనస్సు కలవాడై; ఆ ధర్మనందనుండు= ఆ యమధర్మరాజు కొడుకు ధర్మరాజు; భీష్మున్= భీష్ముడిని; తపము విధమున్= తపస్సు తీరును; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** అట్లా దమం ప్రభావాన్ని ఎంతో గౌరవంగా విన్న ధర్మరాజు అమృతం త్రాగినంతగా ఆనందించాడు. తపస్సు తీరునూ తెల్పుమని భీష్ముడిని అడిగాడు.

**వ. అడిగిన నతం డతని కిట్లనియె. 412**

**ప్రతిపదార్థం:** అడిగినన్= అడుగగా; అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**భీష్ముఁడు ధర్మరాజునకుఁ దపంబు విధము సెప్పుట (సం. 12-155-1)**

**క. తపము నిదానము ధర్మ । ప్రపంచమున కెల్ల; దానిఁ గ్రమమున వ్రతతం**
**త్రపరాయణు లొనరింతు ర । ధిప! ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్. 413**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ధర్మ ప్రపంచమునకున్+ఎల్లన్= ధర్మం తీరులలో కెల్లా; తపము= తపస్సు; నిదానము= మూలకారణం; దానిన్= ఆ తపస్సును; వ్రత తంత్ర పరాయణులు= వ్రతాలు చేయాలనే కోరికగలవారు; ఫల= పళ్ళూ; మూల= కందమూలాలు తిని; అంబు= నీళ్ళుత్రాగే; వృత్తిన్= బతకటంవలన; తృప్తిన్= తనివిని; పొరయుచున్= పొందుతూ; క్రమమునన్= వరసగా; దానిన్= ఆ తపస్సును; ఒనరింతురు= చేస్తారు.

**తాత్పర్యం:** 'రాజా! ధర్మాలన్నిటికీ తపస్సే మూలం. వ్రతాలు శ్రద్ధగా చేయాలనుకొనే వారు పళ్ళూ కందమూలాలు తింటూ నీళ్ళు తాగుతూ తృప్తిగా బ్రతుకుతుంటారు. క్రమం తప్పకుండా తపస్సు చేస్తుంటారు.

**క. విను మశన నిగ్రహము దప । మను నభిధానంబు గల మహాధర్మము త**
**ద్ధనవంతు చిత్తవశగతిఁ । జను నఖిల స్థావరములు జంగమతతులున్. 414**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; అశన నిగ్రహము= మితమైన తిండి; తపము= తపస్సు; అను+అభిధానంబు+కల= అనేపేరుగల; మహాధర్మము= గొప్ప పుణ్యం; అఖిల స్థావరములు= కదలకుండా ఉండే పుట్టలూ చెట్లూ మొదలగునవన్నీ; జంగమ తతులున్= కదిలేవన్నీ; తద్+ధనవంతు= ఆ తపస్సంపన్నుడి; చిత్తవశగతిన్= మనస్సుకులోబడి; చనున్= నడచుకొంటాయి.

**తాత్పర్యం:** ఆహారనియమమే తపస్సు. అదే మహాధర్మం. ఆ తపస్సంపన్నుడి ఇష్టప్రకారం సమస్త చరాచరవస్తు సముదాయమూ నడచుకొంటుంది.

**తే. పంచవిధవృత్తులగు మహాపాతకములు । లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు**
**లగుఁ దపంబున సత్యశౌచాదు లొలయు । నఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు. 415**

**ప్రతిపదార్థం:** తపంబునన్= తపస్సుచేత; పంచవిధ వృత్తులు+అగు= ఐదు రకాలైన; మహాపాతకములు= గొప్ప పాపాలు; లోనుగాన్= మొదలుగా గల; కిల్బిషములు+ఎల్లన్= దోషాలన్నీ; లుంఠితంబులు+అగున్= పటాపంచలయిపోతాయి; సత్యశౌచాదులు=

నిజాయితీ, శుచి మొదలైనవి; ఒలయున్= పొందుతాయి; అఖిలసిద్ధులున్= అన్ని ప్రయోజనాలు; అజుచేతన్+ఆవహిల్లున్= సులభంగా అందుబాటులోకి వస్తాయి.

**తాత్పర్యం:** తపస్సువలన పంచ మహాపాతకాలు మొదలైన పాపాలన్నీ పటాపంచలవుతాయి. సత్యం, శుచి మొదలైనవి అలవడతాయి. సమస్త కార్యసిద్ధులూ అందుబాటులోకి వస్తాయి'.

**వ. అనిన విని 'దేవ పితృ భూదేవగణంబులు సత్యంబు ప్రశంసించుఁ దదీయ స్వరూపంబును నది దొరకొను తెఱంగును నెఱింగింపు'మని యడిగిన నజాతశత్రునకు శంతనుపుత్త్రుం డిట్లనియె. 416**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; దేవ= దేవతలు; పితృ= పితృదేవతల; భూదేవ= బ్రాహ్మణుల; గణంబులు= సమూహాలు; సత్యంబున్= సత్యాన్ని; ప్రశంసించున్= పొగడుతాయి; తదీయ స్వరూపంబునున్= ఆ సత్యస్వభావాన్నీ; అది= ఆ సత్యం; దొరకొను తెఱంగునున్= పొందే విధానాన్నీ; ఎఱింగింపుము= తెలియచెప్పుము; అని అడిగినన్= అని అడుగగా; అజాత శత్రునకున్= ధర్మరాజుకు; శంతను పుత్రుండు= శంతను మహారాజు కొడుకు భీష్ముడు; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అవన్నీ విన్న ధర్మరాజు 'దేవతలూ, పితృదేవతలూ బ్రాహ్మణులూ మొదలైన వారంతా సత్యాన్ని మెచ్చుకొంటారు. దాని స్వరూపాన్నీ, దానిని అవలంబించే తీరునూ చెప్పుము' అన్నాడు. అపుడు భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

## భీష్ముఁడు ధర్మరాజుకు సత్య స్వరూపాదులు సెప్పుట (సం. 12-156-3)

**క. సమతయు దమముఁ దితిక్షయు । నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య**
**త్వములు నహింసా దాన । క్షమా యజన సూనృతములు సత్యము మూర్తుల్. 417**

**ప్రతిపదార్థం:** సమతయున్= సర్వభూతాలపట్ల సమభావమున్నూ; దమమున్= ఇంద్రియ నిగ్రహమున్నూ; తితిక్షయున్= ఓర్పూ; అమత్సరమున్= పగలేకపోవటమున్నూ; హ్రీయున్= సిగ్గూ; ధృతియున్= ధైర్యమూ; అనసూయ= సద్గుణాలపట్ల ఈర్ష్యలేకపోవటం; ఆర్యత్వములున్= జీవకోటికి శుభం కలిగించటం; అహింసా= హింస చేయకపోవటం; దాన= ఇవ్వటం; క్షమా= ఓర్పు; యజన= యాగం చేయటం; సూనృతములు= నిజాయితీ; సత్యము మూర్తుల్= సత్యంయొక్క రూపాలు.

**తాత్పర్యం:** అన్ని ప్రాణులపట్ల సమత, ఇంద్రియ నిగ్రహం, ఓర్పు, పగలేకపోవటం, సిగ్గు, ధైర్యం, ఈర్ష్యలేకపోవటం, ప్రాణులకు మేలు చేయటం, హింసకు ఒడిగట్టకపోవటం యాగం చేయటం దానం, ఓర్మి, నిజాయితి - ఇవీ సత్యం స్వరూపాలు.

**క. సత్యాకృతు లగు గుణములు । నిత్యానుష్ఠిత సమగ్ర నిర్మలయోగ**
**స్థిత్యభిముఖునకు సులభము । లత్యంత సుఖప్రదంబు లవి కార్యంబుల్. 418**

**ప్రతిపదార్థం:** సత్య+ఆకృతులు+అగు= సత్యం రూపాలైన; గుణములు= పదమూడు స్వభావాలు; నిత్య+అనుష్ఠిత= ఎల్లప్పుడూ ఆచరించే; సమగ్ర= సంపూర్తిగా; నిర్మల= పవిత్రమైన; యోగస్థితి= ధ్యానదశకు; అభిముఖునకున్= అనుకూలుడైనటువంటి వాడికి; సులభములు= తేలికగా దొరికేవి; అత్యంత సుఖప్రదంబులు= ఎంతో సుఖాన్నిస్తాయి; అవి= ఆ సత్యాకృతి గుణాలు; కార్యంబుల్= చేయాల్సినవి.

**తాత్పపర్యం:** సత్యం రూపాలైన గుణాలు ఎల్లప్పుడూ ఆచరించే సంపూర్ణ ధ్యానస్థితికల యోగికి తేలికగా

అబ్బుతాయి. అవి ఎంతో సుఖాన్ని ఇస్తాయి. కాబట్టి ఆ గుణాలను ఆచరించాలి.

**చ. కుదురు సమస్త ధర్మములకున్ విను సత్యము; యోగమోక్ష స**
**త్పదములు సత్యకార్యములు; పాప మసత్యముకంటె నొండు లే**
**దు; దలఁప నశ్వమేధములు దొమ్మిది నూఱులు వెండి నూఱునై**
**యొదవిన నీడు గావు భరతోత్తమ! సత్యముతోడ నారయన్. 419**

**ప్రతిపదార్థం:** భరత+ఉత్తమ!= భరతవంశీకులలో ఉన్నతుడా!; విను= వినుము; సత్యము= సత్యం; సమస్త ధర్మములకున్= అన్ని ధర్మాలకు; కుదురు= ఆధారం, ఆలవాలం; యోగమోక్ష సత్పదములు= యోగం, మోక్షం అనే పుణ్యస్థానాలు; సత్యకార్యములు= సత్యంవలన నెరవేరే పనులు; తలఁపన్= ఆలోచించగా; అసత్యము కంటెన్= అబద్ధంకంటె; పాపము= కీడు; ఒండు లేదు= మరొకటి ఉండదు; ఆరయన్= విచారించగా; అశ్వమేధములు= అశ్వమేధయాగాలు; తొమ్మిది నూఱులు= తొమ్మిది వందలు; వెండి= మళ్ళీ; నూఱును+ఐ= వందయై; ఒదవినన్= చేస్తే; సత్యముతోడన్= ఒక్క సత్యంతో; ఈడు+కావు= సాటిరావు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. సత్యం అన్ని ధర్మాలకూ పాదువంటిది. యోగమోక్షాలనే పుణ్యస్థానాలు సత్యంవలనే ఒనగూడుతాయి. అబద్ధాన్ని మించిన కీడు మరొకటి ఉండదు. ఆలోచిస్తే ఒక్క సత్యంతో వెయ్యి అశ్వమేధయాగాలు చేసిన ఫలం కూడా సాటిరాదు'.

**వ. అనిన విని ధర్మతనయుం 'డరిషడ్వర్గం బేమిట నుదయించు? నెట్లు సమయు? నెఱింగింపవే? యనుటయు ననిమిష నదీనందనుండు ధర్మనందనున కిట్లనియె. 420**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; ధర్మతనయుండు= ధర్మరాజు; అరిషడ్వర్గంబు= అంతశ్శత్రు జాతికి చెందిన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే ఆరూ; ఏమిటన్= దేనివలన; ఉదయించున్?= పుట్టుతాయి?; ఎట్లు= ఎట్లా; సమయున్?= సమసిపోతాయి?; ఎఱింగింపవే= తెలుపవా; అనుటయున్= అనగానే; అనిమిష నదీనందనుండు= దేవనది అయిన గంగానది కొడుకు భీష్ముడు; ధర్మనందనునకున్= ధర్మరాజుతో; ఇట్లు= ఇట్లా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అది విన్న ధర్మరాజు 'కామ క్రోధాది అరిషడ్వర్గాలు దేనివలన పుట్టుతాయో, దేనివలన గిట్టుతాయో తెలుపుము' అని అడిగాడు. భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు.

### భీష్ముఁడు ధర్మరాజునకు అరిషడ్వర్గాదులు దెలుపుట (సం. 12-157-3,4)

**సీ. 'మనుజేంద్ర! సంకల్పమునఁ బుట్టుఁ గామంబు । రూపఱు దేహ నిరూపణమునఁ**
**బరులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధము । క్షీణక్షమాయుక్తిఁ జేసి పొలియు**
**భూతాస్థిరత్వంబు బుద్ధిఁ గానమి లోభ । మనఘ! జనించుఁ గాంచిన నడంగు**
**నజ్ఞానమున మోహమావహిల్లు నధర్మ । లేపవర్జనమున లేక తక్కుఁ**

**తే. గులమునను విద్యధనమునఁ గలుగు మదము । మరలి వాని పెంపూహింప మ్రుందిపోవు**
**సాత్త్వికుఁడు గామిఁ బొడము మాత్సర్య మదియుఁ । జెడఁ గురూత్తమ సాధు సంసేవనమున. 421**

**ప్రతిపదార్థం:** అనఘ= పుణ్యవంతుడా!; మనుజ+ఇంద్ర!= రాజా!; సంకల్పమునన్= మనోభావనచేతనే; కామంబు= కోరిక; పుట్టున్= కలుగుతుంది; దేహనిరూపణమునన్= దాని స్వరూపాన్ని తెలిసికొంటే; రూపు+అఱున్= నశించిపోతుంది; క్రోధము= రోషం; పరుల దోషంబునన్= ఇతరులు చేసిన తప్పువలన; ప్రభవించున్= పుట్టుతుంది; అక్షీణ= తగ్గని; క్షమాయుక్తిన్+చేసి= ఓర్పు కలిగి

ఉండటంవలన; పొలియున్= పోతుంది; లోభము= అత్యాశ; భూత+అస్థిరత్వంబు= జీవులు ఎప్పుడూ ఉండేవి కావనే; బుద్ధిన్+కానమి= తెలిసికొనలేకపోవటం వలన; జనించున్= కలుగుతుంది; కాంచినన్= ఆ జ్ఞానం ఉంటే; అడంగున్= అణగారి పోతుంది; మోహము= మోహం; అజ్ఞానమునన్= అవివేకంవలన; ఆవహిల్లున్= కలుగుతుంది; అధర్మ= అధర్మం అనే; లేప వర్జనమునన్= పూతను తొలగించటంవలన; లేక తక్కున్= రూపు మాసిపోతుంది; కులమునను= కులంవలన; విద్య= చదువువలన; ధనమునన్= ధనంవలన; మదము= పొగరు; కల్గున్= కలుగుతుంది; మరలి= తిరిగి; వాని పెంపు= వాటి పెరుగుదలను; ఊహింపన్= తలపోయగా; గ్రుంగిపోవున్= దిగిపోతుంది; కురు+ఉత్తమ!= కురువంశంలో శ్రేష్ఠుడా!; సాత్త్వికుఁడు+కామిన్= సత్త్వగుణం లేని వాడవటంవలన; మాత్సర్యము= ద్వేషం; పొడమున్= పుట్టుతుంది; అదియున్= అదికూడా; సాధు సంసేవనమునన్= మంచివాళ్ళను కొలవటంవలన; చెడున్= పోతుంది.

**తాత్పర్యం:** 'రాజా! మనోభావంవలన కామం పుట్టుతుంది. దాని రూపం ఇట్లాంటిది అని తెలిసికొనగలిగితే ఆ కోరిక పోతుంది. ఇతరులు చేసిన తప్పువలన కోపం వస్తుంది. తరగని ఓర్పువలన అది తగ్గిపోతుంది. ప్రాణికోటి శాశ్వతం కాదు అనే తెలివి లేకపోవటంవలన లోభం పుట్టుతుంది. ఆ తెలివి పొందితే అది పోతుంది. అవివేకంవలన మోహం కలుగుతుంది. అధర్మం జోలికి పోకుంటే అది నశిస్తుంది. కులం, చదువూ, సంపదలవలన గర్వం ఏర్పడుతుంది. వాటి పెంపుదలను తలపోస్తే అదే దూరమవుతుంది. సాత్త్వికగుణం కొరవడటంవలన పగ పుట్టుతుంది. మంచివాళ్ళను సేవించటంవలన అది తొలగుతుంది.

**క. ఈ యాఱింటను సకలా । పాయంబులు మానవులకుఁ బాటిలు; వీనిం**
**బాయంగ జడియనోపిన । ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్. 422**

**ప్రతిపదార్థం:** ఈ+ఆఱింటను= ఈ ఆరింటివలన; సకల= అన్ని; అపాయంబులు= చెరుపులు; మానవులకున్= మనుష్యులకు; పాటిలున్= కలుగుతాయి; వీనిన్= ఈ కామాదులు ఆరింటిని; పాయంగన్= వదులుకొనటానికి; జడియన్+ఓపిన= భయపెట్టజాలిన; ధీయుతునకున్= బుద్ధిమంతుడికి; శుభము= మేలు; సద్గతియున్= ఉత్తమలోకమున్నూ; సమకూరున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** కామం మొదలైన ఈ అరిషడ్వర్గాలవలన మనుష్యులకు అన్ని రకాల చెరుపులు కలుగుతుంటాయి. వీటిని వదలగొట్టుకొనేటట్లు జడుపు పుట్టించగల బుద్ధిమంతుడికి మంచి జరుగుతుంది. ఉత్తమ లోకం సిద్ధిస్తుంది.

**క. ఇవి దోఁడేళుల భంగిం । గవియుఁ బురుషు ధైర్యహానిఁ గనికొని; ధైర్యం**
**బవలంబించిన నరుఁ జే । రవు; వీనికి నిదియ తెఱఁగు రాజవరేణ్యా! 423**

**ప్రతిపదార్థం:** రాజవరేణ్యా!= రాజోత్తమా! ఇవి= ఈ ఆరూ; ధైర్య= దిట్టతనం; హానిన్+కనికొని= తగ్గిపోవటం చూసి; తోఁడేళుల భంగిన్= తోడేళ్ళవలె; కవియున్= చుట్టుముట్టుతాయి; ధైర్యంబున్= తెగువతనాన్ని; అవలంబించిన= ఊతచేసికొన్న; నరున్= మానవుడిని; చేరవు= పొందవు; దీనికిన్= ఈ అరిషడ్వర్గానికి; ఇదియ= ఇదే; తెఱఁగు= పద్ధతి.

**తాత్పర్యం:** ధర్మరాజా! మనిషిలో ధైర్యం కొరవడిం దనిపిస్తే చాలు - ఈ ఆరూ కూడా తోడేళ్ళవలె కలబడతాయి. ధైర్యవంతుల దరిదాపులకు మాత్రం రావు. ఇదీ వీటి సంగతి.

**తే. అధిప! యివి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁ । గలిగియుండు; నీ బుద్ధి నొక్కండుఁ జొరదు;**
**సారధీరతా సంప దుదారమతివి । గాన యింకను నిర్జింతు వీని నెల్ల. 424**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఇవి= ఈ అరిషడ్వర్గాలు; ధార్తరాష్ట్రులయందున్= ధృతరాష్ట్రుడి సంతానంలో; చాలన్= ఎక్కువగా; కలిగి+ఉండున్= పొంది ఉన్నాయి; నీ బుద్ధిన్= నీ మతిలో; ఒక్కండున్= ఒక్కటి అయినా; చొరదు= దూరదు; సార= మేటి అయిన; ధీరతాసంపద్= దిటవు అనే సంపదచే; ఉదారమతివి= గొప్ప బుద్ధి కలవాడవు; కాన= కాబట్టి; ఇంకను= ఇకపై; వీనిన్+ఎల్లన్= కామక్రోధాది శత్రువులు ఆరింటినీ; నిర్జింతు(వు)= జయిస్తావు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ధృతరాష్ట్రుడి కొడుకులలో ఈ ఆరుగుణాలూ ఎక్కువ. వీటిలో ఏ ఒక్కటీ నీలో చొరబడదు. నీవు ధైర్యసంపదచేత గొప్పబుద్ధిమంతుడవు. కాబట్టి నీవు ఈ ఆరింటిని గెలుస్తావు.

**వ. అని వెండియు. 425**

**తాత్పర్యం:** అని మళ్ళీ భీష్ముడు.

**క. హింసావిహారి యైన నృ। శంసుం డీ యాఱుఁ గలుగు జనుకంటెను గీ**
**డంసప్రదేశలలితో। త్తంసీ కరణోపలాల్య ధరణీ వలయా! 426**

**ప్రతిపదార్థం:** అంసప్రదేశ= భుజాలపై; లలిత= మనోహరమై ఉన్న; ఉత్తంసీకరణ= సిగబంతి చేయటం చేత; ఉపలాల్య= లాలించబడుతున్న; ధరణీవలయా!= భూమండలం కలవాడా!; హింసావిహారి+ఐన= ఎపుడూ హింసతో ప్రవర్తించే; నృశంసుండు= క్రూరుడు; ఈ ఆఱున్+కలుగు= ఈ కామక్రోధాదులు ఆరూ ఉన్న; జనుకంటెను= మనిషికంటె; కీడు= చెడ్డవాడు.

**తాత్పర్యం:** భుజాలమీద మనోహరమైన సిగబంతిగా లాలించబడుతున్న భూమండలం గల ధర్మరాజా! హింసా ప్రవృత్తితో బ్రతికేవాడు ఈ ఆరు గుణాలు కలవారిని మించిన చెడ్డవాడు.

**క. మే లనుభవించుఁ జుట్టము। లాలోకింపంగఁ గుజనుఁ డదియు నృశంసా**
**శీలమ; పంచి కుడుచు నతఁ। డే లోకంబుననుఁ బేర్మి యెసఁగ సుఖించున్.' 427**

**ప్రతిపదార్థం:** కుజనుఁడు= చెడ్డవాడు; చుట్టములు= బంధువులు; ఆలోకింపంగన్= చూస్తుండగా; మేలు+అనుభవించున్= హాయిగా బ్రతుకుతాడు; అదియున్= అట్లా సుఖించటం కూడా; నృశంసాశీలము+అ= క్రూరస్వభావమే; పంచి= నలుగురికీ పెట్టి; కుడుచు+అతఁడు= తాను తినేవాడు; ఏలోకంబుననున్= ఏ లోకంలో అయినా; పేర్మిఎసఁగన్= మరింత గౌరవం పెరగగా; సుఖించున్= సుఖపడతాడు.

**తాత్పర్యం:** ఇట్లాంటి పాపాత్ముడు చుట్టూ చుట్టాలు చూస్తుండగానే, తాను ఒక్కడే హాయిగా బ్రతుకుతాడు. అట్లా సుఖించటం కూడా క్రూరస్వభావమే. ఉన్నంతలో నలుగురికీ పెట్టి తానూ తినేవాడు ఇహలోకంలో అయినా పరలోకంలో అయినా మరింత గౌరవం పొందుతాడు, సుఖపడతాడు'.

**వ. అని చెప్పి వెండియు. 428**

**ప్రతిపదార్థం:** అని= అని; చెప్పి= పలికి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ.

**ఆ. 'విను కుటుంబ భృత్యజన జీవనంబుఁ బ్రి। వర్షములకుఁ గల్గువాఁడు నధిక**
**మొదవినట్టి యతఁడు నుర్వీశ! యర్హులు। మాననీయ సోమ పానమునకు. 429**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ!= రాజా!; విను= వినుము; కుటుంబ భృత్యజన= కుటుంబమూ, సేవకులా; జీవనంబున్=

జరుగుబాటు; త్రివర్షములకున్= మూడేళ్ళదాకా; కల్గువాఁడును= ఉన్నవాడూ; అధికము= అంతకంటె ఎక్కువ; ఒదవిన+అట్టి+అతఁడును= కలిగినవాడూ; మాననీయ= గౌరవించదగ్గ; సోమ పానమునకున్= యాగం చేసి తాగే సోమపానానికి; అర్హులు= తగ్గవారు.

**తాత్పర్యం:** 'కుటుంబీకుల, సేవకుల జరుగుబాటుకొరకు మూడేళ్లపాటు సరిపడేటంతగాని, అంతకంటె మించిన స్థితిమంతుడు కాని యాగం చేసి త్రాగే సోమపానానికి అర్హుడు.

**క. క్రతువు లొనరించు భూసుర । తతికిఁ గ్రియాశేష యోగదానాదులు దు**
**ర్గతిఁ గొఱఁత వడిన ధరణీ । పతి నెఱపఁగవలయు వానిఁ బరికించి తగన్. 430**

**ప్రతిపదార్థం:** క్రతువులు= యాగాలు; ఒనరించు= చేసే; భూసురతతికిన్= బ్రాహ్మణుల వర్గానికి; క్రియా శేష= పూర్తికాకుండా మిగిలిపోయిన పనులను; యోగ= సంబంధించిన; దానాదులు= దానం మొదలైనవి; దుర్గతిన్= బీదతనంచేత; కొఱఁతవడినన్= లోటువస్తే; వానిన్= వాటిని (ఆ లోటును); పరికించి= పట్టిచూచి; తగన్= ఒప్పేటట్లు; ధరణీపతి= రాజు; నెఱపఁగ వలయున్= ఆచరించాలి (పూర్తిచేయాలి).

**తాత్పర్యం:** పూర్తికాకుండా నిలిచిపోయిన బ్రాహ్మణుల యాగక్రియలకు సంబంధించిన దానాదుల విషయంలోనూ, బీదరికంవలన లోటు కలిగితేనూ రాజు దానికి తగ్గట్టుగా ఆలోచించి ఆ యాగక్రియలు పూర్తిచేయాలి.

**క. ధనధాన్య పశు సమగ్రుం । డనఁ బరఁగెడునట్టి వైశ్యుఁ డధ్వరముం జే**
**యనినాఁడు బ్రాహ్మణాధ్వర । మునకు నతని సొమ్ము రాజు పుచ్చి యిడఁదగున్. 431**

**ప్రతిపదార్థం:** ధనధాన్య పశు= ధనధాన్యాలచేతను, పశుసంపదచేతను; సమగ్రుండు+అనన్= సంపూర్ణుడు అనేటట్లు; పరఁగెడు+అట్టి= ఒప్పేటటువంటి; వైశ్యుఁడు= కోమటివాడు; అధ్వరమున్= యాగాన్ని; చేయనినాఁడు= చేయనప్పుడు; అతని సొమ్మున్= ఆ వైశ్యుడి ధనాన్ని; పుచ్చి= గ్రహించి; రాజు= ప్రభువు; బ్రాహ్మణ+అధ్వరమునకున్= బ్రాహ్మణులు చేసే యాగానికి; ఇడన్= ఇవ్వటం; తగున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** ధనం, ధాన్యం, పశుసంపద దండిగా ఉన్న కోమటి యాగం తలపెట్టకపోతే ఆ సొమ్మునంతా రాజు గ్రహించి బ్రాహ్మణులయాగానికి దానం చేయవచ్చును.

**క. కుడువక పెట్టక శూద్రుఁడు । కడునెక్కుడు గూర్చినట్టి కనకముఁ గొలుచుం**
**బుడమిపతి ధర్మకృతులకు । నిడునది సగము గొని మేదినీశ్వరవర్యా! 432**

**ప్రతిపదార్థం:** మేదినీ+ఈశ్వర వర్యా!= రాజులలో ఉత్తముడా!; శూద్రుఁడు= శూద్రజాతివాడు; కుడువక= తాను తినక; పెట్టక= ఇంకొకరికి ఇవ్వక; కడున్+ఎక్కుడు= ఎంతో ఎక్కువగా; కూర్చిన+అట్టి= కూడబెట్టుకొన్నట్టి; కనకమున్= బంగారాన్నీ; కొలుచున్= ధాన్యాన్నీ; పుడమిపతి= రాజు; సగము+కొని= సగం తీసుకొని; ధర్మకృతులకున్= పుణ్యకార్యాలకు; ఇడునది= ఇవ్వాలి.

**తాత్పర్యం:** రాజా! శూద్రజాతివాడు తాను తినక, వేరొకరికి పెట్టక, బాగా ఎక్కువగా బంగారాన్నీ ధాన్యాన్నీ పోగేసినట్లైతే వాటిల్లో సగం రాజు పుచ్చుకొని పుణ్యకార్యాలకు వాడాలి.

**క. విను విప్రులు పేద లగుట । మనుజేంద్రుఁడు బుద్ధిలేమి మాతాపితృ భా**
**వన నతఁడు వారిఁ బ్రోచినఁ । గను మేలున కెల్ల గలదె కౌరవనాథా! 433**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ధర్మరాజా!; విను= వినుము; విప్రులు= బ్రాహ్మణులు; పేదలు+అగుట= బీదవారు అవటం అనేది; మనుజ+ఇంద్రుఁడు= మనుష్యులలో ఉత్తముడైన రాజు; బుద్ధిలేమిన్= తెలివిలేనివాడవటంవలననే; అతఁడు= రాజు; వారిన్= వారిని; మాతా పితృభావనన్= తల్లిదండ్రులవలె అనుకొని; ప్రోచినన్= కాపాడితే; కను= పొందే; మేలునకున్= మంచికి; ఎల్లకలదె?= మేర ఉన్నదా?

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రాహ్మణులు పేదవాళ్ళుగా ఉన్నారంటే అది రాజు తెలివిమాలినతనమే. రాజు వాళ్ళను తల్లిదండ్రులవలె చూచుకొని కాపాడుకొనాలి. అపుడు రాజునకు కలిగే మేలునకు హద్దు ఉండదు.

**క. ఆమద్రవ్యము మణియును । రామయు శుచు లగుటఁ గాదె రామారత్నా**
**రామత దగవగు దుష్కుల । మై మెచ్చమి దోఁచెనేని ననిరి మునీంద్రుల్. 434**

**ప్రతిపదార్థం:** మునీంద్రుల్= మునిముఖ్యులు; ఆమద్రవ్యమున్= పెద్దల పేర్లు చెప్పి పితృకర్మలలో బ్రాహ్మణులకిచ్చే స్వయం పాకము; మణియును= రత్నమును; రామయున్= స్త్రీయునూ; శుచులు+అగుటన్+కాదె= పవిత్రం అవటం వలననే కదా; దుష్కులము+ఐ= నీచకులపుదని; రామారత్న= ఉత్తమ స్త్రీ; మెచ్చమితోఁచెన్+ఏనిన్= నచ్చనట్లుగా అనిపించినా; ఆరామత= క్రీడించటం; తగవు+అగున్= న్యాయమే అవుతుంది; అనిరి= అని అన్నారు.

**తాత్పర్యం:** పొత్తర్లలో బ్రాహ్మణులకిచ్చే స్వయంపాకం, మణీ, స్త్రీ - ఈ మూడు పవిత్రమైనవే. నీచకులందయినా ఉత్తమ స్త్రీ నచ్చనట్లుగా అనిపించినా సంగమించటం ధర్మమే అవుతుందంటారు మునులు.

**క. అమృతము విద్యయుఁ బరమహి । తము సేయుటఁ బుచ్చికొంద్రు దానిని దానిన్**
**సుమతులు విషము వలన నై । న మహీశ్వర! నీచమగు జనముచే నైనన్. 435**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశ్వర!= రాజా!; అమృతమున్= అమృతమూ; విద్యయున్= చదువూ; పరమహితము+చేయుటన్= గొప్పమేలు కలిగించటంవలన; సుమతులు= బుద్ధిమంతులు; దానిని= ఆ అమృతాన్ని; విషమువలన నైనన్= గరళంవలన అయినా; పుచ్చికొంద్రు= గ్రహిస్తారు; దానిన్= ఆ విద్యను; నీచము+అగు+జనముచేన్+ఐనన్= అధముల దగ్గర నుండైనా; పుచ్చికొంద్రు= గ్రహిస్తారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! అమృతం, విద్యా - రెండూ పరోపకారం చేస్తాయి. కాబట్టి బుద్ధిమంతులు విషంలోనుండి పుట్టిందైనా అమృతాన్నీ, నీచుల దగ్గరనుండైనా చదువునూ గ్రహిస్తారు.

**క. భూపాలక! విను పంచమ । హాపాతకకరులుఁ బతితు లక్కీడులఁ బ్రా**
**ణాపాయాంత ప్రతికృతిఁ । బాపుదు; రత్యధిక పుణ్యపరతను బాయున్. 436**

**ప్రతిపదార్థం:** భూపాలక!= రాజా!; విను= వినుము; పంచ మహాపాతక కరులున్= పంచ మహా పాపాలు చేసేవారూ; పతితులున్= పాపాత్ములూ; ఆ+కీడులన్= ఆ పాపాలను; ప్రాణ+అపాయ+ అంత ప్రతికృతిన్= ప్రాణాలను విడవడమనే చివరి ప్రతిక్రియచేత; పాపుదురు= పోగొట్టుకుంటారు; (అక్కీడులు); అతి+అధిక పుణ్య పరతను= పుణ్యం చేయటంలో ఎక్కువ ఆసక్తిచేతను; పాయను= పోతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. పంచ మహాపాపాలు చేసేవారూ, పతితులూ, తమ ఆ కీళ్ళను ప్రాణత్యాగంచేత పోగొట్టుకుంటారు. ఆ కీడులు పుణ్యాసక్తి మిక్కిలి ఎక్కువ కావటంచేత కూడా పోతాయి.

**విశేషం:** పంచమహాపాతకాలు: స్వర్ణస్తేయం, సురాపానం, బ్రహ్మహత్య, గురుదారగమనం, ఆ పాపాలు చేసేవాళ్ళతో స్నేహం చేయటం.

**క.** **యానాసనాన్నపాన వి । ధానాదులఁ బతితు బెరసి తాఁ బతితుఁ డగున్;**
**మానవుఁడు దపోముఖ ధ । ర్మానుష్ఠానములఁ బాచు న క్కిల్బిషమున్. 437**

**ప్రతిపదార్థం:** మానవుఁడు= మనిషి; యాన= ప్రయాణించేటప్పుడు; ఆసన= కూర్చున్నప్పుడు; అన్న= తిండి తినేటప్పుడు; పాన= నీళ్ళు తాగేటప్పుడు; విధాన+ఆదులన్= మొదలైన తీరులలో; పతితున్= పాపాత్ముడితో; బెరసి= కూడి; తాన్= తాను; పతితుఁడు+అగున్= పాపాత్ము డవుతాడు; ఆ+కిల్బిషమున్= అట్లా వచ్చిన పాపాన్ని; తపోముఖ ధర్మానుష్ఠానములన్= తపస్సు మొదలుగా గల సత్కార్యాలు ఆచరించటంచేత; పాచున్= పోగొట్టుకొంటాడు.

**తాత్పర్యం:** మనిషి పాపాత్ముడితోపాటు ప్రయాణించినా, కలిసి కూర్చున్నా, ఒకే తడవ తిన్నా, దప్పిక తీర్చుకొన్నా, పతితుడవుతాడు. ఆ పాపాన్ని తపస్సు మొదలైన మంచిపనులద్వారా వదలించుకొంటాడు.

**క.** **అనృతము పాతక మగు; నై । నను వనితల యెడను, బెండ్లి, నవ్వున మృతి వ**
**చ్చిన సర్వధనముఁ జెడు చో, । విను మది పాపంబు గాదు విమలచరిత్రా! 438**

**ప్రతిపదార్థం:** విమల చరిత్రా!= మచ్చలేని నడవడి కలవాడా!; అనృతము= అబద్ధం చెప్పటం; పాతకము+అగున్= పాపం అవుతుంది; ఐనను= అయినా; వినుము= విను; వనితల ఎడను= ఆడవాళ్ళ విషయంలోనూ; పెండ్లి= పెళ్ళి విషయంలోనూ; నవ్వునన్= నవ్వులాటలోనూ; మృతివచ్చినన్= చావు మూడినప్పుడూ; సర్వధనమున్= ధనమంతా (సర్వస్వం); చెడుచోన్= కోల్పోతుంటే; అది= అబద్ధం చెప్పటం; పాపంబు+కాదు= దోషం కాదు.

**తాత్పర్యం:** ధర్మరాజా! అబద్ధం ఆడటం పాపమే. అయితే ఆడవాళ్ళ విషయంలోనూ, పెళ్ళిళ్ళప్పుడూ, పరిహాసాలప్పుడూ, చావు కలిగినప్పుడూ, సర్వస్వం కోల్పోతుంటేనూ అబద్ధం చెప్పటం పాప మేమీ కాదు.

**క.** **ఏ పాపమేని లేనిది । కాపురుషత నొకనిమీఁదఁ గలిగించిన న**
**ప్పాపము సేసినవాఁ డగు । నా పాలువ యనంగ విందు మార్యులచేతన్. 439**

**ప్రతిపదార్థం:** ఏ పాపము+ఏని లేనిది= ఏ పాపమూ లేకపోయినా; ఒకని మీఁదన్= మరియొకనిపై; కాపురుషతన్= చెడ్డవాడనే భావాన్ని; కలిగించినన్= మోపితే; ఆ పాలువ= ఆ దుర్మార్గుడు; ఆ+పాపము చేసినవాఁడు+అగున్= ఆ పాపాన్ని చేసినవా డవుతాడు. అనంగన్= అని; ఆర్యులచేతన్= పెద్దలవలన; విందుము= వింటాము.

**తాత్పర్యం:** ఏ పాపమూ చేయకపోయినా మరియొకనిపై కుత్సిత పురుషుడనే నిందను మోపితే, ఆ దుర్మార్గుడు ఆ పాపం చేసినవాడవుతాడని పెద్దలనగా వింటాము.

**ఆ.** **తల్లిఁ దండ్రిఁ బాయఁ దగ ద కారణమునఁ । బాసెనేని వాఁడు పతితుఁ డాస**
**నంబు సెజ్జ భోజనము చీర వటుకుమా । రులకుఁ బ్రీతి నొసఁగఁ బొలియుఁ గీడు. 440**

**ప్రతిపదార్థం:** తల్లిన్ తండ్రిన్= తల్లినీ తండ్రినీ; అకారణమునన్= ఊరకనే; పాయన్+తగదు= వదలి ఉండటం మంచిదికాదు; పాసెన్+ఏని= విడిచినట్లైతే; వాఁడు= వాడు; పతితుఁడు= పాపాత్ముడు; వటుకుమారులకున్= బ్రహ్మచారులకు; ఆసనంబు= పీటా; సెజ్జ= పక్కా; భోజనము= తిండీ; చీర= బట్టా; ఒసఁగన్= ఇవ్వగా; కీడు= ఆ దోషం; పొలియున్= పోతుంది.

**తాత్పర్యం:** సరైన కారణం ఏమీ లేకుండా తల్లిదండ్రులను కాదని వెళ్ళేవాడు పాపాత్ముడు అవుతాడు. బ్రహ్మచారులకు పీటా, పక్కా, కూడూ, గుడ్డా ఇస్తే ఆ పాపం తొలగిపోతుంది.'

**వ.** **అనియె; నట్టియెడం గృపాణరణ నిపుణుండగు నకులుండు సకలాస్త్రశస్త్ర సారవిశారదుండైన యబ్భాగీరథీసుతునకు సవినయంబుగాఁ బ్రణమిల్లి 'ధను వుత్తమాయుధం బని చెప్పుదు; రది సర్వజన సమ్మతంబు; ధనువునకు బాణంబులకు వైకల్యంబు వాటిల్లినయెడం బరవీరప్రహరణంబునకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మేలని యుండుదు; నా తలంపెట్టిదియో తెలిసికొనవలయుఁ; దత్ప్రభవ ప్రభావంబులుం దదీయ పూర్వాచార్యునిం జెప్పవే' యని యడిగిన.** **441**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అట్టి యెడన్= అట్లాంటప్పుడు; కృపాణరణ= కత్తిపోరులో; నిపుణుండు+అగు= మేటి అయిన; నకులుండు= నకులుడు; సకల= సమస్తమైన; అస్త్ర= మంత్రపూత బాణాల; శస్త్ర= ఆయుధాల ప్రయోగంలో; సారవిశారదుండు+ఐన= బాగా తెలిసిఉన్నవాడైన; ఆ+భాగీరథీసుతునకున్= ఆ భీష్ముడికి; సవినయంబుగాన్= అణకువతో; ప్రణమిల్లి= మ్రొక్కి; ధనువు= విల్లు; ఉత్తమ+ఆయుధంబు+అని= మేలైన సాధనం అని; చెప్పుదురు= చెప్పుతారు; అది= అట్లా చెప్పటం; సర్వజన సమ్మతంబు= అందరికీ అంగీకారమే; ధనువునకున్= వింటికీ; బాణంబులకున్= బాణాలకూ; వైకల్యంబు= విరిగిపోవటం; వాటిల్లిన ఎడన్= కలిగినట్లయితే; పరవీర= పగవారి పోటుగాళ్ళని; ప్రహరణంబునకున్= దెబ్బ కొట్టటానికీ; ఆత్మత్రాణంబునకున్= తనను తాను కాపాడుకొనటానికీ; కృపాణంబు= కత్తి; మేలు= మంచిది; అని; ఉండుదున్= తలంచాను; నా తలంపు= నా ఆలోచన; ఎట్టిదియో= ఎలాంటిదో; తెలిసికొనవలయున్= తెలుసుకొనాలి; తత్ప్రభవ= కత్తి పుట్టుక; ప్రభావంబులున్= మహిమలు; తదీయ= దానికి సంబంధించిన పూర్వాచార్యునిన్= మొదటి గురువునీ; చెప్పవే= చెప్పవా; అని; అడిగినన్= అడుగగా.

**తాత్పర్యం:** అట్లా చెప్పిన తరువాత కత్తిపోరులో కుశలుడైన నకులుడు, మంత్రపూత బాణప్రయోగంలోనూ, ఆయుధాల ప్రయోగంలోనూ, చేయి తిరిగినవాడైన భీష్ముడికి ఎంతో వినయంగా మొక్కాడు. 'అన్నిట్లోకి మేలైన సాధనం 'ధనుస్సు' అని అంతా అంటారు. విల్లూ బాణం విరిగిపోతే శత్రువీరులను చెండాడటానికీ, తనను తాను కాపాడుకొనటానికి కత్తి మేలు - అనే నా ఊహ ఎంతపాటిదో తెలిసికొనాలని ఉన్నది. కత్తిపుట్టుకా దాని మహిమా, దాని తొలి ఉపదేశకుడినీ చెప్పు'మని అడగగా.

### భీష్ముఁడు నకులునకు ఖడ్గ ప్రభావంబు తెఱం గెఱింగించుట (సం. 12-160-9)

**సీ.** **అతనికి నాతఁ డిట్లను 'బ్రహ్మ జగములు । సృజియించి భూతసంసృష్టి సేయ**
**దివిజమర్త్యాది జంతువు లమ్మహాత్ము వి । ధించిన తెరువులఁ దిరిగి బ్రదుకు**
**చుండ దైత్యులు సముద్దండత నన్యాయ । వర్తులై సురమునివ్రాతములకు**
**బాధ లొనర్ప నప్పరమేష్ఠి హిమశైల । తటమున వేయువత్సరము లధిక**

**తే.** **నియతిమెయిఁ దప మొనరించి నిష్ఠఁ గ్రతువు । సేసె నయ్యగ్నిఁ బుట్టె నశేష లోక**
**భీతికర మగు నుగ్రంపుభూత మొకటి । ప్రాంశుకృష్ణమై దంష్ట్రలు ప్రజ్వరిల్ల.** **442**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ నకులుడికి; ఆతఁడు= భీష్ముడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు;

జగములు= లోకాలను; సృజియించి= పుట్టించి; భూతసంసృష్టి+చేయన్= ప్రాణులను పుట్టించగా; దివిజ= దేవతలూ; మర్త్య= మనుష్యులూ; ఆది= మొదలుగా గల; జంతువులు= ప్రాణులు; ఆ+మహాత్ము= ఆ బ్రహ్మదేవుడు; విధించిన= ఏర్పరచిన; తెరువులన్= తెన్నులలో; తిరిగి= సంచరించి; బ్రదుకుచున్+ఉండన్= జీవిస్తుండగా; దైత్యులు= రాక్షసులు; సముద్దండతన్= పెద్ద ఎత్తున; అన్యాయవర్తులు+ఐ= న్యాయం తప్పినవారై; సుర ముని వ్రాతములకున్= దేవతల, మునుల సమూహానికి; బాధలు+ఒనర్పన్= పీడించగా; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మదేవుడు; హిమశైల తటమునన్= మంచుకొండ చరియల్లో; వేయువత్సరములు= వేయ్యేళ్ళు; అధికనియతి మెయిన్= ఎంతో నియమంతో; తపమున్= తపస్సును; ఒనరించి= చేసి; నిష్ఠన్= ఎడతెగని శ్రద్ధతో; క్రతువు చేసెన్= యాగం చేశాడు; అశేషలోక= అన్ని లోకాలకూ; భీతికరము+అగు= అదురు పుట్టించే; ఉగ్రభూతము+ఒకటి= భయంకరమైన ఒక భూతం; ప్రాంశుకృష్ణము+ఐ= పొడవాటి నల్లటి; దంష్ట్రలు= కోరలు; ప్రజ్వరిల్లన్= ఒప్పగా; ఆ+అగ్నిన్= ఆ నిప్పులోనుండి; పుట్టెన్= పైకి వచ్చింది.

**తాత్పర్యం:** ఆ నకులుడితో భీష్ముడు ఇట్లా అన్నాడు. బ్రహ్మ లోకాలనూ, జంతుజాలాన్నీ పుట్టించాడు. దేవతలూ మనుష్యులూ మొదలుగాగల ప్రాణులన్నీ బ్రహ్మదేవుడు నియమించినట్టుగా బ్రతుకుతున్నాయి. రాక్షసులు న్యాయం తప్పి దేవతలను మునులను పీడించటం ఎక్కువైంది. అందువలన మంచుకొండచరియలలో బ్రహ్మదేవుడు వెయ్యేళ్లపాటు తపస్సు చేశాడు. ఆ తరువాత నిష్ఠగా యాగం చేశాడు. ఆ అగ్నిగుండంలోనుండి మొత్తం ప్రపంచానికి అదురుపుట్టేటట్లు ఒక పెద్ద భూతం పైకి వచ్చింది. ఆ భూతం పొడవాటి నల్లటి కోరలతో ఉన్నది.

**ఆ. అప్పు డినుఁడు మాసె, ననిలుండు సుడివడి । వీచె, నుల్క లురలె, వెఱఁ దలంకు**
**సురల మునులఁ జూచి సరసిజభవుఁ 'డిది । నాదుమతమ యొండు గాదు వినుఁడు. 443**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఇనుఁడు= సూర్యుడు; మాసెన్= మసకబారాడు; అనిలుండు= గాలి; సుడివడి= సుళ్ళు చుట్టుకొని; వీచెన్= విసరింది; ఉల్కలు= నిప్పురవ్వలు; ఉరలెన్= రాలిపడ్డాయి; వెఱన్= భయంతో; తలంకు= వణకుతున్న; సురలన్= దేవతలను; మునులన్= ఋషులను; చూచి; సరసిజభవుఁడు= బ్రహ్మ; ఇది= ఈ పెనుభూతం; నాదుమతము+అ= నా తలపే; ఒండు+కాదు= మరొకటి కాదు; వినుఁడు= ఆలకించండి.

**తాత్పర్యం:** ఈ భూతం పుట్టిన సమయంలో సూర్యుడు మసకబారాడు, సుడిగాలి విసురుగా కొట్టింది, నిప్పురవ్వలు రాలిపడ్డాయి, దేవతలూ, మునులూ భయంతో వణకిపోతున్నారు. అది చూచి బ్రహ్మదేవుడు 'దీనిని నేనే పుట్టించాను. మరొకటి కాదు. వినండి.

**వ. ఇది రాక్షస నాశంబునకుం దోఁచిన యుత్పాతంబు; లోకంబుల రక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబుఁ గల్పించితి నని పలుక, నా భూతం బారూపంబు విడిచి ఖడ్గాకృతి గైకొని తన మెఱుంగులు దిక్కులు దీటుకొనం బొల్చిన. 444**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ పెద్ద భూతం; రాక్షస నాశంబునకున్= రాక్షసుల చేటుకొరకు; తోఁచిన= పుట్టిన; ఉత్పాతంబు= అరిష్టం; లోకంబులన్= లోకాలన్నిటినీ; రక్షింపను= కాపాడటానికీ; రాక్షసులన్= రక్కసులను; వధియింపను= చంపటానికీ; సాధనంబుగాన్= పనిముట్టుగా; ఖడ్గంబున్= కత్తిని; కల్పించితిని= పుట్టించాను; అని పలుకన్= అని చెప్పగా; ఆ భూతంబు= ఆ భూతం; ఆ రూపంబున్= ఆ ఆకారాన్ని; విడి= వదలి; ఖడ్గాకృతి= కత్తి రూపాన్ని; కైకొని= పొంది; తన మెఱుంగులు= తన కాంతులు; దిక్కులు దీటుకొనన్= అంతటా ప్రసరించేటట్లు; పొల్చినన్= కనబడగా.

**తాత్పర్యం:** ఈ భూతం రాక్షసుల చావుకొరకు పుట్టిన ఉపద్రవం. లోకాలను ఆదుకొనటానికీ, రాక్షసులను చంపటానికీ తగ్గ పనిముట్టు ఈ కత్తి. అందుకే దీనిని కల్పించాను' అనగానే ఆ భూతం కత్తి రూపం ఎత్తింది. తన కాంతులు నాలుగు దిక్కులకూ విరజిమ్ముతూ కనబడగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కమలాసనుండు నిజ చి । త్తము భక్తి మయంబు సేసి తలఁచె; హరుని ఫా**
**లము కంటి మంటతో న । య్యమరవరదుఁ డేగుదెంచె నచటికి నెమ్మిన్. 445**

**ప్రతిపదార్థం:** కమలాసనుండు= బ్రహ్మ; నిజచిత్తము= తన మనస్సును; భక్తిమయంబు+చేసి= భక్తిపూరితంచేసి, హరునిన్= శివుడిని; తలఁచెన్= స్మరించాడు; ఆ అమరవరదుఁడు= దేవతలు కోరింది ఇచ్చే శివుడు; ఫాలము= నుదుటిలోని; కంటి మంటతోన్= కంటి సెగతో; అచటికిన్= అక్కడకు (బ్రహ్మ ఉన్నచోటుకు); నెమ్మిన్= ప్రీతితో; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు తన మనస్సును భక్తి పూరితం చేసి శివుడిని ధ్యానించాడు. అప్పుడు దేవతల కోరికలు తీర్చే శివుడు నుదుటి కంటి మంటతో బ్రహ్మ ఎదుటకు ప్రీతితో వచ్చాడు.

**ఉ. వచ్చినఁ దత్పదాంబురుహవందనపూర్వముగాఁగఁ బద్మజుం**
**డిచ్చెఁ గృపాణ; మవ్విభుఁ డహీన సముద్యమలీలఁ గ్రాలుచుం**
**బుచ్చికొనంగ నా సభ యపూర్వ మనఃప్రమదంబుతోడి పే**
**రచ్చెరువాటు నొందె నటు లయ్యసిఁ గైకొని మేను వెంచుచున్. 446**

**ప్రతిపదార్థం:** వచ్చినన్= రాగా; తద్= ఆ శివుడి; పద+అంబురుహ= పాద పద్మాలకు; వందన పూర్వము+కాఁగన్= మొక్కటంతో పాటుగా; పద్మజుండు= బ్రహ్మ; కృపాణమున్= కత్తిని; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ విభుఁడు= ఆ శివుడు; అహీన= ఎంతో; సముద్యమలీలన్= పెద్ద ఎత్తున; క్రాలుచున్= వెలిగిపోతూ; పుచ్చికొనంగన్= తీసికొనగా; ఆ సభ= ఆ కొలువు; అపూర్వ= ఇంతకుమునుపు ఎన్నడూ లేని; మనఃప్రమదంబుతోడి= సంతోషించిన మనస్సుతో; పేరు+అచ్చెరువాటున్= ఎంతో వింతను; ఒందెన్= పొందింది; అటులు= అట్లా; ఆ+అసిన్= ఆ కత్తిని; కైకొని= చేతపట్టుకొని; మేను పెంచుచున్= ఒంటిని పెద్దది చేస్తూ.

**తాత్పర్యం:** అట్లా అగపడగానే ఆ బ్రహ్మ శివుడికి మొక్కాడు. కత్తిని చేతిలో పెట్టాడు. ఆ శివుడూ ఎంతో ఉన్నతంగా వెలిగిపోతూ ఆ కత్తిని తీసికొన్నాడు. ఆ సభ కూడా ఎపుడూ లేనంత ఇదిగా సంతోషపడింది. వింతపడింది. అట్లా ఆ కత్తిని చేతపుచ్చుకొన్న ఆ శివుడు తన ఆకారాన్ని పెంచుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. హరుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును । విని సముద్ధతరయమున దనుజకోటి**
**మునుగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ । ధించి యిల యెల్ల నెత్తుట ముంచె నతఁడు. 447**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు, బెట్టుగన్= బిగ్గరగా; నవ్వి; పెల్లు+ఆర్చుటయును= ఉత్సాహంకొద్దీ పెద్దపెద్దగా కేకలు పెట్టగా; విని= ఆలకించి; దనుజకోటి= రాక్షసులమూక; సముద్ధత రయమునన్= ఎంతో వేగంగా; మునుగన్= ముందుగా; పఱతెంచి= పరుగెత్తి వచ్చి; తాఁకినన్= ఎదుర్కొనగా; అతఁడు= శివుడు; మునుముకొని= వరసపెట్టి; వధించి= చంపి; ఇల+ఎల్లన్= నేలనంతా; నెత్తుటన్= రక్తంతో; ముంచెన్= తడిపాడు.

**తాత్పర్యం:** శివుడు ఫకాలున నవ్వి పెద్దగా బొబ్బలు పెట్టాడు. ఆ కేకలు రాక్షసుల చెవిన బడ్డాయి. ఆ వెంటనే

రాక్షసులమూక పరుగుపెట్టి వచ్చి ముందుగా ఎదుర్కొనగా శివుడు కత్తితో కలియబడ్డాడు. వరసపెట్టి నరికి నేలనంతా నెత్తురుమయం చేశాడు.

**ఉ. దైత్యుల నిట్లు గీటడఁచి ధర్మము నిల్పి ప్రసన్నమూర్తి సాం**
**గత్యము నొంది యప్పరమకారుణికుండు త్రిలోకరక్షణౌ**
**దాత్త్యమునన్ వెలుంగు హరిఁ దద్దయు వేడుకఁ బిల్వఁ బంచి సం**
**ప్రీత్యభిరాముఁ డై యొసఁగెఁ బెంపుగ నమ్మహనీయఖడ్గమున్. 448**

**ప్రతిపదార్థం:** అప్పరమకారుణికుండు= గొప్పజాలి చూపే ఆ శివుడు; దైత్యులన్= రాక్షసులను; ఇట్లు= ఇట్లా; గీటు+అడఁచి చంపి; ధర్మము నిల్పి= ధర్మాన్ని నిలబెట్టి; ప్రసన్నమూర్తి= శాంతాకారంతో; సాంగత్యమున్+ఒంది= చేరికపొంది; త్రిలోక రక్షణ= ముల్లోకా (స్వర్గం, భూలోకం, పాతాళం)లను కాపాడే; ఔదాత్త్యమునన్= గొప్పతనంచేత; వెలుంగు= ఒప్పే; హరిన్= విష్ణువును; తద్దయున్ వేడుకన్= ఎంతో ఉత్సాహంతో; పిల్వన్+పంచి= రప్పించి; సంప్రీతి= సంతోషంతో; అభిరాముఁడు+ఐ= ఒప్పేవాడై; ఆ+మహనీయ ఖడ్గమున్= ఆ గొప్పకత్తిని; పెంపుగన్= గౌరవంగా; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** అట్లా ఆ శివుడు రాక్షసులను చంపి ధర్మం నిలబెట్టాడు. ప్రసన్ను డయ్యాడు. స్వర్గ, మర్త్య, పాతాళలోకాలను ఎంతో బాగా కాపాడే విష్ణువును వేడుకపడి పిలిపించాడు. ఎంతో సంతోషంగా ఆ గొప్ప కత్తిని అతడి చేతికి ఇచ్చాడు.

**వ. అ ట్లొసంగినం గైకొని దుష్టదమనం బాచరించుచు నుండెడు నవ్విష్ణుండు మహాస్త్రరూపంబగు నయ్యాయుధంబు పదంపడి మరీచి కొసంగె; మరీచి భార్గవునకు, భార్గవుం డనేకమునులకు, మును లింద్రునకు, నింద్రుండు లోకపాలురకు నొసంగెఁ; గ్రమంబున మనుప్రభృతులైన మానవేంద్రులు వడసి నిజసంతతి కినిచ్చుచు వచ్చి; రందు దుష్యంతుండు భరతున కిచ్చె; నా భరతవంశంబునందు ఖడ్గ సంప్రదాయంబు గలిగి వచ్చె; నొక ముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపున కిచ్చెఁ; గృపునిచేత మీ రేవురుం బడసితిరి; విశేషించి యీ విద్యయం దత్యంతాదరణవంతుండ వగుటంజేసి దీనివలన వెలసితివి నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక యగ్ని యధిదేవత గురుండు రుద్రుం' డని చెప్పి వెండియు నిట్లను 'నసి విశసనంబు ఖడ్గంబు తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగర్భంబు విజయంబు ధర్మపాలనంబన నెనిమిది పూజ్యనామంబులం బరఁగి కృపాణంబు ప్రహరణంబులోనం బ్రధానంబై నెగడుచుండు. 449**

**ప్రతిపదార్థం:** అట్లు= అట్లా; ఒసంగినన్= ఇవ్వగా; కైకొని= పుచ్చుకొని; దుష్టదమనంబు= చెడ్డవాళ్ళను చంపటం; ఆచరించుచున్+ఉండెడు= చేస్తూండే; ఆ+విష్ణుండు= ఆ విష్ణువు; మహా+అస్త్రరూపంబు+అగు= గొప్ప అస్త్రం వంటిది అయిన; ఆ+ఆయుధంబున్= ఆ కత్తిని; పదంపడి= ఆ తరువాత; మరీచికిన్= మరీచిమునికి; ఒసంగెన్= ఇచ్చాడు; మరీచి= మరీచి ముని; భార్గవునకున్= పరశురాముడికి; భార్గవుండు= పరశురాముడు; అనేకమునులకున్= చాలామంది ఋషులకు; మునులు= ఆ మునులు; ఇంద్రునకున్= ఇంద్రుడికీ; ఇంద్రుండు= ఆ ఇంద్రుడు; లోకపాలురకున్= దిక్పాలకులకు; ఒసంగెన్= ఇచ్చాడు; క్రమంబునన్= వరసగా; మనుప్రభృతులు+ఐన= మనువు మొదలైన; మానవేంద్రులు= రాజులు; పడసి= పొంది; నిజసంతతికిన్= తమ వంశీకులకు; ఇచ్చుచున్+వచ్చిరి= ఇచ్చుకుంటూ వచ్చారు; అందున్= వాళ్ళల్లో; దుష్యంతుఁడు= దుష్యంత మహారాజు; భరతునకున్= భరతుడికి; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ భరతవంశంబునందున్= ఆ భరతకులంలో; ఖడ్గ సంప్రదాయంబు= కత్తి ఇచ్చుకొనే ఆచారం; కలిగి వచ్చెన్= ఉంటూ ఉంది; ఒక ముని= ఒక ఋషి; అనుగ్రహింపన్= దయ చూపగా; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు;

అధిగమించి= పొంది; కృపునకున్+ఇచ్చెన్= కృపుడికి ఇచ్చాడు; కృపునిచేతన్= కృపుడివలన; మీరు ఏవురున్= మీ ఐదు మంది; పడసితిరి= పొందారు, విశేషించి= మీదు మిక్కిలి; ఈ విద్యయందున్= ఈ కత్తి విద్యలో; అత్యంత ఆదరణవంతుండవు+అగుటన్+చేసి= ఎక్కువ గౌరవం కలవాడవు కాబట్టి; దీని వలనన్= ఈ విద్యవలన; వెలసితివి= ప్రకాశించావు; నిస్త్రింశంబునకున్= కత్తికి; నక్షత్రంబు= నక్షత్రం; కృత్తిక; అగ్ని= అగ్ని; అధిదేవత= కాపాడే దేవత; గురుండు= ఉపదేశకుడు; రుద్రుండు= శివుడు; అని చెప్పి; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; అసి= కత్తి; విశసనంబు= చంపేది; ఖడ్గంబు= నరికేది; తీక్ష్ణధారంబు= మంచి పదునుతో ఉండేది; దురాసదంబు= ఎదిరించలేనిది; శ్రీగర్భంబు= లోపల సిరులు కలది; విజయంబు= గెలుపు కలిగించేది; ధర్మపాలనంబు= ధర్మాన్ని కాపాడేది; అనన్= అనేటట్లు; ఎనిమిది పూజ్యనామంబులన్= కొల్వదగ్గ ఎనిమిది పేర్ల చేతా; పరఁగి= ఒప్పి; కృపాణంబు= కత్తి; ప్రహరణంబులలోనన్= ఆయుధాలలో; ప్రధానంబు+ఐ= ముఖ్యమై; నెగడుచుండున్= ప్రసిద్ధి కెక్కింది.

**తాత్పర్యం:** చెడ్డవాళ్ళను రూపుమాపే విష్ణువు ఆ కత్తిని శివుడు ఇవ్వగానే అందుకొన్నాడు. ఆ గొప్ప కత్తిని ఆ తరువాత విష్ణువు మరీచికి ఇచ్చాడు. మరీచి పరశురాముడికీ, పరశురాముడు మునులకూ, ఆ మునులు ఇంద్రుడికీ, ఇంద్రుడు దిక్పాలకులకు ఇచ్చారు; వరసగా మనువు మొదలైన రాజులు తమ సంతానానికి ఇస్తూ వచ్చారు. వాళ్ళల్లో దుష్యంతుడు భరతుడికి ఇచ్చాడు. ఆ భరతకులంలో కత్తిని ఇచ్చుకొనే ఆచారం ఏర్పడింది. దాన్ని ఓ ముని దయవలన ద్రోణుడు సంపాదించాడు. ఆ ద్రోణుడు కృపుడికి ఇచ్చాడు. అతడినుండి మీ ఐదుమందీ పొందారు. ఈ కత్తి విద్యను నీవు మన్నించినవాడ వవటం వలన పేరుపొందావు; ఈ కత్తికి నక్షత్రం కృత్తిక. కాపాడే దేవత అగ్ని. గురువు శివుడు. అని చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు. అసి, విశసనం, ఖడ్గం, తీక్ష్ణ ధారం, దురాసదం, శ్రీగర్భం, విజయం, ధర్మపాలనం - అనే ఎనిమిది మారుపేర్లతో వాడుక పడింది. ఆయుధా లన్నిట్లోకి ముఖ్యమైందిగా పేరు పడింది.

**క. సుమహిత మగు నీ ఖడ్గా । గమమగు పుణ్యకథ వినగఁ గాంచిన పురుషుం**
**డమితయశంబును నధిక । ప్రమదంబును సద్గతియును బడయుఁ గుమారా!' 450**

**ప్రతిపదార్థం:** కుమారా!= బాబూ నకులుడా!; ఈ ఖడ్గ+ఆగమము= ఈ కత్తి రాకకు సంబంధించినది; అగు= అయిన; పుణ్యకథ= పుణ్యం కలిగించే కథ; సుమహితము+అగున్= దివ్యమైనదవుతుంది; వినఁగన్+కాంచిన= విన్న; పురుషుండు= మనిషి; అమితయశంబును= ఎంతో కీర్తినీ; అధిక ప్రమదంబును= ఎంతో సంతోషాన్ని; సద్గతియున్= ఉత్తమలోకాన్నీ (స్వర్గాన్ని); పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఖడ్గవిద్యా సంబంధం అయిన (ఖడ్గవేశం అనదగిన) ఈ పుణ్యకథ దివ్యమైనది. ఈ కథను విన్నవాడు ఎంతో కీర్తిమంతు డవుతాడు. సంతోషంగా ఉంటాడు. పుణ్యలోకాలు పొందుతాడు'.

**క. అని యిట్లు నకులునకు భీ । ష్ముని చెప్పిన కథ సుచిత్తమున విని కుంతీ**
**తనయాగ్రజుండు పురికిం । జనియెడు ప్రొద్దగుడు వినయ సంభృతుఁ డగుచున్. 451**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఇట్లా; నకులునకున్= నకులుడికి; భీష్ముని చెప్పిన కథ= భీష్ముడు చెప్పిన కథ; సుచిత్తమునన్= మంచి మనస్సుతో; విని= ఆలకించి; కుంతీతనయ+అగ్రజుండు= కుంతీకుమారులలో మొదటివాడు ధర్మరాజు; పురికిన్= పట్టణానికి; చనియెడు= వెళ్ళే; ప్రొద్దు+అగుడున్= వేళ కాగా; వినయసంభృతుఁడు+అగుచున్= అణకువ కలవాడవుతూ.

**తాత్పర్యం:** ఇట్లా నకులుడికి భీష్ముడు తాత చెప్పిన కథ అంతా ధర్మరాజు మనస్సు పెట్టి విన్నాడు. హస్తినాపురం వెళ్ళే వేళ కావటంతో ఎంతో అణకువగా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. సముచితంబుగా నమ్మహాత్ముని వీడ్కొని చని, యోగ్యవర్తనంబు లాచరించి, వినోదగోష్ఠి నుండి విదురునిం**

**దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమమధ్యమాధమత్వ నిరూపణంబు సేయుఁడు చూత' మని పల్కిన నవ్విభునకు విదురుం డిట్లనియె. 452**

**ప్రతిపదార్థం:** సముచితంబుగాన్= తగ్గట్లుగా; ఆ+మహాత్మునిన్= ఆ భీష్ముడిని; వీడ్కొని= పోయి వస్తానని చెప్పి; చని= వెళ్ళి; యోగ్యవర్తనంబులు= చేయాల్సిన పనులు; ఆచరించి= చేసి; వినోదగోష్ఠిన్= ఆనంద సల్లాపాలతో; ఉండి; విదురునిన్= విదురుడిని; తమ్ములన్= తమ్ములను; ఉపలక్షించి= చూచి; ధర్మార్థకామంబులయందున్= ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలలో; ఉత్తమ, మధ్యమ, అధమత్వం= ఎక్కువది. నడిమిది, తక్కువది ఏదో; నిరూపణంబు+చేయుఁడు= తీర్పు ఇవ్వండి; చూతము+అని= చూద్దాం అని; పల్కినన్= అడుగగా; ఆ+విభునకున్= ఆ ధర్మరాజుతో; విదురుండు= విదురుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడికి వెళ్ళివస్తా నని చెప్పి ఇంటికిపోయి చేయవలసినపనులన్నీ చేశాడు. ఆనందసల్లాపాలతో విదురుడినీ తమ్ముళ్ళనూ చూచి ధర్మార్థ కామాలలో ఏది ఎక్కువదో, ఏది నడిమిదో, ఏది తక్కువదో తీర్పు ఇవ్వండి చూద్దాం' అన్నాడు. విదురుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**ధర్మజునితో విదురాదులు ధర్మార్థ కామంబుల తారతమ్యంబు సెప్పుట (సం. 12-161-4)**

**క. 'విను ధర్మంబున ధనమగు, । ధనమున సిద్ధించుఁ గామతంత్రం, బటు గా**
**వున మధ్యమంబు నధమము । ధన కామము; లుత్తమంబు ధర్మం బధిపా!' 453**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; విను(ము)= ఆలకించుము; ధర్మంబునన్= ధర్మంవలన; ధనము= ధనం; అగును= కలుగుతుంది; ధనమునన్= ధనంవలన; కామతంత్రంబు= కామంతంతు; సిద్ధించున్= ఫలిస్తుంది; అటు కావునన్= అందువలన; ధనము= ధనం; మధ్యమంబు= రెంటినడిమిది; కామము= కామం; అధమము= తక్కువది; ధర్మంబు= ధర్మం; ఉత్తమంబు= మేలైనది.

**తాత్పర్యం:** ధర్మాన్నిబట్టి ధనం, ధనంవలన కామంతంతూ కలుగుతుంది. కాబట్టి ధనం నడిమిది. ధర్మం మేలైనది. కామం నీచమైంది'.

**చ. అనవుడుఁ బార్థు డిట్టులను 'నర్థము మూలము ధర్మకామవ**
**ర్తనముల; కట్లు గాకయు విరక్తతనొంది జటాదిధారణం**
**బునఁ జరియించువారికిని భూవర! యర్థము దేహకృత్య సా**
**ధన మసురేజ్య కణ్వులును దానిన మేలని పూని చెప్పరే. 454**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; పార్థుఁడు= అర్జునుడు; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; ధర్మకామవర్తనములకున్= ధర్మం యొక్క, కామంయొక్క ఉనికికి; అర్థము= ధనం; మూలము= ఆధారం; అట్లు+కాకయున్= అట్లా కాకుండా; విరక్తతన్= వైరాగ్యాన్ని; ఒంది= పొంది; జట+ఆదిధారణంబునన్= జడలు మొదలైనవి ధరించి; చరియించువారికిని= తిరిగేవారికీ; భూవర!= రాజా!; అర్థము= ధనం; దేహకృత్యసాధనము= శరీరంచేత చేయదగ్గదానికి ఉపకరణం; అసురేజ్య= రాక్షస గురువగు శుక్రుడూ; కణ్వులును= కణ్వమునీ; దానిన= ధనాన్నే; మేలు+అని= మంచిది అని; పూని= పనిగట్టుకొని; చెప్పరే= చెప్పలేదా.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా అన్నాడు. 'ధర్మకామాల స్థితికి మూలం ధనమే. అట్లాకాకుండా విరక్తిపొంది జటలతో తిరిగే సన్న్యాసుల దేహయాత్రకు పనిముట్టు ధనం. శుక్రుడూ, కణ్వమునీ పనిగట్టుకొని ధనం మేలని చెప్పలేదా?

**వ. కావున నర్థంబు ప్రధానం' బనుటయు నకుల సహదేవు లేకవాక్యత నిట్లనిరి. 455**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అర్థంబు= ధనం; ప్రధానంబు= ముఖ్యమయినది; అనుటయున్= అనగానే; నకుల సహదేవులు= నకులుడూ, సహదేవుడూ; ఏకవాక్యతన్= ఒకేమాటగా; ఇట్లు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** కాబట్టి ధనం ముఖ్యం' అనగానే నకుల సహదేవు లిద్దరూ ఒక్కసారిగా ఇట్లా అన్నారు.

**తే. అర్థ ధర్మంబు లితరేతరాశ్రయములు। గాన వానిలో నొకఁ డూఁదు మానవేంద్రు**
**జగము పోకులఁ బుచ్చు నసంభృతార్థుఁ। డైన వానికిఁ గామము ప్రాప్యమరయ. 456**

**ప్రతిపదార్థం:** అర్థధర్మంబులు= అర్థం, ధర్మం; ఇతర+ఇతర= ఒకదానికొకటి; ఆశ్రయములు= ఆధారపడి ఉన్నాయి; కానన్= కాబట్టి; వానిలోన్= ఆ రెంటిలో; ఒకఁడు+ఊఁదు= ఒకదాన్నే పట్టుకొని ఉండే; మానవ+ఇంద్రున్= రాజును; పోకులన్+పుచ్చును= నాశనం చేస్తుంది; అసంభృత+అర్థుఁడు+ఐనవానికిన్= పుష్కలంగా ధనంలేనివాడికి; అరయన్= విచారించగా; కామము= కామం; అప్రాప్యము= పొందరానిది.

**తాత్పర్యం:** ధర్మార్థాలు రెండూ ఒక దానిమీద మరొకటి ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఆ రెంటిలో ఏదో ఒకటి అవలంబించే రాజునకు చేటు కలుగుతుంది. చేతినిండా డబ్బు లేనివాడికి కామం అందనిది.

**క. తమలో సరి ధర్మము న। ర్థము నర్థంబునకుఁ గామతంత్రము ఫలరూ**
**పము గావున నప్పురుషా। ర్థమునుం గొనియాడవలయు ధరణీనాథా!' 457**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; ధర్మమున్= ధర్మమూ; అర్థమున్= అర్థమూ; తమలో సరి= వాటికి అవేసాటి; కామతంత్రము= కామంతంతు; అర్థంబునకున్= ధనానికి; ఫలరూపము= ఫలంవంటిది; కావునన్= కాబట్టి; ఆ పురుషార్థమునున్= ఆ ధర్మాన్ని; కొనియాడవలయున్= పొగడాలి.

**తాత్పర్యం:** ధర్మరాజా! ధర్మానికి అర్థం, అర్థానికి ధర్మం సరిసాటి. ధనానికి ఫలరూపంవంటిది కామంతంతు. కాబట్టి ధర్మం అనే పురుషార్థం అన్నిటికంటె ఉత్తమమైనది'.

**వ. అనిన విని పవననందనుం డిట్లనియె. 458**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; పవన నందనుండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అది విన్న భీముడు ఇట్లా అన్నాడు.

**క. 'దధిసారము చందంబున। నధిపా! ధర్మార్థ సారమగు కామరసం**
**బధమ మను తలఁపు సుఖసం। విధానబాహ్య మని నీ వివేకమ యెఱుఁగున్. 459**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; దధిసారము చందంబునన్= పెరుగులోని వెన్నవలె; ధర్మ+అర్థ= ధర్మం అర్థం అనే రెండు పురుషార్థాల; సారము+అగు= నిగ్గు అయిన; కామరసంబు= కామసారం; అధమము+అను= నీచమైనది అనే; తలఁపు= భావన; సుఖసంవిధాన= సుఖవర్తనానికి; బాహ్యము= వెలుపలిది, వెలియైనది; అని; నీ వివేకము+అ= నీ తెలివే; ఎఱుఁగున్= తెలియును.

**తాత్పర్యం:** పెరుగులో సారంగా ఉండే వెన్నవలె ధర్మార్థాలలో కామరసం సారంగా ఉంటుంది. అది చాలా నీచమైనదనే భావన, సుఖంగా బ్రతకటానికి వెలి అయిందని నీ తెలివే నీకు తేటపరుస్తుంది.

**క. విను మళి యలరునఁ దేనియఁ । గొనుగతి నత్యంత సుఖము గొననగుఁ; గామం**
**బున నధిక సుఖము లొందని । జను సిరి తాఁ గొల్చులేని సస్యమ కాదే! 460**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; అళి= తుమ్మెద; అలరునన్= పువ్వులోని; తేనియన్= తేనెను; కొనుగతిన్= ఆరగించే విధంగా; అత్యంత సుఖము= ఎంతో హాయిని; కొనన్+అగున్= పొందవచ్చును; కామంబునన్= కామంవలన; అధిక సుఖములు= ఎక్కువ సౌఖ్యాలు; తాన్+ఒందని= తాను అనుభవించని; జనుసిరి= మనిషి సంపద; కొల్చులేని= తాలుగింజలు గల (ధాన్యంలేని); సస్యమ కాదే= పైరువంటిదే కదా.

**తాత్పర్యం:** విను తుమ్మెద పువ్వులోని తేనెను ఆరగించినట్లు మనిషి ఎక్కువ సౌఖ్యం పొందాలి. కామంవలన మరింత సౌఖ్యం పొందనివాడి సొత్తు చచ్చుగింజలు గల పంటవలె ఎందుకూ పనికిరాని దవుతుంది.

**తే. అనఘ! ధర్మార్థకామంబు లందు నొకట । నర్థిఁ దగిలిన మానవుం డధముఁడు; డొకటి**
**మాని వర్తించు నాతఁడు మధ్యముండు; । నడపు నన్నింటి నుత్తమనాయకుండు.' 461**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యవంతుడా!; ధర్మ+అర్థ+కామంబులందున్= ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాలలో; ఒకటన్= ఒకదాన్నే; అర్థిన్= కోరికతో; తగిలిన= ఆశ్రయించిన; మానవుండు= మనిషి; అధముఁడు= నీచుడు; ఒకటి మాని= మూడిట్లో ఒకటి వదులుకొని (రెంటిని ఆశ్రయించి); వర్తించు+ఆతఁడు= సంచరించేవాడు; మధ్యముండు= నడిమివాడు; ఉత్తమ నాయకుండు= మేలైనవాడు; అన్నింటిన్= ధర్మార్థ కామాలు మూడిటినీ; నడపున్= ఆచరిస్తాడు.

**తాత్పర్యం:** పుణ్యవంతుడా! ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాలలో ఒక్కటి అవలంబించేవాడు అధముడు. ఒకటి కాక రెంటిని ఆచరించేవాడు నడిమివాడు; మూటినీ నడిపేవాడు ఉత్తముడు'.

**క. అని యిట్లందఱుఁ జెప్పఁగ । విని చిఱునవ్వున ముఖారవిందము చెలువం**
**బినుమడిగా ధర్మజుఁ డి । ట్లను వారలఁ గలయఁ జూచి యాదర మెసఁగన్. 462**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఇట్లా; అందఱున్= అంతమంది; చెప్పఁగన్= తెలుపగా; విని= ఆలకించి; చిఱునవ్వునన్= పిన్న నవ్వుతో; ముఖారవిందము= మొగం అనే కమలం; చెలువంబు= సొగసు; ఇనుమడిగాన్= రెండింతలు కాగా; ధర్మజుఁడు= ధర్మరాజు; వారలన్= వారిని; కలయన్+చూచి= పారచూచి; ఆదరము= ప్రేమ; ఎసఁగన్= మరింత కలుగగా.

**తాత్పర్యం:** అంటూ అంతమంది చెప్పగా విన్నాడు. ధర్మరాజు ముఖంలో అందం రెండింతలయింది. చిరునవ్వు నవ్వుతూ వాళ్ళను కలయచూశాడు. మరింత ప్రేమతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. ఏ నడిగిన తెఱంగునకు విదురుని వాక్యంబు సిద్ధాంతంబు; దక్కటివారి వచనంబులు నొక్కక్కమెయి నాదరణీయంబు; లదియట్లుండె; నా మతంబు వినుండు. 463**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అడిగిన= తెఱంగునకున్= ప్రశ్నించిన విధానానికి; విదురుని వాక్యంబు= విదురుడి మాట; సిద్ధాంతంబు= తుదిమాట; తక్కటివారి= మిగతావారి; వచనంబులున్= మాటలూ; ఒక్కొక్క మెయిన్= ఒక్కొక్క తీరుగా; ఆదరణీయంబులు= మన్నించదగ్గవి; అది అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనిండు; నా మతంబు= నా అభిప్రాయం; వినుండు= ఆలకించండి.

**తాత్పర్యం:** నే నడిగినదానికి విదురుడి మాటే ప్రమాణం. మిగతావారి మాటలు ఒక్కొక్కరీతిగా ఆచరించదగ్గవి. అది అట్లా ఉండనిండు. నా అభిప్రాయమూ వినండి.

**క. భూతములు జరామరణో । పేతంబులు గాన మోక్ష మెదఁ గోరుట మేఁ;**
**లాతతవర్గ త్రయ సం । జాత మనోదుఃఖభారసహుఁ డగు కంటెన్. 464**

**ప్రతిపదార్థం:** భూతములు= ప్రాణికోటి; జరా= ముసలితనంతోనూ; మరణ= చావుతోనూ; ఉపేతంబులు= కూడినవి; కానన్= కాబట్టి; ఆతత= విస్తరించి ఉన్న; వర్గత్రయజాత= ధర్మార్థ కామాలనే మూడు పురుషార్థాల వలన; సంజాత= పుట్టిన; మనో దుఃఖభార= మనస్సులో పుట్టే బాధల బరువులను; సహుఁడు+అగుకంటెన్= ఓర్చుకొని ఉండటం కంటె; ఎదన్= మనస్సులో; మోక్షమున్+కోరుట= ముక్తిని కోరుకొనటం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** ప్రాణికోటికి అంతా చావు, ముసలితనం తప్పదు. విస్తరించి ఉన్న ధర్మార్థ కామాలు మానసిక వేదనలు కలిగిస్తాయి. వాటిని ఓర్చుకొని ఉండటంకంటె ముక్తిని కోరుకొనటం మంచిది.

**వ. అది గోరిన దొరకొనునే? యందు మేని. 465**

**ప్రతిపదార్థం:** అది= ఆ మోక్షం; కోరినన్= కావాలనుకొంటే; దొరకొనునే?= లభిస్తుందా?; అందుము+ఏని= అనుకొనేటట్లయితే.

**తాత్పర్యం:** మనం కోరుకొన్నంత మాత్రాన మోక్షం దొరుకుతుంది అనుకొంటె. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మనమున ధర్మము నర్థం । బును గామముఁ గీలుకొనక పొరపొచ్చెములై**
**చన సుఖదుఃఖంబుల మద । మును దైన్యముఁ బొందకునికి మోక్షకర మగున్.' 466**

**ప్రతిపదార్థం:** మనమునన్= కోరికలేనివారి మనస్సులో; ధర్మమున్= ధర్మమూ; అర్థంబును= అర్థమూ; కామమున్= కామమూ; కీలుకొనక= నాటుకొనకుండా; పొరపొచ్చెములై చనన్= కపటములై చరించు; సుఖ దుఃఖంబులన్= సుఖదుఃఖాలతో; మదమును= పొగరున్నూ; దైన్యమున్= దీనత్వాన్నీ; పొందక+ఉనికి= పొందకుండటం; మోక్షకరము+అగున్= ముక్తిదాయక మవుతుంది.

**తాత్పర్యం:** మనస్సులో ధర్మార్థ కామాలను నాటుకో నివ్వకూడదు. సుఖదుఃఖాలు అంటీ అంటకుండా వస్తూ పోతూ ఉంటాయి. కాబట్టి సుఖంచేత పొగరూ, దుఃఖంచేత దీనత్వం పొందకపోతే మోక్షం పొందినట్టే'.

**వ. అనిన విని వారలందఱు నభినందించిరి; మఱునాఁడు నదీనందనుం గొలిచియుండి ధర్మనందనుండు 'నరపతులకు వలయు వారును, వలవని వారును నెట్టెట్టి వా?' రని యడిగిన నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లనియె. 467**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విని= ఆలకించి; వారలు+అందఱున్= వారంతా; అభినందించిరి= పొగిడారు. మఱునాఁడు= మరుసటినాడు; నదీనందనున్= భీష్ముడిని; కొలిచి+ఉండి; సేవించి; ధర్మనందనుండు= ధర్మరాజు; నరపతులకున్= రాజులకు; వలయువారును= కావలసినవారూ; వలవని వారును= అక్కరలేని వారూ; ఎట్టి+ఎట్టివారు+అని= ఎట్లాంటివారని; అడిగినన్= అడుగగా; ఆ+మహాత్ముండు= ఆ భీష్ముడు; ఆ+మహీపతికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు మాటలు విని వారంతా అతడిని ఎంతో మెచ్చుకొన్నారు. ఆ మరునాడు ధర్మరాజు భీష్ముడిని సేవించాడు. 'రాజునకు కావలసినవారు, అక్కరలేనివారు ఎట్లాంటి వారై ఉంటారో చెప్పు'మని అడిగాడు. భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**ఉ. తాలిమిఁ బేర్చువారలును, ధర్మవిధిజ్ఞులు, సత్యవంతులున్,**
**లోలత లేనివారు, మదలోభ నిరర్థక కోపహీనులు**

**శ్శీల సమేతులుం బలుకనేర్చుట కార్యము కాన్పు పెంపుమైఁ**
**జాలుట గల్గు భృత్యులును సంపద సేయుదు రాత్మభర్తకున్. 468**

**ప్రతిపదార్థం:** తాలిమిన్= ఓర్పుచేత; పేర్చువారలును= మీరినవారూ; ధర్మవిధిజ్ఞులు= ధర్మం తెలిసిన వారున్నూ; సత్యవంతులున్= సత్యం మాట్లాడే వారూ; లోలతలేనివారున్= నిలకడ గలవారూ; మద= పొగరును; లోభ= పేరాశయూ; నిరర్థక కోపహీనులున్= ఊరకే కోపమునూ లేనివారు; శీలసమేతులున్= మంచి నడవడి కలవారూ; పలుక నేర్చుట= మాటకారితనం ఉండే; కార్యముకాన్పు= పనులమీద శ్రద్ధ ఉండే; పెంపుమైన్+చాలుట= ఎక్కువ ఆనుకూల్యం; కల్గు= ఉండే; భృత్యులును= పరిజనులూ; ఆత్మభర్తకున్= తమసామికి; సంపద+చేయుదురు= ఐశ్వర్యాన్ని కలిగిస్తారు.

**తాత్పర్యం:** ఓర్పు కలవారూ, ధర్మశాస్త్రాలు ఎరిగినవారూ, సత్యవంతులూ, చపలబుద్ధిలేనివారూ, పొగరుగానీ, పేరాశగానీ, కోపంగానీ లేనివారూ, చక్కటి నడవడి కలవారూ, మాటకారితనం, పనులలో శ్రద్ధ ఎంతో ఆనుకూల్యం ఉండే సేవకులు తమ యజమానికి సకల సంపదలు పొందిస్తారు.

**ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుడుం గృతఘ్నుఁడున్**
**నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్చు నతండుఁ బందయున్**
**ధీరతలేమి దుర్నయ మతివ్యసనత్వముఁ గల్గు వారలుం**
**జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా! 469**

**ప్రతిపదార్థం:** నరేశ్వర+ఉత్తమా!= రాజులలోకెల్ల ఉత్తముడా!; క్రూరుఁడు= కనికరం లేనివాడు; లోభియున్= దురాశాపరుడూ; శఠుఁడున్= మూఢుడూ; కొండియుఁడున్= చాడీలు చెప్పేవాడు; జడుఁడున్= మందకొడిగా ఉండేవాడు; కృతఘ్నుఁడున్= చేసిన మేలు మరచిపోయేవాడు; నేరనివాఁడు= తెలివితేటలు లేనివాడు; బొంకరియున్= అబద్ధాలాడేవాడు; నిందకున్+ఓర్చు+అతండున్= నిందలు పడేవాడూ; పందయున్= పిరికివాడూ; ధీరతలేమి= సాహసం లేనివాడూ; దుర్నయమూ= దుర్నీతీ; అతివ్యసనత్వమున్= మితిమీరిన చెడు అలవాట్లు; కల్గువారలున్= కలవారున్నూ; చేరువన్= దగ్గరగా; ఉన్కి= ఉండటం; భూపతికిన్= రాజునకు; చెట్ట= కీడు; ఒనర్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** క్రూరుడూ, పేరాశపరుడూ, మూర్ఖుడూ, చాడీలు చెప్పేవాడూ, మందగొడి, చేసిన మేలు మర్చిపోయేవాడూ, తెలివి మాలినవాడూ, అబద్ధాలాడేవాడూ, నిందపడేవాడూ, పిరికివాడూ, తెగింపు లేనివాడూ, నీతిమాలినవాడూ, మితిమించిన చెడు అలవాట్లు కలవాడూ రాజునకు దగ్గరగా ఉంటే ఆపద ముంచుకొస్తుంది.

**క. ఒప్పని గుణములఁ బరఁగెడు । నిప్పురుషాధములలోన నెల్లఁ గృతఘ్నుం**
**డొప్పఁడు గడు; నిట్లగుటం । జెప్పెడు నితిహాస మొకటి సెప్పెద నధిపా! 470**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; ఒప్పని గుణములన్= కాని స్వభావాలచేత; పరఁగెడు= నడచుకునేటి; ఈ+పురుషాధములలోనన్+ఎల్లన్= ఈ నీచులందరిలో; కృతఘ్నుండు= చేసినమేలు మరిచేవాడు; కడున్= ఎక్కువగా; ఒప్పఁడు= తగడు; ఇట్లు+అగుటన్= ఇట్లా అవటాన్ని; చెప్పెడు= చెప్పే; ఇతిహాసము= మునుపటి కథ; ఒకటి; చెప్పెదన్= చెప్తాను.

**తాత్పర్యం:** తగని స్వభావం గల నీచులలోకెల్లా చేసిన మేలు మరిచిపోయేవాడు ఎక్కువ తగనివాడు. దీనిని చెప్పే

పాతకాలంనాటి కథ ఒకటి చెప్పుతాను వినుము.

**వ. అది కాశ్యపగౌతమాఖ్యానంబనం బెద్దల గోష్ఠిం బ్రవర్తిల్లు. 471**

**ప్రతిపదార్థం:** అది= ఆ కథ; కాశ్యపగౌతమ+ఆఖ్యానంబు+అనన్= కాశ్యప గౌతముల కథ అనే పేరుతో; పెద్దల గోష్ఠిన్= పెద్దల సల్లాపాలలో; ప్రవర్తిల్లున్= ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ కథ కాశ్యపగౌతమాఖ్యానం అనే పేరుతో పెద్దల వాడుకలో ఉన్నది.

**భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘుడి చరిత్రంబు సెప్పుట (సం.12-162-281)**

**చ. 'విను మొక బ్రాహ్మణుండు కులవృత్తము పెంపుఁ దొఱంగి బోయదా**
**నినొకత నాలిఁ జేసికొని, నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం**
**జనుఁ దిను మాంస మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్**
**ధనము ఘటింపఁగాఁ దగు విధం బని చూచి వణిగ్జనంబుతోన్. 472**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఒక బ్రాహ్మణుండు= ఒక బ్రాహ్మణుడు; కులవృత్తము= కులవృత్తి; పెంపున్= గౌరవాన్ని; తొఱంగి= విడిచిపెట్టి; బోయదానిన్+ఒకతన్= ఒక బోయతను; ఆలిన్+చేసికొని= పెళ్ళాంగా ఉంచుకొని; నెమ్మిన్= సంతోషంతో; కిరాతులన్+కూడి= బోయవారితో కలిసి; వేఁటకున్+చనున్= వేటాడటానికి వెళ్ళుతాడు; మాంసమున్= మాంసాన్ని; తినున్= తింటాడు; ఆ+దురితసక్తుఁడు= పాపాన్ని కూడబెట్టుకొన్న ఆ పాపి; భోగపరుండు= సుఖాన్ని మరిగాడు; కావునన్= కాబట్టి; ధనము= సంపత్తి; ఘటింపఁగాన్= కూడబెట్టుకొనటానికి; తగు విధంబు+అని= సరైన తీరు అని; చూచి= అనుకొని; వణిక్+జనంబుతోన్= వర్తకుల గుంపుతో.

**తాత్పర్యం:** వెనుకటికి ఓ బాపడు, తన తాతముత్తాతలనాటి నుండి వస్తున్న కులవృత్తి గౌరవాన్ని వదులుకొని ఒక బోయదాన్ని పెళ్ళాడాడు. బోయవారితో కలిసిపోయి వేటాడే వాడు, మాంసం తినేవాడు. ఆ పాపాలపుట్ట బాగా సుఖాలకు మరిగి డబ్బు సంపాదించటానికి తగిన పద్ధతి ఇది అనుకొన్నాడు. వర్తకుల గుంపుతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. చెలిమిసేసి కొందఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ గిరిగహన దుర్గమస్థలంబున నొక్క వనగజంబు. 473**

**ప్రతిపదార్థం:** చెలిమి+చేసి= నేస్తంకట్టి; కొందఱు+కోమట్లు= కొంతమంది వైశ్యులు; బేహారంబు+వెంటన్= వర్తకం కొరకు; దేశాంతరంబునకున్= మరొక రాజ్యానికి; చనన్= పోగా; తానును= తాను (బ్రాహ్మణుడు) కూడా; వారితోడన్ కూడి= వారితో కలిసి; పోవన్ పోవన్= పోగా పోగా; గిరి= కొండలలో; గహన= అడవులలో; దుర్గమ= పోవటానికి వీలులేకుండా ఉన్న; స్థలంబునన్= ప్రాంతంలో; ఒక్క వనగజంబు= ఒక అడవి ఏనుగు.

**తాత్పర్యం:** అందులో కొంతమంది కోమట్లు వ్యాపారం నిమిత్తం మరొకదేశానికి పోగా బ్రాహ్మణుడు వారితో కలిసి పోయాడు. అట్లా పోతుండగా కొండల్లో కోనల్లో ఒక అడవి ఏనుగు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. సాతులోని కుతికి జనముల నున్నద। లీల నేలఁ బెట్టి కాలఁ జమరఁ**
**జొచ్చుటయును భీతివిచ్చి నల్దిక్కులఁ। బఱచి రెల్లవారుఁ బటు రయమున. 474**

**ప్రతిపదార్థం:** సాతులోనికిన్+ఉఱికి= వర్తకజనసమూహంమీద పడి; జనములన్= జనాన్ని; ఉన్మదలీలన్= వెర్రెత్తినట్లు; నేలన్+పెట్టి= నేలమీద పడేసి; కాలన్= కాలితో; చమరన్= తొక్కి చంపటం; చొచ్చుటయును= మొదలుపెట్టగా; భీతిన్= భయంతో; విచ్చి= విడివడి; ఎల్లవారున్= అంతమంది; పటురయమునన్= గబగబా; నల్దిక్కులన్= నాలుగు మూలలకు; పఱచిరి= పరుగెత్తిపోయారు.

**తాత్పర్యం:** ఆ బిడారులోని జనాన్ని పిచ్చెత్తినట్టు నేలమీదపడేసి కాలితో తొక్కి చంపటం మొదలు పెట్టింది. ఆ గుంపంతా బెదరిపోయి తలో దిక్కుకు చెల్లాచెద రయింది.

**క. ఆయనయుఁ గాందిశీకుం । డై యుత్తర దిక్కు వాఱె నతి దూరముగా;**
**నా యెడ నొక మార్గము గని । పోయెను దాను నట పోవఁ బోవం గెలనన్. 475**

**ప్రతిపదార్థం:** ఆయనయున్= ఆ బ్రాహ్మణుడూ; కాందిశీకుండు+ఐ= జడిసిపోయి తోవా తెన్నూ తెలియకుండా పరుగెత్తినవాడై; ఉత్తరదిక్కు= ఉత్తరం వైపునకు; అతిదూరముగాన్= చాలా దూరంగా; పాఱెన్= పరుగుతీశాడు; ఆ+ఎడన్= అపుడు; ఒక మార్గము+కని= ఒక తోవ చూచి; పోయెన్= వెళ్ళాడు; తానున్= ఆ బ్రాహ్మణుడు; అట= అక్కడి నుండి; పోవన్ పోవన్= పోగా పోగా; కెలనన్= ప్రక్కనే.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడూ భయంకొద్దీ దిక్కుతోచక పరుగెత్తాడు. ఉత్తరం వైపుగా చాలా దూరం పోయి ఒక దోవ చూచాడు. అతడు ఆ త్రోవలో వెళ్ళగా ఆ ప్రక్కనే. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. పొదల తఱచున జొంపమై పొడవుఁ బఱపుఁ । గలిగి వట్రువఁదనమునఁ జెలువు మిగిలి**
**యున్న వటభూరుహముఁ గని యుల్ల మచట । నిలువఁ గోరిన నాఘ్రాని నీడఁ జేరి. 476**

**ప్రతిపదార్థం:** పొదల తఱచునన్= చిత్తొత్తుగా ఉన్న తుప్పలతో; జొంపమై= జీబుగా ఉండి; పొడవున్= ఎత్తూ; పఱపున్= వెడల్పూ; కలిగి= ఉండి; వట్రువ+తనమునన్= గుండ్రంగా ఉండటంచేత; చెలువు మిగిలి= అందగించి; ఉన్న; వట భూరుహమున్= ఒక మర్రిచెట్టును; కని= చూచి; ఉల్లము= మనస్సు; అచటన్= ఆ చెట్టు దగ్గర; నిలువన్+కోరినన్= ఉండాలనిపించగా; ఆమ్రాని నీడన్+చేరి= ఆ మర్రినీడకు పోయి.

**తాత్పర్యం:** దట్టంగా ఉన్న డొంకలమధ్య గుబురుగా ఉన్న ఓ మర్రిచెట్టును చూచాడు. అది చాలా ఎత్తుగా బాగా వెడల్పుగా ఎంతో గుండ్రంగా అందంగా ఉన్నది. అక్కడ కాసేపు నిలబడా లనిపించి ఆ చెట్టుక్రిందకు పోగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వనలతల కుసుమగంధము । గొని సుడివడు గాడ్పు డప్పిఁ గొండొక దేర్పం**
**దనుపార నచటఁ గూర్చుం । డె నతం డట్లుండ నచ్చటికి లలితగతిన్. 477**

**ప్రతిపదార్థం:** వనలతల= అడవి తీగెల; కుసుమ గంధము= పూలసువాసన; కొని= గ్రహించి; సుడివడు= చుట్టుకొంటున్న; గాడ్పు= గాలి; డప్పిన్= అలసటను; కొండొక తేర్పన్= కొద్దిగా ఊరట కలిగించగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; తనుపారన్= తృప్తిగా; అచటన్= ఆ మర్రినీడన; కూర్చుండెను= చతికిలపడ్డాడు; అట్లు+ఉండన్= అట్లా కూర్చుని ఉండగా; అచ్చటికిన్= ఆ చెట్టుదగ్గరకు; లలితగతిన్= అందంగా నడుచుకుంటూ.

**తాత్పర్యం:** అడవిపూలవాసనను ఇముడ్చుకొన్న సుడిగాలి అతడి అలసటను కొంచెం పోగొట్టింది. ఆ బ్రాహ్మణుడు తనివితీరా ఆ చెట్టు నీడన కూర్చున్నాడు. అంతలో అక్కడికి చక్కగా నడుచుకుంటూ. (తరువాతి వచనంతో

అన్వయం).

**వ. ఒక్క మహాబకంబు వచ్చె; నది పద్మభవునకుం బ్రసాద పాత్రం బగుచు నాడీజంఘుండును రాజధర్ముండు నను పేళ్ళం బరఁగు; నాకొక్కెరకు నమ్మఱ్ఱి నివాసంబై యుండు నప్పక్షి యట్లేతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొను చూడ్కి నాదరించి. 478**

**ప్రతిపదార్థం:** ఒక్కమహాబకంబు= ఒక పెద్ద కొంగ; వచ్చెన్= వచ్చింది; అది= ఆ కొక్కెర; పద్మభవునకున్= బ్రహ్మకు; ప్రసాద పాత్రంబు+అగుచున్= దయకు నోచుకున్నదవుతూ; నాడీజంఘుండును= నాడీజంఘుడు; రాజధర్ముండున్= రాజధర్ముడు; అనుపేళ్ళన్+పరఁగు= అనే పేర్లతో ఒప్పే; ఆ కొక్కెరకున్= ఆ కొంగకు; ఆ+మఱ్ఱి= ఆ మఱ్ఱిచెట్టు; నివాసంబు+ఐ+ఉండున్= కాపురంగా ఉన్నది; ఆ పక్షి= ఆ కొంగ; అట్లు+ఏతెంచి= అట్లా వచ్చి; ఆ విప్రునిన్+కాంచి= ఆ బ్రాహ్మణుడిని చూచి; ప్రియంబు తలకొను= ఇష్టం తెలిపే; చూడ్కిన్= చూపుతో; ఆదరించి= ఆదరణ చూపి.

**తాత్పర్యం:** ఒక పెద్ద కొంగ వచ్చింది. ఆ కొంగ బ్రహ్మదయను నోచుకొన్నది. నాడీజంఘుడు, రాజధర్ముడూ అనేవి ఆ కొక్కెర పేర్లు. ఆ మఱ్ఱిచెట్టు మీదే ఆ కొంగ ఉండేది. ఆ కొంగ అట్లా వచ్చి బ్రాహ్మణుడిని చూచింది. ప్రేమతో ఆదరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఎందుండి యేమి పనికై । యెందుల కరిగెదవు భూసురేశ్వర! ప్రీతిం**
**బొందితి నినుఁ గని; తగియెడు । విందవయితి నాకు; నీదు విధముం జెపుమా!' 479**

**ప్రతిపదార్థం:** భూసుర+ఈశ్వర!= ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా!; ఎందున్+ఉండి= ఎక్కడినుండి; ఏమిపనికై= ఏం పనిమీద; ఎందులకున్= ఎక్కడకు; అరిగెదవు?= వెళ్ళుతున్నావు?; నినున్+కని= నిన్ను చూచి; ప్రీతిన్= సంతోషాన్ని; పొందితిన్= అనుభవించాను; నాకున్= నాకు; తగియెడు= తగ్గ; విందవు+అయితి= అతిథివి అయ్యావు; నీదు విధమున్= నీ తీరును; చెపుమా!= చెప్పవలసినది.

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణోత్తమా! ఎక్కడినుండి ఎక్కడికి ఏం పనిమీద వెళ్ళుతున్నావు? నిన్ను చూచి సంతోషించాను. నాకు తగ్గ అతిథివి. నీ సంగతులు తెలియజెప్పుము'.

**వ. అని యడిగిన నతం 'డేను మధ్యదేశీయుండ' గౌతముండ నొక్క మహనీయ చరిత్రుని పుత్త్రుండ; నాలస్యంబున వేదాధ్యయనాది విప్రకర్మ విరహితుండ నయి కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలిసియుండి, పేదఱికంబునకు నలసి బేహారంబు వెంట నొక్కసాతుం గూడి పరదేశంబున కరుగుచోట గిరి గహన దుర్గమ ప్రదేశంబున. 480**

**ప్రతిపదార్థం:** అని అడిగినన్= అని అడుగగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; ఏను= నేను; మధ్యదేశీయుండన్= మధ్యదేశ నివాసిని; గౌతముండన్= గౌతముడు అనే వాడిని; ఒక్క మహనీయ చరిత్రుని= మంచినడవడికలవాడి; పుత్త్రుండన్= కొడుకును; ఆలస్యంబునన్= సోమరితనంవలన; వేద+అధ్యయన+ఆది= వేదం వల్లించటం మొదలైన; విప్రకర్మ= బ్రాహ్మణ కర్మలు; విరహితుండను+అయి= మానివేసిన వాడినై; కామలోలత్వంబునన్= కామంమీద తృష్ణతో; బోయత= బోయకాంత; ఇల్లాలుగాన్= పెళ్ళాంగా; బోయలన్= బోయవాళ్ళతో; కలిసి+ఉండి= కూడి ఉండి; పేదఱికంబునకున్= పేదతనానికి; అలసి= వేసారి; బేహారంబు వెంటన్= వ్యాపారం వెంబడి; ఒక్కసాతున్+కూడి= ఒక వర్తకులగుంపుతో కలసి; పరదేశంబునకున్= మరొక రాజ్యానికి; అరుగుచోటన్= వెళ్ళే ప్రదేశంలో; గిరి= కొండలవలన; గహన= అడవులవలనా; దుర్గమ= కాలుపెట్టలేని; ప్రదేశంబున= తావులో.

**తాత్పర్యం:** అని అడుగగా 'నాది మధ్యదేశం. నా పేరు గౌతముడు. నేను ఉత్తమ బ్రాహ్మణుడి కొడుకును. నేను

సోమరిపోతునై వేదాలు వల్లించటం వంటి మా జాతికర్మలను మానివేశాను. కామంలో పడి ఒక బోయదాన్ని పెళ్ళాడాను. బీదరికంతో విసిగిపోయి వర్తకం వెంబడి ఒక బిడారుతో కలిసి మరో దేశానికి వెళ్ళుతున్నాను. కాలుతీసి కాలుపెట్టలేనంత దట్టంగా ఉన్న కొండలలో అడవులలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వనకరియొక్కటి యా సా। తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ దొడఁగుడున్**
**విను మెల్లవారునుం గను। కనిఁ బఱచిరి భీతి నేను గాననభూమిన్. 481**

**ప్రతిపదార్థం:** వనకరి= అడవి ఏనుగు; ఒక్కటి; ఆ సాతునకున్= ఆ వర్తకుల గుంపుమీదికి; కవిసి= ఉరికి; జనచయంబున్= గుంపును; త్రుంపన్= చంపటానికి; తొడఁగుడున్= మొదలు పెట్టగా; వినుము= వినుము; ఎల్లవారునున్= ఆ జనమంతా; కనుకనిన్= తత్తరపాటుతో; పఱచిరి= పారిపోయారు; ఏను= నేనూ; భీతిన్= భయంతో; కానన భూమిన్= అడవిలో.

**తాత్పర్యం:** ఒక అడవి ఏనుగు ఆ బిడారుమీద పడి చంపబోయింది. ఆ గుంపులోని వారంతా తత్తరపడి పరుగెత్తారు. నేనూ భయపడి అడవిలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. పఱచి దిక్కు దప్పి భాగ్యంబు కల్మి నీ। దైన నిలయమునకు నరుగుదేరఁ**
**గంటి' ననిన 'మేలుగాక! నీ దారిద్ర్య। మపనయింతుఁ; జింత యపనయింపు. 482**

**ప్రతిపదార్థం:** పఱచి= పరుగెత్తి; దిక్కు తప్పి= దారి తప్పి; అరుగుదేరన్= రాగా; భాగ్యంబు కల్మి= అదృష్టంకొద్దీ; నీదైన= నీకు సంబంధించినది అయిన; నిలయమునకున్= తావలాన్ని; కంటిన్= చూచాను; అనినన్= అనగానే; మేలు+కాక= (కొంగ) మంచి జరుగుగాక; నీ దారిద్ర్యమున్= నీ లేమిని; అపనయింతున్= పోగొట్టుతాను; చింత= దుఃఖాన్ని; అపనయింపు(ము)= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** పరుగెత్తి త్రోవ తప్పాను. నా అదృష్టంకొద్దీ నీవు ఉండే ఈ మర్రిని చూచాను.' అనగానే ఆ కొంగ, 'మంచిదే నీ బీదతనాన్ని పోగొట్టుతాను. నీవు బాధపడకుము.

**వ. అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొను' మని రుచిమంతంబులగు మందాకినీ మీనంబులు సుపక్వంబులు సేసి, మధురంబు లగు వన్యఫలంబులు దెచ్చి తృప్తియగునట్లుగా నతనికి నాహారవిధి యొనర్చి, రాత్రి యగుటయుం బల్లవ పుష్పసాంద్రం బగు శయనంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురుని తోడి సముచిత సల్లాపంబులను సుఖనిద్రను నా రాత్రి గడపి వేగుటయు, నవ్విప్రు నాలోకించి. 483**

**ప్రతిపదార్థం:** అంతకున్= అంతలోపల; ఈ ఆతిథ్యంబున్= ఈ నా అతిథిసేవను; కయికొనుము+అని= పొందుమని; రుచిమంతంబులు+అగు= చవులూరించే; మందాకినీ= గంగానదిలోని; మీనంబులు= చేపలను; సుపక్వంబులు+చేసి= బాగా నిప్పులమీద కాల్చి; మధురంబులు+అగు= తీయటి; వన్యఫలంబులు= అడవి పళ్ళు; తెచ్చి= తీసికొని వచ్చి; తృప్తి+అగునట్లుగాన్= తనివితీరేటట్లు; అతనికిన్= బ్రాహ్మణుడికి; ఆహారవిధి= భోజన కార్యక్రమం; ఒనర్చి= చేసి (ముగించి); రాత్రి అగుటయున్= పొద్దుపోవటంవలన; పల్లవ= చిగురుటాకులతో; పుష్ప= పూలతో; సాంద్రంబు+అగు= ఒత్తుగా పరచిన; శయనంబు= పడకను; కల్పించి= కూర్చి, ఏర్పరచి; ఆ+బకపతి= ఆ కొంగలరాజు రాజధర్ముడు; ఆ+ధరణీసురునితోన్= ఆ బ్రాహ్మణుడితో; సముచిత= తగిన; సల్లాపంబులనున్= సంభాషణలతోనూ; సుఖనిద్రనున్= ఆదమరచిన నిద్రతోనూ; ఆ+రాత్రి= ఆ రేయి; కడపి= వెళ్ళబుచ్చి; వేగుటయున్= తెల్లగా తెల్లవారగానే; ఆ+విప్రున్= ఆ బ్రాహ్మణుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** తన ఆతిథ్యాన్ని అందుకొనుమన్నది. మంచిరుచిగా ఉండే గంగానదిలోని చేపలను కాల్చి తెచ్చింది. తీయటి

అడవిపళ్ళు పెట్టింది. అతిథి బ్రాహ్మణుడు తృప్తి పడేటట్లు భోజనం పెట్టింది. పొద్దు పోవటంతో చిగురుటాకులతోనూ, పూలతోనూ, ఒత్తుగా పక్కను సిద్ధం చేసింది. ఆ కొంగలరాజు ఆ బ్రాహ్మణుడు ముచ్చటలతోనూ హాయి అయిన నిద్రతోనూ ఆ రాత్రి గడిపారు. తెల్లవారగానే ఆ బ్రాహ్మణుడిని చూచి కొంగ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **'విను! మిత్రుండును రజతముఁ । గనకము బుద్ధియును నాల్గుకారణములు మ**
**ర్త్యుని దారిద్ర్యము వాయుట । కని దేవగురుండు సెప్పె నన్నిటిలోనన్.** **484**

**ప్రతిపదార్థం:** విను= వినుము; మిత్రుండును= చెలిమికాడూ; రజతమున్= వెండీ; కనకమున్= బంగారమున్నూ; బుద్ధియును= ఆలోచనా; మర్త్యుని= మనిషి; దారిద్ర్యము= లేమితనం; పాయుటకున్= పోగొట్టటానికి; నాల్గు కారణములు= నాలుగు హేతువులు; అని; దేవగురుండు= బృహస్పతి; చెప్పెన్= చెప్పాడు; అన్నిటిలోనన్= ఈ నాలుగింటిలో.

**తాత్పర్యం:** 'వినుము. మనిషి పేదరికం పోవటానికి స్నేహితుడూ, వెండీ, బంగారమూ, ఆలోచనా అనే నాలుగింటిని కారణాలుగా దేవగురువు బృహస్పతి చెప్పాడు. వీటి అన్నింటిలోనూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **మిత్రుం డెక్కుడు కాశ్యప । పుత్రుఁడనగు నేను నీకు భూసురవర! స**
**న్మైత్రి యనుష్ఠించెద నటె । పాత్రము గాకుండుదే యపార శ్రీకిన్.** **485**

**ప్రతిపదార్థం:** భూసురవర!= బ్రాహ్మణోత్తముడా!; మిత్రుండు= స్నేహితుడు; ఎక్కుడు= దొడ్డవాడు; కాశ్యప పుత్రుఁడను+అగు= కశ్యపుడి కొడుకునైన; నేను= నేను (నాడీజంఘుడిని); నీకున్= నీతో; సన్మైత్రి= మంచి స్నేహం; అనుష్ఠించెదను+అటె= చేస్తున్నవాడిని అవుతుండగా; అపార శ్రీకిన్= అంతులేని సిరులకు; పాత్రము+కాకుండుదే= తగినవాడివి కాకపోతావా!

**తాత్పర్యం:** ఓ బాపనయ్యా! మిత్రుడు గొప్పవాడు. కశ్యపుడి సంతానంలోని వాడనైన నేను నీతో చెలిమి చేస్తూ ఉంటే అంతులేని సిరిసంపదలకు యోగ్యుడివి కాకుండా పోతావా?

**తే.** **నా సఖుండు విరూపాక్ష నామధేయుఁ । డతని పురము మధువ్రజ; మదియు మూఁడు**
**యోజనము లిచ్చటికి; దాని కుల్ల తెరువు । వట్టి వేచని యాదైత్యభర్తఁ గనుము.** **486**

**ప్రతిపదార్థం:** విరూపాక్ష నామధేయుఁడు= విరూపాక్షుడనే పేరుగలవాడు; నా సఖుండు= నా చెలిమికాడు; అతని పురము= అతడి పట్టణం; మధు వ్రజము= మధు వ్రజం; అదియున్= ఆ పట్టణం కూడా; ఇచ్చటికిన్= ఇక్కడకు; మూఁడు యోజనములు= మూడామడల దూరం; దానికిన్= మధు వ్రజానికి; ఉల్ల తెరువుపట్టి= అంతదూరం అంత దగ్గరా కానీ తోవను బట్టి; వేచని= వడిగా వెళ్ళి; ఆ దైత్యభర్తన్= ఆ రాక్షస రాజును; కనుము= చూడుము.

**తాత్పర్యం:** నాకు విరూపాక్షుడనే మిత్రు డొకడు ఉన్నాడు. మధువ్రజం అతడిపట్టణం. అది ఇక్కడకు మూడామడల దూరంలో ఉంటుంది. దానికి మరీ దూరం మరీ దగ్గర కాని త్రోవ వెంబడే గబగబా వెళ్ళుము. ఆ రాక్షసరాజును ఆశ్రయించుము.

**క.** **కాంచి యతనితో నేఁ బు । త్తెంచితినని చెప్పు; మతఁ డతిప్రీతుండై**
**కాంచనమును రత్నంబులు । నంచితుఁగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్.'** **487**

**ప్రతిపదార్థం:** కాంచి= చూచి; అతనితోన్= ఆ విరూపాక్షుడితో; ఏన్= నేను; పుత్తెంచితిని+అని= పంపించాను అని; చెప్పుము= చెప్పుము; అతఁడు= ఆ రక్కసిదొర; అతి ప్రీతుండు+ఐ= ఎంతో సంతోషించినవాడై; కాంచనమును= బంగారమూ; రత్నంబులున్=

మణులూ; అంచితుఁగాన్+చేసి= గౌరవించినవాడిగా చేసి; నీకున్= నీకు; అప్పుడ= అప్పటికప్పుడే; ఇచ్చున్= ఇస్తాడు.

**తాత్పర్యం:** విరూపాక్షుడిని చూచి అతడితో నేను పంపించినట్లు చెప్పుము. అతడు ఎంతో సంతోషిస్తాడు. బంగారం, మణులూ ఇచ్చి నిన్ను సత్కరిస్తాడు'.

**క. అని యప్పురి దెస సెప్పినఁ । జని యాతం డతనిఁ గాంచి సముచిత భంగిన్**
**వినిపించె రాజధర్మున । కనుగలమగు సఖుఁడ ననియు నతని పనుపునన్. 488**

**ప్రతిపదార్థం:** అని= అని; ఆ+పురిదెస= ఆ పట్టణం పోయే దిక్కును; చెప్పినన్= తెలుపగా; చని= వెళ్ళి; ఆతండు= ఆ బ్రాహ్మణుడు; అతనిన్= ఆ రక్కసి దొరను; కాంచి= చూచి; సముచిత భంగిన్= తగిన రీతిలో; రాజధర్మునకున్= నాడీజంఘుడికి; అనుగలము+అగు= అనుకూలుడనైన; సఖుఁడన్= మిత్రుడిని; అనియున్= అని కూడా; వినిపించెన్= చెప్పాడు; అతని పనుపునన్= నాడీజంఘుడు పంపటంవలన.

**తాత్పర్యం:** అంటూ ఆ కొంగ మధువ్రజం పోయే దిక్కును చెప్పింది. ఆ దారివెంబడి వెళ్ళి ఆ బ్రాహ్మణుడు విరూపాక్షుడిని చూచాడు. నేను నాడీజంఘుడికి ఆప్తమిత్రుడిని అని చెప్పాడు. అతడు పంపబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అరుగుదెంచితి ననియు, ధనార్థిననియు, । నిట్లు వినిపించుటయు, రాక్షసేశ్వరుండు**
**దేఱకొనఁజూచి, యాత్మ నిప్పాఱుఁ డధముఁ । డగుట దోఁచుచు నున్నది; యడుగ వలయు. 489**

**ప్రతిపదార్థం:** అరుగుదెంచితిని= వచ్చాను; అనియున్= అనీ; ధన+అర్థిన్+అనియున్= ధనాన్ని కోరివచ్చాననీ; ఇట్లు= ఇట్లా; వినిపించుటయున్= చెప్పగానే; రాక్షస+ఈశ్వరుండు= రాక్షసరాజు; తేఱకొనన్+చూచి= తేరిపార చూచి; ఆత్మన్= మనస్సులో; ఈ+పాఱుఁడు= ఈ బ్రాహ్మణుడు, అధముఁడు+అగుటన్= నీచుడు అని; తోఁచుచున్+ఉన్నది= అనిపిస్తున్నది; అడుగవలయున్= అడిగి చూడాలి.

**తాత్పర్యం:** డబ్బుకోరి వచ్చాను' అని బ్రాహ్మణుడు చెప్పగానే విరూపాక్షుడు అతడిని తేరిపార చూచాడు. లోలోపల 'ఈ బ్రాహ్మణుడు నీచుడుగా అనిపిస్తున్నాడు. సంగతేమిటో అడిగి తెలిసికొనాలి.'

**వ. అని తలంచి. 490**

**తాత్పర్యం:** అని అనుకొని.

**క. 'కులమును విద్యయు వృత్తముఁ । గల రూ పెఱిఁగింపు' మనినఁ గలఁగక తన్నుం**
**దెలియంగఁ జెప్పె విప్రుం । డలఘుం డగు నసురపతియు నవికృతుఁ డగుచున్. 491**

**ప్రతిపదార్థం:** కులమును= వంశాన్నీ; విద్యయున్= చదువునూ; వృత్తమున్= నడతనూ; కలరూపు= ఉన్నదున్నట్లుగా; ఎఱిఁగింపుము= తెలుపుము; అనినన్= అని అడగగానే; విప్రుండు= బ్రాహ్మణుడు; కలఁగక= కలతచెందక; తన్నున్= తన సంగతిని; తెలియంగన్ చెప్పెను= ఎరుకపరిచాడు; అలఘుండు+అగున్= గొప్పవాడవటంవలన; అసురపతియున్= రాక్షసరాజు విరూపాక్షుడు కూడా; అవికృతుఁడు+అగుచున్= ఎట్లాంటి (శారీరక, మానసిక) వికారాలకు లోనుకానివాడవుతూ.

**తాత్పర్యం:** 'నీ వంశం, నీ చదువు, నీ నడవడి ఉన్నదున్నట్లుగా చెప్పుము' అని అడిగాడు. అందుకు ఆ బ్రాహ్మణుడు

ఏ మాత్రం జంకలేదు. తన సంగతి అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అపుడు విరూపాక్షుడు కూడా ఎట్లాంటి (మానసిక, శారీరక) వికారాలకు లోబడనివాడవుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఇతఁ డెట్టిఁ డైన నేమగు? । నతనికి సఖుఁ డట్టె బకమహత్తర సఖ్యం
బితనిం బాత్రముఁ జేయదె! । యితనికిఁ దృప్తి యగునట్టు లిత్తు ధనంబుల్.' 492**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ బాపడు; ఎట్టిఁడు+ఐనన్= ఎట్లాంటివాడైనా; ఏమి+అగున్?= ఏమవుతుంది?; అతనికిన్= అతడికి (రాజధర్ముడికి); సఖుఁడు+అట్టె= స్నేహితుడట; బక= కొంగ; మహత్తర సఖ్యంబు= గొప్ప చెలిమి; ఇతనిన్= ఈ బ్రాహ్మణుడిని; పాత్రమున్= యోగ్యుడిని; చేయదె!= చేస్తుంది కదా!; ఇతనికిన్= ఇతడికి; ధనంబుల్= సిరులు; తృప్తి+అగునట్టులు= కరువుతీరా; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** ఈ బ్రాహ్మణుడు ఎట్లాంటివాడైతే ఏమిలే. నాడీజంఘుడితో స్నేహమే ఈ బ్రాహ్మణుడి యోగ్యతను తెలుపుతుంది. కాబట్టి ఇతడికి కరువుతీరా ధనం ఇస్తాను'.

**వ. అని నిశ్చయించి యతనికి నాహార సంఛాదనంబులు సమీచీనంబుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి, మఱునాఁడు కార్తికపౌర్ణమాసియైన భూసుర సహస్రంబులు దన గృహంబునం బసిండిపళ్ళెరంబుల భోజనంబులు సేయను, బహుళ దక్షిణలు ప్రతిగ్రహింపనుం గల నైమిత్తిక క్రియానుష్ఠానంబులు గలిగిన నమ్మహాజనంబులలోఁ గలిపి యత్యంతాదరంబున. 493**

**ప్రతిపదార్థం:** అని; నిశ్చయించి= నిర్ణయించి; అతనికిన్= ఆ బాపడికి; ఆహార= తిండీ; సంఛాదనంబులు= మంచి బట్టలూ; సమీచీనంబుగాన్= తగ్గట్టుగా; నిర్వర్తింపన్+తగువారిన్= సిద్ధం చేయగలవాళ్ళను; నియోగించి= నియమించి; మఱునాఁడు= మర్నాడు; కార్తికపౌర్ణమాసి+ఐనన్= కార్తీక పౌర్ణమి కాగా; తన గృహంబునన్= తన (విరూపాక్షుడి) ఇంట్లో; భూసుర సహస్రంబులు= వేలకొద్ది బ్రాహ్మణులు; పసిఁడి పళ్ళెరంబులన్= బంగారు పళ్ళాల్లో; భోజనంబులు+చేయను= తినటానికీ; బహుళదక్షిణలు= చాలా కానుకలు; ప్రతిగ్రహింపనున్+కల= పుచ్చుకొనగల; నైమిత్తిక క్రియ= ఏదో ఒక కారణం పెట్టి చేసే కర్మల; అనుష్ఠానంబులు+కలిగినన్= ఆచరించవలసి ఉండగా; ఆ మహాజనంబులలోన్+కలిపి= వేలకొద్ది వచ్చిన బ్రాహ్మణులతోపాటు; అత్యంత+ఆదరంబునన్= ఎక్కువగా మన్నించి.

**తాత్పర్యం:** అని నిర్ణయించుకొని ఆ బ్రాహ్మణుడికి అవసరానికి తగ్గట్టుగా తిండీ, బట్టలూ సమకూర్చిపెట్టటానికి కొంతమందిని నియమించాడు. ఆ మరునాడు కార్తీకపౌర్ణమి. విరూపాక్షుడు తన ఇంట్లో వేలకొద్ది బ్రాహ్మణులు బంగారు పళ్ళాలలో భోజనాలు ఆరగించటానికీ, కానుకలు ఎక్కువగా పుచ్చుకొనటానికీ అనువుగా గల కర్మలు ఆచరించాడు. ఆ మహాజనంతోపాటు ఎంతో ఆదరణతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మహనీయ బహుళపూజా । సహితంబుగ భోజనంబు సంతృప్తిగ న
మ్మహితాత్ముండు నడపి దు । ర్వహ భారముగాఁగ గనకరాశియు మణులున్. 494**

**ప్రతిపదార్థం:** మహిత+ఆత్ముండు= దొడ్డ మనస్సు కలవాడు; మహనీయ= గొప్పవైన; బహుళపూజా సహితంబుగన్= అనేకమైన సేవలతో కూడా; భోజనంబు= తిండిని; సంతృప్తిగన్= తుష్టిగా; నడపి= జరిపి; దుర్వహ= మోయలేనంత; భారముకాఁగన్= బరువు అయ్యేటట్లు; కనకరాశియున్= బంగారం ముద్దా; మణులున్= రత్నాలు.

**తాత్పర్యం:** దొడ్డమనస్సుగల ఆ విరూపాక్షుడు ఆ బ్రాహ్మణుడికి ఎన్నో సేవలు చేశాడు. కడుపునిండా కమ్మని తిండి పెట్టాడు. మొయ్యలేనంత బంగారం, రత్నాలు ఇచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. కుడిచిన పళ్ళెరంబును నకుంఠిత హర్షముతోడ నిచ్చినం**
**గడుముదమంది యెత్తికొని గాఢభరంబున మార్చి మోవఁగా**
**మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి నొవ్వునఁ గొంకు వోవ నె**
**క్కుడు వెస నేఁగుదెంచెఁ గని కొక్కెర సమ్మదమంద మఱ్ఱికిన్. 495**

**ప్రతిపదార్థం:** కుడిచిన పళ్ళెరంబునున్= తిన్న బంగారు పళ్ళాన్నికూడా; అకుంఠిత= మొక్కవోని; హర్షముతోడన్= సంతోషంతో; ఇచ్చినన్= ఇవ్వగా; కడు ముదమున్+అంది= ఎంతో సంతోషించి; ఎత్తుకొని= తీసికొని; గాఢభరంబునన్= బరువు ఎక్కువ అవటంచేత; మార్చి= అటుదిటూ, ఇటుది అటూ మార్చుకొని; మోవఁగాన్= మొయ్యగా; మెడయును= మెడకాయా; వీఁపు= వీపూ; మూఁపులును= భూజాలూ; మిక్కిలి నొవ్వునన్= ఎక్కువ నొప్పివలన; కొంకుపోవన్= కొంకరలుపోగా; కొక్కెర= కొంగ; కని= చూచి; సమ్మదము+అందన్= సంతోషించగా; ఎక్కుడు వెసన్= తొందర తొందరగా; మఱ్ఱికిన్= మఱ్ఱిచెట్టు దగ్గరకు; ఏగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** తిన్న బంగారు పళ్ళాన్ని కూడా మనసారా ఇచ్చాడు. బ్రాహ్మణుడు ఆనందంగా దాన్నీ పుచ్చుకొన్నాడు. బరువు ఎక్కువ అవటంతో భుజాలూ చేతులూ మార్చుకొంటూ మోస్తున్నాడు. బరువువలన మెడా, వీపూ, రెక్కలూ చాలా నొప్పిపెట్టాయి. ఆ నొప్పివలన వంగిపోతున్నాడు. గబగబా అంగలువేస్తూ నాడీజంఘుడు ఉండే మఱ్ఱి చెట్టును చేరుకొన్నాడు. అతడిని చూచి కొంగ సంతోషించింది.

**తే. అట్లు సంతోషమునఁ దేలి యతని డప్పి । వోవ బకవల్లభుఁడు పక్షపుటయుగమున**
**నల్ల వీచి యాహార సమర్పణంబు । సేసి నిసి యైన, సుఖనిద్ర సేయుచుండ. 496**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; సంతోషమునన్= ఆనందంతో; తేలి= తృప్తిపడి; బకవల్లభుఁడు= కొంగలరాజు నాడీజంఘుడు; పక్షపుటయుగమునన్= దొప్పల్లాంటి రెండు రెక్కలచేతా; అతని= ఆ బ్రాహ్మణుడి; డప్పి= అలుపు; పోవన్= పోయేటట్లు; అల్లన్ వీచి= మెల్లగా విసరి; ఆహార సమర్పణంబు+చేసి= తిండిపెట్టి; నిసి+ఐనన్= రాత్రి కాగా; సుఖనిద్ర చేయుచున్+ఉండఁగాన్= హాయిగా కునుకు తీస్తుండగా.

**తాత్పర్యం:** అట్లా వచ్చిన బ్రాహ్మణుడిని చూచి కొంగ తృప్తిపడింది. దొప్పలవంటి తన రెండు రెక్కలతో మెల్లగా విసరి అతడి బడలిక పోగొట్టింది. ఆకలి తీర్చింది. రాత్రి అయింది. ఆదమరిచి నిద్రపోతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

### నాడీజంఘుఁడు దుష్టబ్రాహ్మణునిచే మృతుండై, మరల జీవించుట (సం.12-166-2,3)

**వ. ఆ దుర్బ్రాహ్మణుండు దనరేపటి పయనంబునకు నాహారంబు చింతించి 'యిమ్మహాబకంబు శరీరంబు గ్రొవ్వియున్నది; దీనియందు మాంసంబు సాలం గల; దిది యేమఱి నిద్రవోయెడుఁ; జావనడిచి చెండికొని పోయెదంగాక!' యని పాపనిశ్చయుండై చీర సక్కంగట్టికొని యొక్క కాష్ఠంబు గర యుగంబునం జిక్క నమర్చికొని. 497**

**ప్రతిపదార్థం:** ఆ దుర్బ్రాహ్మణుండు= ఆ చెడ్డ బ్రాహ్మణుడు; తన= తన; రేపటి= మర్నాటి; పయనంబునకున్= ప్రయాణానికి; ఆహారంబు= తిండిని గురించి; చింతించి= ఆలోచించి; ఈ+మహాబకంబు= ఈ పెద్ద కొంగ; శరీరంబు= ఒళ్ళు; క్రొవ్వి+ఉన్నది=

బలిసి ఉన్నది; దీనియందు= కొంగ ఒంట్లో; మాంసంబు= కండ; చాలన్+కలదు= ఎక్కువగా ఉన్నది; ఇది= ఈ కొంగ; ఏమఱి= మైమరచి; నిద్రపోయెడున్= కునుకుతీస్తున్నది; చావన్+అడిచి= చావమోది; చెండి= చంపి ముక్కలు ముక్కలు చేసికొని; కొని పోయెదన్+కాక= ఎత్తుకెళ్ళుతాను; అని= అని; పాపనిశ్చయుండు+ఐ= చెడ్డగా తలపోసినవాడై; చీర= బట్ట; చక్కన్+కట్టికొని= బాగా బిర్రుగా లాగి కట్టుకొని; ఒక్క కాష్ఠంబున్= ఒక బడితను; కరయుగంబునన్= రెండు చేతులలో; చిక్కన్= గట్టిగా; అమర్చికొని= పొందికగా పెట్టుకొని.

**తాత్పర్యం:** ఆ పాడు బాపడు మర్నాటి ప్రయాణంలో తిండిని గురించి ఆలోచించాడు. ఈ కొంగ ఒళ్ళు బాగా కొవ్వి కండపట్టి ఉన్నది. ఇది ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నది. దీన్ని చావమోది మాంసాన్ని ముక్కలు ముక్కలు చేసి పట్టుకుపోవాలని దుర్మార్గంగా ఆలోచించాడు. బట్టను లాగి బిగించి కట్టుకొని రెండు చేతులతోనూ కర్రను బాగా గట్టిగా పట్టుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అందంద మెడయుఁ దలయు న । మందాటోపమునఁ బెక్కు మాఱు లడిచి చావుం**
**దెలియఁ జూచి యలరెడు । డెందముతో నీఁకలన్నిటిని వెస నూడ్చెన్. 498**

**ప్రతిపదార్థం:** అందందన్= అప్పటికప్పుడే; మెడయున్= మెడకాయా; తలయున్= తలకాయా; అమంద ఆటోపమునన్= గొప్ప తొందరపాటుతో; పెక్కుమాఱులు= పలుసార్లు; అడిచి= బాది(కొట్టి); చావున్= ప్రాణం పోవటాన్ని; తెలియన్+చూచి= నిక్కం చేసుకొని; అలరెడు= ఆనందించే; డెందముతోన్= మనస్సుతో; ఈఁకలన్నిటిని= అన్ని ఈకలను; వెసన్= తొందరగా; ఊడ్చెన్= ఊడ పెరికివేశాడు.

**తాత్పర్యం:** అప్పటికప్పుడే మెడమీదా తలమీదా దబదబా చితకబాదాడు. ప్రాణంపోయిందని రూఢి చేసికొన్నాడు. ఈకలన్నీ గబగబా పెరికేశాడు.

**తే. ఊడ్చి బొండువు వ్రచ్చి ప్రేవురివి నంజు । డంతయును బుచ్చి పొదుకగా నమరఁ గట్టి**
**కొనుచు వేగుఁ బోకగుటయుఁ జనియె; నట్టి । సమయమున మేలుకని దనుజప్రభుండు. 499**

**ప్రతిపదార్థం:** ఊడ్చి= ఈకలు పెరికి; బొండువు= పీక; వ్రచ్చి= చీల్చి; ప్రేవు+ఉరివి= పేగులు బయటకు లాగి; నంజుఁడు+అంతయును= మాంసాన్ని అంతా; పుచ్చి= వేరుచేసి; పొదుకగాన్= మూటగా; అమరన్+కట్టికొనుచున్= పొందికగా కట్టుకొంటూ; వేఁగు బోకగుటయున్= తెల్లవారగా; అట్టి సమయమునన్= అపుడు; దనుజ ప్రభుండు= రాక్షసరాజు; మేలుకని= నిద్రనుండి లేచి.

**తాత్పర్యం:** ఈకలన్నీ పెరికేశాడు. పీకను చీల్చాడు; పేగులు బయటకులాగి మాంసాన్ని పొందికగా మూటకట్టుకొన్నాడు. అంతలో తెల్లవారగా విరూపాక్షుడు నిద్రనుండి లేచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పొల వలచె నేమి గీడొకొ । కలిగెడు!' నని తలఁచి మనసు గలఁగఁగఁ దనవా**
**రలతోడ నుగ్గడించుచుఁ । జలియించుచునుండఁ బ్రొద్దు జామెక్కుటయున్. 500**

**ప్రతిపదార్థం:** పొలవలచెన్= నీచుకంపు కొడుతున్నది; ఏమి కీడు= ఏమి ఆపద; కలిగెడున్+ఒకొ= రానున్నదో; అని తలఁచి= అని తలపోసి; మనసు= మనస్సు; కలఁగఁగన్= కలత చెందగా; తనవారలతోడన్= తన వారితో (రాక్షసులతో); ఉగ్గడించుచున్= చెప్పుతూ; చలియించుచున్+ఉండన్= వణకుతూ ఉండగా; ప్రొద్దుజాము ఎక్కుటయున్= జాము పొద్దెక్కగా.

**తాత్పర్యం:** మాంసం కంపు కొడుతున్నది. ఏం ముప్పు ముంచుకొస్తుందో ఏమో! మనస్సులో కలతగా ఉన్నది' అని తన వారితో చెప్పుతూ భయంతో వణకిపోతున్నాడు. జాము పొద్దెక్కగా.

**వ. రాజధర్మునిం దలంచి. 501**

**ప్రతిపదార్థం:** రాజధర్మునిన్= రాజధర్ముడిని; తలంచి= తలచుకొని.

**తాత్పర్యం:** రాజధర్ముడిని గుర్తుకు తెచ్చుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. నిచ్చలు వచ్చు రేపకడ నెయ్యు మెలర్పఁగ మత్సఖుండు; నేఁ**
**డిచ్చటి కేల రాఁడు? గుణహీనత విప్రునియందుఁ గల్మి నా**
**యిచ్చఁ దలంచితిం; దులువ యేమి దలంచెనొ? యక్కటా! మదిం**
**బొచ్చెము లేదు నమ్ము బకపుంగవుఁ; డెట్లగు నొక్కొ దైవమా! 502**

**ప్రతిపదార్థం:** నెయ్యము= స్నేహం; ఎలర్పఁగన్= పెంపొందగా; మత్+సఖుండు= నా నేస్తగాడు; రేపకడన్= పొద్దున్నే; నిచ్చలున్= ప్రతినిత్యమూ; వచ్చున్= వస్తాడు; నేఁడు= ఈనాడు; ఇచ్చటికిన్= నా దగ్గరకు; ఏల రాడు?= ఎందుకురాలేదో; విప్రుని+అందున్= బాపనయ్యలో; గుణహీనత= నీచస్వభావం; కల్మిన్= ఉండటం; నా+ఇచ్చన్= నా మనస్సులో; తలంచితిన్= అనుకొన్నాను; తులువ= తుంటరి; ఏమి తలంచెనొ= ఏం తలపెట్టాడో; అకటా!= అయ్యో!; దైవమా!= దేవుడా!; బక పుంగవుఁడు= బకోత్తముడు; ఎట్లు+అగున్+ఒక్కొ= ఏమవుతాడో ఏమో; మదిన్= మనస్సులో; పొచ్చెము లేదు= కల్మషం ఉండదు; నమ్ము= నామాట నమ్ము.

**తాత్పర్యం:** నా మిత్రుడు ప్రతినిత్యం పొద్దున్నే వచ్చేవాడు. ఇవాళ ఎందుకు రాలేదో ఏమో! బ్రాహ్మణుడు నీచుడని అపుడే అనుకొన్నాను. ఈ తుచ్ఛుడు ఏం తలపెట్టాడో ఏమో? అయ్యో! దైవమా! నాడీజంఘుడు ఏం కానున్నాడో ఏమో? ఏమీ కల్మషం ఎరగనివాడు. అందరినీ నమ్ముతాడు'.

**క. అని తూరవగచి యారయఁ। బనిచెం బనిగఱపి భటులఁ బలువుర వారుం**
**జని బకము డొక్క యేర్పడఁ। గని యతనికిఁ జెప్పి పుచ్చి కడు వేగమునన్. 503**

**ప్రతిపదార్థం:** అని= అని; తూరవగచి= విచారించి; పలువురన్= చాలా మంది; భటులన్= సేవకులను; పని+కఱపి= పురమాయించి; ఆరయన్= కొంగను వెదకటానికి; పనిచెన్= పంపాడు; వారున్= ఆ సేవకులున్నూ; చని= వెళ్ళి; బకము= కొంగ; డొక్క= ఎముకల గూడు; ఏర్పడన్+కని= కళ్ళారా చూచి; కడువేగమునన్= ఆ వెనువెంటనే; అతనికిన్= రక్కసి దొరకు; చెప్పిపుచ్చి= కబురుపెట్టి.

**తాత్పర్యం:** లోతుగా ఆలోచించాడు. తన పరివారానికి కొంగను వెదకండని పురమాయించాడు. ఆ పరిజనం వెళ్ళి వెదకి, కొంగ డొక్కను గుర్తు పట్టి వెంటనే ఆ సంగతి రాజునకు కబురు పంపి. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. అవ్విప్రుని చొప్పువట్టి. 504**

**ప్రతిపదార్థం:** ఆ+విప్రుని= ఆ బ్రాహ్మణుడి; చొప్పు+పట్టి= జాడను తెలిసికొని.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడు ఎటువైపుగా వెళ్ళాడో ఏమిటో తెలిసికొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. పరిమెయిఁ బాఱి వానిఁగని పట్టి వడిం బెడగేలు గట్టి తె**
**చ్చి రసురభర్త సూచి 'యిటు సేరఁగఁ దేవల దీ కృతఘ్నునిం;**
**బొరిగొని వే తినుం' డనినఁ బోకడ మాలిన వార మయ్య! యి**
**ద్దురిత శరీరముం దినఁగ దోసము మా' కని వార లొల్లమిన్. 505**

**ప్రతిపదార్థం:** పరిమెయిన్= బాగా వేగంగా; పాఱి= పరుగెత్తి; వానిన్= ఆ బ్రాహ్మణుడిని; కనిపెట్టి= వెదకి పట్టుకొని; వడిన్= వేగిరంగా; పెడ కేలు కట్టి= చేతులు వెనక్కి విరిచికట్టి; తెచ్చిరి= రాజువద్దకు తీసికొనివచ్చారు; అసురభర్త= రాక్షసరాజు విరూపాక్షుడు; చూచి= కని; ఈ కృతఘ్ననిన్= చేసిన మేలు మరచి చంపిన ఈ బాపనయ్యను; ఇటు+చేరఁగన్= ఇట్లా నా దరిదాపులకు; తేవలదు= తీసికొని రావద్దు; పొరిగొని= చంపి; వే తినుండు= వెంటనే తినండి; అనినన్= అనగానే; ఈ దురిత శరీరమున్= ఈ పాపి బొందిని; తినఁగన్= నమలటానికి; పోకడ మాలిన వారము+అయ్య= నీతిలేని వాళ్ళమా; మాకు= మాకు; దోసము= పాపం; అని= అని; వారలు= ఆ సేవకులు; ఒల్లమిన్= ఇష్టపడకపోవటం వలన.

**తాత్పర్యం:** వడి వడిగా పరుగెత్తి ఆ బ్రాహ్మణుడిని వెదకి పట్టుకొన్నారు. వెంటనే రెక్కలు విరిచికట్టి రాజు ముందుకు తెచ్చారు. విరూపాక్షుడు 'ఇతడు చేసినమేలు మరచినవాడు, వీడిని నా చాయలకు తేకండి, వీడిని వెంటనే చంపి తినండి' అని సేవకులతో చెప్పాడు. ఆ మాటలు విన్న భటులు 'ఈ పాపిష్ఠి శరీరాన్ని తినటానికి మేమంత నీతిలేని వాళ్ళమా? ఇట్లాంటివి తింటే మాకు పాపం అంటుకుంటుంది' - అని ఇష్టపడకపోవటంవలన.

**వ. అతండు. 506**

**తాత్పర్యం:** ఆ విరూపాక్షుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'తినుఁడు తినకుఁ; డొం డేమై । నను జేయుఁడు; వీని నేల నా ముందటికిం**
**గొని వచ్చితి?' రని పలికిన । దనుజులు పురి వెడలఁ దెచ్చి తద్గాత్రంబున్. 507**

**ప్రతిపదార్థం:** తినుఁడు= తింటే తినండి; తినకుఁడు= తినకపోతే మానండి; ఒండు+ఏమైనను= మరేమైనా మీ ఇష్టం వచ్చినట్లు; చేయుఁడు= చేయండి; వీనిన్= ఈ కృతఘ్నుడిని; నా ముందటికిన్= నా ఎదుటకు; ఏల?= ఎందుకు?; కొనివచ్చితిరి?= తీసికొని వచ్చారు?; అని పలికినన్= అని అనగా; దనుజులు= రాక్షసులు; పురి= పట్నం (మధుబ్రజం); వెడలన్= వెలుపలికి; తెచ్చి= తీసికొని వచ్చి; తద్+గాత్రంబున్= ఆ బ్రాహ్మణుడి శరీరాన్ని.

**తాత్పర్యం:** 'తింటే తినండి లేకపోతే మానెయ్యండి. ఏం చేసినా సరే. ఈ కృతఘ్నుడిని నా ఎదుటికి ఎందుకు తెచ్చారు?' అని రాజు అనగానే ఆ రాక్షసులు మధుబ్రజం వెలుపలికి తీసికొనివెళ్ళి అతడి శరీరాన్ని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వెడ గోఁతల నెత్తు రొలుక । బడఁ ద్రోచిన వచ్చి కుక్క పదుపు వెనుకకున్**
**జడిసెఁ గబళింప నొల్లక । కడుపులు నకనకఁ బడంగఁ గౌరవముఖ్యా!' 508**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= ధర్మరాజా!; వెడ= చిన్న చిన్న కండలుగా; కోఁతలన్= కోసిన గాయాలనుండి; నెత్తురు+ఒలుకన్= రక్తం కారుతుండగా; పడన్+త్రోచినన్= పడనెట్టగా; కడుపులు= డొక్కలు; నకనకపడంగన్= ఆకలి నొప్పితో; కుక్కపదుపు= కుక్కలమంద; వచ్చి= వచ్చిపడి; కబళింపన్= ఆ పాపి శరీరాన్ని తినటానికి; ఒల్లక= ఇష్టపడక; వెనుకకున్= వెనక్కి; జడిసెన్= మళ్ళింది.

**తాత్పర్యం:** రాజా! చిన్న చిన్న కండలుగా కోసిన గాయాలనుండి రక్తం చిందుతూ ఉండగా పడదోశారు. అంతలో ఆ పాపిశరీరాన్ని తినటానికి నకనకలాడుతున్న కడుపులతో కుక్కలమంద వచ్చిపడింది. అంత ఆకలితోనూ అవి ఆ పాపాత్ముడి శరీరాన్ని ముట్టకుండానే వెనక్కి తిరిగి వెళ్ళిపోయాయి'.

**వ. అని చెప్పి భీష్ముండు. 509**

**ప్రతిపదార్థం:** అని= అని; చెప్పి= పలికి; భీష్ముండు= భీష్ముడు.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'విను మది యట్టిద; కుక్కలుఁ । దినగా రోయుం గృతఘ్ను దేహము మాంసం**
**బని చెప్ప నాగమంబులు । మనుజేశ్వర! తెల్లమయ్యె మన కిచ్చోటన్.' 510**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= ధర్మరాజా!; వినుము= వినుము; అది= ఆ తినకపోవటం; అట్టిద= అట్లాంటిదే; కృతఘ్ను దేహము= చేసిన మేలును మరిచేవాడి శరీరం; మాంసంబు= కండను; కుక్కలు; తినఁగాన్= తినటానికి; రోయున్= రోత పడతాయి; అని; ఆగమంబులు= వేదాలు; చెప్పన్= పలుకగా; మనకున్= మనక్కూడా; ఇచ్చోటన్= ఇక్కడనే ఈ విషయంగా; తెల్లము+అయ్యెన్= తేట పడింది, విశదపడింది.

**తాత్పర్యం:** వినుము - అది అటువంటిదే. కృతఘ్నుడి మాంసాన్ని కుక్కలు కూడా ముట్టవు, రోతపడతాయి' అని వేదాలే ఘోషిస్తున్నాయి. ఆ విషయం ఈ కథవలన మనకూ తేటతెల్లమయింది కదా!'

**వ. అని పలికి వెండియు నిట్లనియె. 511**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ భీష్ముడు ఇట్లా అన్నాడు.

**క. పురపురఁ బొక్కుచు బకపతి । కరంకముం దేరఁ బనిచి గారవమున నె**
**య్యురుఁ దాను నగ్ని యిచ్చి య । సురపతి యున్నంత వచ్చె సురపతి నెమ్మిన్. 512**

**ప్రతిపదార్థం:** పురపురన్+పొక్కుచున్= ఎంతో ఏడుస్తూ; బకపతి= నాడీ జంఘుడి; కరంకమున్= డొక్కను; తేరన్= తేవటానికి; పనిచి= పంపించి; నెయ్యురున్= స్నేహితులున్నూ; తానున్= తానూ (విరూపాక్షుడూ); గారవమునన్= గౌరవంతో; అగ్ని+ఇచ్చి= తలకొరివి పెట్టి; అసురపతి= రాక్షస రాజు; ఉన్నంతన్= ఉండటంతో; నెమ్మిన్= ప్రేమతో; సురపతి= దేవేంద్రుడు; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** విలవిల ఏడుస్తూ నాడీజంఘుడి డొక్కను తెప్పించాడు. స్నేహితులతో కలిసి, తాను గౌరవంగా తలకొరివి పెట్టాడు. అపుడు దేవేంద్రుడు వచ్చాడు.

**క. కని యతఁడు సంభ్రమంబును । వినయంబును బెరయ గారవించి యడిగె నా**
**తని 'రాజధర్మ నీవే' । యని దైన్యము దోఁప వగచి యశ్రులు దొరఁగన్. 513**

**ప్రతిపదార్థం:** కని= ఇంద్రుడిని చూచి; అతఁడు= విరూపాక్షుడు; సంభ్రమంబును= తత్తరపాటున్నూ; వినయంబును= అణకువా; బెరయన్= కూడుకోగా; గారవించి= గౌరవించి; దైన్యము= దీనత్వం; తోఁపన్= అవుపడగా; వగచి= దుఃఖించి; అశ్రులు= కన్నీరు;

తొరఁగన్= రాలగా; రాజధర్ముస్= రాజధర్ముడిని; ఈవే= తిరిగి బ్రతికించవా; అని; అతనిన్= ఇంద్రుడిని; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడిని చూచాడు విరూపాక్షుడు. అతడిలో తత్తరపాటు వినయం కలగలుపుగా దీనత్వం తోపగా, విలవిల ఏడుస్తూ 'నా రాజధర్ముడిని తిరిగి బ్రతికించవా' అంటూ వేడుకొన్నాడు.

**వ. అడిగిన నమరవిభుండు 'నీ సఖుండు చతుర్ముఖునకు సఖుం డగుట యెఱుంగవే? వానికి వగవనేల? యవ్వారిజాసనుండు దనపాలికి ననుదినంబు వాఁడు వచ్చుటం గోరుచుండుం గావున. 514**

**ప్రతిపదార్థం:** అడిగినన్= ప్రార్థించగా; అమర విభుండు= దేవేంద్రుడు; నీ సఖుండు= నీ చెలికాడు; చతుర్ముఖునకున్= బ్రహ్మకు; సఖుండు+అగుట= స్నేహితుడవటం; ఎఱుంగవే?= తెలియదా?; వానికిన్= నాడీజంఘుడి కొరకు; వగవన్+ఏల?= ఏడ్వటం ఎందుకు?; ఆ+వారిజ+ఆసనుండు= ఆ బ్రహ్మ; తనపాలికిన్= తన వద్దకు; అనుదినంబు= ప్రతినిత్యం; వాఁడు వచ్చుటన్= నాడీ జంఘుడి రాకను; కోరుచున్+ఉండున్= కోరుతూ ఉంటాడు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** విరూపాక్షుడి ప్రార్థన విన్న ఇంద్రుడు 'నీ చెలికాడు నాడీజంఘుడు బ్రహ్మకూ స్నేహితుడని నీకింతవరకూ తెలియదా? అతడి గురించి ఏడవటం ఎందుకు? అతడు ప్రతినిత్యమూ తన దగ్గరకు రావాలని బ్రహ్మకోరుకుంటాడు. కాబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పలుమాఱును రామికి ను । త్తలపడియెను; దాన నిట్టి దశ నతఁ డొందెం;**
**జెలి యగుట నితని డొక్కకు । నలఘువిధిన్ వహ్ని యిచ్చి తది మేల కదా! 515**

**ప్రతిపదార్థం:** పలుమాఱును= తరుచుగా; రామికిన్= రానందుకు; ఉత్తలపడియెను= బాధపడుతుండేవాడు; దానన్= అందువలననే; అతఁడు= నాడీజంఘుడు; ఇట్టిదశన్= పైలోకాన్ని; ఒందెన్= పొందాడు; చెలి+అగుటన్= స్నేహితుడు అవటంవలన; ఇతని డొక్కకున్= ఈ కొంగ ఎముకల గూడుకు; అలఘు విధిన్= గొప్పగా; వహ్ని+ఇచ్చితి=(వి) తలకొరివి పెట్టావు; అదిమేలకదా!= అది మంచిది కదా!

**తాత్పర్యం:** తరచూ రానందుకు బ్రహ్మ విచారించేవాడు. అతడికి ఇట్లాంటి దశ పట్టిందంటే అతడి స్నేహితుడవటంవలననే నీ స్నేహితుడవటంవలన నీవు ఈ కొంగకు తలకొరివి పెట్టావు. అది చాలా మంచి పనికదా!

**వ. అ ట్లగ్నిసంస్కారంబు సేసి నీవు వచ్చిన యనంతరంబ తచ్చితాసమీపంబున. 516**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; అగ్నిసంస్కారంబు+చేసి= దహన సంస్కారం చేసి; నీవు= నీవు; వచ్చిన+అనంతరంబ= వచ్చిన వెంటనే; తద్+చితా సమీపంబునన్= ఆ కాటినిప్పు దగ్గరలో.

**తాత్పర్యం:** అట్లా దహన సంస్కారం ముగించిన నీవు ఇట్లా వచ్చావో లేదో ఆ వెంటనే ఆ చితిమంట దగ్గరలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కడు నర్మిలిఁ గ్రేపుం జను । గుడుపఁ దొడఁగె నొక్క సురభి గుఱుపా ల్బెరయం**
**బడు వత్స వక్త్ర ఫేనము । సుడిగాలిం దూలిపడియె సొదపై ననఘా! 517**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; ఒక్కసురభి= ఒక ఆవు; కడున్= మిక్కిలి; అర్మిలిన్= ప్రేమచేత; క్రేపున్= దూడను; చనుకుడుపన్= పాలు ఇవ్వటానికి; తొడఁగెన్= మొదలుపెట్టింది; కుఱుపాల్= చిన్న చేపువలన; బెరయన్‌పడు= చిందిపడే; వత్స=

దూడ; వక్త్రఫేనము= నోటి నురగ తుంపర; సుడిగాలిన్= సుడిగాలిచేత; సొదపైన్= చితి మీదికి; తూలిపడియెన్= చెదరిపడింది.

**తాత్పర్యం:** ఒక ఆవు తన దూడకు ఎంతో ప్రేమగా పాలిస్తుండగా చిన్న పాలచేపు రాగానే దూడ నోటినుండి నురగ తుంపర జారిపడింది. అది సుడిగాలికి ఎగిరి చితిమీద పడింది.

**వ. దానంజేసి యన్నాడీజంఘుండు సంజీవితుం డయి యెప్పటియట్ల యొప్పెడు నాకారంబుతో నరుగుదెంచుచున్నవాఁ; డి ట్లగుటకుం గారణంబును నద్దేవుని దివ్యచిత్తంబు మహానుభావంబ.' 518**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= నురగ పడటంవలన; ఆ+నాడీజంఘుండు= ఆ రాజధర్ముడు; సంజీవితుండు+అయి= మళ్ళీ బతికినవాడై; ఎప్పటి+అట్ల= ఎప్పటిమాదిరిగానే; ఒప్పెడున్= శోభిల్లే; ఆకారంబుతోన్= రూపంతో; అరుగుదెంచుచున్+ఉన్నవాఁడు= వస్తూ ఉన్నాడు; ఇట్లు+అగుటకున్= ఇట్లా జరగటానికి (తిరిగి బతికి రావటానికి); కారణంబు= నిమిత్తం, మిష; ఆ+దేవుని= ఆ బ్రహ్మదేవుడి; దివ్యచిత్తంబు= లోకాతీతమైన దయా; మహాను భావంబ= మహిమే.

**తాత్పర్యం:** ఆ నురగ పడిందో లేదో నాడీజంఘుడు తిరిగి బ్రతికాడు. మునుపటి మాదిరిగానే అదే రూపంతో వస్తూ ఉన్నాడు. ఇట్లా జరిగిందీ అంటే అది ఆ బ్రహ్మదేవుడి లోకాతీతమైన దయామహిమే!'

**క. అని చెప్పె నంత బకపతి । సనుదెంచెను దనుజపతికి సమ్మద మెసఁగన్**
**మును వాసవుఁ డజువాక్యము । నన పాశ నిబద్ధుఁ జేసినాఁ డవ్విప్రున్. 519**

**ప్రతిపదార్థం:** అని= అని; చెప్పెన్= చెప్పాడు; అంతన్= అంతలో; బకపతి= కొంగలరాజు నాడీజంఘుడు; దనుజపతికిన్= రాక్షస రాజు విరూపాక్షుడికి; సమ్మదము= ఆనందం; ఎసఁగన్= ఎక్కువయ్యేటట్లు; చనుదెంచెన్= వచ్చాడు; మును= కొంగ రాకముందే; వాసవుఁడు= దేవేంద్రుడు; అజువాక్యమునన= బ్రహ్మమాటమీద; ఆ+విప్రున్= ఆ బ్రాహ్మణుడిని; పాశనిబద్ధున్= తాళ్ళతో కట్టినవాడిగా; చేసినాఁడు= చేశాడు.

**తాత్పర్యం:** అని ఇంద్రుడు చెప్పగానే కొంగలరాజు రానేవచ్చాడు. అతడి రాకకు విరూపాక్షుడు మరింత సంతోషించాడు. అంతకు మునుపే ఇంద్రుడు బ్రహ్మ మాట ప్రకారం ఆ బ్రాహ్మణుడిని తాళ్ళతో కట్టించాడు.

**క. ఆ నాడీజంఘుండును । దాని నెఱిఁగి భూసురునకుఁ దనకతమున న**
**ద్దీనదశయగుట కోర్వక । వాని విడుపు గోరి వేఁడె వరముగ నింద్రున్. 520**

**ప్రతిపదార్థం:** దానిని= బ్రాహ్మణుడిని కట్టేశాడని; ఎఱిఁగి= తెలిసికొని; ఆ నాడీజంఘుండును= ఆ కొంగ; భూసురునకున్= ఆ బ్రాహ్మణుడికి; తన కతమునన్= తనకారణంగా; ఆ+దీనదశ+అగుటకున్= ఆ దైన్యస్థితి కలిగినందుకు; ఓర్వక= సహించలేక; వాని విడుపున్= ఆ బ్రాహ్మణుడి విడుదలను; కోరి= కోరుకొని; ఇంద్రున్= ఇంద్రుడిని; వరముగన్= వరంగా; వేఁడెన్= ప్రార్థించాడు.

**తాత్పర్యం:** ఆ రాజధర్ముడు, బ్రాహ్మణుడికి తనవలన కలిగిన దురవస్థకు తట్టుకొనలేకపోయాడు. అతడిని విడిపించుమని ఇంద్రుడిని వరం అడిగాడు.

**చ. అతఁడును దివ్యబోధమున నా సమయంబున బ్రహ్మ సత్కృపా**
**న్వితుఁ డగు టేర్పడం గని వినీతతముం డగు రాజధర్ము వాం**
**ఛిత మొనరించె విప్రునకుఁ జేర్చిరి తెచ్చినవారు తద్ధన**
**ప్రతతియు దైత్యనాయకుఁడు పంప బకాధిపుఁ బ్రస్తుతించుచున్. 521**

**ప్రతిపదార్థం:** అతఁడును= ఆ ఇంద్రుడూ; ఆ సమయంబునన్= వరం అడిగేటప్పుడు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; సత్కృపా+అన్వితుఁడు+అగుట= మంచి దయతో కూడినవాడవటం; దివ్యబోధనమునన్= అతీంద్రియ జ్ఞానంచేత; ఏర్పడన్+కని= తెల్లంగా తెలిసికొని; వినీతతముండు+అగు= ఎక్కువ వినయవంతుడైన; రాజధర్ము= కొంగ; వాంఛితమున్= కోరికను; ఒనరించెన్= తీర్చాడు; దైత్యనాయకుఁడు= రాక్షసరాజు విరూపాక్షుడు; పంపన్= పంపగా; తద్= ఆ బ్రాహ్మణుడి; ధనప్రతతియున్= ధనం మొత్తాన్ని; తెచ్చినవారు= తీసికొని వచ్చినవారు (రాక్షసులు); విప్రునకున్= బ్రాహ్మణుడికే; చేర్చిరి= తిరిగి చేరవేశారు; బకాధిపున్= కొంగలరాజు నాడీజంఘుడిని; ప్రస్తుతించుచున్= పొగడుతూ.

**తాత్పర్యం:** ఈ వరం ఇవ్వటంలో బ్రహ్మదేవుడి దయ ఉన్నదని ఇంద్రుడు దివ్యజ్ఞానంతో తెలిసికొన్నాడు. వెంటనే బ్రాహ్మణుడిని విడిచిపెట్టి, కొంగ కోరిక తీర్చాడు. రాక్షసరాజు ఆజ్ఞతో బ్రాహ్మణధనాన్ని తెచ్చినవారు తిరిగి అతడికి ముద్రశుద్ధిగా ముట్టచెప్పారు. నాడీజంఘుడిని కొనియాడుతూ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **అవ్విప్రుండు ధనసంచయంబు మోచికొని మరలి మరలి చూచుచు సంభ్రమంబునం బోయెఁ; దదనంతరంబ. 522**

**ప్రతిపదార్థం:** ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ధన సంచయంబున్= ధనం మొత్తాన్ని; మోచికొని= మోస్తూ; మరలి మరలి చూచుచున్= మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తూ; సంభ్రమంబునన్= తత్తరపాటుతో; పోయెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబ= ఆ తరువాత.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడు ధనం మూటను మోసుకొంటూ వెనక్కి తిరిగి చూస్తూ తత్తరపడుతూ పోయాడు. ఆ తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **సురపతియుఁ ద్రివిష్టపమున। కరిగె; బకాధీశుఁడును నిజాలయమునకున్**
**గరిమంబు మెఱయఁ జనియెం। బరితుష్టుం డగుచు దైత్యపాలుం డనుపన్.' 523**

**ప్రతిపదార్థం:** సురపతియున్= ఇంద్రుడూ; త్రివిష్టపమునకున్= దేవలోకానికి; అరిగెన్= వెళ్ళాడు; బక+అధీశుఁడును= కొంగలరాజునూ; దైత్యపాలుండు= రాక్షసరాజు; పరితుష్టుండు+అగుచున్= బాగా సంతోషించినవాడవుతూ; అనుపన్= పంపగా; గరిమంబు= గొప్పతనం; మెఱయన్= ఒప్పగా; నిజ+ఆలయమునకున్= తా నుండే తావుకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడూ స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు. విరూపాక్షుడు ఆ బకరాజు రాజధర్ముడిని సంతోషంగా సాగనంపాడు. అతడూ గొప్పగా తానుండే మర్రిచెట్టును చేరుకొన్నాడు'.

**క.** **అని చెప్పి తాత యిట్లను। మనుమనితో నాదరమున మఱియును 'బ్రహ్మ**
**ఘ్నునకును నిష్కృతి గలుగును;। వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా! 524**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; తాత= భీష్మయ్య తాత; మనుమనితోన్= మనుమడైన ధర్మరాజుతో; మఱియును= మళ్ళీ; ఆదరమునన్= ఆపేక్షతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; విమల చరిత్రా!= మచ్చలేని నడతకలవాడా!; బ్రహ్మఘ్నునకును= బ్రాహ్మణుడిని చంపినవాడికైనా; నిష్కృతి= పాపవిముక్తి; కలుగును= కలుగుతుంది; కృతఘ్నునకున్= చేసిన మేలు మరిచేవాడికి; లేదు= ఉండదు; వినుము= వినుము.

**తాత్పర్యం:** భీష్ముడు మనుమడికి కాశ్యప గౌతమోపాఖ్యానం అంతా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు. 'ధర్మరాజా! బాపనవాడిని చంపినవాడికైనా పాపనిష్కృతి ఉంటుంది కాని చేసిన మేలు మరచిపోయినవాడికి మాత్రం పాపవిముక్తి

ఉండదు.

**క. ఆరయ మిత్త్ర ద్రోహము । దారుణమగు పాతకము గృతఘ్నత కంటెన్;**
**వైరము గొని విడువవలయు । నా రెండు దెఱఁగుల వారి నాప్తుల నైనన్. 525**

**ప్రతిపదార్థం:** ఆరయన్= విచారించగా; మిత్త్రద్రోహము= స్నేహితుడికి కీడు తలపెట్టటం; కృతఘ్నతకంటెన్= చేసిన మేలు మరిచినదానికంటే; దారుణము+అగు= భయంకరమైన; పాతకము= పాపం; ఆ రెండు+తెఱంగులవారిన్= ఈ రెండు రకాల (మిత్రద్రోహులు - కృతఘ్నులు) వారిని; ఆప్తులనైనన్=క్షేమం కోరేవారైనప్పటికీ; వైరము కొని= విరోధం పెట్టుకొని; విడువ వలయున్= వదలిపెట్టాలి.

**తాత్పర్యం:** నిజానికి ఆలోచిస్తే స్నేహితుడికి కీడు తలపెట్టటం, చేసిన మేలు మరచిపోవటం కన్నా మించిన మహాపాపం. ఈ రెండు రకాల వారు మన మంచికోరుకునేవారైనా సరే - వైరం పెట్టుకొని వారిని వదలుకొనటం మంచిది.

**క. మిత్త్రుం డైహికములు నా । ముత్త్రికములు నైన భద్రములు దలకొలుపున్;**
**మిత్త్ర ధనంబులలోనను । మిత్త్రుఁడ యెక్కు డనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్. 526**

**ప్రతిపదార్థం:** మిత్త్రుండు= చెలిమికాడు; ఐహికములున్= ఈ లోకానికి సంబంధించినవీ; ఆముత్త్రికములును+ఐన= పై లోకానికి సంబంధించినవి అయిన; భద్రములు= శుభాలు; తలకొలుపున్= కలిగిస్తాడు; మిత్ర ధనంబులలోనను= మిత్రుడూ, ధనం అనే రెంటిలోకూడా; మిత్త్రుఁడ= నేస్తగాడే; ఎక్కుడు= ఎక్కువ; అనుమాటన్= అనే వాక్కును; ప్రాజ్ఞుల్= పెద్దలు; మెత్తురు= మెచ్చుకొంటారు.

**తాత్పర్యం:** స్నేహితుడు ఇహపరలోక సౌఖ్యాలు రెంటినీ సమకూర్చగలడు. మిత్రుడూ, ధనం - ఈ రెంటిలో మిత్రుడే మిన్న - అంటూ మెచ్చుకుంటారు పెద్దలు.

**క. ఉత్తమ కులజుఁడు సుగుణా । యత్తుఁడు సస్నేహమతియు నగు మిత్త్రునకుం**
**చిత్తమెలర్చు తెఱంగునఁ । బొత్తు మనఁగవలయు శుభము పొందవలసినన్.' 527**

**ప్రతిపదార్థం:** శుభము=మేలు; పొందవలసినన్= కలగాలంటే; ఉత్తమ కులజుఁడు= ఉన్నత వంశంలో పుట్టినవాడూ; సుగుణ+ఆయత్తుఁడు= మంచి గుణాలకు వశమైనవాడూ; సస్నేహమతియున్= స్నేహాన్నికోరే బుద్ధికలవాడూ; అగు= అయినట్టి; మిత్త్రునకున్= స్నేహితుడికి; చిత్తము= మనస్సు; ఎలర్చు తెఱంగునన్= అలరించేటట్లు; పొత్తు= కలసి మెలసి; మనఁగవలయున్= నడచుకొనాలి.

**తాత్పర్యం:** ఎవరైనా మేలు పొందాలంటే మంచికులంలో పుట్టినవాడూ, సుగుణాలు కలవాడూ, మంచి స్నేహం కావాలనుకొనేవాడూ అయిన స్నేహితుడితో పొత్తు పెట్టుకొనాలి. అతడు నొచ్చుకోని రీతిలో నడచుకొనాలి'.

**వ. అని యిట్లు కృతఘ్నతయు మిత్త్రద్రోహంబును నధిక పాతకంబు లగుటయు సన్మిత్త్రుఁ బాటించుట శుభంబు చేయుటయు భీష్ముండు భీమాగ్రజునకుం జెప్పె' ననిన విని 'యయ్యుత్తమ పురుషుల యడుగుటలును, నుత్తరం బిచ్చుటలును నింత లెస్సలై చెల్లెడునే? యటమీఁదఁ జెల్లిన తెఱంగు లెఱింగింపు' మనుటయు. 528**

**ప్రతిపదార్థం:** అని= అని; ఇట్లు= ఇట్లా; కృతఘ్నతయున్= చేసిన మేలు మరిచిపోవటమున్నూ; మిత్త్రద్రోహంబునున్= స్నేహితుడికి

కీడు తలపెట్టటమున్నూ; అధికపాతకంబులు= మహాపాపాలు; అగుటయున్= అవటంవలన; సన్మిత్త్రున్= మంచి స్నేహితుడిని; పాటించుట= పొందటం; శుభంబు చేయుటయున్= మేలు చేయటమున్నూ; భీష్మండు= భీష్ముడు; భీమ+అగ్రజునకున్= భీముడికంటె ముందు పుట్టిన ధర్మరాజుకు; చెప్పెన్= చెప్పాడు; అనినన్= అని వైశంపాయనుడు చెప్పగా; విని= జనమేజయుడు ఆలకించి; ఆ ఉత్తమ పురుషుల= మగవారిలో మొనగాళ్ళైన ధర్మరాజు భీష్ముల; అడుగుటలును= ప్రశ్నించటాలు; ఉత్తరంబు ఇచ్చుటలునున్= జవాబు చెప్పటాలు; ఇంత లెస్సలై= ఇంతటి మేలు కలవై; చెల్లెడునే= సాగుబాటవుతున్నాయా; అటమీఁదన్= ఆ పైన అవి; చెల్లిన తెఱంగులు= చలామణి అయిన తీరులు; ఎఱింగింపుము= తెలియ చెప్పుము; అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** చేసిన మేలు మరచిపోవటం, మిత్రుడికి కీడు తలపెట్టటం - అనేవి రెండూ మహాపాపాలు. అందుచేత మంచి మిత్రుడిని సంపాదించటం మేలుచేయటం - అనేవాటిని భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు. ధర్మరాజు అడగగానే భీష్ముడు చెప్పిన విషయాలు లోకంలో మంచివిగా చలామణి అవుతున్నాయా? అయితే ఆ చెల్లుబాటయిన తీరులూ తెలియచెప్పవలసింది.

## ఆశ్వాసాంతము

**చ.** **స్మయభయ దర్పిత క్షుభిత సామజమర్దన రక్షణ క్రియా**
**శ్రయణ విలాస భాసుర భుజా! చరణ ప్రణతామర వ్రజా!**
**జయ విభవ ప్రభుత్వ ధనసంప దుదాత్త చరిత్ర కీర్త్యుపా**
**నయన కృతార్థ సేవక జనా! మునిసంభృత యోగపూజనా!** **529**

**ప్రతిపదార్థం:** స్మయ= కండకావరంతో; దర్పిత= పొగరెక్కిన; సామజ= ఏనుగు (గజాసురుడు)ను; మర్దన= చంపటం; భయ= వెఱపుతో; క్షుభిత= కలతచెందిన; సామజ= ఏనుగు (గజరాజు)ను; రక్షణ= కాపాడటం అనే; క్రియా= వ్యాపారాన్ని; ఆశ్రయణ= ఆశ్రయించటం అనే; విలాస= లీలతో; భాసుర= ప్రకాశిస్తున్న; భుజా!= చేతులు కలవాడా!; చరణ= కాళ్ళకు; ప్రణత= మొక్కుతుండే; అమర= దేవతల; వ్రజా!= సముదాయం కలవాడా!; జయ= గెలుపునూ; విభవ= వైభవాన్నీ; ప్రభుత్వ= సామర్థ్యాన్నీ; ధన= సిరినీ; సంపద్= ఐశ్వర్యాన్నీ; ఉదాత్త చరిత్ర= గొప్పనడవడినీ; కీర్తి= కీర్తినీ; ఉపానయన= పొందించటం చేత; కృతార్థ= కృతకృత్యులైన; సేవక జనా!= పరిచారకులు కలవాడా!; ముని సంభృత= ఋషులు పోషించిన; యోగ= ధ్యానంతో; పూజనా= కొలిచేవాడా!

**తాత్పర్యం:** పొగరుబోతు అయిన గజాసురుడిని చంపి, చెడును తుదముట్టించటం, భయంతో కలతపడ్డ గజరాజుని కాపాడి మంచిని నిలబెట్టటం వంటి చేతలను విలాసంగా చేసి చూపే చేతులు కలవాడా! దేవతలంతా ఎపుడూ మ్రొక్కుకొంటూ ఉండే పాదాలు కలవాడా! విజయాన్నీ, వైభవాన్నీ, సామర్థ్యాన్నీ, సిరులనూ. ఐశ్వర్యాన్నీ, మంచి శీలాన్ని, కీర్తినీ సమకూర్చి పెట్టటం వలన ధన్యులైన పరిచారక వర్గం కలవాడా! ధ్యానంతో కొలిచే ఋషులు కలవాడా!

**క.** **తరణి శశినేత్ర! జగదుప । కరణీయ చరిత్ర! బోధగాత్ర! తపస్సం**
**భరితశమ ముని మనోజ్ఞా! । భరణీయ ప్రాజ్ఞ! విశ్వభార విధిజ్ఞా!** **530**

**ప్రతిపదార్థం:** తరణి= సూర్యుడూ; శశి= చంద్రుడూ; నేత్ర= కన్నులుగా కలవాడా!; జగత్= లోక ప్రవృత్తికి; ఉపకరణీయ= ఉపకరించే వాటిచేత; చరిత్ర!= నడవడికలవాడా!; బోధ= జ్ఞానమే; గాత్ర!= శరీరంగా కలవాడా!; తపస్= తపస్సుచే; సంభరిత=

నిండిన; శమ= అంతరింద్రియ నిగ్రహంకల; ముని= ఋషులకు; మనోజ్ఞా!= మనోహరమైనవాడా!; భరణీయ= పోషించదగ్గ; ప్రాజ్ఞ= వివేకులు కలవాడా!; విశ్వభార= ప్రపంచభారాన్నీ; విధి= బ్రహ్మను (బ్రహ్మతత్త్వాన్ని); జ్ఞా!= తెలిసినవాడా!, విశ్వభార విధానాన్ని తెలిసినవాడా!

**తాత్పర్యం:** సూర్యచంద్రులు కన్నులుగా కలవాడా! లోకపు వృత్తికి ఉపయోగించే నడవడి కలవాడా! జ్ఞానమే ఆకారంగా తాల్చినవాడా! తపోనిధులూ, నిగ్రహవంతులూ అయిన మునులకు మనోహరమైనవాడా! పోషించదగ్గ వివేకులు కలవాడా! ప్రపంచ భారాన్నీ, బ్రహ్మతత్త్వాన్నీ తెలిసినవాడా! ప్రపంచభారం వహించే విధానం తెలిసినవాడా!

**మాలిని:**

> **వరద చరణ లీలా! వైకృతాగమ్య శీలా!**
> **విరతి నిరతి సేవ్యా! వేదవిద్యా విభావ్యా!**
> **నిరవధిక విభూతీ! నిశ్చయాతీతరీతీ!**
> **భరిత కరుణ దృష్టీ! భక్తమాధ్వీక వృష్టీ!** **531**

**ప్రతిపదార్థం:** వరద= కోరికలను తీర్చేటటువంటి; చరణ= పాదాల; లీలా!= విలాసం కలవాడా!; వైకృత= మనోవికారులచేత; అగమ్య= తెలిసికొనరాని; శీలా!= మంచి నడతకలవాడా!; విరతి= విరాగంపట్ల; నిరతి= ఎక్కువ ఆసక్తి కలవారిచేత; సేవ్యా!= పూజించదగినవాడా!; వేద= శ్రుతుల; విద్యా= విజ్ఞానంతోనే; విభావ్యా!= తెలుసుకోదగినవాడా!; నిరవధిక= మేరలేని; విభూతీ!= ఐశ్వర్యం కలవాడా!; నిశ్చయ+అతీత= నిర్ధారించ వీలుకాని; రీతీ!= తీరు కలవాడా!; భరితకరుణ= దయతో నిండిన; దృష్టీ!= చూపులు కలవాడా!; భక్త= భక్తులకు; మాధ్వీక వృష్టీ!= ద్రాక్షావర్ష రూపమైనవాడా!

**తాత్పర్యం:** భక్తుల కోరికలు తీర్చే పాదలీలలు కలవాడా! మనోవికారులు తెలిసికొనలేని మంచి నడత కలవాడా! విరాగులచేత కొల్వబడేవాడా!៖ వేదవిజ్ఞానంతోనే తెలియబడేవాడా! అపారమైన ఐశ్వర్యం కలవాడా! నిర్ధారించవీలుకాని తీరు కలవాడా! దయగల చూపులు కలవాడా! భక్తులపాలిట ద్రాక్షావర్ష రూపమైనవాడా! హరిహరనాథా!

**విశేషం**: మాలిని వృత్తంలో ప్రతిపాదంలోనూ న, న, మ, య, య అనే గణాలుంటాయి. 9వ అక్షరం యతి స్థానం. ప్రాస నియమం ఉన్నది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారతంబున శాంతిపర్వంబునందు తృతీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైన ఉభయకవిమిత్రుడనే బిరుదం కలవాడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, పండితుల ఆరాధనలచేత ప్రకాశించేవాడూ (పండితులను ఆరాధించటంచేత ప్రకాశించేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని శాంతిపర్వంలో మూడవ ఆశ్వాసం.

**శాంతిపర్వంలోని మూడవ ఆశ్వాసం సమాప్తం.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము

### (మొదటి భాగం)

## గద్యపద్య ప్రథమపాద సూచి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

## సంపుటము - 13

## శాంతిపర్వము

(రెండవ భాగం 4,5,6 ఆశ్వాసములు)


కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డా॥ ఆకురాతి పున్నారావు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య

డా॥ బేతవోలు రామబ్రహ్మం

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITHRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATHAM**

With Commentary
Shanti parvamu of Tikkana Somayaji
Vol. XIII.
Part - II (4,5,6 Cantos)

Commentary by
**Dr. Aakurathi Punna Rao - 4th Canto**
**Dr. Samudrala Lakshmanaiah - 5th Canto**
**Dr. Bethavolu Ramabrahmam - 6rd Canto**

Edited by
**Dr.G.V.Subrahmanyam**


T.T.D.Religious Publications Series No.612
First Edition : 2005
First Re-print : 2006

Revised Edition: 2013
Copies : 5,000





Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D. Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

**నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,**

**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.**

కవిత్రయ ఆంధ్రమహాభారతంలో శాంతిపర్వం ఒక ప్రముఖ పర్వం. మహాభారత యుద్ధం సమాప్తి అయిన తర్వాత పాండవులు తమకు మిగిలిన దానిని, తాము గెలిచిన దానిని, బేరీజువేసుకొనేఘట్టం. దుర్యోధనుడు తన దుర్గుణసహితంగా, అంతమొందిన తరువాత గెలిచింది ధర్మమే అయినా, ధర్మజునికి వైరాగ్యం ముంచుకొచ్చింది. దాన్ని తొలగించి రాజ్యపరిపాలనా రంగంలో ఆయన ఆసక్తి కనపరిచేటట్టు సహోదరులు నచ్చజెప్పడమేగాక, కృష్ణుడు, వ్యాసుడు మార్గదర్శనం చేయడం అనేవి ఒక ఎత్తు. అయితే ఆ తరువాత భీష్ముడు దీర్ఘంగా ఉపదేశించే రాజధర్మం, ఆపద్ధర్మం, మోక్షధర్మాలు, ధర్మజునికి శేషజీవిత మార్గదర్శక సూత్రాలు మరోఎత్తు అయినాయి. అవే పాఠకులకు ధర్మప్రభోదాలయినాయి. భీష్ముడిలాంటి భక్తుడు, నీతిశాస్త్రకోవిదుడు తత్త్వం తెలిసినవాడు, కురువృద్ధుడై సమాజాన్ని చూసినవాడు, ఇక్కడ ధర్మసూక్ష్మాలను చెప్పడం అవశ్య మాచరణీయంగా కనబడుతుంది.

శాంతిపర్వంలో నేరుగా ధర్మ వివరణం, ధర్మనిరూపణం, వీటికి ఆలంబనంగా వేరువేరు ఉపకథలు వస్తాయి. అయితే దీనినంతటిని సంగ్రహంగాను, స్వారస్యంగాను మొదటిసారిగా తెలుగులో తెలియపరచిన తిక్కన.

ఆరు ఆశ్వాసాల శాంతిపర్వానికి ఆరుగురు విద్వాంసులు వ్యాఖ్యానాన్ని సమకూర్చారు. డా॥ యస్. గంగప్ప, డా॥ దావులూరి కృష్ణకుమారి, డా॥ ఆకురాతి పున్నారావు, డా॥ బేతవోలు రామబ్రహ్మం. ఈ నలుగురు మహాభారత ఘట్టాలను విద్యార్థులకు బోధించి పేరుపొందినవారు. మహాభారతానికి ప్రధాన సంపాదకులు డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం గారు, ఎడిటోరియల్ సెల్ సభ్యులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్య. వీరిరువురు కూడ శాంతి పర్వానికి వ్యాఖ్యానాన్ని సమకూర్చారు. అందువల్ల శాంతిపర్వానికి న్యాయము, వ్యాఖ్యానానికి గుణాధిక్యము కలిగింది. వీరికి దేవస్థానం తరపున కృతజ్ఞతలు.

శాంతిపర్వాన్ని రెండు సంపుటాలుగా ప్రచురిస్తున్నాము. మొదటి మూడు ఆశ్వాసాల్ని ఒక సంపుటంగాను, తర్వాతి మూడు ఆశ్వాసాల్ని రెండవ సంపుటంగాను ముద్రించి మీ ముందు ఉంచుతున్నాం. ఈ గ్రంథం మొదటి సంపుటం.

ఇక మిగిలినది పర్వషట్కం. కూడ త్వరలో వెలువరించేందుకు కృషి నిరంతరాయంగా జరుగుతున్నది. ఎప్పటిలాగా ఈ పుస్తకాలను కూడ వేంకటేశ్వరస్వామి ప్రసాదంగా ప్రీతితో చదువరులు స్వీకరిస్తారని భావిస్తున్నాము.

కార్యనిర్వహణాధికారి

తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

**పూర్వరంగం:**

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమ స్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

**నన్నయ భారత ప్రాజెక్టు :**

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 -' 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' - అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్లవేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జులై11 తేదీన హైదరాబాదు బాలాజి భవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం:**

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయముగైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అర సున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయతల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య

దివాకర్లవేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను."

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్పురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్లవేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ" కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగాపర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది. ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జులై3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన:**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్దారెడ్డి గారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక"ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం:**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥కె. సర్వోత్తమరావు** | **శ్రీడి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటిదొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీకాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నందూరి రామకృష్ణమాచార్య** | **శ్రీములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం:**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జులై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీడి. నాగసిద్దారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

## కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు:

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీస్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

## ఆ ప్రతిపాదనల సారాంశం:

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో

ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పంద్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి".

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాష్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదక మండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

**సంపాదక మండలి సభ్యులు**

డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు
డా॥ ఎస్.బి. రఘునాథాచార్య
డా॥ కె.జె. కృష్ణమూర్తి
శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు
డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య
డా॥ కె. సర్వోత్తమరావు

**సలహా మండలి సభ్యులు**

పౌరసంబంధాధికారి, తి.తి.దే.
అన్నమాచార్య ప్రాజెక్ట్‌డైరెక్టర్, తి.తి.దే.
ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే.
డా॥ బిరుదురాజు రామరాజు
డా॥ ఎం. కులశేఖరరావు
డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు
డా॥ ఎం. బుద్ధన్న

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ఆఫీస్' లో పై రెండు మండలుల లోని సభ్యులయొక్క సంయుక్తసమావేశం నిర్వహింపబడింది. ఈసమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటాలన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆయా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్త పాత్రను నిర్వహిస్తున్నారు. ఆక్రమంలో ప్రథమ సంపుటం-ఆదిపర్వం (రెండుభాగాలు), ద్వితీయ సంపుటం-సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి. సుబ్బారావుగారి తరువాత కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణను గురించి ఆసక్తితో గమనిస్తూ అన్ని విధాల సహకరించి ఆది సభా పర్వాల విడుదలకు ఏర్పాటుచేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈబృహత్ ప్రణాళిక వ్యాఖ్యా సహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. అప్పట్లో తీవ్రతరం అయిన ప్రయత్నంతో గోదావరి పుష్కరాల సమయానికి ఆరణ్యపర్వం (2భాగాలు), విరాటపర్వం విడుదల అయ్యాయి. తర్వాత శ్రీ అజేయ కల్లంగారు కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన వెనువెంటనే ఈ మహాభారత వ్యాఖ్యాన సహిత ప్రచురణ ప్రణాళికను మరింత వేగిరపరచి కృష్ణాపుష్కరాల లోపల యుద్ధపంచకాన్ని విడుదల చేయాలనీ, 2004 సంవత్సరం చివరకు మిగిలిన పర్వాష్టకము వెలుగు చూడాలనీ నిర్ణయించడం జరిగింది. 2004 కృష్ణాపుష్కరాలసమయంలో ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వాలు వెలువడ్డాయి. కర్ణపర్వం ఒకసంపుటంగాను, తరువాతి పర్వాలైన శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు మూడింటిని కలిపి ఒకే సంపుటంగా ముద్రించుటకు సిద్ధం చేయడం జరిగింది. మిగిలిన పర్వాలన్నిటిని వీలైనంత తొందరగా విడుదల చేయడానికి సర్వయత్నాలు సాగుతున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారత' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తృమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. లోగడ తి.తి. దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా వున్న శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహానికి కృతజ్ఞతాభివందనాలు. ఈమహాగ్రంథం వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ.ఎ.పి.వి.ఎన్. శర్మ ఐ.ఏ.ఎస్., గారిప్రోత్సాహక పర్యవేక్షణకుకైమోడ్పులు. తి.తి.దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి సాహిత్యప్రియులూ ఐన శ్రీ ఎన్. ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్., గారు మరింత ప్రోత్సాహం ఇచ్చి ప్రాజెక్టు పనిని వేగవంతం చేస్తున్నారు. వారికి వందనములు.

సంబంధిత విభాగాధిపతిగా, సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన డా॥పి. రంగారావు, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి-వారికి మరియు ఈప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగా సహాయ సహకారాలందించిన తదితర అధికారిగణానికి నమస్సులు. ఈప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధానపాత్ర వహించిన-వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదక మండలి, సలహా మండలి) విద్యావేత్తలకు, ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి - నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి.దేవస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడంలో వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్ కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానిక పండితవర్యుల ఉప సంఘం (ఎడిటోరియల్ సెల్) నిర్మాణానికి సిఫారసు చేస్తే దేవస్థానం ఆమేరకు **పండితవరేణ్యులు డా॥ కె. సర్వోత్తమరావు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీముదివర్తి కొండమాచార్యులు** గారలతో ఎడిటోరియల్‌సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈసెల్ ఉపకారం అద్వితీయమై మరువరానిది. వర్క్‌షాపువలె నిర్వహింపబడుతున్న కవిత్రయ మహాభారత యజ్ఞంలో వీరు పాలుపంచుకుంటున్నారు. ఆకారణంగానే తక్కిన పర్వాలను త్వరితంగా గుణాత్మకంగా వెలువరించగలుగుతున్నాం.

"సప్తగిరి" సంపాదకులుగా, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి అమరులయ్యేవరకూ ప్రముఖ పాత్ర వహించిన కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమండలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥ కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్-ఎడిటర్లు డాక్టర్ కె. రాధారమణ, డాక్టర్ అల్లాడి సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్-ఎడిటర్ శ్రీ బి.ఎన్. శ్రీనివాసన్ గారికి, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగ సుందరంగా తీర్చి దిద్ది పాఠకులకు తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయాధికారి శ్రీ ఐ. పార్వతీశ్వర రావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీవేంకటేశ్వరస్వామి వారి అనుగ్రహ విశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

**డా॥ఎన్.ఎస్. రామమూర్తి**

కన్వీనర్

సంపాదకుడు - సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదక మండలి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## వ్యాఖ్యాతలు

| | పేర్లు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|---|
| 1. | డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. | డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా. 1 |
| 3. | డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా 1,2 |
| 4. | డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ ఆశ్వా. 1,2 |
| 5. | డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా 1 |
| 6. | డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. | శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా. 2 |
| 8. | డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా. 4 |
| 9. | డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా. 5 |
| 10. | డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. | శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. | శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. | డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. | డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. | డాక్టర్ కె. రాజన్న శాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. | శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. | డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. | డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. | డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. | డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. | డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. | డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. | డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. | డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. | డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | ఆను. ఆశ్వా. 1,2 |
| 27. | డాక్టర్ శలాక రఘునాథశర్మ | ఆను. ఆశ్వా. 3,4 |
| 28. | డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఆను. ఆశ్వా. 5 |
| 29. | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. | డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| ఆను. | – | ఆనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ . | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభ విక్రీడితం |
| శా. | – | శార్దూల విక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# శాంతిపర్వ కథాసారం

(రెండవ భాగం)

**ప్రశ్నోత్తర మాలిక:**

భీష్ముడు : ధర్మరాజా! నాకు తెలిసిన విధంగా ప్రజ్ఞను కలిగించే వాక్యాలను ఇంతవరకూ బోధించాను. ఇంకా ఏమి వినాలని కోరుకొంటున్నావు? (4.2)

ధర్మరాజు ప్రశ్న54: పితామహా! ఇంతవరకు రాజ ధర్మాలు వివరంగా చెప్పావు. కృతజ్ఞుడను. సకల భూప్రజలకూ పరమ హితాన్ని కలిగించే ఉత్తమ ధర్మం ఏది? 4.3,4)

భీష్ముడు : ధర్మం అనేక విధాలుగా విస్తరిల్లి ఉంటుంది. అది ఎన్ని విధాలుగా ఉన్నా ఆచరణయోగ్యమే. ప్రతిధర్మం ఫలితాన్ని పొందింపచేస్తుంది. ధర్మతత్త్వం తెలిసినవాడు మాత్రం ముక్తినిచ్చేదే ఉత్తమ ధర్మమంటాడు. ఇది ఇష్టం, అది అనిష్టం అని హృదయంలో భావించకుండా ఉండటమే మోక్షాన్ని కలిగించే ధర్మం. ఈ అంశాన్ని తెలిపే ఇతిహాసం ఒకటి ఉన్నది. అది 'సేనజిత్ విప్రసంవాదం'. అందులో పుత్రశోకార్తుడయిన సేనజిత్తనేరాజుకు ఒక విప్రుడు చెప్పిన బోధ గమనించదగింది. దానిసార మేమంటే - సృష్టిలో పుట్టినవారంతా గిట్టటం సహజం. కాబట్టి నీ కొడు కొక్కడే చనిపోయినట్లు శోకించటం శోచనీయం. పితృపుత్రాది బంధుసంబంధం నదిలో కలిసి కొట్టుకొనిపోయే రెండు కొయ్యలవంటిది. అవి కొంతదూరం కలిసి సాగి ఆపైన విడిపోతాయి. మానవ సంబంధాలూ అంతే. కాబట్టి బంధువులు ముక్తిప్రాప్తికి కారణం కానే కాదు. సుఖదుఃఖాలు శరీరానికే, ఆత్మరూపుడైన నరుడికి కావు. కర్మఫలం అందరూ అనుభవించవలసిందే. అయితే, తృష్ణను త్యాగం చేస్తే కర్మఫలాన్ని అనుభవించటం నివారించవచ్చును. పింగళ అనే వేశ్య ప్రియుడికొరకు వేచి వేచి విసిగివేసారి చివరకు ఆశవలననే ఆ దుఃఖం ఏర్పడిందని తెలిసికొని, ఇంద్రియాలను జయించి తృష్ణారాహిత్యాన్ని సాధించటమే ముక్తిహేతువైన ధర్మమని తలంచింది. సేనజిత్తు ఆ సత్యం తెలిసికొని శోకవిముక్తు డయ్యాడు.

ప్రశ్న 55 : జీవరాశులు నశించిపోయే కాలం ఏర్పడినప్పుడు ప్రజలు ఏం చేయాలి? (4.20)

ఉత్తరం : నీ ప్రశ్నకు తగిన సమాధానం 'పితాపుత్ర సంవాద'మనే ఇతిహాసంవలన తెలుస్తుంది. మేధావి అనే బ్రాహ్మణుడికి ఒక కొడుకున్నాడు. అతడు తండ్రిని ఇటువంటి ప్రశ్ననే అడిగాడు. వారిరువురి నడుమ చర్చసాగింది. దాని సార మిది- కొందరు చతురాశ్రమాలను నిర్వహించి ప్రశాంతంగా జీవిస్తూ మోక్షాన్ని పొందవచ్చునంటారు. కాని, మానవుడు పుట్టిన క్షణంనుండి మృత్యువు వెంటాడుతూనే ఉంటుంది. అడవిలో నిద్రపోతున్న వాడిని పులి కబళించినట్లు మానవుడిని మృత్యువు మ్రింగివేస్తుంది. కాబట్టి మానవుడు కాలానికి అధీనుడే కాని అతడికి కాలం అధీనం కాదు. కాలం ముందు ప్రాణులన్నీ సమానులే. సత్యమే అమృతం, మోహమే మృత్యువు. ఈ జ్ఞానంతో సంసారబంధాలను త్రెంచుకొనాలి. అప్పుడు సుఖదుఃఖాలు రెండూ సమానమే ఔతాయి. శాంతి చేకూరుతుంది. హింసతో కూడిన యజ్ఞం అహంకారం కలిగిస్తుంది. వాఙ్మానస నియమరూపమైన యజ్ఞం వలన అవ్యయానందం కలుగుతుంది. కాబట్టి మనోవికారహేతువైన అరిషడ్వర్గాన్ని త్యజించి ఏకాంతంలో నిశ్చలమనస్కుడై ఆత్మాన్వేషణం చేసికొనటమే శాంతికి మార్గం. కాబట్టి ధర్మరాజా! సత్యప్రవర్తనలోనూ, ధర్మ నిర్వహణంలోనూ నేర్పరివి కమ్ము.

ప్రశ్న 56 : లోకంలో ధనవంతులు, పేదవారు అని రెండు తెగలుగా జనులు కనిపిస్తుంటారు. వారిలో సుఖు లెవ్వరు? దుఃఖు లెవ్వరు? (4.32)

ఉత్తరం : శాంతి కాముకుడైన శమ్యాకుడు అనే బ్రాహ్మణుడు సంసారాన్ని త్యజించి కటకటపడుతూ నా వద్దకు వచ్చాడు. అతడితో జరిగిన ప్రసంగంలో కొన్ని విశేషాలు నీ సందేహానికి సమాధానాలు ఔతాయి. వాటి సారాంశమిది - కలిమి లేములను ఒక త్రాసులో పెట్టి తూస్తే కలిమికంటే లేమివైపే త్రాసు ముల్లు మొగ్గింది. ధనవంతుడు తన సంపద కారణంగా అనుక్షణం మృత్యుముఖంలో ఉన్నట్లు భయపడుతూ ఉంటాడు. ధనం నిరంతర దుఃఖాన్ని కలిగిస్తుంది. కాబట్టి ధనాశను వదలితే సుఖం ప్రాప్తిస్తుంది. పేదవాడు నిర్భయంగా ఉండగలడు. ఆత్మాధీనమైన జీవితం ఆనందదాయకం.

ప్రశ్న 57 : ధనతృష్ణకు లోనైనవాడు ఎప్పుడు ఏ విధంగా సుఖం పొందుతాడు? (4.39)

ఉత్తరం : ధనం సంపాదించి సంపాదించి విసుగుపుట్టి దానిని చాలించినప్పుడు మనిషికి సుఖం లభిస్తుంది. ఈ అంశాన్ని తెలిపే మంకి అనే బ్రాహ్మణుడి చరిత్ర వినదగింది. దాని తాత్పర్యం తెలియదగింది. సుఖప్రాప్తికి ధనం మూలం కావచ్చును. అయితే, ఆ ధనం కోరినంతనే సిద్ధించదు. దానికై యత్నించాలి, యత్నించినా సిద్ధిస్తుందని నమ్మకం లేదు - సిద్ధిస్తే సిద్ధించవచ్చును. లేకుంటే లేకపోవచ్చును. సిద్ధించినా ఆ ధనంతోపాటు ఏన్నో వెతలు వెన్నంటి ఉంటాయి. ధనం సిద్ధించకపోవటం మరణంతో సమానం. కాబట్టి ధనతృష్ణనే త్యజించటం మంచిది. ఇచ్ఛానిరసనమే సుఖం. కామతిరస్కారంవలన లోభాదులు ఉండవు. శాంతి దాంతి సత్య క్షమా భూతదయలు కలుగుతాయి.

ప్రశ్న 58 : నరుడు ఏమి చేస్తే అతడిశోకం నశిస్తుంది? ఏ మార్గాన అతడు మోక్షాన్ని పొందగలడు? (4.54)

ఉత్తరం : అజగర చరిత్రమనే ఇతిహాసం ఈ ప్రశ్నలకు సమాధానం ఔతుంది. అజగరుడు అనే బ్రాహ్మణుడు ప్రహ్లాదుడనే రాక్షసరాజుకు శమసాధన ప్రకారాన్ని ఉపదేశించాడు. మానవుడికి మేలు కావాలని కోరకుండా ఉండటం, కీడు దాపురించినప్పుడు జాలిపడినా దానినుండి విముక్తుడు కావాలి. మేలు కీడులను సమంగా చూస్తూ సాక్షీభూతంగా ఉండే చిత్తంతో ఆ రెండింటియందు ఉపేక్ష వహించి జీవించాలి. శాంతికి అదే మార్గం.

ప్రశ్న 59 : బంధువుల కలిమి, కర్మం, ధనం, బుద్ధిబలం - అనే ఈ నాలుగింటిలో దేనివలన నరుడికి గొప్పకీర్తి కలుగుతుంది? (4.67)

ఉత్తరం : ప్రజ్ఞయే ప్రతిష్ఠ, లాభం, స్వర్గం; ప్రజ్ఞయే ముక్తి. ప్రజ్ఞకు సాధ్యంకాని పనులు లేవు. కాశ్యపుడనే బ్రాహ్మణుడికీ నక్కరూపంలో వచ్చిన ఇంద్రుడికీ జరిగిన సంవాదం ఉదాహరణం. దానివలన అన్ని విధాలా ప్రజ్ఞయే ఉత్తమాశ్రయ మని స్పష్టమౌతుంది.

ప్రశ్న 60 : నరుడు దానం, తపస్సు, పెద్దలసేవ, అనేక యజ్ఞాలూ చేస్తుంటాడు. అవి ఎట్లా పరిణతిపొంది అతడిని చెందుతాయి? (4. 70)

ఉత్తరం : నరుడు చేసిన పాపపుణ్యాలు అతడిని నీడవలె వెన్నంటి ఉంటూ, అతడు చనిపోతే అతడిని అనుసరించి పరలోకాలకు వెళ్ళుతాయి. ఫలితార్థ మేమంటే నరుడు బ్రతికినా, చనిపోయినా అతడు చేసిన పాపపుణ్యాలు తమ ప్రభావాన్ని నెరపుతూ ఉంటాయి.

ప్రశ్న 61 : భూతసృష్టి ఎవ్వడివలన ఏవిధంగా జరిగింది? (4. 80)

ఉత్తరం : పూర్వం భరద్వాజఋషి ఇటువంటి అంశంతోపాటు మరికొన్ని అంశాలు అడుగగా భృగుమహర్షి వివరించాడు. వాటిని తెలిసికొంటే ఈ అనుమానం తీరుతుంది. నారాయణుడు అవ్యయుడు, అనంతుడు. అతడు మనసులో సృష్టిసంకల్పం చేశాడు. తనలోని వెయ్యోవంతుతో అవ్యక్తుడనే వాడిని సృష్టించాడు. అతడు జరామరణాలు లేనివాడు, సాటిలేనివాడు. అతడివలన మహత్తత్త్వం (ప్రకృతి) కలిగింది. దివ్యతేజోమయమైన పద్మాన్ని ఒకదానిని ప్రభవింపజేశాడు. అందులోనుండి బ్రహ్మ ఉద్భవించాడు. ఆ బ్రహ్మ సంకల్పంవలన ఆకాశం పుట్టింది. దీని నుండి

నీరూ, నీటినుండి నిప్పూ, గాలీ జన్మించాయి. ఆ తరువాత నిప్పుగాలుల కలయికతో భూమి పుట్టింది. బ్రహ్మకు సర్వభూతాలూ శరీర భాగాలే. ఆయన శరీరానికి పర్వతాలు ఎముకలు, భూమి క్రొవ్వూమాంసమూ, సముద్రాలు నెత్తురు, ఆకాశం పొట్ట, గాలి ఊర్పు, అగ్ని తేజస్సు, నదులు రక్తవాహికలైన నరాలు, సూర్యచంద్రులు కన్నులు, ఊర్ధ్వలోకం శిరస్సు, పాతాళం పాదాలు, దిక్కులు చేతులు - ఇట్లా అంతం లేని శరీరం కలవాడు నారాయణుడు. సృష్టి జంగమ స్థావరాత్మకం. జగన్మూర్తి అయిన విష్ణువునుండి పంచభూతాలు జన్మించాయి. కాబట్టి అవి కూడా విష్ణువువలెనే అనంతాలు. సృష్టిలో చేష్టలు, శబ్దాలు, ద్రవాలు, వేడిమి, గట్టిదనం అనే గుణాలు వరుసగా వాయువు, ఆకాశం, జలం, అగ్ని, భూమి అనే పంచభూతాల వలన కలుగుతాయి. స్థావరాలలో కూడా పంచభూతాత్మక చైతన్యం ఉన్నది. పంచభూతాలకు గంధాది లక్షణా లున్నాయి. వాటిని మానవులు క్రమంగా ఇంద్రియాలద్వారా, వాటిని నియంత్రించే మనస్సుద్వారా, గ్రహించి అనుభవిస్తారు. జీవుడు అనుభోక్త. సుఖదుఃఖాలు అతడియందే ప్రతిఫలిస్తాయి. అతడిని పురుషుడనీ, క్షేత్రజ్ఞుడనీ అంటారు. జీవుడికంటె ఆత్మ భిన్నమయింది. క్షేత్ర క్షేత్రజ్ఞతత్త్వం, సత్త్వరజస్తమోగుణాలు అనే ఈ మానవ స్వభావ వికారాలకు మిక్కిలి దూరమై, ఈ జన్మపరంపరాచక్రాన తగుల్కొనకుండా ఆత్మ మోక్షాన్ని చేరుకొంటుంది. పండితుడు ఆధ్యాత్మ చింతనతో, నిర్మల మతితో కేవలుడైన పురుషుడిని అన్వేషించి, దర్శించి, అతడియందే తన మనస్సును లగ్నంచేసి, ఇతరమైనది దేనినీ చూడక, కేవల ప్రశాంతితో సుఖాలనన్నిటిని మించిన ఆ పరమసుఖాన్ని పొందుతాడు. (ఈ సందర్భంలోనే భరద్వాజుడి కోరికపై భృగుమహర్షి వినిపించిన వర్ణాశ్రమధర్మాలను గురించి, భూలోక స్వర్గలోకాలను గురించి భీష్ముడు ధర్మరాజుకు వినిపించాడు).

ప్రశ్న 62 : ఆచారవిధులను వివరించి చెప్పుము. (4. 116)

ఉత్తరం : మంచి చెడు నడతలు సజ్జన దుర్జనులకు సమానమే. ఉదాహరణకు రాజమార్గంలో, సభలో, పశువులమందలో మలమూత్ర విసర్జన చేయకుండటం, శుచిగా ఆచమించి నిలకడగా నీట మునగటం, సంధ్యావేళలలో సూర్యుడికి అర్ఘ్య మిచ్చి పూజించటం, సూర్యుడు పొడిచేటప్పుడు, క్రుంకేటప్పుడు నిద్రపోకుండ ఉండటం, పాద్యఅర్ఘ్య స్నానాదికాలు ముగిసిన పిదప భుజించటం, అన్నాన్ని నిందించకుండటం, తడికాళ్ళతో నిద్రకు ఉపక్రమించకుండ ఉండటం - అనేవి సదాచారాలని నారదుడు చెప్పాడు. ఇతర స్త్రీని వివస్త్రగా ఉన్నప్పుడు చూడరాదు. స్వీయమలాన్ని చూడకూడదు, స్వీయ పాపాన్ని దాచిపెట్టరాదు. సంభోగక్రియను గుప్తంగా ఉంచాలి గాని ప్రకటనం చేయరాదు. - ఇటువంటి ఆచారాలు దురాచారాలకు దూరంగా ఉంచుతాయి. గురువులను సేవించటం, బ్రాహ్మణులను కీర్తించటం నరుడికి ఆయుస్సును పెంచుతాయి.

ప్రశ్న 63 : తాతా! నేను అధ్యాత్మ విద్యను గురించి వినాలని కోరుతున్నాను. చెప్పుము. (4.120)

ఉత్తరం : కడలికెరటాలవలె జీవాత్మ పుట్టుతూ గిట్టుతూ ఉంటుంది. భూమి, నీరు, కాంతి, గాలి, ఆకాశం అనేవి పంచ భూతాలు. వాటి స్వభావాలైన వాసన, ద్రవం, తేజస్సు, చలనం, శబ్దం - అనేవి ఇంద్రియాల ద్వారాగ్రహింపునకువస్తాయి. చెవి, ముక్కు, నోరు, తోలు, కన్ను - అనేవి ఈ ఇంద్రియాలు. వాసనాది పంచభూతాల గుణాలు అనుభవా నికి రావటానికి ఆ సాధనాలకు పెద్ద ఆధారభూమి మనస్సు. ఆ మనస్సు ద్వారానే విషయజ్ఞానం మానవుడిలో ప్రవృత్తిని రేకెత్తించి ఈ జననమరణ చక్రంలో పడవేసి త్రిప్పుతుంటుంది. ఆ చక్రభ్రమణం నుండి బయటపడాలంట్కేముందుగా ఇంద్రియాలను మళ్ళించి మనస్సుతో వాటిని చేరిస్తే, బుద్ధిని లోలోననే అణచివేయవచ్చును. ఆ విధంగా పురుషుడు అంతర్ముఖుడైనప్పుడు అతడిలో బుద్ధి గోచరించని స్థితికలుగుతుంది. ఆత్మజీవంతోచేరి భూతాత్ముడనీ, శరీర తత్త్వం తెలిసి క్షేత్రజ్ఞుడనీ, శరీరం తాను కానని తెలిసి పురుషుడనీ, పరమేశ్వరుడనీ, బుద్ధికి ఎడంగా నిలిచి 'బుద్ధిసాక్షి అనీ,

తత్త్వ దర్శనంతో జనన రహితుడనే పిలువబడుతూ ఉంటాడు. 'ఆత్మ' పరమేశ్వరుడైనప్పుడు అతడు విశ్వమయుడు. సృష్టి అంతా అతడిలో గోచరించేదే. అదే సృష్టి తిరిగి ఆత్ముడికి ఇంద్రియానుభవం ద్వారా గోచరిస్తున్నదంటే తాత్పర్యం- అదంతా మాయవలన స్వప్నసదృశమైన మిథ్య తప్ప అన్యం కాదు. మాయకారణంగానే 'ఆత్మ' తనను తాను కాంచలేక, మోసానికి గురి అయి పరమాత్మకు వెలి అయి అలమటిస్తుంది. మిథ్యాజ్ఞానమే మాయ. మాయకు మానవుడిలోని గుణత్రయం శరీరం. కాబట్టి మాయాతత్త్వం గ్రహించి, మొదట తమస్సును, ఆ పిదప రజస్సును వదలివేయాలి. అప్పుడు ఆత్మ శుద్ధసత్త్వరూపంతో వెలుగుతూ ఉంటుంది. అటు తరువాత ఆ సత్త్వాన్ని కూడా తొలగించుకొనాలి. అపుడు కేవలం జ్ఞానం - విమలబోధ - కలిగి ఆత్మపరమాత్మగా ఔతాడు. గుణత్రయ రాహిత్యమే కైవల్యం. పరిశీలిస్తే సత్త్వగుణం సుఖమయం. రజస్సు నిరంతర దుఃఖనిలయం, తమస్సు జ్ఞానమాంద్య రూపం. అయితే సమతాదృష్టితో ఆయాగుణాలను, వాటి స్వభావాలను దూరంచేయగలిగితే మాయను పోద్రోలినట్లే. గుణత్రయ రాహిత్యమే మాయానాశనం. ఇది ఆధ్యాత్మపద్ధతి.

ఆధ్యాత్మవిద్యకు ఉపకరించే యోగవిద్యను తెలియటం అవసరం. మనస్సు చలించకుండా, ఏకాగ్రమై నిలిచి ఉండాలి అంటే దృఢ నిశ్చయం అవసరం. మబ్బులో మెరుపువలె, తామరాకుపై నీటి బిందువువలె మనస్సులో ఆలోచన సహజంగా ఉంటుంది. మనస్సు ప్రసరించే తీరూ, గాలి వీచే పద్ధతీ ఒకటే. గాలి కారణంగానే మనస్సు చలిస్తుంది కాబట్టి శరీరంలోని వాయువును మనోనిగ్రహం కొరకు నియమించాలి. వాయు నిగ్రహణం సులభం కాదు. అది క్రమక్రమంగా సాగాలి. స్థిరమైన సంకల్పంతో యమ నియమాదులైన ఎనిమిది సాధనాలతో వాయు నిరోధానికై యత్నించాలి. ఆ ప్రయత్నంలో ముందుగా ఆలోచనలు కరిగిపోతాయి. తరువాత సందేహం కలుగుతుంది. ఆ పిదప జ్ఞానం వాయువును క్రమబద్ధం చేయగలుగుతుంది. క్రమబద్ధమైన వాయువు శరీరాంతర్గతనాడులలో ప్రయాణం చేసి శరీరంలోని బ్రహ్మస్థానాన్ని చేరుకొంటుంది. అపుడు మనస్సు నిశ్చలమై, శాంతిపూర్ణమై బ్రహ్మానందాన్ని అందుకొంటుంది. ఆ తరువాత ఆనందంలో లీనమై పోతుంది.

ప్రశ్న 64 : జపం చేసే విధానాన్ని, జపం చేసేవారు పొందే ఫలితాన్ని తెలుపుము. (4. 129)

ఉత్తరం : సాధకుడు శుచిగా దర్భలు పరిచిన సమతలంమీద ఆసీనుడై జ్ఞానకర్మేంద్రియాలను అన్యవిషయాలతో సక్తం కాకుండా నిగ్రహించి, ఏకాగ్రచిత్తుడై, మాత్సర్యం, గర్వం, దర్పం, దంభం - వీటిని తొలగించుకొని జపం చేయటానికి ఉద్యుక్తుడు కావాలి. జపవిధానాన్ని సరిగా పాటిస్తే మోక్షం కలుగుతుంది. అనుమానం లేదు. అదే జపంలో శౌచాది లక్షణాలు లోపిస్తే నరకం కూడా ప్రాప్తించవచ్చును. దీనిని వివరించే కౌశికుడు, ధర్మదేవత, యమధర్మరాజు, కాలపురుషుడు, మృత్యుదేవత - వీరందరి నడుమ జరిగిన సంవాదం తెలియదగింది. కౌశికుడికీ ఇక్ష్వాకు మహారాజుకూ జరిగిన సంవాదం ఉపకరిస్తుంది. వీటి తాత్పర్య మేమిటంటే - జపశీలురూ, యోగులూ ఇద్దరూ పుణ్యగతులు పొందుతారు. అయితే జపశీలురు భారరహితంగా పైకెగసే శక్తి కలిగి యోగులకంటె మిన్నగా ఉంటారు.

ప్రశ్న 65 : నిరతిశయ జ్ఞానయోగ విధాన్ని వివరించుము. (4. 171)

ఉత్తరం : ఈ ప్రశ్నకు సమాధానంగా 'మను బృహస్పతి సంవాదం' అనే ఇతిహాసం ఉపయోగపడుతుంది. జ్ఞానయోగం మానసిక ప్రక్రియ. అందువలన మనస్సు కలత దేరి, కల్మషానికి దూరమై నిర్మలంగా ఉన్నప్పుడు పురుషుడుఆత్మజ్ఞుడు కాగలడు. ఆత్మజ్ఞానం పొందగలడు. మురికినీటిలో రూపం కనపడనట్లు కలత చెందిన మనస్సుతోఆత్మజ్ఞానం పొందలేరు. తేరిన నీటిలో రూపుకానబడినట్లు నిర్మలమైన మనస్సుతో ఆత్మజ్ఞానం పొందగలరు. ఇంద్రియనిగ్రహం వలననే మనస్సు నిర్మలమౌతుంది. పాపాలు నశిస్తే జ్ఞానం కలిగి, మెరుగుటద్దంవలె ప్రకాశిస్తూ ఉంటుంది. అపుడు

శరీరంలోని ఆత్మ తనను తాను దానిలో చూచుకొనగలుగుతుంది. జ్ఞానం ఆత్మలో ఐక్యమౌతుంది. సమ్యగ్జ్ఞానం పొందాలంటే మాయను జయించాలి. ఆత్మను మాయ ఆవరించి ఉంటుంది. గుణత్రయం మూడు పురులుగా కలిసి ఆత్మను చుట్టుకొని ఉంటుంది. ఆ పురిని వైరాగ్యమనే కొడవలితో తెగవేయాలి. మనస్సూ, బుద్ధీ, జ్ఞానమూ నరుడినుండి తొలగిపోతే తప్ప అతడికి శాశ్వతం, సర్వవ్యాపి అయిన జ్ఞానతత్త్వం అయిన పరమేశ్వర స్వరూపం గోచరించదు. ఆ పరతత్త్వం గొప్పవెలుగు. ఆ వెలుగు అమృతం, అచ్యుతం, అమలం, అమేయం, అవ్యయం, అనంతం. దానిని యమనియమాది సాధన సంపత్తితో ప్రశాంతచిత్తం ద్వారా గ్రహించవచ్చును. అప్పుడే ఆ పరతత్త్వం మానవుడి అనుభవానికి అందుతుంది.

ప్రశ్న 66 : మహనీయుడైన శ్రీకృష్ణుడి మాహాత్మ్యాన్ని వినిపించుము. (4.203)

ఉత్తరం : నే నిదివరలో నారద జామదగ్న్య మార్కండేయ వ్యాస వాల్మీకి ప్రభృతి మునీంద్రులు చెప్పగా వినిన విశేషాలను చెప్పుతాను. శ్రీకృష్ణుడు ప్రభవిష్ణుడైన విష్ణుడు. అతడే తన దివ్యశక్తితో తానూ కర్మనిర్వహణ నైపుణ్యంతో వినోదించాలనే సంకల్పంతో ఈ సృష్టికి మూలపదార్థాలైన పంచభూతాలను కల్పించాడు. నీటిపై భద్రమైన శయ్యమీద (శేషతల్పంమీద) పరుండి ఉండగా నాభినుండి ఒక పద్మం పుట్టింది. దాని నుండి బ్రహ్మ పుట్టాడు. అతడికి ఏడుగురు మానస పుత్రులు కలిగారు. వారు వరుసగా మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు. వారిలో మరీచికి కశ్యప ప్రజాపతి జన్మించాడు. ఆ కశ్యపుడివలన దేవతలు, రాక్షసులు, గరుడులు, నాగులు మొదలైన జాతులు జనించాయి. ఆ కశ్యపుడికే సూర్యుడు జన్మించగా, అత్రికి చంద్రుడు కలిగి, ఆ సూర్యచంద్రు లిద్దరూ క్షత్రియ వంశాలకు మూలపురుషు లయ్యారు. ఆ వంశాలకు చెందిన రాజులు పలువురు పెక్కు దేశాలు పాలించారు. భిన్న భిన్న కాలాలలో భిన్న భిన్న దేశాలలో ఆ క్షత్రియ వంశాలు అనేక శాఖోపశాఖలుగా వర్ధిల్లాయి. శ్రీకృష్ణుడు తనకు కావలసి వచ్చినప్పుడు వారిలో వారికి సంభవించే యుద్ధాలను నిమిత్తమాత్రంగా గ్రహించి వివిధ క్షత్రియ వంశాలను నశింపజేస్తూ ఉంటాడు. ఆ దేవుడు శ్రీకృష్ణరూపంతో పాటుగా బలరామ, మన్మథ, అనిరుద్ధ రూపాలను ధరించి, ఈ జగత్తును భరిస్తూ వినోదం కొరకు జన్మలెత్తి ఆటలాడుకొంటాడు. (శ్రీకృష్ణుడివైపు చూపిస్తూ) ఈ జగత్పతిని సామాన్య మానవుడిగా చూడటం అజ్ఞానం. శ్రీకృష్ణుడు భక్తపరాధీనుడు కాబట్టి ఉత్తములకు ఆరాధనాభాజనమయ్యాడు. నరులకు కావలసిన భోగభాగ్యాలను గాని, ముక్తినిగాని, కేవలం తన కరుణా కటాక్షమాత్రాన ఈయగలడు.

ప్రశ్న 67 : పితామహా! మానవుడు ఎవరిని స్మరిస్తే పరమాత్మను పొందుతాడు? ఏ మార్గాన దైవధ్యానం కలుగుతుంది? (4.207)

ఉత్తరం : నేను ఇదివరలో ఈ అంశంమీద నారద మహర్షివలన వినిన విశేషాలను తెలియపరుస్తాను. విష్ణువును ధ్యానించినవారు ముందుగా గొప్పభక్తిని, నిష్కల్మషమైన శ్రద్ధను, ఆపైన ఇంద్రియ నిగ్రహాన్ని అలవరుచుకొనాలి. ఈ మూడు లక్షణాలూ విష్ణుధ్యానానికి సమకారకాలు. పాపరహితుడికి ఈ మూడు గుణాలూ అలవడతాయి. పాపనాశనానికి విష్ణువు మెచ్చిన పద్ధతి నియమపూర్వకంగా నిరంతర విష్ణుస్మరణం అనే అనుస్మృతి. 'ఓం నమో వాసుదేవాయ' వంటి మంత్రాలను నిశ్చల మనస్సుతో జపించాలి. ఆ తరువాత అనుస్మృతిని (విష్ణునామ సహస్రం) పఠించాలి. దానివలన ధర్మార్థకామమోక్షాలను సాధించే సామర్థ్యం కలుగుతుంది. విష్ణుదేవుడు అనుస్మృతిని నారదుడికి బోధించాడు (విష్ణు సహస్రనామ మని ప్రసిద్ధి చెందిన అనుస్మృతిని భీష్ముడు ధర్మరాజుకు వినిపించాడు). అనుస్మృతిని చదివినవారికీ, విన్నవారికీ, నమస్కరించినవారికీ పుణ్యగతి ముక్తి కలుగుతుంది. వేలకొద్ది అశ్వమేధయాగాలు చేసికూడా పొందలేని పరమపదాన్ని అనుస్మృతిని భక్తితో సేవించటంవలన సులభంగా పొందవచ్చును.

ప్రశ్న 68 : పితామహా! నాకు మోక్షమార్గాన్ని ఉపదేశించుము. (4. 260)

ఉత్తరం : దీనిని బోధించే 'వ్వార్ష్ణేయాధ్యాత్మము' అనే ఇతిహాసం ఉన్నది. దానిని విన్నుము. వార్ష్ణేయుడనే ఉత్తముడు మోక్షమార్గాన్ని ఉపదేశించుమన్న శిష్యుడికి దానిని వివరించాడు. దాని తాత్పర్యం ఇది. కాలచక్రం అవధిలేకుండా తిరుగుతూ ఉంటుంది. దాని భ్రమణంలో సృష్టులూ ప్రళయాలూ ఏర్పడుతూ ఉంటాయి. ప్రళయాంతంలో పరమాత్మ మాత్రం నిత్యుడై నిలిచి మరల లోకాలనూ భూతాలనూ సృష్టిస్తాడు. ఋషులూ మునులూ పునస్సృష్టిలో పునరుద్భవించినప్పుడు వేదాలనూ శాస్త్రాలనూ తిరిగి పొందారు. వారు మేధావులై లోకాలన్నీ ఆచరించదగిన నియమ నిబంధనలను స్పష్టంగా తెలియపరచారు. మహర్షులు నిర్మించిన న్యాయాది శాస్త్రసముదాయాన్ని తెలిసికొన్నా, ఆచరించినా బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. ఆ శాస్త్రజ్ఞానమంతా ఒక్క విష్ణువునందు నిలిచి ఉంటుంది. మునీంద్రు లా జ్ఞానాన్ని వారి శిష్య పరంపరకు బోధించి లోకంలో వ్యాప్తిపొందించారు. పురుషుడితో కూడి ఉండటంవలన ప్రకృతి చైతన్యశక్తిని వహిస్తుంది. చైతన్యంనుండి బుద్ధి, దానినుండి అహంకారం పుట్టుతాయి. అహంకారం ఆత్మను చేరుతుంది. అహంకారంవలన ఆకారం, ఆకారంవలన వాయువు, వాయువువలన తేజస్సు, తేజస్సువలన నీరు, నీటివలన భూమి - పుట్టి పంచభూతా లేర్పడ్డాయి. అహంకారమే భూతపంచకానికి మూలం. బుద్ధికి మహత్తని పేరు ఉన్నది. ఈ శరీరం తొమ్మిది ద్వారాలున్న పుణ్యపురం. ఈ పురాన ఆ పరమాత్మ ఊహాతీతమైన వ్యాప్తశక్తితో నిండి, అన్ని భావాలనూ, స్వభావాలనూ, గుణాలనూ పొంది శయనించి ఉన్నాడు. అందువలననే ఆ పరమాత్మను 'పురుషుడు' అని అంటారు. ఆ పురుషుడు అమరుడు, అవ్యయుడు, అజరుడు, అమేయుడు, అమలస్వభావుడు. చెట్టులో నిప్పువలె దేహంలో పురుషుడు ఉంటాడు. కట్టెల రాపిడివలన నిప్పు రాజుకొనేటట్లు యోగవిద్యాభ్యాసం వలన పురుషుడు తేజోరూపుడుగా బోధపడతాడు. ఆ తేజస్సు జ్ఞానంతో నిండి ఉంటుంది. ఆ జ్ఞానమయ తేజస్సు సర్వ భూతాలను ఆశ్రయించి ఉంటుంది. కాబట్టి శ్రవణ, దర్శన, భాషణాదుల నది నిర్వహిస్తుంది. ఆ తేజోరూప పరమాత్మనుండే సృష్టి, స్థితి, లయాలు జరుగుతూ ఉంటాయి. దేహస్థుడైన పురుషుడు అన్నింటికీ సాక్షీ భూతుడుగా ఉంటాడు.

కాలచక్రానికి బుద్ధి మొదలైన వికృతులు ఏడు అంచులు. అవ్యక్తం దాని కేంద్రస్థానం. జ్ఞాన కర్మేంద్రియాలూ పదహారు వికారాలూ వలయాలు. ఆత్మ దానిని అధిష్ఠించి ఉంటాడు. అది నిరంతర భ్రమణం కలిగింది. దానిని తత్త్వశోధన దృష్టితో దర్శించాలి. ఈ సంసారం ఒక అరణ్యం వంటిది. సంసారంలో పడి జీవించటం అంటే అడవిబాటలో నడవటం. సంసార పరిభ్రమణంలో సుఖశాంతు లుండవు. లౌకికమైన తెలివి తేటలు విజ్ఞానమనీ, ఆధ్యాత్మికమైన తెలివితేటలు జ్ఞానమనీ విజ్ఞు లంటారు. అహంకారం జీవుల సకల కార్యాలకూ మూలం. ఆయా కార్యాలవలన పాపపుణ్యాలు కలుగుతాయి. వాటి అనుభవం కొరకు ప్రాణి దేహం ధరించి, జనన మరణ చక్రాన పడి క్రిందికీ, మీదికీ తిరుగుతుంటాడు. ఈ జనన మరణ చక్రానికి మూలం ఆశాలత. దానికి ప్రాకుడు కొయ్య స్త్రీ. ఈ సత్యం తెలిసి ఆశను త్రెంచివేయాలి. సృష్టిలోని ప్రాణికోటిలో మానవులు శ్రేష్ఠులు. వారిలో బ్రాహ్మణులు, వారిలో మంత్రవేత్తలు, వారికంటె జ్ఞానులు ఉత్తములు. మానవుడికి నిజమైన నేత్రం జ్ఞానం. అజ్ఞాని గ్రుడ్డివాడితో సమానుడు. జ్ఞానార్జనకు ముందు నరుడు ధర్మాన్ని ఆచరించాలి. సంకల్ప వికల్పాలకు మనసులో తావీయకుండా సాధన చేయాలి. ఇంద్రియనిగ్రహం మనోనిగ్రహానికి ప్రాతిపదిక. అట్టి ఇంద్రియ నిగ్రహం జ్ఞానార్జనకు, తద్ద్వారా మోక్షప్రాప్తికీ హేతు వవుతుంది. నరుడు మాటలో, మనసులో, పనిలో శౌచాన్ని పాటిస్తూ, అహంకారాన్ని విడనాడి, శాంతస్వభావుడై ఉన్నప్పుడు, అతడిలో కోర్కెలు సన్నగిల్లి అంతరించిపోతాయి. ఆ స్థితిలో లోకంలోని ప్రాణిసమూహా న్నంతటినీ అతడు కరుణతో ఆదరించగలుగుతాడు. పవిత్రజీవనం, అహంకార రహితశీలం, కోర్కెలకు దూరమైన మనస్సు - ఈ మూడింటికి తోడుగా భూతదయ కలిగి ఉన్నవాడికి జ్ఞానం కలిగి తీరుతుంది.

మానవుడు తనలోని జ్ఞానాన్నే వంటచెరకుగా వాడుకొంటూ, విజ్ఞానాగ్ని రగుల్కొనేటట్లు చేసి ప్రజ్వలింపజేయ గలిగితే అతడికి జరామరణాలకూ, ఇతర లౌకిక దుఃఖపరంపరలకూ దూరమైన అమృతత్వస్థితి కలుగుతుంది. అతడు ధ్రువమైన మోక్షస్థితిని చేరుకొంటాడు.

లోకంలో వ్యక్తం, అవ్యక్తం - అని పదార్థాలు రెండు విధాలు. వ్యక్తమంటే మృత్యువు, అవ్యక్తమంటే అమృతం- అని విష్ణువు చెప్పాడు. అది తెలిస్తేనే ముక్తికి దారి కనపడేది. అవ్యక్త మనబడే మూలప్రకృతి ముల్లోకాలకూ ఆలంబనమైనది. దానియందే లోకాలు జన్మించి, పెరిగి, లయమౌతాయి. ఆ అవ్యక్తం నివృత్తి లక్షణం కలది. నివృత్తి మార్గం సాటిలేని మేటి ధర్మమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

నివృత్తి అంటే సంసారంనుండి మరలటం. దీనికి విరుద్ధమైనది ప్రవృత్తి - అంటే సంసారంలో పాల్గొనటం. దేహస్థుడైన ఆత్మ ప్రాకృతికాలైన త్రిగుణాలతో చుట్టబడి ఉంటాడు. కట్టుకొన్నచీరవలె ఒకటి, పైన వేసికొన్న వస్త్రంవలె మరొకటీ, తలకు గట్టిగా చుట్టుకొన్న గుడ్డవలె ఇంకొకటి నిండుగా క్రమ్ముకొంటాయి. త్రిగుణాలు చుట్టుకొని ఉండటంచేత ఆత్మ నిజస్వరూపం కానరాకుండా ఉంటుంది. త్రిగుణాతీతమైన మరొక గుణమున్నది. అదే పరబ్రహ్మతత్త్వం.

బ్రహ్మచర్యం, అహింస అనేవి రెండూ గొప్ప ధర్మాలు. ఆ రెండింటిని ఆచరించటమే ఉత్తమ తపస్సు. ఆ తపస్సు చేసేవారికి నిర్మలజ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞాననేత్రంతో అతడు ఈ లోకపు అంతర్బహిస్స్వరూపాలను సరిగా చక్కగా చూడగలడు. తపస్సు సంపారంనుండి మనస్సును మరల్చటానికి ఔషధంవలె ఉపయోగపడుతుంది. తృష్ణాలతను త్రెంచటానికి కొడవలివలె పనిచేస్తుంది. ధర్మరాజా! నీవు కూడా ఆ శిష్యుడివలెనే జ్ఞానివై నీ జన్మను చరితార్థం చేసికొమ్ము.

ప్రశ్న 69 : మిథిలాధీశుడైన జనక మహారాజు ఏ కర్మవలన ముక్తిని పొందగలిగాడు. (4.338)

ఉత్తరం : జనకరాజుకు నూర్గురు ఆచార్యు లుండేవారు. వారు ఒక్కొక్కరు ఒక్కొక్క పద్ధతిలో ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని అతడికి బోధిస్తూ ఉండేవారు. జనకుడు అందరిపద్ధతులనూ గౌరవిస్తూ ఉండేవాడు. ఒకసారి పంచశిఖుడు (కాపిలేయుడు) అతడి సభకు వచ్చాడు. వాదులో ఆచార్యశతకాన్ని ఓడించాడు. జనకుడు అతడిని ఆశ్రయించి ముక్తిమార్గాన్ని బోధించు మని కోరాడు. అతడు ఉపదేశించాడు. అతడి వాక్యాల సారాంశ మిది - గుణత్రయాన్ని ఆత్మతత్త్వంలో లీనం చేయాలి. అప్పు డవి సముద్రంలో కలిసిపోయే నదులవలె తమ ఉనికి లేకుండా పోతాయి. నరుడు మనస్సును సుఖదుఃఖాలవెంట పరుగెత్తనీయకుండా అంతర్ముఖంగా త్రిప్పుకొని, ఆత్మలో చేర్చాలి. అప్పుడు నీళ్ళలో వేసిన ఉప్పువలె ఆత్మలో మనస్సు కలిసిపోతుంది. కుబుసం వదలిన పాము విలాసంగా కనపడేవిధంగా కర్మసంపర్కం వదలిన ఆత్మ స్వయం ప్రకాశమైన జ్ఞానంతో ప్రజ్వలిస్తుంది. ఈ వాక్యాలను విని జనకుడు విరక్తుడై మిథిలానగరం తగలపడిపోతున్నా తాను దుఃఖానికి దూరంగా నిలిచి స్థితప్రజ్ఞు డయ్యాడు. ఈ కథ విన్నవారికి కూడా ముక్తి కలుగుతుంది.

ప్రశ్న 70 : ఎట్టివాడు సుఖంతోనూ, శుభంతోనూ కూడి నిర్భయుడై జీవించగలడు. (4. 361)

ఉత్తరం : దమ సంపన్నుడు సుఖంతోనూ, శుభంతోనూ నిర్భయంగా జీవించగలడు. దమం సద్గుణాలరాశి, శౌచాదులు సద్గుణాలు. అతడు జ్ఞాని అయి సౌమ్యాకారంతో వెలుగొందుతాడు.

ప్రశ్న 71 : వ్రతస్థులు ఒక్కొకసారి భోజనాలు చేస్తూ ఉంటారు. వారికి వ్రతభంగం కలుగదా. (4. 365)

ఉత్తరం : ఉపవాస వ్రతంలో ఉన్నవారు వేదోక్తాలైన భోజనాలు బ్రాహ్మణుల నిర్దేశానుసారం చేయటంలో తప్పు లేదు. మోక్షార్థి అయినవాడు సదా ఉపవాసిగా, బ్రహ్మచారిగా, అమాంసభోజిగా, అతిథిశేషభోక్తగా, అమృతాశిగా, నిద్రపోనివాడుగా ఉండాలి. వ్రతదీక్షితులు కూడా పలురకాలు. రోజుకు రెండు పూటలు మాత్రం భోజనం చేస్తూ మధ్యమధ్య ఏమీ భోజనం చేయనివాడు సదుపవాసి, ఋతుకాలాన మాత్రం ధర్మపత్నితో సంగమించే సచ్ఛీలుడు సదాబ్రహ్మచారి,

మాంసాహారాన్ని దేవతలకు, పితరులకు, అతిథులకు వండి వడ్డించి పిదప తాను తినేవాడు అమాంసభోజి. పంక్తిభోజనంలో అతిథులతో కలిసి ఆరగించేవాడు విఘసాశనుడు. సేవకులందరూ భుజించిన తరువాత మాత్రమే తాను భుజించే పుణ్యాత్ముడు అమృతాశి. పగటిపూట నిద్రపోనివాడు అస్వప్నుడు. ఇటువంటివారి వ్రతాలన్నీ దేహబాధకాలే.

ప్రశ్న 72 : కర్మలు, సంస్కారవశాన నరుడికి మంచి చెడులు కలిగిస్తూ ఉంటాయి. కాగా, ఆ కర్మలకు అర్హు డౌతాడో కాడో నిర్ణయించలేకుండా ఉన్నాను. నాకు స్పష్టంగా తెలుపుము. (4.369)

ఉత్తరం : ఈ ప్రశ్నకు సమాధానం ఇంద్రప్రహ్లాద సంవాద శ్రవణమే. ఆ సంవాద సారాంశ మిది: సంపదలు యత్నించి ఆర్జించకున్నా అవి తమంత తాముగా వచ్చిపడతాయి. ప్రయత్నించి ఆర్జించి తెచ్చి ఉంచితే ఊరక నశించిపోతాయి. అట్లాగే శుభాశుభాలు, కష్టనష్టాలు, సుఖసంతోషాలు మానవుడిని ముంచెత్తుతుంటాయి. వీటి కన్నిటికీ 'నేను కర్తను' అని అనుకొనటం నరుడి అజ్ఞానం. వీటన్నిటికి కారణం 'విధి'. ఏ లాభమూ ఏర్పడకుండా చేస్తున్న ఆ కర్త తాను కర్త ననుకొనటంలేదు. అట్లని నరుడు కర్త కావటం లేదు. కర్తృత్వభావం అహంకార మూలం. నిరహంకారి కర్మఫలాన్ని కోరడు. కర్త విధికాబట్టి, ఆ విధి చేసే కర్మలను ఉపేక్షాభావంతో ఊరకనే చూస్తూ ఉంటాడు. అట్టివాడు శాంతి, దాంతి, ప్రజ్ఞానిధి అయి ఉంటాడు. నిష్కపటమైన ప్రవృత్తి, దయాగుణం, తాను దేహం కాదు, ఆత్మను అనే భావం, పరాకు లేకుండా జాగరూకతతో వ్యవహరించటం, వృద్ధసేవానురక్తి - అనే గుణాలు నరుడికి శుభాన్ని కలిగిస్తాయి. ఇక జ్ఞానం, శాంతి అనేవి కాలపరిపాకంతో క్రమంగా తమంతతామే నరుడిలో చోటుచేసికొంటాయి.

ప్రశ్న 73 : రాజు సంపదను ఏ కారణంవలన కోల్పోతాడు. (4. 385)

ఉత్తరం : దీనికి సమాధానంగా పూర్వం ప్రవర్తిల్లిన ఇంద్ర బలి సంవాద మనే ఇతిహాసం తెలిసికొనతగింది. దాని సారాంశ మిది- ఒకసారి దివ్యలోకసంపదలు కోల్పోయి విచారంతో కాలం గడుపుతూ, గాడిద రూపంతో కొన్ని క్రంతలలో తిరుగుతూ ఉన్న బలి చక్రవర్తిని ఇంద్రుడు బ్రహ్మదేవుడి సాయంతో కనుగొని ఆతడి వద్దకు వెళ్ళి, 'రాజ్యవైభవాన్నంతా కోల్పోయి దీన దశలో ఉన్న తరుణంలో పూర్వసంపదను తలచుకొంటూ దుఃఖిస్తూ ఉంటావా?' ఉండవా? అని అడిగాడు. బలి ఇట్లా అన్నాడు. 'మేలు జరిగినా, కీడు వాటిల్లినా, సుఖం కలిగినా, దుఃఖంపైకొన్నా నేను సమభావంతో స్థిరంగా ఉంటాను. నా మీద వాటి ప్రభావం ఉండదు. నా చిత్తంలో అహంకారం లేదు. విధాత చేతలకు ఎవరూ అతీతులు కారని నమ్ముతాను' అని పలికిన తరువాత అతడి శరీరంలో నుండి శ్రీ, భూతి, లక్ష్మి - అనే పేర్లుగల వనితారూపం ఒకటి బలి శరీరంనుండి వెడలి ఇంద్రుడిని ఆశ్రయించింది. సత్యం, ధర్మం, దమం, దానం అనే గుణాలు క్రమంగా బలియందు లోపించటంవలన ఆ రాక్షస ప్రభువునుండి తాను వైదొలగాననీ, వజ్రాయుధంతో బలిని చంపకుండ నిగ్రహాన్ని ప్రకటించిన ఇంద్రుడిని చేరాననీ ఆ శ్రీ లక్ష్మి సమాధానం చెప్పింది. సంపదలు తొలగటానికి నరుడి ఉత్తమ గుణాలు లోపించటం కారణమనీ, కలగటానికి ఉత్తమగుణాలే కారణమనీ ఈ ఇతిహాస తాత్పర్యం.

ఇటువంటిదే ఇంద్ర, నముచి సంవాదం కూడా. సంపదలు నశించినా వగవకుండా నిశ్చలంగా ఉన్న రాక్షసరాజు నముచి. అతడి వద్దకు ఇంద్రుడు వెళ్ళి అతడి నిశ్చింతమైన చిత్తానికి కారణమడిగాడు. 'నాకీ విధంగా కావలసి ఉన్నది-అయింది, అని గట్టి నిర్ణయంతో ఉండటంతో నాకు సుఖదుఃఖాలు, సంపత్తి విపత్తులవంటి కృత్యాలు అంటవు. కాబట్టి నాకు భయముండదు. నే నెవరికీ భయపడను. మేలు కీడులు కోరుకొంటే వచ్చేవి కావు. వద్దంటే వెళ్ళేవీ కావు. అందువలన వాటివలన చింత వ్యర్థం'. దేవేంద్రు డాతని మాటలను మెచ్చుకొన్నాడు.

ప్రశ్న 74 : ఏదైనా దుర్దశ మానవుడికి కలిగినప్పుడు అతడు ఏ విధంగా ప్రవర్తిస్తే మేలౌతుంది. (4.418)

ఉత్తరం : దురవస్థలన్నింటికీ ధైర్యమే ఔషధం. ధైర్యం ఆరోగ్యాన్నీ, సిరిసంపదలనూ, కీర్తినీ, ఔన్నత్యాన్నీ పెంచుతుంది. ధైర్యవంతుడు కాలగతిని గుర్తించి వర్తించాలి. దానిని బోధించే ఇంద్రబలి సంవాదం తెలియటం మంచిది. దాని సారాంశ మిది - జీవితంలో సుఖదుఃఖాలు క్రమంగా ఒకదాని తరువాత మరొకటిగా మానవులను చెందుతూ ఉంటాయి. ఈ క్రమం తప్పించరానిది. కాబట్టి నరుడు ధైర్యంతో మెలగుతూ, సుఖం కలిగినప్పుడు గర్వాన్నీ, దుఃఖం కలిగినప్పుడు విషాదాన్నీ ప్రకటించకుండా నిగ్రహించుకొనవలసి ఉంటుంది. నరుడి మహార్దశకు గాని, దుర్దశకుగాని దైవ మొకడే కారణం కాని ఇతరు లెవ్వరూ కాజాలరు. దైవాన్నీ కాలమని కొందరంటారు. కాలప్రవర్తన దేనికీ అందనిది. అది దేనికీ లొంగదు. యజ్ఞాలూ వ్రతాలూ కాలగతిని మార్చలేవు. కాలతత్త్వం తెలిసినవాడు ధైర్యంతో ఉంటాడు. కాలం ఒక నదివలె నిరంతర ప్రవాహశీలి. నది ప్రవాహవేగంతో కొండను కోసివేసి ముందుకు సాగినట్లే కాలం తన గమనంతో నరుడిని లోగొని అణచి వేస్తుంది. నరుడు ముందుగా ఈ తత్త్వాన్ని అంతర్ముఖుడై దర్శించాలి. ఆ తరువాత తపస్సు చేయాలి. జిజ్ఞాసతో కాలతత్త్వాన్ని అన్వేషించాలి. కాలతత్త్వజ్ఞానం మనశ్శాంతిని కలిగిస్తుంది. తాను దేహం కాదనీ ఆత్మననీ తెలిసికొంటే మానవుడు అశాంతికి దూరమౌతాడు. తృప్తినీ, ఆనందాన్నీ పొందుతాడు.

ప్రశ్న 75 : జీవుడు దేనివలన వృద్ధిపొందుతాడు? దేనివలన నశిస్తాడు. (5.3)

ఉత్తరం : ఈ విషయం వివరించ గలిగింది 'శ్రీ శక్రసంవాదం' - అనే ఇతిహాసం. నారదుడు లోకసంచారం చేస్తూ గంగానదిలో స్నానం చేయటానికి వెళ్ళి, అక్కడే స్నానం చేసి వ్రతనిష్ఠలో ఉన్న ఇంద్రుడిని చూచి అతడితో సంభాషణ చేస్తూ ఉన్నాడు. అంతలో ఆకాశంనుండి ఉదయసూర్యకాంతితో ఒక కాంతిరాశివలె దిగివచ్చి లక్ష్మీదేవి ఇంద్రుడితో ఇట్లా అన్నది. 'నన్ను శ్రీ, లక్ష్మి, భూతి అని అంటారు. నేను పూర్వం రాక్షసులు స్వాహా, స్వధా, మతి, శ్రద్ధ, ధృతి, స్మృతి, మేధ అనే గుణాలుండటం వలన వారివద్ద ఉండేదాన్ని. ఇప్పుడు వారివద్ద ఆ గుణాలు లోపించాయి. దానం, అధ్యయనం, అతిథిపూజ మొదలైన సద్గుణాలను కోల్పోయారు. నీవు సత్యధర్మాలలో ఆసక్తి కలిగి ఉండటంచేత నీ వద్ద నివసించాలని వచ్చాను. బుద్ధి, ధృతి, నీతి, శ్రద్ధ, సన్నతి, క్షమ, శాంతి మొదలైన గుణాలు కల దేవతలచెంత నిలిచి ఉంటాను'. ఇంద్రుడు లక్ష్మీసహితుడై అమరావతికి వెళ్ళాడు. ఈ కథ విన్నా, చదివినా సంపదలు కలుగుతాయి.

ప్రశ్న 76 : ప్రజలకు ఏ రకమైన ఆచారంవలన, ఏ విధమైన శీలంవలన, ఏ చదువువలన ముక్తి దొరకుతుంది. (5. 18)

ఉత్తరం : ఈ ప్రశ్నకు సమాధానం 'దేవతల జైగీషవ్య సంవాదం' వింటే తెలుస్తుంది. దేవలుడు ఇదే ప్రశ్నను అడుగగా జైగీషవ్యుడు సమాధానం చెప్పాడు. దాని సారాంశం ఇది - అంతరింద్రియ నిగ్రహం కలవాడు తనకు అవమానం జరిగితే అమృతం త్రాగినట్లుగా తృప్తి పొందుతాడు. సమ్మానం జరిగితే విషం త్రాగినట్లు ఉద్వేగం పొందుతాడు. సమ్మానం కావాలని కోరడు; అవమానం జరిగితే కలత చెందడు. ఆత్మతత్త్వజ్ఞుడికి తనవారనీ, పెరవారనీ భేదం ఉండదు. జ్ఞాన కర్మేంద్రియాలను జయించినవాడు శాంతి పొందుతాడు. శాంతివలన శాశ్వత సుఖం కలుగుతుంది.

ప్రశ్న 77 : సమస్త జనులకు, సకల ప్రాణులకు ప్రియమైనవాడు ఎవడు. (5. 28)

ఉత్తరం : ఉగ్రసేన శ్రీకృష్ణ సంవాదం వింటే ఈ ప్రశ్నకు సమాధానం తెలుస్తుంది. సర్వజనులకు ప్రీతిని గలిగించే వారిలో నారదుడు పేర్కొనదగినవాడు. నారదుడిలో శాస్త్రజ్ఞానం, సదాచారం అధికంగా ఉన్నాయి. అతడి హృదయంలో అహంకారం ఇసుమంతైనా లేదు. ఉత్తమశీలం, నిర్వికారచిత్తం, మాత్సర్య గర్వ మద రాహిత్యం అతడి ఉత్తమ గుణాలు. తపస్సు, తేజస్సు, బుద్ధి, వినయం, నీతి చాలా ప్రసిద్ధి చెందాయి. ధీరత్వం, మాటల మాధుర్యం సహజలక్షణాలు. శఠత్వం, దీనత్వం, కోపం, లోభం - అనే దుర్గుణాలకు దూరంగా ఉంటాడు. ఇటువంటి గుణాలన్నా, అటువంటి గుణాలు కలవాడన్నా అందరూ ఇష్టపడతారు.

ప్రశ్న 78 : కాలంయొక్క అవయవాలకు చెందిన విభాగాలనూ, కృతాదియుగాల ప్రమాణాలనూ తెలియజెప్పుము. (5.33)

ఉత్తరం : ఒకసారి వేదవ్యాసుడు తన కొడుకైన శుక మహర్షికి ఈ వివరాలు చెప్పాడు. అన్ని కాలాలకూ, భూతాలకూ ఆధారంగా ఒక తేజశ్శక్తి ఉన్నట్లు, అన్ని పనులూ అదే చేస్తున్నట్లూ అనిపిస్తుంది. కాని, ఆ శక్తి ఏ క్రియాకలాపాలతో సంబంధం లేనిదిగానే తోస్తుంది. కనురెప్పపాటు నిమేషం. 18 నిమేషాలు= ఒక కాష్ఠ; 30 కాష్ఠలు= ఒక కళ; 360 కళలు= ఒక ముహూర్తం; 30 ముహూర్తాలు= ఒక అహోరాత్రం; 30 అహోరాత్రాలు= ఒక మాసం; 2 మాసాలు= ఒక ఋతువు; 6 ఋతువులు= ఒక సంవత్సరం; 3 ఋతువులు= ఒక అయనం; అయనాలు రెండు= ఉత్తరాయణం, దక్షిణాయనం. యోగులు ఉత్తరాయణాన్ని 'అగ్ని' అనీ, దక్షిణాయనాన్ని 'ధూమ' మనీ అంటారు. అంతేకాదు. వరుసగా వాటిని శుక్లమనీ, కృష్ణమనీ కూడా పిలుస్తారు. ఒక మానవమాసం= ఒక పితరుల దినం; ఒక సంవత్సరం= ఒక దేవతలకు దినం; మానవకాల విభాగంలో కృతయుగానికి 1728000, త్రేతాయుగానికి 1296000, ద్వాపరయుగానికి 864000, కలియుగానికి 432000 సంవత్సరాలు ఉంటాయి. యుగాల ఆద్యంత భాగాలను యుగసంధ్యలంటారు. ఇట్లాగే దేవమానాలు కూడా లెక్కించవచ్చును. కృతాదులైన నాలుగు యుగాలూ కలిస్తే ఒక మహాయుగం. అటువంటి వెయ్యి మహాయుగాలు బ్రహ్మకు ఒక పగటికాలం. రాత్రి కాలం కూడా అంతే. బ్రహ్మ రాత్రివేళ నిద్రిస్తాడు. ఆ సమయంలో లోకాలకు ప్రళయం. ప్రభాతం కాగానే మేలుకొంటాడు. పునస్సృష్టి సాగిస్తాడు. సృష్టిక్రమం ఇట్లాగే సాగిపోతుంది.

బ్రహ్మతత్త్వంనుండి మహత్తత్త్వం, దాని నుండి మనస్సు, దానినుండి ఆకాశం, ఆకాశంనుండి వాయువు, దానినుండి అగ్ని, దాని నుండి జలం, జలంనుండి పృథ్వి క్రమంగా పుట్టుతున్నాయి. మునులు వీటిని పురుషులు అని పిలుస్తారు. ఈ సప్తరూపాలకూ మూలం బ్రహ్మమే. బ్రహ్మము శబ్ద బ్రహ్మమనీ, పరబ్రహ్మమనీ రెండు రకాలు. శబ్ద బ్రహ్మాన్ని భజించటంలో ఆసక్తి కలవాడు పరబ్రహ్మను పొందుతాడు. పరబ్రహ్మం తాను నిష్క్రియారూపమై కూడా ప్రకృతి ప్రభావంతో శబలత్వం పొంది భూతాలను సృష్టిస్తుంది. వాటి లయం తరువాత కూడా బ్రహ్మం శుద్ధబోధ స్వరూపమై నిలుస్తుంది.

దానం అన్ని వర్ణాలవారికీ సాధారణ ధర్మం. దానం, అధ్యయనం, యజ్ఞం చేయటంవలన పాపాలు నశిస్తాయి. సంసార మనే నదిని దాటటానికి ప్రజ్ఞ అనే నావ తోడ్పడుతుంది. కామక్రోధాదులవలన ప్రజ్ఞకు భంగం కలిగితే నదిలో మునిగిపోవటం జరుగుతుంది. మనం అనుష్ఠించే కార్యాలతో ఒక్కొక్కసారి ధర్మకార్యం అధర్మంగా అధర్మం ధర్మంగా తోస్తుంది. కాబట్టి మానవుడు ధర్మశాస్త్రాలను పరిశీలించి ధర్మగమన మెట్లాంటిదో గుర్తించాలి. సదాచారమే చక్రపుటంచుగా, ప్రాణమే కాడిగా, అపానమే ఇరుసుగా, సిగ్గే ఆచ్ఛాదనగా, ఉపాయాపాయాలే నొగలుగా, ఘ్రాణేంద్రియ శ్రవణేంద్రియాలు గుర్రాలుగా, జ్ఞానమే సారథిగా, సర్వతంత్రమే కొరడాగా, త్యాగమే పగ్గాలుగా సాగే యోగమనే రథాన్ని ఎక్కి ఉపాయశాలి అయిన ఆత్మ అనే రథికుడు మోక్షపదం చేరుకొనగలడు. ఇది యోగపద్ధతి.

నిస్సారమైన సంసారానికి ముఖ్యకారణం మమకారమే. మనస్సును ఇంద్రియాల విషయాలనుండి మరలించి ఆత్మయందు లగ్నం చేయటంవలన మమకారాన్ని జయించవచ్చును. సాంఖ్యులకైనా, యోగులకైనా మమకారత్యాగం సమాన ధర్మం. యజ్ఞక్రియ, ప్రజ్ఞాతిశయం, యోగం, సాంఖ్యం - ఇవన్నీ బ్రహ్మపదప్రాప్తికి తోడ్పడే సాధనాలే. అంతేకాక తపస్సు, ఇంద్రియ నిగ్రహం, రాగలోభ నివారణచాతుర్యం, దృఢమైన విద్యకల పుణ్యాత్ముడు తప్పక బ్రహ్మపదాన్ని పొందుతాడు. జీవుడు ప్రయత్నిస్తే మనస్సును నిగ్రహించగలడు. నిగ్రహించబడిన మనస్సు ఇంద్రియాలను నియమించగలదు. అప్పుడు శబ్దాదులైన విషయాలు తొలగిపోతాయి. అప్పుడు అభిలషించిన బ్రహ్మ ప్రాప్తి రూపమైన మోక్షం సిద్ధిస్తుంది. అట్టి పండితుడికి సమదృష్టి ఏర్పడుతుంది. పండితుడు క్షరాక్షర రూపమైనబ్రహ్మమును

తెలిసికొంటాడు. మృత్యురూపమైనది క్షరం. అమృతరూపమైనది అక్షరం. తొమ్మిది ద్వారాలు గల శరీరమనేనగరంలో హంసుడనే ఆత్మ భాసిస్తున్నాడు. యోగులు ఆ ఆత్మనే అక్షరుడనీ, ఆత్మ అనీ అంటారు. వైరాగ్యంతో అక్షరతత్త్వాన్ని గ్రహించవచ్చును. మనస్సునూ, ఇంద్రియాలనూ నిగ్రహించుకొనిన వివేకి దోషరహితుడై పొగ లేని అగ్నివలెవెలుగొందు తాడు. యోగి సమలోష్టకాంచనుడై సమాధిగతుడై శబ్దబ్రహ్మాన్ని అతిక్రమిస్తాడు, పరమాత్ముడిని దర్శిస్తాడు.

కర్మమార్గం ప్రవృత్తి అనీ, కర్మ రహిత మార్గం (కర్మత్యాగం) నివృత్తి అనీ విజ్ఞులు చెప్తుతారు. ప్రవృత్తి బంధాన్నీ, నివృత్తి మోక్షాన్నీ కలిగిస్తాయి. ఏకరేఖా మాత్రుడైన చంద్రుడితో సమానుడు జీవుడు. జీవుడి అజ్ఞానం చంద్రుడి కృష్ణపక్షంతో సమానమైనది. కృష్ణపక్షం గడచిపోతే చంద్రుడు పరిపూర్ణతను సంతరించుకొని భాసిస్తాడు. అట్లాగే అజ్ఞానమనే కర్మమార్గం గడిస్తే జీవుడు జ్ఞానానంద పరిపూర్ణుడై వెలుగొందుతాడు. నాలుగు ఆశ్రమాలకు చెందినవారు శాస్త్రం విధించిన కర్మలను ఆచరించటం ద్వారా సిద్ధిపొందుతారు. ఇది నాలుగు మెట్ల నిచ్చెన వంటిది. ఇది సులభమార్గం కూడా. జీవుడు అంతర్యాగం వలన విగతపాపుడౌతాడు. ఆత్మప్రాప్తి కోరేవాడు సంకల్పాల నన్నిటినీ వదలి మనస్సును సత్త్వగుణంతో లీనం చేయాలి. సత్త్వసక్తమైన మనస్సు ఆత్మనిగ్రహాన్ని కలిగిస్తుంది. ఆత్మ నిగ్రహం వలన మోక్షపదవి లభిస్తుంది. సర్వవేద సారరూపమైనది అధ్యాత్మ విద్య. దానిని దానం చేయటం భూదానం కంటె గొప్పది. ఇంద్రియనిగ్రహం ధర్మాలలో కెల్ల ఉత్తమ ధర్మం.

జీవుడిని సంసారంలో బంధించే బంధనా లన్నింటిలోనూ కామం బలమైనది. ఆ కామాన్ని వదలితే ఆత్మ పూర్ణచంద్రుడివలె ప్రకాశిస్తుంది. 'ఆత్మ' అనే ధనం 'తనది' అనుకొనకున్నా ప్రీతిని కలిగిస్తుంది. 'ఆత్మ' అనే భోజనం తినకున్నా తృప్తి నిస్తుంది. 'ఆత్మ' అనే దానితో భౌతికస్పర్శ లేకున్నా బలం కలిగిస్తుంది. ఆ ఆత్మతత్త్వాన్ని చూడటమే వేదార్థాలను గ్రహించటం. సూర్యుడి బింబం నీళ్ళలో ప్రతిబింబిస్తుంది. అట్లాగే ఆత్మ బుద్ధిలో ప్రతిబింబరూపంలో వ్యక్తమౌతుంది. సత్త్వగుణ ప్రధానులు ఆత్మను యథాతథంగా చూడగలరు. సూర్యుడికి రేయుంబవళ్ళు లేనట్లుగానే శుద్ధజ్ఞాన స్వరూపుడికి వివేకావివేకాలంటూ ఉండవు. శమప్రధానుడైన యోగికి ఇంద్రియా లున్నా, అవి లేకున్నా మనోలయ రూపమైన సమాధి దృఢంగానే ఉంటుందని శాండిల్య మహర్షి శిష్యులకు బోధించిన ప్రబోధం తెలియదగింది.

కామమనే వృక్షం మోహమనే బీజంనుండి మొలకెత్తుతుంది. అజ్ఞానమే దానికి ఆధారమైన వేళ్ళు. ప్రమాదమనే నీటితో ఆ చెట్టు పెరుగుతుంది. అసహనమే దాని ఆకులు. అది చాల విచిత్రంగా ఉంటుంది. మానమనే కాండంతో బలపడి ఆ వృక్షం పైకి ఎదుగుతుంది. శోకమే కొమ్మలుగా, అనేక చింతలే రెమ్మలుగా, పూర్వకర్మవాసనలే చేవగా పెరిగిన ఆ వృక్షం ఆశలనే తీగలతో చుట్టబడుతుంది. లోభులు ఆ చెట్టు పండ్ల కాశించి ఎక్కి, తుదకు పతనమైపోతారు. ఆత్మజ్ఞుడైన పండితుడు త్యాగమనే కత్తితో ఆ చెట్టును తెగనరికి దుఃఖాలకు దూరమౌతాడు.

ఈ శరీరమే ఒక నగరం, బుద్ధి దానికి ప్రభువు. సమస్త విషయాలను చింతించే చిత్తం అక్కడ మంత్రి పదవిలో కొనసాగుతూ ఉంటుంది. శబ్దాదులైన అయిదు విషయాలూ పురోహిత వర్గమై ప్రవర్తిస్తాయి. శ్రోత్రం మొదలైన ఇంద్రియాలే అక్కడి పుర ప్రజలు. ఇట్లా ఉండే ఆ నగరానికి రజస్తమోగుణాలనే దుష్ట శత్రువులు కీడు కలిగిస్తుంటారు. బుద్ధి వివేకాన్ని కోల్పోతే చిత్తంతో విభేదించి రజస్తమోగుణాలకు లొంగిపోయి నశిస్తుంది. అట్లా కాక మనస్సుతో ఏకమై కర్తవ్య మేదో గ్రహించి వ్యవహరిస్తే రజస్తమస్సులను రూపుమాపి రాజ్యభోగం అక్షయంగా అనుభవించగలుగుతుంది.

ప్రశ్న 79 : కార్యబలమూ, వీర్యబలమూ, మనోబలమూ కలిగిన ఉత్తమ భూపాలురు చాలమంది కురుక్షేత్ర యుద్ధంలో ప్రాణాలు కోల్పోయారు. వారిలో ఒక్కరు కూడా తమ ప్రాణాలను నిలుపుకొనలేకపోయారు. మృత్యువంటే ఏమిటి? అది ఎట్లా పుట్టింది? ఎట్లా ప్రాణులను చంపుతుంది. (5. 201)

ఉత్తరం : పుత్రుడిని కోల్పోయి శోకమగ్నుడైన అకంపను డనేరాజుకు నారదుడు చెప్పిన మృత్యుదేవత కథ నీ అనుమానం తీరుస్తుంది. పూర్వం బ్రహ్మదేవుడు లోకాలను సృష్టించాడు. జీవ సంతతి విస్తృతంగా పెరిగి పోయింది. భూభారం పెరిగింది. బ్రహ్మ ఆ స్థితిని గమనించి తీవ్రంగా ఆలోచించగా తీవ్రమైన వేడిమి కలిగి మహాగ్ని ప్రభవించి లోకాలను కాల్చివేయటం ప్రారంభమయింది. శివుడు బ్రహ్మను శాంతింపచేసి జీవసంతతిని తగ్గించటానికి ఉపాయం సూచించాడు. అప్పుడు బ్రహ్మదేవుడి అరుణ నేత్రాలనుండి ప్రకాశవంతమైన శరీరావయవాలతో ఒక స్త్రీ జన్మించింది. 'జీవులను విచక్షణారహితంగా చంపు'మని ఆమెను బ్రహ్మ ఆదేశించాడు. ఆమె ఆ దారుణకార్యానికి అంగీకరించక ధేనుకాశ్రమానికి వెళ్ళి తీవ్రమైన తపస్సు చేయ నారంభించింది. బ్రహ్మ ప్రత్యక్షమై ప్రజాసంహారమే ఆమె ధర్మమనీ, ఆమె కన్నీరు అనేక రోగాల రూపంలో జీవులను బాధిస్తాయనీ, మానవులు వాటితో మరణిస్తారనీ, ఆ పనిలో ఆమె నిమిత్తమాత్రంగానే ఉండగలదనీ, ఎటువంటి పాప మంటదనీ వర మిచ్చాడు. అంగీకరించకపోతే బ్రహ్మ శపిస్తాడేమో అని మృత్యుదేవత సమ్మతించింది. మరణ సమయంలో ప్రాణులు దేహాలను వదలి పూర్వకర్మానుసారంగా దేవాదిరూపాలనూ, ఆ తరువాత మానవాది జన్మాలనూ పొందుతున్నారు.

ప్రశ్న 80 : సజ్జనులు ధర్మానికి భయపడుతూ ఉంటారు. అటువంటి ధర్మం యొక్క పద్ధతిని నిరూపించుము. (5. 216, 217)

ఉత్తరం : వేదాలపై భక్తీ, స్మృతులపై విశ్వాసం, సదాచారం - అనేవి మూడూ ధర్మానికి అందమైన ఆకారాలు. కొందరు ధనంకూడా ధర్మానికి నాలుగవ ఆకారమని అంటారు. అసత్యం పలకకుండా ఉండటం, ధనాన్ని ఆశించకుండా ఉండటం మేలైన ధర్మం. శాస్త్రవిరుద్ధమైన ధర్మం చేయటం చవిటినేలలో విత్తనం విత్తటం వంటిది. ఈ వాస్తవాన్ని తెలిసి మెలగితే ఇహపరసుఖాలు కలుగుతాయి. ధర్మస్వరూపం చాల సూక్ష్మమైనది. ధర్మాలు బహువిధాలుగా ఉంటాయి. వాటి సారభూతమైన ధర్మాన్ని పేర్కొంటాను. ఇతరులు ఏమేమి చేస్తే తన మనస్సునకు అప్రియంగా ఉంటుందో,ఆ పనులను తాను ఇతరులకు చేయకుండా ఉండటమే అన్ని ధర్మమార్గాలకూ ఉత్తమమైన ఆలంబనంగా ఉన్నది.

ప్రశ్న 81 : తాతా! ధర్మస్వరూపం ఇంత చక్కగా ఉంటుందా? సదాచారం ధర్మస్వరూపమని పేర్కొన్నావు. ఉత్తమాచారం ఎట్లాంటిదో తెలియజెప్పుము. (5.221)

ఉత్తరం : వేదాలు అనేక విధాలుగా ఆచారాలను చెప్పుతున్నాయి. ఆలోచించి చూడగా సకలహితకరమైన ఆచారం వేరొకటి ఉంటుందా? మహాత్ములైనవారు ఏ ఆచారాన్ని పాటిస్తారో, దానిని తక్కినవారు పాటించాలి. పూర్వం జాజలి అనే మునికీ, తులాధారుడనే వైశ్య శ్రేష్ఠుడికీ నడుమ నడచిన సంవాదమనే ఇతిహాసం సదాచారరూపధర్మాన్ని వివరిస్తుంది. సంవాద సారాంశ మిది - ఎవడు సత్యమే యజ్ఞమని భావించి సత్యాన్ని పాటిస్తూ సదా తృప్తి పొంది ఉంటాడో అతడిపట్ల దేవతలు కూడా సంతృప్తి పొందుతారు. ఎవడు ధర్మంలో రమిస్తాడో, సదా ధర్మానికి మిత్రుడై ఉంటాడో, బుద్ధితో అసంగత్వాన్ని పాటిస్తాడో, అట్లా పాటించి నిర్మలహృదయు డౌతాడో, అట్లాంటివాడికి కర్మరాహిత్యంవలన కలిగే ఆనందం తప్పక సిద్ధిస్తుంది. కర్తవ్య మని భావించి చేసేకర్మ పవిత్రమైనది, కార్యసిద్ధికి హేతువౌతుంది. ప్రయోజనాకాంక్షతో చేసే పని ఉత్తమం కాదు. మాత్సర్యం, స్పర్ధ అనే దుర్గుణాలు సద్ధర్మాన్ని నశింపజేస్తాయి. సద్ధర్మం నశిస్తే మానవుడు పూర్తిగా నశిస్తాడు. అందువలన శ్రద్ధతో సదాచారాన్ని పాటించేవాడు దేవతల దయకు పాత్రుడౌతాడు. శ్రద్ధ లేనివాడికి దాన స్వభావం ఉండదు. అందువలననే 'దానం చేసేవాడు శ్రేష్ఠుడు' అని బ్రహ్మదేవుడు చెప్పాడు. శ్రద్ధ కలవాడి మనసులో మాత్సర్యాది దోషాలు నిలబడలేవు. మానవుడు తనకు విధ్యుక్తమైన ఏ కర్మకలదో, ఆ కర్మను చక్కగా అనుష్ఠించటం మేలు. అతడు కర్మల పట్ల నివృత్తిని పొంది శ్రద్ధతో కర్మసన్న్యాస పద్ధతిని పాటించటానికి తగిన నేర్పుకూడా ఉండాలి.

ప్రశ్న 82 : కార్యసమీక్ష దీర్ఘకాలం చేసి నిర్ణయం తీసికొనవలెనా? లేక సత్వరంగా నిర్ణయం తీసికొనవలెనా. (5. 260)

ఉత్తరం : పనిచేసేటప్పుడు త్వరపడకుండా చక్కగా చాలకాలం ఆలోచించి చేస్తే ఓటమి కలుగదు, విజయం సిద్ధిస్తుంది. కార్యవిమర్శలో సహనం అవసరం. దీనికి మేధాతిథి పుత్రుడైన చిరకారి కథ చక్కని ఉదాహరణం. ఒక కార్యం చేయవలసి వచ్చినప్పుడు చాలకాలం ఆలోచించి ధీరత్వంతో మంచి చెడ్డలు నిర్ణయించుకొని ఆ పని నిర్వర్తించాలి. ఆయా పనులను నిర్వహించేటప్పుడు ఆలోచించి చేసేవాడిని ఆర్యుడనీ, తొందరపడేవాడిని అనార్యుడనీ పెద్దలు పేర్కొంటారు.

ప్రశ్న 83 : ప్రజలను శిక్షించే పద్ధతి ఎట్లాంటిది. (5. 293)

ఉత్తరం : పూర్వం ద్యుమత్సేనుడికీ అతడి పుత్రుడు సత్యవంతుడికీ నడుమ జరిగిన సంభాషణం దీనికి ఉపకరిస్తుంది. చంపదగిన తప్పు చేసినవాడిని చంపటమే కర్తవ్యం. రాజుకు దుర్మార్గుడిపట్ల పక్షపాతం పనికిరాదు. రాజు స్వయంగా వినీతుడై తన మంత్రులనూ, కుమారులనూ, సేవకులనూ క్రమంగా వినయవంతులనుగా చేసి ప్రజలను రక్షించాలి. బ్రాహ్మణులు అన్ని విధాలా అహింసనే పాటించాలి. ప్రజాపాలకుడైన భూపతికి ఆ విధమైన అహింస తగదు. అతడు ప్రజలపట్ల దయ కలిగి ఉండాలి. వారికి ఏ విధమైన అపకారమూ కలుగకుండా చూడాలి. అట్లా ప్రజలను కాపాడటమే రాజుకు అహింస ఔతుంది.

ప్రశ్న 84 : మానవుడికి అవశ్యకర్తవ్యం గృహస్థ ధర్మమా? సన్న్యాస ధర్మమా? (5. 300)

ఉత్తరం : ఆ రెండు ధర్మాలూ గౌరవించదగినవే. దీనిని నిరూపించే కపిలగో సంవాదమనే ఇతిహాసం వినదగింది. దాని సారాంశ మిది - బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం - అనే నాలుగు ఆశ్రమాలూ ఆత్మప్రాప్తికి సాధనాలే కాబట్టి దేవయానా లౌతున్నాయి. ఆ మార్గాలలో నడవటం గృహస్థులకు కర్తవ్యం. వారు వేదవిహిత మార్గంలో నడవటం శ్రేయస్కరం. గృహం సమస్తకార్యాలకూ, వాటి ఫలాలకూ నిధివంటిది. ప్రాణులపై దయ, అహంకార రాహిత్యం కల నిర్మలచిత్తుడైన గృహస్థుడు దృఢమైన ఆత్మనిష్ఠతో వేదవిహిత ఆచారాలనూ, కర్మలనూ ఆచరించి పుణ్యాత్ముడౌతాడు. బాగా ఆలోచించి చూస్తే - నాలుగు ఆశ్రమాలలోనూ ఏ ఆశ్రమమూ సేవించదగనిది కాదు. అందువలన అంతఃకరణశుద్ధి కలిగి ఏ ఆశ్రమంలో ఉన్నా ఆత్మజ్ఞుడైన పండితులు సంసార సాగరాన్ని దాటగలరు. ముముక్షువయిన సాధకుడు ముందుగా కర్మఫల త్యాగం చేయాలి. ఆ తరువాత మనస్సును నిగ్రహించాలి. ఆపైన సదా సంతోషంతో ఉండాలి. ఇవి ఒకదానికంటె ఒకటి ఉత్తమ గతులు. సాధకుడు తప్పక ఈ మూడింటినీ పొందాలి.

ప్రశ్న 85 : వేదాలలో ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలు ప్రశస్తమై ఉన్నాయి. వీటిలో ఏది లభిస్తే గొప్పగా ఉంటుంది? (5. 340)

ఉత్తరం : ఈ అంశం కుండధారుడి వృత్తాంతమనే ఇతిహాసం నారద ప్రవర్తితమైన ఇతిహాసం వింటే విశదమౌతుంది. దాని సారాంశ మిది - ఉచితమైన హింస అహింసకు భంగ కరం కాదు. యజ్ఞం పేరుతో తగని హింస ఎప్పుడూ చేయరాదు.

ప్రశ్న 86 : పురుషుడు దేనివలన పాపకార్యాలు చేయటానికి పూనుకొంటాడు? పుణ్యకార్యాలకు కారణ మేది? దేనివలన పుణ్యపాపాలు రెండూ అంటకుండా ఉండగలడు? మోక్షం ఎట్లా పొందుతాడు. (5.363)

ఉత్తరం : శబ్దస్పర్శ రూపరస గంధాలు అనే విషయాలమీద కోరిక లోభమోహాలను కలిగిస్తుంది. చిత్తం లోభమోహాలకు లోనైతే ధర్మానికి లోపం కలుగుతుంది. ధర్మం లోపించగానే పాపకార్యాలు చేయాలనే తలంపులు కలుగుతాయి. అందువలన తెలివితో ఈ కీడు లన్నిటినీ ఊహించి, వాటి జోలికి పోక సజ్జనులగోష్ఠిలో కాలం గడపితే విషయాలపై

ఆసక్తి నశిస్తుంది. దానివలన ధర్మబుద్ధి ఉదయిస్తుంది. ధర్మకార్యాలు క్రమంగా ఆచరిస్తూ ఆపైన అపాయం లేని ఉపాయంతో ముక్తిపొందుతాడు. అపాయం లేని ఉపాయం ఇట్లా ఉంటుంది. ఓరిమితో కోపాన్నీ, సంకల్పించకుండా ఉండటంతో కామాన్నీ, సత్త్వగుణాభ్యాసంతో నిద్రనూ, దృఢమైన ధైర్యంతో రాగద్వేషాలనూ, జాగరూకతతో భయాన్నీ, జ్ఞాన వైరాగ్యాదులతో మోహభ్రాంతులనూ, హితమూ, మితమూ, కాలం తప్పకుండా తీసికొనే భోజనంతో రోగాలనూ, ఉపద్రవాలనూ, క్షేత్రజ్ఞస్వరూపుడైన జీవుడిని చూడటంద్వారా ప్రాణచేష్టనూ, కడపట నిస్సారాలని గ్రహించటంతో శబ్దాది విషయాలనూ, నిత్యసంతుష్టితో లోభాన్నీ, దయతో అధర్మాన్నీ, తగిన సమీక్షణ విధానంతో కర్మను కడకు నెట్టటం నేర్చుకొనటమే ముక్తికి బాట.

ప్రశ్న 87 : తృష్ణను నశింపచేసే ఉపాయం తెలుపుము. (5.372)

ఉత్తరం : ఈ ప్రశ్నకు ఉత్తరం జనక మాండవ్య సంవాదం వింటే తెలుస్తుంది. దాని సారాంశ మిది. దొరకిన దానిని అనుభవిస్తూ, దొరకనిదానికి చింతపడి దుఃఖించకుండా పరిపూర్ణుడై ఎవడు ఉంటాడో అతడి మనస్సులోనికి తృష్ణ ప్రవేశించనేరదు.

ప్రశ్న 88 : సమస్త ప్రాణులకూ భయం కలిగిస్తూ కాలం గడుస్తుండగా పురుషుడు ఏమి చేస్తే శ్రేయస్సు కలుగుతుంది. (5.380)

ఉత్తరం : మానవ శరీరంలోనే మృత్యువు, అమృతత్వం - అనేవి రెండూ ఉన్నాయి. సంసార వ్యామోహమే మృత్యువు. తత్త్వజ్ఞానమే అమృతత్వం. యోగాన్ని అనుష్ఠించటం, తపస్సు చేయటం, విషయాసక్తిని త్యజించటం - అనేవి హితకరమైన మార్గాలు. వీటితో సమానమైన దుఃఖం మరొకటి లేదు.

ప్రశ్న 89 : ఏ విధమైన శీలం కలవాడు మోక్షపదాన్ని పొందుతాడు? (5. 390)

ఉత్తరం : మితాహారం స్వీకరిస్తూ, ఇంద్రియానీకాన్ని జయించి మోక్షం కొరకై శాస్త్రాలలో చెప్పబడిన ఉత్తమ ధర్మాలను అనుష్ఠించేవాడికి బ్రహ్మానందం తంగెడి జున్నువలె సులభ సాధ్యమై ఉంటుంది. మోక్షధర్మాలు తెలియజెప్పే హారీతగీత, వృత్రగీత తెలియదగినవి. వాటి సారాంశ మిది - సంపద, పేదరికం అనేవి కాలానికి అధీనమై ఉంటాయి. అవి జ్ఞానం లేని మూఢులకు మదాన్ని, దీనత్వాన్నీ కలిగిస్తాయి. తద్వారా సుఖానికీ, దుఃఖానికీ హేతువు లౌతాయి. సంపదలు శాశ్వతం కావని తెలిసికొన్న జ్ఞానికి అవి ఉన్నా, లేకున్నా ఎట్లాంటి వికారమూ కలుగదు. పుణ్యకార్యాలచేత జీవుడు మాలిన్యం వీడి పవిత్రు డౌతాడు. పుణ్యకార్యాలు చేసేవారు ఉత్తమ వర్ణాన్ని పొందుతారు. విష్ణుధ్యానం గింజలేని పండువలె ఉత్తమ స్థితిని కలిగిస్తుంది.

ప్రశ్న 90 : జ్వరం ఎట్లా పుట్టింది. (5.436)

ఉత్తరం : దక్షయజ్ఞాన్ని ధ్వంసంచేసే సందర్భంలో శివుడి ఫాలభాగంలో కోపంవలన పుట్టిన చెమట బిందు వొకటి భూమిపై పడింది. అక్కడ పెద్దమంట చెలరేగింది. ఆ మంటలో నుండి ఒక పురుషుడు ఎర్రని నేత్రాలు, నల్లనిచూపు, ఊర్ధ్వముఖమైన రోమాలూ గల భయంకరాకారుడు జన్మించాడు. అతడే జ్వరుడు. శివుడు జ్వరానికి నానారూపాలు కల్పించాడు - ఏనుగులకు తలనొప్పిగా, పాములకు కుబుసంగా, గోవులకు గిట్టలలో నొప్పిగా, లేళ్ళకు తమరూపు చూడలేనితనంగా, గుర్రాలకు పార్శ్వభాగంలో శోషణంగా, నెమళ్ళకు ఈకలు ఊడిపోవటంగా, కోకిలకు నేత్రవ్యాధిగా, చిలుకలకు వెక్కిళ్ళుగా, మేకలకు మనోభ్రాంతిగా, పులులకు శ్రమగా, మానవులకు చావుపుట్టుకలు మొదలైన సందర్భాలలో కలిగే దుఃఖంగా పెక్కురూపాలుగా ఉంటుంది. జ్వరం శివుడి తేజస్సు. అందువలన అందరికీ నమస్కరించదగింది. జ్వరకథ వింటే పుణ్యం కూడా.

ప్రశ్న 91 : శాస్త్రతత్త్వం తెలియనివాడు ఏమి చేస్తాడు. (5.446)

ఉత్తరం : గురువులను పూజించటం, వృద్ధులను సేవించటం, విద్యను వినటం - అనేవి తప్పక చేయదగిన పనులు. నారద గాలవ సంవాదం ఈ విషయాలను వివరిస్తుంది. మనుజుడు పాపహేతువులైన పనులన్నీ వదలాలి. యథాశక్తి పవిత్ర

చిత్తంతో పుణ్యకార్యాలు మాత్రమే చేయాలి. సదా సజ్జనసాంగత్యంలోనే గడపాలి. సత్ప్రవర్తన వలన చిత్తదోషం తొలగి జ్ఞానోదయ మౌతుంది.

ప్రశ్న 92 : నా వంటివాడు కాలపాశాన్ని ఎట్లా ఛేదించగలడు. (5. 457)

ఉత్తరం : పూర్వం అరిష్టనేమి మహర్షిని సగరుడు అనే నృపాలుడు ఇదే ప్రశ్నను అడిగాడు. అప్పుడు అరిష్టనేమి సగరుడికి చెప్పిన శాంతి వచనాలు వింటే మనస్సుకు శాంతి కలుగుతుంది. వాటి సారాన్ని ఇట్లా గ్రహించవచ్చును. సమస్త భూమండలాన్నీ పరిపాలించిన మహారాజులు సైతం కాలం చెల్లగానే నేల కొరిగిపోతున్నారు. చూపు మొదలైన ఇంద్రియ శక్తులు ఉడిగిపోగానే శరీరం చెడిపోతున్నది. దీనిని చక్కగా భావించి సంసారం యొక్క నిస్సారతను గమనించగలవాడు మోక్షలక్ష్మిని చేపట్టగలడు.

ప్రశ్న 93 : ధర్మవిద్వేషపరులైన దానవులకు మంత్రి అయిన శుక్రుడికి శుక్రత్వమహిమ ఎట్లా కలిగింది. (5.468)

ఉత్తరం : శుక్రుడు యోగబలంతో కుబేరుడిని వంచించి అతడి ధనం అపహరించాడు. కుబేరు డా సంగతి శివుడికి నివేదించాడు. మహేశ్వరుడు కోపించి త్రిశూలంతో శుక్రుడిపైకి విజృంభించాడు. అతడు పరుగెత్తి పొదలమాటున దాగి ఉన్నాడు.  కాని, అతడి శరీరంలో కంపం మొదలు కావటంతో శివుడిచేతికి చిక్కాడు. శివుడు ఆతడిని మ్రింగాడు. కడుపులో పరుగెత్తుతూ మహేశ్వరుడికి ఇబ్బంది కలిగించగా ఆయన తన శరీర ద్వారాలన్నీ మూసి పురుషాంగం మాత్రం తెరిచి ఉంచాడు. పార్వతి ప్రార్థనను మన్నించి శుక్రుడిని తేజస్వంతుడిని చేసి శిశ్నం నుండి బయటకు పంపి శుక్రుడనే పేరు పెట్టాడు.

ప్రశ్న 94 : తాతా! నీ వాక్యామృతం ఇంకా వినాలని ఉన్నది. సద్ధర్మాన్ని తెలుపుము. (5. 476)

ఉత్తరం : సద్ధర్మాన్ని బోధించే 'పరాశరగీత' వినదగింది. దాని తాత్పర్య మిది - పాపరహితుడైన మానవుడు శ్రేష్ఠమైన తెలివి అనే పగ్గాలతో ఇంద్రియాలనే గుర్రాలతో లాగబడే కోరిక లనే రథాన్ని అపమార్గంలో పోనీయకుండా నిగ్రహిస్తాడు. దుష్టకార్యాలు చేయటం మురికినీటిలో స్నానంచేయటం వంటిది. పుణ్యకార్యాలు చేయటం మంచినీటి స్నానం వంటిది. వేదాలను చదవటంతో ఋషిఋణాన్నీ, యజ్ఞాలు చేయటంతో దేవతల ఋణాన్నీ. పూజాది సత్కారాలతో అతిథిఋణాన్నీ. పితృకర్మతో పితరుల ఋణాన్నీ, చక్కని పాలనతో రంజింపచేయటం ద్వారా ప్రజల ఋణాన్నీ తీర్చాలి. విష్ణుస్తోత్రం, తపస్సు, ధర్మాచరణం - అనేవి మనస్సులో గొప్ప జ్ఞానాన్ని కలిగిస్తాయి; అయోగ్యులను యోగ్యులుగా మారుస్తాయి. ఎంతటి దుర్జనుడైనా సజ్జన సాంగత్యంతో పవిత్రుడౌతాడు. అధిక లాభం కలిగించేదైనా ఆ పని పాపంతో కూడుకొంటే చేయవద్దు. స్వల్పలాభం కలిగించేవైనా పుణ్యకార్యాలను తప్పక చేయాలి. అందువలన ఇహపరసుఖాలు కలుగుతాయి. నాలుగు వర్ణాలకు సంబంధించిన మానవులు వారి వారి వర్ణ ధర్మాలను ఆచరించటం ఉత్తమం. ఆయా ధర్మాలలో నేర్పు సంపాదించి తపస్సును ఆశ్రయించినప్పుడే ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి. మనుష్యులకు అజ్ఞానం కంటె విరోధి మరొకటి లేదు. ఫలాకాంక్ష లేకుండ సత్కర్మలు చేస్తే నిత్యుడౌతాడు. దేనితోనూ సంగం లేకుండా ఉండటం మేలు. సుజ్ఞానం సుగతి. తపస్సువలన నాశనం ఉండదు. ఇది తెలియటమే వేదార్థసారం. సూర్యుడిని కాంతి ఎట్లా వదలిపెట్టదో అట్లా ధీరుడిని జ్ఞానలక్ష్మి ఎప్పుడూ వీడిపోదు.

ప్రశ్న 95 : దమం, సత్యం, క్షమ - అనేవి సద్గుణాలుగా పెద్దలు కీర్తిస్తారు. మంచి గుణాలుగా వాటికి ఎందుకు పేరు వచ్చింది. (5.540)

ఉత్తరం : 'హంసగీత' ఈ ప్రశ్నకు తగిన సమాధానం. బంగారు హంసగా విహరిస్తున్న బ్రహ్మ సాధ్యులకు చెప్పిన విశేషాలలో కొన్ని గమనించదగినవి. వేదసారాంశం సత్యం. సత్యసారరూపం దమం. దమసారాంశం ముక్తి. సత్యాదులను

పాటించేవారికి మోక్షం కరతలామలకం. ఎవడు మనస్సునూ, మాటనూ అపమార్గంలో పోనీయకుండా రక్షిస్తాడో అతడిచేతిలోనే వేదం, తపస్సు, త్యాగం ఉంటాయని మునులు చెప్పారు. సత్యం, ఓర్పు, దమం - అనేవి మూడూ శాశ్వతమైన మోక్షాన్ని చేరుకొనటానికి నిచ్చెన మెట్లవంటివి. అవి సజ్జన సాంగత్యంవలన కలుగుతాయి. ఆత్మజ్ఞాన సంపన్నుడైన పండితుడు ఒక్కడే తనలో తాను ఆనందిస్తాడు. పెక్కురకు ప్రీతి కలిగిస్తాడు. అందరూ అతడిని గౌరవిస్తారు. బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేయటం వలన దేవత్వం పొందుతాడు. ఉపవాసాది పుణ్యకర్మలు చేయటంతో సాధువుగా ప్రశస్తి పొందుతాడు. నింద్యమైన శీలం కలవాడు దుర్జనుడుగా పిలువబడుతాడు. శౌచం పాటించకపోవటంవలన మరణభీతితో దీనుడౌతాడు.

ప్రశ్న 96 : సాంఖ్య యోగ శాస్త్రాల తారతమ్యాలను, వాటి స్వరూపాలను ఎరిగించుము. (5. 571)

ఉత్తరం : సాంఖ్యులూ, యోగులూ తమతమ మార్గాలే మేలైనవని కారణాలు నిరూపిస్తూ ప్రకటిస్తారు. కాని, నా దృష్టికి ఆ రెండు మార్గాలూ ఒక్కటే. యోగులు ప్రత్యక్ష ప్రమాణాన్ని హేతువును విశ్వసిస్తారు. సాంఖ్యులు శాస్త్ర ప్రమాణాన్ని అంగీకరిస్తారు. ఈ రెండు మార్గాలకూ గమ్యం ఒక్కటే. శాస్త్రంలో ఈ రెండూ వేరైనా ప్రాణులపట్ల హితం, మంచి నియమాలు పాటించటం, శౌచం అనేవి రెండు మార్గాలలోనూ నియతమైన కార్యాలే.

ప్రశ్న 97 : భూతదయ, సద్వ్రతధారణం, శౌచం - అనే గుణాలు సమానం కాగా సాంఖ్యయోగాలకు దర్శనం ఎట్లా వేరయింది. (5. 575)

ఉత్తరం: రాగం, మోహం, దీర్ఘ స్నేహం, కామం, క్రోధం అనే దుర్గుణాలను, తద్విరుద్ధమైన సద్గుణాలతో తొలగిస్తే యోగులకు ఆత్మోన్నతి లభిస్తుంది. పెద్దచేప వలను చించుకొని, బలిష్ఠమైన మృగం ఉరిని ఛేదించుకొని బయటపడతాయి. అట్లే యోగి స్థిరసంకల్పంతో యోగోపాయాలను నిరోధించే పాపాలను తొలగించుకొని సన్మార్గంలో సంచరిస్తాడు. విలుకాడు తదేకచిత్తుడై ఎట్లా లక్ష్యాన్ని చక్కగా ఛేదిస్తాడో, అట్లాగే యోగనిపుణుడు మోక్షలక్ష్యాన్ని సాధిస్తాడు. కత్తి వాదరపై నడకవంటి యోగనియమం ఎవడికి వశమై ఉంటుందో అతడికి సాధించలేని కార్యం ఉండదు.

కపిలాది మహామునులు చెప్పిన సాంఖ్యం ఇట్లా ఉన్నది - ఆత్మకు రెండు రూపాలు ఉన్నాయి. అందులో ఒకటి శబ్దస్పర్శాది విషయాలను శ్రోత్రం, త్వక్కు మొదలైన ఇంద్రియాల ద్వారా అనుభవిస్తూ ఉంటుంది. మరొక ఆత్మ విషయాలతో పొత్తులేకుండా తటస్థంగా ఉండి భాసిస్తూ ఉంటుంది. వాయువు ఒక్కటే కాని, దానికి చెందిన భేదాలు ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అని ఐదు విధాలుగా ఉన్నాయి. వాటిని పరిశీలిస్తే క్రమంగా పవనగమనం నిరోధించబడుతుంది. ఈ నిరోధమనే సుకృతం జీవుడిలోని అంతరాత్మను దర్శింపజేస్తుంది. జీవుడు చేసే కర్మలలో కూడా తేడాలున్నాయి. పుణ్యపాప మిశ్రకర్మలవలన మానవుడై జన్మిస్తాడు. బుద్ధిమంతుడు కర్మజాలంలో తగులుపడకుండా ముక్తి కోరి అందుకై ప్రయత్నిస్తాడు. వేయిమందిలో ఏ ఒక్కడో తన శరీరదోషాలను గ్రహించి, వాటిని త్యజించి మోక్షం సాధిస్తాడు.

ప్రశ్న 98 : దేహదోషాలంటే ఏవి. (5. 610)

ఉత్తరం : కామం, క్రోధం, భయం, నిద్ర, నిశ్శ్వాసం - అనేవి దేహగతమైన దోషాలు. వీటిని తొలగించుకొనే విధానం కూడా ఉన్నది. కోపానికి ఓర్పు, కామానికి సంకల్పరాహిత్యం, భయానికి ఏమరుపాటు లేకుండటం, నిద్రకు సత్త్వగుణ సేవనం, శ్వాసకు అల్పాహార స్వీకరణం - శత్రువులు. ఇంకా పెక్కు దోషాలను తొలగించుకొనే ఉపాయాలు ఎన్నో ఉన్నాయి. వివేకవంతుడు వాటి మార్గాలను తెలిసికొని చేపట్టి దోషాలను నిర్మూలిస్తాడు. ఈ లోకాలు విష్ణుమాయా ప్రభావంవలన కలుగుతున్నాయి. పండితుడు వీటిని గోడమీది బొమ్మలవలె, నీటిమీది నురుగువలె, బుడగలవలె భావించి మోక్షమార్గాన్ని మాత్రమే అన్వేషిస్తాడు.

ప్రశ్న 99 : ఆత్మ పరమపదం పొందే ప్రకారం? (5. 613)

ఉత్తరం : వెలుపలి స్పర్శలు అనబడే విషయ సుఖాలను తపస్సు అనే కఱ్ఱతో తొలగనెట్టి సాంఖ్య విధానాన్ని ఓడగా గ్రహించిన ఆర్యుడు ప్రజ్ఞ అనే పడవ నడిపే చుక్కానివాడి నైపుణ్యంతో సంసారమనే సముద్రాన్ని దాటుకొంటాడు. ఆ సముద్రం దుఃఖమనే నీటితోనూ, వ్యాధిమరణాలనే మొసళ్ళతోనూ, భయ మనే పాములతోనూ, హింస అనే ప్రవాహంతోనూ, విషయాసక్తి అనే బురదతోనూ, ఆశలు అనే సుడులతోనూ, సుఖసంతోషాలనే రత్నాలతోనూ, సత్యమనే గట్టుతోనూ కూడి ఉంటుంది. ఆ సముద్రాన్ని దాటిన పుణ్యాత్ముడిని సూర్యుడు తన కిరణాలతో మోసికొని పోతాడు. పిదప తామరతూడులోని దారమంతటి సూక్ష్మమైన దారిలో ప్రవేశించి అతడు పయనిస్తూ ఉండగా మిక్కిలి సూక్ష్మమైనవాడూ, చల్లనివాడూ, మంచివాసన కలవాడూ, సుఖకరమైన స్పర్శకలవాడూ, సప్తవాయువులలో శ్రేష్ఠుడైనవాడూ అయిన ప్రవహుడనే పవనుడు అతడికి ఎదురుగా పోయి, అతడిని ఆకాశంయొక్క పరమగతిని చేరేటట్లు చేస్తాడు. ఆకాశం రజస్సుయొక్క పరమగతిని, రజస్సు సత్త్వం యొక్క పరమగతినీ, సత్త్వం నారాయణుడినీ క్రమంగా చేరేటట్లు చేస్తాయి. నారాయణుడు ఆ పుణ్యాత్ముడిని చివరకు పరమాత్మతో చేరుస్తాడు. అతడు పరతత్త్వంలో లీనమై అమృతస్వరూపుడై శాశ్వతస్థితిని పొందుతాడు.

ప్రశ్న 100 : ఆ రీతిగా అమృత స్వరూపుడై నిత్యుడైన మహాత్ముడు తన పూర్వ స్థితిని తలుస్తాడా? తలంచకుండానే ఉంటాడా. (5.613)

ఉత్తరం : ధర్మరాజా! నీవు మంచి గహనమైన ప్రశ్నను చక్కగా అడిగావు. ఎంతటి ప్రజ్ఞావంతుడైనా సందేహించే విషయ మిది. కపిలమత మిది - ఇంద్రియాలు పురుషుడిని తెలియజాలవు. అవి మనస్సులో ఉంటాయి. కాబట్టి పురుషుడు మనస్సుతోడి సంబంధం వలన ఇంద్రియాలను తెలిసికొంటాడు. పురుషుడు ముక్తిని పొందినా పొందకపోయినా ఇంద్రియాలను తెలిసికొనట మనేది సమానమే. ఆత్మజ్ఞాన సంపన్నుడై అమృత స్వరూపుడైన పురుషుడు విషంలేని పాములవలె చేష్టలు లేక పడి ఉన్న ఇంద్రియాలను తెలిసికొన్నా, తెలియకపోయినా జరిగే దేమీ లేదు. అందువలన అతడి కేవిధమైన బాధలూ లేవు. ముక్తుడైన పురుషుడు ఇంద్రియాలను వర్జించినప్పుడు అవి సాగరంలోని నురుగువలె, నీటి బుడగలవలె విచ్ఛిన్నమై పోతాయి. ఈ స్థితిని పొందట మనేది ఈశ్వర విభూతి అయి ఉన్నది. అది ముక్తి పొందిన ఆత్మకు కూడా అన్వయిస్తుంది.

పరమాత్ముడైన నారాయణుడిని పొందిన జీవుడికి పునర్జన్మ లేదు. పునరావృత్తి లేని శ్రేష్ఠమైన ఈ దశనే మోక్ష మంటారు. మోక్షదశకంటె మించిన దశ మరేమీ లేదు. ఇది శ్రీమన్నారాయణ ప్రణీతమైన అక్షరమోక్షాన్ని ప్రదర్శించే పద్ధతి.

ప్రశ్న 101 : ప్రజ్ఞానిధివైన తాతా! నీవు చెప్పిన 'అక్షర' మనేది ఎటువంటిది? 'క్షర' మేది? (6.2)

ఉత్తరం : ధర్మరాజా! నీ వడిగిన విశేషం 'వసిష్ఠజనక సంవాద' మనే ఉత్తమ ఇతిహాసం వింటే తేటపడుతుంది. దాని తాత్పర్యం వినుము. కరచరణాది అవయవాలు కలిగి ఉండీ, ఆదీ, అంతం, క్షయం, వృద్ధి అనేవి లేనిదైన తత్త్వాన్ని 'అక్షరం' అంటారు పండితులు. దాని నుండి ఇరవై నాలుగు క్షరతత్త్వాలు ఆవిర్భవించాయి. క్షరతత్త్వం విక్రియను పొందుతుంది. దానిని ప్రకృతి అనీ, ప్రధానమనీ, అవ్యక్తమనీ పిలుస్తారు. ఆ విక్రియనుండి 'మహత్' అనే తత్త్వం ఆవిర్భవిస్తుంది. ఇరవైనాలుగు తత్త్వాలు ఇవి - ప్రకృతి, మహత్తు, అహంకారం, పంచభూతాలూ, పంచగుణాలూ, అయిదు జ్ఞానేంద్రియాలూ, అయిదు కర్మేంద్రియాలూ, మనస్సు, కలిసి మొత్తం ఇరవైనాలుగు. ఈ ఇరవైనాలుగు తత్త్వాలూ విజ్ఞానానికి అందుతాయి. ఇరవై అయిదవ అక్షరమైన పరమతత్త్వం విజ్ఞానానికి గోచరం కాదు. దానికి నాశం లేదు; మృతి లేదు. సత్త్వరజస్తమోగుణాలను అనుసరించటం వలన జన్మపరంపరలోనికి జారిపోయిన ఆ

అక్షరతత్త్వం తనను తాను తెలిసికొనలేక, అవే తాను అనుకొని వాటిలో నివాసం సాగిస్తూ ఉంటుంది. అక్షరానికి స్వతస్సిద్ధంగా ఏ రంగూ లేదు. కాని సత్త్వరజస్తమోగుణాలను అనుసరించటంవలన మార్పులకు లోనవుతుంది. అహంకారగుణం ఈ వికారాలకు కారణం. నిర్వికారస్థితిలో అక్షరతత్త్వం ప్రదీప్తమౌతుంది.

స్త్రీ పురుష సంబంధం వంటిదే ప్రకృతి పురుషుల పరస్పరాకర్షణ. అదే సమస్త ప్రాణికోటికీ జన్మహేతువు. వేదాలు ఇదే చెప్పుతున్నాయి. విత్తనంనుండి విత్తనమూ, దేహంనుండి దేహమూ, ఇంద్రియాలనుండి ఇంద్రియాలూ; మనస్సునుండి మనస్సూ - ఇట్లా జన్మిస్తూ ఉంటాయి. ఆత్మకు బీజం లేదు. దేహం ఉండదు. మనస్సు లేదు. ఆత్మ అనేది నిర్గుణం. అందుచేత దానికి భవబంధాలూ, భవదుఃఖాలూ, కర్మాచరణలూ - ఇట్లాంటివి ఏమీ ఉండవు. గుణాలు ప్రకృతివే కాని పరమాత్మవి కావు.

జీవుడిని అక్షరమనీ, ప్రకృతిని క్షరమనీ అంటారు. కొందరు ఈ రెంటినీ 'క్షరములు' అన్నారు. మరికొందరు 'అక్షరములు' అన్నారు. ఆద్యంతాలు లేకపోవటం, ఈశ్వర తత్త్వాన్ని కలిగి ఉండటం - ఇత్యాదులు జీవుడికీ, ప్రకృతికీ ఉన్న సాదృశ్యాలు. మహదహంకారాది ప్రకృతి గుణాలను పొందినప్పుడు పురుషుడు (జీవుడు) తనను తాను ప్రకృతిగా భావిస్తాడు కనుక అతడిని 'క్షరము' అని కూడా అనవచ్చును. ఈ ప్రకృతి పురుషుడిని పొందినప్పుడు గుణవికార రహితంగా ఉంటుంది కాబట్టి అప్పుడు దానిని నిర్గుణమనీ, అక్షరమనీ కూడా వ్యవహరించవచ్చును. ఎన్ని రూపాలలో ఈ ప్రకృతి విజృంభించినా మమకారం, అహంకారం అనేవి రెండే దీని మూల తత్త్వాలు. ఇవి రెండూ పరిహరించగలిగితే ఇంక ఈ ప్రకృతి పురుషుడిని ఏమీ చేయలేదు. నశించే ప్రకృతిని విడిచి పెట్టిన పురుషుడు (ఇరవై అయిదవ తత్త్వం) అక్షరు డనబడతాడు. తన కేవలత్వాన్ని గుర్తించి జీవుడు తనను తాను పరతత్త్వంగా దర్శించి తల్లీనుడౌతాడు. అదే నిరామయమూ అనంతమూ అయిన పదం సుమా!

ధర్మరాజా! మొట్టమొదటగా ఈ తత్త్వ రహస్యాన్ని బ్రహ్మదేవుడు వసిష్ఠుడికి తెలియజేశాడు. వసిష్ఠుడు నారదుడికి, నారదుడు నాకు ఉపదేశించాడు. నేను నీకు జనక వసిష్ఠుల సంభాషణగా బోధించాను. ఈ జ్ఞానాన్ని అలవరచుకొమ్ము. పరమానందాన్ని పొందుము.

ప్రశ్న 102 : ధర్మాధర్మాల విచారం లేనిదీ, సంశయాల నన్నింటినీ పోగొట్టేదీ, చావు పుట్టుకలు లేనిదీ, శుచిశుభ్రతలు కలిగిందీ, శాశ్వతమైనదీ, మార్పు లేనిదీ, 'పరము' అని పిలువబడేదీ, దుఃఖాన్ని పోగొట్టేదీ - అయినట్టి తత్త్వాన్ని బోధించుము. (6.79)

ఉత్తరం : నీ ప్రశ్నల కన్నింటికి సమాధానం ఇవ్వగలిగింది యాజ్ఞవల్క్య జనకరాజ సంవాద ప్రకారేతిహాసం. దాని సారాన్ని గ్రహించాలి. ఇంద్రియ మహిమలన్నీ మనస్సు చేతిలోనే ఉంటాయి. కాబట్టి మనస్సు విషయాసక్తి నుండి వెనుకకు మళ్ళితే ఇంద్రియాలు అన్నీ దానితోపాటే వెనక్కు మళ్ళుతాయి. కాని, ఇంద్రియాలు వెనకకు మళ్ళినా వాటితో పాటు మనస్సుకూడా వెనుకకు మళ్ళుతుందని చెప్పలేము. మళ్ళదుకూడా. విషయ తృష్ణలోనే సంచరిస్తూ ఉంటుంది. కాబట్టి ఇంద్రియ నిగ్రహంతోపాటు మనోనిగ్రహం కూడా అత్యవసరం. ఒక దీపంనుండి అనేక దీపాలు వ్యాప్తి చెందినట్లు ఈ ప్రకృతి అనేది గుణరూపాలను వ్యాప్తిపొందిస్తుంది. జీవాత్ముడు ప్రబుద్ధుడైతే ప్రకృతి వెంటబడిపోక శాశ్వతమైన అచ్యుతపదాన్ని పొంది అక్షరుడైపోతాడు. పురుషుడి యథార్థ రూపాన్ని గ్రహించగలిగిన జ్ఞానం ప్రకృతికి లేదు. కాని, ప్రకృతిని తెలిసికొన గలిగిన జ్ఞానం పురుషుడికి ఉన్నది. అంతే కాదు. పురుషుడు నిశ్చల దృష్టితో చూచి తనకంటె పరతత్త్వం మరొకటి లేదని కూడా గ్రహించగలడు.

సాంఖ్యంతో సాటివచ్చే జ్ఞానంకానీ, యోగంతో సాటివచ్చే బలంకానీ ఇంక ఎక్కడా - ఏ వేదశాస్త్రాలలోనూ కనిపించవు. మూర్ఖుడు ఈ రెండింటినీ వేరువేరు శాస్త్రాలుగా భావిస్తాడేమో కాని నేను మాత్రం ఒక్కటిగానే చూస్తాను.

పరిపూర్ణజ్ఞాని అయిన యోగి నిశ్చల దీపంవలె ఉంటాడు. తేనెకుండ నెత్తిమీద పెట్టుకొని ఏమరుపాటు లేకుండా మెట్టులు ఎక్కినట్లు యోగి తన ఆత్మానందరసం చిందిపోకుండా గమ్యం చేరుకొంటాడు. జనన మృత్యుభయాలతో యోగ సాంఖ్యాలను ఆశ్రయించిన యతీశ్వరులు నిర్మమత్వస్థితిలో పరతత్త్వ సాన్నిధ్యాన్ని, సుస్థిరంగా అనుభవిస్తారు. జీవాత్మ పరమాత్మల ఏకత్వ మహిమను ఎరుక పరచటమే విజ్ఞానం (విద్య) చేసే పని. దానిని పొందటమే ముక్తికి మార్గం. మరి వేరే మార్గాలు లేనే లేవే. కాబట్టి ధర్మరాజా! దానియందు శ్రద్ధ కలిగి సజ్జనులు గర్హించే శోక మోహాలను త్యజించి సుఖివి కమ్ము.

ప్రశ్న 103 : గృహస్థ ధర్మాన్ని వదలకుండా మోక్షం పొందవచ్చునా? (6.169)

ఉత్తరం : ఈ అంశాన్ని వివరించే 'జనకసులభా సంవాదం' అనే ఇతిహాసాన్ని తెలిసికొనాలి. దాని సారాన్ని ఈ విధంగా గ్రహించవచ్చును. పంచశిఖుడనే ముని జనకరాజుకు సాంఖ్యయోగాలనూ, రాజ్యపాలనాన్నీ బోధిస్తూ ఆ మూడింటా ముక్తి పొందే మార్గాలు చెప్పాడు. ముక్తికి వైరాగ్యమే మూలం. వైరాగ్యానికి జ్ఞానమే ఆధారం. కాబట్టి జ్ఞానంవలన కలిగిన విరక్తి సుఖదుఃఖాలూ, రాగద్వేషాల వంటి ద్వంద్వాలకు అతీతంగా ఉంటుంది. కాబట్టి సంసారంలో ఉండికూడా నిస్సంగుడిగా గృహస్థుడు ఉండగలడు. గృహస్థాశ్రమం వద్దు అని ద్వేషించటం కూడా ఒక సంగమే. రాగమే కాదు ద్వేషం కూడా పనికిరాదు. జ్ఞానంవలన మాత్రమే ముక్తి లభిస్తుంది.

ప్రశ్న 104 : శుకుడికి వైరాగ్యం ఎట్లా కలిగింది? (6.221)

ఉత్తరం : జీవితం బుద్బుద మని భావించకుండ పామరజనులతో కలిసి తిరుగుతున్న శుకుడిని చూచి వ్యాసుడు ఇట్లా బోధించాడు. 'నురుగుతో చేసిన పంజరంవంటిది ఈ శరీరం. ఇందులో ఒక పిట్టవలె ప్రాణం ఉంటుంది. దీనిని మరచి తిరగటం తగదు. కాలం తెలియకుండా ముందుకుసాగుతుంది. ఆయుర్దాయం ముగుస్తుంది. హంస ఎగిరిపోతుంది. సంసారం ఒక సముద్రం. చంచలమైన ఇంద్రియాలే నీళ్ళు. అరిషడ్వర్గమే మొసళ్ళు. దీనిని దాటటానికి ధైర్యం ఒక్కటే తెప్ప. దానితో తరించుము. కామాది సౌఖ్యాలతో తృప్తుడై జీవుడు ఏమరితే గొర్రెను ఎత్తుకొనిపోయే పులివలె మృత్యువు తన్నుకొనిపోతుంది. నీవు అట్లాంటి మూఢుడవు కావద్దు. మానవజన్మ బహుదుర్లభం. దాన్ని ఒక సోపానంగా చేసికొని నిచ్చెన ఎక్కి, మోక్షపదం అందుకొనాలి. భోగాలు విడిచిపెట్టి, నిస్సంగుడై, నిర్మలాంతరంగుడై నరుడు ఇంటిలో ఉండికూడా తపస్సు చేసి సంసార సముద్రాన్ని తేలికగా దాటుతాడు. భార్యపట్ల వ్యామోహం (ఆపేక్ష) అనేది కష్టాలకు ప్రారంభం. ఇహంలోనూ, పరంలోనూ అది అంతులేని క్లేశాలను కల్పిస్తుంది. అందుచేత తెలివిగలవా రెవ్వరూ భార్యాపేక్షకు పూనుకోరు, కష్టాలలో కూరుకోరు. భోగదానాలు లేని ధన మెందుకు? శత్రువులను సంహరించలేని పరాక్రమ మెందుకు? ధర్మాచరణానికి పూనుకొనని జ్ఞానం ఎందుకు? జితేంద్రియుడు కాకపోతే ఆత్మ జ్ఞాన సాధన మెందుకు?' ఈ మాటలు విన్న శుకుడికి ముక్తిమార్గం తెలిసింది. ఆత్మ జ్ఞానం గాలిసోకని దీపంవలె నిశ్చలంగా వెలిగింది. అతడు తండ్రిని వదలి వెళ్ళిపోయాడు.

ప్రశ్న 105 : వ్యాసమహర్షి పుత్రుడైన శుకుడి జన్మవృత్తాంతం, అతడు సిద్ధుడైన విధం నాకు తెలియచెప్పుము. (6.246)

ఉత్తరం : మేరుపర్వత సానువులలో కర్ణికారవనం ఉన్నది. అందులో వేదవ్యాసుడు పుత్రార్థి అయి తపస్సు చేశాడు. పార్వతీపరమేశ్వరు లక్కడకు వచ్చి, పంచభూతాలతో సమానమైన శక్తి యుక్తులు కలిగిన పుత్రుడిని వరంగా ప్రసాదించి అంతర్ధానమయ్యారు. ఒకనాడు వ్యాసుడు అరణిని మథిస్తూ ఉండగా ఘృతాచి కనపడింది. ఆమెపై కలిగిన కామభావంవలన వ్యాసుడికి వీర్యస్ఖలనం అయి అరణిలోపడి ప్రకాశించింది. అందులోనుండి తేజస్వి అయిన శుకుడు పుట్టాడు. ఆ బాలుడికి గంగాదేవి స్నానం చేయించింది. ఆకాశంనుండి కృష్ణాజినం, దండం వచ్చి పడ్డాయి. పూలవాన కురిసింది. దేవ దుందుభులు మ్రోగాయి.పార్వతీపరమేశ్వరులు శుకుడికి ఉపనయనం చేశారు.

దేవేంద్రుడు కమండలం ఇచ్చాడు. దేవతలు దివ్యవస్త్రాలు సమర్పించారు. వేదశాస్త్రాలు శుకుడిని పొందాయి. శుకుడు బృహస్పతిని గురువుగా వరించాడు. 'మోక్షాన్ని ఇచ్చేది ఏది?' అనే జిజ్ఞాస ఆతడిలో మొదలయింది. తండ్రిని మోక్షవిద్యను బోధించుమని కోరాడు. ఆయన జనకమహారాజును అడుగుమని చెప్పాడు. శుకుడు కాలినడకతో మిథిలానగరానికి చేరాడు. శాంతచిత్తుడైన శుకుడు జనకుడి అభిమానాన్ని పొందాడు. ఆ రాజిచ్చిన అతిథి సత్కారాలను నిరాసక్తతతో శుకుడు గ్రహించాడు. మరునాడు ఉదయం శుకుడు 'ముక్తిని దేనితో పొందవచ్చును?' అని జనకరాజును కోరాడు.

బ్రహ్మజ్ఞానం పుట్టుకతో వచ్చినవాడు కాని, అభ్యాస వశంతో పొందినవాడు కానీ చతుర్విధాశ్రమాల వరుసలో ప్రయాణంచేసి చివరకు ముక్తిపొందుతాడు. పూర్వ జన్మ సంస్కారం వలన ముక్తిహేతువులు సిద్ధిస్తే బ్రహ్మచర్యంలోనే జీవన్ముక్తుడౌతాడు. జ్యోతిస్స్వరూపమైన పరతత్త్వం ప్రతి వ్యక్తికీ ఆత్మలోనే ఉంటుంది. ఏకాగ్రత సాధించిన యోగి ఆ జ్యోతిని తనలోనే తాను దర్శించగలుగుతాడు. ఇతరులవలన తనకూ, తనవలన ఇతరులకూ ఏ విధమైన భయమూ లేని నిర్భయస్థితి అలవడినప్పుడు ద్వంద్వాతీత స్థితిని పొంది పరమాత్మను సాధకుడు చూడగలుగుతాడు. జనకుడి మాటలు శుకుని అనుమానాలను తీర్చాయి.

శుకుడు వాయుమార్గంలో పయనించి హిమవత్పర్వతంలోని వ్యాసాశ్రమానికి చేరాడు. వేదప్రచారంకొరకు శిష్యులు వివిధ ప్రదేశాలకు పోగా శుకుడూ, వ్యాసుడూ మాత్రమే ఆశ్రమంలో ఉంటున్నారు. ఒకనాడు నారదుడు వచ్చి తండ్రి కొడుకుల నడుమ వేదాధ్యయన వ్రతం నిరంతరంగా సాగాలని కోరాడు. వేదాధ్యయనం సాగింది. ఒకనాడు పెనుగాలి వీచింది. వాయు భూతతత్త్వాన్ని వ్యాసుడు శుకుడికి బోధించాడు. వ్యాసుడు స్నానానికి వెళ్ళినప్పుడు శుకుడు 'మానవుడికి హితమైనదేది?' అని అడుగగా నారదుడు ఇట్లా చెప్పాడు. 'సత్యమే తపస్సు. జ్ఞానమే కన్ను, త్యాగమే సుఖం, రాగమే దుఃఖం; నరుడు మోక్షం కొరకు ప్రయత్నించకుండా సంసారబంధాలలో తగుల్కొంటే మరో జన్మలో కూడా ముక్తి సాధ్యం కాదు. బంధుమిత్రుల పట్ల వ్యామోహితుడైనవాడు ఊబిలో దిగబడిన ఏనుగువలె హింసకు గురిఔతాడు. భోగలాలసుడు వలలో చిక్కుకొన్న మృగంవలె, చేపవలె గిలగిలలాడతాడు. అహింసను అలవరచుకొని అధర్మాన్ని వదలాలి. సంకల్పాలను త్యజించి ధర్మాన్ని వదలించుకొనాలి. బుద్ధిబలంతో సత్యాసత్యాలను తొలగించుకొనాలి' అని నారదుడు చెప్పగా శుకుడు సూర్యుడి దయవలన యోగసిద్ధి పొందుతానని బయలుదేరాడు. వ్యాసుడు వారించినా ఆగక కైలాస పర్వతానికి వెళ్ళి సూర్యుడి అనుగ్రహాన్ని పొందాడు. తాను యోగసిద్ధిని పొందినట్లు నారదుడికి తెలిపి, గరుత్మంతుడివలె ఎగురుతూ ఆకాశమార్గాన బయలుదేరాడు. సిద్ధులూ, సాధ్యులూ, మహర్షులూ ఆ యోగసిద్ధిని చూచి ఆశ్చర్యపోయారు. వ్యాసుడు పుత్రవ్యామోహంతో బయలుదేరాడు. శుకుడు మార్గమధ్యంలో ఉన్న మృగాలనూ, పక్షులనూ, పర్వతాలనూ, నదులనూ, కొలకులనూ, గుట్టలనూ, తీగలనూ చూచి 'మా తండ్రి నా వెంట వస్తూ నా పేరుతో పిలుస్తూ ఉంటే మీరు 'ఓ' అని బదులు పలకాలి సుమా!' అనగానే అవి అందుకు అంగీకరించాయి. శుకుడు త్రిగుణాలను త్యజించి ఉత్తరంగా వెళ్ళుతుండగా ఒక మహాపర్వత శిఖరాలు రెండు అడ్డంగా ఉన్నా, వాటిని తన గమనవేగంతో భగ్నంచేస్తూ సాగిపోయాడు. దేవతలు అతడిపై పూలవాన కురిపించారు.

శుకుడు గంగానదిపై తక్కువ ఎత్తులో పోతూ ఉండగా క్రింద ఉన్న గంగానదిలో అప్సరసలు దిగంబరంగా జలక్రీడ లాడుతున్నారు. వారంతా శుకుడిని చూచారు. కాని, ఏ వికారమూ పొందలేదు. శంకించలేదు. సిగ్గుపడలేదు. ఎప్పటివలె జలక్రీడలు సాగించారు. ఆ సమయంలో వ్యాసుడు తన కుమారుడి వెనుక గొప్ప యోగవిద్యవలన లభించిన గమనాన్ని స్వీకరించి వెంటబడ్డాడు. అప్పటికి ఆ శుకుడు వాయుమార్గం దాటి పంచభూతాలకూ అంతర్యామి అయ్యాడు. అప్పుడు వ్యాసుడు పిలిచేసరికి శుకుడికి తెలిసింది. అత డిప్పుడు సర్వభూతాత్మకుడుగా

మారిపోయాడు. కాబట్టి రూపం కనపడదు. అయినా వ్యాసుడికి వినిపించేటట్లు 'ఓ' అనే ధ్వని ఆకాశమంతటా వ్యాపించి మారుమ్రోగేటట్లు చేశాడు. వ్యాసుడు ఆశ్చర్యపోయి తన కుమారుడి అనంతమైన మహిమను తెలిసికొన్నాడు. అదే పర్వతశిఖరంమీద అట్లాగే నిలబడిపోయాడు. ఆ వ్యాసుడిని చూచి అప్సరసలు సిగ్గు ఎక్కువ కాగా అందరూ బట్టలు కట్టుకొన్నారు. దివ్యజ్ఞానం కలిగిన ఆ వ్యాసుడు - తన కుమారుడు అదే దారిలో వెళ్ళినప్పుడు వారికి శంక లేదన్న నిజాన్ని గ్రహించి, కుమారుడి విముక్త స్థితిని, తన ఆసక్త స్థితినీ గ్రహించి కుమారుడి ఔన్నత్యానికి సంతోషించాడు. తన స్థితికి సిగ్గుపడ్డాడు. అట్లా దిగులు పడుతున్న వ్యాసుడి వద్దకు గంగాధరుడు వచ్చాడు. మునులూ, సిద్ధులూ, దేవతలూ ఆ దేవుడివెంట వచ్చారు. శంకరుడు తాను ముందు వ్యాసుడికి 'పంచభూత సమవీర్యుడిని కొడుకుగా అనుగ్రహించిన' అంశాన్ని జ్ఞాపకంచేసి, విచారించవలసిన అవసరం లేదని ఓదార్చాడు. శుకుడి కీర్తి ప్రపంచం ఉన్నంతకాలం నిత్యంగా ఉంటుందని ప్రకటించాడు. వ్యాసుడు కోరితే శుకుడి నీడ అతడిని అనుసరిస్తుందని పేర్కొని, శివుడు అంతర్ధానమయ్యాడు. ఇది ఉత్తమ ఇతిహాసం. దీనిని విన్నా, చదివినా దీర్ఘాయుర్దాయాదులు కలుగుతాయి. సకలాభ్యుదయాలు సిద్ధిస్తాయి.

ప్రశ్న 106 : నాలుగు ఆశ్రమాలలోనూ ఉండేవాళ్ళు కొలిచే దైవం ఏది? (6.344)

ఉత్తరం : దీనికి తగినది నారద నారాయణ సంవాదం. దాని సార మిది - సర్వాశ్రమాలవారు కొలిచే దైవం విష్ణువు. బదరికాశ్రమంలో నివసిస్తున్న నరనారాయణులలో నారాయణ ముని వద్దకు వెళ్ళి నారదుడు నారాయణ మూల రూపాన్ని గురించి తెలిసికొన దలచాడు. ఆ తత్త్వాన్ని దర్శించదలచాడు. నారాయణుడు నారదుడిని అనుగ్రహించి ఏకాగ్రచిత్తుడిగా చేసి గగనమార్గంలో మేరు పర్వతంమీద క్షీరసముద్రపు టుత్తర తీరంలో ఉన్న శ్వేతద్వీపంలో నిరాహారులై, జితేంద్రియులై, చెమట పట్టనివారై, పరిమళయుతమైన ధవళదేహాలతో ఉన్న పురుషుల వద్దకు చేర్చాడు. తదేక దీక్షతో అనేక సంవత్సరాలు తపస్సు చేస్తే, అప్పటికి విష్ణుమూర్తి దర్శనం లభిస్తుంది. నారదుడు ఆ శ్వేతద్వీప వాసులను దర్శించి, సేవిస్తూ తానుకూడా తపస్సుకు పూనుకొన్నాడు. అతడికి విష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యాడు. ఆయన తెలుపూ, నలుపూ, పసుపూ, ఎరుపూ, గోరోచనమూ, ఆకుపచ్చ రంగులలో ఉన్నాడు. సహస్ర శిరస్సులూ, సహస్రబాహువులూ, సహస్ర పాదాలూ ఉన్నాయి. హోమవేదికా, కమండలువూ, స్రుక్కూ, స్రువమూ, అగ్నీ - వీటన్నిటినీ ధరించి ఉన్నాడు. ఓం కారాన్ని ఉచ్చరిస్తున్నాడు. గాయత్రీమంత్రాన్ని జపిస్తున్నాడు. ఇట్లా అత్యద్భుతమైన దివ్యరూపంతో స్వామి ప్రత్యక్షమయ్యాడు. నారదుడి కన్నులకు కనిపించాడు. స్వామికి మునీంద్రుడు నమస్కరించాడు. స్వామి అతడిని అనుగ్రహించి ఇట్లా నారాయణతత్త్వాన్ని వివరించాడు. దాని సార మిది -

'క్షేత్రజ్ఞుడూ, జీవుడూ, వాసుదేవుడూ, సంకర్షణుడూ - అందరూ ఒక్కటే. అంతా నేనే. వాసుదేవుడే మనస్సు, అదే ప్రద్యుమ్నం. అహంకారమే సంకర్షణుడు. అదే అనిరుద్ధం. ఇరవైనాలుగు తత్త్వాలకూ ప్రభువైన ఇరవై అయిదవ తత్త్వం నేనే. నన్ను అందుకే పంచవింశకుడు అంటారు. పరమపురుషుడిని నేనే. నా కన్నా పరమైనది మరొకటి లేదు. ఏకాగ్రచిత్తులైన యోగీశ్వరులు ఎవరిని దర్శించి నిత్యానందస్థితిని పొందుతారో ఆ పరమాత్మగా, ఆ వాసుదేవుడిగా, ఆ నిష్కలుడిగా, ఆ సాటిలేనివాడిగా నన్ను తెలిసికొనటం నీకు ఆత్మహితం'.

'ఈ సృష్టిలోని సకల ప్రాణికోటిలో అంతర్గతంగా ఉన్న ధాతుశక్తి నా కన్న భిన్నమైనది కాదు. నాలోనే ఉన్నది. అది నా మొత్తం. జీవశక్తి అనేది సర్వత్ర పరివ్యాప్తం కాకపోతే చేష్టలూ, చైతన్యాలూ ఉండవు. జీవుడు వేరు, శరీరం వేరు. ఈ వాస్తవాన్ని గ్రహించటం అత్యవసరం. ఎవడైనా జీవుడిని చూచానని అంటే అదంతా మాయ. ఆ మాయావిలాసానికి సృష్టికర్తను నేనే. జీవుడు నాకంటె భిన్నుడు కాడు. నాలోనే కలిసి ఉంటాడు. ఈ సత్యాన్ని గ్రహించటం అవసరం. భక్తిమయమైన సాధనతో ఎవడు నన్ను ఆశ్రయిస్తాడో వాడికి విముక్తిని అనుగ్రహిస్తాను.

ఆదిత్యులూ, మరుత్తులూ, వసువులూ, రుద్రులూ మొదలైన దేవగణాలూ, బ్రహ్మదేవుడూ, చతుర్వేదాలూ ఆయాగౌరవాలను పొందటం నా వలననే. బ్రహ్మదేవుడిని నేనే సృష్టించాను. ప్రపంచభారాన్ని అప్పగించాను. నేనే నివృత్తి మార్గం చేపట్టాను. ఏకాంతంగా గడుపుతాను. మధ్యస్థుడుగా ఉంటూ బ్రహ్మాదులకు అవసరాన్ని బట్టి దివ్యమూ, భవ్యమూ అయిన సహాయం చేస్తుంటాను. కొన్ని కొన్ని సమయాలలో లోకహితం కొరకు జన్మకర్మలను పూనుతూ ఉంటాను. వరాహరూపం తాల్చి హిరణ్యాక్షుడిని, నరసింహరూపం ధరించి హిరణ్యకశిపుడినీ, భృగువంశంలో పరశురాముడనై పుట్టి క్షత్రియ లోకాన్నంతటినీ, దశరథ రాముడిగా జన్మించి రావణుడినీ సంహరిస్తాను. యాదవకులంలో కృష్ణుడినై పుట్టి అర్జునుడి సహాయంతో భూభారాన్ని తొలగిస్తాను. నేను పూర్వం నరనారాయణులనే పేర్లతో రెండు రూపాలతో, ఋషిత్వంతో వెలసి జగద్రక్షణాన్ని చేస్తున్నాను. ఈ మూర్తులే తరువాత లీలామానుషరూపాలతో తమ కార్యాలను నిర్వహిస్తుండగా కంసుడు, కాలయవనుడు, మురుడు, నరకుడు, బాణుడు మొదలైన కంటకులను రూపుమాపుతాను. అందులో బాణాసురుడిని రక్షిస్తానని పూనుకొని శివుడు కుమారస్వామితో కలిసి అడ్డగించగా ఆ మహాత్ముడిని జయించటానికి బాణుడిని అవమానించాను. ఇంతకు ముందు మత్స్య కూర్మభావాలను పొంది దేవగణాలకు మేలు చేశాను. ఇంకా ధర్మరక్షణం కొరకు ఏయే పనులు చేయాలో వాటిని తప్పక నిర్వహిస్తాను. నా కర్తవ్యాలు పూర్తి కాగానే నా మూల ప్రకృతిని మరల పొందుతాను. ఈ శ్వేతద్వీప వాసులు ఏకాగ్రచిత్తంతో నన్నే స్మరిస్తారు. నీవు కూడా ఏకాగ్రచిత్తుడవు కావటంచేత నా తీరునంతా నీకు తెలిపాను'.

ఈ విష్ణు సందేశాన్ని విన్న నారదుడు బదరికాశ్రమానికి వెళ్ళి, నరనారాయణుల కీ వృత్తాంతం తెలిపి, మిగిలిన మహర్షులందరికీ నారాయణోపదేశాన్ని కర్ణరసాయనంగా అందించాడు. ఆ తరువాత బ్రహ్మ లోకంలో దీని ప్రచారం చేశాడు. ఇది వేదసారం, యోగసారం, సాంఖ్యసారం. ధర్మరాజా! ఇంతవరకూ నీవు విన్న ఉపాఖ్యానాలు ఏవీ దీనికి సరిపోవు. దీనిని శ్రద్ధగా చదివినా, వినినా, అట్టివారికి దీర్ఘాయురారోగ్య సంపదలు సమకూరుతాయి.' (భీష్మ భాషణం విని పాండుపుత్రులు దీనిని వింటూ, పఠిస్తూ, భక్తితో విష్ణుమూర్తిని స్తుతిస్తూ కాలం గడిపారు) (6.395)

* * *

ఇంతవరకు ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు భీష్ముడు సమాధానాలు చెప్పాడు. ఇకపై జనమేజయు డడిగిన ప్రశ్నలకు వ్యాసశిష్యుడైన వైశంపాయనుడు ఉత్తరాలు చెప్పాడు.

వైశంపాయనుడు : ప్రశ్న 107 : వ్యాసుడు పై ఉపాఖ్యానాన్ని భక్తితో జపిస్తూ ఆకాశమార్గాన ప్రయాణం చేసి క్షీరసముద్రానికి వెళ్ళుతుంటాడు. నిత్యమూ విష్ణుమూర్తిని దర్శించాలనీ, ఉత్తమ పూజలు ఆచరించాలనీ కుతూహల పడుతుండేవాడు.

జనమేజయుడు : ఉత్తరం : వైశంపాయనా! నీవు మోక్షం అత్యంత సుఖకరమని చెప్పుతావు. కాని లోకులందరూ భౌతిక విషయాలమీదనే అధికాసక్తి చూపుతారు. దేవతలు కూడా మోక్షాన్ని కోరక హవ్యభోజన ప్రియులై వర్తిస్తూ ఉంటారు. వా రట్లా ఉండటానికి గల కారణమేమిటి? (6.398)

వైశంపాయనుడు: వ్యాసమహర్షి కూడా ఈ ప్రపంచ స్వభావాన్ని తెలిసికొనటానికి విష్ణువును గూర్చి తపస్సు చేశాడు. నారాయణుడి దయవలన ఆ మహర్షికి దివ్యజ్ఞానం, దివ్యదృష్టీ సిద్ధించాయి. విష్ణుదేవుడి దివ్య వాక్కులవలన బ్రహ్మదేవుడు ముజ్జగాలకూ గురువనీ, ఆయన నిర్దేశించిన కర్తవ్యం వేద ప్రతిపాదితమే అనీ, విష్ణువూ అందులోనే చరిస్తాడనీ, వేదవిహితమైన యజ్ఞం కర్తవ్యమనీ, అందులో విష్ణువునకు భాగం కల్పించాలనీ, స్పష్టమయింది. బ్రహ్మదేవుడి ఆజ్ఞప్రకారం వైష్ణవ మనే యజ్ఞం దేవతలూ, మునులూ చేశారు. అందులో విష్ణువునకు భాగం కలిగించారు. విష్ణువు సంతోషించి వారిని కృతార్థులను చేశాడు. విష్ణువు హయగ్రీవరూపం

తాల్చి బ్రహ్మను అనుగ్రహించి అతడిని యజ్ఞాల కన్నిటికీ సృష్టికర్తగా, గురువుగా, అధికారిగా చేశాడు. అతడి కర్తవ్యభారాన్ని హయగ్రీవుడు గ్రహించాడు. అజ, విశ్వరూప, అమర, అమరాధినాథ, ఆద్య, వేదవేద్య, ఆత్మవేద్య, ఈశాన, అవ్యయ, తపఃఫలాత్మ - అనే విశేషణాలు ఆయా లక్షణాలను బట్టి విష్ణుమూర్తికి ఏర్పడ్డాయి. అట్టి విష్ణుమూర్తిని సేవించటం అందరి కర్తవ్యం. వ్యాసప్రోక్తమైన ఈ వృత్తాంతం వింటే సర్వ శుభాలూ, సుఖాలూ కలుగుతాయి.

ప్రశ్న 108 : గూఢములైన విష్ణునామాల నిరుక్తులను తెలియపరచండి. (6.418)

ఉత్తరం : పూర్వం అర్జునుడు ఇదే ప్రశ్న అడుగగా కృష్ణుడు నిజనామాల నిరుక్తులను తెలియపరిచాడు. వాటిని వినుము- అని నారాయణాది నామాల వ్యుత్పత్తులను చెప్పాడు. (వివరాలకు చూడండి. 6.421 - 440). ధర్మరక్షణార్థం జన్మించిన విష్ణువుకు ధర్మరాజు అనే పేరు వచ్చింది. గంధమాదన పర్వతంమీద విష్ణువు తపస్సు చేస్తున్నప్పుడు దక్షప్రజాపతి యాగం చేస్తున్నాడు. ఆ యాగానికి శివుడు కోపించాడు. దానికి యజ్ఞం భయంతో హడలిపోయి నా వక్షః స్థలాన్ని ఆశ్రయించింది. ఆ కారణంవలన నా ఉరస్స్థల రోమాలు ముంజగడ్డివలె మారాయి. యజ్ఞాన్ని వెన్నంటి వస్తున్న శివుడు విష్ణువుతో కలియబడ్డాడు. శివుడు గొడ్డలిరూపంలోని బాణాన్ని ప్రయోగించాడు. విష్ణువు పరశురూపంలోని బాణాన్ని ఖండించాడు. అందువలన 'ఖండపరశువు' అనే పేరు విష్ణువుకు సిద్ధించింది.

శివకేశవుల మధ్య ఏర్పడిన ఆ యుద్ధంలో ఎవరు గెలిచారో చెప్పమని అర్జునుడు అడిగాడు. శ్రీకృష్ణ డిట్లా చెప్పాడు. శివకేశవుల యుద్ధం భయంకరమై లోకాలకు సంక్షోభం కలిగించింది. బ్రహ్మాది దేవతలు రణరంగానికి వచ్చి వారిరువురిని స్తుతించి, శివకేశవాభేదాన్ని స్మరించారు. వేదవేద్యమూ, అద్వంద్వమూ, నిర్గుణమూ, అమూర్తమూ అయిన మూలతత్త్వం ఒకటే అయినా, లోకం కొరకని రెండు రూపాలు ధరించి శివకేశవు లనబడుతున్నారు కాని, నిజానికి శివకేశవులకు భేదం లేదు - అని బ్రహ్మాదులు కీర్తించారు. శివకేశవులు తమ మైత్రి చిహ్నాలను ధరించారు. శ్రీవత్సం త్రిశూలానికి ప్రతీక. శివుడి కంఠంపై నీలిమ విష్ణువుచేతి ముద్ర. ఈశానుడూ, అభవుడూ, అమృతుడూ అయిన శివరూపాలుకూడా ఆరాధ్యాలే. హరిహరాత్మకుడైన కృష్ణుడు రక్షించాడు కాబట్టి కురుసంగ్రామంలో అర్జునుడికి విజయం లభించింది. కృష్ణుడుగా విష్ణువు నొగలెక్కి రక్షించాడు. అగ్రభాగంలో శూలపాణిగా రుద్రుడు సంచరిస్తూ అర్జునుడికంటె ముందే శత్రువులను సంహరించాడు.

ప్రశ్న 109 : నరనారాయణ నారద సల్లాప ప్రకారం వినిపించుము. (6. 463)

ఉత్తరం : నరనారాయణు లడుగగా నారదు డీ క్రింది విశేషాలు చెప్పాడు. వాటి సార మిది - శ్వేతద్వీపం అనేది శాంతి స్వరూపం. అందులో సూర్యచంద్రకాంతులు కానీ, వాయుప్రసారం కానీ ఉండవు. విష్ణువుకు ఇష్టులైన ఏకాగ్రచిత్తులే అందులో ఉంటారు. నారదుడు బదరికాశ్రమంలో ఏకాగ్రచిత్తుడై వేయి దివ్యసంవత్సరాలు తపస్సు చేసి హిమవత్పర్వతంలోని తన ఆశ్రమం చేరి మునులచేత సేవించబడుతూ ఉన్నాడు. జనమేజయా! నీవు కూడా విష్ణుమూర్తినే ఆశ్రయించుము. విష్ణుభక్తి నిన్ను ముల్లోకాలలోనూ మహోన్నతుడిని చేస్తుంది. అందరికీ శ్రీవిష్ణువే ఆత్మ. విష్ణువును ద్వేషిస్తే తమ ఆత్మలను తామే ద్వేషించుకొన్నట్లే ఔతుంది. వ్యాసుడినే సాక్షాత్తు నారాయణుడిగా తెలిసికొనుము.

ప్రశ్న 110 : విష్ణువు హయగ్రీవరూపం ఎందుకు ధరించాడు? (6.478)

ఉత్తరం : ప్రళయకాలంలో విష్ణువు యోగనిద్రలో మునిగి, జగత్తులను మరలా సృష్టించాలని సంకల్పించాడు. వెంటనే అహంకారం ఆవిర్భవించింది. దానికి బ్రహ్మ అనే పేరు ఏర్పడింది. బ్రహ్మ నాలుగు వేదాలను సృష్టించాడు. విష్ణువునుండి వెలువడిన త్రిగుణాలలో సత్త్వగుణంలో బ్రహ్మ ఉండిపోయాడు. రజస్తమోగుణాల నుండి మధు కైటభు లనే రాక్షసులు పుట్టారు. వారు నాలుగు వేదాలనూ అపహరించుకొనిపోయి కట్టగా కట్టి పాతాళంలో

పారవేశారు. వేద రక్షణకై బ్రహ్మదేవుడు విష్ణువును స్తుతించాడు. ఆయన హయగ్రీవరూపంతో వేదాన్వేషణం చేసి పాతాళంనుండి వేదాలను ఉద్ధరించి బ్రహ్మకు అందించాడు. మధుకైటభులు విష్ణువుపై దండెత్తారు. ఆతడు ఆ వేదకంటకులను సంహరించాడు. వివిధావతారాలను ధరించిన విష్ణుమూర్తి తత్త్వం బహువిచిత్రంగా ఉంటుంది. గుణవంతుడూ, గుణరహితుడూ, గుణస్రష్ట, గుణహర్తా, గుణనిబద్ధుడూ, గుణవిముక్తుడూ - అన్నీ ఆయనే. వేదాలూ, యజ్ఞాలూ, సకల పుణ్యకార్యాలూ, పంచభూతాలూ - అన్నీ నారాయణ స్వరూపాలే.

ప్రశ్న 111 : ఐకాంతికత్వం అంటే ఏమిటి? (6.493)

ఉత్తరం : ఐకాంతికత్వం సాంఖ్యయోగశాస్త్రాల సారం. శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించిన గీతలోని సారం తెలియదగింది. ఏకాంతిక ధర్మానికి అహింసయే మూలం. ఆ ధర్మంలోనే హరి సంప్రీతుడౌతాడు. హరి అన్నా క్షేత్రజ్ఞుడన్నా ఒకడే. విష్ణువు చతుర్వ్యూహాలలో దర్శనమిస్తాడు. విష్ణువు ప్రథమ వ్యూహం వాసుదేవావతారం. ద్వితీయవ్యూహం సంకర్షణుడు. తృతీయవ్యూహం ప్రద్యుమ్నుడు. చతుర్థవ్యూహం అనిరుద్ధుడు. విష్ణువు ఇంద్రియాలకు గోచరం కాడు. అద్వితీయమైన భక్తివలననే అతడు సాధ్యుడు. భక్తి కుదరాలంటే తపస్సూ, ఇంద్రియ నిగ్రహం ఉండాలి. శాంతిపట్ల ప్రగాఢమైన నిష్ఠకల వ్యక్తికి ఏకాంతిక ధర్మం కరతలామలకం. అది చింతలన్నింటిని తొలగిస్తుంది.

ప్రశ్న 112 : ఉత్తమ వ్రతమైన ఐకాంతిక ధర్మాన్ని వదలి ప్రజలు ఏవేవో ధర్మాలను ఎందుకు పాటిస్తున్నారు? (6.504)

ఉత్తరం : లోక ప్రవృత్తి త్రిగుణాత్మకం. సాత్త్విక గుణసంపన్నులే ఐకాంతిక వ్రతాన్ని పాటిస్తారు. వారిది నివృత్తి ధర్మం. మిగిలిన వారిది ప్రవృత్తి ధర్మం. ఐకాంతిక జనులు ఎల్లప్పుడూ విష్ణుహృదయంలోనే ఉంటారు. వారికీ హరికీ భేదమే లేదు. గురువైన వ్యాసమహర్షి చెప్పగా మేము విన్నాము. నీవు కూడా ఈ పవిత్ర ధర్మాన్ని ఆచరించి పవిత్రుడవు కమ్ము.

ప్రశ్న 113 : సాంఖ్యమనీ, యోగశాస్త్రమనీ, పాశుపతమనీ - ఇట్లా జ్ఞాన మార్గాలు రకరకాలుగా ఉన్నాయి. వీటి నిష్ఠ లెటువంటివి? వీటి ప్రవర్తకులు ఎవరు? (6.512, 513)

ఉత్తరం : ముందుగా వ్యాసమహర్షికి నమస్కరిస్తున్నాను. ఆయనే లోకాలకన్నిటికీ ఉపదేశకుడు. వేదాలకు నిధి. భారతాధ్యయన కారకుడు. వేదశాస్త్రాలన్నింటికీ పరమగమ్యం, ఆశ్రయం శ్రీమన్నారాయణుడే. ఆయన జ్ఞాన స్వరూపుడు. ఆయనను అందుకొనటానికి శాస్త్రనిష్ఠ అవసరం. వేదాల ఉపదేశకుడు అపాంతరతముడనే పేరుకల వేదవ్యాసుడు; సాంఖ్యానికి కపిలుడు; యోగానికి హిరణ్యగర్భుడు; పాశుపతానికి శివుడు; పాంచరాత్రానికి విష్ణువూ ప్రవర్తకులు. పాంచరాత్రం వైష్ణవం అనబడుతుంది.

ప్రశ్న 114 : వేదవ్యాసుడు పరాశరపుత్రు డని ప్రసిద్ధి. ఆయనకు నారాయణ పుత్రు డనే ప్రఖ్యాతి ఎట్లా ఏర్పడింది? (6.517)

ఉత్తరం : ఆదికాలంలో శ్రీమన్నారాయణుడు ప్రజాసృష్టిచేయటం కొరకు నాభికమలంనుండి బ్రహ్మను సృష్టించాడు. ఆయన సకల భూతాలనూ సృష్టించాడు. బ్రహ్మముఖంనుండి వేదాలు ప్రసరించాయి. ఆ వేదాలకు మేలు చేయటం కొరకు అపాంతరతముడనే పేరుగల ఒక మహాజ్ఞానిని పుత్రుడిగా పొందాడు. అతడిని ఏకాగ్రతతో వేదాలను అధ్యయనం చేయు' మనీ, 'వాటిని అందంగా విభజించు'మనీ ఆజ్ఞాపించాడు. అపాంతరతము డాపని చేశాడు. దానికి విష్ణువు సంతోషించి 'నీవు నాకు పుత్రుడవై మన్వంతరాలన్నింటిలోనూ అత్యధికంగా ప్రకాశించుము. నీకు మరికొన్ని జన్మలు లభిస్తాయి. నా కథలూ, ముల్లోకాలలో ఆచరించవలసిన ఆశలూ, అఖిల ధర్మాలూ మనస్సులో దర్శించి త్రికాలజ్ఞుడవై మహర్షులలోకెల్లా ఉత్తముడుగా విరాజిల్లుము. భవిష్యత్కాలంలో నీవు పరాశరుడికి పుత్రుడుగా పుట్టి ప్రకాశిస్తావు. నీ వలన జన్మించిన వారే కురుసామ్రాజ్యాన్ని పరిపాలిస్తారు. ఆ రాజులు పరస్పర రోషాలతో యుద్ధానికి దిగుతారు. వంశ వినాశనం ఔతుంది. కాలదోషంవలన వేదాలు సంకీర్ణమౌతాయి. వాటిని నీ బుద్ధి వైభవంతో మరల నాలుగుగా విభజిస్తావు. దేవతలకూ, ఋషులకూ ఆనందం కలిగిస్తావు.ధర్మసందేహాలన్నీ నీ వాక్కులతో తీరుతాయి.

నిన్ను అఖిల సంశయవిచ్ఛేదకు డనీ, పుణ్యాత్ము డనీ, లోకహితవాణి అనీ ప్రజలు కీర్తిస్తారు. నీవు విరాగివి కాలేవు. కాని, ఒక విరాగి నీకు కుమారుడుగా జన్మిస్తాడు. శాస్త్రాలనూ, ఆగమాలనూ, అనుసరించే బుద్ధితోపాటు నీ అంతరంగంలో సాంఖ్యయోగాలు కూడా వికసిస్తాయి' - అని చెప్పి నారాయణుడు అంతర్ధానుడైనాడు. అట్లా పరాశరపుత్రుడు ఆదినుండి నారాయణపుత్రుడే.

* * *

ధర్మరాజు ప్రశ్న 115 : తాతా! రాజనీతి మొదలుకొని అన్ని ధర్మాలూ చెప్పావు. వీటిలో ఏది ఉత్తమ ధర్మమో చెప్పుము. (6.543)

భీష్ముడు : ధర్మశాస్త్రాలలో చెప్పే తంత్రాలన్నీ పనికివచ్చేవే. ఒక్కటికూడా పనికిరానిది లేదు. ఎవరికి నచ్చిన ధర్మశాస్త్రాన్ని వారు అనుసరిస్తారు. అదే వారి కోరికలు పండటానికి దోహదం చేస్తుంది. తమకు తగిన ధర్మాలను అనుసరించేవారిని లోకంలో ఎంతమందిని మనం చూడటం లేదు? త్రిలోక సంచారి అయిన నారదుడిని ఒకసారి ఇంద్రుడు 'నారదా! నీవు తిరిగిన చోటులలో ఏదైనా అద్భుతం చూచావా?' అని అడుగగా మహాపద్మనగరంలో వసించే భృగుడనే విప్రుడి కథ చెప్పాడు. (6.546) ఈ పుణ్యోపాఖ్యాన సారంవలన తెలియదగిన అంశాలు : (1) బ్రహ్మచర్యం ద్వారా కొందరూ, గృహస్థధర్మాచరణం ద్వారా కొందరూ, తపస్సుతో కొందరూ, నిష్కర్మత్వంతో కొందరూ, యజ్ఞాలద్వారా కొందరూ, దానధర్మాల ద్వారా కొందరూ ఆత్మదర్శనం పొందుతూ ఉంటారు. తల్లిదండ్రులను సేవించి కొందరూ, భక్తితో కొందరూ, సచ్ఛీలంతో కొందరూ, శాంతస్వభావంతో కొందరూ, ఇంద్రియ నిగ్రహంతో కొందరూ, సత్యవాక్య నియమంతో కొందరూ, అహింసావ్రతంతో కొందరూ - ఇట్లా ప్రజలు వేరే వేరే మార్గాలలో ముక్తి పదం పొందుతారు. (2) గురువుపట్ల భక్తి శిష్యులకు వ్రతం. వేదతత్పరత బ్రాహ్మణులకు వ్రతం. లోకరక్షణ రాజులకు వ్రతం. న్యాయంగా ధనం సంపాదించటం వైశ్యులకు వ్రతం. పై మూడు వర్ణాలవారినీ సేవించటం శూద్రులకు వ్రతం. రాజాజ్ఞను శిరసావహించటం భటులకు వ్రతం. సర్వాశ్రమాలవారికీ ఉపకారం అందించే గృహస్థాశ్రమం మీద ప్రేమ అందరికీ వ్రతం. వైరాగ్యబుద్ధి యోగికి వ్రతం. పాతివ్రత్యం భార్యకు వ్రతం. (3) మౌనంవలన జ్ఞానమూ, దానంవలన అభ్యుదయమూ, ఆశలు తీర్చినందువలన నరకాలు తప్పిపోయిన సుఖమూ లభిస్తాయని పెద్దలు చెప్పుతారు. (4)క్రోధం కారణంగానే కార్తవీర్యార్జునుడు పరశురాముడి చేతిలో మరణించాడు. క్రోధం కారణంగానే దశకంఠుడు దశరథరాముడి చేతిలో సమసిపోయాడు. ఇంకా చాలా మంది కోపంవలన దెబ్బతినినవారు ఉన్నారు. కాబట్టి కోపాన్ని వదలుకొనటం ఎవరికైనా ఎప్పటికైనా మేలు. (5)అద్భుతాల కన్నింటికీ నిలయం సూర్యుడే. అతడినుండే సకల ప్రాణికోటీ జన్మిస్తున్నదంటే ఇంతకంటె ఆశ్చర్యం ఏమి ఉంటుంది? వాలఖిల్యాది ఋషులూ, సిద్ధులూ, దేవతలూ - అందరూ సూర్యుడి కిరణాలలోనే - చెట్టు కొమ్మమీద పిట్ట లున్నట్లు - నివసిస్తూ ఉంటారు. ఇది అద్భుతం కాదా! సూర్యగోళం నుండి వెలువడే వాయువు గోళం మధ్యలో ఉండే దట్టమైన కాంతితో కలిసి వర్షం కురుస్తుంది. ప్రపంచంలో ఎక్కడయినా ఇట్లాంటి అద్భుతాలు ఉన్నాయా? సూర్యుడే వర్షాలు కురిపిస్తాడు. మళ్ళీ అతడే తన కిరణాలతో నీటినంతటినీ వెనుకకు లాగికొంటాడు. సూర్యుడివలననే విత్తనాలు భూమిలో మొలకెత్తుతున్నాయి. పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు సూర్యమండలంలోనే ప్రకాశిస్తుంటాడు. ఇంతకంటె ఆశ్చర్య మేముంది? (6) ఉంఛవృత్తి ఉత్తమోత్తమ వ్రతం. ఉంఛవృత్తితో జీవించేవాడూ, నిశ్చలమైన మనస్సు కలవాడూ, నిష్ఠతోకూడిన నియమాలు కలవాడూ, కందమూలఫలోదక మారుతాలు మాత్రమే ఆహారంగా స్వీకరించేవాడూ, నిరాకాంక్షుడూ, సర్వభూతహితం కోరేవాడూ, మునీశ్వరుడూ అయిన మహానుభావుడు పరమాత్మతో అద్వైత సిద్ధి పొందుతాడు. ఇది అత్యద్భుతం. సర్వసమతా దృష్టి తత్త్వదర్శనం. (7) సమస్త భూతాలపట్ల సమదృష్టి, ఆదృష్టితో కూడిన నిష్కామత్వం ధర్మాలలో కెల్ల ఉత్తమ ధర్మం. నిరతిశయానందానికి అది నిలయం.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము

### రెండవ భాగము

# విషయసూచిక

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - చతుర్థాశ్వాసము

**శ్రీశ్రిత వక్షస్థల! గౌ । రీశ్రిత వామాంగ! సుభగ రేఖా సంప**
**త్త్యశ్రాన్త తనూలలిత! స । మాశ్రిత జన నిత్య ఫలిత! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= హరిహరనాథుడా!; శ్రీ= లక్ష్మిచేత; శ్రిత= ఆశ్రయించబడిన; వక్షస్థల!= రొమ్ము భాగం కలవాడా!; గౌరీ= పార్వతిచేత; శ్రిత= ఆశ్రయించబడిన; వామ+అంగ!= ఎడమ శరీరం కలవాడా!; సుభగ= ఇంపైన; రేఖా= (సౌందర్య) రేఖల; సంపత్తి= సంపదచేత; అశ్రాన్త= వాడిపోని; తనూ= శరీరముచే; లలిత= సుకుమారమైనవాడా!; సమ్+ఆశ్రిత జన= బాగుగా ఆశ్రయించిన (శరణుజొచ్చిన) జనులకు; నిత్య= ఎల్లప్పుడు; ఫలిత!= ఫలితమైన (ప్రయోజనకరమైన)వాడా!; హరిహరనాథా!= హరిహరనాథుడా!

**తాత్పర్యం:** వక్షస్స్థలాన లక్ష్మిని, వామభాగాన గౌరిని ధరించి ఇంపైన రేఖాసంపదలతో శరీర సౌకుమార్యం వాడని వాడా! ఆశ్రితజనులకు నిత్యమూ ఫలితాలు అందించేవాడా! హరిహరనాథ దేవా!

**విశేషం:** కావ్యాలను అంకితం చేసినవారు, అంటే కవులు, తమ కావ్యస్వీకర్త లను అంకితం గ్రహించినవారిని సంబోధించిన తరువాతే ఆశ్వాస ప్రారంభంగాని, ఆశ్వాస సమాప్తిగాని చేయాలి. కావ్యమంతటిని ఆ స్వీకర్తకు వినిపిస్తున్నట్లుగా పేరుపెట్టి పిలిచి ఆ తరువాత కథ ప్రారంభం చేస్తారు కవులు.

### భీష్ముఁడు ధర్మజునకు సర్వోత్తమంబగు ధర్మంబు సెప్పుట (సం. 12-168-2)

**వ.** **దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నట్లు బహు ప్రకారంబుల శాంతనవుండు వివరింప రాజధర్మంబులు విని ధర్మనందనుండు దమ్ములుం దానును బ్రియం బందె; నమ్మందాకినీ నందనుం డతనితో 'నా యెఱింగిన తెఱంగునం బ్రజ్ఞాకరంబులగు వాక్యప్రకరంబు లుపన్యసించితి; నింకనేమి విన నిచ్చ సేసెద?' వనిన నా దేవవ్రతునకు నన్నరదేవోత్తముండు వినయం బెసఁగ వినతుండై.** 2

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయనుడు అనే పేరుగల వ్యాస శిష్యుడయిన ఋషి; జనమేజయునకున్= జనమేజయుడు అనే మహారాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; బహు ప్రకారంబులన్= అనేక విధాలుగా; శాంతనవుండు= శంతనుడి తనయుడు - భీష్ముడు; వివరింపన్= వివరంగా చెప్పగా; రాజధర్మంబులు= రాజుయొక్క విధులు; విని= ఆలకించి; ధర్మనందనుండు= ధర్ముడి (యముడి) తనయుడు ధర్మరాజు; తమ్ములున్+తానును= తమ్ములూ, తానూ; ప్రియంబు+అందెన్= ప్రీతిని పొందాడు; ఆ+మందాకినీ నందనుండు= ఆ గంగానది తనయుడు - భీష్ముడు; అతనితోన్= ఆ ధర్మరాజుతో; నా+ఎఱింగిన తెఱంగునన్= నేను తెలిసికొన్న విధంగా; ప్రజ్ఞాకరంబులు+అగు= బుద్ధిని కలిగించెడి; వాక్యప్రకరంబులు= మాటల సమూహాలను; ఉపన్యసించితిన్= తెలియ బలికాను; ఇంకన్= ఇంకా; ఏమి వినన్+ఇచ్ఛ+చేసెదవు?= ఏమి వినటానికి కోరుచున్నావు?; అనినన్= అనగా; ఆ దేవవ్రతునకున్= ఆ దేవవ్రతుడు అనే పేరుగల

భీష్మునికి; ఆ+నరదేవ+ఉత్తముండు= ఆ రాజులలో శ్రేష్ఠుడు; వినయంబు+ఎసఁగన్= అణకువ కనుపించగా; వినతుండు+ఐ= నమస్కరించినవాడై.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! పూర్వకథ అనంతరం మళ్ళీ ఆ వైశంపాయన ఋషి తన ఎదుటగల జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు. ఆ విధంగా అనేక విధాలయిన రాజధర్మాలను భీష్మ పితామహుడు వివరించి చెప్పగా, ధర్మరాజూ, అతని తమ్ములూ విని సంతోషించారు. తరువాత మళ్ళీ ఆ తాతగారు మనుమడితో 'నాకు తెలిసినంతవరకు ప్రజ్ఞను పెంచే మాటలు అనేకం నీకు వినిపించాను. ఇంకా ఏమి వినటానికి ఉత్సహిస్తున్నావు?' అని అన్నాడు. దానికి బదులుగా ఆ ధర్మరాజు అణకువతో నమస్కరించి తిరిగి తన కోరికను ఇట్లా పేర్కొంటున్నాడు.

**క. 'రాజోచిత ధర్మంబుల । యోజ విశదభంగిఁ జెప్పి తుజ్జ్వల విసర**
**తేజోధన! నాకు సకల । భూజన పరమ హిత ధర్మముం దెలుపు దయన్. 3**

**ప్రతిపదార్థం:** ఉత్+జ్వల విసరత్+తేజస్+ధన!= బాగుగా ప్రకాశించే, వ్యాపించే, కాంతియే ధనంగా కలవాడా!; రాజ+ఉచిత ధర్మంబుల(న్)= రాజులకు తగిన ధర్మాలను; ఓజన్= క్రమంగా; విశదభంగిన్= స్పష్టమైన రీతిలో; చెప్పితి(వి)= పలికితివి; నాకున్= రాజునైన నాకు; సకల భూజన పరమహిత ధర్మమున్= ఎల్ల పుడమి జనులకు మిక్కిలి మేలు అయిన ధర్మమును; దయన్= దయతో; తెలుపు(ము)= తెలియజెప్పుము.

**తాత్పర్యం:** ఉజ్జ్వలమై వ్యాపించే తేజస్సుతో వెలుగుతున్న ఓ పితామహా! ఇంతవరకు రాజునైన నాకు రాజోచితధర్మాలు స్పష్టంగా క్రమంగా వినిపించావు. ఇపుడు నేను ఈ సకల భూజనులకూ గొప్ప మేలు కలిగించగల ధర్మమేదో, దానిని తెలిసికొనాలి అనుకొంటున్నాను. దయతో దానిని తెలియజెప్పుము.

**క. ఉత్తమ మెయ్యది?' నావుడు । నత్తటినీ నందనుఁడు సమాదర సమ్య**
**క్చిత్తుఁ డగుచు నక్కురు భూ । పోత్తమునకు నిట్టు లనియె నుర్వీనాథా! 4**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ రాజా!; ఉత్తమము+ఏ+అది= శ్రేష్ఠము ఏది?; నావుడున్= అనిన అనంతరం; ఆ+తటినీ నందనుఁడు= ఆ నదీతనయుడు భీష్ముడు; సమ్+ఆదర సమ్యక్+చిత్తుఁడు+అగుచున్= మంచి ఆదరంతో తిన్ననైన మనస్సు కలవాడై; ఆ+కురుభూప+ఉత్తమునకున్= ఆ కురురాజులలో శ్రేష్ఠునకు - ధర్మరాజునకు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఏది సర్వోత్తమ ధర్మం?' అనే ధర్మజుడి ప్రశ్న విన్న వెంటనే ఆ గంగాతనయుడైన భీష్ముడు మంచి ఆదరంతో తన మనస్సును తేటపరచుకొని ఆ కురురాజశ్రేష్ఠుడితో ఇట్లా అన్నాడు. ఓ రాజా!

**తే. 'విను మనేక విధంబుల విస్తరిల్లు । ధర్మములయం దొకండును దలఁప నిష్ఫ**
**లంబు లే; దాత్మ మోక్షావలంబి యైన । ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞు లధిప! 5**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; వినుము= ఆలకింపుము; అనేకవిధంబులన్= అనేక పద్ధతులతో; విస్తరిల్లు= వ్యాపించే; ధర్మములలఅందున్= విధి నిషేధ రూపమైన ఆచార వ్యవహారాలలో; ఒకండును= ఒక్కటికూడా; తలఁపన్= ఆలోచించగా; నిష్ఫలంబు లేదు= ఫలితంలేనిది లేదు; తత్త్వజ్ఞులు= ధర్మముల స్వరూప స్వభావాలు తెలిసినవారు; ఆత్మమోక్ష+అవలంబి+ఐన ధర్మము= తన మోక్షంకొరకు అవలంబించిన ధర్మం; ఉత్తమము+అండ్రు= శ్రేష్ఠం అంటారు.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. ధర్మం అనేక విధాలుగా విస్తరిల్లి ఉన్నది. దానిలో ఎంతగా వైవిధ్యమున్నా, మరెంతగా విస్తృతి ఉన్నా, మొత్తంమీద సర్వమూ ఆచరణయోగ్యమే. దానిలో ఒక్కటి కూడా ఫలితం సాధించలేనిది లేదు. కాని, ధర్మతత్త్వం తెలిసినవారు మాత్రం తమకు ముక్తిని ప్రసాదించగలదే శ్రేష్ఠధర్మమని పలుకుతారు.

**విశేషం:** ధర్మాలు సమయ సందర్భాలనుబట్టి దేశకాలాలనుబట్టి అనేక విధాలుగా ఉంటూ ఉంటాయి. కొన్ని సందర్భాలలో వాటిలో భేదాలు, మరికొన్ని సందర్భాలలో సాదృశ్యాలూ కనిపించవచ్చును. ఏది ఎట్లా ఉన్నా ధర్మమన్న ప్రతిదీ ఆచరణకు ఉద్దిష్టమైనదే. ఆచరిస్తే తప్పక ఫలితాన్ని అందించేదే. నిష్ప్రయోజనమైన ధర్మం ఉండదు. అయితే ఆ ప్రయోజనాలలో హెచ్చు తగ్గులు ఉండవచ్చును. ఆ దృష్టితో చూచినప్పుడు అన్ని ప్రయోజనాలకు చివరిదైన మోక్షమనే దాన్ని ఒసగగల ధర్మమే శ్రేష్ఠం.

**క.** **ప్రియములు నప్రియములును హృ । దయమునఁ బొరయమియ మోక్షదంబగు ధర్మం**
**బయమహితా! తద్బోధ వి । షయ మగు నితిహాసముం బ్రసన్నాకృతిగన్.** **6**

**ప్రతిపదార్థం:** అయమహితా!= శుభములచే మహనీయుడా!; ప్రియములున్= ఇష్టములును; అప్రియములును= అనిష్టములును; హృదయమునన్= మనస్సునందు; పొరయమి+అ= కలుగకుండుటయే; మోక్షదంబు+అగు= మోక్షమును ఇచ్చేది అయిన; ధర్మంబు= ధర్మం - విధినిషేధరూపమైన ఆచారం; తద్+బోధ విషయము+అగున్= ఆ జ్ఞానము గోచరించెడిదగు; ఇతిహాసమున్= పూర్వచరిత్రను; ప్రసన్న+ఆకృతిగన్= స్పష్టమైన రూపం కలిగేటట్లుగా.

**తాత్పర్యం:** ఓ రాజా! ఇష్టానిష్టాలను హృదయంలో కలుగకుండా చూడగలగటమే మోక్షప్రదమయిన ధర్మం. శుభకరమైన కార్యాల యెడ ప్రీతిగల ఓ ధర్మనందనా! ప్రియాప్రియాలు మనస్సులో కలుగకుండా జీవించటం ఎట్లా సాధ్యమో, ఎప్పుడు అటువంటి మానసిక స్థైర్యం మానవుడికి సిద్ధిస్తుందో తెలియజేసే పూర్వకథ ఒకటి స్పష్టంగా వినిపిస్తాను.

**విశేషం:** చెప్పటానికి సులభంగా ఉన్నదిగాని, ఈ ధర్మం ఆచరణలో అత్యధిక జనులకు అసాధ్యం. శుభాశుభాలు, ప్రియాప్రియాలు, సుఖదుఃఖాలు వంటి ద్వంద్వాలు సృష్టిలో జీవరాశులన్నిటికి వలె మానవునకూ సంక్రమిస్తాయి. అయితే జ్ఞానబలంగల విశిష్ట మానవుడు మాత్రం ఈ ద్వంద్వాలకు అతీతంగా తన మనస్సును నిలుపగలుగుతాడు.

**వ.** **చెప్పెద నాకర్ణింపుము. సేనజితుం డనురాజు పుత్త్రశోకార్తుం డయి యున్నయెడఁ దదాప్తుండగు విప్రుం డతని కిట్లనియె.** **7**

**ప్రతిపదార్థం:** చెప్పెదన్= పలికెదను; ఆకర్ణింపుము= వినుము; సేనజితుండు+అనురాజు= సేనజితుడు అనే పేరుగల రాజు; పుత్రశోక+ఆర్తుండు+అయి= కొడుకు ఎడబాటువలన దుఃఖంతో బాధనొందినవాడై; ఉన్న+ఎడన్= ఉన్న సమయాన; తద్+ఆప్తుండు+అగు= అతడి స్నేహితుడయిన; విప్రుండు= బ్రాహ్మణుడు; అతనికిన్= ఆ రాజునకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సేనజితుడనే రాజు పుత్రమరణంతో కలిగిన శోకంతో ఆర్తిగొని ఉన్న సమయాన అతడి స్నేహితుడైన ఒక బ్రాహ్మణుడు, ఆతడికి ఇట్లా హితబోధ చేశాడు.

**క.** **'ఇది యేమి? శోకమున వం । దెదు? పుట్టిన వారి కెల్లఁ దెరు వారయఁగా**
**నిదియె; భవత్సుతుఁ డొకనికె? । వదలు వనట; మూఢునట్ల వనరం దగునే?'** **8**

**ప్రతిపదార్థం:** ఇది+ఏమి?= ఈ స్థితి ఎందుకు?; శోకమునన్= ఎడబాటువలన దుఃఖంతో; వందెదు?= చింతించెదవు?; పుట్టినవారికి+ఎల్లన్= పుట్టినట్టి అందరికీ; తెరువు= పద్ధతి, గతి; ఆరయఁగాన్= పరిశీలిస్తే; ఇదియె= ఇదే; భవత్+సుతుఁడు+ఒకనికె?= నీ కొడుకు ఒక్కనికేనా?; వనట= దుఃఖం; వదలు= విడువుము; మూఢు+అట్ల= తెలివిలేనివాడివలె; వనరన్= దుఃఖించగా; తగునే?= తగునా?

**తాత్పర్యం:** శోకంతో విలపించటం ఏమిటిది? ఈ సృష్టిలో పుట్టిన ఎల్లవారికీ తప్పనిసరి గతి ఇది - ఆలోచించి చూస్తే అటువంటప్పుడు ఈ గతి నీ కొడుకుకు ఒక్కడికే ఈ భూమిమీద జరిగినట్లు బాధపడటం మూఢత్వమౌతుంది. దుఃఖించటం మానుము. దుఃఖం ఈ సందర్భాన యుక్తమా! ఆలోచించుము.'

**వ. అనిన విని యజ్జనపతి 'నీ వేమిటంజేసి వగపు వారిం?' తనవుడు నతం డతని కిట్లనియె. 9**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+జనపతి= ఆ రాజు; నీవు+ఏమిటన్+చేసి= నీవు ఏ పద్ధతితో; వగపు= దుఃఖం; వారింతు(వు)?= తొలగింతువు?; అనవుడున్= అనిన వెంటనే; అతండు= ఆ విప్రుడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ రాజునకు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సేనజితుడు ఆ విప్రుడి మాటల తీరుచూచి ఆశ్చర్యపడి అతడిని ప్రశ్నించాడు. 'నీవు ఏ విధంగా ఈ శోకాన్ని తొలగించుకొన్నావు? మరణమెంత సహజమో, శోకమూ అంతే సహజం ఈ రాజు దృష్టిలో. కాబట్టి నీకు ఈ శోక బాధ ఎట్లా తప్పింది?' అని ప్రశ్నించాడు. దానికి ఆ విప్రుడి సమాధాన మిది.

**క. 'కదియుం గాష్ఠముఁ గాష్ఠము । నదిలో మఱికొంత సేపునకుఁ బాయును నె**
**మ్మది నట్లుగఁ దలఁపఁగ వల । వదె పితృ పుత్త్రాది బంధు వర్గము నధిపా! 10**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; నదిలోన్= నదియందు; కాష్ఠమున్= కర్రను; కాష్ఠము= కర్ర; కదియున్= సమీపిస్తుంది; మఱికొంత సేపునకున్= మరల కొంత సమయం తరువాత; పాయును= విడిపోతుంది; నెఱ+మదిన్= నిండుమనసులో; పితృపుత్ర+ఆదిబంధు వర్గమున్= తండ్రి కొడుకు మొదలైన బంధువుల సమూహమును అట్లుగన్= ఆ విధంగా; తలఁపఁగన్= ఆలోచించగా; వలవదు+ఎ?= వద్దా?; (అట్లు తలపవద్దా?)

**తాత్పర్యం:** 'రాజా! నది ప్రవహిస్తూ ఉండగా, ఆ ప్రవాహంలో ఒక కర్రను మరొక కర్ర చేరుకొంటుంది. ఆ చేరిక ఆ ప్రవాహవేగం అనుమతించినంతవరకే. కొంతసేపటికి ఆ చేరిన కర్రలు రెండూ విడిపోతాయి. కలయిక ఎంత సహజంగా జరిగిందో, ఎడబాటూ అంతే సహజంగా జరుగుతుంది. నిండు మనస్సుతో భూమిమీద సంబంధ బాంధవ్యాలను కూడా అవి తండ్రి కొడుకులకు చెందినవైనా, ఆలుమగలకు చెందినవైనా అట్లాగే ఆ ప్రవాహంలోని కర్రల కలయికవలెనే చూడాలి. కలయికలూ ఎడబాటులూ యాదృచ్ఛికంగా మన ప్రమేయం లేకుండా జరిగిపోతాయి.

**విశేషం:** ఇక్కడ నదీప్రవాహం కాలం. కాలంకూడా నిరంతరం గమనశీలమై, ఆగకుండా సాగిపోతూనే ఉంటుంది. కాలప్రవాహంలో కాష్ఠాలు అంటే కట్టెలు ఈ జీవులు. కాష్ఠమనేమాట శరీరాన్ని దాని అశాశ్వతత్వాన్ని స్ఫురింపజేయటానికి వాడబడింది. నదిలో కర్రలవలెనే కాలగమనంలో తండ్రి కొడుకులు కలిసికొంటారు. ఆ కలయికకు వారి ప్రమేయం లేదు. కర్రలు నదిలో తాము కావాలని కలవవు. అట్లాగే సంబంధ బాంధవ్యాలుకూడా కాల ప్రవాహంలో యాదృచ్ఛికంగా జరిగేవే కాబట్టి వాటికోసం శోకించరాదు.

**క. తనకుం దా నెర వనినను । విను బంధులు సతమె? య న్వివేకంబున నే**
**జనులపయిఁ జేయ నర్మిలి । నను వగ వొంద దది కారణముగ నరేంద్రా! 11**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= నరులకు అధిపతి - రాజా!; వినుము= ఆలకించుము; తనకున్= తనకు (ఎల్లవారికి, నీకు, నాకు, ఇతరులకు); తాన్= తాను; ఎరవు= అన్యము; అనినను= అనగా; బంధులు= చుట్టములు; సతమె?= శాశ్వతమా?; అన్+వివేకంబునన్= అనే పరిజ్ఞానంలో; నే= నేను; జనులపయిన్= ఇతర జనులమీద; అర్మిలిన్= ప్రేమను; చేయను= చేయను; అది కారణముగన్= ఆ కారణంచేత; ననున్= నన్ను; వగ= దుఃఖము; పొందదు= చేరదు.

**తాత్పర్యం:** రాజా! వినుము. నాలో ఒక గట్టి జ్ఞానం ఉన్నది. అదేమిటంటే మానవుడికి ఎవనికయినా, తనకు తానే అన్యం. శాశ్వతం కాదు. అటువంటప్పుడు తనవారు, తన సంతానం, బంధువులు ముక్తిప్రాప్తికి కారణం కానేకారు. ఈ వివేకంతో నేను నాకు భిన్నులయిన జనులమీద ప్రేమను పెంచుకోను. ప్రేమ లేనప్పుడు వియోగంవలన శోకమూ ఏర్పడదు. కాబట్టి నన్ను ఏ దుఃఖమూ దరిచేరదు.

**విశేషం:** మానవుడికి మనస్సే సుఖదుఃఖాలను అనుభవానికి తెస్తుంది. ఈ అర్థాన్నే 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'అనే ఉపనిషత్సూక్తి వివరిస్తుంది. జ్ఞానాజ్ఞానాలు మనస్సునకు చెందినవే. కాబట్టి మనస్సులో ఇతరజనులయెడ వారు ఎవరైనా సరే స్వసంతానమైనా బంధువులైనా ప్రేమే ఏర్పడకుండా నిగ్రహించుకొనగలిగితే వారితో ఎడబాటు కలిగినప్పుడు శోకమూ కలుగదు. దానికి 'తనకు తానే మార్గము' అనే జ్ఞానం మూలంగా నిలుస్తుంది. ఆ మూలజ్ఞానాన్ని మనస్సున నిల్పుకొనగలిగితే ముక్తి సులభం.

**క. నరనాథ! సుఖము దుఃఖముఁ । బరువడిమెయిఁ బొరయుఁ గాక! పన్నుగ నరునిం**
**బొరయునె యం దొక్కటి? యవి । పొరసిన వల దూఁద మోదమును ఖేదంబున్. 12**

**ప్రతిపదార్థం:** నరనాథ!= మానవులకు అధిపతీ! ఓ రాజా!; సుఖము దుఃఖమున్= సుఖంగాని, దుఃఖంగాని; పరువడిమెయిన్= క్రమంతో; పొరయున్+కాక= కలుగును కాక; పన్నుగన్= ఒప్పుగా; నరునిన్= మానవుడిని; పొరయునె?= పొందునా?; అందున్= ఆ రెంటిలో, సుఖదుఃఖములలో; ఒక్కటి= ఒక్కటైనా పొందునా? (పొందలేడని తాత్పర్యం); అవి= ఆ సుఖదుఃఖాలు; పొరసినన్= కలిగితే; మోదమును= సంతోషమును; ఖేదంబున్= సంతాపమును; ఊఁదన్= వహించగా; వలవదు= కూడదు.

**తాత్పర్యం:** రాజా! వివేచించి చూస్తే మానవుడికి లోకాన సుఖదుఃఖాలు క్రమంగా కలుగుతాయి. అంతే కాని సుఖదుఃఖాలలో ఏ ఒక్కటీ నరుడిని తాకదు. కాబట్టి సుఖదుఃఖాలు పొందినపుడు సంతోషాన్నిగాని, సంతాపాన్నిగాని పొందకుండా ఉండాలి.

**విశేషం:** ఈ పద్యానికి మూలం:

> సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానన్తరం సుఖమ్,
> సుఖ దుఃఖే మనుష్యాణాం చక్రవ త్పరివర్తతః.
> సుఖా త్త్వం దుఃఖ మాపన్నః పునరాపత్స్యసే సుఖమ్,
> న నిత్యం లభతే దుఃఖం న నిత్యం లభతే సుఖమ్.

**క. ఇది నాయది యను నూఁత । న్మది నెయ్యది పట్టుకొల్పినను వాసితమై**
**తుదిఁ జేటునొంది వానికి । నది శోకము నావహించు నత్యంతంబున్. 13**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ పదార్థం; నా+అది= నాది; అను= అనెడి; ఊఁతన్= అండను; మదిన్= మనస్సునందు; ఏ+అది= ఏది; పట్టుకొల్పినను= నెలకొల్పినా; వాసితమై= వాసన కలిగినదై; తుదిన్= చివరకు; చేటును+ఒంది= నాశనాన్ని పొంది; వానికిన్= దానిని మనస్సున నెలకొల్పుకొన్నవానికి; అది= ఆ పదార్థం; శోకమున్= ఎడబాటు వలన దుఃఖమును; అతి+అంతంబున్= అత్యధికంగా; ఆవహించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** మానవుడు 'ఇది నాది' అనే భావంతో ఏ పదార్థాన్ని తన మనస్సులో నిలుపుకొంటాడో - ఆ పదార్థం, అది చేతనమైనా అచేతనమైనా అనేక వాసనలను భావనాజనితమైన సంస్కారాలను అతడి మనస్సులో కలిగిస్తుంది. ఆ తరువాత అది నశిస్తుంది - సహజంగానే. అపుడు ఆ మానవుడు అత్యధికంగా శోకించక తప్పదు.

**విశేషం:** ఈ పద్యంలో 'వాసితము' అనే పదం ప్రయుక్తమై ఉన్నది. దానికి అర్థం తెలిసికొని ఉన్నాం. వాసన అనేమాట పారమార్థిక చర్చలో సామాన్యం. ఆత్మ ఈ వాసనల కారణంగానే పునః జన్మిస్తుందని కొందరి విశ్వాసం. ఈ వాసనలనే కొందరు సంస్కారాలు అంటారు. పూర్వజన్మవాసన. సంస్కారం అంటూ ఈ రెండు పదాలూ పర్యాయాలుగానే వాడుతున్నాం. ఈ వాసనలు, సంస్కారాలు మనస్సు నంటుకొంటాయి. దానికి హేతువు 'ఇది నాయది అను ఊఁత'. ఇది నాది అనే గాఢమైన భావన మనస్సున నెలకొన్నప్పుడు, ఆ పదార్థం నశించినా, ఆ వాసనలు మనస్సును వీడవు. కర్పూరం తొలగినా, అది కట్టిన గుడ్డ గుబాళిస్తూనే ఉంటుంది కదా! మనస్సూ అంతే. ఆ కారణంగానే ఆయా పదార్థాల నాశనం, అనివార్యమై జరిగినప్పుడు మానవుడు తల్లడిల్లిపోతాడు.

**క. వినుము, పురాతన జన్మం । బునఁ జేసిన యట్టి కర్మముల ఫలములు ప్రా**
**జ్ఞునినైనఁ బొందు వానికి । మనుజేశ్వర! మందు ధైర్యమహిమయ చుమ్మీ. 14**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= మానవులకు అధిపతీ! రాజా!; వినుము= ఆలకించుము; పురాతన జన్మంబునన్= పూర్వజన్మలో; చేసిన+అట్టి కర్మముల ఫలములు= చేసినటువంటి కర్మల ఫలితాలు; ప్రాజ్ఞునిన్+ఐనన్= పండితుడినికూడా; పొందున్= చెందును; దానికిన్= ఆ కర్మల ఫలితములకు; మందు= నివారణౌషధం; ధైర్యమహిమ+అ= ధీరత్వపు గొప్పతనమే; చుమ్మీ= (చూడుమీ) సుమీ.

**తాత్పర్యం:** రాజా! వినుము. పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితాలు మిగిలి ఉంటే, అవి తప్పక ఈ జన్మలో నరుడిని చేరుతాయి. ఈ కర్మఫలాల అనుభవం విషయంలో పామరుడైనా, పండితుడైనా ఒక్కటే. పండితుడికి మినహాయింపు లేదు. 'అయితే మరి, ఆ కర్మ ఫలితాల అనుభవానికి నివారణౌషధమే లేదా!' అంటావా? ఉంది గొప్ప ధీరత్వంతో వాటిని స్వీకరించటమే ఆ నివారణమార్గం.

**విశేషం:** కర్మఫలానుభవానికి నివారణ మార్గం లేదు. ధైర్యంగా అంగీకరించి అనుభవించటమే ఎంత పండితుడైనా చేయవలసిన పని. కారణకార్య సంబంధాన్ని ఎవరూ ఆపలేరు. కారణం కర్మ అయితే కార్యం ఫలితం. గంటకొట్టి శబ్దం రాకుండా నిరోధించలేము. చేసిన పనికి ఫలితం అనుభవించవలసిందే.

**క. పరమ సుఖము దృష్ణ యుడుగు । టరయఁగ ని ట్లగుట పింగళాలాపములం**
**బరిబోధితమగు ధరణీ । శ్వర! చెప్పెదఁ దెలియ వినుము వాని తెఱంగున్. 15**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= భూమికి అధిపతివైన రాజా!; అరయఁగన్= పరిశీలించగా; తృష్ణ+ఉడుగుట= అత్యాశను విడుచుట; పరమసుఖము= మిక్కిలి సుఖం; ఇట్లు+అగుట= ఈ విధంగా అగుట (తృష్ణ ఉడుగుట); పింగళా+ఆలాపములన్= పింగళ అనే వేశ్యయొక్క మాటలచేత; పరిబోధితము+అగున్= బాగుగా తెలియబడింది అగును; చెప్పెదన్= చెప్పుతాను; తెలియన్= తెలిసేటట్లుగా; వాని తెఱంగున్= ఆ మాటల విధమును; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** రాజా! పరిశీలించిచూస్తే గొప్ప సుఖ మనేది వాంఛను వదలిపెట్టటంలోనే ఉన్నది. అ దెట్లాగు? అంటావా? ఈ సత్యం పింగళ అనే వేశ్య స్వానుభవంతో పలికిన పలుకులలో వ్యక్తమై అర్థమవుతుంది. తెలియజెప్పుతాను-వినుము.

**విశేషం:** తృష్ణ అనే మాట బౌద్ధవాఙ్మయంలో ప్రచురంగా కనిపిస్తుంది. ఆశించి దొరకలేదని దుఃఖించటం కంటె అసలు ఆశనే వదలుకుంటే అదే ఆనందమనే భావన ప్రథమంగా బౌద్ధంనుండి వెలువడి ఉండవచ్చును అనే వాదమూ ఉన్నది.

**వ. పింగళయను వేశ్యదన కూర్చువాని రాక వార్చి పెద్దయుం బ్రొద్దు వోవునంతకు నుండి వాఁడు రాకుండుటయును. 16**

**ప్రతిపదార్థం:** పింగళ+అను వేశ్య= పింగళ అనే పేరుగల వెలయాలు; తన కూర్చువాని రాక= తనకు ఇష్టుడగు వాని రాకను; వార్చి= ఎదురుచూచి; పెద్దయును+ప్రొద్దు= ఎక్కువ కాలం; పోవునంతకున్= కడచునంతవరకు; ఉండి= నిలిచి; వాఁడు= ఆ ఇష్టుడైనవాడు; రాక+ఉండుటయును= రాకుండా ఉండగా.

**తాత్పర్యం:** పింగళ అనే వేశ్య తన ప్రియుడికొరకు ఎదురుచూస్తూ చాలా సమయం గడిపింది. అయినా అతడు రాలేదు. అప్పుడు ఆ వేశ్య ఆత్మగతంగా ఇట్లా తలపోసింది.

**ఆ. 'ఏను వేఁదు అగుడు వాని నివ్వేదుఱ । పట్టఁ జదురుగలదె! భ్రాంతి దొఱఁగి**
**యొంటి కంబ మొప్పు నింటి వాకిళులు దొ । మ్మిదియు నెఱయమూసి నిదురవోదు. 17**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వేఁదుఱు+అగుడున్= వెర్రిని అయిన వెంటనే; వానిన్= అతడిని (తాను ఎదురుచూచే ప్రియుడిని); ఈ+వేదుఱు+అ= ఈ వెర్రియే; పట్టన్= పట్టుకొనే; చదురు= రీతి; కలదె?= ఉన్నదా?; భ్రాంతిన్= భ్రమను; తొఱఁగి= విడిచి; ఒంటికంబము= ఒక స్తంభం; ఒప్పు= తగు; ఇంటి వాకిళులు= ఇంటియొక్క వాకిళ్ళు - ద్వారములు; తొమ్మిదియున్= తొమ్మిదింటిని; నెఱయన్ మూసి= నిండుగా మూసివేసి; నిదుర+పోదున్= నిద్రపోతాను.

**తాత్పర్యం:** 'నేను నా ప్రియుడి కొరకు పిచ్చిదాన్ని అయ్యాను. అయితే నాకీ పిచ్చిపట్టిన వెంటనే నా ప్రియుడికీ ఈ పిచ్చి పట్టే వీలుందా! లేదు. కాబట్టి ఈ భ్రమను వదలుకొని ఒంటి కంబంతో ఒప్పి ఉన్న ఈ నా (శరీరమనే) ఇంటిలోని తొమ్మిది వాకిళ్ళూ బాగా మూసికొని నిద్రపోతాను.

**విశేషం:** పింగళ వేశ్య. ప్రియుడికోసం పరితపిస్తూ వెర్రిదై నిరీక్షించింది. ఇంకా నిరీక్షించింది. ఎంతసేపో నిరీక్షించింది. అపుడు ఆమె మనస్సులో ఈ భావం కలిగింది. 'నాకు పట్టిన ఈ వెర్రి వాడే కావాలి, రావాలి అనే పిచ్చితనం నాకు కలిగినట్టే వాడికీ కలుగుతున్నది అని నియమం లేదు. అయినా నేను నిరీక్షిస్తున్నాను. ఇది భ్రాంతి. లేనిదానిని ఉన్నట్లుగ తలచి, మేల్కొని ఉండటం మానుకుంటాను. నే నుండే ఈ ఇంటి వాకిలేగాకుండా నిజమైన నేను (ఆత్మ) ఉండే ఈ దేహమనే, ఇంటి వాకిళ్ళు తొమ్మిదీ (నవరంధ్రాలు - కళ్ళు, ముక్కులు, చెవులు మొ॥నవి) గట్టిగా మూసేసి నిద్రిస్తాను - ప్రశాంతంగా అని ఇంకా ఆ వేశ్య తన తలంపును ఇట్లా కొనసాగిస్తున్నది.

**క. పొంతకు వచ్చిన వానిన । కాంతునిగాఁ గొనుచు నొరునిఁ గాంక్షింపక యే**
**నెంతయు నూఱడి మనమునఁ । జింత యొకఁడు లేకయున్నఁ జెందు సుఖంబుల్. 18**

**ప్రతిపదార్థం:** పొంతకున్= చెంతకు; వచ్చినవానిని+అ= చేరిన వ్యక్తినే; కాంతునిగాన్= ప్రియుడిగా; కొనుచున్= స్వీకరిస్తూ; ఒరునిన్= ఇతరుని; కాంక్షింపక= కోరక; ఏను= నేను; ఎంతయున్= ఎంతగానో, ఎక్కువగా; ఊఱడి= తృప్తిచెంది; మనమునన్= మనస్సునందు; చింత+ఒకఁడున్= దిగులు ఒక్కటికూడా; లేక+ఉన్నన్= లేకుండా ఉన్నట్లయితే; సుఖంబుల్= సుఖాలు; చెందున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** చెంతకు చేరినవాడే ప్రియుడు అనుకొని ఇతరుడిపై కోరికమాని, తృప్తితో మనస్సున ఏ దిగులూ లేకుండా ఉంటే సుఖాలు నన్ను చేరుకొంటాయి.

**విశేషం:** సుఖపడాలంటే మనిషికి రెండు గుణాలు ఉండాలి. 1). తృప్తి; 2). నిగ్రహం. ఇక్కడ చేరినవాడే ప్రియుడు అనుకొనటం తృప్తి. మనస్సున చింతలేమి నిగ్రహం. ఆ వేశ్య తలపులు ఇంకా ఈ విధంగా కొనసాగినాయి.

**క. ఆశయ యింద్రియ జయము వి । నాశముఁ బొందించుఁ గావునం దొఱఁగెద నే**
**నాశను; సౌఖ్యము నిచ్చు ని । రాశయ' యని పలికి యట్టిదై నిద్రించెన్.' 19**

**ప్రతిపదార్థం:** ఆశ+అ= ఆశయే; ఇంద్రియ జయమున్= ఇంద్రియముల గెలుపును; వినాశమున్= చేటును; పొందించున్= కలిగించును; కావునన్= కాబట్టి, నేను; ఆశను= కోరికను; తొఱఁగెదన్= విడిచెదను; నిర్+ఆశ+అ= ఆశ లేకుండుటయే; సౌఖ్యమున్= సుఖమును; ఇచ్చున్= ఈయగలదు; అని; పలికి= చెప్పి; అట్టిదై= ఆ విధంగలదై, ఆశ ఉడిగినదై; నిద్రించెన్= నిద్రపోయింది.

**తాత్పర్యం:** ఆలోచించిచూస్తే ఆశే ఇంద్రియలోలుని చేసి మనిషిని క్రుంగదీస్తుంది. మనిషి ఓటమి పాలు కావటానికి కోరికే కారణం. మనిషి వినాశానికీ ఆశ ఒక్కటే హేతువు. కాబట్టి నేను ఆశను వదలుకొని ఇంద్రియాలను జయించి, వినాశానికి దూరంగా సుఖంగా జీవిస్తాను. సౌఖ్యప్రదాయి నిరాశ ఒక్కటే' అని పలికి, పలుకునకు తగిన మనః ప్రవృత్తితో శాంతంగా నిద్రించింది - పింగళ.'

**విశేషం:** ఆశా నిరాశలు రెండింటి కేంద్రమూ మనస్సు ఒకటే. కాబట్టి దాన్ని నిగ్రహించటమే సౌఖ్యానికి సోపానం.

**వ. అని విప్రుం డుపదేశించిన వాక్యంబులం గలంకదేఱి సేనజిత్తు సుఖి యయ్యెఁ; నీవును నందలి తాత్పర్యం బను సంధించి శాంతినొందు మని చెప్పినఁ గుంతీ తనయాగ్రజుండు శాంతనవుతో 'భూతక్షయావహంబగు కాలం బతిక్రాంతం బగుచున్నయది; యట్లుండ జనంబుల కెయ్యది కర్తవ్యంబు లుపదేశింపు' మనిన నమ్మనుజపతిం బ్రీతిం గనుంగొని 'యమ్మహితాత్ముండు పితాపుత్ర సంవాదంబను నితిహాసంబు గల దాకర్ణింపుము; దాన నీ యడిగినయది దేటపడు' నని పలికి యిట్లనియె. 20**

**ప్రతిపదార్థం:** అని= పలికి; విప్రుండు= బ్రాహ్మణుడు; ఉపదేశించిన వాక్యంబులన్= బోధించిన మాటలతో; కలంక+తేఱి= కలత తొలగి; సేనజిత్తు= సేనజితుడనే రాజు; సుఖి+అయ్యెన్= సుఖం కలవాడైనాడు; నీవునున్= నీవుకూడా; అందలి= ఆ ఉపదేశము నందలి; తాత్పర్యంబు= నిజమైన అర్థమును; అనుసంధించి= గ్రహించి; శాంతిని+ఒందుము= శాంతిని పొందుము; అని చెప్పినన్= అని పలుకగా; కుంతీ తనయ+అగ్రజుండు= కుంతికుమారులలో మొదట జన్మించినవాడు - ధర్మరాజు; శాంతనవుతోన్= శంతనుడి తనయుడితో, భీష్ముడితో; భూతక్షయ+ఆవహంబు+అగు= జీవులకు నాశనం కలిగించెడిదగు; కాలంబు= యుగాంతరమైన కాలము; అతిక్రాంతంబు= జరిగిపోయేదిగా; అగుచున్న+అది= ఔతున్నది; అట్లు+ఉండన్= ఆ విధంగా ఉన్నప్పుడు; జనంబులకున్= ప్రజలకు; ఏ+అది= ఏది; కర్తవ్యంబు= చేయవలసినది; ఉపదేశింపుము= బోధించుము; అనినన్= పలుకగా; ఆ+మనుజపతిన్= ఆ మానవుల అధిపతిని రాజును; ప్రీతిన్= ప్రేమతో; కనుంగొని= చూచి; ఆ+మహిత+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మకలవాడు - భీష్ముడు; పితాపుత్ర సంవాదంబు+అను= తండ్రీకొడుకుల సంవాదం అనే; ఇతిహాసంబు= పూర్వచరిత్ర; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము; దానన్= దానివలన; నీ+అడిగిన+అది= నీవు అడిగిన అంశం; తేటపడున్= స్పష్టపడుతుంది, తెలియును; అని పలికి= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పింగళావృత్తాంతాన్ని విప్రుడిద్వారా విన్న సేనజిత్తు మనస్సు కలత తీరి సుఖంగా జీవించాడు. నీవు కూడా ఆ కథలోని అంతరార్థాన్ని గ్రహించి మనఃక్లేశం మాని శాంతితో జీవించుము - అని తాత మనుమడికి

చెప్పాడు. తరువాత ధర్మరాజు భీష్ముడిని ఇట్లా ప్రశ్నించాడు. 'జీవరాశులు నశించిపోయే కాలం దాపురించింది. ఈ పరిస్థితులలో ప్రజలు ఏమి చేయాలి? బోధించుము.' ఆ ప్రశ్నతో ఆ మహాత్ముడైన భీష్ముడు ఆ రాజును ప్రేమతో చూస్తూ 'తండ్రీ కొడుకుల సంవాదం' అనే పూర్వకథ ఒకటి ఉన్నది వినుము. దాని వలన నీ ప్రశ్నకు సమాధానం తెలుస్తుంది' అని ఇట్లా అన్నాడు.

**మేధావియను బ్రాహ్మణకుమారుఁడు దన తండ్రితోఁ జేసిన సంవాదము (సం. 12-169-2)**

**సీ. 'వేదవిదుం డగు విప్రనందనుఁడు మే । ధావి నామకుఁడు మేధావివరుఁడు**
**సత్సమయంబున జనకుతో 'నాయువు । జనులకు వేగంబ చనుచునుండు;**
**దీనిపైఁ గనువెట్టి ధీరత దలకొల్పి । మేలు వాటిల్ల నెమ్మెయిఁ జరించు**
**వా రొకో?' యనవుడు వానికి ని ట్లనుఁ । దండ్రి 'యాలును నపత్యంబు గలుగు**

**ఆ. తెఱఁగు నడపి యజ్ఞతృప్తనిర్జరుఁ డయి । శమము నొంది కాననమున కేఁగి**
**సౌమ్యవృత్తి ముక్తి సాధించి మృత్యువు । నలఘునియతి గెలువవలయు ననఘ! 21**

**ప్రతిపదార్థం:** వేదవిదుండు+అగు= వేదముల నెరిగినవాడైన; విప్రనందనుఁడు= బ్రాహ్మణ కుమారుడు; మేధావి వరుఁడు= తెలివిగల వారిలో శ్రేష్ఠుడు; మేధావి నామకుఁడు= మేధావి అను పేరుకలవాడు; సత్ సమయంబున(న్)= మంచి (అనువైన) కాలమునందు; జనకుతోన్= తండ్రితో; ఆయువు= బ్రతికి ఉండేకాలము; జనులకున్= ప్రజలకు; వేగంబు+అ= త్వరగానే; చనుచున్+ఉండున్= కడచిపోతూ ఉంటుంది; దీనిపైన్= ఈ అంశంమీద; కను+పెట్టి= కన్ను ఉంచి (చూపు నిలిపి); ధీరత= ధైర్యం; తలకొల్పి= నెలకొల్పి; మేలు= మంచి; పాటిల్లన్= కలుగునట్లుగా; ఏ+మెయిన్= ఏ విధంగా; చరించువారు+ఒకో!= ప్రవర్తిస్తారో (నడచుకొనవలసినవారో); అనవుడున్= అనిన వెంటనే; వానికిన్= ఆ కుమారునికి (మేధావికి); తండ్రి= అతని తండ్రి; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికెను; అనఘ!= పాపరహితుడా!; ఆలును= భార్యయు; అపత్యంబు= బిడ్డ; కలుగు తెఱఁగు= కలిగే విధం; నడపి= ఏర్పరచి; యజ్ఞతృప్త నిర్జరుఁడు+అయి= యాగాలతో తృప్తిపరచబడిన దేవతలు కలవాడై; శమమున్= శాంతిని; ఒంది= పొంది; కాననమునకున్= అడవికి; ఏఁగి= వెళ్ళి; సౌమ్యవృత్తిన్= మృదువైన నడతతో; ముక్తి= మోక్షం; సాధించి= వశపరచుకొని; మృత్యువున్= మరణాన్ని; అలఘు నియతిన్= గొప్ప నియమంతో; గెలువన్+వలయున్= జయించాలి.

**తాత్పర్యం:** మేధావి అనే పేరుగల బ్రాహ్మణకుమారు డొకడు ఉన్నాడు. అతడు వేదాలు తెలిసినవాడు. మేధావులలో శ్రేష్ఠుడు. అతడు ఒకనాడు మంచి సమయంలో తన తండ్రిని ఇట్లా ప్రశ్నించాడు. 'లోకంలో ప్రజలకు ఆయువు త్వరత్వరగా గడచిపోతూ ఉంటుంది. ఆ విషయం తెలిసికొని వారు ఏ పద్ధతిలో ఏ మార్గాన చరించి మేలు పొందగలుగుతారు?' ఆ ప్రశ్నకు అతడి తండ్రి ఇచ్చిన సమాధాన మిది. 'ఓ పాపరహితుడా! పెండ్లిచేసికొని భార్యను పొంది, సంతతిని కని, యజ్ఞాలతో దేవతలను తృప్తిపరచి ఆ తరువాత శాంతిని పొంది, సంసారాన్ని చాలించి, అడవికి వెళ్ళి ప్రశాంతజీవనం సాగిస్తూ మోక్షాన్ని సాధించాలి. ఆ విధంగా మృత్యువును మానవుడు గెలువగలడు' అని.

**విశేషం:** తనయుడి ప్రశ్న, దానికి తండ్రి ఇచ్చిన సమాధానం రెండూ మానవజీవన ప్రయోజనానికి సంబంధించినవి. నశ్వరమైన ఈ దేహంద్వారా అనశ్వరమైన శాశ్వతసౌఖ్యప్రదాయకమైన ముక్తిని పొందే మార్గమేమిటి? - అనేది ప్రశ్న. దాని సమాధానం సంప్రదాయబద్ధంగా ముందు గృహస్థ స్థితినీ, ఆ తరువాత వానప్రస్థ ఆశ్రమాన్ని ముగించి, అనంతరం ముక్తిని పొందాలి - అని ఈ గతానుగతికమైన సమాధానాన్ని ఆ మేధావి స్వీకరించే స్థితిలో లేడు. అందువలన అతడు తండ్రితో తిరిగి ఇట్లా సంవదిస్తున్నాడు.

**వ. అనిన విని మేధావి తండ్రి కి ట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అనినన్= (తండ్రి) పలుకగా; విని= ఆలకించి; మేధావి= ఆ పేరు గల బ్రాహ్మణ కుమారుడు; తండ్రికిన్; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** ఆ తండ్రి సమాధానం విన్న తనయుడు మేధావి తిరిగి తన తండ్రితో ఇట్లా అన్నాడు.

**సీ. 'నిక్కమ కాలంబు నీకుఁ గొంత గలట్లు । వలికెదు; నీవు గర్భంబు సొచ్చి**
**నప్పటి నుండియు నన్వేషణము సేయుఁ । గొనిపోవుటకు మృత్యు వని యెఱుంగు;**
**మివిరెడు నీటి మీనవు గావె? దారపు । త్రాదిసక్తుండగు నతనిఁ గాన**
**నమున సుప్తుండైన నరుఁ బులి గొనిపోవు । నట్టులు సూ మృత్యు వపహరించుఁ;**

**తే. జేసినది సేయుచున్నది సేయవలయు । నది యనంగల కార్యంబులందుఁ దగులు**
**వాని మృత్యు వేపునఁ దన వశముఁ జేయుఁ । గాన కాలంబు నేమనఁ గాదు తండ్రి! 23**

**ప్రతిపదార్థం:** తండ్రి!= ఓ జనకా!; నిక్కము+అ= నిజముగానే; కాలంబు= ఆయువు; నీకున్ (ప్రతి మానవుడికి) కొంత+కల+అట్లు= కొంత ఉన్న విధంగా; పలికెదు= మాట్లాడుతున్నావు; మృత్యువు= మరణం; నీవు (ప్రతి మనిషి - ప్రాణి) గర్భంబు+చొచ్చిన+అప్పటి నుండియున్= కడుపున ప్రవేశించిన వేళనుండి కూడా; కొనిపోవుటకున్= తీసికొనివెళ్ళుటకు; అన్వేషణము+చేయున్= వెదకుట చేయును; అని; ఎఱుంగుము= తెలిసికొనుము; ఇవిరెడు= ఇంకిపోయెడి; నీటి= నీటి యందలి; మీనవు+కాదె?= చేపవు కావా?; దారపుత్ర+ఆది సక్తుండు+అగు+అతనిన్= భార్య, కొడుకు మొదలగు వారియెడ ఆసక్తుడయ్యే వాడిని; కాననమునన్= అడవిలో; సుప్తుండు+అయిన నరున్= నిద్రించిన మనిషిని; పులి; కొనిపోవు+అట్టులు= తీసికొనిపోవు విధంగా; మృత్యువు= మరణము; అపహరించున్ సూ= దొంగిలించును (కొనిపోవును) సుమా!; చేసినది= చేసివేసినది (భూతకాలికం); చేయుచున్నది= చేస్తూ ఉన్నది (వర్తమాన కాలికం); చేయన్ వలయునది= చేయవలసి ఉన్నది (భవిష్యత్కాలికం); అనన్+కలకార్యంబులందున్= అని మూడు విధాల ఉన్న పనులలో; తగులువానిన్= ఆసక్తుడయినవాడిని; మృత్యువు= మరణం; ఏపునన్= బలంతో; తన వశమున్= తనకు లోబడినవాడినిగా; చేయున్= చేస్తుంది; కానన్= కావున; కాలంబున్= కాలాన్ని; ఏమి+అనన్+కాదు= ఏమీ అనటానికి (వీలు) కాదు.

**తాత్పర్యం:** 'తండ్రీ! నిజంగా కాలం కొంత నీ అధీనంలో ఉన్నట్లు పలుకుతున్నావు. కాని, మానవుడు తల్లి కడుపున పడిన మరుక్షణం నుండే మృత్యువు అతడిని వెన్నంటి వేటాడుతూ తీసికొనిపోవటానికి యత్నిస్తూ ఉంటుంది. అని తెలిసికొమ్ము. ఇగిరిపోయే నీటిలోని చేపవు నీవు. నీ జీవితం నీ అధీనంలో లేదు. ఆలుబిడ్డలు అంటూ తాపత్రయ పడే మనిషిని మృత్యువు అడవిలో ఆదమరిచి నిద్రించే నరుని పులి కొనిపోయే అంత సులభంగా అపహరిస్తుంది. మానవుడికి జీవితంలో మూడు విధాలయిన కార్యాలుంటాయి - 1). చేసినది - ఇది భూతకాలానికి చెందినది; 2). చేస్తూ ఉన్నది - ఇది వర్తమాన కాలానికి చెందినది; 3) చేయవలసి ఉన్నది - ఇది భవిష్యత్కాలానికి చెందినది - ఈ మూడు కార్యాలలో మనిషి నిమగ్నుడై ఉంటాడు. అయితే ఈ మూడూ ఒక కాలం యొక్క మూడు అంశాలే. ఈ మూటిలో మనిషి ఉన్నా, మృత్యువు నిర్దయగా అతడిని కబళిస్తుంది. కాబట్టి కాలాన్ని మనిషి ఏమీ చేయజాలడు, ఏమీ అనజాలడు, కాలానికి మనిషి అధీనుడే గాని మనిషికి కాలం అధీనం కాదు.

**విశేషం:** తండ్రి సమాధానం పరంపరాగతమైన సాంప్రదాయకమైన రీతిలో ఉన్నది. దానిని తనయుడు ప్రశ్నించాడు. తొలుత గార్హస్థ్యం, ఆ పిదప వానప్రస్థం, తరువాత మోక్షం అన్నాడు తండ్రి. ఆ క్రమం తప్పకుండా సాగిపోతుంది - అనే ధైర్యం, కాలమహిమ

తెలిస్తే నిలువదు అంటున్నాడు తనయుడు. నిన్ను తీరికగా నీ కార్యక్రమ నిర్వహణకై విడిచిపుచ్చి ఊరుకోదు కాలం. అది అజేయమూ, అప్రతివిధేయమూ అయినది. ప్రాణుల జీవితమంతా కేవలం కాలాధీనమే. అయినపుడు ఆలుబిడ్డలు, యజ్ఞనిర్వహణం వంటి ఈ సాంప్రదాయిక పథాన మోక్షాన్వేషణ చేయటంకంటె వేరే మార్గాన్ని కనుగొనవలసిన అవసరం ఉన్నదని బోధ కలిగే విధంగా తనయుడు తన వాదాన్ని కొనసాగిస్తున్నాడు.

**క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి । శారదుఁ డబలాత్మకుండు సబలుండన లే**
**దేరినయిన మృత్యువు దు । ర్వారంబై యపహరించు వైదికవర్యా! 24**

**ప్రతిపదార్థం:** వైదికవర్యా!= వేదం చదివినవారిలో శ్రేష్ఠుడా!; భీరుఁడు= పిరికివాడు; శూరుఁడు= శౌర్యవంతుడు; జడుఁడు= చలనంలేనివాడు (అజ్ఞాని); విశారదుఁడు= ప్రవీణుడు; అబల+ఆత్మకుండు= బలహీనమైన శరీరం కలవాడు; సబలుండు= బలంతో కూడినవాడు; అనన్= అనుటకు; లేదు= (వీలు) ఉండదు; ఏరిని+అయినన్= ఎవరినైనా; మృత్యువు= మరణం; దుర్వారంబు+అయి= అడ్డులేనిదై; అపహరించున్= కొనిపోవును.

**తాత్పర్యం:** మృత్యువు ఎదురులేని బలంకలది. దాని ముందు అందరూ సమానులే. అది పిరికివాడినీ, నిర్భయుడినీ, అజ్ఞానినీ, విజ్ఞానినీ, అబలుడినీ, సబలుడినీ - అందరినీ ఒకే విధంగా కబళిస్తుంది. కాలం ముందు ప్రాణులన్నీ సమానులే.

**విశేషం:** జీవితంలో మనిషి గుణగణాలకూ అజ్ఞానవిజ్ఞానాలకూ బలదౌర్జన్యాలకూ, ఇతరులముందు అంటే తోడి మానవులలో, ప్రాణులలో విలువ ఉండవచ్చునుగాని, మృత్యు రూపమైన కాలం ముందు సర్వమానవులూ సమానులే. వారు భీరువులయినా శూరులైనా దాని ముందు తలవంచవలసినదే. కాల మహిమ అప్రతివిధేయం.

**క. విను సంసృతి మృత్యువు ప । ట్టనఘా! నిస్సంగవృత్తి యమరగృహము నె**
**ట్టన ని ట్లగుటం గనికొని । తునుముము సంసారరజ్జు దురితవిదూరా! 25**

**ప్రతిపదార్థం:** దురిత విదూరా!= పాపానికి మిక్కిలి ఎడమైనవాడా! వినుము; సంసృతి= సంసారం; మృత్యువు పట్టు= మరణమునకు నిలయం; అనఘా!= పాపరహితుడా!; నిస్+సంగవృత్తి= ఆసక్తి లేకుండా జీవించటం; అమరగృహము= దేవతలఇల్లు (స్వర్గం); నెట్టనన్= చక్కగా; ఇట్లు+అగుటన్= ఈ విధంగా ఉండుటను; కనికొని= గ్రహించి; సంసార రజ్జున్= సంసారము అనే త్రాటిని; తునుముము= తెగవేయుము.

**తాత్పర్యం:** పాపకార్యాలకు దూరంగా జీవించే ఓ తండ్రీ! వినుము. ఆలోచిస్తే ఈ సంసారం మరణానికి ఆటపట్టు. దీనికి వ్యతిరేకంగా, అనాసక్తంగా కోరిక లేకుండా జీవించటం స్వర్గం. ఈ జ్ఞానంతో నీ సంసారమనే త్రాటిని తెంచుకొమ్ము.

**విశేషం:** మన వేదాంత గ్రంథాలు సంసారాన్ని ఘోర సముద్రంగా చిత్రించాయి. నిజానికి మోక్షమంటే కుటుంబజంబాలం నుండి బయటపడటమే అన్నట్లు పేర్కొంటాయి. ఈ పద్యమూ ఆ భావాన్నే తలపింపజేస్తుంది. ఆసక్తితోడి జీవితమే సంసారం. అది మృత్యుమార్గమట! దానికి వ్యతిరిక్తమైన అనాసక్త జీవితం స్వర్గద్వారమట!

**క. అమృతము మృత్యువు నన స । త్యము మోహము గాన విను మహాత్మా! యే స**
**త్యమునన మృత్యువు గెల్చెద । సమసుఖదుఃఖుండ నగుచు శాంతిపరుఁడనై. 26**

**ప్రతిపదార్థం:** మహాత్మా!= గొప్ప మనస్సు కలవాడా!; వినుము; అమృతము= చావులేమి; మృత్యువున్= చావూ; అనన్= అనగా; సత్యము= నిజం; మోహము= భ్రాంతి; కానన్= కావున; ఏన్= నేను; సమ సుఖదుఃఖుండన్+అగుచున్= సమానమైన సుఖమూ,

దుఃఖమూ కలవాడనై; శాంతిపరుండను+ఐ= శాంతియందు ఆసక్తుడనై సత్యమునన్+అ= సత్యంతోడనే; మృత్యువున్=మరణాన్ని; గెల్చెదన్= జయిస్తాను;

**తాత్పర్యం:** మహాత్మా! పరికించి చూస్తే సత్యమే అమృతం - మరణరాహిత్యం. మోహమే మృత్యువు - చావు. కాబట్టి అమృతం-మృత్యువు అనేవి జ్ఞానసంబంధి సాంకేతికాంశాలు మాత్రమే. నేను సత్యం ద్వారా మృత్యు విజేతనయ్యాను. ఆ తరువాత సుఖదుఃఖాలు రెండూ నాకు సమానమే అవుతాయి. కేవలం శాంతి మాత్రం నాకు మిగులుతుంది.

**విశేషం**: అమృతం అనేది మనిషికి అనాదిగా ఉన్న గొప్ప కోరిక. ప్రతిప్రాణికీ మృతి తప్పనిసరి. ఆ తప్పనిదానిని తప్పించుకొనటమే అమృతం. దానికొరకే మానవాన్వేషణ నిరంతరంగా కొనసాగుతూ వస్తూ ఉన్నది. ఆ కొనసాగే దశలో ఒకనాడు మనిషి అమృతమంటే ఏమనుకున్నాడో ఈ పద్యం వివరిస్తుంది. సత్యమే అమృతమట! సత్యానికి వ్యతిరిక్తమైనది మోహం; అదే మృత్యువట! కాబట్టి సత్యమార్గాన మోహం నుండి బయటపడితే అమృతాన్ని అందుకొన్నట్లే! అపుడు లోకాన దుఃఖమూ, అశాంతీ ఉండవు - కనీసం ఆ మహామానవుడి దృష్టిలో. మనిషికి సంతతి ఒక విధంగా కొనసాగింపే కాబట్టి సంతానం ద్వారా చావులేమి (అమృతత్వం) సాధ్యమేకదా! అని వాదిస్తావేమో అది సరికాదంటున్నాడు - (క్రింది పద్యంలో)

**తే.** **నాకుఁ బ్రజ గతి నిచ్చు ననంగవల వ; ၊ దేన ప్రజనయి పొడమెదఁ గాన యేను**
**నన్నుఁ గనుచున్న నది మోక్షణంబు సేయు ၊ నాశపడ; నట్టులగుటఁ బ్రజాభియుక్తి.** **27**

**ప్రతిపదార్థం:** నాకున్= మానవుడికి; ప్రజ= సంతతి; గతిన్+ఇచ్చున్= మోక్షాన్ని ఇస్తుంది; అనంగన్+వలవదు= అనటం వద్దు; ఏను+అ= నేనే; ప్రజన్+అయి= సంతతినై; పొడమెదన్= పుట్టుతాను; కాన= కావున; ఏను= నేను; నన్నున్ కనుచున్నన్= కంటుండగా (ప్రసవిస్తుండగా); అది= ఆ సంతతి; మోక్షణంబు+చేయు+ఆశపడను= మోక్షం కలిగించేందుకు ఆశపడను (మోక్షం కలిగిస్తుందని ఆశించలేను); అట్టులు+అగుటన్= ఆ విధంగా ఆశించటం; ప్రజా+అభియుక్తి= సంతతిమీద (వ్యాజ్యం - నేరం మోపటం.)

**తాత్పర్యం:** 'సంతతిద్వారా అమృతత్వం, అదే మోక్షం' అని అనుకొంటే అది చెల్లదు. ఎందుకంటే, నేనే సంతతిగా పుట్టటం జరుగుతుంది తప్ప వేరుగాదు. నన్ను నేను జన్మింపజేసికొంటూ ఆ సంతతినుండి మోక్షాన్ని ఆశించటం ఉచితం కాదు. పైగా ఆ విధంగా ఆశించటం సంతతిమీద నేరం మోపటం అవుతుంది. సంతతి ప్రయోజనం ఆత్మమోక్షమే అనటం సంతానం మీద అభియోగం నెరపటమే.

విశేషం: సంతతి మోక్షదాయకం కాజాలదు. ఎందుకంటే 'ఆత్మా వై పుత్రనామాసి' అంటూ తానే తనకు జన్మనిచ్చుకొంటున్నాడు తప్ప వేరుకాదు. సంతానం మోక్షహేతువని అనుకొని సంతతినుండి ముక్తికై నిరీక్షించటం ఒక విధంగా సంతతిపై వ్యాజ్యం నెరపటం వంటిది. ఒకవేళ యజ్ఞం ద్వారా ముక్తి లభిస్తుందేమో అనే సందేహాన్ని తీరుస్తూ క్రింది పద్యాన్ని ప్రారంభిస్తున్నాడు.

**క.** **విను పశుయజ్ఞము హింసన ၊ మనంతఫలదంబు గా; దహంకృతిసహితం**
**బనఘా! వాఙ్మనసనియమ ၊ మను యాగం బిచ్చు నవ్యయానందంబున్.** **28**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; విను= ఆలకించుము; పశుయజ్ఞము= పశువులతో చేసే యాగం; హింసనము= హింస; అనంతఫలదంబు= అంతంలేని ఫలితాన్ని ఇచ్చేది; కాదు= కాజాలదు; అహంకృతి సహితంబు= అహంకారంతో కూడింది; వాక్+మనస నియమము= మాటను మనస్సును నిగ్రహించటం; అను యాగంబు= అనే యజ్ఞం; అవ్యయ+ఆనందంబున్= నశించని ఆనందాన్ని; ఇచ్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ తండ్రీ! ఆలకించుము. పశువులతో యజ్ఞం చేసి మోక్షాన్ని పొందలేవు. పైగా అది హింస. అందువలన గొప్ప ప్రయోజనాన్ని ఫలితాన్ని యజ్ఞ నిర్వహణంద్వారా అందుకొనలేవు. యజ్ఞనిర్వహణలో అహంకారం వ్యక్తమవుతుంది. ఆలోచించి చూస్తే కొత్త యజ్ఞం ఒకటుంది. అది మాటను, మనసును నిగ్రహించుకొనటం. ఈ వాఙ్మనసనియమరూపమైన యజ్ఞం ద్వారా శాశ్వతానందం కొత్తగా లభిస్తుంది.

**విశేషం:** పరంపరగా కొనసాగుతూ వస్తున్న యజ్ఞం హింస తప్ప అన్యం కాదు. హింస అనంతఫలితాలను ఇవ్వలేదు. పైగా అది అహంకార సూచనగా కూడా కనిపిస్తుంది. నిజమైన యజ్ఞమంటే వాక్కునూ మనస్సునూ నిగ్రహించుకొనటమే. నిగ్రహం ద్వారానే శాశ్వతానందం లభిస్తుంది. ఇది కొత్త యజ్ఞం. ఇక వాదాన్ని ముగిస్తూ.

**వ. కావున నీవును. 29**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నీవును= నీవు కూడా.

**తాత్పర్యం:** కాబట్టి నీవు కూడా.

**క. కామ క్రోధాద్యములగు । నీ మానస వికృతు లుడిపి యేకాంత గుహా**
**రాముఁడవై నిను వెదకుట । సూ మేఁ; లొండెల్ల నుడుగు సులభవివేకా!' 30**

**ప్రతిపదార్థం:** సులభవివేకా!= సుఖంగా లభించే వివేకం కలవాడా!; కామక్రోధ+ఆద్యములు+అగు= కామం, క్రోధం మొదలైన; ఈ మానస వికృతులు= ఈ మనస్సునకు చెందిన వికారాలను; ఉడిపి= మాన్పి; ఏక+అంత గుహా+ఆరాముడవు+ఐ= ఏకాంతమైన గుహయందు ఆనందించువాడవు అయి; నినున్= (నీలోని) నిన్ను; వెదకుట= పరికించి తెలిసికొనుట; మేలు= ఉత్తమము; సూ= సుమా; ఒండు+ఎల్లన్= ఇతరమంతయును; ఉడుగుము= త్యజించుము, విసర్జించుము.

**తాత్పర్యం:** నీవు అమృతార్థివైతే నీ మానసవికారాలయిన కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం - అనే దుర్గుణాలను విసర్జించుము. ఏకాంత ప్రదేశాన నిశ్చల మనస్కుడవై నిన్ను నీవు అన్వేషించుకొమ్ము. అదే మేలు. ఇతర వ్యవహారాలు అన్నిటినీ త్యజించుము.'

**విశేషం:** ఇక్కడ సులభవివేకా! - అని సంబోధించాడు. వివేకం అందరికీ సులభం కాదు. కొందరి కయితే అది ఎప్పటికీ దుర్లభమే. సంస్కారం కారణంగా కొందరికి వివేకం వెంటనే కలుగుతుంది. ఇక్కడ తనయుడు తండ్రి స్వభావాన్ని గుర్తించి, వెంటనే వివేకంతో తాను తెల్పిన జ్ఞానమార్గాన పయనించి ఆత్మజ్ఞతతో ముక్తిని పొందుమంటున్నాడు. ముక్తిప్రాప్తికి వికారరహిత మనస్సు అవసరమనీ, ఏకాంతవాసమూ అభిలషణీయమనీ తనయుడి కథనం.

ఈ ఇతిహాసమే విలక్షణంగా ఆలోచింపజేసేదిగా ఉన్నది. తండ్రి శ్రోత తనయుడు ఉపదేష్ట. తండ్రి సంప్రదాయవాది ఆనాటికి, తనయుడు ప్రయోగవాది. ప్రయోగానిది సంప్రదాయం మీద పైచేయిగా నిరూపితం కావటం మంచిలక్షణం. లేకుంటే మానవ ప్రగతి ఆగిపోతుంది మరి!

**క. అని పుత్త్రుం డుపదేశిం । చిన జనకుం డట్ల చేసి చెందె సుఖంబున్**
**మనుజేంద్ర! యవ్విధము గని । కొని యూఁదుము సత్యధర్మ కుశలత్వంబున్.' 31**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పుత్త్రుండు= కొడుకు; ఉపదేశించినన్= బోధించగా; జనకుండు= తండ్రి; అట్లు+అ= ఆ విధంగానే; చేసి; సుఖంబున్= సౌఖ్యాన్ని; చెందెన్= పొందాడు; మనుజ+ఇంద్ర!= నరులకు అధిపతీ!; ఆ+విధము= ఆ పద్ధతిని; కని కొని= పొంది; సత్యధర్మ కుశలత్వంబున్= సత్యమందును, ధర్మమందును నేర్పరితనమును; ఊఁదుము= వహించుము.

**తాత్పర్యం:** ఈ విధంగా కొడుకు ఉపదేశించగా తండ్రి కొడుకు ఉపదేశాన్ని గ్రహించి, ఆ విధంగానే చేసి శాశ్వత సౌఖ్యాన్ని అందుకొన్నాడు. కాబట్టి ఓ రాజా! (ధర్మనందనా!) నీవూ ఆ మేధావి ఉపదేశాన్ని అర్థం చేసికొని ఆచరించి సత్యప్రవర్తనలోనూ, ధర్మ నిర్వహణంలోనూ నేర్పరివి కమ్ము.'

**వ. అని చెప్పిన విని యజాతశత్రుండు శంతనుపుత్రునితో 'జగంబున ధనవంతులు నధనులుం గలిగి యుండుదురు. వారలలోన సుఖు లెవ్వరు? దుఃఖు లెవ్వ?'రని యడిగిన నక్కురుపితామహుండు 'శమ్యాకుం డను నొక్క శాంతిపరాయణ బ్రాహ్మణుండు సంసారంబు వదలవిడిచి కూడు సీరకు నవసియుండునట్టివాఁడు; దొల్లి నాకడకు వచ్చి గోష్ఠీప్రసంగంబున నుపదేశించిన వచనంబులు గలవు. వాని వినుమవి భవత్ప్రశ్నంబునకు నుత్తరంబులై యుండు' నని పలికి యిట్లనియె. 32**

**ప్రతిపదార్థం:** అని= పైవిధంగా; చెప్పినన్= పలుకగా; విని= ఆలకించి; అజాతశత్రుండు= (పుట్టని శత్రువులు కలవాడు) ధర్మరాజు; శంతను పుత్రునితోన్= శంతనుడి కొడుకు భీష్ముడితో; జగంబునన్= లోకమందు; ధనవంతులున్= ధనం కలవారు; అధనులును= ధనంలేనివారును; కలిగి+ఉండుదురు= ఉంటున్నారు; వారలలోనన్= అట్టి ఆ ఇరుతెగలవారిలో; సుఖులు+ఎవ్వరు?= సుఖం కలవారు ఎవరు?; దుఃఖులు+ఎవ్వరు?= దుఃఖం కలవారు ఎవరు?; అని; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+కురుపితామహుండు= ఆ కురువంశపు తాత(గారు); శమ్యాకుండు+అను నొక్క శాంతి పరాయణ బ్రాహ్మణుండు= శమ్యాకుడు అనే పేరుగల ఒక శాంతిని ఆశించే బ్రాహ్మణుడు; సంసారంబు= కుటుంబం; వదలన్+విడిచి= తొలగేటట్లు త్యజించి; కూడు+చీరకున్= కూటికి గుడ్డకు కూడా; నవసి+ఉండునట్టివాఁడు= కొరవడి ఉండేవాడు; తొల్లి= ముందు; నా కడకున్= నా దగ్గరకు; వచ్చి= ఏతెంచి; గోష్ఠీ ప్రసంగంబునన్= చర్చా సందర్భంలో; ఉపదేశించిన= బోధించిన; వచనంబులు= మాటలు; కలవు= ఉన్నవి; వానిన్= ఆ మాటలను; వినుము= ఆలకించుము; అవి= ఆ మాటలు; భవత్ ప్రశ్నంబునకున్= నీ ప్రశ్నకు, ఉత్తరంబులు+ఐ= సమాధానాలై; ఉండున్= ఉంటాయి; అని; పలికి= చెప్పి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ మేధావి వృత్తాంతం విన్న తరువాత ధర్మరాజు భీష్ముడిని ఇట్లా ప్రశ్నించాడు: 'లోకంలో ధనవంతులు, నిర్ధనులు అని రెండు విధాలుగా జనులు కనిపిస్తుంటారు. వారిలో సుఖవంతు లెవరు? దుఃఖభాజను లెవరు?' అనగా దానికి ఆ కురువంశపితామహుడు ఇట్లా సమాధాన మిచ్చాడు. శమ్యాకుడు అనే శాంతికాముకుడైన బ్రాహ్మణుడు ఒకడు కుటుంబాన్ని త్యజించి కూడుగుడ్డకు కూడా కటకటపడుతూ పూర్వ మొకనాడు నా దగ్గరకు వచ్చి నాతో గోష్ఠినెరపుతూ ప్రసంగవశాన పలికిన పలుకులు కొన్ని ఉన్నాయి. ఆ పలుకులలో నీ ప్రశ్నకు సమాధానాలు దొరుకుతాయి' అంటూ ఇట్లా చెప్పాడు.

**విశేషం:** లోకంలో ధనమే సుఖశాంతులకు మూలమనే గట్టి అభిప్రాయ మొకటి ప్రాచీనకాలంనుండి పాతుకుపోయి ఉన్నది. ఆ అభిప్రాయంలోని సత్యాసత్యాలను తెలియజెప్పటానికి ఉద్దిష్టమైన దీ వృత్తాంతం.

**తే. 'ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు । నిలిపి యెత్తంగ ములు సూపె నిర్ధనత్వ**
**మెక్కుడై; దాని దిక్కున నెట్టులన్న । వినుము గుణదోషముల భంగి విస్తరింతు. 33**

**ప్రతిపదార్థం:** ధనము కలిమియున్= డబ్బు కలిగి ఉండటం; లేమియున్= (ధనం) లేకుండటం; త్రాసునందున్= కాటాలో; నిలిపి= ఉంచి; ఎత్తంగన్= పైకి లేపగా; నిర్ధనత్వము= డబ్బులేమి; ఎక్కుడు+ఐ= అధికమై; దాని దిక్కునన్= ఆ లేమి వైపునకు; ములు+చూపెన్= ముల్లు (త్రాసులోని భారాన్ని నిర్ణయించే పరికరం) జరిగినది - త్రాసు వంగింది; ఎట్టులు+అన్నన్= ఏ విధంగా అనినచో; వినుము= ఆలకించుము; గుణదోషముల భంగి= గుణాల దోషాల తీరు; విస్తరింతున్= వివరిస్తాను.

**తాత్పర్యం:** కలిమి, లేమి - అనే ఈ రెంటిలో ఏది సుఖకరమైనది? అనే ప్రశ్నకు సమాధానంకొరకు ఆ రెంటిలో ఏది ఉత్తమమో నిర్ణయించటం కొరకు ఆ రెంటిని త్రాసులో పెట్టి తూచగా త్రాసులోని ముల్లు లేమివైపునకే మొగ్గింది. లేమి కలిమి కన్నా ఎట్లా ఉత్తమం? అంటావా? వినుము. ఆ రెండింటిలోగల గుణదోషాలను వివరిస్తాను.

**విశేషం:** చూచేవాడినిబట్టి చూడబడే వస్తువు అనేక విధాలుగా అగుపిస్తుంది. చూచే వ్యక్తి సామాన్యుడయినప్పుడు చూడబడే వస్తువూ సామాన్య రీతిలోనే గోచరిస్తుంది. అట్లా కాకుండా అసామాన్యుడైనప్పుడు ఆ వస్తువూ అసామాన్యంగా కొత్తగా భాసించే వీలున్నది. ఇక్కడ అదే జరిగినది.

**క. ధనము గలవాఁడు మృత్యు వ । దనమున నున్నట్లు భయము దన చిత్తమునం**
**దనుకగ నుల్లల నుడుకును । విను శిఖి చోరాదిముఖ్య విషయాపదకున్. 34**

**ప్రతిపదార్థం:** ధనము కలవాఁడు= ధనవంతుడు; మృత్యువదనమునన్= మరణం యొక్క నోటియందు; ఉన్నట్లు= ఉన్న విధంగా; భయము= భీతి; తన చిత్తమునన్= మనస్సునందు; తనుకగన్= తాకగా; శిఖి చోర+అది ముఖ్య విషయ+ఆపదకున్= అగ్ని, దొంగలు మున్నగు ముఖ్య వస్తువుల వలన విపత్తుకు; ఉల్లలన్= ఉల్ ఉల్ అంటూ (ఉడికేటప్పుడు వచ్చే ధ్వని); ఉడుకును= తాపంపొందును; విను= ఆలకించుము.

**తాత్పర్యం:** ధనవంతుడు ధనం కారణంగానే మృత్యుముఖంలో ఉన్నట్టుగా నిత్యం భయభ్రాంతులకు లోనౌతూ నిప్పువలననో, దొంగలవలననో, కాకపోతే మరొక విధంగానో తన డబ్బు ఎప్పుడు నశిస్తుందో అనే తల్లడపాటుతో సుఖశాంతులకు దూరమై జీవనం సాగిస్తూ ఉంటాడు.

**విశేషం:** నరుడు సుఖశాంతుల కోసమే ధనార్జన చేస్తాడు. ప్రారంభదశలో ధనంవలన సుఖమూ, తద్వారా శాంతీ లభిస్తాయి. అయితే ఈ ఆర్జనాపరమైన ఆశ పెరిగిపోతూ ధనం కూడా అమితంగా ఒనగూడినప్పుడు వ్యతిరేక ఫలితాలు వస్తాయి. అంటే ఆ ధనమే నరుడి సుఖశాంతులకు హానికరంగా పరిణమిస్తుంది.

**క. కోపంబును లోభంబును । నేపారి మనంబు గలఁప నెప్పుడుఁ జింతా**
**తాపంబు నొందు సధనుం । డాపదగా కవ్విధము సుఖావహమగునే? 35**

**ప్రతిపదార్థం:** సధనుండు= ధనంతోఉన్నవాడు; కోపంబును= కోపమూ; లోభంబునున్= పేరాసయు; ఏపారి= పెరిగి; మనంబు= మనస్సు; కలఁపన్= కలచివేయగా; ఎప్పుడున్= ఎల్లప్పుడు; చింతా తాపంబున్= దిగులువలన కలిగే, ఉడుకును; ఒందున్= పొందుతాడు; ఆ+విధము= ఆ పద్ధతి; ఆపద+కాక= దుఃఖకర పరిస్థితి కాక; సుఖ+ఆవహము+అగునే?= సుఖాన్ని కలిగించేది అవుతుందా? (కాదు).

**తాత్పర్యం:** డబ్బు కారణంగా నరుడు కోపానికీ, అత్యాశకు లోనై ముందు మనస్సు పాడుచేసికొంటాడు. మనస్సు నిరంతరం కలతతో ఉన్నప్పుడు దిగులూ విచారం తప్పవు. ఈ స్థితి, దుఃఖం కాకుండా సుఖమా?

**విశేషం:** సుఖశాంతులు అనేవి మనస్సుకు చెందిన అనుభవాలు. డబ్బు పెరిగినప్పుడు మానవసంబంధాలలో మార్పులు వస్తాయి. కోపతాపాలు అధికమౌతాయి. పైగా ఈ ధనం కూడే కొద్దీ లోభమూ పెరుగుతూ ఉంటుంది సాధారణంగా. దానితో మనస్సు కలత చెంది వేదనలు మిగులుతాయి. ఇది ధనవంతుడి స్థితి. దీనిని సుఖమని ఒప్పుకోలేము.

ఇక నిర్ధనుడి స్థితిగతులను వివరిస్తున్నాడు.

**క. ఎచ్చోటనైన నధనుఁడు । విచ్చలవిడి నుండు; లేదు వెఱ పించుకయుం;**
**బొచ్చెపుఁజందం బొల్లఁడు; । మెచ్చరె సురలైనఁ? బలుకు మృదువై యుండున్. 36**

**ప్రతిపదార్థం:** అధనుఁడు= డబ్బులేనివాడు; ఏ+చోటన్+ఐనన్= ఏ స్థలంలోనైనా; విచ్చలవిడిన్= అధిక స్వేచ్ఛతో; ఉండున్= నిలుచును; వెఱపు+ఇంచుకయున్= భయం కొంచెం కూడా; లేదు= ఉండదు; పొచ్చెము+చందంబు= కపటపద్ధతి; ఒల్లఁడు= అంగీకరించడు; పలుకు= మాట; మృదువు+ఐ= మెత్తనిదై; ఉండున్= ఉంటుంది; సురలైనన్= దేవతలయిననూ; మెచ్చరె?= పొగడరా?

**తాత్పర్యం:** నిర్ధనుడు ఎక్కడైనా స్వేచ్ఛగా ఉండగలడు. కొంచెం కూడా భయముండదు. కపటప్రవర్తన అంగీకరించడు. మాట మృదువుగా ఉండటంతో జనప్రియుడుగా మారే వీలుంటుంది. ఇన్ని సుగుణా లున్నప్పుడు దేవతలైనా ఆ నిర్ధనుడిని మెచ్చుకోవలసిందే!

**విశేషం:** ధనాశలేని కారణాన జీవితంలో కపటప్రవృత్తికి అవసరం ఉండదు. మాటలో మార్దవంవలన బ్రతుకు సుఖమయంగా ఉంటుంది.

**క. లోకము చందము గనికొని। యీ కానఁగ నగు ధనాదు లెల్లను గాల**
**వ్యాకులతఁ బొందఁ గలయవి। గాకుండమి యెఱిఁగి విడుపు గడుఁ జదు రెందున్. 37**

**ప్రతిపదార్థం:** లోకము చందమున్= లోకము యొక్క తీరు తెన్నులు; కనికొని= గ్రహించి; ఈ కానఁగన్+అగు= ఈ కనిపించే; ధన+ఆదులు+ఎల్లను= డబ్బు మొదలైనవి అన్నీ; కాలవ్యాకులతన్= కాలంవలన నాశనమును; పొందన్+కల+అవి+కాక+ఉండమి= చెందేవికాకుండా ఉండలేని స్థితి (చెందే తీరవలసిన స్థితిని); ఎఱిఁగి= గ్రహించి; విడుపు= ఎడబాటు-ధనంనుండి; ఎందున్= ఎక్కడైనా; కడున్= మిక్కిలి; చదురు= నేర్పు.

**తాత్పర్యం:** లోకంలోని తీరు తెన్నులు గ్రహించి, మన ఈ కన్నులకు అగుపించే డబ్బాదస్కం మొత్తం చివరకు కాలప్రభావాన నశించక తప్పనివే అనే జ్ఞానంతో డబ్బునుండి ముక్తి పొందటం ఎప్పుడైనా ఎక్కడైనా నేర్పరితనమే.

**విశేషం:** సృష్టిలో పుట్టిన ప్రతిదీ గిట్టేదే. కాలం దేనినీ మిగల్చదు. అటువంటప్పుడు మనిషీ నశిస్తున్నాడు. ఇది లోకస్థితి. ఈ చందం గమనించి నరు డార్జించే డబ్బుకూ కాలంచేతిలో నాశనం తప్పదు అనే జ్ఞానం కలిగి డబ్బుకు దూరంగా జీవించటం నేర్పు. చివరకు పిండితార్థ ప్రతిపాదకంగా ఒక పద్యం.

**క. ధనవత్త్వము దుఃఖకరం। బని కని తత్కాంక్ష విడుచు నతని కధనతా**
**జనితాత్మాధీనత్వం। బనుపమ సౌఖ్యంబు సేయు నక్షీణముగన్.' 38**

**ప్రతిపదార్థం:** ధనవత్త్వము= డబ్బుగలవాడితనం; దుఃఖకరంబు+అని= దుఃఖాన్ని కలిగించేది అని; కని= తెలిసి; తద్ కాంక్ష= ఆ కోరిక; విడుచు+అతనికిన్= వదలేవానికి; అధనతా జనిత+ఆత్మ+అధీనత్వంబు= నిర్ధనత్వం వలన కలిగిన తనకు (తాను)లోబడిన తనం; అక్షీణముగన్= నశించకుండా; అనుపమ= సాటిలేని; సౌఖ్యంబు+చేయున్= సుఖం కలిగిస్తుంది.

**తాత్పర్యం:** నరుడు డబ్బుకలిగి ఉండటం దుఃఖహేతువు - అనే జ్ఞానం కలిగి, డబ్బు మీది కోరికను విడిచిపెట్టినప్పుడు ఆ లేమి కారణంగా తన అధీనంలో తాను ఉండగలడు. ఈ ఆత్మాధీనత్వ మనేది ధనవంతుడికి అసాధ్యం. ముందుగా అతడు ధనానికి అధీనుడైతే తప్ప ఆ ధనవత్త్వం కొనసాగదు మరి! కాగా ఈ ఆత్మాధీనత్వ మనే ఒక్క లక్షణంవలన సాటిలేని సుఖశాంతులు మనిషి పొందగలుగుతాడు.'

**విశేషం:** ఇక్కడి ఆత్మాధీనత్వమనే ఈ లక్షణం నరులలో చాలా అరుదుగా కనిపిస్తుంది. ప్రయోజనాకాంక్షిగా ఉన్న ప్రతివాడూ ఆత్మాధీనత్వాన్ని తనకు తాను అధిపతిగా ఉండగలిగినతనాన్ని వదులుకోవలసినవాడే. ప్రయోజనాలన్నీ లోకాన సామాన్యంగా ధనానికి ప్రతిరూపాలే. కాబట్టి ధనాశ వదలితే ఇక వదిలించుకొనవలసింది ఏదీ మిగులదు.

**భీష్ముఁడు ధర్మజునకు మంకి యను బ్రాహ్మణుని చరిత్రంబు సెప్పుట (సం ॥ 12-171-4)**

**వ.** **అని చెప్పె ననిన విని ధర్మతనయుండు పితామహుతో 'ధన తృష్ణాభిభూతుండగు పురుషుం డేమిట సుఖియగు?' ననుటయు నయ్యమరనదీనందనుండు 'ధనార్జనంబుతోడి విసువుటం బుట్టిన విడుపున సుఖంబు గలుగు నయ్యర్థంబుఁ దెలిపెడునది యొక్క యితిహాసంబు గలదు విను'మని యిట్లనియె.39**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; చెప్పెన్= శమ్యాకుడు పలికాడు; అనినన్= అనగా; విని= ఆలకించి; ధర్మతనయుండు= ధర్మరాజు; పితామహుతోన్= తాతతో; ధనతృష్ణా+అభిభూతుండు+అగు= డబ్బుమీది పేరాసచేత (ఆక్రమించబడిన); పురుషుండు= నరుడు; ఏమిటన్= దేనితో; సుఖి+అగున్= సుఖం కలవాడు ఔతాడు?; అనుటయున్= అనగా; ఆ+అమర నదీనందనుండు= ఆ దేవతల నది (గంగా) కొడుకు (భీష్ముడు); ధన+ఆర్జనంబుతోడి విసువుటన్= డబ్బు సంపాదించటంతో (కలిగే) విసుగుదల వలన; పుట్టిన= కలిగిన; విడుపునన్= ఎడబాటుతో; సుఖంబు+కలుగున్= సౌఖ్యం సిద్ధిస్తుంది; ఆ+అర్థంబున్= ఆ విషయమును; తెలిపెడు+అది= తెలియజేసేది; ఒక్క= ఒక; ఇతిహాసంబు= జరిగిన కథ; కలదు= ఉన్నది; వినుము= ఆలకించుము; అని; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా శమ్యాక వచనాలు విన్న తరువాత, ధర్మరాజు మరొక ప్రశ్న తన తాతకు వేశాడు. 'డబ్బుమీద పేరాసకు లోనైనవాడు ఎప్పుడు ఏ విధంగా సుఖం పొందుతాడు?' అనేది ఆ ప్రశ్న. దానికి తాతగారి సమాధానం చాలా సూటిగా ఉన్నది. 'ఏమీ లేదు! ధనార్జనలో విసిగివేసారి దానినుండి ముక్తిని (ఎడబాటు) పొందినపుడే వాడి కిక సుఖం లభిస్తుంది. ఈ అంశాన్ని తెలిపే కథ ఒకటి ఉన్నది వినుము.' అంటూ ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఆశ వేరు, పేరాస వేరు. ఆశ అవసరమే, పేరాశ - తృష్ణ మనిషిని దుఃఖంలో ముంచుతుంది. తృష్ణ అంటే దాహం, అది తీరని దాహం. దానినుండి విడివడటమే సుఖం.

**సీ.** **మంకి నాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై । వర్తించు శిక్షింపవలయునట్టి**
**గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి । యుండ లంకియతోన గండు మీఱి**
**పాఱె నక్కోడియల్ పడియున్న గనపలొ । ట్టెనుంగు పై నది యెగసి పఱవ**
**నుభయ పార్శ్వంబుల నురిపోసిన ట్లవి । వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి**

**తే.** **'రత్నములుఁ బోని వత్సతరంబు లకట! । వ్రేలుచున్నవి లొట్టెన్గు వెంటఁ దవిలి'**
**యనుచు నిర్వేద మొంది యిట్లనియెఁ దన్నుఁ । గరుణతోడఁ గనుంగొను నరులతోడ. 40**

**ప్రతిపదార్థం:** మంకినాన్= మంకి అనగా; పరఁగు= ఉండు; బ్రాహ్మణుఁడు= విప్రుడు; ధన+ఇచ్ఛమైన్= డబ్బుమీది కోర్కెతో; వర్తించున్= ప్రవర్తిస్తాడు; శిక్షింపన్+వలయు+అట్టి= (పనిపాటులు) నేర్పవలసినట్టి; గుజ్జుదోయిని= కోడెల జంటను; జట్టిన్+కొని= అమ్మకంలో కొని; ప్రీతిన్= ప్రేమతో; లంకించి+ఉండన్= (ఒకదానితో మరొకటి) జతచేసి ఉండగా - కట్టుత్రాటితో కట్టివేసిఉండగా; లంకియతోన= కట్టు త్రాటితోనే; ఆ+కోడియల్= ఆ కోడెదూడలు; గండు మీఱి= సామర్థ్యం హెచ్చి; పడి+ఉన్న= పడుకొనిఉన్న; గనప= పెద్ద; లొట్టె+ఏనుంగుపై= ఒంటెపై - మీదుగా; పాఱెన్= పరుగెత్తింది; అది= ఆ ఒంటె; ఎగసి= లేచి; పఱవన్= పరుగెత్తగా; ఉభయపార్శ్వంబులన్= (దాని) రెండువైపులా; ఉరిపోసినట్లు= ఉరివేసినట్లుగా; అవి= ఆ కోడెలు రెండు; వ్రేలి= వ్రేలాడి; చచ్చినన్= చావగా; చూచి= కని; విప్రుఁడు= బ్రాహ్మణుడు; అడలి= భయపడి;రత్నములున్+పోని= రత్నాలవంటి; వత్సతరంబులు=

కోడెదూడలు; అకట!= అయ్యో!; లొట్టె+ఏన్గు వెంటన్= ఒంటెవెంట తగుల్కొని; వ్రేలుచున్నవి= వ్రేలాడుతున్నాయి; అనుచున్= అనుకొంటూ; నిర్వేదము+ఒంది= విరక్తి చెంది; తన్నున్= తనను; కరుణతోడన్= దయతో; కనుంగొను నరులతోడన్= చూచే మనుష్యులతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** మంకి అనే పేరుగల బ్రాహ్మణు డొకడు ధనాశతో జీవిస్తూ ఉండేవాడు. ధనార్జనకొరకే, అతడు పనిపాటులు నేర్పవలసిన కోడెదూడలను కొని, రెంటిని ఒకే తాటితో (మెడలకు) కట్టి ఉంచాడు. ఆ దూడలు చురుకుపుట్టి హఠాత్తుగా రెండూ కలిసి పరుగెత్తుతూ త్రోవలో పడుకొని ఉన్న పెద్ద ఒంటెమీదుగా ఒంటెకు అటు ఒకటి ఇటు ఒకటిగా దాటబోయాయి. వాటి అలజడికి ఆ ఒంటె కూడా పైకి లేచి పరుగెత్తటం మొదలు పెట్టింది. ఆ ఎత్తైన ఒంటెకు ఇరువైపులా ఈ కోడెల జంట మెడకున్న పలుపుత్రాటితో పైకి లేచింది. మెడకున్న పలుపే ఉరికాగా కోడెలు రెండూ చచ్చి వ్రేలాడాయి. క్షణాలలో ఇదంతా జరిగిపోవటంతో ఆ మంకి విప్రుడు 'అయ్యో! రత్నాలవంటి కోడెలు క్షణంలో శవాలుగా మారిపోయి ఒంటెకు అటూ ఇటూ వ్రేలాడుతున్నాయే!' అని మనస్సున నిర్వేదం పుట్టగా, తనను దయతో జాలితో చూస్తున్న జనాన్ని ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** నరుడు వాంఛించింది ధనాన్ని, సిద్ధించింది అతడికి పెద్ద నష్టం. దీనిలో అతడి ప్రమేయ మేమీ లేదు. అంతా దైవనిర్ణయమే.

**తె. సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు । కంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి;**
**కెచట నేనియుఁ బౌరుష మెసకమెసఁగె । నేని యది దైవదత్తంబ యింత నిజము. 41**

**ప్రతిపదార్థం:** సారమతిన్= శ్రేష్ఠమైన బుద్ధితో; పరికింపఁగన్= పరీక్షించగా; కార్యసిద్ధికిన్= పని నెరవేరటానికి; పౌరుషంబు కంటెన్= పురుష ప్రయత్నంకంటె; దైవంబు= భాగ్యం, అదృష్టం; ముఖ్యంబు= ప్రధానం; ఎచటన్+ఏనియున్= ఎక్కడైనా; పౌరుషము= పురుషకారము; ఎసకము+ఎసఁగెన్+ఏని= ప్రకాశించినదేని; అది= అట్లవటం; దైవదత్తంబు+అ= భాగ్యంచేత ఈయబడిందే; ఇంత= ఇది; నిజము= సత్యం.

**తాత్పర్యం:** తొందరపాటు, పక్షపాతం లేకుండా శ్రేష్ఠమైన బుద్ధితో ఆలోచించి చూస్తే కార్యసిద్ధి జరగాలంటే మానవ యత్నంకంటే దైవబలమే ముఖ్యం. ఎక్కడయినా ఎప్పుడయినా మానవయత్నం ఫలించినట్లు కనిపించినా నిజానికి అది దైవానుగ్రహమే తప్ప అన్యం కాదు.

**విశేషం:** నరుడు కరణం, దైవం కర్త. (కరణం= ఉపకరణం పనిముట్టు. కర్త= చేసేవాడు.)

**వ. కావున. 42**

**తాత్పర్యం:** కాబట్టి. (కార్యసిద్ధికి మానవయత్నంకంటే దైవబలమే ప్రధానం కాబట్టి.)

**క. మనమునకు సుఖము గోరెడు । జనులకు నర్థక్రియా విశారద భంగుల్**
**పొనుపడ విడిచి భరము లే । కునికియ యూహించి చూడ నుర వెబ్భంగిన్.' 43**

**ప్రతిపదార్థం:** మనమునకున్= మనస్సుకు; సుఖము+కోరెడు జనులకున్= సౌఖ్యం కాంక్షించే నరులకు; అర్థక్రియా విశారద భంగుల్= వ్యవహారాలలో, చేష్టలలో సమర్థమైన తీరులను (గొప్ప యత్నాలను); పొనుపడన్= తగ్గించి; విడిచి= వదలి; భరము లేక+ఉనికి+అ= భారము (బరువు) లేకుండా ఉండటమే; ఊహించి చూడన్= ఆలోచించి చూస్తే; ఏ+భంగిన్= ఏ విధంగానైనా; ఉరవు= శ్రేష్ఠం, ఉచితం.

**తాత్పర్యం:** సుఖమే పరమార్థమైనపుడు ఆ సుఖం దైవదత్తం తప్ప పురుషప్రయత్నం వలన సాధ్యంకాదని తెలిపోయినప్పుడు, నరుడు తన సర్వకార్యక్రమాలను, చేష్టలను, నైపుణ్యాలను పక్కకుపెట్టి, భారమంతా దైవం మీదే మోపి, తాను బరువు తీరి ఏ భారం మీదవేసికొనకుండా ఉండటమే ఉచితం.'

**విశేషం:** చేసినా చేయకపోయినా ఒకటే, అనే స్థితిలో పెద్దగా ప్రయత్నం చేయకపోవటమే ఉచితం. మనస్సు భారం లేకుండా తేలికగా ఉంటుంది. దైవదత్తమైనది నరుడిని చేరి తీరుతుంది.

**వ. అని పలికి యుద్దామంబైన కామంబు విడుపువడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగునే? యను విచారంబు పుట్టి తదీయోత్సారణం బూహించి యా చిత్తధర్మంబు నుద్దేశించి. 44**

**ప్రతిదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; ఉద్దామంబు+ఐన= తీవ్రమైన; కామంబు= కోరిక; విడుపు+పడక+ఉన్నన్= వదలిపోకున్నచో; చిత్తంబునకున్= మనస్సునకు; నిర్వృతి= ఆహ్లాదం; కలుగునే?= ఏర్పడునా?; అను విచారంబు= అనే ఆలోచన; పుట్టి= కలిగి; తదీయ+ఉత్సారణంబు= దాని తొలగింపు; ఊహించి= యోచించి; ఆ+చిత్త ధర్మంబును= ఆ మనస్సుయొక్క స్వభావమును; ఉద్దేశించి= లక్షించి, లక్ష్యంగా ఉంచుకొని.

**తాత్పర్యం:** మనస్సుకు ఆహ్లాదం కలగాలంటే తప్పకుండా అది కోర్కెల తీవ్రతతో నిండి ఉండకూడదు. కోర్కెల తీవ్రతను మనస్సునుండి తోసివేయాలంటే ఏమి చేయాలి? - అనే ఆలోచనతో ఆ మంకి బ్రాహ్మణుడు తన మనస్సును గుర్తించి దానితో ఇట్లా ప్రసంగించబోతున్నాడు.

**విశేషం:** 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అనేది ఉపనిషద్ వాక్యం. సుఖ దుఃఖాలు మనోధర్మాలు. కాగా మనస్సును స్వాధీనపరచుకొంటె సుఖదుఃఖాలూ స్వాయత్తమైనట్లే!

**క. 'నీ మూలం బే నెఱిఁగితిఁ । గామమ! సంకల్పముననె కలిగెదు సంక**
**ల్పామర్శరహితమగు చే । తోముద్రం దాల్తు నేను దుది యది నీకున్. 45**

**ప్రతిపదార్థం:** కామమ!= ఓ కోరికా!; నీ మూలంబు= నీ కారణము; ఏన్= నేను; ఎఱిఁగితిన్= తెలిసికొన్నాను; కామమ!= ఓ కోరికా!; సంకల్పముననే+అ= భావనచేతనే; కలిగెదు= పుట్టెదవు; సంకల్ప+ఆమర్శ రహితము+అగు= భావన స్పర్శ లేనిదగు; చేతస్+ముద్రన్= మనస్సుయొక్క స్థితిని; నేను; తాల్తున్= ధరిస్తాను - వహించెదను; అది= ఆ మనోముద్ర; నీకున్= (కామమునకు); తుది= చివర సమాప్తి నాశనం.

**తాత్పర్యం:** మంకి తన మనస్సుతో ప్రసంగిస్తున్నాడు: 'ఓ కోరికా! నీ మూలాన్ని కనుగొన్నాను. నీవు సంకల్పం నుండి జన్మిస్తున్నావు. కాబట్టి నేను సంకల్ప స్పర్శ ఉండని మనోముద్రను వహించి నిన్ను నశింపజేస్తాను.'

**విశేషం:** మనస్సును సంకల్పరహితంగా చేయగలిగితే ముక్తి సిద్ధించినట్లే.

**వ. అని కామం బనునది గోర్కి గావునఁ గోర్కి యొప్పమి దేటపఱుపం దలంచి. 46**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; కామంబు+అనునది= కామము అని పిలువబడేది; కోర్కి+కావున్= కోరిక కాబట్టి; కోర్కి+ఒప్పమి= కోర్కెయొక్క అనౌచిత్యము - తగనితనము; తేటపఱుపన్= స్పష్టపడేటట్లుగా చేయటానికి; తలంచి= ఆలోచించి.

**తాత్పర్యం:** కోర్కె ఏ విధంగా అనుచితమో స్పష్టపరచే అభిప్రాయంతో తన ఆలోచనను కొనసాగిస్తున్నాడు.

**తే. సొమ్ము గోరినయంతన సుఖము గలుగ; । దది యుపార్జింపఁగా సిద్ధియగుట నిజమె?**
**కలిగెనేని యనేక చింతల నొనర్చుఁ । జెడుట చావుతోఁ దుల్య మయ్యిడుమ యేల? 47**

**ప్రతిపదార్థం:** సొమ్ము= ధనమును; కోరిన+అంతన్+అ= కోరినంతనే; సుఖము= సౌఖ్యం; కలుగదు= పుట్టదు; అది= ఆ సొమ్ము; ఉప+ఆర్జింపఁగాన్= సాధించగా ; సిద్ధి+అగుట= నెరవేరుట; నిజము+ఎ?= సత్యమా? (సందేహము); కలిగెను+ఏని= సిద్ధించెనేని; అనేకచింతలన్= పెక్కు వెతలను; ఒనర్చున్= ఒనగూర్చును - తెచ్చిపెట్టును; చెడుట= సిద్ధింపకుండటం; చావుతోన్= మరణంతో; తుల్యము= సమానము; ఆ+ఇడుమ+ఏల?= ఆ కష్టం ఎందుకు?

**తాత్పర్యం:** సుఖప్రాప్తికి ధనం మూలం గావచ్చును. అయితే ఆ ధనం కోరినంతనే సిద్ధించదు. దానికై యత్నించాలి. యత్నిస్తే సిద్ధిస్తుందని నిశ్చయముండదు. సిద్ధిస్తే సిద్ధించవచ్చును. లేకుంటే లేకపోవచ్చును. అయితే సిద్ధిస్తే, ఆ ధనంతోపాటు ఎన్నో వెతలూ వెన్నంటి ఉంటాయి. అసలు సిద్ధించలేదంటే ఆ ఓటమి చావుతో సమానం. కాబట్టి ముందూవెనుకా అటూ ఇటూ అన్నివైపులా దుఃఖాలనే కలిగించే సొమ్ముకై సంకల్పించట మెందుకు?

**విశేషం:** కేవలం కోర్కెతో సుఖం లేదు. నిజమే. అది అందరికీ తెలిసిందే. ఇక్కడ మంకి చెప్పదలచిందేమిటంటే కోర్కెను నెరవేర్చుకోవటంలోనూ నిజంగా సుఖం ఉండదని, పైగా యత్నించి ఓడితే ఆ ఓటమి మరణం వంటిది. నిజమే మరి!

**వ. ఇచ్ఛా నిరసనంబు సుఖం'బని వెండియు. 48**

**ప్రతిపదార్థం:** ఇచ్ఛా నిరసనంబు= కోర్కెను తిరస్కరించటం; సుఖంబు+అని= సంతోషమని; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** కోర్కెను తిరస్కరించటంలోనే నిజమైన సుఖమున్నది. కోర్కెలు లేని మనస్సు ముక్తమే - అనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'శోకశ్రమ తృష్ణలకున్ । నీ కలిమియ యోల మగుట నీ కగపడు వాఁ**
**డే కర్తవ్యము గానం । డో కామమ! నిన్ను దొఱఁగి యుండెద సుఖినై. 49**

**ప్రతిపదార్థం:** ఓ కామమ!= ఓ కోరికా!; శోక శ్రమ తృష్ణలకున్= ఇష్టనాశనంవలన దుఃఖానికి, అలసటకు, పేరాసకు - ఈ మూడిటికీ; నీ కలిమి+అ= (నీవు ఉండుటే) నీ ఉనికియే; ఓలము+అగుటన్= రహస్య స్థావరం కాబట్టి; నీకున్; అగపడువాఁడు= గోచరించేవాడు-నీ పాలిటబడినవాడు; ఏ కర్తవ్యము= ఏ చేయవలసిన పనినీ; కానండు= చూడడు; నిన్నున్; తొఱఁగి= వదలి; సుఖినై= సుఖం కలవాడనై; ఉండెదన్= జీవిస్తాను.

**తాత్పర్యం:** (మంకి ఇంకా కామంతోనే మాట్లాడుతున్నాడు.) 'ఓ కామమా! లోకంలో ఇష్టనాశనంవలన కలిగే దుఃఖానికి, ధనార్జనకై పడే శ్రమకీ, ఆర్జితమైన దానితో తృప్తిపడక ఇంకా ఇంకా ఆర్జించాలనే తపనకీ నీవే మూలస్థానానివి. నీవు ఆవహించిన వాడిని మరేదీ పట్టదు. కాబట్టి నిన్ను విడవటంలోనే సుఖం లభిస్తుంది.

**విశేషం:** శోకమూ దుఃఖమే అయినా, రెంటికీ భేదం ఉన్నది. ఇష్టజనం ఎడబాటువలన కలిగే దుఃఖం శోకం. ఆశ ముదిరితే తృష్ణగా మారుతుంది. ఆశ లేకుండా జీవించటం ఎట్లా సాధ్యమనిపిస్తుంది గాని, తృష్ణతో బ్రదకటం మాత్రం దురంతమైన అనుభవం.

**క. నీ వాస పఱుప ధనములు । గావించెదఁ బో వినాశకముల నుడుపఁగా**
**నీ వశమె? కాన నీ చెడు । టే వగపుం దేదు పెనుపదే దైన్యంబున్? 50**

**ప్రతిపదార్థం:** నీవు= (కామాన్ని ఉద్దేశించిన పలుకు) ఓ కామమా! నీవు; ఆస పఱుపన్= ఆశపెట్టగా; ధనములు= సంపదలు; కావించెదన్+పో= సంపాదించితిని పో; వినాశకములన్= చేటులను; ఉడుపన్+కాన్= నశింపజేయటం; నీ వశము+ఎ?= నీ అధీనమా? (నీకు సాధ్యమా) కాదు; కానన్= కావున; నీ చెడుట= నీ యొక్క నశింపు; ఏ వగపున్+తేదు= ఏ దుఃఖాన్ని కలిగించదు; ఏ దైన్యంబున్= ఏ దీనత్వాన్ని, దిక్కులేనితనాన్ని; పెనుపదు= పెంచదు.

**తాత్పర్యం:** నీవు ఆశపెట్టిన కారణాన, తీవ్రంగా కష్టించి సొమ్ము ఆర్జించినా అనంతరం దాపురించే కష్టపరంపర దానిని దాచటానికి రక్షించటానికి పడవలసిన పాట్లు మిగిలే ఉంటాయి. ఈ కామం, ఆ కష్టపరంపర నుండి చేటులనుండి నరుడిని రక్షించలేదు. కాబట్టి నిన్ను నిరసించటంవలన ఏ దుఃఖమూ ఏర్పడదు. కొత్తగా ఏ దుర్దశా, దైన్యమూ ఆవహించదు.

**విశేషం:** కామానికి తల ఒగ్గితే ఒక దుఃఖం అదనంగా నరుని చేరటం తప్ప సుఖముండదు. దుఃఖంనుండి దుఃఖాన్ని చేరుకొనటంకంటె అసలు ఆ కామాన్నే త్రోసిరాజంటే సుఖంగా ఉండవచ్చును.

**చ.** **సులభము దుర్లభంబొ యని చూడ నెఱుంగవు గన్నదానిపై**
**నలముదు కామమా! యిడుమ లందఁగఁ జేయుదు నిండు టేమిటం**
**గలుగదు నీకు నీతెఱఁ గగాధ రసాతల భంగి నీవు స**
**న్పోలమునఁ బోవకుండ నినుఁ బుచ్చెద బచ్చెన రూపు పోకలన్.** **51**

**ప్రతిపదార్థం:** కామమా!= ఓ కోరికా!; సులభమొ= సుఖంగా లభించేదో; దుర్లభంబొ= దుఃఖంతో లభించేదో; అని చూడన్+ఎఱుంగవు= అని గమనించటం తెలియవు; కన్నదానిపైన్= చూచిన దానిమీద; అలముదు(వు)= చుట్టుకొందువు; ఇడుమలు+అందఁగన్+చేయుదు(వు)= కష్టములు పొందేటట్లు చేస్తావు; నీకున్; ఏమిటన్= దేనితోడనూ; నిండుట= పూర్తి కావటం; కలుగదు= ఉండదు; నీ తెఱఁగు= నీ పద్ధతి; అగాధ రసాతలభంగి= లోతైన పాతాళం వంటిది; నీవు చన్+పొలమునన్= నీవు వెళ్ళే చోట; పోవక+ఉండన్= వెళ్ళకుండ; నినున్= నిన్ను; బచ్చెనరూపు పోకలన్= రంగు (తోడి) ఆకారపు రీతులలో; పుచ్చెదన్= పెరికెదను, తొలగిస్తాను.

**తాత్పర్యం:** ఓ కామమా! నీ దృష్టి నీదిగాని, నీ కన్నుపడిన వస్తువు సులభమో కాదో నీవు పట్టించుకొనవు. అమాంతంగా దానిని ఆక్రమించి స్వాధీనపరచుకొనాలని చూస్తావు. ఆ విధంగా నరుడిని కష్టాలపాలు చేస్తావు. అగాధమైన పాతాళ లోకంవలె నీవు ఎన్ని కబళించినా నిండవు. ఇంకా పూర్తి కావలసింది మిగిలే ఉంటుంది. కాబట్టి నీవు వెళ్ళేదారిలో వెళ్ళకుండా, నీకు దూరంగా ఉండి, నిన్ను రంగుతో ఏర్పడిన ఆకారాన్ని తొలగించినట్లు తొలగించి రూపుమాపుతాను.

**విశేషం:** కామం పూరించే కొద్దీ మళ్ళీ ప్రకోపిస్తూనే ఉంటుంది. అందువలననే అంటారు పెద్దలు "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి" అని. కామం కోర్కెల అనుభవాలతో ఎప్పటికీ తీరదని పై మాట తాత్పర్యం. రంగుతో ఒక ఆకారాన్ని ఏర్పరచినపుడు తిరిగి ఆ ఆకారాన్ని రూపుమాపటమూ సంకల్ప బలమున్నప్పుడు సాధ్యమే. కామాన్ని ఆ విధంగా నశింపజేస్తాడట మంకి. స్థిర సంకల్పు డతడు.

**తే.** **ధనము చేటున విసివి నామనము నిన్ను। నెడలవిడిచెనో కామమ! యేను శాంతి**
**దాంతి సత్యక్షమాభూతదయలఁ జెంది। నాఁడ; లోభాదు లందవు నన్ను నింక.** **52**

**ప్రతిపదార్థం:** ఓ కామమా!= ఓ కోరికా!; ధనము చేటునన్= సొమ్ము నాశనంతో (కోడెదూడల చావు); విసివి= విసిగి, అలసటచెంది; నా మనము= నా మనస్సు; నిన్నున్; ఎడలన్ విడిచెన్= తొలగ వదలింది; ఏను= నేను; శాంతి దాంతి సత్యక్షమా భూతదయలన్=

కోపం లేమిని, కర్మేంద్రియ నిగ్రహాన్ని, నిజమును, ఓర్పును, ప్రాణులయెడ కరుణను - ఈ అన్నిటిని; చెందినాఁడన్= పొందినవాడను; ఇంకన్= ఇకమీదట; నన్నున్; లోభ+ఆదులు= లోభం మొదలైనవి; అందవు= పొందవు.

**తాత్పర్యం:** ఓ కామమా! నీవెంట పరుగెత్తి దైవం ప్రతికూలించిన కారణాన ధననాశనం పొంది, విసిగి వేసారి ఉన్న నేను నిన్ను సంపూర్ణంగా తిరస్కరించాను. కామతిరస్కారంతో నాలోని కోపం నశించింది. ఇంద్రియ నిగ్రహం కలిగింది. ఓర్పు నెలకొన్నది. ప్రాణులయెడ కరుణ పాదుకొన్నది. కాబట్టి ఇకపై నన్ను నీ తోబుట్టువులైన లోభము యొక్క గుణాలు కూడా స్పృశించలేవు.

**విశేషం:** కామమొక్కటి తొలగిపోతే మిగిలిన చెడుగులన్నీ స్వయంగా దూరీకరించబడతాయి. కామమే సర్వదోషాలకూ నిలయం.

**తే. కామ సుఖ దివ్య సుఖములు కాంక్ష దొఱఁగు । మేలి షోడశాంశంబునఁ బోలలేవు**
**గాన కామమ! నిను శత్రు కరణిఁ జంపి । బ్రహ్మపురమున నుండెద రాజుఁ బోలె.' 53**

**ప్రతిపదార్థం:** కామమ!= ఓ కోరికా!; కామ సుఖ దివ్య సుఖములు= కోర్కెవలన సౌఖ్యం, దేవలోక సౌఖ్యము ఈ రెండు సౌఖ్యాలు; కాంక్ష+తొఱఁగు మేలి షోడశాంశంబునన్= కోర్కెను విడవటం (అనే సుఖం) యొక్క గొప్ప పదహారవ భాగంతో; పోల లేవు= సరితూగలేవు; కానన్= కావున; నిను= నిన్ను; శత్రుకరణిన్= పగవాడినివలె; చంపి= నశింపచేసి; బ్రహ్మపురమునన్= పరబ్రహ్మ నగరాన; రాజు+పోలెన్= రాజువలె; ఉండెదన్= వసిస్తాను.

**తాత్పర్యం:** కోర్కెలు ఈడేరటంవలన కలిగే సుఖం, స్వర్గంలో లభించే సుఖం - ఈ రెండు సుఖాలూ పోల్చిచూచినపుడు నిన్ను త్యజించటంవలన కలిగే సుఖం ముందు దిగదుడుపే. కాబట్టి నిన్ను శత్రువువలె చంపి, పరబ్రహ్మయొక్క నగరంలో రాజువలె జీవిస్తాను.'

**విశేషం:** కాంక్షలు అనేకం. ఒకటి తరువాత మరొకటి అట్లా పుట్టుకొస్తూనే ఉంటాయి పదులు వందల సంఖ్యలో అవి. కాని కాంక్షాపరిత్యాగం ఒకటే. అది అద్వితీయం. అంటే రెండోది లేనిది అని అర్థం. కాబట్టి విలువలో కూడా ఆ వ్యత్యాసముండక తప్పదు మరి! అందుకే మంకి చివరకు నిష్కర్షగా కాంక్షాపరిత్యాగసుఖం ముందు మిగిలిన సుఖాలన్నీ అత్యల్పాలు అని ప్రకటించాడు అనుభవపూర్వకంగా.

### అజగరచరిత వ్రతము (సం. 12-172-2,3)

**వ. అని పలికి యివ్విధంబునం గోడెలు సచ్చినం బుట్టిన నిర్వేదంబున సకలకామంబులం బరిత్యజించి దేవసముండై యుండె'నని చెప్పిన విని పాండవాగ్రజుం 'డేమి వర్తనంబున నరుండు వీత శోకుం డగుచుఁ జరించు? నెద్దానం జేసి పరమగతి వడయు?' ననుటయు ననిమిషనదీనందనుం డజగరచరితంబను నితిహాసంబు వినుము దాన నీ యడిగిన యర్థంబు దేటపడు. దానిం జెప్పెద; నజగర నామధేయుం డగు నొక్కబ్రాహ్మణునిఁ బ్రహ్లాదుండు శమప్రకారం బుపదేశింపుమని యభ్యర్థించిన నతం డతని కిట్లనియె. 54**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; ఈ+విధంబునన్= ఈ పద్ధతిలో; కోడెలు= కోడెదూడలు; చచ్చినన్= చనిపోగా; పుట్టిన నిర్వేదంబునన్= కలిగిన రోతతోడి దుఃఖంతో; సకల కామంబులన్= ఎల్లకోర్కెలను; పరిత్యజించి= దిగవిడిచి; దేవసముండు+ఐ= దేవతతో సమానమైనవాడై; ఉండెన్= నివసించాడు; అని చెప్పినన్= అని పలుకగా; విని= ఆలకించి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ఏమి వర్తనంబునన్= ఏ ప్రవర్తనతో, నడతతో; నరుండు= మానవుడు; వీతశోకుండు+అగుచున్= నశించిన శోకంగలవాడుగా; చరించున్?= నడచును?; ఏ+దానన్+చేసి= దేనివలన; పరమగతి= పరమపదము, మోక్షం; పడయున్= పొందుతాడు?; అనుటయున్= అనగా; అనిమిష నదీ నందనుండు= దేవనది తనయుడు భీష్ముడు; అజగర

చరితంబు+అను= అజగర చరితం అనే పేరుగల; ఇతిహాసంబు= చరిత్ర, జరిగిన కథ; వినుము= ఆలకించుము; దానన్= దానివలన; నీ అడిగిన+అర్థంబు= నీవు ప్రశ్నించిన విషయం; తేటపడున్= స్పష్టపడుతుంది; దానిన్+చెప్పెదన్= దానిని పలుకుతాను; అజగర నామధేయుండు+అగు= అజగరుడు అనే పేరుగలవాడగు; ఒక్క బ్రాహ్మణునిన్= ఒక విప్రుడిని; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడనే రాక్షసరాజు; శమప్రకారంబు= శాంతి పద్ధతి; ఉపదేశింపుము= బోధించుము; అని; అభి+అర్థించినన్= ప్రార్థించగా; అతండు= ఆ అజగరుడు; అతనికిన్= ఆ ప్రహ్లాదుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దైవవశాన కోడెదూడలు హఠాత్తుగా మరణించగా మంకి ధనాశమీద విరక్తి కలిగి, కామాన్నే మొత్తంగా పరిత్యజించి, సుఖంగా దేవసమానంగా జీవించాడు' అని భీష్ముడు పలుకగా విని ధర్మజుడు - 'నరుడు ఏమి చేస్తే అతడి శోకం నశిస్తుంది? ఏ మార్గాన అతడు మోక్షాన్ని పొందగలడు?' అని ప్రశ్నించాడు. సమాధానంగా భీష్ముడు అజగర చరిత్ర అనే ఇతిహాసం అతడి ప్రశ్నలకు సమాధానం కాగలదని ఆ ఇతిహాసాన్ని వివరించటం ప్రారంభించాడు. రాక్షసరాజయిన ప్రహ్లాదుడు అజగరుడనే పేరుగల బ్రాహ్మణుడిని సమీపించి, తనకు శాంతి పద్ధతిని ఉపదేశించు మనగా, ఆ అజగరుడు ప్రహ్లాదుడితో ఇట్లా అన్నాడు.

**క. 'అనిమిత్తము భూతంబుల । జననం బవి రూపు సెడుట సంపన్నములై**
**యునికి విషాదము మోదం । బును జేయఁగ లే వనిత్యములుగ నెఱిఁగినన్. 55**

**ప్రతిపదార్థం:** అనిత్యములుగన్= శాశ్వతమైనవి కానివిగా- అశాశ్వతాలుగా; ఎఱిఁగినన్= తెలిసికొంటే; భూతంబుల జననంబు= ప్రాణుల పుట్టుక; అనిమిత్తము= నిష్కారణం; అవి= ఆ ప్రాణులు; రూపు+చెడుట= నశించటం; సంపన్నములై+ఉనికి= సంపదలతో కూడినవై ఉండుట (క్రమంగా); విషాదమున్= దుఃఖమును; మోదంబును= సంతోషమును; చేయఁగన్+లేవు= కలిగింపజాలవు.

**తాత్పర్యం:** 'సృష్టిలో ప్రాణిజాలం పుట్టుక నిష్కారణంగా జరుగుతుంది. అవి సమృద్ధితో ఉండటంగాని, లేక నశించిపోవటంగాని నరుడికి (అతడూ ఒక ప్రాణి మాత్రుడు) మోదాన్నో, ఖేదాన్నో కలిగించవలసిన పని లేదు. ఎందుకంటే ప్రాణులు శాశ్వతమైనవి కావు. నశింపు వాటి సహజలక్షణం.

**విశేషం:** భూతము అంటే ప్రాణి - పుట్టుక కలిగినది. పుట్టుక ఉన్నప్పుడు గిట్టుట తప్పదు. జన్మం, మరణం - ఈ రెండూ ఒక వస్తువుయొక్క మొదలు, తుది వంటివి. తప్పనిసరిగా ఉండేవి. కాబట్టి అపరిహార్యమైన అంశాన శోకించటం ఏల? అని అజగరుడి బోధ.

**తే. వరదఁ గాష్ఠముల్ గూడిన వడువు బంధు । సంగమం బవి వాసిన చాడ్పు తద్వి**
**యోగ మింత సూచిన వాని నుమ్మలికము । వొరయనేరదు దానవవరతనూజ! 56**

**ప్రతిపదార్థం:** దానవ వర తనూజ!= దనుజ రాజకుమారా!; వరదన్= వరదలో, ప్రవాహంలో; కాష్ఠముల్+కూడిన వడువు= కట్టెలు దగ్గరైన విధంగా; బంధు సంగమంబు= బాంధవుల కలయిక; అవి= ఆ కట్టెలు; పాసిన చాడ్పు= విడిపోయిన విధం; తద్+వియోగము= ఆ బంధువుల ఎడబాటు; ఇంత+చూచినవానిన్= ఈ విధంగా గ్రహించిన నరుడిని; ఉమ్మలికము= దుఃఖము; పొరయన్+నేరదు= పొందజాలదు.

**తాత్పర్యం:** రాక్షస రాజకుమారా! ప్రవాహం సాగిపోతూ ఉన్నపుడు అందులో అపుడపుడు కొన్ని కట్టెలు తేలుతూ వచ్చి, ఒకదానితో ఒకటి కలుస్తుంటాయి. సృష్టిలో చుట్టాల, బంధువుల కలయిక కూడా అటువంటిదే. ప్రవాహంలో ఆ కట్టెల కలయిక, కట్టెల ఇష్టంమీద ఆధారపడి జరగలేదు. అవి విడిపోవటంకూడా వాటితో నిమిత్తం లేకుండానే

జరిగిపోతుంది. అదంతా ప్రవాహ వేగం, దిశ - వంటి వాటిమీద ఆధారపడి జరిగిపోతూ ఉంటుంది. అట్లాగే బంధువుల కలయికలూ, ఎడబాటులూ లోకంలో జరుగుతూ ఉంటాయి. ఆ కలయికలకు గాని, ఎడబాటుకు గాని నరుడి ప్రమేయం ఉండదు. ఈ విధంగా సృష్టిలోని మానవుల సంబంధ బాంధవ్యాల యథార్థస్థితిని గ్రహించినవాడిని దుఃఖం దరిచేరలేదు.

**విశేషం:** అలం: ఉపమ. మన ప్రమేయంలేకుండా సృష్టిధర్మాలుగా జరిగిపోయేవాటికి మన ప్రమేయాన్ని ఆపాదించుకొని వేదనలు పడటం తత్త్వ దర్శనం లేకపోవటంవలన జరుగుతుంది. ఇక్కడ అజగరుడు ప్రహ్లాదుడికి తత్త్వదర్శనం కల్పిస్తున్నాడు.

**వ. ఈ తెఱంగు లే నెఱుంగుదు; నాదెసఁ బ్రశాంతిం గనికాదె నీవు శమోపదేశం బర్థించితివి. వినుము. 57**

**ప్రతిపదార్థం:** ఈ తెఱంగులు= ఈ పద్ధతులు - పైన తెలిపినవి; ఏను= నేను; ఎఱుంగుదున్= తెలియుదును; నా దెసన్= నా యందు; ప్రశాంతిన్= అధికమైన శాంతిని; కని= చూచి; నీవు; శమ+ఉపదేశంబు= శాంతి కొరకైన బోధ; అర్థించితివి కాదె!= యాచించావు కదా!

**తాత్పర్యం:** నేను వివరించినట్లుగా మానవుల సంబంధబాంధవ్యాల తత్త్వం నేను గ్రహించాను. కాబట్టే నాలో ఇంతటి ప్రశాంతి నెలకొన్నది. దానిని చూచే కదా నీవు నా దరిచేరావు - శాంతి బోధకొరకు! కాబట్టి వినుము.

**విశేషం:** వాఙ్మయంనుండి గ్రహించటంవేరు, అనుభవంనుండి తెలిసికొనటం వేరు. అజగరుడి వివేకం అనుభవజన్యమైనది. కాబట్టే అతడు అంతగా ప్రశాంతుడు.

**క. మే లర్థింపను గీడును । జాలింబడి తొలఁగఁ ద్రోవ సరిఁ దూష్ణీం భా**
**వాలంబిమనస్కుఁడనై । యాలంబుగఁ జేసి నడతు నయ్యిరుదెఱఁగున్. 58**

**ప్రతిపదార్థం:** మేలు= క్షేమము; అర్థింపను= కోరను; కీడునున్= చేటువలన; జాలిన్+పడి= మనస్సునందు కష్టం చెంది; తొలఁగన్+త్రోవన్= తొలగునట్లు త్రోసివేయగా (కీడును); సరిన్= సమానంగా; తూష్ణీంభావ+ఆలంబిమనస్కుఁడను+ఐ= ఊరక ఉండుటను అవలంబించిన మనస్సుకలవాడనై; ఆ+ఇరుతెఱఁగున్= ఆ రెండు పద్ధతులను; ఆలంబుగన్= ఉపేక్షగ; చేసి= మార్చివేసి; నడతున్= ప్రవర్తింతును.

**తాత్పర్యం:** మేలు కావాలి అని కోరను, కీడు దాపురిస్తే దుఃఖించి దానినుండి బయటపడటానికి యత్నిస్తాను. మేలు కీళ్ళు రెండిటినీ సరిసమానంగా చూస్తూ (ఊరక, సాక్షిగా చూచే) మనస్సులో ఆ రెంటియెడ ఉపేక్ష వహించి జీవిస్తుంటాను.

**విశేషం:** నరునికి మేలుగాని కీడుగాని కలిగినప్పుడు అతడి ప్రవృత్తి భిన్నంగా ఉంటుంది. అయితే సృష్టితత్త్వ దర్శనంచేసి ప్రాణుల సంబంధాల అంతరార్థం అవగతమైన మనస్సును మోదంగాని, ఖేదంగాని స్పృశింపలేదు. అజగరుడు ఆ స్థితిలో తాను అనుభోక్తగా కాకుండా సాక్షిగా జరిగే దానిని చూచేవాడుగా మాత్రం జీవయాత్ర సాగిస్తున్నాడు.

**క. సరసాన్నము పిణ్యాకము । సరిగాఁగ భుజింతు మృదుల శయ్యా తలమున్**
**ధరణియు శయనరుచికి నా । కరయంగా నొక్కరూప! యసురప్రవరా! 59**

**ప్రతిపదార్థం:** అసుర ప్రవరా!= రాక్షస శ్రేష్ఠా!; సరస+అన్నము= రుచికరమైన ఆహారము; పిణ్యాకము= తెలికపిండి; సరిగాఁగన్= సమానముగా; భుజింతున్= తినెదను; మృదులశయ్యా తలమున్= మెత్తనైన పడక ప్రదేశము; ధరణియున్= భూమీ; శయన రుచికిన్= పడక (కొరకైన) కోర్కెకు, నాకున్; అరయంగాన్= పరిశీలింపగా; ఒక్కరూపు+అ!= ఒకటే! సమానమే.

**తాత్పర్యం:** ఓ రాక్షసరాజా! నా జీవన సరళిని వివరిస్తున్నాను. నాకు రుచిగల ఆహారమైనా, రుచిహీనమైన తెలికపిండి అయినా సమానంగానే ఉంటాయి. రెంటినీ సమభావంతో భుజిస్తాను. అట్లాగే మెత్తని పడకైనా, గట్టి భూభాగమైనా పరుండటానికి నాకు సమానంగానే ఉంటాయి. రెండు చోట్లా సమమైన ఆదరంతో శయనిస్తాను.

**విశేషం:** ఆహార నిద్రలు శరీరమాత్రరక్షణానికి ఉద్దిష్టాలని గ్రహించి, ఆత్మజ్ఞుడు వాటికి ప్రాముఖ్యాన్ని ఇవ్వడు. తాను శరీరమాత్రుడను గాననే జ్ఞానం కారణంగా ఆ ఉపేక్షాభావం అతడిలో నెలకొంటుంది. ఇక వస్త్రధారణపై తన పద్ధతిని వివరిస్తున్నాడు - అజగరుడు.

**ఆ. నారచీరయేనిఁ జారు చీనాంబరం । బైనఁ గట్టికొనినయపుడు హృదయ**
**మొప్ప దొప్పు ననక యుండు రూపాదుల । నలమికొనవు చక్షురాదికములు.' 60**

**ప్రతిపదార్థం:** నారచీర+ఏనిన్= చెట్టుపట్టగాని; చారు చీన+అంబరంబు+ఐనన్= అందమైన చీనాంబరము (వెలగల పట్టువస్త్రము) అయినా; కట్టికొనిన+అపుడు= ధరించినపుడు; హృదయము= మనస్సు; ఒప్పదు= అంగీకరించదు(అంతేకాక); ఒప్పున్= అంగీకరించును; అనక= అనకుండా; ఉండున్= (ఒకటిగా) ఉంటుంది; చక్షుస్+ఆదికములు= కన్ను మొదలయినవి (ఇంద్రియములు- చెవి ముక్కు మొదలగునవి); రూప+ఆదులన్= ఆకారము మొదలయిన వానిని, అలమికొనవు= వ్యాపించవు.

**తాత్పర్యం:** వస్త్రధారణ విషయంలో మానసంరక్షణమే ధ్యేయం కాబట్టి, దానికి మించి నేను గుడ్డలకు ప్రాముఖ్యమీయను అని చెట్టుపట్టగాని, చీనాంబరంగాని - రెంటిని సమభావంతోనే ధరిస్తాను. నారచీర కట్టినపుడు మనస్సు అంగీకరించకపోవటం, చీనాంబరం కట్టినపుడు మనస్సు ఆహ్లాదపడటం ఉండవు. నాకు రెండూ సమానమే. ఎందుకంటే నా కన్నులు మొదలైన ఇంద్రియాలు ఆకారంమొదలైన విషయాలను పట్టించుకొనవు.'

**విశేషం:** ఇంద్రియాలు అజగరుని అధీనంలో ఉన్నాయిగాని అజగరుడు ఇంద్రియాల అధీనంలో లేడు. కాబట్టి ఉపేక్ష, సమభావం సాధ్యమైనాయి.

**వ. అని వెండియు. 61**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**ఆ. చలనమేది పుట్టుఁ జావునుం బిరువెట్టి । యామిషార్థిజనుల నపహసించు**
**చెలిమితోడ లేమికలిమి వాటింపని । రమణ నునికి యజగరవ్రతంబు. 62**

**ప్రతిపదార్థం:** చలనము+ఏది= కదలిక (లేకుండ) నశించి; పుట్టున్+చావునున్= పుట్టుకను, చావునూ; పిరు+పెట్టి= నిరాదరణచేసి (వెనుకకు నెట్టి); ఆమిష+అర్థిజనులన్= (మాంసమును) కోరెడి ప్రజలను; అపహసించు= పరిహసించే; చెలిమితోడన్= స్నేహంతో (ఆహారంలో రుచులు భోగాలు కోరేవారిని చూచి నవ్వగలిగిన స్థితిలో); లేమి, కలిమి= దారిద్ర్యం, సంపద - రెంటినీ; పాటింపని= ఆదరించని, రమణన్= పద్ధతితో; ఉనికి= ఉండటం; అజగర వ్రతంబు= అజగరుడి జీవన విధానం.

**తాత్పర్యం:** కదలిక లేకుండా ఒకచోట పడి ఉండి, చావుపుట్టుకలను పట్టించుకొనకుండా భోగభాగ్యాలు ఆశించి ప్రాకులాడే జనసామాన్యాన్ని చూచి నవ్వుకొంటూ, కలిమిలేములు రెండింటినీ సమానంగా చూస్తూ, జీవనం కొనసాగించటం అజగరవ్రతమౌతుంది.

**విశేషం:** అజగరం అంటే కొండచిలువ. పెద్దగా కదలిక లేకుండా పడి ఉండే పెద్దపాము. దేహధారణకొరకు తినటం తరువాత నిద్రించటం దాని పద్ధతి అంటారు. అదే విధంగా కామత్యాగం చేసిన యోగి శరీరధారణమాత్రం కొరకే ఆహారం స్వీకరిస్తూ మిగిలిన ప్రాపంచికవిషయాలలో అనాసక్తుడై ఉంటాడు. అతడే అజగవరవ్రతుడు.

**ఆ. అనియతంబు లైన యాహార విహరణ । శయనముల విధాతృ సంప్రయుక్త**
**భంగిఁ బరఁగు నంతరంగ నిర్భార వ । ర్తనము కలిమి యజగరవ్రతంబు. 63**

**ప్రతిపదార్థం:** అనియతంబులు+ఐన= నియమించబడినవిగాని; ఆహార విహరణ శయనములన్= తినటం, తిరుగటం, పరుండటంతో; విధాతృ సంప్రయుక్త భంగిన్= బ్రహ్మచేత చక్కగా ప్రయోగించబడిన విధంగా (బ్రహ్మ నిర్దేశానుకూలంగా); పరఁగు= ఒప్పు; అంతర్+అంగ నిర్+భార వర్తనము= మనస్సున బరువులేని (బాధ్యతలేని) ప్రవృత్తి; కలిమి= కలిగి ఉండటం; అజగరవ్రతంబు= అజగరవ్రతం.

**తాత్పర్యం:** నియమ నిబంధనలకు లోనుగాకుండా భుజిస్తూ, సంచరిస్తూ, శయనిస్తూ, బ్రహ్మనిర్దేశాన్ని పాటిస్తూ అంతరంగాన ఏ బరువు బాధ్యతలూ లేకుండా ఉండటం అజగరవ్రతం.

**విశేషం:** సామాన్యులకు ఆహారవిహారాదులలో నియమనిబంధనలు తప్పవు. అజగరవ్రతుడు అసామాన్యుడు, అలౌకికుడు, అంతర్ముఖుడు. కాబట్టి అతడికి లోకమర్యాదలు పాటించవలసిన అవసర ముండదు. కేవలం బ్రహ్మనిర్దేశానికి తప్ప ఇతరానికీ అతడు బద్ధుడుకాడు. బ్రహ్మనిర్దేశం ప్రాణికి అవశ్యం అనుసరణీయం. అజగరుడూ జీవించి ఉన్నంత కాలం ప్రాణి మాత్రుడే!

**ఆ. నిత్య తృప్తి శౌచనిరతి తాల్మి సమత్వ । మారఁ గలిగి చిత్ సుఖానుభవము**
**ప్రచుర మగుట యజగరవ్రత మిది విను । యజ్ఞదుర్లభంబు ప్రాజ్ఞభూమి.' 64**

**ప్రతిపదార్థం:** నిత్య తృప్తి= ఎల్లప్పుడూ తనివినొందటం; శౌచనిరతి= శుభ్రతయెడ ఆసక్తి; తాల్మి= ఓర్పు; సమత్వము= సమానత్వం; ఆరన్+కలిగి= నిండుగా ఉండి; చిత్ సుఖ+అనుభవము= చిదానందానుభూతి; ప్రచురము+అగుట= అధికమవటం; అజగరవ్రతము+ఇది= ఇదీ అజగరవ్రతమంటే; విను= ఆలకించుము (ఇది); యజ్ఞ దుర్ లభంబు= యాగంవలన (దుఃఖంతో లభించేది) లభించనిది; ప్రాజ్ఞభూమి= పండితుల స్థలం.

**తాత్పర్యం:** నిత్యతృప్తి, శుభ్రత, ఓరిమి, సమభావం - ఈ లక్షణాలను నిండుగా కలిగి ఉండి, చిదానందానుభవం పొందుతూ ఉండటం అజగరవ్రతం. ఇది యజ్ఞంవలన లభించేదిగాదు. యజ్ఞనిర్వహణం కంటె గొప్పదైన వ్రతమిది. వ్రతమంటే జీవనం. ఈ జీవనవిధానం పండితమాత్ర స్వీకార్యం. అన్యులకు ఇది ఆచరణయోగ్యం కాజాలదు'.

**విశేషం:** ఇంద్రియాలు ప్రాపంచికవిషయాలనుండి మరలి, అంతర్ముఖాలైనపుడు మనస్సు ఏకాగ్రమౌతుంది. అదే చిత్ సుఖం లేక చిదానందం. ఆ ఆనందమయ జీవనం కారణంగానే అజగరుడు లౌకిక విషయాలయెడ అనాసక్తుడై తూష్ణీంభావంతో ఉంటున్నాడు.

**వ. ఇది శమప్రకారం బనియె' నని చెప్పి భీష్ముండు. 65**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ పై బోధించింది; శమప్రకారంబు= శాంతి పద్ధతి; అనియెన్= అన్నాడు; అని; చెప్పి= పలికి; భీష్ముండు= పితామహుడు.

**తాత్పర్యం:** శాంతికి మార్గమిది - అజగరవ్రత ఆచరణమే - అని అజగరుడు పలికా' డని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు. మళ్ళీ భీష్ముడు ఇట్లా ప్రసంగించాడు.

**క. 'అజగర చరితము దనకును । నిజముగ నలవఱుప నేర్చు నిర్మలమతికిన్**
**వృజిన భయ మన్యు శోకము । లజేయములు గావు, మోక్ష మాయత్తమగున్.' 66**

**ప్రతిపదార్థం:** అజగర చరితము= అజగరవ్రతము (అజగరుడి వంటి నడత); తనకును= తనకు కూడా; నిజముగన్= సత్యంగా; అలవఱుపన్= అలవాటుచేసికొనుటకు; నేర్చు= నేర్చిన; నిర్మలమతికిన్= మలినంలేని బుద్ధిగలవానికి; వృజిన భయమన్యు శోకములు= పాపం, భీతి, కోపం, బంధునాశంవలన దుఃఖాలు; అజేయములు= జయించవీలుగానివి; కావు= కాజాలవు; మోక్షము= ముక్తి; ఆయత్తము+అగున్= అధీనం అవుతుంది.

**తాత్పర్యం:** 'అజగరుడి నడతను ఆచరించగల నరుడికి పాపం, భీతి, కోపం, శోకంవంటి మానసిక క్షోభలు నిర్వేదాన్ని కలిగించలేవు. వాటిని అతడు జయించగలడు. ఆపైన ముక్తీ అతడికి లభిస్తుంది.'

**విశేషం:** జీవన్ముక్తుడే అజగరవ్రతాన్ని నిజంగా ఆచరించగలడు. పద్యంలోని 'నిజముగన్' అనే క్రియావిశేషణం అందుకే ప్రయుక్తమైనది. సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతంగా జీవించగలగటమంటే ముక్తిని అందుకొనటమే.

**వ. అనిన విని యజాతశత్రుండు 'బంధుమత్త్వ కర్మవిత్త ప్రజ్ఞలయం దెయ్యది నరునకు సుప్రతిష్ఠం జేయు?' నని యడిగిన నాపగాతనయుం డతని కిట్లనియె. 67**

**ప్రతిపదార్థం:** అనిన(న్)= అనగా; విని= ఆలకించి; అజాతశత్రుండు= పుట్టని శత్రువులు కలవాడు - ధర్మరాజు; బంధుమత్త్వ కర్మ విత్త ప్రజ్ఞలఅందున్= బంధువులు కలిగి ఉండటం, కర్మం, ధనం, బుద్ధిబలం అన్నింటిలో; ఏ+అది= ఏది; నరునకున్= మానవుడికి; సుప్రతిష్ఠన్= మంచికీర్తిని; చేయున్?= కలిగిస్తుంది?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ఆపగాతనయుండు= నదీసుతుడు- భీష్ముడు; అతనికిన్= ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అజగరవచనాలను, ఆపైన భీష్ముడి పలుకులను ఆలకించిన ధర్మరాజు తిరిగి భీష్ముడిని ఇట్లా ప్రశ్నించాడు; 'బంధువుల కలిమి, కర్మం, ధనం, బుద్ధిబలం అనే ఈ నాలుగింటిలో దేనివలన నరుడికి గొప్ప కీర్తి కలుగుతుంది?' అని. ఆ ప్రశ్నకు సమాధానంగా భీష్ముడు ధర్మజుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ప్రజ్ఞయ ప్రతిష్ఠ, లాభము। ప్రజ్ఞయ, నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే,**
**ప్రజ్ఞయ కైవల్యంబును,। ప్రజ్ఞాసాధ్యములు గాని పనులుం గలవే? 68**

**ప్రతిపదార్థం:** 'ప్రజ్ఞ+అ= బుద్ధియే; ప్రతిష్ఠ= కీర్తి; లాభము= ప్రాప్తి, ఆదాయం; ప్రజ్ఞ+అ= బుద్ధియే; నాకంబు= స్వర్గము; అనంగన్= అనగా; ప్రజ్ఞ+అ= బుద్ధియే; చువ్వే= సుమా!; ప్రజ్ఞ+అ= బుద్ధియే; కైవల్యంబును= మోక్షంకూడా; ప్రజ్ఞాసాధ్యములు+కాని= ప్రజ్ఞతో సాధించనలవిగాని; పనులున్= పనులుకూడా; కలవు+ఏ?= ఉన్నవా? (లేవు).

**తాత్పర్యం:** ప్రజ్ఞ ఒక్కటే కీర్తికరం, అదే ఆదాయం. నిజానికి స్వర్గమన్నా బుద్ధే కదా! ఇంతెందుకు? చివరకు ముక్తి కూడా ప్రజ్ఞయే తప్ప అన్యం కాదు. బుద్ధివలన సాధ్యంకాని పనులు లేవు.

**విశేషం:** జీవితాన సర్వాంతర్యామి ప్రజ్ఞ. జీవనంలోని సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, సర్వజీవనవ్యాపారాలూ ప్రజ్ఞాజనితాలే. కాబట్టి ప్రజ్ఞ కీర్తికర మనటం నిశ్చయం.

**వ. బలి ప్రహ్లాద మంకి ప్రభృతులు ప్రజ్ఞన కాదె సమాధాన సంపన్నులయిరి; కాశ్యప నామధేయుం డగు ధరణీసురోత్తముం డొక్క యుద్ధత పురుషుని రథంబు దాఁకి పడి తదవమానదూయమాన మానసుండై యసుపరిత్యాగ పరవ్యవసాయుం డగుటయు నింద్రుండు సృగాలరూపంబున నమ్మహాద్విజుని పాలికి వచ్చి ప్రజ్ఞాసంబోధకం బగు సంవాదంబునం జిత్తప్రసాదంబు కావించె నని విందు; మెల్లభంగులఁ బ్రజ్ఞ యుత్తమాధికారం' బనిన విని ధర్మతనయుండు. 69**

**ప్రతిపదార్థం:** బలిప్రహ్లాద మంకి ప్రభృతులు= బలిచక్రవర్తి, ప్రహ్లాద కుమారుడు, మంకి బ్రాహ్మణుడు మొదలైనవారు; ప్రజ్ఞన కాదు+ఎ!= ప్రజ్ఞవలననే కదా!; సమాధాన సంపన్నులు= సమాధానమును పొందినవారు; అయిరి?= కాగలిగారు?; కాశ్యప నామధేయుండు+అగు= కాశ్యపుడను పేరుగలవాడైన; ధరణీసుర+ఉత్తముండు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; ఒక్క+ఉద్ధత పురుషుని

రథంబు= ఒక గర్వితుడైన నరుడి (రథము) తేరు; తాఁకి= తగిలి; పడి= క్రిందపడి; తద్+అవమాన దూయమాన మానసుండు+ఐ= అవమానంవలన బాధచెందే మనస్సు కలవాడై; అసు పరిత్యాగపర వ్యవసాయుండు+అగుటయున్= ప్రాణాన్ని వదలుటయందు ఆసక్తమైన ప్రయత్నం కలవాడు కాగా; ఇంద్రుండు= దేవేంద్రుడు దేవతలరాజు; సృగాలరూపంబునన్= నక్క ఆకారంలో; ఆ+మహాద్విజుని పాలికిన్= ఆ గొప్ప బ్రాహ్మణుని చెంతకు; వచ్చి; ప్రజ్ఞా సంబోధకంబు+అగు= బుద్ధికి ఉపదేశించెడిదైన; సంవాదంబునన్= సల్లాపంతో, మంచి పలుకుతో, ప్రసంగంతో; చిత్త ప్రసాదంబు= మనస్సుయొక్క ప్రసన్నతను; కావించెన్= కలిగించాడు; అని విందుము= అని వింటాం; ఎల్లభంగులన్= అన్ని విధాలా; ప్రజ్ఞ= బుద్ధి; ఉత్తమ+అధికారంబు= శ్రేష్ఠమైన ఆశ్రయము; అనినన్= అనగా; విని= ఆలకించి; ధర్మతనయుండు.

**తాత్పర్యం:** బలి, ప్రహ్లాదుడు, మంకి మొదలైనవారు ప్రజ్ఞవలననే సమాధానాన్ని పొందారు. కాశ్యపుడు అనే పేరుగల బ్రాహ్మణోత్తముడు ఒక గర్వితుడి రథం తగిలి పడిపోయాడు. దానిని అవమానంగా భావించి బాధపడి ప్రాణత్యాగానికి ప్రయత్నించాడు. ఇంద్రుడు నక్కరూపంలో ఆ బ్రాహ్మణుడి వద్దకు వచ్చి, ప్రజ్ఞను గురించిన ప్రబోధాన్ని చేసే సంభాషణవలన మనశ్శాంతిని కలిగించాడు - అని వింటాం. అన్ని విధాలా ప్రజ్ఞయే ఉత్తమాశ్రయం' అనగా విని ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నరవర! దానముఁ దపమును । గురుశుశ్రూషయును యజ్ఞకోటియు నెట్లై**
**పరిణతిఁ బొందం గలయవి । పురుషున? కత్తెఱఁగు దెల్లముగ వినవలతున్.' 70**

**ప్రతిపదార్థం:** నరవర!= మానవులలో శ్రేష్ఠుడా!; పురుషునకున్= నరునకు; దానమున్= ఇచ్చుట - ఈవి; తపమును= తపస్సు; గురుశుశ్రూషయు= పెద్దల సేవా; యజ్ఞ కోటియున్= యజ్ఞసమూహమూ; ఎట్లు+ఐ= ఏ విధంగా; పరిణతిన్= మార్పును ఫలితరూపమైన మార్పును; పొందన్+కల+అవి= పొందగలవు; ఆ+తెఱఁగు= ఆ పద్ధతి; తెల్లముగన్= స్పష్టంగా; వినన్+వలతున్= వినుటకు ఇచ్ఛగిస్తాను.

**తాత్పర్యం:** 'ఓమానవ శ్రేష్ఠా! నరుడు దానం, తపస్సు, పెద్దలసేవ, యజ్ఞాలవలె చేస్తుంటాడు. అయితే అతడు చేసిన ఈ పనులన్నీ ఏ విధంగా మార్పు చెందుతాయి? వాటి పర్యవసానం ఆ నరునికి ఎట్లా చెందుతుంది? వాటి ఫలితాన్ని అతడు ఎట్లా అందుకొంటాడు? స్పష్టంగా వినటానికి కుతూహలపడుతున్నాను'.

**విశేషం:** కార్యకారణ సిద్ధాంతం ప్రకారం పని జరిగినపుడు ఫలితం ఉండాలి. కాని, నిజజీవితాలలో దానం మొదలైన కార్యాలు నిర్వహించబడినా, వాటి ఫలితాలు కొన్ని సందర్భాలలో వెంటనే బయల్పడక, రూపాంతరం చెంది కనిపిస్తాయనే విశ్వాసం ఆధారంగా ఈ ప్రశ్న వేయబడినట్లు ఉన్నది.

**వ. అనుటయు దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లనియె. 'మేలు లనుబంధించు మేలులట్ల కీళ్ళును ననుస్యూతంబులయి తొడరు నాకర్ణింపుము. 71**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; దేవవ్రతుండు= భీష్ముడు (నిజమైన నామమిది); ఆ+నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజశ్రేష్ఠుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లు పలికాడు; మేలులు= క్షేమాలు, శుభాలు; మేలుల(న్)= శుభాలను; అనుబంధించు(న్)= అనుసరించును; అట్లు+అ= ఆ విధంగానే; కీళ్ళును= కీళ్ళుకూడా; అనుస్యూతంబులు+ఐ= అనుసరించేవై; తొడరున్= కలుగుతాయి; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ధర్మజుని ప్రశ్న విన్న వెంటనే భీష్ముడు 'లోకంలో మేళ్ళు, కీళ్ళు అనేవి ఒకదానిని మరొకటి వెన్నంటి వస్తున్నట్లుగా వరుసగా శుభం వెంట శుభమూ, అశుభం వెంట అశుభమూ ఎడం లేకుండా వచ్చి పడుతూ ఉంటాయి. వినుము.

**విశేషం:** నరుడి పనుల పరిణతిని గూర్చి ప్రశ్నిస్తే శుభాశుభాలు అనుస్యూతంగా వెన్నంటి వస్తుంటా యని సమాధానం. వాటి పరిణామరీతి అట్లా అనిపిస్తుందన్నమాట.

**క. కఱవుపయిఁ గఱవు వొరయుచు । వెఱపు పయిన్ వెఱపుఁ దోప విడువని యిడుమం**
**దొఱఁగమిపైఁ బురుషుఁ డిడుమఁ । దొఱఁగమిఁ జేడ్పడుచు నడచు దుష్కర్మములన్.' 72**

**ప్రతిపదార్థం:** కఱవుపయిన్= కాటకంమీద; కఱవు= కాటకం - క్షామం; పొరయుచు(న్)= కలుగుతూ; వెఱపు పయిన్= భీతిమీద; వెఱపున్+తోఁప(న్)= భీతి ఏర్పడగా; విడువని= తొలగని; ఇడుమన్= కష్టమును; తొఱఁగమిపైన్= తొలగకపోవటం మీద; పురుషుఁడు= నరుడు; ఇడుమన్= కష్టమును; తొఱఁగమిన్= తొలగకపోవటం వలన; చేడ్పడుచు(న్)= చేటు పడుతూ - కష్టపడుతూ; దుస్+కర్మములన్= చెడు పనులతో; నడచున్= ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** మానవలోకంలో కరవు కాటకాలు ఒకదాని మీద ఒకటి వచ్చిపడినట్లుగా వరుసగా వస్తుంటాయి. అట్లాగే భయం మీద భయం వెన్నంటి మనిషిని క్రుంగదీస్తుంది. చేటుమీద చేటు, కీడుమీద కీడు పరుగు పరుగున వచ్చిపడినట్లుగా మనిషిని క్రమ్ముకొంటాయి. ఈ స్థితిలో నరుడు ఒక కీడునుండి మరొక కీడును ఎదుర్కొంటూ, చెడుపనుల బారిన పడి చెడుగై మిగులుతాడు'.

**విశేషం:** నరుడిలో పరిసరాలకు అనుగుణంగా స్పందించే లక్షణం ఉన్నది. బహుశః దానివలననే కావచ్చును - అతడు చెడుగులలో చెడుగుగా మారిపోవటం జరుగుతుంటుంది.

**వ. అని మఱియును. 73**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (ఇట్లా అంటున్నాడు).

**ఆ. 'ఉత్సవంబుమీఁద నుత్సవ మందుచు । సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ**
**బుణ్యపదము మీఁదఁ బుణ్య పదంబున । కరుగు నరుఁడు సుకృతియైన నధిప! 74**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నరుఁడు= మానవుడు; సుకృతి+ఐనన్= పుణ్యవంతుడైతే; ఉత్సవంబు మీఁద(న్)= మేలుమీద; ఉత్సవము+అందుచు(న్)= మేలును పొందుతూ; సుఖముమీఁద(న్)= సౌఖ్యంమీద; సుఖము= సౌఖ్యం; చొప్పడంగన్= చోటుచేసికొనగా; పుణ్యపదము మీఁదన్= ధర్మమార్గంమీదుగా; పుణ్యపదంబునకున్= ఉత్తమ లోకానికి; అరుగున్= వెళ్ళుతాడు.

**తాత్పర్యం:** నరుడు ధర్మాత్ముడై పుణ్యంచేసి ఉంటే అతడు మేలుమీద మేలు అందుకుంటూ సుఖం మీద సుఖం పొందుతూ ధర్మమార్గాన, పుణ్యలోకం చేరుకుంటాడు.

**విశేషం:** నరుడిని ధర్మం మరొక ధర్మానికి నడిపించి అతడికి శుభపరంపర ఒనగూడేటట్లు చేస్తుంది. అదే అధర్మమయితే వ్యతిరేకదిశలో సాగి, ఫలితాలూ వ్యతిరిక్తంగానే ఉంటాయి.

**క. పులుఁగులలోఁ బూత్యండక । ములు సారములైన ధాన్యములలోనం బొ**
**ల్లులు బోలెను జూవె మను । ష్యులలో ధర్మరహితాత్ము లుర్వీనాథా! 75**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా! మనుష్యులలోన్= నరులలో; ధర్మరహిత+ఆత్ములు= ధర్మంలేని ఆత్మకలవారు ఉంటారు, పులుఁగులలోన్= పక్షులలో; పూతి+అండకములు= చెడ్డ కంపుగల చిన్న గ్రుడ్లు (పిల్లలుగాని చెడుగ్రుడ్లు); సారములైన ధాన్యములలోనన్= గట్టి ధాన్యపుగింజలలో; పొల్లులు+పోలెన్= తాలులువలెను (తాలు గింజలు); చూవె!= సుమా!

**తాత్పర్యం:** రాజా! నరులలో పాపాత్ములు ఎట్లా ఉంటూంటారంటే పక్షులలో చెడిన గ్రుడ్లవలె, గట్టి ధాన్యరాశిలో తాలుగింజలవలె సారహీనంగా ఉంటూంటారు. వారి ఉనికి రాశికే గాని వాసికి గాదు.

**క. చనినఁ జను నున్న నుండు । న్మనుజుఁ డొకటి సేయఁ జేయు నరనాయక! తో**
**డన తగిలి నీడవోలెను । విను చేసిన కీడు మేలు విడువవు వానిన్. 76**

**ప్రతిపదార్థం:** నరనాయక!= ఓ రాజా!; మనుజుఁడు= నరుడు; చేసిన= ఒనర్చిన; కీడు= పాపం; మేలు= పుణ్యం; చనినన్= (నరుడు) వెళ్ళిపోతే; చనున్= (తానుకూడా పాపంగాని, పుణ్యంగాని) వెళ్ళిపోతుంది (పరలోకానికి); ఉన్నన్= (జీవించి) ఉన్న యెడల; ఉండున్= (నిలిచి) ఉంటుంది; ఒకటి+చేయన్= ఒకదానిని చేస్తే; చేయున్= (తాను కూడా బదులు) చేస్తుంది; నీడ+పోలెను= నీడవలె; తోడన్+అ= తోడనే, వెంటనే; తగిలి= తగుల్కొని, వెన్నంటి; వానిన్= ఆ చేసిన నరుడిని; విడువవు= వదలవు.

**తాత్పర్యం:** రాజా! నరుడు చేసిన పాపపుణ్యాలు అతడిని నీడవలె వెన్నంటి ఉంటూ, అతడు చనిపోతే అవీ అతడిని అనుసరించి పరలోకాలకు వెళ్ళుతాయి. అతడు జీవించి ఉంటే అవీ అతనితోపాటే జీవిస్తూ, అతడు చేసే ప్రతిపనిమీదా తమ ప్రాభవాన్ని నెరపుతూ ఉంటాయి. ఫలితార్థ మేమిటంటే, నరుడు బ్రతికినా, చనిపోయినా అతడు చేసిన పాపపుణ్యాలు మాత్రం అతడిని వదలవు. వెన్నంటి ఉంటూనే ఉంటాయి. తమ ప్రభావం చూపుతూనే ఉంటాయి.

**విశేషం:** అలం: ఉపమ. పాపపుణ్యాలు మానవజీవితంలో అవిభాజ్యాలుగా కొనసాగుతూ తమ ప్రభావాన్ని తత్కర్తపైన నెరపుతుంటాయి. కర్మసిద్ధాంతానికి కూడా పాపపుణ్యాలే మూలమంటారు. పని ఉన్నప్పుడు దాని ఫలితం తప్పదు మరి!

**క. సమయం బైనను గుసుమ ఫ । లము లెట్టులు దోఁచుఁ దరువులం దటితోఁ గ**
**ర్మములం బొడమున్ సుఖదుః । ఖము లట్టుల నిష్ప్రయత్న కలితోద్భూతిన్. 77**

**ప్రతిపదార్థం:** తరువులన్= చెట్లయందు; సమయంబు+ఐనను= తరుణం, ఋతువు వచ్చినప్పుడు; కుసుమ ఫలములు= పువ్వులు పండ్లు; ఎట్టులు= ఏ విధంగా; తోఁచున్= కనిపించునో; అట్టుల(న్)= ఆ విధంగా; తటితోన్= సమయంతో; కర్మములన్= పుణ్య పాపకర్మలయందు; సుఖదుఃఖములు= సౌఖ్యాలు, కష్టాలూ; నిస్+ప్రయత్నకలిత+ఉద్భూతిన్= ప్రయత్నరహితంగా కలిగిన పుట్టుకతో; పొడమున్= ఏర్పడుతాయి.

**తాత్పర్యం:** ఋతువులకు అనుగుణంగా చెట్లలో చిగుళ్ళూ, పూలూ, పండ్లూ ఏర్పడినట్లే నరుడు చేసిన పుణ్య పాప కర్మలు కూడా పరిపక్వమై, సమయం వచ్చినప్పుడు అకారణంగా పుట్టుకొచ్చినట్లుగా సుఖదుఃఖాలను కలిగిస్తాయి.

**విశేషం:** అలం: ఉపమ. చెట్లు కుసుమించి ఫలించటం సహజలక్షణం. దానికి ఇతర ప్రమేయం ఉండదు. అట్లాగే మానవుడు చేసిన కర్మకూడా తప్పక ఫలిస్తుంది. అయితే సమయం సమాసన్నం కావాలి. కర్మ నరుడిని వదలదు - ఎక్కడైనా.

**క. తెలిసికొనఁ బడయ రొరు లా । ర్యుల పోయెడి తెరవు లరసియును జదలం బ**
**క్షులు నీళ్ళలోన మీనం । బులు వోయెడు త్రోవ లెఱుఁగఁ బోలునె? యధిపా! 78**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; ఒరులు= ఇతరులు; ఆర్యుల పోయెడి తెరువులు= పూజ్యులు నడిచే త్రోవలు; అరసియును= చూచికూడా; తెలిసికొనన్+పడయరు= గ్రహింపలేరు - ఎట్లంటే; చదలన్= ఆకాశాన; పక్షులు= పిట్టలు; నీళ్ళలోన(న్)= నీళ్ళయందు; మీనంబులు= చేపలు; పోయెడు త్రోవలు= వెళ్ళేదారులు; ఎఱుఁగన్+పోలునె?= తెలియనగునా? (తెలియలేమనుట).

**తాత్పర్యం:** లోకాన ఆర్యజనులు ఎపుడూ ధర్మమార్గాన చరిస్తూ ఋజువర్తనులై ఉంటారు. వారిని చూచి కూడా ఇతరులు వారి ధర్మప్రవృత్తిని, ఆర్జవాన్ని తెలిసికొనలేరు. అది తమ చేతగాని పనిగా వారు భావిస్తారు. అదెట్లంటే ఆకాశాన పిట్టలూ, నీళ్ళల్లో చేపలూ సంచరిస్తూ ఉంటాయి గాని వాటి సంచారవిధానం ఇతరులకు అర్థమవుతుందా? (కాదు).

**విశేషం:** లోకాన మంచివారున్నంత మాత్రాన చెడ్డవారు లేకుండా పోరు. మంచివారిని చూచి చెడ్డవారు అందరూ మారరు. చెడ్డవారికి, అధిక సంఖ్యాకులకు వారిలోకమే వారిది. మంచిని వారు గ్రహించలేరు.

**క. ఐనను గాఢ నిరూపణ । మానసుఁడై యార్యజనుల మహిత వచనముల్**
**వీనుల నినుచుచు ధర్మము । లైనవి సేయంగఁ దప్ప కగుఁ దత్ఫలముల్.' 79**

**ప్రతిపదార్థం:** ఐనను= పైన చెప్పినట్లు ఆర్యజనుల ప్రవృత్తి ఇతరులకు సులభగ్రాహ్యం కాకపోయినా (నరుడు); గాఢ నిరూపణ మానసుఁడు+ఐ= గట్టిగా చూడటంలో మనస్సు కలవాడై; ఆర్యజనుల= పూజ్యమానవుల; మహిత వచనముల్= గొప్ప మాటలు; వీనులన్= చెవులయందు; నినుచుచున్= ఉంచుతూ; ధర్మములు+ఐనవి= పుణ్యములైనవి; చేయంగన్= చేసినట్లయిన; తద్+ఫలముల్= వాటి ఫలితాలు; తప్పక+అగున్= తప్పక కలుగుతాయి.

**తాత్పర్యం:** ఆర్యజనులు ఇతరులకు సులభంగా అర్థం కాకపోయినా ఇతరులు నిరుత్సాహపడకుండా ఆర్యుల గొప్ప మాటలు వింటూ, గట్టిగా చూపు నిలిపే మనస్తత్త్వం కలిగి, ధర్మకార్యాలు నిర్వహిస్తే ఆ ధర్మం ఫలితాన్ని తప్పకుండా ఇస్తుంది.

**విశేషం:** ఇక్కడ 'గాఢ నిరూపణ మానసత్వం' చాలా ముఖ్యమైనది. విధి నిర్వహణకు ఆ స్వభావమే మూలం. అది 'అగాఢంగా' ఉంటే విధి నిర్వహణం అసమాప్తంగానే ఉండిపోతుంది'.

**వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో 'భూతసృష్టి యెవ్వానివలన నెబ్బంగినైనయది? యెఱింగింపు' మనవుడు నతం 'డిదియును మఱియునుం గొన్ని యర్థంబులు భరద్వాజుం డడిగిన భృగుండు సెప్పె నప్పరిపాటి యుపన్యసించెద నాకర్ణింపు' మని యతని కిట్లనియె. 80**

**ప్రతిపదార్థం:** అనిన(న్)= అనగా; విని= ఆలకించి; కౌంతేయ+అగ్రజుండు= కుంతీతనయులలో పెద్దవాడైన ధర్మరాజు; శాంతనవునితోన్= శంతనుడి తనయుడైన భీష్ముడితో; భూత సృష్టి= ప్రాణుల పుట్టుక; ఏ+వాని వలనన్= ఎవడి వలన; ఏ+భంగిన్= ఏ విధంగా; ఐన+అది= అయినది; ఎఱింగింపుము= తెలియజేయుము; అనవుడున్= అనినవెంటనే; అతండు= ఆ భీష్ముడు; ఇదియును= ఈ విషయమును; మఱియున్= ఇంకను; కొన్ని+అర్థంబులు= కొన్ని విషయములు, ఇతర విషయములు; భరద్వాజుండు= భరద్వాజ మహర్షి; అడిగిన(న్)= ప్రశ్నించగా; భృగుండు+చెప్పెన్= భృగుమహర్షి చెప్పాడు; ఆ+పరిపాటి= ఆ క్రమం; ఉపన్యసించెదన్= ప్రసంగిస్తాను; ఆకర్ణింపుము= వినుము; అని; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ ధర్మరాజుతో ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** నరుడి పాపపుణ్య పరిపాక క్రమాన్ని గురించి పితామహుడినుండి గ్రహించిన ధర్మజుడు అనంతరం 'సృష్టిని ఎవరు ఏ విధంగా కలిగించారు తెలుపు'మని అర్థించాడు. దానికి బదులుగా భీష్ముడు 'నీ వడిగిన దానితోపాటుగా మరికొన్ని ఇతర అంశాలు కూడా, ముందు భరద్వాజ ఋషి కోరికపై భృగుమహర్షి వివరించి ఉన్నాడు. వాటిని క్రమంగా వివరిస్తాను విను'మని ప్రారంభించాడు.

భీష్ముఁడు ధర్మరాజునకుఁ బృథివ్యాది భూతోత్పత్తిక్రమం బెఱింగించుట (సం. 12-175-5)

సీ. 'కైలాసశైలశిఖరమునఁ దేజో వి । రాజితు భృగు భరద్వాజుఁ డధిక
వినయంబుమైఁ జేరి, 'మునినాథ! భూత సృ । ష్టి ప్రకారము నాకుఁ జెప్పు' మనిన
నమ్మహితాత్ముఁ డిట్లను 'విను నారాయ । ణుం డవ్యయుం డనంతుండు భూత
సృజనంబు దలఁచి మున్ సృజియించెఁ దనదు స । హస్రాంశకమున నవ్యక్తుఁ డనఁగ

తే. మనసునన యజరామరు ననుపమాను । నతనివలన మహత్తత్త్వ మావహిల్లె;
నతఁడు దివ్యతేజోమయం బైన పద్మ । మొకటి గలిగింప బ్రహ్మ యం దుద్భవించె. 81

**ప్రతిపదార్థం:** కైలాస శైలశిఖరమునన్= కైలాస పర్వతపు పైభాగాన; తేజస్+విరాజితున్= కాంతితో ప్రకాశించెడు; భృగున్= భృగు మహర్షిని; భరద్వాజుఁడు= భరద్వాజ ఋషి; అధిక వినయంబు మైన్= ఎక్కువ అణకువతో; చేరి= సమీపించి; మునినాథ!= ఋషులలో శ్రేష్ఠుడా!; భూతసృష్టి ప్రకారము= ప్రాణుల జన్మవిధానం; నాకున్, చెప్పుము, అనినన్; ఆ+మహిత+ఆత్ముఁడు= ఆ గొప్ప ఆత్మకలవాడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అనెను; విను= ఆలకించుము; నారాయణుండు= విష్ణువు; అవ్యయుండు= నాశనం లేనివాడు; అనంతుండు= అంతం లేనివాడు; భూత సృజనంబు= భూమి మొదలైన ఐదు మూల పదార్థాల పుట్టుకను; తలఁచి= తలంచి; మున్= ముందు; తనదు= తనయొక్క; సహస్ర+అంశకమునన్= వెయ్యోభాగంతో; అవ్యక్తుఁడు+అనఁగన్= అవ్యక్తుడు (వ్యక్తం (స్పష్టం) కానివాడు) అనే; అజరామరున్= ముదిమి, మరణం లేనివాడిని; న+ఉపమానున్= పోలికలేనివాడిని; మనసునన్+అ= మనస్సునందే; సృజియించెన్= సృష్టించాడు; అతనివలనన్= ఆ అవ్యక్తుడి వలన; మహత్+తత్త్వము= (బుద్ధి తత్త్వం) గొప్ప ప్రకృతి; ఆవహిల్లెన్= కలిగింది; అతఁడు= ఆ అవ్యక్తుడు; దివ్యతేజస్+మయంబు+ఐన= దేవసంబంధమైన కాంతి నిండిన; పద్మము+ఒకటి= తామరపువ్వు నొకదానిని; కలిగింపన్= పుట్టించగా; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; అందున్= ఆ పద్మమందు; ఉద్భవించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** కైలాస పర్వతశిఖరంమీద తేజస్సు నిండిన భృగుమహర్షిని భరద్వాజముని గొప్ప వినయగుణంతో దరిచేరి, 'ఓ ఋషిశ్రేష్ఠా! భూమి మొదలయిన పంచభూతాలు, ఇతర ప్రాణులు ఏర్పడిన విధానం తెలుపు'మని అర్థించాడు. భృగువు అతడితో అన్నాడు 'విష్ణువు నాశనం, అంతం లేనివాడు. అతడు మనస్సులో సృష్టిని నిర్మించదలచి ముందుగా తనలోని వెయ్యోవంతుతో అవ్యక్తుడనే వాడిని పుట్టించాడు. ఆ అవ్యక్తుడు జరామరణాలు లేనివాడు, సాటిలేనివాడు. అతడివలన ప్రకృతితత్త్వం కలిగింది. అతడు దివ్యకాంతితో నిండిన పద్మమొకటి కలిగించాడు. ఆ పద్మంనుండి బ్రహ్మ పుట్టాడు.

తే. అతని తలఁపునఁ బ్రభవించె నాకసంబు; । దానియందు జలంబు లుద్భవము నొందె;
సలిలమున నగ్ని మారుత జనన మొనరె; । ననల పవన యోగమున మేదిని జనించె. 82

**ప్రతిపదార్థం:** అతని తలఁపునన్= ఆ బ్రహ్మదేవుడి ఆలోచనతో; ఆకసంబు= ఆకాశం; ప్రభవించెన్= పుట్టింది; దానిఅందున్= ఆ ఆకాశంలో; జలంబులు= నీళ్ళు; ఉద్భవమున్+ఒందెన్= పుట్టుకను పొందాయి; సలిలమునన్= నీటిలో; అగ్ని మారుత జననము= నిప్పు, గాలుల పుట్టుక; ఒనరెన్= కలిగింది; అనల పవన యోగమునన్= అగ్ని, గాలుల కలయికతో; మేదిని= భూమి; జనించె(న్)= కలిగింది.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మదేవుడి సంకల్పంవలన ఆకాశం, ఆకాశంనుండి నీరు, నీటినుండి నిప్పు, గాలి జన్మించాయి. ఆ తరువాత నిప్పు గాలుల కలయికతో భూమి పుట్టింది.

**వ. ఆబ్రహ్మా యఖిల భూతాత్మకుం డెట్లనిన నతనికి శైలంబు లస్థులు; మేదిని మేదోమాంసంబులు; సముద్రంబులు రుధిరం; బాకాశం బుదరంబు; పవనుండు నిశ్వాసం; బగ్ని తేజంబు; సరిత్తులు సిరలు; రవిచంద్రులు నయనంబు; లూర్ధ్వలోకంబు శిరంబు; పాతాళంబు పాదంబులు; దిశలు బాహువు; లి ట్లనంతాత్మకుం డగువాఁడు విష్ణుం డిత్తెఱంగున విశ్వంబు విష్ణునివలనం గలిగెననిన విని భరద్వాజుం డాకాశాది భూతంబు లేనింటి ప్రమాణంబులు నడిగిన భృగుం డవి యనంతంబులు దేవతలకుం గొలఁది వెట్టరాకుండు నొక్కచోటు నిరూపించి యీ భూతం బింతటనుండి యట లేదనరాదు పంచభూతంబులు నిరవధికంబు లది యెత్తెఱం గనిన విష్ణునకు గౌణంబై యనంతుం డను నామంబుగలదు గాదె! విష్ణుండు జగన్మూర్తి విష్ణు తనుభూతంబయిన మహాభూత పంచకం బప్రమేయంబుగాక తక్కునే?' యని యెఱింగించిన. 83**

**ప్రతిపదార్థం:** ఆ బ్రహ్మ= ఆ బ్రహ్మదేవుడు; అఖిల భూత+ఆత్మకుండు= ఎల్లభూతముల (భూమి, నీరు మొదలగువాని) స్వరూపమైనవాడు; ఎట్లు+అనినన్= అదెట్లు అంటే; అతనికి(న్)= ఆ బ్రహ్మకు; శైలంబులు= కొండలు; అస్థులు= ఎముకలు; మేదిని= భూమి; మేదస్+మాంసంబులు= కొవ్వు మాంసమును; సముద్రంబులు= సముద్రాలు; రుధిరంబు= రక్తం; ఆకాశంబు= ఆకాశం; ఉదరంబు= పొట్ట; పవనుండు= గాలి; నిశ్వాసంబు= ఊరుపు; అగ్ని= నిప్పు; తేజంబు= కాంతి; సరిత్తులు= నదులు; సిరలు= రక్తవాహికలు; రవిచంద్రులు= సూర్యచంద్రులు; నయనంబులు= కన్నులు; ఊర్ధ్వలోకంబు= పై లోకాలు; శిరంబు= తల; పాతాళంబు= పాతాళలోకము; పాదంబులు= అడుగులు; దిశలు= దిక్కులు; బాహువులు= చేతులు; ఇట్లు= ఈ విధంగా; అనంత+ఆత్మకుండు+అగు+వాఁడు= అంతంలేని శరీరం కలవాడగు వాడు; విష్ణుండు= విష్ణుమూర్తి; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; విశ్వంబు= లోకం; విష్ణునివలనన్= విష్ణువువలన; కలిగెన్= పుట్టింది; అనినన్; విని; భరద్వాజుండు= ఆ పేరుగల ఋషి-ప్రస్తుత అంశానికి శ్రోత; ఆకాశ+ఆది భూతంబులు+ఏనింటి ప్రమాణంబులున్= ఆకాశం మొదలయిన భూతాలు ఐదింటి కొలతలును; అడిగినన్= ప్రశ్నించగా; భృగుడు= భృగుమహర్షి; అవి= భూతాల ప్రమాణాలు; అనంతంబులు= చివరలు లేనివి; దేవతలకున్= సురలకుకూడా; కొలఁది+పెట్టరాకుండున్= కొలత పెట్టటానికి వీలులేకుండా ఉంటాయి; ఒక్కచోటు= ఒక్క స్థలం; నిరూపించి= చూపించి; ఈ భూతంబు= ఈ (ఫలానా) భూతం (భూమి మొదలగునవి); ఇంతటన్= ఇంతవరకు; ఉండి= కలిగి; అటన్= అక్కడ; లేదు+అనరాదు= లేదు అనటానికి (వీలు)గాదు; పంచభూతంబులు= ఐదు భూతాలు (భూమి, నీరు, వెలుతురు, గాలి, ఆకాశం); నిర్+అవధికంబులు= హద్దులు లేనివి; అది= హద్దులు లేకుండటం; ఏ+తెఱంగు?= ఏ విధము?; అనినన్= అన్నచో; విష్ణునకున్= విష్ణుమూర్తికి; గౌణంబు+ఐ= గుణసంబంధమైనదై; అనంతుఁడు+అను= అనంతుడనే; నామంబు= పేరు; కలదు= ఉన్నది; కాదె!= కాదా!; విష్ణుండు= నారాయణుడు; జగత్+మూర్తి= లోకమే ఆకారంగా కలవాడు; విష్ణు తనూభూతంబు+అయిన= విష్ణువు శరీరంనుండి పుట్టిన; మహాభూత పంచకంబు= గొప్పభూతములు ఐదు; అప్రమేయములు= కొలువరానివి; కాక= కాకుండా; తక్కునే?= పోయేది అగునా?; అని; ఎఱింగించిన(న్)= తెలియజేయగా.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మ ఎల్లభూతాలూ అంటే భూమి మొదలయినవి ఇతరాలు కూడా తన శరీరంగా ధరించి ఉంటాడు. అదెట్లాగంటే ఆ బ్రహ్మశరీరానికి సృష్టిలోని పర్వతాలు ఎముకలు, భూమి కొవ్వూ మాంసమూ, సముద్రాలు నెత్తురు, ఆకాశం పొట్ట, గాలి ఊర్పు, నిప్పు వెలుతురు, నదులు రక్తవాహికలయిన నరాలు, ఈ విధంగా సూర్యచంద్రులు కళ్ళు, పై లోకం తల, పాతాళలోకం కాళ్ళ అడుగులు, దిక్కులు చేతులు - ఇట్లాఅంతంలేని శరీరంగలవాడు నారాయణుడు. ఈ విధంగా ఈ లోకం నారాయణుడివలన పుట్టింది' అనగా విని శ్రోత అయిన భరద్వాజుడు భృగుమహర్షిని ప్రశ్నించాడు 'ఆకాశం మొదలయిన గొప్ప మూలపదార్థాలు ఐదు కలవు కదా! వాటి కొలతలు ఎంత?' అని. దానికి ఆ మహర్షి 'అవి గొప్పవి, తుదిలేనివి, సురలు కూడా వాటి హద్దులు నిర్ణయించలేకపోయారు. ఒక చోటును చూపి ఈ భూతం (పదార్థం) ఇంతవరకు కలదు, అక్కడ లేదు అనరాదు.

పంచభూతాలు హద్దులు లేనివి. వస్తువు ఒకటి ఉన్నదన్న తరువాత దాని కొలతలు లేవు అనట మెట్లంటావా? సమాధాన మిది. విష్ణువును అతడి గుణాన్ని స్వభావాన్నిబట్టి అనంతు డంటారు. జగన్మూర్తి అయిన విష్ణువునుండి జన్మించినవి కాబట్టి పంచభూతాలు కూడా విష్ణుడివలెనే అనంతాలు' అని తెలియజేయగా.

**విశేషం:** ఇక్కడ విజ్ఞాన వికాసాలకు మూలభూతమైన తార్కిక దృష్టి ఉన్నది. 'పంచమహాభూతాల కొలత లేమి?' అని భరద్వాజు డడిగితే, భృగువు 'వాటి పరిమాణం కొలతల కందనిది' అని అంటూ తన మాటను సమర్థించుకొనటానికి ఒక తర్కాన్ని ఆవిష్కరించాడు. ఈ పంచమహాభూతాలు కార్యాలు, కర్త నారాయణుడు. అతడు అనంతుడు. కాబట్టి కారణగతమైన అనంతత్వం కార్యంలోనూ ప్రతిఫలించింది. కాబట్టి ఇక్కడ కారణకార్య సంబంధం వ్యక్తమైనదన్నమాట.

**సీ.** **విని భరద్వాజుండు 'మునినాథ! పుష్కరం । బునఁ బుట్టె నన్నప్డ పుష్కరంబు**
**బ్రహ్మకు నాదినాఁ బట్టయ్యె నెట్టొకో?' । నావుడు 'విష్ణుమానసభవుండు**
**బ్రహ్మ యాద్యుఁడు పుష్కరము దదాసన రూప । ముగఁ గల్పితంబయ్యె మున్ను పిదప**
**నను నిశ్చయంబు లే కునికిఁ బద్మజుఁ డన । వలసియు నుండు నయ్యలఘుతేజుఁ**

**తే.** **బద్మ మది భూతధాత్రి యప్పద్మమునకు । గగన మూర్ధితమగు మేరునగము రుచిర**
**చారుకర్ణిక యందుండి సకల జంతు । సృజన ధుర్యత్వమహిమ నయ్యజుఁడు వెలుఁగు.** **84**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; భరద్వాజుండు= భరద్వాజముని; మునినాథ!= ఋషుల రాజా! ఓ భృగూ!; పుష్కరంబునన్= పద్మమునందు; పుట్టెన్+అన్న+అప్డు+అ= పుట్టెను అన్నప్పుడే; పుష్కరంబు= పద్మం; బ్రహ్మకున్= బ్రహ్మదేవుడికి కూడా; ఆదినాన్= మొదటి దనగా; పట్టు+అయ్యెన్= స్థానమైనది; ఎట్టు+ఒకో?= ఎట్లో?; నావుడున్= అనినవెంటనే; విష్ణుమానసభవుండు= విష్ణువు మనస్సునుండి పుట్టినవాడు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఆద్యుఁడు= మొదటివాడు; పుష్కరము= పద్మం; తద్+ఆసన రూపముగన్= ఆతని పీఠము ఆకారంగా; కల్పితంబు+అయ్యెన్= నిర్మించబడినది అయినది; మున్ను పిదపన్= ముందు వెనుక; అను నిశ్చయంబు లేక+ఉనికిన్= అనే నిర్ణయం లేకుండటంవలన; పద్మజుఁడు= పద్మం నుండి పుట్టినవాడు; అనన్+వలసి+ఉండున్= అనవలసి ఉంటుంది; ఆ+అలఘు తేజున్= ఆ గొప్పకాంతిగల వాడిని; పద్మము+అది= ఆ తామరపువ్వు; భూతధాత్రి= (ప్రాణులను పెంచెడిది) భూమి; ఆ+పద్మమునకున్= ఆ తామర పువ్వునకు; గగనమూర్ధితము+అగు= ఆకాశం తలగా గల; మేరునగము= మేరు పర్వతం; రుచిరచారు కర్ణిక= ప్రకాశించెడి సుందరమైన దుద్దు (పువ్వులోని నడిమి భాగం); అందున్+ఉండి= ఆ తామరదుద్దు నుండి; సకల జంతు సృజన ధుర్యత్వమహిమన్= ఎల్ల ప్రాణుల సృజించే భారం వహించే గొప్పతనంతో; ఆ+అజుండు= ఆ బ్రహ్మ; వెలుఁగు(న్)= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** భృగుమహర్షి కథనాన్ని విన్న భరద్వాజుడు 'ఓ ఋషిశ్రేష్ఠా! బ్రహ్మదేవుడు పద్మంనుండి పుట్టాడు - అని అన్నప్పుడు, ఆ పద్మం బ్రహ్మకు ముందు పుట్టినదైనట్లు కాదా?' అని ప్రశ్నించాడు. దానికి భృగువు సమాధానమిది: - 'బ్రహ్మ విష్ణుమానస పుత్రుడు, కాబట్టి బ్రహ్మ మొదటివాడు. తరువాత ఆ బ్రహ్మకు పీఠంగా పద్మం నిర్మించబడింది. అయితే ఈ కార్యక్రమం జరిగినప్పుడు ముందూ - వెనుకా అనే నిర్ణయం లేదు కాబట్టి బ్రహ్మను పద్మజుడు (పద్మం నుండి పుట్టినవాడు) అనీ అనవలసి ఉంటుంది. ఇంతకూ ఆ పద్మం ఏమి టనుకొంటున్నావు! అది భూమి. దానికి ఆకాశమే శీర్షంగా గల మేరుపర్వతం అందమైన కర్ణిక. అక్కడనుండి ఆ బ్రహ్మదేవుడు సకల చరాచర జంతుసమూహాన్ని సృజించే భారాన్ని వహిస్తూ ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** పై వచనంలో బ్రహ్మ స్వరూపాన్ని ఆవిష్కరిస్తూ అక్కడ మేదిని బ్రహ్మశరీరంలోని మేదోమాంసమని వివరించబడింది. ఇక్కడేమో బ్రహ్మదేవుని ఆసనంగా నిర్మితమైన పద్మమే భూతధాత్రిగా భూమిగా చెప్పబడుతూ ఉన్నది. దీనిని బట్టి మనం

గ్రహించవలసినదేమిటంటే ప్రాచీనతమకాలాన నరుడు ఈ సృష్టి ఏర్పడినవిధానాన్ని గూర్చి అనేక ఆలోచనలు చేసి ఉన్నాడు. వాటిలో కొన్ని తర్కసహమైనవిగా ఉన్నవి అనుకొన్నవి, ఇక్కడ చోటుచేసికొనటం జరిగింది.

**వ. అని భృగుండు సెప్పిన విని భరద్వాజుండు 'భూతంబు లై దగుట యేమిట?' నని యడిగిన నతం డతని కి ట్లనియె. 85**

**ప్రతిపదార్థం:** అని= పైవిధంగా; భృగుండు= భృగుముని; చెప్పినన్= పలుకగా; విని= ఆలకించి; భరద్వాజుండు= భరద్వాజ ఋషి; భూతంబులు= మహా పదార్థాలు; ఐదు+అగుట+ఏమిటన్?= ఐదు కావటం దేనివలన? (ఎక్కువ తక్కువలు ఏల లేవు?); అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= ఆ భృగువు; అతనికిన్= ఆ భరద్వాజమునికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భృగువచనం విన్న భరద్వాజుడు ప్రశ్నించాడు. 'మహాపదార్థాలు భూతాలు ఐదే దేనివలన అయినట్లు? ఏ కారణాన అవి అయిదుగా రూపుదాల్చినవి?' అని. దానికి సమాధానం మహాజ్ఞాని అయిన భృగువు ఇట్లా ఇస్తున్నాడు.

**క. వాయువు చేష్టా రూపము, । మ్రోయునెడ నభంబు, ద్రవము మునివర! జల మూ**
**ష్మాయిత మనలము; గారి । న్యాయితము ధరిత్రి; యిట్టు లైదు దెఱంగుల్. 86**

**ప్రతిపదార్థం:** మునివర!= ఓ ఋషిశ్రేష్ఠా! భరద్వాజా!; చేష్టా రూపము= చైతన్యరూపం; వాయువు= గాలి; మ్రోయునెడన్= శబ్దించే చోట; నభంబు= ఆకాశం; ద్రవము= స్రవించేది, పారునది; జలము= నీరు; ఊష్మాయితము= వేడిమి చెందినది; అనలము= నిప్పు; కాఠిన్యాయితము= గట్టితనం చెందినది; ధరిత్రి= భూమి; ఇట్టులు= ఈ విధంగా; ఐదు తెఱంగుల్= ఐదు విధాలు.

**తాత్పర్యం:** సృష్టిలో చేష్టలు, శబ్దాలు, స్రావాలు, వేడిమి, గట్టితనం ఏర్పడటానికై పంచమహాభూతాలు ఆవిష్కరించబడ్డాయి. చేష్టలు వాయురూపాన, శబ్దాలు ఆకాశం ద్వారా, స్రావాలు నీటివలన, వేడిమి నిప్పు నుండి, గట్టితనం భూమివలన కలిగాయి. కాబట్టి పంచభూతాల అవసరం ఆ విధంగా ఏర్పడినది.

**విశేషం:** ఇక్కడకూడా శ్రోతలోని తార్కిక దృష్టి వ్యక్తమైనది. ఆదిలో అయిదు భూతాలే ఎందుకు ఏర్పడవలసి వచ్చినది? అనేది మౌలిక ప్రశ్న. దానికి సంతృప్తికరమైన సమాధానం భృగువు అందించాడు.

**వ. ఈ యయిదింటన కాదె జంగమంబులు స్థావరంబులు నైనయవి!' యనుటయు భరద్వాజుండు 'స్థావరంబుల యందు భూతగుణంబు లేమిటం గంటి?' మని యడిగిన భృగుం డిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** ఈ+అయిదింటన్+అ= ఈ ఐదింటివలననే; కాదె= కదా; జంగమంబులు= తిరుగాడెడివి; స్థావరంబులున్= కదలనివి; ఐన+అవి!= కలిగినవి!; అనుటయున్= అనగా; భరద్వాజుండు= భరద్వాజముని; స్థావరంబులఅందున్= నిలిచి ఉండువాటియందు; భూతగుణంబులు= పంచభూతాల లక్షణములు; ఏమిటన్= ఏ విధంగా; కంటిమి?= చూచితిమి?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; భృగుండు= భృగుమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ పంచభూతాలకారణంగానే సృష్టిలో కనిపించే రెండు విధాలయిన పదార్థాలు 1. తిరుగాడేవి, 2. నిలిచి ఉండేవి (క్రమంగా జంగమాలు, స్థావరాలు) ఏర్పడ్డాయి. సృష్టి సర్వస్వమూ ఈ జంగమ స్థావరాత్మకమే.' అని భృగువు పలికితే భరద్వాజుడు మళ్ళీ ప్రశ్నిస్తున్నాడు - 'పంచభూతాల లక్షణాలు స్థావరాలలో ఎట్లా గమనించగలం?' అని. దానికి భృగువు సమాధానం ఇట్లా ఇచ్చాడు.

సీ. 'అశని నిర్ఘోషంబు నాకర్ణనము లేక । వికృతి నెట్టులు వొందు వృక్ష? మాక
సముశక్తి సూవె శ్రోత్రము నిదాఘంబు సోఁ । కునవాడుఁ జోఁ కెఱుంగుట సమీర
శక్తి మార్గముఁ గని చాఁగెడుఁ గనుట తే । జశ్శక్తి పాదపసంజ్ఞఁ బరఁగుఁ
బాదజిహ్వలఁ గొని బానంబు సేయుట । జలశక్తి జిహ్వ నైజంబు లైన

తే. కుసుమ ధూపాది గంధముల్ గొనుట నెలమిఁ । దాల్చు నని చెప్పుఁ దరువు వేదంబు ఘ్రాణ
మిర్విశక్తి యి ట్లయిదును నుల్లసిలుట । ననఘ! భూజంబు పంచభూతాత్మకంబు. 88

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా!; అశని నిర్ఘోషంబున్= పిడుగు శబ్దమును; ఆకర్ణనము లేక= వినటంలేకుండా; వృక్షము= చెట్టు; వికృతిని= వికారమును, మార్పును; ఎట్టులు+పొందున్?= ఏ విధంగా చెందుతుంది?; ఆకసము శక్తి+చూవె= ఆకాశం యొక్క శక్తి సుమా!; శ్రోత్రము= చెవి; వృక్షము= చెట్టు; నిదాఘంబు సోఁకునన్= వేడిమి తాకిడివలన; వాడున్= వాడిపోతుంది; చోఁకు+ఎఱుంగుట= స్పర్శ (తాకు) తెలిసికొనటం; సమీరశక్తిన్= గాలి ప్రభావంవలన; వృక్షము; మార్గమున్+కని= దారిని చూచి; చాఁగెడున్= సాగుతుంది; కనుట= చూడటం; తేజస్+శక్తిన్= వెలుతురు ప్రభావంవలన; వృక్షము; పాదప సంజ్ఞన్= పాదపము అనే పేరుతో; పరఁగున్= ఒప్పుతుంది; పాదజిహ్వలన్= వేళ్ళు అనే నాల్కలతో; కొని= స్వీకరించి; పానంబు+చేయుట= త్రాగుట చేయటం - త్రాగటం; జలశక్తిన్= నీటి ప్రభావంవలన; జిహ్వ నైజంబులు= నాల్క స్వభావాలు; ఐనన్= కాగా, ఈ విధంగా నాలుగు భూత లక్షణాలు నిరూపితాలు కాగా; కుసుమ ధూప+ఆది గంధముల్= పూవులు, పొగలు మొదలైన వాటి వాసనలు; కొనుటన్= స్వీకరించటం; తరువు= చెట్టు; ఎలమిన్= బాగుగా; తాల్చును+అని= వహించును, ధరించును అని; వేదంబు= వేదం; చెప్పున్= పలుకును; ఘ్రాణము= వాసన చూచే ఇంద్రియం, ముక్కు; ఉర్విశక్తిన్= భూమిశక్తివలన; ఇట్లు= ఈ విధంగా; అయిదును= ఐదు భూతముల లక్షణాలను; ఉల్లసిలుటన్= ప్రకాశిస్తూ ఉండటంవలన; భూజంబు= చెట్టు (భూమినుండి పుట్టినది); పంచభూత+ఆత్మకంబు= ఐదు భూతాల స్వరూపం గలది.

**తాత్పర్యం:** పాపరహితుడవయిన ఓ భరద్వాజా! స్థావరమైన చెట్టులో పంచభూతాల లక్షణాలు ఎట్లా వ్యక్తమౌతున్నాయో చూడుము. చెట్టు పిడుగుపాటుకు వికృతిని పొందుతుంది. పిడుగు శబ్దాన్ని వినకుండా వికారాన్ని ఎట్లా చెందుతుంది? కాబట్టి శబ్దాన్ని గ్రహిస్తున్నదంటే దానికి ఆకాశలక్షణమైన శ్రవణేంద్రియం చెవి ఉన్నట్లే. వేడిమి సోకితే వాడిపోతుంది. స్పర్శను గ్రహించటమంటే వాయువు లక్షణాన్ని ధరించినట్లే. దారి చూచుకొని సాగుతుంది, పెరుగుతుంది. చూచుట అనే క్రియ తేజశ్శక్తికి చెందింది కాబట్టి వెలుతురు గ్రహించే నేత్రమున్నట్లే. చెట్టును పాదపం అంటారు. అనగా పాదజిహ్వలతో, వేళ్ళ రూపంలోని నాలుకలతో పానం చేస్తుంది. ఇక్కడ జలశక్తిని ధరించినట్లు కాగా, చెట్టు, పూవులు, పొగలు మొదలైనవాటి వాసనలు గ్రహిస్తుంది - అని వేదం పలుకుతున్నది. కాగా చెట్టు ఆఘ్రాణిస్తున్నట్లే. ఇది భూమి లక్షణం. ఈ విధంగా స్థావరమైన వృక్షంలో కూడా ప్రాథమికాలయిన పంచభూతాల లక్షణాలు గోచరిస్తున్నాయి కాబట్టి చెట్టు పంచభూతాత్మక మైనదిగా అంగీకరించవలసిందే.

**విశేషం:** తరువులో ఘ్రాణలక్షణం తప్ప మిగిలిన అన్ని లక్షణాలూ సహజంగానే ప్రత్యక్ష ప్రమాణాలతోనే నిరూపితమైనాయి. ఘ్రాణలక్షణం - వాసన చూచే గుణం దగ్గరకు వచ్చేసరికి ప్రత్యక్షప్రమాణం చాలదు. అందుకని అక్కడ వేదాన్ని ప్రమాణంగా చూపాడు భారతకర్త. వేదప్రామాణ్యాన్ని అంగీకరించకపోతే ఆస్తిక్యమే దెబ్బతింటుంది కాబట్టి అది తిరుగులేని ప్రమాణ మన్నమాట.

వ. శైలాదుల యందు నిట్ల యూహింపఁ బెఱ భంగులం గలిగియుండుఁ; బంచభూతాత్మకంబు గాని భూతంబు లేదనుట వేదనిశ్చయం' బనిన విని భరద్వాజుండు. 89

**ప్రతిపదార్థం:** శైల+ఆదులయందున్= కొండలు మొదలయినవాటియందును; ఇట్లు+అ= ఈ విధంగానే; ఊహింపన్= ఆలోచించగా; పెఱభంగులన్= ఇతర విధాలను, పద్ధతులను; కలిగి+ఉండున్= వహించి ఉండును; పంచభూత+ఆత్మకంబు+కాని= పంచభూతాలతో ఏర్పడినది కాని; భూతంబు= (కలిగినది) వస్తువు, ప్రాణి, పదార్థం; లేదు+అనుట= లేదనటం; వేదనిశ్చయంబు= వేదంయొక్క నిర్ణయం; అనినన్= అనగా; విని= ఆలకించి; భరద్వాజుండు= భరద్వాజ ముని.

**తాత్పర్యం:** కొండలు మొదలైనవాటిలో కూడా ఇదే విధంగా ఆలోచించగా, పంచభూతాలలో ఏర్పడని ప్రాణి లేదన్నది వేదం నిర్ణయించిన విషయం' అనగా విన్న భరద్వాజుడు.

**విశేషం:** ఇక్కడ పూర్వ లక్షణాన్ని చెలరేగకుండా చేసే ఉద్దేశంతోనే భృగువు 'ఇది వేద నిశ్చయంబు' అని చివరిమాటగా పలికినట్లున్నాడు.

**క.** **'భూముఖ్యం బగు భూత। గ్రామంబు గుణంబు లైన గంధాదులఁ దే**
**జోమహిత యనుభవించుట। యేమెయి? నెద్దాని కావహిల్లుచునుండున్.'** **90**

**ప్రతిపదార్థం:** తేజస్+మహిత!= గొప్పతేజస్సుగలవాడా!; భూముఖ్యంబు+అగు= భూమి మొదలైన; భూతగ్రామంబు గుణంబులు+ఐన= భూతాల సమూహం యొక్క స్వభావాలైన; గంధ+ఆదులన్= వాసన మొదలైనవాటిని; అనుభవించుట= పొందటం; ఏ మెయిన్= ఏ విధంగా; ఏ+దానికిన్= దేనికి; ఆవహిల్లుచున్+ఉండున్?= కలుగుతూ ఉంటుంది?

**తాత్పర్యం:** 'ఓ తేజస్వీ! భూమి మొదలయిన పంచభూతాలకు గంధం మొదలయిన లక్షణాలున్నాయి. ఆలక్షణాలను, స్వభావాలను ఏ విధంగా ఎవరు అనుభవిస్తారు? ఆ అనుభవం అనేది ఏ క్రమంలో ఎవరికి చెందుతుంది'.

**విశేషం:** సృష్టి అంతా పంచభూతాత్మకం. ఇతరమైన దేదీ లేదు. అయినప్పుడు అనుభోక్తా, అనుభుక్తమూ రెండూ సాంకేతికంగా ఒకటే. అందుకని అనుభవాన్ని గురించిన క్రమపరిణామాన్ని వివరించవలసి వచ్చింది.

**తే.** **అనిన భృగుఁ డిట్టులను 'విషయములు నింద్రి। యములు మనసును గ్రమసాధనములు గాఁగ**
**నంతరాత్మ ప్రదర్శి యై యనుభవించి। తత్కృతము లగు మోదఖేదములఁ బొందు.** **91**

**ప్రతిపదార్థం:** అనినన్= భరద్వాజుడు అనగా; భృగుఁడు= భృగుమహర్షి; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు; విషయములున్= పదార్థాలును; ఇంద్రియములున్= కన్నులు మొదలైన ఇంద్రియాలూ; మనసును= మనస్సు; క్రమసాధనములు+కాఁగన్= వరుసగా ఉపకరణాలు అవుతుండగా; అంతర్+ఆత్మ= లోపలి జీవుడు; ప్రదర్శి+ఐ= చూచేవాడై; అనుభవించి= అనుభవాన్ని పొంది; తద్+కృతములు+అగు= ఆ అనుభవముచేత చేయబడిన (కలిగిన); మోదఖేదములన్= సుఖదుఃఖాలను; పొందున్= చెందును.

**తాత్పర్యం:** భృగువు సమాధానమిది - 'పదార్థాలు, వాటిని గ్రహించే ఇంద్రియాలు, ఇంద్రియాలను నియంత్రించే మనస్సూ - ఈ మూడూ వరుసగా అనుభవక్రియకు సాధనాలు. అనుభోక్త లోపలి జీవుడు. అతడే అంతరాత్మ. అతడు పై మూడింటిని చూస్తూ పంచభూతాల స్వభావాలను అనుభవిస్తాడు. అనుభవించి, తత్ఫలితంగా సుఖాన్నో లేక దుఃఖాన్నో పొందుతాడు. కాబట్టి అనుభోక్త అంతరాత్మ. అతడి క్రింద మనస్సు, దాని అధీనంలో ఇంద్రియాలు, ఇంద్రియాల దగ్గర పదార్థాలు - ఇదీ క్రమం క్రిందినుండి చూస్తే.

**విశేషం:** ఇక్కడ వివరించిన వాటిలో విషయాలు - పదార్థాలు, ఇంద్రియాలు కనిపించేవి రెండు. మనస్సు, అంతరాత్మ కనిపించనివి రెండు. కనిపించకపోయినా వస్తువులుండవచ్చు - అనేది మన అనుభవంలోని విషయమే. మనస్సు ఉనికిని గ్రహించవచ్చును. మనం చూస్తూకూడా ఒక్కొక్కసారి ఎదుటి వస్తువును గ్రహించలేము. కారణం మనస్సు అక్కడ లేక. కాబట్టి ఇంద్రియాలతోపాటుగా మనస్సుకూడా అనుభవానికి అవసరమే.

**వ. అప్పురుషుండు. 92**

**తాత్పర్యం:** ఆ మానవుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** భారతీయ వేదాంత శాస్త్రాలలో ఈ పురుషశబ్దానికి ఒక ప్రత్యేకత ఉన్నది. ప్రకృతి, పురుషుడు వంటి వాడుకలో పురుష శబ్దాన్ని పర్యాయశబ్దాలతో ప్రయోగించరు. అట్లాగే పురుషోత్తముడంటే విష్ణువు. నరోత్తముడంటే ఆ అర్థం రాదుమరి! పురుషసూక్తమనే వాడుక తప్ప మానవ సూక్తంవంటి మాటలు లేవు. ఆ దృష్టిలో ఇక్కడి పురుష శబ్దం అంతరాత్మకు పర్యాయంగా ప్రయుక్తమైనట్లు ఉన్నది.

**క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల । గాత్ర వ్యాప్తత్వమహిమ గలిగి సమీరా**
**సూత్రణమున జీవుండును । గోత్రమునై సర్వవర్తకుం డగుచుండున్. 93**

**ప్రతిపదార్థం:** క్షేత్రజ్ఞుండు+అనఁగన్= క్షేత్రజ్ఞ డనే పేరుతో; నిఖిలగాత్రవ్యాప్తత్వ మహిమ+కలిగి= మొత్తం శరీరంలో వ్యాపించి ఉండెడి గొప్పతనం వహించి; సమీర+ఆసూత్రణమునన్= (ప్రాణం) గాలి యొక్క ప్రవేశం వలన; జీవుండును= ప్రాణమూ; గోత్రమును+ఐ= వంశమునూ అయి; సర్వవర్తకుండు+అగుచున్+ఉండున్= అన్నింటా ఉండెడివాడు అవుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** సృష్టిలోని ఖేదమోదాలకు పాత్రమై ఉండే ఆ పురుషుడు క్షేత్రజ్ఞుడనే సంజ్ఞతో శరీరమంతా నిండి ఉండే గొప్పతనం కలిగి, ప్రాణవాయువుతో కలిసి ఉండటంవలన జీవుడని పిలువబడుతూ తానే వంశం కూడా అయి అన్నింటా వ్యాపించి ఉంటాడు.

**విశేషం:** క్షేత్రమంటే శరీరం; క్షేత్రజ్ఞుడు అంటే జీవాత్మ - క్షేత్రాన్ని ఎరిగినవాడు అని అర్థం. ప్రాణమనే వాయువుతో ఉండటంవలన ప్రాణికి - జీవుడు; అయితే అంతమాత్రమే కాకుండా వంశలక్షణమూ జీవలక్షణమూ ధరించి సర్వవ్యాపకుడై కూడా ఉంటాడు.

**క. అగు నీతత్త్వము సత్త్వా । దిగుణత్రయ వికృతి కత్యతీతంబై పూ**
**ర్వ గురుత్వంబునకుం జన । విగతత్వంబునకు నెలవు విమలవిచారా! 94**

**ప్రతిపదార్థం:** విమలవిచారా!= నిర్మలమైన ఆలోచన కలవాడా!; ఈ తత్త్వము= ఈ క్షేత్రత్వం; సత్త్వ+ఆది గుణత్రయ వికృతికి(న్)= సత్త్వం మొదలైన త్రిగుణాల వికారానికి; అతి+అతీతంబు+ఐ= మిక్కిలిగా గడచిపోయినదై, దూరమైనదై; పూర్వగురుత్వంబునకున్= మొదటి గొప్పతనానికి; చనన్= వెళ్ళుటకు, చేరుటకు; విగతత్వంబునకు(న్)= బొత్తిగా పోయిన తనమునకు, మిక్కిలి లేమికి; నెలవు= స్థానం.

**తాత్పర్యం:** ఈ క్షేత్ర క్షేత్రజ్ఞతత్వం, సత్వరజస్తమోగుణాలు - అనే ఈ మానవస్వభావ వికారాలకు మిక్కిలి దూరమై ఆత్మ ఈ జన్మపరంపరల చక్రాన తగుల్కొనక, ముందున్న కైవల్యానికి నిలయమైనది.

**విశేషం:** ఈ క్షేత్రజ్ఞతత్త్వం ప్రకారం ఆత్మ స్వతఃముక్తం; ఆనందమయం; అయినా జన్మ పరంపరలు అనే చక్రాన తగుల్కొని పరిభ్రమిస్తూ తనను తాను మరచి వ్యవహరిస్తూ, చివరకు తన నెలవును - కైవల్యాన్ని చేరుకొంటుంది.

**ఆ. బుధుఁడు సూక్ష్మ విమల బుద్ధి నప్పురుషుని । నరసి కాంచి యతని యంద మనసు**
**దిగ్గ విడిచి, యెగ్గు లగ్గును బొందక । శుద్ధశాంతిఁ బరమసుఖము పొందు. 95**

**ప్రతిపదార్థం:** బుధుఁడు= పండితుడు; సూక్ష్మవిమల బుద్ధిన్= ఆధ్యాత్మమయిన నిర్మలమైన తెలివితో; ఆ+పురుషునిన్= ఆ క్షేత్రజ్ఞుడిని; అరసి= వెదకి; కాంచి= చూచి; అతనియందున్+అ= ఆ క్షేత్రజ్ఞుడి యందే; మనస్సు= హృదయము; దిగ్గ విడిచి=

దిగవిడిచి, వదలిపెట్టి; ఎగ్గు(న్)+లగ్గును= కీడును, మేలును; పొందక= చెందక; శుద్ధశాంతిన్= పరిశుభ్రమైన శాంతితో; పరమ సుఖము= గొప్ప సంతోషం; పొందున్= చెందుతాడు.

**తాత్పర్యం:** పండితుడు అధ్యాత్మచింతనతో, నిర్మలమతితో కేవలుడైన ఆ పురుషుడిని అన్వేషించి, దర్శించి ఆతడియందే తన మనస్సును లగ్నంచేసి, ఇతరమైన దేనినీ చూడక, కేవలప్రశాంతితో సుఖాలనన్నిటిని మించిన ఆ పరమసుఖాన్ని పొందుతాడు.

**విశేషం:** పండితుడు క్షేత్రజ్ఞదర్శనంతో పరమసుఖాన్ని పొందగలడు - అంటే పరిశేషన్యాయంతో అపండితుడు దానికి విరుద్ధంగా గతానుగతికంగా జన్మచక్రంలో పడి తిరుగుతూనే ఉంటాడని కూడా అర్థం.

**వ. అని వెండియు. 96**

**తాత్పర్యం:** అని పలికి మరలా. (తరువాతి పద్యంతో అన్వయం).

**భృగుమహాముని భరద్వాజునకుం జెప్పిన వర్ణాశ్రమాచారక్రమము (సం. 12-181-1)**

**సీ. 'ఆగమ సత్యధర్మాచార తపముల । కునికి పట్టులుగాఁగ వనజభవుఁడు**
**గలిగించె మును బ్రాహ్మణుల మఱి కల్పించె । నృప వైశ్య శూద్రుల నిర్మలాత్మ**
**బ్రాహ్మణాదికముగఁ బరఁగు నన్నాలుగు । జాతుల యుజ్జ్వలచ్ఛాయ లోలి**
**సొంపారుఁ దెలుపును గెంపును బసుపు చా । యయుఁ గప్పు నయ్యు నండ్రాంఆర్య**

**ఆ. లాత్మకర్మ మెడలి యనులోమ వృత్తి నె । జ్జాతి సొచ్చు నన్యజాతి పనికి**
**దాని కట్టిభంగి దలకొనుఁ బెక్కులు । పనులఁ జేసి జారతనము వచ్చు. 97**

**ప్రతిపదార్థం:** నిర్మల+ఆత్మ!= మలినంలేని ఆత్మకలవాడా! భరద్వాజా!; వనజభవుఁడు= బ్రహ్మదేవుడు; ఆగమ సత్యధర్మాచార తపములకున్= వేదాలకు, సత్యానికి, ధర్మానికి, ఆచారానికి, తపస్సునకు - ఈ అన్నిటికి; ఉనికి పట్టులుగాఁగన్= స్థానాలు అయ్యేటట్లుగా; మును= ముందుగా; బ్రాహ్మణులన్= బ్రాహ్మణజాతిని; కలిగించె(న్)= పుట్టించాడు; మఱి= తరువాత; నృప వైశ్య శూద్రులన్= క్షత్రియ వైశ్య శూద్రులను; కల్పించె(న్)= పుట్టించాడు; బ్రాహ్మణ+ఆదికముగన్= బ్రాహ్మణులు మొదలుగా; పరఁగు= ఒప్పు; ఆ+నాలుగు జాతుల= ఆ నాలుగు వర్ణాల; ఉత్+జ్వల+ఛాయలు= బాగుగా ప్రకాశించే మేని రంగులు; ఓలి(న్)= క్రమంగా; సొంపు+ఆరు= విలసిల్లునటువంటి; తెలుపును= తెల్లదనమూ; కెంపును= ఎర్రదనము; పసుపుచాయయున్= పసుపు (పచ్చని) రంగూ; కప్పున్= నల్లదనమూ; ఐ= అయి; అని; ఆర్యులు= పెద్దలు; అందురు= అంటారు; ఆత్మకర్మము= తనపని; అనులోమవృత్తిన్= ఆరోహణ క్రమానుగతమైన బ్రతుకు దెరువును; ఎడలి= విడిచి; ఏ+జాతి= ఏ వర్ణము; అన్యజాతిపనికిన్= ఇతర వర్ణపు వృత్తికి; చొచ్చున్= ప్రవేశిస్తుందో; దానికిన్= ఆ జాతికి; అట్టి భంగి= ఆ పద్ధతి; తలకొనున్= కలుగుతుంది; పెక్కులు పనులన్+చేసి= అనేకములయిన పనులవలన; జారతనము= వ్యభిచారం, రంకుతనం; వచ్చున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ నిర్మలాత్మా! భరద్వాజా! బ్రహ్మదేవుడు మొదటగా వేదాలకూ, సత్యధర్మ ఆచారాలకూ, తపస్సులకూ నెలవులుగా ఉంటారని బ్రాహ్మణులను సృజించాడు. తరువాత క్షత్రియ వైశ్య శూద్రులను పుట్టించాడు. బ్రాహ్మణులు మొదలు శూద్రుల వరకు గల నాలుగు వర్ణాలవారి మేని రంగులు క్రమంగా తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు- (అంటారు ఆర్యులు.) ఈ నాలుగు వర్ణాలవారిలో ఏ జాతి వారయినా, తమ వృత్తులు వదలి అన్యుల వృత్తులు స్వీకరిస్తే వారికి ఆ వృత్తి ఏర్పడుతుంది. అయితే అటువంటి ప్రవర్తనవలన లోకాన రంకుతనం కలుగుతుంది.

**క. సిత రక్త పీత నీలము । లతులమతీ! మొదలు దొడఁగి యంతంతకు హీ**
**నతఁ దాల్చుఁ గాన యెఱిఁగిం । చితి నీ పరిపాటిఁ గర్మశీలతకొఱకున్.' 98**

**ప్రతిపదార్థం:** అతులమతీ!= సాటిలేని బుద్ధిగలవాడా!; సిత రక్త పీత నీలములు= తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు; మొదలు+తొడఁగి= మొదలుకొని; అంతకున్+అంతకున్= అంతకంతకు క్రిందికి పోయేకొలదీ; హీనతన్= తక్కువ తనమును; తాల్చున్= ధరించును; కాన= కావున; కర్మశీలత కొఱకున్= కర్మల స్వభావాల కొరకు; ఈ పరిపాటిని= ఈ క్రమాన్ని; ఎఱిఁగించితిన్= తెలిపాను.

**తాత్పర్యం:** ఓ భరద్వాజా! తెలుపు ఎరుపు పసుపు నలుపు లనే ఈ వర్ణాలు మొదటినుండి క్రిందికి వచ్చే కొలది తక్కువతనాన్ని వహిస్తాయి. తెలుపుకంటె ఎరుపు తక్కువ, అంటే బ్రాహ్మణుడికంటె క్షత్రియుడు హీనుడు. ఈ విధంగా ఈ వర్ణాలలో హెచ్చు తగ్గుల క్రమాన్ని ఆయా వర్ణాల స్వభావాల ఎరుకకొరకు నీకు తెలియజేశాను'.

**విశేషం:** వర్ణం అనేమాటకు రంగు అని అర్థం. మొట్టమొదట ఈ వర్ణభేదం మానవశరీర వర్ణాల కారణంగానే ఏర్పడి, అనంతరం పెద్దకాలానికి కులంగా స్థిరపడిపోయి ఉంటుంది. గ్రంథం ప్రాచీనం కాబట్టి ఆ మొదటి లక్షణాలు గ్రంథస్థాలుగా నిలిచాయి.

**వ. అని మఱియును. 99**

**ప్రతిపదార్థం:** అని= పలికి; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** అని పలికి ఇంకా ఇట్లా ప్రసంగిస్తున్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సత్యమ బ్రహ్మము దపమును । సత్యమ ప్రజలను సృజించు సత్యము లోక**
**స్థిత్యాధానముఁ జేయును । సత్యం బనృతంబుచేత సంపిహిత మగున్. 100**

**ప్రతిపదార్థం:** సత్యము+అ= సత్యమే; బ్రహ్మము= వేదం; తపమును= తపశ్చర్య కూడా; సత్యమ= సత్యమే; ప్రజలన్= జనులను; సృజించు(న్)= పుట్టిస్తుంది; సత్యమ= సత్యమే; లోకస్థితి+ఆధానమున్= జగత్తుయొక్క ఉనికిని స్థాపించుటను; చేయున్= చేస్తుంది; సత్యంబు= సత్యం; అనృతంబుచేత(న్)+అసత్యంచేత; సంపిహితము= బాగుగా కప్పబడింది; అగున్= అవును.

**తాత్పర్యం:** సత్యమే వేదం, సత్యమే తపస్సు, సత్యవ్రతాన్ని పాటిస్తే తపస్సు చేసినట్లే. సృష్టిలో ప్రజాసంతతిని సత్యమే సృష్టిస్తున్నది. లోకం నిలిచి ఉండటానికి సత్యమే కారణం. ఈ విధంగా లోక సృష్టికి, లోకస్థితికి ఆధారమైన ఈ సత్యం అసత్యం వలన కప్పబడిపోతుంది.

**విశేషం:** సత్యశబ్ద వ్యుత్పత్తి గ్రహించదగింది. 'సత్'కి చెందింది సత్యం. ఈ 'సత్' అనే శబ్దం వేదాంత పరిభాషలో ఎక్కువసార్లు వస్తుంటుంది. సత్= ఉనికి; సత్తా అనే సంస్కృతశబ్దం కూడా ఇటువంటిదే. 'సత్'కి వ్యతిరిక్తం 'అసత్'. అసత్తునుండి సత్తుకు చేరుకోవాలని ఉపనిషత్తుల ఉద్ఘోష.

**వ. అట్లుంగాక ధర్మాధర్మంబు లనఁ బ్రకాశతమంబు లన బోధాజ్ఞానంబు లన స్వర్గ నరకంబు లన సుఖదుఃఖంబు లనఁ బరఁగు బుధజన వ్యావహారిక శబ్దంబులకు నర్థంబులై సత్యానృతంబులు ప్రవర్తిల్లుం గావున. 101**

**ప్రతిపదార్థం:** అట్లున్+కాక= ఆ విధంగానే కాకుండా; ధర్మ+అధర్మంబులు+అనన్= పుణ్యం పాపం అనగా; ప్రకాశ తమంబులు+అనన్= కాంతి, చీకటి అనగా; బోధ+అజ్ఞానంబులు+అనన్= జ్ఞానం అజ్ఞానం అనగా; స్వర్గ నరకంబులు+అనన్= పుణ్యలోకం పాపలోకం అనగా; సుఖదుఃఖంబులు+అనన్= సంతోషం, ఏడుపు అనగా; పరఁగు= ఒప్పెడు; బుధజన వ్యావహారిక శబ్దంబులకున్= పండిత జనుల పలుకులలోని పదాలకు; అర్థంబులై= శబ్దార్థాలై తెలియపరచే శబ్దాలై; సత్య+అనృతంబులు= సత్యం అసత్యం అనేవి; ప్రవర్తిల్లున్= ప్రవర్తిస్తాయి; కావున(న్)= కాబట్టి.

**తాత్పర్యం:** లోకాధారమైన సత్యం అసత్యంచేత కప్పబడటమే కాదు, లోకంలో పుణ్యాపాపా లని, వెలుతురు చీక ట్లని, జ్ఞాన అజ్ఞానా లని, పుణ్యలోక పాపలోకా లని, సుఖదుఃఖా లని, ఆర్యులు వ్యవహరించే మాటల కర్థాలు కూడా క్రమంగా సత్య అసత్యాలే. అంటే సత్యమంటే ధర్మం, కాంతి, జ్ఞానం, స్వర్గం సుఖం - అని అర్థాలు. ఆ విధంగానే అసత్యమంటే పాపం, చీకటి, తెలివి తక్కువతనం, నరకం, దుఃఖం - అని గ్రహించాలి. లోకంలోని మంచిమొత్తం సత్యం, చెడుగంతా అసత్యం - ఇదీ ఫలితార్థం.

**క. అనఘా! దుఃఖాత్మకమగు । నన్నృతం బడఁగించుటకుఁ బ్రయత్నమున సుధీ**
**జను లాచరింతు రనిశం । బును మోహవిఘాతి నియమములు నిష్ఠమెయిన్. 102**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; సుధీజనులు= పండితులు; దుఃఖ+ఆత్మకము+అగు= దుఃఖస్వరూపమైన; న+ఋతంబు= అసత్యం; అడఁగించుటకు(న్)= అణచుటకు; ప్రయత్నమున(న్)= గొప్ప యత్నంతో; అనిశంబును= ఎల్లప్పుడును; మోహవిఘాతి నియమములు= మానసిక విభ్రాంతిని చంపు కట్టుబాట్లు; నిష్ఠమెయిన్= దీక్షతో; ఆచరింతురు= ఆచరణలో పెట్టుతారు.

**తాత్పర్యం:** పాపమెరుగని ఓ భరద్వాజా! దుఃఖస్వరూపమైన ఈ అసత్యాన్ని అణచగోరి, పండితులు గొప్ప యత్నంతో పొరపాట్లను తొలగించే కట్టుబాట్లను ఎప్పుడూ దీక్షతో ఆచరిస్తూ ఉంటారు.

**విశేషం:** సత్యాసత్యాలు యథార్థంగా ఉన్నవి ఉన్నట్లుగా కనిపిస్తే నరులు సామాన్యంగా సత్యాన్నే ఎన్నుకొంటారు. అయితే అసత్యం సత్యంవలె భ్రాంతి కలిగిస్తుంది. ఆ భ్రాంతిని నిర్మూలించే ప్రయత్నం సుధీజనులే చేయాలి. సామాన్యులకు అది అలవిమాలిన పని.

**క. ఒలయు జరావ్యాధి ప్రభృ । తులు శారీరములు గాఢ తోదక శోకా**
**దులు మానసములు; దుఃఖం । బులు రెండు విధముల నిట్లు పురుషు నలంచున్. 103**

**ప్రతిపదార్థం:** ఒలయు= కలిగెడు; జరావ్యాధి ప్రభృతులు= ముసలితనం, రోగం మొదలైనవి; శారీరములు= ఒడలికి, శరీరానికి చెందినవి; గాఢ తోదక= బాధించే; శోక+ఆదులు= గట్టి (మానసిక) బాధ, బంధునాశంవలన దుఃఖం మొదలయినవి; మానసములు= మనస్సునకు చెందినవి; దుఃఖంబులు= బాధలు; రెండు విధములన్= రెండు రీతులలో; ఇట్లు= ఈ విధంగా; పురుషున్= మానవుడిని; నలంచున్= బాధిస్తాయి.

**తాత్పర్యం:** మానవజీవితంలో దాపురించే బాధలు రెండు విధాలుగా ఉంటాయి. ఒకటి శారీరక దుఃఖాలు, ముసలితనం, రోగం మొదలైనవి. రెండు - మానసిక బాధలు, బంధునాశం మొదలైనవాటి వల్ల కలిగేవి

**క. శారీర మానసములగు । నీ రెండు విధములు దన్ను నేఁపక యుండం**
**గోరికొని నియమములఁ బ్రతి । కారం బొనరింపఁగా సుఖం బొందు నరున్. 104**

**ప్రతిపదార్థం:** శారీర మానసములు+అగు= శరీరానికి, మనస్సునకు చెందినవైన; ఈ రెండు విధములు= పైన తెలిపిన రెండు రకాలయిన రోగాలు; తన్ను(న్)= తనను (నరుడిని); ఏఁపక+ఉండన్= బాధించకుండా ఉండుటను; కోరికొని= తనకై అభిలషించి; నియమములన్= కట్టుబాట్లతో; ప్రతికారంబు+ఒనరింపఁగాన్= ప్రతిక్రియ చేస్తే; నరున్= మానవుడిని; సుఖంబు+ఒందున్= క్షేమం పొందుతుంది.

**తాత్పర్యం:** శారీరకంగా, మానసికంగా దాపురించే రోగాలను శారీరకమైన మానసికమైన నియమ నిష్ఠలతో నియంత్రించ గలిగితే అవి నరుడిని బాధించవు. అట్టి ఆ నరుడు సుఖిస్తాడు.

**విశేషం:** పద్యంలోని 'తన్ను నేఁపక యుండంగోరికొని' అనే మాటలు గమనించదగ్గవి. కోరుట వేరు, కోరుకొనుట వేరు. కోరుకొనుట అంటే తనకొరకు కోరటం. అంటే గట్టిగా సంకల్పించుకొని ఆ సంకల్పబలంతో ఒక నిర్ణయానికి రావటం. అట్లా గట్టి నిర్ణయం జరిగితే దుఃఖనివారణ సాధ్యమే నంటున్నాడు భృగువు.

**క. విను దుఃఖంబులఁ దెగఁ దోఁ। చిన పురుషుఁడు సౌఖ్య సక్తచిత్తుఁడు గా కా**
**రిన వైరాగ్యముఁ జెందిన। ననుపమ మగు పరమపదము నమ్మెయి సేర్చున్?' 105**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; దుఃఖంబులన్= శారీరక మానసిక వ్యాధి - ఆధులను; తెగన్+తోఁచిన పురుషుఁడు= ఛేదించి నెట్టివేసిన నరుడు; సౌఖ్యసక్త చిత్తుఁడు= సుఖమునందు తగుల్కొన్న మనస్సు కలవాడు; కాక= కాకుండా; ఆరిన వైరాగ్యమున్= శాంతించిన విరాగి తనమును-విషయవాంఛలు లేకుండుటను; చెందినన్= పొందినచో; న+ఉపమము+అగు= సాటిలేనిదగు; పరమ పదమున్= గొప్పస్థానాన్ని, మోక్షాన్ని; ఆ+మెయిన్= ఆ విధముగా; చేర్చున్= పొందించును.

**తాత్పర్యం:** పైన వివరించినట్లుగా సంకల్పబలంతో, స్థిరనిశ్చయంతో వ్యాధి - ఆధులను దూరీకరించుకొన్న నరుడు ఆ జయంతో, మళ్ళీ సుఖసంతోషాల వెంటబడిన సామాన్యనరుడివలె ప్రవర్తించకుండా, విషయవాంఛలు శాంతించినవాడై ప్రశాంతమైన వైరాగ్యాన్ని స్వీకరించాలి. అపుడు ఆ వైరాగ్యమార్గం అతడిని ముక్తికి చేర్చుతుంది'.

**విశేషం:** ఆధివ్యాధుల నిరోధంతో నరుడి మనశ్శరీరాలు రెండూ పరిశుభ్రపడి కాంతిమంతములౌతాయి. అయితే ఆ స్థితిలో నరుడు మళ్ళీ పాతత్రోవలో ప్రపంచ సుఖాల వెంటబడి పరుగెత్తితే ప్రయోజనముండదు. కథ మళ్ళీ మొదటికి వచ్చినట్లే. అందువలన మనశ్శరీరారోగ్యాలు ఉజ్జ్వలంగా ఉన్నపుడు ప్రశాంతచిత్తుడై విరాగిగా బ్రతకగలిగితే మోక్షాన్ని చేరుకోగలుగుతాడు నరుడు.

**వ. అనిన విని భరద్వాజుం 'డాశ్రమధర్మ ప్రకారంబులు సువ్యక్తంబులుగా నెఱింగింపు' మనుటయు భృగుం డిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; భరద్వాజుండు= భరద్వాజ ముని; ఆశ్రమ ధర్మ ప్రకారంబులు= బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాస ఆశ్రమముల యొక్క నీతి నియమాలు; సువ్యక్తంబులుగాన్= బాగుగా స్పష్టపడే విధంగా; ఎఱింగింపుము= తెలియజేయుము; అనుటయున్= అనగా; భృగుండు= భృగుమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దుఃఖనివారణ మార్గాన్ని భృగువునుండి గ్రహించిన భరద్వాజుడు 'ఆశ్రమధర్మాలు - బ్రహ్మచారిగా, గృహస్థుడుగా, వానప్రస్థుడుగా, సంన్యాసిగా నరుడు ఆచరించవలసిన ధర్మాలను సుస్పష్టంగా తెలుపు'మనగా, సరి అని ఆ భృగుమహర్షి భరద్వాజుడిని ఉద్దేశించి ఈ విధంగా పలికాడు.

**సీ. గురునకు భక్తుఁడై పరమాదరమున వే। దాభ్యాస మెప్పుడు నాచరించు**
**చును, శౌచశీలత వినయంబు త్రిషవణ। స్నానంబు భాస్కరానలసపర్య**
**పాటించుచుండుట బ్రహ్మచారికి వృత్తి;। ధనధాన్యములు గర్హితములు గాని**
**తెరువునఁ బడసి యతిథిపూజ మున్నుగా। నన్నపానాది భోగానుభవముఁ**

**తే. బొందువాఁడు గృహస్థుండు; గందమూల। శాక ఫలము లాహారంబు శయ్యభూమి**
**వననివాసికి నిస్సంగవర్తనమున। భిక్ష బ్రదుకుగ యతి శాంతిఁ బేర్చియుండు. 107**

**ప్రతిపదార్థం:** బ్రహ్మచారికిన్= బ్రహ్మచర్యం - విద్యార్థిత్వం అనే ఆశ్రమంలో ఉన్నవాడికి; గురునకున్= చదువు నేర్పే అధ్యాపకుడికి; భక్తుఁడు+ఐ= శ్రద్ధకలవాడై; పరమ+ఆదరమున(న్)= గొప్ప అభిమానంతో; వేద+అభ్యాసము= వేదములను అభ్యసించుట-

నేర్చుకొనుట; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఆచరించుచున్= చేయుచు; శౌచశీలత= శుభ్రతతోడి స్వభావం; వినయంబు= అణకువ; త్రి+సవన= మూడు హోమములయందు; స్నానంబు= స్నానము చేయుట; భాస్కర+అనల సపర్య= సూర్యుడి, అగ్ని సేవను; పాటించుచుండుట= క్రమంగా చేస్తూఉండటం; వృత్తి= ధర్మం - బ్రహ్మచారికి పై విధులు పాటించటం ధర్మమనుట; ధనధాన్యములు= డబ్బు, గింజలు; గర్హితములు+కాని= నిందితముకాని; తెరువునన్= పద్ధతియందు; పడసి= పొంది; అతిథిపూజ= అతిథుల - భోజనసమయానికి ఇంటికి వచ్చిన వ్యక్తుల సత్కారం; మున్ను+కాన్= మొదట జరుగుచున్నట్లుగా; అన్నపాన+ఆది భోగ+అనుభవమున్= భోజనం, పానీయం మొదలగు భోగములను అనుభవించటాన్ని; పొందువాఁడు= స్వీకరించేవాడు; గృహస్థుండు= గేస్తు - గృహస్థ ఆశ్రమంలో ఉన్నవాడు; వననివాసికిన్= వానప్రస్థ ఆశ్రమంలో ఉన్నవాడికి; కందమూల శాకఫలములు= గడ్డలు, దుంపలు, కూరలు, పండ్లు; ఆహారంబు= భోజనం; శయ్య= పడక; భూమి= నేల; యతి= సన్యాసి; నిస్+సంగవర్తనమున(న్)= ఆసక్తిలేని ప్రవృత్తితో; భిక్ష= బిచ్చం; బ్రతుకుగన్= జీవనంగా; బ్రతుకు దెరువుగా; శాంతిన్= శాంతితో; పేర్చి+ఉండున్= అతిశయించి ఉండును.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యం నాలుగు ఆశ్రమాలలో మొదటిది. బ్రహ్మచారి గురుభక్తి కలిగి, వేదాభ్యాసం నిరంతరం చేస్తూ ఉండాలి. శుభ్రత పాటించే గుణంతో అణకువతో మూడు (ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం) హోమాలు చేసే సమయంలో స్నానం చేస్తూ సూర్యుడిని అగ్నిని క్రమం తప్పక ఆరాధిస్తూ ఉండాలి. ఇదీ బ్రాహ్మణధర్మం. మూడు పూటలా హోమం చేయాలి వటువు. ధనధాన్యాలు నిందారహితంగా ధర్మమార్గాన పొంది ముందుగా అతిథి సత్కారంచేసి, ఆ పిదప భోజనపానీయాదులు స్వీకరిస్తూ ఉండటం గృహస్థుడి ధర్మం. వానప్రస్థ ఆశ్రమానికి ఆహారం కందమూలాలు, కూరలు, పండ్లు మాత్రమే. అతడికి పడక నేలమీద. ఇక చివరి ఆశ్రమం సన్యాసం. సన్యాసి అనాసక్త ప్రవృత్తితో బిచ్చమే జీవనంగా శాంతితో వెలుగుతూ ఉంటాడు.

**విశేషం:** మానవ జీవనకాలాన్ని నాలుగుగా విభజించి - బాల్యంలో, యౌవనంలో, ముదిమి మొదటి దశలో, అనంతరదశలో చేయదగిన పనులను క్రమంగా నిర్దేశించటమే ఈ ఆశ్రమధర్మ వివరణం. జీవనవిధానంలో ఒక క్రమపరిణతి వ్యక్తమౌతుంది.

**క. ఫలకాంక్షి గాక నియతిం । జలిపిన నీయఖిల కర్మజాతంబును ని**
**ర్మల మోక్షపదముఁ జేర్చుట । గలుగు నవశ్యంబుఁ బుణ్యకరణప్రవణా!' 108**

**ప్రతిపదార్థం:** పుణ్య కరణ ప్రవణా!= ధర్మం చేయటంలో ఆసక్తికలవాడా! - ఓ భరద్వాజా!; ఈ అఖిల కర్మజాతంబును= ఈ పైన వివరించిన మొత్తం ధర్మముల సమూహాన్ని; నియతిన్= నియమంతో; ఫలకాంక్షి గాక= ఫలాన్ని కోరేవాడు కాకుండా; చలిపినన్= చేసినచో; నిర్మల మోక్ష పదమున్= మలినంలేని ముక్తి స్థానాన్ని; అవశ్యము= తప్పక; చేర్చుట కలుగున్= పొందించటం జరుగుతుంది.

**తాత్పర్యం:** ధర్మాచరణ పరాయణుడవైన ఓ భరద్వాజా! పైన వివరించిన ఆశ్రమ ధర్మాలు నాలుగింటిని క్రమంగా నియమంతో ప్రయోజన కాంక్షతో కాకుండా ఆచరిస్తే తప్పకుండా ముక్తిపదం లభిస్తుంది'.

**విశేషం:** ఆశ్రమధర్మం నిర్వహణం సామాన్యంగానే చేయవచ్చును. అయితే ఆ చేయుటకు భృగువు ఒక క్రియావిశేషణంగా వాడాడు. 'ఫలకాంక్షిగాక' అని. ప్రయోజన కాంక్షతో గాక, సహజంగా ఆ ఆచరణ జరగాలి. అపుడే ముక్తి మరి!

**వ. అనిన విని భరద్వాజుండు 'పరలోకంబున నొండు గలదం; డ్రీ లోకంబునకును నాలోకంబునకును విశేషం బెట్టిది? యెఱింగింపవే?' యని యడిగిన భృగుం డతని కిట్లనియె. 109**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; భరద్వాజుండు= భరద్వాజముని; పరలోకంబు+అన(న్)= ఇతరలోకం అనగా; ఒండు= ఒకటి; కలదు+అండ్రు= ఉన్నది అంటారు; ఈ లోకంబునకును= ఈ మన లోకానికీ; ఆ లోకంబునకును=

ఆ పరలోకానికీ; విశేషంబు+ఎట్టిది= భేదం ఏ విధమైనది; ఎఱింగింపవే?= తెలియజేయవా?; అని; అడిగినన్= ప్రశ్నించగా; భృగుండు= భృగుమహర్షి; అతనికిన్= ఆ భరద్వాజుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భృగుమహర్షి మాటలు విన్న భరద్వాజుడు 'పరలోకమని, మరొక లోకం ఉన్నది అంటారు. ఆ లోకానికీ ఈ లోకానికీ భేద మేమిటి? తెలుపు'మన్నాడు.

**క. ఇది కర్మభూమి భోగా । స్పద; మా లోకంబు ధర్మపరులకు సులభం;**
**బది సత్యశౌచ సౌజ । న్య దయాదులు లేనివారి కప్రాప్య మగున్. 110**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ ఇహలోకం; కర్మభూమి= కర్మలకు పనిపాటులకు ఉద్దిష్టమైన నేల; ఆ లోకంబు= ఆ పరలోకం; భోగ+ఆస్పదము= సుఖ అనుభవాలకు నిలయము; అది= ఆ పరలోకం; ధర్మపరులకున్= ధర్మ ఆచరణ పరాయణులకు; సులభంబు= సుఖంగా దొరికేది; సత్యశౌచ సౌజన్య దయా+ఆదులు= నిజం చెప్పటం, పరిశుభ్రత, మంచితనం, కరుణ మొదలైన గుణాలు; లేనివారికిన్= కలుగనివారికి; అప్రాప్యము+అగున్= పొందరానిది ఔతుంది.

**తాత్పర్యం:** ఈ లోకం కర్మభూమి. ఇక్కడ నరుడు కర్మలు చేస్తాడు. కేవలం కర్మాచరణకే ఉద్దిష్టమైనది ఈ లోకం. పరలోకం కర్మల ఫలితాల అనుభవాలకు నిలయమైనది. కాబట్టి అది భోగభూమి అనవచ్చును. అయితే ఆ భోగభూమిలో ప్రవేశం ధర్మాచరణ పరులయిన నరులకే పరిమితం. సత్యవ్రతపాలన, శుభ్రత పాటించటం, మంచితనంతో వ్యవహరించటం, దయగలిగి ఉండటం మొదలైన మంచి లక్షణాలు లేనివారు ఆ పరలోకాన్ని పొందలేరు.

**విశేషం:** ప్రాక్తన కాలాన, నరుడు లోకవ్యవహారనిర్వహణమంతా కార్యకారణ సంబంధబద్ధమై ఉన్నదని భావించి, ఆ భావనకు విరుద్ధమైన సంఘటనలను గమనించినపుడు ఈ కర్మభూమి భోగభూమి - ఆలోచన కలిగి ఉండాలి. ఒక విధంగా ఈ ఆలోచన కూడా కార్యకారణ శృంఖలను, జగద్వ్యవహారాలహేతుబద్ధతను సమర్థించటానికి ఉద్దిష్టమైనదే.

**క. ఈ లోకము దుఃఖబహుళ, । మా లోకము భూరిసుఖ నిరంతర; మం దే**
**జాలియును లేక యొండొరు । తో లెస్సగఁ బొంది యుండుదురు జను లనఘా! 111**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; ఈ లోకము= ఈ ఇహలోకం; దుఃఖబహుళము= కష్టాలతో నిండినది -ఎక్కువ కష్టనష్టాలకు పాత్రమైనది; ఆ లోకము= ఆ పరలోకం; భూరిసుఖ నిరంతరము= గొప్ప సౌఖ్యాలతో నిండినది; అందున్= ఆ పరలోకాన; ఏ జాలియును= ఏ చింతయు; లేక= ఉండక; జనులు= ప్రజలు; ఒండు+ఒరుతోన్= పరస్పరం - ఒకరితో ఒకరు; లెస్సగన్= బాగుగా; పొంది+ఉండుదురు= పొందిక, కూడిక కలిగి ఉంటారు.

**తాత్పర్యం:** ఈ లోకం కష్టనష్టాలకు చీకు చింతలకు ఆలవాలమై ఉండగా, ఆ లోకం దీనికి విరుద్ధంగా కేవలం సుఖాలకూ, క్షేమాలకూ, శుభాలకూ నిలయం. అక్కడి జనులకు ఏ ఖేదమూ ఉండదు. అందరూ పరస్పరం కలిసి మెలసి సుఖమయమైన జీవనం సాగిస్తూంటారు.

**తే. హస్తి మశకాంతరము గల దరసి చూడ । వాస గృహ శయనాసన వసన గంధ**
**మాల్య తౌర్యత్రికారామ మానినీజ । నాది సుఖసాధనములకు నందు నిందు. 112**

**ప్రతిపదార్థం:** అందున్= ఆలోకంలోనూ; ఇందున్= ఈ లోకంలోనూ; వాసగృహ= ఉండే ఇళ్ళు; శయన= పడకలు; ఆసన= పీటలు - కూర్చొనుటకు ఉపయోగించే పరికరాలు; వసన= గుడ్డలు; గంధ= (మంచి) వాసనలు; మాల్య= పూల దండలు; తౌర్యత్రిక= సంగీత నృత్యవాద్యము లను మూడు; ఆరామ= ఉద్యానవనాలు; మానినీ జన+ఆది= స్త్రీజనం మొదలైన; సుఖసాధనములకున్=

సౌఖ్యమును కలిగించే పరికరాలకు; అరసి చూడన్= పరిశీలించి చూడగా; హస్తి మశక+అంతరము= ఏనుగు, దోమల భేదం; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** ఇహలోక సుఖాలను పరలోక సుఖాలతో పోల్చిచూస్తే దోమకూ, ఏనుగుకూ ఉన్నంత భేదం కనిపిస్తుంది. నరుడికి సుఖసాధనాలయిన నివాసగృహాలు, పడకలు, ఆసనాలు, బట్టలు, సుగంధ ద్రవ్యాలు, పూలమాలికలు, సంగీత నృత్యవాద్యాలు, ఉద్యాన వనాలు, స్త్రీలు - ఈ అన్నింటా ఆ భేదం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పరలోక సుఖం ఏనుగైతే (హస్తి), ఇహలోక సుఖం దోమ (మశకం). కాబట్టి పరలోక సుఖమే ఉత్కృష్టమైనది.

**విశేషం:** నరుడి జీవితాన తృప్తి ముఖ్యం. అది అనుభూతిద్వారానే కాక, ఆశ ద్వారా కూడా లభిస్తుంది. రాబోయే సుఖాలకై నిరీక్షణలో కూడా తృప్తి నిక్షిప్తమై ఉంటుంది. పరలోక సుఖానుభవం ఆ విధమైన తృప్తిని కలిగిస్తూ నరుడిని శాంతింపజేస్తుంది.

**వ. అని వెండియు. 113**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**క. 'ఇవి పుణ్యలోక విషయ । వ్యవసిత వచనంబు లధమమగు లోకము ధ**
**ర్మవిదూరజనులు వొందుదు । రవిరత బహుదుఃఖ నిలయ మది విప్రవరా! 114**

**ప్రతిపదార్థం:** విప్రవరా!= బ్రాహ్మణ శ్రేష్ఠా!; ఇవి= ఈ పైన చెప్పినవి; పుణ్యలోక విషయ వ్యవసిత వచనంబులు= ధర్మలోకాలకు చెందిన నిశ్చితాలైన మాటలు; అధమము+అగు లోకము= హీనమైన లోకమును; ధర్మవిదూరజనులు= పుణ్యానికి ఎడమైన ప్రజలు; పొందుతారు= చెందుదురు; అది= ఆ తక్కువలోకం; అవిరత బహు దుఃఖ నిలయము= ఎల్లప్పుడు ఎక్కువగా దుఃఖాలకు స్థానం.

**తాత్పర్యం:** 'భరద్వాజా! ఇపుడు నేను వివరించినవి పుణ్యలోక సంబంధాలైన విషయాలు. కాని, వాటికి విరుద్ధంగా పాపలోకం కూడా ఉన్నది. ఆ లోకానికి ధర్మానికి, నీతికి, మంచికి దూరమై జీవించే జనులు చేరుతారు. ఆ లోకం ఎప్పుడూ ఎక్కువ దుఃఖాలకు స్థానంగా నిలుస్తుంది.

**విశేషం:** నరుడి మానసిక తృప్తికి, శాంతికి పుణ్యలోక స్థితి ఎంత అవసరమో, పాపలోకపు ఉనికీ అంతే అవసరం. ఈ లోకాన దుష్కర్మల అకృత్యాల, పాపాల ఫలితాలు పొందకుండానే గతించినవారు, తప్పించుకొనవీలులేకుండా అక్కడ మరొక అధమలోకం ఉండాలి మరి! కర్మఫలితం అనివార్యంగా నరుడికి చెందాలి - అని నరుడు నమ్మినపుడు ఈ లోకాలసృష్టి దేవుడికి తప్పదు.

**క. విను మమకార వివర్జిత । మనస్కులకుఁ బుణ్యపాపమార్గంబులు లే**
**మిని లోకంబులఁ ద్రిమ్మర । రనఘా! పొందుదురు శాశ్వతానందంబున్.' 115**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా! భరద్వాజా!; విను= ఆలకించుము; మమకార వివర్జిత మనస్కులకున్= నాది అనే భావం వదలిన మనస్సులు కలవారికి; పుణ్య పాప మార్గంబులు= ధర్మ అధర్మ గతులు; లేమిని(న్)= లేకుండుటవలన; లోకంబులన్= లోకాలలో, ఈ పుణ్యపాపలోకాలలో; త్రిమ్మరరు= తిరుగాడరు; శాశ్వత+ఆనందంబున్= నిత్యమైన సుఖాన్ని; పొందుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** భరద్వాజా! 'నాది' అనే అభిమానం, మోహం లేనివారు ఈ పుణ్యపాపమార్గాన ప్రయాణించరు. వారి త్రోవ వేరు. వారికి ఈ స్వర్గనరక లోకాలలో తిరుగాడే అవసరం రాదు. వారు నిత్యనిర్మల కేవల ఆనందాన్ని అందుకొంటారు'.

**విశేషం:** 'మమకారం' అనే ఒక్క దినుసును దూరీకరించగలిగితే నరుడు కేవలుడుగా మిగులుతాడు. కేవలుడి భావమే కైవల్యం, మోక్షం.

**వ. అని చెప్పి భృగుండు బ్రహ్మవిహితంబులగు ధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి' ననిన భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముం బ్రశంసించి వినతుండై వీడ్కొనియె; నతనిచేత విన్నంతవట్టును నీకుం జెప్పితి; నీ వింక నెయ్యది వినవల తనుటయు ననిమిషనదీనందనుతో ధర్మనందనుం 'డాచార విధి విను వాంఛ నా మనంబునం బేర్చియుండు' ననవుడు నతం డతని కిట్లనియె. 116**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; భృగుండు= భృగుమహర్షి; బ్రహ్మవిహితంబులు+అగు= బ్రహ్మచేత చేయబడినవి అగు; ధర్మంబులు= విధులు; సంక్షేప రూపంబునన్= కుదించిన రీతిలో; ఎఱింగించితిన్= తెలిపితిని; అనినన్= అనగా; భరద్వాజుండు= భరద్వాజముని; ప్రముదిత+ఆత్ముండు+అగుచున్= సంతుష్టమైన మనస్సు కలవాడు ఔతూ; ఆ+మహా+ఆత్మున్= ఆ గొప్ప హృదయం కలవాడిని - భృగుమహర్షిని; ప్రశంసించి= పొగడి; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; వీడ్కొనియెన్=వెడలి పోయాడు; అతనిచేతన్= ఆ భరద్వాజుడి నుండి; విన్న+అంత+పట్టును= విన్న అంత విషయాన్ని; నీకున్= ధర్మరాజువైన నీకు; చెప్పితిన్= చెప్పాను; నీవు; ఇంకన్= మరియును; ఏ+అది= ఏది; వినన్+వలతు(వు)?= వినుటకు ఇష్టపడతావు?; అనుటయున్= అనగా; అనిమిషనదీనందనుతోన్= గంగానదీ పుత్రుడైన భీష్ముడితో; ధర్మనందనుండు= ధర్మరాజు; ఆచారవిధిన్= ఆచార నియమాలను; విను వాంఛ= ఆలకించే కోర్కె; నా మనంబునన్= నా మనస్సులో; పేర్చి= అతిశయించి; ఉండున్= ఉన్నది; అనవుడున్= అనిన వెంటనే; అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మజునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా భృగుమహర్షి బ్రహ్మ విధించిన ధర్మాలను సంక్షిప్తంగా నీకు తెలియజేశాను'. అని భరద్వాజుడితో అనగా, భరద్వాజుడు సంతోషించి, భృగువును స్తుతించి నమస్కరించి వెడలిపోయాడు. 'ఆ భరద్వాజుడి నుండి నేను విన్నంతవరకు ఆ ధర్మవిశేషాలను నీకు వినిపించాను. నీవు ఇంకా ఏమి వినాలని ఇష్టపడుతున్నావు?' అని భీష్ముడు ధర్మజుడితో అనగా, ధర్మరాజు తనకు ఆచారవిధులను వినాలనే కోరిక ఎక్కువగా ఉన్నదన్నాడు. దానికి బదులుగా భీష్ముడు ఆచారవిధిని ఇట్లా వినిపించాడు.

### భీష్ముఁడు ధర్మజునకు నాచారవిధి యెఱింగించుట (సం. 12-186-2)

**సీ. 'సజ్జనులం దురాచారవంతుల దురా । చారంబు గష్టత్వకారి యట్లు**
**గావున నాచారగతి వింట గడు లెస్స; । రాజమార్గంబున రచ్చ మంద**
**మూత్రపురీష విమోక్షంబు సేయమి, । శౌచియై వార్చి నిష్ఠను జలంబు**
**సొచ్చుట, సంధ్యల సూర్యు సేవించుట, । యర్కోదయాస్తమయముల నిద్ర**

**తే. వోవకుండుట, పంచార్ద్రభావ మొంది । కుడుచు టన్నంబు దెగడమి, తడిపదములు**
**గలుగ నిదురకుఁ జొరమి సత్కర్మవేది । నారదుఁడు వివరించె నాచారములుగ. 117**

**ప్రతిపదార్థం:** సత్+జనులన్= మంచి ప్రజలలో; దుర్+ఆచారవంతులన్= చెడ్డ నడవడి గలిగిన వారిలో; దుర్+ఆచారంబు= చెడునడత; కష్టత్వకారి= దుఃఖాన్ని కలిగిస్తుంది; అట్లు+కావునన్= ఆ విధం కాబట్టి; ఆచారగతిన్= నడవడితీరును, ఆచారముల విధాన్ని; వింట= వినుట; కడు లెస్స= మిక్కిలి మంచిది; రాజమార్గంబునన్= రాజవీథిలో; రచ్చన్= సభయందు; మందన్= పశువుల సమూహంలో; మూత్ర పురీష విమోక్షంబు+చేయమి= మూత్రం మలం విడవకుండటం; శౌచి+ఐ= శుచిత్వం, శుభ్రత గల వాడై; వార్చి= ఆచమించి, ఆచమనము (నీటిని నోటినుంచి ఉమియుట) చేసి; నిష్ఠను= నిలుకడతో; జలంబు+చొచ్చుట=

నీట ప్రవేశించుట; సంధ్యలన్= సంధ్య వేళలందు; సూర్యు సేవించుట= సూర్యదేవుని పూజించటం (అర్ఘ్యమివ్వటం); అర్క+ఉదయ+అస్తమయములన్= సూర్యుడి పొడుపు క్రుంకు (సమయా)లలో; నిద్ర+పోవక+ఉండటం= నిద్రపోకుండా ఉండటం; పంచ+ఆర్ద్ర భావము= ఐదు తడిసినతనములు, పాద్య, అర్ఘ్య, స్నాన, ఆచమనీయ, నిర్మాల్యములు ఈ అన్నింటా జలస్పర్శ; ఒంది= పొంది; కుడుచుట= భుజించటం; అన్నంబు+తెగడమి= తినుదానిని తిట్టకుండటం; తడిపదములు+కలుగన్= తడిసిన కాళ్ళు ఉండగా; నిదురకున్= నిద్రకు చొరమి= ఉపక్రమించకుండటం; సత్+కర్మవేది= మంచి పనులు తెలిసిన; నారదుఁడు= నారదమహర్షి; ఆచారములుగన్= నడతలుగా; వివరించెన్= విశదపరచాడు.

**తాత్పర్యం:** చెడునడత అనేది సజ్జనులనూ, దుర్జనులనూ ఇరువురినీ కష్టపెట్టుతుంది. కాబట్టి నడతను గురించి వినటం మిక్కిలి మంచిది. రాజమార్గంలో, సభలో, పశువుల మందలో మలమూత్రవిసర్జన చేయకుండటం, శుచిగా ఆచమించి నిలకడగా నీటమునగటం, సంధ్యావేళలలో సూర్యుడికి అర్ఘ్యమిచ్చి పూజించటం, సూర్యుడు పొడిచేటప్పుడు, క్రుంకేటప్పుడు నిద్రపోకుండ ఉండటం, పాద్య అర్ఘ్యస్నానాదికాలు ముగిసిన పిదప భుజించటం, అన్నాన్ని నిందించకుండటం, తడి కాళ్ళతో నిద్రకు ఉపక్రమించకుండటం - ఇవి ఆచారాలని సత్కర్మలు తెలిసినవాడైన నారదుడు వివరించాడు.

**విశేషం:** ఆచారం ధర్మానికి మూలం. కాబట్టే 'ఆచార ప్రభవో ధర్మః' అనే సూక్తి ఏర్పడింది. ఇది అనూచానంగా పరంపరగా మానవసమూహంలో ఒక తరం నుండి మరొక తరానికి వారసత్వంవలె అందుతూ ఉంటుంది. అయితే ఈ సుదీర్ఘ కాలవాహినిలో కొన్ని ఆచారాలు కాలంచెల్లి అసందర్భాలుగా అసంగతాలుగా కూడా మారుతూ ఉంటాయి. వివేకి అయిన నరుడు కాలానుగుణమైన మార్పుతో ఆచారాన్ని స్వీకరించాలి.

**తే. ఉదయమగు సూర్యుఁ గనుఁగొను టొప్ప; దన్య । వనిత నగ్నమై యుండంగ వలదు చూడఁ;**
**దన పురీషంబు సూచుట ధరణినాథ! । కీడు; నిజపాపగుప్తి యకృత్య మరయ. 118**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= ఓ రాజా!; ఉదయము+అగు సూర్యున్= పొడిచే సూర్యుడిని; కనుఁగొనుట= చూడటం; ఒప్పదు= కూడదు; అన్యవనిత= ఇతర స్త్రీ; నగ్న+ఐ= వివస్త్ర అయి; ఉండంగన్= ఉన్నప్పుడు; చూడన్+వలదు= చూడటం తగదు; తన పురీషంబు+చూచుట= తన మలమును చూడటం; కీడు= చెడు; నిజపాపగుప్తి= తన పాపాన్ని దాచటం; అరయన్= పరిశీలించగా; అకృత్యము= చేయరానిది.

**తాత్పర్యం:** రాజా! ఉదయించే సూర్యుడిని చూడరాదు. ఇతరస్త్రీ వివస్త్రగా ఉన్నప్పుడు చూడకూడదు. అట్లాగే తన మలాన్ని తాను చూస్తే కీడు కలుగుతుంది. ఈ మూడూ చూడరానివి. ఇక తన పాపాన్ని తాను దాచిపెట్టటం చేయదగ్గ పని కాదు - ఆలోచిస్తే.

**విశేషం:** ఇక్కడ చూడరానివి మూడు; చేయరానిది ఒకటి చెప్పాడు భీష్ముడు. అయితే చివరిది 'నిజపాపగుప్తి' వాస్తవానికి నిజపాపం చూడవలసినది తప్పకుండా తానే గాక ఇతరులూ దాన్ని చూచే వీలు కల్పించాలి - అనే భావాన్ని ఆ మాటలో ఇమిడ్చినట్లున్నాడు వక్త. అంటే చూడరానివి మూడు అని చెప్పుతూ, తప్పకుండా చూడవలసినది మాత్రం స్వకీయ పాపప్రవృత్తి అని సూచిస్తున్నాడువక్త.

**క. సురతంబు గుప్తమగుటయు, । గురుశుశ్రూషయును, బ్రహ్మకుల భజనము నా**
**యురవాప్తిఁ జేయు లక్ష్మీ । కరంబులగు నూర్ధ్వలోక గతుల నొనర్చున్.' 119**

**ప్రతిపదార్థం:** సురతంబు= సంభోగ క్రియ; గుప్తము+అగుటయున్= దాచబడినదిగా ఉండటం; గురుశుశ్రూషయును= గురువుల, పెద్దల, విద్యాదాతల సేవా; బ్రహ్మకుల భజనము= బ్రాహ్మణులను కీర్తించటం; ఆయుః+అవ+ఆప్తిన్= ఆయుస్సును (జీవన కాలమును) పొందుటను; చేయున్= కలిగించును; లక్ష్మీకరంబులు+అగు= సంపదను కలిగించెడు; ఊర్ధ్వలోక గతులన్= పై లోకముల చేరికలను; ఒనర్చున్= చేయును, ఒనగూర్చును.

**తాత్పర్యం:** సంభోగక్రియను గుప్తంగా ఉంచటం, గురువును సేవించటం, బ్రాహ్మణులను కీర్తించటం నరుడి ఆయుస్సు పెంచుతాయి. పైగా వీటివలన నరుడు సంపత్కరమైన పై లోకాలకు కూడా చేరుకొనగలుగుతాడు.'

**విశేషం:** 'శుశ్రూష' అనే మాటకు అసలైన అర్థం - 'శ్రోతుమ్: ఇచ్ఛా' వినుటకు కోరిక అని. భాషలకు లిపులులేనపుడు కూడా విద్యాభ్యాసం కొనసాగేది. అపుడు విద్యార్థి గురుడిచెంత జేరి, ఆయన మాటలను విని విద్య గరచేవాడు. ఆనాడు కేవల శ్రవణేంద్రియ మొక్కటే, నోటికి తోడుగా విద్యార్జనలో ఉపయోగపడేది. కంటి ఉపయోగం లిపుల ఆవిర్భావం తరువాత వచ్చినది. కాగా ఈ 'శుశ్రూష' ఆ నాటిది. ఆ నాడు విద్యార్థి వినికిడి ద్వారానే విద్యను ఆర్జించేవాడు. అపుడు దగ్గరచేరి (గురువుకు) విన కోరిక గలిగి ఉండటం విద్యార్థి లక్షణం. క్రమంగా ఆ లక్షణం గురుసన్నిధిలో గురుసేవా నిర్వహణం చేసే విద్యార్థి లక్షణంగా పరిణమించి, చివరకు గురుసేవకు పర్యాయపదంగా 'శుశ్రూష' స్థిరపడినది.

**వ. అనిన విని యుధిష్ఠిరుం 'డధ్యాత్మ విద్య వినవలతుం జెప్పవే'యనిన నతనికి దేవవ్రతుం డిట్లనియె.120**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అధి+ఆత్మవిద్య= ఆత్మకు చెందిన వేదాంత జ్ఞానం; వినన్+వలతున్= వినగోరెదను; చెప్పవే?+అనినన్= చెప్పుము అనగా; అతనికి(న్)= ఆ ధర్మరాజుకు; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆచారవిధులు విన్న ధర్మరాజు, అనంతరం తాను ఆధ్యాత్మవిద్యను గూర్చి వినగోరుతున్నట్లు తెలుపగా భీష్ముడు ఈ విధంగా అన్నాడు.

**సీ. 'జలధి తరంగల చాడ్పునఁ బొడముచు । నడఁగుచు నుండు భూతాత్మునందు**
**భూమి ప్రభృతిభూతములు వాని గుణములు । గంధాదు లింద్రియ గ్రాహ్యకోటి**
**యనఘ! శ్రోత్రం బాదియగు నింద్రియశ్రేణి । దర్వియుఁ బోలె సాధనత నొందు**
**మనసింద్రియములకుఁ బెనుఁ బ్రాపు బుద్ధి త । న్ముఖమున నిశ్చయంబునకుఁ దేరఁ**

**తే. బురుషుఁ డవ్విషయంబులఁ బొందు నిట్లు । గాకయుండ నింద్రియములఁ గ్రమ్మఱించి**
**మనసుతోఁ గూర్చి బుద్ధిలోనన యడంప । బుద్ధి నిర్విషయస్థితిఁ బురుషు నొందు. 121**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా!; జలధి తరంగల చాడ్పునన్= సముద్రపు అలల మాదిరిగా; పొడముచున్= పుట్టుతూ; అడఁగుచున్= సమసిపోతూ; ఉండు= ఉన్న; భూత+ఆత్మునందున్= జీవాత్ముడియందు; భూమిప్రభృతి భూతములు= భూమి మొదలైన పంచభూతాలు (నీరు, వెలుతురు, గాలి, ఆకాశం, భూమి= 5); వాని గుణములు= ఆ భూతముల స్వభావాలు; గంధ+ఆదులు= వాసన మొదలయినవి; ఇంద్రియ గ్రాహ్యకోటి= ఇంద్రియములచేత గ్రహించదగిన సమూహం; శ్రోత్రంబు+ఆది+అగు= చెవి మొదలైన; ఇంద్రియశ్రేణి= ఇంద్రియాల వరుస; దర్వియున్+పోలెన్= తెడ్డువలె; సాధనతన్+ఒందున్= పరికరత్వమును పొందును; మనసు= మనస్సు; ఇంద్రియములకున్= చెవి మొదలగు ఇంద్రియాలకు; పెను+ప్రాపు= గొప్ప ఆధారం; బుద్ధి= తెలివి; తద్+ముఖమునన్= దాని (మనస్సు) ద్వారా; నిశ్చయంబునకున్= నిర్ణయానికి; తేరన్= చేరగా; పురుషుఁడు= నరుడు; ఆ+విషయంబులన్= ఆయా వస్తువులను, జ్ఞానములను; పొందున్= చెందుతాడు; ఇట్లు+కాక+ఉండన్= ఈ విధంగా కాకుండా ఉండేటట్లు; ఇంద్రియములన్= ఇంద్రియాలను (కన్ను, ముక్కు, చెవి, తోలు, నోరు); క్రమ్మఱించి= మరల్చి; మనస్సుతోన్+కూర్చి= మనస్సుతో కలిపి; బుద్ధిన్= తెలివిని; లోనన్+అ= లోపలనే; అడంపన్= అణచగా; బుద్ధినిర్విషయస్థితి= బుద్ధికి (జ్ఞానమునకు) లోనుకాని - గోచరించని దశ; పురుషున్= నరుడిని; ఒందు(న్)= చెందును.

**తాత్పర్యం:** జీవాత్మ, కడలి కెరటాలవలె పుట్టుతూ గిట్టుతూ ఉంటుంది. భూమి, నీరు, కాంతి, గాలి, ఆకాశం అనేవి పంచభూతాలు. వాటి స్వభావాలయిన వాసన, ద్రవం, తేజస్సు, చలనం, శబ్దం - అనేవి ఇంద్రియాల ద్వారా గ్రహింపునకు వస్తాయి. చెవి, ముక్కు, నోరు, తోలు, కన్ను - అనే ఈ ఇంద్రియాలు వాసనాది పంచభూతాల గుణాలు అనుభవానికి రావటానికి తెడ్డువలె ఉపకరణాలుగా పనిచేస్తాయి. అయితే ఈ ఉపకరణాల ద్వారా అనుభవం కలగటానికి ఆ సాధనాలకు పెద్ద ఆధారభూమి మనస్సు. ఆ మనస్సుద్వారానే విషయజ్ఞానం - అనుభవం నరుడిని చేరుకొంటుంది. ఈ విధంగా ప్రాపంచిక విషయజ్ఞానం మానవుడిలో ప్రవృత్తిని రేకెత్తించి ఈ జననమరణ చక్రంలో పడవేసి త్రిప్పుతుంటుంది. ఆ చక్రభ్రమణం నుండి బయటపడాలంటే ముందుగా ఇంద్రియాలను మళ్ళించి మనస్సుతో వాటిని చేర్చితే, బుద్ధిని (తెలివిడి) లోలోననే అణచివేయవచ్చును. ఆ విధంగా పురుషుడు అంతర్ముఖుడైనపుడు అతడిలో బుద్ధి గోచరించని స్థితి కలుగుతుంది.

**విశేషం:** ఇంద్రియనిగ్రహం ద్వారా మనస్సును స్వాధీనపరచుకొని ప్రాపంచిక విషయపరాఙ్ముఖుడై పురుషుడు తరిస్తాడు.

**క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం। డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం**
**డన బుద్ధిసాక్షి యనఁగా। జననరహితుఁ డనఁగఁ బరఁగు శాంతిప్రవణా! 122**

**ప్రతిపదార్థం:** శాంతిప్రవణా!= శాంతియందు ఆసక్తుడా! - శాంతిని కాంక్షించే ఓ ధర్మరాజా!; వినుము= ఆలకించుము; ఆత్ముఁడు= ఆత్మ; క్షేత్రజ్ఞుండు+అనన్= క్షేత్రజ్ఞుడు అనే పేరుతో; భూతాత్ముఁడు+అనన్= భూతాత్ముడు అనే పేరున; పురుషుఁడు+అనన్= పురుషనామంతో; పరమ+ఈశుండు+అనన్= పరమేశ్వరుడు అనే పేరుతో; బుద్ధి సాక్షి+అనఁగన్= బుద్ధిసాక్షి అనే పేరుతో; జనన రహితుఁడు+అనన్= పుట్టుకలేనివాడు అనగా; పరఁగున్= ఒప్పును.

**తాత్పర్యం:** ఆత్మ జీవంతో చేరి భూతాత్ముడనీ, శరీరతత్త్వం తెలిసి క్షేత్రజ్ఞుడనీ, శరీరం తాను గానని తెలిసి పురుషుడనీ, పరమేశ్వరుడనీ, బుద్ధికి ఎడంగా నిలిచి 'బుద్ధిసాక్షి' అనీ, తత్త్వదర్శనంతో జననరహితుడనీ పిలువబడుతూ ఉంటాడు.

**విశేషం:** 'ఆత్మ' పరమాత్మగా, నరుడు ఈశ్వరుడుగా పరిణతిచెందే దశలను స్ఫురింపజేస్తూ ఆత్మకు గల ఇతర వ్యపదేశాలను-పేర్లను వివరించాడు.

**క. తనయంద తోఁచు విషయము। లనుభవగోచరము లగుట యవి మాయాసం**
**జనిత స్వప్నంబై యా। త్మునికిం దను గాన లేమి మోసము దెచ్చున్. 123**

**ప్రతిపదార్థం:** తనయందున్+అ= తనలోనే; తోఁచు= గోచరించే; విషయములు= వస్తువులు, జ్ఞానములు మొదలైనవి; అనుభవ గోచరములు+అగుట= ఇంద్రియాల ద్వారా తెలియరావటం; అవి= ఆ విషయాలు; మాయాసంజనిత స్వప్నంబు+ఐ= మాయవలన కలిగిన కలఅయి; ఆత్మునికిన్= ఆత్మకు; తను= తనను; కానలేమి= చూడలేకపోవటం; మోసము+తెచ్చున్= వంచనను కలిగిస్తుంది.

**తాత్పర్యం:** 'ఆత్మ' పరమేశ్వరు డయినపుడు అతడు విశ్వమయుడు. సృష్టి అంతా అతడిలో గోచరించేదే. అదే సృష్టి తిరిగి ఆత్ముడికి ఇంద్రియానుభవం ద్వారా గోచరిస్తున్న దంటే అర్థం అదంతా మాయవలన స్వప్నసదృశమైన అయథార్థం మిథ్య తప్ప అన్యంగాదు. మాయ కారణంగానే 'ఆత్మ' తనను తాను కాంచలేక, మోసానికి గురిఅయి పరమాత్మకు వెలియై అలమటిస్తున్నది.

**విశేషం:** పరిణతప్రజ్ఞుడైన ధూర్జటి మహాకవి కూడా 'అంతా మిథ్య తలంచి చూచినన్' అంటాడు శ్రీకాళహస్తీశ్వర శతకంలో. జ్ఞాన నేత్రం ద్వారా చూస్తే ఈ మిథ్యావాదం గోచరిస్తుందంటారు తత్త్వజ్ఞులు.

**క. విను గుణములు మాయకు నొడ। లని యెఱిఁగి, తమోరజస్సు లడఁచి, సుసత్త్వం**
**బున నిలిచి సద్వివేకం। బున నదియుం ద్రోచి విమల బోధాత్ముఁ డగున్. 124**

**ప్రతిపదార్థం:** గుణములు= త్రిగుణాలు - సత్త్వం, రజస్సు, తమము అనేవి; మాయకున్= మిథ్యాజ్ఞానానికి; ఒడలు+అని= శరీరం అని; ఎఱిఁగి= తెలిసి; తమస్+రజస్సులు= తమోగుణాలను, రజోగుణాలను; అడఁచి= నశింపజేసి; సుసత్త్వంబునన్= మంచి సత్త్వగుణమునందు; నిలిచి= స్థిరపడి; సత్+వివేకంబునన్= మంచి జ్ఞానంతో; అదియున్= ఆ సత్త్వగుణాన్ని కూడా; త్రోచి= తొలగించి; విమల బోధ+ఆత్ముఁడు+అగున్= నిర్మలమైన జ్ఞానంగల ఆత్మకలవాడు ఔతాడు; విను(ము)= ఆలకించుము.

**తాత్పర్యం:** మిథ్యాజ్ఞానమే మాయ. మాయకు నరుడిలోని గుణత్రయం (సత్త్వరజస్తమములు) శరీరం. కాబట్టి మాయ తత్త్వం గ్రహించి, మొదట తమస్సును, ఆ పిదప రజస్సును వదలివేయాలి. అపుడు ఆత్మ శుద్ధసత్త్వరూపంతో వెలుగుతూ ఉంటుంది. అటు తరువాత ఆ సత్త్వాన్ని కూడా తొలగించుకొనాలి. అపుడు కేవలం జ్ఞానం - విమల బోధ కలిగి ఆత్మ పరమాత్మగా పరిణమిస్తుంది.

**విశేషం:** గుణత్రయ రాహిత్యమే కైవల్యం.

**తే. అరసి చూడ సత్త్వంబు సుఖాత్మకంబు। సాంద్రదుఃఖమయంబు రజస్సు, బోధ**
**మాంద్యమూర్తి తమస్సు, సమత్వ మూఁది। యీ యవస్థలఁ బొరయమి మాయపోక. 125**

**ప్రతిపదార్థం:** అరసి చూడన్= పరీక్షించిచూస్తే; సత్త్వంబు= సత్త్వం అనే గుణం; సుఖ+ఆత్మకంబు= సుఖం ఆత్మగా గలది, సుఖమయమైనది; రజస్సు= రజోగుణం; సాంద్ర దుఃఖమయంబు= దట్టమైన దుఃఖంతో నిండినది; తమస్సు= తమోగుణం; బోధ మాంద్యమూర్తి= జ్ఞానమందత ఆకారంగా గలది - మందజ్ఞానం తమస్సు లక్షణం; సమత్వము+ఊఁది= సమభావం వహించి; ఈ+అవస్థలన్= పైన వివరించిన దశలను, స్థితులను; పొరయమి= పొందకుండటం; మాయ పోక= మాయ నశించటం.

**తాత్పర్యం:** పరీక్షించి చూస్తే సత్త్వగుణం సుఖమయమైనది. రజస్సు నిరంతర దుఃఖనిలయం. ఇక చివరిదైన తమస్సు జ్ఞాన మాంద్యరూపంతో దర్శనమిస్తుంది. అయితే సమతాదృష్టితో ఆయా గుణాలను, వాటి స్వభావాలను దూరీకరించగలిగితే మాయను పోద్రోలినట్లే. గుణత్రయరాహిత్యమే మాయానాశనం'.

**వ. అని యధ్యాత్మప్రకారంబు నిర్దేశించి భీష్ముండు వెండియు 'యోగంబు సెప్పెద నాకర్ణింపు'మని యమ్మనుజపతి కిట్లనియె. 126**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా పలికి; అధి+ఆత్మ ప్రకారంబు= ఆత్మకు సంబంధించిన విధానాన్ని; నిర్దేశించి= తెలియజెప్పి; భీష్ముండు; వెండియున్= మరలా; యోగంబు= యోగవిద్యను; చెప్పెదన్= తెలుపుతాను; ఆకర్ణింపుము= వినుము; అని; ఆ+మనుజ పతికిన్= రాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అధ్యాత్మవిద్యను వివరించిన భీష్మపితామహుడు, అనంతరం 'అధ్యాత్మవిద్యకు ఉపకరించే యోగవిద్యను వివరిస్తాను విను'మని ధర్మజుడితో ఇట్లా అన్నాడు.

## ధర్మజునకు భీష్ముఁడు యోగప్రకారంబు సెప్పుట (సం. 12-188-1)

**సీ.** **తెలివొంది మనసు నిశ్చలవృత్తి నేకాగ్ర । మై యున్కి గోరి నిష్ఠాతిశయము**
**కలిమి కృత్యంబు మేఘంబున మెఱుఁగును । నలిన పత్రంబున సలిలకణముఁ**
**బోలె మంతవ్యంబు పొంతఁ జరించు మ । నంబు దానికిఁ బవనంబు గతియ**
**గతిగాన హితము మారుత ధారణము పవ । మానంబు గ్రమమునఁ గాని నిలువ**

**ఆ.** **దలయ విసువఁగాదు తలకొని యమ నియ । మాదు లెనిమిదియును నభ్యసింపఁ**
**గా విచార మొలయుఁ గలుగు వితర్కంబు । మఱి వివేక మనిలు నెఱికిఁదెచ్చు.** **127**

**ప్రతిపదార్థం:** మనసు= హృదయం; తెలివి+ఒంది= జ్ఞానం పొంది; నిశ్చల వృత్తిన్= చలనంలేని నడతతో; ఏక+అగ్రమై= ఒక విషయమున లగ్నమైనదై; ఉన్కి= ఉండటాన్ని; కోరి= అభిలషించి; నిష్ఠా+అతిశయము కలిమి= నిశ్చయపు ఆధిక్యం ఉండటం; కృత్యము= చేయవలసినది; మేఘంబునన్= మబ్బునందు; మెఱుఁగును= మెరుపూ; నలిన పత్రంబునన్= తామర ఆకున; సలిలకణమున్+పోలెన్= నీటిబిందువువలె; మంతవ్యంబు పొంతన్= ఆలోచన దగ్గర; మనంబు= మనస్సు; చరించున్= తిరుగుతూ; దానికిన్= ఆ మనస్సునకు; పవనంబు గతియ= గాలియొక్క నడకయే; గతి= నడక; కాన= కావున; మారుత ధారణము= గాలిని ధరించటం, నియమించటం; హితము= మేలు; పవమానంబు= గాలి; క్రమంబునన్+కాని= (ఒక) వరుసలోగాని; నిలువదు= ఆగదు, నియమించబడదు; అలయన్= ఆయాసపడుటకు; విసువన్= విసుగుచెందుటకు; కాదు= కాదు; తలకొని= సంకల్పించి; యమ నియమ+ఆదులు+ఎనిమిదియును= యమము, నియమము మొదలగు ఎనిమిదింటిని; అభ్యసింపఁగాన్= నేర్వగా; విచారము= ఆలోచన; ఒలయున్= కరగును; వితర్కంబు= సంశయం; కలుగున్= ఏర్పడును; మఱి= పిదప; వివేకము= జ్ఞానం; అనిలున్= గాలిని; నెఱికిన్+తెచ్చున్= వరుసకు, క్రమమునకు తెస్తుంది.

**తాత్పర్యం:** మనస్సు చలించకుండా, ఏకాగ్రమై నిలిచి ఉండాలి అంటే గట్టి నిశ్చయం అవసరం. మబ్బులో మెరుపువలె, తామరాకున నీటి బిందువువలె మనస్సులో ఆలోచన సహజంగా ఉంటుంది. మనస్సు ప్రసరించే తీరు, గాలి వీచే పద్ధతీ ఒకటే. గాలి కారణంగానే మనస్సు చలిస్తుంది. కాబట్టి ఆ వాయువును (మన శరీరంలోని దానిని) నివారించాలి - మనోనిగ్రహం కొరకు. వాయువును నిగ్రహించటం సులభంకాదు. అది క్రమక్రమంగా సాగాలి. ఆయాసపడటంగాని, విసుగు చెందటంగాని కుదరదు - వాయునిరోధ ప్రయత్నంలో. స్థిరమైన సంకల్పంతో యమనియమాదులైన ఎనిమిది సాధనాలతో వాయు నిరోధానికై యత్నించాలి. ఆ ప్రయత్నంలో ముందుగా ఆలోచనలు కరిగిపోతాయి. తరువాత సందేహం కలుగుతుంది. ఆ పిదప జ్ఞానం వాయువును క్రమబద్ధం చేయగలుగుతుంది.

**విశేషం:** మనశ్చాంచల్యానికి వాయువు శరీరాంతర్గతమైనది కారణం కాబట్టి మనస్సు నిగ్రహించదలిస్తే వాయునిరోధం తప్పనిసరి. దానికి యమ నియమాది సాధన అనివార్యం.

**క.** **విను మంతర్నాడిం జనఁ । బనుపడి పవనంబు బ్రహ్మపద మొందఁగ శాం**
**తి నిరూఢమైన చిత్తము । గను నానందంబునంద కలియుం బిదపన్.'** **128**

**ప్రతిపదార్థం:** పవనంబు= గాలి; అంతర్+నాడిన్+చనన్= లోపలి నాడి (వాయు ప్రయాణమార్గం) గుండా వెళ్ళగా; పనుపడి= అలవాటు పడి; బ్రహ్మపదము+ఒందఁగన్= బ్రహ్మస్థానమును పొందగా; శాంతినిరూఢమైన చిత్తము= శాంతిని బాగుగా వహించిన

మనస్సు; ఆనందంబున్+కనున్= ఆనందమును - బ్రహ్మానందమును పొందుతుంది; అందున్+అ= ఆ ఆనందమందే; పిదపన్= ఆ తరువాత; కలియున్= లీనమగును; విను(ము)= ఆలకించుము.

**తాత్పర్యం:** క్రమబద్ధమైన వాయువు శరీరాంతర్గతనాడులగుండా ప్రయాణంచేస్తూ శరీరంలోని బ్రహ్మస్థానాన్ని చేరుకొంటుంది. అపుడు మనస్సు నిశ్చలమై శాంతిపూర్ణమై బ్రహ్మానందాన్ని అందుకొంటుంది. ఆ తరువాత ఆ ఆనందంలోనే లీనమైపోతుంది'.

**విశేషం:** బ్రహ్మానందానికి శాంతి, శాంతికి నిశ్చలమనస్కత, నిశ్చలమనస్కతకు పవనగతి నిరోధం, తన్నిరోధానికి యమనియమాది అష్టవిధసాధన, తత్సాధన ప్రారంభానికి స్థిరసంకల్పం కావాలి.

**వ. అనిన విని కురుపతి కురుపితామహునితో 'జపవిధి ప్రకారంబును, జపశీలురగువారు పోవుగతియును నెఱింగింపవే?' యనుటయు నమ్మహీవిభునకు నమ్మహాత్ముం డిట్లనియె. 'జప్యంబు విషయంబుగా యమకాలమృత్యు భూసురేక్ష్వాకులకు సంవాదంబు ప్రవర్తించె; నయ్యితిహాసంబునుం జెప్పెద; మున్ను నా యెఱింగిన తెఱంగునుం జెప్పెద; నాకర్ణింపుము.' 129**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; కురుపతి= కురువులరాజు ధర్మజుడు; కురుపితామహునితోన్= కురువంశపు తాతతో; జపవిధి ప్రకారంబును= జపమును చేసే పద్ధతిని; జపశీలురు+అగువారు= జపంచేసే స్వభావం కలవారు; పోవుగతియున్= పొందే ఫలితమును; ఎఱింగింపవు+ఏ?= తెలియజేయవా?; అనుటయున్= అనగా; ఆ+మహీవిభునకున్= ఆ రాజునకు; ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్ప మనస్సుగలవాడు - భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; జప్యంబు= జపం చేయదగినది; విషయంబుగాన్= శీర్షికగా, చర్చా అంశంగా; యమకాల మృత్యు భూసుర+ఇక్ష్వాకులకున్= యమధర్మరాజునకు; కాలపురుషునకు, మృత్యుదేవతకు, బ్రాహ్మణుడికి, ఇక్ష్వాకు వంశరాజునకు; సంవాదంబు= మంచి ప్రసంగం; ప్రవర్తించెన్= జరిగింది; ఆ+ఇతిహాసంబునున్= ఆ చరిత్రను; చెప్పెదన్= పలికెదను; మున్ను= ముందుగా; నా+ఎఱింగిన తెఱంగునున్= నేను గ్రహించిన విధమును కూడా; చెప్పెదన్= పలికెదను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో 'జపంచేసే విధానాన్నీ, జపంచేసేవారు పొందే ఫలితాన్నీ తెలుపుము' అని కోరగా ఆయనతో భీష్ముడు ఇట్లా అన్నాడు: 'జపించదగిన అంశాన్ని గురించి యమధర్మరాజుకూ, కాలపురుషుడికీ, మృత్యుదేవతకూ, బ్రాహ్మణుడికీ, ఇక్ష్వాకువంశరాజుకూ సంవాదం జరిగింది. ఆ ఇతిహాసాన్ని వినిపిస్తాను. ముందుగా నాకు తెలిసింది చెప్పుతాను వినుము!

### యమ కాల మృత్యు భూసురేక్ష్వాకుల సంవాదము (సం. 12-189-6)

**సీ. వేదాంతవిదు లనుమోదించు నట్టిది । జపకర్మ మత్యంత శౌచశాలి**
**యై కుశాస్తీర్ణ సమావనీతలమునఁ । గుశముష్టి సేకొని విశదచిత్త**
**వృత్తి నింద్రియములు విషయసక్తంబులు । గాకుండ నిలిపి తదేకపరత**
**మత్సరాహంకార మాన దంభాపగ । మంబును బ్రహ్మచర్యంబుఁ గలిగి**

**తే. జపము సెల్లించు పురుషుండు సర్వలోక । విజయ నిస్పృహ మగు జపవిధి విశోక**
**హర్ష రాగాదికంబును నవ్యయంబు । నైన పదముఁ బొందించు నృపాగ్రగణ్య! 130**

**ప్రతిపదార్థం:** నృప+అగ్రగణ్య!= రాజులలో మొదట లెక్కించదగినవాడా! ధర్మరాజా!; జపకర్మము= జపవిధి, జపం చేయటం; వేద+అంత విదులు= వేదాంత విద్యను ఎరిగినవారు; అనుమోదించునట్టిది= ఆమోదించేది, సంతోషంతో అంగీకరించేది; అతి+అంత శౌచశాలి+ఐ= చాలా ఎక్కువ శుభ్రతతో ప్రకాశించేవాడై; కుశ+ఆస్తీర్ణ సమ+అవనీతలమునన్= దర్భలచేత వ్యాప్తమైన, మిట్టపల్లాలులేని, భూమి ప్రదేశాన; కుశముష్టిన్= దర్భల పిడికిలిని; చేకొని= స్వీకరించి; విశదచిత్త వృత్తిన్= నిర్మలమైన మనస్సు యొక్క నడతతో; ఇంద్రియములు= జ్ఞాన, కర్మ ఇంద్రియాలను పదింటిని; విషయ సక్తంబులు+కాక+ఉండన్= విషయములయందు తగుల్కొన్నవి కాకుండేటట్లుగా; నిలిపి= స్థిరీకరించి; తద్+ఏకపరతన్= ఆ ఒక్కదానిఅందలి ఆసక్తితో; మత్సర+అహంకార మాన దంభ+ అపగమంబును= ఓర్వలేనితనం, గర్వం, అభిమానం, ఆటోపాల తొలగింపును; బ్రహ్మచర్యంబున్= బ్రహ్మచర్య వ్రతాన్ని; కలిగి= వహించి; పురుషుండు= నరుడు; జపము= జపించటాన్ని, నామ మంత్ర ఉచ్చారణం చేయటాన్ని; చెల్లించున్= నిర్వహిస్తాడు; సర్వలోక విజయ నిస్పృహము+అగు= ఎల్లలోకాల గెలుపునందును ఆశలేనిది అగు; జపవిధి= జపవిధానం, జపం నిర్వర్తించటం; విశోక హర్షరాగ+ఆదికంబునున్= గతించిన, నశించిన శోకం, సంతోషం, ప్రేమ మున్నగు భావాలు గలదియు; న+వ్యయంబును= నాశంలేనిదియు; ఐన= అగునట్టి; పదమున్= స్థానాన్ని, కైవల్యాన్ని; పొందించున్= సిద్ధింపజేస్తుంది.

**తాత్పర్యం:** ఓ రాజశ్రేష్ఠా! ధర్మరాజా! జపవిధిని వేదాంతవేత్తలు ఆమోదిస్తారు. దానికి పూర్వరంగ మిది. అత్యధిక శుభ్రతతో వెలుగొందుతూ, దర్భలతో వ్యాప్తమై పూతమైన ఒక సమతలంపై పిడికెడు దర్భల ధరించి ఆసీనుడై జ్ఞానేంద్రియాలనూ, కర్మేంద్రియాలనూ అన్యవిషయాలలో సక్తంగాకుండా నిగ్రహించి, ఏకాగ్రచిత్తుడై, మాత్సర్యం, గర్వం, దర్పం, దంభం - వీటిని తొలగించుకొని, జపంచేయటానికి ఉద్యుక్తుడు కావాలి పురుషుడు. ఆ విధంగా జపవిధిని నిర్వహిస్తాడు నరుడు. ఆ విధంగా నిష్ఠాభరితంగా నిర్వర్తితమైన జపం ఎల్లలోకాల గెలుపును కూడా కోరనిదిగా మారి - సుఖదుఃఖాలకు, రాగద్వేషాలకు అతీతమైన శాశ్వతమైన స్థానాన్ని - మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

**విశేషం:** ఇంద్రియాలు - జ్ఞాన కర్మభేదంతో మొత్తం పదిగా అధ్యాత్మవిధులు లెక్కిస్తారు. జ్ఞానేంద్రియాలు 1- కన్ను, ముక్కు, చెవి, త్వక్కు, నోరు; కర్మేంద్రియాలు 5 - వాక్, పాణి, పాద, పాయూపస్థలు. ఈ పదింటిపై అదుపు సాధించినవాడే జితేంద్రియుడు.

**క.** **శౌచాది గుణము లెడలుట । నీచత్వము పాటిలంగ నిశ్చలమతి దు**
**ష్టాచరితమైన జపవిధి । నా చెప్పిన సుగతి లేదు నరకముఁ దెచ్చున్.'** **131**

**ప్రతిపదార్థం:** శౌచ+ఆది గుణములు= శుభ్రత మొదలైన గుణాలు; ఎడలుట= వెలి కావటంవలన; నీచత్వము= తక్కువతనం; పాటిలంగన్= కలిగే విధంగా; నిశ్చలమతిన్= చలనం లేని బుద్ధితో; దుష్ట+ఆచరితము+ఐన= చెడుగా నిర్వహించబడినదైన; జపవిధిన్= జపవిధానం, జపం చేయడంవలన; నా చెప్పిన= నేను పలికిన; సుగతి= మోక్షం; లేదు= ఉండదు, కలుగదు; నరకమున్+తెచ్చున్= నరకలోకాన్ని పొందించును.

**తాత్పర్యం:** జపవిధానం సరిగా ఆచరితమైతే మోక్షప్రదాయి. సందేహంలేదు. అయితే అదే జపం శౌచం మొదలయిన లక్షణాలు లోపించి నైచ్యానికి పాల్పడే రీతిలో చెడుగా ఆచరించబడితే మాత్రం దానివలన ముక్తి రాదు - సరిగదా నరకం వస్తుంది'.

**విశేషం:** లక్ష్యం, మార్గం - రెండూ ఉన్నతంగా పరిశుభ్రంగా ఉండాలి. ఉన్నప్పుడే ఫలితమూ ఆనందప్రదమౌతుంది. కానినాడు చివరకు మిగిలేది దుఃఖమే.

**వ.** **అని చెప్పి వెండియు నిట్లనియె.** **132**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= పలికి; వెండియున్= మరియును; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి, ఇంకా ఈ విధంగా చెప్పాడు.

**సీ.** **'వేద వేదాంగ సంవేది గౌశికుఁ డను । ధరణీసురుఁడు సంహితాజపంబు**
**విహితశీలతఁ జేయ వేయి వత్సరములు । సనిన సావిత్రి యమ్మునివరునకుఁ**
**బొడసూపి తనుఁ జెప్పఁ గడుభక్తితో నతం । డెఱఁగిన 'నిచ్చెద నిష్ట' మడుగు**
**మనిన నాతండు జపాతినిష్ఠయ కోర । నది యిచ్చి, దేవి 'నీ కత్యుదాత్త**

**తే.** **గతియు నగు; ధర్మ మర్థి నీకడకు వచ్చు; । యముఁడు గాలుండు మృత్యువు నరుగుదెంతు**
**రనఘ! నీకును వారికి నావహిల్లు । వాద' మని చెప్పి చనియె భూవరవరేణ్య! 133**

**ప్రతిపదార్థం:** భూవర వరేణ్య!= రాజశ్రేష్ఠా! ఓ ధర్మరాజా!; కౌశికుఁడు+అను= కౌశికుడు అనేపేరుగల; ధరణీసురుఁడు= బ్రాహ్మణుడు; వేద వేద+అంగసంవేది= వేదాలను, వేద అంగాలయిన శిక్ష, వ్యాకరణం మొదలయిన ఆరు శాస్త్రాలను బాగుగా ఎరిగినవాడు; సంహితాజపంబున్= వేద జపమును; విహిత శీలతన్= విధించబడిన స్వభావంతో; చేయన్= ఒనరింపగా; వేయి వత్సరములు= వేయి ఏండ్లు; చనినన్= కడవగా; సావిత్రి= మంత్ర అధిదేవత; ఆ+ముని వరునకున్= ఆ ముని శ్రేష్ఠుడికి; పొడ+చూపి= కనిపించి; తనున్= తనను; చెప్పన్= తెలియజెప్పగా; కడు భక్తితోన్= అధిక భక్తితో; అతండు= ఆ కౌశికుడు; ఎఱఁగినన్= నమస్కరించగా; ఇచ్చెదన్+ఇష్టము+అడుగుము= ఇస్తాను కోరిన దానిని అడుగుము; అనినన్+అనగా (సావిత్రి); అతండు= ఆ కౌశికుడు; జప+అతినిష్ఠ+అ= జపంలో ఎక్కువ శ్రద్ధయే; కోరన్= కోరుకొనగా; అది= దానిని ఆ జపాతినిష్ఠనే; ఇచ్చి= ఒసగి; దేవి= సావిత్రీదేవి; నీకున్= జపకర్మకే అంకితమైన నీకు; అతి+ఉత్+ఆత్త గతియున్= మిక్కిలి గొప్పపదముకూడ; అగున్= కలుగును; ధర్మము= ధర్మదేవత; అర్థిన్= కోరికతో; నీ కడకున్= నీ వద్దకు; వచ్చున్= చేరును; యముఁడున్= యమధర్మరాజు కూడా; కాలుండున్= కాలపురుషుడును; మృత్యువున్= మరణదేవతకూడా; అరుగుదెంతురు= వస్తారు; అనఘ!= ఓ పాపరహితుడవైన కౌశికా!; నీకును; వారికిన్= ఆ వచ్చినవారికిని; వాదము= సంవాదం, చర్చ; ఆవహిల్లును= కలుగుతుంది; అని; చెప్పి= పలికి; చనియెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** వేదాలు, వేదభాగాలయిన శాస్త్రాలు తెలిసిన కౌశికుడనే బ్రాహ్మణుడు జపాన్ని చేయవలసిన విధంగా చేసేవాడు. ఆ బ్రాహ్మణుడు ఆ విధంగా జపకర్మను నిష్ఠతో వేయి వత్సరాలు చేయగా, ఆ జపానికి అధిదేవత అయిన సావిత్రీదేవి ఆయనకు ప్రత్యక్షమై, తనను తాను పరిచయం చేసికొన్నది. ఆ బ్రాహ్మణుడు ఆ దేవికి నమస్కరించాడు. ఆ దేవి ఆ జపతత్పరుడిని, నీ అభీష్టం నెరవేరుస్తాను కోరుకొ'మ్మని అడిగింది. దానికి ఆయన ఆ జపకర్మలోని నిష్ఠనే వరంగా అర్థించాడు. అతడి శ్రద్ధకు సంతసించిన ఆ దేవి ఆ వరాన్ని ప్రసాదించి, 'నీకు మిక్కిలి గొప్ప స్థానం కలుగుతుంది. ధర్మదేవత, యమధర్మరాజు, కాలపురుషుడు, మృత్యుదేవత - వీరందరూ నీ దగ్గరకు వచ్చి, నీతో సంభాషణ నెరపి సంవాదం చేస్తారు' అని కూడా ఆతడికి తెలియజేసి అంతర్హిత అయింది.

**విశేషం:** వేదాలు నాలుగు: ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము. వేద అంగాలు ఆరు: శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం. వీటినే షట్ శాస్త్రాలు అని కూడా వ్యవహరిస్తారు. జపకర్మకే అంకితుడైన ఆ కౌశికుడి వృత్తాంతాన్ని వివరిస్తున్నాడు భీష్ముడు.

**క.** **ధరణీసురుఁడును జప త । త్పరుఁడై దివ్యాబ్దములు శతంబు గడపె న**
**ప్పురుషవరు కడకు ధర్మము । పరమప్రీతిఁ జనుదెంచెఁ బౌరవముఖ్యా! 134**

**ప్రతిపదార్థం**: పౌరవముఖ్యా!= పురువంశ శ్రేష్ఠా!-ధర్మరాజా!; ధరణీ సురుఁడును= బ్రాహ్మణుడుకూడా-ఆ కౌశికుడు; జపతత్పరుఁడు+ఐ= జపకర్మయందు ఆసక్తుడై; దివ్య+అబ్దములు= దేవలోక సంవత్సరాలు; శతంబు= నూరు; కడపెన్= గడపాడు; ఆ+పురుషవరు కడకున్= ఆ నరశ్రేష్ఠుడి దగ్గరకు; ధర్మము= ధర్మదేవత; పరమప్రీతిన్= ఎక్కువ ప్రేమతో; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ కౌశిక బ్రాహ్మణుడు దేవీవరలబ్ధమైన తీవ్రనిష్ఠతో జపకర్మను నిర్వహిస్తూ నూరు దేవలోక సంవత్సరాలు గడిపాడు. అపుడు ఎక్కువ మక్కువతో ధర్మదేవత ఆ కౌశికుడి చెంతకు చనుదెంచింది.

**విశేషం:** అర్థి అయినవాడు దేవతలను తాను ఆశ్రయిస్తాడు, అర్థి కాని తపశ్శీలుడిని దేవతలే ఆశ్రయిస్తారు. అర్థిత్వానికి అనర్థిత్వానికి అంత భేదం ఉన్నది.

**తే.** **అట్లు సాకారమై వచ్చి యతనితోడ । 'నీ జపంబున సిద్ధించె నిరతిశయము**
**లైన పుణ్యలోకములు; నీ వందుఁ జనుము । తనువుఁ జిత్తంబు విడిచి యుత్సవ మెలర్ప.'** **135**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; స+ఆకారము+ఐ= ఆకృతి కలిగినదై; వచ్చి= చేరి; అతనితోడన్= ఆ బ్రాహ్మణుడితో; నీ జపంబునన్= నీ జపకర్మవలన; నిర్+అతిశయములు= అధికమైనవి లేనివి; ఐన; పుణ్యలోకములు= ధర్మాచరణంవలన లభించే ఊర్ధ్వలోకాలు; సిద్ధించెన్= లభించాయి; నీవు; అందున్= ఆ లోకాలకు; ఉత్సవము+ఎలర్పన్= సంతోషం అతిశయిల్లగా; తనువున్= దేహాన్ని; చిత్తంబు= మనస్సును; విడిచి= వదలి; చనుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** స్వతః ఆకారంలేని ధర్మం ఈ కౌశికుడి కారణాన ఆకారం ధరించి వచ్చి, 'ఓ కౌశికా! నీ జపకర్మ ఫలితంగా తమను మించినవి లేని గొప్ప పుణ్యలోకాలు నీకు లభించినవి. సంతోషంతో నీ వీక, నీ శరీరాన్ని మనస్సును విడిచి ఆ లోకాలకు చేరుకొమ్ము'. అన్నది.

**వ.** **అనిన విని యమ్ముని ధర్మంబున కిట్లనియె.** **136**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+ముని= ఆ కౌశిక ఋషి; ధర్మంబునకున్= ధర్మదేవతకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అనగా విని ఆ కౌశిక ఋషి ఈ విధంగా అన్నాడు.

**క.** **'తనువు దొఱఁగి సను లోకము । లనఘా! యే నొల్ల మేల యైనను దుఃఖం**
**బున కోర్చి నా తపంబున । కనుగుణమై యుండ దీని నగునె తొఱంగన్?'** **137**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; ఏను= నేను; తనువు= శరీరం; తొఱఁగి= విడిచి; చనులోకములు= వెళ్ళేడి (ఊర్ధ్వ) లోకాలు; మేలు+అ+ఐనను= శ్రేష్ఠమైనవే అయినా; ఒల్లన్= అంగీకరించను; దీనిన్= ఈ శరీరాన్ని; దుఃఖంబునకున్= కష్టానికి; ఓర్చి= సహించి; నా తపంబునకున్= నేను చేసే జపరూపమైన తపస్సునకు; అనుగుణమై= అనుకూలమై; ఉండన్= ఉండగా, నిలిచి ఉండగా; తొఱంగన్= విడుచుటకు; అగునె?= అర్హం, ఉచితము, అగునా? (కాదు).

**తాత్పర్యం:** 'పాపస్పర్శలేని ఓ ధర్మమా! ఊర్ధ్వలోకాలు ఉత్తమమైనవే అయినప్పటికీ నేను ఈ నా శరీరాన్ని దిగవిడిచి వెళ్ళవలసి వస్తే, ఆ లోకాలను అంగీకరించజాలను. ఎందుకంటే ఈ శరీరం నా జపకర్మకు - అది దుఃఖకరమే అయినా సహించి అనుగుణంగా ఉంటున్నది. అటువంటి ఈ అనుకూలదేహాన్ని విడిచిపుచ్చి వెళ్ళటం ఉచితమా?'

**విశేషం:** కౌశికుడికి ఊర్ధ్వలోక గమనం అనిష్టంగాదు. అతడికి ఇష్టంగానిది - ఇంతకాలం తన తపశ్చర్యకు సాధనమైన శరీరాన్ని దిగవిడిచి పోవటం.

**వ. అనుటయు ధర్మంబు. 138**

ప్రతిపదార్థం: అనుటయున్= కౌశికుడు ఆ విధంగా పలుకగా; ధర్మంబు= సాకారమైన ధర్మం- (ఇట్లా ప్రతిభాషించింది).

**తాత్పర్యం:** దీనికి ధర్మదేవత ఇట్లా సమాధానం ఇచ్చింది.

**క. 'ఒడ లెట్లు విడువవలదే? । కడు రమ్యము నాక మింత గానవొకో?' నా**
**వుడు 'మేను వెలిగ నటవో । నొడఁబడ' నని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా! 139**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా ఒడలు= శరీరం; ఎట్లున్= ఏ విధంగానైనా; విడువన్‌వలదు+ఏ?= వదలివేయవద్దా?; నాకము= స్వర్గం; కడు రమ్యము= మిక్కిలి సుందరం; ఇంత= ఈ మాత్రం; కానవు+ఒకో?= గమనించలేవా?; నావుడున్= అన్నవెంటనే; బ్రాహ్మణ+ఉత్తముఁడు= బ్రాహ్మణ శ్రేష్ఠుడయిన ఆ కౌశికుడు; మేను= శరీరం; వెలిగన్= వెలుపలగాగా - వెంటరాకుండ నిలువగా; అటన్= ఆ స్వర్గానికి; పోన్+ఒడఁబడన్= వెళ్ళుటకు అంగీకరించను; అని; పలికెన్= అన్నాడు;

**తాత్పర్యం:** 'ఏ విధంగానైనా ఎప్పటికైనా శరీర పరిత్యాగం తప్పదు కదా! స్వర్గలోకం ఎంతో అందమైనది. ఈ మాత్రం గ్రహించలేవా? కౌశికా!' అని ధర్మమంటే, శరీరాన్ని విడిచి ఆ లోకాలకు వెళ్ళటానికి తాను అంగీకరించనని భూసురుడు సమాధానం చెప్పాడు ధర్మరాజా!

**వ. అని పలికిన ధర్మం బతనితో 'నీ వొడలు విడువనొల్లవుపో యమకాల మృత్యువులు వీరె వచ్చిరి; చూడు' మనియె; నయ్యవసరంబున వారలు వచ్చి యమ్మహీసురవరు ముందఱ నిలిచి, తమ్ముం బేర్కొని; రాతని నుద్దేశించి యముండు నీ జపంబు ఫలంబు సిద్ధించె' ననియుఁ, గాలుండు 'నీకు నాకలోకారోహణంబునకుం గాలంబైనం దోఁచితి' ననియును మృత్యువు 'కాలచోదితనై నిన్ను నేఁడు గొనిపో వచ్చితి' ననియుం బలుకుటయు, నమ్మాటలు గీటునం బుచ్చుచు వారల వదనంబులు విలోకించి సవినయ వ్యాహృత స్వాగతుండయి యవ్విప్రుం'డేను మీకు నెప్పని సేయువాఁడ?' నని పలికె; నట్టి యెడఁ దీర్థయాత్రా పరుండైన యిక్ష్వాకుం డచ్చటికి నేతెంచి వార లందరకుం బ్రణతుండై బ్రాహ్మణుం డతిథిగా నిరూపించి యాదర భరితుండై. 140**

**ప్రతిపదార్థం:** అని పై విధంగా; పలికినన్= చెప్పగా; ధర్మంబు= సాకారమైన ధర్మదేవత; అతనితోన్= ఆ కౌశికుడితో; నీవు; ఒడలు= శరీరం; విడువన్= వదలుటకు; ఒల్లవుపో= అంగీకరించవు పోనిమ్ము; యమకాల మృత్యువులు= యమధర్మరాజు, కాలపురుషుడు, మృత్యుదేవత, ఈ ముగ్గురు; వీరె= వీరలె (ఈ కనుపించేవారే అని చూపుతూ); వచ్చిరి= నిన్ను చేరారు; చూడుము+అనియెన్= చూడుము అనెను; ఆ+అవసరంబునన్= ఆ సమయాన; వారలు= ఆ ముగ్గురు; వచ్చి= చేరి; ఆ+మహీసురవరు ముందఱన్= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడి ఎదుట; నిలిచి= నిలువబడి; తమ్మున్= తమను; పేర్కొనిరి= తెలుపు కొన్నారు; ఆతనిన్+ఉద్దేశించి= ఆ కౌశికుడితో; యముఁడు= యమధర్మరాజు; నీ జపంబు ఫలంబు= నీవు చేసే జపకర్మయొక్క ఫలితం; సిద్ధించెన్+అనియున్= ఫలించింది అనీ; కాలుండు= కాలపురుషుడు; నీకున్; నాకలోక+ఆరోహణంబునకున్= స్వర్గలోకమున కెక్కుట కొరకు; కాలంబు+ఐనన్= సమయము కాగా; తోఁచితిన్+అనియును= కనిపించాను అనీ; మృత్యువు= మరణదేవత; కాలచోదితను+ఐ= కాలుడిచేత ప్రేరేపించబడినదాననై; నిన్నున్; నేఁడు= ఈ దినం; కొనిపోవన్+వచ్చితిన్+అనియున్= తీసికొనిపోవటానికి చేరాను అనీ; పలుకుటయున్= అనగా; ఆ+మాటలు= ఆ పలుకులు, ఆ ముగ్గురి వాక్కులు; గీటునన్+పుచ్చుచున్=

తిరస్కారానికి లోనుచేస్తూ; వారల వదనంబులు= ఆ ముగ్గురి మొగాలు; విలోకించి= చూచి; సవినయ వ్యాహృత స్వాగతుండు+అయి= అణకువతో పలికిన స్వాగతవచనం కలవాడై - వారికి స్వాగతం పలికి; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఏను= నేను; మీకున్= మీ ముష్వురకు; ఏ+పని= ఏ కార్యం; చేయువాఁడను?= చేయగలవాడను?; అని; పలికెన్= అన్నాడు; అట్టిఎడన్= అట్టి సమయాన; తీర్థయాత్రాపరుండు+ఐన= తీర్థయాత్రలలో ఆసక్తుడయిన; ఇక్ష్వాకుండు= ఇక్ష్వాకుడు అనే మహారాజు; అచ్చటికిన్+ఏతెంచి= ఆ స్థలానికి వచ్చి; వారలు+అందఱకున్= ఆ అందరకు, నల్వురకు కూడా; ప్ర+నతుండు+ఐనన్= బాగా నమస్కరించినవాడు కాగా; బ్రాహ్మణుండు= ఆ నల్వురిలోని కౌశికుడు; అతిథిన్+కాన్= అతిథిత్వమునకు అర్హుడిగా (రాజును); నిరూపించి= గ్రహించి; ఆదరభరితుండు+ఐ= గౌరవంతో నిండినవాడై.

**తాత్పర్యం:** 'కౌశిక ధర్మదేవతల సంవాదంలో ధర్మదేవత కౌశికుడితో 'నీవు శరీర త్యాగం చేయవు సరే! అరుగో యముడు, అతడి వెంట కాలపురుషుడు, అతడి వెంట మృత్యువు - ముష్వురూ వచ్చారు చూడుము' అన్నది. ఆ సమయాన ఆ ముష్వురూ అక్కడకు చేరి, తమను తాము పరిచయం చేసికొని, ఆ కౌశికుడి ముందు నిలిచారు. ముందుగా యముడు 'నీ జపఫలితం సిద్ధించిన'దని పలుకగా, అనంతరం కాలుడు 'నీవు స్వర్గాన్ని అధిరోహించవలసిన సమయం సమీపించి నేను వచ్చా'నని తెల్పాడు. చివరగా మృత్యువు తాను కాలునిచే ప్రేరణబొంది కౌశికుడిని తీసికొని వెళ్ళుటకు వచ్చినట్లు తెలియపరచినది. అయితే ఆ ముగ్గురి మాటలనూ తిరస్కరిస్తూ ఆ బ్రాహ్మణుడు వారి ముఖాలు చూచి అణకువతో అందరకూ స్వాగతం పలికి 'నేను మీకు ఏ పని చేసి పెట్టగలను?' అని విన్నవించుకొన్నాడు. సరిగా అదే సమయాన తీర్థయాత్రలు చేస్తూ ఇక్ష్వాకుమహారాజు ఆ ప్రదేశానికి ఏతెంచి ఆ నల్గురికీ నమస్కరించాడు. వారిలో కౌశికుడు ఆ రాజును అతిథిగా భావించి గౌరవంతో అతడిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** నరుడికి అతని వృత్తి - ప్రవృత్తి విశ్వాసాన్ని కలిగిస్తాయి. దాన్నే ఆత్మవిశ్వాసం అంటారు. అది సమృద్ధిగా సక్రమంగా ఉన్నప్పుడు ఎదుటి వ్యక్తి ప్రాముఖ్యం ముందు తలవంచవలసిన అవసరం ఉండదు. ఇక్కడ కౌశికుడిలో ఆ ఆత్మవిశ్వాసమే-జపనిష్ఠాతత్పరతవలన సిద్ధించిన విశ్వాసమే అతడిని యమకాలమృత్యువులముందు నిర్భయంగా నిలబెట్టగలిగినది. వారిమాటను సరకు చేయకపోయినా కౌశికుడు కుశలంగా ఉండగలిగాడంటే కారణం వృత్తిపరంగా సిద్ధించిన అజేయమైన ఆత్మప్రత్యయం. అదే ఆత్మశక్తి.

### కౌశికునకు నిక్ష్వాకుమహారాజునకు నయిన సంవాదము (సం. 12-192-2, 3)

**క. 'నా కలిమితోడ నిచ్చెద । నీ కెయ్యది యిష్ట?' మనిన నృపతి 'నృపులు దా**
**నైకపరులు గొనువారలె? । యే కామ్యములయిన నిత్తు నీ వడుగు తగన్.' 141**

**ప్రతిపదార్థం:** నా కలిమితోడన్= నా సంపదనుబట్టి; ఇచ్చెదన్= ఇస్తాను; నీకున్= అతిథివి అయిన నీకు; ఏ+అది= ఏది; ఇష్టము?= కోరబడినది?; అనినన్= అనగా; నృపతి= ఇక్ష్వాకు మహారాజు; నృపులు= రాజులు; దాన+ఏకపరులు= ఇవ్వటంలో మాత్రమే ఆసక్తులు; కొనువారలు+ఎ?= గ్రహించేవారా?; ఏ కామ్యములు+అయినన్= ఏ కోరికలయినను; ఇత్తున్= తీరుస్తాను; నీవు= బ్రాహ్మణుడవైన నీవు; తగన్= ఉచితంగా; అడుగు= అర్థించుము.

**తాత్పర్యం:** అతిథిపట్ల గౌరవంతో కౌశికుడు ఇక్ష్వాకువును ఉద్దేశించి, 'నాకున్న దాని కనుగుణంగా ఇవ్వగలను. నీ అభీష్టమేమిటి?' అని అన్నాడు. ఆ మాటకు బదులుగా ఆ రాజు విప్రుడితో 'రాజులు దానశీలురు, దానకర్తలు గాని, దానగ్రహీతలు కాగలరా?' అని, 'నీవు అర్థించుము, నీ కామ్యాలు తీరుస్తాను' అన్నాడు.

**విశేషం:** కొత్తగా ఇల్లు చేరినవాడు తెలియనివాడైనా అతిథి. అతిథిని దేవుడిగా భావించి పూజించుమని మన ఆమ్నాయాల నిర్దేశం. 'అతిథి దేవో భవ' అనే మాట అదే. కౌశికుడు ఆ దృష్టితోనే కొత్తగా వచ్చినవాడిని అతిథిగా భావించి సత్కరించబోయాడు- అభీష్టార్థ ప్రదానంతో.

**వ. అనిన విని విప్రుం డవ్విభున కిట్లనియె. 142**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇక్ష్వాకుడు పలుకగా; విని= ఆలకించి; విప్రుండు= బ్రాహ్మణుడు - కౌశికుడు; ఆ+విభునకున్= ఆ రాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇక్ష్వాకుమహారాజు అట్లు అనగా విని, బ్రాహ్మణుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'కొనువారు ప్రవృత్తులు గా । క నివృత్తులు గొందురయ్య? కామ్యంబులు నా**
**మనమున లే; వే నేమియుఁ । గొన; నిత్తున కాన యధిప! కోరుము తగఁగన్. 143**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ఇక్ష్వాకు మహారాజా!; కొనువారు= (దానం) గ్రహించేవారు; ప్రవృత్తులు+కాక= ప్రవృత్తి మార్గంలో ఉన్నవారు కాకుండా; నివృత్తులు= నివృత్తి మార్గంలో ఉన్నవారు; కొందురు+అయ్య= (దానం) స్వీకరిస్తారటయ్యా?; కామ్యంబులు= కోరికలు; నా మనమునన్= నా మనస్సునందు; లేవు= ఉన్నవి కావు; ఏను= నేను; ఏమియున్= దేనినీ; కొనన్= గ్రహించను; ఇత్తును+అ= ఇస్తాను తప్పక; కాన= కావున; తగఁగన్= ఉచితంగా, అర్హంగా; కోరుము= అర్థించుము.

**తాత్పర్యం:** సంసారచక్రాన బడి వివిధ క్రియలలో ప్రవర్తించేవారు దానాలు స్వీకరిస్తారు తప్ప, సంసారాన్ని దూరంగా నివృత్తిమార్గాన ప్రాపంచిక విషయాలనుండి మరల్చి జీవించేవారు దానం గ్రహిస్తారా? నా మనస్సున ఏ కోరికలూ లేవు. కాగా నేను కోరను, కాని ఈయగలవాడను. తప్పక ఇస్తాను నీవే తగినట్లు కోరుకొమ్ము.

**విశేషం:** ప్రవృత్తి × నివృత్తి. ప్రాపంచిక విషయాల జోలికి వెళ్ళి, వాటిలో తలదూర్చి, వివిధ ఆలోచనలలో క్రియలలో పాల్గొనటం ప్రవృత్తి. ఇది జనసామాన్య జీవనవిధానం. దీనికి విరుద్ధంగా ప్రాపంచిక విషయాలనుండి ఇంద్రియాలనూ, మనస్సునూ మరల్చి, నిగ్రహించి, ఆత్మజ్ఞానం కొరకు యత్నించటం నివృత్తి. ఇక్కడ బ్రాహ్మణుడు నివృత్తుడు. క్షత్రియుడు ప్రవృత్తుడు.

**వ. పూజారూపంబున నిచ్చిన యది యతిథి గైకొనుట యెగ్గుగా' దనుటయు నమ్మనుజపతి 'నీ విచ్చువాఁడవయేని నీ సకల జపంబు ఫలంబును ని' మ్మనిన నమ్మహీదేవుండు. 144**

**ప్రతిపదార్థం:** పూజారూపంబునన్= సత్కారరూపాన్ని; ఇచ్చిన+అది= ఈబడినది; అతిథి= ఆగంతకుడు; కైకొనుట= స్వీకరించటం; ఎగ్గు+కాదు= కీడు కాదు; అనుటయున్= అన్న తరువాత; ఆ+మనుజపతి= ఆ రాజు; నీవు; ఇచ్చువాఁడవు+అ+ఏని= ఇచ్చేవాడివే అయితే; నీ సకల జపంబు ఫలంబును= నీ మొత్తం జపముయొక్క ఫలితాన్ని; ఇమ్ము= ఇచ్చివేయుము; అనినన్= అనగా; ఆ+మహీదేవుండు= ఆ బ్రాహ్మణుడు.

**తాత్పర్యం:** సత్కారరూపాన (యాచనకు బదులుగా కాకుండా) ఇచ్చినది స్వీకరిస్తే స్వీకర్తకు ఏ కీడూ ఉండదు' అని కౌశికుడు పలికాడు. కౌశికుడి నిర్బంధంతో ఆ రాజు 'నీవు కేవలం దాతవే అయితే, నీ మొత్తం జపఫలితం నాకిమ్ము' అన్నాడు. దానికి బదులుగా ఆ బ్రాహ్మణుడు (ఇట్లా అన్నాడు).

**విశేషం:** దానాలు రెండు విధాలుగా ఉండవచ్చును. అర్థించిన తరువాత ఇచ్చేది లోకంలో ప్రసిద్ధమైన దానం. అర్థనతో నిమిత్తం లేకుండా గౌరవపురస్సరంగా పూజోపహారంగా ఇచ్చేది అసామాన్య దానం. దీనిలో గ్రహీతకు, దాన స్వీకర్తకు ఏ ప్రమేయమూ ఉండదు కాబట్టి ఏ కీడూ ఒనగూడే వీలులేదు. ప్రయోజనకాంక్షతో చేసే దానాలు స్వీకరించేవారికి అటువంటి అభయం ఉండ దంటారు పెద్దలు.

**క. 'జపఫలమున సగ మిచ్చెద। నృప! యంతయు నైనఁ గొనుము నీ' వనవుడు 'న**
**జ్జపము ఫలం బెయ్యది?' యని। నృపుఁ డడిగిన నాతఁ 'డేను నిరపేక్షుండన్.' 145**

**ప్రతిపదార్థం:** నృప!= రాజా!; జపఫలమునన్= జపం ఫలితంలో; సగము+ఇచ్చెదన్= సగపాలు ఇస్తాను; అంతయున్+ఐనన్= అంతటినైననూ; నీవు; కొనుము= తీసికొనుము; అనవుడున్= అన్నవెంటనే; ఆ+జపము ఫలంబు= ఆ నీ జపముయొక్క ఫలితం; ఏ+అది?= ఏది, ఏ విధమైనది?; అని; నృపుఁడు= రాజు; అడిగినన్= ప్రశ్నించగా; ఆతఁడు= ఆ కౌశికుడు; ఏను= నేను; నిర్+ఆపేక్షుండన్= కోరిక లేనివాడను.

**తాత్పర్యం:** 'నీ సకల జపంబు ఫలంబును ఇమ్ము' అన్న ఇక్ష్వాకుమహారాజునకు కౌశికుడి సమాధానమిది - 'జపఫలితంలో సగమిస్తాను రాజా! మొత్తం ఫలితం కావాలి - అన్నా తీసికొమ్ము' అని. దానికి రాజు 'ఇంతకూ ఈ నీ జపఫలితం ఏమిటి?' అని ప్రశ్నించాడు. కౌశికుడి సమాధానం - 'నేను కోరికలు లేనివాడిని' అంటూ ప్రారంభించి కొనసాగిస్తున్నాడు.

**విశేషం:** రాజు కౌశికుడి నిర్బంధదాతృత్వానికి విసిగినట్లుగా కౌశికుడి జపఫలితం మొత్తం ఇమ్మన్నాడు. విప్రుడు తనమాట మొదట సగమిస్తానని, మళ్ళీ అంతా అయినా తీసికొనుమన్నాడు. ఈ విధంగా ఇక్కడి దాత, గ్రహీత, ఇరువురూ ఒకింత భావావేశంతో వ్యవహరిస్తున్నట్లు తోస్తున్నది.

**క. కావున ఫల మిట్టిది యని। భావింప; నెఱుంగ నొరులఁ బనివడి యడుగన్;**
**నీ వాఫలంబు గొను మది। దా వినఁబడుఁ బిదప ధర్మతత్త్వజ్ఞులచేన్.' 146**

**ప్రతిపదార్థం:** కావున= (కోరికలు లేనివాడను) కాబట్టి; ఫలము= (జపముయొక్క) ఫలితం); ఇట్టిది+అని= ఈ విధమైనది అని; భావింపన్= ఊహించగా; ఎఱుంగన్= తెలియను; ఒరులన్= ఇతరులను; పని+పడి= పనిగట్టుకొని, ప్రయత్నపూర్వకంగా; అడుగన్= ప్రశ్నించను; నీవు; ఆ ఫలంబు= ఆ నా జపఫలితం; కొనుము= గ్రహించుము; అది= ఆ ఫలితమెట్టిదో - అను నీ ప్రశ్నకు సమాధానం; తాన్= స్వయంగా; పిదపన్= అనంతరం; ధర్మతత్త్వజ్ఞులచేన్= ధర్మ స్వభావం ఎరిగినవారిచేత; వినఁబడున్= వినవచ్చును.

**తాత్పర్యం:** నేను నిరపేక్షకుడను కాబట్టి నా కా జపఫలితపు స్వరూపస్వభాలను గురించిన భావనే కలుగలేదు. ఆ కారణాననే నేను ఇతరు లెవరినీ పనిగట్టుకొని జపఫలిత మేమిటి? - అని అడిగి తెలిసికొనలేదు, ఫలిత మిట్టిది అని తెలియకున్నా దాన్ని స్వీకరించుము. ఆ తరువాత ధర్మతత్త్వవేత్తలు ఆ జపఫలిత మిట్టిది, ఇంతటిది - అని వివరిస్తారు'.

**విశేషం:** మొదటి నుండి ఈ దాత గ్రహీతలలో సౌముఖ్యం కొరవడినట్లుగా అనిపిస్తుంది. ఇపుడు అదేమిటో తెలియకుండానే దానిని గ్రహించమంటున్నాడు దాత. మరి గ్రహీత ఏ విధంగా స్పందిస్తాడో చూడాలి. గ్రహీత అయినా, తొలుత కోరినపుడు లేని సంశయాన్ని అనంతరం దానసమయాన వెలువరించటం ఎందుకో? మొత్తంమీద దానస్వీకారం చేసేటప్పుడు ముందు వెనుకలు చూడవలసిన అవసరం ఎంతో ఉన్నట్లుగా వీరి వ్యవహారశైలిని బట్టి మనం గ్రహించాలి.

**వ. అనుటయు నయ్యినతనయుండు 'ఫలం బిట్టి దని యెఱుఁగ వేనిం గొననొల్ల' ననవుడు నతం డితని కిట్లనియె. 147**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా, అన్న తరువాత; ఆ+ఇనతనయుండు= ఆ సూర్యవంశపు ఇక్ష్వాకు మహారాజు; ఫలంబు+ఇట్టిది+అని= ఫలితం ఇటువంటిది అని; ఎఱుంగవు+ఏనిన్= తెలియవేని; కొనన్+ఒల్లన్= తీసికొనుటకు

అంగీకరించను; అనవుడున్= అన్న పిదప; అతండు= ఆ కౌశికుడు; ఇతనిని= ఈ ఇక్ష్వాకుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కౌశికుని సమాధానం విన్న ఇక్ష్వాకుడు ఫలితం తెలియరాని దానిని తాను స్వీకరించటానికి అంగీకరించ నన్నాడు. తరువాత ఆ కౌశికుడు ఇక్ష్వాకుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'నీ వడిగి తేను నిచ్చితి । భూవల్లభ! యింక సత్యమున కూనము గా**
**దే వరియింపమి?' నావుడు । నా వసుధాధీశుఁ డద్ధరామరవరుతోన్. 148**

**ప్రతిపదార్థం:** భూవల్లభ!= ఓ రాజా!; నీవు= అర్థివైన నీవు; అడిగితి(వి)= అర్థించావు; ఏను= నేను; ఇచ్చితిన్= ఇచ్చాను; ఇంకన్= ఇకమీదట, ఇంత జరిగిన తరువాత; వరియింపమి= ఇష్టపడకుండుట (దానస్వీకారానికి); సత్యమునకున్= సత్యవ్రతానికి; ఊనము+కాదే?= తక్కువ - కొరతకాదా?; నావుడున్= అన్న తరువాత; ఆ+వసుధా+అధి+ఈశుఁడు= ఆ భూమికి అధిపతియైన ఇక్ష్వాకుడు; ఆ+ధరా+అమర వరుతోన్= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడితో.

**తాత్పర్యం:** కౌశికుడు ఇక్ష్వాకుడి తిరస్కారాన్ని తప్పుపట్టుతున్నాడు. 'ఓ రాజా! నీవు అడిగావు. నేను ఇచ్చాను. ఈ అడుగుట, ఇచ్చుట అనే ఈ రెండు క్రియలు జరిగిపోయిన తరువాత ఈ దశలో నీవు - నే నొల్లను అనుట సత్యవ్రత పాలనకు హానికరం కాదా? అట్లా తిరస్కరించటం సత్యానికి కొరత గావించటం కాదా?' అన్నాడు కౌశికుడు. దానికి బదులుగా ఆ మహారాజు ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడితో ఇట్లా పలికాడు.

**వ. 'రాజులకు యుద్ధంబు సుకర్మంబు గావున నీతో వివాదయుద్ధంబు సేసితి' ననిన నతండు 'నీవేమి సేసితేమి? యది యట్లుండనిమ్ము.' 149**

**ప్రతిపదార్థం:** రాజులకున్= క్షత్రియులకు; యుద్ధంబు= కయ్యం; సుకర్మంబు= మంచిపని, చేయదగింది; కావునన్= కాబట్టి; నీతోన్= పండితుడవైన నీతో; వివాద యుద్ధంబు= తగవులాడుట అనే కయ్యం; చేసితిన్= చేశాను; అనినన్= అనగా; అతండు= ఆ కౌశికుడు; నీవు; ఏమి+చేసితి(వి)+ఏమి= ఏ దానిని చేశావో ఏమిటో; అది= ఆ చేసింది; అట్లు+ఉండన్+ఇమ్ము= ఆ విధంగానే చేసినది చేసినట్లుగానే ఉండనిమ్ము.

**తాత్పర్యం:** కౌశికుడి ప్రశ్నకు రాజు సమాధాన మిది: తాను క్షత్రియుడు కాబట్టి క్షత్రియులకు యుద్ధం చేయదగ్గపని కాబట్టి తాను కౌశికునితో తగవులాడుట అనే కయ్యాన్ని చేశాడు. ఈ సమాధానానికి ఆ కౌశికుడి ప్రతివచనమిది: 'నీవు ఏమి చేశావో ఏమో, అది అట్లా ఉండనిమ్ము'.

**విశేషం:** బ్రాహ్మణ కౌశికుడు, క్షత్రియ ఇక్ష్వాకువు - ఇరువురూ ధర్మకర్మతత్పరులే. ఇరువురకూ పరస్పర గౌరవాదరభావాలు ఉన్నవి. అయినా దానప్రదానం, దానస్వీకారం అనే విషయంమీద వివాద పడుతున్నారు. ఎవరికి తోచిన రీతిలో వారు తమ ధోరణిని సమర్థించుకొనజూస్తున్నారు. క్షత్రియధర్మం ప్రకారం కయ్యం కార్యమే కాబట్టి వాఙ్మయమైన కయ్యం చేశా నంటున్నాడు రాజు.

**క. విను మిచ్చెద నని యీమియుఁ, । గొనియెద నని పలికి పిదపఁ గొనకునికియు, న**
**త్యనృతంబులు సత్యవ్రత । మునకుం దొలగంగ మనకు భూవర! తగునే? 150**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా!; వినుము= ఆలకించుము; ఇచ్చెదను+అని= ఇస్తాను అని పలికి; ఈమియున్= ఈయకుండుటా; కొనియెదను+అని= తీసికొంటాను అని; పలికి= చెప్పి; పిదపన్= ఆ తరువాత; కొనక+ఉనికియున్=

తీసికొనకుండా ఉండటం; అతి+అనృతంబులు= మిక్కిలి అసత్యాలు; మనకున్= గొప్ప రాజువైన నీకు, మంచి బ్రాహ్మణుడనైన నాకు ఇద్దరికీ; సత్యవ్రతమునకున్+తొలఁగంగన్= సత్యమును పాటించుటనుండి తప్పుకొనుట; తగునే?= ఉచితమా?

**తాత్పర్యం:** ఓ రాజా! నీవేదో వివాదయుద్ధం చేశాను అంటున్నావు. అయితే ఇది వినుము. ఇస్తానని ఈయకుండటం, తీసికొంటానని తీసికొనకుండా ఉండటం - ఈ రెండు పనులూ మిక్కిలి అసత్యాలు. సద్బ్రాహ్మణుడ నైన నేనూ, క్షత్రియుడవైన నీవూ - ఇద్దరం ఈ విధంగా సత్యవ్రతపాలనకు దూరంగా జరిగిపోవటం తగునా?

**విశేషం:** 'తగునా?' అనేమాట ఈ పద్యంలో సార్థకం. 'తగు' అనే మాటనుండే 'తగవు' - వ్యవహారంలో 'తగువు' వచ్చాయి. ఉచితమగు అనే అర్థంలో ఈ మాటను ప్రయోగిస్తాం. వాదవివాదాలలో వాక్ప్రాగల్భ్యానికి పోయి, ఉచితానుచితాలు మరచే ప్రమాదముంది. ఆ ప్రమాదపుటంచున నిలబడి ఉన్నామని కౌశికుడి హెచ్చరిక.

**క.** **సత్యమ తపమును యజ్ఞము, । సత్యమ వేదంబు దాంతిశాంతులు నగుటన్**
**సత్యము దొఱఁగుట నిర్మల । నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్.' 151**

**ప్రతిపదార్థం:** సత్యము+అ= సత్యమే; తపమును= తపస్సూ; యజ్ఞము= యాగం కూడా; సత్యము+అ= సత్యమొక్కటే; వేదంబు= వేదం, జ్ఞానం; దాంతి శాంతులున్= దమనం, నిగ్రహం, కామక్రోధలోభ మోహ మదమాత్సర్యాలు లేకుండటం; అగుటన్= కాబట్టి; సత్యము= సత్యమునే; తొఱఁగుట= విడుచుట; నిర్మల నిత్య+అనుష్ఠానములును= మలినంలేని, ఎప్పుడూ చేసే కర్మకాండలు, జపహోమపూజాదులు కూడా; నిస్+ఫలములు+అగున్= ఫలం, ప్రయోజనం లేనివి ఔతాయి.

**తాత్పర్యం:** సత్యం సర్వోన్నతమైనది. సత్యవ్రతపాలన చేస్తే తపస్సు చేసినట్లే, యజ్ఞంచేసినట్లే, వేదం తెలిసినట్లే. సత్యవ్రతపాలనే నరుడిలో నిగ్రహాన్ని, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అనే అరిషడ్వర్గాన్ని జయించగల శాంతినీ కలిగిస్తుంది. అటువంటి సకలధర్మాచరణకు మూలకందమైన సత్యాన్ని విడిచిపెడితే ఇక జపహోమ పూజాపురస్కారాలవంటి నిత్యానుష్ఠానాలూ నిష్ఫలమే అవుతాయి'.

**విశేషం:** నేల విడిచి సాముచేయలేనట్లే, సత్యవ్రతపాలనలేక మిగిలిన సకల ధర్మకార్య నిర్వహణమూ అసాధ్యమే. కాదని మొక్కుబడిగా, గుడ్డిగా ఇతర సత్కార్యాలూ, ధర్మకార్యాలూ నిర్వహించినా, సత్యవ్రత మొక్కటి లేనప్పుడు మిగిలినవన్నీ నిష్ఫలాలే! ఎందుకంటే సర్వధర్మమూలమూ సత్యమే కాబట్టి.

**వ.** **అనిన విని ధర్మంబు వారల నుద్దేశించి యమాదులు విన 'వీరికి వివాదంబు వలదు. విప్రుండు దానఫలంబును రాజు సత్యఫలంబును బొందువా' రనియె. నట్టియెడ నాకంబు నరాకృతి దాల్చి వచ్చి తన్నెఱింగించి యయ్యిరువుర నాలోకించి 'వాదేల? మీరిద్దఱుం దుల్యఫలప్రాప్తుల రయ్యెద రిట్లు సేయుం'డని పలికె నవ్విభుం 'డట్లేని నితండును నా యిచ్చునది గొనవలయు? ననుటయు నమ్ముని 'యేను దపస్స్వాధ్యాయనిరతుండం బరిగ్రహవిధి యందు విరతుండ.' 152**

**ప్రతిపదార్థం:** అనినన్= కౌశికుడు అట్లు పలుకగా; విని= ఆలకించి; ధర్మంబు= ధర్మాధిదేవత; వారలన్= ఆ కౌశిక, ఇక్ష్వాకులను; ఉద్దేశించి= లక్ష్యముగాజేసి; యమ+ఆదులు= యముడు మొదలగువారు; వినన్= వినునట్లుగా; వీరికిన్= ఈ ఇరువురకు; వివాదంబు= తగవు; వలదు= అక్కరలేదు; విప్రుండు= బ్రాహ్మణుడు - కౌశికుడు; దానఫలంబును= దానము యొక్క ఫలితమును; రాజు= క్షత్రియుడు - ఇక్ష్వాకువు; సత్యఫలంబును= సత్యవ్రతపాలనయొక్క ఫలితమును; పొందువారు+అనియెన్= చేకొనువారు అని పలికెను; అట్టి+ఎడన్= ఆ సమయాన; నాకంబు= స్వర్గము; నర+ఆకృతి= నరుని ఆకారము; తాల్చి= ధరించి; వచ్చి=

చేరి; తన్నున్= తనను; ఎఱింగించి= తెలియపరచి; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరినీ; ఆలోకించి= చూచి; వాదు+ఏల?= వాదము, తగవు ఎందుకు?; మీరు+ఇద్దరున్= మీరు ఇరువురూ; తుల్యఫల ప్రాప్తులరు+అయ్యెదరు= సమానమైన ఫలితమును పొందువారు కాగలరు; ఇట్లు= ఈ విధంగా; చేయుండు+అని= చేయండి అని; పలికెన్= చెప్పెను; ఆ+విభుండు= ఆ రాజు; అట్లు+ఏని= అట్లయితే; ఇతండును= ఈ బ్రాహ్మణుడు కూడా; నా+ఇచ్చునది= నేను ఇచ్చేది; కొనన్+వలయున్= గ్రహించవలెను; అనుటయున్= అన్న పిదప; ఆ+ముని= ఆ ఋషి, కౌశికుడు; ఏను= నేను; తపస్+స్వ+అధ్యాయ నిరతుండను= తపస్సునందు, చదువునందు ఆసక్తుడను; పరిగ్రహణవిధియందున్= (దానమును) స్వీకరించు పనియందు; విరతుండన్= విరక్తుడను, అనాసక్తుడను.

**తాత్పర్యం:** కౌశికుడి పలుకు లాలకించిన ధర్మదేవత ఆ వివాదగ్రస్తులను ఇరువురనూ ఉద్దేశించి యముడు, కాలుడు, మృత్యువు వింటుండగా - వీరికి ఈ తగవులాట వద్దనీ, బ్రాహ్మణుడు దానఫలితాన్ని, క్షత్రియుడు సత్యవ్రత ఫలితాన్ని పొందగలరని పలికాడు. ఆ సమయాన స్వర్గం మానవరూపంలో అక్కడికి వచ్చి తనను తాను తెలియపరచుకొని, ఆ ఇద్దరినీ చూచి 'మీకు తగ వేల? మీరిద్దరూ సమానంగా ఫలితాలను పొందగల'రని చెప్పి ఈ విధంగా చేయు'మన్నది. ఆ రాజు 'అట్లాగయితే ఈ బ్రాహ్మణుడు కూడా నేనిచ్చే దానాన్ని స్వీకరించాలి' అనగా, ఆ విప్రుడు తాను తపస్సు, అధ్యయనం - ఈ రెంటియందే ఆసక్తుడననీ, దానపరిగ్రహణంలో విరక్తుడననీ తన అభ్యంతరాన్ని తెలిపాడు.

**క. అనవుడు నరనాథుఁడు 'నా । కును నీకును సరియ కాఁగఁ గోరెద సత్క**
**ర్మ నిరూఢి మత్సుకృతఫల । మనఘా! కొనవే? యనుగ్రహంబు దలిర్పన్.' 153**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్న తరువాత; నరనాథుఁడు= రాజు - ఇక్ష్వాకుడు; నాకును= క్షత్రియుడనైన నాకూ; నీకును= బ్రాహ్మణుడవైన నీకూ; సరి+అ+కాఁగన్= సమానమే అయ్యేటట్లుగా; కోరెదన్= కోరుకొందును; అనఘా!= ఓ పాపరహితుడా! కౌశికుడా!; సత్కర్మనిరూఢిన్= మంచిపనియందలి నిర్ధారణతో; మత్ సుకృతఫలము= నా పుణ్యఫలితము; అనుగ్రహము= దయ; తలిర్పన్= వ్యక్తమగునట్లుగా; కొనవే?= తీసికొనవా? - గ్రహించవా?

**తాత్పర్యం:** కౌశికుడి అభ్యంతరాన్ని విన్న రాజు కౌశికుడి నుద్దేశించి 'ఓ పాపరహితుడా! నేను నాకూ నీకూ సమత్వం చెడకుండా జాగ్రత్తగా కోరబోతున్నాను. నీవూ మంచిపని అనే నిర్ధారణతో నా పుణ్యఫలాన్ని దయతో దానంగా స్వీకరించుము'. (అని ప్రార్థించాడు.)

**విశేషం:** రాజు దానగ్రహీతగా, విప్రుడు దానకర్తగా మిగలటం క్షత్రియ ధర్మపరిపాలకుడైన ఇక్ష్వాకునకు మింగుడు పడటంలేదు. అందుకే అతడు బ్రతిమిలాడైనా ఆ విప్రుడిని దానగ్రహీతగా మార్చటానికి యత్నిస్తున్నాడు.

**వ. అని ప్రార్థించె నప్పుడు వికృతవేషులగు పురుషు లిరువురు దమలో వివాదంబు సేయుచు వచ్చి 'యవ్విభుండు మనల శాసింప నొడయం' డనుచు నిక్ష్వాకు ముందఱ నిలిచిరి. వారి తెఱంగు వినుము. 154**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; ప్రార్థించెన్= వేడుకొనెను; అప్పుడు= ఆ సమయాన; వికృత వేషులు+అగు= వికారమైన దుస్తులు, నగలు గలవారగు; పురుషులు= నరులు; ఇరువురు= ఇద్దరు; తమలోన్= పరస్పరం; వివాదంబు+చేయుచున్= వాదులాడుకొంటూ; వచ్చి= చేరి; ఆ+విభుండు= ఆ రాజు; మనలన్= మన ఇరువురను; శాసింపన్= ఆజ్ఞాపించగా; ఒడయండు= అధిపతి; అనుచున్= అని పలుకుతూ; ఇక్ష్వాకు ముందఱన్= ఇక్ష్వాకు మహారాజు ఎదుట; నిలిచిరి= ఆగారు; వారి తెఱంగు= వారి విధం; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** రాజు విప్రుడిని తాను స్వీకరించే దానానికి బదులుగా అతడూ తననుండి దానాన్ని స్వీకరించవలెనని వేడుకొంటూ ఉన్న సమయాన ఇరువురు నరులు వికృతమైన దుస్తులూ నగలూ ధరించి పరస్పరం వాదులాడుకొంటూ ఆ రాజును చూచి 'ఆః! ఈ రాజు మనకు శాసకుడు' అంటూ అతడి చెంతకు చేరి ఎదుట నిలబడ్డారు. వారి కథ ఇది.

**విశేషం:** ఇక్కడ కౌశిక ఇక్ష్వాకు లిరువురూ సమానమైన వాదబలంతో తర్కవితర్కాలతో వివాదంలో మునిగి ఉన్నారు. వారికి జ్ఞానోదయం కావాలి - అంటే మాటలతో సరిగాదని తేలిపోయింది. కాబట్టి ఒక విచిత్రసంఘటన ద్వారా వారివివాదాన్ని పరిష్కార మార్గంవైపు మరలించబోతున్నాడు వక్త.

**తే. ఒకఁడు గోదాన మొనరింప నొక్కరుండు । తత్ఫలము వేఁడఁ బ్రీతి నాతండు నొసఁగఁ
గొనినవాఁ డిది దక్కువ దనకు నని త । లంచి యుత్తమ గోయుగళంబు విలిచి. 155**

**ప్రతిపదార్థం:** ఒకఁడు= ఆ ఇరువురిలో ఒకడు; గోదానము+ఒనరింపన్= ఆవును దానం చేయగా; ఒక్కరుండు= మరొకడు; తద్+ఫలము= ఆ గోదాన ఫలితాన్ని; వేఁడన్= అర్థించగా; ప్రీతిన్= ప్రేమతో; ఆతండున్= ఆ గోదాన కర్తకూడా; ఒసఁగన్= ఈయగా; కొనినవాఁడు= స్వీకరించినవాడు; ఇది= ఈ ఫలితం; తనకున్= స్వీకరించిన తనకు; తక్కువ= చాలినది కాదు; అని; తలంచి= ఆలోచించి, ఉత్తమ గోయుగళంబు= మంచి ఆవుల జంటను; విలిచి= కొని.

**తాత్పర్యం:** వారిలో ఆ తగవులాడుకొనువారిలో ఒకడు గోదానం చేశాడు. మరొకడు ఆ గోదానఫలితం తన కిమ్మన్నాడు. దానకర్త ప్రేమతో దానఫలాన్ని ఆ అర్థికి ధారపోసి ఇచ్చాడు. అయితే ఆ అర్థి తనకు ఆ ఫలితం చాలినదికాదు అనే భావనతో తాను మంచి ఆవుల జంటను కొన్నాడు. (బహుశః దానం కొరకే కావచ్చు.)

**వ. సత్ పాత్ర దానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్ను దనకు గోదాన ఫలం బిచ్చిన యతని కిచ్చువాఁ డయిన నతండు గొనువాఁ డయి యుండి కొనక యెడసేసి తిరుగం దిరుగ నప్పుడు ముట్టం బట్టిన వాదు పుట్టిన వచ్చినవారై; రత్తెఱం గెల్ల నుక్తి ప్రత్యుక్తుల నప్పడమిరేనికి నేర్పడం జెప్పి; రట్లు సెప్ప వినిన యవ్విభుతోడఁ దొలుత నొసంగినవాఁ 'డితం డడిగిన నెమ్మిం బ్రతిగ్రహింపఁగా నొసంగితిఁ బ్రతిగ్రహంబొల్లని నన్ను నితండు నిర్బంధింపం దగునే?' యని చెప్పినఁ బిదపటి యాతం 'డితండు గొనియెద నని యొడంబడి కొనమి పాతకం బగుట కర్మకాండవిదు లెల్ల నెఱుంగుదు' రనవుడుఁ గౌశికుం డిక్ష్వాకు నుద్దేశించి 'వింటె? యప్పురుషుని వచనంబు'లని పలికి వెండియు. 156**

**ప్రతిపదార్థం:** సత్ పాత్ర దానక్రియ= మంచి అర్హునకు దానమిచ్చుటను; నిర్వర్తించి= చేసి; తద్+ఫలంబు= ఆ దానఫలితాన్ని; మున్ను= పూర్వం; తనకున్; గోదాన ఫలంబు= గోవును దానం చేయగా లభించిన ఫలితమును; ఇచ్చిన+అతనికిన్= తనకిచ్చినవాడికి; ఇచ్చువాఁడు+అయినన్= (తాను) దానం ఇచ్చేవాడు కాగా; అతండు= ఆ తనకు ఇచ్చినవాడు; కొనువాఁడు+అయి+ఉండి= తీసికొనబోయేవాడయి ఉండి; కొనక= తీసికొనకుండా; ఎడ+చేసి= దూరంచేసి; తిరుగన్+తిరుగన్= తిరుగగా తిరుగగా; అప్పుడు= ఆ సమయాన; ముట్టన్+పట్టినన్= నిర్బంధముగా పట్టుకోగా; వాదుపుట్టినన్= (ఇద్దరికీ) తగవులాట పుట్టగా; వచ్చినవారు+ఐరి= చేరినవారైనారు; ఆ+తెఱంగు+ఎల్లన్= ఆ పద్ధతి మొత్తం; ఉక్తి+ప్రతి+ఉక్తులన్= మాట, (దానికి) బదులు మాటలతో; ఆ+పుడమిరేనికిన్= ఆ రాజునకు; ఏర్పడన్= స్పష్టంగా; చెప్పిరి= తెలిపిరి; అట్లు= ఆ విధంగా; చెప్పన్= చెప్పగా; వినిన ఆ+విభునితోడన్= విన్న ఆ రాజుతో; తొలుతన్+ఒసంగినవాఁడు= మొదట ఇచ్చినవాడు; ఇతండు= ఇతడు (రెండవవాడిని

ఉద్దేశించి); అడిగినన్= అర్థింపగా; నెమ్మిన్= ప్రీతితో; ప్రతిగ్రహింపఁగాన్= స్వీకరించటానికి; ఒసంగితిన్= ఇచ్చాను; ప్రతిగ్రహంబు= దాన స్వీకారం; ఒల్లని నన్నున్= అంగీకరించని నన్ను; ఇతండు= నా దానఫలితమును ప్రతిగ్రహించిన ఈ ఎదుటి నరుడు; నిర్బంధింపన్+తగునే?= బలవంత పెట్టటం ఉచితమా?; అని చెప్పినన్= అని పలుకగా; పిదపటి+ఆతండు= తరువాతివాడు (మొదట గోదాన ఫలగ్రహీత); ఇతండు= ఈ నరుడు; కొనియెదన్+అని= తీసికొంటాను (గోదాన ఫలితాన్ని) అని; ఒడంబడి= అంగీకరించి; కొనమి= గ్రహించకుండటం; పాతకంబు+అగుట= పాపము అగుట; కర్మకాండవిదులు+ఎల్లన్= కర్మకాండలు, యజ్ఞాలు, హోమాలు, జపాలు, తపాలు, వ్రతాలు మొదలయిన పనుల పద్ధతులు తెలిసినవారు అందరూ; ఎఱుంగుదురు= తెలియుదురు; అనవుడున్= అన్న తరువాత; కౌశికుండు= కౌశిక బ్రాహ్మణుడు; ఇక్ష్వాకుని+ఉద్దేశించి= ఇక్ష్వాకు మహారాజును గురించి; ఆ+పురుషుని వచనంబులు= ఆ నరుడి మాటలు; వింటే?= విన్నావా?; అని; పలికి= చెప్పి; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** గోదాన ఫలగ్రహీత, గోదాన ఫలంగా తనకు లభించినది అల్పమని భావించి తాను స్వయంగా రెండు ఆవులను కొని, అర్హుడిని ఎన్నుకొని ఆ ఆవుల జంటను అతడికి దానం చేసి, ఆ దానఫలాన్ని తనకు ముందు గోదానఫలాన్ని అర్పించినవాడికి ఈయబోగా అతడు స్వీకరిస్తానని అంగీకరించి, తరువాత స్వీకరించక తప్పించుకొని తిరుగసాగాడు. ఆ తప్పించుక తిరుగాడేవాడిని ఒకనాడు ఆ ఈయదలచినవాడు గట్టిగా పట్టుకొని, గోదాన ఫలాన్ని స్వీకరించుమని నిర్బంధించగా వారిద్దరికీ వాదు పుట్టి, దానిని తీర్చుమని ఈ ఇక్ష్వాకు మహారాజును ఆశ్రయించారు. వారిద్దరూ రాజు దగ్గర తమవృత్తాంతాన్ని జరిగినదాన్ని జరిగినట్లుగా విన్నవించుకొనగా ఆ రాజు వారి వివాదచరిత్రను మొత్తాన్ని విన్నాడు. అపుడు ఆ ఇరువురిలో మొదటివాడు రాజుతో 'ఈతడు అర్థిస్తే, నా గోదానఫలాన్ని తీసికొమ్మని అర్పించాను. నాకు మళ్ళీ ప్రతిగ్రహించే అభిప్రాయం లేదు. అయినపుడు ఈతడు నన్ను నిర్బంధించవచ్చునా?' అని అన్నాడు. ఇక రెండవవాడు 'ఇతడు తీసికొంటాను అని అంగీకరించి, తరువాత ఆ గోదానఫలాన్ని తీసికొనకపోవటం పాపమే అవుతుంది - అని కర్మకాండ తెలిసిన వారందరూ ఎరిగిన విషయమే.' అన్నాడు. ఆ సమయాన కౌశికుడు రాజు నుద్దేశించి 'రాజా! విన్నావా ఆ నరుడి మాటలు?' అని పలికి, ఇంకా ఈ విధంగా అనబోతూ ఉన్నాడు.

**విశేషం:** వాస్తవానికి ఇది కౌశిక ఇక్ష్వాకుల వివాదాన్ని పరిష్కరించే ఆశయంతో కల్పితమైన కథ. వీరి వివాదపు పోలికలే ఇపుడా ఇరువురు పురుషుల (గోదానఫల గ్రహణప్రతిగ్రహణ సంబంధులు) వాదులోనూ ఉన్నాయి. కాబట్టి ఇక్కడి పరిష్కారమే అక్కడి పరిష్కారం కూడా.

**క. 'నృప! నీవు మదీయంబగు । జపము ఫలం బడిగి; తేను సమ్మతి నీఁగా**
**విపరీత ఫణితు లాడిన । శపియింతుఁ జుమీ! యెఱుంగఁ జాటితి నీకున్.' 157**

**ప్రతిపదార్థం:** నృప!= రాజా!; నీవు; మదీయంబు+అగు= నాకు చెందినదగు; జపము ఫలంబు= జపముయొక్క ఫలితమును; అడిగితి(వి)= అర్థించావు; ఏను= నేను; సమ్మతిన్= అంగీకారంతో; ఈఁగాన్= ఈయగా; విపరీత ఫణితులు= వ్యతిరేకమైన మాటలు; ఆడినన్= పలికినచో; శపియింతున్+చుమీ= శపిస్తాను సుమా!; నీకున్= విపరీతపు మాటలాడే నీకు; ఎఱుంగన్= తెలిసేటట్లుగా; చాటితిన్= ప్రకటించాను.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఇక్ష్వాకూ! నీవు నా జపఫలితం మొత్తమిమ్మని అర్థించావు. నేను అంగీకారంతో ఈయబోతే ఇపుడు ఏవో వ్యతిరేకమైన మాటలు పలుకుతున్నావు. నీకు ఇదే చాటుతున్నాను - నీవు నా జపఫలాన్ని గ్రహించకపోతే నిన్ను నేను శపిస్తాను సుమా!'

**విశేషం:** ఇక్కడ 'విపరీతఫణితులు' అనే మాట నేటి మనవ్యవహారంలోవలె 'ఎక్కువ' అనే అర్థంలో వాడబడలేదు. 'వాడు విపరీతంగా కొట్టాడు' వంటి వ్యవహారంలో 'విపరీత' శబ్దాన్ని ఎక్కువ అనే అర్థంలోనే వాడుతున్నాం. కాని, ఆ మాటకు నిజమైన అర్థం వ్యతిరేకం అని. సుఖం × దుఃఖం. ఇక్కడ నీవు గ్రహించుమంటే నీవూ గ్రహించుమని అనటం వ్యతిరేక భాషితమన్నమాట.

**తే.** **అనిన నాతఁడు భయమంది యాత్మలోన । 'నొరుల యీగికి నకట చే యొడ్డకుండు**
**నట్టి నా కిది వలసెనే!' యనుచుఁ గరము । సాఁచె నవ్విప్రు దెసకు నిశ్చయముతోడ. 158**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిన పిదప; ఆతఁడు= ఆ ఇక్ష్వాకు మహారాజు; భయము+అంది= భయపడి; ఆత్మలోనన్= మనస్సులో, తనలో; ఒరుల+ఈగికిన్= ఇతరుల దానమునకు; చేయి+ఒడ్డక+ఉండునట్టి నాకున్= చేయి చాచక ఉండే నాకు; అకట!= అయ్యో!; ఇది= ఈ దాన పరిగ్రహణం; వలసెనే!= చేయవలసి వచ్చెనే!; అనుచున్= పలుకుతూ; ఆ+విప్రుదెసకున్= ఆ బ్రాహ్మణుడి వైపునకు; నిశ్చయముతోడన్= గట్టితలంపుతో; కరము= చేయి (దాన స్వీకారం కొరకు); చాఁచెన్= సారించాడు.

**తాత్పర్యం:** కౌశికుడి శాపప్రకటనతో ఆ రాజు భయపడి తనలో 'అయ్యో! ఇతరుల దానానికి ఏనాడూ చేయి చాచి ఎరుగని నాకు ఈనాడు ఇతడి నుండి దానప్రతిగ్రహణం కొరకు చేయి చాచవలసివచ్చెనే' అని అనుకొంటూ ఆ బ్రాహ్మణుడివైపు స్థిరసంకల్పంతో తన చేతిని చాచాడు - దాన మిమ్మని.

**విశేషం:** దాతచేయి పైనా, గ్రహీత చేయిక్రిందా ఉండటం దానక్రియలో తప్పనిసరి. దాత దానాన్ని ప్రకటించి, దానిని తాను వదలుకొంటున్నట్లు గుర్తుగా జలధారను (గ్రహీతచేతిలో) పోసి, ఆ దత్తమైనదానియెడ తన అధికారాన్ని త్యజిస్తాడు. 'నీళ్ళు వదలుట' అంటే స్వత్వాన్ని, అధికారాన్ని వదలటమే - అనే అర్థం - ఈ దానక్రియలోని ఈ ప్రక్రియనుబట్టే వచ్చి ఉంటుంది.

**వ.** **అతండు 'ననేక వర్షంబులు సేసిన జపఫలంబంతయు నీకిచ్చితి' ననుచు ధారవోసిన నమ్మహీసురువరు నాననం బాలోకించి భూపాలుండు 'నా కరంబున జలంబులు వడియె మనకు నిద్దఱకును సత్కర్మ సమత్వంబు గలుగవలదే? నాయదియైన యాగఫలం బేనును నీ కిచ్చెదఁ గైకొను'మని పలికె. నట్టియెడ వికృతవేషులగు నప్పురుషు లిరువురు నన్నరనాథు నుద్దేశించి 'యేము కామక్రోధులము. ధర్మయమాదులచేతను మాచేతను మీరిద్దఱుం బరీక్షితులరైతి రింతియ కాని యిచ్చుటయుఁ గొనుటయును నివి దైవాచరితంబులు మీకుం బనిగా' దని పలికిన విని యవ్విప్రుండు భూవిభునితో నిట్లనియె. 159**

**ప్రతిపదార్థం:** అతండున్= ఆ కౌశికుడును; అనేక వర్షంబులు= పెక్కు ఏళ్ళు; చేసిన= ఒనర్చిన; జపఫలంబు+అంతయున్= జపముయొక్క ఫలితం మొత్తమును; నీకున్= అర్థివి అయిన నీకు; ఇచ్చితిన్+అనుచున్= దానం చేశాను అంటూ; ధార+పోసినన్= (నీటి చాలును) ధారను విడువగా; ఆ+మహీసురవరు+ఆననంబు= ఆ బ్రాహ్మణుడి మొగము; ఆలోకించి= చూచి; భూపాలుండు= రాజు; నా కరంబునన్= నా చేతియందు; జలంబులు= నీళ్ళు; పడియెన్= పడినవి; మనకున్+ఇద్దఱకును= మన ఇద్దరకూ; సత్+కర్మసమత్వంబు= పుణ్యాం సమానమై ఉండటం; కలుగన్+వలదే?= కలుగవద్దా?; నా+అది+అయిన= నాదైన - నాకు చెందిన; యాగఫలంబు= యజ్ఞఫలితము; ఏనును= నేను కూడా; నీకున్+ఇచ్చెదన్= నీకు అర్పిస్తాను; కైకొనుము= తీసికొనుము- స్వీకరింపుము; అని; పలికెన్= అనెను; అట్టి+ఎడన్= ఆ సమయాన; వికృత వేషులు+అగు= వికారమైన గుడ్డలు నగలు మొదలగునవి గల; ఆ+పురుషులు+ఇరువురున్= ఆ నరులు ఇద్దరును; ఆ+నరనాథున్= ఆ రాజును; ఉద్దేశించి= గురించి - లక్ష్యంగాచేసి; ఏము= మేము; కామక్రోధులము= కామం (కోరిక) క్రోధం (కోపం) అనే దుర్గుణాలందు; ధర్మయమ+ఆదులచేతను= ధర్మదేవత, యమధర్మరాజు మొదలైన వారిచేతను; మాచేతను= కామక్రోధులమైన మా ఇరువురిచేతను; మీరు+ఇద్దఱున్= మీరలు ఇరువురూ; పరి+ఈక్షితులరు+ఐతిరి= పరిశోధితులు అయ్యారు; ఇంతి+అ+కాని= ఇంతేకాని; ఇచ్చుటయున్= దానమును; కొనుటయున్=

స్వీకారమును; ఇవి= ఈ రెండు క్రియలూ; దైవ+ఆచరితంబులు= దైవంచేత చేయబడినవి; మీకున్+పని+కాదు+అని= మీకు పనులు కావు అని; పలికినన్= చెప్పగా; విని= ఆలకించి; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; భూ విభునితోన్= రాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** రాజు దానస్వీకారం కొరకు చేయిచాచి నిలబడగా బ్రాహ్మణుడు 'పెక్కుఏండ్లు చేసిన జపఫలితం మొత్తం నీకిచ్చా'నంటూ, తనచేతి నీటిని రాజుచేతిలో ధారగా పోశాడు. అప్పుడు రాజు ఆ బ్రాహ్మణుడి మొగం చూచి, 'నాచేతిలో నీళ్ళు పడ్డాయి. నేను దానం తీసికొన్నాను. మరి మన ఇరువురి పుణ్యం సమానంగా ఉండవద్దా? కాబట్టి నేను చేసిన యజ్ఞపు ఫలితాన్ని నేనూ నీ కిస్తాను తీసికొమ్ము' అన్నాడు. ఆ సమయాన ఆ వికృతవేషులయిన నరులిద్దరూ ఆ రాజును ఉద్దేశించి - తాము కామక్రోధాలనే నరుడి అంతశ్శత్రువులు ఆర్గురిలో తొలి ఇద్దరమనీ, తామూ, ధర్మదేవత, యమధర్మరాజు, కాలపురుషుడు, మృత్యు దేవతా -ఈ అందరూ కలిసి ఆ కౌశిక ఇక్ష్వాకులను ఇద్దరినీ పరీక్షించామనీ తెలిపి, ఇదంతా పరీక్షకొరకు సంఘటిల్లినదే తప్ప నిజానికి దానప్రతిగ్రహణాలు అనేవిదైవం చేసే చేష్టితాలు గాని, మానవక్రియలు కాబోవని పలికారు. ఆ పలుకులు విని, కౌశికుడు ఆ రాజుతోఇట్లా అన్నాడు.

**విశేషం:** దాత చేసే దానాన్ని గ్రహించేవాడు ఆ దానంతోపాటు దాత దుష్కృత్యాల ఫలితాన్నీ తీసికొనవలసి ఉంటుందని ఒక విశ్వాసం. ఎక్కువ దానాలు పాపపరిహారం కొరకే ఉద్దిష్టమైనాయి. మరి పాపం పరిహృతం కావటం ఎట్లు? దాతనుండి గ్రహీతకు అవి సంక్రమిస్తాయని విశ్వసించేవారు. అందుకనే ఈ దానధర్మాలు స్వీకరించకుండా ఉండటం మంచి గొప్ప లక్షణంగా 'అపరిగ్రహ' వ్రతంగా భావించేవారు. దానగ్రహీతలు జపతప ఉపవాసాది క్రియలతో ఆ సంక్రాంతమైన పాపాలనుండి విముక్తులయ్యేవారట!

**ఆ. 'శ్రద్ధయును బలంబు జపవిధియందు సా । విత్రి నాకు నిచ్చె వేఱజపము**
**నాచరింపఁ దగునె? యైనను నిందఱ । యెదుర నీవు గోరి తివ్విధంబు. 160**

**ప్రతిపదార్థం:** సావిత్రి= జపాధిదేవత; నాకున్= జపశీలినయిన నాకు; జపవిధియందున్= జపం అనే పనిలో; శ్రద్ధయును= ఎక్కువ ఆదరమూ; బలంబున్= శక్తీ; ఇచ్చెన్= ఇచ్చింది; వేఱు+అ= వేరుగా, విడిగా; జపమున్= జపక్రియను; ఆచరింపన్= చేయటం; తగును+ఎ?= ఉచితమా? - కాదు; ఐనను= కాకపోయినా; ఇందఱ+ఎదురన్= ఇంత మంది ఎదుట, ధర్మయమకాల ప్రముఖుల ముందర; నీవు= నా దానమును స్వీకరించినట్టి నీవు; ఈ+విధంబు= ఈ పద్ధతిగా (పుణ్యాలు సమానాలు కావాలి అంటూ); కోరితి(వి)= అర్థించావు.

**తాత్పర్యం:** 'నేను జపాధిదేవత సావిత్రీదేవినుండి శ్రద్ధను, శక్తిని జపనిర్వహణ కొరకు దానంగా స్వీకరించి ఉన్నాను. ఇక ఇపుడు వేరుగా జపక్రియ చేయవలసిన పనీ లేదు. నా కోరికలు, యాచనలు, అక్కరలు ఏవైనా ఉంటే, అవి అన్నీ జపంకొరకు ఉద్దిష్టమైనవే. ఆ జపం అవసరమే తీరిన నాకు దానగ్రహణ అవసరమూ ఉండదు. అయినా ఇందరు పెద్దలముందర నీవు మన పుణ్యాలు సమానంగా ఉండవద్దా? - అంటూ నాకు దానమీయ సంకల్పించి అర్థించావు.

**విశేషం:** లోకంలో కూడా ఎన్నో మొండిగా ఆగిపోయిన పనులు కూడా, కొందరు ప్రముఖుల సమ్ముఖాన ఇట్టే జరిగిపోతూ ఉండటం మనం గమనిస్తాం. అట్లాగే ఇక్కడ కూడా. ఎప్పటినుండో తిరస్కృతమౌతూ వస్తున్న రాజు కోరిక అతడికి అభీష్టమయిన క్రియ, ఇపుడు ఈ ఎదుట పెద్దదేవతల సమక్షాన తీరబోతున్నట్లుగా అనిపిస్తున్నది. కొందరు పెద్దల సమ్ముఖమూ ప్రయోజనకారి మరి!

**క. కావునఁ బ్రార్థన సెఱుపం । గా వెఱచెద నట్ల కాక! గైకొంటి ధరి**
**త్రీవల్లభ! నీ సుకృతం । బే వెంటం దిగిచె నరుగు మీ వగ్గతికిన్.' 161**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ప్ర+అర్థన= గొప్ప కోరిక; చెఱుపన్+కాన్= భంగపరచుటకు; వెఱచెదన్= భయపడతాను; అట్లు+అ= అట్లే, నీవన్నట్లే; కాక!= అగుగాక!; ధరిత్రీవల్లభ!= ఓ రాజా!; నీ సుకృతంబు= నీ పుణ్యం; కైకొంటిన్= స్వీకరించాను; ఈవు= నీవు; ఏ వెంటన్= ఏ మార్గము(న); తిగిచెన్= లాగెనో, ఆకర్షించెనో; ఆ+గతికిన్= ఆ మార్గాన; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** ఓ రాజా! నా అవసరంతో నిమిత్తంలేకుండా ఇందరి ఎదుట అర్థించిన నీ కోరికను భంగపరచటానికి వెరచి, నీ పుణ్యాన్ని నేను గ్రహించాను. ఇక నీవు నీకు అభీష్టమైన మార్గాన వెళ్ళుము'. (అన్నాడు కౌశికుడు.)

**విశేషం:** మొత్తం మీద బ్రాహ్మణ క్షత్రియు లిరువురూ తమతమ అభీష్టాలను నెరవేర్చుకొనగలిగారు. ఒకరు ఆలోచన మెదడు, మరొకరు శక్తి - నిర్వహణ. ఈ రెండూ ఘర్షణపడటం దేశానికి మేలుకాదు. ఘర్షణవైపుగా పయనించినా చివరకు సమన్వయపూర్వకంగా ముగియటమే మేధాభుజశక్తులకు ఉచితం.

**వ.** **అనియె నయ్యిరువుర సత్కర్మనిష్ఠావిశేషంబునం బ్రీతులయి బ్రహ్మాదిదేవతలు వారల మీఁదం బుష్పవృష్టి గురియించుచు నయ్యెడకు నరుగుదెంచి యభినందించిరి; దేవతూర్యంబులు మొరయ నప్సరోగణంబు లాడుచుం బాడుచు నుల్లసిల్లె; నయ్యవసరంబునఁ గౌశికు నిక్ష్వాకు నుద్దేశించి నాకం బిట్లనియె.162**

**ప్రతిపదార్థం:** అనియెన్= అనెను; ఆ+ఇరువుర సత్+కర్మనిష్ఠా విశేషంబునన్= ఆ ఇద్దరి మంచి పనులయెడ (గల) శ్రద్ధాతిశయానికి; ప్రీతులు+అయి= సంతసించినవారై; బ్రహ్మ+ఆది దేవతలు= బ్రహ్మ మొదలగు సురలు; వారల మీఁదన్= ఆ ఇద్దరి మీదా; పుష్ప వృష్టి= పూలవాన; కురియించుచున్= కురిసేటట్లు చేస్తూ; ఆ+ఎడకున్= ఆ స్థలానికి; అరుగు+తెంచి= వచ్చి; అభినందించిరి= ప్రశంసించారు; దేవతూర్యంబులు= దేవతల వాద్యాలు; మొరయన్= మ్రోగగా; అప్సరస్+గణంబులు= అప్సరసల సమూహాలు; ఆడుచున్= నాట్యం చేస్తూ; పాడుచున్= గానం చేస్తూ; ఉల్లసిల్లెన్= ఒప్పారాయి; ఆ+అవసరంబునన్= ఆ సమయాన; కౌశికున్+ఇక్ష్వాకున్+ఉద్దేశించి= కౌశికుడినీ, ఇక్ష్వాకువునూ గురించి; నాకంబు= స్వర్గం; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణ క్షత్రియు లిద్దరూ ధర్మపుణ్యకార్య నిర్వహణంలో కనబరచిన అరుదైన శ్రద్ధాసక్తులకు బ్రహ్మ మొదలైన దేవతలు సంతోషించి, వారిమీద పూలవాన కురిపిస్తూ అక్కడకు వచ్చి, వారిని అభినందించారు. దేవతల వాద్యాలు మ్రోగాయి. అప్సరసలు వేడుకగా ఆడారు, పాడారు కూడా. ఆ సమయాన స్వర్గం (మానవాకారంతో వారిచెంతనే ఉన్నది ఇంతవరకు) ఆ కౌశికుడినీ, ఇక్ష్వాకువునూ ఉద్దేశించి ఇట్లా అన్నది.

**తే.** **'అనఘులార! సంసిద్ధుల రయితి రింకఁ। దడయనేటికి? నిర్మలోదాత్తగతికి**
**నుత్సహింతురుగా' కన్న మత్సరాది। బంధకంబులఁ బోఁ ద్రోచి బ్రాహ్మణుండు. 163**

**ప్రతిపదార్థం:** అనఘులార!= ఓ పాపరహితులారా!; సంసిద్ధులరు+అయితిరి= మంచి సిద్ధిని పొందినవారు అయ్యారు; ఇంకన్= ఇకపై; తడయన్= ఆలసించటం, జాగుచేయటం; ఏటికిన్?= ఎందుకు?; నిర్మల+ఉదాత్తగతికిన్= మలినంలేని గొప్ప గమనానికి-మహాప్రస్థానానికి; ఉత్సహింతురు గాక!= ఉత్సాహం చూపుదురు గాక! - తొందర పడెదరు గాక!; అన్నన్= అనగా; బ్రాహ్మణుండు= కౌశికుడు; మత్సర+ఆది బంధకంబులన్= ఈర్ష్య మొదలైన ముడులను; బంధాలను; పోన్+త్రోసి= తొలగ నెట్టి.

**తాత్పర్యం:** 'ఓ పాపరహితులారా! మీరిద్దరూ గొప్ప సిద్ధిని పొందారు. ఇక ఆలసించటం ఎందుకు? మహాప్రస్థానానికి-నిర్మలమైన చిట్టచివరి గొప్ప ప్రయాణానికి ఆయత్తం కండి' అని స్వర్గం పలికినవెంటనే బ్రాహ్మణుడు తన ఈర్ష్యాది బంధనాలు తెగనరికికొని, అంతిమయాత్రకు ఉద్యుక్తుడయ్యాడు.

**వ.** **ధర్మయమాదులను నాదిత్య సంఘంబును సవినయ ప్రణామ సహితంబుగా నామంత్రితులం జేసి.164**

**ప్రతిపదార్థం:** ధర్మయమ+ఆదులను= ధర్మదేవత, యముడు మొదలైన వారిని; ఆదిత్యసంఘంబును= దేవ సమూహమును, తమను అభినందింప వచ్చిన వారిని; సవినయ ప్రణామ సహితంబుగాన్= అణకువతో కూడిన నమస్కారాలతో కూడినట్లుగా; ఆమంత్రితులన్+చేసి= వీడ్కొనేవారినిగా చేసి.

**తాత్పర్యం:** తమను పరీక్షించిన ధర్మదేవతనూ, తదనుయాయులయిన యమకాల మృత్యుదేవతలనూ, తమను అభినందించిన దేవగణాన్నీ అణకువతో నమస్కరిస్తూ వీడ్కొలిపాడు.

**కౌశికేక్ష్వాకులు బ్రహ్మపదప్రాప్తు లగుట (సం. 12-193-18)**

**క. వాయువుల నియతవృత్తి మ। నో యంత్రణ బొమలనడుమ నూల్కొల్పి విచే**
**ష్టాయిత శరీరుఁడై మూ। ర్థా యోజితములుగఁ జేసి యత్తలఁ జేర్చెన్. 165**

**ప్రతిపదార్థం:** వాయువులన్= శరీరంలోని గాలులను, ప్రాణ, అపాన, సమానములను; నియతవృత్తిన్= స్థిరమైన వర్తనతో; మనస్+యంత్రణన్= మనస్సును నిగ్రహించటంవలన; బొమల నడుమన్= కనుబొమ్మల మధ్యభాగాన; నూల్కొల్పి= నిల్పి; విచేష్టాయిత శరీరుఁడు+ఐ= చేష్టలు ఉడిగిన దేహం కలవాడై; మూర్ధ+ఆయోజితములుగన్+చేసి= శీర్షమునకు (తలకు) చేర్చబడినవిగా చేసి (గాలులను); ఆ+తలన్= ఆ తలను, తలయందు, కొనభాగాన; చేర్చెన్= చేర్చాడు.

**తాత్పర్యం:** శరీరంలోని వాయువులను (హృదయాన ప్రాణం, గుదమున అపానం, నాభియందు సమానం) స్థిరమైన నడకతో కనుబొమల నడుమకు తెచ్చి (యోగం ద్వారా), మనస్సును అదుపుచేసి, చేష్టలు ఉడిగిన శరీరంతో, ఆ వాయువులను శీర్షానికి చేర్చి, అక్కడినుండి శీర్షం అగ్రభాగానికి కొనిపోయాడు కౌశికుడు. (యోగవిద్య ద్వారా శరీరపరిత్యాగం చేస్తున్నాడు అన్నమాట. శీర్షాగ్ర భాగం నుండి వాయువులు బ్రహ్మరంధ్రాన్ని ఛేదించుకొని బయటపడతాయి. అదే శరీరపరిత్యాగం.)

**వ. అప్పుడు తదీయ బ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలాకృతియుం బ్రాదేశ మాత్రుండును నగు పురుషు నెదుర్కొని పరమేష్ఠి సమాధానంబున 'వచ్చితే?' యని పలికి వెండియు. 166**

**ప్రతిపదార్థం:** అప్పుడు= కౌశికుడు శరీరాంతర్గత వాయువులను శిరస్సు అగ్ర భాగానికి చేర్చినప్పుడు; తదీయ బ్రహ్మరంధ్ర+ఉద్గతుండును= అతడిదైన బ్రహ్మరంధ్రం, మాడుపట్టునుండి పైకెగసినవాడూ; మహాజ్యోతిర్+జ్వాలా+ఆకృతియున్= గొప్ప కాంతియొక్క శిఖ ఆకారం వంటి ఆకారం కలవాడూ; ప్రాదేశ మాత్రుండును= లొడితెడు - చూపుడు వ్రేలిని బొటనవ్రేలిని చాచిపట్టిన కొలత మాత్రం కలవాడు; అగు పురుషున్= అయిన నరుడిని; పరమేష్ఠి= బ్రహ్మదేవుడు; ఎదుర్కొని= ఎదురుగా వచ్చి; సమ్+ఆధానంబున్= అంగీకారంతో; వచ్చితి+ఏ?= వచ్చావా?; అని; పలికి= మాట్లాడి; వెండియున్= మరియును.

**తాత్పర్యం:** శరీరాంతర్గతవాయువు శిరస్సును చేరి బ్రహ్మరంధ్రంగుండా బయల్వెడలగా, వెంటనే ఆ రంధ్రంనుండి గొప్ప కాంతిశిఖరంవంటి ఆకారంతో లొడితెడు కొలతగల పురుషుడు (ఆత్మ) బయటికి వచ్చాడు. ఆ వచ్చినవాడిని బ్రహ్మదేవుడు ఎదురేగి అంగీకార పూర్వకంగా 'వచ్చావు కదా!' అని పలకరించి, ఇంకా ఇట్లా ప్రసంగించాడు.

**విశేషం:** శరీరం కంటే భిన్నంగా ఆత్మ ఉన్నదని నమ్మేవారు, ఆ ఆత్మ రూపురేఖల గురించిన వివరాలూ ఇచ్చారు. అవే ఇక్కడ చెప్పబడ్డాయి. ఆత్మ కొలత - లొడితెడు. ఆకారం; జ్యోతిశ్శిఖ - వెలుగుకొన; దానికే పురుషనామం కూడా ఉంటుంది.

**తే.** **జాపకులకు యోగులకును సమమ పుణ్య। గతివిశేషంబు ప్రత్యక్ష కలితమందు**
**జాపకులు నిర్భరోత్థానశక్తి నధికు। లనుచు వక్త్రంబు విచ్చి రమ్మనియె నధిప! 167**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; జాపకులకున్= జపం చేసేవారికీ; యోగులకును= యోగంచేసేవారికీ; పుణ్యగతివిశేషంబు= పుణ్యంవలన కలిగే విశేషగతులు - గొప్ప పదాలు; సమము+అ= సమానమే; ప్రతి+అక్షకలితము= కన్నుల ఎదుట (ప్రత్యక్షంగా) నిరూపితం; అందున్= ఆ ఇరువురిలో; జాపకులు= జపశీలురు; నిర్భర+ఉత్థాన శక్తిన్= భారరహితంగా పైకెగసే శక్తితో; అధికులు= యోగులకంటె మిన్న అయినవారు; అనుచున్= అంటూ; వక్త్రంబు విచ్చి= నోరు తెరచి; రమ్ము+అనియెన్= 'రా' అన్నాడు.

**తాత్పర్యం:** బ్రహ్మ జపశీలురకూ యోగులకూ గల సామ్య, ఆధిక్యాలను వివరిస్తున్నాడు కౌశికుడికి. శరీరపరిత్యాగ అనంతరం జపశీలురూ, యోగులూ ఇద్దరూ సమానమైన పుణ్యగతులనే పొందుతారు. అక్కడ భేదం లేదు. అయితే జపశీలురు భారరహితంగా పైకెగసే శక్తికలిగి, యోగులకంటె మిన్నగా నిలుస్తారు. అని అంటూ, 'కౌశికా రమ్మ' అంటూ తన నోటిని తెరిచాడు బ్రహ్మదేవుడు.

**వ.** **అనుటయు. 168**

**తాత్పర్యం:** అనిన పిదప.

**తే.** **బ్రహ్మరంధ్ర నిర్గతుఁడైన బ్రాహ్మణుండు। బ్రహ్మవదనంబు సొచ్చె భూపతియు నట్ల**
**వెడలి తద్వక్త్ర మెప్పటి వికసనంబుఁ। బొంద నందుఁ బ్రవేశించె భూపవర్య! 169**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజశ్రేష్ఠా! ఓ ధర్మరాజా!; బ్రహ్మరంధ్ర నిర్+గతుఁడు+అయిన= బ్రహ్మరంధ్రంనుండి బయల్వెడలిన; బ్రాహ్మణుండు= కౌశికుడు; బ్రహ్మవదనంబు= బ్రహ్మనోరు; చొచ్చెన్= ప్రవేశించాడు; భూపతియున్= రాజుకూడా-ఇక్ష్వాకు మహారాజు కూడా; అట్లు+అ= అట్లే, ఆ విధంగానే, కౌశికునివలెనే; వెడలి= బయటికి (శరీరంనుండి) వచ్చి; తద్+వక్త్రము= అతడి- ఆ బ్రహ్మనోరు; ఎప్పటి వికసనంబు= ఎప్పటివలె తెరచికొనుటను; పొందన్= చెందగా - తెరచికొనగా; అందున్= ఆ నోటిలో; ప్రవేశించెన్= చొరబడ్డాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడి మాట ననుసరించి బ్రాహ్మణుడు ముందుగా బ్రహ్మనోట దూరి, అతడిలో ఐక్యమయ్యాడు. ఆ తరువాత ఇక్ష్వాకుమహారాజుకూడా కౌశికుడివలెనే శరీరాన్ని విడిచి, అతడివలెనే బ్రహ్మనోట దూరి బ్రహ్మైక్యం పొందాడు. ఈ విధంగా చివరకు ఇరువురూ బ్రహ్మలో లీనమయ్యారు.

**విశేషం:** జనవ్యవహారంలో కూడా 'బ్రహ్మైక్యం కావటం' వంటి మాటలు ఉన్నాయి. ఆ విధానమే వివరించినట్లయినది ఇక్కడ.

**క.** **దేవత లచ్చెరువడి య। ద్దేవుని నయ్యిరువురను నుతించి రజుఁడు సం**
**భావించె ధర్మమును నవ। నీవర! యప్పరమ విభుఁడు నిరుపమలీలన్. 170**

**ప్రతిపదార్థం:** అవనీవర!= ఓ రాజా!; దేవతలు= సురలు; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; ఆ+దేవునిన్= ఆ బ్రహ్మదేవుడినీ; ఆ+ఇరువురను= ఆ బ్రాహ్మణ క్షత్రియులిద్దరినీ; నుతించిరి= పొగడిరి; అజుఁడు= బ్రహ్మదేవుడు; ధర్మమును= ధర్మదేవతను; సంభావించెన్= గౌరవించాడు; ఆ+పరమ విభుఁడు= ఆ గొప్ప దొర బ్రహ్మదేవుడు; నిర్+ఉపమలీలన్= పోలికలేని రీతిలో. (అనంతర వాక్యానికి అన్వయం.)

**తాత్పర్యం:** ఈ నరులిద్దరూ బ్రహ్మైక్యం కావటమన్న మొత్తం ప్రక్రియను చూచిన దేవతలు ఆశ్చర్యపోయారు. ఆ బ్రహ్మదేవుడినీ, ఆయనలో లీనమైపోయిన కౌశిక ఇక్ష్వాకువులనూ వారు ప్రస్తుతించారు. అనంతరం బ్రహ్మదేవుడు ధర్మదేవతను - ఈ కార్యక్రమసర్వస్వానికీ ఆదిని నిలిచి నడిపించినదానిని గౌరవపురస్సరంగా వీడ్కొన్నాడు.

**వ. తదనంతరంబ యంతర్హితుం డయ్యెఁ; దక్కినవారును నిజస్థానంబుల కరిగిరి; జాపక ప్రకారంబును దదీయ సుగతి విశేషంబులు నెఱింగించితి; నీ వింక నెయ్యది వినవల తనవుడు నాపగాసుతునితోడం గుంతీతనయాగ్రజుండు 'నిరతిశయ జ్ఞానయోగంబు విధంబు వినువాంఛ నాకుం గలదు. సెప్పవే!' యనిన నప్పురుషుం డప్పౌరవోత్తమున కిట్లనియె. 'మను బృహస్పతి సంవాదం బను నితిహాసంబుగల దది నీయడిగిన యర్థంబునకు బోధకంబయి యుండు నాకర్ణింపుము. మను వాత్మీయగురుం డగు దేవగురునకుం బ్రణమిల్లి యిట్లనియె. 171**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= దానివెంటనే - ధర్మదేవతను వీడ్కొనిన వెంటనే; అంతర్హితుండు= మాయమైనవాడు; అయ్యెన్= ఆయెను; తక్కినవారును= మిగిలినవారు కూడా - ధర్మము, యముడు, కాలం, మృత్యువు, స్వర్గం, కామం, క్రోధం అనే వారు కూడా; నిజస్థానంబులకున్= తమ స్థానాలకు; అరిగిరి= వెళ్ళారు; జాపక ప్రకారంబును= జపం చేసేవారి పద్ధతీ; తదీయ సుగతి విశేషంబులున్= వారి ముక్తి వివరాలూ; ఎఱింగించితిన్= తెలిపాను; నీవు; ఇంకన్= ఇంకనూ; ఏ+అది= ఏది; వినన్+వలతు(వు)?+అనవుడున్= వినుటకు ఇష్టపడెదవు?-అన్న పిదప; ఆపగాసుతునితోడన్= నది కుమారుడైన భీష్ముడితో; కుంతీతనయ+అగ్రజుండు= కుంతి కుమారులలో పెద్దవాడు ధర్మరాజు; నిర్+అతిశయ జ్ఞానయోగంబు విధంబు= మించుటలేని (తానే అన్నింటిని మించినదైన) జ్ఞానయోగముయొక్క పద్ధతిని; వినువాంఛ= వినే కోరిక; నాకున్= ధర్మరాజునైన నాకు; కలదు= ఉన్నది; చెప్పవు+ఏ?= చెప్పవా?; అనినన్= అనగా; ఆ+పురుషుండు= ఆ నరుడు - భీష్ముడు; ఆ+పౌరవ+ఉత్తమునకున్= ఆ పురువంశ రాజశ్రేష్ఠుడైన ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; మను బృహస్పతి సంవాదంబు+అను= మను బృహస్పతి సంవాదం అనే పేరుగల; ఇతిహాసంబు= (జరిగిన) చరిత్ర; కలదు= ఉన్నది; అది= ఆ సంవాదం; నీ+అడిగిన+అర్థంబునకున్= నీవు ప్రశ్నించిన జ్ఞానయోగానికి; బోధకంబు+అయి= తెలియజెప్పునదిగా; ఉండున్= ఉండగలదు; ఆకర్ణింపుము= వినుము; మనువు= ధర్మశాస్త్రకర్త అయిన మానవుల ఆదిపురుషుడు; ఆత్మీయగురుండు+అగు= తనకు గురువయిన; దేవగురునకున్= దేవతల గురువైన బృహస్పతికి; ప్రణమిల్లి= నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు ధర్మదేవతకు వీడ్కోలుపలికి, వెంటనే పోలికలేని రీతిలో మాయమైపోయాడు. మిగిలినవారూ తమ తమ స్థానాలకు చేరుకొన్నారు. ఈ విధంగా జపం చేసేవారి పద్ధతీ వారు పొందే ముక్తివిశేషాలు నీకు తెలియపరిచాను. ఇంకా ఏమి వినాలని అభిలషిస్తున్నావు? - అని భీష్ముడు తన మనుమడైన ధర్మరాజును ప్రశ్నించాడు. దానికి బదులుగా ధర్మరాజు తాను జ్ఞానయోగాన్ని - సర్వయోగాలనూ అతిక్రమించిన దానిని వినటానికి ఉవ్విళ్ళూరుతున్నట్లు చెప్పాడు. ఆ మాటకు ఆయన ధర్మరాజుతో 'మను బృహస్పతి సంవాదం' అనే పేరుతో ఒక ఇతిహాసం ఉన్నది. అది నీ ప్రశ్నకు సమాధానంగా ఉపయోగపడుతుంది. వినుము.' అంటూ మను బృహస్పతి సంవాదాన్ని వివరించబోతున్నాడు.

**విశేషం:** 'యోగము' అనే మాట 'యుజ్' ధాతువునుండి పుట్టినది. దానికి కలుపుట అని అర్థం. వేదాంత పరిభాషలో ఈ యోగశబ్దం ఎక్కువగా వాడబడుతూ ఉంటుంది. దేవుడిని, ముక్తిని పొందే మార్గాలలో కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం అనే మూడు మార్గాలు సుప్రసిద్ధాలు. కర్మల - యజ్ఞజపతపః ప్రభృతులద్వారా చేరితే కర్మయోగం; భక్తి - భజన - సేవ - కైంకర్యంద్వారా చేరితే భక్తి యోగం; జ్ఞానం - తెలివి - వివేకం ద్వారా, కేవలం బుద్ధివికాసంద్వారా చేరితే జ్ఞానయోగం. ఈ మూడింటిలో జ్ఞానయోగం

దుష్కరమనీ, దుర్గ్రహమని, ఒక పట్టాన అర్థం కానిది అని అంటారు తాత్త్వికులు. దానిని మిగిలిన రెండింటినీ మించిన దానినిగా కూడా పరిగణిస్తారు వారు. అందుకనే ఇక్కడ జ్ఞానయోగ శబ్దానికి నిరతిశయ అనే విశేషణం వాడబడినది.

'ఇతి+హ+ఆస' అనేది ఇతిహాస శబ్ద వ్యుత్పత్తి. దానికి 'అని కదా ఉండెను' అని అర్థం. ఎపుడో జరిగిన సంఘటనను పరంపరగా యథాతథంగా చెప్పుకొచ్చే పద్ధతిలో ఈ శబ్దం రూపుదాల్చినది. జరిగిన సంఘటన కాబట్టి దీనిని చరిత్ర శబ్దానికి పర్యాయంగా కూడా వాడటం జరుగుతున్నది. భారతంలో ఎన్నో ఇతిహాసాలను మనం ఇంతవరకు వింటూ వస్తున్నాం.

## మను బృహస్పతి సంవాదము (సం. 12-194-2)

**సీ.** **'జ్ఞానయోగము కృపాసంపన్న బుద్ధి నా । కెఱిఁగింపవే!' యన్న నెలమి నాతఁ**
**డతని కిట్లను 'ననఘ! సత్కర్మ యో । గ శ్రద్ధ దానికిఁ గారణం బ**
**నిష్టంబు ద్రోవను నిష్టంబు దేరను । నరుఁడు కర్మాచరణం బొనర్చు**
**నెయ్యవి సుఖము లొక్కింత కాలమునకు । నవియు దుఃఖంబులై యావహిల్లు;**

**ఆ.** **నింత యెఱిఁగి ఫలమునెడ నిరపేక్షుఁడౌ । నతఁడు సౌఖ్యదుఃఖయమముఁ ద్రోచి**
**కామముఖ్య విపదకంపిత జ్ఞాన వి । శేషబుద్ధిఁ బరమసిద్ధిఁ బొందు.'** **172**

**ప్రతిపదార్థం:** జ్ఞాన యోగము= జ్ఞానం ద్వారా దేవుడి ముక్తిని చేరే మార్గం; కృపా సంపన్న బుద్ధిన్= దయతో కూడిన బుద్ధితో; నాకున్= జ్ఞానార్థినైన నాకు; ఎఱిగింపవు+ఏ?= తెలియజేయవా?; అన్నన్= అనగా; ఎలమిన్= ప్రీతితో; అతఁడు= ఆ బృహస్పతి; అతనికిన్= ఆ మనువునకు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; అనఘ!= ఓ పాపరహితుడా!; సత్+కర్మయోగ(శ్రద్ధ= మంచి కర్మయోగమునందలి శ్రద్ధ; దానికిన్= ఆ జ్ఞానయోగానికి; కారణంబు= హేతువు - కలుగుటకు మూలం; అనిష్టంబు= ఇష్టము కానిది; త్రోవను; త్రోసివేయుటకు; ఇష్టంబు= కోరబడినది; తేరను= తెచ్చుటకు; నరుఁడు= మానవుడు; కర్మ+ఆచరణంబు= పనులను చేయటానికి; ఒనర్చున్= చేయును; ఒక్క+ఇంతకాలమునకున్= అతి స్వల్ప సమయమునకు; ఏ+అవి= ఏవి; సుఖములు= సౌఖ్యాలు - ఆనందమును కలిగించునవో; అవి+అ= అవియే - ఆ సుఖములే; దుఃఖంబులు+ఐ= బాధలై - కష్టములై; ఆవహిల్లును= కలుగును - పరిణమించును; ఇంత= ఈ మాత్రం; ఎఱిఁగి= తెలిసి; ఫలము+ఎడన్= ప్రయోజనం దెస; నిర్+అపేక్షుఁడౌ= అనాసక్తుడౌ- కోరికలేనివాడగు అతఁడు= వాడు; సౌఖ్య దుఃఖమయమున్= సుఖం-దుఃఖం అనే జంటను- ద్వంద్వమును; త్రోచి= తొలగించుకొని; కామ= కోరిక; ముఖ్య= మొదలగు; విపద్= ఆపదలనుండి; అకంపిత= చలించని, కదలని; జ్ఞాన విశేష బుద్ధిన్= గొప్ప జ్ఞానంతోడి బుద్ధితో; పరమసిద్ధిన్= గొప్ప సిద్ధిని, ముక్తిని; పొందున్= చెందును.

**తాత్పర్యం:** 'మనువు తన గురువైన బృహస్పతికి నమస్కరించి, 'కృపతో నాకు జ్ఞానయోగాన్ని, జ్ఞానంద్వారా ముక్తిని పొందే మార్గాన్ని తెలుపవా?' అని ప్రార్థించాడు. బృహస్పతి తెలుపుతున్నాడు. 'ఓ పాపరహితుడవైన మనూ! జ్ఞానయోగానికి మూలం మంచి కర్మయోగమే. అనిష్టాన్ని తొలగించుకొనటానికి, ఇష్టాన్ని అందుకొనటానికి మానవుడు కర్మ చేస్తాడు. ఏవి సుఖాలుగా అందుతాయో, అవే అనంతరకాలాన దుఃఖాలుగా పరిణమిస్తాయి. ఈ మాత్రం తెలిసికొని ఏ నరుడు తాను చేసే కర్మను ఫలం ఆశించకుండా తన విధిగా మాత్రమే చేస్తాడో - అతడు సుఖదుఃఖ ద్వంద్వాన్ని త్రోసేసి కామక్రోధాది అరిషడ్వర్గంనుండి వాటిల్లే విపత్తులనుండి చెదరని గొప్ప జ్ఞానంద్వారా గొప్ప సిద్ధిని ముక్తిని పొందుతాడు'.

**విశేషం:** మన తాత్త్వికులు నరుడికి అంతశ్శత్రువులు ఆరుగురు ఉన్నారని అంటారు. ఆ ఆరుగురు శత్రువులకూటమిని వారు 'అరిషడ్వర్గము' అని వ్యవహరిస్తారు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు - ఆ ఆరుగురు విరోధులట! ఇవి నరుడిలోని భావాలు కాక భావావేశాలు. ఇవే నరుడిని ముక్తికి దూరంగా ఉంచుతాయని, వీటి విజయమే ముక్తికి సోపానమని బోధిస్తారు. ఇక్కడ 'కామముఖ్య' విపత్తులు ఆ అరిషడ్వర్గం వలన ఏర్పడేవే. జ్ఞానం కలగాలి - అంటే అరిషడ్వర్గ విదూరుడు కావాలి.

**వ. అని వెండియు.** **173**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'అసమాలంబ మశబ్దము । రసగంధ స్పర్శరూప రహితం బగుటం**

**బ్రసరించు నింద్రియములకు । వసంబుగా దొందఁ బరమవస్తువు పుత్రా!** **174**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; పరమవస్తువు= గొప్ప పదార్థం-బ్రహ్మతత్త్వం - పరమాత్మతత్త్వం; అసమ+ఆలంబము= సాటిలేని ఆధారము-(ప్రాపు; అశబ్దము= శబ్దరహితమైనది ఆకాశ లక్షణం లేనిది; రసగంధరూప రహితంబు= రసం,గంధం,రూపం-ఇవి లేనిది; అగుటన్= అగుటవలన; ప్రసరించు= పనిచేసెడి; ఇంద్రియములకున్= కన్ను ముక్కు వంటి జ్ఞానేంద్రియాలకు; ఒందన్= పొందగా, పొందుటకు; వసంబు+కాదు= శక్యం కాదు.

**తాత్పర్యం:** 'కుమారా! పరబ్రహ్మతత్త్వం సాటిలేనిది, పోల్చి చెప్పటానికి వీలులేనిది, ఆత్మ ఉనికికి ఆధార భూతమైనది-మూలమైనది. అయితే దానిలో పాంచభౌతికమైన-ఐదు మూలపదార్థాలకు చెందిన లక్షణాలు-శబ్దంగాని, ద్రవంగాని, వాసనగాని, స్పర్శగాని, ఆకారంగాని ఏవీ ఉండవు. అందువలన దానిని చెవి, నోరు, ముక్కు, చర్మం, కన్ను-అనే ఈ ఇంద్రియాలు గ్రహించలేవు.

**విశేషం:** పరతత్త్వం పంచభూతాలతో ఏర్పడినదిగాదు. కాబట్టి నరుడి జ్ఞానేంద్రియాలకు అది అలభ్యం. దాని ఉనికి, ప్రకృతికి-పాంచభౌతికమైన దానికి వెలుపల. అందుకనే దాన్ని గ్రహించటం సులభం కాదు.

**క. స్త్రీపుం నపుంసకత్వము । లా పరతత్త్వమున లేమి నది విను తత్త**
**ద్వ్యాపారాపేతంబయి । దీపించుచునుండు బోధదేహత్వమునన్.** **175**

**ప్రతిపదార్థం:** విను; ఆ పరతత్త్వమునన్= ఆ పరబ్రహ్మస్వభావంలో; స్త్రీ పుం నపుంసకత్వములు= ఆడతనం, మగతనం, ఆ రెండూగాని పేడితనములు; లేమిన్= లేకపోవటంవలన; అది= ఆ పరబ్రహ్మం; తద్+తద్+వ్యాపార+అప+ఇతంబు+అయి= ఆయా పనులనుండి - ఆడ, మగ, పేడిపనులనుండి తొలగినదై; బోధదేహత్వమునన్= జ్ఞానం అనే శరీరం (కలిగిన తనం)తో; దీపించుచున్= ప్రకాశిస్తూ; ఉండున్= నిలిచి ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ పరమవస్తువులో ఆడ, మగ, పేడి స్వభావాలు లేవు. ఈ స్వభావాలన్నీ ప్రకృతిలోనివి. అది ప్రకృతికి అతీతం కాబట్టి, ఆయా పనులకు, అంటే ఆడ, మగ, పేడి పనులకు దూరంగా 'జ్ఞానం' అనే దేహంతో వెలుగుతూ ఉంటుంది.

**విశేషం:** వస్తువును గుర్తించటానికి ఆకారం ముఖ్యం. ఆకారం లేని వస్తువు గోచరించదు. పరబ్రహ్మ నిరాకారమే అయినా, దాని తత్త్వాన్ని వ్యక్తీకరించటానికి, దానికీ ఒక ఆకారమున్నట్లు ఉత్ప్రేక్షించి చెప్పుతున్నాడు బృహస్పతి - స్పష్టమైన అవగాహనకొరకు. అట్లా చెప్పక తప్పదు మరి!

**తే. వెలు గుచుండెడి దీపంబు వేఱ వస్తు । వులఁ బ్రకాశింపఁజేయున ట్లలఘునిత్య**

**బోధన జ్యోతి యింద్రియంబులను మాన । సమును దన ప్రభ విగతజాడ్యములఁ జేయు.** **176**

**ప్రతిపదార్థం:** అలఘు నిత్య బోధన జ్యోతి= గొప్ప శాశ్వతమైన జ్ఞానమనే వెలుతురు; ఇంద్రియంబులను= కన్ను, ముక్కు మొదలైనవాటిని; మానసమును= మనస్సును; తన ప్రభన్= తన వెలుగుతో; వెలుగుచుండెడి దీపంబు= ప్రకాశించే దీపం; వేఱ

వస్తువులన్= ఇతర పదార్థాలను; ప్రకాశింపన్+చేయు+అట్లు= కనుపించేటట్లు చేసే విధంగా; విగత జాడ్యములన్+చేయున్= తొలగిన మాంద్యం కలవాటినిగా చేయును.

**తాత్పర్యం:** ఈ జ్ఞానజ్యోతి గొప్పది, శాశ్వతమైనది. అది తన కాంతితో ఇంద్రియాలను మనస్సునూ వెలిగే దీపం ఇతర వస్తువులను ప్రకాశింపజేసేటట్లుగా - చైతన్యంతో కదిలేటట్లుగా చేస్తుంది. ఇంద్రియాలలోని, మనస్సులోని మాంద్యాన్ని తొలగిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ. ప్రకాశానికి దీపం కారణమైనట్లుగా నరుడిలోని చేతనాశక్తికి జ్ఞానజ్యోతి మూలం. అదే ఇంద్రియాలనూ, మనస్సునూ నడుపుతుంది.

**క. విను పురుషున కింద్రియములు । మనంబు గలిగించుఁ గ్రియల మనుజేశునకుం**
**దన తన తెఱఁగునఁ గార్యము । లనేకములు సూపు సచివు లట్టుల వత్సా!' 177**

**ప్రతిపదార్థం:** వత్సా!= బిడ్డా!; విను= ఆలకించుము; మనుజ+ఈశునకున్= రాజునకు; తన తన తెఱఁగునన్= తన తన ధోరణిలో; అనేకములు= పెక్కులు; కార్యములు= పనులు; చూపు= చూపెట్టే; సచివులు+అట్టులన్= మంత్రులవలె; పురుషునకున్= ఆత్మకు; ఇంద్రియములు= కన్ను ముక్కు మొదలైన ఇంద్రియాలూ; మనంబు= మనస్సు; క్రియలన్= పనులను; కలిగించున్= ఏర్పరచును, కలిగేటట్లు చేస్తాయి.

**తాత్పర్యం:** బిడ్డా! మానవుడు కార్యోన్ముఖుడు కావటానికి అతడి ఇంద్రియాలూ మనస్సూ కారణాలుగా గ్రహించుము. రాజునకు మంత్రులు - ఆతడు నిర్వహించవలసిన విధులను ఎరుకపరచే విధంగా ఇంద్రియాలూ, మనస్సూ నరుడికీ ఏయే పనులు ఎపుడెపుడు చేయాలో తెలియపరుస్తాయి.

**విశేషం:** పురుషుడు ఆత్మ. అతడు అధిపతి; ఇంద్రియాలూ మనస్సూ అతని ఉపకరణాలు. అతడికి లోబడి ప్రవర్తించి, అతడి చెప్పుచేతలలో నిలువవలసి ఉన్నది'. అలంకారం: ఉపమ.

**వ. అని మఱియును. 178**

**తాత్పర్యం:** అని ఇంకా (ఈ విధంగా అన్నాడు.)

**చ. 'అనలము దోఁచునే తరువునందుఁ గుఠారముఖంబు లైన సా**
**ధనములఁ ద్రెవ్వ? సజ్జనహితా! తగఁ ద్రచ్చినఁ గాక; యట్ల యి**
**త్తనువు నలంగఁ జేసి పరతత్త్వముఁ గాంతు మనంగ రాదు; వి**
**న్ననువున నాగమోక్తమథనం బొనరించినఁ గాని యారయన్. 179**

**ప్రతిపదార్థం:** సత్+జనహితా!= మంచిజనులకు మిత్రుడా! ఓ మనూ!; తరువునందున్= చెట్టునందు; తగన్= ఉచితంగా, తగునట్లుగా - చేయవలసిన రీతిలో; త్రచ్చినన్+కాక= మథిస్తే తప్ప; కుఠారముఖంబులు+ఐన= గండ్రగొడ్డలి మొదలైన; సాధనంబులన్= పరికరాలతో; త్రెవ్వన్= పెకలించినట్లయితే; అనలము= నిప్పు; తోఁచును+ఏ?= కనుపించునా? (కనుపించదు); అట్లు+అ= అట్లే ఆ విధంగానే; ఈ తనువున్= ఈ శరీరమును; విన్న+అనువునన్= నేర్పుతో; ఆగమ+ఉక్త మథనంబు= వేదంలో చెప్పబడ్డ; త్రచ్చుటను= తరచి తరచి చూడటం; ఒనరించినన్+కాని= చేస్తే తప్ప; అరయన్= పరిశీలించగా; నలంగన్+చేసి= నలగునట్లుగా చేసి - బాధపెట్టి; పరతత్త్వమున్= పరమమైన జ్ఞానమును; కాంతుము= పొందెదము; అనంగన్+రాదు= అనుటకు (వీలు) కాదు.

**తాత్పర్యం:** 'సజ్జనమైత్రిని నెరపే ఓ మనూ! చెట్టులో నిప్పు నిక్షిప్తమై ఉన్నట్లుగా ఈ శరీరంలో పరతత్త్వం గుప్తంగా ఉన్నది. దానిని తగినట్లుగా పద్ధతి తెలిసి గ్రహించాలి తప్ప, తోచినట్లుగా చేస్తే ప్రయోజనం ఉండదు. కర్రలో నిక్షిప్తమై ఉన్న నిప్పును కర్రను కర్రతో మథిస్తే కనిపిస్తుందే తప్ప గొడ్డలితో నరికితేను, పెకలిస్తేనూ కనిపిస్తుందా? ఆ విధంగానే ఈ శరీరంలో దాగి ఉన్న పరతత్త్వాన్ని వేరొక విధానంతో తరచి తరచి చూచి గ్రహించాలి తప్ప, శరీరాన్ని బాధించి, హింసించి గ్రహించలేము.

**విశేషం:** అలం: నిదర్శనం. ఒక క్రొత్త విషయం గ్రహింపునకు రావటానికి ముందు మళ్ళీ మళ్ళీ ప్రయత్నించవలసిరావచ్చును. మనస్సులో లోపల తరచి తరచి చూడవలసిరావచ్చును. ఈ లోపల తరచి చూచే ప్రక్రియనే 'అంతర్మథనం' అంటుంటాం. దీనికి 'లోపల త్రచ్చుట' అని శబ్దార్థం. ఈ పద్యంలో కూడా 'మథనం' అనే శబ్దమే ప్రయుక్తమై, ఆ అర్థాన్నే స్ఫురింపజేస్తున్నది.

**క. డెందమున కింద్రియములకు । నొందఁ గ రాకున్న లేకయున్నే తత్త్వం**
**బెందు? నపరభాగంబునఁ । బొందవు చూడ్కు లది లేకపోవునె? సుమతీ! 180**

**ప్రతిపదార్థం:** సుమతీ!= మంచి బుద్ధికలవాడా! - మనూ!; డెందమునకున్= మనస్సునకూ; ఇంద్రియములకున్= కన్ను, ముక్కు మున్నగు ఇంద్రియాలకూ; ఒందఁగన్+రాక+ఉన్నన్= పొందరాకుంటే; తత్త్వంబు= ఆ పరతత్త్వం; లేక+ఉన్నే= లేకుండాఉంటుందా?- లేకుండా పోతుందా? (పోదు); చూడ్కులు= చూపులు; అపరభాగంబునన్= ఆవలివైపున, వస్తువునకు వెనుక వైపునకు; పొందవు= చేరవు, అంతమాత్రాన; అది= ఆ ఆవలి భాగం వస్తువుయొక్క వెనుక భాగం; లేకపోవును+ఎ?= లేకుండా పోతుందా? (పోదు).

**తాత్పర్యం:** ఓ సుమతీ! మనూ! ఆలోచించి చూడుము. మనస్సునకూ, ఇంద్రియాలకూ అందనంతమాత్రాన, ఈ శరీరంలో ఆ పరతత్త్వంలేదు అనటం యుక్తిసహం కాదు. ఎందుకంటే, మన చూపులు వస్తువుయొక్క ఎదుటి భాగాన్నే చూడగలవు తప్ప, అవతలి వెనుకవైపును చూడలేవు. అంతమాత్రాన ఆ వస్తువునకు ఆవలివైపు లేదు అనగలమా? అన్నంతమాత్రాన, అది లేకుండా పోతుందా?

**విశేషం:** అలం: నిదర్శన.

**క. వల యురి యోదము గాలము । గలిగి గదా మృగము పక్షి గజము ఝషము ద**
**క్షులు వట్టుదు! రట్టుల తద్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. 181**

**ప్రతిపదార్థం:** దక్షులు= సమర్థులు; వల= జంతువులను పట్టటానికి ఉపయోగించే త్రాటితో చేసిన సాధనం-వాగురు; ఉరి= ఉచ్చు- కంఠమును బిగించి చంపే సాధనం; ఓదము= ఏనుగును పట్టుటకై త్రవ్విన గుంట (పైకి నేలమట్టంగా కనిపిస్తూ లోన పల్లం గలిగింది); గాలము= చేపలను పట్టే సాధనం - త్రాడు కర్రలతో చివరను ఎరగల్గిన సాధనం (వీటిని అన్నిటిని); కలిగి= సంపాదించి (క్రమంగా); మృగము= పశువును; పక్షి= పులుగును; గజము= ఏనుగును; ఝషము= చేపను; పట్టుదురు కదా!= పట్టుకొంటారు కదా!; అట్టులు+అ= ఆ విధంగానే; తద్+జ్ఞులు= తత్త్వం తెలిసినవారు; విజ్ఞానంబు కలిమిన్= ఎక్కువ జ్ఞానం కలిగి ఉండటంతో; పురుషున్= పరతత్త్వమును, పరమాత్మను; చూతురు= చూస్తారు.

**తాత్పర్యం:** పరతత్త్వాన్ని వెదికి గ్రహించాలి - అనే సంకల్పమున్నప్పుడు, దానికి అర్హమైన ప్రయత్నం ఉండాలి. అది ఎట్లంటే, నరుడు పశువును బంధించాలంటే వలను, పక్షిని పట్టుకొనాలంటే ఉచ్చును, ఏనుగును పట్టాలంటే పై భాగాన గ్రాసం మొలచిన, లోపల శూన్యంగా ఉన్న గుంటను (ఓదము), చేపను పట్టాలంటే గాలాన్ని సాధనంగా గ్రహిస్తున్నాడు. సరైన సాధనం లేకపోతే లక్ష్యాన్ని సాధించలేడు. అదే విధంగా పరతత్త్వాకారమైన పరమపురుషుడిని దర్శించగలగాలి - అంటే తప్పకుండా నరుడికి జ్ఞానసంపత్తి కావాలి - అని తత్త్వం తెలిసినవారు పలుకుతారు.

**విశేషం:** అలం: యథాసంఖ్యం, ఉపమ. కార్యసిద్ధికి కర్త అవసరం ఎంత ఉన్నా, కరణం - క్రియాసిద్ధికి ఎక్కువ ఉపకరించే సాధనం కూడా తప్పనిసరి. కరణం లేకుండా కార్యాన్ని సాధించలేము. పరతత్త్వగ్రహణానికి జ్ఞానయోగం తప్పనిసరైన సాధనం. సాధనం లేకుండా సాధ్యం చేరజాలము.

**క. పా మెఱుఁగుఁ బాము కాళులు; । ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ**
**శ్రీమంతుఁ బరమపురుషుని । ధీ మల నిర్మోచనంబు తెఱఁగు నెఱిఁగినన్. 182**

**ప్రతిపదార్థం:** పాము= పాము; పాము కాళులు= పాముయొక్క కాళ్ళను; ఎఱుఁగున్= తెలియును; (అట్లే) ధీమంతుండు= బుద్ధిమంతుడు; ధీసాక్షిత్వ శ్రీమంతున్= బుద్ధికి సాక్షితనం అనే సంపదగల - బుద్ధికి సాక్షీభూతుడై నిలిచే; పరమపురుషుని(న్)= పరతత్త్వమును, పరబ్రహ్మమును; ధీమల నిర్మోచనంబు తెఱఁగున్= బుద్ధియొక్క మురికిని వదిలించే మార్గమును; ఎఱిఁగినన్= గ్రహించినచో; ఎఱుఁగన్+నేర్చున్= తెలిసికొనగలడు.

**తాత్పర్యం:** పాము కాళ్ళు పామే గ్రహించగలుగుతుంది. (నిజానికి పాముకు కాళ్ళు ఉన్నట్లు కనిపించవు. కాని నడుస్తుంది కాబట్టి కాళ్ళు ఉన్నట్లే, అయితే ఇతరులకు తెలియవు. పాముకే ఆ ఎరుక - తెలివి ఉంటుంది.)అదే విధంగా, బుద్ధిమంతుడే - జ్ఞానవంతుడే బుద్ధికి సాక్షిగా నిలిచే ఆ పరవస్తువును గ్రహించగలుగుతాడు. ఆ విధంగా గ్రహించగలగాలంటే అతడు (ఆ బుద్ధిమంతుడు) బుద్ధిలోని మురికిని వదిలించే మార్గం తెలిసినవాడై ఉండాలి.

**విశేషం:** అలంకారం: నిదర్శన. వాస్తవానికి జ్ఞానోదయమనేది వైయక్తికమైన సాధన ద్వారా ఎవరికి వారు పొందవలసినది. అక్కడ బయటివారి ప్రమేయం పరిమితం. కర్మలను ఒకే విధంగా నిర్వహింపజేసినట్లుగా జ్ఞానాన్ని ఒకే విధంగా కలిగించలేము.

**క. కలుగుం దోఁపమి యమవసఁ । గలుగునె యంతటన? యమృతకరునకు నాశం**
**బలఘుతర వస్తువునకుం । గలదె యభావంబు మనసు గానని కలుచన్? 183**

**ప్రతిపదార్థం:** అమవసన్= అమావాస్యనాడు; తోఁపమి= కన్పింపకుండటం; కలుగున్= జరుగును (అమృతకరునకు); అంతటన్+అ= అంతమాత్రాన; అమృతకరునకున్= చంద్రుడికి; నాశంబు కలుగునె?;= లోపం (కనబడకపోవటం) ఏర్పడుతుందా?; మనసు= (నరుడి) మనస్సు; కానని కలుచన్= చూడ(లే)ని దోషాన; అలఘుతర వస్తువునకున్= మిక్కిలి గొప్ప (పరమమైన) పదార్థమునకు- పరతత్త్వానికి; అభావంబు= లేకపోవటం - ఉండకపోవటం - లేమి; కలదు+ఎ?= ఉన్నదా? (లేదు.)

**తాత్పర్యం:** అమావాస్యనాడు చంద్రుడు కనిపించడు. అంతమాత్రాన చంద్రుడు లేడు అనగలమా? ఆ మాత్రానికే చంద్రుడి ఉనికికి భంగం కలుగుతుందా? కేవలం నరుడి మనస్సు చూడలేని దోషం కారణంగా ఆ పరతత్త్వమే లేదని ఆ మహావస్తువునకే అభావాన్ని (లేనితనాన్ని) ఆపాదించటం కూడదు.

**విశేషం:** అలం: నిదర్శన. గ్రహించటం అనే క్రియ ఇక్కడ మనస్సునకు చెందింది. మనస్సు గ్రహించలేకపోతే అది దాని దోషమే తప్ప, అవతలి వస్తువుయొక్క లేమిని తెలపటం కాబోదు.

**క. రవిబింబము రాహువు పయిఁ । గవిసినఁ బాసినను దోఁపకయుఁ దోఁచియు నుం**
**డు విధమ యజ్ఞానంబున । యవిరతి విరతుల యధీనుఁ డగు టాత్మునకున్. 184**

**ప్రతిపదార్థం:** ఆత్మునకున్= పరమాత్ముడికి; అజ్ఞానంబునన్= జ్ఞానంలేకపోవటంవలన; అవిరతి విరతుల+అధీనుఁడు+అగుట= ఉండటం, ఉండకపోవటాలకు లోబడినవాడగుట (ఎట్లంటే); రవిబింబము= సూర్యబింబం; రాహువు= రాహుగ్రహం; పయిన్+కవిసినన్= పైబడినపుడు; పాసినను= విడిచినపుడూ; తోఁపకయున్= కనిపించక; తోఁచియున్= కనిపిస్తూ; ఉండు విధము+అ= ఉండే విధమే.

**తాత్పర్యం:** సూర్యబింబాన్ని రాహువు కప్పివేసినప్పుడు అది కనిపించదు. రాహుగ్రహం విడిచిపెట్టినప్పుడు అది కనిపిస్తుంది. ఇక్కడ సూర్యబింబం ఎప్పుడూ ఉన్నది. అది కనిపించటం, కనిపించకపోవట మన్నది దానిని కప్పిన రాహువువలన జరుగుతున్నది. అదే విధంగా అజ్ఞానం కప్పివేసినప్పుడు ఆత్మ కనిపించదు. అది విడిచినపుడు కనిపిస్తుంది. అంతే తప్ప, ఆత్మ శాశ్వతమైనది. ఎప్పుడూ ఉండేదే.

**విశేషం:** తత్త్వదర్శనం, సమ్యగ్దర్శనం అనే మాటలు మనం వింటుంటాం. కేవల దర్శనం వేరు. కనిపించేది నిజం కావలసిన పనిలేదు. ఆ విషయం మనకు దూరపు కొండలు మొదలైన చోట్ల తెలుస్తూనే ఉన్నది. అందుకనే తత్త్వదర్శనం, సమ్యగ్దర్శనం కావాలి. నిజమైన దాన్ని చూడటమే అది. ఆ తత్త్వదర్శనానికి ఆటంకాన్ని ఉపమానపూర్వకంగా వివరించాడు వక్త. అలంకారం- నిదర్శన.

**క. విను మానస ప్రసన్నతఁ । దనుఁ గను పురుషుండు గలుషతం గానఁడు దే**
**ఱిన నీట రూపు సూడఁగ । ననువై కలఁక నది లేని యట్టుల పోలెన్. 185**

**ప్రతిపదార్థం:** తేఱిన నీటన్= మురికిని వదలిన నీటిలో; రూపు= ఆకారం; చూడఁగన్= చూడటానికి; అనువు+ఐ= వీలయి; కలఁకన్= మురికియందు (మురికినీటిలో); అది= ఆ 'చూడగ'నను వు - చూచుటకు వీలు; లేని+అట్టుల పోలెన్= లేనట్లుగా; పురుషుండు= ఆత్ముడు; మానస ప్రసన్నతన్= మనస్సుయొక్క నిష్కల్మషత్వమునందు, మనస్సు కలతలేక నిర్మలంగా ఉన్నప్పుడు; తనున్= తనను; కనున్= చూస్తాడు; కలుషతన్= కల్మషత్వమున, కలత చెందినప్పుడు; కానఁడు= చూడలేడు; విను= ఆలించుము.

**తాత్పర్యం:** జ్ఞానయోగం మానసిక ప్రక్రియ. ఆత్మజ్ఞత, అనాత్మజ్ఞత - రెండూ మానసిక చర్యలే. అందువలన మనస్సు కలతదేరి, కల్మషానికి దూరమై, నిర్మలంగా ఉన్నప్పుడు పురుషుడు ఆత్మజ్ఞుడు కాగలడు. తనను తాను గ్రహించగలడు. అయితే అదే మనస్సు కలతతో, క్షుభితమై ఉన్నప్పుడు మాత్రం అతడు ఆత్మజ్ఞానాన్ని పొందలేడు. అనాత్మజ్ఞుడుగా, అజ్ఞానిగా మిగిలిపోతాడు. అది ఎట్లంటే, తేరిన నీటిలో రూపు కనిపిస్తుందిగాని, మురికి నీట కనిపించదు కదా!.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. ఇంద్రియంబులు దమ యిచ్చ నిట్టునట్టుఁ । దిరిగె నేనియు దుఃఖముల్ దెచ్చు నవియ**
**కట్టువడి సుఖ మొనరించుఁ గాన యాత్మఁ । గావ వలయు నింద్రియచోరగణము వలన. 186**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు= జ్ఞానేంద్రియాలు ఐదు - కర్మేంద్రియాలు ఐదు - వెరసి పది ఇంద్రియాలు: కన్ను ముక్కు మొదలయినవి, కాలు, చేయి లోనయినవి - రెండు విధాలయినవి; తమ ఇచ్చన్= తమ తమ కోరికతో; ఇట్టున్+అట్టున్= ఇట్లా, అట్లా-ఎట్లా కావాలంటే అట్లా అదుపు ఆజ్ఞా లేకుండా; తిరిగెన్+ఏనియున్= తిరిగితే-వాటి వాటి పనులలో మునిగిపోతే; దుఃఖముల్+తెచ్చున్= కష్టాలను తోడ్కొని వస్తాయి; అవి+అ= అవే ఆ ఇంద్రియాలే; కట్టు+పడి= (ఆత్మ) ఆజ్ఞకు లోబడి; సుఖము+ఒనరించున్= సంతోషం కలిగిస్తాయి; కానన్= కాబట్టి; ఆత్మన్= ఆత్మను; ఇంద్రియ చోర గణమువలనన్= ఇంద్రియాలు అనే దొంగలముఠా నుండి; కావన్+వలయున్= రక్షించాలి.

**తాత్పర్యం:** ఇంద్రియాలు (నరుడి) అదుపు ఆజ్ఞలలో ఉండక, స్వేచ్ఛగా నిరాటంకంగా తమతమ పనులు తాము చేసికొంటూ పోతే చివరకు దుఃఖాలు కష్టాలు, వెతలు, వేదనలూ తప్పవు. అయితే అవే ఇంద్రియాలు నిగ్రహితాలై- అదుపు చేయబడినవై సంచరిస్తే సుఖాలూ, సంతోషాలూ, శాంతి సౌభాగ్యాలూ కలిగిస్తాయి. అందువలన ఆత్మను ఇంద్రియాలు - అనే దొంగల ముఠాబారిన పడకుండా రక్షించుకొనాలి.

**విశేషం:** అలం: కావ్యలింగం.

**క. పాప క్షయమున బోధం । బాపాదింపఁబడి మెఱుఁగుటద్దము కరణిం**
**జూపునకు వచ్చుఁ దనుఁ దా । నా పురుషుఁడు గాంచు పనికినై తన్మయతన్. 187**

**ప్రతిపదార్థం:** పాపక్షయమునన్= పాపం, చెడుపనులు, ఊహలు నశించటంవలన; బోధంబు= జ్ఞానం; ఆపాదింపఁబడి= సంపాదించబడి (కలిగి); మెఱుఁగు+అద్దము కరణిన్= మెరిసే (నిర్మలమైన అద్దంవలె; ఆ పురుషుఁడు= ఆ పరమాత్మ (నరుడిలో అంతర్లీనంగా ఉన్నవాడు); తనున్= తనను; తాన్= తాను; కాంచు పనికిన్+ఐ= దర్శించే కార్యం కొరకై చూచేటందుకై; తద్+మయతన్= ఆ పరమాత్మతో ఐక్యమొందినదై; చూపునకున్+వచ్చున్= (కంటి) చూడ్కికి వీలౌతుంది - అగుపడుతుంది.

**తాత్పర్యం:** పాపాలు నశిస్తే జ్ఞానం కలిగి, మెరుగుటద్దంవలె ప్రకాశిస్తూ ఉంటుంది. అపుడు ఈ శరీరంలోని ఆత్మ తనను తాను దానిలో చూచుకొనగలుగుతుంది - జ్ఞానం ఆత్మలో ఐక్యమౌతుంది.

**విశేషం:** అలం: ఉపమ. పాపపుణ్యాలు రెండూ కర్మజన్యాలు - కర్మలవలన ఏర్పడేవి. కర్మలు ఇంద్రియజన్యాలు - ఇంద్రియాలద్వారా జరిగేవి. కాబట్టి పాపక్షయం కావాలంటే నరుడి క్రియలు నిష్కల్మషాలు కావా లన్నమాట. ఆ స్థితి ఇంద్రియనిగ్రహానికి తార్కాణం.

**తే. ధ్యానయోగ నిశ్చల మగు నంతరంగ । మెడలవిడుచు గుణంబుల నిద్ధశాంత**
**మైన నిర్గుణవస్తువునందుఁ గలయుఁ । బరమపద మది; దానికిఁ బరము లేదు.' 188**

**ప్రతిపదార్థం:** ధ్యాన యోగ నిశ్చలము+అగు= ధ్యానయోగంతో చలనం లేనిదైన; అంతర్+అంగము= లోపలి అవయవం, మనస్సు; గుణంబులన్= తమస్సు, రజస్సు, సత్త్వం - అనేమూడు సహజగుణాలను - స్వభావాలను; ఎడలన్+విడుచున్= దూరంగా వదలును; (తరువాత) ఇద్ధ శాంతము+ఐన= దీప్తమైనది - ప్రకాశించేదీ శాంతిని పొందినదీ అయిన; నిర్+గుణ వస్తువునందున్= గుణ రహితమైన (పరమాత్మ) పదార్థమున; కలయున్= చేరుతుంది; అది= ఆ కలయిక; పరమ పదము= శ్రేష్ఠమైన స్థితి; దానికిన్= ఆ స్థితికంటె; పరము= అవతలిది - శ్రేష్ఠమైనది; లేదు= ఉండదు.

**తాత్పర్యం:** నరుడి లోపలి అవయవమే అంతరంగం. అది సహజంగా చలనశీలి. అయితే ధ్యానయోగం ద్వారా ఆ అంతరవయవాన్ని - మనస్సును వశపరచుకొని, దాని చలనాన్ని నిరోధించగలిగితే అపు డది నరుడి స్వభావాలైన తమస్సు, రజస్సు సత్త్వం - అనే గుణాలు మూడింటినీ విడిచిపెట్టి, తాను పరతత్త్వంలో శాంతమై దీపించే ఆ పరమాత్మలో లీనమైపోతుంది. అదే పరమపదం. దానిని మించిన దేదీ లేదు'.

**విశేషం:** మనస్సు నిశ్చలత్వాన్ని పొందటమంటే పరమాత్మలో లీనమవటంకంటె వేరుగాదు. ఆ నిశ్చలత్వం ధ్యానంద్వారా సాధ్యమంటున్నాడు బృహస్పతి. అనంతర వృత్తాంతాన్ని వివరిస్తున్నాడు - మరొక ప్రసంగానికి ముందుమాట పలుకుతున్నాడు వక్త.

**వ. అని పలికి సమ్యగ్జ్ఞానంబునకు మాయ మాటు గావున దాని మొఱంగు తెఱంగు దేటపఱుపం దలంచి యిట్లనియె. 189**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; సమ్యక్+జ్ఞానంబునకున్= సరియైన తెలివికి (జ్ఞానయోగానికి); మాయ= అవిద్య; మాటు+కావునన్= చాటు కాబట్టి; దాని మొఱంగు తెఱంగు= దాని వంచన పద్ధతి - మోసగించే తీరు; తేటపఱుపన్+తలంచి= స్పష్టపరిచేటందుకు యోచించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** జ్ఞానయోగ ప్రసంగ మిది. జ్ఞానం ఆభాస రూపాన కూడా ఉండవచ్చును. అపు డది జ్ఞానం కాజాలదు. అందుకని మంచి జ్ఞానం పొందాలంటే దానికి ముందుగా జ్ఞానాన్ని దాచే లక్షణంగల మాయను గురించి వివరించాలి.

మాయ నరుడిని వంచించే తీరుతెన్నులు తేటగా తెలియజెప్పాలని బృహస్పతి సంకల్పించి, మనువుతో ఇట్లా ప్రసంగించాడు.

**బృహస్పతి మనువున కుపదేశించిన మాయాప్రకారము (సం. 12-198-1,2)**

**క. 'విను మాయావిధ మిట్టిది । యని యారయ వెరవుగలుగ దవనిం జరణం**
**బనఘా! మోపని జంతువు । సను చొ ప్పరయంగ రాని చందం బొందున్. 190**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా! మనూ!; విను= ఆలకించుము; మాయావిధము= మాయయొక్క - అవిద్యయొక్క పద్ధతి; ఇట్టిది+అని= ఈ విధమైనది అని; ఆరయన్= పరిశీలింపగా; వెరవు= ఉపాయము; కలుగదు= లేదు; అవనిన్= భూమిని; చరణంబు= కాలు; మోపని= ఆనించని; జంతువు+చను చొప్పు= మృగం వెళ్ళే తీరు; అరయంగన్+రాని= చూడరాని; చందంబు= పద్ధతి, ఒందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** 'మాయ ఈ తీరున ఉంటుంది, ఇట్లా సంచరిస్తుంది - అనటానికి, అని తేల్చి చెప్పటానికి మార్గమే- ఉపాయమే లేదు. భూమిమీద కాలుమోపని జంతువు నడకను ఏమని ఎంతగా వర్ణించగలమో ఈ మాయ తీరుతెన్నులనూ ఆ విధంగా, అంతగా వివరించగలం.

**విశేషం:** అలం: ఉపమ. మాయ లీలలు వర్ణనాతీతమైనవి. అనుభవైకవేద్యాలే తప్ప అవి ప్రకటనలకు అనువైనవీ లోబడినవీ కావుమరి!

**క. గుణమూర్తి మాయ దానిని । గణుతించెద నన్నఁ దెగడు; గ్రాహ్యత్వంబున్**
**గుణములఁ బెడఁబాపంగా । గణనాతీతమగు వెలుఁగు గనుఁ దాన తనున్. 191**

**ప్రతిపదార్థం:** మాయ= అవిద్య; గుణమూర్తి= గుణములు (తమస్సు, రజస్సు, సత్త్వములు) ఆకారంగా కలది; దానిని= ఆ మాయను; గణుతించెదను+అన్నన్= లెక్కిస్తాను అనినచో- లెక్కలోనికి తీసికొనబోతే; గ్రాహ్యత్వంబున్= గ్రహించదగిన తనమును; తెగడున్= తిరస్కరిస్తుంది (మాయ కర్త); గుణములన్= ఆ మూడు గుణాలను; పెడన్+పాపన్+కాన్= పెడగా - ప్రక్కగా తొలగించినచో; తనున్= తన్ను; తాను+అ= తానే; గణన+అతీతము+అగు వెలుఁగు= లెక్కకు మించినదైన కాంతిని; కనున్= చూస్తుంది, పొందుతుంది.

**తాత్పర్యం:** మాయ లీలలు వర్ణనకు లొంగనివే అయినా, దానికి ఆకారమున్నది. నరుడిలోని మూడు గుణాలు- తమస్సు, రజస్సు, సత్త్వము అనేవే దాని శరీరం. వాస్తవాన్ని గుర్తించి దానిని పరిగణనలోనికి తీసికొందామనుకొంటే వీలుపడదు. ఎందుకంటే తనను ఇతరులు గ్రహించటాన్ని అది అంగీకరించదు. ఫలితంగా మనం దానిని గ్రహించలేము. అయితే ఆ మూడు గుణాలను దూరంగా నెట్టివేయగలిగితే లెక్కకురాని గొప్పవెలుగును చూడవచ్చును.

**విశేషం:** 'మాయ' విడిగా ప్రత్యేకంగా ఉండదు. అది నరుడిని అంటికొని అతడిలో భాగంగానే ఉంటుంది. అతడి భావంలో, భాషలో, పనిలో కనిపిస్తూ ఉంటుంది. దానినుండి బయటపడటమంటే, మూడు గుణాలనుండి ముక్తి పొందటమే.

**తే. వినుము నృప! సత్త్వమును రజస్సును దమస్సు । ననఁగ గుణములు ముప్పిరిగొనుచు నాత్మఁ**
**జుట్టుకొను నొండుమొయిఁ దెగ విట్టలముగ । నొలయు వైరాగ్య మను కొడవలిన కాని.' 192**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ రాజా!; వినుము= ఆలకించుము; సత్త్వమును= ఆ పేరుగల ఒక గుణమూ (ఇది తెల్లనిదనీ, మిగిలిన రెండు గుణాలకంటే ఉత్తమమనీ తాత్త్వికులు పల్కుతారు); రజస్సును= ఆ పేరుగల మరొక గుణమూ (ఇది ఎర్రనిదనీ, చివరి దానికంటే మంచిదనీ వారే అంటారు); తమస్సున్= ఆ పేరుగల చివరి మూడవ గుణమూ (ఇది నల్లనిదనీ, మిగిలిన రెండింటికంటె

తక్కువదనీ వారే చెప్పుతారు); అనఁగన్= అనే; గుణములు= మానవ స్వభావాలు; ముప్పిరికొనుచున్= మూడు పరస్పరం పెనవేసికొంటూ; ఆత్మన్= ఆత్మను పురుషుడిని; చుట్టుకొనున్= ఆవరించుకొంటాయి; ఇట్టలముగన్= ఎక్కువగా; ఒలయు= అతిశయించే; వైరాగ్యము+అను కొడవలిని+అ= విరాగితనం, కోరికలు లేని తనం అనే కొడవలితో; కాని= తప్ప; ఒండు మెయిన్= ఒక విధంగా; మరొక విధంగా; తెగవు= తెగిపోవు - నశించవు - ఆ మూడు గుణాలు అనే తాళ్ళు.

**తాత్పర్యం:** ఓ రాజా! మనూ! వినుము. ఆత్మను మాయ ఆవరించి ఉన్నది. ఎట్లంటే, సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు మూడు పురులుగా కలిసి ఆత్మను చుట్టుకొని ఉన్నాయి. ఆ ముప్పిరి (మూడు పురులు) తెగవేయాలంటే గొప్ప వైరాగ్యమనే కొడవలి కావాలి. దానితో తప్ప ఇతర విధాల ఆ మాయను తెగటార్చజాలము'.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని నిర్దేశించి వెండియు. 193**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; నిర్దేశించి= ఉపదేశించి; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** అని ఉపదేశించి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'మణిమయములుఁ గనకమయములు రజతమ । యములు మఱియు మృణ్మయాదికములు**
**నైన పెక్కుపూసలందుఁ ద్రాడున్నట్లు । భూతకోటియందుఁ బురుషుఁ డుండు. 194**

**ప్రతిపదార్థం:** మణి మయములు= మణులతో, విలువైన రాళ్ళతో చేయబడినవి; కనక మయములు= బంగారంతో ఏర్పడినవి; రజత మయములు= వెండితో నిండినవి; మఱియున్= ఇంకను; మృత్+మయ+ఆదికములున్= మట్టితోడివీ మొదలైనవి; ఐన= అగు; పెక్కు= బహువిధములయిన; పూసలందున్= పూసలలో; త్రాడు+ఉన్న+అట్లు= (మధ్యన) త్రాడు (ఆధారంగా) ఉన్న విధాన; భూతకోటియందున్= జీవ సమూహమునందు; పురుషుఁడు= ఆత్ముడు; ఉండున్= నివసిస్తాడు.

**తాత్పర్యం:** హారాలు అనేక విధాలుగా ఉంటాయి. మణిహారాలు, బంగారు గొలుసులు, వెండి హారాలు, మట్టివీ-గొలుసులు రకరకాల ఆకారాలలో రంగులలో బరువులలో ఉంటాయి. అయితే ఈ అన్నింటా ఒకటి సామాన్యంగా సమానంగా ఉంటూనే ఉంటుంది. అది దారం- సూత్రం. ఈ మణులూ, బంగారాలూ, వెండులూ, మట్టీ గొలుసుగా ఏర్పడటానికి ఒక ఆధారం ఆ దారం - తాడు. అది లేకుండా ఇవి తమ తమ ఆకారాలతో ఉండలేవు. అదే విధంగా సృష్టిలోని జీవరాసులు అన్నింటా ఆత్మ సంధానకర్తగా ఉంటుంది. ఆత్మ లేకుండా జీవులకు ఉనికి లేదు, మనికీ ఉండదు.

**విశేషం:** అలం: ఉపమ. హారం రూపుదాల్చటానికి సూత్రం కారణం. జీవుల ఆకారచేష్టలు అన్నిటికీ ఆత్మ ఆధారం. సూత్రం లేకుండా హారమూ, ఆత్మ లేకుండా జీవులూ ఉండటానికి వీలులేదు.

**క. ఏకరసమయ క్షేత్ర మ । నేకౌషధి రసమయం బయినయట్లు సుమీ**
**యేకవిధమైన బుద్ధి య । నేకము లగు కర్మములమెయిం బోక నృపా! 195**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా! మనూ!; ఏకరసమయ క్షేత్రము= ఒక ద్రవం (నీరు)తోడి భూమి - పొలము; అనేక+ఓషధి రసమయంబు+అయిన+అట్లు= పెక్కు ఔషధ ద్రవాలతోడిది అయిన చందాన; ఏక విధము+ఐన బుద్ధి= ఒకే తీరు గల తెలివి-మతి; అనేకములు+అగు= పెక్కులైన; కర్మముల మెయిన్= పనులతో పనులవెంట; పోక= పోవటం; సుమీ!= సుమా!

**తాత్పర్యం:** మాయ తనను తాను వ్యక్తపరచుకొనే తీరు నరుడి కర్మలలో కనిపిస్తుంది. ఆ కర్మలు బుద్ధిద్వారా జరుగుతాయి. బుద్ధి ఒకటే అయినా, అది నిర్వహించే కర్మలు కొల్లలు. ఆ విధంగా ఒక్క బుద్ధి పెక్కు కర్మల వెంటపడి, వాటిని నెరవేర్చుకుంటూ పోయే తీరును బృహస్పతి ఒక పోలికతో తెలియపరుస్తున్నాడు. పొలాన ఒక ద్రవమే ఉంటుంది. ఆ ద్రవం నీరే. అయితే ఆ నీటిద్వారా ఏర్పడే చెట్లుచేమల ద్రవాలు అనేకం. ఇక్కడ ఏక రసంతోడి పొలం అనేక ఓషధుల చెట్లుచేమల రసాలను ఏర్పరచినట్లుగా నరుడి ఒకే బుద్ధి పెక్కులైన అతడి కర్మలకు కారణంగా అవి కొనసాగటానికి ఆధారంగా నిలుస్తున్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. జలము పృథివికంటె, జలముకంటెను దేజ, । మంతకంటె వాయు, వాకసంబు**
**దానికంటెఁ బెద్ద; వాని కెల్లను బెద్ద । మనసు; బుద్ధి పెద్ద మనసుకంటె. 196**

**ప్రతిపదార్థం:** పృథివికంటెన్= భూమికంటె; జలము= నీరు; జలముకంటెను= నీటికంటె కూడా; తేజము= కాంతి; అంతకంటె= ఆ కాంతికంటె; వాయువు= గాలి; దానికంటెన్= ఆ గాలికంటె; ఆకసంబు= ఆకాశం; పెద్ద= పెద్దది, ఘనమైనది, విశాలమైనది; వానికి+ఎల్లను= ఆ అన్నిటికంటెను; మనసు= నరుడిలోని మనస్సు; పెద్ద= పెద్దది; మనసుకంటెన్= ఆ ఎక్కువ పెద్దదైన మనసుకంటెకూడా; బుద్ధి= నరుడి మతి - తెలివితేటల నెలవు; పెద్ద= పెద్దది, గొప్పది.

**తాత్పర్యం:** సృష్టిలో మూలద్రవ్యాలు ఐదు ఉన్నాయని - అవి నేల, నీరు, కాంతి, గాలి, ఆకాశాలని తాత్త్వికులు పలుకుతారు. ఆ అయిదూ సృష్టిలో మిగిలిన అన్నిటికంటె పెద్దవే. అయినా, వాటిలో మళ్ళీ తారతమ్యాలు, హెచ్చుతగ్గులు ఉన్నాయి. నేలకంటె నీరూ, నీటికంటె కాంతీ, కాంతికంటె గాలీ, గాలికంటె ఆకాశం - ఒక దానిని మించి ఒకటి పెద్దవి. అయితే ఈ మిక్కిలి పెద్దవైన పంచభూతాలకంటె కూడా పెద్దదైనది నరుడిలోని మనస్సు. ఆ మనస్సుకంటె పెద్దది ఈ బుద్ధి. ఇదీ నరుడిలోని భాగమే.

**విశేషం:** కనిపించే పంచభూతాలు ఒకదానిని ఒకటి మించి పెద్దవిగా ఉండగా, అసలు దృష్టికే అందని మనస్సూ, బుద్ధీ వాటికంటె పెద్దవి కావటం విచిత్రం. మళ్ళీ ఆ మనోబుద్ధులు రెండింటిలో బుద్ధి మనస్సును మించింది కావటమూ విశేషమే.

**తే. ధరణి మొదలయిన పంచభూతములకంటె । మనసుకంటెను బుద్ధికంటెను మహత్త**
**రంబు గాలంబు; గాలతత్త్వంబు మిగిలి । యుండు విభుఁ డిజ్జగంబుల కొడయుఁ డతఁడు. 197**

**ప్రతిపదార్థం:** ధరణి మొదలయిన= భూమి మొదలుగా గల; పంచభూతములకంటెన్= ఐదు మూల పదార్థాలకంటె (నేల, నీరు, కాంతి, గాలి, ఆకాశాలు); మనసుకంటెను= మనస్సు అనే జీవుల అంతరంగం - లోపలి అవయవాలకంటె; బుద్ధికంటెను= మతి అనే, జీవుల కర్మశీలతకు కారణమైన తెలివికంటె; కాలంబు= కాలం - క్షణాలు, నిమిషాలు, గంటలు, దినాలు, నెలలు, సంవత్సరాల రూపాన తెలియవచ్చే ప్రొద్దు; మహత్+తరంబు= ఎక్కువ పెద్దది; విభుఁడు= ప్రభువు, దేవుడు; కాలతత్త్వంబు= కాలము యొక్క స్వభావమును, పెద్దరికమును; మిగిలి+ఉండున్= మించి ఉంటాడు; అతఁడు= ఆ ప్రభువు; ఈ+జగంబులకున్= ఈ లోకాలకు; ఒడయుఁడు= అధిపతి.

**తాత్పర్యం:** (సృష్టిలో పెద్దవి, ఇంకా పెద్దవీ, వాటికంటెకూడా పెద్దవీ అయిన పదార్థాలను క్రమంగా చెప్పుకొంటూ వచ్చే బృహస్పతి ఇపుడు అన్ని విధాలయిన పెద్దరికాలనూ చివరగా ప్రకటిస్తున్నాడు.) పంచభూతాలకంటె మనస్సు,

మనస్సుకంటె బుద్ధీ పెద్దవి కాగా, ఈ అన్నిటినీ మించిన పెద్దరికం కాలానిది. అయితే అద్దానినికూడా మించినవాడు దేవుడు. అతడు సర్వోన్నతుడూ. సర్వాతిశాయీ అయిన ప్రభుడే ఈ లోకాలన్నిటికీ అధిపతి.

**విశేషం:** సృష్టిలో పెద్దరికాలు, చిన్నరికాలు సర్వసామాన్యం. అయితే దేవుడు మాత్రం అన్నింటికంటే, అందరికంటే గొప్పవాడు, పెద్దవాడు. అతడితో ఈ పెద్దరికాలను గూర్చిన వాదం సమసిపోతుంది. అతడిని మించిన పెద్దతనం ఇక లేదు. అందువలననే అతడు ఈ లోకాలకు ఏలిక.

**క.** **ఆదియు మధ్యము నంతము । నా దేవేశునకు లేమి నవ్యయుఁ డతఁ డీ**
**వేదములకు నానావిధ । వాదములకుఁ జేరుగడ భవక్షేపి నృపా!** **198**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా! - మనూ!; ఆ దేవ+ఈశునకున్= ఆ దేవతల అధిపతికి; ఆదియున్= మొదలూ; మధ్యమున్= నడుమూ; అంతమున్= చివరా; లేమిన్= లేకపోవటంచేత; అతఁడు= ఆ దేవేశుడు; అవ్యయుఁడు= నాశనం లేనివాడు; వేదములకున్= ఋక్, యజుస్, సామ, అథర్వములనే నాలుగు వేదాలకూ; నానావిధవాదములకున్= అనేక విధములయిన - దేవుడి ఉనికికి, ఆత్మ ఉనికికీ చెందిన పెక్కు మతాలకు - అభిప్రాయాలకు; చేరుగడ= శరణం - ఆధారం; భవక్షేపి= సంసారమును తిరస్కరించేవాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! మనూ! నేను చెప్పిన ఆ దేవదేవుడు ఆది మధ్య అంతరహితుడు. కాబట్టి నాశనం లేనివాడతడు. అంతే కాదు, ఆతడే లోకంలోని జ్ఞానవిజ్ఞానఖనులని భావించబడే నాలుగువేదాలకూ, ఆత్మ - అనాత్మ, ఆస్తిక - నాస్తిక, మతాలకూ ఆధారభూతమై వెలుగొందేవాడు. సంసారాన్ని దూరీకరించే శక్తిని ఇచ్చేవాడూ అతడే.

**విశేషం:** ఒక వస్తువునకు 'ఆది' ఉంటే తప్పక 'అంతమూ' ఉంటుంది. ఉండక తప్పదు. జన్మ మరణాలు ఆ విధంగా జీవికి ఆది - అంతాలు. ఆ రెండూ ఉన్నపుడు 'మధ్యమూ' ఉన్నట్లే. ఇవన్నీ సృష్టమైన ఏర్పరచబడ్డ పదార్థాల లక్షణాలు. ఇక్కడ దేవేశుడిగా వర్ణితమైన శక్తి - సృష్టము - కల్పితం కాదు. సృష్టికి - కల్పనకు హేతువు. కాబట్టి అక్కడ మొదట - తుద పుట్టుక - చావు వంటి పరిభాషలు చెల్లవు. ఆ చెల్లనితనమే అవ్యయత్వమంటే. అది ఎప్పటికీ ఉంటుంది. మారకుండా ఉంటుంది.

**క.** **అనుభవము మ్రింగు శాంతిం । గనునది నిర్భేద సత్ప్రకాశం బది దా**
**విను తలఁపునకును బలుకున । కు నగమ్యము, గర్మముల కగోచర మనఘా!** **199**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; విను= ఆలకించుము ఓ మనూ!; (అతఁడు= పరతత్త్వం) అనుభవమున్= ప్రత్యక్షం మొదలైన జ్ఞానమును; మ్రింగున్= లోగొంటుంది - తనలో ఇముడ్చుకొంటుంది; శాంతిన్= శాంతిని, శమమును, నిశ్చలమైన స్థితిని; కనున్= పొందుతుంది; అది= ఆ శాంతి; నిర్ భేద సత్ ప్రకాశంబు= భేదంలేని మంచి వెలుగు; తాన్= తాను, ఆ శాంతి; తలఁపునకును= ఆలోచనకూ; పలుకునకున్= మాటకూ - భాషకూ; అగమ్యము= పొందరానిది; కర్మములకున్= పనులకు; అగోచరము= కనిపించనిది.

**తాత్పర్యం:** (ఆ పరత్వతత్త్వాన్ని అవాఙ్మానసగోచరమంటూనే వివరించటానికి యత్నించారు మన తాత్త్వికులు. ఇక్కడి భావాలు అట్లాంటివే. ఆ దేవేశుడే పరతత్త్వం.) ఆ పరతత్త్వం ప్రపంచంలో మనం జ్ఞానమని అనుకొనే సర్వాన్ని లోగొంటుంది. తరువాత శాంతిని పొందుతుంది. ఆ శాంతి భేదంలేని మంచి గొప్ప వెలుగు. నిజానికి ఆ శాంతిని వర్ణించి చెప్పటం అసాధ్యం. ఎందుకంటే అది ఆలోచనకూ, భాషకూ అందదు. ఇతర కర్మలద్వారా కూడా దానిని పొందలేము.

**విశేషం:** వర్ణనకు అలవిగాదు - అనటమూ ఒక వర్ణనమే. వర్ణనకు భాష ఆధారం. భాషకు ఆలోచన - భావం మూలం. భావానికీ భాషకూ అందనిది కర్మలకూ చిక్కదు. అయినా మనిషి మానడు. దానిని తెలియచెప్పటానికి యత్నిస్తూనే ఉంటాడు. భావం,

భాష, కర్మ - అనేవి క్రమంగా ఒకదానికంటె ఒకటి స్థూలమైనవి. విలోమక్రమంలోనయితే అవి క్రమంగా ఒక దానికంటె ఒకటి సూక్ష్మమయినవి. వీటినే మనం మనస్సు, వాక్కు, కర్మ అని అంటాం.

**క. మనసు గొని, మనసు బుద్ధిం । గొని, బుద్ధిని దర్శనంబు గొని, దర్శనమున్**
**విను క్రమమున నొదిఁగించినఁ । గను బుధుఁ డక్షరుని విష్ణు ఘనబోధమయున్. 200**

**ప్రతిపదార్థం:** మనసు= మనస్సును; కొని= గ్రహించి - లోగొని; మనసున్= మనస్సును; బుద్ధిన్+కొని= బుద్ధిని లోగొని-లోబరచుకొని; బుద్ధిని= బుద్ధినీ - మతినీ; దర్శనంబు+కొని= చూపును - జ్ఞానమును లోగొని; దర్శనమున్= చూపును - జ్ఞానమును; క్రమమునన్= వరుసగా, ఒకటొకటిగా; ఒదిఁగించినన్= తొలగిస్తే, లీనము చేసికొన్నచో; విను= ఆలకించుము ఓ మనూ!; బుధుఁడు= పండితుడు; అక్షరునిన్= నాశనంలేనివాడిని; ఘనబోధమయున్= గొప్ప జ్ఞానమయమైనవాడిని; విష్ణున్= విష్ణువును - పరతత్త్వ స్వరూపమును; కనున్= చూస్తాడు, పొందుతాడు.

**తాత్పర్యం:** మనస్సూ, బుద్ధీ, (లోక) జ్ఞానమూ - ఈ మూడూ నరుడినుండి తొలగిపోతే తప్ప, అతడికి ఆ శాశ్వత సర్వవ్యాపి జ్ఞానమయతత్త్వం, పరమేశ్వర స్వరూపం గోచరించదు. అయితే ఆ మూడూ త్రిపుటి తొలగే మార్గ మేది? తత్త్వజ్ఞులకు అది సులభమే - ఎట్లంటే మనస్సుతోనే మనస్సును లోబరచుకొనాలి, తరువాత తొలగించుకొనాలి, బుద్ధితోనే బుద్ధిని లోగొని అనంతరం లీనం చేయాలి. అటు తరువాత జ్ఞానాన్ని పరతత్త్వేతరమైన తెలివితేటలు- అన్నిటినీ జ్ఞానం (పారమార్థికమైనది) తోనే వశపరచుకొని పిదప ఒదగజేయాలి-తొలగించుకొనాలి. ఈ విధంగా పరతత్త్వాన్ని అందుకొనాలి.

**విశేషం:** మనస్సుతో మనస్సును గ్రహించట మేమిటి? సరిగా ఉండని మనస్సును సరైన మనస్సుతో లోబరచుకొనాలి. అట్లాగే సమ్యక్ సంకల్పంతో బుద్ధితో దుర్బుద్ధిని, సమ్యక్ దృష్టితో ఇతర దృష్టినీ లోగొనాలి. ఇట్లా మనస్సు, బుద్ధి, దృష్టి-మూడూ సరిగా సమీచీనంగా సాగితే పరతత్త్వప్రాప్తి జరుగుతుంది.

**క. అమృతం బచ్యుత మమలం । బమేయ మవ్యయ మనంత మవ్వెలుఁగు యమా**
**ద్యముల నలవడిన చిత్తము । శమాతిరేకమునఁ బొంద సంవేద్య మగున్. 201**

**ప్రతిపదార్థం:** ఆ+వెలుఁగు= ఆ పరతత్త్వం; అమృతంబు= మరణం లేనిది; అచ్యుతము= చ్యుతి, భ్రంశం, జారుడు లేనిది; అమలంబు= మురికి లేనిది; అమేయము= కొలత లేనిది; అవ్యయము= నాశం లేనిది; అనంతము= చివర లేనిది; యమ+ఆద్యములన్= యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణములను; అలవడిన= అభ్యసించిన; చిత్తము= మనస్సు; శమ+అతిరేకమునన్= శాంతి (యొక్క) ఆధిక్యంతో; పొందన్= గ్రహించగా-అందుకొనగా (ఆ వెలుగు); సంవేద్యము+అగున్= బాగుగా తెలియదగినది ఔతుంది.

**తాత్పర్యం:** ఆ పరతత్త్వం గొప్ప వెలుగు. ఆ వెలుగు మృతి లేనిది; చ్యుతి లేనిది; మలినం లేనిది, కొలత లేనిది; నాశం లేనిది; చివర లేనిది, దానిని యమనియమాది సాధన సంపత్తితో ప్రశాంతమై నిలిచిన చిత్తంద్వారా గ్రహించవచ్చును. అప్పుడే ఆ పరతత్త్వం నరుడి అనుభవానికి అందుతుంది.

**విశేషం:** ఈ పరతత్త్వం అవాఙ్మానస గోచరమంటూ మన తాత్త్వికులు వర్ణిస్తుంటారు; వదలరు. వర్ణన ఊహ ద్వారా కూడా చేయవచ్చును. అయితే అనుభవం, ఊహ రెండూ ఒకటి కావలసిన అగత్యముండదు. ఊహను మరచి ఒక విషయం అనుభవానికి వచ్చినప్పుడు ఆ అనుభూతి విశేషాన్ని ఎట్లాగైనా వ్యక్తపరచి తీరవలసిందే అన్న పట్టుదలతో చేసిన వర్ణన కావచ్చును ఇది.

క. అని గురుఁ డుపదేశించిన । విని మనువు గృతార్థుఁ డయ్యె విద్వన్నుత! నీ
వును నలవరింపుమీ మన । మున నివ్వాక్యముల యర్థముం దత్పరతన్.' **202**

**ప్రతిపదార్థం:** విద్వత్+నుత!= పండితులచే పొగడబడినవాడా! - ఓ ధర్మరాజా!; అని= పై ప్రకారంగా; గురుఁడు= బృహస్పతి; ఉపదేశించినన్= జ్ఞానబోధ చేయగా; విని= ఆలకించి; మనువు= మను మహారాజు; కృత+అర్థుఁడు+అయ్యెన్= నెరవేరిన ప్రయోజనం కలవాడు అయ్యెను; నీవును= నీవుకూడా; మనమునన్= మనస్సులో; ఈ+వాక్యముల+అర్థమున్= ఈ బృహస్పతి మాటల సారాన్ని; తత్పరతన్= దానియందలి శ్రద్ధతో; అలవరింపుము+ఈ= అలవాటు చేసికొమ్ము-మననం ద్వారా గ్రహించి, అభ్యసించటానికి యత్నించుము.

**తాత్పర్యం:** పండిత ప్రశంసలు అందుకొన్న ఓ ధర్మరాజా! ఈ విధంగా బృహస్పతి మనువునకు ఉపదేశించగా విని ఆ మనువు కృతార్థుడైనాడు. అతడి ప్రయోజనం సిద్ధించింది. నీవూ ఈ బృహస్పతి మాటల అర్థాన్ని శ్రద్ధతో గ్రహించి, మనస్సులో మననం చేసి, ఆ పరతత్త్వప్రాప్తికై మనస్సును అభ్యాసమార్గాన ఉంచి యత్నించుము'.

**విశేషం:** ఉపదేశం వాఙ్మాత్రంగా మిగిలిపోతే నిష్ప్రయోజనమే. దానికి ఆచరణ ముఖ్యం. ఆచరణ మనస్సున కెక్కితేగాని కుదరదు. అందుకనే 'తత్పరత'తో గ్రహించి, మనస్సును జ్ఞానమార్గానికి అలవరచుకొ మ్మనే సూచన అవసరమైనది.

వ. అనిన విని పరమహర్షంబునం బాండవాగ్రజుండు పితామహుం బ్రశంసించి 'మహాత్మా! మహనీయుండగు కృష్ణుని మాహాత్మ్యంబు వినవలతుం జెప్పవే?' యని యడిగిన నతం డమ్మహీపతితో 'నారద జామదగ్న్య మార్కండేయ వ్యాస వాల్మీకి ప్రభృతి మునీంద్రులు సెప్ప వినిన తెఱం గెఱింగించెద నాకర్ణింపు' మని యిట్లనియె. **203**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; పాండవ+అగ్రజుండు= పాండవుల అన్న ధర్మజుడు; పరమహర్షంబునన్= గొప్ప సంతోషంతో; పితామహున్= తాతను భీష్ముడిని; ప్రశంసించి= పొగడి; మహా+ఆత్మా!= గొప్ప మనస్సు కలవాడా!; మహనీయుండు+అగు= పూజించవలసినవాడవగు; కృష్ణుని మాహాత్మ్యంబు= కృష్ణుడి గొప్పతనం; వినన్+వలతున్= వినగోరెదను; చెప్పవే?+అని+అడిగినన్= చెప్పవా? అని వేడగా; అతండు= ఆ భీష్ముడు; ఆ+మహీపతితోన్= ఆ రాజు అయిన ధర్మరాజుతో; నారద జామదగ్న్య మార్కండేయ వ్యాస వాల్మీకి ప్రభృతి ముని+ఇంద్రులు= నారదుడు, జామదగ్న్యుడు, మార్కండేయుడు, వ్యాసుడు, వాల్మీకి మొదలైన మునిశ్రేష్ఠులు; చెప్పన్= పలుకగా; వినిన తెఱంగు= విన్న విధం; ఎఱింగించెదన్= తెలుపుతాను; ఆకర్ణింపుము= వినుము; అని= అని పలికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** బృహస్పతి మనువుకొరకు చేసిన మాయను గురించిన ఉపదేశాన్ని విన్న ధర్మరాజు ఎంతో సంతసించి, తన తాతను మెచ్చుకొని, మళ్ళీ ఇట్లా అర్థించాడు. 'మహాత్మా! నాకు పూజ్యుడైన కృష్ణపరమాత్మ గొప్పదనం వినాలని కోరిక ఉన్నది. చెప్పవే?' అని, దానికి భీష్ముడు 'నారదాది మహామునులు స్వయంగా చెప్పగా విన్న విధాన మిది. నీవూ విను'మంటూ కృష్ణమాహాత్మ్యాన్ని వినిపించటం ప్రారంభించాడు.

**విశేషం:** భారతకథలో భీష్ముడు శ్రీకృష్ణభక్తుడిగా కనిపిస్తాడు. కాబట్టి కృష్ణతత్త్వ వర్ణన తాను చేస్తే అందులో భక్తి ప్రపత్తుల ఆధిక్యం గోచరించవచ్చును. అందువలన తాను ప్రస్తుతం వివరించబోయేది తాను నారదాది మహామునులనుండి విన్నది మాత్రమే అంటూ తన తాటస్థ్యాన్ని నిరూపించుకొన్నాడు పితామహుడు.

క. 'కృష్ణుఁడు ప్రభవిష్ణుం డగు । విష్ణుం; డనిలాగ్నితోయవియదిలలఁ గ్రియా
నిష్ణాతత్వ వినోదన । తృష్ణం గల్పించెఁ దనదు దివ్యవిభూతిన్. **204**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు= నల్లనయ్య; ప్రభవిష్ణుండు+అగు= ప్రభావవంతుడైన; విష్ణుండు= విష్ణువు; తనదు దివ్యవిభూతిన్= తన లోకాతీతమైన ఐశ్వర్యంతో, శక్తితో; అనిల+అగ్ని తోయ వియత్+ఇలలన్= గాలి నిప్పు నీరు ఆకాశం నేలలను (పంచభూతాలను); క్రియా నిష్ణాతత్వ వినోదన తృష్ణన్= పనులలోని నేర్పరితనంతో వినోదించే ఆశతో; కల్పించెన్= చేసెను.

**తాత్పర్యం:** కృష్ణుడు ప్రభావశాలి అయిన విష్ణువే. అతడే తన దివ్యశక్తితో తానూ కర్మనిర్వహణ నైపుణ్యంతో వినోదించాలనే ఆశతో ఈ సృష్టికి మూలపదార్థాలైన పంచభూతాలను - గాలి నిప్పు నీరు ఆకాశం నేల అనేవాటిని కల్పించాడు.

**తే.** **అట్లు కల్పించి జలములయందు భవ్య । తల్పగతుఁ డైన నాభిఁ బద్మంబు దోఁచె;**
**నం దజుఁడు పుట్టి సృజియించె నందనుల మ । నంబునన సప్తసంఖ్యుల నరవరేణ్య!** **205**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= ఓ రాజా!; అట్లు= ఆ విధంగా; కల్పించి= చేసి, పంచభూతాల సృష్టిచేసి; జలముల అందున్= నీళ్ళలో; భవ్య తల్పగతుఁడు+ఐనన్= శుభమైన పడకను చేరినవాడు కాగా - పరుండి ఉండగా; నాభిన్= బొడ్డునందు; పద్మంబు+తోఁచెన్= తామరపువ్వు పుట్టింది; అందున్= ఆ పువ్వునందు; అజుండు= బ్రహ్మ; పుట్టి= కలిగి; మనంబునన్+అ= మనస్సులోపలనే; సప్తసంఖ్యులన్= ఏడుగురు; నందనులన్= కుమారులను; సృజియించెన్= పుట్టించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా పంచభూతసృష్టిచేసి, నీటిలో శుభకరమైన పడకమీద పరుండి ఉండగా (విష్ణువు కర్త) విష్ణువు బొడ్డున తామరపువ్వు పుట్టింది. దానినుండి బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ మనస్సులోనే ఏడుగురు కుమారులను కన్నాడు. (వీరినే బ్రహ్మమానసపుత్రులు అంటారు.)

**వ.** **మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండును బులహుండును గ్రతువును దక్షుండు ననం బరఁగువారలయందు మరీచికిం గశ్యపప్రజాపతి జన్మించె; అతనివలన సురాసుర గరుడ నాగాదిజాతి సంభవంబునుం గలిగె; నతనికి సూర్యుండును నత్రికి సోముండును నుదయించి, రాజవంశంబులకుఁ గవాటస్థులైరి; సూర్య సోమాన్వయ జాతులైన నృపతు లనేకు లనేక దేశంబు లేలిరి; దేశకాల విశేషంబుల నృపకులంబులు బహుశాఖంబులై వర్ధిల్లువాని నెల్లం దన వలసిన యప్పుడు విష్ణుండు పరస్పర విరోధజనిత సంగ్రామంబులు నిమిత్తమాత్రంబులుగాఁ గల విశేషప్రకారంబుల నుపసంహరించుచు నద్దేవుండు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాత్మకంబు లగు చతుర్విధ దివ్యస్వరూపంబులు గలిగి జగద్భరణం బాచరించుచు నిట్లు లీలా జన్మంబులం బొంది క్రీడ సలుపు నని కృష్ణునిం జూపి 'ఈ భూతేశ్వరు మానుషసామాన్య దృష్టిం జూచుట యజ్ఞానంబు గృష్ణుండు భక్తపరతంత్రతం జేసి యుత్కృష్ట చరితుల యారాధనంబునకు భాజనంబయి భోగమోక్షంబులు గరుణామయ కటాక్షంబుల నొసంగు' ననినం బ్రీతుండై భీష్మునకుం బ్రణమిల్లి యుధిష్ఠిరుండు.** **206**

**ప్రతిపదార్థం:** మరీచియున్= మరీచీ; అత్రియున్= అత్రీ; అంగిరసుండును= అంగిరసుడూ; పులస్త్యుండును= పులస్త్యుడూ; పులహుండును= పులహుడూ; క్రతువును= క్రతువూ; దక్షుండును= దక్షుడూ; అనన్+పరఁగువారలఅందున్= అనగా వర్ధిల్లే ఆ బ్రహ్మమానస పుత్రులలో; మరీచికిన్= మొదటివాడు మరీచికి; కశ్యప ప్రజాపతి= కశ్యపబ్రహ్మ; జన్మించెన్= పుట్టాడు; అతని వలనన్= ఆ కశ్యపబ్రహ్మవలన; సుర+అసుర గరుడ నాగ+ఆది జాతి సంభవంబునన్= దేవతలు రాక్షసులు గరుడులు నాగులు మొదలగు జాతుల పుట్టుక కూడా; కలిగెన్= జరిగినది; అతనికిన్= ఆ కశ్యపబ్రహ్మకు; సూర్యుండును= సూర్యభగవానుడూ; అత్రికిన్= అత్రికి; సోముండును= చంద్రుడును; ఉదయించి= పుట్టి; రాజవంశంబులకున్= క్షత్రియుల వంశాలకు; కూటస్థులు+ఐరి=

మూల పురుషులు అయినారు; సూర్య సోమ+అన్వయ జాతులు+ఐన= సూర్యుడి, చంద్రుడి వంశాలలో పుట్టినవారైన; నృపతులు+అనేకులు= రాజులు పెక్కండ్రు; అనేక దేశంబులు+ఏలిరి= పెక్కు దేశాలను పాలించారు; దేశకాల విశేషంబులన్= దేశముయొక్క, కాలముయొక్క భేదముల యందు - భిన్న భిన్న దేశాలలో - భిన్న భిన్న కాలాలలో; నృపకులంబులు= రాజవంశాలు; బహుశాఖంబులు+ఐ= పెక్కు తెగలు కలవిగా; వర్తిల్లున్= ఉంటాయి; వానిని+ఎల్లన్= ఆ వంశాలను అన్నిటిని; విష్ణుండు= కృష్ణుడు; తన వలసిన+అప్పుడు= తనకు కావలిసిన సమయాన; పరస్పర విరోధ జనిత సంగ్రామంబులు= అన్యోన్యం కలహించటంవలన కలిగిన యుద్ధాలు; నిమిత్త మాత్రంబులుగాన్= కారణ మాత్రాలుగా అగునట్లు - ఆ నెపంతో; కల విశేష ప్రకారంబులన్= ఉన్న వివిధ రీతులలో; ఉపసంహరించున్= ముగించును - నశింపజేయును; ఆ+దేవుండు= ఆ శ్రీకృష్ణ దేవుడు; వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న+అనిరుద్ధ+ఆత్మకంబులు+అగు= కృష్ణుడు (వసుదేవుడి కొడుకు), బలరాముడు, మన్మథుడు, మన్మథ తనయుడు- అనేవారి శరీరాలు కలవి అగు; చతుర్విధ దివ్యస్వరూపంబులు= నాలుగు విధాలయిన లోకోత్తర ఆకారాలు; కలిగి= ధరించి; జగత్+భరణంబు= లోకాన్ని భరించటం; ఆచరించుచున్= చేస్తూ; ఇట్లు= ఈ విధంగా; లీలాజన్మంబులన్= వినోదం కొరకైన పుట్టుకలను; పొంది= వహించి; క్రీడ+చలుపున్= ఆట ఆడును; అని= అని పలికి; కృష్ణునిన్+చూపి= శ్రీకృష్ణుడిని చూపి; ఈ+ భూత+ఈశ్వరున్= ఈ ప్రాణుల అధిపతిని; మానుష సామాన్య దృష్టిన్= నరుల సాధారణమైన చూపుతో; చూచుట= కనుగొనటం; అజ్ఞానంబు= తెలివిలేని తనం; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; భక్తపరతంత్రతన్+చేసి= భక్తులకు సేవకుడగుటచేత; ఉత్కృష్ట చరితుల+ఆరాధనంబునకున్= గొప్ప నడతలుగలవారి పూజనానికి; భాజనంబు+అయి= పాత్రమై; భోగ మోక్షంబులు= సుఖానుభవం, మోక్షం అనే రెండూ; కరుణామయ కటాక్షంబులన్= దయామయమైన క్రీగంటి చూపుతో; ఒసంగున్= ఇస్తాడు; అనినన్= అని పలుకగా; ప్రీతుండు+ఐ= సంతసించినవాడై; భీష్మునకున్= భీష్మాచార్యుడికి; ప్రణమిల్లి= నమస్కరించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** బ్రహ్మమానస పుత్రులు ఏడుగురు. వారు వరుసగా మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు. వారిలో మరీచికి కశ్యప ప్రజాపతి జన్మించాడు. ఆ కశ్యపుడివలన దేవతలు, రాక్షసులు, గరుడులు, నాగులు మొదలైన జాతులు జనించాయి. ఆ కశ్యపుడికే సూర్యుడు జన్మించగా, అత్రికి చంద్రుడు కలిగి, ఆ సూర్యచంద్రులిద్దరూ క్షత్రియవంశాలకు మూల పురుషులయ్యారు. ఆ సూర్యచంద్ర వంశాలకు చెందిన రాజులు పలువురు పెక్కుదేశాలు ఏలారు. భిన్నభిన్న కాలాలలో భిన్నభిన్న దేశాలలో ఈ క్షత్రియవంశాలు అనేక శాఖోపశాఖలుగా వర్ధిల్లాయి. ఈ నానావిధ క్షత్రియవంశాలను, శ్రీకృష్ణుడు తనకు కావలసినపుడు వారిలో వారికి సంభవించే యుద్ధాలను నిమిత్తమాత్రంగా గ్రహించి, నశింపజేస్తూ ఉంటాడు. ఆ దేవుడు శ్రీకృష్ణరూపంతోపాటుగా బలరామ, మన్మథ, అనిరుద్ధ రూపాలను ధరించి ఈ జగత్తును భరిస్తూ వినోదంకొరకు జన్మలెత్తి ఆటలాడుకొంటూంటాడు' - అని భీష్ముడు పలుకుతూ ఎదుటనున్న శ్రీకృష్ణుడిని చూపి 'ఈ జగత్పతిని సామాన్య మానవుడిగా చూడటం అజ్ఞానం. శ్రీకృష్ణుడు భక్తులకు సేవకుడు కాబట్టి గొప్ప నడతగలవారికి ఆరాధనాభాజనమైనవాడు. నరులకు కావలసిన భోగభాగ్యాలనుగాని, ముక్తినిగాని కేవలం తన కరుణాకటాక్షమాత్రాన ఈయగలవాడు' అని పలుకగా ధర్మరాజు సంతసించి, పితామహుడికి నమస్కరించి. (మళ్ళీ ఈ విధంగా ప్రశ్నించాడు).

**క. 'మునిజన వినుత చరిత్రా! । మనుజుం డెవ్వనిఁ దలంచి మహనీయ నిరం**
**జన సిద్ధిఁ బొందఁ గను? నే । యనువు దలఁపు నలవరించు?' నని యడుగుటయున్. 207**

**ప్రతిపదార్థం:** మునిజన వినుత చరిత్రా!= ఋషిజనులచేత పొగడబడ్డ నడతగలవాడా! ఓ పితామహా!; మనుజుండు= నరుడు; ఎవ్వనిన్= ఏ వాడిని; తలంచి= చింతించి; మహనీయ నిరంజన సిద్ధిన్= గొప్పదైన పరమాత్మయొక్క ప్రాప్తిని; పొందన్+కనున్?= పొందగలుగును?; ఏ+అనువు= ఏ ఉపాయం; తలఁపున్+అలవరించున్= చింతనను మననమును అలవడజేయును?; అని+ అడుగుటయున్= అని ప్రశ్నించిన పిదప.

**తాత్పర్యం:** 'మునులు కొనియాడదగ్గ నడతగల ఓ పితామహా! ఏ వాడిని స్మరించి నరుడు గొప్పదైన పరమాత్మ స్థితిని పొందగలడు? ఏ మార్గాన దైవధ్యానం అలవడుతుంది?'

**భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రప్రభావంబు తెలుం గెఱింగించుట (సం. 12-200-3)**

**వ. ఆ ధర్మతనయుతోడ నద్దేవవ్రతుం డిట్లను; 'నారదునిచేత వినిన తెఱంగు వివరించెద నాకర్ణింపుము. 208**

**ప్రతిపదార్థం:** ఆ ధర్మతనయుతోడన్= ఆ ధర్మరాజుతో; ఆ+దేవవ్రతుండు= ఆ భీష్ముడు (దేవవ్రతుడు - భీష్ముడి మొదటి నామం); ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు; నారదునిచేతన్= నారదమునినుండి; వినిన తెఱంగు= విన్న విధం; వివరించెదన్= వివరంగా, విస్తారంగా, చెప్పెదను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** 'నీ ప్రశ్నకు సమాధానం నేను పూర్వం నారదమునీంద్రుడి నుండి విని ఉన్నాను. దానిని నీకు వివరిస్తాను విను'మన్నాడు భీష్ముడు.

**తే. పరము నక్షరు విష్ణునిఁ బ్రస్తుతించి। నారద మునీంద్రుఁ డంజలి నమితమైన**
**మస్తకముఁ జేర్చి భక్తిసమగ్రచిత్త। వృత్తి నల్లన యిట్లని విన్నవించె. 209**

**ప్రతిపదార్థం:** పరమున్= శ్రేష్ఠుడిని; అక్షరున్= నాశనంలేనివాడిని; విష్ణునిన్= విష్ణువును; ప్రస్తుతించి= పొగడి; నారదముని+ఇంద్రుఁడు= నారదుడనే మునిశ్రేష్ఠుడు; అంజలి= దోసిలి; నమితము+ఐన= వంగినదైన; మస్తకమున్= తలను; చేర్చి= ఉంచి; భక్తి సమగ్ర చిత్తవృత్తిన్= భక్తితో పరిపూర్ణమైన మనస్సుయొక్క వర్తనతో; అల్లన= మెల్లగా; ఇట్లు+అని= ఈ విధంగా; విన్నవించెన్= విజ్ఞప్తిచేశాడు.

**తాత్పర్యం:** సర్వశ్రేష్ఠుడూ, నాశరహితుడూ అయిన విష్ణుమూర్తిని నారదమునీంద్రుడు స్తుతించి, వంచిన శిరస్సున అంజలిని నిలిపి, భక్తిప్రపత్తులతో, పరిపూర్ణమైన మనస్సుతో మెల్లగా విన్నవించాడు. (ఈ విధంగా చెప్పబోయేది ఆ ముని విన్నపం.)

**విశేషం:** అర్థి - యాచకుడు, దాతను దరిచేరేటప్పుడు ఎట్లా ఏ భంగిమలో ఉండాలో అతడి మానసిక స్థితి ఏ తీరున ఉంటే కార్యసిద్ధి జరిగే వీలున్నదో ఈ పద్యం వివరిస్తున్నది.

**క. 'దేవా! మోక్షార్థి జనము। లే వెరవున నిన్నుఁ దలఁతు? రే జప్యము సం**
**భావింతురు? నా కానతి। యీవే? భక్తపరతంత్ర! యేర్పడఁ గరుణన్. 210**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ ప్రభూ! భక్త పరతంత్ర! భక్తులకు లొంగినవాడా!; మోక్ష+అర్థి జనములు= ముక్తిని యాచించే ప్రజలు; ఏ వెరవునన్= ఏ పద్ధతితో; నిన్నున్= మోక్షదాతవైన నిన్ను; తలఁతురు?= చింతిస్తారు?; ఏ జప్యము= ఏ జపం కొరకైన మంత్రాన్ని (జపింప దగిన దానిని); సంభావింతురు?= గౌరవిస్తారు; స్వీకరిస్తారు?; నాకున్= అర్థినైన నాకు; ఆనతి+ఈవే= ఆజ్ఞ ఈయవా?, తెలుపవా?

**తాత్పర్యం:** 'భక్తులకు లొంగే ఓ ప్రభూ! ముక్తిగోరే జనులు నిన్ను ఏ విధాన తలచుకొంటారు? (అంటే) నిన్ను ఏమని స్మరిస్తుంటారు వారు? వారు జపించే మంత్రమేది? దయతో నాకు ఆనతి ఈయవా ప్రభూ!' అని దీనంగా అర్థించాడు నారదుడు.

**తే. అనిన నద్దేవముని పలు కాదరించి। వరదుఁ డగు విష్ణుఁ డిట్లనుఁ బరమభక్తి**
**నిర్మల శ్రద్ధ యింద్రియనిగ్రహంబు। మన్మయ ధ్యానమునకు నమాత్యకోటి. 211**

**ప్రతిపదార్థం:** అనినన్= (నారదుడు ఆ విధంగా) అన్న తరువాత; ఆ+దేవముని పలుకు= ఆ దేవఋషి మాట - అర్థన; ఆదరించి= మన్నించి; వరదుండు+అగు విష్ణుఁడు= వరము లిచ్చే విష్ణుమూర్తి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; మత్+మయ ధ్యానమునకున్= (నా విష్ణుమయమైన) నాతో నిండిన ధ్యానమునకు - స్థిరమైన తలపునకు; పరమభక్తి= గొప్ప భక్తిభావం; నిర్మల శ్రద్ధ= స్వచ్ఛమైన శ్రద్ధ - ఆదరం; ఇంద్రియ నిగ్రహంబు= ఇంద్రియాల అణచివేత - కన్ను నోరు వంటి ఇంద్రియాలను లోబరచుకొనటం అనే ఈ లక్షణాలు మూడూ; అమాత్యకోటి= మంత్రిమండలి - ఉపకారకాలు.

**తాత్పర్యం:** నారదుడి అభ్యర్థనకు సమాధానంగా వరదుడైన విష్ణుమూర్తి ఇట్లా అన్నాడు. 'నన్ను ధ్యానించదలచినవారు ముందుగా గొప్పభక్తిని, నిష్కల్మషమైన శ్రద్ధను, ఆపై ఇంద్రియ నిగ్రహాన్ని అలవరచుకొవాలి. ఈ మూడు లక్షణాలూ విష్ణుధ్యానపరుడికి ఉండవలసినవి. విష్ణుధ్యానక్రియకు అవి సహకారకాలు.

**విశేషం:** అమాత్యుల ద్వారా రాజును చేరినట్లు, భక్తి శ్రద్ధ నిగ్రహాలద్వారా విష్ణుధ్యానాన్ని అందుకొనవచ్చును. ధ్యానమనే గమ్యం చేరటానికి ఈ మూడూ అనుసరించవలసిన మార్గాలు.

**క. విను, వీతకల్మషున కవి । పనుపడుఁ; గల్మషము లెల్లఁ బాపఁగ నా మె**
**చ్చిన యట్టి పరమసాధన । మనుస్మృతి జపించునది నియతిమెయి దానిన్. 212**

**ప్రతిపదార్థం:** విను= ఓ నారదా! ఆలకించుము; వీత కల్మషునకున్= తొలగిన పాపం కలవాడికి; అవి= ఆ మూడు లక్షణాలు- భక్తి శ్రద్ధా నిగ్రహాలు; పనుపడున్= అలవాటు అగును; కల్మషములు+ఎల్లన్= పాపాలు అన్నిటిని; పాపఁగన్= తొలగించటానికి; నా మెచ్చిన+అట్టి పరమ సాధనము= నేను మెచ్చుకొన్న గొప్ప ఉపకరణం; అనుస్మృతి= అనుసరించి స్మరించుట - మరల మరల తలంచటం; దానిన్= ఆ అనుస్మృతిని; నియతిమెయిన్= నియమ పూర్వకంగా; జపించునది= జపం చేయవలసింది.

**తాత్పర్యం:** (విష్ణుధ్యాన మలవడాలంటే భక్తి, శ్రద్ధ, నిగ్రహం కావాలని వివరించిన దేవుడు ఇపుడు అవి ఆ సద్గుణాలు ఎట్లా కలుగుతాయో వివరిస్తున్నాడు.) పాపరహితుడికి ఆ మూడు గుణాలూ అలవడతాయి. మరి ఆ పాపపరిహార మార్గమేది? - అంటే పాపాలు అన్నీ నశింపజేయటానికి విష్ణువు నంతటి దేవుడు మెచ్చిన పద్ధతి- అనుస్మృతి - మరల మరల తలచటం నిరంతరమననం. నియమపూర్వకంగా అనుస్మృతిని పాటించాలి- అనుస్మృతినే జపించాలి.

**విశేషం:** ఈ 'అనుస్మృతి' ఒక ఆరాధన ప్రక్రియగా కనిపిస్తున్నది. దేవుడి దయను పొందటానికి భక్తుడు చేసే నిరంతరస్మరణ ఇది. దీనికి ఒక ఆకారంకూడా ఏర్పడి ప్రచురితమైనట్లు ఈ సందర్భాన్నిబట్టి గమనించవచ్చును.

**తే. ప్రణవ పూర్వకమగు నమః పదము పొంత । షడ్గుణైశ్వర్య వాచక సర్వవసన**
**నిర్వచన శబ్దములు గ్రమనిష్ఠ మెయిఁ జ । తుర్థిఁ గూర్పంగ మంత్రంబు తోఁచు బెరసి. 213**

**ప్రతిపదార్థం:** ప్రణవ పూర్వకము+అగు= ఓంకారం ముందు గలదైన; నమః+పదము పొంతన్= 'నమః' అనే పదం దగ్గర; షట్+గుణ+ఐశ్వర్యవాచక సర్వవసన నిర్వచన శబ్దములు= ఆరుగుణాలను ఈశ్వర స్వభావాలను చెప్పెడి శబ్దాలు (మాహాత్మ్యం, ధైర్యం, యశస్సు, శ్రీ జ్ఞానం, వైరాగ్యం) మొత్తం గృహవాచకశబ్దాలు, (మొత్తం) నిందారహిత శబ్దాలు - ఈ మూడు విధాలయిన శబ్దజాలాన్ని (1. ఈశ్వర వాచకాలు, 2.వసన గృహవాచకాలు, 3. నిర్వచన వాచకాలు); క్రమనిష్ఠ మెయిన్= వరుసగా నిలుకడతో; చతుర్థిన్= నాలుగవ విభక్తిని కొఱకు, కై అనే ప్రత్యయాలను, (సంస్కృతంలో మంత్రాలు చతుర్థి అంతాలుగా ఓం వాసుదేవాయనమః- అన్నట్లుగా ఉంటాయి) మంత్రాలు తెలుగున ఉండవు కాబట్టి ఇక్కడ సంస్కృత చతుర్థిని - జే) అనే దానిని గ్రహించాలి; కూర్పంగన్= చేర్పగా; బెరసి= కలిగి, ఏర్పడి; మంత్రంబు= జనయోగ్యమైన మంత్రం; తోఁచున్= సిద్ధిస్తాయి.

**తాత్పర్యం:** ఓంకారాన్ని ముందునిల్పి, అనంతరం నమశ్శబ్దాన్ని జోడించి, ఆ తరువాత ఈశ్వర స్వభావాలయిన మాహాత్మ్యం, ధైర్యం, యశస్సు మొదలయిన గుణాలను తెలిపే శబ్దాలను క్రమంగా శ్రద్ధతో చేర్చుకొంటూ, ఆ శబ్దాలకు చతుర్థీవిభక్తిని కలిపితే "ఓం నమో వాసుదేవాయ" "ఓం నమో మహాయశసే" వంటి మంత్రాలు రూపుదిద్దుకొంటాయి.

**విశేషం:** దేవుడు సర్వాత్మకుడు కాబట్టి సృష్టిలోని సర్వశబ్దాలూ దేవవాచకాలుగా చెల్లుతాయి. విష్ణు సహస్రనామం మొదలయిన చోట్ల ఈ సూత్రం అన్వయిస్తుంది.

**క. తొలి తొలి యిమ్మంత్రము ని । శ్చల మానసుఁడై జపించి జపియింపంగా**
**వలయు; ననుస్మృతి దానం । గలుగుఁ జతుర్వర్గ సాధకత పురుషునకున్.' 214**

**ప్రతిపదార్థం:** తొలి తొలి= ముందు ముందు - మొట్టమొదట; ఈ+మంత్రము= ఈ పైన చెప్పిన మంత్రమును; నిస్+చలమానసుఁడు+ఐ= చలనంలేని మనస్సుగలవాడై (నరుడు); జపించి= జపము చేసి (అనంతరం); అనుస్మృతిన్= అనుస్మృతిని - ఆ పేరగల స్తోత్రమును; జపియింపంగాన్+వలయున్= జపించవలయును; దానన్= దానివలన - అట్లు చేయుటవలన; పురుషునకున్= నరుడికి; చతుర్ వర్గ సాధకత= నాలుగు వర్గాలను, ధర్మ అర్థ కామ మోక్షములను సాధించేవాడి తనం - సాధించే సామర్థ్యం; కలుగున్= ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** పైన చెప్పిన మంత్రాన్ని మున్ముందు నిశ్చలమనస్కుడై నరుడు జపించాలి. ఆ తరువాత 'అనుస్మృతి' పేరగల స్తోత్రాన్ని జపించాలి. అట్లా చేస్తే - ముందుగా మంత్రజపమూ, పిదప అనుస్మృతి స్తోత్రపఠనమూ చేస్తే నరుడికి ధర్మ - అర్థ - కామ - మోక్షాలను సాధించే సామర్థ్యం కలుగుతుంది'.

**విశేషం:** చిత్తానికి చంచలత్వం సహజలక్షణం. నీటికి ప్రవహించటం, నిప్పునకు పైకెగయటం ఎట్లాంటిదో మనస్సుకు చాంచల్యం అటువంటిది. ఆ చాంచల్యాన్ని నిరోధించగలిగితే ఆధ్యాత్మవిద్యలో సగభాగాన్ని అనుభవానికి తెచ్చుకొన్నట్లే. పూజాపురస్కారాలు, జపతపః ప్రభృతులూ - అన్నీ ఆ లక్ష్యంవైపు - మనశ్చాంచల్య నిరోధంవైపు సాగే సాధనాలే.

**క. అని మఱియు 'దయ ననుస్మృతి । యనుపేరం గలుగుదాని నమ్మునిపతి కి**
**ట్లని చెప్పె నచ్యుతుఁడు నిజ । మనఃప్రియం బైన యట్టి మహితస్తవమున్. 215**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; మఱియున్= ఇంకనూ; దయన్= దయతో; ఆ+మునిపతికిన్= ఆ మునిరాజునకు - నారదుడికి; అనుస్మృతి అనుపేరన్= అనుస్మృతి అనే పేరుతో; కలుగుదానిన్= ఉన్నదానిని; అచ్యుతుఁడు= చ్యుతుడు కానివాడు - విష్ణువు; నిజమనః ప్రియంబు+ఐన+అట్టి మహిత స్తవమున్= తన మనస్సునకు ప్రియమైన ఆ గొప్ప స్తోత్రాన్ని - అనుస్మృతిని; ఇట్లు+అని చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మంత్ర జపం తరువాత అనుస్మృతిని జపించుమన్న భగవంతుడు, దయతో ఆ నారదమునీంద్రుడికి తన మనస్సుకు ప్రీతిపాత్రమైనదీ, గొప్ప శక్తిమంతమయినదీ అయిన 'అనుస్మృతి'ని ఇట్లని చెప్పటం ప్రారంభించాడు.

**సీ. 'అవ్యక్తు శాశ్వతు నఖిల ప్రభవ భూమి । భక్తివత్సలు విష్ణుఁ బరమపురుషు**
**నక్షయుఁ బ్రాంజలినై యాశ్రయించెదఁ । బుండరీకాక్షుని భువనసాక్షి**
**నిత్యుఁ బురాణు వర్ణించెదఁ బరు సహ । స్రాక్షు నక్షరుని లోకైకనాథు**
**భవ్యుఁ గొల్చెద భూతభవ్య భవత్ప్రభు । సర్వతోముఖు భూతసంప్రవర్తి**

ఆ. నమృతు నచ్యుతుని ననంతు హృషీకేశు । రవిసహస్రనిభు హిరణ్యగర్భు
నబ్జనాభు సత్యు నాద్యంతరహితు భూ । గర్భుఁ బ్రభువు భక్తిగమ్యుఁ దలఁతు. **216**

**ప్రతిపదార్థం:** అవ్యక్తున్= ప్రకటంకాని వాడిని; శాశ్వతున్= నిత్యమైన వాడిని; అఖిల ప్రభవ భూమిన్= అన్నింటి పుట్టుకకు ఆధారమైన వాడిని; భక్తవత్సలున్= భక్తులయెడల ప్రేమ గలవాడిని; విష్ణున్= వ్యాపకుడిని - విశ్వమును వ్యాపించి ఉండేవాడిని; పరమపురుషున్= గొప్ప పురుషుడిని; అక్షయున్= నాశనములేనివాడిని; ప్ర+అంజలి+ఐ= దోసిలి పట్టినవాడినై; ఆశ్రయించెదన్= శరణు జొత్తును; పుండరీక+అక్షునిన్= తెల్లదామరలవంటి కన్నులు గలవాడిని; భువనసాక్షిన్= లోకాలకు సాక్షిఅయినవాడిని; నిత్యున్= శాశ్వతమైన వాడిని - నిరంతరం ఉండేవాడిని; పురాణున్= ప్రాచీనుడిని; వర్ణించెదన్= కొనియాడుతాను; పరున్= పరమాత్మను; సహస్ర+అక్షున్= వేయి కన్నులు గలవాడిని; అక్షరునిన్= నాశంలేనివాడిని; లోక+ఏకనాథున్= జగత్తునకు ఒకడే అధిపతి అయినవాడిని; భవ్యున్= శుభకరమైనవాడిని; కొల్చెదన్= సేవించెదను; భూత భవ్య భవత్+ప్రభున్= జరిగిన, జరగగల, జరుగుచున్న కాలాలకు త్రికాలాలకు అధిపతిని; సర్వతః+ముఖున్= అన్ని వైపులా మోము - చూపుగలవానిని; భూత సంప్రవర్తిన్= ప్రాణులను ప్రవర్తింపజేసేవాడిని; అమృతున్= మృతి - మరణం లేనివాడిని; అచ్యుతునిన్= చ్యుతి - జారుట - నాశములేనివాడిని; అనంతున్= అంతము- చివరలేనివాడిని; హృషీక+ఈశున్= ఇంద్రియాలకు అధిపతిని; రవి సహస్ర నిభున్= వేయి సూర్యుల వంటివాడిని; హిరణ్యగర్భున్= బంగారు కడుపు గలవాడిని; అబ్జనాభున్= పద్మం బొడ్డునగలవాడిని; సత్యున్= నిజమైన వాడిని; ఆది+అంతరహితున్= మొదలు తుదిలేనివాడిని; భూగర్భున్= పుడమి కడుపువాడిని; ప్రభువున్= అధిపతిని; భక్తిగమ్యున్= భక్తిచేత చేరదగినవాడిని; తలఁతున్= తలుస్తాను - ధ్యానిస్తాను.

**తాత్పర్యం:** (ఇది అనుస్మృతి.) నిరంతర స్మరణరూపమైన స్తుతి. దేవుడి లీలలను, ఆకారాలను, చేష్టలను వర్ణించే స్తోత్రం. కనబడనివాడిని, ఎప్పుడూ ఉండేవాడిని, అన్నింటి పుట్టుకకు ఆస్పదమైనవాడిని, భక్తులయెడ ప్రీతి గలవాడిని, విశ్వమంతా వ్యాపించి ఉండేవాడిని, గొప్ప పురుషుడిని, నాశంలేనివాడిని దోసిలి ఒగ్గి సేవిస్తాను - ఆశ్రయిస్తాను. తెల్లతామరలవంటి కన్నులు గలవానిని, లోకాలను (సాక్షిగా) చూస్తుండేవాడిని, ఎప్పుడూ నిలిచి ఉండేవాడిని, ప్రాతవాడిని వర్ణిస్తాను - కొనియాడుతాను. పరమాత్మ స్వరూపుడిని, వేయి కన్నుల వేల్పును, జారుట - నశింపులేనివాడిని, లోకాలకు తానొక్కడే అధినాథుడైనవాడిని, మంగళకరుడిని సేవిస్తాను. జరిగిన, జరగబోయే జరుగుతున్న మూడు కాలాలకూ అధిపతి అయినవాడిని, అన్నింటా ఉండేవాడిని, ప్రాణుల ప్రవృత్తికి కారణమైన వాడిని, మృతిచ్యుతి లేనివాడిని, తుదలేనివాడిని, ఇంద్రియాలకు అధీశుడిని, వేయి సూర్యులతో సమానుడిని, బంగరు కడుపుగలవాడిని, పద్మము నాభిని గలవాడిని, సత్యమైనవాడిని, మొదలు తుదిలేనివాడిని, పుడమి కడుపుగా గలవాడిని, అధిపతిని, భక్తితో చేరదగ్గవాడిని స్మరిస్తాను, ధ్యానిస్తాను.

**విశేషం:** విష్ణు సహస్రనామ శ్రవణం చేసేవారికి ఈ పదాలూ, ఇట్లాంటి పదాలూ జ్ఞప్తికి వస్తాయి. అంతా తానే అయి, తాను ఏమీ కాని తత్త్వాన్ని ఏ విధంగా వర్ణించినా చెల్లుతుంది. సహస్రనామాలంటే - సరిగా వేయి పేర్లని అర్థంగాదు. అన్ని పేర్లూ ఆయనవే. అన్నీ అందరూ అంతా తానే అయిన దేవుడికి పేరు గాని దేముంటుంది? సహస్ర శబ్దానికి తాత్పర్యార్థం అనంతమని లెక్కకు మిక్కిలి- అని ఇది వ్యవహారంలోనూ ఉన్నదే - 'వేయి చెప్పు నేను వినను' - వంటి మాటలలో 'వేయి' కూడా ఇటువంటిదే.

తే. అచలు సూక్ష్ము వరేణ్యు సహస్రశీర్షు । నభయకారి నశీర్షు నారాయణుని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు । ధ్రువుని నీశ్వరు హరి భక్తితోడఁ గొలుతు. **217**

**ప్రతిపదార్థం:** అచలున్= చలించని - కదలనివాడిని; సూక్ష్మున్= స్థూల దృష్టికి అందనివాడిని వరేణ్యున్= శ్రేష్ఠుడిని; సహస్రశీర్షున్= వేయి తలలవాడిని; అభయకారిన్= భయంలేమిని చేసేవాడిని - అభయమిచ్చేవాడిని; ఆశీర్షున్= తలలేనివాడిని; నారాయణునిన్=

విష్ణువును; సనాతమునిన్= సదాతనుని; యోగమూర్తిన్= యోగమే ఆకారంగా గలవాడిని; లోక+అతిరిక్తున్= లోకాలకు మించిన వాడిని; ధ్రువునిన్= శాశ్వతుడిని; ఈశ్వరున్= అధిపతిని; హరిన్= శ్రీహరిని; భక్తితోడన్= భక్తితో; కొలుతున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** స్థిరమైనవాడిని, ఆధ్యాత్మమైనవాడిని, సర్వశ్రేష్ఠుడిని, వేయితలలతో అభయమిచ్చేవాడిని, మొదలు లేనివాడిని, విష్ణువును, ప్రాచీనుడిని, యోగవిద్య ఆకారంగా గలవాడిని, లోకాలకు వెలిగా ఉన్నతంగా ఉండేవాడిని, శాశ్వతుడిని, అధీశ్వరుడిని అయిన హరిని భక్తితో సేవిస్తాను.

**విశేషం:** సహస్రశీర్షుడూ ఆయనే - అశీర్షుడూ ఆయనే. ఆయనకు విశేషంగా వాడదగని పద మేదీ ఉండదు. సర్వమయుడూ ఆయనే సర్వాతీతుడూ ఆయనే మరి! అందుకనే ఆయన 'సూక్ష్ముడు'.

**క. ఎవ్వఁడు సచరాచర గురుఁ, । డెవ్వని నాభీసరోజ మీనె విధాతన్,**
**నివ్వటిలు జగములన్నియు । నెవ్వనిచే నమ్ముకుందు నెప్పుడుఁ గొలుతున్. 218**

**ప్రతిపదార్థం:** ఏ+వాఁడు= ఏ దేవుడు; సచర+అచర గురుఁడు= కదిలేవాటికి, కదలనివాటికి, అన్నిటికి పెద్ద - ఏలిక; ఎవ్వడి నాభీ సరోజము= ఏ దేవుని బొడ్డున తామరపూవు; విధాతన్= బ్రహ్మదేవుడిని; ఈనెన్= కనెనో; జగములు+అన్నియున్= లోకాలు అన్నీ; ఎవ్వనిచేన్= ఏ దేవుడిచేత - ఎవడికారణంగా; నివ్వటిలున్= కలుగునో; ఆ+ముకుందున్= ఆ విష్ణువును; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; కొలుతున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** సృష్టిలో అనంతమైన భేదాలున్నా, మొత్తం సృష్టిని రెండే రెండు విధాలుగా - భాగాలుగా - భేదాలుగా చేయవచ్చును. ఒకటి కదిలేవి, రెండు కదలనివి. ఈ రెండింటికీ అధిపతి ఆ విష్ణువే. ఆ దేవుని బొడ్డు తామరనుండే సకలసృష్టికీ కర్త బ్రహ్మ పుట్టుకొచ్చాడు. ఆ దేవుడివలననే ఎల్లలోకాలూ ఏర్పడుతున్నాయి - కాగా అట్టి దేవుడిని సదా సేవిస్తాను.

**తే. స్థావరములు జంగమములు ధాత లోను । గాఁగఁ బ్రళయంబు నొందిన కాలమునను**
**నిలుచు నెవ్వఁ డొకండ యానిత్యసత్య । లలితు శార్ఙ్గిఁ బ్రపన్నుఁ గాఁ గొలుతు నియతి. 219**

**ప్రతిపదార్థం:** స్థావరములు= చలనంలేనివి; జంగమములు= తిరిగెడివి; ధాత లోనుగాఁగన్= బ్రహ్మ లోనైనది (సర్వమును); ప్రళయంబున్+ఒందిన కాలమునను= వినాశనం పొందిన సమయాన; ఎవ్వఁడు+ఒకండు+అ= ఏవాడు ఒకడే; నిలుచున్= నశించక నిలబడి ఉంటాడో; ఆ నిత్య సత్య లలితున్= అట్టి నిత్యమైన నిజమైన సుకుమారుడిని; శార్ఙ్గిన్= విష్ణువును; ప్రపన్నుగాన్= శరణుకోరిన వాడినిగా (నేను); నియతిన్= నియమంతో; కొలుతున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** సృష్టిలోని లోకాలన్నిటికీ ప్రళయం - చివరి వినాశం - తప్పదు. అపుడు సృష్టిలో సర్వస్వమూ కదిలేవీ కదలనివీ, బ్రహ్మ మొదలు పిపీలిక (చీమ) వరకు లయమై పోయినా, ఏ ఒక్కడు మాత్రం నశించక నిలిచి ఉంటాడో, ఆ శాశ్వతుడిని, సత్యుడిని, సుకుమారుడిని, శ్రీ మహావిష్ణువును శరణు కోరుతూ నియమంతో సేవిస్తాను.

**విశేషం:** పుట్టినది ఏదైనా గిట్టక మానదు. బ్రహ్మ పుట్టినవాడేగాబట్టి ప్రళయకాలాన ఆయనకూ గిట్టుట తప్పదు. ఇక్కడ బ్రహ్మకూడా లయమౌతాడని చెప్పటంలో తాత్పర్యమేమిటంటే నిజానికి ఆయనే సకలసృష్టికర్త. ఆయనే నశిస్తే ఆయన సృష్టివిషయంలో చెప్పవలసిన పనిలేదు.

**క. కాలముఁ బర్జన్యుండును । నేలయు సస్యంబుఁ గ్రియయు నిష్క్రియయును ధ**
**ర్మాలోకమునై మహిమన్ । లీల సలుపు వాసుదేవునిం బ్రణుతింతున్. 220**

**ప్రతిపదార్థం:** కాలమున్= క్షణాలూ, గంటలూ, దినాలూ - మాసాలు - వత్సరాల రూపంలో ఉండే కాలమూ; పర్జన్యుండును= మేఘుడును - పంటలకు అధిదేవతయూ; నేలయున్= భూమీ - పంటలకు ఆధారం; సస్యంబున్= పంటా; క్రియయున్= పంటకు- ఇతరానికి హేతువయిన పనీ; నిష్క్రియయును= పని లేకుండుటా; ధర్మ+ఆలోకమును+ఐ= ధర్మం యొక్క వెలుతురు కూడా (తాను) అయి; మహిమన్= గొప్పదనముతో; లీల+చలుపు= వినోదం చేసే; వాసుదేవునిన్= వసుదేవుడి తనయుడిని- శ్రీకృష్ణుడిని; ప్ర+నుతింతున్= కీర్తిస్తాను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణతత్వం మహిమోపేతం. వాసుదేవుడే సృష్టిలో కాలం. అతడే పంటలు పండించే మేఘుడు కూడా. పంటలకు ఆధారమైన నేలా ఆతడే. అంతేకాదు స్వయానపంటకూడా తానే. ఆ పంటకు కావలసిన పనిపాటలూ శ్రీకృష్ణుడే! అంతేకాదు ఏ పనీ లేని స్థితీ శ్రీకృష్ణతత్త్వమే. చివరకు ధర్మానికి వెలుతురూ శ్రీకృష్ణుడే, ఇట్లా అంతా తానే అయి, తన మహిమతో సృష్టివినోదాన్ని నెరపే వాసుదేవుడిని కొనియాడుతాను.

**విశేషం:** భగవతత్త్వానికి, భగవల్లీలకు వెలి అయిన దేదీ సృష్టిలో లేదు. అంతా భగవన్మయ మీ సృష్టి.

**క. అనలునకు రవికిని శశాం । కునకును గ్రహ తారకములకును దేజం బె**
**వ్వనివలన నావహిల్లెడు । ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్మున్. 221**

**ప్రతిపదార్థం:** అనలునకున్= అగ్నికి; రవికిని= సూర్యుడికీ; శశ+అంకునకును= కుందేలు గుర్తుగా కలవాడికి - చంద్రుడికీ; గ్రహ తారకములకును= (ఆకాశంలోని ప్రకాశించే) గ్రహాలకూ, చుక్కలకూ; ఎవ్వనివలనన్= ఏ దేవుడివలన; తేజంబు= కాంతి; ఆవహిల్లెడున్= కలుగునో; న+ఉపాధిక తేజున్= కారణం లేకయే తేజస్సు కలవాడిని; ఆ+విశ్వ+ఆత్మున్= ఆ విశ్వమే శరీరంగా కలవాడిని; కొల్తున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** సృష్టిలో సూర్యచంద్రులూ, అగ్నీ, గ్రహాలూ, నక్షత్రాలూ - ఇవన్నీ తేజస్సులు చిమ్ముతూ వెలగటానికి ఏ సహజతేజస్సు కారణమో, ఆ విశ్వమయుడిని సేవిస్తాను.

**విశేషం:** సృష్టిలో తేజస్సమూహమంతా సోపాధికమే - సకారణమే - భగవత్తేజస్సు కారణంగా ఆ తేజస్సులు జ్వలిస్తున్నాయి. కాని, భగవత్స్వరూపమైన తేజస్సు మాత్రం సహజం. ఇతర తేజస్సులకు అది కారణమే కాని, దానికి కారణం మరిలేదు. అదే 'అనుపాధిక తేజము'. దేవుడు తేజోరూపుడనుట.

**తే. నాలుగింటను వెండియు నాలుగింటఁ । రెంట నైదింట మఱియును రెంట వేల్చి**
**యజ్ఞశీలు రారాధించునట్టి విష్ణుఁ । డిష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడును నాకు. 222**

**ప్రతిపదార్థం:** నాలుగింటను= నాలుగు అక్షరాలతో - 'ఆశ్రావయ' అనే మంత్రంతో (దీనిలో నాలుగు అక్షరాలున్నాయి); వెండియున్= మరలా; నాలుగింటన్= నాల్గు అక్షరాలతో -'అస్తుశ్రౌషట్' అనే మంత్రంతో (దీనిలోనూ నాలుగు అక్షరాలే); రెంటన్= రెండు అక్షరాలతో- 'వషట్' అనే మంత్రంతో (రెండు వర్ణాలు గలది); ఐదింటన్= ఐదు వర్ణాలతో -'యే యజామహే' అనే మంత్రంతో (ఐదు అక్షరాలు); మఱియును= ఇంకనూ; రెంటన్= రెండు వర్ణాలతో - 'వషట్' మంత్రంతో; వేల్చి= అర్చించి - యజనం చేసి; యజ్ఞశీలురు= యజ్ఞాలు (చేసే) స్వభావం కలవారు; ఆరాధించునట్టి= సేవించునట్టి; విష్ణుఁడు= విష్ణుదేవుడు; ఇష్టదాయి= ఇష్టమును ఇచ్చేవాడు; నాకున్= ఈ అనుస్మృతిని పలికే నాకు; ప్రసన్నుఁడు+అయ్యెడును= అనుగ్రహం గలిగినవాడు అగుగాక! నన్ను అనుగ్రహించు గావుత!

**తాత్పర్యం:** యజ్ఞనిర్వహణంలో మంత్ర పూర్వకంగా దేవతలను తృప్తి పరచటం జరుగుతుంది. అట్టిచో విష్ణుదేవుడికి ప్రియమైన మంత్రాలను సంఖ్యానిర్దేశంతో తెల్పుతూ ఆయా మంత్రాలతో యాజులు ఆరాధిస్తే ఇష్టాలు ఒనగూర్చే

విష్ణుదేవుడు నా యెడకూడా ప్రసన్నుడౌగాక - అని భక్తుడు వేడుకొంటున్నాడు. ఇక విష్ణుప్రీతికి పాత్రమైన మంత్రాలు 'ఆశ్రావయ' 'అస్తుశ్రౌషట్', 'యేయజామహే', ' వషట్' అనేవి.

**విశేషం:**. యజ్ఞశబ్దానికి మొదటి అర్థం 'పూజ'. అనంతరం అది ఒక పెద్ద 'క్రతువు'గా రూపొందింది.

**ఆ. యజ్ఞధరుఁడు పంచయజ్ఞుండు లక్ష్మికి । నునికిపట్టు యోగమునకు నెలవు**
**సర్వమునకు నిష్టసదనంబుగా నొప్పు । వాని నాశ్రయింతు వరదుఁ బరము. 223**

**ప్రతిపదార్థం:** యజ్ఞధరుఁడు= యజ్ఞమును ధరించినవాడు; పంచయజ్ఞుఁడు= ఐదు యజ్ఞములు - వేదపఠనం, వైశ్వదేవం, అతిథిపూజ, పితృతర్పణం, భూతబలి కలవాడు; లక్ష్మికిన్= సిరికి; ఉనికిపట్టు= నివాస స్థానం; యోగమునకున్= యోగ విద్యకు; నెలవు= తావు - ఆవాసము; సర్వమునకున్= అంతటికీ; ఇష్టసదనంబు గాన్= ప్రియమైన ఇల్లుగా - అన్నిటికీ ఆస్పదమైనవాడుగా; ఒప్పు= వెలుగు; వానిన్= అతడిని - ఆ దేవుడిని; వరదున్= వరాలు ఇచ్చేవాడిని; పరమున్= పరమాత్మను; ఆశ్రయింతున్= శరణు పొందుతాను.

**తాత్పర్యం:** విష్ణుమూర్తి యజ్ఞధారి - యజ్ఞగర్భుడు, వేదపఠనం మొదలైన ఐదు యజ్ఞాల స్వరూపం తాల్చినవాడు. లక్ష్మికి నివాసమైనవాడు, యోగానికీ, ఇంకా ఎన్నింటికో ఉత్తమమైన, కోరదగిన అన్నింటికీ ఆస్పదమైనవాడు, వరాలకు దాత - పరమాత్మ; అతడిని ఆశ్రయిస్తాను.

**క. అగమనునిం బాంథు నఖిల । జగద్భరణపరు నమూర్తి సాగరనిభ బో**
**ధ గరిష్ఠుఁ బంచకాల । జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వ శోభితుఁ గొలుతున్. 224**

**ప్రతిపదార్థం:** అగమనునిన్= గమనం-నడకలేనివాడిని; పాంథున్= బాటసారిని (నడిచేవాడిని); అఖిల జగత్+భరణపరున్= మొత్తం లోకమును భరించటంలో ఆసక్తుడిని - భరించేవాడిని; అమూర్తిన్= ఆకారం లేనివాడిని; సాగరనిభ బోధ గరిష్ఠున్= సముద్రంతో సమానమైన జ్ఞానంతో మిక్కిలి గొప్పవాడిని; పంచకాలజ్ఞున్= ఐదు కాలాలను ఎరిగిన వాడిని; గుణ+ఆత్మకున్= గుణములు ఆత్మయందు కలవాడిని; నిర్గుణత్వ శోభితున్= గుణరహితతత్త్వంతో ప్రకాశించేవాడిని; కొలుతున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** భగవల్లీలలు విచిత్రంగా ఉంటాయి. వాటిలో వైరుద్ధ్యాలు గోచరిస్తాయి - స్థూలదృష్టికి, దేవుడు నడక లేనివాడయి కూడా గమనశీలిగా పాంథుడిగా భాసిస్తాడు. లోకాలు మొత్తం మోస్తూ కూడా తాను ఆకారమే లేకుండా ఉంటాడు. సముద్రమంత తెలివితో అందరికంటె గొప్పవాడు. ఐదు కాలాలూ తెలిసినవాడు. (ప్రాతఃకాలం, సంగమకాలం, మధ్యాహ్నకాలం, అపరాహ్ణకాలం, సాయంకాలాలు ఆయనకు తెలుసును.) ఎట్లంటే - స్వయంగా ఆయన కాలస్వరూపుడు మరి! గుణగణాలకు నిలయమైనవాడూ ఆయనే - నిర్గుణుడూ ఆయనే. అటువంటి గొప్పదేవుడిని సేవిస్తాను.

**విశేషం:** భగవద్వర్ణనలోని విరోధాలన్నీ నిజానికి ఆభాసమాత్రాలు. వాస్తవాలు కావు. స్థూల దృష్టికి విరోధం. సూక్ష్మదృష్టికి ఆభాసం-అయథార్థం.

**క. వ్యక్తమునకుఁ బ్రభవం బ । వ్యక్తం బాతత్త్వమునకు నవల యను వచో**
**యుక్తికిఁ బరాయణం బగు । భక్తపరాధీను భవ్య భావ్యు నుతింతున్. 225**

**ప్రతిపదార్థం:** వ్యక్తమునకున్= వ్యక్తమైన - ప్రకటితమైన - కనిపించేదానికి; ప్రభవంబు= కారణం; అవ్యక్తంబు= వ్యక్తం కానిది; ఆ తత్త్వమునకున్= ఆ అవ్యక్తతత్త్వానికి కూడా; అవల= అటువైపు - ఆవలితనము; అను వచస్+యుక్తికిన్= అనే మాట తీరునకు;

పరాయణంబు+అగు= ఆశ్రయమైన; భక్తపర+అధీనున్= భక్తులకు లోబడినవాడిని; భవ్యభావ్యున్= శుభమునకై భావించదగ్గవాడిని; నుతింతున్= స్తుతిస్తాను.

**తాత్పర్యం:** సృష్టి వ్యక్తరూపం; దానికి మూలం అవ్యక్తం - వ్యక్తంకానిది. అయితే ఆ అవ్యక్తానికి కూడా అందక దానికి ఆవల ఉండేది విష్ణుతత్త్వం. అంత గంభీరమైనది అది. అట్టి సర్వోన్నతతత్త్వానికి ఆశ్రయమైనవాడు అయినా భక్తులకు మాత్రం బానిస అయిన ఆ దేవుడు శుభకామనగల ఎల్లవారికీ భావింపదగ్గ, సేవింపదగ్గవాడు. అతడిని స్తుతిస్తాను.

**విశేషం:** విజ్ఞానశాస్త్రం, తత్త్వశాస్త్రం కలిసే స్థలాలు అక్కడక్కడా అపుడపుడు తటస్థపడుతుంటాయి. ఇక్కడ అది జరిగినట్లుంది. అవ్యక్తం నుండి వ్యక్తం ఉద్భవిస్తుం దంటుంది తత్త్వశాస్త్రం. దీనితో వైజ్ఞానికులు విభేదించరు. ఎందుకంటే అవ్యక్తం శూన్యం కాదు కాబట్టి.

**క. జ్ఞాన ధ్యాన పరాయణు। లైన మహాత్ములు జితేంద్రియత్వ మహితు లె**
**వ్వానిం బొందిన మరలరు। వాని శరణుఁ జొచ్చి బ్రదుకువాఁడ సుకృతినై. 226**

**ప్రతిపదార్థం:** జ్ఞాన ధ్యాన పరాయణులు+ఐన= జ్ఞానంలో, ధ్యానంలో (మాత్రం) ఆసక్తులయిన; మహా+ఆత్ములు= గొప్ప ఆత్మలు కలవారు; జిత+ఇంద్రియత్వ మహితులు= ఇంద్రియాలను జయించినతనంతో పూజ్యులు; ఏ వానిన్= ఏ దేవుడిని; పొందినన్= చేరినచో; మరలరు= తిరిగిరారో; వానిన్= అట్టి దేవుడిని; శరణు+చొచ్చి= శరణు - ఆశ్రయం పొంది; సుకృతిని+ఐ= పుణ్యాత్ముడనై; బ్రదుకువాఁడన్= జీవిస్తాను.

**తాత్పర్యం:** లోకంలో అసాధారణు లయిన మహాత్ము లున్నారు. వారికి జ్ఞానం, ధ్యానం - ఈ రెండే నిత్యకృత్యాలు. వారు ఇంద్రియాలను జయించి, పూజలందుకొనే గొప్పవారు. అట్టి మహాత్ములు ఏ దేవుడిని చేరి పునర్జన్మ లేకుండా ముక్తిని పొందుతారో - ఆ గొప్ప దేవుడిని - విష్ణుమూర్తిని పుణ్యాత్ముడనై ఆశ్రయించి జీవిస్తాను.

**విశేషం:** ఈ దేశాన వేదాంతులు కోరే చివరి దశ మోక్షం. ఆ మాటకు అర్థం ఎడబాటు - విడివడుట అని. ఎడబాటు దేనినుండి? జన్మ పరంపర నుండి. పునర్జన్మ లేకుండా ఉండగలగటమే ముక్తి. అది ఇక్కడి పురుషప్రయోజనాలలోకూడా చివరిది, గొప్పది.

**క. లోకం బంతయు నెవ్వం। డేకాంశంబునన నిర్వహించుచు నగ్రా**
**హ్యాకారుండై వెలుఁగు ద। యాకరు నప్పద్మనాభు నభివర్ణింతున్. 227**

**ప్రతిపదార్థం:** ఎవ్వండు= ఏ దేవుడు; లోకంబు+అంతయున్= జగత్తు మొత్తాన్ని; ఏక+అంశంబునన్+అ= (తన) ఒక అంశం-భాగంతోనే; నిర్వహించుచున్= మోస్తూ - జరిపిస్తూ; అగ్రాహ్య+ఆకారుండు+ఐ= గ్రహించనలవిగాని స్వరూపం కలవాడై; వెలుఁగు= ప్రకాశించునో; దయాకరున్= దయను చేసే (చూపే)వాడిని; ఆ+పద్మనాభున్= పద్మం బొడ్డునగలవాడిని - విష్ణువును; అభివర్ణింతున్= బాగా పొగడుతాను.

**తాత్పర్యం:** ఈ కనిపించే లోకం చాలా పెద్దది. ఇంత పెద్ద లోకాన్నంతటినీ తనలోని ఒక చిన్న అంశతోనే నడుపుతూ, తాను మాత్రం అగుపించకుండా, తన ఆకారాన్ని గ్రహించటానికి వీలులేనిదానినిగా అమర్చుకొన్న ఆ తేజోమయుడిని, దయాశాలిని - విష్ణుమూర్తిని అభివర్ణిస్తాను.

**తే. అయిదు దెఱఁగులఁ బ్రకృతిఁ బంచాననముల। ననుభవించు క్షేత్రజ్ఞు సత్త్వాది గుణ చ**
**యంబు లీల భుజించు మహత్త్వ కలితు। సంశ్రయింతు మదాత్మ ప్రసక్తిఁ గోరి. 228**

**ప్రతిపదార్థం:** అయిదు తెఱఁగులన్+ప్రకృతిన్= ఐదు విధాలయిన మూల సృష్టిని; పంచ+ఆననములన్= ఐదు ముఖాలతో; అనుభవించు క్షేత్రజ్ఞున్= చవిచూచే ఆత్మ స్వరూపుడిని; సత్త్వ+ఆది గుణచయంబున్= సత్త్వం మొదలయిన గుణాల సమూహాన్ని; లీలన్= వినోదంగా, విలాసంగా; భుజించు= భక్షించు - మ్రింగివేయు; మహత్త్వ కలితున్= గొప్పతనంతోకూడిన వాడిని; మత్+ఆత్మ ప్రసక్తిన్+కోరి= నా ఆత్మయొక్క చొరబాటును అభిలషించి; సంశ్రయింతున్= ఆశ్రయిస్తాను.

**తాత్పర్యం:** సృష్టికికర్త దేవుడు; దానికి భోక్త కూడా ఆయనే. తుదకు వినాశకర్త కూడా ఆయనే. పంచభూతాలతోడి ఈ ప్రకృతిని దేవుడు తన ఐదు ముఖాలతో అనుభవిస్తూ క్షేత్రజ్ఞుడుగా వెలుగుతున్నాడు. సృష్టిలోని జీవజాలాల ప్రవృత్తులకు కారణభూతాలైన సత్త్వరజస్తమోగుణాలను చివరకు ఆయనే తనలో లీనం చేసికొంటున్నాడు. అట్టి గొప్పతనంతో కూడిన భగవంతుడిని నా ఆత్మ ఏకాగ్రతకొరకు ఆశ్రయిస్తాను.

**విశేషం:** మన ఆరాధనలు, పూజలు, పురస్కారాలు - అన్నీ చిత్త ఏకాగ్రతకొరకు ఉద్దిష్టమైనవి. మనస్సు ఏకాగ్రమైతే, నరుడు నారాయణుడు కావచ్చునని మన తాత్త్వికుల బోధ.

**క. మతి గల సాంఖ్యులు, యోగా । న్వితులు నగుమహాత్ము లెవ్వనిం గని పున రా**
**గతిలేని సుగతి వడయుదు । రతర్క్య వైభవునిఁ దలఁతు నప్పరమాత్మున్. 229**

**ప్రతిపదార్థం:** మతిగల= బుద్ధిగల; సాంఖ్యులు= సాంఖ్యయోగులు - పంచభూతాలు - వాటి పంచ గుణాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, ప్రకృతి, జీవుడు మున్నగు ఇరవై ఐదు తత్త్వాలతోడి పరమాత్మ ధ్యానమును చేసేవారు; యోగ+అన్వితులున్= యోగవిద్యతో కూడినవారూ; అగు మహా+ఆత్ములు= ఐన గొప్ప మనస్సులు కలవారు; ఎవ్వనిన్+కని= ఏ దేవుడిని చూచి (పొంది); పునః+ఆగతి లేని= మరలి రావటం లేని; సుగతి+పడయుదురు= మోక్షాన్ని పొందుతారో; ఆ+పరమ+ఆత్మున్= ఆ పరమాత్మ - పరబ్రహ్మ స్వరూపుడిని; అతర్క్య వైభవునిన్= ఊహించరాని విభవం - సంపత్తి గలవాడిని; తలఁతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** బుద్ధిమంతులైన సాంఖ్యయోగులూ, ఇతర యోగవిద్యాప్రవీణులూ అయిన మహాత్ములు ఏ దేవుడిని చేరిన పిదప, ఇక మరలిరాని ముక్తిని - పునర్జన్మ రాహిత్యాన్ని పొందుతారో, ఆ పరబ్రహ్మ స్వరూపుడిని, ఊహకందని గొప్ప వైభవముగల ఆ దేవదేవుడిని స్మరిస్తాను.

**విశేషం:** సాంఖ్యమనేది ఒక యోగానికి పేరు. సంఖ్యా శబ్ద నిష్పన్నం సాంఖ్యం. ఈ యోగవిద్య సంఖ్యమీద ఏర్పడినట్లుగా ఉంటుంది. పంచభూతాలు - పంచగుణాలు, పంచ ఇంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనో బుద్ధి అహంకార ప్రకృతి జీవులు ఐదు- ఇట్లా ఈ 5×5= 25 తత్త్వాలతోడి శాస్త్రమిది. మనకున్న దర్శనాలలో ఒక ముఖ్యమైనది.

**క. ఇనునడుమ వెలుంగుచు సో । ముని మధ్యమునం జలత్వముం బొందని ని**
**ప్పున వెలయు దీప్తి యగు వా । ని నిరంజను నంతరాత్మునిం బాటింతున్. 230**

**ప్రతిపదార్థం:** ఇను నడుమన్= సూర్యుడి మధ్యభాగాన; వెలుంగుచున్= ప్రకాశిస్తూ; సోముని మధ్యమునన్= చంద్రుడి నడిమి భాగాన; జలత్వమున్+పొందని= నీటితనమును చెందనివానిని; నిప్పునన్= అగ్నియందు; వెలయు= వెలిగే; దీప్తి+అగువానిన్= కాంతి - ప్రకాశము అయినవాడిని; నిరంజనున్= పరమాత్మను; అంతర్+ఆత్మునిన్= లోపలి (నరుడిని) ఆత్మయైనవాడిని; పాటింతున్= (స్మరిస్తాను) గౌరవిస్తాను.

**తాత్పర్యం:** విష్ణుతత్త్వం తేజోమయం. విష్ణువు సూర్యుడి నడుమ వెలుగుతుంటాడు. చంద్రుడిలో కూడా విష్ణుడు నడుమ నిలిచి, ఆ చల్లదనానికి నీరుగాకుండా నిలిచి ఉంటాడు. నిప్పులోని వెలుగూ వైష్ణవమే. ఈ విధంగా సర్వ తేజస్సులకూ తేజస్సుగా నిలిచిన అంతరాత్మస్వరూపుడైన ఆ పరమాత్మను గౌరవిస్తాను.

**విశేషం:** సృష్టమైనదేదీ సూర్యచంద్ర అగ్నులలో నిలిచి ఉండలేదు. స్రష్టకే (సృష్టిని చేసేవాడు బ్రహ్మ) స్రష్ట గాబట్టి విష్ణువు ఆ మూడు మహాతేజస్సుల నడుమ నిలిచి ఉన్నాడు.

**క. సోమార్కాగ్నిమయముఁ దా । రామయమును నిత్య సుస్థిరంబును నగు తే**
**జోమయతత్త్వము నాత్మా । రామత్వంబున నిరంతరంబును జూతున్. 231**

**ప్రతిపదార్థం:** సోమ+అర్క+అగ్ని మయమున్=చంద్రుడు, సూర్యుడు, అగ్నితో నిండినదానిని; తారామయమును= నక్షత్రాలతో నిండినదియు; నిత్య సుస్థిరంబును+అగు= ఎల్లప్పుడూ గట్టిగా నిలిచి ఉండేదీ అగు; తేజస్+మయతత్త్వము= కాంతితో నిండిన బ్రహ్మమును; ఆత్మ+ఆరామత్వంబునన్= ఆత్మయందే విహరించే శీలంతో; నిర్+అంతరంబును= ఎడం లేకుండా - ఎల్లప్పుడూ; చూతున్= చూస్తాను.

**తాత్పర్యం:** విష్ణుతత్త్వం తేజోమయం. చంద్రుడిలో, సూర్యుడిలో, అగ్నిలో ఉన్నది విష్ణువే. నక్షత్రాలలోని వెలుగూ వైష్ణవమే - విష్ణువునకు చెందినదే. ఈ వైష్ణవతేజస్సు నిత్యమైనది, సుస్థిరమైనది కూడా. ఇట్టి ఈ కాంతిమయ తత్త్వాన్ని అంతర్దృష్టితో ఆత్మలోనే నిరంతరం దర్శిస్తుంటాను.

**విశేషం:** ఈ దైవతత్త్వం ఎవరెన్ని విధాల వర్ణించి చెప్పినా, చివరకు అనుభవైకవేద్యమే. ఎందుకంటే, మాటలకు ఆలోచనలకు ఎంత విస్తృతి ఉన్నా కాని, పరిమితులూ, పరిధులూ ఉన్నాయి. అవి (వాక్కు, మనస్సు) చెల్లని చోటులు లోకానుభవంలోనే మనకు ఎదురవుతుంటాయి. ఉదా: 'బెల్లం తియ్యగా ఉంటుంది'. 'తియ్యగా' అంటే ఏమిటి? తియ్యన ఒక రకంగా గుర్తించగలమే గాని, ఎదుటివానికి స్వానుభవానికి దూరంగా ఎరుకపరచగలమా? ఈ స్వల్ప విషయమే ఇట్లా ఉంటే, దైవతత్త్వం మహా దొడ్డది - దాని విషయం వేరే చెప్పాలా? అయినా నరుడి ప్రయత్నాలు దైవతత్త్వవర్ణనలో కొనసాగుతూనే ఉన్నాయి.

**క. గుణములకు నాదియై ని । ర్గుణమ్ములకు నాద్యుఁడగు నరూపుని లక్ష్మీ**
**ప్రణయవరు నజుని సూక్ష్ముని౯ । బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁ బరము సర్వగతున్. 232**

**ప్రతిపదార్థం:** గుణములకున్= (సృష్టిలోని) వస్తువులలోని ధర్మములకు; ఆది+ఐ= మొదలై; నిర్+గుణమ్ములకున్= గుణముల లేమికి కూడా; ఆద్యుఁడు+అగు= మొదటివాడగు; అరూపునిన్= రూపంలేని వాడిని; లక్ష్మీ ప్రణయవరున్= లక్ష్మీదేవి ప్రేమను పొందినవాడిని; అజునిన్= పుట్టుకలేనివాడిని; సూక్ష్మనిన్= ఆధ్యాత్మమైన వానిని; పరమున్= పరమాత్మను; సర్వగతున్= అంతటా ఉండేవాడిని; ప్రసన్నున్+కాన్= అనుగ్రహించేవాడగుటకు; ప్ర+నుతింతున్= బాగుగా పొగడుతాను.

**తాత్పర్యం:** విష్ణుతత్త్వం విచిత్రంగా ఉంటుంది. విష్ణువు సృష్టిలోని వస్తుగత గుణగణాలు అన్నిటికీ మొదటివాడు. అయినా స్వయంగా గుణాతీతుడుగా గుణరహితుడుగా కూడా ఉంటాడు. ఆయనకు స్వరూపమే లేదు - అంతటా అన్నిటా ఉండేవాడికి ఒక్క స్వరూపం ఎట్లా ఉంటుంది మరి! అయినా విష్ణువు శ్రీలక్ష్మీప్రణయాన్ని అందుకొన్నవాడు- అంటే సాకారుడన్నమాట. నిరాకారుడూ అతడే; సాకారుడూ అతడే. విష్ణువు పుట్టుక లేనివాడు, ఆధ్యాత్మికమైన ఉనికి కలవాడు. అంతా వ్యాపించి ఉండేవాడు విష్ణువు. పరమాత్ము డతడు. అట్టి దేవుడిని అనుగ్రహం కొరకు నుతిస్తాను.

**విశేషం:** గుణాలు వ్యక్తినిష్ఠాలు - వ్యక్తిలో ఉండేవి. వ్యక్తి ఆత్మకు నిలయం. ఆత్మ పరమాత్మకు రూపాంతరం. కాబట్టి గుణాలకు ఆద్యుడే దేవుడు. పరమాత్మ సర్వవ్యాపకమైనది. సర్వప్రాణిగతమైనది కూడా. కాబట్టి ఈ సర్వగతత్వమున్నచోట ఏకవ్యక్తి గుణాల ఉనికి అసంభవం. కాగా నిర్గుణుడూ ఆయనే. ఈ విధంగా తర్కసహాయంతో ఈ విశేషణాలను సమర్థించుకొనాలి.

**క. కలయంగ నెల్లయెడలం। దలలును లోచనములును వదనములు నగు ని**
**ర్మలు నిర్వికారు నిన్నుం। గొలిచెద సర్వైకసాక్షి గోవింద హరీ! 233**

**ప్రతిపదార్థం:** గోవింద!= ఓ విష్ణుమూర్తీ!; హరీ!= ఓ నారాయణా!; కలయంగన్= బాగుగా; ఎల్ల+ఎడలన్= అన్ని ప్రదేశాలలో; తలలును= శిరస్సులూ; లోచనములును= కన్నులూ; వదనములున్= మోములూ; అగు నిర్మలున్= కల మలినరహితుడిని; నిర్వికారున్= వికారాలు లేనివాడిని; సర్వ+ఏక సాక్షిన్= అన్నింటికీ ఒక్కడే సాక్షిఅయినవాడిని; నిన్నున్= నిన్ను హరిని; కొలిచెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** ఓ శ్రీహరీ! నీది విశ్వరూపం. అన్ని ఎడలా నీ శీర్షాలే, నీ లోచనాలే, నీ ముఖాలే, అయినా మలిన మంటని వాడవు. సృష్టి నిజానికి వికృతిమయం. కాని, నీవు వికృతులు లేనివాడవు. సృష్టిసర్వస్వానికి ఏకసాక్షిగా నిలిచే నిన్ను సేవిస్తాను దేవా!

**క. నిను నెఱుఁగకున్న సంసా। ర నిమగ్నత వోదు; గోచరము గావు మనం**
**బునకు నఖిలేంద్రియములకు। నను నేమనువాఁడ నిఁక నారాయణుఁడా! 234**

**ప్రతిపదార్థం:** నారాయణుఁడా!= ఓ నారాయణస్వామీ!; నినున్= సర్వవ్యాపకుడవైన నిన్ను; ఎఱుఁగక+ఉన్నన్= తెలియకుండా ఉంటే; సంసార నిమగ్నత= సంసారమున (కుటుంబమున) మునిగి ఉండటం; పోదు= తొలగదు; (నీవు) మనంబునకున్= మనస్సునకు గాని; అఖిల+ఇంద్రియములకున్= ఎల్ల ఇంద్రియాలకూ - కన్ను ముక్కు వంటివాటికి; గోచరము కావు= కనిపించవు- తెలియవు; ఇంకన్= ఇకమీదట - ఈ స్థితి ఇట్లా కొనసాగగా; ననున్= శక్తిహీనుడనైన నన్ను; ఏమి+అనువాఁడన్= ఏమి నిందించుకొంటాను? (నన్ను నేను ఏమని నిందించుకొనేది దేవా!)

**తాత్పర్యం:** దేవా! నీ తత్త్వం గ్రహిస్తే తప్ప ఈ సంసారబంధం విడిపోదు. నీ వేమో ఎల్ల ఇంద్రియాలకు కాదు కదా, మనస్సుకూ కనిపించవు, తెలియరావు. ఇక నన్ను నేను ఏమనుకోవాలి? (నన్ను నేను ఏమని అనాలి!)

**విశేషం:** దైవజ్ఞానం లోకజ్ఞానంకంటె భిన్నమైనది. లోకజ్ఞానానికి ఇంద్రియాలూ, మనస్సు చాలు. కాని, దైవజ్ఞాన - అవాప్తికి ఈ రెండూ యథాతథంగా - ఉన్నవి ఉన్నట్లుగా పనికిరావు. అందుకనే 'నీవు గోచరించనందుకు నన్ను నేను ఏమనాలి?' అని నిర్వేదం వెలువరిస్తున్నాడు భక్తుడు.

**క. రోషముఁ గామము రాగ। ద్వేషములును లేక భక్తి తిరమై యేకా**
**శ్లేషిణిగాఁ గొలుతు రవి। శ్లేష మనోనిలయ వృత్తి సిద్ధులు నిన్నున్. 235**

**ప్రతిపదార్థం:** సిద్ధులు= సిద్ధిపొందినవారు; రోషమున్= కోపమూ; కామమున్= కోరికా; రాగద్వేషములును= ప్రేమా, పగా ఇవన్నీ; లేక= ఉండకుండా; భక్తి= భజనభావం; తిరము+ఐ= స్థిరమై; ఏక+ఆశ్లేషిణి+కాన్= ఒకటే (తాను) సంసక్త మౌనట్లుగా; అవిశ్లేష మనస్+నిలయ వృత్తిన్= విడిపోని మనస్సు అనే ఇంట ఉండటంవలన; నిన్నున్= పరమాత్మవైన నిన్ను; కొలుతురు= సేవిస్తారు.

**తాత్పర్యం:** సిద్ధిని - వాంఛితార్థాన్ని పొందినవారు మాత్రం నిన్ను చూడగలుగుతున్నారు. కొలువ గలుగుతున్నారు. వారు కోపం, కోరిక, ప్రేమ, పగ వంటి వికృత భావాలను విడిచిపెట్టి, కేవలం భక్తినే ఆశ్రయించి, నిరంతరం ఆ భావంనుండి బయటపడక, వారి మనస్సులనే ఇళ్ళలో కాపురముండే నిన్ను చూడగలుగుతున్నారు, సేవిస్తున్నారు.

**విశేషం:** దైవతత్త్వ దర్శనానికి అనేక మార్గాలు ఉన్నాయి. వాటిలో భక్తి మార్గం సుగమం. అందరికీ అందుకొనదగ్గది. దాన్ని వివరించాడు ఇక్కడ.

క. ఫలములు గోరక కర్మం । బులు నడపుచు వాని విమలబోధాగ్నిహతిం
బొలియించుచు నిర్ద్వంద్వత । నెలకొను నేకాంతిజనులు నినుఁ గంద్రు హరీ! 236

**ప్రతిపదార్థం:** హరీ!= ఓ విష్ణూ!; ఫలములు= ఫలితాలు; కోరక= ఇచ్ఛగించక; కర్మంబులు= పనులు; నడపుచు(న్)= నిర్వహిస్తూ; వానిన్= ఆ ఫలితాలను - పనులవలన ఒనగూడే ప్రయోజనాలను; విమల బోధ+అగ్నిహతిన్= నిర్మలమైన జ్ఞానం అనే నిప్పు తాకిడితో; పొలియించుచున్= నశింపజేస్తూ; నిర్ద్వంద్వత= ద్వంద్వములు - సుఖదుఃఖములు, మంచి చెడులు, ప్రేమ, ద్వేషం వంటి సహజములైన జంటలు లేకుండటం; నెలకొను= స్థిరపడిన - ఏర్పడిన; ఏక+అంతిజనులు= చిత్త ఏకాగ్రతగలవారు; నినున్= సర్వవ్యాపివయిన నిన్ను; కంద్రు= చూస్తారు.

**తాత్పర్యం:** ఓ విష్ణూ! నీ విశ్వరూప సందర్శనం కావాలంటే నరులు వారి నడతలు, ఆలోచనలు మార్చుకొనాలి. ఫలితాలు ఆశించకుండా పనులు నిర్వహించుకుంటూ పోయి, తుదకు ఆ కర్మఫలాలను నిర్మలజ్ఞానమనే నిప్పు తాకుతో హరించివేసికొని, సుఖదుఃఖాలు, ప్రేమద్వేషాలువంటి ద్వంద్వాలకు అతీతంగా ఏకాగ్రచిత్తులై నిలువగలిగిన ఘనులే నిన్ను దర్శించగలరు.

**విశేషం:** మనవేదాంత పరిభాషలో ముక్తి, మోక్షం అనే మాటలకు జన్మరాహిత్యం తాత్పర్యం. తిరిగి పుట్టకపోవటమే - జన్మచక్రం నుండి బయటపడటమే ముక్తి. పునర్జన్మలకు వాసనలు మూలమంటారు. ఆ వాసనలు కర్మఫలాలనుండి, వాటికై పడే తాపత్రయాల నుండి ఏర్పడుతాయట. అందుకని ఫలంతో ప్రమేయంలేకుండా, అసలు ఆ కోరికే లేకుండా కర్మనిర్వహణం చేయాలని మన వేదాంతశాస్త్రం బోధిస్తుంది. కోరిక లేకపోతే వాసన ఉండదు. వాసన లేక జన్మ లేదు. అలంకారం - రూపకం.

క. దేహస్థు నదేహు నఖిల । దేహిసమున్ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత
వ్యూహమ్ముఁ బుణ్యచయము న । మోహత నిరసించు యోగిముఖ్యులు కృష్ణా! 237

**ప్రతిపదార్థం:** కృష్ణా!= ఓ కృష్ణమూర్తీ! దేవా!; దేహస్థున్= దేహంలో ఉన్నవాడిని; అదేహున్= దేహంలేనివాడిని; అఖిల దేహిసమున్= అందరు దేహధారులకు - అన్ని ప్రాణులకు సమానుడయిన వాడిని; నిన్నున్= విశ్వరూపివైన నిన్ను; దురిత వ్యూహమ్మున్= పాపముల సమూహమును; పుణ్యచయమున్= పుణ్యాల ప్రోగును; అమోహతన్= మోహం (తీవ్రకాంక్ష) లేనితనంతో; నిరసించు= తిరస్కరించే; యోగిముఖ్యులు= శ్రేష్ఠులయిన యోగులు; భక్తిన్= భక్తి భావంతో; తెలుతురు= మ్రొక్కుదురు.

**తాత్పర్యం:** విష్ణువు దేహాన ఉన్నవాడు, కాని, దేహం (స్వయంగా) లేనివాడు. ఎల్ల జీవజాలమూ ఆ దేవుడికి సమానమే. అట్టి ఆ దేవుడిని తెలియగలవారు - గ్రహించగలవారు మాత్రం యోగిశ్రేష్ఠులు. వారు పాపాలనూ పుణ్యాలనూ రెంటినీ తిరస్కరించి, కేవలం భక్తితో ఆ దేవదేవుడికి నమస్కరిస్తారు.

**విశేషం:** ముక్తిసాధనలో తొలుత పాపపరిహారం కర్తవ్యం. తరువాత పుణ్యసంచయనం కార్యం. ఆ తరువాత, పాపపుణ్య ద్వంద్వ తిరస్కారం ఆచరణీయం.

చ. ప్రకృతియు, బుద్ధ్యహంకృతులు, భావము, భూతచయంబు, నింద్రియ
ప్రకరముఁ గేశవా! భవదుపాశ్రయ భాసిత వర్తనంబు; లా
సకలమునందు నీవును బ్రసన్నత ని; ల్తవి నీకు, నీవు వా
నికి నిలువంగఁ బట్టగుట నిక్కముగా నిటులై వెలుంగవే? 238

**ప్రతిపదార్థం:** కేశవా!= ఓ విష్ణూ!; ప్రకృతియున్= స్వభావమును; బుద్ధి+అహంకృతులున్= బుద్ధి, అహంకారం అనేవీ; భావమున్= మనస్సూ; భూతచయంబున్= ప్రాణికోటి; ఇంద్రియ ప్రకరమున్= ఇంద్రియాల - కన్ను ముక్కు లోనగు జ్ఞానేంద్రియాల, కాలు చేయి లోనగు కర్మేంద్రియాల సమూహమూ; భవత్+ఉప+ఆశ్రయ భాసిత వర్తనములు= నీ ప్రాపువలన ప్రకాశించే (కలిగే) ప్రవృత్తులు గలవి; ఆ సకలమునందున్= ఆ అన్నింటియందు - ప్రకృతి మొదలు ఇంద్రియాల వరకు గల ఎల్లవానియందును; నీవును= నీవు కూడా; ప్రసన్నతన్= అనుగ్రహంతో; నిల్తు(వు)= నిలుస్తావు - ఉండెదవు; అవి= ఆ అన్నీ - ప్రకృతి మొదలు ఇంద్రియాలవరకు గల మొత్తం; నీకున్= నీకూ; నీవు= విష్ణుడవైన నీవు; వానికిన్= ఆ అన్నింటికీ; నిలువంగన్= నిలుచుటకు- ఉండటానికి - ప్రవర్తించటానికి; పట్టు+అగుటన్= ఆధారమవటంవలన; నిక్కముగాన్= నిజంగా; ఇటులు+ఐ= ఈ విధంగా అయి; వెలుంగవే?= ప్రకాశించవా? - ప్రకాశిస్తావు కదా!

**తాత్పర్యం:** ఓ విష్ణూ! ఈ కనుపించే ప్రకృతి, కనుపించని బుద్ధి, అహంకారం, మనస్సు సృష్టిలోని ప్రాణిలోకం, జ్ఞాన, కర్మ ఇంద్రియాలు, ఇవన్నీ నీ ప్రాపుతో నీ అదుపాజ్ఞలకు లోబడి ప్రవర్తించేవే! నిజానికి ఆ అన్నింటియందు ప్రసన్నుడవై నీవే నివసిస్తూ ఉంటావు. అవి నీకూ, నీవు వాటికీ పరస్పరం ఆధార - ఆధేయ భావం కలిగి ఉండటం వాస్తవం. ఈ విధంగా సృష్టిలోని అన్నింటా నీవు, నీలో సృష్టి సర్వస్వం - ఒదిగి ఉండటం విచిత్రం! అంతా నీవై ప్రకాశిస్తున్నావు దేవా!

**విశేషం:** తత్త్వదర్శనం జరిగితే, ద్రష్ట, దృష్టి, దృశ్యమూ మూడు ఒకటే అని భారతీయవేదాంతం ప్రకటిస్తుంది. ఆత్మ పరమాత్మ అనీ, దానికే పరబ్రహ్మ నామాంతరమనీ కొన్ని భారతీయదర్శనాల ప్రబోధం.

**క.** **ఏకత్వం బన్యత్వ మ । నేకత్వము గలుగు నీ మహిమ చందం బా**
**లోకింప నిపుణులగు సు । శ్లోకులకుం బరమపదము సులభము శార్ఙ్గీ!** **239**

**ప్రతిపదార్థం:** శార్ఙ్గీ!= ఓ విష్ణూ!; ఏకత్వంబు= ఒంటితనం - ఒకటిగా ఉండటం; అన్యత్వము= పెరతనం - మరొకటిగా ఉండటం; అనేకత్వము= పెక్కుతనం - ఎక్కువగా - ఒకటికంటె అధికంగా ఉండటం; కలుగు= ఉన్న; నీ మహిమ చందంబు= నీ గొప్పదనపు తీరు; ఆలోకింపన్= చూచుటకు; నిపుణులు+అగు= నేర్పరులగు; సుశ్లోకులకున్= మంచి కీర్తిగల వారికి; పరమపదము= మోక్షం; సులభము= సుఖంగా లభించేది.

**తాత్పర్యం:** (ఇపుడు విష్ణుతత్త్వంలోని మరొక విశేషాన్ని వర్ణిస్తున్నాడు.) విష్ణువు ఏకత్వ మహిమ గలిగినవాడు. తాను తప్ప మరేదీ లేనివాడు. అతడే అన్యత్వ మహిమ గలవాడు కూడా - తాను ఇతరుడు కూడా కాగలడు. ఈ రెండింటితో - ఏకత్వ అన్యత్వాలతో విరాజిల్లే విష్ణుదేవుడు అనేకత్వంగలవాడూ అయినాడు. ఈ గొప్పదనపు తీరు చూడగల ఉత్తమనరులు కైవల్యాన్ని సులభంగా అందుకొనగలరు.

**విశేషం:** వస్తువు ఒకటే అయి, ఒకటిగా అగుపడటం వింత కాదు. అది స్వత్వాన్ని కోల్పోయి, అన్యంగా అగుపించటం, అంతటితో ఆగక, అనేకంగా కూడా కనిపించటం తప్పక మహిమగా గుర్తించవలసిందే. అయితే ఆ గుర్తింపు పొందగలిగినవారు ముక్తిని పొందటానికి అర్హులే అయి ఉంటారట!

**తే.** **అచరములును జరంబులు నైన భూత । సముదయంబులు మణులు సూత్రమున నున్న**
**కరణి నీ యంద యున్నవి గాన సమత । నేక భక్తి నేఁ గోరెద నిమ్ము దేవ!** **240**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ విష్ణూ!; అచరములును= తిరుగాడనివీ; చరంబులును+ఐన= తిరుగాడెడివీ అయిన; భూత సముదయంబులు= ప్రాణుల సమూహాలు; నీ+అందున్+అ= నీయందే' - నీ లోపలే; మణులు= రత్నాలు; సూత్రమునన్= దారమందు; ఉన్న కరణిన్= ఉన్న విధంగా; ఉన్నవి= కలవు; కాన= కావున; సమతన్= సమభావాన్నీ; ఏకభక్తిన్= కేవలం భక్తిని, అనన్య భక్తిని; కోరెదన్= కాంక్షిస్తాను; ఇమ్ము= ఒసగుము.

**తాత్పర్యం:** దేవా! సూత్రంలో మణులు నిలిచి ఉన్నట్లుగా, నీలో ఈ సృష్టిలోని చరాచర ప్రాణికోటి ఇమిడి ఉన్నది. కాబట్టి నీకు అవతల మరేమీ లేదు. నీవు కానిది ఏదీ లేదు. అందువలన నిన్ను నేను సమభావాన్నీ, కేవలం భక్తినీ అర్థిస్తున్నాను. నా అభ్యర్థనను ఈడేర్చుము ప్రభూ!

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **హేతురహితుఁడవు, కర్తవు, । భూతస్రష్టవు, సమస్తభోక్త, వతత్త్వం**
**బై తత్త్వము నగుదు జగ । న్నేతవు కూటస్థుఁడవును నీవ ముకుందా!** **241**

**ప్రతిపదార్థం:** ముకుందా!= ఓ విష్ణూ!; హేతురహితుఁడవు= కారణం లేనివాడవు; కర్తవు= చేసేవాడవు; భూత స్రష్టవు= ప్రాణులను సృజించేవాడవు; సమస్త భోక్తవు= ఎల్లవాటిని భుజించేవాడివి; అతత్త్వంబు+ఐ= తత్త్వంగానిదై; తత్త్వమును+అగుదు(వు)= తత్త్వమూ అవుతావు; జగత్+నేతవు= లోకానికి అధిపతివి; కూటస్థుఁడవును= పరమాత్మవు కూడా; నీవు+అ!= నీవే!

**తాత్పర్యం:** ఓ విష్ణూ! నీ మహిమ ఊహ కందదు. అన్నిటికి కారణమవైన నీకు కారణం లేదు. అన్నిటికీ నీవే కర్తవు. ప్రాణుల, భూమి నీరు వెలుగు గాలి ఆకాశాల సృష్టి చేసినవాడవు నీవే. అట్లాగే ఆ అన్నిటి భోక్తవూ నీవు. తత్త్వానివీ, అతత్త్వానివీ, సత్యానివీ, అసత్యానివీ నీవే! జగత్తుకు అధిపతివి నీవు. తుదకు పరమాత్మవూ నీవే దేవా!

**విశేషం:** తత్త్వ శబ్దాన్ని మనం సాధారణంగా ఆంగ్లంలోని 'ఫిలాసఫీ' అనే మాటకు బదులుగా వాడుతున్నాం. వ్యుత్పత్తి దృష్టితో చూస్తే ఈ రెండు శబ్దాలకూ పోలికే లేదు. తత్త్వశబ్దం 'తద్' అనే ప్రాతిపదిక మీద భావార్థంలో 'త్వ' ప్రత్యయం చేర్చగా ఏర్పడినట్టిది. దానికి ఉన్న అర్థం 'దాని తనము' అని. ఈ తత్త్వశబ్దాన్ని సత్యార్థంలోనూ, స్వభావార్థంలోనూ కూడా వాడుతున్నాం. ఇక ఆంగ్లంలోని 'ఫిలాసఫీ' కి జ్ఞానాన్వేషణమని స్థూలంగా అర్థం చెప్పవచ్చును. ఇక్కడ తత్త్వశబ్దం సత్యార్థంలోనే ప్రయుక్తమైనది.

**సీ.** **ద్వేష్యంబుఁ బ్రియ మను వేర్పాటు లేదు, భూ । తములయం దెల్లను సముఁడ నాకు**
**భూతసంయోగంబు బుద్ధ్యహంకార యు । క్తియు గుణత్రయసంగతియును లేవు**
**ప్రారంభణంబు ధర్మాధర్మములు నింద్రి । యముల పొందును విషయాభిరతియుఁ**
**బరిహృతంబులు జరామరణమోక్షార్థి నై । శరణంబు వేఁడెదఁ గరుణ నాదు**

**తే.** **ఘ్రాణజిహ్వాలు మహి నుదకమున దృక్కు । త్వక్కు దేజంబునందును వాయువునను**
**శ్రోత్ర మాకాశమునఁ గ్రమసూత్రితముగఁ । బొందఁ జేసి గోవింద! యానంద మిమ్ము.** **242**

**ప్రతిపదార్థం:** గోవింద!= ఓ కృష్ణా!; (నాకు) ద్వేష్యంబు= ద్వేషించ దగ్గది; ప్రియము= ఇష్టమైనది; అను వేర్పాటు= అనే భేదం; లేదు= ఉండదు; భూతముల అందున్+ఎల్లన్= అన్ని ప్రాణులయందును; సముఁడన్= సమానమైన భావంకలవాడను - హెచ్చుతగ్గు భావాలు లేనివాడను; నాకున్= విష్ణు భక్తుడనైన నాకు; భూత సంయోగంబు= పంచభూతాలతో - కలయిక; బుద్ధి+అహంకార యుక్తియున్= బుద్ధి (మతి) 'నేను' అనే భావం, అభిమానం - వీటితోడి కలయిక; గుణత్రయ సంగతియును= సత్త్వరజ స్తమస్సు లనే మూడు గుణాల కూడిక; లేవు= ఉండవు; ప్ర+ఆరంభణంబు= ప్రయత్నం - కర్మం - పని; ధర్మ+అధర్మములున్=

పుణ్యాపాపాలూ; ఇంద్రియముల పొందు= జ్ఞాన కర్మ ఇంద్రియాలతోడి పొత్తు; విషయ+అభిరతియున్= ప్రాపంచిక లౌకిక అంశాలపట్ల ప్రీతీ; - (ఇవన్నీ) పరిహృతంబులు= పరిహరించబడినవి - తొలగించబడినవి; జరా మరణ మోక్ష+అర్థిన్+ఐ= ముసలితనం, చావులనుండి ముక్తిని కోరేవాడనై; శరణంబు వేఁడెదన్= శరణు అర్థిస్తున్నాను; కరుణన్= దయతో; నాదు ఘ్రాణ జిహ్వాలు= నా ముక్కు, నాల్కలు; (క్రమంగా) మహిన్= నేలయందు; ఉదకమునన్= నీటియందు; దృక్కు, త్వక్కు= చూపు, చర్మం (క్రమంగా); తేజంబునందును= కాంతిలోనూ; వాయువునను= గాలిలోను; శ్రోత్రము= చెవి; ఆకాశమునన్= ఆకసమున; క్రమసూత్రితముగన్= వరుసగా ఏర్పరచబడినట్లుగా; పొందున్+చేసి= చేరేటట్లు చేసి; ఆనందము+ఇమ్ము= ఆహ్లాదాన్ని ఒసగుము.

**తాత్పర్యం:** ఓ విష్ణుమూర్తీ! ఈ సృష్టిలో నాకు పగకు గాని ప్రేమకుగాని, పాత్రమైన దేదీ లేదు. నేను సకల ప్రాణులయెడ సమభావం కలవాడను. నాకు సృష్టిలోని పంచభూతాలతో పొత్తు లేదు. బుద్ధి, అహంకారం, సత్త్వరజస్తమోగుణాలూ లేవు. నాకు కర్మకోసం ప్రయత్నంగాని, పుణ్యాపాపాలుగాని, ఇంద్రియాలతోడి పొత్తుగాని లేవు. లౌకికవిషయాలయెడ ఆసక్తీ లేదు. అన్నిటినీ వదలించుకొని, ఇప్పుడు నేను జరామరణాలనుండి విడుదలకొరకు నిన్ను వేడుకొంటూ నీ శరణు కోరి నీ దరి చేరాను. దయతో నా ముక్కు నాల్కలు నేలలో నీటిలో, చూపు చర్మాలు కాంతిలో గాలిలో, చెవి ఆకాశంలో, వరుసగా క్రమం తప్పకుండా లీనంచేసి, నాకు నిరంతరానందాన్ని ప్రసాదించుము దేవా!

**విశేషం:** ఇక్కడ మోక్షార్థి లక్షణాలన్నీ ఉదాహృతాలై ఉన్నాయి. అతడు రాగద్వేషాలకు, పుణ్యాపాపాలకూ అతీతుడు. లౌకిక మానవ లక్షణాలన్నీ పరిహరించుకొన్నవాడు. సర్వసంస్కారాలకూ, సకల వాసనలకూ విదూరుడు.

**సీ.** **ఇల జలంబుల జలంబులు, శిఖి శిఖి, వాయు । వున వాయు, వంబరంబునను నంబ**
**రంబు, చిత్తమునఁ జిత్తం, బహంకృతి నహం । కృతి, బుద్ధిఁ దగ నొదిఁగించి యింత**
**వట్టును గూడ నవ్యక్తంబుఁ జేర్చి య । వ్యక్తంబు నిజభంగి యైనఁ ద్రిగుణ**
**సామ్యవ్యవస్థితి సడిసన్నఁ గారణ । భూత తన్మాత్రలు పొదువకుండఁ**

**తే.** **దొలఁగఁ బెట్టుట దొరకొనవలయు దానఁ । బరమమున కేవలము నగు పదము గలిగి**
**యేన నీ వను నైక్యంపు టెఱుక వొడముఁ । గాత గమనాగమనములు గ్రాఁగి పోవ.** **243**

**ప్రతిపదార్థం:** ఇలన్= భూమిపై; జలంబులన్= నీళ్ళయందు; జలంబులు= నీళ్ళు; శిఖిన్= నిప్పునందు; శిఖి= నిప్పు; వాయువునన్= గాలియందు; వాయువు= గాలి; అంబరంబునను= ఆకాశమునందు; అంబరంబు= ఆకాశం; చిత్తమునన్= మనస్సునందు; చిత్తంబు= మనస్సు; అహంకృతిన్= అహంకారమునందు; అహంకృతి= అహంకారం; బుద్ధిన్= బుద్ధిని (బుద్ధియందు); తగన్= సరిగా; ఒదిఁగించి= ఇమిడేటట్లు చేసి - తొలగేటట్లుచేసి; ఇంతవట్టును+కూడన్= ఈ అంతటినీ; అవ్యక్తంబున్= మూల ప్రకృతిని; చేర్చి= చెందించి; అవ్యక్తంబు= మూల ప్రకృతి; నిజభంగి+ఐనన్= స్వత్వ పద్ధతి - స్థితిని చెందగా; త్రిగుణసామ్య వ్యవస్థితి=మూడు గుణాల - సత్త్వరజస్తమస్సుల సమానత్వ స్థితి; సడిసన్నన్= సద్దుమణగగా; కారణభూత తన్మాత్రలు= (జగత్తు పుట్టుకకు) మూలమైన శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే ఐదును; పొదువకుండన్= క్రమ్మకుండగా - ఏర్పడకుండా; తొలఁగన్+ పెట్టుట= ప్రక్కకు నెట్టటం; దొరకొనవలయున్= మొదలు పెట్టాలి; దానన్= అందువలన; పరమమునను= ఉత్తమగతి; కేవలమున్+ అగు పదము= ఒకటే అగు స్థానం - కైవల్య పదం; కలిగి= ఏర్పడి; ఏను+అ= నేనే; నీవు+అను= నీవు అనే; ఐక్యము+ఎఱుక= ఒకతనమునకు (ఆత్మ పరమాత్మల ఏకత్వం) చెందిన జ్ఞానం; గమన+ఆగమనములు= రాకపోకలు - లోకానికి రావటం (జన్మ) లోకంనుండి పోవటం (చావు) అనే రెండు క్రియలు; క్రాఁగిపోవన్= నశించి పోయేటట్లుగా; పొడమున్+కాతన్= కల్గుగావుత.

**తాత్పర్యం:** సృష్టి పంచభూతాలతో నేల, నీరు, వెలుగు (కాంతి), గాలి, ఆకాశం - అనే ఐదు మూల పదార్థాలతో ఏర్పడినది. కాబట్టి సృష్టిలో భాగమైన నరుడూ పంచభూతాత్మకమైనవాడే. కాబట్టి అతడి శరీరంలోని ఆయా మూల

పదార్థాలకు చెందిన అవయవాలన్నీ ఆయా మూలప్రకృతిలో లీనమైపోవాలి. 'జలాలలో జలాలు' ఒదిగించటం అంటే నీటిలో నాలుకను లీనంచేయుటం; అట్లాగే నిప్పులో నిప్పును కలుపుట అంటే, నిప్పులో చూపును ఉంచటం, గాలిలో గాలి - గాలిలో చర్మం; ఆకాశాన ఆకాశం - ఆకాశాన చెవి; ఈ విధంగా పంచేంద్రియాలనూ పంచ భూతాలలో లీనం చేయాలి. ఆ తరువాత నరుడిలో మనస్సున్నది. దానిని మనస్సునే అణచివేయాలి. అట్లాగే (నరుడి) అహంకారాన్నికూడా అహంకారంలో లీనంచేయాలి. బుద్ధిని బుద్ధిలో కలపాలి - నశింపజేయాలి- ఈ విధంగా ముందు పాంచభౌతిక ధర్మాలను, ఆ పిదప - మనస్సు, బుద్ధి, అహంకారాలనూ నశింపజేయాలి. ఈ సామగ్రినంతటినీ మూలప్రకృతిలోనికి చేర్చాలి. ఆ మూలప్రకృతికి అవ్యక్త మని పేరు. అది తన నిజస్థితిని తాను చెందిన తరువాత, సత్త్వ రజస్తమోగుణాలూ నశిస్తాయి. అటు తరువాత, జగత్తు ఆవిర్భావానికి ఆదికారణా లయిన పంచతన్మాత్రలు - రూప రస గంధ స్పర్శ శబ్దాలు ఏర్పడకుండా పక్కకు నెట్టటానికి మొదలు పెట్టాలి. ఈ విధంగా ఈ పాంచభౌతిక స్థితినుండే మనోబుద్ధి అహంకారాలనుండీ, పంచతన్మాత్రలనుండి బయటపడ్డ ఆత్మకు సర్వోన్నతమూ, సర్వశ్రేష్ఠమూ అయిన కైవల్యపదం అందుతుంది. ఆ పదంలో ఉండగా, 'నేనే నీవు' అనే ఆత్మజ్ఞానం కలుగుతుంది. అపు డిక జనన మరణాలు అనే ఈ లోకాన జీవకోటికి సంభవించే రాకపోకలు (రాక - జన్మ, పోక - మరణం) నశిస్తాయి.

**విశేషం:** ఇక్కడ పంచభూతాత్మకుడయిన పురుషుడు, కైవల్యపదం చేరే దారి చూపబడింది. ఆ మార్గాన అక్కడక్కడ మజిలీలు, మార్పులు జరుగుతుంటా యని కూడా తెలియవచ్చింది. ఇది పరమాత్మకు అభిముఖంగా ఆత్మ సాగించే ప్రయాణపు వివరాల సూచిక.

**క. హరియం దేనును నాయం । దరయంగా హరియుఁ గలము; హరి నాకును నా**
**హరి కేను ననశ్వరులము । హరిప్రసాదోదయము మహత్తర మహిమన్. 244**

**ప్రతిపదార్థం:** హరియందున్= విష్ణువునందు; ఏనును= నేనూ; నాఅందున్= నాలో; అరయంగాన్= పరిశీలించగా; హరియున్= విష్ణువూ; కలము= ఉన్నాము; హరి= విష్ణువు; నాకును= నరుడనైన నాకూ; ఆ హరికిన్= ఆ నారాయణుడికీ; ఏనును= నరుడనైన నేనూ; అనశ్వరులము= నశించే స్వభావం లేనివారం; మహత్తర మహిమన్= మిక్కిలి గొప్పతనంతో; హరిప్రసాద+ఉదయము= విష్ణువు యొక్క అనుగ్రహపు పుట్టుక (కలుగుతుంది).

**తాత్పర్యం:** నరుడికి నారాయణుడికీ భేదం లేని స్థితి కలిగింది. నారాయణుడిలో నేను ఉన్నాను. నాలో నారాయణుడు ఉన్నాడు. నా కొరకు నారాయణుడూ, నారాయణుడికొరకూ నేనూ నశించకుండా ఉంటాం. గొప్ప మహిమతో మాత్రమే విష్ణువు అనుగ్రహం కలుగుతుంది. మానవ ప్రయత్నాలకు అన్నిటికీ అతడిలోని బుద్ధి చైతన్యాలే కారణం. కాగా ఆ రెండు, ఏ ప్రయత్నం చేసి, ఏమి సాధించాలో సూచిస్తున్నాడు.

**తే. బుద్ధియును బ్రాణమును నిన్నుఁ బొరయఁ జేయఁ । జాలు భక్తి నా కొసఁగుము జలధిశయన!**
**పూర్వ కర్మఫలంబులు పొందుఁగాక!; । యవి ఋణంబులు గడతేఱుటై సుఖింతు. 245**

**ప్రతిపదార్థం:** జలధిశయన!= సముద్రాన పరుండేవాడా - ఓ విష్ణూ!; బుద్ధియును= తెలివీ; ప్రాణమును= ఊపిరీ; నిన్నున్+ పొరయన్+చేయన్+చాలు= నిన్ను పొందజేయగల; భక్తి= భక్తి భావం - కొలిచే, సేవించే స్వభావం; నాకున్= నరుడనైన నాకు; ఒసఁగుము= ఇమ్ము; (అట్లే) పూర్వకర్మఫలంబులు= ప్రాచీన (జన్మలలోని) కర్మఫలితాలు; పొందున్+కాక!= చెందునుగాక

నన్ను చేరుకోనిమ్ము; అవి= ఆ కర్మఫలాలు (చేరుట); ఋణంబులు= అప్పులు; కడతేఱుట+ఐ= తీరుట కాగా; సుఖింతున్= సుఖపడెదను.

**తాత్పర్యం:** సముద్రాన శయనించే ఓ స్వామీ! బుద్ధినీ, చైతన్యాన్నీ నిన్ను పొందుటకుగల కేవలభక్తినీ నాకు ప్రదానం చేయుము. నా ధీశక్తినీ, చేతనాశక్తినీ, నిన్ను చేరే మార్గాన్ని నిర్దేశించగల భక్తిభావంవైపు మళ్ళించుము. అదే విధంగా, నా పూర్వజన్మల కర్మల ఫలితాలు నన్ను చేరుకొనేటట్లు చూడుము. అవి ఆ విధంగా నన్ను చేరితే, ఆ ఫలితాల నన్నిటినీ అనుభవించి, నేను ఋణవిముక్తుడనైనట్లుగా ఆనందిస్తాను.

**విశేషం:** కర్మ, ఫలం అనేవి కారణకార్యాలు. కర్మకు ఫలితం ఈనాడు కాకున్నా మరొకనాడు పొంది తీరవలసిందే. అది అనివార్యం. లోకన్యాయం - అప్పు తీర్చటంవలె కర్మఫలమూ అనుభోక్తవ్యమే.

**తే. నిన్ను నెప్పుడుఁ దలఁచెద; నన్ను నీవు । వత్సలుఁడ వయి వీఁడు నావాఁ డనంగ**
**వలయుఁ జుమ్మయ్య! మఱవక వాసుదేవ! । దేవ దేవ! మునీశ్వర భావనీయ! 246**

**ప్రతిపదార్థం:** వాసుదేవ!= వసుదేవుడి తనయుడా!; దేవదేవ!= దేవతలకు దేవుడైనవాడా!; ముని+ఈశ్వర భావనీయ!= మునిశ్రేష్ఠులచేత భావించదగ్గ, స్మరించదగ్గవాడా!; నిన్నున్= జగన్నేతవైన నిన్ను; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; తలఁచెదన్= స్మరిస్తాను; నన్నున్= నీ భక్తుడనైన నన్ను; నీవు= నా ఆరాధ్యదైవ మయిన నీవు; వత్సలుఁడవు+అయి= దయకలవాడవై; మఱవక= మరచిపోక; అయ్య= స్వామీ!; వీఁడు= ఈ నరుడు; నా వాఁడు+అనంగన్+వలయున్+చుమ్ము= నా వాడు అనవలె సుమా!

**తాత్పర్యం:** ఓ వసుదేవ తనయా! దేవసమూహానికి దేవుడా! మునీశ్వరుల భావనలలో నిలిచే స్వామీ! నేను నిన్ను అన్ని కాలాలలో స్మరిస్తుంటాను. నీవూ నాపై దయ గలిగి 'వీడు నావాడు' అనాలి సుమా! మరవవద్దు.

**క. తనుఁ దనయంద నిలిపి పే । రనువున బుద్ధికడ వెలుఁగు నచ్యుతుని సనా**
**తను నగ్రాహ్యునిఁ జిన్మయు । ననుస్మరించునది యపునరావృత్తికినై. 247**

**ప్రతిపదార్థం:** తనున్= తనను; తనయందున్+అ= తనయందే; నిలిపి= ఉంచి; పేరు+అనువునన్= గొప్పనేర్పుతో; బుద్ధికడన్= బుద్ధిచెంత; వెలుఁగు+అచ్యుతునిన్= ప్రకాశించే విష్ణువును; సనాతనున్= శాశ్వతుడైనవాడిని; అగ్రాహ్యునిన్= గ్రహించరానివాడిని- తెలియరానివాడిని - పట్టుకొనరానివాడిని; చిత్+మయున్= జ్ఞానమయుడిని - జ్ఞానాకారుని; అపునర్+ఆవృత్తికిన్+ఐ= మరల రావటం (లోకంలోనికి) (పుట్టుక) లేకుండటానికై - జన్మరాహిత్యమునకై; అనుస్మరించునది= అనుస్మృతిని - నిరంతరస్మరణను చేయాలి.

**తాత్పర్యం:** తనలో తాను ఉంటూ, గొప్పనేర్పుతో బుద్ధికి సమీపాన వెలిగే శ్రీ మహావిష్ణువును, శాశ్వతమైనవాడిని, తెలియరాని, పట్టుకొనరానివాడిని, జ్ఞానమయుడిని జన్మరాహిత్యంకొరకు (అనుస్మరించాలి. అనుస్మృతి ద్వారా నిరంతరం ఉచ్చరిస్తూ స్మరణను గావించాలి. జపించాలి.)

**విశేషం:** ధ్యానానికిగాని, జపానికిగాని, పూజకుగాని, పురస్కారానికిగాని నరుడిలో ఏకాగ్రత అవసరం. ఏకాగ్రత ఏ సాధనలోనైనా అవసరమైన మానసిక స్థితి.

**క. పరమాత్ముని నారాయణుఁ । జిరంతనుని భక్తశేముషీనిష్ఠా స్వీ**
**కరణైకాయనుని నమ । స్కరణంబునఁ దలఁతు నతుల షడ్విధభూతిన్.' 248**

**ప్రతిపదార్థం:** పరమ+ఆత్మునిన్= గొప్ప ఆత్మగలవాడిని, పరమాత్మ స్వరూపుడిని; నారాయణున్= విష్ణువును; చిరంతనునిన్= శాశ్వతమైనవాడిని; భక్తశేముషీనిష్ఠా స్వీకరణ+ఏక+అయనునిన్= భక్తుడి బుద్ధి నిలకడ (ఏకాగ్రత)ను స్వీకరించటం ఒక మార్గంగా గలవాడిని - భక్తుడి బుద్ధి నిలుకడను ఒక చోటుగా చేసికొన్నవాడిని; అతులషట్+విధ భూతిన్= సాటి లేని ఆరు విధాలయిన ఐశ్వర్యాలుకలవాడిని; నమస్+కరణంబునన్= నమస్కారంతో; తలఁతున్= స్మరిస్తాను.

**తాత్పర్యం:** పరమాత్మ స్వరూపుడిని, నారాయణమూర్తిని, శాశ్వతుడిని, భక్తుల ఏకాగ్రచిత్తం ద్వారా చేరదగ్గ ఉనికి గలవాడిని, ఆరువిధా లయిన ఐశ్వర్యాలతో భక్తుల ననుగ్రహించే దేవుడిని నమస్కరిస్తూ స్మరిస్తాను'.

**తే.** **అని జపించి సర్వావస్థలందు నను వి । శిష్టభక్తి ననుస్మరించిన యతండు**
**సకల పాపంబులను బాసి శాంతి నొంది । యవ్యయానంద పదమున నతిశయిల్లు.** **249**

**ప్రతిపదార్థం:** అని= పై ప్రకారంగా; జపించి= జపం చేసి; సర్వ+అవస్థలందున్= అన్ని స్థితులలోను - దశలలోను; ననున్= పరమాత్మనైన నన్ను; విశిష్టభక్తిన్= అతిశయించిన భక్తితో; అనుస్మరించిన+అతఁడు= అనుస్మృతి చేసిన - నిరంతర స్మరణం చేసినవాడు; సకలపాపంబులను= ఎల్ల కల్మషములను; పాసి= వదలి; శాంతిని+ఒంది= శాంతిని పొంది; అవ్యయ+ఆనందపదమునన్= నశించని ఆనందమయమైన చోటున; అతిశయిల్లున్= విలసిల్లును.

**తాత్పర్యం:** పైన నిర్దేశించిన తీరున అన్ని స్థితిగతులలో, దశలలో మిక్కిలి భక్తితో ఈ అనుస్మృతిని జపించినవాడు ఎల్ల పాపాలనుండి ముక్తుడౌతాడు. తరువాత శాంతిని పొంది శాశ్వతానందమయ మైన స్థితిని - ముక్తిని పొంది అతిశయిస్తాడు.

**విశేషం:** ముక్తిప్రాప్తికి ముందు పాపపరిహారం ఒక తప్పనిసరైన అంశమన్నమాట.

**తే.** **వైష్ణవియుఁ గల్మషవ్రజధ్వంసినియును । నైన యీ యనుస్మృతి ప్రాజ్ఞుఁ డైన నజ్ఞుఁ**
**డైన నెవ్వాఁడు పఠియించు యజ్ఞదాన । సమయముల వాఁడు తత్ఫలశతము వడయు.** **250**

**ప్రతిపదార్థం:** వైష్ణవియున్= విష్ణుసంబంధీ; కల్మషవ్రజ ధ్వంసినియును= పాప సమూహాల నశింపజేసేదీ; ఐన+ఈ+అనుస్మృతి= అగు ఈ అనుస్మృతి స్తోత్రం; ప్రాజ్ఞుఁడు+ఐనన్= మహాపండితుడైనా; అజ్ఞుఁడు+ఐనన్= అజ్ఞాని - పామరుడైనా; యజ్ఞదాన సమయములన్= యజ్ఞ నిర్వహణ సమయంలో, దానంచేసే కాలంలో; ఏ+వాఁడు= ఏ నరుడు; పఠియించున్= చదువునో; వాఁడు= ఆ నరుడు; తద్+ఫలశతము+పడయున్= వాని ఆ యజ్ఞము యొక్క దానము యొక్క ఫలితాల నూటిని - నూరు ఫలితాలను పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ అనుస్మృతి స్తోత్రం విష్ణుసంబంధి. పాపపుంజాన్ని ధ్వంసం చేస్తుంది. మహా పండితుడుగాని, పామరుడుగాని - ఎవడైనా ఈ అనుస్మృతిని యజ్ఞసమయానగాని, దానంచేసే టప్పుడుగాని, పఠిస్తే అతడికి ఆ యజ్ఞఫలంగాని, దానం ఫలంగాని నూరింతలు లభిస్తుంది.

**విశేషం:** యజ్ఞం చేయడం, దానంచేయడం గొప్పపనులు. వ్యయప్రయాసలు కొల్లలుగా వాటి నిర్వహణలో ఎదురౌతాయి. అటువంటి యజ్ఞఫలితాలు, దాన ఫలితాలూ నూరురెట్లు అధికంగా లభించాలంటే మాత్రం కేవలం అనుస్మృతి పఠనం చాలును. అంతటిది దాని మహిమ!

**క.** **సురపితృపూజలఁ బావక । పరిచర్యలయందు నన్ను భక్తిఁ దలఁచుచుం**
**బరమనియతి నివ్వాక్యో । త్కరముఁ బఠించిన యతండు గనుఁ బుణ్యగతిన్.** **251**

**ప్రతిపదార్థం:** సురపితృపూజలన్= దేవతల, పితరుల, పితృదేవతల పూజాసందర్భాలలో; పావక పరిచర్యలయందున్= అగ్ని సేవలయందు, అగ్ని కార్యాలలో, హోమాలు, యజ్ఞాలలో; నన్నున్= శ్రీ మహావిష్ణువునైన నన్ను; భక్తిన్= భక్తితో; తలఁచుచున్= స్మరిస్తూ; పరమనియతిన్= గొప్ప నియమంతో; ఈ+వాక్య+ఉత్కరమున్= ఈ మాటల (స్తోత్రంలోనివి) ప్రోగును; పఠించిన+అతఁడు= చదివినవాడు; పుణ్యగతిన్= పుణ్యసిద్ధిని; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ అనుస్మృతిని దేవతాపూజలలో, వ్రతాలలో, పితృదేవతల తర్పణ సమయాలలో, అగ్నికార్యాలలో విష్ణుభక్తితో, నియమపాలనతో, ఎవరు చదువుతారో, వారు పుణ్యసముపార్జన చేయగలుగుతారు.

**విశేషం:** ఇక్కడ కూడా ఆయా పూజావ్రతాదుల ఫలితాలు సిద్ధించిన తరువాత, అదనంగా పుణ్యార్జనకు ఈ అనుస్మృతి పఠనం కారణమౌతుంది.

**క. వినుపించునది యనుస్మృతి । నను భక్తిం గొలుచు బహుజనముల కమావా**
**స్యను బున్నమ బారసిని స । వినయంబుగ దానవెల్ల విభవము గలుగున్. 252**

**ప్రతిపదార్థం:** ననున్= విష్ణువునైన నన్ను; భక్తిన్= భక్తితో; కొలుచు బహుజనములకున్= సేవించే పెక్కు ప్రజలకు; అమావాస్యను= అమావాస్యనాడు; పున్నమన్= పున్నమినాడు; బారసిని= ద్వాదశినాడు; సవినయంబుగన్= వినయంతో - అణకువతో; అనుస్మృతిన్= ఈ అనుస్మృతి స్తోత్రమును; వినిపించునది= వినిపించాలి; దానన్= అట్లు వినిపించటంవలన; ఎల్ల విభవము= సర్వసంపద; కలుగున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** ఈ అనుస్మృతి స్తోత్రాన్ని సామాన్యులయిన జనసమూహాలకు, నన్ను భక్తితో సేవించేవారికి, అమావాస్య, పున్నమి, ద్వాదశి తిథులలో వినిపించాలి. ఈ మూడు తిథులు ఈ అనుస్మృతి శ్రవణానికి యోగ్యమైనవి. అట్లా వినిపించటంవలన, వినుటవలన సకలసంపదలు సిద్ధిస్తాయి.

**విశేషం:** ఈ దేశాన వివేకం మాట ఎట్లా ఉన్నా, విద్య అక్షర రూపమైనది, అందరికీ అందుబాటులో ఉండేది గాదు. స్వయంగా చదువలేని ఆ అధికసంఖ్యాకజనుల పుణ్యాన్ని ఉద్దేశించి, ఈ 'వినిపించే' కార్యక్రమం వివరించబడినది.

**క. జనము లనుస్మృతిఁ జదువఁగ । విని మ్రొక్కిన యంత్యజునకు విశ్రుతగతి గ**
**ల్గు నవిన సద్భక్తి జపిం । చిన యుత్తమజాతిజునకుఁ జెప్పఁగ నేలా? 253**

**ప్రతిపదార్థం:** జనములు= భక్తజనులు; అనుస్మృతిన్= అనుస్మృతి స్తోత్రాన్ని; చదువఁగన్= పఠిస్తూ ఉండగా; విని= ఆలకించి; మ్రొక్కిన= నమస్కరించిన; అంత్యజునకున్= చివరి కులమువాడికి; విశ్రుతగతి= పుణ్యగతి; కల్గున్+అనినన్= సిద్ధిస్తుందనగా; సత్+భక్తిన్= మంచిభక్తితో; జపించిన= జపంచేసిన; ఉత్తమ జాతిజునకున్= శ్రేష్ఠకులంలో పుట్టినవాడికి (కలిగే పుణ్యగతిని గూర్చి); చెప్పఁగన్+ఏలా?= చెప్పటం ఎందుకు? (అనవసరం అని తాత్పర్యం. ఎంతో గొప్ప ఫలితం తప్పకుండా సిద్ధిస్తుంది అని భావం.)

**తాత్పర్యం:** ఈ అనుస్మృతి పఠన శ్రవణ మహిమ గొప్పది. భక్తజనులు పఠిస్తుండగా, ఈ అనుస్మృతిని విని నమస్కరించిన చండాలుడికే పుణ్యగతి గలుగుతుంది. అటువంటప్పుడు, ఇక ఈ అనుస్మృతిని భక్తితో జపించే ఉత్తమజాతి నరుడికి కలిగే ఫలితాన్ని గురించి వేరే చెప్పటమెందుకు? (తప్పక గొప్ప ఫలితాన్ని వారికి అందిస్తుంది- ఈ అనుస్మృతి పఠనం).

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. సంస్కృతంలో 'కైముతిక' న్యాయమని ఒకటుంది. 'కిమ్+ఉత' అనే శబ్దాలతో ఏర్పడ్డది ఆ న్యాయం. ఇది లోకవ్యవహార జన్యమయినమాట. జనవ్యవహారంలోని "పెద్ద ఏనుగులనే పరుగెత్తించే ఆ గాలివేగంలో ఇక దోమల సంగతి చెప్పేదేమిటి?" - వంటి మాటలు ఈ న్యాయానికి మూలం. 'కిమ్+ఉత' అంటే 'ఇంకేమిటి?' (చెప్పేది) అని తాత్పర్యం. ఈ పద్యంలోని 'చెప్పగనేలా?' అనే మాట అట్టిది. అంత్యజుడికే పుణ్యగతి కల్గుతుంటే ఇక అగ్రజుడి సంగతి చెప్పగనేలా? - అని కైముతికన్యాయం అన్వితమై ఉన్నది.

**ఆ. అఖిల కర్మఫలము నంతవంతంబు మ । ద్భక్తులకు ననంతపదము గలుగు**
**నట్టు లగుటఁ దలపు మమర మునీంద్ర! ని । న్నది మదీయపదమహార్థిఁ జేయు. 254**

**ప్రతిపదార్థం:** అమరముని+ఇంద్ర!= దేవబుషిశ్రేష్ఠా!; అఖిల కర్మ ఫలమున్= మొత్తం కర్మయొక్క ఫలితం కూడా; అంతవంతంబు= చివర - తుది కలిగినది - ముగిసిపోయేది; మత్+భక్తులకున్= నా భక్తులకు; అనంత పదము= చివర తుదిలేని స్థానం - ముగిసిపోని ప్రయోజనం - ముక్తి; కలుగున్= సిద్ధించును; అట్టులు+అగుటన్= ఆ విధంగా అగుటను నా భక్తులకు మాత్రం అనంతపదప్రాప్తి జరుగుటను; తలఁపుము= స్మరించుము; అది= ఆ స్మరణం; నిన్నున్= దేవర్షివైన నిన్ను; మదీయ పదమహా+అర్థిన్+చేయున్= నాకు చెందిన స్థానానికి, నా సాన్నిధ్యానికి గొప్ప యాచకుడినిగా చేస్తుంది-నా సాన్నిధ్యాన్ని కోరు కుంటావు.

**తాత్పర్యం:** ఓ దేవమునీ! లోకాన ఎల్ల కర్మల ఫలితాలూ చివరకు ముగిసిపోయేవే! అయితే నా భక్తులకు మాత్రం ఈ అనుస్మృతి జపకర్మవలన ఫలితం ముగింపులేని పదమును-ముక్తిని కలిగిస్తుంది. ఆ విషయం నీవు స్మరించుకొంటే, నీవూ నా సాన్నిధ్యాన్ని కోరే పరమభక్తుడవుగా మారిపోతావు.

**క. జ్ఞానము గేవలకృప న । జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రజనితము సేయం**
**గా నది సకలధరిత్రీ । దానంబునకంటె నధికతరఫలద మగున్. 255**

**ప్రతిపదార్థం:** కేవలకృపన్= ఒక్కదయతో - దయతో మాత్రమే; అజ్ఞానికిన్= జ్ఞానం లేనివాడికి; జ్ఞానము= జ్ఞానం - దేవుడిని-ముక్తిని గురించిన తెలివిని; ఉపదేశ విధిన్= బోధించటంతో; ప్రజనితము+చేయంగాన్= కలిగినదిగా చేయగా, కల్గించగా, కలిగించినచో; అది= ఆ ఉపదేశ క్రియ; సకలధరిత్రీదానంబునకంటెన్= భూమినంతా దానంచేయటం కంటె; అధికతర ఫలదము+అగున్= ఎక్కువ ఫలితం ఇచ్చునది ఔతుంది.

**తాత్పర్యం:** కేవలం దయతో అజ్ఞానికి జ్ఞానాన్ని బోధించి, అతడిలో దేవునిగూర్చిన మోక్షాన్ని గూర్చిన, తెలివితేటలను ఏర్పరచగలిగితే. ఆ జ్ఞానబోధ గొప్ప దానంగా పరిణమిస్తుంది. ఆ విధంగా జ్ఞానదానం చేస్తే, ఆ దానంవలన ఫలితం, మొత్తం నేలను దానం చేయగా వచ్చే ఫలితాన్ని మించి ఉంటుంది.

**విశేషం:** అట్లా కాకుండా వ్యావహారికార్థంలోనయినా, జ్ఞానం ఇతర సకలకార్యకలాపాలకు మూలం. కాబట్టి జ్ఞానదానం ఇతర దానాలను మించినదే.

**క. కావున నీకేఁ జెప్పిన । యీ విధ మంతయును శుద్ధహృదయులకుఁ గృపా**
**శ్రీ వెలయఁ జెప్పుమీ! పు । ణ్యావహశీలురకు సులభమగు సర్వంబున్. 256**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి - జ్ఞానదానం అన్ని దానాలకంటె మిన్న కాబట్టి; నీకున్= నా భక్తుడవైన నీకు; ఏన్= నేను; చెప్పిన+ఈ విధము+అంతయును= తెలిపిన ఈ విధానం సర్వమూ; శుద్ధహృదయులకున్= నిర్మలమైన హృదయం కలవారికి; కృపాశ్రీ వెలయన్= దయ అనే సంపద స్పష్టపడగా; చెప్పుమీ!= ఎరిగింపుమా!; పుణ్య+ఆవహశీలురకున్= ధర్మమును స్వీకరించే స్వభావంగలవారికి; సర్వంబున్= అంతయూ; సులభము+అగున్= సుఖంగా పొందదగినది అవును.

**తాత్పర్యం:** జ్ఞానదానం సర్వదానాలనూ అతిశయిస్తుంది కాబట్టి ఓ దేవమునీ! నేను నీకు ఉపదేశించిన ఈ అనుస్మృతి జపవిధిని మొత్తాన్ని, పవిత్ర హృదయులయిన భక్తులకు నీలోని దయాగుణం ప్రకటితమయ్యే విధంగా తిరిగి బోధించుము. ధర్మస్వభావంగల వారికి అంతా సులభసాధ్యమే అవుతుంది.

**తే. అశ్వమేధ సహస్రంబు లాచరించి । పడయరాని మహోన్నత పదము నస్మ**
**దీయ భక్తిరసైక పరాయణుండు । వడయనేర్చు సుకరముగ బ్రహ్మపుత్ర! 257**

**ప్రతిపదార్థం:** బ్రహ్మపుత్ర!= బ్రహ్మతనయుడా! - నారదమహర్షీ!; అశ్వమేధ సహస్రంబులు= అశ్వమేధం అనే యజ్ఞాలు వేలు; అచరించి= చేసి; పడయన్+రాని= పొందరాని; మహా+ఉన్నత పదమున్= గొప్ప ఉత్తమ స్థితిని; అస్మదీయ భక్తిరస+ఏకపరాయణుండు= నా భక్తిభావమున మాత్రము ఆసక్తుడైనవాడు; సుకరముగన్= సులభంగా; పడయన్+నేర్చున్= పొందగలడు.

**తాత్పర్యం:** ఓ బ్రహ్మమానసపుత్రా! నారదమహర్షీ! వేలకొలదిగా అశ్వమేధయజ్ఞాలు చేసి కూడా పొందజాలని పరమపదాన్ని, కేవలం నా భక్తియందు ఆసక్తుడైన నరుడు సులభంగా అందుకొనగలుగుతాడు.

**విశేషం:** యజ్ఞ నిర్వహణం కంటె చిత్తశుద్ధిగల విష్ణుభక్తి మిన్న.

**సీ. అని చెప్పె నిట్టు లయ్యనిమిష మునిపతి । యడుగంగ శంభుఁ డెయ్యది సమాద**
**రంబున నెఱిఁగించె రాజవంశోత్తమ! । తెల్లంబుగా నది యెల్ల నీకుఁ**
**జెప్పితి; నేకాగ్రచిత్తుండవై పర । మాత్ము న న్నారదునట్ల భక్తి**
**సంభృత శ్రద్ధానుషంగ తాత్పర్యంబు । తోఁ దలంపుము కృతార్థుండ వగుదు;**

**తే. పరమ వరద రహస్యానుభావ పూజ్య । మానమూర్తి యనుస్మృతి దీనిజపము**
**బుద్ధిఁ బెనుచు, దుఃఖంబులఁ బోవఁ ద్రోచు, । బంధములఁ బాపు, నిత్యశుభంబు నొసఁగు.' 258**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; చెప్పెన్= ఉపదేశించాడు (ఈ మాట పూర్వపద్యంతో అన్వయిస్తుంది); రాజవంశ+ఉత్తమ!= క్షత్రియ కులంలో శ్రేష్ఠుడా! ఓ ధర్మరాజా!; ఇట్టులు= ఈ విధంగా; ఆ+అనిమిష మునిపతి= ఆ దేవముని శ్రేష్ఠుడు - నారదుడు; అడుగంగన్= అర్థించగా; శంభుఁడు= శివుడు; సమ్+ఆదరంబునన్= మంచి ప్రేమభావంతో; ఏ+అది= ఏది; ఎఱిఁగించెన్= తెలియజేశాడో; అది+ఎల్లన్= అది అంతా; తెల్లంబుగాన్= స్పష్టంగా; నీకున్= చెప్పకోరిన నీకు; చెప్పితిన్= తెలియజేశాను; ఏక+అగ్ర చిత్తుండవు+అయి= లగ్నమయిన మనస్సు కలవాడవయి; ఆ+నారదుని+అట్లు+అ= ఆ నారదుడివలెనే; పరమాత్మున్= పరబ్రహ్మమును; భక్తి సంభృత శ్రద్ధా+అనుషంగ తాత్పర్యంబుతోన్= భక్తితో నిండిన శ్రద్ధతో కూడిన ఆసక్తితో; తలంపుము= స్మరించుము, ధ్యానించుము; కృత+అర్థుండవు+అగుదు(వు)= నెరవేరిన ప్రయోజనం కలవాడవు కాగలవు; పరమ= గొప్ప; వరద= వరాలిచ్చెడి; రహస్య+అనుభావ= గోప్యమైన శక్తిగల; పూజ్య= ఆరాధనకు అర్హమైన; మాన= గౌరవంగల; మూర్తి= స్వరూపంకలది; అనుస్మృతి= అనుస్మృతి స్తోత్రము; దీని జపము= ఈ అనుస్మృతియొక్క జపం; బుద్ధిన్+పెనుచున్= తెలివిని పెంచును; దుఃఖములన్+పోవన్+త్రోచున్= కష్టములను వెడలగొట్టుతుంది; బంధములన్+పాపున్= (భవ) బంధాలను, సంసారపు ముడులను తొలగిస్తుంది; నిత్యశుభమున్+ఒసఁగున్= ఎల్లప్పుడూ శుభాన్ని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** క్షత్రియవంశశ్రేష్ఠుడవైన ఓ ధర్మనందనా! ఆ దేవర్షి నారదుడు అర్థించగా, భగవంతుడైన విష్ణుమూర్తి దేనిని ఆదరంతో తెలియజేశాడో, ఆ అనుస్మృతిని స్పష్టంగా నీకు ఎరుకపరిచాను. నీవు కూడా నారదమహర్షివలె ఏకాగ్రచిత్తంతో, భక్తి భరితమైన శ్రద్ధాసక్తులతో ఆ పరమాత్ముడిని అనుస్మరించుకొనుము. నీ కోరిక ఈడేరుతుంది.

ఈ అనుస్మృతి గొప్ప స్తోత్రమంత్రం. వరాలను ఈయగల శక్తిగలది. గోప్యమైన సామర్థ్యం గలది. ఆరాధనకు అర్హమైన రీతిలో జపించటానికి వీలైన ఆకారంతో ఉన్నది. దీనిని జపిస్తే నరుడి బుద్ధి పెరుగుతుంది, దుఃఖాలు తొలగిపోతాయి, సంసారబంధాలు తెగిపోతాయి. నిరంతరం శుభం కలుగుతుంది'.

**క. అని భీష్ముం డుపదేశిం। చిన విని యానందభరిత చిత్తుండై పాం**
**డు నృపాత్మజుఁ డప్పుణ్యా। త్మునకుం బ్రణమిల్లె వినయమునఁ దనువొప్పన్. 259**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; భీష్ముండు= భీష్మపితామహుడు; ఉపదేశించినన్= బోధించగా; పాండు నృప+ఆత్మజుఁడు= పాండురాజు కొడుకు - ధర్మరాజు; విని= ఆలకించి; ఆనందభరిత చిత్తుండు+ఐ= ఆనందంతో నిండిన మనస్సుకలవాడై; వినయమునన్= అణకువతో; తనువు+ఒప్పన్= శరీరం ప్రకాశించగా; ఆ+పుణ్య+ఆత్మునకున్= ఆ ధర్మస్వరూపుడికి - సర్వధర్మవేత్త అయిన పితామహుడికి; ప్రణమిల్లెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా విష్ణుదేవప్రోక్తమైన అనుస్మృతిని, దాని మహిమను ధర్మస్వరూపుడైన భీష్ముడు ఉపదేశించగా, ఆలకించిన ధర్మరాజు ఆనందభరిత మనస్కుడై, వినయంతో వంగి భీష్మాచార్యుడికి నమస్కరించాడు.

**విశేషం:** నమశ్శబ్దం 'నమ' ధాతు జనితం. దానికి 'వంగుట' అర్థం. వినయాన్ని తెల్పుతూ వంగడమే నమస్కారం. అయితే అనుష్ఠానంలో, ఆచరణలో వంగడంతో పనిలేకుండానే చేతుల జోడింపుకై ఈ నమశ్శబ్దం పరిమితమై పోయింది.

**వ. ఇట్లు ప్రణామంబు సేసి యాధరణీవరుండు గురుపితామహుతో 'మోక్షమార్గ బోధన ప్రపంచం బుపదేశింపవే?' యని యడిగిన నతండు వార్ష్ణే యాధ్యాత్మం బను నితిహాసంబుగల 'దా తంత్రంబు నీ యడిగినదియైయుండు' నని పలికి 'వినుము వార్ష్ణేయ నామధేయుం డగువాఁడు. 260**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రణామంబు+చేసి= నమస్కారంచేసి; ఆ ధరణీవరుండు= ఆ రాజు - ధర్మరాజు; కురుపితామహుతోన్= కురువంశపు తాతతో - భీష్ముడితో; మోక్షమార్గ బోధన ప్రపంచంబు= ముక్తిమార్గంయొక్క జ్ఞాన విస్తృతి- ముక్తిని చేరే దానిని గూర్చిన అధిక జ్ఞానం; ఉపదేశింపవే?+అని= బోధించవే? అని; అడిగినన్= అర్థించగా; అతఁడు= ఆ భీష్ముడు; వార్ష్ణేయ+అధి+ఆత్మంబు+అను+ఇతిహాసంబు= వార్ష్ణేయాధ్యాత్మం అనే వృత్తాంతము; కలదు= ఉన్నది; ఆ తంత్రంబు= ఆ విషయం; నీ+అడిగినది+ఐ+ఉండున్= నీవు అర్థించినదై ఉంటుంది - నీ కోరికకు సమాధానంగా ఉంటుంది; అని పలికి= అని చెప్పి; వినుము= ఆలకించుము; వార్ష్ణేయ నామధేయుండు+అగువాఁడు= వార్ష్ణేయుడు అనే పేరుగలవాడైన ఒకడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా వినయంతో భీష్ముడికి నమస్కరించి, తనకు మోక్షమార్గాన్ని ఉపదేశించుమని అర్థించాడు. అప్పుడు ఆ పితామహుడు, 'వార్ష్ణేయాధ్యాత్మము' అనే ఇతిహాసమొకటి ఉన్నది. అది నీ ప్రశ్నకు కోరికకు సమాధానంగా ఉపయుక్తమౌతుంది. విను' మంటూ ప్రారంభించాడు.

**భీష్ముండు ధర్మజున కధ్యాత్మ విద్యా ప్రకారం బెఱింగించుట (సం. 12-203-1,2)**

**క. మానితముని యొకఁడు సుఖా। సీనుండై యున్న నతని శిష్యుఁడు వినయం**
**బూని నిలిచి 'మోక్షము తెరు। వానతి యీవే దయామయా! నా'కనుచున్. 261**

**ప్రతిపదార్థం:** (వార్ష్ణేయ నామధేయుడైన) మానితముని+ఒకఁడు= గౌరవించబడ్డ ఋషి ఒకరు; సుఖ+ఆసీనుండు+ఐ= సుఖంగా కూర్చున్నవాడై; ఉన్నన్= ఉండగా; అతని శిష్యుఁడు= ఆ ఋషి శిష్యుడు; వినయంబు+ఊని= అణకువతో; నిలిచి= నిలబడి;

దయామయా!= దయతో నిండినవాడా!; నాకు= నీ శిష్యుడనైన నాకు; మోక్షము తెరువు= ముక్తియొక్క మార్గం; ఆనతి+ఈవే?= (తెలియ జెప్పవా) ఆజ్ఞ ఈయవా? - సాధికారంగా వక్కాణించవా?; అనుచున్= అంటూ.

**తాత్పర్యం:** వార్ష్ణేయుడు అనే పేరుగల గౌరవాస్పదముని ఒకడు సుఖంగా కూర్చొని ఉన్నప్పుడు, అతడి శిష్యుడొకడు అణకువతో లేచి నిలబడి, 'ఓ దయామూర్తీ! గురుదేవా! నాకు మోక్షమార్గాన్ని ఉపదేశించవా?' అని అంటూ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. పాదములకుం బ్రణమిల్లినఁ బ్రబోధమహితాత్ముం డగు నమ్మహాత్ముండు. 262**

**ప్రతిపదార్థం:** పాదములకున్= కాళ్ళకు; ప్రణమిల్లినన్= నమస్కరించగా; ప్రబోధమహిత+ఆత్ముండు+అగు= గొప్పజ్ఞానంతో పూజ్యమైన మనస్సుకలవాడగు; ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్పముని.

**తాత్పర్యం:** ఆ శిష్యుడు మోక్షానికి మార్గదర్శనం చేయుమంటూ ఆ వార్ష్ణేయముని కాళ్ళకు నమస్కరించాడు. గొప్పజ్ఞాన నిధియైన ఆ మునీశ్వరుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'భక్తి గలవు నాకుఁ బ్రజ్ఞాన ఘనుఁడ; వ । ట్లవుట నీవు యోగ్యుఁడవు కుమార!**
**సదుపదేశమునకు సమవధానుండవై । వినుము నాదువాక్యవృత్తి తెఱఁగు.' 263**

**ప్రతిపదార్థం:** కుమార!= పుత్రా!; నాకున్= నా యెడ; భక్తి+కలవు= భక్తి కలవాడవు; ప్రజ్ఞాన ఘనుఁడవు= ఎక్కువ జ్ఞానంతో గొప్పవాడవు (శరీరంతో కాదు); అట్లు+అగుటన్= ఆ విధంగా అగుటవలన - నీకు భక్తి, జ్ఞానం రెండూ ఉండటంవలన; సత్+ఉపదేశమునకున్= మంచి ఉపదేశానికి - జ్ఞానబోధనకు; యోగ్యుఁడవు= అర్హుడవు; సమ్+అవధానుండవు+ఐ= మంచి ఏకాగ్రత కలవాడవై; నాదు వాక్యవృత్తి తెఱఁగు= నా యొక్క మాటల భావాల తీరు - నా మాటల తాత్పర్యం; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** కుమారా! నీవు నా యెడ భక్తిగలవాడవు, జ్ఞానసంపన్నుడవు కూడా. కాబట్టి నీవు మంచి జ్ఞానబోధకు అర్హమైనవాడవు, ఏకాగ్రచిత్తంతో నేను చెప్పేమాటల భావాలను గ్రహించుము'.

**విశేషం:** విద్యార్థికి గురుడియెడ భక్తి, జ్ఞానమంటే ఆసక్తీ - రెండూ కావాలి. అతడే జ్ఞానదానానికి యోగ్యుడు.

**వ. అని పలికి యిట్లనియె. 264**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని, ఈ విధంగా చెప్పాడు.

**తే. 'కాలచక్రంబు నిరవధికంబు; దీని । సర్గములుఁ బ్రళయంబులుఁ జనుచునుండుఁ;**
**బ్రళయమునఁ బరమాత్ముఁడు ప్రకృతిఁ బొంది । యఖిలమును సృజియించుఁ గల్పాదియందు. 265**

**ప్రతిపదార్థం:** కాలచక్రంబు= కాలం అనే చక్రం; నిర్+అవధికంబు= అవధి హద్దు - ఎల్ల లేనిది; దీని సర్గములున్+ప్రళయంబులున్= ఈ కాలచక్రం యొక్క సృష్టులు - పుట్టుకలు, నాశనములు కూడా; చనుచున్+ఉండున్= వెళ్ళుతూ - నడుస్తూ ఉంటాయి- సృష్టిలయాలు జరుగుతుంటాయి; పరమ+ఆత్ముఁడు= పరమాత్మ అనేవాడు - చావు పుట్టుకలు లేనివాడు; ప్రళయమునన్= ప్రళయ- వినాశకాలాన; ప్రకృతిన్+పొంది= స్వభావం చెంది; కల్ప+ఆదియందున్= సృష్టి ఆది - మొదలునందు; అఖిలమును= అంతటిని; సృజియించున్= పుట్టిస్తాడు.

**తాత్పర్యం:** ఈ కాల మనేది చక్రం వంటిది. గుండ్రంగా తిరుగుతూ ఉంటుంది. దీనికి అవధిలేదు, అంతంలేదు. ఈ కాలచక్రభ్రమణంలోనే సృష్టులూ ప్రళయాలూ ఏర్పడుతూ ఉంటాయి. ప్రళయకాలంలో పరమాత్మ మాత్రం స్వభావంతో నిలిచి, మళ్ళీ సృష్టిప్రారంభాన అంతటిని అన్నిలోకాలను - భూతాలను కల్పిస్తూ ఉంటాడు.

**విశేషం:** సృష్టి అంతా నష్టమౌతుంది ప్రళయాన. పరమాత్మ సృష్టి వస్తువు కాదు కాబట్టి తనకు నష్టి ఉండదు.

**తే.** **భూతజాలంబుతో మునిపుంగవులును । దోఁచి మును ప్రళయంబునఁ దోఁ పడంగి**
**చనిన సర్వవేదంబులు శాస్త్రములును । బడసి రద్దేవు దివ్యానుభావమునను.** **266**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; భూతజాలంబుతోన్= ప్రాణులసమూహాలతో; మునిపుంగవులును= ఋషిశ్రేష్ఠులు కూడా; తోఁచి= కలిగి; ప్రళయమునన్= ప్రళయకాలాన - సర్వమూ నశించే సమయాన; తోఁపు+అడంగి= తోచుట - కలుగుట - పుట్టుట నశించి; చనినన్= పోగా; ఆ+దేవు దివ్య+అనుభావమునను= ఆ దేవుడి యొక్క (విష్ణువుయొక్క) దివ్య శక్తివలన; సర్వవేదంబులు= ఎల్ల వేదాలూ; శాస్త్రములును= ఎల్ల శాస్త్రాలూ; పడసిరి= పొందారు.

**తాత్పర్యం:** పూర్వం ఋషులూ మునులూ కూడా ఇతర ప్రాణసమూహాలతోపాటే సృష్టి ఆదిలో పుట్టారు. అయితే ప్రళయకాలాన ఇతర సృష్టితోపాటు వారూ నశించారు. అయితే ఆ దేవుడి దివ్యశక్తివలన ఎల్లవేదాలూ అన్ని శాస్త్రాలూ తిరిగి పొందారు వారు.

**క.** **న్యాయా ద్యనేక తంత్రము । లా యంచితమతు లొనర్చి యఖిల జనాను**
**ష్ఠేయాచారములుఁ బరి । జ్ఞేయములుగ విశదభంగిఁ జేసిరి పుత్రా!** **267**

**ప్రతిపదార్థం:** పుత్రా!= ఓ కుమారా! శిష్యా!; ఆ+అంచితమతులు= ఆ ఒప్పిన బుద్ధిగలవారు; న్యాయ+ఆది+అనేక తంత్రములు= న్యాయము మొదలైన పెక్కు శాస్త్రాలు; ఒనర్చి= చేసి; అఖిలజన+అనుష్ఠేయ+ఆచారములు= ఎల్ల జనులు అనుష్ఠించవలసిన ఆచారములను - ప్రవర్తనకు చెందిన నియమ నిబంధనలను; విశదభంగిన్= స్పష్టమైన రీతిలో; పరిజ్ఞేయములుగన్+చేసిరి= బాగుగా తెలియదగినవిగా చేశారు.

**తాత్పర్యం:** ఆ మునిపుంగవులు ఆ దేవుడినుండి వేదాలు శాస్త్రాలు పొందిన తరువాత తమ మంచి బుద్ధులతో న్యాయం మొదలైన అనేక శాస్త్రాలను నిర్మించి లోకంలోని ఎల్లజనులూ ఆచరించదగ్గ నియమ నిబంధనలు స్పష్టంగా తెలియపరిచారు.

**క.** **అవి వినఁగ నెఱుఁగఁ జేయను । నవుఁ బరమబ్రహ్మబోధ; మమరులకు ముని**
**ప్రవరులకును దుర్లభ మ । య్యవగతము జనార్దనునక యలవడియుండున్.** **268**

**ప్రతిపదార్థం:** అవి= ఆ న్యాయాది శాస్త్రాలు; వినఁగన్= వింటే; ఎఱుఁగన్= తెలిస్తే; చేయను= చేస్తే; పరమబ్రహ్మబోధము= పరబ్రహ్మను గూర్చిన జ్ఞానం; అవున్= కలుగుతుంది; ఆ+అవగతము= ఆ (శాస్త్రాల) పరిజ్ఞానం; అమరులకున్= దేవతలకూ; ముని ప్రవరులకును= ఋషిశ్రేష్ఠులకూ; దుర్లభము= సులభంకాదు; జన+అర్దనునకున్+అ= విష్ణువునకు మాత్రం; అలవడి+ఉండున్= అలవాటయి (తెలిసినదై) ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ మునిపుంగవులు రచించి ఇచ్చిన న్యాయాదిశాస్త్ర సముచ్చయాన్ని విన్నా, తెలిసికొన్నా, ఆచరించినా పరబ్రహ్మజ్ఞానం కలుగుతుంది. అయితే ఆ శాస్త్రాల పరిజ్ఞానం మాత్రం దేవతలకుగాని, ఋషులకుగాని సులభం కాదు. ఒక్క విష్ణువుకు మాత్రం వాటినిగూర్చిన పరిజ్ఞానం అలవడి ఉన్నది.

**ఆ. సకల దుఃఖ భేషజం బగు నత్తెరు । వప్పురాణపురుషు నగ్గలంపుఁ**
**గరుణ నతనివలనఁ గనిరి మునీంద్రులు । గ్రమముతోడ నర్హగమ్య మయ్యె. 269**

**ప్రతిపదార్థం:** సకల దుఃఖ భేషజంబు+అగు= ఎల్ల దుఃఖాలకూ మందైన; ఆ+తెరువు= ఆ పద్ధతి (ఆ న్యాయాది శాస్త్రాల పరిజ్ఞానం); ఆ+పురాణ పురుషు+అగ్గలము+కరుణన్= ఆ ప్రాచీన పురుషుడిని (విష్ణుదేవుడి) మిక్కుటమైన దయతో; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; కనిరి= పొందారు; క్రమముతోడన్= ఆ మునీంద్రుల వరుసతో - వారి నుండి, వారి శిష్య సంతతికి, వారినుండి వారి సంతతికి - ఇట్లా; అర్హగమ్యము+అయ్యెన్= తగినవారికి పొందదగ్గది అయింది (ఆ పరిజ్ఞానం).

**తాత్పర్యం:** దుఃఖాలన్నిటికీ ఔషధమైన ఆ శాస్త్రపరిజ్ఞానం, ఆ పురుషోత్తముడి అగ్గలమైన దయవలన మునీంద్రులు పొందగలిగారు. ఆ తరువాత ఆ మునీంద్రులనుండి వారి శిష్యసంతతికి, వారినుండి వారి శిష్యపరంపరకు - ఇట్లా ఆ పరిజ్ఞానం అర్హులకు లభిస్తూ వస్తున్నది.

**క. చైతన్యశక్తిఁ బురుష స । మేతత్వవిశేషమున వహించుఁ బ్రకృతి; త**
**జ్జాత యగును బుద్ధి; తదు । ద్భూత మహంకార; మదియుఁ బొరయుం జిత్తున్. 270**

**ప్రతిపదార్థం:** ప్రకృతి= ప్రకృతి - గాలి, ఆకాశం మొదలయిన మొదటి సృష్టి; పురుష సమేతత్వ విశేషమునన్= పురుషుడితో కూడుకొన్న అతిశయంతో - (పురుషుడితో కూడికతో); చైతన్యశక్తిన్= చేతనా శక్తిని - కదిలే - కదిలించేశక్తిని; వహించున్= ధరించును; తద్+జాత= దాని నుండి (ఆ ప్రకృతి పురుషుల కలయిక నుండి) పుట్టినది; బుద్ధి= బుద్ధి అనే మూల పదార్థం (తెలివి); అగును= అవుతుంది; అహంకారము= అహంకారం - 'నేను' అనే భావం; తద్+ఉత్+భూతము= దాని నుండి పుట్టినది; అదియున్= ఆ అహంకారం; చిత్తున్= చైతన్య రూపమైన ఆత్మను; పొరయున్= పొందును.

**తాత్పర్యం:** పురుష సమ్మేళనం కారణంగా ప్రకృతి చైతన్యాన్ని పొందుతుంది. చైతన్యజన్యమైనది బుద్ధి. బుద్ధి నుండి అహంకారం పుట్టింది. ఆ అహంకారం ఆత్మను చేరుతుంది.

**క. కలిగె వినుమహంకారము । వలన నభము, దానఁ జేసి వాయువు, గ్రమసం**
**కలిత జననములఁ దేజము । జలము నిలయుఁ దత్తదాత్త జన్యత్వమునన్. 271**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ శిష్యా! - ఆలకించుము; అహంకారమువలనన్= 'అహంకారం' అనే మూలపదార్థంవలన; నభము కలిగెన్= ఆకాశం పుట్టింది; దానన్+చేసి= దాని (ఆకాశం)వలన; వాయువు= గాలి; క్రమ సంకలిత జననములన్= క్రమంగా - వరుసగా జరిగిన జన్మలలో; తేజము= కాంతి; జలము= నీరు; ఇలయున్= భూమీ; తద్+తద్+ఆత్త జన్యత్వమునన్= (ఒకదాని నుండి ఒకటి) పొందబడ్డ పుట్టుకతో కలిగినవి.

**తాత్పర్యం:** శిష్యా వినుము. అహంకారం వలన ఆకాశం, ఆకాశంవలన వాయువు, వాయువువలన తేజస్సు, తేజస్సువలన నీరు, నీటివలన భూమి - ఇట్లా ఒకదాని నుండి ఒకటి కలుగుతూ పంచభూతాలు ఏర్పడ్డాయి. అహంకారమే ఈ భూతపంచకానికి మూలం.

**వ. బుద్ధికి మహత్తను తత్త్వనిర్దేశంబును గలిగియుండు. 272**

**ప్రతిపదార్థం:** బుద్ధికిన్= బుద్ధి అనే మూలపదార్థానికి; మహత్తు+అను= 'మహత్తు' అనే; తత్త్వ నిర్దేశంబును= తాత్త్వికమైన - వేదాంతపరమైన; నిర్దేశంబును= పేరు కూడా; కలిగి+ఉండున్= ఏర్పడి ఉన్నది.

**తాత్పర్యం:** బుద్ధి అనే మూలపదార్థానికి మహత్తు అనే తాత్త్వికమైన పేరు కూడా ఏర్పడి ఉన్నది.

**క.** **వికృతులు మహదాదిక స । ప్తక ముభయ విధేంద్రియములు పదియు విషయ పం**
**చకమును మనసును గూడఁగ । వికారషోడశక మిది వివేకాభ్యర్థీ!** **273**

**ప్రతిపదార్థం:** వివేక+అభ్యర్థీ!= జ్ఞానాన్ని కోరేవాడా!; మహత్+ఆదిక సప్తకము= మహత్తు (బుద్ధి) మొదలగు ఏడు; వికృతులు= వికారములు - ప్రకృతికి భిన్నమైనవి; ఉభయవిధ+ఇంద్రియములు= రెండు విధాలయిన (జ్ఞానకర్మ భేదంతో రెండుగా ఉన్న) ఇంద్రియాలు - కన్ను కాలు మొదలయినవి; పదియున్= పదీ; విషయపంచకమును= విషయాలు - పంచేంద్రియాలకు గోచరించేవి- (శబ్దస్పర్శ రూపరస గంధాలు) ఐదూ; మనసును+కూడఁగన్= మనస్సును కలిపితే; ఇది ఈ పదార్థ సముదాయమంతా; వికారషోడశకము= వికృతుల పదియారు - పదహారు వికృతులు.

**తాత్పర్యం:** బుద్ధి (మహత్తు) మొదలయిన ఏడింటినీ తత్త్వశాస్త్రంలో వికృతులు అంటారు - జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు - వెరసి పదీ ఇంద్రియాలు. విషయాలు జ్ఞానేంద్రియాలకు, గోచరించే పదార్థాలు ఐదు, ఈ పదిహేనుకు తోడుగా మనస్సును కలిపి లెక్కిస్తే మొత్తం ఈ పదహారూ వికారాలు అనబడుతాయి.

**క.** **ఈ సర్వము దేహత్వా । భాసిత; మిది దేహియైన పరమాత్ముని వి**
**న్యాసమునకుఁ గా నొదవి యు । పాసించుం గరణరూపమై యా కర్తన్.** **274**

**ప్రతిపదార్థం:** ఈ సర్వము= ఈ పదార్థాల మొత్తం; దేహత్వ+ఆభాసితము= శరీరత్వంగా అగుపించే; ఇది= ఈ ఆభాస; దేహి+ఐన= దేహంగల శరీరం దాల్చిన; పరమ+ఆత్ముని= పరబ్రహ్మయొక్క; విన్యాసమునకున్+కాన్= ఉనికికొరకు; ఒదవి= ఏర్పడి; కరణరూపము+ఐ= సాధన రూపంగా (పనిముట్టువలె); ఆ కర్తన్= ఆ చేసేవాడిని - పరమాత్మను; ఉపాసించున్= సేవిస్తుంది.

**తాత్పర్యం:** పైన వివరించిన ప్రకృతులు, వికృతులు - అన్నీ ఆ పరమాత్మ నివాసంకొరకు శరీరంవలె అగుపిస్తూ, ఈ అన్నింటికీ ఆదికర్త అయిన ఆ పరమాత్మకే సాధనాల రూపంగా ఉపకరిస్తూ, అతడినే సేవిస్తుంటాయి.

**విశేషం:** భాసం వేరు 'ఆభాస' వేరు. భాసమంటే కాంతి. అది నిజం. 'ఆభాస' అంటే అగుపించటం నిజం కానిది. ఉన్నట్లు అగుపిస్తుంది- ఉండదు. 'రసాభాస' మొదలయిన వ్యవహారంలోనిది ఇదే. ఇక్కడ శరీరం కూడా ఆభాస మాత్రం.

**తే.** **పుత్ర! వినుము నవద్వార పుణ్యపురము । నం దచింత్య సంవ్యాపకుఁ డై శయించు**
**నీ సమస్త భావంబుల నెనసి యట్టు । లగుటఁ బురుషుండు నాఁ జను నవ్విభుండు.** **275**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; వినుము= ఆలకించుము; నవద్వార పుణ్యపురమునందున్= తొమ్మిది వాకిళ్ళుగల పుణ్యనగరంలో (శరీరంలో); ఆ+విభుండు= ఆ ప్రభువు - పరమాత్మ; అచింత్య సంవ్యాపకుఁడు+ఐ= ఊహించరాని వ్యాప్తిగలవాడై; ఈ సమస్త భావంబులన్= ఈ అన్ని తత్త్వాలను గుణాలను; ఎనసి= పొంది; శయించున్= పరుండి ఉంటాడు; అట్టులు+అగుటన్= అట్లు ఆ శరీరాన పరుండుటవలన; పురుషుండు నాన్+చనున్= 'పురుషుడు' (పురమున శయనించేవాడు) అనబడతాడు.

**తాత్పర్యం:** కుమారా! వినుము. ఈ శరీరం తొమ్మిది ద్వారాలున్న పుణ్యపురం. ఈ పురాన ఆ పరమాత్మ ఊహాతీతమైన వ్యాప్తిశక్తితో నిండి, అన్ని భావాలను, స్వభావాలను, గుణాలను పొంది, శయనించి ఉన్నాడు. అందువలననే ఆ పరమాత్మను 'పురుషుడు' అంటారు. అంటే పురాన శయనించేవాడని ఆ పదానికి వ్యుత్పత్తి- "పురి శేతే" - ఇతి పురుషః.

**విశేషం:** ఇక్కడ విద్యార్థిని - శిష్యుడిని గురువు 'పుత్రా!' అంటున్నాడు. ప్రాచీనకాలాన గురుకులాలు విద్యాసంతతికి నిలయాలుగా ఉండేవి. వంశసంతతివలెనే విద్యాపరమైన సంతాన పరంపర కొనసాగుతుండేది. అందువలన ఆనాటి శిష్యులు గురువులకు పుత్రులే!

**క. అమరుం డవ్యయుఁ డజరుం । డమేయుఁ డమలస్వభావుఁ డప్పురుషుఁడు దే**
**హమున మహీజమునం దన । లమున్న గతి నుండు మథనలక్ష్యుం డగుచున్. 276**

**ప్రతిపదార్థం:** ఆ+పురుషుఁడు= ఆ పరమాత్మ స్వరూపుడై శరీరంలో కాపురముండే నరుడు; అమరుఁడు= మరణం లేనివాడు; అవ్యయుఁడు= నాశనం లేనివాడు; అజరుండు= ముసలితనం లేనివాడు; అమేయుఁడు= కొలువరానివాడు; అమలస్వభావుఁడు= నిర్మల స్వభావం కలవాడు; దేహమునన్= శరీరాన; మహీజమునందున్= చెట్టునందు; అనలము+ఉన్నగతిన్= నిప్పు ఉన్న విధంగా; మథన లక్ష్యుండు+అగుచున్= తరచుటచేత గుర్తించదగినవాడై; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ పురుషుడు నిజానికి మరణం, నాశనం, ముసలితనం, కొలతలు, మలినాలు - ఇవేవీ లేనివాడు. నరుడికి ఇవన్నీ ఉన్నట్లు మనం చూస్తున్నాం. ఇదంతా ఆభాసమాత్రమే. దేహాన ఆ పురుషు డున్న తీరు ఎటువంటి దంటే, చెట్టులో నిప్పు దాగి ఉన్నట్లే. చూస్తే కనిపించని నిప్పు చెట్టును మథిస్తే కనిపిస్తుంది. బహిరింద్రియాల ద్వారా తెలియరాని ఆ పరమాత్మస్వరూపు డైన ఆ పురుషుడు, యోగమథనంద్వారా కనిపిస్తాడు. ఆత్మజ్ఞానానికి అంతర్మథనం అవసరం.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. వినుము! యోగమథనమునఁ దోఁచు నత్తేజ; । మది ప్రబోధసాంద్ర, మఖిల భూత**
**గణసమాశ్రయంబు గావున శ్రవణ ద । ర్శన ముఖక్రియాకరంబు దాన. 277**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ఆ+తేజము= ఆ పరమాత్మ స్వరూపమైన కాంతి; యోగమథనమునన్= యోగం ద్వారా త్రచ్చుటతో; తోచున్= కనిపించును; ఆ+తేజము= ఆ పరమాత్మ స్వరూపమైన కాంతి; అది= ఆ కాంతి; ప్రబోధ సాంద్రము= ప్రజ్ఞానంతో - గొప్పజ్ఞానంతో దట్టమైనది; అఖిల భూతగణ సమ్+ఆశ్రయంబు= ఎల్లప్రాణుల సమూహాలకూ ఆధారమైనది; కావునన్= కాబట్టి; శ్రవణ దర్శన ముఖ క్రియాకరంబు= వినటం, చూడటం మొదలైన పనులచేసేది; దానన్= దానియందే (ఈ చివరి పదం అనంతర పద్యంతో అన్వయిస్తుంది).

**తాత్పర్యం:** యోగవిద్యాభ్యాసంతో మథిస్తే కనిపించే ఆ పరమాత్మ స్వరూపుడైన పురుషుడు తేజోరూపాన ఉంటాడు. తేజస్సే అతడు. ఆ తేజస్సు జ్ఞానంతో నిండి ఉంటుంది. ఆ జ్ఞానమయతేజస్సు సకలప్రాణిసామాన్యంగా అన్నింటికీ ఆధారంగా వెలుగుతుంటుంది. అన్ని ప్రాణులలో ఉంటుంది కాబట్టి-వినటం, చూడటం మొదలయిన పనులన్నిటినీ నిర్వహిస్తుంది కూడా.

**క. భూతము లవ్యక్తంబున । జాతములగు; నంద పెరుఁగు సమయుఁ; దదీయ**
**స్ఫీతత్వమునన పురుషుం । డే తద్విధ సాక్షితాసమిద్ధుఁడు వత్సా! 278**

**ప్రతిపదార్థం:** వత్సా!= బిడ్డా! కుమారా! (దానన్= ఆ తేజస్సునందే); భూతములు= ప్రాణులు; అవ్యక్తంబునన్= మూలప్రకృతినుండి; జాతములు+అగున్= కలిగినవి అవుతున్నాయి; అందున్+అ= దానియందే - ఆ తేజస్సునందే; పెరుఁగున్= పెద్దవౌతాయి; తదీయ స్ఫీతత్వమునన= దాని ఆధిక్యమునందే; సమయున్= నశిస్తాయి; పురుషుఁడు= పరమాత్మరూపుడై తేజోమయంగా ప్రాణులలో ఉండేవాడు; ఏతద్+విధ సాక్షితా సమ్+ఇద్ధుఁడు= ఈ విధమైన సాక్షిత్వంతో వెలుగొందేవాడు.

**తాత్పర్యం:** ఆ తేజోరూప పరమాత్మనుండే ఈ సృష్టిలో ప్రాణిలోకమంతా పుట్టుతుంది. ఆ తేజస్సునందే పెరుగుతుంది. చివరకు ఆ తేజస్సమృద్ధిలోనే సమసిపోతుంది. ఈ సృష్టిస్థితిలయలు మూడూ జరుగుతుండగా, ఆ అన్నింటికీ సాక్షీభూతుడుగా దేహస్థుడైన పురుషుడు మిగులుతున్నాడు.

**భీష్ముఁడు ధర్మజునకుఁ గాలచక్రప్రభావం బెఱింగించుట (సం. 12-204-7,8)**

**ఆ.** **వ్యక్త సప్తధార మవ్యక్త నాభంబు । షోడశకవికార సుపరిమండ**
**లంబు ధ్రువ మధిష్ఠితం బాత్మచేతఁ జ । క్రంబు దిరుగుచుండుఁ గాలవశత. 279**

**ప్రతిపదార్థం:** వ్యక్త సప్తధారము= వెల్లడిఅయిన ఏడు అంచులు గలది (బుద్ధి మొదలైన ఏడు వికృతులు కాలచక్రానికి అంచులు); అవ్యక్తనాభంబు= మూలప్రకృతి నాభిగా (బొడ్డుగా)గలది; షోడశకవికార సుపరిమండలంబు= పదహారు వికారాలు - జ్ఞాన కర్మ ఇంద్రియాలు లోనైనవి మంచి వలయాలుగా గలిగినది; ధ్రువము= శాశ్వతమైనది; ఆత్మచేతన్= ఆత్మచేత; అధిష్ఠితము= అధిష్ఠించబడినది - కూర్చొనబడినది, అయిన; చక్రంబు= చక్రం - గుండ్రంగా తిరిగే గుండ్రని వస్తువు; కాలవశతన్= కాలవశంవలన - కాలమహిమవలన - కాలానికి లోబడి; తిరుగుచుండున్= పరిభ్రమిస్తుంటుంది.

**తాత్పర్యం:** కాలం ఒక చక్రం. దానికి బుద్ధి మొదలయిన వికృతులు ఏడూ అంచులు. ఆ అంచులు కనిపిస్తూ ఉంటాయి. దాని నాభి - కేంద్రస్థానం - అవ్యక్తం. అంటే మూలప్రకృతి కేంద్రంగా కలది కాలచక్రం. ఆ చక్రానికి జ్ఞానకర్మ ఇంద్రియాలు పదహారు వికారాలూ వలయాలు. ఆ చక్రంమీద ఆత్మ అధిష్ఠితుడై ఉన్నాడు. అది శాశ్వతమైనది. భ్రమణశీలం కలది. గుండ్రంగా తిరుగుతుంటుంది.

**విశేషం:** కొన్ని సంఘటనలు సృష్టిలో ఒక నియమం ప్రకారం మళ్ళీ మళ్ళీ జరుగుతున్నట్లు కనిపించినపుడు, ఆది మానవుడు ఆ ఆవృత్తిని చక్రభ్రమణంతో పోల్చికొని ఉండవచ్చును. ఉదా: ఋతువులు, పగళ్ళు రాత్రులు, ఉదయాలూ సాయంకాలాలూ. అటు తరువాత ఆ ఊహాచక్రానికి ఇతర అవయవాలు అమర్చి, ఒక సంపూర్ణ దృశ్యాన్ని నిర్మించుకొని గ్రంథస్థం చేశా డతడు.

**క.** **ఈ చక్రంబున సకల చ । రాచరమయ మైన లోక మవశానిష్ఠా**
**గోచరమై చరియించుట । సూచికొనన్ వలయుఁ దత్త్వశోధన దృష్టిన్. 280**

**ప్రతిపదార్థం:** ఈ చక్రంబునన్= ఈ కాలచక్రంలోపల; సకల చర+ఆచరమయము+ఐన లోకము= మొత్తము కదిలే, కదలని వాటితోడిదైన జగత్తు; అవశ+అనిష్ఠా గోచరము+ఐ= వశంగాని, నిలకడలేని స్థితి కలదై; చరియించుట= తిరుగుతుండటం; తత్త్వశోధన దృష్టిన్= సత్యమును వెదకే చూపుతో; చూచికొనవలయున్= చూచుకొనాలి.

**తాత్పర్యం:** ఆ కాలచక్రమహిమను చూచి గ్రహించవలసిందే. ఆ చక్రంలోనే ఈ సకల చరాచరమయిన జగత్తంతా వశం తప్పి, నిలకడలేక నిలిచి తిరుగుతూ ఉన్నది. సత్యశోధన దృష్టితో - ఆంతరమైన జ్ఞానదృష్టితో ఈ దృశ్యాన్ని దర్శించవలసి ఉంటుంది.

**తే.** **పాందు సత్త్వరజస్తమంబులు విశుద్ధు । నంతరాత్ముఁ బాంసువ్రాత మనిలుఁ జెందు**
**నట్లు సద్వివేకమునఁ దదంతరంబు । బుధుఁడు గాంచి యగ్గుణములఁ బొరయకుండు. 281**

**ప్రతిపదార్థం:** పాంసువ్రాతము= దుమ్ము ప్రోవు; అనిలున్+చెందునట్లు= గాలిని చేరేవిధంగా; సత్త్వరజస్+తమంబులు= సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు; విశుద్ధున్= పరిశుభ్రమైన; అంతర్+ఆత్మున్= లోపలి ఆత్మను - పరమాత్మను; పొందున్=

చేరును; బుధుఁడు= పండితుడు; సత్+వివేకమునన్= మంచి జ్ఞానంతో; తద్+అంతరంబు= వాటి భేదం; కాంచి= చూచి - గ్రహించి; ఆ+గుణములన్= ఆ మూడు గుణాలను; పొరయక+ఉండున్= పొందకుండా ఉంటాడు.

**తాత్పర్యం:** దుమ్ము, ధూళి పోగులుగా నిర్మలవాయువులో కలిసినట్లుగా, సత్త్వము, రజస్సు, తమము అనే త్రిగుణాలు విశుద్ధుడైన అంతరాత్మలో చేరుతున్నాయి. పండితుడైనవాడు మంచివివేకంతో ఆ గుణాల భేదాలు గ్రహించి, వాటికి దూరంగా ఉంటాడు. ఆ గుణాలు తనను అంటుకొననివ్వడు.

**విశేషం:** అలం: ఉపమ. విద్యవలన వివేకం కలగవచ్చును. అయితే ఈ విద్య ఉన్న ప్రతిచోటా వివేకం ఉండాలనే నియమం లేనట్లుగా లోకవృత్తాంత పరిశీలన వలన గ్రహించవచ్చును. కాబట్టి "విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుండు" వంటి సూక్తులు పుట్టాయి. వివేకం విషయంలో అటువంటివి ఏమీ వినిపించవు. కాగా వివేకం విద్యను మించినది.

**క. వేదాంతవిదుఁడు దుర్లభుఁ। డాదరము ప్రవృత్తి లక్షణాన్వితమగు ధ**
**ర్మోదయమంద కలుగు నది। లే దరయ నివృత్తి సౌఖ్య లీనత్వమునన్. 282**

**ప్రతిపదార్థం:** వేదాంతవిదుఁడు= వేదాంతం - తత్త్వం తెలిసినవాడు; దుర్లభుఁడు= కష్టంతో లభించేవాడు - అరుదుగా దొరికేవాడు; ఆదరము= అభిమానం; ప్రవృత్తి లక్షణ+అన్వితము+అగున్= ప్రవర్తించటం అనే గురుతుతో కూడినది అగును - ప్రవృత్తికి కారణ మగును; అందున్+అ= దానియందే - ఆ ప్రవృత్తియందే; ధర్మ+ఉదయము= పుణ్యపు పుట్టుక; కలుగున్= ఏర్పడుతుంది; అరయన్= పరిశీలించగా; నివృత్తి సౌఖ్యలీనత్వమునన్= నివృత్తి (ప్రవృత్తికి వ్యతిరిక్తమైనది)వలన సౌఖ్యమున మగ్నమగుటలో; అది= ఆ ధర్మోదయం - పుణ్యం కలగటం; లేదు= ఉండదు.

**తాత్పర్యం:** భూమిమీద తత్త్వవేత్త అరుదుగా లభిస్తాడు. తత్త్వవేత్తలు కానివారిలో ప్రకృతి సహజలక్షణాలు ఉంటాయి. వారు సత్త్వరజస్తమోగుణాలు గలవారై ఉంటారు. వారిలో ఉండే ఆదరం - అంటే వస్తువులయెడ, వ్యక్తులయెడ ఉండే అభిమానం వారిని లోకవ్యవహారాలలో ప్రవర్తించేటట్లు చేస్తుంది. ఆ ప్రకృతి లక్షణం ఒక విధంగా ఉత్తమమే. ఎందుకంటే ప్రవృత్తిమార్గంలో ఉన్నపుడే నరుడు పుణ్యాన్ని ఆర్జించగలడు. ప్రవృత్తిమార్గానికి భిన్నమైనది నివృత్తిమార్గం-అంటే లోకవ్యవహారాలకు దూరంగా వాటినుండి మరలి ఉండటం. ఆ విధంగా అంతర్ముఖుడై ఉన్న నరుడికి పుణ్యార్జన చేసే వీలు ఉండదు.

**క. ఆర్యులుఁ బ్రవృత్తి లక్షణ। కార్యంబులచేతఁ జేసి గ్రాహ్యము నగు త**
**ద్ధుర్యత్వ మందు విడువర। నార్యములగు మదనమద భయక్రోధాదుల్. 283**

**ప్రతిపదార్థం:** ఆర్యులున్= పూజ్యులు కూడా - మంచివారును; ప్రవృత్తి లక్షణ కార్యంబులచేతన్+చేసి= ప్రవృత్తికి గుర్తు అయిన క్రియల కారణాన; గ్రాహ్యమున్+అగు= గ్రహింపదగ్గదే అయిన; తద్+ధుర్యత్వమందున్= ఆ కార్యభారం వహించేవాని తనంలో- కార్యభారం వహించే సందర్భాన; అనార్యములు+అగు= మంచివి కానివి అగు; మదన+మద భయక్రోధ+ఆదుల్= మన్మథ (వికారం), మదం, భయం, క్రోధం, మొదలైనవాటిని; విడువరు= వదలిపెట్టరు.

**తాత్పర్యం:** నరులు పూజ్యులే అయినా, వారు ప్రవృత్తిమార్గాన పయనిస్తున్నపుడు వివిధ విధినిషేధాలను పాటిస్తూ పెక్కుకార్యాలు నిర్వహిస్తూ ఉండవలసి వస్తుంది. ఆయా కార్యభారాలను వహించే సందర్భాలలో వారు, చెడ్డవి అని తెలిసికూడా మన్మథవికారాలను గాని, మత్తునుగాని, భయక్రోధాది భావాలను గాని విడిచిపెట్టలేరు. అవి వారి కార్యభారవహనసమయాన తప్పక కావలసివస్తాయి.

**తే. వినుము దేహాభిమానికి వీని నెల్లఁ। దొఱఁగ దొరకొన దెంత శాంతునకునైనఁ**
**గాన ఏమిట దేహాభిమాన మెడలు। నట్టి చూ పభ్యసించు వేదాంతవిదుఁడు. 284**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ఎంత శాంతునకున్+ఐనన్= ఎంతగా శాంతిని పొందినవానికైనా; దేహ+అభిమానికిన్= శరీరంపట్ల ప్రేమగలవాడికి; వీనిని+ఎల్లన్= వీటిని అన్నింటిని - మదన మదభయ క్రోధాదులను; తొఱఁగన్+దొరకొనదు= విడువ వీల్పడదు; కాన= కాబట్టి; వేదాంత విదుఁడు= తత్త్వవేత్త; ఏమిటన్= దేనిచేత; దేహ+అభిమానము= శరీరం పైన ఆదరం; ఎడలున్= తొలగునో; అట్టి చూపు= ఆ విధమైన (శరీరాభిమానాన్ని దూరంచేసే) చూడ్కి; అభ్యసించున్= నేర్చుకొంటాడు.

**తాత్పర్యం:** ఎంత శాంతిని వహించినవాడైనా, శరీరంమీద అభిమానం ఉన్నంత కాలం, అతడు ఈ పరిత్యాజ్యా లయిన మదనమదభయక్రోధాది దుర్లక్షణాలను విడిచిపెట్టలేడు. కారణం శరీరాభిమానమే. కాబట్టి తత్త్వవేత్త అయినవాడు, ముందుగా దేనిద్వారా ఈ దేహాభిమానం తొలగించవచ్చునో - ఆ పద్ధతిని అలవరచుకొనాలి. ఆ విధమైన చూపు అతడిలో రావాలి.

**ఆ. అడవి సొచ్చి యంతకంతకు నవులకు। నతికుతూహలమున నరిగి యరిగి**
**చూచుచుండునట్లు సూవె సంసార కా। ననము నందుఁ దిరుగు జనుల నడపు. 285**

**ప్రతిపదార్థం:** సంసార కాననమునందున్= కుటుంబము అనే అడవిలో; తిరుగు= సంచరించు; జనుల నడపు= ప్రజల నడత; అడవి+చొచ్చి= అరణ్యాన ప్రవేశించి; అంతకున్+అంతకున్= అంతకంటె, అంతకంటె; అవులకున్= ఆవల ప్రదేశానికి - అవతలి స్థలానికి; అతికుతూహలమునన్= ఎక్కువ ఉత్కంఠతో; అరిగి+అరిగి= నడచి నడచి; చూచుచున్+ఉండునట్లు+చూవె!= చూస్తూ ఉండునట్లు సుమా!

**తాత్పర్యం:** ఈ సంసారం ఒక అరణ్యం. సంసారాన పడి జీవించటమంటే - అడవిలో పడి నడవటం. అడవిలోపడి నడచేవాడు. ఒకచోట ఆగక, అంత కంతకు పైపైకి నడిచివెళ్ళుతూ ఉత్కంఠతో ఆయా దృశ్యాలను' చెట్లు చేమల, పక్షులు సరీసృపాల, సాధు క్రూరజంతువుల వింత వింత తీరుతెన్నులను చూస్తూ తిరుగుతూనే ఉంటాడు. ఈ లోకాన సంసారీ అంతే. సంసారంలో ఒక దశనుండి మరొక దశకు, ఒక స్థితినుండి మరొక స్థితికి చేరుకొంటూ నిరంతరం పరిభ్రమిస్తూ విస్తుపోతూనే ఉంటాడు. అతడికి నిజమైన సుఖమూ శాంతీ లభించవు.

**విశేషం:** అలం: రూపకానుప్రాణితోపమ.

**క. విను తెవు లుడుపఁగ భేషజ। మునకుం దలకొనిన చందమున మది సత్యం**
**బును శౌచము శమమును దమ। మును నెలకొలుపంగవలయు మోహచ్యుతికిన్. 286**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; తెవులు= రోగం; ఉడుపఁగన్=పోగొట్టుకొనటానికై; భేషజమునకున్= మందుకొరకు; తలకొనిన చందమునన్= ప్రయత్నించిన విధాన; మదిన్= మనస్సునందు; సత్యంబును= సత్యవ్రతం - నిజం చెప్పటం - చెప్పింది చెయ్యడంవంటి నియమపాలన; శౌచము= శుచిత్వం - పరిశుభ్రత; శమమును= శాంతిని; దమమును= దాంతిని - ఇంద్రియ నిగ్రహాన్ని; మోహ చ్యుతికిన్= శరీరంమీది వ్యామోహం జారిపోవటానికి; నెలకొలుపంగన్+వలయున్= ఏర్పరచుకొనాలిస్థాపించుకొనాలి.

**తాత్పర్యం:** రోగం పోవటానికి మందు కావాలి. మందుకొరకు యత్నించి పొందవలసి ఉంటుంది. ఆ విధంగానే శరీరంమీది వ్యామోహమూ ఒక రోగమే. దానిని పారద్రోలాలంటే నరుడు తన మనస్సులో సత్యాన్ని, పరిశుభ్రతను, నిగ్రహాన్ని, శాంతిని నెలకొల్పుకొనాలి. ఈ సద్గుణాలన్నీ భేషజంవలె పనిచేసి, నరుడికి శరీరాభిమానం నుండి ముక్తిని ప్రసాదిస్తాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. భూమి మొదలుగఁ గల భూతములకు నింద్రి । యముల కన్నింటికిని సత్త్వ మాదియైన**
**గుణములకు నెల్ల జగములకును దదీశ్వ । రునకు నరయ నహంకార మునికిపట్టు. 287**

**ప్రతిపదార్థం:** భూమి మొదలుగన్+కల= భూమి మొదలయిన; భూతములకున్= మూలపదార్థాలకు - నీరు, తేజస్సు, గాలి, ఆకాశాలకు; ఇంద్రియములకున్+అన్నిటికినిన్= కన్ను, ముక్కు, లోనైన ఇంద్రియాలన్నింటికీ; సత్త్వము+ఆది+ఐన= సత్త్వం మొదలయిన; గుణములకున్= రజస్సు తమస్సు అనే ప్రాథమికమైన గుణములకు; ఎల్ల జగములకును= అన్నిలోకాలకూ; తద్+ ఈశ్వరునకున్= ఆ లోకాల అధిపతులకూ; అరయన్= ఆలోచించగా; అహంకారము= 'నేను అనే భావం' అహంకారం; ఉనికిపట్టు= నివాసస్థలం.

**తాత్పర్యం:** ఈ సర్వసృష్టి పంచభూతాత్మకం. అయితే ఆ పంచభూతాలకూ, ప్రాణులకున్న ఇంద్రియాలకూ, ప్రాథమికమైన సత్త్వరజస్తమోగుణాలు మూడింటికీ - ఇంతెందుకు ఎల్లలోకాలకూ, ఆ లోకాలను ఏలే అధిపతులకూ ఆవాసస్థానం అహంకారం. ఒక్క అహంకారంవలన ఈ లోకాలు, ప్రాంతాలు లోకేశ్వరులూ ఈ సర్వమూ ప్రవర్తిల్లుతున్నవి. అన్నిటికీ మూలం అహంకారం.

**తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మఱియు । నీదృశములును సత్త్వగుణోదితములు**
**రాగలోభ రోషాదులు రాజసములు । దర్పశోక ప్రముఖములు దామసములు. 288**

**ప్రతిపదార్థం:** స్మృతియున్= స్మరణం - తలచుట; సంప్రీతియును= మంచి సంతోషం; ప్రసన్నతయున్= కలతలేకుండా ఉండటం; మఱియున్= ఇంకను; ఈదృశములును= ఇటువంటివీ; సత్త్వగుణ+ఉదితములు= సత్త్వం అనే గుణం వలన కలిగినవి; రాగలోభ రోష+ఆదులు= ఆసక్తి, పేరాస, క్రోధం మొదలయినవి; రాజసములు= రజోగుణ సంబంధులు; దర్ప శోక ప్రముఖములు= పొగరు, ఏడుపు మొదలయినవి; తామసములు= తమోగుణ సంబంధి లక్షణాలు.

**తాత్పర్యం:** స్మరణం, సంతోషం, కల్మషరాహిత్యం ఇంకా ఇటువంటి సల్లక్షణాలు సత్త్వగుణంవలన కలిగేవి. ఆసక్తి, పేరాస, క్రోధం మొదలయిన లక్షణాలు రజోగుణంవలన ఏర్పడేవి. పొగరు, ఏడ్పు మొదలయినవి చివరిదైన తమోగుణం నుండి కలుగుతాయి.

**క. జ్ఞానమునకు నగ్గుణసం । తానం బడ్డంబుగాన తత్ప్రతిహతికై**
**పూని మును సాత్త్వికమునను । మానస మూన్పంగ వలయు మహనీయధృతిన్. 289**

**ప్రతిపదార్థం:** జ్ఞానమునకున్= ముక్తి సంబంధమైన తెలివికి; ఆ+గుణ సంతానంబు= ఆ (మూడు) గుణాల సమూహం; అడ్డంబు= అవరోధం; కాన= కాబట్టి; తద్+ప్రతిహతికై= దాని (ఆ అడ్డం) తొలగింపునకై ప్రతిక్రియకొరకు; మును= ముందుగా; పూని= యత్నించి; మానసము= మనస్సు; మహనీయ ధృతిన్= ఆరాధించదగ్గ ధైర్యంతో; సాత్త్వికమునను= సాత్త్విక గుణమునందు; ఊన్పంగన్+వలయున్= నిలుపవలెను.

**తాత్పర్యం:** లౌకికమైన తెలివితేటలు విజ్ఞానమనీ, అలౌకికమైన ఆధ్యాత్మమైన తెలివితేటలు జ్ఞానమని విజ్ఞులంటారు. ఆ జ్ఞానం కలుగటానికి ఈ సత్త్వరజస్తమోగుణాలు అడ్డంగా ఉంటాయి. ఆ అడ్డు తొలగించుకొనాలంటే ముందుగా ఆ గుణాలలో ఉత్తమమైన సత్త్వగుణాన్ని మనస్సున ప్రయత్నపూర్వకంగా ప్రతిష్ఠించుకొనాలి. ఆ విధంగా మనస్సును సత్త్వగుణంతో నింపాలంటే నరుడికి ఇతరులు ఆరాధించదగ్గ గొప్ప ధైర్యబల ముండాలి.

**విశేషం:** సంసారంలో ఉంటూ సత్త్వగుణాన్ని మనస్సున నిల్పి వ్యవహరించగలగటం, నిజంగా ఎంతో ఆరాధనాభాజనమైన ధైర్యం ఉంటే గాని కుదరదు. ఎందుకంటే చుట్టూ విరుద్ధవాతావరణం ఉంటుంది. ఏ పాటిగా పూనిక తప్పినా రజస్సునకో, తమస్సునకో జారిపోయే ప్రమాదముంటుంది. అందుకనే 'పూని', 'మహనీయధృతి' అంటూ నొక్కిచెప్పవలసి వచ్చింది.

**క. వినుసాత్త్వికములు మది నెల । కొని రాజసతామసములకును వినతత్వం**
**బొనరించుఁ బదంపడి స । త్త్వనిరూఢత బోధసంపదకు హేతు వగున్. 290**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; సాత్త్వికములు= సత్త్వగుణ సంబంధి లక్షణాలు; మదిన్= మనస్సును; నెలకొని= పాదుకొని; రాజస తామసములకును= రజస్తమోగుణాలకు చెందిన లక్షణాలకు కూడా; వినతత్వంబు= లొంగిపోయినతనమును; ఒనరించున్= కలిగిస్తాయి; పదంపడి= ఇంకను; సత్త్వనిరూఢత= సత్త్వగుణం గట్టిగా నెలకొని ఉండటం; బోధ సంపదకున్= జ్ఞానసంపత్తికి; హేతువు+అగున్= కారణమగును.

**తాత్పర్యం:** మనసున సత్త్వగుణసంబంధమైన లక్షణాలు నెలకొన్నట్లయితే - అవి ఇతర రాజసమైన, తామసమైన లక్షణాలు వీగిపోయేటట్లు చేయగలవు. పైగా మనస్సు సత్త్వగుణ సంభరితమై ఉండటం జ్ఞానావిర్భావానికి కారణంగా కూడా పరిణమిస్తుంది.

**తే. క్రియ లహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన । దేహసంబంధ మెడలక తిరుగవలయు**
**జన్మపర్యాయములయందు జన్మ మనఁగ । మిళితనవశుక్లశోణితకలితవృత్తి. 291**

**ప్రతిపదార్థం:** అహంకారమునన్= అహంకారం - నేను అనే భావం వలన; క్రియలు= కార్యాలు - పనులు; కల్గున్= ఏర్పడతాయి; క్రియలవలనన్= పనుల కారణాన; దేహసంబంధము= శరీరంతోడి చుట్టరికం; ఎడలక= తొలగక; జన్మపర్యాయములఅందున్= పుట్టుకల క్రమంలో; తిరుగన్+వలయున్= తిరుగవలసి ఉంటుంది; జన్మము+అనఁగన్= పుట్టుక అంటే; మిళిత నవ శుక్ల శోణిత కలిత వృత్తి= కలిసిన కొత్త ఇంద్రియ రక్తములతోడి బ్రతుకు - ఇంద్రియరక్తములు కొత్త కొత్తగా కలుస్తుంటే, పుట్టుతూ ఉండాలి.

**తాత్పర్యం:** అహంకారం సకల లోకాలకే కాక లోకేశ్వరులకూ ఉనికిపట్టని గ్రహించి ఉన్నాం. ఆ అహంకారమే జీవుల సకల కార్యాలకూ మూలం. ఆ కార్యనిర్వహణం జరుగుతున్నంతవరకు, ఆ కార్యకలాపాల ఫలితాలుగా పాపపుణ్యాలు కలుగుతూనే ఉంటాయి. ఆ పాపపుణ్యాల అనుభవంకొరకు ప్రాణి దేహం ధరించి, జననమరణ చక్రానపడి, క్రిందికీ మీదికీ తిరుగుతుండటం తప్పనిసరి. ఇంతకూ జననమంటే, పురుషుడి శుక్లం, స్త్రీ శోణితాల కలయికతో రూపుదిద్దుకొనటమే.

**ఆ. మూత్రమునఁ బురీషమున నూనుచును గర్భ । మునఁ బ్రవర్ధనమ్ముఁ బొంది వెడలి**
**సంతతానుబంధ సంసార దుఃఖ ని । ర్మగ్నుఁ డగుచు నుండు మానవుండు. 292**

**ప్రతిపదార్థం:** మానవుండు= నరుడు; మూత్రమునన్= నీరుడితో; పురీషమునన్= మలంతో; ఊనుచును= ఆనుచు-అంటుకొంటూ; గర్భమునన్= కడుపునందు; ప్రవర్ధనమ్మున్+పొంది= పెరుగుటను 'చెంది' - పెరిగి; వెడలి= బయటపడి; సంతత+అనుబంధ సంసార దుఃఖ నిర్మగ్నుఁడు= ఎల్లప్పుడు వెన్నంటి ఉండే సంసారమనే దుఃఖాన మునిగినవాడై; అగుచున్= ఔతూ; ఉండున్= జీవిస్తాడు.

**తాత్పర్యం:** నరుడి జన్మ దుఃఖమయమేగాదు, రోతగొల్పునది కూడా. మలమూత్రాల నడుమ గర్భాన పెరిగి, బయటపడి, ఇక అప్పటినుండి నిరంతరం సంసారంతో బద్ధుడైపోయి, తొలుత శిశువుగా, తనయుడుగా దానిలో చేరిన తాను చివరకు ముదుసలిగా తాతగా మారేంతవరకు దుఃఖంలో కూరుకొనిపోతున్నాడు.

**విశేషం:** తాత్త్విక దృష్టితో చూచినపుడు సాంసారిక జీవనం కేవలం గతానుగతికంగానే కాక, సారహీనంగా దుఃఖమయంగా కూడా కనిపిస్తుంది.

**క. ఇంతకు మూలము దృష్ణా । తంతులతయ వత్స! వినుము దానికి నడరం**
**గాంతాజనంబు దొలు ప్రాఁ । కింత యెఱిఁగి తృష్ణ తొఱఁగు టిచ్చు విముక్తిన్. 293**

**ప్రతిపదార్థం:** వత్స!= బిడ్డా! ధర్మనందనా!; ఇంతకున్= ఈ అంతటికిని; మూలము= హేతువు; తృష్ణాతంతులత+అ= పేరాస అనే తీగే; వినుము= ఆలకించుము; దానికిన్= ఆ తీగకు; అడరన్= అతిశయించగా; కాంతాజనంబు= స్త్రీజనం; తొలుప్రాఁకు= పాకుడు కొరకు నిలువుగా కొట్టిన కొయ్య - ఆలంబనం - ఊతం; ఇంత+ఎఱిఁగి= ఈ విధం గ్రహించి; తృష్ణ+తొఱఁగుట= పేరాసను వదలటం; విముక్తిన్= మోక్షమును - సంసారబంధమునుండి ఎడబాటును; ఇచ్చున్= ఒసగును.

**తాత్పర్యం:** ఈ నిరంతర సంసారబంధానికి, ఎడతెరపి లేక తిరిగే జనన మరణ చక్రానికి ఏకైక మూలం ఆశ అనే తీగ. ఆ ఆశాలత ఎగబ్రాకటానికి పాకుడు కొయ్యగా సంసారంలోని స్త్రీజనం ఉపయోగపడుతున్నది. ఈ నిజం తెలిసి, ఆశను విడిచిపుచ్చగలిగితే, సంసారబంధం నుండి, జనన మరణ చక్రభ్రమణం నుండి బయట పడవచ్చును.

**విశేషం:** అలం: రూపకం.

**క. జ్ఞానాజ్ఞానంబులకుం । దాన యుపాశ్రయము బుద్ధి తత్త్వాహంకా**
**రానూన లక్షణాఢ్యం । బైన యెఱుక దాని జీవుఁ డని చెప్పు శ్రుతుల్. 294**

**ప్రతిపదార్థం:** బుద్ధి= నరుడి మతి; జ్ఞాన+అజ్ఞానంబులకున్= జ్ఞానానికీ, అజ్ఞానానికీ - రెండింటికీ; తాను+అ= తానే; ఉప+ఆశ్రయము= ఆలంబనం - ఆధారం; తత్త్వ+అహంకార+అనూన లక్షణ+ఆఢ్యంబు+ఐన= సత్యం అహంకారం (నేను అనే భావం) అనే గొప్ప లక్షణాలతో సంపన్నమైన (కూడిన); ఎఱుక= పరిజ్ఞానం - తెలివి; దానిన్= ఆ ఎరుకను; శ్రుతుల్= వేదాలు; జీవుఁడు+అని చెప్పున్= జీవి అని పేర్కొంటాయి.

**తాత్పర్యం:** (ఇక్కడ బుద్ధినీ, జీవుడినీ విడివిడిగా వాటి లక్షణాలతో ప్రదర్శిస్తున్నాడు.) బుద్ధి జ్ఞానానికి, అజ్ఞానానికి - రెండింటికీ ఆధారం. బుద్ధివేరు, జీవుడు వేరు. ఇక జీవుడి లక్షణాలు ఏమిటంటే - అతడే తత్త్వం, సృష్టిలోని చిట్టచివరి సత్యం; అతడే అహంకారం కూడా. ఈ అహంకారం కారణంగానే అహంకారలక్షణంతో ఉన్నన్నాళ్ళు సంసారయాత్ర సాగిస్తున్నాడు జీవుడు. అతడే తత్త్వలక్షణసంపన్నుడైతే ముక్తుడైపోతాడు.

**ఆ. అతఁడు కాలకలిత మైన కర్మమున సం । సార వర్తనంబు సల్పుచుండు**
**స్వప్న సంప్రవృత్తి సలిపెడు నరుమాడ్కి । నింద్రియములతోడ నెనయ బెరసి. 295**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ జీవుడు; కాలకలితము+ఐన= కాలంచేత సంపాదితమైన - కూడబెట్టబడిన; కర్మమునన్= కర్మవలన; సంసార వర్తనంబు= కుటుంబ జీవనం; స్వప్న సంప్రవృత్తి= కలలో ప్రవర్తనను; చలిపెడు= చేసెడు; నరుమాడ్కిన్= మానవుడివలె; ఇంద్రియములతోడన్= జ్ఞాన కర్మ ఇంద్రియాలతో; ఎనయన్+బెరసి= కలయవ్యాపించి; చలుపుచున్+ఉండున్= చేస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ జీవుడు కాలసంపాదితమైన కర్మ కారణాన సంసారం చేస్తూ ఉంటాడు. సంసారంలోని వివిధ కార్యాలు నిర్వహిస్తూ ఉంటాడు. అయితే నిజానికి తత్త్వరూపుడైన అతడు సంసారి కాజాలడు. అయినా కర్మవశాన

సంసారజీవనం తప్పదు. అందువలన జీవుడు చేసే ఈ సాంసారిక ప్రవర్తనలు ఎట్లాంటి వంటే కలలో నరుడు చేసే క్రియలవంటివి. క్రియల నిర్వహణకు ఇంద్రియాల తోడ్పాటు తప్పదు కాబట్టి, ఆయా ఇంద్రియాలతో కలిసి ఆయా కర్మలు స్వప్నంలోవలె చేస్తూ ఉంటాడు అతడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. రాగ పరిలిప్తమానస । యోగంబున నింద్రియంబు లుల్లసితము లై**
**భోగు లగుట యుడిపిన నప । రాగత సంసార దుర్విరామము సేయున్. 296**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు= జ్ఞాన - కర్మ ఇంద్రియాలు; రాగపరిలిప్తమానస యోగంబునన్= అనురాగంతో పూయబడిన మనస్సు యొక్క కలయికతో; ఉత్+లసితములు+ఐ= బాగా ఆడబడినవై (క్రీడించినవై); భోగులు+అగుట= భోగించునవిగా అగుట(ను); ఉడిపినన్= మాన్పినచో; అపరాగత= తొలగిన అనురాగం; సంసార దుర్+విరామము= సంసారముయొక్క చెడు ముగింపును; చేయున్= కలిగించును.

**తాత్పర్యం:** నరుడి ఇంద్రియాలు అనురాగపు పుంత కలిగిన మనస్సుతో కలిసి భోగాలలో ప్రవర్తిస్తూ, భోగులుగా అనుభోక్తలుగా మారుతున్నాయి. వాటి ఆ భోగలాలసను మాన్పగలిగితే, నరుడిలో అపరాగత్వం - అనురాగరాహిత్యం - అనురాగం తొలగిపోవటం ఏర్పడుతుంది. ఆ అపరాగత్వం వలన సంసారం నుండి విముక్తి పొందవచ్చును.

**క. పురుషు లఖిల భూతములను । బురుషులలో భూమిసురులు భూమిసురులయం**
**దరయంగ మంత్రవేదులు । వరు లధికులు బోధయుతులు వారలకంటెన్. 297**

**ప్రతిపదార్థం:** అఖిల భూతములను= ఎల్ల ప్రాణులలో; పురుషులు= నరులు; పురుషులలోన్= నరులలో; భూమిసురులు= బ్రాహ్మణులు; భూమిసురులఅందున్= బ్రాహ్మణులలో; అరయంగన్= పరిశీలిస్తే; మంత్రవేదులు= మంత్రం తెలిసినవారు - వేదం చదివినవారు; వరులు= శ్రేష్ఠులు; వారలకంటెన్= ఆ మంత్రవేత్తలకంటె; బోధయుతులు= జ్ఞానవంతులు; అధికులు= ఎక్కువైనవారు - ఉత్తములు.

**తాత్పర్యం:** సృష్టిలోని ప్రాణిజాతు లన్నింటా మానవులు శ్రేష్ఠులు. మానవులలో బ్రాహ్మణులు ఉత్తములు. బ్రాహ్మణులలో మంత్రవేత్తలు అధికులు. వారికంటెను జ్ఞానవంతులు ఉత్తములు. (సృష్టిలో సర్వోన్నతమూ, సర్వోత్కృష్టమూ అయిన పదార్థం జ్ఞానమన్నమాట.)

**క. జ్ఞానంబు దృష్టి నరునకుఁ । గాన నయనహీను నడపు కరణి యగుటఁ బ్ర**
**జ్ఞాన విహీనుని నడవడి । దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. 298**

**ప్రతిపదార్థం:** నరునకున్= మానవుడికి; దృష్టి= చూపు; జ్ఞానంబు= జ్ఞానం - (తెలివి); కాన= కావున; ప్రజ్ఞాన విహీనునిన్= నడవడి- జ్ఞానం లేనివాడి నడత; నయన హీను నడపు కరణి+అగుటన్= కన్నులు లేనివాడి నడత వంటిది అగుటచేత; ఎఱుక+తెచ్చికొనంగన్= జ్ఞానం సంపాదించటానికి; దీనిన్= ఈ విషయమును - జ్ఞానహీనుడు నయనహీనుడను విషయమును; ఎఱుఁగన్+వలయున్= తెలిసికొనవలెను.

**తాత్పర్యం:** మానవుడికి నిజమైన చూపు జ్ఞానమే గాని, కన్ను కాదు. కాబట్టి జ్ఞానహీనుడి నడత గుడ్డివాడి నడకవంటిది. జ్ఞానార్థిఅయినవాడు జ్ఞానార్జనకు ముందుగా ఈ విషయాన్ని గ్రహించాలి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. క్షమయును సత్యంబును శౌ । చమును సుధర్మములు! బ్రహ్మచర్యం బత్యు**
**త్తమ ధర్మము; వానికిఁ జి । త్తము నలవఱుపంగవలయు ధైర్యము పేర్మిన్. 299**

**ప్రతిపదార్థం:** క్షమయును= ఓర్పూ; సత్యంబును= సత్యవ్రతమూ - సత్యం చెప్పడం, సత్యంగా ప్రవర్తించటం; శౌచమును= శుచిత్వము - శుభ్రత - శారీరక మానసిక పరిశుద్ధత - ఈ మూడూ; సుధర్మములు= మంచి ధర్మాలు; బ్రహ్మచర్యంబు= బ్రహ్మచారి తనం - గార్హస్థ్యానికి ముందు ఆచరించే ధర్మం; అతి+ఉత్తమ ధర్మము= మిక్కిలి శ్రేష్ఠమైన ధర్మం; వానికిన్= ఆ ధర్మాల - క్షమా, సత్య శౌచ బ్రహ్మచర్య ధర్మాలకొరకు - వాటి ఆచరణకై; ధైర్యము పేర్మిన్= ధైర్యము - ధీరుడి స్వభావంయొక్క అతిశయంతో; చిత్తమున్= మనస్సును; అలవఱుపంగన్+వలయున్= అలవాటు చేయాలి.

**తాత్పర్యం:** జ్ఞానార్జనకు ముందు నరుడు ధర్మాధర్మవివేకంతో ధర్మాన్ని ఆచరించాలి. ధర్మాలలో ఓర్పు, సత్యం, బహిరంతశ్శుభ్రత ఉత్తమమైనవి. ఆ తరువాత బ్రహ్మచర్యం అతిశ్రేష్ఠధర్మం. ఈ ధర్మాలయెడ మనస్సును అనుకూలంగా మలచటానికి నరుడిలో గొప్ప ధైర్యం కావాలి. మనస్సును ఈ ధర్మాల ఆచరణకు క్రమంగా అలవాటు చేయాలి.

**విశేషం:** సద్ధర్మాచరణకు ధైర్యం తప్పనిసరి. సామాన్యులు ధర్మాన్ని సాధారణంగా ఆచరిస్తూనే ఉంటారు. కాని, పరీక్షా సమయాలలో కీలకమైన సన్నివేశాలలో ధైర్యశాలి తప్ప ఇతరులు ధర్మానికి కట్టుబడి ఉండలేరు.

**క. పరిహాసము భాషణమును । నిరీక్షణము లోనుగాఁగ నింద్యంబులు సుం**
**దరులయెడ దీని కేమని । చొరఁదగ దట్లైన మనసు సొత్తురు సుదతుల్. 300**

**ప్రతిపదార్థం:** సుందరుల ఎడన్= అందమైన వనితలతోడి వ్యవహార సందర్భాన; పరిహాసము= గేలి; భాషణము= మాట్లాడుట; నిర్+ఈక్షణము= ఎదురుచూడటం; లోనుగాఁగన్= లోనైనవి (క్రియలు-చేష్టలు); నింద్యములు= నిందించదగ్గవి - పరిహరించదగ్గవి; దీనికిన్= ఈ మాత్రపు చిన్న పనికి; ఏమి+అని= (తప్పు) ఏమిటి అని; చొరన్+తగదు= ప్రవేశించకూడదు; అట్లు+అయినన్= అట్లు (ఏమీలేదులే అనికొని చొరబడి) పోతే పోయినచో; సుదతుల్= స్త్రీలు; మనసు+చొత్తురు= మనస్సున (నరుడి) ప్రవేశిస్తారు.

**తాత్పర్యం:** సౌందర్యవతులయిన వనితలయెడ బ్రహ్మచారి అతిజాగరూకుడై మెలగాలి. వారితో పరిహాసం, సంభాషణం, వారికొరకు ఎదురుచూపు లోనైన చేష్టలు కూడవు. ఆఁ, దీనికేమైనది! దీనిలో తప్పు ఏమిటి? అన్న భావంతో వారిలోనికి చొచ్చుకుపోతే, వారు బ్రహ్మచారి మనస్సులోనికి ప్రవేశిస్తారు.

**విశేషం:** ఈ జాగరూకత, రోగం కలిగిన తరువాత ఔషధసేవనం కంటె, ముందుగానే అసలు రోగ ఆవిర్భావమే లేకుండా చూచుకొనే అభిప్రాయంతో తీసికొనవలసినది.

**క. విను మాంసాస్థిమయం బని । వనితాంగము సద్వివేక వైభవమునఁ గాం**
**చిన నందు మది దగులు; దా । పనికిని నాడీ విశుద్ధి ప్రాపగుఁ బుత్రా! 301**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; విను= ఆలకించుము; వనితా+అంగము= స్త్రీ శరీరం; మాంస+అస్థిమయంబు+అని= మాంసంతో, ఎముకలతో నిండినది అని; సత్+వివేకవైభవమునన్= మంచి విచక్షణా జ్ఞానంతో; కాంచినన్= చూస్తే; మది= మనస్సు; తగులదు= చిక్కుకొనదు - స్త్రీయెడ; ఆ పనికిని= ఆ క్రియకు - ఆ విధంగా చూడటానికి; నాడీ విశుద్ధి= నాడుల - శరీరంలోని రక్తాన్ని ధరించి శరీరమంతా ప్రాకి ఉండే నరాల వంటివాటి విశుద్ధత్వం - వాటి పరిశుభ్రత; ప్రాపు+అగు(న్)= ఆధారమౌతుంది.

**తాత్పర్యం:** వనితల శరీరనిర్మాణాన్ని గమనించి, వాస్తవాన్ని గుర్తిస్తే వారియెడ ఆకర్షణ కలుగదు. మాంసపుటెముకల మూట తప్ప అన్యంగాదు ఆ శరీరము అనే మంచి వివేకంతో స్త్రీని దర్శిస్తే, బ్రహ్మచారి మనస్సు స్త్రీని స్పృశించదు. అయితే ఆ దృష్టి ఏర్పడాలంటే, ముందుగా అతడికి శరీరనిర్మాణంలో ప్రధాన భాగాలయిన నాడుల పరిశుద్ధత ఆలంబనంగా ఉండగలదు.

**క. శారీరస్థితికిఁ బ్రథమ । కారణమై యుండు నాడికాదశకము; సం**
**చారిక లగు నింద్రియముల । కారయ నాడికలు మఱియు నై దమలమతీ! 302**

**ప్రతిపదార్థం:** అమలమతీ!= నిర్మలమైన బుద్ధి కలవాడా! - ధర్మరాజా!; శారీర స్థితికిన్= శరీరముయొక్క ఉనికికి; నాడికా దశకము= నాడుల పది - పది నాడులు; ప్రథమ కారణము+ఐ= మొదటి కారణమై; ఉండున్= కలవు; ఆరయన్= పరిశీలించగా; సంచారికలు+అగు= సంచారశీలములయిన - తిరుగాడే స్వభావంగల; ఇంద్రియములకు - పంచజ్ఞాన ఇంద్రియాలకు; మఱియున్= ఇంకను; ఐదు నాడికలు= ఐదు నాడులు (కలవు).

**తాత్పర్యం:** ఓ నిర్మలబుద్ధీ! ధర్మరాజా! శరీరనిర్మాణంలో ఆదికారణాలుగా పదినాడులు ఉన్నాయి. సంచరించే స్వభావంగల జ్ఞానేంద్రియాలకు అదనంగా మరి ఐదు నాడికలు ఉన్నాయి. మొత్తం ఈ పదిహేను నాడులూ శరీరాన్ని నిలుపుతున్నాయి, నడుపుతున్నాయి కూడా.

**విశేషం:** యోగవిద్యాభ్యాసంలో ఈ నాడీపరిజ్ఞానం ఆవశ్యకంగా భావిస్తారు. ఇంద్రియనిగ్రహం నాడీపరిజ్ఞానంతో ముడిపడి ఉన్నట్లు భావిస్తారు.

**తే. స్థూల భంగులు పదియును సూక్ష్మభంగు । లైదు నివి; వీనికంటె నత్యంత సూక్ష్మ**
**భంగి హృదయంబు నడుముగాఁ బరఁగియున్న । నాడియది సర్వగత యగుఁ జూడఁ జూడ. 303**

**ప్రతిపదార్థం:** స్థూలభంగులు= బలసిన (పెద్ద) విధముగలవి - పెద్దవి; పదియును= పదీ - పైన చెప్పినవి; సూక్ష్మభంగులు= సన్నని విధం గలవి - వెదికితేగాని కనిపించనివి; ఐదును= ఐదూ (ఇంద్రియాలకు చెందినవి); ఇవి= ఈ పై వివరించబడినవి; వీనికంటెన్= ఈ పదిహేనింటికంటె; అతి+అంత+సూక్ష్మ భంగి= మిక్కిలి సన్నమైన విధంగలది; హృదయంబు= మనస్సు; నడుముగాన్+పరఁగి+ఉన్న= మధ్యభాగంగా ఒప్పే; నాడి+ఆది= ఆ నాడి - ఆ ప్రసిద్ధమైన నాడి; చూడన్+చూడన్= చూడగా చూడగా; సర్వగత+అగున్= అంతటను ఉండేది - శరీరమంతా వ్యాపించి ఉండేది ఔతుంది.

**తాత్పర్యం:** శరీరనిర్మాణానికి ప్రథమకారణాలుగా పేర్కొనబడ్డ నాడులు పది - స్థూలమైనవి. ఆ తరువాత పంచేంద్రియాలకు ఆధారమైన నాడికలు (చిన్న నాడులు) ఐదూ సూక్ష్మమైనవి. చూచినంత మాత్రాన కనిపించేవి కావు అవి. ఈ రెండు విధాలయిన నాడులు - స్థూలసూక్ష్మ రూపాలలో ఉండేవి కాకుండా, మరొక అతిసూక్ష్మనాడి ఉన్నది. దానికి మనస్సు మధ్యభాగంగా ఉంటుంది. ఆ అతిసూక్ష్మనాడి హృదయగతమైనది. దానిని చూస్తూ చూస్తూ పోతే అది అంతటా వ్యాపించి, అంతా తానే అయి ఉంటుంది.

**క. ఆ చూపు మఱిగి చిత్తం । బే చవికిం బోదు; పోయె నేని మరలుపన్**
**గోచరమగు వెలిచవులం । బాచిన లోచవిన నిలిచి పరమాత్మఁ గనున్. 304**

**ప్రతిపదార్థం:** ఆ చూపు= (పైన వివరించిన) హృదయగతనాడిపై చూపు - అంతర్ దృష్టి; మరిగి= అలవాటుపడి; చిత్తంబు= మనస్సు; ఏచవికిన్= ఏ రుచికొరకూ; పోదు= వెళ్ళదు; పోయెను+ఏని= (ఒకవేళ) వెళ్ళినట్లయితే; మరలుపన్= మరలించగా-

తిరిగి అంతర్ దృష్టివైపునకు త్రిప్పగా; గోచరము+అగు= అనుభూతాలయిన; వెలిచవులన్= బయట రుచులను; పాచినన్= విసర్జించగా - వదలివేసిన పిదప; లోచవిని+అ= లోపలి రుచియందే; నిలిచి= నిలబడి - స్థిరమై; పరమ+ఆత్మన్= పరబ్రహ్మ స్వరూపమైన దానిని; కనున్= చూస్తుంది.

**తాత్పర్యం:** హృదయం మధ్యభాగంగా కలిగి, సర్వాంతర్యామిగా ఉండే ఆ సూక్ష్మతమ నాడిపై దృష్టి నిలిపిన చిత్తం ఇక దేనినీ కోరక, దేనినీ పట్టించుకొనక ఆ అంతర్ దృష్టితో అట్లాగే ఉండిపోతుంది. ఇతర అంశాలజోలికి పోదు. ఒకవేళ పోయినా, దానిని తిరిగి మరలించి యథాపూర్వస్థితిలో నిల్పినపుడు ఆ చిత్తం తన అనుభవానికి వచ్చిన వెలిచవులను విసర్జించి, సూక్ష్మతమ నాడిపై దృష్టి నిలిపి, అనుభవించిన లోచవిని తిరిగి స్వీకరించి, దానియందే నిలిచి పరమాత్మను చూడగలుగుతుంది.

**క. ఆ విధము శుక్లగతి గను । భావమునకుఁ గాని పట్టువడదు; వినుము! శు**
**క్లావేశము సంకల్పజ । మావాసము శుక్లమునకు నఖిలాంగకముల్. 305**

**ప్రతిపదార్థం:** ఆ విధము= ఆ పరమాత్మను కనగల్గిన 'లోచవి'; శుక్లగతి+కను భావమునకున్+కాని= ఇంద్రియపు పోక(ను) పొందే స్థితికిగాని; పట్టు+పడదు= అలవడదు - అనుభవానికి రాదు; వినుము= ఆలకించుము; శుక్ల+ఆవేశము= ఇంద్రియపు ప్రవేశం; సంకల్పజము= ఆలోచనవలన పుట్టేది; అఖిల+అంగకముల్= ఎల్ల అవయవములు; శుక్లమునకున్= ఇంద్రియానికి; ఆవాసము= నివాసం - ఉనికిపట్టు.

**తాత్పర్యం:** ఆ విధంగా 'లోచవి'తో పరమాత్మను దర్శించగలగటం నరుడిలో ఇంద్రియపు పోకడ ఏర్పడేనాటికిగాని అలవడదు. ఇంద్రియపు ఉద్రేకమనేది సంకల్పంవలన జనిస్తుంది. నరుడి సకల అవయవాలూ శుక్లానికి ఉనికిపట్టులే- ఉత్పత్తి హేతువులే.

**క. అరయఁగ సంస్పర్శనమునన । తిరుగుడువడు శుక్ల మనుట తెఱఁగే? సంక**
**ల్పరతింగలదే? చోఁకెడఁ । జరింపకుండంగ వలయు సంకల్పంబుల్. 306**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= పరిశీలించగా; శుక్లము= ఇంద్రియం; సంస్పర్శనమునను+అ= బాగా తాకటంవలననే; తిరుగుడు+పడున్= స్ఖలనమౌతుంది; అనుట= అనటం - అట్లా అనటం; తెఱఁగు+ఏ?= పద్ధతా? తగునా? (తగదు); సంకల్పరతిన్= ఊహయందలి రతియందు; చోఁకు= స్పర్శ; కలదు+ఏ?= ఉన్నదా?; సంకల్పంబుల్= ఊహలు; ఎడన్+చరింపక+ఉండంగన్+వలయున్= హృదయంలో తిరుగాడక ఉండాలి.

**తాత్పర్యం:** పరిశీలిస్తే స్పర్శవలననే ఇంద్రియస్ఖలనం జరుగుతుంది - అనే మాట సరిగా కనబడదు. ఎందుకంటే నరుడు ఊహాలోకంలో విహరిస్తూ కేవలం సంకల్పమాత్రాన రతిసుఖానుభూతిని ఇంద్రియస్ఖలనంద్వారా పొందుతున్నాడు. మరి అక్కడ ఆ సంకల్పమాత్ర రతిలో స్పర్శకు తావేది? కాబట్టి నరుడి ఎడదలో సంకల్పాలు తిరుగాడకుండా ఉండాలి.

**తే. అత్రిముని యింద్ర దైవత్య మని జనులకుఁ । దెలిపె; నది కారణముగ నింద్రియ మనంగఁ**
**బరఁగుఁ జూవె నృబీజంబు పరమ మెల్ల । ధాతువుల కది విను పుత్ర! దాని విధము. 307**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమార!; అత్రిముని= అత్రి అనే పేరుగల ఋషి; నృబీజంబు= నరుడి విత్తనమును - శుక్లమును; ఇంద్ర దైవత్యము= ఇంద్రదేవతకు చెందింది; అని జనులకున్= అని ప్రజలకు; తెలిపెన్= ఎరుకపరచాడు; అది= ఆ తెల్పటం;

కారణముగన్= హేతువుగా; ఇంద్రియము+అనంగన్= ఇంద్రియం అనగా; పరఁగున్+చూవె!= ఒప్పును సుమా!; అది= ఆ ఇంద్రియం; ఎల్ల ధాతువులకున్= అన్ని మూలపదార్థాలకంటె (మానవ శరీర నిర్మాణ మూలపదార్థాలు); పరమము= గొప్పది - శ్రేష్ఠము; దాని విధము= ఆ ఇంద్రియపు వైనం; విను= ఆలకించుము.

**తాత్పర్యం:** కుమారా! ధర్మరాజా! వినుము. పూర్వం అత్రిముని నరుడిలో ఈ బీజాన్ని ఇంద్రదేవతకు చెందినదానినిగా జనులకు తెలియజేశాడు. అప్పటినుండి ఈ శుక్లాన్ని ఇంద్రియమని వ్యవహరిస్తున్నారు. ఈ ఇంద్రియం నరుడి శరీరంలోని మూలపదార్థాలు అన్నింటికంటె శ్రేష్ఠమైనది.

**ఆ. శుక్లమునకు మనసు సూక్ష్మరూపము; మనో । బలము నిల్వరింపఁ బక్వబుద్ధి**
**యోపుఁ; దరుణవృద్ధు లోప రజ్ఞాన దౌ । ర్బల్య మూఢ వికలభావు లగుట. 308**

**ప్రతిపదార్థం:** శుక్లమునకున్= ఇంద్రియానికి; మనస్సు= చిత్తం; సూక్ష్మరూపము= అతిగా సన్నని చిన్నని ఆకారం; మనస్+బలము= చిత్తముయొక్క శక్తిని; నిల్వరింపన్= నిగ్రహించటానికి - అదుపు చేయటానికి; పక్వబుద్ధి= పండిన మతిగలవాడు - వివేకవంతుడు; ఓపున్= సమర్థుడగును - చాలును; తరుణ వృద్ధులు= యువకులు, ముదుసలులు; అజ్ఞాన దౌర్బల్య మూఢవికల భావులు+అగుటన్= (క్రమంగా) జ్ఞానం లేకపోవటంచేత (యువకులు) బలం చాలకపోవటంచేత (ముదుసలులు) తెలియని కలతచెందిన భావాలు కలవారు కాబట్టి; ఓపరు= సమర్థులు కారు - చాలరు (మనస్సును నిల్వరించటానికి).

**తాత్పర్యం:** ఈ ఇంద్రియానికి సూక్ష్మరూపం మనస్సే. కాబట్టి ఇంద్రియ నిగ్రహమంటే మనోనిగ్రహమనే గ్రహించాలి. మనశ్శక్తిని నిల్వరించాలి - అంటే పరిపక్వమైన బుద్ధిగల వివేకవంతులకే అది సాధ్యమౌతుంది. ఇతరులకు, యువకులకుగాని వృద్ధులకుగాని మనోబలాన్ని నిగ్రహించే శక్తి చాలదు. ఎందుకంటే యువకులు అజ్ఞానంవలన తెలియని భావాలతో ఉంటారు. ముదుసలులు దౌర్బల్యంవలన కలతచెందిన భావాలతో ఉంటారు. యువకులు అజ్ఞానమూఢులు కాగా, వృద్ధులు దౌర్బల్యవికలులు. కాబట్టి యౌవనవార్ధక్యాల నడిమి దశలోనివారే మనస్సును నిగ్రహించగలరు.

**క. కావున శుక్ల స్థితికిం । గావించినయట్టి పుణ్యకర్మము లగు స**
**త్సేవిత యమనియమాదుల । త్రోవ సొరఁగవలయు విషయ దూరాత్మకుఁడై. 309**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి - ఇంద్రియ నిగ్రహం అవశ్య ఆచరణీయం కాబట్టి; శుక్ల స్థితికిన్= ఇంద్రియపు నిలకడకు; కావించిన+అట్టి= ఏర్పరచినట్టి; పుణ్యకర్మములు+అగు= ధర్మకార్యములయిన; సత్+సేవిత యమ నియమ+ఆదుల త్రోవ= మంచివారిచేత ఆచరించబడ్డ యమము, నియమము మొదలయిన ఎనిమిది నియములయొక్క దారిని; విషయదూర+ఆత్మకుఁడు+ఐ= విషయాలకు - కన్ను ముక్కు లోనైనవాటికి తెలియవచ్చేవానికి, ఎడమైన మనస్సుగలవాడై; చొరఁగన్+వలయున్= ప్రవేశించాలి.

**తాత్పర్యం:** ఇంద్రియనిగ్రహం జ్ఞానార్జనకు, తద్వారా మోక్షప్రాప్తికీ కారణం కాబట్టి వీర్యపు నిలకడకొరకు ఏర్పరచబడ్డవీ, సజ్జనులు ఆచరించేవీ అయిన యమనియమాది ఎనిమిది నియమాలూ నరుడు పాటించాలి. జ్ఞానేంద్రియాలకు గోచరించే విషయాలకు దూరంగా మనస్సును కట్టడిచేసి, ఈ యమనియమాదుల మార్గాన ప్రవేశించాలి. అపుడు మనో నిగ్రహం, తద్వారా శుక్లస్థితి చేకూరే వీలుంది.

**క. అరయఁగ విషయము లెంతయు । దురంతములు; వానియందుఁ దొడరినఁ జేటుం**
**బొరయుదురు దొడరకున్నం । బరమపదవి యమ్మహానుభావులకు నగున్. 310**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= పరిశీలించగా; విషయములు= పంచజ్ఞానేంద్రియాలకు గోచరించే అంశాలు - పదార్థాలు;ఎంతయున్= అమితంగా - అధికంగా; దుర్+అంతములు= దుఃఖం, చెడు అంతాన గలవి - చివరకు దుఃఖాన్ని, చెడును కలిగించేవి;వానియందున్= ఆ విషయాలలో (విషయ సుఖాలలో); తొడరినన్= లగ్నమైనచో; చేటున్= కీడును; పొరయుదురు= పొందుదురు; తొడరక+ఉన్నన్= లగ్నం కాకుండా ఉన్నచో; ఆ+మహా+అనుభావులకున్= అట్టి తొడరని గొప్పశక్తి సంపన్నులకు; పరమపదవి= గొప్పస్థితి - ముక్తి; అగున్= కలుగును.

**తాత్పర్యం:** పరిశీలనగా చూస్తే జ్ఞానేంద్రియాలద్వారా మనస్సును చేరే విషయాలు, చాలా దుఃఖాన్ని, కీడును చివరకు మిగిల్చేవిగా ఉంటాయి. కాబట్టి ఆ విషయాలలో తగుల్కొంటే (ఆ విషయసుఖాలకు లోనైతే) చివరకు చేటు కలుగకమానదు. అట్లా కాకుండా ఆ విషయాలకు దూరంగా ఉండి, విషయ సుఖాలకు లోనుగాని మహానుభావులు పరమపదాన్ని (ముక్తిని) అందుకొనగలుగుతారు.

**క. జననము జరయును మరణం । బును మొదలుగఁ గలుగు దుఃఖములు లోకమునం**
**గనుఁగొని బుధుండు మోక్షం । బున కుద్యోగించు నియతిఁ బూతహృదయుఁ డై. 311**

**ప్రతిపదార్థం:** బుధుండు= పండితుడు - బుద్ధిమంతుడు; లోకంబునన్= జగత్తులో; జననము= పుట్టుక; జరయును= ముసలితనమూ; మరణంబును= చావూ; మొదలుగన్+కలుగు దుఃఖములు= మొదలైన ఎపుడూ ఉండే దుఃఖాలను; కనుఁగొని= చూచి; నియతిన్= నియమంతో - నిగ్రహంతో; పూత హృదయుఁడు+ఐ= పవిత్రమైన మనస్సు కలవాడై; మోక్షంబునకున్= ముక్తికొరకు; ఉద్యోగించున్= ప్రయత్నిస్తాడు.

**తాత్పర్యం:** లోకవ్యవహారాన్ని పరిశలించిన పండితుడు, లోకంలో నిరంతరం ఎపుడూ ఆగకుండా జరిగిపోయే పుట్టుకలూ, చావులూ, మీదపడే ముసలితనం మొదలైన దుఃఖపరంపరను చూచి, నియమపాలనతో మనస్సునుపవిత్రీకరించుకొని ఈ జగత్తునకు, దానిలోని దుఃఖసమూహానికీ దూరంగా పోయే ఉద్దేశంతో మోక్షంకొరకుప్రయత్నిస్తాడు.

**విశేషం:** గతానుగతమైన జీవనం చేయటం పామరుడి లక్షణం. పరిశీలించి ఉత్తమ మార్గాన బ్రతకటం పండితుడి లక్షణం.

**తే. వాఙ్మనః కాయములు శౌచవంతములుగఁ । జేసికొని యనహంకారశీల శాంత**
**బుద్ధియై నిరపేక్షతఁ బొంది యఖిల । భూతదయ గల్గి మెలఁగంగ బోధ మొందు. 312**

**ప్రతిపదార్థం:** వాక్+మనస్+కాయములు= మాట, మనస్సు, శరీరం - ఈ మూడూ; శౌచవంతములుగన్= శుభ్రతతో కూడినవిగా; చేసికొని= కావించుకొని; న+అహంకారశీల శాంత బుద్ధి+ఐ= అహంకారంలేని - 'నేను' అనే గర్వంలేని స్వభావంతో శాంతించిన బుద్ధిగలవాడై; నిర్+అప+ఈక్షతన్= కోరికలేనివాడితనమును - కోరికలు లేని స్థితిని; పొంది= చెంది; అఖిల భూతదయ= ఎల్ల ప్రాణులయెడ జాలి - కరుణ; కల్గి= ఉండి - వహించి; మెలఁగంగన్= ప్రవర్తిస్తే - జీవిస్తే; బోధము= జ్ఞానం; ఒందున్= చెందును.

**తాత్పర్యం:** నరుడు మాటలో, మనస్సులో, పనిలో పరిశుభ్రతను పాటిస్తూ, సహజమైన అహంకారభావాన్ని విడనాడి శాంత స్వభావుడై ఉన్నపుడు, అతడిలో కోర్కెలు సన్నగిల్లి, అంతరించిపోతాయి. ఆ స్థితిలో లోకంలోని ప్రాణి సమూహమంతటినీ అతడు కరుణతో ఆదరించగలుగుతాడు. పరిశుభ్రమైన జీవనం, అహంకారం లేని శీలం, కోర్కెలకు దూరమైన మనస్సూ - ఈ మూడిటికి తోడుగా భూతదయ కలిగి ఉన్నవాడికి జ్ఞానం కలిగితీరుతుంది.

**క. మనసును వాక్కును గాయం । బు నియంత్రితములుగఁ జేసి పొందుదురు ధనం**
**బునకై ముచ్చులు దానిం । గనుఁగొనఁ గావలదె మోక్షకాంక్షికి? వత్సా! 313**

**ప్రతిపదార్థం:** వత్సా!= బిడ్డా! ధర్మసుతా!; మ్రుచ్చులు= దొంగలు - అధ్యాత్మ విద్యలోనివారు; మనసును= చిత్తమును; వాక్కును= మాటను; కాయంబున్= శరీరాన్ని; ధనంబునకై= ధనంకొరకు - ధనార్జనకై; నియంత్రితములుగన్+చేసి= నియమించబడిన - నిగ్రహించబడిన వాటినిగా చేసి; దానిన్= ఆ ధనాన్ని; పొందుదురు= అందుకొంటారు; మోక్షకాంక్షికిన్= ముక్తిని కోరేవాడికి; కనుఁగొనఁగాన్+వలదే?= చూడవద్దా? (ఆ విషయం).

**తాత్పర్యం:** అన్ని విద్యలనువలెనే ఈ ఆధ్యాత్మవిద్యనూ దుర్వినియోగంచేసే దొంగలున్నారు. అట్టివారిని ముక్తిని కోరేవాడు గమనించాలి. ఆ మునిమ్రుచ్చులు ధనంకొరకు, మనోవాక్కాయాలను నియంత్రించికొని, తత్ప్రదర్శనద్వారా దాన్ని ఆర్జించి ఆధ్యాత్మవిద్యా కాలుష్యానికి కారకులవుతున్నారు. ఈ విధమైన దురుపయోగం నుండి ఆధ్యాత్మవిద్య రక్షితం కావాలి.

**ఆ. బుద్ధిఁ గొని మనంబు పోనీక నిలిపి మ । నోభియుక్తి నింద్రియముల నాఁగి**
**విషయసమితి నెడల విడిచిన వానికి । ననిమిషులు ప్రసన్ను లగుదు రనఘ! 314**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; బుద్ధిన్+కొని= మతినిపట్టి - నిగ్రహించి; మనంబు= మనస్సును; పోన్+ఈక= పోనీయక- దానిని నిలిపి; మనస్+అభియుక్తిన్= చిత్తముయొక్క పూనికతో; ఇంద్రియములన్= కన్ను ముక్కు లోనైన జ్ఞానేంద్రియాలను; ఆఁగి= అడ్డగించి- నిగ్రహించి; విషయసమితిన్= విషయ (వాసనల) సమూహాన్ని - లౌకిక ప్రవృత్తులను; ఎడలన్+విడిచినవానికిన్= దూరాన వదలిన వాడికి; అనిమిషులు= రెప్పపాటులేనివారు - దేవతలు; ప్రసన్నులు+అగుదురు= అనుగ్రహించినవారు అవుతారు.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడ వైన ధర్మరాజా! బుద్ధిని అదుపులో ఉంచుకొని, మనస్సును నిగ్రహించుకొని, పూనికతో ఇంద్రియాలను నిరోధించి, తద్ద్వారా విషయవాసనలను విడిచిపుచ్చిన వాడిని దేవతలు అనుగ్రహిస్తారు.

**క. విను దేవతాప్రసాదం । బున నిర్మల యోగతంత్రములు పనుపడు న**
**య్యనువున నిశ్చలమతి ని । ల్చునది శిథిలితాన్నపాన సుఖతృష్ణుం డై. 315**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; దేవతా ప్రసాదంబునన్= దేవతల అనుగ్రహంవలన; నిర్మల యోగ తంత్రములు= స్వచ్ఛమైన యోగకార్యాలు; పనుపడున్= అలవాటౌతాయి; ఆ+అనువునన్= ఆ సౌకర్యంతో - ఆ ఉపాయముతో; నిశ్చలమతిన్= చలనంలేని బుద్ధితో; శిథిలిత+అన్నపాన సుఖతృష్ణుండు+ఐ= తినటం తాగటం సుఖములయెడ సడలిన ఆశగలవాడై- అన్నపానాలయెడ, సుఖాలయెడ ఆశ సన్నగిల్లినవాడై; నిల్చునది= నిలబడాలి.

**తాత్పర్యం:** దేవతల అనుగ్రహంవలన మలినరహితమైన యోగకార్యాలు నరుడికి అలవడుతాయి. ఆ యోగవిద్యల సహాయంతో నిశ్చలబుద్ధితో అన్నపానాలు, ఇతర సుఖాలయెడ ఆసక్తి సన్నగిల్లి, ఏకాగ్రతతో నరుడు నిలబడాలి.

**క. శాక కణ మూల ఫల పి । ణ్యాకాదుల భైక్షమైన యన్నంబున ని**
**శ్శోకత నాఁకలివుచ్చుచు । లోకాలోకంబున నచలుఁడు గావలయున్. 316**

**ప్రతిపదార్థం:** శాక కణ మూల ఫల పిణ్యాక+ఆదులు= కూరలు, నూకలు, కందములు (భూమిలోపల పెరిగే ఆహారాలు), పండ్లు, తెలికపిండులు మొదలయిన వాటియొక్క; భైక్షము+ఐన= బిచ్చంగా వచ్చిన; అన్నంబునన్= ఆహారంతో; నిస్+శోకతన్= దుఃఖంలేని భావంతో; ఆఁకలి+పుచ్చుచున్= ఆకలిని తీర్చుకుంటూ; లోక+ఆలోకంబునన్= జగత్తునుచూచుటలో - పరిశీలించుటలో (నరుడు); అచలుఁడు= చలనంలేనివాడు - స్థాణువు - స్థిరమైనవాడు; కాన్+వలయును= కావలెను.

**తాత్పర్యం:** అన్నపానాలమీద, సుఖసంతోషాలమీద ఆశ సన్నగిల్లిన తరువాత, సాధకుడు భిక్షగా దొరకిన ఆహారం అది ఏదైనా - కూర నారగాని, నూకలుగాని, కందమూలాలుగాని, పండ్లుగాని, తెలికపిండివంటి పదార్థాలుగాని, దుఃఖంలేకుండా స్వీకరించి, ఆకలి తీర్చుకొంటూ, జగత్తును పరీక్షిస్తూ అచలుడై నిలవాలి. తన సాధనమండి చలించక స్థాణువువలె నిలబడాలి.

**క. జ్ఞానమ యింధనముగ వి। జ్ఞానాగ్నిం బ్రబలఁజేయ జరయు మరణమున్**
**నానావిధ దుఃఖంబులు। లేని యమృత మక్షరంబు లెస్సై తోఁచున్. 317**

**ప్రతిపదార్థం:** జ్ఞానము+అ= జ్ఞానమే; ఇంధనముగన్= వంట కట్టెగా - నిప్పు రగిల్చే సాధనంగా; విజ్ఞాన+అగ్నిన్= విజ్ఞానం - అధికమైన జ్ఞానం అనే నిప్పును; ప్రబలన్+చేయన్= పెరిగేటట్లు చేస్తే; జరయున్= ముసలితనమూ; మరణమున్= చావూ; నానా విధ దుఃఖంబులు= అనేక విధాలయిన ఇతర దుఃఖాలూ; లేని= ఉండని - కలగని; అమృతము= మరణరహితమైన; అక్షరంబు= జారుడులేని స్థితి - ముక్తి; లెస్స+ఐ= బాగై - బాగుగా; తోఁచున్= గోచరిస్తుంది.

**తాత్పర్యం:** నరుడు తనలోని జ్ఞానాన్నే వంటచెరకుగా వాడుకొంటూ, విజ్ఞానాగ్ని రగుల్కొనేటట్లు చేసి ప్రజ్జ్వలింపచేయగలిగితే అతడికి జరామరణాలకు, ఇతర లౌకిక దుఃఖపరంపరలకూ దూరమైన అమృతత్వసిద్ధి కలుగుతుంది. అతడు ధ్రువమైన మోక్షస్థితిని చేరుకొంటాడు.

**క. విని నిద్రాదోషంబునఁ। గను కలల రజస్తమో వికారంబులచే**
**మనసు దిరుఁగఁబడఁగాఁ గఱ। చినవి మఱచి యపుడు దుష్టశీలుండ యగున్. 318**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి - ఇతరుల ప్రసంగాలలోని విషయాలు చెవిని వేసికొని; నిద్రాదోషంబునన్= నిద్ర అనే దోషంవలన - (సాధకుడు మితిమీరి నిద్రించటం తప్పు కాబట్టి అది దోషం); కను కలలన్= (నిద్రలో) చూచే కలలలో; రజస్+తమస్+వికారంబులచేన్= రజోగుణంయొక్క, తమోగుణంయొక్క వికృతులవలన; మనసు= చిత్తం; తిరుగన్+పడఁగాన్= తిరుగబడగా - వ్యత్యస్తం కాగా- సాధన నుండి మరలినది కాగా; కఱచినవి= నేర్చినవి - అప్పటివరకు శ్రద్ధగా అలవరచుకొన్న సాధనలు; మఱచి= మరలిపోయి; అపుడు+అ= అప్పుడే - ఆ క్షణమే; దుష్టశీలుండు+అ= దుర్మార్గమైన స్వభావం గలవాడుగా; అగున్= ఔతాడు.

**తాత్పర్యం:** సాధకుడు సాధనదశలో ఉండగా నిత్యజాగరూకత అవసరం. అతడి భాషణం, శ్రవణం - ఇవన్నీ నిర్దుష్టంగా విషయవిదూరంగా పవిత్రంగా ఉండాలి. విషయాలకు సమీపంగా వెళ్ళి లౌకిక ఆసక్తితో కూడని విషయాలను వింటే, అవి అతడికి నిద్రలో అవే కలలుగా కనిపించి, అతడి చిత్తాన రజస్తమోగుణాలను ప్రకోపింపజేస్తాయి. ఆ కారణంగా సాధకుడి చిత్తం తిరుగబడి, సాధనమండి వెనుకకు మరలుతుంది. అంతవరకు అలవడిన సాధనలను మరచి, వెంటనే సాధకుడు దుర్మార్గాన పడిపోయి దుష్టశీలుడుగా మారిపోవచ్చును.

**వ. అది యోగి కొప్పదు గావున. 319**

**ప్రతిపదార్థం:** అది= సాధనమండి జారి, దుష్టుడుగా మారటం; యోగికిన్= యోగవిద్యాభ్యాసికి; ఒప్పదు= కూడదు- తగదు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** సాధన దశలో మధ్యలో యోగభ్రష్టుడై నశించటం తగదు కాబట్టి, సాధకుడైనవాడు ఏమి చెయ్యాలంటే. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుతజ్ఞానాభ్యాసం । బున సమధిక జాగరత్వముం బడసి సకృ**
**జ్జనితం బగు నిద్రాభర । మునుఁ బొందును యోగి యదియుఁ బోఁ ద్రోచుఁ దుదిన్.' 320**

**ప్రతిపదార్థం:** యోగి= యోగమును అనుష్ఠించేవాడు; వినుతజ్ఞాన+అభ్యాసంబునన్= పొగడబడ్డ జ్ఞానార్జనయందు - ఆ సమయాన; సమ్+అధిక జాగరత్వమున్+పడసి= మిక్కిలి మెలకువను పొంది - మేల్కొని ఉంటూ; సకృత్+జనితంబు+అగు= స్వల్పంగా కలిగినదైన; నిద్రాభరమును= నిద్దురయొక్క మోతను - నిద్రాభారాన్ని; పొందును= చెందుతాడు; (పిదప); అదియున్= దానిని కూడా ఆ సకృత్తుగా కలిగే నిద్రను కూడా; తుదిన్= చివరకు; త్రోచున్= త్రోసివేస్తాడు.

**తాత్పర్యం:** జ్ఞానార్జనకై యోగాభ్యాసం చేపట్టిన సమయాన సాధకుడు ఎక్కువ మెలకువతో ఉంటాడు. ఎక్కువ కాలం మేల్కొని ఉంటూ, ఎపుడో ఒకసారి మాత్రం నిద్రాభారానికి లొంగిపోతాడు. ఈ స్థితి అభ్యాస దశలోనే. చివరకు ఆ కొద్దిపాటి నిద్రను కూడా దూరీకరించి, నిత్యజాగరూకు డౌతాడు యోగి'.

**వ. అని వెండియు. 321**

**ప్రతిపదార్థం:** అని= పై ప్రకారంగా వివరించి; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** ఇట్లా పలికి, మళ్ళీ (ఇట్లా అన్నాడు).

**భీష్ముఁడు ధర్మజునకు స్వప్నాద్యవస్థల తెఱం గెఱింగించుట (సం. 12-209-1, 2)**

**క. 'విలయం బింద్రియములకుం । గలుగఁగ విషయానుభవము గలిగిన భంగిన్**
**మెలఁగును స్వప్నంబున మెయి । గల యట్టుల దేహి భావగతి యెయ్యదియో. 322**

**ప్రతిపదార్థం:** ఇంద్రియములకున్= కన్ను, ముక్కు వంటి ఇంద్రియాలకు; విలయంబు= విశ్రాంతిని (పనిచేయకపోవటం); కలుగఁగన్= (నిద్రలో) ఏర్పడగా; దేహి= దేహంగలవాడు - దేహస్థుడు - ఆత్మ; విషయ+అనుభవము= విషయములయొక్క, దృశ్యాలు, నాదాలు మొదలయినవాటియొక్క అనుభూతి; కలిగిన భంగిన్= కలిగినట్లుగా; స్వప్నంబునన్= కలయందు; మెయి+కల+అట్టులన్= శరీరం ఉన్నప్పటివలె - మేల్కొని శరీరం తన పనులు తాను చేస్తున్నపుడు వలె; మెలఁగును= ప్రవర్తిస్తాడు; భావగతి= మనస్సుయొక్క పోకడ; ఏ+అదియో!= ఏదో, ఏమిటో!

**తాత్పర్యం:** 'నిద్రాస్థితిలో ఇంద్రియాలు విశ్రాంతిచెంది, ప్రవర్తించటం మానివేసిన తరువాత ఆత్మ స్వప్నంలో విషయానుభూతిని పొందుతున్నాడు. మేల్కొని ఉన్నప్పటివలె అతడి అనుభవం ఇంద్రియాలద్వారానే అవుతున్నది. మనస్సు పోకడ ఎటువంటిదో! ఏమిటో!

**విశేషం:** అనుభూతి ఇంద్రియ మాత్రజన్యం. ఇంద్రియాలు నిజానికి నిద్రావస్థలో విశ్రమించి ఉంటాయి. అయినా స్వప్నాన, బాహ్య జగత్తులోవలె మేల్కొని ఉన్నప్పటివలె క్రియలు, స్పర్శలు, ధ్వనులు - అన్నీ అనుభూత మౌతాయి. కాబట్టి మనస్సు గతి ఏమిటో అని ఆశ్చర్యపడటం సబబే.

**క. అని యి ట్లొలయు వితర్కం । బునెడ హృషీకేశుఁ డైన పురుషోత్తము ద**
**ర్శనమును గ్రమమున నెఱిఁగిన । ముని వర్గము శిష్యవర్గమున్ బోధించున్. 323**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; ఇట్లు+ఒలయు= ఈ ప్రకారం కలిగే; వితర్కంబు+ఎడన్= సందేహం విషయంలో; హృషీక+ఈశుఁడు+ఐన= ఇంద్రియాలకు అధిపతి అయిన; పురుష+ఉత్తము= శ్రేష్ఠమానవుడి - శ్రీ విష్ణువుయొక్క; దర్శనమును=

చూపును - జ్ఞానమును; క్రమమునన్= వరుసగా విద్యా సంతతిద్వారా; ఎఱిఁగిన= గ్రహించిన; మునివర్గము= ఋషి సంఘం; శిష్యవర్గమున్= (తమ) శిష్యుల సమూహమును; బోధించున్= ఉపదేశిస్తుంది.

**తాత్పర్యం:** ఇంద్రియాలు విశ్రాంతిలో ఉన్నప్పుడు కూడా ఇంద్రియక్రియలు స్వప్నాన జరిగిపోవటం ఏ విధంగా సంభవం? - అనే సంశయానికి సమాధానంగా ఋషీశ్వరులు, ఇంద్రియాలకు అధీశ్వరుడైన విష్ణుమూర్తినుండి జ్ఞానాన్ని పొంది, ఆ జ్ఞానజ్యోతిని విద్యాసంతతిద్వారా అనగా శిష్యపరంపర ద్వారా అందిస్తూ వస్తున్నారు.

**క. శ్రమమున నింద్రియములు లీ । నము లగునది నిద్ర కలయనం దత్సంస్కా**
**రము మిథ్యావిషయ ప్రా । ప్తమగుట యప్పుడును దేహి దా సాక్షి యగున్. 324**

**ప్రతిపదార్థం:** శ్రమమునన్= శ్రమ - అలసటవలన; ఇంద్రియములు= జ్ఞాన, కర్మ ఇంద్రియాలు; లీనములు+అగున్= దాగినవి-విరమించినవి ఔతాయి; అది= ఆ ప్రక్రియ; నిద్ర= నిద్దుర (ఔతుంది); కల+అనన్= కల అనగా; తద్+సంస్కారము= వాటి - ఆ ఇంద్రియాలయొక్క పూర్వానుభవపు తలపు; మిథ్యావిషయ ప్రాప్తము+అగుట= అసత్యమైన విషయాలతో లభించటం; అప్పుడును= ఆ స్థితియందుకూడా; దేహి= దేహం కలవాడు - ఆత్మ; తాన్= తాను; సాక్షి+అగున్= జరుగునది చూచువాడిగా (అవును) ఉంటాడు.

**తాత్పర్యం:** అలసట కారణాన ఇంద్రియాలు విశ్రాంతితో ఆగిపోవటం నిద్ర. మరి కల అనగా ఆ ఇంద్రియాల పూర్వానుభవం మిథ్యావిషయంగా వచ్చిచేరటం. ఆ సమయంలో కూడా దేహి ఆ కలలో జరిగే దానిని అంతటినీ చూచే సాక్షిగా మిగిలి ఉంటాడు.

**తే. అనిలముఖ దోషములను సత్త్వాదిగుణ వి । కారముల జాగరంబునఁ గలుగునట్టి**
**తోఁపు బెరయంగఁ గల యయి తోఁచు; నది శు । భాశుభములకు సూచక మనియుఁ గలదు. 325**

**ప్రతిపదార్థం:** జాగరంబునన్= మేల్కొని ఉన్నప్పుడు; అనిలముఖ దోషములను= గాలి మొదలైన దోషాలవలన; సత్త్వ+ఆది గుణ వికారములన్= సత్త్వం మొదలైన గుణాలయొక్క వికృతులవలన; కలుగు+అట్టి తోఁపు= కలిగే తలంపు; బెరయంగన్= చేరగా- వచ్చి చేరగా; కల+అయి= కలగా మారి; తోఁచున్= గోచరిస్తుంది; అది= ఆ కల; శుభ+అశుభములకున్= మంచి చెడులకు (రాబోవువాటికి); సూచకము= సూచిక - ప్రకాశకం - ముందుగా తెలిపేది; అనియున్= అని కూడా; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** జాగ్రదవస్థలో గాలి, మొదలయిన దోషాలవలనగాని, సత్త్వరజస్తమోగుణాల వికారాలవలన గాని కలిగే తలంపే, నిద్రలో కలగా వచ్చి చేరుతుంది. ఆ కల శుభాశుభాలకు సూచకమని అనటం కూడా ఉన్నది.

**విశేషం:** ఆధునికులు, మానసికశాస్త్ర అధ్యయనం తరువాత కనుగొన్నామని చెప్పే విషయాలకు సన్నిహితంగా ప్రాచీనులు కలకు ఇచ్చిన నిర్వచనం ఉన్నది.

**క. స్వాపావస్థం బ్రకృతి క । దీపిత వాటిల్లు నపుడుఁ దెలి వెడలక తా**
**దీపించుఁ బురుషుఁ డిమ్మెయి । చూపు ప్రబోధంబు పరమసూక్ష్మత పుత్రా! 326**

**ప్రతిపదార్థం:** పుత్రా!= బిడ్డా!; స్వాప+అవస్థన్= నిద్రావస్థలో; ప్రకృతికిన్= స్వభావానికి; అదీపిత= కాంతిలేని స్థితి-ప్రకాశంలేకపోవుట; పాటిల్లున్= కలుగుతుంది- ఏర్పడుతుంది; అపుడున్= ఆ సమయంలో కూడా - ప్రకృతి దీపించకుండా ఉన్నప్పుడు కూడా; పురుషుఁడు= దేహి అయిన ఆత్మ; తెలివి+ఎడలక= తెలివి నశించకుండా; తాన్= తాను; దీపించున్= ప్రకాశిస్తాడు; ఈ+మెయిన్= ఈ విధంగా; పరమ సూక్ష్మతన్= మిక్కిలి సూక్ష్మత్వంతో - చాలా సూక్ష్మమార్గాన; ప్రబోధంబు= ప్రజ్ఞానం - గొప్ప తెలివిని (పురుషుడు) చూపున్= ప్రదర్శిస్తాడు.

**తాత్పర్యం:** నిద్రావస్థలో నరుడి స్వభావం ప్రకాశరహితంగా ఉంటుంది. అయితే దేహస్థుడైన పురుషుడు మాత్రం, తాను ప్రకాశాన్ని కోల్పోకుండా మేల్కొనే ఉంటూ, ఈ విధంగా మిక్కిలి సూక్ష్మమార్గాన తన ప్రబోధాన్ని ప్రకటిస్తున్నాడు.

**తే.** **తెలియ మేల్కని యుండుట, గలలు, నిద్ర। యను నవస్థాత్రయంబును, నవులఁబెట్టఁ**
**జాలు విజ్ఞాననిర్మల సత్యబోధ। రూప నిర్భరానందస్వరూపుఁ డనఘ! 327**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా!; తెలియన్= గ్రహించగా; మేల్కని+ఉండుట= మేల్కొని ఉండటం - జాగ్రదవస్థ; కలలు= స్వప్నాలు - స్వప్నావస్థ; నిద్ర= నిద్దుర పోవటం - నిద్రావస్థ; అను+అవస్థాత్రయంబును= అనే మూడు స్థితులనూ కూడా; అవులన్+పెట్టన్+చాలు= ఆవల పెట్టగల; విజ్ఞాన= విశేషమైన జ్ఞానం; నిర్మల= మలినంలేని; సత్యబోధరూప= నిజమైన ఎరుక అనే ఆకారంతో; నిర్భర= పరిపూర్ణ; ఆనంద స్వరూపుఁడు= ఆనందమే స్వరూపంగా కలవాడు ('పురుషుడు' అని పూర్వపద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఓ పాపరహితుడా! నరుడి జీవన సర్వస్వమూ మూడు అవస్థలతో నిండి ఉన్నది. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, నిద్రావస్థ - ఆ మూడు. నిజానికి దేహస్థుడైన ఆ పురుషుడు ఈ మూడు అవస్థలను ఆవలకు నెట్టి, స్వయంగా నిర్మలమూ సత్యమూ అయిన జ్ఞానాన్ని అకారంగా స్వీకరించి, పరిపూర్ణానందమయుడుగా ఉండగలవాడే.

**విశేషం:** పై పద్యాన 'బోధరూప. . . ఆనంద స్వరూపుడు' అనే మాట కొంత దురవగాహంగా అనిపించవచ్చును. 'బోధ', 'ఆనందం' రెండూ 'రూప' స్వరూపాలు'గా రూపింపబడటం వలన ఆ స్థితి కలుగవచ్చును. అయితే బోధ - జ్ఞానమే. ఆనందం. ఆనందమే ఆత్మస్వరూపమని సమన్వయించుకొనాలి.

**తే.** **వ్యక్త మవ్యక్తమును రెండు నవగతములు। గాక మోక్షంబు మార్గంబు గానరాదు;**
**వ్యక్త మది మృత్యు వవ్యక్త మమృత మనియె। నతుల విజ్ఞాన ఘనుఁడు నారాయణుండు. 328**

**ప్రతిపదార్థం:** వ్యక్తము= గోచరించేది; అవ్యక్తమును= మూల ప్రకృతి; రెండున్= ఈ రెండూ; అవగతములు+కాక= తెలిసినవిగాక - తెలియకుండా; మోక్షమార్గంబు= ముక్తికి దారి; కానన్+రాదు= కనబడదు; వ్యక్తము+అది= ఆ వ్యక్తమనేది - గోచరించే సర్వస్వమూ; మృత్యువు= మరణం - చావు - చావుకు లోనైనది; అవ్యక్తము= మూలప్రకృతి; అమృతము= మరణంలేనిది - చావనిది (అని); అతుల విజ్ఞాన ఘనుఁడు= పోలికలేని విశేషజ్ఞానంతో గొప్పవాడు అయిన; నారాయణుండు= విష్ణువు; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** జగాన వ్యక్తం, అవ్యక్తం అని పదార్థాలు రెండు ఉన్నాయి. అవి తెలిస్తే తప్ప ముక్తికి దారి కనపడదు. వ్యక్తమంటే చావు; అవ్యక్తమంటే అమృతం - అని విజ్ఞానఘనుడైన విష్ణువు పలికాడు.

**విశేషం:** వ్యక్తమంటే గోచరించేది. గోచరించేది సర్వమూ సృష్టపదార్థమే. సృష్టిని పొందిన దేదైనా నష్టికి లోను గావలసిందే, అవ్యక్తమంటే అగోచరం; అసృష్టం - సృష్టి లేనిదానికి నష్టి ఉండదు. అదే అమృతత్వమంటే.

**క.** **అనఘా! విను మవ్యక్తం। బనునది త్రైలోక్యమునకు నాధారము; దా**
**ని నివృత్తి లక్షణం బగు। ననుపమ ధర్మ మని చాటు నాగమఫణితుల్. 329**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; వినుము= ఆలకించుము; అవ్యక్తంబు+అనునది= అవ్యక్తమనేది - మూలప్రకృతి అనేది; త్రైలోక్యమునకున్= ముల్లోకాలకూ; ఆధారము= ఆలంబనం; దాని నివృత్తి లక్షణంబు= ఆ అవ్యక్తముయొక్క 'నివృత్తి' అనే లక్షణం; అ+ఉపమ ధర్మము= సాటిలేని ధర్మం - ఆచరించదగ్గ నియమం; అగున్+అని= ఔతుందని; ఆగమ ఫణితుల్= శాస్త్రాల వాక్యాలు; చాటున్= ప్రకటిస్తాయి.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడా! వినుము. అవ్యక్తమనబడే మూలప్రకృతి ముల్లోకాలకూ ఆలంబనమైనది. దానినుండే లోకాలన్నీ జన్మించి, దానిలోనే పెరిగి, చివరకు దానియందే లయమౌతున్నాయి. ఆ అవ్యక్తం నివృత్తి లక్షణం కలది. ఆ నివృత్తిమార్గం సాటిలేని గొప్ప ధర్మమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

**తే.** **వినుము బ్రహ్మోదితంబు ప్రవృత్తిధర్మ । మది గతాగతవ్యాప్తుల నావహించు**
**బ్రహ్మమంద్రు; నివృత్తిధర్మంబు నమ్మ । హాశ్రయము మోక్షదం బను నాగమములు.** **330**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ప్రవృత్తి ధర్మము= ప్రవర్తన స్వరూపమైన ధర్మం; బ్రహ్మ+ఉదితంబు= బ్రహ్మనుండి పుట్టినది; అది= ఆ ప్రవర్తన ధర్మం; గత+అగత వ్యాప్తులన్= గతంయొక్క (కడచిన దాని), అగతంయొక్క (కడవని దాని) ప్రసరణలను - (భూత భవిష్యత్తుల) వ్యాప్తులను; ఆవహించు= కలిగించే; బ్రహ్మము+అంద్రు= బ్రహ్మ అంటారు. భూత భవిష్యత్కాలాలకు వ్యాపించి ఉంటుంది - ప్రవృత్తి ధర్మం, ప్రవర్తన, వర్తమానకాలాన జరుగుతున్నా, దాని మూలాలు భూతాన, అవశేషాలు. భవిష్యత్తున ఉండవచ్చుననుట; నివృత్తి ధర్మంబున్= నివృత్తి రూపమైన ధర్మం; ఆ+మహా+ఆశ్రయము= ఆ గొప్ప ఆధారం - ఆ నివృత్తిధర్మం; మోక్షదంబు= మోక్షమును ఇచ్చేది (అని); ఆగమములు= శాస్త్రాలు; అనున్= పలుకుతాయి.

**తాత్పర్యం:** పైన తెలిపిన నివృత్తిమార్గానికి వ్యతిరిక్తమైనది ప్రవృత్తి మార్గం. నివృత్తి అంటే మరలడం - సంసారంనుండి. ప్రవృత్తి అంటే పాల్గొనటం - సంసారంలో. ప్రవృత్తిమార్గం బ్రహ్మనుండి పుట్టినది. ఈ ప్రవృత్తిమార్గం నిజానికి ప్రస్తుతకాలానికి చెందినట్లుగా కనిపిస్తున్నా, అది భూతభవిష్యత్కాలాలకూ వ్యాపించి ఉండే లక్షణం గలది. ఎందుకంటే ప్రవర్తన - ప్రవృత్తి అనగా కర్మలు చేయటమే, చేసిన కర్మల ఫలితాలు ముందు వెనుకలుగా అనుభవానికి రావచ్చును. ముందుగా అనుభవానికి రావటమంటే భూతకాలాన సంచితమై ఉన్నది వస్తున్నట్లుగా అర్థం చేసికొనాలి. అట్లాగే వెనుకగా అనుభవానికి రావటమంటే భవిష్యత్కాలాన రావటానికై దాచబడినదై అనంతరజన్మలో రాబోయేదిగా అర్థం చేసికొనాలి. ఈ విధంగా వర్తమానకాలానికే చెందినట్లున్నా, భూతభవిష్యత్తులకు కూడా వ్యాపించి ఉండే బ్రహ్మస్వరూపమే ప్రవృత్తిమార్గమని విజ్ఞులంటారు. జగత్తంతా బ్రహ్మవిలాసమే - వాస్తవానికి. అయితే నివృత్తిమార్గాన్ని మోక్షాన్ని ఈయగల దానినిగా శాస్త్రాలు పేర్కొంటున్నాయి.

**క.** **కట్టిన చీరయునుం, బైఁ । బెట్టిన చీరయును, మౌళి బిగి యారంగాఁ**
**జుట్టిన చీరయుఁ బోలెను । నెట్టన పొదివినది దేహిని గుణత్రయమున్.** **331**

**ప్రతిపదార్థం:** గుణత్రయమున్= గుణాలు మూడు - సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలూ; దేహిని= దేహం కలవానిని; కట్టిన చీరయున్= కట్టుకొన్న వస్త్రంవలె (ఒకటి); పైన్+పెట్టిన చీరయును= శరీరంమీద వేసికొన్న వస్త్రంవలె (మరొకటి రెండోది); మౌళిన్= తలను; బిగి+ఆరంగాన్= బిగువు స్పష్టపడే విధంగా; చుట్టిన చీరయున్+పోలెను= చుట్టిన వస్త్రంవలెనూ (మూడోది); నెట్టనన్= నిండుగా; పొదివినది= కమ్ముకొన్నది.

**తాత్పర్యం:** దేహస్థుడు ఆత్మ. అతడిని ప్రాకృతికాలయిన సత్త్వరజస్తమో గుణాలు మూడూ, కట్టుకొన్న చీరవలె ఒకటీ, పైన వేసికొన్న వస్త్రంవలె మరొకటీ, తలకు గట్టిగా చుట్టుకొన్న గుడ్డవలె ఇంకొకటీ, నిండుగా కమ్ముకొన్నాయి. ఆత్మ నిజస్వరూపం కానరాకుండా, ఈ క్రొత్త బాహ్యరూపాన్ని ఈ గుణాలు మూడూ కలిగించా యన్నమాట.

**క.** **విను సత్త్వరజస్తమముల । పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపు గలుగు తు**
**ర్య నిరంజనతత్త్వము పర । మనఘా! యది భావనీయ మను వేదంబుల్.** **332**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపంలేనివాడా!; విను= ఆలకించుము; సత్త్వరజస్+తమముల పెనఁకువకున్= సత్త్వం (తెల్లనిది) రజస్సు (ఎర్రనిది); తమముల= తమస్సు (నల్లనిది)ల మేళనమునకు; అవులన్= ఆవల - అవతల; వెలుఁగు+ఒందు= ప్రకాశించే; పెంపు+కలుగు= గొప్పదనం ఉన్న; తుర్య= నాలుగవ; నిరంజన తత్త్వము= పరబ్రహ్మతత్త్వం; పరము= ముఖ్యం; వేదంబుల్= వేదాలు; అది= ఆ పరబ్రహ్మతత్త్వం; భావనీయము+అనున్= భావించవలసినది - అంటాయి.

**తాత్పర్యం:** దేహిని కమ్ముకొని ఉన్న ఈ మూడు - సత్త్వరజస్తమోగుణాల కలయికకు అవతల వెలుగొందే నాల్గో తత్త్వం ఒకటిఉన్నది. అదియే పరబ్రహ్మతత్త్వం. ఆ పరబ్రహ్మతత్త్వాన్నే భావించవలసి ఉన్నదని వేదాలు పలుకుతున్నాయి.

**విశేషం:** పరబ్రహ్మతత్త్వమనేది దృష్టికి గోచరించేదికాదు. మనసా భావించి గ్రహించవలసినది. అందువలననే దానిని జ్ఞానానందమయ మని యోగులు గుర్తించారు.

**క.** **వాకును మనసును గాయము । నేకాయన వృత్తి శౌచ మెడలని తపముం**
**జేకొనునది యది బోధ । శ్రీకి ఘృతంబునకు వెన్నక్రియ జనక మగున్.** **333**

**ప్రతిపదార్థం:** వాకును= మాటా; మనసును= మనస్సూ; కాయమున్= దేహమూ; ఏక+అయన వృత్తిన్= ఒకే పోకడగల నడతతో; శౌచము+ఎడలని= శుభ్రత నశించని; తపమున్= తపస్సును; చేకొనునది= ఆచరించాలి; అది= ఆ తపస్సు; బోధశ్రీకిన్= జ్ఞాన సంపత్తికి; ఘృతంబునకున్= నేతికి; వెన్నక్రియన్= వెన్నవలె; జనకము= కారకం - కలిగించేది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** వాచా మనసా కర్మణా ఒకే ప్రవృత్తితో - మాటలో, ఆలోచనలో, క్రియలో ఏకత్వం పాటిస్తూ, ఆలోచించినదే చెప్తుతూ, చెప్పినదే చేస్తూ, పరిశుభ్రత కొరవడని తపస్సును ఆచరించాలి. ఆ ప్రవృత్తీ, ఆ తపస్సూ, జ్ఞానసంపత్తి ఏర్పడటానికి, నేయి కలగటానికి వెన్నవలె ఆధారమౌతాయి.

**విశేషం:** వెన్నకు రూపాంతరమే నేయి. త్రికరణ శుద్ధి (మనోవాక్కాయాలు - మూడు త్రికరణాలు) తోడి నిర్మల తపశ్చరణమే జ్ఞానానికి పూర్వరూపం.

**తే.** **బ్రహ్మచర్య మహింస నాఁ బరఁగు పరమ । ధర్మములు రెండు సువ్వె యుత్తమ తపంబు;**
**దానిఁ గలవాఁడు నిర్మల జ్ఞానయోగ । వంతుఁడై చూడనేర్చు సర్వంబు ననఘ!** **334**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా!; బ్రహ్మచర్యము= బ్రహ్మమందు - యోగమునందు - వేదాధ్యయనమందు చరించటం; అహింస= హింస చేయకుండటం; నాన్= అనగా; పరఁగు= చెలగెడు; పరమధర్మములు= గొప్పధర్మాలు; రెండు+చువ్వె= రెండు సుమా!; ఉత్తమ తపంబు= శ్రేష్ఠ తపస్సు; దానిన్= ఆ తపస్సును - బ్రహ్మచర్య వ్రతపాలన, హింసమాని జీవించటం - ఈ రెండింటిని; కలవాఁడు= కలిగినవాడు; నిర్మల జ్ఞాన యోగవంతుఁడు+ఐ= మలిన రహితమైన జ్ఞానమూ, యోగమూ కలవాడై; సర్వంబున్= అంతటిని - జగత్తు లోపలి బయటి వాటిని మొత్తమును; చూడన్+నేర్చున్= చూడగలుగుతాడు.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యం, అహింస అనేవి రెండూ గొప్ప ధర్మాలు. ఆ రెండింటిని ఆచరించటమే ఉత్తమ తపస్సు. ఆ తపస్సు చేసేవాడికి నిర్మలజ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞాననేత్రంతో అతడు ఈ లోకపు అంతర్బహి స్స్వరూపాలను సరిగా చక్కగా చూడగలడు.

**విశేషం:** సంస్కృతంలో 'బ్రహ్మన్' శబ్దానికి 'తత్త్వ తపోవేద యోగాదులు' అర్థంగా ఉన్నాయి. అయితే వ్యవహారంలో 'బ్రహ్మచారి' అనేమాట, సంసారానికి దూరంగా ఆధ్యాత్మవిద్య అభ్యసించేవారికి - వాచకంగా స్థిరపడింది. బ్రహ్మచారి ప్రవృత్తే బ్రహ్మచర్యం.

ఇక్కడి అర్థం కూడా వ్యవహారంలో ఉన్నదే. ప్రాచీనకాలాన అధ్యయనశీలురైన బాలురు గురుకులాలలో చేరి, చదువులు కొనసాగించేవారు. కాబట్టి బ్రహ్మచారి పదం, చదువుకొనే బాలుడు అనే అర్థానికీ వాచకమే. సబ్రహ్మచారి - తోడ చదువుకొనేవాడు.

**క. ఆతత సంసారము తృ। ష్ణాతంతు స్యూతిబంధనంబున దృఢమై**
**చేతస్సంగతిఁ బాయమి। కాతెఱఁగు తపంబు పుత్ర! యౌషధము సుమీ! 335**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; ఆతత సంసారము= విశాలమైన (ఈ) సంసారం; తృష్ణాతంతు స్యూతి బంధనంబునన్= ఆశ అనే దారపు కుట్టు ముడితో; దృఢము+ఐ= గట్టిదై; చేతస్+సంగతిన్= మనస్సు యొక్క పొత్తును; పాయమికిన్= వదలకుండటానికి; విడువక ఉండటానికి; ఔషధము= మందు; ఆ తెఱఁగు తపంబు= ఆ విధమైన తపస్సు; చుమీ!= సుమా!

**తాత్పర్యం:** కుమారా! కనిపించే ఈ సువిశాల సంసారం, ఆశాతంతువుల కుట్టుడు ముడులతో గట్టిపడి, మనస్సును విడిచిపెట్టదు. మానవుడిని వదలదు. అందువలన ఈ తపశ్చర్య అవసరమైనది. ఈ తపస్సు ఆ సంసారం నుండి మనస్సును మరల్చడానికి ఔషధంవలె ఉపయోగపడుతుంది.

**విశేషం:** తంతువులు ఒకదానితో ఒకటి పెనవేసుకొని గట్టిపడి బంధనంగా మారుతాయి. ఆశలు కూడా అంతే. ఒక ఆశకు మరొక ఆశ ఆలంబనం. ఈ ఆశాసంతతి పరస్పరం సమ్మిశ్రితమై సంసారాన్ని దృఢతరంగా మారుస్తాయి. (ఆశ= తంతువు.)

**క. వికసిత తృష్ణాలతికకు। న కుటిలమగు తపము దాత్రమై నఱకంగా**
**వికృతులఁ బ్రకృతినిఁ బురుషుని। నకలంక జ్ఞాన దృష్టి నవలోకించున్. 336**

**ప్రతిపదార్థం:** వికసిత తృష్ణాలతికకున్= వికసించిన ఆశ అనే తీగకు; అకుటిలము+అగు= వంకర లేనిది అగు; తపము= తపస్సు; దాత్రము+ఐ= కొడవలి అయి; నఱకంగాన్= నరకగా-ఖండించగా (అపుడు); వికృతులన్= వికారాలను; ప్రకృతినిన్= స్వభావాన్ని-స్వభావరూపమైన ప్రకృతిని; పురుషునిన్= ఆత్మస్వరూపుడైన పురుషుడిని; అకలంక జ్ఞాన దృష్టిన్= మరక లేని, జ్ఞానమనే చూపుతో; అవలోకించున్= చూస్తాడు.

**తాత్పర్యం:** లోకంలోని జీవనవ్యవహారాన తృష్ణ ఒక తీగ. అది బహుభంగుల ప్రవర్ధమానమై వికసించి, నరుడిని ఆకర్షిస్తుంది. తనలో ఇముడ్చుకొంటుంది. అతడిచుట్టూ జిగిబిగిగా అల్లుకొని, బంధించివేస్తుంది. ఆ అల్లికనుండి బయటపడాలంటే - బ్రహ్మచర్యం, అహింస అనే ధర్మాల ఆచరణ రూపమైన తపశ్చర్య అనే కొడవలి కావాలి. ఆ తపోరూపదాత్రంతో తృష్ణారూప లతికాబంధాన్ని తెగనరకవచ్చును. తృష్ణ తెగిపడిన వెంటనే నరుడిలో, నిర్మల జ్ఞానమనే క్రొత్త చూడ్కి ఏర్పడుతుంది. ఆ క్రొత్త చూపుతో అతడు తనలోని తనవెలుపలి వికృతులనూ, ప్రకృతినీ చూడగలడు. అంతేగాదు - తన అంతరాత్మరూపుడైన 'పురుషుడిని' కూడా అపుడే గుర్తించగలడు.

**విశేషం:** అలం: రూపకం.

**క. అని యమ్ముని పలుదెఱఁగులఁ। దను బోధించినఁ గృతార్థతం బొందెఁ దపో**
**ధనుఁ డా శిష్యుండు నీవును। గనికొను మేతద్వచో నికాయార్థంబుల్.' 337**

**ప్రతిపదార్థం:** అని= పై ప్రకారంగా; ఆ+ముని= ఆ ఋషి; పలు+తెఱఁగులన్= అనేక విధాలుగా; తనున్= తనను; బోధించినన్= ఉపదేశించగా - తెలియపరచగా; తపస్+ధనుఁడు= తపస్సే ధనంగా కలవాడు అయిన; ఆ శిష్యుఁడు= ఆ అతడి శిష్యుడు; కృత+అర్థతన్+పొందెన్= నెరవేరిన ప్రయోజనం కలవానితనమును చెందాడు - ప్రయోజనం నెరవేరినవాడైనాడు; నీవును= నీవు కూడా (ఓ ధర్మరాజా! నీవూ); ఏతద్+వచస్+నికాయ+అర్థంబుల్= ఈ మాటల ప్రోగుల అర్థాలను; కనికొనుము= గ్రహించుము.

**తాత్పర్యం:** ఆ విధంగా ఆ ముని నానావిధాలుగా తన శిష్యుడికి జ్ఞానబోధ చేయగా, తపోమాత్రధనుడైన ఆ శిష్యుడూ కృతార్థుడైనాడు. ఓ ధర్మరాజా! నీవు కూడా ఆ మునిమాటల అర్థతాత్పర్యాలను గ్రహించి, నీ జన్మను చరితార్థం చేసికొమ్ము'.

**తే. అనిన విని ప్రీతుఁడై పాండవాగ్రజన్ముఁ । డాపగాసూనుతో 'మిథిలాధినాథుఁ**
**డైన జనకుండు మోక్షంబు ననఘ! యేమి । కృత్యమునఁ గాంచె?' నది యెఱిఁగింపు మనుడు. 338**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; ప్రీతుఁడు+ఐ= ప్రీతి చెందినవాడై; పాండవ+అగ్రజన్ముఁడు= పాండవులలో మొదట పుట్టినవాడు - ధర్మరాజు; ఆపగాసూనుతోన్= నదీతనయునితో - భీష్ముడితో; అనఘ!= పాపంలేనివాడా!; మిథిలా+అధినాథుఁడు+ఐన= మిథిలానగరానికి అధిపతిఅయిన; జనకుండు= జనకమహారాజు; మోక్షంబున్= ముక్తిని; ఏమి కృత్యమునన్= ఏ కర్మవలన; కాంచెన్?= పొందాడు?; అది= ఆ విషయం; ఎఱిఁగింపుము= తెలుపుము; అనుడున్= అన్నవెంటనే.

**తాత్పర్యం:** పై ప్రకారంగా భీష్ముడు పలుకగా విని ఆనందించిన ధర్మజుడు తిరిగి భీష్మాచార్యుడితో 'ఓ పాపంలేని పితామహా! మిథిలానగరాధీశ్వరుడు జనకమహారాజు ఏ కర్మవలన ముక్తిని పొందగలిగాడు? ఆ విషయం ఎఱిగించుము' అన్నాడు. ఆ తరువాత.

**వ. అతం డతని కిట్లనియెఁ 'దత్సంబంధియైన యితిహాసంబు సెప్పెద. 339**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; తద్+సంబంధి+ఐన= దానికి చెందిన; ఇతిహాసంబు= చరితమును; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** ధర్మజుడి ప్రశ్నకు సమాధానంగా భీష్ముడు 'దానికి సంబంధించిన చరితాన్ని చెప్పుతాను' (అంటూ తన ప్రసంగాన్ని కొనసాగించాడు.)

**క. విను మాచార్యులు నూర్వురు । జనకనృపాలునకు; వారు సతతంబును న**
**జ్జనపతి వినిపింతురు త । త్త్వ నిరూపక శాస్త్రమును పృథగ్విధములుగన్. 340**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ఆచార్యులు= గురువులు; జనక నృపాలునకున్= జనక రాజునకు; నూర్వురు= వందమంది; వారు= ఆ నూరుగురు; సతతంబునున్= ఎల్లప్పుడునూ; ఆ+జనపతిన్= ఆ రాజుకు; తత్త్వ నిరూపక శాస్త్రమును= సత్యమును నిరూపించే శాస్త్రమును; పృథక్+విధములుగన్= వేరు వేరు తీరులుగా; వినిపింతురు= వినిపిస్తారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆలకించుము. ఆ జనకరాజుకు నూర్గురు ఆచార్యులున్నారు. వారు సత్యనిరూపక పరమాత్మస్వరూపమైన శాస్త్రాన్ని ఆయనకు వినిపించేవారు. అయితే వారు ఆ శాస్త్రార్థాలను వేరు వేరు విధాలుగా వివరించేవారు.

**విశేషం:** సత్య మొకటైనపుడు, దానిని గూర్చి కథనమూ ఒకటిగా ఉంటే సమస్యలుండవు. కాని మానవ స్వభావం విచిత్రం. ఒకే అంశాన్ని బహుభంగుల వివరించటం మొదటినుండి మానవ చరిత్రలో ఉన్నదే. అందువల్లనే "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" వంటి ఉపనిషద్వాక్యం పుట్టి ఉంటుంది.

**క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన । నా వసుధాధిపుఁడు దాని ననుమోదించున్**
**భావము సంతోషశ్రీ । భావిత మగుచుండఁ గురునృపాలప్రవరా! 341**

**ప్రతిపదార్థం:** కురున్నపాల ప్రవరా!= కురురాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; ఆ వసుధా+ఆధిపుఁడు= ఆ రాజు; ఏవాఁడు= ఎవడు; ఏ మెయిన్= ఏ విధంగా; చెప్పినన్= ఉపదేశించినా; దానిన్= ఆ ఉపదిష్టాంశాన్ని; భావము= మనస్సు; సంతోషశ్రీ భావితము+అగుచున్+ఉండన్= ఆనందసంపదతో ప్రభావితం కాగా; అనుమోదించున్= అనుగుణంగా ఆమోదిస్తాడు.

**తాత్పర్యం:** ఆ నూర్వురు ఆచార్యులలో ఎవరు దేనిని ఏ విధంగా ఉపదేశిస్తే, ఆ మహారాజు దానిని ఆ విధంగానే మనస్సు సంతోషంతో నిండిపోగా, అనుమోదిస్తూ ఉండేవాడు.

**విశేషం:** (ఉపదేష్ట అభిప్రాయాన్ని శిష్యుడు యథాతథంగా గౌరవించి ఆమోదిస్తూ ఉండేవాడన్నమాట.) బోధితుడికి (శిష్యునకు) బోధకుడితో అభిప్రాయభేదమనే భావనే ఉత్పన్నం కాని తీరున అక్కడ బోధన జరిగినది. ఈ జనకుడి జ్ఞానార్జన విధానం సమన్వయమార్గానికి సర్వధర్మసమానత్వ భావనకు మార్గదర్శకంగా భాసిస్తున్నది. బహుశః సమన్వయ విధానం ఆర్షధర్మాన కలదనే వాదంలోని సారాంశమదే కావచ్చును.

**వ. అట్టియెడఁ దత్త్వజ్ఞానఘనుండును నిర్ద్వంద్వుండును సంశయరహితుండును నగు పంచశిఖుండను మునివరుండు మహిం దిరుగుచుండి మిథిలకుం జనుదెంచె; నతండు కపిలాభిధాన యగు గురుకుటుంబిని చన్ను గుడిచి పెరిఁగిన వాఁ డగుటం గాపిలేయుండు ననంబరఁగు; నమ్మహాత్ముండు హేతుమద్వాక్య విశేషంబుల నయ్యాచార్యుల నూర్వుర నయ్యుర్వీపతి సన్నిధిన నిరుత్తరులంజేసిన, నాతం డతని విశేషజ్ఞత యెఱింగి వారల విడిచి తన్నుం బ్రబోధించుటకై ప్రార్థించి యతనికిం బ్రణతుఁ డైన నమ్మాననీయుం డనూన దయాయత్తచిత్తుండు గావున నా భూవల్లభునకు మోక్షోపాధి బోధప్రదంబులగు వాక్యంబు లిట్లని యుపదేశించె. 342**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయాన; తత్త్వజ్ఞాన ఘనుండును= సత్యజ్ఞానంవలన గొప్పవాడును; నిర్+ద్వంద్వుండును= రెండవవాడును లేనివాడును - ఒంటరి (జ్ఞానంలోను, జీవితంలోను); సంశయరహితుండును= సందేహం లేనివాడును; అగు= అయిన; పంచశిఖుండు+అను= పంచశిఖుడు అనే పేరుగల (ఐదు శిఖలు - జడలు గలవాడని వ్యుత్పత్తి. పేర్లకు వ్యుత్పత్తి ఉండబనిలేదు గాని తెలియవచ్చినంత తెల్పుట ఇది); మునివరుండు= ఋషిశ్రేష్ఠుడు; మహిన్= భూమిపై; తిరుగుచున్+ఉండి= తిరుగాడుతూ ఉండి; మిథిలకున్= మిథిలానగరానికి; చనుదెంచెన్= వచ్చాడు; అతండు= ఆ పంచశిఖుడు; కపిల+అభిధాన+అగు= కపిల అనే పేరుగల; గురుకుటుంబిని చన్ను= గురుపత్నియొక్క రొమ్ము; కుడిచి పెరిఁగినవాఁడు+అగుటన్= త్రాగి పెరిగినవాడు కావటంవలన; కాపిలేయుండును+అనన్= కపిలాతనయుడు అనగా (గూడ); పరఁగున్= ఒప్పును; ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మగలవాడు-పంచశిఖుడు; హేతుమత్+వాక్యవిశేషంబులన్= కారణాలతో కూడిన విశిష్టవాక్యాలతో; ఆ+ఆచార్యులన్= ఆ గురువులు; నూర్వురన్= వందమందినీ; ఆ+ఉర్వీపతి సత్+నిధిని+అ= ఆ రాజు దగ్గరనే; నిర్+ఉత్తరులన్= సమాధానం లేనివారినిగా; చేసినన్= చేయగా; ఆతండు= ఆ రాజు జనకుడు; అతని విశేషజ్ఞత= ఆ పంచశిఖుని విశిష్టజ్ఞానము (కలిగియున్నతనమును); ఎఱింగి= గ్రహించి; వారలన్= ఆ నూర్వురు ఆచార్యులను; విడిచి= వదలి; తన్నున్= తనను (రాజును) ప్రబోధించుటకై= ఉపదేశించటానికై; ప్రార్థించి= యాచించి; ఆతనికిన్= ఆ పంచశిఖుడికి; ప్ర+నతుండు+ఐనన్= నమస్కరించినవాడు కాగా; ఆ+మహనీయుండు= ఆ పూజ్యుడు; న+ఊనదయా+ఆయత్త చిత్తుండు= తక్కువగాని దయకు లొంగిన మనస్సు కలవాడు; కావునన్= కాబట్టి; ఆ భూవల్లభునకున్= ఆ రాజునకు; మోక్ష+ఉపాధి బోధ ప్రదంబులు+అగు= ముక్తికి కారణమైన జ్ఞానాన్ని ఇచ్చెడివి అయిన; వాక్యంబులు= మాటలు; ఇట్లు+అని= ఈ విధంగా; ఉపదేశించెన్= బోధించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా జనకరాజు నూర్వురు ఆచార్యులనుండి భిన్నభిన్న విధాలయిన ఆధ్యాత్మవిద్యాబోధనలు వింటూ, సంతోషిస్తూ, ఆ అందరి అభిప్రాయాలనూ గౌరవిస్తూవస్తున్న సమయాన పంచశిఖుడనే విప్రుడొకడు ఆయన

ఆస్థానాన ప్రవేశించాడు. అతడు సత్యజ్ఞానంతో గొప్పవాడు, ఒంటరి. సంశయాలు తీరినవాడు, భూమిపై సంచరిస్తూ యాదృచ్ఛికంగా మిథిలానగరప్రవేశం చేసి, రాజును చూచాడు. అతడిని కాపిలేయుడు అని కూడా అంటారు. ఎందుకంటే అతడు కపిల అనే గురుపత్ని చన్నుగుడిచి పెరిగినవాడు. ఆ మహాత్ముడు జనకుడి ఆస్థానాన, రాజు సన్నిధిలోనే తన హేతుపూర్వక వాక్యవిన్యాసాలతో జనకుడి నూర్వురు ఆచార్యులనూ వాదంలో జయించి వారిని నిరుత్తరులను చేశాడు. ఆ జనకుడు ఆ పంచశిఖుడి విశేషపరిజ్ఞానాన్ని గ్రహించి, తన గురుశతాన్ని విడిచి, అతడిని ఆశ్రయించి, తనకు తత్త్వోపదేశం చేయుమని అర్థిస్తూ ప్రణమిల్లాడు. ఆతడు కూడా గొప్పదయకు లొంగిన మనస్సుతో ఆ రాజునకు మోక్షానికి కారణమైన జ్ఞానాన్ని ఈయగల మాటలను ఈ విధంగా ఉపదేశించటం ప్రారంభించాడు.

### పంచశిఖుండను విప్రుండు జనకునకుఁ దత్త్వోపదేశంబు సేయుట (సం. 12-211-6,8)

**ఆ. విను మవిద్య గామమునకుఁ గామము గర్మ । మునకుఁ బుట్టఁబట్టు లనఘ! యింత**
**వట్టుఁ గారణముగ వచ్చుఁ బునర్జన్మ । మండ్రు తత్త్వవేదు లైన మునులు. 343**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా! జనకమహారాజా!; వినుము= ఆలకించుము; అవిద్య= మాయ (అజ్ఞానం); కామమునకున్= కోరికకు; కామము= కోరిక; కర్మమునకున్= క్రియకు - ప్రవృత్తికి - పనికి; పుట్టన్+పట్టులు= పుట్టుటకు స్థానాలు; ఇంతవట్టున్= ఇంతవరకు - ఈపై తెల్పినవి; కారణముగన్= హేతువుగా; పునర్+జన్మ= మరల పుట్టుట; వచ్చున్= కలుగుతుంది (అని); తత్త్వవేదులు+అయిన మునులు= సత్యము నెరిగినవారైన ఋషులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** పాపంలేని ఓ జనక మహారాజా! వినుము. మాయ కోరికకు కారణం, ఆ కోరిక కర్మకు కారణం, కర్మ పాపపుణ్యాలకు మూలం. ఆ పాపపుణ్యాల అనుభవంకొరకు ప్రాణికి పునర్జన్మ అవసరమౌతుంది. ఈ విషయం తత్త్వవేత్తలైన మునులు చెప్పుతారు.

**ఆ. ఒలసి లోభమోహములు దోషసంసేవ । నం బొనర్పఁగా ఘనత్వగాఢ**
**యగు నవిద్య భూమియై బహుకర్మ బీ । జముల కంకురాది శక్తు లొసఁగు. 344**

**ప్రతిపదార్థం:** అవిద్య= మాయ; ఒలసి= అతిశయించి; లోభమోహములు= పేరాస, అపజ్ఞానములు (ఒకదానిని మరొకటిగా గ్రహించటం); దోష సంసేవనంబు= తప్పుల యొక్క ఉపాసనం - గౌరవంతో పరిచర్యచేయటం; ఒనర్పఁగాన్= చేయగా; ఘనత్వగాఢ+అగున్= గట్టిదనంతో దిట్టయైనది అగును - గట్టిపడును; బహుకర్మబీజములకున్= అనేక కర్మలు అనే విత్తనములకు; భూమి+ఐ= ఆధారమై - క్షేత్రమై; అంకుర+ఆది శక్తులు= మొలకెత్తటం మున్నగు సామర్థ్యాలను; ఒసఁగున్= ఇచ్చును.

**తాత్పర్యం:** మాయ పేరాస, అపజ్ఞానం చేసే తప్పులు కారణంగా బలపడి దట్టంగా రూపుదాలుస్తుంది. ఆ తరువాత అదే అనేక కర్మలు అనే విత్తనాలకు పొలంగా మారి, ఆ కర్మబీజాలు మొలకెత్తటం, మారాకు తొడగటం పెరగటం పుష్టించటం, ఫలించటంవంటి వివిధశక్తులతో విస్తరించటానికీ కారణమౌతుంది. మాయకు లోభమోహాలు దోహదపడగా, అదే బహుకర్మలకు ఆధారం భూమిగా మారి, నరుడిని జననమరణ చక్రాన పడవేసి తిప్పుతుంటుంది- అని ఫలితార్థం.

**క. ప్రియములు నప్రియములును హ్వ । దయమును జిక్కువడఁ దివ్వఁ దత్తదనేక**
**క్రియలకుఁ జొచ్చు నరుఁడు మేన్ । వ్రయమగు టెఱుగఁడు వితత జరావ్యాధులచేన్. 345**

**ప్రతిపదార్థం:** నరుఁడు= మానవుడు; హృదయమును= మనస్సును; ప్రియములున్= ఇష్టమైన విషయాలు; అప్రియములును= అనిష్టమైన విషయములును; చిక్కు+పడన్+తివ్వన్= (కలిసి) చిక్కుపడేటట్లు లాగగా; తద్+తద్+అనేక క్రియలకున్= ఆయా పెక్కు కర్మలకు; చొచ్చున్= ప్రవేశించును - పాల్పడును; వితత జరావ్యాధులచేన్= విరివిఅయిన ముసలితనం, రోగాలతో; మేన్= దేహం; వ్రయము+అగుట= నశించుట; ఎఱుఁగఁడు= గ్రహించడు.

**తాత్పర్యం:** మనస్సు ఇష్టానిష్టాలతో చిక్కువడి అటూ ఇటూ లాగుతూ ఉండగా నరుడు ఆయా కర్మలు అనేకాలు చేయ మొదలుపెడతాడు. చేస్తూ జీవిస్తూ ఉంటాడే తప్ప అతడికి తన శరీరం జరావ్యాధులకు లోనై క్రుంగి నశించబోయే విషయం బోధపడదు.

**క. ధనములు బంధులు భోగము। లనియెడు నస్థిరము లెల్ల నాత్మ కెరవు సే**
**సిన శాంతి యలవడును మన। మున శాంతిశ్రీ సమృద్ధి మోక్షము నిచ్చున్.' 346**

**ప్రతిపదార్థం:** ధనములు= సంపదలు; బంధులు= చుట్టపక్కాలు; భోగములు= అనుభవాలు (క్రియల ఫలితాలు); అనియెడు+అస్థిరములు+ ఎల్లన్= అనే మూడు విధాలయిన అశాశ్వత విషయాలను అన్నింటిని; ఆత్మకున్= జీవుడికి; ఎరవు+చేసినన్= వేరు చేస్తే; మనమునన్= మనస్సునందు; శాంతి+అలవడును= శాంతి అలవాటు అవుతుంది - ఏర్పడుతుంది; శాంతిశ్రీ సమృద్ధి= శాంతి అనే సంపద యొక్క పెంపు; మోక్షమును+ఇచ్చున్= ముక్తిని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** నరుడు సంపదలు చుట్టపక్కాలు అనుభవాలు - అనే ఈ అశాశ్వత విషయాలు అన్నిటినీ జీవుడికి దూరంగా ఉంచగలిగితే అతడి మనస్సులో శాంతి ఏర్పడుతుంది. మిగిలిన సంపదలు సమృద్ధులు నశించగా ఏర్పడిన ఈ శాంతిసంపద పెరిగి, తుదకు అతడికి ముక్తిని చేకూర్చి పెట్టుతుంది.

**వ. అనిన విని జనకజనవల్లభుం డమ్మునివల్లభునితోడ. 347**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పంచశిఖముని పలుకగా; విని= ఆలకించి; జనక జనవల్లభుండు= జనకరాజు; ఆ+ముని వల్లభునితోడన్= ఆ మునిరాజుతో.

**తాత్పర్యం:** పంచశిఖప్రవచనాన్ని ఆలకించిన జనకరాజు ఆ మునిరాజుతో (ఇట్లా అన్నాడు).

**క. 'కేవల వైరాగ్యము మో। క్షావహ మగునేని యట్టులైన విరక్తిన్**
**భావమున నరుఁడు దాల్చెడిఁ। బో వాఁ డవ్యయ పదంబుఁ బొందునె? యనుడున్. 348**

**ప్రతిపదార్థం:** కేవల వైరాగ్యము= వైరాగ్య మొక్కటే; మోక్ష+ఆవహము+అగును+ఏని= ముక్తిని కలిగించేది అయినచో; అట్టులు+ఐనన్= అట్లా అయితే; నరుఁడు= మనుజుడు; భావమునన్= మనస్సునందు; విరక్తిన్= వైరాగ్యమును; తాల్చెడిన్+పో= ధరించును పో - ధరించుననుకొమ్ము; వాఁడు= ఆ విరాగి - ఆ విరక్తిని దాల్చినవాడు; అవ్యయపదంబున్= నశించని స్థానమును- ముక్తిని; పొందును+ఎ?= చెందునా?; అనుడున్= అన్న వెంటనే.

**తాత్పర్యం:** కేవలం వైరాగ్య మొక్కటే ముక్తిని కలిగించగలిగితే నరుడు తన మనస్సున ఆ వైరాగ్యాన్ని వహించాడు- అనుకొమ్ము. అపుడు అతడు ముక్తిని పొందుతాడా? అని ప్రశ్నించిన వెంటనే.

**వ. అవ్విప్రవరుం డతని కిట్లనియె. 349**

**ప్రతిపదార్థం:** ఆ+విప్రవరుండు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు - ఆ పంచశిఖముని; అతనికిన్= ఆ జనక రాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** రాజు ప్రశ్నకు విప్రుడు ఇట్లా సమాధానం చెప్పాడు.

**క. విను నృప! హర్షంబు ప్రియం । బనూన సుఖయుక్తి నిర్భరానందము శాం**
**తినిరూఢి యనఁగ మనమునఁ । బనిగొనునవి సాత్త్వికాఖ్య భావంబు లగున్. 350**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ రాజా!; విను= ఆలకించుము; హర్షంబు= సంతోషం; ప్రియంబు= ప్రీతి; న+ఊన సుఖయుక్తి= తక్కువగాని-గొప్పదైన సుఖముయొక్క కలయిక; నిర్భర+ఆనందము= నిండైన ఆనందము; శాంతినిరూఢి= శాంతియొక్క గట్టితనం; అనఁగన్= అనగా; మనమునన్= మనస్సునందు; పని+కొనునవి= నియోగించేవి - సంచరించెడివి; సాత్త్విక+ఆఖ్య భావంబులు+అగున్= సాత్త్వికాలు - అనే పేరుగల భావాలు అవుతాయి.

**తాత్పర్యం:** ఓ రాజా! వినుము, సంతోషం, ప్రీతి, గొప్పసుఖంతోడి ఆనందం, నిశ్చలశాంతీ మనస్సును ఏలేవి సాత్త్వికాలు అనే ఈ భావాలు. సత్త్వగుణంవలన కలిగే భావ పరంపర ఇది.

**క. పరితాప మనభితోషము । నరేశ్వరా! శోచనము జనవ్యాపారా**
**దర మక్షమ యనియెడు నివి । యరయంగా రాజసంబు లగు భావంబుల్. 351**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వరా!= ఓ రాజా!; పరితాపము= సంతాపం-దుఃఖం; న+అభితోషము= సంతోషంలేమి; శోచనము= ఏడ్చుట; జనవ్యాపార+ఆదరము= జనుల కర్మలయందు ప్రేమ-అభిమానము; అక్షమ= ఓర్వలేని తనం-అసూయ; అనియెడు+ఇవి= అనే ఇవి-ఈ భావాలు (మనో వికారాలు); అరయంగాన్= పరిశీలించగా; రాజసంబులు+అగు= రజోగుణసంబంధులు అగు; భావంబుల్= మనోభావాలు.

**తాత్పర్యం:** సంతాపం చెందటం, అవకాశమున్నా సంతోషించకుండా ఉండటం, ఏడుపు, జనుల క్రియలలో అభిమానం ప్రదర్శించటం, ఓర్వలేనితనం - ఈ భావాలు రజోగుణంవలన కలిగేవి.

**క. తలఁపులు గ్రందుగఁ బొడముట । గల గను టేమఱుట భ్రమము గదురుట జాడ్యం**
**బలసత యను నీ భావం । బులు దామసకోటి యండ్రు బుధులు నరేంద్రా! 352**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ఓ రాజా! జనకా!; తలఁపులు= ఆలోచనలు; క్రందుగన్= (అతిశయంగా) ఉపద్రవంగా; పొడముట= కల్గటం; కల+కనుట= కలగాంచటం; ఏమఱుట= ప్రమాదపడటం - పొరబడటం; భ్రమము= భ్రాంతి - ఒకదానిని మరొకటిగా తలచుట; కదురుట= విజృంభించటం; జాడ్యంబు= జడత్వం - చురుకులేనితనం; అలసత= ఆలస్యం - సోమరితనం; అను+ఈ భావంబులు= అనే ఈ భావాల వరుస; బుధులు= పండితులు; తామసకోటి= తమోగుణ సంబంధిఅయిన (భావ) సమూహం; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఓ జనక రాజా! ఇపుడు తామసభావాలు వివరిస్తున్నాను. ఉపద్రవరూప ఆలోచనలు కలుగుతూ ఉండటం, కలలు రావటం, ఏమరుపాటు ఒకదానిని మరొకటిగా గ్రహిస్తూ వ్యవహరించటం, చురుకుదనం లేకుండా మందగించి ఉండటం, సోమరితనం - అనే ఈ మనోవికారాలన్నీ తమోగుణజన్యాలు - అని పండితులు పలుకుతారు.

**క. కారణము గలిగియును ని । ష్కారణ కలితంబులయ్యు జనియించు ధరి**
**త్రీరమణ! మూఁడు దెఱఁగులు । నారయ నివి యస్థిరంబులై తిరుగఁబడున్. 353**

**ప్రతిపదార్థం:** ధరిత్రీరమణ!= రాజా!; మూఁడు తెఱఁగులు= మూడు విధాలు - సత్త్వ రజస్తమోజనిత భావాలు మూడు; కారణము+కలిగియును= కారణం ఉండీ; నిః+కారణ కలితంబులు+అయ్యున్= కారణం లేకా (కారణములేమితో కూడినవై

కూడా); జనియించున్= కలుగుతాయి; ఆరయన్= పరిశీలించగా; ఇవి= ఈ మూడు విధాలయిన భావాలు; అస్థిరంబులు+ఐ= స్థిరం కానివై - చంచలములై; తిరుఁగన్+పడున్= తిరగబడతాయి - తారుమారౌతాయి.

**తాత్పర్యం:** ఓ రాజా! ఈ సత్త్వరజస్తమోగుణ జన్యాలయిన మూడు విధాల భావాలూ ఒకసారి కారణం ఉండి కలగవచ్చును. ఒక్కొక్కసారి నిష్కారణంగానే పొటమరించవచ్చును. ఈ భావపరంపర స్థిరంగా నిలువదు. చంచలంగా మారుతుంటుంది. ఒక్కొక్కసారి ఈ మనోవికారాలు తిరగబడతాయి కూడా.

**చ. జనవర! సౌఖ్యముం బొరసి సాత్త్వికభావ సముద్గమంబు సు**
**మ్మనియును దుఃఖముల్ గదిరినప్పుడు రాజసభావభంగి సు**
**మ్మనియు జడత్వసంగసమయంబునఁ దామసభావవృత్తి సు**
**మ్మనియును ద్రోచి వానఁ బడ కాత్మరతిన్ నిలు పిచ్చు మోక్షమున్. 354**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; సౌఖ్యమున్+పొరసి= సుఖాన్ని పొంది; సాత్త్వికభావ సమ్+ఉత్+గమంబు= సత్త్వగుణ సంబంధి భావాల మంచి పుట్టుక; సుమ్ము+అనియును= సుమా అనీ; దుఃఖముల్+కదిరిన+అప్పుడు= దుఃఖాలు - దుఃఖమయమైన భావాలు పైకొన్నపుడు; రాజసభావ భంగి= రజోగుణసంబంధి భావాలతీరు; సుమ్ము+అనియును= సుమా అనీ; జడత్వ సంగసమయంబునన్= జాడ్యంతోడి కలయిక కలిగినపుడు; తామసభావవృత్తి= తమోగుణ సంబంధి భావాల ప్రవృత్తి; సుమ్ము+అనియున్= సుమా అనీ; త్రోచి= ప్రక్కకు నెట్టి - ఆ భావాల జోరులో పడి కొట్టుకొనిపోకుండా - వాటిని నెట్టివేసి; వానన్= ఆ భావాలలో; పడక= పడిపోకుండా; ఆత్మరతిన్ నిలుపు= తనయందు (తాను) సంతోషించటం - బహిఃకారణాలతో పనిలేకుండా - తనలో తాను సంతసించుటయందు నిల్పుట; మోక్షమున్= ముక్తిని; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! నరుడు తాను సౌఖ్యాన్ని చవిచూస్తున్నప్పుడు అది సత్త్వగుణ సంజనితమైన భావాలవలన కలిగినట్లూ, దుఃఖాన్ని అనుభవిస్తున్నప్పుడు అది రజోగుణం కారణంగా ఏర్పడినట్లూ, జడత్వంతో స్తబ్ధంగా సోమరితనం పైబడినప్పుడు అది తమోగుణ ఫలితమయినట్లూ గ్రహించి, ఆయా భావాలనూ, వాటి ఫలితా లయిన సుఖదుఃఖ జడత్వాలనూ విడిచిపుచ్చి, తనలో తాను ఆనందించే స్థైర్యాన్ని అందుకొనగలగాలి. అపుడే ముక్తి లభిస్తుంది. ఆ ఆత్మరతి స్థైర్యమే ముక్తిని ఈయగలదు.

**వ. ఇవ్వెరవునకు వైరాగ్యంబు మూలం బని చెప్పి వెండియు. 355**

**ప్రతిపదార్థం:** ఈ+వెరవునకున్= ఈ పద్ధతికి; వైరాగ్యంబు= విరక్తి; మూలంబు+అని= కారణం అని; వెండియున్= మరియును.

**తాత్పర్యం:** ఈ ఆత్మరతి స్థైర్యసిద్ధికి కారణం విరక్తి ఒక్కటే - అని పలికి, ఇంకనూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. వినుము సత్త్వాదిగుణముల ననఘ! యాత్మ । తత్త్వమున లీనములఁ జేయఁ దన్మయత్వ**
**దర్శనము దాన నవి మహోదధి నడంగు । నేఱు లట్టుల రూపఱు వేఱులేక. 356**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా! జనకరాజా!; వినుము= ఆలకించుము; సత్త్వ+ఆదిగుణములన్= సత్త్వం మొదలైన గుణములను - రజస్తమోగుణాలను కూడా; ఆత్మతత్త్వమునన్= ఆత్మయొక్క జీవుడి యొక్క తత్త్వమునందు - స్వభావమునందు - సహజసత్త్వస్థితియందు; లీనములన్+చేయన్= లయించిన - కలిసిపోయిన వానినిగా చేయగా; తద్+మయత్వ దర్శనము= దానిలో - ఆ ఆత్మలో భాగమైపోయిన స్థితి అగుపడుట (జరుగును); దానన్= ఆ ఆత్మయందు; అవి= ఆ సత్త్వ గుణాలు; మహా+ఉదధిన్= పెద్ద సముద్రాన; అడంగు= లయమైపోయే; ఏఱులు+అట్టులు+అ= కాల్వలవలెనే; వేఱులేక= విడిగా ఉండక; రూపు+అఱున్= రూపు నశించును - ఆకారం లేకుండా ఆ ఆత్మలో అంతర్భవిస్తాయి.

**తాత్పర్యం:** ఓ పాప మెరుగని పాలకుడా! జనకమహారాజా! వినుము. సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు మూడింటినీ ఆత్మతత్త్వంలో - జీవుడి నిజస్వభావాన లీనం చేయాలి. అపుడు అవి ఆత్మలో కలిసిపోయి, విడిగా ఉండక - సముద్రాన కలిసిపోయే ఏరులవలె నిరాకారంగా సొంతమైన ఉనికిలేకుండా అయిపోతాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **నరుఁడు సుఖదుఃఖములవెంటఁ బొరయ నీక। మలఁచి యాత్మునిఁ జేర్చిన మానసంబు**
**లీనమగు నంద జలములలోన నిడిన। లవణకణము చందమ్మున నవనినాథ! 357**

**ప్రతిపదార్థం:** అవనినాథ!= ఓ రాజా!; నరుఁడు= మానవుడు (కర్త); మానసంబు= మనస్సు (కర్మ); సుఖదుఃఖములవెంటన్= సంతోషం సంతాపములవెంట; పొరయన్+ఈక= వెడలనీయకుండా - వాటితో పాటుగా పడిపోకుండా; మలచి= త్రిప్పి - అంతర్ముఖంచేసి; ఆత్మునిన్= జీవాత్ముడిని; చేర్చినన్= పొందించినట్లయితే - కలిపినట్లయితే; అందున్+అ= దానియందే - ఆ ఆత్మయందే; జలములలోనన్ - నీళ్ళలో; ఇడిన= వేసిన - ఉంచిన; లవణకణము చందమ్మునన్= ఉప్పుగల్లు విధాన; లీనము+అగున్= లీనమై - కలిసినదై పోవును.

**తాత్పర్యం:** ఓ రాజా! నరుడు తన మనస్సును లౌకికా లయిన సుఖదుఃఖాల వెంటబడిపోకుండా అంతర్ముఖంగా త్రిప్పివేసి, ఆత్మలో చేర్చగలగాలి. ఆ విధంగా ఆత్మలో చేర్చబడ్డ మనస్సు ఆ ఆత్మలోనే నీళ్ళను చేర్చిన ఉప్పుగల్లువలె కలిసిపోయి తన ఆకారాన్ని కోల్పోతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **తోలు దిగవిడిచి నాగము। లీలఁ బొలుచు మాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ**
**గీలుకొననీక వెలుఁగు ని। రాలంబన బోధఘనుఁడు రాజవరేణ్యా! 358**

**ప్రతిపదార్థం:** రాజవరేణ్యా!= ఓ రాజశ్రేష్ఠా!; నాగము= పాము; తోలు= చర్మం (కుబుసం); దిగవిడిచి= తీసివేసికొని; లీలన్+పొలుచు మాడ్కిన్= విలాసంతో ఒప్పినవిధాన; నిర్+ఆలంబన బోధఘనుఁడు= ఆధారంలేని (స్వతః ప్రకాశమానమైన) జ్ఞానంతో గొప్పవాడైనవాడు (నరుడు) కర్మలేపమున్= కర్మం అనే పూతను (ఒంటికి రాసుకొనే ద్రవం); తనతోన్= తనతో; కీలుకొనన్+ఈక= ముడిపడనీయకుండా - అంటుకొనకుండా; వెలుంగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** ఓ రాజశ్రేష్ఠా! కుబుసం విడిచిన పాము విలాసంగా ప్రకాశిస్తుంది. ఆ విధంగానే, కర్మసంపర్కం వదలిన ఆత్మ, నిరాధారమై స్వతఃప్రకాశవంతమైన జ్ఞానంతో ప్రజ్వలిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **అని బోధించె; నిట్లు పంచశిఖునిచేత బోధితుండై కాదె! జనకుండు దన పురంబైన మిథిల గాలునప్పుడు దుఃఖంబులం బొరయమింజేసి తన కేమియుం గాలదని పలికెం గౌంతేయాగ్రజా! యాకర్ణింపుము.359**

**ప్రతిపదార్థం:** అని= పై ప్రకారంగా; బోధించెన్= ఉపదేశించెను; ఇట్లు+ ఈ విధంగా; పంచశిఖునిచేతన్= పంచశిఖుడనే ఋషిశ్రేష్ఠుడిచేత; బోధితుండు+ఐ= ఉపదిష్టుడై - ఉపదేశించబడినవాడై; కాదె= కదా!; జనకుండు= జనక మహారాజు; తన పురంబు+ఐన= తన పట్టణమైన; మిథిల= మిథిలా నగరం; కాలునప్పుడు= కాలిపోయే సమయాన; దుఃఖంబులన్= పరితాపాలను- ఖేదములను; పొరయమిన్+చేసి= పొందకపోవటంవలన; తనకున్+ఏమియున్+కాలదు= (నిర్లిప్తుడైన) తనను ఏమీ దహించదు;

అని పలికెన్= అని అన్నాడు; కౌంతేయ+అగ్రజా!= కుంతీనందనులలో మొదట పుట్టినవాడా! ధర్మరాజా!; ఆకర్ణింపుము= వినుము, (ఈ చివరిమాట అనంతర వాక్యంతో అన్వయిస్తుంది.)

**తాత్పర్యం:** పై ప్రకారం పంచశిఖమహర్షి జనకమహారాజునకు ఉపదేశించాడు. ఆ పంచశిఖుడి బోధ జనకుడిపై తన ప్రభావం నెరపి, అతడిని నిజంగానే విరక్తుడిని చేసింది. అందువలననే జనకుడు తన నగరం మిథిల కాలిపోతూ ఉంటే, తాను దుఃఖానికి దూరంగా నిలిచి తన కేమీ కాల్పు అంటదని పలికాడు.

**క. అమలం బగు నీ యితిహా । సము భక్తిఁ బఠించినం బ్రశాంతి యొలసి దుః**
**ఖములం దొఱఁగి మనుష్యం । డమృతత్వావాప్తి మహితుండై వెలుఁగొందున్.' 360**

**ప్రతిపదార్థం:** మనుష్యుండు= నరుడు; అమలంబు+అగు= మలినంలేనిదైన; ఈ ఇతిహాసము= ఈ వృత్తాంతం; భక్తిన్= భక్తితో; పఠించినన్= చదివితే; ప్రశాంతి= మిక్కిలి శాంతి; ఒలసి= కలిగి; దుఃఖములన్+తొఱఁగి= ఖేదాలను వదలి; అమృతత్వ+అవాప్తి మహితుఁడు+ఐ= మృత్యువులేనితనం లభించటంతో పూజ్యుడై; వెలుఁగు+ఒందున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** నిర్మలమైన ఈ వృత్తాంతాన్ని భక్తితో పఠిస్తే, నరుడికి మనశ్శాంతి ప్రాప్తిస్తుంది. దుఃఖాలు తొలగిపోతాయి. తుదకు మరణంలేని ముక్తిని కూడా పొంది పూజ్యుడై అతడు లోకాన వెలుగొందుతాడు'.

**వ. అనిన విని ధర్మతనయుండు దేవవ్రతుతో 'నెట్టివాఁడు సుఖియును మంగళవంతుండును నిర్భయుండునునై వర్తించు?' నని యడిగిన నప్పుడమిఱేని కప్పురుషవరుం డిట్లను 'దమసంపన్నునకు నీ చెప్పిన చందంబుగలుగు నాకర్ణింపుము. 361**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; ధర్మతనయుండు= ధర్మరాజు; దేవవ్రతుతోన్= భీష్ముడితో; ఎట్టివాఁడు= ఏ విధమైన నరుడు; సుఖియును= సుఖంకలవాడూ; మంగళవంతుండును= శుభంకలవాడూ; నిర్+భయుండును= భయంలేనివాడూ; ఐ వర్తించున్= అయి ప్రవర్తిస్తాడు - జీవిస్తాడు; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ఆ+పుడమిఱేనికిన్= ఆ రాజునకు; ఆ+ పురుషవరుండు= ఆ నరశ్రేష్ఠుడు - భీష్ముడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; దమసంపన్నునకున్= ఇంద్రియనిగ్రహం కలవాడికి; నీ చెప్పిన చందంబు= నీవు పలికిన విధం - సుఖం శుభం కలిగి నిర్భయంగా జీవించగల లక్షణం; కలుగున్= ఉంటుంది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** పితామహుడి పలుకులు విన్న ధర్మరాజు మరొక ప్రశ్న అడిగాడు. 'ఎట్టివాడు సుఖంతోనూ, శుభంతోనూ కూడి నిర్భయుడై జీవించగలడు?' అని. ఆ ప్రశ్నకు భీష్ముడు ధర్మజుడితో, 'దాంతి - ఇంద్రియ నిగ్రహం కలవాడు నీ ప్రశ్నకు సమాధానంగా నిలుస్తాడు. విను మంటూ తన ప్రవచనాన్ని కొనసాగించాడు.

**తే. సర్వవర్ణాశ్రమములకు శమము దమముఁ । గలిగియునికి విశిష్ట ప్రకార మగుట**
**బ్రాహ్మణునకు విశేషించి రాజవర్య! । దమసమాహిత వృత్తి పెద్దయును వలయు. 362**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= ఓ రాజశ్రేష్ఠా!; సర్వ వర్ణ+ఆశ్రమములకున్= ఎల్ల వర్ణములకు - బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు; ఎల్ల ఆశ్రమములకు - బ్రహ్మచర్య, గృహస్థ వానప్రస్థ సన్న్యాస ఆశ్రమవాసులకు; శమము= శాంతి; దమము= నిగ్రహం; కలిగి+ ఉనికి= కలిగి ఉండటం; విశిష్ట ప్రకారము+అగుటన్= విశేషంతో కూడిన పద్ధతి కాబట్టి; విశేషించి= అధికంగా; బ్రాహ్మణునకున్= బ్రాహ్మణవర్ణజునకు; దమసమాహిత వృత్తి= దమంతో - నిగ్రహంతో సమాధానసహితమైన నడత; పెద్దయును= ఎక్కువగా; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** లోకంలో అన్ని వర్ణాలవారికీ, అన్ని ఆశ్రమాలవారికీ శాంతి, దాంతి కలిగి ఉండటం విశిష్ట పద్ధతి. విశేషించి బ్రాహ్మణులకు దాంతితోడి జీవనవిధానం ఎక్కువగా కావలసి ఉంటుంది.

**వ. దమంబు సద్గుణంబులరాశి; యవి యెయ్యవి? యంటేని. 363**

**ప్రతిపదార్థం:** దమంబు= నిగ్రహంబు; సత్+గుణంబుల రాశి= మంచి గుణాల ప్రోవు; అవి= ఆ సద్గుణాలు; ఏ+అవి?= ఏవి? అంటి(వి)+ఏని= అంటివేని - అంటే.

**తాత్పర్యం:** దమ మొక్కటి సద్గుణాల ప్రోవు. ఆ సద్గుణాలు ఏమిటి? - అంటావా? (వినుము.)

**సీ. శౌచ, మక్రోధంబు, సంతోష, మార్జవ, । మనసూయ, విగతదైన్యత్వవృత్తి,**
**యప్రమాదంబు, దురభిమానరాహిత్య, । మతివాదవర్జన, మఖిలభూత**
**దయ, గురుపూజ, నిందాస్తుతి ప్రవణతా । త్యాగం, బపైశునత్వంబు, సాధు**
**జనసంగమం, బమృషాభాషణంబు, ని । స్పృహత, యహింస, సుశీలభావ,**

**తే. మింద్రియగ్రామజయ మివి యెల్ల దమము । నాకృతులు; వీనిఁ గల పుణ్యుఁ డభయుఁ డైహి**
**కములవలనను నాముష్మికముల వలన । శాంతిమంగళ నిధి బోధ సౌమ్యమూర్తి.' 364**

**ప్రతిపదార్థం:** శౌచము= శుచిత్వం - పరిశుభ్రత; అక్రోధము= కోపం లేకుండటం; సంతోషము= ఆనందం; ఆర్జవము= ఋజుభావం - కపటంలేమి; న+అసూయ) అనసూయ= అసూయ - ఈర్ష్యలేకుండటం; విగత దైన్యత్వ వృత్తి= పోయిన దీనత్వంతోడి జీవనం- దైన్యంలేని బ్రదుకు; అప్రమాదంబు= పరాకు లేకుండటం; దుర్+అభిమాన రాహిత్యము= చెడు అభిమానం లేకుండటం; అతివాద వర్జనము= ఎక్కువ మాట్లాడటం మానటం; అఖిలభూతదయ= ఎల్లప్రాణులయెడ దయ; గురుపూజ= పెద్దలయెడ గౌరవం; నిందాస్తుతి ప్రవణతా త్యాగంబు= నిందయందుగాని, స్తోత్రమునందుగాని ఆసక్తుడై ఉండటాన్ని వదలటం - ఎక్కువగా తెగడటం పొగడటం రెండూ మానటం; అపైశునత్వంబు= కొండెములు చెప్పే గుణం లేకుండటం; సాధుజన సంగమంబు= సజ్జనుల తోడి కలయిక; అమృషాభాషణంబు= అబద్ధములాడకుండటం; నిస్పృహత= ఆశ లేకుండటం; అహింస= హింస లేకుండటం; సుశీల భావము= మంచి సహజ స్వభావం; ఇంద్రియ గ్రామజయము= ఇంద్రియాల సమూహమును జయించటం; ఇవి+ఎల్లన్= ఇవి అన్నీ; దమము+ఆకృతులు= దమముయొక్క ఆకారాలు - స్వరూపాలు; వీనిన్= ఈ సద్గుణాలను; కల పుణ్యుఁడు= కలిగిన ధన్యజీవి; ఐహికముల వలనను= ఇహలోకానికి చెందిన విషయాల నుండిగాని; ఆముష్మికముల వలనను= పరలోకానికి చెందిన విషయాలనుండి గాని; అభయుఁడు= భయంలేనివాడు; శాంతి మంగళ నిధి= శాంతికీ, శుభానికీ స్థానమైనవాడు; బోధసౌమ్యమూర్తి= జ్ఞానంవలన ప్రశాంతమైన ఆకారం కలవాడు.

**తాత్పర్యం:** దమము అనే ఒక్క లక్షణంలో ఎన్నో సద్గుణాలు ఇమిడిపోతాయి. ఆ సద్గుణాలు ఇవి: పరిశుభ్రత-బయటి లోపలి మలినాలు తొలగించుకొనటం, కోపంలేకుండా, కపటమూ అసూయా లేకుండా దైన్యానికి దూరంగా జీవించటం, పరాకుపడటం దురభిమానం అధికప్రసంగం - వీటిని త్యజించటం, ఎల్ల ప్రాణులయెడ దయ, పెద్దలయెడ గౌరవం కలిగి ఉండటం, నిందించటం స్తుతించటంలలో నిమగ్నుడు కాకపోవటం, కొండెములు చెప్పకుండా ఉండటం, సజ్జనసాంగత్యం చేయటం, అబద్ధాలు ఆడకుండటం, ఆశలకు లోనుగాక, హింసకు పాల్పడక, మంచి శీలం కలిగి ఉండటం, ఇంద్రియాలను జయించటం - ఇవన్నీ వాస్తవానికి దమముయొక్క రూపాంతరాలే. ఈ లక్షణాలు గల ధన్యజీవికి ఇహలోక విషయాలవలనగాని, పరలోక విషయాల వలనగాని ఎట్టి భయమూ ఉండదు, ఏర్పడదు. అతడు శాంతికీ శుభానికీ నిలయమైనవాడు. జ్ఞానంవలన సౌమ్యమైన ఆకారంతో వెలుగొందేవాడు'.

**విశేషం:** దమధాతుజన్యమైన కృదన్త రూపమిది. ఆ ధాతువునకు అణచుట అని అర్థం. ఇంద్రియాలను అణచుట దమమౌతుంది. ఇంద్రియ విజయమొకటి సిద్ధిస్తే సకల సద్గుణాలూ లభించినట్లే.

**వ. అనినం బితామహునితోఁ బాండవేయాగ్రజుండు 'వ్రతస్థు లొక్కొక్కయెడ భోజనంబులు సేయుదురు. వారలకు వ్రతహానిలేకుండునే?' యని యడిగిన నతనితో నతండు. 365**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; పితామహునితోన్= తాతతో; పాండవేయ+అగ్రజుండు= పాండుతనయులలో పెద్దవాడు-ధర్మరాజు; వ్రతస్థులు= వ్రతంలో ఉన్నవారు; ఒక్క+ఒక్క+ఎడన్= ఒక్కొక్కచోట, ఒక్కొక్క సమయాన; భోజనంబులు+చేయుదురు= భుజించుటలు చేస్తారు; వారలకున్= ఆ విధంగా వ్రతంలో ఉండీ భోజనాలు చేసేవారలకు; వ్రతహాని= వ్రత భంగం; లేక+ఉండును+ఏ?= లేకుండా ఉంటుందా?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతనితోన్= ఆ ధర్మజుడితో; అతండు= ఆ భీష్ముడు (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ధర్మరాజు 'దమవంతుడు సకల సద్గుణరాశి' అని భీష్ముడినుండి విన్న పిదప, పితామహుడిని 'వ్రత నిర్వహణంలో ఉండి కూడా కొందరు అపుడపుడు అక్కడక్కడ భోజనాలు చేస్తూ ఉంటారు. వారికి వ్రతభంగం వాటిల్లదా?' అని ప్రశ్నించగా, దానికి సమాధానంగా భీష్ముడు ఇట్లా అన్నాడు.

**తే. 'వినుము విప్రకామార్థ భోజనములోను । గాఁగఁ గలుగు వేదోక్త ప్రకార భోజ**
**నములు వ్రతహాని సేయవు నరవరేణ్య!' । యని నిరూపించి పలికి యిట్లనియె మఱియు. 366**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= ఓ రాజా!; వినుము= ఆలకించుము; విప్రకామ+అర్థభోజనము= బ్రాహ్మణుడి కోరికయే ప్రయోజనంగా గల భోజనం - గృహస్థుడి కోర్కెతీర్చడానికై చేసే భోజనం; లోనుగాఁగన్= లోనైన - మొదలయిన; కలుగువేద+ఉక్త ప్రకార భోజనములు= ఉన్న, వేదంలో చెప్పబడ్డ విధానంగల భోజనాలు - వేదానుమతమైన భోజనాలూ; వ్రతహాని+చేయవు= వ్రతభంగం చేయవు - కలిగించవు; అని= అంటూ; నిరూపించి= నిరూపణ చూపి; పలికి= చెప్పి; మఱియున్= ఇంకనూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'విప్రుల కోరికమేర చేసే భోజనాలూ, ఇంకా ఇటువంటివే అయిన వేదోక్తాలయిన భోజనాలూ వ్రతస్థులు చేసినా, వాటివలన వ్రతహాని జరుగదు' అని గట్టిగా ప్రకటించి, భీష్ముడు ఇంకా ఈ విధంగా ప్రవచించాడు.

**వ. 'సదోపవాసియు, సదాబ్రహ్మచారియు, నమాంసభోజియు, విఘసాశనుండును, నమృతాశియు, నస్వప్నుండునుం గావలయుఁ దత్స్వరూపంబు లెట్టి వంటేని. 367**

**ప్రతిపదార్థం:** సదా+ఉపవాసియున్= ఎల్లప్పుడూ ఉపవసించేవాడూ; సదాబ్రహ్మచారియున్= ఎల్లప్పుడూ బ్రహ్మచర్య వ్రతం పాటించేవాడూ; అమాంస భోజియున్= మాంసం భుజించనివాడూ; విఘస+అశనుండును= దేవతల అతిథుల భుక్తశేషాన్ని తినేవాడూ; అమృత+ఆశియును= అమృతమును తినేవాడూ; అస్వప్నుఁడునున్= నిదురలేనివాడునూ; కావలయున్= కావాలి (నరుడు-సాధకుడు); తద్+స్వరూపంబులు+ఎట్టివి?= వారి ఆకారాలు ఏవిధమైనవి; అంటి(వి)+ఏనిన్= అంటివేని - అన్నచో.

**తాత్పర్యం:** మోక్షార్థియైన సాధకుడు, సదా ఉపవాసిగా బ్రహ్మచారిగా ఉండాలి. మాంసాన్ని భుజించనివాడుగా, దేవతల అతిథుల భుక్తశేషాన్ని భుజించేవాడుగా, అమృతాన్ని భుజించేవాడుగా కూడా ఉండాలి. నిదురపోనివాడుగా కూడా ఉండాలి. వీరి స్వరూపాలు ఏ విధంగా ఉంటాయి? అని అడుగబోతున్నావా? (వినుము).

**సీ. 'ఇరు ప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడవక । యుండునాతండు సదోపవాసి;**
**ఋతుకాలమున నాత్మసతియంద రతిసల్పు । భవ్యశీలుఁడు సదా బ్రహ్మచారి;**
**దేవ పిత్రతిథి పూజావిధులం బిడి । మఱి నంజు పురుషుఁ డమాంస భోజి;**
**దనయట్లు పంక్తివారును భుజింప భుజించు । నంచితాత్ముఁడు విఘసాశనుండు;**

**తే.** **భృత్య వర్గంబు గుడిచిన పిదపఁ గుడుచు । నాతఁ డమృతాశి; దివసంబునందు నిదుర**
**వోని పుణ్యుఁడస్వప్నుఁ; డిప్పాలములగు మ । హాధిక వ్రతములు దేహ బాధకములు.' 368**

**ప్రతిపదార్థం:** ఇరుప్రొద్దు= రెండు పూటల; కుడుచుచున్= తింటూ; ఎడన్+ఎడన్= మధ్య మధ్య; కుడువక= తినక; ఉండు+ ఆతండు= ఉండేవాడు; సదా+ఉపవాసి= నిత్యోపవాసి - ఎప్పుడూ ఉపవసించేవాడే; ఋతుకాలమునన్= ఋతుమతి అయినపుడు; ఆత్మసతియందున్= తన భార్యయందు; రతి+చల్పు= సంభోగించేసే; భవ్యశీలుఁడు= ఉత్తమ స్వభావంకలవాడు; సదాబ్రహ్మచారి= నిత్యబ్రహ్మచారి; దేవ పితృ+అతిథి పూజా విధులందున్= దేవతల పితరుల అతిథుల పూజాకార్యాలలో; ఇడి= ఉంచి; మఱి= తరువాత; నంజు పురుషుఁడు= తినే నరుడు; అమాంస భోజి= మాంసం భుజించనివాడు; తన+అట్లు= తనవలెనే; పంక్తివారును= బంతిలోనివారూ - తనతో కూర్చొని భుజించేవారుకూడా; భుజింపన్= తినగా; భుజించు+అంచిత+ఆత్ముఁడు= తినే మంచి మనస్సు కలవాడు; విఘస+అశనుండు= దేవభుక్తశేషాన్ని భుజించేవాడు; భృత్యవర్గంబు= సేవకుల సమూహం; కుడిచిన పిదపన్= తిన్న తరువాత; కుడుచు+ఆతఁడు= తినేవాడు; అమృతాశి= అమృతం భుజించేవాడు; దివసంబునందున్= పగటివేళ; నిదుర+పోని పుణ్యుఁడు= నిద్రపోని ధన్యుడు; అస్వప్నుఁడు= నిద్రపోనివాడు; ఈ+పాలములు+అగు= అ విధాలయిన; మహా+అధిక వ్రతములు= గొప్ప పెద్ద వ్రతాలు; దేహబాధకములు= శరీరాన్ని బాధించేవి.

**తాత్పర్యం:** రోజుకు రెండు పూటల మాత్రం భోజనంచేస్తూ మధ్యమధ్య ఏమీ తిననివాడు సదోపవాసి, ఋతుకాలాన మాత్రం ధర్మపత్నితో సంగమించే సచ్ఛీలుడు సదాబ్రహ్మచారి, దేవతల పితరుల అతిథులకొరకు వండి వడ్డించి ఆ పిదప మాత్రం భుజించేవాడు అమాంసభోజి. తనతో తన పంక్తిని వారు కూడా ఆరగిస్తుండే వారివలెనే సమానంగా మాత్రమే భుజించేవాడు విఘసాశనుడు - భుక్తశేషభోజి. సేవకులందరూ భుజించిన తరువాత మాత్రమే తాను భుజించే పుణ్యాత్ముడు అమృతాశి. పగటిపూట నిద్రపోనివాడు అస్వప్నుడు - నిద్రపోనివాడు ఇటువంటివారి మహా వ్రతాలన్నీ శరీరబాధకాలే'.

## ఇంద్ర ప్రహ్లాద సంవాద ప్రకారము (సం. 12-212-3)

**వ.** **అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితోడఁ 'గర్మంబులు సంస్కారయోగంబున శుభాశుభంబులం బురుషుం బొందించు వానికిం గర్త యప్పురుషుండ యగుట గాకుండుట నిశ్చయింపరాకుండు. నాకేర్పడం జెప్పవే?' యనుటయు నప్పుణ్యుం డక్కురువరేణ్యున కిట్లను 'నింద్ర ప్రహ్లాద సంవాద సమాకర్ణనంబున నది దేటపడు నాకర్ణింపుము. సత్త్వస్థుండును, సంయమనిరతుండును, ననహంకారుండును, నమర్షక్రోధ దూరుండును, దుల్యనిందాస్తుతియును, సమలోష్టకాంచనుండును, నారాయణధ్యాన పరాయణుండును నగు ప్రహ్లాదుం డొక్కయెడ నొక్కరుండ యాసీనుండై యుండ నింద్రుం డతని యంతరంగం బారయ వేఁడి చేరంబోయి. 369**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; కౌంతేయ+అగ్రజుండు= కుంతీకుమారులలో పెద్దవాడు - ధర్మజుడు; శాంతనవునితోడన్= శంతనుడి కుమారుడితో - భీష్ముడితో; కర్మంబులు= కర్మలు-నరులు చేసే అన్ని పనులూ; సంస్కారయోగంబునన్= పూర్వానుభవపు కలయికతో; శుభ+అశుభంబులన్= మంచిచెడులను; పురుషున్= నరుని; పొందించున్= ప్రాప్తింపజేస్తాయి - పొందజేస్తాయి; వానికిన్= ఆ కర్మలకు; కర్త= చేసేవాడు; ఆ+పురుషుండు+అ= ఆ నరుడే; అగుట+కాక+ఉండుట= కావటం, కాకపోవటం; నిశ్చయింపన్+రాక+ఉండున్= నిర్ణయించ (వీలు) కాకుండా ఉంటుంది; నాకున్= సందేహంతో ఉన్న నాకు; ఏర్పడన్+చెప్పవే?= స్పష్టంగా తెల్పవా?; అనుటయున్= అన్న తరువాత; ఆ+పుణ్యుండు= ఆ పుణ్యాత్ముడు- భీష్ముడు; ఆ+కురువరేణ్యునకున్= ఆ ధర్మరాజునకు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; ఇంద్రప్రహ్లాద సంవాద సమ్+ఆకర్ణనంబునన్=

ఇంద్రుడి ప్రహ్లాదుడి సంభాషణమును బాగుగా వినటంవలన; అది= నీ వడిగిన సందేహం; తేటపడున్= స్పష్టపడుతుంది; ఆకర్ణింపుము= వినుము; సత్త్వస్థుండును= సత్త్వగుణమున ఉన్నవాడును; సంయమ నిరతుండును= నిగ్రహమునందు ఆసక్తుడును; న+అహంకారుండును= అహంకార రహితుడును; అమర్షక్రోధ దూరుండును= అసహనం తీవ్ర కోపములకు దూరమైనవాడును; తుల్యనిందాస్తుతియును= సమానమైన తెగడుట పొగడుటలు గలవాడును; సమలోష్టకాంచనుండును= సమానమైన మట్టిగడ్డ, బంగారం కలవాడును; నారాయణధ్యాన పరాయణుండును= విష్ణుమూర్తిని ధ్యానించటంలో ఆసక్తుడైనవాడూ; అగు= అయిన; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు - హిరణ్యకశిపుడి తనయుడు; ఒక్క+ఎడన్= ఒకచోట; ఒక్కరుండు+అ= ఒక్కడే; ఆసీనుండు+ఐ+ఉండన్= కూర్చొన్నవాడై ఉండగా; ఇంద్రుండు= ఇంద్రుడనే దేవతలరాజు; అతని+అంతర్+అంగంబు= ఆ ప్రహ్లాదుడి మనస్సును; ఆరయన్= పరిశీలించుటకు; వేఁడి= అర్థించి; చేరన్+పోయి= సమీపించి.

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మసూక్ష్మాలు పితామహుడినుండి విన్న తరువాత, ధర్మరాజు భీష్ముడిని ఒక జటిల ప్రశ్నవేశాడు. 'కర్మలు, సంస్కారవశాన నరుడికి మంచిచెడులు కలిగిస్తూ ఉంటాయి. అయినప్పుడు ఆ కర్మలకు కర్త నరు డౌనో కాడో నిర్ణయించలేకుండా ఉన్నాను. నాకు స్పష్టంగా నిస్సందేహంగా తెలుపవా?' అని అర్థించాడు. దానికి బదులుగా భీష్ముడు ధర్మజుడితో 'ఇంద్రప్రహ్లాద సంభాషణమనే వృత్తాంతాన్ని వింటే నీ సందేహం తీరుతుంది. విను'మంటూ ఆ వృత్తాంతాన్ని వివరించటం ప్రారంభించాడు. 'సత్త్వగుణంలో నిలిచి ఉన్నవాడూ, నిగ్రహశీలుడూ, అహంకార రహితుడూ అసహనాన్ని క్రోధాన్ని దూరీకరించినవాడూ, తెగడ్తలను పొగడ్తలను సమంగా భావించేవాడూ, మట్టిబెడ్డను బంగారాన్ని ఒకటిగా చూచేవాడు, విష్ణుమూర్తిధ్యానమగ్నుడూ అయిన ప్రహ్లాదుడు ఒకచోట ఒంటరిగా కూర్చొని ఉండగా, ఇంద్రుడు అతడి మనస్సును పరిశీలించి పరీక్షించే సంకల్పంతో, కోరి అతడిని చేరి.

**క. 'సంపద లేమికి మది శో । కింపవు; శత్రువుల చేతికిని లోనగు టూ**
**హింపవు; నీ కూరకునికి । పెంపని పాటించె; దిట్టి బేలవు గదవే!' 370**

**ప్రతిపదార్థం:** సంపద లేమికిన్= సంపత్తి లేకపోవటానికి; మదిన్= మనస్సున; శోకింపవు= ఏడ్వవు; శత్రువులచేతికిని= విరోధుల చేతికి కూడా; లోను+అగుట= లొంగిపోవటం; ఊహింపవు= తలంచవు; ఊరక+ఉనికి= నిష్క్రియగా - ఏ పనీ పాటూ లేకుండా ఉండుట; నీకున్= ఒంటరివైన నీకు; పెంపు+అని= ఎక్కువ అని - మేలని; పాటించెదు= గ్రహిస్తావు; ఇట్టి బేలవు+కదవే!= ఇంతటి వెర్రివాడవు అయినావే!

**తాత్పర్యం:** 'సంపదలు లేవు నీకు. అయినా దుఃఖించవు, శత్రువులచేతికి లొంగిపోతానని, అయినా ఆలోచించవు. ఉపేక్షాభావంతో ఊరక ఉండటమే నీకు మేలని గ్రహిస్తావు. ఇంత అమాయకుడవు అయినా వేమిటి? ఈ నిష్క్రియత్వ మెందుకు?'

**వ. అనిన విని హిరణ్యకశిపునందనుం డప్పురందరున కిట్లనియె. 371**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; హిరణ్య కశిపు నందనుండు= హిరణ్యకశిపుడి తనయుడు - ప్రహ్లాదుడు; ఆ+పురందరునకున్= ఆ ఇంద్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దీనికి ప్రహ్లాదుడు ఇంద్రుడికి ఈ విధంగా ప్రత్యుత్తర మిచ్చాడు.

**ఆ. 'కలిమిలేమి యనఁగఁగల వొకరెం డవి । యత్నగౌరవము వియత్నతయును**
**గలుగ వచ్చు ననుట గాదది సూ బేల । తనము వినుము తెలియ ననిమిషేంద్ర! 372**

**ప్రతిపదార్థం:** అనిమిష+ఇంద్ర!= దేవతల రాజా!; తెలియన్= తెలియునట్లుగా; వినుము= ఆలకించుము; కలిమిలేమి+అనఁగన్= కలుగుట, కలుగకుండుట అనే; ఒక రెండు= ఒక రెండు (క్రియలు); కలవు= ఉన్నవి; అవి= ఆ కలిమిలేములు (ఏవి? అంటే); యత్నగౌరవము వియత్నతయును= ప్రయత్నమనే బరువు, ప్రయత్నంలేకుండటం (అంతేగాని సంపద - దారిద్ర్యం కావు - కలిమిలేములకు అర్థాలు); కలుగన్= ప్రయత్నముంటే; వచ్చును+అనుట= (కలిమి) సిద్ధిస్తుంది అనటం; కాదు= కుదురదు- చెల్లదు; అది= యత్నిస్తే వస్తుంది అనుట; బేలతనము సూ= అమాయకత్వం - మౌఢ్యము సుమా!

**తాత్పర్యం:** ఓ దేవతలరాజా! కలిమిలేముల గురించి ప్రసంగించావు. అది సరిగాదు. నిజానికి కలిమి, లేమి- అనేవి రెండూ లోకాన ఉన్నాయి. కలిమి - ఉండుట - ప్రయత్నముండుట; లేమి - లేకుండుట - ప్రయత్నం లేకుండుట- అనేవే అవి. అయితే యత్న మున్నంత మాత్రాన సంపద సిద్ధిస్తుంది అనటానికి వీలులేదు. ఆ విధంగా అనటమే బేలతన మౌతుంది సుమా!

**విశేషం:** ఇంద్రుడు ప్రహ్లాదుడిని 'బేలవు - తెలియని మూఢుడవు లేక అమాయకుడవు' అంటే, ప్రహ్లాదుడు తిరిగి ఇంద్రుడిని అదే పదం ప్రయోగించి బోధిస్తూ అతడి మౌఢ్యాన్ని అతడికి ఎరుకపరుస్తున్నట్లున్నాడు. 'నిజమైన బేలతనం నీదే సుమా!' అని హెచ్చరిస్తున్నాడు.

**క. తేరక యుండఁగఁ జేరుం । దేరంగాఁ బొలియు విధి యధీనంబులు గా**

**కారయ విత్తంబులు పురు । షారంభాయత్తములెౘ మహా బుద్ధినిధీ! 373**

**ప్రతిపదార్థం:** మహాబుద్ధినిధీ!= గొప్ప ధీశక్తికి నిధానమైనవాడా! ఇంద్రా!; విత్తంబులు= సంపదలు; తేరక+ఉండఁగన్= తేకుండా- తీసికొనిరాకుండా ఉంటే; చేరున్= కూడతాయి; తేరంగాన్= తేగా, తీసికొనిరాగా; పొలియున్= నశిస్తాయి; ఆరయన్= పరిశీలించగా; విధి+అధీనంబులు+కాక= విధికి లొంగినవిగాకుండా; పురుష+ఆరంభ+ఆయత్తములు+ఎ?= పురుష ప్రయత్నానికిలొంగేనా?

**తాత్పర్యం:** ఓ మహాధీశాలీ! ఇంద్రా! సంపదలు యత్నించి ఆర్జించకున్నా తమంత తాముగా వచ్చి పడతాయి. ప్రయత్నించి సమార్జించి తెచ్చి ఉంచితే ఊరక నశించిపోతాయి. కాబట్టి పరిశీలించి చూస్తే అవి విధికి లొంగి ఉండేవేగాని నరుడి ప్రయత్నానికి లొంగినవి మాత్రం కావు.

**క. శత్రుజనులు చెఱుచుటయును, । మిత్రులు బ్రతికించుటయును మిన్నక యాప**

**త్పాత్రతయును సంపదయు వి । ధాతృఁడు సంధించుఁ జూవె తఱితోఁ బురుషున్. 374**

**ప్రతిపదార్థం:** శత్రుజనులు= విరోధి నరులు; చెఱుచుటయున్= చెడునట్లు చేయటం - నశింపజేయటం; మిత్రులు=స్నేహితులు; బ్రతికించుటయును= బ్రతికేటట్లు చేయటం - క్షేమాలు కలిగించటం; మిన్నక= ఊరక- అనుకొనకుండా - నిష్కారణంగా; ఆపద్+ పాత్రతయును= ఆపదలకు కష్టనష్టాలకు పాత్రమవటం; సంపదయును= (ఊరకనే) సంపత్తి కలగటం - ఇవి అన్నీ; తఱితోన్= సమయంతో - కాలంతో; పురుషున్= నరుడిని; విధాతృఁడు= చేసేవాడు- బ్రహ్మదేవుడు; సంధించున్+చూచె!= కలుపుతాడుసుమా!

**తాత్పర్యం:** జీవితంలో నరుడికి అనేక ఆనంద ఖేదకర సంఘటనలు ఎదురౌతూ ఉంటాయి. మిత్రులు శుభాలు గలిగిస్తుంటే, శత్రువులు నాశనాలు కలిగిస్తూ ఉంటారు. ఒక్కొక్కసారి ఊరకనే తన ప్రమేయ మేమీ లేకుండానే నరుడిమీద కష్టనష్టాలు వచ్చి పడతాయి. ఆ విధంగానే సుఖసంతోషాలూ హఠాత్తుగా మానవుడిని ముంచెత్తుతుంటాయి. ఇవన్నీ ఈ విధంగా ఎందుకు జరుగుతున్నాయి? ఎవరు జరిపిస్తారు? ఆయా సహాయం సమీపించినపుడు స్వయంగా విధాతే నరుడికి ఆయా ఖేదమోదాలతో, ఆపత్సంపదలతో, పరాజయవిజయాలతో సంధానం కుదురుస్తూ ఉంటాడు. ఇదంతా ఆయన ఆడించే ఆట తప్ప అన్యం కాదు.

**విశేషం:** ఈ పద్యంలో ప్రాసమైత్రి విశేషం గమనించదగినది. సంయుక్తాక్షరమైన 'త్ర'కును, 'తృ'కును ప్రాసమైత్రి చెల్లింపబడినది. ఇది 'సంయుతాసంయుతప్రాసము. రేఫ లకారములతో ఏర్పడినప్పుడే చెల్లుతుంది. 'పాఁడి ద్రచ్చుఁగ నిమ్ము నా తండ్రి కృష్ణ వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లు దినుము.'

**ఆ.** **భావములు నిజస్వభావంబునన తోఁచు । నడఁగునట్లు గాన యస్థిరతకు**
**నెలవు లని యెఱుంగ నేర్చిన భావంబు । లందుఁ దగులు నెట్లు డెంద మనఘ!** **375**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా -సురేంద్రా!; భావములు= అభిప్రాయాలు - మనోవికారాలు; నిజస్వభావమునను+అ= తన స్వభావమునందే; తోఁచున్= పుట్టుతాయి; అడఁగున్= నశిస్తాయి; అట్లు+కానన్= ఆ విధము కాబట్టి (భావాలు); అస్థిరతకున్= చంచలత్వానికి - నిలకడలేనితనానికి; నెలవులు+ఐ= స్థానాలు అని; ఎఱుంగ నేర్చినన్= తెలిసికొనగలిగితే; డెందము= మనస్సు; భావంబులందున్= భావాలలో - మనస్సులో నుండే కలిగే అభిప్రాయాలలో; ఎట్లు= ఏ విధంగా; తగులున్= తగుల్కొంటుంది?- చిక్కుకొంటుంది? (తగుల్కొనదు.)

**తాత్పర్యం:** కర్మలకు పూర్వరూపాలయిన భావాలు నరుడి స్వభావం లోపలినుండి పుట్టుకొస్తున్నాయి. మళ్ళీ ఆ స్వభావంలోనే కలిసి నశించిపోతున్నాయి. కాబట్టి ఈ మనోవికారరూపమైన భావాలకు నిలకడ ఉండదు. అవి చంచలత్వానికి నెలవులు. ఈ విషయం గ్రహించగలిగితే, ఇక నరుడి మనస్సు భావాలలో ఎందుకుతగుల్కొంటుంది? ఆ గ్రహింపు లేకపోవటం వలననే మనస్సు, భావాలు ఆడించినట్లు ఆడుతున్నది గాని, లేకపోతే, మనస్సు నిగ్రహంతో ఉండగలుగుతుంది.

**ఆ.** **ఏను గర్త ననుట యెఱుఁగమి దాఁ గర్త । యేని నేమి ఫలము నెడలకుండ**
**నఖిలకర్మములును నాచరించుచు నున్న । వాఁడె కాన కర్తగాఁడు దాను.'** **376**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; కర్తను+అనుట= చేసేవాడను అనటం; ఎఱుఁగమి= అజ్ఞానం; తాన్= తాను (నరుడు); కర్త+ఏనిన్= చేసేవాడైతే; ఏమిఫలమున్= ఏ ఫలితమూ - ఏ ప్రయోజనమూ; ఎడలకుండన్= క్రింద పడకుండా - ఏర్పడకుండానే; అఖిల కర్మములును= ఎల్ల కర్మలను (విడువకుండా); ఆచరించుచున్+ఉన్నవాఁడు+ఎ= చేస్తూ ఉన్నవాడే (అయినాడు నరుడు); కాన= కాబట్టి పై కారణంవలన; తాను= నరుడు; కర్త+కాఁడు= చేసేవాడు కాడు; (అనగా చేసేవాడు విధాతే గాని, నరుడుకాదు.)

**తాత్పర్యం:** నేను కర్తను-అని అనటం అజ్ఞానం. నిజంగా తాను కర్త అయితే ఏ లాభమూ ఏర్పడకుండానే అన్ని పనులనూ చేస్తున్నవాడే కాబట్టి, ఈ కారణంవలన చేసేది అంతా విధాతే అవుతాడు. అంతేగాని నరుడు కానేరడు'

**వ.** **అని పలికి వెండియు.** **377**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రవచించి, మళ్ళీ (ఆ అంశాన్నే వివరిస్తున్నాడు.)

**క.** **'అనఘా! విధివిహితంబుం । దన చేఁతగఁ దలఁప ఫలము దగులు నహంకా**

**ర నిరూఢున కనహం కా । రునకది లేమి ఫలయుక్తిఁ ద్రోవం జాలున్.** **378**

**ప్రతిపదార్థం:** అనఘా! ఓ పాపరహితుడవైన దేవేంద్రా!; అహంకార నిరూఢునకున్= అంహకారమున గట్టిపడినవాడికి - అహంకారం గలవాడికి; విధివిహితంబు= విధియొక్క పనిని; తనచేఁతఁగన్= తన పనిగా; తలఁపన్= తలచగా; ఫలము+తగులున్= ఫలితం

అంటుకొనును; న+అహంకారునకున్= అహంకారం లేనివాడికి; అది= తనచేతగా భావించటం; లేమిన్= లేకపోవటంవలన; ఫలయుక్తిన్= ఫలితము యొక్క కలయికను - చేరికను; ద్రోవన్+చాలున్= (అతడు) త్రోసివేయగలుగును.

**తాత్పర్యం:** ఓ పాప మెరుగని దేవేంద్రా! నరుడు అహంకారిగా జీవించేటప్పుడు, విధిచేష్టితాన్ని కూడా, తన చేతగానే (పనిగానే) భావించి ఆ కర్మఫలితంలో తగుల్కొంటాడు. ఆ తగుల్కొనటానికి అతడి అహంకారమే మూలం. అయితే అహంకారానికి లొంగని నరుడు మాత్రం విధిచేతను తనదిగా భావించడు కాబట్టి, అతడికి ఆ కర్మఫలితాన్ని త్రోసివేసే శక్తి ఉంటుంది. ఆ శక్తి అతడి అనహంకార శీలంవలన లభించింది.

**విశేషం:** ప్రహ్లాదుడి బోధన ప్రకారం చేష్టితాలు - కర్మలు అన్నీ విధి చేసేవే. అయితే అహంకారి నరుడు తనను కర్తగా భావించుకొని ఫలితాలూ అనుభవిస్తాడు. అనహంకారుడైన నరుడు మాత్రం తద్విరుద్ధంగా కర్తృత్వంతోపాటు ఫలితాన్ని త్రోసి రాజంటాడు.

**క. విను విధికృత్యము లూరక । కనుఁగొనుచును సిద్ధ్యసిద్ధికల్పిత సుఖదుః**
**ఖ నిరూఢిఁ బొందకుండఁగ । మనముం దొలఁగించు వెరవు మహనీయ మగున్. 379**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; విధి కృత్యములు= విధి (చేసే) పనులు; ఊరక= ఉపేక్షాభావంతో, పట్టించుకొనకుండా; కనుఁగొనుచును= చూస్తూ; సిద్ధి+అసిద్ధి కల్పిత సుఖదుఃఖ నిరూఢిన్= నెరవేరటం, నెరవేరకపోవటం వలన (కలిగే) సంతోష ఖేదాల గట్టిదనమును - ఆ సుఖదుఃఖాలను; పొందక+ఉండఁగన్= చెందకుండా ఉండేటట్లుగా; మనమున్= మనస్సును; తొలగించు వెరవు= ప్రక్కకు నెట్టు ఉపాయం; మహనీయము+అగున్= గొప్పది ఔతుంది.

**తాత్పర్యం:** కర్త విధి కాబట్టి, ఆ విధి చేసే కర్మలను ఉపేక్షాభావంతో ఊరకనే చూస్తూ ఉండాలి. ఆ కర్మలు సిద్ధించినపుడు సుఖాన్నీ, సిద్ధించనపుడు దుఃఖాన్నీ పొందకుండా ఉండటంకొరకు నరుడు తన మనస్సును విషయాలనుండి తొలగించే ఉపాయం కనుగొనాలి. ఆ విధమైన ఉపాయం గొప్పది.

**క. కావున భూతానిత్యత । భావించుట యెపుడుఁ గలిగి బంధచ్ఛేద**
**ప్రావీణ్యము సంపరితో । షావహముగ నున్నవాఁడ నమరప్రవరా! 380**

**ప్రతిపదార్థం:** అమర ప్రవరా!= సురశ్రేష్ఠా! దేవేంద్రా!; కావున= కాబట్టి; మనస్సును విషయాల నుండి తొలగించేఉపాయం ఎరిగినవాడను కాబట్టి; ఎపుడున్= ఎల్లప్పుడూ; భూత+అనిత్యతన్= ప్రాణుల అశాశ్వతత్వాన్ని - నశించే స్వభావాన్ని; భావించుట= తలంచటం; కలిగి= ఉండి; బంధచ్ఛేద ప్రావీణ్యము= (భవ) బంధాలను ఛేదించే నేర్పు; సంపరితోష+ఆవహముగన్= మంచిదీ, అధికమైనదీ అయిన ఆనందాన్ని కలిగించేది కాగా; (ఆ నేర్పు కర్త) ఉన్నవాఁడన్= ఉన్నాను - జీవిస్తున్నాను.

**తాత్పర్యం:** ఓ దేవతల రాజా! నేను మనస్సులో ఎపుడూ సృష్టిలోని ప్రాణి సంఘాల అశాశ్వతత్వాన్ని భావిస్తూ ఉంటాను. ఆ భావన నాలో భవబంధాలను ఛేదించే నేర్పు కలిగించింది. ఆ నేర్పు నాలో నిరంతరమూ అపరిమితమూ అయిన ఆనందాన్ని ఆవిర్భవింపజేస్తూ ఉండగా, నేను ఇట్లా నిలిచి ఉన్నాను.

**క. దాంతుఁడుఁ బ్రజ్ఞావంతుఁడు । శాంతుఁడు నగువాని మానసం బాయాస**
**శ్రాంతముగా దెమ్మెయి ని । శ్చింతుఁడనై యుండుదును విశిష్ట విచారా!' 381**

**ప్రతిపదార్థం:** విశిష్ట విచారా!= విశేషించిన ఆలోచనలు కలవాడా! సురేంద్రా!; దాంతుఁడున్= దమము కలవాడు(ఇంద్రియ నిగ్రహం కలవాడు); ప్రజ్ఞావంతుఁడున్= జ్ఞానం కలవాడు; శాంతుఁడున్= శాంతిని పొందినవాడు; అగువాని మానసంబు= అయిన నరుడి

చిత్తం; ఏ+మెయిన్= ఏ విధంగానూ; ఆయాస శ్రాంతము+కాదు= శ్రమతో - పరితాపంతో అలసినది కాదు (కాగా); నిస్+చింతుఁడను+ఐ= చింతలు లేనివాడనై; ఉండుదును= ఉంటాను.

**తాత్పర్యం:** విశిష్ట ఆలోచనలు గల ఓ దేవతలరాజా! నరుడు దాంతి, శాంతి, ప్రజ్ఞ కలిగినవాడైనపుడు అతడి చిత్తం ఏ విధంగానూ ఆయాసంతో అలసిపోదు. నేను అట్టివాడను కాబట్టి ఈ విధంగా చింతారహితంగా ఉండగలుగుతున్నాను'.

**క.** **అనవుడు ననిమిషపతి 'యే। యనువున నీ శాంతి నీకు నగపడియె మహా**
**జనపూజ్య!' చెప్పవే? నా। కని యడిగిన నిట్టులనియె నతఁ డాతనితోన్.** **382**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్న తరువాత; అనిమిషపతి= రెప్పపాటులేనివారి (దేవతల) నేత - ఇంద్రుడు; ఏ+అనువునన్= ఏ ఉపాయంతో; ఈ శాంతి= ఈ విధమైన ప్రశాంతి; నీకున్+అగపడియెన్= నీకు కనిపించినది? - లభించినది?; మహాజనపూజ్య!= గొప్పజనంచేత పూజింప దగ్గవాడా! ప్రహ్లాదా!; నాకున్= అర్థించే నాకు; చెప్పవే;= తెలుపవా?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతఁడు= ఆ ప్రహ్లాదుడు; ఆతనితోన్= ఆ ఇంద్రుడితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** ప్రహ్లాదుడు తన నిశ్చింతతను నిరూపించి తెలుపగా విన్న దేవేంద్రుడు 'ఏ ఉపాయంతో నీకు ఈ ప్రశాంతి లభించింది? ఓ మహాజనపూజ్యా! ప్రహ్లాదా! అర్థినైన నాకు తెలుపవా?' అని వేడగా, ప్రహ్లాదుడు ఇంద్రుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **'ఆర్జవంబు ప్రసన్నత యాత్మవత్త్వ। మప్రమాదంబు వృద్ధసేవాభినిరతి**
**మేలుసేయుఁ బ్రజ్ఞాశాంతిశాలి యగుట। కాలపాకంబుతోఁ దాన కలుగు ననఘ!'** **383**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా! ఇంద్రుడా!; ఆర్జవంబు= ఋజుభావం - నిష్కాపట్యం; ప్రసన్నత= దయగలతనం; ఆత్మవత్త్వము= ఆత్మను కలిగిన తనం; అప్రమాదంబు= పరాకులేనితనం; వృద్ధసేవా+అభినిరతి= పెద్దలను సేవించుటలో మంచి ఆసక్తి - ఈ గుణాలు; మేలు+చేయున్= శ్రేయస్సును కలిగిస్తాయి; ప్రజ్ఞాశాంతిశాలి+అగుట= జ్ఞానంతో శాంతితో ప్రకాశించేవాడు కావటం; కాలపాకంబుతోన్= కాలం పరిపక్వం కావటంతో; తాను+అ= తానే - స్వయంగా; కలుగున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** 'నిష్కపట మైన ప్రవృత్తి, దయాగుణం, తాను శరీరంగాదు - ఆత్మను అనే భావం, పరాకులేకుండా జాగరూకతతో వ్యవహరించటం, పెద్దల పరిచర్యలలో నిజమైన ఆసక్తి - ఈ సద్గుణాలు నరుడికి శుభాన్ని కలిగిస్తాయి. ఇక జ్ఞానం, శాంతి అనేవి, కాలపరిపాకంతో క్రమంగా తమంత తామే నరుడిలో చోటుచేసికొంటాయి.

**విశేషం:** నరుడిలో జ్ఞానం, శాంతి సద్యోజాతాలుగా ఏర్పడేవిగావు. అవి కలగటానికి నిజంగా కాలపరిపాకమూ అవసరమే. ఆ రెండూ పరిణతమైన మానవలక్షణాలు. పరిణతి అనేది తప్పనిసరిగా కాలంతో ముడిపడి ఉన్నదే! తొందరపడితే కలిగేవి కావవి. పైగా ఒక విధంగా స్వయంభువులు - తమంతట తాము పొడచూపేవి.

**క.** **అనిన విని విస్మయము నె। మ్మనమునఁ దళుకొత్తగా నమరపతి యభివం**
**దన మొనరించి పొగడుచుం। జనియె నిజావాసమునకు జగతీనాథా!'** **384**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ ధర్మరాజా!; అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; అమరపతి= దేవతలరాజు; నెఱ+మనమునన్= నిండుమనస్సునందు; విస్మయము= ఆశ్చర్యం; తళుకు+ఒత్తగాన్= మెరవగా, ప్రకాశించగా; అభివందనము+ఒనరించి= నమస్కారం చేసి; పొగడుచున్= స్తుతిస్తూ (ప్రహ్లాదుడిని); నిజ+ఆవాసమునకున్= తన నివాసానికి; చనియెన్= పోయాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు ప్రహ్లాదుడి ఆ ప్రవచనాన్ని ఆలకించి, మనస్సున విస్మయం పొడమగా, వినమ్రతతో అతడికి నమస్కరించి, తన నివాసానికి చేరాడు. ధర్మరాజా! ఇదీ ఇంద్రప్రహ్లాద సంవాదం'.

**వ. అని చెప్పిన విని యప్పాండవాగ్రజుండు 'భూపాలునకు లక్ష్మీభ్రంశం బేమిటఁ గలుగు?' ననుటయు నయ్యాపగా నందనుం డతని కిట్లనియె. 385**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; చెప్పినన్= పలుకగా; విని= ఆలకించి; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడు- ధర్మజుడు; భూపాలునకున్= రాజుకునకు; లక్ష్మీభ్రంశంబు= సిరి జారిపోవటం; ఏమిటన్= ఏ కారణాన; కలుగున్?= జరుగును?; అనుటయున్= అన్న పిదప; ఆ+ఆపగానందనుండు= ఆ నదీతనయుడు - భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంద్రప్రహ్లాద సంవాదప్రకారాన్ని ఆలకించిన ధర్మరాజు పితామహుడితో 'రాజు సిరిని ఏ కారణాన కోల్పోతాడు?' అని ప్రశ్నించాడు. దానికి బదులుగా భీష్ముడు ధర్మజుడితో ఇట్లా పలికాడు.

**తే. 'వాసవునకును బలికి సంవాద మనఘ! । కలిగె నయ్యితిహాసంబు గర్ణగోచ**
**రంబు సేయుము నీ దగు ప్రశ్నమునకు । నుత్తరం బిది సెప్పెదఁ జిత్తమలర. 386**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పాపరహితుడా!; వాసవునకును= ఇంద్రుడికీ; బలికిన్= బలిచక్రవర్తికీ; సంవాదము= సంభాషణం; కలిగెన్= ఏర్పడింది; ఆ+ఇతిహాసంబు= ఆ వృత్తాంతం; కర్ణగోచరంబు+చేయుము= (నీ) చెవిని పడేటట్లు చేయుము; నీది+అగు= నీయొక్క; ప్రశ్నమునకున్= ప్రశ్నకు; అది= ఆ ఇంద్ర బలిసంవాదం; ఉత్తరంబు= సమాధానం; చిత్తము= మనస్సు; అలరన్= సంతోషించగా; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** 'మున్ను దేవేంద్రుడికి బలిచక్రవర్తికీ సంవాద మొకటి జరిగింది. ఆ సంవాదప్రకారాన్ని నీవు ఆలకించుము. అది నీ ప్రశ్నకు సమాధానంగా సరిపోతుంది. నేను నీ మనస్సు సంతోషించే విధంగా ఆ వృత్తాంతాన్ని వినిపిస్తాను.

**సీ. ఇంద్రుఁ డబ్జజు కడ కేతెంచి వినతుఁడై । 'బలి మహాసంపద వెలుఁగుచుండె;**
**నితని నిప్పుడు గాన; మాతఁ డెచ్చో నున్న । వాఁడొకో!' యనుడు నవ్వారిజాస**
**నుండు 'నీతలఁ పొప్పకుండుట యెఱిఁగితి; । నైనను జెప్పెద నన్నృతవాది**
**గాకుండుమీ యుష్ట్రఖర గోహయంబుల । యందులో నొక్కటి చంద మొంది**

**తే. యడఁగి యున్నాడు వధియించు టనుచితంబు । వాని నని పల్కె నటు సేయువాఁడఁ' గాను**
**మాటవెట్టుదుఁ గన్నచో మాననీయ । వాక్య'యని వీడుకొనియె నవ్వాసవుండు. 387**

**ప్రతిపదార్థం:** ఇంద్రుఁడు= దేవతలరాజు; అబ్జజుకడకున్= బ్రహ్మదేవుడి దగ్గరకు; ఏతెంచి= వచ్చి; వినతుఁడు+ఐ= నమస్కరించినవాడై; బలి= బలిచక్రవర్తి; మహాసంపదన్= గొప్ప సంపత్తితో; వెలుఁగుచున్+ఉండెన్= ప్రకాశిస్తూ ఉన్నాడు; ఇతనినిన్= ఈ బలిని; ఇప్పుడు= ఈ దినాలలో; కానము= చూడము; ఆతఁడు= ఆ బలి; ఎచ్చోన్= ఏ చోట; ఉన్నవాఁడు+ఒకో!= ఉన్నాడో కదా!; అనుడున్= అన్న తరువాత; ఆ+వారిజాసనుండు= ఆ పద్మాసనుడు - బ్రహ్మ; నీ తలఁపు= నీ ఆలోచన; ఒప్పక+ఉండుట= తగక ఉండటం; ఎఱిఁగితిన్= గ్రహించాను; ఐనను= అయినా - గ్రహించినా; చెప్పెదన్= తెలుపుతాను; న+ఋతవాది= అసత్యం పలికేవాడు; కాక+ఉండుము+ఈ= కాకుండా నిలువుము; ఉష్ట్రఖర గోహయంబుల అందులోన్= ఒంటె, గాడిద, ఆవు, గుర్రముల లోపల; ఒక్కటి చందము= ఒక్కదాని విధం (ఆకారం); ఒంది= పొంది; అడఁగి+ఉన్నాడు= దాగి ఉన్నాడు; వానిన్= అతడిని; వధియించుట= చంపటం; న+ఉచితము= తగినది కాదు; అని పల్కెన్= అని చెప్పాడు; అటు= ఆ విధంగా; చేయువాఁడన్+కాను= చేసేవాడను కాను; మాననీయవాక్య!= గౌరవించవలసిన మాటగలవాడా!; కన్నచోన్= (బలిని)

చూస్తే; మాట+పెట్టుదున్= మాట ఇత్తును - భాషణం చేస్తాను; అని= అని పలికి; ఆ+వాసవుండు= ఆ ఇంద్రుడు; వీడుకొనియెన్= విడిచిపోయాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు బ్రహ్మదేవుడివద్దకు చేరి, నమస్కరించి, 'బలి మహాసంపదతో వెలుగుతూ ఉండేవాడు. ఇపుడు అతడు కనిపించడేమిటి? ఎక్కడ ఉన్నాడో కదా!' అని ప్రశ్నించాడు. దానికి బదులుగా బ్రహ్మ, 'నీ ఆలోచన అనుచితంగా ఉన్నదని నేను గ్రహించాను. అయినా నీకు చెప్తుతాను. అయితే నీవు మాత్రం అసత్యవాదివి కాకుమీ, ఒంటె, గాడిద, ఆవు, గుర్రములలో ఏదో ఒక దాని ఆకారం పొంది అతడు ఇపుడు దాగి ఉంటున్నాడు. అట్టి అతడిని చంపుట తగనిపని' అని పలికాడు. ఇంద్రుడు తాను ఆ విధంగా చేసేవాడను కానని పలుకుతూ, 'ఓ మన్నించదగ్గ మాటలు గల దేవా! నేను బలిని చూస్తే భాషణం మాత్రం చేస్తాను' అని పలికి వీడ్కొనినాడు.

**వ. వీడ్కొని చని జగతిం జరియించి యొక్కచోట ఖరరూపంబున సంప్రీతుం డయి యున్న యబ్బలిం గని బలారాతి యిట్లనియె. 388**

**ప్రతిపదార్థం:** వీడ్కొని= వీడ్కోలు పలికి; చని= వెళ్ళి; జగతిన్= లోకాన; చరియించి= తిరిగి; ఒక్కచోటన్= ఒక స్థలాన; ఖరరూపంబునన్= గాడిద ఆకారంతో; సంప్రీతుండు+అయి= బాగుగా సంతసించినవాడై; ఉన్న+ఆ+బలిన్= ఉండిన ఆ బలిచక్రవర్తిని; కని= చూచి; బల+ఆరాతి= ఇంద్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ ఇంద్రుడు వెదకగా ఒకచోట గాడిద రూపంలో సంతుష్టుడైన బలి కనిపించాడు. ఆ బలితో ఇంద్రుడు ఇట్లా అన్నాడు.

### ఇంద్ర బలిచక్రవర్తి సంవాదప్రకారము (సం. 12-216-2)

**క. 'ఏనుఁగులు సుట్టిరాఁ బే । రేనుఁగుపై మణిమయంపుటెల్లులు మెఱయం**
**గా నీ వే తెంతువు మముఁ । గానికిఁ గొన వప్పు డిపుడు గాడిదవైతే! 389**

**ప్రతిపదార్థం:** ఏనుఁగులు= పట్టపుటేనుగులు; చుట్టిరాన్= చుట్టూ చేరిరాగా; పేరు+ఏనుఁగుపైన్= పెద్ద ఏనుగుమీద; మణిమయము+ఎల్లులు= మణులతో నిండిన గొడుగులు; మెఱయంగాన్= ప్రకాశించగా; అప్పుడు= నీవు రాజ్య మేలినప్పుడు; నీవు= చక్రవర్తివైన నీవు; ఏతెంతువు= వచ్చెదవు - వస్తూ ఉంటివి; మమున్= దేవతలమైన మమ్ము; కానికిన్= కానీకి కూడా- అత్యల్పమైన నాణెమునకు సమానంగా కూడా; కొనవు= గ్రహించవు; ఇపుడు= ఈ సమయాన; గాడిదవు+ఐతి(వి)+ఏ!= గాడిదవుగా అయ్యావా!

**తాత్పర్యం:** 'ఓ బలిచక్రవర్తీ! ఒకనాడు నీవు చుట్టూ పట్టపుటేనుగులు రాగా, ఒక మహాగజము నధిరోహించి, మణిమయ ఛ్ఛత్రచామరాలు వెలుగులు చిమ్ముతూ ఉండగా ఏతెంచేవాడవు. ఆనాడు దేవలోకనివాసులమైన మేము నీకు 'కానీ' కి కొరగాలేదు. అట్టి ఉజ్జ్వలమైన భూతకాలవైభవంగల నీవు ఈనాడు ఈవిధంగా గాడిదగా అయి ఉన్నావా!

**క. కనకమయయూప మొప్పఁగ । ననూన విభవమున నీవు యాగం బొనరిం**
**చిన యొప్పును నిప్పటి నీ । యునికియునుం జూచి నాకు నుమ్మల మయ్యెన్. 390**

**ప్రతిపదార్థం:** నీవు= బలిచక్రవర్తివైన నీవు; కనకమయ యూపము= బంగారపు కట్టుగొయ్య (యజ్ఞసమయాన పశువును కట్టివేసే కొయ్యపేరు యూపము); ఒప్పఁగన్= ప్రకాశించగా; న+ఊన విభవమునన్= అల్పంగాని గొప్పదైన సంపదతో; యాగంబు= యజ్ఞం; ఒనరించిన+ఒప్పును= చేసిన గొప్పదనమును; ఇప్పటి నీ+ఉనికియునున్= ఈ నాటి నీ స్థితినీ; చూచి= (కన్నులారా) కాంచి; నాకున్= దేవతల రాజైన నాకు; ఉమ్మలము+అయ్యెన్= సంతాపము కలిగింది.

**తాత్పర్యం:** ఆనాడు చక్రవర్తిగా నీవు బంగారు యూపస్తంభంతో గొప్పవైభవం వ్యక్తం కాగా యజ్ఞం నిర్వహించిన ఉజ్జ్వల సంఘటననూ, ఇప్పటి నీ శోచనీయమైన స్థితినీ చూచి నాకు శోకం కలుగుతున్నది.

**విశేషం:** నరు డెవడైనా, ఒకడి జీవనంలోనే ఊహకందని గొప్ప వ్యత్యాసాలను చూడటం తటస్థిస్తే, అతడిలో భావోద్వేగం సానుభూతి రూపాన తప్పక వ్యక్తమై తీరుతుంది. గౌతమ బుద్ధుడి జీవనంలోని పెద్ద వ్యత్యాసాలే అతడియెడ లోకానికి మొదట కలిగిన అనంత సానుభూతికీ, అనంతర కాలాన ఏర్పడిన ఆదరాభిమానాలకూ మూలమని అనటంలో ఔచిత్యమున్నది.

**ఆ. ఉముక దినుచు నిట్టులుండి నీ తొల్లింటి । లీలఁ దలఁచి యుమ్మలింతొ? లేదొ?**
**యున్నరూపు సెప్ప వన్న! గార్దభరూప । దారుణైకనిపుణ! దానవేంద్ర! 391**

**ప్రతిపదార్థం:** గార్దభరూప దారుణ+ఏక నిపుణ!= గాడిద ఆకారంతో భయంకరుడవైన ఒక్క నేర్పరీ! (ఇతరు లెవరూ ఇంతటి స్థితికి చేరినవారు లేరనుట); దానవ+ఇంద్ర!= రాక్షసుల రాజా! ఓ బలిచక్రవర్తీ!; ఉముక= ఊక - వడ్లమీది పొట్టు; తినుచున్= తింటూ; ఇట్టులు+ఉండి= ఈ విధంగా నీచంగా ఉండి; నీ తొల్లింటి లీలన్= నీ యొక్క పూర్వ వైభవాన్ని; తలఁచి= స్మరించి; ఉమ్మలింతు+ఒ?= శోకిస్తావా?; లేదు+ఒ?= లేదో? - శోకించవో?; ఉన్నరూపు= ఉన్న వాస్తవం - నిజం; చెప్పవు+అన్న= తెలియజేయవయ్యా!.

**తాత్పర్యం:** గాడిద రూపంతో దారుణంగా కనిపించే ఒకే ఒక్క నేర్పరీ! రాక్షసరాజా! నేడు ఊక తింటూ జీవిస్తున్న నీవు, నీ తొల్లిటి వైభవాన్ని తలచుకొని శోకిస్తూ ఉంటావా? ఉండవా? ఉన్న వాస్తవం యథార్థంగా చెప్పవయ్యా!'

**విశేషం:** బలిని సంబోధించిన తీరు గమనించవలసి ఉన్నది. 'గార్దభరూపదారుణ' - ఇంతవరకు సామాన్యమే. తరువాతి పదమే విలక్షణము - 'ఏకనిపుణ!' - బలికి ఆధ్యాత్మవిద్యావేత్తలలో పెద్ద పీట ఉన్న వైనాన్ని సూచిస్తున్న దీ పదం.

**సీ. అన విని బలి దేవతాధీశుతో 'నీకు । నా విభవంబు గానంగ రాదు;**
**గుప్తమై యున్నది గుహయందు; నా కిచ్చ । వుట్టిన నిప్పుడ పొలిచి తోఁచు;**
**నది యటులుండె; నీ వధికుండ వల్పుల । యెదుర రజ్జులు వల్కుటేటి పెంపు?**
**పొమ్ము దుశ్చ్యవన! నీ పోయెడు తెరు' వన్న । నాతండు నవ్వుచు నతనిఁ జూచి**

**ఆ. మున్ను పల్కినట్ల కన్నోటలేక ప । ల్కుటయు, నతఁడు 'భూతకోటి మంచు**
**వోలెఁ దోఁచు విరియు; బుద్ధిమంతులు దాని । కిచ్చ వగవ; రింత యెఱుఁగ వెట్లు?' 392**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అనగా విని; బలి= బలిచక్రవర్తి; దేవతా+అధి+ఈశుతోన్= దేవతల అధిపతితో - ఇంద్రుడితో; నీకున్= దేవేంద్రుడవైన నీకు; నా విభవంబు= నా సంపద; కానంగన్+రాదు= చూడరాదు - అగుపడదు; గుహయందున్= కొండబిలమునందు; గుప్తము+ఐ= దాచబడ్డదై; ఉన్నది= కలదు; నాకున్+ఇచ్చ+పుట్టినన్= నాకు కోర్కె కలిగినప్పుడు; ఇప్పుడు+అ= ఇప్పుడే; పొలిచి= సమీపించి; తోఁచున్= అగుపిస్తుంది; అది= ఆ విషయం-నా సంపద విషయం; అటుల+ఉండెన్= అట్లుండనీ - ఆ ప్రక్కన ఉండనిమ్ము; నీవు+అధికుండవు= నీవు పెద్దవాడవు; అల్పుల+ఎదురన్= పిన్నల - చిన్నవారి ఎదుట; రజ్జులు+పల్కుట= వ్యర్థభాషణములు ఆడుట; ఏటి పెంపు?= ఏ విధమైన పెద్దరికం?; దుశ్చ్యవన= ఓ ఇంద్రుడా!; నీ పోయెడు తెరువు= నీవు వెళ్ళేదారిన; పొమ్ము= వెడలుము; అన్నన్= అనగా; ఆతండు= ఆ ఇంద్రుడు; నవ్వుచున్= నవ్వుతూ; అతనిన్+చూచి= ఆ బలిని చూచి; మున్ను= ముందు; పలికినట్లు+అ= అన్న విధంగానే; కన్నోట లేక= జంకులేకుండా; పల్కుటయున్= (అనుట జరిగిన) అన్న తరువాత; అతండు= ఆ బలి; భూతకోటి= ప్రాణి సమూహము; మంచు+పోలెన్= మంచువలె; తోఁచున్= కనిపించును; విరియున్= తొలగును - నశించును; బుద్ధిమంతులు= తెలివిగలవారు; దానికిన్= ఆ ప్రాణికోటి పుట్టి చచ్చుటకు; ఇచ్చన్+వగవరు= మదిలో శోకించరు; ఇంత= ఈ మాత్రము; ఎట్లు ఎఱుఁగవు= ఏల గ్రహించవు?

**తాత్పర్యం:** ఇంద్రుని ప్రశ్న విన్న బలి 'దేవేంద్రా! నీకు నా విభవం కనిపించదు. కొండగుహలో దాచబడి ఉన్నది. నాకు కోర్కెగల్గినప్పుడే కనిపిస్తుంది. సరి అది అట్లా ఉండనిమ్ము, నీవు గొప్పవాడవు. అల్పుల దగ్గర వ్యర్థభాషణాలు చేయటం ఏమి గొప్పతనం? నీవు వెళ్ళవలసిన దారిలో వెళ్ళిపొమ్ము' అన్నాడు. మొదట బలి ఇంద్రుడి ప్రశ్నను లక్ష్యపెట్టకుండా సమాధానం చెప్పాడు. అయితే ఇంద్రుడు బలిని వదలలేదు. అతడు నవ్వుతూ బలిని చూచి, పూర్వం ప్రశ్నించినట్లే మళ్ళీ ఏ జంకూ లేకుండా ప్రశ్నించాడు. అపుడు బలి 'ఈ కనిపించే ప్రాణికోటి అంతా మంచువలె కనిపిస్తుంది. మంచువలెనే తొలగిపోతుంది. బుద్ధిమంతులైన నరులు ప్రాణికోటి చావు పుట్టుకలకొరకు శోకించరు. ఈ మాత్రం ఎరుగ వేమిటి?' అన్నాడు.

**విశేషం:** ఇక్కడ బలి బుద్ధిమంతుడు. అతడు ఇంద్రుడి తొలిమాటలు వ్యర్థభాషితాలుగా తోచగా ఉబుసుపోక కోపం ఆడిన పల్కులుగా తలచి, పట్టించుకోలేదు. అందుకనే ఇంద్రుడిని తనదారిన తనను పొమ్మన్నాడు. అయితే ఇంద్రుడు నిశ్చలంగా నిలిచి నవ్వుతూ మళ్ళీ అదే ప్రశ్నవేసేసరికి, అతడి జిజ్ఞాస (తెలిసికొనాలనే కోరిక) మీద బలికి విశ్వాసమేర్పడి, సమాధానం చెప్పటం ప్రారంభించాడు. దుశ్చ్యవనుఁడు= ఇంద్రుఁడు; తన వజ్రాయుధమునకు సాధ్యుఁడు కాని చ్యవనముని వంటివాఁడు.

**వ. అని వెండియు విరోచననందనుండు. 393**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; విరోచన నందనుండు= విరోచనుడి కొడుకైన బలి; వెండియున్= మరలా ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** అని బలి మరలా (ఈ విధంగా కొనసాగించాడు.) (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పొరి నర్థంబు ననర్థము । మరణము జీవితము సుఖ సమాగమమును దు**
**స్తర దుఃఖసంగమంబును । దొరకొన నే నెపుడు సమత తోడన నిలుతున్. 394**

**ప్రతిపదార్థం:** పొరిన్= క్రమంగా; అర్థంబున్= ధనం; అనర్థము= కీడు; మరణము= చావు; జీవితము= బ్రదుకు; సుఖసమ్+ఆగమమును= సుఖం బాగుగా రావటం; దుస్+తర దుఃఖ సంగమంబును= దాటరాని (దుఃఖంతో దాటవలసిన) దుఃఖం యొక్క కూడికా; దొరకొనన్= కలుగగా; నేను= బలిని అయిన నేను; ఎపుడున్= సదా ఎల్లవేళలా - సుఖంలో దుఃఖంలో, జీవితంలో, మరణంలో, అర్థంలో, అనర్థంలో; సమతతోడన్+అ= సమభావంతోనే; నిలుతున్= నిలుస్తాను.

**తాత్పర్యం:** దేవేంద్రా! లోకాన క్రమంగా ప్రాణికోటికి మేలు కీళ్ళు, బ్రదుకులు చావులు, సుఖానుభవాలు, దుఃఖపీడనలు వచ్చి పడుతూ ఉంటాయి. నేను మాత్రం ఎప్పుడూ మేలు జరిగినా, కీడు వాటిల్లినా, సుఖం కలిగినా, దుఃఖం పైకొన్నా, సమభావంతో నిలిచి ఉంటాను. నా మీద ఆ మేలుకీడుల ప్రభావ మేదీ ప్రసరించదు.

**చ. బలమును నొప్పు బుద్ధియును బ్రౌఢతయుం గలవారు లేనివా**
**ర లనక యొక్కభంగిఁ దఱి రాకయ చూచి హరించుచుండు వి**
**చ్చలవిడిఁ గాలుఁ; డట్లగుట సారమతిం గని యున్నవాఁడ; ను**
**మ్మలికయు నుబ్బు నాదుమది మందున కైనను లేదు వాసవా! 395**

**ప్రతిపదార్థం:** వాసవా!= ఇంద్రా!; కాలుఁడు= యమధర్మరాజు; బలమును= శరీర బలమూ; ఒప్పు బుద్ధియును= తీరైన తెలివీ; ప్రౌఢతయున్= ప్రాగల్భ్యమూ, సమర్థతా; కలవారు= ఉన్నవారు - ఈ గుణాలన్నీ ఉన్నవారు; లేనివారలు= ఉండనివారు; అనక= అనకుండా; ఒక్కభంగిన్= ఒకే విధంగా; తఱిరాక+అ= సమయం, కాలం వచ్చుటయే - పోగాలం సమీపించుటే; చూచి= గమనించి;

విచ్చలవిడిన్= స్వేచ్ఛగా - అడ్డూ ఆపూ లేకుండా; హరించుచున్+ఉండున్= సంహరిస్తూ ఉంటాడు; అట్లు+అగుటన్= ఆ విధంగా జరుగుటను; సారమతిన్= గట్టి బుద్ధితో; కని+ఉన్నవాఁడన్= చూచి ఉన్నాను; నాదు మదిన్= నా మనస్సునందు; ఉమ్మలికయున్= దుఃఖమును; ఉబ్బును= సంతోషమును; మందునకున్+ఐనను= మందుకోసం కూడా - కొంచెం కూడా; లేదు= ఉండదు;

**తాత్పర్యం:** ఇంద్రా! లోకాన నరులలో శరీరబలం, బుద్ధి, వివేకం, పనులలో ఎంతో సామర్థ్యం కలవారున్నారు. అవి ఏవీ లేనివారూ పుష్కలంగానే ఉన్నారు. కాని కాలుడు మాత్రం కాలం సమీపించినప్పుడు ఆ ఇరుతెగలవారినీ స్వేచ్ఛగా తిరుగులేకుండా హరించివేస్తూనే ఉన్నాడు. కాలుడి దగ్గర బలవివేకసామర్థ్యాలేవీ కొరగావటంలేదు. అట్లా జరగడాన్ని నేను గట్టి తెలివితో గమనించి ఉన్నాను. కాబట్టి నా చిత్తాన ఉమ్మలిక ఉండదు. ఉబ్బూ ఉండదు- ఏ కొంచెంగానైనా.

**ఉ. గాడిద రూపు దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం**
**బాడెదు శక్ర! శాంతిసమయం బగుటన్ విను మింకఁ గొన్ని నీ**
**వాడిన నాదు చిత్తమున నల్క యొకింతయుఁ బుట్ట దిట్లు నీ**
**వాడితె మున్ను? ని న్నెఱుఁగనా? వలదా నను నీ వెఱుంగఁగన్? 396**

**ప్రతిపదార్థం:** శక్ర!= దేవేంద్రా!; గాడిదరూపు+తాల్చి= గార్దభ ఆకారం ధరించి; ఉముకల్= ఊకలు; తినుచున్+ఉండఁగన్= తింటూ ఉండగా; చూచి= కనుగొని; ఉల్లసంబు+ఆడెదు= పరిహాసం పల్కుతావు; వినుము= ఆలకించుము; శాంతి సమయంబు+అగుటన్= సత్త్వరజస్తమోగుణాలు శాంతించిన కాలం కాబట్టి; నీవు= పరిహసించే నీవు; ఇంకన్+కొన్ని ఆడినన్= ఇంకా కొన్ని పరిహాసాలు - ఎకసక్కెములు పలికినా; నాదు చిత్తమునన్= నా మనస్సున; అల్క+ఒక+ఇంతయున్= కోపం కొంచెం కూడా; పుట్టదు= కలుగదు; మున్ను= పూర్వం, నేను ఏలే సమయాన; నీవు= ఇంద్రుడవైన నీవు; ఇట్లు= ఈ విధంగా పరిహాసంగా; ఆడితి(వి)+ఎ?= పలికితివా?; నిన్నున్+ఎఱుఁగనా?= దేవతల రాజువైన నిన్ను ఎరుగనా!; నన్నున్= బలిచక్రవర్తినైన నన్ను నీవు; ఎఱుఁగన్+వలదా?= ఎరుగవద్దా?

**తాత్పర్యం:** ఇంద్రా! ఇపుడు గార్దభాకారం ధరించి ఊక మేస్తున్న నన్ను చూచి, ఎకసక్కెములు ఆడుతున్నావు. త్రిగుణాలు శాంతించి ఉన్నవాడను కాబట్టి, నీవు ఇంకా మరికొన్ని పరిహాసాలు పలికినా నా చిత్తాన అలుక అంకురించదు. ముందు నేను చక్రవర్తిగా లోకమేలేటప్పుడు నీవు నాతో ఇట్లా పలికావా? నిన్ను నేను ఎరుగనా? మరి, నీవూ నన్ను ఎరిగి ప్రవర్తించవద్దా?

**క. ఎలమియు వాడుటయును దన । వలచిన యట్టివె యెఱుంగవా? విధి చరితం**
**బులు బలవంతంబు లగుట । వలదె? వివేకంబు పెద్దవారికి నింద్రా! 397**

**ప్రతిపదార్థం:** ఇంద్రా!దేవేంద్రా!; ఎలమియున్= వికాసమూ - వృద్ధీ; వాడుటయును= వినాశమూ; తన వలచిన+అట్టివె?= తాను (విధి) అనుకొన్న కోరిన అటువంటివే?; విధి చరితంబులు= విధియొక్క నడతలు; ఎఱుంగవా?= తెలియవా? గ్రహించలేవా?; బలవంతంబులు= బలము గలిగినవి (విధి చరితములు); అగుటన్= కాగా, అందువలన; పెద్దవారికిన్= పెద్దలైన వారికి (నీ వంటివారికి); వివేకంబు= మంచిచెడు గ్రహించే తెలివి; వలదె?= వద్దా? ఉండవద్దా?

**తాత్పర్యం:** ఓ దేవతల రాజా! విధి కోర్కెనుబట్టి ప్రాణుల జీవితాలలో వికాసంగాని, వినాశంగాని జరుగుతుంటుంది. విధి చేష్టలు బలీయాలు. ఆ విషయం నీ వెరుగవా! పెద్దవారికి వివేకం - మంచిచెడు వింగడించి చూచే తెలివి ఉండవద్దా?

**క. ఇటు గర్వించుట నీచత; । యెట వోయెదో పొమ్ము; మానుమీ వలవని త్రు**
**ళ్ళుట; వజ్రము నీవును బిడి । కిటి తాఁకున నొఅగు దేను కినిసితినేనిన్. 398**

**ప్రతిపదార్థం:** ఇటు= ఈ విధంగా; గర్వించుట= గర్వం వహించటం; నీచత= నైచ్యం - నీచుడి స్వభావం; ఎట= ఎక్కడకు; పోయెదో= పోతావో; పొమ్ము= వెడలుము; వలవని త్రుళ్ళుట= కూడని మిడిసిపాటు; మానుమీ= మానుకొనుము; ఏను= నేను; కినిసితిని+ఏనిన్= అలిగితినా; కోపగించితినా; వజ్రము= నీ వజ్రాయుధం; నీవును= నీవుకూడా; పిడికిటి తాఁకునన్= (నా) చేతి పిడికిలియొక్క దెబ్బకు; ఒఱగుదు= పడతావు.

**తాత్పర్యం:** ఇతరుల దైన్యాన్నిచూచి ఎకసక్కెములాడటం నీచస్వభావం. నీవు ఎటుపోతున్నావో పొమ్ము. ఈ తగని మిడిసిపాటు మానుకొమ్ము. నేను కోపగించానంటే, నీవూ నీ వజ్రాయుధమూ నా చేతి పిడికిటి వేటుకే నేలకు ఒరిగి పోవలసివస్తుంది.

**క. ఇది మేలపు మాట సుమీ! । మది నుద్ధతి లేదు నాకు; మహితాశ్చర్యా**
**స్పదమగు విధాతృ చెయ్దిం । దుది నీవును దుస్సుపోదు; త్రుళ్ళు టుడుగుమీ. 399**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చివరిమాట; మేలము+మాటచుమీ!= పరిహాసపు పలుకు సుమా!; నాకున్= స్థిరప్రజ్ఞుడనైన నాకు; మదిన్= చిత్తమునందు; ఉద్ధతి లేదు= పొగరు ఉండదు; మహిత+ఆశ్చర్య+ఆస్పదము+అగు= గొప్పదీ ఆశ్చర్యానికి స్థానమైనదీ అయిన; విధాతృ చెయ్దిన్= విధియొక్క చేత (పని) వలన; తుదిన్= చివరకు; నీవును= దేవరాజువైన నీవు కూడా; తుస్సు+పోదు= భంగపడతావు; (కాబట్టి) త్రుళ్ళుట= మిడిసిపడటం; ఉడుగుమీ!= మానుము!

**తాత్పర్యం:** (బలి ప్రసంగంలో 'నేను కినిసితినేనిన్ నీవును వజ్రము పిడికిటి తాఁకున నొఱగుదు' అని ఒక మాట పల్కి ఉన్నాడు. అది నిజానికి ఔద్ధత్యాన్ని తెలియజేసే పలుకు. కాబట్టి ఆ మాటను తాను వాస్తవార్థంలో వాడలేదన్నాడు) ఇది పరిహాసవచనం మాత్రమే! నాకు చిత్తాన అహంకారం లేదు. గొప్ప అచ్చెరువుకు ఆస్పదమైన విధాత చేతలకు ఎవరూ అతీతులుగారు. చివరకు నీవు కూడా విధిచేతిలో భంగపడతావు. కాబట్టి త్రుళ్ళిపడటం మానుకొమ్ము.

**వ. శాంతుఁడ వగు' మని పలికె; నట్టియెడ నవ్విరోచన నందను శరీరంబున నుండి సురూపయు సుగౌరయు నగు నొక్కమగువ నిర్గమించినం గని కౌశికుండు విస్మయ వికసితాక్షుం డగుచు నతనితో 'నివ్వనిత యెవ్వత?'యనిన నాతం 'డే నెఱుంగ నీవ యీ యమ నడుగు' మనుటయు నయ్యనిమిషపతి యమ్ముద్దియ మొగంబు గనుంగొని 'మాకు నిన్నెఱింగింపు' మనవుడు నద్దేవి యతనితోడ. 400**

**ప్రతిపదార్థం:** శాంతుఁడవు+అగుము= శాంతించినవాడవు కమ్ము; అని పలికెన్= అని చెప్పాడు; అట్టి+ఎడన్= ఆ సమయాన; ఆ+విరోచన నందను శరీరంబున నుండి= ఆ విరోచనుడి కుమారుడైన బలియొక్క దేహంనుండి; సురూపయున్= మంచి ఆకారం కలిగినదీ; సుగౌరయున్= మంచి తెల్లనైనదియు; అగు+ఒక్క మగువ= అయిన ఒక వనిత; నిర్గమించినన్= బయటకు వెడలగా; కని= చూచి; కౌశికుండు= ఇంద్రుడు; విస్మయవికసిత+అక్షుండు+అగుచున్= అచ్చెరువుతో విప్పారిన కన్నులు గలవాడు అవుతూ; అతనితోన్= ఆ బలితో; ఈ+వనిత= ఈ స్త్రీ; ఎవ్వత?= ఎవరు?; అనినన్= అనగా; ఆతండు= ఆ బలి; ఏను+ఎఱుంగన్= నేను ఎరుగను; నీవు+అ= నీవే; ఈ+అమన్= ఈ అమ్మను, వనితను; అడుగుము= ప్రశ్నించుము; అనుటయున్= అన్న తరువాత; ఆ+అనిమిషపతి= ఆ దేవతలరాజు; ఆ+ముద్దియ మొగంబు= ఆ ముద్దరాలి ముఖం; కనుంగొని= చూచి; మాకున్= ఇంద్రదేవులమైన మాకు (రాచరికపు బహువచనం); నిన్నున్+ఎఱింగింపుము= నిన్ను తెలియపరచికొనుము; అనవుడున్= అన్న పిదప; ఆ+దేవి= ఆ దేవత; అతనితోడన్= ఆ ఇంద్రుడితో.

**తాత్పర్యం:** శాంతిని వహించుము ఇంద్రా!' అని బలి పలికాడు. ఆ సమయాన ఆ రాక్షసరాజు శరీరంనుండి ఒక వనిత మంచి ఆకారంతో, మంచి తెల్లదనంతో ప్రకాశిస్తూ బయటకు వెడలినది. ఆ దృశ్యం చూచిన ఇంద్రదేవుడు

అచ్చెరువుతో కన్నులు పెద్దవి కాగా, బలితో 'ఎవ్వరీమె?' అని ప్రశ్నించాడు. బలి తనకూ తెలియదంటూ 'నీవే ఈ వనితను అడిగి తెలిసికొ'మ్మన్నాడు. ఇంద్రుడు ఆ ముద్దరాలి మొగం చూచి 'మాకు నిన్ను ఎరిగించుకొ'మ్మని పలికాడు. దానికి బదులుగా ఆ దేవత ఆ ఇంద్రదేవుడితో.

**విశేషం:** లోక వ్యవహారాన 'అతడికి దశ తిరిగింది. ఇతడికి మహర్దశ వదలింది' వంటి మాటలు వింటూ ఉంటాం. ఆ మాటలలోని దశలు జ్యోతిష శాస్త్రాన్నిబట్టి లెక్కించి చెప్పేవి గావచ్చును. ఊరకే మనిషి స్థితిగతులను చూచి పలికేవీ కావచ్చును. ఇక్కడ బలి దశ మారింది. ఆ మార్పును భౌతికంగా సంభవిస్తున్నట్లుగా చిత్రిస్తూ వ్యాఖ్యానిస్తున్నాడు భారతకర్త. నరుడిలో సిరి ప్రవేశించటం నిర్గమించటం జరుగుతున్నట్లుగా నిరూపిస్తున్నాడు. ధర్మజుడి ప్రశ్న ఈ అంశానికి చెందినదే.

**క. 'శ్రీయును భూతియు లక్ష్మియు । నా యభిధానములు మీరు న న్నెఱుఁగమి పె**
**ద్దే? యింద్ర! యెజ్జగంబుల । నే యుగములయందు నెఱుఁగ రెవ్వరు ననినన్.' 401**

**ప్రతిపదార్థం:** ఇంద్ర!= ఓ ఇంద్రదేవా!; శ్రీయును= శ్రీ అనేదీ; భూతియును= భూతి అనేదీ; లక్ష్మియున్= లక్ష్మి అనేదీ; నా+అభిధానములు= నా పేరులు; మీరు= ఇంద్రబలులు - మీరు ఇరువురు; నన్నున్+ఎఱుఁగమి= నన్ను గ్రహించలేకపోవటం; పెద్ద+ఏ?= ఆశ్చర్యమా? (కాదు); ఏ+జగంబులన్= ఏ లోకాలలోనైనా; ఏ యుగములయందున్= ఏ యుగాలలోనైనా; ఎవ్వరున్= ఎట్టివారూ; ఎఱుఁగరు= తెలియరు; అనినన్= అనగా.

**తాత్పర్యం:** 'ఓ ఇంద్రదేవా! నా పేరులు మూడున్నాయి - శ్రీ, భూతి, లక్ష్మి అని. ఇక మీరు (ఇంద్రబలులు) ఇద్దరూ నన్ను ఎరుగకపోవటం విచిత్ర మేమీ కాదు. ఏ లోకాలలోనూ, ఏ యుగాలలోనూ, ఏ ఒక్కరూ నన్ను ఎరుగరు' అన్నది ఆ దేవి.

**క. అనవుడు నతండు 'నీ వీ । దనుజేశ్వరుఁ బాయుటకుఁ గతం బేమి యొకో!'**
**యనిన విని లక్ష్మి 'సత్యం । బును ధర్మము దమము దానమును నా యిక్కల్. 402**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్న వెంటనే; అతండు= ఆ ఇంద్రుడు; నీవు+ఈ దనుజ+ఈశ్వరున్= నీవు ఈ రాక్షసరాజును; పాయుటకున్= విడుచుటకు; కతంబు+ఏమి+ఒకో!= కారణం ఏమిటో కదా!; అనినన్= అనగా; విని= ఆలకించి; లక్ష్మి= లక్ష్మీదేవి; సత్యంబును= నిజమూ; ధర్మము= న్యాయం - పుణ్యం; దమము= నిగ్రహం; దానమును= ఇచ్చుటా - ఈ నాలుగు గుణాలూ; నా+ఇక్కల్= నా నెలవులు - స్థానాలు.

**తాత్పర్యం:** ఇంద్రుడు శ్రీదేవిని 'నీవీ రాక్షసరాజును విడిచి వెడలుటకు కారణమేమిటి?' అని అడిగాడు. ఆ ప్రశ్న విన్న లక్ష్మి 'సత్యం, ధర్మం, దమం, దానం - అనే గుణాలు నాకు నెలవులు. అవి ఎక్కడ ఉంటే నేనూ అక్కడే ఉంటాను.

**విశేషం:** ఇది మహాభారతంలో లక్ష్మీదేవి పలుకు. ఆమె సత్యధర్మాలు, దాంతి దానాలూ తన నెలవులంటున్నది. అనంతరకాలాన వెలసిన కావ్యాలలో లక్ష్మి దూషితగా దుష్టవర్తనగా వర్ణితమై కనిపిస్తూ ఉన్నది (కాదంబరి కావ్యాన). అది కాలవ్యత్యాసం కావచ్చు.

**క. అవి గలిగి పరాక్రమయుతుఁ । డవు పురుషునిపాల నిలుతు నమరాధిప! యా**
**దివిజారి దొల్లి యట్టిఁడ । యవినీతత నిపుడు బ్రాహ్మణాసూయ మెయిన్. 403**

**ప్రతిపదార్థం:** అవి= ఆ నాలుగు గుణాలు; కలిగి= ఉండి; పరాక్రమయుతుఁడు+అవు= ప్రతాపంతో కూడినవాడైన; పురుషుని పాలన్= నరుడి దగ్గర; నిలుతున్= ఉండెదను; అమర+అధిప!= దేవతలరాజా!; ఆ దివిజ+అరి= ఆ దేవతల శత్రువు; అట్టిఁడు+అ=

అట్టివాడే - ఆ గుణాలూ- పరాక్రమమూ గలవాడే; ఇపుడు= ప్రస్తుత కాలాన; అవినీతతన్= అవినయంతో - వినయం లేనివానితనంతో; బ్రాహ్మణ+అసూయ మెయిన్= బ్రాహ్మణులయెడ ఓర్వలేనితనంతో.

**తాత్పర్యం:** ఓ దేవరాజా! ఆ నాలుగు గుణాలూ ఉండి, ప్రతాపవంతుడు కూడా అయిన పురుషుడిదగ్గర నేను నిలిచి ఉంటాను. ఆ బలిచక్రవర్తి పూర్వకాలాన అట్టివాడే. కాని, ప్రస్తుతకాలాన అతడు అవినయంతో, బ్రాహ్మణుల పట్ల, బ్రహ్మవిద్యాసంపన్నులయెడ అసూయతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **తొల్లిటి సచ్చారిత్రము । లెల్లను దిగవిడిచెఁ గాన యీతనికడ నే**
**నొల్ల నిలువ, వచ్చెద సుర । వల్లభ! నీ పాల నెలమి వసియింపంగన్.** **404**

**ప్రతిపదార్థం:** సురవల్లభ!= ఓ దేవతలరాజా!; తొల్లిటి= పూర్వపు; సత్+చారిత్రములు+ఎల్లను= మంచి నడతలను అన్నింటిని; దిగన్+విడిచెన్= దిగిపోయేటట్లు - వెడలిపోయే విధంగా వదలివేశాడు; కాన= కాబట్టి; ఈతని కడన్= ఈ బలి దగ్గర; నేన్+నిలువన్+ఒల్లన్= నేను నిలుచుటకు ఇష్టపడను; నీ పాలన్= నీ దగ్గర; ఎలమిన్= సంతోషంతో; వసియింపంగన్= నివసించటానికై; వచ్చెదన్= వస్తాను.

**తాత్పర్యం:** పూర్వపు ఆ మంచి నడతలు అన్నిటినీ ఈ బలి వదలివేశాడు. కాబట్టి ఇకపై ఈతడి దగ్గర ఉండనొల్లను. ఓ దేవరాజా! నీ దగ్గర సంతోషంతో నివసించటానికై వస్తాను.

**ఆ.** **ఆ గుణములు మఱియు నాగమోదిత సమా । చారములును గలిమిఁ గోరి యింద్ర!**
**నిన్నుఁ బొంది యేను నిల్చెద; నేమిట । నేమఱంగ వలవ దెపుడు నీవు.'** **405**

**ప్రతిపదార్థం:** ఇంద్ర!= ఓ దేవరాజా!; ఆ గుణములు= ఆ నేను చెప్పిన గుణగణాలూ; మఱియున్= ఇంకను; ఆగమ+ఉదిత సమ్+ఆచారములును= శాస్త్ర విహితమైన మంచి ధర్మాలును; కలిమిన్= ఉండటంవలన; నిన్నున్= నిన్ను; కోరి= ఇష్టపడి; పొంది= చెంది; ఏను= నేను; నిల్చెదన్= నిలుస్తాను - పోకుండా - నిలకడగా ఉంటాను; నీవు= దేవరాజువైన నీవు; ఎపుడున్= ఏ సమయాననైనా; ఏమిటన్= ఏ విషయాననైనా; ఏమఱంగన్+వలవదు= ఏమరి ఉండవద్దు- ప్రాల్మాలికతో పరాకుతో వ్యవహరించవద్దు.

**తాత్పర్యం:** ఇంద్రదేవా! నీలో నేను నుడివిన ఆ గుణాలతోపాటుగా, అదనంగా వేదశాస్త్ర విహితాలైన ధర్మాలను ఆచరించే సల్లక్షణం కూడా ఉన్నది. అందువలన నేను నిన్ను కోరి వరించి వచ్చి, నీ వద్ద నిలిచి ఉంటాను. అయితే నీవు కూడా ఎపుడూ ఏ విషయంలోనూ పరాకుపడకుండా నిత్యజాగరూకుడవై ఉండవలెను'.

**విశేషం:** లక్ష్మీనివాస మన్నది కొన్ని నియమ నిబంధనలకు లోబడి జరుగుతుంది. ఆ నియమనిబంధనలు పాటించినచోట శ్రీ తాండవిస్తుంది. వాటిని పారద్రోలిన చోటును సిరి దిగవిడిచి వెళ్ళుతుంది.

**వ.** **అని పలికె నిట్లు లక్ష్మి చేతం బరిత్యక్తుండైన బలి యాఖండలు నాలోకించి.** **406**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికెన్= చెప్పింది; ఇట్లు= ఈ ప్రకారంగా; లక్ష్మిచేతన్= శ్రీదేవి చేత; పరిత్యక్తుండు+ఐన బలి= విడువబడ్డ బలి; ఆఖండలున్= ఇంద్రుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** లక్ష్మి ఆ విధంగా పలికిన తరువాత, సిరి తొలగిన ఆ బలి ఇంద్రుడిని చూచి ఇట్లా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'అయనవశంబునఁ దేజో । వియుక్తుఁ డై రవి ప్రతాపవిరహితుఁ డగు నా**
**క్రియఁ బొనుఁగుపడినఁ బొంగకు; । జయింతు నిను దేవదనుజ సంగర మగుడున్. 407**

**ప్రతిపదార్థం:** రవి= సూర్యుడు; అయనవశంబునన్= ప్రయాణ (ఉత్తర - దక్షిణ దిక్కులకు ప్రయాణించటం) కారణాన; తేజస్+వియుక్తుఁడు+ఐ= కాంతిని వీడినవాడై; ప్రతాప విరహితుండు= వేడిమి లేనివాడు; అగున్= అవును; ఆ క్రియన్= ఆ విధంగా (నేను); పొనుఁగుపడినన్= నిస్తేజం కాగా - ప్రతాపం చెడగా; పొంగకు= సంతసించకు - ఉబ్బిపోకుము; దేవదనుజ సంగరము= దేవతల రాక్షసుల యుద్ధం; అగుడున్= అయినపుడు; నినున్= నిన్ను; జయింతున్= గెలుస్తాను.

**తాత్పర్యం:** 'సూర్యుడు తన ప్రయాణం కారణంగా తేజస్సు చెడి, వేడిమిని కోల్పోతాడు. ఆ విధంగా నేనూ ప్రస్తుతం నిస్తేజంగా ప్రతాపం తగ్గి ఉన్నానని ఉబ్బిపోకుము; దేవాసుర సంగ్రామం జరిగినప్పుడు నిన్ను నేను గెలుస్తాను'.

**వ. అనుటయు మహేంద్రుండు. 408**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; మహా+ఇంద్రుండు= ఇంద్రదేవుడు.

**తాత్పర్యం:** అని బలి అనగా, దేవేంద్రుడు.

**క. 'అది యట్టులుండె నీతోఁ । బదరం బని లేదు నాకుఁ బద్మభవుని మా**
**ట దలంపవలయు నీపై । భిదురం బిడ దనుజనాథ! ప్రియ మందు మెదన్.' 409**

**ప్రతిపదార్థం:** దనుజనాథ!= రాక్షసరాజా!; అది= నీవు నన్ను జయించబోయే విషయం; అట్టులు+ఉండెన్= ఆ విధంగా ఉండనిమ్ము - ఒక ప్రక్కన ఉండనిమ్ము; నీతోన్= బలివైన నీతో; పదరన్= వాగగా - వ్యర్థభాషణ చేయగా; పని లేదు= అవసరం లేదు; నాకున్= దేవరాజునైన నాకు; పద్మభవునిమాట= బ్రహ్మదేవుడి పలుకు - వధించటం ఉచితం కాదు అనేది; తలంపన్+వలయున్= స్మరించవలసి ఉన్నది; నీపైన్= నీ మీద; భిదురంబు= వజ్రాయుధం; ఇడన్= వేయను - ప్రయోగించను; ఎదన్= మనస్సున; ప్రియము+అందుము= ప్రీతిని పొందుము.

**తాత్పర్యం:** 'సరి, భవిష్యత్తులో నీవు నన్ను గెలిచే విషయం అట్లా ఉండనిమ్ము. ప్రస్తుతం నేను నీతో వ్యర్థప్రసంగం చేయ పనిలేదు. నేను బ్రహ్మదేవుడికిచ్చిన మాటను పాటించవలసి ఉన్నది. ఓ రాక్షసరాజా! నీ మీద నేను వజ్రాయుధాన్ని వేయను. నీవు మనస్సున ప్రీతిని వహించుము'.

**క. అనిన విని యొండు పలుకక । దనుజాధీశ్వరుఁడు వోయె దక్షిణ దిశకుం;**
**జనియె నుదఙ్ముఖుఁడై దివి । కనిమిష నాథుండు గౌరవాన్వయముఖ్యా! 410**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; కౌరవ+అన్వయ ముఖ్యా!= ధర్మరాజా!; దనుజ+అధి+ఈశ్వరుండు= రాక్షసుల అధిపతి - బలి; ఒండు+పలుకక= ఒకటీ అనక - నిశ్శబ్దంగా; దక్షిణదిశకున్= దక్షిణదిక్కునకు; పోయెన్= పోయాడు; అనిమిష నాథుండు= రెప్పపాటులేనివారి రాజు - దేవేంద్రుడు; ఉదక్+ముఖుఁడు+ఐ= ఉత్తరమునకు ముఖంకలవాడై - ఉత్తర దిశగా; దివికిన్= స్వర్గానికి; చనియెన్= వెళ్ళెను.

**తాత్పర్యం:** ఇంద్రుడి ఆ మాటలు ఆలకించిన బలి, మరి మారుమాటాడకుండా, దక్షిణదిశకు వెడలిపోయాడు. ఇంద్రుడు కూడా ఉత్తరాభిముఖంగా కదలి, స్వర్గానికి వెళ్ళిపోయాడు ధర్మరాజా!' (అని భీష్ముడు ఈ వృత్తాంతాన్ని ముగించాడు.)

**వ. అని చెప్పి యనిమిషనదీనందనుండు వెండియుఁ బాండవాగ్రజున కిట్లను 'నింద్ర నముచి సంవాదం బను నితిహాసంబు హృదయప్రసాదకరంబు; దాని నాకర్ణింపుము. 411**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; అనిమిష నదీ నందనుండు= దేవతల నది కొడుకు - భీష్ముడు; వెండియున్= ఇంకను; పాండవ+అగ్రజునకున్= పాండవులలో మొదటివాడితో - ధర్మరాజుతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ఇంద్ర నముచి సంవాదంబు+అను= ఇంద్ర నముచుల సంవాదం అనే పేరుగల; ఇతిహాసంబు= వృత్తాంతం - జరిగిన కథ; హృదయ ప్రసాదకరంబు= మనస్సున నిర్మలత్వమును కలిగించేది; దానిని= ఆ ఇతిహాసాన్ని; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇంద్ర బలి సంవాదాన్ని వినిపించిన భీష్ముడు ధర్మరాజుతో 'ఇంద్ర - నముచి సంవాదం అనే మరొక ఇతిహాసమున్నది. అది మనస్సున కలతదీర్చి ఊరట కలిగిస్తుంది. దానిని విను'మంటూ ప్రారంభించాడు.

**ఇంద్ర నముచి సంవాద ప్రకారము (సం. 12-219-1,2)**

**సీ. 'సిరిఁ బాసియును నొక్క చింతయు లేక వీ । చుల క్రం దడంగిన జలధివోలె**
**నముచి యేకాంతస్థలమున నుండఁగ నింద్రుఁ । డచటికి నేతెంచి యతనిఁ జూచి**
**'పేదవడ్డాఁడవు ప్రియజనంబును బరి । వారంబు లే దియ్యవస్థ కెంత**
**వగచెదవో దానవశ్రేష్ఠ!' నావుడు । నాతండు 'వగపు నిరర్థకంబు**

**తే. వలయు వస్తువు వగచిన వచ్చునయ్య? । రామి యొక్కటియే శరీరంబు నెదయుఁ**
**దాపమునఁ బొందు వగపున ధర్మ మేదు; । నింత యెఱుఁగుదు వగవ నే నేమిటికిని. 412**

**ప్రతిపదార్థం:** నముచి= ఆ పేరుగల ఒక రాక్షసుడు; సిరిన్+పాసియును= లక్ష్మిని కోల్పోయికూడా; ఒక్క చింతయున్ లేక= ఒక విచారమూ లేకుండా; వీచుల క్రందు= అలల అలజడి; అడంగిన= అణగిన - మానిన; జలధి+పోలెన్= సముద్రంవలె; ఏక+అంతస్థలమునన్= ఒంటరి ప్రదేశాన - ఇతరు లెవరూ లేనిచోట; ఉండంగన్= వసించగా; ఇంద్రుఁడు= దేవతల రాజు; అచటికిన్+ఏతెంచి= ఆ చోటికి వచ్చి; అతనిన్+చూచి= ఆ నముచి దానవుడిని కనుగొని; పేద+పడ్డాఁడవు= పేదపడినవాడవు - లేనివాడ వైనావు; ప్రియజనంబును= ఇష్టమైన బంధుమిత్రులును; పరివారంబు= బలగం; లేదు; ఈ+అవస్థకున్= ఈ స్థితికి; ఎంత వగచెదవో?= ఎంతగా దుఃఖిస్తావో?; దానవశ్రేష్ఠ!= రాక్షసులలో ఉత్తముడా!; నావుడున్= అన్న వెంటనే; ఆతండు= ఆ నముచి; వగపు= దుఃఖం; నిర్+అర్థకంబు= నిష్ప్రయోజనం - వ్యర్థం; వలయువస్తువు= కావలసిన పదార్థం; వగచినన్= దుఃఖిస్తే; వచ్చును+అయ్య?= వస్తుందటయ్యా? (రాదు) పైగా; రామి= రాకపోవటం; ఒక్కటి+ఏ= ఒక్కటైనా; శరీరంబున్= దేహమూ; ఎదయున్= మనస్సూ; తాపమునన్= బాధవలన; పొందు= పొందే; వగపునన్= దుఃఖంవలన; ధర్మము+ఏదున్= ధర్మం నశిస్తుంది; ఇంత= ఇది అంతా; ఎఱుఁగుదున్= గ్రహించాను; నేను= జ్ఞానినైన నేను; ఏమిటికిని= దేనికి కూడా; వగవను= దుఃఖించను.

**తాత్పర్యం:** నముచి అనే రాక్షసుడు సంపదలు నశించిపోయినా, చీకూచింతా లేకుండా అలల సందడి మానిన సముద్రుడివలె నిశ్చలంగా ఒక ఏకాంతస్థలాన ఆసీనుడై ఉండగా అక్కడికి ఇంద్రుడు చేరి అతడి అవస్థను చూచి, 'ఓ రాక్షసరాజా! పేదవాడివై ఉన్నావు; బంధుమిత్రులుగాని ఇతర పరివారాలుగాని లేరు. ఈ హీనస్థితికి ఎంతగా దుఃఖిస్తున్నావో కదా!' అని ఓదార్చబోయాడు. అయితే నముచి మాత్రం 'వగపు నిష్ప్రయోజనం, వగచినంతమాత్రాన వలసిన పదార్థం వస్తుందటయ్యా? రాకపోవటమేకాక, శరీరానికీ మనస్సుకూ సంతాపం కూడా ఆ వగపువలన కలుగుతుంది. అంతేగాదు, వగపువలన ధర్మహానీ కలుగుతుంది. ఇదంతా గ్రహించినవాడను కాబట్టి నేను దేనికీ దుఃఖించను'.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు । గాదె! యొక్కరుఁ డాతని కల్పనమునఁ**
**బ్రాప్తమైనది నీళులు పల్లమునకు । వచ్చు క్రియఁ దాన వచ్చు గీర్వాణముఖ్య! 413**

**ప్రతిపదార్థం:** గీర్వాణముఖ్య!= దేవతలరాజా!; సకలభూతంబులకును= ఎల్లప్రాణులకును; శాసకుఁడు= ఏలిక - అధిపతి; కలఁడు+కాదె!= ఉన్నాడు కదా!; ఒక్కరుఁడు= ఒకడు; ఆతని కల్పనమునన్= ఆ శాసకుడి ఏర్పాటువలన; ప్రాప్తము+ఐనది; లభించినట్టిది; నీళులు= నీరములు; పల్లమునకున్= పల్లమైన ప్రదేశానికి; వచ్చుక్రియన్= వచ్చే విధంగా; తాను+అ= తానే - స్వయంగా; వచ్చున్= చేరును.

**తాత్పర్యం:** ఓ దేవతలరాజా! సృష్టిలో ఎల్లప్రాణులకూ ఏలిక ఒక డున్నాడు కదా! అతడి ఏర్పాటు ప్రకారం ఏ ప్రాణికి ఏది ఎప్పుడు లభించాలో, ఆ ప్రాణికి అది అప్పుడు, నీళ్ళు పల్లానికి ప్రాకివచ్చినంత సులభంగా ప్రయత్న రహితంగా వచ్చి చేరుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **ఇది నా కయ్యెం; గాఁగల । యది యై యను గాఢనిశ్చయం బెవ్వని నె**
**మ్మదిఁ గలుగు నుబ్బు వగ సం । పద యాపద గలుగ వట్టి భవ్యున కింద్రా! 414**

**ప్రతిపదార్థం:** ఇంద్రా!= ఓ దేవరాజా!; ఎవ్వని నెఱ+మదిన్= ఏ నరుడి నిండు మనస్సులో; కాఁగల+అది+ఐ= కావలసి ఉన్నదై- ఏర్పడి ఉన్నదై; ఇది= ఈ పని- సంఘటన; నాకున్+అయ్యెన్= నాకు అయింది- జరిగింది; అను గాఢ నిశ్చయంబు= అనే గట్టి నిర్ణయం; కలుగున్= ఉండునో; అట్టి భవ్యునకున్= అట్టి శుభకరుడికి - యోగ్యుడికి; ఉబ్బు= సంతోషాతిరేకం; వగ= దుఃఖం; సంపద= కలిమి - సంపత్తి; ఆపద= విపత్తు - కష్టము; కలుగవు= ఉండవు - ఏర్పడవు.

**తాత్పర్యం:** ఇది ఈ విధంగా కావలసి ఉన్నదే, నాకు అయినది నాకు జరిగినది, ఇది జరగవలసి ఉండే జరిగింది. అనే గట్టి నిశ్చయంగల యోగ్యుడికి ఇక ఆనందం, దుఃఖం, సంపత్తి విపత్తివంటి ద్వంద్వాలు ఉండవు.

**క.** **ధైర్యంబున వీర్యంబున । శౌర్యంబునఁ బ్రజ్ఞఁ బడయఁ జాలునె నరుఁ డె**
**క్కార్యము నప్రాప్యమయిన? । నార్యుం డది యెఱుఁగుఁ గాన యడలఁడు శక్రా! 415**

**ప్రతిపదార్థం:** శక్రా!= ఓ ఇంద్రుడా!; నరుఁడు= మానవుడు; ఏ+కార్యమున్= ఏ పనినైనా; అప్రాప్యము+అయినన్= పొందరానిది అయితే; ధైర్యంబునన్= ధీరగుణంతో; వీర్యంబునన్= వీరభావంతో; శౌర్యంబునన్= శూరభావంతో - ధైర్యపరాక్రమాలతో; ప్రజ్ఞన్= బుద్ధిబలంతో; పడయున్+చాలునె?= పొందగలడా? (పొందలేడు); ఆర్యుండు= సజ్జనుడు; అది= ఆ విషయం; ఎఱుఁగున్+కానన్= తెలియును కాబట్టి; అడలఁడు= భయపడడు.

**తాత్పర్యం:** ఓ దేవరాజా! ఒక కార్యం అలభ్యమని దైవం నిర్ణయించి ఉంటే, ఇక దానిని నరుడు తన ధైర్య శౌర్యాలతోగాని, పరాక్రమశక్తితోగాని, కాదంటే బుద్ధిబలంతోగాని పొందగలడా? పొందనే లేడు. ఆ విషయం సుజనుడు గ్రహించి ఉంటాడు కాబట్టి, అతడికి భయ ముండదు. అత డెవరికీ భయపడడు.

**తే.** **మేలుఁ గీడును నరుఁ బొందుఁ గాలముల న । వశ్యమును వానిఁ గోరిన వచ్చుటయును**
**వినుము త్రోచినఁ బోవుటయును సురేంద్ర! । కలదె వానికిఁ? గావున వలదు చింత.' 416**

**ప్రతిపదార్థం:** సుర+ఇంద్ర!= దేవతలరాజా!; మేలున్+కీడును= శుభమూ, అశుభమూ; కాలములన్= ఆయా సమయాలలో; అవశ్యమును= తప్పకుండ; నరున్= మానవుడిని; పొందున్= చెందుతాయి; వానిన్= ఆ మేలు కీళ్ళను; కోరినన్+వచ్చుటయును= కోరితే రావటమూ; త్రోచినన్+పోవుటయును= త్రోసివేస్తే పోవటమూ; వానికిన్= ఆ మేలు కీడులకు; కలదు+ఎ?= ఉన్నదా? (లేదు); కావున= కాబట్టి; చింత వలదు= విచారం - వగపు వద్దు; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** ఓ దేవరాజా! జీవితంలో మేలు, కీడు అనేవి కాలవశాన తప్పకుండా నరుడిని చేరేవే తప్ప, కోరితే వచ్చేవీ, త్రోసివేస్తే తొలగి పోయేవీ అవుతాయా? కావు. కాబట్టి ఆ మేలు, కీడుల విషయమై చింతించటం పనికిరాదు. వినుము'.

**క. అని యిట్లు నముచి పలికిన । విని మెచ్చుచు దివికి నమరవిభుఁ డరిగెం; బా**
**వనచరిత! యింకనెయ్యది । వినవల తనవుడును భరితవినయుండగుచున్. 417**

**ప్రతిపదార్థం:** పావన చరిత!= పవిత్రమైన నడతగల ఓ ధర్మరాజా!;అని= పై విధంగా; ఇట్లు= ఈ ప్రకారం; నముచి= నముచిదనుజుడు; పలికినన్= చెప్పగా; విని= ఆలకించి; మెచ్చుచున్= మెచ్చుకొంటూ; అమరవిభుఁడు= దేవేంద్రుడు; దివికిన్ అరిగెన్= స్వర్గానికి వెళ్ళాడు; ఇంకన్= ఇంకనూ; ఏ+అది= ఏది; వినన్+వలతు(వు)?= వినటానికి కోరుతున్నావు?; అనవుడున్= (అని భీష్ముడు) అన్న తరువాత; భరిత వినయుండు+అగుచున్= నిండిన వినయము కలవాడు అవుతూ.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా నముచి పలుకగా విన్న దేవేంద్రుడు నముచి పలుకులను మెచ్చికొంటూ తాను స్వర్గానికి వెడలిపోయాడు. ఓ పవిత్రచరిత్రగల ధర్మరాజా! నీవు ఇకపై ఏమి వినాలని నిరీక్షిస్తున్నావు - అని భీష్ముడు అనగా అణకువతో నిండినవాడై (ధర్మరాజు).

**క. ఆ నరపతి శాంతనవుని । తో నిట్లను 'నెద్దియేని దుర్దశ యైనన్**
**మానవుఁ డెట్టిఁ డగుట మే । లానతియీవే? దయామయా! తేటపడన్.' 418**

**ప్రతిపదార్థం:** ఆ నరపతి= ఆ రాజు - ఆ ధర్మరాజు; శాంతనవునితోన్= శంతను తనయుడితో - భీష్ముడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; ఎద్ది+ఏని= ఏదైనా; దుర్+దశ+ఐనన్= చెడ్డ అవస్థ కలిగితే; మానవుఁడు= నరుడు; ఎట్టిఁడు+అగుట= ఎటువంటివాడు కావటం - ఏ విధంగా ప్రవర్తించటం; మేలు?= ఉత్తమం?; దయామయా!= దయతో నిండిన ఓ భీష్మాచార్యా!; తేటపడన్= స్పష్టంగా; ఆనతి+ఈవే?= సెలవీయవా? - ఉపదేశించవా?

**తాత్పర్యం:** ధర్మరాజు పితామహుడితో 'ఏదైనా చెడ్డ అవస్థ నరుడికి కలిగినపుడు అతడు ఎట్లాంటివాడు కావాలి? ఏ విధంగా ప్రవర్తించి ఆ దుర్దశను దాటగలగాలి? ఆజ్ఞాపించు'మని అర్థించాడు.

**వ. అని యడిగిన నయ్యుధిష్ఠిరునకు బుధశ్రేష్ఠుం డిట్లనియె. 419**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= ధర్మరాజు ఆ విధంగా అడగగా; ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజునకు; బుధశ్రేష్ఠుండు= పండిత ఉత్తముడు - భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అడుగగా భీష్ముడు ధర్మజుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'ఏ విధమున దుర్దశలకు । భూవర! ధైర్యంబ మందు; భూరిధృతిమెయిం**
**జేవ గలుగు దృఢనిశ్చయ । భావము నెవ్వగలఁ దొట్రువడ దెబ్బంగిన్. 420**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా!; ఏ విధమునన్= ఏ ప్రకారంగానైనా; దుర్+దశలకున్= దురవస్థలకు - చెడు స్థితిగతులకు; ధైర్యంబు+అ= ధైర్యమే ధీర స్వభావమే; మందు= ఔషధం - ప్రతీకారం; భూరి ధృతిమెయిన్= గొప్ప ధైర్యంతో; చేవ+కలుగు= బలంగల; దృఢనిశ్చయ భావము= గట్టి నిర్ణయంగల మనస్సు; ఏ భంగిన్= ఏ విధంగానూ; నెఱ+వగలన్= నిండు దుఃఖాలతో; తొట్రు+పడదు= చలించదు - కదలిపోదు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! దురవస్థలు ఏ విధమైనవైనా ఆ అన్నిటికీ ఒక్క ధైర్యమే ఔషధం. గొప్ప ధైర్యంతో చేవగల గట్టి నిర్ణయం తీసికొన్న మనస్సు ఎటువంటి నిండు శోకాలలోనైనా, దుఃఖాలలోనైనా చలించకుండా నిలుస్తుంది. ఆ కష్టనష్టాలను అతిక్రమిస్తుంది.

**క. ధృతి యారోగ్యము నొసఁగును; । ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు; ధృతి గీర్తి సము**
**న్నతిఁ జేయుఁ; గాలగత్యవ । గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా! 421**

**ప్రతిపదార్థం:** వికారవిదూరా!= వికృతులకు - మానసిక బలహీనతలకు మిక్కిలి దూరమైనవాడా! - ధర్మరాజా!; ధృతి= ధైర్యం; ఆరోగ్యమున్= రోగంలేని శరీరస్థితిని; ఒసఁగును= ఇస్తుంది; ధృతి= ధైర్యం; ఉత్+జ్వల లక్ష్మిన్= ప్రకాశించే సిరిని; తెచ్చున్= తీసికొనివస్తుంది; ధృతి= ధైర్యం; కీర్తి సమ్+ఉన్నతిన్= యశస్సుయొక్క మంచి ఔన్నత్యమును - పెరుగుదలను; చేయున్= కలిగిస్తుంది; కాలగతి+అవగతి= కాలముయొక్క నడకను గూర్చిన జ్ఞానం; కలిగినన్= ఏర్పడితే; ధృతి= ధీరగుణం; కలుగున్= ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** మనోవికృతులకు దూరమైన ఓ ధర్మరాజా! ధైర్యం ఆరోగ్యాన్ని ఇస్తుంది. ధీరగుణం ప్రకాశించే సిరులు కురిపిస్తుంది. ధీరస్వభావం యశస్సును ఉన్నతంగా పెంచుతుంది. అయితే ఆ ధైర్యం కలగాలి - అంటే నరుడికి కాలపునడకను గూర్చిన జ్ఞానం ముందు కలగాలి.

**విశేషం:** ధైర్యం మానసిక లక్షణం. ఆరోగ్యం శరీర సంబంధి. అయినా ఆ మనోలక్షణం శరీరాన ఆరోగ్యాన్ని కలిగిస్తుంది అంటున్నాడు భారతకర్త. నిజమే మనఃప్రభావం శరీరంమీద పడటం సహజమైన వాస్తవమైన, విషయం. ఆధునిక వైద్యశాస్త్రమూ ఈ అంశాన్ని అంగీకరిస్తుందని తద్జ్ఞుల కథనం.

### ఇంద్ర బలి సంవాద ప్రకారము (సం. 12-220-6)

**వ. ఏ తద్విషయం బైన యది యొక్కటి యింద్ర బలి సంవాదం బను నితిహాసంబు గల; దాకర్ణింపుము. దేవాసురులకు సమరంబు సెల్లిన నందు విష్ణుని మహానుభావంబున దేవతలకు గెలుపై రుద్రాదిత్య మరుద్వసు గంధర్వ సిద్ధాదులు పరివేష్టింప నింద్రుం డైరావతారూఢుండై లీలం ద్రైలోక్యంబును జరించుచుండి యొకప్పుడు సముద్రోపాంతంబున నొక్క గిరిగహ్వరంబున యంగణంబున వైరోచనుం డగు బలిం గని చేరం జని యద్దనుజపతి దన్నుం జూచి నిస్సంభ్రముండును వైమనస్యరహితుండును నై యునికి నిరూపించి, యతనితో నిట్లనియె. 422**

**ప్రతిపదార్థం:** ఏతద్+విషయంబు+ఐన+అది= ఈ విషయానికి చెందింది; ఒక్కటి= ఒక; ఇంద్రబలి సంవాదంబు+అను= ఇంద్రుడి యొక్క బలియొక్క సంభాషణం అనే; ఇతిహాసంబు= వృత్తాంతం; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము; దేవ+అసురులకున్= దేవతలకు రాక్షసులకును; సమరంబు= యుద్ధం; చెల్లినన్= ముగియగా; అందున్= ఆ యుద్ధాన; విష్ణుని మహా+అనుభావంబునన్=

నారాయణుడి గొప్పతనం వలన; దేవతలకున్= సురలకు; గెలుపు+ఐ= జయం కలిగి; రుద్ర+ఆదిత్య మరుత్+వసు గంధర్వ సిద్ధ+ఆదులు= రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, వసువులు, గంధర్వులు, సిద్ధులు మొదలయినవారు (వీరందరూ దేవజాతి విశేషాలు); పరివేష్టింపన్= చుట్టిరాగా; ఇంద్రుండు= దేవరాజు; ఐరావత+ఆరూఢుండు+ఐ= ఐరావతమును (తెల్లని ఏనుగు - ఇంద్రుడి వాహనం) ఎక్కినవాడై; లీలన్= విలాసంగా; త్రైలోక్యంబును= ముల్లోకాలను; చరించుచున్+ఉండి= తిరుగుతూ ఉండి; ఒకప్పుడు= ఒక సమయాన; సముద్ర+ఉప+అంతంబునన్= సముద్రపు సమీపాన; ఒక్క గిరిగహ్వరంబునన్= ఒక కొండగుహలో; అంగణంబునన్= ముంగిలియందు; వైరోచనుండు+అగు= విరోచనుడి తనయుడగు; బలిన్= బలి (చక్రవర్తి)ని; కని= చూచి; చేరన్+చని= సమీపించి; ఆ+దనుజపతి= ఆ రాక్షసరాజు; తన్నున్+చూచి= తనను కనుగొని; నిస్+సంభ్రముండును= తొట్రుపాటు లేనివాడును; వైమనస్య రహితుండును= మనస్సు చెడినవానితనంలేనివాడును; ఐ+ఉనికి= అయి ఉండటం; నిరూపించి= గట్టిగా గ్రహించి; అతనితోన్= ఆ బలితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విషయానికి చెందిన వృత్తాంత మొకటి ఇంద్ర బలి సంవాదం అనే పేరుతో ఉన్నది. దానిని వినుము. దేవాసురులకు యుద్ధం ముగిసిపోగా, దానిలో నారాయణుడి ప్రాభవంతో దేవతలకు గెలుపు కలిగింది. అనంతరం ఇంద్రుడు దేవతాపరివారమైన రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, వసువులు, గంధర్వులు, సిద్ధులు మొదలయినవారు చుట్టిరాగా ఐరావతాన్ని అధిరోహించి విలాసంగా మూడులోకాలూ సంచరిస్తూ ఒకనాడు సముద్రపు సమీపంలో, ఒక కొండ గుహ ముంగిట విరోచనుడి తనయుడైన బలిని చూచాడు. చూచి, అతడి దగ్గరకువెళ్ళి, ఆ రాక్షసరాజు తనను చూచి ఏ పాటి తొట్రుపాటూ, మనస్సులో కలతా లేనివాడై ఉండటం గమనించి, అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'హీనస్థానమున విభవ । హీనత నిట్లుండి రిపుల యెలమిఁ గనియు నీ**
**మానసమున శోకింపమి । దానవకులనాథ! యెవ్విధంబునఁ గలిగెన్? 423**

**ప్రతిపదార్థం:** దానవకులనాథ!= ఓ రాక్షసవంశరాజా! - బలీ!; హీనస్థానమునన్= హీనమగుచోట; విభవహీనతన్= ఐశ్వర్యపు లేమితో; ఇట్లు+ఉండి= ఈ విధంగా జీవిస్తూ; రిపుల+ఎలమిన్= శత్రువుల అభివృద్ధిని; కనియున్= చూచికూడా; నీ మానసమునన్= నీ మనస్సునందు; శోకింపమి= దుఃఖింపకుండటం; ఏ+విధంబునన్= ఏ ప్రకారంతో - ఏ పద్ధతితో; కలిగెన్?= ఏర్పడింది?

**తాత్పర్యం:** ఓ రాక్షసరాజా! తక్కువస్థితిలో ఉన్నావు, ఐశ్వర్యం కోల్పోయి ఉన్నావు, శత్రువుల వికాసాన్ని చూచావు. అయినా నీ మనస్సులో శోకం కలుగలేదు. ఎందువలన? ఇది - ఈ నిర్వికారస్థితి నీకు ఏ విధంగా సిద్ధించింది?

**ఆ. శౌర్యముననొ వృద్ధసంసేవ వలననొ । తపముననొ యుదాత్తతా నిరూఢి**
**గలిగి మమ్ము సరకుగాఁ గొన కున్నాఁడ । వేమి కతము? దీని నెఱుఁగఁ జెపుము!' 424**

**ప్రతిపదార్థం:** శౌర్యముననొ= శూరగుణంవలననో; వృద్ధసంసేవవలనన్+ఒ= పెద్దల పరిచర్య వలననో; తపమునన్+ఒ= తపస్సు వలననో; ఉదాత్తతా నిరూఢి+కలిగి= గొప్పదనపు గట్టితనం కలిగి; మమ్మున్= దేవతల రాజులమైన మమ్మును కూడా; సరకుగాన్+కొనక+ఉన్నాఁడవు= లక్ష్యపెట్టకుండా ఉన్నావు; కతము ఏమి?= కారణం ఏమిటి? దీనిన్= ఈ కారణాన్ని; ఎఱుఁగన్+చెపుము+అ!= తెలిసేటట్లుగా పలుకవే!

**తాత్పర్యం:** ఓ బలీ! నీవు శూరభావంవలననో, కాక పెద్దల పరిచర్యల ఫలితంగానో, అటుకాక తపశ్శక్తివలననో ఉదాత్తతను సంపాదించి, నీ ఎదుట నిలిచిన దేవేంద్రులమైన మమ్ము సరకుజేయక ఉన్నావు. కారణ మేమిటి? విశదంగా వివరించుము'.

**విశేషం:** ఉదాత్తత అనే గొప్ప లక్షణం మొత్తం వ్యక్తిత్వానికి సంబంధించింది. నరుడి చూపులో, మాటలో, ప్రవృత్తిలో, క్రియలో ప్రతి కదలికలోనూ అది వ్యక్తమౌతూ ఉంటుంది. ఆ ఉదాత్తతవలననే సామాన్యులు మాన్యులుగా, వక్తలు ప్రవక్తలుగా, పురుషులు పురుషోత్తములుగా మారి మానవ సమాజాలను నడిపించారు.

**వ. అనిన విని బలి యతని కిట్లనియె. 425**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; బలి= బలిదానవరాజు; అతనికిన్= ఆ దేవరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడి ప్రశ్నకు బలి ఇట్లా సమాధానం ఇచ్చాడు.

**ఆ. 'సరకు సేయ వను చసడ్డమాటలు గొన్ని । యాడినంత నేమియయ్యె నింద్ర!**
**నీదుశక్తి వింతయే దైవవశమున । నెట్టిపాటివారు నెట్లుఁ గారె? 426**

**ప్రతిపదార్థం:** ఇంద్ర!= ఓయీ ఇంద్రుడా!; సరకు+చేయవు+అనుచున్= లక్ష్యపెట్టవు అంటూ; అసడ్డమాటలు+కొన్ని= అశ్రద్ధ - నిర్లక్ష్య భావంతోడి పలుకులు కొన్ని; ఆడిన+అంతన్= పలికినంత మాత్రాన; ఏమి+అయ్యెన్= ఏమి అయింది? (ఏమీ కాదు); నీదు శక్తి= నీ శక్తి; వింత+ఏ= ఆశ్చర్యకరమా? కాదు; దైవవశమునన్= విధివశాన - విధాత చేష్టలవలన; ఎట్టిపాటివారున్= ఏ విధమైన గొప్పదనం కలవారు కూడా; ఎట్లున్+కారె?= ఏ విధంగానో - ఏ పాటి గొప్పదనమూ లేనివారుగా కారా?

**తాత్పర్యం:** 'ఓయీ ఇంద్రదేవా! నీవు పలికిన 'సరకుచేయవు' వంటి మాటలు అశ్రద్ధతో నిర్లక్ష్యభావంతో కూడినవి. ఆ పలుకులవలన ప్రయోజన మేమిటి? నీశక్తిసామర్థ్యాలు ఆశ్చర్యకరాలు గావు. అది తెలిసిన విషయమే. విధిచేష్టలవలన ఏపాటివారికైనా అపుడపుడు హైన్యదైన్యాలు తప్పవు.

**క. నీవు మును హీనుఁ డగుటయు । నా వలనం గాదు; నీకు నను హీనదశా**
**భావితునిఁ జేయరా దివి । దైవకృతము; లట్లుగాన ధైర్యము వలయున్. 427**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; నీవు= దేవతల రాజువైన నీవు; హీనుఁడు+అగుటయున్= తక్కువవాడవు కావటం, నేను దండెత్తినపుడు రాజ్యం కోల్పోయి ఇక్కట్లపాలు కావటం; నావలనన్+కాదు= నా శక్తివలన కాదు; (అట్లే); నీకున్= నీకు కూడా; ననున్= రాక్షసరాజునైన నన్ను; హీనదశాభావితునిన్= తక్కువదనమును పొందిన వాడినిగా - రాజ్యభ్రంశాది కష్టాలపాల బడినవాడినిగా; చేయన్+రాదు= చేయ శక్తి చాలదు; ఇవి= ఈ కష్టనష్టాలు - పూర్వం నీకు, ఇపుడు నాకు జరిగినవి; దైవకృత్యములు= విధి చేష్టితములు; అట్లు+కాన= అ ట్లగుటను బట్టి - ఆ కారణాన; ధైర్యము= ధీరలక్షణం; వలయున్= కావలయును.

**తాత్పర్యం:** ఇంద్రా! పూర్వం నేను దండెత్తివచ్చినప్పుడు నీవు రాజ్యభ్రష్టుడవై హీనతను పొందావు. అయితే నిజానికి అది నావలన జరిగినది కాదు. ఆ విధంగానే నేడు నేను రాజ్యం కోల్పోయి దైన్యంతో ఉన్నట్లు అగుపిస్తున్నాను. ఈ నా స్థితికి నీవు కారణం కాబోవు. ఇవి నీవలనా, నావలనా జరిగే, జరిగిన పనులుకావు. వీటికి కర్త విధి. కాబట్టి, విధి చేష్టలకు తిరుగులేదు - అనే జ్ఞానంతో నరుడు ధైర్యం కలిగి ఉండాలి.

**క. విను పర్యాయంబున సుఖ । మును దుఃఖముఁ జెందు జనులఁ బురుషుఁడు ధైర్యం**
**బున గర్వంబు విషాదం । బు నడంగింపఁ దగునండ్రు బుధు లది వినమే? 428**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము ఇంద్రా!; జనులన్= నరులను; పర్యాయంబునన్= క్రమంగా - వంతు ప్రకారంగా; సుఖమును= సౌఖ్యమూ; దుఃఖమున్= విషాదమూ; చెందున్= పొందుతాయి; (కాబట్టి) బుధులు= పండితులు; పురుషుఁడు= నరుడు; ధైర్యంబునన్= ధీరగుణంతో; గర్వంబు= పొగరు - పొంగిపోవటం (సుఖం కలిగినపుడు); విషాదంబున్= దుఃఖమును (కష్టం కలిగినపుడు); అడంగింపన్+తగును= అణచటం ఉచితం; అంద్రు= అంటారు; అది= ఆ మాట; వినము+ఏ= వినలేదా?

**తాత్పర్యం:** ఇంద్రా! ఆలకించుము, జీవితాన సుఖదుఃఖాలు క్రమంగా ఒకదాని తరువాత మరొకటిగా నరులను చెందుతూ ఉంటాయి. ఆ క్రమం తప్పించరానిది. కాబట్టి నరుడు ధైర్యంతో మెలుగుతూ, సుఖం కలిగినప్పుడు గర్వాన్నీ, దుఃఖం కలిగినపుడు విషాదాన్నీ ప్రకటించకుండా అణచుకొనవలసి ఉంటుంది - అని పండితులు పలుకుతారు. మనం ఆ మాట వినలేదా? విన్నాం కదా!

**క.** **చెలులుం జుట్టలును సహా । యులు విభవము పెం పకాలయుక్తి నవస్థం**
**దొలఁగించుట గలదె? మదిం । దెలిసి మనుము మనికి యిట్టిదియ కా దెపుడున్.** **429**

**ప్రతిపదార్థం:** చెలులున్= స్నేహితులూ; చుట్టలును= చుట్టములు పక్కములూ; సహాయులు= తోడ్పడేవారూ; విభవము= సంపద; పెంపు= అభివృద్ధి - ఇవన్నీ; అకాలయుక్తిన్= సరిగాని కాలంతోడి కలయికను; అవస్థన్= దశను - దుర్దశను; తొలఁగించుట= ప్రక్కకు తప్పించటం - దూరీకరించటం; కలదె?= ఉన్నదా? (లేదు); మదిన్= మనస్సునందు; తెలిసి= గ్రహించి; మనుము= జీవించుము; మనికి= జీవితం; ఎపుడున్= ఎల్లప్పుడూ; ఇట్టిది+అ= ఇటువంటిదే - ఒకే విధమైనది; కాదు= కాబోదు.

**తాత్పర్యం:** నరుడి మహర్దశకుగాని దుర్దశకుగాని దైవమొకటే కారణం గాని ఇతరులెవరూ కాజాలరు. స్నేహితులూ, చుట్టపక్కాలు, సహాయకులూ, సంపదలూ, సమృద్ధులూ - ఇటువంటివి ఎన్ని ఉన్నా, నరుడికి చెడుకాలం దాపురించినపుడు, దుర్దశ ఆవహించబోతున్నపుడు తొలగించజాలవు. ఈ విషయం మనస్సున గ్రహించి నరుడు జీవించాలి. జీవిత మెప్పుడూ ఈ విధంగానే ఏకరీతిలో కొనసాగదని గ్రహించి జీవించుము దేవరాజా!

**విశేషం:** పురుషకారం దైవం ముందు దిగదుడుపు అనే విషయం గ్రహించాలి నరుడు.

**క.** **నిను నే గెలుచుట కాలము । నన నీవును గాలయుక్తి నను గెలిచితి; గా**
**వున నశుభమునకు శుభమున । నకు గాలము సూవె కర్త కుశికతనూజా!** **430**

**ప్రతిపదార్థం:** కుశిక తనూజా!= ఓ కుశికుడి కుమారుడా! - ఇంద్రుడా!; నినున్= దేవతలరాజు వైన నిన్ను; నేన్= రాక్షసరాజునైన నేను; గెలుచుట= జయించటం; కాలముననన= కాలవశముననే; నీవును= నీవు కూడా; కాలయుక్తిన్= కాలముయొక్క కలయికతో- కాలం కలసిరాగా; ననున్+గెలిచితి(వి)= నన్ను జయించావు; కావునన్= కాబట్టి - మన జయాపజయాలు కాలాధీనాలు కాబట్టి; అశుభమునకున్= కీడునకు; శుభముననకున్= మేలునకును; కర్త - చేయునది; కాలము+చూవె= కాలం సుమా

**తాత్పర్యం:** పూర్వం దేవేంద్రుడ వైన నిన్ను రాక్షసరాజునైన నేను జయించాను. దానికి కర్త కాలమే తప్ప, నిజానికి నేను కాదు. ఆ విధంగానే నీవూ నన్ను గెలిచావు అనంతరకాలాన. దానికీ కర్త కాలమొక్కటే! నరుడికి వాటిల్లే శుభాశుభాలు రెండింటికీ కాల మొక్కటే కర్త తప్ప నరుడు కాబోడు.

**ఆ. నాకు నీకు నేల నాకేశ! శత్రుత్వ । మేరి కైనఁ గలదె యెందుఁ? బాక**
**మునకుఁ దెచ్చుచుండు జనులఁ గాలము వృక్ష । ఫల విధముగ రజ్జు పలుకు లుడుగు.' 431**

**ప్రతిపదార్థం:** నాక+ఈశ!= స్వర్గాధిపతీ! నాకున్+నీకున్= నాకూ, నీకూ; శత్రుత్వము+ఏల?= వైరం ఎందుకు?; ఎందున్= ఎక్కడనైననూ; ఏరికిన్+ఐనన్= ఎవరికైనా; కలదె?= ఉన్నదా? (శత్రుత్వం); కాలము= కాలం - కాలశక్తి; జనులన్= నరులను; వృక్షఫల విధముగన్= చెట్టుపండు రీతిగా - చెట్టున ఏర్పడిన కాయ పండైన విధాన; పాకమునకున్= పరిణతికి - పండే స్థితికి; తెచ్చుచున్+ఉండున్= తెస్తూ ఉంటుంది; రజ్జు పలుకులు= వ్యర్థ భాషణములు - కొరగాని పలుకులు; ఉడుగు(ము)= మానుము.

**తాత్పర్యం:** ఓ స్వర్గాధిపతీ! దేవేంద్రా! నీకూ నాకూ విరోధ మెందుకు? నీకూ నాకే కాదు, లోకాన ఎవరికైనా ఎక్కడైనా స్వతస్సిద్ధమైన వైరభావ మున్నదా! లేదు. అంతా కాలమహిమ! కాలమే నరులను పరిణతివైపు ప్రయాణింపజేస్తూ ఉంటుంది. చెట్టున పండిన కాయ పండుగా పరిణతిని కాలక్రమాన పొందినట్లుగానే నరుడూ పరిపాకంవైపు నడుస్తుంటాడు కాలప్రభావంవలన. అంతే తప్ప, నీవూ నేనూ కర్తలమనటం కొరగాని మాట. కాబట్టి వ్యర్థ భాషితాలు మానుము'.

**వ. అని చెప్పి యంత నిలువక. 432**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; చెప్పి= పలికి; అంతన్= అంతటితో; నిలువక= ఆగకుండా (బలి తన హితవచనాలు ముగించి, అంతటితో ఆగకుండా.)

**తాత్పర్యం:** బలి ఇంకా తన భాషణాన్ని ఇట్లా సాగించాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'కా దిది విక్రమకాలము । లే దిప్పుడు నాకు నలుక లీలాత్మక రో**
**షాదరము గలిగినను నిను । నీ దగు పరిజనముఁ గూల్పనే పెడసేతన్?' 433**

**ప్రతిపదార్థం:** ఇది= ఇపుడు నేనున్న ఈ సమయం; విక్రమకాలము= విక్రమించు పరాక్రమించే సమయం; కాదు= కాదు; ఇప్పుడు= ఈ సమయాన; నాకున్= నాకు - నీనుండి ఓటమిపొందిన నాకు; అలుక= కోపం; లేదు= కలుగదు; లీలా+ఆత్మక రోష+ఆదరము= వినోదాత్మకమైన - నిజం కాని క్రోధము నందు గౌరవం - ప్రీతి; కలిగినను= (నాలో) పుట్టినా; నినున్= నిన్నూ; నీది+అగు= నీకు చెందిన; పరిజనమున్= సేవక జనులను; పెడ+చేతన్= చేతి వెనుక భాగంతో; కూల్పనే?= నశింపజేయనా?

**తాత్పర్యం:** 'ఓ దేవేంద్రా! ఇపుడు నే నున్న ఈ కాలం పరాక్రమించటానికి అనువైనది కాదు. నాకు నీపై కోపమూ లేదు. అట్లాకాకుండా వినోదంకోసమైనా నాలో నీయెడ రోషావేశం జనించినా, నిన్నూ నీ తోడి జనాన్నీ నా పెడచేతితోనే కూల్చివేసేవాడను'.

**వ. అని పలికి వెండియు. 434**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; వెండియున్= మరియూ.

**తాత్పర్యం:** ఈ విధంగా పలికిన బలి, ఇంకా చెప్పుతున్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'సరి పెంపునఁ గడునొప్పెదు । సురనాయక! యిపుడు మీఁదఁ జూచెదు నీకుం**
**బరిభవము దెచ్చుటకునై । కరము వెసన్ వచ్చు చేటుకాలము తెఱఁగున్. 435**

**ప్రతిపదార్థం:** సురనాయక!= ఓ దేవతలరాజా!; సరిపెంపునన్= సమానమైన అభివృద్ధితో; కడున్+ఒప్పెదు= ఎక్కువగా ప్రకాశిస్తున్నావు; ఇపుడు= ఈ కాలాన - ఈ పెంపుగల సమయాన; మీఁదన్+చూచెదు= పైకి చూస్తున్నావు; నీకున్= నీకు కూడా (నాకువలెనే); పరిభవము= అవమానం; తెచ్చుటకున్+ఐ= తేవటంకొరకే; చేటుకాలము తెఱఁగున్= చెడుకాలం యొక్క పద్ధతి - చెడుకాలం; కరము= మిక్కిలి; వెసన్= వేగంగా; వచ్చున్= రాగలదు.

**తాత్పర్యం:** 'ఓ దేవతలరాజా! నేడు మంచి అభివృద్ధితో ఎంతగానో ఒప్పులకుప్పవై వెలుగుతున్నావు. పైకి చూస్తూ ఉన్నావు. గర్వించి, ఇతరులయెడ అనాదరంతో వెలుగుతున్నావు. కాని, చేటుకాలం నిన్ను అవమానించటంకొరకు మిక్కిలి వేగంతో సమీపించబోతూ ఉన్నది.

**తే. ఇంద్రు లెందఱు వో? రింద్రు లేల? బ్రహ్మ । లుండుదురె? తఱితోఁ దెగుచున్న వారు**
**గాక దానవసంఘంబు గాలవశతఁ । బొందు టేటికి నెగ్గింపఁ? బొమ్ము నీవు. 436**

**ప్రతిపదార్థం:** ఇంద్రులు= దేవతలరాజులు; ఎందరు+పోరు?= ఎంతమంది వెళ్ళిపోరు? - ఎందరో గతించారు; ఇంద్రులు+ఏల?= ఇంద్రులే ఎందుకు?; బ్రహ్మలు= ఇంద్రులకంటె పైవారయిన బ్రహ్మనామక దేవతలు మాత్రం - సృష్టికర్తగా చెల్లేవారు మాత్రం; ఉండుదురె?= ఉంటారా?; తఱితోన్= సమయంతో - కాలంతో; తెగుచున్+ఉన్నవారు+కాక= నశిస్తూ ఉన్నారు తప్ప; దానవసంఘంబు= రాక్షసుల సమాజం; కాలవశతన్= కాలానికి వశం అగుటను; పొందుట= చెందటం - కాలవశత్వాన్ని పొందుటను; ఎగ్గింపన్+ఏటికిన్?= నిందింప నేల?; నీవు= సురేంద్రుడ వైన నీవు; పొమ్ము= వెడలిపొమ్ము - వీడిపొమ్ము.

**తాత్పర్యం:** కాలప్రవాహంలో ఇంద్రులు ఎందరో గతించారు. ఇంద్రులే ఏమిటి? బ్రహ్మలు మాత్రం నిలుస్తారా? వారూ, తమ కాలం చెల్లిన వెంటనే నశించిపోతున్నారు. ఈ విధంగా కాలంముందు సృష్టికర్తలైన బ్రహ్మలకే స్వతంత్రమైన ఉనికి లేనప్పుడు, ఇక రాక్షససమాజ మేదో కాలానికి లొంగి ఉంటే, ఆ దశను చూచి వారిని నిందించటమెందుకు? ఓ దేవరాజా! నీవు వెళ్ళిపొమ్ము.

**క. క్రతువులు సేఁతయు, దేవ । వ్రతములు సల్పుటయు, వృత్తవంతుఁ డగుటయుం**
**గతమే కాలము ద్రోచుట? । కతర్క్యవర్తనము గాల మది గొనదు సుమీ!' 437**

**ప్రతిపదార్థం:** క్రతువులు= యజ్ఞాలు; చేఁతయున్= చేయటమూ; దేవవ్రతములు= దేవతలకై వ్రతాలు - పూజాపురస్కారాలు; చల్పుటయున్= చేయుటమూ; వృత్తవంతుఁడు+అగుటయున్= చరిత్ర (మంచినడత) కలవాడు కావటం; కాలము+త్రోచుటకున్= కాలం పడవేయుటకు - నెట్టివేయుటకు - హీనదశకు చేర్చుటకు; కతమే?= కారణమా? (కాదు); కాలము= క్షణాలు - గంటలు- దినాలు - వత్సరాలుగా సాగిపోయే సమయం; అతర్క్యవర్తనము= ఊహించరాని ప్రవర్తనంగలది - ఊహ కందని నడతగలది; అది= ఆ కాలం; కొనదు+చుమీ!= గ్రహించదు సుమా! (ఇక్కడ కర్మ పదం లేదు. 'దేనినీ' గ్రహించదు అని అనుకొనాలి).

**తాత్పర్యం:** యజ్ఞాలూ, వ్రతాలూ నిర్వహించటం, శీలవంతుడై జీవించటం వంటి విషయాలు కాలగతిని మార్చలేవు. కాలగతికి అవి కారణాలు కాజాలవు. కాలప్రవర్తన ఊహ కందనిది. కాలం దేనినీ సరకుగొనదు; అన్నీ దానికి లొంగవలసినవే కాని, అది దేనికీ లొంగేది కాదు'.

**క. అని యిట్లాడిన మాటలు । విని దనుజునిఁ జూచి యమరవిభుఁ డుల్లములో**
**నన సంరంభంబు నుడిపి । కొనుచు నతని కిట్టు లనియెఁ గురువంశవరా! 438**

**ప్రతిపదార్థం:** కురువంశవరా!= కౌరవ వంశాన శ్రేష్ఠుడా! ధర్మరాజా!; అని= పై విధంగా; ఇట్లు+ఆడిన మాటలు= ఈ విధంగా పలికిన పలుకులు; విని= ఆలకించి; దనుజునిన్= రాక్షసుడిని - బలిని; చూచి= కనుగొని; అమరవిభుఁడు= దేవరాజు - ఇంద్రుడు; ఉల్లములోనన్+అ= మనస్సునందే; సంరంభంబును= తొట్రుపాటును; ఉడిపికొనుచున్= పాపుకొంటూ - తొలగించుకొంటూ; అతనికిన్= ఆ బలికి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పలికి బలిని చూచి, దేవేంద్రుడు మనసులోనే తన తొట్రుపాటును అణచుకొంటూ ఇట్లా పలికాడు.

**విశేషం:** బలి మాటలకు ఇంద్రుడు సంరంభం పాలైనట్లు భారతకర్త వాకొంటున్నాడు. ఆ తొట్రుపాటు బలికి గల జ్ఞానసంపత్తిని చూచి కావచ్చును. లేక 'లీలగా ఆగ్రహం కలిగినా నిన్నూ నీ వారిని పెడచేతితో కూలుస్తాను - అన్న అతడి స్థైర్యానికీ కావచ్చు.

**క. 'అకట! భవచ్చిత్తము ని । ర్వికారమై భరితధృతి వివేకవినయశాం**
**తిక మగుచు వెలింగెడు దీ । నికిఁ గారణమైన నిష్ఠ నెఱి యెట్టిదియో!' 439**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; భవత్+చిత్తము= నీ మనస్సు; నిర్+వికారము+ఐ= వికృతులు లేనిదై; భరిత= నిండిన; ధృతి= ధైర్యం; వివేక= తెలివి; వినయ= అణకువ; శాంతికము= శాంతిగలది; అగుచున్= అవుతూ; వెలింగెడున్= ప్రకాశిస్తున్నది; దీనికిన్= ఈ స్థితికి; కారణము+ఐన= హేతువైన; నిష్ఠ= పట్టుదల; నెఱి= ధర్మం; ఎట్టిది+ఓ!= ఏ విధమైనదో!.

**తాత్పర్యం:** 'ఓ బలీ! నీ మనస్సు వికారాలకు దూరంగా, ధైర్యం, వివేకం, వినయం, శాంతి - అనే ఈ సద్గుణాలకు నిలయంగా వెలుగుతూ ఉన్నది. మరి ఈ నిర్వికారస్థితికీ, సౌశీల్యశాంతులకూ కారణమైన ఆ అభినివేశం ఎటువంటిదో! ఆ ధర్మం ఏ పాటిదో!'

**విశేషం:** ఇక్కడ ఇంద్ర వచనంలో 'అకట' అనే దుఃఖసూచక పదం కనిపిస్తున్నది. అది నిజంగా నిర్వేదానికి వాచకమే. ఇంద్రుడు ఈ గొప్ప లక్షణాలు తన విరోధిలో ఉండి, తనలో లేకపోవటానికి లోలోన దుఃఖిస్తూ అన్న మాటగా ఉన్నది అది.

**క. అనిన నతఁ డతని కిట్లను । 'విను మనిషనాథ! యేను వేఱొకచోటం**
**గొని వచ్చితినే చిత్తం । బున కవికృతి ధృతి వివేక ముఖ్య గుణంబుల్? 440**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అతఁడు= ఆ బలి; అతనికిన్= ఆ ఇంద్రుడికి; ఇట్లు+అనున్= ఈ విధాన చెప్పాడు; అనిమిషనాథ!= రెప్పపాటులేనివారికి - దేవతలకు రాజా! - ఇంద్రుడా!; వినుము= ఆలకించుము; ఏను= నేను; చిత్తంబునకున్= మనస్సునకు; అవికృతి ధృతి వివేక ముఖ్య గుణంబుల్= వికారం లేకపోవటం, ధైర్యం, జ్ఞానం - మొదలయిన గుణాలను లక్షణాలను; వేఱు+ఒకచోటన్= వేరే ఇతర స్థలంనుండి; కొని= తీసికొని; వచ్చితినే?= వచ్చానా? (కాదు).

**తాత్పర్యం:** ఇంద్రుడి ప్రశ్న విన్న బలి అతడితో ఇట్లా అన్నాడు. 'ఓ దేవతలరాజా! వినుము. నేను నా చిత్తానగల గుణాలు - నిర్వికారత, ధైర్యం, జ్ఞానం మొదలయిన వాటిని వేరొకచోటునుండి తీసికొని వచ్చానా? కాదు. అవి నాలో స్వతః ఏర్పడినవే.

**వ. కాలప్రకారం బెఱుంగుదుం గావునఁ గలంగ కుండుదు. 441**

**ప్రతిపదార్థం:** కాలప్రకారంబు= కాలముయొక్క రీతి - విధానం - ప్రవర్తించే తీరు; ఎఱుంగుదున్= తెలియుదును; కావునన్= కాబట్టి; కలంగక+ఉండుదున్= కలతచెందకుండా ఉంటాను.

**తాత్పర్యం:** నేను కాలతత్త్వాన్ని, అది ప్రవర్తించే తీరుతెన్నులను గ్రహించినవాడను కాబట్టి, నిర్వికారంగా ధైర్యంతో ఉంటాను.

**తే.** **చెప్పుచున్నాఁడఁ గాలంబుచేత నెల్ల । విధముఁ జొప్పడు జనులకు వినుము కాల**
**మప్రమాదవర్తన మధిక ప్రమాద । సంగమత్తులు వా రెట్లు భంగపడరు?** **442**

**ప్రతిపదార్థం:** చెప్పుచున్+ఉన్నాఁడన్= పలుకుతున్నాను; కాలంబుచేతన్= కాలంవలన; జనులకున్= నరులకు; ఎల్లవిధమున్+చొప్పడున్= అన్ని తీరులూ కలుగుతాయి; వినుము= ఆలకించుము; కాలము= సమయం; అప్రమాద వర్తనము= పరాకులేని ప్రవర్తన - నడవడి కలది; అధిక ప్రమాద సంగమత్తులు= ఎక్కువ పరాకు కలయికతో మదించినవారు; వారు= జనులు; ఎట్లు భంగపడరు?= ఏ విధంగా (కాలంచేతిలో) భంగపాటు చెందకుండా ఉంటారు? ఉండలేరు - తప్పకుండా భంగపడితీరుతారు.

**తాత్పర్యం:** ఓ దేవేంద్రా! చెప్పుతున్నాను వినుము. కాలంవలననే నరులకు అన్ని తీరులూ, ఎల్ల అవస్థలూ, సకలదశలూ కలుగుతాయి. కాలం ప్రమాదమెరగకుండా జాగరూకతతో ప్రవర్తిస్తూ ఉంటుంది. దాని గమనంలో పరాకుకు స్థానం లేదు. అయినప్పుడు అధికప్రమాదాలలో పడి మత్తులయినవారు కాలంనుండి భంగపడకుండా ఎట్లా తప్పించుకుంటారు? తప్పించుకొనలేరు.

**క.** **కళలుం గాష్ఠలు లోనుగఁ । గల చిదురులఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం**
**బుల వడ్డికిచ్చు నాతని । వల నలవడఁ బొదివి తనకు వశ్యులఁ జేయున్.** **443**

**ప్రతిపదార్థం:** కాలంబు= కాలం; కళలున్= ముప్పై కాష్ఠల భాగాలును - కాలపు చిన్నముక్కలును; కాష్ఠలున్= పద్దెనిమిది రెప్పపాట్ల కాలాలూ - కాలపు మరీ చిన్న ముక్కలును; లోనుగన్= లోపల కాగా; కల చిదురులన్= ఉన్న ముక్కలను; కూర్చుకొనుచున్= చేర్చుకొంటూ; జనంబులన్= జనులను; వడ్డికి+ఇచ్చు+ఆతని వలను= వడ్డీకి (డబ్బు) ఇచ్చేవాడి తీరు; అలవడన్= అలవాటుగా కాగా; పొదివి= వ్యయం చేయక ఉండి; తనకున్= తనకు (కాలానికి); వశ్యులన్+చేయున్= వశమయ్యే వారినిగా చేస్తుంది.

**తాత్పర్యం:** కాలస్వరూపాన పెద్దముక్క సంవత్సరమైతే, చిన్నముక్క కళ. కళ అంటె ముప్పై కాష్ఠల ప్రమాణంగల కాలం. కాష్ఠమనేది కళకంటె చిన్నదైన కాలపుముక్క. పద్దెనిమిది రెప్పపాట్లకాలం ఒక కాష్ఠ. కాలం ఈ చిన్న, మిక్కిలి చిన్న ముక్కల రూపాన తనను తాను సమకూర్చుకుంటూ, పెరిగి, ఇంకా పెరిగి పెరిగి చివరకు జగత్తునే కబళిస్తుంది. చిన్న చిన్న శకలాల రూపాన పెరిగి పెరిగి పెద్దదయ్యే కాలం ఒక వడ్డీ వ్యాపారివంటిది - వడ్డీవ్యాపారి కూడా చిన్న చిన్న మొత్తాలతో ప్రారంభించి, పెద్ద పెద్ద మిక్కిలి పెద్ద మొత్తానికి అధిపతి అవుతాడు. కాలమూ అంతే. ముందు కాష్ఠలతో అనంతరం కళలతో, నిమిషాలతో, గంటలతో, దినాలతో. . . . అట్లా పెరిగి పెరిగి చివరకు విశ్వంభరగా లోకమంతా తానే అయి సర్వస్వాన్నీ స్వాధీనంచేసికొంటుంది. నరులందరూ ఆ విధంగా చివరకు కాలాధీనులై పోతారు.

**విశేషం:** అలం: ఉపమ. కాలం తనను తాను పెంచుకొంటూ పోయే విధానాన్ని తేటతెల్లంగా చెప్పదలచి భారతకర్త ఇక్కడ వడ్డీవ్యాపారిని పోలికగా చూపాడు. ప్రారంభం అల్పంగా ఉండి, పరిసమాప్తి అనూహ్యపరిమాణంలో మిక్కిలి పెద్దదిగా ఉండే విషయాన్ని చెప్పటానికి ఈ పోలిక ఉచితమే. పైగా ఈ పెరుగుదల ఎట్ట ఎదుటే జరుగుతుంటుంది. అయినా నరుడు పట్టించుకొనడు. ఆధ్యాత్మవిషయావగాహనకు లౌకిక ఉపమాన స్వీకారం జరిగింది ఇక్కడ.

**క. కాల మడఁగించుఁ జనుఁ గ । ల్లోలిని గిరిఁ ద్రెంచుకరణి లోభక్రోధా**
**శీలత్వ కామ భయములఁ । దేలు జనుఁడు కాలవృత్తి తెఱఁగు నెఱుఁగునే? 444**

**ప్రతిపదార్థం:** కాలము= సమయం; జనున్= నరుడిని; కల్లోలిని= నది; గిరిన్+త్రెంచు కరణిన్= కొండను కోసే విధంగా; అడఁగించున్= నశింపజేస్తుంది; లోభ క్రోధ+అశీలత్వ కామ భయములన్= పేరాస, రోషం, శీలహీనత, కోరిక, భీతి - ఇన్ని దుర్గుణాలలో; తేలు= పడి కొట్టుకొనే; జనుఁడు= నరుడు; కాలవృత్తి తెఱఁగున్= కాలముయొక్క ప్రవర్తన విధానమును - కాలం ప్రవర్తించే తీరును; ఎఱుఁగునే?= గ్రహించునా? (గ్రహించడు).

**తాత్పర్యం:** కాలం ఒక నది. అది నిరంతర ప్రవాహశీలి. నది తన ప్రవాహవేగంతో కొండను కోసివేసి, తన దారిని తానూ సాగిపోతుంది. కాలమూ అంతే. తన గమనంతో నరుడిని లోగొని అణచివేస్తుంది. అయితే నరుడు మాత్రం ఈ వాస్తవాన్ని గ్రహించటంలేదు. అతడు తన దుర్గుణవలయంలో పడి కొట్టుకొంటూ ఉన్నాడు. లోభమూ, క్రోధమూ, శీలరాహిత్యమూ, కామమూ - అనే దుర్గుణాలలో చిక్కుకొని, భయవిహ్వలుడై బ్రతుకుతూ కాలప్రవృత్తిని గమనించలేకున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఇంతకు మును సూచితి నతఁ । డెంతయు నొప్పుగొని యుండె; నిది గడుఁ జిత్రం;**
**బింత వెసఁ జచ్చె ననుఁ దనుఁ । జింతింపఁడు జనుఁడు మూఢచిత్తత్వమునన్. 445**

**ప్రతిపదార్థం:** జనుఁడు= నరుడు; ఇంతకు మును= ఇంతకు పూర్వం; చూచితిన్= చూచాను; అతఁడు= ఆ నరుడు (ఒకానొకడు); ఎంతయున్= ఎంతగానో - ఎక్కువగా; ఒప్పు+కొని= గుణం కలిగి; ఉండెన్= (జీవించి) ఉన్నాడు; ఇది= ఈ విషయం; కడున్+చిత్రంబు= మిక్కిలి విచిత్రం; ఇంత వెసన్= ఇంత వేగంగా; చచ్చెన్= చనిపోయాడు; అనున్= అని పలుకుతారు; మూఢచిత్తత్వమునన్= జ్ఞానహీనమైన మనస్సువలన; తనున్= తనను గురించి; చింతింపఁడు= ఆలోచించడు.

**తాత్పర్యం:** నరుడు కాలమహిమను గమనించలేక, అపుడపుడు జరిగే హఠాత్ సంఘటనలను చూచి, 'ఇంతకుముందే చూచానే, చాలా బాగా ఉన్నాడు, మరీ విచిత్రంగా ఉన్నది, ఇంత త్వరగా పోయాడే!' అంటూ ఇతరులగూర్చి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ ఉంటాడు. అతడి చిత్తం వివేకవిహీనం కాబట్టి, ఆ విధంగా తలపోస్తున్నాడు తప్ప నిజానికి ఆ సంఘటన తనకూ ఎంతో దూరాన లేదు. అయితే ఆ ఆలోచనే అతడికి రాదు.

**క. విను భావాభావంబులు । గని యత్యుత్తమ తపంబు గైకొను విద్వ**
**జ్జనుఁడు గనుఁ గాలగతి యె । ల్లను గరతలశోభితామలకముం బోలెన్. 446**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము ఇంద్రా!; భావ+అభావంబులు= ఉనికి, లేములు - ఉండుట - ఉండకుండుటలు; కని= గ్రహించి; అతి+ఉత్తమ తపంబు= మిక్కిలి శ్రేష్ఠమైన తపస్సు; కైకొను= స్వీకరించే - చేసే; విద్వత్+జనుఁడు= విద్వాంసుడు

- జ్ఞాని; కాలగతి+ఎల్లను= కాలముయొక్క పోకడ మొత్తమును; కరతల శోభిత+ఆమలకమున్+పోలెన్= అరచేత శోభించే (కల) ఉసిరిక కాయనువలె; కనున్= చూస్తాడు.

**తాత్పర్యం:** నరుడు తొలుత అంతర్ముఖుడై (తనలోనికి తాను చూచుకొనేవాడై) భావాన్ని, అభావాన్ని గ్రహించాలి. ఉనికిని, లేమిని తెలిసికొనాలి. అనంతరం మిక్కిలి ఉత్తమరీతిలో తపస్సును ఆచరించాలి - తీవ్రమయిన జిజ్ఞాసతో నిరంతర తపనతో కాలతత్త్వాన్ని అన్వేషించాలి. అపుడు నరుడు విద్వాంసు డౌతాడు. అతడికి కాల ప్రవృత్తి మొత్తమూ అరచేత నుంచుకొన్న ఉసిరికకాయవలె స్పష్టంగా నిస్సందేహంగా గోచరిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **కాలగతి గనుట శాంతికి । మూలంబై యంతరంగమున కాత్మమయ**
**త్వాలంబనంబు నిచ్చుఁ ద । దాలీనుండైన పురుషుఁ డక్షోభ్యుఁ డగున్.'** **447**

**ప్రతిపదార్థం:** కాలగతి= కాలపు నడకను; కనుట= చూడటం - గ్రహించటం; శాంతికిన్= మనస్సుయొక్క శాంతికి - వికారాలు లేకుండుటకు; మూలంబు+ఐ= కారణమై; అంతర్+అంగమునకున్= లోపలి అవయవమునకు - మనస్సునకు; ఆత్మమయత్వ+ఆలంబనంబున్= ఆత్మమయత్వం - తాను ఆత్మ తప్ప శరీరం కాదనే తత్త్వం అనే ఆధారమును - ప్రాపును; ఇచ్చున్= ఒసగును; తద్+ఆలీనుండు+ఐన= దానిని అంటి ఉన్నవాడు; పురుషుఁడు= నరుడు; అక్షోభ్యుఁడు+అగున్= క్షోభింప దగనివాడు - క్షోభకు గురికాజాలనివాడు ఔతాడు.

**తాత్పర్యం:** కాలపు నడకను గ్రహించటం మనశ్శాంతికి కారణమౌతుంది. మనస్సునకు 'తాను ఆత్మగాని, శరీరం కాదు' అనే ఆత్మమయత్వ భావనను బాసటగా అందిస్తుంది. ఆ భావనను అందుకొన్న నరుడు క్షోభకు అతీతుడుగా మారిపోతాడు'.

**వ.** **అనిన విని పాకశాసనుం డతని వివేకపాకంబున కచ్చెరువొంది యభినందించి యతని కిట్లనియె.448**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; పాకశాసనుండు= స్వర్గపాలకుడు - ఇంద్రుడు; అతని వివేకపాకంబునకున్= ఆ బలియొక్క జ్ఞానపరిణతికి - పండిన జ్ఞానానికి; అచ్చెరువు+ఒంది= ఆశ్చర్యం పొంది; అభినందించి= ప్రశంసించి; అతనికిన్= ఆ బలికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు బలికిగల జ్ఞానపరిపాకానికి చకితుడై, అతడిని మెచ్చుకొని, ఇట్లా అన్నాడు.

**ఆ.** **'దనుజనాథ! యివ్విధంబునఁ గాల చా । రిత్రవేదివై పవిత్రశీల**
**యుతుఁడ వైతి; నీవు కృతకృత్యుఁడవు; నీదు । వృత్తి గోరవలయు నుత్తములకు.** **449**

**ప్రతిపదార్థం:** దనుజనాథ!= ఓ రాక్షసరాజా!; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; కాలచారిత్ర వేదివి+ఐ= కాలముయొక్క నడతను గ్రహించినవాడవై; పవిత్రశీల యుతుఁడవు+ఐతి(వి)= పావనమైన స్వభావంగలవాడవు అయినావు; నీవు= జ్ఞానివైన నీవు; కృతకృత్యుండవు= చేయబడిన పనిగలవాడవు - చేయవలసినదానిని చేసినవాడవు - ప్రయోజనం నెరవేరినవాడవు; ఉత్తములకున్= శ్రేష్ఠనరులకు; నీదు వృత్తి= నీ యొక్క ప్రవర్తనం - నడత - జీవనం; కోరవలయున్= కోరుకొనదగింది - అనుకరించదగింది.

**తాత్పర్యం:** 'ఓ దానవరాజా! బలీ! నీవు కాలపు నడకను - అతిగహనమైన దానిని గ్రహించావు. పావనమైన శీలం కలిగి, నిర్మలజీవనం గడపుతున్నావు. నీవు కృతకృత్యుడవు. నీవు చేయవలసినది ఇక ఏదీ మిగిలిలేదు. నీ నడత, నీ జీవనం ఉత్తమమానవులకు శిరోధార్యమై వెలుగుతున్నది.

**తే.** **లోక మెల్లను నఱచేతిలోన నున్న। యట్లు గనుగొని సత్త్వాదులైన మూఁడు**
**గుణములను బాయఁ బెట్టి నిర్గుణత వెలుఁగు। నాత్మఁ గనుచున్నవాఁడ; వే మందు నిన్ను! 450**

**ప్రతిపదార్థం:** లోకము+ఎల్లను= జగత్తునంతటినీ; అఱచేతిలోనన్= చేతి మధ్యభాగాన - హస్తంలోపల; ఉన్న+అట్లు= ఉన్న విధంగా; కనుఁగొని= చూచి; సత్త్వ+ఆదులు+ఐన= సత్త్వం (రజస్సు తమస్సు అనేవి) మొదలైన; మూఁడు గుణాలను= త్రిగుణాలను; పాయన్+పెట్టి= పోగొట్టి - తొలగించికొని; నిర్+గుణతన్= గుణాలు లేనితనంతో; వెలుఁగు= ప్రకాశించే; ఆత్మన్= అంతరాత్మను; కనుచున్+ఉన్నవాఁడవు= చూస్తూ ఉన్నావు; నిన్నున్= ఇట్టి ఆత్మ దర్శివైన నిన్ను; ఏమి+అందున్!= ఏమని అనేది! - ఏమని పొగడినా తక్కువే! - అంత ఎత్తునకు ఎదిగిపోయావు.

**తాత్పర్యం:** అరచేతిలో ఉన్న వస్తువును చూచినట్లుగా జగత్తు మొత్తాన్ని చూడగలుగుతున్నావు. నరుడికి జన్మసిద్ధాలయిన సత్త్వరజస్తమోగుణాలను, జన్మచక్రాన బంధించి త్రిప్పే గొప్ప సాధనాలను తొలగించుకొన్నావు. లోపల వెలిగే ఆత్మను - పరమాత్మకు ప్రతిబింబమైన దానిని దర్శిస్తున్నావు. ఇట్టి నిన్ను ఏమని పొగడేది!

**క.** **కెలనికిఁ జూడఁగ దైన్యా। కలనం బగుచున్న యిపుడు గదిరిన దశయుం**
**దొలఁగుం గావుతఁ! గడుమే। లెలసి పరమసుఖముఁ బొందు మిచ్ఛావృత్తిన్.' 451**

**ప్రతిపదార్థం:** కెలనికిన్= దాపునకు - దగ్గరకు; చూడఁగన్= చూడటానికి; దైన్య+ఆకలనంబు+అగుచున్న= దీనత్వమును కూర్చుతున్న; ఇపుడు+కదిరిన= ఈ సమయాన కలిగిన; దశయును= అవస్థకూడా; తొలఁగున్+కావుతన్= విడిపోవుగాక; కడు మేలు+ఎలసి= గొప్పమేలు కలిగి; ఇచ్ఛావృత్తిన్= కోరికతోడి వర్తనంతో; పరమసుఖమున్+పొందుము= గొప్ప ఆనందమును అందుకొనుము.

**తాత్పర్యం:** నీవు కృతకృత్యుడ వైనావు, లోకతత్త్వంతోపాటు ఆత్మతత్త్వమూ బోధపడి ఆత్మదర్శనం కూడా చేస్తున్నవాడవు నీవు. అయినా దగ్గరగా చూచినపుడు, భౌతికంగా ఒక దీనదశ నీ చుట్టూ కనిపిస్తున్నది. అది కూడా తొలగిపోయి నీకు గొప్ప మేలు, అంతకంటె గొప్ప ఆనందమూ, నీ కోర్కెకు లోబడి కలుగుగాక!'

**క.** **అని పలికి యుచితముగ వీ। డ్కొని విభవం బెసఁగ నభ్రకుంజరము పయిన్**
**వినువీథిఁ జనియె సురలును। మునులును వేష్టింప భూతములు వినుతింపన్. 452**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికి= చెప్పి; ఉచితముగన్= తగినట్లుగా; వీడ్కొని= వీడ్కోలు పొంది - విడిచి; విభవంబు+ఎసఁగన్= ఐశ్వర్యం అతిశయించగా; అభ్రకుంజరము పయిన్= ఆకాశపుటేనుగుమీద - ఐరావతంమీద; వినువీథిన్= ఆకాశమార్గాన; సురలును= దేవతలూ; మునులును= ఋషులూ; వేష్టింపన్= చుట్టుకొనగా; భూతములు= ప్రాణులు; వినుతింపన్= ప్రశంసించగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** బలిని ఆ విధంగా అభినందించి, అతడికి ఇతోధికమైన శ్రేయస్సును, ఆనందాన్నీ ఆకాంక్షిస్తూ వీడ్కొని, దేవేంద్రుడు తన ఐశ్వర్యం అతిశయించగా ఆకాశపుటేనుగు నెక్కి, ఆకాశమార్గాన అమరులు, ఋషులు పరివేష్టించి రాగా, ప్రాణులు ప్రస్తుతించగా పయనమై పోయాడు.

**తే.** **అమృతపానంబుఁ జేసిన యంతకంటె। నద్దనుజపతి మధురవాక్యామృతమున**
**సంభృతానందుఁడై సురేశ్వరుఁడు దనదు। పురమునకు నేఁగి సుఖముండెఁ గురువరేణ్య!' 453**

**ప్రతిపదార్థం:** కురువరేణ్యా!= ఓ కురుశ్రేష్ఠుడా! ధర్మరాజా!; సుర+ఈశ్వరుండు= దేవతలరాజు; అమృతపానంబున్=అమృతమును తాగుటను; చేసిన+అంతకంటెన్= చేసినప్పటికంటే కూడా; ఆ+దనుజపతి మధురవాక్య+అమృతమునన్= ఆ రాక్షసరాజు బలి యొక్క తీయని మాటలు అనే అమృతంవలన; సంభృత+ఆనందుఁడు+ఐ= బాగుగా నిండిన ఆనందం కలిగినవాడై; తనదు పురమునకున్= తనయొక్క పట్టణానికి - అమరావతికి; ఏఁగి= వెళ్ళి; సుఖము+ఉండెన్= సుఖంగా ఉన్నాడు.

**తాత్పర్యం:** బలి పల్కిన సంభాషణం ఇంద్రుడికి అమృతపానంచేసినప్పటికంటె కూడా అధికమైన తృప్తిని, ఆనందాన్ని కలిగించింది. బలి మాటలు ఇంద్రుడి పాలిట అమృతాధికమైన పానీయంగా మారాయి. ఆ దేవేంద్రుడు బలి వాగమృతంతో కలిగిన అనుభూతిని మోసుకొంటూ అమరావతికి చేరి సుఖంగా ఉన్నాడు'.

**వ. అని యిట్లు ధర్మతనయునకు భీష్ముండు పునర్భూతంబైన యింద్రబలి సంవాదంబు సెప్పె నని చెప్పిన విని మఱి యేమి సత్కథలు సెల్లెఁ? జెప్పుమని యడుగుటయు. 454**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; ఇట్లు= ఈ ప్రకారంగా; ధర్మతనయునకున్= ధర్మరాజునకు; భీష్ముండు= భీష్ముడు; పునర్+భూతంబు+ఐన= మరల జరిగినదైన (పూర్వమొకటి జరిగి ఉన్నది); ఇంద్ర బలి సంవాదంబు= ఇంద్రుని బలి సంభాషణం; చెప్పెన్= తెలిపాడు; అని చెప్పినన్= అని పలుకగా (వైశంపాయనుడు కథకుడు); విని= ఆలకించి (జనమేజయుడు శ్రోత); మఱి+ఏమి= ఇంకను ఏ విధమైన; సత్ కథలు= మంచి వృత్తాంతాలు; చెల్లెన్?= జరిగాయి; చెప్పుము+అని+అడుగుటయున్= పలుకుము అని ప్రశ్నించటం జరిగిన తరువాత (అనంతర ఆశ్వాసాన కథాప్రారంభం).

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజునకు అతడి పితామహుడు భీష్ముడు మళ్ళీ రెండవసారి జరిగిన ఇంద్ర బలి సంవాదాన్ని వినిపించాడు - అని భారతామ్నాయానికి కథకుడైన వైశంపాయనుడు శ్రోత అయిన జనమేజయ మహారాజునకు తెలిపాడు. 'ఆ తరువాత ఇంకా ఏ సత్కథలు జరిగెనో చెప్పు'మని భారత ఇతిహాసశ్రోత అయిన జనమేజయుడు ఆ కథకుడిని అర్థించాడు. (ఆ తరువాత కథాక్రమం పంచమాశ్వాస ప్రారంభాన మొదలవుతుంది).

## ఆశ్వాసాంతము

**చ. పరమమునీంద్ర సంయమనపక్వ వివేకవిభూతి రమ్య! వి**
**స్తర మహనీయ తార్కిక వచః కలనా నభిగమ్య! దేవతా**
**సుర పరిరక్షణోన్మథన శోభి కటాక్ష విహార! నిత్య సుం**
**దర! శుభకాంతిపూర! దురితప్రవిదారణ! వీతకారణా! 455**

**ప్రతిపదార్థం:** పరమ= గొప్ప; ముని+ఇంద్ర= ఋషిశ్రేష్ఠులయొక్క; సంయమన= తపస్సువలన; పక్వ= పండిన; వివేక= జ్ఞానం యొక్క; విభూతి= ఐశ్వర్యంతో; రమ్య!= అందమైనవాడా!; విస్తర= విశాలమైన; మహనీయ= ఘనమైన; తార్కిక వచః+కలనా= తర్కశాస్త్ర సంబంధి వాక్కుల జ్ఞానంచేత; న+అభిగమ్య!= పొందరానివాడా!; దేవతా= సురలయొక్క; అసుర= రాక్షసులయొక్క; పరిరక్షణ= సంరక్షణయందు; ఉన్మథన= రాపిడి - తీవ్రమైన కదలికతో; శోభి= ప్రకాశించే; కటాక్ష= క్రీగంటి చూపుయొక్క; విహార!= ప్రసారం కలవాడా!; నిత్య సుందర!= ఎప్పుడూ అందంగా ఉండేవాడా!; శుభకాంతిపూర!= క్షేమ (కర) ప్రకాశంతో నిండినవాడా!; దురిత ప్రవిదారణ!= పాపమును నశింపజేసేవాడా! (ఖండించేవాడా!); వీతకారణా!= నశించిన- పోయిన కారణం కలవాడా!

**తాత్పర్యం:** గొప్ప మునీంద్రుల నిగ్రహం వలన పరిపక్వమైన ప్రజ్ఞాసంపత్తితో సుందరంగా భాసించేవాడా! విస్తృతమూ మహనీయమూ అయిన తర్కశాస్త్ర పరిజ్ఞానానికి అందకుండా వెలిగేవాడా! సురాసుర సంరక్షణ శ్రమతో అలసిన అందమైన క్రీగంటిచూపుతో విహరించేవాడా! నిత్యనూతన సౌందర్యంతో, శుభావహమైన తేజస్సుతో,నిండి వెలుగులు చిమ్మేవాడా! చెడును సంహరించేవాడా! అన్నిటికీ స్వయంగా కారణమై ప్రకాశిస్తూ స్వతఃకారణంలేనివాడా!

**విశేషం:** హరిహరనాథుడు జ్ఞానలభ్యుడే కాని, తర్కప్రాప్యుడు కాడు, ఆయన దయకు మంచి మాత్రమే పాత్రంకాని, సురాసుర విభేదం కాదు.

**క. ఆదిత్యమరుద్వసు రు। ద్రాది సకలదేవతా మయాత్మక! శ్రీ సం**
**పాదనవిధావిచక్షణ । పాద సరోజా! మహర్ధిభక్తసమాజా! 456**

**ప్రతిపదార్థం:** ఆదిత్య= సూర్యుడు; మరుత్= మరుత్తులు; వసు= వసువులు; రుద్ర+ఆది= రుద్రులు మొదలైన; సకలదేవతామయ+ ఆత్మక!= ఎల్లరు దేవతలతో నిండిన ఆత్మకలవాడా!, ఆదిత్యులు మొదలయినవారు దేవతలలో భిన్నజాతులు; ఆ అందరి ఆత్మ తానే అయినవాడా! - హరిహరనాథా!; శ్రీ= సంపదను; సంపాదన విధా= సంపాదించే పనియందు; విచక్షణ= నేర్పుగల - సమర్థమైన; పాదసరోజా!= పద్మాలవంటి అడుగులు కలవాడా!; మహా+ఋద్ధి భక్త సమాజా!= గొప్ప అభివృద్ధితోడి భక్తుల సమూహం కలవాడా!

**తాత్పర్యం:** దేవతలలోని విభిన్న జాతులయిన ఆదిత్యులు, మరుత్తులు, వసువులు, రుద్రులు మొదలయిన సకల దేవతలతో నిండిన ఆత్మకలవాడా! ఆ ఎల్లరు దేవతలను ఆత్మయందు ధరించేస్వామీ! సంపదలను సంపాదించిపెట్టే సమర్థతగల పాదపద్మాలు కలవాడా! గొప్ప అభివృద్ధి గల భక్త జనులకు ఆశ్రయ మైనవాడా! భక్తజన సందోహాలకు గొప్ప సమృద్ధులను అందించే దేవుడా!

**మాలిని:**

**అమల హృదయవేద్యా! హవ్యకవ్య ప్రసాద్యా!**
**శమసుఖమయమూర్తీ! సర్వలోక ప్రవర్తీ!**
**కమలభవ నిషేవ్యా! కామదూరానుభావ్యా!**
**యమనియమవికాసీ! వ్యాసచేతో నివాసీ! 457**

**ప్రతిపదార్థం:** అమల హృదయవేద్యా!= నిర్మల మనస్సుతో తెలిసికొనదగినవాడా!; హవ్యకవ్య ప్రసాద్యా!= దేవతల అన్నం (అమృతం)తో, పితృదేవతల అన్నంతో (పిండం) అనుగ్రహింపజేసుకోదగిన వాడా!; శమసుఖమయమూర్తీ!= శాంతి సౌఖ్యాలతో నిండిన ఆకారం కలవాడా!; సర్వలోక ప్రవర్తీ!= ఎల్లలోకాలను ప్రవర్తింపజేసేవాడా!; కమలభవ నిషేవ్యా!= బ్రహ్మచేత సేవింపదగినవాడా!; కామదూర+అనుభావ్యా!= మన్మథుడికి దూరమైన వారిచేత అనుభవించ దగినవాడా! - కామవాసనారహితులకు అగుపించేవాడా!; యమనియమ వికాసీ!= యమంతో, నియమంతో - నిగ్రహంతో, ఆచారంతో వికసించేవాడా!; వ్యాసచేతస్+నివాసీ!= వ్యాసుడి మనస్సున నివసించేవాడా!

**తాత్పర్యం:** నిర్మల మనస్కులకు (మాత్రం) తెలియదగినవాడా! దేవతల పితరుల అన్నములతో అనుగ్రహింపజేసుకో దగినవాడా! శాంతిసౌఖ్యాలే ఆకారంగా కలవాడా! ఎల్లలోకాలనూ నడిపించేవాడా! బ్రహ్మదేవుడి సేవలు అందుకొనేవాడా!

మన్మథదేవుడికి దూరమైనవారికి (మాత్రం) అనుభవానికి వచ్చేవాడా! నిగ్రహాన్ని పాటిస్తూ ఆచారాన్ని అనుసరిస్తూ ఉన్నవారికి ప్రకాశించేవాడా! వ్యాసమహర్షి మనస్సునందు నివసించేవాడా! హరిహరనాథా!

**గద్యము:**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ పర్వంలోని ఈ భాగం; శ్రీమత్+ఉభయకవిమిత్ర= శ్రీమంతుడైన - సిరిగల, ఇరువురు కవులకు - సంస్కృతాంధ్ర కవులకు మిత్రుడైన; కొమ్మన+ఆమాత్య పుత్ర= కొమ్మన మంత్రి కుమారుడైన; బుధ+ఆరాధన విరాజి= పండితుల సేవనంవలన ప్రకాశించెడి; తిక్కన సోమయాజి ప్ర+నీతంబు+ఐన= తిక్కన సోమయాజిచేత (సోమయజ్ఞంచేసిన వానిచే) రచించబడిన; శ్రీమహాభారతంబునన్= శుభకరమైన మహా భారతంలో - భారత గ్రంథమున; శాంతిపర్వంబునందున్= శాంతి అనే భాగాన (పర్వము= (చెరకు) గడ - భాగము - ఒక ముక్క); చతుర్థ+ఆశ్వాసము= నాలుగవ ఉపవిభాగం.

**తాత్పర్యం:** ఇది మంగళకరమైనది. ఉభయకవిమిత్రుడనే బిరుదం కలవాడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, పండితులను సేవించటంవలన ప్రకాశించేవాడూ (పండితులు గౌరవించటంవలన రాజిల్లేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలో శాంతిపర్వంలోని నాలుగవ ఆశ్వాసం.

**శాంతిపర్వంలోని నాలుగవ ఆశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - పంచమాశ్వాసము

**శ్రీ కరణ నిపుణ చరణ । వ్యాకోచాంభోజ నిత్య వాసముదిత సు**
**శ్లోకముని చిత్త భృంగ! మ । హాకరుణామిళదపాంగ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= మోక్షమును; కరణ= కలిగించటంలో; నిపుణ= సమర్థములైన; చరణ+వ్యాకోచ+అంభోజ= వికసించిన పద్మాలవంటి పాదాలయందు; నిత్య= నిరంతరమును; వాస= నివసించటంచేత; ముదిత= సంతోషించిన; సుశ్లోక= కీర్తిమంతులైన; ముని= జ్ఞానులయొక్క; చిత్త= మనస్సులకు; భృంగ!= తుమ్మెద అయినవాడా!; మహాకరుణా= గొప్పదయతో; మిళత్= కూడిన; అపాంగ!= క్రీకన్నులుకలవాడా!; హరిహరనాథా!= విష్ణుశంకర స్వరూపుడవైన ఓ ప్రభూ!

**తాత్పర్యం:** విష్ణుశంకర స్వరూపుడవైన ఓ దేవా! వికసించిన పద్మాలవంటి నీ పాదాలు; సదా నివసించటంచేత సంతోషించిన శ్రీమంతులకు, జ్ఞానులకు మోక్షమును ప్రసాదించటంలో నేర్పుగలవి. అట్టి వారి మనస్సులకు తుమ్మెదవైన ఓ ప్రభూ! గొప్ప దయతో కూడిన క్రీగంటి చూపులు గలవాడా!

**విశేషం**: అలం: ఉపమ. మునిచిత్త భృంగ అనుచో రూపకం.

### శ్రీ శక్ర సంవాద ప్రకారము (సం. 12-221-3)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లింద్రబలిసంవాద రూపంబునఁ గాలప్రకారంబు విని యుధిష్ఠిరుండు దేవవ్రతునితోడ. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయనుడనే మహర్షి; జనమేజయునకున్= జనమేజయుడనే ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఇంద్రబలి సంవాదరూపంబునన్= ఇంద్రుడికి బలిచక్రవర్తికి జరిగిన సంభాషణ విధానాన్ని అనుసరించి; కాలప్రకారంబు= కాలముయొక్క స్వభావాన్ని; విని= ఆలకించి; దేవవ్రతునితోడన్= భీష్ముడితో.

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు: ఆ విధంగా ధర్మరాజు ఇంద్రుడికీ, బలిచక్రవర్తికీ జరిగిన సంవాదపద్ధతి ప్రకారం కాలస్వరూపాన్ని గురించి విని భీష్ముడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏమిట రూపగుఁ? బురుషుం । డేమెయిరూపు సెడు? నాకు నెఱిఁగింపుము తే**
**జోమహిత! యనిన నతఁ డా । భూమిపతికి నిట్టు లనియె భూపప్రవరా! 3**

**ప్రతిపదార్థం:** తేజోమహిత!= తేజస్సుచేత పూజించబడినవాడా! పురుషుండు= జీవుడు; ఏమిటన్= దేనిచేత; రూపగున్?= వర్ధిల్లును?; ఏమెయిన్= ఏ విధంగా; రూపు చెడున్?= నశించును?; నాకున్; ఎఱింగింపుము= ఈ విషయం తెలియజేయుము; అనినన్= అని అడుగగా; ఓ జనమేజయ మహారాజా!; భూపప్రవరా!= రాజ శ్రేష్ఠుడవగు; అతఁడు= ఆ భీష్ముడు; ఆ భూమిపతికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** జీవుడు దేనివలన వృద్ధి పొందుతాడు? దేనివలన నశిస్తాడు? తేజోమాన్యుడ వైన ఓ భీష్మా! నా కీవిషయం బోధపడేటట్లు చెప్పుము' అని అడిగాడు. అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: ఓ జనమేజయమహారాజా!

**వ. 'ఇవ్విషయంబునకు నొక్క యితిహాసంబు శ్రీశక్రసంవాదం బనంగలదు. దానిం జెప్పెద నాకర్ణింపుము. నారదమునీశ్వరుం డెందును నిజేచ్ఛంజరియించుచుండి యొక్కనాఁడు మందాకినికిం జని కృతస్నానుండై. 4**

**ప్రతిపదార్థం:** ఈ+విషయంబునకున్= ఈ అంశాన్ని స్పష్టం చేయటానికి; శ్రీ శక్రసంవాదంబు= లక్ష్మికి ఇంద్రుడికి జరిగిన సంభాషణం; అనన్= అనగా; ఒక్క ఇతిహాసంబు= ఒక పూర్వకథ; కలదు= ఉన్నది; దానిన్= ఆ కథను; చెప్పెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము; నారదమునీశ్వరుండు= నారదమహర్షి; ఎందునున్= ఎల్లయెడల; నిజేచ్ఛన్= తన ఇచ్ఛచొప్పున; చరియించుచుండి= తిరుగుచుండి; ఒక్కనాఁడు= ఒకదినం; మందాకినికిన్= ఆకాశగంగానదికి; చని= పోయి; కృతస్నానుండు+ఐ= స్నానం చేసినవాడై.

**తాత్పర్యం:** ఈ విషయం వివరించటానికి 'శ్రీశక్ర సంవాదం' అనే తొల్లిటికథ ఒకటి ఉన్నది. దానిని చెప్పుతాను వినుము. నారదమునీంద్రుడు ప్రతిచోటా తన యిష్టం వచ్చిన విధంగా తిరుగుతూ ఒకనాడు ఆకాశగంగానదికి వెళ్ళాడు. అక్కడ స్నానం చేసి.

**క. ఆ నదియం దాచరిత । స్నానుండై నియతినున్న శక్రుం గని య**
**చ్చో నయ్యిరువురు సల్లా । పానందముఁ బొందుచుండ నాకాశమునన్. 5**

**ప్రతిపదార్థం:** ఆ నదియందున్= ఆ గంగలో; ఆచరిత స్నానుండు+ఐ= స్నానం చేసినవాడై; నియతిన్= నియమంతో; ఉన్న= వర్తిల్లిన; శక్రున్= ఇంద్రుడిని; కని= చూచి; అచ్చోన్(ఆ+చోటన్)= ఆచోట; ఆ+ఇరువురున్= వారిద్దరును; సల్లాప+ఆనందమున్= సంభాషణం వలన కలిగే సంతోషమును; పొందుచుండన్= అనుభవిస్తుండగా; ఆకాశమునన్= ఆకాశంలో.

**తాత్పర్యం:** ఆ నదిలోనే స్నానం చేసి వ్రతనిష్ఠతో ఉన్న ఇంద్రుడిని నారదుడు చూచాడు. ఆ పైన, వారిద్దరూ అన్యోన్యం మాట్లాడుకొంటూ ఆనందిస్తున్నారు. ఇంతలోనే ఆకాశంలో.

**తే బాలభాను బింబంబు గీడ్పఱుచునట్టి । దీప్తి మండలి దోఁచె; నద్దేవపతియు**
**మునిపతియుఁ జూచుచుండ గ్రక్కున విమాన । మవతరించి యాసన్నయై యతివ యొర్తు. 6**

**ప్రతిపదార్థం:** బాలభానుబింబంబున్= లేత సూర్యుడి మండలమును; కీడ్పఱుచునట్టి= తక్కువజేసే; దీప్తిమండలి= కాంతిపుంజం; తోఁచెన్= భాసించింది; ఆ+దేవపతియున్= ఆ ఇంద్రుడును; మునిపతియున్= నారదుడును; చూచుచుండన్= చూస్తూ ఉండగానే; గ్రక్కునన్= వడిగా; విమానము= వ్యోమయానమునుండి; అవతరించి= దిగి; అతివ= స్త్రీ; ఒర్తు= ఒకతె; ఆసన్న ఐ= దగ్గరకువచ్చినదై.

**తాత్పర్యం:** అప్పుడే ఉదయించిన సూర్యమండలకాంతిని అతిశయించిన ఒక కాంతిరాశి కనిపించింది. ఇంద్రుడు, నారదుడూ చూస్తూ ఉండగానే ఒక వనిత విమానంనుండి దిగి వారిదగ్గరకు వచ్చి.

**క. పురుహూతున కభిముఖి యై । కరములు మోడ్చుటయు, నతఁడు గారవమున 'నె**
**వ్వర వబ్జానన! యెచటికి । నరిగెద, వెందుండి రాక?' యనియె నరేంద్రా! 7**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; పురుహూతునికిన్= ఇంద్రుడికి; అభిముఖిఐ= ఎదురుగా నిల్చినదై; కరములు= చేతులు; మోడ్చుటయున్= చేర్చి నమస్కరించగా; అతఁడు= ఆ ఇంద్రుడు; గారవమునన్= ఆదరముతో; అబ్జానన!= పద్మముఖీ!; ఎవ్వరవు= నీవు ఎవతెవు?; ఎచటికిన్= ఏ చోటికి; అరిగెదవు?= వెళ్ళుతావు?; ఎందుండి= ఎచటనుండి; రాక= వచ్చావు?; అనియెన్= అని అడిగాడు.

**తాత్పర్యం:** రాజా! ఇంద్రుడికి ఎదురుగా నిల్చి, ఆమె చేతులు మోడ్చి నమస్కరించింది. అతడు ప్రీతితో ఆమెను చూచి 'కమలముఖీ! నీ వెవరవు? ఎక్కడికి పోతున్నావు? ఎక్కడినుండి వచ్చావు?' అని ప్రశ్నించాడు.

**సీ. అనవుడు నద్దేవి యాదరభరిత యై । 'బాలార్కబోధిత పద్మజాత**
**యైనట్టిదాన; శ్రీయన లక్ష్మినా భూతి । యనఁగ వెలుంగుదు నవఘ! యేను**
**స్వాహాస్వధామతి శ్రద్ధాధృతిస్మృతి । మేధల దనుజుల మెచ్చి వారి**
**కడనుండి మెచ్చ కిప్పుడు నీకడకు నేఁగు । దెంచితి' ననిన నద్దివిజనాథుఁ**

**తే. 'డేమికారణమున మెచ్చి? తేకతమున । మెచ్చవైతి దానవుల? నీ మెచ్చుచొప్పు**
**మాకు నెఱిఁగింపు' మనిన నమ్మానసీయ । వాక్య యిట్లని చెప్పె నవ్వాసవునకు. 8**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అత డట్లనగా; ఆ+దేవి= ఆ దివ్యస్త్రీ; ఆదరభరిత+ఐ= ప్రీతితో నిండినదై; అనఘ!= పాపరహితుడా!; ఏను= నేను; బాలార్క= లేతసూర్యుడిచేత; బోధిత=వికసింపచేయబడిన; పద్మ= పద్మమునుండి; జాత ఐనట్టిదానన్= పుట్టినదానను; శ్రీ యనన్= 'శ్రీ' అనియు; లక్ష్మినాన్= 'లక్ష్మి' అనియు; భూతి అనఁగన్= 'భూతి' అనియు; వెలుంగుదున్= ప్రకాశిస్తాను; స్వాహా, స్వధా, మతి, శ్రద్ధ, ధృతి, స్మృతి, మేధ - అనే గుణాలచేత; దనుజులన్= రాక్షసులను; మెచ్చి= అభినందించి; వారికడన్= వారివద్ద; ఉండి= నివసించి; ఇప్పుడు= ఈ సమయమున; మెచ్చక= వారిని సమ్మతించక; నీ కడకున్= నీ సమీపానికి; ఏఁగుదెంచితిన్= వచ్చాను; అనినన్= అనగా; ఆ+దివిజనాథుఁడు= ఆ దేవేంద్రుడు; దానవులన్= రాక్షసులను; ఏమి కారణమునన్= ఏ హేతువుచేత; మెచ్చితి(వి)?= పూర్వం సమ్మతించావు?; ఏకతమునన్= ఏ కారణంచేత; మెచ్చవైతివి= (ఇప్పుడు) సమ్మతించవైతివి?; నీ మెచ్చు చొప్పున్= నీవు అభినందించే విధానాన్ని; మాకున్+ఎఱిఁగింపుము= మాకు తెలియజేయుము; అనినన్= అని అడుగగా; ఆ+మానసీయవాక్య= గౌరవించదగిన మాటలుగల ఆ దేవి; ఆ+వాసవునకున్= ఆ ఇంద్రుడికి; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పింది.

**తాత్పర్యం:** ఇంద్రుడు అట్లా అడిగేసరికి ఆ దేవి మిక్కిలి ఆదరంతో 'పాపరహితుడ వైన ఓ ఇంద్రా! నేను బాలసూర్యుడి కిరణస్పర్శతో వికసించిన తామరపూవునుండి పుట్టినదాన్ని. 'శ్రీ', 'లక్ష్మి', 'భూతి' అనే పేర్లతో ప్రకాశిస్తూ ఉంటాను. పూర్వం నేను 'స్వాహా, స్వధా, మతి, శ్రద్ధ, ధృతి, స్మృతి, మేధ' అనే గుణా లుండటంవలన రక్కసులను మెచ్చుకొని వారి వద్ద ఉండేదాన్ని. ఇప్పుడు వారిని మెచ్చక నీ చెంతకు వచ్చాను' అని చెప్పింది. అది విని ఇంద్రుడు 'పూర్వం ఎందువలన రాక్షసులను మెచ్చుకొన్నావు? ఇప్పుడు ఏ కారణాన మెచ్చకుండా ఉన్నావు? నీ మెప్పు పొందాలంటే ఎట్లా ఉండాలో మాకు చెప్పుము' అని అడిగాడు. అందుకు గౌరవించదగిన పద్ధతిలో మాటలాడే ఆ దేవి ఇంద్రుడితో ఇట్లా అన్నది:

**విశేషం:** 'స్వాహా, స్వధా' అనే శబ్దాలు దేవతలకు హవిస్సు అర్పించేటప్పుడు వాడబడతాయి. ఇవి ఇక్కడ యాగాలు చేసే స్వభావాన్ని సూచిస్తాయి. 'మతి' మొదలైన శబ్దాలు బుద్ధినీ, శ్రద్ధనూ, ధైర్యాన్నీ, స్మరణశక్తినీ, ప్రజ్ఞనూ క్రమంగా నిర్దేశిస్తున్నాయి. 'స్వాహా' మొదలైన గుణాలు లక్ష్మికి ప్రతిరూపాలైన దేవతలు, అవి ఉన్నచోట లక్ష్మి ఉంటుంది. (చూడు. సంస్కృతభారతం - శాన్తి - అధ్యా. 228- శ్లో॥22, 23, 82-84).

**క. 'దానాధ్యయనాతిథిస । మ్మానాది విశిష్ట గుణసమగ్రత కలిమిన్**
**దానవుల నియ్యకొంటిని; । వాని విడిచి గర్వు లగుట వారి విడిచితిన్. 9**

**ప్రతిపదార్థం:** దాన= ఈవి; అధ్యయన= స్వాధ్యాయం; అతిథిసమ్మాన= అతిథులను పూజించటం; ఆది= మొదలైన; విశిష్ట= శ్రేష్ఠమైన; గుణ= గుణాలయొక్క; సమగ్రత= పూర్ణత్వం; కలిమిన్= కలిగిఉండటంచేత; దానవులన్= రాక్షసులను; ఇయ్యకొంటిని= అంగీకరించాను; వానిన్= ఆ గుణాలను; విడిచి= వదలి; గర్వులు= గర్వంకలవారు; అగుటన్= అగుటచేత; వారిన్= ఆ రాక్షసులను; విడిచితిన్= వదలాను.

**తాత్పర్యం:** 'పూర్వం రాక్షసులు దానం, అధ్యయనం, అతిథిపూజనం మొదలైన సద్గుణాలు నిండుగా కలిగి ఉండేవారు. అందువలన వారిని అప్పుడు అంగీకరించాను. ఇప్పుడు వారు ఆ గుణాలు వదలిపెట్టి గర్వం వహించారు. అందుచేత వారిని వదలిపెట్టాను.

**వ. సత్యధర్మపరుండ వగుటంజేసి నీపాల వసియింప రుచిపుట్టి వచ్చితి' నని చెప్పి వెండియు. 10**

**ప్రతిపదార్థం:** సత్యధర్మపరుండవు= (నీవు) సత్యమునందు; ధర్మమునందు ఆసక్తి కలవాడవు; అగుటన్+చేసి= అయిన కారణం చేత; నీపాలన్= నీ యొద్ద; వసియింపన్= నివసించటానికి; రుచి= ఆసక్తి; పుట్టి= కలిగి; వచ్చితిన్= అరుదెంచాను; అని చెప్పి= అని వచించి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** నీవు సత్యంలోనూ, ధర్మంలోనూ ఆసక్తి కలిగి ఉన్నావు. అందువలన నీవద్ద నివసించాలన్న కోరిక నాకు కలిగింది. అందుకై వచ్చా'నని లక్ష్మి చెప్పింది. మరల (ఇట్లా పలికింది).

**సీ. గురుభక్తి నిరతులు, సురపితృపూజన । పరులును, సత్యసంభాషణులును,**
**దానశీలురుఁ, బరధన పరదార ప । రాఙ్ముఖచిత్తులు, బ్రాహ్మణ ప్రి**
**యులు, దివానిద్రా వియుక్తులు, వృద్ధదు । ర్బల దీన యోషిత్కృపారతులును,**
**శౌచులు, నతిథిభోజనశిష్టభోజులు । నేను మెచ్చు జనంబు; లిట్లుగాక**

**తే. ధర్మ మెడలి, కామంబు క్రోధంబుఁజాలఁ । గలిగి, గర్వులై బలియు బైక్షంబు నిడక**
**పరుష వాక్కులఁ గ్రూరంపుఁ జరితములను । మిగిలి వర్తించువారు నా మెచ్చు గారు. 11**

**ప్రతిపదార్థం:** గురుభక్తి నిరతులు= ఆచార్యులయందు భక్తిగలవారు; సురపితృ పూజన పరులును= దేవతలను, పితరులను పూజించటంలో ఆసక్తికలవారు; సత్యసంభాషణులును= సత్యమైన మాటలుకలవారును; దానశీలురు= దానం స్వభావంగా కలవారు; పరధన= ఇతరుల ధనమునందును; పరదార= ఇతరుల కళత్రములందును; పరాఙ్ముఖ= విముఖమైన; చిత్తులు= మనస్సుకలవారు; బ్రాహ్మణప్రియులున్= ద్విజులయందు ప్రీతికలవారును; దివానిద్రా వియుక్తులు= పగటివేళ నిద్రించనివారు; వృద్ధ= ముసలివారు; దుర్బల= బలహీనులు; దీన= దైన్యముగలవారు; యోషిత్= స్త్రీలు - వీరిపట్ల; కృపారతులును= దయ గలవారును; శౌచులు= బాహ్యమున; ఆభ్యంతరమున శుచిపాటించువారు; అతిథిభోజనశిష్టభోజులున్= అతిథులు భుజించగా

మిగిలిన అన్నంతినేవారును; ఏను= నేను; మెచ్చు= అభినందించే; జనంబులు= ప్రజలు; ఇట్లుగాక= ఈ రీతిగా ఉండక; ధర్మము+ఎడన్= ధర్మం తప్పి; కామంబు= కోరిక, క్రోధంబు= కోపం; చాలన్= మిక్కిలిగా; కలిగి= వహించి; గర్వులు+ఐ= గర్వం కలవారై; బలియున్= పూజార్హమైన కానుకయు; భైక్షంబు= భిక్షాన్నం; ఇడక= పెట్టక; పరుషవాక్కులన్= కఠినమైన మాటలచేత; క్రూరంపుఁ జరితములను= క్రూరమైన నడవడికలచేతను; మిగిలి= అతిశయించి; వర్తించువారు= మెలగేవారు; నా మెచ్చు గారు= నేను మెచ్చేవారు కారు.

**తాత్పర్యం:** గురువుల పట్ల భక్తిచూపేవారు, దేవతలను, పితృదేవతలను పూజించేవారు, సత్యం పలికేవారు, దానం చేసేవారు, ఇతరులకు చెందిన ధనం, స్త్రీల పట్ల కోరికలేక విముఖంగా ఉండేవారు, విప్రులపై ప్రీతి కలిగినవారు, పగటిపూట నిద్రించనివారు, వృద్ధులయందూ, బలహీనులయందూ, దీనులయందూ, స్త్రీలయందూ దయచూపేవారూ, బాహ్యంగానూ ఆంతరంగికంగానూ శౌచం పాటించేవారూ, అతిథులై వచ్చినవారు భుజించగా మిగిలినదానిని మాత్రమే భుజించేవారూ అయిన జనులను నేను మెచ్చుకొంటాను. అట్లా కాకుండా ధర్మహీనులై, కామక్రోధాలు ఎక్కువగా కలిగి, గర్వంతో కూడినవారై, పూజార్హమైన కానుకగాని, భిక్షగాని పెట్టకుండా కఠినమైన మాటలు మాట్లాడుతూ, మిక్కిలి క్రూరమైన ప్రవర్తన కలిగి చరించేవారిని నేను మెచ్చను.

**విశేషం:** సృష్టిలో ప్రాణివర్గం దైవసంపద కలదనీ, అసురసంపద కలదనీ రెండు రకాలుగా ఉంటుంది. ఇక్కడ లక్ష్మి ఇంద్రుడితో దైవసంపద గలవారు తనకు ఇష్టులనీ, అసురప్రవృత్తిగలవారిని తాను ఇష్టపడననీ చెప్పింది. దేవాసురసంపదల వివరణ భగవద్గీతలోని పదునారవ అధ్యాయంలో విపులంగా నిరూపించబడి ఉన్నది.

**క. బుద్ధియు ధృతియును నీతియు । శ్రద్ధయు సన్నతియు క్షమయు శాంతియు ననఁగా**
**వృద్ధశ్రవ! యేడ్వురు మ । ద్వృద్ధి ప్రదదేవతలు శ్రుతిస్మృతికథితల్. 12**

**ప్రతిపదార్థం:** వృద్ధశ్రవ= ఇంద్రా!; బుద్ధియున్= బుద్ధి, ధృతియున్= ధృతి; నీతియున్= నీతి; శ్రద్ధయున్= శ్రద్ధయు; సన్నతియున్= సన్నతియు; క్షమయున్= క్షమయు; శాంతియున్= శాంతియు; అనగాన్= అని ప్రసిద్ధికెక్కిన; ఏడ్వురు= ఏడుమంది; శ్రుతి స్మృతి కథితల్= శ్రుతులలోనూ స్మృతులలోనూ చెప్పబడినవారు; మద్వృద్ధి ప్రదదేవతలు= నాకు వృద్ధి నిచ్చే దేవతలున్నారు.

**తాత్పర్యం:** అమరేంద్రా! వేదాలలోనూ, స్మృతులలోనూ చెప్పబడిన ఏడుమంది దేవతలు నాకు వృద్ధి కల్గించేవారు. వారు బుద్ధి, ధృతి, నీతి, శ్రద్ధ, సన్నతి, క్షమ, శాంతి అని వ్యవహరించబడుతున్నారు. (బుద్ధి మొదలైన గుణాలున్న వారి వద్ద లక్ష్మి వృద్ధి బొందుతుందని తాత్పర్యం).

**క. అష్టమి యగు దేవత నేఁ । గష్టాత్మత యసురులందుఁ గని విడిచితి మ**
**త్తుష్టికరచరితు లగుటఁ ద్రి । విష్టప సదుల కడ నిలిచి వెలసెద ననినన్. 13**

**ప్రతిపదార్థం:** నేన్= నేను; అష్టమిఅగు= ఎనిమిదవ దైన; దేవతన్= దేవతను; అసురులందున్= రాక్షసులందు; కష్టాత్మత= దుష్టస్వభావమును; కని= చూచి; విడిచితిన్= వారిని వదలిపెట్టాను; మత్తుష్టికర= నాకు సంతసం కలిగించే; చరితులు= ప్రవర్తన కలవారు; అగుటన్= కావటంవలన; త్రివిష్టపసదుల కడన్= దేవతలచెంత; నిలిచి= నిలబడి; వెలసెదన్= ప్రకాశిస్తాను; అనినన్= అని చెప్పగా.

**తాత్పర్యం:** నేను ఎనిమిదవ దేవతను. రాక్షసులలో దుష్టస్వభావాన్ని చూచి వారిని వదలిపెట్టాను. నాకు సంతోషం కలిగించే విధంగా ప్రవర్తించేవారు కావటం వలన దేవతలచెంత నిలబడి ప్రకాశిస్తాను' అని చెప్పగా.

**క. అభినందించిరి దేవ । ప్రభుఁడును నారదుఁడు నపుడు పవనంబును సౌ**
**రభసుఖ సంస్పర్శంబుల । నభిరామం బగుచు వీచె నల్లన యచటన్. 14**

**ప్రతిపదార్థం:** దేవప్రభుఁడునున్= ఇంద్రుడున్నూ; నారదుఁడున్= నాదరమునీంద్రుడున్నూ; అభినందించిరి= (లక్ష్మిని) మెచ్చుకొన్నారు; అచటన్= ఆచోట; అప్పుడు= ఆ సమయంలో; పవనంబునున్= గాలికూడా; సౌరభ= పరిమళంచేత; సుఖ సంస్పర్శంబులన్= సుఖావహమైన స్పర్శచేత అభిరామంబు= మనోహరం; అగుచున్= అవుతూ; అల్లన= మెల్లగా; వీచెన్= ప్రసరించింది.

**తాత్పర్యం:** లక్ష్మి చెప్పిన మాటలు విని ఇంద్రుడూ, నారదుడూ, ఆమెను మెచ్చుకొన్నారు. ఆ సందర్భంలో అక్కడ గాలి కూడా సువాసనతోనూ, సుఖావహమైన స్పర్శతోనూ కూడి మనోహరమై మెల్లగా వీచింది.

**ఆ. కురిసెఁ బుష్పవృష్టి, మొరసె గీర్వాణ దుం । దుభులు, సిరి వరింప నభినవోజ్జ్వ**
**లత్వమొంది దివిజులకు నేత్రపర్వమై । పొలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె. 15**

**ప్రతిపదార్థం:** పుష్పవృష్టి= పూలవాన; కురిసెన్= కురిసింది; గీర్వాణదుందుభులు= దేవతల భేరులు; మొరసెన్= శబ్దించాయి; సిరి= లక్ష్మి; వరింపన్= వరించేసరికి; అభినవ+ఉజ్జ్వలత్వము= నూతనమైన ప్రకాశమానత్వాన్ని; ఒంది= పొంది; దివిజులకున్= దేవతలకు; నేత్రపర్వము+ఐ= కనులపండువై; పొలిచి= భాసించి; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; ఆత్మపురికిన్= తన నగరానికి; అరిగెన్= పోయాడు.

**తాత్పర్యం:** పిదప పూలవాన కురిసింది. దేవతల నగారామ్రోతలు వ్యాపించాయి. లక్ష్మి తనను వరించగానే నూతన ప్రకాశం పొంది దేవతలకు కన్నులపండువై ఇంద్రుడు తన పట్టణమైన అమరావతికి వెళ్ళాడు.

**క. శతమఖకమలావాసా । ప్రతిమ సమాగమ విశేష బహుమత మగు నీ**
**యితిహాసము శ్రుతమైనఁ బ । ఠితమైనను నెఱయ సంఘటించును లక్ష్మిన్. 16**

**ప్రతిపదార్థం:** శతమఖ= ఇంద్రుడియొక్క; కమల+ఆవాస= లక్ష్మీదేవియొక్కయు; అప్రతిమ= సాటిలేని; సమాగమ విశేష= విశిష్టమైన కలయికచేత; బహుమతము= మిక్కిలి సమ్మానితం; అగు= అవుతున్న; ఈ ఇతిహాసము= ఈ కథ; శ్రుతము+ఐనన్= వినబడినదైననూ; పఠితము+ఐననున్= చదువబడినదైననూ; నెఱయన్= విస్తృతముగా; లక్ష్మిన్= సిరిని; సంఘటించును=కలిగిస్తుంది.

**తాత్పర్యం:** సాటిలేనిదీ, విశిష్టమైనదీ అయిన ఇంద్రలక్ష్మి సమాగమంవలన ఈ కథ మిక్కిలిగా సంభావించ బడుతున్నది. దీనిని విన్నా, చదివినా సంపద సమృద్ధిగా లభిస్తుంది.

**క. ఇందుల తాత్పర్యము నీ । డెందము నొందించి యతిదృఢీకృతశీలా**
**స్పందితుఁడ వగుము; తిరమై । యిందిర నీకడ వసించు నిభపురనాథా!' 17**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= హస్తినాపట్టణానికి ప్రభుడవైన ఓ ధర్మరాజా!; ఇందుల= ఇందులోని; తాత్పర్యమున్= భావమును; నీ డెందమున్= నీ హృదయాన్ని; ఒందించి= పొందించి; అతిదృఢీకృత= మిక్కిలి గట్టిపరచబడిన; శీల= సత్స్వభావంచేత; అస్పందితుఁడవు= చలనం లేనివాడవు; అగుము= కమ్ము; ఇందిర= లక్ష్మి; తిరమై= స్థిరమై; నీకడన్= నీ చెంత; వసించున్= నివసిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ ఇతిహాసంలోని రహస్యాన్ని నీ హృదయంలో పదిలపరచుకొమ్ము. తద్వారా దృఢమైన శీలంతో చలనం లేని వాడవు కమ్ము. అట్లా చేస్తే లక్ష్మి స్థిరంగా నీవద్ద నిలిచిపోతుంది'.

**క. అనిన విని ధర్మజుఁడు శాం । తనవునితో జనుల కెవ్విధము నాచారం**
**బున నెట్టిపాటి శీలం । బున నే విద్యను మహాత్మ! ముక్తి దొరకొనున్. 18**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధర్మజుఁడు= ధర్మరాజు; శాంతనవునితోన్= భీష్ముడితో; మహాత్మ!= మహానుభావా!; జనులకున్= ప్రజలకు; ఏ+విధము+ఆచారంబునన్= ఏ విధమైన ఆచారంతో; ఎట్టిపాటిశీలంబునన్= ఏ రకమైన స్వభావంతో; ఏ విద్యనున్= ఏ రకమైన విద్యచేత; ముక్తి= మోక్షం; దొరకొనున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** భీష్ముడు ఆ రీతిగా చెప్పగా విని ధర్మరాజు ఆయనతో ఇట్లా అన్నాడు: 'మహాత్మా! ప్రజలకు ఏ రకమైన ఆచారంవలన, ఏ విధమైన శీలం వలన, ఏ చదువు వలన ముక్తి దొరుకుతుంది?'

**క. అనవుడు నతనికి నతఁ డి । ట్లను 'విను మితిహాస మొకటి యది నీ ప్రశ్నం**
**బున కుత్తర మగు; నేర్పడ । వినిపించెద గాఢతర వివేక నిరూఢా! 19**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; అతనికిన్= ధర్మరాజుకు; అతఁడు= ఆ భీష్ముడు; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; గాఢతర వివేకనిరూఢా!= దృఢమైన వివేకంచేత ప్రసిద్ధమైనవాడా!; ఇతిహాసము+ఒకటి= ఒక పూర్వకథ; వినుము= ఆలకించుము; అది= ఆ కథ; నీ ప్రశ్నంబునకున్= నీ ప్రశ్నకు; ఉత్తరము+అగున్= సమాధానం అవుతుంది; ఏర్పడన్= స్పష్టమయ్యే విధంగా; వినిపించెదన్= ఆలకింపజేస్తాను.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనేసరికి, భీష్మ డతడితో ఇట్లా అన్నాడు: 'దృఢవివేకం వలన ప్రసిద్ధుడవైనవాడా! ఒక పూర్వకథ వినుము. అది నీ ప్రశ్నకు తగిన సమాధాన మవుతుంది. దాన్ని వినిపిస్తాను'.

## దేవల జైగీషవ్య సంవాద ప్రకారము (సం. 12-222-34)

**వ. అసితుం డగు దేవలుండు జైగీషవ్యుం డను సంయమితోడ 'నీవృత్తం బెఱింగి కొనవలయు నెఱింగింపవే!' యనిన నమ్మహాత్ముం డమ్మునివరున కిట్లనియె. 20**

**ప్రతిపదార్థం:** అసితుండగు దేవలుండు= అసితుడనే పేరుగల దేవలముని; జైగీషవ్యుండు అను సంయమితోడన్= జైగీషవ్యుడు అనే మునితో; నీ వృత్తంబు= నీ వర్తనాన్ని; ఎఱింగికొనవలయున్= తెలిసికొనాలి; ఎఱింగింపవే= తెలియజేయుమా; అనినన్= అనగా; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; ఆ+మునివరునకున్= ఆ మునిశ్రేష్ఠునకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** పూర్వం అసితుండనే పేరుగలడైన దేవలముని జైగీషవ్యుడనే మునిని ఇప్పుడు నీ వృత్తాంతాన్ని తెలిసికొనాలని అడిగాడు. అప్పు డా జైగీషవ్యు డతడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'శాంతిమంతు లైన సౌమ్యుల కెయ్యది । నిష్ఠ దానియందు నిరతిశయ స**
**మాదరంబు గలదు నాదుచిత్తంబున । వినుము తద్విధంబు విస్తరింతు. 21**

**ప్రతిపదార్థం:** శాంతిమంతులు+ఐన= శాంతిగలవారగు; సౌమ్యులకున్= ప్రియమైన దర్శనం కలవారికి; ఏ+అది= ఏది; నిష్ఠ= ఆచరింపదగిన ధర్మమో; దానిఅందున్= ఆ ధర్మమునందు; నాదు చిత్తంబునన్= నా హృదయంలో; నిరతిశయ సమాదరంబు= అత్యధికమైన ప్రీతి; కలదు= ఉన్నది; తద్విధంబున్= ఆ ధర్మప్రకారాన్ని; విస్తరింతున్= వివరించి చెప్పుతాను; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** 'శాంతిసంపన్నులై ప్రియదర్శనులైన వారికి ఏది పాటింపదగిన ధర్మంగా ఉన్నదో, ఆ ధర్మంపట్ల నా చిత్తం ఎనలేని ప్రీతి కలిగి ఉన్నది. ఆ ధర్మవిధాన మెట్లాంటిదో వివరిస్తాను వినుము.

**క. వినుతించిన నిందించిన । ననఘా! మనమునఁ బ్రియంబు నప్రియమును లే**
**కునికియు వ్రేసిన నైనను । గనలు వొడమమియుఁ బ్రబుద్ధగణ్యగుణంబుల్. 22**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; వినుతించినన్= పొగడినా; నిందించినన్= తెగడినా; మనంబునన్= చిత్తంలో; ప్రియంబున్= ప్రీతియు; అప్రియమునున్= అప్రీతియు; లేకునికియున్= లేకుండా ఉండటమున్నూ; వ్రేసినన్+ఐనను= (ఒకరు తనను) కొట్టినప్పటికినీ; కనలు= కోపం; పొడమమియున్= కలగకుండా ఉండటమున్నూ; ప్రబుద్ధ= జ్ఞానంకలవారియొక్క; గణ్య= గణించదగిన; గుణంబుల్= గుణాలుగా ఉన్నవి.

**తాత్పర్యం:** కిల్బిషంలేని ధర్మరాజా! ఇతరులు తనను పొగడవచ్చును, లేదా తెగడవచ్చును. అట్లా చేసినా చిత్తంలో ప్రీతిగానీ, అప్రీతిగానీ లేకుండా ఉండటం, అట్లాగే పరులు తనను కొట్టినా కోపం లేకుండా ఉండటం, జ్ఞానులైనవారి ఎన్నదగిన గుణాలుగా ఉన్నాయి.

**విశేషం:** మానావమానాలు, స్తుతినిందలు కల్గినప్పుడు సామాన్యులు పొంగిపోవటమో, లేక క్రుంగిపోవటమో జరుగుతూ ఉంటుంది. తన్నుకొట్టినవారిని తిరిగి కొట్టాలనిపిస్తుంది. కాని స్థితప్రజ్ఞులైనవారు స్తుతి నిందలను సమానంగా భావిస్తారు. వారు త్రిగుణాలకు అతీతంగా ఉంటారు. కాబట్టి తనకు అపకారం చేసినవారికి ప్రతీకారం చేయాలని అనుకోరు.

**ఆ. ఒకటిఁగోరి దాని కుల్లంబు గందంగ । జాలిఁ బడమి, యేమి సంభవించె**
**నేని దానఁ దృప్తి నూనుట దప్పిన । పనికి వగవ కునికి భవ్యగుణము. 23**

**ప్రతిపదార్థం:** ఒకటి= ఒక వస్తువును; కోరి= అభిలషించి; దానికిన్= ఆ వస్తువుకొర్కై; ఉల్లంబు= హృదయము; కందంగన్= తపించగా; జాలిన్+పడమి= విచారం పొందకుండా ఉండటం; ఏమి సంభవించెనేనిన్= ఏమి జరిగినా; దానన్= ఆ జరిగినదానివలన; తృప్తిన్ ఊనుట= తృప్తినొందటం; తప్పినపనికిన్= తప్పిపోయిన కార్యానికి; వగవక+ఉనికి= చింతించకుండా వుండటం; భవ్యగుణము= శ్రేష్ఠమైన గుణం.

**తాత్పర్యం:** ఏదో ఒక వస్తువును కోరుకొని అది లభించకపోవటం వలన హృదయతాపానికి గురి అయి విచారించరాదు. తనకు మంచి జరిగినా, చెడు జరిగినా దానివలన తృప్తినొందాలి. తాను అనుకొన్నట్లు ఒక పని జరగలేదని చింతించకూడదు. ఇవే మేలైన గుణాలు.

**క. హర్షంబును మానంబు న । మర్షము నపరాధమును సమదభావము ను**
**త్కర్షాపకర్ష చింతలు । నార్షసమాచారమున నిరస్తగుణంబుల్. 24**

**ప్రతిపదార్థం:** హర్షంబును= సంతోషమూ; మానంబున్= అభిమానమూ; ఆమర్షమున్= అసహనమూ; అపరాధమును= తప్పిదమూ; సమదభావము= మదంతో గూడి ఉండటమూ; ఉత్కర్ష+అపకర్ష చింతలు= ఎక్కువ, తక్కువతనాలను గూర్చిన విచారాలూ; ఆర్షసమాచారమునన్= ఋషులకు చెందిన సమీచీనమైన ఆచారమునందు; నిరస్తగుణంబుల్= నిరసించబడిన గుణాలు అవుతున్నాయి.

**తాత్పర్యం:** సంతోషం, అభిమానం, అసహనం, అపరాధం, మదించటం, తన గొప్పతనాన్ని గూర్చిగాని, లేక తక్కువతనాన్ని గూర్చిగాని చింతిస్తూ ఉండటమనేవి ఋషులు విధించిన సదాచార పద్ధతిలో నిరసించబడిన గుణాలుగా ఉన్నాయి.

**క. అవమానమునకుఁ దృప్తుం । డవు నమృతము ద్రావినట్ల యంచితసమ్మా**
**నవిధికి నుద్వేగముఁ బొం । దు విషంబునఁ బోలె శమరతుఁడు మునినాథా! 25**

**ప్రతిపదార్థం:** మునినాథా!= మునిశ్రేష్ఠా!; శమరతుఁడు= అంతరింద్రియనిగ్రహమునందు తత్పరుడైనవాడు; అవమానమునకున్= (తనకు జరిగే) అవమానంతో కూడిన కార్యానికి; అమృతము+త్రావినట్లు+అ= సుధ నాస్వాదించినట్లే; తృప్తుండు+అవున్= తృప్తిపొందినవాడు ఔతాడు; అంచిత= పూజితమైన; సమ్మానవిధికిన్= సత్కారంతో గూడిన పనికి; విషంబునన్+పోలెన్= విషంచేతవలె; ఉద్వేగమున్+పొందున్= వ్యాకులత్వాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠా! అంతరింద్రియ నిగ్రహంకలవాడు తనకు అవమానం జరిగితే అమృతం త్రాగినట్లుగా తృప్తి పొందుతాడు. సమ్మానం జరిగితే విషం త్రాగినప్పుడు పొందినట్లు కలతను పొందుతాడు. సమ్మానం కావాలని కోరడు. అవమానం జరిగితే కలత చెంద డని తాత్పర్యం.

**క.** **చుట్టము పగ యను భేదం । బెట్టిజనులవలనఁ దగుల దెల్లప్పుడు నె**
**ప్పట్టున నద్దానను మదిఁ । బుట్టదు సంతోష హాని బుద్ధాత్మునకున్.** **26**

**ప్రతిపదార్థం:** బుద్ధాత్మునకున్= ఆత్మజ్ఞుడైనవాడికి; ఎట్టి జనులవలనన్= ఏ రకమైన ప్రజలవలనగానీ; ఎల్లప్పుడున్= ఏ వేళనైనా; చుట్టము= బంధువు; పగ= శత్రువు; అను భేదంబు= అనే భేదబుద్ధి; తగులదు= కలుగదు; ఏ+పట్టునన్= ఏ పరిస్థితిలో నైనా; ఆ+దానను= ఆ భేదబుద్ధివలన; మదిన్= హృదయంలో; సంతోషహాని= సంతోషానికి చెరుపు; పుట్టదు= సంభవించదు.

**తాత్పర్యం:** ఆత్మతత్త్వం తెలిసినవాడికి ఏ విధమైన జనులను చూచినా ఎప్పుడైనా వీరు నావారు, వీరు శత్రువులు అనే భేదబుద్ధి పుట్టదు. ఆ భేదభావం లేకపోవటం వలన ఏ పరిస్థితిలోనూ ఆయన చిత్తంలో సంతోషం లోపించదు.

**ఆ.** **ఇంద్రియముల గెల్చి హృదయంబు శాంతిసు । ఖంబుఁ బొంద నిర్వికార వృత్తి**
**యైనవాని పొందు మానితగతి దేవ । తలకుఁ బొంద నరిది ధర్మనిరత!'** **27**

**ప్రతిపదార్థం:** ధర్మనిరత!= ధర్మమునందు+ఆసక్తుడైనవాడా!; ఇంద్రియములన్= శ్రోత్రంమొదలైన ఇంద్రియాలను; గెల్చి= జయించి; హృదయంబు= చిత్తం; శాంతిసుఖంబున్= శాంతివలనగలిగిన సుఖమును; పొందన్= చెందగా; నిర్వికారవృత్తి= వికారాలు లేని వర్తనముగలవాడు; ఐనవాని పొందు= అయినటువంటి వాడితో కలయిక; మానితగతిన్= పూజితమైన రీతిలో; దేవతలకున్= సురలకు; పొందన్+అరిది= పొందటానికి దుర్లభమై ఉన్నది.

**తాత్పర్యం:** ధర్మతత్పరుడవైన మునీంద్రా! శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియాలను, పాదాదులైన కర్మేంద్రియాలను జయించిన వాడు హృదయంలో శాంతి పొందుతాడు. శాంతివలన వాడికి శాశ్వతసుఖం కలుగుతుంది. అప్పు డతడిలో ఏ విధమైన వికారాలూ కలగవు. అట్లాంటి వాడితో పూజితమైన పద్ధతిలో చెలిమి సాధించటం దేవతలకు సైతం దుర్లభంగా ఉంటుంది'.

**క.** **అని చెప్పె ననుడుఁ గుంతీ । తనయాగ్రజుఁ డాత్మ సమ్మదముఁ బొంద నదీ**
**తనయునితో 'నెవ్వఁ డఖిల । జన ప్రియుఁడు సకలసత్త్వసమ్మతుఁ?' డనినన్.** **28**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్+అనుడున్= ఈ రీతిగా చెప్పాడని అనగా; కుంతీతనయ+అగ్రజుఁడు= ధర్మరాజు; ఆత్మ= చిత్తం; సమ్మదమున్+పొందన్= సంతసించగా; నదీతనయునితోన్= భీష్ముడితో; అఖిలజనప్రియుఁడు= సమస్తజనులకు ప్రియమైనవాడు; సకలసత్త్వసమ్మతుఁడు= సర్వప్రాణులకు ఇష్టమైనవాడు; ఎవ్వఁడు?= ఎవడు?; అనినన్= అని అడుగగా.

**తాత్పర్యం:** జైగీషవ్యుడు దేవలుడితో ఈ విధంగా చెప్పా'డని భీష్ము డన్నాడు. అది విని ధర్మరాజు సంతోషించాడు. ఆపై భీష్ముడిని 'సమస్త జనులకు, సకల ప్రాణులకు ప్రియమైనవాడు ఎవడు?' అని ప్రశ్నించగా.

## ఉగ్రసేన శ్రీకృష్ణసంవాద ప్రకారము (సం. 12-223-23)

**వ. అమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను. 'నారదుని విషయంబుగా ఉగ్రసేనునకుఁ గేశవునకు సంవాదంబు గలిగె; నది నీ యడిగిన యర్థంబుఁ దేటపఱుచు; దాని నాకర్ణింపుము. 29**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; ఆ+మహీపతికిన్= ధర్మరాజునకు; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; నారదుని విషయంబుగాన్= నారదమునికి సంబంధించి; ఉగ్రసేనునకున్= ఉగ్రసేను డనబడే యాదవ విభునకు; కేశవునకున్= కృష్ణుడికి; సంవాదంబు= సంభాషణం; కలిగెన్= సంభవించింది; అది= ఆ సంవాదం; నీ అడిగిన= నీవు ప్రశ్నించిన; అర్థంబున్= విషయాన్ని; తేటపఱుచున్= స్పష్టం చేస్తుంది; దానిన్= ఆ సంవాదాన్ని; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** మహాత్ముడైన భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'పూర్వం ఉగ్రసేనుడికీ, కృష్ణుడికీ నారదుడి విషయమై ఒక సంవాదం జరిగింది. ఆ సంవాదం నీవు అడిగిన విషయాన్ని తేటతెల్లం చేస్తుంది. దానిని వివరిస్తాను. వినుము.

**క. నరనాథ! యుగ్రసేనుఁడు । హరితో నిట్లనియె 'జనము లభివర్ణన త**
**త్పరు లగుదురు నారదునెడ; । నరయఁగ నతఁ డంతవాఁడె? యంబుజనాభా!' 30**

**ప్రతిపదార్థం:** నరనాథ!= ధర్మరాజా!; ఉగ్రసేనుఁడు= ఉగ్రసేనవిభుడు; హరితోన్= కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు; నారదునెడన్= నారదుడిపట్ల; జనములు= ప్రజలు; అభివర్ణన తత్పరులు= కీర్తించటంలో ఆసక్తికలవారు; అగుదురు= అవుతున్నారు అంబుజనాభా!= పద్మం నాభియందు గల కృష్ణా!; అరయఁగన్= ఆలోచించగా; అతఁడు= ఆ నారదుడు; అంతవాఁడె?= అంత గొప్పవాడా?

**తాత్పర్యం:** ధర్మరాజా! ఉగ్రసేన మహారాజు శ్రీకృష్ణుడిని చూచి 'ప్రజలు నారదుడిని ఎంతో ఘనంగా ప్రశంసిస్తున్నారు. పద్మనాభా! నిజంగా నారదుడు ఆ ప్రశంసకు తగినంత గొప్పవాడేనా?' అని అడిగాడు.

**వ. అనుటయు నా కృష్ణుం డగ్గురుమతి కిట్లనియె. 31**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అడుగగా; ఆ కృష్ణుండు= ఆ మాధవుడు; ఆ+గురుమతికిన్= ఆ దొడ్డబుద్ధిగలవాడితో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** ఉగ్రసేను డట్లా అడిగేసరికి శ్రీకృష్ణుడు మహామతిఅయిన ఆ రాజుతో ఇట్లా అన్నాడు:

**సీ. 'శ్రుతము నాచారంబు నతిశయవంతంబు । లెడ నహంకార మొక్కింతయేని**
**లేదు, శీలము గడు లెస్స, వేషము నిర్వి । కారం, బమత్సర గర్వమదుఁడు,**
**జననంబుఁ దపము దేజంబును బుద్ధియు । వినయంబు నయమును విశ్రుతములు,**
**ధైర్యంబు వచనమాధుర్యంబు శౌర్యదై । న్య క్రోధలోభ నిరాసకత్వ**

**ఆ. మోజ యతనియందు నైజంబు; లీర్ష్యయు । నుద్ధతియు నసూయయును నవజ్ఞ**
**యును నెఱుంగఁ డట్టి మునివరు నారదు । నఖిలజనులుఁ బొగడు టరుదె యధిప!' 32**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అతనిఅందున్= ఆ నారదుడియందు; శ్రుతమున్= విద్యయు; ఆచారంబున్= సత్ప్రవర్తనమూ; అతిశయవంతంబులు= ఆధిక్యం కలిగి ఉన్నాయి; ఎడన్= హృదయంలో; అహంకారము= గర్వం; ఒక్కింత ఏనిన్= లేశమైనా;

లేదు= ఉన్నది కాదు; శీలము= స్వభావం; కడున్= మిక్కిలి; లెస్స= మేలైనది; వేషము= వస్త్రాద్యలంకారం; నిర్వికారంబు= వికారం లేనిది; అమత్సరగర్వమదుఁడు= (అతడు) మాత్సర్యం, గర్వం, మదం లేనివాడు; జననంబు= పుట్టుకా; తపము= తపస్సూ; తేజంబును= ప్రకాశమూ; బుద్ధియున్= మతీ; వినయంబున్= అడకువా; నయమును= నీతీ; విశ్రుతములు= ప్రసిద్ధములు; ధైర్యంబు= ధీరత్వం; వచనమాధుర్యంబు= మాటలలోని మధురత్వము; శాఠ్యదైన్య క్రోధ లోభ నిరాసకత్వము= శఠత్వం, దీనత్వం, కోపం, పిసినితనం అను దోషములను నిరసించు స్వభావమును; ఓజ= ఉత్సాహము; అతనియందున్= ఆ నారదునిలో; నైజంబులు= స్వభావసిద్ధములు; ఈర్ష్యయున్= ఓర్వలేనితనము; ఉద్ధతియున్= గర్వం; అసూయయునున్= గుణాలపై దోషదృష్టి, అవజ్ఞయునున్= తెగడికయు; ఎఱుంగఁడు= తెలియనివాడు; అట్టిమునివరున్= అట్లాంటి మునిశ్రేష్ఠుడైన; నారదున్= నారదమునీంద్రుడిని; అఖిలజనులు= సమస్తప్రజలు; పొగడుట= స్తుతించుట; అరుదె?= అబ్బురమా?

**తాత్పర్యం:** 'రాజా! నారదునిలో శాస్త్రజ్ఞానం, సదాచారం అధికంగా ఉన్నాయి. అతడి హృదయంలో ఇసుమంతైనా అహంకారం లేదు. అతడి శీలం చక్కనిది. వేషంలో ఏ విధమైన వికారమూ లేదు. అతడిలో మాత్సర్యం, గర్వం, మదం అనే దుర్గుణాలు లేవు. అతని పుట్టుక, తపస్సు, తేజస్సు, బుద్ధి, వినయం, నీతి చాలా ప్రసిద్ధి పొందాయి. అతడు ధీరత్వం, మధురమైన మాటలు కలవాడు. శఠత్వం, దీనత్వం, కోపం, లోభం - అనే దుర్గుణాలను అతడు ఈసడించుకొంటాడు. అతడికి ఈర్ష్య, గర్వం, అసూయ, తిరస్కారభావం - అనేవి తెలియవు. అట్లాంటి మునిశ్రేష్ఠుడైన నారదుడిని జనులు కీర్తించటంలో ఆశ్చర్య మేమున్నది?'

**వ.** **అని చెప్పె నగ్గుణంబు లఖిల ప్రియకరంబులు, సకల సత్త్వ సమ్మతంబు' లనిన విని ధర్మతనయుండు శంతను తనయుతోఁ 'గాలావయవ ప్రకారంబులును, యుగప్రమాణంబులును, భూతవిధంబులును నెఱింగింపవే!' యని యడుగుటయు, నతండు 'శుకుం డడుగ వేదవ్యాస మునీశ్వరుండు సెప్పిన యర్థంబులు నీయడిగిన యవియును మఱియు ననేకంబులుఁ గలవు సెప్పెద విను' మని యజ్జనపతి కిట్లనియె. 33**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= అని వచించాడు; ఆ+గుణంబులు= ఆ గుణాలు; అఖిలప్రియకరంబులు= అందరికీ ప్రియమును కలిగించేవి; సకలసత్త్వసమ్మతంబులు= సమస్త ప్రాణులకు ఇష్టములైనవి; అనినన్+విని= అనగా ఆలకించి; ధర్మతనయుండు= ధర్మజుడు; శంతను తనయుతోన్= భీష్ముడితో; కాలావయవ ప్రకారంబులును= కాలముయొక్క అంగములకు చెందిన విధానాలు; యుగప్రమాణంబులును= కృతయుగాదులైన యుగాలయొక్క కొలతలు; భూతవిధంబులున్= పృథివి మొదలైన పంచభూతాల విధానాలను; ఎఱింగింపవే!= తెలుపవే!; అని అడుగుటయున్= అని ప్రశ్నించగా; అతండు= ఆ భీష్ముడు; శుకుండు+అడుగన్= శుకయోగి ప్రశ్నించగా; వేదవ్యాస మునీశ్వరుండు= వేదవ్యాసుడనే ముని శ్రేష్ఠుడు; చెప్పిన= వచించిన; అర్థంబులు= విషయాలు; నీ అడిగినవియును= నీవు ప్రశ్నించినవియును; మఱియున్= అంతేకాక; అనేకంబులు= పెక్కువిషయాలు; కలవు= ఉన్నాయి; చెప్పెదన్= చెబుతాను; వినుము+అని= ఆలకించుమని; ఆ+జనపతికిన్= ఆ రాజుకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కృష్ణుడు ఉగ్రసేనుడితో చెప్పాడు; 'పై జెప్పిన గుణాలు అందరికీ ప్రియమైనవి. సమస్తప్రాణులకూ ఇష్టమైనవి' అని చెప్పేసరికి విని ధర్మరాజు భీష్ముడిని 'కాలము యొక్క అవయవాలకు చెందిన విభాగాలను, కృతాదియుగాల ప్రమాణాలను తెలియజెప్పు' మని అడిగాడు. అప్పుడు భీష్ముడు 'పూర్వం శుకుడు ఈ విషయాలనే వేదవ్యాస మునీశ్వరుడిని అడిగాడు. ఆ మునీంద్రుడు చెప్పిన విషయాలు నీ వడిగినవే కాక ఇంకా ఆయన అనేక విషయాలు తెలియజేశాడు. వాటిని వివరిస్తాను విను' మని ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**క.** **అనఘుఁ బరాశరసూను స। వినయంబునఁ జేరి భక్తి వినతుం డై త**
**త్తనయుండు బుద్ధి సంప। ద్ఘనుఁడు శుకుం డిట్టు లనియెఁ గౌరవనాథా! 34**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ధర్మరాజా!; అనఘున్= పాపరహితుడైన; పరాశరసూనున్= వ్యాసుడిని; తత్తనయుండు= అతడి కుమారుడు; బుద్ధి సంపద్ఘనుడు= ప్రజ్ఞావైభవంతో దొడ్డవాడూ అయిన; శుకుండు= శుకయోగి; సవినయంబునన్= వినయంతో; చేరి= సమీపించి; భక్తివినతుండు+ఐ= భక్తితో ప్రణమిల్లినవాడై; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కౌరవాధిపతివగు ఓ ధర్మరాజా! పాపరహితుడూ, పరాశరుడి పుత్రుడూ అయిన వ్యాసుడిని ఒకసారి అతడి కుమారుడూ, బుద్ధివైభవంలో పెద్దవాడూ అయిన శుకుడు వినయంతో సమీపించాడు. భక్తిభావంతో తండ్రికి నమస్కరించాడు. ఆ పైన ఇట్లా అన్నాడు:

**తే.** **'కాలవిధములు భూతసంఘప్రకార । ములును లోనుగ నెఱుఁగంగ వలయు వాని**
**బహుళకారుణ్యసంపద పల్లవింప । నాకు నెఱిఁగింపవే మునినాథవర్య!'** **35**

**ప్రతిపదార్థం:** మునినాథవర్య!= మునీంద్రులలో శ్రేష్ఠుడవైన వాడా!; కాలవిధములు= కాలముయొక్క ప్రకారాలు; భూతసంఘ ప్రకారములును= భూతసమూహాల స్వరూపాలూ; లోనుగన్= మొదలుగ; ఎఱుగంగవలయున్= తెలిసికొనాలి; బహులకారుణ్య సంపద= అత్యధికమైన దయావైభవము; పల్లవింపన్= విస్తరించగా; వానిన్= ఆ విషయాలను; నాకున్+ఎఱిఁగింపవే= నాకు తెలియజేయుమా!

**తాత్పర్యం:** 'మునిశ్రేష్ఠా! కాలముయొక్క స్వరూపాలను, పంచభూతాల ప్రకారాలు లోనుగా గల విషయాలను తెలిసికొనాలని అనుకొంటున్నాను. మెండైన కృప తొణికిసలాడగా నాకు ఆ విషయాలు తెలియజేయుము!'

**వ్యాసుడు శుకునకుఁ జెప్పిన కాలావయవ నిరూపణము (సం. 12-224-6)**

**వ.** **అనిన విని భరితాదరుండై వేదవ్యాస మునీశ్వరుం డమ్మహనీయున కిట్లనియె.** **36**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= విని; వేదవ్యాస ముని+ఈశ్వరుండు= వేదవ్యాసమునివర్యుడు; భరిత+ఆదరుండు+ఐ= నిండినప్రేమకలవాడై; ఆ+మహనీయునకున్= పూజ్యుడైన ఆ శుకుడికి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** శుకు డా విధంగా అడిగేసరికి వేదవ్యాసుడు మిక్కిలి ఆదరంతో పూజనీయుడైన ఆ శుకుడిని చూచి ఇట్లా అన్నాడు.

**క.** **'కాలములకు భూతములకు । నాలంబనభూత మగు మహామహిమఁ గ్రియా**
**లీల వెలింగెడు నప్పర । మాలోకం బెందు నిష్క్రియాత్మక మయ్యెన్.** **37**

**ప్రతిపదార్థం:** కాలమునకున్= రేయింబవళ్ళు మొదలైన కాలాలకు; భూతములకున్= పృథివి మొదలైన భూతాలకు; ఆలంబన భూతము+అగు= ఆధారమైన; మహామహిమన్= గొప్ప ప్రభావంతో; క్రియాలీలన్= కార్యరూపమైన విలాసంతో; వెలింగెడు= తేజరిల్లే; ఆ+పరమాలోకంబు= ఆ పరమతేజ స్వరూపం; ఎందున్= ఏ సందర్భంలో గానీ; నిష్క్రియాత్మకము= క్రియాసంబంధం లేనిదిగా; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** కాలాలకూ, భూతాలకూ ఆధారమైన గొప్ప ప్రభావంతో ఒక తేజశ్శక్తి పైకి అన్నిపనులూ చేస్తున్నట్లు భాసిస్తున్నది. కాని అది ఎప్పుడుగానీ ఏ విధమైన క్రియతోనూ సంబంధం లేనిదిగానే ఉన్నది.

**వ.** **అది భావనీయంబు.** **38**

**ప్రతిపదార్థం:** అది= ఆ తేజస్సు; భావనీయంబు= భావించదగి ఉన్నది.

**తాత్పర్యం:** ఆ తేజోరూపమైన శక్తి మనస్సులో భావించటానికి యోగ్యమైనదిగా ఉన్నది.

**క. వినుము! నిమేషంబులు పదు । నెనిమిది యగుఁగాష్ఠ; గాష్ఠ లిరువదియుం దో**
**డన పదియుం గళ; యఱువది । యును మున్నూఱుఁ గళలై ముహూర్తము నడచున్. 39**

**ప్రతిపదార్థం:** వినుము; పదునెనిమిది= అష్టాదశ సంఖ్యాకాలైన; నిమేషంబులు= నిముసములు; కాష్ఠఅగున్= కాష్ఠఅనబడుతుంది; ఇరువదియున్= ఇరవై; తోడన పదియున్= చేరిన పదియు, మొత్తం ముప్పది; కాష్ఠలు= 'కాష్ఠలు' అనే కాలవిభాగాలు; కళ= కళ అనబడుతుంది; అఱువదియును మున్నూరు కళలు+ఐ= మూడువందలా అరవై కళలు గలదై; ముహూర్తము= ముహూర్తమనే కాలభాగం; నడచున్= ప్రవర్తిస్తుంది.

**తాత్పర్యం:** ఆ సంగతి వివరిస్తాను వినుము. పదునెన్మిది నిమేషాలు ఒక 'కాష్ఠ' అన్న కాలవిభాగ మవుతుంది. అట్లాంటి ముప్పది కాష్ఠలు ఒక 'కళ' అవుతుంది. మూడువందల అరవై కళలను ఒక ముహూర్తం అంటారు.

**తే. మూఁడు పదులు ముహూర్తముల్ మోహదూర! । యగు నహోరాత్ర; మట్టివి యన్ని గూడ**
**మాస; మవి రెండు ఋతు వను మహితసంజ్ఞఁ । బరఁగు; ఋతువు లాఱైన వత్సరము వత్స! 40**

**ప్రతిపదార్థం:** మోహదూర!= మోహానికి దూరమైనవాడా!; వత్స!= కుమారా!; మూఁడుపదుల్= ముప్పదైన; ముహూర్తముల్= ముహూర్తాలనే కాలవిభాగాలు; అహోరాత్రము అగున్= పవలు రేయి అవుతున్నవి; అట్టివి= ఆ అహోరాత్రాలు; అన్ని= అంతే సంఖ్యగలవి, అనగా ముప్పది; కూడన్= కలియగా; మాసము= ఒక నెల ఔతుంది; అవిరెండు= ఆ మాసాలు రెండు చేరిన; ఋతువు+అను= ఋతువు అనబడే, మహితసంజ్ఞన్= శ్రేష్ఠమైన నామంతో; పరఁగున్= ఒప్పుతుంది; ఋతువులు= ఆ ఋతువు లనబడే కాలవిభాగాలు; ఆఱు+ఐనన్= ఆరు కూడితే; వత్సరము= ఒక సంవత్సరం అవుతుంది.

**తాత్పర్యం:** మోహ మంటని ఓ కుమారా! ముప్పైముహూర్తాలు ఒక అహోరాత్ర మవుతుంది. ముప్పై అహోరాత్రాలు ఒక మాస మవుతుంది. రెండుమాసాలు కలిస్తే ఒక ఋతు వవుతుంది. ఆరు ఋతువులు ఒక సంవత్సరం అవుతుంది.

**తే. అందు మూఁడేసి ఋతువుల కయననామ । కంబు లగు; నుత్తరాఖ్య మొకండు దక్షి**
**ణాభిధాన మొక్కటియు గుణాభిరామ! । యవి యహస్సును రాత్రియు ననఁగఁ బరఁగు. 41**

**ప్రతిపదార్థం:** గుణ+అభిరామ!= గుణములచేత మనోహరమైనవాడా!; అందున్= ఆ ఋతువులలో; మూఁడేసి= మూడు మూడైన; ఋతువులకున్= ఋతువులనబడే కాలవిభాగాలకు; అయననామకంబులు= అయనాలనే పేర్లు; అగున్= ఉంటాయి; ఒకండు= ఒకటి; ఉత్తరాఖ్యము= ఉత్తరాయణ మనేది; ఒక్కటియున్= ఇంకొకటి; దక్షిణ+అభిధానము= దక్షిణాయనమనబడేది; అవి= ఆ ఉత్తరదక్షిణాయనాలు; అహస్సును= పవలును; రాత్రియున్= రేయియును; అనఁగన్+పరఁగున్= అని చెప్పగా ఒప్పుతున్నాయి.

**తాత్పర్యం:** సద్గుణాలచేత శోభిల్లే ఓ కుమారా! ఆ ఋతువులలో మూడేసి ఋతువులను అయన మంటారు. ఒక అయనానికి ఉత్తరాయణన మనీ, మరొక అయనానికి దక్షిణాయన మనీ పేర్లు. ఈ అయనాలు రెండింటినీ అహోరాత్రాలు (రేయింబవళ్ళు) అనికూడా వ్యవహరిస్తారు.

**వ. అది యోగిజనుల నిర్దేశంబు. 42**

**ప్రతిపదార్థం:** అది= ఆ వ్యవహారం; యోగిజనుల= యోగమార్గంలో ఉన్న జనులయొక్క; నిర్దేశంబు= కథనం.

**తాత్పర్యం:** యోగులు నిర్దేశించినట్లుగా పై వ్యవహారం కాలానికి ఏర్పడింది.

**తే. అనఘ! యుత్తరదక్షిణాయనము లమ్మ। హాత్ము లగ్నియు ధూమంబు నంద్రు; మఱియు**
**వినుము! శుక్లంబుఁ గృష్ణంబు ననుట గలుగు। సుగతి కగతికి హేతువు లగుటఁ జేసి. 43**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఆ+మహాత్ములు= ఆ యోగులు; ఉత్తరదక్షిణ+అయనములు= ఉత్తరాయణ దక్షిణాయనాలను; అగ్నియున్= అగ్నిఅనీ; ధూమంబు= ధూమ మనీ; అంద్రు= అంటారు; మఱియున్= ఇంకను; వినుము; సుగతికిన్= మంచిగతికి; అగతికిన్= దుర్గతికిని; హేతువులు= (ఆ అయనాలు) కారణాలు; అగుటన్+చేసి= కావటంవలన; శుక్లంబు= శుక్లమనీ; కృష్ణంబు= కృష్ణమనీ; అనుట= వ్యవహరించటం; కలుగున్= సంభవిస్తున్నది.

**తాత్పర్యం:** పాపరహితుడా! యోగులు ఉత్తరాయణాన్ని 'అగ్ని' అనీ, దక్షిణాయనాన్ని 'ధూమ' మనీ కూడా అంటారు. అంతేకాక అందు మొదటిది సుగతి కలిగిస్తుంది కాబట్టి శుక్లమనీ, రెండవది దుర్గతి కలిగిస్తుంది కాబట్టి కృష్ణ మనీ వ్యవహరించటం కూడా కద్దు.

**క. నరుల నెలలు నేఁడులు ౘ బితృ। సురులకు దినము లగు నంద్రు సూరులు వరుసం**
**బరఁగు కృత త్రేతా ద్వా। పర కలియుగ వత్సరముల భంగిఁ దెలిపెదన్. 44**

**ప్రతిపదార్థం:** సూరులు= విద్వాంసులు; నరుల= మానవులయొక్క; నెలలు= మాసాలు; ఏఁడులు= సంవత్సరాలు; పితృసురులకున్= (క్రమంగా) పితరులకు, దేవతలకు; దినములు+అగున్+అంద్రు= దినము లవుతాయని చెప్తుతారు; వరుసన్= క్రమముగా; పరఁగు= ఒప్పారు; కృత= కృతయుగం యొక్కయు; త్రేతా= త్రేతాయుగం యొక్కయు; ద్వాపర= ద్వాపరయుగం యొక్కయు; కలియుగ= కలియుగం యొక్కయు; వత్సరముల= సంవత్సరాల యొక్క; భంగిన్= ప్రకారాన్ని; తెలిపెదన్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** విద్వాంసు లైనవారు మానవులకు చెందిన నెలలు పితరులకు దినాలక్రింద లెక్కింపబడతాయనీ, సంవత్సరాలు దేవతలకు దినాలక్రింద పరిగణించబడతాయనీ అంటారు. అంటే మానవులకు ఒక్క నెల అయితే పితరులకు ఒక్క దినమవుతుంది. మానవులకు ఒక్క సంవత్సరమయితే దేవతలకు ఒక్క దినమవుతుందని భావం. ఇక కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని క్రమంగా ప్రవర్తించే ఆయా యుగాలకు చెందిన సంవత్సరాల వివరాలు తెలియజేస్తాను.

**వ. ఆకర్ణింపుము. 45**

**తాత్పర్యం:** వినుము.

### చతుర్యుగ సంవత్సర పరిమితి ప్రకారము (సం. 12-224-18)

**సీ. విబుధుల పండ్రెండు వేలేండ్లు సనునంత। నాలుగు యుగములు నోలి నడచుఁ**
**గృతయుగమ్మున కందుఁ జతురంశకములుఁ, ద్రే। తకు మూఁడు పాళ్ళును, ద్వాపరంబు**
**భాగద్వయంబునఁ బర్యవసిత మగుఁ;। గలియుగ మంశ మొక్కటన తీఱు;**
**నిబ్భంగిపాళ్ళగు నిన్నియుగముల కం। బరయుగ్మ వసువార్ధి పరిమితములు**

**తే. ఖద్వయర్తుగుణంబులు గగన యుగళ। వేద నేత్రంబులును నభోద్వితయకరసు**
**ధాంశులును వచ్చు మున్నూటయఱువదింటఁ। బెంప మానుషాబ్దంబులై పేర్చి యుండు. 46**

**ప్రతిపదార్థం:** విబుధుల= దేవతలయొక్క; పండ్రెండు వేలేండ్లు= పండ్రెండువేల సంఖ్యగల సంవత్సరాలు; చనునంతన్= కడచినంతనే; ఓలిన్= క్రమంగా; నాలుగు యుగములు= కృతత్రేతాదులైన నాలుగు యుగాలు; నడచున్= ప్రవర్తిస్తాయి; అందున్= ఆ పండ్రెండువేల సంవత్సరాలలో; కృతయుగమ్మునకున్= కృతయుగానికి; చతురంశకములు= (పదింట) నాలుగుపాళ్ళు; త్రేతకున్= త్రేతాయుగానికి; మూఁడుపాళ్ళును= మూడంశాలును ఔతాయి; ద్వాపరంబు= ద్వాపరయుగం; భాగద్వయంబునన్= రెండుపాళ్ళతో; పర్యవసితము= సమాప్తం; అగున్= ఔతుంది; కలియుగము= నాల్గవయుగం; అంశము+ఒక్కటైనన్= ఒక్కభాగంలోనే; తీఱున్= సమాప్తమవుతుంది; ఈ+భంగిన్= ఈ రీతిగా; పాళ్ళు+అగు= భాగాలు అవుతున్న; ఇన్ని యుగములకున్= ఈ నాలుగు యుగాలకు; అంబరయుగ్మ వసువార్ధి పరిమితములు= నాలుగువేల ఎనిమిది వందల సంవత్సరాల; ఖద్వయర్తు గుణంబులు= మూడువేల ఆరువందలు; గగనయుగళవేద నేత్రంబులును= రెండువేల నాలుగు వందలు; నభోద్వితయకర సుధాంశులును= పండ్రెండువందలును; వచ్చున్= సమకూరుతాయి; మున్నూట యరువదింటన్= మూడువందల అరువది అనే సంఖ్యతో; పెంపన్= గుణించగా; మానుష+అబ్దంబులు+ఐ= మానవులకు చెందిన సంవత్సరాలై; పేర్చి ఉండున్= పెంపొందిఉంటాయి.

**తాత్పర్యం:** దేవతలకు చెందిన పండ్రెండువేల సంవత్సరాలు గడచేసరికి నాలుగు యుగాలు పూర్తి అవుతాయి. అందులో మొదటిదైన కృతయుగానికి పదింట నాల్గుభాగాలు, త్రేతాయుగానికి మూడుభాగాలు, ద్వాపరయుగానికి రెండుభాగాలు, కలియుగానికి ఒక్కభాగంగా కాలం విభక్తమయింది. 12000 లో పదింట నాల్గవభాగం, 4800, మూడవభాగం 3600, రెండవ భాగం 2400, ఒకభాగం 1200 గా గ్రహించవలసి ఉంటుంది. ఈ సంఖ్యలను క్రమంగా 360తో గుణిస్తే మానుష లోకానికి చెందిన కృతయుగాదుల సంవత్సరాలు సిద్ధిస్తాయి.

**విశేషం:** అంబరయుగ్మ వసు వార్ధులు అనే పదానికి సంఖ్యా గణన ప్రకారం 4800 అని అర్థం సిద్ధిస్తుంది. అంబరం అంటే ఆకాశం - శూన్యమన్నమాట; యుగ్మమంటే రెండు, అంబరయుగ్మమన్న పదానికి రెండు సున్నలని అర్థం; వసువులు అష్టసంఖ్యాకులు కాబట్టి వసుశబ్దానికి ఎనిమిది అని అర్థం; వార్ధి= సముద్రం - నాల్గు సముద్రాలు ప్రసిద్ధాలు కాన వార్ధి అంటే నాల్గు సంఖ్య అని అర్థం; 'అంకానాం వామతో గతిః' అన్నట్లు అంకెలను ఎడమవైపుకు లెక్కించాలి. ఇట్లా లెక్కిస్తే 4800 అనే సంఖ్య వస్తుంది. తక్కినవిగూడా ఇట్లానే అన్వయించుకోవాలి.

ఖద్వయర్తుగుణంబులు= ఖద్వయం= రెండు సున్నలు, ఋతువులు 6, గుణములు 3= మొత్తం 3600 -

గగనయుగళ వేదనేత్రంబులు= గగనయుగళ= రెండు సున్నలు, వేదాలు= 4, నేత్రాలు 2= మొత్తం 2400 -

నభోద్వితయకర సుధాంశులును= నభోద్వితయం= రెండుసున్నలు, కరములు2 , సుధాంశుడు= చంద్రుడు= ఒకటి - మొత్తం 1200 - వీటిని 360తో పెంచగా వచ్చేసంఖ్యలను గ్రంథకర్తే తరువాత వివరిస్తాడు.

**వ. ఇట్లు కృతయుగంబునకుఁ బదియేడు లక్షలు ఇఱువది యెనిమిది వేలును, ద్రేతాయుగంబునకుఁ బండ్రెండు లక్షలుఁ దొంబదియాఱువేలును, ద్వాపరంబునకు నెనిమిది లక్షలు నఱువది నాలుగువేలును, గలియుగంబునకు నాలుగు లక్షలు ముప్పది రెండు వేలును మనుష్య వత్సరంబు లయ్యెఁ; నిందులోన సంధ్యలును, సంధ్యాంశంబులు ననుపేళ్లఁ గొంతేసి కాలంబు సెల్లు. 47**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కృతయుగంబునకున్= కృతయుగానికి; పదియేడులక్షలు ఇరువది ఎనిమిదివేలును= 4800 x 360= 17 28000 సంఖ్యగల సంవత్సరాలు, త్రేతా యుగానికి, పండ్రెండు లక్షలు తొంబదియాఱువేలును= 3600x 360= 12 96000 సంఖ్య గల సంవత్సరాలు, ద్వాపరంబునకున్= ద్వాపరయుగానికి, ఎనిమిదిలక్షలు అఱువదినాలుగు వేలును= 2400 x 360= 864000 సంఖ్యగల సంవత్సరాలును; కలియుగంబునకున్= కలియుగానికి; నాలుగు లక్షలు ముప్పదిరెండువేలును= 1200 x 360= 432000 సంఖ్యగల సంవత్సరాలును; మనుష్యవత్సరంబులు= మానవసంవత్సరాలు; అయ్యెన్= అయ్యాయి;

ఇందులోనన్= ఈ సంవత్సరాలలో; సంధ్యలును= సంధ్యలనియు; సంధ్యాంశంబులున్= సంధ్యాంశములనియు; అనుపేళ్ళన్= అనబడు నామములతో; కొంతేసికాలంబు= కొంతపరిమాణానికి చెందిన సమయం; చెల్లున్= గతిస్తుంది.

**తాత్పర్యం:** ఇట్లా లెక్కిస్తే మానవలోకానికి చెందిన కాల విభాగంలో కృతయుగానికి 17,28,000, త్రేతాయుగానికి 12,96,000, ద్వాపరయుగానికి 8,64,000, కలియుగానికి 4,32,000 సంవత్సరాలు వస్తాయి. ఇందులో కొంతకాలం సంధ్యలనీ, సంధ్యాంశాలనీ వ్యవహరించబడుతుంది.

**క. క్రమమున సంధ్యలు సంధ్యాం । శములు ననం బరఁగు బుత్ర! సకలయుగాద్యం**
**తములును యుగయుగమునకుం । దమలో నవి సరియ కాలతత్త్వం బరయన్. 48**

**ప్రతిపదార్థం:** పుత్ర!= వత్సా!;; సకలయుగ+ఆద్యంతములును= సమస్తయుగాల మొదటిభాగాలును, చివరిభాగాలును; క్రమమునన్= క్రమంగా; సంధ్యలు= సంధ్యలనీ; సంధ్యాంశములు= సంధ్యాంశాలు; అనన్= అనగా; పరఁగున్= ఒప్పారుతాయి; కాలతత్త్వంబు= కాలస్వభావం; అరయన్= పరిశీలించగా; యుగయుగమునకున్= యుగయుగానికీ; అవి= ఆ సంధ్యాసంధ్యాంశాలు; తమలోన్= తమయందు; సరియ= సమానంగానే ఉంటాయి.

**తాత్పర్యం:** కుమారా! అన్ని యుగాల ఆద్యంతభాగాలను సంధ్యలనీ, సంధ్యాంశాలనీ అంటారు. కాలతత్త్వాన్ని బట్టి పరిశీలిస్తే యుగయుగానికీ ఈ సంధ్యా సంధ్యాంశాలు సమంగానే ఉంటాయి.

**వ. అది యెట్లంటేని దేవసంఖ్యం జెప్పెద. 49**

**ప్రతిపదార్థం:** అది= ఆ వివరం; ఎట్లు+అంటివి+ఏనిన్= ఎట్లా అంటే; దేవసంఖ్యన్= దేవతలకాలమానాన్ని అనుసరించి; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** ఆ సంధ్యలు, సంధ్యాంశాల వివరం ఎట్లా అంటే దేవతల కాలమానానుసారం వివరిస్తాను.

**క. నన్నూఱులు మున్నూఱులు । నిన్నూఱులు నూఱులును మహితవర్షము ల**
**య్యన్ని యుగములకును గ్రమా । సన్నత సంధ్యలను వాని సంధ్యాంశములన్. 50**

**ప్రతిపదార్థం:** ఆ+అన్ని యుగములకునున్= ఆ సమస్త యుగాలకు; సంధ్యలను= సంధ్యాకాలాలలోనూ; వాని సంధ్యా+అంశములన్= ఆ యుగాల సంధ్యాంశముల కాలంలోనూ; క్రమ+ఆసన్నతన్= వరుసగా; నన్నూఱులు= నాల్గువందలు; మున్నూఱులు= మూడువందలు; ఇరు+నూరులు= రెండు వందలు; నూఱులును= ఒక వందసంవత్సరాలును; మహిత వర్షములు= పూజితమైన సంవత్సరాలుగా ఉన్నాయి.

**తాత్పర్యం:** కృతాది సర్వయుగాలకూ సంధ్యలలోనూ, సంధ్యాంశాలలోనూ క్రమంగా దేవతలకాలమానం ప్రకారం నాలుగువందల సంవత్సరాలూ, మూడువందల సంవత్సరాలూ, రెండువందల సంవత్సరాలూ, వంద సంవత్సరాలూ లెక్కకు వస్తాయి.

**విశేషం:** వీటిని మానుషకాలానికి అనుగుణంగా లెక్కించటానికి 360 సంఖ్యతో గుణించితే సరిపోతుంది.

**వ. ఇట్లు కృతయుగంబునకు సంధ్య లక్షయునలువదినాలుగువేలు, దాని సంధ్యాంశంబు నంతియ; త్రేతకు సంధ్య లక్షయు నెనిమిది వేలు; దాని సంధ్యాంశంబు నంతియ; ద్వాపరంబునకు సంధ్య డెబ్బదిరెండువేలు; దాని సంధ్యాంశంబు నంతియ; కలియుగంబునకు సంధ్య ముప్పదియాఱువేలు; దాని సంధ్యాంశంబు నంతియ; యివి మానుష వత్సరంబులు. 51**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కృతయుగంబునకున్= కృతయుగానికి; సంధ్య= సంధ్యాకాలం; లక్షయు నలువది నాలుగు వేలు= 1,44,000 సంవత్సరాలు; దాని సంధ్యా+అంశంబున్= ఆ కృతయుగానికి చెందిన సంధ్యాంశకాలం కూడా; అంతియ= అంతే; త్రేతకున్= త్రేతాయుగానికి సంధ్య= సంధ్యాకాలం; లక్షయు నెనిమిదివేలు= 1,08,000 సంవత్సరాలు; దాని సంధ్యా+అంశమున్= ఆ త్రేతాయుగానికి చెందిన సంధ్యాంశకాలం కూడా; అంతియ= అంతే; ద్వాపరంబునకున్= ద్వాపరయుగానికి; సంధ్య= సంధ్యాకాలం; డెబ్బదిరెండువేలు= 72,000 సంవత్సరాలు; దాని సంధ్యా+అంశంబున్= ఆ ద్వాపరయుగానికి చెందిన సంధ్యా+అంశకాలం కూడా; అంతియ= అంతే; కలియుగంబునకున్= కలియుగానికి; సంధ్య= సంధ్యాకాలం; ముప్పది+ఆఱువేలు= 36,000 సంవత్సరాలు; దాని సంధ్యా+అంశంబున్= ఆ కలియుగానికి చెందిన సంధ్యాంశకాలం కూడా; అంతియ= అంతే; ఇవి= ఈ చెప్పినవి; మానుష వత్సరంబులు= మానవలోకానికి చెందిన సంవత్సరాలు.

**తాత్పర్యం:** (దేవతావత్సరాలను 360తో గుణిస్తే మానుష వత్సరాలు వస్తాయి. ఆ విధంగా గుణించగా) కృతయుగానికి సంధ్య, సంధ్యాంశం - ఒక లక్ష నలభై నాలుగువేల మానుష సంవత్సరాల కాలమవుతుంది. త్రేతాయుగానికి ఒకలక్ష ఎనిమిదివేల సంవత్సరాల సమయ మవుతుంది. ద్వాపరయుగానికి డెబ్భైరెండువేల సంవత్సరాల సమయ మవుతుంది. కలియుగానికి ముప్పదియారువేల సంవత్సరాల కాలం పడుతుంది.

**క.** **వరుసఁ గృత త్రేతా ద్వా । పర కలియుగములఁ దపంబు భవ్యజ్ఞాన**
**స్ఫురణము యజనము దోషా । దరమును మానవులకుం బ్రధానతఁ గలుగున్.** **52**

**ప్రతిపదార్థం:** మానవులకున్= మనుష్యులకు; ప్రధానతన్= ముఖ్యంగా; కృత= కృత యుగంలోనూ; త్రేతా= త్రేతాయుగంలోనూ; ద్వాపర= ద్వాపరయుగంలోనూ; కలియుగములన్= కలియుగంలోనూ; వరుసన్= క్రమంగా; తపంబు= తపస్సు; భవ్యజ్ఞానస్ఫురణము= శ్రేష్ఠమైన జ్ఞానంయొక్క ప్రకాశం; యజనము= యజ్ఞక్రియ; దోషాదరమును= దోషాచరణంపై ప్రీతియు; కలుగున్= సంభవిస్తాయి.

**తాత్పర్యం:** మనుష్యులకు ముఖ్యంగా కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో శ్రేష్ఠమైన జ్ఞానస్ఫూర్తీ, ద్వాపరయుగంలో యజ్ఞం చేయటం, కలియుగంలో దోషాచరణమూ - స్వభావంగా సంభవిస్తుంటాయి.

**క.** **న్యాయంబులు, ధర్మంబులు, । నాయువులుఁ, దనూబలములు నంతంతకు వ**
**త్సా! యెంతయుఁ దఱుఁగుం ద్రే । తాయుగముఁ దొడంగి మనుజతతి కరయంగన్.** **53**

**ప్రతిపదార్థం:** వత్సా!= కుమారా!; మనుజతతికిన్= మానవసమూహానికి; అరయంగన్= పరిశీలించగా; త్రేతాయుగమున్+తొడంగి= త్రేతాయుగం మొదలుకొని; న్యాయంబులున్= న్యాయవిధానాలు; ధర్మంబులు= ధర్మాచరణలు; ఆయువులున్= జీవన కాలాలు; తనూబలములున్= శరీరబలాలు; అంతంతకున్= అంతకంతకు; ఎంతయున్= మిక్కిలిగా; తఱుఁగున్= తగ్గిపోతాయి.

**తాత్పర్యం:** కుమారా! పరిశీలించి చూస్తే మానవాళికి త్రేతాయుగంనుండీ న్యాయం, ధర్మం, ఆయువు, శరీర పటుత్వం - ఇవి అంతకంతకూ ఎంతగానో తరిగిపోతాయి.

**తే.** **ఆ యుగంబులు నాల్గు మహాయుగంబు । నాఁగఁ జనుఁ దత్సహస్రంబు నలువ పగలు**
**దాని కొలఁదియ రేయును దీని నెఱుఁగు । ప్రౌఢ జనములు సు మ్మహోరాత్ర విదులు.** **54**

**ప్రతిపదార్థం:** ఆ యుగంబులు నాల్గు= ఆ నాలుగు యుగాలూ; మహాయుగంబునాఁగన్= ఒక మహాయుగం అనగా; చనున్= ప్రవర్తిల్లుతుంది; తత్సహస్రంబు= ఆ మహాయుగాలు వెయ్యి; నలువ పగలు= బ్రహ్మకు ఒక పగటికాలం; రేయును= రాత్రియును; దానికొలఁదియ= అంతే పరిమాణం కలిగిఉంటుంది; దీనిన్= ఈ కాల విభాగాన్ని; ఎఱుఁగు= తెలిసికొను; ప్రౌఢజనములు= వివేకంగల మానవులు; అహోరాత్ర విదులు సుమ్ము!= అహోరాత్రాలను తెలిసికొన్న వారు సుమా!

**తాత్పర్యం:** కృతాదులైన నాలుగు యుగాలూ కలిస్తే ఒక మహాయుగం అవుతుంది. అట్లాంటి వెయ్యి మహాయుగాలు బ్రహ్మకు ఒక పగటి కాల మవుతుంది. రాత్రి కాలం కూడా అంతే. ఈ విధమైన బ్రహ్మ పగలు - రేయి కాలక్రమాన్ని తెలిసికొన్న పండితులే అహోరాత్రవేత్త లనబడతారు.

**తే. అతఁడు రాత్రి నిద్రించు; నిద్రావసరమ । ప్రళయ మగు లోకములకు; ప్రభాత మగుడు**
**మేలుకను; దివమున భూతజాలసృష్టి । పరతఁ బొందుఁబర్యాయ మిప్పాటఁ జెల్లు.' 55**

**ప్రతిపదార్థం:** అతడు= ఆ బ్రహ్మ; రాత్రి= రాత్రివేళ; నిద్రించున్= నిద్రిస్తాడు; నిద్రా+అవసరము= ఆ నిద్రించే సమయమే; లోకములకున్= ప్రపంచాలకు; ప్రళయము+అగున్= విలయకాల మవుతుంది; ప్రభాతము+అగుడున్= తెల్లవారగానే; మేలుకనున్= ఆ బ్రహ్మ మేల్కొంటాడు; దివమునన్= ఆ పగటివేళ; భూతజాలసృష్టిపరతన్= ప్రాణి సమూహాన్ని సృష్టి చేయటంలో ఆసక్తతను; పొందున్= చెందుతాడు; ఈ+పాటన్= ఈ రీతిగా; పర్యాయము= క్రమం; చెల్లున్= ప్రవర్తిస్తుంది.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మ రాత్రివేళ నిద్రిస్తాడు. అతడు నిద్రించేసమయమే లోకాలకు ప్రళయకాలం. ప్రభాతం కాగానే అతడు మేలుకొంటాడు. పగటివేళలో ప్రాణికోట్ల సృష్టికి పూనుకొంటాడు. ఈ క్రమపద్ధతి ఇట్లాగే సాగిపోతూ ఉంటుంది'.

**వ. అని వెండియు. 56**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** వ్యాసుడు ఇట్లా చెప్పి మళ్ళీ ఈ రీతిగా అన్నాడు.

**తే. 'అనఘ! బ్రహ్మంబు దేజోమయంబు శుక్ల । మగ్రభాసిత మెద్దాని యతుల సార**
**రసము విశ్వంబు నది యహర్మహితకాల । బుద్ధమై చేయు బహువిధ భూతసృష్టి. 57**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితా!; బ్రహ్మంబు= బ్రహ్మం; తేజోమయంబు= కాంతితో నిండినది; శుక్లము= ధవళమైనది; అగ్రభాసితము= ముందు ప్రకాశించేది; విశ్వంబున్= ప్రపంచం; ఏ+దాని= ఏ దానియొక్క; అతులసారరసము= సాటిలేని సారాంశమో; అది= ఆ బ్రహ్మం; అహర్మహితకాల బుద్ధము+ఐ= అహస్సు అనే పూజ్యమైన కాలంలో మేల్కాంచినదై; బహువిధ భూతసృష్టి= నానావిధాలైన భూతాల సృష్టిని; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన ఓ శుకా! బ్రహ్మం తేజోమయం, అది శుక్లం. అన్నింటికంటె ముందు ప్రకాశించేది. ఈ విశ్వమంతా ఆ బ్రహ్మముయొక్క సారాంశమే. ఆ బ్రహ్మమే అహఃకాలంలో మేలుకొని నానావిధ భూతసంచయాన్ని సృష్టిస్తుంది.

**వ. తత్ప్రకారం బెట్టి దనిన: నమ్మహనీయతత్త్వంబు వలన. 58**

**ప్రతిపదార్థం:** తద్= ఆ బ్రహ్మముయొక్క; ప్రకారంబు= స్వరూపం; ఎట్టిది+అనినన్= ఏ విధమైనది అనగా; ఆ+మహనీయ= ఆ పూజనీయమైన; తత్త్వంబువలనన్= తత్త్వంనుండి.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మస్వరూపం ఎట్లాంటి దంటే - పూజనీయమైన ఆ బ్రహ్మ తత్త్వంనుండి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. విను! మహన్మనోగగన పవనానల । సలిల భూము లనఁగ సంభవించు**
**మహిత విభవములు గ్రమంబున నేడు । రూపములు జన్యజనకభావ మొంది. 59**

**ప్రతిపదార్థం:** విను= వినుము; మహత్= మహత్తత్త్వం; మనః= మనస్సు; గగన= ఆకాశం; పవన= వాయువు; అనల= అగ్ని; సలిల= జలం; భూములు= పృథివి; అనఁగన్= అనగా; మహిత విభవములు= పూజితమైన విభవం గలవి అగు; ఏడురూపములు= సప్తరూపాలు; క్రమంబునన్= వరుసగా; జన్యజనకభావము= పుట్టేది, పుట్టించేది అనే భావాన్ని; ఒంది= పొంది; సంభవించున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** మహత్తు, మనస్సు, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి - అనే ఈ ఏడు రూపాలు గొప్ప వైభవం కలిగి క్రమంగా జన్యజనక భావంతో ఉదయిస్తున్నాయి. అంటే, బ్రహ్మతత్త్వంనుండి మొదట మహత్తత్త్వం పుడుతుంది. దానినుండి మనస్సు, మనస్సునుండి ఆకాశం, ఆకాశంనుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్నినుండి జలం, జలమునుండి పృథ్వి - ఇట్లా క్రమంగా పుట్టుతున్నాయి. మహదాదిక మైన సప్తరూపాలకు మూలం బ్రహ్మమే.

**విశేషం:** 'ఆత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ' ఇత్యాది శ్రుతివచనం కూడా పంచభూతాల ఉత్పత్తిక్రమాన్ని ఇట్లాగే వివరించింది.

**క. క్రమయుక్తిని శబ్దస్ప । ర్శములును రూపరసగంధ సద్భావములుం**
**దమ గుణములుగా నాకా । శము మొదలగు భూతములు ప్రశస్తి వహించున్. 60**

**ప్రతిపదార్థం:** ఆకాశము మొదలగు= ఆకాశాదులైన; భూతములు= ఐదు భూతాలు; క్రమయుక్తిని= క్రమయోగంతో; శబ్దస్పర్శములును= శబ్దం, స్పర్శము; రూపరసగంధ సద్భావములన్= రూపం, రసం, గంధం - అనే సత్పదార్థాలు; తమగుణములుకాన్= తమతమ గుణాలుగా; ప్రశస్తిన్= విఖ్యాతిని; వహించున్= కలిగి ఉన్నాయి.

**తాత్పర్యం:** పంచభూతాలలో క్రమంగా ఆకాశం శబ్దమనే గుణంతోనూ, వాయువు స్పర్శమనే గుణంతోనూ, తేజస్సు రూపమనే గుణంతోనూ, జలం రసమనే గుణంతోనూ, పృథివి గంధమనే గుణంతోనూ ప్రశస్తి వహిస్తున్నాయి.

**క. నరనుత! విను మీ సప్త । స్వరూపములు పురుషులండ్రు సంయమివరు; లీ**
**పురుషులు గూడిన సృష్టికి । వెరవరు లది సంఘటిలదు వేర్పడిరేనిన్. 61**

**ప్రతిపదార్థం:** నరనుత!= మనుజులచేత నుతించబడినవాడా!; వినుము= ఆలకించుము; సంయమివరులు= మునీంద్రులు; ఈ సప్తస్వరూపములు= పై జెప్పబడిన ఏడురూపాలు; పురుషులు+అండ్రు= పురుషులు అని చెప్పుతున్నారు; ఈ పురుషులు= మహదాది పురుషులు; కూడినన్= కలిసినచో; సృష్టికిన్= సృష్టికార్యం చేయటానికి; వెరవరులు= ఉపాయశాలు లగుతున్నారు; వేర్పడిరేనిన్= కలవకుండా విడివిడిగా ఉంటే; అది= ఆ సృష్టి; సంఘటిలదు= సంభవించదు.

**తాత్పర్యం:** జనస్తుతుడవైన ఓ శుకా! వినుము. మునీంద్రులు పై చెప్పిన సప్త స్వరూపాలను పురుషులు అని వ్యవహరిస్తున్నారు. వారు తమలో తాము కూడితే సృష్టికార్యం సిద్ధిస్తుంది. కూడకుండా ఉంటే సృష్టి జరగదు.

**వ. ఇట్టి మహిమ గలిగి . 62**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఈ విధమైన; మహిమకలిగి= ప్రభావం కలిగి.

**తాత్పర్యం:** ఈ విధమైన ప్రభావంతో కూడి.

**క. తేజోరూపము బ్రహ్మము । ప్రాజాపత్యం బనఁగఁ బరగి పురుషుఁ డు**
**ద్భ్రాజిష్ణు సత్యనిత్యా । వ్యాజమహిమ వెలుఁగుచుండు నకలంకమతిన్. 63**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు= పైన పేర్కొనబడిన పురుషుడు; తేజోరూపము= తేజస్స్వరూపం, బ్రహ్మం; ప్రాజాపత్యంబు అనఁగన్= బ్రహ్మమనీ, ప్రాజాపత్యమనీ అనగా; పరఁగి= ఒప్పి; ఉద్భ్రాజిష్ణు సత్యనిత్యావ్యాజమహిమన్= ప్రకాశశీలమైన సత్యం, నిత్యం, వ్యాజరహితం అయిన ప్రభావంతో; అకలంకమతిన్= నిర్మలమైన బుద్ధితో; వెలుఁగుచుండున్= భాసిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ పురుషుడు తేజోరూపమనీ, బ్రహ్మమనీ, ప్రాజాపత్యమనీ వ్యవహరించబడుతున్నాడు. అంతేకాక నిర్మలమైన మతి గలిగి సదా ప్రకాశించే సత్యమూ, నిత్యమూ అయిన మహిమతో ప్రకాశిస్తూ ఉంటాడు.

**క. వ్యాపకుఁడు స్రష్ట బ్రహ్మ ప్ర । జాపతినాఁ బరఁగి నిత్యసత్యాత్మ త్వో**
**ద్దీపితుఁడై పురుషుఁడు ని । ర్లేపుఁ డనిర్దేశముం గలిగి వెలుఁగొందున్. 64**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు= పురుషశబ్దవాచ్యుడైన అతడు; వ్యాపకుడు, స్రష్ట, బ్రహ్మ, ప్రజాపతినాన్= వ్యాపకుడనీ, స్రష్ట అనీ, బ్రహ్మ అనీ, ప్రజాపతి అనీ అనగా; పరఁగి= ఒప్పారి; నిత్య సత్యాత్మత్వ+ఉద్దీపితుఁడు+ఐ= శాశ్వతం, సత్యం అయిన ఆత్మభావంచేత ప్రకాశించినవాడై; నిర్లేపుఁడు= సంగం లేనివాడై; అనిర్దేశమున్= ఇట్టిదని నిర్దేశించటానికి వీలుగాని భావమును; కలిగి= వహించి; వెలుఁగొందున్= ప్రకాశిస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ పురుషుడినే వ్యాపకుడనీ, స్రష్ట అనీ, బ్రహ్మ అనీ, ప్రజాపతి అనీ అంటారు. అతడు నిత్యమూ, సత్యమూ అయిన ఆత్మభావంతో ప్రకాశిస్తుంటాడు. మరియు సంగంలేనివాడై, ఏ విధమైన నిర్దేశం లేక వెలుగొందుతూ ఉంటాడు.

**క. సురసంయమి గరుడోరగ । నరకిన్నర గిరి సరిద్వన పయోధులఁ ద**
**త్కరణీయములం జేయుం । బురుషుఁడు దివ్యాంతరంగమునఁ దలఁచి సుతా! 65**

**ప్రతిపదార్థం:** సుతా!= కుమారా!; పురుషుఁడు= పూర్వోక్తుడైన ఆ పురుషుడు; దివ్య+అంతరంగమునన్= దివ్యమైన హృదయంలో; తలఁచి= సంకల్పించి; సుర= దేవతల యందును; సంయమి= మునులయందును; గరుడ= గరుడుల యందును; ఉరగ= పన్నగుల యందును; నర= మానవుల యందును; కిన్నర= కిన్నరుల యందును; గిరి= పర్వతాల యందును; సరిత్= నదులయందును; వన= అరణ్యాల యందును; పయోధులన్= సముద్రాలయందును; తత్కరణీయములన్= ఆయా కార్యాలను; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** కుమారా! ఆ పురుషుడు తన దివ్యమైన హృదయంలో తలచుకొని దేవతలు, ఋషులు, గరుడులు, ఉరగులు, నరులు, కిన్నరులు, పర్వతాలు, నదులు, అడవులు, సాగరాలు - వీటిలో సురాదులు చేయదగిన ఆయా కార్యాలు నిర్వర్తిస్తూ ఉంటాడు.

**వ. ఇట్లు గలిగి వర్తిలుచున్న లోకంబులందు. 66**

**ప్రతిపదార్థం:** ఇట్లు గలిగి= ఈ రీతిగా సంభవించి; వర్తిలుచున్న= ప్రవర్తిస్తున్న; లోకంబులందున్= ప్రపంచాలలో.

**తాత్పర్యం:** ఈ విధంగా సంభవించి నడుస్తున్న లోకాలలో.

**ఆ. పౌరుషంబు సూవె ఫలదమందురు కొంద । అనఘ! దైవ మిచ్చు నండ్రు కార్య**
**ఫలము కొంద ఱెల్ల ఫలము భూతస్వభా । వంబ యండ్రు గొంద అమితతేజ! 67**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; అమితతేజ!= అత్యధిక తేజం కలవాడా!; కొందఱు= కొంతమంది; పౌరుషంబు సూవె= పౌరుషమేకదా; ఫలదము= ఫలమిచ్చేది అని; అందురు= చెప్తుతారు; కొందఱు= మరికొంతమంది; కార్యఫలము= చేసేపనులయొక్క ఫలాన్ని; దైవము= విధి; ఇచ్చునండ్రు= ఇస్తుందంటారు; కొందఱు= ఇంక కొందరు; ఎల్లఫలము= అన్ని ఫలాలూ; భూతస్వభావంబ= ఆయా భూతాల స్వభావమే అని; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** పాపరహితుడవు, అధికతేజుడవూ అయిన ఓ శుకా! కొందరు పురుష ప్రయత్నమే ఫల మిస్తుందంటారు. మరికొందరు కార్యఫలం ఇచ్చేది దైవమని చెప్తుతారు. ఇంక కొందరు ఫలమంతా ఆయా భూతాల స్వభావమే కాని మరేమీ కాదు అని పేర్కొంటారు.

**వ. ఇవి కర్మస్థుల తెఱంగులు; సత్త్వస్థులు సమదర్శను లయి యుండుదురు; విశేషంబు వినుము. 68**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ చెప్పినవి; కర్మస్థుల= కర్మమార్గంలో ఉన్నవారి; తెఱంగులు= పద్ధతులు; సత్త్వస్థులు= సత్త్వంలో ఉన్నవారు; సమదర్శనులు+అయి= సమదృష్టి కలవారయి; ఉండుదురు= ఉంటారు; విశేషంబు= విశిష్టాంశం; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** కర్మమార్గంలో ఉండేవారి పద్ధతు లివి. సత్త్వస్థు లయిన వారు సదా సమదర్శనం కలిగి ఉంటారు. ఇక ఇందులో ఉన్న విశేషం వివరిస్తాను వినుము.

**క. శివకరము దపము మేధా । ధవ! సకల జనంబులకును దానికి మూలం**
**బవిరళ శమదమ సంపద । లవుట నివి మనంబుతోడ నలవడ వలయున్. 69**

**ప్రతిపదార్థం:** మేధాధవ!= బుద్ధిమంతుడా!; సకలజనంబులకును= సమస్త ప్రజలకూ; తపము= తపస్సు; శివకరము= మంగళకరం; దానికిన్= తపస్సుకు; అవిరళ= ఎడతెగని; శమదమ= అంతరింద్రియ నిగ్రహ బాహ్యేంద్రియ నిగ్రహములనెడి; సంపదలు= సిరులు; మూలంబు= కారణం; అవుటన్= కావటంవలన; ఇవి= ఈ శమదమాలు; మనంబు తోడన్= చిత్తంలో; అలవడన్ వలయున్= అలవాటు గావలెను.

**తాత్పర్యం:** ప్రజ్ఞావంతుడవైన ఓ శుకా! సర్వజనులకూ తపస్సు మంగళకరమైనది. తపస్సుకు మూలం ఎడతెగని శమదమాలే అవుతున్నాయి. అందువలన శమదమాలను మనస్సులో అలవరచుకొనాలి.

**వ. స్వాధ్యాయంబు దపంబునకు బలం బిచ్చి తత్ఫలంబు గావించు. 70**

**ప్రతిపదార్థం:** స్వాధ్యాయంబు= వేదాధ్యయనం; తపంబునకున్= తపస్సుకు; బలంబు+ఇచ్చి= బలం ఇచ్చి; తత్ఫలంబున్= ఆ తపస్సుకు అనువైన ఫలాన్ని; కావించున్= ఒడగూరుస్తుంది.

**తాత్పర్యం:** తపస్సుకు వేదాధ్యయనం బలం చేకూరుస్తుంది. తద్వారా తపస్సుకు రాగల ఫలాన్ని ప్రసాదింపజేస్తుంది.

**క. అరయంగా శబ్దంబును । పరంబునన రెండు సూవె బ్రహ్మములు గుణో**
**త్తర శబ్ద బ్రహ్మ భజన । పరుఁడు పరబ్రహ్మ మహితపదముం బొందున్. 71**

**ప్రతిపదార్థం:** గుణ+ఉత్తర!= గుణశ్రేష్ఠుడా; అరయంగాన్= పరిశీలించగా; శబ్దంబును, పరంబున్= శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము; అనన్= అనగా; బ్రహ్మములు= బ్రహ్మములు; రెండుచూవె!= రెండుగదా!; శబ్దబ్రహ్మ భజనపరుఁడు= శబ్దబ్రహ్మమును సేవించటంలో ఆసక్తి కలిగినవాడు; పరబ్రహ్మమహిత పదమున్= పరబ్రహ్మమనే శ్రేష్ఠమైన స్థానాన్ని; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** గుణశ్రేష్ఠుడవైన ఓ శుకుడా! బ్రహ్మములు శబ్దబ్రహ్మమనీ, పరబ్రహ్మమనీ రెండు రకాలుగా ఉన్నాయి. శబ్దబ్రహ్మను భజించడంలో ఆసక్తిగలవాడు పరబ్రహ్మను పొందుతాడు.

**విశేషం:** 'ద్వే విద్యే వేతవ్యే తు శబ్దబ్రహ్మ పరంచ యత్ । శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మా ధిగచ్ఛతి॥' అన్న అమృతబిందూపనిషత్తులోని వచనం ఇక్కడ స్మరణీయం. శబ్దబ్రహ్మ పరబ్రహ్మలను రెండు విద్యలు తెలిసికొనాలి. శబ్దబ్రహ్మంలో నిపుణుడైనవాడు పరబ్రహ్మమును పొందుతాడని ఇందలి భావం.

**క. పరమబ్రహ్మము భూతో । త్కరముం గలిగించు మ్రింగు; దా నిష్క్రియతా**
**స్ఫురితం బయ్యును బ్రకృతి । స్ఫురణను శబలత్వ మొంది పురుషవరేణ్యా! 72**

**ప్రతిపదార్థం:** పురుషవరేణ్యా!= పురుషశ్రేష్ఠా!; పరమబ్రహ్మము= పరబ్రహ్మమే; తాన్= తాను; నిష్క్రియతా స్ఫురితంబు= క్రియారాహిత్యంచేత ప్రకాశిస్తూ కూడా; ప్రకృతి స్ఫురణనున్= ప్రకృతి యొక్క స్ఫూర్తిచేత; శబలత్వము= విచిత్రత్వమును; ఒంది= పొంది; భూత+ఉత్కరమున్= భూతముల సమూహాన్ని; కలిగించున్= పుట్టిస్తుంది; మ్రింగున్= సంహరిస్తుంది.

**తాత్పర్యం:** పురుష వర్యుడవగు ఓ శుకా! పరబ్రహ్మమే తాను ఏ క్రియా లేనిదై కూడా ప్రకృతి ప్రభావంతో శబలత్వం పొంది భూతాలను పుట్టించటం, సంహరించటం చేస్తూ ఉంటుంది.

**వ. సృష్టి తెఱంగు ము న్నెఱింగించితి; సంహారప్రకారంబు సెప్పెద నాకర్ణింపుము. 73**

**ప్రతిపదార్థం:** మున్ను= పూర్వం; సృష్టి తెఱంగు= సృష్టిక్రమాన్ని; ఎఱింగించితిన్= తెలియజేశాను; సంహారప్రకారంబున్= జగత్తుయొక్క సంహారవిధానాన్ని; చెప్పెదన్= వచిస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ముందు జగత్తుయొక్క సృష్టి విధానం చెప్పాను. ఇప్పుడు సంహారవిధానం ఎట్లాంటిదో వివరిస్తాను. వినుము.

**తే. స్థావరములు జంగమములుఁ దన్నుఁ గలయ । విలయ మొందిన ఘటపృష్ఠ విధము దాల్చు;**
**భూమి నంబువుల్ మ్రింగు; వంబువుల నగ్ని । యగ్ని ననిలుం, డనిలుఁ ద్రావు నాకసంబు. 74**

**ప్రతిపదార్థం:** స్థావరములు= కదలని కొండలు మొదలైనవి; జంగమములు= సంచరించే ప్రాణులు; తన్నున్= తనను; కలయన్= కూడుకొనగా; విలయము= ప్రళయం; ఒందిన= పొందిన; ఘటపృష్ఠ విధమున్= కుండయొక్క పూర్వ రూపమైన మట్టిరీతిని; తాల్చున్= ధరించును; భూమిన్= అట్టి పృథ్విని; అంబువుల్= జలం; మ్రింగున్= హరించును; అంబువులన్= జలాన్ని; అగ్ని= అనలుడు; అగ్నిన్= అనలుడిని; అనిలుండు= వాయువు; అనిలున్= వాయువును; ఆకసంబు= గగనం; త్రావున్= లయమొనర్చుకొంటాయి.

**తాత్పర్యం:** స్థావర జంగమా లనబడే సకలమూ భూమిలో కలిసిపోతాయి. అది ఘటస్వరూపం నశించిన పిమ్మట ఘటం తన పూర్వరూపమైన మృత్తికను పొందినట్లు అవుతుంది. ఆ భూమిని జలాలు మ్రింగుతాయి. జలాలను అగ్నీ, అగ్నిని వాయువూ, వాయువును ఆకాశమూ కబళిస్తాయి.

**ఆ. ఆకసమును మనసు హరియించు, గంధాది । యగు గుణాళితోడ నఖిల భూత**
**ములును నిట్లు లయముఁ బొందిన గ్రసియించు । మనసు నాత్మగుణము నెనసి విధుఁడు. 75**

**ప్రతిపదార్థం:** ఆకసమును= ఆకాశాన్ని; మనసు= చిత్తం; హరియించున్= లయింపజేస్తుంది; ఇట్లు= ఈ రీతిగా; అఖిలభూతములును= సమస్త భూతాలు; గంధ+ఆదిఅగు= గంధం మొదలైన; గుణ+ఆళితోడన్= గుణాల సమూహంతో కూడా; లయమున్= నాశమును; పొందినన్= పొందగా; విధుఁడు= చంద్రుడు; ఆత్మగుణమున్= తన స్వభావాన్ని; ఎనసి= పొంది; మనసున్= చిత్తమును; గ్రసియించున్= మ్రింగుతాడు.

**తాత్పర్యం:** మనస్సు ఆకాశాన్ని హరించివేస్తుంది. ఇట్లా సకలభూతాలూ తమ తమ గంధం మొదలైన గుణాలతో కూడ లయమై పోతాయి. తరువాత మనస్సుకు అధిదేవత అయిన చంద్రుడు తన స్వభావం పొంది ఆ మనస్సును కూడా తనలో లయం చేసుకొంటాడు.

**క. అతనిఁ బొదువు సంకల్పం । బతుల జ్ఞానంబు దాని నడఁచును విజ్ఞా**
**నితఁ దద్బలముఁ బురుషదే । హితనుం గాలంబు వరుస నెడలం జేయున్. 76**

**ప్రతిపదార్థం:** సంకల్పంబు= మనోవ్యాపారం; అతనిన్= ఆ చంద్రుడిని; పొదువున్= లయింపజేస్తుంది; అతులజ్ఞానంబు= సాటిలేని జ్ఞానం; దానిన్= ఆ సంకల్పాన్ని; అడఁచును= అణచివేస్తుంది; కాలంబు= కాలాత్మకమైన తత్త్వం; విజ్ఞానితన్= విజ్ఞానిత్వాన్ని; తద్బలమున్= దాని బలాన్ని; పురుషదేహితనున్= పురుషశరీరత్వాన్ని; వరుసన్= క్రమంగా; ఎడలన్+చేయున్= నశింపజేస్తుంది.

**తాత్పర్యం:** సంకల్పం చంద్రుడిని గ్రసిస్తుంది. నిరుపమానమైన జ్ఞానం సంకల్పాన్ని రూపుమాపుతుంది. కాలం క్రమంగా విజ్ఞానాన్ని, దాని బలాన్నీ, పురుషశరీరత్వాన్నీ హతమారుస్తుంది.

**క. కాలం బెడలిన విద్యో । న్మీలిత మగు బోధ మన్యమిశ్రత్వంబుం**
**దూలించి వెలుఁగుచుండు వి । శాలమతీ! బ్రహ్మ మది ప్రశస్తము శ్రుతులన్. 77**

**ప్రతిపదార్థం:** విశాలమతీ!= విపులమైన బుద్ధికలవాడా!; కాలంబు+ఎడలినన్= కాలం నశించిపోగా; విద్యోన్మీలితము+అగు= విద్యచేత వికసించినదైన; బోధము= జ్ఞానం; అన్యమిశ్రత్వంబున్= ఇతర పదార్థాలతో కలయికను; తూలించి= తొలగించి; వెలుఁగుచుండున్= ప్రకాశిస్తూ ఉంటుంది; అది= అయ్యది; శ్రుతులన్= వేదాలలో; ప్రశస్తము= ప్రసిద్ధమైనది; బ్రహ్మము= బ్రహ్మశబ్దంతో వ్యవహరించబడేది.

**తాత్పర్యం:** విశాలబుద్ధిగల ఓ శుకుడా! ఆ కాలం కూడా నశిస్తుంది. పిదప విద్యచేత వికాసం పొందిన జ్ఞానం దేనితోనూ కలయిక చెందక శుద్ధబోధస్వరూపమై వెలుగొందుతుంది. అదే బ్రహ్మం. వేదాలతో ప్రశస్తమైన బ్రహ్మ మదే.

**క. వినుమీ సంహరణంబును । దన వస మాతత్త్వ మవ్విధంబున దివసం**
**బును రాత్రియు భూతములకు । జననము విలయమును జేయు సంక్రీడమెయిన్. 78**

**ప్రతిపదార్థం:** వినుము; ఈ సంహరణంబును= ఈ సంహారం కూడా; తన వసము= ఆ బ్రహ్మముయొక్క వశంలో ఉన్నదే; ఆ తత్త్వము= ఆ బ్రహ్మం; ఆ+విధంబునన్= ఆ రీతిగా; దివసంబును= పగలును; రాత్రియున్= రేయియు; భూతములకున్= భూతాలకు; జననమున్= పుట్టుకను; విలయమును= వినాశనాన్ని; సంక్రీడమెయిన్= ఆటవలె; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** శుకుడా! వినుము. ఈ సంహారకార్యం కూడా ఆ బ్రహ్మవశంలోనిదే. ఈ ప్రకారంగా ఆ బ్రహ్మం రేయుంబవళ్ళు భూతాలకు వినోదక్రీడవలె జనన మరణాలను చేస్తూ ఉంటుంది'.

**వ. అని చెప్పి పారాశర్యుం డార్యవర్యుం డగు శుకునితో వెండియు నిట్లనియె. 79**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; పారాశర్యుండు= వ్యాసుడు; ఆర్యవర్యుండు+అగు= ఆర్యశ్రేష్ఠుడైన; శుకునితోన్= శుకయోగితో; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** వ్యాసు డట్లా చెప్పి ఆర్యశ్రేష్ఠుడైన శుకుడిని చూచి మళ్ళీ ఇట్లా అన్నాడు:

**సీ. 'జనియించి విప్రుండు జాతకర్మంబును। చౌలంబు నుపనీతి సంస్కృతియును**
**బడసి యాచార్యునిపాల నధ్యయనంబు। సేసి, తా నాతనిచే ననుజ్ఞ**
**గాంచి తక్కటివి మూఁ డంచితాశ్రమముల। యందు నొక్కటి పూననగు గృహస్థ**
**ధర్మ మాశ్రయ మండ్రు తక్కిన మూఁటికిఁ। గావున నది పూని దైవపైతృ**

**తే. కంబులైన ఋణంబులఁ గ్రాఁచు; వడుగు। నాఁటి నడవడి ఋషుల ఋణమ్ము దీర్చి**
**వచ్చి కాన కాషాయపక్వతఁ బ్రశుద్ధిఁ। బొంది మఱి యుత్తమాశ్రమ మొందు టొప్పు. 80**

**ప్రతిపదార్థం:** విప్రుండు= ద్విజుడు; జనియించి= పుట్టి; జాతకర్మంబునున్= పుట్టినపుడు చేసే సంస్కారాన్ని; చౌలంబున్= చూడా కర్మయును; ఉపనీతి సంస్కృతియునున్= ఉపనయన సంస్కారమును; పడసి= పొంది; ఆచార్యునిపాలన్= గురువు చెంత; అధ్యయనంబు చేసి= వేదాధ్యయనం కావించి; తాను= శిష్యుడైన తాను; ఆతనిచేన్= ఆ గురువుచేత; అనుజ్ఞన్= అనుమతిని; కాంచి= పొంది; తక్కటివి= మిగిలినవైన; మూఁడు+అంచిత+ఆశ్రమములఅందున్= పూజితములైన (గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసములనెడు) మూడు ఆశ్రమాలలో; ఒక్కటి= ఒక్క ఆశ్రమాన్ని; పూనన్+అగున్= స్వీకరించదగును; తక్కిన మూఁటికిన్= మిగిలిన బ్రహ్మచర్యం మొదలైన మూడాశ్రమాలకు; గృహస్థ ధర్మము= గృహస్థాశ్రమ రూపమైన ధర్మం; ఆశ్రయము= ఆధారం; అండ్రు= అని పెద్దలు చెప్తుతారు; కావునన్= ఆ కారణంవలన; నాఁటినడవడిన్= బ్రహ్మచర్య కాలం నాటి వేదాధ్యయనాది ప్రవర్తనతో; ఋషులఋణమ్ము= ఋషులకు చెందిన అప్పును; తీర్చివచ్చి= తొలగించుకొని వచ్చి; వడుగు= బ్రహ్మచారి; అది= ఆ గృహస్థాశ్రమం; పూని= వహించి; దైవపైతృకంబులు+ఐన= దేవతలకు, పితరులకు చెందిన; ఋణంబులన్= అప్పులను; క్రాఁచున్= తొలగించుకొంటాడు; కాన= ఆ కారణంవలన; కాషాయపక్వతన్= చిత్తదోషాన్ని శమింపజేయడం ద్వారా; ప్రశుద్ధిన్= మిక్కిలి శుద్ధిని; పొంది= వహించి; మఱి= ఆ పైన; ఉత్తమ+ఆశ్రమము= శ్రేష్ఠమైన ఆశ్రమమును; ఒందుట= పొందుట; ఒప్పున్= సమంజసంగా ఉంటుంది.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడు తాను పుట్టిన తర్వాత జాతకర్మ, చూడాకర్మ, ఉపనయనం మొదలైన సంస్కారాలు పొందాలి. ఆపై ఆచార్యుడి చెంతకు వెళ్ళి వేదాధ్యయనం చేయాలి. పిదప గురుని అనుమతి పొంది గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే మూడు ఆశ్రమాలలో ఏదైనా ఒక ఆశ్రమాన్ని స్వీకరించాలి. బ్రహ్మచర్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే మూడాశ్రమాలకూ ఆధారం గృహస్థాశ్రమం అంటారు. అందుచేత తాను బ్రహ్మచారిగా ఉంటూ వేదాధ్యయనం చేయటం ద్వారా ఋషి ఋణం తీర్చుకొన్నా, బ్రహ్మచారి ఇప్పుడు క్రమపద్ధతిలో గృహస్థాశ్రమం స్వీకరించి దేవఋణాన్ని, పిత్రూణాన్ని తీర్చుకొనాలి. ఈ రీతిగా క్రమపద్ధతిలో చిత్తదోషం తొలగించుకొని పరిపాకం పొందిన తర్వాతనే ఉత్తమాశ్రమమైన సన్న్యాసం స్వీకరించటం మంచిది.

**విశేషం:** బ్రాహ్మణాది జాతులకు స్మృతులలో జాతకర్మం మొదలైన అనేక సంస్కారాలు విధించబడ్డాయి. ఇక్కడ విప్రులు పాటించవలసిన జీవనవిధానాన్ని బోధిస్తున్నాడు. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనేవి నాలుగు ఆశ్రమాలు. ఇందులో బ్రహ్మచర్యం పాటించినవాడు తక్కిన మూడాశ్రమాలలో తనకు అనువైన ఏ ఆశ్రమాన్నైనా స్వీకరించవచ్చును. కాని క్రమపద్ధతిలో గార్హస్థ్యం స్వీకరించటం మంచిదని వ్యాసుడి అభిప్రాయం. అది తక్కిన ఆశ్రమాలను పోషించేది కదా!

ఋషిఋణం, దేవఋణం, పితౄణం మొదలైన ఋణాలు ప్రతి ఒక్కరికీ సహజంగా ఉంటాయి. వేదాధ్యయనంతో ఋషి ఋణాన్నీ, యజ్ఞకర్మతో దేవఋణాన్నీ, శ్రాద్ధాదులతో పితరుల ఋణాన్నీ తీర్చుకొనవచ్చును. ఇందుకు గృహస్థాశ్రమం తగి ఉంటుంది. క్రమపద్ధతిలో పక్వస్థితికి వచ్చిన తర్వాత చివరిదీ, శ్రేష్ఠతమమైనదీ అయిన సన్న్యాసం స్వీకరించాలి. ఇట్లా చేయటం మంచిదని తాత్పర్యం.

**తే.** **క్రతువుసేఁత సేయించుట, శ్రుతులు గాఢ । నియతిఁ జదువుట, చదివించుటయును, ధనము**
**లీగికొనుట షట్కర్మంబు; లింతవట్టు । నర్హకృత్యంబు లండ్రు ధరామరులకు. 81**

**ప్రతిపదార్థం:** క్రతువు= యజ్ఞం; చేఁత= చేయటం; చేయించుట= ఇతరులచేత అనుష్ఠింప చేయటం; గాఢనియతిన్= దృఢమైన నియమంతో; శ్రుతులు= వేదాలు; చదువుట= అధ్యయనం చేయటం; చదివించుటయును= ఇతరులచేత అధ్యయనం చేయించటం; ధనములు= అర్థసంపదలు; ఈగి= ఇవ్వటం; కొనుట= ఇతరులనుండి స్వీకరించటం; షట్కర్మంబులు= ఆరు కర్మములు; ఇంతవట్టు= ఇంతవరకు; ధరా+అమరులకున్= భూసురులకు; అర్హకృత్యంబులు= తగినపనులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులకు యజ్ఞం చేయటం, ఇతరులచేత చేయించటం, అధ్యయనం, అధ్యాపనం, దానం, ప్రతిగ్రహం అనబడే షట్కర్మలు తగిన పనులని పెద్దలు చెప్పుతారు.

### దానగుణంబు సర్వవర్ణ సామాన్యంబుగా నిరూపించుట (సం.12-226-14,15)

**వ.** **దానానుష్ఠానంబు సర్వజాతి సామాన్యం బయిన యుత్తమధర్మంబు; పుణ్యపరులకు దాతవ్యంబుగాని వస్తువు లేదు; కాశ్యుండను రాజు దన ప్రాణంబు లిచ్చి బ్రాహ్మణుప్రాణంబులు గాచె, నౌశీనరుండగు శిబి యాత్మాంగంబుల నౌరస పుత్రునిని బ్రాహ్మణార్థంబుగా నొసంగెఁ; గాశీపతి యగు ప్రతర్దనుండు బ్రాహ్మణునికై నిజనయనంబులిచ్చె; విదేహుండును, జామదగ్న్యుండును, గయుండును నొక్కొక్కతటి సకల వసుంధరయును బ్రాహ్మణుల కిచ్చిరి; పాంచాల్యుండగు బ్రహ్మదత్తుండు శంఖనిధి విప్రోత్తములకు దానంబుసేసె; మఱియును బ్రాహ్మణులకుఁ బ్రాణ శరీర మణి హిరణ్య కన్యాగవాది ప్రశస్త వస్తువు లనేకు లర్థుల కొసంగిరి; వారలకెల్లను సమకూరిన సద్గతుల విశేషంబులం జెప్పం బెద్దయని వెండియు. 82**

**ప్రతిపదార్థం:** దాన+అనుష్ఠానంబు= దానం అనే ఆచరణ; సర్వజాతిసామాన్యంబు+అయిన= అన్ని జాతులకూ సాధారణమైన; ఉత్తమ ధర్మంబు= శ్రేష్ఠధర్మం; పుణ్య పరులకున్= పుణ్యంపై ఆసక్తిగలవారికి; దాతవ్యంబుకాని= ఈరాని; వస్తువు లేదు= పదార్థం లేదు; కాశ్యుండను రాజు= కాశ్య డనబడే నరపతి; తన ప్రాణంబులు= తన అసువులు; ఇచ్చి= ఒసగి; బ్రాహ్మణ ప్రాణంబులు= విప్రుడి యసువులను; కాచెన్= రక్షించాడు; ఔశీనరుండు+అగు= ఉశీనర దేశానికి చెందిన; శిబి= శిబి అనే రాజు; ఆత్మ+ అంగంబులన్= తన అవయవాలను; ఔరస పుత్రునినిన్= తన సొంత కుమారుడిని; బ్రాహ్మణ+అర్థంబుగాన్= బ్రాహ్మణుల కొరకై; ఒసంగెన్= ఇచ్చాడు; కాశీపతిఅగు= కాశీనగరానికి రాజైన; ప్రతర్దనుండు= ప్రతర్దను డనేవాడు; బ్రాహ్మణునకై= విప్రుడికై; నిజనయనంబులు= తన కన్నులు; ఇచ్చెన్= ఇచ్చాడు; విదేహుండును, జామదగ్న్యుండును, గయుండును= జనకుడు, పరశురాముడు, గయుడనువారు; ఒక్కొక్క తటిన్= ఒక్కొక్క సమయాన; సకలవసుంధరయును= సమస్త భూమియును;

బ్రాహ్మణులకున్= విప్రులకు; ఇచ్చిరి= ఇచ్చారు; పాంచాల్యుండగు= పాంచాలదేశానికి చెందినవాడైన; బ్రహ్మదత్తుండు= ఆ పేరుగల రాజు; విప్ర+ఉత్తములకున్= బ్రాహ్మణోత్తములకు; శంఖనిధి= 'శంఖ' మనే నిధిని; దానంబుచేసెన్= దానంగా ఇచ్చాడు; మఱియును= ఇంకను; అనేకులు= పెక్కుమంది; అర్హులకున్= తగినవారికి; బ్రాహ్మణులకున్= విప్రులకు; ప్రాణ= ప్రాణాలు; శరీర= దేహం; మణి= మణులు; హిరణ్య= స్వర్ణం; కన్యా= కన్యలు; గవాది(గో+ఆది)= గోవులు మొదలైన; ప్రశస్త వస్తువులు= శ్రేష్ఠ పదార్థాలు; ఒసంగిరి= ఇచ్చారు; వారలకున్+ఎల్లను= వారికందరికీ; సమకూరిన= కలిగిన; సద్గతుల విశేషంబులన్= ఉన్న తగతులలోని విశేషాలను; చెప్పన్+పెద్ద అని= వివరించటానికి అలవిగాకున్నదని చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** దాన మనేది అన్ని జాతులకూ సాధారణమైన ఉత్తమధర్మం. పుణ్యాత్ములకు ఈరాని వస్తువు లేదు. పూర్వం కాశ్యుడనే రాజు తన ప్రాణా లిచ్చి బ్రాహ్మణుడి ప్రాణాలను రక్షించాడు. ఉశీనరాధిపతి అయిన శిబి బ్రాహ్మణులకై తన అవయవాలనూ, ఔరసపుత్రుడినీ దానం చేశాడు. కాశిని పాలించే ప్రతర్దనుడనేరాజు తన నేత్రాలు విప్రుడికై దానం చేశాడు. జనకుడు, పరశురాముడు, గయుడు బ్రాహ్మణులకై సమస్త భూమండలాన్ని దానమిచ్చారు. పాంచాలదేశీయుడైన బ్రహ్మదత్తుడు విప్రశ్రేష్ఠులకు శంఖనిధినే దానం చేశాడు. అంతే కాదు. చాలామంది తగిన విప్రులకు ప్రాణాలు, శరీరం, మణులు, బంగారు, కన్యలు, గోవులు మొదలైన శ్రేష్ఠపదార్థాలను దానం చేసి ఉన్నారు. వారి కందరికీ కలిగిన సద్గతులను వివరించటానికి సాధ్యం కాదు' అని చెప్పి వ్యాసుడు మళ్ళీ ఇట్లా అన్నాడు:

**క.** **'దానాధ్యయన యజనముల । నానావిధపాపములు వినాశముఁ బొందుం**
**గాన యవి మేలు హింసా । హీనత ధర్మవిధిలేని యెడఁ గడు వలయున్.** **83**

**ప్రతిపదార్థం:** దాన= దానం చేతను; అధ్యయన= వేదాధ్యయనం చేతను; యజనములన్= యజ్ఞాలు చేయటంచేతను; నానావిధపాపములు= పెక్కు రకాలైన పాపాలు; వినాశమున్+పొందున్= నశించిపోతాయి; కాన= అందువలన; అవి= ఆ దానాదులు; మేలు= శ్రేష్ఠమైనవి; ధర్మవిధి లేనిఎడన్= ధర్మవిహిత విధానం లేని చోట; కడున్= మిక్కిలిగా; హింసాహీనత= హింసలేకుండా ఉండటం; వలయున్= ఆవశ్యకమై ఉన్నవి.

**తాత్పర్యం:** దానం, అధ్యయనం, యజ్ఞం చేయటం అనే కర్మలవలన అనేక విధాల పాపాలు నశిస్తాయి. కాబట్టి వాటి నాచరించటం మేలైన పని. వేదవిహిత ధర్మం కానప్పుడు ఏ ప్రాణులనూ హింసించకుండా ఉండాలి. (వేదం విధించినపుడు ప్రాణిహింస హింస కాదని భావం).

**ఆ.** **ధూతపాపుఁ డైన పూతాత్మకుండు ల । ఘ్వాశి యగుచు, నింద్రియముల గెల్చి**
**మనసులోనఁ గామమును గ్రోధమును జొర । నీక బ్రహ్మపదము నిచ్చఁ గోరు.** **84**

**ప్రతిపదార్థం:** ధూతపాపుఁడు+ఐన= తొలగిన పాపాలు కలవాడగు; పూత+ఆత్మకుండు= పవిత్రాత్ముడు; లఘు+ఆశి అగుచున్= మితాహారి అవుతూ; ఇంద్రియములన్= ఇంద్రియాలను; గెల్చి= ఓడించి; మనసులోనన్= చిత్తంలో; కామమును క్రోధమును= కామాన్ని, కోపాన్నీ; చొరన్+ఈక= ప్రవేశించనీయకుండా; ఇచ్చన్= మనస్సులో; బ్రహ్మపదమున్= బ్రహ్మస్థానాన్ని; కోరున్= అభిలషిస్తాడు.

**తాత్పర్యం:** పాపాల నన్నిటినీ నశింపజేసికొన్న పవిత్రాత్ముడు మితంగా ఆహారం స్వీకరించి, ఇంద్రియాలపై విజయం సాధిస్తాడు. కామక్రోధాలను తన మనస్సులో ప్రవేశింపనీయడు. అట్లా చేసి బ్రహ్మపదవిని ఎదలో అభిలషిస్తాడు.

**ఆ.** **ఇట్టివాఁడు వెడల నీఁదు నింద్రియజల । మన్యుపంక లోభమయ తటాది**
**ఘోరరూప యగు నసార సంసార వి । శాలనదిఁ బ్రశాంతశాలి హృదయ!** **85**

**ప్రతిపదార్థం:** ఇట్టివాఁడు= ఈ విధంగా ప్రవర్తించేవాడు; ఇంద్రియజల= ఇంద్రియా లనే నీటితోనూ; మన్యుపంక= కోపమనే బురదతోనూ; లోభమయతట+ఆది= లోభరూపమైన గట్టు మొదలైన వాటితోనూ; ఘోరరూప+అగు= భయంకర రూపంకలదైన; అసార= సారంలేని; సంసార= సంసారమనెడి; విశాల= విస్తృతమైన; నదిన్= నదిని; వెడలన్+ఈఁడున్= తరిస్తాడు.

**తాత్పర్యం:** ప్రశాంతమైన చిత్తం కల శుకుడా! పై నే చెప్పిన రీతిగా ప్రవర్తించేవాడు ఇంద్రియాలే నీరుగా, కోపమే బురదగా, లోభమే గట్టుగా - ఇట్లా భీకరంగా ఉన్న సంసార మనే విశాలమైన నదిని తరిస్తాడు.

**విశేషం:** అలం: రూపకం.

**తే.** **ఘనతరప్రజ్ఞ యను తెప్ప గలుగువాఁడు । సంసరణనది గడవంగఁ జాలుఁ గాక!**
**కామమును గ్రోధమును మదిఁ గలిగి ప్రజ్ఞ । చించునేని నక్కడచుట చిక్కువడదె?** **86**

**ప్రతిపదార్థం:** ఘనతరప్రజ్ఞ+అను= గొప్పదైన ప్రజ్ఞ అనే; తెప్ప= నావ; కలుగువాఁడు= కలవాడు; సంసరణనదిన్= సంసారమనే నదిని; కడవంగన్+చాలున్= దాటగలుగుతాడు; కాక= అట్లాకాక; కామమును= కోరికను; క్రోధమును= కోపమును; మదిన్= చిత్తంలో; కలిగి= సంభవించి; ప్రజ్ఞన్= బుద్ధిని; చించున్+ఏనిన్= నశింపజేస్తే; ఆ+కడచుట= ఆ తరించటం అనే కార్యం; చిక్కు+పడదె?= ఇబ్బందికి గురికాదా?

**తాత్పర్యం:** గొప్ప ప్రజ్ఞ అనే పడవ నధిష్ఠించిన వాడు సంసార మనే నదిని దాటుతాడు. అట్లాకాక కామక్రోధాలవలన ప్రజ్ఞకు భంగం కలిగితే ఆ నదీతరణం చిక్కుపడి నెరవేరకపోతుంది కదా!

**క.** **గతహర్షభయక్రోధుఁడు । ధృతిమంతుఁడు నప్రమత్తధీమహితుఁడు సం**
**శ్రితధర్ముఁడు దాంతుఁడు నగు । నతఁ డవసాదంబు నొందఁ డతులవివేకా!** **87**

**ప్రతిపదార్థం:** అతులవివేకా!= సాటిలేని తెలివికలవాడా!; గతహర్షభయక్రోధుఁడు= తొలగిన సంతోషం, భీతి, కోపంకలవాడు; ధృతిమంతుఁడు= ధైర్యంకలవాడు; అప్రమత్త= ఏమరుపాటు లేని; ధీ= బుద్ధిచేత; మహితుఁడు= పూజితుడైనవాడు; సంశ్రితధర్ముఁడు= ఆశ్రయించబడిన ధర్మంకలవాడు; దాంతుఁడు= నిగ్రహంకలవాడు; అగు= అయిన; అతఁడు= ఆ వ్యక్తి; అవసాదంబున్= నాశనాన్ని; ఒందఁడు= పొందడు.

**తాత్పర్యం:** అనుపమ వివేకంకల శుకుడా! ఎవరికి హర్షం, భయం, కోపం లేవో ఎవడు ధైర్యశాలియో, జాగరూకమైన బుద్ధిగలవాడో, ధర్మా న్నాశ్రయించి ఉంటాడో, ఇంద్రియనిగ్రహం కలిగి ప్రవర్తిస్తాడో, అట్లాంటివాడు నాశం పొందడు.

**క.** **ధర్మ మధర్మము వోలె న । ధర్మము దా ధర్మవిధి విధంబున దోఁచుం**
**గర్మసమితి నొక్కొక యెడ । ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్.'** **88**

**ప్రతిపదార్థం:** కర్మ సమితిన్= కార్యసమూహంలో; ఒక్కొక ఎడన్= ఒక్కొక్క సందర్భంలో; ధర్మము= ధర్మమైనది; అధర్మముపోలెన్= ధర్మం కాని దానివలెనూ; అధర్మము= ధర్మంకానిది; తాన్= తాను; ధర్మవిధివిధంబునన్= ధర్మకార్యం మాదిరిగానూ; తోఁచున్= భాసిస్తుంది; తద్+శాస్త్రములన్= ఆ ధర్మం నిరూపించే శాస్త్రాలతో; ధర్మగతి= ధర్మవిధానాన్ని; ఎఱుంగన్ వలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** మనం అనుష్ఠించే కార్యాలలో ఒక్కొక్క పట్టున ధర్మకార్యం అధర్మంగా తోస్తుంది. అధర్మకార్యం ధర్మంగా తోస్తుంది. అందుచేత ధర్మశాస్త్రాలను పరీక్షించి ధర్మగమన మెట్లాంటిదో గుర్తించాలి'.

**వ.** **అని యుపదేశించి మఱియును.** **89**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; ఉపదేశించి= బోధించి; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** ఇట్లా బోధించి వ్యాసుడు శుకుడితో ఇంకా ఇట్లా అన్నాడు:

**క. 'జ్ఞానంబు వడయుటకు వా । జ్మానసములు సునియతములు గావింతురు, స**
**మ్మానిత శాంతికొఱకు వి । జ్ఞానంబున నాత్మనియతి సల్పుదురు బుధుల్. 90**

**ప్రతిపదార్థం:** బుధుల్= పండితులు; జ్ఞానంబు పడయుటకున్= జ్ఞానం పొందటానికి; వాక్+మానసములు= వాక్కును, మనస్సును; సునియతములు= చక్కగా నియమించబడినవిగా; కావింతురు= చేస్తారు; సమ్మానిత= ఆదరింపబడిన; శాంతికొఱకున్= శాంతిని పొందటానికి; విజ్ఞానంబునన్= విశేష జ్ఞానంతో; ఆత్మనియతిన్= ఆత్మనియమమును; సల్పుదురు= చేస్తారు.

**తాత్పర్యం:** 'పండితు లైనవారు జ్ఞానసిద్ధిని కోరి వాక్కును, మనస్సునూ నిగ్రహిస్తారు. శాంతి పొందటానికై విశేషజ్ఞానంతో ఆత్మనియమం పాటిస్తారు.

**క. ఈ తెరువున వేదవిదుఁడు । వీతామ్నాయుండు ధర్మవేదియుఁ బాప**
**స్ఫీతుఁడు సరియై కడతు ర । నాతురత జరామరణమహాంభోరాశిన్. 91**

**ప్రతిపదార్థం:** ఈ తెరువునన్= ఈ మార్గంతో; వేదవిదుఁడు= వేదం తెలిసినవాడూ; వీత+ఆమ్నాయుండు= వేదజ్ఞానం లేనివాడూ; ధర్మవేదియున్= ధర్మం తెలిసిన వాడూ; పాపస్ఫీతుఁడు= పాపంచేత వృద్ధిపొందిన వాడూ; సరి+ఐ= సమానులై; అనాతురతన్= ఆతురత లేకుండా; జరామరణ మహా+అంభోరాశిన్= ముసలితనం, చావు అనే మహాసముద్రాన్ని; కడతురు= తరిస్తారు.

**తాత్పర్యం:** వేదజ్ఞుడైనా, వేదగంధం లేనివాడైనా, ధర్మజ్ఞుడైనా, పాపాత్ముడైనా సరే - పైన చెప్పిన పద్ధతి పాటిస్తే - అందరూ సమంగా జరామరణ ప్రవాహరూపమైన సంసారసముద్రాన్ని కష్టంలేకుండా దాటుతారు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. ఆచారనేమియుఁ, బ్రాణయుగంబును, నపానాక్షంబును, హ్రీవరూథంబును, నుపాయాపాయకూబరంబును, ఘ్రాణశ్రవణ వాహనంబును, జ్ఞానసారథికంబును, సర్వతంత్రప్రతోదంబును, ద్యాగరశ్మియు నగు యోగరథంబు నెక్కి వెరవుగలవాఁ డక్షరపదంబు సారం జనఁజాలు; నా రథికుం డా తంత్రంబు ప్రభావంబునంజేసి.92**

**ప్రతిపదార్థం:** ఆచారనేమియున్= ఆచార మనే చక్రపు టంచు గలదీ; ప్రాణయుగంబును= ప్రాణమనే కాడి గలదీ; అపాన+అక్షంబును= అపానమనే ఇరుసు కలదీ; హ్రీవరూథంబును= సిగ్గు అనే ఆచ్ఛాదనం కలదీ; ఉపాయ+అపాయకూబరంబును= ఉపాయం, అపాయం అనే నొగలు కలదీ; ఘ్రాణశ్రవణ వాహనంబును= ఘ్రాణేంద్రియ శ్రవణేంద్రియాలనే గుర్రాలు కలదీ; జ్ఞానసారథికంబును= జ్ఞాన మనే సారథి కలదియు; సర్వతంత్ర ప్రతోదంబును= సర్వతంత్రమనే జాటీ కలదీ; త్యాగరశ్మియున్= త్యాగమనే పగ్గాలు కలదీ; అగు= అయినట్టి; యోగరథంబున్= యోగమనే రథాన్ని; ఎక్కి= అధిష్ఠించి; వెరవుగలవాఁడు= ఉపాయశాలిఅయినవాడు; అక్షరపదంబున్= క్షరంకాని స్థానాన్ని అనగా మోక్షాన్ని; చొరన్+చనన్+చాలున్= ప్రవేశించగలుగును; ఆ రథికుండు= ఆ రథంలో పయనించినవాడు (ఆత్మ); ఆ తంత్రంబు= ఆ ఉపాయంయొక్క; ప్రభావంబునన్+చేసి= మహిమవలన.

**తాత్పర్యం:** సదాచారమే చక్రపుటంచుగా, ప్రాణమే కాడిగా, అపానమే ఇరుసుగా, సిగ్గే ఆచ్ఛాదనంగా, ఉపాయాపాయాలే నొగలుగా, ఘ్రాణేంద్రియ శ్రవణేంద్రియాలే గుర్రాలుగా, జ్ఞానమే సారథిగా, సర్వతంత్రమే కొరడాగా, త్యాగమే పగ్గాలుగా సాగే యోగమనే రథాన్ని ఎక్కిన ఉపాయశాలిఅయిన ఆత్మ అనే రథికుడు మోక్షపదం చేరుకొనగలడు. ఆ విధంగా పయనించిన రథికుడు ఆ ఉపాయబలంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం.

**క. వరుసన ధరణీపవనాం । బరజలతేజముల గెలుచు, బల మెక్కి యహం**
**కరణంబు ద్రోచు; బుద్ధిం । బరువడి నడఁగించుఁ బ్రకృతి పనిఁ బెడఁబాపున్. 93**

**ప్రతిపదార్థం:** వరుసన= క్రమంగా; బలము+ఎక్కి= బలవంతుడై; ధరణీ= భూమిని; పవన= గాలిని; అంబర= ఆకసాన్నీ; జల= నీటినీ; తేజములన్= తేజస్సును; గెలుచున్= లోబరచుకొంటాడు; అహంకరణంబున్= అహంకారాన్ని; త్రోచున్= కడకునెట్టివేస్తాడు; బుద్ధిన్= మతిని; పరువడిన్= శీఘ్రంగా; అడఁగించున్= నశింపజేస్తాడు; ప్రకృతిపనిన్= ప్రకృతియొక్క చేష్టను; పెడఁబాపున్= తొలగించి వేస్తాడు.

**తాత్పర్యం:** క్రమంగా బలపడి పృథ్వివ్యాపస్తేజోవాయ్వాకాశాలనే పంచభూతాలపై విజయం సాధిస్తాడు. అంతేకాక అహంకారాన్ని కడకు నెట్టివేస్తాడు. బుద్ధిని నియమిస్తాడు. ప్రకృతి చేష్టలైన కామాదులను అరికట్టుతాడు.

**ఆ. భూమిజయము దొడఁగి పురుషుఁ డంతంతకు । వృద్ధిఁ బొంది యోగసిద్ధిఁ బొందుఁ**
**బొగయు మిడుఁగుఱులును బొనుఁగు లేని శిఖియు । బహులశిఖలు నైన పగిది నసఘ! 94**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; పురుషుఁడు= జీవుడు; భూమిజయముతొడఁగి= పృథ్వీభూతమును జయించిన మొదలుగా; అంతంతకున్= అంతకంతకు; వృద్ధిన్+పొంది= పెరుగుదల నొంది; పొగయున్= ధూమమును; మిడుఁగుఱులును= నిప్పురవ్వలూ; పొనుఁగు లేని= తేజోహీనతలేనట్టి; శిఖియున్= అగ్నియు; బహులశిఖలున్= అనేకజ్వాలలు; ఐన పగిదిన్= అయిన రీతిగా; యోగసిద్ధిన్+పొందున్= యోగముయొక్క పరిపక్వదశను పొందుతాడు.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ శుకుడా! జీవాత్ముడు పృథ్వీభూతాన్ని జయించిన నాటినుండి క్రమక్రమంగా వృద్ధి పొందుతాడు. అతడు ధూమం, మిణుగురులు, తేజోహీనత లేని అగ్ని అనేక జ్వాలలతో కూడి జ్వలించినట్లే యోగసిద్ధుడై ప్రకాశిస్తాడు.

**తే. విను మహంకారజయము పృథ్వీ ముఖంబు । లైనవానిని బుద్ధి ప్రధానమును జ**
**యించునట్టి సంస్కారంబు నిచ్చు; దాన । నగు మహానుభావంబు సంయమివరులకు. 95**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; అహంకారజయము= అహంకారంపై సాధించిన గెలుపు; పృథ్వీముఖంబులు+ఐన వానిని= భూమి మొదలుగా గల పంచభూతాలను; బుద్ధి= బుద్ధిని; ప్రధానమును= ప్రకృతిని; జయించునట్టి= సాధించునటువంటి; సంస్కారంబున్= సంస్కరణమును; ఇచ్చున్= ఇస్తుంది; దానన్= అందువలన; సంయమివరులకున్= మునిశ్రేష్ఠులకు; మహానుభావంబు= గొప్ప ప్రభావం; అగున్= కల్గుతుంది.

**తాత్పర్యం:** అహంకారంపై విజయం సాధిస్తే క్రమంగా అది పృథ్వ్యాది పంచభూతాలనూ, బుద్ధినీ, ప్రకృతినీ జయించగల సంస్కారాన్ని ప్రసాదిస్తుంది. అందువలన మునివర్యులకు గొప్పప్రభావం సమకూరుతుంది.

**వ. ఇది యోగప్రకారంబు. 96**

**ప్రతిపదార్థం:** ఇది= ఇంతవరకు చెప్పింది; యోగప్రకారంబు= యోగముయొక్క విధానం.

**తాత్పర్యం:** ఇంతవరకు నిరూపించబడింది యోగపద్ధతి.

**తే.** **అనఘ! యింద్రియముల విషయముల మీఁద । నిగుడనీక, మనంబుతో మగుడఁ దిగిచి**
**యాత్మఁగూర్చుట సాంఖ్యుల యనువు; సాంఖ్య । యోగములు రెండు నారయ నొక్క తెరువ. 97**

**ప్రతిపదార్థం:** అనఘ!= కల్మషరహితుడా!; ఇంద్రియములన్= శ్రోత్రాదులైన ఇంద్రియాలను; విషయములమీఁదన్= శబ్దాదులైన విషయాలమీద; నిగుడనీక= ప్రసరింపనీక; మనంబుతోన్= మనస్సుతో; మగుడన్= మరలేటట్లు; తిగిచి= ఆకర్షించి; ఆత్మన్= ఆత్మయందు; కూర్చుట= లగ్నంకావించటం; సాంఖ్యుల అనువు= సాంఖ్యమార్గాన్ని అనుసరించేవారి పద్ధతి; ఆరయన్= పరిశీలించగా; సాంఖ్యయోగములు= సాంఖ్యమార్గం, యోగమార్గం; రెండున్= రెండూ; ఒక్క తెరువు+అ= ఒక్క పద్ధతియే.

**తాత్పర్యం:** పాపరహితుడా! ఇంద్రియాలను విషయాలపై పోనీయకుండా మనస్సు మరలింపజేసి ఆత్మయందు సంలగ్నం కావించాలి. సాంఖ్యులు ఈ పద్ధతినే పాటిస్తారు. పరిశీలించి చూడగా సాంఖ్యయోగమార్గాలు రెండూ ఒక పద్ధతికి చెందినవే.

**విశేషం:** భగవద్గీతలో కృష్ణుడు "ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి" అని సాంఖ్యయోగముల ఏకత్వాన్ని ప్రతిపాదించిఉన్నాడు. ఇక్కడ గూడ ఈ విషయమే మరల ప్రస్తావించబడింది.

**క.** **ఈ రెండు ప్రకారంబుల । వారలకును మమత విడువవలయుట సరి; ని**
**స్సారపు సంసారమునకుఁ । గారణము మమత్వ మగుటఁ గవిజనముఖ్యా! 98**

**ప్రతిపదార్థం:** కవిజనముఖ్యా!= యోగిజనశ్రేష్ఠా!; నిస్సారపు= సారరహితమైన; సంసారమునకున్= సంసారానికి; కారణము= హేతువు; మమత్వము= మమకారం; అగుటన్= కావటంవలన; ఈ రెండు ప్రకారంబుల వారలకును= ఈ ద్వివిధ పద్ధతులు పాటించే వారికి కూడా; మమత= మమకారమును; విడువన్+వలయుట= వదలవలసిన ఆవశ్యకత; సరి= సమమే.

**తాత్పర్యం:** యోగులలో శ్రేష్ఠుడవైన ఓ శుకుడా! నిస్సారమైన సంసారానికి ముఖ్యకారణం మమకారమే. అందువలన సాంఖ్యాన్ని అనుసరించేవారికైనా, యోగాన్ని పాటించేవారికైనా మమకార పరిత్యాగం సమానమైన ధర్మం.

**వ.** **భూతతారతమ్యంబులు సెప్పెద నాకర్ణింపుము: జంగమస్థావరంబులయందు జంగమంబులు లెస్స; యవి జరాయువు, నండంబును, నుద్భిదంబును, స్వేదంబును నను జనక విశేషంబుల జనియించి బహుపాదంబులును, ద్విపాదంబులు నైయుండు; నందు మనుష్యులు మేలు; మనుష్యుల యందు జాతిధర్మోపధారకు లెక్కుడు; జాతి ధర్మోపధారకుల యందు విప్రు లుత్తములు; విప్రులయందు వేదజ్ఞు లుదాత్తులు; వేదజ్ఞులయందుం బ్రవచనశీలు రుత్కృష్టులు; ప్రవచన శీలురయం దాత్మజ్ఞులధికులు; వారలు స్వధర్మవిదులు, సత్యసంకల్పులు, నధిభూతాధిదైవ వేదులు నగుదురు. వారలం జూవె దేవతలు బ్రాహ్మణు లండ్రు; వా రెల్ల వారికి నమస్కారాద్యుపచారాదరణీయులు; వారికి సరిలేరు; వా రాధారంబుగా సమస్త జగంబులుఁ బ్రవర్తిల్లుచున్నవి' యని చెప్పి య మ్మహాత్ముండు వెండియు. 99**

**ప్రతిపదార్థం:** భూతతారతమ్యంబులు= ప్రాణులలోని తరతమభేదాలు; చెప్పెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము; జంగమస్థావరంబుల+అందున్= చరాచరములయందు; జంగమంబులు= చరప్రాణులు; లెస్స= మేలు; అవి= ఆప్రాణులు; జరాయువు= మావి; అండంబును= గ్రుడ్డును; ఉద్భిదంబును= భూమిని ఛేదించుకొని పుట్టేదీ; స్వేదంబును= చెమటయును; అను= అనే; జనకవిశేషంబులన్= ఉత్పాదకములైన వస్తు విశేషాలయందు; జనియించి= పుట్టి; బహుపాదంబులును= అనేక చరణాలు కలవి; ద్విపాదంబులున్+ఐ= రెండు చరణాలు కలవియునై; ఉండున్= ఉంటాయి; అందున్= ఆ ద్విపాదప్రాణులలో; మనుష్యులు=

మానవులు; మేలు= లెస్స; మనుష్యుల+అందున్= మానవులలో; జాతిధర్మ+ఉపధారకులు= జాతియొక్క ధర్మమును పోషించేవారు; ఎక్కుడు= మేలు; జాతిధర్మ+ఉపధారకులయందున్= జాతి ధర్మపోషకులలో; విప్రులు= బ్రాహ్మణులు; ఉత్తములు= శ్రేష్ఠులు; విప్రుల+అందున్= భూసురులలో; వేదజ్ఞులు= వేదం తెలిసినవారు; ఉదాత్తులు= శ్రేష్ఠులు; వేదజ్ఞుల+అందున్= వేదవిదులలో; ప్రవచనశీలురు= వేదపారప్రవచనం చూసేవారు; ఉత్కృష్టులు= శ్రేష్ఠులు; ప్రవచనశీలుర+అందున్= ప్రవచనం చేసేవారియందు; ఆత్మజ్ఞులు= ఆత్మతత్త్వమెరిగినవారు; అధికులు= శ్రేష్ఠులు; వారలు= వారు; సర్వధర్మవిదులు= సమస్త ధర్మాలు తెలిసినవారు; సత్యసంకల్పులు= సత్యమైన సంకల్పంకలవారు; అధి భూతాది దైవవేదులున్= అధిభూతమును; అధిదైవము నెరిగినవారును; అగుదురు= అవుతారు; దేవతలు= సురలు; వారలన్+చూవె= వారలనే కదా!; బ్రాహ్మణులు+అంద్రు= బ్రాహ్మణులు అని చెప్పుతారు; వారు= ఆ బ్రాహ్మణులు; ఎల్లవారికిన్= అందరికీ; నమస్కార+ఆది+ఉపచార+ఆదరణీయులు= నమస్కారం మొదలైన ఉపచారాలచేత ఆదరించదగినవారు; వారికిన్= ఆ బ్రాహ్మణులకు; సరిలేరు= సాటివారు లేరు; వారు= ఆ బ్రాహ్మణులు; ఆధారంబుగాన్; ఆశ్రయంగా; సమస్తజగంబులున్= సర్వలోకాలూ; ప్రవర్తిల్లుచున్నవి= నడుస్తున్నవి; అని చెప్పి= అని వచించి; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ప్రాణులలోఉన్న తేడాలు వివరిస్తాను వినుము. చరాచరాలైన రెండు రకాల ప్రాణులలో చరప్రాణులు మేలైనవి. అవి మావి, గ్రుడ్డు, ఉద్భిదము, చెమట అనే ఉత్పాదక పదార్థాలనుండి పుట్టి అనేకపాదాలు గలవి, రెండు పాదాలు గలవిఅయి ఉంటాయి. వాటిలో మానవులు మేలు. మానవులలో జాతిధర్మాన్ని పోషించేవారు శ్రేష్ఠులు. వారిలో విప్రులు మేలైనవారు. విప్రులలో వేదము నెరిగినవారు ముఖ్యులు. వేదం తెలిసినవారిలో వేదార్థప్రవచనం కావించేవారు ఉత్కృష్టమైనవారు. అట్లా ప్రవచనం చేసేవారిలో ఆత్మజ్ఞులైనవారు గొప్పవారు. ఆత్మతత్త్వం తెలిసినవారు, సర్వధర్మవేత్తలు, యథార్థమైన సంకల్పం కలవారు, అధిభూతాధిదైవాలను ఎరిగినవారు అవుతున్నారు. దేవతలు అట్లాంటి వారినే బ్రాహ్మణు లంటారు. ఆ రకమైన బ్రాహ్మణులు అందరికీ ప్రణామాదులచేత ఆదరించదగి ఉన్నారు. వారికి సమానమైన వా రెవరూ లేరు. వారి నాధారం చేసికొనే సమస్త లోకాలూ నడుస్తున్నాయి' అని మళ్ళీ (వేదవ్యాసమునీంద్రుడు ఇట్లా అన్నాడు:)

**తే.** **'బ్రాహ్మణునకుఁ బ్రధానవర్తనము వినుము! । నిర్మలజ్ఞానయుక్తుఁడై కర్మసమితి**
**నలఘునిష్ఠమైఁ జలుపంగ వలయు; దాన । సంశయము లెల్లఁ బాయుఁ, బ్రసాద మొందు. 100**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణునకున్= పై జెప్పిన లక్షణాలతో విలసిల్లే బ్రాహ్మణుడికి; ప్రధానవర్తనము= ముఖ్యమైన నడవడి; వినుము; నిర్మలజ్ఞానయుక్తుఁడు+ఐ= అతడు నిర్మలమైన జ్ఞానంతో కూడినవాడై; అలఘునిష్ఠమైన్= గొప్ప నిష్ఠతో; కర్మసమితిన్= కర్తవ్యకార్య సమూహాలను; చలుపంగన్ వలయున్= నిర్వహించాలి; దానన్= ఆ విధంగా చేయటంవలన; సంశయములు+ఎల్లన్= సమస్త సందేహాలూ; పాయున్= తొలగుతాయి; ప్రసాదమున్= నైర్మల్యమును; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** 'పూర్వోక్తమైన లక్షణాలతో ఒప్పారే బ్రాహ్మణుడు ఎట్లా ప్రవర్తించాలో చెప్పుతాను వినుము. అతడు నిర్మలజ్ఞానం కలిగి గొప్ప దీక్షతో శ్రద్ధతో కర్తవ్యకర్మలు చేయాలి. అట్లా చేస్తే అతడి సంశయాలన్నీ తొలగిపోతాయి. అతడు మనోనైర్మల్యం పొందుతాడు.

**క.** **ఇయ్యఖిలము సృజియింపఁగ । నెయ్యది ప్రభు వమ్మహామహిత భూతము పొం**
**దయ్యెడి శుభంబు దపమునఁ । జయ్యన సిద్ధించు; నది విసంశయ మనఘా! 101**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; ఈ+అఖిలమున్= ఈ సమస్త జగత్తును; సృజియింపఁగన్= సృష్టించటానికి; ఏ+అది= ఏది; ప్రభువు= సమర్థమో; ఆ+మహామహిత భూతము పొందు= ఆ మహాపూజ్యమైన భూతంతోడి కలయిక; అయ్యెడి= సంభవించెడి;

శుభంబు= మంగళం; తపమునన్= తపస్సుతో; చయ్యనన్= శీఘ్రంగా; సిద్ధించున్= సంభవిస్తుంది; అది= ఆ విషయం; విసంశయము= సంశయంలేనిది.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడవైన శుకుడా! ఈ సమస్త ప్రపంచాన్నీ ఏది సృష్టిస్తున్నదో, ఆ మహాపావనమైన భూతంతో కలయిక అనే శుభం తపస్సుతో వెంటనే సిద్ధిస్తుంది. ఇందులో సందేహం లేదు.

**క. మైత్రిం బోలెడు ధర్మము । ధాత్రీ దివిజులకు లేదు; దాని నడపినం**
**బుత్రా! యేకర్మంబు ప । విత్రతయును వలవ దది వివేకముఁ జేర్చున్.' 102**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; ధాత్రీ దివిజులకున్= భూసురులకు; మైత్రిన్+పోలెడిధర్మము= మిత్రత్వమును పోలిన; ధర్మము; లేదు= లేదు; దానిన్= ఆ మైత్రిని; నడపినన్= నిర్వహిస్తే; ఏకర్మంబు= ఏ కర్మయొక్క; పవిత్రతయును= పావనత్వమును; వలవదు= అక్కరలేదు; అది= ఆ మైత్రి; వివేకమున్= తెలివిని; చేర్చున్= ఘటిస్తుంది.

**తాత్పర్యం:** కుమారా! భూసురులకు మైత్రివంటి ధర్మం మరొకటి లేదు. మైత్రీధర్మాన్ని చక్కగా నడిపితే ఇతరకర్మల పవిత్రతలు పాటించవలసిన పనిలేదు. ఆ మైత్రి నిత్యానిత్య వివేకాన్ని కలిగిస్తుంది'.

**విశేషం:** సమస్తప్రాణుల పట్ల సద్భావన కలిగి మిత్రత్వమును పాటించటమే మైత్రి. ఇది శ్రేష్ఠతమ ధర్మం.

**వ. అనిన విని శుకుం డా సంయమివరున కిట్లనియె. 103**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; శుకుండు= శుకయోగి; ఆ సంయమివరునకున్= ఆ వ్యాసుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసుడు ఈ రీతిగా చెప్పగా విని శుకుడు ఆ మునిశ్రేష్ఠుడితో మళ్ళీ ఇట్లా అన్నాడు:

**వ్యాసుఁడు శుకున కుపదేశించిన పరబ్రహ్మ ప్రాప్తి సాధన ప్రకారము (సం. 12-231-3)**

**క. 'పరమబ్రహ్మపదము న । ధ్వరముననో, ప్రజ్ఞ పెంపు వలననొ, యోగా**
**చరణముననొ, సాంఖ్యసమా । దరణముననొ పొందవచ్చుఁ దత్త్వజ్ఞవరా!' 104**

**ప్రతిపదార్థం:** తత్త్వజ్ఞవరా!= తత్త్వం తెలిసిన వారిలో శ్రేష్ఠుడవైనవాడా!; అధ్వరముననో= యజ్ఞంవలననో; ప్రజ్ఞపెంపువలననొ= మతియొక్క అతిశయంవలననో; యోగ+ఆచరణముననొ= యోగము నాచరించటంవలననో; సాంఖ్య సమాదరణముననొ= సాంఖ్యమును చక్కగా ఆచరించటంచేతనో; పరమబ్రహ్మపదమున్= శ్రేష్ఠమైన బ్రహ్మస్థానమును; పొందవచ్చున్?= పొందటానికి వీలవుతుంది?

**తాత్పర్యం:** 'తత్త్వమునెరిగినవారిలో శ్రేష్ఠుడవైన ఓ మునీశ్వరా! యజ్ఞక్రియవలననా? లేక ప్రజ్ఞాతిశయం వలననా? యోగాన్ని పాటించటం వలననా? సాంఖ్యాన్ని ఆదరించటం వలననా? ఏ విధంగా పరబ్రహ్మ పదమైన మోక్షమును పొందవచ్చును?'

**చ. అనుటయు నమ్మునిప్రవరుఁ డాతని కిట్లను 'నీవు పేరు గ్రు**
**చ్చినయవి యెల్ల మేల; సవిశేషతపంబును, నింద్రియప్రవ**
**ర్తనముల నిగ్రహించుటయు, రాగము లోభముఁ ద్రోవఁ జాలు నే**
**ర్పును దృఢవిద్యయుం గలుగు పుణ్యుఁడు వొందఁగనోపు బ్రహ్మమున్. 105**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అడుగగా; ఆ+మునిప్రవరుఁడు= ఆ వ్యాసుడు; ఆతనికిన్= ఆ శుకుడికి; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; నీవు పేరుగ్రుచ్చిన+అవి ఎల్లన్= నీవు పేర్కొన్నవి అన్నియునూ; మేలు= శ్రేయస్సును గలిగించేవే; సవిశేషతపంబును= విశేషంతో కూడిన తపస్సు; ఇంద్రియ ప్రవర్తనములన్= ఇంద్రియాల పోకడలను; నిగ్రహించుటయున్= నియమించటం; రాగమున్= విషయాలపై ప్రీతిని; లోభమున్= లోభమనే దుర్గుణమును; త్రోవన్+చాలు= తొలగింపగల; నేర్పును= చాతుర్యమును; దృఢవిద్యయున్= గట్టి విద్యయును; కలుగు= కలిగియున్నట్టి; పుణ్యుఁడు= పుణ్యాత్ముడు; బ్రహ్మమున్= బ్రహ్మస్థానాన్ని; పొందఁగన్+ఓపున్= పొందగలుగుతాడు.

**తాత్పర్యం:** అట్లా శుకు డడిగేసరికి వ్యాసమునీంద్రు డతడితో ఇట్లా అన్నాడు: 'నీ విపుడు చెప్పిన యజ్ఞాదులన్నీ బ్రహ్మపదప్రాప్తికి ఉపకరించే శ్రేష్ఠమైన సాధనాలే. అంతేకాక విశిష్టమైన తపస్సు, ఇంద్రియనిగ్రహం, రాగలోభనివారణ మొనర్చే చాతుర్యం, దృఢమైన విద్యకల పుణ్యాత్ముడు తప్పక బ్రహ్మపదాన్ని పొందుతాడు.

**క. విను! మందు నొక విశేషం । బనఘా! బుద్ధీంద్రియంబు లైదును బరముం**
**గను వెలుఁగున కడ్డము వా । ని నడంగింపంగ మనసునిపుణత యొప్పున్. 106**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; అందున్= ఇప్పుడు చెప్పినవాటిలో; ఒక విశేషంబు= ఒక విశేషాంశాన్ని; వినుము= ఆలకించుము; బుద్ధి+ఇంద్రియంబులు= జ్ఞానేంద్రియాలు; ఐదును= అయిదు కూడాను; పరమున్= బ్రహ్మమును; కను వెలుఁగునకున్= చూచే ప్రకాశానికి; అడ్డము= నిరోధకాలై ఉన్నవి; వానిన్= ఆ ఇంద్రియాలను; అడంగింపంగన్= అణచివేయగా; మనసు నిపుణత= చిత్తంయొక్క నేర్పు; ఒప్పున్= భాసిస్తుంది.

**తాత్పర్యం:** కల్మషరహితుడవైన ఓ శుకుడా! అందులోనూ ఒక విశేషం చెప్పుతాను. వినుము. శ్రోత్రం మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలు పరతత్త్వ దర్శనానికి ఆటంకాలుగా ఉంటాయి. వాటిని నిరోధించి వేస్తే బ్రహ్మప్రాప్తి కవసరమైన మనోనైపుణ్యం చక్కగా విరాజిల్లుతుంది.

**క. మనసు నియమింప భూతా । త్మని యత్నం బోపు నియమమునకున్ లోనై**
**మన సింద్రియములఁ గుదియిం । చిన శబ్దాదులు దొఱంగి సిద్ధి దొరకొనున్. 107**

**ప్రతిపదార్థం:** భూత+ఆత్మని= జీవుడియొక్క; యత్నంబు= ప్రయత్నం; మనసున్= చిత్తమును; నియమింపన్= నిగ్రహించటానికి; ఓపున్= సమర్థమవుతుంది; మనసు= చిత్తం; నియమమునకున్= నిగ్రహానికి; లోనై= లోబడినదై; ఇంద్రియములన్= శ్రోత్రాదులగు ఇంద్రియాలను; కుదియించినన్= నిగ్రహిస్తే; శబ్దాదులు= శబ్దాదులైన విషయాలు; తొఱంగి= తొలగిపోయి; సిద్ధి= మోక్షం; దొరకొనున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** జీవుడు ప్రయత్నిస్తే మనస్సును నిగ్రహించగలడు. నిగ్రహించబడిన మనస్సు ఇంద్రియాలను నియమించగలదు. అపుడు శబ్దాదులైన విషయాలు తొలగిపోతాయి. అంతట అభిలషించిన బ్రహ్మప్రాప్తి రూపమైన మోక్షం సిద్ధిస్తుంది.

**ఆ. కనుట వినుట యాదిగాఁ గల యింద్రియం । బుల కగోచరంబు బుద్ధి; దీన**
**రూపుగాఁగఁ దోఁచు రూపశబ్దాది గు । ణత్వరహితమైన తత్త్వ మనఘ! 108**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; బుద్ధి= ప్రజ్ఞ; కనుట వినుట ఆదిగాన్+కల= చూడటం, వినటం మొదలైన; ఇంద్రియములకున్= ఇంద్రియాలకు; అగోచరంబు= గోచరించనిది; దీనన్= ఈ బుద్ధివలననే; రూపశబ్ద+ఆదిగుణత్వరహితము+ఐన= రూపం, శబ్దం మొదలైన గుణాలతో సంబంధం లేని; తత్త్వము= పరతత్త్వం; రూపుకాఁగన్= స్పష్టంగా; తోఁచున్= భాసిస్తుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ శుకుడా! నేత్రం, శ్రోత్రం మొదలైన ఇంద్రియాలకు బుద్ధి గోచరించేదికాదు. బుద్ధివలననే రూపశబ్దాదులైన గుణాలతో ఏ మాత్రం సంబంధము లేని పరతత్త్వం స్పష్టంగా గోచరిస్తుంది.

**చ.** **వినయము విద్యయుం గలుగు విప్రునియందును, గోవునందు, నొ**
**ప్పు నెఱయు హస్తియందు నొక పోఁకకుఁబోవని కుక్కయందు, దా**
**ని నడఁచి తెచ్చి వండి తిను నీచపుమాలనియందుఁ దుల్యద**
**ర్శనులు దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్. 109**

**ప్రతిపదార్థం:** తదంతరాత్మని= విప్రుడు మొదలైనవారి అంతరాత్మయైన; నిరంజనునిన్= పరిశుద్ధమైన పరమాత్మను; కనునట్టి= చూచునట్టి; పండితుల్= పండితులు; వినయము= అణకువ; విద్యయున్= చదువును; కలుగు= కలిగి ఉన్నట్టి; విప్రుని అందున్= బ్రాహ్మణుడియందు; గోవునందున్= ఆవునందు; ఒప్పునెఱయు= చక్కనైన; హస్తి+అందున్= ఏనుగునందు; ఒక పోఁకకున్+పోవని= ఒక నీచమైన పోకకు కూడ కొరగాని; కుక్కయందున్; దానిన్= ఆ కుక్కను; అడఁచి= చంపి; వండి= వంటజేసికొని; తిను నీచపు మాలని+అందున్= భుజించే నీచుడైన శ్వపాకుడి యందు; తుల్యదర్శనులు= సమమైన దర్శనంకలవారు.

**తాత్పర్యం:** విప్రాదులలో అంతరాత్మఅయిన పరిశుద్ధమైన పరమాత్ముడిని చూచే పండితులు. విద్యావినయ సంపన్నుడైన విప్రుడియందు, గోవునందు, ఏనుగునందు, పోకకు కూడ కొరగాని కుక్కయందు, కుక్కమాంసం వండుకొని తినే చండాలుడియందు సమదృష్టి గల్గువారవుతారు.

**విశేషం:** భగవద్గీతలో గూడ దీనికి మూలమైన శ్లోకము 'విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని। శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః'॥ అన్నది కలదు.

**క.** **స్థావరముల జంగమముల । నా విభుఁడు వసించు; నతనియందు నవి నిస**
**ర్గావాసత నుండును; ద । ద్భావన మెఱుఁగుట తదైక్యపదముం జేర్చున్. 110**

**ప్రతిపదార్థం:** స్థావరములన్= స్థిరంగా ఒకచోట ఉండే ప్రాణులలోనూ; జంగమములన్= చరించే ప్రాణులలోనూ; ఆ విభుఁడు= ఆ పరమాత్ముడు; వసించున్= నివసిస్తాడు; అతని+అందున్= ఆ పరమాత్ముడియందు; అవి= ఆ చరాచరాలు; నిసర్గ+ఆవాసతన్= సహజ నివాసంకలవై; ఉండున్= ఉంటాయి; తద్భావనము= అవి అట్లా ఉండటాన్ని; ఎఱుఁగుట= తెలిసికొనుట; తత్+ఐక్యపదమున్= ఆ పరమాత్మతో ఏకమయ్యే స్థితిని; చేర్చున్= చేరుస్తుంది.

**తాత్పర్యం:** ఆ పరమాత్మ చరాచర ప్రాణులన్నిటిలో ఉన్నాడు. ఆ పరమాత్మలో ఆ ప్రాణులన్నీ ఉన్నవి. ఇట్లా ఒకదానిలో ఒకటి అవి పరస్పరం కలిసి ఉన్నాయని గ్రహించటమే బ్రహ్మపద ప్రాప్తిని సమకూరుస్తుంది.

**తే.** **క్షరము నక్షరమును ననం గలవు రెండు । మూర్తు; లాత్మ కఖిలభూతములను బూర్వ**
**మొలయు మృత మన దివమున నుండు నమృత । మనఁగ నపరంబు రెంటిని గను బుధుండు. 111**

**ప్రతిపదార్థం:** ఆత్మకున్= ఆత్మ పదార్థానికి; క్షరమున్= క్షరమనీ; అక్షరమునున్= అక్షరమనీ; అనన్= అనగా; రెండుమూర్తులు= రెండు ఆకృతులు; కలవు= ఉన్నాయి; అఖిలభూతములను= సమస్త ప్రాణులలోను; పూర్వము= మొదటిదైన క్షరం; మృతము= మరణశీలం; అనన్= అనగా; ఒలయున్= ఒప్పుతుంది; అపరంబు= మరొకటైన అక్షరం; అమృతము+అనఁగన్= మరణశీలం కానిదనగా; దివమునన్= స్వర్గంలో; ఉండున్= ఉంటుంది; బుధుండు= ఆత్మజ్ఞుడైన పండితుడు; రెంటినిన్= క్షరాక్షరాలను రెండింటినీ; కనున్= చూస్తాడు.

**తాత్పర్యం:** ఆత్మకు క్షరమనీ, అక్షరమనీ రెండు మూర్తులున్నాయి. క్షరం సమస్త ప్రాణులలోను మృతమన్న పేరుతో ఉంటుంది. రెండవదైన అక్షరం 'అమృత' మనబడి స్వర్లోకంలో ఉంటుంది. పండితుడైనవాడు పై క్షరాక్షరాలను రెండింటినీ వేరు వేరుగా గ్రహిస్తాడు.

**విశేషం:** నశించిపోయే స్వభావం గలది క్షరము. నాశం లేనిది అక్షరం. స్థూలదేహాదులన్నీ కాలక్రమంలో నశించిపోతాయి కాబట్టి క్షర మనబడుతున్నాయి. అక్షరమైన జీవాత్మ నశించదు. అవిద్యను తొలగించుకొన్నపు డా జీవాత్ముడే పరమాత్ము డవుతాడు. పరమాత్ముడు కూడా అక్షరుడే.

**'ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ'** ఇత్యాదిగా గీతలో ఈ విషయమే చెప్పబడింది. సర్వభూతాలూ క్షరమనీ, కూటస్థుడు అక్షరుడనీ గీత పేర్కొన్నది. క్షరాక్షరములకు అతీతుడైన పురుషోత్తముడే పరమాత్ముడని వ్యవహరించబడుతున్నాడు.

**క.** **ఈ లోకంబుల నెల్లం । గాలము పక్వంబు సేయఁగా నెవ్వాఁ డ**
**క్కాలము పక్వము సేయం । జాలు నతం డమృతు నజరు సత్యుఁ గనుటకున్.** **112**

**ప్రతిపదార్థం:** ఈ లోకంబులను+ఎల్లన్= ఈ లోకాలనన్నింటినీ; కాలము= కాలమనే తత్త్వం; పక్వంబుచేయఁగాన్= పచనం చేసివేయగా; ఎవ్వాఁడు= ఎవడు; ఆ+కాలమున్= ఆ కాలమును; పక్వము చేయన్= పచనమొనర్ప; అతండు= అట్టివాడు; అమృతున్= మరణశీలుడుకానివాడు; అజరున్= వార్ధకమంటనివాడు అగు; సత్యున్= శాశ్వతుడైన పరమాత్మను; కనుటకున్= చూచుటకు; చాలున్= సమర్థుడవుతాడు.

**తాత్పర్యం:** కాలం ఈ అన్ని లోకాలను పచనం చేసి వేస్తున్నది. ఆ కాలాన్ని పచనం చేయటంద్వారా ఎవడు జయించగలడో వాడు మాత్రమే జరామరణాలు లేని శాశ్వతుడైన అక్షరపురుషుడిని చూడగలడు.

**విశేషం:** సమస్త లోకాలూ కాలక్రమంలో నశించి పోతున్నాయి. మరణించేశరీరం తాను కాదని, తనకు మరణం లేదనీ ఎవడు గుర్తిస్తాడో వాడు మాత్రమే కాలానికి లోబడనివాడై కాలాన్ని జయించినవా డవుతాడు. వానికి అక్షరపురుష దర్శనం సిద్ధిస్తుంది.

**తే.** **విను నవద్వారపురమున వెలుఁగుచుండు । హంసుఁ డతనిన యక్షరుఁ డమృతుఁ డంద్రు**
**పరమయోగు లాతత్త్వంబు భంగిఁ గాంచు । యోగ్యసత్క్రియాభ్యాసవైరాగ్యపరుఁడు.'** **113**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; హంసుఁడు= హంసశబ్దవాచ్యుడైన ఆత్మ; నవద్వారపురమునన్= తొమ్మిది ద్వారాలుగల పట్టణమనే శరీరంలో; వెలుఁగుచుండున్= ప్రకాశిస్తూ ఉంటాడు; పరమయోగులు= శ్రేష్ఠులైన యోగులు; అతనిన= ఆ హంసుడినే; అక్షరుఁడు+అమృతుఁడు+అంద్రు= అక్షరుడనీ అమృతుడనీ అంటారు; యోగ్య= తగిన; సత్క్రియా= సత్కార్యాలయొక్క; అభ్యాస= అభ్యాసమునందును; వైరాగ్య= వైరాగ్యమునందును; పరుఁడు= ఆసక్తిగలవాడు; ఆ తత్త్వంబుభంగిన్= ఆ అక్షరతత్త్వపద్ధతిని; కాంచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** శుకా! వినుము. తొమ్మిదిద్వారాలు గల శరీర మనే నగరంలో హంసు డనే ఆత్మ భాసిస్తున్నాడు. శ్రేష్ఠులైన యోగులు ఆ ఆత్మనే అక్షరుడనీ, అమృతుడనీ అంటున్నారు. యోగ్యమైన సాధనాది సత్కార్యాలు ఆచరిస్తూ వైరాగ్య పరుడైనవాడు ఆ అక్షరతత్త్వాన్ని గ్రహించగలడు'.

**విశేషం:** శరీరానికి రెండు కన్నులు, రెండు చెవులు, రెండు నాసారంధ్రాలు, నోరు, గుదం, మూత్రద్వారం - అని తొమ్మిది ద్వారాలున్నాయి. అందువలన నవద్వారపురంగా శరీరం అభివర్ణించబడుతున్నది. 'నవద్వారేపురే' ఇత్యాదిగా గీతాదులలో ప్రయోగాలు గమనించేది.

**వ. అని చెప్పి యప్పారాశర్యుండు వెండియు. 114**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఇట్లా పలికి; ఆ+పారాశర్యుండు= వ్యాసుడు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఈ రీతిగా చెప్పి పరాశరపుత్రుడైన వ్యాసమునీంద్రుడు మళ్ళీ శుకుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అనఘ! విను కామమును గ్రోధమును భయంబు । నిద్రయును లోభమును జాల నిందితములు**
**యోగిజనులకుఁ గావున నుడుగవలయు । వీని నైదింటి నచలావధాన వృత్తి. 115**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; విను= ఆలకించుము; యోగిజనులకున్= యోగమార్గంలో ఉన్నవారికి; కామమును= కామమూ; క్రోధమును= కోపమూ; భయంబున్= భీతియు; నిద్రయున్= నిద్రించటమూ; లోభమును= పిసినితనమున్నూ; చాలన్= మిక్కిలి; నిందితములు= నిందించబడినవి; కావునన్= అందువలన; అచలావధానవృత్తిన్= నిశ్చలమైన అవధానవ్యాపారంతో; వీనిన్+ఐదింటిన్= ఈ ఐదు దుర్గుణాలను; ఉడుగన్ వలయున్= వదలిపెట్టాలి.

**తాత్పర్యం:** పాపరహితుడా! ఇంకా చెప్పుతాను వినుము. యోగులైనవారికి కామం, క్రోధం, భయం, నిద్ర, లోభం అనేవి చాలా నిందించదగిన చెడు గుణాలు. కాబట్టి అచంచలమైన అవధానంతో ఈ ఐదు దుర్గుణాలనూ పరిత్యజించాలి.

**శా. కామంబుం బెడఁబాచుఁ బండితుఁడు సంకల్పంబు వర్జించి, ని**
**ద్రామోహంబు నడంచు సత్త్వగుణ చింతన్, లోభముం బ్రాజ్ఞ సే**
**వాముద్రం దొలఁగించుఁ, గ్రోధము శమవ్యాప్తిన్ మగుడ్చున్ మతి**
**శ్రీమాన్యా! భయ మప్రమాదమున నిర్జించున్ దృఢస్వాంతుఁడై. 116**

**ప్రతిపదార్థం:** మతిశ్రీమాన్యా!= బుద్ధివైభవంచేత పూజించదగిన వాడా!; పండితుఁడు= బుధుడు; దృఢస్వాంతుఁడు+ఐ= దృఢమైన చిత్తం కలవాడై; సంకల్పంబున్= మనోవ్యాపారాన్ని; వర్జించి= వదలి; కామంబున్= కామాన్ని; పెడఁబాచున్= ఎడబాయజేస్తాడు; సత్త్వగుణచింతన్= సత్త్వమనే గుణాన్ని చింతించటంచేత; నిద్రామోహంబున్= నిద్రఅనే మోహాన్ని; అడంచున్= నశింపజేస్తాడు; ప్రాజ్ఞసేవాముద్రన్= బుద్ధిమంతులైనవారి సేవఅనే ముద్రచేత; లోభమున్= పిసినితనాన్ని; తొలఁగించున్= తొలగింపజేస్తాడు; శమవ్యాప్తిన్= అంతరింద్రియనిగ్రహ వ్యాప్తిచేత; క్రోధమున్= కోపమును; మగుడ్చున్= మరలింపజేస్తాడు; అప్రమాదమునన్= జాగరూకతతో; భయమున్= భీతిని; నిర్జించున్= జయిస్తాడు.

**తాత్పర్యం:** ధీసంపదచేత పూజింపదగిన ఓ శుకుడా! పండితుడు దృఢచిత్తంతో సంకల్పాన్ని వదలి కామాన్ని వదలించుకొంటాడు, సత్త్వగుణాన్ని చింతించటం ద్వారా నిద్రామోహాన్ని నశింపజేస్తాడు. ప్రాజ్ఞులను సేవించటం వలన లోభాన్ని తొలగించుకొంటాడు. శమంతో కోపాన్ని విసర్జిస్తాడు. ఏమరుపాటు లేనివాడై భయాన్ని జయిస్తాడు.

**తే. శిశ్నము నుదరమును ధృతిఁ, జేయుఁ గాలుఁ । జూడ్కిఁ జూడ్కిని వినికిని శుద్ధమాన**
**సమున మానసవాక్కుల విమలవిద్య । నవహితుండు రక్షించుఁ గులాగ్రగణ్య! 117**

**ప్రతిపదార్థం:** కుల+అగ్రగణ్య!= వంశంలో మొదట గణించదగినవాడా!; అవహితుండు= అవధానంకలవాడు; శిశ్నమున్= పురుషాంగాన్నీ; ఉదరమును= పొట్టనూ; ధృతిన్= ధైర్యంతో; చేయున్+కాలున్= చేతిని, కాలిని; చూడ్కిన్= చూపుతో; చూడ్కిని= చూపును; వినికిని= శ్రవణమును; శుద్ధమానసమునన్= పరిశుద్ధమైన చిత్తంతోనూ; మానసవాక్కులన్= మనస్సును, వాక్కునూ; విమలవిద్యన్= నిర్మలమైన విద్యతోనూ; రక్షించున్= కాపాడుతాడు.

**తాత్పర్యం:** కులశ్రేష్ఠుడవైన ఓ శుకుడా! జాగరూకుడై ఏమరుపాటులేని వాడు శిశ్నోదరాలను ధీరతతోనూ, హస్తపాదాలను చూపుతోనూ, నేత్ర శ్రవణాలను శుద్ధచిత్తంతోనూ, మనోవాక్కులను నిర్మలమైన విద్యతోనూ కాపాడుకొంటాడు.

**వ. మఱియు నొక్కతెఱంగు సెప్పెద. 118**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఒక్క తెఱంగున్= ఒక పద్ధతిని; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** ఇంకా ఒక మార్గం వివరిస్తాను.

**తే. ఇంద్రియములలో నొక్కటియేనిఁ బట్టు । వడక వెడలిన నా గంటిఁ బ్రజ్ఞ గాఱు**
**నట్లు కావున మనసు మున్నాఁగి వినికి । యాదియగు నైదుఁ గ్రమమున నాఁగవలయు. 119**

**ప్రతిపదార్థం:** ఇంద్రియములలోన్= ఐదు జ్ఞానేంద్రియాలలోనూ; ఒక్కటి+ఏనిన్= ఒక్కటైనా; పట్టువడక= నిగ్రహించబడక; వెడలినన్= తప్పించుకొనిపోతే; ఆగంటిన్= ఆ రంధ్రంద్వారా; ప్రజ్ఞ= తెలివి; కాఱున్= స్రవించిపోతుంది; అట్లు కావునన్= ఆ విధంగా జరుగుతుంది కాబట్టి; మనసున్= చిత్తమును; మున్ను= ముందు; ఆగి= నిరోధించి; వినికి+ఆది+అగు= శ్రవణం మొదలైన; ఐదున్= పంచేంద్రియాలను; క్రమమునన్= క్రమంగా; ఆఁగవలయున్= నిరోధించాలి.

**తాత్పర్యం:** ఇంద్రియాలలో ఒక్కటైన నిగ్రహానికి లొంగక తప్పించుకొంటే చాలు, ఆ రంధ్రంద్వారా ప్రజ్ఞ మొత్తం జారిపోతుంది. అందువలన మొదట చిత్తాన్ని నిరోధించాలి. ఆపై శ్రవణాదులైన పంచేంద్రియాలను నిరోధించాలి.

**క. మనసును నింద్రియములనుం । దనయం దొదుఁగంగఁ జేయఁ దానుఁ దెలివి నొం**
**ది నిరంజనత్వ సిద్ధిం । గని యపధూమానలంబు కరణి వెలుంగున్. 120**

**ప్రతిపదార్థం:** మనసును= చిత్తాన్ని; ఇంద్రియములనున్= ఇంద్రియాలనూ; తన+అందున్= ఆత్మలో; ఒదుఁగంగన్+చేయన్= అణగేటట్లు చేయగా; తాను= ఆత్మ; తెలివిన్+ఒంది= వివేకంపొంది; నిరంజనత్వసిద్ధిన్= మాయా దోషరాహిత్యాన్ని; కని= పొంది; అపధూమానలంబు కరణిన్= పొగలేని అగ్నివలె; వెలుంగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** మనస్సునూ, ఇంద్రియాలనూ తనలో నిగ్రహించుకొంటే తాను వివేకి అవుతాడు. ఆపై ఏ విధమైన దోషం లేనివాడై పొగలేని అనలంవలె వెలుగొందుతాడు.

**మ. మన సేకాగ్రతఁ బొందఁ జేయ జనసమ్మర్దంబు వర్జించి శూ**
**న్యనికేతాద్రిగుహా వివిక్త వనదేవాగార ముఖ్యంబు లై**
**న నివాసంబుల నుండఁగావలయుఁ దన్మన్నించినం గీడు సే**
**సిన హర్షంబు నమర్షముం హృదయముం జెందింప కక్షోభ్యుఁడై. 121**

**ప్రతిపదార్థం:** తన్= తనను; మన్నించినన్= పూజించినను; కీడు చేసినన్= (తనకు) అపకారం చేసినా; హర్షంబున్= సంతోషమును; అమర్షమున్= కోపమును; హృదయమున్= చిత్తమును; చెందింపక= పొందించకుండా; అక్షోభ్యుఁడు+ఐ= క్షోభింపజేయరానివాడై; మనసున్= చిత్తమును; ఏకాగ్రతన్= ఏకనిష్ఠత్వమును; పొందన్+చేయన్= ఒందించటానికి; జనసమ్మర్దంబున్= ప్రజల సందడిని; వర్జించి= త్యజించి; శూన్య= జనులు లేని; నికేత= గృహాలు; అద్రిగుహా= పర్వతగుహలు; వివిక్త= ఏకాంతములైన; వన= అడవులు; దేవాగార ముఖ్యంబులు+ఐన= దేవాలయాలు మొదలైన; నివాసంబులన్= స్థానాలలో; ఉండఁగాన్ వలయున్= నివసించాలి.

**తాత్పర్యం:** ఇతరులు తనను సమ్మానించినా, తనకు అపకారం చేసినా సంతోషాన్నీ, కోపాన్నీ పొందకుండా, ఏ విధమైన చిత్తక్షోభకు గురికానివాడై చిత్తమును ఏకాగ్రం చేయటానికి ఒక శూన్యమైన ప్రదేశంలో, కొండగుహలు, విజనములైన అడవులు, దేవాలయాలు మొదలైన ప్రదేశాలలో నివసించాలి.

**క. సమదృష్టిని ఱాయియుఁ గన । కముఁ జూచుచు సత్స మాధికలితం బగు వృ**
**త్తము నడపిన శబ్దబ్ర । హ్మము షణ్మాసముల యోగి యతివర్తించున్. 122**

**ప్రతిపదార్థం:** యోగి= యోగమార్గంలో ఉన్నవాడు; సమదృష్టిని= సమమైన చూపుతో; ఱాయియున్= శిలను; కనకమున్= బంగారాన్ని; చూచుచున్= విలోకిస్తూ; సత్సమాధికలితంబు+అగు= చక్కని సమాధితో కూడిన; వృత్తమున్= వర్తనమును; నడపినన్= నిర్వహించెనేని; షణ్మాసములన్= ఆరుమాసాలలో; శబ్దబ్రహ్మమున్= శబ్దమనే బ్రహ్మాన్ని; అతివర్తించున్= దాటిపోతాడు.

**తాత్పర్యం:** యోగి 'సమలోష్టాశ్మకాంచనః' అన్నట్లు రాయిని, బంగారాన్ని సమదృష్టితో చూస్తూ సమాధినిష్ఠుడై ఆరుమాసాలు గడపగలిగితే శబ్దబ్రహ్మాన్ని అతిక్రమిస్తాడు.

**క. సుత! విను; శబ్దబ్రహ్మము । నతివర్తించి భువనత్రయమునను యోగా**
**న్వితుఁ డగు ముని గను నజు శా । శ్వతు నచలుఁ బురాణతము నజరుఁ బరమాత్మున్.' 123**

**ప్రతిపదార్థం:** సుత!= కుమారా!; విను= ఆలకించుము; యోగ+అన్వితుఁడు= యోగంతో కూడినవాడు; అగు ముని= ఐన ముని; శబ్దబ్రహ్మమును= శబ్దమనే బ్రహ్మాన్ని; అతివర్తించి= దాటి; భువనత్రయమునను= ముల్లోకాలలోనూ; అజున్= పుట్టుకలేనివాడును; శాశ్వతున్= సత్యమైనవాడును; అచలున్= నిశ్చలమైనవాడును; పురాణతమున్= ప్రాచీనతముడును; అజరున్= వార్ధకం లేనివాడును అయిన; పరమాత్మున్= పరమాత్ముడిని; కనున్= చూస్తాడు.

**తాత్పర్యం:** పుత్రా! యోగి శబ్దబ్రహ్మాన్ని దాటి మూడు లోకాలలోనూ జననం లేనివాడూ, శాశ్వతుడైనవాడూ, నిశ్చలమైనవాడూ, సనాతనుడూ, ముసలితనం లేనివాడూ అయిన పరమాత్ముడిని దర్శిస్తాడు.

**వ. అనిన విని శుకుండు వేదవ్యాసమునీశ్వరునితో నిట్లను 'వేదంబు గర్మంబుల నాచరించుటయుం, బరిత్యజించుటయుం జెప్పు; నివ్విధంబులు పరస్పర విరుద్ధంబులై యున్నయవి; యిం దెద్దాన నెట్టిగతి సిద్ధించు; నేర్పడ? నెఱింగింపవే!' యనుటయు, నతం డతని కిట్లనియె. 124**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆకర్ణించి; శుకుండు= శుకయోగి; వేదవ్యాసమునీశ్వరునితోన్= వేదవ్యాస మునీంద్రుడితో; ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పాడు; వేదంబు= శ్రుతి; కర్మంబులన్= కర్మలను; ఆచరించుటయున్= చేయటాన్ని; పరిత్యజించుటయున్= వదలటాన్ని; చెప్పున్= చెప్పుతున్నది; ఈ+విధంబులు= ఈ రెండు పద్ధతులు; పరస్పర విరుద్ధంబులు+ఐ= అన్యోన్య వ్యతిరేకాలుగా; ఉన్న+అవి= ఉన్నాయి; ఇందున్= ఈ రెండు మార్గాలలో; ఏ+దానన్= దేనివలన; ఎట్టిగతి= ఏ విధమైన ప్రాప్తి; సిద్ధించున్= లభిస్తుంది; ఏర్పడన్= స్పష్టంగా; ఎఱింగింపవే= తెలియజెప్పుమా; అనుటయున్= అనగా; అతండు= ఆ వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసు డా రీతిగా చెప్పేసరికి అది విని శుకు డతడితో 'వేదం కర్మలు చేయాలనీ, వదలాలనీ రెండు రకాలుగా చెప్పుతున్నది. ఈ పద్ధతులు రెండూ అన్యోన్యం విరుద్ధంగా ఉన్నాయి. ఇందులో ఏది చేస్తే ఏ గతి లభిస్తుందో స్పష్టంగా తెలియజేయు'మని అడిగాడు. అందుకు వేదవ్యాసు డీ విధంగా చెప్పాడు.

**ఆ. విను ప్రవృత్తి కర్మ మనఘ! నివృత్తి ని । ష్కర్మ మరయ బంధకంబు మోక్ష**
**ణంబు నగుట బోధనత్వసంపన్నులు । సొరరు కర్మతంత్ర కరణమునకు. 125**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; విను= ఆలకించుము; కర్మము= కర్మమార్గం; ప్రవృత్తి= ప్రవర్తనం; అరయన్= పరిశీలింపగా; నిష్కర్మము= కర్మరాహిత్యం; నివృత్తి= బంధించేది, (రెండవది) మోక్షణంబు= విడుదల కలిగించేది; అగుటన్= కావటంచేత; బోధనత్వ సంపన్నులు= జ్ఞానంకలవారు; కర్మ తంత్ర కరణమునకున్= కర్మవిధానం ఒనర్చటానికి; చొరరు= పూనుకొనరు.

**తాత్పర్యం:** పాపరహితుడా! విను. కర్మమార్గం ప్రవృత్తి అనీ, కర్మరహితమార్గం నివృత్తి అనీ చెప్పబడుతాయి. ఇందులో మొదటిది బంధం కలిగించేది, రెండవది విడుదల కలిగించేది. అందువలన జ్ఞానసంపన్నులైనవారు కర్మమార్గంలో ప్రవేశించరు.

**క. కొందఱు కర్మకరణ మభి । నందింతురు; వారలకు జనన మరణములం**
**బొందక పోరాదు; మహా । నందముఁ బొందుదురు నిత్య నైష్కర్మ్య పరుల్. 126**

**ప్రతిపదార్థం:** కొందఱు= కొంతమంది; కర్మకరణమున్= కర్మచేయటాన్ని; అభినందింతురు= మెచ్చుకొంటారు; వారలకున్= వారికి; జనన మరణములన్= పుట్టుకను, చావును; పొందకపోరాదు= అనుభవించక పోవటానికి వీలుకాదు; నిత్యనైష్కర్మ్యపరుల్= సదా నిష్కర్మలయందుండేవారు; మహానందమున్= గొప్ప ఆనందాన్ని; పొందుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** కొందరు కర్మలు చేయటమే మంచిదంటారు. కాని, వారు చావుపుట్టుకలను పొందకుండా తప్పించుకొనలేరు. ఎల్లవేళలా నిష్కర్మతామార్గాన్ని అనుసరించేవారు గొప్ప ఆనందం పొందుతారు.

**ఆ. చిత్తశుద్ధి మాత్రఁ జేసెనేనియు నవి । ద్యాత్మకంబ చూవె యరయఁ గర్మ**
**మది దొఱంగు టంచితాత్మ విద్యాత్మక । ధర్మ మదియ మోక్షదంబు సుమ్ము! 127**

**ప్రతిపదార్థం:** అరయన్= పరిశీలింపగా; కర్మము= కర్మమార్గం; చిత్తశుద్ధిమాత్రన్= మనశ్శుద్ధిని మాత్రం; చేసెన్+ఏనియున్= చేసినప్పటికినీ; అవిద్యాత్మకంబ చూవె!= అవిద్యాస్వరూపమే గదా!; అది= ఆ కర్మను; తొఱంగుట= త్యజించటం; అంచిత+ఆత్మవిద్యా+ఆత్మక ధర్మము= పూజితమైన ఆత్మవిద్యా స్వరూపమైన ధర్మం; అదియ= అదే; మోక్షదంబు సుమ్ము= మోక్షమునిచ్చేది సుమా!

**తాత్పర్యం:** కర్మ చిత్తశుద్ధిని కలిగించినప్పటికీ, అవిద్యా స్వరూపమైనదే. దానిని వదలిపెట్టటమే ఆత్మవిద్య అయి ఉన్నది. మోక్షమిచ్చేది కూడా ఆ కర్మత్యాగమే.

**ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవరేఖకాంతియున్**
**జు మ్మరయంగఁ గర్మఫల శోభనసంపద; జున్ను నేఱుఁ బూ**
**ర్ణమ్మగు చంద్రబింబము ననం దగు నిర్మలవిద్య గాఢపా**
**కమ్ము ఫలోదయం బది యఖండసుఖాత్మ పదంబు పుత్రకా! 128**

**ప్రతిపదార్థం:** పుత్రకా!= కుమారా!; అరయంగన్= పరిశీలించగా; కర్మఫలశోభనసంపద= కర్మకు ప్రయోజనమైన సుందరమైన సంపత్తి; గుమ్మడి పువ్వుతేనియయున్= గుమ్మడిపువ్వులోని మకరందము; కూపమున్= బావియు; ఐందవరేఖ కాంతియున్+చుమ్ము= చంద్రరేఖాకాంతియు నగునుసుమా!; నిర్మలవిద్య= విమలమైన విద్య; జున్నున్= తేనెతెట్టెయు;ఏఱున్= నదియును; పూర్ణమ్ము+అగు=

నిండైన; చంద్రబింబము+అనన్+తగున్= చంద్రమండలమని చెప్పదగును; అది= ఆ విద్య; గాఢపాకమ్ము= అధికపాకం కలది; ఫలోదయంబు= ఫలమునకు ఉత్పత్తి స్థానమైనది; అఖండసుఖ+ఆత్మపదంబు= ఎడతెగని సుఖస్వరూపస్థానం.

**తాత్పర్యం:** కుమారా! కర్మమార్గానికి ఫలంగా లభించే శోభనమైన సంపద గుమ్మడిపువ్వు తేనెను, బావిని, చంద్రరేఖాకాంతిని పోలినది. నిర్మలమైన నైష్కర్మ్యమార్గ మనబడే విద్య తేనెతెట్టెను, నదిని, నిండుచంద్రబింబమును పోలినది. అది అధికపరిపాకం కలిగి ఫలానికి మూలమైనదై ఎడతెగని సుఖస్థానమై ఉన్నది.

**విశేషం:** గుమ్మడి పువ్వులో తేనె అతి స్వల్పంగా ఉంటుంది. తేనె తెట్టెలోని తేనెతో పోల్చినపుడు దాని ప్రయోజనం అతి స్వల్పం. అట్లాగే బావి సంకుచిత ప్రయోజనాలను మాత్రమే కల్గిస్తుంది. అందులోని నీరు స్వల్పం. నదితో పోల్చినపుడు బావివలన మనకు కలిగే లాభం చాలా కొద్దిపాటిది మాత్రమే. చంద్రుడి ఏకరేఖాకాంతి చాలా కొద్దిగా ఉంటుంది. పున్నమినాటి చంద్రుడి కాంతి ఎంతో పెద్దదై బహుళప్రయోజనాన్ని కల్గిస్తుంది. అట్లాగే స్వల్పఫలప్రదమైన కర్మమార్గంకంటే అత్యధిక ఫలప్రదమైన విద్యామార్గం శ్రేష్ఠమని భావం. అలం: రూపకం.

**వ. కర్మంబునం గానిది యై విద్యనయ్యెడునట్టితెఱం గెఱింగించెద. 129**

**ప్రతిపదార్థం:** కర్మంబునన్= కర్మమార్గంచేత; కానిది+ఐ= సాధించరానిదై; విద్యన్= విద్యామార్గంచేత; అయ్యెడునట్టి= సాధించదగినట్టి; తెఱంగు= పద్ధతి; ఎఱింగించెదన్= తెలుపుతాను.

**తాత్పర్యం:** కర్మచేత సాధ్యంకాక విద్యచేత మాత్రమే సాధించదగిన పద్ధతి ఏదో తెలియపరుస్తాను.

**క. విను! రేఖామాత్రపుఁ జం । ద్రుని యట్టుల జీవుఁ డతని దుష్పక్షముఁ బో**
**లిన యజ్ఞానము నపగమ । మున బోధానందసాంద్రపూర్ణతఁ బొలుచున్.' 130**

**ప్రతిపదార్థం:** విను= వినుము; జీవుఁడు= జీవాత్ముడు; రేఖామాత్రపు= ఒక్కరేఖామాత్రమే కల; చంద్రుని అట్టుల= చంద్రుడివంటివాడు; అతని= ఆ చంద్రుడియొక్క; దుష్పక్షమున్+పోలిన= కృష్ణపక్షంవంటిదైన; అజ్ఞానము నపగమమునన్= అజ్ఞానం తొలగిపోవటంచేత; బోధ+ఆనంద= జ్ఞానంచేత గలిగిన ఆనందంయొక్క; సాంద్ర= దట్టమైన; పూర్ణతన్= నిండుదనముచేత; పొలుచున్= భాసిస్తాడు.

**తాత్పర్యం:** ఏకరేఖామాత్రుడైన చంద్రుడితో సమానుడు జీవుడు. జీవుడి అజ్ఞానం చంద్రుడి కృష్ణపక్షంతో సమానమైనది. కృష్ణపక్షం గడచిపోతే చంద్రుడు పరిపూర్ణతను సంతరించుకొని భాసిస్తాడు. అట్లాగే అజ్ఞానమనే కర్మమార్గం గడిస్తే జీవుడు విద్యానంద పరిపూర్ణుడై వెలుగొందుతాడు'.

**విశేషం:** అలం: ఉపమ.

### బ్రహ్మచర్యంబు బ్రహ్మవిద్యాప్రాప్తికి ముఖ్యకారణంబని చెప్పుట (సం. 12-234-12)

**వ. అని చెప్పిన విని 'విద్య యెట్టివారికి నలవడు? నెఱింగింపవే!' యనిన నందనునితో గంధవతీనందనుం డిట్లనియె. 131**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్ విని= ఈ రీతిగా చెప్పగా విని; విద్య= జ్ఞానహేతువైన విద్య; ఎట్టివారికిన్= ఏ రీతిగా ఉన్నవారికి; అలవడున్= అలవాటగును; ఎఱింగింపవే= తెలుపుమా; అనినన్= అని అడిగిన; నందనునితోన్= కుమారుడితో; గంధవతీనందనుండు= (యోజన) మత్స్యగంధి తనయుడైన వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** వ్యాసు డట్లా చెప్పగా విని శుకుడు 'విద్య ఎట్లాంటి వారికి లభిస్తుందో చెప్పు'మని తండ్రిని అడిగాడు. అంతట వ్యాసమునీంద్రు డతనితో ఇట్లా అన్నాడు.

**తే.** **బ్రహ్మచర్యసమేతతపంబు విపుల । కాననమున వానప్రస్థ గణము పొంత**
**నిలిచి చేయుచుఁ బర్ణశాలలకు నుచిత । కాలమునఁ జని యెత్తి భిక్షలు భుజించి. 132**

**ప్రతిపదార్థం:** విపులకాననమునన్= విశాలమైన అడవిలో; వానప్రస్థగణము పొంతన్= వానప్రస్థాశ్రమంలో ఉన్నవారి చెంత; నిలిచి= ఉండి; బ్రహ్మచర్య సమేత తపంబున్= బ్రహ్మచర్యంతో కూడిన తపస్సును; చేయుచున్= చేస్తూ; ఉచితకాలమునన్= తగినసమయంలో; పర్ణశాలలకున్= పర్ణకుటీరాలకు; చని= పోయి; భిక్షలు ఎత్తి= భిక్షలు గ్రహించి; భుజించి= తిని.

**తాత్పర్యం:** విశాలమైన అరణ్యంలో వానప్రస్థులైనవారు నివసించే చోట ఉండి, బ్రహ్మచర్యంతో సహా తపోనిష్ఠ అనుష్ఠిస్తూ సరి అయిన సమయంలో అక్కడి పర్ణశాలలకు పోయి భిక్ష పరిగ్రహించి భుజిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **నుతియు నమస్కృతియును లే । క తిరిగి, శుభ మశుభమను వగం బొందక, గో**
**ష్ఠి తెరువు సొరకుండుట సు । వ్రత, మది యధ్యాత్మవిద్యఁ బ్రచురముఁ జేయున్.' 133**

**ప్రతిపదార్థం:** నుతియున్= పొగడ్తయు; నమస్కృతియున్= నమస్కారం; లేక= కలిగిఉండక; తిరిగి= సంచరించి; శుభము+అశుభము+అను వగన్= మంగళం, అమంగళం అనేచింతను; పొందక= చెందక; గోష్ఠితెరువు= పదిమంది కూడిన చోటికిపోయేమార్గం; చొరకుండుట= ప్రవేశించక ఉండటం; సువ్రతము= మంచివ్రతం; అది= ఆ వ్రతం; అధ్యాత్మవిద్యన్= బ్రహ్మవిద్యను; ప్రచురమున్+చేయున్= ఎక్కువ కావిస్తుంది.

**తాత్పర్యం:** మానావమానాలకు, శుభాశుభాలకు లొంగక ప్రజల కూటములలో చేరక ఉండటం మంచివ్రతం. ఆ వ్రతం వలన అధ్యాత్మవిద్య అభివృద్ధి పొందుతుంది'.

**ఆ.** **అనుడు నతఁడు 'కర్మ మఖిలంబు నీడఁ బో । విడుచు టొప్పదండ్రు వేదవిదులు;**
**దాని నాదరింపఁ దగదొకో సంయమి । ప్రవర! సందియంబు వాపవలయు.' 134**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; అతఁడు= ఆ శుకుడు; సంయమిప్రవర!= మునిశ్రేష్ఠా!; వేదవిదులు= వేదం తెలిసినవారు; అఖిలంబు కర్మము= సమస్తమైన కర్మను; ఈడన్+పోన్ విడుచుట= వెనుదీయక విడనాడటం; ఒప్పదు+అండ్రు= తగదని చెప్తుతారు; దానిన్= ఆ కర్మమును; (లేక వారిమాటను); ఆదరింపన్+తగదొకో?= సంభావించటం అనుచితమా?; సందియంబు= ఈ సందేహాన్ని; పాపన్ వలయున్= తొలగించాలి.

**తాత్పర్యం:** వ్యాసు డట్లా చెప్పగా శుకుడు మళ్ళీ ఇట్లా అన్నాడు: 'మునీంద్రా! వేదజ్ఞులు కర్మను పూర్తిగా వదలరా' దని చెప్పుతున్నారు. ఆ కర్మను (లేదా వారిమాటను) ఆదరించకూడదా! ఈ సందేహం నివారించండి'.

**వ.** **అనినం 'గర్మంబు విడువమియు, విడుచుటయుం గలిగియుండుఁ; దదీయయోగ్యతావిశేషంబు లెఱింగించెద. 135**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కర్మంబు= కర్మమును; విడువమియున్= వదలకుండా ఉండటమూ; విడుచుటయున్= వదలటమూ; కలిగిఉండున్= ఉండటం కద్దు; తదీయ= ఆ కర్మత్యాగ - అపరిత్యాగాలయొక్క; యోగ్యతావిశేషంబులు= అర్హతను గూర్చిన విశేషాలు; ఎఱింగించెదన్= తెలుపుతాను.

**తాత్పర్యం:** శుకు డట్లా అడిగేసరికి వ్యాసు డిట్లా అన్నాడు: 'కర్మను పరిత్యజించటమూ కద్దు. పరిత్యజించకపోవటమూ కద్దు. ఆ త్యాగాత్యాగాల విశేషాలను వివరిస్తాను.

**సీ.** **విను' మని ముని యిట్టులను 'బ్రహ్మచారి గృ। హస్థ వానప్రస్థ యతులు విహిత**
**కర్మ నిష్ఠత సిద్ధిఁగాంతు; రాశ్రమ చతు। ష్కముఁ జతుష్పట్టికా ఘటితమైన**
**నిఃశ్రేణి తుదిముట్టు నెలవెక్కుటకు నిట్టి। క్రమవర్తనము సుకరంపుమార్గ;**
**మాయువు మొదలి నాలవపాలు గురుపాల। దాసునియట్లు సంతతముఁ బనులు**

**తే.** **ప్రీతిఁ జేయుచుఁ గుడిచిన పిదపఁ గుడిచి। శయ్యఁ జెందిన నాతని చరణయుగము**
**గరయుగంబున నొత్తుచు గలితనిద్రుఁ। డైన నిద్రించు బ్రహ్మచర్యాన్వితుండు.** **136**

**ప్రతిపదార్థం:** వినుము= ఆకర్ణించుము; అని= అనిచెప్పి; ముని= వ్యాసుడు; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు; బ్రహ్మచారి= బ్రహ్మచర్యాశ్రమంలో ఉండేవాడు; గృహస్థ= గృహస్థుడు; వానప్రస్థ= వానప్రస్థుడు; యతులు= సన్న్యాసి అనేవీరు; విహితకర్మనిష్ఠతన్= శాస్త్రంచేత విధించబడిన కర్మలో నిష్ఠకలిగిఉండటం వలన; సిద్ధిన్= సాధనచేత గమ్యమైన ప్రయోజనమును; కాంతురు= పొందుతారు; ఆశ్రమ చతుష్కమున్= నాలుగాశ్రమాలు; చతుష్పట్టికా ఘటితమైన= నాలుగు మెట్లతో సంఘటించబడిన; నిఃశ్రేణి= నిచ్చెన; తుదిముట్టు నెలవు= గమ్యస్థానమైన మోక్షమును; ఎక్కుటకున్= అధిరోహించటానికి; ఇట్లు= ఇటువంటి; క్రమవర్తనము= క్రమమైన పద్ధతి; సుకరంపుమార్గము= సులభమైన త్రోవ; బ్రహ్మచర్య+అన్వితుండు= బ్రహ్మచర్యంతో కూడిన వటువు; ఆయువు మొదలి నాలవపాలు= జీవితకాలమైన ఆయుస్సులో మొదటిదైన నాల్గవ భాగాన్ని; గురుపాలన్= గురుడి చెంత; దాసునిఅట్లు= సేవకుడివలె; సంతతమున్= ఎల్లప్పుడు; ప్రీతిన్= ప్రీతితో; పనులు= కర్మలు; చేయుచున్= ఆచరిస్తూ; కుడిచిన పిదపన్= (గురువు) భుజించిన పిమ్మట; కుడిచి= భుజించి; శయ్యన్+చెందినన్= (గురువు) శయనిస్తే; ఆతని చరణయుగమున్= ఆ గురువు పాదాలు రెండింటిని; కరయుగంబునన్= తన రెండు చేతులలో; ఒత్తుచున్= పిసుకుతూ; కలితనిద్రుఁడు+ఐనన్= అతడు నిద్రించగా; నిద్రించున్= తాను నిద్రపోతాడు.

**తాత్పర్యం:** నేను చెప్పేది వినుము' అని వ్యాసు డిట్లా అన్నాడు: 'బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి అనే నాలుగాశ్రమాలకు చెందినవారు శాస్త్రం విధించిన కర్మలు ఆచరించటం ద్వారా సిద్ధి పొందుతారు. నాలుగాశ్రమాల పద్ధతి నాలుగు మెట్లతో నిర్మించిన నిచ్చెన వంటిది. చివరి గమ్యమైన మోక్షపదవి నధిష్ఠించటానికి బ్రహ్మచర్యాది క్రమపద్ధతి సులభమైన త్రోవ. బ్రహ్మచారి తన ఆయువులో మొదటి నాల్గవభాగమైన యిరువదైదు సంవత్సరాల కాలం గురువువద్ద భృత్యుడివలె సదా ప్రియంగా కర్మలు చేస్తూ ఉండాలి. గురువు భుజించిన తర్వాత భుజించాలి. గురువు పడుకొన్న పిమ్మట ఆయన రెండు పాదాలనూ తన రెండు చేతులతో ఒత్తాలి. ఆయన నిద్రించిన తర్వాతనే తాను నిద్రించాలి.

**విశేషం:** 'శతాయుర్వైపురుషః' అన్న ప్రమాణాన్ని అనుసరించి మానవుల ఆయుఃకాలం నూరు సంవత్సరాలై ఉన్నది. దీనిని నాల్గు భాగాలుగా విభజిస్తే ఒక్కొక్క భాగానికి ఇరువైఅయిదు సంవత్సరాలవుతాయి. క్రమపద్ధతిలో ఆశ్రమాలను స్వీకరించేవాడు ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క ఆశ్రమం చొప్పున నాలుగాశ్రమాలను పాటించాలి.

**క.** **రసగంధప్రముఖంబుల। దెస వేడుక లేక గురుమతికి వచ్చిన య**
**ట్టిసమయములఁ దగ వేదా।భ్యసనంబులు సేయుచుండు నాతఁడు నియతిన్.** **137**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ బ్రహ్మచారి; నియతిన్= నియమంతో; రసగంధప్రముఖంబుల దెసన్= రసం, గంధం మొదలైన విషయాలపై; వేడుక= ఔత్సుక్యం; లేక= కలిగి ఉండక; గురుమతికిన్= ఆచార్యుడి బుద్ధికి; వచ్చిన= తోచిన; అట్టిసమయములన్= ఆ కాలాలలో; తగన్= తగిన రీతిలో; వేద+అభ్యసనంబులు= శ్రుతిసారమును అభ్యసించటాన్ని; చేయుచుండున్= ఆచరిస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** బ్రహ్మచారి నియమంపాటిస్తూ రసగంధాదులైన విషయాలపై మక్కువ లేనివాడై ఉంటాడు. గురువు బుద్ధికి తోచిన సమయాలలో ఆయన వద్ద వేదాభ్యాసం చేస్తూ ఉంటాడు.

**వ. ఇది బ్రహ్మచారి ప్రకారం; బాతం డాశ్రమాంతరగతుం డయి వర్తించు విధంబు సెప్పెద. 138**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పింది; బ్రహ్మచారి ప్రకారంబు= బ్రహ్మచారి పద్ధతి; ఆతండు= ఆ బ్రహ్మచారి; ఆశ్రమ+ అంతరగతుండు+అయి= మరొక ఆశ్రమమైన గృహస్థాశ్రమంలో ప్రవేశించినవాడై; వర్తించు= మెలగే; విధంబు= ప్రకారాన్ని; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** ఇంతవరకూ చెప్పింది బ్రహ్మచారి పద్ధతి. ఆ బ్రహ్మచారి గార్హస్థ్యం స్వీకరించినప్పుడు మెలగే పద్ధతిని వివరిస్తాను.

**సీ. సవినయంబునఁ దన శక్తితో గురునకు । దక్షిణ యిచ్చి, యాతండు వనుపఁ**
**గా సమావర్తనకార్యంబు నడపి వి । వాహమై హవ్యకవ్యముల నతిథి**
**తోషణ బాంధవ పోషణంబుల సత్య । భాషల నిజదారపరతఁ బుత్ర**
**సంశిక్షఁ గ్రతువిశేషంబుల నొక యాయు । రంశంబు గడపి గృహస్థ, ధర్మ**

**తే. వృత్తిఁ గృతకృత్యుఁ డగు నగ్ని విడువ కడవిఁ । బూరిపంటల ఫలమూలములను భిక్షు**
**పూజ సలుపుచుఁ, బరిశిష్టములు భుజించి । తపము సేఁత వానప్రస్థ ధర్మసరణి. 139**

**ప్రతిపదార్థం:** సవినయంబునన్= వినయంతో; తనశక్తితోన్= తనకున్న శక్తి కొలది; గురునకున్= ఆచార్యుడికి; దక్షిణ ఇచ్చి= దక్షిణగా ఈదగిన ధనం ఇచ్చి; ఆతండు= ఆ గురువు; పనుపఁగాన్= పంపగా; సమావర్తన కార్యంబున్= బ్రహ్మచర్య సమాప్తికి తగినకార్యం; నడపి= నిర్వహించి; వివాహము+ఐ= పెండ్లిచేసికొని; హవ్యకవ్యములన్= దేవతలకు, పితృదేవతలకు ఈదగిన యన్నములతోను; అతిథితోషణ= అతిథులను సంతోషపరచుటతోను; బాంధవపోషణంబులన్= బంధువులను పోషించటంతోను; సత్యభాషలన్= సత్యమైన మాటలతోనూ; నిజదారపరతన్= తన భార్యయందే ఆసక్తిగలవాడై ఉండటంచేతను; పుత్ర సంశిక్షన్= పుత్రులకు మంచి శిక్షణ చేతను; క్రతు విశేషంబులన్= యాగ విశేషాలతోనూ; ఒక ఆయుః+అంశంబున్= తన ఆయుస్సులో నాలుగింట ఒకభాగాన్ని; కడపి= అతిక్రమించి; గృహస్థధర్మవృత్తిన్= గృహస్థుడి యొక్క ధర్మానికి చెందిన వర్తనంచేత; కృతకృత్యుఁడు= చేయదగిన పనులు చేసినవాడు; అగున్= అవుతాడు; అగ్నిన్ విడువక= అగ్నికార్యమును వదలక; అడవిన్= అరణ్యంలో; పూరిపంటలన్= ధాన్యములచేత; ఫలమూలములను= పండ్లు, దుంపలచేత; భిక్షుపూజన్= యతి పూజను;సలుపుచున్= నిర్వహిస్తూ; పరిశిష్టములు= మిగిలినవి; భుజించి= తిని; తపముచేఁత= తపస్సు చేయటం; వానప్రస్థధర్మసరణి= వానప్రస్థాశ్రమంలో ఉన్నవారి ధర్మముయొక్క మార్గమై ఉన్నది.

**తాత్పర్యం:** బ్రహ్మచారి వినయంతో తనశక్తి కొలది గురువుకు దక్షిణ ఇచ్చుకోవాలి. ఆయన అనుమతి పొంది అధ్యయనానంతరం గృహస్థధర్మాన్ని స్వీకరించటానికి అవసరమైన కార్యాలు నిర్వహించాలి. తరువాత పెండ్లి చేసికొని దేవతలను, పితృదేవతలనూ క్రమంగా హవ్యకవ్యాలలో సంతృప్తి పరచాలి. అతిథులను సంతోషపెట్టాలి.బంధువులను పోషించాలి. సత్యం పలకాలి. తన భార్యయందే అనురక్తుడై ఉండాలి. పుత్రులకు చక్కని శిక్షణ ఇవ్వాలి.

క్రతువులు చేయాలి. ఇట్లా జీవితకాలంలో ఒక పాతిక భాగం గడపి గృహస్థుడి ధర్మం పాటించి అతడు కృతార్థుడవుతాడు. ఆ పిమ్మట అగ్నికార్యం విడువకుండా నిర్వహిస్తూ ధాన్యాలతో, ఫలమూలాలతో సన్న్యాసులను ఆదరిస్తూ వారు తినగా మిగిలిన అన్నాన్ని భుజిస్తూ తపస్సు చేయటం వానప్రస్థులైనవారి ధర్మమార్గం.

**క. వానప్రస్థ ప్రక్రియ । దా నొకపా లాయువునఁ బదంపడి తుది పా**
**లైనను సన్న్యాసాను । ష్ఠానమునకుఁ జొచ్చువాఁడు శాంతాత్మకుఁడై. 140**

**ప్రతిపదార్థం:** పదంపడి= పిమ్మట; తాను= అతడు; ఒకపాలు+ఆయువునన్= ఒకభాగం ఆయుస్సుచేత; వానప్రస్థప్రక్రియన్= వానప్రస్థ వృత్తితో (గడపి); తుదిపాలైనను= శేషించిన నాల్గవపాలు జీవితకాలాన్నైనా; శాంతాత్మకుఁడు+ఐ= శాంతమైన చిత్తంకలవాడై; సన్న్యాస+అనుష్ఠానమునకున్= యతిధర్మాన్ని అనుష్ఠించటానికి; చొచ్చువాఁడు= ప్రవేశించేవాడు అగును.

**తాత్పర్యం:** ఈ విధంగా జీవితకాలంలో ఒకపాతిక వంతు వానప్రస్థ ధర్మాచరణతో గడపి, ఆ తరువాత మిగిలిన నాల్గవభాగం కాలంలో సన్న్యాసాశ్రమానుగుణమైన ధర్మానుష్ఠానంలో శాంతచిత్తంతో ప్రవేశించాలి.

**వ. ఇ ట్లాయురంశంబులు నాలుగుం జెల్లుట యుత్తమ ధర్మస్వరూపం; బంశత్రయకాలాచరితంబైన యాశ్రమత్రితయంబు ప్రవర్తనంబులఁ గషాయపక్వంబగుటయుఁ జతుర్థాశ్రమంబుఁ జెందుట కృత్యంబు; దాని తెఱం గెఱింగించెద నవహితుండ వై యాకర్ణింపుము. 141**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ఆయుః+అంశంబులు= ఆయుర్భాగాలు; నాలుగున్+చెల్లుట= నాలుగును గడచుట; ఉత్తమధర్మస్వరూపంబు=శ్రేష్ఠమైనధర్మముయొక్క పద్ధతి; అంశత్రయ= మూడుభాగాలైన; కాల= సమయంలో; ఆచరితంబు+ఐన= చేయబడిన; ఆశ్రమత్రితయంబు= మూడాశ్రమాలయొక్క; ప్రవర్తనంబులన్= ఆయా ఆశ్రమానికి తగిన నడవడికలతో; కషాయపక్వంబు+అగుటయున్= చిత్తం శుద్ధం కావటంతోనే; చతుర్థ+ఆశ్రమంబున్= యత్యాశ్రమమును; చెందుట= స్వీకరించటం; కృత్యంబు= చేయదగింది; దాని తెఱంగు= నాల్గవ ఆశ్రమపద్ధతిని; ఎఱింగించెదన్= తెలుపుతాను; అవహితుండవు+ఐ= అవధానం కలవాడవై; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఈ విధంగా నాలుగు జీవితకాలభాగాలు గడవట మనేది ఉత్తమమైన ధర్మపద్ధతి. మొదటి మూడు కాలాంశాలలో చక్కని ప్రవర్తనలతో గడపిన బ్రహ్మచర్యం మొదలైన మూడాశ్రమాలు క్రమపక్వత పొందాలి. ఆ పిదప నాల్గవదైన సన్న్యాసాశ్రమం స్వీకరించటం ఉచితం. నాల్గవ ఆశ్రమానికి చెందిన పద్ధతి ఎట్లాంటిదో వివరిస్తాను. సావధానంగా వినుము.

**సీ. ఆత్మయం దగ్ని సమారోపణము సేసి । యజన మాంతరముగ నకృతసంధి**
**విగ్రహుం డగుచుఁ బరిగ్రహ విముఖుఁడై । ముండుండు ననికేతనుండు వృక్ష**
**మూలవాసియును గపాలధారుండు నే । కాకియు నక్రోధకామశోకుఁ**
**డును గాఁగవలయు; భిక్షునకు నిందా స్తుతుల్ । దనయంద యడఁగంగఁ దాను బరుల**

**తే. దిక్కు వలుకక దివియెల్లఁ బిక్కటిలఁగఁ । దాన యున్నట్లు గనుచు నేమేనిఁ గుడిచి**
**యెద్దియేనియుఁ గట్టి యెందే శయించు । నతని దేవతల్ బ్రాహ్మణుఁ డండ్రు పుత్ర! 142**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; యజనము= యజ్ఞక్రియ; ఆంతరముగన్= ఆంతరంగికం కాగా; ఆత్మయందున్= ఆత్మలో; అగ్నిసమారోపణము చేసి= అగ్నిని చక్కగా ఆరోపింపజేసి; అకృత సంధి విగ్రహుండు+అగుచున్= ఇతరులతో కలయికగాని,

కలహంగాని చేయనివాడుగా ఉంటూ; పరిగ్రహవిముఖుఁడు+ఐ= ఇతరులనుండి ధనాదుల స్వీకారానికి విముఖుడై; ముండుండున్= బోడితలవాడును; అనికేతనుండున్= గృహం లేనివాడు; వృక్షమూలవాసియున్= చెట్టుమొదట నివసించేవాడును; కపాలధారుండున్= పెంకును చేబూనినవాడును; ఏకాకియున్= ఒంటరిగా ఉండేవాడును; అక్రోధకామశోకుఁడును= కోపం, కామం, దుఃఖం లేనివాడును; కాఁగన్+వలయున్= కావలెను; భిక్షునకున్= సన్న్యాసికి; నిందాస్తుతుల్= నిందించటం, పొగడటమూ; తనయంద= తనలోనే; అడఁగంగన్= అణగిపోగా; తాను= ఆ సన్న్యాసి; పరులదిక్కు= ఇతరులవైపు; పలుకక= మాట్లాడక; దివి ఎల్లన్= ఆకాశమంతా; పిక్కటిలఁగన్= క్రిక్కిరిసినట్లుగా; తాన= తానే; ఉన్నట్లు= ఉండినట్లు; కనుచున్= చూస్తూ; ఏమేని= ఏదైనా; కుడిచి= తిని; ఎద్దియేనియున్= ఏదైనా; కట్టి= ధరించి; ఎందేన్= ఎక్కడైనా; శయించునతని= శయనించే సన్న్యాసిని; దేవతల్= సురలు; బ్రాహ్మణుఁడు+అండ్రు= బ్రాహ్మణుడని చెప్పుతారు.

**తాత్పర్యం:** కుమారా! సన్న్యాసాశ్రమం స్వీకరించినవాడు ఆత్మలోనే అగ్ని సమారోపణం కావించి ఆంతరంగికంగా యజనక్రియ నిర్వహించాలి. ఎవరితోనూ పొత్తుగానీ, కలహంకానీ పెట్టుకొనకూడదు. అతడికి పరిగ్రహం తగదు. ముండిత శిరస్కుడై ఒక యింట నివాసం లేక ఏ చెట్టుమొదట్లోనో నివసించాలి. ఘటకపాలం చేతబట్టి ఏకాకిగా సంచరించాలి. కామానికీ, క్రోధానికీ, శోకానికీ గురి కాకూడదు. నిందాస్తుతులను తనలో అణచివేసి ఇతరులతో ఏ వ్యవహారమూ పెట్టుకొనక భూమ్యాకాశాలంతటా తానే వ్యాపించి ఉన్నానని భావిస్తూ, ప్రాప్తమైనది ఏదైనా తిని, ఏదైనా ధరించి, ఎక్కడైనా శయనించే స్వభావంకల ఆ యతిని దేవతలు 'బ్రాహ్మణుడు' అని వ్యవహరిస్తారు.

**క. జన నికరములకుఁ దొలఁగును । ఘన భుజగంబులకుఁ బోలెఁ గనుఁ బీనుఁగుఁ గా**
**వనితం దనుఁ బాటించిన । ననఘా! నరకముగఁ దలఁచు నతఁడు మనమునన్. 143**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; అతఁడు= ఆ సన్న్యాసి; జన నికరములకున్= ప్రజాసమూహాలకు; ఘనభుజంగం బులకున్+పోలెన్= పెద్దపాములకు వలె; తొలఁగును= తొలగిపోతాడు; వనితన్= స్త్రీని; పీనుఁగున్+కాన్= శవంగా; కనున్=భావిస్తాడు; తను= తనను; పాటించినన్= చేరితే; మనమున్= చిత్తంలో; నరకముగన్= నరకంగా; తలఁచున్= భావిస్తాడు.

**తాత్పర్యం:** పాపరహితుడా! ఆ యతి పాములు తొలగినట్లు ప్రజల గుంపులను చూస్తే దూరంగా తొలగిపోతాడు. స్త్రీని శవంగా భావిస్తాడు. ఆ స్త్రీ తనను పాటిస్తే అది నరకంగా చిత్తంలో భావిస్తాడు.

**తే. అతనివలన భూతములకు నభయ మగుట । భూతముల దెస నభయంబ యాతనికిని**
**బుత్ర! యీగు లెల్లవియును భూతములకు । నభయ మిచ్చుటఁ బోలవం డ్రార్యజనులు. 144**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; అతనివలనన్= ఆ యతివలన; భూతములకున్= ప్రాణులకు; అభయము+అగుటన్= భయం లేదు కాబట్టి; ఆతనికిని= ఆ యతికి కూడ; భూతములదెసన్= ప్రాణులవలన; అభయంబు+అ= భయమన్నది లేదు; ఆర్యజనులు= పెద్దలు; ఈగు లెల్లవియును= సమస్తదానాలు; భూతములకున్= ప్రాణులకు; అభయము+ఇచ్చుటన్= నిర్భయత్వం ఒసంగుటను; పోలవు+అండ్రు= సరిపోల వని చెప్పుతారు.

**తాత్పర్యం:** కుమారా! సన్న్యాసివలన ప్రాణులకు భయం లేదు కాబట్టి ప్రాణులవలన అతడికి కూడా భయంలేదు. ఆర్యులైనవారు అన్నిదానాలు ప్రాణుల కిచ్చే అభయ ప్రదానానికి సరిపోల వని చెప్పుతారు.

**ఆ. జంతుపదము లెల్ల దంతిపదంబులో । నడఁగు క్రియ నహింసయందు సకల**
**ధర్మములు నడంగుఁ గర్మ సంత్యాగికి । నైన భూతదయ సమర్థగుణము. 145**

**ప్రతిపదార్థం:** జంతుపదములు+ఎల్లన్= జంతువుల అడుగులన్నీ; దంతిపదంబులోన్= ఏనుగు అడుగులో; అడఁగుక్రియన్= అణగునట్లు; అహింస+అందున్= 'అహింస' అనే ధర్మమందు; సకలధర్మములు= సమస్త ధర్మాలు; అడంగున్= అణగిపోతాయి; కర్మసంత్యాగికిన్+ఐనన్= కర్మములు పరిత్యజించినవాడికి సైతం; భూతదయ= ప్రాణులపట్ల చూపే కరుణ; సమర్హగుణము= ఉచితమైన గుణం.

**తాత్పర్యం:** లోకంలోని జంతువుల అడుగులన్నీ ఏనుగు అడుగులో లీనమైపోతాయి. అట్లే సమస్త ధర్మాలు 'అహింస' అనే ధర్మంలో లీనమైపోతాయి. కాబట్టి కర్మపరిత్యాగం చేసిన వానికి కూడా భూతదయ చాలా ఉచితమైన గుణంగా భాసిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. కావున. 146**

**తాత్పర్యం:** అందువలన.

**క. జగముల కెల్ల శరణ్యుం। డగుచు నమృతసిక్తమైన యట్టి మనసుతో**
**విగతాఖిలలేపస్థితి। గగనము నట్లుండు నతఁడు గణనాధికుఁడై.' 147**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ యతి; జగములకున్+ఎల్లన్= లోకాలకన్నిటికీ; శరణ్యుండు+అగుచున్= శరణొందదగినవాడు అవుతూ; అమృతసిక్తము+ఐన అట్టి= అమృతంతో తడుపబడినదైనట్టి; మనసుతోన్= చిత్తంతో; గణనాధికుఁడు+ఐ= ఇట్టివాడని ఊహించుటకు వీలుగానివాడై; విగత+అఖిల లేపస్థితిన్= తొలగిన సమస్త సంగముయొక్క స్థితిచేత; గగనముఅట్లు= ఆకాశంవలె; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ సన్న్యాసి లోకాల కన్నిటికీ శరణ్యమై ఉంటాడు. అతడి చిత్తం అమృతంతో తడిపినట్లు చల్లగా, శ్రేయోదాయకంగా ఉంటుంది. అతడు దేనినీ అంటక 'ఇట్టివాడు' అని ఊహించరానివాడై ఆకాశంవలె ఉంటాడు'.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని చెప్పి యప్పరాశరనందనుండు వెండియు నిట్లనియె. 148**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; ఆ+పరాశర నందనుండు= ఆ వ్యాసుడు; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి వ్యాసుడు మళ్ళీ ఈ విధంగా అన్నాడు:

### వ్యాసుఁడు శుకున కుపదేశించిన యంతర్యాగ ప్రకారము (సం. 12-237-27, 28)

**తే. హృదయవేదికయందు సమిద్ధమూర్తి। వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁ బ్రాణ**
**ములను యాజి య ట్లంతరమున నొనర్చు। యాగమున వీతకల్మషుఁడై వెలుంగు. 149**

**ప్రతిపదార్థం:** యాజి= యాగం చేసేవాడు; హృదయవేదిక+అందున్= హృదయ మనే యజ్ఞవేదిమీద; సమిద్ధమూర్తిన్= ఉజ్జ్వలమైన ఆకారంతో; వెలుఁగుచుండు= ప్రకాశించే; తేజమునందున్= తేజస్సులో; ప్రాణములను= అసువులను; వేల్చున్= హోమించును; అట్లు= ఆ రీతిగా; అంతరమునన్= ఆంతరంగికంగా; ఒనర్చు= చేసే; యాగమునన్= యాగంచేత; వీతకల్మషుఁడు+ఐ= తొలగిన పాపం కలవాడై; వెలుంగున్= భాసిస్తాడు.

**తాత్పర్యం:** అంతర్యాగం చేసే వాడు తన హృదయమనే యజ్ఞవేదికపై ధగధగ ప్రకాశించే తేజస్సులో ప్రాణాలను వేలుస్తాడు. అట్లా ఆంతరంగా చేసే యాగంవలన అతడు విగతపాపుడై భాసిస్తాడు.

**క. విను! మాత్మతీర్థ సంసే । వనము తెఱఁగెఱుఁగునట్టి వానికిఁ దిరుగం**
**జనవలయునె పెఱచోటుల । కని చెప్పుదు రాశ్రితులకు నధ్యాత్మవిదుల్. 150**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ఆత్మతీర్థ= 'ఆత్మ' అనే తీర్థముయొక్క; సంసేవనము తెఱంగు= సేవించే తీరును; ఎఱుఁగునట్టివానికిన్= తెలిసినవాడికి; పెఱచోటులకున్= ఇతర ప్రదేశాలకు; తిరుగన్+చనన్ వలయునె అని= తిరుగటానికి పోవలెనా? అని; అధ్యాత్మవిదుల్= ఆధ్యాత్మికతత్త్వ మెరిగినవారు; ఆశ్రితులకున్= తమనాశ్రయించినవారికి; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** ఆధ్యాత్మిక తత్త్వవేత్తలైన పెద్దలు తమను ఆశ్రయించినవారితో - 'ఆత్మ' అనే తీర్థాన్ని ఎట్లా సేవించాలో తెలిసినవారికి ఇతర ప్రదేశాలలో తీర్థాటనం చేయవలసిన పనిలేదని చెప్పుతారు.

**తే. అవనిఁ బొందదు దివమున నప్రమేయ । మండజంబు హిరణ్మయ మండమధ్య**
**మున వెలుంగు నుజ్జ్వలపక్ష ఘనత; దాని । నెఱుఁగు సంతత యోగసమేతుఁ డనఘ! 151**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; హిరణ్మయము= స్వర్ణరూపమైన; అండజంబు= పక్షి; అవనిన్= భూమిని; పొందదు= చేరదు; దివమునన్= ఆకాశమందు; అప్రమేయము= గోచరింపచేసికొనటానికి వీలుకాదు; అండమధ్యమునన్= గ్రుడ్డుయొక్క మధ్యభాగంలో; ఉజ్జ్వలపక్ష ఘనతన్= మిక్కిలిగా ప్రకాశించే రెక్కల గొప్పతనంతో; వెలుంగున్= ప్రకాశిస్తుంది; దానిన్= ఆ పక్షిని; సంతతయోగ సమేతుఁడు= సదా యోగంతో కూడినవాడు; ఎఱుఁగున్= తెలిసికొంటాడు.

**తాత్పర్యం:** కల్మషరహితుడ వైన ఓ శుక్రుడా! ఆత్మ అనే ఒక చిన్మయమైన పక్షి ఉన్నది. అది భూమిని స్పృశించదు. ఆకాశంలో ఏ ప్రమాణానికీ గోచరం కాదు. అది పిండమనే గ్రుడ్డు మధ్యలో ఉజ్జ్వలమైన కాలమనే రెక్కలతో ప్రకాశిస్తూ ఉంటుంది. యోగశక్తి కలవాడు మాత్రమే దానిని గ్రహించగలడు.

**విశేషం:** ప్రత్యగాత్మ ప్రమాణగోచరం కాదు. అది చిన్మయమైనది. అది మాయామయమైన హృదయాకాశంలో ఎగురుతూ ఉంటుంది. మోదప్రమోదాలనే వృత్తివిశేషాలను కూడా దాని రెక్కలుగా చెప్పవచ్చు. "అథ య దిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మదహరోऽస్మిన్నంతరాకాశ స్తస్మిన్యదంతస్త ద్వేష్టవ్యమ్" అన్న శ్రుతిని ఇక్కడ అనుసంధించుకొనాలి.

**క. విను మాఱంచులుఁ బండ్రెం । డనుపమధారలును నై నిజాస్యము విశ్వం**
**బును బొదువఁ దిరుగు కాలం । బను చక్రము దురవబోధ మది యడఁగు గుహన్. 152**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; కాలంబు+అను= కాలమనే; చక్రము= ఆయుధవిశేషం, (బండికల్లు); ఆఱు+అంచులు= ఋతువులనే ఆరు అంచులును; పండ్రెండు= పదియు రెండు సంఖ్యగల; అనుపమ ధారలునునై= సాటిలేని తీక్ష్ణమైన అంచులను గలిగినదై; నిజాస్యము= తన ముఖం; విశ్వంబును= ప్రపంచమును; పొదువన్= వ్యాపించగా; తిరుగున్= పరిభ్రమించును; దురవబోధము= గ్రహించుటకు శక్యంకానిదగు; అది= ఆ చక్రం; గుహన్= హృదయమనే గుహలో; అడఁగున్= అణగిపోతుంది.

**తాత్పర్యం:** కాలమనే చక్రానికి వసంతం మొదలైన ఆరు ఋతువులు అంచులుగా ఉన్నాయి. చైత్రం మొదలైన పన్నెండు మాసాలు తీక్ష్ణమైన ధారలుగా ఉన్నాయి. దాని ముఖం విశ్వమంతా వ్యాపించి ఉన్నది. గ్రహించశక్యం కాని ఆ కాలచక్రం బుద్ధిగుహలో అణగి ఉన్నది.

**విశేషం:** అలంకారం: రూపకం.

**ఆ. మనసు నింద్రియములఁ బనిగొని పురుషుండు । ప్రచురశిక్షలేని రథ్యసమితి**
**నడపు రథికు మాడ్కి నడవడి నవి యీడ్చి । నట్టులైన నశుభ మావహిల్లు. 153**

**ప్రతిపదార్థం:** పురుషుండు= జీవుడు; మనసున్= చిత్తమును; ఇంద్రియములన్= శ్రోత్రం మొదలైన ఇంద్రియాలను; పనిగొని= నియోగించి; ప్రచురశిక్ష= దృఢమైన శిక్షణ; లేని= అలవడని; రథ్యసమితిన్= గుర్రాల సముదాయమును; నడపు= నడపింపచేసే; రథికు మాడ్కిన్= రథస్థుడివలె; నడవడిన్= ప్రవర్తనతో; అవి= ఆ ఇంద్రియాలు; ఈడ్చినట్టులు+ఐనన్= లాగినట్లు జరిగితే; అశుభము= అమంగళం; ఆవహిల్లున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** రథమును లాగే గుర్రాలకు చక్కని శిక్షణ ఉండాలి. అట్లా లేని పక్షంలో అవి స్వేచ్ఛగా రథాన్ని లాగితే ప్రమాదం కలుగుతుంది. అట్లే జీవుడు మనస్సును, ఇంద్రియాలను నియోగించేటప్పుడు నిగ్రహించకుండా వాటి మార్గంలో వాటిని పోనిస్తే అశుభానికి గురి అవుతాడు.

**విశేషం: "యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా । తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వాఇవ సారథేః ॥"** అను కఠశ్రుతిని ఇక్కడ అనుసంధించుకొనాలి. నిగ్రహంలేని చిత్తం కలవాడైన అవివేకి యొక్క ఇంద్రియాలు సారథియొక్క దుష్టాశ్వాలవలె వశం తప్పి ప్రవర్తిస్తాయి అని పై శ్రుతి తాత్పర్యం. అలంకారం: ఉపమ.

**క. తనకు మహిత ప్రసాదం । బొనరక యున్నేనిఁ గీళ్లు లొలయు; నది దృఢ**
**త్వనిరూఢమైనఁ జేకుఱు । ననంత పదసిద్ధి; దాని కనువెఱిఁగింతున్. 154**

**ప్రతిపదార్థం:** మహితప్రసాదంబు= శ్రేష్ఠమైన ఆత్మనిగ్రహం; తనకున్= సాధకుడికి; ఒనరక ఉన్నేనిన్= కలుగక ఉన్నచో; కీళ్లులు= కష్టాలు; ఒలయున్= సంభవిస్తాయి; అది= ఆత్మనిగ్రహం; దృఢత్వనిరూఢము+ఐనన్= దృఢపడితే; అనంతపదసిద్ధి= అంతంలేని ఉన్నత పదప్రాప్తి; చేకుఱున్= కలుగుతుంది; దానికిన్= ఆ పద ప్రాప్తికి; అనువు= ఉపాయం; ఎఱిఁగింతున్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** మోక్షప్రాప్తికై సాధన చేసే సాధకుడికి ఆత్మనిగ్రహం చాలా ముఖ్యం. అది సిద్ధించక పోతే కష్టాలు సంభవిస్తాయి. ఆత్మనిగ్రహం దృఢంగా సిద్ధిస్తే అంతంలేని మోక్షపదవి లభిస్తుంది. ఆ పదవిని సాధించే ఉపాయం చెప్తుతాను వినుము.

**తే. సర్వసంకల్పరహితుఁడై సత్త్వమున వి । నిశ్చలంబుగఁ జిత్తంబు నిలుపవలయు**
**సత్త్వసక్త చిత్తంబు ప్రసాద మొసఁగు । దానఁ గాలంబు నడపు టుత్తమవిధంబు. 155**

**ప్రతిపదార్థం:** సర్వసంకల్పరహితుఁడు+ఐ= సమస్తములైన సంకల్పాలు లేనివాడై; చిత్తంబున్= మనస్సును; సత్త్వమునన్= సత్త్వగుణంలో; వినిశ్చలంబుగన్= చలనం లేనట్లుగా; నిలుపన్ వలయున్= నిలపాలి; సత్త్వసక్త చిత్తంబు= సత్త్వగుణంలో ఆసక్తమైన మనస్సు ప్రసాదము= ఆత్మనిగ్రహమును; ఒసంగున్= ఇస్తుంది; దానన్= ఆ నిగ్రహంతో; కాలంబు నడపుట= కాలం గడపటం; ఉత్తమ విధంబు= మేలైన పద్ధతి.

**తాత్పర్యం:** ఆత్మప్రాప్తిని కోరేవాడు అన్ని సంకల్పాలూ వదలి మనస్సును సత్త్వగుణంతో సంసక్తం చేయాలి. సత్త్వగుణంలో నిలబడ్డ మనస్సు ఆత్మనిగ్రహాన్ని సమకూరుస్తుంది. అట్లాంటి నిగ్రహంతో కాలయాపన చేయటం మేలైన విధానం.

**క.** **వినుము నివాతస్థానం। బునఁ గం పనరహిత దీపము వెలింగెడు చా**
**డ్పున నంతరాత్మ వెలుఁగుచు। నునికి ప్రసాదంబు భంగి యుత్తమధిషణా!॥ 156**

**ప్రతిపదార్థం:** ఉత్తమధిషణా= ఉత్తమమైన బుద్ధిగలవాడా!; వినుము= ఆలకించుము; నివాతస్థానంబునన్= గాలిలేనిచోట; కంపనరహిత దీపము= కదలికలేని దివ్వె; వెలింగెడు చాడ్పునన్= ప్రకాశించే విధంగా; అంతరాత్మ= లోపలి ఆత్మ; వెలుంగుచున్+ఉనికి= ప్రకాశిస్తూ ఉండటం; ప్రసాదంబు భంగి= ప్రసాదం యొక్క పద్ధతి.

**తాత్పర్యం:** శ్రేష్ఠమైన బుద్ధి కలవాడా! వినుము. గాలి లేని చోట పెట్టిన దీపం కదలకుండా ప్రకాశిస్తుంది. ఆ రీతిగా ప్రసాదమంటే అంతరాత్మ చాంచల్యం లేకుండా నిగ్రహించబడి భాసించటమే.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **విను తత్ప్రసాదవంతుఁడు। దనయందు నిరంజనముగఁ ద న్ననిశంబుం**
**గనుఁగొనుచు నియతి నియతా। శనుఁడై యుండుట యొనర్చు శాశ్వతపదమున్. 157**

**ప్రతిపదార్థం:** విను= వినుము; తద్+ప్రసాదవంతుడు= ఆ ప్రసాదం కలవాడు; తన+అందున్= తనలో; నిరంజనముగన్= మాలిన్యరహితంగా; తన్నున్= తనను; అనిశంబున్= ఎల్లవేళలా; కనుఁగొనుచున్= చూస్తూ; నియతిన్= నియమంతో; నియత+అశనుఁడు+ఐ= నియమించబడిన మితాహారం గలవాడై; ఉండుట= ప్రవర్తించటం; శాశ్వత పదమున్= శాశ్వతమైన స్థానాన్ని; ఒనర్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఆ రీతిగా అచంచలమైన అంతరాత్మ కలవాడు తనలో తనను సదా మాయామాలిన్యం లేనివాడినిగా చూస్తాడు. నియమంకలిగి ఉంటాడు. హితమితాహారంతో జీవిస్తాడు. అట్లా ఉంటే శాశ్వత పదమైన మోక్షం లభిస్తుంది.

**తే.** **అతులవేదాంతశాస్త్ర మహాంబురాశిఁ। ద్రచ్చి పుచ్చిన నవనీత మిచ్చితిని స**
**మాదరంబునఁ గైకొను మనుసరించు। నిర్మలాత్మ తపస్వికి నీవు నొసఁగు. 158**

**ప్రతిపదార్థం:** అతుల= సాటిలేని; వేదాంతశాస్త్ర= వేదాంతశాస్త్రమనే; మహా+అంబురాశిన్= గొప్ప సాగరాన్ని; త్రచ్చి= తరచి; పుచ్చిన= గ్రహించిన; నవనీతము= వెన్న; ఇచ్చితిని= ఇచ్చాను; సమాదరంబునన్= ప్రీతితో; కైకొనుము= స్వీకరించుము; అనుసరించు= (ఈ వేదాంతమార్గాన్ని) అనుసరించి ప్రవర్తించుము; నీవున్= నీవు కూడ; నిర్మల+ఆత్మ తపస్వికిన్= నిర్మలహృదయుడైన తపోనిష్ఠుడికి; ఒసఁగు= ఇమ్ము.

**తాత్పర్యం:** శుకా! సాటిలేని వేదాంతశాస్త్రమనే మహాసముద్రాన్ని మథించి పుచ్చుకొన్న సారమైన నవనీతాన్ని నీ కిప్పుడు నేను ఇచ్చాను. నీవు దీనిని ప్రీతితో స్వీకరించుము. దీన్ని అనుసరించి నడచుకొమ్ము. నిర్మలచిత్తుడైన తపోనిధికి నీవు దీన్ని ప్రసాదించుము.

**విశేషం:** అలంకారం: రూపకం.

**ఆ.** **సకల రత్నపూర్ణ సర్వవసుంధరా। చక్రదాన విధియు సరి యనంగ**
**రాదు విశ్వవేదరాశి సారాధ్యాత్మ। విద్య యిచ్చుటకు వివేకధుర్య!' 159**

**ప్రతిపదార్థం:** వివేకధుర్య!= వివేకమనే భారం వహించే వాడా!; విశ్వ= సమస్తమైన; వేదరాశి= వేదసముచ్చయం యొక్క; సార= సారమైన; అధ్యాత్మవిద్య= బ్రహ్మవిద్యను; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; సకల= సమస్తమైన; రత్నపూర్ణ= రత్నాలతో నిండిన; సర్వ= సకలమైన; వసుంధరా చక్రదాన విధియున్= భూమిని దానం చేసే విధానం కూడా; సరి= సాటి; అనంగన్‌రాదు= అని చెప్పటానికి వీలుగాదు.

**తాత్పర్యం:** వివేకశాలీ! అన్ని వేదాల సారమైనది అధ్యాత్మవిద్య. దానిని దానం చేయటంతో సమస్తరత్న పూర్ణమైన భూమిని దానం చేసే విధికూడా సాటిరాజాలదు. బ్రహ్మవిద్య శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన దని తాత్పర్యం'.

**విశేషం:** గీతలో భగవంతుడు 'అధ్యాత్మ విద్యా విద్యానాం' 'విద్యలలో నేను ఆధ్యాత్మవిద్యను' - అని చెప్పి అధ్యాత్మ విద్యా ప్రాశస్త్యాన్ని ప్రకటించాడు. ఇతర వస్తువుల వలన కలిగే సౌఖ్యం అల్పం. ఆత్మవిద్య అనల్పమైన ఆత్మసుఖాన్ని ప్రసాదిస్తుంది. కాబట్టి అధ్యాత్మవిద్యా ప్రదానం అన్ని దానాలకంటె మేలైనదని గ్రహించాలి.

**వ. అని యుపదేశించి 'యింక నేమి వినవల?' తనిన శుకుండు 'దీనికంటె వినవలయునది గలదె? దీనిన సుదృఢంబుగా ననుగ్రహింపవే!' యనుటయు ననుకంపావిధేయుం డగు సాత్యవతేయుం డతని కిట్లనియె. 160**

**ప్రతిపదార్థం:** అని ఉపదేశించి= ఈ విధంగా ఉపదేశం కావించి; ఇంకను= దీనికంటె అధికంగా; ఏమి వినన్ వలతు(వు)?= ఏమి వినవలెనని కోరుతున్నావు?; అనినన్= అని ప్రశ్నించే సరికి; శుకుండు= శుకయోగి; దీనికంటెన్= ఇంతకంటెను; వినవలయునది= వినదగింది; కలదె?= ఉన్నదా?; దీనిన్+అ= దీనినే; సుదృఢంబుగాన్= గట్టిగా నాకు బోధపడేటట్లు; అనుగ్రహింపవే= అనుగ్రహించుము; అనుటయున్= అనగా; అనుకంపా విధేయుండు+అగు= దయకు విధేయుడైన; సాత్యవతేయుండు= వ్యాసుడు; అతనికిన్= శుకుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** వ్యాసు డారీతిగా ఉపదేశించి 'ఇంకా ఏమి వినగోరుతున్నావు?' అని ప్రశ్నించాడు. శుకుడు 'దీనికంటె వినవలసిం దేముంది? ఈ విషయమే ఇంకా నా మనసులో దృఢంగా నాటుకొనేటట్లు బోధించుము' అని అడిగాడు. అప్పుడు దయావిధేయుడైన వ్యాసమహర్షి ఆ శుకుడిని చూచి ఇట్లా అన్నాడు.

**క. భూతంబులఁ బచరించుచు । భూతాత్ముఁడు వానిఁ దన విభూతి నడంచున్.**
**భూతాహరణంబు నిజ । ద్యోతనము దదీయవృత్తి దుర్దశ పుత్రా! 161**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; భూత+ఆత్ముఁడు= భూతస్వరూపుడైన పరమాత్ముడు; భూతంబులన్= పంచభూతాలను; పచరించుచున్= ప్రవర్తింపజేస్తూ; వానిన్= ఆ భూతములను; తన విభూతిన్= తన విభూతిలో; అడంచున్= లీనంగావిస్తాడు; భూత+ఆహరణంబు= భూతాలను హరించటం; నిజద్యోతనము= తనను ప్రకాశింపజేయటం; తదీయవృత్తి= ఆ పరమాత్మయొక్క భూతాహరణమనే వర్తనం; దుర్దశ= (భూతాలకు) దుఃస్థితిగా ఉన్నది.

**తాత్పర్యం:** కుమారా! పరమాత్ముడు పంచభూతాలను, (ఆ భూతజన్యమైన చరాచరప్రాణికోట్లను) సృష్టికాలంలో ప్రవర్తింపజేస్తాడు. ప్రళయకాలంలో మళ్ళీ వాటిని తనలో విలీనం చేసికొంటాడు. ఈ రీతిగా సృష్టి స్థితి సంహారాత్మకమైన చర్య పరమాత్మవృత్తిగా జరిగిపోతున్నది. అతడి భూతాహరణ మనే చర్య భూతాలకు దుర్దశ.

**క. అవయవము లెట్లు కూర్మము । నివిడించును లోని కడఁచు నెఱి నట్టుల భూ**
**తవితతి భూతాత్ముండును । బ్రవర్తన నివర్తనముల పాల్పడఁజేయున్. 162**

**ప్రతిపదార్థం:** కూర్మము= తాబేలు; ఎట్లు= ఏ రీతిగా; అవయవములు= అంగాలు; నివిడించును= వెలుపలికి దోపజేయునో; నెఱిన్= క్రమంగా; లోనికిన్= లోపలికి; అడఁచున్= ఉపసంహరించుకొనునో; అట్టులన్= అదే రీతిగా; భూత+ఆత్ముండును= భూతస్వరూపుడైన పరమాత్మకూడ; భూతవితతిన్= భూతసంతతిని; ప్రవర్తన నివర్తనముల= సృష్టి సంహారములయొక్క; పాల్పడన్= వశమమయ్యేటట్లుగా; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** తాబేలు తన అవయవాలనెట్లా వెలికి చూపి మరల లోనికి ముడచుకొంటుందో అట్లాగే సకల భూతస్వరూపుడైన పరమాత్ముడు భూతాలను సృష్టించి మళ్ళీ తనలోనికి ఉపసంహరించుకొంటూ ఉంటాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. మాయాశబలుం డై యటు। సేయకపోరామి భూతసృష్టి యొనర్చున్**
**మాయఁ బెడఁబాప భూత ని। కాయాభావ మగు నదియ కవిజనముఖ్యా! 163**

**ప్రతిపదార్థం:** కవిజనముఖ్యా!= యోగిజనులలో శ్రేష్ఠుడైనవాడా; మాయాశబలుండు+ఐ= (పరమాత్ముడు) మాయతో కూడినవాడై; అటు= ఆ రీతిగా; చేయకపోరామిన్= చేయకుండా ఉండటానికి వీలు లేకపోవటం వలన; భూతసృష్టి= భూతాలను ప్రవర్తింపజేయటాన్ని; ఒనర్చున్= చేస్తాడు; మాయన్= అవ్యక్తమైన ఆ మాయాశక్తిని; పెడఁబాపన్= వదలించగా; అదియ= అదే; భూతనికాయాభావము+అగున్= భూతసమూహాలయొక్క లేమి అవుతుంది.

**తాత్పర్యం:** యోగిజన శ్రేష్ఠుడవగు ఓ శుకుడా! పరమాత్ముడు మాయతో కూడినప్పుడే సృష్టి ప్రారంభమవుతుంది. అతడు మాయాయుక్తుడైన వేళలో భూతాలను సృష్టించకుండా ఉండలేడు కాబట్టి భూతసృష్టి జరుగుతున్నది. మళ్ళీ మాయను వదలగానే, ఆ స్థితి భూతాల అభావాన్ని సూచిస్తుంది. అంటే పరమాత్మ మాయావియోగం చెందినప్పుడు సృష్టి లేకుండా పోతుంది. భూతాల ఉనికి నశిస్తుంది.

**తే. గగన పవనతేజో జలక్ష్మాగుణములు। సూవె శబ్దాదికంబును శ్రోత్రముఖ్య**
**కంబునై చెల్లు విషయచయంబు నింద్రి। యవ్రజంబును సర్వంబు నడఁచు శమము. 164**

**ప్రతిపదార్థం:** గగనపవన తేజోజలక్ష్మాగుణములు= ఆకాశం, వాయువు, తేజస్సు, జలం, భూమి వీని గుణాలు; శబ్ద+ఆదికంబును= శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే ఐదు విషయాలును; శ్రోత్రముఖ్యకంబును= శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణం అనే ఐదు జ్ఞానేంద్రియాలును; ఐ చెల్లుచూవె!= అయిప్రవర్తిస్తుంది కదా!; శమము= మనోనిగ్రహం; విషయచయంబున్= శబ్దాదివిషయసంచయమును; ఇంద్రియవ్రజంబును= శ్రోత్రంమొదలైన ఇంద్రియ సమూహాన్ని; సర్వంబున్= సమస్తమును; అడఁచున్= శమింపజేస్తుంది.

**తాత్పర్యం:** శ్రోత్రం, శబ్దం ఆకాశముయొక్క గుణాలు. త్వక్కు, స్పర్శం, వాయువు యొక్క గుణాలు. జిహ్వా, రసం జలముయొక్క గుణాలు. ఘ్రాణం, గంధం పృథివీ భూతము యొక్క గుణాలు. ఈ రీతిగా పంచభూతాలనుండి పంచజ్ఞానేంద్రియాలు, పంచ విషయాలు జనించాయి. మనస్సును నిగ్రహించిన యోగి పూర్ణంగా ఇంద్రియాలను, విషయాలను నియమించగలుగుతాడు. కాబట్టి మనోనిగ్రహం ప్రధానమని భావం.

**క. విను మై దింద్రియములకును। మనంబు షష్ఠంబు; సప్తమత్వము బుద్ధిం**
**బనుగొను; భవ్యక్షేత్ర। జ్ఞునియం దష్టమత గల్గు సుగుణాభరణా! 165**

**ప్రతిపదార్థం:** సుగుణ+ఆభరణా!= సద్గుణాలనే ఆభరణాలుగా కలవాడా!; వినుము= ఆలకించుము; ఐదు+ఇంద్రియములకును= శ్రోత్రము మొదలైన పంచజ్ఞానేంద్రియాలకు; మనంబు= మనస్సు; షష్ఠంబు= ఆరవది; సప్తమత్వము= ఏడవదన్నభావం; బుద్ధిన్= బుద్ధియందు; పనుగొనున్= కలుగుతుంది; భవ్యక్షేత్రజ్ఞుని అందున్= శ్రేష్ఠుడైన జీవుడియందు; అష్టమత= ఎనిమిదవదన్న భావం; కల్గున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** సుగుణాలంకారుడవగు ఓ శుకా! శ్రోత్రం మొదలైన ఐదుజ్ఞానేంద్రియాలు కలవు కదా! మనస్సు ఆరవది. బుద్ధి ఏడవదవుతుంది. క్షేత్రజ్ఞుడు అనే జీవుడు ఎనిమిదవవాడుగా పరిగణింపబడుతున్నాడు.

**విశేషం:** క్షేత్రమనగా శరీరము. క్షేత్రమును తెలిసినవాడు ఎవడో, వాడు క్షేత్రజ్ఞుడు. "ఇదం శరీరం కౌన్తేయ ! క్షేత్రమి త్యభిధీయతే, ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః; అని క్షేత్రజ్ఞ లక్షణము భగవద్గీతలో వివరించబడింది.

**తే.** **తలఁచు మనమందు నిశ్చయదశ యొనర్చు । బుద్ధి సర్వైక సాక్షిత్వమున వెలుంగు**
**నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ డనఁగ వాని । మెఱపు సత్త్వాదిగుణములై మెఱయు వత్స! 166**

**ప్రతిపదార్థం:** వత్స!= కుమారా!; తలఁచు= సంకల్ప వికల్పములు గావించునట్టి; మనమందున్= మనస్సునందు; బుద్ధి= అంతఃకరణ చతుష్టయంలో రెండవదైన బుద్ధి; నిశ్చయదశ యొనర్చున్= నిశ్చయావస్థను నిర్వహిస్తుంది; అంతరాత్ముండు= అంతరాత్మయగు; క్షేత్రజ్ఞుఁడు= జీవుడు; సర్వైకసాక్షిత్వమునన్= అంతటికీ ముఖ్యమైన సాక్షీభావంతో; వెలుంగున్= ప్రకాశించును; వాని మెఱపు= వాడి ప్రకాశం; సత్త్వాదిగుణములు+ఐ= సత్త్వం మొదలైన గుణాలుగానై; మెఱయున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** కుమారా! మనస్సు సంకల్ప వికల్పాలుచేస్తూ ఉంటుంది. ఆ దశలో నిశ్చయం చేసేది బుద్ధి. అంతరాత్ముడైన వాడు క్షేత్రజ్ఞుడనబడి అంతటికీ ఏకైక సాక్షిగా ప్రకాశిస్తూ ఉంటాడు. సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు రూపంతో ప్రకాశించే ఆ క్షేత్రజ్ఞుడి ప్రకాశమే.

**విశేషం:** క్షేత్రజ్ఞుడనగా జీవుడని కొందరు, పరమాత్ముడని కొందరు వివరించి ఉన్నారు. అవిద్య తొలగి జీవత్వము నశించినపుడు జీవుడే పరమాత్ముడుగా భాసిస్తాడని అద్వైతవేదాంతము చెప్తుతున్నది. ద్వైతులు పరమాత్మకంటె జీవుడు వేరుగా ఉండునని నిర్ణయించారు.

**తే.** **స్వస్థతయు దుఃస్థతయు జడత్వమును గ్రమవి । గణన సత్త్వరజస్తమోగుణము లవి స**
**మీరితములగు టడఁగుట యింద్రియంబు । లడరు టొదుఁగుట బుద్ధి కృత్యములు పుత్ర! 167**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; స్వస్థతయున్= హాయిగా ఉండి సుఖించే స్వభావం; దుఃస్థతయున్= దుఃఖానికి గురి యయి బాధపడే లక్షణం; జడత్వమును= బుద్ధి మాంద్యమున్ను; క్రమవిగణనన్= క్రమంగా; సత్త్వరజస్తమోగుణములు= సత్త్వగుణం, రజోగుణం, తమోగుణము లగును; అవి= ఆ గుణాలు; సమీరితములు+అగుట= ప్రేరితములు కావటం; అడఁగుట= శమించటం; ఇంద్రియంబులు= ఇంద్రియాలు; అడరుట= ప్రేరణ పొందటం; ఒదుఁగుట= శమించటం; బుద్ధికృత్యములు= బుద్ధిచేసే పనులు.

**తాత్పర్యం:** కుమారా! ప్రసన్నచిత్తుడై సుఖించటం సత్త్వగుణస్వభావం. దుఃఖంతో పరితపించటం రజోగుణ లక్షణం. అలసుడై బుద్ధిమాంద్యం కలిగి ఉండటం తమోగుణ లక్షణం. ఆయా గుణాలు, తదనుగుణంగా ఆయా ఇంద్రియాలు ప్రేరణ పొందటం, తర్వాత శమించటం అనేవి బుద్ధివలన కలిగే పనులు.

**విశేషం:** సత్త్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాలు ప్రకృతి సంభవాలు. అవి జీవుడిని దేహంలో బంధిస్తాయి. వీటి లక్షణాలు భగవద్గీతలోని పదునాల్గవ అధ్యాయంలో విపులంగా నిరూపించబడ్డాయి.

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**

**జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత!** (గీత - 14-9) ఇత్యాదిగా సత్త్వం సుఖహేతువనీ, కర్మకారణమైన రజస్సు దుఃఖహేతువనీ, తమస్సు ప్రమాదహేతువనీ భగవద్గీత వివరించింది.

**తే.** **అనఘ! యింద్రియములు విషయములు మనసు । బుద్ధియును నాత్మయును గ్రమంబునన యెక్కు**
**డాత్మ బుద్ధి యనంగ నల్పాంతరంపు । వస్తువులు బుద్ధి యిన్నింట విస్తరిలుట.** **168**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఇంద్రియములు= శ్రోత్రం మొదలైన ఇంద్రియాలు; విషయములు= శబ్దం మొదలైన విషయాలు; మనసు= చిత్తం; బుద్ధియును= బుద్ధీ; ఆత్మయును= ఆత్మా - ఇవి; క్రమంబునన్+అ= క్రమంగానే; ఎక్కుడు= ఒకదానికంటె ఒకటి శ్రేష్ఠమైనవి.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ శుకుడా! ఇంద్రియాలకంటె విషయాలు, విషయాలకంటె చిత్తం, చిత్తంకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ - క్రమక్రమంగా శ్రేష్ఠములైనవి. ఆత్మకూ, బుద్ధికీ పెద్ద తేడా లేదు. బుద్ధి అన్నింటిలోనూ వ్యాపించి ఉంటుంది. కాబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** **ఇంద్రియేభ్యః పరా హ్యర్థా । అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసశ్చ పరా బుద్ధిః । యో బుద్ధేః పరతస్తు సః ॥** (కఠశ్రుతి -1-3-10)

అనే శ్రుతి కూడ పైపద్యంలో చెప్పిన రీతిగా ఇంద్రియాదులు ఒకదానికంటె ఒకటి శ్రేష్ఠమైనవని నిరూపించింది.

**క.** **కనుఁ గన్నై వినుఁ జెవియై । కొనుఁ జవి జిహ్వ యయి మూరుకొను నాసికయై,**
**తనువై స్పర్శము గైకొను । ననవద్యా! బుద్ధి యాత్మయంద నిలుచుచున్.** **169**

**ప్రతిపదార్థం:** అనవద్యా!= దోషరహితుడా!; బుద్ధి= అంతఃకరణచతుష్టయంలో రెండవదగు బుద్ధి; ఆత్మ+అంద= క్షేత్రజ్ఞుడైన అంతరాత్మయందే; నిలుచుచున్= నిలుస్తూ; కన్ను+ఐ= నేత్రమై; కనున్= చూస్తుంది; చెవి+ఐ= శ్రోత్రమై; వినున్= వింటుంది; జిహ్వ+అయి= నాలుకై; చవిన్= రసమును; కొనున్= గ్రహిస్తుంది; నాసిక+ఐ= ఘ్రాణమై; మూరుకొనున్= వాసన చూస్తుంది; తనువు+ఐ= శరీరమై; స్పర్శమున్= తాకిడిని; కైకొనున్= స్వీకరిస్తుంది.

**తాత్పర్యం:** దోషరహితుడవైన ఓ శుకా! సర్వవ్యాపిని అయిన బుద్ధి ఆత్మలో ఉంటూ నేత్రమై రూపాన్ని చూస్తుంది. చెవిగా మారి శబ్దాన్ని వింటుంది. నాలుకగా రూపొంది రసాన్ని గ్రహిస్తుంది. ముక్కై గంధాన్ని ఆఘ్రాణిస్తుంది. శరీరంలోని చర్మమై స్పర్శను స్వీకరిస్తుంది.

**క.** **ప్రీతిం గడుఁ బొదలు విషా । దాతురతన్ స్రుక్కుఁ దద్ద్వయము లేక సమ**
**త్వాతిశయంబున నిలుచును । నేతృత్వంబునను బుద్ధి నెఱపు గుణములన్.** **170**

**ప్రతిపదార్థం:** బుద్ధి= అంతటా వ్యాపించిన ఈ బుద్ధి; ప్రీతిన్= సంతోషంతో; కడున్= మిక్కిలిగా; పొదలున్= ప్రవర్తిస్తుంది; విషాదాతురతన్= దుఃఖపీడితత్వంతో; స్రుక్కున్= వగజెందుతుంది; తద్ద్వయములేక= ఆ సంతోష విషాదాలు రెండూ లేక; సమత్వాతిశయంబునన్= సమభావముయొక్క అతిశయమునందు; నిలుచును= స్థిరపడుతుంది; నేతృత్వంబునను= నాయకత్వగుణముచేత; గుణములను= సత్త్వాదిగుణాలను; నెఱపున్= వ్యాపింపజేస్తుంది.

**తాత్పర్యం:** బుద్ధి ఒక సమయంలో సంతోషాతిశయంతో ఉప్పొంగిపోతుంది. ఇంకొక సమయంలో దుఃఖంతో క్రుంగిపోతుంది. సంతోషవిషాదాలు రెండూ లేక సమభావంతో ఉంటూ ఒక్కొక్క సారి స్థైర్యం వహించి ఉంటుంది. గుణాలకు తాను నాయకత్వం పూని వాటిని తన యిచ్చవచ్చినట్లు ప్రవర్తింప జేస్తుంది.

**ఆ. తత్స్వభావ మెఱిఁగి తా నింద్రియాది స । ప్తకము వెంటఁ బోక తన్నుఁ గనుచు,**
**నున్న వానిఁ బొందనోపునె దుఃఖదై । న్యంబు సుఖమదంబు నప్రమత్త! 171**

**ప్రతిపదార్థం:** అప్రమత్త!= ఏమరుపాటు లేనివాడా!; తత్స్వభావము= ఆ బుద్ధియొక్క స్వభావమును; ఎఱిఁగి= గ్రహించి; తాను= సాధకుడు; ఇంద్రియాది సప్తకము వెంటన్= ఇంద్రియాలు మొదలైన యేడింటి వెనుక; పోక= పోకుండా; తన్నున్= తనను; కనుచున్= చూస్తూ; ఉన్నవానిన్= ఉన్నట్టి వానిని; దుఃఖదైన్యంబు= దుఃఖమనే దీనత్వం గానీ; సుఖమదంబు= సుఖమనే గర్వంగానీ; పొందన్+ఓపునె?= చేరగలవా?

**తాత్పర్యం:** జాగరూకుడవైన ఓ శుకుడా! పైన చెప్పిన రీతిగా ఉండే బుద్ధియొక్క స్వభావాన్ని గ్రహించి సాధకుడైన మానవుడు పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి - వీటిని అనుసరించరాదు. తనలో తనను చూచుకొంటూ బాహ్యపదార్థాలపై భ్రాంతి వదలి ఉండాలి. అట్లా ఉన్నవాడిని సుఖదుఃఖాలు చెనకలేవు. అంటే అతడికి దుఃఖంవలన దీనత్వమూ, సుఖం వలన మదమూ కలుగవు. (సుఖదుఃఖాలకు అతీతమైన స్థితిలో అత డుంటా డని భావం).

**ఆ. జలములందు నిలిచి జలపక్షి మునుఁగదు; । మేడిపండు మశకపీడఁ బొరయ;**
**దట్ల విషయసమితియందుఁ దానది దన । యందు నుండి వికృతి నొంద దాత్మ.' 172**

**ప్రతిపదార్థం:** జలపక్షి= నీటిపక్షి; జలములందున్= నీళ్ళలో; నిలిచి= నిలబడి; మునుఁగదు= మునిగిపోదు; మేడిపండు= అత్తిపండు; మశకపీడన్= దోమబాధను; పొరయదు= పొందదు; అట్ల= అదే రీతిగా; ఆత్మ= క్షేత్రజ్ఞుడైన అంతరాత్మ; విషయసమితి+అందున్= శబ్దాదివిషయసముదాయ మందును; అది= ఆ విషయ సమూహం; తన+అందున్= ఆ యాత్మలోనూ; ఉండున్= ఉంటుంది; వికృతిన్= వికారమును; ఒందదు= పొందదు.

**తాత్పర్యం:** నీటిపక్షి నీటిలోఉన్నా మునిగిపోదు. అత్తిపండులో ఎన్ని పురుగులున్నా వాటివలన ఆ పండు బాధింపబడదు. అదే రీతిగా ఆత్మ విషయాలలో ఉన్నా, ఆత్మలో విషయాలున్నా - ఆత్మకు వికారం కలుగదు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని చెప్పి మఱియును. 173**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; చెప్పి= వచించి; మఱియును= మరల.

**తాత్పర్యం:** వ్యాసుడు శుకుడితో ఈ రీతిగా చెప్పాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'విను మూర్ణనాభి తంతువు । జనియింపఁగఁ జేసినట్లు సత్త్వగుణము సం**
**జనకం బగు నది పురుషుఁడు । గనుట యుదాసీనతన వికారము గలదే? 174**

**ప్రతిపదార్థం:** వినుము= ఆకర్ణించుము; ఊర్ణనాభి= సాలెపురుగు; తంతువున్= దారమును; జనియింపఁగన్+చేసినట్లు= సృష్టించినట్లే; సత్త్వగుణము= సత్త్వమనే గుణం; సంజనకంబు+అగున్= జ్ఞానాదులకు కారణమవుతుంది; అది= ఆ స్థితిని; పురుషుఁడు= ఆత్మ; కనుట= చూడటం; ఉదాసీనతన్+అ= ఔదాసీన్యంతోనే; వికారము= వికృతి; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** సాలెపురుగు తనలోనుండి దారమును సృష్టించినట్లే సత్త్వాదిగుణాలు జ్ఞానసుఖ దుఃఖాదులు కలిగిస్తున్నాయి. పురుషుడు ఉదాసీనుడై ఈ స్థితిని చూస్తూ ఉంటాడు. అందువలన అతడికి వికారం కలగదు.

**విశేషం:** 'సత్త్వము గుణసంజనకంబగు' అను పాఠాంతరము కలదు. ఆ పాఠమును స్వీకరిస్తే 'గుణ' శబ్దానికి విషయాలు అని అర్థం చెప్పాలి. సత్త్వాదిగుణాలు విషయాలను కలిగిస్తుంటాయి అని భావం. సాలెపురుగు దారాన్ని తనలోనుండే సృష్టిస్తుంది. అందుకై బాహ్య పదార్థాలను గ్రహించదు. అట్లే సత్త్వాదులు విషయాలకు అభిన్న నిమిత్తోపాదాన కారణాలవుతున్నాయని తెలిసికొనాలి.

**ఆ. ఆదినిధనరహితుఁ డగు నిరంజనుఁ జెంది । గుణము లెడల విడిచి, క్రోధలోభ**
**ములకుఁ జొరవ యీని ముని హృదయగ్రంథి । విరియ నడఁచి మోక్ష విభవ మొందు. 175**

**ప్రతిపదార్థం:** ఆది నిధన రహితుఁడు+అగు= మొదలు తుదిలేని (జననమరణాలు లేని); నిరంజనున్= పరమాత్మను; చెంది= పొంది; గుణములు= సత్త్వాదిగుణాలను; ఎడలన్ విడిచి= తొలగిపొయ్యేటట్లు వదలిపెట్టి; క్రోధలోభములకున్= కోపానికీ లోభానికీ; చొరవ ఈని= అవకాశం ఇవ్వని; ముని= మౌని; హృదయగ్రంథిన్= చిత్త గ్రంథిని; విరియన్+అడఁచి= నశింపజేసి; మోక్షవిభవము= ముక్తి సంపదను; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పరమాత్మ ఆద్యంతాలు (జనన మరణాలు) లేనిది. అట్టి దాని నాశ్రయించి సత్త్వాది గుణాలను వదలి, కోపలోభాలను త్యజించిన ముని తన హృదయంలోని కామాదులకు జన్మస్థానమైన ముడిని నశింపజేసి మోక్షవైభవం పొందుతాడు.

**క. శమసంపద బ్రాహ్మణ జ । న్మమునకు సామగ్ర్య మవ్వినయసారము చి**
**త్తమున కలవడ్డ మునికి భ । యము శోకము మదము హర్ష మనునివి గలవే? 176**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ జన్మమునకున్= విప్రుడియొక్క పుట్టుకకు; శమసంపద= ఆత్మనిగ్రహమనే ఐశ్వర్యం; సామగ్ర్యము= సర్వస్వమై ఉన్నది; ఆ+వినయసారము= ఆ వినయముయొక్క బలిమి; చిత్తమునకున్= మనస్సుకు; అలవడ్డ= అలవడిన; మునికిన్= మౌనికి; భయము= భీతి; శోకము= దుఃఖం; మదము= గర్వం; హర్షము= సంతోషం; అనునివి= అనబడేవి; కలవే?= ఉన్నవా?

**తాత్పర్యం:** బ్రాహ్మణుడై పుట్టినవాడికి ఆత్మనిగ్రహమనే సంపత్తే సర్వస్వం. అట్టి వినయబలం హృదయానికి అలవడిన మునీంద్రుడికి భయం, శోకం, మదం, సంతోషం అనేవి లేవు.

**క. శమనిరతియు నాత్మ జ్ఞా । నముఁ జువ్వే బుధ లక్షణంబులు పర్యా**
**ప్తము లివి రెండు నరయ మో । క్షము సాధించుటకు వేఱ కల్పన లేలా?' 177**

**ప్రతిపదార్థం:** శమనిరతియున్= చిత్త నిగ్రహంలో ఆసక్తియు; ఆత్మజ్ఞానమున్= ఆత్మను గూర్చిన తెలివియూ; బుధ లక్షణంబులు చువ్వే= ఆత్మజ్ఞుడైనవాని లక్షణములై ఉన్నవి; అరయన్= పరిశీలించగా; ఇవి రెండు= ఈ చెప్పిన రెండు లక్షణాలును; మోక్షమున్= ముక్తిని; సాధించుటకున్= వశం చేసికొనటానికి; పర్యాప్తములు= చాలిఉన్నవి; వేఱ= అన్యములైన; కల్పనలు+ఏలా?= సాధనములు ఎందుకు?

**తాత్పర్యం:** చిత్తనిగ్రహం, ఆత్మజ్ఞానం - అనేవి ప్రబుద్ధుడైన వాడి లక్షణములై ఉన్నవి. మోక్షం సాధించటానికి ఈ రెండు లక్షణాలే చాలి ఉన్నవి. వేరే సాధనలకై ప్రయాసపడ నవసరం లేదు.

**వ.** **అనిన విని శుకుండు 'ధర్మంబుల కెల్లఁ బరమంబయిన ధర్మం బెఱింగింపవే!' యనుటయు వాత్సల్యపరాయణుం డగు నబ్బాదరాయణుండు 'సనాతనంబును, మునిసత్తమ సంస్తుత్యంబును నగునుత్తమ ధర్మంబు సెప్పెద; నేకాగ్రచిత్తుండ వయి యాకర్ణింపు'మని పలికి యిట్లనియె.** **178**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆకర్ణించి; శుకుండు= శుకయోగి; ధర్మంబులకున్+ఎల్లన్= సమస్త ధర్మాలలోను; పరమంబు= శ్రేష్ఠం; అయిన ధర్మంబు= ఐన ధర్మాన్ని; ఎఱింగింపవే= తెలుపవే; అనుటయున్= అనేసరికి; వాత్సల్యపరాయణుండు+అగు= పుత్రస్నేహపరుడైన; ఆ+బాదరాయణుండు= ఆ వ్యాసుడు; సనాతనంబును= పురాతన మైనదీ; మునిసత్తమసంస్తుత్యంబును+అగు= మునిశ్రేష్ఠులచేత స్తుతించదగినదీ అయిన; ఉత్తమధర్మంబున్= శ్రేష్ఠధర్మమును; చెప్పెదన్= వివరిస్తాను; ఏక+అగ్రచిత్తుండవు+అయి= సమాహిత మనస్సు గలవాడవై; ఆకర్ణింపుము+అని= వినుమని; పలికి= చెప్పి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా వచించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా వ్యాసుడు చెప్పగా విని శుకయోగీంద్రుడు 'అన్ని ధర్మాలలోనూ శ్రేష్ఠమైన ధర్మ మేదో తెలియచెప్పు' మని అడిగాడు. అంతట పుత్రస్నేహపరుడైన ఆ పారాశర్యుడు 'పురాతనమూ, మునులచేత శ్లాఘ్యమూ అయిన శ్రేష్ఠధర్మాన్ని వివరిస్తాను, ఏకాగ్రమైన మనస్సుతో వినుము అని చెప్పి ఇట్లా అన్నాడు:

**ఇంద్రియనిగ్రహం బుత్తమ ధర్మంబుగ నిరూపించుట (సం. 12-242-1,2)**

**తే.** **'ఎల్లకడలకు వెలువడు నింద్రియముల । బాలపుత్రులఁ దండ్రియుఁ బోలె నాఁగు**
**మవియు మనమును నిశ్చలైకాగ్రభావ । మొందు టుత్తమ తప మది యుజ్జ్వలాత్మ!** **179**

**ప్రతిపదార్థం:** ఉజ్జ్వల+ఆత్మ!= ప్రకాశమానమైన బుద్ధిగలవాడా!; ఎల్లకడలకున్= అన్ని దిశలకు; వెలువడు= ప్రసరిస్తున్న; ఇంద్రియములన్= శ్రోత్రం మొదలైన ఇంద్రియాలను; బాలపుత్రులన్= బాలురైన కుమారులను; తండ్రియున్+పోలెన్= తండ్రివలె; ఆఁగుము= నిగ్రహించుము; అవియున్= ఆ ఇంద్రియములు; మనమును= చిత్తమును; నిశ్చల+ఏక+అగ్రభావము+ఒందుట= కదలికలేని ఏకాగ్రతను పొందటం; అది ఉత్తమతపము= అది శ్రేష్ఠమైన తపస్సు.

**తాత్పర్యం:** ఉజ్జ్వలమైన బుద్ధిగలవాడా! అన్ని దిక్కులకూ పరుగిడే చిన్న పిల్లలను తండ్రి ఏ విధంగా పట్టి నిలవేస్తాడో, అట్లాగే అన్ని దిశలకూ ప్రసరించే శ్రోత్రాదులైన ఇంద్రియాలను నిగ్రహించుము. ఆ ఇంద్రియాలూ, మనస్సూ కదలిక లేనివై ఏకాగ్రత్వం పొందటమనేదే మేలైన తపస్సు అవుతుంది.

**క.** **అది ధర్మంబుల కెల్లం । దుది యగు ధర్మంబు; మనసుతో దానిఁ దగం**
**గుదియించి మేధతోడం । గదియింపుము నియతిఁ బుత్ర! కడుగాఢముగన్.** **180**

**ప్రతిపదార్థం:** పుత్ర!= కుమారా!; అది= ఆ ఇంద్రియనిగ్రహం; ధర్మంబులకున్+ఎల్లన్= సమస్త ధర్మాలలోను; తుదిఅగు= చివరిదగు (శ్రేష్ఠమగు); ధర్మంబు= ధర్మం; మనసుతోన్= చిత్తంతో; దానిన్= ఆ ధర్మమును; తగన్= చక్కగా; కుదియించి= సంలగ్నం చేసి; నియతిన్= నియమంతో; కడు గాఢముగన్= మిక్కిలి గట్టిగా; మేధతోడన్= బుద్ధితో; కదియింపుము= చేర్చుము.

**తాత్పర్యం:** కుమారా! ఆ ఇంద్రియసంయమనం ధర్మాలలో కెల్లా మేలైన ధర్మం. నీ మనస్సుతో ఆ ధర్మాన్ని సంసక్తం కావించుము. నియమంతో గట్టిగా దానిని బుద్ధితో చేర్చుము.

**తే.** **ఇంద్రియంబుల నాఱింటి నిట్లు విషయ । ములకు నొలయక యుండంగ నిలువరించి'**
**తలఁపు లుడిగి, తేనియఁ బ్రమదమున నాను । భంగిఁ దృప్తుఁడవై యుందు పరముఁ గాంతు.'** **181**

**ప్రతిపదార్థం:** ఆఱింటిన్= ఆరైన; ఇంద్రియములన్= మనస్సుతో కూడిన జ్ఞానేంద్రియాలను; విషయములకున్= శబ్దాదులైన విషయాలకు; ఒలయక ఉండంగన్= చేరకుండా ఉండేటట్లు; నిలువరించి= నిలిపి; తలఁపులు= సంకల్పాలు; ఉడిగి= వదలి; ప్రమదమునన్= సంతోషంతో; తేనియన్= మకరందాన్ని; అనుభంగిన్= త్రాగేటట్లు; తృప్తుడవై ఉందు= తృప్తి పొందిన వాడవై ఉంటావు; పరమున్= బ్రహ్మమును; కాంతు= చూస్తావు.

**తాత్పర్యం:** నీవు శ్రోత్రం మొదలగు ఐదు జ్ఞానేంద్రియాలను, మనస్సును శబ్దాది విషయాలవైపు పోనీయకుండా నిలుపుము. సంకల్పాలు వదలు. అట్లా చేస్తే సంతోషంతో తేనె నాస్వాదించేవిధంగా తృప్తి పొందుతావు. పరతత్త్వమును సాక్షాత్కరించుకొంటావు'.

**వ.** **అని వెండియు.** **182**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఈ రీతిగా చెప్పి వ్యాసుడు మళ్ళీ (ఈ క్రింది విధంగా అన్నాడు.)

**చ.** **'తన కుసుమంబులన్ ఫలవితానము మూర్కొన నాన మ్రాను నే**
**రని క్రియఁ గాన నేరదు పరం బగు తత్త్వము నైజభంగి వి**
**న్ననువున నంతరాత్మ గను నైష్ఠికతం గను; మింతవట్టుఁ బా**
**మెనసిన తోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజమున్.** **183**

**ప్రతిపదార్థం:** మ్రాను= చెట్టు; తన కుసుమంబులన్= తన పూలను; ఫలవితానమున్= పండ్ల సమూహాన్ని; మూర్కొనన్= ఆఘ్రాణించటానికీ; ఆనన్= ఆస్వాదించటానికీ; నేరని క్రియన్= అభ్యసించనట్లే; పరంబు+అగు= శ్రేష్ఠమైన; తత్త్వము= బ్రహ్మతత్త్వం; నైజభంగిన్= తానుగా తన స్వరూపాన్ని; కానన్ నేరదు= గ్రహించజాలదు; విన్ననువునన్= నేర్పుతో; అంతరాత్మన్= పరమాత్మను; కను నైష్ఠికతన్= చూచేనిష్ఠా పరత్వమును; ఇంతవట్టు= ఇంతమాత్రం; కనుము= పొందుము; పాము= సర్పం; ఎనసిన= తనను పొందిన; తోలు= చర్మమును; పాయుక్రియన్= వదలిపెట్టే రీతిగా; నీవు పాపపుంజమున్= నీవు పాపసమూహాన్ని; తొఱంగుదు= వర్జిస్తావు.

**తాత్పర్యం:** వృక్షం తన పూలను తాను వాసన చూడలేదు. తన పండ్లను తాను ఆస్వాదించజాలదు. అట్లాగే తత్త్వం తనకు తానుగా తన స్వరూపమును గ్రహించలేదు. నీవు నేర్పుతో అంతరాత్మను సాక్షాత్కరించుకొనేందుకు చాలినంత నిష్ఠాపరత్వమును పొందుము. అట్లా చేస్తే పాము కుబుసాన్ని వర్జించినట్లు నీవు పాపసంచయాన్ని వర్జిస్తావు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**వ.** **ఇవ్విధంబున శాంతి నొంది యవ్యక్త సంభవయు, సంకల్పకూలయుఁ, గ్రోధపంకయు, నింద్రియగ్రాహయుఁ, గామభుజంగయు, మోహ తృణచ్ఛన్నయు, సంసారసాగర గామినియు నై ఘోరప్రకార యగుచు నకృతాత్ములకుం గడవరాని యట్టి లోభవాహిని సత్యతీర్థంబున నుత్తరించి.** **184**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; శాంతిన్+ఒంది= శమమును పొంది; అవ్యక్త సంభవయున్= తెలియరాని పుట్టుక గలదియు; సంకల్పకూలయున్= తలపు లనే గట్టుకలదియు; క్రోధపంకయున్= కోపమనే బురద కలదియు; ఇంద్రియగ్రాహయున్= ఇంద్రియాలనే మొసళ్ళు గలదియు; కామభుజంగయున్= కోరికలనే పాములు గలదియు; మోహతృణచ్ఛన్నయున్= మోహమనే గడ్డితో కప్పబడినదియు; సంసారసాగరగామినియున్+ఐ= సంసార మనే సముద్రంలో ప్రవేశించేదియునై; ఘోరప్రకార= భయంకర

విధానంగలది; అగుచున్= అవుతూ; అకృత+ఆత్ములకున్= వివేకంలేని వారికి; కడవన్రాని అట్టి= దాటవీలుగానిదైన; లోభవాహిని= లోభ మనే నదిని; సత్యతీర్థంబునన్= సత్యమనే ఉపాయంతో; ఉత్తరించి= దాటి.

**తాత్పర్యం:** ఈ చెప్పిన పద్ధతిలో అంతరాత్మను సాక్షాత్కరించుకొని శాంతిని పొందాలి. లోభ మనేది ఎక్కడ ఎప్పుడు ఎట్లా పుట్టిందో తెలియదు. సంకల్పాలే దానికి గట్లు. క్రోధమే దానిలోని బురద. ఇంద్రియాలే అందలి మొసళ్ళు. కోరికలే అందులో పాములు. అది మోహమనే గడ్డితో కప్పబడి ఉంటుంది. సంసారసాగరంలో ప్రవేశిస్తుంది. అట్లా భయంకరంగా ఉన్న ఆ నదిని వివేకంలేని వారు దాటలేరు. సత్యమనే ఉపాయంతో దానిని దాటాలి. అట్లా దాటి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలంకారం: రూపకం.

**క. సుత! నీవు సుప్రసన్నా । త్మతఁ బొంది నగాగ్రగతుఁడు మహివారలఁ జూ**
**చుతెఱంగున నీ భూత । ప్రతతిం గనుఁగొనుచునుండు పరితృప్తుఁడవై. 185**

**ప్రతిపదార్థం:** సుత!= కుమారా!; నీవు సుప్రసన్న+ఆత్మతన్= నీవు నిర్మలాత్మత్వమును; పొంది= చెంది; నగ+అగ్రగతుఁడు= కొండకొననున్నవాడు; మహివారలన్= భూమిపైన ఉన్నవారిని; చూచుతెఱంగునన్= చూచేవిధంగా; ఈ భూతప్రతతిన్= ఈ ప్రాణిసమూహాన్ని; కనుఁగొనుచున్= చూస్తూ; పరితృప్తుఁడవు+ఐ ఉండు= తృప్తి పొందినవాడవై ఉండుము.

**తాత్పర్యం:** కుమారా! నీవు పై రీతిగా లోభమనేనదిని దాటి నిర్మలాత్మతను పొందుము. కొండపై నున్న వాడు భూమిమీద నున్నవారినెట్లా చూస్తాడో, అట్లాగే ఈ ప్రాణులను దర్శించుము. అట్లా చూచి సంతృప్తి వహించి ఉండిపొమ్ము.

**విశేషం:** అలం:

**క. శాంతము ధర్మప్రచయం । బంతటికి విశిష్ట మిమ్మహావిద్య మదీ**
**యాంతఃకరణము సాక్షిగ । నెంతయు సంప్రీతి నీకు నిచ్చితిఁ బుత్రా!' 186**

**ప్రతిపదార్థం:** ధర్మప్రచయంబు= ధర్మవర్గం; అంతటికిన్= మొత్తానికి; విశిష్టము= శ్రేష్ఠం; పుత్రా!= కుమారా!; మదీయ+అంతఃకరణము= నా అంతరింద్రియం; సాక్షిగన్= సాక్ష్యం వహించేది కాగా; ఎంతయున్= మిక్కిలి; సంప్రీతిన్= ప్రేమతో; ఈ+మహావిద్య= ఈ గొప్పదైన ఆధ్యాత్మిక విద్యను; నీకున్+ఇచ్చితిన్= నీకు ఇచ్చాను.

**తాత్పర్యం:** వత్సా! నే నిప్పుడు నీకు చెప్పిన ధర్మాలన్నిటిలోనూ ఇంద్రియనిగ్రహ రూపమైన శాంత మనే ధర్మం మిక్కిలి విశిష్టమైనది. నా అంతఃకరణం సాక్షిగా నీకు నేను ఎంతో ప్రేమతో ఈ శ్రేష్ఠమైన బ్రహ్మవిద్యను బోధించాను'.

**వ. అని యి ట్లుపదేశించి పరమసంవిదేకాయనుండగు కృష్ణద్వైపాయనుండు కృతార్థీభూత చేతస్కుండగు నందను ప్రతిపత్తికి నభినందన విశేషంబుగా నధ్యాత్మవిద్యా విలాస విషయంబులగు వాక్యంబులు మఱియు ననుగ్రహించె; వానిం జెప్పెద. 187**

**ప్రతిపదార్థం:** అని యిట్లు+ఉపదేశించి= అని ఈ రీతిగా బోధించి; పరమసంవిదేకాయనుండు+అగు= బ్రహ్మజ్ఞానానికి ముఖ్యస్థానమైన; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; కృతార్థీభూత చేతస్కుండు+అగు= కృతకృత్యమైన మనస్సు గలవాడైన;

నందను= కుమారుని యొక్క; ప్రతిపత్తికిన్= తెలివికి; అభినందన విశేషంబుగాన్= మెచ్చుకొనే పద్ధతిగా; మఱియున్= మరలకూడా; అధ్యాత్మవిద్యావిలాస విషయంబులు+అగు= బ్రహ్మవిద్యా విలాసానికి సంబంధించినవైన; వాక్యంబులు= మాటలు; అనుగ్రహించెన్= ప్రసాదించాడు; వానిన్= ఆ మాటలను; చెప్పెదన్= చెప్తుతాను.

**తాత్పర్యం:** బ్రహ్మజ్ఞానైక నిలయుడైన వ్యాసమహర్షి ఈ విధంగా ఉపదేశించేసరికి శుకుడు కృతకృత్యతతో ధన్యుడయ్యాడు. అతడి తెలివిని అభినందిస్తూ వ్యాసుడు మళ్ళీ అతడికి ఆత్మవిద్యను వివరించే కొన్ని మాటలు చెప్పాడు. ఆ మాటలు చెప్తుతాను.

**క.** **'వేదములుఁ దదంగములు స । మాదరమునఁ జదివినను సుయజమానత్వా**
**పాదకుఁ డైనను బ్రాహ్మణ । తాదశ దక్కునె ప్రశాంతిఁ దక్కఁ గుమారా! 188**

**ప్రతిపదార్థం:** కుమారా!= పుత్రా!; ప్రశాంతిన్+తక్కన్= ప్రశమంచేత తప్ప; వేదములు= శ్రుతులు; తదంగములు= వేదాంగములు; సమాదరమునన్= ప్రీతితో; చదివినను= పఠించినను; సుయజమానత్వ+ఆపాదకుఁడు+ఐనను= మంచి యజ్ఞకర్తృత్వం పొందినవాడైనా; బ్రాహ్మణతాదశ= బ్రాహ్మణత్వస్థితి; తక్కునె?= లభిస్తుందా?

**తాత్పర్యం:** వత్సా! బ్రాహ్మణత్వం అనేది ప్రశాంతిచేత మాత్రమే ప్రాప్తిస్తుంది. నాలుగువేదాలు, ఆరువేదాంగాలు (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - అనేవి) చదివినా సిద్ధించదు. అట్లే యజ్ఞాలు చేసి మంచి యజమానుడుగా పేరు పొందినప్పటికీ బ్రాహ్మణత్వ స్థితి లభించదు.

**క.** **ఒరులకుఁ దా వెఱవక తన । కొరులు వెఱవకుండునట్టి యొప్పెడు సమతం**
**దిరమైన నడవడిం గల । పరిణతచిత్తుండు సూవె బ్రాహ్మణుఁ డనఘా! 189**

**ప్రతిపదార్థం:** అనఘా!= కల్మషరహితుడా!; ఒరులకున్= పరులకు; తాన్= తాను; వెఱవక= భయపడక; తనకున్+ఒరులు= తనకు పరులు; వెఱవక= భీతిల్లక; ఉండునట్టి= ఉన్నట్టి; ఒప్పెడు= విరాజిల్లెడు; సమతన్= సమభావంతో; తిరము+ఐన= స్థిరమైన; నడవడిన్= ప్రవర్తనను; కల= కలిగి ఉండు; పరిణతచిత్తుండు= పరిపక్వమైన మనస్సు కలవాడు; బ్రాహ్మణుఁడు సూవె!= విప్రుడగునుగదా!

**తాత్పర్యం:** పాపరహితుడా! ఎవడు ఇతరులకు తాను భయపడడో, ఎవరివలన ఇతరులు భీతిచెందరో, అట్టి సమదృష్టితో స్థిరమైన ప్రవర్తన కలిగిఉండే పరిపక్వమైన హృదయం కలవాడే బ్రాహ్మణు డనబడతాడు.

**విశేషం: యస్మాన్నోద్విజతే లోకో । లోకా న్నోద్విజతే చ యః**
**హర్షామర్షభయోద్వేగైః । ముక్తో య స్స చ మే ప్రియః ॥ (గీత-12-15)**

అని భగవంతుడి మాట. లోకం ఎవరినుండి ఉద్వేగం పొందదో, ఎవరు లోకంనుండి ఉద్వేగం పొందరో, హర్షమూ, అమర్షమూ, భయమూ, ఉద్వేగమూ ఎవరికి లేవో వాడే నాకు ప్రీతిపాత్రుడని శ్రీకృష్ణుడు చెప్పాడు. ఈ స్థితికూడా బ్రాహ్మణత్వమును వ్యక్తం చేస్తున్నదని గుర్తించాలి.

**తే.** **బంధనంబులలో నెల్లఁ బరమబంధ । నంబు గామంబు; దద్వర్జనమున నాత్మ**
**యభ్రపటలంబు వాసిన యమృతకిరణ । పూర్ణమండలమును బోలెఁ బొలుచు ననఘ! 190**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; బంధనంబులలోన్+ఎల్లన్= సమస్త బంధనాలలోనూ; కామంబు= కోరిక; పరమబంధనంబు= దృఢమైన బంధనం; తద్వర్జనమునన్= ఆ కామమును విడవటంచేత; ఆత్మ= ప్రత్యగాత్మ; అభ్రపటలంబున్=

మేఘసమూహాన్ని; పాసిన= విడిచిన; అమృతకిరణపూర్ణ మండలమునున్+పోలెన్= చంద్రుడియొక్క సంపూర్ణబింబంవలె; పొలుచున్= భాసిస్తుంది.

**తాత్పర్యం:** పాపరహితుడా! జీవుడిని సంసారంలో బంధించే బంధనాలన్నింటిలోనూ కామమనే బంధనం మిక్కిలి గట్టిది. ఆ కామాన్ని వదలితే మబ్బులను విడిచిన పూర్ణచంద్రుడివలె ఆత్మ ప్రకాశిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. పరతత్త్వోపాసన త । త్పరుఁడై సంక్షీణకామభావత నున్నం**
**బురుషు సుఖ మొందు వృద్ధిం । బొరయుచు వపు వమృతకిరణుఁ బొందినమాడ్కిన్. 191**

**ప్రతిపదార్థం:** వపువు= శరీరం; వృద్ధిన్= పెంపుదలను; పొరయుచున్= పొందుచు; అమృతకిరణున్= చంద్రుడిని; పొందినమాడ్కిన్= పొందినరీతిగా; పరతత్త్వ+ఉపాసన తత్పరుఁడు+ఐ= బ్రహ్మతత్త్వమును ఉపాసించటంలో ఆసక్తిగలవాడై; సంక్షీణ కామభావతన్= క్షీణించిన కామభావం కలవానితనంతో; ఉన్నన్= ఉంటే; పురుషున్= జీవుడిని; సుఖము+ఒందున్= సుఖం పొందుతుంది.

**తాత్పర్యం:** శ్రేష్ఠమైన బ్రహ్మతత్త్వాన్ని ఉపాసిస్తూ కామభావాలను క్షయింపజేసికొనాలి. అట్లా ఉంటే పురుషుడిని శుక్లపక్షంలో నిత్యమూ శరీరాభివృద్ధి చంద్రుడిని పొందినట్లే శాశ్వతసుఖం పొందుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. పొరిఁ బొరి భూతముల గుణో । త్కర మవిశేషాన్వితముగఁ గనుఁగొను సంవి**
**త్పర దుఃఖంబు సుఖముచే । విరియుఁ దరణిచేతఁ దమము విరిసిన భంగిన్. 192**

**ప్రతిపదార్థం:** తరణిచేతన్= సూర్యుడిచేత; తమము= చీకటి; విరిసినభంగిన్= విడిపోయినట్లు; పొరిన్+పొరిన్= మిక్కిలిగా; భూతముల= ప్రాణులయొక్క; గుణోత్కరము= గుణసమూహమును; అ+విశేషాన్వితముగన్= భేదంలేకుండా; కనుఁగొను= చూచునట్టి; సంవిత్పరు దుఃఖంబు= జ్ఞాననిష్ఠుని దుఃఖం; సుఖముచేన్= సుఖం కారణంగా; విరియున్= నశిస్తుంది.

**తాత్పర్యం:** ప్రాణులలోని గుణాల నన్నిటినీ అభేదదృష్టితో చూచే జ్ఞాననిష్ఠుడి దుఃఖం చీకటి, సూర్యుడిచేత నశించినట్లు సుఖాతిశయంచేత నశిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. తనది యనక యేమి ధనమునఁ బ్రియమందు, । నెద్ది గుడువకుండ నెసఁగుఁ దృప్తి,**
**యిచ్చఁ బొందులేక యెయ్యది బలమిచ్చు, । దానిఁ గనుట శ్రుతుల తలఁపు గనుట. 193**

**ప్రతిపదార్థం:** తనది అనక= ఇది నాది అని అనుకొనకుండానే; ఏమి ధనమునన్= ఎట్టిధనంతో; ప్రియము+అందున్= ప్రీతినొందునో; ఎద్ది= ఏది; కుడువక+ఉండన్= తినకుండానే; తృప్తి= తనివి; ఎసఁగున్= అతిశయించునో; ఇచ్చన్= ఇచ్ఛతో; పొందులేక= కలయిక లేకయే; ఎయ్యది= ఏది; బలము+ఇచ్చున్= బలిమినిస్తుందో; దానిన్= అట్టి ఆత్మతత్త్వమును; కనుట= చూడటం; శ్రుతుల తలఁపున్= వేదాభిప్రాయాన్ని; కనుట= చూడటం (అగును).

**తాత్పర్యం:** 'ఆత్మ' అనే ధనం 'తనది' అనుకొనకున్నా ప్రీతిని కల్గిస్తుంది. 'ఆత్మ' అనే భోజనం తినకున్నా తృప్తినిస్తుంది. 'ఆత్మ' అనే దానితో భౌతికస్పర్శ లేకున్నా బలం కలుగుతుంది. ఆ ఆత్మతత్త్వాన్ని చూడటమే వేదార్థాలను గ్రహించటం.

**విశేషం:** ధనం, భోజనం మొదలైన పదార్థాలు ప్రీతి, తృప్తి మొదలైనవాటిని కలిగిస్తాయి. కాని ఎక్కడో ఎవరివద్దనో ఉన్న ధనంవలన తనకు ప్రీతి కలుగదు. ఎవడో అన్నం భుజిస్తే తనకు తనివి కలగదు. 'ఆత్మ'భోజనం అట్లాంటిది కాదు. దానిని తనది అనుకొనకున్నా, భుజించకున్నా ప్రీతినీ, తృప్తినీ కలిగిస్తుంది. ఆత్మభావనతో కలిగే బలం చాలా గొప్పది. అందువలన ఆత్మతత్త్వప్రాప్తికై ప్రయత్నించాలి. ఆత్మలాభమే వేదతత్త్వాన్ని గ్రహించి ఆచరించినందుకు నిక్కమైన నిదర్శనం.

**క. పరిపాటిఁ గర్మ మెడలఁగ । వరుస గుణము లడఁగ విషయవర్గము పొందుం**
**బొరయక యుండెడు బ్రాహ్మణు । జరయును మృత్యువును బొరయఁజాలవు వత్సా! 194**

**ప్రతిపదార్థం:** వత్సా!= కుమారా!; పరిపాటిన్= క్రమంగా; కర్మము+ఎడలఁగన్= కర్మము తొలగగా; వరుసన్= క్రమంగా; గుణములు= సత్త్వం మొదలైన గుణాలు; అడఁగన్= నశించగా; విషయవర్గము పొందున్= శబ్దాది విషయాలతోడి కలయికను; పొరయక ఉండెడు= పొందకుండా ఉండేటి; బ్రాహ్మణున్= విప్రుని; జరయును= ముసలితనమును; మృత్యువును= మరణమును; పొరయన్+చాలవు= పొందలేవు.

**తాత్పర్యం:** కుమారా! కర్మబంధమూ, సత్త్వాది గుణాలూ, శబ్దాది విషయాలూ క్రమక్రమంగా తొలగిపోయిన విప్రుడికి వార్ధకమూ, మరణమూ కలుగవు.

**విశేషం:** శరీరభావంతో ఉండేవాడికి ఆ శరీరానికి కలిగే ముసలితనం, మరణం మొదలైన దోషాలు కూడా ఆపాదిస్తాయి. కాని, 'తాను శరీరంకాదు, శుద్ధబుద్ధముక్తమైన ఆత్మను' అని గ్రహించిన బ్రాహ్మణుడికి వార్ధకాది దోషా లంటవని భావం.

**తే. అనఘ! దేహంబుకంటె వేఱయిన దేహి । సూక్ష్మరూపము శాస్త్రోక్త సుకృతములఁ బ్ర**
**శాంతజనములు గాంతురు సాధనముల । నాదరింపరు దర్శనానంతరమున. 195**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; శాస్త్ర+ఉక్తసుకృతములన్= శాస్త్రాలలో చెప్పబడిన పుణ్యకర్మలచేత; ప్రశాంతజనములు= ప్రశాంతినొందిన జనులు; దేహంబుకంటెన్= శరీరంకంటె; వేఱు+అయిన= భిన్నమయిన; దేహి= ఆత్మయొక్క; సూక్ష్మరూపంబున్= సూక్ష్మమైన రూపును; కాంతురు= చూస్తారు; దర్శన+అనంతరమునన్= అట్లా చూచిన తర్వాత; సాధనములన్= వేరే ఉపాయాలను; ఆదరింపరు= గణించరు.

**తాత్పర్యం:** కల్మషరహితుడా! శాస్త్రాలలో చెప్పబడిన పుణ్యకర్మలచేత ప్రశాంతి నొందిన జనులు మాత్రమే శరీరం కంటె భిన్నమైన శరీరి, అనగా ఆత్మయొక్క సూక్ష్మస్వరూపాన్ని గ్రహించగలరు. అట్లా అవ్యక్తాత్మ స్వరూపాన్ని గ్రహించిన తర్వాత వారు వేరే సాధనాలను లెక్కచేయరు.

**క. ఇనురూపము జలములఁ దోఁ । చిన క్రియ బుద్ధిఁ బ్రతిబింబసిద్ధత వెలుఁగొం**
**దిన యాత్మను బరమార్థతఁ । గను సత్త్వస్థులకు నిజము గానంగ నగున్. 196**

**ప్రతిపదార్థం:** ఇనురూపము= సూర్యుడిరూపం; జలములన్= నీటిలో; తోఁచినక్రియన్= కనబడిన విధంగా; బుద్ధిన్= బుద్ధి యందు; ప్రతిబింబసిద్ధతన్= ప్రతిబింబంగా కావటంతో; వెలుఁగు+ఒందిన= ప్రకాశించిన; ఆత్మను= క్షేత్రజ్ఞుడిని; పరమార్థతన్= యథార్థంగా; కను= చూచే; సత్త్వస్థులకున్= సత్త్వగుణంలో ఉండేవారికి; నిజము= సత్యం; కానంగన్+అగున్= చూడటానికి వీలవుతుంది.

**తాత్పర్యం:** సూర్యుడి స్వరూపం నీళ్ళలో ప్రతిబింబంగా భాసిస్తుంది. అట్లాగే ఆత్మ బుద్ధిలో ప్రతిబింబరూపంతో వ్యక్తమవుతుంది. సత్త్వగుణ ప్రధానులైనవారు ఆత్మను యథాతథంగా చూడగలరు. అట్లాంటివారికి మాత్రమే సత్యం భాసిస్తుంది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. అనఘ! దివసంబు రాత్రియు । ననునవి భానునకు లేని యట్టులు సతతం**
**బును బరమయోగయుతుఁ డగు । మునికి వివేకావివేకములు లేకుండున్. 197**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; భానునకున్= సూర్యుడికి; దివసంబు= పగలు; రాత్రియున్= రేయియు; అనునవి= అనేవి; లేని అట్టులు= లేనట్లే; సతతంబును= ఎల్లవేళలా; పరమ యోగయుతుఁడు+అగు= శ్రేష్ఠమైన యోగంతో కూడినవాడైన; మునికిన్= మౌనికి; వివేక+అవివేకములు= జ్ఞానాజ్ఞానాలు; లేక+ఉండున్= లేకుండా ఉంటాయి.

**తాత్పర్యం:** పాపరహితుడా! సూర్యుడికి రేయుంబవళ్ళు అనేవి లేవు. అట్లే సదా పరమయోగం పాటించే మునీంద్రుడికి వివేకం, అవివేకం అనేవి లేవు. సదా అతడు శుద్ధ జ్ఞానస్వరూపుడై ఉంటాడు కాబట్టి ఇది వివేకం కలిగిన స్థితి, ఇది వివేకం లేని స్థితి అనేవి అతడికి లేవని తాత్పర్యం.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. కరణంబులు దొడరిన ని । ష్కరణత నున్నను శమంబు గల యోగికి సు**
**స్థిర మగు సమాధి యని ముని । వర శాండిల్యుండు శిష్యవరులకుఁ జెప్పెన్. 198**

**ప్రతిపదార్థం:** మునివర= మునిశ్రేష్ఠుడా!; శాండిల్యుండు= శాండిల్యుడు; కరణంబులు= ఇంద్రియాలు; తొడరినన్= కలిగిఉన్నా; నిష్కరణతన్= ఇంద్రియరహితస్థితితో; ఉన్నను= ఉన్నా; శమంబు= శాంతం; కల= కల్గిన; యోగికిన్= యోగశీలుడికి; సమాధి= చిత్తలయం; సుస్థిరము+అగున్+అని= ధృఢమౌతుందని; శిష్యవరులకున్= శిష్యశ్రేష్ఠులకు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** శమప్రధానుడైన యోగికి ఇంద్రియాలున్నా, అవి లేకున్నా మనోలయ రూపమైన సమాధి దృఢంగానే ఉంటుందని శాండిల్యమహర్షి తన శిష్యులకు బోధించాడు.

**సీ. విను మోహబీజ సంజనితంబు గామద్రు । మంబు ప్రమాదజలంబు దనకుఁ**
**బరిషేచనంబుగఁ బెరుఁగు నజ్ఞాన స్థి । రాధారకలితమై యందసూయ**
**పత్త్ర సంపద యది చిత్ర తరంబు మా । నస్కంధ దృఢత నున్నతి వహించు**
**శోక శాఖంబు ననేక చింతోప శా । ఖంబు బురాకృత కర్మ సార**

**తే. ఘనముఁ దృష్ణాలతా పరిగతము నగుచుఁ । బొలుచుఁ దత్ఫలములకు లుబ్ధులు గడంగి**
**ప్రాఁకి పడుదురు విడుపు శస్త్రముగ నది వి । ఖండితము సేసి బుధుఁడు దుఃఖములఁ దొఱఁగు. 199**

**ప్రతిపదార్థం:** విను= ఆకర్ణించు; మోహబీజసంజనితంబు= మోహమనే విత్తనంనుండి మొలకెత్తినదైన; కామద్రుమంబు= కామమనే చెట్టు; అజ్ఞానస్థిర+ఆధారకలితము+ఐ= అజ్ఞానమనే గట్టి వేళ్ళతో కూడినదై; ప్రమాదజలంబు= ఏమరుపాటు అనేనీరు; తనకున్ పరిషేచనంబుగన్= తనకు నీరుకట్టుగా; పెరుఁగున్= వృద్ధిపొందుతుంది; అందున్= ఆ వృక్షమునందు; అసూయ= ఇతరుల ఉత్కర్షను సహింపమి అనే దుర్గుణం; పత్త్రసంపద= ఆకుల సంపత్తి(గాఉన్నది); అది= ఆ ఆకుల సంపద; చిత్రతరంబు= మిక్కిలి చిత్రమైనది; మానస్కంధదృఢతన్= అభిమానమనే బోదె యొక్క దార్ఢ్యంతో; ఉన్నతిన్= (ఆచెట్టు) ఔన్నత్యమును;వహించున్= పొందుతుంది; శోకశాఖంబు= శోకమనే కొమ్మలు కలది; అనేక చింతా+ఉపశాఖంబు= పెక్కు చింతలనే రెమ్మలుగలది; పురాకృత కర్మ సారఘనము= పూర్వం చేసిన కర్మల బలమే చేవగా కలది; తృష్ణాలతాపరిగతమున్= ఆశ అనే తీగలతో చుట్టబడింది;అగుచున్ = అవుతూ; పొలుచున్= భాసిస్తుంది; లుబ్ధులు= లోభగుణం కలవారు; తత్ఫలములకున్= ఆ చెట్టుకు సంబంధించిన పండ్లకు;

కడంగి= ప్రయత్నించి; ప్రాఁకి= ఎగబ్రాకి; పడుదురు= పతనం చెందుతారు; బుధుఁడు= పండితుడు (ఆత్మజ్ఞానం కలవాడు); విడుపు= త్యాగం; శస్త్రముగన్= ఖడ్గంగా; అది= ఆ చెట్టును; విఖండితము చేసి= తెగనరికి; దుఃఖములన్= శోకాలను; తొఱఁగున్= విడిచిపెడతాడు.

**తాత్పర్యం:** శుకుడా! వినుము. కామమనే వృక్షం మోహమనే బీజంనుండి మొలుస్తుంది. ఏమరుపాటు అనే నీటితో పెరుగుతుంది. అజ్ఞానమే దాని స్థిరమైన ఆధారపువేళ్ళు; అసూయే దానికి ఆకులు. అది చాలా చిత్రంగా ఉంటుంది. మానమనే కాండంతో దృఢపడి ఆ వృక్షం పైకెదుగుతుంది. శోకమే కొమ్మలుగా, అనేకచింతలే రెమ్మలుగా, పూర్వం చేసిన కర్మలబలమే చేవగా పెరిగిన ఆ చెట్టు ఆశలనే తీగెలతో చుట్టబడుతుంది. లోభులు ఆ చెట్టు పండ్ల కాశించి ఎక్కి తుదకు పతనమై పోతారు. ఆత్మజ్ఞుడైన పండితుడు త్యాగమనే కత్తితో ఆ చెట్టును తెగనరికి దుఃఖాలకు దూరమవుతాడు.

**విశేషం:** అలం: రూపకం

**సీ.** **పురము శరీరంబు; బుద్ధి తత్స్వామిని; । సర్వార్థచింతన సచివపదవి**
**నడచుచు నుండు మనంబు శబ్దాద్యంబు । లై చెల్లు విషయంబులైదుఁ దగు పు**
**రోహితవర్గంబు శ్రోత్రాదులగు నింద్రి । యంబులు పౌరజనంబు; లిట్లు**
**పరఁగెడు రాజ్యంబు పరిభోగమునకు దూ । షకులైన దొరలు రజస్తమములు**

**తే.** **వారి కఱపులఁ బడు బుద్ధి నేరకుండి । మనసుతోడ వేర్పడినఁ దానును మనంబు**
**నేకముఖతఁ గార్యము సూచునేని దుష్టు । లడఁగుదురు భోగ మవ్యయ మగుఁ గుమార!' 200**

**ప్రతిపదార్థం:** కుమార!= పుత్రా!; శరీరంబు= దేహం; పురము= పట్టణం; బుద్ధి= అంతఃకరణ చతుష్టయంలో రెండవదైన బుద్ధి; తత్స్వామిని= ఆ నగరానికి యజమానురాలు; మనంబు= మనస్సు; సర్వార్థచింతన= సమస్త పదార్థాలను గూర్చిన ఆలోచనతో; సచివ పదవిన్= మంత్రిస్థానంలో; నడచుచున్+ఉండున్= ప్రవర్తిస్తూ ఉంటుంది; శబ్ద+ఆద్యంబులు+ఐ= శబ్దం మొదలుగాగలవై; చెల్లు= ప్రవర్తిల్లే; విషయంబులు= విషయాలు; ఐదున్= ఐదును; తగు= తగిన; పురోహితవర్గంబు= పురోహితులయొక్క సమూహం; శ్రోత్ర+ఆదులు+అగు= చెవి మొదలైన; ఇంద్రియంబులు= జ్ఞానేంద్రియాలు; పౌరజనంబులు= పురప్రజలు; ఇట్లు= ఈ రీతిగా; పరఁగెడు= ప్రవర్తిల్లెడు; రాజ్యంబుపరిభోగమునకున్= రాజ్యముయొక్క అనుభవానికి; రజస్తమములు= రజోగుణ తమోగుణాలు; దూషకులు+ఐన= దూషించే స్వభావంగల; దొరలు= ప్రభువులు; నేరక+ఉండి= నేర్పు చాలక ఉన్నదై; బుద్ధి= మతి; మనసుతోడన్= చిత్తంతో; వేర్పడిన= విభిన్నమయినచో; వారికఱపులన్+పడున్= రజస్తమోగుణాల శిక్షణకు లోనవుతుంది; తానును= (అట్లు వారికి లోబడక) బుద్ధియును; మనంబును= చిత్తమును; ఏకముఖతన్= ఏకాభిప్రాయంతో; కార్యము= చేయదగినపనిని; చూచునేని= గమనించిన పక్షంలో; దుష్టులు= దుర్జనులు; అడఁగుదురు= నశించిపోతారు; భోగము= సుఖానుభవం; అవ్యయము+అగున్= అక్షయం అవుతుంది.

**తాత్పర్యం:** పుత్రా! ఈ శరీరమే ఒక నగరం. బుద్ధి దానికి ప్రభువు. సమస్త విషయాలనూ చింతించే చిత్తం అక్కడ మంత్రి పదవిలో కొనసాగుతూ ఉంటుంది. శబ్దాదులైన ఐదు విషయాలూ పురోహితవర్గమై ప్రవర్తిస్తాయి శ్రోత్రం మొదలైన ఇంద్రియాలే అక్కడి పురప్రజలు. ఇట్లా ఉండే ఈ రాజ్యాన్ని రజస్తమో గుణాలనే దుష్టులైన దొరలు అనుభవిస్తూ ఉంటారు. బుద్ధి తనకు వివేకం చాలనిదై చిత్తంతో విభేదించి రజస్తమోగుణాల శిక్షణలకు లోనై నశిస్తుంది. అట్లాకాక మనస్సుతో ఏకమై అది కర్తవ్యమేదో గ్రహించి ప్రవర్తిస్తే దుర్జనులైన రజస్తమోగుణాలు పొడవడగిపోతాయి. రాజ్యభోగం అక్షయ మవుతుంది'.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని చెప్పెననిన విని పాండవాగ్రజుండు భీష్మునితోఁ 'గార్యబలంబును, వీర్యబలంబును, మనోబలంబునుం గలుగు నుత్తమక్షితిపతు లనేకు లీకయ్యంబున మృతులైరి. నిజప్రాణంబునకు నొక్కరుండు నొడయండు లేక తక్కె ; మృత్యువనునది యెయ్యది? యేమిటం గలిగె? నెట్లు ప్రజల సంహరించు? నెఱిఁగింపవే!' యనుటయు నతం డిట్లనియె. 201**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= అని చెప్పాడు; అనినన్= అనగా; విని= ఆలకించి; పాండవ+అగ్రజుండు= ధర్మజుడు; భీష్మునితోన్= శాంతనవుడితో; కార్యబలంబును= చేయదగిన పనులకు తగిన బలమూ; వీర్యబలంబును= పరాక్రమబలమూ; మనోబలంబును= చిత్తబలమూ; కలుగు= కలిగిఉన్న; ఉత్తమక్షితిపతులు= శ్రేష్ఠులైన రాజులు; అనేకులు= చాలమంది; ఈ కయ్యంబునన్= ఈ యుద్ధంలో; మృతులు+ఐరి= చనిపోయారు; ఒక్కరుండున్= ఒకడుకూడ; నిజప్రాణంబునకున్= తన ప్రాణానికి; ఒడయండు= ప్రభువు; లేక తక్కెన్= లేకపోయాడు; మృత్యువు+అనునది= చావు అనేది; ఏ+అది?= ఏది?; ఏమిటన్= దేనినుండి; కలిగెన్= సంభవించింది?; ఎట్లు= ఏ రీతిగా; ప్రజలన్= జనులను; సంహరించున్= చంపుతుంది?; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అడుగగా; అతండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా వ్యాసుడు శుకుడితో చెప్పాడని భీష్ము డన్నాడు. అప్పుడు ధర్మరాజు భీష్ముడితో - 'కార్యబలమూ, వీర్యబలమూ, మనోబలమూ గల్గిన చాలామంది ఉత్తములైన భూపాలకులు ఈ యుద్ధంలో అసువులు కోల్పోయారు. వీరిలో ఒక్కడు కూడా తన ప్రాణాలకు ప్రభువు కాలేకపోయాడు. మృత్యువంటే ఏమిటి? అది దేనినుండి సంభవించింది? అది ఏ రీతిగా ప్రజలను చంపుతుంది? తెలియజెప్పుమని అడిగాడు. అపుడు భీష్ము డతడితో ఇట్లా అన్నాడు:

**భీష్ముఁడు ధర్మరాజునకు మృత్యుదేవత తెఱం గెఱింగించుట (సం. 12-248-7)**

**సీ. విను మకంపనుఁ డను మనుజేంద్రుఁ డాత్మజుఁ । డాహవంబున మృతుఁ డైన, వగపు**
**గదురంగనుండి నారదు నలవోక వ । చ్చిన వానిఁ గని సవిశేషభక్తి**
**యుతముగా నాతిథ్య మొనరించి తన వగ । పెఱిఁగించుటయు, నమ్మునీశ్వరుండు**
**గరుణ శోకనిరాసకారణం బైన యా । ఖ్యాన మొక్కటి సెప్పె; దాని తెఱఁగు**

**తే. దేటపడునట్లుగాఁ బరిపాటి తోడ । నఖిలమును నెఱింగించెద నవహితుండ**
**వై వినంగ నీ వడిగిన యర్థమునకు । బోధకం బగు నది కురుభూపవర్య! 202**

**ప్రతిపదార్థం:** కురుభూపవర్య!= కౌరవరాజోత్తమా!; వినుము; అకంపనుఁడు+అను= అకంపనుడనబడే; మనుజ+ఇంద్రుఁడు= రాజు; ఆహవంబునన్= యుద్ధంలో; ఆత్మజుఁడు= పుత్రుడు; మృతుఁడు+ఐనన్= చనిపోగా; వగపు= దుఃఖం; కదురంగన్+ఉండి= కలుగగా ఉండినవాడై; అలవోకన్= స్వేచ్ఛగా; వచ్చినవానిన్= వచ్చినవాడైన; నారదున్= నారదమునిని; కని= చూచి; సవిశేషభక్తి యుతముగాన్= అత్యధిక భక్తితో కూడిన పద్ధతిలో; ఆతిథ్యము= అతిథి సత్కారం; ఒనరించి= చేసి; తన వగపు= తన దుఃఖమును; ఎఱిఁగించుటయున్= తెలియజెప్పగా; ఆ+ముని+ఈశ్వరుండు= ఆ నారదుడు; కరుణన్= దయతో; శోకనిరాసకారణంబు+ఐన=దుఃఖ నివారణహేతువైన; ఆఖ్యానము= కథ; ఒక్కటిచెప్పెన్= ఒకటి వచించాడు;పరిపాటితోడన్= క్రమంగా; దానితెఱఁగు=ఆ కథా పద్ధతి; అఖిలమును= సర్వమును; తేటపడునట్లుగాన్= స్పష్టమయ్యేవిధంగా; ఎఱిఁగించెదన్= తెలియపరుస్తాను; అవహితుండవు+ఐ=

అవధానం కలవాడవై; వినంగన్= వింటే; అది= ఆ కథ; నీ అడిగిన= నీవు ప్రశ్నించిన; అర్థమునకున్= విషయానికి; బోధకంబు+ అగున్= బోధించేది అవుతుంది.

**తాత్పర్యం:** కురురాజవర్యా! వినుము. పూర్వం అకంపనుడనే ఒక రాజుండేవాడు. అతడి కుమారుడు యుద్ధంలో మరణించాడు. ఆ రాజు దుఃఖాక్రాంతుడయ్యాడు. అట్లా ఉండగా నారదముని స్వేచ్ఛగా సంచరిస్తూ అప్పుడు అక్కడికి వచ్చాడు. అతడిని చూచి రాజు మిక్కిలి భక్తితో అతిథి సత్కారం కావించాడు. తర్వాత తన దుఃఖాన్ని గూర్చి ఆ మునికి తెలియపరచాడు. ఆ మునీంద్రుడు అది విని దయతో అతడికి దుఃఖాన్ని తొలగింపజేసే కథ ఒకటి చెప్పాడు. నేను ఆ కథనంతా స్పష్టంగానూ, క్రమంగానూ నీకు వివరిస్తాను. అవధానంతో వినుము. అది వింటే నీ వడిగిన ప్రశ్నకు సమాధానం తెలియవస్తుంది.

**వ. అజుండు జగంబులు సృజియింప జంతుసంతానంబు వెరిఁగి సమ్మర్దం బధికంబై యూర్పు వోవని యట్లయిన నద్దేవుండు సంకటపడి సంహారప్రకారంబు విచారింపం దదీయ చిత్తంబు కార్యదాహంబున మహాదహనుండు జనియించి జగంబులు దహింపం జొచ్చిన. 203**

**ప్రతిపదార్థం:** అజుండు= బ్రహ్మ; జగంబులు= లోకాలు; సృజియింపన్= సృష్టించగా; జంతుసంతానంబు= ప్రాణిసంతతి; పెరిఁగి= వృద్ధిపొంది; సమ్మర్దంబు= ఒత్తిడి; అధికంబు+ఐ= ఎక్కువై; ఊర్పు పోవని అట్లు+అయినన్= ఊపిరాడని ప్రకారంగా కాగా; ఆ+దేవుండు= ఆ బ్రహ్మదేవుడు; సంకటపడి= కష్టపడి; సంహారప్రకారంబున్= ప్రాణులను సంహరించే విధానాన్ని; విచారింపన్= ఆలోచించగా; తదీయచిత్తంబు= అతడి మనస్సుయొక్క; కార్యదాహంబునన్= కార్యార్థమయిన తాపమునందు; మహాదహనుండు= గొప్ప అగ్ని; జనియించి= పుట్టి; జగంబులు= లోకాలు; దహింపన్+చొచ్చినన్= కాల్చటానికి ప్రారంభించగా.

**తాత్పర్యం:** పూర్వం బ్రహ్మదేవుడు లోకాలు సృష్టించాడు. అంతట ప్రాణుల సంతానం ఎక్కువగా పెరిగిపోయింది. సమ్మర్దం ఎక్కువయింది. ఊపిరి పీల్చుకొనటానికి కూడా వీలులేని విధంగా పరిస్థితి ఏర్పడింది. అప్పుడు ఆ దేవుడు చింతించి ప్రాణిలోకాన్ని ఎట్లా సంహరించటమా అని యోచించసాగాడు. అతడి చిత్తంలో కార్యాన్ని గూర్చిన తీవ్రమైన ఆలోచన వలన వేడిమి జనించింది. అందుండి మహాగ్ని ప్రభవించింది. అది లోకాలను కాల్చివేయటానికి పూనుకొన్నది.

**తే. త్రినయనుఁడు వచ్చి యాతనిఁ దేర్చె; నాతఁ । డాతెఱం గెఱిఁగించి యయ్యగ్ని నుడిపె;**
**నపుడు పుట్టెఁ దదీయేంద్రియవ్రజమున । నొక్క యంగన రక్తాక్షి యుజ్జ్వలాంగి. 204**

**ప్రతిపదార్థం:** త్రినయనుఁడు= మూడుకన్నులుగల శివుడు; వచ్చి= ఏతెంచి; ఆతనిన్= బ్రహ్మదేవుడిని; తేర్చెన్= శాంతింపజేశాడు; ఆతఁడు= ఆ శివుడు; ఆ తెఱంగు= ప్రాణులను సంహరించే పద్ధతిని; ఎఱిఁగించి= తెలియజెప్పి; ఆ+అగ్నిన్= ఆ దహనుడిని; ఉడిపెన్= చల్లార్చాడు; అప్పుడు= ఆ సమయంలో; తదీయ+ఇంద్రియవ్రజమునన్= ఆ బ్రహ్మయొక్క ఇంద్రియ సమూహమునందు; రక్త+అక్షి= ఎర్రని కన్నులు గలది; ఉజ్జ్వల+అంగి= ప్రకాశించే అవయవాలు గలదైన; ఒక్క అంగన= ఒక స్త్రీ; పుట్టెన్= జనించింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో శివుడక్కడికి వచ్చాడు. బ్రహ్మను శాంతింపజేశాడు. అతడికి పెరిగిపోయిన జంతు సంతతిని ఎట్లా సంహారం చేయాలో, ఆ పద్ధతి తెలియచెప్పి ఆ యగ్నిని శమింపజేశాడు. అప్పుడు ఎర్రని కన్నులతోనూ, భాసమానమైన అవయవాలతోనూ ఒప్పే ఒక స్త్రీ బ్రహ్మదేవుడి ఇంద్రియాలనుండి ఉద్భవించింది.

**వ. పుట్టి దక్షిణాభిముఖియై పోవం గని కమలసంభవుండు పిలిచి 'మృత్యువ! ప్రజలఁ బ్రబల దుర్బలభేదంబు లేక సంహరింపు' మనుటయు నవ్వనిత వనటం గన్నీరొలుక 'నీ కుద్భవించి క్రూరకర్మంబు సేయుదునే? ధర్మకార్యంబునకుం బనుపు'మని పలికిన నయ్యశ్రుబిందువులు దోయిటంబట్టి యద్దేవుం డమ్ముద్దియతో 'నిదియపనిగా నుదయించినదానవు; నీవు ప్రజాసంహారంబు సేయవలయు' ననవుడు నాబాల గాలిం దూలు తీవయుంబోలెఁ గంపంబు నొందుచు. 205**

**ప్రతిపదార్థం:** పుట్టి= ఉద్భవించి; దక్షిణా+అభిముఖి ఐ= దక్షిణదిశ కెదురైన ముఖంకలదై; పోవన్= పోతుండగా; కని= చూచి; కమలసంభవుండు= బ్రహ్మ; పిలిచి= ఆహ్వానించి; మృత్యువ!= ఓ మృత్యుదేవతా!; ప్రజలన్= జనులను; ప్రబలదుర్బల భేదంబు లేక= బలవంతుడు, దుర్బలుడు అనే తేడా లేకుండా; సంహరింపుము= చంపుము; అనుటయున్= అనగా; ఆ+వనిత= ఆ అంగన; వనటన్= దుఃఖంతో; కన్నీరు= బాష్పజలం; ఒలుకన్= ప్రసరించగా; నీకున్+ఉద్భవించి= నీకు పుట్టి; క్రూరకర్మంబు= క్రూరమైన కార్యం; చేయుదునే?= అనుష్ఠింతునా; ధర్మకార్యంబునకున్= పుణ్యకార్యానికి; పనుపుము+అని= నియోగింపుమని; పలికినన్= చెప్పగా; ఆ+దేవుండు= ఆ బ్రహ్మ; ఆ+అశ్రుబిందువులు= ఆ కన్నీటి బిందువులు; దోయిటన్= దోసిలితో; పట్టి= పట్టుకొని; ఆ+ముద్దియతోన్= ఆ వనితతో; ఇదియ= ఇదే; పనిగా= కార్యముగా; ఉదయించినదానవు= పుట్టినదానవు; నీవు ప్రజాసంహారంబు= నీవు జంతుసంహారము; చేయన్ వలయున్= చేయాలి; అనవుడున్= అనగా; ఆ బాల= ఆ బాలిక; గాలిన్+తూలు= వాయువుతో చలించే; తీవయున్+పోలెన్= లతవలె; కంపంబున్+ఒందుచున్= వణకిపోతూ.

**తాత్పర్యం:** ఆ రీతిగా పుట్టి దక్షిణదిక్కు కెదురుగా పోసాగింది. అది చూచి బ్రహ్మ 'ఓ మృత్యుదేవతా! నీవు ప్రాణులను ఇది బలమైనది, ఇది బలం లేనిది అన్న భేదం లేకుండా చంపుము' అని చెప్పాడు. అందుకు ఆ స్త్రీ దుఃఖిస్తూ కంటనీరు పెట్టి 'దేవా! నీకు పుట్టి నేను ఈ సంహారమనే క్రూరకార్యం ఎట్లా చేసేది? నన్ను ధర్మకార్యానికి నియోగించుము' అని అడిగింది. బ్రహ్మ ఆమె కన్నీటి బిందువులను అంజలితో పట్టుకొని ఆమెతో 'నీవు ఇందుకే జన్మించావు. కాబట్టి ప్రజాసంహారకార్యం తప్పక చేయాలి' అన్నాడు. అందు కా బాలిక గాలికి చలించే తీగవలె వణకిపోతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'మనుజుల హరించి బాంధవ। జనమున శోకంబుఁ జూడఁ జాలుదునె? తపం**
**బున కేఁగెద సదయంబుగ। ననుజ్ఞ సేయంగవలయు' నని ప్రణమిల్లెన్. 206**

**ప్రతిపదార్థం:** మనుజులన్= మానవులను; హరించి= చంపి; బాంధవజనమునన్= వారి బంధుజనులలో; శోకంబున్= దుఃఖమును; చూడన్+చాలుదునె?= చూడగలనా?; తపంబునకున్= తపస్సు చేయటానికి; ఏఁగెదన్= పోతాను; సదయంబుగన్= కృపతో; అనుజ్ఞ చేయంగన్ వలయున్= అనుమతించాలి; అని ప్రణమిల్లెన్= అని నమస్కరించింది.

**తాత్పర్యం:** 'మానవుల ప్రాణాలు హరించి వారి బంధువులలో శోకం నేను చూడగలనా? తపస్సు చేయటానికి పోతాను. దయతో నాకు అనుమతి ఇమ్ము' అని నమస్కారం చేసింది.

**వ. దానికి నరవిందసంభవుండు మందస్మితంబుతో 'ని ట్లేలగు? జంతుసంహారంబు నీ కవశ్యకర్తవ్యంబు; దానిం జేయుమి సువ్వేయధర్మం' బని నిర్బంధించిన నూరకుండి యన్నాతి పదంపడి యల్లన సురిఁగి ధేనుకాశ్రమంబున కరిగి యత్యంత దీర్ఘకాలంబు ఘోరతపంబు సేసి, కౌశికి గంగ నందయను నదులకుం బోయి వాయు వాహారంబుగా నతిదుష్కరవ్రతంబు లనేక వర్షంబు లాచరించి హిమశిఖరి శిఖరంబునకుం జని చతురానన ప్రీతికరం బగు నిష్ఠాతిశయంబున సంయమంబు దాల్చియుండ నద్దేవుండు. 207**

**ప్రతిపదార్థం:** దానికిన్= అందుకు; అరవిందసంభవుండు= బ్రహ్మ; మందస్మితంబుతోన్= చిరునవ్వుతో; ఇట్లు+ఏల+అగున్?= ఈ విధంగా ఎందుకు జరుగుతుంది?; జంతుసంహారంబు= ప్రాణుల సంహరించటం; నీకున్+అవశ్యకర్తవ్యంబు= నీకు తప్పక చేయదగినపని; దానిన్= ఆ కార్యాన్ని; చేయమి= చేయకపోవటం; అధర్మంబు సువ్వె= అధర్మంగదా!; అని నిర్బంధించినన్= అని పట్టువిడక చెప్పేసరికి; ఊరక+ఉండి= మారుమాటలాడకుండా ఉండి; ఆ+నాతి= ఆ స్త్రీ; పదంపడి= ఆపైన; అల్లనన్= మెల్లగా; సురిఁగి= అదృశ్యమై చని; ధేనుక+ఆశ్రమంబునకున్= ధేనుకనామకమైన ఆశ్రమానికి; అరిగి= వెళ్ళి; అత్యంత దీర్ఘకాలంబు= చాలకాలం; ఘోరతపంబుచేసి= తీవ్రమైన తపస్సు చేసి; కౌశికి, గంగ, నంద అను నదులకున్= కౌశికి మొదలైన ఏరులకు; పోయి= వెళ్ళి; వాయువు+ఆహారముగాన్= గాలినే భోజనంగా; అనేకవర్షంబులు= పెక్కు సంవత్సరాలు; అతి దుష్కర వ్రతంబులు= మిక్కిలి కష్టమైన వ్రతాలను; ఆచరించి= చేసి; హిమశిఖరిశిఖరంబునకున్= హిమవత్పర్వతాగ్రానికి; చని= వెళ్ళి; చతుః+ఆనన ప్రీతికరంబు+అగు= బ్రహ్మకు ప్రీతి కల్గించే; నిష్ఠా+అతిశయంబునన్= నిష్ఠాగరిష్ఠతతో; సంయమంబు= నియమాన్ని; తాల్చి ఉండన్= వహించి ఉండగా; ఆ+దేవుండు= ఆ బ్రహ్మదేవుడు;

**తాత్పర్యం:** అందుకు బ్రహ్మ చిరునవ్వు నవ్వి 'ఇట్లా ఎందుకు జరుగుతుంది? నీకు జంతువులను సంహరించటం చేయదగిన పని. ఆ పని చేయకపోతేనే అధర్మం' అని నిర్బంధించాడు. ఆమె అందు కేమీ బదులు చెప్పక ఊరుకొన్నది. పిదప మెల్లగా అక్కడినుండి మాయమైపోయి ధేనుకాశ్రమం చేరింది. అక్కడ చాలా కాలం తీవ్ర తపోనిష్ఠ కొనసాగించింది. అక్కడినుండి కౌశికి, గంగ, నంద అనే నదులకు వెళ్ళింది. ఆ నదీతీరాలలో గాలినే ఆహారంగా స్వీకరిస్తూ అనేక సంవత్సరాలు మిక్కిలి దుష్కరమైన వ్రతాలు చేసింది. ఆ పై హిమవత్పర్వత శిఖరం చేరి బ్రహ్మకు ప్రీతికరమైన నిష్ఠతో నిగ్రహం దాల్చి ఉండింది. అప్పుడు ఆ బ్రహ్మదేవుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **సన్నిధిసేసి తపముమెయి । నున్నఁ బ్రయోజనము గలదె? యుడుగుము పుత్రీ!'**
**యన్న 'శరణంబు వేఁడెద । నన్ను దయం గావు' మనియె నాతి యతనితోన్.** **208**

**ప్రతిపదార్థం:** సన్నిధిచేసి= సమీపానికి వచ్చి; పుత్రీ!= కుమారీ!; తపముమెయిన్= తపస్సుతో; ఉన్నన్= ఉంటే; ప్రయోజనము= కార్యం; కలదె?= ఉన్నదా?; ఉడుగుము= మానుము; అన్నన్= అనగా; నాతి= వనిత; అతనితోన్= ఆ బ్రహ్మతో; శరణంబు వేఁడెదన్= శరణు కోరుతాను; నన్నున్ దయన్= నన్ను దయతో; కావుము+అనియెన్= రక్షించు మని అన్నది.

**తాత్పర్యం:** (బ్రహ్మ) ఆమె సమీపానికి వచ్చి 'బిడ్డా! ఈ విధంగా తపస్సు చేస్తూ ఉంటే నీకు కలిగే ప్రయోజన మేమి? ఈ తపోనిష్ఠ వదలిపెట్టుము' అని చెప్పాడు. అందు కామె బ్రహ్మతో "దేవా! నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను దయతో రక్షించుము' అని చెప్పింది.

**వ.** **అనిన విని యమ్మహాత్ముండు.** **209**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆకర్ణించి; ఆ+మహాత్ముండు= ఆ బ్రహ్మ.

**తాత్పర్యం:** ఆమె అట్లా అనగా విని మహాత్ముడైన చతుర్ముఖుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **'ప్రజల హరియించు టిది నీకు పరమధర్మ; । మేను బొంకెదనే? దీని నెల్ల భంగి**
**నాచరింపన వలయు; మత్ప్రార్థనంబు । భగ్న మొనరించు టొప్పదు పద్మనయన!** **210**

**ప్రతిపదార్థం:** పద్మనయన!= కమలనేత్రా!; ప్రజలన్= జనులను; హరియించుట= సంహరించటం; ఇది= అనే ఈ పని; నీకున్ పరమధర్మము= నీకు శ్రేష్ఠమైన ధర్మం; ఏను= నేను; బొంకెదనే?= అసత్యం పలుకుతానా!; దీనిన్= ఈ ప్రజాసంహారాన్ని;

ఎల్లభంగిన్= ఎన్ని విధాలనైనా; ఆచరింపన వలయున్= చేసేతీరాలి; మత్ప్రార్థనంబు= నా వేడికోలు; భగ్నము+ఒనరించుట= వమ్ముచేయటం; ఒప్పదు= తగదు.

**తాత్పర్యం:** పద్మాలవంటి నేత్రాలు కలదానా! ప్రజాసంహారం కావించటమే నీకు మేలైన ధర్మం. నేను నీతో అసత్య మాడుతానా? ఈ పనిని నీవు అన్నివిధాలా చేసే తీరాలి. నా కోరికను నెరవేర్చకుండా వమ్ముచేయటం నీకు ఉచితం కాదు.

**వ. మఱియు నొక్క విశేషంబు సెప్పెద; నీయశ్రుజలంబు లే నంజలిపుటంబునం బట్టు టెఱుంగుదు గాదె? యవి నానావ్యాధిరూపంబుల మానవుల బాధించుఁ; గామ క్రోధంబులు వానికిం దోడుపడు; వారు దానన తెగుదురు; నీవు నిమిత్తమాత్రం; బింతియ; నీకు వరం బిచ్చెద. 211**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఒక్కవిశేషంబు= ఒక విశిష్టవిషయాన్ని; చెప్పెదన్= చెప్పుతాను; ఏను= నేను; నీ అశ్రుజలంబులు= నీ కన్నీరు; అంజలిపుటంబునన్= దోయిట; పట్టుట= గ్రహించటం; ఎఱుంగుదుకాదె?= తెలియుదువుగదా!; అవి= ఆ కన్నీళ్ళు; నానావ్యాధిరూపంబులన్= అనేక రోగరూపాలతో; మానవులన్= మనుజులను; బాధించున్= పీడిస్తాయి; కామక్రోధంబులు= కోరిక, కోపం అనేవి; వానికిన్= ఆ కన్నీటికి; తోడుపడున్= సాయపడతాయి; వారు= ఆ మానవులు; దానన= దానివల్లనే; తెగుదురు= మరణిస్తారు; నీవు నిమిత్తమాత్రంబు= నీవు కారణంమాత్రమే; ఇంతియ= ఇంతే; నీకున్ వరంబు+ఇచ్చెదన్= నీకు విశేషించి ఒక వరంకూడా ఇస్తాను.

**తాత్పర్యం:** ఇంకా ఒక విశేషాంశం చెప్పుతాను. నీ కన్నీటిబిందువులను నేను నా దోసిట పట్టుకొనటం నీకు తెలుసుగదా! ఆ కన్నీరు అనేకరోగాల రూపాలతో మనుష్యులను బాధిస్తాయి. కామక్రోధాలనే దుర్గుణాలు ఆ పనిలో ఆ కన్నీటికి సాయం చేస్తాయి. ఆ మానవులు వాటితోనే మరణిస్తారు. నీవు ఈ పనిలో నిమిత్తమాత్రంగానే ఉంటావు. ఇంతే. నీకు విశేషించి ఒక వరం కూడా ఇస్తాను.

**తే. పురుషుఁడును నంగనయును నపుంసకుండు । నగుము పుత్రిక! పురుషుని నంగనను న**
**పుంసకుని జంపువేళలఁ బొందకుండు । పాపమును నిది ధర్మమై పరఁగు నీకు.' 212**

**ప్రతిపదార్థం:** పుత్రిక!= కుమారీ!; పురుషుఁడును= మగవాడుగానూ; అంగనయును= స్త్రీగానూ; నపుంసకుండును= పేడివిగానూ; అగుము= కమ్ము; పురుషునిన్= మగవాడిని; అంగనను= స్త్రీని; నపుంసకునిన్= పేడివాడిని; చంపువేళలన్= సంహరించే సమయంలో; పాపమును= కల్మషాన్ని; పొందకుండు= చెందకుండా ఉంటుంది; ఇది= ఈ సంహారం; నీకున్ ధర్మము+ఐ పరఁగున్= నీకు ధర్మకార్యమై విలసిల్లుతుంది.

**తాత్పర్యం:** కుమారీ! నీవు పురుషుడుగా, స్త్రీగా, నపుంసకుడిగా కమ్ము. అట్లయినప్పుడు నీవు మగవాడిని, ఆడుదానిని, పేడివానిని చంపేసమయంలో నీకు పాపమంటదు. అంతేకాక నీకది కర్తవ్యమైన ధర్మంగా కూడా పరిణమిస్తుంది.

**వ. అని పలుకుటయు నప్పొలంతి శాపంబునకు వెఱచియు, నది యట్టిద కాక యను తలంపు దోఁచియుఁ, బ్రజాసంహారంబు సేయు నధికారంబు పూనె; మృత్యుదేవత ప్రాణాపహారిణి యగుఁ బ్రాణిజాలంబు దేహంబులం బాసి దేవాదిభావంబులం బొందుచు మగుడ మనుష్యత్వంబు నొందుచుండు. 213**

**ప్రతిపదార్థం:** అని పలుకుటయున్= అని చెప్పగానే; ఆ+పొలంతి= ఆ వనిత; శాపంబునకున్= బ్రహ్మ శాపానికి; వెఱచియున్= భయపడి కూడా; అది= ఆ కార్యం; అట్టిద కాక= అట్టిదేఅగుగాక; అను= అనునట్టి; తలంపు= భావన; తోఁచియున్= కలిగియు;

ప్రజాసంహారంబున్= జనులను చంపటాన్ని; చేయు అధికారంబు= నిర్వహించే ప్రక్రియను; పూనెన్= వహించింది; మృత్యుదేవత= మరణదేవత; ప్రాణ+అపహారిణి= ప్రాణాలను అపహరించేది; అగున్= అవుతుంది; ప్రాణిజాలంబు= జంతుసంతతి; దేహంబులన్= శరీరాలను; పాసి= వదలి; దేవ+ఆదిభావంబులన్= దేవతలు మొదలైన స్వరూపాలను; పొందుచున్= చెందుతూ; మగుడన్= మరల; మనుష్యత్వంబున్= మానవత్వాన్ని; ఒందుచున్+ఉండున్= పొందుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** బ్రహ్మ ఆ విధంగా చెప్పగానే ఆ వనిత అతడి మాట వినకపోతే అతడు శపిస్తాడేమో అని భయపడింది. తన కర్తవ్యం అట్టిదే అగునుగాక అనే ఊహకూడా ఆమెకు సంభవించింది. అందువలన ఆమె జనసంహారమనే అధికారాన్ని వహించింది. ఆ మృత్యుదేవతే ప్రజలప్రాణాలను అపహరించేదిగా ఉన్నది. ప్రాణుల సమూహం మరణకాలంలో శరీరాలు వదలి పూర్వకర్మానుసారంగా దేవాదిస్వరూపాలు పొందుతుంది. మళ్ళీ మానవత్వం ఆ ప్రాణులకు కలుగుతూ ఉంటుంది.

**తే.** **భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్ర। తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డొడలు**
**మనుపఁ జెఱుపంగ నొడయండు సనుట మగుడ। నరుగుదెంచుట వింతగా దతని కెందు.'** **214**

**ప్రతిపదార్థం:** జగత్ప్రాణుఁడు= వాయుదేవుడు; భీమనాదుండు= భయంకరమైన శబ్దం కలవాడు; భీముఁడు= భీకరుడు; ఉద్దాముఁడు= స్వతంత్రుడు; అప్రతర్క్యతేజోమయుఁడు= ఊహకందని తేజస్స్వరూపం కలవాడై; ఒడలు= శరీరమును; మనుపన్= కాపాడటానికి;చెఱుపంగన్= నశింపజేయటానికి; ఒడయండు= ప్రభువు; అతనికిన్= ఆ వాయువునకు; ఎందున్= ఎక్కడనైనా; చనుట= పోవటం; మగుడన్= మరల; అరుగుదెంచుట= రావటం; వింతకాదు= ఆశ్చర్యం కాదు.

**తాత్పర్యం:** జగత్తునకు ప్రాణస్వరూపుడైన వాయువు భీకరమైన ధ్వని కలిగి ఉంటాడు. అతడు భయంకరుడు; కట్టుబాటులేనివాడు, ఊహించరాని తేజస్సు కలవాడు. అతడే శరీరాన్ని రక్షించటానికీ, నశింపజేయటానికీ సమర్థుడైన ప్రభువు. ఎక్కడికైనా అతడు పోవటం, మళ్ళీ రావటం అనేది వింతకాదు'.

**వ.** **అనినం 'దొల్లియు నిది వింటి; నాఁ డత్యంత శోకాక్రాంతుండ నగుట న వ్వినికి రిత్తవోయె; నేఁ డీ యుపాఖ్యానంబున యర్థంబు పరిజ్ఞాతం బయ్యె.'** **215**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; తొల్లియున్= పూర్వంకూడా; ఇది= ఈ విషయాన్ని; వింటిన్= విన్నాను; నాఁడు= ఆ దినం; అత్యంతశోక+ఆక్రాంతుండను= మిక్కిలి దుఃఖంచేత పీడితుడను; అగుటన్= కావటంవలన; ఆ+వినికి= ఆ వినటం; రిత్తపోయెన్= వ్యర్థమయింది; నేఁడు= ఈ దినం; ఈ ఉపాఖ్యానంబున= ఈ కథలోని; అర్థంబు= మృత్యువిషయం; పరిజ్ఞాతంబు= తెలిసింది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** భీష్మ డట్లా చెప్పేసరికి ధర్మజుడు 'ముందుకూడా ఇది విన్నాను. కాని, ఆ దినాన మిక్కిలిగా దుఃఖపీడితుడను కావటం వలన ఆ విన్నది వ్యర్థమయింది. నేడు నీవు చెప్పిన ఈ కథలో విషయం నాకు బోధ పడింది'.

**క.** **అని పలికి యధిప! కుంతీ। తన యాగ్రజుఁ డిట్టు లనుఁ బితామహుతో 'స**
**జ్జనకోటి ధర్మమునకును। మనమున వెఱచు; నది యింత మాన్యం బగునే?** **216**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అని పలికి= అని చెప్పి; కుంతీ తనయ+అగ్రజుఁడు= కుంతీపుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; పితామహుతోన్= భీష్ముడితో; ఇట్టులు+అనున్= ఈ రీతిగా అన్నాడు: సజ్జనకోటి= సుజనులయొక్క సమూహం; ధర్మమునకున్= ధర్మానికి; మనమునన్= చిత్తంలో; వెఱచున్= భయపడుతుంది; అది= ఆ ధర్మం; ఇంత మాన్యంబు= ఇంతగా పూజింపదగింది; అగునే?= అవునా?

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! ధర్మరాజు ఈ రీతిగా చెప్పి భీష్ముడితో మళ్ళీ ఇట్లా అన్నాడు: 'సజ్జనులైన వారు తమ మనస్సులో ధర్మానికి భయపడుతున్నారు. ఆ ధర్మం ఇంతగా పూజింపదగినంత గొప్పదా?

**వ. ధర్మంబు తెఱం గిట్టిదని నిరూపించి యనుగ్రహింపుము.' 217**

**ప్రతిపదార్థం:** ధర్మంబు తెఱంగు= ధర్మంయొక్క తీరు; ఇట్టిది+అని= ఈ విధంగా ఉన్నదని; నిరూపించి= వివరించి; అనుగ్రహింపుము= అనుగ్రహం చూపుము.

**తాత్పర్యం:** ఆ ధర్మముయొక్క పద్ధతి ఇట్లాంటిదని ప్రతిపాదించి నన్ను అనుగ్రహించుము'.

**సీ. అనుటయు నతఁ డిట్టు లనియె 'వేదంబుల। మీఁది భక్తియు దృఢస్మృతియు సమ్య**
**గాచారమును రుచిరాకారములు ధర్మ। మునకుఁ గొందఱు బుధజనము లర్థ**
**మగుఁ జతుర్థాకార మం; డ్రయినను బాడి। దప్పియు బొంకియు ధనము గూర్చు**
**టెల్ల పాపములకు నెక్కుడు; బొంకమి। పరుల సొమ్ముల కాసపడమి సర్వ**

**ఆ. ధర్మములకు నధికతరములు విధివిహి। తంబు గాని యట్టి ధర్మ మనఘ!**
**చవుట నిడిన విత్తు చాడ్పున రూపించి। చేయ నిహపరములఁ జెందు సుఖము. 218**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (ధర్మరాజు) అట్లు అనగా; అతఁడు= భీష్ముడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అనఘ!= పాపరహితుడా!; ధర్మమునకున్= ధర్మానికి; వేదంబులమీఁది భక్తియున్= వేదముల యందు భక్తినీ దృఢస్మృతియున్= గట్టిస్మృతియును; సమ్యగాచారమును= చక్కని ఆచరణమును; రుచిర+ఆకారములు= అందమైన(మూడు) స్వరూపాలు; కొందఱు బుధజనములు= పండితులు కొందరు; అర్థము= ధనం; చతుర్థ+ఆకారము= నాల్గవస్వరూపం; అగున్ అంద్రు= అగునని చెప్తుతారు; అయినను= ఐనప్పటికి; పాడితప్పియున్= న్యాయం దప్పియును; బొంకియున్= అసత్య మాడియు; ధనమున్+కూర్చుట= అర్థము నార్జించటం; ఎల్లపాపములకున్= సమస్త పాపాలకు; ఎక్కుడు= అధికమైనది; బొంకమి= అసత్యం పలుకకుండా ఉండటం; పరులసొమ్ములకున్= ఇతరుల ధనములకు; ఆస పడమి= ఆశపడకుండా ఉండటం; సర్వధర్మములకున్= అన్ని ధర్మాలకూ; అధికతరములు= ఎక్కువయినవి; విధివిహితంబుకాని= శాస్త్రోక్తం కానట్టి; అట్టి ధర్మము= అటువంటి ధర్మం; చవుటన్= చవిటినేలలో; ఇడిన= ఉంచిన; విత్తుచాడ్పునన్= విత్తనమువంటిదని; రూపించి= నిరూపించి; చేయన్= అనుష్ఠించగా; ఇహపరములన్= ఈ లోకంలోనూ, పరలోకంలోనూ; సుఖము చెందున్= సుఖం పొందుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనగానే భీష్ము డతడితో ఈ రీతిగా చెప్పాడు: 'అనఘా! వేదాలపై భక్తీ, స్మృతులపై గట్టి విశ్వాసం, మంచి ఆచారం అనేవి మూడూ ధర్మానికి సుందరమైన ఆకారాలు. కొందరు పండితులు ధనం ధర్మానికి నాల్గవ ఆకారమంటారు. ఐనా న్యాయం తప్పి, అసత్యం పలికి ధనం సంపాదించటం పాపాలన్నింటిలోకీ ఎక్కువపాపం. అసత్యం పలకకుండా ఉండటం, ఇతరుల ధనాన్ని ఆశించకుండటం అన్ని ధర్మాలలోనూ మేలైన ధర్మాలు. శాస్త్రవిరుద్ధమైన ధర్మం చేయటం చవిటి నేలలో విత్తిన విత్తనం వలె నిష్ప్రయోజనమవుతుంది. ఇది గ్రహించి ప్రవర్తిస్తే ఇహలోక పరలోకాలలో సుఖం లభిస్తుంది.

**వ. ధర్మంబు తెఱంగు సూక్ష్మంబు; ధర్మంబులు బహువిధంబు; లట్లు గావున ధర్మసర్వస్వ నైజస్వరూప నిరూపణంబు**
**సేసి కరతలామలకంబుగాఁ బలికెద నాకర్ణింపుము. 219**

**ప్రతిపదార్థం:** ధర్మంబు తెఱంగు= ధర్మంయొక్క పద్ధతి; సూక్ష్మంబు= అధ్యాత్మమైన (అగోచరమైనది); ధర్మంబులు= ధర్మాలు; బహువిధంబులు= అనేక విధాలు; అట్లు కావునన్= ఆ కారణంవలన; ధర్మసర్వస్వ నైజస్వరూపనిరూపణంబు= సర్వధర్మసారమైన నిజస్వరూపంయొక్క ప్రతిపాదనమును; చేసి= ఒనర్చి; కరతల+ఆమలకంబుగాన్= చేతిలోని ఉసిరిక కాయవలె స్పష్టమయ్యేటట్లు; పలికెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ధర్మస్వరూపం చాలా సూక్ష్మమై అగోచరంగా ఉంటుంది. ధర్మాలు నానావిధాలుగా ఉంటాయి. అందువలన అన్ని ధర్మాలకూ సారభూతమైనది ధర్మనిజ స్వరూపజ్ఞానం. ఆ స్వరూపాన్ని నిరూపించి అరచేతిలోని ఉసిరికకాయవలె స్పష్టమయ్యేటట్లు వివరిస్తాను వినుము.

**క. ఒరు లేమేమి యొనర్చిన । నరవర! యప్రియము తన మనంబున కగుఁ దా**
**నొరులకు నవి సేయకునికి । పరాయణము పరమధర్మపథముల కెల్లన్.' 220**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; ఒరులు= పరులు; ఏమి+ఏమి+ఒనర్చినన్= ఏ యే పనిచేస్తే; తన మనంబునకున్= తన చిత్తానికి; అప్రియము అగున్= అనిష్టం అగునో; అవి= ఆ పనులు; తాను ఒరులకున్= తాను పరులకు; చేయక+ఉనికి= చేయకుండా ఉండటం; పరమధర్మపథములకున్+ఎల్లన్= శ్రేష్ఠమైన ధర్మమార్గా లన్నింటికీ; పరాయణము= ఉత్తమమైన ఆశ్రయం.

**తాత్పర్యం:** రాజా! ఇతరులు ఏమేమి చేస్తే తన మనస్సునకు అప్రియంగా ఉంటుందో, ఆ పనులను తాను ఇతరులకు చేయకుండా ఉండటమే అన్ని ధర్మమార్గాలకూ ఉత్తమమైన ఆలంబనంగా ఉన్నది'. ('ధర్మపదములకు' అన్న పాఠమునకు 'ధర్మస్థానాలకు' అని అర్థం చెప్పుకొనాలి).

**వ. అని చెప్పినం బ్రీతుండై తాతకుం బ్రణమిల్లి పాండవాగ్రజుండు 'ధర్మస్వరూప నిరూపణం బింత యొప్పునే!' యని యభివర్ణించి 'యాగ్రహంబున నేమేనియు నడుగుచున్నవానింగా నన్నుం దలంప వలదు; వలవని యట్టిది యడుగం దెలిసికొనుటకై వలయునది యడుగుదు; నట్లుంగాక యడిగిన దానిన యడుగుటయుం గలుగుఁ; గృప నాదరింపుము. సమ్యగాచారంబు ధర్మప్రకారంబని నిర్దేశించితి; వుత్తమాచార ప్రకారం బెఱింగింపవే' యనుటయు నమ్మనుజపతికి నమ్మహితాత్ముం డిట్లనియె. 221**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని వచించగా; ప్రీతుండు+ఐ= సంతసించినవాడై; తాతకున్= పితామహుడైన భీష్ముడికి; ప్రణమిల్లి= నమస్కరించి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ధర్మస్వరూపనిరూపణంబు= ధర్మానికి చెందిన నిజరూపంయొక్క ప్రతిపాదనం; ఇంత ఒప్పునే= ఇంతగా ఒప్పిదమగునే; అని అభివర్ణించి= అభినందన పూర్వకంగా పల్కి; నన్నున్= నన్ను; ఆగ్రహంబునన్= కోపంతో; ఏమి+ఏనియున్= ఏదేదో; అడుగుచున్నవానింగాన్= ప్రశ్నించేవాడనుగా; తలంపన్ వలదు= అనుకొనవద్దు; వలవనిఅట్టిది= అనావశ్యకమైనదానిని; అడుగన్= ప్రశ్నించను; వలయునది= ఆవశ్యకమైనది; తెలిసికొనుటకై= బోధపరచుకొనటానికై; అడుగుదున్= ప్రశ్నిస్తాను; అట్లున్+కాక= అట్లేకాకుండా; అడిగినదానినిన్= ప్రశ్నించిన విషయాన్ని; అడుగుటయున్= మరల ప్రశ్నించటం; కలుగున్= సంభవిస్తుంది; కృపన్= దయతో; ఆదరింపుము= మన్నించుము; సమ్యగాచారంబు= మంచి ఆచారం; ధర్మ+ఆకారంబు+అని= ధర్మంయొక్క స్వరూపమని; నిర్దేశించితి(వి)= చెప్పావు; ఉత్తమ+ఆచార ప్రకారంబు= మేలైన ఆచారముయొక్క విధానాన్ని; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అనేసరికి; ఆ+మనుజపతికిన్= ఆ రాజునకు; ఆ+మహిత+ఆత్ముండు= ఆ మహాత్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ము డావిధంగా చెప్పేసరికి ధర్మరాజు సంతుష్టు డయ్యాడు. తాతకు నమస్కరించాడు. 'ధర్మస్వరూప నిరూపణం ఇంత చక్కగా ఉన్నదే!' అని ఆ నిరూపణాన్ని మెచ్చుకొన్నాడు. తరువాత భీష్ముడిని చూచి ' నేనేదో

పట్టుదలతో అడుగుతున్నానని భావించవద్దు. అవసరం లేనిదాని నడగను. తెలిసికొనాలన్న అంశాన్ని అడుగుతాను. అంతేకాదు. ఒక్కొక్క సారి జిజ్ఞాసతో అడిగిన విషయాన్నే మళ్ళీ అడుగుతుంటాను. దయతో నన్ను మన్నించి అనుగ్రహించుము. నీవు ధర్మస్వరూపాన్ని నిరూపిస్తూ సదాచారం ధర్మముయొక్క స్వరూపమని చెప్పావు. ఉత్తమమైన ఆచారం ఎట్లాంటిదో నాకు తెలియజెప్పుము' అని అడిగాడు. అప్పుడు ఆ ధర్మరాజుతో మహాత్ముడైన భీష్ముడు ఇట్లా అన్నాడు:

**తే. 'వేద మాచారములఁ జెప్పు వివిధగతుల; । సకలహిత మగునట్టి యాచార మరయ**
**ననఘ! వేఱొండు గలదె? మహాత్ము లెద్ది । యాచరించిరి దానిఁ జేయంగవలయు.' 222**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; వేదము= శ్రుతి; వివిధగతులన్= అనేకవిధాల; ఆచారములన్= ఆచరణాలను; చెప్పున్= వచిస్తుంది; సకలహితము+అగునట్టి= అందరికీ హితమైనట్టి; ఆచారము= ఆచరణం; వేఱొకటి= మరొకటి; అరయన్= పరిశీలించగా; కలదె?= ఉన్నదా?; మహాత్ములు= పెద్దలు; ఎద్ది= దేనిని; ఆచరించిరి= చేస్తారో; దానిన్= ఆ కార్యమును; చేయంగన్ వలయున్= అనుష్ఠించాలి.

**తాత్పర్యం:** 'పాపరహితా! వేదం వివిధాచారాలను నిరూపిస్తున్నది. పరిశీలించి చూస్తే అందరికీ హితకరమైన సదాచారం వేరే ఏమున్నది? మహాత్ములైన వారు ఏ ఆచారాన్ని పాటిస్తారో, దానినే తక్కినవారు పాటించాలి.

**వ. అని పలికి 'తొల్లి జాజలి యను మునికిఁ దులాధారుండను వణిగ్వరునితో సంవాదంబు గలిగె; నది యితిహాసరూపంబునఁ జెల్లు; నేతద్విషయంబయి యుండు దానిం జెప్పెద; నాకర్ణింపుము. 223**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; తొల్లి= పూర్వం; జాజలిఅను మునికిన్= 'జాజలి' అనే మౌనికీ; తులాధారుఁడు+అను వణిగ్వరునితోన్= తులాధారుడనే వైశ్య ప్రముఖుడితో; సంవాదంబు= సంభాషణ; కలిగెన్= ప్రవర్తిల్లింది; అది= ఆ సంవాదం; ఇతిహాసరూపంబునన్= ఇతిహాసంగా; చెల్లున్= ప్రవర్తిల్లుతున్నది; ఏతద్విషయంబయి= ఈ సదాచారరూపమైన ధర్మాన్ని విషయంగా కలిగినదై; ఉండున్= ఉంటున్నది; దానిన్= ఆ సంవాదాన్ని; చెప్పెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని వచించి భీష్ముడు ఇట్లా అన్నాడు: 'పూర్వం 'జాజలి' అనే మునికీ, తులాధారుడనే వైశ్య శ్రేష్ఠుడితో ఒక సంవాదం జరిగింది. అది ఇతిహాసరూపంలో ఉన్నది. అది నీ వడిగిన సదాచారరూపమైన ధర్మాన్ని వివరిస్తుంది. ఆ సంవాదాన్ని వివరిస్తాను వినుము.

### జాజలి తులాధారుల సంవాదప్రకారము (సం. 12-252-1)

**సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నా । సీనుఁడై యుండఁ బిచ్చికలు గూఁడు**
**గావించెఁ దన్మస్తకంబున; నమ్మిథు । నము గారణముగ నండములు గలిగి**
**పిల్లలై వర్తించి యెల్లెడ కెరగొన । నరుగుచు మరలుచు నవియు నవియు**
**నగ్గూఁట వసియింప, నతఁడు దయాళుఁ డై । వానిఁ జోపక యుండి వత్స! తనదు**

**తే. నియతి కెద మెచ్చి యీధర్మనిష్ఠ యెందుఁ । గలదె? యనుటయు మ్రోసె నాకాశవాణి;**
**ధర్మపరుఁ డైన యత్తులాధారుఁ డింత । యాడఁ డిట్లాడ నే లని యద్భుతముగ. 224**

**ప్రతిపదార్థం:** వత్స!= కుమారా!; జాజలి= జాజలి అనేముని; చలనంబు లేక= కదలిక లేకుండా; తపోనిష్ఠన్= తపస్సుకు చెందిన పూనికతో; ఆసీనుఁడు+ఐ+ఉండన్= కూర్చొనిఉండగా; పిచ్చికలు= ఊరపిచ్చుకలు; తన్మస్తకంబునన్= అతడితలమీద; గూఁడు= పక్షిగృహం; కావించెన్= నిర్మించాయి; ఆ+మిథునము= ఆ పక్షులజంట; కారణముగన్= హేతువుగా; అండములు= గ్రుడ్లు; కలిగి= సంభవించి; పిల్లలు+ఐ= శిశువులై; వర్తించి= ఉండి; ఎల్లెడకున్= అన్నిచోట్లకు; ఎరగొనన్= ఆహారం స్వీకరించటానికి; అరుగుచున్= పోతూ; మరలుచున్= తిరిగివస్తూ; అవియున్= ఆ పిచ్చుకలజంటయు; అవియు= వాని పిల్లలును; ఆగూఁటన్= ఆ గూడునందు; వసియింపన్= నివసిస్తూ ఉండగా; అతఁడు= ఆ జాజలి; దయాళుఁడు+ఐ= దయగలవాడై; వానిన్= ఆ పక్షులను; చోపకఉండి= తరుమక ఉండి; తనదు= తనయొక్క; నియతికిన్= నియమానికి; ఎదన్= హృదయంలో; మెచ్చి= అభినందించి; ఈ ధర్మనిష్ఠ= ఈ ధర్మస్థితి; ఎందున్= ఎక్కడైనా; కలదె?= ఉన్నదా?; అనుటయున్= అనగానే; ఆకాశవాణి= గగనవాణి; ధర్మపరుఁడు+ఐన= ధర్మమునందు ఆసక్తుడైన; ఆ+తులాధారుఁడు= ఆ తులాధారుడనేవాడు; ఇంత ఆడఁడు= ఇంతగా మాట్లాడడు; ఇట్లు+ఆడన్+ఏల?= ఈ రీతిగా చెప్పటం ఎందుకు?; అని అద్భుతముగన్= అని ఆశ్చర్యకరంగా; మ్రోసెన్= ధ్వనించింది.

**తాత్పర్యం:** కుమారా! జాజలి అనే ముని కదలిక లేకుండా తపఃస్థితిలో ఆసీనుడై ఉన్నాడు. పిచ్చుకలు అతడి తలపై గూడు నిర్మించాయి. అందులో గ్రుడ్లు కూడా పెట్టాయి. ఆ గ్రుడ్లు పొదిగి పిల్లలయ్యాయి. పెద్ద పిచ్చుకలు, వాటి పిల్లలూ కలిసి ఆహారం కొరకై అన్నిచోట్లకూ పోతూ వస్తూ ఆ గూటిలో నివసించసాగాయి. ఆ జాజలి దయతో ఆ పక్షులను తరిమివేయకుండా ఉండి తన నియమానికి తానే మెచ్చుకొని 'ఇంతటి ధర్మనిష్ఠ ఎక్కడైనా ఉంటుందా?' అని అనుకొన్నాడు. అప్పుడు ఆకాశవాణి 'మహాధర్మాత్ముడైన తులాధారుడు ఈ విధంగా ఎప్పుడూ మాట్లాడి ఎరుగడు. ఈ విధంగా నిన్ను నీవు గొప్పగా మెచ్చుకొంటూ మాట్లాడటం ఎందుకు?' అని అతడిని ఆక్షేపిస్తూ ఆశ్చర్యకరంగా ధ్వనించింది.

**వ.** **అట్లు మ్రోసిన విని వెఱఁగుపడి యత్తులాధారుం గాన వలయు నని తలంచినం 'దులాధారుండు వారాణసీపురంబున నున్నవాఁ' డను వాక్యంబును నంబరంబున వీతెంచె; నమ్మునియును మత్సరభరితుఁ డగుచు నప్పురంబునకుం బోయి జనసంపూజ్య వాణిజ్యంబునం బ్రవర్తిల్లు నతనిం గాంచిన నతండు సముచితసత్కారం బాచరించి యిట్లనియె.** **225**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; మ్రోసినన్= ధ్వనించగా; విని= ఆలకించి; వెఱఁగుపడి= ఆశ్చర్యమొంది; ఆ+తులాధారున్= ఆ తులాధారుడనే వాడిని; కానన్ వలయును+అని= చూడాలని; తలంచినన్= సంకల్పించగా; తులాధారుండు= తులాధారుడనేపేరుగల వైశ్యుడు; వారాణసీపురంబునన్= కాశీనగరంలో; ఉన్నవాఁడు= ఉన్నాడు; అను వాక్యంబునున్= అనేమాటకూడ; అంబరంబునన్= ఆకాశంలో; వీతెంచెన్= ఉదయించింది; ఆ+మునియును= ఆ జాజలి కూడా; మత్సరభరితుండు+అగుచున్= మచ్చరం గలవాడై; ఆ+పురంబునకున్= ఆ నగరానికి; పోయి= వెళ్ళి; జనసంపూజ్య వాణిజ్యంబునన్= ప్రజలచేత పూజించదగిన వ్యాపారకృత్యమునందు; ప్రవర్తిల్లు= వ్యవహరిస్తున్న; అతనిన్= ఆ తులాధారుడిని; కాంచినన్= చూడగా; అతండు= ఆ తులాధారుడు; సముచిత సత్కారంబు= తగిన మర్యాద; ఆచరించి= చేసి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ ధ్వని విని జాజలి ఆశ్చర్యం పొందాడు. 'ఆ తులాధారుడిని చూడా లనుకొన్నాడు. ఇంతలో 'అతడు కాశిలో ఉంటాడు' అనే వాక్యం ఆకాశంనుండి వినిపించింది. ఆ ముని మాత్సర్యంతో కూడినవాడై కాశికి పోయాడు. అక్కడ ప్రజామాన్యమైన వ్యాపారంలో ఉన్న తులాధారుడిని చూచాడు. అంతట ఆ తులాధారు డతడికి తగిన సత్కారం చేసి ఇట్లా అన్నాడు.

**తే. 'పిచ్చికలు గూఁడు శిరమునఁ బెట్టి తారుఁ । బిల్లలును సుఖలీల వర్తిల్లుచుండఁ**
**జిత్తవికృతి లే కెట్టులు సేయుదయ్య । తపము? సంభావనీయవర్తనుఁడ వీవు.' 226**

**ప్రతిపదార్థం:** పిచ్చికలు= ఊరబిచ్చికలు; శిరమునన్= తలపై; గూఁడుపెట్టి= గృహం కట్టి; తారున్= తామును; పిల్లలును= శిశువులును; సుఖలీలన్= హాయిగా; వర్తిల్లుచుండన్= బ్రదుకుతుండగా; చిత్తవికృతి= మనోవికారము; లేక= కలుగకుండా; ఎట్టులు= ఎట్లా; తపముచేయుదు+అయ్య!= తపస్సు చేస్తున్నావయ్యా!; ఈవు= నీవు; సంభావనీయవర్తనుఁడవు= గౌరవింపదగిన ప్రవర్తన కలవాడవు.

**తాత్పర్యం:** 'అయ్యా! పిచ్చికలు నీ తలమీద గూడు కట్టుకొని అక్కడ తామూ, తమ పిల్లలూ కలిసి హాయిగా జీవిస్తూఉండగా నీవు ఏ మాత్రం మనోవికారం లేకుండా ఎట్లా తపస్సు చేస్తున్నావు? నీ ప్రవర్తన చాలా గౌరవించదగింది.'

**వ. అనినఁ దదీయబోధంబునకు విస్మయంబందుచు విప్రోత్తముండు 'నీవు వణిగ్వర్తనంబున నుండ నెవ్విధం బగు ధర్మంబున నివ్విశేషంబు గలిగె?' ననవుడు నతం డతని కిట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని చెప్పగా; విప్రోత్తముండు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; తదీయ బోధంబునకున్= అతడి జ్ఞానానికి; విస్మయంబు+అందుచున్= ఆశ్చర్యపడుతూ; నీవు వణిగ్వర్తనంబునన్= నీవు వ్యాపారవృత్తిలో; ఉండన్= ఉండగా; ఏ+విధంబు+అగు= ఏ విధమైన; ధర్మంబునన్= ధర్మంచేత; ఈ+విశేషము= ఈ త్రైకాలికజ్ఞాన విశేషం; కలిగెన్?= సంభవించింది?; అనవుడున్= అని అడుగగా; అతండు= ఆ తులాధారుడు; అతనికిన్= ఆ జాజలికి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** తులాధారు డట్లా అనేసరికి బ్రాహ్మణశ్రేష్ఠుడైన జాజలి అతడి జ్ఞానానికి ఆశ్చర్యపడ్డాడు. 'నీవు వ్యాపారవృత్తిలో ఉన్నావుగదా! నీ కేవిధంగా ఇట్లాంటి జ్ఞానాతిశయం కలిగింది?' అని ప్రశ్నించాడు. అప్పుడు తులాధారు డతడితో ఇట్లా అన్నాడు:

**సీ. 'విలుచుట నమ్ముట నొలయదు వంచన । యర్ఘలాభంబున యనుభవింతు;**
**సరి సిద్ధ్యసిద్ధులు; సమలోష్టకాంచన । మై యుండు మనసు; నిందాభినుతులు**
**హింసయు నాత్మ ప్రశంసయు లేవు; భూ । తంబులయం దెల్ల దయ ఘటిల్లు;**
**నభయదక్షిణ మగు నంచిత సత్య యా । గము సెల్లుఁ; గోర భోగమును యశము;**

**తే. నెవ్వరికి మేలు సేసిన నింత సేసి । నాఁడ ననుబుద్ధి మమత యెన్నండు నాకుఁ**
**గలుగ దేమిట నేనియు వలపునొల్ల । మియును బుట్టదు; నిక్క మింతయు మహాత్మ! 228**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= గొప్ప మనసు కలవాడా!; విలుచుటన్= కొనటంలోనూ; అమ్మటన్= విక్రయంలోనూ; వంచన= మోసం; ఒలయదు= కలుగదు; అర్ఘలాభంబున= తగిన లాభాన్నే; అనుభవింతున్= అనుభవిస్తాను; సిద్ధి+అసిద్ధులు= లాభనష్టాలు; సరి= సమానం; మనసు= చిత్తం; సమలోష్టకాంచనము+ఐ= మట్టి పెళ్ళయందును, బంగారునందును సమభావంకలదై; ఉండున్= ఉంటుంది; నిందా+అభినుతులు= తెగడ్త, పొగడ్తలు; హింసయున్= బాధించుటయు; ఆత్మప్రశంసయున్= నన్ను నేను పొగడుకొనటం; లేవు= ఉన్నవి కావు; భూతంబులయందున్+ఎల్లన్= సమస్త ప్రాణులలోనూ; దయ= కరుణ; ఘటిల్లున్= కల్గును; అభయదక్షిణము+అగు= నిర్భయత్వమే దక్షిణగా గలిగినదైన; అంచితసత్యయాగము= మానితమైన సత్యమనే యాగం; చెల్లున్= ప్రవర్తిల్లుతుంది; భోగమును= సుఖమును; యశమున్= కీర్తిని; కోరన్= వాంఛించను; ఎవ్వరికిన్= ఎట్లాంటివారికి; మేలుచేసినన్=

ఉపకారం చేసినను; ఇంత సేసినాఁడన్= నేను ఇంత ఉపకారం చేశాను; అను బుద్ధి= అనే తలపు; మమత= మమకారం; ఎన్నండున్= ఎప్పుడును; నాకున్ కలుగదు= నాకు సంభవించదు; ఏమిటన్+ఏనియున్= దేనియందైనను; వలపున్= రాగమును; ఒల్లమియును= ద్వేషమును; పుట్టదు= కలుగదు; ఇంతయున్= ఇదంతా; నిక్కము= నిజము.

**తాత్పర్యం:** 'మహాత్మా! నేను వ్యాపారవృత్తిలో క్రయవిక్రయాలు చేసేటప్పుడు మోసముండదు. తగిన లాభాన్నే అనుభవిస్తాను కాని ఎక్కువ లాభాన్ని కోరను. లాభాలాభాల పట్ల సమభావం కలిగి ఉంటాను. నా చిత్తం మట్టిపెళ్ళను, బంగారాన్నీ సమంగానే చూస్తుంది. స్తుతినిందలు, హింసించటం, నన్ను నేను పొగడుకొనటం అనేవి నాకు లేవు. అన్ని ప్రాణులపట్లా దయగలిగి ఉంటాను. నేను పాటించే సత్యమనే యాగానికి అభయమే దక్షిణగా ఉంటుంది. (నేను సత్యప్రవర్తనతో ఉంటాను గాన నాకు భయంలేదు). మితిమీరిన సుఖాలనూ, కీర్తినీ కోరను. ఎవరికి ఎట్లాంటి ఉపకారం చేసినా సరే, ఇంత చేసినానన్న తలపు నాలో పుట్టదు. నాకు ఎప్పుడూ మమకారం లేదు. దేనిమీదగానీ నేను రాగద్వేషాలు కలిగిఉండను. నేను చెప్పినదంతా సత్యం.

**విశేషం:** తులాధారుడు 'నేను ఎవరికి ఉపకారం చేసినా, ఇంత చేశాను అని భావించను' అని జాజలికి చెప్పాడు. జాజలి పిచ్చుకలకు తాను చేసిన మేలును భావించుకొని తనను తాను ప్రశంసించుకొన్నాడు. తులాధారుడిలో ఆత్మప్రశంస లేదు. కాన వీరిరువురి ప్రవర్తనలో కల భేదం స్పష్టం.

**క. లోకం బెల్లను నేఁ జి । త్రాకారము గాఁగఁ జూతు; నట్లగుట మనం**
**బేకార్యములం దగులదు । కోకనద దళాంబుబిందుగుణ మొనరంగన్. 229**

**ప్రతిపదార్థం:** నేన్= నేను; లోకంబు+ఎల్లను= సమస్తలోకాన్నీ; చిత్రాకారము+కాఁగన్= చిత్రంలోని బొమ్మనువలె; చూతున్= చూస్తాను; అట్లు+అగుటన్= ఆ విధంగా చూడటంవలన; కోకనదదళ+అంబుబిందుగుణము= చెంగల్వ రేకుమీది నీటిబొట్టుయొక్క స్వభావం; ఒనరంగన్= కలుగగా; మనంబు= నా చిత్తం; ఏకార్యములన్= ఏ పనులలోనూ; తగులదు= సంలగ్నం కాదు.

**తాత్పర్యం:** నేను ఈ లోకాన్నంతటినీ చిత్రంలోని బొమ్మను చూచినట్లే చూస్తాను. అందువలన నా మనస్సు కలువరేకును నీరంటనట్లే దేనినీ అంటుకొనకుండా నిస్సంగస్థితిలో ఉంటుంది'.

**వ. అనిన విని జాజలి తులాధారున కిట్లనియె. 230**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; జాజలి= జాజలిముని; తులాధారునకున్+ఇట్లు+అనియెన్= తులాధారుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని తులాధారుడితో మళ్ళీ జాజలిమునీంద్రుడు ఈ రీతిగా చెప్పాడు.

**తే. 'తపములును యజ్ఞములు నీవు ధర్మములుగఁ । బలుకవైతివి యార్యసంభావనీయ**
**పదములగు కర్మములలోనఁ బరిగణింపఁ । బడవొకో వేదశాస్త్రతత్పరులచేత.' 231**

**ప్రతిపదార్థం:** నీవు= తులాధారుడవైన నీవు; తపములును= తపస్సులును; యజ్ఞములు= యాగకర్మలు; ధర్మములుగన్= ధర్మకార్యాలుగా; పలుకవైతివి= చెప్పవైతివి; వేదశాస్త్ర తత్పరులచేతన్= వేదములయందును, శాస్త్రముల యందును ఆసక్తులైన వారిచేత; ఆర్యసంభావనీయ పదములు+అగు= మహనీయులచే గౌరవింప దగిన స్థానములుగల; కర్మములలోనన్= కార్యాలలో; పరిగణింపన్+పడవు+ఒకో= (తపోయజ్ఞాలు) లెక్కించబడటం లేదా!

**తాత్పర్యం:** 'నీవు ఇప్పుడు పేర్కొన్న కర్మలలో తపస్సులు, యజ్ఞాలు ధర్మకార్యాలని చెప్పవైతివి. వేదాలలో, శాస్త్రాలలో నిష్ణాతులైన పెద్దలు తపస్సు మొదలైన కార్యాలను ఆర్యులు గౌరవించే సత్కర్మలలో లెక్కిస్తున్నారు గదా! అట్లాంటప్పుడు నీ వెందుకు ఆ కార్యాలను పేర్కొనలేదు?'

**చ. అనవుడు నాతఁ డిట్లను 'నహంకృతి యుక్తముఁ గామసంశ్రితం**
**బును నగునేని నట్టి తపమున్, ఫలకాంక్ష యొనర్చు యజ్ఞమున్,**
**ఘనతరలోభవృత్తి యను కాన్పున మెచ్చదు దేవకోటి; వా**
**న నగు గతాగతంపు భ్రమణంబులు గీళ్ళులు గాక మేలులే? 232**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతఁడు= తులాధారుడు; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; అహంకృతియుక్తమున్= అహంకారంతో కూడింది; కామసంశ్రితంబును= కోరికలకు నెలవైనదీ; అగున్+ఏనిన్= అయితే; అట్టి తపమున్= అట్లాంటి తపస్సున్ను; ఫలకాంక్ష= ఫలాపేక్షతో; ఒనర్చు= చేసేటి; యజ్ఞమున్= యజ్ఞకర్మయును; దేవకోటి= దేవతాసమూహం; ఘనతరలోభవృత్తి= పెద్దదైన లోభవర్తనము; అను కాన్పున= అనేది కన్పించటంచేత; మెచ్చదు= అభినందించదు; వానన్= అట్టి తపోయజ్ఞాలవలన; అగు= సంభవించే; గత+ఆగతంపు భ్రమణంబులు= రాకపోకలతోకూడిన త్రిప్పటలు, కీళ్ళులుగాక= ఉపద్రవాలుగాక; మేలులే?= శుభాలా?

**తాత్పర్యం:** జాజలి అట్లా అనగా తులాధారుడు ఇట్లా అన్నాడు: 'అహంకారం, కోరిక- వీటితో కూడిన తపస్సు, ఫలంమీది కోరికతో చేసే యజ్ఞమూ ప్రయోజనకారులు కావు. ఆ రెండింటిలోనూ పెద్ద లోభితనం కన్పిస్తుంది. అందువలన దేవతలు ఆ తపోయజ్ఞాలను మెచ్చరు. అంతేకాక వాటివలన ఇహలోక పరలోకాల మధ్య సాగే రాకపోకలకు చెందిన త్రిప్పటలు అపకారం కలిగిస్తాయే కాని మేలు కల్గించవు.

**ఆ. నిత్యతృప్తుఁ డైన సత్యయజ్ఞుని యెడ । దేవతలును నధిక తృప్తు లగుదు;**
**రమరతృప్తివలన నవ్యయానందంబు । సంఘటిల్లుఁ జూవె సంయమీంద్ర! 233**

**ప్రతిపదార్థం:** సంయమి+ఇంద్ర!= మునీంద్రా!; నిత్యతృప్తుఁడు+ఐన= సదా తృప్తికలిగి ఉండునట్టి; సత్యయజ్ఞుని ఎడన్= సత్యమునే యజ్ఞంగా కలవాడిపట్ల; దేవతలును= సురలుకూడ; అధికతృప్తులు= మిక్కిలి తృప్తి పొందినవారు; అగుదురు= అవుతారు; అమరతృప్తివలనన్= దేవతలయొక్క తృప్తి కారణంగా; అవ్యయ+ఆనందంబు= తరుగు లేని ఆనందం; సంఘటిల్లున్+చూవె= కలుగుతుంది కదా!

**తాత్పర్యం:** మునీంద్రా! ఎవడు సత్యమే యజ్ఞమని భావించి సత్యాన్ని పాటిస్తూ సదా తృప్తి పొంది ఉంటాడో, అతడిపట్ల దేవతలుకూడా సంతృప్తి వహిస్తారు. దేవతాతృప్తివలన తిరుగులేని ఆనందం కలుగుతుంది'.

**తే. అనిన జాజలి 'యట్లేని నసఘ! నీవు । కర్మ ముడుగమి కెయ్యది కారణంబు?**
**మాకు నెఱిఁగింపు' మనుటయు మహితబోధుఁ । డగు తులాధారుఁ డిట్లను నతనితోడ. 234**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; జాజలి= జాజలిముని; అనఘ!= పాపరహితుడా!; అట్లు+ఏనిన్= అట్లా ఐతే; నీవు కర్మము+ఉడుగమికిన్= నీవు కర్మను వదలకుండా ఉండటానికి; కారణంబు= హేతువు; ఏ+అది?= ఏది?; మాకున్+ఎఱిఁగింపుము= మాకు తెలుపుము; అనుటయున్= అనేసరికి; మహితబోధుఁడు+అగు= శ్రేష్ఠమైన జ్ఞానంకలవాడైన; తులాధారుఁడు= తులాధారుడనే వైశ్యుడు; అతనితోడన్= ఆ జాజలితో; ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** తులాధారు డట్లా అనగానే జాజలి అతడితో 'అనఘా! అట్లైతే నీవు కర్మ వదలకుండా ఉండటానికి కారణమేమి? మాకు తెలియజెప్పుము' అని అన్నాడు. అప్పుడు శ్రేష్ఠజ్ఞాన సంపన్నుడైన తులాధారుడు అతడితో ఈ విధంగా చెప్పాడు.

**క. 'ధర్మారాముఁడు సంతత । ధర్మసఖుఁడునై యసంగతా నిష్ఠ మతిన్**
**నిర్మలుఁడగు వానికి ని । ష్కర్మత్వానందసిద్ధి గలుగు మునీంద్రా! 235**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మౌనివర్యా!; ధర్మారాముఁడు= ధర్మంలో రమించేవాడు; సంతతధర్మ సఖుఁడున్+ఐ= సదా ధర్మంతో మైత్రిచేసేవాడై; మతిన్= బుద్ధిలో; అసంగతానిష్ఠన్= నిస్సంగత్వనిష్ఠచేత; నిర్మలుఁడు+అగువానికిన్= మాలిన్య రహితుడైనవాడికి; నిష్కర్మత్వ+ఆనందసిద్ధి= అకర్మణతవలన కలిగే ఆనందప్రాప్తి; కలుగున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** 'మునిశ్రేష్ఠా! ఎవడు ధర్మంలో రమిస్తాడో, సదా ధర్మానికి మిత్రుడై ఉంటాడో, బుద్ధిలో అసంగత్వాన్ని పాటిస్తాడో, అట్లా పాటించి నిర్మల హృదయు డవుతాడో, అట్లాంటివాడికి కర్మరహితత్వం వలన కలిగే ఆనందం తప్పక సిద్ధిస్తుంది.

**ఆ. నగములెల్లఁ బుణ్యనగములు, నదులెల్లఁ । బుణ్యనదులు వినుము భూసురాగ్ర**
**గణ్య! యకలుషం బకర్దమం బనఁజాలు । నాత్మ తీర్థమెఱుఁగు నకలుషునకు. 236**

**ప్రతిపదార్థం:** భూసుర+అగ్రగణ్య!= విప్రులలో మొదట లెక్కించదగినవాడా!; వినుము= ఆలకించుము; అకలుషంబు= కాలుష్యం లేని; అకర్దమంబు= బురద లేనిది; అనన్+చాలు= అనగలిగినట్టి; ఆత్మతీర్థము= ఆత్మఅనే తీర్థాన్ని; ఎఱుఁగు= తెలిసికొన్న; అకలుషునకున్= పాపరహితుడికి; నగములు+ఎల్లన్= కొండలన్నీ; పుణ్యనగములు= పవిత్రమైన కొండలు; నదులు+ఎల్లన్= అన్ని ఏరులూ; పుణ్యనదులు= పవిత్రమైన ఏరులు.

**తాత్పర్యం:** విప్రోత్తమా! వినుము. ఏ విధమైన కాలుష్యం, పంకం లేని 'ఆత్మ' అనే తీర్థాన్ని తెలిసికొన్న పవిత్రాత్ముడికి లోకంలో ఉన్న కొండలన్నీ పావనమైన కొండలే. నదులన్నీ పావనమైన నదులే. అతడు పవిత్రాత్ముడు కాబట్టిఅతడికి సర్వమూ పవిత్రమే అవుతుంది. (అందుచేత పవిత్రప్రదేశాలకై అతడు విశేషించి వెదకవలసిన పని లేదని భావం).

**క. కారణములవలనఁ గృత । ప్రారంభంబైన కర్మ మంచితగతికిం**
**గారణమే కర్తవ్య । త్వారబ్ధ క్రియలయట్టు లనఘచరిత్రా!' 237**

**ప్రతిపదార్థం:** అనఘచరిత్రా!= దోషరహితమైన వర్తనం కలవాడా!; కర్తవ్యత్వ+ఆరబ్ధ క్రియల అట్టులు= ఇది చేయదగినది అన్న ఉద్దేశంతో ప్రారంభించిన కర్మలవలె; కారణములవలనన్= ఏవో కారణాలచేత; కృతప్రారంభంబు+ఐన= ప్రారంభించబడిన; కర్మము= పని; అంచితగతికిన్= పూజితమైన స్థితికి; కారణమే?= నిమిత్తమా? (కాదనుట)

**తాత్పర్యం:** పవిత్రచరిత్రా! 'ఇది నావంతు కర్తవ్యం కాన నేనీపని చేసి తీరతాను' అన్న ఉద్దేశంతో చేసే కర్మ పూజ్యమైన గొప్పసిద్ధికి హేతువు అవుతుంది. అంతేకాని ఏదో ప్రయోజనాన్ని కాంక్షించి, ఇతరకారణాలవలన చేసే పని ఆ విధమైన మహోన్నత గతికి కారణం ఎట్లా అవుతుంది?' (కాజాలదని భావం).

**వ. అని చెప్పి యంత నిలువక. 238**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; అంతన్= అంతటితో; నిలువక= ఆగక.

**తాత్పర్యం:** తులాధారుడు ఆ రీతిగా చెప్పి, దానితో నిలువక మళ్ళీ ఇట్లా అన్నాడు:

**క. 'విను మంచివారిచే నై । నను నితరుల చేతనేని నా యెఱిఁగిన యీ**
**యను వొప్పదొ మేలో యను । ననుమానము వాపుదమె మహాధర్మనిధీ! 239**

**ప్రతిపదార్థం:** మహాధర్మనిధీ!= గొప్ప ధర్మానికి తావలమైనవాడా!; విను= ఆలకించు; నా ఎఱిఁగిన= నేను తెలిసికొన్న; ఈ+ అనువు= ఈ ధర్మపద్ధతి; ఒప్పదొ?= తగదో?; మేలో= తగినదో; అను అనుమానము= అనే సందేహం; మంచివారిచేన్+ఐనను= సజ్జనులచేతగానీ; ఇతరులచేతన్+ఏనిన్= పరులచేతగాని; పాపుదమె= తీర్చుకొందమా!

**తాత్పర్యం:** 'ధర్మాత్మా! వినుము. నాకు తెలిసిన ఈ ధర్మప్రకారం సరిఅయినదో కాదో అనే సందేహాన్ని సజ్జనుల ద్వారానైనా, లేక తదితరులచేత గానీ తీర్చుకొందామా!

**వ. అప్పని మనచేత నయ్యెడి; నీవు దండ్రిపోలెం బెనిచిన మరగి నీతో నరుగుదెంచి నీశిరంబు చక్కటిచదలం జేరువం బొలయు నిప్పులుఁ గులం బిలిచి కరంబుల ధరియించి యుపలాలింపుమా!' యనుటయు జాజలి వానిం బిలిచిన నవి దివిన నిలిచి యతనితో నిట్లనియె. 240**

**ప్రతిపదార్థం:** ఆ+పని= ఆ కార్యం; మనచేతన్= మనవలన; అయ్యెడిన్= కాగలదు; నీవు తండ్రి+పోలెన్= నీవు జనకుడివలె; పెనిచిన= పెంచిన; మరగి= అలవాటుపడి; నీతోన్+అరుగుదెంచి= నీతోకూడా వచ్చి; నీ శిరంబు చక్కటి చదలన్= నీ తలకు సూటిగా ఆకాశమునందు; చేరువన్= సమీపంబున; పొలయు= తిరుగుతున్న; ఈ+పులుఁగులన్= ఈ పిచ్చికలను; పిలిచి= ఆహ్వానించి; కరంబులన్= చేతులలో; ధరియించి= ఉంచుకొని; ఉపలాలింపుమా!= బుజ్జగించుమా!; అనుటయున్= అనగా; జాజలి= జాజలిముని; వానిన్= ఆ పక్షులను; పిలిచినన్= ఆహ్వానించగా; అవి= ఆ పక్షులు; దివిన్+అం= ఆకాశంలోనే; నిలిచి= నిలబడి; అతనితోన్= ఆ జాజలితో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాయి.

**తాత్పర్యం:** అట్లా సంశయం తొలగించుకొనే పని మనమే చేసికొనవచ్చును. నీవీ పిచ్చుకలను తండ్రివలె పెంచావు. నీతో అవి మచ్చిక పడి ఉన్నాయి. నీ తలమీద నేరుగా ఆకాశంలో సమీపం లోనే ఎగురుతూ ఉన్నాయి. వాటిని పిలిచి నీ చేతిపై ఉంచుకొని బుజ్జగించుము' అని చెప్పాడు. తులాధారు డట్లా అనగానే జాజలి ఆ పక్షులను పిలిచాడు. అవి అతడి చేతిమీదికి రాకుండానే ఆకాశంలోనే నిలబడి జాజలిని చూచి ఇట్లా అన్నాయి.

**చ. 'మునివర! ధర్మదేవత మమున్ బనుపన్ నిను నారయంగ వ**
**చ్చిన భటసంఘు మేము; విను చెప్పెద మీసు గలంక పోరితం**
**బను నివి మత్సరంబు గల యట్టిమనంబునఁ బుట్టు; హింస వీ**
**నన జనియించు; సంయమిజనంబు విమత్సరమైన మేలగున్. 241**

**ప్రతిపదార్థం:** మునివర!= మునిశ్రేష్ఠా!; ఏము= మేము; ధర్మదేవత= ధర్మానికి అధిష్ఠానమైన దేవత; మమున్= మమ్ములను; పనుపన్= పంపగా; నినున్+ఆరయంగన్= నిన్ను పరీక్షించటానికి; వచ్చిన= ఏతెంచిన; భటసంఘము= సేవకవర్గం; చెప్పెదము= వచింతుము; విను= వినుము; మత్సరంబు+కలయట్టి= మాత్సర్యం గలిగినట్టి; మనంబునన్= చిత్తంలో; ఈసు= ఈర్ష్య; కలంక= మనఃక్షోభం; పోరితంబు+అనునివి= కలహం అనే ఇవి; పుట్టున్= కలుగుతాయి; వీనన= వీటినుండే; హింస= హింసించటం; జనియించున్= కలుగుతుంది; సంయమిజనంబు= మునిజనం; విమత్సరము+ఐనన్= మాత్సర్యం లేనిదైతే; మేలు+అగున్= శుభం కలుగుతుంది.

**తాత్పర్యం:** 'మునివర్యా! నిన్ను పరీక్షించటానికి ధర్మదేవత పంపిస్తే మేము వచ్చాము. మేము ఆ ధర్మదేవతకు చెందిన సేవకులం. ఇప్పుడు నీకు కలిగిన సంశయం తొలగేటట్లు విషయం చెప్పుతాము, వినుము. ఎవడి హృదయంలో మాత్సర్యదోషం ఉంటుందో, వాడిలో ఈర్ష్య, కలంక, కలహం అనే దుర్గుణాలు కలుగుతాయి. వీటివలననే హింస కూడా కలుగుతుంది. అందువలన మునివృత్తిలో ఉన్నవారు పూర్తిగా మాత్సర్యదోషాన్ని హృదయంనుండి తొలగించుకొంటేనే మేలు కలుగుతుంది.

**తే. స్పర్ధ సద్ధర్మమునకు నాశని సుధర్మ । నాశమునఁ జేసి నరుఁడు వినష్టభావ**
**మొందుఁ గావున సంస్పర్ధ యుడుగవలయు । నిర్మలశ్రద్ధ గైకొని నిపుణుఁ డనఘ! 242**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; స్పర్ధ= పోటీ; సద్ధర్మమునకున్= మంచి ధర్మానికి; నాశని= వినాశకారి; సుధర్మనాశమునన్+చేసి= మంచి ధర్మం వినాశం పొందటంవలన; నరుఁడు= మానవుడు; వినష్టభావము= విశేషంగా నశించే భావాన్ని; ఒందున్= పొందుతాడు; కావునన్= అందువలన; నిపుణుఁడు= నేర్పు కలవాడు; నిర్మలశ్రద్ధన్= విమలమైన శ్రద్ధతో; కైకొని= స్వీకరించి; సంస్పర్ధన్= పోటీని; ఉడుగన్ వలయున్= వర్జించాలి.

**తాత్పర్యం:** పాపరహితా! స్పర్ధ అనే దుర్గుణం మంచిధర్మాన్ని నశింపజేస్తుంది. మంచిధర్మం నశిస్తే మనుజుడు పూర్తిగా వినాశానికి గురి అవుతాడు. అందువలన తెలివైన నేర్పరి నిర్మలమైన శ్రద్ధగలవాడై స్పర్ధ అనే దుర్గుణాన్ని వదలాలి.

**క. శ్రద్ధ ఋషితనయ! సాత్త్వికి । బోద్ధ వ్యావాప్తి శుభముఁ బొనరించు మన**
**శ్శుద్ధిస్వరూప దానిఁ బ్ర । బుద్ధుఁడు పాటించుఁజూవె పురుషాత్మికఁగన్. 243**

**ప్రతిపదార్థం:** ఋషితనయ!= మునికుమారా!; సాత్త్వికి= సత్త్వగుణం వలన కలిగిన; శ్రద్ధ= ఆసక్తి; బోద్ధవ్య+అవాప్తిన్= తెలిసికొనదగిన దానిని పొందటంచేత; శుభమున్= మంగళమును; పొనరించు= కలిగించునట్టి; మనశ్శుద్ధి స్వరూప= చిత్తనైర్మల్యస్వరూపమైనది; దానిన్= ఆ శ్రద్ధను; ప్రబుద్ధుఁడు= తెలివైనవాడు (ఆత్మజ్ఞుడు); పురుషాత్మికఁగన్= పురుషస్వరూపిణిగా; పాటించున్+చూవె!= అనుసరించునుగదా!

**తాత్పర్యం:** మునికుమారా! సత్త్వగుణంవలన జనించిన శ్రద్ధ మనం తెలిసికొనదగిన దానిని తెలియజేస్తుంది. తద్ద్వారా శుభం కలగజేస్తుంది. చిత్తశుద్ధే శ్రద్ధకు స్వరూపం. అందువలన తత్త్వజ్ఞుడు శ్రద్ధను పురుష స్వరూపిణిగా భావించి అనుసరిస్తాడు.

**విశేషం:** 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని గీత - శ్రద్ధావంతుడు జ్ఞానం పొందుతాడని చెప్పింది. శాస్త్రమునందు గురువాక్యమునందు ఇది సత్యమనే బుద్ధితో నిశ్చయానికి రావటమే శ్రద్ధ. దానివలన ఆత్మతత్త్వం లభిస్తుందని శంకరులు వివేకచూడామణిలో వివరించారు.

> "శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యాऽవధారణా।
> సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వ స్తూపలభ్యతే॥ " (వివేకచూడామణి).

**క. అమరులు విమలశ్రద్ధా । సమేతములు గాని తాపసత్వముఁ గ్రతుమ**
**త్త్వము గైకొన రా సువిశే । షముగలిగిన మెత్తు రది ప్రశస్తం బనఘా! 244**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; అమరులు= దేవతలు; విమలశ్రద్ధాసమేతములు కాని= నిర్మలమైన శ్రద్ధతో కూడని; తాపసత్వమున్= మునిత్వమును; క్రతుమత్త్వమున్= యాజకత్వమును; కైకొనరు= అంగీకరించరు; ఆ సువిశేషము= ఆ విశిష్టమైన శ్రద్ధ; కలిగినన్= ఉంటే; మెత్తురు= అభినందిస్తారు; అది= ఆ శ్రద్ధ; ప్రశస్తంబు= ఉత్తమం.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ జాజలీ! దేవతలు నిర్మలమైన శ్రద్ధ లేని తపసితనమునూ, యాజకత్వాన్నీ అంగీకరించరు. శ్రద్ధతో కూడి ఉంటే వాటిని వారు మెచ్చుకొని అంగీకరిస్తారు. కాబట్టి శ్రద్ధ అనేది చాలా ప్రశస్తమైన గుణం.

**క. వినుమునివర! వాగ్వృత్తియు। మనః ప్రవర్తనముఁ గాచు మహితశ్రద్ధా**
**ధనసంపద; శ్రద్ధ యనం। జనునది జీవాత్మ సుప్రసన్నత సుమ్మీ!' 245**

**ప్రతిపదార్థం:** మునివర!= మునిశ్రేష్ఠా!; విను= వినుము; మహిత శ్రద్ధాధనసంపద= పూజ్యమైన 'శ్రద్ధ' అనే అర్థసంపత్తి; వాక్+వృత్తియున్= వాక్కుల యొక్క వ్యాపారమునూ; మనఃప్రవర్తనమున్= చిత్తముయొక్క నడవడికనూ; కాచున్= కాపాడుతుంది; శ్రద్ధ= శ్రద్ధ; అనన్+చనునది= అనబడేది; జీవాత్మ సుప్రసన్నత సుమ్మీ!= ప్రత్యగాత్మ యొక్క ప్రసన్నత్వమే సుమా!

**తాత్పర్యం:** మునివర్యా! వినుము. మానితమైన 'శ్రద్ధ' అనే ధనసంపద మన మాటలను, మనస్సును చెడుదారిలో పోనీకుండా కాపాడుతుంది. 'శ్రద్ధ' అనేది జీవాత్మయొక్క మంచి ప్రసన్నతాగుణమే సుమా!'

### తులాధారుఁడు జాజలికిం జెప్పిన బ్రహ్మగీతలు (సం. 12-256-7)

**వ. అని మఱియు నిట్లను 'బ్రహ్మగీత లను వాక్యంబు లాకర్ణింపుము. 246**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు చెప్పి; మఱియు= ఇంకను; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; బ్రహ్మగీతలు+అను= బ్రహ్మగీతలు అనబడే వాక్యంబులు= మాటలు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ పక్షులు ఆ విధంగా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాయి. 'బ్రహ్మగీతలు అనే మాటలు వినుము.'

**క. యాగంబునందు శ్రద్ధా। యోగముగల యశుచి శ్రద్ధ యొనరని శుచి పు**
**ణ్యాగమసంపదఁ దుల్యులు। గా గణుతించిరి నిరూపకత నమరవరుల్. 247**

**ప్రతిపదార్థం:** అమరవరుల్= దేవతాశ్రేష్ఠులు; యాగంబునందున్= యజనకర్మ చేసేటప్పుడు; శ్రద్ధాయోగముకల= శ్రద్ధాసమేతుడైన; అశుచి= శుచిలేనివాడు; శ్రద్ధఒనరని= శ్రద్ధలేని; శుచి= శుచిగలవాడు; పుణ్య+ఆగమసంపదన్= పుణ్యంయొక్క రాక అనే సంపద విషయంలో; నిరూపకతన్= నిరూపించటంలో; తుల్యులుగాన్= సమానులుగా; గణుతించిరి= లెక్కించారు.

**తాత్పర్యం:** దేవతలు శుచిలేకున్నా యాగం చేసేటప్పుడు శ్రద్ధ గలవాడినీ, శుచి ఉండినా శ్రద్ధలేని వాడినీ పరిశీలించి నిరూపిస్తూ వీరిరువురికీ పుణ్యం సంపాదించటంలో సమానత్వమే ఉంటుందని నిర్ణయించారు. (శౌచంలేని దోషాన్ని శ్రద్ధ తొలగిస్తుందని భావం).

**క. విను! మజుఁడు శ్రద్ధ యతిపా। వని, యది గలవాఁడు గౌరవశ్రేష్ఠుం; డా**
**తని యన్నము భోజ్యతరం। బని నిర్దేశించె నెల్ల యమరులు వినఁగన్. 248**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; అజుఁడు= బ్రహ్మ; శ్రద్ధ అతిపావని= శ్రద్ధ చాలా పవిత్రమైనది; అది కలవాఁడు= శ్రద్ధావంతుడు; గౌరవశ్రేష్ఠుఁడు= గౌరవంచేత ఉత్కృష్టుడు; ఆతని అన్నము= అతడు పెట్టే భోజనం; భోజ్యతరంబు+అని= తినదగిన వాటిలో మేలైనదని; ఎల్లఅమరులు= దేవతలందరూ; వినఁగన్= వింటూ ఉండగా; నిర్దేశించెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** వినుము. పూర్వం బ్రహ్మదేవుడు దేవతలందరూ వింటూ ఉండగా 'శ్రద్ధ చాలా పవిత్రమైనది. శ్రద్ధగల మనుజుడు గౌరవంవలన ఉత్కృష్టు డవుతున్నాడు. అతడి అన్నం భుజించటానికి యుక్తతరమైనది' అని చెప్పాడు.

**ఉ. వారక వడ్డి కిచ్చి కుడువన్ వెరవారిన దానశీలు నె**
**వ్వారికిఁ జేయుఁ జూపక ధ్రువంబుగ లోభగుణంబ పట్టి ని**
**స్సారత నుండు వేదవిదు సామ్యముఁ జేర్చి రమర్త్యులందు న**
**వ్వారిజసూతి దాని యగువాఁ డధికుం డనియెన్ హవిర్విధిన్. 249**

**ప్రతిపదార్థం:** అమర్త్యులు= సురలు; వారక= ఉడుగక; వడ్డికిన్= వృద్ధికి; ఇచ్చి= ఒసంగి; కుడువన్= అనుభవించటానికి; వెరవారిన= యుక్తిపరుడైన; దానశీలున్= దానంచేసే స్వభావంగలవాడిని; ఏ+వారికిన్= ఎవరికిన్ని; చేయున్+చూపక= హస్తం కూడా చూపకుండా; ధ్రువంబుగన్= స్థిరంగా; లోభగుణంబు= పిసినితనం అనే గుణాన్నే; పట్టి= అవలంబించి; నిస్సారతన్= సారహీనతతో; ఉండు= మెలగునట్టి; వేదవిదు= వేదజ్ఞుడితో; సామ్యమున్+చేర్చిరి= పోలిక చెప్పారు; అందున్= వారిలో; ఆ+వారిజసూతి= ఆ బ్రహ్మ; హవిర్విధిన్= యాగకర్మలో; దాని అగువాఁడు= దానం చేసేవాడు; అధికుండు= గొప్పవాడు; అనియెన్= అని చెప్పాడు.

**తాత్పర్యం:** వడ్డీవ్యాపారం చేసి తాను అనుభవిస్తూ తగిన సమయంలో దానంకూడా చేసేవాడినీ, ఎవరికీ ఏమీ ఇవ్వకుండా లోభి అయిన వేదాభ్యాసపరుడినీ - సమానమని దేవతలు చేర్చి పలికారు. వారిద్దరిలోనూ యజ్ఞకర్మలో దానం చేసేవాడు శ్రేష్ఠుడని బ్రహ్మదేవుడు చెప్పాడు.

**ఆ. దానగుణము శ్రద్ధ లేనివానికి లేదు । గాన యివ్విధమునఁ గమలభవుఁడు**
**నిశ్చయించె; నీవు నిర్మలశ్రద్ధాభి । పూతమతివి గమ్ము పుణ్యచరిత! 250**

**ప్రతిపదార్థం:** పుణ్యచరిత!= పవిత్రమైన నడవడి కలవాడా!; శ్రద్ధలేనివానికిన్= శ్రద్ధావిరహితుడికి; దానగుణము= దానంచేయాలనే స్వభావం; లేదు= ఉన్నదికాదు; కాన= కాబట్టి; కమలభవుఁడు= బ్రహ్మ; ఈ+విధమునన్= ఈరీతిగా; నిశ్చయించెన్= నిర్ణయించాడు; నీవు నిర్మలశ్రద్ధా+అభిపూతమతివి= నీవు విమలమైన శ్రద్ధచేత పవిత్రమైన బుద్ధికలవాడవుగా; కమ్ము= అగుము.

**తాత్పర్యం:** పావనమైన చరిత్రం కల ఓ జాజలీ! 'శ్రద్ధ' అనే గుణం లేనివాడికి దానం చేయాలనే స్వభావం ఉండదు. అందువలననే బ్రహ్మదేవుడు 'దానం చేసేవాడే శ్రేష్ఠుడు' అని నిర్ణయించి చెప్పాడు. నీవు శ్రద్ధయొక్క గొప్పతనాన్ని గుర్తించి నీబుద్ధిని నిర్మలమైన శ్రద్ధతో పవిత్రంగా చేసికొమ్ము.

**ఆ. వినుము శ్రద్ధ గలుగు మనుజుండు పాపంబుఁ । దొలఁగఁ ద్రోవనేర్చుఁ; దోలు డిగ్గ**
**నూడ్వ వెరవు గలుగు నురగంబు చాడ్పునఁ । గాన మేలు శ్రద్ధధానుఁ డగుట.' 251**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; శ్రద్ధకలుగు= శ్రద్ధకలిగినటువంటి; మనుజుండు= మానవుడు; తోలు= కుబుసం; డిగ్గన్+ఊడ్వన్= తొలగించుకొనటానికి; వెరవుకలుగు= ఉపాయం గలిగినట్టి; ఉరగంబు చాడ్పునన్= పామువలె; పాపంబున్= పాపాన్ని; తొలఁగన్+త్రోవ నేర్చున్= తొలగేటట్లు త్రోసి వేయటానికి శక్తికలవాడవుతాడు; కాన= కాబట్టి; శ్రద్ధధానుఁడు+అగుట= శ్రద్ధగలవాడు కావటం; మేలు= శుభకరం.

**తాత్పర్యం:** ఇంకను వినుము. అనాయాసంగా కుబుసాన్ని తొలగించుకొనే పామువలె శ్రద్ధావంతుడైన మానవుడు పాపమును తొలగించుకొంటాడు. అందువలన మానవుడు శ్రద్ధావంతుడు కావటం శుభప్రదం.

**వ. అని వెండియు. 252**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి మళ్ళీ (ఆ పక్షులు ఈ రీతిగా అన్నాయి.)

**ఆ. 'మత్సరాది చిత్తమాలిన్యములు శ్రద్ధ। గల మనంబునందు నిలువనేర'**
**వనినఁ దేఱి యిట్టులనియె జాజలి తులా। ధారుతోడ నిభృతిఁ గౌరవేంద్ర! 253**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ధర్మరాజా! శ్రద్ధగల= శ్రద్ధకలిగినట్టి; మనంబునందున్= చిత్తంలో; మత్సర+ఆది చిత్త మాలిన్యములు= మాత్సర్యం మొదలైన మనోదోషాలు; నిలువన్ నేరవు= నిలబడజాలవు; అనినన్= అని చెప్పగా; తేఱి= తేరుకొని; జాజలి= జాజలిముని; నిభృతిన్= నిబ్బరంగా; తులాధారుతోడన్= తులాధారుడనే వ్యాపారితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! శ్రద్ధగలవాడి మనస్సులో మత్సరం మొదలైన దోషాలు నిలబడలేవు, అని ఆ పిచ్చుకలు జాజలితో చెప్పాయి. అది విని జాజలి తేరుకొన్నాడు. తరువాత తులాధారుడిని చూచి సవినయంగా ఇట్లా అన్నాడు:

**క. మునులవలనఁ దత్త్వం బే। వినకుండుటఁ జేసి యిట్టివిధము గలిగె నా**
**కనఘా! నీ వాక్యంబుల। మనంబు దెలివొందె శాంతి మరగెద నింకన్.' 254**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; మునులవలనన్= తాపసులనుండి; ఏన్= నేను; తత్త్వంబు= తత్త్వార్థమును; వినకుండుటన్+చేసి= ఆలకించకపోవటంవలన; నాకున్= జాజలినైన నాకు; ఇట్టివిధము= ఈ రీతి; కలిగెన్= సంభవించింది; నీ వాక్యంబులన్= నీవు చెప్పిన మాటలచేత; మనంబు= చిత్తం; తెలివి+ఒందెన్= తెలివిపొందింది; ఇంకన్= ఇటుపైన; శాంతిన్= శమమును; మరగెదన్= అభ్యసిస్తాను.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ తులాధారా! పూర్వం నేను మునులవద్ద తత్త్వం వినలేదు. అందువలన నా కిట్టి 'ఆత్మశ్లాఘాపరత్వం' అనే అవినయదోషం సంభవించింది. నీ ఉపదేశవచనాల వలన నా మనస్సు కిప్పుడు తెలివిగలిగింది. ఇక మీద నేను శాంతిమార్గంలో నడుస్తాను'.

**వ. అనిన నభినందించి తులాధారుండు. 255**

**ప్రతిపదార్థం:** అనినన్= జాజలి అట్లా అనగా; తులాధారుండు= తులాధారుడనే వైశ్యుడు; అభినందించి= మెచ్చి.

**తాత్పర్యం:** జాజలి అట్లా అనేసరికి తులాధారుడు (పశ్చాత్తాపంతో కూడిన అతడి మాటలు విని) అతడిని అభినందించి - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తన తన తెరువునఁ గర్మం। బనుష్ఠితం బైన మేల యనఘ! నివృత్తిం**
**గని శ్రద్ధ గూర్పఁగా నే। ర్పెనయంగా వలయు దాని యెడయం దతఁడున్. 256**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; తన తన తెరువునన్= తనకు తనకు చెందిన మార్గంలో; కర్మంబు= పని; అనుష్ఠితంబు+ఐనన్= చేయబడితే; మేలు+అ= శుభమే; దాని ఎడ అందున్= ఆ కర్మ వ్యవహారంలో; అతఁడున్= ఆ కర్మానుష్ఠానపరుడు; నివృత్తిన్+కని= నివర్తనమును పొంది; శ్రద్ధన్+కూర్పఁగాన్= శ్రద్ధను సంఘటించటానికి; నేర్పు= చాతుర్యం; ఎనయంగావలయున్= పొందాలి.

**తాత్పర్యం:** పాపరహితుడా! మానవుడు తనకు విధ్యుక్తమైన ఏ కర్మకలదో, ఆ కర్మను చక్కగా అనుష్ఠించటం మేలు. మరియు అతడు ఆ కర్మపట్ల నివృత్తిని పొంది శ్రద్ధతో కర్మసన్న్యాస పద్ధతిని పాటించటానికి తగిన నేర్పుకూడా కలిగి ఉండాలి.

**ఆ. అట్లకాక యని ప్రియంబుమై వీడ్కొని । జాజలియును జనియె రాజవర్య!**
**యిహపరముల నెసకమెసఁగ సౌఖ్యము తులా । ధారుఁడును సమున్నతత్వ మొందె. 257**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= రాజశ్రేష్ఠా!; జాజలియును= జాజలిమునీంద్రుడును; అట్లకాక!= అట్లేఅగునుగాక!; అని ప్రియంబుమైన్= అని ప్రీతితో; వీడ్కొని= పోయివస్తానని చెప్పి వదలి; చనియెన్= వెళ్ళాడు; తులాధారుఁడును= తులాధారుడుకూడా; ఇహపరములన్= ఈ లోకంలోను, పరలోకంలోను; సౌఖ్యము= సుఖం; ఎసకమెసఁగన్= అతిశయించగా; సమున్నతత్వము= గొప్పతనమును; ఒందెన్= పొందాడు.

**తాత్పర్యం:** నృపశ్రేష్ఠుడవగు ఓ ధర్మరాజా! తులాధారు డట్లా చెప్పేసరికి జాజలి 'అట్లే అగుగాక!' అని చెప్పి ప్రీతితో వీడ్కోలు వడసి వెళ్ళిపోయాడు. తులాధారుడు సైతం ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖం పెంపొందగా మహోన్నతస్థితిని పొందాడు.

**క. ఆ వణిజుఁడు ధర్మస్థితి । దేవతలును మెచ్చునట్లు దెలియఁగఁ బలికెన్**
**నీ వీ వాక్యము లన్నిట । భావం బలవఱిచి కసటు వాపుము వత్సా!' 258**

**ప్రతిపదార్థం:** వత్సా!= పుత్రా!; ఆ వణిజుఁడు= ఆ వర్తకుడు; దేవతలును= అమరులుకూడా; మెచ్చునట్లు= అభినందించేటట్లు; ధర్మస్థితి= ధర్మంయొక్క పద్ధతిని; తెలియఁగన్+పలికెన్= తెలిసేటట్లు చెప్పాడు; ఈ వాక్యములు+అన్నిటన్= తులాధారుడు వచించిన మాటలన్నిటిలోను; భావంబు= అభిప్రాయం; అలవఱిచి= అలవడజేసి; నీవు కసటు= నీవు మాలిన్యమును; పాపుము= తొలగించు కొనుము.

**తాత్పర్యం:** కుమారా! తులాధారుడు దేవతలు సైతం మెచ్చుకొనే విధంగా, ధర్మపద్ధతిని గూర్చి స్పష్టంగా వివరించాడు. నీవు అతడు జెప్పిన మాటలన్నిటిలోనూ నీ భావాన్ని సమన్వయింపజేసి నీ హృదయంలోని మాలిన్యాన్ని తొలగించుకొమ్ము'.

**వ. అని చెప్పినం బ్రమదంబు నొంది. 259**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని వచించగా; ప్రమదంబు= సంతోషం; ఒంది= పొంది.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పేసరికి సంతోషం పొంది (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సురసరిదాత్మజుతోఁ గురు । నరపాలోత్తముఁడు వినయనమ్రుం డగుచున్**
**'జిరమో కార్యసమీక్ష య । చిరమో వలయునది కరుణఁ జెప్పు' మనవుడున్. 260**

**ప్రతిపదార్థం:** కురునరపాల+ఉత్తముఁడు= ధర్మరాజు; వినయనమ్రుండు+అగుచున్= వినయంతో వంగి నమస్కరించేవాడై; సురసరిదాత్మజుతోన్= గంగానదీ పుత్రుడైన భీష్ముడితో; కార్యసమీక్ష= కార్యముయొక్క పరిశీలన; వలయునది= ఆవశ్యకమైనది; చిరమో= బహుకాలమో; అచిరమో= అల్పకాలమో; కరుణన్= కృపతో; చెప్పుము= వివరించుము; అనవుడున్= అనగా.

**తాత్పర్యం:** కౌరవాధిపతి అగు ధర్మజుడు వినయంతో ప్రణమిల్లి భీష్ముడితో 'కార్యాలను సమీక్షించటంలో అవసరమైనది బహుదీర్ఘ సమయమా? లేక అత్యల్పసమయమా?' (చాలకాలం ఆలోచించి కార్యం నెరవేర్చవలెనా? లేక త్వరపడి నిర్ణయం చేయవలెనా?) దయచేసి ఈ సంగతి వివరించు'మని అడిగాడు. అట్లా అడిగేసరికి - (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అతం డతని కిట్లనియె: 261**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ము డప్పుడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు:

**క. 'త్వరితము సేయక కార్యము । చిరంతన విమర్శనముగఁ జేసి యొనర్పన్**
**ధరణీశ్వర! యోటువడఁడు । పురుషుఁడు; సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్. 262**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= రాజా!; పురుషుఁడు= మనుజుడు; కార్యము= పని; త్వరితము చేయక= వేగిరం చేయక; చిరంతన విమర్శనముగన్ చేసి= చాలకాలం పరామర్శతో కూడినదిగా; ఒనర్పన్= చేస్తే; ఓటు పడఁడు= ఓడిపోడు; వానిన్= ఆ రీతిగా చేసేవాడిని; సిద్ధియును= ఫలప్రాప్తికూడా; దృఢముగన్= నిశ్చయంగా; పొందున్= చేరుతుంది.

**తాత్పర్యం:** 'రాజా! పనిచేసేటప్పుడు త్వరపడరాదు. తొందరపడకుండా చక్కగా చాలాకాలం ఆలోచించి చేస్తే ఓటమి కలుగదు. అంతేకాక అట్లా చేసేవాడికి తప్పకుండా ఆ కార్యంలో విజయం కూడా సిద్ధిస్తుంది.

**క. తాలిమి లేని జనంబులు । మేలెఱుఁగక యట్టివాని మీఁదను జాడ్యం**
**బాలస్యం బిది యని దో । షాలోచన మాచరింతు; రది మతి యగునే? 263**

**ప్రతిపదార్థం:** తాలిమి లేని= ఓర్పు లేని; జనంబులు= ప్రజలు; మేలు+ఎఱుఁగక= శ్రేష్ఠమైనది తెలియక; అట్టివానిమీఁదను= ఆ విధంగా ఆలోచించి నిదానంగా పనులు చేసేవాడిపై; ఇది జాడ్యంబు= ఇది జడత్వం; ఆలస్యంబు+అని= అలసత్వం అని; దోష+ఆలోచనము= దొసగులను గూర్చిన చింతన; ఆచరింతురు= చేస్తారు; అది= అట్లా చేయటం; మతి అగునే?= తెలివి ఔతుందా?

**తాత్పర్యం:** ఏ మాత్రం సహనంలేనివారు మంచి ఏదో తెలియజాలరు. వారు చక్కగా ఆలోచించి కార్యాలు నిర్వర్తించేవాడిని చూచి 'వీడు జడుడు, అలసుడు' అని నిందిస్తారు. అది బుద్ధిమంతుల లక్షణం కాదు'.

**వ. అని చెప్పి వెండియు నిట్లను 'నీవడిగిన యర్థంబు మేధాతిథి యను మునిసుతుండు చిరకారి యనువాని వృత్తాంతంబు వినినం దెలియు; దానిం జెప్పెద. 264**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; వెండియున్= మరల; ఇట్లనున్= ఈ విధంగా అన్నాడు; నీవు+అడిగిన= నీవు ప్రశ్నించిన; అర్థంబు= విషయం; మేధాతిథిఅను మునిసుతుండు= మేధాతిథి అనబడే మునియొక్క పుత్రుడు; చిరకారి అనువాని= చిరకారి అనబడే వాడియొక్క; వృత్తాంతంబున్= చరిత్రను; వినినన్= ఆలకిస్తే; తెలియున్= తేటపడుతుంది; దానిన్= ఆ చరిత్రను; చెప్పెదన్= వివరిస్తాను.

**తాత్పర్యం:** భీష్ము డారీతిగా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు: 'ఇప్పుడు నీ వడిగిన విషయం మేధాతిథి అనే తాపసుడి కుమారుడు 'చిరకారి' అనే వాడి చరిత్ర వింటే స్పష్టమవుతుంది. ఆ కథ వివరిస్తాను వినుము.

### చిరకారియను మునికుమారుని చరిత్ర (సం. 12-258-2)

**క. అతఁడు చిరకాల సువిచా । రితంబుగాఁ జేసి యాచరించుం గురుభూ**
**పతివర్య! యెద్దియును నది । గతముగఁ జిరకారి నామకంబునఁ బరఁగున్. 265**

**ప్రతిపదార్థం:** కురుభూపతివర్య!= కౌరవరాజశ్రేష్ఠా!; అతఁడు= ఆ మేధాతిథి కుమారుడు; ఎద్దియును= ఏ పని ఐనను; చిరకాల సువిచారితంబుగాన్+చేసి= చాలాకాలం చక్కగా ఆలోచనతో కూడినదిగా కావించి; ఆచరించున్= అనుష్ఠించును; అది కతముగన్= అదికారణంగా; చిరకారినామకంబునన్= చిరకారి అనే పేరుతో; పరఁగున్= ప్రవర్తిల్లుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ మేధాతిథిపుత్రుడు ఏ పనినీ తొందరపడి చేయడు. చక్కగా ఆలోచించి చాలాకాలం తర్వాత ఆ పని నెరవేరుస్తాడు. అందువలననే ప్రజ లతడిని 'చిరకారి' అని వ్యవహరించారు.

**సీ.** **విను మొక్క కారణంబున ముని పత్నిపైఁ। గోపించి చంప నక్కొడుకుఁ బనిచి**
**యెటయేని వెడలి పోవుటయును, బనులెల్లఁ। జిరవిచారముతోడఁ జేయుఁ గాన**
**యచ్చిరకారి యిట్లని విచారించె 'జ। నకు పంపుసేఁత మానంగరాదు,**
**తల్లిఁ జంపుటయును తగదు; తండ్రి తలంపుఁ। దప్పింతుఁ గాకని తలఁతునేనిఁ**

**తే.** **గల్మషంబండ్రు దాని సత్కర్మవిదులు; । మాతృరక్ష గర్తవ్య మెమ్మాడ్కినైనఁ;**
**బుత్ర భావ మస్వాతంత్ర్యమునకు నెలవు; । పాప మడఁగింప నెవ్వల నోపు నొక్కొ! 266**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ముని= మేధాతిథిఅనే మౌని; ఒక్కకారణంబునన్= ఏదో ఒక కారణం చేత; పత్నిపైన్= భార్యమీద; కోపించి= కోపపడి; చంపన్= (ఆమెను) చంపటానికై; ఆ+కొడుకున్= ఆ కుమారుడిని; పనిచి= నియోగించి; ఎటఏనిన్= ఎచ్చటికో; వెడలిపోవుటయున్= బయలుదేరి పోగా; ఆ+చిరకారి= ఆ చిరకారి అనేవాడు; పనులు+ఎల్లన్= కార్యాలన్నీ; చిరవిచారముతోడన్= దీర్ఘకాలపుటాలోచనతోగూడ; చేయున్+కాన= చేస్తాడు కాబట్టి; ఇట్లు+అని= ఈ రీతిగా; విచారించెన్= చింతించాడు; జనకుపంపుసేఁత= తండ్రి ఆదేశాన్ని నిర్వర్తించటం; మానంగన్ రాదు= నిలుపతగదు; తల్లిన్= అమ్మను; చంపుటయును= హతమార్చుటకూడా; తగదు= ఉచితంకాదు; తండ్రి తలంపు= జనకుడి సంకల్పాన్ని; తప్పింతున్+కాక+అని= తొలగింతునుగాక అని; తలఁతునేనిన్= భావించెదనేని; దానిన్= అట్లు చేయటాన్ని; సత్కర్మవిదులు= మంచికార్యాలను గురించి తెలిసిన పెద్దలు; కల్మషంబు+అండ్రు= పాప మంటారు; ఏ+మాడ్కిన్+ఐనన్= ఏ రీతిగా నైనా; మాతృరక్ష= తల్లిని కాపాడటం; కర్తవ్యం= చేయదగినది; పుత్రభావము= పుత్రత్వం; అస్వాతంత్ర్యమునకున్= స్వతంత్రత లేమికి; నెలవు= ఆశ్రయం; పాపము= ఈ కల్మషమును; అడఁగింపన్= నశింపజేయుటకు; ఏ+వలను= ఏ ఉపాయం; ఓపును+ఒక్కొ!= సమర్థమైన దొకో!

**తాత్పర్యం:** ధర్మజా! వినుము. మేధాతిథి ఏదో ఒక కారణాన భార్యపై కోపించాడు. కొడుకును పిలిచి ఆమెను చంపుమని ఆదేశించి వెంటనే అత డెక్కడికో వెళ్ళిపోయాడు. మునికుమారుడైన చిరకారి తాను చేసే పనులన్నీ చాలాసేపు ఆలోచించి చేసే లక్షణం కలవాడు. అందువలన అత డిట్లా ఆలోచించాడు; 'మాతండ్రి ఆజ్ఞను పాటించకుండా ఉండటానికి వీలుగాదు. అట్లని తల్లిని చంపటం కూడా యుక్తం కాదు. తండ్రియొక్క ఆలోచన తప్పించటానికి ప్రయత్నిద్దా మనుకొంటే సత్కర్మవేత్తలైన పెద్దలు అట్లా చేయటం పాపమంటారు. తల్లినెట్లాగైనా కాపాడాలి. ఏ విధంగా చూచినా తల్లిదండ్రులమధ్య ఈ 'పుత్రత్వం' అనేది స్వేచ్ఛలేనిదిగా ఉన్నది. ఈ పాపాన్ని తొలగించజాలినది ఏదైనా ఉపాయమున్నదా?

**క.** **జననీ వధంబు సేసిన । ననుమానమె నరక మగుట యని యుడిగితిఁ బో,**
**జనకావమాన మొనరిం । చిన వానికి నరకమున వసింపఁగ వలదే. 267**

**ప్రతిపదార్థం:** జననీవధంబున్= మాతృహత్యను; చేసినన్= చేస్తే; నరకము+అగుట= నరకలోకప్రాప్తి; అనుమానమె? అని= సందేహమా? అని; ఉడిగితిన్‌పో= వర్జించితినిపో; జనక+అవమానము= తండ్రియొక్క తిరస్కారమును; ఒనరించినవానికిన్= చేసినవాడికి; నరకమునన్= నరకలోకమునందు; వసింపఁగ వలదే?= నివసించవలసిరాదా?

**తాత్పర్యం:** తల్లిని చంపితే నరకం వస్తుందని భావించి మాతృహత్యను వర్జిస్తాననుకో, అప్పుడు పిత్రాజ్ఞ ధిక్కరించిన దోషం రాదా? ఆ దోషం వలన నరకప్రాప్తి తప్పుతుందా?

**తే.** **తల్లి ధాత్రిక బీజంబు తండ్రి వెట్టు । వంశధరణార్థముగ; నిది వారి భంగి;**
**యేను బొత్తులవాఁడ; నయ్యిరువురకును । వీరలం దిప్పు డెవ్వరి విడుచువాఁడ?' 268**

**ప్రతిపదార్థం:** వంశధరణ+అర్థముగన్= వంశాన్ని నిలపటానికి; తల్లి; ధాత్రిక= నేల; తండ్రి= జనకుడు; బీజంబుపెట్టున్= విత్తనం నాటుతాడు; ఇది= ఈ రీతిగా చేయటం; వారి భంగి= జననీజనకుల పద్ధతి; ఏను= నేను; ఆ+ఇరువురకును= ఆ ఇద్దరికీ; పొత్తులవాఁడన్= ఉమ్మడిగా సంబంధించినవాడను; వీరలందున్= వీరిరువురిలో; ఇప్పుడు= ఈ సమయంలో; ఎవ్వరిన్= ఎవరిని; విడుచువాఁడన్?= వదలగలను?

**తాత్పర్యం:** వంశము నిల్పటానికి గాను తల్లి నేలకాగా, తండ్రి అందులో బీజావాపం చేస్తాడు. ఇది వారి పద్ధతి. నేను తల్లి దండ్రులిద్దరికీ సంబంధించినవాడను. ఈ క్లిష్టపరిస్థితిలో ఈ ఇరువురిలో నే నిప్పు డెవరిని వదలిపెట్టగలను?'

**విశేషం:** ధాత్రిక అనే పాఠానికి 'భస్త్రిక' అనే పాఠాంతరం ఉన్నది. 'ధాత్రిక' పాఠమే సమంజసం.

**వ.** **అని విచారించి తలంచుకొని. 269**

**ప్రతిపదార్థం:** అని విచారించి= అని చింతించి; తలంచుకొని= భావించుకొని.

**తాత్పర్యం:** చిరకారి ఈ రీతిగా చింతించి తలచుకొన్నవాడై - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **'జనకుఁడ యేనై జన్మిం । చినవాఁడను; జనకు పంపు సేసినఁ బాయుం**
**దనయుని పాపము లనియును । వినియుండుదుఁ; దలఁపు లింక వేయును నేలా? 270**

**ప్రతిపదార్థం:** జనకుఁడు+అ = తండ్రియే; ఏనై= నేనై; జన్మించిన వాఁడను= పుట్టినవాడను; తనయుని పాపములు= కుమారుడి పాపాలు; జనకుని పంపు= తండ్రి ఆజ్ఞను; చేసినన్= నెరవేరిస్తే; పాయున్= తొలగుతాయి; అనియును= అనికూడా; వినియుండుదున్= ఆలకించిఉన్నాను; ఇంకన్= ఇకపై; తలపుఁలు= సంకల్పాలు; వేయునున్+ఏలా?= వేయి ఎందుకు?

**తాత్పర్యం:** తండ్రియే నేనై పుట్టాను. జనకుడి ఆజ్ఞ నెరవేరిస్తే కుమారుడి పాపాలన్నీ నశిస్తాయని కూడా విని ఉన్నాను. ఇంక లేనిపోని వేయి ఊహలు ఎందుకు?

**విశేషం:** "ఆత్మా వై పుత్రనామాసి" అనేశ్రుతి ననుసరించి తండ్రియే కుమారుడై జన్మిస్తాడని గ్రహించాలి.

**క.** **జనకుఁడు దపమును ధర్మం । బును విద్యయుఁ బరమదైవమును గావున నా**
**తనికిఁ బ్రియంబగు పని సే । సిన దేవత లెల్లఁ బ్రీతిఁ జెందుట గల్గున్. 271**

**ప్రతిపదార్థం:** జనకుఁడు= తండ్రి; తపమును= తపస్సున్నూ; ధర్మంబును= శాస్త్రోక్త ధర్మమున్నూ; విద్యయున్= చదువున్నూ; పరమదైవమును= శ్రేష్ఠమైన దైవమున్నూ; కావునన్= కాబట్టి; ఆతనికిన్= తండ్రికి; ప్రియంబు+అగు= ప్రీతిపాత్రమైన; పని= కార్యం; చేసినన్= చేస్తే; దేవతలు+ఎల్లన్= దేవతలందరూ; ప్రీతిన్+చెందుట= సంతోషపడటం; కల్గున్= ఔతుంది.

**తాత్పర్యం:** తపస్సు, ధర్మం, విద్య, శ్రేష్ఠమైన దైవం - ఇవన్నీ తండ్రియే. అందువలన తండ్రికి ప్రీతి గలిగించే పని నెరవేరిస్తే దేవతలందరూ ప్రీతి పొందుతారు'.

**వ. అని వితర్కించియుఁ దల్లి తెఱంగుఁ దలంచి. 272**

**ప్రతిపదార్థం:** అని వితర్కించియున్= అని విశేషంగా ఆలోచించికూడా; తల్లి తెఱంగున్= మాతృస్థితిని; తలంచి= చింతించి.

**తాత్పర్యం:** ఈ విధంగా తండ్రిని గూర్చి విశేషంగా చిరకారి విచారించాడు. తదుపరి తల్లియొక్క స్థితిని గూర్చి ఆలోచించి (మళ్ళీ ఇట్లా అనుకొన్నాడు) - (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'కరచరణాది సంఘటితకాయము సంజననంబు వహ్నిపు**
**ట్టరణికిఁ బోలెఁ దల్లి దెసనైనది గాదొకొ! యట్లుఁగాక దు**
**ర్భరమగు గర్భఖేదమును బట్టికినై నిజదేహచింతపై**
**భర మొకయింతలేక పడుపాటులు నక్కట! యెక్కు డింతకున్. 273**

**ప్రతిపదార్థం:** వహ్నిపుట్టు= అగ్నియొక్క పుట్టుక; అరణికిన్+పోలెన్= త్రచ్చుటచేత నిప్పును గలిగించే కొయ్యకువలె; కరచరణాది సంఘటితకాయము సంజననంబు= చేతులు, కాళ్ళు మొదలైన అవయవాలతో కూడిన శరీరం యొక్క పుట్టుక; తల్లిదెసన్= జననియందు; ఐనది కాదొకొ!= జరిగినది కాదా!; అట్లున్‌కాక= అట్లు కావటమే కాక; దుర్భరము+అగు= భరించరాని; గర్భ ఖేదమును= పురిటి నొప్పుల వలన కలిగే బాధ; నిజదేహచింతపైన్= తన శరీరానికి చెందిన విచారంమీద; ఒక ఇంత= ఇసుమంత కూడా; భరములేక= బరువులేక; పట్టికినై= బిడ్డకొరకై; పడుపాటులున్= పడే కష్టాలు కూడ; ఇంతకున్= స్వశరీరచింత కంటె; ఎక్కుడు= ఎక్కువ; అక్కట!= అయ్యో!

**తాత్పర్యం:** అగ్ని అరణిని మథించటం వలన అందులో పుట్టుతుంది. అట్లాగే చేతులు, కాళ్ళు మొదలైన అంగాలతో కూడిన ఈ శరీరం తల్లినుండే జనిస్తుంది. అంతేకాదు సహించశక్యంకాని గర్భధారణ క్లేశం, తన శరీరంయొక్క బాగోగులు చూచుకొనకుండ బిడ్డకై పడే పలు కష్టాలు అయ్యో! తల్లికే ఎంతో ఎక్కువగా ఉంటాయి.

**ఆ. వచ్చిపోయి చూచువాఁడు గా కిడుమలఁ । బడునె తల్లిపోలెఁ బట్టితోడఁ**
**దండ్రి చెప్ప నిట్లు ధర్మశాస్త్రంబులు । నంబ గౌరవమున నధిక యగుట. 274**

**ప్రతిపదార్థం:** తండ్రి= జనకుడు; వచ్చిపోయి చూచువాఁడుకాక= వస్తూ పోతూ చూస్తూఉండే వాడేకాక; పట్టితోడన్= బిడ్డతో; తల్లిపోలెన్= జననివలె; ఇడుమలన్+పడునె?= కష్టాలు పడుతాడా?; ధర్మశాస్త్రంబులున్= ధర్మశాస్త్రాలు కూడా; అంబ= తల్లి; గౌరవమునన్= గురుత్వమునందు; అధిక అగుటన్= (తండ్రికంటె) గొప్పది కావటాన్ని; ఇట్లు= ఇదే రీతిగా; చెప్పున్= చెప్పుతున్నవి.

**తాత్పర్యం:** తండ్రి బిడ్డవద్దకు రాకపోకలు సాగిస్తూ చూస్తూ ఉంటాడు. అంతేకాని తల్లివలె బిడ్డవిషయాన్ని గాఢంగా పట్టించుకొని బాధపడడు. ధర్మశాస్త్రాలు కూడా తండ్రికంటె తల్లి గౌరవంలో గొప్పది అని ఇట్లాగే చెప్పుతున్నాయి.

**విశేషం:** "ఉపాధ్యాయాన్ దశాచార్యః । ఆచార్యాణాం శతం పితా ।
సహస్రం తు పితౄన్ మాతా । గౌరవే ణాతిరిచ్యతే ॥

అని మన్వాది ధర్మశాస్త్రాలు చెప్పుతున్నాయి. అంటే పదిమంది ఉపాధ్యాయులకంటె ఒక ఆచార్యుడు, నూరుమంది ఆచార్యులకంటె ఒక తండ్రి, వెయ్యిమంది తండ్రులకంటె ఒక తల్లి గౌరవంలో గొప్పవారుగా ఉన్నారని భావం. అందుకే వేదంకూడా 'మాతృదేవో భవ' అని తల్లినే మొదటి దైవంగా భావించుమని బోధించింది.

**ఆ. బాలుఁ డైనఁ గొడుకు ప్రౌఢుఁ డైనను వృద్ధుఁ। డైన నొక్క విధమ యర్మిలియును**
**నరయు భరముఁ దల్లి కా పదార్థంబు జ। గంబు కలిమికెల్లఁ గారణంబు. 275**

**ప్రతిపదార్థం:** కొడుకు= పుత్రుడు; బాలుఁడైనన్= పిల్లవాడైనా; ప్రౌఢుఁడు+ఐనను= యుక్తవయస్సు కలవాడైనా; వృద్ధుఁడు+ఐనన్= ముసలివాడైనా; అర్మిలియును= ప్రేమయు; అరయు భరము= కాపాడే బాధ్యత; తల్లికిన్= జననికి; ఒక్క విధము+అ= ఒకేరీతిగా ఉంటుంది; ఆ పదార్థంబు= 'తల్లి' అనే ఆ వస్తువు; జగంబు కలిమికిన్+ఎల్లన్= సర్వ ప్రపంచపుటునికికీ; కారణంబు= నిమిత్తం.

**తాత్పర్యం:** కన్నకొడుకు చిన్న వయస్సులోఉన్నా, యుక్తవయస్సు కలవాడైనా; వృద్ధుడైనా తల్లికి వాడిమీద ప్రేమ, అతడిని రక్షించే బాధ్యత ఒకేరీతిగా ఉంటాయి. 'తల్లి' అనే వస్తువే ఈ లోకానికంతటికీ మూలకారణం.

**ఆ. క్షుద్ర జంతువులకు గురులకు నెమ్మెయిఁ। దలఁప నొక్కరూప తల్లి వలయు**
**నూఱడిల్లఁ గలదె యొండుసోటుల సువ। స్తువు నివాసమైన చోటఁ గాక! 276**

**ప్రతిపదార్థం:** క్షుద్రజంతువులకున్= నీచ జంతువులకూ; గురులకున్= పెద్దవారికీ; ఏ+మెయిన్= ఏ రీతిగానైనా; తలఁపన్= ఆలోచించగా; తల్లి= మాత; ఒక్కరూప వలయున్= ఒకే విధంగా అవసరమై ఉన్నది; సువస్తువు= మంచి వస్తువు; నివాసము+ఐన= నివసించెడి; చోటన్+కాక= ప్రదేశంలో కాక; ఒండుచోటులన్= వేరే చోట్ల; ఊఱడిల్లన్+కలదె?= ఉపశమించటానికున్నదా?

**తాత్పర్యం:** నీచ ప్రాణులకైనా, ఉత్తమప్రాణులకైనా ఏ రీతిగా ఆలోచించి చూచినా తల్లి ఒకే రీతిగా అవసరమై ఉన్నది. తల్లివంటి సత్పదార్థం ఉన్నచోట సుఖంగా ఉండగలంగాని, అది లేనిచోట ఉపశాంతితో జీవించటం సాధ్యమా?

**క. అప్పుడ యసమర్థుం డగు। నప్పుడ దుఃఖియగు శూన్యమై తోఁచు జగం**
**బప్పుడ మాతృవియోగం। బెప్పుడు వాటిల్లె నపుడ యెంతయుఁ దూలున్. 277**

**ప్రతిపదార్థం:** మాతృవియోగంబు= తల్లితో ఎడబాటు; ఎప్పుడు= ఏ కాలంలో; పాటిల్లెన్= కల్గెనో; అప్పుడు+అ= అప్పుడే; అసమర్థుండు+అగున్= శక్తిలేనివాడౌతాడు; అప్పుడు+అ= ఆ కాలంలో; దుఃఖి+అగున్= దుఃఖం పొందినవాడౌతాడు; అప్పుడు+అ= అప్పుడే; జగంబు= లోకం; శూన్యము+ఐ= లేనిదై; తోఁచున్= భావనకు వస్తుంది; అపుడు+అ= అప్పుడే; ఎంతయున్= మిక్కిలిగా; తూలున్= చలించిపోతుంది.

**తాత్పర్యం:** ఎవడికి తల్లితో ఎప్పుడు వియోగం కలుగుతుందో, వాడు అప్పుడే అన్ని విధాలా అశక్తు డవుతాడు. అప్పుడే దుఃఖితు డవుతాడు. అతడికి లోకమంతా శూన్యమై తోస్తుంది. అప్పుడు వాడు చలించిపోతాడు.

**క. కలవాఁడు లేనివాఁడు స। బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుం డనఁగా**
**వల; దెవ్వరికైన జనని। కలిమియ యత్యంతసౌఖ్యకరమై యుండున్. 278**

**ప్రతిపదార్థం:** కలవాఁడు= సంపన్నుడు; లేనివాఁడు= పేదవాడు; సబలుఁడు= బలవంతుడు; అబలుఁడు= బలహీనుడు; మూఢబుద్ధి= తెలివిలేనివాడు; ప్రౌఢుండు= బుద్ధిమంతుడు; అనఁగాన్ వలదు= అని చెప్పవద్దు; ఎవ్వరికైనన్= ఎట్టివారికైనాసరే; జనని కలిమియ= తల్లి ఉండటమే; సౌఖ్యకరము+ఐ= సుఖము కలిగించేదై; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** వాడు ధనికుడు కావచ్చును, లేక పేదవాడు కావచ్చును. బలవంతుడు కావచ్చును, లేదా బలహీనుడు కావచ్చును. మూర్ఖుడు కావచ్చును, లేదా బుద్ధిమంతుడు కావచ్చును. వాడూ వీడూ అనవలసిన పని లేదు. ఎవడికైనా తల్లి జీవించి ఉండటమే సుఖహేతువై ఉంటుంది.

**తే.** **ఇట్టి జనని వధించుట యెల్లభంగి । నధికపాప పయోరాశియందు ముంచు;**
**దీని నెఱుఁగండె పసులవాఁ డైన? వధకు । నేల తెంపు వాటిలుఁ? జేతు లెట్టులాడు?'** **279**

**ప్రతిపదార్థం:** ఇట్టి జననిన్= ఇట్లాంటి తల్లిని; వధించుట= చంపటం; ఎల్లభంగిన్= అన్నివిధాలా; అధికపాప పయోరాశి అందున్= గొప్ప 'పాప' మనే సాగరంలో; ముంచున్= ముంచివేస్తుంది; పసులవాఁడు+ఐన= పశువులు మేపుకొనేవాడైనా; దీనిన్= ఈ విషయాన్ని; ఎఱుఁగండు+ఎ?= తెలియడా?; వధకున్= తల్లిని చంపటానికి; తెంపు= సాహసం; ఏల పాటిలున్= ఎట్లా సంభవిస్తుంది?; చేతులు= కరములు; ఎట్టులు+ఆడున్?= ఎట్లా పనిచేస్తాయి?

**తాత్పర్యం:** ఇట్లాంటి పూజ్యురాలైన తల్లిని వధించటం అన్ని రీతులా మహాపాపమనే సముద్రంలో ముంచివేస్తుంది. ఈ సంగతి పసులకాపరికి కూడా తెలిసిందే. తల్లిని చంపటానికి సాహస మెట్లా కల్గుతుంది? చేతు లెట్లా ఆడుతాయి?'

**వ.** **అని యిట్లు పెక్కు భంగుల నూహించుచుఁ జిరకారి యగుట నతండు శీఘ్రకారి గాక యుండం దడవెంతయేనియుం గలిగె నంతకుం దదీయ జనకుండు.** **280**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ రీతిగా; అతండు= ఆ మునికుమారుడు; పెక్కుభంగులన్= అనేక విధాల; ఊహించుచున్= తర్కిస్తూ; చిరకారి అగుటన్= 'చిరకారి' (ఆలసించి చేసేవాడు) కావటంచేత; శీఘ్రకారి కాకఉండన్= తొందరపడి పనిచేసేవాడు కాకుండా ఉండగా; ఎంతఏనియున్= ఎంతో; తడవు= ఆలస్యం; కలిగెన్= అయింది; అంతకున్= ఆ సమయానికి; తదీయ జనకుండు= అతడి తండ్రి.

**తాత్పర్యం:** చిరకారి ఈ రీతిగా అనేక విధాల ఆలోచిస్తూ ఉండిపోయాడు. సహజంగా అతడు బహుకాలం చింతించి పనిచేసేవాడు కావటం వలన తొందరపడలేదు. ఇట్లా చాలా సమయం జరిగిపోయింది. అప్పటికి అతడి తండ్రి మేధాతిథి - (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **వెడపనికి నాలిఁ జంపం । గొడుకుఁ బనిచి వచ్చినాఁడ గ్రూరత్వమునం**
**గడవంబడునొకొ పని?' యని । కడువెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్.** **281**

**ప్రతిపదార్థం:** క్రూరత్వమునన్= కఠినమైన స్వభావంతో; వెడపనికిన్= చిన్న పనికి; ఆలిన్= భార్యను; చంపన్= చంపటానికై; కొడుకున్= కుమారుడిని; పనిచి= ఆదేశించి; వచ్చినాఁడన్= వచ్చాను; పని= ఆ క్రూరమైన కర్మ; కడవన్+పడున్+ఒకొ అని=జరిగి పోయి ఉంటుందా అని; అశ్రుకణములు= కన్నీటి బొట్లు; తొరఁగన్= జారగా; కడున్ వెసన్= మిక్కిలి త్వరగా; చనుదెంచెన్=వచ్చాడు;

**తాత్పర్యం:** ఇంచుక పనికి కోపించి క్రూరుడనై భార్యను చంపుమని పుత్రుడి నాజ్ఞాపించి వచ్చాను. కుమారుడు ఆ పనిచేసి ఉంటాడేమో! అని కన్నీరు కారుస్తూ వడివడిగా తిరిగి వచ్చాడు.

**వ.** **అట్లు సనుదెంచునప్పుడు.** **282**

**ప్రతిపదార్థం:** అట్ల= ఆ రీతిగా; చనుదెంచు+అప్పుడు= వచ్చేటప్పుడు.

**తాత్పర్యం:** అట్లా అతడు వచ్చేటప్పుడు.

**క.** **'చిరకారి యెట్లునుం దన । చిరకారితఁ జూపుఁ గాక శీఘ్రపుఁ జేఁతన్**
**దురటిల్లఁ జేయునే నను? । వెరవరి వాఁ డిట్టి పనికి వేగిరపడునే?'** **283**

**ప్రతిపదార్థం:** చిరకారి= నా కుమారుడగు చిరకారి; ఎట్లునున్= ఏ విధంగానైనా; తన చిరకారితన్= తనయొక్క చిరకారిత్వమును; అనగా ఆలస్యంగా పనిచేసే లక్షణం; చూపున్+కాక= ప్రదర్శిస్తాడుగాక; శీఘ్రము+చేఁతన్= త్వరతో కూడిన పనిచేత; ననున్= నన్ను; దురటిల్లన్+చేయునే?= వగచేటట్లు చేస్తాడా?; వాఁడు= అతడు; వెరవరి= ఉపాయశాలి; ఇట్టిపనికిన్= ఈ విధమైన పనికి; వేగిరపడునే?= తొందరపడతాడా?

**తాత్పర్యం:** 'నా పుత్రుడు చిరకారి ఏ రీతిగానైనా చాలాకాలం ఆలోచించి పనిచేసే తన సహజ స్వభావాన్నే ప్రదర్శిస్తాడు. కాని త్వరపడి పనిచేసి నన్ను దుఃఖింపజేస్తాడా? వాడు చాలా ఉపాయం కలవాడు. అందువలన ఇట్లాంటి క్రూరమైన పనికి తొందరపడతాడా? (పడ డని భావం).

**వ. అని పుత్రునుద్దేశించి. 284**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా భావించి; పుత్రున్+ఉద్దేశించి= కుమారుడితో.

**తాత్పర్యం:** ఇట్లా భావించి కుమారుడితో (మళ్ళీ ఇట్లా అనుకొన్నాడు).

**చ. 'చిరముగ గర్భవాసమునఁ జెందితి పుత్ర చిరంబుగాఁగ ని**
**న్నరసె గదయ్య తల్లి; యనయంబును నేఁబనుపంగఁ బూనియుం**
**జిరమగునట్టి యిత్తెఱఁగుసేఁత దలంచితయేని సత్కృపా**
**పర! చిరకారి నాబరఁగు భాసితనామము సార్థకం బగున్. 285**

**ప్రతిపదార్థం:** సత్కృపాపర!= మంచిదయగలవాడా!; పుత్ర!= కుమారా!; చిరముగన్= చాలాకాలంగా; గర్భవాసమునన్+చెందితి(వి)= తల్లియొక్క ఉదరవాసం చేశావు; తల్లి= మాత; చిరంబు+కాఁగన్= చాలాకాలంగా; నిన్నున్+అరసెన్+కదయ్య= నిన్ను కాపాడింది గదా నాయనా!; నేను= నేను; అనయంబును= నీతివిరహితమైన పనిని; పనుపంగన్= చేయుమని నిన్ను నియోగించగా; పూనియున్= పూనుకొని కూడా; చిరము+అగునట్టి= చాలాకాలం కొనసాగినట్టి; ఇత్తెఱఁగు చేఁత= ఈ పద్ధతిగా చేయటం; తలంచితి+అ+ఏనిన్= సంకల్పించితివా; చిరకారి+అనన్= చిరకారి అనగా; పరఁగు= ప్రవర్తిల్లే; భాసితనామము= ప్రకాశితమైన నీ పేరు; సార్థకంబు+అగున్= ప్రయోజనంతో కూడిన దవుతుంది.

**తాత్పర్యం:** కరుణాపరుడవైన ఓ కుమారా! నీవు చాలాకాలం నీతల్లి గర్భంలో ఉన్నావు. నిన్ను ఎంతోకాలం నీ తల్లి పోషించింది. నేను నిన్ను అవినీతి పరమైన కార్యం చేయటానికి పురికొల్పాను. ఐనా చాలాకాలం నీతల్లి నీకై చేసిన సేవలను తలంచుకొన్నావంటే 'చిరకారి' అనే నీ పేరు సార్థకమవుతుంది. (నీవు తొందర పడి నీ తల్లి వధకు పూనుకొనవు అని భావం).

**ఆ. నాకు నా తపంబునకు నింద రాకుండ, । దురితభయము నిన్నుఁ బొరయకుండ**
**నెమ్మిఁ జేసి తన్న నీ చిరకారిత । సకల భూతములును సంస్తుతింప. 286**

**ప్రతిపదార్థం:** నాకున్= మేధాతిథినైన నాకూ; నా తపంబునకున్= నా తపస్సుకూ; నింద= అపవాదు; రాకుండన్= కలగకుండ; నిన్నున్= నా కుమారుడవైన నిన్ను; దురితభయము= పాపభీతి; పొరయకుండన్= అంటకుండా; నీ చిరకారితన్= నీయొక్క చిరకారిత్వాన్ని; సకలభూతములును= సమస్త ప్రాణులును; సంస్తుతింపన్= పొగడగా; నెమ్మిన్= ప్రీతితో; చేసితి(వి)+అన్న!= చేసితివా బాబూ!

**తాత్పర్యం:** బాబూ! నాకూ, నే నింతకాలం చేసిన తపస్సుకూ నింద కలుగకుండానూ, నా కుమారుడ వైన నీకు 'తల్లిని చంపినందుకు కలిగే పాపభీతి అంటకుండానూ, సమస్త ప్రాణులూ నీ 'చిరకారిత్వ' మనే లక్షణాన్ని

స్తుతింపగానూ, నీతల్లిపట్ల ప్రీతి నెఱపితివా? (నీ చిరకారిత నెమ్మి జేసితన్న?= నీ చిరకారిత్వ మనే ధర్మాన్ని ప్రీతితో నెరవేర్చావా నాయనా!' అని కూడా అన్వయించుకొనవచ్చును).

**వ. అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశించినం గని చిరకారి నిజకరంబున నున్న వధసాధనంబు డిగ్గ విడిచి యగ్గౌతమవంశవర్యు చరణంబులు శిరంబు సోఁకఁ బ్రణామంబు సేసెం; బత్నియుం జాఁగి మ్రొక్కె; నయ్యిరువుర నెత్తి శోకబాష్పంబు లానందాశ్రువులుగా నమ్మునివరుండు దనయుని గాఢాలింగనంబును, మూర్ధఘ్రాణంబునుం జేసి దీవనలం బొగడ్తల నభినందించి దానును వారును సుఖాసీను లై యుండి యిట్లనియె. 287**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అనుకొంటూ; చనుదెంచి= వచ్చి; నివాసంబున్= గృహంలో; ప్రవేశించినన్= ప్రవేశించేసరికి; కని= చూచి; చిరకారి= అతడికుమారుడైన చిరకారి; నిజకరంబునన్+ఉన్న= తన చేతిలో ఉన్నట్టి; వధసాధనంబు= చంపటానికి సాధనమైన దానిని(కత్తిని); డిగ్గన్ విడిచి= వదలిపెట్టి; ఆ+గౌతమవంశవర్యు చరణంబులు= ఆ గౌతమవంశ శ్రేష్ఠుడైన మేధాతిథి పాదాలు; శిరంబుసోఁకన్= తలతాకేటట్లుగా; ప్రణామంబుచేసెన్= నమస్కరించాడు; పత్నియున్= భార్యకూడ; చాఁగిమ్రొక్కెన్= సాగిలబడి నమస్కరించింది; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; ఆ+ఇరువురన్= వారిద్దరినీ; ఎత్తి= పైకి లేవనెత్తి; శోకబాష్పంబులు= దుఃఖాశ్రువులు; ఆనంద+అశ్రువులుగాన్= సంతోషబాష్పాలు కాగా; తనయునిన్= కుమారుడిని; గాఢ+ఆలింగనంబును= గట్టి కౌగిలింతను; మూర్ధఘ్రాణంబునున్= శిరస్సు మూర్కొనుటను; చేసి= కావించి; దీనివలనన్= ఆశీర్వాదాలచేతనూ; పొగడ్తలన్= స్తుతులచేతనూ; అభినందించి= మెచ్చి; తానును= మేధాతిథి అయిన తానును; వారును= ఆ భార్యాపుత్రులును; సుఖాసీనులు+ఐ ఉండి= హాయిగా కూర్చున్నవారై ఉండి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా అనుకొంటూ వచ్చి మేధాతిథి తన ఇల్లు ప్రవేశించాడు. అతడిని చూచి చిరకారి తన చేతనున్న ఖడ్గాన్ని వదలిపెట్టాడు. ఆపై తండ్రి పాదాలు శిరస్సుసోకేటట్లు నమస్కరించాడు. మునిపత్ని కూడా ఆయనకు ప్రణమిల్లింది. ఆ మునీంద్రుడు ఆ యిద్దరినీ ఎత్తి తన దుఃఖబాష్పాలు ఆనందబాష్పాలు కాగా కుమారుడిని గట్టిగా కౌగిలించుకొన్నాడు. అతడి శిరసు మూర్కొన్నాడు. ఆశీర్వచనాలతోనూ, పొగడితలతోనూ అతడిని మెచ్చుకొన్నాడు. తరువాత మునీశ్వరుడూ, అతడి భార్యా, కుమారుడూ సుఖాసీనులై ఉన్నారు. అప్పుడు మేధాతిథి ఇట్లా అన్నాడు:

**క. 'కార్యవిచారము చిరముగ । ధైర్యముతో నడపవలయుఁ; దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁ డని । యార్యులు సేయుదురు నిశ్చయమును; దిరముగన్. 288**

**ప్రతిపదార్థం:** కార్యవిచారమున్= కార్యంయొక్క సమీక్షను; చిరముగన్= చిరకాలంగా; ధైర్యముతోన్= ధీరత్వంతో; నడపన్ వలయున్= నిర్వహించాలి; ఆర్యులు= పెద్దలు; తత్తత్క్రియల+అందున్= ఆయా కర్మలయందు; వీఁడు ఆర్యుఁడు= ఇతడు ఆర్యవృత్తి గలవాడు; అనార్యుఁడు అని= ఇతడు అనార్యవృత్తికలవాడు అని; తిరముగన్= స్థిరంగా; నిశ్చయమును= నిర్ణయాన్ని; చేయుదురు= చేస్తారు.

**తాత్పర్యం:** ఒక కార్యం చేయవలసి వచ్చినపుడు చాలాకాలం ఆలోచించి ధీరత్వంతో మంచి చెడ్డలు నిర్ణయించుకొని ఆ పని నెరవేర్చాలి. ఆయాపనులను నిర్వహించేటపుడు ఆలోచించి చేసేవాడిని ఆర్యుడనీ, తొందరపడేవాడిని అనార్యుడనీ పెద్దలైనవారు స్థిరంగా నిర్ణయిస్తారు.

**క. మిత్రత్వము శత్రుత్వముఁ । బాత్రతయు నపాత్రతయును బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా । సూత్రితముగ దాన నెల్ల శుభములు నొందున్.' 289**

**ప్రతిపదార్థం:** చిరతరగణనా సూత్రితముగన్= చాలాకాలం సమీక్షతో కూడినట్లుగా; మిత్రత్వమున్= మైత్రిని; శత్రుత్వమున్= శత్రుభావాన్ని; పాత్రతయున్= యోగ్యతయును; అపాత్రతయును= అయోగ్యతయును; పరికించు= పరిశీలించే; సుచారిత్రుఁడు= మంచి నడవడి కలవాడు; దానన్= అట్లా చేయటంవలన; ఎల్లశుభములన్= సమస్త కల్యాణాలను; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** తొందరపడక చాలాసేపు విచారించి 'ఇతడు మిత్రుడు, ఇతడు శత్రువు, ఇతడు యోగ్యుడు, ఇతడు అయోగ్యుడు' అని పరిశీలించి ఆచరించే సచ్చరిత్రుడు - సమస్తమైన శుభాలనూ పొందుతాడు'.

**వ. అని నిర్దేశించె; న ట్లా చిరకారి చిరకారిత్వంబు సఫలత్వంబు నొంది వినుతింబొందె. 290**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించెన్= అని చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; ఆ చిరకారి చిరకారిత్వంబు= ఆ మునికుమారుడి చిరకారితాలక్షణం; సఫలత్వంబున్= సాఫల్యాన్ని; ఒంది= పొంది; వినుతిన్+పొందెన్= పొగడ్తకెక్కాడు.

**తాత్పర్యం:** అని మేధాతిథి వచించాడు. ఈ రీతిగా 'చిరకారి' నామకుడయిన ఆ ముని కుమారుడి చిరకారిత్వం సఫలమయింది. అతడు తన చిరకారిత్వం వలన శ్లాఘాపాత్రుడయ్యాడు.

**క. కావునఁ గురువంశోత్తమ! । నీవును సదసత్ప్రకార నిశ్చయము చిరం**
**బై వఱలఁ జేయుమీ! యది । గావించుం జిరము లైన కార్యఫలములన్. 291**

**ప్రతిపదార్థం:** కురువంశ+ఉత్తమ!= కౌరవకులశ్రేష్ఠా!; కావునన్= అందువలన; నీవునున్= నీవుకూడ; సదసత్ప్రకారనిశ్చయము= మంచి చెడుల పద్ధతియొక్క నిర్ణయమును; చిరంబై= దీర్ఘకాలమున చేయబడునదై; వఱలన్= ఒప్పేటట్లు; చేయుమీ!= ఒనరింపుమా!; అని= ఆ విధంగా చేసిన నిశ్చయము; చిరములు+ఐన= శాశ్వతాలైన; కార్యఫలములన్= కార్యప్రయోజనాలను; కావించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** కురువంశోత్తముడవైన ఓ ధర్మరాజా! అందువలన నీవు కూడా కార్యం చేయవలసి వచ్చినపుడు మంచి చెడులను చక్కగా ఆలోచించి తొందరపాటు లేక నిర్వర్తించుము. అట్లా చేసిన కార్యం యొక్క నిర్ణయం శాశ్వత ఫలాలను ప్రసాదిస్తుంది.

**క. విను మచిరవృత్తిఁ జేసిన । పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం**
**బనఘా! చిరభావితశు । ద్ధి నిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్.' 292**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; వినుము= ఆలకించుము; అచిరవృత్తిన్= తొందరపాటుతో; చేసిన= నిర్వర్తించిన; పని= కర్మం; కర్తకున్= చేసినవాడికి; పశ్చాత్తాపంబు= అనుతాపం; ఆవహించున్= కలిగిస్తుంది; చిరభావిత శుద్ధి నిరూపణకృతము= చాలాకాలం భావింపబడి శుద్ధిని నిరూపించటం చేత చేయబడిన పని; శుభమున్= భద్రమును; తేజమున్= కాంతిని; తెచ్చున్= లభింపజేస్తుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ యుధిష్ఠిరా! వినుము. తొందరపడి ఒకడు పనిచేస్తే - ఆ పని చేసినవాడికి తరువాత పశ్చాత్తాపం కలిగిస్తుంది. అట్లాకాక చక్కగా చాలాకాలం ఆలోచించి దోషం లేదని నిర్ణయించుకొని చేసిన పని కర్తకు కల్యాణాన్నీ, ప్రకాశాన్నీ తెచ్చిపెట్టుతుంది.

**వ. అనిన విని ధర్మపుత్రుండు 'ప్రజల శిక్షించు వెరవెట్టి' దని యడిగిన నాపగానందనుండు 'దొల్లి ద్యుమత్సేనుం డను రాజునకు నిజతనూజుం డగు సత్యవంతుతోడ సంవాదంబు గలిగె నది నీయడిగిన యర్థంబునకుం బ్రకాశకం బగుఁ; జెప్పెద నాకర్ణింపుము'; వా రిద్దఱుం బ్రజాశిక్ష తెఱంగు మాటలాడు సమయంబున.293**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ధర్మపుత్రుండు= ధర్మజుడు; ప్రజలన్= జనులను; శిక్షించు వెరవు= శిక్షించే పద్ధతి; ఎట్టిది+అని అడిగినన్= ఏ విధమైనదని ప్రశ్నింపగా; ఆపగానందనుండు= గంగాసుతుడైన భీష్ముడు; తొల్లి= పూర్వం; ద్యుమత్సేనుండు+అను రాజునకున్= ద్యుమత్సేనుడనే నృపుడికి; నిజ తనూజుండు+అగు= తన కుమారుడైన; సత్యవంతుతోడన్= సత్యవంతుడనేవాడితో; సంవాదంబు= సంభాషణ; కలిగెన్= జరిగింది; అది= ఆ సంవాదం; నీ అడిగిన అర్థంబునకున్= నీవు ప్రశ్నించిన విషయానికి; ప్రకాశకంబు+అగున్= నిరూపించేదవుతుంది; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము; వారిద్దఱున్= ద్యుమత్సేన సత్యవంతు లనువా రిరువురు; ప్రజాశిక్ష తెఱంగు= ప్రజల శిక్షించే పద్ధతిని గూర్చి; మాటలాడు సమయంబునన్= సంభాషించుకొనే కాలమందు;

**తాత్పర్యం:** భీష్ము డావిధంగా చెప్పగా విని ధర్మరాజు 'ప్రజలను శిక్షించే పద్ధతి ఎట్లాంటిది?' అని మళ్ళీ ప్రశ్నించాడు. అప్పుడు భీష్ము డిట్లా అన్నాడు: 'పూర్వం ద్యుమత్సేనుడనే రా జుండేవాడు. అతడి కుమారుడు సత్యవంతుడు. వా రిరువురి మధ్య ఒక సంవాదం జరిగింది. ఆ సంవాదం నీ విపుడు నన్ను అడిగిన ప్రశ్నను వివరిస్తుంది. దానిని చెప్పుతాను వినుము. వారిరువురూ ప్రజలను శిక్షించే విధానాన్ని గురించి మాట్లాడుకొనే సమయంలో.

**సీ.** **వధము ధర్మంబుగా బుధులు సెప్పుదు రని । యనుశాసనము సేయు జనకుతోడ**
**సత్యవంతుఁడు 'హింస కృత్యకర్మంబగు । నేని యకృత్య మిం కేది?' యనుడు**
**'మ్రుచ్చులు ప్రల్లదుల్ సచ్చువారల యట్లు । గాకున్న బాధలు లోకమునకుఁ**
**బుట్టవె?' యనిన నబ్భూపతి యమ్మాట । కతఁడు 'సంపుటదక్క నన్యదండ**

**తే.** **విధిన శిక్ష సెల్లించుట వెరవుగాదె?' । నావుడును బతి 'య ట్లేల నడచు? దృష్టి**
**దండ వాగ్దండ ధనదండ తనువికార । దండములు సేయునది తప్పు దర మెఱింగి.** **294**

**ప్రతిపదార్థం:** బుధులు= పండితులు; వధమున్= చంపటాన్ని; ధర్మంబుగాన్= ధర్మకార్యంగా; చెప్పుదురు+అని= వచిస్తారని; అనుశాసనమున్ చేయు= ఆజ్ఞ చేయునట్టి; జనకుతోడన్= తండ్రితో; సత్యవంతుఁడు= అతడి కుమారుడగు సత్యవంతుడు; హింస= చంపటం; కృత్యకర్మంబు+అగున్+ఏనిన్= చేయదగిన పని ఐతే; ఇంకన్ అకృత్యము ఏది?= ఇంక చేయరాని పని ఏమున్నది?; అనుడున్= అనగా; ఆ+భూపతి= ఆ రాజు; మ్రుచ్చులు= దొంగలు; ప్రల్లదుల్= దుష్టులు; చచ్చువారల= చచ్చేవారే; అట్లు కాకున్నన్= అట్లా కానిచో; లోకమునకున్= ప్రపంచానికి; బాధలు= కష్టాలు; పుట్టవె?= కలుగవా?; అనినన్= అని చెప్పగా; ఆ+మాటకున్= ఆ పలుకునకు; అతఁడు= ఆ సత్యవంతుడు; చంపుటతక్కన్= వధించటం వినా; అన్యదండవిధిన్+అ= మరొక శిక్షాప్రకారంతోనే; శిక్ష చెల్లించుట= దండించటం; వెరవు గాదె!= యుక్తం కాదా!; నావుడును= అనగా; పతి= రాజు; అట్లు= ఆ రీతిగా; ఏల= ఎందుకు; నడచున్?= జరుగుతుంది?; తప్పు దరమున్= అపరాధంయొక్క ప్రమాణమును; ఎఱింగి= తెలిసికొని; దృష్టి దండ= చూపుతో శిక్షయు; వాగ్దండ= మాటలతో శిక్షించటం; ధనదండ= ధనాన్ని గ్రహించటం అనే శిక్షయు; తనువికారదండములు= శరీరానికి వికృతికలిగించటం అనే శిక్షలు; చేయునది= చేయాలి.

**తాత్పర్యం:** ద్యుమత్సేనుడు నేరం చేసినవారిని వధించటం ధర్మమని పండితులు చెప్పుతారని ఆనతి ఇచ్చాడు. అది విని అతడి కుమారుడు సత్యవంతుడు 'చంపటమే ధర్మమైతే ఇంక చేయరాని అధర్మ కార్య మేముంటుంది?' అని ప్రశ్నించాడు. అందుకు రాజు "దొంగలు, దుర్జనులు వధార్హులే, లేకపోతే లోకానికి వారివలన బాధలు తప్పవు' అని చెప్పాడు. అందుకు సత్యవంతుడు 'చంపటమనే శిక్షను వదలి మరొక దండనవిధానంతో శిక్షించటం ఉచితం కదా?' - అని అడిగాడు. అందుకు రాజు 'అట్లా ఎందుకు జరుగుతుంది? తప్పు చేసినవాడిని దండించేటప్పుడు

చేసిన తప్పు ఏ పాటిదో గమనించి అందుకు తగినట్లు చురచుర చూడటమనే శిక్షగాని, తీవ్రమైన మాటలతో మందలించటం అనే శిక్షగాని, డబ్బు వసూలు చేయటమనే శిక్షగానీ, లేక శరీరంలోని అవయవాలను వికృతం చేయటమనే శిక్షగానీ విధించాలి' అని చెప్పాడు.

**క. విను చంపఁ దగిన తప్పున । కనఘా! చంపుటయు వలయు; నాప్తుఁడు బంధుం**
**డనుజుఁడు దనుజుఁడు ననుమ । న్ననయును దుష్టునెడ రాజునకుఁ బాప మగున్. 295**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; విను= ఆలకించుము; చంపన్+తగిన తప్పునకున్= వధార్హమయిన నేరానికి; చంపుటయున్= వధించటమూ; వలయున్= అవసరమౌతుంది; రాజునకున్= ప్రభువుకు; దుష్టునెడన్= దుర్జనుడి పట్ల; ఆప్తుఁడు= కావలసినవాడు; బంధుండు= చుట్టం; అనుజుఁడు= సోదరుఁడు; తనుజుఁడు= కుమారుడు; అను మన్ననయున్= అనే ఆదరం కూడా; పాపము+అగున్= కిల్బిష మవుతుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవగు ఓ కుమారా! చెప్పుతాను వినుము. చంపదగిన తప్పుచేసినవాడిని చంపటమే కర్తవ్యం. రాజైనవాడికి దుర్మార్గుడి పట్ల 'వీడు నాకు కావలసినవాడు, చుట్టం, తమ్ముడు, కుమారుడు' అనే పక్షపాతంకూడా పాపమే అవుతుంది సుమా!

**తే. తాను మున్ను వినీతుఁడై తనదు మంత్రి । వరులఁ బుత్రుల భృత్యుల వరుసతోడ**
**వినయవంతులఁ జేసి భూవిభుఁడు ప్రజకు । రక్షణము సేయ నిహముఁ బరంబుఁ గల్గు. 296**

**ప్రతిపదార్థం:** భూవిభుఁడు= రాజు; మున్ను= ముందు; తాను వినీతుఁడు+ఐ= తాను వినయం కలవాడై; తనదు= తనయొక్క; మంత్రివరులన్= అమాత్యముఖ్యులను; పుత్రులన్= కుమారులను; భృత్యులన్= సేవకులను; వరుసతోడన్= క్రమంగా; వినయవంతులన్+చేసి= వినీతులుగా ఒనర్చి; ప్రజకున్= జనులకు; రక్షణము చేయన్= కాపుదల చేయగా; ఇహమున్+పరంబున్= ఇహలోకపరలోక సుఖాలు రెండూ; కల్గున్= సంభవిస్తాయి.

**తాత్పర్యం:** రాజైనవాడు తాను ముందు వినయంగల వాడుగా ఉండాలి. తదుపరి తన మంత్రులను, కుమారులను, సేవకులనూ క్రమంగా వినయపరులను చేయాలి. అట్లా చేసి ప్రజలను రక్షించే భూపతి ఇహలోక సుఖాన్నీ, పరలోక సౌఖ్యాన్నీ చూరగొంటాడు.

**క. దోష మరసి కామంబును । రోషంబును లేక తగిన రూపునఁ జేయం**
**బోషక మగు ధర్మమునకు । వైషమ్యవిహీనమైన వధము గుమారా! 297**

**ప్రతిపదార్థం:** కుమారా!= పుత్రా!; దోషము+అరసి= తప్పును పరీక్షించి; కామంబును= కోరికనూ; రోషంబును= క్రోధాన్ని; లేక= కలిగిఉండక; తగిన రూపునన్= ఉచితమైన పద్ధతిలో; చేయన్= ఆచరించగా; వైషమ్యవిహీనము+ఐన= పక్షపాతరహితమైన; వధము= చంపటం; ధర్మమునకున్= ధర్మాచరణానికి; పోషకము+అగున్= పోషించేదిగా అవుతుంది.

**తాత్పర్యం:** పుత్రా! తప్పుచేసినవాడి తప్పును చక్కగా పరీక్షించాలి. కామక్రోధాలు వదలి ఉచితమైన పద్ధతిలో ఏ విధమైన పక్షపాతమూ లేకుండా వధార్హమైన నేరానికే మరణదండన విధించాలి. అట్లా చేస్తే అది ధర్మాన్ని పోషించే శిక్షగా అవుతుంది.

**క. చంపఁగఁ జూచియు లోభము । పెంపునఁ గ్రోధమునఁ గామపీడను మది శం**
**కింపక దుష్టులు గీడొన । రింపఁగఁ జూడమె కలంక రేఁగు నహింసన్. 298**

**ప్రతిపదార్థం:** దుష్టులు= దుర్జనులు; చంపఁగన్= వధించగా; చూచియున్= చూచికూడా; లోభము పెంపునన్= ఎక్కువ ఆశతోనూ; క్రోధమునన్= కోపంతోనూ; కామపీడను= కోరికవలన కలిగే ఒత్తిడివలన; మదిన్= మనసులో; శంకింపక= సందేహించక; కీడు+ఒనరింపఁగన్= అపకారం చేస్తుండగా; చూడమె= మనం చూస్తున్నాముకదా!; అహింసన్= హింస లేకపోవటం చేత; కలంక రేఁగున్= అస్తవ్యస్తమైన స్థితి విజృంభిస్తుంది.

**తాత్పర్యం:** దుర్మార్గులు నేరం చేసినవారు వధించబడటం చూస్తూనే ఉంటారు. కాని, కామం, క్రోధం, లోభం అనే దుర్గుణాలు మితిమీరటం వలన మదిలో ఏ విధమైన సందేహం లేకుండా ఇతరులకు తీవ్రమైన అపకారం చేస్తూనే ఉంటారు. ఇది మనం చూస్తూనే ఉన్నాంకదా! కాబట్టి మరణదండన విధించకుండా రాజు పూర్తిగా అహింసాపద్ధతిని పాటిస్తే లోకంలో ఎంతో అరాజకం ప్రబలిపోతుంది.

**విశేషం:** మానవులు కామక్రోధలోభాలకు గురిఅయి అకృత్యాలు చేసి నరకం పాలవుతారు. భగవద్గీతలో - ఈ విషయమే - "త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః, కామః క్రోధశ్చ లోభశ్చ తస్మా దేతత్త్రయం త్యజేత్" అని చెప్పబడింది. అరిషడ్వర్గాలనబడే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలలో మొదటివి మూడూ ఎంతగా మానవుడిని అకృత్యాలకు ప్రేరేపిస్తాయో ఇక్కడ ద్యుమత్సేనుడు నిరూపించాడు.

**ఆ. విను మహింస విప్రజనులకు నెల్ల భం । గులను వలయుఁ బ్రజలవలనఁ గరుణ**
**గలిగి వారిఁ గీడు గదురక యుండంగఁ । గాపు పతి కహింసకత్వ మనఘ!' 299**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; వినుము= ఆలకించుము; విప్రజనులకున్= బ్రాహ్మణులకు; ఎల్లభంగులనున్= అన్నివిధాలా; అహింస= హింసలేమి; వలయున్= ఆవశ్యకమై ఉన్నది; పతికిన్= రాజునకు; ప్రజలవలనన్= జనులపట్ల; కరుణకలిగి= దయగలిగి; వారిన్= ఆ ప్రజలను; కీడు= అపకారం; కదురక ఉండంగన్= తాకకఉండేటట్లుగా; కాపు= రక్షించటం; అహింసకత్వము= హింసకుడు కాకుండా ఉండట మవుతుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవైన సత్యవంతుడా! వినుము. బ్రాహ్మణులైనవారు అన్నివిధాలా అహింసనే పాటించాలి. ప్రజాపాలకుడైన భూపతికి ఆ విధమైన అహింస తగదు. అతడు ప్రజలపట్ల దయగలిగి ఉండాలి. వారికి ఏ విధమైన అపకారం కలుగకుండా చూడాలి.అట్లా ప్రజలను కాపాడటమే రాజైన వానికి అహింస అవుతుంది'.

కపిల గో సంవాద ప్రకారము (సం. 12-260-5)

**వ. అనియె నని చెప్పిన విని యజాతశత్రుండు తాతతో 'నవశ్యకర్తవ్యంబు గృహస్థధర్మంబో పరిత్యాగంబో నిరూపించి చెప్పవే' యనిన నతండు 'రెండును మాననీయ ధర్మంబులు; కపిలగోసంవాదంబను నితిహాసంబు వినుము; దాన నీవితర్కంబు వినిశ్చయ దశంబొందు, నని పలికి యిట్లనుఁ 'గపిలుం డను సంయమిసత్తముం డుత్తమాకృతియు భీతిరహితయు నహుషసంభావితయు నగు నొక్కగోవుం గాంచి 'నీవు వేదస్వరూపవు గావే' యని పలికె నమ్మాట వేదంబుల వలని యాదరంబు లేమింజేసి వెడలినదిగా నూహించి యప్పుడు గెలన నున్న స్యూమరశ్మి యనుముని సూక్ష్మ రూపంబున నగ్గోవు నందుఁ బ్రవేశించి. 300**

**ప్రతిపదార్థం:** అనియెన్+అని= అని చెప్పానని; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; అజాతశత్రుండు= ధర్మరాజు; తాతతోన్= భీష్ముడితో; అవశ్యకర్తవ్యంబు= తప్పక చేయదగింది; గృహస్థధర్మంబో= గృహస్థుడికి సంబంధించిన ధర్మమో; పరిత్యాగంబో= సన్న్యాసమో; నిరూపించి= నిరూపణంచేసి; చెప్పవే= చెప్పుము; అనినన్= అనగా; అతండు= ఆ భీష్ముడు; రెండును=

గృహస్థసన్న్యాసములు రెండును; మాననీయ ధర్మంబులు+అ= పూజించదగిన ధర్మాలే; కపిలగోసంవాదంబు+అను= కపిలగోసంవాదంఅనే; ఇతిహాసంబు= పూర్వకథను; వినుము= ఆలకించుము; దానన్= అది వినటంవలన; నీ వితర్కంబు= నీసందేహం; వినిశ్చయదశన్= నిర్ణయస్థితిని; పొందున్+అని= పొందగలదని; పలికి= చెప్పి; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; కపిలుండు+అను= కపిలనామకుడైన; సంయమిసత్తముండు= మునిశ్రేష్ఠుడు; ఉత్తమ+ఆకృతియున్= మేలైన ఆకారం కలదీ; భీతిరహితయున్= భయంలేనిదీ; నహుష సంభావితయున్= నహుషుడిచేత సమ్మానించబడినదీ అయిన; ఒక్కగోవున్= ఒక ఆవును; కాంచి= చూచి; నీవు వేదస్వరూపవు కావే= నీవు శ్రుతి స్వరూపిణివి అగుదువుగదా!; అని పలికెన్= అని చెప్పాడు; ఆ+మాట= ఆ పలుకు; వేదంబుల వలని= వేదములవలన; ఆదరంబు= గౌరవం; లేమిన్+చేసి= లేకపోవటంవలన; వెడలినదిగాన్= పుట్టిందిగా; ఊహించి= తర్కించి; అప్పుడు= ఆ సమయంలో; కెలనన్+ఉన్న= సమీపంలో ఉన్న; స్యూమరశ్మి అనుముని= స్యూమరశ్మి అనే మౌని; సూక్ష్మరూపంబునన్= సూక్ష్మమైన రూపంతో; ఆ+గోవునందున్= ఆ ఆవులో; ప్రవేశించి= చొచ్చి.

**తాత్పర్యం:** అని ద్యుమత్సేనుడనే రాజు చెప్పాడు' అని భీష్ముడు అన్నాడు. అది విని ధర్మరాజు భీష్ముడితో 'గృహస్థధర్మ సన్న్యాస ధర్మాలలో తప్పక ఆచరించదగిన ధర్మమేదో నిర్ధారణ చేసి చెప్పు'మన్నాడు. అప్పుడు భీష్ముడు, 'పై రెండు ధర్మాలూ గౌరవించదగినవే. దీనిని నిరూపించే కపిలగోసంవాద మనే ఒక ఇతిహాసం ఉన్నది. దానిని వినిపిస్తాను, వినుము. అది వింటే నీ సందేహం తొలగిపోతుంది' అని చెప్పి ఇట్లా అన్నాడు: 'కపిలు డనే మునివర్యుడు శ్రేష్ఠమైన ఆకారం కలదీ, నిర్భయమైనదీ, నహుషుడిచేత పోషించబడినదీ, అయిన ఒక ధేనువును చూచి, నీవు వేదస్వరూపిణివిగదా అన్నాడు. ఆ ప్రక్కనే ఉన్న స్యూమరశ్మి అనే ముని కపిలుడి మాట వేదాలపై గౌరవం లేకపోవటం వలన వెలువడిందని ఊహించాడు. వెంటనే అతడు సూక్ష్మాకృతితో ఆ గోవులో ప్రవేశించాడు. అట్లా ప్రవేశించి -(తరువాతి పద్యంతో అన్వయం).

**క. వేదములు డాంబికత్వా । పాదనములు గాఁగ యతులు వలుకుదు; రవి స**
**ర్వాదరణీయంబులు నీ । కాదరపాత్రములు గావొ?' యని పలుకుటయున్. 301**

**ప్రతిపదార్థం:** యతులు= సన్న్యాసులు; వేదములు= శ్రుతులు; డాంబికత్వ+ఆపాదనములు కాఁగన్= డాంబికతను కలుగజేసేవిగా; పలుకుదురు= చెప్పుతారు; అవి= ఆ వేదాలు; సర్వ+ఆదరణీయంబులు= అందరికీ ఆదరించదగినవి; నీకున్+ఆదరపాత్రములు= నీకు గౌరవయోగ్యాలు; కావొ?= కావా?; అని పలుకుటయున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** 'పరివ్రాజకులు వేదాలు డంబం కలిగిస్తాయని అంటారు. అవి అందరికీ ఆదరింపదగి ఉన్నాయి. నీకు ఆదరించదగినవి కావా?' అని కపిలుడితో గోవులో ప్రవేశించిన స్యూమరశ్మి అన్నాడు. అట్లా అనేసరికి -(తరువాతి పద్యంతో అన్వయం).

**వ. అగ్గోవున కతం డిట్లనియె. 302**

**ప్రతిపదార్థం:** ఆ+గోవునకున్= ఆ ఆవుతో; అతండు= కపిలుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు ఆ గోవుతో కపిలు డిట్లా అన్నాడు:

**క. 'వేదములవలన నాకు న । నాదరమును నాదరమ్ము నను రెండును లేఁ;**
**వేది గతంబుగ నడిగితొ । నీదు తలం పెఱుఁగునట్టి నేరిమి గలదే. 303**

**ప్రతిపదార్థం:** వేదములవలనన్= వేదాలపట్ల; నాకున్= నాకు; అనాదరమును= గౌరవం లేకుండటం కాని; ఆదరమ్మును= మన్ననకాని; అను రెండును లేవు= అనే రెండు భావాలూ లేవు; ఏది కతంబుగన్= ఏది కారణంగా; అడిగితొ= నీవు అడిగినావో; నీదు తలంపు= నీ అభిప్రాయాన్ని; ఎఱుఁగునట్టి= తెలిసికొనేటటువంటి; నేరిమి= నేర్పు; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** 'అయ్యా! వేదాల విషయంలో నాకు ఆదరమూ లేదు. అనాదరమూ లేదు. నీవు ఎందు కిట్లా అడిగావో నాకు తెలియదు. నీ అభిప్రాయాన్ని గ్రహించే నేర్పరిని కాను.

**వ. అయినను నా యెఱింగినంత సెప్పెద నాకర్ణింపుము; బ్రహ్మచర్య గృహస్థ ధర్మ వానప్రస్థ వృత్తి పరివ్రజనంబు లను నాలుగాశ్రమంబులు దేవయానంబుల; యత్తెరువుల నడచుట సంసారులకుఁ గర్తవ్యంబు గావున. 304**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికీ; నా ఎఱింగినంత= నేను గ్రహించినంత వరకు; చెప్పెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము; బ్రహ్మచర్య గృహస్థధర్మ వానప్రస్థవృత్తి పరివ్రజనంబులు+అను= బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థ వర్తనం, సన్న్యసనం అనే; నాలుగు ఆశ్రమంబులు= చతురాశ్రమాలు; దేవయానంబులు+అ= ఆత్మప్రాప్తిహేతువులైన దేవయాన మార్గాలే; ఆ+ తెరువులన్= ఆ మార్గాలలో; నడచుట= చరించటం; సంసారులకున్= సంసారంలో ఉండేవారికి; కర్తవ్యంబు= అనుష్ఠించదగినది; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** అయినప్పటికీ నాకు తెలిసినంత వరకూ నీ వడిగిన విషయం చెప్తుతాను. వినుము. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే నాలుగు ఆశ్రమాలూ ఆత్మప్రాప్తికి సాధనాలే కాబట్టి, దేవయానా లనబడు తున్నాయి. ఆ మార్గాలలో నడవటం సంసారులైన వారికి ఆచరణీయంగా ఉన్నది. అందువలన - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వారలకు వేదవిహితా । చారంబులు వలయు నది ప్రశస్తము హింసా**
**ప్రారంభ మాచరించుట । యారయఁగా మేలొ కీడొ యంచితమూర్తీ!' 305**

**ప్రతిపదార్థం:** అంచితమూర్తీ!= పావనమూర్తీ!; వారలకున్= ఆ సంసారులకు; వేదవిహిత+ఆచారంబులు= వేదంచేత విధించబడిన ఆచారాలు; వలయున్= అవసరమై ఉన్నవి; అది= ఆ పద్ధతి; ప్రశస్తము= శ్రేష్ఠం; హింసాప్రారంభము= హింసాప్రయత్నం; ఆచరించటం= చేయటం; ఆరయఁగాన్= పరిశీలించగా; మేలొ= శుభమో; కీడొ= అశుభమో!

**తాత్పర్యం:** ఓ పవిత్రమూర్తీ! వేదం విధించిన ఆచారాలు సంసారులైన వారికి ఆవశ్యకమయి ఉన్నాయి. వేదవిహిత పద్ధతిలో నడవటం శ్రేష్ఠమైనది. అయితే యజ్ఞాలలో హింసకు పూనుకొనటం శుభప్రదమో, అశుభప్రదమో నీవే చెప్పుము'.

**వ. అనుటయు స్యూమరశ్మి యతని కిట్లనియె. 306**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కపిలుడు చెప్పగా; స్యూమరశ్మి= గోవులోఉన్న స్యూమరశ్మి; అతనికిన్= కపిలుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** కపిలు డట్లా అడిగేసరికి గోవులో ప్రవేశించి ఉన్న స్యూమరశ్మి అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'అలఘుమతిని యజ్ఞార్థం । బులుగాఁ బశువులను ధాన్యములఁ గల్పించెన్**
**జలజభవుం; డదిగాకయుఁ । దలకొని యజ్ఞంబు లతఁడు దాఁ జేయఁడొకో!' 307**

**ప్రతిపదార్థం:** జలజభవుండు= బ్రహ్మ; అలఘుమతినిన్= గొప్పబుద్ధితో; పశువులనున్= జంతువులనూ; ధాన్యములన్= కొలుచులూ; కల్పించెన్= సృష్టించాడు; అది కాకయున్= అంతేకాక; అతఁడు= ఆ బ్రహ్మ; తాన్= తాను; తలకొని= పూనుకొని; యజ్ఞంబులు= యాగాలు; చేయఁడు+ఒకో!= చేయటం లేదా!

**తాత్పర్యం:** బ్రహ్మ గొప్ప ఆలోచనతో యజ్ఞంకొరకే పశువులను, ధాన్యాలను సృష్టించాడు. అంతే కాదు. అతడు తాను పూనుకొని యజ్ఞాలు చేశాడు కదా!

**క. విను మజ్ఞునకును బ్రాజ్ఞున। కును గలయది దివ్యసుఖము గోరుట దివ్య**
**త్వనిరూఢి యాగకరణం। బునఁ దక్కఁగ నొంటఁ గలుగఁ బోలునె చెపుమా! 308**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; దివ్యసుఖము= దేవలోకానికి చెందిన సుఖాన్ని; కోరుట= అభిలషించటం; అజ్ఞునకునున్= జ్ఞానహీనుడికి; ప్రాజ్ఞునకును= జ్ఞానవంతునికిని; కలయది= ఉన్నదే; యాగకరణంబునన్+తక్కఁగన్= యజ్ఞంచేస్తే తప్ప; ఒంటన్= మరొకవిధంగా; దివ్యత్వనిరూఢి= దేవత్వసిద్ధి; కలుగన్+పోలునె?= సిద్ధిస్తుందా?; చెపుమా!= వివరించుమా!

**తాత్పర్యం:** ఇంకా వినుము. జ్ఞానవంతుడు, జ్ఞానహీనుడూ ఇద్దరూ దివ్యసుఖం అభిలషిస్తారు. యజ్ఞంచేస్తే తప్ప దేవలోకసుఖహేతువైన దివ్యత్వప్రాప్తి కలుగదు. మరొకరీతిగా కలుగుతుందేమో నీవే చెప్పుము.

**క. అమలిన గృహస్థ ధర్మో త్తమముం గల్మషహరంబు దైవతసంభా**
**వ్యము నైన యజ్ఞ కర్తృ। త్వము మునివర! హింస గాఁగ దలఁపం దగునే? 309**

**ప్రతిపదార్థం:** మునివర!= మునిశ్రేష్ఠా!; అమలినగృహస్థ ధర్మోత్తమమున్= నిష్కల్మషమైన శ్రేష్ఠమైన గృహస్థధర్మమూ; కల్మషహరంబున్= పాపహరమూ; దైవతసంభావ్యమున్= దేవతలచేత సమ్మానించదగిందీ; ఐన= అయినట్టి; యజ్ఞకర్తృత్వము= యాజకత్వం; హింసకాఁగన్= హింసాకృత్యంగా; తలఁపన్+తగునే= భావించటం యుక్తమా?

**తాత్పర్యం:** ఓ మునీంద్రా! యజ్ఞం చేయటమనేది కల్మషరహితమూ, శ్రేష్ఠతమమూ అయిన గృహస్థధర్మం. అది పాపాన్ని హరిస్తుంది. దేవతలుకూడా ఆ పనిని గౌరవిస్తారు. అట్టిదానిని హింస అని భావించటం యుక్తమా?'

**చ. అనుటయు నిట్లనుం గపిలుఁ 'డాత్మ సుఖైక పరాయణుండు మె**
**చ్చునె పెఱసౌఖ్యకోటి గతశోకుఁ డకాముఁడ సంగశీలుఁ డా**
**తని కవియెల్ల నేటికి మదప్రదలోకము లొల్లమిన్ సనా**
**తన మగు మోక్షముం గొఱలి తా విడుచున్ గృహధర్మవర్గమున్.' 310**

**ప్రతిపదార్థం:** అనుటయున్= స్యూమరశ్మి అట్లా అనగా; కపిలుఁడు= కపిలమునీంద్రుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ఆత్మసుఖ+ఏక పరాయణుండు= ఒక్క ఆత్మసుఖం మీదనే ఆసక్తి కలవాడు; పెఱసౌఖ్యకోటిన్= ఇతరాలైన అనేక సుఖాలను; మెచ్చునె?= అభినందిస్తాడా?; గతశోకుఁడు= శోకం తొలగిన వాడు; అకాముఁడు= కోరికలేనివాడు; అసంగశీలుఁడు= సంగం లేనివాడు అయిన; ఆతనికిన్= అతడికి; అవిఎల్లన్= ఆ ఇతర సుఖాలన్నీ; ఏటికిన్?= ఎందుకు?; తాన్= తాను; మదప్రద లోకములు= ఇంద్రియసుఖమిచ్చే లోకాలను; ఒల్లమిన్= అభిలషించకపోవటంవలన; సనాతనము+అగు= శాశ్వతమైన; మోక్షమున్= ముక్తిని; కొఱలి= పొంది; గృహధర్మవర్గమున్= గృహస్థులకు చెందిన ధర్మాల సముదాయాన్ని; విడుచున్= వదలుతాడు.

**తాత్పర్యం:** స్యూమరశ్మి అట్లా చెప్పేసరికి అతడితో కపిలముని ఇట్లా అన్నాడు: 'ఆత్మసుఖాన్ని మాత్రమే కోరేవాడు ఇతర సుఖాలను కోరడు. అతడు శోకరహితుడు, కామరహితుడు, సంగరహితుడు. అట్లాంటివాడికి ఆ పరలోకసుఖాలతో పనేమి? అతడు సుఖప్రదమైన స్వర్గాదిలోకాలను అభిలషించడు కాబట్టి శాశ్వతమైన మోక్షం పొంది గృహస్థధర్మాలను వర్జిస్తాడు'.

**వ. అనిన విని స్యూమరశ్మి యా సిద్ధప్రవరున కిట్లనియె. 311**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; స్యూమరశ్మి= స్యూమరశ్మి అనే ముని; ఆ సిద్ధ ప్రవరునకున్= ఆ కపిలుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కపిలు డట్లా చెప్పగా విని స్యూమరశ్మి సిద్ధశ్రేష్ఠుడైన ఆ కపిలుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. ప్రజలు దల్లిఁ జెందు పగిది గృహస్థ ధ । ర్మంబు నెల్ల యాశ్రమములుఁ జేరి**
**కాదె జీవనంబు గావించుకొను గృహ । యుక్తుఁ డోషధులకు నొడయుఁ డగుట. 312**

**ప్రతిపదార్థం:** గృహయుక్తుఁడు= గృహస్థుడు; ఓషధులకున్= సస్యములకు; ఒడయుఁడు+అగుటన్= ప్రభువు కావటంవలన; ప్రజలు= బిడ్డలు; తల్లిన్+చెందుపగిదిన్= తల్లిని చేరేటట్లు; ఎల్ల ఆశ్రమములు= అన్ని ఆశ్రమాలూ; గృహస్థధర్మంబున్= గృహస్థాశ్రమాన్ని; చేరి= ఆశ్రయించి; జీవనంబు= బ్రతుకు; కావించుకొనున్ కాదె= నిర్వహించుకొంటాయి గదా!

**తాత్పర్యం:** గృహస్థుడు ఫలమునిచ్చి వెంటనే నశించిపోయే సస్యాదులైన ఓషధులకు ప్రభువు. అందువలన బిడ్డలు తల్లిని చేరినట్లే ఇతర ఆశ్రమాలకు చెందిన వారు తమకు పోషకుడైన గృహస్థుడిని ఆశ్రయించి జీవిస్తున్నారు.

**క. విను మోక్షము గార్హస్థ్యం । బునఁ గాదని యెన్నఁ డెచటఁ బురుషుం డెవ్వం**
**డు నిరూపించి పలికె? స । ర్వనిధానము గృహము వేదవాక్యఫలజ్ఞా! 313**

**ప్రతిపదార్థం:** వేదవాక్యఫలజ్ఞా!= శ్రుతివచనాల ఫలం ఎఱిగిన కపిలమహర్షీ!; విను= ఆలకించుము; గార్హస్థ్యంబునన్= గృహస్థాశ్రమంతో; మోక్షము= ముక్తి; కాదని= సిద్ధించదని; ఎన్నఁడున్= ఎప్పుడు; ఎచటన్= ఎక్కడ; పురుషుండు+ఎవ్వండు= ఏ పురుషుడు; నిరూపించి= నిర్ధారణ చేసి; పలికెన్?= చెప్పెను?; గృహము= ఇల్లు; సర్వనిధానము= అన్నిటికీ నిధి అయినది.

**తాత్పర్యం:** ఓ శ్రుతివచన ఫలాన్ని ఎరిగిన మునీంద్రా! గృహస్థాశ్రమం వలన ముక్తి సిద్ధించ దని ఎవడు, ఎప్పుడు, ఎక్కడ నిరూపణ చేసి చెప్పాడు? గృహం సమస్త కార్యాలకూ, వాటి ఫలాలకూ నిధిఅయినది కదా!

**క. అలసులు ధనహీనులు నై । సొలసి క్రియలు విడుతు; రది విసూత్రత; దానం**
**గలదే సద్గతి? వేదం । బులు విడిచి యఘుంబుపరతఁ బోవరె తండ్రీ! 314**

**ప్రతిపదార్థం:** తండ్రీ!= నాయనా!; అలసులు= సోమరులు; ధనహీనులును+ఐ= దరిద్రులుఅయి; సొలసి= వెనుదీసి; క్రియలు= కర్మలు; విడుతురు= వర్జిస్తారు; అది= అట్లా వర్జించటం; విసూత్రత= విగతసూత్రత్వమవుతుంది; దానన్= దానివలన; సద్గతి=మంచిగతి; కలదే?= ఉన్నదా?; వేదంబులు= శ్రుతులు; విడిచి= వర్జించి; అఘంబుపరతన్=పాపపరత్వంతో;పోవరె?=పోరా?

**తాత్పర్యం:** తండ్రీ! సోమరులై దరిద్రులైనవారు వెనుక అడుగువేసి వేదవిహితకర్మలు విడిచివేస్తారు అది తెగిన దారంవలె ఆలంబనం లేని స్థితిగా పరిణమిస్తుంది. దానివలన సద్గతి నశిస్తుంది. ఇట్లా వేదాలు వర్జించినవారు పాపానికి అగ్గమై నశించి పోకుండా ఉంటారా?

**క.** **విదితము గర్భాధానము । మొదలుగ శ్రుతికలితమంత్రములు నిర్మల సం**
**పద లెల్లను బ్రాహ్మణునకు । నొదవించుట దగునె శ్రుతుల నొల్లక యుండన్.' 315**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణునకున్= విప్రునకు; గర్భాధానము మొదలుగన్= గర్భంలో బీజావాపం మొదలుకొని; శ్రుతికలితమంత్రములు= వేదంలో విధించబడిన మంత్రాలు; నిర్మలసంపదలు+ఎల్లను= విమలమైన సమస్త సంపదలను; ఒదవించుట= కలిగించటం; విదితము= తేటతెల్లం; శ్రుతులన్= వేదాలను; ఒల్లకఉండన్= అంగీకరించకుండటం; తగునె?= ఉచితమా?

**తాత్పర్యం:** గర్భాధానం మొదలైన సంస్కారం గల్గించే వేదవిహితమంత్రాలు బ్రాహ్మణుడికి సమస్త సంపదలను కలిగించటం లోక ప్రసిద్ధమే. వేదాలను అంగీకరించకుండటం ఉచితమౌతుందా?'

**ఆ.** **అనినఁ గపిలుఁ డిట్టు లని వివరించు 'నా । చారములను దేవ సమితి నెల్ల**
**భూమిసురులు దృప్తిఁ బొందింతు; రమృత మా । నంగఁ బ్రీతి నిచ్చు భంగి యొలయ. 316**

**ప్రతిపదార్థం:** అనినన్= స్యూమరశ్మి అట్లా అనగా; కపిలుఁడు= కపిలమహాముని; ఇట్టులు+అని= ఈ రీతిగా; వివరించున్= చెప్పాడు; భూమిసురులు= బ్రాహ్మణులు; ఆనంగన్= త్రాగటానికి; ప్రీతిన్= ప్రియంగా; అమృతము+ఇచ్చు భంగి= అమృతమొసంగే పద్ధతి; ఒలయన్= కలుగగా; ఆచారములను= ఆచారాలతో; దేవసమితిన్+ఎల్లన్= దేవతల సమూహమంతటిని; తృప్తిన్+పొందింతురు= తనివి నొందిస్తారు.

**తాత్పర్యం:** స్యూమరశ్మి అట్లా చేప్పేసరికి కపిలు డీ రీతిగా తన అభిప్రాయం వివరించాడు. 'విప్రులు దేవతలనందరినీ అమృతం ద్రావించినరీతిగా వేదవిహితాలైన ఆచారాలతో తృప్తి పొందింపజేస్తారు.

**వ.** **అది యట్లుండె వినుము చెప్పెద. 317**

**ప్రతిపదార్థం:** అది= అట్లా చేయటం; అట్లు+ఉండెన్= ఆ రీతిగా ఉండనిమ్ము; చెప్పెదన్= ఇంకను విశేషాలు చెప్పుతాను; వినుము.

**తాత్పర్యం:** విప్రులు పాటించే ఆచారాలు అట్లా ఉన్నాయి. ఇంకా వినదగిన విశేషాలు వివరిస్తాను వినుము.

**క.** **పాణి యుపస్థం బుదరము । వాణి యనఁగ మూయరాని వాకి ళ్ళివి; గీ**
**ర్వాణులకు వీని బుధుఁడు పు । రాణపురుషరక్షకై తిరంబుగ మూయున్. 318**

**ప్రతిపదార్థం:** పాణి= చేయి; ఉపస్థంబు= గుహ్యేంద్రియం; ఉదరము= పొట్ట; వాణి= వాక్కు; అనఁగన్= అనగా; గీర్వాణులకున్= దేవతలకు (కూడ); మూయన్ రాని= మూయటానికి వీలుకాని; వాకిళ్ళు+ఇవి= ద్వారాలివి; బుధుఁడు= పండితుడు; పురాణపురుష రక్షకై= పరమాత్మ పరిరక్షణకుగాను; వీనిన్= ఈ ద్వారాలను; తిరంబుగన్= గట్టిగా; మూయున్= బంధిస్తాడు.

**తాత్పర్యం:** దేవతలకు సైతం చేయి, గుహ్యేంద్రియం, పొట్ట, వాక్కు అనే వాకిళ్ళు నాలుగూ మూయరానివై ఉన్నాయి. ఆత్మజ్ఞుడైన పండితుడు తనలోని పరమాత్మను పరిరక్షించటానికై ఈ నాలుగు ద్వారాలనూ గట్టిగా మూసివేస్తాడు.

**తే.** **పుచ్చికొనఁడు ముందటఁ బైఁడిప్రోక యున్న; । నలుక నొడమియుఁ బొడువను నడువఁ దొడఁగ;**
**డట్టి యా నైష్ఠికుని చేత నడఁగకున్నె। పాణి యనియెడు వాకిలి బంధురముగ.** **319**

**ప్రతిపదార్థం:** ముందటన్= ఎదురుగా; పైడిప్రోక= బంగారుప్రోగు; ఉన్నన్= ఉండినప్పటికీ; పుచ్చికొనఁడు= స్వీకరించడు; అలుక= కోపం; పొడమియున్= కలిగినా; పొడువనున్= పొడవటానికి; అడువన్= కొట్టటానికి; తొడఁగడు= ప్రయత్నించడు; అట్టి= అటువంటి; ఆ నైష్ఠికునిచేతన్= ఆ నిష్ఠగలవాడిచేత; పాణి అనియెడు= చేయి అనే; వాకిలి= ద్వారం; బంధురముగన్= ఒప్పిదంగా; అడఁగక+ఉన్నె?= మూయబడక ఉంటుందా?

**తాత్పర్యం:** ఆత్మజ్ఞుడు ఎదురుగా స్వర్ణరాశి పడిఉన్నా పరిగ్రహించడు. కోపం వచ్చినా ఎదుటివారిని పొడవటం, కొట్టటం చేయడు. అట్లాంటి నిష్ఠాగరిష్టుడు 'చేయి' అనే వాకిలిని చక్కగా మూసినవాడవుతాడు.

**క.** **ఏ విధము కాంతనైనన్। దా విహరణమునకు నెపుడుఁ దార్పఁడు తనయం**
**దావిష్టము భార్యావ్రత। మావెర వడ్డం బుపస్థ మనువాకిటికిన్.** **320**

**ప్రతిపదార్థం:** తాన్= తాను; ఏ విధము కాంతన్+ఐనన్= ఎట్లాంటి స్త్రీనైనా; విహరణమునకున్= విహారానికి; తార్పఁడు= కదియించడు; భార్యావ్రతము= పరస్త్రీవర్జనాత్మకమైన పత్నీవ్రతం; తన+అందున్= తనలో; ఆవిష్టము= ప్రవేశించిఉంటుంది; ఆ వెరవు= ఆ పద్ధతి; ఉపస్థము+అను= గుహ్యేంద్రియ మనే; వాకిటికిన్= ద్వారానికి; అడ్డంబు= నిరోధమై ఉన్నది.

**తాత్పర్యం:** ఆత్మజ్ఞుడైన పండితుడు ఎట్లాంటి స్త్రీనైనా తనతో విహరించటానికి పురికొల్పడు తాను తన భార్యతో తప్ప ఇతర స్త్రీలతో రమించడు. ఈ పద్ధతి 'ఉపస్థ' మనే ద్వారాన్ని బంధిస్తుంది.

**క.** **తనుయాత్రకుఁగా నశనము। గొనుఁ; బూర్ణముగాఁ గొనండు; గోరఁడు లౌల్యం**
**బున రాని దాని; నమ్మెయి। ముని యుదరద్వార మోపి మూసెన కాదే?** **321**

**ప్రతిపదార్థం:** అశనము= ఆహారం; తనుయాత్రకుగాన్= శరీరనిర్వహణానికై; కొనున్= స్వీకరిస్తాడు; పూర్ణముగాన్= పొట్టనిండుగా; కొనండు= తినడు స్వీకరించడు; లౌల్యంబునన్= చాపల్యంతో; రానిదానిన్= తనకు ప్రాప్తించనిదానిని; కోరఁడు= అభిలషించడు; ఆ+మెయిన్= ఆ రీతిగా; ముని= సంయమి; ఉదరద్వారము= 'పొట్ట' అనెడి వాకిలిని; మూసెన్+అ కాదే= బంధించెనే కదా!

**తాత్పర్యం:** ఆత్మతత్త్వజ్ఞుడైన మునీంద్రుడు శరీరధారణకు ఎంత అవసరమో అంతే ఆహారం పరిగ్రహిస్తాడు. అంతేకాని పొట్టనిండా తినడు. తన కేది ప్రాప్తమో దానితో తృప్తి వహిస్తాడే కాని రానిదానిపై చాపల్యంతో అభిలాష చూపడు. ఆ రీతిగా ఉన్న ముని ఉదరమనే ద్వారాన్ని బంధించినట్లే కదా!

**క.** **పలుకఁ దసత్యము, దూఱం। బలుకఁడు, బెట్టిదముగాఁగఁ బలుకఁడు, వాదం**
**బులకుఁ జొరఁడు వాణి యనం। గలవాకిలి యట్టి బుధుఁడు గప్పం జాలున్.** **322**

**ప్రతిపదార్థం:** అసత్యము= కల్లమాట; పలుకఁడు= చెప్పడు; దూఱన్= ఇతరులను నిందించటానికై; పలుకఁడు= మాటలాడడు; బెట్టిదముకాఁగన్= ఉద్ధతంగా; పలుకఁడు= మాట్లాడడు; వాదంబులకున్= వాగ్వివాదాలకు; చొరఁడు= ప్రవేశించడు; అట్టిబుధుఁడు= అట్లా ఉండే పండితుడు; వాణిఅనన్+కల= 'వాక్కు' అనగా కల; వాకిలి= ద్వారం; కప్పన్+చాలున్= బంధించగలుగును.

**తాత్పర్యం:** పండితుడు అబద్ధం చెప్పడు, పరనింద చేయడు, క్రూరంగా పరుషవచనాలు పలుకడు, ఇతరులతో తగవులకు పోడు. అట్లా ఉండేవాడు 'వాక్కు' అనే వాకిలిని బంధించగలడు.

**తే.** **ద్వారములు నాల్గు మూయంగ దక్షుఁడైన । వాఁడ చూవె బ్రాహ్మణుఁ; డట్టివాని కేల**
**తపములును యజనంబులు దానములును । వ్రతములును వేదకింకరత్వంబు దొడఁకు. 323**

**ప్రతిపదార్థం:** నాల్గు ద్వారములు= నాలుగు వాకిళ్ళు; మూయంగన్= బంధించటానికి; దక్షుఁడు+ఐనవాఁడు+అ= సమర్థుడైనవాడే; బ్రాహ్మణుఁడు= విప్రుడు; చూవె= సుమా!; అట్టివానికిన్= అట్లాంటివాడికి; తపములును= తపస్సులున్నూ; యజనంబులు= యజ్ఞకరణములున్నూ; దానములును= వితరణములున్నూ; వ్రతములును= వ్రతాలున్నూ; వేదకింకరత్వంబు తొడఁకు= వేదదాస్యంతోడి సంబంధము; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** పై చెప్పిన పాణి, ఉపస్థం, ఉదరం, వాణి అనే నాలుగు ద్వారాలూ మూయగలిగే నైపుణ్యం కలవాడే బ్రాహ్మణు డనబడతాడు. అట్లాంటివాడికి తపస్సులు, యాగక్రియలు, దానాలు, వ్రతాలు అక్కరలేదు. వాడు వేదాలకు దాస్యం చేయవలసిన అవసరం కూడా లేదు.

**విశేషం:** ఇక్కడ జిహ్వ, ఉపస్థం మొదలైన వాటిని నిగ్రహించగల ఉత్తమగుణ సంపన్నుడే బ్రాహ్మణుడని చెప్పట జరిగింది. అంతే కాని జాతిచేత బ్రాహ్మణుడైన వాడు పేర్కొన బడలేదని గ్రహించాలి.

**తే.** **ద్వంద్వములు లేక పేర్మికి వ్రస్సి పడక । ప్రకృతి వికృతులఁ గనుచుండు బ్రాహ్మణత్వ**
**శాలి యా సదాచారంబు సలుపలేని । వాఁడు ఫలకాంక్షియై కర్మవశతఁ బొందు. 324**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణత్వశాలి= (పై పద్యంలో చెప్పిన) బ్రాహ్మణత్వమనే ధర్మంకలవాడు; ద్వంద్వములు లేక= శీతోష్ణాలు, సుఖదుఃఖాలు ఇత్యాదిగాగల ద్వంద్వాలు లేనివాడై; పేర్మికిన్= గౌరవానికి; వ్రస్సిపడక= ఆరాటపడక; ప్రకృతివికృతులన్= ప్రకృతి వికారాలను; కనుచుండున్= చూస్తూ ఉంటాడు; ఆ సదాచారంబు= ఆ సత్ప్రవర్తన; సలుపలేనివాఁడు= అనుష్ఠింపజాలనివాడు; ఫలకాంక్షి+ఐ= ఫలితాలమీది అపేక్ష గలవాడై; కర్మవశతన్= కర్మకు అధీనుడు కావటం; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పై జెప్పిన నాలుగు ద్వారాలూ మూయటమనే బ్రాహ్మణధర్మంతో ఒప్పారేవాడే శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలకు లొంగడు. ప్రతిష్ఠకై ప్రాకులాడడు. ప్రకృతిరూపమైన బ్రహ్మాన్నీ, వికృతిరూపమైన దైవతాన్నీ తటస్థుడై చూస్తూ ఉంటాడు. అట్లాంటి బ్రాహ్మణ్యాన్ని అనుష్ఠింపజాలనివాడే ఫలాన్ని అపేక్షించి కర్మల కధీనుడౌతాడు.

**వ.** **అని నిర్దేశించిన గోవునం దడంగియునికి దక్కి సన్నిహితుండై స్యూమరశ్మి తన పేరు సెప్పి 'యేను ధర్మనిర్ణయం బెఱింగికొనవలసి గోవిలీనుండనై పలుకుచుండితిఁ గాని యొండుగాదు. మహాత్మా! ని న్నాశ్రయించితి. వేదంబులు ప్రమాణంబు లగుట యూఁది వర్ణాశ్రమ విహితాచారంబులు నడపుటయుం, బరిత్యాగంబునుం గలదెయ్యది యత్యంత విధేయంబు సువ్యక్తంబుగా నెఱింగింపవే. నీవు ధర్మసూక్ష్మత్వదర్శి; నేను శుశ్రూషకుండ; న న్ననుశాసింపు'మనవుడుఁ గపిలుండు ప్రీతుండై యతని కిట్లనియె. 325**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించినన్= అని కపిలుడు చెప్పగా; స్యూమరశ్మి= స్యూమరశ్మి అనే ముని; గోవునందున్= ఆవునందు; అడంగిఉనికి= అడగిఉండటాన్ని; తక్కి= వర్జించి; సన్నిహితుండు+ఐ= సమీపానికి వచ్చినవాడై; తన పేరుచెప్పి= తన నామం పేర్కొని; ఏను= నేను; ధర్మనిర్ణయంబు= ధర్మనిశ్చయం; ఎఱింగికొనవలసి= తెలిసికొనవలసి; గోవిలీనుండను+ఐ= ఆవునందు దాగినవాడనై; పలుకుచుండితిన్= మాటాడుతూ ఉన్నాను; కాని= అంతేకాని; ఒండుకాదు= మరేమీ కాదు; మహాత్మా!= మహా బుద్ధిగలవాడా!; నిన్నున్+ఆశ్రయించితిన్= నిన్ను అండగొన్నాను; వేదంబులు= శ్రుతులు; ప్రమాణంబులు+అగుట= జ్ఞానకారణాలు కావటం; ఊఁది= గ్రహించి; వర్ణాశ్రమ విహిత+ఆచారంబులు= వర్ణాలకు, ఆశ్రమాలకు విధింపబడిన ఆచారాలు; నడపుటయున్=

నిర్వహించటమూ; పరిత్యాగంబునున్= వదలిపెట్టటమున్నూ; కలది= ఉన్నది; ఏ+అది= ఏది?; అత్యంత విధేయంబు= మిక్కిలిగా చేయదగినదో; సువ్యక్తంబుగాన్= స్పష్టంగా; ఎఱింగింపవే!= తెలుపుమా!; నీవు= కపిలమునివైన నీవు; ధర్మసూక్ష్మత్వదర్శివి= ధర్మాలలోని సూక్ష్మభావాన్ని చూచేవాడవు; ఏను= నేను; శుశ్రూషకుండన్= సేవకుడను (వినగోరేవాడను); నన్నున్+అనుశాసింపుము= నన్ను ఆజ్ఞాపించుము; అనవుడున్= అనగా; కపిలుండు= కపిలముని; ప్రీతుండు+ఐ= ప్రీతి పొందినవాడై; అతనికిన్= ఆ స్యూమరశ్మికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కపిలముని అట్లా చెప్పేసరికి స్యూమరశ్మి ధేనువులో దాగి ఉండటాన్ని వర్జించి అతడికి సమీపంగా వచ్చాడు. తన పేరు చెప్పి ఇట్లా అన్నాడు: ' నేను ధర్మనిశ్చయం గ్రహించదలచి ఈ గోవులో దాగి మాటలాడానే కాని మరేమీ కాదు. ఓ మహాత్మా! నేను నిన్ను ఆశ్రయించాను. వేదాలు ప్రమాణాలు అన్న సంగతి గ్రహించిన తర్వాత ఆ వేదాలలో విధించిన బ్రాహ్మణాది వర్ణాలకూ, బ్రహ్మచర్యాద్యాశ్రమాలకూ తగిన ఆచారాలను నిర్వహించటమూ కద్దు. పరిత్యజించటమూ కద్దు. ఈ రెండు పద్ధతులలో ఏది మిక్కిలిగా అనుష్ఠించదగిందో స్పష్టంగా తెలియజెప్పుము. నీవు ధర్మాలలోని సూక్ష్మాంశాలను తెలిసినవాడవు. నేను వినాలన్న కోరికతో వచ్చిన సేవకుడను. నాకు ఈ రహస్యం బోధించి నన్ను శాసించుము'. అత డట్లా అనగానే కపిలుడు అతడిపట్ల ప్రీతిపొంది ఇట్లా చెప్పాడు:

**క. జ్ఞానంబు నాశ్రయించిన । వానికి నే పనులఁ గీడు వాటిల్లదు; ప్ర**
**జ్ఞానరహితుండు గామా । ధీనత మెయిఁ గర్మసమితి త్రిప్పునఁ జిక్కున్. 326**

**ప్రతిపదార్థం:** జ్ఞానంబున్= జ్ఞానయోగాన్ని; ఆశ్రయించినవానికిన్= అండగాకొన్నవాడికి; ఏ పనులన్= ఏ కార్యాలలోనూ; కీడు= అశుభం; పాటిల్లదు= కలుగదు; ప్రజ్ఞానరహితుండు= ప్రకృష్టమైన జ్ఞానం లేనివాడు; కామ+అధీనతమెయిన్= కోరికలకు వశపడుటవలన; కర్మసమితి త్రిప్పునన్= కర్మసమూహాల పరిభ్రమణంలో; చిక్కున్= తగులుకొంటాడు.

**తాత్పర్యం:** 'జ్ఞానాన్ని ఆశ్రయించినవాడు ఏ పనిచేసినా వాడికి కీడు కలుగదు. జ్ఞానం లేనివాడు కోరికలకు దాసుడై కర్మలలో తగులుకొంటాడు. ఆ కర్మల చక్రభ్రమణంలోబడి తిరుగుతూ ఉంటాడు.

**క. అనహంకారుఁడు నక్రో । ధనుఁడు నతృష్ణుండు నై నతఁడు శుభ మశుభం**
**బను భేదముఁ బొరయఁడు; విడు । పున సమతాసుఖమయత్వముం గనుచుండున్. 327**

**ప్రతిపదార్థం:** అనహంకారుఁడున్= అహంకారంలేనివాడు; అక్రోధనుఁడున్= కోపంలేనివాడు; అతృష్ణుండున్= ఆశ లేనివాడూ; ఐన+అతఁడు= అయినవాడు; శుభము+అశుభంబు+అను= మేలు కీడు అనే; భేదమున్= తేడాను; పొరయఁడు= పొందడు; విడుపునన్= త్యాగంచేత; సమతాసుఖమయత్వమున్= సమభావంచేత కలిగే సుఖస్థితిని; కనుచుండున్= చూస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** అహంకారం, కోపం, ఆశ లేనివాడు శుభాశుభాలనే భేదదృష్టి పొందడు. అతడు త్యాగం కలిగి సర్వత్రా సమభావంతో సుఖస్వరూపాన్నే దర్శిస్తూ ఉంటాడు.

**క. విను మెఱుక గలర మీరె । ల్లను నేకాత్మత్వసిద్ధి లాభం బెందే**
**ని నొకని కలవడు నాతం । డనుమానింపఁ డఖిల క్రియలుఁ బోఁ ద్రోచున్.' 328**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; మీరు+ఎల్లనున్= మీరు అందరున్నూ; ఎఱుకగలర= తెలివిగలవారే; ఎందున్+ఏనిన్= ఎక్కడో ఒక్కచోట; ఒకనికిన్= ఒక్కడికి; ఏక+ఆత్మత్వసిద్ధిలాభంబు= ఒకే ఒక ఆత్మ ఉన్నదనే భావప్రాప్తి; అలవడున్= సిద్ధిస్తుంది;

ఆతండు= ఆ సిద్ధి కలిగినవాడు; అనుమానింపఁడు= సందేహించడు; అఖిలక్రియలున్= సమస్తమైన పనులూ; పోన్‌త్రోచున్= తొలగద్రోస్తాడు.

**తాత్పర్యం:** వినుము. మీరందరూ జ్ఞానం కలవారే, ఐనా ఎక్కడో ఒకానొకడికి మాత్రమే సర్వత్రా ఏకాత్మభావనాప్రాప్తి కలుగుతుంది. అది కలిగినవాడి కీ సందేహా లుండవు. అతడు సర్వకర్మలూ అనాయాసంగా కడకు నెట్టివేస్తాడు.

**వ. అనిన విని స్యూమరశ్మి య మ్మునివరున కిట్లనియె. 329**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; స్యూమరశ్మి= స్యూమరశ్మి యనేవాడు; ఆ+మునివరునకున్= ఆ మునిశ్రేష్ఠుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కపిలు డట్లా చెప్పగా విని స్యూమరశ్మి ఆ మునీంద్రుడితో ఈ రీతిగా చెప్పాడు.

**ఆ. వేదశాస్త్రసరణి విడుచు టున్మార్గవ । ర్తనము; మోక్షపదము రాదు దాన**
**ననఁగ విందు; నంచితాత్మ వేదంబులఁ । గైకొనమియ కీడు నాకుఁ జూడ. 330**

**ప్రతిపదార్థం:** అంచిత+ఆత్మ!= పూజితాత్మా!; వేదశాస్త్రసరణి= వేదాలు, శాస్త్రాలు విధించిన త్రోవ; విడుచుట= వీడటం; ఉన్మార్గవర్తనము= తప్పుత్రోవలో నడవటమే; దానన్= అందువలన; మోక్షపదము= ముక్తిస్థానం; రాదు= సిద్ధించదు; అనఁగన్= అని చెప్పగా; విందున్= విని ఉన్నాను; నాకున్+చూడన్= నా పరిశీలనలో; వేదంబులన్= శ్రుతులను; కైకొనమి+అ= స్వీకరింపకుండటమే; కీడు= అశుభం.

**తాత్పర్యం:** పవిత్రాత్మా! వేదాలు, శాస్త్రాలు విధించిన త్రోవ వదలటం తప్పుదారిలో చరించటమే. అట్లా చేయటంవలన ముక్తి సిద్ధించదని నేను విన్నాను. పరిశీలించి చూడగా వేదాలను అంగీకరించకుండా ఉండటమే కీడుగా నాకు తోస్తున్నది.

**వ. నా మనంబు సందియంబుఁ బాపవే' యనినం గపిలుం డమ్మహాద్విజునితో 'వేదంబుల నేల కై కొనకుండ వచ్చు? నవియ చూవె లోకంబులకుం బ్రమాణంబు'లని పలికి యిట్లనియె. 331**

**ప్రతిపదార్థం:** నా మనంబు సందియంబు= నా మనస్సులోని సందేహాన్ని; పాపవే= తొలగించుమా; అనినన్= అనగా; కపిలుండు= కపిలముని; ఆ+మహాద్విజునితోన్= ఆ గొప్పవిప్రుడితో; వేదంబులన్= శ్రుతులను; ఏల= ఎందుకు; కైకొనక+ఉండవచ్చున్?= స్వీకరించక ఉండవచ్చును?; అవి+అ= ఆ వేదములే; చూవె!= సుమా!; లోకంబులకున్= జగత్తులకు; ప్రమాణంబులు= కొలమానాలు, ఆదర్శాలు; అని పలికి= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** నా మనస్సులోని సందేహం తొలగించు'మని స్యూమరశ్మి అనేసరికి కపిలుడు ఆ మహాబ్రాహ్మణుడితో 'వేదాలను ఎందుకు అంగీకరించకుండా ఉండాలి? అవే కదా లోకాలకు ప్రమాణాలుగా ఉన్నాయి' అని చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు:

**కపిలుఁడు స్యూమరశ్మికి వేదంబులు ముఖ్యప్రమాణంబులుగాఁ జెప్పుట (సం. 12-262-14,1)**

**క. 'అరయంగా శబ్దంబును । బరంబు నన రెండు సూవె బ్రహ్మములు; గుణో**
**త్తర! శబ్దబ్రహ్మ భజన । పరుఁడు పరబ్రహ్మ మహిత పదమున్ బొందున్. 332**

**ప్రతిపదార్థం:** గుణ+ఉత్తర!= గుణశ్రేష్ఠుడా!; అరయంగాన్= పరిశీలించగా; శబ్దంబును= శబ్దమనీ; పరంబును= పరమనీ; అనన్= అనగా; రెండు= ఇవి రెండూ; బ్రహ్మములు= బ్రహ్మ శబ్దంచేత చెప్పబడతాయి; చూవె= సుమా!; శబ్దబ్రహ్మ భజనపరుఁడు=

శబ్దబ్రహ్మమును సేవించటంలో ఆసక్తుడైనవాడు; పరబ్రహ్మమహిత పదమున్= పరబ్రహ్మ మనే శ్రేష్ఠమైన మోక్షస్థానాన్ని; పొందున్= చేరుకొంటాడు.

**తాత్పర్యం:** గుణశ్రేష్ఠుడవైన ఓ స్యూమరశ్మీ! బ్రహ్మములు రెండు. అవి శబ్దబ్రహ్మమనీ, పరబ్రహ్మమనీ పేర్కొనబడుతున్నాయి. అందులో శబ్దబ్రహ్మాన్ని భజించి నిష్ణాతుడైనవాడు పరబ్రహ్మపదవి అనే మోక్షస్థానం చేరుకొంటాడు.

**విశేషం:** పై పద్యంలో 'గుణోత్తర' అనే పదాన్ని శబ్దబ్రహ్మశబ్దానికి విశేషణంగా అన్వయించి గుణాలచేత శ్రేష్ఠమైన శబ్దబ్రహ్మాన్ని భజించేవాడు అని కూడ అర్థం చెప్పవచ్చును. ఈ పద్యానికి మూలమైన సంస్కృత శ్లోకం

**"ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్ । శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥"**

అని అమృతబిందూపనిషత్తులో

**"ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరం చ యత్ । శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥"**

అని కొద్దిపాటి మార్పుతో కనిపిస్తున్నది.

శబ్దబ్రహ్మ విద్యను అపరావిద్య అనీ, పరబ్రహ్మ బోధకవిద్యను పరావిద్య అనీ ఉపనిషత్తులు పేర్కొన్నాయి. మొదట అపరావిద్యలో కృషి చేసి నిష్ణాతుడైన వాడు అనగా ఆరితేరినవాడు పరావిద్యలో ప్రావీణ్యం పొందగలడని ఉపనిషత్తుల అభిప్రాయం.

**క. మనమున నెద్దియుఁ గోరం । డనసూయయు శమము దమము నతులజ్ఞానం**
**బును గల గృహపతి ధర్మం । బని నడపును వేదచోదితాచారములన్. 333**

**ప్రతిపదార్థం:** అనసూయయున్= అసూయ లేకపోవటమూ; శమమున్= అంతరింద్రియనిగ్రహమూ; దమమున్= బాహ్యేంద్రియ నిగ్రహమూ; అతులజ్ఞానంబును కల= సాటిలేని జ్ఞానమూ కలిగినట్టి; గృహపతి= గృహస్థుడు; మనమునన్= చిత్తంలో; ఎద్దియున్= ఏది కూడా; కోరండు= అభిలషించడు; వేదచోదిత+ఆచారములన్= వేదంచేత విధించబడిన ఆచారాలను; ధర్మంబు+అని= ఇవి చేయదగిన ధర్మాలని; నడపును= నిర్వహిస్తాడు.

**తాత్పర్యం:** అసూయ వదలి అంతరింద్రియాలపైనా, బాహ్యేంద్రియాలపైనా నిగ్రహం సాధించిన జ్ఞానసంపన్నుడైన గృహస్థుడు మనస్సులో ఏదీ అభిలషించడు. అతడు వేదం విధించిన సదాచారాలను కర్తవ్యధర్మాలన్న బుద్ధితో శ్రద్ధగా నిర్వహిస్తాడు.

**క. భూతదయయు ననహంకా । రాతిశయముఁ గలుగు విమలుఁ డప్రాయశ్చి**
**త్తాతురుఁడు సూవె! విధులు సు । నీతములైనను దృఢాత్మనిష్ఠ కతమునన్. 334**

**ప్రతిపదార్థం:** భూతదయయున్= ప్రాణికోట్లపై కరుణ; అనహంకార+అతిశయమున్= అహంకారం లేమి; కలుగు= కలిగినట్టి; విమలుఁడు= నిర్మలస్వభావుడు; విధులు= వేదవిహితాచారాలు; సునీతములు+ఐనను= చక్కగా అనుష్ఠించబడినప్పటికి; దృఢ+ ఆత్మనిష్ఠ= గట్టి ఆత్మస్థితి; కతమునన్= కారణాన; అప్రాయశ్చిత్తాతురుఁడు= ప్రాయశ్చిత్తంచేత ఆతురుడు కానివాడు; చూవె!= సుమా!

**తాత్పర్యం:** ప్రాణులపై దయ, అహంకారం బొత్తిగా లేకపోవటం కల నిర్మలచిత్తుడైన గృహస్థుడు దృఢమైన ఆత్మనిష్ఠ కలిగి ఉంటాడు. అందువలన అతడు వేదం విధించిన ఆచారాలు, కర్మలు చేస్తున్నా ప్రాయశ్చిత్తం చేయవలసిన పనిలేదు.(ఆత్మనిష్ఠవలన అతడిలోని దోషాలు తొలగిపోతాయి కాబట్టి ప్రాయశ్చిత్తం అక్కరలేదనిభావం.).

**క. విను శాంతులైన విప్రులు । మనుజేంద్రులు గృహమునంద మహితవ్రత సం**
**జనిత పరిజ్ఞాన నిరం । జనులై పడయుదురు సూవె శాశ్వతపదమున్. 335**

**ప్రతిపదార్థం:** విను= వినుము; శాంతులు+ఐన= నిగ్రహపరులైన; విప్రులు= బ్రాహ్మణులు; మనుజ+ఇంద్రులు= రాజులు; గృహమునందు+అ= ఇంటియందే; మహితవ్రతసంజనిత పరిజ్ఞాన నిరంజనులు+ఐ= శ్రేష్ఠమైన వ్రతంచేత కలిగిన పరిజ్ఞానంచేత దోషం లేనివారై; శాశ్వతపదమున్= ముక్తిని; పడయుదురు= పొందుతారు; చూవె!= సుమా!

**తాత్పర్యం:** ఇంకా వినుము. ఇంద్రియనిగ్రహపరులైన విప్రులు, నృపులు గృహస్థాశ్రమంలోనే చక్కని వ్రతాలు ఆచరించి అందువలన కలిగిన జ్ఞానం వలన దోషం శమించినవారై శాశ్వతమైన మోక్షస్థానం పొందుతారు.

**తే. బ్రహ్మచర్యాదు లగు నాల్గుఁ బాదమహిమ । గాఁగఁ బరఁగెడు ధర్మ మొక్కటియ చూవె!**
**యెవ్వఁ డెందు వర్తించిన నేమి? సకల । కర్మఫలరూపకత్వ మొక్కటియ కాదె! 336**

**ప్రతిపదార్థం:** బ్రహ్మచర్య+ఆదులు+అగు= బ్రహ్మచర్యం మొదలైనవి; నాల్గున్= నాలుగు ఆశ్రమాలు కూడా; పాదమహిమకాఁగన్= పాదప్రభావం పొందగా; పరఁగెడు= విలసిల్లే; ధర్మము= ధర్మం; ఒక్కటియచూవె!= ఒక్కటే సుమా!; ఎవ్వఁడు= ఏ వ్యక్తి; ఎందు= ఏ ఆశ్రమంలో; వర్తించినన్+ఏమి= ప్రవర్తించినా ఏమి; సకలకర్మఫలరూపకత్వము= సమస్త కర్మల ఫలాన్ని రూపించే ధర్మం; ఒక్కటియ కాదె!= ఒక్కటే కదా!

**తాత్పర్యం:** ధర్మానికి బ్రహ్మచర్యం మొదలైన నాలుగాశ్రమాలు నాలుగుపాదాలుగా ఉన్నాయి. ఆ నాలుగుపాదాలపై నిలిచి ఉన్న ధర్మం ఒక్కటే. అందుచేత ఎవడు ఏ ఆశ్రమంలో ఉంటే నేమి? సమస్త కర్మల ఫలాలను రూపింపజేసే ధర్మస్వరూపం ఒక్కటే కదా! (సర్వకర్మల ఫలస్వరూపం ఒకటే కదా!)

**క. సంతోషామృత సుఖిత । స్వాంతుం డగు నేని నట్టివాఁడు గృహంబుం**
**గాంతారదేశమును నొ । క్కంతగ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 337**

**ప్రతిపదార్థం:** సంతోష+అమృత సుఖితస్వాంతుండు= సంతసమనే అమృతంచేత సుఖించిన చిత్తం కలవాడు; అగున్+ఏనిన్= అయితే; అట్టివాఁడు= అట్లాంటి మనుజుడు; గృహంబున్= ఇంటిని; కాంతారదేశమునున్= అడవిప్రదేశాన్నీ; ఒక్కంతగన్= ఒకే విధంగా (భావించి); నిశ్చింతవృత్తి= చింతలేని వర్తనముతో; అక్షోభ్యుఁడు+అగున్= క్షోభింపజేయటానికి వీలుకాని వాడౌతాడు.

**తాత్పర్యం:** ఎవడు సంతోషమనే అమృతంతో సుఖించే చిత్తం కలిగి ఉంటాడో అట్లాంటివాడు ఇంటినీ, అడవినీ ఒకే రకంగా భావించగలవా డవుతాడు. వాడికి చింతలు ఉండవు. అందువలన దేనికీ కలత చెందడు.

**క. విను తృష్ణారాహిత్యం । బున నాలవు నాశ్రమంబుఁ బొందుదురు మహా**
**జను; లది యుపనిషదుక్తం । బనక యవైదిక మనంగ నగునే నీకున్? 338**

**ప్రతిపదార్థం:** విను= వినుము; మహాజనులు= గొప్పవారు; తృష్ణారాహిత్యంబునన్= ఆశలేమిచేత; నాలవు= నాల్గవదైన; ఆశ్రమంబున్= సన్న్యాసాశ్రమాన్ని; పొందుదురు= చెందుతారు; అది= ఆ పద్ధతి; ఉపనిషద్+ఉక్తంబు+అనక= ఉపనిషత్తులచేత ప్రతిపాదించబడినదని చెప్పక; అవైదికము+అనంగన్= వేదవిరుద్ధ మైనదని చెప్పగా; నీకున్+అగునే?= నీకు తగునా?

**తాత్పర్యం:** మహాత్ములు ఆశను పూర్తిగా వర్జించి నాలుగవదైన సన్న్యాసాశ్రమం స్వీకరిస్తారు. అది ఉపనిషత్తులు ప్రతిపాదించిన పద్ధతి. అట్లా భావించక అది వేదవిహితమైనది కాదు అని నీవు చెప్పవచ్చునా?

క. **జ్ఞానము ధర్మమున కధి । ష్ఠానము మూలంబు పరమసంతోషము భ**
**వ్యానూనత్యాగము రూ । పానందము ప్రాఁకు దాని కను వేదంబుల్.** **339**

**ప్రతిపదార్థం:** వేదంబుల్= శ్రుతులు; ధర్మమునకున్= యతిధర్మానికి; అధిష్ఠానము= ఆశ్రయం; జ్ఞానము= జ్ఞాననిష్ఠ; దానికిన్= ఆ ధర్మానికి; పరమసంతోషము= ఆనందం; మూలంబు= మొదలు; భవ్య+అనూనత్యాగము= శ్రేష్ఠమైన మహాత్యాగం; రూపు= స్వరూపం; ఆనందము= ఆత్మానందం; ప్రాఁకు= ఆలంబనం; అనున్= అని చెప్పుతున్నవి.

**తాత్పర్యం:** వేదాలు యతిధర్మాని కధిష్ఠానం జ్ఞానమనీ, దానికి అత్యంతసంతోషస్థితే మొదలనీ, మహాత్యాగమే స్వరూపమనీ, ఆనందమే పట్టుగొమ్మ అనీ చెప్పుతున్నాయి.

క. **ఏదియుఁ దలఁప నసేవ్యము । గా దాశ్రమసమితిలోనఁ గావున శుచులై**
**యేదాన నున్న సంసా । రోదధి యాదరికిఁ బోవ నోపుదురు బుధుల్.** **340**

**ప్రతిపదార్థం:** ఆశ్రమసమితిలోనన్= బ్రహ్మచర్యం మొదలైన నాలుగు ఆశ్రమాలలోనూ; ఏదియున్= ఏ ఆశ్రమం కూడా; తలఁపన్= భావించగా; అసేవ్యము కాదు= సేవించదగనిది కాదు; కావునన్= అందుచేత; శుచులు+ఐ= శుద్ధాంతఃకరణం కలవారై; ఏ దానన్+ఉన్నన్= ఏ ఆశ్రమంలో ఉన్నా; బుధుల్= పండితులు; సంసారోదధి= సంసారసాగరం యొక్క; ఆ దరికిన్= ఆవలి గట్టుకు; పోవన్= పోవటానికి; ఓపుదురు= సమర్థు లవుతారు.

**తాత్పర్యం:** బాగా ఆలోచించి చూస్తే నాలుగు ఆశ్రమాలలోనూ ఏ ఆశ్రమమూ సేవించదగనిది కాదు. అందువలన అంతఃకరణశుద్ధి కలిగి ఏ ఆశ్రమంలో ఉన్నా ఆత్మజ్ఞులైన పండితులు సంసారసాగరతీరం చేరగలరు.

క. **సంతోషంబున నేగతి । శాంతాత్మున కొదవు దాని సద్గతిగా వే**
**దాంతవిదులు గొనియాడుదు; । రింత నిజము; దీని నీవు నెఱుఁగు మనింద్యా!** **341**

**ప్రతిపదార్థం:** అనింద్యా!= నిందించదగనివాడా!; శాంత+ఆత్మునకున్= శమించిన చిత్తంకలవాడికి; సంతోషంబునన్= సంతసం చేత; ఏ గతి= ఏ ప్రాప్తి; ఒదవున్= కలుగునో; దానిన్= ఆ గతిని; వేదాంత విదులు= వేదాంతం తెలిసిన వారు; సద్గతిగాన్= మంచిగతిగా; కొనియాడుదురు= పొగడుదురు; ఇంత నిజము= ఇంతా సత్యం; నీవున్= నీవుకూడ; దీనిన్= ఈ విషయాన్ని; ఎఱుఁగుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** పవిత్రుడవైన ఓ స్యూమరశ్మీ! శాంతచిత్తుడైన వాడికి సంతోషం కారణంగా ఏ గతి లభిస్తుందో, ఆ గతినే సద్గతి అని వేదాంతవేత్తలైన పెద్దలు శ్లాఘిస్తారు. ఇది సత్యం. నీవు కూడా ఈ సత్యాన్ని గ్రహించుము.

తే. **వేద తాత్పర్య మారసి వేదితవ్య । మెఱుఁగు వారలు వేదజ్ఞు; లిట్లు గాని**
**వారు వేదపారకులు; సర్వంబు నరయ । వేద పరినిష్ఠితము సూవె విప్రవర్య!** **342**

**ప్రతిపదార్థం:** విప్రవర్య!= బ్రాహ్మణశ్రేష్ఠా!; వేద తాత్పర్యము= శ్రుతియొక్క భావాన్ని; ఆరసి= పరిశీలించి; వేదితవ్యము= తెలిసికొన దగిన తత్త్వాన్ని; ఎఱుఁగువారలు= తెలిసికొనేవారు; వేదజ్ఞులు= వేదం తెలిసినవారు; ఇట్లు కానివారు= ఈ రీతిగా తెలిసికొననివారు; వేదపాఠకులు= వేదం చదివేవారు; అరయన్= పరిశీలించగా; సర్వంబున్= సమస్తమూ; వేదపరినిష్ఠితము= వేదంలో నిహితం; చూవె!= సుమా!

**తాత్పర్యం:** విప్రశ్రేష్ఠా! ఎవరు వేదభావాన్ని గ్రహించి తెలియదగిన తత్త్వం తెలిసికొంటారో వారే వేదం తెలిసినవా రవుతారు. అట్లా కానివారు వట్టి వేదపాఠకులు మాత్రమే. వారికి వేదరహస్యం తెలియదు. పరిశీలించి చూచేవారికి వేదంలోనే అంతా నిక్షిప్తమైనట్లు గోచరిస్తుంది.

**క. త్యాగ మొక నెలవు; శమసం । యోగం బుత్తరము దాని; కూర్ధ్వము సంతో**
**షాగమము; మోక్షలాభో । ద్యోగికి నివి గమ్యభూము లుత్తమధిషణా!' 343**

**ప్రతిపదార్థం:** ఉత్తమధిషణా!= శ్రేష్ఠమైన బుద్ధి కలవాడా!; త్యాగము= కర్మఫలాన్ని త్యజించటం; ఒక నెలవు= ఒక స్థానం; దానికిన్= ఆ త్యాగానికంటె; శమసంయోగము= అంతరింద్రియ నిగ్రహం; ఉత్తరము= శ్రేష్ఠం; సంతోషాగమము= సంతుష్టి పొందటం; ఊర్ధ్వము= దానికంటె ఉన్నతమైనది; మోక్షలాభ+ఉద్యోగికిన్= ముక్తిప్రాప్తికై ప్రయత్నించే వాడికి; ఇవి= ఈ మూడూ; గమ్యభూములు= చేరదగిన స్థానాలు.

**తాత్పర్యం:** శ్రేష్ఠమతీ! మోక్షం కావాలని ప్రయత్నించే సాధకుడు ముందు కర్మఫలత్యాగం చేయాలి. ఆ తరువాత మనస్సును నిగ్రహించాలి. ఆ పైన సదా సంతోషంతో ఉండాలి. ఇవి ఒక దానికంటె ఒకటి ఉన్నతమైన గతులు. సాధకుడు తప్పక ఈ మూడింటినీ పొందాలి'.

**వ. అని యి ట్లుపదేశించి. 344**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ రీతిగా; ఉపదేశించి= ప్రబోధించి.

**తాత్పర్యం:** కపిలుడు స్యూమరశ్మికి పైన చెప్పిన విధంగా ఉపదేశించాడు. తరువాత.

**సీ. 'వేదితవ్యంబన విదితంబు నా ఋతం । బనఁగ సత్యంబన నతిశయిల్లి,**
**సంభృతస్థావర జంగమం బనఁగ స । ర్వాత్మకంబన శుభం బనఁగ వెలసి,**
**యవ్యక్త మనఁగ బ్రహ్మంబునా నుత్తర । మనఁగ శివంబన వినుతి కెక్కి,**
**ప్రభవం బనంగ నవ్యయ మన శాంతి నాఁ । దేజంబు నా నెందుఁ దేజరిల్లి,**

**తే. క్షమ యనంగ నంబర మనఁగా ధ్రువంబు । నా ననామయ మన నొప్పి లీనరూప**
**బుద్ధి సంప్రాప్య మగు తత్త్వమునకు వేద । మానిత బ్రాహ్మణులకు నమస్కరింతు.' 345**

**ప్రతిపదార్థం:** వేదితవ్యంబు+అనన్= వేదితవ్యమనీ (తెలిసికొనదగిన దనీ); విదితంబునాన్= విదితమనీ (తెలియబడినదనీ); ఋతంబు+అనఁగన్= ఋతమనీ; సత్యంబు+అనన్= సత్యం అనీ; అతిశయిల్లి= శోభిల్లి; సంభృత స్థావర జంగమంబు+అనఁగన్= చరాచరములను భరించినదనీ; సర్వాత్మకంబు+అనన్= సర్వ స్వరూపమనీ, అన్నిటికీ ఆత్మస్థానీయమనీ; శుభంబు+అనఁగన్= శుభమనీ; వెలసి= అలరారి; అవ్యక్తము+అనఁగన్= అవ్యక్తమనీ; బ్రహ్మంబునాన్= బ్రహ్మమనీ; ఉత్తరము+అనఁగన్= ఉత్తరమనీ; శివంబు+అనన్= శివమనీ; వినుతికిన్+ఎక్కి= ప్రసిద్ధి పొంది; ప్రభవంబు+అనఁగన్= ప్రభవమనీ (ఉత్పత్తి స్థానమనీ); అవ్యయము+అనన్= అవ్యయ మని (వ్యయం కానిదనీ); శాంతినాన్= శాంతి అనీ; తేజంబునాన్= తేజమనీ; ఎందున్= అంతటా; తేజరిల్లి= ప్రకాశించి; క్షమఅనఁగన్= క్షమ అనీ, (భూమి అనీ); అంబరంబు+అనఁగాన్= అంబరమనీ (ఆకాశమనీ); ధ్రువంబునాన్= ధ్రువమనీ (స్థిరమైనదనీ); అనామయమనన్= అనామయమనగా (జాడ్యం లేనిదనగా); ఒప్పి= భాసించి; లీనరూప బుద్ధిసంప్రాప్యము+అగు= లయమైన రూపం కల బుద్ధిచేత ప్రాపింపదగిన; తత్త్వమునకున్= పరతత్త్వానికి; వేదమానిత బ్రాహ్మణులకున్= వేదజ్ఞానంచేత పూజించబడిన విప్రులకూ; నమస్కరింతున్= ప్రణమిల్లుతాను.

**తాత్పర్యం:** వేదితవ్యమూ, విదితమూ, ఋతమూ, సత్యమూ, సంభృతస్థావరజంగమమూ (చరాచర జగత్తును భరించేది), సర్వాత్మకమూ, శుభమూ, అవ్యక్తమూ, బ్రహ్మమూ, ఉత్తరమూ, శివమూ, ప్రభవమూ, అవ్యయమూ,

శాంతీ, తేజమూ, క్షమా, అంబరమూ, ధ్రువమూ, అనామయమూ - అని వ్యవహరించబడుతూ లయించిన రూపం కల బుద్ధికి మాత్రమే గోచరమవుతున్న పరతత్త్వానికీ, వేద విజ్ఞానంతో పూజితులైన విప్రులకూ నేను నమస్కరిస్తాను.

**వ.** **అని పలుకుటయు స్యూమరశ్మి ప్రీతుఁడగుచుఁ గపిలునిం బ్రశంసించె; నియ్యితిహాసంబు తాత్పర్యంబు నీవుం గనికొను'మని చెప్పినం దద్దయుఁ బ్రియంబంది ధర్మనందనుండు 'ధర్మార్థకామంబులు మూఁడును వేదశంసితంబులు; వీనిలో నెద్దాని లాభంబున విశేషంబు గలిగియుండు నెఱింగింపవే !' యనిన గాంగేయుండు గుండధారుం డనువాఁడు నిజభక్తున కుపకారంబు సేసిన ప్రకారం బితిహాస రూపంబునం బ్రవర్తిల్లునది భవత్ప్రశ్నంబునకు నుత్తరంబై యుండు; వినుము చెప్పెద'నని యప్పుడమిఱేని కిట్లనియె.346**

**ప్రతిపదార్థం:** అని పలుకుటయున్= అని చెప్పేసరికి; స్యూమరశ్మి ప్రీతుండు+అగుచున్= స్యూమరశ్మిఅనే ముని సంతుష్టుడై; కపిలునిన్= కపిలుడిని; ప్రశంసించెన్= అభినందించాడు; ఈ+ఇతిహాసంబు+తాత్పర్యంబున్= ఈ ఇతిహాసంయొక్క భావాన్ని; నీవున్= నీవు కూడా; కనికొనుము= గ్రహించుము; అని చెప్పినన్= అని భీష్ముడు చెప్పగా; ధర్మనందనుండు= ధర్మరాజు; తద్దయున్= మిక్కిలిగా; ప్రియంబు+అంది= సంతోషించి; ధర్మ+అర్థకామంబులు మూఁడునున్= ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలూ; వేదశంసితంబులు= వేదాలచేత ప్రశంసింపబడి ఉన్నాయి; వీనిలోన్= ఈ మూడింటిలోనూ; ఏ+దాని లాభంబునన్= దేని ప్రాప్తివలన; విశేషంబు= అతిశయం; కలిగి+ఉండున్= లభిస్తుంది; ఎఱింగింపవే= చెప్పుమా; అనినన్= అని అడుగగా; గాంగేయుండు= భీష్ముడు; కుండధారుండు+అనువాఁడు= కుండధారుడనేవాడు; నిజభక్తునకున్= తన భక్తుడికి; ఉపకారంబు చేసిన ప్రకారంబు= ఉపకరించిన పద్ధతి; ఇతిహాసరూపంబునన్= పూర్వకథారూపంతో; ప్రవర్తిల్లున్= ఉంటున్నది; అది= ఆ కథ; భవత్ప్రశ్నంబునకున్= నీ ప్రశ్నకు; ఉత్తరంబు+ఐ ఉండున్= సమాధానమై ఉన్నది; వినుము= ఆలకించుము; చెప్పెదన్+అని= చెప్పుతాను అని; ఆ+పుడమిఱేనికిన్= ఆ రాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని కపిలమునీంద్రుడు చెప్పేసరికి స్యూమరశ్మి సంతసించి కపిలమునిని ప్రశంసించాడు. ఈ కథలోని భావం నీవు కూడా గ్రహించుము అని భీష్ముడు చెప్పాడు. అందుకు ధర్మరాజు ఎంతో సంతోషించాడు. ఆయన మళ్ళీ 'వేదాలలో ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలు ప్రశస్తమై ఉన్నాయి. ఆ మూడిటిలోనూ ఏది లభిస్తే గొప్పగా ఉంటుంది? ఈ సంగతి తెలియజెప్పుము' అని ప్రశ్నించాడు. అప్పుడు భీష్ముడు ' పూర్వం కుండధారుడు అనేవాడు తన భక్తుడికి ఉపకరించిన విధానం ఒక ఇతిహాసరూపంలో ఉన్నది. అది నీ ప్రశ్నకు సమాధానంగా ఉంటుంది; దానిని చెప్పుతాను విను'మని ఆ ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

### కుండధారుం డను దేవానుచరుని వృత్తాంతము (సం. 12-263-2)

**సీ.** **'యజ్ఞార్థ మొక్క బ్రాహ్మణుఁడు ధనార్థియై । తపము సేయఁగఁ గుండధారుఁ డనఁగఁ**
**బరఁగెడు దేవానుచరుఁ డచ్చటికి వచ్చి । 'యభిలాష మేరూప' మనుడు 'నర్థ**
**సిద్ధిఁ గోరెద'నని చెప్పినఁ బ్రీతి నా । తఁడు మాణిభద్రుని ధనదభృత్యు**
**నియతిఁ దలంప సన్నిధి సేసె నయ్యక్షుఁ; । డతఁడు 'మదాశ్రితుం డైన యితని**

**తే.** **ధనసమగ్రునిఁ జేయవే' యనిన 'నెంత । ధనము వలసిన నిచ్చెద' ననియె మాణి**
**భద్రుఁ డమ్మహాత్ముఁడు మర్త్యభావ మస్థి । రత్వదూషిత మను విచారంబు వుట్టి! 347**

**ప్రతిపదార్థం:** ఒక్క బ్రాహ్మణుఁడు= ఒక విప్రుడు; యజ్ఞ+అర్థము= యజ్ఞంకొరకై; ధనార్థి+ఐ= ధనంకోరినవాడై; తపము చేయఁగన్= తపస్సు చేయగా; కుండధారుఁడు+అనఁగన్= కుండధారుడు అనే పేరుతో; పరఁగెడు= ప్రవర్తిల్లెడు; దేవ+అనుచరుఁడు=

దేవసేవకుడు; అచ్చటికిన్= ఆ చోటికి; వచ్చి= ఏతెంచి; అభిలాషము= కోరిక; ఏ రూపము?= ఎట్టిది?; అనుడున్= అనగా; అర్థసిద్ధిన్= ధనప్రాప్తిని; కోరెదను+అని= అభిలషిస్తున్నానని; చెప్పినన్= చెప్పగా; ఆతఁడు= ఆ కుండధారుడు; ప్రీతిన్= ప్రీతితో; నియతిన్= నియమపూర్వకంగా; ధనదభృత్యున్= కుబేరుడి బంటు అయిన; మాణిభద్రునిన్= మాణిభద్రుడనేవాడిని; తలంపన్= స్మరించగా; ఆ+యక్షుఁడు= ఆ యక్షుడు; సన్నిధిచేసెన్= సమీపించాడు; అతఁడు= ఆ కుండధారుడు; మదాశ్రితుండు+ఐన= నన్నాశ్రయించిన వాడైన; ఇతనిన్= ఈ బ్రాహ్మణుడిని; ధనసమగ్రునిన్= ధనంచేత సంపూర్ణుడిగా; చేయవే= చేయుమా; అనినన్= అనగా; మాణిభద్రుఁడు= మాణిభద్రుడనే ఆ యక్షుడు; ఎంతధనము= ఎంత విత్తం; వలసినన్= కావలసినను; ఇచ్చెదన్= ఇస్తాను; అనియెన్= అన్నాడు; ఆ+మహాత్ముఁడు= మహనీయుడైన ఆ కుండధారుడు; మర్త్యభావము= మరణించే స్వభావంకల మానవత్వం; అస్థిరత్వ దూషితము= శాశ్వతం కాకపోవటంచేత దూషించబడింది; అను విచారంబు= అనే ఆలోచన; పుట్టి= కలిగి.

**తాత్పర్యం:** ఒక విప్రుడు యజ్ఞం చేయాలన్న తలంపుతో ధన మభిలషించి తపస్సు చేశాడు. కుండధారుడనే దేవసేవకు డొకడు అతడు తపస్సు చేస్తున్న చోటికి వచ్చాడు. వచ్చి 'నీ కోరిక ఏమి?' అని ప్రశ్నించాడు. ఆ బ్రాహ్మణుడు ధనం కొరకై తపస్సు చేస్తున్నా నన్నాడు. అప్పుడు ఆ కుండధారుడు నియమపూర్వకంగా కుబేరుడి బంటైన మాణిభద్రుడనే యక్షుడిని తలచాడు. ఆ యక్షుడు వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యాడు. అప్పు డా కుండధారుడు 'ఈ విప్రుడు నన్ను ఆశ్రయించి ఉన్నాడు. ఇతడిని మిక్కిలి ధనవంతుడిని చేయుము' అని అర్థించాడు. అంతట మాణిభద్రుడు 'ఇతడు ఎంత ధనం కావలె నని కోరినా ఇస్తాను' అని చెప్పాడు. ఇంతలో కుండధారుడు 'మానవుడు మరణశీలుడు. మానవత్వం స్థిరమైనది కాదు' అన్న ఆలోచన కలిగినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ధన మేటికి? నీ విప్రుని । మన మొలయఁగ వలయు ధర్మమార్గంబున; దా**
**నన సర్వసంపదలు నగు' । నని నిశ్చయ మొంది వినయ మతిశయ మందన్. 348**

**ప్రతిపదార్థం:** ధనము= అర్థం; ఏటికిన్?= ఎందుకు?; ఈ విప్రుని= ఈ బ్రాహ్మణుడియొక్క; మనము= చిత్తం; ధర్మమార్గంబునన్= ధర్మపు త్రోవలో; ఒలయఁగన్ వలయున్= ప్రవేశించాలి; దానన్+అ= అట్లా చేయటం వలననే; సర్వసంపదలున్= సమస్తమైన సిరులూ; అగునని= కలుగుతాయి అని; నిశ్చయము+ఒంది= నిర్ణయించుకొని; వినయము= అడకువ; అతిశయము+అందన్= అతిశయిల్లగా.

**తాత్పర్యం:** 'డబ్బు ఎందుకు? ఈ భూసురుడి చిత్తం ధర్మమార్గంలో ప్రవర్తించాలి. అట్లా ప్రవర్తిస్తే ఇతడికి సమస్తమైన సంపదలూ సిద్ధిస్తాయి' అని నిశ్చయించుకొని మిక్కిలి వినయంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. యక్షవరునితోడ నవ్విచారము మృదు । వచన రచనఁ జెప్ప వాఁడు దాని**
**కాత్మఁ బ్రీతిఁ బొంది యనుమతి సేయంగ । నధికభక్తి నిరతుఁడై యతండు. 349**

**ప్రతిపదార్థం:** యక్షవరునితోడన్= యక్షశ్రేష్ఠుడితో; ఆ+విచారము= ఆ ఆలోచన; మృదువచన రచనన్= మెత్తని మాటలతో; చెప్పన్= చెప్పేసరికి; వాఁడు= ఆ యక్షుడు; దానికిన్= అందుకు; ఆత్మన్= మనస్సులో; ప్రీతిన్= సంతోషం; పొంది= చెంది; అనుమతి చేయంగన్= అనుమతించగా; అతండు= ఆ కుండధారుడు; అధికభక్తి నిరతుఁడు+ఐ= మిక్కిలి భక్తితత్పరుడై.

**తాత్పర్యం:** కుండధారుడు యక్షునితో తన అభిప్రాయాన్ని మెత్తని పలుకులతో వివరించాడు. అందు కా యక్షుడు మనస్సులో ఎంతో సంతోషించి అనుమతించాడు. అప్పు డా కుండధారుడు అత్యంతభక్తి గలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దేవతలను బ్రార్థించిన । నావసుధామరుని చిత్త మా ప్రొద్ద తప**
**స్సేవనతత్పర మగుడున్ । దేవానుచరునకు నిట్లనియె నతఁ డధిపా! 350**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; దేవతలనున్= సురలను; ప్రార్థించినన్= వేడగా; ఆ ప్రొద్దు+అ= ఆ దినమే; ఆ వసుధా+అమరుని చిత్తము= ఆ విప్రుడిమనస్సు; తపస్సేవనతత్పరము= తపం చేయటంలో ఆసక్తమైనది; అగుడున్= కాగా; అతఁడు= ఆ బ్రాహ్మణుడు; దేవ+అనుచరునకున్= దేవసేవకుడైన కుండధారుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! దేవతల నుద్దేశించి ధర్మమార్గంలో ఆ విప్రుడు ప్రవర్తించేటట్లు అనుగ్రహించుమని కుండధారుడు ప్రార్థించాడు. అట్లా ప్రార్థించగానే ఆ దినమే ఆ బ్రాహ్మణుడి మనస్సు తపస్సులో సంలగ్నమయింది. అప్పు డా బ్రాహ్మణుడు కుండధారుడితో ఇట్లా అన్నాడు:

**క. 'అనఘా! భవదీయదయన్ । మనంబు దెలివొందె నిపుడు నా; కే నొల్లన్**
**ధనము తపంబ యొనర్పఁగ । ననుజ్ఞ సేయంగవలయు నాదరణమునన్.' 351**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; ఇప్పుడు= ఇప్పుడు; భవదీయదయన్= నీ కృపచేత; నాకున్= ధనం కోరిన నాకు; మనంబు= చిత్తం; తెలివి+ఒందెన్= వివేకం కలదయింది; ఏన్= నేను; ధనము= విత్తం; ఒల్లన్= అభిలషించను; ఆదరణమునన్= ప్రీతితో; తపంబు+అ= తపస్సే; ఒనర్పఁగన్= చేయటానికి; అనుజ్ఞచేయంగన్ వలయున్= అనుమతించాలి.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ కుండధారుడా! ఇంత వరకూ ధనాన్ని అభిలషిస్తూ ఉండిన నాకు ఇప్పుడు నీ దయవలన చిత్తం వివేకవంత మయింది. ఇంక నాకు ధనమక్కరలేదు. ప్రీతితో తపస్సునే చేయటానికి నన్ను అనుమతించుము'.

**ఆ. అనిన 'నట్లకాక యాచరింపుము ధర్మ' । మనుచు నరిగె నిర్జరానుచరుఁడు**
**భూసురుండు మూలములును బత్రములు నా । హారములుగఁ జేసె నధికతపము. 352**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; నిర్జర+అనుచరుఁడు= దేవానుచరుడైన కుండధారుడు; అట్లకాక= అట్లే అగుగాక!; ధర్మమున్= ధర్మమును; ఆచరింపుము= చేయుము; అనుచున్= అంటూ; అరిగెన్= పోయాడు; భూసురుండు= బ్రాహ్మణుడు; మూలములును= కందమూలాలు; పత్రములున్= ఆకులునూ; ఆహారములుగన్= భోజనాలుకాగా; అధికతపమున్= తీవ్రమైన తపస్సు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణు డా విధంగా చెప్పేసరికి కుండధారుడు 'అట్లే కానిమ్ము; ధర్మం ఆచరించుము' అంటూ స్వస్థానానికి వెళ్ళిపోయాడు. బ్రాహ్మణుడు దుంపలూ, ఆకులూ ఆహారంగా స్వీకరిస్తూ కఠిన తపస్సుచేశాడు.

**క. క్రమమున జల పవనము లశ । నములుగఁ గొని తపము సేసినం గాయముఁ జి**
**త్తము మానుషంబు లగు చం । దములు విడిచి దివ్యమహిమధామము లయ్యెన్. 353**

**ప్రతిపదార్థం:** క్రమమునన్= క్రమంగా; జలపవనములు= నీరు గాలి; అశనములుగన్= ఆహారాలుగా; కొని= గ్రహించి; తపముచేసినన్= తపస్సు చేయగా; కాయము= శరీరం; చిత్తము= మనస్సు; మానుషంబులు+అగు= మనుష్య సంబంధం కలవి అగు; చందములు= విధానాలు; విడిచి= వదలి; దివ్యమహిమధామములు= దివ్యమైన ప్రభావానికి నెలవులుగా; అయ్యెన్= ఐనవి;

**తాత్పర్యం:** ఆ విప్రుడు క్రమంగా కందపత్రాలు కూడా వదలి నీటిని గాలిని మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ తపస్సు చేశాడు. అందువలన అతడి శరీరమూ, మనస్సూ మనుష్యత్వాన్ని వదలి దివ్యప్రభావానికి నెలవులై విలసిల్లాయి.

**వ. అట్లు సిద్ధుం డగుటయు. 354**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; సిద్ధుండు= తపస్సుచేత సిద్ధిపొందినవాడు; అగుటయున్= కాగా.

**తాత్పర్యం:** ఆ విప్రు డారీతిగా తపస్సుచేత సిద్ధి పొందగా.

**క. నను నెవ్వ రాశ్రయించిన । ధన మొసఁగుదు, రాజ్యమిత్తుఁ; దద్దురితములం**
**దునుముదు; నను నగ్గలికలు । మనమున జనియింపఁజొచ్చె మనుజాధీశా! 355**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= రాజా!; ననున్= నన్ను; ఎవ్వరు= ఎట్టివారు; ఆశ్రయించినన్= ఆశ్రయించిననూ; ధనమున్= విత్తమును; ఒసఁగుదున్= ఇస్తాను; రాజ్యమున్= రాజ్యాన్ని; (పరిపాలించదగిన దేశాన్ని) ఇత్తున్= ఇస్తాను; తద్దురితములన్= ఆశ్రయించినవారి పాపాలను; తునుముదున్= సంహరిస్తాను; అను అగ్గలికలు= అనే ఉత్సాహాతిశయాలు; మనమునన్= చిత్తంలో; జనియింపన్+చొచ్చెన్= కలుగసాగాయి.

**తాత్పర్యం:** రాజా! ఆ బ్రాహ్మణుడికి తపఃప్రభావం వలన 'న న్నెవ్వ రాశ్రయించినా వలసినంత ధనమిస్తాను. రాజ్యం ఇస్తాను. వారి పాపాలను పోగొట్టుతాను' అనే ఉత్సాహాతిశయం అతడి మనస్సులో కలుగసాగింది.

**వ. అవ్విధంబున మహానుభావుండై. 356**

**ప్రతిపదార్థం:** ఆ+విధంబునన్= ఆ రీతిగా; మహానుభావుండు+ఐ= గొప్పప్రభావం కలవాడై.

**తాత్పర్యం:** ఆ రీతిగా అతడు గొప్ప ప్రభావం కలిగినవాడై.

**తే. ఆతఁ డతిభక్తిఁ దలఁచె దేవానుచరుని; । నపుడ యక్కుండధారుండు నరుగుదెంచె;**
**నరుగుదెంచిన నతఁడు నిజానుభావ । జనితగంధ పుష్పములఁ బూజన మొనర్చి. 357**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ బ్రాహ్మణుడు; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; దేవ+అనుచరునిన్= దేవసేవకుడైనకుండధారుడిని; తలఁచెన్= స్మరించాడు; అపుడు+అ= తలపగానే; ఆ+కుండధారుండును= ఆ కుండధారుడుకూడ; అరుగుదెంచెన్= వచ్చాడు; అరుగుదెంచినన్= అతడు రాగా; అతఁడు= ఆ విప్రుడు; నిజ+అనుభావజనిత గంధపుష్పములన్= తన తపఃప్రభావంచేత సృష్టించబడిన గంధంచేతను, పూలచేతను; పూజనము= అర్చన; ఒనర్చి= చేసి.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడు అత్యంతభక్తియుక్తుడై దేవసేవకుడిని తలచాడు. అతడు అట్లా తలచగానే కుండధారుడు అతడి యెదుట ప్రత్యక్షమయ్యాడు. అతడు రాగానే ఈ విప్రుడు అతడిని తన తపోమహిమచేత సృష్టించబడిన గంధంతోనూ, పూలతోనూ పూజించాడు. పూజించిన పిదప. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. చక్కఁగఁ జాగి మ్రొక్కుటయుఁ జయ్యన నెత్తి మనం బెలర్పఁగా**
**నక్కునఁజేర్చి యిట్లనియె నద్దివిజానుచరుండు 'శంక దాఁ**
**దక్కి ధనంబుఁ గామమును ధర్మముతోఁ గలయంగ నెన్నునే**
**యక్కట! యిట్లు వేదమని యప్పురుషార్థమునూఁద మే లగున్.' 358**

**ప్రతిపదార్థం:** చక్కఁగన్= సాష్టాంగంగా; చాగిమ్రొక్కుటయున్= సాగిలబడి నమస్కరించగానే; ఆ+దివిజ+అనుచరుండు= ఆ కుండధారుడు; చయ్యనన్= వెంటనే; ఎత్తి= బ్రాహ్మణుడిని పైకి లేవదీసి; మనంబు+ఎలర్పఁగాన్= చిత్తం సంతోషించగా;

అక్కునన్+చేర్చి= వక్షమున (కౌగిట) చేర్చుకొని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అక్కట!= ఔరా!; వేదము= శ్రుతి; తాన్= తాను; శంక దక్కి= సంశయం వీడి; ధనంబున్= అర్థమును; కామమును= కామ పురుషార్థాన్నీ; ధర్మముతోన్= ధర్మమనే మొదటి పురుషార్థంతో; కలయంగన్= కలియగా; ఎన్నునే?= ప్రశంసించునా?; అవి= ఆ అర్థకామాలు; ఆ+పురుషార్థమున్= ఆ ధర్మమనే ముఖ్యపురుషార్థాన్ని, ఊఁదన్= ఆధారంగా చేసికొన్నపుడు; మేలు+అగున్= శ్రేయస్సు కలుగుతుంది.

**తాత్పర్యం:** విప్రుడు కుండధారుడికి పూజానంతరం సాష్టాంగనమస్కారం చేశాడు. కుండధారు డందుకు సంతసించి వెనువెంటనే అతడిని లేవనెత్తి కౌగిలించుకొని ఇట్లా అన్నాడు: 'వేదం శంకలేక ధర్మంతో సమానంగా అర్థ కామాలను పరిగణించగలదా? ఔరా! అర్థకామాలు ధర్మాన్ని మించకుండా ఉన్నంతవరకే శ్రేయోదాయకా లవుతాయి'.

**విశేషం:** ధర్మం ముఖ్య పురుషార్థం. అర్థకామాలు సైతం పురుషార్థాలే. కాని ధర్మాన్ని అనుసరించి అర్థ కామాలను అనుభవించాలి. ధర్మవిరుద్ధమైన అర్థకామాలు శ్రేయస్సు కల్గించవు. శ్రీకృష్ణభగవానుడు గీతలో 'ధర్మావిరుద్ధః కామోఽస్మి భూతేషు' - నేను ప్రాణులలో ధర్మానికి విరుద్ధం కాని కామమునై ఉన్నాను అని చెప్పాడు. అందువలన అర్థకామాలకంటె ధర్మమే ప్రధానమని కుండధారు డిక్కడ విశదం చేశాడని గ్రహించాలి.

**వ. అని ధర్మం బగ్గించి. 359**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ధర్మంబు= ధర్మాన్ని; అగ్గించి= ప్రశంసించి.

**తాత్పర్యం:** కుండధారు డట్లా చెప్పి ధర్మాన్ని అర్థకామాలకంటె శ్రేష్ఠమైనదని వినుతించాడు. తరువాత.

**క. 'ఆ సుకృతముఁ గడయెయ్యి మ । హాసత్త్వా యోగసేవ నారామత ను**
**ద్భాసితుఁడ వగుచు నిష్ఠా । వ్యాసంగ విహారి వగు మనామయలీలన్.' 360**

**ప్రతిపదార్థం:** మహాసత్త్వా!= గొప్ప సత్త్వముగల ఓ విప్రుడా!; ఆ సుకృతమున్= ఆ ధర్మాన్ని; కడయెయ్యి= పారం ముట్టి; యోగసేవ నారామతన్= యోగమును సేవించటంచేత రమిస్తూ; ఉద్భాసితుఁడవు+అగుచున్= ప్రకాశమానుడవవుతూ; అనామయ లీలన్= ఉపద్రవం లేని పద్ధతితో; నిష్ఠావ్యాసంగ విహారివి= ఆత్మనిష్ఠా సంబంధంతో విహరించేవాడవుగా; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** 'మహాసత్త్వుడ వగు ఓ భూసురుడా! నీవు పురుషార్థాలలో శ్రేష్ఠమైన ఆ ధర్మాన్ని ఆచరించుము. యోగాన్ని సేవిస్తూ క్రీడించుము. దానిద్వారా భాసించే ఏ ఉపద్రవమూ లేని పద్ధతిలో ఇట్లా ఆత్మనిష్ఠుడవై స్వేచ్ఛగా విహరించుము.

**క. అని యతఁడు నిజనివాసం । బున కరిగెను విప్రవరుఁడు మునిజనములు పూ**
**జనము లొనరింప ఖేచరు । లనుమోదింప విహరించె నప్రతిహతుఁడై.' 361**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; అతఁడు= ఆ కుండధారుడు; నిజనివాసంబునకున్= తన స్థానానికి; అరిగెను= వెళ్ళాడు; విప్రవరుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుడు; మునిజనములు= మునుల సమూహాలు; పూజనములు+ఒనరింపన్= తనను అర్చించగా; ఖేచరులు= ఆకాశచారులు; అనుమోదింపన్= అభినందించగా; అప్రతిహతుఁడు+ఐ= ఎదురులేని వాడై; విహరించెన్=సంచరించాడు.

**తాత్పర్యం:** కుండధారు డట్లా చెప్పి తన స్థానానికి వెళ్ళాడు. ఈ బ్రాహ్మణుడు మునులు తనను పూజిస్తుండగా, తన ప్రవృత్తిని ఖేచరులైన దేవతావిశేషాలు అనుమోదించగా, ఎదురులేకుండా యోగమార్గంలో విహరించాడు.

## నారద ప్రవర్తితం బగు నితిహాసము (సం. 12-264-2)

**వ. అని చెప్పి యప్పురుషవరుం డప్పాండవాగ్రజుతో వెండియు నిట్లను 'నొక్క ధర్మసూక్ష్మత సెప్పెద నాకర్ణింపు; ముంఛవృత్తి యగు విప్రుం డొక్కరుండు భార్యాసహితుండై వనంబున నుండి యజ్ఞాచరణంబునకుం దొడంగి యహింసాపరుఁ డగుటం బశువిధి యుడిగి ఫలమూలంబుల హవిస్తంత్రంబు నడపం జూచె; నది విహితాచారంబు గామి యెఱింగియు శాపభయంబునం దత్పత్ని యమ్మహీసురవరు నెదుర నిలిచియుం బలుకకుండెఁ; బాకశాసనాదులు హవిర్భాగంబులు గొనం గడంగమి నగ్నియుం బచనశక్తిం దొఱంగె; నట్టియెడ నా సమీపంబునం దిరుగు హరిణంబు మనుష్య వచనంబులం దత్పత్ని దూఱి యమ్మహీసురవరు నెదుర నిలిచి తన్ను హింసించి యాగంబు సెల్లింపు మనిన, నతండట్లు సేయంబొ మ్మనవుడుఁ గొన్ని యడుగులు వోయి మగిడి యాకృష్ణమృగంబు 'నా యిచ్చు దివ్యదృష్టిం గనుంగొను; మేను చెప్పినట్లు సేసిన ని న్నభినందించువారై యప్సరఃకాంతలును గంధర్వులును వీరె విమానంబుల నేతెంచిన వా'రనుటయు నవ్విప్రుండు విలోకించి దివ్యత్వసిద్ధికై దాని హింసించువాఁ డగుటయు; దానం దదీయతపంబునకు నుత్పాతంబులు పుట్టె; నేణరూపంబున వర్తించు నా ధర్మదేవత యా భూదేవునకు సన్నిధి సేసి నీయజ్ఞశ్రద్ధకు సంతోషించి ధర్మసూక్ష్మత్వంబు దెలుప వచ్చితి; నర్హంబగు హింసావిశేషం బహింసావ్రతహానిం జేయదు; క్రతువు గదాయని యనర్హహింస కర్తవ్యంబుగా దని నిర్దేశించి తత్పత్నీసమాధానంబునం దపశ్శక్తి ప్రత్యాసత్తియుం జేసి యాగవిశేషవిధానంబు వరప్రదానంబున నిర్వహించె; నయ్యితిహాసంబు నారదప్రవర్తితంబని చెప్పిన నప్పుడమిఱేఁడు ప్రీతుండై. 362**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; ఆ+పురుషవరుండు= ఆ పురుషశ్రేష్ఠుడైన భీష్ముడు; ఆ+పాండవ+అగ్రజుతోన్= పాండవులలో పెద్దవాడైన ఆ ధర్మజుడితో; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; ఒక్కధర్మసూక్ష్మతన్= ఒక ధర్మరహస్యాన్ని; చెప్పెదన్= వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము; ఉంఛవృత్తిఅగు= రాలిన గింజల నేరుకొని తినే వర్తనం కలిగిన; విప్రుండు= బ్రాహ్మణుడు; ఒక్కరుండు= ఒకడు; భార్యాసహితుండు+ఐ= భార్యతో కూడినవాడై; వనంబునన్= అడవిలో; ఉండి= వసించి; యజ్ఞ+ఆచరణంబునకున్= యజ్ఞం చేయటానికి; తొడంగి= పూనుకొని; అహింసాపరుండు+అగుటన్= అహింసావ్రతం పాటించేవాడు కావటంవలన; పశువిధిన్= పశుహింసా రూపమైన విధానాన్ని; ఉడిగి= వర్జించి; ఫలమూలంబులన్= పండ్లచేతను; దుంపలచేతను; హవిస్తంత్రంబు= హవిర్విధానాన్ని; నడపన్= నిర్వర్తించటానికి; చూచెన్= ఆలోచించాడు; అది= ఆ పద్ధతి; విహిత+ఆచారంబు= శాస్త్రం విధించిన ఆచారం; కామి= కాకుండటం; ఎఱింగియున్= తెలిసికూడా; తత్పత్ని= అతడి భార్య; శాపభయంబునన్= శాపంవలని భీతిచే; ఆ+మహీసురవరు+ఎదురన్= ఆ బ్రాహ్మణుడి ఎదుట; నిలిచియున్= నిలబడికూడా; పలుకక+ఉండెన్= ఏమీ మారు చెప్పజాలక పోయింది; పాకశాసన+ఆదులు= ఇంద్రాదులైన దేవతలు; హవిర్భాగంబులు= యజ్ఞాగ్నిలో వేల్చబడిన హవిస్సుయొక్క పాళ్ళను; కొనన్= గ్రహించటానికి; కడంగమిన్= ప్రయత్నించక పోవటం వలన; అగ్నియున్= అగ్నికూడ; పచనశక్తిన్= పాకంచేసే సామర్థ్యాన్ని; తొఱంగెన్= కోల్పోయాడు; అట్టిఎడన్= ఆ సందర్భంలో; ఆ సమీపంబునన్= ఆ చెంతనే; తిరుగు= సంచరించే; హరిణంబు= లేడి; మనుష్యవచనంబులన్= మానవుల భాషతో; తత్పత్నిన్= ఆయన భార్యను; దూఱి= నిందించి; ఆ+మహీసురవరుఎదురన్= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడి ఎదుట; నిలిచి= నిలబడి; తన్నున్ హింసించి= తనను వధించి; యాగంబు చెల్లింపుము= యజ్ఞం పూర్తిచేయుము; అనినన్= అని చెప్పగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; అట్లు= ఆ రీతిగా; చేయన్+పొమ్ము= చేయనుపో; అనవుడున్= అనగా; ఆ కృష్ణమృగంబు= ఆ నల్లలేడి; కొన్నియడుగులు= కొంతదూరం; పోయి= వెళ్ళి; మగిడి= తిరిగివచ్చి; నా ఇచ్చు= నేను ఇచ్చెడి; దివ్యదృష్టిన్= దివ్యదృష్టితో; కనుంగొనుము= చూడుము; ఏను= నేను; చెప్పినట్లు= వచించిన రీతిగా; చేసినన్= ఆచరిస్తే; నిన్నున్+అభినందించువారై= నిన్ను మెచ్చుకొనేవారై; అప్సరఃకాంతలును= అప్సరఃస్త్రీలును;

గంధర్వులును= గానంచేసే గంధర్వులు కూడ; వీరె= ఈ కనిపించేవారే; విమానంబులన్= విమానాలమీద; ఏతెంచినవారు= వచ్చారు; అనుటయున్= అనగా; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; విలోకించి= చూచి; దివ్యత్వసిద్ధికై= దివ్యత్వంయొక్క ప్రాప్తికై; దానిన్= ఆ కృష్ణమృగాన్ని; హింసించువాఁడు= చంపేవాడు; అగుటయున్= కాగా; దానన్= దానివలన; తదీయతపంబునకున్= వాని తపస్సుకు; ఉత్పాతంబులు= ఉపద్రవాలు; పుట్టెన్= కలిగాయి; ఏణరూపంబునన్= జింకరూపంతో; వర్తించు= మెలగుతున్న; ఆ ధర్మదేవత= ధర్మమునకు అధిష్ఠానమైన ఆ దేవత; ఆ భూదేవునకున్= ఆ విప్రుడికి; సన్నిధిచేసి= ప్రత్యక్షమై; నీయజ్ఞశ్రద్ధకున్= యజ్ఞమునందు నీకు గల ఆస్తిక్యబుద్ధికి; సంతోషించి= సంతసించి; ధర్మసూక్ష్మత్వంబు= ధర్మంలోని సూక్ష్మతను; తెలుపన్= తెలియజేయటానికై; వచ్చితిన్= ఏతెంచాను; అర్హంబు+అగు= తగిన; హింసావిశేషంబు= హింసావిధానం; అహింసావ్రతహానిన్= అహింసావ్రతానికి చేటును; చేయదు= కల్గించదు; క్రతువు కదా అని= యజ్ఞం కదా అన్న బుద్ధితో; అనర్హహింస= తగని హింసాప్రక్రియ; కర్తవ్యంబు కాదు= చేయదగింది కాదు; అని నిర్దేశించి= అని చెప్పి; తత్పత్నీసమాధానంబునన్= అతడి భార్యను సమాధానపరచటమూ; తపశ్శక్తి ప్రత్యాసత్తియున్= తపోమహిమ సాంగత్యమూ; చేసి= ఆచరించి; వరప్రదానంబునన్= వరాన్ని ప్రసాదించటంతో; యాగవిశేషవిధానంబున్= యజ్ఞవిశేష విధిని; నిర్వహించెన్= నిర్వర్తింపజేసింది; ఆ+ఇతిహాసంబు= ఆ పూర్వగాథ; నారదప్రవర్తితంబు+అని= నారదమునిచే ప్రవర్తింపజేయబడిందని; చెప్పినన్= వచించగా; ఆ+పుడమితేఁడు= ఆ రాజు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజుతో పై విధంగా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు: 'ఒక ధర్మరహస్యం చెప్పుతాను వినుము. రాలిన గింజలను ఏరుకొని తినటమనే ఉంఛవర్తనంతో జీవించే బ్రాహ్మణు డొకడు భార్యతో సహా అడవిలో ఉండేవాడు. అతడు యజ్ఞం చేయటానికి ప్రయత్నించాడు. కాని, అహింసావ్రతాన్ని పాటించేవాడు కావటంవలన పశువులను హింసించటం తగదని ఫలమూలాలతో హవిర్విధానం నిర్వర్తింపజూచాడు. అది శాస్త్రవిహిత పద్ధతి కాదని తెలిసికూడా అతడి భార్య అతడి ఎదుట నిలబడి శపిస్తాడన్న భయంతో ఏమీ చెప్పకుండా ఉండిపోయింది. ఇంద్రాది దేవతలు ఆ యజ్ఞంలో హవిస్సులను స్వీకరించడానికి రాలేదు. అగ్ని కూడా హవిస్సులను పచనం చేసే శక్తి కోల్పోయాడు. ఆ పరిస్థితిలో ఆ సమీపప్రాంతంలో సంచరించే జింక ఒకటి మానవవచనాలతో అతడి భార్యను నిందించి, ఆ బ్రాహ్మణుడి ఎదుట నిలబడి 'నన్ను చంపి యాగం పూర్తిచేయి' అని చెప్పింది. అయినా అతడు 'నేనట్లా చేయనుపో' అని నిరాకరించాడు. ఆ కృష్ణహరిణం కొన్ని అడుగులు పోయి మరల తిరిగివచ్చి 'నేనిచ్చే దివ్యదృష్టితో చూడు. నేను చెప్పినట్లు చేస్తే నిన్ను మెచ్చుకొనటానికై ఇదిగో అచ్చరలు, గంధర్వులు విమానాలెక్కి వచ్చి ఉన్నారు చూడుము' అని చెప్పింది. ఆ విప్రుడు వారిని చూచి దివ్యత్వప్రాప్తి నభిలషించి ఆ లేడిని హింసించటానికి ఉద్యుక్తుడయ్యాడు. ఆ హింసవలన అతడి తపస్సుకు ఉత్పాతాలు కలిగాయి. అపుడు జింకరూపంలో ఉన్న ఆ ధర్మదేవత అతడికి నిజరూపంలో ప్రత్యక్షమై 'నేను నీ యజ్ఞశ్రద్ధకు సంతసించాను. నీకు ధర్మసూక్ష్మం చెప్పటానికై వచ్చాను. ఉచితమైన హింస అహింసకు భంగకరం కాదు. యజ్ఞం పేరుతో తగని హింస ఎన్నడూ చేయరాదు' అని చెప్పింది. తరువాత అతడి భార్యను సమాధానపరచింది. అతడి తపశ్శక్తికి లోటులేకుండా చేసింది. వరమిచ్చి అతడి యాగం నిర్వహించబడేటట్లు అనుగ్రహించింది. ఈ కథను నారదమహర్షి లోకంలో ప్రవర్తింపజేశాడు అని భీష్ముడు చెప్పాడు. అందుకు ధర్మజుడు ప్రీతి పొంది. (తరువాతి పద్యంతో అన్వయం).

### భీష్ముఁడు ధర్మజునకు ముక్తిమార్గము దెల్పుట (సం. 12-265-2)

**క. 'పురుషుం డేమిటఁ బాపా । చరణమునకుఁ జొచ్చు? ధర్మచర్యకు మూలం**
**బరయఁగ నెయ్యది? రెంటిం । బొరయం డెద్దాన? నెట్లు వొందును ముక్తిన్?' 363**

**ప్రతిపదార్థం:** పురుషుండు= మానవుడు; ఏమిటన్= దేనివలన; పాపాచరణమునకున్= పాపంచేయటానికి; చొచ్చున్= ప్రారంభిస్తాడు; అరయఁగన్= పరిశీలించగా; ధర్మచర్యకున్= ధర్మాచరణకు; మూలంబు= కారణం; ఎయ్యది?= ఏది?; ఏ+దానన్= దేనివలన; రెంటిన్= పుణ్యపాపాలను రెండింటినీ; పొరయఁడు= పొందడు; ముక్తిన్= మోక్షాన్ని; ఎట్లు= ఎట్లా; పొందున్= పొందుతాడు?

**తాత్పర్యం:** పురుషుడు దేనివలన పాపకార్యాలు చేయటానికి పూనుకొంటాడు? పుణ్యకార్యాలకు కారణ మేది? దేనివలన పుణ్యాపాపాలు రెండూ అంటకుండా ఉండగలడు? మోక్షం ఎట్లా పొందుతాడు?

**వ. అని యడిగిన నతనికి భీష్ముం డిట్లనియె. 364**

**ప్రతిపదార్థం:** అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; భీష్ముండు= పితామహుడు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా ధర్మరాజు ప్రశ్నించాడు. అది విని భీష్ముడు ధర్మజుడితో ఇట్లా అన్నాడు:

**సీ. 'గంధరసాదుల కాంక్ష లోభము మోహ । ము ను దెచ్చు; నద్దోషమునకు మనసు**
**లోనైన ధర్మవిలోపంబు వాటిల్లు; । దానఁ బాపము సేయు తలఁపు లొదవు;**
**బ్రజ్ఞ నక్కీడులు భావించి సద్గోష్ఠిఁ । బరఁగంగ విషయతత్పరత మాను;**
**నది ధర్మబుద్ధికి నాలవాలం బగు; । ధర్మాచరణములఁ దనివి సనక**

**తే. హృద్గత ద్వంద్వముల నెల్ల నెడల విడుచు । ననఘ! యనపాయ మగు నుపాయమున ముక్తి**
**వడయుఁ బదపడి; యేను నీయడిగినంత । వట్టుఁ దెలిపితి ధర్మనిర్వాహి వగుము.' 365**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; గంధరసాదులకాంక్ష= గంధం, రసం మొదలైన విషయాలమీది కోరిక; లోభమున్= లోభాన్నీ; మోహమున్= మోహాన్నీ; తెచ్చున్= తీసికొని వస్తుంది; మనసు= చిత్తం; ఆ+దోషమునకున్= ఆ దోషానికి; లోనైనన్= లోబడితే; ధర్మవిలోపంబు= ధర్మానికి హాని; పాటిల్లున్= కలుగుతుంది; దానన్= దానివలన; పాపము చేయు= పాపకార్యాలు చేసే; తలఁపులు= సంకల్పాలు; ఒదవున్= సంభవిస్తాయి; ప్రజ్ఞన్= ప్రతిభతో; ఆ+కీడులు= ఆ దోషాలు; భావించి= ఊహించి; సద్గోష్ఠిన్= సజ్జనుల గోష్ఠిలో; పరఁగంగన్= ప్రవర్తిల్లితే; విషయతత్పరత= విషయాలపై ఆసక్తి; మానున్= తొలగిపోతుంది; అది= ఆ పద్ధతి; ధర్మబుద్ధికిన్= ధర్మంచేయాలనే బుద్ధికి; ఆలవాలంబు= పాదు; అగున్= అవుతుంది; ధర్మ+ఆచరణములన్= ధర్మకార్యాలు చేయటం వలన; తనివి చనక= తృప్తి పొందక; హృద్గతద్వంద్వములన్+ఎల్లన్= హృదయంలో ఉన్న సుఖదుఃఖాది ద్వంద్వాల నన్నింటినీ; ఎడలన్ విడుచున్= వర్జిస్తాడు; పదపడి= పిదప; అనపాయము+అగు= అపాయంలేని; ఉపాయమునన్= ఉపాయంతో; ముక్తిన్= మోక్షమును; పడయున్= పొందుతాడు; ఏను= నేను; నీఅడిగినంతవట్టు= నీవు ప్రశ్నించినంతవరకు; తెలిపితిన్= తెలియజేశాను; ధర్మనిర్వాహివి= ధర్మకార్యాలు నెరవేర్చేవాడవు; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** 'శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే విషయాలమీది కోరిక లోభ మోహాలు కలిగిస్తుంది. చిత్తం లోభమోహాలకు లోనైతే ధర్మానికి లోపం కలుగుతుంది. ధర్మం లోపించగానే పాపకార్యాలు చేయాలనే తలపులు కలుగుతాయి. అందువలన తెలివితో ఈ కీడులన్నిటినీ ఊహించి వాటిజోలికి పోక సజ్జనుల గోష్ఠిలో కాలం గడిపితే విషయాలపై ఆసక్తి నశిస్తుంది. దానివలన ధర్మబుద్ధి ఉదయిస్తుంది. ధర్మకార్యాలు క్రమంగా ఆచరిస్తూ పోతే హృదయంలోని రాగద్వేషాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు తొలగిపోతాయి. ఆపైన అపాయం లేని ఉపాయంతో ముక్తి పొందుతాడు. నీవు అడిగినంతవరకూ విషయాలు నీకు తెలియజేశాను. నీవు ధర్మాన్ని ఆచరించుము'.

**తే.** **అనుడు ననపాయ మగు నుపాయం బనంగఁ। జెప్పి తొక్కటి; మోక్షంబుఁ జెందుతెఱఁగు**
**దానిఁ దెలియంగ నెఱిఁగింపవే నరేంద్ర। ముఖ్య!' యనియె నక్కురువంశముఖ్యుఁ డధిప! 366**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అనుడున్= భీష్ముడట్లా అనగానే; ఆ+కురువంశముఖ్యుఁడు= ఆ కౌరవవంశానికి ప్రధానుడైన ధర్మరాజు; నరేంద్రముఖ్యా!= రాజశ్రేష్ఠ!; అనపాయము+అగు= అపాయం లేనిదైన; ఉపాయంబు+అనంగన్= ఉపాయం అనగా; మోక్షంబున్= ముక్తిని; చెందు= పొందు; తెఱఁగు= మార్గం; ఒక్కటి= ఒకదానిని; చెప్పితి(వి)= చెప్పితివి; దానిన్= ఆ ఉపాయాన్ని; తెలియంగన్= తెలిసేవిధంగా; ఎఱిఁగింపవే= తెలియజేయుమా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! భీష్ముడట్లా అనేసరికి ధర్మరాజు భీష్ముడితో 'రాజవర్యా! అపాయంలేని ఉపాయం అంటూ మోక్షం పొందే మార్గమొక్కటి చెప్పావు. దానిని విపులంగా తెలియజెప్పుము' అని ప్రార్థించాడు.

**వ.** **అనుటయు నమ్మహీకాంతునకు శాంతనవుం డిట్లనియె. 367**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+మహీకాంతునకున్= ఆ ధర్మరాజునకు; శాంతనవుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మజుడు ఆ విధంగా ప్రార్థించగానే భీష్ము డతడితో ఈ రీతిగా అన్నాడు:

**క.** **'వినుము ఘటము సేయుట సా। ధనములు లేకున్న నగునె ధరణిప! పూర్వాం**
**బునిధికిఁ జను మార్గ మపర। వనరాశికిఁ జనునె? వెరవు వలయుం దెలియన్. 368**

**ప్రతిపదార్థం:** ధరణిప!= రాజా!; వినుము= ఆలకించుము; ఘటమున్= కుండను; చేయుట= నిర్మించటం; సాధనములు లేకున్నన్= పరికరాలు లేకపోతే; అగునె?= జరుగునా?; పూర్వాంబునిధికిన్= తూర్పు సముద్రానికి; చనుమార్గము= పోయేదారి; అపరవనరాశికిన్= పశ్చిమసాగరానికి; చనునె?= పోతుందా?; వెరవు= ఉపాయం; తెలియన్+వలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వినుము. తగు సాధనాలు లేకుంటే కుమ్మరి కుండ చేయగలడా? తూర్పు సాగరానికి పోయేదారి ఎప్పుడైనా పడమటి సముద్రానికి పోతుందా? అందువలన ఏ పనికైనా తగిన ఉపాయాన్ని తప్పక తెలిసికొనాలి.

**విశేషం:** అలం: దృష్టాంతం.

**వ.** **అడిగి మేలు సేసి తాకర్ణింపుము. 369**

**ప్రతిపదార్థం:** అడిగి= ప్రశ్నించి; మేలు= మంచి; చేసితి(వి)= చేశావు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** మోక్షానికి 'అపాయం లేని ఉపాయమేది?' అని అడిగి మంచి పని చేశావు. చెప్పుతాను వినుము.

**సీ.** **క్షమఁ గ్రోధ, మకృత సంకల్పతఁ గామంబు,। చిరనిద్ర సత్త్వసంసేవనమున**
**గాఢధైర్యమున రాగద్వేషములు, భయ। మప్రమాదమున, మోహంబు భ్రమము**
**వినివర్తనాభ్యాసమున రోగములు నుప। ద్రవములు హితము మితంబు గాల**
**యోజితంబును నగు భోజనంబున జీవ। సందర్శనమున నిశ్వాస మఖిల**

**తే.** **విషయములు నంతవిరసతా వేక్షణమున। నిత్యసంతోషమున లోభనిరతి కృప న**
**ధర్మ ముచిత కృతావేక్ష ధర్మ మవులఁ। ద్రోవనేర్చుట ముక్తికిఁ ద్రోవ యధిప! 370**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; క్షమన్= ఓర్పుతో; క్రోధము= కోపాన్ని; అకృతసంకల్పతన్= సంకల్పం చేయకుండా ఉండటంవలన; కామంబు= కోరికను; సత్త్వసంసేవనమునన్= సాత్త్వికగుణాభ్యాస్యంతో; చిరనిద్ర= నిడుపైన నిద్దురను ; గాఢధైర్యమునన్= దృఢమైన ధీరత్వంతో; రాగద్వేషములు= ఆసక్తి ద్వేషాలను; అప్రమాదమునన్= ఏమరుపాటు లేకుండా ఉండటంతో; భయము= భీతిని; వినివర్తన+అభ్యాసమునన్= తొలగద్రోయటమనే అభ్యాసంతో; మోహంబు భ్రమము= వ్యామోహభ్రాంతులను; హితము= మేలు చేసేది; మితంబున్= పరిమితమైనది; కాలయోజితంబునున్= తగిన కాలంలో స్వీకరించబడేది; అగు= అయిన; భోజనంబునన్= ఆహారంచేత; రోగములు= వ్యాధులను; ఉపద్రవములు= బాధలను; జీవసందర్శనమునన్= క్షేత్రజ్ఞుడనబడే జీవుడిని చూడటంచేత; నిశ్వాసము= ప్రాణచేష్టను; అంత విరసతావేక్షణమునన్= కడపట రసహీనత్వమును చూచుటచే; విషయములు= శబ్దము మొదలైన విషయాలను; నిత్యసంతోషమునన్= సదా సంతోషముగా నుండుటచే; లోభనిరతి= లోభతత్పరతను; కృపన్= కరుణతో; అధర్మము= ధర్మంయొక్క లేమిని; ఉచితకృతావేక్ష= తగిన రీతిలో చేయబడిన సమీక్షణంచేత; కర్మము= కర్మను; అవులన్+త్రోవనేర్చుట= కడకునెట్టటం అభ్యసించటమే; ముక్తికిన్= మోక్షానికి; త్రోవ= మార్గం.

**తాత్పర్యం:** రాజా! ఓరిమితో కోపాన్నీ, సంకల్పించకుండా ఉండటంతో కామాన్నీ, సత్త్వగుణాభ్యాసంతో నిద్రనూ, దృఢమైన ధైర్యంతో రాగద్వేషాలనూ, జాగరూకతతో భయాన్నీ, జ్ఞానవైరాగ్యాదులతో క్రమంగా తొలగించటం నేర్చుకొనటం ద్వారా మోహభ్రాంతులనూ, హితమూ, మితమూ, తగినకాలంలో గ్రహింపబడేదీ అయిన భోజనంతో రోగాలనూ, ఉపద్రవాలనూ, క్షేత్రజ్ఞస్వరూపుడైన జీవుడిని చూడటంద్వారా ప్రాణచేష్టనూ, కడపట నిస్సారములని గ్రహించటంతో శబ్దాది విషయాలనూ, నిత్యసంతుష్టితో లోభాన్నీ, దయతో అధర్మాన్నీ, తగిన సమీక్షణ విధానంతో కర్మనూ కడకు నెట్టటం నేర్చుకొనటమే ముక్తికి బాట అవుతున్నది.

**తే.** **తాను గ్రోధాదు లెడలించుఁగాని ముక్తిఁ । దెచ్చి యీ; దొకభంగి ముక్తికిఁ బథంబు**
**నగుట ననపాయ మగు నుపాయం బనంగ । వలసె నీ నేర్పు పే రిందువంశవర్య!** **371**

**ప్రతిపదార్థం:** ఇందువంశవర్య!= చంద్రవంశ శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; తాను= ఈ ఉపాయం; క్రోధాదులు= కోపం మొదలైన దుర్గుణాలను; ఎడలించున్+కాని= తొలగిస్తుందికాని; ముక్తిన్= మోక్షాన్ని; తెచ్చి+ఈదు= తీసికొనివచ్చి ఈయదు; ఒక భంగిన్= ఒక విధంగా; ముక్తికిన్= మోక్షానికి; పథంబున్= దారియు; అగుటన్= కావటంవలన; ఈ నేర్పుపేరు= ఈ చాతుర్యం యొక్క నామం; అనపాయము+అగు= అపాయంలేని; ఉపాయము+అనంగన్+వలసెన్= ఉపాయమని చెప్పవలసి వచ్చింది.

**తాత్పర్యం:** చంద్రవంశశ్రేష్ఠా! పై జెప్పిన ఉపాయం ముక్తికి ఆటంకం కల్గించే కామక్రోధాదులను తొలగిస్తుంది కాని తాను ముక్తిని తెచ్చి సమర్పించదు. ఒక విధంగా అది మోక్షానికి తెరువు కావటం వలననే ఆ నేర్పును అపాయంలేని ఉపాయమని చెప్పటమయింది.

**చ.** **అనుడు నజాతశత్రుఁ 'డిటు లన్నలు దమ్ములు లోనుగాఁగఁ దృ**
**ష్ణ నఖిలబంధుకోటులనుఁ జంపెడు తెం పొలసెన్ మహాత్మ! యే**
**యనువునఁ దృష్ణ త్రోపువడునట్టి సమంచితచిత్త ధర్మముం**
**బనుపఱుపంగ జాలు కలభాషణ పంక్తి ననుగ్రహింపవే!'** **372**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని భీష్ము డనగా; అజాతశత్రుఁడు= ధర్మజుడు; మహాత్మ!= మహానుభావా!; ఇటులు= ఇట్లా; అన్నలు తమ్ములు లోనుగాఁగన్= అగ్రజులు అనుజులు మొదలైనవారిని; తృష్ణన్= ఆశతో; అఖిలబంధుకోటులనున్= సమస్త బంధుసమూహాలను; చంపెడు= వధించే; తెంపు= సాహసం; ఒలసెన్= సంభవించింది; తృష్ణ= ఆశ; ఏ యనువునన్= ఏ

ఉపాయంతో; త్రోపువడున్= తొలగిపోవునో; అట్టి= అటువంటి; సమంచిత చిత్త ధర్మమున్= పూజితమైన మనోధర్మాన్ని; పనుపఱుపంగన్+చాలు= అభ్యసింపజేయగా నేర్చునట్టి; కలభాషణపంక్తిన్= మధురమైన మాటలపరంపరను; అనుగ్రహింపవే!= ప్రసాదించుమా!

**తాత్పర్యం:** భీష్ముడట్లా అనగానే ధర్మరాజు 'ఓ మహాత్మా! ఆశ వలన సోదరులు మొదలైన సమస్త బంధుసమూహాలనూ వధించే సాహసం సంభవించింది. ఈ ఆశ ఎట్లా తొలగిపోతుందో, ఆ మానితమైన మనోధర్మాన్ని అలవడజేసే మధురవచనాలు వినిపించుము'.

**క. అనుటయు దేవవ్రతుఁ డ । మ్మనుజపతికి నిట్టు లనియె 'మాండవ్యునితో**
**జనకుఁడు సెప్పిన మాటలు । విను; మవి తృష్ణ నడఁగించు వెరవు నొనర్చున్. 373**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; దేవవ్రతుఁడు= భీష్ముడు; ఆ+మనుజపతికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్టులు+అనియెన్= ఇలా అన్నాడు; జనకుఁడు= జనక భూపాలుడు; మాండవ్యునితోన్= మాండవ్యుడనే మునితో; చెప్పిన= వచించిన; మాటలు= పలుకులు; వినుము= ఆలకించు; అవి= ఆ మాటలు; తృష్ణన్= ఆశను; అడఁగించు= నశింపజేయు; వెరవున్= ఉపాయమును; ఒనర్చున్= చేయును.

**తాత్పర్యం:** ధర్మజు డట్లా అనేసరికి భీష్ము డతడితో ఇట్లా అన్నాడు: 'పూర్వం జనకుడు మాండవ్యుడనే మునితో చెప్పిన మాటలు చెప్పుతాను, వినుము. ఆ మాటలు తృష్ణను నశింపజేసే ఉపాయం తెలుపుతాయి.

**జనకరాజ మాండవ్య మహామునులసంవాద ప్రకారము (సం. 12-268-3)**

**వ. జనకుని కడకు మాండవ్యుండు వచ్చి వితృష్ణత్వశిక్షఁ గోరిన న మ్మేదినీశ్వరుం డాదరభరితుండై. 374**

**ప్రతిపదార్థం:** మాండవ్యుండు= మాండవ్యమహాముని; జనకుని కడకున్= జనకనరేంద్రుడి సమీపానికి; వచ్చి= ఏతెంచి; వితృష్ణత్వశిక్షన్= ఆశ లేమిలో శిక్షణను; కోరినన్= అడుగగా; ఆ+మేదినీ+ఈశ్వరుండు= ఆ రాజు; ఆదరభరితుండు+ఐ= ప్రీతితో కూడినవాడై.

**తాత్పర్యం:** మాండవ్యముని ఒకసారి జనకభూపాలుడి కడకు వచ్చాడు. వచ్చి ఆశ లేకుండా ఉండటానికై తగిన శిక్షణ నిమ్మని అర్థించాడు. అప్పు డా భూపాలకుడు అతడిపట్ల ఆదరం కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'అర్థముల్ దుఃఖదోషాకరంబులు విను । మేమిటిపై నాశ లేమిఁ జేసి**
**పొరయవు నను దుఃఖములు మునినాయక! । మిథిల గాలంగ నేమియును నాకుఁ**
**గాలని య ట్లుండెఁ; గామసుఖంబును । దివ్య సుఖంబునుఁ దృష్ణ విడుచు**
**సుఖముఁ బోలునె? యర్థసులభత తోడన । గోవుతోఁ బెరిఁగెడు కొమ్ములట్లు**
**తే. తృష్ణ దానును పెరుఁగుఁ; దదీయ శక్తి । మమత గలుగు మా బంధులు మా ధనములు**
**మా నివాసంబు లనమి మమత్వ మెదఁ ది । రంబు గాకున్న నింకుఁ దృష్ణాంబురాశి. 375**

**ప్రతిపదార్థం:** మునినాయక!= మునిశ్రేష్ఠా!; వినుము= ఆలకించుము; అర్థముల్= సంపదలు; దుఃఖదోష+ఆకరంబులు= దుఃఖమనే దోషానికి నిలయాలు; ఏమిటిపైన్= దేనిమీదా; ఆశ= తృష్ణ; లేమిన్+చేసి= లేకపోవటంవలన; ననున్= నన్ను; దుఃఖములు=బాధలు; పొరయవు= అంటవు; మిథిల= మిథిలానగరం; కాలంగన్= దహింపబడగా; ఏమియునున్= ఏదీకూడా; నాకున్= నా చిత్తానికి; కాలనిఅట్లు+ఉండెన్= కాలకుండా ఉన్నట్లే ఉన్నది; కామసుఖంబునున్= కామానుభవం వలన కలిగే సుఖమూ; దివ్య సుఖంబునున్=

దేవలోకసుఖమూ; తృష్ణ విడుచుసుఖమున్= ఆశ విడనాడటం వలన కలిగే సుఖాన్ని; పోలునె?= పోలగలవా?; గోవుతోన్= ఆవుతోగూడ; పెరిఁగెడు= వృద్ధిపొందే; కొమ్ములట్లు= కొమ్ములలాగా; అర్థసులభతతోడనన్+అ= అనాయాసంగా ధనప్రాప్తి కాగానే; తృష్ణ= ఆశ; తానునున్= తానుగూడ; పెరుఁగున్= వృద్ధి పొందుతుంది; తదీయశక్తిన్= ఆశకు సంబంధించిన సామర్థ్యం వలన; మమత= మమకారం; కలుగున్= కలుగుతుంది; కలుగు= సంభవించే; మాబంధులు= మా చుట్టాలు; మా ధనములు= మా సంపదలు; మా నివాసంబులు= మా ఇళ్ళు; అనమిన్= అనకపోవటం వలన; మమత్వము= మమకారం; ఎదన్= హృదయంలో; తిరంబుగాక+ఉన్నన్= స్థిరపడకపోతే; తృష్ణా+అంబురాశి= ఆశ అనే సముద్రం; ఇంకున్= ఎండిపోతుంది.

**తాత్పర్యం:** మునీశ్వరా! చెప్పుతాను వినుము. సంపదలు దుఃఖనిలయాలు. నాకు దేనిపైనా ఆశలేదు. అందువలననే మిథిలానగరం తగలబడుతున్నా నాకు ఏమీ తగులబడినట్లు లేదు. కామసుఖమూ, దివ్యసుఖమూ ఆశలేమిచేత కలిగే సుఖానికి ఈడు కావు. అర్థం అనాయాసంగా లభించగానే గోవుతో కూడా కొమ్ములు పెరిగినట్లే ఆశ కూడా పెరిగిపోతుంది. ఆశాప్రభావం వలన కలిగే మమకారం పెరిగి పోతుంది. వీరు మా చుట్టాలు, అవి మా సంపదలు, ఇవి మా నెలవులు - అనే మమకారం తొలగితే తృష్ణ అనే సాగరం ఎండిపోతుంది.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం.

**క.** **దొరకొన్న ననుభవించుచు । దొరకొనమికిఁ జింతనొంది దురపిల్లక ని**
**ర్భరుఁడై యున్ననుఁ దృష్ణకుఁ । జొరవచ్చునె యతని మనసు సువ్రతశీలా! 376**

**ప్రతిపదార్థం:** సువ్రతశీలా!= మంచివ్రతం స్వభావంగా కలవాడా!; దొరకొన్నన్= లభిస్తే; అనుభవించుచున్= అనుభవిస్తూ; దొరకొనమికిన్= లభించనిదానికి; చింతన్+ఒంది= విచారంపొంది; దురపిల్లక= దుఃఖించక; నిర్భరుఁడు+ఐ= పూర్ణచిత్తుడై; ఉన్ననున్= ఉంటే; అతని మనసు= అతడి చిత్తం; తృష్ణకున్= ఆశకు; చొరన్ వచ్చునె?= ప్రవేశించవీలగునా?

**తాత్పర్యం:** సద్వ్రతమే స్వభావంగా గల ఓ మాండవ్యమునీంద్రా! దొరకినదానిని అనుభవిస్తూ, దొరకనిదానికి చింతపడి దుఃఖించకుండా పరిపూర్ణుడై ఎవడు ఉంటాడో, అతడి మనస్సులోనికి తృష్ణ ప్రవేశించనేరదు.

**తే.** **విడువరాదు దుర్మతులకు నొడలు ముదియఁ । దాను ముదియదు ప్రాణాంతమైన రోగ**
**మనఘ! తృష్ణ వర్జితకాముఁడై నతండు । దానిఁ బోఁద్రోచి సౌఖ్యసాంద్రత్వ మొందు. 377**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; తృష్ణ= ఆశ; దుర్మతులకున్= దుర్బుద్ధులైనవారికి; విడువన్‌రాదు= వదలటానికి వీలుకాదు; ఒడలు= శరీరం; ముదియన్= ముదిసిపోగా; తాను= ఆశ; ముదియదు= వృద్ధత్వం పొందదు; (అది) ప్రాణాంతమైన= ప్రాణవినాశకమైనట్టి; రోగము= వ్యాధి; వర్జితకాముఁడు+ఐన+అతండు= కోరికలు వదలినవాడు; దానిన్= ఆ తృష్ణను; పోఁద్రోచి= కడకు నెట్టివైచి; సౌఖ్యసాంద్రత్వము= సుఖాధిక్యమును; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ మునిశ్రేష్ఠా! దుర్మతులైనవారు తృష్ణను విడువలేరు. శరీరం ముసలితనం పొందినా ఆశమాత్రం ముదిమి పొందదు. అది ప్రాణాలు తీసే రోగం. ఎవడు తాను విముఖుడై తృష్ణను పరిహరిస్తాడో, అతడు అత్యధిక సుఖం పొందుతాడు.

**క.** **శోక ప్రమదాది ద్వం । ద్వాకులుఁ డవుఁ గాక శాంతి నంతఃకరణ**
**శ్రీకిఁ బరిరక్ష సేయుము; । నీకు వితృష్ణత్వసౌఖ్యనిత్యత గలుగున్.' 378**

**ప్రతిపదార్థం:** శోకప్రమద+ఆది ద్వంద్వ+ఆకులుఁడవు= దుఃఖం, సుఖం మొదలైన ద్వంద్వాలచేత వ్యాకులపడినవాడవు; కాక= కాకుండా; శాంతిన్= శమంతో; అంతఃకరణశ్రీకిన్= మనోబుద్ధ్యాదులతో కూడిన అంతఃకరణలక్ష్మికి; పరిరక్ష= కాపుదల; చేయుము= ఒనర్చుము; నీకున్= మాండవ్యుడవగు నీకు; వితృష్ణసౌఖ్యనిత్యత= ఆశ లేమివలన కలిగే సౌఖ్యస్థిరత్వం; కలుగున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** మునీంద్రా! నీవు సుఖదుఃఖాది ద్వంద్వాలకు వ్యాకులత చెందవద్దు. నిగ్రహంతో మనోబుద్ధ్యాదులతో కూడిన అంతఃకరణసంపదను కాపాడుకొమ్ము. అట్లా చేస్తే నీకు ఆశలేమివలన నిత్యసుఖం లభిస్తుంది'.

**క.** **అని చెప్పిన నమ్ముని య । మ్మనుజపతిం బ్రస్తుతించి మనము ప్రశాంతిం**
**బనుపడఁగఁ బ్రీతి వీడ్కొని । చని వర్తిల్లెను వితృష్ణసరణిఁ గుమారా! 379**

**ప్రతిపదార్థం:** కుమారా!= ధర్మరాజా!; అని చెప్పినన్= జనకుడు ఆ రీతిగా చెప్పేసరికి; ఆ+ముని= ఆ మాండవ్యుడు; ఆ+మనుజపతిన్= ఆ రాజును; ప్రస్తుతించి= ప్రశంసించి; మనము= చిత్తం; ప్రశాంతిన్+పనుపడఁగన్= ప్రశాంతిని పొందగా; ప్రీతిన్= సంతోషంతో; వీడ్కొని చని= పోయివస్తానని చెప్పి వదలిపోయి; వితృష్ణ సరణిన్= ఆశారహిత మార్గంలో; వర్తిల్లెను= చరించాడు.

**తాత్పర్యం:** ధర్మపుత్రా! జనకుడట్లా బోధించే సరికి ఆ మాండవ్యుడు ఆ రాజును ప్రస్తుతించాడు. అతడి చిత్తం శాంతి పొందింది. ఆపై రాజును వీడ్కొని ఆ మాండవ్యమునీంద్రుడు ఆశారహితమైన పథంలో సంచరించాడు.

### పితాపుత్రసంవాదము

**వ.** **అనిన విని ధర్మనందనుండు శంతనునందనుతో 'సర్వభూతభయావహంబగుచుం గాలం బతిక్రమించుచుండఁ బురుషుం డెద్ది యాచరించుట మేలు? దీని మున్ను నడిగి విన్నవాఁడ; నిది పెద్దయు వినవలయునది గావున నడిగెదం జెప్పవే!' యనుటయు, నమ్మహాత్ముం డీ యర్థంబు దెలియుటకు ముంద రేను జెప్పిన పితాపుత్ర సంవాదం బను నితిహాసంబు లెస్స; యందుఁగొన్ని వాక్యంబు లప్పుడు సెప్పనియవి యునుం గలవు; చెప్పెద విను; మధ్యయనపరుం డగు నొక్క బ్రాహ్మణపుత్రుం డన్వర్థనామధేయుండు మేధావి యనువాఁడు దండ్రి కభిముఖుండై. 380**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ధర్మనందనుండు= ధర్మజుడు; శంతనునందనుతోన్= భీష్ముడితో; సర్వభూతభయావహంబు+అగుచున్= సమస్త ప్రాణులకు భీతికలిగిస్తూ; కాలంబు= సమయం; అతిక్రమించుచుండన్= గడుస్తూ ఉండగా; పురుషుఁడు= జీవుడు; ఎద్ది= ఏది; ఆచరించుట= చేయటం; మేలు= శుభం; దీనిన్= ఈ విషయాన్ని; మున్నున్= ముందుకూడా; అడిగి= ప్రశ్నించి; విన్నవాఁడన్= ఆలకించినవాడను; ఇది= ఈ సంగతి; పెద్దయున్= మిక్కిలిగా; వినన్‌వలయునది= వినదగింది; కావునన్= కాబట్టి; అడిగెదన్= ప్రశ్నిస్తున్నాను; చెప్పవే= వివరింపుమా; అనుటయున్= అనగా; ఆ+మహాత్ముండు= ఆ భీష్ముడు; ఈ అర్థంబు= ఈ విషయం; తెలియుటకున్= గ్రహించటానికి; ముందర= ముందు; ఏను= నేను; చెప్పిన= వచించిన; పితాపుత్రసంవాదంబు+అను= తండ్రికొడుకుల సంవాదమనే; ఇతిహాసంబు= పూర్వగాథ; లెస్స= బాగైనది; అందున్= దానిలో; కొన్ని వాక్యంబులు= కొన్నిమాటలు; అప్పుడు= ఆ కాలమున; చెప్పనియవియునున్= చెప్పనివి కూడ; కలవు= ఉన్నవి; చెప్పెదన్+వినుము= వివరిస్తాను వినుము; అధ్యయనపరుండు= విద్యాభ్యాసంలో ఆసక్తుడైనవాడు; ఒక్క బ్రాహ్మణపుత్రుండు= ఒక విప్రసుతుడు; అన్వర్థనామధేయుండు= సార్థకమైన పేరు గలవాడు; మేధావిఅనువాఁడు= 'మేధావి' అనబడేవాడు; తండ్రికిన్= జనకుడికి; అభిముఖుండు+ఐ= ఎదురుమొగంతో ఉన్నవాడై.

**తాత్పర్యం:** భీష్ము డట్లా చెప్పగా విని ధర్మరాజు అతడితో 'సమస్త ప్రాణులకూ భయంకలిగిస్తూ కాలం గడుస్తుండగా పురుషుడు ఏమి చేస్తే శ్రేయస్సు కలుగుతుంది? ఈ విషయం ఇంతకుముందు కూడా విన్నాను. అయినా ఇది మిక్కిలిగా వినదగిన విషయం. అందువలన మళ్ళీ అడుగుతున్నాను చెప్పు'మన్నాడు. అప్పుడు మహనీయుడైన ఆ పితామహుడు ఈ విషయం గ్రహించేముందు నేను పూర్వం చెప్పిన పితాపుత్రసంవాదం అనే ఇతిహాసం చాలా మేలైనది. అందులో కొన్ని మాటలు నేను నీకు అప్పుడు చెప్పనివి కూడా ఉన్నాయి. ఇప్పు డవి చెప్పుతాను వినుము. విద్యాభ్యాసపరుడైన ఒక విప్రకుమారు డుండేవాడు. వాడు 'మేధావి' అనే సార్థకనామధేయం కలిగి మిక్కిలి తెలివితో ప్రవర్తించేవాడు. వాడు తండ్రి ఎదుట నిలిచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **'ఆయువు దఱుఁగు నంతంతకు ధీరుఁ డె। య్యది సేయువాఁ?' డన్న నతఁడు 'బ్రహ్మ**
**చర్యంబు వేదాభ్యసనమును సంతాన। సంపాదనంబు యజ్ఞప్రవర్త**
**నంబును జేసి వానప్రస్థధర్మంబు। నడపి యాచరితసన్న్యాసుఁ డగుట**
**కృత్యం' బనుడు 'జరామృత్యువుల్ జననమా। దిగ వెను తగులంగ దిగులు లేమి**

**తే.** **మీను వలదన్నుఁ బొదువుట గాన కిష్ట। వృత్తి విహరించుచుండెడు విధమ కాదె!**
**యెల్లి సేసెద ననక మే లిపుడ చేయు। మనఘ! వార్చునె మృత్యువు జనుల పనుల.'** **381**

**ప్రతిపదార్థం:** ధీరుఁడు= ధైర్యం కలవాడు; ఆయువు= జీవితకాలం; తఱుఁగున్+అంతంతకున్= ఆరోజు కారోజు తరిగిపోతూ ఉండగా; ఏ+అది= ఏమి; చేయువాఁడు+అన్నన్= చేయాలి అని అడుగగా; అతఁడు= అతడి తండ్రి; బ్రహ్మచర్యంబున్= బ్రహ్మచారియొక్క ధర్మమును; వేద+అభ్యసనమునున్= వేదాలను చదవటం; సంతానసంపాదనంబున్= సంతతిని పొందటం; యజ్ఞప్రవర్తనంబునున్= యజ్ఞాచరణం; చేసి= అనుష్ఠించి; వానప్రస్థధర్మంబున్= వానప్రస్థుడియొక్క ధర్మాన్నీ; నడపి= నిర్వహించి; ఆచరితసన్న్యాసుఁడు+అగుట= అనుష్ఠింపబడిన సన్న్యాసం కలవాడు కావటం; కృత్యంబు= చేయదగినపని; అనుడున్= అనగా; జననము+ఆదిగన్= పుట్టింది మొదలుగా; జరామృత్యువుల్= ముసలితనం; మరణం; వెనుతగులంగన్= వెంబడించగా; దిగులు లేమి= విచారం లేకుండా ఉండటం; మీను= చేప; వల= జాలము; తన్నున్= తనను; పొదువుటన్= ఆక్రమించటం; కానక= చూడక; ఇష్టవృత్తిన్= ఇచ్చవచ్చిన చొప్పున; విహరించుచుండెడు= తిరుగుతుండే; విధమకాదె!= పద్ధతేకదా!; మేలు= మంచిపని; ఎల్లి= రేపు; చేసెదను+అనక= చేస్తాను అనకుండా; ఇపుడు+అ= ఇప్పుడే; చేయుము= అనుష్ఠించుము; అనఘ!= పాపరహితుడా!; మృత్యువు= చావు; జనుల= ప్రజలయొక్క; పనులన్= కార్యాలను; వార్చునె?= ప్రతీక్షించునా?

**తాత్పర్యం:** 'ధీరుడైన మనుజుడు నిత్యమూ ఆయుస్సు తరిగిపోతూ పోతూ ఉండగా ఏమి చేయాలి?' అని ప్రశ్నించాడు. తండ్రి అతడితో 'బ్రహ్మచర్యం, వేదాధ్యయనం, సంతానం పొందటం, యజ్ఞనిర్వహణం చేసి ఆపై వానప్రస్థధర్మం నిర్వర్తించి సన్న్యాసవృత్తిని అవలంబించటం చేయదగినపని' అని చెప్పాడు. అప్పుడు కుమారుడు 'పాపరహితుడవైన ఓ తండ్రీ! పుట్టినది మొదలు ముదిమి, మరణం వెంటబడతాయి. అప్పుడు విచారం లేకుండా ఉండటం; వల తన్ను ఆక్రమించినపుడు దానిని చూడకుండా చేప ఇచ్చవచ్చినట్లు విహరించినట్లే కదా! అందువలన చేయాలనుకొన్న సత్కార్యం రేపటికి వాయిదా వేయకుండా ఇప్పుడే పూర్తిచేయుము. ప్రజల పనులు పూర్తి అయ్యేంతవరకు మృత్యువు తన పని చేయకుండా ఎదురుచూస్తూ ఉంటుందా?'

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **అని పలికి పుత్రుండు వెండియు.** **382**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; పుత్రుండు= కుమారుడు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అట్లా చెప్పి ఆ విప్రకుమారుడు మరల. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'కృత మిది యకృతం బిది యిది । కృతాకృతంబనుచు నరుఁడు కింకర్తవ్య**
**త్వతిరోహితాత్మహిత సం । స్మృతియైనఁ గృతాంతుఁ డతనిఁ జేర్చుఁ దనపురిన్. 383**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది; కృతము= చేయబడింది; ఇది= ఇది; అకృతంబు= చేయబడనిది; ఇది; కృత+అకృతంబు= చేసీ చేయనిది (అసంపూర్ణంగా చేయబడింది); అనుచున్= అని భావిస్తూ; నరుఁడు= మనుజుడు; కింకర్తవ్యతిరోహితాత్మహితసంస్మృతి= ఏమి చేయాలి అనే సందేహంతో కప్పబడిన ఆత్మహితముయొక్క స్మరణకలవాడు; ఐనన్= ఐతే; కృత+అంతుఁడు= యముడు; అతనిన్= అట్టివాడిని; తన పురిన్= తన నగరాన్ని; చేర్చున్= పొందిస్తాడు.

**తాత్పర్యం:** ఏ మనుజుడు ఇది చేశాను, ఇది చేయలేదు, ఇది చేసీ చేయకుండా ఉన్నాను అని తలంచుకొంటూ ఏమి చేయాలో తోచనిస్థితిలో పడి ఆత్మహితం మరచి ఉంటాడో అట్టివాడిని యముడు తన నగరానికి తీసికొనిపోతాడు.

**క. అనఘా! మృత్యువు నమృతం । బును దేహమునంద కలవు; మోహము మృత్యు**
**త్వనిరూఢ మున్నరూపుం । గనుటమృతత్వోపహితము గాఁగ నెఱుఁగుమీ. 384**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; మృత్యువు= మరణం; అమృతంబునున్= మరణరాహిత్యస్థితీ; దేహమునందు+అ= శరీరమునందే; కలవు= ఉన్నాయి; మోహము= సంసారం మీది వ్యామోహం; మృత్యుత్వ నిరూఢము= మరణ ధర్మంచేత ప్రసిద్ధమైనది; ఉన్న రూపున్= యథార్థమైన తత్త్వమును; కనుట= చూడటం; అమృతత్వోపహితముకాఁగన్= అమృతత్వంతో కూడిందిగా; ఎఱుఁగుమీ!= తెలిసికొనుమా!

**తాత్పర్యం:** పాపరహితుడ వగు ఓ జనకా! ఈ శరీరంలోనే మృత్యువు, అమృతత్వం అనేవి రెండూ ఉన్నాయి. సంసార వ్యామోహమే మృత్యువు. తత్త్వజ్ఞానమే అమృతత్వం. ఈ విషయం చక్కగా గ్రహించుము.

**క. ననుబోఁటికిఁ బశుయజ్ఞం । బున హింసకుఁ డగుట దగునె భూసురవర! హిం**
**సనరహితమైన శాంతి య । జనమున బ్రహ్మాధ్వరంబు సలిపెద నియతిన్. 385**

**ప్రతిపదార్థం:** భూసురవర!= విప్రశ్రేష్ఠా!; ననుబోఁటికిన్= నావంటి వాడికి; పశుయజ్ఞంబునన్= పశువులను వధించి చేసే యజ్ఞంతో; హింసకుఁడు+అగుట= హింసించేవాడు కావటం; తగునె?= ఉచితమా?; హింసన రహితము+ఐన= హింసలేని; శాంతియజనమునన్= శాంతియజ్ఞంతో; నియతిన్= నియమపూర్వకంగా; బ్రహ్మాధ్వరంబు= బ్రహ్మయజ్ఞమును; సలిపెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** విప్రవర్యా! నా వంటివాడికి పశువులను చంపి చేసే ద్రవ్యయజ్ఞం తగదు. హింసా సంబంధంలేని శాంతియజ్ఞంతో నేను నియమంగా బ్రహ్మయజ్ఞం చేస్తాను.

**విశేషం:** యజ్ఞాలు అనేక విధాలుగా ఉన్నాయి. వేదంలోని కర్మకాండలో పశువధతో కూడిన అనేకయజ్ఞాలు నిరూపించబడి ఉన్నాయి. అయితే అవి అంత ప్రశస్తమైనవి కావు. గీతలో శ్రీకృష్ణుడు "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" అని చెప్పాడు. అంటే ద్రవ్యమయమైన యజ్ఞం కంటె జ్ఞానయజ్ఞం శ్రేయస్కరమని అర్థం. అందువలన మోక్షార్థులు జ్ఞానయజ్ఞం అనుష్ఠిస్తారే కాని ద్రవ్యయజ్ఞాలు చేయరు. ఇక్కడ మేధావి జ్ఞానయజ్ఞ మనబడే బ్రహ్మయజ్ఞమే ప్రశస్తమని వివరించాడు. సర్వేంద్రియ నిగ్రహంతో

కూడిందే తపోమయమూ, యోగమయమూ అయిన శాంతియజ్ఞం. అందువలన జ్ఞానప్రాప్తి కల్గుతుంది. ఆ విధానాన్నే బ్రహ్మయజ్ఞమని వ్యవహరిస్తారు. గీతలో ఈ యజ్ఞాల స్వరూపం విపులంగా నిరూపించబడి ఉన్నది. ఆధునిక కాలంలో కర్మకాండలో చెప్పినట్లు ద్రవ్యయజ్ఞాలు చేసేవారు అరుదైపోయారు. ఇప్పుడు కూడా జ్ఞానయజ్ఞం ప్రశస్తమై ఉన్నది.

**క. యోగంబుఁ దపంబుఁ బరి । త్యాగంబును గాక యొండు లగునె హితంబుల్?**
**రాగము సరి దుఃఖంబును । ద్యాగముఁ బోలెడి సుఖంబు నరయం గలవే? 386**

**ప్రతిపదార్థం:** యోగంబున్= యోగానుష్ఠానము; తపంబున్= తపస్సు; పరిత్యాగంబునున్= సంగం త్యజించటమూ; కాక= ఇవికాక; ఒండులు= ఇతర మార్గాలు; హితంబుల్= శ్రేయస్కరాలు; అగునె?= అవుతాయా?; రాగముసరి= విషయాసక్తితో సమానమైన; దుఃఖంబునున్= బాధయు; త్యాగమున్+పోలెడి= విషయాసక్తిని వదలటంతో సమానమైన; సుఖంబున్= ప్రమోదమును; అరయన్= పరిశీలించగా; కలవే?= ఉన్నవా?

**తాత్పర్యం:** యోగాన్ని అనుష్ఠించటం, తపస్సు చేయటం, విషయాసక్తిని త్యజించటం - అనేవి హితకరమైన మార్గాలు. వీటితో సమానమైన శ్రేయోమార్గాలు మరి లేవు. అట్లాగే విషయాసక్తితో సదృశమైన దుఃఖం మరొకటి లేదు. త్యాగాన్ని పోలిన సుఖం కూడా లేదు.

**క. ప్రజ యేన కాన నన్నుం । బ్రజ సుగతికిఁ బుచ్చునని భరంపడి కోరం**
**బ్రజ విడిచెద నా యందది । యజేయమును నవ్యయంబు నగు పద మిచ్చున్. 387**

**ప్రతిపదార్థం:** ఏను+అ= నేనే; ప్రజ= జనించిన సంతానమై ఉన్నాను; కానన్= అందుచేత; నన్నున్= నన్ను; ప్రజ= సంతతి; సుగతికిన్= సద్గతికి; పుచ్చున్+అని= పంపుతుందని; భరంపడి= అతిశయించి; కోరన్= అభిలషించను; ప్రజన్= సంతతిని; విడిచెదన్= వదలివేస్తాను; అది= ఆ త్యాగం; నాయందున్= నాలో; అజేయమునున్= జయించరానిదీ; అవ్యయంబున్= వ్యయం కానిదీ; అగుపదమున్= అయినస్థానాన్ని; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** తండ్రీ! నేను నీకు సంతతినై ఉన్నాను. నాకు కలిగిన మరొక సంతతి నా సుగతికి హేతువవుతుందని నేను భావించటం లేదు. అందువలన నేను సంతతికొరకై అభిలషించను. సంతతిని వదలివేస్తాను. (గృహస్థధర్మం స్వీకరించను అని భావం). ఆ త్యాగం నాకు జయించరాని, తరుగులేని మహోన్నతస్థితికి హేతువవుతుంది.

**ఉ. కావున లోకసంక్షయము గన్గొని యెల్లెడ నిర్మముండ వై**
**నీవును శాంతియున్ సమత నిష్ఠయుఁ బూని గుహాప్రవేశ సం**
**భావన నాత్మదర్శన విభాసివి గమ్మనినం దదీయ వి**
**ద్యావచనంబులం జనకుఁ డట్టిఁడ యై వెలిఁగెం గృతార్థతన్. 388**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; నీవును= నీవుకూడ; లోకసంక్షయమున్= లోకంయొక్క వినాశాన్ని; కన్గొని= చూచి; ఎల్ల+ఎడన్= అన్ని విషయాలలోనూ; నిర్మముండవు+ఐ= మమకారం లేనివాడవై; శాంతియున్= శమము; సమత= సమభావం; నిష్ఠయున్= ఆత్మనిష్ఠ కూడా; పూని= వహించి; గుహాప్రవేశసంభావనన్= బుద్ధిగుహలో చొరబారుట అనే సంభావనచే (ఏకాంతమైన కొండగుహలో ప్రవేశించటం అనియు చెప్పవచ్చును.); ఆత్మదర్శన విభాసివి= ఆత్మను చూడటంచేత ప్రకాశించేవాడివి; కమ్ము= అగుము; అనినన్= అని చెప్పగా; తదీయ విద్యావచనంబులన్= అతడి బ్రహ్మవిద్యామయాలైన మాటలచేత; జనకుఁడు= తండ్రి; అట్టిఁడ+ఐ= అట్లాంటివాడుగానే రూపొంది; కృతార్థతన్= కృతకృత్యతతో; వెలిఁగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అందువలన లోకం శాశ్వతం కాదని గ్రహించి నీవు దేనిమీదా మమకారం పెట్టుకొనవద్దు. శాంతి, సమభావం, ఆత్మనిష్ఠ కలిగి ఉండుము. నీ బుద్ధిగుహలోనికి ప్రవేశించి అందు నిగూఢంగా ఉన్న ఆత్మను చూడుము. (ఏకాంతమైన కొండగుహలో జేరి ఆత్మ దర్శనపరుడివి కమ్ము)' అని కుమారుడు తండ్రికి బోధించాడు. అతడు చెప్పిన బ్రహ్మవిద్యా ప్రబోధకాలైన మాటలు విని తండ్రి ఆ రీతిగా అనుష్ఠించి కృతార్థుడై వెలుగొందాడు.

**క. నరనాథ! యమృతమగు ను । న్నరూపు గను దీవు మరగు నా చెప్పిన యి**
**ప్పరమేతిహాస వాక్యో । త్కరంబు నర్థంబు చిత్తగత మగుచుండన్. 389**

**ప్రతిపదార్థం:** నరనాథ!= రాజా!; నా చెప్పిన= నేను వచించిన; ఈ+పరమ+ఇతిహాస వాక్య+ఉత్కరంబు= ఈ శ్రేష్ఠమైన పూర్వగాథకు చెందిన వచనసమూహంయొక్క; అర్థంబు= శబ్దార్థం; చిత్తగతము= మనసుకెక్కింది; అగుచుండన్= అవుతూ ఉండగా; ఈవు= నీవు; అమృతము+అగు= మరణరహితమైన; ఉన్నరూపు= యథార్థతత్త్వమును; కనుదు= చూస్తావు; మరగు= దానిని ఆశించుము.

**తాత్పర్యం:** రాజా! నే నిప్పుడు చెప్పిన గాథకు చెందిన వాక్యాల అర్థం నీ మనస్సున కెక్కగా నీవు కూడా అమృతమైన ఆ పరతత్త్వస్వరూపాన్ని చూడగలవు. అభ్యాసంతో దాని నాశించుము'.

**వ. అనిన విని యుధిష్ఠిరుం 'డెవ్విధంబు శీలంబు గలవాఁడు బ్రహ్మపదంబు నొందు?' నని యడిగిన భీష్ముం డత్యాదరంబున. 390**

**ప్రతిపదార్థం:** అనినన్= భీష్ము డట్లా చెప్పగా; విని= ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; ఏ+విధంబు= ఎట్టిదైన; శీలంబు గలవాఁడు= స్వభావం కలవాడు; బ్రహ్మపదంబున్= మోక్షస్థానమును; ఒందున్?= పొందుతాడు?; అని అడిగినన్= అని ప్రశ్నించగా; భీష్ముండు= భీష్ముడు; అతి+ఆదరంబునన్= మిక్కిలి ప్రీతితో.

**తాత్పర్యం:** భీష్ము డారీతిగా చెప్పగా విని ధర్మరాజు 'ఏ విధమైన స్వభావం కలవాడు మోక్షం పొందగలడో వివరించు' మని మళ్ళీ ప్రశ్నించాడు. భీష్ముడు అతడిపట్ల మిక్కిలి ప్రీతిగలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'అధిప! లఘ్వాశియై యింద్రియప్రపంచ । జయము గలిగి మోక్షార్థోక్త సారధర్మ**
**నిరతి నుండెడి వానికిఁ బరమ మగు ప । దంబు తంగేటిజున్ను చందంబు నొందు.' 391**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; లఘు+ఆశి+ఐ= మితంగా భుజించేవాడై; ఇంద్రియప్రపంచజయము= శ్రోత్రం మొదలైన ఇంద్రియ సమూహంపై విజయాన్ని; కలిగి= కలిగి ఉండి; మోక్ష+అర్థ+ఉక్త సారధర్మనిరతిన్= మోక్షం కొరకై చెప్పబడిన శ్రేష్ఠధర్మాలపై ఆసక్తితో; ఉండెడివానికిన్= ఉండేవాడికి; పరమము+అగు= శ్రేష్ఠమైన; పదంబు= బ్రహ్మపదం; తంగేటిజున్ను చందంబున్= తంగేడుచెట్టు లోని తేనెతెట్టెవలె అందుబాటులో ఉండే విధాన్ని; ఒందున్= పొందును.

**తాత్పర్యం:** 'రాజా! మితాహారం స్వీకరిస్తూ ఇంద్రియానీకాన్ని జయించి మోక్షం కొరకై శాస్త్రాలలో చెప్పబడిన ఉత్తమ ధర్మాలను అనుష్ఠించేవాడికి బ్రహ్మపదం తంగేటిజున్నువలె సులభసాధ్యమై ఉంటుంది'.

**విశేషం:** తంగేడుచెట్టు మిక్కిలి ఎత్తుగా పెరగదు. దానిలోని తేనెతెట్టెను సులభంగా ఎవ్వరైనా గ్రహించి అనుభవించవచ్చును. అలంకారం ఉపమ.

**వ. అని పలికి మఱియు నిట్లను 'హారీతగీతి యను వాక్యసంచయం బాకర్ణింపుము. దాన మోక్ష ధర్మంబులు దేటపడుం జెప్పెద హారీతుం డను మునివరుండు విద్వజ్జనంబులు దనవలనం బ్రవ్రజనంబు సమీచీన ప్రకారంబుగా నెఱుంగ నపేక్షించిన. 392**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; మఱియున్= మరలకూడ; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు!; 'హారీతగీతి' యను= 'హారీతగీత యనబడే; వాక్యసంచయంబున్= వచనసమూహమును; ఆకర్ణింపుము= విను; దానన్= దానివలన; మోక్షధర్మంబులు= ముక్తిపొందుటకనువైన ధర్మాలు; తేటపడున్= స్పష్టమవుతాయి; చెప్పెదన్= చెపుతాను; హారీతుండను మునివరుండు= 'హారీతు' డనే మునిశ్రేష్ఠుడు; విద్వజ్జనంబులు= పండితజనులు; తనవలనన్= తననుండి; ప్రవ్రజనంబు= సన్న్యాస పద్ధతిని; సమీచీన ప్రకారంబుగాన్= చక్కని రీతిలో; ఎఱుంగన్= తెలుసుకొనటానికి; అపేక్షించినన్= కోరగా.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మజుడితో అట్లా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు. ' హారీతగీత' అనబడే కొన్ని మాటలున్నాయి. అవి వినుము. వాటిద్వారా మోక్షధర్మాలు స్పష్టమయ్యేటట్లు చెప్పుతాను. పూర్వం హారీతుడనే ఒక మునిశ్రేష్ఠుడి నుండి పండితులు సన్న్యాసవిధానం చక్కగా తెలిసికొనాలని అపేక్షించారు. అట్లా వారు అపేక్షించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

### హారీతుండు విద్వజ్జనుల కుపదేశించిన తత్త్వప్రకారము (సం. 12-269-2)

**సీ. వారి కి ట్లనియె 'నిష్ఠారంభమతి నిలు । వెడలి కోర్కుల కెల్ల విముఖుఁ డగుచు**
**జనములకీడు వాక్చక్షుర్మనోవర్త । నములఁ గూర్పక మైత్రి సమతఁ గరుణ**
**గలిగి, నిందాప్రశంసల ఖేదమును నుబ్బు । లేక పాడింటను నేకతంపు**
**గుడి మ్రాని పొంతను గుహలోన నుండుచు । డంపకములకు వంటకములకును**

**తే. భోజనములకుఁ దఱియైన ప్రొద్దు గడపి । భిక్ష గొనుఁ బ్రీతి మన్నన పెద్దవెట్టు**
**నట్టియెడఁ దక్కి క్రొత్తగా నరుగు యతి ని । రంతరంబు నాత్మారాముఁ డై చరించు. 393**

**ప్రతిపదార్థం:** వారికిన్= ఆ పండిత జనులకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; యతి= సన్న్యాసి; నిష్ఠా+ఆరంభమతిన్= ఆత్మనిష్ఠాప్రయత్నం గల బుద్ధితో; ఇలు వెడలి= గృహంనుండి వెలికివచ్చి; కోర్కులకున్+ఎల్లన్= సమస్తములైన కోరికలకూ; విముఖుఁడు+అగుచున్= పరాఙ్ముఖుడవుతూ; జనముల= ప్రజలయొక్క; కీడున్= అపకారమును; వాక్చక్షుర్మనోవర్తనములన్= మాటలు, చూపులు, మనస్సు వీటినడతలలో; కూర్పక= సంధించక; మైత్రి= మిత్రభావం; సమత= సమభావం; కరుణ= దయ; కలిగి= కలిగి ఉండి; నిందాప్రశంసలన్= తెగడిక - పొగడికలలో; ఖేదమును= దుఃఖాన్నీ; ఉబ్బున్= పొంగటమూ; లేక= లేనివాడై; పాడింటనున్= పాడుపడిన ఇంటిలో; ఏకతంపుగుడిన్= ఏకాంతమైన ఆలయంలో; మ్రానిపొంతను= చెట్టుచెంతను; గుహలోనన్= కొండబిలంలో; ఉండుచున్= ఉంటూ; డంపకములకున్= దంచటానికీ; వంటకములకున్= వండటానికీ; భోజనములకున్= భుజించటానికీ; తఱిఐన ప్రొద్దు= అనువైన కాలం; కడపి= దాటనిచ్చి; భిక్షన్+కొనున్= భిక్షగ్రహిస్తాడు; ప్రీతిన్= ప్రియంతో; మన్ననన్= గారవంతో; పెద్దపెట్టునట్టి ఎడన్= అధికంగా భిక్షపెట్టే చోటును; తక్కి= వర్జించి; క్రొత్తగాన్= నూతనంగా; అరుగున్= పోతాడు; నిరంతరంబున్= ఎల్లవేళల; ఆత్మారాముఁడు+ఐ= తనలో తాను క్రీడించేవాడై; చరించున్= తిరుగుతాడు.

**తాత్పర్యం:** హారీతుడు పండితులతో ఇట్లా అన్నాడు: 'ఆత్మనిష్ఠలో ఉద్యుక్తమైన బుద్ధిగలవాడై సన్న్యాసి ఇల్లు వదలాలి. కోర్కెలు కలిగి ఉండకూడదు. తన మాటలలో, చూపులలో, చిత్తంలో ప్రజలకు ఏ విధమైన కీడూ

తలపెట్టరాదు. మిత్రత్వం, సమత్వం, దయ కలిగి ఉండాలి. స్తుతినిందలకు పొంగటం, క్రుంగటం లేకుండా ఉండాలి. పాడుపడిన ఇంటిలోనో, ఏకాంతమైన చోట గుడిలోనో, చెట్టునీడనో, లేక కొండగుహలోనో ఉండాలి. దంచటం, వండటం, భోజనం పనులు పూర్తి అయేసమయంవరకూ వేచిఉండి భిక్షకు పోవాలి. తనపై ఎక్కువ ప్రీతి, గౌరవం చూపుతూ మితిమించి భిక్షపెట్టే వారున్నచోటు వదలి క్రొత్తచోటికి వెళ్ళాలి. సదా ఆత్మయందే రతి గలిగి చరించాలి.

**తే.** **అనిన వారు కృతార్థులై యతనిఁ బ్రస్తు । తించి రని చెప్పె విని నరదేవవరుఁడు**

**దేవతటినీ తనూజుతో 'భావశుద్ధి । కలిమి యొప్పుఁగదే!' యని పలికి మఱియు. 394**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వారు= ఆ పండితులు; కృతార్థులు+ఐ= ధన్యులై; అతనిన్= ఆ హారీతుడిని; ప్రస్తుతించిరి+అని= పొగిడారని; చెప్పెన్= చెప్పాడు; విని= ఆలకించి; నరదేవవరుఁడు= రాజశ్రేష్ఠుడైన ధర్మపుత్రుడు; దేవతటినీ తనూజుతోన్= గంగాపుత్రుడితో; భావశుద్ధి కలిమి= చిత్తశుద్ధి కలిగి ఉండటం; ఒప్పున్+కదే అని= శోభిస్తుంది కదా అని; పలికి= చెప్పి; మఱియున్= ఇంకనూ.

**తాత్పర్యం:** ఇట్లా హారీతముని చెప్పేసరికి ఆ విద్వజ్జనులు కృతకృత్యులై అతడిని పొగిడారు' అని భీష్ముడు చెప్పాడు. అది విని ధర్మరాజు భీష్ముడితో 'ఔరా! భావశుద్ధి కలిగి ఉండటం ఎంత శోభావహమైనది?' అని పలికి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **రాజభావంబు తొడుసునఁ గ్రచ్చుకొన్న । మనసుతో నుండ కెన్నఁడో మరలి యింద్రి**

**యముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోచి । యేను శాంతిసుఖంబున కెలయు టనఘ!' 395**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఏను= నేను; రాజభావంబు తొడుసునన్= రాజత్వంయొక్క సంబంధంచేత; క్రచ్చుకొన్న= చుట్టుకొని ఉన్న; మనసుతోన్= చిత్తంతో; ఉండక= వర్తించక; మరలి= ఈ స్థితినుండి తొలగి; ఇంద్రియములన్= శ్రోత్రం మొదలైన ఇంద్రియాలను; నిర్జించి= జయించి; సత్త్వాదులు= సత్త్వంమొదలైన త్రిగుణాలను; అవులన్+త్రోచి= కడకునెట్టి; శాంతిసుఖంబునకున్= శాంతిచేత కలిగే ఆత్మసుఖానికి; ఎలయుట= చేరటం; ఎన్నఁడో!= ఎప్పుడో కదా!

**తాత్పర్యం:** కిల్బిషరహితుడవైన ఓ పితామహా! నేను రాజత్వం అనే సంబంధంతో చుట్టుకొన్న చిత్తాన్ని వదలి ఇంద్రియాలను జయించి సత్త్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాలను దాటి శాంతివలన కలిగే ఆత్మసుఖాన్ని చూరగొనేది ఏనాటికో కదా!'

**చ.** **అనుటయు నాతఁ డిట్టు లను నక్కురుభర్తకు 'వేగ మేటికిన్**

**ఘనభుజ? యెల్లచందములుఁ గాలముతోడివ చుమ్ము; వర్ణధ**

**ర్మనిరతి చిత్తపాకము గ్రమంబునఁ దెచ్చుఁ గషాయపక్వతన్**

**బనుపడ కర్పుఁ డేలగు నృపాలకుమారుఁడు సన్న్యసింపఁగన్? 396**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; ఆతఁడు= ఆ భీష్ముడు; ఆ+కురుభర్తకున్= కౌరవనాథుడైన ఆ ధర్మరాజుకు; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; ఘనభుజ!= మహాబాహూ!; వేగము= త్వర; ఏటికిన్?= ఎందుకు?; ఎల్లచందములు=అన్ని ప్రకారాలు; కాలముతోడివి+అ+చుమ్ము!= కాలానుసారాలే సుమా!; వర్ణధర్మనిరతి= బ్రాహ్మణాదివర్ణాలయొక్కధర్మాలలోదృఢమైనఆసక్తి;క్రమంబునన్=క్రమంగా;చిత్తపాకమున్=మనఃపరిపాకాన్ని;తెచ్చున్=తీసికొనివస్తుంది;నృపాలకుమారుఁడు=రాకుమారుడు;

కషాయపక్వతన్= చిత్తదోషాన్ని శమింపజేయటాన్ని; పనుపడక= వాడుక పడకుండా; సన్న్యసింపఁగన్= సన్న్యాసధర్మాన్ని స్వీకరించటానికి; అర్హుఁడు= తగినవాడు; ఏల+అగున్?= ఎట్లా ఔతాడు?

**తాత్పర్యం:** ధర్మసుతుడు అట్లా అనేసరికి భీష్ముడు అతడితో ఇట్లా అన్నాడు: 'మహాబాహుడవైన ఓ ధర్మరాజా! అన్ని విధానాలూ కాలానుగుణంగానే ఉంటాయి సుమా! వర్ణాలకు చెందిన ధర్మాలపై ఆసక్తి క్రమంగా మనస్సుకు పరిపక్వత తెస్తుంది. రాజపుత్రుడైనవాడు చిత్తదోషాన్ని శమింపజేయకుండా సన్న్యసించటానికి ఎట్లా అర్హుడు ఔతాడు?'

**విశేషం:** **'కషాయం చిత్తదోషం పాచయిత్వా విశ్లథం కృత్వా'** అని నీలకంఠ వ్యాఖ్య - కషాయ శబ్దానికి చిత్తదోషమని భావం.

**వ.** **ఇవ్విషయంబున వృత్రగీత యను నితిహాసంబు గలదు వినుము. వృత్రుండు భండనంబునం బడిన నెత్తికొనిపోయి పెట్టుకొని యున్న యెడ నయ్యవస్థ నొందియు విషాదంబు లేకయున్న యద్దనుజవిభునితో శుక్రుండు 'వైరిహృతవిభవుండవైన నీకు మనోవ్యథ లేమికిఁ గతంబేమి?' యని యడిగిన నతం డతని కిట్లనియె.** **397**

**ప్రతిపదార్థం:** ఈ+విషయంబునన్= ఈ విషయంలో; వృత్రగీత అను= 'వృత్రగీత' అనే; ఇతిహాసంబు= పూర్వగాథ; కలదు= ఉన్నది; వినుము= ఆలకించుము; వృత్రుండు= వృత్రాసురుడు; భండనంబునన్= యుద్ధంలో; పడినన్= పడగా; ఎత్తికొనిపోయి= లేవనెత్తికొని వెళ్ళి; పెట్టుకొని ఉన్న ఎడన్= ఉంచుకొని ఉండగా; ఆ+అవస్థన్= ఆ స్థితిని; ఒందియున్= పొందికూడా; విషాదము లేక ఉన్న= దుఃఖము లేకున్న; ఆ+దనుజవిభునితోన్= ఆ రాక్షస ప్రభువుతో; శుక్రుండు= శుక్రాచార్యుడు; వైరిహృతవిభవుండవు+ఐన= శత్రువులచేత అపహరించబడిన సంపదకలవాడవగు; నీకున్= వృత్రుడవైన నీకు; మనోవ్యథ= చిత్తబాధ; లేమికిన్= లేకుండుటకు; కతంబు+ఏమి?= కారణమేమి?; అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= ఆ వృత్రుడు; అతనికిన్= ఆ శుక్రుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విషయానికి సంబంధించినది 'వృత్రగీత' అనే ఇతిహాసం ఒకటి ఉన్నది. వినుము. వృత్రాసురుడు యుద్ధంలో పడిపోగా అనుచరులు అతడిని లేవనెత్తుకొనిపోయి పెట్టుకొని ఉన్నారు. అట్టి దురవస్థ పొంది కూడా వృత్రుడు ఏ విధమైన విషాదం లేకుండా ఉన్నాడు. అప్పుడు గురువైన శుక్రుడు ఆ రాక్షసరాజుతో 'శత్రువులు నీ సంపదను హరించినా నీకు చిత్తబాధ లేకుండా ఉండటానికి కారణమేమి?' అని ప్రశ్నించాడు. అప్పుడు అతడితో వృత్రాసురుడు ఈ రీతిగా చెప్పాడు.

### వృత్రగీత (సం. 12-270-13)

**తే.** **కలిమియును లేమియును విను కాలవశగ । తములు; బోధవిహీనుల దర్ప దైన్య**
**కలితసుఖదుఃఖములఁ బెట్టుఁగాక యర్థ । ముల యనిత్యత యెఱిఁగినఁ గలదె వికృతి?** **398**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; కలిమియును= సంపదయు; లేమియును= పేదరికమును; కాలవశగతములు= కాలానికి అధీనాలు; (అవి), బోధవిహీనులన్= జ్ఞానం లేనివారిని; దర్పదైన్యకలిత సుఖదుఃఖములన్= గర్వం, దీనత్వంతో కూడిన సుఖంలోనూ, దుఃఖంలోనూ; పెట్టుఁగాక= ఉంచును గాక; అర్థముల= సంపదలయొక్క; అనిత్యత= అశాశ్వతత్వం; ఎఱిఁగినన్= తెలుసుకొంటే; వికృతి= వికారం; కలదు+ఏ?= ఉన్నదా?

**తాత్పర్యం:** సంపద, పేదరికం అనేవి కాలానికి అధీనమై ఉంటాయి. అవి జ్ఞానంలేని మూఢులకు మదాన్నీ, దీనత్వాన్నీ కల్గిస్తాయి. తద్వారా వారి సుఖానికీ, దుఃఖానికీ హేతువు లవుతాయి. అంతేకాని సంపదలు శాశ్వతం కావు అని తెలిసికొన్న జ్ఞానికి అవి ఉన్నా, లేకున్నా ఎట్లాంటి వికారమూ కలుగదు.

**వ. అర్థంబుల యస్థిరత్వంబ కా దాకర్ణింపుము. 399**

**ప్రతిపదార్థం:** అర్థంబుల= సంపదలయొక్క; అస్థిరత్వంబ కాదు= అశాశ్వతమే కాదు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** సంపదలయొక్క అశాశ్వత్వమే కాదు. ఇంకా వినుము.

**క. దైవతమానుష తిర్య । గ్భావంబులఁ బొందుచును వికారిణియై భూ**
**తావలి దిరిగిన వెంటన । వే విధములఁ దిరుగుఁ గర్మవివశత్వమునన్. 400**

**ప్రతిపదార్థం:** భూత+ఆవలి= ప్రాణులయొక్క సమూహం; దైవతమానుషతిర్యగ్భావంబులన్= దేవత్వం, మనుష్యత్వం, పశుత్వం అనే భావాలను; పొందుచును= పొందుతూ; కర్మవివశత్వమునన్= కర్మకు అధీనం కావటం వలన; వికారిణి+ఐ= వికారం కలదై; తిరిగిన వెంటన్+అ= పోయిన మార్గంలోనే; వేవిధములన్= వెయ్యి విధాలుగా; తిరుగున్= సంచరిస్తుంది.

**తాత్పర్యం:** ప్రాణుల బృందం దేవతలుగా, మనుష్యులుగా, పశుపక్ష్యాదులుగా జన్మిస్తూ కర్మకు లొంగి వికారం పొంది సంచరించిన మార్గంలోనే మరల మరల వేయివిధాల సంచరిస్తూ ఉంటుంది.

**క. ఏ నిది యంతయు నెఱుఁగుదుఁ । గాన వగపు నుబ్బు నాకుఁ గలుగ' వనుడు ని**
**మ్మాన విహీనపు మాటలు । దానవకులనాథ! నీకుఁ దగునే యాడన్.' 401**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఇదిఅంతయున్= దీనినంతటినీ; ఎఱుఁగుదున్= తెలిసికొని ఉన్నాను; కాన= కావున; వగపు= విచారం; ఉబ్బు= సంతసం; నాకున్+కలుగవు= నాకు సంభవించవు; అనుడున్= అనగా; దానవకులనాథ!= రాక్షసకుల రాజా!; ఈ+మానవిహీనపు మాటలు= అభిమానంలేని ఈ పలుకులు; నీకున్ ఆడన్+తగునే?= నీకు చెప్పదగినవా?

**తాత్పర్యం:** ఈ విషయమంతా నాకు తెలుసు. అందువలన ఏది ఏమైనా నాకు సుఖదుఃఖాలు కలుగవు' అని వృత్రు డన్నాడు. అది విని 'రాక్షసవంశాధిపా! మానం లేని ఈ మాటలు చెప్పటం నీకు ఉచితమా?'

**వ. అని యతని మనశ్శుద్ధి యెఱుంగుటకునై భార్గవుండు. 402**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; భార్గవుండు= శుక్రుడు; అతని మనశ్శుద్ధిన్= ఆ వృత్రాసురుడి చిత్తశుద్ధిని; ఎఱుంగుటకున్+ఐ= తెలిసికొనటానికై.

**తాత్పర్యం:** అని చెప్పి శుక్రాచార్యుడు ఆ వృత్రుడి చిత్తశుద్ధి ఎట్లాంటిదో తెలిసికొనటానికై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అనయము నీసువొనర్చిన । విని యతనికి నిట్టు లనియె వృత్రుఁడు 'విజయం**
**బునకు నయి తపము సేయనె । ముసు? తత్సుకృతమునఁ గొననె మూఁడు జగములున్? 403**

**ప్రతిపదార్థం:** అనయమున్= మిక్కిలి; ఈసు+పొనర్చినన్= ఈర్ష్య ప్రదర్శించగా; విని= ఆలకించి; వృత్రుఁడు= వృత్రాసురుడు; అతనికిన్= ఆ శుక్రుడికి; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు; మును= పూర్వం; విజయంబునకున్+అయి= యుద్ధంలో విజయం

పొందటానికై; తపము చేయనె?= తపస్సు చేసినవాడనుగానా?; తత్సుకృతమునన్= ఆ తపస్సు అనే పుణ్యంచేత; మూఁడు జగములున్= త్రిలోకాలనూ; కొననె?= చేకొన్నానుకదా!

**తాత్పర్యం:** అత్యంతం ఆ మాటలతో శుక్రుడు ఈర్ష్య ప్రదర్శించగా అతడి మాటలు విని వృత్రుడు ఇట్లా సమాధానం చెప్పాడు. 'నేను పూర్వం యుద్ధంలో విజయం పొందటానికై తపస్సు చేయలేదా? ఆ తపఃప్రభావంవలన కలిగిన పుణ్యంతో ముల్లోకాలకూ ప్రభువును కాలేదా?

**క. ఆ యైశ్వర్యము గ్రమ్మఱ । మాయుటకుం గారణంబు మాన్యచరిత! లే**
**దే యొక దుష్కృత; మది యిటు । సేయుం గాకేమి? యేల చింతింపంగన్? 404**

**ప్రతిపదార్థం:** మాన్యచరిత!= పూజ్యచరిత్రుడా!; క్రమ్మఱన్= మరల; ఆ+ఐశ్వర్యము= ఆ సంపద; మాయుటకున్= తొలగి పోవటానికి; కారణంబు= హేతువు; ఒక దుష్కృతంబు= ఒక పాపం; లేదే?= లేదా?; అది= ఆ పాపం; ఇటు= ఇట్లు; చేయున్+కాక+ఏమి= ఒనర్చునుగాక ఏమి?; చింతింపంగన్+ఏల?= విచారించట మెందుకు?

**తాత్పర్యం:** పూజ్యచరిత్రుడవైన ఓ ఆచార్యా! పూర్వం అనుభవించిన ఆ సంపద ఇప్పుడు తొలగింది. దీనికి కారణమన్న పాపం లేకుండునా? ఆ పాపం ఇట్లా చేస్తుంది. చేస్తే చేయనీ! ఇందుకై విచారించటం ఎందుకు?

**క. విను మనఘ! యింక సుకృతం । బునకుం జొర దుష్కృతంబు పొంతకుఁ బోనే**
**ననుపము నచ్యుతు నవ్యయు । ననంతుఁ జెందెద ననామయత నవ్విష్ణున్. 405**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; వినుము= ఆకర్ణించుము; ఏను= నేను; ఇంకన్= ఇకమీదట; సుకృతంబునకున్= పుణ్యానికి; చొరన్= ప్రవేశింపను; దుష్కృతంబు పొంతకున్= పాపం చెంతకును; పోను= చనను; అనుపమున్= సాటిలేనివాడిని; అచ్యుతున్= భక్తరక్షణంలో జారుపాటు లేనివాడిని; అవ్యయున్= వ్యయం లేనివాడిని; అనంతున్= అంతం లేనివాడిని; ఆ+విష్ణున్= ఆ విష్ణుదేవుడిని; అనామయతన్= బెడదలేకుండా; చెందెదన్= పొందుతాను.

**తాత్పర్యం:** పాపరహితుడవయిన ఓ ఆచార్యా! వినుము. ఇంకమీద నేను పాపపుణ్యాల వంకకు పోను. తనకు సాటి లేనివాడూ, చ్యుతి లేనివాడూ, వ్యయం లేనివాడూ, శాశ్వతుడూ, తుది లేనివాడూ, సర్వవ్యాపకుడూ అయిన విష్ణుదేవుడిని ఏ చిక్కులు లేని పద్ధతిలో ఆశ్రయిస్తాను.

**చ. అనిమిషనాథుతోడి యనియప్పుడు గంటి ననంతు నాద్యు వి**
**ష్ణుని నలవోకఁ దన్మహిమ సువ్రత! నా కెఱిఁగింపు; కర్మసం**
**జనితవిశేషతం గలుగు చాయలలోపల నెద్ది యవ్విభుం**
**గనుటకు నర్హ మయ్యెఱుక గల్గఁగఁ జేయుము నాదు బుద్ధికిన్.' 406**

**ప్రతిపదార్థం:** సువ్రత!= మంచి వ్రతంకలవాడా!; అనిమిషనాథుతోడి= ఇంద్రుడితోడి; అని అప్పుడు= యుద్ధసమయంలో; అనంతున్= అంతంలేనివాడిని; ఆద్యున్= అంతటికీ మొదటివాడైన వాడిని; విష్ణునిన్= సర్వవ్యాపకుడైన వాడిని; అలవోకన్= లీలగా; కంటిన్= చూచాను; తన్మహిమన్= ఆ విష్ణుదేవుడి ప్రభావం; నాకున్+ఎఱిఁగింపు= నాకు తెలియజెప్పుము; కర్మసంజనిత విశేషతన్= కర్మం వలన కలిగే విశేషప్రక్రియలచేత; కలుగు= సంభవించే; చాయలలోపలన్= జాడలలో, (వర్ణాలలో); ఎద్ది= ఏది; ఆ+విభున్= ఆ విష్ణుదేవుడిని; కనుటకున్= చూడటానికి; అర్హము= తగినదో; ఆ+ఎఱుకన్= ఆ తెలివిని; నాదు బుద్ధికిన్= నా మతికి; కల్గఁగన్+చేయుము= కలిగించుము.

**తాత్పర్యం:** సద్వ్రతశీలుడవైన ఓ శుక్రాచార్యా! నేను ఇంద్రుడితో సంగరం చేసినప్పుడు లీలగా అనంతుడూ, ఆద్యుడూ అయిన విష్ణువును చూచాను. ఆయన మహిమ నాకు తెలియచెప్పుము. కర్మలవలన పెక్కు వర్ణాలు (జీవావస్థలు) ఏర్పడతాయి. అందులో ఏ వర్ణం ఆ దేవుడిని చూడటానికి మిక్కిలిగా తగి ఉన్నదో నా బుద్ధికి గోచరించేటట్లు వివరించుము.

**ఆ. అనిన 'నట్లకాక వినుము చెప్పెద'నని । యసురగురుఁడు పలుకు నవసరమున**
**నచటి కరుగుదెంచె నఖిల మునీంద్ర స । మ్మాన్యుఁ డగు సనత్కుమారుఁ డధిప! 407**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అనినన్= అని వృత్రుడు అడుగగా; అసురగురుఁడు= రాక్షసుల గురువైన శుక్రుడు; అట్లకాక= అట్లే అగుగాక!; చెప్పెదన్= చెప్పుతాను; వినుము అని= ఆలకించుము అని; పలుకు+అవసరమునన్= చెప్పే సమయంలో; అఖిలముని+ఇంద్ర సమ్మాన్యుఁడు+అగు= సమస్త మునివర్యులచేత పూజించదగినవాడైన; సనత్కుమారుఁడు= సనత్కుమారుడనే బ్రహ్మమానసపుత్రుడు; అచటికిన్= ఆ చోటికి; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ విధంగా వృత్రుడు ప్రశ్నించగానే రక్కసులకు ఆచార్యుడైన శుక్రుడు 'అట్లాగే విష్ణుడి మహిమను విశదీకరిస్తాను, వినుము' అని అన్నాడు. అత డట్లా అంటూ ఉండగానే అక్కడికి మునిశ్రేష్ఠులందరి చేతను పూజించదగిన బ్రహ్మమానసపుత్రుడు సనత్కుమారుడు వచ్చాడు.

**వ. వచ్చి యభిపూజితుండై సమున్నతాసనంబున నున్న యమ్మహాత్మునితో శుక్రుండు 'విష్ణుని మాహాత్మ్యంబును వర్ణవిశేషంబులు నిద్దానవేంద్రునకు నెఱింగింపవే!' యనిన నతండు ప్రసన్నవదనుం డగుచు నిట్లనియె.408**

**ప్రతిపదార్థం:** వచ్చి= ఏతెంచి; అభిపూజితుండు+ఐ= అన్నివిధాలా పూజించబడినవాడై; సమున్నత+ఆసనంబునన్= ఎత్తైన పీఠిక పై; ఉన్న= కూర్చున్న; ఆ+మహాత్మునితోడన్= ఆ మహనీయుడితో; శుక్రుండు= శుక్రాచార్యుడు; విష్ణుని మాహాత్మ్యంబును= వెన్నుడి మహిమనూ; వర్ణవిశేషంబులన్= రంగులలోని తేడాలనూ; ఈ+దానవేంద్రునకున్= ఈ రాక్షసరాజుకు; ఎఱింగింపవే= తెలియజెప్పవా; అనినన్= అని అడుగగా; అతండు= ఆ సనత్కుమారుడు; ప్రసన్న వదనుండు+అగుచున్= అనుగ్రహపూర్ణమైన ముఖం కలవాడై; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ రీతిగా వచ్చిన సనత్కుమారుడికి రక్కసులరేడు పూజాదులు కావించాడు. ఆపై ఉన్నతాసనంపై ఆ మునీంద్రుడు కూర్చున్నాడు. శుక్రుడు ఆయనతో 'ఈ వృత్రాసురుడికి విష్ణుదేవుడి మాహాత్మ్యాన్నీ, వర్ణవిశేషాలనూ తెలియజెప్పు'మని అర్థించాడు. అప్పుడు ప్రసన్నమైన ముఖంతో సనత్కుమారుడు ఇట్లా చెప్పాడు.

**ఆ. 'వినుము దనుజనాథ! విష్ణునియం దఖి । లంబుఁ గలుగు నిలుచు లయముఁ బొందు;**
**నతనిభక్తి నింద్రియ జయంబునను బోలె । దానధర్మవిధులఁ గానరాదు. 409**

**ప్రతిపదార్థం:** దనుజనాథ!= రక్కసులరేడా!; వినుము= ఆలకించుము; విష్ణుని+అందున్= వెన్నునిలో; అఖిలంబున్= సమస్తమున్నూ; కలుగున్= ఉదయిస్తుంది; నిలుచున్= నిలిచి ఉంటుంది; లయమున్+పొందున్= లయిస్తుంది; అతనిన్= ఆ దేవుడిని; భక్తిన్= భక్తిచేతా; ఇంద్రియజయంబుననున్+పోలెన్= ఇంద్రియాలను నిగ్రహించటంచేత వలె; దానధర్మవిధులన్= త్యాగం, ధర్మం మొదలైన విధానాలచేత; కానన్ రాదు= చూడటానికి సాధ్యంకాదు.

**తాత్పర్యం:** రాక్షసరాజా! వినుము. విష్ణుడిలోనే ఈ సమస్త చరాచరాత్మక జగత్తూ ఉదయిస్తుంది. అతడిలోనే నిలిచి ఉంటుంది. చివరికి ఆ దేవుడిలోనే లీనమవుతుంది. భక్తితోనూ, ఇంద్రియవిజయంతోనూ ఆ దేవుడిని సందర్శించవచ్చును గాని, దానం, ధర్మకార్యాలు మొదలైన వాటిద్వారా చూడటానికి సాధ్యంకాదు.

**వ. అవి ప్రయోజన పడుటయుం గలిగి యుండు; నదియునుం జెప్పెద; మున్ను విష్ణుని మహిమ యాకర్ణింపుము. 410**

**ప్రతిపదార్థం:** అవి= ఆ దాన ధర్మాదులు; ప్రయోజనపడుటయున్= అక్కరకు రావటం; కలిగిఉండున్= సంభవిస్తుంది;అదియున్= ఆ విషయం కూడ; చెప్పెదన్= వివరిస్తాను; మున్ను= ముందు; విష్ణునిమహిమ= వెన్నుని ప్రభావం; ఆకర్ణింపుము= విను.

**తాత్పర్యం:** ఆ దానాది ధర్మకార్యాలు కూడా ప్రయోజనం కలిగియే ఉన్నాయి. దానిని కూడా చెప్పుతాను. ముందుగా విష్ణుడి ప్రభావ మెటువంటిదో చెప్పుతాను వినుము.

**తే. ధరణి పాదంబు లతనికి శిరము దివము । దిశలు బాహు లతఁడు సర్వదేవమయుఁడు**
**భూతవిక్షేప సంహారములు దదీయ । మానసస్వైరలీలలు దానవేంద్ర! 411**

**ప్రతిపదార్థం:** దానవేంద్ర!= రాక్షసరాజా!; అతనికిన్= ఆ విష్ణువునకు; ధరణి= భూమి; పాదంబులు= కాళ్ళు; దివము= ఆకాశం (స్వర్గం); శిరము= తల; దిశలు= దిక్కులు; బాహులు= చేతులు; అతఁడు= ఆ విష్ణువు; సర్వదేవమయుఁడు= సకల దేవతాస్వరూపుడు; భూతవిక్షేపసంహారములు= ప్రాణుల సృష్టి మరియు సంహారాలు; తదీయ మానసస్వైరలీలలు= ఆ దేవుడి చిత్తముయొక్క స్వేచ్ఛావిలాసాలు.

**తాత్పర్యం:** రాక్షసనాథా! విష్ణువుకు భూమి - పాదాలు, ఆకాశం (స్వర్గం) - తల, దిక్కులు - భుజాలు. ఆ దేవుడు సర్వదేవతాస్వరూపుడై ఉన్నాడు. ప్రాణులను సృష్టించటం, సంహరించట మనేవి ఆయన చిత్తంలో సంభవించే స్వేచ్ఛాలీలావిలాసాలు.

**వ. వినుము జీవావస్థలు ఛాయలై యుండుఁ గృష్ణంబును, ధూమ్రంబును, హరితంబును, హారిద్రంబును, రక్తంబును, శుక్లంబును నైనవి యాఱుగల వద్దశా విశేషంబులు. 412**

**ప్రతిపదార్థం:** వినుము= ఆకర్ణించుము; జీవ+అవస్థలు= కర్మవిశేషంవలన కలిగే జీవుల దశలు; ఛాయలు= వర్ణాలు; ఐ+ఉండున్= అయి ఉంటాయి; ఆ+దశావిశేషంబులు= ఆ అవస్థాభేదాలు; కృష్ణంబునున్= నలుపును; ధూమ్రంబునున్= నలుపుమించిన ఎరుపును; హరితంబునున్= ఆకుపచ్చరంగును; హారిద్రంబునున్= పసుపువర్ణమును; రక్తంబునున్= ఎరుపును; శుక్లంబునున్= తెలుపును; ఐనవి= అయి ఉన్నవి, ఆఱు= ఆరుసంఖ్య గలవి; కలవు= ఉన్నాయి.

**తాత్పర్యం:** వివరిస్తాను వినుము. కర్మవిశేషం వలన జీవులకు అవస్థాభేదాలు కలుగుతాయి. అవి వర్ణాలుగా రూపొంది ఉంటాయి. అట్టి భేదాలు ఆరున్నాయి. అవి క్రమంగా నలుపు, నలుపుమించి కలసిన ఎరుపు, ఆకుపచ్చరంగు, పసుపురంగు, ఎరుపు, తెలుపు అనబడతాయి.

**తే. అనఘ! విష్ణువిహారంబు లైన విషమ । వివిధ విక్షేప సంహారవృత్తులందు**
**భ్రమణ మొందెడి జీవుని బహుళకర్మ । ముల వశంబున నాతనిఁ బొందుచుండు. 413**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; విష్ణువిహారంబులు+ఐన= విష్ణుదేవుడి విహరణా లైనటువంటి; వివిధ విక్షేపసంహార వృత్తులందున్= నానావిధాలైన సృష్టి సంహారవ్యాపారాలలో; భ్రమణము= తిరుగుటను; ఒందెడి= పొందెడి; జీవుని= జీవాత్మయొక్క; బహుళకర్మముల వశంబునన్= అనేక కర్మలవలన; ఆతనిన్= ఆ జీవుడిని; పొందుచుండున్= (పై చెప్పిన దశావిశేషాలు) ప్రాప్తిస్తూ ఉంటాయి.

**తాత్పర్యం:** పాపరహితుడవైన వృత్రాసురుడా! నానావిధాలైన సృష్టిసంహారాలు విష్ణువు విహారవిలాసాలై ఉన్నాయి. జీవుడు వాటిలో పరిభ్రమిస్తూ ఉంటాడు. అతడి కర్మల ఫలితంగా పైన పేర్కొన్న ఆరు అవస్థాభేదాలు అతడిని పొందుతూ ఉంటాయి.

**తే.** **తన్ను నుత్తమ మధ్యమాధమము లైన । ఛాయ లొందంగఁ బ్రచుర పర్యాయవృత్తి**
**జీవుఁ డమరత్వ ముఖ్యనానావిధముల । నొంది యెక్కుచు డిగ్గుచు నుండుఁ జూవె.** **414**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= జీవాత్ముడు; తన్నున్= తనను; ఉత్తమ మధ్యమ+అధమములు+ఐన= శ్రేష్ఠం, మధ్యమం, నీచం అయిన; ఛాయలు= వర్ణాలు; ప్రచురపర్యాయవృత్తిన్= ఆధిక్యక్రమవర్తన ననుసరించి; ఒందఁగన్= పొందగా; అమరత్వ ముఖ్యనానావిధములన్= దేవత్వం మొదలైన అనేక స్థితులను; ఒంది= పొంది; ఎక్కుచున్= పైకిపోతూ; డిగ్గుచున్= క్రిందికివస్తూ; ఉండున్+చూవె!= ఉంటాడు సుమా!

**తాత్పర్యం:** జీవుడిని ఉత్తమం, మధ్యమం, నీచం అనే దశాభేదాలు క్రమానుగుణంగా పొందుతూ ఉంటాయి. దానిని బట్టి అతడు దేవత్వం, మనుష్యత్వం, మొదలైన అవస్థలు పొంది పైకీ, క్రిందికీ పరిభ్రమిస్తూ ఉంటాడు సుమా!

**క.** **మే లొనరింపఁగ దొరకొను । మేలిమి గలచాయ కీడు మెయికొని చేయన్**
**లోలత్వరహిత! చాయకుఁ । జాలం గీడ్పాటు వొలయు చందము వచ్చున్.** **415**

**ప్రతిపదార్థం:** లోలత్వరహిత!= చాంచల్యం లేనివాడా!; మేలు+ఒనరింపఁగన్= మంచిపని చేయగా; మేలిమికల= శ్రేష్ఠమైన; చాయ= వర్ణం; దొరకొనున్= సంభవిస్తుంది; మెయికొని= పూనుకొని; కీడు= అపకారం; చేయన్= చేయగా; చాయకున్= వర్ణానికి; చాలన్= మిక్కిలి; కీడ్పాటు+పొలయు= చేటు ఘటిల్లే; చందము వచ్చున్= పద్ధతి సంభవిస్తుంది.

**తాత్పర్యం:** చాపల్యం లేని వృత్రుడా! ఎవడు ఇతరులకు మేలు చేస్తాడో వాడికి మంచి వర్ణం సిద్ధిస్తుంది. అట్లా కాక ఇతరులకు అపకారం చేసేవాడికి వచ్చే వర్ణం కూడా అధమమై ఉంటుంది.

**వ.** **కావునన్.** **416**

**తాత్పర్యం:** కాబట్టి.

**క.** **రసకర్మజ్ఞుఁడు దారము । పసిండి సేఁతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధ**
**త్వసమగ్రము సేయుక్రియ । న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయు టురున్.** **417**

**ప్రతిపదార్థం:** రసకర్మజ్ఞుఁడు= రసవాదక్రియ తెలిసినవాడు; దారమున్= సూత్రమును; పసిండిసేఁతకున్= బంగారుగా చేయటానికి; ప్రయత్నపరుఁడు+ఐ= ఉద్యమం చేసేవాడై; శుద్ధత్వసమగ్రము= నైర్మల్య సంపన్నం; చేయు క్రియన్= చేసేటట్లు; విసువక= విసుగు చెందక; జీవునికిన్= జీవాత్ముడికి; పరిశుద్ధిన్+చేయుట= నిర్మలత్వం ఆపాదించటం; ఉరున్= తగి ఉంటుంది.

**తాత్పర్యం:** రసవాదక్రియా కలాపం తెలిసినవాడు దారాన్ని బంగారుగా మార్చటానికి ప్రయత్నిస్తూ దానికి శుద్ధిగల్గించి నట్లే జీవుడికి శ్రేయస్సు కలిగించటానికై మలవిక్షేపాది దోషాలు లేకుండా చేయటం ఉచిత మవుతుంది.

**క. వినుకుసుమంబుల వాసిం । చిన నొప్పని కంపు విడిచి చెందును సౌర**
**భ్య నిరూఢిం దిలలట్టుల । యనఘా! సుకృతముల జీవుఁ డకలంకుఁ డగున్. 418**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; విను= ఆలకించుము; తిలలు= నువ్వులు; కుసుమంబులన్= పువ్వులలో; వాసించినన్= ఉంచితే, వాసెన కట్టుకట్టితే; ఒప్పని కంపున్= దుర్గంధమును; విడిచి= వదలి; సౌరభ్యనిరూఢిన్= సువాసనా ప్రశస్తిని; చెందును= పొందుతాయి; అట్టుల= అట్లే; జీవుఁడు= జీవాత్ముడు; సుకృతములన్= పుణ్యకార్యాలచేత; అకలంకుఁడు+అగున్= మాలిన్యం లేనివాడవుతాడు.

**తాత్పర్యం:** పాపంలేనివాడా! నువ్వులను మంచిగంధంగల పూలలో వాసెన కట్టు కట్టితే దుర్గంధం వదలి సుగంధం కలవిగా అవుతాయి. అట్లే పుణ్యకార్యాలచేత జీవుడు మాలిన్యం వీడి పవిత్రుడవుతాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అంతంతకు సత్కర్మము । లెంతయుఁ బెనుపొంద జీవుఁ డెక్కుడు చాయన్**
**జింతా కలుషము వాయఁగ । సంతోషామృతము నాని సంశుద్ధుఁ డగున్. 419**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= జీవాత్ముడు; అంతకున్+అంతకున్= అంతకంతకు; సత్కర్మములు= సుకృతాలు; ఎంతయున్= మిక్కిలిగా; పెనుపొందన్= వృద్ధిపొందగా; ఎక్కుడు చాయన్= మేలైన వర్ణంతో; చింతాకలుషము= వగపు అనే కాలుష్యం; పాయఁగన్= తొలగిపోగా; సంతోష+అమృతమున్= హర్షమనే సుధను; ఆని= త్రాగి; సంశుద్ధుడు+అగున్= పరిశుద్ధ డవుతాడు.

**తాత్పర్యం:** ఎంతకెంతకు జీవుడు పుణ్యకార్యాలు చేస్తాడో, అంతకంతకు మేలైన వర్ణాన్ని అతడు పొందుతాడు. దానివలన అతడి దుఃఖం తొలగుతుంది. సంతోషసుధను ఆస్వాదించి అతడు నిర్మలు డవుతాడు.

**వ. ఎక్కుడు చాయ శుక్లత్వంబు. 420**

**ప్రతిపదార్థం:** ఎక్కుడు చాయ= శ్రేష్ఠవర్ణం; శుక్లత్వంబు= తెలుపు.

**తాత్పర్యం:** పైన నిర్దేశించిన ఆరు రంగులలో తెలుపు మేలైన వర్ణం.

**క. జీవుఁడు శుక్లచ్ఛాయా । భావితుఁడైనపుడు విష్ణు భావించుటకున్**
**దా వెరవరి యగుఁ దద్గత । భావ మొసఁగు గుఱుము లేని పండగునెలవున్.' 421**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= జీవాత్మ; శుక్లచ్ఛాయాభావితుఁడు+ఐనపుడు= ధవళవర్ణవాసితుడైన సమయంలో; విష్ణున్= వెన్నుని; భావించుటకున్= ధ్యానించటానికి; తాన్= తాను; వెరవరి+అగున్= ఉపాయశాలి అవుతాడు; తద్గతభావము= విష్ణుడి యందు సక్తమైన ధ్యానం; గుఱుము లేని= గింజలేని; పండు+అగు= ఫలమైన; నెలవున్= స్థానమును; ఒసఁగున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** జీవుడు ఎప్పుడు శుక్లవర్ణ వాసితమైన చిత్తవృత్తి గలవాడవుతాడో, అప్పు డతడు విష్ణువు నందు ధ్యానం కలిగినవాడవుతాడు. విష్ణుధ్యానం గింజలేని పండువంటి ఉత్తమస్థితిని కలిగిస్తుంది. (పండులో గింజగల భాగం వదలి తక్కిన భాగమునే అనుభవిస్తారు. గింజలేని పండు మొత్తం ఆనందజనకమై ఉంటుందని భావం)'.

**విశేషం:** 'గురుము' అనే పదానికి 'గుఱుతు' అనే పాఠాంతరం ఉన్నది. 'గురుతు లేని పండు' అన్న పాఠానికి మచ్చలేని ఫలమని అర్థం.

**వ. అనిన విని వృత్రుం 'డదీనంబులు, నమృతస్వరూపంబులు నగు భవదీయ వచనంబులు వినికింజేసి విశుద్ధుండనైతి' నని పలికి ప్రాణంబులు విడిచి విష్ణునిం బొందె' నని చెప్పుటయు, నప్పాండవేయాగ్రజుండు 'వృత్రుని విజ్ఞానంబును, విష్ణుభక్తియు నింత యొప్పునే?' యని యగ్గించి, 'యతండును, నాఖండలుండును భండనంబు సేసిన తెఱం గెఱింగింపవే' యనుటయు ననిమిషనదీనందనుం డతని కిట్లనియె. 422**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆకర్ణించి; వృత్రుండు= వృత్రాసురుడు; అదీనంబులు= దైన్యంలేనివి; అమృత స్వరూపంబులున్= సుధాసదృశములు; అగు= అయిన; భవదీయవచనంబులు= నీమాటలు; వినికిన్+చేసి= వినటంవలన; విశుద్ధుండన్+ఐతిన్+అని= పరిశుద్ధుడనయ్యాను అని; పలికి= వచించి; ప్రాణంబులు= అసువులు; విడిచి= వదలి; విష్ణునిన్= వెన్నుని; పొందెన్= చేరాడు; అని చెప్పుటయున్= అని చెప్పగా; ఆ+పాండవేయ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ఆ ధర్మజుడు; వృత్రుని= వృత్రాసురుడియొక్క; విజ్ఞానంబును= విశేషజ్ఞానమూ; విష్ణుభక్తియున్= మాధవుడిపై గల భక్తియు; ఇంత ఒప్పునే?= ఇంతగా భాసించిందా?; అని+అగ్గించి= అని ప్రశంసించి; అతండునున్= ఆ వృత్రుడూ; ఆఖండలుండును= ఇంద్రుడూ; భండనంబు చేసిన= యుద్ధంచేసిన; తెఱంగు= పద్ధతి; ఎఱింగింపవే అనుటయున్= తెలుపుమనగానే; అనిమిషనదీనందనుండు= దేవనదీపుత్రుడు- భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మజుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** సనత్కుమారుడు అట్లా చెప్పగా విని వృత్రాసురుడు 'ధైర్యం కలిగించేవీ, అమృతతుల్యములూ అయిన నీ మాటలు విని 'నేను పరిశుద్ధుడ నయ్యాను' అని చెప్పి ప్రాణాలు వదలి విష్ణు సన్నిధి చేరుకొన్నాడు' అని భీష్ముడు చెప్పగా విని ధర్మజుడు 'వృత్రాసురుడి విజ్ఞానమూ, విష్ణుభక్తీ ఇంతగా రాణించాయే' అని ప్రశంసించాడు. తరువాత 'వృత్రుడు, ఇంద్రుడు ఎట్లా యుద్ధం చేశారో తెలుపు' మని ప్రశ్నించాడు. అప్పుడు భీష్ము డతడితో ఇట్లా అన్నాడు:

### ఇంద్రవృత్రాసురుల యుద్ధప్రకారము (సం. 12-272-7)

**సీ. 'ఇంద్రుఁ డుజ్జ్వలరథం బెక్కి దేవానీక । సహితుఁడై వృత్రుపైఁ జన నతండు**
**దనుజసైన్యముఁగొని తాఁకెఁ; దత్సంగర । మవ్వాసవునకు భయం బొనర్చెఁ;**
**బర్వత ప్రతిమరూపమున నయ్యసుర యు । గ్రతఁ జూచి వడఁకు దైవతకులేంద్రు**
**నద్దానవుండు మాయాబలంబున మోహి । తునిఁ జేయ సొగయుడు ముని సమాజ**

**తే. సంస్తుతముగ రథంతరసామశక్తిఁ । జేసి యమ్మూర్ఛదేర్చి వసిష్ఠుఁ డతని**
**తోడ నజుఁడును హరియు రుద్రుండుఁ బోరు । గనుఁగొనంగ వచ్చినవారు గడఁగు మనుడు. 423**

**ప్రతిపదార్థం:** ఇంద్రుఁడు= వాసవుడు; ఉజ్జ్వలరథంబున్= ప్రకాశించే అరదాన్ని; ఎక్కి= అధిష్ఠించి; దేవానీకసహితుఁడు+ఐ= దేవసైన్యంతో కూడినవాడై; వృత్రుపైన్= వృత్రాసురుడిమీదికి; చనన్= దండెత్తిపోగా; అతండు= ఆ వృత్రుడు; దనుజసైన్యమున్ +కొని= రాక్షససైన్యాన్ని వెంటకొని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు; తత్సంగరము= ఆ యుద్ధం; ఆ+వాసవునకున్= ఆ ఇంద్రుడికి; భయంబు+ఒనర్చెన్= భీతి కలిగించింది; ఆ+అసుర+ఉగ్రతన్= ఆ రక్కసుడి ఉగ్రత్వమును; పర్వతప్రతిమరూపమునన్= కొండవంటి రూపుతో; చూచి= విలోకించి; వడఁకు= చలిస్తున్న; దైవతకుల+ఇంద్రున్= దేవతల సమూహానికి ప్రభువైన ఇంద్రుడిని; ఆ+దానవుండు= ఆ రాక్షసుడు; మాయాబలంబునన్= మాయయొక్క బలంతో; మోహితునిన్+చేయన్= మోహగ్రస్తుడిని చేయగా; సొగయుడున్= (ఇంద్రుడు) మూర్ఛిల్లగా; వసిష్ఠుఁడు= వసిష్ఠమహర్షి; ముని సమాజసంస్తుతముగన్=

మునుల సమూహం స్తుతించేటట్లు; రథంతరసామశక్తిన్+చేసి= రథంతరమనే సామ మంత్రంయొక్క ప్రభావంచేత; ఆ+ మూర్ఛన్+తేర్చి= సొమ్మనుండి తేరుకొనేటట్లు చేసి; అతనితోడన్= ఆ ఇంద్రుడితో; అజుఁడును= బ్రహ్మయు; హరియున్= విష్ణువును; రుద్రుండున్= శివుడును; పోరు= యుద్ధమును; కనుఁగొనంగన్ వచ్చినవారు= చూడటానికి వచ్చారు; కడఁగుము= ఉద్యమించుము; అనుడున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** ఇంద్రుడు ప్రకాశించే రథం అధిష్ఠించి దేవతాసైన్యంతో సహా వృత్రుడిపైకి సమరానికి వెళ్ళాడు. వృత్రుడు రాక్షససైన్యంతో సహా ఇంద్రుడిని మార్కొని యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఆ యుద్ధం ఇంద్రుడికి భీతి కల్గించింది. పర్వతాకారుడై భయంకరంగా ఉన్న వృత్రాసురుడి ఉగ్రరూపం చూచి ఇంద్రుడు గడగడ వణకసాగాడు. అప్పు డా రాక్షసరాజు అతడిని మాయాశక్తితో మూర్ఛితుడిని చేశాడు. అంతట వసిష్ఠుడు మునులు తనను పొగడుతుండగా రథంతరసామ మంత్రాల ప్రభావంతో ఇంద్రుడిని మూర్ఛనుండి తేరుకొనేటట్లు చేశాడు. తరువాత అతడితో 'బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు ఈ యుద్ధం చూడాలని వచ్చారు. సన్నద్ధుడవు కమ్ము!' అని చెప్పి యుద్ధానికి పురికొల్పాడు.

**చ.** **అతఁడు గడంగ దేవగురుఁ డప్డు మునీంద్రులుఁ దాను నమ్మరు**
**త్పతి విజయంబు గోరి హరుఁ బ్రార్థన సేయఁ దదీయతేజ ము**
**ద్ధత చటులజ్వరం బగుచు దైత్యపతిం బొదివెన్ సురేశ్వరో**
**ద్ధృతకులిశంబుఁ బొందె హరి దత్సమయంబునఁ గౌరవేశ్వరా! 424**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కౌరవులకు నాథుడవైన ధర్మరాజా!; అతఁడు= ఆ ఇంద్రుడు; కడంగన్= యుద్ధానికి ఉద్యమించగా; అప్డు= ఆ సమయాన; దేవగురుఁడు= బృహస్పతి; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; తానున్= తానుకూడ; ఆ+ మరుత్పతి విజయంబున్= ఆ దేవేంద్రుడి జయాన్ని; కోరి= అభిలషించి; హరున్= రుద్రుడిని; ప్రార్థన చేయన్= ప్రార్థించగా; తదీయతేజము= ఈ రుద్రుడి యొక్క తేజస్సు; ఉద్ధతచటుల జ్వరంబు+అగుచున్= గర్వితమై చలించే జ్వరమవుతూ; దైత్యపతిన్= రాక్షసరాజును; పొదివెన్= ఆక్రమించింది; తత్సమయంబునన్= అప్పుడు; హరి= విష్ణువు; సుర+ఈశ్వరోద్ధృత కులిశంబున్=ఇంద్రుడు పైకెత్తిన వజ్రాయుధాన్ని; పొందెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వసిష్ఠుడి ప్రేరణతో ఇంద్రుడు యుద్ధానికి తలపడ్డాడు. అప్పుడు బృహస్పతి మునులతో కూడి తాను ఇంద్రుడి విజయార్థమై ఈశ్వరుడిని ప్రార్థించాడు. ఆ శంకరుడి తేజస్సు మహోద్ధతమై చలించే జ్వరంగా రూపొంది వృత్రుడిని ఆక్రమించింది. ఆ కాలంలోనే విష్ణువు ఇంద్రుడు పైకెత్తిన వజ్రాయుధాన్ని ప్రవేశించాడు.

**తే.** **ఇంద్రునకు రుద్రుఁ డత్తఱి నిట్టు లనియె । నసఘ! యఱువది వేలు దివ్యాబ్దములు మ**
**హాతపం బొనరించె నీయసుర; వీని । కొసఁగెఁ బద్మజుఁ డధికమహోగ్రబలము. 425**

**ప్రతిపదార్థం:** అత్తఱిన్= ఆ సమయంలో; రుద్రుఁడు= శివుడు; ఇంద్రునకున్= వాసవుడికి; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు; అనఘ!= పాపరహితుడా!; ఈ యసుర= ఈ రాక్షసుడు; అఱువదివేలు దివ్య+అబ్దములు= అరవైవేల దివ్యసంవత్సరాలు; మహాతపంబు+ఒనరించెన్= గొప్ప తపస్సు చేశాడు; పద్మజుఁడు= బ్రహ్మ; వీనికిన్= ఈ రక్కసుడికి; అధికమహా+ఉగ్రబలమున్= ఎక్కుడైన భయంకరబలాన్ని; ఒసంగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** అప్పుడు రుద్రుడు ఇంద్రుడితో ఇట్లా అన్నాడు: 'పాపరహితుడా! ఈ రాక్షసుడు అరవైవేల దివ్యసంవత్సరాలు తీవ్రతపస్సు చేశాడు. బ్రహ్మ వీడికి భయంకరమైన మహాబలం ప్రసాదించాడు'.

**క. అని చెప్పి 'యబ్బలము నా । ఘనతేజముచేత నడఁగు గడఁగు' మనుడు న**
**య్యనిమిషనాథుఁడు వజ్రం । బున వైవ నతండు వడియె మునిగణ మలరన్. 426**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; ఆ+బలము= ఆ సత్తువ; నా ఘనతేజముచేతన్= నాయొక్క గొప్ప తేజస్సుచేత; అడఁగున్= నశిస్తుంది; కడఁగుము= ప్రయత్నించుము; అనుడున్= అనగా; ఆ+అనిమిషనాథుఁడు= ఆ దేవప్రభువు; వజ్రంబునన్= వజ్రాయుధంతో; వైవన్= వేయగా; మునిగణము= మునిబృందం; అలరన్= సంతసించగా; అతండు= ఆ రాక్షసుడు; పడియెన్= నేలకూలాడు.

**తాత్పర్యం:** రుద్రుడు ఆ రీతిగా పలికి 'వాడి బలము గొప్పదైన నా తేజస్సుచేత నశిస్తుంది, కాబట్టి ప్రయత్నించుము' అని ఇంద్రుడిని పురికొల్పాడు. అంతట ఇంద్రుడు వజ్రాయుధంతో వాడిని కొట్టాడు. ముని సమూహం సంతోషించగా ఆ దెబ్బకు ఆ రాక్షసుడు నేలకూలాడు.

**క. సుర లార్చిరి, తూర్యంబులు । మొరసె ననేకంబు; లపుడు మోదమున మునుల్**
**హరిహరులం గీర్తించిరి, । సురేంద్రు నగ్గించి రధికశుభవాక్యములన్. 427**

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; ఆర్చిరి= అరచారు; అనేకంబులు తూర్యంబులు= పెక్కు వాద్యాలు; మొరసెన్= మ్రోగాయి; అపుడు= ఆ సమయంలో; మునుల్= మౌనులు; మోదమునన్= సంతోషంతో; హరిహరులన్= విష్ణువునూ, రుద్రుడినీ; కీర్తించిరి= స్తుతించారు; అధిక శుభవాక్యములన్= అనేక మంగళవచనాలతో; సురేంద్రున్= దేవేంద్రుడిని; అగ్గించిరి= ప్రశంసించారు.

**తాత్పర్యం:** వృత్రాసురుడు పడిపోగానే దేవతలు ఆనందంతో అరచారు. పెక్కువాద్య విశేషాలు మ్రోగాయి. మునులు సంతసంతో హరినీ, హరుడినీ వినుతించారు. అనేక మంగళవాక్యాలతో దేవేంద్రుడిని పొగడారు.

**క. విను విష్ణుని సంస్పర్శం । బున నప్పుడ చూవె కసటు వోయిన నతనిం**
**గనుటయు శాంతిం బొందుట । యును గురువర! కలిగె వృత్రు నుల్లంబునకున్.' 428**

**ప్రతిపదార్థం:** కురువర!= కౌరవశ్రేష్ఠా!; విను= ఆలకించుము; విష్ణుని సంస్పర్శంబునన్= విష్ణుదేవుడు తాకటంతో; అప్పుడ చూవె!= అప్పుడే సుమా!; కసటు= మాలిన్యం; పోయినన్= తొలగిపోగా; అతనిన్= ఆ విష్ణుడిని; కనుటయున్= చూడటమూ; వృత్రుఉల్లంబునకున్= వృత్రాసురుడి హృదయానికి; శాంతిన్+పొందుటయునున్= శమించటమున్నూ; కలిగెన్= సంభవించాయి.

**తాత్పర్యం:** కురుశ్రేష్ఠా! వెన్నుని స్పర్శతో అప్పుడే వృత్రుడి హృదయగతమైన మాలిన్యం తొలగిపోయింది. అప్పుడతడు విష్ణుదేవుడిని చూచాడు. అతడి చిత్తానికి శాంతి కూడా అప్పుడు కల్గింది'.

**వ. అని పలికి భీష్ముండు వెండియు నవ్విభున కిట్లను నట్లు వృత్రుని జయించి. 429**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; భీష్ముండు= భీష్ముడు; వెండియున్= మరల; ఆ+విభునకున్= ఆ రాజుకు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; వృత్రునిన్= వృత్రాసురుడిని; జయించి= ఓడించి.

**తాత్పర్యం:** భీష్ము డీ రీతిగా చెప్పి మరల ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: అట్లా వృత్రుడిని యుద్ధంలో పరాజితుడిని చేసి. (తరువాతి పద్యంతో అన్వయం).

చ. హరునకు మ్రొక్కి 'మీ కరుణ నార్తి దొఱంగి యనూన సౌఖ్యముం
బొరసితి' నంచు వీడుకొని పోయె మహేంద్రుఁడు బ్రహ్మహత్య యా
సురపతి నప్డు వెన్కొనియెఁ జొచ్చె బిసాంతర మాతఁ డందునుం
బరిగొని యుగ్రవృత్తి నది పట్టెఁ జలంబున నమ్మహాత్మునిన్. 430

**ప్రతిపదార్థం:** మహేంద్రుఁడు= దేవేంద్రుడు; హరునకున్= రుద్రుడికి; మ్రొక్కి= నమస్కరించి; మీ కరుణన్= మీ దయచేత; ఆర్తిన్= బాధను; తొఱంగి= త్యజించి; అనూన సౌఖ్యమున్= అధికసుఖాన్ని; పొరసితిన్+అంచున్= పొందాను అంటూ; వీడుకొని పోయెన్= పోయివస్తానని వెళ్ళిపోయాడు; అప్డు= అప్పుడు; బ్రహ్మహత్య= బ్రహ్మహత్యాదోషం; ఆ సురపతిన్= ఆ ఇంద్రుడిని; వెన్కొనియెన్= వెంబడించింది; ఆతఁడు= ఆ ఇంద్రుడు; బిస+అంతరమున్= తామరతూడులోపల; చొచ్చెన్= ప్రవేశించాడు; అది= ఆ దోషము; అందునున్= ఆ తామర తూడులోగూడ; పరిగొని= చుట్టుముట్టి; ఉగ్రవృత్తిన్= భీకరవర్తనంతో; చలంబునన్= మాత్సర్యంతో; ఆ+మహాత్మునిన్= ఆ ఇంద్రుడిని; పట్టెన్= గ్రహించింది.

**తాత్పర్యం:** అంతట ఇంద్రుడు శివుడికి ప్రణమిల్లాడు. 'మీ దయవలన పీడ తొలగి మహాసౌఖ్యం పొందాను' అని చెప్పుతూ పోయివస్తానని వెళ్ళాడు. అప్పుడు బ్రహ్మహత్యాదోషం ఆ ఇంద్రుడిని వెంబడించింది. దానికి భయపడి అతడు తామరతూడులో ప్రవేశించాడు. అది మాత్సర్యంతో వెంబడించి అక్కడ కూడా భయంకరంగా అతడిని చుట్టుముట్టి ఆక్రమించింది.

ఆ. బ్రహ్మహత్య దన్నుఁ బట్టిన నమరేంద్రుఁ। డజుని కడకు నేఁగి ప్రార్థనంబు
చేసి 'దీనిఁ బాయఁజేయవే' యన నతం। డది దొలంగఁ జేయుననువు దలఁచి. 431

**ప్రతిపదార్థం:** బ్రహ్మహత్య= బ్రహ్మహత్య అనే దోషం; తన్నున్= తనను; పట్టినన్= ఆక్రమించగా; అమరేంద్రుఁడు= దేవేంద్రుడు; అజుని కడకున్= బ్రహ్మవద్దకు; ఏఁగి= పోయి; ప్రార్థనంబుచేసి= ప్రార్థించి; దీనిన్= ఈ బ్రహ్మహత్యను; పాయన్+చేయవే+అనన్= తొలగించవే అనగా; అతండు= ఆ బ్రహ్మ; అది= ఆ దోషమును; తొలంగన్+చేయు= తొలగించే; అనువున్= ఉపాయాన్ని; తలఁచి= భావించి.

**తాత్పర్యం:** ఇంద్రుడు బ్రహ్మహత్యాదోషం తనను పట్టుకొనటంతో బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు. ఆయనను ప్రార్థించి ఈ దోషం తొలగేటట్లు చేయుమన్నాడు. బ్రహ్మ ఆ దోషం తొలగించే ఉపాయం ఆలోచించాడు. తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

వ. అగ్నినోషధివృక్షతృణంబులను వనితా జనంబులను జలంబులను దలంపున రావించి వృత్రునివలన వాసవునకుం బాటిల్లిన బ్రహ్మహత్య చతుర్భాగంబులు సేసితి. మీర లొక్కొక్క పాలు గై కొనుండని పనిచెఁ; బనిచిన వారు 'దేవా! నీ పంపు సేసెదము; మాకు నిష్కృతి యెట్టిది? దాని నీదివ్య చిత్తంబున నవధరింపవలయు' నని పలికిన నగ్నికిని నోషధివృక్షతృణంబులకును, వనితాజనంబులకును, జలంబులకును వరంబులుగాఁ గ్రమంబున నీవు ప్రజ్వలింపక హవిఃప్రదానంబు సేయు వానియందును, మీకుఁ బర్వంబుల భేదనచ్ఛేదనంబు లాచరించువానియందును, మీరు రజస్వలలై యుండ మీతో సురతంబు సలుపువాని యందును, మీలో మల మూత్ర శ్లేష్మంబులు విడుచువాని యందును మీ మీ కడనున్న బ్రహ్మహత్య ప్రవేశింపఁ గలయది' యని నిర్దేశించిన దానికిం బ్రియం బంది, యగ్ని ప్రముఖంబులు శతమఖు బ్రహ్మహత్య పాళ్ళు ధరియించి; రిట్లు విరించి ప్రసాదంబునం గల్మషంబు దొఱంగి యాఖండలుండు దదనుమతి నశ్వమేధంబు సేసి నాక సామ్రాజ్యంబున సర్వలోక పూజ్యత్వంబు నొంది వెలింగె' నని చెప్పి వెండియు నిట్లనియె. 432

**ప్రతిపదార్థం:** అగ్నిన్= అగ్నిదేవుడిని; ఓషధివృక్షతృణంబులనున్= అరటిమొదలైన ఓషధులను, చెట్లను, గడ్డిమొక్కలను; వనితాజనంబులను= స్త్రీలను; జలంబులను= నీటిని; తలంపునన్= సంకల్పంతో; రావించి= వచ్చేటట్లు చేసి; వృత్రునివలనన్= వృత్రాసురుడివలన; వాసవునకున్= ఇంద్రుడికి; పాటిల్లిన= కల్గిన; బ్రహ్మహత్యన్= బ్రహ్మహత్యాదోషాన్ని; చతుర్భాగంబులు= నాలుగుపాళ్ళు; చేసితిన్= చేశాను; మీరలు= మీరు; ఒక్కొక్క పాలు= ఒక్కొక్క భాగం; కైకొనుండు+అని= స్వీకరించండి అని; పనిచెన్= నియోగించాడు; పనిచినన్= నియోగించేసరికి; వారు= అగ్ని మున్నగువారు; దేవా!= ప్రభూ!; నీపంపు= నీయాజ్ఞ; చేసెదము= నిర్వర్తిస్తాం; మాకున్= అట్లా నిర్వర్తించిన అగ్న్యాదులమైన మాకు; నిష్కృతి= ప్రాయశ్చిత్తం; ఎట్టిది= ఎట్లాంటిది?; దానిన్= ఆ ప్రాయశ్చిత్తాన్ని; నీ దివ్యచిత్తంబునన్= నీ దివ్యమానసంలో; అవధరింపన్ వలయున్+అని= భావించవలెను అని; పలికినన్= చెప్పగా; అగ్నికినిన్= అనలమునకు; ఓషధివృక్షతృణంబులకున్= ఓషధులకు, చెట్లకు, గడ్డికిని; వనితాజనంబులకునున్= స్త్రీలకు; జలంబులకును= నీటికిని; క్రమంబునన్= వరుసగా; వరంబులుగాన్= దేవతలిచ్చే కోరికలుగా; నీవు= అగ్నివైన నీవు; ప్రజ్వలింపక= మండక; హవిఃప్రదానంబు చేయువాని+అందునున్= హవిస్సును వేల్చువాడి యందు; మీకున్= ఓషధివృక్షాదులగు మీకు; పర్వకాలంబులన్= పండుగదినాలలో; భేదన చ్ఛేదనంబులు= పెళ్ళగించటం, నరకటం చేసేవాడియందు; మీరు= స్త్రీజనమైన మీరు; రజస్వలలై ఉండన్= ముట్టుగలవారై ఉండగా; మీతోన్ సురతంబు= మీతో రతి; సలుపువానియందును= చేసేవాడియందు; మీలోన్= జలమైన మీలో; మలమూత్రశ్లేష్మంబులు= మలం, మూత్రం, తెమడ వీటిని; విడుచువానియందును= వదలిపెట్టేవాడియందు; మీమీ కడన్= మీమీ వద్ద; ఉన్నబ్రహ్మహత్య= ఉన్నట్టి బ్రహ్మహత్యాదోషం; ప్రవేశింపన్ కలయది= దూరగలదు; అని నిర్దేశించినన్= అని చెప్పగా; దానికిన్= ఆ మాటకు; ప్రియంబు+అంది= సంతోషపడి; అగ్నిప్రముఖంబులు= అగ్ని మొదలగు వారు; శతమఖు= ఇంద్రుడియొక్క; బ్రహ్మహత్యపాళ్ళు= బ్రహ్మహత్యాదోషపు విభాగాలను; ధరియించిరి= పూనారు; ఇట్లు= ఈ రీతిగా; విరించి ప్రసాదంబునన్= బ్రహ్మఅనుగ్రహంతో; కల్మషంబు= పాపం; తొఱంగి= వీడి; ఆఖండలుండు= ఇంద్రుడు; తదనుమతిన్= బ్రహ్మయొక్క సమ్మతితో; అశ్వమేధంబు= అశ్వమేధమనే యజ్ఞం; చేసి= నిర్వహించి; నాక సామ్రాజ్యంబునన్= స్వర్గ సామ్రాజ్యంలో; సర్వలోకపూజ్యత్వంబును= సమస్తలోకాలచేత పూజించబడుటను; ఒంది= పొంది; వెలింగెన్= ప్రకాశించాడు; అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రహ్మ అగ్నిదేవుడిని, ఓషధులను, చెట్లను, గడ్డిమొక్కలను, స్త్రీలను, నీటిని తన సంకల్పశక్తితో వచ్చేటట్లు చేశాడు. 'ఇంద్రుడికి కలిగిన బ్రహ్మహత్యాదోషాన్ని నేను నాలుగు భాగాలు చేశాను. మీరు ఒక్కొక్క భాగం స్వీకరించాలి' అని ఆదేశించాడు. అందుకు అగ్న్యాదులు 'ప్రభూ! నీ ఆన పాటిస్తాము. అయితే దానివలన కలిగే పాపానికి మాకు ప్రాయశ్చిత్తమేది? దానిని నీ మనస్సులో నిశ్చయించి చెప్పు' మని అన్నారు. అప్పుడు విధాత అగ్నికి, ఓషధి వృక్షతృణాలకూ, స్త్రీలకూ, నీటికీ క్రమంగా ఈ క్రింది రీతిగా వరాలు ఇచ్చాడు. 'నీవు మండకున్నప్పుడు హవిస్సు నీలో వేల్చేవాడిలో నీలోని దోషం ప్రవేశిస్తుంది' అని అగ్నికి వరమిచ్చాడు. 'పండుగకాలంలో మిమ్మలను భగ్నంచేసి, నరికి, పెకలించేవారిలో మీలోని దోషం చేరుతుంది' అని ఓషధి వృక్షతృణాలకు వరమిచ్చాడు. 'మీరు రజస్వలలై ఉన్నపుడు మీతో రతిచేసే వాడిలోనికి మీ దోషం ప్రవేశిస్తుం' దని స్త్రీలకు వరం ఇచ్చాడు. 'మీలో మలమూత్రాలు, కళ్ళెలు వదలిపెట్టే వాడిని మీలోని దోషం వెన్నంటుతుంది' అని నీటికి వరమిచ్చాడు. అందుకు అగ్ని మున్నగువారు సంతోషించారు. ఇంద్రుడి బ్రహ్మహత్యాదోషాన్ని వారు ధరించారు. ఇట్లా బ్రహ్మ అనుగ్రహంతో ఇంద్రుడు పాపం వీడి ఆయన సమ్మతితో అశ్వమేధయాగం చేశాడు. స్వర్గరాజ్యంలో సమస్తలోకపూజ్యుడై వెలుగొందాడు' అని చెప్పి మరల భీష్ముడు ధర్మరాజుతో ఈ రీతిగా అన్నాడు:

**తే.** **ఒదవు వృత్రురక్తమున బుద్బుదము లెసఁగి । పుట్టకొక్కులై యవి జనభోజ్యభావ**
**మొంది విప్రాదికద్విజ యోగ్యతాభి । పన్నములు గావు ధర్మసంపన్నచరిత!** **433**

**ప్రతిపదార్థం:** ధర్మసంపన్నచరిత!= ధర్మంతో కూడిన శీలంకల ఓ ధర్మరాజా!; ఒదవు= ఉదయించిన; వృత్రురక్తమునన్= వృత్రాసురుడి నెత్తుటిలో; బుద్బుదములు= బుడగలు; ఎసఁగి= వృద్ధిపొంది; పుట్టకొక్కులు+ఐ= పుట్టగొడుగులుగా రూపొంది; అవి= ఆ పుట్టగొడుగులు; జనభోజ్యభావము+ఒంది= ప్రజలకు తినదగినవై; విప్రాదికద్విజ= బ్రాహ్మణులు మున్నగు ద్విజులకు; యోగ్యతాభిపన్నములు= భోజనయోగ్యతతో గూడినవి; కావు= కావు.

**తాత్పర్యం:** 'ధర్మాత్మా! వృత్రుని శరీరంనుండి కారిన నెత్తురునుండి బుడగలు పుట్టాయి. అవి పుట్టకొక్కులయ్యాయి. ప్రజలకు ఆహారపదార్థంగా కూడ రూపొందాయి. అయితే రాక్షస రక్తజములు కావటం వలన బ్రాహ్మణులు మొదలైన ద్విజులు భుజించటానికి అవి తగని వయ్యాయి.

**క.** **ఆ వాసవు చందంబున । నీవును శత్రుజయకీర్తనీయుఁడ వగుచున్**
**భూవిబుధుల కెపుడుఁ బ్రమో । దావహుఁడవు గమ్ము. భారతాన్వయముఖ్యా! 434**

**ప్రతిపదార్థం:** భారత+అన్వయముఖ్యా!= భరతవంశశ్రేష్ఠా!; ఆ వాసవుచందంబునన్= ఆ ఇంద్రుడివలె; నీవును= నీవుకూడ; శత్రుజయకీర్తనీయుఁడవు+అగుచున్= రిపులను జయించటంచేత కీర్తించదగినవాడ వవుతూ; భూవిబుధులకున్= భూసురులకు; ఎప్పుడున్= ఎల్లవేళల; ప్రమోద+ఆవహుఁడవు కమ్ము= సంతోషం కలిగించేవాడవు కమ్ము.

**తాత్పర్యం:** భరతవంశముఖ్యుడవైన ఓ ధర్మపుత్రా! ఆ ఇంద్రుడివలె నీవు కూడా శత్రువులను జయించి కీర్తి పొందుము. బ్రాహ్మణులకు సదా సంతోషం కలిగించుము.

**తే.** **పర్వములయందు విప్రసభను సభక్తి । కంబుగా నెవ్వఁ డీశక్రకథఁ బఠించు**
**వానిఁ బాపము లొందవు, మాననీయ । ధర్మములయందు రతుఁడగు ధర్మతనయ!' 435**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ!= ధర్మపుత్రా!; ఎవ్వఁడు= ఎవడు; పర్వముల+అందున్= పండుగదినాలలో; విప్రసభను= బ్రాహ్మణుల సభలో; ఈ శక్రకథన్= ఈ ఇంద్రుడి చరిత్రమును; సభక్తికంబుగాన్= భక్తితో కూడి; పఠించున్= చదువునో; వానిన్= అతడిని; పాపములు= కిల్బిషాలు; ఒందవు= పొందవు; మాననీయ ధర్మముల+అందున్= పూజ్యములైన ధర్మాలయందు; రతుఁడు+అగున్= (అతడు) ఆసక్తిగల వాడవుతాడు.

**తాత్పర్యం:** ధర్మజా! ఎవడు పర్వదినాలలో ఈ ఇంద్రుడి కథను భక్తితో బ్రాహ్మణుల సభలో చదువుతాడో, వాడికి పాపా లంటవు. వాడు మాన్యమైన ధర్మాలలో ఆసక్తి కలవా డవుతాడు'.

**వ.** **అనిన నతండు ప్రీతుండై 'వృత్రుండు జ్వరంబుచేతం బొదువంబడియె నని వింటి; దాని జననంబును దత్ప్రకారంబును నెఱిఁగింపవే' యనుటయు భీష్ముం డా భూపతి కిట్లనియె. 436**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అతండు= ఆ ధర్మసుతుడు; ప్రీతుండు+ఐ= ప్రీతినొందినవాడై; వృత్రుండు= వృత్రాసురుడు; జ్వరంబుచేతన్= జ్వరంచేత; పొదువంబడియెన్+అని= ఆక్రమించబడ్డాడని; వింటిన్= విన్నాను; దాని జననంబును= ఆ జ్వరముయొక్క పుట్టుకయును; తత్ప్రకారంబునున్= దాని స్వభావమును; ఎఱిఁగింపవే= తెలుపుమా; అనుటయున్= అనగా; భీష్ముండు= గాంగేయుడు; ఆ భూపతికిన్= ఆ రాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు అట్లా చెప్పగా విని ధర్మరాజు ప్రీతి పొందాడు. 'వృత్రుడిని జ్వరం ఆక్రమించింది అని విన్నాను. ఆ జ్వరం ఎట్లా పుట్టింది? దాని విధానం ఏమిటి? తెలియజేయు' మని మళ్ళీ అడిగాడు. అప్పుడు భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**దక్షమఖధ్వంసంబు నప్పుడు శివునివలన జ్వరం బుద్భవించిన ప్రకారము (సం. 12-274-4)**

**సీ.** **రజతాచలంబున రత్నతటంబున । నంబికాసహితుఁడై హరుఁడు పేర్మి**
**నమరమునీంద్ర యక్షాదులు గొలువంగ । నుండు; నట్లుండంగ నొక్కనాఁడు**
**దేవర్షికోటు లతిప్రమదంబునం । జనఁ జూచి 'వీ రేమిపనికి నెచటి**
**కరిగెద?' రని పతి నడిగె భవాని; యా । తఁడు 'దక్షుచేయు నధ్వరమునందుఁ**

**తే.** **దమహవిర్భాగములు గొనుదాని' కనినఁ । 'బొలఁతి నీ వేల పో?' వను పలుకు పలికె;**
**'నాకు మును భాగపరికల్పనంబు లేమి । నతఁడు బిలువఁ; డేనును బోవ' ననియె భవుఁడు. 437**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; అంబికాసహితుఁడు+ఐ= సతీదేవితో కూడినవాడై; రజత+అచలంబునన్= కైలాసగిరిపై; రత్నతటంబునన్= రత్నసానువునందు; పేర్మిన్= అతిశయంగా; అమరముని+ఇంద్ర యక్ష+ఆదులు= దేవతలు, మునివర్యులు, యక్షులు మొదలైనవారు; కొలువంగన్+ఉండున్= సేవించగా ఉంటాడు; అట్లు+ఉండంగన్= అట్లా ఉండగా; ఒక్కనాఁడు= ఒక్కదినం; భవాని= సతీదేవి; దేవర్షికోటులు= దేవతలు, ఋషిసమూహాలు; అతిప్రమదంబునన్= మిక్కిలి సంతోషంతో; చనన్= పోగా; చూచి= విలోకించి; వీరు= ఈ దేవర్షులు; ఏమిపనికిన్= ఏ కార్యానికి; ఎచటికిన్= ఎక్కడికి; అరిగెదరు?= పోతున్నారు?; అని పతిన్+అడిగెన్= అని భర్తను ప్రశ్నించింది; ఆతఁడు= ఆ శివుడు; దక్షు చేయు= దక్షప్రజాపతి చేసే; అధ్వరము+అందున్= యజ్ఞంలో; తమ హవిర్భాగములు= తమకు చెందిన వేల్చిన ద్రవ్యపు పాళ్ళను; కొనుదానికిన్+అనినన్= స్వీకరించటానికని చెప్పగా; పొలఁతి= పార్వతి; నీవు+ఏల పోవు?= నీవెందుకు పోవటం లేదు?; అను పలుకు= అనుమాట; పలికెన్= అన్నది; భవుఁడు= శివుడు; నాకున్= శివుడనైన నాకు; మును= ముందు; భాగపరికల్పనంబు= పాలు కల్పించటం; లేమిన్= లేకుండటంవలన; అతఁడు= ఆ దక్షుడు; పిలువఁడు= నన్ను ఆహ్వానించడు; ఏనును= నేనుకూడ; పోవన్+అనియెన్= పోనన్నాడు.

**తాత్పర్యం:** శివుడు వెండికొండపై సతీదేవితో కూడి ఉన్నాడు. దేవతలు, మునివర్యులు, యక్షులు మొదలైనవారు ఆ దేవుడిని సేవిస్తూ ఉన్నారు. ఒక్క దినాన దేవర్షి సమూహం చాలా సంతోషంతో బయలుదేరి వెళ్ళుతూ ఉండటం చూచి అంబిక 'వీరు ఎక్కడికి ఏమి పనిమీద పోతున్నారు?' అని భర్తను అడిగింది. అందుకు భవుడు 'దక్షుడు చేసే యాగంలో తమ తమ హవిర్భాగాలు గ్రహించటానికి వీరు పయనమయ్యారు' అని చెప్పాడు. అప్పుడు భవాని 'అయితే నీ వెందుకు పోవటం లేదు?' అని ప్రశ్నించింది. దానికి శివుడు నాకు ముందుభాగం పెట్టలేదు. అందువలన అతడు నన్ను పిలువలేదు. నేనుకూడా పోవటం లేదు' అని చెప్పాడు.

**క.** **తన పతికి భాగకల్పన । మొనరింపఁడు దక్షుఁ డని మహోగ్రపుఁ గోపం**
**బున బొమలు ముడివడఁగ న । వ్వనిత పలుకు మాని యుండె వసుధాధీశా! 438**

**ప్రతిపదార్థం:** వసుధాధీశా!= రాజా!; దక్షుఁడు= దక్షప్రజాపతి; తన పతికిన్= తన భర్తకు; భాగకల్పనము= పాలు కల్పించటం; ఒనరింపఁడు= చేయడు; అని= అని తలచి; మహా+ఉగ్రపు= మిక్కిలి భయంకరమైన; కోపంబునన్= క్రోధంతో; బొమలు; ముడిపడఁగన్= వక్రత్వం పొందగా; ఆ+వనిత= ఆ భవాని; పలుకు మాని= మాట్లాడటం మాని; ఉండెన్= ఉండింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! దక్షుడు తన భర్తకు యజ్ఞంలో భాగం కల్పించలేదని సతీదేవి మిక్కిలి కోపంతో కనుబొమలు ముడివడగా మాట్లాడటం మాని మౌనంగా ఉండిపోయింది.

సీ. దేవిచిత్త మెఱింగి దేవుండు ప్రమథసం । ఘంబులు దాను నా క్రతువు సెఱుప
నరిగె; యజ్ఞాంగంబు లన్నింటఁ బ్రమథులు । గాసి సేయుచును రక్తములు సల్లి
యార్పంగ మృగరూపమై గగనంబున । కెగసె; నధ్వరము మున్నీశునుదుట
నలుకఁ బుట్టిన ఘర్మజల కణ మిలఁ బడ్డఁ । బెనుమంట లెగసిన జనితుఁ డయ్యెఁ

ఆ. నందుఁ బురుషుఁ డొకరుఁ డరుణ నేత్రకము నీ । లంబు నూర్ధ్వరోమకంబు ఘోర
భంగికంబు నైన యంగంబుతో సప్త । తంతుదాహి యగుచు ధరణినాథ! 439

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; దేవుండు= భవుడు; దేవిచిత్తము+ఎఱింగి= భవాని మనస్సు తెలిసికొని; ప్రమథసంఘంబులు= ప్రమథసమూహాలు; తానును= తానుకూడ; ఆ క్రతువు= ఆ యజ్ఞాన్ని; చెఱుపన్= చెడగొట్టటానికి; అరిగెన్= పోయాడు; ప్రమథులు= శివభటులు; యజ్ఞ+అంగంబులు+అన్నింటన్= యజ్ఞానికి చెందిన అవయవాలన్నింటిలోనూ; గాసి చేయుచును= చీకాకు పరుస్తూ; రక్తములు+చల్లి= నెత్తురులు చల్లి; ఆర్పంగన్= ఆర్పివేయగా; అధ్వరము= యజ్ఞం; మృగరూపమై= జింక రూపుగలదై; గగనంబునకున్= ఆకసానికి; ఎగసెన్= ఎగిరిపోయింది; మున్ను= ముందు; ఈశునుదుటన్= శివుడి ఫాల భాగంలో; అలుకన్= కోపంతో; పుట్టిన= ఉదయించిన; ఘర్మజలకణము= చెమటబొట్టు; ఇలన్= భూమిపై; పడ్డన్= పడగా; పెనుమంటలు= పెద్దజ్వాలలు; ఎగసినన్= పైకి లేవగా; అందున్= ఆ జ్వాలలలో; అరుణనేత్రకము= ఎర్రని కనులుకలది; నీలంబు= నల్లనిది; ఊర్ధ్వరోమకంబు= పైకి మొనచూపిన వెంట్రుకలు కలది; ఘోరభంగికంబు= భయంకరమైన ఆకృతికలదియు; ఐన+అంగంబుతోన్= అయినట్టి శరీరంతో; సప్తతంతుదాహి= యజ్ఞాన్ని కాల్చివేసేవాడు; అగుచున్= అవుతూ; పురుషుఁడు+ఒకరుఁడు= ఒక పురుషుడు; జనితుఁడు+అయ్యెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** రాజా! అప్పుడు భవానీదేవి చిత్తం గ్రహించి భవుడు ప్రమథగణాలతో కూడా తాను దక్షయజ్ఞాన్ని నాశనం చేయటానికై వెళ్ళాడు. అక్కడ శివభటులు యజ్ఞాంగాలను చీకాకు జేసి రక్తం చల్లి అగ్నిహోత్రాన్ని ఆర్పివేశారు. అంతట యజ్ఞం మృగరూపంతో ఆకాశాని కెగిరిపోయింది. ఈశ్వరుడి పాలభాగంలో కోపంవలన పుట్టిన చెమట బిందువొకటి భూమిపై పడింది. వెంటనే అక్కడ పెద్దమంటలు ఏర్పడ్డాయి. ఆ మంటలలో ఒక పురుషుడు ఎర్రని నేత్రాలు, నల్లనిరూపు, ఊర్ధ్వముఖమైన రోమాలు గల భయంకరమైన ఆకృతితో జన్మించాడు.

క. సురలు మునులు భయమునఁ బఱ । చిరి నలుగడ; బ్రహ్మ వచ్చి శివుఁ గని వినయో
త్తరముగ మ్రొక్కుచు 'నమరులు । పరికల్పించెదరు నీకు భాగము భక్తిన్. 440

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; మునులు= మౌనులు; భయమునన్= భీతితో; నలుగడ= నాలుగు దెసలకు; పఱచిరి= పరుగెత్తారు; బ్రహ్మ= అజుడు; వచ్చి= ఏతెంచి; శివున్= భవుడిని; కని= చూచి; వినయ+ఉత్తరముగన్= వినయప్రధానంగా; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; అమరులు= సురలు; నీకున్= శివుడ వగు నీకు; భక్తిన్= భక్తితో; భాగము= పాలు; పరికల్పించెదరు= ఏర్పాటు చేస్తారు.

**తాత్పర్యం:** అట్లా జరుగగానే దేవతలు, ఋషులు భయంతో నలుదిక్కులకు పారిపోయారు. అపుడు బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చి శివుడిని చూచి వినయభరితుడై నమస్కరిస్తూ 'దేవతలు నీకు యజ్ఞంలో భక్తితో భాగం కల్పిస్తారు.

వ. స్వామీ! కోపం బుపసంహరింపుము.' 441

**ప్రతిపదార్థం:** స్వామీ!= ప్రభూ!; కోపంబు= క్రోధాన్ని; ఉపసంహరింపుము= మరలించుము.

**తాత్పర్యం:** స్వామీ! కోపం మళ్ళించుకొమ్ము'.

**క. నావుడు నల్ల నగుచు న । ద్దేవుఁడు గరుణించి మునుల దేవతలను సం**
**భావింప భాగకల్పన । గావించిరి వార లా జగత్ప్రభువునకున్. 442**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; ఆ+దేవుఁడు= ఆ శివుడు; అల్లనగుచున్= మందహాసం చేస్తూ; కరుణించి= దయచూపి; మునులన్= మౌనులను; దేవతలను= సురలను; సంభావింపన్= గౌరవించగా; వారలు= ఆ మునులు, దేవతలు; ఆ జగత్ప్రభువునకున్= ఆ జగదీశ్వరుడికి; భాగకల్పన= పాలు కల్పించటం; కావించిరి= చేశారు.

**తాత్పర్యం:** బ్రహ్మ అట్లా అనగానే ఆ శివుడు దయతో మందహాసం చేస్తూ మునులనూ దేవతలనూ సంభావించాడు. వారు జగన్నాథుడైన ఆ దేవుడికి యజ్ఞంలో భాగం కల్పించారు.

**వ. అప్పరమేశ్వరుండు సుప్రసన్నుండై యనిమిషులకు మునిగణంబులకు నానందం బొసంగె; శతానందుం డయ్యిందుశేఖరునితో 'దేవా! నీనుదుటి చెమటం బుట్టిన యప్పురుషుండు జ్వరంబను నామంబున బ్రశస్తుండయి యెందునుం జరియించు; నీ జ్వరం బేకముఖత్వంబునం బృథివికి దుర్భరంబగు బహువిధంబుగా సృజియింపవే' యనుడు నగ్గిరీశుండు కరులకు శిరస్తాపనంబును, భుజంగంబులకు నిర్మోకంబును, గోవులకు ఖురాంతర్బాధనంబును, మృగంబులకు నైజస్వరూపదర్శన ప్రత్యవరోధనంబును, దురగంబులకుఁ బార్శ్వశోషణంబును, మయూరంబులకుఁ బత్త్రోద్భేదనంబును, గోకిలంబులకు నేత్రరోగంబును, శుకంబులకు హిక్కయు, నజంబులకుఁ జిత్తభ్రమణంబును, శార్దూలంబులకు శ్రమంబును, మనుష్యులకు జననమరణాదుల యెడ వేదనావేశంబునుంగా విభాగించె; నిది జ్వరప్రకారంబు. జ్వరంబు మాహేశ్వరతేజంబు గావున సర్వజనంబులకు నమస్కార్యంబును, మాననీయంబునై యుండు. 443**

**ప్రతిపదార్థం:** ఆ+పరమేశ్వరుండు= ఆ శివుడు; సుప్రసన్నుండు+ఐ= అత్యంతానుగ్రహంకలవాడై; అనిమిషులకున్= దేవతలకు; మునిగణంబులకున్= ముని బృందానికి; ఆనందంబు+ఒసంగెన్= సంతోషం కలిగించాడు; శతానందుండు= బ్రహ్మ; ఆ+ఇందుశేఖరునితోన్= ఆ చంద్రశేఖరుడితో; దేవా!= ప్రభూ!; నీ నుదుటి చెమటన్= నీ నొసలి స్వేదమునందు; పుట్టిన= జనించిన; ఆ+పురుషుండు= ఆ పురుషుడు; జ్వరంబు+అను= జ్వరం అనే; నామంబునన్= పేరుతో; ప్రశస్తుండు+అయి= ప్రసిద్ధుడై; ఎందునున్= ప్రతిచోటా; చరియించున్= తిరుగుతాడు; ఈ జ్వరంబు= ఇట్టి జ్వరం; ఏకముఖత్వంబునన్= ఒకే రూపుతో; పృథివికిన్= భూమికి; దుర్భరంబు+అగున్= భరించరాని దవుతుంది; బహువిధంబుగాన్= నానాముఖాలుగా; సృజియింపవే= సృష్టించుమా; అనుడున్= అని చెప్పగా; ఆ+గిరీశుండు= ఆ శివుడు; కరులకున్= ఏనుగులకు; శిరస్తాపనంబును= తల నొప్పియును; భుజంగంబులకున్= పాములకు; నిర్మోకంబునున్= కుబుసమును; గోవులకున్= ధేనువులకు; ఖురాంతర్బాధనంబునున్= గిట్టలలో నొప్పియును; మృగంబులకున్= జింకలకు; నైజస్వరూపదర్శనప్రత్యవరోధనంబునున్= తమస్వరూపాన్ని చూడటంలో ఆటంకమును; తురగంబులకున్= గుర్రాలకు; పార్శ్వశోషణంబునున్= ప్రక్కలు శుష్కించుటయును; మయూరంబులకున్= నెమళ్ళకు; పత్త్రోద్భేదనంబును= ఈకలు ఊడుటయును; కోకిలంబులకున్= కోయిలలకు; నేత్రరోగంబును= కంటివ్యాధియును; శుకంబులకున్= చిలుకలకు; హిక్కయున్= ఎక్కిళ్ళును; అజంబులకున్= మేకలకు; చిత్తభ్రమణంబును= మనస్సు భ్రమించుటయును; శార్దూలంబులకున్= పులులకు; శ్రమంబును= శ్రాంతియును; మనుష్యులకున్= మానవులకు; జనన మరణ+ఆదులయెడన్= పుట్టుక, చావు మొదలైన సందర్భాలలో; వేదనా+ఆవేశంబునున్+కాన్= దుఃఖావేశమును కాగా; విభాగించెన్= విభజించాడు; ఇవి= ఈ చెప్పినవి; జ్వరప్రకారంబు= జ్వరముయొక్క స్వరూపం; జ్వరంబు= జ్వరం; మహేశ్వరతేజంబు+అగున్= శివసంబంధమైన

తేజస్సు; కావునన్= అందువలన; సర్వజనంబులకున్= సమస్తప్రజలకు; నమస్కార్యంబునున్= నమస్కరించదగినదియును; మాననీయంబును= పూజించదగినదియును; ఐ+ఉండున్= అయి ఉన్నది.

**తాత్పర్యం:** ఆ శివుడు వారిపట్ల అనుగ్రహపరుడై దేవతలకు, మునులకూ ఆనందం కలిగించాడు. బ్రహ్మదేవుడు ఆ చంద్రశేఖరుడితో 'దేవా! నీ నొసటి చెమట నుండి పుట్టిన పురుషుడు 'జ్వరం' అనే పేరుతో ప్రసిద్ధుడవుతాడు. అతడు సర్వత్రా సంచరిస్తాడు. ఆ జ్వరం ఏకరూపమై ఉంటే భూమి భరించలేదు. అందువలన దానిని నానా రూపాలుగా సృష్టించుము' అని చెప్పాడు. అప్పుడు శంకరుడు ఆ జ్వరాన్ని ఏనుగులకు తలనొప్పిగా, పాములకు కుబుసంగా, గోవులకు గిట్టలలో నొప్పిగా, లేళ్ళకు తమరూపు చూచేదానికి ఆటంకంగా, గుర్రాలకు పార్శ్వభాగంలో శోషణంగా, నెమళ్ళకు ఈకలు ఊడిపోవటంగా, కోకిలలకు నేత్రవ్యాధిగా, చిలుకలకు వెక్కిళ్ళుగా, మేకలకు మనోభ్రాంతిగా, పులులకు శ్రమగా, మానవులకు చావుపుట్టుకలు మొదలైన సందర్భాలలో దుఃఖంగా విభజించాడు. ఇది జ్వరస్వరూపం. జ్వరం శివుడి తేజస్సు. అందుచేత అది అందరికీ నమస్కరించదగింది, సమ్మానించదగిందిగాఉన్నది.

**క.** **జ్వరకథ వినినఁ బఠించినఁ। బురుషుం డారోగ్యసిద్ధిఁ బొదలుం; దేజః**
**స్ఫురణముఁ జిత్తసమాధియు। దొరకొనుఁ; గోర్కులు ఫలించు; దురితము లడఁగున్.' 444**

**ప్రతిపదార్థం:** జ్వరకథ= జ్వరచరిత్ర; వినినన్= విన్నా; పఠించినన్= చదివినా; పురుషుఁడు= మనుజుడు; ఆరోగ్యసిద్ధిన్= ఆరోగ్య ప్రాప్తితో; పొదలున్= శోభిల్లుతాడు; తేజస్స్ఫురణమున్= తేజస్సుయొక్క దీప్తియును; చిత్తసమాధియున్= మనోనిగ్రహమును; దొరకొనున్= లభిస్తుంది; కోర్కులు= అభిలాషలు; ఫలించున్= ఫలిస్తాయి; దురితములు= పాపాలు; అడఁగున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** జ్వరముయొక్క ఈ చరిత్రను విన్నా, చదివినా పురుషుడు ఆరోగ్యం పొందుతాడు. అతడికి తేజస్సూ, చిత్తనిగ్రహమూ సిద్ధిస్తాయి. కోర్కెలు తీరుతాయి. పాపాలు తొలగిపోతాయి'.

**క.** **అని చెప్పి యమరతటినీ। తనూభవుం డాదరమున ధర్మసుతునితో**
**'ననఘా! నీ విం కెయ్యది। వినవల?' తనవుడు నతండు వినయానతుఁడై. 445**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; అమరతటినీ తనూభవుండు= గంగాసుతుడు; ఆదరమునన్= ప్రీతితో; ధర్మసుతునితోన్= ధర్మపుత్రుడితో; అనఘా!= పాపరహితుడా!; నీవు+ఇంకన్= నీవు ఇంకమీదట; ఏ+అది= ఏది; వినవలతు(వు)?= వినగోరుతున్నావు?; అనవుడున్= అనగా; అతండు= ధర్మజుడు; వినయ+ఆనతుఁడు+ఐ= వినయంతో ప్రణమిల్లినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పి భీష్ముడు ప్రీతితో ధర్మజుడిని చూచి 'అనఘా! నీ వింకా ఏమి వినాలనుకొంటున్నావు?' అని ప్రశ్నించాడు. అంతట ధర్మరాజు వినయంతో భీష్ముడికి నమస్కరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

### శాస్త్రతత్త్వం బెఱుంగని వాఁడు సేయవలసిన విధము (సం. 12-276-3)

**తే.** **'శాస్త్రతత్త్వ మెఱుంగక సంశయాత్ముఁ। డగుచుఁ బరమార్థ మిట్టిది యనఁగలేని**
**యట్టివాఁ డేమి కర్మంబు నాచరించు। వాఁడు సెప్పవె ధర్మప్రవర్తనజ్ఞ!' 446**

**ప్రతిపదార్థం:** ధర్మప్రవర్తనజ్ఞ!= ధర్మంయొక్క ప్రవృత్తిని తెలిసిన ఓ పితామహా!; శాస్త్రతత్త్వమున్= శాస్త్రముయొక్క నిజ స్వరూపాన్ని; ఎఱుంగక= తెలియక; సంశయ+ఆత్ముఁడు+అగుచున్= సందేహంతో కూడిన మనస్సు కలవాడవుతూ; పరమార్థము=

ముఖ్యార్థం; ఇట్టిది= ఇటువంటిది; అనఁగన్ లేని అట్టివాఁడు= అనజాలని మనుజుడు; ఏమి కర్మంబున్= ఏ పనిని; ఆచరించువాఁడు= చేయువాడు; చెప్పవె!= వివరించుమా!

**తాత్పర్యం:** 'ధర్మప్రవృత్తిని గ్రహించిన పితామహా! శాస్త్రతత్త్వం ఏమిటో తెలియక సందేహించేవాడు ఇదమిత్థమని పరమార్థం గ్రహించజాలడు. అట్లాంటివాడు ఏ పని చేస్తాడో వివరించుము.

**వ. అని యడిగిన నమ్మహామతి యతని కిట్లను 'గురుపూజయు వృద్ధోపసేవనంబును విద్యాశ్రవణంబు నవశ్యకర్తవ్యంబులు; మఱియునుం జేయవలయునవి నారద గాలవ సంవాదంబు వినినం దెలియు; వినుము చెప్పెద; నారదు నాశ్రయించి గాలవుండు. 447**

**ప్రతిపదార్థం:** అని అడిగినన్= అని ప్రశ్నించగా; ఆ+మహామతి= ఆ మహాబుద్ధి అయిన భీష్ముడు; అతనికిన్= ధర్మజుడికి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; గురుపూజయున్= ఆచార్యులను అర్చించటమూ; వృద్ధ+ఉపసేవనంబును= పెద్దలను సేవించటమూ; విద్యాశ్రవణంబున్= విద్యను వినటమూ; అవశ్యకర్తవ్యంబులు= తప్పక చేయదగినవి; మఱియునున్= ఇంకను; చేయవలయునవి= అనుష్ఠించవలసినవి; నారద గాలవ సంవాదంబున్= నారదగాలవమునుల సంభాషణమును; వినినన్= వింటే; తెలియున్= తెలుస్తుంది; చెప్పెదన్= వివరిస్తాను; వినుము= ఆకర్ణించుము; గాలవుండు= గాలవుడను ముని; నారదున్+ఆశ్రయించి= నారదుడిని చేరి.

**తాత్పర్యం:** ధర్మజుడు అట్లా అడిగేసరికి మహాబుద్ధిమంతు డయిన భీష్ము డతడితో ఇట్లా అన్నాడు: 'గురువులను పూజించటం, వృద్ధులను సేవించటం, విద్యను వినటం తప్పక చేయదగిన పనులు. ఇంకా చేయదగినవి నారదగాలవుల మధ్య జరిగిన సంవాదం వింటే తెలియవస్తాయి. ఆ సంవాదం చెప్పుతాను, వినుము. గాలవుడు నారదమునిని ఆశ్రయించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నానా శాస్త్రంబుల న । ర్థానేకత్వంబు గనుచు నప్రాప్త సువి**
**జ్ఞానపరినిష్ఠ మగు మ । న్మానసముం దేర్పవే సమగ్రవివేకా!' 448**

**ప్రతిపదార్థం:** సమగ్రవివేకా!= పూర్ణవివేకం కలవాడా!; నానా శాస్త్రంబులన్= వివిధ శాస్త్రాలలో; అర్థ+అనేకత్వంబున్= విషయాల బాహుళ్యాన్ని; కనుచున్= చూస్తూ; అప్రాప్తసువిజ్ఞాన పరినిష్ఠము+అగు= పొందబడని మంచి విజ్ఞానమునందు నిష్ఠను పొందనిదైన; మన్మానసమున్= నా చిత్తాన్ని; తేర్పవే!= ప్రసన్నత పొందించుమా!

**తాత్పర్యం:** పూర్ణవివేకం కల ఓ నారదమునీంద్రా! నేను అనేక శాస్త్రాలు చూచాను. అందులోని నానా విషయాలు నా దృష్టికి వచ్చాయి. కాని, మంచి విజ్ఞానంలో నా మనస్సు నిలుకడ పొందలేదు. ఇట్లాంటి నా చిత్తం ప్రసన్నమయ్యేటట్లు నాకు బోధచేయుము'.

**వ. అని యభ్యర్థించిన నద్దేవముని యమ్మహాద్విజున కిట్లనియె. 449**

**ప్రతిపదార్థం:** అని+అభ్యర్థించినన్= అని కోరగా; ఆ+దేవముని= ఆ నారదముని; ఆ+మహాద్విజునకున్= ఆ మహాబ్రాహ్మణుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** గాలవుడు ఆ రీతిగా అడిగేసరికి నారదమునీంద్రుడు ఆ మహావిప్రుడిని చూచి ఇట్లా చెప్పాడు.

**క. చతురాశ్రమముల వృత్త । స్థితులు పరీక్షించి యందుఁ జెందఁదలఁచి త**
**ద్గతి సూక్ష్మదృష్టిఁ గనుఁగొని । సతతంబుఁ ద్రివర్గచరిత సౌమ్యుం డగుచున్. 450**

**ప్రతిపదార్థం:** చతురాశ్రమముల వృత్తస్థితులు= బ్రహ్మచర్యం మొదలైన నాల్గు ఆశ్రమాల వర్తనాలు, పరిస్థితులు; పరీక్షించి= పరికించి; అందున్= ఆ ఆశ్రమాలలో; చెందన్+తలఁచి= ప్రవేశించటానికి సంకల్పించి; తద్గతిన్= వాటి పోకడను; సూక్ష్మదృష్టిన్= సూక్ష్మమైన చూపుతో; కనుఁగొని= చూచి; సతతంబున్= ఎల్లవేళలా; త్రివర్గచరితన్= ధర్మాదులైన త్రివర్గాల నడతతో; సౌమ్యుండు+అగుచున్= శోభిల్లిన వాడు అవుతూ.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే నాలుగాశ్రమాల పరిస్థితులనూ పరికించాలి. అందులో ప్రవేశించదలచినవాడు వాటి పోకడను సూక్ష్మదృష్టితో చూడాలి. సదా ధర్మార్థకామాల నడవడికలో సౌమ్యభావం కలిగి ఉంటూ (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **పాపకర్మంబు లెల్లనుఁ బాయఁ బెట్టి । పుణ్యకృత్యంబు లగువానిఁ బురుషుఁ డోపి**
**నట్లు శుద్ధమనస్కుఁడై యాచరించు । వాఁడు సజ్జనసంగతి వలయు నెపుడు.** **451**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు= మానవుడు; పాపకర్మంబులు+ఎల్లనున్= పాపపు పనులన్నింటినీ; పాయన్+పెట్టి= త్యజించి; పుణ్యకృత్యంబులు+అగువానిన్= పుణ్యకార్యములైన వాటిని; ఓపినట్లు= శక్తి ననుసరించి; శుద్ధమనస్కుఁడు+ఐ= నిర్మలమైన చిత్తం కలవాడై; ఆచరించువాఁడు= చేసేవాడు కావాలి; ఎపుడున్= ఎల్లవేళలా; సజ్జనసంగతి= సాధుజనులతోడి పొత్తు; వలయున్= ఆవశ్యకమై ఉన్నది.

**తాత్పర్యం:** మనుజుడు పాపానికి హేతువులైన పను లన్నిటినీ వదలాలి. యథాశక్తి పవిత్రమైన చిత్తంతో పుణ్యకార్యాలు మాత్రమే చేయాలి. సదా సజ్జనులతో సాంగత్యం కలిగి ఉండాలి.

**విశేషం:** దుర్జనులతో సాంగత్యం వలన దుష్టసంస్కారాలు కలుగుతాయి. అందుచేత పాపకర్మల పట్ల ప్రవృత్తి కలుగుతుంది. పుణ్యకార్యాలు మాత్రమే చేయాలంటే అందుకు తగిన సంస్కారం సజ్జన సాంగత్యంతో సిద్ధిస్తుంది. అందుకే సజ్జనసంగతి అవసరమని చెప్పటమయింది.

**క.** **విను సర్వభూతముల యం । దును మార్దవయుక్తుఁడై మధుర వాగ్వృత్తిం**
**బనుపడఁగవలయు; నార్జవ । మనూనముగ దేవపితృసమర్చకుఁ డగుచున్.** **452**

**ప్రతిపదార్థం:** విను= వినుము; ఆర్జవము= ఋజుత్వం; అనూనముగన్= వెలితిలేనిది కాగా; దేవపితృసమర్చకుఁడు+అగుచున్= దేవతలకు, పితృదేవతలకు పూజలు చేసేవాడవుతూ; సర్వభూతముల+అందునున్= సమస్తప్రాణులందును; మార్దవయుక్తుఁడు+ఐ= మెత్తదనంతో కూడినవాడై; మధురవాగ్వృత్తిన్= తియ్యని వాగ్వ్యాపారమునందు; పనుపడఁగన్ వలయున్= వాడుక పడాలి.

**తాత్పర్యం:** ఇంకా వినుము. పురుషుడు కపటవృత్తిని వదలి ఋజుత్వాన్ని పూర్ణంగా కలిగి ఉండాలి. దేవతలనూ, పితృదేవతలనూ శాస్త్రోక్తవిధి ప్రకారం పూజించాలి. ఎల్లప్రాణుల పట్లా కాఠిన్యం వదలి మెత్తదనంతో వ్యవహరించాలి. మధురమైన మాటలకు అలవాటు పడాలి.

**క.** **అనహంకారము, నప్రా । ర్థనమును విషయములఁ బెద్ద దగులమియును మే;**
**లనఘా! పరునిందించుట । దను వర్ణించుకొను టనుచితము లెయ్యెడలన్.** **453**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; అనహంకారమున్= అహంకారం లేకుండా ఉండటం; అప్రార్థనమును= యాచనలేకుండా ఉండటం; విషయములన్= శబ్దం, స్పర్శం మొదలైన విషయ సుఖాలలో; పెద్ద= మిక్కిలిగా; తగులమియును= ఆసక్తుడు కాకుండా ఉండటమూ; మేలు= శ్రేయస్కరం; ఏ+ఎడలన్= ఏ సందర్భంలోనైనా; పరున్= ఇతరుడిని; నిందించుట= తూలనాడటమూ; తనున్= తనను; వర్ణించుకొనుట= శ్లాఘించుకొనటమూ; అనుచితములు= తగని పనులు.

**తాత్పర్యం:** కల్మషరహితుడవైన ఓ గాలవమునీంద్రా! పురుషుడికి అహంకారం పనికిరాదు. యాచన కూడదు. అట్లాగే శబ్దస్పర్శ రూపరసగంధా లనే విషయాలలో అపరిమితమైన ఆసక్తి తగదు. అహంకారాది దోషాలు లేకుండా ఉంటే మేలు కలుగుతుంది. ఎప్పుడైనా సరే ఇతరులను నిందించటం, తనను తాను పొగడుకొనటమనేవి తగవు.

**క. విను మలసుండును గర్వియు । ననర్థభాషియును మత్సరాలీఢుఁడుఁ గ్రో**
**ధనుఁడును గా వలవదు శ । క్త్యనురూపతఁ జేయవలయు నాతిథ్యంబున్. 454**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; అలసుండును= సోమరియు; గర్వియున్= గర్వం కలవాడూ; అనర్థభాషియును= అర్థరహితంగా మాట్లాడేవాడును; మత్సర+ఆలీఢుఁడున్= మచ్చరంచేత స్పృశించబడినవాడునూ; క్రోధనుఁడునున్= కోపం కలవాడును; కావలవదు= కాదగదు; ఆతిథ్యంబున్= అతిథిసత్కారాన్ని; శక్త్యనురూపతన్= శక్తికి తగినట్లుగా; చేయన్ వలయున్= ఆచరించాలి.

**తాత్పర్యం:** గాలవా! ఇంకా వినుము. మనుజుడు సోమరిపోతు, గర్వగ్రస్తుడు, నిష్ప్రయోజనంగా ఏదేదో మాటలాడేవాడు, మాత్సర్యదోషం కలవాడు, కోపశాలి కారాదు. అతిథులకు తన శక్తిననుసరించి సత్కారం చేయాలి. (శక్తికి మించిగాని, శక్తికి తక్కువగాకాని ఆతిథ్యం చేయదగదని భావం).

**క. వేదాధ్యయనంబుఁ దదం । గాదరణము యజ్ఞవిధిసమారంభము ధా**
**త్రీదైవత సమ్మానము । నే దేశమునందుఁ గలుగు నిర వది నిలువన్. 455**

**ప్రతిపదార్థం:** ఏ దేశమునందున్= ఏ భూ భాగములో; వేద+అధ్యయనంబున్= వేదాలు చదవటమును; తదంగ+ఆదరణమున్= వేదాల అంగాలను ఆదరించటమూ; యజ్ఞవిధి సమారంభమున్= యజ్ఞకార్యప్రయత్నమున్ను; ధాత్రీదైవత సమ్మానమున్= భూసురసత్కారమున్ను; కలుగున్= ఉండునో; అది= ఆ దేశం; నిలువన్= నివసించటానికి; ఇరవు= (తగిన) స్థానం.

**తాత్పర్యం:** వేదాధ్యయనం, వేదాంగాలైన శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - అనే ఆరు శాస్త్రాలపట్ల ప్రీతి, యజ్ఞాచరణం, బ్రాహ్మణసమ్మానమూ - ఏ దేశంలో ఉంటాయో, ఆ దేశమే నివసించటానికి తగిన ప్రదేశమవుతుంది.

**క. ఇత్తెఱఁగునఁ బురుషుం డ । త్యుత్తమ చరితముల నడచుచుండఁగఁ బాయుం**
**జిత్తంబుకలఁక బోధో । త్పత్తికి నది మూల మగు నధర్మవిదూరా!' 456**

**ప్రతిపదార్థం:** అధర్మవిదూరా!= అధర్మానికి మిక్కిలి దూరంగా ఉన్నవాడా!; ఈ+తెఱఁగునన్= ఈ రీతిగా; పురుషుండు= మనుజుడు; అత్యుత్తమచరితములన్= మిక్కిలి శ్రేష్ఠమైన ప్రవర్తనలతో; నడచుచుండఁగన్= చరిస్తూ ఉంటే; చిత్తంబుకలఁక= మనస్సులోని మాలిన్యం; పాయున్= తొలగుతుంది; అది= అట్లా చిత్తమాలిన్యం తొలగటం; బోధ+ఉత్పత్తికిన్= జ్ఞానం కలగటానికి; మూలము+అగున్= కారణమవుతుంది.

**తాత్పర్యం:** అధర్మప్రవృత్తిలేని ఓ గాలవమునీ! ఈ రీతిగా మనుష్యుడు పవిత్రమైన నడవడిక కలిగి ప్రవర్తిస్తే అతడి చిత్తదోషం పరిహరించబడుతుంది. ఆ దోషం తొలగగానే అతడికి జ్ఞానోదయ మవుతుంది'.

**క. అని చెప్పె ననుడుఁ గుంతీ । తనయాగ్రజుఁ డమరతటిని తనయునితో ని**
**ట్లనుఁ 'గాలపాశసంఛే । దనమును ననుబోఁటి యెవ్విధంబునఁ జేయున్?' 457**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= అని వచించాడు; అనుడున్= అనగా; కుంతీతనయ+అగ్రజుఁడు= కుంతిపుత్రులలో పెద్దవాడైన ధర్మజుడు; అమరతటిని తనయునితోన్= గంగాసుతుడైన భీష్ముడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ననుబోఁటి= నావంటివాడు; ఏ+విధంబునన్= ఏ రీతిగా; కాలపాశసంఛేదనమునున్= కాలమనే త్రాడును తెగకోయటాన్ని; చేయున్?= చేస్తాడు?

**తాత్పర్యం:** అని నారదుడు గాలవుడితో చెప్పాడని భీష్ముడు ధర్మజుడితో చెప్పాడు. అప్పుడు ధర్మసుతుడు భీష్ముడితో మళ్ళీ ఇట్లా అన్నాడు: 'నావంటి వాడు కాలపాశాన్ని ఎట్లా ఛేదించగలడు?'

**వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 458**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మజు డట్లా ప్రశ్నించగా భీష్ముడు అతడితో ఇట్లా అన్నాడు:

**అరిష్టనేమి యను ముని సగరున కుపదేశించిన ధర్మప్రకారము (సం. 12-277-2)**

**ఆ. 'విను మరిష్టనేమి యను ముని నడిగె నీ । యడిగినట్ల సగరుఁ; డమ్మహాత్ముఁ**
**డన్నరేంద్రునకుఁ బ్రియంబునఁ జెప్పిన । సౌమ్యవాక్యములు ప్రశాంతిఁ జేయు. 459**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; సగరుఁడు= సగరచక్రవర్తి; అరిష్టనేమి అను మునిన్= 'అరిష్టనేమి' అనే ఋషిని; నీ+అడిగినట్లు+అ= నీవు ప్రశ్నించినట్లే; అడిగెన్= ప్రశ్నించాడు; ఆ+మహాత్ముఁడు= ఆ అరిష్టనేమి; ఆ+నరేంద్రునకున్= ఆ రాజుకు; ప్రియంబునన్= ప్రీతితో; చెప్పిన= వచించిన; సౌమ్యవాక్యములు= తిన్నని మాటలు; ప్రశాంతిన్+చేయున్= ప్రకృష్టమైన శాంతిని కలిగిస్తాయి.

**తాత్పర్యం:** 'ధర్మజా! వినుము. నీవు నన్ను ఇప్పు డడిగిన రీతిగానే పూర్వం సగరుడనే నృపాలుడు అరిష్టనేమి అనే మునీంద్రుడిని ప్రశ్నించాడు. ఆ ముని ఆ రాజుకు ప్రీతితో అపుడు చెప్పిన శాంతవచనాలు వింటే మనస్సుకు శాంతి కలుగుతుంది.

**వ. వానిం జెప్పెద నవహితుండవై వినుము. సగరుం బ్రబోధించుటకు నరిష్టనేమి యిట్లను. ధనధాన్య పశుకళత్ర పుత్త్రాదుల సందడింబడి డెందం బాకులంబగునేని ముక్తిమార్గంబు దుర్గమంబై యుండు. 460**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ వచనాలను; చెప్పెదన్= చెప్పుతాను; అవహితుండవు+ఐ= అవధానం కలవాడవై; వినుము= ఆలకించుము; అరిష్టనేమి= అరిష్టనేమి అనే మునీంద్రుడు; సగరున్= సగరచక్రవర్తిని; ప్రబోధించుటకున్= చక్కగా బోధించటానికి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ధనధాన్య పశుకళత్ర పుత్రాదులు= ధనం, ధాన్యం, పశువులు, భార్య, బిడ్డలు మొదలైనవారి; సందడిన్= సమూహపు ఒత్తిడిలో; పడి= లగ్నమై; డెందంబు= హృదయం; ఆకులంబు+అగునేనిన్= వ్యాకులత చెందినట్లైతే; ముక్తిమార్గంబు= మోక్షపుదారి; దుర్గమంబు+ఐ+ఉండున్= పోగూడనిదై ఉంటుంది.

**తాత్పర్యం:** ధర్మజా! ఆ మాటలు చెప్పుతాను, సావధానంగా వినుము. సగరనృపుడిని ప్రబుద్ధుడిని చేయటానికై అరిష్టనేమి ఇలా అన్నాడు: 'ధనం, ధాన్యం, పశువులు, భార్య, పుత్రులు మొదలైన జనసమూహపు టొత్తిడిలో తగులుకొని చిత్తం వ్యాకులత్వం పొందితే మోక్షమార్గం త్రొక్కరానిదై పోతుంది.

**సీ.** **వృద్ధ కళత్రంబు బుద్ధిమత్పుత్రుల । విడిచి నిర్భరత వివిక్త దేశ**
**మునకుఁ బోవలయు; సపుత్రుం డపుత్రకుం । డను విశేషంబు లే; దతులశాంతి**
**వైరాగ్యములు గలవానికి విను నృప । వర్య! బంధులఁబ్రోవవలదె యను త**
**లంపున సంసారలంపటుం డగువాఁడు । బేల; దా మృత్యువుపాలు వడిన**

**ఆ.** **యపుడవారి నరయ నబ్బునే యద్దశఁ । దలఁచి ముక్తి గోరఁదగదె యట్లుఁ**
**గాక తనకు వారు గలుగుదురే యప్పు । డదియుఁ దలఁపవలయు నదియ కాదె!** **461**

**ప్రతిపదార్థం:** నృపవర్య!= రాజశ్రేష్ఠా!; విను= ఆలకించుము; వృద్ధకళత్రంబున్= ముసలిదైన భార్యను; బుద్ధిమత్పుత్రులన్= బుద్ధిమంతులైన కుమారులను; విడిచి= వదలి; నిర్భరతన్= నిబ్బరంతో; వివిక్తదేశమునకున్= జనశూన్యమైన చోటికి; పోవలయున్= వెళ్ళవలెను; అతులశాంతి వైరాగ్యములు= సాటిలేని శమము, విరక్తి; కలవానికిన్= కల్గినవాడికి; సపుత్రకుండు= పుత్రులు కలవాడు; అపుత్రకుండు= పుత్రులు లేనివాడు; అనువిశేషంబు= అనే భేదం; లేదు= ఉన్నదికాదు; బంధులన్= చుట్టాలను; ప్రోవన్ వలదె?= రక్షింపవద్దా?; అను తలంపునన్= అనే సంకల్పంతో; సంసారలంపటుండు+అగువాఁడు= సంసారంలో మిక్కిలిగా ఆసక్తుడైనవాడు; బేల= మూఢుడు; తాన్= తాను; మృత్యువుపాలుపడినన్= మరణిస్తే; అప్పుడు= ఆ సమయంలో; వారిన్= ఆ బంధువులను; అరయన్ వచ్చునే?= కాపాడనగునా?; ఆ+దశన్= ఆ స్థితిని; తలఁచి= భావించి; ముక్తి= మోక్షం; కోరన్+తగదె?= అభిలషింపదగదా?; అట్లున్+కాక= అట్లా కాకున్న; అప్పుడు= తాను మరణించే సమయాన; తనకున్ వారు కలుగుదురే?= తన విషయంలో బంధువులు సాయపడతారా?; అదియున్= ఆ విషయంకూడ; తలఁపన్ వలయునదియ కాదె!= ఆలోచించదగిందే కదా!

**తాత్పర్యం:** రాజేంద్రా! వినుము. మనుజుడు వార్ధకదశలో ఉన్న భార్యను, బుద్ధిమంతులైన పుత్రులనూ వదలి నిబ్బరంగా ఏకాంతప్రదేశానికి పోవాలి. శాంతి, వైరాగ్యం కలవాడు తప్పక అట్లా పోతాడు, కాని అతడు బిడ్డలు కలవాడా? లేక లేనివాడా అనే తేడా లేదు. బిడ్డలున్నా విడిచి విరక్తుడు విజనస్థలానికి వెళ్ళుతాడు. సంసారంలో పూర్తిగా మునిగిపోయిన వాడు ఈ బంధువులను నేను రక్షించవద్దా? - అనే తలంపు కలిగి ఉంటాడు. అట్లాంటి వాడు మూర్ఖుడు. ఒకవేళ తాను మరణించాడనుకో, అపుడు వారి నతడు కాపాడగలడా? ఆ స్థితిని ఊహించి ముందే ముక్తి కోరుకొనాలి. బంధువులను వదలకుండా ఉన్నా, తనకు మరణం ఆసన్నమైనపుడు వారు తనను కాపాడగలరా? లేక ముక్తిని ఈయగలరా? ఈ సంగతి కూడా ఆలోచించదగిన అంశమే కదా!

**తే.** **భూతముల పుట్టుఁ జేష్టయుఁ బొలియుటయును । జూచునేర్పు గలుగువాఁడు సూడనేర్చు**
**మోక్షమార్గంబు చిత్తంబు మూఢమైన । సక్తుఁడగు లోకగతి నెట్లు ముక్తి గలుగు?** **462**

**ప్రతిపదార్థం:** భూతముల పుట్టున్= ప్రాణుల పుట్టుకనూ; చేష్టయున్= అవి చేసే కర్మలూ; పొలియుటయునున్= తుదకు అవి మరణించటాన్నీ; చూచునేర్పు కలుగువాఁడు= పరిశీలించే చాతుర్యం కల బుద్ధిమంతుడు; మోక్షమార్గంబున్= ముక్తిపథాన్ని; చూడనేర్చున్= కనుగొనగలడు; చిత్తంబు= మనసు; మూఢమైనన్= మోహగ్రస్తమైతే; లోకగతిన్= లోకప్రవృత్తిలో; సక్తుఁడు+అగున్= ఆసక్తి కలవా డవుతాడు; ముక్తి= మోక్షం; ఎట్లు కలుగున్?= ఎట్లా సంభవిస్తుంది?

**తాత్పర్యం:** నిత్యం ప్రాణులు పుట్టి, కర్మలు చేసి, గిట్టుతూ ఉన్నాయి. దీనిని చక్కగా గమనించినవాడు మోక్షకాంక్షతో శ్రేయోమార్గంలో పయనిస్తాడు. ఎవడి చిత్తం సంసారవ్యామోహానికి లొంగిపోయిందో వాడు లోకప్రవృత్తిలో తగులుకొని ప్రేయోమార్గంలో పడిపోతాడు. ఇక వాడికి మోక్షం ఎట్లా కలుగుతుంది?

**క.** **అనఘ! దురన్నము శాల్యో । దనమును భూమియును మృదుల తల్పము నజిన**
**మ్మును సురుచిరచీనాంబర । మును సరి యెవ్వనికి నతఁడు ముక్తిం బడయున్.** **463**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఎవ్వనికిన్= ఏ మనుజుడికి; దురన్నమున్= దుష్టాన్నమును; శాల్యోదనమునున్= మేలైన వరి అన్నమున్నూ; భూమియును= కటికనేలయు; మృదులతల్పమున్= మెత్తని శయ్యయు; అజినమ్మునున్= జింకచర్మమును; సురుచిర చీనాంబరమునున్= అందమైన పట్టువస్త్రమును; సరి= సమానమో; అతఁడు= అట్లాంటివాడు; ముక్తిన్= మోక్షమును; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ రాజా! ఎవడు దుష్టాన్నమునూ, మేలైన మృష్టాన్నాన్నీ, కటికనేలనూ, మెత్తని హంసతూలికాతల్పాన్నీ, జింకచర్మాన్నీ, అందమైన పట్టు పీతాంబరాన్నీ సమదృష్టితో చూస్తాడో వాడు ముక్తి పొందుతాడు.

**తే.** **నేలయెల్లను నేలిన నృపుల పుట్టు । నీగిపోకయుఁ జూపాదిగాఁగఁ గలుగు**
**శక్తు లెడలినఁ జెడు మేని చందమును ద । లంప నేర్చునతఁడు మోక్షలక్ష్మిఁ జెందు.** **464**

**ప్రతిపదార్థం:** నేల+ఎల్లనున్= సమస్త భూమండలాన్నీ; ఏలిన= పాలించిన; నృపుల పుట్టున్= రాజుల జన్మయు; ఈగిపోకయున్= వెనుకకొరగి పోవటమున్నూ; చూపు+ఆది కాఁగన్+కలుగు= చూపు మొదలుగాగల; శక్తులు= సామర్థ్యాలు; ఎడలినన్= తొలగిపోగా; చెడు= చెడిపోతున్న; మేనిచందమునున్= శరీరస్థితిని; తలంపన్ నేర్చునతఁడు= భావించగల వాడు; మోక్షలక్ష్మిన్= మోక్షశ్రీని; చెందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** సమస్త భూమండలాన్నీ పరిపాలించిన మహారాజులు సైతం కాలం చెల్లగానే నేలకొరగి పోతున్నారు. చూపు మొదలైన ఇంద్రియశక్తులు ఉడిగిపోగానే శరీరం చెడిపోతున్నది. దీనిని చక్కగా భావించి సంసారముయొక్క నిస్సారతను గమనించగలవాడు మోక్షలక్ష్మిని చేపట్టగలడు.

**క.** **ధనయోగము దుర్లభమని । యును గ్లేశము సులభ మనియు నూహించుచు నె**
**మ్మనమున మర్త్యత్వము గీ । డని యెఱుఁగు నతండు గను మహానందంబున్.** **465**

**ప్రతిపదార్థం:** ధనయోగము= అర్థప్రాప్తి; దుర్లభము+అనియునున్= పొంద శక్యం కానిదనీ; క్లేశము= దుఃఖం; సులభము+అనియున్= అనాయాసంగా పొందబడునదనీ; ఊహించుచున్= భావిస్తూ; నెమ్మనమునన్= చిత్తంలో; మర్త్యత్వము= మనుష్యత్వం; కీడు+అని= అశుభమనీ; ఎఱుఁగు అతండు= తెలిసికొనే వాడు; మహానందంబున్= మోక్షానందాన్ని; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ లోకంలో సుఖజీవనాని కవసరమైన ధనాన్ని సంపాదించటం సులభమైన విషయం కాదు. ఏ ప్రయత్నం చేయకుండానే వచ్చేవి క్లేశాలు అని భావించాలి. ఈ భావనవలన మానవత్వం శుభప్రదం కాదన్న సత్యం తెలియవస్తుంది. అట్లా గ్రహించినవాడు మోక్షం పొంది నిరతిశయానందాన్ని అందుకొంటాడు.

**క.** **కావున గృహస్థవృత్తి । న్నీవతిలోలుఁడవు గాక నెఱిఁ జేయుము ర**
**క్షావిధి ధరణీప్రజకుం । గైవల్యము దాన నీకుఁ గలుగుం జులుకన్.'** **466**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; నీవు గృహస్థవృత్తిన్= నీవు గృహస్థుడికి చెందిన వర్తనంలో; అతిలోలుఁడవు కాక= మిక్కిలి ఆసక్తికలవాడవు కాకుండా; నెఱిన్= క్రమంగా; ధరణీప్రజకున్= భూమిలోని జనులకు; రక్షావిధిన్= రక్షణకార్యాన్ని; చేయుము= ఆచరించుము; దానన్= దానివలన; కైవల్యము= ముక్తి; చులుకన్= అనాయాసంగా; నీకున్+కలుగున్= నీకు సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** అందుచేత నీవు గృహస్థులకు చెందిన నడతలో లంపటుడవు కావద్దు. క్రమంగా జనానీకాన్ని నీ విధ్యుక్తధర్మం పాటించి పరిపాలించుము. అందువలన నీకు కష్టం లేకుండా మోక్షం సిద్ధిస్తుంది'.

**క. అని బోధించిన సగరుం । డనయముఁ దెలివొంది నియతుఁడై ప్రజ రక్షిం**
**చె నరేంద్ర! నీవుఁ దద్వ । ర్తనమున నెగడుము జనాభిరంజన మొప్పన్.' 467**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; అని బోధించినన్= అరిష్టనేమి ఈ రీతిగా బోధించగా; సగరుండు= సగరు డనే భూపాలకుడు; అనయమున్= మిక్కిలి; తెలివి+ఒంది= వివేకం పొంది; నియతుఁడు+ఐ= నియమం కలవాడై; ప్రజన్= జనులను; రక్షించెన్= కాపాడాడు; నీవున్= నీవు కూడ; తద్వర్తనమునన్= అట్టి ప్రవర్తనతో; జన+అభిరంజనము= ప్రజారంజనం; ఒప్పన్= విలసిల్లగా; నెగడుము= వర్ధిల్లుము.

**తాత్పర్యం:** అరిష్టనేమి అట్లా ప్రబోధించేసరికి సగరచక్రవర్తి ప్రబోధితుడయ్యాడు. నియమవంతుడై ప్రజాపాలన కొనసాగించాడు. ధర్మరాజా! నీవు కూడా అతడివలె వర్తించి ప్రజలు రంజిల్లేటట్లుగా రాజ్యపాలన చేసి వర్ధిల్లుము.

**తే. అనినఁ బ్రియమంది పాండవేయాగ్రజుండు । 'ధర్మ విద్వేషపరులగు దానవులకు**
**మంత్రియై యుండు శుక్రత్వ మహిమ యెట్లు । గలిగె భార్గవునకుఁ బుణ్యగణ్యచరిత!' 468**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పాండవేయ+అగ్రజుండు= ధర్మజుడు; ప్రియము+అంది= ప్రీతినొంది; పుణ్యగణ్యచరిత్ర!= పుణ్యంచే గణనీయమైన శీలంకలవాడా!; భార్గవునకున్= శుక్రుడికి; ధర్మవిద్వేషపరులు+అగు= ధర్మాన్ని ద్వేషించేవారయిన; దానవులకున్= రక్కసులకు; మంత్రి+ఐ+ఉండు= అమాత్యుడై ఉండునట్టి; శుక్రత్వ మహిమ= శుక్రత్వప్రభావం; ఎట్లు= ఎట్లా; కలిగెన్?= సంభవించింది?

**తాత్పర్యం:** భీష్ముడు ఆ విధంగా చెప్పగా విని ధర్మరాజు ప్రీతి పొందాడు. మళ్ళీ భీష్ముడితో ఇలా అన్నాడు: 'పుణ్యంతో ప్రసిద్ధి పొందిన సచ్చరిత్రగల ఓ పితామహా! రాక్షసులు ధర్మాన్ని ద్వేషించేవారుకదా! వారికి మంత్రిగా మనగలిగే 'శుక్రత్వం' అనే మహిమ భార్గవుడికి ఎట్లా కలిగింది?'

### శుక్రనామంబు భార్గవునకుం గలిగిన విధము (సం. 12-278-4)

**చ. అనవుడు భీష్ముఁ డిట్లనియె 'నాతఁడు యోగబలంబు పెంపునన్**
**ధనదుని మోసపుచ్చి తదుదాత్త ధనం బవలీలఁ గొన్న నె**
**మ్మనమున నొచ్చి చెప్పెఁ బురమర్దనుతోడ; నతండు దానికిం**
**గనలున నమ్మహేశ్వరుఁడు గన్నుల నిప్పులు రాలుచుండఁగన్. 469**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ప్రశ్నించగా; భీష్ముఁడు= పితామహుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; ఆతఁడు= ఆ భార్గవుడు; యోగబలంబు పెంపునన్= యోగానికి చెందిన బలాతిశయంతో; ధనదునిన్= కుబేరుడిని; మోసపుచ్చి= వంచించి; తదుదాత్త ధనంబున్= ఆ కుబేరుడి శ్రేష్ఠమైన సంపదను; అవలీలన్= అనాయాసంగా; కొన్నన్= గ్రహించగా; అతండు= ఆ కుబేరుడు; నెమ్మనమునన్= హృదయంలో; నొచ్చి= బాధపడి; పురమర్దనుతోడన్= శివుడితో; చెప్పెన్= చెప్పాడు; దానికిన్= అందుకు; కనలునన్= కోపంతో; మహేశ్వరుఁడు= శివుడు; కన్నులన్= నేత్రాలలో; నిప్పులు= అగ్నికణాలు; రాలుచుండఁగన్= జారిపడుతూ ఉండగా.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా ప్రశ్నించేసరికి భీష్ము డతడితో ఇట్లా అన్నాడు: 'భార్గవుడు గొప్ప యోగబలం ప్రదర్శించి కుబేరుడిని వంచించాడు. అతడి ధనం అనాయాసంగా అపహరించాడు. అందుకు కుబేరుడు చిత్తంలో చాలా నొచ్చుకొని తన మిత్రుడూ, త్రిపురాసుర సంహారకర్తా అయిన శివుడితో జరిగిన సంగతి చెప్పాడు. అది వినగానే శివుడికి కోపం వచ్చింది. ఆగ్రహాతిశయం వలన అతడి కన్నులనుండి నిప్పులు రాలాయి. అట్లా రాలుతూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. శూల ముగ్రత నెత్తి 'యెచ్చోట నున్న। వాఁడు భార్గవుఁ?' డనుచు దుర్వారకోప**
**వివశుఁ డగుటయు? నాతఁడు వెఱచి చాల। దూరముగఁ బోయి తుప్పలఁ దూలియుండె. 470**

**ప్రతిపదార్థం:** ఉగ్రతన్= భయంకరత్వంతో; శూలమున్= శూలాయుధాన్ని; ఎత్తి= చేపట్టి; భార్గవుఁడు= శుక్రుడు; ఏ+చోటన్= ఎక్కడ; ఉన్నవాఁడు+అనుచున్= ఉన్నాడంటూ; దుర్వారకోప వివశుఁడు+అగుటయు= వారించరాని కోపంచేత వశంతప్పినవాడు కాగానే; ఆతఁడు= ఆ భార్గవుడు; చాలన్= మిక్కిలి; వెఱచి= భయపడి; దూరముగన్+పోయి= దూరంగా వెళ్ళి; తుప్పలన్= చిన్న పొదలలో; తూలిఉండెన్= నక్కి ఉన్నాడు.

**తాత్పర్యం:** శివుడు భీకరంగా శూలాయుధం పైకెత్తి 'భార్గవుడు ఎక్కడ ఉన్నాడు?' అంటూ అత్యధిక కోపంతో వివశుడైనాడు. అది చూచి చాలా భయపడి భార్గవుడు పరుగెత్తి దూరంగాపోయి చిన్న పొదలలో ఒదిగి ఉన్నాడు.

**క. అమ్మెయి నిలుచుటకునుఁ జి। త్త మ్మోర్వమిఁ దల్లడంబు దనికినఁ గడు వే**
**గమ్మునఁ ద్రిపురహరుని హ। స్తమ్మునఁ జొప్పడియెఁ గని యతఁడు వెస మ్రింగెన్. 471**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ రీతిగా; నిలుచుటకునున్= నిలిచి ఉండటానికి; చిత్తము= మనస్సు; ఓర్వమిన్= ఓర్చుకొనకపోవటం వలన; తల్లడంబు= వణకు; తనికినన్= పుట్టగా; కడువేగమ్మునన్= మిక్కిలి వేగంతో; త్రిపురహరుని= శివుడియొక్క; హస్తమునన్= చేతిలో; చొప్పడియెన్= దొరికిపోయాడు; అతఁడు= ఆ శివుడు; కని= చూచి; వెసన్= శీఘ్రంగా; మ్రింగెన్= కబళించాడు.

**తాత్పర్యం:** అట్లా పొదలలో దాగి ఉండటానికి అతడి చిత్తం ఓర్చుకొనలేకపోయింది. శరీరంలో కంపం కలిగింది. వెంటనే అతడు శివుడి చేతికి దొరికిపోయాడు. అది చూచి శివు డతడిని అప్పుడే మ్రింగివేశాడు.

**ఆ. కడుపులోన నుండి కలగొనఁ బాఱెడు। విబుధవైరిగురుఁడు వెడలకుండు**
**నట్లుగాఁగఁ దెరువులన్నియు మూసి శి। శ్నంబు మూయ కంగజన్మరిపుఁడు. 472**

**ప్రతిపదార్థం:** కడుపులోనన్+ఉండి= ఉదరములోనుండి; కలగొనన్+పాఱెడు= కలతజెంది పరుగిడుతున్న (నలువైపులకు పరుగిడుతున్న); విబుధవైరిగురుఁడు= దేవతలకు శత్రువులగు రాక్షసులకు ఆచార్యుడైన శుక్రుడు; వెడలక+ఉండునట్లు కాఁగన్= వెలుపలికి చనక ఉండేటట్లుగా; అంగజన్మరిపుఁడు= మన్మథుడి శత్రుడగు శివుడు; తెరువులు+అన్నియున్= దారులన్నీ; మూసి= బంధించి; శిశ్నంబున్= పురుషాంగమును; మూయక= బంధించక.

**తాత్పర్యం:** అట్లా మ్రింగి తన కడుపులో ఉంటూ కలత చెందేటట్లు ఇటూ అటూ పరుగిడుతున్న భార్గవుడు పారిపోకుండా ఉండేటట్లు శివుడు దారులన్నీ మూసివేశాడు. కాని పురుషాంగద్వారం మాత్రం మూయకుండా తెరచి ఉంచాడు.

**క. వెడలు మని తెరువు సూపిన। వెడలెను భృగునందనుండు; వెండియుఁ గోపం**
**బడరఁగ నాతనిఁ గనుఁగొని। యెడు రుద్రునిఁ జూచి దేవి యిట్లనియె నృపా! 473**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; వెడలుము= వెడలిపొమ్ము; అని తెరువు+చూపినన్= అని దారి చూపగా; భృగునందనుండు= భార్గవుడు; వెడలెను= శిశ్నద్వారం నుండి వెలుపలికి వచ్చాడు; వెండియున్= మరలకూడ; కోపంబు+అడరఁగన్= క్రోధం ప్రసరించగా; ఆతనిన్= ఆ భార్గవుడిని; కనుఁగొనియెడు= చూస్తూ ఉన్న; రుద్రునిన్= శివుడిని; చూచి= విలోకించి; దేవి= పార్వతి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ధర్మరాజా! అట్లా శివుడు శిశ్నద్వారం మాత్రం మూయక ఆ దారినుండి బయటికి పొమ్మని భార్గవుడికి దారి చూపాడు. అత డా దారినుండి వెలికి వచ్చాడు. ఇంకా శివుడి కోపం చల్లారలేదు. అతడివైపు కినుకతో చూస్తూనే ఉన్నాడు. అప్పుడు పార్వతీదేవి శివుడితో ఇట్లా అన్నది.

**క. 'నీ కడుపున జన్మించుట । నాకుం గొడుకయ్యె నితఁడు; నా సుతునకు సు**
**శ్లోకా! యలుగం దగునే । నీకు? సుఖిం జేయు మీతనిం గృపతోడన్.' 474**

**ప్రతిపదార్థం:** సుశ్లోకా!= మంచి కీర్తి కలవాడా!; ఇతఁడు= ఈ భార్గవుడు; నీ కడుపునన్= నీ ఉదరంలో; జన్మించుటన్= పుట్టటంతో; నాకున్+కొడుకు+అయ్యెన్= నాకూ పుత్రుడయ్యాడు; నా సుతునకున్= నా కుమారుడికై; నీకున్ అలుగన్+తగునే?= నీకు కోపింపతగునా?; ఈతనిన్= ఇతడిని; కృపతోడన్= దయతో; సుఖిన్+చేయుము= ఆనందింపజేయుము.

**తాత్పర్యం:** 'సుకీర్తీ! ఈ భృగుపుత్రుడు నీ కడుపునుండి పుట్టటం వలన నాకూ కొడుకయ్యాడు. నా కొడుకుపట్ల నీవు కోపించటం యుక్తమా? అందుచేత దయతో ఇతడిని సుఖవంతుడిని చేయుము'.

**తే. అనినఁ దేజస్విఁ జేసి చంద్రార్ధ మౌళి । శిశ్నమున నిర్గమించుటఁ జేసి యితఁడు**
**శుక్రుఁ డనుపేర వర్తించు; సుదతి! నీకుఁ । బ్రియ మొనర్చితి ననియె సంప్రీతితోడ. 475**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; చంద్రార్ధమౌళి= చంద్రశేఖరుడు శివుడు; సంప్రీతితోడన్= మిక్కిలి ప్రీతితో; తేజస్విన్= తేజోవంతుడిగా; చేసి= ఒనర్చి; సుదతి!= పార్వతీ!; శిశ్నమునన్= మగగురిద్వారా; నిర్గమించుటన్+చేసి= బయలువెడలటం వలన; ఇతఁడు= ఈ భృగునందనుడు; శుక్రుఁడు+అనుపేరన్= శుక్రుడనే నామంతో; వర్తించున్= ప్రవర్తిస్తాడు; నీకున్= పార్వతివగు నీకు; ప్రియము+ఒనర్చితిన్= ప్రియం చేశాను; అనియెన్= అని చెప్పాడు.

**తాత్పర్యం:** పార్వతీదేవి అట్లా ప్రార్థించగానే శివుడు ప్రీతి పొందాడు. భార్గవుడిని తేజోవంతుడిగా చేశాడు. తరువాత పార్వతిని చూచి 'సుదతీ! వీడు నా శిశ్నమునుండి బయలువెడలినాడు. కాన 'శుక్రుడు' అనే పేరుతో వర్తిస్తాడు. నీకు ప్రియమైన కార్యం చేశా' నని చెప్పాడు.

**తే. 'అనఘ! యిది భార్గవుఁడు శుక్రుఁడైన తెఱఁగు' । నావుడును ధర్మజుఁడు శాంతనవునితోడ**
**'నీదు వాక్యామృతమున నా నెమ్మనంబు । తృప్తి సనదు; సద్ధర్మంబుఁ దెలుపు' మనియె. 476**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఇది= ఇప్పుడు చెప్పింది; భార్గవుఁడు= భృగుపుత్రుడు; శుక్రుఁడైన తెఱఁగు= శుక్రుడుగా రూపొందిన విధానం; నావుడున్= అని చెప్పగా; ధర్మజుఁడు= ధర్మపుత్రుడు; శాంతనవునితోడన్= భీష్ముడితో; నీదు వాక్య+అమృతమునన్= నీ వచనమనే సుధతో; నా నెమ్మనంబు= నా చిత్తము; తృప్తి చనదు= తృప్తి చెందదు; సద్ధర్మంబున్= మంచిధర్మాన్ని; తెలుపుము+అనియెన్= తెలియజెప్పుమన్నాడు.

**తాత్పర్యం:** పాపరహితు డవగు ఓ ధర్మపుత్రా! ఇప్పుడు నేను చెప్పింది భార్గవుడు శుక్రుడుగా రూపొందిన కథాక్రమం అని భీష్మ డన్నాడు. అప్పుడు ధర్మసుతుడు శంతనుసుతుడైన భీష్మడిని చూచి 'నీ వాక్యామృతం

ఎంత గ్రోలినా నామనస్సు తృప్తి పొందటం లేదు. ఇంకా నాకు మంచి మంచి ధర్మాలు బోధించు' మని అర్థించాడు.

**వ. అనవుడు నమ్మహానుభావుం డమ్మహీనాథుతోఁ 'బరాశర గీతా శ్రవణ ప్రవణుండ వగు'మది ధర్మప్రబోధకం బగునని పలికి యిట్లనియె. 477**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆ+మహానుభావుండు= ఆ మహాత్ముడైన భీష్ముడు; ఆ+మహీనాథుతోన్= ఆ రాజుతో; పరాశరగీతా శ్రవణ ప్రవణుండవు= పరాశరముని చెప్పిన గీతను వినటంలో ఆసక్తుడవు; అగుము= కమ్ము; అది= ఆ శ్రవణం; (లేక ఆ గీత); ధర్మప్రబోధకంబు+అగున్+అని= ధర్మమును చక్కగా బోధించేది అవుతుందని; పలికి= చెప్పి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజుడట్లా అర్థించగా మహానుభావుడైన భీష్ముడు ఆ రాజును చూచి 'నీవు పరాశరమహర్షి గీతను వినుము. అది ధర్మాన్ని చక్కగా బోధిస్తుంది' అని చెప్పి ఇట్లా పలికాడు.

**జనకునకుఁ బరాశరముని యుపదేశించిన ధర్మప్రకారము (సం. 12-279-3)**

**సీ. జనకభూపతి యడిగినఁ బరాశరముని। ధర్మసంబోధనతా నిరూఢి**
**నిట్లని యెఱిఁగించె 'నిహపరసౌఖ్యముల్। ధర్మకార్యములని తలఁచి నరుఁడు**
**ఫలము బీజంబునం బడయునట్టుల ధర్మ। మున సౌఖ్యసంసిద్ధిఁ బొందవలయు;**
**సుకృత దుష్కృతములు సుఖమును దుఃఖంబుఁ। గుడువఁ జేయక నరు విడువ వధిప!**

**తే. వాఙ్మనోదృష్టి కలితప్రవర్తనములఁ। గాయ చేష్టితములను నన్యాయపథముఁ**
**బొరయనీకున్న సత్పథనిరతి గలుగు। సత్యశమదమాహింసలు సత్పథములు. 478**

**ప్రతిపదార్థం:** జనకభూపతి= జనకభూపాలుడు; అడిగినన్= ప్రశ్నించగా; పరాశరముని= పరాశరుడనే సంయమి; ధర్మసంబోధనతానిరూఢిన్= ధర్మమును చక్కగా బోధించుటంలోని నైపుణ్యంతో; ఇట్లు+అని= ఈ రీతిగా; ఎఱిఁగించెన్= తెలియపరచాడు; అధిప!= రాజా!; ఇహపరసౌఖ్యముల్= ఈ లోకంలోనూ; పరలోకంలోనూ కలిగే సుఖములు; ధర్మకార్యములు= ధర్మం కారణంగా కలిగే కార్యాలు; అని తలఁచి= అని భావించి; నరుఁడు= మనుజుడు; బీజంబునన్= విత్తనముతో; ఫలమున్= పండును; పడయునట్టుల= పొందునట్లు; ధర్మమునన్= ధర్మముతో; సౌఖ్యసంసిద్ధిన్= సుఖప్రాప్తిని; పొందవలయున్= చెందవలెను; సుకృత దుష్కృతములు= పుణ్యపాపములు; సుఖమునున్= సౌఖ్యమును; దుఃఖమున్= క్లేశమును; కుడువన్+చేయక= అనుభవించేటట్లు చేయకుండ; నరున్= మనుజుడిని; విడువవు= వదలవు; వాఙ్మనోదృష్టి కలిత ప్రవర్తనములన్= మాటలు, మనస్సు, చూపు - వీటితో కూడిన ప్రవృత్తులయందును; కాయచేష్టితములను= శరీరముతో చేయు పనులలోనూ; అన్యాయపథమున్= అధర్మమార్గం; పొరయనీక+ఉన్నన్= పొందనీయకుండా ఉన్నచో; సత్పథనిరతి= సన్మార్గంపై ఆసక్తి; కలుగున్= సంభవిస్తుంది; సత్యశమదమా హింసలు= సత్యము, అంతరింద్రియ నిగ్రహం; బాహ్యేంద్రియనిగ్రహం, అహింస- అనేవి; సత్పథములు= మంచిమార్గాలు.

**తాత్పర్యం:** జనకుడు పరాశరమునిని సద్ధర్మతత్త్వమును గురించి ప్రశ్నించాడు. ఆ ముని ధర్మప్రబోధమందలి నైపుణ్యంతో ఇట్లా చెప్పాడు. 'రాజా! మానవుడు ఇహలోక సుఖాలూ, పరలోక సుఖాలూ ధర్మమూలకాలే అని భావించాలి. విత్తనంవేసి తద్వారా ఫలం పొందే విధంగానే ధర్మ మాచరించి సుఖం పొందాలి. పుణ్యం సుఖాన్నీ, పాపం దుఃఖాన్నీ మానవుడిచేత అనుభవింపజేయకుండా వదలవు. వాక్కులోగాని, మనస్సులోగాని, చూపులోగానీ,

శరీరంతో చేసే పనులలో గాని అన్యాయం అంటనీయకుండా ఉండగలిగితే సన్మార్గంపై ఆసక్తి కలుగుతుంది. సత్యం, అంతరింద్రియాలను నిగ్రహించటం, బాహ్యేంద్రియాలను నిగ్రహించటం, హింసలేకుండా ఉండట మనేవే సన్మార్గా లనబడుతాయి.

**క. అనఘుం డింద్రియహయభృత । మనోరథ రథంబు నాఁగు మహితజ్ఞాన**
**త్వనిరూఢ రశ్మిశక్తిని । జనపాలక! దుష్పథమునఁ జనకుండంగన్. 479**

**ప్రతిపదార్థం:** జనపాలక!= రాజా!; అనఘుండు= పాపరహితుడు; మహితజ్ఞానత్వ నిరూఢరశ్మి శక్తినిన్= శ్రేష్ఠజ్ఞానత్వమనే ప్రసిద్ధమైన పగ్గాలబలంతో; ఇంద్రియహయభృత మనోరథరథంబున్= ఇంద్రియాలనే గుర్రాలచేత భరించబడిన కోరికలనే రథాన్ని; దుష్పథమునన్= దుర్మార్గంలో; చనకుండంగన్= పోకుండా ఉండేటట్లు; ఆఁగున్= అరికట్టుతాడు.

**తాత్పర్యం:** రాజా! పాపరహితుడైన మనుజుడు శ్రేష్ఠమైన తెలివి అనే పగ్గాలతో ఇంద్రియాలనే గుర్రాలతో లాగబడే కోరిక లనే రథాన్ని అపమార్గంలో పోనీయకుండా నిగ్రహిస్తాడు.

**విశేషం:** అలం: రూపకం. శ్రోత్రం మొదలైన ఇంద్రియాలు అనే గుర్రాలు కోరికలనే రథాన్ని లాగుతున్నాయి. జ్ఞాని అయినవాడు తన జ్ఞానమనే పగ్గంతో ఇంద్రియాలను అరికట్టాలి. లేకపోతే ఇంద్రియాలు విషయాసక్తితో రథాన్ని అపమార్గంలోకి ఈడ్చుకుపోతాయి. అట్లా జరిగితే రథం గమ్యం చేరక ప్రమాదానికి లోనవుతుంది. ఇంద్రియ నిగ్రహంతో మానవుడు అధర్మమార్గంలో ప్రవేశించకుండా ఉండాలని భావం. కోరిక అనే రథం పరమాత్మవైపు పయనించాలి గాని, విషయాలవైపు పోకూడదు. కఠోపనిషత్తులో శరీరం రథంతోనూ, ఆత్మ రథికుడితోనూ, బుద్ధి సారథితోనూ, మనస్సు పగ్గంతోనూ, ఇంద్రియాలు గుర్రాలతోనూ, విషయాలు అపమార్గాలతోనూ రూపించబడ్డాయి. అక్కడి రూపకాలంకార ప్రక్రియే కొంత మార్పుతో ఇక్కడ అనుసరించబడింది.

**ఆ. పడయరాని యాయు వొడలికిఁ గలిగినఁ । బాపకృతుల దానిఁ బదటఁ గలుప**
**నగునె పుణ్యవిధిసమాచరణములఁ గై । సేయవలయుఁ గాక చెలువు మిగుల. 480**

**ప్రతిపదార్థం:** ఒడలికిన్= శరీరానికి; పడయన్ రాని= పొందరాని; ఆయువు= జీవితకాలము; కలిగినన్= లభిస్తే; దానిన్= దానిని; చెలువు= శోభ; మిగులన్= అతిశయించగా; పుణ్యవిధి సమాచరణములన్= పుణ్యకార్యముల నాచరించుటలతో; కైసేయవలయున్+కాక!= అలంకరింపవలెనుగాక!; పాపకృతులన్= పాపకార్యాలతో; పదటన్+కలుపన్+అగునె?= బూడిదలో కలపటం యుక్తమా?

**తాత్పర్యం:** శరీరానికి దుర్లభమైన ఆయువు దొరికినప్పుడు దానిని పాపపు పనులతో బూడిదపాలు చేయటం తగునా? అట్లా కాక శోభ అతిశయించేటట్లు ఆ శరీరాన్ని పుణ్యకార్యాలు చేయటంతో అలంకరించటం తగును. పవిత్రకార్యాలతో శరీరం శోభావహమవుతుంది. పాపకార్యాలతో చివరకు దానిని బూడిదపాలు చేయటం తగదని తాత్పర్యం.

**క. దురితంబులు దొడరు నహిత । కరణంబున మేలు వడయఁగాఁ గోరుట భూ**
**వర! దుస్సలిలస్నానా । దరము తెఱఁగు సూవె యెవ్విధంబునఁదలఁపన్. 481**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; దురితంబులు= పాపాలు; తొడరు= విజృంభించునట్టి; అహితకరణంబునన్= హితములుగాని కార్యములు చేయటంవలన; మేలు= శ్రేయస్సును; పడయన్+కాన్+కోరుట= పొందాలని అభిలషించటం; ఏ+విధంబునన్= ఏ రీతిగా; తలఁపన్= ఆలోచించినా; దుస్సలిలస్నాన+ఆదరము తెఱఁగు= చెడునీటిలో స్నానము చేయుటయందలి ప్రీతివంటిది; చూవె= చూడుమా!

**తాత్పర్యం:** రాజా! పాపకారణమైన దుష్టకార్యాలు చేసి శ్రేయస్సు పొందాలని కోరటం ఏ విధంగా ఆలోచించినా మురికినీటిలో స్నానం చేయటం వంటిదే. శుభ్రమైన నీటిలోనే స్నానం చేయాలి. అట్లాకాక మురికినీటిలో స్నానం చేస్తే శుభ్రత కలగదు. (అట్లాగే శ్రేయస్సు కోరేవాడు పుణ్యం కల్గించే పనులు చేయాలి కాని పాపం కలిగించే పనులు చేస్తే మేలు కలగదని తాత్పర్యం).

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క.** **సమదర్శియై యఖిల భూ । తములను దనయట్ల కాఁగఁదలఁచుచు నెవ్వం**
**డమలన్యాయపరుండగు । నమరు లతని వందనీయుఁ డండ్రు నరేంద్రా!** **482**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; ఎవ్వండు= ఎవడు; సమదర్శి+ఐ= సమానమైన దృష్టికలవాడై; అఖిలభూతములనున్= సర్వప్రాణులను; తన యట్ల కాఁగన్= తనవంటివే అయినట్లుగా; తలఁచుచున్= భావిస్తూ; అమలన్యాయపరుండు+అగున్= నిర్మలమైన న్యాయమునందు నిరతుడవుతాడో; అతనిన్= అట్టివాడిని; అమరులు= దేవతలు; వందనీయుఁడు= నమస్కరించదగినవాడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! ఎవడు సమదృష్టి కలిగి సమస్త ప్రాణికోటినీ తనవంటిదే అని భావిస్తూ నిర్మలమైన న్యాయాన్ని పాటిస్తాడో, అతడిని దేవతలు నమస్కరణీయుడు అని చెబుతారు.

**క.** **ధన మించుకేని ధర్మం । బునఁ బడసినయట్టి దైన భూవర! పాత్రం**
**బున నిడిన నది మహాఫల । జనకంబగు నండ్రు వేదసంవేదిజనుల్.** **483**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; వేదసంవేదిజనుల్= వేదాలు చక్కగా ఎరిగినవారు; ధనము= అర్థం; ఇంచుక+ఏనిన్= కొద్దిపాటిదైనా; ధర్మంబునన్= ధర్మమార్గంతో; పడసిన అట్టిది+ఐనన్= ఆర్జించినట్టిదైతే; పాత్రంబునన్= తగినవాడియందు; ఇడినన్= ఉంచితే; అది= ఆ ధనం; మహాఫలజనకంబు= గొప్ప ఫలాన్ని కలిగించేది; అగున్+అండ్రు= అవుతుందని అంటారు.

**తాత్పర్యం:** రాజా! వేదాలను చక్కగా గ్రహించినవారు ధనం కొద్దిగానైనా ధర్మంగా ఆర్జించబడి ఉండి, దానిని తగినవారికి దానం చేస్తే, అది గొప్ప ఫలం కలిగిస్తుందంటారు.

**తే.** **మునుల ఋణ మధ్యయనమున, ననిమిషుల ఋ । ణంబు క్రతువున; నతిథిఋణంబు పూజఁ**
**దీర్చునది శ్రాద్ధమునఁ బితృదేవతల ఋ । ణంబు, నరుల ఋణము రంజన వ్రతమున.** **484**

**ప్రతిపదార్థం:** అధ్యయనమునన్= వేదాధ్యయనంతో; మునుల ఋణమున్= ఋషిఋణాన్నీ; క్రతువునన్= యజ్ఞంతో; అనిమిషుల ఋణంబున్= దేవతల ఋణాన్నీ; పూజన్= సమ్మానసత్కారాదులతో; అతిథిఋణంబున్= అతిథులై వచ్చినవారి ఋణాన్నీ; శ్రాద్ధమునన్= పితృకర్మతో; పితృదేవతల ఋణంబున్= పితరుల ఋణాన్నీ; రంజనవ్రతమునన్= రంజింపజేయటం అనే వ్రతంతో; నరుల ఋణమున్= ప్రజల ఋణాన్నీ; తీర్చునది= తీర్చుకోవాలి.

**తాత్పర్యం:** వేదాలు చదవటంతో ఋషిఋణాన్నీ, యజ్ఞాలు చేయటంతో దేవతల ఋణాన్నీ, పూజాది సత్కారాలతో అతిథి ఋణాన్నీ, పితృకర్మతో పితరుల ఋణాన్నీ, చక్కని పాలనతో రంజింపజేయటం ద్వారా ప్రజల ఋణాన్నీ తీర్చుకోవాలి.

**క. నారద పర్వత దేవల । భారద్వాజాదు లైన పరమమునులు ధ**
**ర్మారంభంబునఁ బడసిరి । గారవ మట్లగుట ధర్మకరణము వలయున్. 485**

**ప్రతిపదార్థం:** నారద పర్వత దేవల భారద్వాజాదులు+ఐన= నారదుడు, పర్వతుడు, దేవలుడు, భారద్వాజుడు మొదలైన; పరమమనులు= శ్రేష్ఠమునులు; ధర్మ+ఆరంభంబునన్= ధర్మకార్యారంభంతో; గారవమున్= గౌరవమును; పడసిరి= పొందారు; అట్లు+అగుటన్= అట్లా కావటం వలన; ధర్మకరణము= ధర్మంయొక్క ఆచరణ; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** నారదుడు, పర్వతుడు, దేవలుడు, భారద్వాజుడు మొదలైన మహామునీంద్రులు పూర్వం ధర్మకార్యాలు చేసి గౌరవానికి పాత్రులయ్యారు. అందువలన ధర్మకార్యాలు తప్పక చేయాలి.

**క. విను మర్హుఁడగు ననర్హుం । డనఘా! విష్ణుస్తుతిక్రియం దపమున ద**
**ర్మనిరూఢి నివి మనంబున । ఘన పరిబోధంబుఁ గూర్చుఁ గావున నధిపా! 486**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; అధిపా!= రాజా!; వినుము= ఆలకించుము; అనర్హుండు= అయోగ్యుడైన జనుడు; విష్ణుస్తుతిక్రియన్= విష్ణుదేవుడి స్తోత్రం చేయుటమనే కర్మచేతను; తపమునన్= తపస్సుచేతను; ధర్మనిరూఢిన్= ధర్మప్రసిద్ధి చేతను; ఇవి= విష్ణుస్తుతి మొదలైనవి; మనంబునన్= చిత్తమునందు; ఘన పరిబోధంబున్= గొప్ప జ్ఞానమును; కూర్చున్+కావునన్= కలిగిస్తాయి కాబట్టి; అర్హుఁడు+అగున్= యోగ్యుడవుతాడు.

**తాత్పర్యం:** రాజా! విష్ణుస్తోత్రం, తపస్సు, ధర్మాచరణం అనేవి మనస్సులో గొప్ప జ్ఞానం కలిగిస్తాయి. అందువలన అయోగ్యుడైనవాడు స్తోత్రం, తపస్సు, ధర్మం ఆచరిస్తే యోగ్యుడుగా రూపొందుతాడు.

**ఆ. ఆహితాగ్నిఁ బుణ్యుఁ డను శ్రుతి జననియు । జనకుఁడును గురుండు సద్గతియును,**
**దేజమును బలంబు ధృతియును బుద్ధియు । నగ్ని యగుటఁ జేసి యమలచరిత. 487**

**ప్రతిపదార్థం:** అమలచరిత!= నిర్మలచరిత్రం కల ఓ జనకమహారాజా!; జననియున్= తల్లియును; జనకుఁడునున్= తండ్రియును; గురుండున్= ఆచార్యుడును; సద్గతియునున్= మంచి గతియును; తేజమునున్= తేజస్సున్ను; బలంబున్= బలమున్ను; ధృతియునున్= ధైర్యమున్ను; బుద్ధియున్= మతియున్ను; అగ్ని అగుటన్+చేసి= అగ్నియే కావటం వలన; శ్రుతి= వేదం; ఆహితాగ్నిన్= అగ్నిహోత్రమునుంచుకొని ఉన్నవాడిని; పుణ్యుఁడు+అనున్= పుణ్యాత్ముడని అంటున్నది.

**తాత్పర్యం:** నిర్మలచరిత్రుడవైన ఓ జనకమహారాజా! తల్లి, తండ్రి, గురువు, మంచిగతి, తేజస్సు, బలం, ధృతి, బుద్ధి - ఇవన్నీ అగ్నియే. అందువల్లనే వేదం అగ్నిహోత్రము నుంచుకొన్నవాడు పుణ్యాత్ముడు అని చెప్పింది.

**తే. సుజనసంగతి కర్తవ్య కుజనుఁడైన । దాన నిర్మలుఁ డయ్యెడుఁ గాన వినుము**
**శూద్రజాతి భూదేవ శుశ్రూషఁగాదె । యిహముఁ బరమునుఁ బడయుట మహితవృత్తి. 488**

**ప్రతిపదార్థం:** వినుము= ఆకర్ణించుము; కుజనుఁడు+ఐనన్= దుర్జనుడైనప్పటికీ; దానన్= ఆ సజ్జన సాంగత్యంచేత; నిర్మలుఁడు= పవిత్రుడు; అయ్యెడున్+కానన్= ఔతాడుకాబట్టి; సుజనసంగతి= సజ్జనులతోడి పొత్తు; కర్తవ్య= చేయదగినది; శూద్రజాతి= శూద్రవర్ణము; భూదేవ శుశ్రూషన్+కాదె= భూసురుల సేవచేతకదా; మహితవృత్తిన్= పూజితమైన వర్తనంతో; ఇహమున్= ఈ లోకమును; పరమునున్= పరలోకమును; పడయుట= పొందటం.

**తాత్పర్యం:** రాజా! విను. ఎంతటి దుర్జనుడైనా సజ్జనసాంగత్యంతో పవిత్రు డవుతాడు. అందువలన సజ్జనసాంగత్యం అవశ్యం చేయదగింది. శూద్రకులం భూసురకులాన్ని సేవించి వారి సాంగత్యంతో గదా ఇహపరలోక సుఖాలను పొందుతున్నది!

**క. అనఘా! మర్త్యుల జీవన । మనిత్యమని యెఱిఁగి సుఖమునప్పుడు దుఃఖం**
**బున యపుడు ధర్మ మేమఱ । కునికియ యెజ్జాతికైన నుర వూహింపన్. 489**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితా!; ఊహింపన్= ఆలోచించగా; మర్త్యుల జీవనము= మానవుల బ్రదుకు; అనిత్యము+అని= అశాశ్వతమని; ఎఱిఁగి= తెలిసికొని; సుఖమునప్పుడున్= సుఖసమయంలోగానీ; దుఃఖంబున+అపుడున్= దుఃఖసమయంలో గానీ; ధర్మము+అ= ధర్మమును; ఏమఱక+ఉనికి= ఏమరిల్లక ఉండటమే; ఏ+జాతికిన్+ఐనన్= ఏ జాతిలో పుట్టినవాడికైనా; ఉరవు= ఉచితం.

**తాత్పర్యం:** పాపరహితుడా! మానవజీవితం శాశ్వతం కాదని తెలిసికొని సుఖకాలంలో గానీ, దుఃఖకాలంలో కానీ ధర్మంపట్ల ఏమరుపాటు లేకుండా ఉండటమే ఏ జాతివారైనా పాటించవలసిన ఉచిత పద్ధతి.

**తే. పాప మించుక దొడరిన పనియు నెట్టి । ఫలము గలిగిన వల దల్ప ఫల విధాయి**
**యైన పుణ్యమిశ్రితకార్య మాచరించు । నది; శివంబగు దాన నిహమ్ముఁ బరము. 490**

**ప్రతిపదార్థం:** ఇంచుక= కొంచెం; పాపము= కిల్బిషం; తొడరిన= కలిగిన; పనియున్= కార్యమును; ఎట్టిఫలముగల్గినన్= ఎట్లాంటి ప్రయోజనం సిద్ధించినా; వలదు= చేయవద్దు; అల్పఫలవిధాయి= కొంచెం ప్రయోజనం కలిగించేది; ఐన= అయినట్టి; పుణ్యమిశ్రితకార్యమున్= పుణ్యంతో కూడిన పనిని; ఆచరించునది= చేయునది; దానన్= దానిచేత; ఇహమ్మున్= ఈ లోకమును; పరమున్= పరలోకమును; శివంబు+అగున్= శుభప్రద మవుతుంది.

**తాత్పర్యం:** ఎంత ఫలం దానివలన కలుగుతున్నా ఆ పని కొంచెం పాపంతో కూడి ఉంటే, చేయవద్దు. ఫలం కొంచెమే అయినా పుణ్యంతో కూడిన పని తప్పక చేయాలి. దానివలన ఇహపరలోకాలలో శుభం కలుగుతుంది.

**తే. యజ్ఞపరుఁడు రక్షకుఁడు నుపార్జకుండు । విప్రశుశ్రూషకుఁడు గాని విప్రరాజ**
**వైశ్యశూద్రులు దక్కటివాని నెట్టి । ధర్మములఁ జేసిరేని నధర్మపరుల. 491**

**ప్రతిపదార్థం:** యజ్ఞపరుఁడు= యజ్ఞంచేయడంలో ఆసక్తి కలవాడు; రక్షకుఁడు= రాజ్యరక్షణ ఒనరించేవాడు; ఉపార్జకుండు= ధనం సంపాదించేవాడు; విప్రశుశ్రూషకుఁడు= బ్రాహ్మణసేవకుడు; కాని= కానట్టి; విప్రరాజ వైశ్యశూద్రులు= బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులు; తక్కటివానిన్= పై జెప్పినవాడికంటె అన్యములైన; ఎట్టిధర్మములన్= ఎట్టి ధర్మకార్యాలను; చేసిరేనిన్= చేసినప్పటికీ; అధర్మపరులు+అ= ధర్మపరులు కానివారే.

**తాత్పర్యం:** యజ్ఞంచేయని విప్రుడు, రక్షణ చేయని క్షత్రియుడు, తన వృత్తిలో ధనమార్జించని వైశ్యుడు, బ్రాహ్మణ సేవ చేయని శూద్రుడు - వీరు తదితరమైన ఎట్టి ధర్మకార్యాలు చేసినా, అధర్మపరులే కాని ధర్మపరులు కారు.

**ఆ. ధర్మలబ్ధమైన ధనము పాతికయేని । బహుళఫలము నిచ్చుఁ; బాపవృత్తు**
**పార్జితంబు కోటియైన నిష్ఫలమండ్రు । దానశాస్త్ర విదులు మానవేంద్ర! 492**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర!= రాజా!; దానశాస్త్రవిదులు= దానశాస్త్రం తెలిసినవారు; ధర్మలబ్ధము+ఐన= ధర్మకార్యాలు చేయటంతో దొరకిన; ధనము= అర్థం; పాతికఏనిన్= నాలుగవవంతైనా(కొంచెమైనా); బహుళఫలమున్+ఇచ్చున్= ఎక్కువ ఫలాన్ని

ప్రసాదిస్తుంది; పాపవృత్తి+ఉపార్జితంబు= పాపపు పనిచేత సంపాదించబడినదైన ధనం; కోటి ఐనన్= కోటిసంఖ్యగలదైనా (అత్యధికమైనను); నిష్ఫలము+అండ్రు= ప్రయోజనం లేనిదని చెప్పుతారు.

**తాత్పర్యం:** రాజా! దానశాస్త్రం పరిశోధించిన విద్వాంసులు ధర్మపద్ధతిలో ఆర్జించిన ధనం కొద్దిపాటిదైనా బహుప్రయోజనకారి అనీ, అధర్మపద్ధతిలో ఆర్జించిన విత్తం కోటి అయినా (అత్యధికమైనా) నిష్ప్రయోజనమనీ చెప్పుతారు.

**క. నృపధర్మ వైశ్యధర్మము । లపాపకర్మములు జీవనాభావము పా**
**లుపడిన బ్రాహ్మణునకు నర । కపాతమగు శూద్రకర్మ కర్తృత్వమునన్. 493**

**ప్రతిపదార్థం:** జీవనాభావము= జీవించటానికి లేమి అనగా పేదరికంయొక్క; పాలుపడిన= వశమైన; బ్రాహ్మణునకున్= విప్రుడికి; నృపధర్మవైశ్య ధర్మములు= రాజవృత్తి, వైశ్యవృత్తి అనే రెండు వృత్తులును; అపాపకర్మములు= పాపంలేని పనులు; శూద్రకర్మ కర్తృత్వమునన్= శూద్రుడి పనికి పూనుకొనటంచేత; నరకపాతము+అగున్= నరకంలో పడటం సంభవిస్తుంది.

**తాత్పర్యం:** ఒకవేళ బ్రాహ్మణుడు జీవించటానికి లేక పేదరికం పాలు పడితే రాజులకు, వైశ్యులకు విధించబడిన వృత్తి నాశ్రయించి జీవించవచ్చును. దానివలన పాపమంటదు. కాని, అట్టి విప్రుడు శూద్రవృత్తి అయిన సేవాభావాన్ని అంగీకరిస్తే నరకంలో పడిపోతాడు.

**క. రాజునకును ధర్మము శ । స్త్రాజీవిక యొకఁడ; వైశ్యుఁ డాపద యైనన్**
**రాజవర! మధువు మాంసముఁ । దాఁ జట్టి యిడంగఁ బొందు దౌర్గత్యంబున్. 494**

**ప్రతిపదార్థం:** రాజవర!= నృపవర్యా!; రాజునకునున్= నృపుడికి; శస్త్రాజీవిక+ఒకఁడు+అ= శస్త్రమును చేపట్టి జీవించుటొక్కటే; ధర్మము= కర్తవ్యధర్మమై ఉన్నది; వైశ్యుఁడు= తృతీయవర్ణంవాడు; ఆపద ఐనన్= కష్టం సంభవించినపుడు; తాన్= తాను; మధువున్= కల్లును; మాంసమున్= మాంసాన్ని; చట్టిన్= పాత్రలో; ఇడంగన్= పెట్టినచో; దౌర్గత్యంబున్= దుర్గతిని; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠా! శస్త్రము నాశ్రయించిన జీవిక ఒకటే క్షత్రియుడికి ధర్మం. వైశ్యుడు తనకు కష్టం వచ్చినప్పుడు తన ధర్మం వదలి మధుమాంససేవనం చేస్తే దుర్గతి పాలవుతాడు.

**క. జనవర! కృషిఁ బశుపాలన । మున నేనియు బ్రదుకు ధర్మముగ నార్యులు శూ**
**ద్రునకు విధింతురు జీవన । వినాశమున వాన వృత్తి వినిహత గామిన్. 495**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; శూద్రునకున్= నాలుగవవర్ణం వానికి; ఆర్యులు= పెద్దలు; జీవనవినాశమునన్= బ్రదుకుతెరువు నశించునపుడు; వానన్= కృషి మొదలగు వాటిచేత; వృత్తి= తన వర్తనం; వినిహత+కామిన్= చెడిపోదు కాబట్టి; కృషిన్= వ్యవసాయం చేతను; పశుపాలనమునన్+ఏనియున్= పశురక్షచేతనైనను; బ్రదుకు= జీవనం; ధర్మముగన్= చేయదగిన ధర్మంగా; విధింతురు= నియమిస్తారు.

**తాత్పర్యం:** రాజా! శూద్రుడు బ్రదుకుతెరువు నశించినప్పుడు వ్యవసాయం చేసి, పశువులను పాలించి జీవించవచ్చును. అది ధర్మమని పెద్దలు చెప్పుతారు. దానివలన ఆ స్థితిలో శూద్రవృత్తికి చేటు లేదు కాబట్టి వా రట్లా నియమం చేశారు.

**సీ.** **విను తొల్లి ధర్మవర్తనము లసహ్యంబు । లైన దానవులు మహాగ్రహమున**
**నరులయం దెలసిన నరవర! వారలు । దర్పరోషముల నధర్మవృత్తిఁ**
**దగిలినఁ గలఁగె వేదములును గ్రతువులు । సురలు విషణ్ణులై పురహరునకు**
**నంతయు నెఱిఁగింప, నతఁడు త్రిశూలంబుఁ । బనుప దైత్యావిష్టభావ మడఁచె;**

**తే.** **నది మహామునుల్ మృడునిఁ బ్రజాభిరక్ష । ణమునకై నిల్ప శ్రుతులు జన్నములుఁ దొంటి**
**చందమునఁ జెల్లె నమరులు సంతసింప । నసఘ! నీవునుఁ బాలింపు మట్ల ప్రజల.'** **496**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; విను= ఆలకించుము; తొల్లి= పూర్వం; ధర్మవర్తనములు= ధర్మాచరణములు; అసహ్యములు+ఐనన్= సహించరానివి కాగా; దానవులు= రక్కసులు; మహా+ఆగ్రహమునన్= పెద్దకోపావేశంతో; నరులఅందున్= మానవులందు; ఎలసినన్= ప్రవేశించగా; వారలు= ఆ మనుష్యులు; దర్పరోషములన్= గర్వంతోనూ, రోషంతోనూ; అధర్మవృత్తిన్= ధర్మ విరుద్ధమైన వర్తనాన్ని; తగిలినన్= ఆశ్రయించగా; వేదములును= శ్రుతులును; క్రతువులు= యజ్ఞాలు; కలఁగెన్= కలతపొందాయి; సురలు= దేవతలు; విషణ్ణులు+ఐ= దుఃఖం పొందినవారై; అంతయున్= జరిగిన వృత్తాంతం అంతటినీ; పురహరునకున్= శివుడికి; ఎఱిఁగింపన్= తెలుపగా; అతఁడు= ఆ శివుడు; త్రిశూలంబున్= త్రిశూలమనే ఆయుధాన్ని; పనుపన్= పంపగా; అది= ఆ త్రిశూలం; దైత్యావిష్టభావమున్= రాక్షసులచేత ఆవేశింపబడిన భావాన్ని; అడఁచెన్= సంహరించింది; మహామునుల్= గొప్పమునులు; మృడునిన్= శివుడిని; ప్రజాభిరక్షణమునకై= జనులను కాపాడటంకొరకై; నిల్పన్= నిలుపగా; అమరులు= దేవతలు; సంతసింపన్= ముదమొందగా; శ్రుతులు= వేదాలు; జన్నములు= యజ్ఞాలు; తొంటిచందమునన్= మునుపటివలె; చెల్లెన్= కొనసాగాయి; అనఘ!= పాపరహితుడవైన ఓ జనకమహారాజా!; నీవునున్= నీవుకూడ; అట్ల= అదే విధంగా; ప్రజలన్= జనులను; పాలింపుము= రక్షింపుము.

**తాత్పర్యం:** రాజా! వినుము. పూర్వం రాక్షసులు ధర్మకార్యాలు తమకు సహింపరానివయ్యేసరికి పెద్ద ఆగ్రహం పూని మానవులలో ప్రవేశించారు. ఆ మానవులు అందువలన గర్వరోషాలు పూని అధర్మకార్యాలలో నిమగ్నులయ్యారు. అప్పుడు వేదాలు, యజ్ఞాలు కలతజెందాయి. దేవతలు విషాదగ్రస్తులై ఈ వృత్తాంతమంతా శివుడికి తెలియజేశారు. శివుడు త్రిశూలాన్ని ప్రయోగించాడు. ఆ త్రిశూలం మానవులలోని రాక్షసావేశాన్ని నశింపజేసింది. అప్పుడు మహర్షులు శివుడిని ప్రజారక్షకుడిగా నిలిపారు. అంతట వేదాలు, యజ్ఞాలు పూర్వంవలెనే కొనసాగాయి. దేవతలు అందుకు సంతోషించారు. పాపరహితుడా! నీవు కూడా అట్లాగే ప్రజలను పాలించుము'.

**క.** **అని చెప్పి తపము పెంపును । వినిపించుట కిట్టు లనియె విద్యాధరస**
**న్ముని దేవతాగణంబులు । వినుత తపంబునన మహిత విభవముఁ బొందెన్.** **497**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; తపము పెంపునున్= తపస్సుయొక్క మహిమను; వినిపించుటకున్= వినిపింపజేయటానికై; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు; విద్యాధర= విద్యాధరులు; సన్మునిదేవతా గణంబులు= శ్రేష్ఠులైన మునులు, దేవతలయొక్క సమూహాలు; వినుతతపంబునన్= ప్రశస్తమైన తపస్సుతోనే; మహితవిభవమున్= పూజ్యమైన వైభవాన్ని; పొందెన్= చెందాయి.

**తాత్పర్యం:** పరాశరముని ఇట్లా చెప్పి తపోమహిమను జనకుడికి వినిపించాలనుకొని మళ్ళీ ఇట్లా అన్నాడు: 'విద్యాధరులు, ఉత్తమమునులు, దేవతలయొక్క బృందాలు పూర్వం గణుతించదగిన తపస్సు చేయటంవలననే శ్రేష్ఠమైన వైభవమును పొందారు.

చ. **కమలభవుండు దాఁ దపము కల్మిన కాదె సృజించె నెల్ల లో**
**కములను; నాదిరాజు లధికంబగు పెంపు వహించుటెల్ల ను**
**త్తమ తప మాచరించుటన; తద్దయు సౌఖ్యకరంబులైన భో**
**జ్యములును గంధమాల్యములు శయ్యలు భవ్యతపఃప్రభూతముల్.** **498**

**ప్రతిపదార్థం:** కమలభవుండు= బ్రహ్మ; తాన్= తాను; ఎల్లలోకములనున్= సమస్తమైన లోకాలనూ; తపము కల్మినకాదే= తపస్సు కలిగిఉండటం వలననేకదా!; సృజించెన్= సృష్టించాడు; ఆదిరాజులు= మొదటిభూపాలకులు; అధికంబు+అగు= దొడ్డదైన; పెంపున్= గొప్పతనాన్ని; వహించుట+ఎల్లన్= కల్గి ఉండటమంతా; ఉత్తమతపమున్= శ్రేష్ఠమైన తపస్సును; ఆచరించుటన్= చేయటంవలననే; తద్దయున్= అత్యధికంగా; సౌఖ్యకరంబులు+ఐన= సుఖం కలిగించేవి అగు; భోజ్యములునున్= భుజించదగిన పదార్థాలును; గంధమాల్యములు= సుగంధద్రవ్యాలు, మాలికలు; శయ్యలు= పాన్పులు; భవ్యతపఃప్రభూతముల్= శ్రేష్ఠమైన తపస్సునుండి కలిగినవే.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు తాను తపస్సు చేయటం వలననే సమస్త లోకాలనూ సృష్టించాడు. ఆదికాలానికి చెందిన రాజులు గొప్ప ప్రభావం కలిగి ఉండటంకూడా శ్రేష్ఠమైన తపస్సు చేయటం వలననే. పెద్దగా మనకు సుఖం కలిగించే ఆహారపదార్థాలు, గంధం, పూలమాలలు, పడుకలు - ఇవన్నీ గొప్ప తపస్సుకు ఫలంగా మనకు కలిగినవే.

తే. **దారధనమిత్ర పుత్రకాద్యంబు లగు ప । దార్థముల సంగమునఁ జిత్త మలఁతఁ బొంది**
**విసివినప్పుడు నిర్మల విపుల తపము । గారణంబగు నుపశాంతి కలిమి కనఘ!** **499**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; చిత్తము= మనస్సు; దారధనమిత్ర పుత్రక+ఆద్యంబులు+అగు= భార్య, ధనం, మిత్రులు, పుత్రులు మొదలైనట్టి; పదార్థముల సంగమునన్= వస్తువుల కలయికతో; అలఁతన్= అలసటను; పొంది= చెంది; విసివినప్పుడు= విసుగు పొందిన సమయంలో; ఉపశాంతి కలిమికిన్= ప్రశాంతి కలిగిఉండటానికి; నిర్మలవిపులతపము= విమలమూ, దీర్ఘమూ అయిన తపస్సు; కారణంబు+అగున్= హేతు వవుతుంది.

**తాత్పర్యం:** కల్మషంలేని ఓ రాజా! భార్య, విత్తం, మిత్రులు, పుత్రులు మొదలైన వారి పొత్తుతో మనస్సు విసిగి వేసారినప్పుడు దానికి ఉపశమనం కావాలంటే అది నిర్మలమూ, తీవ్రమూ అయిన తపస్సు నుండి మాత్రమేసిద్ధిస్తుంది.

క. **విను! లోభము సంతోషం । బును దుఃఖసుఖ ప్రదములు పురుషున కవి సం**
**జనితములగుట తపము లే । కునికిని గలుగుటను జూవె యుర్వీనాథా!** **500**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= భూనాథా!; విను= ఆలకించుము; పురుషునకున్= మనుజుడికి; లోభమున్= పిసినితనమును; సంతోషంబును= హర్షమున్నూ; దుఃఖసుఖప్రదములు= దుఃఖాన్నీ, సుఖాన్నీ కలిగించేవి; అవి= ఆ లోభసంతోషాలు; సంజనితములు+అగుట= కలగటం; తపములేక+ఉనికినిన్= తపస్సు లేకుండుటను; కలుగుటను జూవె= వలననే సుమా!

**తాత్పర్యం:** రాజా! ఇంకా చెప్పుతాను వినుము. మానవుడికి లోభం దుఃఖాన్ని కలిగిస్తుంది. సంతోషం సుఖాన్ని కలిగిస్తుంది. లోభమూ, సంతోషమూ తపస్సు లేకపోవటంవలననే సంభవిస్తాయి. పరిశీలించి చూడుము.

తే. **అనఘ! సుఖదుఃఖములు వచ్చినపుడు మద వి । షాదములు లేక సంప్రాప్తసముపభోగ**
**రతుఁడు నప్రాప్యవాంఛా నిరాసకుండు । నగుట సారతపోరూప మండ్రు బుధులు.** **501**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; బుధులు= పండితులు; సుఖదుఃఖములు= హర్షవిషాదాలు; వచ్చినపుడు= సంభవించిన సమయంలో; మదవిషాదములు లేక= పొంగటం, క్రుంగటం లేకుండా; సంప్రాప్త సముపభోగరతుఁడున్= లభించిన భోగాలలో ఆసక్తి కలవాడును; అప్రాప్యవాంఛా నిరాసకుండున్= లభ్యంకాని కోరికలను త్యజించేవాడును; అగుట= కావటం; సారతపో రూపము+అండ్రు= శ్రేష్ఠతపస్సుయొక్క రూపు అని పలుకుతారు.

**తాత్పర్యం:** కిల్బిషరహితుడవైన ఓ రాజా! సుఖం వచ్చినపుడు పొంగిపోక, దుఃఖం వచ్చినపుడు క్రుంగిపోక, తాముగా వచ్చి చేరిన భోగా లనుభవిస్తూ, లభించనివాటికి సంబంధించిన కోరికలను దూరం చేసికొనటమే శ్రేష్ఠమైన తపస్సుయొక్క లక్షణమని పండితులు చెప్తుతారు.

**క. వరధర్మము నర్థంబును । సరసంబగు విషయ సుఖము సద్గతియుఁ దపః**
**పరిపాకమునన కలుగున్ । నరునకుఁ దత్త ద్విధాత్త నైపుణుఁ డైనన్.' 502**

**ప్రతిపదార్థం:** నరునకున్= మనుజుడికి; తత్తద్విధా+ఆత్తనైపుణుఁడు+ఐనన్= ఆయా విధాలలో పొందబడిన నేర్పు గలవాడైతే; వరధర్మమున్= శ్రేష్ఠమైన ధర్మమూ; అర్థంబునున్= విత్తమూ; సరసంబు+అగు= రసవంతమైన; విషయసుఖమున్= శబ్దాది విషయాలవలన కలిగే కామ సౌఖ్యమూ; సద్గతియున్= ఉత్తమగతియూ; తపఃపరిపాకమునన్+అ= తపస్సు పండటం చేతనే; కలుగున్= సంభవిస్తాయి.

**తాత్పర్యం:** మానవుడు ఆయా విధానాలలో నేర్పు సంపాదిస్తే తపస్సు పక్వదశకు వచ్చినప్పుడే ధర్మం, అర్థం, విషయసుఖంతో కూడిన కామం, ఉత్తమగతి అయిన మోక్షం అనే చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి'.

**వ. అనిన విని జనకుండు వర్ణంబుల యుత్కర్షాపకర్షత్వంబులకు మూలం బెయ్యది దానిని, దాన పుత్రుండై జన్మించునం;డ్రదియు విసంశయం బగుట నెఱింగింపవే' యనుటయుం బరాశరుం డతని కిట్లనియె.503**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; జనకుండు= జనకభూపాలుడు; వర్ణంబుల= బ్రాహ్మణాదిజాతులయొక్క; ఉత్కర్ష+అపకర్షత్వంబులకున్= ఎక్కువ - తక్కువతనాలకు; మూలంబు= కారణం; ఏ+అది?= ఏది?; దానిని= ఆ విషయాన్ని; తాన్+అ= తానే; పుత్రుండు+ఐ= కుమారుడై; జన్మించున్= పుట్టుతాడు; అండ్రు= అని అంటారు; అదియున్= ఆ విషయమును; విసంశయంబు+అగుట= సందేహం తొలగునట్లుగా; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అడిగేసరికి; పరాశరుండు= పరాశరముని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పరాశరుడట్లా చెప్పగా విని జనకమహారాజు 'బ్రాహ్మణక్షత్రియాదులైన వర్ణాలకు గొప్పతనం, తక్కువతనం కలగటానికి కారణ మేమి? ఆ విషయాన్నీ, తానే కుమారుడై జన్మిస్తాడని అంటారు. ఆ సంగతినీ సందేహం తీరేటట్లు నాకు తెలియజెప్పుము' అని అడిగాడు. అప్పుడు పరాశరముని జనకమహారాజుతో ఇట్లా చెప్పాడు:

**తే. 'పద్మభవముఖ బాహూరుపాదసంభ । వములు గాన భూసురరాజవైశ్యశూద్ర**
**భావములు తారతమ్య సంప్రాప్తి నొందె । జనన దేశగుణంబుల మనుజనాథ! 504**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; భూసురరాజ వైశ్యశూద్రభావములు= బ్రాహ్మణత్వం, క్షత్రియత్వం, వైశ్యత్వం, శూద్రత్వం అనేవి; పద్మభవముఖ బాహు+ఊరు పాదసంభవములు కానన్= బ్రహ్మయొక్క వదనం, బాహువులు, తొడలు, కాళ్ళు - ఉత్పత్తి స్థానాలుగా కలవి కావున; జనన దేశగుణంబులన్= పుట్టినచోట్ల యొక్క గుణాలనుబట్టి; తారతమ్య సంప్రాప్తిన్= తరతమ భావంయొక్క ప్రాప్తిని; ఒందెన్= పొందాయి.

**తాత్పర్యం:** రాజా! బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు క్రమంగా బ్రహ్మదేవుడియొక్క ముఖం, బాహువులు, తొడలు, పాదాలు అనే చోట్లనుండి పుట్టారు. పుట్టినచోటుయొక్క భేదాలను బట్టి బ్రాహ్మణాది వర్ణాలు ఉత్కర్షభావాన్నీ, అపకర్షభావాన్నీ పొందాయి.

**విశేషం:** బ్రాహ్మణాది వర్ణాలపుట్టుక పురుషసూక్తం ఆధారంగా ఇక్కడ వర్ణించబడింది. పురుషసూక్తానికి వివరణ ఇచ్చేవారు పలురకాల అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నారు. సమాజస్వరూపాన్ని విరాట్పురుషుడి స్వరూపంతో పోల్చటం జరిగిందే కాని మానవుల పుట్టుకలో స్థానభేదాలున్నాయని చెప్పటం సమంజసం కాదని కొందరు అభిప్రాయపడుతున్నారు. ఇక్కడ పుట్టినచోటే భేదాలకు కారణమని స్పష్టంగా పేర్కొనటం గమనార్హం. పుట్టుకతోనే మానవులలో ఒకరిని ఎక్కువగా, మరొకరిని తక్కువగా భావించటమనేది భారతకాలం నుండీ వస్తున్న సంప్రదాయ మని గుర్తించవలసి ఉంటుంది.

**క. తాన సుతుఁ డగుట దెలియం । గానగు; మును లాత్మ వీర్య కలనం బెచ్చో**
**నైనం జేయఁగ ముని భా । వానూనత ఋశ్యశృంగుఁ డాదిగఁ గనుటన్.' 505**

**ప్రతిపదార్థం:** మునులు= మహర్షులు; ఆత్మవీర్యకలనంబు= తమ శుక్రమును ఉంచుటను; ఏ+చోనైనన్= ఏ చోటనైనా; చేయఁగన్= చేయగా; మునిభావానూనతన్= మునిత్వంయొక్క సమగ్రత్వాన్ని; ఋశ్యశృంగుఁడు+ఆదిగన్= ఋశ్యశృంగుడు మొదలుగా; కనుటన్= పొందుటచేత; తాన్+అ= తానే; సుతుఁడు+అగుట= పుత్రుడు కావటం; తెలియంగాన్+అగున్= తెలిసికొనవచ్చును.

**తాత్పర్యం:** మునులు తమ వీర్యాన్ని ఎక్కడ నిక్షిప్తం చేసినా అక్కడ సమగ్రమైన మునిత్వం కల్గినవారు జన్మిస్తున్నారు. ఈ సంగతిని ఋశ్యశృంగుడు మొదలైనవారిలో చూడవచ్చును. అందువలన 'ఆత్మా వై పుత్ర నామాసి' అన్నట్లు తానే పుత్రుడై జన్మిస్తున్నాడని తెలిసికొనవచ్చును'.

**విశేషం:** ఋశ్యశృంగుడు విభాండకుడనే మునియొక్క పుత్రుడు. విభాండకుడు నదిలో స్నానం చేస్తూ ఊర్వశిని చూచాడు. అతడి వీర్యం అప్పుడు నదిలో పడింది. ఒక ఆడమృగం ఆ నీటిని త్రాగింది. నీటితోపాటు విభాండకుని శుక్లం కూడా మృగముయొక్క గర్భంలో ప్రవేశించింది. ఆ మృగానికి పుట్టిన కుమారుడే ఋశ్యశృంగుడు. దీనినిబట్టి ఋషుల తేజస్సు ఎక్కడ పడినా అక్కడ ఋషికుమారులే పుట్టుతున్నారని తెలియరావటం వలన తండ్రి తానే తనయుడై జన్మిస్తున్నాడని గ్రహించవచ్చును.

**ఆ. అనిన జనకుఁ డిట్టులను 'వినినవి యైన । వలయుఁ దెలియ వినఁగ వర్ణధర్మ**
**సమితిఁ గల విశేషసాధారణత్వంబు । లేర్పరించి చెప్పవే మునీంద్ర!' 506**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; జనకుఁడు= జనకచక్రవర్తి; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; ముని+ఇంద్ర!= మునివర్యా!; వినినవి ఐనన్= ముందు విన్నవే ఐనప్పటికీ; తెలియన్= స్పష్టంగా తెలిసికొనటానికి; వినఁగన్ వలయున్= మళ్ళీ వినాలి; వర్ణధర్మసమితిన్= బ్రాహ్మణాదివర్ణాలయొక్క ధర్మసముచ్చయంలో; కల= ఉన్నట్టి; విశేషసాధారణత్వంబులు= విశేషభావమూ, సామాన్యభావమూ; ఏర్పరించి= విభజించి; చెప్పవే= విశదీకరించుమా!

**తాత్పర్యం:** పరాశరు డట్లా చెప్పగా జనకుడు మళ్ళీ ఈ రీతిగా అన్నాడు: 'మునివర్యా! పూర్వం విన్న విషయాలే స్పష్టంగా గ్రహించాలంటే మళ్ళీ మళ్ళీ వినవలసి ఉంటుంది. బ్రాహ్మణక్షత్రియాది వర్ణాలలో ఉన్న సాధారణ ధర్మాలు, విశేషధర్మాలు చక్కగా విభజించి నాకు వివరించుము.'

**వ. అనుటయుఁ బరాశరుం డిట్టు లనియె. 507**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; పరాశరుండు= పరాశరముని; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** జనకు డట్లా ప్రశ్నించగా పరాశరుడిట్లా చెప్పాడు.

**సీ.** **'వినుము ప్రతిగ్రహంబును యాజనంబును। నధ్యాపనమును ధరామరులకుఁ,**
**బ్రజరక్ష నృపునకుఁ, బశుపాలనము గృషి। వాణిజ్య మనునివి వణిజులకును,**
**శూద్రజనులకు శుశ్రూషయు శ్రుతులు వి। శేషధర్మములుగఁ జెప్పు సత్య**
**శౌచంబులును నహింసయు ననసూయయు। శ్రాద్ధంబు నతిథిపూజనము నాత్మ**

**తే.** **దారపరతయు సర్వసాధారణంబు। లనఘ! వీనను నిజవృత్తులను సమస్త**
**జాతులును నిహపరసౌఖ్యసంపదలకు। నాస్పదములగు; నింద్యంబు లన్యవిధులు.** **508**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; వినుము= ఆలకించుము; శ్రుతులు= వేదాలు; ధరామరులకున్= విప్రులకు; ప్రతిగ్రహంబునున్= పుచ్చుకొనటమును; యాజనంబునున్= యజింపజేయటమును; అధ్యాపనమునున్= చదివించటమును; నృపునకున్= రాజుకు; ప్రజరక్ష= జనరక్షణమును; వణిజులకునున్= వైశ్యులకు; పశుపాలనమున్= పశురక్షణమును; కృషి= వ్యవసాయమును; వాణిజ్యమునున్= వ్యాపారమును; అను+ఇవి= ఈ చెప్పినవృత్తులు; శూద్రజనులకున్= శూద్రప్రజలకు; శుశ్రూషయున్= సేవయును; విశేషధర్మములుగన్= విశిష్టమైన ధర్మాలుగా; చెప్పున్= వచించును; సత్యశౌచంబులునున్= సత్యాన్నీ, శుచినీ పాటించటం; అహింసయున్= హింసలేమి; అనసూయయున్= అసూయ లేకుండా ఉండటం; శ్రాద్ధంబున్= పితృకర్మయు; అతిథిపూజనమున్= అతిథులను సమ్మానించటమూ; ఆత్మదారపరతయున్= తన భార్యయందే తత్పరుడై ఉండటమూ; సర్వసాధారణంబులు= అన్ని వర్ణాలకూ సమానమైన ధర్మాలు; వీననున్= ఈ సామాన్యధర్మాల చేతను; నిజవృత్తులనున్= తమ తమ విశిష్టధర్మాలకు చెందిన వర్తనాల చేతను; సమస్తజాతులును= సర్వవర్ణాలూ; ఇహపరసౌఖ్యసంపదలకున్= ఈ లోకానికీ, పరలోకానికీ చెందిన సుఖవిభవాలకు; ఆస్పదములు+అగున్= స్థానాలు అవుతాయి; అన్యవిధులు= తదితరవృత్తులు; నింద్యంబులు= నిందించదగినవి.

**తాత్పర్యం:** 'పాపరహితుడా! నీవడిగిన విషయాలు వివరిస్తాను వినుము. బ్రాహ్మణులకు దానం పుచ్చుకొనటం, యజ్ఞం చేయించటం, వేదం చదివించటం విశేషధర్మాలు. రాజుకు ప్రజారక్షణమూ, వైశ్యులకు పశురక్షణ, వ్యవసాయం, వ్యాపారం, శూద్రులకు సేవావృత్తి - ఇవి విశేషధర్మాలని వేదాలు చెప్తున్నాయి. సత్యం, శౌచం, అహింస, అసూయలేమి, పితృకర్మ, అతిథిపూజ, తన భార్యతో మాత్రమే సంగమం కలిగి ఉండటం అనేవి సర్వవర్ణాలకూ సాధారణధర్మాలు. ఈ సామాన్యధర్మాలనూ, పై జెప్పిన విశేషధర్మాలనూ పాటిస్తే అన్ని జాతులూ ఇహలోకంలోనూ, పరలోకంలోనూ సుఖం పొందుతాయి. ఇక్కడ జెప్పినట్లు కాక ఇతర ధర్మాలు పాటించటం తగదు. అవి నిందించదగినవి.

**విశేషం:** ఇక్కడ విప్రులకు దానం పుచ్చుకొనటం, యాగం చేయించటం, వేదం చదివించటం అనే మూడు విశేషధర్మాలు చెప్పటమయింది. వీటితోపాటు దానం చేయటం, యాగం చేయటం, వేదం చదవటం అనేవి కూడా ఉన్నాయి. ఇవి అన్నీ కలిస్తే షట్కర్మ లనబడుతాయి. అవే దానం, ప్రతిగ్రహం, యజనం, యాజనం, అధ్యయనం, అధ్యాపనం అని పేర్కొనబడ్డాయి.

**క.** **భూవర! నాకుం జూడం। గా విష్ణుఁడు దైవ; మట్లు గావున నతనిన్**
**భావించు టెల్ల వారికిఁ। గావించును మోక్షమయసుఖము లన్నింటన్.'** **509**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; నాకున్+చూడంగాన్= నేను పరిశీలించగా; విష్ణుఁడు= వెన్నుడు; దైవము= దేవుడు; అట్లు కావునన్= అట్లాకావటంవలన; అన్నింటన్= అన్ని విషయాలలోనూ; అతనిన్= ఆ విష్ణువును; భావించుట= తలచటం; ఎల్లవారికిన్= అందరికీ; మోక్షమయ సుఖములు= ముక్తిమయమైన సౌఖ్యాలు; కావించును= కలిగిస్తాడు'.

**తాత్పర్యం:** రాజా! నా దృష్టిలో విష్ణువే పరదైవతము. అందువలన అందరూ అన్నివిషయాలలోనూ ఆ దేవుడిని తలంచటం మంచిది. అట్లా చేస్తే మోక్షాత్మక సుఖం సిద్ధిస్తుంది'.

**క. అనిన విని జనక భూవిభుఁ। డనఘ! యహింసనములైన యవి యెయ్యవి? య**
**ప్పను లెఱుఁగ జెప్పవే నా'। కనుడు నతని కిట్టులనియె నమ్ముని యధిపా! 510**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; అనినన్= అని చెప్పగా; విని= ఆకర్ణించి; జనకభూవిభుఁడు= జనకమహారాజు; అనఘ!= పాపరహితుడా!; అహింసనములు+ఐన అవి= హింసారహితములైనవి; ఎయ్యవి?= ఏవి?; ఆ+పనులు= ఆ కార్యాలు; నాకున్= జనకుడనైన నాకు; ఎఱుఁగన్+చెప్పవే= తెలియజెప్పుమా; అనుడున్= అనగా; ఆ+ముని= ఆ పరాశరుడు; అతనికిన్= జనకుడికి; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పరాశరమునీంద్రుడు ఆ రీతిగా చెప్పేసరికి విని జనకుడు 'అనఘా! హింసారహితాలైన పనులేవి? ఆ పనులు ఏవో నాకు విశదపరచుము' అని మళ్ళీ ప్రశ్నించాడు. అప్పుడు ఆ పరాశరు డా రాజుతో ఈ విధంగా చెప్పాడు.

**జనకునకుఁ బరాశరముని వివరించిన హింసాహింసల ప్రకారము (సం. 12-280-12)**

**ఆ. 'శమము దమము లేమి జనులకు హింస నొ। నర్చుఁ గాన ధరణినాథ! విను మ**
**హింస శమదమములు హృదయంబునకు నెప్డు। నలవడంగఁ జేత యంద్రు బుధులు.' 511**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; వినుము= ఆలకింపుము; శమము= అంతరింద్రియ నిగ్రహం; దమము= బాహ్యేంద్రియ నిగ్రహం; లేమి= లేకపోవటం; జనులకున్= ప్రజలకు; హింసన్= పీడను; ఒనర్చున్+కానన్= కలిగిస్తుంది కాబట్టి; బుధులు= పండితులు; హృదయంబునకున్= చిత్తానికి; ఎప్డున్= ఎల్లవేళలా; శమదమములు= అంతరింద్రియ, బాహ్యేంద్రియ నిగ్రహాలు; అలవడంగన్+చేఁత= అలవాటు చేయటం; అహింస అంద్రు= 'అహింస' అని చెప్తుతారు.

**తాత్పర్యం:** 'రాజా! నీ వడిగిన విషయం వివరిస్తాను. వినుము. మనోనిగ్రహమనే శమమూ, బాహ్యేంద్రియ నిగ్రహమనే దమమూ లేకపోతే జనులకు హింస కలుగుతుంది. అందువలననే పెద్దలు చిత్తానికి శమదమాలు అలవాటు చేయటమే అహింస అంటారు'.

**వ. అని చెప్పి వెండియుం బరాశరమునీశ్వరుం డిట్లనియె. 512**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల; పరాశరమునీశ్వరుండు= పరాశరమునివర్యుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా చెప్పి మళ్ళీ పరాశరముని జనకుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'దురమున జయము గొనుటకై। నరపతులకు వలయు హింసనం బెట్లును; ద**
**త్పరిహరణ స్థానములును। ధరణీశ్వర! కలవు సెప్పెదను విను వానిన్. 513**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= రాజా!; నరపతులకున్= రాజులకు; దురమునన్= యుద్ధంలో; జయమున్= గెలుపును; కొనుటకై= స్వీకరించటానికై; ఎట్లునున్= ఎట్లైనా; హింసనంబు= హింసించటం; వలయున్= ఆవశ్యకమై ఉన్నది; తత్పరిహరణ స్థానములునున్= ఆ హింసను పరిహరించే చోట్లు కూడ; కలవు= ఉన్నాయి; వానిన్= ఆ చోట్లను; చెప్పెదను= వివరిస్తాను; విను= వినుము.

**తాత్పర్యం:** 'రాజా! యుద్ధభూమిలో గెలుపు పొందటానికై రాజులు ఎట్లాగూ హింస చేయక తప్పదు. అయితే ఆ హింస కలగకుండా నివారించే స్థానాలు కూడా కొన్ని ఉన్నాయి. వాటిని వివరిస్తాను. వినుము.

**క. పడినం బాఱినఁ గైదువు । వడినను వాహనము వడినఁ బార్థివముఖ్యా!**
**పొడువఁదగదు శత్రుని నె । య్యెడల నహింసనముఁ బోల వే సుకృతములున్. 514**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజశ్రేష్ఠా!; పడినన్= శత్రువు క్రింద పడిపోయినా; పాఱినన్= పరుగిడినా; కైదువు= ఆయుధం; పడినను= క్రిందపడిపోయినా; వాహనము= గుర్రం వంటి వాహనం; పడినన్= పడిపోయినా; శత్రునిన్= పగవాడిని; పొడువన్+తగదు= కొట్టకూడదు; ఏ+ఎడలన్= ఏ సందర్భంలోనైనా; ఏ సుకృతములున్= ఏ పుణ్యాలునూ; అహింసనమున్+పోలవు= హింసలేమికి సరిరావు.

**తాత్పర్యం:** రాజవర్యా! యుద్ధరంగములో శత్రువు క్రిందపడిపోయినపుడు, పారిపోయినపుడు, అతడిచేతిలోని ఆయుధం జారిపోయినప్పుడు, అతడి వాహనం పడిపోయినపుడు అతడిని ప్రహరించకూడదు. ఎప్పుడైనాసరే, ఏ పుణ్యకార్యాలైనా అహింసకు సాటిరావు.

**క. న్యాయమున సంగరంబుం । జేయఁగ శస్త్రాగ్ని దన్నుఁ జెందిన దానం**
**గాయంబు విడుచు పురుషుఁడు । వేయేటికి మోక్షలక్ష్మి విభుఁ డగు నధిపా! 515**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; న్యాయమునన్= క్రమం తప్పక; సంగరంబున్= యుద్ధమును; చేయఁగన్= నిర్వహించగా; శస్త్రాగ్ని= ఆయుధాగ్ని; తన్నున్= తనను; చెందినన్= తాకితే; దానన్= దానివలన; కాయంబున్= శరీరమును; విడుచు పురుషుఁడు= త్యజించే మనుజుడు; వేయి+ఏటికిన్?= వేయిమాట లేల?; మోక్షలక్ష్మివిభుఁడు+అగున్= ముక్తిరమకు భర్త అవుతాడు.

**తాత్పర్యం:** రాజా! వేయిమాట లెందుకు? న్యాయంగా యుద్ధంచేసే సమయంలో శత్రువు ప్రయోగించిన శస్త్రానలం సోకి మరణించే పురుషుడు మోక్షలక్ష్మికి మగడవుతాడు.

**క. తనతోఁ దుల్యుం డైనను । మనుజాధిప! యధికబల సమగ్రత్వము గ**
**ల్గిన నని శత్రుని వధియిం । చిన నరపతి పుణ్యలోక సిద్ధిం బొందున్.' 516**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిప!= రాజా!; అనిన్= యుద్ధంలో; తనతోన్+తుల్యుండు+ఐనను= తనతో సమానుడైనా; అధికబల సమగ్రత్వమున్= ఎక్కువ బలసంపూర్ణతను; కల్గినన్= కలిగిఉన్నా; శత్రుని= అట్టిపగవాడిని; వధియించిన= చంపిన; నరపతి= రాజు; పుణ్యలోకసిద్ధిన్= పుణ్యలోకప్రాప్తిని; పొందున్= చెందుతాడు.

**తాత్పర్యం:** యుద్ధభూమిలో ఏ భూపాలుడు తనతో బలంలో సమానుడూ, లేక తనకంటె ఎక్కువబలం కలవాడూ అయిన పగవాడిని చంపుతాడో, అతడు పుణ్యలోకాలకు పోతాడు'.

**విశేషం:** యుద్ధంలో చనిపోయినవాడు మోక్షం పొందుతాడని పూర్వపద్యంలో చెప్పబడింది. ఇక్కడ చంపినవాడు కూడా పుణ్యలోకాలకు పోతాడని చెప్పటమయింది. అయితే తనకంటె బలహీనుడైనవాడిని చంపితే సుగతి కలగదని ఈ పద్యాన్నిబట్టి గ్రహించాలి.

**వ. అని మఱియును. 517**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ పరాశరముని ఇట్లా అన్నాడు:

క. ' **భూతంబులు నింద్రియ సం । ఘాతము సత్త్వాదిగుణనికాయముఁ గాయం**
**బైతోఁచు టెఱిఁగినను ధ । ర్మేతరకృత్యములు సేయునే నరుఁ డనఘా! 518**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; భూతంబులున్= పంచభూతాలును; ఇంద్రియసంఘాతమున్= ఇంద్రియాల సమూహమును; సత్త్వాదిగుణనికాయమున్= సత్త్వం మొదలైన గుణాల సంచయమును; కాయంబు+ఐ= శరీరమై; తోఁచుట= ప్రకాశించటం; ఎఱిఁగినను= తెలిసికొన్నచో; నరుఁడు= మానవుడు; ధర్మేతర కృత్యములు= అధర్మకార్యాలు; చేయునే?= చేస్తాడా?

**తాత్పర్యం:** పాపరహితుడా! పృథివ్యాదులైన ఐదుభూతాలు, శ్రోత్రం మొదలైన ఇంద్రియాల సమూహం, సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలూ శరీరంగా రూపొందుతాయి అన్న విషయం తెలిస్తే మానవుడు అధర్మకార్యాలు చేయగలడా?

క. **జాతుఁడు మృతుఁ డగుట ధ్రువము; । భూతోల్లాసము లనిత్యములు; విను సద్యః**
**పాతి యగు శరీరంబున । కై తొఱఁగునె ధర్మపథము నార్యుం డనఘా! 519**

**ప్రతిపదార్థం:** అనఘా!= కిల్బిషంలేనివాడా!; విను= ఆలకించుము; జాతుఁడు= పుట్టినవాడు; మృతుఁడు+అగుట= చచ్చుట; ధ్రువము= నిక్కం; భూత+ఉల్లాసములు= ప్రాణుల విలాసాలు; అనిత్యములు= అశాశ్వతాలు; ఆర్యుండు= పూజ్యుడు; సద్యఃపాతి అగు= వెంటనే పడిపోయే; శరీరంబునకై= దేహంకొరకై; ధర్మపథమున్= ధర్మమార్గాన్ని; తొఱఁగునె?= విడుచునా?

**తాత్పర్యం:** జనకా! ఇంకా చెప్పుతాను వినుము. పుట్టినవాడు మరణించటం తథ్యం. ప్రాణులకు సంబంధించిన ఉల్లాసాలన్నీ అశాశ్వతాలు. పూజ్యుడైన మానవుడు త్రుటిలో నశించిపోయే ఈ శరీరంకొరకై ధర్మమార్గం వీడి చరిస్తాడా?

తే. **ఉత్తరాయణమును సంగరోత్సవాది । కారణంబులుఁ గలుగు సత్కర్మపరుని**
**మరణమునకు దుష్కాలంబు గరళరజ్జు । జలముఖములుఁ బాటిలు దుష్టచరితుమృతికి. 520**

**ప్రతిపదార్థం:** సత్కర్మపరుని మరణమునకున్= సత్కార్యాలు చేసేవాడి చావుకు; ఉత్తర+అయనమును= ఉత్తరాయణ కాలమున్నూ; సంగర+ఉత్సవాదికారణంబులున్= యుద్ధోత్సవం మొదలైన హేతువులున్నూ; కలుగున్= సంభవిస్తాయి; దుష్టచరితు మృతికిన్= దుర్జనుడి మరణానికి; దుష్కాలంబున్= చెడుకాలం; గరళరజ్జుజలముఖములున్= విషం, త్రాడు, నీరు మొదలైనవి; పాటిలున్= సంభవిస్తాయి.

**తాత్పర్యం:** సత్కార్యాలు చేసే సజ్జనుడికి మరణం ఉత్తరాయణ పుణ్యకాలంలోనూ, యుద్ధం మొదలైన సంఘటనల వలననూ కలుగుతుంది. దుష్కార్యపరుడైన దుష్టుడు దుష్టకాలంలో (దక్షిణాయనంలోనే) మరణిస్తాడు. వాడి చావుకు విషం, ఉరిత్రాడు, జలం మొదలైనవి హేతువు లవుతాయి.

క. **మానవులకుఁ దలఁపఁగ న । జ్ఞానమునట్టి పగ లేఁ దసంగతకృత్యా**
**ధీనుండై రూపు సెడును । దానం గావున నుదాత్త ధర్మవిధిజ్ఞా! 521**

**ప్రతిపదార్థం:** ఉదాత్తధర్మవిధిజ్ఞా!= శ్రేష్ఠమైన ధర్మవిధిని తెలిసినవాడా!; దానన్= అజ్ఞానంవలన; అసంగతకృత్యాధీనుండు+ఐ= అనుచితాలైన కార్యములకు వశమైనవాడై; రూపుచెడును కావునన్= నశిస్తాడు కాబట్టి; తలఁపఁగన్= ఊహించగా; మానవులకున్= మనుజులకు; అజ్ఞానమునట్టి= అజ్ఞానమువంటి; పగ= శత్రువు; లేదు= లేదు.

**తాత్పర్యం:** మేలైన ధర్మప్రకారమును తెలిసిన ఓ జనకమహారాజా! అజ్ఞానంవలన మానవుడు అనుచితకార్యాలకు పాల్పడి నశించిపోతాడు. అందువలన మనుష్యులకు అజ్ఞానంవంటి విరోధి మరొకడు లేడు.

**క. మానుషజన్మము మే; లతి । హీనపు జాతిని జనించె నేనియు నన్యం**
**బైన జననంబు కంటెను । దాన సుగతివడయ నగుట దత్త్వప్రవణా! 522**

**ప్రతిపదార్థం:** తత్త్వప్రవణా!= తత్త్వమునందు ఆసక్తుడైన వాడా!; దానన్= మానవజన్మచేత; సుగతిన్= సద్గతిని; పడయన్+అగుటన్= పొందవచ్చును కాబట్టి; అన్యంబు+ఐన= ఇతరమైన; జననంబుకంటెను= జన్మకంటె; అతిహీనపుజాతినిన్= మిగుల తక్కువ కులంలో; జనించెన్+ఏనియున్= పుట్టినను; మానుషజన్మము= మనుష్యుడియొక్క పుట్టుక; మేలు= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** యథార్థతత్త్వమునందు ఆసక్తి గల ఓ రాజా! ఎంత తక్కువ కులంలో పుట్టినా, ఇతర జన్మలకంటె మానవుడై జన్మించటమే మేలు. ఎందుకంటే మానవజన్మవలన సద్గతిని పొందవచ్చును గదా!'

**క. దానములఁ బుణ్యతీర్థ । స్నానంబుల నతిథిపూజనంబులను ఫలా**
**దాన నిరతుండు గా కీ । మానుష్యము గారవించు మతి నిత్యుఁడగున్.' 523**

**ప్రతిపదార్థం:** దానములన్= దానాలివ్వటంలోనూ; పుణ్యతీర్థస్నానంబులన్= పవిత్రతీర్థాలలో స్నానం చేయటంలోనూ; అతిథిపూజనంబులనున్= అతిథులను పూజించుటలోనూ; ఫలాదాననిరతుండు కాక= ఫలాన్ని పొందటంలో ఆసక్తిగలవాడుకాక; ఈ మానుష్యమున్= ఈ మనుష్యత్వమును; గారవించుమతిన్= గౌరవించే బుద్ధిచేత; నిత్యుఁడు+అగున్= శాశ్వతు డవుతున్నాడు.

**తాత్పర్యం:** దానాలు, పుణ్యతీర్థాలలో స్నానాలు, అతిథి సమ్మానాలు చేసినప్పుడు వాటివలన కలిగే ఫలాన్ని ఆశించకుండా ఉండాలి. అట్లా ఉంటూ ఈ మనుష్యజన్మమును ఎవడు గౌరవిస్తాడో, వాడు శాశ్వతస్థానం పొందుతాడు. (ఫలాకాంక్ష లేకుండా సత్కర్మలు చేస్తే శాశ్వతస్థితి లభిస్తుం' దని తాత్పర్యం).

**వ. అనిన విని జనక జనేశ్వరుండు పరాశరమునీశ్వరునితో 'మే లెయ్యది? పరమగతి యెయ్యది? కృతంబైన నెద్దానికి నాశంబు లేకుండు? నెఱింగింపవే' యనవుడు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె. 524**

**ప్రతిపదార్థం:** అనినన్= పరాశరు డట్లా చెప్పగా; విని= ఆకర్ణించి; జనకజనేశ్వరుండు= జనకరాజు; పరాశరముని+ఈశ్వరునితోన్= పరాశరమునీంద్రుడితో; ఏ+అది= ఏది; మేలు= భద్రమైనది; ఏ+అది= ఏది; పరమగతి= శ్రేష్ఠమైన గతి; కృతంబు+ఐనన్= చేయబడితే; ఏ+దానికిన్= దేనికి; నాశంబులేకుండున్= వినాశం లేకుండా ఉంటుందో; ఎఱింగింపవే!= తెలుపుమా!; అనవుడున్= అనగా; ఆ+మహీపతికిన్= ఆ రాజుకు; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా చెప్పగా విని జనకుడు పరాశరుడితో 'ఏది మేలు? ఏది సుగతి? ఏ పని చేస్తే దానికి వినాశం లేకుండా శాశ్వతంగా ఉంటుంది? ఈ విషయాలు నాకు తెలియపరచు' మని అడిగాడు. అప్పుడు ఆ రాజును చూచి ఆ ముని ఇట్లా పలికాడు.

**ఆ. ' అరయ మే లసంగ; మంచితజ్ఞానంబు । పరమగతి, మహాతపంబు చేటు**
**లేని కృత్య; మిట్లుగా నెఱుంగుట సర్వ । వేదవాక్య తత్త్వవిత్త్వ మనఘ! 525**

**ప్రతిపదార్థం:** అనఘ!= కిల్బిషరహితుడా!; అరయన్= పరిశీలించిచూడగా; అసంగము= సంగం లేకుండా ఉండటం; మేలు= భద్రం; అంచితజ్ఞానంబు= పూజితమైన జ్ఞానం; పరమగతి= శ్రేష్ఠమైన గతి; మహాతపంబు= గొప్ప తపస్సు; చేటులేని= చెడిపోని; కృత్యము= కార్యం; ఇట్లుగాన్= ఈ రీతిగా; ఎఱుంగుట= గ్రహించటం; సర్వవేదవాక్య తత్త్వవిత్త్వము= సమస్త వేదవచనాల తత్త్వాన్ని తెలియటం.

**తాత్పర్యం:** 'అనఘా! దేనితోనూ సంగం లేకుండా ఉండటం మేలు. మంచి జ్ఞానం కలిగిఉండటం పరమమైన గతి. గొప్ప తపస్సు అనుష్ఠిస్తే దానికెప్పుడూ నాశముండదు. ఇట్లా తెలిసికొనటమే సర్వవేదవచనాల యథార్థభావాన్ని గ్రహించటం అవుతుంది.'

**వ.** **అని చెప్పి వెండియు.** **526**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఇట్లా పలికి పరాశరుడు మళ్ళీ ఈ రీతిగా చెప్పాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **విను సుమతి విషయములయం । దునికి గలిగె నేనిఁ బొందఁ డుదకంబులఁ బొం**
**దని బిసరుహపత్త్రము చా । డ్పున నది విజ్ఞానఫలము భూపవరేణ్యా!** **527**

**ప్రతిపదార్థం:** భూపవరేణ్యా!= రాజవర్యా!; విను= ఆలకించు; సుమతి= బుద్ధిమంతుడు; విషయముల+అందున్= శబ్దంమొదలైన విషయాలలో; ఉనికి కలిగెన్+ఏనిన్= ఉన్నను; ఉదకంబులన్= నీళ్ళను; పొందని= అంటని; బిసురహపత్రము చాడ్పునన్= తామరాకువలె; పొందఁడు= అంటడు; అది= అట్లా అంటనితనం; విజ్ఞానఫలము= విజ్ఞానముయొక్క ప్రయోజనం.

**తాత్పర్యం:** 'రాజశ్రేష్ఠా! వినుము. నీళ్ళలో ఉన్నా తామరాకునకు నీరంటదు. అట్లాగే బుద్ధిగలవాడు శబ్దస్పర్శాది విషయాలలో ఉన్నా అవి అంటకుండా ఉంటాడు. అట్లా అసంగంగా ఉండటమే విజ్ఞానం గలిగిఉన్నందుకు ఫలమవుతుంది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే.** **అనఘ! మూఢాత్ము చిత్తంబునందు విషయ । జాల మత్యంత గాఢసంసక్తి నొందు**
**లక్కరసము దండాదుల జిక్కఁబట్టు । చందమున దీనిఁ గనుట ప్రశాంతికరము.** **528**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; మూఢాత్మచిత్తంబునందున్= మూర్ఖుడి మనస్సులో; విషయజాలము= శబ్దం మొదలుగా గల విషయ సమూహం; లక్కరసము= లక్కద్రవము; దండాదులన్= కట్టె మొదలైనవాటిని; చిక్కఁబట్టు చందమునన్= అంటబట్టుకొనే రీతిగా; అత్యంతగాఢసంసక్తిన్= మిక్కిలి దృఢమైన సంయోగాన్ని; పొందున్= పొందుతుంది; దీనిన్= ఈ పరిస్థితిని; కనుట= గ్రహించటం; ప్రశాంతి కరము= ప్రశాంతిని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** జనకమహారాజా! లక్కరసం ఏ విధంగా దండం మొదలైన పదార్థాలను గట్టిగా పట్టుకొంటుందో అట్లాగే మూఢుని హృదయంలో శబ్దస్పర్శాదులైన విషయజాలం మిక్కిలి దృఢంగా అంటుకొనిపోతుంది. ఈ సంగతిని గమనించి జాగ్రత్తపడటం వలన శాంతి కలుగుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **ఇనరుచిఁ బాషాణము ర ।శ్మి నిరూఢం బైనయట్ల చిత్తము సద్భా**
**వనమున సదాత్మకం బగు । ననామయ స్థితికి మూల మది మనుజేంద్రా!** **529**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్రా!= రాజా; పాషాణము= రాయి (సూర్యకాంతమణి); ఇనరుచిన్= సూర్యకాంతిచేత; రశ్మినిరూఢంబు= కిరణాలతో సంబద్ధం; ఐన+అట్ల= అయిన విధంగా; చిత్తము= మనస్సు; సద్భావనమునన్= మంచిని లేక సత్స్వరూపాన్ని భావించటంచేత; సదాత్మకంబు= మంచితనమే స్వరూపముగా కలది, సత్స్వరూపం; అగున్= అవుతుంది; అది= అట్లాకావటం;

అనామయ స్థితికిన్= శుభస్థితికి; మూలము= కారణం.

**తాత్పర్యం:** రాజా! సూర్యకాంత శిల సూర్యుడి కాంతిలో సూర్యకిరణాలతో సంబద్ధమవుతుంది. అదే రీతిగా మనస్సు మంచిని భావిస్తే మంచిదిగానే రూపొందుతుంది. లేదా సత్యస్వరూపుడైన పరమాత్మను భావిస్తే సత్స్వరూపం గానే పరిణమిస్తుంది. అట్లా పరిణమించి నప్పుడే ఏ ఉపద్రవమూ లేని శుభస్థితి సిద్ధిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఆరయఁ గదళీగర్భా । సారము సంసార; మిట్టిచంద మెఱిఁగినం**
**జేరవు జనన మరణములు; । గారించును దీని భంగిఁ గానక యున్నన్. 530**

**ప్రతిపదార్థం:** ఆరయన్= పరిశీలించగా; సంసారము= గృహస్థజీవనం; కదళీగర్భాసారము= అరటిపొట్టవలె నిస్సారం; ఇట్టిచందమున్= ఈ రీతిని; ఎఱిఁగినన్= తెలిసికొంటే; జనన మరణములు= చావు పుట్టుకలు; చేరవు= దరికిరావు; దీనిభంగిన్= ఈ సంసారస్థితిని; కానక ఉన్నన్= గ్రహించకుంటే; కారించును= బాధిస్తాయి.

**తాత్పర్యం:** పరిశీలించి చూస్తే అరటి కంబంపొట్టవలె సంసారం సారహీనమై కనిపిస్తుంది. ఈ సంగతి గ్రహించిన వాడు చావుపుట్టుకలనుండి విముక్తు డౌతాడు. అది గ్రహించకపోతే జననమరణాలు అతడిని బాధిస్తాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఒరుల పనికిఁగా నిజహిత । విరహితుఁ డగునట్లు గాదె వివిధేంద్రియకా**
**ర్యరతుండై యాత్మసము । ద్ధరణంబును జేయకునికి ధరణీనాథా! 531**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; వివిధ+ఇంద్రియకార్యరతుండు+ఐ= నానావిధాలయిన ఇంద్రియాల పనులలో ఆసక్తుడై; ఆత్మసముద్ధరణంబునున్= తనను ఉద్ధరించు కొనుటను; చేయక+ఉనికి= చేయకుండా ఉండటం; ఒరులపనికిగాన్= ఇతరుల కార్యం కొరకై; నిజహితవిరహితుఁడు= తన+శ్రేయస్సుచేత విడువబడినవాడు; అగునట్లు కాదె= అయినట్లే కదా!

**తాత్పర్యం:** భూపతీ! మానవుడు పలురకాల ఇంద్రియకార్యాలలో నిమగ్నుడై తనను తాను ఉద్ధరించుకొనకపోవటం ఇతరుల పనికై తన శ్రేయస్సును పోగొట్టుకొన్నట్లే కదా!

**క. తన గృహమున నభ్యాసం । బున మెలఁగెడు నంధు చందమున సంసారం**
**బునఁ దిరుగు మూఢుఁ డెఱుఁగఁడు । వినుతం బగుమోక్షపదము విమలవివేకా! 532**

**ప్రతిపదార్థం:** విమలవివేకా!= నిర్మలమైన వివేకం కలవాడా!; తన గృహమునన్= తన ఇంటిలో; అభ్యాసంబునన్= అలవాటువలన; మెలఁగెడు= ప్రవర్తించెడు; అంధుచందమునన్= గ్రుడ్డివాడివలె; సంసారంబునన్= కుటుంబజీవనమునందు; తిరుగుమూఢుఁడు= చరించే మూర్ఖుడు; వినుతంబు+అగు= ప్రశస్తమైన; మోక్షపదమున్= ముక్తిస్థానమును; ఎఱుఁగఁడు= గ్రహించడు.

**తాత్పర్యం:** శుద్ధ వివేకంకల ఓ జనకమహారాజా! గ్రుడ్డివాడు అలవాటు చొప్పున తన ఇంటిలో ఇటు అటు సంచరించినట్లే జనన మరణాత్మకమైన సంసారంలో పరిభ్రమించే మూర్ఖుడు ప్రశస్తమైన మోక్షస్థితిని గ్రహించలేడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. వినుము! మృణాళంబున నం । టిన రొంపి జలంబులం గడిగినను బెడఁబా**

**సిన క్రియ విమల జ్ఞానం । బున సంసారంబు వాయుఁ బురుషు నరేంద్రా! 533**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; వినుము= ఆలకించుము; మృణాళంబునన్= తామరతూడునందు; అంటిన= తగులువడిన; రొంపి= బురద; జలంబులన్= నీటిచేత; కడిగినను= శుభ్రం చేస్తే; పెడన్+పాసినక్రియన్= తొలగిపోయిన రీతిగా; విమలజ్ఞానంబునన్= నిర్మలమైన జ్ఞానంచేత; పురుషున్= మనుజుడిని; సంసారంబు= భవం; పాయున్= విడిచిపోతుంది.

**తాత్పర్యం:** రాజా! వినుము. తామరతూడుకు తగులుకొన్న బురద నీటితో కడిగితే తొలగిపోతుంది. అదే మాదిరిగా మానవుడికి అంటిన సంసారం నిర్మలజ్ఞానం కలిగితే వీడిపోతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. నరనాయక! శిశ్నోదర । పరాయణుం డగుచు నొండు పరికింపని దు**
**ర్నరుఁ డెలుకఁ బిల్లి వొదివిన । పరుసున జర వొదువ ముక్తిఁ బడయక పొలియున్. 534**

**ప్రతిపదార్థం:** నరనాయక!= నరనాథా!; శిశ్నోదరపరాయణుండు+అగుచున్= గుహ్యేంద్రియమునందును, కుక్షియందును ఆసక్తుడవుతూ; ఒండు= మరొకటి; పరికింపని= పరిశీలించని; దుర్నరుఁడు= దుష్టమానవుడు; ఎలుకన్= మూషికమును; పిల్లిపొదివిన పరుసునన్= పిల్లి పట్టుకొన్న రీతిగా; జర= ముసలితనం; పొదువన్= ఆక్రమించగా; ముక్తిన్= మోక్షమును; పడయక= పొందక; పొలియున్= నశిస్తాడు.

**తాత్పర్యం:** రాజా! గుహ్యేంద్రియాన్నీ, కుక్షినీ తృప్తి పరచటంలోనే నిమగ్నుడై మరొక విషయం పరిశీలింపని దుష్టమనుజుడు పిల్లి ఎలుకను పట్టినట్లు తనను వార్ధక్యం పైకొనగా మోక్షం పొందలేక నశిస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. వ్రేఁగు పెద్దైన నోడ వారిధిఁ దరింప । లేని భంగి మనోభవావీఢవృత్తి**
**యగుచునుండు జీవుండు భవాబ్ధియుత్త । రింపలేఁ డిది నిజము గరిష్ఠచరిత! 535**

**ప్రతిపదార్థం:** గరిష్ఠచరిత= శ్రేష్ఠమైన చరిత్రం కలవాడా!; ఓడ= పడవ; వ్రేఁగు= భారం; పెద్ద+ఐనన్= అధికమైతే; వారిధిన్= సముద్రాన్ని; తరింప లేని భంగిన్= దాటలేని రీతిగా; మనోభవావీఢవృత్తి= మన్మథుడిచేత ఆక్రమించబడిన వ్యాపారం కలవాడు; అగుచున్+ఉండు= అవుతున్న; జీవుండు= జీవుడు; భవ+అబ్ధి= సంసారసాగరం; ఉత్తరింపలేఁడు= దాటలేడు; ఇది నిజము= ఇది సత్యం.

**తాత్పర్యం:** పవిత్రచరిత్రుడవైన ఓ రాజా! బరువు ఎక్కువైతే పడవ సముద్రం దాటలేదు. అదే రీతిగా కామావేశం అధికమైన జీవుడు సంసారసముద్రాన్ని దాటజాలడు. ఇది నిజం.

**విశేషం:** అలం: ఉపమ

**క. పడియెడు దుఃఖము లరయం । గడుఁబెక్కల్పములు గను సుఖంబులు వీనం**
**బడయఁగ నగుమే లెయ్యది? । విడుప యురవు శుభము పొందు విద్యాప్రవణా! 536**

**ప్రతిపదార్థం:** విద్యాప్రవణా!= విద్యయందు ఆసక్తుడైనవాడా!; అరయన్= పరిశీలించగా; పడియెడు= అనుభవించెడు; దుఃఖములు= క్లేశములు; పెక్కు= అధికములు; కను సుఖంబులు= అనుభవించే సుఖాలు; అల్పములు= స్వల్పములు; వీనన్=

కామతృష్ణమొదలైన ఈ దుర్గుణాలచేత; పడయఁగన్+అగు= అనుభవించే; మేలు= భద్రం; ఏ+అది= ఏది?; విడుపు+అ= త్యాగమే; ఉరవు= ఉచితమైనది; శుభముపొందు= మంచి మిత్రము.

**తాత్పర్యం:** గుహ్యేంద్రియతృప్తి, కుక్షింభరిత్వము అనే ఈ దుర్గుణాలవలన అనుభవానికి వచ్చే కష్టాలు ఎక్కువగా ఉంటాయి. సుఖాలు చాలా స్వల్పం. అందువలన వీటివలన కలిగే మే లేమున్నది? ఈ దుర్గుణాలను పరిత్యజించటమే ఉచితమైన కర్తవ్యం. ఆ పరిత్యాగమే మనకు కలగనున్న శుభానికి మిత్రము. (శుభం కల్గిస్తుందని భావం.)

**క. మిత్రులు భార్యలు భ్రాతలుఁ । బుత్రులు నిజకార్యపరులు బోధము సు మ్మా**
**త్మత్రాణమునకు మూలము । ధాత్రీపతివర్య! యెవ్విధంబునఁ జూడన్. 537**

**ప్రతిపదార్థం:** ధాత్రీపతివర్య!= రాజశ్రేష్ఠా!; ఏ+విధంబునన్+చూడన్= ఏ రీతిగా పరిశీలించినా; మిత్రులున్= స్నేహితులును; భార్యలున్= పెండ్లాములు; భ్రాతలున్= సోదరులును; పుత్రులున్= కుమారులును; నిజకార్యపరులు= తమ కార్యమునందు ఆసక్తులు; ఆత్మత్రాణమునకున్= తన రక్షణకు; మూలము= హేతువు; బోధముసుమ్ము= జ్ఞానంసుమా!

**తాత్పర్యం:** రాజేంద్రా! ఎట్లా ఆలోచించి చూచినా లోకంలో మిత్రులు, భార్యలు, సోదరులు, కుమారులు తమతమ పనులు సాధించుకొవటంలోనే నిమగ్నులై ఉంటారు. తనను తాను రక్షించుకొనటానికి జ్ఞానమొక్కటే సాధనం సుమా! తక్కినవారు తన రక్షణకు ఉపయోగపడరు.

**ఆ. ధీరుఁడై యభేదదృష్టియ పాటించు । చుండునట్టి పురుషు నొక్కమాటు**
**విడువ దర్కునంశు విభవంబు చాడ్పున । బోధలక్ష్మి పెంపు భూపవర్య! 538**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజశ్రేష్ఠా!; అర్కున్= సూర్యుడిని; అంశువిభవంబు చాడ్పునన్= కాంతివైభవం వలె; ధీరుఁడు+ఐ= ధైర్యంకలవాడై; అభేదదృష్టి+అ= భేదంలేని చూపునే; పాటించుచుండునట్టి పురుషున్= శీలించునట్టి మానవుడిని; బోధలక్ష్మిపెంపు= జ్ఞానలక్ష్మియొక్క అతిశయం; ఒక్కమాటున్= ఒక్కసారికూడ; విడువదు= వదలదు.

**తాత్పర్యం:** రాజవర్యా! కాంతివైభవం సూర్యుడిని ఎప్పుడూ వదలిపెట్టి ఉండదు. అదే రీతిగా భేదభావం లేని ధీర పురుషుడిని జ్ఞానలక్ష్మి ఎప్పుడూ త్యజించదు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అని యిట్లు పెక్కుభంగుల । మునివరుఁడు పరాశరుం డమోఘ ప్రజ్ఞా**
**ఘనత యొలయయంగఁ జెప్పిన । జనకుఁడు ముదమందె భరత సంతతివర్యా! 539**

**ప్రతిపదార్థం:** భరతసంతతివర్యా!= భరత సంతతిలో శ్రేష్ఠా!; ఇట్లు+అని= ఈ రీతిగా; మునివరుఁడు= మునిశ్రేష్ఠుడు; పరాశరుండు= పరాశరుడు; అమోఘప్రజ్ఞాఘనత= వ్యర్థంకాని బుద్ధియొక్క అతిశయం; ఒలయంగన్= ప్రసరించగా; పెక్కుభంగులన్= అనేకరీతులుగా; చెప్పినన్= చెప్పగా; జనకుఁడు= జనకమహారాజు; ముదము+అందెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** భారతవర్యా! మునిశ్రేష్ఠుడైన పరాశరుడు ఈ రీతిగా అనేకవిధాల అమోఘమైన ప్రజ్ఞతో చెప్పేసరికి జనకచక్రవర్తి సంతోషించాడు.

### హంసగీత (సం. 12-288-1,2)

**సీ. అనిన ధర్మసుతుండు హర్షమ్ము దనదు చి । త్తమున నిండార శాంతనవుతోడ**

' దమమును సత్యంబు క్షమయును నెల్లెడ । వినుతింపఁబడు నార్యజనులచేత;
నవి యంత లెస్సలే?' యనవుడు నతనికి । నతఁడిట్టులను 'విను హంసగీత;
యది యుత్తరంబగు నధిప! నీ ప్రశ్నంబు । నకు; దానిఁ జెప్పెద నలినభవుఁడు

**తే.** పసిఁడి రాయంచయై కేళిపరత నొంది । తిరుగ నొక్కెడ సాధ్యు లద్దేవుఁ గాంచి
పక్షివర! నీవు విద్యలఁ బ్రౌఢుఁడగుట । సెప్పఁగా విందు మాశ్రయించెదము నిన్ను. **540**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ధర్మసుతుండు= ధర్మరాజు; తనదు చిత్తమునన్= తన మనస్సులో; హర్షమ్ము= సంతోషం; నిండారన్= నిండగా; శాంతనవుతోడన్= భీష్మునితో; దమమును= బాహ్యేంద్రియనిగ్రహమును; సత్యంబు= సత్యపరిపాలనము; క్షమయును= ఓర్పును; ఆర్యజనుల చేతన్= పెద్దలచేత; ఎల్లెడన్= అన్నిచోట్లా; వినుతింపఁబడున్= ప్రస్తుతింపబడుతుంది; అవి= దమము మొదలైన ఆ గుణాలు; అంత లెస్సలే?= అంతశ్రేష్ఠములైనవా?; అనవుడున్= అనగా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; అతఁడు= భీష్ముడు; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; అధిప!= రాజా!; హంసగీత విను= 'హంసగీత' అన్న ఉపదేశభాగాన్ని ఆలకించుము; అది= ఆ గీత; నీ ప్రశ్నంబునకున్= నీవడిగిన ప్రశ్నకు; ఉత్తరంబు+అగున్= సమాధాన మవుతుంది; దానిన్= ఆ హంసగీతను; చెప్పెదన్= పలుకుతాను; నలినభవుఁడు= పద్మజుడైన బ్రహ్మ; పసిఁడిరాయంచ ఐ= బంగారు రాజహంసఅయి; కేళిపరతన్= క్రీడాపరత్వమును; ఒంది= పొంది; తిరుగన్= సంచరించగా; సాధ్యులు= సాధ్యులనబడే దేవతావిశేషాలు; ఒక్క+ఎడన్= ఒకచోట; ఆ+దేవున్= ఆ బ్రహ్మను; కాంచి= చూచి; పక్షివర!= పక్షిశ్రేష్ఠా!; విద్యలన్= విద్యలలో; నీవు ప్రౌఢుఁడు+అగుట= నిపుణుడవగుట; చెప్పఁగాన్+విందుము= చెప్పుతుండగా వింటున్నాము; నిన్నున్= విద్యానిపుణుడవగు నిన్ను; ఆశ్రయించెదము= ఆశ్రయంగా పొందుతాము.

**తాత్పర్యం:** అని భీష్ముడు పై విధంగా చెప్పేసరికి ధర్మరాజు చిత్తం సంతోషంతో నిండిపోయింది. అప్పుడు అతడు మరల భీష్ముడితో 'దమము, సత్యము, ఓర్పు - అనే సద్గుణాలు ప్రతిచోటా పెద్దలచేత కీర్తించబడుతున్నాయి. అవి అంత మంచి గుణాలా?' అని ప్రశ్నించాడు. అప్పుడు భీష్ము డతడితో 'రాజా! 'హంసగీత' అనే గీత వినుము. అది నీ ప్రశ్నకు తగిన సమాధానంగా ఉన్నది. దానిని చెప్పుతాను. బ్రహ్మదేవుడు బంగారు రాజహంస రూపం పొంది స్వేచ్ఛగా క్రీడిస్తూ సంచరిస్తూ ఉండగా, ఒకచోట సాధ్యులు ఆ దేవుడిని చూచారు. చూచి 'పక్షివర్యా! నీవు విద్యలలో నిపుణుడ వని అనేకులు చెప్పగా విన్నాము. నిన్ను మేము ఆశ్రయిస్తున్నాము.'

**వ.** ' ఏము సాధ్యుల' మని పలికి సవినయంబుగా నిట్లనిరి. **541**

**ప్రతిపదార్థం:** ఏము సాధ్యులము= మేము 'సాధ్యులు' అనబడే దేవతావర్గానికి చెందినవారము; అని పలికి= అని చెప్పి; సవినయంబుగాన్= వినయంతో; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** 'మేము సాధ్యులు అనబడే దేవతావర్గపు వారము' అని చెప్పి మళ్ళీ వారు వినయంతో బ్రహ్మ నుద్దేశించి ఇట్లా అన్నారు.

**తే.** ' ఉత్తమం బెద్ది? నీ చిత్త మొలయు నెందుఁ? । బురుషుఁ డెయ్యది గల్గినఁ బొందు నఖిల
కర్మబంధ మోక్షము? నట్టి ధర్మ మెఱుఁగఁ । జెప్పవే కరుణాలత చిగురులొత్త.' **542**

**ప్రతిపదార్థం:** కరుణాలత= 'దయ' అనే తీగ; చిగురులు+ఒత్తన్= అంకురించగా; ఎద్ది= ఏది; ఉత్తమంబు= శ్రేష్ఠతమమైనది; నీ చిత్తము= నీ హృదయం; ఎందున్= దేనిలో; ఒలయున్= ప్రసరిస్తుంది?; పురుషుఁడు= మనుజుడు; ఏ+అది= ఏది; కల్గినన్= కలిగిఉంటే; అఖిలకర్మబంధమోక్షమున్= సమస్తకర్మబంధాలనుండి విడుదలను; పొందున్= చెందుతాడు; అట్టి ధర్మమున్=

అటువంటి ధర్మాన్ని; ఎఱుఁగన్+చెప్పవే= తెలియచెప్పుమా.

**తాత్పర్యం:** 'ఈ లోకంలో ఉత్తమమైన దేది? నీ మనస్సు దేనిలో లీనమవుతుంది? ఏది కలిగి ఉంటే పురుషుడు అన్నివిధాలైన కర్మబంధాలనుండి విడివడతాడు? అట్లాంటి ప్రశస్తధర్మాన్ని మాకు దయామయమైన చిత్తంతో వివరించుము.'

**వ. అని యడిగిన నాదరించి యయ్యంచ వారల కిట్లనియె. 543**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= సాధ్యులట్లా ప్రశ్నించగా; ఆ+అంచ= ఆ రాజహంస; ఆదరించి= సంభావించి; వారలకున్= వారికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఆ సాధ్యులట్లా తనను ప్రశ్నించగా హంస వారిపై ఆదరం చూపి వారితో ఇట్లా అన్నది.

**క. ' క్షమయును దమమును సత్యము । నమేయ మహిమాస్పదంబు లన విందుము ధ**
**ర్మములం దెల్లను నభివ । ర్ణ్యము; లవి హృద్గ్రంథిభేదన ప్రౌఢంబుల్.' 544**

**ప్రతిపదార్థం:** క్షమయును= ఓర్పును; దమమును= బాహ్యేంద్రియ నిగ్రహమును; సత్యమున్= సత్యవచనమున్ను; అమేయమహిమ+ఆస్పదంబులు+అనన్= అపరిమితమైన ప్రభావానికి స్థానాలనగా; విందుము= వింటున్నాము; అవి; ధర్మములందున్+ఎల్లనున్= సమస్త ధర్మాలలోనూ; అభివర్ణ్యములు= కీర్తించదగినవి; హృద్గ్రంథిభేదనప్రౌఢంబుల్= హృదయంలోని ముడులను భేదించటంలో సమర్థములు.

**తాత్పర్యం:** 'ఓర్పు, దమము, సత్యము అనే ఈ మూడు సద్గుణాలు అపరిమితమహిమ కలిగి ఉన్నాయని వింటున్నాము. అవి సమస్త ధర్మాలలోనూ కీర్తించదగినవై ఉన్నాయి. అవి హృదయంలోని వాసనామయములై అవిద్యవలన ఏర్పడిన గ్రంథులను భేదించటంలో చాలా సమర్థములై ఉన్నాయి.'

**విశేషం:** పూర్వజన్మలో చేసిన కర్మల వలన కలిగిన మాలిన్యం హృదయంలో వాసనారూపంలో ముడివడి ఉంటుంది. ఈ ముడులే హృదయగ్రంథులు అనబడతాయి. ఈ శరీరమే నేను, ఇది నా ధనం, నేను సుఖవంతుడిని, దుఃఖవంతుడిని' ఇత్యాది భావనలే. అవిద్యామూలంగా ఏర్పడే గ్రంథులు. క్షమ మొదలైన సద్గుణాల వలన ఈ ముడులు విడిపోతాయి.

**వ. అని చెప్పి వెండియు. 545**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఆ హంస అట్లా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నది.

**క. ' పరమర్మ భేదులును నయ । విరహితములు ధర్మకార్య విముఖంబులు ని**
**ష్ఠురములు నగు మాటలు స । త్పురుషుం డాడఁ డవి సత్యములు గా కునికిన్. 546**

**ప్రతిపదార్థం:** అవి= ఈ చెప్పబోయేవి; సత్యములు= నిజాలు; కాక+ఉనికిన్= కాకుండా ఉండటంవలన; సత్పురుషుండు= సజ్జనుడు; పరమర్మ భేదులునున్= ఇతరుల జీవస్థానాలను భేదించేవీ; నయవిరహితములున్= నీతిలేనివీ; ధర్మకార్య విముఖంబులున్= ధర్మంతో కూడిన పనులకు విరుద్ధాలును; నిష్ఠురములున్+అగు= కఠినములునైన; మాటలు= వాక్యాలు; ఆడఁడు= పలుకడు.

**తాత్పర్యం:** ఇతరుల మర్మాలను భేదించేవీ, నీతికి దూరమైనవీ, ధర్మకార్యాలకు అనుకూలం కానివీ, కఠినములైనవీ అయిన వాక్యాలు సత్యాలు కాజాలవు. అందువలన సజ్జనుడు అట్టిమాటలు చెప్పడు.

**క. జనములు దను నవమానిం । చిన నిందించినను మాఱుసేయక సైరిం**
**చిన శాంతాత్ముఁడు వారల । ముసు చేసిన యట్టి సుకృతముల నాఁచికొనున్. 547**

**ప్రతిపదార్థం:** జనములు= ప్రజలు; తనున్= తనను; అవమానించినన్= పరాభవించినా; నిందించినన్= తిట్టినా; మాఱుచేయక= ప్రతీకారం చేయక; సైరించిన= సహించిన; శాంత+ఆత్ముఁడు= శాంతచిత్తుడు; వారల= వారియొక్క; మునుచేసినఅట్టి= పూర్వం కావించినట్టి; సుకృతములన్= పుణ్యాలను; ఆఁచికొనున్= అపహరించుకొంటాడు.

**తాత్పర్యం:** ఎవడు జనులు తనను అవమానించినా, తిట్టినా బదులు చేయకుండా సహించుకొంటాడో, అట్టి శాంతమనస్కుడు తనను అవమానించినవారు పూర్వం చేసిన పుణ్యాలను అపహరించుకొంటాడు.

**క. కీడాడిన మేలాడుచుఁ । దాడన మొనరించి రేని దరహాసముతో**
**నీడం బోదును గ్రోధో । త్పీడ వొరయ దెప్పుడును మదీయహృదయమున్. 548**

**ప్రతిపదార్థం:** కీడు+ఆడినన్= నిందించినా; మేలు+ఆడుచున్= శుభం పలుకుతూ; తాడనము= కొట్టటం; ఒనరించిరేనిన్= చేసినను; దరహాసమునన్= చిరునగవుతో; ఈడన్+పోదును= వెనుదీస్తాను; ఎప్పుడునున్= ఏ వేళనూ; మదీయహృదయమున్= నా చిత్తాన్ని; క్రోధ+ఉత్పీడ= కోపముయొక్క+ఒత్తిడి; పొరయదు= పొందదు.

**తాత్పర్యం:** న న్నెవరైనా నిందిస్తే నేను వారిపట్ల శుభమే పలుకుతాను కాని అశుభం పలకను. ఎవరైనా కొట్టినా చిరునవ్వుతో వెనుదీస్తాను గాని మారు కొట్టటానికి ప్రయత్నించను. ఎప్పుడూ నా హృదయంలో కోపం పొడసూపదు.

**తే. వేదసారంబు సత్యంబు; వినుఁడు! సత్య । సారమూర్తి దమము; దమసార మనఘు**
**లార! మోక్ష; మీ పరిపాటి గారవమున । నాదరించు జనంబుల కందు ముక్తి. 549**

**ప్రతిపదార్థం:** అనఘులార!= పాపరహితులారా!; వినుఁడు= ఆలకించండి!; వేదసారంబు= శ్రుతియొక్క సారం; సత్యంబు= సత్యవచనం; సత్యసారమూర్తి= సత్యంయొక్క సారమైన రూపం; దమము= బాహ్యేంద్రియ నిగ్రహం; దమసారము= ఇంద్రియనిగ్రహము యొక్క సారాంశం; మోక్షము= విడుదల; ఈ పరిపాటిన్= ఈ పద్ధతిని; గారవంబునన్= ప్రేమతో; ఆదరించు జనంబులకున్= గౌరవించే ప్రజలకు; ముక్తి= మోక్షం; అందున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** పాపరహితులైన సాధ్యులారా! వినండి. వేదము యొక్క సారాంశం సత్యం. సత్యంయొక్క సారరూపం దమము, దమము యొక్క సారాంశం ముక్తి. ఈ ప్రకారం సత్యాదులను పాటించేవారికి మోక్షం కరతలామలక మవుతుంది.

**క. దమమునఁ గర్మేంద్రియముల । శమియింపఁగఁ జేఁత యది నిసర్గగుణంబై**
**రమియించు నెప్పురుషు చి । త్తము దాన నతండు సర్వధర్మకరుఁ డగున్. 550**

**ప్రతిపదార్థం:** దమమునన్= ఇంద్రియ నిగ్రహంతో; కర్మేంద్రియములన్= వాక్కు మొదలైన కర్మేంద్రియాలను; శమియింపఁగన్+చేఁత= శాంతింప జేయటం; అది= అది; నిసర్గగుణంబై= సహజస్వభావమై; ఏ+పురుషు చిత్తమున్= ఏ మనుజుడి మనస్సును; రమియించున్= రమింపజేస్తుందో; అతండు= ఆ మనుజుడు; దానన్= ఆ చిత్తంచేత; సర్వధర్మకరుఁడు+అగున్= సమస్త ధర్మాలు చేసినవా డవుతాడు.

**తాత్పర్యం:** బాహ్యేంద్రియ నిగ్రహాత్మకమైన దమంతో వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే ఐదు కర్మేంద్రియాలను శాంతింప జేయటమనేది సహజగుణమై ఎవడి మనస్సును రమింపజేస్తుందో, దానివలన అతడు సమస్తమైన ధర్మాలు చేసినవాడవుతాడు.

**క. ఆ తెఱఁ గఘములఁ బాచును । బాతకములు వాయ మొగులు వాసిన సంప్ర**
**ద్యోతితుఁ డగు నమృతాంశుని । భాతి వెలుఁగు నాత్మమోక్షపద మది సుండీ! 551**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱఁగు= ఆ పద్ధతి; అఘములన్= పాపాలను; పాచును= తొలగిస్తుంది; పాతకములు= పాపాలు; పాయన్= తొలగగా; మొగులు పాసినన్= మబ్బు తొలగిన; సంప్రద్యోతితుఁడు+అగు= చక్కగా ప్రకాశించేవాడైన; అమృతాంశుని భాతిన్= చంద్రుడివలె; ఆత్మ వెలుఁగున్= ఆత్మ ప్రకాశిస్తుంది; అది= ఆ ఆత్మప్రకాశమే; మోక్షపదము సుండీ!= మోక్షస్థానం సుమా!

**తాత్పర్యం:** ఆ రీతిగా ఇంద్రియాలను నిగ్రహించటమనే పద్ధతి పాపాలు నశింపచేస్తుంది. పాపాలు పోతే మబ్బు తొలగితే చంద్రుడు ప్రకాశించునట్లు ఆత్మ ప్రకాశిస్తుంది. అదే మోక్షం.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. మనసును వాక్కును రక్షం । బనుపడు నెవ్వనికి శ్రుతి తపస్త్యాగము లా**
**తని చేతిలోని వగునని । మునిజనములచేత విందుము నిరంతరమున్. 552**

**ప్రతిపదార్థం:** ఎవ్వనికిన్= ఏ మనుజుడికి; మనసునున్= చిత్తమును; వాక్కునున్= మాటయు; రక్షన్+పనుపడున్= రక్షణకు అలవాటుపడునో; శ్రుతితపస్త్యాగములు= వేదము, తపస్సు, దానము అనేవి; ఆతనిచేతిలోనివి+అగున్+అని= అతడి చేతికి లభ్యము లవుతా యని; నిరంతరమున్= ఎల్లవేళలా; మునిజనములచేతన్= ఋషులచేత; విందుము= వింటాము.

**తాత్పర్యం:** ఎవడు మనస్సును, మాటను అపమార్గంలో పోనీయకుండా రక్షిస్తాడో, అతడి చేతిలోనే వేదం, తపస్సు, త్యాగం ఉంటాయని సదా మునులు చెప్పగా వింటున్నాము.

**క. పలుకు వడినతనిఁ బాపం । బులు విడుచుం బలికినతనిఁ బొందును బాపం**
**బులు నొరుపాపము దనపై । నొలయింపఁగనేల నింద యుడిగినఁ గాదే. 553**

**ప్రతిపదార్థం:** పలుకువడినతనిన్= నిందపడినవాడిని; పాపంబులు= పాతకాలు; విడుచున్= వదలుతాయి; పలికినతనిన్= నిందించినవాడిని; పాపంబులు= పాతకాలు; పొందును= చేరుతాయి; ఒరుపాపమున్= ఇతరుని పాతకమును; తనపైన్= తనమీద; ఒలయింపఁగన్+ఏల= వ్యాపింపచేయుట మెందుకు?; నింద యుడిగినన్= నిందించటం వదలితే; కాదే?= జరుగదా? (ఉచితం గాదా)

**తాత్పర్యం:** ఎవడు ఊరక ఇతరులచేత నిందించబడతాడో, వాడిని పాపాలు విడిచిపెడతాయి. ఎవడు ఊరక ఇతరుడిని నిందిస్తాడో, వాడిని పాపాలు చుట్టుకొంటాయి. అందువలన ఇతరులను నిందించి వారి పాపం తనపై వేసికొనటం ఎందుకు? నిందించటం పూర్తిగా వదలి పెట్టితే మంచిదికదా!

**క. కుపితుఁ డగువాని వ్రతమును । జపమును దేవార్చనంబు శ్రాద్ధక్రియయుం**
**దపమును దానము యజనము । నపగతములు గాఁగఁజేయు నంతకుఁ డలుకన్. 554**

**ప్రతిపదార్థం:** అంతకుఁడు= యముడు; అలుకన్= కోపంతో; కుపితుఁడు+అగువాని వ్రతమును= కోపించినవాడియొక్క వ్రతమూ; జపమును= జపమూ; దేవార్చనంబు= దేవపూజ; శ్రాద్ధక్రియయున్= పితృకర్మ; తపమును= తపస్సు; దానము= ఈవి; యజనము= యాగక్రియ; అపగతములు+కాఁగన్+చేయున్= తొలగేటట్లు చేస్తాడు.

**తాత్పర్యం:** ఎవడు కోపం కలిగిఉంటాడో, వాడి వ్రతం, జపం, దేవపూజ, పితృకర్మ, తపస్సు, దానం, యాగక్రియ - వీటన్నిటినీ కోపంతో యముడు నశింపజేస్తాడు.

**చ. పలుకక యుండుకంటెఁ దగఁ బల్కుట మేలు; వినుండు! సత్యముం**
**బలుకుట ధర్మమార్గమునఁ బల్కుట సర్వజన ప్రియంబుగాఁ**
**బలుకుట యొలి నెక్కుడగు భంగులు; వీని నెఱింగి యొండుమైఁ**
**బలుకక నాల్గుచందములఁ బల్కఁగ మెత్తురు వాని దేవతల్. 555**

**ప్రతిపదార్థం:** వినుండు= ఆలకించండి!; పలుకకఉండు కంటెన్= మాటలాడక ఉండటంకన్నా; తగన్= తగురీతిగా; పల్కుట= మాటలాడటం; మేలు= శ్రేయస్కరం; సత్యమున్= నిజమును; పలుకుట= వచించటం; ధర్మమార్గమునన్= ధర్మపద్ధతిలో; పల్కుట= వచించటం; సర్వజనప్రియంబుగాన్= సమస్త ప్రజలకు ప్రీతికలిగేటట్లుగా; పలుకుట= వచించటం; ఓలిన్= వరుసగా; ఎక్కుడు+అగుభంగులు= ఎక్కువఅయిన పద్ధతులు; వీనిన్= ఈ పద్ధతులను; ఎఱింగి= తెలిసికొని; ఒండుమైన్= మరొకరీతిగా; పలుకక= వచించక; నాల్గుచందములన్= నాల్గువిధాల; పల్కఁగన్= వచించగా; వానిన్= అట్లు వచించేవాడిని; దేవతల్= సురలు; మెత్తురు= అభినందిస్తారు.

**తాత్పర్యం:** వినండి! మాటలాడకుండా మౌనం వహించటంకంటె తగినట్లు మాటలాడటం మేలు. సత్యంగా మాటలాడటం, ధర్మపద్ధతిలో మాటలాడటం, సకలజనులకు ప్రీతిగా మాటలాడటం క్రమంగా శ్రేష్ఠమైన పద్ధతులు. ఇట్లా మాట్లాడేపద్ధతులు గ్రహించి మరొక విధంగా మాటలాడక పై జెప్పినట్లు నాలుగువిధాల మాటలాడేవాడిని దేవతలు అభినందిస్తారు.

**క. సత్యక్షమాదమంబులు । నిత్యపదంబునకు నెక్కు నిచ్చెన; యవి సం**
**గత్యనుగతములు సత్సాం । గత్యం బటు గాన ముఖ్యకార్యము సుండీ!' 556**

**ప్రతిపదార్థం:** సత్య క్షమా దమంబులు= సత్యం, ఓర్పు, ఇంద్రియనిగ్రహం అనేవి; నిత్యపదంబునకున్= శాశ్వతమైన స్థానానికి; ఎక్కునిచ్చెన= ఎక్కటానికి తగిన సాధనము; అవి= సత్యం మొదలైనవి; సంగత్యనుగతములు= సాంగత్యమును అనుసరించి వచ్చేవి; అటుకానన్= అందువలన; సత్సాంగత్యంబు= సజ్జనులతోడి పొత్తు; ముఖ్యకార్యము= ప్రధానంగా చేయదగింది; చుండీ!= సుమా!

**తాత్పర్యం:** సత్యం, ఓర్పు, బాహ్యేంద్రియ నిగ్రహం అనేవి మూడూ శాశ్వతమైన మోక్షస్థానం అధిష్ఠించటానికి ఉపకరించే నిచ్చెనవంటివి. అవి సాంగత్యమునుబట్టి వస్తాయి. ఆ కారణాన సజ్జనసాంగత్యం ముఖ్యమైన కర్తవ్యమని గమనించండి!'

**విశేషం:** అలంకారం: రూపకం.

**వ. అని సత్య క్షమా దమ ప్రకారవిషయంబు లైన వాక్యంబులు సెప్పిన విని కృతార్థులై సాధ్యులు సంతోషించి వెండియు హంసంబున కిట్లనిరి. 557**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; సత్య క్షమా దమ ప్రకారవిషయంబులు+ఐన= సత్యం, ఓర్పు, ఇంద్రియనిగ్రహం వీటి స్వభావం విషయంగా గల్గిన; వాక్యంబులు= మాటలు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; కృతార్థులు+ఐ= కృతకృత్యులై; సాధ్యులు సంతోషించి= సాధ్యులు హర్షించి; వెండియున్= మరల; హంసంబునకున్= అంచతో; ఇట్లు+అనిరి= ఈ రీతిగా అన్నారు.

**తాత్పర్యం:** హంస ఈ ప్రకారంగా సత్యం, క్షమ, దమం అనే గుణాలస్వభావాన్ని వివరించే మాటలు చెప్పింది. అది విని ధన్యులై సాధ్యులు సంతోషించారు. మళ్ళీ హంసతో వారు ఇట్లా అన్నారు.

**క. ' ఏమిట లోకం బావృత? । మేమిటఁ దా వెలుఁగకుండు? నేమిట మిత్ర**
**స్తోమంబు విడుచుఁ దనుఁ గా । దేమిట మోక్షంబు? మాకు నెఱిఁగింపు దయన్.' 558**

**ప్రతిపదార్థం:** లోకంబు= ప్రపంచం; ఏమిటన్= దేనిచేత; ఆవృతము= ఆవరింపబడింది; ఏమిటన్= దేనివలన; తాన్= తాను; వెలుఁగకుండున్= ప్రకాశించకుండా ఉంటుంది; ఏమిటన్= దేనిచేత; తనున్= తనను; మిత్రస్తోమంబు= మిత్రులసమూహం; విడుచున్= వదలును; ఏమిటన్= దేనివలన; మోక్షంబు= ముక్తి; కాదు= సిద్ధించదు; దయన్= కృపతో; మాకున్ ఎఱిఁగింపు= మాకు తెలియజెప్పుము.

**తాత్పర్యం:** 'ఈ లోకం దేనిచేత కప్పబడి ఉన్నది? ఒకడు తాను దేనివలన ప్రకాశించకుండా ఉంటాడు? దేనిచేత మిత్రులు తనను వదలిపోతారు? దేనిచేత మోక్షం కలుగదు? ఈ విషయాలు కృపతో మాకు తెలియపరచుము.'

**వ. అనుటయు. 559**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** అని సాధ్యులు ప్రశ్నింపగా.

**ఉ. ఆనతవైరి! యిట్టులను హంసము వారలతోడ 'లోక మ**
**జ్ఞానముచేత నావృతము సంభృతమత్సరుఁడైన వే అగుం**
**దాను బ్రకాశసంపదకుఁ దన్ విడుచుం దెగి మిత్రకోటిలో**
**భానుగతిన్ విమోక్షపద మందదు సంగముకల్మి నెమ్మెయిన్.' 560**

**ప్రతిపదార్థం:** ఆనతవైరి!= అవనతులైన శత్రువులు కలవాడా!; హంసము= మరాళం; వారలతోడన్= వారితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నది; లోకము= ప్రపంచం; అజ్ఞానము చేతన్= జ్ఞానంలేమిచేత; ఆవృతము= కప్పబడింది; తాను= తాను; సంభృతమత్సరుఁడు+ఐనన్= మచ్చరముచేత నిండినవాడైతే; ప్రకాశసంపదకున్ వేఱు+అగున్= కాంతి సంపదకు భిన్నమవుతాడు; లోభానుగతిన్= లోభమును అనుసరించటం చేత; తెగి= సాహసించి; మిత్రకోటి= మిత్రులబృందం; తన్+విడుచున్= తనను వదలును; ఏ+మెయిన్= ఏ రీతిగానైనా; సంగముకల్మిన్= సంసర్గం కలిగి ఉండటంచేత; విమోక్షపదము= విముక్తి స్థానం; అందదు= లభించదు.

**తాత్పర్యం:** శత్రుంజయుడవైన ఓ ధర్మరాజా! అప్పుడు హంస వారితో ఇట్లా అన్నది: 'ఈ లోకం అవివేకంచేత ఆవరించబడిఉన్నది. మానవుడు మాత్సర్యం కలవాడైతే లోకంలో ప్రకాశించకుండా పోతాడు. లోభి అయినవాడిని మిత్రబృందం వదలిపోతుంది. ఏ రీతిగానైనా లోకసంసర్గం కలిగిఉన్న వాడికి మోక్షం లభించదు.'

**వ. అనిన వారు మరాళంబున కిట్లనిరి. 561**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వారు= ఆ సాధ్యులు; మరాళంబునకున్= హంసకు; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** హంస అట్లా చెప్పేసరికి సాధ్యులు మళ్ళీ దానితో ఇట్లా అన్నారు.

**క. ' ఎవ్వఁడు రమించు నొక్కఁడ, । యెవ్వఁడు పెక్కండ్రఁ బ్రీతి నెసఁగఁగఁజేయున్,**
**నివ్వటిలు నెవ్వనికి బల । మెవ్వఁడు కలహంబు వెంట కెంతయుఁ దొలఁగున్.' 562**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఎవడు; ఒక్కఁడ రమించున్= ఒకడే క్రీడిస్తాడు; ఎవ్వఁడు= ఎవడు; పెక్కంఁడ్రన్= పెక్కుమందిని; ప్రీతిన్= ప్రీతితో; ఎసఁగఁగన్+చేయున్= అతిశయించునట్లు చేస్తాడు; ఎవ్వనికిన్= ఎవనికి; బలము= సత్తువ; నివ్వటిలున్= కలుగుతుంది; ఎవ్వఁడు= ఎవడు; ఎంతయున్= మిక్కిలిగా; కలహంబు వెంటకున్= జగడపు త్రోవకు; తొలఁగున్= దూరంగా పోతాడు.

**తాత్పర్యం:** ఒక్కడే తనలో తాను రమించేవా డెవడు? చాలామందికి ప్రీతి కల్గించేవా డెవడు? ఎవనికి బలం కలుగుతుంది? ఎవడు కలహపు త్రోవకు దూరంగా తొలగిపోతాడు?'

**వ. అని యడిగిన హంస యిట్లనియె. 563**

**ప్రతిపదార్థం:** అని యడిగినన్= అని ప్రశ్నించగా; హంస= మరాళం; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని సాధ్యులు అడిగేసరికి హంసవారితో ఇట్లా చెప్పింది.

**క. ' ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడ; । ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁ జేయున్;**
**బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ; । బ్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలంగున్. 564**

**ప్రతిపదార్థం:** ప్రాజ్ఞుఁడు= పండితుడు; ఒక్కఁడ= ఒకడే; రమించున్= క్రీడిస్తాడు; ప్రాజ్ఞుఁడు= పండితుడు; పెక్కంఁడ్రన్= చాలామందిని; ప్రీతిన్= ప్రీతితో; పరఁగఁగన్+చేయున్= ప్రవర్తిల్లునట్లు చేస్తాడు; ప్రాజ్ఞుఁడు= పండితుడు; బలవంతుండు+అగున్= బలంకలవాడవుతాడు; ప్రాజ్ఞుఁడు= పండితుడు; కలహమునన్= జగడంలో; తొట్టుపడక= తగులువడక; తొలంగున్= దూరంగా పోతాడు.

**తాత్పర్యం:** ఆత్మజ్ఞానసంపన్నుడైన పండితుడు ఒక్కడే తనలోతాను ఆనందిస్తాడు, ఎక్కువమంది జనులలో ప్రీతి కలిగిస్తాడు. బలం కలవా డవుతాడు. అట్టి పండితుడు ఎవరితోనూ జగడానికి పోక తొలగిపోతాడు.

**వ. అని చెప్పిన రాయంచతో సాధ్యు లిట్లనిరి. 565**

**ప్రతిపదార్థం:** అని చెప్పిన= అని వచించిన; రాయంచతోన్= రాజహంసతో; సాధ్యులు+ఇట్లు+అనిరి= సాధ్యు లీరీతిగా అన్నారు.

**తాత్పర్యం:** ఈ రీతిగా చెప్పిన హంసను చూచి సాధ్యులు మరల ఇట్లా చెప్పారు.

**తే. ' విప్రుఁడేమిట దేవత్వవిభవ మొందు? । నేమి కతమున సాధుత్వ మెసకమెసఁగు?**
**నతని కెద్ది యసాధుత్వ మావహించు? । మానుషుం డగు నెద్దాన? మహితమూర్తి! 566**

**ప్రతిపదార్థం:** మహితమూర్తి!= పూజ్యమైన ఆకృతిగల ఓ హంసా!; విప్రుఁడు= బ్రాహ్మణుడు; ఏమిటన్= దేనిచేత; దేవత్వవిభవమున్= అమరత్వ వైభవాన్ని; ఒందున్= పొందుతాడు; అతనికిన్= ఆ విప్రుడికి; ఏమి కతమునన్= ఏ కారణాన; సాధుత్వము= సజ్జనత్వం; ఎసకమెసఁగున్?= మిక్కిలి అతిశయిస్తుంది?; ఎద్ది= ఏది; అసాధుత్వమున్= దుర్జనత్వమును; ఆవహించున్= కలిగిస్తుంది?; ఏ+దానన్= దేనివలన; మానుషుండు+అగున్?= కేవలమనుష్యు డవుతాడు?

**తాత్పర్యం:** 'దివ్యాకృతి గల ఓ హంసమా! బ్రాహ్మణుడు దేనిచేత దేవతావైభవం పొంది రాణిస్తాడు? ఏ కారణంతో అతడు సాధుపురుషుడుగా ప్రశస్తి పొందుతాడు? అతడిని సాధుత్వం లేనివాడినిగా చేసేది ఏది? దేనివలన అతడు

కేవలం మనుష్యు డవుతాడు?'

**చ. అనుటయు హంస మిట్టులను 'నధ్యయనంబున దేవభావముం**
**గను; వ్రతవృత్తి సాధువనఁగాఁ జరియించు; జనం బసాధు నాఁ**
**జనుఁ బరివాదశీలమున; శౌచవిహీనత మృత్యుభీతి వొం**
**దిన మదిలోన నెక్కొనిన దీనత విప్రుఁడు మానుషుం డగున్.' 567**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అడుగగా; హంసము= మరాళం; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నది; విప్రుఁడు= ద్విజుడు; అధ్యయనంబునన్= వేదం చదువటంచేత; దేవభావమున్+కనున్= దేవత్వం పొందుతాడు; వ్రతవృత్తిన్= పుణ్యాకర్మపు వర్తనంచేత; సాధువు అనఁగాన్= సజ్జనుడనగా; చరియించున్= ప్రవర్తిల్లుతాడు; పరివాదశీలమునన్= నిందాశీలంచేత; జనంబు= ప్రజ; అసాధునాన్+చనున్= దుర్జనుడనగా అట్లే అయిపోతాడు; శౌచవిహీనతన్= శుచిత్వం లేకపోవటం వలన; మృత్యుభీతిన్= మరణభయమును; పొందిన మదిలోనన్= చెందిన హృదయములో; నెక్కొనిన= పాదుకొన్న; దీనతన్= దీనత్వముచేత; మానుషుండు+అగున్= మనుష్యుడు అవుతాడు.

**తాత్పర్యం:** సాధ్యు లట్లా ప్రశ్నించగా హంస ఇట్లా అన్నది - 'బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేయటంతో దేవత్వం పొందుతాడు. ఉపవాసాది పుణ్యకర్మలు చేయటంతో సాధువుగా ప్రశస్తి పొందుతాడు. నింద్యమైన శీలం కలవాడైతే ప్రజ లతడిని దుర్జనుడు అని వ్యవహరిస్తారు. శౌచం పాటించకపోవటం వలన, మరణభీతితో దీనత్వం పొందటం వలన అతడు కేవలం మనుష్యుడుగా రూపొందుతాడు.'

**క. అని పలికి సాధ్యులకుఁ దన । తను విభవము సూపి సమ్మదంబున వారల్**
**దనుఁగొలువ నిజనివాసం । బున కేఁగె నజుండు నగవు మొగమున నెఱయన్. 568**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; అజుండు= బ్రహ్మ; సాధ్యులకున్= సాధ్యులనబడే ఆ దేవతావర్గాలకు; తన తనువిభవమున్= తన శరీరవైభవాన్ని; చూపి= ప్రదర్శించి; వారల్= వారు; సమ్మదంబునన్= సంతసంతో; తనున్+కొలువన్= తనను ఆరాధించగా; నగవు= నవ్వు; మొగంబునన్= వదనమందు; నెఱయన్= వ్యాపించగా; నిజనివాసంబునకున్= తన నెలవుకు; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** హంస రూపంతో ఉన్న బ్రహ్మదేవుడు అట్లా చెప్పి సాధ్యులకు తన నిజమైన శరీరవైభవం చూపాడు. వా రందుకు చాలా సంతోషించి ఆయనను సేవించారు. పిమ్మట ముఖంలో నవ్వు దీపిస్తూ ఉండగా బ్రహ్మ తన నెలవైన సత్యలోకానికి వెళ్ళాడు.

**వ. అని చెప్పి భీష్ముండు. 569**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; భీష్ముండు= భీష్ముడు

**తాత్పర్యం:** అట్లా ధర్మజుడితో వచించి భీష్ముడు మళ్ళీ ఈ క్రింది రీతిగా అన్నాడు.

**ఉ. ' సాదరవృత్తి సాధ్యులఁ బ్రహర్ష సమేతులఁ జేయఁ బూని సం**
**వాదము సేసె దేవముని వంద్యుఁ డజుం; డిది సేయు నాయురు**
**త్పాదన మిచ్చు సంతతశుభంబులు గీర్తి యొనర్చుఁ బుత్రపౌ**
**త్రోదయ మావహించు భరతోత్తమ! తన్ వినినన్ బఠించినన్.' 570**

**ప్రతిపదార్థం:** దేవమునివంద్యుఁడు= దేవతలచేతను; మునులచేతను నమస్కరించదగినవాడైన; అజుడు= బ్రహ్మ; సాదరవృత్తిన్= ఆదరంతో కూడిన వర్తనతో; సాధ్యులన్= సాధ్యులను; ప్రహర్షసమేతులన్= సంతోషంతో గూడినవారినిగా; చేయన్+పూని= చేయ నారంభించి; సంవాదమున్+చేసెన్= సంభాషించాడు; భరత+ఉత్తమ!= భరతవంశములో శ్రేష్ఠుడా!; ఇది= ఈ సంవాదం; తన్= తనను; వినినన్= విన్నా; పఠించినన్= చదివినా; ఆయురుత్పాదనమున్= ఆయువు యొక్క పుట్టుకను; చేయున్= కలిగిస్తుంది; సంతత శుభంబులు= ఎడతెగని మంగళాలను; ఇచ్చున్= ప్రసాదిస్తుంది; కీర్తి+ఒనర్చున్= యశస్సు కలిగిస్తుంది; పుత్రపౌత్ర+ఉదయమున్= కొడుకుల, మనుమల ఉద్భవమును; ఆవహించున్= కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** భరతకులశ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా! దేవతలకు, మునులకూ నమస్కరణీయుడైన బ్రహ్మ ఆదరంతో సాధ్యులకు సంతోషం కలిగించటానికై వారితో 'హంసగీత' అనే ఈ సంవాదం చేశాడు. ఈ గీతను విన్నా, చదివినా, దీర్ఘాయువు కలుగుతుంది. ఎడతెగని శుభాలు సంభవిస్తాయి. కీర్తి చేకూరుతుంది. పుత్రులు, మనుమలు తామరతంపరగా ఉదయించి వంశం వర్ధిల్లుతుంది.'

**వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనుతో 'సాంఖ్యయోగంబుల తారతమ్యంబులుం దత్స్వరూపం బులు నెఱింగింపవే' యనుటయు, నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియె. 571**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా ఆకర్ణించి; ధర్మనందనుండు= ధర్మజుడు; శంతనునందనుతోన్= శంతనుడి కుమారుడైన భీష్ముడితో; సాంఖ్యయోగంబుల తారతమ్యంబులున్= సాంఖ్యశాస్త్ర, యోగశాస్త్రములయొక్క తరతమ భేదాలను; తత్స్వరూపంబులున్= ఆ శాస్త్రాల నిజరూపాలను; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అడుగగా; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు; ఆ+మహాత్ముండు= ఆ భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ము డట్లా చెప్పేసరికి విని ధర్మరాజు అతడితో 'సాంఖ్యశాస్త్రం, యోగశాస్త్రం -ఈ రెండింటియొక్క భేదాలు, వాటి స్వరూపాలు తెలియజెప్పుము' అని అడిగాడు. అంతట ఆ నరపాలుడితో భీష్ముడు ఈ రీతిగా చెప్పాడు.

### భీష్ముఁడు ధర్మజునకు యోగతంత్రప్రకారము చెప్పుట (సం. 12-289-2)

**క. తెలుపుదురు సాంఖ్యులును యో। గులుఁ దమతమ తెఱఁగు మేలగుట కారణసం**
**కలితముగ నాకుఁ జూడఁగ। నలఘుగుణా! యొక్క రూప యయ్యిరు దెఱఁగున్. 572**

**ప్రతిపదార్థం:** అలఘుగుణా!= గొప్ప గుణాలు గలవాడా!; సాంఖ్యులునున్= సాంఖ్య మార్గం అనుసరించేవారూ; యోగులున్= యోగమార్గం అవలంబించేవారూ; కారణసంకలితముగన్= హేతువులతో కూడ; తమ తమ తెఱఁగులు= తమ తమ పద్ధతులు; మేలు+అగుట= శ్రేష్ఠంకావటం; తెలుపుదురు= చెప్పుతారు; నాకున్+చూడఁగన్= నేను పరిశీలింపగా; ఆ+ఇరుదెఱఁగున్= ఆ రెండు విధాలత్రోవయును; ఒక్కరూప= ఒకే విధమైనది.

**తాత్పర్యం:** 'శ్రేష్ఠగుణుడవైన ఓ ధర్మజా! సాంఖ్యులు, యోగులు తమ తమ మార్గాలే మేలైనవని కారణాలు నిరూపిస్తూ ప్రకటిస్తారు. కాని నా దృష్టికి ఆ రెండు మార్గాలూ ఒక్కటే.

**క. ప్రత్యక్షహేతువాదులు। సత్యపరా! యోగపరులు సాంఖ్యులు శాస్త్రా**
**ర్థాత్యంతనైపుణులు స। ద్గత్యాకలనంబు సరియ తదుభయమునకున్. 573**

**ప్రతిపదార్థం:** సత్యపరా!= సత్యపరాయణా!; యోగపరులు= యోగులు; ప్రత్యక్షహేతువాదులు= ప్రత్యక్షాన్నే ప్రామాణ్యహేతువని వాదించేవారు; సాంఖ్యులు= సాంఖ్యమార్గం అనుసరించేవారు; శాస్త్రార్థాత్యంతనైపుణులు= శాస్త్ర ప్రతిపాదితమైన విషయములందు

మిక్కిలి సామర్థ్యం కలవారు; తదుభయమునకున్= ఆ రెంటికీ; సద్గత్యాకలనంబు= ఉన్నతమైన గతి చేకూరటం; సరి+అ= సమానమే.

**తాత్పర్యం:** సత్యనిష్ఠుడవైన ఓ ధర్మపుత్రా! యోగులు ప్రత్యక్ష మొక్కటే ప్రమాణహేతువని వాదిస్తారు. సాంఖ్యులు శాస్త్ర ప్రతిపాదితమైన అర్థాలలో విశ్వాసం కలిగి అవే ప్రమాణమని నిరూపిస్తారు. అయినా ఈ రెండుమార్గాలవారూ చివరికి పొందే లక్ష్యం ఒక్కటే.

**క. ఆ తెరువులు రెంటికి వే। త్రై తోఁచుట దర్శనంబునంద నరేంద్రా!**
**భూతహితము సద్వ్రతచ। ర్యాతిశయము శౌచమును నియతకృత్యంబుల్.' 574**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; ఆ తెరువులు= ఆ మార్గాలు; రెంటికిన్= రెండింటికి; వేఱై తోఁచుట= విభిన్నములై భాసించటం; దర్శనంబునంద= శాస్త్రమునందే; భూతహితము= ప్రాణులకు మేలు చేయటం; సద్వ్రతచర్యాతిశయము= మంచి నియమాలను ఎక్కువగా పాటించటం; శౌచమును= శుచిత్వం; నియతకృత్యంబుల్= రెండు మార్గాలకూ తప్పనిసరిగా సంబద్ధమైన కార్యాలు.

**తాత్పర్యం:** రాజా! సాంఖ్యయోగాల మార్గాలు రెండూ విభిన్నమై కనిపించటమనేది కేవలం శాస్త్రమునందు మాత్రమే. ప్రాణులపట్ల హితం, మంచి నియమాలు పాటించటం, శౌచం ఈ రెండుమార్గాలకూ నియతమైన కార్యాలే.'

**విశేషం:** **సాంఖ్యయోగౌ పృథగ్బాలాః । ప్రవదన్తి న పండితాః**
**ఏకమప్యాస్థిత స్సమ్యక్ । ఉభయో ర్విందతే ఫలమ్ ॥ (గీత - 5-4)**
**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం । తద్యోగై రపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ । యః పశ్యతి స పశ్యతి ॥ (గీత - 5-5)**

అని శ్రీకృష్ణుడు గీతలో ప్రతిపాదించి ఉన్నాడు. 'అవివేకులు మాత్రమే సాంఖ్యమూ, యోగమూ వేరువేరని చెప్తుతారు. ఈ రెండింటిలో దేని ననుష్ఠించినా ఫలప్రాప్తి కలుగుతుంది. సాంఖ్యులు పొందే స్థానాన్నే యోగులు కూడా పొందుతారు. అందువలన సాంఖ్యయోగాలను రెంటినీ ఒక్కటిగా చూచేవాడు యథార్థదర్శి' అన్న గీతాచార్యుడి అభిప్రాయం ఇక్కడ భీష్ముడు చెప్పిన మాటలతో సరిపడుతున్నది.

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'భూతదయయును, సద్వ్రతధారణంబును, శౌచంబును దుల్యంబులై సాంఖ్యయోగంబులకు దర్శనంబు వేఱగుట యెట్లు? వివరింపవే' యనుటయు, నన్నరదేవునకు దేవవ్రతుం డిట్లనియె. 575**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; సాంఖ్యయోగంబులకున్= సాంఖ్యానికీ, యోగానికీ; భూతదయయునున్= ప్రాణులపట్ల కృపయు; సద్వ్రతధారణంబునున్= మంచినియమాలు పాటించటమూ; శౌచంబునున్= శుచిత్వమూ; తుల్యంబులు+ఐ= సమానములై; దర్శనంబు= శాస్త్రం; వేఱు+అగుట= భిన్నమవటం; ఎట్లు= ఎట్లా; వివరింపవే= విశదీకరింపుమా; అనుటయున్= అని అడుగగా; ఆ+నరదేవునకున్= ఆ రాజుకు; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పింది విని ధర్మరాజు 'సాంఖ్యయోగమార్గాలు రెండింటికీ భూతదయ, వ్రతనిర్వహణ, శుచిత్వం అనేవి సమానాలై ఉండగా శాస్త్రం మాత్రం ఎట్లా వేరుగా ఉంటుంది? ఈ సంగతి వివరించుము' అని అర్థించాడు. అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**క. ' యోగులకు యోగబలమున । రాగము మోహంబునుం జిరస్నేహముఁగా**
**మాగమముఁ గ్రోధము గుణా । యోగము వరుసఁ బెడఁబాప నున్నతి యొలయున్. 576**

**ప్రతిపదార్థం:** యోగబలమునన్= యోగము యొక్క సామర్థ్యంతో; రాగమున్= విషయముల మీది అనురాగాన్నీ; మోహంబునున్= అజ్ఞానాన్నీ; చిరస్నేహమున్= దీర్ఘకాలికమైన ప్రీతిని; కామ+ఆగమమున్= అభిలాష యొక్క ఉత్పత్తినీ; క్రోధమున్= కోపాన్నీ; వరుసన్= క్రమంగా; గుణ+ఆ యోగము= పై దోషాలకు విరుద్ధాలైన సద్గుణాలతోడి కలయిక; పెడన్+పాపన్= తొలగించగా; యోగులకున్= యోగమార్గంలో ఉన్నవారికి; ఉన్నతి= ఔన్నత్యం; ఒలయున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** రాగం, మోహం, దీర్ఘకాలికమైన స్నేహం, కామం, క్రోధం అనే దుర్గుణాలు ఆత్మోన్నతిని నిరోధించేవి. యోగబలంతో పై దోషాలను తద్విరుద్ధమైన సద్గుణాలతో తొలగిస్తే యోగులకు ఆత్మోన్నతి లభిస్తుంది.

**విశేషం:** పద్యంలో 'గుణాయోగము' అన్న పదాన్ని ద్వితీయాంతంగా గ్రహిస్తే, రాగాదులతోపాటు త్రిగుణాలతోడి ఆ యోగాన్ని (కలయికను) కూడా యోగబలంతో తొలగిస్తే - అని అర్థం చెప్పాలి.

**చ. ఘనరుఝషమున్ సముద్ధతమృగంబును జాలము వ్రచ్చి వాగురా**
**వినిహతిఁ జేసి యిష్టపదవిం జను చాడ్పున యోగతంత్రరో**
**ధనమగు లోభ జాత దురితవ్రజముం బెడఁబాచి సత్పథం**
**బునఁ జరియించు యోగి సుఖమూర్తిత సుస్థితగా వహించుచున్. 577**

**ప్రతిపదార్థం:** ఘనరుఝషమున్= పెద్ద చేపయున్నూ; సముద్ధతమృగంబును= బలిష్ఠమై గర్వించిన జంతువున్నూ; జాలమున్= వలను; వ్రచ్చి= చించి; వాగురావినిహతిన్+చేసి= ఉరిని ఛేదించి; ఇష్టపదవిన్= ఇచ్చవచ్చిన త్రోవలో; చనుచాడ్పునన్= పోయేటట్లు; యోగి= యోగం శీలించేవాడు; సుఖమూర్తితన్= సుఖస్వరూపాన్ని; సుస్థితగాన్= దృఢంగా ఉండేటట్లు; వహించుచున్= కలిగిఉంటూ; యోగతంత్ర రోధనము+అగు= యోగంయొక్క ఉపాయాలను అడ్డగించినదైన; లోభజాతదురితవ్రజమున్= లోభంనుండి కలిగిన పాపసంచయాన్ని; పెడన్+పాచి= తొలగద్రోసి; సత్పథంబునన్= సన్మార్గంలో; చరియించున్= సంచరిస్తాడు.

**తాత్పర్యం:** పెద్దచేప వలను చించుకొని, బలిష్ఠమైన మృగము ఉరిని ఛేదించుకొని ఇచ్చవచ్చిన దారిలో వెళ్ళిపోతాయి. అట్లే యోగి దృఢమైన సుఖస్వరూపంలో ఉంటూ యోగోపాయాలను నిరోధించే పాపాలను తొలగించుకొని సన్మార్గంలో సంచరిస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. యోగబలము లేని యొకభంగి యోగి బల్ । ద్రోపు లేని మీను నేపు లేని**
**మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱుకంగ । లేనియట్ల భవములోన నడఁగు. 578**

**ప్రతిపదార్థం:** యోగబలము లేని= యోగశక్తి చాలని; ఒక భంగియోగి= ఒక మాదిరి యోగి; బల్ద్రోపులేని మీనున్= పెద్దగా దూసుకొని పోయేశక్తి లేని చేప; ఏపు లేని మృగమున్= విజృంభించే శక్తిలేని జంతువు; వలయున్= జాలమును; ఉరియున్= పాశమును; తెగిపోవన్= తెగిపోయేటట్లుగా; ఉఱుకంగలేని+అట్ల= పరుగెత్తలేని మాదిరిగా; భవములోనన్= సంసారంలో; అడఁగున్= అణగిపోతాడు.

**తాత్పర్యం:** బలాధిక్యంతో విజృంభించి ముందుకు దూసుకొని పోలేని చేప వలను ఛేదించలేదు. అట్లే శక్తి చాలని మృగం ఉరిని తెగజేసి ముందుకు పోలేదు. అవి రెండూ పాశం క్రింద తగులువడతాయి. అదే రీతిగా యోగబలం చాలని యోగి పాపపాశాలను ఛేదించలేక సంసారంలోనే నిబద్ధుడైపోతాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అల్పమైన యగ్ని యడఁగు నింధనములు । మీఁద వైవ బలము మిగులలేని**
**యోగమట్ల తనకు నురునట్టి దానన । సాదమొందు సకలజనమనోజ్ఞ! 579**

**ప్రతిపదార్థం:** సకలజనమనోజ్ఞ!= సమస్త ప్రజలకు మనోహరమైనవాడా!; అల్పమైన= కొద్దిపాటిదైన; అగ్ని= నిప్పు; ఇంధనములు= కట్టెలు; మీఁదవైవన్= పైనవేయగా; అడఁగున్= ఆరిపోతుంది; అట్ల= అదే మాదిరిగా; బలము మిగులలేని= శక్తి చాలని; యోగము= యోగానుష్ఠానం; తనకున్+ఉరునట్టి దానన్+అ= తనకు తగిన దానితోనే; సాదము+ఒందున్= అణగారిపోతుంది

**తాత్పర్యం:** సకల జనులకు హృదయంగముడవైన ధర్మసుతా! కొద్దిపాటి నిప్పు కట్టెలు పైన పడవేస్తే ఆరిపోతుంది. అదే రీతిగా బలహీనమైన యోగం కూడా తన కనుకూలమైన దానితోనే అణగారిపోతుంది. కట్టెలు అగ్నికి అనుకూలమైనప్పటికీ నిప్పు తక్కువై కట్టెలెక్కువైతే నిప్పు శమించిపోతుంది. (అదే రీతిగా అనుకూలమైన యోగసాధనలే యోగానికి బలం లేనప్పుడు దానిని శమింపజేస్తాయని తాత్పర్యం).

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ఇద్ధమైన యగ్ని ఇంధన సంపద । నతిశయిల్లు నట్టు లధికబలస**
**మగ్రసారయోగ మహిమయు నంతంత । కగ్గలించు వ్రతము లగ్గలింప. 580**

**ప్రతిపదార్థం:** ఇద్ధము+ఐన= దీపించిన; అగ్ని= అనలం; ఇంధనసంపదన్= కట్టెల సమృద్ధిచేత; అతిశయిల్లునట్టులు= ఎక్కువగా మండే విధంగా; అధికబలసమగ్రసారయోగ మహిమయున్= ఎక్కువ బలంతో సమగ్రమైన శ్రేష్ఠయోగ ప్రభావం కూడ; వ్రతములు= నియమాలు; అగ్గలింపన్= ఎక్కువ కాగా; అంతంతకున్= అంతకంతకు; అగ్గలించున్= అతిశయిస్తుంది.

**తాత్పర్యం:** బాగా జ్వలించిన అగ్ని ఎక్కువగా వంటచెరకు అందిస్తే ఇంకా ఎక్కువగా మండుతుంది. అదే రీతిగా శక్తిమంతమైన యోగంయొక్క ప్రభావం ఎంతకెంతకు నియమసాధనలు ఎక్కువవుతాయో, అంతకంతకు అతిశయమై రాణిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. స్రోతోవేగము పటుగతి । వీతబలుం దిగుచునట్లు విషయము లీడ్చుం**
**జేతోబలసంభృత యో । గాతిశయుఁడు గాని వాని నంచితచరితా! 581**

**ప్రతిపదార్థం:** అంచితచరితా= పూజ్యమైన చరిత్రం కలవాడా!; స్రోతోవేగము= ప్రవాహంయొక్క వేగం; పటుగతిన్= పటిష్ఠమైన నడకతో; వీతబలున్= తొలగినబలం కలవాడిని; తిగుచునట్లు= లాగివేసేటట్లు; చేతోబలసంభృతయోగాతిశయుఁడు= మనోబలంతో నిండిన యోగదృఢత్వం కలవాడు; కానివానిన్= కానట్టి యోగిని; విషయములు= శబ్దం మొదలైన విషయాలు; ఈడ్చున్= లాగివేస్తాయి.

**తాత్పర్యం:** మాన్యచరిత్రుడవగు ఓ ధర్మరాజా! బలంగా ముందుకు సాగిపోయే ప్రవాహవేగం బలహీనుడిని లాగివేస్తుంది. అట్లాగే మనోబలంతో కూడిన యోగశక్తి లేనివాడిని శబ్దస్పర్శాది విషయాలు తమవైపునకు లాగివేస్తాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **నది రయము వారణేంద్రుఁడు । గుదియించిన యట్ల పోలెఁ గురువర! దైన్యా**
**స్పదమగు విషయోల్లాసముఁ । గుదియించును యోగసిద్ధి గురుహృద్బలుఁడున్.** **582**

**ప్రతిపదార్థం:** కురువర!= కురుశ్రేష్ఠా!; వారణ+ఇంద్రుఁడు= గజేంద్రుడు; నదిరయమున్= నదీవేగాన్ని; కుదియించిన అట్ల పోలెన్= అడ్డగించేటట్లే; యోగసిద్ధి గురుహృద్బలుఁడున్= యోగంయొక్క సిద్ధిచేత గొప్పదైన మనోబలం కలవాడుకూడా; దైన్యాస్పదము+అగు= దీనత్వానికి నెలవైన; విషయ+ఉల్లాసమున్= శబ్దాదివిషయాల విలాసాన్ని; కుదియించును= అడ్డగిస్తాడు.

**తాత్పర్యం:** కురువర్యా! మదించిన ఏనుగు నదీప్రవాహ వేగాన్ని తగ్గించినట్లే యోగసిద్ధితో మనోబలం సంపాదించుకొన్న యోగివర్యుడు దీనత్వం కలిగించే విషయాల ఉరవడిని తగ్గించివేస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **కుపితుఁడగు నంతకుండును గ్రోధఘోర । మృత్యువును నైన నియమసమృద్ధయోగ**
**బలునిదెస వోవఁ జాల రప్రతిహతముగ । నెందుఁ జరియించు నతఁడు నరేంద్రముఖ్య!** **583**

**ప్రతిపదార్థం:** నరేంద్రముఖ్య!= రాజశ్రేష్ఠా!; కుపితుఁడు+అగు= కోపించినవాడైన; అంతకుండును= యముడు అయినా; క్రోధఘోరమృత్యువునున్+ఐనన్= కోపంచేత భయంకరమైన మృత్యుదేవత ఐనా; నియమసమృద్ధ యోగబలుని దెసన్= నియమాలతో సమగ్రమైన యోగబలం కలవాడివైపు; పోవన్+చాలరు= పోలేరు; అతఁడు= ఆ యోగి; అప్రతిహతముగన్= ఎదురులేకుండ; ఎందున్+చరియించున్= ఎక్కడనైనా తిరుగగలడు.

**తాత్పర్యం:** నృపశ్రేష్ఠా! కోపించిన యముడుగానీ, కోపభీకరమైన మృత్యువుగానీ దృఢనియమాలను పాలించి యోగశక్తి పరిపూర్ణుడైన యోగిచెంతకు పోలేరు. అట్లాంటి యోగీంద్రుడు ఎదురులేనివాడై ఎక్కడనైనా తిరుగుతాడు.

**క.** **భోగంబుఁ దపముఁ బొరిఁబొరి । రాగవిరాగతల హృదయరంగమునకుఁ గే**
**ళీగతులఁ దెచ్చి యార్చుచు । యోగి యనుభవించుఁ దగిలియుండం డెందున్.** **584**

**ప్రతిపదార్థం:** యోగి= యోగశీలుడు; పొరిన్+పొరిన్= మాటిమాటికి; భోగంబున్= విషయానుభవాన్ని; తపమున్= తపస్సును; రాగవిరాగతలన్= రక్తినీ, విరక్తినీ; హృదయరంగమునకున్= చిత్తం అనే రంగస్థలానికి; కేళీగతులన్= క్రీడాగమనాలతో; తెచ్చి= తీసికొనివచ్చి; ఆర్చుచున్= ఆడిస్తూ; అనుభవించున్= అనుభవిస్తాడు; ఎందున్= దేనిలోనూ; తగిలిఉండడు= ఆసక్తుడై ఉండడు.

**తాత్పర్యం:** యోగాభ్యాసపరుడైనవాడు మాటిమాటికీ తన హృదయమనే రంగస్థలం మీదికి విషయసుఖానుభవాన్నీ, తపస్సునూ, రాగాన్నీ, విరాగాన్నీ సవిలాసంగా తీసికొనివచ్చి ఆడిస్తూ ఉంటాడు. ఎందులోనూ తగులువడకుండా తాను ఆ క్రీడారసాన్ని అనుభవిస్తాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క.** **జగతీవర! యోగస్థూ । లగతులు సెప్పితి వినం గలదు సూక్ష్మవిధం**
**బగుమార్గ ప్రచయము ద । న్నిగదన మవధానమున వినిన మతి దేఱున్.** **585**

**ప్రతిపదార్థం:** జగతీవర!= భూవరా!; యోగస్థూల గతులు= యోగంయొక్క స్థూలమైన విధానాలు; చెప్పితిన్= వివరించాను; సూక్ష్మవిధంబు+అగు= సూక్ష్మపద్ధతిగల; మార్గప్రచయము= విధానాల సముదాయం; వినంగలదు= వినటానికి మిగిలిఉన్నది;

తన్నిగదనమున్= ఆ చెప్పటాన్ని; అవధానమునన్= హెచ్చరికతో; వినినన్= వింటే; మతి= బుద్ధి; తేజున్= ప్రసన్నతపొందుతుంది.

**తాత్పర్యం:** రాజా! యోగానికి చెందిన స్థూలమైన విషయాలు ఇంతవరకూ చెప్పాను. ఇంకా సూక్ష్మ విషయాలైన కొన్ని యోగవిధానాలు వినవలసి ఉన్నాయి. వాటి వివరణ సావధానంగా వింటే బుద్ధి నిర్మలమవుతుంది.

**క. ఏమిగతి లక్ష్యభేదముఁ । దా మేలుగఁ జేయు ధన్వి తత్పరుఁడై యో**
**గామల చిత్తుఁడు మోక్షం । బామెయి సాధించువాఁ డహంకృతిదూరా! 586**

**ప్రతిపదార్థం:** అహంకృతిదూరా!= అహంకారం లేనివాడా!; ధన్వి= విలుకాడు; ఏమిగతిన్= ఎట్లు; తత్పరుఁడు+ఐ= దానియందాసక్తుడై; తాన్= తాను; లక్ష్యభేదమున్= గురిని ఛేదించటాన్ని; మేలుగన్= బాగా; చేయున్= చేస్తాడో; ఆ+మెయిన్= అదేరీతిగా; యోగ+అమలచిత్తుఁడు= యోగముచే నిర్మలమైన హృదయం కలవాడు; మోక్షంబు= ముక్తిని; సాధించువాఁడు= సంపాదిస్తాడు.

**తాత్పర్యం:** అహంకారంలేని ఓ ధర్మరాజా! విలుకాడు తదేకచిత్తుడై ఎట్లా లక్ష్యాన్ని చక్కగా ఛేదిస్తాడో, అట్లాగే యోగనిపుణుడు మోక్షలక్ష్యాన్ని సాధిస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. నేతికుండ మోచి యే తెఱఁగున సోబ । నాలు వ్రాఁకు నైపుణంబు గలుగు**
**పురుషుఁడట్ల యోగపరిణతుండును నాత్మ । నేమఱక విముక్తి కెక్క వలయు. 587**

**ప్రతిపదార్థం:** నైపుణంబు గలుగు= నేర్పుగల; పురుషుఁడు= మనుజుడు; నేతికుండ= నేతితో నింపిన కుండను; మోచి= వహించి; ఏ+తెఱఁగునన్= ఏ రీతిగా; సోబనాలు= మెట్లు; ప్రాఁకున్= ఎక్కుతాడో; అట్ల= ఆ రీతిగానే; యోగపరిణతుండునున్= యోగనిపుణుడుకూడ; ఆత్మన్+ఏమఱక= ఆత్మవిషయంలో మరుపులేకుండా; విముక్తికిన్= మోక్షానికి; ఎక్కన్‌వలయున్= ఎగబ్రాకాలి.

**తాత్పర్యం:** నేర్పుగల పురుషుడు నెత్తిపై నేతికుండ మోసికొని ఎట్లా మెట్లు ఎక్కిపోతాడో, అట్లాగే యోగనిపుణత గలవాడు కూడ ఆత్మను మరువకుండా మోక్షసౌధాన్ని అధిష్ఠించాలి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. రథికునకుఁ గలమరికి సారథియుఁ గర్ణ । ధారుఁడును బోలె నాత్మకుఁ దాను సుపథ**
**వర్తనైకవిధాయి గావలయు యోగ । ధారణా నిశ్చలుం డగు ధీరు డధిప! 588**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; రథికునకున్= రథమునధిష్ఠించిన వాడికిని; కలమరికిన్= ఓడనెక్కిపోయేవాడికిని; సారథియున్= రథంనడిపేవాడును; కర్ణధారుఁడును పోలెన్= చుక్కానిపట్టేవాడివలె; యోగధారణానిశ్చలుండు+అగు= యోగమును ధరించుటలో చలనములేనివాడైన; ధీరుఁడు= ధైర్యముగలవాడు; తాను= తాను; ఆత్మకున్= తన ఆత్మకు; (తనకు); సుపథవర్తనైక విధాయి= మంచి మార్గమున ప్రవర్తించుటను మాత్రమే కల్పించువాడు; కావలయున్= కావాలి.

**తాత్పర్యం:** రాజా! రథమెక్కి పోయేవాడిని సారథివలె, పడవ ఎక్కి పయనించే వాడిని చుక్కాని పట్టేవాడివలె యోగధారణలో నిశ్చలస్థితిని పొందిన ధీరచిత్తుడు తన ఆత్మను మంచి మార్గంలోనే నడిపించాలి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. శిరమును నాభియు హృదయము । నురమును గర్ణములఁ బార్శ్వయుగళము నాత్మా**
**దరణీయస్థానము ల । య్యిరవులఁ గనుయోగి యాత్మ నిభపురనాథా!' 589**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= హస్తినానగరరాజా!; శిరమును= తలను; నాభియున్= బొడ్డును; హృదయమున్= హృదయాన్ని; ఉరమును= వక్షమును; కర్ణములున్= చెవులు; పార్శ్వయుగళమున్= రెండు ప్రక్కలును; ఆత్మాదరణీయస్థానములు= ఆత్మకు ఆదరించదగిన ప్రదేశాలు; యోగి= యోగశీలుడు; ఆ+ఇరవులన్= ఆ స్థానాలలో; ఆత్మన్ కనున్= ఆత్మను చూస్తాడు.

**తాత్పర్యం:** హస్తినాపుర ప్రభుడవైన ఓ ధర్మపుత్రా! శరీరంలో తల, బొడ్డు, హృదయం, వక్షం, చెవులు, ఇరుప్రక్కలు - ఆత్మకు ఆదరించదగిన నెలవులై ఉన్నాయి. యోగి అయినవాడు ఆ స్థానాలలో తన ఆత్మను సందర్శిస్తాడు.'

**వ. అనిన నజాతశత్రుం డాపగాపుత్రునితో నిట్లనియె. 590**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అజాతశత్రుండు= ధర్మరాజు; ఆపగా పుత్రునితోన్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ము డట్లా చెప్పగా ధర్మజుడు అతడితో ఇట్లా అన్నాడు:

**తే. ' యోగి యెట్టి యాహారంబు లుడుగవలయు? । నాతఁ డెబ్బంగి భోజ్యంబు లనుభవించి**
**బలము వడయువాఁ?డిది నాకుఁ దెలియఁజెప్ప । వే జనస్తవనీయసమిద్ధబుద్ధి! 591**

**ప్రతిపదార్థం:** జన స్తవనీయ సమిద్ధ బుద్ధి!= జనులచేత స్తుతించదగిన తేజోవంతమైన బుద్ధికలవాడా!; యోగి= యోగశీలుడు; ఎట్టి= ఎటువంటి; ఆహారంబులు= భోజనాలు; ఉడుగన్ వలయున్?= వర్జించాలి?; ఆతఁడు= ఆ యోగి; ఏ+భంగిభోజ్యంబులు= ఎట్లాంటి ఆహారపదార్థాలను; అనుభవించి= భుజించి; బలము+పడయువాఁడు?= బలం పొందుతాడు; ఇది= ఈ విషయం; నాకున్+తెలియన్=చెప్పవే!= నాకు ఎఱుగజేయుమా!

**తాత్పర్యం:** 'ప్రజాస్తుతికి పాత్రమై దీపించే బుద్ధిగల ఓ పితామహా! యోగి ఎట్లాంటి ఆహారాలు వర్జించాలి? అతడు ఎటువంటి ఆహారాలు తింటే బలం పుంజుకొంటాడు? ఈ విషయం నాకు వివరించుము.'

**సీ. అనవుడు నతనితో నతఁడు 'సుస్నిగ్ధంబు । లైన యాహారముల్ మానువాఁడు**
**యోగి; నీరసముల నుదకంబులను జాల । నాఁకలి పుచ్చుచు నవియు నుదర**
**మధికపూర్ణంబగు నట్లుగాఁ గొనక వ । ర్తించుట బలము వర్ధింపఁజేయు'**
**నని చెప్పి వెండియు ననుఁ 'గామమును గ్రోధ । మును నిద్రయును దృష్ణయును భయంబు**

**తే. రతియు నరతియుఁ బవనంబుగతియు నుడిపి । ధారణా నిశ్చలుం డయి తన్నుఁ దాన**
**కనుచునుండెడు యోగి దుర్గంపుఁజోటు । వెడల నరిగి సుఖస్థానవిభవ మొందు. 592**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; అతనితోన్= ఆ ధర్మజుడితో; అతఁడు= భీష్ముడు; యోగి= యోగాభ్యాసపరుడు; సుస్నిగ్ధంబులు+ఐన= నూనెగల్గి చిక్కనైన; ఆహారముల్= భోజనాలు; మానువాఁడు= వదలేవాడు; నీరసములన్= సరసములు కానట్టి పదార్థాలతోనూ; ఉదకంబులనున్= నీటితోను; చాలన్= మిక్కిలిగా; ఆఁకలి పుచ్చుచున్= ఆకలి తీర్చుకొంటూ; అవియున్= అవికూడా; ఉదరము= పొట్ట; అధికపూర్ణంబు+అగునట్లుగాన్= మిక్కిలి నిండేటట్లుగా; కొనక= గ్రహించక; వర్తించుట= ఉండటం; బలమున్= సత్తువను; వర్ధిల్లన్+చేయున్= వృద్ధిపొందిస్తుంది; అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల; అనున్= ఇట్లా అన్నాడు; కామమునున్=

కోరికనూ; క్రోధమునున్= కోపాన్నీ; నిద్రయునున్= నిద్రనూ; తృష్ణయునున్= ఆశనూ; భయంబున్= భీతినీ; రతియున్= రాగాన్నీ; అరతియున్= రాగంలేమినీ; పవనంబుగతియున్= శ్వాసగమనాన్నీ; ఉడిపి= ఉడిగించి; ధారణా నిశ్చలుండు+అయి= యోగమును ధరించటంలో కదలికలేనివాడై; తన్నున్= తనను; తాన= తానే; కనుచున్+ఉండెడు యోగి= చూస్తూ ఉండే యోగి; దుర్గంపుఁజోటున్= చొరరాని ప్రదేశాన్ని; వెడలన్+అరిగి= అతిక్రమించిపోయి; సుఖస్థానవిభవమున్= ఆనందపదముయొక్క వైభవాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అడుగగా అతడితో భీష్ముడు ఇట్లా అన్నాడు: 'యోగి నూనెగల చిక్కనైన ఆహారపదార్థాలు వర్జించాలి. రసవత్తరములు కాని పదార్థాలతో, నీటితో ఆకలి తీర్చుకొనాలి. అవికూడా పొట్టనిండేటట్లు ఎక్కువగా తీసికొనరాదు. అట్లా ఉంటే బలం పెంపొందుతుంది' - ఈ రీతిగా చెప్పి భీష్ముడు మళ్ళీ ఇట్లా అన్నాడు: - 'కామాన్నీ, క్రోధాన్నీ, నిద్రనూ, ఆశనూ, భయాన్నీ, అభిరుచినీ, అభిరుచిలేనితనాన్నీ, శ్వాసగమనాన్నీ ఉడిగించాలి. యోగధారణలో నిశ్చలత కలిగి తనలో తనను చూచుకొంటూ రమించే యోగి దుర్గమప్రదేశాలను నిర్గమించి నిత్యసుఖానికి నెలవైన ధామం చేరుకొంటాడు.

**క. జనవర! యసిధారావ్రత । మనఁదగియెడు ధారణానియతి పనుపడు నె**
**వ్వని చిత్తంబున నా యో । గనిరూఢుున కరిది యైన కార్యముఁ గలదే. 593**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; ఎవ్వనిచిత్తంబునన్= ఎవడి హృదయంలో; అసిధారావ్రతము= కత్తివాదరపై నడక; అనన్+తగియెడు= అని చెప్పదగిన; ధారణానియతి= ధారణయొక్క నియమం; పనుపడున్= అలవడుతుందో; ఆ యోగనిరూఢునకున్= అట్టి యోగసిద్ధుడికి; అరిది+ఐన కార్యమున్= అశక్యమైన పని; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** రాజా! కత్తి వాదరపై నడక అనదగిన యోగధారణా నియమం ఎవడి చిత్తంలో స్థిరమై ఉంటుందో అట్లాంటి యోగనిపుణుడు సాధించరాని కార్యమేమున్నది?

**క. యోగనిరూఢుఁడు సంగ । త్యాగానందైకరతుఁ; డతనికి జనన సం**
**యోగము మృతిదైన్యంబును । భోగాభోగ సుఖదుఃఖములు లే వధిపా! 594**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; యోగనిరూఢుఁడు= యోగమునందు సిద్ధిపొందినవాడు; సంగత్యాగ+ఆనందైకరతుఁడు= పొత్తును విడుచుటచేత కలిగే ఆనందమునందే ఆసక్తుడు; అతనికిన్= అట్టి యోగికి; జననసంయోగమున్= పుట్టుకతోపొత్తు; మృతిదైన్యంబునున్= మరణభీతిచేతకలిగే దీనత్వమూ; భోగ+అభోగసుఖదుఃఖములు= భోగంచేత కలిగే సుఖమూ; భోగం లేకపోవటంచేత కలిగే దుఃఖమూ; లేవు= ఉండవు.

**తాత్పర్యం:** రాజా! యోగసిద్ధి పొందినవాడు సంగాన్ని వదలిపెట్టటం వలన కలిగే సంతోషంలోనే ఆసక్తి కలిగి ఉంటాడు. అతడికి పుట్టుకతో సంయోగం, మరణంతో దీనత్వం లేవు. భోగంవలన సుఖించటం, భోగం లేకపోతే దుఃఖించటం అనేవి అతడి కుండవు.

**క. అతనికి సరిత్సముద్ర । క్షితిభృ ద్ద్వీపములు కేలికిం బట్టులు దా**
**మతిఁ దలఁచెనేనిఁ బరిశాం । తత నున్నను గుడియు గుహయుఁ దగుమందిరముల్. 595**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ యోగికి; సరిత్సముద్రక్షితిభృద్ద్వీపములు= నదులు, సముద్రాలు, కొండలు, దీవులు; కేళికిన్= క్రీడకు;

పట్టులు= నెలవులు; తాన్= తాను; మతిన్= చిత్తమునందు; తలఁచెన్+ఏనిన్= తలంచినచో; పరిశాంతతన్+ఉన్ననున్= శాంతంగా ఉన్నా; గుడియున్= దేవాలయమూ; గుహయున్= కొండబిలమూ; తగుమందిరముల్= తగిన గృహాలు.

**తాత్పర్యం:** యోగనిపుణుడికి నదులూ, సాగరాలూ, కొండలూ, దీవులూ క్రీడాస్థానా లవుతాయి. అతడు తలచుకొంటే, ప్రశాంతంగా ఉంటే గుడి, పర్వతగుహ తగిన నివాసగృహాలుగా రూపొందుతాయి.

**క. విముఖుం డగుటయుఁ గీళులు । దమయంతన చెందు జనులఁ దా వారలకున్**
**సుముఖుం డగుటయు శుభములు । సమకూరును శివునియట్ల చరితము లెల్లన్.' 596**

**ప్రతిపదార్థం:** తాన్= తాను; విముఖుండు= ప్రతికూలుడు; అగుటయున్= కాగానే; తమ+అంతన= తమకుతామే; కీళులు= అశుభములు; జనులన్= ప్రజలను; చెందున్= పొందుతాయి; వారలకున్= ఆ జనులకు; సుముఖుండు+అగుటయున్= అనుకూలుడు కాగానే; శుభములు= మంగళాలు; సమకూరును= కలుగును; చరితములు+ఎల్లన్= నడవడికలన్నీ; శివుని+అట్ల= శంకరుడి వంటివే అవుతాయి.

**తాత్పర్యం:** యోగి ప్రజలకు విముఖుడుగా ఉంటే వాళ్ళకు అశుభాలు తమకు తామే కలుగుతాయి. అతడు వారికి సుముఖుడైతే శుభాలు ప్రాప్తిస్తాయి. యోగియొక్క పోకడలన్నీ శంకరుడి పోకడలను పోలి ఉంటాయి.'

**విశేషం**: అలం: ఉపమ.

**వ. అని చెప్పి వెండియు. 597**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** భీష్ముడీరీతిగా పలికి మళ్ళీ ఈ విధంగా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ' యోగతంత్రంబు సకలశాస్త్రోదితంబు । విను విశేషించి లోకైక విభుఁడు సెప్పె**
**దీని నారాయణుఁడు; మునిమాననీయ । మిది మనంబునఁ దెలిసికొ మ్మిద్ధచరిత!' 598**

**ప్రతిపదార్థం:** ఇద్ధచరిత= ఉజ్జ్వలమైన శీలం కలవాడా!; విను= ఆలకించుము; యోగతంత్రంబు= యోగంయొక్క సిద్ధాంతం; సకలశాస్త్ర+ఉదితంబు= సమస్తశాస్త్రాలలో చెప్పబడింది; విశేషించి= అతిశయించి; దీనిన్= ఈ యోగశాస్త్రాన్ని; లోకైకవిభుఁడు= ప్రపంచానికి ముఖ్యప్రభువైన; నారాయణుఁడు= మాధవుడు; చెప్పెన్= వచించాడు; ఇది= ఈ సిద్ధాంతం; మునిమాననీయము= మునులచేత పూజించదగినది; మనంబునన్= నీ చిత్తంలో; తెలిసికొమ్ము= గ్రహించుకొనుము.

**తాత్పర్యం:** 'ఉజ్జ్వలచరిత్రుడవైన ఓ ధర్మరాజా! వినుము. ఇప్పుడు నేను వివరించిన యోగసిద్ధాంతం సకలశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. విశేషించి దీనిని జగదేకప్రభువైన నారాయణుడు చెప్పాడు. దీనిని మునులు గౌరవిస్తున్నారు. కాబట్టి నీవు నీ మనస్సులో దీనిని చక్కగా గ్రహించుము.'

**వ. అనిన విని ధర్మతనయుండు 'యోగతంత్రప్రకారంబు భవత్ప్రసాదంబునం బ్రబుద్ధంబయ్యె; సాంఖ్యస్వరూపం బెట్టిది యెఱింగింపవే' యని యడిగిన, నతనికి దేవవ్రతుం డిట్లనుఁ 'గపిలాది మహాముని దర్శితంబైన మార్గంబున వివరించెద. 599**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆకర్ణించి; ధర్మతనయుండు= ధర్మపుత్రుడు; యోగతంత్రప్రకారంబు= యోగసిద్ధాంత

విధానం; భవత్ప్రసాదంబునన్= నీ అనుగ్రహంచేత; ప్రబుద్ధంబు+అయ్యెన్= తెలియబడింది; సాంఖ్యస్వరూపంబు= సాంఖ్యశాస్త్రవిధానం; ఎఱింగింపవే= తెలుపుమా; అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతనికిన్= ఆ ధర్మసుతుడికి; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; కపిల+ఆదిమహాముని దర్శితంబు+ఐన= కపిలుడు మొదలైన పెద్ద మునులు చూపిన; మార్గంబునన్= పద్ధతిలో; వివరించెదన్= విశదీకరిస్తాను.

**తాత్పర్యం:** భీష్ముడట్లా చెప్పగా విని ధర్మరాజు 'నీ అనుగ్రహం వలన నేను యోగశాస్త్ర మెట్లాంటిదో చక్కగా తెలిసికొనగలిగాను. ఇక సాంఖ్యశాస్త్ర స్వరూపం ఎట్లాంటిదో నాకు తెలియజెప్పుము' అని అడిగాడు. అప్పు డతడితో భీష్ముడు ఇట్లా చెప్పాడు. 'నేను నీకు కపిలుడు మొదలైన మహా మునులు చెప్పిన పద్ధతి ననుసరించి సాంఖ్యశాస్త్రాన్ని విశదీకరిస్తాను.'

**భీష్ముఁడు ధర్మరాజునకు సాంఖ్యస్వరూప నిరూపణంబు సేయుట (సం. 12-290-3)**

**సీ.** **' వినుము దృఢజ్ఞానమున విషయంబుల । భంగి లెస్సగ నారయంగ వలయు;**
**నవియుఁ దిర్యఙ్మనుష్యామర పితృసిద్ధ । గరుడ గంధర్వ కిన్నరుల యందు**
**వేఱచందంబులై విలసిల్లు; శ్రుతివాక్య । దృష్టంబులగు దానఁ దెలియ నరయు**
**పరిచయంబున భేదపరబోధమేమిటి । కనరాదు; తోఁచిన యప్పు డవియు**

**తే.** **దురితకరముల యని వానిఁ దొడరకుండ । వలదె లెస్సగ నెఱిఁగిన వచ్చుఁ దొలఁగ**
**నేమఱమి దక్క నొండొకం డేల చోర । జనులఁ జిట్లంగ నడఁచుట కనఘచరిత! 600**

**ప్రతిపదార్థం:** అనఘచరిత!= దురితంలేని చరిత్రం కలవాడా!; వినుము= ఆలకించుము; దృఢజ్ఞానమునన్= గట్టి తెలివితో; విషయంబులభంగిన్= (గ్రహించదగిన) ఆయా అంశాల పద్ధతిని; లెస్సగన్= బాగుగా; ఆరయంగన్+వలయున్= పరిశీలించాలి; అవియున్= ఆ విషయాలుకూడా; తిర్యఙ్మనుష్యామర పితృసిద్ధ గరుడ గంధర్వకిన్నరుల+అందున్= పశుపక్ష్యాదులు, మానవులు, దేవతలు, పితరులు, సిద్ధులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులనబడే వీరిలో; వేఱచందంబులు+ఐ= వేరువేరు విధములై; విలసిల్లున్= ప్రకాశిస్తాయి; శ్రుతివాక్య దృష్టంబులు+అగున్= (అవి) వేదవచనములచేత తెలియబడునవి అవుతున్నాయి; దానన్= దానివలన; తెలియన్+అరయు= తెలిసికొనటానికై అన్వేషించుము; పరిచయంబునన్= ఎఱుకలో; భేదపరబోధము= భేదంతో సంబంధపడిన జ్ఞానం; ఏమిటికిన్= ఎందుకు; అనన్ రాదు= అని చెప్పతగదు; తోఁచిన అప్పుడు= ఉదయించినప్పుడు; అవియున్= ఆ విషయాలుకూడా; దురితకరముల+అని= పాపహేతువులే అని; వానిన్= ఆ విషయాలను; తొడరక+ఉండన్ వలదె?= అంటకుండా ఉండవద్దా?; లెస్సగన్= బాగుగా; ఎఱిఁగినన్= గ్రహిస్తే; తొలఁగన్ వచ్చున్= తొలగిపోవచ్చు; చోరజనులన్= దొంగలను; చిట్లంగన్+అడఁచుటకున్= కొట్టి అణచేటందుకు; ఏమఱమిదక్కన్= జాగరూకత తప్ప; ఒండు+ఒకండు+ఏల?= మరొకటి ఎందుకు?

**తాత్పర్యం:** 'పవిత్రవర్తనుడవైన ధర్మపుత్రా! వినుము. గ్రహించదగిన విషయాల నన్నింటినీ దృఢమైన వివేకంతో గ్రహించాలి. పశుపక్ష్యాదులు, మానవులు, దేవతలు, పితరులు, సిద్ధులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు - వీరికి చెందిన విషయాలు పరస్పర భిన్నంగా ఉంటాయి. వేదవాక్యాలలో వాటిని చూడవచ్చును. నీవు కూడా వాటిని ఆ విధంగా తెలిసికొనటానికై ప్రయత్నించుము. పశుపక్ష్యాదులు, మానవులు మొదలైన వారికి చెందిన భిన్నభిన్న విషయాలను గ్రహించవలసిన అవసర మేమున్నది? అని చెప్పకూడదు. ఆయా పరిస్థితులు మనకు కలిగినపుడు అవికూడ పాపహేతువులే అని తెలిసికొని వాటిని అంటకుండా ఉండాలి కదా! అవి చక్కగా తెలిసి ఉంటే వాటినుండి బయటపడవచ్చును. దొంగలను ఒడలు పగలగొట్టి తరిమివేయాలంటే ఏమరుపాటు లేకుండా ఉండటం తప్ప

మరొక ఉపాయంతో ప్రయోజనమేముంది? అందువలన దోషభూయిష్ఠమైన ఆయా విషయాలకు దూరంగా ఉండాలంటే వాటిని గూర్చిన పరిజ్ఞానం అవసరమే. (ఇందులో ఏమరుపాటు పనికిరాదని భావం).

**విశేషం:** తిర్యక్కులు, మానవులు మొదలైన వారికి చెందిన విషయాలన్నీ దోషాలతో కూడినవే. అవి శాశ్వతాలు కాక రాకపోకలు గలిగి ఉండటం వలననే దోషభూయిష్ఠాలవుతున్నాయి. ఆ దోషస్వరూపం చక్కగా తెలిస్తే వాటిని వర్జించి చివరికి జీవుడు మోక్షం పొందుతాడు. అందువలన వేదవాక్యాల సాయంతో వాటిని గ్రహించాలని తాత్పర్యం. ఆ విషయాలలో కొన్ని గుణాలు కలిగించవచ్చును. అయినా వాటికి కూడా రాకపోకలుంటాయి. అందువలన వాటికి శాశ్వతత్వం లేదు కాబట్టి అవికూడా దోషాలే అని భావించాలని ఈ ఘట్టంలో సంస్కృతభారతానికి వ్యాఖ్యవ్రాసిన నీలకంఠుడు వివరించాడు. (చూడు - ఓరియంటల్ బుక్స్ రీప్రింట్ కార్పొరేషన్ వారి - శాంతిపర్వం - ద్వితీయముద్రణ, 602 పుట).

**చ.** **తలఁపఁగ నాయు వింతియకదా యని సౌఖ్యము దుఃఖముం బొరిం**
**గలుగవె కాలవృత్తి నని, కర్మము లిట్లని వేదచోదనం**
**బుల బహుభంగు లిట్టివని బుద్ధికి సత్త్వరజస్తమోగుణం**
**బులకుఁ బ్రవర్తనంబు లివి పొమ్మని కాంచుట చాల మే లగున్. 601**

**ప్రతిపదార్థం:** తలఁపఁగన్= ఊహించగా; ఆయువు= జీవితకాలం; ఇంతియకదా అని= ఇంతేకదా అనీ; సౌఖ్యమున్= సుఖమూ; దుఃఖమున్= దుఃఖమూ; కాలవృత్తిన్= కాలవర్తనచేత; పొరిన్= క్రమంగా; కలుగవె అని= సంభవించవా అనీ; కర్మములు+ఇట్లు+అని= పనులు ఇట్లాంటివి అనీ; వేదచోదనంబుల బహుభంగులు= శ్రుతిచేసేప్రేరణలయొక్క వివిధ పద్ధతులు; ఇట్టివి+అని= ఈ విధమైనవనీ; బుద్ధికిన్= బుద్ధి అనే అంతఃకరణవృత్తికి; సత్త్వరజస్తమోగుణంబులకున్= సత్త్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాలకు; ప్రవర్తనంబులు= పోకడలు; ఇవిపొమ్ము+అని= ఇవియే సుమా! అనీ; కాంచుట= గ్రహించటం; చాలమేలు+అగున్= మిక్కిలి శ్రేయస్సు అవుతుంది.

**తాత్పర్యం:** ఆయువు ఇంతేకదా! అనీ, సుఖమూ, దుఃఖమూ క్రమంగా వస్తూఉంటాయి అనీ, మనం చేయదగిన కర్మ లట్లాంటివి అనీ, వేదం విధించే నానా విధులు ఈ రీతిగా ఉన్నాయనీ, బుద్ధియొక్క ప్రవృత్తీ, సత్త్వరజస్తమోగుణాల ప్రవృత్తులూ ఇవే సుమా! అనీ గ్రహించటం ఎంతో శ్రేయోదాయక మవుతుంది. ఇవి తెలిసికొనటంవలన మానవుడు ప్రవృత్తిమార్గం వదలి క్రమంగా నివృత్తిమార్గంలో ప్రవేశించి శ్రేయస్సు పొందుతా డని భావం.

**సీ.** **ఇంద్రియార్థంబుల నేనింట నై దింద్రి। యములును గోష్ఠంబునందు వహ్ని,**
**పవనుండు బయలను, బావకునందుఁ దో। యములును భూమి దోయముల బలము**
**గౌశికునందును గ్రాంతి యుపేంద్రుని। యందును నర్థంబునందు లోభ**
**మును దమస్సున బుద్ధియును రజస్సునఁ దమ। స్సును సత్త్వమున రజస్సును గరంబు**

**ఆ.** **దగులు సత్త్వ మాత్మఁదగులు; నాత్ముండు నా। రాయణుఁడు మహేశుఁ డనఁగ బరఁగు**
**పరముఁ దగులు నతఁడు పరము మోక్షంబునఁ। దగులు, మోక్ష మెందుఁ దగుల దధిప! 602**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఇంద్రియ+అర్థంబుల+ఏనింటన్= శబ్దం మొదలైన ఐదువిషయాలలో; ఐదు+ఇంద్రియములునున్= శ్రోత్రంమొదలైన ఇంద్రియాలు ఐదును; కోష్ఠంబునందున్= గర్భమునందు; వహ్ని= అగ్ని; బయలనున్= ఆకాశమున;

పవనుండున్= వాయువును; పావకునందున్= అగ్నియందు; తోయములును= జలములును; తోయములన్= జలాలలో; భూమి= పృథివియు; కౌశికునందునున్= ఇంద్రుడియందు; బలమున్= హస్తేంద్రియమును; ఉపేంద్రునియందునున్= విష్ణువునందు; క్రాంతి= పాదవిక్షేపమును (కాలుముందుకు చాచుట); అర్థంబునందున్= ధనమునందు; లోభమునున్= పిసినితనమును; తమస్సునన్= తమోగుణమునందు; బుద్ధియునున్= బుద్ధియు; రజస్సునన్= రజోగుణమునందు; తమస్సును= తమోగుణమును; సత్త్వమునన్= సత్త్వగుణమునందు; రజస్సును= రజోగుణమును; కరంబున్= మిక్కిలిగా; తగులున్= తగులువడిఉంటాయి; సత్త్వము= సత్త్వగుణము; ఆత్మన్= జీవునియందు; తగులున్= తగులుకొనిఉంటుంది; ఆత్ముండు= జీవుడు, నారాయణుడు మహేశు(డు+అన(గన్+పర(గు= నారాయణుడు, మహేశ్వరుడు అనగా ప్రసిద్ధుడైన; పరమున్= శ్రేష్ఠుడైనదేవుని; తగులున్= తగులుకొని ఉంటాడు; అత(డు= ఆ దేవుడు; పరము= శ్రేష్ఠమైన; మోక్షంబునన్= మోక్షమునందు; తగులున్= ఆసక్తుడై ఉంటాడు; మోక్షము= ముక్తి; ఎందున్= దేనిలోనూ; తగులదు= తగులుకొనదు.

**తాత్పర్యం:** రాజా! శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణం అనే ఐదు జ్ఞానేంద్రియాలు క్రమంగా శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనే ఐదు విషయాలలోనూ, అగ్ని ఉదరంలోనూ, వాయువు ఆకాశంలోనూ, జలం అగ్నిలోనూ, భూమి జలమందునూ, హస్తేంద్రియం ఇంద్రుడియందునూ, పాదవిక్షేపం (కాలు చాచటం) వామనుడైన విష్ణుని యందునూ, లోభం ధనంలోనూ, బుద్ధి తమోగుణంలోనూ, తమోగుణం రజోగుణంలోనూ, రజోగుణం సత్త్వగుణంలోనూ మిక్కిలిగా తగులువడివున్నాయి. సత్త్వగుణం జీవాత్ముడితో సంబద్ధమై ఉన్నది. త్వంపదార్థమైన జీవుడు నారాయణుడూ, మహేశ్వరుడూ అనబడే దేవుడిలో తగులువడిఉన్నాడు. ఆ దేవుడు శ్రేష్ఠమైన మోక్షంలో సక్తుడై ఉన్నాడు. తత్పదార్థమైన మోక్షం ఎందులోనూ తగులువడక స్వతంత్రమై ఉన్నది.

**క. ప్రకృతి పదాఱు వికారము । లకు నాశ్రయ మాత్మ కది నెలవు; విను మాత్ముం**
**డకుటిల తేజోరూపత( । బ్రకృతియు వికృతియును గాక ప్రస్ఫురితు( డగున్. 603**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ప్రకృతి= త్రిగుణాలసామ్యావస్థ అయిన ప్రకృతి; పదాఱు వికారములకున్= పదునారు వికారాలకు; ఆశ్రయము= ఆధారం; ఆత్మకున్= ఆత్మకు; అది= ఆ ప్రకృతి; నెలవు= స్థానం; ఆత్ముండు= ఆత్మ; అకుటిలతేజోరూపతన్= స్వచ్ఛమైన తేజస్సు యొక్క రూపంకలవా డవటంచేత; ప్రకృతియున్= గుణసామ్యావస్థయు; వికృతియునున్+కాక= వికారమున్ను కాక; ప్రస్ఫురితు(డు+అగున్= భాసించినవాడవుతాడు.

**తాత్పర్యం:** సత్త్వం మొదలైన మూడు గుణాల సామ్యావస్థ అయిన ప్రకృతి పదునారు వికారాలకు ఆలంబనమై ఉన్నది. ఆత్మకు ఆ ప్రకృతే ఆశ్రయస్థానం. ఆత్మ స్వచ్ఛమైన తేజోరూపం కలిగి ఉన్నది. అది ప్రకృతి వికృతులలో ఏదీ కాక భాసిస్తూ ఉన్నది.

**విశేషం:** సత్త్వరజస్తమోగుణాల కలయికతో కూడిన సామ్యావస్థకు ప్రకృతి అని పేరు. ఈ ప్రకృతే ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, పంచభూతాలు (పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం) - అనే పదారు వికారాలకు ఆశ్రయమై ఉన్నది. సంస్కృత భారతానికి వ్యాఖ్య రచించిన నీలకంఠుడు, స్వప్నశరీరం పదునారు కార్యాలతో ఆవృతమై ఉన్నదనీ, ప్రాణం మొదలు నామం వరకూ గల 'ప్రాణాచ్ఛ్రద్ధాం' ఇత్యాది వేదమంత్రంలో చెప్పబడిన ప్రాణాదుల పదునారు కార్యాలనూ వివరించాడు. అందలి విశేషాలు ఆ వ్యాఖ్యలో చూడవచ్చును.

**తే. ఆత్మునకు రెండు రూపంబు లనఘ! కలవు । విషయసంగతి నొక్కటి విస్తరిల్లు(,**
**దదుపభోగంబు లేక మధ్యస్థభావ । మొంది యొక్కఁడు వెలు(గుచు నుండు( జూవె! 604**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఆత్మునకున్= ఆత్మకు; రెండు రూపంబులు= రెండు ఆకారాలు; కలవు= ఉన్నాయి; ఒక్కటి= అందులో ఒకటి; విషయసంగతిన్= శబ్దాదులైన విషయాల కలయికతో; విస్తరిల్లున్= వ్యాపించి ఉన్నది; ఒక్కఁడు= మరొక ఆత్మ; తదుపభోగంబు లేక= ఆ విషయాల యొక్క అనుభవం లేకుండా; మధ్యస్థభావమున్+ఒంది= తటస్థస్వరూపం పొంది; వెలుఁగుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటుంది; చూవె!= సుమా!.

**తాత్పర్యం:** అనఘా! ఆత్మకు రెండు రూపాలు ఉన్నాయి. అందులో ఒకటి శబ్దస్పర్శాది విషయాలను శ్రోత్రం, త్వక్కు మొదలైన ఇంద్రియాలద్వారా అనుభవిస్తూ ఉంటుంది. మరొక ఆత్మ విషయాలతోడి పొత్తు లేకుండా తటస్థంగా ఉండి భాసిస్తూ ఉంటుంది.

**విశేషం:** ఆత్మ ఒక్కటే అయినా అవిద్యా (అజ్ఞానం) ప్రభావం వలన ఆత్మ నిజస్వరూపాన్ని మరచిపోయి కామకర్మాదులకు లోనై జన్మలెత్తి విషయసుఖాలను అనుభవిస్తూ ఉంటుంది. ఇది అవిద్య ఉన్నంతవరకూ ఇట్లాగే ప్రవర్తిస్తుంది. అవిద్య తొలగిననాడు ఆత్మ పరమాత్మగా భాసిస్తుంది. పరమాత్మకు సుఖదుఃఖాలు, విషయాలతోడి పొత్తు లేవు. అవిద్యకు లోనైనవాడు జీవాత్మ. అవిద్యను నశింపజేసికొన్న నాడు అతడే పరమాత్మగా ప్రకాశిస్తాడు. ఈ జీవాత్మ - పరమాత్మలనే ఇక్కడ ఆత్మయొక్క రెండురూపాలుగా పేర్కొనటమయిందని గ్రహించాలి.

**క.** **పవనం బేకము, ప్రాణా । ది విభేదము లైదు, విను! తదీయంబులు వా**
**ని విధంబు లరయ నిశ్చల । మవు నది; యాసుకృత మంతరాత్మునిఁ జూపున్.** **605**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; పవనంబు= వాయువు; ఏకము= ఒక్కటి; తదీయంబులు= దానికి చెందినవి; ప్రాణాదివిభేదములు+ఐదు= ప్రాణం మొదలైన భేదాలు ఐదు; వాని విధంబులు= ప్రాణాదివాయువుల యొక్క స్వరూపాలను; అరయన్= పరిశీలించగా; అది= ఆ వాయువు; నిశ్చలము+అవున్= కదలిక లేనిదవుతుంది; ఆ సుకృతము= ఆ పుణ్యము; అంతః+ఆత్మునిన్= పరమాత్ముడిని; చూపున్= దర్శింపజేస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము. వాయువు ఒక్కటే. కాని దానికి చెందిన భేదాలు ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అని ఐదు విధాలుగా ఉన్నాయి. వాటిని పరిశీలిస్తే క్రమంగా పవనగమనం నిరోధించబడుతుంది. ఈ నిరోధమనే సుకృతం జీవుడిలోని అంతరాత్మను దర్శింపజేస్తుంది.

**విశేషం:** వాయువు ఒక్కటైనా స్థానభేదాన్ని బట్టి అది ఐదు విధాలుగా రూపొందింది. హృదయంలో ఉన్నవాయువు ప్రాణమనబడుతుంది. గుదస్థానంలో ఉన్నది అపానం. నాభిప్రదేశంలో ఉండేది సమానవాయువు. కంఠస్థలంలో ఉన్న దానిని ఉదానమంటారు. వ్యానమనేది సర్వశరీరంలోనూ వ్యాపించిఉంటుంది. వాయుగమనాన్ని పరిశీలిస్తూ ప్రాణాయామాది క్రియలు ఆచరిస్తే వాయు నిరోధం జరుగుతుంది. తద్వారా అంతరాత్మను చూడవచ్చును. వాయుచలనాన్ని అరికట్టటం ద్వారా మనస్సును నిరోధించవచ్చు. మనస్సు నిశ్చలమైతే పరమాత్మ దర్శనం కలుగుతుంది.

**క.** **విను! గర్భవాస దుఃఖం । బును జన్మవ్యథయు బాల్యము విమూఢత్వం**
**బును రాగక్లేశ జరా । జనితకృపణతలును జూపు, సంగముఁ బాపున్.** **606**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము, (ఆ సుకృతం); గర్భవాసదుఃఖంబును= మాతృగర్భంలో నివసించటానికి చెందిన దుఃఖాన్ని; జన్మవ్యథయున్= పుట్టుకకు సంబంధించిన బాధను; బాల్యము విమూఢత్వంబునున్= పసితనంలోని మూర్ఖత్వాన్నీ; రాగక్లేశ జరాజనిత కృపణతలును= విషయాసక్తి లోని కష్టాన్నీ; ముసలితనంలో జనించే దీనత్వాన్నీ; చూపున్= దర్శింపజేస్తుంది; సంగమున్= వాటి సాంగత్యాన్ని; పాపున్= తొలగిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మజా! వినుము. పైన చెప్పిన సుకృతం మానవులకు మాతృగర్భవాసంలోని క్లేశాన్నీ, పుట్టుకలోని బాధనూ, బాలుడుగా ఉండేటప్పుడుండే మూఢత్వాన్నీ, విషయాసక్తిలోని క్లేశాన్నీ, వార్ధకంలోని దీనావస్థనూ స్పష్టంగా తెలియజేస్తుంది. అవి తెలియటం వలన వాటిని వదలించుకొనాలని మానవుడు ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నం అతడికి సంసారం తోడి పొత్తును తొలగిస్తుంది.

**ఉ.** **చెందుచునుండుఁ బుణ్యములు సేసి సురత్వము, మధ్యకర్ముఁడై**
**యొందు నరత్వమున్, దురితయోగమునం బశుకీటభావమున్**
**బొందు, సుఖంబు దుఃఖమును బొందఁగ జీవుఁడు దీనిభేదశ**
**క్తిం దెలియంగ నేర్చినమతిం గల యాతఁడు గోరు మోక్షమున్.** **607**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= జీవాత్మ; సుఖంబున్= సౌఖ్యాన్నీ; దుఃఖమునున్= దుఃఖాన్నీ; పొందఁగన్= అనుభవించటానికై; పుణ్యములు= సుకృతములు; చేసి= ఆచరించి; సురత్వమున్= దేవత్వాన్ని; చెందుచున్+ఉండున్= పొందుతూ ఉంటాడు; మధ్యకర్ముఁడు+ఐ= సుకృతమూ - దుష్కృతమూ కాని మధ్యమరూపాలైన సామాన్యకర్మలు గలవాడై; నరత్వమున్= మానవత్వాన్ని; ఒందున్= పొందుతాడు; దురితయోగమునన్= పాపంతోడి పొత్తున; పశుకీటభావమున్= జంతుత్వాన్ని, పురుగురూపాన్నీ; పొందున్= చెందుతాడు; దీని భేదశక్తిన్= కర్మయొక్క భేదసామర్థ్యాన్ని; తెలియంగన్= గ్రహించగా; నేర్చినమతిన్= నేర్పుగలబుద్ధిని; కల+ఆతఁడు= కలిగినట్టివాడు; మోక్షమున్= ముక్తిని; కోరున్= అభిలషిస్తాడు.

**తాత్పర్యం:** జీవుడు సుఖదుఃఖాలు పొందటానికై పుణ్యకార్యాలు చేసి అమరత్వం పొందుతాడు. పుణ్యాతిశయమూ, పాపాతిశయమూ లేని నడిమిరకపు పనులు చేసి మానవుడై జన్మిస్తాడు. పాపం ఎక్కువైనపుడు పశువుగానో, పురుగుగానో ఉద్భవిస్తాడు. జీవుడు చేసే కర్మలలో ఇన్ని తేడా లున్నాయి. ఈ కర్మయొక్క భేదసామర్థ్యాన్ని గ్రహించనేర్చిన బుద్ధిమంతుడు మాత్రం కర్మజాలంలో తగులువడకుండా ముక్తి కోరి అందుకై ప్రయత్నిస్తాడు.

**క.** **క్షయవృద్ధులఁ జంద్రుఁడు న । బ్ధియు లోనుగఁ బొందుచుండఁ దెలియఁడు బంధు**
**క్షయమునకు వగచు నజ్ఞుం । డయమహితా! దీని నెఱుఁగు టమలతఁ దెచ్చున్.** **608**

**ప్రతిపదార్థం:** అయమహితా!= శుభకర్మలచేత పూజించబడినవాడా!; చంద్రుఁడున్= చందమామయు; అబ్ధియున్= సముద్రుడును; లోనుగన్= లోనుగా గలవారు; క్షయవృద్ధులన్= నాశాన్నీ, వృద్ధినీ; పొందుచున్+ఉండన్= పొందుతూ ఉండగా; అజ్ఞుండు= జ్ఞానహీనుడు; తెలియఁడు= ఈ సంగతి గ్రహించడు; బంధుక్షయమునకున్= చుట్టాల వినాశానికి; వగచున్= దుఃఖిస్తాడు; దీనిన్= ఈ విషయాన్ని; ఎఱుఁగుట= గ్రహించటం; అమలతన్+తెచ్చున్= నిర్మలత్వాన్ని సమకూరుస్తుంది.

**తాత్పర్యం:** పవిత్రకర్మలచేత పూజితుడవైన ఓ ధర్మరాజా! చంద్రుడు, సముద్రం మొదలైన గొప్ప గొప్ప పదార్థాలు హాని, వృద్ధులు పొందుతున్నాయి. అయినా వివేకం లేనివాడు క్షయవృద్ధులు తప్పవన్న విషయం గుర్తించడు. తన బంధువులు మరణిస్తే దుఃఖిస్తాడు. హాని, వృద్ధి అనే ద్వంద్వాలు సృష్టిలో సహజాలు అని గ్రహించగలిగితే చిత్తం నిర్మల మవుతుంది.

**క.** **తన దేహము దోషములం । గని వేవురలో నొకండు గలుగు విముక్తిం**
**గను పని కుద్యోగించుట । కనఘా! పెక్కండ్రు లే రహంకృతికతనన్.'** **609**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; వేవురలోన్= వెయ్యిమందిలో; ఒకండు= ఒక్కడు; తన దేహము దోషములన్= తన శరీరంలోని దోషాలను; కని= చూచి; విముక్తిన్= మోక్షమును; కను పనికిన్= చూచే కార్యానికి; ఉద్యోగించుటకున్=

ప్రయత్నించటానికి; కలుగున్= ఉంటాడు; అహ్వాంకృతికతనన్= అహంకారకారణంచేత; పెక్కండ్రు లేరు= ఎక్కువమంది లేరు.

**తాత్పర్యం:** అనఘా! వెయ్యిమందిలో ఒక్కడు మాత్రమే తన శరీరానికి చెందిన దోషాలు గ్రహించి మోక్షం కొరకై ప్రయత్నించేవా డుంటాడు. అహంకారం కారణంగా చాలామంది మోక్షప్రయత్నం చేసేవారు లేరు.'

**విశేషం:** "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే" అన్న భగవద్గీతావాక్యం అభిప్రాయం ఇదే.

**వ.** **అనిన విని యుధిష్ఠిరుండు 'దేహదోషంబు లెవ్వి? యెఱింగింపవే' యనుటయు, ననిమిషనదీనందనుం డతని కిట్లనియె.** **610**

**ప్రతిపదార్థం:** అనిన విని= అని చెప్పగా ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; దేహదోషంబులు= శరీరదోషాలు; ఎవ్వి= ఏవి; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అడుగగా; అనిమిషనదీనందనుండు= దేవనదీపుత్రుడైన భీష్ముడు; అతనికిన్= ధర్మజుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్మ డట్లా చెప్పగా విని ధర్మరాజు 'శరీరంలోని దోషాలు ఏవి? నాకు తెలియపరచుము' అని అడిగాడు. అప్పుడు భీష్మ డతడితో ఈ రీతిగా చెప్పాడు.

**క.** **విను! కామముఁ గ్రోధము భయ । ము నిద్రయు నిశ్శ్వసనము భూవర! దేహం**
**బునఁ గల దోషము; లీ యై । దును బాపెడి తెఱఁగు సెప్పుదుం దెలియంగన్.** **611**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; విను= ఆలకించుము; కామమున్= కోరిక; క్రోధమున్= కోపం; భయమును= భీతి; నిద్రయున్= నిద్దుర; నిశ్శ్వసనమున్= నిట్టూర్పు; దేహంబునన్= శరీరమునందు; కల దోషములు= ఉన్న దోషాలు; ఈ ఐదునున్= ఈ ఐదురకాలైన దోషగుణాలను; పాపెడి తెఱఁగు= తొలగించే విధానాన్ని; తెలియంగన్= తెలిసేటట్లుగా; చెప్పుదున్= చెప్తుతాను.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. కామం, క్రోధం, భయం, నిద్ర, నిశ్వాసం అనేవి దేహగతమైన దోషాలు. ఈ ఐదు దోషాలను తొలగించుకొనే విధానం కూడా వివరిస్తాను.

**సీ.** **క్షమ క్రోధమునకు, సంకల్ప వర్జనము గా । మమునకు, నప్రమాదము భయంబు**
**నకు, సత్త్వసంసేవనము నిద్రకును, లఘు । భోజిత నిశ్వాసమునకు వైరు**
**లని చెప్పి, వెండియు నను ననేకములగు । దోషముల్ దొలఁగంగఁ ద్రోచువెరవు**
**లును బెక్కు లవి గనికొను వివేకము గల । పురుషుండు దన్మార్గ పరిచయమున**

**తే.** **విష్ణుమాయను దోఁచు నీ విష్టపములు । భిత్తి చిత్రంబు విధమున ఫేనభంగి**
**బుద్బుదాకృతిగాఁ గను బుధుఁడు; దీని । సరకు సేయక మోక్షంబు తెరువు వెదకు.** **612**

**ప్రతిపదార్థం:** క్రోధమునకున్= కోపానికి; క్షమ= ఓర్పు; కామమునకున్= కోరికకు; సంకల్పవర్జనము= సంకల్పించటాన్ని విడవటం; భయంబునకున్= భయానికి; అప్రమాదము= ఏమరుపాటు లేకుండటం; నిద్రకునున్= నిద్దురకు; సత్త్వసంసేవనము= సత్త్వగుణమును సేవించటం; నిశ్వాసమునకున్= నిట్టూర్పునకు; లఘుభోజిత= అల్పభోజనం చేయటం; వైరులు+అని= శత్రువులని; చెప్పి= వచించి; వెండియున్= మరల; అనున్= చెప్పాడు; అనేకములు+అగు= పెక్కులయిన; దోషముల్= దోషాలు; తొలఁగంగన్+త్రోచు= తొలగజేసేటటువంటి; వెరవులును= ఉపాయాలుకూడ; పెక్కులు= అనేకాలు; వివేకముకల= తెలివిగల; పురుషుండు= మానవుడు; తన్మార్గ పరిచయమునన్= ఆ ఉపాయాల యొక్క త్రోవలతోడి పరిచయంతో; అవి కనికొనున్= వాటిని ఎరింగి గ్రహిస్తాడు;

విష్ణుమాయను= విష్ణుమాయచేత; తోఁచు= ఉదయించే; ఈ విష్టపములు= ఈ లోకాలు; భిత్తిచిత్రవిధంబునన్= గోడమీది బొమ్మలవలె; ఫేనభంగిన్= నురుగురీతిగానూ; బుద్బుద+ఆకృతిగాన్= నీటి బుడగవంటి రూపుగలవిగానూ; కను= చూచు; బుధుఁడు= పండితుడు; దీనిన్= ఈ లోకాన్ని; సరకుచేయక= లక్ష్యపెట్టక; మోక్షంబు తెరువు= ముక్తియొక్క మార్గమును; వెదకున్= అన్వేషిస్తాడు.

**తాత్పర్యం:** కోపానికి ఓర్పు, కామానికి సంకల్పించకుండా ఉండటమూ, భయానికి ఏమరుపాటు లేకుండటమూ, నిద్రకు సత్త్వగుణాన్ని సేవించటమూ, శ్వాసకు అల్పాహారస్వీకరణమూ శత్రువులు' - అని భీష్ముడు చెప్పాడు. మళ్ళీ ఇట్లా అన్నాడు. ఇంకా పెక్కు దోషాలను తొలగించుకొనే ఉపాయాలు కూడా అనేకం ఉన్నాయి. వివేకవంతుడు వాటిమార్గాలను తెలిసికొని చేపట్టి దోషాలను నిర్మూలిస్తాడు. ఈ లోకాలు విష్ణుమాయా ప్రభావం వలన కలుగుతున్నాయి. పండితుడు వీటిని గోడమీది బొమ్మలుగా, నురుగులవలె, నీటి బుడగలతీరుగా చూస్తాడు. అతడు వీటిని లక్ష్యపెట్టడు. మోక్షమార్గాన్ని మాత్రమే అన్వేషిస్తాడు.

### ఆత్మ పరమపదంబుఁ బ్రాపించెడు ప్రకారము (సం. 12-290-80, 81)

**వ. ఇది సాంఖ్యప్రకారంబు బహిస్స్పర్శంబులు తపోదండంబునం దొలంగం జడిసి యానపాత్రరూపంబుగా దీని నవలంబించిన యార్యుండు ప్రజ్ఞాకర్ణధార సామర్థ్యంబున దుఃఖోదకంబును వ్యాధిమృత్యు మహాగ్రాహంబును భయోరగంబును హింసావేగంబును రాగపంకంబును దృష్ణావర్తంబును నానాప్రీతిరత్నంబును సత్యతీరంబును నగు సంసారసాగరంబు నుత్తరించు నా సుకృతి నట సూర్యుండు తన రశ్ముల వహించి నడపు పద్మతంతు సన్నిభంబైన మార్గంబు ప్రవేశించి చనంజన సూక్ష్ముండును శీతలుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుత శ్రేష్ఠుండును నగు పవనుం డెదుర్కొని నభఃపరమగతిం జేర్చు; నభంబు రజః పరమగతిని రజస్సు సత్త్వపరమగతిని, సత్త్వంబు నారాయణుని, నారాయణుండు పరమంబునం జేర్ప నందుం గలిసి తన్మయుండై యమృతత్వ నిత్యుండగు'నని చెప్పిన విని పాండవాగ్రజుం'డ ట్లమృత స్వరూపశాశ్వతుండగు నమ్మహాత్ముండు దన పూర్వవృత్తంబు దలంచునో తలంపకుండునో దాని నిశ్చయం బతిగహనంబు; మోక్షంబు దలంచి పరమజ్ఞానమగ్నుం డగుటం బురుషున కెద్ది దశయో యను వితర్కంబున నది ప్రవృత్తి ధర్మంబున కంటె మే లనరాకున్నది; యీ రెండు దెఱంగులుం దెలుప నీవకాక యీలోకంబున నొరులు గలరే?' యనుటయు నజ్జనపతికి జాహ్నవీనందనుం డిట్లనియె. 613**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పినది; సాంఖ్యప్రకారంబు= సాంఖ్యముయొక్క విధానం; తపోదండంబునన్= తపస్సు అనే కర్రతో; బహిస్స్పర్శంబులు= వెలుపలి తాకిడులు; తొలంగన్ జడిసి= తొలగద్రోచి; దీనిన్= ఈ సాంఖ్యవిధిని; యానపాత్రరూపంబుగాన్= ఓడయొక్క రూపంగా; అవలంబించిన= గ్రహించిన; ఆర్యుండు= పూజ్యుడు; ప్రజ్ఞాకర్ణధార సామర్థ్యంబునన్= తెలివిఅనే ఓడ నడిపేవాడి నైపుణ్యంతో; దుఃఖోదకంబునున్= దుఃఖమనే నీరు కలదీ; వ్యాధిమృత్యుమహాగ్రాహంబునున్= రోగాలు, మరణం అనే గొప్ప మొసళ్ళు గలదీ; భయ+ఉరగంబునున్= భయం అనే సర్పాలు కలదీ; హింసావేగంబునున్= హింస అనే ప్రవాహం కలదీ; రాగపంకంబునున్= విషయాసక్తి అనే బురదకలదీ; తృష్ణా+ఆవర్తంబునున్= ఆశ అనే సుడిగుండం కలదీ; నానాప్రీతి రత్నంబునున్= పలురకాల సంతోషాలు అనే రత్నాలు గలదీ; సత్యతీరంబునున్+అగు= సత్యమనే గట్టు గలదీ అయిన; సంసారసాగరంబున్= సంసారమనే సముద్రాన్ని; ఉత్తరించున్= దాటుతాడు; అటన్= అచ్చట; సూర్యుండు= సూర్యుడు; ఆ సుకృతిన్= ఆ పుణ్యాత్ముడిని; తన రశ్ములన్= తన కిరణాలచేత; వహించి= మోసి; నడపున్= కొనిపోతాడు; పద్మతంతు సన్నిభంబు+ఐన= తామరతూడు దారంతో సమానమైన; మార్గంబు ప్రవేశించి= త్రోవలో చొచ్చి; చనన్+చనన్= పోగా పోగా; సూక్ష్ముండునున్= అణుస్వరూపుడూ; శీతలుండునున్= చల్లనివాడూ; సుగంధియున్= మంచివాసనకలవాడూ; సుఖస్పర్శుండునున్= హాయిగొలిపే స్పర్శకలవాడూ; సప్తమారుతశ్రేష్ఠుండునున్= ఏడు వాయువులలో మేలైనవాడూ; అగు= అయినట్టి; పవనుండు= ప్రవాహమనెడు వాయువు; ఎదుర్కొని= అభిముఖమైపోయి;

నభఃపరమగతిన్= ఆకాశముయొక్క శ్రేష్ఠగతిని; చేర్చున్= చేరుస్తాడు; నభంబు= ఆకాశం; రజఃపరమగతినిన్= రజస్సుయొక్క శ్రేష్ఠగతిని; రజస్సు= రజోగుణం; సత్త్వపరమగతినిన్= సత్త్వంయొక్క శ్రేష్ఠమైన గతిని; సత్త్వంబు= సత్త్వగుణం; నారాయణునిన్= విష్ణుదేవుడిని; నారాయణుండు= విష్ణువు; పరమంబునన్= పరమాత్మయందు; చేర్పన్= చేర్చగా; అందున్+కలిసి= ఆ పరమాత్మతో కూడి; తన్మయుండు+ఐ= పరమాత్మ స్వరూపుడై; అమృతత్వ నిత్యుండు= అమరణ ధర్మప్రాప్తిచేత శాశ్వతుడు; అగునని చెప్పినన్= అవుతాడని చెప్పగా; విని= ఆకర్ణించి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; అట్లు= ఆ రీతిగా; అమృతస్వరూపశాశ్వతుండు+అగు= అమరణ ధర్మస్వరూపంచేత నిత్యుడైన; ఆ+మహాత్ముండు= ఆ సుకృతాత్ముడు; తన పూర్వవృత్తంబున్= తన మునుపటి వృత్తాంతాన్ని; తలంచునో= భావిస్తాడో; తలంపక+ఉండునో= భావించకే ఉంటాడో; దాని నిశ్చయంబు= దానికి సంబంధించిన నిర్ణయం; అతిగహనంబు= మిక్కిలి సూక్ష్మమవటంవలన ఎరుగరానిది; మోక్షంబున్= ముక్తిని; తలంచి= భావించి; పరమజ్ఞానమగ్నుండు+అగుటన్= శ్రేష్ఠజ్ఞానంలో లీనుడు కావటం వలన; పురుషునకున్= జీవుడికి; ఎద్ది= ఏది; దశయో= అవస్థయో; అను వితర్కంబునన్= అన్న సందేహముచేత; అది= ఆ స్థితి; ప్రవృత్తి ధర్మంబున కంటెన్= లోకప్రవర్తనకు సంబంధించిన ధర్మానికంటె; మేలు+అనరాక+ఉన్నది= శ్రేష్ఠమైనదని చెప్పరాక ఉన్నది; ఈ రెండు తెఱంగులున్= ఈ రెండు మార్గాలూ; తెలుపన్= వ్యక్తం చేయటానికి; నీవకాక= నీవే తప్ప; ఈ లోకంబునన్= ఈ జగత్తులో; ఒరులు= ఇతరులు; కలరే?= ఉన్నారా?; అనుటయున్= అని చెప్పగా; ఆ+జనపతికిన్= ఆ రాజుకు; జాహ్నవీనందనుండు= గంగాసుతుడైన భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంతవరకూ చెప్పింది సాంఖ్యులు అనుసరించే విధానం. వెలుపలి స్పర్శలు అనబడే విషయసుఖాలను తపస్సు అనే కర్రతో తొలగనెట్టి ఈ సాంఖ్యవిధానాన్ని ఓడగా గ్రహించిన ఆర్యుడు ప్రజ్ఞ అనే పడవ నడిపే చుక్కాని వాడి నైపుణ్యంతో సంసారమనే సముద్రాన్ని దాటుకొంటాడు. ఆ సముద్రం దుఃఖమనే నీటితోనూ, వ్యాధులు, మరణమనే మొసళ్ళతోనూ, భయమనే పాములతోనూ, హింస అనే ప్రవాహంతోనూ, విషయాసక్తి అనే బురదతోనూ, ఆశలు అనే సుడులతోనూ, పెక్కు సంతోషాలు అనే రత్నాలతోనూ, సత్యమనే గట్టుతోనూ కూడి ఉంటుంది. ఆ సముద్రాన్ని దాటిన పుణ్యాత్ముడిని సూర్యుడు తన కిరణాలతో మోసికొనిపోతాడు. పిదప తామరతూడులోని దారమంతటి సూక్ష్మమైన దారిలో ప్రవేశించి అతడు పయనిస్తూ ఉండగా మిక్కిలి సూక్ష్మమైనవాడూ, చల్లనివాడూ, మంచివాసనకలవాడూ, సుఖమైన స్పర్శకలవాడూ, ఏడు విధాలైన వాయువులలో శ్రేష్ఠుడూ అయిన ప్రవహుడనే పవనుడు అతడి కెదురుగా పోయి అతడిని ఆకాశంయొక్క పరమగతిని చేరేటట్లు చేస్తాడు. ఆకాశం రజస్సుయొక్క పరమగతినీ, రజస్సు సత్త్వంయొక్క పరమగతినీ, సత్త్వం నారాయణుడినీ క్రమంగా చేరేటట్లు చేస్తాయి. నారాయణుడు ఆ పుణ్యాత్ముడిని కడకు పరమాత్మతో చేరుస్తాడు. ఆ పరతత్త్వంతో కలిసి అతడు తన్మయుడై అమృతత్వదశను పొంది శాశ్వతస్థితి కలవాడవుతాడు' ఇట్లా భీష్ముడు చెప్పగా విని ధర్మజుడు 'ఆ రీతిగా అమృతస్వరూపుడై నిత్యుడైన మహాత్ముడు తన పూర్వస్థితిని తలుస్తాడా? తలంచకుండానే ఉంటాడా? ఈ విషయానికి సంబంధించిన నిర్ణయం అగోచరమై ఉన్నది. మోక్షాన్ని భావించి అందుకై పరమజ్ఞానంలో లీనమైనవాడు కావటంతో ఆ పురుషుడి అప్పటి స్థితి ఎట్లాంటిదో అంతుబట్టటం లేదు. ఈ సంశయం ఉండటం వలన ఆ స్థితి ఈ లోక ప్రవృత్తిధర్మం కంటె మేలైనది అని నిర్ణయించి చెప్పటానికి వీలుకాకుండా ఉన్నది. అతడు ఆ స్థితిలో తన పూర్వస్థితిని తలుస్తాడా? తలంచడా? అనే ఈ రెండు మార్గాలనూ ఇదమిత్థమని తెలపటానికి ఈ లోకంలో నీవు తప్ప మరెవరూ లేరు' అని అన్నాడు. అప్పుడు ధర్మరాజుతో భీష్ము డీరీతిగా చెప్పాడు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. ఆకాశం యొక్క పరమగతి అంటే హార్దాకాశమని గ్రహించాలి. అట్లాగే రజస్సుయొక్క పరమగతి

అహంకారమనీ, సత్త్వముయొక్క పరమగతి మహత్తత్త్వమనీ, దాని పరమగతి నారాయణుడనీ, నారాయణుడి పరమగతి ఉపాధిరహితమైన చిన్మాత్రస్వరూపమనీ గ్రహించాలి. ఆ స్వరూపం పొందితేనే అమృతత్త్వం సిద్ధిస్తుంది. (చూడు - నీలకంఠ పండితుని 'భారతభావదీప' మనే సంస్కృతభారతవ్యాఖ్య - ఓరియంటల్ బుక్స్ రీప్రింటింగ్ కార్పొరేషన్‌వారి ప్రచురణ - శాంతిపర్వం - ద్వితీయముద్రణ - 606వ పుట).

**క. అడిగితి లెస్సగఁ బ్రశ్నము । గడుసంకట; మెట్టి యెఱుక గలవారలు నె**
**ప్పుడు సంశయించు చో టిది; । దడయక యుత్తరము సెప్పెదం దేటపడన్. 614**

**ప్రతిపదార్థం:** లెస్సగన్= బాగుగా; కడుసంకటమున్= మిక్కిలి సూక్ష్మమైన; ప్రశ్నమున్= ప్రశ్నను; అడిగితి(వి)= అడిగావు; ఇది= ఇయ్యది; ఎప్పుడున్= ఎల్లవేళలా; ఎట్టిఎఱుక గలవారలున్= ఎట్లాంటి విజ్ఞానం గలిగినవారైనా; సంశయించుచోటు= సందేహించే స్థానం; తడయక= ఆలసించక; తేటపడన్= స్పష్టమయ్యేటట్లుగా; ఉత్తరమున్= సమాధానాన్ని; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** 'నీవు చాలా గహనమైన ప్రశ్నను చక్కగా అడిగావు. ఎంత తెలివైన వారైనా సందేహించే విషయ మిది. వెంటనే ఇది స్పష్టంగా బోధపడేటట్లు వివరిస్తాను.

**వ. కపిల దర్శన విదులగు మునీంద్రుల పరమమతం బిది; యవహితుండవై యాకర్ణింపుము. 615**

**ప్రతిపదార్థం:** ఇది= నేనిప్పుడు చెప్పేది; కపిల దర్శనవిదులు+అగు= కపిలమహర్షి చెప్పిన సాంఖ్యశాస్త్రము నెరింగినవారైన; ముని+ఇంద్రుల= మునిశ్రేష్ఠులయొక్క; పరమమతంబు= శ్రేష్ఠమైన అభిప్రాయం; అవహితుండవు+ఐ= అవధానంకలవాడవై; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** కపిలమహర్షి చెప్పిన సాంఖ్యశాస్త్రమును తెలిసికొన్న మునివర్యుల శ్రేష్ఠమైన మత మిది. దీనిని సావధానంగా వినుము.

**సీ. పురుషుని నింద్రియంబు లెఱుఁగ; వవి మనస్ । స్థములు గావున మనస్సంగమమునఁ**
**గనువాని నతఁడు ముక్తత్వంబు లేని య । ప్పుడుఁ గల్గినను నది పురుషునందు**
**సమమ నిర్విషభుజంగములట్ల నిశ్చేష్ట । నున్న యింద్రియములఁ గన్నఁ గాన**
**కున్నను నేమి యయ్యుదిత విజ్ఞానామృ । తస్వరూపునకు నాతండు దొఱఁగఁ**

**తే. గాష్ఠకుడ్యకుసూలాదికముల చంద । మొందునట్టు గాకయు నింద్రియోత్కరంబు**
**శరధిఫేననిభం బయి విరియు నవ్వి । భూతి యీశ్వరుతెఱఁ గాత్మఁ బొందకున్నె? 616**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు= శ్రోత్రం మొదలైన ఇంద్రియాలు; పురుషునిన్= ఆత్మను; ఎఱుఁగవు= తెలియనేరవు; అవి= ఆ ఇంద్రియాలు; మనస్స్థములు గావునన్= మనస్సులో ఉండేవి కాబట్టి; వానిన్= ఆ ఇంద్రియాలను; అతఁడు= ఆ పురుషుడు; కనున్= చూస్తాడు; అది= ఆ చూడటం; ముక్తత్వంబు లేని అప్పుడున్= ముక్తి కలగని దశలోనూ; కల్గిననున్= ముక్తి కలిగిన అవస్థలోనూ; పురుషునందున్= ఆత్మయందు; సమము+అ= సమానమే; ఆ+ఉదితవిజ్ఞాన+అమృత స్వరూపునకున్= ఉదయించిన విజ్ఞానంచేత అమరణధర్మమునొందిన స్వరూపంగల ఆ పురుషుడికి; నిర్విషభుజంగములట్ల= విషంలేని పాములవలె; నిశ్చేష్టన్= చేష్టారహితత్వంతో; ఉన్న= ఉన్నట్టి; ఇంద్రియములన్= ఇంద్రియాలను; కన్నన్= చూచినా; కానకున్ననున్= చూడక ఉండినా; ఏమి?= ఏమవుతుంది?; ఆతండు= ఆ పురుషుడు; తొఱఁగన్= విడువగా; ఇంద్రియోత్కరంబు= ఇంద్రియాల సమూహం; కాష్ఠకుడ్యకుసూల+ఆదికముల చందమున్= కొయ్య, గోడ, గాదె మొదలైన పదార్థాల రీతిని; ఒందున్= పొందుతుంది; అట్లు కాకయున్= అట్లాకాక; శరధిఫేన నిభంబు+అయి= సముద్రంలోని నురుగుతో సదృశమై; విరియున్= విచ్ఛిన్నమై పోతుంది;

ఆ+విభూతి= ఆ వైభవం; ఈశ్వరుతెఱఁగు= ఈశ్వరుడి విధానం; ఆత్మన్= ఆత్మను; పొందకున్నె?= పొందక ఉంటుందా?

**తాత్పర్యం:** శ్రోత్రం, త్వక్కు మొదలైన ఇంద్రియాలు పురుషుడిని తెలియజాలవు. అవి మనస్సులో ఉంటాయి. కాబట్టి పురుషుడు మనస్సుతోడి సంబంధం వలన ఇంద్రియాలను తెలిసికొంటాడు. పురుషుడు ముక్తిపొందినా, పొందకుండినా ఇంద్రియాలను తెలిసికొనటమనేది సమానమే. ఆత్మజ్ఞానసంపన్నుడై అమృతస్వరూపుడైన పురుషుడు విషం లేని పాములవలె చేష్టలు లేక పడిఉన్న ఇంద్రియాలను తెలిసికొన్నా, తెలిసికొనకున్నా జరిగే దేమీలేదు. అందువలన అతడి కేవిధమైన బాధలూ లేవు. ముక్తి నొందిన పురుషుడు ఇంద్రియాలను వర్జించినప్పుడు ఆ ఇంద్రియాలు కొయ్య, గోడ, గాదెలవలె జడంగా పడి ఉంటాయి. లేదా సాగరంలోని నురుగువలె విచ్ఛిన్నమై పోతాయి. ఇంద్రియాలు ఈ స్థితిని పొందటమనేది ఈశ్వరుడి విభూతిఅయి ఉన్నది. అది ముక్తి పొందిన ఆత్మకు కూడా అన్వయిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ. ముక్తుడు కానివాడు ఇంద్రియాలను గ్రహించజాలినట్లే ముక్తుడైనవాడు కూడ ఇంద్రియాలను గ్రహించగలడు. అయితే ముక్తిపొందిన వాడిని జడప్రాయాలైన ఇంద్రియాలు ఏమీ చలింపజేయలేవు. లేదా అవి నీటిపై నురుగువలె రూపులేనివై పోతాయి. ఈశ్వరు డే విధంగా ఇంద్రియాల ప్రభావానికి లోనుగాడో, అట్లాగే ముక్త పురుషుడు కూడా ఇంద్రియాల ప్రభావానికి ఏ విధంగానూ లోనుగాడని భావం.

**క. విను! మింద్రియసహితముగా । మనుజాధిప! బోధపూరమగ్నత్వము గ**
**ల్గిననుం దత్సూక్ష్మగతులఁ । గనుఁ బురుషుఁడు గనియు నిర్వికారత నుండున్. 617**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిప!= రాజా!; వినుము= ఆలకించుము; ఇంద్రియసహితముగాన్= ఇంద్రియాలతో కూడిఉండేటట్లు; బోధపూరమగ్నత్వము= జ్ఞానప్రవాహంలో మునుగటం; కల్గిననున్= సంభవించినా; పురుషుఁడు= ముక్తాత్ముడు; తత్సూక్ష్మగతులన్= వాటి సూక్ష్మగమనాలను; కనున్= చూస్తాడు; కనియున్= చూచికూడా; నిర్వికారతన్= వికార రహితస్థితితో; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. ఒకవేళ పురుషుడు ఇంద్రియాలతో కూడియే పరమజ్ఞానమగ్నుడైతే అతడు వాటి సూక్ష్మమైన పోకడలను చూస్తూ ఉంటాడు. చూచినా తాను వాటివలన కలిగే వికారాలకు లోనుకాడు.

**తే. భూతములను గుణంబుల బుద్ధి మనసు । నడఁచికొని జీవుఁ డొందు నారాయణునిఁ ద**
**దీయమాహాత్మ్యమున మాననీయపరమ । పదము గనుఁగాన నిష్పుణ్యపాపుఁ డతఁడు. 618**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= పురుషుడు; భూతములనున్= పంచభూతాలనూ; గుణంబులన్= మూడు గుణాలనూ; బుద్ధిన్= బుద్ధినీ; మనసున్= చిత్తాన్నీ; అడఁచికొని= లయింపజేసికొని; నారాయణునిన్= నారాయణు డనబడే పరమాత్ముడిని; ఒందున్= పొందుతాడు; తదీయ మాహాత్మ్యమునన్= ఆ నారాయణుడి ప్రభావం వలన; మాననీయపరమపదమున్= పూజ్యమైన మోక్షాన్ని; కనున్= చూస్తాడు; కానన్= కావున; అతఁడు= ఆ ముక్తజీవుడు; నిష్పుణ్యాపాపుఁడు= పుణ్యాపాపాలు లేనివాడవుతాడు.

**తాత్పర్యం:** జీవుడు పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం అనే ఐదు భూతాలనూ, సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడుగుణాలనూ, బుద్ధినీ, మనస్సునూ అణచుకొన్నవాడై నారాయణుడి సన్నిధి చేరుకొంటాడు. ఆ పరమాత్ముడి కృపాప్రభావం వలన మహితమైన పరమపదం పొందుతాడు. అందువలన ఆ స్థితిలో అతడికి పుణ్యాం, పాపం అనేవి లేవు. (ఇంద్రియాల పోకడలను చూస్తున్నా అతడికి పుణ్యాపాపాల స్పర్శ లేదని తాత్పర్యం.)

**క. పునరావర్తనరహితుం । డనఘా! పరమాత్ముఁ జెందినట్టి పురుషుఁ డ**

**వ్వినుతావస్థను మోక్షం । బని చెప్పుదు; రంతకంటె నధికము గలదే?'** **619**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; పరమాత్మున్= నారాయణుడివి; చెందినట్టి= పొందినట్టి; పురుషుఁడు= జీవుడు; పునరావర్తనరహితుండు= తిరిగి రాకలేనివాడు; ఆ+వినుత+అవస్థను= పునర్జన్మలేని ఆ ప్రశస్తమైన దశను; మోక్షంబు+అని= ముక్తి అని; చెప్పుదురు= అంటారు; అంతకంటెన్= ఆ మోక్షంకంటె; అధికము= గొప్పది; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ ధర్మరాజా! పరమాత్ముడైన నారాయణుడిని పొందినట్టి జీవుడికి పునర్జన్మ లేదు. శ్రేష్ఠమైన పునరావృత్తిలేని ఆ దశనే మోక్షమంటారు. మోక్షావస్థకంటె ఎక్కువ దశ మరేమీ లేదు.

**విశేషం: "ఆ బ్రహ్మ భువనాల్లోకాః । పునరావర్తినోఽర్జున!**
**మా ముపేత్య తు కౌంతేయ । పునర్జన్మ న విద్యతే॥' (గీత - 8-16)**

అన్న గీతావాక్యం ఇక్కడ స్మరణీయం. కృష్ణుడు అర్జునుడితో 'అర్జునా! బ్రహ్మలోకం వరకూ పోయిన వారు మళ్ళీ తిరిగి జన్మిస్తారు. కాని నన్ను పొందినవారికి పునర్జన్మ లేదు' అని చెప్పాడు. అందువలన నారాయణుడి సన్నిధి చేరి ఆ పరమాత్ముడి అనుగ్రహానికి పాత్రులైనవారు ముక్తు లవుతా రని గ్రహించాలి.

**వ. అని చెప్పి వెండియు.** **620**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మజుడితో అట్లా చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. ' గురుని వచనంబు తెలఁగునఁ । బరమార్థ నిరూపణంబు భంగి నియతిఁ ద**
**త్పరుఁడై నడపం జాలిన । పురుషునిఁ దడయక ప్రశాంతి వొందు నరేంద్రా!** **621**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; గురుని వచనంబు తెలఁగునన్= ఆచార్యుడి ఉపదేశాన్ని అనుసరించి; పరమ+అర్థనిరూపణంబు భంగిన్= పరతత్త్వమును నిరూపించే పద్ధతిని; నియతిన్= నియమంతో; తత్పరుఁడు+ఐ= దానియందే ఆసక్తిగలవాడై; నడపన్+చాలిన= నిర్వహించగలిగినట్టి; పురుషునిన్= మానవుడిని; తడయక= ఆలసించక; ప్రశాంతి= ప్రకృష్టమైన శాంతి పొందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! గురూపదేశాన్ని అనుసరించి ఎవడు పరతత్త్వ నిరూపణ పద్ధతిని నియమంతో పాటిస్తాడో, అట్లాంటి పురుషుడికి త్వరలో ప్రశాంతి కలుగుతుంది.

**చ. జనవర! సాంఖ్య మిట్టిది ప్రజాపతి పూజ్యము బ్రహ్మభావభా**
**జనత ఘటింప దీనిసరి సమ్యగుపాయము లెందులేవు; నె**
**మ్మనమున సంశయింపక సమాహితచిత్తత దీనినూఁదు ని**
**స్తనుఁడగు నమ్మహేశునకుఁ దాఁ దనువిం కిట వేయు నేటికిన్.** **622**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; సాంఖ్యము= సాంఖ్యశాస్త్రం; ఇట్టిది= ఇటువంటిది; ప్రజాపతిపూజ్యము= ఇది బ్రహ్మచేత పూజించతగినది; బ్రహ్మభావభాజనతన్= బ్రహ్మత్వయోగ్యతను; ఘటింపన్= కలిగించటానికి; దీని సరి= దీనికి సాటియగు; సమ్యగు పాయములు= మంచి ఉపాయాలు; ఎందున్= ఎక్కడను; లేవు= ఉన్నవికావు; నెమ్మనమునన్= చిత్తమునందు;

సంశయింపక= సందేహించక; సమాహితచిత్తతన్= సమాధానం పొందిన మనస్సుతో; దీనిన్= ఈ సాంఖ్యవిధానాన్ని; ఊఁదు= అవలంబించుము; తాన్= తాను; నిస్తనుఁడు+అగు= శరీరంలేనివాడైన; ఆ+మహేశునకున్= ఆ పరమేశ్వరుడికి; తనువు= శరీరం; ఇంకన్= ఇకపై; ఇటన్= ఈ విషయంలో; వేయున్ ఏటికిన్?= వెయ్యి మాటలు ఎందుకు?

**తాత్పర్యం:** రాజా! ఇప్పుడు నేను చెప్పింది సాంఖ్యపద్ధతి. ఇది ప్రజాపతి అయిన బ్రహ్మచేత పూజించదగినదై ఉన్నది. జీవుడు బ్రహ్మత్వం పొందటానికి దీనికి దీటు రాగల మంచి ఉపాయాలు వేరే ఎక్కడా లేవు. నీవు దీని విషయమై మనస్సులో సంశయించవద్దు. మనస్సును సమాధానపరచుకొని ఈ సాంఖ్య పద్ధతిని పాటించుము. ఈ సాంఖ్యం శరీరంలేని పరమేశ్వరుడికి శరీరమై ఉన్నది. ఇంక ఈ విషయమై వెయ్యి మాటలతో ప్రయోజన మేమి?

**తే. వేదశాస్త్ర పురాణ సంవేదితంబు । లైన బహువిధసంపరిజ్ఞానములకు**
**నెల్ల నిది సేరుగడ సూవె యేఱులకు స । ముద్రమును బోలె నుపశాంతి భద్రచిత్త! 623**

**ప్రతిపదార్థం:** ఉపశాంతి భద్రచిత్త!= ఉపశాంతిచే మంగళకరమైన మనస్సు గల ఓ ధర్మరాజా! ఏఱులకున్= నదులకు; సముద్రమును పోలెన్= సాగరంలాగా; వేదశాస్త్రపురాణసంవేదితంబులు+ఐన= శ్రుతులచేత, శాస్త్రాలచేత, పురాణాలచేత తెలియజేయబడినవైన; బహువిధసంపరిజ్ఞానములకున్+ఎల్లన్= అనేకవిధాలైన జ్ఞానాలకన్నింటికిని; ఇది= ఈ సాంఖ్యపద్ధతి; చేరుగడ చూవె= గమ్యం సుమా!

**తాత్పర్యం:** ప్రశాంతిచేత భద్రమైన హృదయంగల ఓ ధర్మరాజా! నదులకన్నిటికీ సముద్రమే గమ్యమైనట్లు వేదాలు, శాస్త్రాలు, పురాణాలు ప్రతిపాదించే నానావిధ జ్ఞానాలకు ఈ సాంఖ్యపద్ధతి చేరువలోనున్న గమ్యమై ఉన్నది చూడుము.

**వ. యోగులును సాంఖ్యులును జూచువెరవు లాకర్ణించితి కాదె; యిది యిట్లగుటం జేసి దర్శనభేదంబు గల దంటి నదియును నల్పాంతరం; బదియునుంగాక. 624**

**ప్రతిపదార్థం:** యోగులునున్= యోగమార్గం అనుసరించే వారూ; సాంఖ్యులునున్= సాంఖ్యపద్ధతిని అనుసరించే వారూ; చూచువెరవులు= చూచేపద్ధతులు; ఆకర్ణించితి(వి) కాదె!= వింటివికదా!; ఇది ఇట్లు+అగుటన్+చేసి= ఇది ఇట్లా ఉంటున్నది కాబట్టి; దర్శనభేదంబు= చూపులో తేడా; కలదు+అంటిన్= ఉన్నదన్నాను; అదియునున్= ఆ భేదం కూడ; అల్ప+అంతరంబు= స్వల్పమైన తేడా గలది; అదియునున్+కాక= అదీకాక.

**తాత్పర్యం:** ధర్మరాజా! యోగులు, సాంఖ్యులు చూచే పద్ధతిని వింటివికదా! అట్లు ఉండటంవలననే నేను వారిలో దర్శనభేదం ఉన్నదని చెప్పాను. ఆ భేదం చాలా స్వల్పమైనది. అదీకాక.

**ఆ. యోగి చూచుభంగి నుర్వీశ! సాంఖ్యుండుఁ । జూచు; సాంఖ్యుఁ డరయు చొప్పు యోగి**
**వరుఁడు నరయుఁ; గాన వారిద్దఱును నొక్క । తెరువువార యండ్రు పరమమునులు. 625**

**ప్రతిపదార్థం:** ఉర్వీశ!= రాజా!; యోగిచూచుభంగిన్= యోగి చూచునట్లే; సాంఖ్యుండున్+చూచున్= సాంఖ్యపద్ధతిననుసరించువాడు కూడ చూస్తాడు; సాంఖ్యుఁడు+అరయు చొప్పున్= సాంఖ్యుఁడు చూచే విధానమును; యోగివరుడున్= యోగిశ్రేష్ఠుడుకూడ; అరయున్= చూస్తాడు; కానన్= కావున; పరమమునులు= శ్రేష్ఠులైన మౌనులు; వారు+ఇద్దఱును= ఆ ఇద్దరున్నూ; ఒక్కతెరువువార+అండ్రు= ఒక మార్గములోని వారే అని చెప్తుతారు.

**తాత్పర్యం:** భూపాలా! యోగి చూచే రీతిగానే సాంఖ్యుడు చూస్తాడు. సాంఖ్యుడు చూచునట్లే యోగి చూస్తాడు.

అందువలననే మునివర్యులు వా రిద్దరూ ఒక్కమార్గానికి చెందినవారే అని అంటారు.

**విశేషం: 'ఏకం సాంఖ్యం చ యోగం చ । యః పశ్యతి స పశ్యతి!'** (గీత 5-5) అని గీతావచనం. 'సాంఖ్యాన్ని, యోగాన్నీ ఒకటిగానే ఎవడు చూస్తాడో, వాడే నిజంగా చూచేవాడు' అని ఈ వచనానికి అర్థం. దీనివలన సాంఖ్యయోగాలకు పెద్ద భేదం లేదని గ్రహించాలి.

**క. విను! సాంఖ్యమ్మును యోగము । నను పేళుల కాని దీనియం దదియును దా**
**న నిదియుఁ దోఁచుచునుండుం । గనుఁ దత్త్వవిచారి యొకఁడ కా నీ రెంటిన్. 626**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; సాంఖ్యమ్మును= సాంఖ్యమనీ; యోగమున్+అను= యోగమనీ అనే; పేళులు+అ+కాని= పేరులే కాని; దీనిఅందున్= దీనిలో; అదియునున్= అదీ; దానన్= దానిలో; ఇదియున్= ఇదీ; తోఁచుచున్+ఉండున్= కనిపిస్తూ ఉంటాయి; తత్త్వవిచారి= తత్త్వమును విచారించేవాడు; ఈ రెంటిన్= ఈ రెండింటినీ; ఒకఁడకాన్= ఒక్కటిగానే; కనున్= చూస్తాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. సాంఖ్యమనీ, యోగమనీ పేరులో భేదమే కాని నిజంగా పరిశీలించి చూస్తే సాంఖ్యంలో యోగమూ, యోగంలో సాంఖ్యమూ కనిపిస్తూనే ఉంటాయి. అందువలననే తత్త్వజ్ఞులు సాంఖ్యయోగాలను రెంటినీ ఒక్కటిగానే భావిస్తారు.

**క. ఈ తెరువునఁ జరియించుచు । నే తెఱఁగున నైనఁ దప్పెనేనియుఁ బురుషుం**
**డాతత నాక సుఖము గనుఁ; । దోఁతెంచును మగుడ సద్బుధుల వంశమునన్. 627**

**ప్రతిపదార్థం:** పురుషుండు= జీవుడు; ఈ తెరువునన్= ఈ మార్గంలో; చరియించుచున్= చరిస్తూ; ఏతెఱఁగునన్+ఐనన్= ఏ విధంగానైనా; తప్పెన్+ఏనియున్= మార్గం తప్పితే; ఆతతనాక సుఖమున్= విస్తృతమైన స్వర్గసుఖాన్ని; కనున్= చూస్తాడు; మగుడన్= మరల; సద్బుధుల వంశమునన్= మంచి పండితుల వంశమునందు; తోఁతెంచును= జన్మిస్తాడు.

**తాత్పర్యం:** జీవుడు ఈ మార్గంలో సంచరిస్తూ ఉంటాడు. ఏ విధంగానైనా అతడు మార్గం తప్పి గమ్యమైన మోక్షం చేరలేకపోతే స్వర్గానికి పోతాడు. అక్కడ సుఖం అనుభవిస్తాడు. మరల మంచి విబుధుల వంశంలో జన్మిస్తాడు.

**విశేషం:** పైన చెప్పిన యోగాది మార్గాలు మోక్షం చేరటానికి ఉపాయాలు. ఆ మార్గాలలో భద్రంగా పయనించేవాడు గమ్యమైన పరమపదం చేరుకొంటాడు. వాడికి పునర్జన్మ లేదు. అట్లాకాక ఏ కారణంవలననైనా యోగమార్గం నుండి భ్రష్టుడైనవాడు స్వర్గానికి వెళ్ళుతాడు. అక్కడ పుణ్యాఫలమైన స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. పుణ్యం క్షీణమైన పిమ్మట 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' (గీత 9-21) అన్నట్లు మళ్ళీ మానవలోకంలో జన్మిస్తాడు. అయితే పూర్వం వీడు యోగభ్రష్టుడు కనుక ఆ ప్రభావంవలన 'శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోZ భిజాయతే' (గీత 6-41) అన్నట్లు శుచిమంతులు, శ్రీమంతులు అయిన మాన్యుల వంశంలో జన్మించి సాంఖ్యయోగం పాటిస్తాడు. యోగసిద్ధి పొందిన పిమ్మట మోక్షం వాడికి సిద్ధిస్తుంది అని భావం.

**ఆ. మఱియు నిత్తెఱంగు మనసున నెలసిన । వినుతమోక్షలక్ష్మి విభుత గాంచు**
**నిట్టి తెరువు సూప నెవ్వరి కలవి నా । రాయణునక కాక యమలచరిత! 628**

**ప్రతిపదార్థం:** అమలచరిత!= విమలచరిత్రుడా!; మఱియున్= ఇంకను; ఈ+తెఱంగు= ఈ పద్ధతి; మనసునన్= చిత్తమునందు; ఎలసినన్= పొందితే; వినుతమోక్షలక్ష్మి విభుతన్= ప్రశస్తమైన మోక్షమనే లక్ష్మియొక్క ప్రభుత్వమును; కాంచున్= పొందుతాడు; నారాయణునకు+అ+కాక= ఒక్క శ్రీమన్నారాయణపరమాత్మకు తప్ప; ఇట్టి తెరువు= ఇట్లాంటి మార్గమును; చూపన్=

దర్శింపజేయటానికి; ఎవ్వరికిన్+అలవి= ఇతరుల కెవ్వరికి శక్యం?

**తాత్పర్యం:** పవిత్రచరిత్రుడవైన ఓ ధర్మరాజా! బుధుల వంశంలో పుట్టినవాడు మరల ఆ యోగమార్గాన్ని చిత్తంలో అనుసంధించి నిర్వహించగలిగితే మోక్షలక్ష్మికి ప్రభువు కాగలడు. ఈ మోక్షమార్గాన్ని ఆ యోగులకు ఒక్క శ్రీమన్నారాయణుడు చూపగలడే కాని ఇతరులకు అది సాధ్యమా? (భగవదనుగ్రహం వలననే మోక్షప్రాప్తి కలుగుతుందని భావం).

**వ.** **నారాయణ ప్రణీతంబై యక్షర ప్రదర్శకం బైన యిత్తెఱంగుఁ జిత్తంబున నలవరింపు' మని దేవవ్రతుండు ధర్మనందనునకుం జెప్పెనని యిట్లు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన, 'నటమీఁద వర్తించిన విశిష్ట సల్లాపంబులు సెప్పవే' యని యడుగుటయు.** **629**

**ప్రతిపదార్థం:** నారాయణప్రణీతంబై= నారాయణుడిచేత ప్రవర్తింపచేయబడినదై; అక్షర ప్రదర్శకంబు+ఐన= క్షరంలేని మోక్షమును చూపించేదగు; ఈ+తెఱంగు= ఈ పద్ధతి; చిత్తంబునన్= మనస్సులో; అలవరింపుము+అని= అభ్యసించుమని; దేవవ్రతుండు= భీష్ముడు; ధర్మనందనునకున్= ధర్మజుడికి; చెప్పెన్+అని= వచించెనని; ఇట్లు= ఈ విధంగా; వైశంపాయనుండు= వ్యాసుడి శిష్యుడైన వైశంపాయనుడు; జనమేజయునకున్= పరీక్షిత్తు పుత్రుడైన జనమేజయ మహారాజునకు; చెప్పినన్= చెప్పగా; అటమీఁదన్= ఆ పైన; వర్తించిన= జరిగిన; విశిష్టసల్లాపంబులు= వినూత్నమైన సంభాషణములు; చెప్పవే= వచించుమా; అని అడుగుటయున్= అని అడుగగా.

**తాత్పర్యం:** శ్రీమన్నారాయణుడిచేత ప్రవర్తితమై అవ్యయమైన మోక్షాన్ని ప్రదర్శించే ఈ పద్ధతిని నీ చిత్తములో అభ్యసించుము' అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు అని ఈ రీతిగా వ్యాసశిష్యుడయిన వైశంపాయనముని పరీక్షిత్తనయుడైన జనమేజయుడితో చెప్పాడు. ఆ పైన జనమేజయుడు వైశంపాయనుడితో ధర్మజుడికీ, భీష్ముడికీ తరువాత జరిగిన విశిష్టమైన సంభాషణలు వివరించుమని అడిగాడు. అట్లా అడిగేసరికి (తరువాతి ఆశ్వాసంలోని రెండవ పద్యంతో అన్వయం).

### ఆశ్వాసాంతము

**శా.** **లీలాస్వీకృతచక్రశూల! వినతాళీరక్షణాలోల! దు**
**శ్శీల స్వాంతవిదూర! వేదజలదశ్రేణీమయూరా! సమి**
**త్కేళీఖండిత దైత్య! నిర్జరగణక్షేమక్రియానిత్య! ని**
**స్త్రైలోక్యత్వ నిరంజనాగ్రవిహృతీ! సంస్థాపకవ్యాహృతీ!** **630**

**ప్రతిపదార్థం:** లీలా స్వీకృత చక్రశూల!= విలాసార్థం స్వీకరించబడిన చక్రశూలాలు కలవాడా!; వినతాళీరక్షణాలోల!= ప్రణతులైన భక్తశ్రేణిని రక్షించటంలో ఆసక్తికలవాడా!; దుశ్శీలస్వాంత విదూర!= దుశ్చరిత్రులైనవారి చిత్తములకు దూరమైనవాడా!; వేదజలదశ్రేణీ మయూరా!= వేదాలనెడు మేఘపంక్తికి నెమలివైనవాడా!; సమిత్కేళీఖండితదైత్య= యుద్ధక్రీడలో ఖండించబడిన రాక్షసులు కలవాడా!; నిర్జరగణ క్షేమక్రియానిత్య!= దేవతల బృందానికి క్షేమం కలిగించే కార్యమునందు సదా ప్రవర్తించే వాడా!; నిస్త్రైలోక్యత్వ నిరంజనాగ్ర విహృతీ!= ముల్లోకాల నతిక్రమించి మాయాసంగదోషంలేని వాడవై ఆ లోకాల తుదిని

**మాలిని.**

**జపయజన నిషేవ్యా! సంగనిర్ముక్తభావ్యా!**
**విపుల దురితభేదీ! విశ్వలోకప్రమోదీ !**
**యపరిమిత విభూతీ! యప్రమాణస్వరీతీ!**
**యుపనిష దవగమ్యా! యోగభావ్యైకరమ్యా!**

**ప్రతిపదార్థం:** జపయజననిషేవ్యా!= జపయజ్ఞంచేత సేవించదగినవాడా!; సంగనిర్ముక్తభావ్యా!= సంగంలేని వారిచేత ధ్యానించదగినవాడా!; విపుల దురితభేదీ!= విస్తృతమైన పాపాలను నశింపచేసేవాడా!; విశ్వలోకప్రమోదీ!= సమస్తలోకములను సంతసింపజేసేవాడా!; అపరిమితవిభూతీ!= అనంతమైన ఐశ్వర్యం కలవాడా!; అప్రమాణస్వరీతీ= ప్రమాణంలేని స్వీయపద్ధతికలవాడా!; ఉపనిషదవగమ్యా!= ఉపనిషత్తులచేత తెలియదగిన వాడా!; యోగభావ్యైకరమ్యా!= యోగవిద్యచేత బావించదగిన ముఖ్యమైన రమణీయత్వం కలవాడా!

**తాత్పర్యం:** జపయజ్ఞంచేత సేవించదగిన ఓ దేవా! సంగంలేని విరాగులచేత ధ్యానించదగినవాడా! అనంతమైన పాపసంచయాన్ని హరించేవాడా! సమస్తలోకాన్నీ ఆనందింపజేసేవాడా! అంతంలేని ఐశ్వర్యం కలవాడా! ప్రమాణాల కందని నిజపద్ధతి కలవాడా! వేదాంత రూపాలైన ఉపనిషత్తులచేత తెలిసికొనదగినవాడా! చిత్తవృత్తి నిరోధరూపమైన యోగవిద్యచేత భావించదగిన ముఖ్యమైన మనోహరత్వం కలవాడా!

**విశేషం:** 'యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి' (గీత.10-25)అని గీతావచనం. యజ్ఞాలలో భగవంతుడు జపయజ్ఞ స్వరూపుడై ఉన్నాడనటం వలన ద్రవ్యయజ్ఞాలకంటె జపయజ్ఞం శ్రేష్ఠమని భావించాలి. 'నాన్తోస్తి మను దివ్యానాం విభూతీనాం పరంతప!' (గీత.10-40)-'అర్జునా! నా దివ్య విభూతులకు అంతం లేదు' అని శ్రీకృష్ణుడి వచనం. 'అపరిమిత విభూతీ' అన్న ప్రయోగం ఈ సంగతినే తెలియపరుస్తున్నది. ఇది మాలినీ వృత్తం. 'ననమయయ' గణాలు గల మాలిని. 'ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః'- అని లక్షణం. 8వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**విశేషం:** అలం: అంత్యప్రాసం.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారతంబున శాంతిపర్వంబునందుఁ బంచమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పినది; శ్రీమదుభయకవిమిత్ర= శ్రీమంతులైన సంస్కృతాంధ్రకవులనే ఇరుతెగలవారికి మిత్రుడును; కొమ్మనామాత్యపుత్త్ర= కొమ్మనమంత్రి కుమారుడును; బుధారాధన విరాజి= పండితులను ఆరాధించటంచేత శోభిల్లేవాడును అగు; తిక్కన సోమయాజి= తిక్కన సోమయాజిచేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీ మహాభారతంబునన్= శ్రీ మహాభారతంలో; శాంతిపర్వంబునందున్= శాంతిపర్వంలో; పంచమ+ఆశ్వాసము= ఐదవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** శ్రీ మంతులైన సంస్కృతాంధ్ర కవు లనే ఇరుతెగలవారికి మిత్రుడు, పండితులను ఆరాధించటంచేత విశేషంగా భాసించినవాడు అయిన శ్రీ తిక్కన సోమయాజి రచించిన ఆంధ్రమహాభారతంలోని శాంతిపర్వంలో ఐదవ అశ్వాసం.

**శాంతిపర్వంలో పంచమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతిపర్వము - షష్ఠాశ్వాసము

**క.** **శ్రీ సంధానప్రౌఢ ద । యాసంభృత భక్తమోద! యఖిలజగద్ర**
**క్షాసత్తి వినోద! శమా । భ్యాసనిరత నిర్విభేద! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సంపదలను; సంధాన= సమకూర్చటంలో; ప్రౌఢ= సమర్థమైన; దయా= కరుణచేత; సంభృత= కలిగించబడిన; భక్తమోద= భక్తుల ఆనందం కలవాడా!; (సంపత్కరమైన దయాగుణంతో భక్తులకు ఆనందం కలిగించేవాడా!); అఖిల= సమస్తమైన; జగత్= లోకాలనూ; రక్షా= రక్షించటమనే; ఆసత్తి= ఆసత్తితో-రక్షణభారాన్ని కోరి వహించి నిర్వహించటంతో; వినోద!= ఆనందించే వాడా! (జగద్రక్షణకార్యభారాన్ని ఒక వినోదంగా వహించేవాడా!); శమ+అభ్యాస= అంతరింద్రియ నిగ్రహాన్ని అభ్యసించటంవలన; నిరతనిర్విభేద!= నిరంతరం నిర్విభేద స్థితిని పొందేవాడా! (శమాభ్యాస నిరతమైన నిర్విభేదస్థితి కలవాడా అనికానీ); హరిహరనాథా!= ఓ హరిహరనాథుడా!

**తాత్పర్యం:** ప్రతి ఆశ్వాసానికీ ఆద్యంతాలలో కృతిపతిని స్తుతించటం తెలుగుకవుల సంప్రదాయం. ఈ కందపద్యంలో తిక్కన హరిహరనాథుడికి మూడు విశిష్టసంబోధనలు కూర్చాడు. ఇహపరాలలో సకల సంపదలనూ భక్తులకు సంధానించటంలో సమర్థుడు హరిహరనాథుడు. అతడి దయాగుణం అంతటి ప్రౌఢం. దానితో భక్తులు ఆనందిస్తున్నారు. జగద్రక్షణ భారాన్ని కోరివహించాడు హరిహరనాథుడు. ఆ రక్షాసత్తితో వినోదిస్తున్నాడు. అతడిది శమాభ్యాస నిరతమైన నిర్విభేదస్థితి. (శమాభ్యాసంతో విభేదాలు నిర్గతమైపోయి సర్వాంతర్యామిత్వం పొందినవాడని). [(శమాభ్యాస నిరతశ్చాసౌ నిర్విభేదశ్చ - తత్సంబుద్ధౌ).]

**విశేషం:** 'అఖిలజగద్రక్షాసక్త - రక్షాసక్తి - వినోద' అనే పాఠాంతరాలు కనిపిస్తున్నాయి. రక్షణయందు ఆసక్తమైన (సంలగ్నమైన) వినోదం కలవాడా - అనీ, రక్షణయందున్న ఆసక్తితో (అభిలాషతో) వినోదించేవాడా - అనీ ఈ పాఠాంతరాలకు అర్థం. మూడు పాఠాలకూ భావంలో పెద్దగా తేడా లేదు. సంబోధన లన్నింటా అంత్యానుప్రాస పాటించాడు తిక్కన. 'ద' అనేది అంత్యానుప్రాసాక్షరం. ఇది హ్రస్వం కాబట్టి దీని పూర్వాక్షరాన్ని మూడుచోట్లా దీర్ఘమే వేసి నియమం పాటించాడు.

**భీష్ముని ధర్మజుండు ప్రశంసించి యక్షర క్షరంబుల నడుగుట. (సం. 12-291-1)**

**వ.** **దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు యోగసాంఖ్యవిదు లక్షరంబునొంది యానందస్వరూపు లగుదురని చెప్పిన విని ధర్మతనయుండు దేవవ్రతునితో 'నీవు పరమజ్ఞాన నిధివని వేదసంవేదు లగు విపులు సెప్ప నప్పలుకులు నిన్ను సాంఖ్యయోగ ప్రవీణులయిన యతులును మునిపతులును వర్ణింప నవ్వచనంబులును నాకర్ణించుచుం బ్రమోదంబునం బొందుచుండుదుము. దక్షిణాయనశేషదినంబు లింక నల్పంబు, లర్కుండు మరలంబడినఁ బరమగతిం బ్రాపించెదవు, మఱి మేమెవ్వరిచేత వినువారము? కురువంశంబునకుం బ్రజ్ఞాఘృత ప్రదీపితంబగు దీపంబుగావె? భవత్తేజంబు నాశ్రయించెద' మని తనవారలం**

**గలసికొని పలికి, 'నీవు నిర్దేశించిన యక్షరం బనునది యెట్టిది? క్షరం బెయ్యది? యెఱింగింపవే?' యనుటయు నతండు 'వసిష్ఠజనక సంవాదంబనంబరఁగు విశిష్టేతిహాసంబు గలదు. దాన నీయడిగిన యవియును మఱియునెఱుంగ వలయునట్టివి యనేకార్థంబులును దెలివిపడు; విను'మని సుప్రసాదభరితుండై. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా! వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= వివరించాడు; అట్లు= ఇంతకుముందు (పంచమాశ్వాసం చివర) చెప్పినట్లుగా; యోగసాంఖ్యవిదులు= ఒక తెరువువారే అయిన యోగవిద్యావేత్తలూ, సాంఖ్యవిద్యావేత్తలూ; అక్షరంబును ఒంది= క్షరం (నాశము) లేని స్థితిని పొంది; ఆనందస్వరూపులు= ఆనందస్వరూపులు; అగుదురు అని= అవుతారని; చెప్పినన్= భీష్ముడు చెప్పేసరికి; విని; ధర్మతనయుండు; దేవవ్రతునితో= భీష్ముడితో (ఇట్లా అంటున్నాడు); నీవు; పరమజ్ఞాననిధివి= పరమజ్ఞానానికి నిధివి; అని; వేదసంవేదులు అగు విప్రులు= వేద వేత్తలయిన విప్రులు (విజ్ఞులు); చెప్పన్= చెబుతూంటే; ఆ+పలుకులున్= ఆ మాటలనూ; సాంఖ్యయోగ ప్రవీణులయిన= సాంఖ్యవిద్యాప్రవీణులూ, యోగవిద్యా ప్రవీణులూ అయిన; యతులును= యతీశ్వరులూ; మునిపతులును= మునీశ్వరులూ; నిన్ను; వర్ణింపన్= వర్ణిస్తూంటే; ఆ+వచనంబులున్= ఆ పలుకులనూ; ఆకర్ణించుచున్= శ్రద్ధగా వింటూ; ప్రమోదంబునన్ పొందుచుందుము= మేమంతా ఆనందం పొందుతూ వుంటాం; దక్షిణ+అయన శేషదినంబులు= ఈ దక్షిణాయనంలో మిగిలిన రోజులు; ఇంకన్= ఇక; అల్పంబులు; చాలా తక్కువ; అర్కుండు= సూర్యుడు; మరలంబడినన్= ఉత్తరాయణంలోకి ప్రవేశిస్తే; పరమగతిన్ ప్రాపించెదవు= నీవు పరమపదిస్తావు - అక్షయపులోకాలకు చేరుకుంటావు; మఱి మేము= మరింక మేము; ఎవ్వరిచేతన్= ఎవరినుంచి; వినువారము?= వినగలం?; కురువంశంబునకున్= ఈ కురువంశానికి; ప్రజ్ఞా= తెలివి అనే; ఘృత= నేతితో; ప్రదీపితంబు అగు= వెలిగించబడిన; దీపంబు+కావె?= దీపానికి నీవే కదా?; భవత్= నీ; తేజంబున్= తేజస్సును; ఆశ్రయించెదము= ఆశ్రయిస్తాం; అని= అంటూ; తనవారలన్= తన సోదరాదులను; కలిపికొని= కలుపుకొని; పలికి= మాట్లాడి; నీవు; నిర్దేశించిన= ఇంతకుముందు పేర్కొన్న; అక్షరంబు అనునది= 'అక్షరము' అనేది; ఎట్టిది= ఎటువంటిది?; క్షరంబు= క్షరము (పుట్టి-నాశనమయ్యేది); ఏ+అది= ఏది?; ఎఱింగింపవే?= దయచేసి తెలియచెప్పవా?; అనుటయున్= అని ధర్మరాజు అడిగేసరికి; అతండు= ఆ భీష్ముడు; వసిష్ఠజనకసంవాదంబు అనన్= 'వసిష్ఠజనకసంవాదము' అని; పరఁగు= ప్రసిద్ధిపొందిన; విశిష్ట+ఇతిహాసంబు= ఒక విశిష్టమైన కథ; కలదు= ఉన్నది; దానన్= దానితో; నీ+అడిగిన అవియును= నువ్వు అడిగినవీ; మఱియున్= ఇంకా; ఎఱుంగన్ వలయునట్టివి= తెలుసుకోవలసినవి; అనేకార్థంబులును= అనేక విశేషాలూ; తెలివిపడున్= స్పష్టపడతాయి; వినుము అని; సుప్రసాదభరితుండై= ప్రసాదగుణభరితుడై - సుప్రసన్నుడై - భీష్ముడు ఇట్లా అన్నాడని (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు; 'ఆ విధంగా యోగసాంఖ్య పండితులు అక్షరమైన ఆనందస్వరూపులౌతారని చెప్పగా విని, ధర్మరాజు దేవవ్రతుడితో ఇట్లా అన్నాడు. 'నీవు పరమజ్ఞానివని వేదవిదులు, సాంఖ్యయోగ ప్రవీణులయిన యతీంద్రులు చెప్పగా విని సంతోషిస్తూ ఉంటాము. దక్షిణాయనంలో ఇంకా మిగిలిన రోజులు తక్కువ. సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించగానే నీవు పరమపదిస్తావు. ఆ తరువాత మేము ఎవరివలన వినగలుగుతాము? కురువంశంలో ప్రజ్ఞ అనే నేయితో వెలుగుతున్న దీపంవలె ఉన్నావు. నీ తేజస్సును ఆశ్రయిస్తున్నాము' అని తనవారితో కలిసి పలికి 'నీవు చెప్పిన 'అక్షర'మనేది ఎటువంటిది?' 'క్షర' మేది? తెలుపుము' అన్నాడు. భీష్ముడు 'వసిష్ఠ జనకుల సంవాద' మనే ఉత్తమ ఇతిహాసం ఉన్నది. దానివలన నీ వడిగిన విశేషాలన్నీ తెలుస్తాయి వినుము' అని సుముఖుడై.

**విశేషం:** 'ప్రజ్ఞాఘృత ప్రదీపితంబగు దీపంబుగావె' అనేచోట 'ప్రజ్ఞాకృత/ ప్రజ్ఞామృత ప్రేరితంబగు దీపంబవుగావె' అని పాఠాంతరాలు కనిపిస్తున్నాయి. ప్రాజ్ఞకృతము అని ఉన్నప్పుడు ప్రదీపితము - ప్రేరితము అనే (క్త) నిష్ఠాంతాలు వ్యర్థమవుతాయి. ప్రజ్ఞను అమృతంగా పోల్చినందువలన అది ఇంధనంగా ప్రదీపితత్వానికి సాధకం కానేరదు. అంచేత 'ప్రజ్ఞాఘృత ప్రదీపితంబగు'

అనేదే సాధుపాఠం. 'కురువంశప్రదీపస్త్వం జ్ఞానద్రవ్యేణ దీప్యసే' (శాంతి 291-5) అని వ్యాసుడు దీపన సాధకంగా జ్ఞానద్రవ్యమన్నాడు. ఆ ద్రవ్యాన్ని తిక్కన ఘృతమని స్పష్టపరిచాడు. తరువాతి శ్లోకంలో 'న తృప్యామీహ రాజేంద్ర శృణ్వన్నమృత మీదృశమ్' (291-6) అన్నాడు. ఉపదేశాన్ని అమృతంగా పోల్చి దాని ఆస్వాదనతో ఎంతకీ తనివితీరటం లేదని ధర్మరాజు అభిప్రాయం. అమృతంతో పోల్చినప్పుడు ఇలా ఆస్వాదానుభూతి అన్వయిస్తుందే కానీ ప్రదీపితత్వం కాదు.

'దీపంబవు గావె - దీపంబుగావె' అనే రెండు పాఠాలూ తెలుగువ్యాకరణానికి అనుకూలమే. దీపంబు అనేది ఈ వాక్యంలో యుష్మద్విశేషణం. కాబట్టి వుగాగమం ప్రాయికంగా వస్తుంది. వస్తే 'దీపంబవుగావె' అనీ, రాకపోతే 'దీపంబుగావె' అనీ అవుతుంది. వుగాగమ రహితరూపం 'ప్రాయోగ్రహణంబుచే రక్షితంబయ్యె'.

**సీ.** **అనఘ! సుఖాసీనుఁడైన వసిష్ఠసం । యమిఁగాంచి భక్తిఁ బాదముల కెఱఁగి**
**జనకభూనాథుండు వినయంబుతోడ ను । పాసించి 'మునివర! యక్షరం బ**
**నాది శివంబన నపునరావృత్తి సి । ద్ధిదమగుచుండు నెయ్యది యెఱుంగఁ**
**జెప్పవే!' యనుడు నాశ్రిత వత్సలుండగు । నమ్మహాత్ముఁడు దెలియంగఁ జెప్పె**

**తే.** **నద్దయాళుని చెప్పిన యత్తెఱంగు । ప్రస్ఫుటంబుగఁ జెప్పెదఁ బాండవాగ్ర**
**జన్మ! నీ కని పలికి యజ్జాహ్నవీత । నూజుఁ డిట్లను నాననాంభోజ మలర.** 3

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! ఓ ధర్మరాజా!; సుఖాసీనుఁడైన= సుఖంగా కూర్చున్న; వసిష్ఠసంయమిన్= వసిష్ఠమహర్షిని; కాంచి= చూచి; భక్తిన్= భక్తితో; పాదములకున్= పాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; జనకభూనాథుండు= జనకమహారాజు; వినయంబుతోడన్= వినయంతో; ఉపాసించి= అర్చించి; మునివర!= ఓ మునీశ్వరా!; అక్షరంబు= నాశనం లేనిదీ; (క్షరము= పుట్టి నశించేది; అక్షరము= పుట్టుకలేనిది - నశించనిది; అనాది= ఆది లేనిదీ; శివంబు అనన్= శుభప్రదం అనబడేదీ; అపునరావృత్తి సిద్ధిదము= జన్మరాహిత్య సిద్ధిని కలిగించేదీ; అగుచుండున్ ఎయ్యది?= అవుతూ ఉంటుందో - అది ఏది?; ఎఱుంగన్ చెప్పవే?= దయచేసి తెలియజెప్పవా?; అనుడున్= జనకభూనాథుడు ఇట్లా అనేసరికి; ఆశ్రితవత్సలుండగు= ఆశ్రితులమీద వాత్సల్యం కలవాడైన; ఆ+మహాత్ముఁడు= ఆ మహానుభావుడు వసిష్ఠుడు; తెలియంగన్ చెప్పెన్= తెలిసేటట్లు చెప్పాడు; పాండవ+అగ్రజన్మ!= ఓ పాండవులలో పెద్దవాడా!; ఆ+దయాళుని= ఆ దయామయుడు వసిష్ఠుడు; చెప్పిన ఆ+తెఱంగున్= వివరించిన ఆ విధానమంతా; ప్రస్ఫుటంబుగన్= స్పష్టపడేటట్లు; నీకున్ చెప్పెదన్= నీకు నేను చెబుతాను; అని పలికి= అని చెప్పి; ఆ+జాహ్నవీతనూజుఁడు= ఆ గంగాపుత్రుడు భీష్ముడు; ఆనన+అంభోజము+అలరన్= తన ముఖపద్మం వికసించగా; ఇట్లు= ఈ చెప్పబోయే విధంగా; అనున్= పలికాడు.

**తాత్పర్యం:** ఒకప్పుడు జనకమహారాజు వసిష్ఠుడిని అడిగాడు - అక్షరతత్త్వం తెలియజెప్పుమని. అప్పుడు ఆశ్రిత వత్సలుడూ దయాగుణ విశిష్టుడూ అయిన ఆ మహాత్ముడు పూర్వం వసిష్ఠుడు జనకుడికి వివరించి చెప్పాడు. అది అంతా నీకు నేను స్పష్టంగా చెప్పుతాను' - అని సంతోషంగా భీష్ముడు ధర్మరాజుకు వివరించటం మొదలు పెట్టాడు.

**విశేషం:** ఇక్కడ జనకభూనాథుడు అంటే సీతాదేవి కన్నతండ్రి కాదు. ఆ వంశంలోవారికి అందరికీ జనకుడు అనేది సాధారణ నామధేయం. అదికాక అసలు పేరు వేరే వుంటుంది. 'వసిష్ఠస్య చ సంవాదం కరాళజనకస్య చ (291-7), పప్రచ్ఛర్షివరం రాజా కరాళజనకః పురా (291-10) అనీ వ్యాసుడు రెండుసార్లు కరాళజనకుడు అన్నాడు. అంటే ఈ జనకమహారాజు అసలు పేరు కరాళుడు అన్నమాట. 'అద్దయాళుని చెప్పిన అత్తెఱంగు' - అనేది తెలుగు వాక్యనిర్మాణంలో ఒక విశిష్టకారకం. దయాళునియొక్క చెప్పిన ఆ విధానం - అంటే దయాళుడు చెప్పిన ఆ విధానం అని ఫలితార్థం. 'నీయడిగినయవి, నా యొనర్పంబూనిన మహా ప్రబంధంబునకు- ఇత్యాదులన్నీ ఇటువంటివే.

### వసిష్ఠ జనకరాజ సంవాద ప్రకారము (సం. 12-291-7)

**వ. జనకజనేశ్వరు బోధించుటకై వసిష్ఠ మునీశ్వరుం డి ట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** జనకజనేశ్వరున్= కరాళజనకమహారాజును; బోధించుటకై= జ్ఞానవంతుడిని చెయ్యటానికి; వసిష్ఠమునీశ్వరుండు= ఆ వసిష్ఠమహర్షి; ఇట్లు అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** కరాళజనక మహారాజుకు జ్ఞానం బోధించేందుకు వసిష్ఠమహర్షి ఇట్లా చెప్పాడు.

**క. 'నయనముఖ పాణిపాదము । లయమహితా! యెందుఁ గలిగి యాద్యంతపరి**
**క్షయవృద్ధి రహితమై ని । ర్ద్వయ మగు తత్త్వంబు నక్షరంబండ్రు బుధుల్. 5**

**ప్రతిపదార్థం:** అయమహితా!= ఓ శుభాన్వితా! ధర్మరాజా!; నయన= నేత్రాలు; ముఖ= ముఖం; పాణిపాదములు= చేతులూ, కాళ్ళూ; ఎందున్ కలిగి= సర్వాత్మనా కలిగి ఉండీ; ఆది+అంత+పరిక్షయ+వృద్ధి+రహితమై= ఆది, అంతం, వినాశం, వృద్ధి - అనేవి లేనివై; నిస్+ద్వయము+అగు+తత్త్వమున్= అద్వితీయమైన తత్త్వాన్ని; బుధుల్= పండితులు; అక్షరంబు+అండ్రు= అక్షరము అంటారు.

**తాత్పర్యం:** 'ఓ మంగళగుణాన్వితా! ధర్మరాజా! కరచరణాది అవయవాలు కలిగి ఉండీ, ఆది, అంతం, క్షయం, వృద్ధి - ఇవి లేనివైన ఏకైక తత్త్వాన్ని 'అక్షరము' అంటారు పండితులు.

**విశేషం:** నిర్విభేదం, నిర్ద్వయం, అద్వితీయం - ఇవన్నీ సమానార్థకాలు. ఏకైకం అని తాత్పర్యం. ద్వయములేనిది నిర్ద్వయం. ద్వితీయం లేనిది అద్వితీయం. విభేదం లేనిది నిర్విభేదం. సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్, సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి (291-16) అనేది మూలశ్లోకం. ఇందులో సర్వతః అనే పదానికి పర్యాయంగా 'ఎందున్ కలిగి' అన్నాడు తిక్కన. సర్వత్రగామి, సర్వదర్శి, సర్వగతి, సర్వశిరస్సు, సర్వానందం, సర్వశ్రోత అయిన ఆ పరబ్రహ్మమే అంతటా ఆవరించి ఉంటుంది - అదే అక్షరమని తాత్పర్యం వివరించారు పెద్దలు.

**క. క్షరమండ్రు దానివలనను । క్షరియించిన తత్త్వములను జనవత్సల! య**
**య్యిరువది నాల్గింటిని దర । తరమ విభాగించి చెప్పెదం దెలియంగన్. 6**

**ప్రతిపదార్థం:** జనవత్సల!= జనులపట్ల వాత్సల్యం కలవాడా! (జనుల వాత్సల్యం చూరగొన్నవాడా అని కానీ); ఓ ధర్మరాజా! దానివలనను= 'అక్షరము' అనబడే ఆ తత్త్వంనుంచి; క్షరియించిన= ఆవిర్భవించిన; తత్త్వములను= తత్త్వాలను; క్షరము అండ్రు= 'క్షరము' అంటారు; ఆ+ఇరువది నాల్గింటిని= క్షరతత్త్వాలు ఇరవై నాల్గింటినీ; తరతరమ= క్రమంగా; విభాగించి= విభజించి; తెలియంగన్= నీకు తెలిసేటట్లు; చెప్పెదన్= చెబుతాను.

**తాత్పర్యం:** జనవత్సలా! ఓ ధర్మరాజా! అక్షరతత్త్వంనుంచి ఇరవై నాలుగు క్షరతత్త్వాలు ఆవిర్భవించాయి. నీకు స్పష్టంగా తెలియటంకొరకు వాటిని విడమరచి చెప్పుతాను ఆలకించుము.

**తే. అక్షరము విక్రియాశబలాత్మకత్వ । మొందు నవ్విక్రియకును బేళ్ళొలసెఁ బ్రకృతి**
**యనఁ బ్రధానంబునాఁగ నవ్యక్త మనఁగ । దానఁబుట్టు మహన్నామతత్త్వ మనఘ! 7**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పవిత్రుడా!; అక్షరంబు= అక్షరము అని చెప్పబడిన తత్త్వం; విక్రియా= విక్రియతో; శబలాత్మకత్వము+ఒందున్= వైవిధ్యాన్ని పొందుతుంది; ఆ+విక్రియకును= ఆ వికృతికికూడా; ప్రకృతి+అనన్= ప్రకృతి అనీ;

ప్రధానంబునా(గన్= ప్రధానము అనీ; అవ్యక్తము+అన(గన్= అవ్యక్తము అనీ; పేళ్లు+ఒలసెన్= పేరులు ఏర్పడ్డాయి; దానన్= ఆ విక్రియనుండి; మహత్+నామతత్త్వము= మహత్(మహాన్) అని పిలవబడే తత్త్వం; పుట్టున్= పుడుతుంది. (12-291-17).

**తాత్పర్యం:** అక్షరతత్త్వం విక్రియను పొందుతుంది. దానికి ప్రకృతి, ప్రధానం, అవ్యక్తం అని పేరులు. ఆ విక్రియనుండి 'మహత్' అనబడే తత్త్వం ఆవిర్భవిస్తుంది.

**తే.** **విను మహంకార మా తత్త్వమున జనించు । దాన భూతపంచకమును దద్గుణంబు**
**లైన శబ్దాది విషయంబులైదు నింద్రి । యములు( బదియును మనసును నావహిల్లు.** **8**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! వినుము; ఆ తత్త్వమునన్= ఆ మహన్నామతత్త్వంనుంచి; అహంకారము= అహంకారమనేది; జనించున్= ఉద్భవిస్తుంది; దానన్= దానినుంచి; భూతపంచకమును= పంచభూతాలూ; తద్గుణంబులైన శబ్దాదివిషయంబులు ఐదున్= పంచభూతాలకూ గుణాలైన శబ్దస్పర్శ రూపరసగంధాదులు అయిదూ; ఇంద్రియముల్ పదియును= జ్ఞానేంద్రియాలు అయిదూ - కర్మేంద్రియాలు అయిదూ వెరసి పది ఇంద్రియాలూ; మనసును= మనస్సునందు; ఆవహిల్లున్= ఏర్పడతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! వినుము; ప్రకృతి లేదా ప్రధానం లేదా అవ్యక్తం అనబడే తత్త్వం ఒకటి. దానినుంచి ఆవిర్భవించే మహత్తు - రెండు. అహంకారం - మూడు. పంచభూతాలు, పంచగుణాలు- అయిదు. జ్ఞానేంద్రియాలు-ఐదు కర్మేంద్రియాలు. మనస్సు - ఒకటి. కలిపి మొత్తం ఇరవైనాలుగు తత్త్వాలు ఉన్నాయి. పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు (నేల, నీరు, వెలుగు, గాలి, ఆకాశం) పంచభూతాలు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు - అయిదు గుణాలు. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాలు (చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు) అయిదూజ్ఞానేంద్రియాలు. వాక్పాణి పాదపాయు మేఢ్రాలు అయిదూ కర్మేంద్రియాలు మనస్సునందు ఏర్పడతాయి.

(12-291-28).

**క.** **క్షరమయ్యిరువది నాలుగు । నరనాథా! యక్షరంబునకు నెయ్యెడలన్**
**క్షరభావము లే దయ్య । క్ష రము విలాసములు సూవె క్షరతత్త్వమ్ముల్.** **9**

**ప్రతిపదార్థం:** నరనాథా!= ఓ రాజా!; క్షరము= క్షరమే; ఆ+ఇరువది నాలుగున్= ఆ ఇరవైనాలుగు తత్త్వాలును; అక్షరంబునకున్= అక్షరము అనబడే తత్త్వానికి; ఏ+ఎడలన్= ఎప్పుడూ; క్షరభావము= క్షరత్వం; లేదు= లేనేలేదు; క్షరతత్త్వమ్ముల్= క్షరతత్త్వాలు అన్నీ; ఆ+అక్షరము విలాసములు చూవె= ఆ అక్షరతత్త్వం తాలూకు విలాసాలే సుమా!

**తాత్పర్యం:** క్షరమే ఇరవైనాలుగు తత్త్వాలుగా అవుతుంది. అక్షరతత్త్వానికి ఎక్కడా ఎప్పుడూ క్షరభావం ఉండదు. అయితే క్షరతత్త్వాలు అన్నీ అక్షరతత్త్వం తాలూకు విలాసాలే.

**వ.** **ఈ చతుర్వింశతి తత్త్వంబులును విజ్ఞానగోచరంబులు, పంచవింశతితమంబై యక్షరంబనం బర(గు నిప్పరమతత్త్వంబు విను మవిజ్ఞేయం బవ్యయం బకలంకం బనామయం బమృతంబు.** **10**

**ప్రతిపదార్థం:** ఈ చతుర్వింశతి తత్త్వంబులును= ఈ చెప్పిన ఇరవై నాలుగు తత్త్వాలూ; విజ్ఞానగోచరంబులు= విజ్ఞానానికిఅందుతాయి; పంచవింశతితమంబై= ఇరవై అయిదవదై; అక్షరంబు+అనన్= అక్షరము అని; పర(గు= ఒప్పుతున్న; ఈ+పరమతత్త్వంబు= ఈ పరమతత్త్వం; వినుము; అవిజ్ఞేయంబు= అది విజ్ఞానగోచరం కానిది; అవ్యయంబు= అది వ్యయం కానిది; అకలంకంబు= కళంకంలేనిది; అనామయంబు= ఆమయంలేనిది (నాశమూ, రోగమూ లేనిది); అమృతంబు= మృతిలేనిది; మృతంకానిది.

**తాత్పర్యం:** శ్రద్ధగా ఆలకించుము. ఈ ఇరవై నాలుగు తత్త్వాలూ విజ్ఞానానికి అందుతాయి. ఇరవై అయిదవ అక్షరమైన పరమతత్త్వం విజ్ఞానానికి గోచరం కానిది. నాశం లేనిది. మృతి లేనిది.

**విశేషం:** 'అమృతంబు' అనటానికి బదులు 'అనాద్యంతంబు' అనే పాఠాంతరం కనిపిస్తున్నది కొన్ని ప్రతులలో. ఆదీ అంతమూ లేనిది అని దాని భావం.

**క.** **జననాథ! యక్షరం బెం । దును గ్రీడఁ జరించుఁ ద్రిగుణ దోహలపరమై**
**తనకుఁ బ్రబోధము లేకు । న్నను నానాయోనిగత జననముల వెంటన్.** **11**

**ప్రతిపదార్థం:** జననాథ= ధర్మరాజా!; అక్షరంబు= అక్షరతత్త్వమనేది; తనకున్= తనకు; ప్రబోధము= జ్ఞానము - మెలకువ అనేది; లేకున్నను= లేకపోయినట్టయితే; త్రిగుణదోహలపరమై= సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడుగుణాలతో బలపడినదై; (బలపరచునదై) నానాయోనిగత జననములవెంటన్= పలురకాల జీవజాతులలో జననాలను వరుసగా పొందుతూ; ఎందును= సర్వత్ర; క్రీడన్= కేళీవిలాసంగా; చరించున్= సంచరిస్తుంది.

**తాత్పర్యం:** అక్షరతత్త్వానికి ప్రబోధం లేకపోతే సత్త్వరజస్తమోగుణాల సంయోజనకారణంగా నానాజాతులలో జన్మపరంపరలను పొందుతూ ఉంటుంది. ఇది అక్షరతత్త్వానికి ఒక క్రీడావిలాసం (12-291-42).

**క.** **విను సత్త్వరజస్తమముల । యనుసరణమువలన వివిధమగు యోనిగణం**
**బున వెలసిన యా తత్త్వము । దనుఁ జూడఁగలేక యవియ తానని యుండున్.** **12**

**ప్రతిపదార్థం:** విను= ధర్మరాజా! శ్రద్ధగా ఆలకించుము; సత్త్వరజస్తమములు= ఆ త్రిగుణాల; అనుసరణమువలనన్= వెంట తగులుకోవటం వలన; వివిధము+అగు= పలు రకాలైన; యోనిగణంబునన్= జాతులలోనికి; వెలసిన= అవతరించిన; ఆ తత్త్వము= ఆ అక్షరతత్త్వం; తనున్ చూడఁగ లేక= తనను తాను అవలోకించుకోలేక (గ్రహించుకోలేక); అవియ= ఆ జాతులే; తాను= నేను; అని= అనుకొని; ఉండున్= నివసిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** సత్త్వరజస్తమోగుణాలను అనుసరించటం వలన జన్మపరంపరలలోనికి జారిపోయిన ఆ అక్షరతత్త్వం తనను తాను తెలిసికొనలేక, అవే తాను అనుకొని వాటిలో నివాసం సాగిస్తూ ఉంటుంది.

**ఉ.** **సత్త్వరజస్తమోగుణవశస్థితి నక్షర మర్థ్యధర్మ సం**
**గిత్త్వము మధ్యకర్మతయుఁ గిల్బిషకృత్యమునొంది యొంది ది**
**వ్యత్వనరత్వగోమృగఖగాదిక తిర్యగనేక హీనజం**
**తుత్త్వములన్ సుఖంబులును దుఃఖములున్ నరకంబులుం గనున్.** **13**

**ప్రతిపదార్థం:** అక్షరము= అక్షర తత్త్వమనేది; సత్త్వరజస్తమో గుణవశస్థితిన్= సత్త్వగుణము - రజోగుణము - తమోగుణము అనే ఈ మూడింటికీ వశవర్తి అగుట వలన; వరుసగా - అర్థ్యధర్మసంగిత్త్వమున్= అర్థ్యమైన ధర్మాలతో కూడి ఉండటం అనే స్థితినీ (ఇది సత్త్వగుణ లక్షణం); మధ్యకర్మతయున్= పుణ్యాపాపాలు రెండింటినీ ఆచరించటమనే స్థితినీ (ఇది రజోగుణ లక్షణం); కిల్బిషకృత్యమున్= కేవలం పాపకార్యాలే చెయ్యటం అనే స్థితినీ (ఇది తమోగుణ లక్షణం); ఒంది+ఒంది= పూర్తిగా పొంది; దివ్యత్వ= దేవతాత్వంలో; నరత్వ= మానవత్వంలో; గోమృగఖగాదిక తిర్యక్+అనేక హీన జంతుత్త్వములన్= గోవు, మృగము, పక్షి మొదలైన తిర్యగ్జాతికి చెందిన అనేక నీచ జంతుత్వాలలో; సుఖంబులును= సుఖాలనూ; దుఃఖములున్= దుఃఖాలనూ; నరకంబులున్= నరకాలనూ; కనున్= అనుభవిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** సత్త్వగుణానికి వశవర్తి అయిన అక్షరతత్త్వం అర్థ్యధర్మాలను పొందీ ఆచరించీ దివ్యత్వంతో సుఖాలను అనుభవిస్తుంది. రజోగుణానికి వశవర్తి అయి పుణ్యాపాపాలను చెరిసగంగా ఆచరించి నరత్వం పొంది సుఖదుఃఖాలను

చెరిసగంగా అనుభవిస్తుంది. తమోగుణానికి వశవర్తి అయి కేవలం పాపకృత్యాలనే ఆచరించి పశుపక్ష్యాది జంతుత్వాన్ని పొంది నరకం అనుభవిస్తుంది.

**విశేషం:** ఈ పద్యమంతటా క్రమాలంకారమూ ఉంది. అలంకారం: క్రియాలంకారం,

**క. జనవర! శుక్లము లోహిత । మును గృష్ణమునైన వర్ణముల నక్షర మొం**
**దును సత్త్వరజస్తమముల । యనుసారంబున నవర్ణమయ్యు వికృతమై. 14**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ యుధిష్ఠిరా!; అక్షరము= అక్షరతత్త్వం; అవర్ణమయ్యున్= ఏ రంగూలేనిదే అయినప్పటికీ; సత్త్వరజస్తమముల+అనుసారంబునన్= సత్త్వరజస్తమోగుణాలను అనుసరించటం వలన; వికృతమై= మార్పునకు లోనై; శుక్లము= తెలుపూ; లోహితము= ఎరుపూ; కృష్ణమును+ఐన= నలుపూ అయిన; వర్ణములన్= రంగులను; ఒందును= పొందుతుంది.

**తాత్పర్యం:** అక్షరానికి స్వతస్సిద్ధంగా ఏ రంగూ లేదు. కానీ, అది ఈ త్రిగుణాలను అనుసరించటం వలన మార్పులకు లోనవుతుంది. సత్త్వగుణానుసారంగా తెలుపురంగునూ, రజోగుణానుసారంగా ఎరుపురంగునూ, తమోగుణానుసారంగా నలుపురంగునూ పొందుతుంది.

**క. అగుణంబయ్యును నిమ్మెయిఁ । బ్రగుణతఁ బ్రాపించు నక్షర మహంకార**
**స్థగుణంబూఁదిన, విడిచినఁ । దెగు నన్నియు నిర్వికారదీప్తంబునగున్.' 15**

**ప్రతిపదార్థం:** అక్షరము= అక్షరతత్త్వం; అగుణంబు+అయ్యున్= తనంతతాను నిర్గుణమే అయినా; అహంకారస్థగుణంబు= అహంకారగతమైన గుణాన్ని (అహంకారలక్షణాన్ని); ఊఁదినన్= పొందినట్లయితే; ఈ+మెయిన్= ఈ ప్రకారంగా; ప్రగుణతన్= ప్రకృష్టగుణవత్తను; ప్రాపించున్= పొందుతుంది; విడిచినన్= అహంకారస్థగుణాన్ని విడిచినట్టయితే; అన్నియున్= ఈ గుణాలన్నీ; తెగున్= తొలగిపోతాయి; నిర్వికార= నిర్వికారస్థితితో; దీప్తంబున్= ప్రకాశించేదికూడా; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** నిర్గుణమైన అక్షరతత్త్వం అహంకారగుణ సంయోగంవలన ఈ రకంగా ఇన్ని వికారాలను పొందుతున్నది. అహంకారగుణ సంయోగాన్ని విడిచిపెట్టేస్తే ఈ వికారాలు అన్నీ తొలగిపోతాయి. నిర్వికారస్థితితో మళ్ళీ ప్రదీప్తంకూడా అవుతుంది.'

**వ. అని చెప్పి వెండియు. 16**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= వసిష్ఠుడు ఇట్లా వివరించి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని చెప్పి, వసిష్ఠుడు మళ్ళీ (ఇట్లా వివరిస్తున్నాడు.)

**చ. 'క్రతువులఁ దీర్థయాత్రలను రాత్ర్యశనంబుల భూమిశయ్యలన్**
**వ్రతపరినిష్ఠలన్ జడలు వల్కలముల్ వివిధంపు దండముల్**
**సతతముఁ దాల్చుటన్ వపువు సంకటపాటునఁ బెట్టు నాద్యమ**
**చ్యుత మమలంబు దాను దనుఁ జూడక యక్షరమప్రబుద్ధమై. 17**

**ప్రతిపదార్థం:** ఆద్యము= తొట్టతొలిదీ; అచ్యుతము= చ్యుతి లేనిదీ; అమలంబు= మలినరహితమూ అయిన; అక్షరము= అక్షరతత్త్వం; తాను తనున్ చూడక= తనను తాను తెలుసుకోలేక; అప్రబుద్ధమై= జ్ఞానప్రబోధం లేనిదై; వపువున్= శరీరాన్ని

(ఉపాధిని); సంకటపాటునన్ పెట్టున్= కష్టపెడుతూ వుంటుంది; ఏ రకంగా అంటే - క్రతువులన్= యజ్ఞయాగాది క్రియలతోనూ; తీర్థయాత్రలను= పుణ్యక్షేత్రాలకు ప్రయాణం సాగించటాలతోనూ; రాత్రి+అశనంబులన్= రాత్రిపూట మాత్రమే భోజనం చెయ్యటాలతోనూ (ఏకభుక్తాలతోనూ); భూమిశయ్యలన్= కటికనేలమీద పవ్వళించటాలతోనూ; వ్రతపరినిష్ఠలన్= రకరకాల వ్రతాల నియమనిష్ఠలతోనూ; జడలు= జడలూ; వల్కలముల్= నారచీరలూ; వివిధంపు దండముల్= రకరకాల దండాలూ (సన్న్యాసాశ్రమానికి సూచకంగా ఉండే దండములు - కర్రలు, ఏకదండి, ద్విదండి, త్రిదండి ఇత్యాదిగా ఆశ్రమభేదాలు ఉన్నాయి); సత్వరమున్= ఎల్లవేళలా; తాల్చుటన్= ధరించటంతోనూ; వపువును సంకటపాటున పెడుతుంది.

**తాత్పర్యం:** తనను తాను తెలిసికొనలేక ఈ అక్షరతత్త్వం. 'క్రతువులు చేయటం, తీర్థయాత్రలకు తిరగటం, ఏకభుక్తాలు ఉండటం, నేలమీద పడుకొనటం - ఇంకా రకరకాల కఠోరవ్రత నియమాలు పాటించటం, జటావల్కల దండాలు ధరించటం - ఇత్యాది కార్యక్రమాలతో శరీరాన్ని సంకటపెట్టుతూ ఉంటుంది - ఇది అచ్యుతమే. అమలమే. కానీ, ఇప్పుడు అప్రబుద్ధం.

**క. అమృతము నభవము నజరము । నమలమునగు తన్ను మృతము నాహితభవమున్**
**సమధికజరమును మలసహి । తముగా నక్షరము మమతఁ దలఁచు నరేంద్రా! 18**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ధర్మరాజా!; అమృతము= చావులేనిది; అభవము= పుట్టుకలేనిది; అజరము= ముసలితనము లేనిది; అమలమున్= మలినము లేనిది; అగు= అయినటువంటి; అక్షరము= అక్షరతత్త్వం; తన్నున్= తననుతాను; మృతము= చావు కలదిగానూ; ఆహితభవమున్= పుట్టుక కలదిగానూ; సమధికజరమును= బాగా ముసలితనము (జరా) పొందేదిగానూ; మలసహితముగాన్= మలినసహితముగానూ; మమతన్= మమకారంతో; తలఁచున్= భావిస్తుంది.

**తాత్పర్యం:** అక్షరతత్త్వానికి చావూ పుట్టుకా ముసలితనం - ఇట్లాంటివి ఏమీలేవు. అది అమలం. కాని, ఉపాధిగతమైన మమకారంతో ఇవన్నీ తనకు ఉన్నాయని భావిస్తూ ఉంటుంది.

**ఆ. తనకుఁదాన బంధమొనరించుకొనియెడు । పొత్తినూలికాయ పురువు భంగి**
**నగుణమయ్యు సగుణతావాప్తిఁ బొందు న । క్షరము ప్రకృతి గుణము సంక్రమించి. 19**

**ప్రతిపదార్థం:** తనకున్ తాన= తనకుతానే; బంధము= బంధాన్ని; ఒనరించుకొనియెడు= కల్పించుకునేటువంటి; పొత్తినూలికాయ పురువుభంగిన్= సాలెపురుగువలె (సాలీడువలె); అక్షరము= అక్షరతత్త్వమనేది; అగుణమయ్యున్= స్వతస్సిద్ధంగా నిర్గుణమే అయినా; ప్రకృతి గుణము= ప్రధానము - ప్రకృతి - అవ్యక్తము అనబడే విక్రియ తాలూకు గుణం; సంక్రమించి= సంక్రమించటంచేత (అది కారణంగా); సగుణత+అవాప్తిన్= సగుణత్వప్రాప్తిని; పొందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** స్వతస్సిద్ధంగా నిర్గుణమైన అక్షరతత్త్వం తన విక్రియ అయిన ప్రకృతిగుణాలు తనకే సంక్రమించటం చేత తానుకూడా సగుణత్వాన్ని పొందుతున్నది. ఇది ఎట్లా ఉన్నదంటే సాలెపురుగువలె ఉన్నది. సాలెపురుగు తన పొత్తికడుపులోనుండి వచ్చిన నూలుదారాలతో తనకు తానే గూడు అల్లుకొని అందులో తానే బందీ అయిపోతుంది. (గుణము అంటే త్రాడు అనికూడా అర్థం ఉన్నది).

**విశేషం:** ఈ దృష్టాంతం వ్యాసుడు ఇచ్చినదే. "కోశకారో యథాత్మానం కీటః సమనురుంధతి! సూత్రతంతుగుణైర్నిత్యం తథాయ మగుణో గుణైః॥" (12-292-4). భావప్రకటన సమర్థంగా సాలీడుని 'పొత్తినూలికాయ పురువు' అన్నాడు తిక్కన.

**ఆ. అమలవాయుసేవనము నిర్మలత్వంబు । గలుగఁగాఁ బదాఱు కళలఁ బూర్ణుఁ**
**డగు సుధాంశు మాడ్కి నక్షర మమలినా । ఖండశాంతిబోధఘనత వెలుఁగు.' 20**

**ప్రతిపదార్థం:** అక్షరము= ఈ అక్షరతత్త్వం; అమల= స్వచ్ఛమైన; వాయు= వాయువుయొక్క; సేవనము= అనుభవం; నిర్మలత్వంబు= నిర్మలస్థితి; కలుగఁగాన్= (రెండూ) లభించినప్పుడు; పదాఱుకళలన్= పదహారు కళలతోనూ; పూర్ణుఁడు+అగు= పరిపూర్ణత్వాన్ని పొందిన; సుధాంశు మాడ్కిన్= అమృతకిరణుడైన చంద్రుడివలె; అమలిన= మలినరహితమూ; అఖండ= పరిపూర్ణమూ అయిన; శాంతి= శాంతియొక్క; బోధ= ఎరుకతో; కలిగిన ఘనతన్= గొప్పదనంతో; వెలుఁగున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** వాయుసేవనం వలన (మబ్బులు తొలగిపోయి) నిర్మలస్థితి పొంది పదారుకళలతో పరిపూర్ణుడైన చంద్రుడు ప్రకాశిస్తాడు. అట్లాగే అక్షరతత్త్వం కూడా అఖండశాంతి బోధతో మునుపటి గొప్పదనాన్ని మళ్ళీ పొంది విరాజిల్లుతుంది'.

**వ. అనిన విని జనకుం డమ్మునీశ్వరున కిట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెబుతూంటే; విని; జనకుండు; ఆ+మునీశ్వరునకున్= ఆ వసిష్ఠుడితో; ఇట్లు; అనియెన్= సంభాషించాడు.

**తాత్పర్యం:** అని చెప్పుతూంటే విని, జనకమహారాజు ఆ వసిష్ఠుడితో ఈ ప్రకారంగా అన్నాడు.

**క. 'వనితకుఁ బురుషునకుం దన । తనయంతన రూపొకం డొదవఁ జేయఁగ వి**
**న్ననువు గలుగ దొండొరువుల । నెనయుటఁగాని శ్రుతిమతము నిట్ల మహాత్మా! 22**

**ప్రతిపదార్థం:** మహాత్మా!; గొప్ప ఆత్మకలవాడా! వనితకున్= స్త్రీకీ; పురుషునకున్= పురుషుడికీ; ఒండొరులన్= ఒకరిని ఒకరు; ఎనయుటన్కాని= కలుసుకోవటం వల్లనే తప్ప; తనయంతన= విడివిడిగా; రూపు ఒకండు= ఒక రూపాన్ని; ఒదవన్ చేయఁగన్= ప్రసవించటమనేది; విన్ననువు= నేర్పు; కలుగదు= కనిపించలేదు; శ్రుతిమతమున్= వేదం అభిప్రాయంకూడా; ఇట్లు+అ= ఇలాగే ఉన్నది.

**తాత్పర్యం:** 'మహాత్మా! స్త్రీపురుషులు పరస్పరం కలిసికొంటే మరొక రూపాన్ని ఉత్పత్తి చేయగలుగుతున్నారే తప్ప, విడివిడిగా ఆ ఇద్దరిలో ఎవ్వరికీ ఆ నేర్పు లేదు అనేది లోకం చూస్తే తెలుస్తున్నది. వేదమూ ఇదే చెప్పుతున్నది.

**క. వనితగుణంబులు చర్మం । బును మాంసము శోణితంబుఁ బురుషగుణతతిన్**
**విను మజ్జాస్థిస్నాయువు । లనఘతపోవిభవ! యిట్లయని శ్రుతి సెప్పన్. 23**

**ప్రతిపదార్థం:** అనఘ= పవిత్రమైన; తపోవిభవ!= తపోవైభవం కలవాడా!; చర్మంబును= చర్మం; మాంసమున్= మాంసం; శోణితంబున్= రక్తం - ఇవి; వనితగుణంబులు= స్త్రీవల్ల శిశువుకు లభించే గుణాలు; పురుష= పురుషునియొక్క; గుణతతిన్= గుణసమూహం వలన; విను; మజ్జా= మూలగ; అస్థి= ఎముకలు; స్నాయువులు= ఆయువు పట్టులు (నెరకులు) అనేవి ఇవి పురుషుడివలన బిడ్డకు లభిస్తాయని; ఇట్ల+అని= ఇలాగనే; శ్రుతి= వేదం; చెప్పున్= చెప్పుతోంది.

**తాత్పర్యం:** ఓ తపస్వీ! చర్మం, మాంసం, రక్తం - అనేవి స్త్రీనుండీ, మజ్జ, ఎముకలు, స్నాయువులు - అనేవి పురుషుడినుండి బిడ్డకు లభిస్తాయి. వేదం ఇట్లాగే చెప్పుతున్నది.

**వ. అది తిర్యఙ్మనుష్యాదులైన సకల యోనులయందును జన్యంబులు ఆవహిల్లెడి తెఱంగు. 24**

**ప్రతిపదార్థం:** అది= ఈ పైని చెప్పినది; తిర్యక్+మనుష్య+ఆదులైన= పశుపక్షిమానవాదులైన; సకలయోనులయందును= సకలజాతులలోనూ; జన్యంబులు(జన్మంబులు)= పుట్టుకలు; ఆవహిల్లెడి తెఱంగు= జరిగే పద్ధతి.

**తాత్పర్యం:** పైన చెప్పినది పశుపక్షిమానవాదులైన సకలజాతులలోనూ పుట్టుకలు జరిగే పద్ధతి.

**క. నరనారీసంబంధము । వరుసగదా పురుషునకును బ్రకృతికి నన్యో**
**న్యరమణ మది సర్వజనన । కర మిట్టులు శ్రుతులు సెప్పుఁ గారుణ్యనిధీ! 25**

**ప్రతిపదార్థం:** కారుణ్యానిధీ!= ఓ కృపానిధీ!; పురుషునకును= పురుషుడికీ; ప్రకృతికిని= ప్రకృతికీ ఉండే; అన్యోన్యరమణము= పరస్పర ఆనందం, ఆకర్షణ అనేది; నరనారీసంబంధము వరుస కదా!= నరనారీ సంబంధం వంటిదే గదా!; అది= ఆ సంబంధం, ఆ ఆకర్షణ; సర్వజననకరము= సకలజీవరాశికీ జన్మకారణం; ఇట్టులు= ఇట్లాగని; శ్రుతులు= వేదాలు; చెప్పున్= చెబుతున్నాయి.

**తాత్పర్యం:** పురుషుడికీ ప్రకృతికీ ఉన్న ఆకర్షణ నరనారీసంబంధం వరసే. స్త్రీ పురుష సంబంధంవంటిదే ప్రకృతి పురుషుల పరస్పరాకర్షణ. అదే సమస్త ప్రాణికోటికీ జన్మహేతువు. వేదాలు ఇదే చెప్పుతున్నాయి.

**క. వినుము ప్రకృతి పురుషుల భం । గి నిరూపింపంగ ముక్తికిని మార్గంబుం**
**గను వెరవు లేకయున్నది । మునినాయక! యెఱుఁగఁ జెప్పు మోక్షపదంబున్. 26**

**ప్రతిపదార్థం:** మునినాయక!= ఓ మునీశ్వరా!; వినుము; ప్రకృతిపురుషుల భంగిన్= ప్రకృతి పురుషుల పద్ధతిని; నిరూపింపంగన్= నిరూపించినా (లేదా నిరూపించటానికీ); ముక్తికిని= మోక్షానికి; మార్గంబున్= మార్గాన్ని; కను= తెలిసికొనే; వెరవు= ఉపాయం; లేకఉన్నది= కనిపించటంలేదు (అందుచేత); మోక్షపదంబున్= ముక్తిమార్గాన్ని; ఎఱుఁగన్ చెప్పు= నాకు తెలిసేట్టు చెప్పుము.

**తాత్పర్యం:** ప్రకృతిపురుషుల పద్ధతిని స్పష్టంగా నిరూపించవచ్చును. అయినా ముక్తిమార్గం మాత్రం తెలియరావటం లేదు. కాబట్టి ఓ మునీశ్వరా! మోక్షమార్గం ఏమిటో స్పష్టంగా తెలియజేయుము.

**క. అనుపమ మజర మతీంద్రియ । మనామయ మనంత మమల మన వెలుఁగు నొకం**
**డని వేదశాస్త్రములచే । వినియుండుదు దానిఁ దెలుపవే కృప నాకున్.' 27**

**ప్రతిపదార్థం:** (ఓ మునినాయకా!) అనుపమము= సాటిలేనిదీ; అజరము= ముసలితనంలేనిదీ; అతీంద్రియము= ఇంద్రియాలకు అతీతమైనదీ; అనామయము= ఆమయాలు (నాశమూ రోగమూ) లేనిదీ; అనంతము= అంతులేనిదీ; అమలము= మాలిన్యం లేనిదీ; అనన్= ప్రసిద్ధిపొందిన; ఒకండు= ఒకానొకతత్త్వం; వెలుఁగున్= ప్రకాశిస్తోంది; అని; వేదశాస్త్రములచేన్= వేదాలవల్లా, శాస్త్రాలవల్లా; వినియుండుదున్= విని ఉన్నాను; దానిన్= ఆ తత్త్వాన్ని; నాకున్= నాకు (కూడా); కృపన్= దయతో; తెలుపవే!= (దయచేసి) తెలియజెప్పవా!

**తాత్పర్యం:** అనుపమాది లక్షణాలు కలిగి, ఒక తేజస్సు ఏదో ప్రకాశిస్తున్నదని వేదాలూ శాస్త్రాలూ చెప్పుతున్నాయి. అది విన్నాను. దయచేసి ఆ తత్త్వాన్ని నాకు తెలియజేయుము'.

**వ. అని వేఁడిన నమ్మునివరుండు సాదరంబుగా నతని కిట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; వేఁడినన్= జనకుడు ప్రార్థించేసరికి; ఆ+మునివరుండు= ఆ మునీశ్వరుడు - వసిష్ఠుడు; సాదరంబుగాన్= ఆదరంతో; అతనికిన్= ఆ జనకుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా ప్రార్థించగా వసిష్ఠుడు ఆదరంతో ఆ జనకుడికి ఈ విధంగా చెప్పాడు.

వసిష్ఠుఁడు జనకున కక్షరక్షర తత్త్వంబుల తెఱం గెఱింగించుట (సం. 12-291-13)

**సీ.** 'గ్రంథంబు ధరియింతు గాని నీ కర్థబో। ధంబు లే దర్థబోధవ్యపేత
మగు గ్రంథధారణ మప్రయోజన మర్థ। నిశ్చయ మెఱిఁగింతు నిపుణబుద్ధి
నవధరింపుము సాంఖ్య మనుసరించును యోగ। తంత్రంబు నదియును దాని తెరువు
నొందుఁ గావున సాంఖ్యయోగంబు లేకంబ। యని కంద్రు ప్రాజ్ఞులు మనుజనాథ!

**తే.** సాంఖ్యమునకు యోగమునకు జనని శ్రుతియ। పురుషవనితానపుంసకంబు లనఁ బ్రకృతి
లింగములు గల నాత్ముం డలింగుఁ డతనిఁ। జెంద దది యెద్దియును నని చెప్పు శ్రుతులు. 29

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ఓ జనకమహారాజా!; గ్రంథంబున్= తత్త్వశాస్త్ర గ్రంథాన్ని; ధరియింతు(వు)కాని= కంఠస్థం చేస్తావే కానీ; నీకున్= నీకు; అర్థబోధంబులేదు= అర్థావగాహన లేదు; అర్థబోధ= అర్థజ్ఞానంతో; వ్యపేత= విరహితమైన; గ్రంథధారణ= పుస్తకపఠనం; అప్రయోజనము= నిష్ఫలం; అర్థనిశ్చయము= అర్థనిర్ణయాన్ని; ఎఱిఁగింతున్= తెలియజేస్తాను; నిపుణబుద్ధిన్= నేర్పుగల ధీశక్తితో; అవధరింపుము= శ్రద్ధగా ఆలకించుము; సాంఖ్యమున్= సాంఖ్యశాస్త్రాన్ని; యోగతంత్రంబు= యోగశాస్త్రం; అనుసరించును= అనుసరిస్తుంది; అదియును= ఆ సాంఖ్యంకూడా; దాని తెరువున్= యోగశాస్త్రపద్ధతిని; ఒందున్= అనుసరిస్తుంది; కావునన్= కాబట్టి; సాంఖ్యయోగంబులు= సాంఖ్యమూ, యోగమూ అనేవి; ఏకంబు+అ+అని= ఒకటే అని; ప్రాజ్ఞులు= పండితులు; కంద్రు= దర్శిస్తున్నారు - భావిస్తున్నారు; సాంఖ్యమునకున్= ఈ సాంఖ్యానికీ; యోగమునకున్= ఆ యోగశాస్త్రానికీ; జనని= తల్లి (ఆవిర్భావ ప్రదేశం); శ్రుతి+అ= వేదమే; పురుషవనితా నపుంసకంబులు+అనన్= పురుషుడు, స్త్రీ, నపుంసకం అని; ప్రకృతి లింగములు= ప్రకృతి సిద్ధమైన లింగాలు; కలవు= ఉన్నాయి; ఆత్ముండు= ఆత్ముడుమాత్రం; అలింగుఁడు= లింగరహితుడు; అతనిన్= ఆత్ముడిని; అది ఎద్దియును= స్త్రీ పుం నపుంసకలింగాలలో ఏ ఒక్కటీకూడా; చెందదు= పొందదు; అని= అని; శ్రుతులు= వేదాలు; చెప్పున్= చెబుతున్నాయి.

**తాత్పర్యం:** 'మహారాజా! నీవు తత్త్వశాస్త్ర గ్రంథాలు ధారణచేస్తున్నావే తప్ప వాటి అర్థం నీకు అవగాహనకు రాలేదు. అర్థం తెలియని చదువు వ్యర్థం. అర్థనిశ్చయాన్ని నేను చెప్తున్నాను. శ్రద్ధగా ఆలకించుము. సాంఖ్యయోగశాస్త్రాలు ఒకదానిని ఒకటి అనుసరిస్తూ ఉంటాయి. అందుకే అవి అభిన్నాలు, ఒక్కటే అని ప్రాజ్ఞులు గుర్తించారు. ఈ రెండింటికీ వేదమే జన్మస్థానం, అదే ఆధారం. ప్రకృతిలో మూడు లింగాలు ఉన్నాయి. అవి ప్రసిద్ధాలు. ఆత్మకు మాత్రం ఆ లింగాలు ఏవీ ఉండవు. ఇదికూడా వేదం చెప్పిన విషయమే.

**క.** విను బీజంబున బీజం। బును దేహమునందు దేహమును నింద్రియముల్
దనతనవలనం దానును। మనంబునకు మనసు పుట్టు మహితవిచారా! 30

**ప్రతిపదార్థం:** మహితవిచారా!= ఓ శ్రేష్ఠమైన ఆలోచన కలవాడా!; విను; బీజంబునన్= విత్తనం నుండి; బీజంబును= విత్తనమూ; దేహమునందున్= శరీరంనుంచి; దేహమును= శరీరమూ; ఇంద్రియముల్= ఇంద్రియాలు; తనతనవలనన్= ఒక్కొక్కదానినుంచి; తానును= తాను ఒక్కొక్కటీ; మనంబునకున్= మనస్సుకు; మనసు= మనస్సూ; పుట్టున్= జన్మిస్తాయి.

**తాత్పర్యం:** ఓ ఆలోచనాపరుడా! విత్తనంనుండి విత్తనమూ, దేహంనుండి దేహమూ, ఇంద్రియాలనుండి ఇంద్రియాలూ, మనస్సునుండి మనస్సూ - ఇట్లా జన్మిస్తూ ఉంటాయి. తెలిసికొమ్ము.

**తే.** ఇతఁ డబీజుం డదేహుం డనింద్రియుండు। వీతమానసుఁడని యాత్మవిధము సెప్పు
వేదములు, భవదుఃఖ కర్మాదికములు। నాతనికి లేవు నిర్గుణుం డగుటఁ జేసి. 31

ప్రతిపదార్థం: ఇతఁడు= ఈ ఆత్ముడు; అబీజుండు= బీజ విరహితుడు; అదేహుండు= దేహశూన్యుడు; అనింద్రియుండు= ఇంద్రియ రహితుడు; వీతమానసుఁడు= మనస్సులేనివాడు; అని= అని; ఆత్మవిధము= ఆత్మ తాలూకు స్వభావాన్నీ, విధానాన్నీ; వేదములు= వేదాలు; చెప్పున్= చెబుతున్నాయి; నిర్గుణుండు= గుణరహితుడు; అగుటన్+చేసి= అవ్వటంవలన; ఆతనికిన్= ఆత్ముడికి; భవదుఃఖకర్మాదికములు= పుట్టుక, దుఃఖం, కర్మాచరణ మొదలైనవి; లేవు= ఉండవు.

తాత్పర్యం: ఆత్మకు బీజం లేదనీ, దేహం ఉండదనీ, ఇంద్రియాలు లేవనీ, మనస్సు కూడా ఉండదనీ వేదాలు వివరిస్తున్నాయి. ఆత్మ అనేది నిర్గుణం. అందుచేత దానికి భవబంధాలూ భవదుఃఖాలూ కర్మాచరణలూ - ఇట్లాంటివి ఏమీ ఉండవు.

**చ. ప్రకృతి యలింగ, తజ్జనితభంగులు లింగము, లట్టులయ్యు రం**
**జకగుణశీల లింగచయసంగతిఁ దాను సలింగమయ్యె, మూ**
**ర్తికలన లేక యుండియుఁ బరిస్ఫుట పుష్పఫలాదిసూచక**
**ప్రకరముచేత మూర్తమయి రంజిలదే ఋతువేళ సూడఁగన్. 32**

ప్రతిపదార్థం: ప్రకృతి= ప్రకృతి అనేది నిజానికి; అలింగ= లింగరహిత; తద్= ఆ ప్రకృతినుంచి; జనిత= పుట్టిన; భంగులు= వికారాలే; లింగములు= లింగాలు; అట్టులయ్యున్= అయినప్పటికీ; రంజక= రంజింపజేసే; గుణ= గుణమూ; శీల= స్వభావమూ ఉన్న; లింగచయ= ఆ లింగ సమూహంయొక్క; సంగతిన్= కలయికతో - సాంగత్యంతో; తానున్= ఆ ప్రకృతి తాను కూడా; సలింగ+అయ్యెన్= లింగసహిత అవుతోంది; మూర్తికలన లేకయుండియున్= ఒక రూపం అనేది లేకపోయినా; ఋతువేళ= వసంతాది ఋతుసమయం; పరిస్ఫుట= స్పష్టంగా కనిపించే; పుష్పఫల+ఆది= పువ్వులూ, పండ్లూ మొదలైన; సూచకప్రకరముచేతన్= సూచకసమూహంతో; మూర్తము+అయి= ఒక రూపం ధరించినదై; చూడఁగన్= మనం గమనించాలే కానీ; రంజిలదే= ప్రకాశించదా!

తాత్పర్యం: వసంతాది ఋతువులకు ఒక రూపమంటూ ఏదీ లేదు. అయినా ఫలపుష్పాలవలన ఆ ఋతువులకు ఒక రూపం ఏర్పడుతున్నది. ఆ చిహ్నాలతో ఆయా ఋతువులను మనం గుర్తిస్తున్నాం. అట్లాగే ప్రకృతికి కూడా ఒక లింగమంటూ ఏదీ లేదు. లింగాలన్నీ ప్రకృతినుండి పుట్టిన వికృతులే. అయితే ఆ లింగాల సాంగత్యంవలన ప్రకృతి కూడా సలింగ అవుతున్నది. నిజానికి అది అలింగ.

**క. కావున గుణములు ప్రకృతివ। యేవిధమునఁ జూచినను మహేశ్వరుని గుణి**
**త్వావేశము పొరయ దస। ద్భావము సద్భావమగునె? భరితవివేకా! 33**

ప్రతిపదార్థం: భరితవివేకా!= వివేకవంతుడా!; కావునన్= కాబట్టి; గుణములు= గుణములనేవి; ప్రకృతివి+అ= ప్రకృతివే; ఏ విధమునన్ చూచినను= ఏ విధంగా చూసినప్పటికీ; మహేశ్వరునిన్= మహేశ్వరుడిని (పరమాత్మను); గుణిత్వ+ఆవేశము= గుణాలు ఆవేశించటమనేది; పొరయదు= జరగదు; అసద్భావము= లేనిది; సద్భావము= ఉన్నది; అగునె?= అవుతుందా?

తాత్పర్యం: కాబట్టి గుణాలు ప్రకృతివే కానీ పరమాత్మవి కావు. అవి ఏ రకంగానూ మహేశ్వరుడికి అంటవు. లేనిది ఉన్నట్లు అవుతుందా! కాదు కదా! అట్లాగే ఇదీనూ.

**వ. ఇది యక్షర క్షర వివేకం, బేకం బనేకంబు దర్శనం బదర్శనంబు నిస్తత్త్వంబు దత్త్వం బపవర్గంబు వర్గంబని యక్షరక్షరంబుల పర్యాయ నిర్దేశంబు, లక్షరంబు నప్రబుద్ధులు గానరు, ప్రబుద్ధులగు సాంఖ్యులును యోగులును బుద్ధికిం బరంబై పంచవింశతితమంబైన యా తత్త్వంబు నాలోకింతు'రని చెప్పిన వసిష్ఠుతో నవ్వసుమతీవల్లభుండు. 34**

**ప్రతిపదార్థం:** ఇది= ఇంతవరకూ చెప్పింది; అక్షర - క్షర వివేకంబు= అక్షరమూ క్షరమూ అనేవాటి వివేకం (జ్ఞానం); ఏకంబు= ఏకమూ; అనేకంబు= అనేకమూ; దర్శనంబు= దర్శనమూ (కనబడేది); అదర్శనంబు= అదర్శనమూ; నిస్తత్త్వంబు= తత్త్వరహితమూ; తత్త్వంబు= తత్త్వమూ; అపవర్గంబు= అపవర్గమూ; వర్గంబు= వర్గమూ; అని= అని వరుసగా; అక్షర క్షరంబుల= అక్షర క్షరాల పర్యాయనిర్దేశంబులు= పర్యాయసంజ్ఞలు; అక్షరంబున్= అక్షర తత్త్వాన్ని; అప్రబుద్ధులు= ప్రబుద్ధులు కానివారు (జ్ఞానరహితులు); కానరు= తెలుసుకోలేరు; ప్రబుద్ధులు అగు= జ్ఞానులైన; సాంఖ్యులును= సాంఖ్యులూ; యోగులును= యోగులూ; బుద్ధికిన్ పరంబై= బుద్ధికి అందనిదై; పంచవింశతి తమంబైన= ఇరవై అయిదవదైన; ఆ తత్త్వంబున్= ఆ అక్షరతత్త్వాన్ని; ఆలోకింతురు= దర్శిస్తారు; అని; చెప్పినన్= చెప్పేసరికి; వసిష్ఠుతోన్= ఆ వసిష్ఠుడితో; ఆ+వసుమతీ వల్లభుండు= ఆ జనకమహారాజు.

**తాత్పర్యం:** ఇంతరకూ చెప్పినది అక్షరమూ - క్షరమూ అనే వాటి జ్ఞానం. ఏకమూ, అనేకమూ; కనబడేది, అదర్శనమూ; తత్త్వరహితమూ - తత్త్వమూ; అపవర్గమూ వర్గమూ అని వరుసగా అక్షర క్షరాల పర్యాయసంజ్ఞలు. అజ్ఞానులు అక్షరతత్త్వాన్ని గ్రహించలేరు. తెలిసికొనలేరు. జ్ఞానులైన సాంఖ్యులూ, యోగులూ, బుద్ధికి అందనిదై, ఇరవై అయిదవదైన ఆ అక్షరతత్త్వాన్ని దర్శిస్తారు' అని వసిష్ఠుడు చెప్పగా విని, ఆ జనకమహారాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **'కలదు నానాత్వ మేకత్వ మాత్మునకు న । విద్యయు విద్య నా విందు నదియు**
**నదియును నెఱిఁగింపు మక్షరక్షరభేద । మీవు సెప్పితి బుద్ధి యెంతయేని**
**నస్థిరగాన యయ్యవబోధమును మాసె । సాంఖ్యయోగంబుల చందములును**
**దెలియంగఁ జెప్పఁగా వలయు నా' కనుడు న । మ్ముని యిట్టు లనియె నమ్మనుజ పతికి**

**తే.** **'యోగమనఁగను ధ్యానంబు రాగరహిత! । యదియు వినుము ప్రాణాయామ మనఁగ నొకటి**
**మనసు నేకాగ్రతావృత్తి యనఁగనొకఁడు । పరఁగు సగుణత్వ నిర్గుణ భావగతుల.** 35

**ప్రతిపదార్థం:** ఆత్మునకున్= ఆత్మకు; నానాత్వము= అనేకత్వమూ; ఏకత్వము= ఏకత్వమూ; కలదు= ఉంది; అవిద్యయున్= అవిద్య; విద్య= విద్య; నాన్= అని పెద్దలు చెప్పగా; విందున్= విన్నాను; అదియున్ అదియున్= ఆ రెండింటినీ; ఎఱిఁగింపుము= నాకు తెలియజేయుము; అక్షర క్షర భేదము= అక్షర క్షరాల విభేదాన్ని; ఈవు= నీవు; చెప్పితి(వి)= చెప్పావు; బుద్ధి= ఈ బుద్ధి అనేది; ఎంతయేనిన్= ఎంతయినా; అస్థిర= అస్థిరం దీనికి స్థిరతలేదు; కానన్= కాబట్టి; ఆ+అవబోధనమునున్= ఆ వివేకంకూడా; మాసెన్= అంతరించిపోయింది; సాంఖ్యయోగంబుల= సాంఖ్యయోగాల; చందములునున్= తీరుతెన్నులను కూడా; నాకున్= నాకు; తెలియంగన్+చెప్పఁగాన్ వలయున్= తెలిసేట్లు నీవే చెప్పాలి; అనుడున్= అని అడిగేసరికి; ఆ+ముని= ఆ వసిష్ఠుడు; ఆ+మనుజపతికిన్= ఆ జనకమహారాజుకు; ఇట్టులు+అనియెన్= ఇట్లా చెప్పాడు; రాగరహిత!= రాగమూ మోహమూ అనేవి లేనివాడా!; యోగము+అనఁగను= యోగం అంటే; ధ్యానంబు= ధ్యానమే; వినుము= విను; అదియున్= అదికూడా; ప్రాణాయామము+అనఁగన్+ఒకటి= ప్రాణాయామమని ఒకటీ; మనసు+ఏకాగ్రతావృత్తి+అనఁగన్+ఒకఁడు= మనస్సు యొక్క ఏకాగ్రతాప్రవృత్తి అని మరొకటీ; సగుణత్వ - నిర్గుణభావగతులన్= సగుణనిర్గుణ పద్ధతులుగా; పరఁగున్= ఉన్నాయి.

**తాత్పర్యం:** 'మహర్షీ! ఆత్మకు ఏకత్వం అనేకత్వం ఉన్నది అంటున్నారు. అట్లాగే విద్య, అవిద్య - అనేవి ఉన్నాయి అంటున్నారు. ఇవి రెండూకూడా నాకు తెలిసేటట్లు చెప్పుము. అక్షర-క్షర విభేదం ఏమిటో చెప్పావు. కానీ, బుద్ధి ఎంతయినా అస్థిరం. అందుచేత ఆ వివేకం అప్పుడే రూపుమాసిపోయింది. సాంఖ్యయోగ పద్ధతులను కూడా మరింత స్పష్టంగా వివరించుము' అని జనక మహారాజు అడిగాడు. అప్పుడు వసిష్ఠుడు ఇట్లా అన్నాడు. 'ఓ రాగరహితుడా!

చెప్పుతున్నాను శ్రద్ధగా వినుము. యోగం అంటే ధ్యానం. అది ప్రాణాయామం అని ఒకటీ, మానసిక ఏకాగ్రత అని ఒకటీ - రెండు పద్ధతులలో ఉంటుంది. వీటిలో మొదటిది సగుణత్వ విధానం. రెండవది నిర్గుణత్వ పద్ధతి. ("ఏకాగ్రతా చ మనసః ప్రాణాయామస్తథైవ చ, ప్రాణాయామస్తు సగుణో నిర్గుణో మనసస్తథా" (12-294-8).)

**వ. తదనుష్ఠాన ప్రకారంబు సెప్పెద. 36**

**ప్రతిపదార్థం:** తద్= ఆ రెండింటికీ; అనుష్ఠాన ప్రకారంబు= అనుష్ఠాన పద్ధతి; చెప్పెదన్= చెప్పుతాను. తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** ఆ రెండింటికీ అనుష్ఠానపద్ధతి చెప్పుతాను వినుము.

**క. 'మలమూత్రంబుల కాలం । బుల భుక్తి కనంతరమున భూవర! యోగం**
**బలవఱుచు రెండు మార్గం । బులును నిషిద్ధంబు లండ్రు పూర్వాచార్యుల్. 37**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ జనకమహారాజా!; మలమూత్రంబుల= మలమూత్రాలు విసర్జించే; కాలంబులన్= సమయాల్లోనూ; భుక్తికిన్= భోజనానికి; అనంతరమునన్= తరువాత సమయంలోనూ; యోగంబు= ఈ యోగాన్ని; అలవఱుచు= అలవాటుగా చేసేటువంటి; రెండు మార్గంబులును= రెండు పద్ధతులూ; నిషిద్ధంబులు= నిషిద్ధాలు అని; పూర్వాచార్యుల్= పురాతన గురువులు; అండ్రు= అంటున్నారు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! మలమూత్రాలు విసర్జించే సమయంలోనూ, భోజనానికి తరువాతా ప్రాణాయామాదికమైన యోగాన్ని అనుష్ఠించటం సమంజసం కాదనీ, అది నిషిద్ధమనీ పూర్వాచార్యులు చెప్పుతున్నారు. ('మూత్రోత్సర్గే పురీషే చ భోజనే చ నరాధిప! త్రికాలం నాభియుంజీత శేషం యుంజీత తత్పరః' (12-294-9).)

**సీ. కొంచెపుటశనంబుఁ గొనుచు సంగంబులఁ । బాసి యింద్రియముల పజ్జఁ జనమి**
**శబ్దాదియైన విషయజాత మంతరం । గంబున సందడిగాక యుండ**
**సద్బుద్ధి దృఢమగు సాధనంబుగఁ గొని । మరలిచి యాత్మన మనసు నిలిపి**
**యపగతసంకల్పుఁడై యుపలస్థాణు । భంగికస్థితిఁ బనుపడి దివంబు**

**తే. రాత్రియును యోగసేవానురతి నివాత । దీపమును బోలె వెలుఁగు నాత్మీయమూర్తిఁ**
**గనుచు నెడనెడ నుపరమకాలములు స । నంగ వర్తించి యోగి యానంద మొందు. 38**

**ప్రతిపదార్థం:** కొంచెము+అశనంబు= అల్పపరిమాణంలో ఆహారాన్ని; కొనుచున్= స్వీకరిస్తూ; సంగంబులన్= తగులుకోళ్ళను; పాసి= వదిలించుకొని; ఇంద్రియముల పజ్జన్= ఇంద్రియాలవైపు; చనమి= వెళ్ళకపోవటం; శబ్దాదియైన= శబ్దము మొదలైన; విషయజాతము= విషయసమూహం; అంతరంగంబునన్= హృదయంలో; సందడికాక+ఉండన్= సందడి చెయ్యకుండా ఉండటం; సద్బుద్ధిన్= మంచి ధీశక్తిని; దృఢము+అగు= గట్టిదైన; సాధనంబుగన్+కొని= సాధనంగా స్వీకరించి; మనసున్= మనస్సును; మరలిచి= మళ్ళించి; ఆత్మన్+అ= ఆత్మలోనే; నిలిపి= నిలబెట్టి; అపగత సంకల్పుఁడై= ఏ రకమైన సంకల్పాలూ లేనివాడై; ఉపలస్థాణుభంగికస్థితిన్= రాయివలె నిశ్చలమైన (స్థాణు)భంగితో ఉంటూ; పనుపడి= పూనికతో వరుసగా; దివంబున్ రాత్రియును= పగలూ రాత్రికూడా; యోగసేవా+అనురతిన్= యోగానుష్ఠానం పట్ల గాఢవాంఛతో; నివాతదీపమును పోలెన్= గాలి లేనప్పుడు నిశ్చలంగా వెలిగే దీపం వలె; వెలుఁగు= ప్రకాశించే; ఆత్మీయమూర్తిన్= ఆత్మ(తాలూకు) రూపాన్ని; కనుచున్= దర్శిస్తూ; ఎడనెడన్= మధ్యమధ్యలో; ఉపరమకాలములు= విరామసమయాలు; చనంగన్= కడచిపోతూండగా; వర్తించి= యోగానుష్ఠానంతో వర్తించి; యోగి= యోగి అయినవాడు; ఆనందము+ఒందున్= ఆనందం పొందుతాడు.

**తాత్పర్యం:** కొలదిగా మాత్రమే ఆహారాన్ని భుజిస్తూ, కలయికలను వదలిపెట్టి, ఇంద్రియాలపై దృష్టి పెట్టకుండా, విషయసంబంధమైన ప్రలోభాలు లోలోపల గొడవచేయకుండా ఉండేటందుకు మంచి బుద్ధిబలాన్ని ఆయుధంగా గ్రహించి, మనస్సును ఆత్మలోనికి మరల్చి, రాయివలె ఏ సంకల్పాలూ లేకుండా, గాలిలేనప్పుడు నిశ్చలంగా ఉండే దీపంవలె ఆత్మస్వరూపాన్ని నిరంతరం దర్శించుకొంటూ యోగి ఆనందిస్తాడు.

**వ.** **ఇది యోగప్రకారంబు, సాంఖ్యంబు తెఱం గెఱింగించెద.** **39**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పినది; యోగప్రకారంబు= యోగ పద్ధతి; సాంఖ్యంబు తెఱంగు= ఇంక సాంఖ్య పద్ధతి; ఎఱింగించెదన్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** పైన చెప్పినది యోగ పద్ధతి. ఇక సాంఖ్యం గురించి వివరిస్తాను.

**తే.** **ప్రకృతివాదు లవ్యక్తంబు ప్రకృతియండ్రు। ప్రసవధర్మిణియైన యా ప్రకృతి దన్ను**
**బుద్ధ్యహంకారములుఁ బంచభూతములును। విషయములు నింద్రియములుఁగా విస్తరించు.** **40**

**ప్రతిపదార్థం:** ప్రకృతివాదులు= సాంఖ్యులు; ప్రకృతి= ప్రకృతి అనేది; అవ్యక్తంబు= అవ్యక్తము; అంద్రు= అంటారు; ప్రసవధర్మిణి+ ఐన= ప్రసవించే ధర్మం కలదైన; ఆ ప్రకృతి; తన్నున్= తనను తాను; బుద్ధి+అహంకారములు= బుద్ధి, అహంకారం; పంచభూతములును= పంచభూతాలూ; విషయములు= శబ్దాదివిషయాలూ; ఇంద్రియములున్= శ్రోత్రాది ఇంద్రియాలూ; కాన్= అయ్యేటట్లు; విస్తరించున్= విస్తరించుకొంటుంది.

**తాత్పర్యం:** మహారాజా! ప్రకృతివాదులైన సాంఖ్యులు ఈ ప్రకృతిని 'అవ్యక్తము' అంటారు. దీనికి ప్రసవించే ధర్మం ఉన్నది కాబట్టి తనను తాను బుద్ధిగా, అహంకారంగా, పంచభూతాలుగా, శబ్దాది విషయాలుగా, శ్రోత్రాది ఇంద్రియాలుగా (జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ) విస్తరించుకొంటుంది.

**వ.** **పురుషునివలన నివి యెల్లను గలుగుఁ బురుషుఁడింతకు నధిష్ఠాతయై యుండు.** **41**

**ప్రతిపదార్థం:** పురుషునివలనన్= పురుషుడివలన; ఇవి+ఎల్లనున్= పైని చెప్పిన విస్తరణ అంతా; కలుగున్= జరుగుతుంది; పురుషుఁడు= పురుషుడే; ఇంతకున్= దీనికంతటికీ, ఇంతకూ; అధిష్ఠాతయై ఉండున్= అధిష్ఠాతగా ఉంటాడు.

**తాత్పర్యం:** పురుషుడివలన ఈ విస్తరణ అంతా జరుగుతుంది. పురుషుడే దీని కంతటికీ అధిష్ఠాత.

**క.** **అనులోమంబున సృష్టియు। జనవర! ప్రతిలోమవృత్తి సంహారముఁ గ**
**ల్గును జనన ప్రళయంబులఁ। దనకు బహుత్వంబు నేకతయు శోభిల్లున్.** **42**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ రాజా!; అనులోమంబునన్= అనులోమ పద్ధతిలో; సృష్టియున్= సృష్టీ; ప్రతిలోమవృత్తిన్= ప్రతిలోమపద్ధతిలో; సంహారమున్= ఉపసంహారమూ (ప్రళయం లేదా వినాశం); కల్గును= ఏర్పడతాయి; జనన ప్రళయంబులన్= ఈ సృష్టి సంహారాలలో; తనకున్= ప్రకృతికి; బహుత్వంబున్= అనేకత్వమూ; ఏకతయున్= ఏకత్వమూ; శోభిల్లున్= వరుసగా ప్రకాశిస్తాయి.

**తాత్పర్యం:** ఓ జనకా! అనులోమంలో (పైనుండి క్రిందకు) సృష్టి జరుగుతుంది. ప్రతిలోమంలో (క్రిందినుండి పైకి) సంహారం జరుగుతుంది. సృష్టి జరుగుతున్న (జనన) సమయంలో ప్రకృతికి అనేకత్వం శోభిస్తుంది.

ప్రళయసమయంలో ఏకత్వం విరాజిల్లుతుంది. 'అనులోమేన జాయంతే, లీయంతే ప్రతిలోమతః (12-294--32). ఏకత్వం ప్రళయే చాస్య, బహుత్వం చ యదాసృజత్ (12-294-33)'.

**వ. క్షేత్రంబన నవ్యక్తంబనం బకృతియనం బ్రధానం బనం బరఁగు తత్త్వం బొక్కటియ. దానిన సత్త్వంబు నండ్రు, జీవుం డా క్షేత్రంబు నెఱింగినవాఁడు, కావున క్షేత్రజ్ఞుఁడును, నవ్యక్తపురంబున వసియించుటఁజేసి పురుషుండు, ననవెలుంగు, క్షేత్రక్షేత్రజ్ఞులు వేఱగుట ప్రస్ఫుటంబు, అవ్యక్తంబు జ్ఞానంబు, పురుషుండు జ్ఞేయుండు, ప్రకృతి సగుణాత్మక, పురుషుండు నిర్గుణుం డిది సాంఖ్యప్రకారం, బిట్లు పరిసంఖ్యానరూపంబునఁ జతుర్వింశతితత్త్వంబుల నేర్పరించి పురుషుండు దన్నుఁదాన చూడం గైవల్యంబు సిద్ధించు; నిట్టిది యపునరావృత్తిపదంబు, తత్త్వసమూహం బప్రబుద్ధం బది క్షరంబు, పంచవింశతితత్త్వ విశిష్టుండగు పురుషుండు ప్రబుద్ధుం డక్షరంబునం బరఁగు, నిత్తెఱం గెఱింగిన వా రెల్లవలనను నిర్భయులు. భూవర! యోగంబును సాంఖ్యంబును నక్షరంబును జెప్పితి. విద్యావిద్యలు సెప్పెద నాకర్ణింపుము. 43**

**ప్రతిపదార్థం:** క్షేత్రంబు+అనన్= క్షేత్రముఅనీ; అవ్యక్తంబు అనన్= అవ్యక్తము అనీ; ప్రకృతి అనన్= ప్రకృతి అనీ; ప్రధానంబు అనన్= ప్రధానము అనీ; పరఁగు= చెప్పబడుతున్న; తత్త్వంబు+ఒక్కటి+అ= తత్త్వం ఒక్కటే; దానిన= దానినే; సత్త్వంబున్+అండ్రు= సత్త్వము అని కూడా అంటారు; జీవుండు= జీవుడు; ఆ క్షేత్రంబున్= అవ్యక్తమైన ఆ ప్రకృతిని; ఎఱింగెడివాఁడు= తెలిసికొనే వ్యక్తి; కావునన్= కాబట్టి; క్షేత్రజ్ఞుఁడును= క్షేత్రజ్ఞుడు అనీ; అవ్యక్తపురంబునన్= ప్రకృతిలో; వసియించుటన్ చేసి= నివసించటం వలన; పురుషుండును+అనన్= పురుషుడు అనీ; వెలుంగున్= ప్రకాశిస్తున్నాడు; క్షేత్ర-క్షేత్రజ్ఞులు= ప్రకృతి పురుషులు; వేఱు అగుట= విభిన్నులు అనేది; ప్రస్ఫుటంబు= స్పష్టం; అవ్యక్తంబు= ప్రకృతి అనేది; జ్ఞానంబు= జ్ఞానం; పురుషుండు= పురుషుడు; జ్ఞేయుండు= తెలిసికొనదగినవాడు; ప్రకృతి= ప్రకృతి అనేది; సగుణాత్మక= సగుణస్వరూపం కలది; పురుషుండు= పురుషుడు; నిర్గుణుండు= నిర్గుణుడు; ఇది= ఇది అంతా; సాంఖ్యప్రకారంబు= సాంఖ్యపద్ధతి; ఇట్లు= ఇలా; పరిసంఖ్యానరూపంబునన్= పరిగణనరూపంలో; చతుర్వింశతి తత్త్వంబులన్= ఇరవై నాలుగు తత్త్వాలనూ; ఏర్పరించి= నిర్ధారించుకొని; పురుషుండు= పురుషుడు; తన్నున్ తాన= తనను తానే; చూడన్= దర్శిస్తే; కైవల్యంబు సిద్ధించున్= కైవల్యం (మోక్షం) సిద్ధిస్తుంది; ఇట్టిది= ఇటువంటిది; అపునరావృత్తిపదంబు= పునర్జన్మ లేని స్థానం; తత్త్వసమూహంబు= తత్త్వసమూహమనేది; అప్రబుద్ధంబు= ప్రబుద్ధంకానిది; అది= అది; క్షరంబు= క్షరతత్త్వం; పంచవింశతితత్త్వవిశిష్టుండు అగు పురుషుండు= ప్రబుద్ధుడు (జ్ఞాని); అక్షరంబు అనన్= అతడే అక్షరతత్త్వం అని; పరఁగున్= ఒప్పును; ఈ+తెఱంగు= ఈ పద్ధతిని; ఎఱింగినవారు= తెలుసుకొన్నవారు; ఎల్లవలనను= సమస్తంనుండి; నిర్భయులు= భయరహితులు; (వారికి దేనినుంచీ ఏ భయమూ ఉండదని); భూవర!= ఓ జనకరాజా!; యోగంబును= యోగమునూ; సాంఖ్యంబును= సాంఖ్యమునూ; అక్షరంబును= అక్షర (తత్త్వ)మునూ; చెప్పితిన్= నీకు వివరించాను; విద్యావిద్యలు= విద్య, అవిద్య అనేవి; చెప్పెదన్= తెలియజేస్తాను; ఆకర్ణింపుము= శ్రద్ధగా విను.

**తాత్పర్యం:** క్షేత్రం, అవ్యక్తం, ప్రకృతి, ప్రధానం అని చెప్పబడుతున్నది ఒక్కటే తత్త్వం. 'సత్త్వము' దానికి మరొక పేరు. అట్టి ప్రకృతిని ఎరిగినవాడు గనుక క్షేత్రజ్ఞుడుగా, ప్రకృతిలో ఉండటంవలన పురుషుడుగా జీవుడు ప్రకాశిస్తున్నాడు. ప్రకృతి వేరు, పురుషుడు వేరు అనేది స్పష్టం. ప్రకృతి జ్ఞానం. పురుషుడు తెలిసికొనవలసినవాడు. ప్రకృతికి గుణాలు ఉన్నాయి. పురుషుడు నిర్గుణుడు. ఇది సాంఖ్య పద్ధతి ఇట్లా పరిగణన రూపంగా ఇరవై నాలుగు తత్త్వాలనూ గ్రహించి దర్శించుకొంటే మోక్షం లభిస్తుంది. ఇది పునర్జన్మ లేని స్థితి. తత్త్వసమూహం వ్యక్తం కానిది. నాశవంతమైనది. పంచవింశతితత్త్వాలతో కూడిన పురుషుడు ప్రకటస్వరూపుడు, క్షరము లేనివాడు. ఈ విషయం తెలిసినవాళ్ళు నిర్భయంగా ఉండగలరు. రాజా! యోగమునూ, సాంఖ్యమునూ అక్షరతత్త్వాన్ని, నీకు బోధించాను. ఇక 'విద్య - అవిద్య' అనగా ఏమిటో వివరిస్తాను వినుము.

## విద్యావిద్యల ప్రకార నిరూపణము (సం.12-295-1)

**ఆ. విద్యయనఁగఁ బంచవింశతితమ తత్త్వ । మైన యక్షరంబు మానవేంద్ర!**
**విను మవిద్య నాఁగఁ జనుఁ బ్రధానము, దేట । పఱిచెదను విశేషభంగు లెల్ల. 44**

**ప్రతిపదార్థం:** మానవేంద్ర= మానవనాయకా!; విద్య+అనఁగన్= విద్య అంటే; పంచవింశతితమ తత్త్వము+ఐన= ఇరవై అయిదో తత్త్వమైన; అక్షరంబు= అక్షరమే; వినుము; ప్రధానము= ప్రకృతియే; అవిద్య నాఁగన్+చనున్= అవిద్య అనబడుతున్నది; విశేషభంగులు+ఎల్లన్= విశేష పద్ధతులన్నీ; తేటపఱిచెదను= స్పష్టపరుస్తాను.

**తాత్పర్యం:** ఓ మానవనాయకా! ఇరవై అయిదో తత్త్వమైన అక్షరమే విద్య. ప్రధానమూ అవ్యక్తమూ క్షేత్రమూ అనే పేర్లతో వ్యవహరింపబడే ప్రకృతియే అవిద్య. వీటిలో ఉన్న తక్కిన విశేషవిభాగాలు కూడా స్పష్టంగా చెప్పుతాను వినుము.

**వ. కర్మేంద్రియంబులకు బుద్ధీంద్రియంబు విద్య, బుద్ధీంద్రియంబులకు మనస్సును, మనస్సునకు భూతపంచకంబును, భూతపంచకంబునకు నహంకారమును, నహంకారమునకు బుద్ధియు, బుద్ధికి నవ్యక్తంబును, నవ్యక్తంబునకుం బంచవింశతితమ తత్త్వంబును విద్య'లని చెప్పి వెండియు నమ్మునివరుం డిట్లనియె. 45**

**ప్రతిపదార్థం:** కర్మేంద్రియంబులకున్= కర్మాచరణ చేసే ఇంద్రియాలకు; బుద్ధి+ఇంద్రియంబు= జ్ఞానేంద్రియం; విద్య; బుద్ధీంద్రియంబులకున్= జ్ఞానేంద్రియాలకు; మనస్సును= మనస్సు అనేది విద్య; మనస్సునకున్= ఈ మనస్సుకు; భూతపంచకంబును= పంచభూతాలు విద్య; భూత పంచకంబునకున్= పంచభూతాలకు; అహంకారమును= అహంకారమూ; అహంకారమునకున్= ఆ అహంకారానికి; బుద్ధియున్= బుద్ధి అనేదీ; బుద్ధికిన్= ఆ బుద్ధికి; అవ్యక్తంబును= అవ్యక్తము అనబడే ప్రకృతీ; అవ్యక్తంబునకున్= ఆ ప్రకృతికి; పంచవింశతితమతత్త్వంబును= ఇరవై అయిదవ తత్త్వమూ; విద్యలు= విద్యలు అవుతాయి; అని చెప్పి= ఇట్లా వివరించి; వెండియున్= తిరిగి; ఆ+మునివరుండు= ఆ వసిష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఇంకా ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** కర్మాచరణ చేసే ఇంద్రియాలకు జ్ఞానేంద్రియాలు, జ్ఞానేంద్రియాలకు మనస్సూ, మనస్సుకు పంచ భూతాలూ, పంచ భూతాలకు అహంకారమూ, అహంకారానికి బుద్ధీ, బుద్ధికి ప్రకృతీ, ఆ ప్రకృతికి ఇరవై అయిదవ తత్త్వమూ విద్యలు' అని చెప్పి, వసిష్ఠుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. 'క్షరము నక్షరమును ననఁ గలుగు రెంటి । నేర్పఱిచి మున్ను సెప్పితి నింక నొకటి**
**సెప్పఁ గలదు సమగ్రవిశేషకలిత । మవహితుండవై విను విదేహాధినాథ! 46**

**ప్రతిపదార్థం:** విదేహాధినాథ!= విదేహరాజ్యధిపా - జనకమహారాజా!; క్షరము= క్షరతత్త్వమూ; అక్షరమును= అక్షరతత్త్వమూ; అనన్= అనే పేర్లతో; కలుగు= ఉన్నటువంటి; రెంటిన్= రెండింటినీ; ఏర్పఱిచి= విడమరిచి; మున్ను= ఇంతవరకూ; చెప్పితిన్= చెప్పాను; ఇంకన్+ఒకటి= మరొకటి; చెప్పన్= చెప్పటానికి; కలదు= ఉంది; సమగ్రవిశేషకలితము= అది పరిపూర్ణమైన విశేషంతో కూడినది; అవహితుండవై= సావధానుడవై; విను.

**తాత్పర్యం:** 'ఓ విదేహరాజా! క్షరమూ అక్షరమూ అనే తత్త్వాలను రెండింటినీ ఇంతవరకూ వివరించి చెప్పాను. ఇంకా చెప్పవలసింది మరొకటి ఉన్నది. అది సమగ్రవిశేషకలితం. సావధానుడవై వినుము.

**సీ. జీవుండుఁ బ్రకృతియు భూవర! యక్షర । క్షరము లీ రెంటిని క్షరము లనియు**
**నార్యులు సెప్పుదు రక్షరంబులు నందు । రాద్యంతరహితంబు లగుట యీశ్వ**
**రత్వంబుగల్గుట తత్త్వాదికము లనఁ । జనుట రెంటికి సదృశంబు సూవె**
**ప్రకృతిగుణంబులై పరఁగెడు మహదహం । కారాదికంబులఁ గలసినపుడు**

**ఆ. క్షర మనంగ వచ్చుఁ బురుషునిఁ ప్రకృతిఁ దా । నని తలంచుఁగాన, నదియుఁ బురుషుఁ**
**బొంద గుణవికారములు లేమి నిర్గుణ । మక్షరం బనంగ నగును దాని. 47**

**ప్రతిపదార్థం:** భూవర!= మహారాజా!; జీవుండున్= జీవుడూ; ప్రకృతియున్= ప్రకృతి అనేదీ; అక్షర క్షరములు= వరుసగా అక్షరమూ క్షరమూను; ఈ రెంటినిన్= ఈ రెండింటినీ; క్షరములు+అనియున్= కేవలం క్షరములు అని కూడా; ఆర్యులు= పెద్దలు; చెప్పుదురు= చెప్పుతుంటారు; అక్షరంబులున్ అందురు= అక్షరములు అని కూడా అంటారు; ఆద్యంత రహితంబులు అగుట= ఆదీ అంతమూ లేనివి కావటం; ఈశ్వరత్వంబు కల్గుట= ఈశ్వరత్వం ఉండటం; తత్త్వాదికములు+అనన్+చనుట= తత్త్వాదికాలు అని చెప్పటానికి తగినవి కావటం అనే ఈ లక్షణాలు; రెంటికిన్= జీవుడికీ, ప్రకృతికీ; సదృశంబు+చూవె= సమానం సుమా!; ప్రకృతిగుణంబులై= ప్రకృతిగుణాలుగా; పరఁగెడు= ఒప్పేటువంటి; మహత్+అహంకారాదికంబులన్= మహత్తు అహంకారం మొదలైనవాటితో; కలసినపుడు= కూడినప్పుడు(జీవుడు); ప్రకృతిన్= ప్రకృతిని; తాను+అని= తానే అని; తలంచున్గానన్= భావిస్తాడు కాబట్టి; పురుషునిన్= జీవుడిని; క్షరము అనంగన్ వచ్చున్= క్షరము అని కూడా అనవచ్చును; అదియున్= ఆ ప్రకృతికూడా; పురుషున్+పొందన్= జీవుడిని పొందినప్పుడు; గుణవికారములు= గుణసంబంధమైన వికారాలు; లేమిన్= లేకపోవటం వలన; నిర్గుణము= నిర్గుణమనీ; అక్షరంబు= అక్షరము అనీ; దానిన్= ఆ ప్రకృతిని; అనంగన్ అగును= చెప్పవచ్చును.

**తాత్పర్యం:** భూవరా! జీవుడిని అక్షరమనీ, ప్రకృతిని క్షరమనీ అంటారు. కొందరు పెద్దలు ఈ రెంటినీ 'క్షరములు' అన్నారు. మరికొందరు 'అక్షరములు' అన్నారు. ఆద్యంతాలు లేకపోవటం, ఈశ్వరతత్త్వాన్ని కలిగిఉండటం-ఇత్యాదులు జీవుడికీ ప్రకృతికీ ఉన్న సాదృశ్యాలు. మహదహంకారాది ప్రకృతిగుణాలను పొందినపుడు పురుషుడు (జీవుడు) తనను తాను ప్రకృతిగా భావిస్తాడు కనుక అతడిని 'క్షరము' అని కూడా అనవచ్చును. ఈ ప్రకృతి పురుషుడిని పొందినప్పుడు గుణవికారరహితంగా ఉంటుంది కాబట్టి అప్పుడు దానిని నిర్గుణమనీ అక్షరమనీ కూడా వ్యవహరించవచ్చును.

**వ. ఎప్పుడు పురుషుండు ప్రబుద్ధుం డయ్యె నప్పు డతండు. 48**

**ప్రతిపదార్థం:** ఎప్పుడు= ఎప్పుడయితే; పురుషుండు= జీవుడు; ప్రబుద్ధుండు+అయ్యెన్= ప్రబుద్ధుడు (జ్ఞాని) అవుతాడో; అప్పుడు; అతండు= ఆ జీవుడు.

**తాత్పర్యం:** జీవుడు ఎప్పుడయితే జ్ఞాని అవుతాడో అప్పుడు ఆ జీవుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. ఇంతకాలమేని యెఱుఁగక సంగాభి । భూతయగుచు నప్రబోధకలిత**
**యైనయట్టి ప్రకృతి యేనంటి నిస్సంగ । బోధమహిమఁగానఁ బోలదయ్యె. 49**

**ప్రతిపదార్థం:** ఇంతకాలమేని= ఇంతకాలమయినా; ఎఱుఁగక= తెలియక; సంగాభిభూతయగుచున్= సాంగత్యసహిత అవుతూ; అప్రబోధకలిత+ఐనయట్టి= అజ్ఞానసహిత అయినటువంటి; ప్రకృతి= ప్రకృతియే; ఏను+అంటిన్= నేను అనుకున్నాను; నిస్సంగ బోధమహిమన్= నిస్సంగమహిమ, బోధమహిమ (సాంగత్య రహితతత్త్వమూ, జ్ఞానసహితతత్త్వమూ) - అనేవాటిని; కానన్+ పోలదు+ అయ్యెన్= తెలుసుకోలేకపోయాను.

**తాత్పర్యం:** సాంగత్యసహితమూ జ్ఞానరహితమూ అయిన ప్రకృతియే నేను అని ఇంతకాలమూ తెలియక అనుకొన్నాను. నిస్సంగమహిమనూ జ్ఞానమహిమనూ గుర్తించలేకపోయాను. (అని జీవుడు అనుకొంటాడట).

**క. ప్రకృతికి నాకును నుదకము । నకు మత్స్యంబునకుఁ బోలె నైసర్గికమై**
**ప్రకటంబైనది వేర్పా । టకట! యహంకారవశత నది యే నంటిన్. 50**

**ప్రతిపదార్థం:** ప్రకృతికిన్= ప్రకృతినీ; నాకునున్= నాకూ; ఉదకమునకున్ మత్స్యంబునకున్+పోలెన్= నీటికీ చేపకూ వలె; నైసర్గికమై= సహజసిద్ధమై; వేర్పాటు= విభిన్నత; ప్రకటంబైనది= స్పష్టంగా ఉంది; అకట!= అయ్యో!; అహంకారవశతన్= అహంకారానికి వశుడిని అవటంవలన; అది= ఆ ప్రకృతి; ఏను+అంటిన్= నేనే అనుకొన్నాను.

**తాత్పర్యం:** (ప్రబుద్ధుడైన పురుషుడు ఇంకా ఇట్లా అనుకొంటాడట). నీటికీ చేపకూ వలె ప్రకృతికీ నాకూ విభిన్నత అనేది సహజసిద్ధమై స్పష్టంగా భాసిస్తూనే ఉన్నది. అయినా అయ్యో! అహంకారంవలన నేనే ఆ ప్రకృతి అనుకొన్నాను సుమా!

**విశేషం:** నీరూ చేపా వేరు వేరు అన్న దృష్టాంతాన్ని వ్యాసుడే ఇచ్చాడు. **మత్స్యోఽన్యత్వం యథా జ్ఞానాదుదకాన్నాభిమన్యతే । ఆత్మానం తద్వదజ్ఞానాదన్యత్వం చైవ వేద్మ్యహమ్ ॥** (12-295-25). అజ్ఞానంతో చేప వలను అనుసరించినట్టుగా పురుషుడు ప్రకృతివెంట పడతాడనికూడా వ్యాసుడు చెప్పాడు. 'మత్స్యో జాలం హ్యవిజ్ఞానా దనువర్తితవాం స్తథా' (12-295-23).

**క. ప్రకృతి గుణంబులఁ గొని బహు । వికృతపురూపముల నట్లు వెట్టిగొలిపె నే**
**నకలంకుండ నరూపుఁడఁ । బ్రకృతి దొఱఁగి నిలిచెదను నిరంజనమహిమన్. 51**

**ప్రతిపదార్థం:** ప్రకృతి= ప్రకృతి; గుణంబులన్ కొని= సత్త్వాది గుణాలను స్వీకరించి; బహు= పలురకాలయిన; వికృతపురూపములన్= రూపవికారాలతో; అట్లు= ఆ విధంగా; వెట్టిగొలిపెన్= వ్యామోహపరచింది; (నిజానికి) నేను; అకలంకుండన్= కళంకరహితుడను; అరూపుఁడన్= రూపరహితుడను; ప్రకృతిన్ తొఱఁగి= ప్రకృతి విడిపించుకుని (విడిచిపెట్టి); నిరంజనమహిమన్= నిరంజనమహిమతో (అహంకారమమకార రహితస్థితిలో); నిలిచెదను= నిలుస్తాను.

**తాత్పర్యం:** ప్రకృతి తన గుణవికారాలతో లోభపెట్టి ఇంతకాలమూ నన్ను వెర్రివాడిని చేసింది. నిజానికి నేను కళంకరహితుడను, రూపరహితుడను, ఈ ప్రకృతిని విడిచి నిర్మముడనూ, నిరహంకారుడనూ అయి శాశ్వతంగా నిలుస్తాను. అక్షరత్వం పొందుతాను.

**తే. ప్రకృతి సేసెనె యీ యపరాధ మరయ? । నాయదియకాక వే ఱొకండే? యసంగ**
**కలితుఁడగు నేను దానితోఁ గలియనేల? । కలిగె బహురూపములు దానఁగాదె నాకు. 52**

**ప్రతిపదార్థం:** ఈ అపరాధము= ఈ అపరాధాన్ని; ప్రకృతి చేసెనె?= నిజంగా ప్రకృతియే చేసిందా?; అరయన్= ఆలోచించి చూస్తే; నా+అదియకాక= ఇది నా అపరాధమే కాక; వేఱొకండే?= వేరొకటా?; అసంగకలితుఁడు+అగు= సాంగత్యరహితుడను అయిన; నేను= నేను(జీవుడు లేక పురుషుడు); దానితోన్= ఆ ప్రకృతితో; కలియన్+ఏల?= కలవటం ఎందుకు?; నాకున్= నాకు; బహురూపములు= అనేకరూపాలు; కలిగెన్= కలగటం; దానన్ కాదె!= దానివల్లనే కదా!

**తాత్పర్యం:** నిజంగా ఈ అపరాధం ప్రకృతివలననే జరిగిందా? కాదు. దోషమంతా నాదే. అసంగుడను అయిన నేను అసలు ప్రకృతితో ఎందుకు కలిశాను?అట్లా నేనై కలిసినందువలననే కదా ఈ అనేకరూపత కలిగింది నాకు!

**క. మమతంగాదే బహు జ । న్మములయ్యెడు! దీని విడిచి నానాయోని**
**భ్రమణంబుం బాసెద న । త్యమలుఁడ నగు నాకుఁ బ్రకృతి యాశ్రయ మేలా? 53**

**ప్రతిపదార్థం:** మమతన్ కాదె= మమకారం వల్లనే కదా; బహుజన్మములు+అయ్యెడున్!= బహుజన్మలు కలుగుతున్నాయి!; దీనిన్= ఈ మమకారాన్ని; విడిచి= పరిత్యజించి; నానాయోని భ్రమణంబున్= పలు జాతులలో జన్మించటమనే ఈ తిరుగుడును; పాసెదన్= తొలగించుకుంటాను, అతి+అమలుఁడన్+అగు= పూర్తిగా నిర్మలుడను అయిన; నాకున్= నాకు; ప్రకృతి ఆశ్రయము= ప్రకృతిని ఆశ్రయించటమనే ఈ లక్షణం; ఎలా?= ఎందుకూ?

**తాత్పర్యం:** మమకారంవలన బహుజన్మలు కలుగుతున్నాయి. దానిని వదలించుకొన్నాను - అంటే ఈ నానా జన్మభ్రమణం తొలగిపోతుంది. సహజంగా నేను (పురుషుడు - జీవుడు) నిర్మలుడను. ప్రకృతిని ఆశ్రయించటం అనే ఈ లక్షణం నాకెందుకు? అనవసరం.

**తే. ఎన్ని రూపులు గొనివచ్చి యెట్లు పొడవు । సూపెనేనియుఁ బ్రకృతినేఁ జూడ మమత**
**నా నహంకారమనఁ గల్గు వానిఁ జేర । నీక త్రోచినఁ బ్రకృతి దానెట్లు దోఁచు? 54**

**ప్రతిపదార్థం:** ఎన్నిరూపులు= ఎన్ని రూపాలను; కొని= ధరించి; వచ్చి= ప్రత్యక్షమై; పొడవున్+చూపెన్+ఏనియున్= విజృంభణను చూపించినా; ప్రకృతిన్= ఈప్రకృతిలో; ఏన్+చూడన్= నేను పరిశీలిస్తే; మమత+నాన్= మమకారం అనీ; అహంకారము+అనన్= అహంకారం అనీ; కల్గున్= రెండు ఉన్నాయి; వానిన్= ఆ రెండింటినీ; చేరనీక= దగ్గరకు రానివ్వకుండా; త్రోచినన్= పరిహరించినట్లయితే; ప్రకృతి= ఈ ప్రకృతి; తాను= అది; ఎట్లుతోఁచున్?= ఇంక ఎలా నన్ను వశపరచుకుంటుంది? (వశపరచుకోదు).

**తాత్పర్యం:** ఎన్ని రూపాలలో ఈ ప్రకృతి విజృంభించినా మమకారం, అహంకారం అనేవి రెండే దీని మూలతత్త్వాలు. ఇవి రెండూ పరిహరించగలిగితే ఇంక ఈ ప్రకృతి పురుషుడిని ఏమీ చేయలేదు.

**క. నిశ్చేతనయును నెంతయు । దుశ్చేష్టయునైన ప్రకృతి దొఱఁగి సముద్య**
**న్నిశ్చయవృత్తి నిరామయ । నిశ్చలనిర్మల పదైక నిరతుఁడ నగుదున్.' 55**

**ప్రతిపదార్థం:** నిశ్చేతనయున్= చైతన్యరహితమూ; ఎంతయున్= మిక్కిలి; దుశ్చేష్టయున్+అయిన= దుశ్చేష్టాసహితమూ అయిన; ప్రకృతిన్= ఈ ప్రకృతిని; తొఱఁగి= విడిచిపెట్టి; సముద్యత్= విజృంభిస్తున్న; నిశ్చయవృత్తిన్= నిశ్చయ ప్రవృత్తితో (నేను= నేను); నిరామయ= ఆమయ రహితమూ (రోగాదికాలు లేనిది); నిశ్చల= నిశ్చలమూ; నిర్మల= మలిన రహితమూ అయిన; పద+ఏక+నిరతుఁడన్= స్థానం పట్ల మాత్రమే ఆసక్తి కలవాడను; అగుదున్= అవుతాను.

**తాత్పర్యం:** నిశ్చేతనతా దుశ్చేష్టతలు ప్రకృతి లక్షణాలు. అటువంటి ప్రకృతిని విడిచిపెట్టివేయాలి. అప్పుడు నిశ్చయవృత్తితో నిరామయ నిశ్చల నిర్మలపదాన్ని పొందగలుగుతాను'.

**వ. అని యిట్లు పరబోధనంబునం జేసి క్షరంబగు నవ్యక్తంబు దొఱంగిన పంచవింశకుం దక్షరం బనం బరఁగు, నక్షరంబునకుం బరంబైన దానిం బెక్కండ్రెఱుంగరు, సాంఖ్యసూక్ష్మ త్వదర్శకులు గాంతురు, క్షరాక్షర పరంబు లప్రబుద్ధబుధ్యమాన బుద్ధంబులను నిర్దేశంబులు గలిగియుండుఁ, బరతత్త్వ నిర్దేశంబునం బొల్చు షడ్వింశకంబు బుద్ధంబును విమలంబును నప్రమేయంబును సనాతనంబునునై పంచవింశంబును జతుర్వింశంబునుం గనుచు వెలుంగు నని చెప్పి వెండియు. 56**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= ఈ ప్రకారంగా; పరబోధనంబునన్+చేసి= ఉత్తమ జ్ఞానంవలన; క్షరంబు+అగు= నశించేదైన; అవ్యక్తంబున్= ప్రకృతిని; తొఱంగిన= విడిచిపెట్టిన; పంచవింశకుండు= ఇరవై అయిదవ తత్త్వమైన పురుషుడు (జీవుడు); అక్షరంబు+అనన్= 'అక్షరము' అని; పరఁగున్= అలరారుతాడు; అక్షరంబునకున్= ఈ అక్షరతత్త్వానికన్నా; పరంబు+అయిన+దానిన్= ఉత్తమమైన దానిని (పైది) (నాశనము లేనివాడు); పెక్కంద్రు= చాలామంది; ఎఱుంగరు= ఎరుగరు; సాంఖ్యసూక్ష్మత్వ దర్శకులు= సాంఖ్యశాస్త్రంలో ఉన్న సూక్ష్మతత్త్వాన్ని గ్రహించగలిగినవారు మాత్రమే; కాంతురు= గ్రహిస్తారు; క్షర+అక్షర+పరంబులు= క్షరమూ, అక్షరమూ పరమూ అనే ఈ మూడూ; అప్రబుద్ధ+బుధ్యమాన+బుద్ధంబులు= అప్రబుద్ధమూ,(తెలుసుకోబడనిది) బుధ్యమానమూ (తెలుసుకొంటున్నది); బుద్ధమూ; (తెలుసుకోబడినది) అను= అనేటటువంటి; నిర్దేశంబులు= పేర్లు; కలిగియుండున్= కలిగిఉంటాయి; పరతత్త్వనిర్దేశంబునన్= పరతత్త్వం అనే పేరుతో; పొల్చు= ఉండేటటువంటి; షడ్వింశకంబు= ఈ ఇరవై ఆరవతత్త్వం; బుద్ధంబును= బుద్ధమూ (జ్ఞానసంపన్నం); విమలంబును= (మలినరహితం) విమలమూ; అప్రమేయంబును= కొలతకు అందనిదీ; అప్రమేయమూ; సనాతనంబును+ఐ= సనాతనమూ అయి; పంచవింశంబును= ఇరవై అయిదవ తత్త్వాన్నీ; చతుర్వింశంబును= ఇరవై నాల్గవతత్త్వాన్నీ; కనుచున్= దర్శిస్తూ; వెలుంగున్= ప్రకాశిస్తుంది; అని చెప్పి= అని వసిష్ఠుడు వివరించి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని ఈ విధంగా ఉత్తమ జ్ఞానం వల్ల నశించే ప్రకృతిని విడిచిపెట్టిన పురుషుడు (ఇరవై అయిదవతత్త్వం) అక్షరు డనబడతాడు. దీనికంటె పైన ఉన్న ఉత్తమతత్త్వాన్ని చాలామంది ఎరుగరు. సాంఖ్యులు తప్ప. క్షరుడు, అక్షరుడు, ఉత్తముడు; వీరు అప్రబద్ధులు (తెలుసుకోబడనివారు)ఇరవై ఆరవతత్త్వం పురుషతత్త్వం. వరుసగా ఇవి - తెలిసికొనబడనిది, తెలిసికొంటున్నది, తెలియబడినదీను, చివరిది (పరతత్త్వం) జ్ఞానసంపన్నం, శుద్ధం, కొలతకు అందనిదీ, శాశ్వతమైనదీను. ఇది ఇరవై అయిదవతత్త్వాన్ని, ఇరవై నాలగవతత్త్వాన్ని దర్శిస్తూ వెలుగొందుతుంది.

**క. 'విను దృశ్యంబు నదృశ్యం । బును నగు జీవ పరతత్త్వములు బ్రహ్మసమా**
**ఖ్యను నెగడుఁ బ్రకృతి కది లే । దనఘా! యక్షరము తెఱఁగు నభివర్ణింతున్. 57**

**ప్రతిపదార్థం:** అనఘా!= పవిత్రుడవైన జనకమహారాజా!; విను; దృశ్యంబున్= దృశ్యమూ; అదృశ్యంబును= అదృశ్యమూ; అగు= అయిన; జీవ-పరతత్త్వములు= జీవతత్త్వం, పరతత్త్వం అనేవి (ఈ జీవుడూ పరుడూ); బ్రహ్మసమాఖ్యను= బ్రహ్మ(తత్త్వం) అనే పేరుతో; నెగడున్= ఒప్పారుతుంటాయి; ప్రకృతికిన్= ప్రకృతికి; అది లేదు= ఆ పేరు లేదు; అక్షరము తెఱఁగున్= అక్షరతత్త్వంయొక్క పద్ధతిని; అభివర్ణింతున్= వివరిస్తాను.

**తాత్పర్యం:** దృశ్యమూ అదృశ్యమూ అయిన ఈ జీవతత్త్వపరతత్త్వాలకు 'బ్రహ్మము' అనే పేరుకూడా ఉన్నది. ప్రకృతికి అది లేదు. ఇంక అక్షరతత్త్వాన్ని వివరిస్తాను తెలిసికొనుము.

**ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ బరికించు జీవుండు । పరముఁ గాంచునపుడు ప్రకృతి సగుణ**
**తానిరూఢి యడఁగి తన్మయత్వము నొంది । జీవకేవలత్వసిద్ధి యొలయు. 58**

**ప్రతిపదార్థం:** ప్రకృతిన్= ప్రకృతిని; తొఱఁగి= విడిచిపెట్టి; తన్నున్= తనను తాను; పరికించు= దర్శించేటువంటి; జీవుండు= జీవుడు (పురుషుడు); పరమున్= పరతత్త్వాన్ని (ఇరవై ఆరవది); కాంచునపుడు= తెలుసుకొనేటప్పుడు; ప్రకృతి= ప్రకృతి తాలూకు; సగుణతానిరూఢి= సగుణత్వస్ఫూర్తి; అడఁగి= నశించి; తద్+మయత్వమున్ ఒంది= తన్మయత్వాన్ని పొంది; జీవకేవలత్వసిద్ధి= జీవుడియొక్క కేవలతా సిద్ధి (నేను ప్రకృతికాదు. కేవలమూ జీవుడిని అనే స్థితిని); ఒలయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ప్రకృతిని విడిచిపెట్టేసి, జీవుడు తనను తాను తెలిసికొని, పరతత్త్వాన్ని దర్శించేటప్పుడు ప్రకృతి తాలూకు సగుణత్వస్థితి నశించిపోతుంది. తన్మయత్వాన్ని పొంది ఈ పురుషుడు తన కేవల జీవతత్త్వసిద్ధిని గ్రహిస్తాడు.

**క. విను కేవలుఁడగు జీవుఁడు । దనుఁ బరముంగాఁగఁ జూచి తల్లీనత్వం**
**బున వెలుఁగు నది నిరామయ । మనంతమగు పదముసూవె యతులవివేకా! 59**

**ప్రతిపదార్థం:** అతులవివేకా!= సాటిలేని వివేకంకలవాడా!; విను; కేవలుఁడు+అగు+జీవుఁడు= కేవలత్వసిద్ధిని పొందిన జీవుడు; తనున్= తనను తాను; పరమున్+కాఁగన్= పరతత్త్వంగా; చూచి= దర్శించి; తద్+లీనత్వంబునన్= తన్మయత్వంతో; వెలుఁగున్= ప్రకాశిస్తాడు (పరతత్త్వమయుడు అవుతాడు); అది= ఆ స్థితి; నిరామయము= ఆ మయరహితమూ; అనంతము+అగు= అనంతమూ అయిన పదము+చూవె= స్థానం సుమా!

**తాత్పర్యం:** తన కేవలత్వాన్ని గుర్తించిన జీవుడు తనను తాను పరతత్త్వంగా దర్శించి తల్లీనుడవుతాడు. అదే నిరామయమూ అనంతమూ అయిన పదం సుమా!

**క. ఈ నెఱి పురుషునకుం గల । నానాత్వైకత్వములును నరనాయక! శా**
**స్త్రానూన దృష్టిఁ గనుఁగొనఁ । గా నగుఁ దాత్పర్యశుద్ధి కలితాత్మునకున్. 60**

**ప్రతిపదార్థం:** నరనాయక= ఓ జనకమహారాజా!; ఈ నెఱిన్= ఈ విధంగా (ఈ ఉపాయంతో); పురుషునకున్ కల= పురుషుడికి (జీవుడు) ఉన్న; నానాత్వ+ఏకత్వములును= అనేకత్వమూ ఏకత్వమూ అనేవి; శాస్త్ర+అనూనదృష్టిన్= శాస్త్రం తాలూకు మహోన్నత దృష్టితో; తాత్పర్యశుద్ధికలిత+ఆత్మునకున్= శ్రద్ధకలిగినవాడికి; కనుఁగొనఁగాన్+అగున్= తెలుసుకోవటం సాధ్యమవుతుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! పురుషుడికి సంబంధించిన ఏకత్వం, అనేకత్వం అనేవాటిని శాస్త్రమర్యాదతో ఈ విధంగా తెలిసికొనవచ్చును. శ్రద్ధ ఉన్నవాడు ఇవి గ్రహించగలుగుతాడు.

**క. అనఘా! మోక్షము తెఱఁ గిది । విను మోక్షణమిట్లు పంచవింశునకుఁ గాఁ**
**గనినది యతండు ప్రకృతిం । దనుగాఁ గొని తద్గుణములఁ దగులుట వలనన్. 61**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పావనుడా! విను; మోక్షము తెఱఁగు= మోక్షంతాలూకు పద్ధతి; ఇది= ఇదీ; ఇట్లు; మోక్షణము= (విడుదల) మోక్షం అనేది; పంచవింశునకుఁగాన్= ఇరవై అయిదవ తత్త్వమయిన జీవుడికోసమని; కనినది= ఏర్పడింది, దర్శింపబడింది; అతండు= ఆ జీవుడు (పురుషుడు); ప్రకృతిన్= ఈ ప్రకృతిని; తనున్+కాన్= తానుగా; కొని= సంభవించి, స్వీకరించి; తద్+గుణములన్= ఆ ప్రకృతిగుణాలలో (మమకారాహంకారాదుల్లో); తగులుటవలనన్= తగుల్కోవటంవలన (అతడికి వాటినుంచి మోక్షణం అవసరమయ్యింది అని అన్వయం.)

**తాత్పర్యం:** పరమపావనుడా! ఇది మోక్ష పద్ధతికి. పంచవింశుడైన పురుషుడికే మోక్షం అనేది. ఈ జీవుడు తనను ప్రకృతిగా భావించి దాని గుణాలలో తగుల్కొని ఉంటాడు కాబట్టి అతడికి వాటినుంచి మోక్షణం (విడుదల) అవసరమవుతుంది.

**తే. తగులువాసి షడ్వింశకత్వమునఁ గలియఁ । దనకు మును లేని కేవలత్వమును నిర్మ**
**లత్వ శుచితా స్వతంత్రత్వ సత్త్వపరత । లొందుఁ దద్ధర్మ సమవాయ మొలసి యధిప!' 62**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; తగులున్+పాసి= అహంకార మమకారాలనే ప్రకృతి గుణాల్లో తగుల్కొన్న స్థితిని విడిచిపెట్టి (ఈ జీవుడు); షడ్వింశకత్వమునన్= ఇరవై ఆరవ తత్త్వంలో (పరంలో); కలియన్= ఐక్యం పొందినట్టయితే; తనకున్= తనకు; మునులేని= అంతవరకూ లేని; కేవలత్వమును= కేవలత్వం; నిర్మలత్వ= నిర్మలత్వం; శుచితా= శుచిత్వం; స్వతంత్రత్వ సత్త్వపరతలు= స్వతంత్రత్వం, సత్త్వ పరత్వం అనేవి; తద్+ధర్మ+సమవాయము+ఒలసి= ఆ ధర్మసముదాయంతో ఐక్యం జెంది (అవిభాజ్యంగా); ఒందున్= కేవలత్వాదులను పొందుతాడు.

**తాత్పర్యం:** ప్రకృతితో తనకున్న తగులును విడిచిపెట్టి పురుషుడు ఇరవై ఆరవతత్త్వంతో కలిసినట్టయితే అతడు తనకు అంతకు ముందు లేని కేవలత్వనిర్మలత్వాది పరతత్త్వలక్షణాలను పొందుతాడు. వాటితో సమైక్యంచెందుతాడు'

**వ. అని యిట్లు ప్రబోధించి. 63**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= అని ఈ ప్రకారంగా; ప్రబోధించి= బోధపరచి - వసిష్ఠుడు ఇంకా కొనసాగిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా బోధించి, వసిష్ఠుడు ఇంకా ఇట్లా చెప్పాడు.

**క. 'శివమును బరమ బ్రహ్మము। నవికృతియు సనాతనంబు నగు పదమును భూ**
**ధవ! యెఱిఁగించితి నిర్భయుఁ। డవు గ మ్మలవఱపు మిది దృఢంబుగ నాత్మన్. 64**

**ప్రతిపదార్థం:** భూధవ!= ఓ రాజా!; శివమును= శుభప్రదమూ; పరమబ్రహ్మమున్= పరబ్రహ్మమూ; అవికృతియున్= వికారాలు లేనిదీ; సనాతనంబున్= సదాతనమూ (ఎల్లకాలమూ ఉండేది); అగు= అయిన; పదమును= స్థానాన్ని - పరమపదాన్ని; ఎఱిఁగించితిన్= నీకు తెలియజేశాను; ఇది= ఈ తత్త్వాన్ని; ఆత్మన్= నీ ఆత్మలో; దృఢంబుగన్= గట్టిగా; అలవఱుపుము= అలవరుచుకో; నిర్భయుఁడవు కమ్ము= భయరహితుడవు కమ్ము.

**తాత్పర్యం:** 'జనకమహారాజా! శివమూ, పరబ్రహ్మమూ, వికారరహితమూ, సనాతనమూ అయిన పదాన్ని తెలియజేశాను. దీనిని నీవు స్థిరచిత్తంతో అలవరచుకొమ్ము. అందువలన నిర్భయుడవు అవుతావు.

**తే. దీని నెఱిఁగించునపుడు భక్తియును శమము। దమము సంశ్రయమును వేదతత్పరతయుఁ**
**గలుగఁజూచి యెఱింగింపు కానివాని। కీకుమా విద్య పాత్రదానైక నిరతి 65**

**ప్రతిపదార్థం:** దీనిన్= ఈ విద్యను; ఎఱిఁగించునపుడు= నీవు ఎవరికైనా తెలియజెప్పాలనుకుంటే; భక్తియున్= భక్తి; శమము= అంతరింద్రియ నిగ్రహం; దమము= బాహ్యేంద్రియనిగ్రహం; సంశ్రయమును= అనన్యచిత్తంతో శరణాగతిగా ఆశ్రయించటం; వేదతత్పరతయున్= వేదాలపట్ల భక్తితాత్పర్యాలు; కలుగన్+చూచి= ఉండటాన్ని గమనించి కలవాడవై; పాత్రదాన+ఏక+నిరత= పాత్రుడికే దానం చెయ్యాలి అనే నియమం కలవాడా!; ఎఱింగింపు= అటువంటివాడికే తెలియజెప్పుము; కానివానికిన్= ఈ లక్షణాలు లేని అనర్హుడికి; విద్యన్= ఈ సాంఖ్యవిద్యను; ఈకుమా!= ఇవ్వకు సుమా!

**తాత్పర్యం:** మహారాజా! నీకు ఇంతవరకూ తెలియజెప్పిన ఈ విద్యను నీవు మరెవరికయినా తెలియజెప్పాలని-అనుకొంటే అవతలి వ్యక్తి అర్హతానర్హతలు గమనించి వ్యవహరించుము. భక్తీ, నిగ్రహం, సంశ్రయణం, వేదాలపట్ల గౌరవం - ఈ లక్షణాలు ఉన్నవాడికే ఉపదేశించుము. పాత్రత ఎరిగికదా దానం చేయుమన్నారు! ఈ లక్షణాలు లేని అపాత్రుడికి ఈ విద్యను ఉపదేశం చేయకుము సుమా!

**ఆ. అఖిల రత్నపూర్ణయగు వసుంధర యెల్ల। నొసఁగితేని నొసఁగు యోగ్యతాభి**
**యుక్తిలేనివాని కొసఁగకు మీ విద్య। తగిన పాత్రమైనఁ దడయ కిమ్ము.' 66**

**ప్రతిపదార్థం:** రాజా! అఖిల= సమస్తమైన; రత్న= రత్నాలతో; పూర్ణయగు= నిండినదైన; వసుంధర ఎల్లన్= భూమినంతటినీ; ఒసఁగితేనిన్ ఒసఁగు= ఇస్తే ఇమ్ము; యోగ్యతా+అభియుక్తి లేనివానికిన్= నిగ్రహాదియోగ్యతల కూడిక లేనివాడికి మాత్రం; ఈ విద్యన్= ఈ సాంఖ్య విద్యను; ఒసఁగకుము= ఇవ్వకు; తగిన పాత్రము ఐనన్= తగిన యోగ్యుడు (అర్హుడు) అయినట్టయితే; తడయక= ఆలస్యం చేయకుండా వెంటనే; ఇమ్ము= ఉపదేశించుము.

**తాత్పర్యం:** మహారాజా! యోగ్యతాయోగ్యతలు చూడకుండా ఎవడికి ఇవ్వాలనుకొంటే వాడికి సామ్రాజ్యమంతా ఇచ్చివేయుము. నేను కాదనను. కానీ, ఈ విద్యనుమాత్రం పైని పేర్కొన్న యోగ్యతలు లేనివాడికి దయచేసి ఎప్పుడూ ఇవ్వవద్దు. అర్హుడు అయినట్లయితే మరి ఆలస్యం చేయకుండా వాడికి ఉపదేశించుము'.

**క. 'అని చెప్పె, నియతుఁడై విని । జనకనృపాలుఁడు గృతార్థజన్ముం డయ్యెన్**
**మనుజేంద్రవర్య నీకే । వినిపించితిఁ దదితిహాస విధ మేర్పడఁగన్.' 67**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= ఈ ప్రకారంగా వసిష్ఠుడు చెప్పాడు; జనక నృపాలుఁడు= జనకమహారాజు; నియతుఁడై= నియమనిష్ఠలు కలవాడై; విని= అంతా శ్రద్ధగా విని; కృతార్థజన్ముండు= చరితార్థమైన జన్మకలవాడు; అయ్యెన్= అయ్యాడు; మనుజేంద్రవర్య!= ఓ రాజశ్రేష్ఠుడా ధర్మరాజా!; తద్= ఆ; ఇతిహాస= జనకవసిష్ఠులమధ్య జరిగిన వృత్తాంతంయొక్క; విధము= వరుస అంతా; ఏర్పడఁగన్= స్పష్టపడేట్టు; నీకున్= నీకు; ఏన్= నేను; వినిపించితిన్= వివరించాను.

**తాత్పర్యం:** జనకమహారాజు నియమనిష్ఠలతో వసిష్ఠుడు చెప్పినది అంతా విని జన్మ చరితార్థతను పొందాడు. ఓ ధర్మరాజా! ఆ జరిగిన కథ అంతా నీకు నేను స్పష్టంగా వివరించి చెప్పాను.'

**వ. అని పలికి భీష్ముఁడు పాండవాగ్రజున కిట్లనియె. 68**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; భీష్ముఁడు; పాండవ+అగ్రజునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**క. 'ఇది బ్రహ్మ వసిష్ఠునకున్ । సదయుండై చెప్పె నతఁడు నారదునకు సం**
**విదితంబు సేసె నమ్ముని । మదాత్మకుం దేటపఱిచె మహనీయకృపన్. 69**

**ప్రతిపదార్థం:** (ధర్మరాజా!) ఇది= ఈ సాంఖ్యరహస్యాన్ని; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; వసిష్ఠునకున్= వసిష్ఠుడికి; సదయుండై= దయ కలవాడై; చెప్పెన్= తెలియజెప్పాడు; అతఁడు= ఆ వసిష్ఠుడు; నారదునకున్= నారదమహర్షికి; సంవిదితంబున్ చేసెన్= ఎరుక పరిచాడు; ఆ+ముని= ఆ నారదముని; మద్+ఆత్మకున్= నా ఆత్మకు (అంతరంగానికి); మహనీయకృపన్= గొప్ప దయతో; తేటపఱిచెన్= స్పష్టపరిచాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! మొట్టమొదటిగా ఈ తత్త్వరహస్యాన్ని బ్రహ్మదేవుడు వసిష్ఠుడికి తెలియజేశాడు. వసిష్ఠుడు నారదుడికి వివరించాడు. ఆ నారదుడేమో దయతో నాకు ఉపదేశించాడు.

**క. ఏను వసిష్ఠవచనముల । కానెఱిఁగించితి మనంబు కలఁక విడిచి యీ**
**జ్ఞానం బలవఱుపుము పర । మానందప్రదము కౌరవాన్వయముఖ్యా! 70**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయ+ముఖ్యా!= కౌరవవంశంలో ప్రధానుడా!; ధర్మరాజా! ఏను= నేను; వసిష్ఠ వచనములు+అ కాన్= వసిష్ఠుని మాటలుగానే (అ కాన్= వలె); ఎఱిఁగించితిన్= నీకు తెలియజెప్పాను; మనంబు(యొక్క) కలఁకన్= దిగులును; విడిచి= విడిచిపెట్టి; ఈ జ్ఞానంబు= నేను ఇంతవరకూ ఉపదేశించిన ఈ విద్యను; అలవఱుపుము= అభ్యాసంలోకి తెచ్చుకొమ్ము; పరమ+ఆనంద ప్రదము= (ఇది) బ్రహ్మానందాన్ని (ఇస్తుంది) ఇచ్చేది.

**తాత్పర్యం:** పాండవాగ్రజా! నాకు నారదుడు ఉపదేశించిన ఈ విద్యను నీకు (జనక వసిష్ఠుల సంభాషణగా) వసిష్ఠుడి మాటలుగా తెలియజెప్పాను. మానసికమైన కలతను విడిచిపెట్టి, ఈ జ్ఞానాన్ని అలవరచుకొమ్ము. ఇది పరమానందాన్ని సమకూరుస్తుంది.

**క. క్షరమును నక్షరమును ద । త్పరమును నెఱిఁగితి విశోకభయమోహుఁడవై**
**కురువర! యా నిశ్శ్రేయస । కరప్రబోధంబు నూఁదు గాఢాదరతన్.' 71**

**ప్రతిపదార్థం:** కురువర!= ఓ కురువంశోత్తమా! ధర్మారాజా!; క్షరమును= క్షరతత్త్వం; అక్షరమును= అక్షరతత్త్వం; తద్ పరమును= వాటికంటే పై దయిన పరతత్త్వం - వీటిని; ఎఱిఁగితి(వి)= తెలుసుకున్నావు; విశోకభయమోహుఁడవై= శోకం, భయం, మోహం అనేవి విగళితమైపోయినవాడవై; ఆ= నేను వివరించిన; నిశ్శ్రేయసకర= మోక్షప్రదమయిన; ప్రబోధంబున్= జ్ఞానాన్ని; గాఢ+ఆదరతన్= మిక్కిలి ఆదరంతో; ఊఁదు(ము)= అవలంబించుము.

**తాత్పర్యం:** ఓ కురువరా! క్షర, అక్షర పరతత్త్వాల గురించి తెలిసికొన్నావు. శోకం, భయం, మోహం అనేవి నీకు పోయి ఉంటాయి. మోక్షప్రదమైన ఆ విద్యను గాఢమైన ఆదరంతో అవలంబించుము'.

**వ. అని చెప్పి వెండియు. 72**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఇలా వివరించి; వెండియున్= తిరిగి - భీష్ముడే ఇంకా ఇట్లా కొనసాగిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా వివరించి, తిరిగి ఇట్లా కొనసాగిస్తున్నాడు.

**సీ. 'వేఁట వేడుక నడవికిఁ జని వసుమంతుఁ । డనువాఁడు జనకుని తనయుఁడొక్క**
**చో భృగువంశతేజో వర్ధనుండగు । నొక మునీశ్వరుఁ జూచి యుచితవృత్తిఁ**
**జేరి వినమ్రుఁడై 'చిత్తానువృత్తిమై । నిహపరంబుల కెద్ది హితము సెప్ప**
**వే' యన్నఁ గృప నతండిట్లను - భూతహి । తాహితాచరణంబు లధిప! సౌఖ్య**

**ఆ. దుఃఖముల నొనర్చు దుర్వార తృష్ణ త । న్నిరసనంబు మేలు నరులు జుంటి**
**చవియకాని నెగులుఁ జఱి రయంబున నెక్కి । తారు విఱుగఁబడుటఁ దలఁప లేరు. 73**

**ప్రతిపదార్థం:** జనకుని తనయుఁడు= జనకుని కుమారుడైన; వసుమంతుఁడు+అనువాఁడు= వసుమంతుడు అనే వ్యక్తి; వేఁటవేడుకన్= వేటపట్ల ఉన్న వేడుకతో; అడవికిన్ చని= అరణ్యానికి వెళ్ళి; ఒక్కచోన్= ఆ అడవిలో ఒకచోట; భృగువంశతేజోవర్ధనుండు+అగు= భృగువంశ తేజస్సును వృద్ధి పరిచేవాడైన; ఒక మునీశ్వరున్= ఒక మునీశ్వరుడిని; చూచి= దర్శించి; ఉచితవృత్తిన్= తగిన పద్ధతితో (ప్రవర్తనతో); చేరి= సమీపించి; వినమ్రుఁడై= వినయంతో వంగినవాడై; చిత్త+అనువృత్తిమైన్= చిత్తాన్ని అనుసరించి; ఇహపరంబులకున్= ఇహపరాలకు; ఎద్ది= ఏది; హితము= హితమో; చెప్పవే= వివరింపవా'; అన్నన్= అని అడిగేసరికి; కృపన్= దయతో; అతండు= ఆ భృగువంశమునీశ్వరుడు; ఇట్లు+అనున్= ఇలా చెప్పాడు; అధిప!= రాజా! (జనకరాజపుత్రా!) వసుమంతుడా!; భూత= ప్రాణులకు-లేదా పంచభూతాలకూ; హిత= మేలు; అహిత= కీడు; ఆచరణంబులు= చెయ్యటాలు; సౌఖ్య - దుఃఖములన్= సౌఖ్యాన్నీ, దుఃఖాన్నీ; ఒనర్చున్= కలిగిస్తాయి; దుర్వార= వారింపరానిదైన; తృష్ణ= ఇచ్ఛకలిగి ఉండటం; తద్= అది (దానిని); నిరసనంబు= నిరసించటం; మేలు= హితం; నరులు= జీవులు; జుంటి= తేనెయొక్క; చవియకాని= రుచినేకానీ; నెగులున్= శ్రమనూ (దుఃఖాన్నీ); చఱి= కొండచరియను; రయంబునన్= వేగంగా; ఎక్కి= అధిరోహించి; తారు= తాము; విఱుగన్+పడుటన్= విరిగిపడిపోవటాన్నీ; తలఁపన్ లేరు= ఊహించలేరు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! జనకుడి కుమారుడైన వసుమంతుడు ఒకరోజున వేటకొరకు అడవికి వెళ్ళి అక్కడ ఒకచోట భృగువంశమునీశ్వరుడిని చూచి వినయంగా 'స్వామీ! ఇహపరాలకు హితం ఏదో తెలియచెప్పవా?' అని అడిగాడు. అప్పుడు ఆ మునీశ్వరుడు ఇట్లా అన్నాడు. 'వసుమంతుడా! మనం చేసే హితాహితకార్యాలు సౌఖ్యాన్నీ దుఃఖాన్నీ

ఇస్తాయి. (హితకార్యాలు సౌఖ్యాన్నీ, అహితకార్యాలు దుఃఖాన్నీ ఇస్తాయి). అందుచేత అవి చేయాలి - అనే తృష్ణను విడిచిపెట్టుకొనటం మంచిది. మానవులు ఎట్లాంటివాళ్ళంటే - తేనె రుచిమీద కోరికేకానీ దాన్ని సంపాదించటంలో ఉన్న శ్రమమీద ధ్యాస ఉండదు. దానికొరకు కొండచరియలు ఎక్కుతున్నాం అనుకొంటారే తప్ప ఆనక అక్కడనుండి జారిపడతాం - అనే విషయం తలచుకోరు.

**విశేషం:** 'దుర్వారతృష్ణతన్నిరసనంబు' అనేది వావిళ్ళవారి ప్రతిలో ఉన్నపాఠం. 'దుర్వారతృష్ణితన్నిరసనంబు' అనేది సంశోధితభారతప్రతిలో ఉన్న పాఠం. 'స్వాదుకాముక! కామానాం వైతృష్ణ్యం కిం న గచ్ఛసి (12-297-7)' కోరికలపట్ల వైముఖ్యం ఎందుకుపొందవు? - అనేది వ్యాసభారతం. తృష్ణతన్ లేదా తృష్ణితన్+నిరసనంబు అని విభజించినా అర్థం కిట్టించవచ్చును. దుర్వారతృష్ణ లేదా తృష్ణి+తన్నిరసనంబు అని సమాసాలుగా విభజిస్తే అన్వయం ఇంకా సులువుగా కుదురుతుంది. కానీ, అప్పుడు 'దన్నిరసనంబు' కావాలి. ఈ పాఠం ఎక్కడా లేదు. అందుచేత ఇక్కడ 'తత్' శబ్దాన్ని సమాసమధ్యంలో పూర్వావయవపరామర్శకంగా ప్రయోగించాడనటమే సమంజసం. దుర్వారతృష్ణ(ష్ణి)యది నిరసించుట - అన్న పద్ధతిలో సమాసం. తత్ - తావదాదులను వాక్యాలంకారాలుగా వాడటమూ సంస్కృతంలో ఉన్నది. అప్పుడు 'తృష్ణాతన్నిరసనంబు' అని ఉండవలసి వస్తుంది. అది ఆటవెలదిలో కుదరదు. కాబట్టి 'దుర్వారతృష్ణితన్నిరసనంబు' అన్న సంశోధితముద్రణ పాఠమే మేలుబంతి.

**క. ధర్మంబుఁ బరిజ్ఞానము । నిర్మలమతి నభ్యసించి నృప! యనిశంబున్**
**ధార్మికసంగతి గలిగినఁ । బేర్మి యుభయలోకముల నభిష్టుత్యమగున్.' 74**

**ప్రతిపదార్థం:** నృప!= ఓ వసుమంతుడా!; ధర్మంబున్= ధర్మాన్నీ; పరిజ్ఞానమున్= విద్యనూ; నిర్మలమతిన్= నిర్మలమైన మనస్సుతో(నూ); అభ్యసించి= అలవరచుకొని; అనిశంబున్= ఎల్లవేళలా (రేయింబవళ్ళు); ధార్మికసంగతి= ధార్మికుల సాంగత్యం (ధార్మికక్రియల సాంగత్యం); కలిగినన్= పొందినట్లయితే; పేర్మి= ఆ గొప్పదనం; ఉభయలోకములన్= ఇహ పరలోకాలలో; అభిష్టుత్యము+అగున్= కొనియాడదగినది అవుతుంది.

**తాత్పర్యం:** ఓ వసుమంతుడా! ధర్మాన్నీ, జ్ఞానాన్నీ నిర్మలమైన మనస్సుతో అభ్యసించాలి. ఎల్లవేళలా ధార్మికసాంగత్యం పెంపొందించుకొనాలి. అప్పుడు ఆ గొప్పదనం ఆ ప్రవర్తన ఇహపరలోకాలలో అభినందించబడుతుంది'
.

**వ. అని మఱియును. 75**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. బ్రాహ్మణ ప్రార్థితములైన పనులు సేయు । మిమ్ము ధనము పాత్రములకు నిచ్చి వగవ**
**కుండు, మక్రోధకామత్వ మొలయఁ జేయు । మతికి ధృతి సాలఁ గల్గుము మనుజనాథ! 76**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ఓ వసుమన్మహారాజా!; బ్రాహ్మణ= బ్రాహ్మణులచేత; ప్రార్థితములైన= కోరబడిన; పనులు= కార్యాలు; చేయుము= చెయ్యి; పాత్రములకున్= అర్హులకు; ధనము= ధనం; ఇమ్ము; ఇచ్చి= అట్లా దానంచేసి; వగవకుండుము= మరి బాధపడవద్దు; అక్రోధకామత్వము= క్రోధరహితత్వం - కామరహితత్వాలను; ఒలయన్ చేయు(ము)= పొందుము; మతికిన్= మదికి(అంతరంగానికి); ధృతి= ధైర్యాన్ని; చాలన్= అధికంగా; కల్గుము= కలిగించుకొమ్ము.

**తాత్పర్యం:** 'ఓ రాజా! బ్రాహ్మణులు కోరిన పనులు చేయుము. పాత్రత గుర్తించి ధనాదికం దానం చేయుము. చేసిన తరువాత 'అయ్యో! ఇచ్చేశానే' అని బాధపడకుము. క్రోధాన్నీ, కామాన్నీ విడిచిపెట్టుము. మనస్సుకు ధైర్యం పెంపొందించుకొమ్ము. ఇది చాలా ముఖ్యం.

**వ. ధృతిలేమింగాదె మహాభిషాఖ్యుండగు నృపముఖ్యుండు త్రివిష్టపంబుననుండి విభ్రష్టుండయ్యె! ధృత్యాలంబనంబునంగదా యయాతి యాపద నిస్తరించె!' 77**

**ప్రతిపదార్థం:** మహాభిష+ఆఖ్యుండు+అగు= మహాభిషుడు అనే పేరుగల; నృపముఖ్యుండు= రాజోత్తముడు; ధృతిలేమిన్+కాదె= ధృతి అనేది లేకపోవటంవలననే కదా; త్రివిష్టపంబుననుండి= స్వర్గంనుండి; విభ్రష్టుండు+అయ్యెన్!= పరిభ్రష్టుడయ్యాడు! (జారిపడ్డాడని); యయాతి= యయాతి మహారాజు; ధృతి+ఆలంబనంబునన్+కదా= ధృతిని అవలంబించటం వల్లనేకదా!; ఆపదన్= ప్రమాదాన్ని; నిస్తరించెన్!= కడచి గట్టెక్కగలిగాడు! (సం. 12-297-23).

**తాత్పర్యం:** మహాభిషుడనే రాజు ధైర్యం కోల్పోయే కదా స్వర్గభ్రష్టుడైనాడు! అదీ ధైర్యాన్ని పొందటంవలననే కదా! యయాతి ఆపదనుండి బయటపడ్డాడు!'

**క. అనిన విని యా నృపతి య । మ్ముని వచనము లూఁది కామమునకుం గ్రోధం**
**బునకుం దొలఁగించి తనదు । మనము ధృతికి ధర్మమునకు మరుగంజేసెన్.' 78**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పేసరికి; ఆ నృపతి= ఆ వసుమంతుడు; ఆ+మునివచనములు= ఆ భృగువంశమహర్షి మాటలను; ఊఁది= ఆధారం చేసికొని; తనదు మనమున్= తన మనస్సును; కామమునకున్= కామానికీ; క్రోధంబునకున్= క్రోధానికీ; తొలఁగించి= దూరంచేసి; ధృతికిన్= ధైర్యానికీ; ధర్మమునకున్= ధర్మానికీ; మరుగన్+చేసెన్= అలవాటు పడేటట్టు చేశాడు.

**తాత్పర్యం:** భృగువంశమహర్షి చేసిన ఉపదేశాన్ని ఆధారం చేసికొని ఆ వసుమంతుడు కామక్రోధాలను వదలిపెట్టి ధృతిధర్మాలను అలవాటు చేసికొన్నాడు.'

**వ. అని చెప్పినం బ్రియంబంది మందాకినీనందనుతో ధర్మనందనుండు 'ధర్మాధర్మవియుక్తంబును సర్వసంశయ విముక్తంబును జన్మమృత్యు రహితంబును నిత్యంబును శుచియును శివంబును నవ్యయంబును పరంబును ననాయాసంబును నగునట్టిదాని నెఱింగింపవే?' యని ప్రార్థించిన నతండు యాజ్ఞవల్క్య జనక సంవాదం బితిహాస రూపంబునం బ్రవర్తిల్లు నది వినిన భవదభ్యర్థితంబైన యర్థంబు ప్రతిభాసించు మఱియు వలయునవి యెఱుంగనగుం జెప్పెదనని పలికి యతని కిట్లనియె. 79**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని చెప్పేసరికి; ప్రియంబు+అంది= సంతోషించి; మందాకినీనందనుతోన్= గంగాపుత్రుడైన భీష్ముడితో; ధర్మనందనుండు= ధర్మరాజు; ధర్మ+అధర్మ+వియుక్తంబును= ధర్మాధర్మాలు లేనిదీ; సర్వసంశయ= సమస్త సంశయాలనుంచీ; విముక్తంబును= విడుదల పొందినదీ; జన్మమృత్యు రహితంబును= పుట్టుక చావులు లేనిదీ; నిత్యంబును= సదాతనమైనదీ; శుచియును= పరిశుభ్రమైనదీ; శివంబును= శుభప్రదమైనదీ; అవ్యయంబును= నశించనిదీ లేక మార్పులేనిదీ; పరంబును= పరము అని పిలువబడేదీ; అనాయాసంబును= దుఃఖరహితమైనదీ (క్లేశరహితమనిగానీ); అగునట్టి దానిన్= ఇటువంటి లక్షణాలు గల తత్త్వాన్ని; ఎఱింగింపవే?= తెలియజెప్పవా?; అని; ప్రార్థించినన్= ప్రార్థించేసరికి; అతండు= ఆ భీష్ముడు; యాజ్ఞవల్క్యజనక సంవాదంబు= యాజ్ఞవల్క్యుడూ, జనకుడూ - వీరిద్దరికీ మధ్య సాగిన సంభాషణ; ఇతిహాసరూపంబునన్= కథారూపంగా; ప్రవర్తిల్లును= ప్రసిద్ధికెక్కింది; అది= ఆ వృత్తాంతాన్ని; వినినన్= విన్నట్టయితే; భవత్= నీచేత; అభ్యర్థితంబైన= ప్రార్థించబడిన; అర్థంబు= విషయం; ప్రతిభాసించున్= నీకు అవగతమవుతుంది; మఱియున్= అంతేకాదు; వలయునవి= కావలసినవి అన్నీ; ఎఱుంగన్+అగున్= తెలుస్తాయి; చెప్పెదన్= ఆ ఇతిహాసం చెప్పుతాను; అని పలికి= అని చెప్పి; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు అనియెన్= ఇలా తెలియజేశాడు.

**తాత్పర్యం:** భీష్ము డింతవరకు చెప్పినదానికి సంతోషపడి ధర్మరా జతడితో 'ధర్మాధర్మాల విచారం లేనిదీ, అన్ని సంశయాలనూ పోగొట్టేదీ చావుపుట్టుకలు లేనిదీ, శుచి, శుభ్రత కలిగినదీ, శాశ్వతమైనదీ, మార్పులేనిదీ, 'పరము' అని పిలువబడేది, దుఃఖాన్ని పోగొట్టేదీ - అయినట్టి తత్త్వాన్ని బోధించు' మన్నాడు. దానికి బదులుగా 'నీ ప్రశ్నలన్నింటికి సమాధానం ఇదీ - యాజ్ఞవల్క్యజనక సంవాదాన్ని గూర్చి చెప్పుతాను' అంటూ ఆ వృత్తాంతాన్ని చెప్పసాగాడు.

### యాజ్ఞవల్క్య జనకరాజ సంవాదప్రకారము (సం.12-298-3)

**ఆ.** **వినుము సకలలోక విశ్రుత విజ్ఞాన । ఘనుని యాజ్ఞవల్క్యుఁడను మునీంద్రు**
**వినయ మొప్పఁ గాంచి వినతుఁడై మిథిలేశుఁ । డైన జనకనృపతి యతనితోడ.** **80**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! వినుము; సకలలోక= సమస్తలోకాల్లో; విశ్రుత= ప్రసిద్ధికెక్కిన; విజ్ఞానఘనునిన్= మహా విజ్ఞాని అయిన; యాజ్ఞవల్క్యుఁడు+అను+మునీంద్రున్= యాజ్ఞవల్క్యుడనే మునీశ్వరుడిని; వినయము+ఒప్పన్= వినయం అలరారేటట్టు; కాంచి= దర్శించి; వినతుఁడై= నమస్కరించినవాడై; మిథిలేశుఁడైన జనకనృపతి= మిథిలాపరిపాలకుడైన జనకమహారాజు; అతనితోడన్= ఆ యాజ్ఞవల్క్య మహర్షితో.

**తాత్పర్యం:** ధర్మరాజా! యాజ్ఞవల్క్యుడు సకలలోకాలలోనూ ప్రసిద్ధికెక్కిన మహాజ్ఞాని. ఒకరోజున జనకమహారాజు ఆ మహర్షిని దర్శించాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. ఇట్లా అడిగాడు.

**వ.** **ఇంద్రియంబులు నవ్యక్తంబును బ్రహ్మంబును బరంబును భూతసర్గ ప్రళయంబులును దత్కాల సంఖ్యలును దేటపఱిచి భవదీయ దయాళుత్వంబు నెఱపవే యనిన నమ్మునివరుం డమ్మహీవరున కిట్లనియె.** **81**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులును= జ్ఞానకర్మేంద్రియాలూ; అవ్యక్తంబును= ప్రకృతి; బ్రహ్మంబును= బ్రహ్మము అనబడేది; భూత సర్గ ప్రళయంబులును= పంచభూతాలూ, వాటి సృష్టి, వాటి ప్రళయం; తత్కాల సంఖ్యలును= వాటికి చెందిన కాలసంఖ్యలు; తేటపఱిచి= (వీటిని) నాకు స్పష్టంగా తెలియజేసి; భవదీయ= నీయొక్క; దయాళుత్వంబు= కృపాసహితత్వాన్ని (దయగలవాడవు అనటాన్ని); నెఱపవే= నిర్వహించవా; అనినన్= అని అభ్యర్థించేసరికి; ఆ+మహీవరునకున్= ఆ జనకమహారాజుకు; ఆ మునివరుండు= యాజ్ఞవల్క్యుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఇంద్రియాలు, ప్రకృతి, బ్రహ్మము, పంచభూతాలూ, వాటి సృష్టి, ప్రళయం, వాటి సంఖ్యను - వీటి నన్నిటినీ దయతో నాకు చెప్పవలెను' అని జనక మహారాజు అడుగగా, దానికి మునిశ్రేష్ఠుడైన యాజ్ఞవల్క్యుడు ఇట్లా సమాధాన మిచ్చాడు.

**సీ.** **'అధిప! సర్గముఁ బ్రళయంబు నవ్యక్తంబు । దానొనరించుఁ దత్కాల సంఖ్య**
**విను-కల్పములు పది దినమున, కంతియ । రజనికాలంబు, సర్గంబు పగలు**
**సేయు, రే ప్రళయంబు సెల్లించుఁ దొలుత న । శేషభూతములకు జీవనముగ**
**నోషధికల్పన మొనరించు, దానికై । హైరణ్యమైన మహాండమున వి**

**తే.** **ధాతఁ బుట్టించు, నతఁడు భూతములనెల్ల । జనన మొందించు, భూమ్యాది సారభూత**
**గంధముఖ్య గుణోత్కరగ్రాహకములు । శ్రోత్రముఖములు, దత్స్వామి సూవె మనసు.** **82**

**ప్రతిపదార్థం:** అధిప!= జనకమహారాజా!; సర్గమున్= సృష్టినీ; ప్రళయంబున్= ప్రళయాన్నీ (వినాశం); అవ్యక్తంబు= అవ్యక్తం అనబడే ప్రకృతి; తాన్= తాను; ఒనరించున్= కల్పిస్తుంది; తత్కాలసంఖ్య= వాటి కాలపరిమాణం (పరిగణన); విను= చెప్పుతున్నాను ఆలకించుము; దినమునకున్= పగటిపూటకు; కల్పములు= కల్పాలు; పది= పది; రజనికాలంబు= రాత్రి సమయంకూడా; అంతియ= అంతే - పదికల్పాలు; సర్గము= సృష్టి అనే దాన్ని; పగలు చేయున్= పగటిపూట నిర్వహిస్తుంది; రే= రాత్రిపూట; ప్రళయంబు= ప్రళయాన్ని; చెల్లించున్= నిర్వహిస్తుంది; తొలుతన్+అ= వీటి అన్నింటికంటే ముందే; అశేష భూతములకున్= అన్ని ప్రాణులకూ; జీవనముగన్= ఆధారంగా; ఓషధి కల్పనమున్= ఓషధుల సృష్టిని; ఒనరించున్= చేస్తుంది; దానికై= దానికోసమని; హైరణ్యమైన= హిరణ్యసంబంధమైన; మహాండమునన్= ఈ పెద్ద అండంలో - బ్రహ్మాండంలో; విధాతన్= విధాత అనబడే బ్రహ్మదేవుడిని; పుట్టించున్= సృష్టిస్తుంది; అతఁడు= ఆ విధాత; భూతములన్ ఎల్లన్= భూతాలను అన్నింటినీ (పంచభూతాలూ - సకలప్రాణులూ); జననము+ఒందించున్= పుట్టిస్తాడు; భూమి+ఆది= భూమ్యాకాశాది పంచభూతాలకూ; సారభూత= సారమైన; గంధముఖ్య= గంధశబ్దాదులైన; గుణ+ఉత్కర= గుణసమూహానికి; గ్రాహకములు= స్వీకారకాలు (గ్రహించేవి); శ్రోత్రముఖములు= ముక్కూ చెవీ మొదలైన ఇంద్రియాలు; మనసు= మనస్సు అనేది; తద్= ఆ ఇంద్రియాలకు; స్వామి చూవె= ప్రభువు సుమా!

**తాత్పర్యం:** 'జనకమహారాజా! సర్గమూ ప్రళయమూ అనేవాటిని అవ్యక్తమే ('ప్రకృతి - అహంకారం) సృష్టిస్తుంది. పదికల్పాలు ఒక పగలు. పది కల్పాలు ఒక రాత్రి. పగటిపూట సృజన, రాత్రిపూట ప్రళయం. అశేషప్రాణికోటికీ జీవనాధారంగా అన్నిటి కంటే ముందు ఓషధీసృష్టి జరుగుతుంది. దీనికొరకని ఈ బ్రహ్మాండంలో విధాతను సృష్టిస్తుంది. అత డేమో పంచభూతాలనూ సృష్టిస్తాడు. పృథివీ - అప్ - తేజో - వాయు - ఆకాశాలు పంచభూతాలు. గంధ - రస - రూప - స్పర్శ - శబ్దాలు వీటికి సారభూతమైన గుణాలు. ఈ గుణాలను ముక్కు- నాలుక - కన్ను - చర్మం- చెవి - అనే ఐదు ఇంద్రియాలు గ్రహిస్తాయి. గుణోత్కర గ్రాహకాలు ఇవి. ఈ ఇంద్రియాలకు మనస్సు ప్రభువు.

**విశేషం:** ఇంద్రియాలకు మనస్సు ప్రభువు అనటాన్ని వ్యాసుడు ఇంకా ఇట్లా వివరించాడు. ఇంద్రియాలు ఏమీ గ్రహించలేవు. గ్రహించేది మనస్సే. కన్ను చూస్తోంది అనుకుంటాం. కాదు. మనస్సే కన్నుతో చూస్తోంది. మనస్సు కనక వ్యాకులంగా ఉంటే చూస్తున్నా కన్ను చూడనట్టే. ఏమీ కనపడదు. మనస్సు ద్వారానే ఇంద్రియాలు అన్నీ ఆయాగుణాలను గ్రహిస్తున్నాయి. మనస్సు నిద్రపోతే ఇంద్రియాలు అన్నీ నిద్రపోతాయి. ఇంద్రియాలు నిద్రపోయినా మనస్సు మాత్రం నిద్రపోదు. అందుచేత మనఃప్రధానాలు ఇంద్రియాలు. **చక్షుఃపశ్యతి రూపాణి మనసా తు న చక్షుషా। మనసి వ్యాకులే చక్షుః పశ్యన్నపి న పశ్యతి । తథేంద్రియాణి సర్వాణి పశ్యన్తీత్యభిచక్షతే**

**(12-299-16). మనస్యుపరతే రాజన్ ఇంద్రియోపరమో భవేత్। న చేంద్రియోపరమే మనస్యుపరమో భవేత్ ॥ ఏవం మనః ప్రధానాని ఇంద్రియాణి విభావయేత్ । ఇంద్రియాణాం హి సర్వేషామీశ్వరం** (12-299-17,18). ఈ శ్లోకాల భావాన్ని తిక్కన ఈ తరువాతి పద్యంలో అందిస్తున్నాడు.

**వ. అది యెట్లంటేని. 83**

**ప్రతిపదార్థం:** అది= మనస్సే ఇంద్రియాలకు ప్రభువు అనటం; ఎట్లు+అంటి(వి)+ఏనిన్= ఎలాగ అన్నట్టయితే - విను.వివరిస్తున్నాను.

**తాత్పర్యం:** ఇంద్రియాలకు మనస్సే ప్రభువు అవటం వలన. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుటకును గనుటకును సా । ధనములయిన చెవియుఁ గన్నుఁ దనతనయంతన్**
**వినను౦ గానను నేర్చునె । మనఃప్రభావమునఁ గాక? మనుజాధీశా! 84**

**ప్రతిపదార్థం:** మనుజాధీశా!= ఓ జనకమహారాజా!; వినుటకును= వినటానికీ; కనుటకునున్= చూడటానికీ; సాధనములు+ఐన= సాధనాలైన (ఉపకరణాలైన ఇంద్రియాలు); చెవియున్= చెవీ; కన్నున్= కన్నూ; మనఃప్రభావమునన్ కాక= ఇదంతా మనస్సు

ప్రభావంతో కాకుండా తనతనయంతన్= తమంతతాము; వినను‌న్= వినటం; కానను‌న్= చూడటం; నేర్చునె?= చెయ్యగలవా?;(అవి తమంతతాము వినలేవు, చూడలేవు అని.)

**తాత్పర్యం:** ఓ మహారాజా! మనస్సు ప్రభావంతోనే తప్ప చెవి తనంత తాను వినలేదు, కన్ను తనంత తాను చూడలేదు. ఇట్లాగే తక్కిన ఇంద్రియాలు అన్నీను.

**తే.** **ఇంద్రియములెల్ల నట్టివ యెలసి యొండు । వలన మనసున్నఁ దమతమ వర్తనముల**
**నిగుడ నేరమి తెల్లంబు నృపవరేణ్య! । యిట్టు లగు టజ్ఞులకునైన నెఱుఁగవచ్చు.** **85**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= ఓ రాజోత్తమా!; ఇంద్రియములు+ఎల్లన్= ఇంద్రియాలు అన్నీ; అట్టివి+అ= అట్లాంటివే - మనస్సు అధీనంలోనే ఉంటాయి; ఎలసి= ఆసక్తమై; ఒండువలనన్= మరొకవిషయం వైపు; మనసు+ఉన్నన్= మనస్సు ఉన్నట్టయితే; తమ తమ వర్తనములన్= ఇంద్రియాలు తమ తమ వ్యాపారాల్లో; నిగుడన్ నేరమి= ప్రవర్తించలేకపోవటం (చొరలేకపోవటం, ప్రవేశించలేకపోవటం); తెల్లంబు= స్పష్టం; ఇట్టులు+అగుట= ఇట్లా ఉండటం (ఈ పరిస్థితి); అజ్ఞులకునైనన్= అజ్ఞులకుకూడా; ఎఱుఁగన్+వచ్చున్= తెలియవచ్చే విషయమే.

**తాత్పర్యం:** ఓ రాజా! ఇంద్రియాలన్నీ ఇట్లా మనఃప్రభావంతోనే ఉంటాయి. ఈ మనస్సు కనుక మరింకేదయినా విషయంలో ఆసక్తమై ఉన్నట్లయితే ఇంద్రియాలు ఏవీ కూడా తమతమ పనులను చేయలేవు. అజ్ఞానులు కూడా ఈ విషయాన్ని తేలికగా గ్రహించగలరు.

**తే.** **మనసు చేతివ యింద్రియ మహిమలెల్ల । నుపరతంబైన మనసుతో నుడిగి మడఁగు**
**నింద్రియము లుపరమ మొందెనేని దాన । మనసు మగుడదు విషయతృష్ణన చరించు.** **86**

**ప్రతిపదార్థం:** ఇంద్రియ మహిమలు+ఎల్లన్= ఇంద్రియాల శక్తులన్నీ; మనసుచేతివి+అ= మనస్సుచేతిలోవే (మనస్సుకి అధీనాలే); ఉపరతంబైన= వెనక్కుమళ్ళిన; మనసుతోన్= మనస్సుతోపాటు (ఇంద్రియమహిమలు కూడా); ఉడిగి= విరమించి; మడఁగున్= ఉపశమిస్తాయి; ఇంద్రియములు; ఉపరమము+ఒందెన్+ఏని= ఉపశమించినా; దానన్= దానివలన; మనసు= మనస్సు; మగుడదు= వెనక్కు మళ్ళదు; విషయతృష్ణన్+అ= ఆసక్తిగొన్న ఆ విషయం పట్ల తృష్ణతోనే; చరించున్= సంచరిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** రాజా! ఇంద్రియమహిమలన్నీ మనస్సు చేతిలోవే. మనస్సు కనుక విషయాసక్తినుండి వెనక్కు మళ్ళితే ఇంద్రియాలు అన్నీ దానితోపాటే వెనక్కు మళ్ళుతాయి. కానీ, ఇంద్రియాలు వెనక్కు మళ్ళినా వాటితోపాటు మనస్సుకూడా వెనక్కు మళ్ళుతుందని చెప్పలేము. మళ్ళదు. విషయతృష్ణలోనే అట్లాగే సంచరిస్తూ ఉంటుంది.

**క.** **కావున నింద్రియ చేష్టల । నేవలనికిఁ బోవ నీమి యింతకు ముఖ్యం**
**బై వడిగొను మనసు దిగువఁ । గావలయును మగుడ దీనిఁ గనుఁగొను మనఘా!** **87**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పవిత్రుడా!; కావునన్= కాబట్టి; ఇంద్రియచేష్టలన్= ఇంద్రియాల చేష్టలను; ఏ వలనికిన్= ఏ వైపునకూ; పోవన్+ఈమి= పోనివ్వకపోవటం; ఇంతకున్= ఇంతకూ; ముఖ్యంబై= ప్రధానమైనదై; వడిగొను= విషయాసక్తితో పరుగులుతీసే; మనసున్= మనస్సును; మగుడన్= వెనకకు మళ్ళేట్టు; తిగువఁగాన్ వలయున్= దిగలాగాలి; దీనిన్= ఈ విధాన్ని; కనుఁగొనుము= దర్శించుము, అభ్యసించుము.

**తాత్పర్యం:** అనఘా! ఇంద్రియాలనూ వాటి చేష్టలనూ నిగ్రహించటం అతిప్రధానం. విషయాసక్తమై పరుగులుతీసే మనస్సును వెనుకకు మళ్ళించాలి. ఇది గ్రహించి అభ్యసించుము.

వ. ప్రళయప్రకారంబు వినుము. రాత్రియగుటయు నవ్యక్తం బహంకృతి పురుషు బోధించిన నతండు పండ్రెండు మూర్తులు గైకొని రశ్మిజాలంబుల జరాయుజ ప్రభృతి సర్వభూతంబులను రూపుమాపినం గూర్మపృష్ఠంబునుంబోని పృథివి జలమయం బగు జలంబు లోకంబు లెల్లం దమమయంబకాఁ బేర్చి తన్నుం గాలాగ్ని మడియింపం గుదియుఁ బ్రజ్వల జ్జ్వాలాభీలం బగు నయ్యనలం బనిలంబుచేతం జెడు నెందునుం దానయై పరఁగు నమ్మహాబలు నాకసంబు మ్రింగు నతివితతంబగు నవ్వియత్తత్త్వంబు మనంబు గ్రసియించు మనంబు నయ్యహంకారాధిష్ఠిత పురుషుండు గబళించు నయ్యహంకృతి నవ్యక్తంబు లోఁగొను నిట్లు రేయివోయిన నెప్పటివిధంబు ప్రవర్తిల్లు. 88

**ప్రతిపదార్థం:** ప్రళయప్రకారంబున్= ప్రళయపద్ధతిని; వినుము; రాత్రి+అగుటయున్= రాత్రి కావటంతోనే; అవ్యక్తంబు= ప్రకృతి; అహంకృతిపురుషున్= అహంకారయుక్తుడైన పురుషుడిని; బోధించినన్= నిద్రలేపగా; అతండు= ఆ అహంకృతి పురుషుడు; పండ్రెండుమూర్తులు కైకొని= పన్నెండు సూర్యరూపాలు ధరించి; రశ్మిజాలంబులన్= కిరణసమూహాలతో; జరాయుజ+ప్రభృతి= గర్భజాతాలూ, అండజాతాలూ, స్వేదజాతాలూ; ఉద్భిజ్జాలూ అయిన; సర్వభూతంబులను= చతుర్విధ జీవరాశినీ; రూపుమాపినన్= నశింపజేస్తే; కూర్మపృష్ఠంబునున్+పోని= తాబేటి వీపువలె ఉండే; పృథివి= భూమి; జలమయంబు+అగున్= జలమయం అయిపోతుంది; జలంబు= ఈ నీరు; లోకంబులెల్లన్= లోకాలన్నీ; తమమయంబు+అ కాన్= జలమయాలే అయిపోయేట్టు; పేర్చి= విజృంభించి; తన్నున్= ఆ జలాన్ని; కాలాగ్ని= ప్రళయకాలాగ్ని; మడియింపన్= నశింపజేస్తే; కుదియున్= అంతరించిపోతుంది; ప్రజ్వలత్= అతిశయించి మండుతున్న; జ్వాలా= మంటలతో; ఆభీలంబు+అగు= భయంకరమైన; ఆ+అనలంబు= ఆ కాలాగ్ని; అనిలంబుచేతన్= అష్టాత్మకుడైన మహావాయువుచేత; చెడున్= నశిస్తుంది; ఎందునున్= ఎక్కడచూసినా; తానయై= తానే అయి; పరఁగు= సంచరిస్తున్న; ఆ+మహాబలున్= ఆ వాయువును; ఆకసంబు= ఆకాశము; మ్రింగున్= మింగేస్తుంది; అతి వితతంబు+అగు= అతి విస్తృతమైన; ఆ+వియత్‌తత్త్వంబున్= ఆ ఆకాశతత్త్వాన్ని; మనంబు= మనస్సు; గ్రసియించున్= కబళిస్తుంది; మనంబున్= మనస్సును; ఆ+అహంకార+అధిష్ఠిత పురుషుండు= ఆ అహంకృతిపురుషుడు; కబళించున్= మింగేస్తాడు; ఆ+అహంకృతిన్= ఆ అహంకారాన్ని; అవ్యక్తంబు= అవ్యక్తము అనబడే ప్రకృతి; లోఁగొనున్= కబళిస్తుంది; ఇట్లు= ఈ ప్రకారంగా; రేయి+పోయినన్= రాత్రిగడిస్తే; ఎప్పటివిధంబు= మళ్ళీ పూర్వపద్ధతి; ప్రవర్తిల్లున్= ప్రవర్తిస్తుంది.

**తాత్పర్యం:** (పగటిని సృష్టిగానూ, రాత్రిని ప్రళయంగానూ లోగడ (శాంతి - 6-82) చెప్పాడు.) రాత్రి అయ్యేసరికి అవ్యక్తం అహంకృతిపురుషుడిని ప్రబోధిస్తుందిట. అప్పుడు అతను పన్నెండు సూర్యరూపాలు గ్రహించి తన కిరణాలతో జీవరాశిని అంతటినీ నశింపజేస్తాడు. జీవరాశి నాలుగువిధాలు. గర్భాశయంనుండి పుట్టేవీ (జరాయుజములు), గుడ్డులనుండి పుట్టేవీ (అండజాలు), స్వేదంనుండి పుట్టేవి (స్వేదజములు), గింజలనుండి మొలకెత్తేవి (ఉద్భిజ్జాలు), ఈ మొత్తం జీవరాశిని ద్వాదశాదిత్యకిరణాలు నాశనం చేస్తాయి. అప్పుడు ఈ భూమి తాబేటి చిప్పవలె (కూర్మపృష్ఠం) అయిపోతుంది. అప్పుడు మహాప్రవాహంవలె నీరు వచ్చి ఈ భూగోళాన్ని ముంచివేస్తుంది. జలమయం చేసివేస్తుంది. కాలాగ్ని చెలరేగి ఆ నీటిని ఆవిరి చేసివేస్తుంది. మహావాయువును ఆకాశం మ్రింగివేస్తుంది. ఆకాశాన్ని మనస్సు కబళిస్తుంది. మనస్సును అహంకృతిపురుషుడు గ్రసిస్తాడు. అహంకారాన్ని అవ్యక్తం లోగొంటుంది. ఇదీ ప్రళయం. రాత్రి గడిస్తే మళ్ళీ అంతా మామూలే. పగటిపూట సృజన.

క. ప్రీతిగ నధ్యాత్మము నధి। భూతము నధిదైవతంబు భూవర! సంప్ర
ద్యోతితములుగాఁ జెప్పెద। నా తెఱఁగు ప్రబోధకారియగు నూహింపన్. 89

**ప్రతిపదార్థం:** భూవర!= జనకమహారాజా!; అధ్యాత్మము= ఆధ్యాత్మికమూ; అధిభూతము= ఆధిభౌతికమూ; అధిదైవతంబు= ఆధిదైవికమూ అనే వీటినిగురించి; ప్రీతిగన్= ప్రేమగా; సంప్రద్యోతితములు+కాన్= స్పష్టపడేటట్లు; చెప్పెదన్= చెబుతాను; ఆ తెఱఁగు= ఆ పద్ధతి; ఊహింపన్= ఆలోచిస్తే; ప్రబోధకారి+అగున్= నీకు జ్ఞానప్రదం అవుతుంది.

**తాత్పర్యం:** మహారాజా! అధ్యాత్మ, అధిభూత, అధిదైవతాలు ఏమిటో నీకు స్పష్టపరుస్తాను. అది నీకు కనువిప్పు కలిగిస్తుందని భావిస్తాను.

### అధ్యాత్మాధిభూతాధిదైవత ప్రకారము (సం.12-301-1)

**సీ.** **పాదపాయూపస్థపాణివాక్కులు విను । మధ్యాత్మములు దత్క్రమానుయుక్తి**
**గంతవ్యమును విసర్గంబు నానందంబుఁ । గర్తవ్యవక్తవ్యకములు నయ్యె**
**నధిభూతములు వాని కధిదైవములు వరు । సన విష్ణుమిత్త్రప్రజాపతులును**
**శక్రపావకులును జక్షువు జిహ్వయు । ఘ్రాణంబుఁ ద్వక్కు శ్రోత్రంబుఁ జూవె**

**తే.** **యనఘ! యధ్యాత్మములు రూపమును రసంబుఁ । జాలుపడ గంధసంస్పర్శ శబ్దములును**
**దదధిభూతంబు లధిదైవతములు సూర్య । జలమహీ వాయు దిశలండ్రు శాస్త్రవిదులు** 90

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; విను(ము); పాద, పాయు, ఉపస్థ పాణి, వాక్కులు= కాళ్ళు, గుదము, రహస్యావయవము, చేతులు, నాలుక ఇవి అయిదూ; అధ్యాత్మములు= అధ్యాత్మాలు; తద్+క్రమ+అనుయుక్తిన్= వాటివరుసలోనే; గంతవ్యమును= గమ్యం; విసర్గంబున్= విసర్జించదగిన మలమూత్రాదికం; ఆనందంబున్= ఆనందమును; కర్తవ్య= చేయదగినది; వక్తవ్యకములు= పలుకదగినది - ఇవి అయిదూ; అధిభూతములు= అధిభూతాలు; వానికిన్= ఆ అయిదింటికీ; వరుసన= అదే వరుసలో; విష్ణుమిత్త్ర ప్రజాపతులును= విష్ణువు, సూర్యుడు, ప్రజాపతి(బ్రహ్మ) అనేవారూ; శక్రపావకులును= ఇంద్రుడు, అగ్ని అనేవారూ మొత్తం అయిదుగురు; అధిదైవములు= అధిదైవతాలు; చక్షువు= కన్ను; జిహ్వయున్= నాలుక; ఘ్రాణంబున్= ముక్కు; త్వక్కు= చర్మం; శ్రోత్రంబున్= చెవి అనే ఈ అయిదూ; అధ్యాత్మములు+చూవె= అధ్యాత్మాలు సుమా!; రూపమును= రూపమూ; రసంబున్= రుచి; గంధ= వాసన; సంస్పర్శ= స్పర్శ; శబ్దములును= శబ్దమూ అనే ఈ అయిదూ; చాలుపడన్= వరుసగా; తద్= కన్ను మొదలైన వాటి కయిదింటికీ; అధిభూతంబులు= అధిభూతాలు; సూర్య= సూర్యుడూ; జల= నీరూ; మహీ= నేలా; వాయు= గాలీ; దిశలు= ఆకాశం అనే అయిదూ; అధిదైవతములు= పైవాటికి అధిదైవతాలు; శాస్త్రవిదులు= శాస్త్రవేత్తలు; అండ్రు= ఇట్లా చెబుతారు (దైవానికి అధీనంలో ఉండేవి).

**తాత్పర్యం:** కాళ్ళూ, గుదమూ, ఉపస్థ, చేతులూ, నాలుక - అనేవి అయిదూ అధ్యాత్మాలు. వీటికి గంతవ్యం, విసర్జనం, ఆనందం, కర్తవ్యం, వక్తవ్యం - అనేవి అయిదూ అధిభూతాలు. వీటికే వరుసగా విష్ణు, సూర్య, ప్రజాపతి, ఇంద్ర, అగ్ని - వీరు అయిదుగురూ అధిదైవతాలు. కన్ను, నాలుక, ముక్కు, చర్మం, చెవి - ఇవి అయిదూ అధ్యాత్మాలు. రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాలు వాటికి వరుసగా అధిభూతాలు. తేజస్సు, జలం, భూమి, వాయువు, ఆకాశం అనేవి అయిదూ అదే క్రమంలో అధిదైవతాలు.

**క.** **మన మధ్యాత్మము దానికి । ననఘా! మంతవ్యమందు రధిభూతము చం**
**ద్రుని నధిదైవతముగ బుధ । జనములు చెప్పుదురు శ్రుతివచఃప్రతిపత్తిన్.** 91

**ప్రతిపదార్థం:** అనఘా!= పవిత్రుడా!; మనము= మనస్సు అనేది; అధ్యాత్మము= అధ్యాత్మం; దానికిన్= దానికి; మంతవ్యము= మంతవ్యమనేది (మననము చేసికొనదగినది); అధిభూతము= అధిభూతం; అందురు= అంటారు; శ్రుతివచః= వేదవాక్కుల;

ప్రతిపత్తిన్= ప్రామాణికతతో; బుధజనములు= పండితులు; చంద్రునిన్= చంద్రుడిని; అధిదైవతముగన్= మనస్సుకు అధిదైవతంగా; చెప్పుదురు.

**తాత్పర్యం:** రాజా! మనస్సు అనేది అధ్యాత్మం. దీనికి మంతవ్య మనేది అధిభూతం. చంద్రుడేమో అధిదైవతం. వేదప్రామాణ్యాన్ని బట్టి పండితులు ఇట్లా చెప్పుతున్నారు.

**తే.** **బుద్ధి యధ్యాత్మమనఁ జను భూతవర్య! । దాని కధిభూత మండ్రు బోద్ధవ్యమైన**
**దానిఁ బొల్చు తదీయాధిదైవతంబు । వినుము క్షేత్రజ్ఞుఁడని చెప్పు వేదచయము.** **92**

**ప్రతిపదార్థం:** భూతవర్య!= జీవోత్తమా! జనకమహారాజా!; బుద్ధి= బుద్ధి అనేది; అధ్యాత్మము= అధ్యాత్మం; అనన్+చెల్లును= అనటం తగును; బోద్ధవ్యమైన దానిన్= (దానికి) తెలిసికొనదగినదానిని; అధిభూతము+అండ్రు= బుద్ధికి అధిభూతము అంటారు; పొల్చు= అతిశయించే; తదీయ= ఆ బుద్ధియొక్క; అధిదైవతంబు= అధిదైవతం; క్షేత్రజ్ఞుఁడు+అని= క్షేత్రజ్ఞుడే అని; వేదచయము= వేదసమూహం; చెప్పున్= చెప్పుతుంది; వినుము.

**తాత్పర్యం:** బుద్ధి అధ్యాత్మమనీ, బోద్ధవ్యం అధిభూతమనీ, క్షేత్రజ్ఞుడైన జీవుడే అధిదైవతమనీ వేదాలు చెప్పుతున్నాయి.

**క.** **ఆరయ నధ్యాత్మ మహం । కారం బధిభూతనామకం బభిమానం**
**బారూఢ యశఃపరమో । దారా! రుద్రుఁ డధిదైవతం బన నెగడున్.** **93**

**ప్రతిపదార్థం:** ఆరూఢ= ప్రసిద్ధికెక్కిన; యశః= కీర్తితో; పరమ+ఉదారా!= గొప్ప ఔదార్యం కలవాడా! ఓ జనకమహారాజా!; ఆరయన్= పరిశీలించగా; అహంకారంబు= అహంకారమనేది; అధ్యాత్మము= అధ్యాత్మం; అభిమానంబు= అభిమానమనేది; అధిభూతనామకంబు= అహంకారానికి అధిభూతం అవుతుంది; రుద్రుఁడు= భవుడు; అధిదైవతంబు= అధిదైవతం; అనన్= అనగా; నెగడున్= ఒప్పును.

**తాత్పర్యం:** అహంకార మనేది ఆధ్యాత్మం. దానికి అభిమాన మనేది అధిభూతం. అధిదైవతమేమో రుద్రుడు.

**విశేషం:** దీనికి మూలశ్లోకం ఇట్లా ఉన్నది - **"అభిమానో஽ధిభూతం తు భవస్తత్రాధిదైవతమ్" (12-301-12).** అనే పాఠం కూడా కొన్ని ప్రతులలో ఉన్నది. తెలుగు ప్రతులన్నింటా అభిమానమనేదే కనపడుతున్నది. భవుడు అన్నదానిని తిక్కన రుద్రుడు అన్నాడు. స్థూలార్థం సమానమే అయినా వ్యుత్పత్తి స్వభావంలో తేడా ఉన్నది. దీనికి 'బుద్ధి యధిదైవతంబన' అనే పాఠాంతరం తెలుగులో ఉన్నది. **విరించో஽త్రాధిదైవతమ్** అనే పాఠాన్ని సంశోధిత ముద్రణ అధస్సూచికలో (పి.వి.యన్. శాస్త్రి ప్రతి 12-298-12) చూపింది.

**తే.** **ధరణివల్లభ! చిత్తమధ్యాత్మ మనఁగ । బరఁగుఁ జేతయితవ్యంబు భావితాత్ము**
**లైన మహనీయు లధిభూతమండ్రు బ్రహ్మ । మంచితాధిదైవతమను నాగమములు.'** **94**

**ప్రతిపదార్థం:** ధరణివల్లభ!= ఓ మహారాజా! (భూపతీ!); చిత్తము= చిత్తము అనేది; అధ్యాత్మము+అనఁగన్+పరఁగున్= అధ్యాత్మం అనబడుతుంది; భావిత+ఆత్ములైన= ఆలోచనాపరులైన; మహనీయులు= గొప్పవారు; చేతయితవ్యంబున్= చేతయితవ్యము అనబడేదాన్ని; అధిభూతము+అండ్రు= చిత్తానికి అధిభూతం అంటారు; ఆగమములు= వేదాలూ, శాస్త్రాలూ; బ్రహ్మమున్= బ్రహ్మము అనబడేదాన్ని; అంచిత= ఒప్పయిన; అధిదైవతము+అనున్= చిత్తానికి అధిదైవతం అంటాయి.

**తాత్పర్యం:** రాజా! చిత్తం అధ్యాత్మం, చేతయితవ్యం దానికి అధిభూతం, పరబ్రహ్మం దానికి అధిదైవతం అని ఆగమాలు చెప్పుతున్నాయి'.

**విశేషం:** దీనికి మూలశ్లోకం భండార్కరు వారి ప్రామాణిక ప్రతిలో ప్రధానపాఠంగా లేదు. అధస్సూచిలో మాత్రమే ఉన్నది. **చిత్తమధ్యాత్మమిత్యాహుర్యోగినః సూక్ష్మదృష్టయః । అధిభూతం చైత్యమాహూ రుద్రస్తత్రాధిదైవతమ్ ॥** ఇది గ్రంథలిపిలో లాహోరు ప్రతిగా వారు సూచించారు. దీనివలన చేతయితవ్యమే చైత్యమని తెలుస్తోంది. రుద్రుడు తెలుగులో బ్రహ్మం అయాడు.

**వ. అని చెప్పి 'ప్రకృతి పురుష ప్రకారంబులు వినుట మనో నిర్వికారత్వకారణం బగు' నను పలుకు పలికి యిట్లనియె. 95**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= యాజ్ఞవల్క్యుడు ఇట్లా చెప్పి; ప్రకృతి పురుషప్రకారంబులు= ప్రకృతిపురుషుల పద్ధతులు; వినుట= వినటం; మనోనిర్వికారత్వ కారణంబు+అగున్= మనస్సు తాలూకు నిర్వికారత్వానికి హేతువు అవుతుంది; అను పలుకు= ఈ మాట; పలికి= అని; ఇట్లు అనియెన్= మళ్ళీ ఇట్లా కొనసాగించాడు.

**తాత్పర్యం:** యాజ్ఞవల్క్యుడు ఇట్లా చెప్పి 'ప్రకృతి పురుషుల పద్ధతులు వినుటవలన మనస్సు నిర్వికారత్వాన్ని పొందుతుం'దంటూ, ఇంకా ఇట్లా చెప్పాడు.

**క. 'ప్రకృతి దనయిచ్చఁ గ్రీడా । ర్థకముగ సత్త్వాదిగుణ వితానము నానా**
**వికృతులఁ బొందింప నసం । ఖ్యకవిధమై పరఁగుచుండునది మనుజేంద్రా! 96**

**ప్రతిపదార్థం:** మనుజేంద్రా!= ఓ రాజేంద్రా!; ప్రకృతి= ప్రకృతి అనేది; తనయిచ్చన్= స్వేచ్ఛతో; క్రీడార్థకముగన్= క్రీడావిలాసంకోసం అన్నట్టు; సత్త్వాదిగుణవితానమున్= సత్త్వమూ, రజస్సూ, తమస్సూ అనే గుణసమూహాన్నీ; నానావికృతులన్= వాటివలన పలురకాల వికారాలనూ (రూపభేదాలనూ); పొందింపన్= కలుగజేస్తే; అసంఖ్యకవిధమై= లెక్కపెట్టలేనన్ని భేదాలు కలదై; పరఁగుచుండున్+అది= ఒప్పుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఈ ప్రకృతి అనేది స్వేచ్ఛగా క్రీడావిలాసంగా సత్త్వాదిగుణాలనూ, నానా వికృతులనూ పురుషుడికి కల్పిస్తూ ఉంటుంది.

**క. దీపమున ననేకములగు । దీపములు పరంపరానుదీప్తాకృతులై**
**వ్యాపించు చందమున గుణ । రూపంబులఁ బరపుఁ బ్రకృతి రోషవిదూరా! 97**

**ప్రతిపదార్థం:** రోషవిదూరా!= రోషరహితుడా!; దీపమునన్= ఒక దీపంనుండి; అనేకములగు= అనేకమైన; దీపములు= దీపాలు; పరంపరా+అనుదీప్త+ఆకృతులై= ఒకదాని నుంచి ఒకటి వరసగా వెలిగిన ఆకారాలు కలవై; వ్యాపించు చందమునన్= వ్యాప్తి చెందినట్టుగా; ప్రకృతి= ఈ ప్రకృతి అనేది; గుణరూపంబులన్= సత్త్వాదిగుణాలనూ రూపాలనూ; పరపున్= వ్యాప్తి చెందిస్తుంది.

**తాత్పర్యం:** రోషరహితుడా! ఒక దీపం నుంచి అనేకదీపాలు వ్యాప్తి చెందినట్టు ఈ ప్రకృతి అనేది గుణరూపాలను వ్యాప్తి పొందిస్తుంది.

**సీ. సత్త్వగుణంబులు సంతోష మానంద । మారోగ్య మక్రోధ మార్జవంబు**
**శుద్ధి ప్రకాశత సుస్థిరత్వ మహింస । నిర్మల శ్రద్ధ వినీతి లజ్జ**
**సత్యంబు శౌచంబు సమత యాచారం బ । కార్పణ్యపైశున్య కామవృత్తి**
**విను రజోగుణములు విగ్రహ దర్పాభి । మాన కామక్రోధ మత్సరములు**

**ఆ. కరుణలేమి భోగకాంక్ష యహంకార । ముమ్మలిక తమోగుణమ్ము లప్ర**
**కాశమోహ బహుతరాశన వాదప్ర । మాద మౌర్ఖ్యమరణ భేదనములు. 98**

**ప్రతిపదార్థం:** సంతోషంబు= సంతోషంగా ఉండటం; ఆనందము= ఆనందంగా ఉండటం; ఆరోగ్యము= రోగరహితంగా ఉండటం; అక్రోధము= క్రోధంలేకపోవటం; ఆర్జవంబు= ఋజుత్వం (తిన్నని నడవడి); శుద్ధి= పరిశుభ్రత; ప్రకాశత= తేజస్విత; సుస్థిరత్వము= నిశ్చలత్వం; అహింస= హింస విడనాడటం; నిర్మలశ్రద్ధ= నిర్మలమైన శ్రద్ధ (దీక్ష); వినీతి= వినయం; లజ్జ= సిగ్గు; సత్యంబు= నిజం చెప్పటం; శౌచంబు= శుచిగా ఉండటం; సమత= సర్వప్రాణి సమానత్వం; ఆచారంబు= ఆచారపరత్వం; అకార్పణ్య పైశున్యకామవృత్తి= లోభించటం (దుష్టత), చాడీలు చెప్పటం, కాముకత్వం అనేవి లేకుండా ప్రవర్తించటం ఇవి; సత్త్వగుణంబులు= సత్త్వగుణాలు; విను; విగ్రహ= కలహించటం; దర్ప= అహంకారం; అభిమాన= గర్వం; కామ= అతివాంఛ; క్రోధ= కోపం; మత్సరములు= ఈర్ష్య అనేవీ; కరుణ లేమి= దయ లేకపోవటం; భోగకాంక్ష= భోగాలు అనుభవించాలి అనే కోరిక; అహంకారము= అహంభావం; ఉమ్మలిక= దుఃఖం - ఇవన్నీ; రజోగుణములు= రజోగుణాలు; అప్రకాశ= తేజోరహితత్వం; మోహ= వ్యామోహం; బహుతర+అశన= తిండిపోతుగా ఉండటం; వాద= వాదోపవాదాల్లో ప్రీతి; ప్రమాద= పొరపాటు పడటం; మౌర్ఖ్య= మూర్ఖత్వం; మరణ= మరణం; భేదనములు= ఒకరిమీద ఒకరికి చాడీలు చెప్పటం - ఇవన్నీ; తమోగుణమ్ములు= తమోగుణాలు.

**తాత్పర్యం:** సంతోషాదులు సత్త్వగుణాలనీ, అహంకార కామ క్రోధాదులు రజోగుణా లనీ, తిండిపోతుదనం చాడీకోరుతనం మొరకుదనం ఇత్యాదులు తమోగుణాలనీ తెలిసికొమ్ము.

**క. ప్రకృతికిని గుణములుం గొని । యకలంకుండైన యంతరాత్ముని వేవే**
**ల్వికృతులఁ బొందించుట పా । యక కలుగుం దత్స్వభావ మది యరయంగన్. 99**

**ప్రతిపదార్థం:** గుణములన్+కొని= సత్త్వరజస్తమోగుణాలను స్వీకరించి; అకలంకుండు+ఐన= స్వతస్సిద్ధంగా కళంకరహితుడైన; అంతరాత్మునిన్= అంతరాత్ముడిని; వేవేల్= వేలకువేలుగా; వికృతులన్+పొందించుట= రూప వికారాలను పొందేట్టు చెయ్యటం; ప్రకృతికిన్= ఈ ప్రకృతి అనేదానికి; పాయక= వదలక; కలుగున్= ఉంటుంది; అరయంగన్= ఆలోచించి చూస్తే; అది= అట్లా పొందించటమనేది; తద్= ఆ ప్రకృతియొక్క; స్వభావము= స్వభావం.

**తాత్పర్యం:** సత్త్వాది గుణాలతో - కళంకరహితుడైన పురుషుడికి అనేకరూపాలు కల్పించటం ప్రకృతికి స్వభావం. అది దానిని వదలదు.

**క. పురుషుఁడు చైతన్యాత్ముఁడు । నరనాయక! ప్రకృతి చేతనారహిత జగ**
**ద్ధురఁ బురుషుని వెలుఁగునఁ దా । ధరియించుం బురుషుఁ దిగుచుఁ దనమెయిఁ దిరుగన్. 100**

**ప్రతిపదార్థం:** నరనాయక!= జనకమహారాజా!; పురుషుఁడు= జీవాత్ముడు; చైతన్యాత్ముఁడు= చైతన్యస్వరూపుడు; ప్రకృతి= ఈ ప్రకృతిమాత్రం; చేతనారహిత= చైతన్యరహితం; పురుషుని= అంతరాత్మునికి చెందిన; వెలుఁగునన్= ప్రకాశంలో; తాను= ఈ ప్రకృతి; జగత్+ధురన్= జగద్భారాన్ని; ధరియించున్= వహిస్తుంది; పురుషున్= పురుషుడిని; తనమెయిన్= తనతో; తిరుగన్= తిరిగేట్టు; తిగుచున్= లాగుతుంది.

**తాత్పర్యం:** రాజా! పురుషుడు చైతన్య సహితుడు. ప్రకృతికి చైతన్యం లేదు. అయినా పురుషుడి ప్రకాశంలోనే తాను జగద్భారాన్ని వహిస్తుంది. పురుషుడిని కూడా తనవెంట తిప్పుకొంటుంది.

**ఉ. సత్త్వరజస్తమోగుణ వశస్థితిఁ గేవలపుణ్యమిశ్రకా**
**రిత్వ విరుద్ధకర్మములఁ బ్రేరితమై కను నూర్ధ్వలోకసే**
**విత్వము మానుషత్వ పదవీకలనంబును రౌరవంబు నా**
**తత్త్వము తన్నెఱుంగమి ప్రధానము చేఁతల నావహిల్లినన్. 101**

**ప్రతిపదార్థం:** ఆ తత్త్వము= పురుషుడు అనబడే ఆ తత్త్వం; తన్నున్+ఎఱుంగమి= తనను తాను తెలుసుకోకపోవటంచేత; ప్రధానము చేఁతలన్= ప్రధానము అనబడే ప్రకృతియొక్క చేష్టలలోకి; ఆవహిల్లినన్= లొంగిపోయినట్టయితే; సత్త్వ రజ స్తమోగుణ వశస్థితిన్= సత్త్వమూ, రజస్సూ, తమస్సూ అనే మూడు గుణాలకూ వివశమైపోయిన పరిస్థితిలో; కేవలపుణ్య= పూర్తిగా పుణ్యకర్మలను చెయ్యటం; మిశ్రకారిత్వ= పుణ్యకార్యాలను కొన్నింటినీ, పాపకార్యాలను కొన్నింటినీ చెయ్యటం; విరుద్ధకర్మములన్= పుణ్యవిరుద్ధమైన పాపకర్మలు చెయ్యటం - వాటితో; ప్రేరితమై= ప్రేరేపింపబడినదై; క్రమంగా - ఊర్ధ్వలోకసేవిత్వము= పుణ్యలోకాలను సేవించటం; మానుషత్వ పదవీ+కలనంబును= మనుష్యజన్మను అధిష్ఠించటం; రౌరవంబున్= రౌరవము అనబడే నరకాన్నీ; కనున్= పొందుతుంది.

**తాత్పర్యం:** జీవాత్మ అనబడే ఈ తత్త్వం తనను తాను తెలిసికొనలేక, ప్రధానము అనబడే ప్రకృతితత్త్వపు చేతలలో ఇరుక్కుపోయి సత్త్వగుణంతో కేవల పుణ్యకర్మలను ఆచరించి ఊర్ధ్వలోకాలను పొందుతుంది. రజోగుణంతో మిశ్రకర్మలను ఆచరించి మానుషత్వం పొందుతుంది. తమోగుణంతో కేవల పాపకర్మలు ఆచరించి రౌరవాది నరకాల పాలవుతుంది.

**క. తను నెఱిఁగిన నవ్యక్తము । చనవునఁ బోఁ డాత్ముఁ డజర శాశ్వత విగతాం**
**జన విమలాచ్యుత పదముం । గని యక్షరుఁడగు నిజప్రకాశస్థిరతన్.' 102**

**ప్రతిపదార్థం:** ఆత్ముఁడు= ఈ జీవాత్ముఁడు; తనున్= తనను తాను; ఎఱిఁగినన్= తెలుసుకొన్నట్టయితే; అవ్యక్తము చనవునన్= అవ్యక్తము అనబడే ప్రకృతియొక్క చనవుతో; పోఁడు= దానివెంట పడి వెళ్ళడు; అజర= ముసలితనం లేనిదీ; శాశ్వత= శాశ్వతమైనదీ; విగత+అంజన= నిరంజనమైనదీ (పాపరహితం, శివప్రదం); విమల= నిర్మలమైనదీ; అచ్యుత= చ్యుతిలేనిదీ అయిన; పదమున్= స్థానాన్ని; కని= పొంది; నిజ= తనయొక్క; ప్రకాశ= తేజస్సు తాలూకు; స్థిరతన్= నిశ్చలత్వంతో; అక్షరుఁడు+అగున్= (జీవాత్ముడు) అక్షరాత్ముడే అయిపోతాడు.

**తాత్పర్యం:** జీవాత్ముడు ప్రబుద్ధుడైనట్లయితే అవ్యక్త మనబడే ప్రకృతివెంట తగిలిపోడు. శాశ్వతం, నిరంజనం, నిర్మలం, జరావిరహితం అయిన అచ్యుతపదాన్ని పొంది అక్షరుడై పోతాడు. పంచవింశతితత్త్వవిశిష్టుడైన పురుషుడు తనను తాను తెలిసికొని ప్రబుద్ధుడైతే అక్షరుడైపోతాడు.'

**వ. అనిన విని జనకపతి యమ్మునిపతితో 'ననాదినిధనంబులు నమూర్తంబులు నచలంబులు నగ్రాహ్యంబులు నగు పురుషప్రకృతితత్త్వంబులయం దొక్కటి సచేతనంబైయుండఁ దక్కినయది చేతనారహితం బగుటకుం గతం బేమి యెఱింగింపవే' యనుటయు నతం డతని కిట్లనియె. 103**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలించి; జనకపతి= జనకమహారాజు; ఆ+మునిపతితోన్= ఆ యాజ్ఞవల్క్య మునీశ్వరుడితో; అనాదినిధనంబులును= ఆదీ అంతమూ లేనివీ; అమూర్తంబులును= ఆకారరహితాలూ; అచలంబులున్= నిశ్చలాలూ; అగ్రాహ్యంబులును= గ్రహింపరానివీ; అగు= అయినటువంటి; పురుష-ప్రకృతి తత్త్వంబులయందున్= ఈ పురుషతత్త్వ - ప్రకృతితత్త్వాలలో; ఒక్కటి= ఒకటి (పురుషతత్త్వం); సచేతనంబై+ఉండన్= సచేతనంగా ఉంటే; తక్కినయది= రెండవది (ప్రకృతితత్త్వం); చేతనారహితంబు+అగుటకున్= చైతన్యరహితమై పోవటానికి; కతంబు= కారణం; ఏమి= ఏమిటో; ఎఱింగింపవే= తెలియజెప్పవా; అనుటయున్= అని వేడుకోగా; అతండు= ఆ యాజ్ఞవల్క్యుడు; అతనికిన్= ఆ జనకమహారాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని జనకమహారాజు ఆ యాజ్ఞవల్క్య మునీశ్వరుడితో 'ఆదీ, అంతమూ లేనివీ, ఆకారరహితాలూ, నిశ్చలాలూ, గ్రహింపరానివీ అయిన పురుష, ప్రకృతి తత్త్వాలలో ఒకటి సచేతనంగా ఉండగా రెండవది - ప్రకృతితత్త్వం చైతన్యరహితమై పోవటానికి కారణం ఏమిటో తెలియజెప్పు' మని అడుగగా ఆ జనకమహారాజుతో యాజ్ఞవల్క్యుడు ఇట్లా అన్నాడు.

**క. సగుణం బగుణం బగునే? । యగుణము సగుణమగు నెట్టు? లవ్యక్తము ని**
**త్యగుణసమవేతమై జడ । త గలిగియుండంగఁ బురుషధర్మము గలదే? 104**

**ప్రతిపదార్థం:** సగుణంబు= సత్త్వాదిగుణసహితమైనది; అగుణంబు+అగునే?= గుణరహితం అవుతుందా?; అగుణము= గుణరహితమైనది; సగుణము= గుణసహితం; అగునెట్టులు?= ఎలా అవుతుంది?; అవ్యక్తము= అవ్యక్తము అనబడే ప్రకృతి; నిత్య= ఎల్లవేళలా; గుణసమవేతమై= సత్త్వాదిగుణాలతో కూడినదై; జడతన్= చైతన్యరహితత్వాన్ని; కలిగి+ఉండన్= ధరించి ఉండగా; పురుషధర్మము= పురుషతత్త్వానికి స్వభావమైన చైతన్యం; కలదే?= దానికి ఉంటుందా?

**తాత్పర్యం:** సగుణం, అగుణం కాదు. అట్లాగే అగుణమూ సగుణం కాదు. సత్త్వాదిగుణాలు కలిగి జడస్థితిలో ఉండే అవ్యక్తానికి (ప్రకృతికి) పురుషధర్మమైన (జీవాత్మ) చైతన్యం ఉండదు.

**క. పురుషుని కల రూపెఱిఁగెడు । పరిబోధము లేకయుండుఁ బ్రకృతికిఁ బ్రకృతిం**
**బురుషుఁ డెఱుంగును దనకుం । బరంబు లేదనియుఁ గను శుభస్థిర దృష్టిన్. 105**

**ప్రతిపదార్థం:** ప్రకృతికిన్= ప్రకృతికి (అవ్యక్తానికి); పురుషుని= పురుషుడియొక్క; కలరూపు= యథార్థరూపాన్ని; ఎఱిఁగెడు= తెలిసికొనగలిగిన; పరిబోధము= జ్ఞానం; లేకయుండున్= ఉండదు; పురుషుఁడు= జీవాత్ముడు; ప్రకృతిన్= అవ్యక్తాన్ని; ఎఱుంగును= తెలుసుకోగలడు; తనకున్= తనకంటే; పరంబు= పరమైనది; లేదు+అనియున్= లేదు అనికూడా; శుభస్థిరదృష్టిన్= శుభప్రదమైన నిశ్చలదృష్టితో; కనున్= దర్శింపగలడు.

**తాత్పర్యం:** రాజా! పురుషుడి యథార్థరూపాన్ని గ్రహించగలిగిన జ్ఞానం ప్రకృతికి లేదు. కానీ, ప్రకృతిని తెలిసికొనగలిగిన జ్ఞానం - చైతన్యం పురుషుడికి ఉన్నాయి. అంతేకాదు - ఈ పురుషుడు నిశ్చలదృష్టితో చూచి తనకన్నా పరతత్త్వం లేదని కూడా గ్రహించగలడు.

**క. కావునఁ బ్రకృతి యచేతన । భూవల్లభ! చేతనుండు పురుషుఁడు సమ్య**
**గ్భావన యలవడిన మునీం । ద్రావళి యిమ్మెయి సునిశ్చయంబుగఁ బలుకున్. 106**

**ప్రతిపదార్థం:** భూవల్లభ!= జనకభూపతీ!; కావునన్= అందుచేత; ప్రకృతి= ప్రకృతితత్త్వమనేది; అచేతన= చైతన్యరహితం; పురుషుఁడు= జీవాత్ముడు; చేతనుండు= చైత్యసహితుడు; సమ్యక్+భావన= సరిగ్గా భావించటమనేది; అలవడిన= అభ్యాసపరచుకొన్న; మునీంద్రావళి= మునీశ్వరుల సమూహం; ఈ+మెయిన్= ఈ ప్రకారంగా; సునిశ్చయంబుగన్= కచ్చితమైన నిశ్చయంగా; పలుకున్= చెప్పుతోంది.

**తాత్పర్యం:** పైని చెప్పిన కారణంవలన ప్రకృతి అచేతన అనీ, పురుషుడు సచేతనుడనీ తెలుస్తున్నది. ఆలోచనాపరులైన మునీశ్వరులందరూ ఇదే నిశ్చయంగా తెలియజెప్పారు.

**వ. అని వెండియు. 107**

**తాత్పర్యం:** అనిచెప్పి మరల ఇట్లా కొనసాగిస్తున్నాడు.

**ఆ. తాను బ్రకృతిఁ బ్రకృతి తనయందు నిల్చు ని । ల్చినను దాన వికృతిఁ జెందకుండుఁ**
**బురుషుఁ డుదకమత్స్యముల యుదుంబరమశ । కముల సంగమంబు కరణి గలుగ. 108**

**ప్రతిపదార్థం:** తాను= పురుషుడు తాను; ప్రకృతిన్= ప్రకృతియందూ; ప్రకృతి= అవ్యక్తం; తనయందున్= తనయందూ; నిల్చున్= నిలుస్తారు; నిల్చినను= అట్లా నిల్చినప్పటికీ; ఉదకమత్స్యముల= నీరూ, చేపలయొక్క; ఉదుంబర మశకముల= మేడి దోమల యొక్క; సంగమంబు-కరణి= కలయికతో పోలిక; కలుగన్= లభించేట్టు; పురుషుఁడు= జీవాత్ముడు; వికృతిన్+చెందక+ఉండున్= ఏ వికారాన్నీ పొందకుండా ఉంటాడు.

**తాత్పర్యం:** పురుషుడు ప్రకృతిలో ఉంటాడు. ప్రకృతిని తనలో నిలుపుకొంటాడు. కానీ, ఈ కలయికవలన తానుమాత్రం ఏ వికృతినీ పొందడు. చేప నీళ్ళల్లో ఉన్నట్లూ, ఒకరకం దోమలు మేడిపండులోకి దూరి ఉన్నట్లూ ఈ కలయిక ఉంటుంది. ఇదీ ప్రకృతితో పురుషుడి సాంగత్యం. లీనత్వంలో అలీనత్వం.

**విశేషం:** 'మేడిపండు చూడ మేలిమై యుండును, పొట్ట విచ్చిచూడ పురుగులుండు' అన్నాడు వేమన్న. ఈ పురుగులు దోమల్లాగానే ఉంటాయి. ఎగిరే పురుగులు. వ్యాసుడూ మశకా లనే అన్నాడు. **"అన్యం చ మశకం విద్యాత్, అన్యచ్చోదుంబరం తథా । న చోదుంబర సంయోగైర్మశకస్తత్ర లిప్యతే॥"** (12-303-14)

**ఆ. జలముఁ గదిసియుండ జలముచే నార్ద్రంబు । గాక యుండునట్టి కమలదళము**
**భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును ద । ద్వికృతిఁ బొందకుండు వీతదోష! 109**

**ప్రతిపదార్థం:** వీతదోష!= దోషరహితుడా! ఓ జనకమహారాజా!; జలమున్= నీటిని; కదిసి+ఉండి= కలిసి ఉండీ కూడా; జలముచేన్= ఆ నీటితో; ఆర్ద్రంబుకాక+ఉండునట్టి= తడి కాకుండా ఉండేటటువంటి; కమలదళము -భంగిన్= తామరపువ్వు రేకువలె; అంతరాత్మ= జీవాత్ముడు; ప్రకృతిన్= ప్రకృతిని; పొందియును= కలిసీకూడా; తద్+వికృతిన్= దానివలన కలిగే వికారాన్ని; పొందక+ఉండున్= పొందకుండా ఉండగలుగుతాడు.

**తాత్పర్యం:** తామరపువ్వు గానీ తామర ఆకు గానీ నీళ్ళను తాకుతూ నీళ్ళల్లోనే ఉంటుంది. కానీ, దాని ఆకులకు గానీ రేకులకు గానీ తడి అంటదు. అట్లాగే జీవాత్ముడు ప్రకృతిలో ఉన్నా దాని వికారాలు మాత్రం ఇతడికి అంటవు.

**వ. ఇది సాంఖ్యానుభావంబు, యోగంబు తెఱంగెఱింగించెద. 110**

**ప్రతిపదార్థం:** ఇది= ఇంతవరకూ చెప్పినది; సాంఖ్య+అనుభావంబు= సాంఖ్యస్వరూపం; యోగంబు తెఱంగున్= ఇంక యోగం పద్ధతిని; ఎఱింగించెదన్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** ఇంతవరకూ సాంఖ్యయోగం గురించి చెప్పాను. ఇక యోగపద్ధతిని తెలియజేస్తాను.

**క. విను సాంఖ్యసమజ్ఞానం । బును యోగసమానబలము భూవర! లే వెం**
**దును, నవి రెండును వేఱుగఁ । గను బాలిశుఁ డొక్క తెరువకా నేఁ గందున్. 111**

**ప్రతిపదార్థం:** భూవర!= జనకమహారాజా!; విను; సాంఖ్య= సాంఖ్యంతో; సమ= సమానమైన; జ్ఞానంబును= జ్ఞానమూ; యోగ= యోగంతో; సమాన= సాటివచ్చే; బలమును= బలమూ; ఎందునున్ లేవు= ఇంక ఎక్కడా లేవు; అవి రెండును= ఆ సాంఖ్యయోగాలు రెండింటినీ; బాలిశుఁడు= మూర్ఖుడు; వేఱుగన్+కను= వేరు వేరుగా చూస్తాడు; నేన్= నేను; ఒక్కతెరువు+అకాన్= ఒకే మార్గంగా; కందున్= దర్శిస్తాను, భావిస్తాను.

**తాత్పర్యం:** జనకమహారాజా! సాంఖ్యంతో సాటివచ్చే జ్ఞానంకానీ, యోగంతో సాటివచ్చే బలంకానీ ఇంక ఎక్కడా-ఏ వేదశాస్త్రాలలోనూ కనిపించవు. మూర్ఖుడు ఈ రెండింటినీ వేరువేరు శాస్త్రాలుగా భావిస్తాడేమో కానీ నేను మాత్రం ఒక్కటిగానే చూస్తాను.

**క. జననాథ! మనోధారణ । యును బ్రాణాయామ విధియు నుపయోగ్యములై**
**చను నిర్గుణమును సగుణం । బును ననఁగా రెండు తంత్రములు యోగమునన్. 112**

**ప్రతిపదార్థం:** జననాథ!= ఓ జనకమహారాజా!; యోగమునన్= ఈ యోగంలో; మనోధారణయును= మనస్సును ఏకాగ్రం చేయటం; ప్రాణ+ఆయామ+విధియున్= ప్రాణాయామం చెయ్యటం - అనేవి; ఉపయోగ్యములై= ఉపయోగింపదగినవిగా; చనున్= ఉంటాయి; నిర్గుణమును= ఒకటి నిర్గుణం; సగుణంబునున్= మరొకటి (ప్రాణాయామం) సగుణం; అనఁగాన్= అని; రెండు తంత్రములు= ఇవి రెండు తంత్రాలు - రెండు ఉపాయాలు.

**తాత్పర్యం:** మనస్సును ఏకాగ్రం చేయటం, ప్రాణాయామం అనేవి యోగంలో రెండు ప్రధాన తంత్రాలు. వీటిలో మొదటిదానిని నిర్గుణం అంటారు. రెండోదానిని సగుణం అంటారు. మనస్సును ఏకాగ్రం చేయటమే ధ్యానం. అదే మనోధారణ.

**క. ప్రాణాయామము గ్రమమునఁ । బ్రాణోత్పీడనము గాని భంగి నడుపుచున్**
**ఘోణాగ్రస్థితి విషయ । శ్రేణి దొఱఁగి యుండి యోగసిద్ధతఁ బడయున్. 113**

**ప్రతిపదార్థం:** ఘోణ+అగ్రస్థితిన్= నాసిక అగ్రభాగం నుంచి; ప్రాణాయామమున్= ప్రాణాయామాన్ని; క్రమమునన్= ఒక క్రమంతో; ప్రాణ+ఉత్పీడనము= ప్రాణాపాయం; కాని భంగిన్= జరగని పద్ధతిలో; నడుపుచున్= సాగిస్తూ; విషయశ్రేణిన్= ఇంద్రియసుఖాలను; తొఱఁగియుండి= విడిచిపెట్టేసి; యోగసిద్ధతన్= యోగసిద్ధిని; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజా! శ్వాసకు ఇబ్బంది కలగకుండా నాసికాగ్రభాగంనుండి క్రమం తప్పకుండా ప్రాణాయామం నడిపిస్తూ, ఇంద్రియసుఖాలపట్ల ఆసక్తిని వదలించుకొని అభ్యాసకుడు యోగసిద్ధుడు అవుతాడు.

**వ. ఎట్లంటేని. 114**

**తాత్పర్యం:** అది ఎట్లా అంటే (ఇదిగో వినుము).

**తే. కరము నియతుఁడై కొంతేసి కాలముల శ । రీర ధర్మవిరోధిగా రేయుఁ బగలుఁ**
**బ్రాణ సంయమనము నడపంగవలయు । దాన చిత్తంబుఁ దనువు శుద్ధత వహించు. 115**

**ప్రతిపదార్థం:** కరమున్= మిక్కిలి; నియతుఁడై= నియమవంతుడై; కొంత+ఏసి+కాలములన్= కొంచెం కొంచెం సేపుగా; శరీరధర్మ+అవిరోధిగాన్= శరీరస్వభావానికి విరోధం కలగకుండా; రేయున్= రాత్రి; పగలున్= పగలూ; ప్రాణసంయమనము= ప్రాణాయామం; నడపంగన్+వలయున్= నడపించాలి; దానన్= దానితో; చిత్తంబున్= అంతరంగమూ; తనువు= బహిరంగమూ (శరీరం); శుద్ధతన్ వహించున్= శుద్ధి పొందుతాయి.

**తాత్పర్యం:** ప్రాణాయామం అభ్యసించే వ్యక్తి చాలా నియమనిష్ఠలతో ఉండాలి. క్రమక్రమంగా కొంచెం కొంచెం సేపు దాన్ని అభ్యసించాలి. శరీరధర్మానికి ఇబ్బంది కలగని పద్ధతిలో దాన్ని ఆచరించాలి. రేయి కొంతసేపూ, పగలు కొంతసేపూ నడిపించాలి. అట్లా చేస్తే అంతశ్శుద్ధీ బహిశ్శుద్ధీ లభిస్తాయి.

**వ. అది సిద్ధత్వసంపదకు మూలం బిది సగుణతంత్రంబు తెఱఁగు, నిర్గుణ తంత్రప్రకారం బెఱింగించెద.116**

**ప్రతిపదార్థం:** అది= ప్రాణాయామమూ, దానివల్ల లభించే అంతర్బహిశ్శుద్ధులూ; సిద్ధత్వసంపదకున్= యోగసిద్ధిని పొందటమనే మహాభాగ్యానికి; మూలంబు= మూలం; ఇది= ఇంతవరకూ చెప్పింది; సగుణతంత్రంబు తెఱంగు= సగుణోపాయం తాలూకు పద్ధతి; నిర్గుణతంత్ర ప్రకారంబు= మనోధారణ లేదా ధ్యానం అనే నిర్గుణోపాయం తాలూకు తెరగు; ఎఱింగించెదన్= ఇక తెలియజేస్తాను.

**తాత్పర్యం:** ప్రాణాయామమూ దానివలన లభించే అంతర్బహిశ్శుద్ధులూ, యోగసిద్ధికి మూలం. ఇంతవరకూ చెప్పింది సగుణోపాయ పద్ధతి. ధ్యానం అనే నిర్గుణోపాయాన్ని ఇక తెలియబరుస్తాను.

**తే. ఇంద్రియంబులు మనమునం దివురఁజేసి । మనసుఁ దిగిచి యహంకారమున నడంచి**
**బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి బుద్ధి । ప్రకృతిఁ గలఁపఁ దద్ధ్యానతత్పరత గలుగు. 117**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు= ఇంద్రియాలను; మనమునందున్= మనస్సులో; ఇవురన్+చేసి= ఇంకిపోయేట్టు చేసి; మనసున్= మనస్సును; తిగిచి= వెనక్కులాగి; అహంకారమునన్= అహంకారంలో; అడంచి= అణిచివేసి; అహంకృతిన్= ఈ అహంకారాన్ని; బుద్ధిలోనన్= బుద్ధిలో; పుచ్చి= అంతరింప జేసి; బుద్ధి= ఆ బుద్ధి(ని); ప్రకృతిన్= ప్రకృతిలో; కలఁపన్= కలిపినట్లయితే; తద్= ఆ; ధ్యానతత్పరత= ధ్యానతత్పరత్వం; కలుగున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** ఇంద్రియాలను మనస్సులో, మనస్సును అహంకృతిలో, అహంకృతిని బుద్ధిలో, బుద్ధిని ప్రకృతిలో సంలీనం చేసినట్లయితే అదే ధ్యానం. అదే మనోధారణ.

**క. ధ్యానైక తత్పరాత్ముఁడు । గానఁబడయు నజరు నిర్వికల్పు విమలు ని**
**త్యానందసత్యశుద్ధ । జ్ఞానమయుం బరము నచలు శాశ్వతుని శివున్. 118**

**ప్రతిపదార్థం:** ధ్యాన+ఏక+తత్పర+ఆత్ముఁడు= ధ్యానంపట్ల అద్వితీయమైన తత్పరత కలిగిన వ్యక్తి; అజరున్= జరలేనివాడూ; నిర్వికల్పున్= వికల్పాలు లేనివాడూ; విమలున్= మలినరహితుడూ; నిత్య+ఆనంద+సత్య+శుద్ధ+జ్ఞానమయున్= నిత్యానందమయుడూ, సత్యమయుడూ, శుద్ధమయుడూ; జ్ఞానమయున్= జ్ఞానమయుడూ; పరమున్= పరతత్త్వం అనబడేవాడూ; అచలున్= నిశ్చలుడూ; శాశ్వతునిన్= శాశ్వతమైనవాడూ అయిన; శివున్= శివుడిని; కానన్+పడయున్= చూడగలడు.

**తాత్పర్యం:** ధ్యాననిష్ఠ కలిగిన వ్యక్తి - జరావికల్పరహితుడూ, నిర్మలుడూ, నిత్యానందమయుడూ, సత్య-శుద్ధ జ్ఞానమయుడూ, పరముడూ, అచలుడూ, శాశ్వతుడూ అయిన శివుడిని దర్శించగలుగుతాడు.

**చ. ఉదిత సమగ్రబోధుఁడగు యోగికి నిశ్చలదీపరూపసం**
**పద సుఖసుప్త భంగి ఘనపంక్తులు లేని వియత్తలంబు నొ**
**ప్పిద మొదవుం దరంగముల పెల్లునఁ దాఁ జలితంబుగాని వా**
**ర్ధి దశ నతం డకంపుఁ డగు ధీపరివృత్తులు గల్గెనేనియున్. 119**

**ప్రతిపదార్థం:** ఉదిత= ఆవిర్భవించిన; సమగ్ర= పరిపూర్ణమైన; బోధుఁడు+అగు= జ్ఞానం కలవాడైన; యోగికిన్= ధ్యానతత్పరుడికి; నిశ్చల= చలనంలేని; దీప= దీపంయొక్క; రూపసంపద= రూపసంపత్తీ; సుఖసుప్త= ఆదమరిచి నిద్రపోయినవాడియొక్క; భంగి= పోలిక; ఘనపంక్తులు= మేఘాల గుంపులు; లేని= లేనటువంటి; వియత్+తలంబు(యొక్క) ఒప్పిదము= ఆకాశపు చందమూ;

ఒదవున్= లభిస్తాయి; తరంగములు= కెరటాలు; పెల్లునన్= అతిశయంతో; తాన్= తాను; చలితంబు= చలించినది; కాని= కానటువంటి; వార్ధి+దశన్= సముద్రంవలె; అతండు= ఆ యోగి; ధీ+పరివృత్తులు= బుద్ధి చాంచల్యాలు; కల్గెనేనియున్= ఎన్ని కల్గినప్పటికీ; అకంపుఁడు+అగున్= కంపించడు - చలించడు.

**తాత్పర్యం:** పరిపూర్ణ జ్ఞాని అయిన యోగి నిశ్చలదీపంవలె ఉంటాడు. ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నట్లు ఉంటాడు. నిర్మేఘమూ నిర్మలమూ అయిన ఆకాశంవలె ఉంటాడు. బుద్ధిలో మార్పులూ చాంచల్యాలూ ఎన్ని వచ్చినా- తరంగాల తాకిడికి చలించని సముద్రంవలె అతడూ నిశ్చలంగా ఉంటాడు.

**విశేషం:** అలం: మాలోపమ.

**క. భేరీ శంఖాదిక నా - నారవములు వొడమెనేని నాతఁడు దానం**
**గారింపఁబడఁడు వీతవి । కారస్థితిఁ బొలిచియుండు గగనముభంగిన్. 120**

**ప్రతిపదార్థం:** భేరీ= యుద్ధభేరులూ; శంఖ+ఆదిక= శంఖాలూ మొదలైన; నానా+రవములు= రకరకాల ధ్వనులు; పొడమెనేనిన్= తనచుట్టూ చెలరేగినా; ఆతఁడు= ఆ యోగి; దానన్= ఆ రణగుణధ్వనితో; కారింపఁబడఁడు= హింసింపబడడు; గగనముభంగిన్= ఆకాశంలాగా; వీతవికార స్థితిన్= వికారాలు ఏమీ లేని స్థితితో; పొలిచి+ఉండున్= విరాజిల్లుతూంటాడు.

**తాత్పర్యం:** భేరీభాంకారాలూ శంఖఝుంకారాలూ తన చుట్టూ ఎన్ని చెలరేగినా యోగి చలించడు. ధ్యానం భంగపడదు. నిర్వికారంగా నిశ్చలంగా ఆకాశంవలె ఉంటాడు.

**క. తేనియకుండఁ గొనుచు సో । పానము లేమఱుట లేక ప్రాఁకిన క్రియ నా**
**త్మానందరసంబొక కణ । మైనఁ జిలుకనీక తుదికి నాతం డెక్కున్. 121**

**ప్రతిపదార్థం:** తేనియకుండన్= తేనెతో నిండిన కుండను; కొనుచున్= మోస్తూ; సోపానములు= మెట్లు; ఏమఱుటలేక= ఏమరుపాటు లేకుండా; ప్రాఁకిన క్రియన్= అధిరోహించిన విధంగా('క్రియన్' అనేది 'పోలెన్', 'వలెన్' మొదలైన వాటివలె ఉపమావాచకం); ఆత్మానందరసంబు= ఆత్మానందమనే మధురద్రవం; ఒక కణమైనన్= ఒక్క బిందువు కూడా; చిలుకనీక= తొణికి పడనీయకుండా; ఆతండు= ఆ యోగి; తుదికిన్= కొసదాకా; ఎక్కున్= అధిరోహిస్తాడు.

**తాత్పర్యం:** తేనెకుండ నెత్తిమీద పెట్టుకొని ఏమరుపాటు అనేది లేకుండా మెట్టులు ఎక్కినట్లుగా యోగి తన ఆత్మానందరసం ఒక్క బొట్టు కూడా చిందిపోకుండా అధిరోహించి గమ్యం చేరుకొంటాడు.

**విశేషం:** అలం: ఉపమ. దీనికి వ్యాసుడి శ్లోకం ఇట్లా ఉన్నది **"తైలపాత్రం యథా పూర్ణం కరాభ్యాం గృహ్య పూరుషః । సంయతాత్మా భయాత్తేషాం న పాత్రాద్బిందు ముత్సృజేత్ । తథైవోత్తరమాణస్య చైకాగ్ర మనసస్తథా ॥"** నూనె నిండిన పాత్రను చేతులతో పట్టుకొని ఒక వీరుడు మెట్లు ఎక్కుతూ ఉంటాడు. అటూ ఇటూ కత్తులవారు ఝళిపిస్తూ ఉంటారు. ఏకాగ్రతను కోల్పోకుండా నూనె బొట్టు తొణికి పడకుండా ఆ వీరుడు అన్ని మెట్లు ఎక్కి పైకి చేరుకొనాలి. చేరుకొంటాడు. అట్లాగే ఆకర్షణలూ ఆటంకాలూ ఎన్ని వచ్చినా యోగి చలించకుండా సాధన కొనసాగించి గమ్యం (ముక్తి) చేరుకొంటాడు. పోలికగా చెప్పిన ఈ అంశం ఒకరకం యుద్ధవిద్య. వీరుడి భౌతికశక్తినీ, బౌద్ధిక శక్తినీ పరీక్షించే విధాన మిది. కరాటే - కుంగ్‌ఫూ వంటి మార్షల్ ఆర్ట్స్‌లో ఇది ఇప్పటికీ ఉన్నది. ఇక్కడ తైలపాత్రను తిక్కన తేనియకుండగా మార్చాడు. ఆత్మానందరసంతో పోల్చటం వలన ఈ మార్పు మరింతగా అందగించింది.

**క. అనఘ! యిది యోగపథ మిం । దనలసుఁడై చనఁగఁ జాలు నతఁడు కృతార్థుం**
**డనితరసులభ పద ప్రా । ప్తినిరూఢుఁ డనామయుం డభిష్టుతుఁ డెందున్. 122**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పవిత్రుడా!; ఇది= ఈ చెప్పినది; యోగపథము= యోగమార్గం; ఇందున్= ఈ మార్గంలో; అనలసుఁడై= ఏమరుపాటు (అలసత) లేనివాడై; చనఁగఁ జాలునతఁడు= ప్రయాణించగల్గినవాడు; కృతార్థుండు= కృతకృత్యుడు; ఎందున్= సర్వత్ర; అతఁడు; అనితరసులభ= ఇతరులకు అందని; పద= మోక్షపదం యొక్క; ప్రాప్తి= లబ్ధితో; నిరూఢుఁడు= ప్రసిద్ధికెక్కినవాడూ; అనామయుండు= రోగరహితుడూ; అభిష్టుతుఁడు= కొనియాడబడేవాడూను.

**తాత్పర్యం:** జనకమహారాజా! ఇంతవరకూ చెప్పినది యోగమార్గం. ఈ మార్గంలో ప్రయాణించాలంటే చాలా ఏకాగ్రత ఉండాలి. జాగరూకుడై ప్రయాణించినవాడు కృతార్థుడవుతాడు. ఇతర మార్గాలలో ప్రయాణించేవారికి అంత తేలికగా అందని మోక్షపదం ఇతడికి లభిస్తుంది. అనామయు డవుతాడు. సర్వేసర్వత్రస్తుతిపాత్రుడు అవుతాడు.

**వ. అని యుపదేశించి వెండియు. 123**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; ఉపదేశించి= ఉపదేశం చేసి; వెండియున్= మరల - కొనసాగిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా చెప్పి, మరల (కొనసాగిస్తున్నాడు).

**సీ. నరనాథ! యుత్క్రమణప్రదేశంబులు । పాదజంఘాజానుపాయు గుహ్య**
**ములు నూరుపార్శ్వనాభులు బాహువక్షోగ । ళాననశ్రోత్ర నాసాంబకములు**
**భ్రూఫాలమస్తకంబులు నోలి విష్ణుండు । వసుసాధ్యమిత్రులు వసుధయును బ్ర**
**జాపతి మరుదిందు సంక్రందనస్థాణు । లును నరుం డను మహామునియు విశ్వ**

**తే. దేవదిగ్గంధవహులును బావకుండు । నశ్విపితృ శతానందులు నందు వెలుఁగు**
**చుండ్రు హృన్మయ పవనక్రమోత్క్రమముల । నొందు నద్దైవతంబుల యోగివరుఁడు.' 124**

**ప్రతిపదార్థం:** నరనాథ!= మిథిలేశ్వరా!; పాద= కాళ్ళు; జంఘా= పిక్కలు; జాను= మోకాళ్ళు; పాయు= గుదం; గుహ్యములును= రహస్యాంగాలు అనేవీ; ఊరు= తొడలు; పార్శ్వ= డొక్కలు; నాభులు= బొడ్డు అనేవీ; బాహు= చేతులు; వక్షః= ఉరస్సు; గళ= గొంతు (కంఠం); ఆనన= ముఖం; శ్రోత్ర= చెవులు; నాసా= ముక్కు; అంబకములు= కన్నులు అనేవీ; భ్రూ= కనుబొమలు; ఫాల= నుదురు; మస్తకంబులున్= శిరస్సు - అనేవీ; ఉత్క్రమణ ప్రదేశములు= యోగి హృదయగతమైన ప్రాణవాయువు శరీరంనుంచి ఉత్క్రమించే ప్రదేశాలు; ఓలిన్= క్రమంగా; విష్ణుండు= విష్ణుమూర్తి (పాద); వసు= వసువులు (జంఘా); సాధ్య= సాధ్యులు; మిత్రులు= సూర్యుడు అనేవారూ; వసుధయును= భూమి (గుహ్య); ప్రజాపతి= ప్రజాపతి అనబడే బ్రహ్మ; మరుత్= మరుత్తులు అనే దేవతలు; ఇందు= చంద్రుడు (నాభి); సంక్రందన= ఇంద్రుడు (బాహు); స్థాణులును= శివుడు (వక్షః); అనేవారూ; నరుండు+అను+మహామునియున్= నరుడు అనే పేరుగల మహాముని (గళం); విశ్వదేవ= విశ్వేదేవతలు; దిక్= దిక్కులు (శ్రోత్ర); గంధవహులును= వాయువు (నాసా) అనేవారూ; పావకుండు= అగ్ని (అంబకములు); అశ్వి= అశ్వినీ దేవతలు; పితృ= పితృదేవతలు; శతానందులు= శతానందుడు అనబడే మరొక బ్రహ్మ; అందున్= ఆయా అవయవాలలో; వెలుఁగుచుంద్రు= విరాజిల్లుతూ ఉంటారు; యోగివరుఁడు= యోగీశ్వరుడు; హృద్+మయ= హృదయగతమైన; పవన= ప్రాణవాయువుయొక్క; క్రమ+ఉత్క్రమములన్= వరుసగా జరిగిన ఉత్క్రమణాలతో; ఆ+దైవతంబులన్= ఆయా దేవతలను; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** (యోగీశ్వరుడి శరీరంలో ఏయే ప్రదేశాలనుండి ప్రాణవాయువు ఉత్క్రమిస్తే అతడు ఏయే దేవతల స్థానాన్ని పొందుతాడో ఈ పద్యంలో వివరించి చెప్పాడు). కాళ్ళనుండి ఉత్క్రమిస్తే వైష్ణవస్థానాన్నీ, పిక్కలనుండి

అయితే వసుస్థానాన్ని, మోకాళ్ళనుండి సాధ్యులస్థానాన్ని, గుదప్రదేశంనుండి సూర్యస్థానాన్ని, రహస్యాంగంనుండి వసుధాస్థానాన్ని, తొడలనుండి ప్రజాపతిస్థానాన్ని, పార్శ్వాలనుండి మరుత్తుల స్థానాన్ని, నాభినుండి చంద్రస్థానాన్ని, బాహువులనుండి ఇంద్రస్థానాన్ని, రొమ్మునుండి స్థాణుత్వాన్ని, గళంనుండి నరుడనే మునీశ్వరుడి స్థానాన్ని, ముఖంనుండి విశ్వేదేవత్వాన్ని, చెవులనుండి దిక్కుల స్థానాన్ని (దిక్పాలకత్వమేమో **దిశః శ్రోత్రేణ చాప్నుయాత్** అని మూలం), నాసికనుండి వాయుత్వాన్ని, నేత్రాలనుండి పావకత్వాన్ని, కనుబొమలనుండి అశ్వినీదేవత్వాన్ని, ఫాలంనుండి పితృదేవతల స్థానాన్ని, మస్తకంనుండయితే శతానందత్వాన్ని పొందుతాడు'.

**విశేషం:** పాఠాంతరాలతో సరిజూచుకొంటే ఆంధ్రీకరణం యథామూలంగా సరిపోతోంది. (12-305-1 నుండి 7 శ్లోకాలు)

### యాజ్ఞవల్క్యుఁడు జనకునితో మరణసూచకంబులఁ జెప్పుట (సం. 12-305-7)

**వ. అని చెప్పి మఱియు నిట్లను 'నరిష్టంబుల తెఱం గెఱుంగవలయుం గావున నెఱింగించెద నాకర్ణింపుము.' 125**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; చెప్పి= వివరించి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు యాజ్ఞవల్క్యుడు; అరిష్టంబుల తెఱంగు= అరిష్టాలు ఎట్లా ఉంటాయో; ఎఱుంగన్ వలయున్= తెలుసుకోవాలి; కావునన్= కాబట్టి; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; ఆకర్ణింపుము= ఆలించు.

**తాత్పర్యం:** 'ప్రాణోత్క్రమణవేళ అరిష్టసూచకాలను వివరిస్తాను తెలిసికొమ్ము' అని యాజ్ఞవల్క్యుడు జనకమహారాజుకు చెప్పుతున్నాడు.

**సీ. 'ధ్రువమండలమున నరుంధతిఁ గనుశక్తి । గంటికిఁ గలుగంగఁ గానకున్న**
**ముక్కున వలపటఁ జెక్కవాసినయట్లు । దోఁచినఁ బూర్ణచంద్రుండు మలినుఁ**
**డై కానవచ్చిన నాయువు సంవత్స । రంబునఁ గడచను రాజముఖ్య!**
**కాంతి దొల్లిటియట్లుగాక యంతకు నెక్కు । డైనను గడుఁజెడ్డ నట్లు ప్రజ్ఞ**

**తే. క్రొత్తగాఁ బెద్దయైనను గొంచెమైన । నాఱునెలల మరణదశ యగుట గలుగు**
**నిందుమండలమున రవి యందు నడుమఁ । దెఱపి గాంచినఁ దెగు నేడు దివసములకు. 126**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= ఓ రాజోత్తమా!; ధ్రువమండలమునన్= సప్తర్షిమండలంలో; అరుంధతిన్= అరుంధతీ నక్షత్రాన్ని; కనుశక్తి= చూడగలిగిన శక్తి; కంటికిన్= నేత్రాలకు; కలుగంగన్= ఉన్నప్పటికీ; కానకున్నన్= చూడలేక పోతే; ముక్కునన్+వలపటన్= ముక్కు కుడివైపున; చెక్క+పాసినయట్లు= ముక్కు తెగిపోయినట్లు; తోఁచినన్= కనిపించినట్టయితే; పూర్ణచంద్రుండు= నిండు జాబిల్లి; మలినుఁడై= మసకబారి; కానవచ్చినన్= కనిపించినట్టయితే; ఆయువు= అటువంటివాడి ఆయుర్దాయం; సంవత్సరంబునన్= ఒక సంవత్సరకాలంలో; కడచను= అంతం అవుతుంది; కాంతి= తేజస్సు; తొల్లిటి+అట్లు గాక= మునుపటివలె కాకుండా; అంతకున్+ఎక్కుడు+ఐననున్= అంతకంటే ఎక్కువ అయినా; కడున్+చెడ్డన్= లేదా పూర్తిగా చెడిపోయినా; అట్లు= అట్లాగే; ప్రజ్ఞ= తెలివి అనేది; క్రొత్తగాన్= ఉన్నట్టుండి; పెద్దయైననున్= గొప్పగా అతిశయించినా; కొంచెము+ఐనన్= బాగా తరిగిపోయినా; ఆఱునెలలన్= ఆరుమాసాల్లో; మరణదశ+అగుట= మరణ దశ ప్రాప్తించటం; కలుగున్= జరుగుతుంది; ఇందుమండలమునన్= చంద్రబింబంలోనూ; రవియందున్= సూర్యబింబంలోనూ; నడుమన్= మధ్యభాగంలో; తెఱపి= వెలితి; కాంచినన్= కనిపించినట్లయితే; ఏడు దివసములకున్= కేవలం వారం రోజుల్లో; తెగున్= వాడు మరణిస్తాడు.

**తాత్పర్యం:** 'జనకమహారాజా! సప్తర్షిమండలంలో అరుంధతిని చూడగలిగిన శక్తి కంటికి ఉన్నా అరుంధతి కనపడకపోతే వాడి ఆయుర్దాయం ఇక సంవత్సరమే అని గ్రహించుము. నాసికకు కుడివైపున ఒక ముక్కు ఊడిపోయినట్లు తన చూపులకే అనిపిస్తే వాడు కూడా సంవత్సరంకంటె జీవించడు. అట్లాగే నిండు చందమామ మకిలిపట్టినట్టు బూజురు బూజురుగా కనిపిస్తే అతడూ అంతే - సంవత్సరం తరువాత మరి ఉండడని తెలిసికొమ్ము. ముఖవర్చస్సు ఇదివరకువలె కాకుండా బాగా పెరిగినట్లు కనపడినా తరిగినట్లుగా కనపడినా, తెలివికూడా అట్లాగే బాగా పెరిగినట్లో తరిగినట్లో అనిపించినా వాడు ఆరునెలల్లో సెలవు తీసికొంటాడని గుర్తించుము. సూర్యచంద్రబింబాలలో తొర్రెలు కనపడితే వాడు వారం రోజులకంటె బ్రతుకడు సుమా!

**క. విను గుడిలోనున్న సమయ । మున సురభిద్రవ్యములను బొల వల్చుట గ**
**ల్గిన నాఱు దివసములఁ గ । ల్గును మృత్యుసమాగమంబు గుణరత్ననిధీ! 127**

**ప్రతిపదార్థం:** గుణరత్ననిధీ!= గుణసముద్రుడా - జనకమహారాజా! విను; గుడిలోన్+ఉన్న+సమయమునన్= కోవెలలో కూర్చున్న తరుణంలో; సురభిద్రవ్యములను= పువ్వులూ, గంధం మొదలైన పరిమళవస్తువుల్లో; పొల వల్చుట= దుర్గంధ విజృంభణ; కల్గినన్= తనకు అనిపిస్తే; ఆఱు దివసములన్= ఆరు రోజులలో; మృత్యు సమాగమంబు= మృత్యుప్రాప్తి; కలుగున్= అవుతుంది.

**తాత్పర్యం:** సద్గుణసముద్రుడా! మరొక విషయం చెప్తున్నాను గ్రహించుము. కోవెలలోకి వెళ్ళినప్పుడు అక్కడున్న గంధపుష్పాది సుగంధద్రవ్యాలు ఎవడి ముక్కుకి దుర్గంధంవలె సోకుతాయో వాడు ఆరునెలల్లో 'హరీ' అంటాడని తెలిసికొమ్ము.

**విశేషం:** 'పొల వల్చుట' అని మాత్రమే అన్నాడు తిక్కన. కానీ వ్యాసుడు శవం కంపు కొట్టటం అన్నాడు. **"శవగంధముపాఘ్రాతి సురభిం ప్రాప్య యో నరః । దేవతాయతనస్థస్తు షడ్రాత్రేణ స మృత్యుభాక్ ॥" (12-305-14).**

**తే. ముక్కువ్రాలుట కర్ణముల్ మ్రొగ్గఁబడుట । రదనవైవర్ణ్యమక్షి విరాగభావ**
**మంగ మతికృష్ణ మగు టుల్ల మడరఁ జెడుట । సూచకములు సద్యోమృత్యు గోచరతకు. 128**

**ప్రతిపదార్థం:** ముక్కు= నాసిక; వ్రాలుట= ఒరిగిపోవటం; కర్ణముల్= చెవులు; మ్రొగ్గఁబడుట= వాలిపోవటం; రదన= దంతాల; వైవర్ణ్యము= రంగు మారిపోవటం; అక్షి= నేత్రాల; విరాగభావము= విరక్తి; అంగము= శరీరం; అతికృష్ణము+అగుట= బాగా నల్లబడటం; ఉల్లము= హృదయం; అడరన్+చెడుట= స్పందన కోల్పోవటం; సద్యోమృత్యు గోచరతకున్= వెంటనే మృత్యువు ప్రత్యక్షమవుతుంది అనటానికి; సూచకములు= చిహ్నాలు.

**తాత్పర్యం:** చెవులూ, ముక్కూ వాలిపోవటం, దంతాలు రంగు మారిపోవటం, కన్నులు నిర్జీవంగా అయిపోవటం, శరీరమంతా మాడిపోయినట్టు నల్లబడటం, హృదయస్పందన కోల్పోవటం - ఇవన్నీ సద్యోమృత్యువుకు సూచకాలు.

**తే. కారణము లేక దాపలి కను ద్రవించు । నెత్తి చక్కటి ధూమంబు నెగయు నపుడ**
**మరణదశ యావహిల్లెడు మానవునకు । జనకనృప! యివి బ్రహ్మ సెప్పిన విధములు. 129**

**ప్రతిపదార్థం:** జనకనృప!= జనకమహారాజా!; కారణములేక= కారణం ఏదీ లేకుండానే; దాపలి కను= ఎడమకన్ను; ద్రవించున్= నీరు కారుతుంది; నెత్తిచక్కటిన్= నెత్తిమీద; ధూమంబు= పొగ; నెగయున్= ఎగసిపడుతుంది; మానవునకున్= ఇవి జరిగిన మానవుడికి; మరణదశ= చివరిదశ; అపుడు+అ= ఆ క్షణంలోనే; ఆవహిల్లెడున్= ప్రాప్తిస్తుంది; ఇవి= ఇవన్నీ; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; చెప్పిన= వివరించిన; విధములు= తీరులు.

**తాత్పర్యం:** అకారణంగా ఎడమకన్ను నీరోడినా, నెత్తిమీదనుంచి పొగలు రేగినా ఆ మానవుడు తత్ క్షణమే మరణిస్తాడని సూచన. ఇవన్నీ బ్రహ్మదేవుడు స్వయంగా చెప్పిన విషయాలు సుమా!

**క. విను యోగివరుఁ డరిష్టము । కనుఁగొని యనిశమును యోగగతియుతసాంఖ్యం**
**బనపాయత నడుపుచు నా । త్మునిఁ బరముం జేర్చి కాలముం గబళించున్. 130**

**ప్రతిపదార్థం:** విను= రాజా! ఆలకించుము; యోగివరుఁడు= యోగీశ్వరుడు; అరిష్టము= అశుభాన్ని; కనుఁగొని= పైని చెప్పిన మరణ సూచకాలతో గ్రహించి; అనిశమును= ఎల్లప్పుడూ; యోగగతియుత= యోగమార్గంతో కూడిన; సాంఖ్యంబున్= సాంఖ్యవిద్యను; అనపాయతన్= విడిచిపెట్టకుండా; నడుపుచున్= సాగిస్తూ; ఆత్మునిన్= జీవాత్ముడిని; పరమున్ చేర్చి= పరమాత్మను చేర్చి; కాలమున్= కాలాన్ని; కబళించున్= స్వాయత్తం చేసుకుంటాడు - స్వాధీనపరచుకుంటాడు.

**తాత్పర్యం:** ఆయా మరణసూచకాలతో యోగీశ్వరుడు అరిష్టాన్ని గుర్తించి, యోగమార్గం విడువకుండా సాగిస్తూ, జీవాత్మను పరమాత్మతో అనుసంధానించి, కాలాన్ని స్వాధీనపరుచుకొంటాడు.

**వ. ఇవ్విధమున నతండు. 131**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ పద్ధతిగా; అతండు= ఆ యోగీశ్వరుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ యోగీశ్వరుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కాల కబళనైక శీలుఁడై మృత్యువు । గెలిచి శాశ్వతము నచలము శివము**
**నచ్యుతము ననామయము నమృతము నవ్య । యంబు నగు పదంబునందు నిలుచు.' 132**

**ప్రతిపదార్థం:** కాల= కాలాన్ని; కబళన= స్వాధీనపరచుకోవటమనే; ఏక= (ఒకే ఒక్క) అద్వితీయమైన; శీలుఁడై= స్వభావం కలవాడై; మృత్యువున్= మృత్యువును; గెలిచి= జయించి; శాశ్వతమున్= నిత్యమైనదీ; అచలమున్= చలించనిదీ; శివమున్= శుభప్రదమైనదీ; అచ్యుతమున్= చ్యుతిలేనిదీ; అనామయమున్= రోగరహితమైనదీ; అమృతమున్= మరణంలేనిదీ; అవ్యయంబున్= మార్పులేనిదీ; అగు= అయినటువంటి; పదంబునందున్= స్థానంలో; నిలుచున్= నిలుస్తాడు.

**తాత్పర్యం:** యోగీశ్వరుడు కాలాన్ని కబళించే శీలంతో మృత్యువును జయించి, శాశ్వతాదిలక్షణాలు కలిగిన అవ్యయ పదాన్ని పొందుతాడు'.

**వ. అని పలికి యాజ్ఞవల్క్య మునీశ్వరుండు జనకజనేశ్వరుతోఁ 'బరంబు దేటపఱుపు మని నీ వడిగి; తా ప్రశ్నంబు సూక్ష్మం; బుత్తరం బవహితుండ వయి విను'మని యిట్లనియె. 133**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఇట్లా చెప్పి; యాజ్ఞవల్క్యమునీశ్వరుండు= యాజ్ఞవల్క్యుడు; జనక+జన+ఈశ్వరుతోన్=జనకమహారాజుతో; పరంబు= పరతత్త్వాన్ని; తేటపఱుపుము+అని= విశదీకరించుమని; నీవు; అడిగితి(వి)= అడిగావు; ఆ ప్రశ్నంబు= ఆ ప్రశ్న; సూక్ష్మంబు= చాలా సూక్ష్మమైనది; ఉత్తరంబు= సమాధానం; అవహితుండవు+అయి= సావధానుడవై; వినుము; అని; ఇట్లు+అనియెన్= ఇట్లా వివరించాడు.

**తాత్పర్యం:** అని చెప్పి యాజ్ఞవల్క్యుడు జనకమహారాజుతో 'పరతత్త్వాన్ని విశదీకరించు మని అడిగావు. ఆ ప్రశ్న చాలా సూక్ష్మమైనది' అంటూ ఇట్లా కొనసాగించాడు.

సీ. 'మహనీయతపమున మార్తాండు నాకుఁ బ్ర । సన్నుఁగాఁ జేసితి సదయదృష్టి
నను(జూచి యద్దేవుఁ డనఘ! వరంబు నీ । కిచ్చెద నీ కోర్కి యెద్ది? సెప్పు
మనవుడుఁ బ్రణతుండనై యజుస్సంప్రాప్తి । గోరెద ననిన నవ్వారిజాప్తుఁ
డట్లేని వాగ్దేవి నావహించెద వివృ । తంబుగాఁ జేయు మాస్యంబు విప్ర!

తే. యనియె నవ్వచనము విని యాననమ్ము । సంతసమున విచ్చితి సరస్వతియు నాదు
తనువుఁ జొచ్చెఁ బదంపడి దాహమొంది । తన్ను నెఱుఁగక వెగడొందు నన్ను నినుఁడు. 134

**ప్రతిపదార్థం:** మహనీయ తపమునన్= గొప్ప తపస్సుతో; మార్తాండున్= సూర్యుడిని; నాకున్= నాకు; ప్రసన్నుఁగాన్= ప్రసన్నుడిగా; చేసితిన్= చేసికొన్నాను; ఆ+దేవుఁడు= ఆ సూర్యభగవానుడు; సదయదృష్టిన్= కరుణగల చూపులతో; ననున్+చూచి= నన్ను వీక్షించి; అనఘ!= ఓ పవిత్రుడా! యాజ్ఞవల్క్యుడా!; వరంబున్= ఒక వరాన్ని; నీకున్+ఇచ్చెదన్= నీకు ఇస్తాను; నీ కోర్కి= నీ కోరిక; ఎద్ది?= ఏమిటి?; చెప్పుము= చెప్పు; అనవుడున్= అని సూర్యుడు అనగానే; ప్రణతుండను+ఐ= నమస్కరించినవాడిని అయి; యజుః+సంప్రాప్తిన్= యజుర్వేద లబ్ధిని; కోరెదన్= కోరుకుంటున్నాను; అనినన్= అని నేను అడగగానే; ఆ+వారిజ+ఆప్తుఁడు= పద్మాలకు ఆప్తుడైన ఆ సూర్యుడు; అట్లు+ఏనిన్= అట్లాగయితే; వాగ్దేవిన్= సరస్వతిని; ఆవహించెదన్= ఆవహింపజేస్తాను; విప్ర!= ఓ బ్రాహ్మణుడా!; ఆస్యంబున్= నీ నోటిని; వివృతంబుగాన్+చేయుము= బాగా తెరుచుకునేట్టు చెయ్యి; అనియెన్= అన్నాడు; ఆ+వచనము= ఆ మాట; విని= ఆలించి (పాటించి); సంతసమునన్= సంతోషంతో; ఆననమ్మున్= నా నోటిని; విచ్చితిన్= తెరిచాను; సరస్వతియున్= వాగ్దేవి; నాదు తనువున్= నా శరీరాన్ని; చొచ్చెన్= ప్రవేశించింది; పదంపడి= వెనువెంటనే; దాహము+ఒంది= మంటలకు లోనై; తన్నున్+ ఆ సూర్యభగవానుడిని; ఎఱుఁగక= గుర్తించలేక; వెగడు+ఒందు= తల్లడిల్లుతున్న; నన్నున్= నన్ను; ఇనుఁడు= ఆ సూర్యదేవుడు.

**తాత్పర్యం:** 'జనకమహారాజా! ఒకప్పుడు నేను గొప్ప తపస్సుచేసి సూర్యభగవానుడిని మెప్పించాను. ఆ దేవుడు ప్రత్యక్షమై ఏదైనా వరం కోరుకొనుమన్నాడు. అయితే 'నాకు యజుస్సులను సంప్రాప్తింపజేయుము' అని అడిగాను. 'సరే అట్లాగే. సరస్వతీదేవిని ఆవహింపజేస్తాను. నోరు పెద్దదిగా తెరువుము' - అన్నాడు సూర్యుడు. నేను ఆనందంతో నోరు తెరిచాను. సరస్వతి శరీరంలోనికి ప్రవేశించింది. వెంటనే శరీరం భగభగ లాడిపోయింది. తట్టుకొనలేక ఎదురుగా ఉన్న సూర్యుడిని గుర్తుపట్టలేక తల్లడిల్లిపోయాను. అట్లాంటి నన్ను చూచి ఆ సూర్యుడు (ఇట్లా అన్నాడు).

క. కనుఁగొని యించుకసేపునఁ । దనువడు నని పలికెఁ బిదపఁ దనువడుటయునుం
బనుపడియె నప్పు డద్దే । వుని వదనాబ్జమున నా చెవుల కింపారన్. 135

**ప్రతిపదార్థం:** కనుఁగొని= నన్నుచూసి; ఇంచుకసేపునన్= కొంచెం సేపట్లో; తనువడున్= చల్లబడుతుంది; అని పలికెన్= అని అన్నాడు; పిదపన్= అటు తరువాత; తనువడుటయునున్= చల్లపడటమనేది కూడా; పనుపడియెన్= జరిగిపోయింది; అప్పుడు= ఆ సమయాన; ఆ+దేవుని= ఆ సూర్యదేవుడి; వదన+అబ్జమునన్= ముఖ పద్మంనుంచి; నా చెవులకున్= నా కర్ణేంద్రియాలకు; ఇంపారన్= ఇంపు అతిశయించేట్టు.

**తాత్పర్యం:** సూర్యుడు నన్ను చూచి 'ఓ విప్రుడా! కొంచెంసేపు తట్టుకొమ్ము. మంటలు చల్లబడతాయి' అన్నాడు. అనట మేమిటి చల్లబడటం కూడా జరిగిపోయింది. అప్పుడు సూర్యుడి ముఖపద్మంనుండి నా చెవులకు ఇంపుగా కొన్ని పలుకులు వినిపించాయి.

**విశేషం:** 'వదనాబ్జమునుండి నా చెవులకింపారన్' అని ఉండవలసిన పంచమీవిభక్తికి బదులుగా 'వదనాబ్జమునన్' అని సప్తమీవిభక్తి నిలిచింది. దీనిని బాలవ్యాకర్త సూత్రించాడు. 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగా నగు'

(కారక - 11) 'వదనాబ్జముననుండి' అన్న చోట ఉన్న 'ఉండి' శబ్దానికి లోపం బహుళంబుగా వస్తుందని ప్రౌఢవ్యాకర్త సూత్రించాడు. 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు (కారక -11)' 'వదనాబ్జమున నా చెవుల కింపారన్.'

**క. భూసురవర! వేదము ప్రతి । భాసిల్లుచు సంతతప్రపత్తి గలుగు ను**
**ల్లాసంబు బుద్ధినొందు స । మాసన్నంబు లగు సాంఖ్యమతయోగంబుల్. 136**

**ప్రతిపదార్థం:** భూసురవర!= ఓ బ్రాహ్మణోత్తమా! యాజ్ఞవల్క్యుడా!; వేదము= నీవడిగిన యజుర్వేదం; ప్రతిభాసిల్లుచున్= విరాజిల్లుతూ; సంతతప్రపత్తి= శాశ్వత శరణాగతి; కలుగున్= నీకు లభిస్తుంది; ఉల్లాసంబు= వికాసం; బుద్ధిన్= నీ బుద్ధిని; ఒందున్= పొందుతుంది; సాంఖ్యమతయోగంబుల్= సాంఖ్యమతమూ, యోగమూ; సమాసన్నంబులు+అగున్= నిన్ను చేరుకుంటాయి.

**తాత్పర్యం:** యాజ్ఞవల్క్యమహర్షీ! వేదం నీకు లభిస్తుంది. నీ బుద్ధి వికసిస్తుంది. సాంఖ్యయోగాలు నీకు ప్రాప్తిస్తాయి. (వేదం భాసించే ప్రపత్తితో ఉన్న ఉల్లాసం బుద్ధికి కలుగుతుందని గానీ).

**ఆ. యోగసాంఖ్య సిద్ధినొందు నిష్టావాప్తి । సనుము సమ్మదమున' నను మృదూక్తు**
**లుద్భవించె మోద ముత్కట మయ్యె నా । కమృతవృష్టిఁ దోఁగినట్టు లైతి. 137**

**ప్రతిపదార్థం:** యోగసాంఖ్య సిద్ధిన్= యోగసాంఖ్యాల సిద్ధితో; ఒందు+ఇష్ట+అవాప్తిన్= లభించేటువంటి ఇష్టావాప్తితో; సమ్ముదమునన్= సంతోషంగా; చనుము= వెళ్ళుము; అను= అనేటువంటి; మృదు+ఉక్తులు= మృదువైన మాటలు; ఉద్భవించెన్= వెలువడ్డాయి; నాకున్= నాకు; మోదము= ఆనందం; ఉత్కటము+అయ్యెన్= అతిశయించింది; అమృతవృష్టిన్= అమృతవర్షంలో; తోఁగినట్టులు+ఐతిన్= ఓలలాడినట్టు అయ్యాను.

**తాత్పర్యం:** యోగసాంఖ్యాల సిద్ధివలన కలిగే ఇష్టావాప్తి నీకు లభిస్తుంది. ఆనందంగా వెళ్ళుము' అనే మెత్తని పలుకులు సూర్యుడి నోటినుండి నా చెవులకు సోకాయి. నా ఆనందానికి అవధులు లేవు. అమృతవర్షంలో దొప్పదోగినట్టు అయ్యాను.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. తదనంతరంబ యద్దేవుం డస్తాచలంబువలని కరిగె; నేనుం బరమానందకందళిత మనస్కుండ నగుచు మందిరంబున కేతెంచి సరస్వతిం దలంచుచున్నంత - 138**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే; ఆ+దేవుండు= ఆ సూర్యభగవానుడు; అస్తాచలంబువలనికిన్= పశ్చిమాద్రి వైపునకు; అరిగెన్= వెళ్ళిపోయాడు; నేనున్= నేనుకూడా; పరమానంద= గొప్ప ఆనందంతో; కందళిత= పులకించిన; మనస్కుండను+అగుచున్= మనస్సుకలవాడను అవుతూ; మందిరంబునకున్= ఇంటికి; ఏతెంచి= తిరిగివచ్చి; సరస్వతిన్= వాగ్దేవిని; తలంచుచున్+ఉన్నంతన్= ధ్యానిస్తూండగా.

**తాత్పర్యం:** తరువాత ఆ సూర్యభగవానుడు పశ్చిమదిక్కుగా వెళ్ళిపోయాడు. నేను మిక్కిలి సంతోషిస్తూ ఇంటికి వచ్చి సరస్వతీదేవిని ధ్యానిస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుము వినుతస్వరవ్యం । జనభూషిత యగ్రభాగ సంస్ఫురదోంకా**
**రనితాంత హృద్యమధుగ । ర్భనిజాకృతి విశదముగ సరస్వతి దోఁచెన్. 139**

**ప్రతిపదార్థం:** వినుము= జనకమహారాజా! ఆలకించుము; వినుత= పొగడొందిన; స్వర= అచ్చులూ; వ్యంజన= హల్లులతో; భూషిత= అలంకరింపబడినదీ; అగ్రభాగ= ఉపరిభాగంలో; సంస్ఫురత్= విరాజిల్లుతున్న; ఓంకార= ప్రణవం కలదీ; నితాంత= మిక్కిలి; హృద్య= మనోహరమైన; మధు= తీయందనం- మకరందం; గర్భ= మధ్యభాగంలోగల; నిజ+ఆకృతి= తన ఆకారం కలదీ; ఐన సరస్వతి= భారతి; విశదముగన్= స్పష్టంగా; తోఁచెన్= భాసించింది.

**తాత్పర్యం:** మిథిలాధిపతీ! ఓంకారం అగ్రభాగంలో ఉండగా అచ్చులూ హల్లులతో అలంకరింపబడిన సరస్వతి నాకు ప్రత్యక్షం అయింది. హృద్యమైన మధువు ఆ రూపానికి మధ్యభాగంలో భాసిస్తోంది. ఈ రూపం నాకు స్పష్టంగా కనిపించింది.

### విశ్వావసునకు యాజ్ఞవల్క్యుఁ డుపదేశించిన తత్త్వప్రకారము (సం. 12-306-30)

**వ. తోఁచిన నత్యంతభక్తిం బ్రపత్తిసేసి సూర్యప్రసాదలబ్ధయుఁ బంచ దశశాఖా సమన్వితయు నిఖిలోత్తర సంహితయు నగు నయ్యజుర్వచోమూర్తి ధరియించి శిష్యులం బరిగ్రహించి వారల నధ్యయనంబు సేయించుచు నివ్వాఙ్మయ బ్రహ్మంబునందు వేదితవ్యం బెయ్యదియో యని విచారింప విరోచనుమహానుభావంబునం జేసి యోగసాంఖ్య రూపోపాయ ప్రకారంబు దోఁచెఁ బదంపడి తదుపేయంబగు వేదవేద్యంబును నద్దేవుని కరుణావిశేషంబునం బ్రతిభాసించెఁ గొండొక కాలంబునకు విశ్వావసుం డను గంధర్వేశ్వరుండు నాకడకుం జనుదెంచి తన్నెఱింగించి యేనుజేయు నతిథిపూజనం బత్యాదరంబునఁ గైకొని 'విశ్వావిశ్వంబులు మిత్రావరుణులు జ్ఞానజ్ఞేయంబులుఁ దపోzతపంబులు సూర్యాతిసూర్యులు విద్యావిద్యలు వేద్యావేద్యంబులుం జలాచలంబులు ననునవి వేదోదితంబులు వానిం దేటపఱుపవే' యని యడిగిన నవహితుండవై వినుమని పలికి - విశ్వంబు భూతభవ్యభవత్కరం బగు నవ్యక్తం బవ్యక్తనామ ప్రకృతి య; విశ్వంబు నిర్గుణుండగు పురుషుండు; మిత్రావరుణులు పురుష ప్రకృతులు, జ్ఞానజ్ఞేయంబులుఁ దపోzతపంబులు సూర్యాతిసూర్యులును ప్రకృతిపురుషుల కానెఱుంగుము. విద్యావిద్యా వేద్యావేద్యా చలచలంబులను శబ్దంబులు వరుసం బురుషునకుం బ్రకృతికిని వాచకంబు లని చెప్పి వెండియు నిట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** తోఁచినన్= సరస్వతీదేవి ప్రత్యక్షమయ్యేసరికి; అత్యంత భక్తిన్= మిక్కిలి భక్తితో; ప్రపత్తి+చేసి= శరణాగతి చేసి; సూర్య= సూర్యదేవుడి; ప్రసాద= అనుగ్రహంతో; లబ్ధయున్= చేకూరినదీ; పంచదశ= పదిహేను; శాఖా= శాఖలతో; సమన్వితయున్= కూడుకొన్నదీ; అగు= అయిన; ఆ+యజుః+వచః+మూర్తిన్= యజుర్వేదం అనే ఆ సరస్వతిని; ధరియించి= ఆవాహన చేసికొని; శిష్యులన్= కొందరు శిష్యులను; పరిగ్రహించి= స్వీకరించి; వారలన్= వారితో; అధ్యయనంబు+చేయించుచున్= యజుశ్శాఖల అధ్యయనం చేయిస్తూ; ఈ+వాఙ్మయ బ్రహ్మంబునందున్= ఈ వాగ్రూపమైన యజుర్వేదంలో; వేదితవ్యంబు= తెలిసికొనవలసినది; ఏ+అదియో= ఏదో; అని; విచారింపన్= ఆలోచిస్తుండగా; విరోచను= సూర్యుడియొక్క; మహా+అనుభావంబునన్+చేసి= గొప్ప మాహాత్మ్యంతో; యోగ - సాంఖ్యరూప= యోగం సాంఖ్యం అనే రూపంగల; ఉపాయప్రకారంబు= ఉపాయవిధానం; తోఁచెన్= కనిపించింది; పదంపడి= తరువాత; తద్= ఆ ఉపాయంతో; ఉపేయంబు+అగు= పొందదగినదై; వేదవేద్యంబును= వేదంతో మాత్రమే తెలుసుకోవలసిన తత్త్వం కూడా; ఆ+దేవుని= ఆ సూర్యభగవానుడి; కరుణా విశేషంబునన్= దయావిశేషంతో; ప్రతిభాసించెన్= స్ఫురించింది; కొండొక కాలంబునకున్= కొంతకాలానికి; విశ్వావసుండు+అను= విశ్వావసుడు అనే; గంధర్వ+ఈశ్వరుండు= గంధర్వప్రభువు; నా కడకున్= నా వద్దకు; చనుదెంచి= వచ్చి; తన్నున్+ఎఱింగించి= తన పరిచయం చెప్పుకుని; ఏను= నేను; చేయు= చేసిన; అతిథిపూజనంబు= అతిథిమర్యాదలను; అతి+ఆదరంబునన్= మిక్కిలి ఆదరంతో; కైకొని= స్వీకరించి; విశ్వ+అవిశ్వంబులున్= విశ్వమైనదీ, విశ్వంకానిదీ; మిత్రావరుణులు= మిత్రుడూ, వరుణుడూ అనేవారూ;

జ్ఞాన జ్ఞేయంబులున్= జ్ఞానమూ, జ్ఞేయమూ అనేవీ; తపః+అతపంబులున్= తపస్సయినదీ తపస్సు కానిదీ; సూర్య+అతిసూర్యులున్= సూర్యుడూ, అతిసూర్యుడూ అనేవీ; విద్యా+అవిద్యలు= విద్య అయినదీ, విద్యకానిదీ; వేద్య+అవేద్యంబులున్= తెలిసికొనదగినదీ తెలిసికొనదగనిదీ; చల+అచలంబులున్= చలించేదీ, చలించనిదీ; అనునవి= అనే ఇవన్నీ; వేద+ఉదితంబులు= వేదోక్తాలు; వానిన్= వాటిని; తేటపఱుపవే= నాకు తెలియజెప్పవా; అని; అడిగినన్= అభ్యర్థిస్తే; అవహితుండవు+ఐ= సావధానుడవై; వినుము; అని; పలికి= చెప్పి; భూతభవ్య భవత్కరంబు+అగు= భూతకాలమూ, భవిష్యత్కాలమూ, వర్తమానకాలమూ అనేవాటిని రూపొందించే; అవ్యక్తనామప్రకృతి= అవ్యక్తం అనబడే ప్రకృతియే; విశ్వంబు= విశ్వము అనబడుతుంది; నిర్గుణుండు+అగు= సత్త్వాది గుణరహితుడైన; పురుషుండు= పురుషుడే; అవిశ్వంబు= అవిశ్వం అనబడేది; మిత్రావరుణులు= మిత్రుడూ, వరుణుడూ అనేవారు; పురుష ప్రకృతులు= వరుసగా పురుషుడూ, ప్రకృతీ; జ్ఞానజ్ఞేయంబులున్= జ్ఞానమూ, జ్ఞేయమూ అనేవీ; తపః+అతపంబులున్= తపస్సూ అతపస్సూ అనేవీ; సూర్య+అతిసూర్యులును= సూర్యుడూ, అతిసూర్యుడూ అనేవీ; ప్రకృతిపురుషులు+అ కాన్= వరుసగా ప్రకృతి పురుషులు అని; ఎఱుంగుము= తెలుసుకో; విద్యా+అవిద్యా= విద్య, అవిద్యలూ; వేద్య+అవేద్య= వేద్య, అవేద్యాలూ; అచల+చలంబులు= అచలమూ, చలమూ; అను= అనేటువంటి; శబ్దంబులు= పదాలు; వరుసన్= క్రమంగా; పురుషునకున్= పురుషుడికీ; ప్రకృతికిని= ప్రకృతికీ; వాచకంబులు= బోధకాలు; అని చెప్పి= అని వివరించి; వెండియున్= తిరిగి ఇంకా; ఇట్లు+అనియెన్= యాజ్ఞవల్క్యుడు గంధర్వుడితో ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ధ్యానంలో సాక్షాత్కరించిన సరస్వతీదేవిని నేను (యాజ్ఞవల్క్యుడు) శరణు వేడగా సూర్యానుగ్రహంతో పదిహేను శాఖల యజుర్వేదం స్ఫురించింది. దానిని శిష్యులకు నేర్పి, వేదవేద్యమైన తత్త్వాన్ని సాంఖ్యయోగాల సహాయంతో తెలిసికొనగలిగాను. ఇట్లా కాలం గడుస్తున్నది. ఒకనాడు విశ్వావసువు అనే గంధర్వుడు నా దగ్గరకు వచ్చాడు. పదిహేను ప్రశ్నలు వేసాడు. అన్నింటికీ సమాధానాలు చెప్పాను. విశ్వావిశ్వాలూ మిత్రావరుణులూ జ్ఞానజ్ఞేయాలూ తపోతపస్సులూ, సూర్యాతిసూర్యులూ, విద్యావిద్యలూ, వేద్యావేద్యాలూ, చలాచలాలూ - వీటిని తెలియజెప్పుమని పదిహేనవ ప్రశ్నగా కట్టకడపట అడిగాడు. విశ్వమూ, వరుణుడూ, జ్ఞానమూ, తపస్సూ, సూర్యుడూ - ఇవన్నీ అవ్యక్తము అనబడే ప్రకృతి. అవిశ్వమూ, మిత్రుడూ, జ్ఞేయమూ, అతపస్సూ, అతిసూర్యుడూ - ఇవన్నీ పురుషుడు. అట్లాగే విద్య, వేద్యం, అచలం అనే శబ్దాలు పురుషుడికి పర్యాయపదాలు - అని చెప్పి యాజ్ఞవల్క్యుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం: "విశ్వంబు భూతభవ్యభవత్కరంబగు నవ్యక్తం బవ్యక్త నామప్రకృతి"** తెలుగు (సం. 12-306-36) భారతప్రతులలో కనిపిస్తున్న పాఠం. దీనికి మూలశ్లోకం ఇట్లా ఉన్నది: **విశ్వావ్యక్తం పరం విద్యాత్ భూతభవ్య భయంకరమ్.** దీనికి 'భూతభవ్యరూపం యద్భయం, సంసారస్తత్కరోతీతి భూతభవ్యభయంకరమ్' అని నీలకంఠ వ్యాఖ్య. 'భూతభవ్యభవత్తథా' అనే పాఠాంతరంకూడా (జి2, ఎమ్ 1. 5-7) ఉన్నట్లు భండార్కరు ప్రతిలో అధస్సూచిక ఉన్నది. తిక్కన్నకు దొరికిన పాఠం ఇదే అయ్యుండాలి. 'భయంకరమగు' అనేది పాఠాంతరంగా తెలుగు ప్రతులలోనూ ఉన్నది. అయితే ఇందులో 'అవ్యక్తంబు' అనే మాట ఒకటి అదనంగా కనపడుతున్నది. దాని అవసరం కనిపించటంలేదు. భూత భవ్యభవత్కరంబగు నవ్యక్తనామ ప్రకృతి= విశ్వంబు అని అన్వయం కుదిరిపోతున్నది. కాబట్టి అదనంగా ఉన్న 'అవ్యక్తంబు' అనే మాట లేఖకదోషమో ముద్రాపకుల దోషమో అయి ఉంటుంది. 'విద్యావిద్యా - వేద్యావేద్య-చలాచలంబులు' అని సంశోధితముద్రణ పాఠం. దీని ప్రకారం చల= పురుషుడు, అచల= ప్రకృతి అని అన్వయం. **"చలాం తు ప్రకృతిం ప్రాహుః కారణం క్షేపసర్గయోః। అక్షేపసర్గయోః కర్తా నిశ్చలః పురుషః స్మృతః" (12-306-42)** అనేది మూలశ్లోకం. సర్గప్రతిసర్గలకు కారణం అవుతున్నది కాబట్టి చల అంటే ప్రకృతి. వాటికి కర్త కాడు కనుక అచలుడు (నిశ్చలః) అంటే పురుషుడు. సంశోధిత ముద్రణలో పాఠం పూర్తిగా దీనికి వ్యతిరేకంగా ఉన్నది. కాబట్టి 'విద్యావిద్యా-వేద్యావేద్యాచల చలంబులు' అని ఉన్న వావిళ్ళ ప్రతిలో పాఠమే సరియైనది. విద్యా+అవిద్యా, వేద్య+అవేద్య+అచల+చలంబులు అని పదవిభాగం. అప్పుడు వరుసగా 'అచలంబు పురుషునకున్, చలంబు ప్రకృతికిని వాచకంబులు' అవుతాయి.

**ఆ. అజము లవ్రణంబు లక్షయంబు లతీంద్రి । యములు ప్రకృతి పురుషు లనఁగఁ బరఁగు**
**రెండు తత్త్వములు నఖండరూపతఁ బొంది । నపుడు ప్రకృతి పురుషునట్ల కాన. 141**

**ప్రతిపదార్థం:** రెండు తత్త్వములున్= వ్యక్తమూ అవ్యక్తమూ అనే ఈ రెండు తత్త్వాలూ; అఖండరూపతన్+పొందిన+అపుడు= ఏకాకారాన్ని పొందినప్పుడు; ప్రకృతి= అవ్యక్తమనబడే ప్రకృతి; పురుషునట్లు+అ+కాన= వ్యక్తమనబడే పురుషునివంటిదే అవుతుంది కాబట్టి; అజములు= అజాలూ; అవ్రణంబులు= అవ్రణాలూ (అక్షరాలు); అక్షయంబులు= అక్షయాలూ; అతీంద్రియములు= అతీంద్రియాలూ; అనఁగన్= అనే పేర్లతో; ప్రకృతి పురుషులు= ప్రకృతి తత్త్వమూ, పురుషతత్త్వం రెండూ కూడా; పరఁగున్= ఒప్పుతాయి.

**తాత్పర్యం:** విశ్వావసుగంధర్వా! వ్యక్తావ్యక్త తత్త్వాలు రెండూ సమైక్యం పొంది అఖండరూపత్వం పొందినప్పుడు అజములూ అవ్రణములూ అక్షయములూ అతీంద్రియములూ అనే పేర్లతో రెండూ వ్యవహరించబడుతూ ఉంటాయి.

**విశేషం:** దీనికి మూలశ్లోకాలు ఇట్లా ఉన్నాయి: **"అజా వుభా వప్రజౌ చ అక్షయౌ చాప్యుభావపి । అజౌ నిత్యావుభౌ ప్రాహురధ్యాత్మగతి నిశ్చయాః ॥ అక్షయత్వాత్ప్రజననే అజమత్రాహురవ్యయమ్ । అక్షయం పురుషం ప్రాహుః క్షయో హ్యస్య న విద్యతే ॥'**
**' (12-306-43,44)** అజములూ, అప్రజములూ, అక్షయములూ, నిత్యములూ అనే పేర్లు రెండింటికీ వర్తిస్తాయని ద్వివచనంతో చెప్పాడు వ్యాసుడు. అప్రజములూ, నిత్యములూ అనే పదాలు తిక్కన ఆంధ్రీకరణంలోనికి రాలేదు. అప్రజంబులు అనేది అవ్రణంబులు అయిందో! అతీంద్రియములు అనేది అదనంగా వచ్చి చేరింది. 'అతీంద్రియావుభౌ' అనే పాఠాంతరం దీనికి మూలం. అజౌ అన్నపదాన్ని వ్యాఖ్యానిస్తూ నీలకంఠీయం। **"అజౌ, అజననహేతూ, పురుషసన్నిధానస్య, అనయా భూతసర్గం కరోమీతీచ్ఛాయాశ్చ అభావాత్. ప్రకృతేరపి సర్గాసామర్థ్యాత్"** - అంది. సాన్నిధ్యం లేకపోవటం వలన, ఇచ్ఛలేకపోవటం వలన ప్రకృతి పురుష తత్త్వాలు జననహేతువులు కాలేకపోతున్నాయి. భూతసృష్టి చెయ్యలేక పోతున్నాయి. కాబట్టి రెండూ 'అజములు' అవుతాయి అని తాత్పర్యం. 'అప్రజములు' అనేది దీనికి పర్యాయపదం అవుతుంది.

అజ్ఞౌ అని పాఠాంతరం ఉన్నది. దాన్ని వ్యాఖ్యానిస్తూ 'యథా ప్రకృతిర్జడత్వాత్ స్వాత్మానం న జానాత్యేవం నిష్కలాత్మాపి స్వాత్మని వృత్తివిరోధాత్ స్వాత్మనం న జానాతీత్యత ఉభావప్యజ్ఞౌ' అన్నాడు. జడత్వం కారణంగా ప్రకృతికి స్వాత్మజ్ఞానం ఉండదు. నిర్గుణుడైన పురుషుడికి కూడా ఆత్మవృత్తి విరోధం వలన ఈ జ్ఞానం ఉండదు. అందుచేత రెండూ అజ్ఞములు అవుతాయని భావం. 'అజౌ నిత్యావుభౌ' అనే ఉత్తరార్ధాన్ని వ్యాఖ్యానిస్తూ 'ద్విత్వ మవివక్షితమ్. తేన యదకర్మఫలం తదజం తదేవ చ నిత్యమిత్యర్థః' అన్నాడు. రెండింటికీ కలిపి ఇవి వాచకాలు అవుతున్నాయి కాబట్టి ద్వివచనం అవసరం లేదు. అది వివక్షితం కాదు. అకర్మఫలాన్నే 'అజము' అంటారు. ఇది ప్రకృతి పురుషతత్త్వాలకు రెండింటికీ సమానం.

**వ. అని తెలిపి మఱియును. 142**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; తెలిపి= తెలియజెప్పి; మఱియును= ఇంకా .

**తాత్పర్యం:** ఇట్లా తెలిపి, ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విను వేదవేద్యము నెఱుం । గని యాతని వేదపాఠకలనంబు సుధీ**
**ధన! వేదభారవహనం । బనఁజను నింతియ నిరర్థకాయాసంబై. 143**

**ప్రతిపదార్థం:** సుధీధన!= జ్ఞానసంపన్నుడా! విశ్వావసూ!; విను; వేదవేద్యమున్= వేదంతో తెలుసుకోదగిన ఆ తత్త్వాన్ని; ఎఱుంగని ఆతని= తెలుసుకోని వ్యక్తి(యొక్క) చేసే; వేదపాఠకలనంబు= వేదపఠనమనే పని (వ్యాపారం); నిరర్థక= నిష్ప్రయోజనమైన; ఆయాసంబై= శ్రమ అయి; వేదభార వహనంబు= వేదాల బరువు మొయ్యటం మాత్రమే; అనన్+చనున్= అనదగింది;ఇంతియ=ఇంతే.

**తాత్పర్యం:** వేదాధ్యయనానికి ఫలం వేదవేద్యాన్ని తెలిసికొనటం. అది జరగనినాడు అయిదు వేదాలనూ బట్టీయం పట్టినా అది కేవలం శ్రమ. వేదాల బరువుని మోయటం మాత్రమే. నిష్ప్రయోజనం. ఇంతే!

**ఆ.** **క్షరము నక్షరంబుఁ గానంగఁ బోలు వే । దార్థచింతనమున నమ్మిథునము**
**నందుఁ బూర్వ మురివి యపరంబు సేపట్టి । నిలువవలయు నధికనిష్ఠ గలిగి. 144**

**ప్రతిపదార్థం:** వేదార్థచింతనమునన్= వేదార్థాన్ని మననం చెయ్యటంవలన; క్షరమున్= ఏది క్షరతత్త్వమో; అక్షరంబున్= ఏది అక్షరతత్త్వమో; కానంగన్+పోలున్= తెలుసుకోగలగాలి; ఆ+మిథునమునందున్= ఆ జంటలో; పూర్వము= మొదటిది; ఉరివి= విడిచిపెట్టి; అపరంబు= రెండవదైన అక్షరతత్త్వాన్ని; చేపట్టి= స్వీకరించి; అధికనిష్ఠ కలిగి= దృఢమైన నిష్ఠను వహించి; నిలువన్+వలయున్= నిలవాలి.

**తాత్పర్యం:** వేదార్థచింతనవలన క్షర - అక్షరతత్త్వాల వివేకం కలుగుతుంది. వీటిలో క్షరాన్ని విడిచిపెట్టి అక్షరతత్త్వాన్ని స్థిరమైన నిష్ఠతో స్వీకరించాలి.

**తే.** **అక్షరం బగు పంచవింశాఖ్య తత్త్వ । తత్పరత నున్నఁ గేవలత్వము ఘటిల్లు**
**వినుము కేవలత్వమున షడ్వింశదర్శ । నంబు పురుషున కొదవి తన్మయత గలుగు. 145**

**ప్రతిపదార్థం:** అక్షరంబు+అగు= అక్షరము అనబడే; పంచవింశాఖ్య= ఇరవై అయిదవదైన; తత్త్వ= తత్త్వంపట్ల; తత్పరతన్= తాత్పర్యంతో; ఉన్నన్= ఉన్నట్లయితే; కేవలత్వము= కేవలత్వస్థితి; ఘటిల్లున్= సంభవిస్తుంది; వినుము= ఓ విశ్వావసూ! ఆలకించుము; కేవలత్వమునన్= ఆ కేవలతా సిద్ధివలన; పురుషునకున్= పురుషుడికి; షట్+వింశదర్శనంబు= ఇరవై ఆరవదైన పరతత్త్వ సాక్షాత్కారం; ఒదవి= లభించి; తద్+మయత= దానితో తాదాత్మ్యం; కలుగున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** ఇరవై అయిదవదైన అక్షరతత్త్వాన్ని ఉపాసిస్తే క్షరాతీతమైన కేవలత్వం సిద్ధిస్తుంది. దానివలన ఇరవై ఆరవదైన పరతత్త్వం సాక్షాత్కరిస్తుంది. తాదాత్మ్యం కలుగుతుంది.

**క.** **పురుషుని నవ్యక్తము రెం । డు రూపులుగఁ జూచు టొప్పెడు తెఱఁగ తఁడుం**
**బురుషోత్తముండు నరయఁగ । నిరువురుగా రతఁడ యాతఁ డిది నిజము సుమీ. 146**

**ప్రతిపదార్థం:** పురుషునిన్= పురుషతత్త్వాన్నీ; అవ్యక్తమున్= ప్రకృతినీ; రెండు రూపులుగన్= వేరువేరైన రెండు తత్త్వాలుగా; చూచుట= చూడటమనేది; ఒప్పెడు తెఱంగు= ఒప్పయిన పద్ధతియే; అతఁడున్= పరముడు అనబడే ప్రబుద్ధపురుషుడూ; పురుషోత్తముడున్= పురుషోత్తముడు అనబడే ఇరవై ఆరవతత్త్వమూ; అరయఁగన్= పరిశీలించి చూస్తే; ఇరువురు కారు= విడివిడిగా ఇద్దరు కారు; అతఁడు+అ= అతడే; ఆతఁడు= ఆతడు; ఇది; నిజము సుమీ= సత్యం సుమా!

**తాత్పర్యం:** పురుషుడినీ, ప్రకృతినీ వేరువేరు రూపాలుగా చూడట మనేది సమంజసమే. కాని, పరముడూ పురుషోత్తముడూ వేరువేరు కాదు. ఇద్దరూ ఒకటే. (ఇరవై అయిదూ ఇరవై ఆరూ తత్త్వాలకు భేదం లేదని).

**క.** **పురుషోత్తమ షడ్వింశక । పరమేశ్వర నామకములు వరఁగును విను మా**
**పరమునకు నదియ నిష్కళ । నిరంజనానంద బోధనిత్యం బనఘా!' 147**

**ప్రతిపదార్థం:** అనఘా!= పవిత్రుడా! విశ్వావసూ!; వినుము; ఆ పరమునకున్= ప్రసిద్ధుడైన ఆ పరమాత్మకు; పురుషోత్తమ= పురుషోత్తముడనీ; షడ్వింశక= ఇరవై ఆరవ తత్త్వమనీ; పరమేశ్వర= పరమేశ్వరుడనీ; నామకములు= ప్రసిద్ధమైన నామధేయాలు;

పర(గును= ఉన్నాయి; అదియ= అదే; నిష్కళ= నిర్గుణం; నిరంజన= నిరంజనం; ఆనంద= ఆనందం; బోధ= జ్ఞానం; నిత్యంబు= నిత్యం.

**తాత్పర్యం:** పురుషోత్తముడూ షడ్వింశకతత్త్వమూ పరమేశ్వరుడూ అనేవి ఆ పరమాత్మకే పేర్లు. (ప్రబుద్ధుడైన జీవాత్ముడే పరమాత్ముడని లోగడ వివరించాడు). అదే నిష్కలం. అదే నిరంజనం. అదే ఆనందం. అదే జ్ఞానం. అదే నిత్యం'.

**వ. అని చెప్పిన విని విశ్వావసుండు 'పంచవింశకతత్త్వంబునకుం బరంబు గలుగుటయు నది రూపింప నేకంబగుటయు నారద జైగీషవ్య దేవల కపిలశుక సుమంత పైలాదులైన పరమమునుల గోష్ఠీ విశేషంబుల విందు. వినినను నిస్సంశయంబగు బోధం బుదితంబు గామి నిన్నాశ్రయించితి, నీవు సంయమిలోక సురలోక బ్రహ్మలోక ప్రఖ్యాత ప్రజ్ఞాన సంభావనీయుండవు. మదీయ సందేహాపనయంబు సేయవే' యనుటయు నారదాయత్త చిత్తుండనై. 148**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని యాజ్ఞవల్క్యుడు చెప్పగా; విని= గ్రహించి; విశ్వావసుండు= ఆ విశ్వావసువు; పంచవింశక తత్త్వంబునకున్= ఇరవై అయిదవ తత్త్వంకంటే; పరంబు= పరమైనది; కలుగుటయున్= ఉండటమూ; అది= ఆ తత్త్వం; రూపింపన్=నిర్ధారిస్తే; ఏకంబు+అగుటయున్= ఒక్కటే కావటం అనేది; నారద= నారదుడూ; జైగీషవ్య= జైగీషవ్యుడూ; దేవల= దేవలుడూ; కపిల= కపిలుడూ; శుక= శుకుడూ; సుమంత= సుమంతుడూ; పైల+ఆదులైన= పైలుడూ మొదలైన; పరమమునుల= మహామునుల; గోష్ఠీవిశేషంబులన్= చర్చాసందర్భాలలో; విందున్= విని ఉన్నాను; వినినను= విన్నప్పటికీ; నిస్సంశయంబు+అగు= సంశయరహితమైన; బోధంబు= జ్ఞానం; ఉదితంబు+కామిన్= కలగకపోవటంతో; నిన్నున్= నిన్ను; ఆశ్రయించితిన్= ఆశ్రయించాను; నీవు= ఓ యాజ్ఞవల్క్యమహర్షీ! నీవు; సంయమిలోక= నిగ్రహసంపన్నులైన మహర్షుల సమూహంలోనూ; సురలోక= దేవలోకంలోనూ; బ్రహ్మలోక= బ్రహ్మలోకంలోనూ; ప్రఖ్యాత= ప్రసిద్ధికెక్కిన; ప్రజ్ఞాన= తత్త్వజ్ఞానంతో; సంభావనీయుండవు= గౌరవింపబడుతున్నవాడవు; మదీయ= నా; సందేహ+అపనయంబు= సందేహాన్ని తొలగించటం; చేయవే?= చేయవా?; అనుటయున్= అని అభ్యర్థించటంతో; నారద+ఆయత్త-చిత్తుండను+ఐ= నారదుడిని ధ్యానించిన హృదయం కలవాడనై - హృదయంలో నారదుడ్ని ధ్యానించి యాజ్ఞవల్క్యుడు పలుకుతున్నాడు.

**తాత్పర్యం:** అని యాజ్ఞవల్క్యుడు చెప్పగా విశ్వావసుడు 'ఇరవై అయిదవ తత్త్వానికి పైన మరొకటి ఉండటం, అది మరలా ఒకటే కావటం అన్న విషయాన్ని నారద, జైగీషవ్య, దేవల, కపిల, శుక, సుమంత పైలాదుల గోష్ఠీ సందర్భాలలో విని ఉన్నాను. అయినా ఇంకా అనుమాన నివృత్తి కాలేదు. సర్వలోక పూజ్యుడవైన నీవే నా సందేహాన్ని తొలగించాలి' అని న న్నడుగగా, నారదుడిని ధ్యానించి.

**క. మునిగోష్ఠివలని కొఱతయె। విను భవదీయాంతరంగవృత్తి కలుషయై**
**నిను సంశయాత్మునింగా। నొనరించుచు నున్నయది సముజ్జ్వలతేజా! 149**

**ప్రతిపదార్థం:** సముత్+జ్వలతేజా= ప్రకాశించే తేజస్సు కలవాడా!; మునిగోష్ఠివలని కొఱతయె= నీ సంశయం తీరకపోవటం మహర్షుల గోష్ఠిలోని లోపమా?; విను; భవదీయ= నీ; అంతరంగవృత్తి= మనః ప్రవృత్తి - ఏకాగ్రత; కలుషయైనను= కలుషితమై చెడిపోతే; నిను, సంశయాత్మునిన్+కాన్= నిన్ను సంశయాత్ముడిగా; ఒనరించుచునున్న+అది= చేస్తోంది.

**తాత్పర్యం:** ఓ తేజస్వీ! నీ సందేహం తీరకపోవట మనేది ఎవరి తప్పు అంటావు? మహర్షుల గోష్ఠిదా ఆ లోటు? కాదు కదా! ఏకాగ్రత కోల్పోయి నీ బుద్ధి కలుషం అయితే అది నిన్ను సంశయాత్ముడిగానే ఉంచేస్తుంది మరి.

**వ. ప్రసన్నైకాగ్రచిత్తుండవై యాకర్ణింపు మని యిట్లంటి. 150**

**ప్రతిపదార్థం:** (అందుచేత ఓ విశ్వావసూ!); ప్రసన్న= కలతదేరి ప్రసన్నమైన; ఏకాగ్రచిత్తుండవు+ఐ= ఏకాగ్రతతో ఉన్న చిత్తం కలవాడవై; ఆకర్ణింపుము= వినుము; అని; ఇట్లు+అంటిన్= ఈ ప్రకారంగా పలికాను.

**తాత్పర్యం:** అందుచేత ఓ విశ్వావసూ! ప్రశాంతమైన మనస్సుతో వినుము' అంటూ ఇట్లా కొనసాగించాను.

**క. 'పురుషున కవ్యక్త పరి । స్ఫురణ శబలవృత్తి గలుగఁ బోయిన నతనిం**
**బురుషోత్తముఁ డనరు జనన । మరణాది వికారయుక్తి మాటయి యజ్ఞుల్. 151**

**ప్రతిపదార్థం:** పురుషునకున్= జీవాత్మునికి; అవ్యక్త= ప్రకృతియొక్క; పరిస్ఫురణన్= స్ఫూర్తితో; శబలవృత్తి= అనేక రూపత్వం; కలుగన్+పోయినన్= కలిగినట్లయితే; అతనిన్= ఆ జీవాత్ముడిని; జననమరణ+ఆది= పుట్టుక చావు మొదలైన; వికారయుక్తి= వికారాలతో కూడి ఉండటమనేది; మాటు+అయి= మిషగా; అజ్ఞుల్= తత్త్వజ్ఞాన రహితులు; పురుషోత్తముఁడు+అనరు= పురుషోత్తముడు అని అనరు.

**తాత్పర్యం:** ప్రకృతితో సాంగత్యంవలన పురుషుడికి అనేకరూపత్వం కలుగుతుంది. జనన మరణాది వికారాలు తప్పవు. ఇది కారణంగా అతడిని పురుషోత్తముడు అనకపోవటం అజ్ఞత. ప్రకృతి సాంగత్యంలో ఉంటూనే పురుషుడు తన విభిన్నత్వాన్ని తెలిసికొనగలిగితే ప్రబుద్ధుడు అయినట్లే. జననమరణాది వికారాలు ఎన్ని ఉన్నా అతడిని (ప్రబుద్ధ జీవాత్మను) పురుషోత్తముడుగా గుర్తించటం విజ్ఞులు మాత్రమే చెయ్యగలరు.

**వ. అని వెండియు. 152**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని చెప్పి మరల యాజ్ఞవల్క్యుడు ఇట్లా అంటున్నాడు.

**తే. ప్రకృతి పురుషునిఁ గానదు, ప్రకృతిఁ గనుచు । నునికిఁ బురుషుండు పరమునిఁ గనుట లేక**
**యుండుఁ, గనుఁ దద్ద్వయముఁ బరముండు, పరమ । వీక్షణము పురుషున కగు వెరవు వినుము. 153**

**ప్రతిపదార్థం:** ప్రకృతి= ప్రకృతితత్త్వం; పురుషునిన్= జీవాత్ముడిని; కానదు= దర్శించదు; పురుషుండు= జీవాత్ముడు; ప్రకృతిన్= ప్రకృతిని; కనుచున్+ఉనికిన్= దర్శిస్తూ ఉండటంచేత; పరమునిన్= పరమాత్ముడిని; కనుట= దర్శించటం; లేక+ఉండున్= లేకుండా ఉండిపోతాడు; పరముండు= పరమాత్మ; తద్+ద్వయమున్= ప్రకృతి పురుషతత్త్వాలు రెండింటినీ; కనున్= చూస్తాడు; పురుషునకున్= జీవాత్మకు; పరమవీక్షణము= పరమాత్మ దర్శనం; అగు= అయ్యే; వెరవు= ఉపాయం; వినుము.

**తాత్పర్యం:** ప్రకృతి పురుషుడిని చూడదు. ప్రకృతినే చూస్తూ పురుషుడు పరమాత్మను దర్శించలేడు. పరమాత్మ మాత్రం ఈ రెండింటినీ చూస్తూ ఉంటాడు. పురుషుడు పరమాత్మను దర్శించే ఉపాయం ఏమిటో చెప్తుతాను వినుము.

**క. స్నేహసహవాసములు స । మ్మోహముఁ దలకొలుపఁ గాలమున మునుఁగుచు గా**
**ఢాహంకారమమత్వము । లీహఁ బెనుపఁ బ్రకృతిఁ బురుషుఁ డే ననుచుండున్. 154**

**ప్రతిపదార్థం:** స్నేహసహవాసములు= స్నేహమూ, సహవాసమూ అనేవి; సమ్మోహమున్= వ్యామోహాన్ని; తలకొలుపన్= కలిగిస్తే; కాలమునన్= ఋతువులూ, సంవత్సరాలూ ఇత్యాదిగా ఉన్న కాలంలో; మునుఁగుచున్= మునిగిపోతూ; గాఢ= గాఢమైన;అహంకార=

అహంభావమూ; మమత్వములు= మమకారం అనేవి; ఈహన్= కోరికను; పెనుపన్= పెంపొందించగా; పురుషుఁడు= జీవాత్ముడు; ఏను= నేను; ప్రకృతిన్= ప్రకృతిని; అనుచుండున్= అనుకుంటూ ఉంటాడు.

**తాత్పర్యం:** పురుషుడికి ప్రకృతితో స్నేహమూ, సహవాసమూ తప్పవు. అవి అతడిలో ప్రకృతిపట్ల వ్యామోహం కలిగిస్తాయి. దానితో కాలంలో మునిగిపోతాడు. అహంకార మమకారాలు కోరికను పెంచుతాయి. ఇంక ఈ జీవాత్ముడు 'నేనే ప్రకృతిని' అనుకొంటూ ఉంటాడు. ఈ వ్యామోహం ఉన్నంతవరకూ పురుషుడికి 'పరమవీక్షణము' లభించదు.

**క. అది లెస్సగ విడిచి ప్రకృతి । కుదకనిభాకలనమును ఝుషోపమ తనకుం**
**బదిలుఁడయి చూడనేర్చిన । విదితం బగు దానితోడి వేర్పా టనఘా! 155**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! - విశ్వావసూ!; అది= ప్రకృతిని నేనే అనే భావం; లెస్సగన్= బాగా; విడిచి= విడిచిపెట్టేసి; ప్రకృతికిన్= ప్రకృతికి; ఉదకనిభ+ఆకలనమును= నీటితో పోలిక; తనకున్= తనకు; ఝుష+ఉపమ= చేపతో పోలిక; పదిలుఁడు+అయి= జాగరూకుడై; చూడనేర్చినన్= చూడగలిగితే; దానితోడి వేర్పాటు= ప్రకృతితో తన విభిన్నత; విదితంబు+అగున్= స్పష్టపడుతుంది.

**తాత్పర్యం:** ఓ విశ్వావసూ! నేనే ప్రకృతిని అనే భావం విడిచిపెట్టి పురుషుడు చూడగలగాలి. ప్రకృతిని నీరుగా, తనను చేపగా దర్శించగలిగితే తనకూ ప్రకృతికీ ఉన్న వేర్పాటు ఏమిటో తెలుస్తుంది.

**ఆ. ప్రకృతి దొఱఁగి తన్నుఁ బన్నుగాఁ జూచు వి । వేక దృఢతఁ బంచవింశకుండు**
**సంగరహితమైన షడ్వింశపదము ని । స్సంశయముగఁ గాంచు వంశవర్య! 156**

**ప్రతిపదార్థం:** వంశవర్య!= గంధర్వవంశశ్రేష్ఠుడా!; ప్రకృతి= ప్రకృతిని; తొఱఁగి= విడిచిపెట్టి; తన్నున్= తననుతాను; పన్నుగాన్= వేరుపడినవానిగా; చూచు= దర్శించే; వివేకదృఢతన్= జ్ఞానదృఢత్వంతో; పంచవింశకుండు= ఇరవై అయిదవ తత్త్వమైన పురుషుడు (జీవాత్ముడు); సంగరహితము+ఐన= బంధరహితమైన; షడ్వింశపదమున్= ఇరవై ఆరవ తత్త్వమైన పరమస్థితిని; నిస్సంశయముగన్= నిస్సందేహంగా; కాంచున్= దర్శిస్తాడు.

**తాత్పర్యం:** ఓ విశ్వావసూ! ప్రకృతిని విడిచిపెట్టి తనను తాను భిన్నుడుగా గుర్తించగలిగిన దృఢవివేకం పురుషుడికి లభిస్తే అప్పుడు నిస్సంగమైన పరతత్త్వాన్ని నిస్సందేహంగా చూడగలుగుతాడు.

**క. జననజరామృత్యు భయం । బున యోగసమేతసాంఖ్యముం దిరముగ నూఁ**
**దిన యతులు నిర్మమత్వం । బునఁ బడయుదు రప్పరంబు పొం దచలముగన్. 157**

**ప్రతిపదార్థం:** జనన= పుట్టుట; జరా= ముసలితనం; మృత్యు= చావు అనే వీటివలన కలిగే; భయంబునన్= భయంతో; యోగసమేత= యోగసహితమైన; సాంఖ్యమున్= సాంఖ్యాన్ని; తిరముగన్= స్థిరంగా; ఊఁదిన= ఆశ్రయించిన; యతులు= యోగులు; నిర్మమత్వంబునన్= మమకార రహితస్థితితో; ఆ+పరంబు+పొందు= ఆ పరతత్త్వసాన్నిధ్యాన్ని; అచలముగన్= నిశ్చలంగా; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** జననమృత్యుభయాలతో యోగసాంఖ్యాలను ఆశ్రయించిన యతీశ్వరులు నిర్మమత్వస్థితితో పరతత్త్వ సాన్నిధ్యాన్ని సుస్థిరంగా అనుభవిస్తారు.

**వ. అపునరావృత్తిపదం బగు నప్పదంబు సూవె పరం' బని చెప్పి వెండియు. 158**

**ప్రతిపదార్థం:** అపునరావృత్తి పదంబు+అగు= పునర్జన్మ అనేది లేని స్థానమైన; ఆ+పదంబు+చూవె= ఆ స్థితియే సుమా!; పరంబు= పరతత్త్వమంటే; అని; చెప్పి= పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** పునర్జన్మ లేని స్థానమైన, ఆ స్థితియే పరతత్త్వ మంటే' అని పలికి మరల.

**క. నెట్టన చూడమి నయ్యెడు । నట్టిది యొకచూపునం బరానందంబున్**
**గట్టిగఁ జేయఁగ వికృతులు । పుట్టక పురుషుండు తత్ప్రబోధాత్ముఁడగున్. 159**

**ప్రతిపదార్థం:** నెట్టన= పూనికతో; చూడమిన్= చూడకపోవటంవలన; అయ్యెడు+అట్టిది= ఏర్పడేటువంటిది; ఒకచూపునన్= ఒక ప్రత్యేక అవగాహనతో; పరానందంబున్= పరము అనబడే ఆనందాన్ని; గట్టిగన్+చేయఁగన్= స్థిరపరుచుకుంటే; వికృతులు= సత్త్వరజస్తమోగుణ సంబంధమైన వికారాలు; పుట్టక= కలగకుండా; పురుషుండు= జీవాత్ముడు; తద్= ఆ పరమాత్మకు సంబంధించిన; ప్రబోధ+ఆత్ముఁడు+అగున్= జ్ఞానంతో కూడినవాడు అవుతాడు.

**తాత్పర్యం:** 'నేను ప్రకృతికంటే భిన్నుడను' అనే పూనికతో చూడకపోవటం వలన కలిగేది, ఒక ప్రత్యేకమైన అవగాహనతో కూడిన చూపుతో చూస్తే, అందువలన కలిగే పరమానందాన్ని స్థిరపరుచుకొనగలిగితే పురుషుడికి ఏ వికారాలూ ఉండవు. ప్రబుద్ధుడు అవుతాడు.

**క. పురుషోత్తముండుఁ బురుషుఁడు । నిరువు రగుట గలదు గలిగెనేనియుఁ బురుషుం**
**బురుషోత్తమునందుఁ గలపు । వెరవున నేకత్వమహిమ విజ్ఞాతమగున్. 160**

**ప్రతిపదార్థం:** పురుషోత్తముండున్= పరమాత్ముడూ; పురుషుఁడున్= జీవాత్ముడూ; ఇరువురు+అగుట= ఇద్దరుగా విభిన్నులు+ కావటం; కలదు= ఉంది; కలిగెనేనియున్= ఉన్నప్పటికీ; పురుషున్= జీవాత్ముడిని; పురుషోత్తమునందున్= పరమాత్మలో; కలపు= ఐక్యంచేసే; వెరవునన్= ఉపాయంలో; ఏకత్వమహిమ= ఏకత్వం తాలూకు గొప్పతనం; విజ్ఞాతము+అగున్= తెలివిడికి వస్తుంది.

**తాత్పర్యం:** పురుషోత్తముడూ, పురుషుడూ విభిన్ను లనటమూ ఉన్నది. అయినా ఇద్దరినీ కలిపే ఉపాయంలోనే ఏకత్వమహిమ సాధకుడికి అనుభవంలోనికి వస్తుంది. (సాంఖ్యయోగాలద్వారా ఇది సిద్ధిస్తుందని).

**క. ఇది విజ్ఞానము కృత్యము । తుది విజ్ఞానాత్ముఁడు నగు, దుర్లభము ప్రశాం**
**తి దశాహీనాత్ముల క । ప్పదమది, మోక్షంబు మమత వాసినఁ గల్గున్.' 161**

**ప్రతిపదార్థం:** ఇది= ఏకత్వమహిమ విజ్ఞాతం కావటమనేది; విజ్ఞానము కృత్యము= విద్యవలన జరిగేపని; తుదిన్= కట్టకడపటికి; విజ్ఞానాత్ముఁడున్= పురుషుడు విద్యావంతుడు కూడా; అగున్= అవుతాడు; ప్రశాంతిదశా+హీన+ఆత్ములకున్= చిత్తశాంతి అనే దశ లేనివారికి; ఆ+పదము+అది= ఆ పరమాత్మ స్థాయి; దుర్లభము= ఒకపట్టాన దొరకదు; మమత= మమకారం అనేది; పాసినన్= వదిలిపోయినట్టయితే; మోక్షంబు= ముక్తి; కల్గున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** జీవాత్మ పరమాత్మల ఏకత్వమహిమను ఎరుక పరచటమే విజ్ఞానం (విద్య) చేసేపని. చిత్తశాంతి అనేది లేనివాళ్ళకు పరానందం లభించదు. ఏకత్వమహిమ సిద్ధించదు. మమకారాన్ని విడిచిపెట్టుకొంటే మోక్షం లభిస్తుంది.

**వ. అని యుపదేశించిన విని విశ్వావసుండు ప్రమోదంబు నొంది 'పథ్యంబును హితంబును దథ్యంబును నగుతెఱం గనుగ్రహించితి భవదీయ ప్రసాదంబునం గలంకదేఱి నిర్మలుండ నయితి' నని పలికి సభక్తికంబుగా బ్రదక్షిణంబును ప్రణామంబునుం జేసి నిజస్థానంబున కరిగె' నని చెప్పి యాజ్ఞవల్క్యమునినాథుండు జనకజననాథుతో వెండియు నిట్లనియె. 162**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; ఉపదేశించినన్= ఉపదేశించగా; విని; విశ్వావసుండు= విశ్వావసుడు అనే గంధర్వుడు; ప్రమోదంబున్+ఒంది= సంతోషించి; పథ్యంబును= ఆచరించదగినదీ; హితంబును= మేలుకూర్చేదీ; తథ్యంబును= నిజమైనదీ; అగు= అయిన; తెఱంగు= విధానాన్ని; అనుగ్రహించితి(వి)= నాకు దయచేశావు; భవదీయ= నీ; ప్రసాదంబునన్= అనుగ్రహంతో; కలంక+తేఱి= కలతనుంచి తేరుకుని తేటపడి; నిర్మలుండన్+అయితిన్= మలినరహితుడిని అయ్యాను; అని పలికి= ఇట్లా చెప్పి; సభక్తికంబుగాన్= భక్తితో; ప్రదక్షిణంబును= ప్రదక్షిణం; ప్రణామంబును= సాష్టాంగనమస్కారం; చేసి= ఆచరించి; నిజ స్థానంబునకున్= తన నెలవుకు; అరిగెన్= వెళ్ళిపోయాడు; అని చెప్పి= ఇట్లా వివరించి; యాజ్ఞవల్క్య మునినాథుండు= మునీశ్వరుడైన యాజ్ఞవల్క్యుడు; జనక - జననాథుతోన్= జనేశ్వరుడైన జనకుడితో; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా నేను ఉపదేశించగా వినిన విశ్వావసుడు 'నాకు మేలుకూర్చేదీ ఆచరణయోగ్యమైనదీ, నిజమైనదీ అయిన మార్గాన్ని చెప్పావు. నీ అనుగ్రహంవలన తేటపడ్డాను' అని నాకు నమస్కరించి, విశ్వావసుడు సెలవు తీసికొన్నాడు' అని యాజ్ఞవల్క్యుడు ఇంకా ఇట్లా చెప్పసాగాడు.

**క. 'మానవపతిసత్తమ! యీ । జ్ఞానము బ్రహ్మాది దివిజ సంయమిమత మె**
**వ్వానికి మోక్షంబునకుం । దాన తెరువు - తెరువు లొండ్లు దలఁపం గలవే? 163**

**ప్రతిపదార్థం:** మానవ+పతిసత్తమ!= రాజోత్తమా!; ఈ జ్ఞానము= నేను ఇంతవరకూ ఉపదేశించిన ఈ విద్య; బ్రహ్మ+ఆది= బ్రహ్మమొదలైన; దివిజ= దేవతల; సంయమి= నిగ్రహసంపన్నులైన మునీశ్వరుల; మతము= అభిమతం; ఏ+వానికిన్= ఎవడికైనా; మోక్షంబునకున్= ముక్తికి; తాను+అ= అదియే; తెరువు= మార్గం; ఒండ్లు+తెరువులు= వేరే మార్గాలు; తలఁపన్= ఎంత ఆలోచించినా; కలవే?= ఉన్నాయా? (లేవని భావం).

**తాత్పర్యం:** జనకరాజోత్తమా! ఇంతవరకూ నేను చెప్పింది బ్రహ్మాది దేవతలకూ, మునులకూ సమ్మతమైన మతం. ఇదే ముక్తికి మార్గం. మరి వేరే మార్గాలు లేనే లేవు.

**ఆ. జ్ఞానమునన కాని జన్మజరామృత్యు । వుల జయించునట్టి యలఘు మోక్ష**
**పదము గల్గ నేర దది కారణముగ సు । జ్ఞాన మెల్లభంగి సాధ్యతమము. 164**

**ప్రతిపదార్థం:** జ్ఞానమునన్+అ+కాని= జ్ఞానంచేతనే తప్ప; జన్మ= పుట్టుక; జరా= ముసలితనం; మృత్యువులన్= మరణం అనే వీటిని; జయించునట్టి= జయించేటువంటి; అలఘుమోక్షపదము= ఆ గొప్ప ముక్తిపదవి; కల్గన్ నేరదు= లభించదు; అది కారణముగన్= అందుచేత; ఎల్లభంగిన్= సర్వవిధాలా; సుజ్ఞానము= ఈ మంచిజ్ఞానం (విద్య); సాధ్యతమము= తప్పకుండా సాధించవలసిన వాటి అన్నింటిలో ఉత్తమోత్తమం.

**తాత్పర్యం:** జననమరణాలను జయించటమే మోక్షపదవి. అది కేవలం ఈ జ్ఞానంచేతనే లభిస్తుంది కాబట్టి జ్ఞానసాధన అనేది అన్నివిధాలా ఉత్తమోత్తమ కర్తవ్యం.

**క.** **గురుఁ డెవ్వఁడైననగు ని । వ్వెర వుపదేశించువాఁడ వేల్పుగ శ్రద్ధా**
**పరమతి గావలయు జనన । మరణంబులు శ్రద్ధ లేని మనుజునిఁ బొదువున్. 165**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ఆచార్యుడు; ఎవ్వఁడు+ఐనన్+అగున్= చతుర్వర్ణాలలో ఎవడయినా కానిమ్ము; ఈ+వెరవు= ఈ ఉపాయాన్ని; ఉపదేశించువాఁడు+అ= ఉపదేశించినవాడే; వేల్పుగన్= దేవుడుగా; శ్రద్ధాపర+మతిన్= శ్రద్ధతోకూడిన బుద్ధికలవాడు; కావలయున్= కావాలి; జననమరణంబులు= ఈ జననజరామృత్యువులు; శ్రద్ధలేని= శ్రద్ధలేనటువంటి; మనుజునిన్= మానవుడిని; పొదువున్= పొదువుకుంటాయి లేక ఆవరిస్తాయి.

**తాత్పర్యం:** చతుర్వర్ణాలలో గురువు ఎవడైనా కానిమ్ము, ఈ ఉపాయం చెప్పినవాడే దేవత. శిష్యుడికి అంతటి శ్రద్ధ ఉండాలి. శ్రద్ధ లేకపోతే జననమరణరూపమైన అజ్ఞానం వదలదు. పొదువుకొనే ఉంటుంది.

**క.** **విను మజ్ఞానంబునఁ గ । ర్మనిరూఢత గలుగు దాన మలఁగవు జననం**
**బును మరణము సమ్యక్ జ్ఞా । న నిత్యుఁ డగువాఁడు మోక్షణముఁ జుల్కఁ గనున్. 166**

**ప్రతిపదార్థం:** వినుము= రాజా! ఆలకించు; అజ్ఞానంబునన్= అవిద్యవలన; కర్మనిరూఢత= కర్మాచరణమనే బంధంలో కూరుకుపోవటమనేది; కలుగున్= జరుగుతుంది; దానన్= అందుచేత; జననంబును-మరణమున్= జననమరణాలు; మలఁగవు= అంతరించవు; సమ్యక్+జ్ఞాన+నిత్యుఁడు+అగువాఁడు= సరియైన విద్యపట్ల నిష్ఠ కలిగినవాడు; మోక్షణమున్= ముక్తిని; చుల్కన్= తేలికగా; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజా! వింటున్నావా! అజ్ఞానంవలన జీవాత్ముడు కర్మాచరణబంధనంలో కూరుకొనిపోతాడు. అతడికి జననమరణాదులు అంతరించవు. మోక్షపదం లభించదు. సరియైన జ్ఞానం కలవాడికి ముక్తి కరతలామలకం.

**క.** **ఈ వెర వూఁదుము నృప! నను । నీ వడిగిన యంతయును వినిశ్చయకృతి సం**
**భావితముగాఁగఁ జెప్పితిఁ । బోవిడువుము శోకమోహమును, నిలుపు ధృతిన్.' 167**

**ప్రతిపదార్థం:** నృప!= రాజా!; ఈ వెరవు= ఈ మార్గాన్ని; ఊఁదుము= ఆశ్రయించుము; ననున్= నన్ను; నీవు; అడిగినయంతయునున్= అడిగినంతా; వినిశ్చయకృతిన్= ఏ సందేహమూ, సంశయమూ లేని నిశ్చయరీతిలో; సంభావితముగాఁగన్= అందరూ ఒప్పి మెచ్చేట్టు; చెప్పితిన్= వివరించాను; శోకమోహమును= దుఃఖహేతువైన మోహాన్ని; పోన్+విడువుము= వదలించుకొమ్ము; ధృతిన్= ధైర్యాన్ని; నిలుపు= అలవరచుకొమ్ము.

**తాత్పర్యం:** రాజా! ఇప్పటివరకూ నేను ఉపదేశించిన ఈ మార్గాన్ని ఆశ్రయించుము. నీవు నన్ను అడిగినదంతా నలుగురికీ సమ్మతమైన పద్ధతిలో ఏ సందేహాలకూ తావులేకుండా వివరించి చెప్పాను. శోకహేతువైన మోహాన్ని లేదా శోకాన్నీ, మోహాన్నీ, విడిచిపెట్టుము. జ్ఞానంవలన కలిగే ధైర్యం నిలుపుకొమ్ము'.

**క.** **అని చెప్పిన ముదితుండై । జనకుఁడు శోకాదిభావ సంగవిరహితం**
**బును బ్రహ్మధ్యానపరం । బును నగు చిత్తంబుతోడ ముదితుం డగుచున్. 168**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= యాజ్ఞవల్క్యుడు ఇట్లా చెప్పేసరికి; జనకుఁడు= జనకమహారాజు; ముదితుండై= సంతోషించినవాడై; శోక+ఆది= దుఃఖమూ మొదలైన; భావ= భావాలతో; సంగవిరహితంబును= సాంగత్యం లేనిదీ; బ్రహ్మధ్యాన పరంబును= పరమాత్మను ధ్యానించటంలో సక్తమైనదీ; అగు= అయిన; చిత్తంబుతోడన్= అంతరంగంతో; ముదితుండు+అగుచున్= సంతోషించినవాడు అవుతూ.

**తాత్పర్యం:** యాజ్ఞవల్క్యుడు ఇట్లా వివరించి చెప్పేసరికి జనకమహారాజు సంతోషపడ్డాడు. దుఃఖాది భావాలను విడిచిపెట్టేసి బ్రహ్మధ్యానంలో జనకుడి చిత్తం సంలగ్నమయ్యింది. అందువలన మరీ సంతోషం కలిగింది. ఆ ఆనందంలో అట్లా ఉండిపోయాడు.

**విశేషం:** సంశోధిత ముద్రణ ప్రతిలో ముదితుండై - ముదితుండగుచున్ అనే పాఠమే కనపడుతున్నది. వావిళ్ళవారి ప్రతిలోనూ ఇట్లాగే ఉన్నది. ఇది పునరుక్తి. 'ముని నతుఁడగుచున్' అనే పాఠాంతరాన్ని సంశోధితముద్రణ అధస్సూచికగా ఇచ్చింది. దాన్ని స్వీకరిస్తే పునరుక్తి తొలగిపోతుంది. ముని= యాజ్ఞవల్క్య మహర్షికి; నతుఁడు+అగుచున్= నమస్కరిస్తూ - ఉండెను అని అన్వయం మరింత సమంజసంగా ఉంటుంది.

**వ. ఉండెం బాండవాగ్రజా! యీ యాజ్ఞవల్క్యమునివరు వాక్యరూపంబునన యే నిమ్మహనీయజ్ఞానంబు నీ కుపదేశించితి' నని చెప్పి భీష్ముఁ డతనితో 'నీ విందుల తాత్పర్యంబు గలిగి యార్యగర్హితంబులగు శోకమోహాదిప్రాకృతభావంబులం దొఱంగి సుఖి వగు' మనిన విని య క్కౌంతేయాగ్రజుండు సంతుష్టాంతరంగుండై య గ్గాంగేయునకుం బ్రణమిల్లి 'గృహస్థ ధర్మంబు పరిత్యజింపక మోక్షంబు వడయుట గలుగనోపునే?' మదీయ చిత్తంబు సంశయాయత్తం బగుచుండు; నిక్కాలుష్యంబు వాపవే' యని యభ్యర్థించిన నతండు 'జనకసులభాసంవాదం బను నితిహాసంబు గలుగు దాన నేతత్సంశయంబు వాయు దానిం జెప్పెద విను' మని పలికి యతని కిట్లనియె. 169**

**ప్రతిపదార్థం:** ఉండెన్= ఉన్నాడు; పాండవ+అగ్రజా!= ధర్మరాజా!; ఈ యాజ్ఞవల్క్యమునివరు= ఈ యాజ్ఞవల్క్యుడనే మునీశ్వరుడి; వాక్యరూపంబునన్+అ= పలుకుల ప్రకారమే; ఏను= నేను; ఈ+మహనీయ జ్ఞానంబున్= ఈ గొప్ప విద్యను; నీకున్= నీకు; ఉపదేశించితిన్= ఉపదేశించాను; అని చెప్పి= అని తెలిపి; భీష్ముఁడు= భీష్మాచార్యుడు; అతనితోన్= ఆ ధర్మరాజుతో; నీవు; ఇందులన్= ఈ విషయంపట్ల; తాత్పర్యంబు= శ్రద్ధ; కలిగి= వహించి; ఆర్య= సజ్జనులచేత; గర్హితంబులు+అగు= నింద్యాలయిన; శోక మోహ+ఆది= దుఃఖమూ, వ్యామోహమూ మొదలైన; ప్రాకృత భావంబులన్= ప్రకృతి సంబంధమైన భావాలను; తొఱంగి= విడిచి; సుఖివి= సుఖవంతుడవు; అగుము= కమ్ము; అనినన్= అని పలుకగా; విని; ఆ+కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో పెద్దవాడైన ఆ ధర్మరాజు; సంతుష్ట+అంతరంగుండై= సంతోషించిన హృదయం కలవాడై; ఆ+గాంగేయునకున్= గంగాపుత్రుడైన ఆ భీష్ముడికి; ప్రణమిల్లి= నమస్కరించి; గృహస్థధర్మంబు= గృహస్థాశ్రమాన్ని; పరిత్యజింపక= విడిచిపెట్టకుండా; మోక్షంబు+పడయుట= ముక్తి పొందటం; కలుగన్+ఓపునే?= సంభవిస్తుందా?; మదీయచిత్తంబు= నా అంతరంగం; సంశయ+ఆయత్తంబు+అగుచుండున్= ఈ సందేహానికి లోనవుతూ ఉంటుంది; ఈ+కాలుష్యంబు= ఈ మాలిన్యాన్ని; పాపవే?= దయచేసి తొలగింపవా?; అని; అభ్యర్థించినన్= ప్రార్థించేసరికి; అతండు= ఆ భీష్ముడు; జనకసులభాసంవాదంబు+అను= ధర్మధ్వజుడనే జనకమహారాజూ, సులభాదేవి - వీరిద్దరిమధ్యా నడిచిన వివాదం అనే; ఇతిహాసంబు= ఒక పూర్వవృత్తాంతం; కలుగున్= ఉంది; దానన్= ఆ కథతో; ఏతత్+సంశయంబు= నీ ఈ సందేహం; పాయున్= తొలగిపోతుంది; దానిన్= ఆ సంవాదాన్ని; చెప్పెదన్= చెబుతాను; వినుము; అని పలికి= అని చెప్పి; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇలా వివరించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! యాజ్ఞవల్క్యముని పలుకుల ప్రకారమే నేను ఈ గొప్పవిద్యను నీకు ఉపదేశించాను; అని చెప్పి భీష్ముడు 'నీవు దీనియందు శ్రద్ధకలిగి సజ్జనులు గర్హించే శోకమోహాలను త్యజించి సుఖివి కమ్ము' అని ధర్మరాజుతో పలుకగా అతడు సంతోషించి భీష్ముడికి నమస్కరించి 'గృహస్థ ధర్మాన్ని వదలకుండా మోక్షం పొందవచ్చునా? అనే అనుమానం నా మనస్సులో ఉన్నది. దానిని తొలగించు' మని వేడుకొన్నాడు. భీష్ముడు

'జనకసులభాదేవుల నడుమ జరిగిన సంవాద మనే ఇతిహాసాన్ని విను' మనీ, 'దానివలన సందేహాలన్నీ తొలగిపోతాయి. దానిని విను' మని ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**భీష్ముఁడు ధర్మరాజునకు జనక సులభా సంవాదంబు సెప్పుట (సం. 12-308-3)**

**క. సులభాభిధాన యగునొక । లలన విమలయోగధర్మ లంపటు జనకుం**
**గెలన విని యతని బోధము । కొలఁది పరీక్షింపఁ దనకుఁ గోర్కి వొడమినన్. 170**

**ప్రతిపదార్థం:** సులభా+అభిధాన+అగు= సులభ అనే పేరుగలదైన; ఒక లలన= ఒక వనిత; విమల= పవిత్రమైన; యోగధర్మ= యోగాచరణంలో; లంపటున్= పూర్తిగా మునిగిపోయిన; జనకున్= ధర్మధ్వజుడనే జనకమహారాజును; కెలనన్= సమీపంలోనే (ఉన్నాడని); విని= తెలిసికొని; అతని= ఆ జనకుడి; బోధముకొలఁది= జ్ఞానం లోతు; పరీక్షింపన్= పరీక్షించాలని; తనకున్= తనకు; కోర్కి= కోరిక; పొడమినన్= కలుగగా.

**తాత్పర్యం:** అనగా అనగా ఒక వనిత. ఆవిడపేరు సులభ. యోగ ధర్మాలను ఒక వ్యసనంవలె ఆచరిస్తున్న జనకమహారాజును పరీక్షించాలనీ, అతడి జ్ఞానం తాలూకు లోతు ఎంతో తెలిసికొనాలనీ ఆవిడకు ఒక కోరిక కలిగింది. జనకమహారాజు ఆ దగ్గరలోనే ఉన్నా డని తెలిసికొన్నది.

**వ. నియమాచరణకృశం బగు శరీరంబు యోగప్రభావంబున డాఁచి సుందరసుకుమారం బగు నాకారంబు వహించి జనకుం గాంచి భిక్షావృత్తిత్వసూచకంబు లగు వచనంబు లుపన్యసించిన నతం డాసనపాద్యార్చనంబు లాచరించి మహనీయంబగు భోజనం బొనర్చిన సంతృప్తిం బొంది యవ్విదేహపతికి నాసన్నంబగు నుచితాసనంబున నాసీనయైయుండి యాతండు ముక్తుండగుఁ గామిఁ గనుఁగొను తలంపున నిజానుభావంబున నతని చిత్తంబు ప్రవేశించి మారవికారంబు భావించి. 171**

**ప్రతిపదార్థం:** నియమ+ఆచరణ= యోగ నియమాలను ఆచరించటం వలన; కృశంబు+అగు= చిక్కిపోయిన; శరీరంబున్= తన శరీరాన్ని; యోగప్రభావంబునన్= యోగశక్తితో; డాఁచి= మరుగుపరచి; సుందర సుకుమారంబు+అగు= సుందరమూ, సుకుమారమూ అయిన; ఆకారంబు= రూపం; వహించి= ధరించి; జనకున్= జనకమహారాజును; కాంచి= సమీపించి; భిక్షావృత్తిత్వ= తాను భిక్షావృత్తితో ఉన్నాను అనే విషయానికి; సూచకంబులగు= సూచకాలైన; వచనంబులు= మాటలు; ఉపన్యసించినన్= పలికే సరికి; అతండు= ఆ జనకుడు; ఆసన పాద్య+అర్చనంబులు= కూర్చోవటానికి ఆసనం; కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళూ అందివ్వటమనే గౌరవాలు; ఆచరించి= చేసి; మహనీయంబు+అగు= గొప్పదైన; భోజనంబు+ఒనర్చినన్= విందుభోజనం ఏర్పాటు చేయగా; సంతృప్తిన్+పొంది= ఆవిడ సంతుష్టురాలై; ఆ+విదేహపతికిన్= ఆ జనకమహారాజుకు; ఆసన్నంబు+అగు= సమీపంలో ఉన్న; ఉచిత+ఆసనంబునన్= సముచిత పీఠంమీద; ఆసీనయై యుండి= సుఖంగా కూర్చుని; ఆతండు= ఆ జనకుడు; ముక్తుండు= సంగవిరహితుడు; అగున్ కామిన్= అవునోకాదో; కనుఁగొను తలంపునన్= తెలిసికొనే ఉద్దేశంతో; నిజ= తన; అనుభావంబునన్= కటాక్షాది చేష్టలతో; అతని చిత్తంబు= ఆ జనకుడి హృదయం (లోనికి); ప్రవేశించి= చొరబడి; మారవికారంబున్= మన్మథవికారాన్ని; భావించి= ఊహించి.

**తాత్పర్యం:** ఆమె యోగప్రభావంతో చిక్కిపోయిన తన శరీరాన్ని మరుగుపరిచి, అందమైన శరీరాన్ని తెచ్చిపెట్టుకొని, జనకుడివద్దకు వెళ్ళి, తాను భిక్షుకి నన్నట్లుగా తోచే మాటలు అతడితో అనగా, ఆయన ఆమెను సాదరంగా ఆహ్వానించి, భోజనం పెట్టి, సుఖాసీనురాలినిగా చేశాడు. అతడు నిజంగా విరక్తుడగునో కాదో పరీక్షించటానికి తన చేష్టలతో ఆమె మన్మథవికారాన్ని కలిగించబోయింది.

**క. తన లోచనదీప్తుల న । మ్మనుజపతి మొగంబునందు మల్లడిగొనఁ జే**
**సిన నమ్మహాత్ముఁ డప్ప । ద్మనయన తలఁ పెఱిఁగి జనిత మందస్మితుఁడై. 172**

**ప్రతిపదార్థం:** తన= ఆ సులభాదేవి తన యొక్క; లోచనదీప్తులన్= నేత్రకాంతులను; ఆ+మనుజపతి= ఆ జనకమహారాజుగారి; మొగంబునందున్= ముఖంమీద; మల్లడిగొనన్= గుంపుగా పెనవేసుకునేట్టు; చేసినన్= చేసేసరికి; ఆ+మహాత్ముఁడు= ఆ మహానుభావుడు; ఆ+పద్మనయన= ఆ పద్మాక్షియొక్క; తలఁపు= ఆలోచనను; ఎఱిఁగి= గుర్తించి; జనితమందస్మితుఁడై= మొలకెత్తిన చిరునవ్వు కలవాడై.

**తాత్పర్యం:** సులభాదేవి మన్మథభావసూచకాలైన తన మెరుపు చూపులను జనకమహారాజు ముఖంమీదికి వ్యాపింపజేసింది. అతడు ఆమె మనస్సును గ్రహించాడు. చిన్నగా నవ్వుకొన్నాడు. మెల్లగా ప్రశ్నించాడు.

**ఆ. 'ఎచటినుండి యెచటికేఁగెద? వెవ్వరి । దాన? వేమి వెంటఁ దగిలి నడతు**
**సుదతి! నాకుఁ జెప్పు మది యట్టులుండె నా । మాట వీవు విను సమాదరమున. 173**

**ప్రతిపదార్థం:** సుదతి!= అందమైన పలువరుస కలదానా!; ఎచటనుండి+ఎచటికిన్+ఏఁగెదవు?= ఎక్కడనుండి ఎక్కడికి వెళుతున్నావు?; ఎవ్వరిదానవు?= నీవెవరవు?; ఏమిటి వెంట+తగిలి+నడతు(వు)= నీవు ఏమి చేస్తుంటావు?; నాకున్= నాకు; చెప్పుము= తెలియజేయుము; అది+అట్టులు+ఉండెన్= అది అట్లా ఉంచి; నా మాటలు= నీకు చెప్పబోయే మాటలు; ఈవు= నీవు; సమాదరమునన్= శ్రద్ధతో; విను.

**తాత్పర్యం:** 'ఓ సుదతీ! నీవు ఎవరవు? ఏ ఊరు? ఎక్కడికి వెళ్ళుతున్నావు? ఏమి చేస్తుంటావు? వివరంగా చెప్పుము. దానికేంగానీ ముందు నేను చెప్పే మాటలు శ్రద్ధగా వినుము.

**విశేషం:** ఈ ఇతిహాసంలో జనకమహారాజు పేరు ధర్మధ్వజుడు. **"సన్న్యాస ఫలికః కశ్చిద్బభూవ నృపతిః పురా! మైథిలో జనకో నామ ధర్మధ్వజ ఇతి శ్రుతః॥"** (12-308-4). మిథిలాధిపతులందరికీ 'జనకుడు' అనేది సాధారణ నామధేయం. ఎవరికి వారికి ప్రత్యేకంగా విశిష్టనామధేయాలూ ఉంటాయి. అది ఆ వంశసంప్రదాయం. ఈ సులభ - జనకమహారాజును మిథిలానగరం వెళ్ళి మంత్రి పండిత సభా మధ్యంలో కలుసుకున్నట్టుగా వ్యాసుడు ముందే చెప్పాడు. **"సా ప్రాప్య మిథిలాం రమ్యాం సమృద్ధజనసంకులామ్। భైక్షచర్యాపదేశేన దదర్శ మిథిలేశ్వరమ్॥"** (12-308-12). **"అథ భుక్తవతీ ప్రీతా రాజానం మంత్రిభిర్వృతం । సర్వభాష్యవిదాం మధ్యే చోదయామాస భిక్షుకీ॥" (15).** దీనిని తిక్కన 206వ వచనంలో ప్రస్తావించాడు. తన నేత్రకాంతులతో జనకుడి నేత్రకాంతులను సంయోజన చేసి (చూపుల పగ్గాలు పెనవేసి - రశ్మి అంటే పగ్గమనికూడా) యోగబంధనంలో అతడిని బంధించింది అన్నాడు వ్యాసుడు. **" నేత్రాభ్యాం నేత్రయోరస్య రశ్మీన్సంయోజ్య రశ్మిభిః । సా స్మ సంచోదయిష్యంతం యోగబంధైర్బబంధ హ॥''** (12-308-17).

**సీ. పంచశిఖుండను పరమమునీశ్వరు । శిష్యుండ నతనిచే శిక్షితంబు**
**గమలాక్షి సాంఖ్యయోగక్షితి పాలనం । బులఁ ద్రివిధంబగు మోక్షధర్మ**
**మట్లుగావున సంశయము లేక ముక్తకా । మస్థితి నమ్మూఁడు మార్గములను**
**నడచి పరంబున కెడపడకుండుదు । ముక్తి వైరాగ్యైకమూల సూవె**

**తే. విను విరక్తి దృఢ జ్ఞానజనిత గాన । దీపిత జ్ఞానమును విరక్తియు ధరింపఁ**
**బడిన బుద్ధి నిర్ద్వంద్వత బరఁగు నింటి । యంద నిల్చి నిస్సంగుఁడనై చరింతు. 174**

**ప్రతిపదార్థం:** కమలాక్షి!= పద్మాలవంటి కన్నులుగలదానా!; పంచశిఖుండు+అను= పంచశిఖుడు అనే పేరుగల; పరమమునీశ్వరు= మహామునివరుని; శిష్యుండన్= శిష్యుడను నేను; సాంఖ్య - యోగ - క్షితిపాలనంబులన్= సాంఖ్యమూ, యోగమూ, రాజ్యపరిపాలనమూ అనే వీటితో; త్రివిధంబు+అగు= మూడు విధాలైన; మోక్షధర్మము= ముక్తి పద్ధతి (స్వభావం); అతనిచేన్= ఆ పంచశిఖగురునిచేత; శిక్షితంబు= (నాకు) నేర్పబడింది; అట్లు+కావునన్= అందుచేత; సంశయము లేక= ఏ సందేహమూ లేకుండా; ముక్తకామస్థితిన్= కోరికలు తొలగిన స్థితితో; ఆ+మూఁడు+మార్గములను= ఆ మూడు మోక్షపద్ధతుల్లోనూ; నడచి= ప్రవర్తించి; పరంబునకున్= పరతత్త్వానికి లేదా పరలోకానికి; ఎడపడక+ఉండుదున్= దూరం కాకుండా ఉండగలుగుతున్నాను; ముక్తి= మోక్షమనేది; వైరాగ్యైకమూల+చూవె= వైరాగ్యమే మూలంగా కలది సుమా!; విను; విరక్తి= వైరాగ్యమనేది; దృఢ-జ్ఞాన-జనిత= నిశ్చలమైన జ్ఞానం వల్లనే పుడుతుంది; కానన్= కాబట్టి; దీపిత జ్ఞానమునున్= ప్రకాశించే జ్ఞానమూ; విరక్తియున్= అందువలన కలిగే వైరాగ్యమూ; ధరింపఁబడిన= రెండూ ధరించినటువంటి; బుద్ధి= అంతరంగం; నిర్ద్వంద్వతన్= సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతంగా; పరఁగున్= వ్యవహరిస్తుంది; ఇంటియంద= ఇంటిలోనే; నిల్చి= ఉండీ; నిస్సంగుఁడనై= విరక్తుడనై; చరింతున్= సంచరిస్తూ ఉంటాను.

**తాత్పర్యం:** ఓ పద్మాక్షీ! పంచశిఖుడు అనే మునీశ్వరుడికి నేను శిష్యుడను. ఆయన నాకు సాంఖ్యంలోనూ యోగంలోనూ రాజ్యపరిపాలనలోనూ - ఈ మూడింటా ముక్తిపొందే మార్గాలు ఉపదేశించారు. అందుచేత నిస్సంశయంగా నిష్కామంగా ఆ మూడు మార్గాల్లోనూ నడుస్తూ పరమాత్మకు సన్నిహితంగా ఉంటున్నాను. ముక్తికి వైరాగ్యమే మూలం. వైరాగ్యానికి జ్ఞానమే ఆధారం. కాబట్టి జ్ఞానంతో కలిగిన విరక్తి నా అంతరంగంలో ఉండటం వలన సుఖదుఃఖాలూ, రాగద్వేషాలూ వంటి ద్వంద్వాలకు అతీతంగా జీవించగలుగుతున్నాను. ఇంటిలోనే (సంసారంతోనే) ఉండి కూడా నిస్సంగుడిగా మనుతున్నాను.

**క.** **వనితా! చందనమునఁ బూ । సినఁ గత్తిని వ్రేసినను సుచిత్తత నా క**
**జ్జను లిరువురయందును సరి, । కనకము లోష్టమును సమము కాఁ గనుగొందున్. 175**

**ప్రతిపదార్థం:** వనితా!= ఓ మగువా!; చందనమునన్= మంచి గంధంతో; పూసినన్= పులిమినా; కత్తిని= ఖడ్గంతో; వ్రేసినన్= ఖండించినా; నాకున్= నాకు; ఆ+జనులు= ఆ పనిచేసిన వ్యక్తులు; ఇరువురయందునున్= ఇద్దరిపట్లా; సుచిత్తత= ద్వేషం లేని మంచి మనస్సు కలిగి ఉండటమనేది; సరి= సమానం; కనకమున్= బంగారాన్నీ; లోష్టమునున్= మట్టినీ; సమము+అ= సమానమే; కాన్= అయ్యేట్టు; కనుఁగొందున్= చూస్తాను.

**తాత్పర్యం:** ఓ వనితా! నా శరీరానికి (కుడిభుజానికి) చందనం పులిమినా (ఎడమభుజాన్ని) కత్తితో నరికినా ఆ ఇద్దరి వ్యక్తుల పట్లా నేను రాగ-ద్వేష రహితంగా సమానంగా ఉండగలను. నా దృష్టిలో బంగారానికీ, మట్టికీ తేడా లేదు. నాకు రెండూ సమానమే.

**తే.** **జ్ఞానమును గర్మమును రెంటి సంగమంబు । నిష్ఠలుగ మోక్షవిదులు వర్ణింతు రాత్మ**
**శాస్త్రములు గని మద్గురుశాసనంబు । సుగమపదము తృతీయంబు సూవె యబల! 176**

**ప్రతిపదార్థం:** అబల!= ఓ సుకుమారీ!; జ్ఞానమును= జ్ఞానమూ; కర్మమును= కర్మత్యాగమూ లేదా కర్మాచరణమూ; రెంటి= ఈ రెండింటి; సంగమంబున్= సాంగత్యాన్ని; నిష్ఠలుగన్= జ్ఞాననిష్ఠగానూ, కర్మనిష్ఠగానూ; మోక్షవిదులు= ముక్తిస్వరూపం తెలిసినవారు; ఆత్మశాస్త్రములు+కని= ఆత్మతత్త్వాన్ని గురించీ మోక్షం గురించీ చర్చించే శాస్త్రాలు చదివి; వర్ణింతురు= వివరించి చెబుతూ ఉంటారు; మత్+గురు+శాసనంబు= మా గురువుగారి ఆజ్ఞ(ఉపదేశం); సుగమపదము= తేలికగా పొందదగినది; తృతీయంబు+చూవె= అది మూడవ నిష్ఠ సుమా!

**తాత్పర్యం:** ఓ సుకుమారీ! వేదాంతగ్రంథాలు చదివిన మోక్షవేత్తలు జ్ఞాననిష్ఠ - కర్మనిష్ఠ అనే రెండు మార్గాలు చెప్తుతూ ఉంటారు. కానీ, మా గురువుగారు చెప్పేది సులభమైన మూడవ మార్గం సుమా!

**ఆ. కీడుగని యొకండు గృహధర్మ ముడిగి స । మాశ్రయించు నాశ్రమాంతరంబు**
**దాన సంగ ముడుగఁగా నేర దదియొల్ల । మియును వలపుగాన మీననయన! 177**

**ప్రతిపదార్థం:** మీననయన!= ఓ మచ్చెకంటీ!; కీడు+కని= ఏదో ప్రమాదాన్ని పొంది; ఒకండు= ఒక గృహస్థు; గృహధర్మము+ఉడిగి= గృహస్థాశ్రమాన్ని విడిచిపెట్టి; ఆశ్రమాంతరంబున్= సన్న్యాసాశ్రమాన్ని (ఎందుకంటే); సమాశ్రయించున్= స్వీకరిస్తాడు; దానన్= అట్లా స్వీకరించినందువలన; సంగము= తగుల్కోలు; ఉడుగఁగాన్+నేరదు= అంతరించిపోదు (మరొక ఆశ్రమం - సన్న్యాసం); అది+ఒల్లమియున్= గృహస్థాశ్రమం వద్దనటం కూడా; వలపు+కానన్= ఒక కోరికయే కాబట్టి.

**తాత్పర్యం:** ఓ చేపకన్నుల చిన్నదానా! కుటుంబంలో ఏదో కీడు జరిగింది కదా అని ఒకడు గృహస్థాశ్రమం వదిలేసి సన్న్యాసాశ్రమం స్వీకరిస్తాడు. అంతమాత్రాన అతడికి సాంగత్యం వదలదు. గృహస్థాశ్రమం వద్దు అని ద్వేషించటం కూడా ఒక సంగమే. రాగమే కాదు ద్వేషమూ పనికి రాదు సుమా!

**క. దండముఁ గాషాయంబును । ముండితయుఁ గమండలువును మోక్ష మొసఁగ వె**
**ట్లండేని లింగములకు న । ఖండజ్ఞాన ప్రదత్వకలనము గలదే? 178**

**ప్రతిపదార్థం:** దండమున్= సన్న్యాసులు ధరించే పొడవాటి కర్ర (త్రిదండి); కాషాయంబును= కాషాయవస్త్రధారణ; ముండితయున్= గుండు కలిగియుండుట; కమండలువును= నీటి కమండలమూ - ఇవి; మోక్షమున్+ఒసఁగవు= మోక్షాన్ని ఇయ్యవు; ఎట్లు+అండు(వు)+ఏనిన్= ఎలాగంటే; లింగములకున్= చిహ్నాలకు; అఖండ= అఖండమైన; జ్ఞాన= జ్ఞానాన్ని; ప్రదత్వకలనము= ఇవ్వగలిగిన శక్తి; కలదే?= ఉన్నదా? (లేదని భావం.)

**తాత్పర్యం:** సన్న్యాసాశ్రమం స్వీకరించాడు - అనటానికి చిహ్నాలైన కాషాయధారణ, ముండనం, దండకమండల వహనం, ఇత్యాదులు మోక్షాన్ని ఇవ్వవు. బాహ్యచిహ్నాలకు జ్ఞానప్రదానశక్తి ఉండదుగదా! జ్ఞానమనేది ఆత్మగుణం. ఈ చిహ్నాలు ఏమీ లేకుండానూ జ్ఞాని ఉండవచ్చును.

**విశేషం:** ఎట్లు+అంటి(వి)+ఏనిన్= ఎట్లంటేనిన్ అని ఉంటే అన్వయం హాయిగా కుదురుతుంది. కానీ అప్పుడు ప్రాసనియమం భంగపడుతుంది. అందు(వు)+ఏనిన్= అందేనిన్ అని విభజించి ద-డలకు అభేదం కనక 'అండేనిన్' అని సమన్వయించాలి. 'అందురు- అండ్రు' అనే రూపాల్లో దకారం డకారంగా మారటం ఉన్నది.

**క. మగువా! దుఃఖము శిథిలం । బగునని లింగములు దాల్తు రమ్మెయి లే దె**
**ట్లు? గొడుగునందుం గావున । వగవఁగ మోక్షదముగాఁగ వలయున్ గొడుగున్. 179**

**ప్రతిపదార్థం:** మగువా!= ఓ వనితా!; దుఃఖము= శోకమనేది; శిథిలంబు+అగున్+అని= తొలగిపోతుంది అనుకొని; లింగములు= కాషాయమూ మొదలైన వైరాగ్య చిహ్నాలను; తాల్తురు= ధరిస్తూ ఉంటారు; ఆ+మెయి= ఆపాటి; గొడుగునందున్= రాజలాంఛనమైన వెల్లగొడుగులోమాత్రం; లేదు+ఎట్లు?= లేదా ఏమిటి?; కావునన్= కాబట్టి; వగవఁగన్= దుఃఖాలు కొనితెచ్చుకొనటానికీ; మోక్షదము+కాఁగన్= ముక్తిప్రదం అవ్వటానికీ; గొడుగున్= కాషాయాదులతోపాటు గొడుగుకూడా; వలయున్= కావలసిందే మరి!

**తాత్పర్యం:** దుఃఖం తొలగిపోతుందని కాషాయాది సన్న్యాసచిహ్నాలను స్వీకరిస్తారు. ఆ పాటి శక్తి రాజలాంఛనంగా నేను ధరించే సితచ్ఛత్రానికి మాత్రం లేదా! అది దుఃఖహేతువైనా ముక్తిప్రదమైనా గొడుగు అనేది నాకు తప్పదు.

(జ్ఞానం కాక కాషాయాదులే మోక్షాన్ని ఇచ్చేటట్లయితే నాకు నా గొడుగూ మోక్షదం అవుతుందని; జ్ఞానమే మోక్ష హేతువయినప్పుడు అది నాకు ఉన్నది కనుక ఇంక ఈ రాజలాంఛనాలు నాకు దుఃఖకారణాలూ బంధనాలూ కావని భావం.)

**విశేషం:** దీనికి మూలశ్లోకంలో భావం మరింత స్పష్టంగా కనపడుతున్నది. **"అథవా దుఃఖశైథిల్యం వీక్ష్య లింగే కృతా మతిః । కిం తదేవార్థ సామాన్యం ఛత్రాదిషు న లక్ష్యతే॥" (12-308-49).** ఏ చిహ్నాలూ లేనంతమాత్రం చేత మోక్షం లభించదు. ఏవో కొన్ని లాంఛనాలు ఉన్నంతమాత్రంచేత అవి బంధనాలూ కావు. చిహ్నాలు ఉన్నా లేకపోయినా జీవుడు జ్ఞానంచేతనే ముక్తుడు అవుతున్నాడు. **"ఆకించన్యే న మోక్షోऽస్తి, కైంచిన్యే నాస్తి బంధనమ్ । కైంచిన్యే చేతరే చైవ జంతుః జ్ఞానేన ముచ్యతే॥" (12-308-50).**

**ఆ. జ్ఞానమునన కాని మానిని! లింగమా । త్రమున ముక్తి యగునె? రాజ్యబంధ**
**రాగబంధ నిఖిల భోగబంధములఁ బ్ర । జ్ఞాసిఁ దునిమినాఁడ నది గతముగ. 180**

**ప్రతిపదార్థం:** మానిని!= ఓ మగువా!; జ్ఞానమునన్+అ+కాని= జ్ఞానం చేతనే తప్ప; లింగమాత్రమునన్= కాషాయాది చిహ్నాలను ధరించినంత మాత్రంచేత; ముక్తి+అగునె?= మోక్షం లభిస్తుందా?; రాజ్యబంధ= రాజ్యపరిపాలనం అనే బంధాన్నీ; రాగబంధ= వ్యామోహం అనే బంధాన్నీ; నిఖిల= సమస్తమైన; భోగబంధములన్= భోగబంధాలనూ; ప్రజ్ఞా+అసిన్= ప్రజ్ఞ అనే ఖడ్గంతో; తునిమినాఁడన్= ఖండించినవాడను; అది+కతముగన్= ఆ కారణంగా.

**తాత్పర్యం:** మానినీ! జ్ఞానంవలన మాత్రమే ముక్తి లభిస్తుంది. దండ కమండల కాషాయాది చిహ్నాలవలన కాదు. నేను రాజ్య, రాగ, భోగబంధాలను అన్నింటినీ జ్ఞానం అనే కత్తితో తెగకోసుకొన్నాను. అది కారణంగా ముక్తుడను అయ్యాను. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం.

**వ. ఇట్లు ముక్తుండ నైయున్న నాయెడ ముక్తత్వాముక్తత్వంబు లారయవేఁడి వచ్చి మచ్చిత్తంబు మెత్తన చొచ్చి తిదియ ప్రయోజనం బట్లుంగాక. 181**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; ముక్తుండను+ఐ+ఉన్న= ముక్తుడిని అయి ఉన్న; నా+ఎడన్= నాయందు; ముక్తత్వ+ అముక్తత్వంబులు= ముక్తుడా? అముక్తుడా? అనే లక్షణాలు; ఆరయన్= తెలుసుకోవటం కోసం; వేఁడి వచ్చి= కోరి వచ్చి; మత్+చిత్తంబున్= నా హృదయాన్ని; మెత్తన= మెల్లగా; చొచ్చితి(వి)= ప్రవేశించావు; ప్రయోజనంబు= దీనికి ప్రయోజనం; ఇదియ= ఇదే, ఇంతే; అట్లున్+కాక= అట్లా కాక.

**తాత్పర్యం:** ఇట్లా ముక్తుడనై ఉన్న నన్ను పరీక్షించటానికి నా హృదయంలోనికి మెల్లగా ప్రవేశించావు. దీనికి ప్రయోజనం ఇంతే! అట్లా కాక.

**తే. బ్రాహ్మణివి యోగినివి పరభార్య వబల! । భర్త ప్రోషితుఁ డేను నృపాలసుతుఁడ**
**వినుము గృహమేధి నాచారఘనుఁడ నిట్టి । నేను నీవు రమించుట నిందఁ దేదె? 182**

**ప్రతిపదార్థం:** అబల!= ఓ సుకుమారీ!; బ్రాహ్మణివి= నీవు బ్రాహ్మణస్త్రీవి; యోగినివి= భిక్షుకివి; పరభార్యవు= పరకాంతవు; భర్త= నీ మగడు; ప్రోషితుఁడు= ఏదో పనిమీద దూరప్రాంతాలకు వెళ్ళినవాడు; వినుము= ఆలకించు; ఏను= నేను; నృపాల సుతుఁడన్= క్షత్రియకుల సంజాతుడిని; గృహమేధిన్= గృహస్థాశ్రమంలో ఉన్నవాడిని; ఆచారఘనుఁడన్= ఆచారాలను

పాటించటంలో నిష్ఠకలవాడిని; ఇట్టి= ఇటువంటి; నేనున్= నేనూ; నీవున్= నీవూ; రమించుట= సుఖించటమనేది; నిందన్+ తేదె?= అపకీర్తి తీసుకురాదా?

**తాత్పర్యం:** మానినీ! నేను ముక్తుడనో కాదో పరీక్షించటంకొరకే నీవు నా హృదయంలోనికి ప్రవేశించావు అనుకొంటున్నాను. అట్లా కాక మరింకేదయినా శృంగారపరమైన శారీరకవాంఛతో ప్రవేశించినట్లయితే - వినుము. మరి నీవు బ్రాహ్మణకులంలో పుట్టినదానవు. నేను క్షత్రియుడను. నీవు యోగినివి. నేను గృహమేధిని. నీవు పరభార్యవు. నేను ఆచారపరుడను. ఇట్లాంటి నీవూ నేనూ రమించటం ఎంతటి నింద్యం! ఎంతటి అపకీర్తి!

**వ. స్వతంత్రవై నీవు చేసిన యీ యవినయంబున నెయ్యది వాటిల్లిన నది నీయంద నిలుచుం గాక!' యని పలికి వెండియు. 183**

**ప్రతిపదార్థం:** స్వతంత్రవు+ఐ= స్వతంత్రురాలవై; నీవు; చేసిన; ఈ; అవినయంబునన్= అవినీతివలన; ఎయ్యది= ఏది; పాటిల్లినన్= జరిగినా; అది; నీయందున్+అ= నీయందే; నిలుచున్+కాక!= నిలుచుగాక!; అని పలికి= అని హెచ్చరించి; వెండియున్= మళ్ళీ ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** స్వతంత్రించి నీవు చేసిన ఈ అవినీతి పనివలన ఏమి జరిగినా అది నీకే చెందుతుంది గాక!' అని చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'నావలని రాగముననే । నీవిట్లైతి నను గెల్చు నిపుణతకుం గా**
**కీ వెడమాయల నిప్పుడుఁ । బో విడువవు యోగశక్తి పొలుపు కలిమినే. 184**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; గెల్చు= జయించటం అనే; నిపుణతకున్+కాక= నైపుణ్యంకోసం కాకుండా; ఈ+వెడమాయలన్= ఈ రకమైన వృథా మాయలు; ఇప్పుడున్= ఇంత చెప్పినా ఇప్పటికీ; పోన్+విడువవు= నీవు విడవటం లేదు; అది యోగశక్తి= యోగశక్తియొక్క; పొలుపు= మహిమ; కలిమినే= నీకు ఉండటంచేతనే.

**తాత్పర్యం:** 'ఓ మానినీ! నన్ను పరీక్షించి గెలవటంకొరకు కాక నాపట్ల అనురాగంతోనే నీవు ఇట్లా అందాలరాశిగా రూపం ధరించి వచ్చావు. అందుకే ఈ వృథామాయలను ఇప్పటికీ నీవు వదిలిపెట్టటం లేదు. ఇదంతా నీకున్న యోగశక్తి మహిమవలన సాధ్యపడుతున్నది.

**క. నిను డాఁచి కుటిలభావం । బున దుష్టచరిత్రవైతి ముక్తుల తెఱఁగే**
**వనిత! యిది యే బయలుపఱి । చిననైనను మానవలదె చెన్నఁటిచూపుల్?' 185**

**ప్రతిపదార్థం:** వనిత!= ఓ మగువా!; నినున్= నిన్ను నీవు; డాఁచి= కప్పిపుచ్చుకొని; కుటిలభావంబునన్= వక్రబుద్ధితో; దుష్టచరిత్రవు+ఐతి(వి)= దుష్టస్వభావవు అయ్యావు; ఇది= ఇటువంటిది; ముక్తుల తెఱఁగే?= ముక్తుల పద్ధతియేనా?; ఏన్= నేను; బయలుపఱిచిన నైననున్= ఇట్లా నా స్వభావాన్నీ, నీ వ్యవహారాన్నీ బట్టబయలు చేసినప్పుడైనా; చెన్నఁటి చూపుల్= వంకర చూపులు (దుష్టమైన చూపులు); మానవలదె?= మానవద్దా?

**తాత్పర్యం:** అమ్మాయీ! వక్రబుద్ధితో నిన్ను నీవు కప్పిపుచ్చుకొని నీ దుష్టస్వభావం వెల్లడించుకొన్నావు. ఇది ముక్తుల పద్ధతేనా? పోనీ నేను బయలుపరచాను కనుక ఇప్పటికైనా నీ కుటిల వీక్షణాలు మానుకొనవద్దా?'

**క. అని తన వైరాగ్యంబును । ఘనబోధము మహిమయుం బ్రకాశింప మనం**
**బున సరకుగొనక యి ట్ల । వ్వనితఁ బలికి యన్నరేంద్రవర్యుఁడు మఱియున్. 186**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ఆ+నరేంద్రవర్యుఁడు= ఆ రాజశ్రేష్ఠుడు జనకమహారాజు; తన= తనయొక్క; వైరాగ్యంబును= విరక్తీ; ఘన= గొప్పదైన; బోధము+మహిమయున్= జ్ఞానం యొక్క మహిమా; ప్రకాశింపన్= విరాజిల్లేటట్లు; మనంబునన్= మనస్సులో; సరకుగొనక= సులభను లెక్కచెయ్యకుండా; ఇట్లు= ఈ ప్రకారంగా; ఆ+వనితన్= ఆ స్త్రీని ఉద్దేశించి; పలికి= ఉపన్యసించి; మఱియున్= ఇంకా (ఇట్లా అంటున్నాడు.)

**తాత్పర్యం:** జనకమహారాజు ఆమెను లెక్కచెయ్యకుండా తన వైరాగ్యమూ, తన జ్ఞానమహిమమూ ప్రకాశించేట్లు ఇట్లా మాట్లాడి, మళ్ళీ తనే ఇంకా ఉపన్యాసం కొనసాగిస్తున్నాడు.

**క. తను వొప్పెడునది యౌవన । మును నూతన మిట్టి నీకుఁ బొలఁతీ! యోగం**
**బున నింతచొరవ యెమ్మెయిఁ । బనుపడియెం జెపుమ! దాఁపఁ బనిలే దింకన్.' 187**

**ప్రతిపదార్థం:** పొలఁతీ!= ఓ వనితా!; తనువు= నీ శరీరం; ఒప్పెడునది= చాలా అందంగా ఉంది; యౌవనమును= నీ జవ్వనంకూడా; నూతనము= తొలిదశలో ఉంది; ఇట్టి నీకున్= ఇలా తొలిప్రాయంలో ఉన్న నీకు; యోగంబునన్= యోగమార్గంలో; ఇంత చొరవ= ఇంతటి ప్రవేశం (చనవు); ఏ+మెయిన్= ఎట్లా; పనువడియెన్= అలవడింది; చెపుమ!= దయచేసి చెప్పుము!; ఇంకన్= ఇక; దాఁపన్+పనిలేదు= దాచవలసిన అవసరంలేదు.

**తాత్పర్యం:** ఓ వనితా! నీ శరీరం చూస్తే ఒప్పులకుప్పవలె ఉన్నది. నీ యౌవనమూ తొలిదశలో ఉన్నది. మరి నీకు ఇంతటి యోగమహిమ ఎట్లా అలవడింది? ఇంకా దాపరికం ఎందుకు? చెప్పుము'.

**వ. అనుచు. 188**

**తాత్పర్యం:** అంటూ.

**క. తను సరకుసేయ కి ట్ల । జ్జననాథుఁడు వలుక నవ్వచనములు దెలియన్**
**విని సులభ చతురముగ ని । ట్లను నించుక గొంకులేక యవ్విభుతోడన్. 189**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; తనున్= తనను; సరకుసేయక= లక్ష్యపెట్టకుండా; ఇట్లు= ఈ విధంగా; ఆ+జననాథుఁడు= ఆ జనకమహారాజు; పలుకన్= మాట్లాడేసరికి; ఆ+వచనములు= ఆ మాటలు; తెలియన్ విని= అర్థమయ్యేట్టు ఆలకించి; సులభ= ఆ సులభ; చతురముగన్= నిపుణంగా; ఆ+విభుతోన్= ఆ రాజుతో; ఇంచుక= కొంచెమైనా; కొంకులేక= జంకు అనేది లేకుండా; ఇట్లు= ఈ ప్రకారంగా; అనున్= అన్నది.

**తాత్పర్యం:** జనకమహారాజు ఇట్లా తనను ఏ మాత్రమూ లెక్కచెయ్యకుండా మాట్లాడినా; అంతా శ్రద్ధగా ఆలకించి, సులభాదేవి చాలా నిపుణంగా బదులు పలికింది.

**క. 'శ్రోతకుఁ దనకుం బ్రియమగు । నే తెరువున నట్టిమెయి సమీరిత మైనం**
**జూ తగు వాక్యం బది నృప । సూతీ! పెఱపలుకు బాలిశుల చొ ప్పరయన్. 190**

**ప్రతిపదార్థం:** నృపసూతీ!= ఓ రాకుమారా!; శ్రోతకున్= వినే వ్యక్తికీ; తనకున్= చెప్పే తనకూ; ఏ తెరువునన్= ఏ పద్ధతిలో; ప్రియము+అగున్= హితవు అవుతుందో; అట్టి మెయిన్= ఆ పద్ధతిలో; సమీరితము+ఐనన్+చూ!= చెప్పబడినది అయితేనే సుమా!; అది; తగువాక్యంబు= తగినమాట అవుతుంది; పెఱపలుకు= తక్కినవాక్యం (మాట); అరయన్= పరిశీలనగా చూస్తే; బాలిశుల చొప్పు= మూర్ఖుల పద్ధతి.

**తాత్పర్యం:** 'ఓ క్షత్రియకుమారా! వినే వ్యక్తికీ, చెప్పే వ్యక్తికీ హితమైన పద్ధతిలో వెలువడినదే సరి అయిన మాట. తక్కినవన్నీ మూఢుల మాటలక్రిందే లెక్క.

**వ. భవదీయ వాక్యవైదగ్ధ్యం బట్లుండె నీవు నన్నెవ్వరిదాన? వెచ్చటినుండి వచ్చి? తెటుపోయె?దని తొలుత నడిగి తవహితుండవై వినుము చెప్పెద. 191**

**ప్రతిపదార్థం:** భవదీయ= నీ; వాక్య= మాటల; వైదగ్ధ్యంబు= నేర్పు; అట్లు+ఉండెన్= అట్లా ఉంది; నీవు; నన్నున్= నన్ను; ఎవ్వరిదానవు?= ఎవరి వనితవు?; ఎచ్చటినుండి వచ్చితి(వి)?= ఎక్కడనుంచి వచ్చావు?; ఎటుపోయెదు?= ఎక్కడికి వెడతావు?; అని; తొలుతన్= ఆదిలో; అడిగితి(వి)= అడిగావు, అవహితుండవై= సావధానుడవై; వినుము= ఆలకించు; చెప్పెదన్= చెబుతాను.

**తాత్పర్యం:** నీ మాటల చాతుర్యం అట్లా ఉండనిమ్ము. నా వివరాలను మొదట్లో అడిగావు కనుక చెప్పుతున్నాను. సావధానంగా వినుము.

**జనకుని ప్రశ్నంబులకు సులభ ప్రత్యుత్తరంబు లిచ్చుట (సం. 12-308-95,96)**

**క. విను పాంసూదకముల చా । డ్పున జతుకాష్ఠముల భంగి భూతంబులకున్**
**మనుజేంద్ర! కలుగుఁ బొం దా । పని నన్యోన్యసమధీనభావము గలదే? 192**

**ప్రతిపదార్థం:** మనుజేంద్ర= ఓ మహారాజా!; విను; పాంసు+ఉదకముల+చాడ్పునన్= దుమ్మూ, నీరులాగా; జతు+కాష్ఠముల+భంగిన్= లక్కా చెక్కల్లాగా; భూతంబులకున్= పంచభూతాలకు; పొందు= కలయిక (సాంగత్యం); కలుగున్= ఏర్పడుతుంది; ఆ పనిన్= ఆ కలయికలో; అన్యోన్య సమ్+అధీన+భావము= పరస్పరం ఒకదాని అధీనంలో మరొకటి ఉండటమనే స్థితి; కలదే?= ఉంటుందా?

**తాత్పర్యం:** ధూళికణాలూ, నీటి బిందువులూ కలిసినట్లుగా, లక్కతో కర్ర అతికినట్లుగా పంచభూతాలకు యాదృచ్ఛికంగా పరస్పరం కలయిక ఏర్పడుతూ ఉంటుంది. ఎంతగా కలిసి ఉన్నా ఇవి పరస్పరాధీనాలు కావు. దేని అస్తిత్వం దానికుంటుంది. ఒకదానితో కలిసి ఉన్నట్టు మరొక దానికి తెలియదు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ఒక్క మేనియంద యుర్వీశ! పంచభూ । తములు దశమితేంద్రియములు మనసు**
**బుద్ధియును బ్రధానమును గల వివి యొక్కఁ । డొకటియవియె, యేల యొండు సెప్ప? 193**

**ప్రతిపదార్థం:** ఉర్వీశ!= రాజా!; ఒక్క మేనియందున్+అ= ఒక్క శరీరంలోనే; పంచభూతములున్= పంచభూతాలూ; దశమిత+ ఇంద్రియములున్= పది పరిమితమైన ఇంద్రియాలూ; మనసున్= మనస్సూ; బుద్ధియును= బుద్ధి అనేదీ; ప్రధానమును= ప్రకృతి లేదా అవ్యక్తం అనబడే తత్త్వమూ; కలవు= ఉన్నాయి; ఇవి= ఇవన్నీ; ఒక్కఁడు+ఒకటి+అవియె= వేటికవి స్వతంత్రాలే; ఒండు= మరొకటి ఉదాహరణంగా; చెప్పన్ ఏల?= చెప్పటం ఎందుకూ?

**తాత్పర్యం:** ఒకే శరీరంలో పంచభూతాలూ, దశేంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, ప్రకృతీ ఇవి అన్నీ కలిసిఉంటున్నాయి. కానీ, ఒకదాని ఉనికి మరొక దానికి తెలియదు. దేని కది ప్రత్యేకమే. ఇంక మరొకటి చెప్పవలసిన పని ఏముంది? (పంచభూతాల కలయిక అన్యోన్య సమధీనం కాదు అనటానికి ఇది చాలు - అని.)

**వ. నిక్కంబునకు నెవ్వరు నెవ్వరివారుం గామి తెలియవే? యని పలికి వెండియు. 194**

**ప్రతిపదార్థం:** నిక్కంబునకున్= నిజానికి; ఎవ్వరున్= ఎవ్వరూకూడా; ఎవ్వరివారున్+కామి= ఎవ్వరివారూ కాకపోవటం; తెలియవే?= ఎరుగవా?; అని పలికి= అని చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** నిజానికి ఎవరూ ఒకరికి చెందినవారు కారని తెలియదా?' అని చెప్పి మరల ఇట్లా కొనసాగించింది.

**తే.** **'సకలలోకములను సదశ్వంబు కరణి । ధావనము సేయుచుండుఁ బ్రధాన మింత**
**యెఱిఁగి జననాథ! యెవ్వరి నెచటనుండు । వార లనువార మమ్మాటవలను సెపుమ! 195**

**ప్రతిపదార్థం:** జననాథ!= ఓ రాజా!; ప్రధానము= ప్రకృతి అనేది (ప్రాణం); సత్+అశ్వంబు+కరణిన్= మేలుజాతి గుర్రంలాగా; సకలలోకములను= సమస్తలోకాలలోనూ; ధావనము+చేయుచుండున్= పరుగుతీస్తూ ఉంటుంది; ఇంత= ఇదంతా; ఎఱిఁగి= తెలిసీ; ఎవ్వరిన్= ఎవరిని; ఎచటనుండువారలు= ఎక్కడ ఉండేవారు; అనువారము?= అనగలం?; ఆ+మాట+వలనున్= ఆ మాట తీరూ అర్థం; (వలను= తీరు, దిక్కు); చెపుమ!= చెప్పుము చూద్దాం!

**తాత్పర్యం:** 'జనకమహారాజా! ప్రకృతి అనేది జవనాశ్వంవలె సకలలోకాలకూ పరుగులు తీస్తూ ఉంటుంది. అది నీకూ తెలుసు, నాకూ తెలుసు. ఇంత తెలిసీ ఎవరిని ఎక్కడివాళ్ళు అని అడగగలం? అసలు ఆ ప్రశ్నకు అర్థంఏమిటి?

**తే.** **నీవు నీయందు నినుఁగను నెఱియ యొరుల । యందుఁ గానంగవలవదే యధిప! తన్ను**
**నొరులనొక్కటిగాఁ జూచు పురుషుఁ డెచట । మీరలుండుదు రెవ్వరివార లనునె? 196**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నీవు; నీయందున్= నీలో; నినున్= నిన్ను; కను= చూసుకొనే; నెఱియ= అందమే, పద్ధతియే; ఒరులయందున్= ఇతరులలో కూడా; కానంగన్+వలవదే?= చూడవద్దా?; తన్నున్= తననూ; ఒరులన్= ఇతరులనూ; ఒక్కటిగాన్= అభిన్నంగా; చూచు= దర్శించగలిగిన; పురుషుఁడు= జ్ఞాని; ఎచటన్= ఎక్కడ; మీరలు= మీరు; ఉండుదురు?= నివసిస్తారు?; ఎవ్వరివారలు?= ఎవరికి చెందినవారు మీరు?; అనునె?= అని ప్రశ్నిస్తాడా?

**తాత్పర్యం:** రాజా! నీలో నిన్ను నీవు చూచికొనగలిగినట్లే ఇతరులలోనూ చూడగలగాలి కదా! జీవాత్మ్మడి సాక్షాత్కారం సర్వప్రాణికోటిలోనూ పొందగలిగినవాడు తాను అనీ, ఇతరులు అనీ భేదభావంతో ఉండగలడా? అతడికి అందరూ అంతా ఒక్కటే. 'నీవు ఎవరవు? ఎవరి దానవు?' - ఇట్లాంటి ప్రశ్నలు వెయ్యడు. అవునా?

**తే.** **అరులు మిత్త్రు లుదాసీను లనుచు సంధి । విగ్రహాది షడ్గుణముల వెరవు లొకరుఁ**
**డలవరించుచు విజయంబు నాసపడుచు । నుండునటె? ముక్తితెఱఁ గిటులున్నె యరయ?! 197**

**ప్రతిపదార్థం:** ఒకరుఁడు= అటువంటి జ్ఞానం కలిగిన వ్యక్తి ఒకడు; అరులు= శత్రువులూ; మిత్త్రులు= స్నేహితులూ; ఉదాసీనులు= మధ్యస్థులూ; అనుచున్= అని ఇతరులను విభజిస్తూ; సంధి= పొత్తూ; విగ్రహ= యుద్ధమూ; ఆది= మొదలైన; షడ్గుణముల= ఆరు విధానాల; వెరవులు= ఉపాయాలు; అలవరించుచున్= ఆచరణలో పెట్టుతూ; విజయంబున్= శత్రువులమీద విజయాన్ని; ఆశపడుచున్= ఆశిస్తూ; ఉండునటె?= ఉంటాడా?; అరయన్= ఆలోచిస్తే; ముక్తి తెఱఁగు= మోక్షవిధానం - ముక్తిమార్గం; ఇటులు+ఉన్నె?= ఇట్లా ఉంటుందా?

**తాత్పర్యం:** రాజా! వీరు శత్రువులనీ, వారు మిత్రులనీ, వీరు మధ్యస్థులనీ జనులను విభజించి చూస్తూ, వాళ్ళమీద విజయం సాధించటానికి ఆరురకాల రాజనీతి ఉపాయాలను పన్నుతూ - ఇట్లా ఉంటాడా నిజమైన జ్ఞాని? ముక్తిమార్గం ఇట్లాగే ఉంటుందా?

ఉ. కావున నీవు ముక్తుఁడవు గా విటు గాకయు నిన్ను ముక్తుఁగా
భూవర! చూచె దిక్కలఁక బుద్ధులు సెప్పి తగం దొలంగఁగాఁ
ద్రోవఁగఁ బాడి బంధులకు దుర్మతి పుట్టినయట్టి మర్త్యు వా
రే విధినైన మందు లిడి యెప్పటి బుద్ధి ఘటించుచాడ్పునన్. 198

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; కావునన్= కాబట్టి; నీవు; ముక్తుడవు= బంధవిముక్తుడవు (జ్ఞానివి); కావు= కాదు; ఇటు+కాకయున్= ఇట్లా కాకపోయినా; నిన్నున్= నిన్ను నీవు; ఇటు= ఇట్లా; ముక్తున్+కాన్= ముక్తుడుగా; చూచెదు= భావిస్తున్నావు; ఈ+కలఁకన్= ఈ రుగ్మతను; బుద్ధులు+చెప్పి= జ్ఞానం ఉపదేశించి; తగన్= తగిన పద్ధతిలో; తొలంగఁగాన్+త్రోవఁగన్= తొలగ జేయటం; బంధులకున్= హితులకు; దుర్మతి+పుట్టిన+అట్టి+మర్త్యున్= దురాలోచనలూ, దుర్బుద్ధులూ పుట్టే మానవుడిని; వారు= ఆ బంధువులు; ఏ విధినైనన్= ఎట్లాగైనా; మందులు+ఇడి= ఔషధాలు ఇచ్చి; ఎప్పటి బుద్ధి= మునుపటి సద్బుద్ధి; ఘటించు+చాడ్పునన్= కలగజేసినట్టుగా; పాడి= ధర్మం.

**తాత్పర్యం:** ఓ రాజా! షాడ్గుణ్యం పన్నుతూ జయాభిలాషివై ఉన్నావు కాబట్టి నీవు ముక్తుడవు కావు. కాకపోయినా ఇట్లా నిన్ను నీవు ముక్తుడుగా భావిస్తున్నావు. అంటే ఇదేదో మానసికరుగ్మత. తగిన బుద్ధి చెప్పి దీనిని తొలగించటం బంధువుల కర్తవ్యం. ఎవడయినా ఒకడు ఉన్నట్టుండి దుర్మతి అయిపోతే వాడికి ఎట్లాగైనా ఏ మందులో మాకులో ఇప్పించి మళ్ళీ మనిషిని చేసినట్లుగా బంధువులంతా పూనుకొని నీ కలక వదలించాలి. ఇది పాడి. ఇది ధర్మం.

వ. ఏనెట్లు ముక్తుండఁగా? నంటేని విను మింకనుం జెప్పెద. 199

**ప్రతిపదార్థం:** రాజా! ఏను= నేను; ఎట్లు= ఏ విధంగా; ముక్తుండన్+కాను?= ముక్తుడిని కాను?; అంటి(వి)+ఏనిన్= అని నీవు అడిగినట్లయితే; వినుము= ఆలకించు; ఇంకనున్= ఇంకా వివరంగా; చెప్పెదన్= చెబుతాను.

**తాత్పర్యం:** ఓ రాజా! 'నేను ఏ విధంగా ముక్తుడను కాను?' అని నీవు అడిగితే గనుక ఇంకా చెప్తుతాను. వినుము.

సీ. వర్గత్రయంబున వలనను సప్తాంగ । ములయందుఁ జిత్తంబు మెలఁగుచుండ,
రాజులు-మజ్జనభోజన నిద్రావ । సరములు లోనుగా జనులుసేయు
విజ్ఞాపనము విని యాజ్ఞాపనం బొన । రించుచు, మంత్రులుఁ బ్రేమపాత్ర
తరుణులు నస్వతంత్రతఁ జేయ, నర్థుల । కొసరి తిండియు ధనగుప్తిమీఁది

తే. భరముఁ దమలో విరోధులై పట్టి మనసుఁ । జిక్కువఱుపంగఁ, బెక్కండ్రు సిరికి నడువఁ
బరిహరించుచు - బహుదుఃఖపరులు నల్ప । సౌఖ్యులును నగుచునికి రాజ్యంబు తెఱఁగు. 200

**ప్రతిపదార్థం:** వర్గత్రయంబున+వలనను= ధర్మ, అర్థ, కామాలు అనే మూడు పురుషార్థాల పట్లా; సప్త+అంగములయందున్= సైన్యమూ, కోశమూ మొదలైన రాజ్యాంగాలు ఏడింటిపట్లా; చిత్తంబు= మనస్సు; మెలఁగుచున్+ఉండన్= నిత్యమూ మెలగుతూ ఉంటే; మజ్జన+అవసరము= స్నాన సమయమూ; భోజన+అవసరము= భోజనసమయమూ; నిద్రా+అవసరము(లు)= నిద్రాసమయమూ అని; లోనుగాన్= ఈ మొదలైనవాటిని; జనులు= సేవకజనులు; చేయు= చేసేటటువంటి; విజ్ఞాపనము= విన్నపం; విని= ఆలకించి; ఆజ్ఞాపనంబు+ఒనరించుచున్= వాటివాటికి ఏర్పాట్లు చెయ్యమని ఆజ్ఞలు జారీ చేస్తూ; మంత్రులున్= అమాత్యులూ; ప్రేమపాత్ర= ప్రేమకు పాత్రలైన; తరుణులున్= వనితలూ; అస్వతంత్రతన్= అస్వతంత్రస్థితిని; చేయన్= తనకు కల్పించగా; అర్థుల= యాచకుల విషయంలో; కొసరి= ఇంకా ఇంకా కొసరి కొసరి; తిండియున్= ఆహారాదికం; ధనగుప్తిమీఁది= కోశాగారంలో ఉన్నధనం

కాపాడటంపట్ల ఉండే; భరమున్= బాధ్యత; తమలోన్= పరస్పరం; విరోధులై= శత్రువులై; పట్టి= ఆక్రమించి; మనసున్= మనస్సును; చిక్కు+పఱుపంగన్= కలతపెట్టగా; పెక్కండ్రు= పలువురు; సిరికిన్= తన సంపదకోసం; నడువన్= ప్రయత్నిస్తొంటే; పరిహరించుచున్= అటువంటివారిని పరిహరిస్తూ; రాజులు= పరిపాలకులు; బహుదుఃఖపరులు= అధికదుఃఖాలు కలవారూ; అల్పసౌఖ్యులును= తక్కువ సుఖాలు కలవారుగా; అగుచున్+ఉనికి= అవుతూ ఉండటం; రాజ్యంబు తెఱఁగు= రాజ్యం తాలూకు పద్ధతి.

**తాత్పర్యం:** రాజుల హృదయంలో ఎప్పుడూ వర్గత్రయకాంక్ష, సప్తాంగాలపట్ల జాగరూకత - ఇవే ఉంటాయి. వారి స్నానసంధ్యాదులు దాసదాసీజనం గుర్తుచేస్తే జరుగుతాయి. వారు చేసే ఏర్పాట్ల ప్రకారం ఉంటాయి. మంత్రులూ, తరుణులూ రాజులను పూర్తిగా అస్వతంత్రులను చేసేస్తారు. ధనాగారం కాపాడుకొనటం ఒకవైపూ, అర్థులకు దానం చెయ్యటం మరొకవైపూ రాజుల మనస్సులను పట్టిపీడిస్తూ ఉంటాయి. తన సిరికి ఆశపడేవాళ్ళను పరిహరించటం- అదొక బాధ్యత. మొత్తంమీద పరిపాలకులకు దుఃఖాలు ఎక్కువ - సౌఖ్యాలు తక్కువ. ఇదీ రాజ్యం పద్ధతి.

**విశేషం:** 'అర్థులకొసరి తిండియు - ధనగుప్తిమీఁది భరమున్' అనే పాఠంలో అన్వయం క్లిష్టంగా ఉన్నది. 'అర్థుల కొసఁగి తిండియు' అన్న పాఠాంతరంలో అన్వయసౌలభ్యం ఉన్నా అఖండయతి అవుతున్నది. 'అర్థులకున్+ఒసఁగి= అర్థుల కొసఁగి'లో 'కొ' కి గుప్తిలో 'గు'తో యతి. దీనికి మూలమైన సంస్కృతశ్లోకాలు **"అభిగమ్యాభిగమ్యైనం యాచంతే సతతం నరాః । న చాప్యుత్సహతే దాతుం విత్తరక్షీ మహాజనాత్॥ దానే కోశక్షయోహ్యస్య వైరం చాప్యప్రయచ్ఛతః । క్షణేనాస్యోపవర్తంతే దోషా వైరాగ్యకారకాః ॥"** స్పష్టంగా ఉన్నాయి. **(12-308-144).**

**వ. వారలు ముక్తులు గామి దెల్లం బది యట్లుండె నీకు విశేషించియు. 201**

**ప్రతిపదార్థం:** వారలు= అటువంటి రాజులు; ముక్తులు+కామి= ముక్తులు కాకపోవటం; తెల్లంబు= స్పష్టం; అది= ఆ విషయం; అట్లు+ఉండెన్= అట్లా ఉండనిమ్ము; నీకున్= నీకు; విశేషించి= విశేషంగా.

**తాత్పర్యం:** అటువంటి రాజులు ముక్తులు కాకపోవటం స్పష్టం, నీకు విశేషంగా చెప్పాలంటే.

**చ. సదయ మనీషఁ బంచశిఖసంయమి మోక్షము దెల్పెనంటి, నీ**
**హృదయము నాదు చొచ్చుటకు నెంతయు రోసితి, ముక్తు చందమే**
**యిది? నిరపేక్షుఁడైన విను మెయ్యది యెట్లయినం బ్రశాంతిసం**
**పద నొకయింతయుం గలఁగఁ బాఱకయుండఁడె నిర్వికారుఁడై? 202**

**ప్రతిపదార్థం:** సదయమనీషన్= దయగల హృదయంతో; పంచశిఖ-సంయమి= పంచశిఖుడు అనే యోగీశ్వరుడు; మోక్షంబు= ముక్తివిధానం; తెల్పెన్+అంటి(వి)= తెలియజేశాడు అన్నావు; నీ హృదయమున్= నీ హృదయాన్ని; నాదు+చొచ్చుటకున్= నేను ప్రవేశించటానికి; ఎంతయున్+రోసితి(వి)= ఎంతగానో అసహ్యించుకున్నావు; ఇది= ఇట్లా అసహ్యించుకోవటం; ముక్తు+చందమే?= ముక్తుడి పద్ధతియేనా?; వినుము; నిరపేక్షుఁడైనన్= వ్యక్తినిజంగా విరక్తుడే అయితే; ఏ+అది+ఎట్లు+అయినన్= ఏది ఎట్లా జరిగినా; నిర్వికారుఁడై= ఏ రకమైన ప్రతిస్పందనా లేనివాడై; ప్రశాంతిసంపదన్= తన విలువైన మానసిక ప్రశాంతి విషయంలో; ఒక+ఇంతయున్= రవ్వంతకూడా; కలఁగన్+పాఱక= కలతచెందకుండా; ఉండఁడె?= ఉండడా?

**తాత్పర్యం:** మహారాజా! పంచశిఖమునీశ్వరుడు నీకు మోక్షపద్ధతిని ఉపదేశించాడు అన్నావు. నేను నీ హృదయంలోకి ప్రవేశించా నని అసహ్యించుకొంటున్నావు. ఇది ముక్తుడి పద్ధతేనా? నిజంగా విరక్తుడైన వ్యక్తి ఏది ఎట్లా జరిగినా నిర్వికారుడుగానే ఉంటాడు తప్ప ఎట్టి పరిస్థితులలోనూ తన మానసిక ప్రశాంతినికోల్పోడు,చలించడు, కలత చెందడు.

**క. విను శూన్యస్థానంబున। నునికి యతికిఁ గృత్య మగుట నుర్వీశ్వర! ము**
**క్తుని మానసంబు శూన్యం। బని చొచ్చితి, ముక్తి లేమి నది తప్పయ్యెన్. 203**

**ప్రతిపదార్థం:** ఉర్వీశ్వర!= భూపాలా!; విను; శూన్యస్థానంబునన్= శూన్యప్రదేశంలో (నిర్జన ప్రదేశంలో); ఉనికి= నివాసం; యతికిన్= యోగికి; కృత్యము+అగుటన్= కర్తవ్యం కాబట్టి; ముక్తుని= ముక్తుడైనవాడి; మానసంబున్= మనస్సుకూడా; శూన్యంబు+అని= శూన్యమే అని; చొచ్చితిన్= నీ మనస్సులోకి ప్రవేశించాను; ముక్తి= ముక్తి అనేది; లేమిన్= లేకపోవటంతో; అది= అట్లా నేను ప్రవేశించటం; తప్పు+అయ్యెన్= పొరపాటు అయ్యింది.

**తాత్పర్యం:** మహారాజా! యోగీశ్వరులు శూన్యప్రదేశాలలో నివసించటం పరిపాటి. యోగుల మనస్సులు కూడా రాగద్వేషాదిభావశూన్యాలుగానే ఉంటాయి. నీవు ముక్తుడవుకదా అనుకొని నీ మనస్సులోనికి ప్రవేశించాను. కానీ నీవు ముక్తుడవు కావు. అందుకని నేను చేసిన పని తప్పు అయింది. నీవు నిందిస్తున్నావు.

**వ. అట్లుం గాక. 204**

**ప్రతిపదార్థం:** అట్లున్+కాక= అదీకాక.

**తాత్పర్యం:** అదీకాక మరొక్క విషయం.

**ఆ. కాలుఁజేయి మొదలుగాఁగల నాయంగ। కములలోన నిన్నుఁ గలయ దొకటి**
**యేని, రిత్త యిప్పుడేటికిఁ గటకటం। బడుచు నిట్లు దూరఁబలికి తధిప! 205**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; కాలున్= కాలూ; చేయిన్= చేయీ; మొదలుగాన్+కల= మొదలుగా ఉన్న; నా+అంగకములలోనన్= నా శరీరావయవాలలో; ఒకటియేనిన్= ఒక్కటయినా; నిన్నున్= నిన్ను; కలయదు= స్పృశించలేదు; రిత్త(న్)= వృథా(గా); ఇప్పుడు; ఏటికిన్= ఎందుకని; కటకటంబడుచున్= మనస్సు కష్టపెట్టుకుంటూ; ఇట్లు= ఇలా; దూరన్+బలికితి(వి)?= నన్ను నిందించావు?

**తాత్పర్యం:** రాజా! నా కాలుగానీ చేయిగానీ మరింక ఏ అవయవంగానీ నిన్ను తాకలేదు. ఎందు కింత వ్యథ చెందుతున్నావు? వృథాగా నన్ను ఎందుకు నిందిస్తున్నావు? ఇప్పుడు ఏమంత అపచారం జరిగిపోయిందని?

**వ. అని యమాత్యుల దిక్కు సూచి. 206**

**ప్రతిపదార్థం:** అని; అమాత్యుల దిక్కు= మంత్రులవైపు; చూచి= వీక్షించి.

**తాత్పర్యం:** అని మంత్రులవైపు చూచి.

**ఆ. వీరు పెద్దవారు; వీరలు విన నిట్టి। తులువమాటలాడ దొరకుఁదగునె?**
**యెదిరిఁ దూలవుచ్చు టే మంచివెరవు? గాం। భీర్యహాని దలఁచు పెంపు లేదె? 207**

**ప్రతిపదార్థం:** వీరు= ఈ మంత్రులందరూ; పెద్దవారు= పెద్దలు; వీరలు= వీరంతా; వినన్= వింటూండగా; ఇట్టి= ఇటువంటి; తులువమాటలు= నీచమైన పలుకులు; ఆడన్= మాట్లాడటం; దొరకున్= ప్రభువుకు; తగునె?= తగునా?; ఎదిరిన్= ఎదుటి వ్యక్తిని; తూల+పుచ్చుట= కించపరచటం; ఏ మంచి వెరవు?= ఏమంత మంచి పద్ధతి?; గాంభీర్యహానిన్= ఉదాత్తత దెబ్బతింటోంది అనే విషయాన్ని; తలఁచు= గుర్తించేటువంటి; పెంపు= ఔన్నత్యం; లేదె?= నీకు లేదా?

**తాత్పర్యం:** వయోజ్ఞాన వృద్ధులూ, పెద్దలూ అయిన మంత్రులు ఇంతమంది వింటూ ఉండగా ఇట్లా నీచంగా మాట్లాడటం నీవంటి ప్రభువుకు తగిన విషయమేనా? ఎదుటివారిని కించపరచటమే మంచిపద్ధతి అనుకొంటున్నావా? నీ గాంభీర్యం దెబ్బతింటున్నది - అనే విషయాన్ని గమనించేపాటి ఔన్నత్యంకూడా నీకు లేదనుకోనా?

**క. వనితల పురుషులయెడఁ బు । ట్టినయది వెల్లివిరిసేఁత డిమ్మరితన, మె**
**ట్టి నికృష్టుం డైనను ని । ప్పనికిఁ జొరఁడు; దగునె యిది నృపాలసుతునకున్? 208**

**ప్రతిపదార్థం:** వనితల - పురుషుల+ఎడన్= స్త్రీపురుషుల మధ్య; పుట్టిన+అది= ఏర్పడిన సంబంధాన్ని; వెల్లివిరిసేఁత= బాగా ప్రచారం చేయటమనేది; డిమ్మరితనము= దుష్టుడి లక్షణం; ఎట్టి= ఎంతటి; నికృష్టుండు+ఐననున్= నీచుడైనా; ఇప్పనికిన్= ఈ పనికి; చొరఁడు= పూనుకోడు; నృపాలసుతునకున్= నీవంటి రాకుమారుడికి; ఇది; తగునె?= అర్హమా?

**తాత్పర్యం:** స్త్రీపురుష సంబంధాన్ని ఊరంతా వరదగట్టించటం దుష్టలక్షణం. ఎంతటి నీచుడైనా ఈ పని చెయ్యడు. అటువంటిది ఒక రాజకుమారుడవై నీవు చేయటం సమంజసమా? చెప్పుము.

**చ. బిసరుహపత్రలగ్న జలబిందువు చాడ్పున సంగవర్జితో**
**ల్లసనమునన్ వసించితి నిలావర! నీ మది నిట్టిదానిఁగాఁ**
**బొసఁగ నెఱుంగవైతి నను; బొంకగు టేర్పడియెన్ విముక్తి చొ**
**ప్పు సదయవృత్తి నీకు మునిపుంగవు చెప్పుట మాటలేటికిన్? 209**

**ప్రతిపదార్థం:** ఇలావర!= భూవిభూ!; బిసరుహపత్ర= తామరపాకుమీద; లగ్న= నిలిచిన; జలబిందువు చాడ్పునన్= నీటిబిందువువలె; సంగవర్జిత= సాంగత్యరహితమైన; ఉల్లసనమునన్= విలాసంతో; వసించితిన్= ఇంతకాలమూ జీవించాను; ఇట్టిదానిన్+కాన్= ఇటువంటి నిస్సంగగా; ననున్= నన్ను; పొసఁగన్= సముచితంగా; నీ మదిన్= నీ మనస్సులో; ఎఱుంగవు+ఐతి(వి)= తెలుసుకోలేకపోయావు; సదయవృత్తిన్= దయామయమైన ప్రవృత్తితో; నీకున్= నీకు; విముక్తి చొప్పు= మోక్షపద్ధతి; మునిపుంగవు చెప్పుట= పంచశిఖమునీశ్వరుడు ఉపదేశించటం; బొంకు+అగుట= అసత్యం కావటం; ఏర్పడియెన్= జరిగింది, సిద్ధించింది; మాటలు+ఏటికిన్= ఇంక వెయ్యిమాటలు ఎందుకు?

**తాత్పర్యం:** తామరాకుమీద నీటిబొట్టువలె నిస్సంగంగా జీవితం గడుపుతున్నాను. నన్ను నీవు తెలిసికొనలేకపోయావు. అంటే - పంచశిఖమునీశ్వరుడు దయతో నీకేదో ముక్తిమార్గం ఉపదేశించాడు - అన్నది అసత్యమని తేలింది. ఇంతకూ సారాంశం ఇదీ. ఇంక వేయిమాటలు ఎందుకు!

**విశేషం:** అలం: ఉపమ.

**క. నీవు గృహధర్మ పరతయుఁ । బో విడిచితి; నీకు మోక్షమును విదితము గా**
**దేవలనికిఁ గా కిట్లు ధ । రావర! మిథ్యా ప్రబోధరతుఁడై తరయన్. 210**

**ప్రతిపదార్థం:** ధరావర!= భూభర్తా!; నీవు; గృహధర్మపరతయున్= గృహస్థాశ్రమధర్మాన్ని ఆచరించటమూ; పోవిడిచితి(వి)= పూర్తిగా విడిచిపెట్టేశావు; నీకున్= నీకు; మోక్షమును= ముక్తిమార్గమంటావా - అదీ; విదితము+కాదు= అర్థం కాలేదు; అరయన్= ఆలోచిస్తే; ఏవలనికిన్+కాక= ఎటూ చెందకుండా; ఇట్లు= ఇట్లా; మిథ్యా ప్రబోధరతుఁడు(డవు)= మిథ్యాజ్ఞానంలో సంబరపడే వాడవు; ఐతి(వి)= అయ్యావు.

**తాత్పర్యం:** రాజా! నీవు అటు గృహస్థాశ్రమధర్మాలనూ విడిచి పెట్టేశావు. ఇటు మోక్షమార్గమూ నీకు అర్థం కాలేదు. రెంటికీ చెడ్డావు. ఒక మిథ్యాజ్ఞానంతో సంబరపడుతున్నావు.

**క. ముక్తులు ముక్తులఁ గలయుట। యుక్తమ - యది నభము నభము నొందు తెఱఁగు, నీ**
**ముక్తత బొంకని దీనిని। సక్తతగా నీవు గనుట సాలదె తెలుపన్? 211**

**ప్రతిపదార్థం:** ముక్తులు= భవబంధాలనుండి మానసికంగా ముక్తిపొందినవారు; ముక్తులన్= అటువంటి ముక్తులతో; కలయుట= కలవటం; యుక్తము+అ= ఉచితమే; అది= ఆ కలయిక; నభము= ఆకాశం; నభమున్= ఆకాశాన్ని; ఒందు తెఱఁగు= పొందినట్లుంటుంది; దీనినిన్= ఈ కలయికను; సక్తతగాన్= సాంగత్యంగా; నీవు; కనుట= భావించటమనేది; నీ ముక్తత= నీవు ముక్తుడవనటం; బొంకు+అని= అబద్ధమని; తెలుపన్= తెలియజెయ్యటానికి; చాలదె?= సరిపోదా?

**తాత్పర్యం:** ముక్తులూ, ముక్తులూ కలవటం ఎప్పుడూ యుక్తమే - ఆకాశమూ, ఆకాశమూ కలిసినట్టుగా. రెండూ శూన్యాలే. కాబట్టి సక్తత అనేదే ఉండదు. కానీ, నీవు ఈ కలయికను సక్తతగా భావించావు. అంటే నీవు ముక్తుడవు కావన్నమాట. నీ ముక్తత అబద్ధ మనటానికి ఈ ఒక్క ఉదాహరణ చాలదా?

**వ. మనము ముక్తులము గాకున్నను మనకు సాంగత్యము గలుగుట నింద్యంబుగా దెట్లంటేని. 212**

**ప్రతిపదార్థం:** మనము= నీవు, నేనూ; ముక్తులము= ముక్తులం; కాకున్నను= కాకపోయినప్పటికీ; మనకు= మన ఇద్దరికీ; సాంగత్యము= కలయిక; కలుగుట= ఏర్పడటం; నింద్యంబు+కాదు= దుష్టం కాదు; ఎట్లు+అంటి(వి)+ఏనిన్= అది ఎట్లా అంటే.

**తాత్పర్యం:** మనం ముక్తులం కాకపోయినప్పటికీ, మనకు కలయిక ఏర్పడటం దుష్టం కాదు. అది ఎట్లా అంటే చెప్పుతాను వినుము.

**సీ. నిఖిలజన శ్రోత్రసుఖకరం బగు చరి। త్రమునఁ బెంపారెడు ప్రథన నృపతి**
**కులమునఁబుట్టితి, సులభ నా పేరు, మ। త్పూర్వులు శతశృంగమునను ద్రోణ**
**మునను శక్రద్వారమున మహాధ్వరములు। సేసిరి, విను పాకశాసనుండు**
**దమ పాలి కేతేరఁ దద్గోష్ఠిఁ బరమార్థ। చింత సేయుదురు, భూకాంత! యేను**

**తే. నాకు నెనయైన పురుషుండు లేకయునికి। మోక్షధర్మ ప్రవర్తనమునఁ జరింతుఁ,**
**గాన నీ చూచు వర్ణసాంకర్య మస్మ। దీయ సాంగత్యమున లేమి దెల్లమరయ. 213**

**ప్రతిపదార్థం:** భూకాంత!= భూపతీ!; నిఖిలజన= సమస్తజనుల; శ్రోత్ర= చెవులకు; సుఖకరంబు+అగు= పండువుగా సుఖప్రదమైన; చరిత్రమునన్= చరిత్రతో; పెంపు+ఆరెడు= పెంపొందుతున్న; ప్రథననృపతి కులమునన్= ప్రథనుడు అనే పేరుగల రాజుగారి వంశంలో; పుట్టితిన్= జన్మించాను; నా పేరు; సులభ; మత్+పూర్వులు= మా వంశంలో పూర్వపు పెద్దలు; శతశృంగమునను= శతశృంగం అనే చోట; ద్రోణమునను= ద్రోణం అనే చోట; శక్రద్వారమునన్= శక్రద్వారం అనే చోట; మహా+అధ్వరములు= గొప్ప యజ్ఞాలు; చేసిరి= చేశారు; విను; పాకశాసనుండు= దేవేంద్రుడంతటివాడు; తమపాలికిన్= తమ సన్నిధికి; ఏతేరన్= రాగా; తద్+గోష్ఠిన్= అతడితో గోష్ఠిలో; పరమార్థ చింత= పరమార్థానికి సంబంధించిన ఆలోచనలు; చేయుదురు= చేస్తూ ఉండేవారు; నాకున్= నాకు; ఎనయైన= సాటియైన; పురుషుండు= మగవాడు; లేక+ఉనికిన్= లేకపోవటంతో; ఏనున్= నేను; మోక్షధర్మ ప్రవర్తనమునన్= మోక్షధర్మ ఆచరణతోనే; చరింతున్= సంచరిస్తున్నాను; కానన్= కాబట్టి; నీ+చూచు= నీవు చూస్తున్న;

వర్ణసాంకర్యము= బ్రాహ్మణ, క్షత్రియ వర్ణ సాంకర్యం అనేది; అస్మదీయ= మన ఇద్దరియొక్క; సాంగత్యమునన్= కలయికలో; లేమి= లేకపోవటం; అరయన్= పరిశీలించి చూస్తే; తెల్లము= తేటతెల్లం.

**తాత్పర్యం:** ఓ క్షత్రియా! నేను ప్రధనమహారాజు వంశంలో పుట్టిన దానను. మా వంశచరిత్ర జగదానందదాయకం. ప్రజల చెవులకు పండుగ. నా పేరు సులభ. మా వంశంలో పూర్వీకులు శతశృంగంలో, ద్రోణంలో, శక్రద్వారంలో మహాయజ్ఞాలు అనేకం చేశారు. దేవేంద్రుడంతటివాడు తానై తరలివచ్చి కూర్చుంటే మా పెద్దలు ఆయనతో పరమార్థగోష్ఠి నడిపేవాళ్ళు తెలుసా? వింటున్నావా? నాకు సాటివచ్చే పురుషుడు కనిపించకపోవటంతో నేను ఇట్లా మోక్షధర్మం పట్టి సంచరిస్తున్నాను. కాబట్టి మన ఇద్దరి సాంగత్యంలోనూ నీవు అనుకునే వర్ణసాంకర్యం ఏమీ లేదు. నేను బ్రాహ్మణిని కాను సుమా!

**విశేషం:** 'నీవు బ్రాహ్మణివి - నేను క్షత్రియుడను' మన ఇద్దరి సాంగత్యమూ నింద తేదా? - అని తిక్కన గారి జనకుడు చాలా సుకుమారంగా పలికాడు (182). వ్యాసభారతంలో ఇది చాలా ఘాటుగా ఉన్నది. 'నీవు బ్రాహ్మణ కాంతవు - నేను క్షత్రియ పురుషుడను. కాబట్టి మొదటిది వర్ణసాంకర్యం. నీవు యోగినివి - నేను గృహస్థుడను. కాబట్టి రెండవది ఆశ్రమసాంకర్యం. నీ గోత్రమేమిటో నాకు తెలియదు. నా గోత్రం ఏమిటో నీకు తెలియదు. ఒకవేళ సగోత్రులమైతే మూడవది గోత్రసాంకర్యం. నీ భర్త జీవించి ఉన్నాడో - ప్రోషితుడయ్యాడో. ఏమయినా పరభార్యవు. పొందదగని దానవు. కాబట్టి నాలుగవది ధర్మసాంకర్యం. ఇన్ని అకార్యాలకు సిద్ధపడుతున్నావు. ఇది అజ్ఞానమో! మిథ్యాజ్ఞానమో!' అన్నాడు వ్యాసులవారి జనకుడు. **"వర్ణప్రవరముఖ్యాసి బ్రాహ్మణీ క్షత్రియో హ్యహమ్। నావయోరేకయోగోఽస్తి మా కృథా వర్ణసంకరమ్. (12-308-59). వర్తసే మోక్షధర్మేషు గార్హస్థ్యే త్వహమాశ్రమే । అయం చాపి సుకష్టస్తే ద్వితీయోఽఽశ్రమసంకరః (60). సగోత్రాం వాసగోత్రాం వా న వేద త్వాం న వేత్థమామ్ । సగోత్రమావిశంత్యాస్తే తృతీయో గోత్రసంకరః (61). అథ జీవతి తే భర్తా ప్రోషితోఽప్యథవా క్వచిత్ । అగమ్యా పరభార్యేతి చతుర్థో ధర్మసంకరః ॥ (62) సా త్వమేతాన్యకార్యాణి కార్యాపేక్షా వ్యవస్యసి । అవిజ్ఞానేన వా యుక్తా మిథ్యాజ్ఞానేన వా పునః॥' ' (63).** ఇన్ని శ్లోకాల సారాంశాన్నీ ఒక తేటగీతిలోకి (6-182) సంగ్రహించాడు తిక్కన. వీటికి అన్నింటికీ సమాధానంగా మన కలయికలో ఏ సాంకర్యమూ ఏ అధర్మమూ లేదని ఈ సీసపద్యంలో సులభ స్పష్టం చేసింది. ప్రధనన్నపతి కులంలో పుట్టాను అనటం వలన వర్ణ గోత్రసూచన. అవివాహితనూ, కన్యనూ అని చెప్పటం వలన ఆశ్రమ-ధర్మ సాంకర్యాలు లేవని సూచన.

**క. నను డాఁప నేల దానం । గనియెడునది గలదె? ముక్తి గలదో? లేదో?**
**జనకున కరసెదఁ గా కని । చనుదెంచితిఁ, దప్పె యది విచారింపంగన్.' 214**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను నేను; డాఁపన్+ఏల= దాచుకోవటం ఎందుకు?; దానన్= అట్లా దాచుకున్నందు వలన; కనియెడునది= పొందేది; కలదె?= ఏమైనా ఉన్నదా?; జనకునకున్= ఈ జనకమహారాజుకు; ముక్తి= ముక్తి అనేది; కలదో?= ఉన్నదో?; లేదో?; అరసెదన్+కాక= పరీక్షించెదను; అని; చనుదెంచితిన్= వచ్చాను; విచారింపంగన్= ఇప్పుడు ఆలోచించి చూస్తే; అది; తప్పె= తప్పయిపోయింది, వ్యర్థమని తేలింది.

**తాత్పర్యం:** నన్ను నేను కప్పి పుచ్చుకొనవలసిన అవసరం ఏముంది? అట్లా చేసినందువలన నాకు కలిగేది ఏముంది? జనకమహారాజు ముక్తుడా? కాదా? - పరిశీలిద్దామని వచ్చాను. ఇప్పుడు ఆలోచిస్తే అది తప్పే అని తేలింది.'

**క. అని యిట్లు పలుకు పలుకులు । విని పలుకకయున్న జనకవిభు నాననముం**
**గనుఁగొని సులభ నగుచు ని । ట్లనియె నతనితోడఁ గౌరవాన్వయముఖ్యా! 215**

**ప్రతిపదార్థం:** కౌరవాన్వయముఖ్యా!= కౌరవవంశంలో ప్రధానమైనవాడా! ఓ ధర్మరాజా!; అని; ఇట్లు= ఈ ప్రకారంగా; పలుకు= పలుకుతున్న; పలుకులు= మాటలు; విని= ఆలకించి; పలుకక+ఉన్న= మాట్లాడకుండా కూర్చున్న; జనకవిభు+ఆననమున్=

జనకమహారాజుయొక్క ముఖాన్ని; కనుఁగొని= చూచి; సులభ= ఆ సులభ; నగుచున్= నవ్వుతూ; అతనితోడన్= ఆ జనకుడితో; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తాత్పర్యం:** (ఇదంతా భీష్ముడు ధర్మరాజుతో చెప్పుతున్నాడు) ఓ ధర్మరాజా! సులభ ఇట్లా మాట్లాడుతుంటే వింటూ జనకమహారాజు మౌనంగా ఉండిపోయాడు. ఆ రాజుగారి ముఖం చూసి నవ్వుతూ మళ్ళీ సులభ ఇట్లా అన్నది.

**తే. 'అగ్ని వెచ్చనొ? చల్లనో? యని మనమునఁ। గరము సందియ మందుట గాదె నిన్ను**
**నధిప! ముక్తుండవో? కావొ? యని తలంచు। టది మదీయ బాలిశభావ మని తలంపు. 216**

**ప్రతిపదార్థం:** అధిప!= జనకమహారాజా!; నిన్నున్= నిన్ను; ముక్తుండవో?= ముక్తి పొందినవాడవో?; కావొ?= కావో?; అని; తలంచుట+అది= ఆలోచించటమనేది; అగ్ని= నిప్పు; వెచ్చనొ?= వేడిగా ఉంటుందో?; చల్లనో?= చల్లగా ఉంటుందో?; అని; మనమునన్= మనస్సులో; సందియము+అందుట+కాదె= సందేహించటం కాదా!; మదీయ= నాయొక్క; బాలిశభావము= అవివేకం; అని; తలంపు(ము)= భావించుము.

**తాత్పర్యం:** 'రాజా! నీవు ముక్తుడవు అవునో కాదో అని నేను సంశయించటం - అగ్ని వేడిగా ఉంటుందో చల్లగా ఉంటుందో అని సందేహించటంతో సమానం. ఇది కేవలం నా అజ్ఞానమనీ మూర్ఖత్వమనీ భావించుము.

**విశేషం:** అలం: దృష్టాంతం.

**చ. జనవర! నీ సుభాషల నసత్యమొకండును లేదు నీవు స**
**న్మునిగణకీర్తనీయుఁడవు మోక్షము నీ కఱచేతిలోనిదై**
**యునికి దృఢంబుగాఁ గనియు నొండొక చందము మాటలాడితిన్**
**నిను నగుపింపఁగా వలసి నీదగు మన్నన శంక వాసినన్. 217**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ రాజా!; నీ= నీయొక్క; సుభాషలన్= మంచి మాటలలో; అసత్యము= అబద్ధమనేది; ఒకండునున్= ఒక్కటికూడా; లేదు; నీవు; సత్+మునిగణ= మహాముని బృందంచేత; కీర్తనీయుఁడవు= స్తుతింపదగినవాడవు; మోక్షము= ముక్తి అనేది; నీకున్= నీకు; అఱచేతిలోనిది= అరచేతిలోది; ఐ+ఉనికి= అయి ఉండటం; దృఢంబుగాన్= గట్టిగా; కనియున్= తెలిసికొని కూడా; నీది+అగు= నీవు ఇచ్చినటువంటి; మన్ననన్= గౌరవంవల్ల (చనవువలన); శంక+పాసినన్= (అయ్యో); మహారాజు కదా; నేను ఇట్లా మాట్లాడవచ్చునా? - అనే శంక తొలగిపోవటంతో; నినున్= నిన్ను; నగుపింపఁగాన్+వలసి= నవ్విద్దామనిపించి; ఒండొక చందము= మరొకరకం; మాటలు= పలుకులు; ఆడితిన్= పలికాను.

**తాత్పర్యం:** రాజా! నీవు మాట్లాడిన వాక్యాలలో ఒక్కటయినా అసత్యం లేదు. మునీశ్వరులచేతకూడా కీర్తనీయుడవు. మోక్షం నీకు అరచేతిలోనిది. ఇన్నీ తెలిసినా - నీవు ఇచ్చిన మన్ననతో జంకు వదిలిపోయి, నిన్ను నవ్విద్దా మనిపించి (ఆటపట్టిద్దామని) మరోరకంగా మాట్లాడాను. అంతే సుమా!

**క. అవియెల్ల నసత్యంబుల। యవనీశ్వర! యరయవచ్చుటది యొక్కఁడు ని**
**క్కువ మీ యపరాధము భవ। దవిరళ సౌజన్యమగ్న మగుఁగాక తగన్. 218**

**ప్రతిపదార్థం:** అవనీశ్వర= మహారాజా!; అవి+ఎల్లన్= ఆ నా మాటలన్నీ; అసత్యంబులు+అ= అబద్ధాలే; అరయన్+వచ్చుట= నిన్ను పరీక్షించటానికి నేను రావటం అనేది; అది+ఒక్కఁడు= ఆ ఒక్కటీ; నిక్కువము= నిజం; ఈ+అపరాధము= ఈ తప్పు;తగన్= తగినట్టు; భవత్= నీయొక్క; అవిరళ= చిక్కనైన; సౌజన్య= ఔదార్యంలో(సజ్జనత్వంతో); మగ్నము+అగున్+కాక= మునిగిపోవుగాక!

**తాత్పర్యం:** ఓ రాజా! ఇంతవరకూ నేను మాట్లాడినవన్నీ అసత్యాలే. అయితే - నిన్ను పరీక్షించాలి అని రావటం ఉన్నదే - అదొక్కటే నిజం. నా ఈ అపరాధం నీ స్నిగ్ధమైన సౌజన్యంలో (మంచితనంలో) మునిగి, మరుపున పడిపోవాలని ఆశిస్తున్నాను.

**క. సులభానామము సంసృతి । పాలమొల్లక తిరుగుటయును భూలోకవరా!**
**కలరూప నేఁటి కిచ్చట । నిలిచెద నీవు మునిసేవనీయుఁడ వగుటన్.' 219**

**ప్రతిపదార్థం:** భూలోకవరా!= భూపాలా!; సులభానామము= సులభ అనే పేరు; సంసృతి పాలము= సంసార పరిధి; ఒల్లక= ఇష్టపడక; తిరుగుటయును= దేశసంచారం చేయటం; కల+రూపు+అ= (ఇవి రెండూ) ఉన్న స్వరూపమే.; నీవు; ముని= మునులకు కూడా; సేవనీయుఁడవు= సేవింపదగినవాడవు; అగుటన్= కాబట్టి; నేఁటికిన్= ఈ రోజుకి; ఇచ్చటన్= ఇక్కడే; నిలిచెదన్= ఉంటాను.

**తాత్పర్యం:** జనకమహారాజా! నా పేరు సులభ అనేదీ, నేను సంసార బంధం ఇష్టపడక దేశసంచారం చెయ్యటమనేదీ - ఇవి రెండూ ఉన్న నిజాలు. నీవేమో మునులకుకూడా అర్చనీయుడవు. కాబట్టి ఈ రోజు ఇక్కడే నీ అతిథిగా ఉంటాను.'

**తే. అనినఁ దానును మంత్రులు నవ్విభుండు । సులభఁ గొనియాడె; నాఁడెల్ల నలఘుగోష్ఠిఁ**
**బ్రియము రెట్టింప నయ్యోగినియును దారు । నెమ్మి నొక్కట నుండిరి నృపవరేణ్య! 220**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజశ్రేష్ఠా! ధర్మరాజా!; అనినన్= సులభ ఇట్లా అనేసరికి; ఆ+విభుండు= ఆ జనకమహారాజు; మంత్రులున్= మంత్రులూ; తానునున్= తానూ; సులభన్= సులభాదేవిని; కొనియాడెన్= ప్రశంసించాడు; నాఁడు+ఎల్లన్= ఆ రోజంతా; అలఘుగోష్ఠిన్= సుదీర్ఘమైన చర్చలో (విలువైన గోష్ఠి); ప్రియము= ప్రీతి; రెట్టింపన్= రెట్టింపుకాగా (ఇబ్బడికాగా); ఆ+యోగినియును= ఆ సులభాదేవీ; తారును= రాజూ, మంత్రులూ; నెమ్మిన్= మైత్రితో (ఆదరంతో); ఒక్కటన్+ఉండిరి= ఒకేచోట కాలక్షేపం చేశారు.

**తాత్పర్యం:** ఇట్లా సులభాదేవి పలికేసరికి జనకుడూ అతడి మంత్రులూ ఆమెను ఎంతగానో కొనియాడారు. ధర్మరాజా! ఆ రోజంతా వారందరికీ విలువైన విషయాలతో గోష్ఠి నడిచింది. ప్రేమాదరాలతో ఒకేచోట కాలక్షేపం చేశారు.

**వ. మఱునాఁ డజ్జనపతి యనుమతిసేయ నమ్మహానుభావ నిజేచ్ఛం జనియె' నని చెప్పిన నప్పౌరవోత్తముండు ప్రమోదాయత్తస్వాంతుండయి శాంతనవునితో 'శుకుని కెవ్విధంబున వైరాగ్యంబు సొప్పడియెం జెప్పవే?' యనుటయును నతం డా ధర్మ సుతున క్లినియె. 221**

**ప్రతిపదార్థం:** మఱునాఁడు= మరుసటిరోజు; ఆ+జనపతి= ఆ జనకమహారాజు; అనుమతి+చేయన్= అనుమతించగా; ఆ+మహానుభావ= ఆ మహాత్మురాలు - సులభాదేవి; నిజ+ఇచ్ఛన్= తన కోరిక ప్రకారం; చనియెన్= వెళ్ళిపోయింది; అని; చెప్పినన్= భీష్ముడు వివరించేసరికి; ఆ+పౌరవ+ఉత్తముండు= పురువంశంలో ఉత్తముడైన ఆ ధర్మరాజు; ప్రమోద= ఆనందానికి; ఆయత్త= స్వాధీనమైన; స్వాంతుండు+అయి= హృదయం కలవాడై (మనస్సులో సంతోషించి); శాంతనవునితోన్= శంతనుమహారాజు పుత్రుడైన భీష్ముడితో; శుకునికిన్= శుకమహర్షికి; ఏ+విధంబునన్= ఎట్లాగ; వైరాగ్యంబు= విరక్తి అనేది; చొప్పడియెన్= ఏర్పడింది?; చెప్పవే?= దయచేసి వివరించవా?; అనుటయున్= అనటమూ; అతండు= ఆ భీష్ముడు; ఆ; ధర్మసుతునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** మరుసటిరోజు జనకుడి అనుమతితో ఆ సులభాదేవి వెళ్ళిపోయింది' అని భీష్ముడు వివరించగా, ధర్మరాజు 'శుకుడికి వైరాగ్యం ఎట్లా కలిగింది?' అనే ప్రశ్న వేశాడు. దానికి బదులుగా భీష్ముడీ విధంగా చెప్ప సాగాడు.

వేదవ్యాసుఁడు శుకున కుపదేశించిన వైరాగ్యప్రకారము (సం. 12-309-2)

**సీ.** **'ప్రాకృతజనుల వర్తనములవెంటఁ జి । త్తమున జరామరణముల కలిమి**
**దలఁపక యేమఱి మెలఁగెడు శుకుఁజూచి । విపులధర్మజ్ఞాన నిపుణ ధిషణుఁ**
**డైన వేదవ్యాసుఁ డాతని కిట్లను । 'మనసు నింద్రియములు మర్దితములు**
**గాఁ జేయు ముత్పథగాములు గానీకు । మక్రోధసత్య శమార్జవములుఁ**

**తే.** **దపము దమము నహింసయు ధర్మమునకు । నాకృతులు వీనిఁ బాలింపు మాఁకలియును**
**నీరువట్టును దగియెడు నెఱి నడంచి । దేవతాతిథి శేషోపజీవి వగుము. 222**

**ప్రతిపదార్థం:** ప్రాకృతజనుల= పామరజనులయొక్క; వర్తనములవెంటన్= నడవడికలను అనుసరిస్తూ; జరామరణముల= ముసలితనం, మరణం అనే విషయాలయొక్క; కలిమిన్= ఉనికిని; చిత్తమునన్= ఎడదలో; తలఁపక= ఆలోచించకుండా; ఏమఱి= ఏమరుపాటుతో; మెలఁగెడు= జీవిస్తున్న; శుకున్= తన పుత్రుడైన శుకుడిని; చూచి= తిలకించి; నిఖిల= సమస్తమైన; ధర్మ= ధర్మాలకు సంబంధించిన; జ్ఞాన= ఎరుకతో; నిపుణ= నిపుణమైన; ధిషణుఁడు= బుద్ధికలవాడు; ఐన= అయిన; వ్యాసుఁడు= వ్యాసభగవానుడు; ఆతనికిన్= ఆ శుకుడికి; ఇట్లు; అనున్= చెప్పుతున్నాడు; మనసున్= మనస్సునూ; ఇంద్రియములున్= జ్ఞాన కర్మేంద్రియాలనూ; మర్దితములుగాన్= అణచివేయబడినవిగా; చేయుము; ఉత్పథగాములు= తప్పుడు మార్గాలలో ప్రయాణించేవిగా; కానీకుము= కానీయకుము; అక్రోధ= క్రోధం లేకపోవటం; సత్య= సత్యం; శమ= అంతరింద్రియనిగ్రహం; ఆర్జవములున్= ఋజుత్వం అనే ఇవీ; తపమున్= తపస్సూ; దమమున్= బాహ్యేంద్రియ నిగ్రహం; అహింసయున్= హింసాప్రవృత్తి లేకపోవటం - ఇవన్నీ; ధర్మమునకున్= ధర్మానికి; ఆకృతులు= స్వరూపాలు; వీనిన్= వీటిని; పాలింపుము= ఆచరించుము; ఆఁకలియును= ఆకలీ; నీరువట్టును= దప్పికా; తగియెడు నెఱిన్= తగిన పద్ధతిలో; అడంచి= అణచివేసికొని; దేవతా+అతిథి= దేవతలకూ, అథితులకూ సమర్పించాక; శేష= మిగిలినదానితో; ఉపజీవివి= జీవించేవాడవు; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** 'జీవుడికి జరామరణాలు ఉన్నాయి అనే విషయమే మర్చిపోయి పామరజనులతో కలిసి అజాగ్రత్తగా జీవితం గడిపివేస్తున్న శుకుడిని చూసి వ్యాసుడు ఇట్లా ఉపదేశించాడు. 'మనస్సునూ, ఇంద్రియాలనూ మర్దించి స్వాధీనం చేసికొమ్ము. వాటిని ఎప్పుడూ తప్పుడు దారులలోనికి రానివ్వకుము. అదుపులో ఉంచుకొమ్ము. క్రోధత్యాగం, సత్యం, నిగ్రహం, ఋజుత్వం, తపస్సు, అహింస - అనేవి ధర్మానికి ఆకారాలు. వీటిని పరిపాలించుము. ఆకలి దప్పికలను నేర్పుగా తగ్గించుకొమ్ము. దేవతలకూ, అతిథులకూ సమర్పించాక మిగిలినదానితో జీవితం గడుపుకొనటం అలవాటు చేసికొమ్ము.

**క.** **నురువున నొనరించిన పం । జరంబులో నున్న పులుఁగు చాడ్పున మేనం**
**బురుషవర! జీవ ముండుట । పరికింపక యేమఱంగఁ బాడియె నీకున్? 223**

**ప్రతిపదార్థం:** పురుషవర!= ఓ మానవోత్తమా!; నురువునన్= ఫేనంతో(నీటి నురుగుతో); ఒనరించిన= తయారుచేసిన; పంజరంబులోన్= పంజరంలో; ఉన్న= ఉన్నటువంటి; పులుఁగు చాడ్పునన్= పిట్టవలె; మేనన్= శరీరంలో; జీవము= ప్రాణం; ఉండుట= ఉండటాన్ని; పరికింపక= గమనించకుండా; ఏమఱంగన్= ఇట్లా ఏమరుపాటుతో ఉండటం; నీకున్= నీకు; పాడియె?= తగునా?

**తాత్పర్యం:** నాయనా! నురుగుతో చేసిన పంజరంవంటిది ఈ శరీరం. ఇందులో ఒక పిట్టవలె ఉంటున్నది ప్రాణం. ఈ పరిస్థితిని గమనించకుండా ఏమరుపాటుతో ఉండటం నీకు తగునటరా! (ఈ నురుగు పంజరం ఏ క్షణంలోనైనా

చితికిపోవచ్చును. పిట్ట తుర్రుమనవచ్చును. తలచుకొంటేనే భయంగా ఉంటుందే - నీకసలు నిద్ర ఎట్లా పట్టుతున్నది పుత్రకా! అని భావం.)

**విశేషం:** అలం: ఉపమ. దీనికి సంస్కృత మూలం: **"ఫేనపాత్రోపమే దేహే జీవే శకునివత్ స్థితే । అనిత్యే ప్రియసంవాసే కథం స్వపిషి పుత్రక॥" (సం. 12-309-6)**

**తే. ఎన్నికొనుచుండఁ జనుచుండు నేండ్లు లివ్వి । ధమున నాయువు దోడ్తోడఁ దఱఁగి జీవ**
**హాని వాటిల్లఁగాఁ బుత్ర! యనవధాన । నిద్ర మోహితుఁడై యున్కి నీకుఁ దగునె? 224**

**ప్రతిపదార్థం:** పుత్ర!= బిడ్డా!; ఎన్నికొనుచుండన్= లెక్కపెట్టుకొంటూంటే; ఏండ్లులు= సంవత్సరాలు; చనుచుండున్= వెళ్ళిపోతూ ఉంటాయి; ఈ+విధమునన్= ఈ విధంగా; ఆయువు= ఆయుర్దాయం; తోడ్తోడన్= క్రమక్రమంగా; తఱఁగి= తరిగిపోయి; జీవహాని= ప్రాణవియోగం; పాటిల్లఁగాన్= జరిగే పరిస్థితి ఉండగా; అనవధాన= ఏమరుపాటు అనేటటువంటి; నిద్రన్= నిద్రలో; మోహితుఁడై= సమ్మోహితుడై; ఉన్కి= ఉండటమనేది; నీకున్= నీకు (నీ వంటి వాడికి); తగునె?= అర్హమా? - సమంజసమా?

**తాత్పర్యం:** తనయా! లెక్కపెట్టుతూ ఉంటే వెళ్ళిపోతూనే ఉంటాయి సంవత్సరాలు. ఇట్లా క్రమక్రమంగా ఆయుర్దాయం తరిగిపోయి, చివరికి హంస ఎగిరిపోతుంది. ఇది తెలిసి నీవంటివాడు ఏమరుపాటుతో నిద్రపోతూ ఉండటం తగునా? చెప్పుము. లేచి పరుగెత్తవద్దూ?

**విశేషం:** దీని మూలశ్లోకం ఇట్లా ఉన్నది. **"గణ్యమానేషు వర్షేషు క్షీయమాణే తథాయుషి జీవితే శిష్యమాణే చ కిముత్థాయ న ధావసి?"** (12-309-8). 'గణ్యమానేషు' అనే పదానికి అనువాదంగా ఎన్నికొనుచుండన్ అన్నాడు తిక్కన. ఎన్నటం, ఎంచటం అనేవి లెక్కపెట్టటం అనే అర్థంలో నెల్లూరు మాండలికాలట.

**క. విను మాంసశోణిత వివ । ర్ధనమగు నైహికమునందుఁ దత్పరులు పరం**
**బని యొకటి కలిమి దలఁపరు । గొనరు బుధులమాట నాస్తికులు వినయనిధీ! 225**

**ప్రతిపదార్థం:** వినయనిధీ!= వినయానికి నిధీ!; విను; మాంస= మాంసంతోనూ; శోణిత= రక్తంతోనూ; వివర్ధనము+అగు= వృద్ధిపొందేటువంటి; ఐహికమునందున్= ఈ శరీరంపట్లా, ఈ జన్మపట్లా; తత్పరులు= సంసక్తులైనవారు; పరంబు+అని= పరము అంటూ; ఒకటి; కలిమి= ఉండటాన్ని; తలఁపరు= అసలు ఆలోచించరు; నాస్తికులు= పరము లేదు అనే ఈ నాస్తికులు; బుధుల= పండితులయొక్క; మాట= ఉపదేశాన్ని; కొనరు= స్వీకరించరు.

**తాత్పర్యం:** ఓ వినయశీలీ! ఇహలోకం అంతా మాంసశోణితాలతో వృద్ధి పొందుతూ ఉంటుంది. దానిలో సంసక్తులైనవారు పరలోకం అంటూ ఒకటి ఉన్నది - అనే విషయాన్ని గ్రహించరు (నాస్తికులు). వీళ్ళు పెద్దల మాట చెవిని పెట్టరు.

**తే. బుద్ధిమంతుల తెరువునఁ బోక యుత్ప । థప్రవర్తుల నడచు పథంబునందుఁ**
**జనుట విను మప్పటికిఁ జూడఁ దనకుఁ జాల । నించియుండు నాపద యొనరించుఁ బిదప. 226**

**ప్రతిపదార్థం:** వినుము; బుద్ధిమంతుల= బుద్ధిమంతులయొక్క; తెరువునన్= మార్గంలో; పోక= నడవకుండా; ఉత్పథవర్తులు+అ= దుష్టులు మాత్రమే; నడచు= ప్రయాణించే; పథంబునందున్= మార్గంలో; చనుట= నడవటం; అప్పటికిన్ చూడన్= అప్పటికి చూస్తే; తనకున్= తనకు; చాలన్= బాగా; ఇంచియుండున్= నచ్చి కనపడుతుంది - ఆనందదాయకంగా ఉంటుంది; పిదపన్= తరువాత; ఆపద+ఒనరించున్= ఆపద కలిగిస్తుంది.

**తాత్పర్యం:** బుద్ధిమంతుల మార్గంలో పోకుండా దుష్టులమార్గంలో నడిస్తే అది అప్పటికి బాగానే ఉంటుంది. తృప్తిగానూ, ఆనందంగానూ ఉంటుంది. కానీ, ఆలోచించి చూడగా - అది చిట్టచివరకు ఆపద తెచ్చిపెట్టుతుంది.

**చ.** **తన తన ధర్మమున్ నడపి దానన సంతసమంది శాంత భా**
**వనరతినుండు వారిఁ గని, వారల చెప్పెడు ధర్మవృత్తి ని**
**చ్చెనయుఁగ నూఁది సత్పదముఁ జెందుట కెక్కుము, పొత్తినూలి ప్రు**
**వ్వునెనయుఁగాకు, బంధకుఁడవుం దన కజ్ఞుఁడు దాన యెమ్మెయిన్.** **227**

**ప్రతిపదార్థం:** తన తన ధర్మమున్= తమకు విధ్యుక్తమైన ధర్మాన్ని; నడపి= ఆచరించి; దానన్+అ= దానితోనే; సంతసము+అంది= ఆనందించి; శాంతభావన రతిన్= ప్రశాంతమైన భావనపట్ల ప్రేమతో; ఉండువారిన్= జీవిస్తున్నవారిని; కని= దర్శించి; వారల= వారియొక్క; చెప్పెడు= ఉపదేశించేటువంటి; ధర్మవృత్తి= ధర్మప్రవృత్తి; నిచ్చెనయుఁగన్+ఊఁది= నిచ్చెనగా ఆలంబనం చేసికొని; సత్పదమున్= సత్ స్థానాన్ని; చెందుటకున్= అందుకోవటానికి; ఎక్కుము; పొత్తినూలిప్రువ్వు+ఎనయున్+కాకు= సాలీడుకి సాటి కాకుము (ప్రువ్వు= పురుగు, ఎన= సాటి); అజ్ఞుఁడు= మూర్ఖుడు; ఏ+మెయిన్= ఎలాగయినా; తనకున్= తనకు; తాను+అ= తానే; బంధకుఁడు+అవున్= బంధనం కల్పించుకొనేవాడు అవుతాడు.

**తాత్పర్యం:** ధర్మాచరణంతో ఆనందిస్తూ శాంతచిత్తులై జీవితం గడిపేవారిని దర్శించుము. వారి ధర్మోపదేశాలు నిచ్చెనగా సత్పదం అందుకొమ్ము. సాలీడువలె నీకు నీవే బంధనాలు కల్పించుకొనవద్దు. అది అజ్ఞుడి లక్షణం.

**విశేషం:** అలం: ఉపమ. శాంతభావ నిరతినుండు వారిఁ గని - అనే పాఠాంతరంలో అన్వయసౌలభ్యం ఉన్నది.

**తే.** **అస్థిరేంద్రియ సలిలమయంబుఁ గామ । రోషదారుణ గ్రాహ ప్రదూషితంబు**
**నైన సంసారసాగర మతులధైర్య । పోతపాత్రిక నిస్తరింపుము కుమార!** **228**

**ప్రతిపదార్థం:** కుమార!= పుత్రకా!; అస్థిర= చంచలమైన; ఇంద్రియ= ఇంద్రియాలు అనేటటువంటి; సలిలమయంబున్= నీటితో నిండినదీ; కామ= కామమూ; రోష= క్రోధమూ అనేటటువంటి; దారుణ= భీషణమైన; గ్రాహ= మొసళ్లతో; ప్రదూషితంబున్= నింద్యమైనదీ; ఐన= అయినటువంటి; సంసారసాగరమున్= సంసారము అనే సముద్రాన్ని; అతుల= సాటిలేని; ధైర్య= ధీరత్వం అనే; పోతపాత్రికన్= ఈతకాయతో; నిస్తరింపుము= పూర్తిగా తరించు - దాటు.

**తాత్పర్యం:** కుమారా! ఈ సంసారం ఒక సముద్రం. చంచలమైన ఇంద్రియాలే నీళ్ళు. అరిషడ్వర్గమే మొసళ్ళు. దీనిని దాటటానికి ధైర్యం ఒక్కటే తెప్ప. దానితో తరించవయ్యా!

**విశేషం:** అలం: ఉపమ. దీనికి మూలశ్లోకం ఇట్లా ఉన్నది: **"కామం క్రోధం చ మృత్యుం చ పంచేంద్రియజలాం నదీమ్ । నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర ॥"** (12-309-16). పోతము అంటే నావ, తెప్ప, దోనె ఇట్లాంటి అర్థాలు ఉన్నాయి. ఇవన్నీ నీటిని దాటటానికి ఉపయోగించే సాధనాలే. ఈతకొట్టే వ్యక్తి సులువుగా ఎక్కువదూరం ఈదటానికని సొరకాయ కానీ కుండగానీ బిందెగానీ గుండెలకింద అదుముకుంటాడు. ఆ పాత్రను 'ఈతకాయ' అంటారు. ఈదటానికి ఉపయోగించే కాయ. పాండురంగమాహాత్మ్యంలో (ద్వితీయాశ్వాసం) దశావతార వర్ణన చేస్తూ కూర్మావతారాన్ని 'ఈతకాయరూపై పృథుకర్పరంబనర... (2.57)' అన్నాడు తెనాలి రామకృష్ణుడు. పోతపాత్రిక అంటే పోతంవలె - తెప్పవలె - ఉపయోగించే చిన్నపాత్ర (పాత్రిక) అని తాత్పర్యార్థం. అలాగే సంసారసాగరాన్ని ఈదటానికి కూడా గుండె ధైర్యంకలిగి ఉండాలి.

క. **కామాదితృప్తుఁడై నరుఁ। డేమఱియుండంగ గొఱియనెత్తెడు పులి యు**
**ద్దామత మృత్యువు గొని చను। నామూఢుని యట్లుగాకు మతుల వివేకా! 229**

**ప్రతిపదార్థం:** అతులవివేకా!= సాటిలేని తెలివికలవాడా!; కామ+ఆది= కామము మొదలైన సుఖాలలో; తృప్తుఁడై= తృప్తిపొందినవాడై; నరుఁడు= జీవుడు; ఏమఱియుండంగన్= ఏమరుపాటుతో ఉంటే; గొఱియన్+ఎత్తెడు= గొర్రెను వేసుకుపోయే; పులి= పులియొక్క; ఉద్దామతన్= ఔద్ధత్యంతో; మృత్యువు; కొని చనున్= తన్నుకుపోతుంది; ఆ మూఢుని+అట్లు= అటువంటి మూర్ఖునిలాగా; కాకుము= కావద్దు.

**తాత్పర్యం:** నాయనా! నీకు గొప్ప వివేకం ఉన్నది. గ్రహించగలవు. అందుకే చెప్పుతున్నాను వినుము. కామాది సౌఖ్యాలతో తృప్తుడై జీవుడు ఏమరితే గొర్రెను ఎత్తుకుపోయే పులివలె మృత్యువు తన్నుకొనిపోతుంది. నీవు మాత్రం అట్లాంటి మూఢుడివి కావద్దు.

తే. **బ్రాహ్మణత్వంబు గడు దుర్లభంబు; దాని । నెట్టకేలకుఁ గని కడయెయ్యఁ జేయ**
**వలదె తపము దమంబు నిశ్చలవివేక। సంపదయు నూఁది నరుఁడు దుస్సంగ ముడిగి? 230**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణత్వంబు= బ్రహ్మపరాయణుడుగా ఉండటమనేది; కడున్= మిక్కిలి; దుర్లభంబు= దుర్లభం; దానిన్= ఆ బ్రాహ్మణత్వాన్ని; ఎట్టకేలకున్= ఎట్లాగో ఎన్నిజన్మలకో; కని= పొంది(న); నరుఁడు= జీవుడు; దుస్సంగము+ఉడిగి= చెడు సాంగత్యాన్ని విడిచిపెట్టి; తపమున్= తపస్సునూ; దమంబున్= ఇంద్రియనిగ్రహాన్నీ; నిశ్చల వివేక సంపదయున్+ఊఁది= స్థిరమైన జ్ఞానసంపత్తినీ ఆసరా చేసికొని (ఆ బాహ్మణత్వాన్ని); కడఎయ్యన్+చేయన్+వలదె?= ఈ జన్మ ముగిసేంతవరకు ఆచరించవద్దా?

**తాత్పర్యం:** నాయనా! బ్రాహ్మణత్వమనేది బహుజన్మదుర్లభం. ఎట్టకేలకు దానిని పొందిన నీవంటివాడు ఏం చేయాలి? దుస్సాంగత్యాలు విడిచిపెట్టి, తపస్సునూ, ఇంద్రియనిగ్రహాన్నీ, స్థిరమైన జ్ఞానసంపత్తినీ ఊతగా తీసికొని ఈ జన్మ ముగిసేంతవరకు ఆచరించవద్దా?

క. **విను విప్రశరీరము సుఖ। మునకే? బహునియమదుఃఖముల నిహమునఁ జెం**
**దను నిత్యసౌఖ్యముం బర। మునఁ బొందను బుట్టెఁ గాక బోధప్రవణా! 231**

**ప్రతిపదార్థం:** బోధప్రవణా!= జ్ఞానం పట్ల ఆసక్తి కలవాడా!; విను; విప్రశరీరము= బ్రాహ్మణజన్మ అనేది; సుఖమునకే?= సుఖాలు అనుభవించటానికా?; బహునియమ= అనేక నియమాలవలన కలిగే; దుఃఖములన్= క్లేశాలను; ఇహమునన్= ఈ లోకంలో; చెందనున్= అనుభవించటానికీ; పరమునన్= పరలోకంలో; నిత్యసౌఖ్యమున్= శాశ్వతమైన సౌఖ్యాన్ని; పొందనున్= అనుభవించటానికీ; పుట్టెన్+కాక!= పుట్టిందే తప్ప!

**తాత్పర్యం:** అబ్బాయీ! నీకు జ్ఞానంమీద శ్రద్ధ ఉన్నది. ఆలకించుము. బ్రాహ్మణజన్మ అనేది ఇహలోకంలో నియమనిష్ఠలవలన కలిగే దుఃఖాన్ని అనుభవించటానికీ, పరలోకంలో శాశ్వతమైన సౌఖ్యాన్ని చవిచూడటానికీ లభిస్తుందే తప్ప ఇహంలో సుఖపడటానికి కాదురా నాయనా!

క. **బలితపుటురిఁ గామంబున। నిలుచుట యా రజ్జుఁద్రెవ్వ నీలిగి సుమతుల్**
**వెలువడి చని సుఖు లగుదు ర। వ్వల నెఱుఁగరు పడుదు రంద వత్స! దురాత్ముల్. 232**

**ప్రతిపదార్థం:** వత్స!= బిడ్డా!; కామంబునన్= కామసౌఖ్యంలో; నిలుచుట= ఉండటం అనేది; బలితపు+ట్+ఉరి= దృఢమైన ఉరి; సుమతుల్= బుద్ధిమంతులు; ఆ రజ్జున్= ఆ ఉరిత్రాడును; త్రెవ్వన్+నీలిగి= తెగిపోయేటట్టు లాగి; వెలువడి చని= బయటకు వచ్చి; సుఖులు+అగుదురు= సుఖవంతులు అవుతారు; దురాత్ముల్= దుర్బుద్ధులు; ఆ+వలను= ఆ ఉపాయాన్ని; ఎఱుఁగరు= గుర్తించలేరు; అందున్+అ= దానిలోనే; పడుదురు= పడిపోతూ ఉంటారు.

**తాత్పర్యం:** నాయనా! కామసుఖాలు అనుభవించటమంటే మనకు మనం బలమైన ఉరిత్రాడు బిగించుకొనటం. బుద్ధిమంతులు ఎవ్వరూ అట్లా చెయ్యరు. ఆ ఉరిత్రాడును తెగద్రెంచుకొని బయటపడతారు. నిత్యమూ - శాశ్వతమూ - సత్యమూ అయిన సుఖాలను అనుభవిస్తారు. అజ్ఞానులు మాత్రం ఆ వలను గుర్తించలేరు. అందులోనే పడి అట్లాగే కొట్టుకొంటూ ఉంటారు.

**తే.** **తాను దెగునేని బాంధవదారపుత్త్ర । మిత్త్రు లను నజ్జనంబు లేమిటికి? విగత**
**చింతుఁడై గుహసొచ్చి యశ్రాంతబుద్ధిఁ । దడవి కానంగ వలవదె తన్నుఁ దాన?** **233**

**ప్రతిపదార్థం:** తాను= నరుడు తాను; తెగున్+ఏని= మరణించినట్లయితే; బాంధవ= బంధువులూ; దార= భార్య; పుత్త్ర= సంతానం; మిత్త్రులు= స్నేహితులూ; అను= అనేటువంటి; ఆ+జనంబులు= ఆ మనుష్యులంతా; ఏమిటికిన్?= ఎందుకు?; విగతచింతుఁడు+ఐ= చింత తొలగినవాడై; గుహ+చొచ్చి= ఏ కొండగుహలోకో ప్రవేశించి; అశ్రాంత= అలిసిపోని; బుద్ధిన్= బుద్ధితో; తడవి= అన్వేషించి; తన్నున్= తనను; తాను+అ= తానే; కానంగన్+వలవదె?= దర్శించవద్దా?

**తాత్పర్యం:** నరుడు తాను మృతి చెందాక బంధుమిత్ర భార్యాపుత్ర బృందం ఉండీ ఏమి లాభం? ఏమి ప్రయోజనం? కాబట్టి జ్ఞాని చింతాసక్తుడు కాకుండా, ఏకాంతంగా ఏ కొండగుహలోనికో వెళ్ళి (అంతర్దర్శనం) మేల్కొన్న బుద్ధితో అన్వేషించి తనను తాను తెలిసికొనాలి. ఆత్మసాక్షాత్కారం పొందాలి.

**తే.** **జరయు మరణంబు మర్త్యుని జన్మమాది । గాఁగ వెనువెంటఁ దగులు నగ్గంబు వేచి**
**యెల్లి సేసెద ననక మే లిపుడ చేయు । తనయ! వార్చునె మృత్యువు జనుల పనులు!** **234**

**ప్రతిపదార్థం:** తనయ!= పుత్రుడా!; జరయున్= ముసలితనమూ; మరణంబున్= మృత్యువూ; మర్త్యునిన్= మానవుడిని; జన్మము+ఆది+కాఁగన్= పుట్టుక మొదలుగా; వెనువెంటన్= వెంటబడినే; తగులున్= అనుసరించి ఉంటాయి; అగ్గంబు= తగిన సమయం; వేచి= వచ్చేదాకా ఆగి; ఎల్లి= రేపు; చేసెదన్= చేస్తాను; అనక= అనకుండా; మేలు= మంచిని (మంచి పనులను); ఇపుడు+అ= ఈ క్షణంలోనే; చేయు(ము); మృత్యువు= మరణమనేది; జనుల= ప్రజల; పనులు= కార్యాలు; వార్చునె?= ప్రతీక్షిస్తూ ఆగుతుందా?

**తాత్పర్యం:** జరామృత్యువులు మనిషిని పుట్టుకనాటినుండి వెన్నంటే ఉంటాయి. కాబట్టి 'అనుకూల ముహూర్తం వరకూ వేచి వేచి ఎప్పుడో మంచి పనులు' చేస్తాను అంటే కుదరదు. చేద్దామనుకొన్న మంచిని వెంటనే ఆ క్షణంలోనే చేసివేయ్యాలి. నీవు చేసే మంచిపనులు పూర్తి అయ్యేవరకూ నిరీక్షిద్దామని మృత్యువు అనుకోదు సుమా!

**ఆ.** **ఆశ్మశాన గమను లంతియ చుట్టంబు । లగ్నిఁ గలిపి మరలు నఖిలమైన**
**జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందటి । యందు మమతఁ బెనుచు నజ్ఞుఁ డనఘ!** **235**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; చుట్టంబులు= బంధువులు; ఆశ్మశాన గమనులు= శ్మశానం వరకూ తోడు వచ్చేవారు; అంతియ= అంతే; అగ్నిన్= అగ్నిలో; కలిపి= భస్మంచేసేసి; అఖిలమైన= సమస్తమైన; జ్ఞాతిజనమున్= బంధువర్గమూ; మరలున్=

వెనక్కి మరలి వెళ్ళిపోతారు; దీనిన్= ఈ సత్యాన్ని; చర్చింపక= ఆలోచించకుండా; అజ్ఞుఁడు= మూర్ఖుడు; అందఱియందున్= అందరిపట్ల; మమతన్= అనురాగాన్ని; పెనుచున్= పెంచుకుంటాడు.

**తాత్పర్యం:** నాయనా! బంధువర్గం ఎంత రక్తసంబంధీకులైనా చచ్చినవాడితో తామూ చావరు. కాటిదాకా సాగనంపి, కళేబరాన్ని అగ్నికి ఆహుతి చేసి, తిరిగి ఎవరి ఇళ్ళకు వాళ్ళు వచ్చేస్తారు. అంతే! ఎవరి లోకయాత్ర వారు హాయిగా సాగిస్తారు. దీనిని గుర్తించకుండా అందరిపట్ల అనురాగం పెంచుకొనటం, మమకారం పెంచుకొనటం - ఇది అజ్ఞుడి లక్షణం.

**క.** **లోకము కాలముచే ని । ట్లాకుల పడుచునికి గాంచి యధికధృతిని ధ**
**ర్మైకాంతతా నిరూఢిం । గైకొని త్రోవంగవలదె కాలవికృతులన్?** **236**

**ప్రతిపదార్థం:** లోకము= ప్రపంచం (ప్రాణికోటి); కాలముచేన్= కాలంచేత; ఇట్లు= ఈ రకంగా; ఆకులపడుచున్+ఉనికి= వ్యాకులం చెందుతూ ఉండటాన్ని; కాంచి= చూచి(గ్రహించి); అధికధృతిని= అత్యంత ధైర్యంతో; ధర్మ+ఏకాంతతా+నిరూఢిన్= ధర్మాచరణం ఒక్కటే శాశ్వతం అనే నిశ్చయాన్ని; కైకొని= స్వీకరించి; కాలవికృతులన్= కాలం తెచ్చే వికారాలను; త్రోవంగన్+వలదె?= పారద్రోలవద్దా?

**తాత్పర్యం:** కాలం ఇన్ని ఇబ్బందులపాలు చేస్తోంది లోకాన్ని. అది గమనించి, అత్యంత ధైర్యంతో ధర్మాచరణం ఒక్కటే ఏకాంతం అనే నిర్ణయం తీసికొని కాలవికారాలను జయించగలగాలి.

**క.** **మానుషము దుర్లభము, సో । పానంబగు నది విముక్తి పదము గనుటకున్,**
**దానిఁ గని తొంటి చందము । రానీక, సముద్యమమునఁ బ్రాఁకఁగ వలదే?** **237**

**ప్రతిపదార్థం:** మానుషము= మానవజన్మ అనేది; దుర్లభము= దుర్లభం; ముక్తిపదము= మోక్షపదవి; కనుటకున్= పొందటానికి; అది= ఆ మానవజన్మ; సోపానంబు+అగున్= ఒక మెట్టు అవుతుంది; దానిన్= ఆ విషయాన్ని; కని= గ్రహించి; తొంటిచందము= పూర్వపు జన్మల పద్ధతి; రానీక= దరికి రానివ్వకుండా; సముద్యమమునన్= గొప్ప ప్రయత్నంతో; ప్రాఁకఁగన్+వలదే?= పై మెట్టులకు ప్రాకవద్దా?

**తాత్పర్యం:** మానవజన్మ బహు దుర్లభం. దాన్ని ఒక సోపానంగా చేసికొని నిచ్చెన ఎక్కి, మోక్షపదం అందుకొనాలి. పూర్వజన్మల లక్షణాలు దరికి రానివ్వకూడదు.

**విశేషం:** అలం: రూపకం.

**క.** **అనఘా! తపోవనమునన । జననంబును మరణదశయు సంప్రాప్తము ల**
**య్యెనయేని వాఁడు ముక్తుఁడె । మనంబు బహుకామవికృతి మగ్నంబైనన్.** **238**

**ప్రతిపదార్థం:** అనఘా!= పావనుడా!; జననంబునున్= పుట్టుకా; మరణదశయున్= మరణమూ; తపోవనమునన్+అ= ఆశ్రమంలోనే; సంప్రాప్తములు+అయ్యెను+అ+ఏనిన్= ప్రాప్తించినట్టయితే; మనంబు= వాడి హృదయం; బహు= పలురకాలైన; కామవికృతి= కామ వికారాలలో; మగ్నంబు+ఐనన్= మునిగిపోయినచో; వాఁడు= ఆ వ్యక్తి; ముక్తుఁడె?= ముక్తుడు అగునా?

**తాత్పర్యం:** పావనుడా! జననమూ మరణమూ అనేవి తపోవనంలోనే జరిగినప్పటికీ జీవించి ఉన్నకాలంలో వాడి మనస్సు ఎన్నో కామవికారాలకు లోనైతే వాడు ముక్తుడు కాగలడా? (కాలేడని భావం).

**తే.** **భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి । కేవలాంగుఁడై నిర్మలభావయుక్తిఁ**
**దపము గృహముననేనియుఁ దత్పరతఁ జ । రించి సంసారజలధిఁ దరించు నరుఁడు.** **239**

**ప్రతిపదార్థం:** భోగములు= భోగాలు; సంపరిత్యక్తములుగన్+చేసి= పూర్తిగా విడిచిపెట్టి; కేవల+అంగుఁడై= శరీరమాత్రుడుగా మిగిలి; నిర్మల= మలినరహితమైన; భావయుక్తిన్= హృదయస్పందనలతో; నరుఁడు= మానవుడు; గృహమునన్+ఏనియున్= ఇంటిలోనే అయినా; తత్పరతన్= తాదాత్మ్యంతో; తపము= తపస్సు; చరించి= ఆచరించి; సంసారజలధిన్= సంసారము అనే సముద్రాన్ని; తరించున్= దాటుతాడు.

**తాత్పర్యం:** భోగాలను విడిచిపెట్టి, నిస్సంగుడై, నిర్మలాంతరంగుడై ఇంటిలోనైనా తాదాత్మ్యంతో తపస్సు చేసికొనే నరుడు సంసారసముద్రాన్ని తేలికగా తరిస్తాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క.** **విను దారపుత్రమిత్రులు । సనిరి కొడుక! మున్ను చనిన జన్మంబుల, నీ**
**కును వారు, వారలకు నీ । వును మఱుపుట్టువులఁ గొఱయవుట గల్గెనొకో?** **240**

**ప్రతిపదార్థం:** కొడుక!= పుత్రుడా!; విను; మున్ను= ఇంతకుముందు; చనిన= కడచిన; జన్మంబులన్= పుట్టుకలలో; దార= భార్యలూ; పుత్ర= సంతానం; మిత్రులు= స్నేహితులూ - ఎంతోమంది; చనిరి= గతించారు; నీకును= నీకు; వారున్= వారూ; వారలకున్= వారికి; నీవునున్= నీవూ; మఱుపుట్టువులన్= అనంతర జన్మలలో; కొఱ+అవుట= శేషంగా కొనసాగటం; కల్గెనొకో?= జరిగిందా?

**తాత్పర్యం:** నాయనా! ఇప్పటికి నీవు ఎన్ని జన్మలు ఎత్తి ఉంటావు? ప్రతిజన్మలోనూ భార్యాపుత్ర మిత్రులు ఉంటూనే ఉన్నారు కదా! వారంతా గతించిపోయారు. ఒక జన్మలో వారు మరొక జన్మలోనికి అదే బంధుత్వంతో శేషంగా కొనసాగటమనేది నీకుగానీ వారికిగానీ జరిగిందంటావా? నీ అంతట నీవూ - వారంత వారుగా జన్మపరంపరలలో యాత్ర సాగిస్తున్నారు. ఇది తెలిసికొనరా తండ్రీ!

**ఆ.** **ఏన కలను నాకు, నెవ్వరివానిఁగా । నాత్మఁ దలఁతు?, నన్ను నట్టివాని**
**నెందుఁగాననఁ, గాన యెవ్వరివాఁడను । గా ననంగవలదె మాననీయ!** **241**

**ప్రతిపదార్థం:** మాననీయ!= గౌరవింపదగినవాడా!; ఏను+అ= నేనే; నాకున్= నాకు; కలను= ఉన్నాను; ఎవ్వరివానిన్+కాన్= ఎవ్వరివాడనుగా; ఆత్మన్= అంతరంగంలో; తలఁతున్= (నన్ను నేను) భావిస్తాను?; నన్నున్+అట్టివానిన్= నావంటి వాడిని; ఎందున్= ఎక్కడా; కానన్= చూడను; కాన= కాబట్టి; ఎవ్వరివాఁడనున్+కాను= నేను ఎవరివాడినీ కానే కాను; అనంగన్+వలదె?= అనుకోవద్దా?

**తాత్పర్యం:** మాన్యుడా! నాకు నేనే ఉన్నాను. మరెవ్వరూ లేరు. నేను ఎవరివాడను అని అనుకోను? నావంటివాడు మరొకడు ఎక్కడా లేడు, ఉండడు. అందుచేత నేనే ఎవ్వరివాడనూ కాను. జ్ఞాని అయినవాడు ఇట్లా భావించాలి నాయనా!

**క.** **దారాపేక్షం గష్ట । ప్రారంభముఁ బూని యిహమునందుఁ బరమునన్**
**వారని సంక్లేశంబులఁ । గూరు నరుఁడు దానిఁ జేయ గొనకొండ్రె బుధుల్?** **242**

**ప్రతిపదార్థం:** నరుఁడు= పురుషుడు; దార+అపేక్షన్= భార్యావ్యామోహంతో; కష్టప్రారంభమున్= కష్టాల ఆరంభాన్ని; పూని= పొంది; ఇహమునందున్= ఈ లోకంలోనూ; పరమునన్= పరలోకంలోనూ; వారని= ఎడతెగని; సంక్లేశంబులన్= క్లేశాలలో; కూరున్= కూరుకుపోతాడు; దానిన్= అటువంటి దారాపేక్షను; చేయన్= పెట్టుకోవటానికి; బుధుల్= జ్ఞానులు; గొనకొంద్రె?= పూనుకొంటారా?

**తాత్పర్యం:** భార్యపట్ల వ్యామోహం (అపేక్ష) అనేది కష్టాలకు ప్రారంభం. ఇహంలోనూ పరంలోనూ అది అంతులేని క్లేశాలను కల్పిస్తుంది. అందుచేత తెలివిగలవారెవ్వరూ దారాపేక్షకు పూనుకోరు, కష్టాలలో కూరుకోరు.

**చ. ధన మది యేల భోగమును దానము లేదగునేని? శత్రు మ**
**ర్దన మొనరింపఁడేని బలదర్పము లేల? సధర్మవృత్తికిన్**
**గొనకొనఁడేని విన్కి మునికుంజర! యేల జితేంద్రియుండు గాఁ**
**డనఁ జనునేని నాత్మవిధ మారయు నా క్రమమేల చెప్పుమా!' 243**

**ప్రతిపదార్థం:** మునికుంజర?= మునిశ్రేష్ఠా!; భోగమును= అనుభవించటమూ; దానమున్= త్యాగం చెయ్యటమూ అనేవి; లేదు+అగున్+ఏని= లేకపోయినది అయినట్లయితే; ధనము+అది= ఆ ధనం; ఏల?= ఎందుకు?; శత్రుమర్దనము= శత్రువులను మర్దించటం; ఒనరింపఁడు+ఏనిన్= చేయనివాడు అయినట్లయితే; బల దర్పములు= బలమూ పౌరుషమూ అనేవి; ఏల?= ఎందుకు?; సధర్మవృత్తికిన్= ధర్మసహితమైన ప్రవర్తనకు; గొనకొనఁడు+ఏనిన్= పూనుకోనివాడు అయినట్లయితే; విన్కి= బహుశ్రుతత్వం (వేదాలూ, శాస్త్రాలూ గురుముఖతః వినటం); ఏల?= ఎందుకు?; జిత+ఇంద్రియుండు+కాఁడు= ఇంద్రియనిగ్రహం కలవాడు కాదు; అనన్= అనటానికి; చనున్+ఏని= వీలు కలిగినట్లయితే; ఆత్మవిధము= ఆత్మతత్త్వం; ఆరయు= తెలిసికొనే; ఆ+క్రమము= ఆ వరుస అంతా; ఏల?= ఎందుకు?; చెప్పుమా!= చెప్పు చూద్దాం!

**తాత్పర్యం:** మునివరా! శుకా! భోగానికీ, త్యాగానికీ కాని ధనం ఎందుకు? శత్రు సంహారం చేయలేని బలదర్పాలు ఎందుకు? ధర్మాచరణానికి పూనుకోని జ్ఞానం ఎందుకు? జితేంద్రియుడు కాలేనప్పుడు ఆత్మతత్త్వం గురించి శ్రమపడి తెలిసికొని ఏమి లాభం - చెప్పుము!'

**క. అని యి ట్లుపదేశించిన । విని శుకుఁడు విముక్తిమార్గవిదుఁడై చనియెన్**
**జనకుఁ దొఱఁగి నిశ్చలదీ । పనిభాత్ముం డగుచుఁ గురునృపాలవరేణ్యా!' 244**

**ప్రతిపదార్థం:** కురునృపాల వరేణ్యా!= కురురాజోత్తమా! ధర్మరాజా!; అని; ఇట్లు= ఈ ప్రకారంగా; ఉపదేశించినన్= వ్యాసుడు ఉపదేశించేసరికి; విని= ఆలకించి; శుకుఁడు; విముక్తిమార్గ విదుఁడై= మోక్షమార్గం తెలిసికొన్నవాడై; జనకున్= తండ్రిని; తొఱఁగి= విడిచిపెట్టి; నిశ్చల= చలించని; దీప= దీపంతో; నిభ= సాటివచ్చే; ఆత్ముఁడు+అగుచున్= ఆత్మ కలవాడు అవుతూ, నిశ్చలదీపంలా; చనియెన్= వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వ్యాసుడు ఇట్లా ఉపదేశించేసరికి శుకుడికి ముక్తిమార్గం తెలిసిపోయింది. ఆత్మ నివాత నిశ్చలదీపంవలె ప్రకాశించింది. తండ్రిని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు'.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అనిన విని దేవతటినీ । తనయునితోఁ బాండురాజ తనయాగ్రజుఁ డి**
**ట్లనుఁ బ్రీతియు వినయము నా । ననమునఁ దళుకొత్త నరతనయవంశవరా! 245**

**ప్రతిపదార్థం:** నర= అర్జునుడియొక్క; తనయ= కుమారుడైన అభిమన్యుడి; వంశ= వంశంలో; వరా!= శ్రేష్ఠమైనవాడా ఓ జనమేజయా!; అనినన్= అని భీష్ముడు చెప్పగా; విని= ఆలకించి; పాండురాజతనయ+అగ్రజుఁడు= పాండురాజు కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు; దేవతటినీ+తనయుతోన్= గంగాపుత్రుడైన భీష్ముడితో; ప్రీతియున్= ప్రేమా; వినయమున్= వినయమూ; ఆననమునన్= ముఖంలో; తళుకొత్తన్= వికసించగా; ఇట్లు; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఇట్లా గాంగేయుడు చెప్పినది అంతా శ్రద్ధగా ఆలకించాడు ధర్మరాజు. అతడి ముఖంలో ఒక తృప్తి, ఒక వినయం వికసించాయి. జనమేజయా! ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అంటున్నాడు.

### భీష్ముఁడు ధర్మరాజునకు శుకుని జన్మప్రకారంబు సెప్పుట (సం. 12-310-1)

**వ. 'కృష్ణద్వైపాయన పుత్త్రుండను మాత్రమ కాని శుకుని జన్మంబు తెఱంగును నతని తల్లిని నతండు బాల్యంబున మహానుభావుం డగుటకుం గతంబును నతండు సిద్ధిఁబొందిన భంగియు నెఱుంగ నవియెల్ల నెఱింగింపుము.' 246**

**ప్రతిపదార్థం:** కృష్ణద్వైపాయన పుత్రుండు= వ్యాసుడి కుమారుడు; అను మాత్రము+అ+కాని= అని మాత్రమే కానీ; శుకుని= శుకునియొక్క; జన్మంబు తెఱంగునున్= జన్మప్రకారమూ; అతని= అతడియొక్క; తల్లిని= తల్లినిగురించీ; అతండు= ఆ శుకుడు; బాల్యంబునన్= పిన్నవయస్సులోనే; మహానుభావుండు= మహాత్ముడు; అగుటకున్= కావటానికి గల; కతంబునున్= కారణమూ; అతండు= ఆయన; సిద్ధి+పొందిన భంగియున్= సిద్ధుడు అయిన విధానమూ; ఎఱుంగన్= ఇవి ఏవీ నేను ఎరుగను; అవి+ఎల్లన్= ఆ విశేషాలన్నీ; ఎఱింగిపుము= దయచేసి తెలియజెప్పుము.

**తాత్పర్యం:** శుకుడు వ్యాసుడి పుత్రుడనే విషయం తప్పించి, ఆతడు ఎట్లా జన్మించాడు? చిన్నతనంలోనే అంతటి మహానుభావు డెట్లా అయ్యాడు? అతడు సిద్ధు డెట్లా అయ్యాడు - ఈ వివరాలను అన్నింటినీ నే నెరుగను. అవి నాకు తెలుపవలసింది'. (అని ధర్మరాజు భీష్ముడిని అడిగాడు).

**సీ. అనవుడు నతఁడిట్టులను నాతనికిఁ గర్ణి । కారవనం బనఁ గలదు మేరు**
**తటమున నం దద్రితనయయుఁ దానును । పశుపతి లీలమైఁ బ్రమథగణము**
**గొలువనుండఁ దనూజుఁగోరి వేదవ్యాస । సంయమి దత్ప్రదేశమున యోగ**
**బలమూర్జితముగఁ దపంబొనరించె యో । గమునకు రాజసూయములు నశ్వ**

**తే. మేధములును నపరిమితములైనను సరి । గావు సూవె వినుము కౌరవేంద్ర!**
**తత్తపోవిశిష్టతకు మెచ్చి శివుఁడు ప్ర । త్యక్షమై యభీష్టమడుగు మనిన. 247**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= ధర్మరాజా!; అనవుడున్= అని ధర్మరాజు అడిగేసరికి; అతఁడు= ఆ భీష్ముడు; ఆతనికిన్=ఆ ధర్మరాజుతో; ఇట్టులు= ఈ ప్రకారంగా; అనున్= చెబుతున్నాడు; మేరుతటమునన్= మేరు పర్వతపార్శ్వంలో; కర్ణికార వనము+అనన్= కర్ణికారము అనే పేరుతో ఒక వనం; కలదు= ఉన్నది; అందున్= ఆ వనంలో; పశుపతి= శివుడు; ప్రమథగణము= ప్రమథుల సమూహం; కొలువన్= సేవిస్తూండగా; తానున్= తానూ; అద్రితనయయున్= పార్వతీదేవీ; లీలమైన్= విలాసంగా; ఉండన్= క్రీడిస్తూ ఉన్న కాలంలో; వేదవ్యాస సంయమి= మునీశ్వరుడైన వేదవ్యాసుడు; తనూజున్= ఒక పుత్రుడిని; కోరి= కోరుకుని; తద్+ప్రదేశమునన్= ఆ ప్రదేశంలో; యోగబలము= యోగశక్తి; ఊర్జితముగన్= అతిశయించేటట్టు; తపంబు= తపస్సు; ఒనరించెన్= చేశాడు; వినుము; రాజసూయములున్= రాజసూయ యజ్ఞాలూ; అశ్వమేధములున్= అశ్వమేధాలూ; అపరిమితములైననున్= అసంఖ్యాకంగా చేసినా; యోగమునకున్= యోగమార్గానికి;

సరి+కావు+చూవె!= సాటిరావు సుమా!;

తద్= ఆ వ్యాసుడియొక్క; తపః+విశిష్టతకున్= విశిష్టమైన తపస్సుకు; మెచ్చి= సంబరపడి; శివుఁడు= పశుపతి; ప్రత్యక్షమై= దర్శనం అనుగ్రహించి; అభీష్టమున్= కోరుకొన్నదానిని; అడుగుము= అడుగుమని; అనినన్= అనేసరికి.

**తాత్పర్యం:** (భీష్ముడు చెప్పుతున్నాడు) 'ధర్మరాజా! మేరుపర్వత సానువులలో కర్ణికారవనం ఉన్నది. అందులో పార్వతీపరమేశ్వరులు ప్రమథుల సేవలు అందుకొంటూ విహరిస్తుంటారు. ఒకప్పుడు వేదవ్యాసుడు ఆ ప్రదేశంలో పుత్రుడిని కోరి తపస్సుకు పూనుకొన్నాడు. ఇక్కడ ఒకమాట చెప్పుతాను వినుము. రాజసూయాలూ, అశ్వమేధాలూ ఎన్నయినా యోగనిష్ఠకు సాటిరావు సుమా! వ్యాసుడి తపస్సుకు శివుడు సంతోషించి ప్రత్యక్షమయ్యాడు. ఏమి కావాలో కోరుకొనుమన్నాడు. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అ మ్మునీశ్వరుండు భక్తి సంభ్రమభరితుం డగుచుం దండప్రణామంబు చేసి. 248**

**ప్రతిపదార్థం:** ఆ+ముని+ఈశ్వరుండు= ఋషీంద్రుడైన ఆ వ్యాసుడు; భక్తి= భక్తితో; సంభ్రమ= భరితుండు+అగుచున్= దండప్రణామంబు= సాష్టాంగనమస్కారం; చేసి= ఆచరించి.

**తాత్పర్యం:** ఆ వ్యాసుడు ఆనందభరితుడై భక్తితో సాష్టాంగనమస్కారం చేసి.

**క. 'జల పవనాంబరవసుధా । నల సమవీర్యుఁడగు పుత్త్రు నా కొసఁగంగా**
**వలయు' ననుడు నిచ్చితి నని । పలికి చనియె నమ్మహాకృపామూర్తి నృపా! 249**

**ప్రతిపదార్థం:** నృపా!= ధర్మరాజా!; జల= నీటితో; పవన= వాయువుతో; అంబర= ఆకాశంతో; వసుధా= భూమితో; అనల= అగ్నితో; సమ= సమానమైన; వీర్యుఁడు= శక్తికలవాడు; అగు= అయిన; పుత్త్రున్= కుమారుడిని; నాకున్= నాకు; ఒసఁగంగాన్+వలయున్= ఇమ్ము; అనుడున్= అని అనటంతోనే; ఇచ్చితిన్= ఇచ్చాను; అని; పలికి= చెప్పి; ఆ+మహా కృపామూర్తి= గొప్ప దయా స్వరూపుడైన ఆ శివుడు; చనియెన్= వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** 'ధర్మజా! 'పంచభూతాలతో సమానమైన శక్తియుక్తులు కలిగిన పుత్రుడిని వరప్రసాదంగా అనుగ్రహించుము' అని వ్యాసుడు శివుడిని వేడుకొన్నాడు. 'ఇచ్చాను' అని చెప్పి శివుడు అంతర్ధానం అయ్యాడు. శివుడు గొప్ప దయామయుడు.

**వ. ఇట్లు లబ్ధవరుం డగుచు సత్యవతీసుతుం డగ్నికార్యపరుండై యరణి వుచ్చికొని మథింపం దొడంగిన ఘృతాచి యను నప్సరోవనిత లోచనగోచరం బగుటయుఁ దానునుం గామగోచరత్వంబు నొందిన నయ్యిందువదన యమ్ముని తెఱం గెఱింగి వంచనం జిలుకయై యుండె నతండును ధైర్యం బవలంబించి యరణికార్య ప్రవణుండై యుండం బ్రబలుండగు నంగజుని చెయ్ది నప్సరోరూపాతిశయసక్తచిత్తుండైన యా సంయమి శుక్లం బయ్యరణియందుఁ బడియె. నవ్విప్రుండు నిర్విశంకంబగు నంతఃకరణంబుతో నరణిమథనం బొనరించిన. 250**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; లబ్ధవరుండు= పొందినవరం కలవాడు; అగుచున్= అయి (వరం పొందినవాడై); సత్యవతీసుతుండు= సత్యవతి కుమారుడైన ఆ వ్యాసుడు; అగ్నికార్యపరుండు+ఐ= అగ్నికార్యం నిర్వహిద్దామనే పూనికతో; అరణి+పుచ్చికొని= అరణిని అందుకొని; మథింపన్+తొడంగినన్= మథించటం మొదలు పెట్టేసరికి; ఘృతాచి= ఘృతాచి; అను= అనే పేరుగల; అప్సరస్+వనిత= అప్సరస; లోచనగోచరంబు+అగుటయున్= కన్నుల ఎదుట కనిపించటంతో; తానునున్= ఆ వ్యాసుడు కూడా; కామగోచరత్వంబున్+ఒందినన్= ఇంద్రియాలు కామప్రకోపాన్ని పొందేసరికి; ఆ+ఇందువదన = ఆ చంద్రముఖి;

ఆ+ముని+తెఱంగు= ఆ మునీశ్వరుడి పరిస్థితి; ఎఱింగి= గుర్తించి; వంచనన్= వంచనతో; చిలుక+అయి+ఉండెన్= చిలుకగా మారిపోయింది; అతండును= ఆ వ్యాసుడుకూడా; ధైర్యంబు= ధీరత్వాన్ని; అవలంబించి= వహించి; అరణికార్యప్రవణుండు+ఐ= అరణిని మథించే పనిలో నిమగ్నుడై; ఉండన్= ఉండగా; ప్రబలుండు+అగు= మిక్కిలి బలశాలియైన; అంగజుని= మన్మథుడియొక్క; చెయ్దిన్= చేష్టవలన; అప్సరస్+రూప+అతిశయ= ఘృతాచియొక్క సౌందర్యాతిశయం పట్ల; సక్త= లగ్నమైన; చిత్తుండు+ఐన= మనస్సు కలవాడైన; ఆ+సంయమి= ఆ ఋషియొక్క; శుక్లంబు= వీర్యం; ఆ+అరణియందున్= ఆ అరణిలో; పడియెన్= పడింది; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; నిర్విశంకంబు+అగు= ఏ సంశయమూ లేని; అంతఃకరణంబుతోన్= హృదయంతో; అరణిమథనంబు= అరణిని మథించటం; ఒనరించినన్= కొనసాగించేసరికి.

**తాత్పర్యం:** ధర్మరాజా! వరం పొందిన వ్యాసుడు ఒకరోజున తన ఆశ్రమంలో అగ్నికార్యాలు నిర్వహించటం కొరకని అరణిని మథిస్తున్నాడు (గుండ్రటి చెక్కమీద పుల్లతో మథించి అగ్నిని పుట్టిస్తారు. ఆ చెక్కను అరణి అంటారు). ఆ సమయంలో ఘృతాచి అనే అప్సరస కనిపించింది. మహర్షికి ఆమెను చూసి కామప్రకోపం కలిగింది. దానిని గమనించిన అప్సరస భయపడిందో ఏమో ఎందుకయినా మంచిదని వంచనతో చిలకగా మారిపోయింది. వ్యాసుడు మనస్సు చిక్కబట్టుకొని అరణిని చిలకటం కొనసాగించాడు. కానీ, మన్మథుడు మహాబలశాలి కదా! వ్యాసుడి మనస్సులో అప్సరస రూపమే నిలిచిపోయింది. దాని కారణంగా వీర్యస్ఖలనం అయింది. అది అరణిలో పడింది. అయినా వ్యాసుడు నిర్వికారచిత్తంతో అరణిమథనం కొనసాగించాడు.

**తే.** **అయ్యరణిఁ బుట్టి జనకసమాకృతియును । భూరి కాంతియు వెలుఁగంగఁ బొలిచె శుకుఁడు**
**యాగకాల సుసంభృత హవిరవాప్తి । మహితతేజస్కుఁడగు హుతవహుని మాడ్కి. 251**

**ప్రతిపదార్థం:** ఆ+అరణిన్= ఆ అరణిలో; పుట్టి= ఉద్భవించి; జనకసమ= తండ్రితో సమానమైన; ఆకృతియును= ఆకారమూ; భూరి= గొప్ప; కాంతియున్= తేజస్సూ; వెలుఁగంగన్= ప్రకాశించగా; శుకుఁడు= వ్యాసపుత్రుడు శుకుడు; యాగకాల= యజ్ఞసమయంలో; సుసంభృత= సమృద్ధిగా సమర్పించబడిన; హవిస్+అవాప్తి= హవిస్సుయొక్క (నెయ్యి) ప్రాప్తితో; మహిత= గొప్ప; తేజస్కుఁడు+అగు= తేజస్వంతుడయ్యే; హుతవహుని+మాడ్కిన్= అగ్నిలాగా; పొలిచెన్= విరాజిల్లాడు.

**తాత్పర్యం:** ఆ అరణినుంచి ఒక మగపిల్లవాడు జన్మించాడు. అతడే శుకుడు. రూపంలో ముమ్మూర్తులా వ్యాసుడే. యజ్ఞకుండంలో ఆజ్యంపోస్తే అగ్ని ఎట్లా ప్రకాశిస్తుందో శుకుడు గొప్ప తేజస్సుతో. అట్లా వెలిగిపోతున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ.** **అపుడు మందాకిని సాకారయై వచ్చి । మంగళస్నాన సమన్వితుఁడు గ**
**నొనరించె నాకసంబుననుండి పడియెఁ గృ । ష్ణాజినదండంబు లతని యెదుర**
**దివ్యదుందుభులును దేవాంగనాగాన । ములును వీతెంచె నద్భుతముగాఁగఁ**
**గుసుమవర్షంబులు గురిసె నింద్రాది దే । వతలు గారవమున వచ్చి రంబి**

**తే.** **కాసమేతుఁడై యేతెంచి కామవైరి । యతని నుపనీతుఁ గావించె నమరనాథుఁ**
**డుజ్జ్వలంపుఁ గమండులు వొసఁగె నిచ్చి । రమరు లెన్నండు మాయని యంబరములు. 252**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; మందాకిని= గంగానది; సాకారయై= ఆకారం ధరించి; వచ్చి; మంగళస్నానసమన్వితుఁడుగన్= వచ్చి మంగళస్నానంతో కూడుకొన్నవాడిగా శుకుడిని; ఒనరించెన్= చేసింది (మంగళస్నానం చేయించింది); ఆకసంబుననుండి=

ఆకాశంనుంచి; కృష్ణాజినదండంబులు= నల్లని జింకతోలూ, బ్రహ్మచారి ధరించే ఒక దండమూ; అతని+ఎదురన్= అతడి ఎట్టఎదుట; పడియెన్= పడ్డాయి; దివ్యదుందుభులును= దేవతల దుందుభులూ; దేవాంగనా= అమరకాంతల; గానములును= పాటలూ; వీతెంచెన్= వినవచ్చాయి; అద్భుతము+కాఁగన్= ఆశ్చర్యజనకంగా; కుసుమవర్షంబులు= పూలవానలు; కురిసెన్= కురిశాయి; ఇంద్ర+ఆది+దేవతలు= ఇంద్రుడు మొదలైన దేవతలు; గారవమునన్= గౌరవసూచకంగా; వచ్చిరి= వచ్చారు; కామవైరి= మన్మథసంహారకుడైన శివుడు; అంబికా సమేతుఁడై= పార్వతితో కూడినవాడై; ఏతెంచి= వచ్చి; అతనిన్= ఆ బాలుడిని; ఉపవీతున్= ఉపనయనం జరిగినవాడిగా; కావించెన్= చేశాడు (పార్వతీ పరమేశ్వరులు వచ్చి అతడికి ఉపనయనం చేసి జందెం వేశారని భావం); అమరనాథుఁడు= దేవనాయకుడు ఇంద్రుడు; ఉజ్జ్వలంపు= ప్రకాశిస్తున్న; కమండలువు= కమండలువును; ఒసఁగెన్= బహూకరించాడు; అమరులు= దేవతలు; ఎన్నండున్= ఎప్పటికీ; మాయని= మాసిపోని; అంబరములు= వస్త్రాలను; ఇచ్చిరి= సమర్పించారు.

**తాత్పర్యం:** పాండవా! సరిగ్గా అప్పుడే గంగానది స్త్రీరూపంలో వచ్చింది. ఆ బిడ్డకు మంగళస్నానం చేయించింది. ఆకాశంనుండి కృష్ణాజినమూ దండమూ వచ్చి పడ్డాయి. దుందుభులు మ్రోగాయి. దేవతాంగనల గానాలు వినిపించాయి. ఆశ్చర్యజనకంగా పూలవాన కురిసింది. ఇంద్రాది దేవతలు గౌరవంతో వచ్చారు. పార్వతీపరమేశ్వరులు శుకుడికి ఉపనయనం చేశారు. దేవేంద్రుడు తళతళలాడే కమండలం ఇచ్చాడు. దేవతలేమో ఎప్పుడూ మాసిపోని దివ్యమైన వస్త్రాలు బహూకరించారు.

**క. మృగపక్షి సమూహము లా । దిగఁ గల్గు చరాచరముల దివ్యప్రభవుం**
**డగు శుకుని పుట్టొనర్చెం । బ్రగాఢతమ సంప్రమోద భరితంబులుగాన్. 253**

**ప్రతిపదార్థం:** దివ్యప్రభవుండు+అగు= మానవాతీతమైన జన్మకలవాడైన; శుకుని= శుకుడియొక్క; పుట్టు= పుట్టుక; మృగపక్షి సమూహములు= జంతుబృందాలూ పక్షిసమూహాలూ; ఆదిగన్= మొదలుగా; కల్గు= ఉన్న; చరాచరములన్= జంగమస్థావరాలను; ప్రగాఢతమ= మిక్కిలిగాఢమైన; సంప్రమోద= ఆనందంతో; భరితంబులు+కాన్= నిండినవాటిగా; ఒనర్చెన్= చేసింది.

**తాత్పర్యం:** శుకుడిది దివ్యమైన పుట్టుక. అది మృగపక్షి సమూహాలతో కూడిన సకలచరాచర జగత్తులోనూ ప్రగాఢమైన ఆనందాన్ని నింపివేసింది.

**క. జనియించిన మాత్రన య । మ్మునిప కిశోరమును వేదములు వొందెను ద**
**జ్జనకుని మును పొందిన తెఱఁ । గున, నబ్బాలుఁడు వరించె గురుఁడుగ ధిషణున్. 254**

**ప్రతిపదార్థం:** జనియించిన మాత్రన్+అ= పుట్టటంతోనే; ఆ+మునిప+కిశోరమును= మునీశ్వరుడి బిడ్డ అయిన ఆ శుకుడిని; వేదములు= వేదాలు; మునుపు= పూర్వం; తద్+జనకున్= అతడితండ్రి వ్యాసుడిని; పొందిన తెఱఁగునన్= పొందినట్లే; పొందెను= వరించాయి; ఆ+బాలుఁడు= ఆ కుమారుడు; ధిషణున్= బృహస్పతిని; గురుఁడుగన్= తనకు గురువుగా; వరించెన్= కోరుకొన్నాడు;

**తాత్పర్యం:** మునుపు వ్యాసుడు పుట్టగానే వేదాలు అతడిని పొందాయి. ఇప్పుడూ అట్లాగే శుకుడిని వచ్చి చేరాయి. శుకుడేమో బృహస్పతిని తనకు గురువుగా వరించాడు.

**వ. ఆచారపరిపాటి యవలంబించి యి ట్లుపాధ్యాయవరణంబు సేసి. 255**

**ప్రతిపదార్థం:** ఆచార పరిపాటి= ఆచారవిధానం; అవలంబించి= స్వీకరించి; ఇట్లు; ఉపాధ్యాయవరణంబు= ఉపాధ్యాయుడిని కోరుకోవటం అనేది; చేసి= చేసి.

**తాత్పర్యం:** ఆచారవిధానం స్వీకరించి ఉపాధ్యాయుడిని కోరుకొని (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అతఁడు సదివింప వేదవేదాంగధర్మ । శాస్త్రరాజనీత్యాదిక సకల విద్య**
**లును గ్రమంబునఁ జదివి యమ్మునికుమారుఁ । డచ్చటన యుండె వ్రతచర్యలందుఁ దగిలి.** **256**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ బృహస్పతి; చదివింపన్= చదివిస్తూంటే; వేద= వేదాలూ; వేదాంగ= ఛందోవ్యాకరణ జ్యోతిషాదులైన షడంగాలూ; ధర్మశాస్త్ర= ధర్మశాస్త్రాలూ; రాజనీతి+ఆదిక= రాజనీతి మొదలైన; సకలవిద్యలును= సమస్తవిద్యలనూ; క్రమంబునన్= వరుసగా; చదివి= అభ్యసించి; ఆ+మునికుమారుఁడు= ఆ శుకుడు; వ్రతచర్యలందున్= బ్రహ్మచర్యవ్రతనియమాలపట్ల; తగిలి= ఆసక్తి కలవాడై; అచ్చటన్+బృహస్పతి సన్నిధిలోనే; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** బృహస్పతి చదివిస్తూంటే శుకుడు వేదాలూ వేదాంగాలూ సకల శాస్త్రాలూ క్రమంగా అభ్యసించాడు. బ్రహ్మచర్య వ్రతదీక్షతో ఆ నియమాలు పాటిస్తూ గురువుగారి దగ్గరే ఉండిపోయాడు.

**వ.** **దేవతలకు లోనుగా నామంత్రణీయుండును మాననీయుండును నగుచు నట్లుండు నయ్యారణీయుండు నిజాశ్రమంబున నున్న తండ్రిపాలికిం జనుదెంచి తదనుసరణ ప్రక్రియం బ్రవర్తించునెడ నచ్చేరువం జరించు మునికుమారులతోడి మాటలు మరిగి లోకంబుతోడి పాటియై యాత్మానుసంధానంబు సేయలేక మెలంగుచున్నం జూచి యా సత్యవతీసుతుండు సాంఖ్యయోగశాస్త్రంబు లతనికి నధిగతంబులు గావించె మఱియు దేహంబునందలి యహంకారంబంతయు బంధులవలని మమతయుం బాయునట్టి వాక్యంబు లుపదేశించె దానం బ్రబోధం బుదయించుటం జేసి యమ్మహామతికి బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ ధర్మంబులను నాశ్రమంబులు మూఁటను బుద్ధి రమింపదయ్యె నయ్యుఁ బరమపరుం డప్పారాశర్యుతో మోక్షప్రదం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు.** **257**

**ప్రతిపదార్థం:** దేవతలకులోనుగాన్= దేవతలకుకూడా; ఆమంత్రణీయుండున్= ఆహ్వానింప దగినవాడును; మాననీయుండును= గౌరవింపదగినవాడును; అగుచున్= అవుతూ; అట్లు+ఉండు= అలా ఉన్న; ఆ+ఆరణీయుండు= అరణి సంభవుడైన ఆ శుకుడు; నిజ+ఆశ్రమంబునన్+ఉన్న= తన ఆశ్రమంలో తానుగా ఉన్న; తండ్రిపాలికిన్= తండ్రిదగ్గరకు (వ్యాసాశ్రమానికి); చనుదెంచి= వచ్చి; తద్+అనుసరణ= ఆ తండ్రిని అనుసరించే; ప్రక్రియన్= విధానంతో; ప్రవర్తించునెడన్= ప్రవర్తిస్తున్న సమయంలో (తండ్రిని అనుసరించి మెలగుతున్న తరుణంలో); ఆ+చేరువన్= ఆశ్రమానికి సమీపంలో; చరించు= సంచరిస్తున్న; మునికుమారులతోడి= మునిబాలకులతోటి; ఆటలు మరిగి= క్రీడలకు అలవాటుపడి; లోకంబుతోడి పాటియై= మిగతా ప్రపంచంతో సమానుడైపోయి; ఆత్మ+అనుసంధానంబు= ఆత్మధ్యానం; చేయలేక; మెలంగుచున్నన్= కాలం గడుపుతూండగా; చూచి; ఆ సత్యవతీసుతుండు= సత్యవతి కుమారుడైన ఆ వ్యాసుడు; సాంఖ్య - యోగ శాస్త్రంబులు= సాంఖ్యమూ, యోగమూ అనే శాస్త్రాలు; అతనికిన్= ఆ శుకుడికి; అధిగతంబులు+కావించెన్= బోధించి నేర్పాడు;మఱియున్= ఇంకా; దేహంబునందలి= జీవోపాధిలో ఉండే; అహంకారంబు+అంతయున్= అహంకారమంతటినీ; బంధులవలని= బంధువులపట్ల; మమతయున్= మమకారాన్నీ; పాయునట్టి= విడిచిపెట్టేటువంటి; వాక్యంబులు= పలుకులు; ఉపదేశించెన్= ఉపదేశించాడు; దానన్= దానితో; ప్రబోధంబు= జ్ఞానం; ఉదయించుటన్+చేసి= కలగటంచేత; ఆ+మహామతికిన్= ఆ గొప్ప ధీశాలికి; బ్రహ్మచర్య= బ్రహ్మచర్యం; గార్హస్థ్య= గార్హస్థ్యం; వానప్రస్థధర్మంబులు= వానప్రస్థధర్మాలు; అను= అనేటువంటి; ఆశ్రమంబులు= ఆశ్రమాలు; మూఁటను= మూడింటిలోనూ; బుద్ధి= అంతరంగం; రమింపదు+అయ్యెన్= ఆసక్తం కాలేదు; అయ్యున్= అయినప్పటికీ; పరమపరుండు= పరమాత్మపట్లనే ఆసక్తి కలిగిన ఆ శుకుడు; ఆ+పారాశర్యుతోన్= ఆ వ్యాసుడితో; మోక్షప్రదంబు= మోక్షాన్ని ఇచ్చేది; ఎయ్యది= ఏది; దానిన్= దానిని; ఎఱింగింపవే= తెలియజెప్పవా; అనుటయున్= అని అడగటంతో.

**తాత్పర్యం:** దేవతలచేతకూడా గౌరవించబడే ఆ శుకుడు తన తండ్రిని అనుసరిస్తూ ఉండేవాడు. తోటి మునికుమారుల సహవాసంవలన ఆటలలోపడి ధ్యానం చేయలేకపోతున్న కుమారుడికి సాంఖ్యయోగ శాస్త్రాలను బోధించి అహంకారమమకారాలను విడిచిపెట్టే పద్ధతిలో బోధచేశాడు, దానితో జ్ఞానోదయమైన శుకుడు విరాగి అయ్యాడు. అయినా కూడా 'మోక్షాన్ని ఇచ్చేది ఏది?' అనే విషయమై తనకు తెలియజెప్పుమని తండ్రిని ప్రార్థించగా.

**ఆ. అతఁడు మోక్షదర్శి యగుట నిరూపించి । యమ్మహామునీంద్రుఁ డతనితోడ**
**వత్స! కానఁ బొమ్ము వైదేహుఁడగు జన । క క్షితీశు వినయగౌరవమున. 258**

**ప్రతిపదార్థం:** అతఁడు= తన కుమారుడైన ఆ శుకుడు; మోక్షదర్శి= మోక్షాన్ని దర్శించాలి (తెలుసుకోవాలి) అనే శీలం కలవాడు; అగుట= కావటాన్ని; నిరూపించి= నిర్ధారించుకొని; ఆ+మహాముని+ఇంద్రుఁడు= ఆ మహామునీశ్వరుడైన వ్యాసుడు; అతనితోడన్= ఆ శుకుడితో; వత్స!= నాయనా! (బిడ్డా!); వైదేహుఁడు+అగు= విదేహ రాజ్యాధిపతి అయిన; జనక క్షితీశున్= జనకమహారాజును; వినయగౌరవమునన్= వినయాతిశయంతో; కానన్+పొమ్ము= దర్శించటానికి వెళ్ళు.

**తాత్పర్యం:** తన కుమారుడు మోక్షాన్ని సందర్శించాలి అనే కోరికతో ఉన్నాడు - అనే విషయాన్ని వ్యాసుడు గమనించాడు. ఇట్లా అన్నాడు: నాయనా! విదేహాధిపతి జనకమహారాజు ఉన్నాడు. నీవు వినయంగా, గౌరవంగా ఆయన దగ్గరకు వెళ్ళుము.

**క. గగనంబునఁ జను టుడుగుము । తగఁగఁ బాదప్రచారితన చను మిథిలా**
**నగరమునకు నమ్ముని మా । న్యగుణుం గను మోక్షధర్మ మతఁ డెఱిఁగించున్. 259**

**ప్రతిపదార్థం:** గగనంబునన్= ఆకాశమార్గంలో; చనుట= ప్రయాణంచేసి వెళ్ళటం; ఉడుగుము= మానివేయుము; తగంగన్= తగినట్టు; పాదప్రచారితన్+అ= పాదసంచారంతోనే; మిథిలానగరమునకున్= మిథిలాపట్టణానికి; చను(ము)= వెళ్ళుము; ఆ+మునిమాన్యగుణున్= మునులకు కూడా గౌరవింపదగిన గుణాలుకల ఆ జనకుడిని; కను(ము)= సందర్శించు; మోక్షధర్మము= ముక్తిమార్గం; అతఁడు= ఆయన; ఎఱిఁగించున్= తెలియజెబుతాడు.

**తాత్పర్యం:** నాయనా! ఆకాశమార్గంలో వెళ్ళవద్దు. పాదచారివై ప్రయాణం చేసి, మిథిలానగరం చేరుకొమ్ము. జనకుడంటే మునులకు కూడా గౌరవింపదగినవాడు. ఆయన నీకు మోక్షధర్మం ఉపదేశిస్తాడు.

**క. ఆ రాజన్యునెడ నహం । కారిత మమకారితయును గర్తవ్యముగా**
**దేరికినైనను బూజ్యుం । డారయ నాతఁడు వినీతియ తగుం జుమ్మీ! 260**

**ప్రతిపదార్థం:** ఆ రాజన్యునెడన్= ఆ జనకమహారాజుపట్ల; అహంకారిత= అహంకారం చూపడం; మమకారితయును= మమకారం చూపటం; కర్తవ్యము+కాదు= చెయ్యదగినపని కాదు; ఆరయన్= పరిశీలించి చూస్తే; ఆతఁడు= ఆయనగారు; ఏరికిన్+ఐనను= ఎవ్వరికైనా; పూజ్యుండు= అర్చింపదగినవాడు; అందుచేత - వినీతి+అ= వినయమే; తగున్+చుమ్మీ= తగును సుమా!

**తాత్పర్యం:** తనయుడా! ఆ జనకమహారాజు పట్ల అహంకారం చూపటంగానీ, మమకారం ప్రదర్శించటం కానీ ఎవ్వరికీ తగదు. ఎవ్వరికైనా అతడు పూజింప దగినవాడు. అందుచేత వినయం ఒక్కటే కర్తవ్యం సుమా!

**ఆ. అనిన నట్లకాక యని మేరుముఖనగం । బులు ననేకనదులుఁ బలుదెఱఁగుల**
**దేశములను వివిధతీర్థంబులును జుల్కఁ । గడచి వచ్చె భరతఖండమునకు. 261**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వ్యాసుడు చెప్పగా; అట్ల+అ+కాక= అట్లాగే; అని; మేరుముఖ= మేరువు మొదలైన; నగంబులున్= పర్వతాలూ; అనేక నదులున్= అనేక ప్రవాహాలూ; పలుతెఱఁగుల దేశములను= రకరకాల దేశాలలో; వివిధ= అనేకమైన; తీర్థంబులును= పుణ్యక్షేత్రాలూ; చుల్కన్= వేగంగా; కడచి= దాటి; భరతఖండమునకున్= భరతభూభాగానికి; వచ్చెన్= శుకుడు వచ్చాడు.

**తాత్పర్యం:** వ్యాసుడు చెప్పినదానికి అట్లాగే అని ఒప్పుకొన్నాడు శుకుడు. వెంటనే పాదచారిగా బయలుదేరాడు. మేరువు మొదలైన పర్వతాలు దాటాడు. నదులు ఈదాడు. పలు దేశాలలో అనేక పుణ్యతీర్థాలు అతిగమించాడు. తేలికగా, వేగంగా ప్రయాణం సాగించి సాగించి, భరతఖండం చేరుకొన్నాడు.

**వ. వచ్చునప్పు డెయ్యెడ నే పదార్థంబులఁ జూచినం జూడనివాఁడపోలె వచ్చె. నిట్టు వచ్చి విదేహజనపదంబు సొచ్చి మిథిలాపురంబు నుపవనంబు దఱిసి చని తదీయప్రాకారద్వారదేశంబు సేరిన సమయంబున. 262**

**ప్రతిపదార్థం:** వచ్చునప్పుడు= వస్తున్నప్పుడు; ఏ+ఎడన్= ఎక్కడ; ఏ పదార్థంబులన్= ఏ వస్తువులను; చూచినన్= చూచినా; చూడనివాఁడు+అ+పోలెన్= చూడనివాడివలెనే; వచ్చెన్= ప్రయాణం సాగించి వచ్చాడు; ఇట్టు= ఇట్లా; వచ్చి= విచ్చేసి; విదేహజనపదంబు= విదేహరాజ్యం; చొచ్చి= ప్రవేశించి; మిథిలాపురంబు+ఉపవనంబు= మిథిలాపట్టణంయొక్క ఉద్యానవనం; తఱిసి= సమీపించి; చని= ఇంకా ముందుకు నడిచి; తదీయ= జనక మహారాజు గారి మిథిలాపట్టణంయొక్క; ప్రాకార= కోటగోడతాలూకు (ప్రహరి); ద్వారదేశంబు= ప్రధానద్వారాన్ని; చేరిన సమయంబునన్= చేరుకున్న సమయంలో.

**తాత్పర్యం:** దారిలో దేనిని చూచినా చూడనివాడివలె దానిని ఉపేక్షిస్తూ ప్రయాణించి, మిథిలా నగరాన్ని చేరుకొన్నాడు శుకుడు. ఉద్యానవనాన్ని దాటి, ప్రధానద్వారాన్ని చేరుకొన్న సమయంలో.

**ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై । నూరకున్నఁ జూచి వారు వెఱచి**
**లోని కెఱుకచేసి లోఁగుచు వారు ద । న్ననుప నరిగె నృపగృహంబు సేర. 263**

**ప్రతిపదార్థం:** ద్వారపాలురు= ద్వారపాలకులు (గుమ్మం కావలివారు); అచటన్= అక్కడ; వారింపన్= ఆపివేస్తే; శాంతిమైన్= ప్రశాంతంగా (కిమ్మనకుండా); ఊరకున్నన్= శుకుడు ఊరుకునేసరికి; చూచి; వారు= ఆ ద్వారపాలకులు; వెఱచి= భయపడి; లోనికిన్= ప్రాకారంలోపలికి; ఎఱుకచేసి= తెలియజెప్పి; లోఁగుచున్= వినయంగా వంగుతూ; వారు= ఆ కావలివారు; తన్నున్= తనను; అనుపన్= లోపలికి పంపగా; నృపగృహంబు= రాజప్రాసాదం; చేరన్+అరిగెన్= సమీపించటానికి వెళ్ళాడు, ప్రాసాదం సమీపించాడు.

**తాత్పర్యం:** ప్రాకారద్వారం దగ్గర కావలివారు అడ్డగించారు. శుకుడు కోపించలేదు. ప్రశాంతంగా నిలిచాడు. ఆ ప్రశాంతిని చూచి, ద్వారపాలకులు భయపడి, లోపలికి వర్తమానం పంపి సగౌరవంగా రాజగృహం వైపు పంపించారు. అట్లా రాజప్రాసాదం చేరుకొన్నాడు శుకుడు.

**క. అచటఁ బ్రతిహారు లాఁగిన । నచలిత శమవృత్తినుండె నవ్వేత్రధరుల్**
**ప్రచలితమతులై యా తెఱఁ । గుచితంబుగఁ జెప్ప నృపతియుఁ బురోహితునిన్. 264**

**ప్రతిపదార్థం:** అచటన్= రాజగృహద్వారంలో; ప్రతిహారులు= సేవకులు; ఆఁగినన్= ఆపితే; అచలిత= చలించని; శమవృత్తిన్= శాంతప్రవత్తితో; ఉండెన్= నిలబడ్డాడు; ఆ+వేత్రధరుల్= బెత్తాలు ధరించిన ఆ ప్రతిహారులు; ప్రచలిత= కంపించిన; మతులు+ఐ= మతికలవారై; ఆ+తెఱఁగున్= ఆ విధానమంతా; ఉచితంబుగన్= తగినరీతిలో; చెప్పన్= లోపలికి వచ్చి వివరించేసరికి; నృపతియున్= ఆ జనకమహారాజు కూడా; పురోహితునిన్= తన పురోహితుడిని.

**తాత్పర్యం:** రాజగృహద్వారంలో సేవకులు ఆపివేశారు. అక్కడా శుకుడు అట్లాగే చలించని ప్రశాంతితో నిలబడ్డాడు. ప్రతిహారుల గుండెలు చలించిపోయాయి. బెత్తాలు ఊపుకొంటూ గబగబా లోపలికి వెళ్ళి రాజుగారికి విషయమంతా వివరించారు. అప్పుడు జనకుడు తన పురోహితుడిని పిలిచి (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అరయఁ బుత్తెంచె నాతఁడు నరసిపోయి । నిజ మెఱింగింప భక్తి వినీతి సంభ్ర**
**మములు ముప్పిరిగొనఁగ నమ్మనుజనాథుఁ । డఖిల మంత్రులు బుధులుఁ దో నరుగుదేర. 265**

**ప్రతిపదార్థం:** అరయన్= చూచి రావటానికి; పుత్తెంచెన్= పంపించాడు; ఆతఁడున్= ఆ పురోహితుడు కూడా; అరసి= చూచి; పోయి= తిరిగి లోపలికి వెళ్ళి; నిజము= ఉన్న పరిస్థితిని; ఎఱింగింపన్= తెలియ జెప్పేసరికి; ఆ+మనుజనాథుఁడు= ఆ జనక మహారాజు; భక్తి; వినీతి= వినయం; సంభ్రమములు= హడావిడి అనేవి; ముప్పిరిగొనన్= మూడూ ఒక్కసారిగా చుట్టుముట్టగా;అఖిల మంత్రులున్= తన మంత్రులు అందరూ; బుధులున్= ఆస్థాన పండితులూ; తోన్+అరుగుదేరన్= తనతోపాటు బయలుదేరిరాగా.

**తాత్పర్యం:** జనకుడు తన పురోహితుడిని పంపించాడు. ఆయన వెళ్ళి ద్వారదేశంలో శాంతచిత్తంతో నిలబడి ఉన్న శుకుడిని చూచి వచ్చి మహారాజుకు విన్నవించాడు. రాజుగారి మనస్సులో భక్తీ, వినయమూ, సంభ్రమమూ ముప్పేటగా అలుముకొన్నాయి. తన మంత్రులూ, పండితులూ వెంటరాగా బయలుదేరాడు.

**చ.** **శిరమున నర్ఘ్యపాత్రఁగొని చెచ్చెర వచ్చి ప్రియం బెలర్ప న**
**గ్గురుసుతుఁగాంచి యంతిపురి కోటకు లోనగు నొక్క సౌమ్యమం**
**దిరమున కమ్మునిం గొనుచు దేవసమప్రతిపత్తి నేఁగి ర**
**త్నరుచిర కాంచ నాసనమునం దగనుంచి సునీతపాద్యుఁడై. 266**

**ప్రతిపదార్థం:** శిరమునన్= శిరస్సుమీద; అర్ఘ్యపాత్రన్= అర్ఘ్యంతో నిండిన పాత్రను; కొని= వహించి; చెచ్చెరన్= గబగబా; వచ్చి= శుకుడు నిలబడ్డ ద్వారం దగ్గరికి వచ్చి; ప్రియంబు+ఎలర్పన్= ప్రీతి చిగురింపగా; ఆ+గురుసుతున్= గురుపుత్రుడైన ఆ శుకుడిని; కాంచి= దర్శించి; అంతిపురి= అంతఃపురమూ; కోటకున్= రాజప్రాసాదానికీ; లోన్+అగు= మధ్యలో ఉన్న; ఒక్క= ఒకానొక; సౌమ్యమందిరమునకున్= సౌమ్యమైన మందిరానికి; ఆ+మునిన్= ఆ శుకుడిని; కొనుచున్= నడిపిస్తూ; దేవ= దేవుడితో; సమ= సమానమైన; ప్రతిపత్తిన్= గౌరవం చూపుతూ; ఏఁగి= తీసుకువెళ్ళి; రత్న= రత్నాలతో; రుచిర= అందమైన; కాంచన+ఆసనమునన్= బంగారుగద్దెమీద; తగన్+ఉంచి= తగినట్టు కూర్చోబెట్టి; సునీతపాద్యుఁడై= కాళ్ళు కడిగినవాడై.

**తాత్పర్యం:** జనకమహారాజు స్వయంగా అర్ఘ్యపాత్రను (పూజాద్రవ్యాలు ఉంచిన పాత్ర) నెత్తిమీద పెట్టుకొని గబగబా ఎదురువెళ్ళాడు. గురుపుత్రుడిని చూసేసరికి ఎంతో ప్రీతి కలిగింది. తన కోటలో ఒక చంద్రశాలకు శుకుడిని వెంట ఉండి తీసికొని వెళ్ళాడు. దేవుడివలె చూచుకొంటూ తీసికొనివెళ్ళాడు. రత్నాలు పొదిగిన బంగారు ఆసనంమీద కూర్చోబెట్టి కాళ్ళు కడిగాడు.

**విశేషం:** సౌమ్యము= సోమసంబంధమైనది. (సోముడు= చంద్రుడు). (తెల్లని మందిరానికి అనిగానీ, చంద్రశాలకు అనిగానీ). పై అంతస్తులో విశాలమైన ముంగిలితో నిర్మించిన ఒంటరిగదిని చంద్రశాల అంటారు. చంద్రకాంతపు మణులు పొదిగిన మందిరమైనా కావచ్చును.

**క.** **లలితాక్షతములఁ గుసుమం । బులఁ బూజితుఁ జేసి యర్ఘ్యమును గోవును న**
**క్కులపతికి నిచ్చె విధిపరి । కలనజ్ఞుండైన యతఁడుఁ గైకొనియెఁ దగన్. 267**

**ప్రతిపదార్థం:** లలిత= మనోజ్ఞమైన; అక్షతములన్= అక్షతలతోనూ (అక్షింతలు అంటారు. బియ్యమూ, పసుపూ, కుంకుమ కలిపి చేసినవి); కుసుమంబులన్= పువ్వులతోనూ; పూజితున్= పూజింపబడినవాడినిగా; చేసి= పూజించి; అర్ఘ్యమును= అర్ఘ్యమును; గోవునున్= ఒక ఆవును; ఆ+కులపతికిన్= ఆ శుకుడికి; ఇచ్చెన్= జనకుడు సమర్పించాడు; విధిపరికలనజ్ఞుండు+ఐన= అతిథిపూజా నియమాలు తెలిసినవాడైన; అతఁడున్= ఆ శుకుడున్నూ; తగన్= తగినట్లు; కైకొనియెన్= వాటిని స్వీకరించాడు.

**తాత్పర్యం:** జనకమహారాజు అక్షతలూ కుసుమాలూ తీసికొని అతడిని అర్చించాడు. అర్ఘ్యం ఇచ్చాడు. గోవును బహూకరించాడు. అతిథులను అర్చించే విధులు తెలిసిన వాడు కాబట్టి శుకుడు వాటిని స్వీకరించాడు.

**విశేషం:** పదివేలమందికి అన్నపానాదులు ఇచ్చి విద్యను బోధించే బ్రహ్మర్షిని కులపతి అంటారు. వ్యాసుడు కులపతి. ఆయన కుమారుడు కాబట్టి శుకుడికీ ఆ విశేషణం కుదురుతుంది. వంశశ్రేష్ఠుడని కూడా అర్థం ఉన్నది కాబట్టి అట్లాగయినా చెల్లుతుంది.

**వ. జనకుండు సవినయంబుగా నిలుచుండి యమ్ముని యనుమతి సేసిన మఱి మహియంద సమాసీనుండై తానును మంత్రులు విద్వజ్జనంబులు గొలిచియుండె నట్టియెడ నన్నరపతి పరివారజాతం బెల్లను గౌతుకంబునం జనుదెంచి యంతంత మ్రొక్కుచుం జూచుచుండ. 268**

**ప్రతిపదార్థం:** జనకుండు= జనకమహారాజు; సవినయంబుగాన్= వినయం ఉట్టిపడేట్టు; నిలుచుండి= నిలబడి; ఆ+ముని= ఆ శుకుడు; అనుమతి+చేసినన్= అనుమతించగా; మఱి= అప్పుడు; మహి+అందున్+అ= నేలమీదనే; సమాసీనుండై= కూర్చుని; తానునున్= తానూ; మంత్రులున్= తన అమాత్యులూ; విద్వత్+జనంబులున్= పండితులూ; కొలిచియుండెన్= సేవిస్తూ ఉన్నాడు; అట్టియెడన్= ఆ సమయంలో; ఆ+నరపతి= ఆ రాజుగారి; పరివారజాతంబు+ఎల్లనున్= సేవకసమూహం అంతా; కౌతుకంబునన్= కుతూహలంతో; చనుదెంచి= వచ్చి; అంతంతన్= అంతంత దూరంలో; మ్రొక్కుచున్= వంగివంగి నమస్కరిస్తూ; చూచుచుండన్= చూస్తూ ఉండగా.

**తాత్పర్యం:** సవినయంగా నిలబడిన జనకమహారాజును కూర్చోమన్నాడు శుకుడు. అప్పుడు రాజుగారూ అతడి మంత్రులూ, పండితులూ అంతా నేలమీదనే ఆసీనులయ్యారు. ఇది చూచి, పరిజనమంతా ఆశ్చర్యపోయి వాళ్ళూ వంగి వంగి అల్లంత దూరంలో నమస్కరిస్తూ నిలబడ్డారు.

**తే. రూపవిభ్రమముల నప్సరోజనంబుఁ । గ్రేణిసేయు వారాంగనాశ్రేణి గీత**
**నృత్యనిరతి నారాధింప నిర్విశేష । యోజితేంద్రియుఁడై యతఁ డుండె నధిప! 269**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; రూప= సౌందర్యంలోనూ; విభ్రమములన్= విలాసాల్లోనూ; అప్సరస్+జనంబున్= దేవకాంతా సమూహాన్ని; క్రేణి+చేయు= తిరస్కరించేటటువంటి; వారాంగనాశ్రేణి= వేశ్యాబృందం; గీతనృత్య నిరతిన్= సంగీత నాట్యాల ప్రదర్శనతో; ఆరాధింపన్= అర్చించగా; అతఁడు= ఆ శుకుడు; నిర్విశేష= నిర్వికారంగా; యోజిత= నిగ్రహింపబడిన; ఇంద్రియుఁడై= ఇంద్రియాలు కలవాడై; ఉండెన్= కూర్చున్నాడు, ఆరాధన స్వీకరించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! సౌందర్యంలోనూ, విలాసాలలోనూ అప్సరసలను మించిన వేశ్యలు వచ్చి తమ సంగీతంతో, నృత్యప్రదర్శనతో శుకుడిని అర్చించారు. ఇంద్రియ వికారాలు ఏమీ లేని నిశ్చలస్థితితో శుకుడు వాటిని ఆలకించాడు, తిలకించాడు.

**చ. అతనికి నన్నపానముల నంచితభక్తి నొనర్పఁగాఁ బురో**
**హితు నియమించి యవ్వసుమతీశ్వరుఁ డద్దినశేషయామినుల్**
**చతురము భక్తియుక్తమును సంప్రమదంబునుఁ గా నయించె స**
**స్మితమృదు సారభాషణసమీరణతం దదుపాంతవర్తియై. 270**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ శుకుడికి; అన్నపానములన్= భోజనపానీయాదులను; అంచిత భక్తిన్= గొప్పభక్తితో; ఒనర్పఁగాన్= సమకూర్చటానికి; పురోహితున్= తన కులబ్రాహ్మణుడిని; నియమించి= నియోగించి; ఆ+వసుమతీ+ఈశ్వరుఁడు= ఆ జనకభూపాలుడు; ఆ+దినశేష+యామినుల్= ఆ రోజులో అప్పటికి శేషించి ఉన్న సమయాన్నీ, ఆనాటి రాత్రినీ; చతురమున్= చతురంగానూ (నేర్పుగా); భక్తియుక్తమును= భక్తియుక్తంగానూ; సంప్రమదంబునున్+కాన్= సంతోషంగానూ; సమ్మిత= అంగీకారయోగ్యమైన; మృదు= సుకుమారమైన; సార= విలువైన; భాషణ= సంభాషణలయొక్క; సమ్+ఈరణతన్= ప్రసారంతో; తద్= ఆ శుకునియొక్క; ఉపాంత= సమీపంలో; వర్తియై= కూర్చున్నవాడై; నయించెన్= కడపాడు.

**తాత్పర్యం:** ఒప్పిన భక్తితో శుకుడికి అన్నపానాదులు సమకూర్చటానికని జనకుడు తన పురోహితుడిని నియమించాడు. అవి అయిన తరువాత ఆ దినశేషాన్నీ, ఆ రాత్రినీ హాయిగా, నేర్పుగా, భక్తి ప్రపత్తులతో సారవంతమూ సజ్జనసమ్మతమూ అయిన సంభాషణలతో గడిపాడు జనకమహారాజు. అతడి సన్నిధిని విడిచిపెట్టి మరి ఎక్కడికీ వెళ్ళలేదు. పనికిరాని మాటలు దొర్లలేదు.

**వ. మఱునాఁ డమ్మహీపాలుండు గాలోచితకృత్యంబు లాచరించి కృతకరణీయుండును సుఖాసీనుండునునై యున్నయమ్మునిపాలికి సూరిజన సమేతంబుగాఁ జని పరివేష్టించి యుండి కేలుమోడ్చి 'మీరిట విచ్చేయుటకుం గతంబేమి?' యని సవినయంబుగా నడిగిన నమ్మహాత్ముండు 'మా తండ్రి పంపున మోక్షమార్గబోధార్థినై వచ్చితి విప్రునకుం గర్తవ్యం బెయ్యది? మోక్షం బేమిటం బడయవచ్చు? నెఱింగింపవే!' యనుటయు నతండు సవిశేష సమాదరుండై - 271**

**ప్రతిపదార్థం:** మఱునాఁడు= మరుసటిరోజున; కాల+ఉచితకృత్యంబులు= ఉదయకాలానికి చేయవలసిన స్నానాది విధులను; ఆచరించి= చేసి; కృతకరణీయుండునున్= చేయవలసినవి చేసినవాడూ; సుఖ+ఆసీనుండును+ఐన= సుఖంగా ఆసీనుడై ఉన్నవాడూ అయి; ఉన్న= ఉన్నటువంటి; ఆ+ముని+పాలికిన్= ఆ శుకుడి దగ్గరికి; సూరిజనసమేతంబుగాన్= పండితజన సహితంగా; ఆ+మహీపాలుఁడు= ఆ జనకమహారాజు; చని= వెళ్ళి; పరివేష్టించి ఉండి= ఆయనకు చుట్టూ కూర్చుని; కేలుమోడ్చి= నమస్కరించి; మీరు= తమరు; ఇటన్= ఇక్కడికి; విచ్చేయుటకున్= రావటానికి; కతంబు= కారణం; ఏమి?= ఏమిటి; అని; సవినయంబుగాన్= వినయంతో; అడిగినన్= అభ్యర్థించేసరికి; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు శుకుడు; మా తండ్రి పంపునన్= మా తండ్రిగారి ఆజ్ఞమీద; మోక్షమార్గ= ముక్తిమార్గానికి సంబంధించిన; బోధ= జ్ఞానాన్ని; అర్థినై= కోరినవాడనై; వచ్చితిన్= ఇక్కడకు వచ్చాను; విప్రునకున్= బ్రాహ్మణుడికి; కర్తవ్యంబు= చెయ్యదగినది; ఏ+అది= ఏది?; మోక్షంబు= ముక్తి అనేది; ఏమిటన్= దేనితో; పడయన్ వచ్చున్?= పొందవచ్చును?; ఎఱింగింపవే!= తెలియజెప్పవా! - అనుటయున్= అని శుకుడు అనటమూ; అతండు= ఆ జనకుడు; సవిశేష+సమాదరుండై= విశిష్టమైన ఆదరం కలవాడై.

**తాత్పర్యం:** మరుసటిరోజున ఉదయకాలానికి చేయవలసిన స్నానాది విధులను నిర్వహించి, సుఖాసీనుడైన ఆ శుకుడి దగ్గరికి, పండితజన సహితంగా ఆ జనకమహారాజు వెళ్ళి ఆయన దగ్గర కూర్చుని నమస్కరించి, 'మీరు ఇక్కడికి రావటానికి కారణం ఏమి?' టని సవినయంగా అడిగేసరికి, శుకుడు 'మా తండ్రిగారి ఆజ్ఞమీద, ముక్తి మార్గానికి సంబంధించిన జ్ఞానాన్ని కోరినవాడనై ఇక్కడకు వచ్చాను. బ్రాహ్మణుడు చేయదగినది ఏది? ముక్తి అనేది దేనితో పొందవచ్చును? తెలియజెప్పు'మని జనకుడిని అడుగగా, జనకుడు విశిష్టమైన ఆదరంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

జనకుఁడు శుకున కుపదేశించిన మోక్షధర్మ ప్రకారము: (సం. 12-313-9)

**సీ.** **'విను ముపనీతుఁడై విప్రుండు బ్రహ్మచ । ర్యంబు వేదాభ్యసనంబు నడపి**
**దారసంగ్రహము సంతానసంపాదనం । బును నధ్వరక్రియయును నొనర్చి**
**దేవపిత్రతిథిపూజా విధిపరుఁడగు । చుండి వనమునకు హుతవహప్ర**
**యుతముగఁ జని యందు నతిథులఁ గొనియాడి । వ్రతము గషాయపక్వత నొనర్ప**

**తే.** **నగ్నులాత్మయందు యారోపితములుగఁ । జేసి వీతరాగ చిత్తవృత్తిఁ**
**బరమశాంతిఁ బొంది బ్రహ్మాశ్రమపదంబుఁ । బొందువాఁడు లోకపూజ్యచరిత!'** **272**

**ప్రతిపదార్థం:** లోకపూజ్యచరిత!= లోకానికి పూజింపదగిన ప్రవర్తనకలవాడా! ఓ శుకమహర్షీ!; వినుము; విప్రుండు= బ్రాహ్మణుడు; ఉపనీతుఁడై= ఉపనయనం చేసికొని; బ్రహ్మచర్యంబున్= బ్రహ్మచర్యాన్నీ; వేద+అభ్యసనంబున్= వేదాధ్యయనాన్నీ; నడపి= నిర్వర్తించి; దారసంగ్రహమున్= భార్యను పొందటం (వివాహంతో గృహస్థాశ్రమం స్వీకరించటం); సంతాన సంపాదనంబునున్= పుత్రపౌత్రాదికంగా సంతానం కలగటం; అధ్వరక్రియయునున్= యజ్ఞాలు చెయ్యటం అనేవాటిని; ఒనర్చి= నిర్వహించి; దేవ= దేవతలు; పిత్రు= పితృదేవతలు; అతిథి= అతిథులు - వీరిని; పూజా= అర్చించటమనే; విధి= కర్తవ్యంపట్ల; పరుఁడు= తత్పరుడు; అగుచుండి= అవుతూ (గృహస్థాశ్రమాన్ని) గడపి; హుతవహప్రయుతముగన్= అగ్నిహోత్రంతో సహా; వనమునకున్= అరణ్యానికి; చని= వెళ్ళి (వానప్రస్థం స్వీకరించి); అందున్= అక్కడ కూడా; అతిథులన్= అతిథులను; కొనియాడి= అర్చించి; వ్రతమున్= వానప్రస్థ దీక్షను; కషాయ పక్వతన్= కషాయం పరిపక్వతను పొందినట్లు ('కాషాయపక్వతన్' - అనే పాఠాంతరం ఉంది. 'వైరాగ్య పరిపక్వతలో' అని దాని అర్థం); ఒనర్పన్= నిర్వహించుటకై; అగ్నులు= అగ్నిహోత్రాలను; ఆత్మయందున్+అ= అంతరంగంలోనే; ఆరోపితములుగన్+చేసి= ఆరోపించి; వీతరాగచిత్తవృత్తిన్= తొలగిపోయిన రాగబంధంతో కూడిన మనఃప్రవృత్తితో (వైరాగ్య సంపన్నమైన మనస్సుతో అని); పరమశాంతిన్= గొప్ప ప్రశాంతిని; పొంది= అనుభవించి; బ్రహ్మ+ఆశ్రమపదంబున్= బ్రహ్మాశ్రమము అనబడే జ్ఞానమయ సన్న్యాసాశ్రమాన్ని; పొందువాఁడు= పొందుతాడు. (పొందేవాడు అవుతాడు).

**తాత్పర్యం:** లోకాలకు ఆరాధనీయమైన ప్రవర్తన కలవాడా! అడిగావు కనుక చెప్తున్నాను. ఆలకించుము. బ్రాహ్మణుడు ముందు ఉపనయనం చేసికొని, బ్రహ్మచర్యాశ్రమం స్వీకరించాలి. వేదాధ్యయనం చేయాలి. అటుపైని వివాహం చేసికొని గృహస్థాశ్రమంలోనికి ప్రవేశించాలి. పుత్రపౌత్రాదికంగా సంతానం పొందాలి. గృహస్థుడు చేయవలసిన యజ్ఞయాగాదులు చేయాలి. దేవపూజలూ, పితృపూజలూ, అతిథిపూజలూ తత్పరతతో నిర్వహించాలి. అటుపైని తన నిత్యాగ్నిహోత్రాలతో సహా అరణ్యానికి వెళ్ళి వానప్రస్థం స్వీకరించాలి. అక్కడకూడా అతిథిపూజలు జరపాలి. ఆ దీక్షలో కషాయసమపాకంగా పరిపక్వతను పొందటానికై అగ్నిహోత్రాలను ఆత్మలో నిక్షేపించుకొని, వైరాగ్యపూర్ణమైన మనఃప్రవృత్తితో పరమప్రశాంతిని పొంది, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించాలి. అటువంటి వాడే ఆ బ్రహ్మాశ్రమపదవికి అర్హుడు అవుతాడు'.

**వ.** **అనిన విని యమ్మునివరుండు.** **273**

**ప్రతిపదార్థం:** అనినన్= జనకుడు ఇట్లా అనేసరికి; విని= ఆలకించి; ఆ+మునివరుండు= ఆ మునీశ్వరుడైన శుకుడు.

**తాత్పర్యం:** దీనినంతా ఆ శుకుడు ఆలకించి. (ఇట్లా అంటున్నాడు).

**క.** **'జ్ఞానోదయమైయుండఁగ । మానక వెండియును నాశ్రమత్రయవాసుం**
**డై నిలిచి తత్క్రియాను । ష్ఠానము గ్రమవృత్తి నడపుటయు వలయు నొకో?** **274**

**ప్రతిపదార్థం:** జ్ఞాన+ఉదయమై+ఉండఁగన్= తనంత తాను జ్ఞానోదయమై ఉన్నప్పటికీ; మానక= విడువకుండా; వెండియును= మళ్ళీ; ఆశ్రమత్రయవాసుండై= బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం అనే ఈ మూడు ఆశ్రమాలలోనూ నివసించినవాడై; నిలిచి= ఉండి; తద్= ఆయా ఆశ్రమాలకు చెప్పిన; క్రియా= విధులయొక్క; అనుష్ఠానమున్= ఆచరణను; క్రమవృత్తిన్= యథాక్రమంగా (క్రమప్రక్రియగా); నడపుటయున్= నిర్వహించటంకూడా; వలయున్+ఒకో?= అవసరమంటావా?

**తాత్పర్యం:** జ్ఞానోదయమై ఉండగా విడువకుండా మళ్ళీ మూడు ఆశ్రమాల్లోనూ ఉండి ఆయా ఆశ్రమాల విధులను యథాప్రకారంగా నడపడం అవసరమా!

**తే. జ్ఞానవిజ్ఞాన దృష్టి శాశ్వతిక తత్త్వుఁ । డయ్యెనేనియు విడువరా దాశ్రమముల**
**క్రమ సమారూఢి యనునె వేదములు? దీనిఁ । దెలియఁజెప్పవె మోక్షవిత్తిలకజన్మ .' 275**

**ప్రతిపదార్థం:** మోక్షవిత్= ముక్తివేత్తలయందు; తిలక= శ్రేష్ఠమైన; జన్మ!= పుట్టుక కలవాడా! - జనకమహారాజా!; జ్ఞాన= జ్ఞానమూ; విజ్ఞాన= వివేకమూ అనేవాటితో కూడిన; దృష్టిన్= దర్శనంతో; శాశ్వతిక తత్త్వుఁడు= శాశ్వతమైన పరమాత్మ తత్త్వం తెలిసికొన్నవాడు; అయ్యెన్+ఏనియున్= అయినప్పటికీ; వేదములు= వేదాలు; ఆశ్రమముల= బ్రహ్మచర్యాది ఆశ్రమాల; క్రమసమారూఢి= క్రమ నివాసాన్ని; విడువన్+రాదు= వదలటానికి వీలు లేదు; అనునె?= అంటున్నాయా?; దీనిన్= ఈ విషయాన్ని; తెలియన్= నాకు తెలిసేట్టు; చెప్పవె?= చెప్పవా?

**తాత్పర్యం:** "మోక్షవేత్తలయందు శ్రేష్ఠమైనజన్మకలవాడా! జ్ఞానము వివేకమూ కలిగి శాశ్వతమైన పరమాత్మతత్త్వాన్ని తెలుసుకొన్నాకుండా(బ్రహ్మచర్యాలు) ఆశ్రమాలన్నింట క్రమంగా నివసించడం విడువరాదని వేదాలంటాయా? దీనిని తెలియజేప్పుము''.

**వ. అనవుడు నతం డతని కిట్లనియె. 276**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని శుకుడు అనేసరికి; అతండు= ఆ జనకుడు; అతనికిన్= శుకుడికి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** అని శుకుడు అనగా జనకుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**తే జ్ఞానవిజ్ఞానములు మోక్షసాధనములు । గురుని యుపదేశమున నవి దొరకొనంగ**
**వాన మోక్షంబు గాంచినవాఁడు విడుచు । నయ్యుపాయద్వయమ్మును నతులబుద్ధి. 277**

**ప్రతిపదార్థం:** జ్ఞానవిజ్ఞానములు= విద్యావివేకాలు; మోక్షసాధనములు= మోక్షానికి ఉపకరణాలు; గురుని= గురువుయొక్క; ఉపదేశమునన్= ఉపదేశంతో; అవి; దొరకొనంగన్= లభిస్తే; వానన్= వాటితో; మోక్షంబు= ముక్తి; కాంచినవాఁడు= పొందినవాడు; అతులబుద్ధిన్= సాటిలేని ధీశక్తితో; ఆ+ఉపాయద్వయమ్మును= ఆ రెండు ఉపాయాలనూ; విడుచున్= విడిచిపెట్టేస్తాడు.

**తాత్పర్యం:** మోక్షసాధనాలైన జ్ఞానవిజ్ఞానాలను సద్గురుడి ఉపదేశం వలన పొంది వాటితో ముక్తి సంపాదించినవాడు కట్టకడపటికి తన బుద్ధిపటిమతో ఆ రెండుసాధనాలనూ కూడా వదిలివేస్తాడు. (అతులబుద్ధి అనే సమాసాన్ని బహువ్రీహిగా శుకుడికి సంబోధనకూడా చేయవచ్చును.)

**క. లోకోచ్ఛేదముఁ గర్మ । వ్యాకులతయుఁగాక యుండవలయుటకై సు**
**శ్లోకా! చతురాశ్రమములు । గైకొని నడిపిరి దృఢంబుగాఁ బూర్వమునుల్. 278**

**ప్రతిపదార్థం:** సుశ్లోకా!= పొగడదగినవాడా!; లోక+ఉచ్ఛేదమున్= లోక వినాశమూ; కర్మవ్యాకులతయున్= కర్మాచరణలోసాంకర్యమూ

(కలత); కాక= జరగకుండా; ఉండన్+వలయుటకై= ఉండటంకోసం; పూర్వమునుల్= మన పూర్వమహర్షులు; చతుర్+ఆశ్రమములు= నాలుగు ఆశ్రమాలు; కైకొని= స్వీకరించి; దృఢంబుగాన్= కట్టుదిట్టంగా; నడిపిరి= నడిపారు (సమాజాన్ని నడిపారు).

**తాత్పర్యం:** స్తుతింపదగినవాడా! లోకవినాశమూ, కర్మసాంకర్యమూ జరగకుండా ఉండటంకొరకే బ్రహ్మచర్యాది ఆశ్రమాలను నాల్గింటిని ఏర్పాటుచేసి మన పూర్వమహర్షులు ఆ ఆశ్రమధర్మాలను దృఢంగా నడిపారు, నడిపించారు.

**తే.** **అందుఁ దుదముట్ట నడచిన నందవచ్చు । ముక్తి బహుజన్మ సంసిద్ధమోక్షకార**
**ణముల శుద్ధుఁడై ప్రథమాశ్రమమునయంద । కాంచు మోక్ష మెందేని నొక్కరుఁడు మునిప! 279**

**ప్రతిపదార్థం:** మునిప!= మునీశ్వర!; అందున్= ఆశ్రమచతుష్టయమార్గంలో; తుదముట్టన్= కట్టకడపటిదాకా; నడచినన్= నడిచినట్లయితే; ముక్తిన్= మోక్షాన్ని; అందవచ్చున్= పొందవచ్చు; ఎందేనిన్= ఎక్కడయినా (అరుదుగా); ఒక్కరుఁడు= ఒక వ్యక్తి; బహుజన్మ= పూర్వానేక జన్మలలో; సంసిద్ధ= లభించిన; మోక్షకారణములన్= మోక్షసాధనాలతో; శుద్ధుఁడై= శుద్ధి పొందినవాడై; ప్రథమ+ఆశ్రమున+అందున్+అ= మొదటిదైన బ్రహ్మచర్యాశ్రమంలోనే; మోక్షమున్= ముక్తిని; కాంచున్= పొందుతాడు.

**తాత్పర్యం:** మునీశ్వరా! ఈ ఆశ్రమాల వరుసలో ప్రయాణం చేసేవాడు కట్టకడపటిదాకా యథావిధిగా నడిస్తే ముక్తి పొందుతాడు. అట్లాకాక అరుదుగా ఎక్కడైనా ఒక వ్యక్తికి పూర్వజన్మల సంస్కారం వలన ముక్తిహేతువులు సిద్ధిస్తే అతడు ఈ జన్మలో ప్రథమాశ్రమంలోనే - బ్రహ్మచర్యాశ్రమంలోనే - ముక్తిని కైవసం చేసికొంటాడు. అట్లా జరుగవచ్చును.

**క.** **వానికి మూఁడాశ్రమముల । లో నిలువఁ బ్రయోజనంబులుం గలవె? తమోz**
**ధీనతను రజఃపరత । న్మానవలయుఁ గాక? సత్త్వనైష్ఠికమతియై. 280**

**ప్రతిపదార్థం:** సత్త్వనైష్ఠికమతియై= సత్త్వనిష్ఠకుదురుకొన్న మతికలవాడై; తమః+అధీనతను= తమోగుణానికి లొంగిపోవటం; రజఃపరతన్= రజోగుణానికి పరతంత్రు కావటం అనేవాటిని; మానవలయున్+కాక= విడిచిపెట్టాలే తప్ప; వానికిన్= అటువంటి అరుదైన వ్యక్తికి; మూఁడు+ఆశ్రమములలోన్= బ్రహ్మచర్యాదికమైన మొదటిమూడు ఆశ్రమాలలోనూ; నిలువన్= ఉండటంవలన; ప్రయోజనంబులున్+కలవె?= ఉపయోగాలు ఏమయినా ఉన్నాయా? (లేవు అని భావం.)

**తాత్పర్యం:** పూర్వజన్మల సంస్కారాలవలన మోక్షహేతులు ఈ జన్మలో సిద్ధించిన అరుదైన వ్యక్తి మొదటి మూడు ఆశ్రమాలలోనూ వరుసగా కాలం గడపవలసిన అవసరం ఏమీ లేదు. అట్లా గడపినందువలన ప్రత్యేక ప్రయోజనమూ లేదు. కాకపోతే అతడు తమోగుణానికీ రజోగుణానికీ లొంగిపోకుండా సత్త్వగుణనిష్ఠ కలిగినవాడై ఉండాలి. అంతే.

**తే.** **సత్త్వమార్గాభిరతి యాత్మతత్త్వదర్శ । నంబు గావింపఁ దనుఁ దాన నరుఁడు గాంచు**
**విశ్వమునఁ దానుఁ దనయందు విశ్వమును వ । సించుటయుఁ జూచుచును ముక్తిఁ జెందియుండు.281**

**ప్రతిపదార్థం:** సత్త్వ= సత్త్వగుణసంపన్నమైన; మార్గ= విధానంలో; అభిరతి= ఆసక్తి అనేది; ఆత్మతత్త్వ= ఆత్మతత్త్వానికి సంబంధించిన; దర్శనంబు= దర్శనాన్ని (ఆత్మసాక్షాత్కారాన్ని); కావింపన్= కలిగిస్తే; నరుఁడు= సాధకుడు; తనున్= తనను; తాను+అ= తానే; కాంచున్= దర్శిస్తాడు; విశ్వమునన్= ప్రపంచంలో; తానున్= తానూ; తనయందున్= తనలో; విశ్వమును= ప్రపంచం; వసించుటయున్= ఉండటం అనేదాన్ని కూడా; చూచుచును= దర్శిస్తూ; ముక్తిన్= విముక్తిని; చెందియుండున్= పొందుతాడు.=

**తాత్పర్యం:** నరుడు సాత్త్వికప్రవృత్తివలన ఆత్మతత్త్వాన్ని తెలిసికొంటాడు. దానివలన తనను తాను దర్శించగలుగుతాడు. ఆత్మజ్ఞుడు అవుతాడు. అప్పుడు విశ్వంలో తననూ, తనలో విశ్వాన్నీ చూడగలుగుతాడు. రాగద్వేషాది బంధాలనుంచి విముక్తి పొందిన స్థితితో జీవిస్తూ ఉంటాడు.

**వ. ఇవ్విషయంబున యయాతి వాక్యంబులు గల వాకర్ణింపుము. 282**

**ప్రతిపదార్థం:** ఈ+విషయంబునన్= ఈ అంశంలో; యయాతి వాక్యంబులు= యయాతి చెప్పిన మాటలు; కలవు= ఉన్నాయి; ఆకర్ణింపుము= చెప్తాను వినుము.

**తాత్పర్యం:** ఈ విషయమై యయాతి చెప్పిన మాటలను వినుము.

**ఆ. జ్యోతి యాత్మయంద యున్నది కాన శ । క్యము సమాహితాత్ముఁడైన మునికి**
**నొరులవలనఁ దనకు నొరులకుఁ దన దెస । భయము లేకయున్నఁ బరముఁ గాంచు. 283**

**ప్రతిపదార్థం:** జ్యోతి= తేజస్సు (పరమాత్మ); ఆత్మయందున్+అ= నరుడి ఆత్మలోనే; ఉన్నది= ఉంది; సమాహిత+ఆత్ముఁడు+ఐన= ఏకాగ్రచిత్తం కలవాడైన; మునికిన్= జ్ఞానికి; కానన్= ఆ జ్యోతిని దర్శించటం; శక్యము= సాధ్యమే; ఒరులవలనన్= ఇతరులవలన; తనకున్= తనకూ; ఒరులకున్= ఇతర జీవులకూ; తనదెసన్= తనవలనా; భయము= భీతి అనేది; లేక+ఉన్నన్= లేకపోయినట్లయితే (నిర్భయస్థితిలో); పరమున్= పరమాత్మను; కాంచున్= దర్శిస్తాడు.

**తాత్పర్యం:** జ్యోతిస్స్వరూపమైన పరతత్త్వం ప్రతివ్యక్తికీ ఆత్మలోనే ఉంటుంది. ఏకాగ్రత సాధించిన మునీశ్వరుడు ఆ జ్యోతిని తనలో తాను దర్శించగలుగుతాడు. ఇతరులవలన తనకూ, తనవలన ఇతరులకూ ఏ విధమైన భయమూ లేని నిర్భయస్థితి అలవడినప్పుడు పరమాత్మను సాధకుడు చూడగలుగుతాడు.

**క. కోరికయు నొల్లమియు లే । కే రూపున భూతములకు నెగ్గగు తెఱఁగుం**
**జేరక యకామవృత్తిఁ ద । పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్. 284**

**ప్రతిపదార్థం:** కోరికయున్= ఒకటి కావాలి అనుకోవటంగానీ; ఒల్లమియున్= ఒకటి వద్దు అనుకోవటంగానీ; లేక= లేకుండా; ఏ రూపునన్= ఏ రకంగానూ; భూతములకున్= ప్రాణికోటికి; ఎగ్గు+అగు+తెఱఁగున్= అపకారం చేసే పద్ధతిని; చేరక= చేరకుండా; అకామవృత్తిన్= నిష్కామప్రవర్తనతో (కోరికలు లేని జీవనవిధానంతో); తపోరతిన్= తపస్సు పట్ల గాఢమైన ఆసక్తితో; ఉన్న+అతఁడు= ఉన్న వ్యక్తి; బ్రహ్మమున్= పరమాత్మను (పరబ్రహ్మను); ప్రాపించున్= పొందుతాడు (బ్రహ్మసాక్షాత్కారం అతడికి అవుతుంది).

**తాత్పర్యం:** రాగమూ, ద్వేషమూ అనేవి లేకుండా ఏ ప్రాణికీ అపకారం చెయ్యకుండా సర్వభూతహితుడై, నిష్కామంగా తపస్సు చేసికొనే సాధకుడు పరబ్రహ్మను పొందగలుగుతాడు.

**క. వినఁ జూడం బడు నం దె । ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం**
**బున సుఖదుఃఖాదిద్వం । ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁ గనున్. 285**

**ప్రతిపదార్థం:** వినన్+పడునందెల్లనున్= వినబడే అన్నింటిలోనూ; చూడన్+పడునందున్+ఎల్లనున్= కనపడే అన్నింటిలోనూ; సమతన్= సమదృష్టితో; పరమున్= పరమాత్మను; కనుచున్= దర్శిస్తూ; లౌల్య= లోలత్వంయొక్క; నిరసనంబునన్= పరిత్యాగంతో (లోలుడు కాకుండా); సుఖదుఃఖాది= సుఖదుఃఖాలూ - రాగద్వేషాలూ మొదలైన; ద్వంద్వ= జంటలలో; నిరూఢుఁడు+కాక= తగుల్కొనవాడు కాకుండా; ఉన్న+అతఁడు= జీవించగలిగిన వ్యక్తి; ముక్తిన్= విముక్తిని (మోక్షాన్ని); కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** వినబడే, కనబడే సర్వవిషయాలలోనూ సమదృష్టితో పరమాత్మనే చూడగలిగి, దేనిలోనూ లోలుడు కాకుండా, రాగద్వేష సుఖదుఃఖాదికమైన ద్వంద్వాలకు అతీతంగా, జీవితం గడపగలిగినవాడు తప్పకుండా ముక్తి పొందుతాడు.

**క. ఇనుమును గనకము నిందయు । వినుతియు సమములుగఁ గొనుచు వివిధాంగకముల్**
**దనలోన నడఁచు కమఠము । ననువున నింద్రియము లడఁచునతఁడు గను శివున్.' 286**

**ప్రతిపదార్థం:** ఇనుమును= ఇనుమునూ; కనకమున్= బంగారాన్నీ; నిందయున్= నిందనూ; వినుతియున్= స్తుతినీ; సమములుగన్= సమానంగా; కొనుచున్= పరిగణించి పరిగ్రహిస్తూ; వివిధ+అంగకముల్= అన్ని అవయవాలనూ; తనలోనన్= తన డిప్పలోనే; అడఁచు= ముడుచుకొనే; కమఠము (యొక్క)+అనువునన్= తాబేలు చందంగా; ఇంద్రియములు= తన ఇంద్రియాలను; అడఁచు+అతఁడు= నిగ్రహించేవాడు; శివున్= పరమాత్మను; కనున్= దర్శిస్తాడు.

**తాత్పర్యం:** ఇనుమునూ, బంగారాన్నీ సమానంగా చూడగలగాలి. పొగడ్తనూ, తెగడ్తనూ ఒక్కలాగే స్వీకరించగలగాలి. తాబేలు తన కాళ్ళూ, చేతులూ, తలా మొదలైన అన్ని అవయవాలనూ సాచి మళ్ళీ డిప్పలోకి ఉపసంహరించు కొంటున్నట్లుగా- లేదా - సంకోచపరచుకొంటున్నట్లుగా సాధకుడు సర్వేంద్రియాలను నిగ్రహించుకొనగలగాలి. అటు వంటి వ్యక్తి మాత్రమే శివుడిని దర్శించగలుగుతాడు.'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని చెప్పి. 287**

**ప్రతిపదార్థం:** అని= యయాతి వాక్యాలుగా వీటిని; చెప్పి= జనకుడు వినిపించి-

**తాత్పర్యం:** అని చెప్పి (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అవ్విశేషంబు లెల్ల నీయందుఁ గలుగు । టనఘ! భవదీయ జనకదయాసమృద్ధి**
**సిద్ధ దివ్యబోధంబునఁ జేసి తోఁచె । నవ్విధముకంటె నీ చంద మధికతరము. 288**

**ప్రతిపదార్థం:** అనఘ!= పావనుడా!; ఆ+విశేషంబులు+ఎల్లన్= పైని చెప్పిన ఆ విశేషాలు అన్నీ; నీయందున్= నీలో; కలుగుట= ఉండటం; భవదీయ= నీయొక్క; జనక= తండ్రియైన వ్యాసుని; దయాసమృద్ధి= పుష్కలమైన కృపచేత; సిద్ధ= సిద్ధించిన; దివ్యబోధంబునన్+చేసి= దివ్యజ్ఞానం చేత; తోఁచెన్= జరిగినది; ఆ+విధముకంటెన్= ఆ సాత్త్విక పద్ధతికన్నా; నీ చందము= నీ విధం; అధికతరము= మిక్కిలి గొప్పది.

**తాత్పర్యం:** పవిత్రుడా! పైని చెప్పిన సాత్త్వికపద్ధతులన్నీ నీలో ఉన్నాయి. అది మీ తండ్రిగారి దయావిశేషంవలన నీకు లభించిన జ్ఞానంతో సిద్ధించింది. నిజం చెప్పాలంటే నీ పద్ధతి అంతకన్నా గొప్పది.

**క. నీ వట్టిఁడ వగు టెఱుఁగవు । భావంబున సంశయమును భయమును బాల్యం**
**బావేశింపఁగఁ జేయ న । భావితనిశ్చయుఁడ వగుటఁ బరమమునీంద్రా! 289**

**ప్రతిపదార్థం:** పరమమునీంద్రా!= అత్యుత్తమ మహర్షీ!; బాల్యంబు= పిన్నవయస్సు అనేది; భావంబునన్= అంతరంగంలో;

సంశయమును= సంశయమూ; భయమును= భయమూ (వెరపూ) అనేవాటిని; ఆవేశింపఁగన్+చేయన్= ఎక్కువగా కలిగిస్తున్నందువలన; అభావితనిశ్చయుఁడవు= నిశ్చయం లేనివాడవు; అగుటన్= కావటంచేత; నీవు; అట్టిఁడవు= అంతటివాడవు (అటువంటి గొప్పవాడవు); అగుటన్= కావటం; ఎఱుఁగవు= గుర్తించలేకపోతున్నావు.

**తాత్పర్యం:** ఓ ఉత్తమోత్తమ మునీశ్వరా! నిజానికి నీవు మీ తండ్రి అంతటివాడవే. కానీ నీ బాల్యమనేది నీ మనస్సులో కొంత సంశయాన్నీ, కొంత భయాన్నీ ఆవేశింపజేస్తున్నది. దానితో నీ వొక నిశ్చయానికి రాలేక నిన్ను నీవు అంతటి వాడుగా గుర్తించలేకపోతున్నావు. అంతే సుమా!

**విశేషం:** బాల్యం సంశయభయాలను ఆవేశింపజేస్తున్నది అన్నట్టుగా అన్వయిస్తున్నది ఈ పద్యం. కానీ మూలంలో బాల్యం కూడా ఒక హేతువుగా కనపడుతున్నది. **"బాల్యాద్వా సంశయాద్వాపి భయాద్వాప్యవిమోక్షజాత్ । ఉత్పన్నే చాపి విజ్ఞానే నాధిగచ్ఛతి తాం గతిమ్॥" (12-313-45)**

**క. జ్ఞానము విజ్ఞానము నీ । మానిత గుణము లగు నవి సమగ్రములైనం**
**గానేరదు మోక్షపదము । గానుపు - దృఢనిశ్చయుండు గాకున్నేనిన్. 290**

**ప్రతిపదార్థం:** జ్ఞానము= జ్ఞానమూ; విజ్ఞానము= విజ్ఞానమూ; నీ= నీయొక్క; మానితగుణములు+అగున్= గొప్ప గుణాలు అయ్యాయి - నిజమే; అవి= ఆ రెండూ; సమగ్రములు+ఐనన్= పరిపూర్ణాలు అయినా; దృఢనిశ్చయుండు= దృఢమైన నిశ్చయం కలవాడవు; కాకున్న+ఏనిన్= కానట్లయితే; మోక్షపదము+కానుపు= మోక్షపదం యొక్క దర్శనం; కానేరదు= జరగబోదు.

**తాత్పర్యం:** శుకమహర్షీ! జ్ఞానం, విజ్ఞానం అనేవి నీ గొప్ప గుణాలు అనటం నిజమే. అవి ఎంత సమగ్రంగా నీలో ఉన్నా నీవు బాల్యం వలన కలిగే సంశయభయాలను విడిచిపెట్టి దృఢనిశ్చయానికి రాకపోతే ముక్తిపదవీదర్శనం జరుగదు సుమా!

**తే. ఒక్క కొఱఁతయు లేదు నీ వుదితమోక్ష । బోధుఁడవు సంశయములెల్లఁ బోవవిడిచి**
**నిశ్చయింపుము నీ కన్న నెలవు శాశ్వ । తంపు నెలవుగ విషయావికంపితాత్మ!' 291**

**ప్రతిపదార్థం:** విషయ= నృత్యగీత సౌందర్యాదులూ ద్వంద్వాలూ మొదలైన విషయాలకు; అవికంపిత= చలించని; ఆత్మ!= అంతరంగం కలవాడా!; ఒక్క కొఱఁతయున్= ఒక్కటంటే ఒక్క లోటుకూడా; లేదు= నీలో లేదు; నీవు; ఉదిత= సిద్ధించిన; మోక్షబోధుఁడవు= మోక్షజ్ఞానం కలవాడవు; సంశయములు+ఎల్లన్= సందేహాలన్నీ; పోవన్+విడిచి= పారద్రోలి; నీ+కన్న+నెలవు= నీవు దర్శించిన చోటు; శాశ్వతంపు+నెలవుగన్= శాశ్వతస్థానంగా; నిశ్చయింపుము.

**తాత్పర్యం:** నిశ్చలమైన మనస్సు కలవాడా! నీకు ఏ లోటూ లేదు. నీవు మోక్షజ్ఞానివి. సంశయాలు అన్నీ విడిచిపెట్టుము. నీవు దర్శించిన చోటునే ఈ శాశ్వతనివాసంగా నిశ్చయించుకొమ్ము.

**విశేషం:** ఇక్కడ మూలభారతంలో శుకుడిని ప్రశంసించే శ్లోకాలు మూడు ఉన్నాయి. 'మహర్షీ! నీకు సుఖదుఃఖాలకు తేడా లేదు. దేనికీ లోలుడవు కావు. నృత్తగీతాలపట్ల ఔత్సుక్యం లేదు. రాగమూ లేదు. బంధువులపట్ల అనుబంధం లేదు. భయమూ లేదు. మట్టినీ, బంగారాన్నీ సమానంగా చూడగలిగిన మహానుభావుడవు నీవు. అక్షయమూ, అనామయమూ అయిన మోక్షమార్గాన్ని పొందినవాడవుగా నిన్ను నేనూ తక్కిన ఈ మనీషులూ భావిస్తున్నాం. **"నాస్తి తే సుఖదుఃఖేషు విశేషో నాస్తి లోలుపా(?) నౌత్సుక్యం నృత్తగీతేషు న రాగ ఉపజాయతే (48). న బంధుషు నిబంధస్తే న భయేష్వస్తి తే భయమ్ । పశ్యామి త్వాం మహాభాగ తుల్యలోష్టాశ్మకాంచనమ్ ॥ (49). అహం చ త్వామనుపశ్యామి యే చాప్యన్యే మనీషిణః । ఆస్థితం పరమం మార్గమక్షయం**

**తమనామయమ్॥"** (50). ఈ మూడు శ్లోకాల సారాన్నీ తిక్కన 'విషయాకంపితాత్మ!' అనే సంబుద్ధిలోనికి సంగ్రహించాడు.

**శుకుఁడు హిమవంతంబున నున్న వ్యాసునియొద్దకు వచ్చుట (సం. 12-314-2)**

**క. అని బోధించిన జనకు వ । చనములు విని శుకుఁడు విగతసంశయుఁడై శాం**
**తినిరూఢిఁ బరమసౌఖ్యం । బు నొంది తనుఁ దాన కనుచుఁ బోవుచునుండెన్. 292**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; బోధించిన= ఉపదేశించిన; జనకు= జనకమహారాజుగారి; వచనములు= పలుకులు; విని= ఆలకించి; శుకుఁడు= శుకమహర్షి; విగత= తొలగిపోయిన; సంశయుఁడై= సంశయాలు కలవాడై (సంశయాలు తొలగినవాడై); శాంతి= మనశ్శాంతియొక్క; నిరూఢిన్= స్థిరసంప్రాప్తితో; పరమసౌఖ్యంబున్= గొప్ప సౌఖ్యాన్ని; ఒంది= పొంది; తనున్= తనను; తాను+అ= తానే; కనుచున్= దర్శిస్తూ; పోవుచున్+ఉండెన్= ప్రయాణం సాగిస్తున్నాడు.

**తాత్పర్యం:** జనకుడి ఉపదేశంతో శుకుడి సంశయాలు తీరిపోయాయి. శాంతీ సౌఖ్యమూ గాఢంగా లభించాయి. అంతర్దర్శనం ఏర్పడింది. ప్రయాణం అయ్యాడు.

**తే. మారుతముతో సమానధర్మత్వమొంది । యతఁ డుదఙ్ముఖుడై నిఖిలామరులును**
**మునులు గరుడగంధర్వాదులును గుతూహ । లమున వసియించు శిశిరశైలమున కరిగె. 293**

**ప్రతిపదార్థం:** మారుతముతోన్= వాయువుతో; సమానధర్మత్వము= సమానమైన లక్షణాన్ని; ఒంది= పొంది; అతఁడు= ఆ శుకుడు; ఉదక్+ముఖుడు+ఐ= ఉత్తరదిక్కుకు అభిముఖుడై; నిఖిల+అమరులును= సమస్తదేవతలూ; మునులున్= మునులూ; గరుడగంధర్వ+ఆదులును= గరుత్మంతుడూ, గంధర్వులూ మొదలైన దివ్యజాతులవారూ; కుతూహలమునన్= ఉత్సుకతతో; వసియించు= నివసించే; శిశిరశైలమునకున్= చలిమలకు (హిమవత్పర్వతానికి); అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** శుకుడు ఉత్తరదిశగా బయలుదేరాడు. వాయువేగంతో ఆకాశమార్గాన సాగిపోయాడు. సకలదేవతలూ, మునులూ గరుడగంధర్వాదులూ ముచ్చటపడి నివసించే హిమశైలానికి వెళ్ళాడు.

**సీ. కురువంశముఖ్య! యగ్గిరి పుణ్యవిభవస । మేతంబు విను మమ్మహీధరమునఁ**
**బరమేశ్వరుండు దపం బేకపాదస్థుఁ । డై బహువర్షంబు లాచరించెఁ,**
**బుత్రలాభార్థిత్వమునఁ గృష్ణుఁ దుత్కృష్ట । నియమాచరణములు నిష్ఠ సలిపె,**
**షణ్ముఖుం డాత్మీయశక్తి ప్రభావంబుఁ । దెలిపి దేవాధికతేజుఁ డయ్యె,**

**తే. మఱియుఁ బెక్కండ్రు మునులు నమర్త్యులును సు । చరితములఁ బెంపునొంది, రా శైల మా వృ**
**షాంకునకుఁ గూఁతునిచ్చె, యాగాంగయోని । యగుట నజుఁడు దదాత్మత్వమర్థిఁబొందె. 294**

**ప్రతిపదార్థం:** కురువంశముఖ్య!= కురువంశంలో ప్రధానుడవైన ఓ ధర్మరాజా!; ఆ+గిరి= ఆ హిమవత్పర్వతం; పుణ్యవిభవ= పుణ్యవైభవంతో; సమేతంబు= కూడుకొన్నది; వినుము; ఆ+మహీధరమునన్= ఆ పర్వతంమీద; పరమేశ్వరుండు= శివుడు; ఏకపాదస్థుఁడై= ఒంటికాలిమీద నిలిచి; తపంబు= తపస్సు; బహువర్షంబులు= చాలా సంవత్సరాలు; ఆచరించెన్= చేశాడు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; పుత్రలాభ+అర్థిత్వమునన్= తనకు కొడుకు పుట్టాలి అనే కోరికతో; ఉత్కృష్ట= శ్రేష్ఠమైన; నియమ= తపోనియమాల; ఆచరణములు= ఆచరణాలను (నియమాలను ఆచరించటాలు); నిష్ఠన్= దీక్షతో (నిష్ఠతో); సలిపెన్= జరిపాడు; షట్+ముఖుండు= ఆరు ముఖాలుగల కుమారస్వామి; ఆత్మీయ= తనయొక్క; శక్తి= శక్తి అనే ఆయుధం తాలూకు; ప్రభావంబున్= మహిమను; తెలిపి= ప్రకటించి; దేవ+అధిక= దేవతలందరిలోకీ అధికమైన; తేజుఁడు= పరాక్రమం కలవాడు; అయ్యెన్= అయ్యాడు-

సకలదేవతలలోకీ అధికతేజస్వి అయ్యాడు; మఱియున్= ఇంకా; పెక్కండ్రు= పలువురు; మునులు= ఋషులూ; అమర్త్యులును= దేవతలూ; సుచరితములన్= మంచి చరిత్రలతో - తపోనియమాల ఆచరణలతో; పెంపున్+ఒందిరి= ప్రసిద్ధి పొందారు (అతిశయించారు); ఆ+శైలము= ఆ హిమవత్పర్వతం; వృష+అంకునకున్= వృష(భ) వాహనుడైన శివుడికి; కూఁతున్+ఇచ్చెన్= కూతురునిచ్చి వివాహం చేశాడు; యాగ+అంగ+యోని= యజ్ఞయాగాలకు అవసరమైన వస్తువులకు (అంగాలకు) జన్మస్థలం; అగుటన్= అవ్వటంవలన; అజుఁడు= బ్రహ్మదేవుడు; తద్+ఆత్మత్వము= హిమవంతుడి హృదయస్థానాన్ని; అర్థిన్= కోరికతో; పొందెన్= పొందాడు; బ్రహ్మదేవుడే తానై కోరి హిమశైలాత్మ అయ్యాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పరమపవిత్రమూ, పుణ్యప్రదమూ అయిన ఆ హిమవత్పర్వతం గురించి చెప్తుతాను వినుము. పరమేశ్వరుడు ఒంటికాలిమీద నిలబడి వేల సంవత్సరాలు అక్కడ తపస్సు చేశాడు. కొడుకు పుట్టాలి - అనే కోరికతో విష్ణుమూర్తి (శ్రీకృష్ణుడు) కఠిన నియమాలతో తపస్సు చేసింది అక్కడే. షణ్ముఖుడు తన శక్త్యాయుధం మహిమను దేవతలకందరికీ ప్రదర్శించి అత్యధిక తేజస్వంతుడుగా నిరూపణ పొందిందీ అక్కడే. ఇంకా చాలామంది మునులూ, దేవతలూ తమ తమ తపోదీక్షలతో ప్రశస్తి పొందిందీ అక్కడే. ఆ శైలరాజే తన కూతురు పార్వతిని శివుడికి ఇచ్చి వివాహం చేశాడు. యజ్ఞావసర వస్తువుల కన్నింటికీ ఆ పర్వతం పుట్టిల్లు. అందుకని బ్రహ్మదేవుడు కోరి ఆ పర్వతాత్మ అయ్యాడు. (అంటే హిమవత్పర్వతం పరబ్రహ్మస్వరూపం అని. ఇంకా భీష్ముడు చెప్తుతున్నాడు.)

**వ.** **అట్టి మహామహిమ గలుగు నా హిమవంతంబునకు మున్న వచ్చి సుమంతు వైశంపాయన జైమిని పైలనామధేయు లగు శిష్యులం గరుణావిధేయుండగు సాత్యవతేయుం డధ్యయనంబు సేయించుచుండం బుణ్యతమంబగు తదాశ్రమంబు భానుప్రభానిభంబగు నిజకాంతి విసరంబున వెలుంగ నయ్యారణేయుం డమ్ముని పాలికింజని తాను యోగబలంబున ననేకంబులైన గిరిసరిదరణ్యంబులు గడచి యెందునుం దగులువడక కార్ముకజ్యానిర్ముక్త శరంబుచందంబున నేతెంచుటకుం బ్రీతుండగు నప్పరాశరనందను పాదంబుల కభివందనంబు సేసిన నతం డభినందింప నాసన్నక్షమాసీనుండై జనకజననాథసంవాదవిధంబు విన్నవించి విశేషసమ్మదం బావహించె నిట్లరణిసుతు సమాగంబు నొంది. 295**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; మహామహిమ= గొప్ప మహత్తు; కలుగు= కలిగిన; ఆ హిమవంతంబునకున్= ఆ హిమవత్పర్వతానికి; మున్ను+అ+వచ్చి= ముందే చేరుకుని; సుమంతు= సుమంతుడూ; వైశంపాయన= వైశంపాయనుడూ; జైమిని; పైల= పైలుడూ అనే; నామధేయులు+అగు= పేర్లు కలవారైన; శిష్యులన్= శిష్యులను; కరుణావిధేయుండు+అగు= దయకు లొంగిపోయినవాడైన (దయాశీలి); సాత్యవతేయుండు= సత్యవతీదేవి కుమారుడు - వ్యాసుడు; అధ్యయనంబు= వేదాభ్యాసం; చేయించుచుండన్= చేయిస్తూ ఉండగా; పుణ్యతమంబు+అగు= అధికపుణ్యప్రదమైన; తద్+ఆశ్రమంబు= ఆ ఆశ్రమం; భానుప్రభా= సూర్యకాంతితో; నిభంబు+అగు= సాటివచ్చేదయిన; నిజ= తనయొక్క; కాంతివిసరంబునన్= తేజఃపుంజంతో; వెలుంగన్= ప్రకాశించగా; ఆ+ఆరణేయుండు= అరణి సంభవుడైన ఆ శుకుడు; ఆ+ముని+పాలికిన్= ఆ వ్యాసమహర్షి సమీపానికి; చని= వెళ్ళి; తాను; యోగబలంబునన్= యోగశక్తితో; అనేకంబులు+ఐన= అసంఖ్యాకాలైన; గిరి= పర్వతాలూ; సరిత్= నదులూ; అరణ్యంబులు= అడవులూ; కడచి= దాటుకుంటూ; ఎందునున్= ఎక్కడా కూడా; తగులు+పడక= మనస్సు సంలగ్నంకాక; కార్ముక= ధనుస్సుయొక్క; జ్యా= అల్లెత్రాడునుంచి; నిర్ముక్త= విడువబడిన; శరంబు+చందంబునన్= బాణంవలె; ఏతెంచుటకున్= తిరిగివచ్చినందుకు; ప్రీతుండు+అగు= సంతోషించినవాడైన; ఆ+పరాశరనందను= ఆ వ్యాసునియొక్క; పాదంబులకున్= చరణాలకు; అభివందనంబు= నమస్కారం; చేసినన్= చేసేసరికి; అతండు= ఆ వ్యాసుడు; అభినందింపన్= మెచ్చుకోగా; ఆసన్న= సమీపమందలి; క్షమా= నేలమీద; ఆసీనుండై= కూర్చున్నవాడై; జనక జననాథ= జనకమహారాజుతో జరిగిన; సంవాద=

సంభాషణయొక్క; విధంబున్= పద్ధతిని; విన్నవించి= మనవిచేసి; విశేష= అత్యధికమైన; సమ్మదంబున్= సంతోషాన్ని; ఆవహించెన్= కలిగించాడు; ఇట్లు; అరణిసుతు= శుకమహర్షియొక్క; సమాగమంబున్= కలయికను; ఒంది= పొంది.

**తాత్పర్యం:** అటువంటి హిమాలయానికి శుకుడికంటే ముందే వ్యాసుడు చేరుకున్నాడు. సుమంతు వైశంపాయన జైమిని పైలులనే నలుగురు శిష్యులకు వేదం నేర్పుతున్నాడు. అటువంటి దయాశాలి నివసిస్తున్న ఆశ్రమం సూర్యకాంతితో ప్రకాశిస్తోంది. శుకుడు అక్కడికి చేరుకొన్నాడు. తాను యోగబలంతో నానాగిరినదీనదాలు దాటి ఎక్కడా చిక్కుపడక ధనుస్సునుండి వెలువడిన బాణంవలె తన పుత్రుడు తిరిగిరావటాన్ని వ్యాసుడు సంతోషించాడు. శుకుడు పాదాభివందనం చేసి చేరువలో నేలమీద కూర్చున్నాడు. జనకుడితో జరిపిన సంభాషణ అంతా విన్నవించాడు. వ్యాసుడికి పరమానందం అయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **అమ్మునియును శిష్యులతో । నమ్మహితాత్ము నునుచికొని యధ్యాపనశీ**
**లమ్మగు చిత్తముతోడ సు । ఖమ్ముండఁగ నొక్కనాఁడు గౌరవమొప్పన్.** **296**

**ప్రతిపదార్థం:** ఆ+మునియును= ఆ వ్యాసుడుకూడా; శిష్యులతోన్= తన నలుగురు ఛాత్రులతోనూ; ఆ+మహితాత్మున్= ఆ మహానుభావుడైన శుకుడిని; ఉనిచికొని= కలుపుకొని; అధ్యాపనశీలమ్ము+అగు= నిరంతరం చదువు చెప్పే స్వభావం కలదైన; చిత్తముతోడన్= హృదయంతో; సుఖమ్ము+ఉండఁగన్= సుఖంగా ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజున; గౌరవము+ఒప్పన్= గౌరవం స్ఫురించేట్టు.

**తాత్పర్యం:** వ్యాసుడు ఆ శుకుడిని తన నలుగురు శిష్యులతోనూ కలిపి మొత్తం అయిదుమందికీ అధ్యాపనం చేస్తున్నాడు. వ్యాసుడు అనారతాధ్యాపన తత్పరుడు. అదే ఆయనకు ఆనందం. అట్లా సుఖంగా కాలం గడుస్తోంది. వ్యాసుడిని గౌరవంగా సేవించుకొనే శిష్యులంతా ఒకరోజున ఇట్లా అన్నారు: (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **కొలిచియుండు సుమంతుప్రభృతులు నలువు రతనితో 'దేవా! శుకుండు మొదలుగాఁ గల యేమేవురము వేదవిషయప్రఖ్యాతి నెల్లవారికంటె నెక్కుడు గావలయు, మమ్ముంబోలె నొడ్ల నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరం' బని విన్నవించిన వీత పక్షపాత చిత్తుండగు నత్తాపసోత్తముండు.** **297**

**ప్రతిపదార్థం:** కొలిచియుండు= సేవిస్తూండే; సుమంతుప్రభృతులు= సుమంతుడూ మొదలైన; నలువురు= నలుగురూ; అతనితోన్= ఆ వ్యాసుడితో; దేవా!= గురుదేవా!; శుకుండు= శుకుడు; మొదలుగాన్= మొదటివాడుగా; కల= ఉన్న; ఏము+ఏవురమున్= మేము అయిదుగురమూ; వేదవిషయ= వేదాలు కారణంగా లభించే; ప్రఖ్యాతిన్= ప్రసిద్ధి విషయంలో; ఎల్లవారికంటెన్= అందరికన్నా; ఎక్కుడు= ఎక్కువ; కావలయున్= కావాలి; మమ్మున్+పోలెన్= మాలాగా; ఒడ్లను= ఇతరులను; ఆదర+ఆధిక్యంబునన్= అధికాదరంతో; భరంపడి= పూచీవహించి (బాధ్యత వహించి); సవిశేషంబుగాన్= అత్యధికంగా; అధ్యయనంబు+చేయింపక+ఉండుట= వేదాధ్యయనం చేయించక పోవటం (ఇతరులకు మాకంటే అధికంగా వేదాలు నేర్పకపోవటం); మాకున్= మాకు; వరంబు+అని= మంచిది అని (నీవు ఈయవలసిన వరం అని); విన్నవించినన్= మనవి చేసేసరికి; వీతపక్షపాత= పక్షపాతం లేని; చిత్తుండు+అగు= హృదయం కలవాడైన; ఆ+తాపస+ఉత్తముండు= ఆ ఋషీశ్వరుడు-

**తాత్పర్యం:** 'గురుదేవా! వేదాలవలన లభించే ప్రసిద్ధిలో మేము అయిదుగురమూ అందరికంటే ఎక్కువగా ఉండాలి.

మమ్మల్ని మించినవారు ఉండకూడదు. అంటే నీవు మరింకెవరికీ ఇంతకన్నా ఆదరంతో ఇంతకన్నా అధికంగా వేదాలు నేర్పకూడదు. ఈ వరం అనుగ్రహించు' మని శిష్యులు అభ్యర్థించేసరికి పక్షపాతరహితుడైన ఆ వ్యాసుడు ఇట్లా సమాధానం చెప్పాడు.

**తే. భక్తుఁడగు బ్రాహ్మణునకు వా గ్బ్రహ్మ మఖిల । మును బ్రియంబున నిచ్చు సజ్జనుని చేతి**
**లోనియది బ్రహ్మలోకంబు దీని మీర । లేర్పడఁగ నెన్నఁడును విని యెఱుఁగ రెట్లు! 298**

**ప్రతిపదార్థం:** బ్రహ్మలోకంబు= బ్రహ్మలోకం; భక్తుఁడు+అగు= భక్తుడైన (ఆసక్తి కలవాడైన); బ్రాహ్మణునకున్= విప్రుడికి; వాక్+బ్రహ్మము= వాగ్రూపమైన (బ్రహ్మము) వేదాన్ని; అఖిలమున్= పూర్తిగా; ప్రియంబునన్= ప్రేమతో; ఇచ్చు= నేర్పేటువంటి; సజ్జనుని= సత్పురుషుడియొక్క; చేతిలోని+అది= చేతిలోది; దీనిన్= ఈ విషయాన్ని; మీరలు= మీరు; ఏర్పడఁగన్= స్పష్టపడేట్టు; ఎన్నఁడునున్= ఏనాడూ; విని+ఎఱుఁగరు+ఎట్లు!= విని ఎరగరా ఏమి! (విని ఉండలేదా!).

**తాత్పర్యం:** 'భక్తుడైన బ్రాహ్మణుడికి వేదమంతా ప్రేమతో నేర్పే సత్పురుషుడికి బ్రహ్మలోకమనేది అరచేతిలో వస్తువు. అతడు అంత అనాయాసంగా బ్రహ్మలోకం పొందుతాడు. దీన్ని మీరు ఎప్పుడూ ఎక్కడా విని ఉండలేదా! ఆశ్చర్యమేనే!

**క. వినుఁ డెల్లవారు దుర్గం । బును గడచి శుభంబునొంది పురుషార్థములం**
**గనువార కాక యనియెడు । ననుగ్రహము వలదె? యిట్టులనఁ దగ వగునే? 299**

**ప్రతిపదార్థం:** వినుఁడు= శిష్యులారా! వినండి; ఎల్లవారున్= చతుర్వర్ణాలవారు అందరూ; దుర్గంబును= కష్టాన్ని; కడచి= దాటి; శుభంబున్= మంచిని; ఒంది= పొంది; పురుష+అర్థములన్= ధర్మార్థకామ మోక్షాలను; కనువారు+అ+కాక!= పొందేవారే కదా!; అనియెడు= అనేటువంటి; అనుగ్రహము= అనుగ్రహం; వలదె?= ఉండవద్దా?; ఇట్టు= ఇలా; అనన్= అనటం; తగవు= న్యాయం; అగునే?= అవుతుందా? - ధర్మమేనా?

**తాత్పర్యం:** శిష్యులారా! ఆలకించండి. ప్రపంచంలో ప్రతివాడూ కష్టాలు గడచి శుభాలు పొందాలి, పురుషార్థాలను అనుభవించాలి - అనివారిపై అనుగ్రహం మనకు ఉండవద్దా! మీరు ఇట్లా స్వార్థంతో అడగటం సమంజసమా? అది ధర్మమా? చెప్పండి?

**విశేషం:** అందరూ కష్టాలను గట్టెక్కుదురుగాక! భద్రాలను పొందుదురుగాక! బ్రాహ్మణుడిని అగ్రభాగంలో కూర్చోబెట్టుకుని నాలుగువర్ణాలవారికీ వేదాలు వినిపింతురుగాక! - అని ఉంది మూలంలో. **"సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు । శ్రావయేచ్చతురో వర్ణాన్ కృత్వా బ్రాహ్మణమగ్రతః ॥" (12-314-45).**

**చ. అనుటయు వార లొండొరుల యాననముల్ గనుఁగొంచు నవ్వి యి**
**ట్లని రటులేనిఁ బోదుమె దయాపర! శైలము డిగ్గి భూమి నెం**
**దును జరియించి యధ్యయన దోహలులం జదివించి యాజనం**
**బు నడపి నీ కృపారసము పొంగు నిగుడ్తుమె యెల్ల చోటులన్? 300**

**ప్రతిపదార్థం:** అనుటయున్= వ్యాసుడు అలా అనేసరికి; వారలు= ఆ శిష్యులు నలుగురూ; ఒండొరుల+ఆననముల్= ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు; కనుఁగొంచున్= చూసుకుంటూ; నవ్వి= చిరునవ్వుల చిందించి; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు: దయాపర!= ఓ కృపాళూ!; శైలమున్= ఈ హిమవత్పర్వతాన్ని; డిగ్గి= దిగి; పోదుమె?= వెళ్ళమా?; భూమిన్= భూలోకంలో; ఎందున్= అంతటా; చరియించి= సంచారం సాగించి; అధ్యయనదోహలులన్= వేదాలు అధ్యయనం చేయాలి అనే ఉత్సాహమూ, కోరికా కలవారిని, చదివించి; యాజనంబున్= యజ్ఞాలు చెయ్యించటాన్ని; నడపి= నిర్వహించి; ఎల్లచోటులన్= అన్ని ప్రదేశాల్లోనూ; నీ= నీయొక్క;

కృపారసము+పొంగున్= దయామృతపు వెల్లువను; నిగుడ్తుమె?= ప్రవహింప చెయ్యమా?

**తాత్పర్యం:** వ్యాసుడి మాటలకు ఆ శిష్యులు నలుగురూ ముఖముఖాలు చూచుకొన్నారు. చిన్నగా నవ్వులు చిందించి ఇట్లా అన్నారు: ఓ దయాళూ! అయితే మరి మమ్మల్ని ఈ హిమాలయం దిగి భూమిమీదకు వెళ్ళుమంటారా? అక్కడ అంతటా సంచరిస్తూ, వేదాలు నేర్చుకొనాలి - అనే కోరిక కలవాళ్ళను గుర్తించి వాళ్ళకు నేర్పుమంటారా? యజ్ఞయాగాదులు చేయించమంటారా? మీ దయామృతం వెల్లువలను అంతటా ప్రవహింపజేయుమంటారా?

**విశేషం:** ఇక్కడ మూలంలో శిష్యులు పరమవైదికంగా మాట్లాడారు. 'మహామునీ! వేదాలను బహుశాఖలుగా విస్తరింపజేయాలి అనే కోరికతో మేమంతా ఇక్కడినుండి భూమికి దిగాలని కోరుకొంటున్నాం. సమ్మతమేనా?' అన్నారు. '**శైలాదస్మాన్మహీం గంతుం కాంక్షితం నో మహామునే, వేదా ననేకధా కర్తుం యది తే రుచిరం ప్రభో (4).** కృపారసము పొంగు నిగుడ్తుమె' అనే కవితామయోక్తి తిక్కన కల్పన.

**చ.** **అనవుడు 'మున్న యిట్టు లన రైతిరి వోవఁగనీను మిమ్ము నెం**
**దును గడు వెడ్డువెట్టితిరి దోహల మిమ్మెయినుండ జాణలై**
**నను నిటు వేఱొకం డడిగి నా వచనంబులు మీ మనోరథం**
**బున కిటు సాధనంబులుగఁ బోకలఁ బోయితి' రంచు నవ్వుచున్.** **301**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని శిష్యులు అడిగేసరికి - వ్యాసుడు ఇట్లా అంటున్నాడు; మున్ను+అ= ముందుగానే; ఇట్టులు= ఇట్లా; అనరు+ఐతిరి= మీరు అనకపోయారు; మిమ్మున్= మిమ్ములను; ఎందున్= ఎక్కడికీ; పోవఁగన్+ఈను= వెళ్ళనీయను; కడున్= బాగా; వెడ్డు+పెట్టితిరి= నన్ను మోసగించారు; దోహలము= మీ ఉత్సాహం; ఈ+మెయిన్= ఈ రీతిగా; ఉండన్= ఉంటే (ఉండగా); జాణలై= చతురులై; ననున్= నన్ను; ఇటు= ఇట్లా; వేఱు+ఒకండు= మరొకటి; అడిగి= అభ్యర్థించి; నా+ వచనంబులు= నా సమాధానవాక్యాలు; మీ+మనోరథంబునకున్= మీ కోరికకు; సాధనంబులుగన్= అనుకూలముగా ఉండేట్లు; పోకలన్+పోయితిరి= వేషాలు వేసారు; అంచున్= అంటూ; నవ్వుచున్= నవ్వుతూ.

**తాత్పర్యం:** శిష్యులు అట్లా అడిగేసరికి వ్యాసుడికి అసలు సంగతి అర్థమయింది. నవ్వుతూ ఇట్లా అన్నాడు: 'శిష్యులారా! ముందుగానే మీరు ఇట్లా అడిగి ఉంటే బాగుండేది. అడుగలేదు. నన్ను మోసం చేశారు. మీ మనస్సులో కోరిక ఇట్లా భూమిమీదకు వెళ్ళాలి అని ఉంటే మరో విధంగా మాట్లాడి నా మాటలు మీ కోరికలకు అనుకూలంగా ఉండేటట్లు పన్నాగం పన్నారు. జాణతనం చూపించి వేషాలు వేశారు.' అంటూ నవ్వుతూ.

**విశేషం:** ఈ సరస సంభాషణ పూర్తిగా అమూలకం. తిక్కన కల్పన.

**తే.** **తమ్ము సంప్రీతిఁ గనుఁగొను నమ్మునీంద్రు । చరణకమలంబులకుఁ జక్కఁ జాఁగి మ్రొక్కి**
**రన్నలువురును వారల నతఁడు దివిచి । కరుణ సిగురొత్త బిగియారఁ గౌఁగిలించి.** **302**

**ప్రతిపదార్థం:** తమ్మున్= తమ నలుగురినీ; సంప్రీతిన్= ప్రేమతో; కనుఁగొను= తిలకిస్తున్న; ఆ+మునీంద్రు= ఆ వ్యాసమహర్షి యొక్క; చరణకమలంబులకున్= పాదపద్మాలకు; ఆ+నలువురును= ఆ నలుగురూ; చక్కన్= (వెంటనే) చక్కగా; చాఁగిమ్రొక్కిరి= సాష్టాంగ నమస్కారం చేశారు; వారలన్= ఆ నలుగురినీ; అతఁడు= ఆ వ్యాసుడు; తివిచి= లేవనెత్తి; కరుణ+చిగురు+ఒత్తన్=

దయ పల్లవింపగా; బిగియారన్= గట్టిగా; కౌఁగిలించి= ఆలింగనం చేసుకొని.

**తాత్పర్యం:** ప్రేమ నిండిన కన్నులతో తమను వీక్షిస్తున్న ఆ వ్యాసుడికి నలుగురూ సాష్టాంగపడ్డారు. వారిని లేవనెత్తి ఆ మహర్షి దయ పల్లవించగా గట్టిగా కౌగిలించుకొన్నాడు. అటుపైని దీవించాడు. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. దీవించి 'యెయ్యది సేసిన నప్రమాదాయత్త చిత్తులరై చేయుండు త్రిలోకంబు లందును మీకుం బ్రియంబైన చోటుల వర్తిల్లుం'డని వీడుకొలిపినఁ జని వార లధ్యాపనయాజన విశేషంబుల నశేషదేశంబులు నలంకరించుచుండి; రట్టియెడ. 303**

**ప్రతిపదార్థం:** దీవించి= ఆశీర్వదించి; ఏ+అది+చేసినన్= ఏది చేసినా; అప్రమాద+ఆయత్త+చిత్తులరు+ఐ= పొరపాటుపడని మనస్సుకలవారై (జాగరూకులై); చేయుండు= చేయండి; త్రిలోకంబులందునున్= ముల్లోకాలలోనూ; మీకున్= మీకు; ప్రియంబైన చోటులన్= ఇష్టమైన (నచ్చిన) ప్రదేశాలలో; వర్తిల్లుండు= సంచరించండి; అని= అని చెప్పి; వీడుకొలిపినన్= వ్యాసుడు పంపిస్తే; చని= వెళ్ళి; వారలు= ఆ నలుగురూ; అధ్యాపన= వేదాలు చదివించటం; యాజన= యజ్ఞాలు చేయించటం అనే; విశేషంబులన్= విశేషకార్యక్రమాలతో; అశేషదేశంబులన్= అన్ని రాజ్యాలనూ (ప్రదేశాలనూ); అలంకరించుచుండిరి= శోభిల్లజేస్తున్నారు; అట్టియెడన్= అప్పుడు.

**తాత్పర్యం:** వ్యాసుడు ఆ శిష్యులను దీవించి, 'ఏది చేసినా, జాగరూకులై చెయ్యండి. ముల్లోకాలలోనూ, మీకు ఇష్టమైన ప్రదేశాలలో సంచరించండి' అని చెప్పి పంపగా వెళ్ళి ఆ నలుగురూ వేదాలు చదివించటం, యజ్ఞాలు చేయించటం వంటి కార్యక్రమాలతో అన్ని రాజ్యాలనూ శోభింపజేస్తున్నారు. అప్పుడు.

**క. నారదుఁడు వచ్చి ప్రీతిం । బారాశర్యమునిఁ గాంచి 'బ్రహ్మనినాదం**
**బీ రున్నచోట లేమికిఁ । గారణమేమియొకొ?' యనుడు గారవమెసఁగన్. 304**

**ప్రతిపదార్థం:** నారదుఁడు= నారదమహర్షి; వచ్చి= విచ్చేసి; ప్రీతిన్= ప్రియంగా; పారాశర్యమునిన్= పరాశరుడి సంతానమైన వ్యాసమునీంద్రుడిని; కాంచి= దర్శించి; ఈరు= మీరు; ఉన్నచోటన్= ఉన్నస్థలంలో; బ్రహ్మనినాదంబు= వేదధ్వని; లేమికిన్= లేకపోవటానికి; కారణము+ఏమియొకొ?= హేతువు ఏమిటిచెప్మా?; అనుడున్= అనటంతో; గారవము+ఎసఁగన్= గౌరవం స్ఫురించేట్టు.

**తాత్పర్యం:** శిష్యులు నలుగురూ వెళ్ళిపోయారు. తండ్రీకొడుకులు ఇద్దరే ఆశ్రమంలో ఉంటున్నారు. ఆ సమయంలో ఒకరోజున నారదమహర్షి వ్యాసాశ్రమానికి వచ్చాడు. వస్తూనే ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. 'మహర్షీ! మీరు ఉన్నచోట వేదధ్వనులు వినిపించకపోవటం ఏమిటి? వింతగా ఉందే? దీనికి కారణం ఏదయినా ఉన్నదా?' అని అడిగాడు. సగౌరవంగా వ్యాసుడు (బదులు పలికాడు).

**క. అతఁ డతనితోడ 'శిష్య । ప్రతతి యిచట లేమి' యనుడు 'బ్రహ్మర్షివరా!**
**సుతుఁడును నీవైనను ద । ద్వ్రతంబు సెల్లించుచుండవలదే?' యనినన్. 305**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ వ్యాసుడు; అతనితోడన్= ఆ నారదుడితో; శిష్యప్రతతి= శిష్యబృందం; ఇచటన్= ఇక్కడ; లేమి= లేకపోవటమే(కారణం); అనుడున్= అనేసరికి; బ్రహ్మర్షివరా!= బ్రహ్మర్షులలో ఉత్తముడా! ఓ వ్యాసా!; సుతుఁడును= నీ కుమారుడూ; నీవు+ఐనను= నీవు అయినా; తద్+వ్రతంబు= ఆ వేదాధ్యయన వ్రతాన్ని; చెల్లించుచుండన్+వలదే= నిర్వహిస్తూ ఉండవద్దా? (దానికి అంతరాయం రాకూడదు కదా!); అనినన్= అనేటప్పటికి.

**తాత్పర్యం:** 'శిష్యబృందం ఇప్పుడు ఇక్కడ లేకపోవటమే వేదధ్వని వినిపించక పోవటానికి కారణం' అని వ్యాసుడు సగౌరవంగా బదులు పలికాడు. 'వేదాధ్యయనం నిరంతరంగా కొనసాగాలి కదా! అందుచేత నీవూ నీ కుమారుడూ అయినా ఆ వ్రతాన్ని కొనసాగించకపోయారా? అనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'నీవును నైనను వ్రతమది సెల్లించుచుండవలదే?' - అని పాఠాంతరం ఉన్నది. 'నీవును నైనను' అనే సముచ్చయార్థకంలో అన్వయసౌలభ్యమూ వాక్యవిన్యాసంలో వ్యావహారికతా మరింత ఎక్కువగా ఉన్నాయి.

**క.** **నారదుని వచనములుఁ బెం । పారం గొనియాడి భువనమంతయు నాదా**
**పూరితముఁ జేసె నమ్ముని । సారాధ్యయనమునఁ బుత్రసంయుక్తుండై.** **306**

**ప్రతిపదార్థం:** నారదుని= నారదుడియొక్క; వచనములున్= సూచనలనుకూడా; పెంపారన్= అతిశయించేట్టు; కొనియాడి= ప్రశంసించి; ఆ+ముని= ఆ వ్యాసుడు; పుత్రసంయుక్తుండై= పుత్రుడితో కలిసినవాడై; సార+అధ్యయనమునన్= సారభూతమైన వేదాధ్యయనంతో; భువనము+అంతయున్= లోకమంతటినీ; నాద= వేదధ్వనితో; ఆపూరితమున్= నిండిపోయిన దానినిగా; చేసెన్= చేసివేశాడు.

**తాత్పర్యం:** నారదుడినీ అతడి సూచననూ వ్యాసుడు ఎంతగానో ప్రశంసించాడు. తన పుత్రుడితో కలిసి ఉత్తమోత్తమమైన వేదాధ్యయనం తత్క్షణమే ప్రారంభించి ముల్లోకాలనూ వేదధ్వనితో నింపివేశాడు.

**వ.** **ఇట్లయ్యిరువురు నధ్యయనంబు సేయ మహావాయువు బెట్టు వీచిన నవిశ్వేషజ్ఞుండు పుత్రుతో ననధ్యయన సమయం బగుట సెప్పి తదధ్యయనంబు వారించి తానును నూరకున్న నయ్యారణీయుండు 'నియ్యత్యధికమారుతం బెక్కడిది?' యని యడిగిన నఖిల భూతవేదియగు వేదవ్యాసుండు దేవయానంబున విష్ణుండును పితృయానంబున భానుండును నూర్ధ్వాధోగమన పర్యాయరూపంబునం బ్రవర్తిల్లుదు రది పవనాలంబనకలితంబై చెల్లుఁ బవనుల వినుము సెప్పెద సమానుండు దైవతసంఘసంభవుం డతనికి నుదానుండును నుదానునికి వ్యానుండును వ్యానునికి నపానుండును నపానునికిఁ బ్రాణుండును జనియించిరి. జగంబులు వీరిచేత సంవ్యాప్తంబులైయుండుం బ్రవహుం డావహుం డుద్వహుండు సంవహుండు వివహుండు పవహుండు పరావహుం డనం బవనులు సప్తసంఖ్యు లదితిపుత్రు లఖిల భువనవ్యాప్తులై చరియింతురు. వారు సమానాదిపవనపంచక మహితాత్ములు. వారలవలన వర్షంబులకుం బ్రవర్తన నివర్తనంబులు గలుగుచుండు. వివిధదైవత విమానంబులకును మహితయానం బావహిల్లు నొక్కొక్కనాఁడు విష్ణుని నిశ్వాసవేగంబు.** **307**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఆ+ఇరువురున్= ఆ తండ్రీకొడుకు లిద్దరూ; అధ్యయనంబు+చేయన్= వేదాధ్యయనం చేస్తుంటే; మహావాయువు= పెద్దగాలి; బెట్టువీచినన్= భయంకరంగా వీచేసరికి; ఆ+విశేషజ్ఞుండు= విశేషజ్ఞానం కలిగిన ఆ వ్యాసుడు; పుత్రుతోన్= కుమారుడితో; అనధ్యయన సమయంబు= అది వేదాధ్యయనం చెయ్యకూడని సమయం; అగుట= కావటాన్ని; చెప్పి= తెలియపరిచి; తద్= అతడి; అధ్యయనంబు= వేదాధ్యయనం; వారించి= నిలుపుదల చేయించి; తానునున్= తాను కూడా; ఊరక+ఉన్నన్= ఆపివేసి ఉండగా; ఆ+ఆరణీయుండు= అరణి సంభవుడైన ఆ శుకుడు; ఈ+అత్యధిక మారుతంబు= ఈ మహావాయువు; ఎక్కడిది?= ఎక్కడినుంచి వీస్తున్నది; అని; అడిగినన్= అడిగితే; అఖిలభూతవేది+అగు= పంచభూతాలనూ ఎరిగినవాడైన; వేదవ్యాసుండు= ఆ వేదవ్యాసుడు; దేవయానంబునన్= దేవతావిమానంలో; విష్ణుండును= విష్ణుమూర్తీ; పితృయానంబునన్= పితృదేవతలు ప్రయాణించే విమానంలో; భానుండును= సూర్యుడూ; ఊర్ధ్వ+అధః+గమన+పర్యాయరూపంబునన్= పైకీ కిందికీ ఒకరి తరువాత ఒకరుగా; ప్రవర్తిల్లుదురు= ప్రయాణం చేస్తారు; అది= ఆ ప్రయాణం; పవన+ఆలంబన+కలితంబై= వాయువే

ఆధారంగా కలదై; చెల్లున్= జరుగుతుంది; పవనులన్= వాయువులనుగురించి; చెప్పెదన్= వివరిస్తాను; వినుము; సమానుండు= సమానుడు అనే పేరుగల వాయువు; దైవతసంఘ సంభవుండు= దేవతల జాతిలో (సమూహంలో) జన్మించాడు; అతనికిన్= ఆ సమానుడికి; ఉదానుండును= ఉదానుడనే వాయువూ; ఉదానునికిన్= ఆ ఉదానుడికి; వ్యానుండును= వ్యానుడు అనే వాయువూ; వ్యానునికిన్= ఆ వ్యానుడికి; అపానుండును= అపానుడు అనే వాయువూ; అపానునికిన్= ఆ అపానుడికి; ప్రాణుండును= ప్రాణుడు అనే వాయువూ; జనియించిరి= జన్మించారు; జగంబులు= లోకాలన్నీ; వీరిచేతన్= ఈ వాయుదేవతలచేత; సంవ్యాప్తంబులై= నిండినవై; ఉండున్= ఉంటాయి; ప్రవహుండు= ప్రవహుడూ; ఆవహుండు= ఆవహుడూ; ఉద్వహుండు= ఉద్వహుడూ; సంవహుండు= సంవహుడూ; వివహుండు= వివహుడూ; పవకుండు= పవకుడూ; పరాహుండు= పరాహుడూ; అనన్= అనే పేర్లతో; అదితిపుత్రులు= అదితికుమారులైన; పవనులు= వాయుదేవతలు; సప్తసంఖ్యులు= ఏడుగురు; అఖిలభువనవ్యాప్తులై= అన్ని లోకాలకూ వ్యాపించినవారై; చరియింతురు= సంచరిస్తూ ఉంటారు; వారు= ఆ ఏడుగురూ; సమాన+ఆది= సమానుడూ మొదలైన; పవనపంచక= అయిదుగురు పవనులతో; మహిత+ఆత్ములు= కలిసిన మహానుభావులు; వారలవలనన్= వారివల్లనే; వర్షంబులకున్= వానలకు; ప్రవర్తన+నివర్తనంబులు= ప్రవృత్తి - నివృత్తులు; కలుగుచుండున్= కలుగుతూ ఉంటాయి; వివిధ= పలురకాలైన; దైవతవిమానంబులకున్= దేవవిమానాలకు; మహితయానంబు= వేగవంతమైన కదలిక; ఆవహిల్లున్= సంభవిస్తుంది; ఒక్కొక్కనాఁడు= ఎప్పుడైనా ఒక్కొక్కరోజున; విష్ణుని= విష్ణుమూర్తియొక్క; నిశ్శ్వాసవేగంబు= నిట్టూర్పు వాయువుల వేగం. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ ఇద్దరూ వేదాధ్యయనం చేస్తుంటే భయంకరంగా పెద్దగాలివీచింది. వ్యాసుడు ఆనాడు అనధ్యయనదినంగా ప్రకటించాడు. శుకుడు 'ఈ పెనుగాలి ఎక్కడినుండి వీస్తున్నది?' అని అడిగాడు. విశ్వభూత జ్ఞానంగల వ్యాసుడు దానికి కారణం చెప్పాడు. 'దేవతావిమానంలో విష్ణుమూర్తీ, పితృదేవతల విమానంలో సూర్యుడూ క్రిందికీ మీదికీ ప్రయాణం చేయటం వలన ఈ పెనుగాలి ఏర్పడింది. ఆ వాయువులను గురించి వివరిస్తాను. వినుము. సమానుడు అనే వాయువు దేవతలగణంలో పుట్టాడు. సమానుడికి ఉదానుడూ, ఉదానుడికి వ్యానుడూ, ఆ వ్యానుడికి అపానుడూ, అపానుడికి ప్రాణుడూ పుట్టారు. లోకాలన్నీ ఈ వాయువులతో నిండి ఉన్నాయి. ప్రవహుడూ, ఆవహుడూ, ఉద్వహుడూ, సంవహుడూ, వివహుడూ, పవహుడూ, పరాహుడూ అనే పేర్లతో అదితిపుత్రులైన వాయుదేవతలు ఏడుగురు లోకాలన్నీ వ్యాపించి తిరుగుతూ ఉంటారు. ఈ ఏడుగురూ సమానాది పంచవాయువులతో కలిసి ఉండే గొప్పవారు. వారివలననే వానలు కురవటం, కురవకపోవటం కలుగుతూ ఉంటాయి. వివిధ దేవవిమానాలకు వేగవంతమైన కదలికలు కలిగితే, ఒక్కొక్కనాడు విష్ణుదేవుడి నిట్టూర్పు గాలుల వేగం (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అప్పవనములను గలఁచిన । నిప్పరుసగు వికృతవాయు విది దీని రయం**
**బిప్పుడు మహనీయంబగు । నిప్పర్వతమునుఁ జలింప నెసకం బెసఁగెన్. 308**

**ప్రతిపదార్థం:** ఆ+పవనములను= ఆ సప్తవాయువులనూ; కలఁచినన్= కలచివేస్తే; ఈ+పరుసు+అగు= ఈ విధంగా జరుగుతుంది; వికృతవాయువు+ఇది= పిచ్చిగాలి ఇది; దీని= ఈ వెర్రిగాలియొక్క; రయంబు= వేగం; ఇప్పుడు; మహనీయంబు+అగున్=పరమ పవిత్రమైన; ఈ+పర్వతమునున్= ఈ హిమవత్పర్వతం కూడా; చలింపన్= కదలిపోయేట్టు; ఎసకంబు+ఎసఁగెన్= అతిశయిస్తుంది.

**తాత్పర్యం:** విష్ణుమూర్తులవారి నిట్టూర్పు గాలుల వేగం సప్తపవనాలనూ కలచి వేస్తే అప్పుడు ఇటువంటి వెర్రిగాలి ఆవిర్భవిస్తుంది. ఈ హిమాలయాన్ని కూడా కదలించేస్తుందా అన్నంతగా ఉంటుంది దీని అతిశయం.

**తే. ఇట్టియప్పుడు సదివిన నెల్లభంగి। నెడరుపుట్టుఁ గావునఁ జదు వుడుగవలసె'**
**ననియెఁ బదపడి ప్రకృతిస్థమయ్యెఁ బవన। మఖిల భూతంబులకు సౌఖ్య మావహిల్లె. 309**

**ప్రతిపదార్థం:** ఇట్టి+అప్పుడు= ఇటువంటప్పుడు; చదివినన్= వేదాధ్యయనం చేస్తే; ఎల్లభంగిన్= అన్నివిధాలా; ఎడరు+పుట్టున్= కీడు సంభవిస్తుంది; కావునన్= కాబట్టి; చదువు= అధ్యయనం; ఉడుగన్+వలసెన్= ఆపివెయ్యవలసి వచ్చింది; అనియెన్= అని వ్యాసుడు; చెప్పాడు పదపడి= క్రమంగా (కొంతసేపటికి); పవనము= ఆ వికృతవాయువు; ప్రకృతిస్థము+అయ్యెన్= సహజస్థితికి వచ్చింది; అఖిల= సమస్తమైన; భూతములకున్= ప్రాణులకూ; సౌఖ్యము+ఆవహిల్లెన్= సౌఖ్యం కలిగింది.

**తాత్పర్యం:** నాయనా! ఇటువంటి సమయంలో వేదాధ్యయనం చేస్తే అది అన్నివిధాలా కీడు కలిగిస్తుంది. అందుకని చదువు ఆపవలసి వచ్చింది' అని వ్యాసుడు వివరించాడు. అటుపైని క్రమంగా సుడిగాలి సద్దు మణిగింది. ప్రాణికోటి అంతా హమ్మయ్య అనుకొన్నది, సుఖపడింది.

**వ. స్నానకాలం బయ్యెనని పలికి పుత్రునకు 'నీవు చదువుచుండు' మని చెప్పి యప్పారాశర్యుం డాకాశగంగా ప్రపాతప్రదేశంబునకుం జనియె నయ్యారణీయుండును నారదుం డాకర్ణింపఁ గొంతసే పధ్యయనంబుసేసిన నద్దేవముని మెచ్చి యతనితో 'నీకు మేలొనర్చెద నిష్టంబు సెప్పు' మనిన నతం 'డీలోకంబునం బుట్టినవానికి హితం బెయ్యది దానిం జెప్పవే?' యనుటయు నమ్మహాత్ముండు దొల్లి సంయములకు సనత్కుమారుండు సెప్పిన వాక్యంబు లేతత్ప్రయోజనంబు లయియుండు వానిం జెప్పెద వినుమని యిట్లనియె. 310**

**ప్రతిపదార్థం:** స్నానకాలంబు= స్నానానికి వేళ; అయ్యెన్+అని= అయింది అని; పలికి= అంటూ; నీవు; చదువుచుండుము= వేదపాఠం కానిస్తూండుము; అని; పుత్రునకున్= శుకునికి; చెప్పి= ఆజ్ఞాపించి; ఆ+పారాశర్యుండు= పరాశరుడి కుమారుడైన ఆ వ్యాసుడు; ఆకాశగంగా= ఆకాశగంగయొక్క; ప్రపాత= జలపాతాలు ఉన్న; ప్రదేశంబులకున్= ప్రాంతాలకు; చనియెన్= వెళ్ళాడు; ఆ+ఆరణీయుండును= ఆ శుకమహర్షి; నారదుండు; ఆకర్ణింపన్= వింటూండగా; కొంతసేపు= కొంచెంసేపు; అధ్యయనంబు= వేదపఠనం; చేసినన్= చేసేసరికి; ఆ+దేవముని= దేవముని అయిన ఆ నారదుడు; మెచ్చి= మెచ్చుకొని; అతనితోన్= ఆ శుకుడితో; నీకున్= నీకు; మేలు+ఒనర్చెదన్= మేలు చేస్తాను; ఇష్టంబు= నీకు ఇష్టమైనది ఏమిటో; చెప్పుము; అనినన్= అంటే; అతండు= ఆ శుకుడు; ఈ లోకంబునన్= ఈ లోకంలో; పుట్టినవానికిన్= జన్మించిన వ్యక్తికి; హితంబు= హితమైనది; ఎయ్యది= ఏది?; దానిన్= అటువంటి దాన్ని గురించి; చెప్పవే?= వివరించవా?; అనుటయున్= అనటమూ; ఆ+మహాత్ముండు= మహానుభావుడైన ఆ నారదుడు; తొల్లి= పూర్వకాలంలో; సంయములకున్= మునీశ్వరులకు; సనత్కుమారుండు= సనత్కుమారుడు అనే మహర్షి; చెప్పిన= వివరించినటువంటి; వాక్యంబులు= మాటలు; ఏతద్+ప్రయోజనంబులు= ఇదే ప్రయోజనంగా కలవి; అయి+ఉండున్= అవుతాయి నీవు అడిగిన ప్రయోజనానికి సరిపోతాయి; అని; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పటం మొదలుపెట్టాడు.

**తాత్పర్యం:** ఇక నాకు స్నానానికి వేళ అయింది' అని వ్యాసుడు లేచి, ఆకాశగంగా జలపాతా లున్న చోటికి వెళ్ళిపోయాడు. శుకుడు నారదుడు వింటూండగా కొంతసేపు వేదపఠనం చేశాడు. దానికి మెచ్చి నారదుడు 'నీ కేమి కావాలో కోరుకొమ్ము' అని అడుగగా 'మానవుడికి హితమైనదానిని తెలియజెప్పు' మని శుకుడు అడిగాడు. దానికి నారదుడు 'మునుపు సనత్కుమారుడనే ఋషి కొందరు మునులకు ఇదే విషయాన్ని వివరించాడు. ఇదే ప్రయోజనంకొరకు ఆ వివరాలను విశదీకరిస్తాను' అంటూ నారదుడు మొదలుపెట్టాడు.

### నారదుఁడు శుకున కుపదేశించిన తత్త్వప్రకారము (సం. 12-316-5)

**తే. తపము సత్యంబ, కన్ను విద్యయ, సుఖంబు। విడుప, దుఃఖంబు రాగంబ, వినుఁడు నరుఁడు**
**ముక్తి కుత్సహింపక భవసక్తుఁ డైన। నొండు పుట్టువునం దది యొందరాదు. 311**

**ప్రతిపదార్థం:** సత్యంబు+అ= సత్యమే; తపము= తపస్సు; విద్యయ= విద్యయే (జ్ఞానమే); కన్ను= నేత్రం; విడుపు+అ= త్యాగం చెయ్యటమే; సుఖంబు= సుఖం; రాగంబు+అ= అనురాగమే; దుఃఖంబు= దుఃఖం; వినుఁడు= మహర్షులారా! ఆలకించండి; నరుఁడు= జీవుడు; ముక్తికిన్= మోక్షానికి; ఉత్సహింపక= ఉత్సాహం చూపకుండా; భవసక్తుఁడు+ఐనన్= సంసారంలో తగుల్కొన్న వాడైతే; ఒండు పుట్టువునందున్= మరొకజన్మలో; అది= ఆ ముక్తి; ఒందన్+రాదు= పొందటం సాధ్యం కాదు.

**తాత్పర్యం:** సత్యమే తపస్సు. జ్ఞానమే కన్ను. త్యాగమే సుఖం. రాగమే దుఃఖం. మునులారా! వినండి. నరుడుమోక్షానికి ప్రయత్నించకుండా సంసార బంధాలలో తగుల్కొన్నట్లయితే మరొక జన్మలోకూడా ఆ ముక్తి సాధ్యం కాదు.

**విశేషం:** దీనికి మూలమైన సంస్కృతశ్లోకం చతురస్రంగా ధారణయోగ్యంగా క్లుప్తంగా ఉన్నది. **"నాస్తి విద్యాసమం చక్షుః నాస్తి విద్యాసమం తపః । నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్॥" (12-316-6)**

**క. ఆరయఁ గామముఁ గ్రోధము । వైరులు ముక్తి కవి రెండు వారించిన సం**
**సార మనాకారం బగు । నేరిమి యొండేల ముక్తి నెలవు గనుటకున్? 312**

**ప్రతిపదార్థం:** ఆరయన్= పరిశీలించి చూసినట్టయితే; కామమున్= కామమూ; క్రోధమున్= క్రోధమూ; ముక్తికిన్= మోక్షానికి; వైరులు= శత్రువులు; అవి రెండున్= ఆ రెండింటినీ; వారించినన్= అడ్డుకోగలిగినట్టయితే; సంసారము= భవము అనేది; అనాకారంబు+అగున్= ఆకారరహితం అయిపోతుంది - సంసారం తన ఉనికిని కోల్పోతుంది; ముక్తి నెలవు= మోక్షపదాన్ని; కనుటకున్= పొందటానికి; నేరిమి= నేర్పు; ఒండు= ఇంతకన్నా మరొకటి; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** కామక్రోధాలే ముక్తికి శత్రువులు. ఆ రెండింటినీ జయించి పారద్రోలినట్లయితే మానవుడికి సంసారమనేది రూపరహితం అయిపోతుంది. ముక్తి పదం పొందటానికి ఇంతకన్నా మరొక నేర్పరితనం ఎవరికిమాత్రం ఎందుకు?

**తే. అపరిగ్రహ సర్వారం । భ పరిత్యాగములు గలుగు పండితునకు దుః**
**ఖపుఁ దెరువు వాటిలదు మో । క్షపదము సొప్పడి తదాత్మక సుఖం బొందున్. 313**

**ప్రతిపదార్థం:** అపరిగ్రహ= ఏ దానాన్నీ స్వీకరించటకపోవటం; సర్వ= సమస్తవిధాలైన; ఆరంభ= ప్రయత్న - క్రియాప్రారంభాల; పరిత్యాగములు= త్యాగం (విడవటం) అనేవి రెండూ; కలుగు= ఉన్నటువంటి; పండితునకున్= జ్ఞానికి; దుఃఖపున్ తెరువు= దుఃఖమార్గం అనేది; పాటిలదు= సంభవించదు; మోక్షపదము= ముక్తిస్థానం; చొప్పడి= లభించి; తదాత్మక= తాదాత్మ్యరూపమైన; సుఖంబున్= సౌఖ్యాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** అపరిగ్రహం - సర్వారంభపరిత్యాగం అనేవి రెండూ ఉన్న జ్ఞానికి అసలు దుఃఖమనేదే ఉండదు. మోక్షపదాన్ని తాదాత్మ్యంతో పొందటం, సుఖపడటం - అనేవి అతడికి సిద్ధిస్తాయి.

**క. భూతంబుల దర్శింపమి । భూతాస్పర్శనము భూతములయెడ సంభా**
**షా తరలత నొందమి సూ । రే తెరువు విమోక్ష సుఖగరిష్ఠత వడయన్. 314**

**ప్రతిపదార్థం:** భూతంబులన్= ప్రాణికోటిని; దర్శింపమి= చూడకపోవటం; భూత= ప్రాణికోటియొక్క; అస్పర్శనము= తాకకపోవటం (వాటిని); భూతములయెడన్= ప్రాణులతో; సంభాషాతరలతన్= సంభాషించాలి అనే ఉబలాటాన్ని; ఒందమి= పొందకపోవటం అనే ఇవి; విమోక్ష= విముక్తికి సంబంధించిన; సుఖ= సుఖంయొక్క; గరిష్ఠతన్= ఆధిక్యాన్ని; పడయన్= పొందటానికి; తెరువు= మార్గం; చూరే= చూడండి. (తెలుసుకోండి సుమా!)

**తాత్పర్యం:** మహర్షులారా! ప్రాణికోటిని దర్శించకుండా, స్పృశించకుండా, సంభాషించకుండా నిగ్రహంతో దూరంగా ఉండటమే విముక్తికి మార్గం. దయచేసి గుర్తించండి.

**విశేషం:** చూరె - చూరే అనేవి అన్వయాలు. ప్రసిద్ధినీ ఆభిముఖ్యాన్నీ తెలియజేస్తాయి. **"అదర్శనమసంస్పర్శః తథాऽసంభాషణం సదా। యస్య భూతైస్సహ మునే స శ్రేయో విందతే పరమ్॥"** [1](12-316-17)

**ఆ. ' హింసలేక యునికి యింద్రియ జయము నై! । రాశ్య మచపలత్వ మను గుణములు**
**నాల్గుఁ గలుగునట్టి నరునకుఁ గరతలా । మలక మంతరాత్మ మహిమ యెల్ల. 315**

**ప్రతిపదార్థం:** హింసలేక+ఉనికి= హింసాప్రవృత్తి లేకపోవటం; ఇంద్రియజయము= ఇంద్రియనిగ్రహమూ; నైరాశ్యము= ఆశారహితత్వమూ; అచపలత్వము= చాపల్యం లేకపోవటమూ; అను= అనే; గుణములు= సద్గుణాలు; నాల్గున్= నాలుగూ; కలుగునట్టి= ఉన్నటువంటి; నరునకున్= జీవుడికి; అంతరాత్మ మహిమ ఎల్లన్= అంతరాత్మయొక్క గొప్పతనం అంతా; కరతల+ఆమలకము= అరచేతిలోని ఉసిరికపండు;

**తాత్పర్యం:** అహింస, ఇంద్రియనిగ్రహం, నైరాశ్యం, అచపలత్వం అనే ఉత్తమగుణాలు నాలుగూ ఉన్న వాడికి అంతరాత్మ తత్త్వం తేటతెల్లమవుతుంది. అరచేతిలో ఉసిరికపండంత సులభంగా అనుభవంలోకి వస్తుంది.

**విశేషం:** 'వైరాగ్యము' అనే సంశోధిత ముద్రణపాఠంలో యతిభంగం. నిర్+ఆశా... 'నైరాశ్యము' - ఇది వావిళ్ళవారి పాఠం. 'వైరాగ్య' అయినా 'నైరాశ్య అను' అయినా, రెండవ పాదంలోని మొదటి అక్షరం 'రా' కదా! 'రా'కు 'మ'కు యతి ఉంటే ఉన్నట్లు - లేకపోతే రెండు పాఠాలలోనూ లేనట్లే కదా! గమనించగలరు.

**క. ' అమ్మునిపతి వాక్యముల వి । ధమ్మిది దీనం బ్రగాఢ తత్పరతం జి**
**త్తమ్మున నిడి తెలిసినడవు । మిమ్మెయి సమకూరు నీకు నిహపర సుఖముల్.' 316**

**ప్రతిపదార్థం:** ఆ+మునిపతి= మునీశ్వరుడైన ఆ సనత్కుమారుడు చెప్పిన; వాక్యముల= మాటలయొక్క; విధమ్ము+ఇది= పద్ధతి ఇది - ఇట్లా ఉన్నది; దీనిన్= ఈ విధాన్ని; ప్రగాఢతత్పరతన్= ప్రగాఢమైన ఆసక్తితో; చిత్తమ్మునన్= మనస్సులో; ఇడి= పెట్టుకుని; తెలిసి నడవుము= ఎరుకతో సంచరించుము (ప్రవర్తించుము); ఇహపరసుఖముల్= ఇహానికీ పరానికీ చెందిన సుఖాలు; ఈ+మెయిన్= ఇట్లా (ఇకనుండి); నీకున్= నీకు; సమకూరున్= వాటంతట అవి లభిస్తాయి.

**తాత్పర్యం:** సనత్కుమారుడు ఆ మహర్షులకు చెప్పిన మాటల సారాంశం ఇది. దీన్ని నిజమైన ఆసక్తితో మనసులో పెట్టుకొని తెలిసి నడిచావంటే ఇహపరసుఖాలు వాటంతట అవి నీకు సమకూరుతాయి.'

**వ. అని చెప్పి వెండియు. 317**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; చెప్పి= నారదుడు చెప్పి; వెండియున్= తిరిగి ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నారదుడు చెప్పి ఇంకా.

**ఆ. ' పుత్త్రదార బంధుమిత్త్ర సక్తుఁడు రొంపిఁ । బడిన గజము నట్ల యెడరునొందు**
**భోగజాలపరుఁడు వాగురాజాలసం । పతిత మృగఝుషముల భంగిఁ దలరు. 318**

**ప్రతిపదార్థం:** పుత్త్ర= సంతానమూ; దార= కళత్రమూ; మిత్త్ర= నెచ్చెలులూ - వీరిపట్ల; సక్తుఁడు= వ్యామోహితుడైనవాడు; రొంపిన్+పడిన= ఊబిలో కూరుకుపోయిన; గజము+అట్లు+అ= ఏనుగువలెనే; ఎడరున్+ఒందున్= దుఃఖాన్ని పొందుతాడు; భోగ=

సుఖాల; జాల= సమూహంలో; పరుఁడు= ఆసక్తుడైన వ్యక్తి (భోగసమూహంలో లాలసుడైనవాడు); వాగురా= వలల; జాల= సమూహంలో; సంపతిత= చిక్కుకొన్న; మృగ= లేడి; ఝషములు= చేపల; భంగిన్= పోలికగా; తలరున్= దుఃఖిస్తాడు.

**తాత్పర్యం:** 'శుకమహర్షీ! పుత్రికాపుత్రులు, భార్యలూ, బంధువులూ, మిత్రులూ - వీరిపట్ల వ్యామోహితుడైనవాడు ఊబిలో దిగిన ఏనుగువలె హింస పడతాడు. భోగలాలసుడు వలలో చిక్కుకొన్న మృగంవలె చేపవలె గిలగిలలాడతాడు.

**విశేషం:** పుత్రులు అంటే కేవలం మగబిడ్డలే కా నవసరం లేదు. 'పుత్రాశ్చ పుత్ర్యశ్చ - పుత్రాః' అని ఏకశేషసమాసం. 'పుమాన్ స్త్రియా' - అని పాణినీయసూత్రం). పుత్రికలూ, పుత్రులూ కలిపి పుత్రులు అనవచ్చును. పుత్రదార బంధుమిత్ర- అన్నచోట పుత్రికా పుత్రరూపమైన సంతానం అంతా - అని అర్థం. మిత్రపదంకూడా అట్లాగే ఏకశేషసమాసం అనుకుంటే స్నేహితురాండ్రూ స్నేహితులూ ఇద్దరూ వస్తారు. నెచ్చెలి అనేది స్త్రీ పురుషులకు సమానం.

**వ. ధర్మాధర్మంబులును సత్యాసత్యంబులును దొఱంగవలయుఁ దొఱంగుటెట్లు సొప్పడు నంటేని. 319**

**ప్రతిపదార్థం:** ధర్మ+అధర్మంబులును= ధర్మాధర్మాలూ; సత్య+అసత్యంబులును= సత్యాసత్యాలూ; తొఱంగన్+వలయున్= విడిచిపెట్టెయ్యాలి; తొఱంగుట= ఆ విడవటం; ఎట్లు= ఎలా; చొప్పడున్= సాధ్యమవుతుంది; అంటి(వి)+ఏనిన్= అన్నావనుకో.

**తాత్పర్యం:** ధర్మాధర్మాలను, సత్యాసత్యాలను విడనాడాలి. అ దెట్లా సాధ్యమంటే.

**సీ. విను మధర్మం బహింసనమున నెడలు ధ । ర్మంబు సంకల్పవర్జనముచేత**
**నవ్యాప్తిఁ బొందు సత్యాసత్యములు బుద్ధిఁ । గొని త్రోవనగు' నని మునివరుండు**
**మఱియును జెప్పు 'నాత్మవిభావనంబున । బుద్ధివిలీనతఁబొందు శోక**
**భయహేతువులు నిచ్చఁ బదివేలు వాటిల్లుఁ । బండితుం డందుఁ బొందండు భూత**

**తే. ములును నింద్రియములు నొక్కప్రోవు గట్టి । యున్న వీనికి వగఁ బొందు టూరివారి**
**కొలయు నెడరుల కెల్లఁ దా నుమ్మలికము । గట్టికొని కుందునట్టులు గాదె? వత్స!' 320**

**ప్రతిపదార్థం:** వినుము= శుకమహర్షీ! ఆలకించుము; అధర్మంబు= అధర్మము అనేది; అహింసనమునన్= అహింసవలన; ఎడలున్= తొలగిపోతుంది; ధర్మంబు= ధర్మమనేది; సంకల్ప= సంకల్పాల యొక్క; వర్జనముచేతన్= విడుమరతో (సంకల్పరాహిత్యంతో); అవ్యాప్తిన్+పొందున్= వ్యాప్తిని కోల్పోతుంది; సత్య+అసత్యములు= సత్యాసత్యాలు అనేవాటిని; బుద్ధిన్+కొని= బుద్ధియొక్క సహకారం స్వీకరించి; త్రోవన్+అగున్= పారద్రోలవచ్చును; అని; మునివరుండు= నారదుడు; మఱియునున్= ఇంకా; చెప్పున్= ఉపదేశిస్తున్నాడు; బుద్ధి= ఈ బుద్ధి అనేది; ఆత్మవిభావనంబునన్= ఆత్మసందర్శనంలో; విలీనతన్+పొందున్= లీనమైపోతుంది; శోకభయహేతువులు= శోకకారణాలూ, భయహేతువులూ అనేవి; నిచ్చన్= ఎల్లప్పుడూ; పదివేలు= అసంఖ్యాకంగా; వాటిల్లున్= ఏర్పడుతూనే ఉంటాయి; పండితుండు= జ్ఞాని; అందున్= వాటిలో; పొందండు= సంలగ్నుడు కాడు; వత్స!= నాయనా!; భూతములును= పంచభూతాలూ; ఇంద్రియములును= పది ఇంద్రియాలూ; ఒక్కప్రోవుగట్టి= ఒక పోగులాగా (మూట) చర్మంతో కట్టి; ఉన్నన్= ఉండగా; వీనికిన్= ఈ శరీరాలకోసమని; వగన్= దుఃఖాన్ని; పొందుట= పొందటం; ఊరివారికిన్= ఊళ్ళో జనానికి; ఒలయు= వచ్చే; ఎడరులకున్= క్లేశాలకూ, కీడులకూ; ఎల్లన్= అన్నింటికీ; తాను; ఉమ్మలికము+కట్టికొని= దిగులు పెట్టుకొని; కుందునట్టులు+కాదె!= బాధపడినట్లు కాదా!

**తాత్పర్యం:** అహింసను అలవాటు చేసికొనటంతో అధర్మాన్ని విడిచిపెట్టవచ్చును. సంకల్పాలను పరిత్యజించటంతో ధర్మాన్ని వదిలించుకొనవచ్చును. బుద్ధిబలంతో సత్యాసత్యాలను తొలగించుకొనవచ్చును. శుకా! ఆలకించుము.

ఆత్మజ్ఞానంతో బుద్ధినీ వికసింపజేసికొనవచ్చును. శోకహేతువులూ, భయహేతువులూ నిత్యజీవితంలో రోజూ వేలకువేలు ఉంటూనే ఉంటాయి. జ్ఞాని అయినవాడు వాటిలో తగుల్కొనడు. పంచభూతాలనూ పది ఇంద్రియాలనూ పోగుచేసి చర్మంతో మూటగట్టిన ఈ శరీరంకొరకు దుఃఖించటమా? ఊళ్ళోవాళ్ళ దుఃఖాలకు మనం ఏడవటం వంటిది కాదూ ఇది!

**చ.** **అన విని సంశయం బురివి యమ్మునితో నరణీతనూజుఁ డి**
**ట్లను 'భవదీయ దివ్యవచనామృత మాని యరోగచిత్తతం**
**గని కృతకృత్యతం బొరయఁ గాంచితిఁ బొందెద యోగసిద్ధి సూ**
**ర్యుని మహితప్రసారమున, నూని సమస్తము డిగ్గఁ ద్రావెదన్.'** **321**

**ప్రతిపదార్థం:** అనన్= అని (నారదుడు) చెప్పగా; విని= ఆలకించి; సంశయంబు= సందేహం; ఉరివి= తొలగి; ఆ+మునితోన్= ఆ నారదమహర్షితో; అరణీతనూజుఁడు= అరణీ సంభవుడైన శుకుడు; ఇట్లు+అనున్= ఇలా అంటున్నాడు; భవదీయ= నీయొక్క; దివ్య= దివ్యమైన (పవిత్రమైన); వచన+అమృతము= వాగమృతాన్ని; ఆని= క్రోలి (త్రాగి); అరోగచిత్తతన్= రోగరహితమైన మానసికస్థితిని; కని= పొంది; కృతకృత్యతన్= చరితార్థతను; పొరయన్+కాంచితిన్= పొందగలిగాను; సూర్యుని= సూర్య భగవానుడియొక్క; మహిత= గొప్పదైన; ప్రసారమునన్= ప్రసరణంతో (దయాప్రసారం వలన); యోగసిద్ధిన్= యోగంలో సిద్ధిని; పొందెదన్= పొందుతాను; ఊని= ప్రయత్నించి; సమస్తమున్= అన్నింటినీ; డిగ్గన్+త్రావెదన్= పరిత్యజిస్తాను.

**తాత్పర్యం:** నారదుడి ఉపదేశంతో శుకుడికి సంశయాలు తొలగిపోయాయి. అతడితో అంటున్నాడు 'మహర్షీ! నీ వాగమృతం గ్రోలటంతో నా మనస్సుకు స్వస్థత చేకూరింది. చరితార్థుడను అయాను. సూర్యభగవానుడి దయవలన యోగసిద్ధి పొందుతాను. రాగద్వేషాలూ, ధర్మాధర్మాలూ, సత్యాసత్యాలూ మొదలైనవన్నీ పరిత్యజిస్తాను.'

**క.** **అని పలికి యమ్మునీశ్వరు । ననుజ్ఞఁ గొని తండ్రికడకు నరిగి వినతుఁడై**
**తన నిశ్చయంబు సెప్పిన । విని యతఁ డలరెం దదీయ విజ్ఞానతకున్.** **322**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఆ+మునీశ్వరు+అనుజ్ఞన్= ఆ నారదమహర్షి అనుమతిని; కొని= స్వీకరించి; తండ్రికడకున్= తండ్రియైన వ్యాసుడి దగ్గరకు; అరిగి= వెళ్ళి; వినతుఁడై= నమస్కరించి; తన= తనయొక్క; నిశ్చయంబు= నిర్ణయం; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; అతఁడు= ఆ వ్యాసుడు; తదీయ= ఆ పుత్రుడియొక్క; విజ్ఞానతకున్= తెలివికి; అలరెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** శుకమహర్షి తన ఆకాంక్షను చెప్పి నారదుడి అంగీకారం పొంది వెళ్ళి వ్యాసుడికి నమస్కరించాడు. తన నిశ్చయం తెలియజేశాడు. వ్యాసుడు పుత్రుడి విజ్ఞతకు సంతోషించాడు.

**క.** **సంప్రమోదమందు సాత్యవతేయునిఁ । గని ప్రదక్షిణంబుగాఁగ వచ్చి**
**నరుగ నుత్సహించె నారణీయుఁడు దానిఁ । గాంచి వత్సలత్వగౌరవమున.** **323**

**ప్రతిపదార్థం:** సంప్రమోదము= ఆనందాన్ని; అందు= పొందుతున్న; సాత్యవతేయునిన్= వ్యాసుడిని; కని= చూచి; ప్రదక్షిణంబుగాఁగన్= ప్రదక్షిణం అయ్యేట్టు; వచ్చి= చుట్టి వచ్చి; ఆరణీయుఁడు= శుకుడు; అరుగన్+ఉత్సహించెన్= వెళ్ళటానికి ఉత్సాహపడ్డాడు; దానిన్= ఆ ఉత్సాహాన్ని; కాంచి= గమనించి; వత్సలత్వ= వాత్సల్యరూపమైన; గౌరవమునన్= గురుత్వంతో - గారాబంతో.
**తాత్పర్యం:** ఆనందిస్తున్న తండ్రికి ప్రదక్షిణం చేసి శుకుడు బయలుదేరబోయాడు. ఆ ఉత్సాహాన్ని గుర్తించిన వ్యాసుడు పుత్రప్రేమతో, గారాబంతో (ఇట్లా అన్నాడు).

**వ. ఆ బ్రహ్మర్షి సత్తముండు. 324**

**ప్రతిపదార్థం:** ఆ బ్రహ్మర్షి సత్తముండు= బ్రహ్మర్షులలో ఉత్తముడైన ఆ వ్యాసుడు.

**తాత్పర్యం:** ఉత్తముడైన ఆ వ్యాసుడు.

**క. ' ప్రమద మొనర్చెదు నా నయ । నములకు నంత కటు నిలుము నాఁగా' నిః స్నే**
**హము నిస్సంశయముం దన । యమలమతిం బల్లవింప నా శుకుఁ డరిగెన్. 325**

**ప్రతిపదార్థం:** నాయనా! నా = నాయొక్క; నయనములకున్= కన్నులకు; ప్రమదము= ఆనందాన్ని; ఒనర్చెదు= కలిగిస్తున్నావు; అంతకున్= అంతదాకా; అటు= అట్లా; నిలువుము= ఆగుము; నాఁగాన్= అని వ్యాసుడు అనగా; ఆ శుకుఁడు= ఆ శుకర్షి; నిస్స్నేహమున్= మైత్రీరాహిత్యమూ; నిస్సంశయమున్= సంశయరాహిత్యమూ; తన= తనయొక్క; అమలమతిన్= నిర్మలమైన మనస్సులో; పల్లవింపన్= చిగురొత్తగా; అరిగెన్= ఆగకుండా వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** 'నాయనా! నా కన్నులకు ఆనందం కలిగిస్తున్నావు. కొంచెం సేపు (ఈపూటకు) ఇక్కడ ఉండవయ్యా!' అని వ్యాసుడు అడిగాడు. కానీ, శుకుడి మనస్సులో ఏ స్నేహమూ లేదు. ఏ సంశయమూ లేదు. నిర్మమంగా బయలుదేరి వెళ్ళిపోయాడు.

**విశేషం:** ఇక్కడ మూలంలో శ్లోకం ఇట్లా ఉన్నది. **"శ్రుత్వా ఋషిస్తద్వచనం శుకస్య ప్రీతో మహాత్మా పునరాహ చైనమ్ । భోభోః పుత్ర! స్థీయతాం తావదద్య యావచ్చక్షుః ప్రీణయామి త్వదర్థమ్॥" (12-318-62)** ఎంతవరకూ నా కన్నులు ఆనందిస్తాయో అంతవరకూ నీవు ఈ రోజు ఇక్కడ ఉండుము - అని యావత్తావత్ శబ్దాలతో ఉన్న వాక్యాన్ని 'అంతకిటు నిలువుము' అని తిక్కన ఆంధ్రీకరించాడు.

**ఆ. జనకు విడిచి యిట్లు సని సిద్ధచారణ । సముదయోపసేవితమును యోగ**
**సేవనార్హ విధమునై వెలుఁగొందు కై । లాసశిఖరితట మలంకరించె. 326**

**ప్రతిపదార్థం:** జనకున్= తండ్రియైన వ్యాసుడిని; విడిచి= వదలి; ఇట్లు; చని= వెళ్ళి; సిద్ధ= సిద్ధులూ; చారణ= చారణులూ అనే దేవజాతులయొక్క; సముదయ= సమూహంతో; ఉపసేవితమును= సేవింపబడేదీ; యోగసేవన= యోగాభ్యాసానికి; అర్హవిధమును+ఐ= అనువైన పద్ధతిలో ఉండేదీ అయి; వెలుఁగు+ఒందు= ప్రకాశించే; కైలాసశిఖరి= కైలాసము అనే పేరుగల పర్వతంయొక్క; తటమున్= చరియను; అలంకరించెన్= అలంకరించాడు.

**తాత్పర్యం:** ఇట్లా తండ్రిని విడిచిపెట్టి వెళ్ళిన శుకుడు కైలాసపర్వతం చేరుకొన్నాడు. అక్కడ సిద్ధులూ, చారణులూ మొదలైన దేవతలు నివసిస్తూ ఉంటారు. అది యోగసాధనకు చాలా అనుకూలమైన ప్రదేశం. అందుకని అది ఎంచుకొని వెళ్ళాడు శుకుడు.

**సీ. విను మందు సమము వివిక్తంబు నగుచోటఁ । బ్రాఙ్ముఖాసీనుఁడై పరమయోగ**
**రతిఁ బదప్రభృతిగాత్రములఁ గ్రమంబుగ । నాత్మధారణము సేయంగ నంత**
**నినుఁ డుదయించినం గని పాణిపాదసం । యమ మొప్ప నద్దేవు నాశ్రయించి**
**నిర్విషయంబగు సర్వాత్మ తత్త్వంబు । గాంచి విశిష్టయోగక్రమంబుఁ**

**తే. బొంది నారదముని యలవోక యచటి । కరుగుదెంచిన వినతుఁడై యాత్మయోగ**
**సిద్ధి యెఱిఁగించి' నీ కృపఁజేసి తెరువు । గంటి నరిగెద విగతసంగత్వమొంది.' 327**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! ఆలకించుము; అందున్= ఆ కైలాసపర్వతంమీద; సమము= ఎత్తుపల్లాలు లేనిదీ; వివిక్తంబున్= ఏకాంతం కలదీ; అగు= అయిన; చోటన్= స్థలంలో; ప్రాక్+ముఖ+ఆసీనుఁడై= తూర్పు ముఖంగా కూర్చున్నవాడై; పరమ యోగరతిన్= శ్రేష్ఠమైన యోగంపట్ల గాఢమైన అభినివేశంతో (కోరికతో); పదప్రభృతి= పాదాలు మొదలుకొని; గాత్రములన్= సర్వావయవాల్లోనూ; క్రమంబుగన్= వరుసగా; ఆత్మధారణము+చేయంగన్= ఆత్మధారణ చేయగా; అంతన్= అప్పుడు; ఇనుఁడు= సూర్యుడు; ఉదయింపన్= సాక్షాత్కరిస్తే; కని= దర్శించి; పాణి= చేతులూ; పాద= కాళ్ళూ వీటి; సంయమము+ఒప్పన్= పొందిక అతిశయించేట్టు; ఆ+దేవున్= ఆ సూర్యభగవానుడిని; ఆశ్రయించి= శరణువేడి; నిర్విషయంబు+అగు= విషయవాసనా రహితమైన; సర్వాత్మ తత్త్వంబున్= సర్వాత్మయొక్క తత్త్వాన్ని; కాంచి= తెలిసికొని; విశిష్ట= అసాధారణమైన; యోగక్రమంబున్= యోగమార్గాన్ని; పొంది= అందుకొని; నారదముని= నారదమహర్షి; అలవోక= యథాలాపంగా; అచటికిన్= అక్కడికి; అరుదెంచినన్= వచ్చేసరికి; వినతుఁడై= శుకుడు నమస్కరించి; ఆత్మయోగసిద్ధి= తనకు కలిగిన ఆత్మ యోగం యొక్క సిద్ధిని; ఎఱిఁగించి= నారదుడికి చెప్పి; నీ= నీయొక్క; కృపన్+చేసి= దయచేత; తెరువు= సరియైన మార్గం; కంటిన్= దర్శించాను; విగతసంగత్వము+ ఒంది= నిస్సంగస్థితిని పొంది; అరిగెదన్= ప్రయాణం సాగిస్తాను.

**తాత్పర్యం:** కైలాసపర్వతంమీద అనువైన చోటు చూచికొని శుకుడు తూర్పుముఖంగా కూర్చున్నాడు. సర్వాంగాలలోనూ ఆత్మధారణ చేశాడు. అంతలో సూర్యుడు సాక్షాత్కరించాడు. శుకుడు సాష్టాంగపడ్డాడు, సమాశ్రయించాడు. సర్వాత్మతత్త్వాన్ని గ్రహించాడు. అప్పుడు యథాలాపంగా నారదుడు వచ్చాడు. శుకుడు తన యోగసిద్ధిని తెలియజేశాడు. 'దేవర్షీ! నీ దయవలన సరియైన మార్గం దొరికింది. నిస్సంగుడినై ఈ యోగమార్గంలో ప్రయాణిస్తాను.' (అన్నాడు.)

**క. అని పలికి విమలయోగం । బున నాకసమునకు నెగసిపోయె గరుత్మం**
**తుని భంగి నపుడు సాధ్యులు । మునులుంగని విస్మయమున మునుఁగుచుఁ దమలోనన్. 328**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; విమలయోగంబునన్= పవిత్రమైన యోగశక్తితో; ఆకసమునకున్= ఆకాశానికి; గరుత్మంతుని భంగిన్= గరుత్మంతుడిలా; ఎగసి+పోయెన్= శుకుడు ఎగిరి వెళ్ళాడు; అపుడు= ఆ సమయంలో; సాధ్యులు= సాధ్యులు అనే దేవతలూ; మునులున్= మహర్షులూ; కని= చూచి; విస్మయమునన్= ఆశ్చర్యంలో; మునుఁగుచున్= మునుగుతూ; తమలోన్= తమలో తాము.

**తాత్పర్యం:** నారదుడితో ఆ రెండుమాటలూ పలికి శుకుడు తన యోగశక్తితో గరుత్మంతు డిలా ఆకాశంలోకి ఎగిరి వెళ్ళాడు. చాలాకాలం ఆ పర్వతంమీదనే యోగాభ్యాసం చేస్తున్న సిద్ధులూ, సాధ్యులూ, మహర్షులూ - వీరంతా అది చూచి ఆశ్చర్యంలో మునిగిపోతూ తమలో తాము. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ' అచిరకాలంబునన యమ్మహాత్ముఁ డిట్లు । యోగసిద్ధిఁ బ్రాపించునె? యుల్ల మెంత**
**నిర్మలమొ! పితృభక్తి వినిశ్చలత్వ । సంపదన చూవె యీతఁ డీ పెంపువడసె. 329**

**ప్రతిపదార్థం:** అచిరకాలంబునన్+అ= అనతికాలంలోనే; ఆ+మహాత్ముఁడు= ఆ మహానుభావుడు - శుకుడు; ఇట్లు; యోగసిద్ధిన్= యోగసిద్ధిని; ప్రాపించునె?= పొందగలిగాడా!; ఉల్లము= అతడి హృదయం; ఎంత నిర్మలమొ!= ఎంత నిర్మలమైనదో కదా!; పితృభక్తి= పితృభక్తి రూపమైన; వినిశ్చలత్వ= స్థిరత్వంయొక్క; సంపదన్+అ= సంపత్తితోనే; చూవె!= సుమా!; ఈతఁడు= ఈ శుకుడు; ఈ పెంపున్= ఈ గొప్పదనాన్ని; పడసెన్= పొందాడు!

**తాత్పర్యం:** 'అనతికాలంలోనే ఈ మహాత్ముడు యోగసిద్ధిని ఎట్లా పొందగలిగాడో! ఈయన మనస్సు ఎంత నిర్మలమో! పితృభక్తిపట్ల ఇతడి కున్న నిశ్చలత్వం వల్లనే సుమా - ఇతడికి ఈ పెంపు లభించింది!' అనుకొన్నారు.

వ్యాసుఁడు వెనుకొన శుకుఁడు యోగమార్గంబున నదృశ్యుండగుట (సం. 12-320-2,3)

**వ. అని మఱియు ననేకభంగులం బ్రస్తుతించుచుండి రట్టియెడ శుకుండు మృగపక్షిశైలసరిత్సరసీతరుగుల్మలతలం గలయం గనుంగొని 'మా తండ్రి నా వెనుకం జనుదెంచి నాదగు పేరం బిలిచెనేని మీరెల్ల నో యనవలయుంజుండీ!' యనిన నవి యట్ల చేసెదమనియె. నా బ్రహ్మర్షివరుండు దమోరజస్సత్త్వంబులం గ్రమంబున డిగ్గఁ ద్రావియు నుత్తరాభిముఖుండై పోవ నొక్క మహాపర్వతంబు శృంగంబులు రెం డత్యంతపీతశ్వేతంబులై మేరు హిమవంతంబులం దెగడుచుం గదిసి యనేక యోజనాయామ విస్తారంబులు గలిగి మార్గంబున కడ్డపడియుండె నతం డప్రతిహతగమనంబునం జన నవి దుత్తుమురై రాలె నద్భుతభంగియగు నా సిద్ధపుంగవుపైఁ బుష్పవర్షంబు గురియుచు నమరగణంబు బహువిధంబులం బ్రణుతించె నప్పారాశర్యపుత్రుం డయ్యెడం బ్రవహించు మందాకిని మీఁదం జదలఁ జేరువం జనియె నట్లు సను సమయంబున. 330**

**ప్రతిపదార్థం:** అని; మఱియున్= ఇంకా; అనేకభంగులన్= పలురకాలుగా; ప్రస్తుతించుచున్+ఉండిరి= పొగుడుతున్నారు; అట్టియెడన్= అప్పుడు; శుకుండు= ఆ శుకమహర్షి; మృగ= జంతువులనూ; పక్షి= పక్షులనూ; శైల= పర్వతాలనూ; సరిత్= నదులనూ; సరసీ= సరోవరాలనూ; తరు= వృక్షాలనూ; గుల్మ= పొదలనూ; లతలన్= తీగెలనూ; కలయన్+కనుంగొని= అన్నివైపులా తేరిపార చూచి; మా తండ్రి= మా నాన్నగారు (వ్యాసుడు); నా వెనుకన్= నా వెన్నంటి; చనుదెంచి= ఇక్కడికి వచ్చి; నాది+అగు+పేరన్= నా పేరుతో; పిలిచెన్+ఏని= పిలిచినట్లయితే; మీరు+ఎల్లన్= మీరంతా; ఓ+అనవలయున్+చుండీ= 'ఓ' అని బదులు పలకాలి సుమండీ! - అనినన్= అనేసరికి; అవి= ఆ మృగపక్షిశైలాదులన్నీ; అట్లు+అ= అట్లాగే; చేసెదము= చేస్తాం; అనియెన్= అన్నాయి; ఆ+బ్రహ్మ+ఋషి+వరుండు= బ్రహ్మర్షులలో అగ్రగణ్యుడైన ఆ శుకుడు; తమః= తమోగుణాన్నీ; రజః= రజోగుణాన్నీ; సత్త్వంబులన్= సత్త్వగుణాన్నీ; క్రమంబునన్= ఇదే వరుసలో; డిగ్గఁద్రావియున్= పరిత్యజించి; ఉత్తర+అభిముఖుండు+అయి= ఉత్తరదిక్కువైపు; పోవన్= వెళ్ళగా; ఒక్క= ఒకానొక; మహాపర్వతంబు= మహాగిరియొక్క; శృంగంబులు= శిఖరాలు; రెండు; అత్యంత= మిక్కిలి; పీత= పసుపూ; శ్వేతంబులై= తెలుపూ అయి; మేరు= మేరు పర్వతాన్నీ; హిమవంతంబులన్= హిమవత్పర్వతాన్నీ; తెగడుచున్= తిరస్కరిస్తూ; కదిసి= క్రిక్కిరిసి; అనేకయోజన= పలు యోజనాల; ఆయామవిస్తారంబులు= పొడుగూ, వెడల్పులు; కలిగి; మార్గంబునకున్= శుకుడు ప్రయాణిస్తున్న ఆకాశమార్గానికి; అడ్డపడి+ఉండెన్= అవరోధంగా ఉన్నాయి; అతండు= ఆ శుకుడు; అప్రతిహత= నిరాటంకమైన; గమనంబునన్= సంచారంతో; చనన్= ప్రయాణించేసరికి; అవి= ఆ రెండుపర్వత శిఖరాలూ; తుత్తుమురై= తునకలు తునకలై; రాలెన్= నేలకు రాలిపోయాయి; అద్భుతభంగి+అగు= ఆశ్చర్యకరమైన పద్ధతి కలవాడైన; ఆ; సిద్ధపుంగవుపైన్= యోగసిద్ధులలో అగ్రగణ్యుడిమీద (శుకుడిమీద); పుష్పవర్షంబు= పూలవాన; కురియుచున్= కురిపిస్తూ; అమరగణంబు= దేవతల సమూహం; ప్రణుతించెన్= స్తుతించింది; ఆ+పారాశర్యపుత్రుండు= వ్యాసపుత్రుడైన ఆ శుకుడు; ఆ+ఎడన్= ఆ సమీపంలో; ప్రవహించు= ప్రవహిస్తున్న; మందాకినిమీఁదన్= గంగానదిమీద నుండి; చదలన్= ఆకాశంలో; చేరువన్= తక్కువ ఎత్తున; చనియెన్= వెళ్ళాడు; అట్లు; చను+సమయంబునన్= వెడుతున్న తరుణంలో.

**తాత్పర్యం:** అని అనేకవిధాలుగా పొగడుతున్నారు. అప్పుడు శుకుడు మృగాలనూ, పక్షులనూ, పర్వతాలనూ, నదులనూ, కొలకులనూ, చెట్లనూ, గుట్టలనూ, తీగలనూ చూచి 'మాతండ్రి నా వెంట వస్తూ నాపేరుతో పిలుస్తూ ఉంటే మీరు 'ఓ' అని బదులు పలకాలి సుమా!' అనగానే అవి దానికి అంగీకరించాయి. శుకుడు త్రిగుణాలనూ త్యజించి ఉత్తరంగా వెళ్ళుతుండగా, మహాపర్వత శిఖరాలు రెండు పసుపూ, తెలుపు రంగులలో ఉండి మేరు హిమనగాలను ధిక్కరిస్తూ శుకుడి పయనానికి అడ్డం వచ్చాయి. శుకుడు నిరాఘాటంగా ముందుకు సాగేసరికి ఆ శిఖరాలు ముక్కలు ముక్కలై కూలిపోయాయి. దేవతలు అతడిమీద పూలవాన కురిపించారు. శుకుడు గంగానది మీద ఆకాశంలో తక్కువ ఎత్తున వెళ్ళే సమయంలో.

**తే.** **నగ్నలై యప్సరస్త్రీజనములు సలిల । కేళి సలుపుచునుండి శంకింప కమ్మ**
**హాత్ముఁ గనుఁగొను చెప్పటియట్ల నిర్వి । కారవృత్తి వర్తించిరి కౌరవేంద్ర! 331**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ధర్మరాజా!; అప్సరస్+స్త్రీ+జనములు= అప్సరసలు; నగ్నలు+ఐ= దిగంబరలై; సలిలకేళి= జలక్రీడను; సలుపుచున్+ఉండి= ఆ గంగానదిలో జరుపుతూ; శంకింపక= అయ్యో!- పురుషుడే అని సంకోచించకుండా; ఆ+మహాత్మున్= మహానుభావుడైన ఆ శుకుడిని; కనుఁగొనుచున్= అట్లా చూస్తూ; ఎప్పటి+అట్లు+అ= ఎప్పటిలాగానే; నిర్వికారవృత్తిన్= ఏ వికృతీ లేని ప్రవృత్తితో; వర్తించిరి= జలకేళి కొనసాగించారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! తక్కువ ఎత్తులో శుకుడు అట్లా వెళ్ళుతున్నప్పుడు క్రింద ఆ గంగానదిలో అప్సరసలు దిగంబరంగా జలకేళి ఆడుతున్నారు. వారంతా శుకుడిని చూచారు. కానీ, ఏ వికారమూ పొందలేదు, శంకించలేదు. సిగ్గు అనుకోలేదు. ఎప్పటివలె జలక్రీడలు కొనసాగించారు.

**వ.** **అయ్యవసరంబున సత్యవతీసుతుండు నిజసుతు వెనుక మహాయోగ గమనంబు గైకొని తగిలె నంతకు నయ్యారణేయుండు వాయుపథం బతిక్రమించి సర్వభూతాత్మకుం డయ్యె నప్పుడు. 332**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సత్యవతీసుతుండు= వ్యాసుడు; నిజసుతు (యొక్క); వెనుకన్= తన కుమారుడి వెనకాల; మహాయోగ గమనంబు= గొప్ప యోగవిద్యవలన లభించిన (గతిని) గమనాన్ని; కైకొని= స్వీకరించి (చేపట్టి); తగిలెన్= వెంటపడ్డాడు; అంతకున్= అప్పటికి; ఆ+ఆరణేయుండు= ఆ శుకుడు; వాయుపథంబు= వాయుమార్గం; అతిక్రమించి= దాటి; సర్వభూతాత్మకుండు= పంచభూతాలకూ అంతర్యామి; అయ్యెన్= అయ్యాడు; అప్పుడు= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో వ్యాసుడు తన కుమారుడి వెనుక గొప్ప యోగవిద్యవలన లభించిన గమనాన్ని స్వీకరించి వెంటపడ్డాడు. అప్పటికి ఆ శుకుడు, వాయుమార్గం దాటి పంచభూతాలకూ అంతర్యామి అయ్యాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **వెనుక నరుగుచునున్న యవ్వేదమూర్తి । తోడ సిద్ధచారణులు దత్సుతుఁడు శైల**
**శృంగ విధ్వంసియై పోక సెప్ప నెలుఁగు । పెంపు మిగుల 'శుకా!' యని పిలిచె నతఁడు. 333**

**ప్రతిపదార్థం:** వెనుకన్= శుకుని వెనకాల; అరుగుచునున్న= వెడుతున్న; ఆ+వేదమూర్తితోడన్= వేదస్వరూపుడైన ఆ వ్యాసుడితో; సిద్ధచారణులు= సిద్ధులూ, చారణులూ; తద్+సుతుఁడు= ఆయన పుత్రుడైన శుకుడు; శైలశృంగ= పర్వతశిఖరాల; విధ్వంసియై= వినాశకుడై; పోక= వెళ్ళటం; చెప్పన్= చెప్పేసరికి; అతఁడు= ఆ వ్యాసుడు; ఎలుఁగుపెంపు= కంఠధ్వని; మిగులన్= అతిశయించేట్టు; శుకా!= ఓ శుకా!; అని; పిలిచెన్= కేకవేశాడు;

**తాత్పర్యం:** కొడుకును వెదుక్కొంటూ వెనకాలే బయలుదేరిన బ్రహ్మశ్రీవేదమూర్తులైన వ్యాసులవారిని చూచి సిద్ధచారణులు ఇట్లా అన్నారు: 'స్వామీ! మీ అబ్బాయి రెండు పర్వతశృంగాలను విధ్వంసం చేసి ఇటే వెళ్ళాడు' అని. ఇది విన్న వ్యాసుడు గొంతెత్తి గట్టిగా 'శుకా!' అని అరచి పిలిచాడు.

**వ.** **పిలిచిన నా సర్వగతుండు నిజప్రకారం బంతర్హితం బగుట దేటపడ బయల నో యను నాదంబు నిగుడునట్లు సేసెం దదనంతరంబ. 334**

**ప్రతిపదార్థం:** పిలిచినన్= వ్యాసుడు అట్లా పిలిస్తే; ఆ సర్వగతుఁడు= సర్వభూతాత్మకుడుగా మారిపోయిన ఆ శుకుడు; నిజప్రకారంబు= తన స్వరూపం; అంతర్హితంబు+అగుటన్= అదృశ్యమైపోవటం; తేటపడన్= స్పష్టపడేట్టు; బయలన్=

ఆకాశంలో; ఓ+అను+నాదంబు= ఓ అనే ధ్వని; నిగుడునట్లు+చేసెన్= వ్యాపించేట్టు చేశాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** వ్యాసుడు అట్లా పిలిచేసరికి శుకుడికి తెలిసింది. అత డిప్పుడు సర్వభూతాత్మకుడుగా మారిపోయాడు. కాబట్టి రూపం కనపడదు. అయినా వ్యాసుడికి వినిపించేటట్లు ఓ అనే ధ్వని ఆకాశమంతటా వ్యాపించి మారుమ్రోగేటట్లు చేశాడు. అప్పుడు ఏమి జరిగిందంటే.

**విశేషం:** 'అంతర్హితంబగుటఁ దేటపడ' అని అన్నిప్రతులలోనూ అరసున్న ఉన్నది. అంతర్హితం అవటంచేత తేటపడేటట్లు - అంటే ఏది తేటపడేటట్లు? అన్న ప్రశ్న పుట్టుతుంది. దానికి సమాధానం లేదు. అరసున్న తీసేస్తే - తన స్వరూపం అంతర్హిత మవ్వటం అనేది తండ్రికి తేటపడేట్టు ఓ అనే ధ్వని నిగుడించాడు - అని అన్వయం హాయిగా కుదురుతుంది. ఈ సందర్భంలో మూలశ్లోకం ఇట్లా ఉన్నది. **"అంతర్హితః ప్రభావం తు దర్శయిత్వా శుకస్తదా । గుణాన్సంత్యజ్య శబ్దాదీన్ పదమధ్యగమత్పరమ్ ॥" (12-320-26).** అంతర్హితుడైన శుకుడు తన ప్రభావాన్ని ప్రదర్శిస్తూ శబ్దాదిగుణాలను కూడా విడిచిపెట్టి పరమపదాన్ని పొందాడు అని ఈ శ్లోకానికి భావం. పై అన్వయానికి అనువైనది.

**తే. సకలజంగమ స్థావర సమితు లెల్ల । నో యనిన నద్భుతం బెడ్డ నుద్భవింప**
**సత్యవతి కొడ్కు - కొడుకు విశాలమహిమఁ । దెలిసి యప్పర్వతముమీఁద నిలువఁబడియె. 335**

**ప్రతిపదార్థం:** సకల= సమస్తమైన; జంగమ= కదిలేవీ; స్థావర= కదలినివీ; (చరాచర) అయిన; సమితులు+ఎల్లన్= (వస్తు) సమూహం అంతా; ఓ+అనినన్= ఓ అనేసరికి; అద్భుతంబు= ఆశ్చర్యం; ఎడ్డన్= హృదయంలో (ఎడఁద-ఎడ్ద-ఎడ్డ-ఎద,ఎడ); ఉద్భవింపన్= కలగగా; సత్యవతి కొడ్కు= సత్యవతీ సుతుడైన వ్యాసుడు; కొడుకు= తన కొడుకు శుకుడియొక్క; విశాలమహిమన్= విస్తారమైన మహత్తును; తెలిసి= గ్రహించి; ఆ+పర్వతముమీఁదన్= అదే కొండమీద; నిలువన్+పడియెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** చరాచర వస్తుసమూహం అంతా 'ఓ' - అని ధ్వనించింది. వ్యాసుడు ఆశ్చర్యపోయాడు. తన కుమారుడి అనంతమైన మహిమ తెలిసికొన్నాడు. అదే పర్వతశిఖరం మీద అట్లాగే నిలుచుండిపోయాడు.

**వ. ఇట్లు నిలిచిన యవ్వేదవ్యాస మునీశ్వరుం గాంచి జలవిహారంబు సలుపు నయ్యప్సరోజనంబులు సిగ్గు నగ్గలికగ్రందుకొన నందఱు నంబరంబులు ధరియించి రద్దివ్యబోధమహనీయుండు నిజతనయు చనునప్పుడు వారు శంకలేక యునికిఁ గని యతని ముక్తతయుఁ దన సక్తతయు నిరూపించి ప్రియంబును లజ్జయు నొక్కటఁ బొడమ నున్నంత. 336**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇలా; నిలిచిన= ఆగిపోయిన; ఆ+వేదవ్యాసముని+ఈశ్వరున్= ఆ వ్యాసమహర్షిని; కాంచి= చూసి; జలవిహారంబు+సలుపు= (అప్పటికీ) గంగానదిలో (ఇంకా) జలవిహారం చేస్తున్న; ఆ+అప్సరోజనంబులు= ఆ దేవకాంతలు; సిగ్గున్+అగ్గలిక= లజ్జాతిశయం (మిక్కిలి సిగ్గు); క్రందుకొనన్= ఆవహించగా; అంబరంబులు= వస్త్రాలు; ధరియించిరి= ధరించారు; ఆ+దివ్యబోధ+మహనీయుండు= దివ్యజ్ఞానంతో మహానుభావుడైన ఆ వ్యాసుడు; నిజతనయు= తన కుమారుడు; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు; వారు= ఆ అప్సరసలు; శంకలేక+ఉనికిన్= ఏ సంకోచమూ లేకుండా ఉండటాన్ని; కని= చూసి; అతని= ఆ శుకుడి యొక్క; ముక్తతయున్= విముక్తస్థితీ; తన= తనయొక్క; సక్తతయున్= సక్తస్థితీ (సాంసారిక స్పృహ); నిరూపించి= గ్రహించి; ప్రియంబునున్= (కుమారుడి స్థితికి) సంతోషమూ; లజ్జయున్= (తన స్థితికి) సిగ్గూ; ఒక్కటన్= ఒకేసారి; పొడమన్= కలగగా; ఉన్నంత= అలా ఉన్న సమయంలో.

**తాత్పర్యం:** ఇట్లా ఆగిపోయిన వ్యాసుడిని చూచి, అక్కడ జలకాలాడుతున్న అప్సరసలు సిగ్గు ఎక్కువ కాగా, అందరూ బట్టలు కట్టుకొన్నారు. దివ్యజ్ఞానం కలిగిన ఆ వ్యాసుడు తన కుమారుడు అదే దారిలో వెళ్ళినప్పుడు వారికి శంకలేదన్న

నిజాన్ని గ్రహించి, కుమారుడి విముక్తస్థితిని, తన ఆసక్తస్థితినీ గ్రహించి కుమారుడి ఔన్నత్యానికి సంతోషించాడు. తన స్థితికి సిగ్గుపడ్డాడు. అట్లా ఆయన ఉండగా.

**క. సుర ముని సిద్ధగణంబులు । పరివేష్టింపంగ నతని పాలికి గంగా**
**ధరుఁ డేఁగుదెంచి నెవ్వగఁ । బొరయు నతనితోడఁ గరుణ వొంపిరివోవన్. 337**

**ప్రతిపదార్థం:** సుర (గణంబులు)= దేవతాబృందాలూ; ముని (గణంబులు)= ముని సమూహాలూ; సిద్ధగణంబులు= సిద్ధుల గుంపులూ; పరివేష్టింపంగన్= గుమిగూడి రాగా; గంగాధరుఁడు= శివుడు; అతనిపాలికిన్= ఆ వ్యాసుడి దగ్గరకు; ఏఁగుదెంచి= వచ్చి; నెవ్వగన్ (నెఱ+వగన్)= పెద్ద దిగులు; పొరయు= పొందుతున్న; అతనితోడన్= ఆ వ్యాసుడితో; కరుణ= దయ; పొంపిరి+పోవన్= అతిశయించేటట్టు.

**తాత్పర్యం:** దిగులుపడుతున్న వ్యాసుడిదగ్గరకు సాక్షాత్తూ గంగాధరుడు విచ్చేశాడు. సురలూ, మునులూ, సిద్ధులూ- ఇత్యాదులందరూ గుంపులు గుంపులుగా ముందు వెనుకల నడుస్తూంటే పెద్ద కోలాహలంగా వచ్చాడు పరమేశ్వరుడు. దిగులుపడుతున్న వ్యాసుడిని చూచి దయ తొణికిసలాడేటట్టు ఓదార్పు మాటలు పలికాడు.

**వ. అనునయ పూర్వకంబుగా నిట్లనియె. 338**

**ప్రతిపదార్థం:** అనునయ పూర్వంబుగాన్= బుజ్జగింపుగా; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= పలికాడు - శివుడు.

**తాత్పర్యం:** బుజ్జగింపుగా శివుడు ఇట్లా అన్నాడు.

**క. ' జలపవనాంబర వసుధా । నల సమవీర్యుఁడగు పుత్త్రు నాకొసఁగంగా**
**వలయు'నని యడిగి తిచ్చితి । నలఘు తపోవిభవ! యేను నట్టికుమారున్. 339**

**ప్రతిపదార్థం:** అలఘు!= గొప్ప; తపోవిభవ!= తపోవైభవం కలవాడా!; జల= నీరు; పవన= వాయువు; అంబర= ఆకాశం; వసుధా= నేల; అనల= అగ్ని - ఈ పంచభూతాలతో; సమ= సాటివచ్చే; వీర్యుఁడు+అగు= శక్తి కలవాడైన; పుత్రున్= కుమారుడిని; నాకున్= నాకు; ఒసఁగంగాన్+వలయున్= ఇవ్వాలి; అని; అడిగితి(వి)= అలనాడు అడిగావు; ఏనున్= నేనుకూడా; అట్టికుమారున్= అటువంటి పుత్రుడిని; ఇచ్చితిన్= నీకు వరంగా ఇచ్చాను.

**తాత్పర్యం:** 'ఓ తపస్వీ! అలనాడు నీ తపస్సుకి మెచ్చి నేను ప్రత్యక్షమయినప్పుడు 'పంచభూత సమవీర్యుడిని కొడుకుగా అనుగ్రహించు'మని నీవు వరం అడిగావు. నేను అట్లాగే అటువంటి వాడినే ఇచ్చాను.

**వ. వాఁడును మత్ప్రభావంబునను భవత్తపోవిశేషంబునను బ్రహ్మతేజోమయుండై దేవతలకుం బొందరానిపరమగతిం బ్రాపించె దీనంజేసి మోదంబు నందవలదె? విషాదంబునకుం బనియేమి?' యని పలికి వెండియు. 340**

**ప్రతిపదార్థం:** వాఁడునున్= ఆ శుకుడు; మత్+ప్రభావంబుననున్= నా ప్రభావంవల్లనూ; భవత్= నీ; తపోవిశేషంబుననున్= నీ విశిష్ట తపస్సువల్లనూ; బ్రహ్మతేజోమయుండు+ఐ= బ్రహ్మతేజస్సుతో కూడినవాడై; దేవతలకున్= దేవతలకైనా; పొందరాని= పొందటానికి శక్యంకాని; పరమగతిన్= ఉత్తమోత్తమ గతిని; ప్రాపించెన్= పొందాడు; దీనన్+చేసి= దీనితో; మోదంబున్+అందన్+వలదె?= సంతోషించవద్దా?; విషాదంబునకున్= దుఃఖానికి; పని+ఏమి?= అవసరం ఏముంది?; అని పలికి= అని మాట్లాడి; వెండియున్=తిరిగి.

**తాత్పర్యం:** ఆ శుకుడు నా ప్రభావంవలన, నీ విశిష్టమైన తపస్సువలనా, బ్రహ్మతేజస్సుతో కూడినవాడై, దేవతలకైనా, పొందటానికి శక్యంకాని ఉత్తమోత్తమ గతిని పొందాడు. దీనితో సంతోషించాలి. దుఖపడవలసిన అవసరం ఏముంది?' అని చెప్పి తిరిగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **' ఇలయు గిరులును శరధులు నెంతదాఁకఁ। గలుగు నంతకాలంబును వెలయుచుండు**
**శుకుని కీర్తియు నీదు యశోవిభూతి। యును జనంబుల వీనుల కుత్సవముగ.' 341**

**ప్రతిపదార్థం:** ఇలయున్= ఈ భూమీ; గిరులునున్= పర్వతాలూ; శరధులున్= సముద్రాలూ; ఎంతదాఁకన్= ఎంతకాలం; కలుగున్= ఉంటాయో; అంతకాలంబునున్= అంతకాలమూ; శుకుని= శుకమహర్షియొక్క; కీర్తియున్= యశస్సూ; నీదు= నీయొక్క; యశః+విభూతియునున్= కీర్తి మహిమ (ఇవి రెండూ); జనంబుల= ప్రజల; వీనులకున్= చెవులకు; ఉత్సవముగన్= పండువుగా; వెలయుచుండున్= ప్రకాశిస్తూ ఉంటాయి.

**తాత్పర్యం:** 'వ్యాసమహర్షీ! ఈ నేలా, ఈ కొండలూ, ఈ సముద్రాలూ ఉన్నంతకాలమూ నీ పుత్రుడి కీర్తీ, నీ యశోవిభూతీ ఉంటాయి. తరతరాలకూ ప్రజలకు చెవులపండువు చేస్తాయి. '

**వ.** **అని నిర్దేశించి 'వలయునేనిఁ బుత్రసదృశయైన ఛాయ నిన్నెప్పుడు ననుగమింప దర్శించువాఁడవు గా'కనియె నిట్లనుగ్రహించి యా బ్రహ్మర్షి ప్రవరుని సంప్రీతునింజేసి వీడుకొల్పి విశ్వేశ్వరుండు నిజేచ్ఛం జనియె నింతవట్టు నారదుండు నాకుం జెప్పె. 342**

**ప్రతిపదార్థం:** అని; నిర్దేశించి= అలా నిర్దేశం చేసి; వలయునేనిన్= అంతగా కావలిస్తే; పుత్ర సదృశ+అయిన= నీ కుమారుడిలాంటి; ఛాయ= నీడ ఒకటి; నిన్నున్= నిన్ను; ఎప్పుడున్= ఎల్లవేళలా; అనుగమింపన్= అనుసరిస్తూంటే; దర్శించువాఁడవు+కాక= దర్శిస్తావు గాక; అనియెన్= అని అనుగ్రహించాడు; ఇట్లు= ఇలా; అనుగ్రహించి= దయచూపించి; ఆ= ఆ ప్రసిద్ధుడైన; బ్రహ్మ+ఋషి+ప్రవరునిన్= బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైన వ్యాసుడిని; సంప్రీతునిన్= సంతోషించినవాడినిగా; చేసి; వీడుకొల్పి= వీడ్కోలు చెప్పి; విశ్వేశ్వరుండు= గంగాధరుడు; నిజ+ఇచ్ఛన్= తన ఇచ్ఛమేరకు; చనియెన్= వెళ్ళిపోయాడు; ఇంతవట్టున్= ఇంతమట్టుకే; నారదుండు= నారదుడు; నాకున్+చెప్పెన్= నాకు చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, 'నీకు అంతగా కావాలని అనిపిస్తే, అతడివంటి నీడ నిన్ను అనుసరించగా చూడగలవు' అని అనుగ్రహించి, శివుడు వెళ్ళిపోయాడు. ఇంతవరకూ నాకు నారదుడు చెప్పాడు.

**క.** **ఇది యితిహాసవరము దనుఁ। జదివిన వారలకు వినిన జనముల కాయుః**
**ప్రదమగు లక్ష్మీ కీర్త్య। భ్యుదయంబుల నిచ్చు సుగతియును గావించున్. 343**

**ప్రతిపదార్థం:** ఇది; ఇతిహాసవరము= శ్రేష్ఠమైన ఇతిహాసం (కథ); తనున్= తనను; చదివినవారలకున్= చదివినవారికీ; వినిన జనములకున్= విన్న ప్రజలకూ; ఆయుఃప్రదము+అగున్= దీర్ఘాయుస్సును ఇస్తుంది; లక్ష్మీ+అభ్యుదయంబులన్= సంపదల అభివృద్ధినీ; కీర్తి+అభ్యుదయంబులన్= యశస్సుల అభివృద్ధినీ (లక్ష్మినీ, కీర్తినీ ఇంకా పలురకాల అభ్యుదయాలనూ); ఇచ్చున్= ఇస్తుంది; సుగతియునున్= సద్గతిని కూడా (ముక్తిని); కావించున్= కలిగిస్తుంది;

**తాత్పర్యం:** ధర్మరాజా! ఉత్తమోత్తమమైన ఇతిహాసం ఇది. దీనిని చదివినవారికీ, విన్నవారికీ దీర్ఘాయుర్దాయం లభిస్తుంది. సకలసంపదలూ యశస్సులూ ఇంకా అనేకమైన అభ్యుదయాలూ కలుగుతాయి. కట్టకడపటికి సద్గతులను (ఉత్తమలోకాలను) ప్రసాదిస్తుంది. (అని ఫలశ్రుతి కూడా చెప్పాడు నారదుడు.)'

**వ.** **అనియె నద్దేవమునిచేత నా వినినచొప్పున నీకుం జెప్పితి నీవింక నేమి వినవల తనుటయ ధర్మతనయుండు శంతనుతనయుతో బ్రహ్మచర్యాదులగు నాలుగాశ్రమంబుల వారును దమకు నుత్తమపదసిద్ధిం గోరి యారాధించు దైవం బెయ్యది దయ పల్లవింప నా కెఱింగింపుము. 344**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని ముగించాడు నారదుడు; ఆ+దేవమునిచేతన్= దేవర్షి అయిన ఆ నారదుడిచేత; నా+వినిన చొప్పునన్= నేను విన్నది విన్నట్టు; నీకున్= నీకు; చెప్పితిన్= చెప్పాను; నీవు; ఇంకన్= ఇంకా; ఏమి= ఏమిటి; వినన్+వలతు(వు)?= వినగోరుతున్నావు?; అనుటయున్= అని భీష్ముడు అడిగేసరికి; ధర్మతనయుండు= యమునికుమారుడైన ధర్మరాజు; శంతను తనయుతోన్= శంతనుమహారాజుగారి కుమారుడైన భీష్ముడితో; బ్రహ్మచర్య+ఆదులు+అగు= బ్రహ్మచర్యం మొదలుగాగల; నాలుగు+ఆశ్రమంబులవారునున్= నాలుగు ఆశ్రమాలలోనూ ఉండేవారు; తమకున్= తమకు; ఉత్తమపదసిద్ధిన్= ఉత్తమమైన మోక్షసిద్ధిని; కోరి= కాంక్షించి; ఆరాధించు= కొలిచే; దైవంబు= దైవం; ఏ+అది= ఏది (నాలుగు ఆశ్రమాలవారికీ ఆరాధింపదగిన దైవం ఎవరు?); దయ పల్లవింపన్= కృప చిగురొత్తగా; నాకున్= నాకు; ఎఱింగింపుము= తెలియజేయుము.

**తాత్పర్యం:** నారదు డిట్లా చెప్పగా నేను విన్నంతమేరకు నీకు చెప్పాను. నీ వింకా ఏమి వినగోరుతున్నావు?' అని భీష్మ డడుగగా ధర్మరాజు 'నాలుగు ఆశ్రమాలలోనూ ఉండేవాళ్ళు కొలిచే దైవం ఏది? నాకు తెలియజెప్పుము.' అని అడిగాడు.

**క.** **అనియె నని చెప్పి గురుభ। క్తి నిరూఢుఁడు లోకమాన్య తేజుఁడు విద్యా**
**ఘనుఁడగు నా వైశంపా। యనమునివరుఁ డిట్టు లనియె నాతనితోడన్.** **345**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని అడిగాడు ధర్మరాజు; అని చెప్పి= అని; గురుభక్తినిరూఢుఁడు= గొప్పభక్తితో స్థిరంగా కూడినవాడూ; లోక= ప్రజలకు; మాన్య= గౌరవింపదగిన; తేజుఁడు= తేజస్సుకలవాడూ; విద్యాఘనుఁడు= విద్యచేత గొప్పవాడూ; అగు= ఐన; ఆ+వైశంపాయన+మునివరుఁడు= మునివరేణ్యుడైన ఆ వైశంపాయనుడు; ఆతనితోడన్= శ్రోతగా ఉన్న జనమేజయుడితో; ఇట్టులు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** (ఇప్పుడు కథను జనమేజయ వైశంపాయనులతో కలుపుతున్నాడు కవి.) ధర్మరాజు భీష్ముడిని ఇట్లా అడిగాడు అని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు. ఈ వైశంపాయనుడు గురుభక్తి కలవాడు. (సకలలోకాల చేత) లోకులు అందరిచేత గౌరవించబడేవాడు. విద్యావిషయకంగా ఘనుడు. ఆయన తన ప్రధానశ్రోత అయిన జనమేజయుడితో ఇట్లా అన్నాడు:

**తే.** **వ్యాసమునినాథు షడ్గుణైశ్వర్యధుర్యు। నాగమవ్యాసకర్మఠు నమితతేజుఁ**
**గొలిచి తత్ప్రసాదంబున వలనుఁ బెంపుఁ। గలిగి యేను నారాయణు కథ ఘటింతు.** **346**

**ప్రతిపదార్థం:** షట్+గుణ= ఆరువిధాలైన; ఐశ్వర్యధుర్యున్= సౌభాగ్యం కలవాడూ; ఆగమ= ఆగమాలలో (ధర్మశాస్త్రాలలో); వ్యాస= వివరింపబడిన; కర్మఠున్= కర్మలను ఆచరించేవాడూ (కర్మఠః= కర్మాచరణ పరాయణుడు); అమితతేజున్= మహాతేజస్వంతుడూ అయిన; వ్యాసమునినాథున్= మునీశ్వరుడైన వ్యాసుడిని; కొలిచి= సేవించి; తద్+ప్రసాదంబునన్= ఆయన అనుగ్రహంవలన; వలనున్= సామర్థ్యమూ; పెంపున్= అతిశయమూ; కలిగి= పొంది; ఏను= నేను; నారాయణు (యొక్క) కథన్= నారాయణుడి ఇతిహాసాన్ని; ఘటింతున్= (నీ వీనులకు) పొందుపరుస్తాను.

**తాత్పర్యం:** ఆరు రకాలైన ఆధ్యాత్మిక ఐశ్వర్యాలు కలవాడూ, ఆగమశాస్త్రాలలో చెప్పబడినట్లుగా కర్మాచరణం చేసేవాడూ, మహాతేజస్వంతుడూ అయిన వ్యాసమునీశ్వరుడిని సేవించి వారి దయవలన సామర్థ్యమూ, ప్రావీణ్యమూ పొందిన నేను నారాయణుడి కథను నీకు వివరించి చెప్పుతాను. అని వైశంపాయనుడు. జయమేజయునితో అన్నాడు

**వ. అని భక్తిపూర్వకంబుగాఁ బలికి జనమేజయున కిట్లనియె న ట్లజాతశత్రుం డడిగిన నయ్యాపగాపుత్త్రుం డతనితో నారాయణనారద సంవాదం బను నితిహాసంబు మా తండ్రి నాకుం జెప్పె దాన నీయడిగిన యర్థంబు దేటపడం జెప్పెద. 347**

**ప్రతిపదార్థం:** అని= ఇలా; భక్తిపూర్వంబుగాన్= భక్తిపురస్సరంగా; పలికి= మాట్లాడి; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= వైశంపాయనుడు చెప్పాడు; అట్లు= ఆ విధంగా; అజాతశత్రుండు= ధర్మరాజు; అడిగినన్= అడిగితే; ఆ+ఆపగాపుత్రుండు= గంగా పుత్రుడైన ఆ భీష్ముడు (ఆపగ= నది); అతనితోన్= ఆ ధర్మరాజుతో; నారాయణ నారదసంవాదంబు= నారాయణ, నారద సంవాదం; అను= అనే; ఇతిహాసంబు= వృత్తాంతం; మా తండ్రి= మా తండ్రిగారైన శంతనుమహారాజు; నాకున్= నాకు; చెప్పెన్= చెప్పాడు; దానన్= దానితో; నీ+అడిగిన= నీవు అడిగిన; అర్థంబు= ప్రయోజనం (విశేషం); తేటపడన్= స్పష్టపడేట్టు; చెప్పెదన్= వివరిస్తాను; ఈ ఇతిహాసం ద్వారా నీ సందేహం తీరుస్తాను అని భావం.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు: 'ధర్మరాజు ప్రశ్నకు బదులుగా భీష్ముడు 'మా తండ్రి శంతనుడు నాకు నారాయణనారద సంవాదాన్ని చెప్పాడు. అది నీ సందేహాన్ని తీర్చగలదు.'

**క. అని పలికి యాదరంబున । మనంబు మేదురము గాఁగ మనుజేశ్వర! య**
**జ్జనపతి వీను లమృతరస । మున నించినయట్టి చందముగ నిట్లనియెన్. 348**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర= జనమేజయమహారాజా!; అని పలికి= భీష్ముడు అట్లా పలికి; ఆదరంబునన్= ప్రేమతో; మనంబు= హృదయం; మేదురము+కాఁగన్= క్రిక్కిరియగా; ఆ+జనపతి= ఆ ధర్మరాజుయొక్క; వీనులు= చెవులు; అమృతరసమునన్= అమృతరసంతో; నించిన+అట్టి చందముగన్= నింపినట్టుగా; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆదరంతో మనస్సు మేదురం కాగా భీష్ముడు ధర్మజుడి చెవులలో అమృతరసం నింపినట్లుగా ఆ ఇతిహాసాన్ని ఇట్లా వివరించాడు.

**భీష్ముఁడు ధర్మజునకు నారదనారాయణ సంవాదంబు సెప్పుట: (సం. 12-321-7)**

**సీ. ' విను మవ్యయుఁడు సనాతనుఁడు విశ్వాత్ముఁడు । నైన నారాయణుండను మునీంద్రు**
**బదరికాశ్రమమున భక్తిమైఁ గొలిచి నా । రదుఁ డెద్ది సిద్ధి కారాధనీయ**
**మానతి యిమ్మన్న నతఁడుఁ ధ్రువం బచ । లం బింద్రియాగోచరంబు సూక్ష్మ**
**మనుపమ మన సర్వమున కంతరాత్మయై । వెలుఁగు తత్త్వము దక్క వేఱ కలదె?**

**తే. అరయ నారాధ్యమై యజుఁ డాదిగాఁగ । సకల భూతంబులకును బూజ్యంబు దాన**
**యనియె నిట్లన్న నరసఖుఁ డతికృపార్ద్ర । భావుఁడై చెప్ప నప్పద్మభవసుతుండు. 349**

**ప్రతిపదార్థం:** వినుము= ధర్మరాజా! ఆలకించుము; అవ్యయుఁడు= వ్యయంకానివాడూ; సనాతనుఁడు= సనాతనుడూ; విశ్వాత్ముఁడు= విశ్వస్వరూపుడూ; ఐన= అయినటువంటి; నారాయణుండు= నారాయణుడు; అను= అనే; మునీంద్రున్= మునీశ్వరుడిని; బదరికాశ్రమమునన్= బదరికాశ్రమంలో; భక్తిమైన్= భక్తితో; కొలిచి= సేవించి; నారదుఁడు= నారదమహర్షి; ఎద్ది= ఏది; సిద్ధికిన్= మోక్షసిద్ధికి; ఆరాధనీయము= ఆరాధింప దగినదో; ఆనతి+ఇమ్ము= ఆజ్ఞాపించుమని; అన్నన్= అడిగితే; అతఁడు= ఆ నారాయణుడు; ధ్రువంబు= ధ్రువమైనదీ; అచలంబు= చలించనిదీ; ఇంద్రియ+అగోచరంబు= ఇంద్రియాలకు అందనిదీ; సూక్ష్మము= సూక్ష్మమైనదీ; అనుపమము= సాటిలేనిదీ; అనన్= అనబడుతూ; సర్వమునకున్= సమస్తానికీ; అంతరాత్మయై=లోపలి ఆత్మయై; వెలుఁగు= ప్రకాశించే; తత్త్వము= ఆ తత్త్వం ఒక్కటి; తక్కన్= తప్ప; వేఱు+అ= వేరే మరొకటి; అరయన్= ఎంత

పరిశీలించినా; ఆరాధ్యము+ఐ= ఆరాధనీయమైనది; కలదె?= ఉన్నదా?; అజుఁడు+ఆదిగాఁగన్= బ్రహ్మదేవుడు మొదలుగా; సకల భూతంబులకున్= సమస్త ప్రాణులకూ; పూజ్యంబు= ఆరాధింపదగినది; తాను+అ= అదే; అనియెన్= అని చెప్పాడు; ఇట్లు+అన్నన్= ఇట్లా అన్నటువంటి; నరసఖుఁడు= నరుడి మిత్రుడైన (నరనారాయణులే అర్జున కృష్ణులు) నారాయణుడు; అతి కృపా+ఆర్ద్రభావుఁడై= మిక్కిలి దయతో చెమ్మగిల్లిన హృదయం (భావం) కలవాడై; చెప్పన్= వివరించేసరికి; ఆ+పద్మభవ+సుతుండు= బ్రహ్మదేవుని (పద్మభవుడు) కుమారుడైన ఆ నారదుడు.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పుతున్నాడు. 'ధర్మరాజా! వినుము. నారాయణుడు అనే మునీంద్రుడిని బదరికాశ్రమంలో సందర్శించి సంసేవించి నారదుడు ఒక ప్రశ్న వేశాడు. మోక్షసిద్ధికి ఆరాధనీయమైనది ఏది?- అని. 'సమస్తానికీ అంతరాత్మగా వెలిగే తత్త్వం ఒక్కటే తప్ప మరొకటి ఆరాధనీయం ఏముంది? బ్రహ్మాదులకూ సకల భూతాలకూ అదే ఆరాధనీయం'. అని నరసఖుడైన నారాయణుడు తెలిపేసరికి నారదుడు విని సంప్రీతుడయ్యాడు.

**వ. సంప్రీతుండై సవిశేష వినయంబున నమ్మహాత్మున కిట్లనియె. 350**

**ప్రతిపదార్థం:** సంప్రీతుఁడు= నారదుడు ఆనందించి; సవిశేషవినయంబునన్= విశిష్టమైన వినయంతో; ఆ+మహాత్మునకున్= ఆ మహానుభావుడికి; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నారదుడు ఆనందించి, సవినయంగా ఇట్లా అడిగాడు.

**క. ' లోకేశ! నీవు ధర్మ । శ్రీ కావలి గాఁగ నవతరించుట విద్వ**
**ల్లోకంబు సెప్పు నమ్మూ । లాకృతి యెట్లుండునో? దయాత్మకమూర్తీ! 351**

**ప్రతిపదార్థం:** లోక+ఈశ= జగన్నాయకా!; నీవు; ధర్మశ్రీ= ధర్మసంపదకు (లక్ష్మి యొక్క); కావలి+కాఁగన్= రక్షకుడవుగా; అవతరించుట= జన్మించటం; విద్వత్+లోకంబు= పండితుల సమూహం; చెప్పున్= చెప్పుతోంది; ఆ+మూల+ఆకృతి= నీ దయిన ఆ అసలు స్వరూపం; దయా+ఆత్మకమూర్తీ!= ఓ దయాస్వరూపుడా!; ఎట్టు+ఉండునో?= ఎలా ఉంటుందో?

**తాత్పర్యం:** ఓ జగన్నాయకా! ఓ దయాస్వరూపా! నీవు ధర్మసంరక్షకుడవుగా ఈ అవతారం ధరించావని విజ్ఞులంతా చెప్పుతున్నారు. మరి నీదయిన అసలు సిసలు మూలాకారం ఎట్లా ఉంటుందో కదా!

**క. శ్రుతిపరతయు గురుభక్తియు । మతిఁ గల వొకకొంత కొంత మన్నింపఁగఁ బా**
**త్రత గలిగెనేని నా కొసఁ । గు తదీయాలోకనం బగు తెఱంగు కృపన్. 352**

**ప్రతిపదార్థం:** శ్రుతిపరతయున్= వేదనిష్ఠ; గురుభక్తియున్= గురువుపట్ల భక్తి అనేవి; మతిన్= నా హృదయంలో; కలవు= ఉన్నాయి; ఒక కొంతకొంత= ఏ కొంచెమయినా; మన్నింపఁగన్= గౌరవించటానికి; పాత్రత= అర్హత; కలిగెన్+ఏనిన్= నాకు ఉన్నట్టయితే; తదీయ= ఆ మూలాకృతియొక్క; ఆలోకనంబు= దర్శనం; అగు= అయ్యే; తెఱంగున్= పద్ధతిని (ఉపాయాన్ని, మార్గాన్ని); కృపన్= దయతో; నాకున్= నాకు; ఒసఁగు(ము)= ఇమ్ము (అనుగ్రహించు - తెలియజేయుము).

**తాత్పర్యం:** మహానుభావా! నాకు వేదాలపట్ల నిష్ఠ ఉన్నది . గురువులపట్ల భక్తి ఉన్నది. వీటివలన ఏ కొంచెమయినా గౌరవార్హత నాకు కలిగినట్టయితే దయచేసి నీ మూలస్వరూపాన్ని దర్శించే అవకాశం కల్పించుము.

**వ. అని వేఁడిన భక్తపరాధీనుండైన యమ్మహానుభావుం డద్దేవసంయమితోఁ బరమైకాంతి వగుము. నీ కట్టి పెంపు సంపాదించెదం బొ మ్మని యత్యాదరంబున వీడుకొలిపినం బ్రీతుండై యవ్వియద్వీథిం జని యమ్ముని**

**గనకనగంబునందు నియతాత్ముండయి యుండి దుగ్ధార్ణవంబు నుత్తరంబు చేరువ నున్న శ్వేతద్వీపంబునం దనాహారులు నింద్రియవృత్తిరహితులు నస్వేదులు సుగంధిశ్వేతాంగులు నగు పురుషులం గాంచె ననిన విని ధర్మపుత్రుం డవ్విశేషంబులు ముక్తలక్షణంబులై యున్నయవి యప్పురుషుల తెఱం గెఱింగింపవే ? యని యడిగిన శంతనునందనుం డతని కిట్లనియె. 353**

**ప్రతిపదార్థం:** అని; వేఁడినన్= అభ్యర్థించగా; భక్తపరాధీనుండైన= భక్తులకు పరవశుడైన; ఆ+మహానుభావుండు= ఆ మహాత్ముడు; ఆ+దేవసంయమితోన్= ఆ దేవర్షి నారదుడితో; పరమ+ఏకాంతివి= మిక్కిలి ఏకాగ్రచిత్తుడవు; అగుము= కమ్ము; నీకున్= నీకు; అట్టి= అటువంటి; పెంపున్= శక్తిని (మహత్తును); సంపాదించెదన్= కలిగిస్తాను; పొమ్ము= వెళ్ళుము; అని; అతి+ఆదరంబునన్= మిక్కిలి ఆదరంతో; వీడుకొలిపినన్= సాగనంపగా; ప్రీతుండు+ఐ= సంతుష్టుడై; వియత్+వీథిన్= ఆకాశమార్గంలో; చని= ప్రయాణించి; ఆ+ముని= ఆ నారదుడు; కనకనగంబునందున్= మేరుపర్వతంమీద; నియత+ఆత్ముండు+అయి= నియమబద్ధుడై; ఉండి= (తపోదీక్షతో) ఉండి; దుగ్ధ+అర్ణవంబు+ఉత్తరంబు+చేరువన్= క్షీరసముద్రం యొక్క ఉత్తరతీరంలో; ఉన్న; శ్వేతద్వీపంబునందున్= శ్వేతద్వీపంలో; అనాహారులున్= ఆహారం తీసికొననివారూ; ఇంద్రియవృత్తి రహితులున్= ఇంద్రియవ్యాపారాలనన్నింటినీ వదిలించుకొన్నవారూ (జితేంద్రియులు); అస్వేదులున్= స్వేదం (చెమట) పట్టనివారూ; సుగంధి= పరిమళించే; శ్వేత+అంగులున్= తెల్లని శరీరాలు కలవారూ; అగు= అయినటువంటి; పురుషులన్= పురుషులను; కాంచెన్= (నారదుడు) దర్శించాడు; అనినన్= అని భీష్ముడు చెప్పగా; విని= ఆలకించి; ధర్మపుత్రుండు= ధర్మరాజు; ఆ+విశేషంబులు= ఆ విశేషాలు; ముక్తలక్షణంబులు+ఐ= ముక్తి పొందినవారి చిహ్నాలై; ఉన్నయవి= ఉన్నాయి; ఆ+పురుషుల= ఆ పురుషులయొక్క; తెఱంగున్= పద్ధతి అంతా; ఎఱింగింపవే?= తెలియజేయవా?; అని; అడిగినన్= అడిగితే; శంతనునందనుండు= భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** అని వేడగా నారాయణుడు నారదుడితో ఇట్లా అన్నాడు: 'నీవు మిక్కిలి ఏకాగ్రచిత్తుడవు కమ్ము. నీకు కూడ అటువంటి మహత్తును కలిగిస్తాను పొమ్ము' అని ఆదరంతో వీడుకొల్పాడు. నారదుడు గగనమార్గంలో పయనించి మేరుపర్వతంమీద నియమనిష్ఠలతో, క్షీరసముద్రపు టుత్తరతీరంలో ఉన్న శ్వేతద్వీపంలో నిరాహారులై, జితేంద్రియులై, చెమట పట్టనివారై, పరిమళయుతమైన తెల్లని మేనులతో ఉన్న పురుషులను చూచాడు.' అని భీష్మ డనగా 'ఆ లక్షణాలు ముక్తులైన పురుషుల చిహ్నాలై ఉన్నాయి. ఆ పురుషులపద్ధతి నాకు తెలియజెప్పు' మని అడిగాడు. భీష్ముడు ఈ విధంగా చెప్పాడు.

**క. ' వారల కథ మా తండ్రికి । గారవమున బుధులు సెప్పఁగా నే వింటిం**
**గౌరవముఖ్య! విశిష్టా । చారుఁడు నృపుఁ డొక్కఁ డుపరిచరవసు వనఁగన్. 354**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్య!= ధర్మరాజా!; వారలకథ= ఆ పురుషుల వృత్తాంతం; మా తండ్రికిన్= మా నాన్నగారికి; గారవమునన్= గౌరవంతో (ప్రేమతో); బుధులు= దేవతలు లేదా పండితులు; చెప్పఁగాన్= చెపుతుండగా; ఏన్= నేను; వింటిన్= విన్నాను; విశిష్ట+ఆచారుఁడు= విశిష్టమైన ఆచారాలు కలిగినవాడైన; నృపుఁడు= రాజు; ఒక్కఁడు= ఒకానొకడు; ఉపరిచరవసువు= ఉపరిచర వసువు; అనఁగన్= అనే పేరుతో.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! సుగంధిశ్వేతాంగులైన ఆ పురుషుల వృత్తాంతం ఒకప్పుడు బుధులు మా తండ్రిగారికి చెప్పుతుంటే నేను విన్నాను. అది నీకు చెప్పుతాను. ఉపరిచరవసువు అనే పేరుతో ఒక రాజు ఉండేవాడు. ఆయన ఆచారపరాయణుడు.

**ఆ. కలిగెఁ దొల్లి భూమి గలయంతయును నేలు। సత్యమును దమంబు శమము విష్ణు**
**భక్తియును నయంబు బలిమియుఁ గ్రతుకుతూ। హలము బ్రాహ్మణ ప్రియంబుఁ గలఁడు. 355**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; కలిగెన్= (ఉపరిచరవసువు అనే రాజు) ఉన్నాడు; భూమి+కల+అంతయునున్= మొత్తం ఉన్న భూమిని అంతటినీ (భూగోళం మొత్తాన్ని); ఏలున్= పరిపాలిస్తూ ఉండేవాడు; సత్యమునున్= సత్యవాక్య పరిపాలనమూ; దమంబున్= బాహ్యేంద్రియ నిగ్రహమూ; శమము= అంతరింద్రియ నిగ్రహమూ; విష్ణుభక్తియునున్= విష్ణుమూర్తి పట్ల భక్తీ; నయంబు+బలిమియున్= నైతిక బలమూ (రాజనీతివలన కలిగే బలం. లేదా నయంబున్= రాజనీతి; బలిమియున్= సైన్యబలమూ - స్వీయబలమూ); క్రతు= యజ్ఞాలపట్ల; కుతూహలమున్= చేయాలనే ఉత్సాహమూ; బ్రాహ్మణ= బ్రాహ్మణులపట్ల; ప్రియంబున్= ఇష్టమూ; కలఁడు= కలిగినవాడు అతడు.

**తాత్పర్యం:** ఆ ఉపరిచరవసువు మొత్తం భూగోళాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు. అతడు సత్యసంధుడు, ఇంద్రియ నిగ్రహం కలవాడు, విష్ణుభక్తుడు, రాజనీతికుశలుడు. అదే అతడికి బలం. యజ్ఞయాగాదులు చేయటమంటే ఆయనకు ఎంతో సంబరం. బ్రాహ్మణులపట్ల చాలా ప్రేమగా ఉండేవాడు.

**వ. అమ్మహాత్ముండు. 356**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్ముఁడు= మహానుభావుడైన ఆ ఉపరిచరవసువు.

**తాత్పర్యం:** మహానుభావుడైన ఆ ఉపరిచరవసువు.

**చ. అలఘు తపంబుఁగోరి వసుధాధిపతిత్వము డిగ్గఁద్రావి కా**
**నలఁ జరియించుచుండ సురనాయకుఁ డాతని పాలికేఁగి 'నె**
**చ్చెలివయి నా కడం దగ వసింపుము వచ్చుచుఁ బోవుచున్న మే**
**లిలయును నేలు దివ్యతయు నిచ్చితి మెచ్చితి నీదు నిష్ఠకున్. 357**

**ప్రతిపదార్థం:** అలఘు తపంబున్= మహాతపస్సును; కోరి= చేయగోరి (ఆ వసురాజు); వసుధా+అధిపతిత్వము= రాజ్యాధికారాన్ని; డిగ్గఁద్రావి= పరిత్యజించి; కానలన్= అడవుల్లో; చరియించుచుండన్= సంచరిస్తుండగా; సురనాయకుఁడు= దేవేంద్రుడు; ఆతనిపాలికిన్= ఆ వసురాజుదగ్గరకు; ఏఁగి= వెళ్ళి; నెచ్చెలివి+అయి= మంచి మిత్రుడవై; నాకడన్= నా దగ్గర; తగన్= తగినట్లు; వసింపుము= ఉండుము; వచ్చుచున్+పోవుచున్నన్= (లేదంటే) మా నగరానికి వస్తూ పోతూ ఉంటే; మేలు= మంచిది; ఇలయునున్= భూమినికూడా; ఏలు(ము)= పరిపాలించుము; దివ్యతయున్= దివ్యత్వాన్ని కూడా; ఇచ్చితిన్= నీకు ఇచ్చాను; నీదు నిష్ఠకున్= నీ తపోదీక్షకు; మెచ్చితిన్= మెచ్చాను.

**తాత్పర్యం:** ఆ వసురాజు మహాతపస్సును చెయ్యాలని నిశ్చయించుకొని రాజ్యభారాన్ని వదలి అరణ్యాలలోనికి వెళ్ళిపోయాడు. ఒక రోజున దేవేంద్రుడు అతడి దగ్గరకు వచ్చాడు. 'వసురాజా! నాతో స్నేహం చేయుము. నాతో ఉండుము. మా నగరానికి (అమరావతికి) వస్తూ పోతూ ఉండుము. ఈ భూమినికూడా పరిపాలించుము. నీకు దివ్యత్వాన్ని ఇస్తున్నాను. నీ తపోనిష్ఠకు మెచ్చుకొంటున్నాను.

**తే. దేవభావంబునకుఁ దగ దీనినెక్కి। తిరుగు మెల్లెడ' నని రత్నదీప్తమైన**
**యొక విమానంబు సంప్రీతి నొసఁగె నతఁడు। నతని మాటకు మిగులక యట్ల చేసె. 358**

**ప్రతిపదార్థం:** దేవభావంబునకున్= దివ్యత్వానికి; తగన్= తగినట్లుగా; దీనిన్= ఈ విమానాన్ని; ఎక్కి= అధిరోహించి; ఎల్ల+ఎడన్= అంతటా (సకలలోకాలూ); తిరుగుము= విహరించుము; అని; రత్న= రత్నాలతో; దీప్తమైన= ప్రకాశించే; ఒక+విమానంబున్= ఒక విమానాన్ని; సంప్రీతిన్= ప్రేమతో; ఒసఁగెన్= బహూకరించాడు; అతఁడున్= ఆ వసురాజుకూడా; అతని మాటకున్= ఆ ఇంద్రుడి మాటకు; మిగులక= జవదాటకుండా; అట్లు+అ= అలాగే; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** దివ్యత్వానికి అనువుగా ఇదిగో - ఈ విమానాన్ని స్వీకరించి దీనిమీద సకలలోకాలకూ రాకపోకలు చేయుము.' అంటూ ఇంద్రుడు రత్నఖచితమైన ఒక విమానం వసురాజుకు బహూకరించాడు ఇంద్రుడిమాట కాదనలేక వసురాజు అట్లాగే నని స్వీకరించాడు.

**వ.** **దానం జేసి వసునామధేయుండైన యతం డుపరిచరుఁ డనం బరఁగె నదియునుం గాక వేఱొక్కటి యవ్విభుని విశేషంబు వినుము -కల్పాదియందు మరీచి యత్రి అంగిరసుండు పులహుండు పులస్త్యుండు క్రతువు వసిష్ఠుండనియెడు మహామునులు చిత్రశిఖండినామధేయులు స్వాయంభువుండను మనువుం దారు ననేకవర్షంబులు విష్ణు నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుం డదృశ్యరూపంబున వారల కట్టెదుర నిల్చి వారితో 'మీరు ధర్మశాస్త్రకరణ ప్రవణులరై నన్నాశ్రయించితిరి. భారతి మీయందు నిలువ నియోగించితి. మీచేతం బ్రణీతంబై సకల జగంబులకు హితంబును మర్యాదాప్రవర్తకంబును నై శాస్త్రంబు వెలుంగు నంగిరసువలన బృహస్పతి యను నొక్క మహామతి జన్మించు వానియం దాసందర్భంబు ప్రతిష్ఠించునది' యని యానతిచ్చి వెండియు.** **359**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= అట్లా విమానం ఎక్కి తిరగటంచేత; వసునామధేయుండైన= వసువు అనే పేరుగలిగిన; అతండు= ఆ రాజు; ఉపరిచరుఁడు+అనన్+పరఁగెన్= ఉపరిచరుడు అనే ప్రఖ్యాతిని పొందాడు; అదియున్+కాక= అదీకాక; ఆ+విభుని= ఆ వసురాజుగారి; వేఱొక్కటి+విశేషంబు= మరొక విశేషం; వినుము; కల్ప+ఆదియందున్= ఈ కల్పానికి ఆదిలో, మరీచి - అత్రి - అంగిరసుండు, పులహుండు, పులస్త్యుండు, క్రతువు, వసిష్ఠుండు; అనియెడు= అనేటువంటి; మహామునులున్= మహర్షులూ; చిత్ర - శిఖండి నామధేయులున్= చిత్రుడు, శిఖండి అనేవారూ; స్వాయంభువుండు+అను= స్వాయంభువుడు అనే; మనువున్= మనువూ; తారున్= తామంతా; అనేకవర్షంబులు= అనేక సంవత్సరాలపాటు; విష్ణున్+ఉద్దేశించి= విష్ణుమూర్తిని మనస్సులో పెట్టుకొని; తపంబు+చేసినన్= తపస్సు చేస్తే; ఆ+దేవుండు= ఆ విష్ణు భగవానుడు; అదృశ్యరూపంబునన్= అదృశ్యరూపంలో; వారల= వారియొక్క; కట్టెదురన్= ఎట్టఎదుట; నిల్చి= నిలబడి; వారితోన్= వారందరితోనూ; మీరు= మీరంతా; ధర్మశాస్త్ర కరణ= ధర్మశాస్త్రాలను రచించటంలో; ప్రవణులరు+ఐ= తత్పరులై; నన్నున్= నన్ను; ఆశ్రయించితిరి= ఆశ్రయించారు; భారతిన్= సరస్వతిని; మీయందున్= మీలో; నిలువన్= నివసించటానికి; నియోగించితిన్= ఆజ్ఞాపించాను; మీచేతన్= మీచేత; ప్రణీతంబై= రచింపబడి; సకలజగంబులకున్= సమస్తలోకాలకూ; హితంబునున్= మేలునూ; మర్యాదాప్రవర్తకంబునున్+ఐ= కట్టుబాటుల అమలునూ చేసేదై; శాస్త్రంబు= ధర్మశాస్త్రం; వెలుంగున్= ప్రకాశిస్తుంది; అంగిరసువలనన్= అంగిరసుడికి; బృహస్పతి+అను= బృహస్పతి అనేటువంటి; ఒక్క= ఒకానొక; మహామతి= మహాధీశాలి; జన్మించున్= ప్రభవిస్తాడు; వానియందున్= ఆ బృహస్పతిలో; ఆ+సందర్భంబు= ఆ శాస్త్రగ్రంథం; ప్రతిష్ఠించునది= నెలకొల్పండి (బృహస్పతికి బోధించి, ఆ శాస్త్రానికి అతడిని వారసుడిని చేయండి); అని; ఆనతి+ఇచ్చి= ఆజ్ఞాపించి; వెండియున్= తిరిగి ఇట్లా.

**తాత్పర్యం:** వసువు అనే పేరుగల ఆ రాజు అట్లా విమానం ఎక్కి తిరగటంచేత ఉపరిచరుడు అనే ప్రఖ్యాతిని పొందాడు. మరొకవిశేషం వినుము. కల్పాదిలో మరీచి మొదలైన మునులూ, చిత్తుడు, శిఖండి, స్వాయంభువుడు (మనువు), అనేక సంవత్సరాలు విష్ణువును గూర్చి తపస్సు చేశారు. ఆ దేవుడు వారికి అదృశ్యరూపంలో వారి ఎదుట నిలిచి 'మీరంతా ధర్మశాస్త్రాలు రచించటంలో ఆసక్తులై నన్ను ఆశ్రయించారు. సరస్వతిని మీలో నిలవాలని

ఆజ్ఞాపించాను. మీ వలన ధర్మశాస్త్రం సమస్త లోకాలకూ మేలును, మర్యాదలను కలిగించేటట్లు వెలుగొందుతుంది. అంగిరసుడికి బృహస్పతి పేర ఒక మేధావి జన్మిస్తాడు. అతడి ద్వారా శాస్త్ర గ్రంథాన్ని నెలకొల్పండి' అని ఆజ్ఞాపించి మరల ఇట్లా అన్నాడు:

**తే.** **' ఉపరిచరవసు వను నొక్క నృపతి పుట్టు । నాతఁ డర్హుఁ డా శాస్త్రంబు నధిగమింప**
**నా బృహస్పతి సెప్పంగ నధిగమించి । తత్సమాచార నాయకత్వము వహించు.** **360**

**ప్రతిపదార్థం:** ఉపరిచరవసువు= ఉపరిచరవసువు; అను= అనేటటువంటి; ఒక్క నృపతి= ఒక రాజు; పుట్టున్= జన్మిస్తాడు; ఆతఁడు= ఆయన; ఆ శాస్త్రంబున్= ఆ ధర్మశాస్త్రాన్ని; అధిగమింపన్= పొందటానికి (నేర్చుకోవటానికి); అర్హుఁడు= యోగ్యుడు; ఆ బృహస్పతి= అంగిరసుడి కుమారుడై పుట్టబోయే ఆ బృహస్పతి; చెప్పంగన్= నేర్పగా; అధిగమించి= నేర్చుకొని; తద్+సమ= ఆ శాస్త్రంతో సమానమైన; ఆచార= ఆచరించటానికి నాయకత్వమున్= నేతృత్వాన్ని; వహించున్= వహిస్తాడు.

**తాత్పర్యం:** 'మహర్షులారా! ఉపరిచరవసువు అనే ఒక మహారాజు జన్మిస్తాడు. అతడు మీరు రచించబోయే ధర్మశాస్త్రాన్ని అధ్యయనం చెయ్యటానికి యోగ్యుడు. బృహస్పతి నేర్పగా అతడు నేర్చుకొని శాస్త్రప్రకారం ఆచరిస్తూ యజ్ఞయాగాది ఆచారాలకు నాయకుడు ఔతాడు.

**వ.** **' అమ్మహితాత్ముండు మద్భక్తుండు మీకు సంభావనీయుం' డని పలికి చనియె నత్తెఱంగునన యా పెంపు నొందినయట్టి యవ్వసువు హయమేధంబునకుం బ్రవర్తించిన నమ్మరీచ్యాదులగు సప్తసంఖ్యులును మఱియునుం దత్సములగు మహానుభావులును ఋత్విక్కరణంబు లాచరించిరి, బృహస్పతి యుపదర్శనంబు నడపెఁ, బ్రజాపతిపుత్రు లగు నేకతుండును ద్వితుండును త్రితుండును నను మునిసత్తములు సదస్యులై రిట్లు సెల్లు నయ్యధ్వరంబునందు.** **361**

**ప్రతిపదార్థం:** ఆ+మహిత+ఆత్ముండు= మహానుభావుడైన ఆ వసురాజు; మత్+భక్తుండు= నా భక్తుడు; మీకున్= మీ కందరికీ; సంభావనీయుండు= గౌరవింపదగినవాడు; అని; పలికి= చెప్పి; చనియెన్= విష్ణుమూర్తి వెళ్ళిపోయాడు; ఆ+తెఱంగునన్+అ= అదే విధంగా; ఆ+పెంపున్= ఆ అభివృద్ధిని; ఒందినయట్టి= పొందినటువంటి; ఆ+వసువు= ఆ వసుమహారాజు; హయమేధంబునకున్= అశ్వమేధయజ్ఞం చేయటానికి; ప్రవర్తించినన్= పూనుకొంటే; ఆ+మరీచి+ఆదులు+అగు= మరీచిప్రభృతులైన ఆ; సప్తసంఖ్యులునున్= ఏడుగురూ; మఱియునున్= ఇంకా; తద్+సములు+అగు= వారితో సమానులైన; మహానుభావులునున్= మహాత్ములూ; ఋత్విక్+కరణంబులు= ఋత్విక్కులు చేసే పనులు (యాజ్ఞికత్వాలను); ఆచరించిరి= చేశారు; బృహస్పతి= అంగిరసుడు; ఉపదర్శనంబున్= పెత్తనాన్ని; నడపెన్= నడిపాడు; ప్రజాపతిపుత్రులు+అగు= బ్రహ్మదేవుడి కుమారులైన; ఏకతుండును= ఏకతుడూ; ద్వితుండునున్= ద్వితుడూ; త్రితుండునున్= త్రితుడూ; అను= అనే; మునిసత్తములు= మునిశ్రేష్ఠులు; సదస్యులు+ఐరి= సభ్యులయ్యారు; ఇట్లు; చెల్లు= నడుస్తున్న; ఆ+అధ్వరంబునందున్= ఆ యజ్ఞంలో.

**తాత్పర్యం:** మహానుభావుడైన ఆ వసురాజు నా భక్తుడు, గౌరవింపదగినవాడు' అని చెప్పి విష్ణువు వెళ్ళిపోయాడు. వసుమహారాజు అభివృద్ధి పొంది అశ్వమేధయాగం చేశాడు. అందులో మరీచి మొదలైన సప్తర్షులు, మరికొందరు ఋత్విక్కులుగా పాల్గొన్నారు. బృహస్పతి దర్శకత్వం వహించాడు. బ్రహ్మ పుత్రులైన ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ సదస్యులయ్యారు. అట్లా నడుస్తున్న ఆ యజ్ఞంలో.

**తే.** **అన్నరేంద్రుం డహింసకుం డగుటఁ జేసి । పశు విశసనంబు లేకుండఁ బరమనిష్ఠ**
**నాతఁ డారణ్యకోద్గీత మైన వాక్య । సంచయము విష్ణుగుఱిచి పఠించె నధిప!** **362**

**ప్రతిపదార్థం:** అధిప= ధర్మరాజా!; ఆ+నరేంద్రుండు= ఆ వసుమహారాజు; అహింసకుండు= ప్రాణిహింసకు వ్యతిరేకి; అగుటన్+ చేసి= కావటంచేత; పశువిశసనంబు= యజ్ఞంలో పశువును బలి ఇవ్వటం అనేది; లేకుండన్= లేకుండా దాని బదులు; పరమనిష్ఠన్= అత్యంతనిష్ఠతో; ఆతఁడు= యజమానుడైన ఆ వసురాజు; ఆరణ్యక+ఉద్గీతము+ఐన= ఆరణ్యకాలు అనే వేదభాగాలలో చెప్పబడిన; వాక్యసంచయమున్= మంత్రసమూహాన్ని; విష్ణుగుఱిచి= విష్ణుమూర్తినుద్దేశించి; పఠించెన్= జపించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ వసుమహారాజు జీవహింసకు వ్యతిరేకి. అందుచేత అశ్వమేధంలో పశుసంహారానికి అంగీకరించలేదు. దానికి బదులుగా ఆరణ్యాకాలలో చెప్పబడిన కొన్ని మంత్రాలను పరమనిష్ఠతో ఆ మహారాజు విష్ణుమూర్తి నుద్దేశించి పఠించాడు.

**క. కరుణావిధేయుఁ డగు నా । హరి యతనికిఁ గానవచ్చు నట్టులుగాఁ జె**
**చ్చెర వచ్చి హవిర్భాగా । హరణం బొనరించి చనుడు నతికుపితుండై. 363**

**ప్రతిపదార్థం:** కరుణా విధేయుఁడు+అగు= దయకు వశంవదుడైన; ఆ+హరి= ఆ విష్ణుమూర్తి; అతనికిన్= ఆ వసురాజుకు మాత్రమే; కానవచ్చునట్టులుగాన్= కనిపించేటట్టు; చెచ్చెరన్+వచ్చి= వేగమే వచ్చి; హవిర్భాగ+ఆహరణంబు+ఒనరించి= యజ్ఞ హవిర్భాగాన్ని (పురోడాశం) స్వీకరించి; చనుడున్= వెళ్ళిపోగా; అతికుపితుండై= మిక్కిలి కోపించి.

**తాత్పర్యం:** దయాపరుడైన విష్ణుమూర్తి సంతోషించి యజమానుడైన వసురాజుకు మాత్రమే కనిపించేటట్లు వచ్చి తనకు ఉద్దేశించిన హవిర్భాగాన్ని స్వీకరించి వెంటనే వెళ్ళిపోయాడు. ఆధ్వర్యం వహిస్తున్న బృహస్పతికి కోపం వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. దివ్యధిషణుం డగు ధిషణుండు గన్నీ రొలుక నన్నరపతితోఁ దనకై యెత్తిన పురోడాశభాగంబు విష్ణుం డెల్ల వేలుపులుంబోలె నాకు దర్శనగోచరుండై కొనక యదృశ్యుండై కొనియె నని యుగ్గడించిన నయ్యుపరిచరుండు భరితవినయుండై యతని ననునయించె. సదస్యులు సంభ్రమంబు లేక యన్నాకేశమంత్రితో నిట్లనిరి. 364**

**ప్రతిపదార్థం:** దివ్య= దివ్యమైన; ధిషణుండు= బుద్ధికలవాడు; అగు= అయిన; ధిషణుండు= బృహస్పతి; కన్నీరు+ఒలుకన్= శోకిస్తూ; ఆ+నరపతితోన్= ఆ వసుమహారాజుతో; విష్ణుండు= విష్ణుమూర్తి; తనకై= తనకొరకని; ఎత్తిన= మీదుగట్టిన; పురోడాశభాగంబున్= హవిర్భాగాన్ని; ఎల్ల+వేలుపులున్+పోలెన్= తక్కిన అందరు దేవతలవలె; నాకున్= నాకు; దర్శనగోచరుండై= కనబడుతూ; కొనక= స్వీకరించకుండా; అదృశ్యుండై= అదృశ్యరూపంలో; కొనియెన్= స్వీకరించాడు(డా); అని; ఉగ్గడించినన్= పలికేసరికి; ఆ+ఉపరిచరుండు= ఆ ఉపరిచరవసువు; భరితవినయుండై = నిండా (నిండిన) వినయంతో; అతనిన్= ఆ బృహస్పతిని; అనునయించెన్= ఊరడించాడు (బుజ్జగించాడు); సదస్యులు= సదస్యులుగా వచ్చిన ప్రజాపతి పుత్రులు; సంభ్రమంబు లేక= కంగారుపడకుండా; ఆ+నాక+ఈశమంత్రితోన్= దేవేంద్రుడి మంత్రియైన ఆ బృహస్పతితో; ఇట్లు; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ధీమంతుడైన బృహస్పతి కన్నీరు కారుస్తూ వసుమహారాజుతో ఇట్లా అన్నాడు: 'అందరు దేవతలవలె కాక విష్ణువు తన కిచ్చే హవిర్భాగాన్ని ప్రత్యక్షంగా కాక అదృశ్యుడై స్వీకరించా' డని చెప్పాడు. వసుమహారాజు బృహస్పతిని ఊరడించాడు. అప్పుడు ప్రజాపతి పుత్రులు బృహస్పతితో ఇట్లా అన్నారు:

ఏకతద్వితత్రితులు బృహస్పతికి విష్ణుదేవుమహిమ సెప్పుట (సం. 12-323-19)

**సీ.** **' అలుక మానుము హరికై సముద్యతమైన । భాగంబు హరిగొన్నఁ బదరనేల?**
**యతని దర్శింప శక్యమె నీకు మాకును? । నజుని మానస పుత్రు లైన యేము**
**హరిదర్శనముఁ గోరి యధికతపం బాచ । రించుచుండఁగ నశరీరవాణి**
**దుగ్ధార్ణవంబునందు విశాల రమణీయ । మగు నొక్కదీవి దెల్పారియుండు**

**తే.** **నచటి కరుగుఁ డనుచు నతి సితవర్ణుల । స్వేదు లింద్రియప్రవృత్తి విముఖు**
**లధిక సురభిదేహు లాహార రహితులు । హరిపరాత్ములైన నరులు గలరు.** **365**

**ప్రతిపదార్థం:** ఓ బృహస్పతీ! అలుక= కోపం; మానుము= విడిచిపెట్టుము; హరికై= విష్ణుమూర్తికోసం; సముద్యతము+ఐన= మీదుగట్టిన; భాగంబున్= హవిర్భాగాన్ని; హరి= విష్ణుమూర్తి; కొన్నన్= స్వీకరిస్తే; పదరన్+ఏల= బాధ పడటం ఎందుకు?; అతనిన్= ఆ విష్ణుమూర్తిని; దర్శింపన్= చూడగలగటమనేది; నీకున్= నీకూ; మాకునున్= మాకూ; శక్యమె?= సాధ్యమా?; అజుని= బ్రహ్మదేవునియొక్క; మానసపుత్రులు+ఐన= మనస్సు నుంచి జన్మించిన కుమారులమైన; ఏము= మేము ముగ్గురమూ; హరిదర్శనమున్= విష్ణుమూర్తి దర్శనాన్ని; కోరి; అధికతపంబు= గొప్ప తపస్సు; ఆచరించుచున్+ఉండఁగన్= చేస్తూండగా; అశరీరవాణి= ఆకాశవాణి; దుగ్ధ+అర్ణవంబునందున్= క్షీరసముద్రంలో; విశాల= విశాలమూ; రమణీయము= రమణీయమూ; అగు= అయిన; ఒక్క= ఒకానొక; దీవి= ద్వీపం; తెలుపు+ఆరి+యుండున్= తెల్లగా ఉంటుంది; అచటికిన్= అక్కడికి; అరుగుఁడు= వెళ్ళండి; అచటన్= ఆ ద్వీపంలో; అతిసితవర్ణులు= మిక్కిలి తెల్లని రంగు కలవారూ; అస్వేదులు= చెమటపోయనివారూ; ఇంద్రియప్రవృత్తి= ఇంద్రియవ్యాపారాలపట్ల; విముఖులు= వైముఖ్యం కలవారూ; అధిక= బాగా; సురభి= పరిమళాలు విరజిమ్మే; దేహులు= శరీరాలు కలవారూ; ఆహారరహితులు= ఆహారం ఏమీ తీసికొననివారూ; హరి+పర+ఆత్ములు= విష్ణుమూర్తి పట్ల సంలగ్నమైన ఆత్మలు కలవారూ; ఐన= అయినటువంటి; నరులు= పురుషులు; కలరు= ఉన్నారు.

**తాత్పర్యం:** 'ఓ బృహస్పతీ! ఎందుకయ్యా అనవసరంగా అలుగుతావు? కోపం వదలుము. విష్ణుమూర్తికొరకని ఎత్తిన హవిరంశాన్ని విష్ణుమూర్తి తీసికొనివెళ్ళాడు. దానికి నీవు అలగటం ఎందుకు? నీవు బాధపడటం ఎందుకు? ఆయనను దర్శించటమనేది నీకూ మాకూ అవుతుందా! సాక్షాత్తూ బ్రహ్మమానసపుత్రులమైన మాకే సాధ్యం కాలేదు. విష్ణుమూర్తి దర్శనం కోరి మేము ముగ్గురమూ బ్రహ్మాండమైన తపస్సు చేశాం. అపుడు అశరీరవాణి మాకు వినిపించేటట్లు ఇట్లా చెప్పింది. క్షీరసముద్ర మధ్యభాగంలో ఒక శ్వేతద్వీపం ఉన్నది. అక్కడికి వెళ్ళండి. ఆ ద్వీపంలో మిక్కిలి తెల్లని రంగువారూ, చెమట పట్టనివారూ, జితేంద్రియులూ, పరిమళాలు విరజిమ్మే శరీరం కలవారూ, నిరాహారులూ, హరిభక్తి పరాయణులూ అయిన నరులు ఉంటారు.

**క.** **వారలకుఁ జూపు నిజతే । జోరూపము విష్ణుఁ డపుడు సూడఁగనైనన్**
**మీరును జూతు రనినఁ బ్రియ । మారిన చిత్తములతోడ నందఱము వెసన్.** **366**

**ప్రతిపదార్థం:** వారలకున్= ఆ నరులకు; విష్ణుఁడు= విష్ణుమూర్తి; నిజ= తనయొక్క; తేజస్+రూపమున్= కాంతిమయమైన రూపాన్ని; చూపున్= చూపిస్తూ ఉంటాడు (కాంతి స్వరూపుడుగా దర్శనం అనుగ్రహిస్తాడు); అపుడు= ఆ సమయంలో; చూడఁగన్+ఐనన్= చూడగలిగితే (చూడటం తటస్థపడితే); మీరునున్= మీరుకూడా; చూతురు= చూద్దురుగాని; అనినన్= అని అశరీరవాణి చెప్పగా; ప్రియము+ఆరిన= ప్రీతినిండిన; చిత్తములతోడన్= హృదయాలతో; అందఱమున్= మేము ముగ్గురమూ; వెసన్= వెంటనే.

**తాత్పర్యం:** ఆ నరులకు విష్ణుమూర్తి తన తేజోరూపాన్ని చూపిస్తూ ఉంటాడు. అప్పుడు చూడగలిగితే మీరూ చూద్దురుగాని - అని ఆకాశవాణి చెప్పింది. ఆ మాటలకు మా హృదయాలు ఆనందపరవశాలు అయ్యాయి. ముగ్గురమూ వెంటనే బయలుదేరాము.

**వ. శ్వేతద్వీపంబునకుం జని యశరీరవాణి సెప్పిన చందంబు మానవులం గంటి మట్టి దీప్తి విశేషంబు లే లోకంబుల నెజ్జాతులకు లేవు. వారలు మానసజప పరాయణులైయున్నవా రే మయ్యెడ నేకాంతిజనుల కింతనంత నున్నంత భాను సహస్ర ప్రభాభాసితంబగు నొక్కదివ్య తేజోరూపంబు వారి యగ్రభాగంబునం దోఁచిన వారు గూడుకొని భక్తిమయ ప్రణామంబులు సేయుచుం జేరి జయ పుండరీకాక్ష! జయ హృషీకేశ! జయ విశ్వభావన! నమస్తే నమస్తే యను నెలుంగులు నింగిముట్టం గొల్పి రట్టియెడ. 367**

**ప్రతిపదార్థం:** శ్వేతద్వీపంబునకున్= ఆ శ్వేతద్వీపానికి; చని= వెళ్ళి; అశరీరవాణి= ఆకాశభారతి; చెప్పిన+చందంబు+మానవులన్= చెప్పిన తీరులోనే ఉన్న నరులను; కంటిమి= చూశాము; అట్టి= అటువంటి; దీప్తివిశేషంబులు= విశిష్టమైన శరీరకాంతులు (రూపప్రకాశం); ఏ లోకంబులన్= ఏ లోకాలలోనూ; ఏ+జాతులకున్= ఏ జాతులవారికీ; లేవు= ఉండవు; వారలు= ఆ శ్వేతశరీరాలు; మానస+జప+పరాయణులు+ఐ= మనస్సులో ధ్యానతత్పరులై; ఉన్నవారు= ఉన్నారు; ఏము= మేము; అయ్యెడన్= అక్కడ; ఏకాంతిజనులకున్= ఏకాగ్రచిత్తులైన ఆ విష్ణుభక్తులకు; ఇంతన్+అంతన్= చేరువలో (ఇంతా అంతా దూరాలలో); ఉన్నంతన్= నిలువగా; భానుసహస్ర= వేయిమంది సూర్యబింబాల; ప్రభా= వెలుగులతో; భాసితంబు+అగు= ప్రకాశించే; ఒక్క= ఒకానొక; దివ్యతేజోరూపంబు= దివ్యమైన కాంతిమయ స్వరూపం; వారి= ఆ శ్వేతవర్ణుల; అగ్రభాగంబునన్= ఎట్టయెదుట; తోఁచినన్= ప్రత్యక్షమయ్యేసరికి; వారు= ఆ నరులందరూ; కూడుకొని= సామూహికంగా; భక్తిమయ= భక్తితో నిండిన; ప్రణామంబులు= నమస్కారాలు; చేయుచున్= చేస్తూ; చేరి= సమీపించి; పుండరీకాక్ష!= తెల్లతామరల వంటి కన్నులుకలవాడా!; జయ= నీకు జయము; హృషీకేశ!= ఓ విష్ణూ!; జయ= జయము; విశ్వభావన!= విశ్వరూపా!; జయ= నీకు జయము నమః+తే= నీకు నమస్కారము; నమః+తే= నీకు నమస్కారము; అను= అనే; ఎలుంగులు= కంఠధ్వనులు; నింగి+ముట్టన్+కొల్పిరి= ఆకాశం అంటేటట్లు చేశారు (మిన్ను ముట్టేలా బిగ్గరగా జయజయ ధ్వానాలు చేశారు); అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ శ్వేతద్వీపానికి వెళ్ళి, ఆకాశవాణి చెప్పినట్లుగా ఉన్న మానవులను చూచాం. అటువంటి విశిష్టమైన శరీరరూపాలు ఏ లోకాలలోనూ ఏ జాతులవారికీ ఉండవు. ఆ శ్వేతశరీరులు మనస్సులో ధ్యానతత్పరులై ఉన్నారు. మేము అక్కడ ఏకాగ్రమైన మనస్సుతో ఆ విష్ణుభక్తుల చెంత నిలువగా వేయిమంది సూర్యబింబాల వెలుగులతో ప్రకాశించే ఒకానొక దివ్యమైన కాంతిమయ స్వరూపం ఆ శ్వేతవర్ణుల ఎట్టయెదుట ప్రత్యక్షమయ్యేసరికి ఆ నరులందరూ సామూహికంగా భక్తితో నిండిన నమస్కారాలు చేసి 'తెల్లతామరలవంటి కన్నులుకలవాడా! నీకు జయము! హే విష్ణూ! నీకు జయము. విశ్వరూపా! నీకు జయము జయము.' అంటూ మిన్నుముట్టేటట్లు జయజయధ్వానాలు చేశారు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** హృషీకము= ఇంద్రియము. హృషీక+ఈశుఁడు= ఇంద్రియాలను స్వాధీనపరచుకొన్నవాడు - విష్ణువని అర్థం.

**క. మా నయనంబులు దత్తే । జోనిహతము లగుడుఁ దెలియఁ జూడ నశక్యం**
**బైనం జేడ్పడి యుండం । గా నొక భూతంబు వలికె గగనతలమునన్. 368**

**ప్రతిపదార్థం:** మా నయనంబులు= మా కన్నులు; తత్+తేజోనిహతములు= ఆ కాంతిచేత చూడలేనివి; అగుడున్= కావటంచేత; తెలియన్= స్పష్టంగా; చూడన్= చూడటానికి; అశక్యంబు+ఐనన్= సాధ్యం కాకపోగా; చేడ్పడి+ఉండన్= నివ్వెరపాటుచెంది ఉండగా; ఒక భూతంబు= ఒక మహాశక్తి; గగనతలమున్= ఆకాశభాగాన; పలికెన్= మాట్లాడింది.

**తాత్పర్యం:** ఆ కాంతిచేత మా కన్నులు చూడలేకపోవటంతో ఆ దివ్యరూపాన్ని స్పష్టంగా తెలిసికొనటం సాధ్యంకాక మేమందరం నివ్వెరపాటుచెంది ఉండగా ఒక భూతం ఆకాశపుటంచున ఈ విధంగా పలికింది.

**క. ఈ దేవునిఁ గన్నట్టుల । కాదే? యిప్పురుషవరులఁ గాంచుట మీకున్**
**ఖేదంబు వలదు నియమ త । పోదానము లితనిఁ జూపఁ బూఁటవడియెనే? 369**

**ప్రతిపదార్థం:** ఈ+పురుషవరులన్= నరులలో శ్రేష్ఠులైన ఈ శ్వేతశరీరులను; కాంచుట= చూడటం అనేది; ఈ దేవునిన్= ఈ విష్ణుమూర్తిని; కన్న+అట్టుల+కాదే?= చూసినట్టుకాదా?; మీకున్= మీకు; ఖేదంబు= దిగులు; వలదు= వద్దు (దిగులుపడకండి); నియమ= మీరు ఆచరించిన నియమాలూ; తపః= తపస్సులూ; దానములు= దానాలూ; ఇతనిన్+చూపన్= ఈ దేవుడిని దర్శింపజేయటానికి; పూఁట+పడియెనే= పూచీపడ్డాయా?

**తాత్పర్యం:** బ్రహ్మమానసపుత్రులారా! విష్ణుమూర్తిని దర్శించలేకపోయామే అని ఖేదపడకండి. ఈ శ్వేతశరీరులైన దివ్యపురుషులను దర్శించారు. చాలు. సంతృప్తి పడండి. విష్ణుమూర్తిని దర్శించినట్లే. ఇంతకాలమూ మీరు ఆచరించిన నియమనిష్ఠలూ, తపస్సులూ, దానాలూ ఇవన్నీ విష్ణుమూర్తి దర్శనం మీకు ఇప్పించటానికి ఏమయినా పూచీపడ్డాయా? (మీ తపస్సులు ఇంకా చాలవు సుమా! అని భావం).

**క. ఏకాంతిక భక్తిరతి న । నేకములగు వత్సరముల కివ్విష్ణుని నా**
**లోకింపంగా దొరకొనుఁ । గా కిటు వేగపడ మీకుఁ గానఁగ వశమే? 370**

**ప్రతిపదార్థం:** ఏకాంతిక= తదేకమైన; భక్తి రతిన్= భక్తినిరతితో (దీక్షతో); అనేకములు+అగు+వత్సరములకున్= అనేక సంవత్సరాలకు; ఈ+విష్ణునిన్= ఈ విష్ణుమూర్తిని; ఆలోకింపంగాన్= చూడటానికి; దొరకొనున్+కాక= అవకాశం లభిస్తుందే తప్ప; ఇటు= ఇట్లా; వేగపడన్= తొందరపడితే; మీకున్= మీకు; కానఁగన్+వశమే?= దర్శించటం సాధ్యమా?

**తాత్పర్యం:** తదేకభక్తితో, దీక్షతో అనేక సంవత్సరాలు తపస్సు చేస్తే, అప్పటికి ఈ విష్ణుమూర్తి దర్శనం లభిస్తుంది. అంతే కాని ఇట్లా తొందరపడితే దొరుకుతుందా? అది అంత తేలిక విషయం కాదు.

**క. అని పలికిన విని క్రమ్మఱఁ । జనుదెంచితి మేము విష్ణు చందం బిది నీ**
**కనఘా! యలుగం బనిలే । దనూనములు గాఁగ నడపు మధ్వరవిధులన్.' 371**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పవిత్రుడా!; అని; పలికినన్= (ఆకాశవాణి) పలికితే; విని; ఏము= మేము ముగ్గురమూ; క్రమ్మఱన్= తిరిగి; చనుదెంచితిమి= వచ్చేశాం; విష్ణు+చందంబు= విష్ణుమూర్తియొక్క పద్ధతి; ఇది; నీకున్= నీకు; అలుగన్+పనిలేదు= అలగవలసిన అవసరంలేదు; అధ్వరవిధులన్= ఈ యజ్ఞకర్తవ్యాలను; అనూనములు+కాఁగన్= ఏ లోటూ లేనివిగా; నడపు(ము)= జరిపించుము.

**తాత్పర్యం:** ఆకాశవాణి ఇట్లా చెప్పేసరికి మేము ముగ్గురం మళ్ళీ తిరిగి వచ్చాం. విష్ణుమూర్తులవారి పద్ధతి అది. అట్లా ఉంటుంది. అందుచేత ఓ బృహస్పతీ! కనిపించకుండా వెళ్ళిపోయాడే విష్ణుమూర్తి - అని నీవు అలగవలసిన పనిలేదు. ఈ అశ్వమేధయజ్ఞంలో ఇంకా మిగిలిపోయిన విధుల నన్నింటినీ ఏ లోటూ రాకుండా శ్రద్ధగానడిపించుము.'

**వ. అని యిట్లేకతద్వితత్రితులు సెప్పినం బ్రశాంతుండై పురుహూతపురోహితుం డయ్యాగంబు సుప్రయోగంబుగాఁ జెల్లించె నా భూవల్లభుం డట్లు పుణ్యపరుం డగుచుఁ బ్రజాపరిపాలనం బొనరించె నట్టియెడ నాకలోకంబునన సురమునిగోష్ఠి యందు సుర లధ్వరంబుల నజంబుల విశసింపవలయు నని పలికిరి మును లజంబు లన్నంతన**

**యెల్లయుగంబులను ఛాగంబులఁగాఁ గొనరాదు. కృతయుగ విషయంబుగా వేదంబు లజంబు లోషధులని చెప్పెంగాన యని రిట్లు వివాదంబైన సమయంబున నలవోక నుపరిచరవసు వయ్యెడకుం జనిన నా రెండు దెఱంగులవారును జయాపజయంబులకు నతనిమాట పాటిగా నూఁది యడిగిన నాతండు. 372**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; ఏకత, ద్విత, త్రితులు= ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ అనే ముగ్గురూ; చెప్పినన్= చెప్పేసరికి; ప్రశాంతుండై= కోపం తగ్గి ప్రశాంతి పొందినవాడై; పురుహూత పురోహితుండు= దేవేంద్రుడి పురోహితుడైన బృహస్పతి; ఆ+యాగంబున్= వసురాజు చేస్తున్న ఆ అశ్వమేధ యజ్ఞాన్ని; సుప్రయోగంబుగాన్= బాగా చేయబడినదానిగా; చెల్లించెన్= పూర్తిచేయించాడు; ఆ+భూవల్లభుండు= ఆ వసుమహారాజు; అట్లు; పుణ్యపరుండు+అగుచున్= పుణ్యతత్పరుడు అవుతూ; ప్రజాపరిపాలనంబు= లోకపరిపాలన; ఒనరించెన్= చేశాడు; అట్టియెడన్= అట్లా ఉండగా ఒకనాడు; నాకలోకంబునన్+అ= దేవలోకంలోనే; సురమునిగోష్ఠియందున్= దేవతలూ, మునులూ జరుపుతున్న ఒక చర్చలో; సురలు= దేవతలు; అధ్వరంబులన్= యజ్ఞాలలో; అజంబులన్= మేకలను (గొర్రెలు); విశసింపన్+వలయున్= బలి ఇవ్వాలి; అని; పలికిరి= అన్నారు; మునులు= మునులేమో; అజంబులు+అన్నంతన= అజములు అనగానే; ఎల్లయుగంబులను= అన్ని యుగాలలోనూ; ఛాగంబులన్+కాన్+ కొనరాదు= మేకలు అనే తీసుకోవటానికి వీలులేదు; వేదంబులు= వేదాలు; కృతయుగ విషయంబుగాన్= కృతయుగంలో మాటగా; అజంబులు+ఓషధులు= అజములంటే ఓషధీలతలూ; అని; చెప్పెన్= చెప్పింది; కానన్= కాబట్టి అజములు అంటే అన్ని యుగాల లోనూ ఛాగాలు కాదు యుగయుగానికీ దీని అర్థం మారిపోతూ ఉంటుంది కాబట్టి; అనిరి= అన్నారు; ఇట్లు; వివాదంబు+ ఐన+సమయంబునన్= వాదం నడుస్తున్న తరుణంలో; అలవోక+పోలెన్= యథాలాపంగా అన్నట్టు; ఉపరిచరవసువు; అయ్యెడకున్= వివాదం జరుగుతున్న ఆ చోటికి; చనినన్= (తన విమానంమీద) వెళ్ళేసరికి; ఆ+రెండు తెఱంగులవారునున్= ఆ రెండు పద్ధతులవారూ; జయ+అపజయంబులకున్= గెలుపూ ఓటములకు; అతనిమాట= వసురాజుగారి వాక్కే; పాటిగాన్+ఊఁది= ఆధారంగా భావించి (తుదినిర్ణయంగా ఒప్పుకొని); అడిగినన్= అడిగితే; ఆతండు= ఆ వసురాజు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ అనే ముగ్గురూ చెప్పేసరికి కోపం తగ్గి ప్రశాంతుడై బృహస్పతి వసుమహారాజుయొక్క యజ్ఞాన్ని పూర్తిచేయించాడు. ఆ వసుమహారాజు పుణ్యతత్పరుడై లోకపరిపాలన చేశాడు. అట్లా ఉండగా ఒకనాడు దేవలోకంలోనే దేవతలూ, మునులూ జరుపుతున్న ఒక చర్చలో దేవతలు యజ్ఞాలలో మేకలను బలిఇవ్వాలి అన్నారు. మునులేమో 'అజములు అనగానే అన్ని యుగాలలోనూ మేకలు అనే అర్థాన్ని తీసికొనటానికి వీలులేదు. కృతయుగంలో అజములంటే ఓషధులనే అర్థం గ్రహించాలి' అని అన్నారు. యథాలాపంగా అక్కడకు వెళ్ళిన ఉపరిచరవసువును చూచి, తుదినిర్ణయాన్ని ఉభయపక్షాలవారూ అతడికి వదలివేశారు. దానికి అతడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఛాగమ విశసనయోగ్యము। యాగంబుల నెల్ల యుగములందు ననియెం**

**దా గీర్వాణుల పక్షం। బై గెలు పది యపుడు వారి కగుటకు నధిపా! 373**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; తాన్= ఆ వసురాజు; గీర్వాణుల పక్షంబై= దేవతల పక్షంచేరి; అపుడు= అప్పటికి; గెలుపు+అది= జయమనేది; వారికిన్= దేవతలకు; అగుటకున్= కావటం కోసం; ఎల్లయుగములందున్= అన్ని యుగాలలోనూ; యాగంబులన్= యాగాలలో; ఛాగము+అ= మేకయే; విశసనయోగ్యము= బలి ఇయ్యదగినది; అనియెన్= అన్నాడు;

**తాత్పర్యం:** అప్పుడు ఆ వసురాజు అన్ని యుగాలలోనూ యజ్ఞాలలో బలి ఇవ్వదగినది మేక ఒక్కటే అని దేవతలను అప్పటికి గెలిపించటంకొరకు వారి పక్షం చేరి వారికి అనుకూలంగా తీర్పు చెప్పాడు.

**వ. అనిన విని వేదార్థాపలాపంబునకుం గోపంబు నొందిన మునుల శాపంబున నతండు భూవివరపతితుండై యుండ నమరు లేతెంచి యతని యంతరంగంబునకుం దెలివును నంగంబునకు డప్పి లేకునికియు నొసంగి విష్ణుప్రసాదంబునఁ బ్రత్యాపన్నుండ వగు దని యూఱడించి యరిగి రన్నరవరుండును విష్ణుధ్యాన జపపరాయణుం డగుచుండ నచిరకాలంబునకు విష్ణుండు విహగపతిం బుత్తెంచి యెత్తించికొనిపోయి శరీరంబుతోడన బ్రహ్మలోకగతుం గావించి సంభావించిన నమ్మహానుభావుండు పరమానందంబునొంది వెలింగె. 374**

**ప్రతిపదార్థం:** అనినన్= వసురాజు అట్లా అనేసరికి; విని= మునులు విని; వేదార్థ+అపలాపంబునకున్= వేదార్థాన్ని అన్యథాకరించినందుకు; కోపంబున్+ఒందిన= కోపించిన; మునుల= మునులయొక్క; శాపంబునన్= శాపంతో; అతండు= ఆ వసురాజు; భూవివర+పతితుండు+ఐ+ఉండన్= భూమిరంధ్రంలో పడిపోయినవాడై ఉండగా; అమరులు= దేవతలు; ఏతెంచి= అక్కడికివచ్చి; అతని= ఆ వసుమహారాజుగారి; అంతరంగంబునకున్= (మనస్సుకు) ఆత్మకు; తెలివును= కాంతీ, (జ్ఞాపకం); అంగంబునకున్= శరీరానికి; డప్పి= దప్పికా; లేక+ఉనికియున్= లేకపోవటాన్ని; ఒసంగి= ఇచ్చి (మనస్సుకు తెలివీ, శరీరానికి డప్పికా లేకుండా చేశారు); విష్ణు= విష్ణుమూర్తియొక్క; ప్రసాదంబునన్= అనుగ్రహంతో; ప్రతి+ఆపన్నుండవు= మళ్ళీ యథాస్థితికీ వచ్చినవాడవు; అగుదు(వు)+అని= అవుతావు అని (మళ్ళీ సురలోకానికి తిరిగి వస్తావని); ఊఱడించి= ఉపశమన వాక్యాలు పలికి; అరిగిరి= వెళ్ళిపోయారు; ఆ+నరవరుండునున్= ఆ వసుమహారాజు; విష్ణుధ్యాన జప పరాయణుండు= విష్ణుమూర్తిని ధ్యానించేవాడూ, జపించేవాడూ; అగుచుండన్= అవుతూ ఉండగా (ధ్యానజపాలు చేస్తూండగా - అని); అచిరకాలంబునకున్= స్వల్పకాలంలోనే; విష్ణుండు= ఆ విష్ణుమూర్తి; విహగపతిన్= పక్షిరాజయిన గరుత్మంతుడిని; పుత్తెంచి= పంపించి; ఎత్తించి కొనిపోయి= వసురాజును పైకి లేవనెత్తించి తీసికొనివెళ్ళి; శరీరంబుతోడన్+అ= సశరీరంగానే; బ్రహ్మలోకగతున్= బ్రహ్మలోకం పొందిన వాడినిగా; కావించి= చేసి (బ్రహ్మలోకంలో ఆవాసం కల్పించి); సంభావించినన్= గౌరవించేసరికి; ఆ+మహానుభావుండు= ఆ మహాత్ముడు; పరమానందంబున్+ఒంది= గొప్ప ఆనందం పొంది; వెలింగెన్= విరాజిల్లాడు.

**తాత్పర్యం:** వసురాజు అట్లా అనేసరికి వేదార్థాన్ని అన్యథాకరించినందుకు కోపించిన మునులు శపించగా అతడు నేలపై పడ్డాడు. దేవతలు అక్కడికి వచ్చి అతడి మనస్సుకు తెలివీ, శరీరానికి దప్పికా లేకుండా చేశారు. 'విష్ణుదేవుడి ప్రసాదం వలన మరల సురలోకానికి వస్తా'వని ఊరడించి వెళ్ళారు. వసురాజు విష్ణుదేవుడిని ధ్యానించి, జపించి సేవించగా కొద్దికాలంలోనే విష్ణువు గరుత్మంతుడిని పంపి, అతడిని సశరీరంగా బ్రహ్మలోకానికి తెప్పించాడు. ఆ గౌరవానికి వసురాజు పరమానందం పొందాడు.

**విశేషం:** 'అంతరంగంబునకుం - 'దెలివును' అనే పాఠానికి 'తెవులును' అని మరొకపాఠం ఉన్నది. సంస్కృతమూలంలో **"మా చ త్వాం గ్లాని రాస్పృశేత్"** (13-324-24) అని ఉన్నది. 'గ్లాని'కి 'తెవులు' అనే పాఠం సముచితమని తోస్తున్నది.

**క. కురునాథ! యుపరిచరవసు । చరితంబు ప్రసంగకలన సంప్రాప్తంబై**
**బెరసెను నీ వడిగిన య । ప్పురుషుల దివ్యానుభావముం జెప్పంగన్.' 375**

**ప్రతిపదార్థం:** కురునాథ!= ఓ ధర్మరాజా!; నీవు; అడిగిన= అడిగినటువంటి; ఆ+పురుషుల= ఆ శ్వేతశరీరుల; దివ్య+అనుభావమున్= దివ్యమైన ఆకార చేష్టాదికాన్ని; చెప్పంగన్= చెప్తూతూ ఉంటే; ప్రసంగకలనన్= ప్రసంగవశాత్తూ; ఉపరిచరవసు= ఉపరిచరవసుమహారాజు యొక్క; చరితంబు= కథ; సంప్రాప్తంబై+బెరసెను= వచ్చి కలిసింది. (బెరయు= కలియు)

**తాత్పర్యం:** ధర్మరాజా! శ్వేతద్వీపంలో ఉండే దివ్యపురుషుల ఆకారాదులను నీ కోరికపై చెప్పబోతే మధ్యలో ఈ ఉపరిచరవసువు వృత్తాంతం ప్రసంగవశాత్తూ వచ్చిపడింది.'

**వ.** **అని పలికి భీష్ముం డా భూపతితో 'నారదు వృత్తాంతంబు వివరించెద నాకర్ణింపుము.'** **376**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; భీష్ముండు= భీష్మాచార్యుడు; ఆ+భూపతితోన్= ఆ ధర్మరాజుతో; నారదు= నారదుడి యొక్క; వృత్తాంతంబు=(349వ పద్యంతో ప్రారంభించిన) కథ; వివరించెదన్= (మిగిలినది) వివరిస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని భీష్ముడు నారదుడి కథను ధర్మరాజుకు చెప్పటం మొదలుపెట్టాడు.

**సీ.** **అని చెప్పి యిట్లను 'నధిప! నారదుఁ డట్టు । లద్దీవియును నద్భుతాంగులైన**
**యమ్మానవులుఁ దన యంతరంగంబునఁ । దోఁచినఁ బ్రీతి నందులకు నేఁగి**
**యమ్మహాత్ములు దన్ను నాత్మల నాదరిం । పంగఁ దా నత్యంతభక్తిఁ బ్రణతుఁ**
**డై పరమైకాంతులగువారి కింతింత । నిలిచి దుష్కరతపోనిష్ఠఁ బూని**

**తే.** **యూర్ధ్వబాహుతఁ గదలకయుండి వివిధ । గూఢ దివ్యనామోక్తి సంప్రౌఢి యచటి**
**సకలజీవుల నానంద సంభృతములఁ । జేయుచుండ విష్ణుస్తుతి సేయుచుండె.** **377**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని; ఇట్లు+అనున్= ఇట్లా కొనసాగిస్తున్నాడు; అధిప!= ఓ ధర్మరాజా!; అట్టులు= ఆ రకంగా; నారదుఁడు= నారదమహర్షి; ఆ+దీవియునున్= ఆ శ్వేతద్వీపమూ; అద్భుత+అంగులైన= ఆశ్చర్యకరమైన శరీరాలు కలిగిన; ఆ+మానవులున్= ఆ దివ్యపురుషులూ (నరులు); తన= తనయొక్క; అంతరంగంబునన్= హృదయంలో (మనస్సులో); తోఁచినన్= కనిపించేసరికి; ప్రీతిన్= ప్రేమతో; అందులకున్= ఆ శ్వేతద్వీపంలోకి; ఏఁగి= వెళ్ళి; ఆ+మహాత్ములు= ఆ శ్వేతశరీరులైన మహానుభావులు; తన్నున్= తనను; ఆత్మలన్= వారి హృదయాలలో; ఆదరింపంగన్= గౌరవించగా; తాన్= తాను(నారదుడు); అత్యంతభక్తిన్= మిక్కిలి భక్తితో; ప్రణతుఁడై= నమస్కరించినవాడై; పరమ+ఏకాంతులు+అగు= మిక్కిలి ఏకాగ్రచిత్తులైన; వారికిన్= ఆ శ్వేతశరీరులకు; ఇంతింతన్= చేరువలో; నిలిచి= నిలబడి; దుష్కర= కఠినమైన; తపోనిష్ఠన్= తపోదీక్షను; పూని= వహించి; ఊర్ధ్వబాహుతన్= చేతులు పైకి చూపిన భంగిమలో (స్థితిలో); కదలక+ఉండి= నిశ్చలంగా ఉండి; వివిధ= పలురకాలైన; గూఢ= రహస్యమైన; దివ్యనామ= మంత్రప్రాయమైన విష్ణునామాల; ఉక్తి= తన ఉచ్చారణతో ఏర్పడిన; సంప్రౌఢి= ప్రౌఢత్వం; అచటి= అక్కడ ఉన్న; సకలజీవులన్= సమస్త ప్రాణికోటినీ; ఆనంద= ఆనందంతో; సంభృతములన్= నిండినవిగా (నిండినవానిఁగా); చేయుచుండన్= చేస్తూఉంటే (దివ్యనామాల ఉచ్చారణ వీటిని ఆనందపరుస్తోంది - అని); విష్ణుస్తుతి= ఇట్లా విష్ణుమూర్తికి సంబంధించిన స్తోత్రం; చేయుచుండెన్= (నారదుడు) చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నారదుడి మనస్సులో శ్వేతద్వీపమూ శ్వేతశరీరులైన దివ్య పురుషులూ రూపుగట్టారు. వెంటనే బయలుదేరి ఆ ద్వీపం చేరుకొన్నాడు. ఆ మహాత్ములను దర్శించాడు, నమస్కరించాడు. వారంతా నారదుడిని ఆత్మీయంగా గౌరవించారు. వారికి చేరువలోనే నారదుడు కూడా తపస్సుకు పూనుకొన్నాడు. ఊర్ధ్వబాహుడై నిలబడి విష్ణునామాలను ఉచ్చరించటం మొదలుపెట్టాడు. అవి నిగూఢమైన దివ్యనామాలు. వాటి ఉచ్చారణ ఆ ప్రాంతంలో ఉన్న సకలప్రాణులనూ ఆనందింపజేసింది. ఇట్లా నారదుడు ధ్యానమూ విష్ణుస్తోత్రమూ చేస్తున్నాడు.

**వ.** **ఇవ్విధంబున నేకాంతియై సంస్తుతింప సితాసితపీతారుణ పిశంగ హరిత వర్ణంబులను బహుశిరోబాహుపాదంబులను వేది - కమండలు - స్రుక్స్రు వాగ్ని ధారణంబున నోంకారసావిత్రీ చతుర్వేదోచ్చారణంబులను మహాద్భుతంబయిన నిజదివ్యరూపంబు నారదునకు దర్శనగోచరంబుగా నిలిచి విష్ణుండు వినయ సంభ్రమోపేతభక్తి ప్రణతుండగు నప్పరమముని నాదరించి యిట్లనియె.** **378**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ఏకాంతియై= ఏకాగ్రచిత్తుడై; సంస్తుతింపన్= స్తుతించేసరికి; సిత= తెలుపు; అసిత= నలుపు (నీలం); పీత= పసుపు; అరుణ= ఎరుపు; పిశంగ= పుప్పొడి రంగు; హరిత= ఆకుపచ్చ; వర్ణంబులను= రంగులతోనూ;

బహు= అనేకమైన; శిరః= తలలూ; బాహు= చేతులూ; పాదంబులను= కాళ్ళతోనూ; వేది= కుండమూ; కమండలు= కమండలువూ; స్రుక్+స్రువ= హోమం చెయ్యటానికి నెయ్యి పోసే చెక్క గరిటెలు రెండూ (పాత్రలోనుండి నెయ్యి తీయటానికి ఉపయోగించేది - స్రువం. అగ్నిలో ఆ నెయ్యిని పోయటానికి ఉపయోగించే పొడవాటిది - స్రుక్కు); అగ్ని= హోమాగ్ని - వీటి; ధారణంబునన్= వహనంతో (వీటిని ధరించటంతోపాటు); ఓంకార= ప్రణవమూ; సావిత్రీ= గాయత్రీ మంత్రమూ; చతుర్వేద= నాలుగువేదాలూ - వీటి; ఉచ్చారణంబులను= ఉచ్చారణలతోనూ; మహా (హత్)+అద్భుతంబు+ఐన= మిక్కిలి ఆశ్చర్యకరమైన; నిజ= తనయొక్క; దివ్యరూపంబు= దివ్యస్వరూపం; నారదునకున్= ఆ నారదమహర్షికి; దర్శన+గోచరంబుగాన్= చూపులకు (కన్నులకు) కనిపించేటట్టు; నిలిచి= ప్రత్యక్షమై నిలబడి; విష్ణుండు= ఆ విష్ణుమూర్తి; వినయ= వినయమూ; సంభ్రమ= కంగారూ - వీటితో; ఉపేత= కూడుకొన్న; భక్తి= భక్తితో; ప్రణతుండు+అగు= నమస్కరిస్తున్న; ఆ+పరమమునిన్= ఆ దేవర్షి నారదుడిని; ఆదరించి= గారవించి; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా నారదుడు ఏకాగ్రచిత్తుడై ధ్యానం చేస్తుండగా విష్ణుమూర్తి ప్రత్యక్షం అయ్యాడు. ఆయన తెలుపూ, నలుపూ, పసుపూ, ఎరుపూ, గోరోచనమూ, ఆకుపచ్చ రంగులలో ఉన్నాడు. సహస్రశిరస్సులూ, సహస్రబాహువులూ, సహస్రపాదాలూ ఉన్నాయి. హోమవేదిక, కమండులువూ, స్రుక్కూ, స్రువమూ, అగ్నీ - వీటినన్నింటిని ధరించి ఉన్నాడు. ఓంకారాన్ని ఉచ్చరిస్తున్నాడు. గాయత్రీమంత్రాన్ని జపిస్తున్నాడు. ఇట్లా అత్యద్భుతమైన దివ్యరూపంతో స్వామి ప్రత్యక్షమయ్యాడు. నారదుడి కన్నులకు కనిపించాడు. వినయసంభ్రమాలతో భక్తిగా నారదుడు నమస్కరించాడు. స్వామి ఆతడిని ఆదరించి ఇట్లా అన్నాడు:

### శ్వేతద్వీపవాసియగు నారాయణుండు నారదున కుపదేశించిన తత్త్వము (సం. 12-326-10,11)

**క. ' ననుఁ గానఁ బడయ రెవ్వరు । ననఘా! యేకాంతికులక యర్హము మద్ద**
**ర్శన మీ వేకాంతికుఁడవు । ననహంకారుఁడవుఁ గాన యబ్బెం జూడన్.' 379**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; ఎవ్వరున్= ఎవరు ఎంతటివారైనప్పటికీ; ననున్= నన్ను; కానన్+పడయరు= చూడటం పొందరు (చూడలేరు - అని); ఏకాంతికులకున్+అ= ఏకాగ్రచిత్తులకే; మత్+దర్శనము= నా దర్శనం; అర్హము= యోగ్యం. (వారే పొందగలరు - అని); ఈవు= నీవు; ఏకాంతికుఁడవు= ఏకాగ్రచిత్తం కలవాడవు; అనహంకారుఁడవు= అహంకారం లేనివాడవు; కాన= కాబట్టే; చూడన్= నన్ను దర్శించటం; అబ్బెన్= (అబ్బింది) నీకు లభించింది.

**తాత్పర్యం:** 'ఓ పవిత్రుడా! ఎవ్వరూ నన్ను దర్శించలేరు. ఏకాగ్రచిత్తులే నా దర్శనం పొందటానికి అర్హులు. నీవు ఏకాగ్రచిత్తుడవు. అహంకార రహితుడవు. కాబట్టి నా దర్శనం నీకు లభించింది.'

**వ. అని పలికి వరంబు వేడుమనుటయు నతండు 'దేవా! భవద్దర్శనంబుకంటె మిగుల వరంబునుం గలదే?' యనుటయు నద్దేవుండు సవిశేషప్రసాదభరితుండై. 380**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; వరంబున్= ఏదయినా ఒక వరాన్ని; వేడుము= కోరుకొమ్ము; అనుటయున్= అనటమూ; అతండు= ఆ నారదుడు; దేవా!= మహానుభావా!; భవత్= నీ; దర్శనంబుకంటెన్= దర్శనంకన్నా; మిగుల= మించి (అతిశయించి); వరంబునున్+కలదే?= వరం ఒకటి ఏదయినా ఉన్నదా?; అనుటయున్= అనటమూ; ఆ+దేవుండు= ఆ విష్ణుమూర్తి; సవిశేష= విశేషంతో కూడిన; ప్రసాద= అనుగ్రహంతో (విశిష్టమైన అనుగ్రహంతో); భరితుండు+ఐ= నిండినవాడై.

**తాత్పర్యం:** అని చెప్పి ఏదయినా వరాన్ని కోరుకోమన్నాడు. నారదుడు 'దేవా! నీ దర్శనభాగ్యానికి మించి వేరొక వరం ఉన్నదా?' అన్నాడు. అపుడు విష్ణుమూర్తి అనుగ్రహం నిండిన మనస్సు కలవాడై. (తరువాతి పద్యంతోఅన్వయం).

సీ. ఇంద్రియంబుల కందఁ డెల్ల భూతంబులుఁ । దెగినను దెగకుండుఁ ద్రిగుణరహితుఁ
డఖిలంబునకు నాత్మ యన సర్వసాక్షినా । నజుఁ డన నిష్కళుండన వెలుంగు
క్షేత్రజ్ఞుఁ డాతండు జీవుండు వాసుదే । వుండును సంకర్షణుండుఁ జూవె
వారు మనం బహంకారంబు వరుసఁ బ్ర । ద్యుమ్నానిరుద్ధనామోపహితము

తే. లింతయును మన్మయంబ యే నిరువదియును । నాల్గునగు తత్త్వకోటికి నాథుఁడైన
పంచవింశకాభిఖ్యుండఁ బరమపురుషుఁ । డనియు నాపేరు మఱి పర మరయ లేదు. 381

**ప్రతిపదార్థం:** క్షేత్రజ్ఞుఁడు= క్షేత్రజ్ఞుడు అనబడేవాడు (ఆత్మ); ఇంద్రియంబులకున్= ఇంద్రియాలకు; అందఁడు= లొంగడు; ఎల్ల+భూతంబులున్= సకలప్రాణులూ (పంచభూతాలూ); తెగినను= నశించినా; తెగకుండున్= తాను నశించకుండా ఉంటాడు; త్రిగుణ రహితుఁడు= సత్త్వరజస్తమోగుణాలు లేనివాడు; అఖిలంబునకున్= సమస్తానికీ; ఆత్మ+అనన్= ఆత్మ అనీ; సర్వసాక్షి+నాన్= సర్వసాక్షి అనీ; అజుఁడు+అనన్= అజుడు అనీ; నిష్కళుండు+అనన్= నిష్కళుడు అనీ - వ్యవహరింపబడుతూ; వెలుంగున్= ప్రకాశిస్తాడు; ఆతండు= ఆతడే; జీవుండున్= జీవుడూ; వాసుదేవుండును= వాసుదేవుడూ; సంకర్షణుండున్+చూవె= సంకర్షణుడూ సుమా!; మనంబు= మనస్సూ; అహంకారంబున్= అహంకారమూ అయిన; వారు= వాసుదేవ సంకర్షణులు; వరుసన్= క్రమంగా; ప్రద్యుమ్న+అనిరుద్ధ= ప్రద్యుమ్నమూ అనిరుద్ధమూ అనేటువంటి; నామ= పేరులతో; ఉపహితములు= చెప్పబడేవి; ఇంతయునున్= ఇదంతా; మత్+మయంబు+అ= నా వికృతియే (నా మయమే); ఏను= నేను; ఇరువదియును నాల్గునగు= ఇరవై నాల్గుగా చెప్పబడిన; తత్త్వకోటికిన్= తత్త్వసమూహానికి; నాథుఁడు+ఐన= ప్రభువైన; పంచవింశక+అభిఖ్యుఁడన్= పంచవింశకుడు అనే పేరుగలవాడిని (ఇరవై అయిదవ తత్త్వాన్ని నేనే); పరమపురుషుఁడు+అనియున్= పరమపురుషుడు అని కూడా; నాపేరు= నా నామధేయం; మఱి= ఇంతకన్నా; పరము= పరము అనేది; అరయన్= ఎంత చూసినా; లేదు= లేదు.

**తాత్పర్యం:** నారదా! క్షేత్రజ్ఞుడూ, జీవుడూ, వాసుదేవుడూ, సంకర్షణుడూ - అందరూ ఒక్కటే. అంతా నేనే. వాసుదేవుడే మనస్సు. అదే ప్రద్యుమ్నం. అహంకారమే సంకర్షణుడు. అదే అనిరుద్ధం. ఇరవైనాలుగు తత్త్వాలకూ ప్రభువైన ఇరవై అయిదవ తత్త్వం నేనే. నన్ను అందుకే పంచవింశకుడు అంటారు. పరమపురుషుడిని నేనే. నాకంటె పరం (శ్రేష్ఠం) మరొకటి లేనేలేదు.

క. విను మేకాంతికుఁ డెవ్వనిఁ । గని నిత్యానందపదము గను నప్పరమా
త్ముని వాసుదేవు నిష్కలు । ననుపముఁగా నను నెఱుంగు టాత్మహితమగున్. 382

**ప్రతిపదార్థం:** వినుము= నారదా! ఆలకించుము; ఏకాంతికుఁడు= ఏకాగ్రచిత్తుడైన యోగి; ఎవ్వనిన్+కని= ఎవరిని దర్శించి; నిత్య+ఆనందపదము= ఎల్లప్పుడూ ఆనందమయమైన స్థానాన్ని (నిత్యానంద స్థితి); కనున్= పొందుతాడో; ఆ+పరమాత్మునిన్= ఆ పరమాత్మగా; వాసుదేవున్(కాన్)= వాసుదేవుడిగా; నిష్కలున్ (కాన్)= నిష్కలుడిగా; అనుపమున్+కాన్= సాటిలేనివాడినిగా; ననున్= నన్ను; ఎఱుంగుట= తెలియుట; ఆత్మహితము+అగున్= ఆత్మకు మేలు అవుతుంది.

**తాత్పర్యం:** ఏకాగ్రచిత్తులైన యోగీశ్వరులు ఎవరిని దర్శించి నిత్యానందస్థితి పొందుతారో ఆ పరమాత్మగా, ఆ వాసుదేవుడిగా, ఆ నిష్కలుడిగా, ఆ సాటిలేనివాడిగా నన్ను తెలిసికొనటం నీకు ఆత్మహితం. గ్రహించుము దేవర్షీ!

క. భూతాత్మకమైన యఖిల । ధాతుచయము వెలిగ లేదు తను నా మొత్తం
బాతతజీవవ్యాప్తి స । మేతము గాకున్నఁ జేష్ట నెసఁగదు వత్సా! 383

**ప్రతిపదార్థం:** వత్సా!= నాయనా!; భూత+ఆత్మకమైన= సకల జీవులకూ ప్రాణభూతమైన; అఖిల ధాతుచయము= సమస్తవిధాల ధాతుసమూహం (అంతశ్శక్తి); వెలిగన్+లేదు= నాకన్నా భిన్నంగా (వెలుపలగా) లేదు; తను= అది; నా= నాయొక్క; మొత్తంబు= మొత్తం (అది సమస్తం నేను, నా సమస్తం అదీ); ఆతత= నిడుపైన; జీవ= జీవశక్తియొక్క (ప్రాణం); వ్యాప్తి= వ్యాపనంతో;సమేతము= (ధాతుచయం) కూడుకొన్నది; కాకున్నన్= కాకపోయినట్టయితే; చేష్టన్= కదలికతో (క్రియాశక్తితో); ఎసఁగదు= అలరారదు.

**తాత్పర్యం:** నాయనా! నారదా! ఈ సృష్టిలో సకలప్రాణికోటిలో అంతర్గతంగా ఉన్న ధాతుశక్తి నాకంటె భిన్నమైనది కాదు. నాలోనే ఉన్నది. అది నా మొత్తం. జీవశక్తి అనేది సర్వత్ర పరివ్యాప్తం కాకపోతే చేష్టలూ చైతన్యాలూ ఉండవుగదా!

**క. జీవశరీరములు పృథ । గ్భావాకలితములు గాఁగఁ గనుటయు వలయున్**
**జీవునిఁ గంటి ననుట మా । యావిలసన మస్మదీయ మది మునివర్యా! 384**

**ప్రతిపదార్థం:** మునివర్యా!= మునిశ్రేష్ఠా!; జీవ+శరీరములు= జీవమూ, శరీరమూ అనేవాటిని; పృథక్+భావ+ఆకలితములు కాఁగన్= వేరు వేరు అనే భావంతో; కనుటయున్= చూడటంకూడా; వలయున్= అవసరం; జీవునిన్= జీవుడిని; కంటిన్= దర్శించాను; అనుట= అనటం; మాయా+విలసనము= ఒక మాయావిలాసం; అది= ఆ మాయావిలాసం; అస్మదీయము= నాదే.

**తాత్పర్యం:** మునీశ్వరా! జీవుడు వేరు, శరీరం వేరు అనే విషయాన్ని గ్రహించటం చాలా అవసరం. ఎవరయినా జీవుడిని చూశాను అని అంటే అదంతా మాయ. ఆ మాయావిలాసానికి సృష్టికర్తను నేనే.

**క. జీవుఁడు మత్సముపేతుఁడు । గావు టెఱుఁగవలయు దృఢముగా భక్తిమయం**
**బై వఱలు నాశ్రయంబున । నేవాఁ డొందు నను వాని కిత్తు విముక్తిన్. 385**

**ప్రతిపదార్థం:** జీవుఁడు= జీవాత్మ (ఎప్పుడూ); మత్+సమ్+ఉపేతుఁడు= నాతో గాఢంగా కూడి ఉన్నవాడే (నాలో భాగం); కావుట= కావటాన్ని; ఎఱుఁగన్+వలయున్= (నీవు) తెలిసికోవాలి; దృఢముగాన్= గట్టిగా (నిశ్చలంగా); భక్తిమయంబు+ఐ= భక్తితో నిండినదై (భక్తిమయం అయి); వఱలు= ఒప్పేటటువంటి; ఆశ్రయంబునన్= ఆధారంతో (సాధనంతో); ఏ వాఁడు= ఎవడు; ననున్= నన్ను; ఒందున్= పొందుతాడో; వానికిన్= ఆ భక్తుడికి; విముక్తిన్= మోక్షాన్ని; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** జీవుడు నాకంటె భిన్నుడు కాదు. నాతోనే కలిసి ఉంటాడు. ఈ విషయాన్ని కూడా గ్రహించటం అవసరం. భక్తిమయమైన సాధనంతో ఎవడు నన్ను పొందుతాడో వాడికి విముక్తిని అనుగ్రహిస్తాను.

**క. ఆదిత్య మరు ద్వసురు । ద్రాది దివిజగణము నంబుజాసనుఁడుఁ జతు**
**ర్వేదములు మదాత్మకతం । గాదే తత్తద్విశేష గౌరవమొందున్! 386**

**ప్రతిపదార్థం:** ఆదిత్య= ఆదిత్యులూ; మరుత్= మరుత్తులూ; వసు= వసువులూ; రుద్ర= రుద్రులూ; ఆది= మొదలైన; దివిజగణమున్= దేవతాసమూహమూ; అంబుజ+ఆసనుఁడున్= పద్మాసనుడైన బ్రహ్మదేవుడూ; చతుర్వేదములున్= నాలుగు వేదాలూ; మత్+ఆత్మకతన్+కాదే!= నా స్వరూపాలు కావటం వల్లనేకదా!; తత్తత్= ఆయా; విశేషగౌరవమున్= విశేషమైన గౌరవాన్ని; ఒందున్= పొందేది.

**తాత్పర్యం:** ఆదిత్యులూ, మరుత్తులూ, వసువులూ, రుద్రులూ మొదలైన దేవగణాలూ, బ్రహ్మదేవుడూ, చతుర్వేదాలూ ఆయా గౌరవాలను పొందటం నా మహిమవలననే.

**తే. కమలగర్భు సృజించి సకలజగద్ధు । రానియుక్తునిఁ గావించి యే నివృత్తి**
**పరత నేకాకినై దివ్యభవ్య మగు స । హాయముగ సంచరింతు మధ్యస్థవృత్తి. 387**

**ప్రతిపదార్థం:** కమలగర్భున్= బ్రహ్మను; సృజించి= సృష్టించి; సకలజగత్= సకలప్రపంచం యొక్క; ధురా= భారవహనంపట్ల; నియుక్తునిన్+కావించి= నియమించి; ఏన్= నేను; నివృత్తిపరతన్= నివృత్తిమార్గంలో తత్పరత కలిగి; ఏకాకిని+ఐ= అద్వితీయుడిని అయి (ఏకాంతం అనుభవిస్తూ); మధ్యస్థవృత్తిన్= మధ్యస్థుడుగా ఉంటూ (ఏ పక్షపాతమూ లేకుండా); దివ్య= దివ్యమూ; భవ్య= భవ్యమూ; అగు= అయిన; సహాయముగన్= సహాయంగా; సంచరింతున్= వ్యవహరిస్తూ ఉంటాను.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడిని నేనే సృష్టించాను. ప్రపంచభారాన్ని అప్పగించాను. నేను నివృత్తి మార్గం చేపట్టాను. ఏకాంతంగా గడుపుతాను. మధ్యస్థుడుగా ఉంటూ బ్రహ్మాదులకు అవసరాన్ని బట్టి దివ్యమూ, భవ్యమూ అయిన సహాయం చేస్తుంటాను.

**వ. ఒక్కొక్కకాలంబుల జగద్ధితంబుగా జన్మకర్మంబులం బూనుదు వినుము వారాహ రూపంబు దాల్చి హిరణ్యాక్షుని నారసింహమూర్తి ధరియించి హిరణ్యకశిపుని భృగువంశంబున జామదగ్న్యుం డన జనియించి సర్వక్షత్రంబును దశరథుండను రాజునకు రామనామంబునం బుట్టి రావణాసురుం బరిమార్పంగలవాఁడ. భూభారంబు వాపుటకై యాదవకులంబునఁ బ్రభవించి పురందరనందనుండై యవతరించిన నరుండు దోడ్పడ నక్కార్యంబు నిర్వహింతు. నేను దొల్లి నరనారాయణు లనియెడు నామంబుల మూర్తిద్వయంబును ఋషిత్వంబును వెలయ నొలసి లోకరక్షణం బాచరించుచున్నవాఁడ. నమ్మూర్తుల పదంపడి కేళీమానుషత్వంబు గైకొని యిట్లు సేయు నయ్యవతారంబునఁ గంస కాలయవన ముర నరక బాణప్రముఖులైన కంటకులం జెఱుతు. నందు బాణాసురుం గాతునని పూని మహాదేవుండు మహాసేనానీసహితుండై యడ్డపడ నమ్మహాత్ముని జయించి బాణునిం బరాభవింతు. నింతకుమున్ను మత్స్యత్వంబుకూర్మత్వంబుల నొంది నిఖిలచ్ఛందోబృందారక హితం బొనర్చితి మచ్చరితంబులు నీకుం గర్ణగోచరంబులు గాకుండెడునే? మఱియు ధర్మరక్షణార్థంబుగా నేమేమి సేయవలయు నవియెల్లనుం జేయువాఁడఁ గృత్యంబులు గృతంబులైన మదీయ ప్రకృతిం బొందుదుఁ బరమేష్ఠినందనా! నీ వేకాంతికుండ వగుట నీకు నా తెఱంగెల్ల నెఱింగించితి' నని చెప్పి యమ్మునిం గని యనాహారులు నవింద్రియులు నస్వేదులు సుగంధి శ్వేతదేహులు నగు నమ్మానవులం జూపి 'వీరేకాంతికులు' మన్మయధ్యానపరులునై యున్నవారు వీరలకు సమ్మర్దంబుగా మెలఁగం దగదు. నీవింకం బొ'మ్మని పరమాదరంబునం బలికి వీడ్కొలిపిన నద్దేవమునిసత్తముండు పరమానందభరితుఁ డై బదరికాశ్రమంబునకుం జనుదెంచి నరనారాయణులం గాంచి. 388**

**ప్రతిపదార్థం:** ఒక్కొక్కకాలంబులన్= కొన్ని కొన్ని సమయాలలో; జగత్+హితంబుగాన్= ప్రపంచానికి మేలు అయ్యేట్టు; జన్మకర్మంబులన్= జన్మలనూ, కర్మాచరణాలనూ (జన్మల రూపమైన కర్మలను); పూనుదున్= వహిస్తూ ఉంటాను; వినుము; వారాహరూపంబున్+తాల్చి= వరాహావతారం ధరించి; హిరణ్య+అక్షునిన్= హిరణ్యాక్షుడు అనే రాక్షసుడినీ; నారసింహ+మూర్తిన్= నరసింహరూపాన్ని; ధరించి= వహించి; హిరణ్యకశిపునిన్= హిరణ్యకశిపుడు అనే రాక్షసుడినీ; భృగువంశంబునన్= భృగు మహర్షి వంశంలో; జామదగ్న్యుండు+అని= పరశురాముడు అనే రూపంతో (జమదగ్ని కుమారుడు); జనియించి= జన్మించి; సర్వక్షత్రంబునున్= సకల క్షత్రియసమూహాన్ని; దశరథుండు+అను= దశరథుడు అనే; రాజునకున్= రాజుగారికి; రామనామంబునన్= రాముడు అనే పేరుతో; పుట్టి= ప్రభవించి; రావణ+అసురున్= దశగ్రీవుడు అనే రాక్షసుడినీ; పరిమార్పన్+కలవాఁడన్= సంహరిస్తాను; భూభారంబు= భూమి బరువును; పాపుటకై= తగ్గించటంకోసం; యాదవకులంబునన్= యదువు అనే రాజుగారి వంశంలో; ప్రభవించి= జనించి; పురందర= ఇంద్రుడియొక్క; నందనుండై= కుమారుడై; అవతరించిన= పుట్టిన; నరుండు= అర్జునుడు; తోడ్పడన్= సహకరించగా; ఆ+కార్యంబున్= భూభారాన్ని తొలగించటమనే ఆ పనిని (కురుక్షేత్ర సంగ్రామంతో); నిర్వహింతున్= నిర్వహిస్తాను; ఏను= నేను; తొల్లి= పూర్వకాలంలో; నరనారాయణులు+అనియెడు= నరనారాయణులు అనే; నామంబులన్= పేరులతో; మూర్తిద్వయంబును=

రెండు రూపాలూ; ఋషిత్వంబునున్= ఋషిత్వమూ; వెలయన్= పరిఢవిల్లగా (ఒప్పగా); ఒలసి= పొంది; లోకరక్షణంబు= ప్రపంచ సంరక్షణ (ప్రాణిరక్ష); ఆచరించుచున్నవాఁడన్= చేస్తున్నాను; ఆ+మూర్తుల= ఆ నరనారాయణ అవతారాల; పదంపడి= తరువాత; కేళీమానుషత్వంబున్= విలాసార్థంగా మానవరూపం; కైకొని= చేపట్టి; ఇట్లు= ఇట్లా; చేయు+ఆ+అవతారంబునన్= చేసే ఆ శ్రీకృష్ణావతారంలో; కంస= కంసుడూ; కాలయవన= కాలయవనులూ; ముర= మురుడూ; నరక= నరకుడూ; బాణ= బాణుడూ; ప్రముఖులైన= మొదలైన; కంటకులన్= పీడకులను (లోక కంటకులు= లోకానికి ముళ్ళవంటివారు); చెఱుతున్= నాశనం చేస్తాను (కంటకాలను చెఱపటం అంటే చెక్కివేయటం); అందున్= వారిలో (ఆ పని చేస్తున్నప్పుడు); బాణ+అసురున్= బాణుడు అనే రాక్షసుడిని; కాతున్+అని= రక్షిస్తాను అని; పూని= పూనుకొని (బాధ్యత మీద వేసికొని); మహాదేవుండు= శంకరుడు; మహాసేనానీసహితుండై= ప్రమథసేనాపతి అయిన కుమారస్వామితో కలిసి (సేనాని= కుమారస్వామి); అడ్డపడన్= నాకు (బాణాసుర సంహారంలో) అడ్డురాగా; ఆ+మహాత్మునిన్= మహానుభావుడైన ఆ శివుడిని; జయించి= జయించి; బాణునిన్= (శివరక్షణలో ఉన్న) బాణాసురుడిని; పరాభవింతున్= అవమానపరుస్తాను (ఉషానిరుద్ధుల వివాహంతో ఆ రాక్షసుడిని అవమానించటం); ఇంతకున్+మున్ను= ఇంతకుపూర్వం; మత్స్యత్వ+కూర్మత్వంబులన్= మత్స్యావతారాన్ని, కూర్మావతారాన్నీ (తాబేలు); ఒంది= ధరించి; నిఖిల= సమస్తమైన; ఛందః= వేదాలకూ (మత్స్యావతారంలో సోమకాసురుడిని జయించి వేదాలను ఉద్ధరించటం); బృందారక= దేవతలకూ (క్షీరసముద్రమథనం - అమృతోత్పత్తి - కూర్మావతారం); హితంబు= మేలు; ఒనర్చితిన్= చేశాను; మత్+చరితంబులు= నా ప్రవర్తనలు (చరిత్రలు - కథలు); నీకున్= నీకు; కర్ణగోచరంబులు= చెవులకు వినిపించినవి; కాకుండెడునే?= కాకుండా ఉన్నాయా? (ఇవి వినే ఉంటావు - అని); మఱియున్= ఇంకా; ధర్మరక్షణార్థంబుగాన్= ధర్మాన్ని రక్షించటంకోసమని; ఏమేమి+చేయన్+వలయున్= ఏమిటేమిటి చేయాలో; అవి+ఎల్లనున్= అవి అన్నీ; చేయువాఁడన్= చేస్తాను - చేస్తుంటాను; కృత్యంబులు= చేయవలసినవి; కృతంబులు+ఐనన్= చేయబడినవి అయినట్టయితే (చేయవలసినవన్నీ చేశాక); మదీయ ప్రకృతిన్= నా సహజస్వభావాన్ని (స్థితిని); పొందుదున్= పొందుతాను; పరమేష్ఠినందనా!= బ్రహ్మదేవుని పుత్రుడా! నారదుడా!; నీవు; ఏకాంతికుఁడవు+అగుటన్= ఏకాగ్రచిత్తం కలవాడవు అవటంచేత; నీకున్= నీకు; నా+తెఱంగు+ఎల్లన్= నా పద్ధతి (విధం) అంతా; ఎఱింగించితిన్= తెలియజెప్పాను; అని; చెప్పి= పలికి; ఆ+మునిన్= ఆ నారదమహర్షిని; కని= తిలకించి; అనాహారులు= ఆహారం తీసికోనివారూ; అనింద్రియులున్= ఇంద్రియచాంచల్యం లేనివారూ; అస్వేదులున్= చెమటపట్టనివారూ; సుగంధి= పరిమళించే; శ్వేతదేహులున్= తెల్లని శరీరాలు కలవారూ; అగు= అయినటువంటి; ఆ+మానవులన్= ఆ నరులను; చూపి= చూపించి; వీరు= వీరంతా; ఏకాంతికులున్= ఏకాగ్రత కలవారూ; మత్+మయ+ధ్యానపరులై= నాతో నిండిన ధ్యానం కలవారూ అయి (నన్నే ధ్యానిస్తూ); ఉన్నవారు= ఉన్నారు; వీరలకున్= ఈ దివ్యపురుషులకు; సమ్మర్దంబుగాన్= ఒత్తిడి అయ్యేట్టు (ఇబ్బంది అయ్యేట్టు); మెలఁగన్+తగదు= సంచరించటం పనికిరాదు (నీ సంచారమూ నీ ఉనికీ వాళ్ళ ఏకాగ్రతను భంగపరుస్తుంది - అని); నీవు; ఇంకన్= ఇంక; పొమ్ము= తిరిగివెళ్ళుము; అని; పరమ+ఆదరంబునన్= మిక్కిలి ఆదరంతో (ప్రేమతో, ఆత్మీయతతో); పలికి= చెప్పి; వీడ్కొలిపినన్= వీడ్కోలు ఇచ్చేసరికి; ఆ+దేవముని+సత్తముండు= దేవర్షులలో ఉత్తముడైన ఆ నారదుడు; పరమ+ఆనంద భరితుండై= బ్రహ్మానందంతో నిండినవాడై; బదరికా+ఆశ్రమంబునకున్= తానుండే బదరికాశ్రమానికి (బదరి= రేగుచెట్టు); చనుదెంచి= తిరిగి వచ్చి; నరనారాయణులన్= నరనారాయణులు ఇద్దరినీ; కాంచి= దర్శించి.

**తాత్పర్యం:** కొన్ని కొన్ని సమయాలలో లోకహితం కొరకు జన్మకర్మలను పూనుతూ ఉంటాను. వరాహరూపం తాల్చి హిరణ్యాక్షుడిని, నరసింహరూపం ధరించి హిరణ్యకశిపుడినీ, భృగువంశంలో పరశురాముడై పుట్టి క్షత్రియలోకాన్నంతటినీ, దశరథరాముడిగా జన్మించి రావణుడినీ సంహరిస్తాను. యాదవకులంలో కృష్ణుడినై పుట్టి అర్జునుడి సహాయంతో భూభారాన్ని తొలగిస్తాను. నేను పూర్వం నరనారాయణు లనే పేర్లతో రెండు రూపాలతో, ఋషిత్వంతో వెలసి జగద్రక్షణాన్ని చేస్తున్నాను. ఆ మూర్తులే తరువాత లీలామానుష రూపాలతో తమ కార్యాలను నిర్వహిస్తూ కంసుడు, కాలయవనుడు, మురుడు, నరకుడు, బాణుడు మొదలైన కంటకులను రూపుమాపుతారు. అందులో బాణాసురుడిని రక్షిస్తానని పూనుకొని శివుడు కుమారస్వామితో కలిసి అడ్డగించగా ఆ మహాత్ముడిని జయించి బాణుడిని అవమానించాను. ఇంతకు ముందు మత్స్యకూర్మభావాలను పొంది దేవగణాలకు మేలు చేశాను.

నా లీలలు నీవు వినకుండా ఉన్నావా? ఇంకా ధర్మరక్షణం కొరకు ఏయే పనులు చేయాలో వాటిని తప్పక నిర్వహిస్తాను. నా కర్తవ్యాలు పూర్తి కాగానే నా మూలప్రకృతిని మరల పొందుతాను. నారదా! ఏకాగ్రచిత్తుడవు కావటంచేత నా తీరునంతా నీకు తెలిపాను' - అని పలికి ఆ మునిని చూచి నిరాహారులూ, ఇంద్రియ నిగ్రహులూ, స్వేదం లేనివారూ, సుగంధి శ్వేతదేహులూ అయిన ఆ మానవులను చూపి, వారు ఏకాగ్రచిత్తులు, నన్నే స్మరించేవారూ అయి ఉన్నారు. వారికి ఇబ్బంది కలిగేటట్లు వ్యవహరించరాదు. నీ వింక పొమ్ము' అని పలికి గౌరవంగా వీడ్కోలు పలుకగా, నారదుడు పరమానందంగా బదరికాశ్రమానికి వచ్చి నరనారాయణులను దర్శించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **భక్తి వీడ్కొని చని మునిప్రతతి కెందు । నచ్యుతాననోద్గతము వేదార్థమయము**
**యోగసాంఖ్యాత్మకమునైన వాగమృతముఁ । గర్ణపుటపేయముగఁ జేయు గారవమున.** **389**

**ప్రతిపదార్థం:** భక్తిన్= భక్తితో; వీడ్కొని= (విష్ణుమూర్తి దగ్గర) సెలవు తీసికొని; చని= నారదుడు వెళ్ళి; మునిప్రతతికిన్= మునిబృందానికి; ఎందున్= అంతటా; అచ్యుత= విష్ణుమూర్తియొక్క; ఆనన= ముఖంనుండి; ఉద్గతమున్= వెలువడినదీ; వేద+అర్థమయమున్=వేదసారంతో నిండినదీ; యోగ+సాంఖ్య+ఆత్మకమున్= యోగరూపమూ, సాంఖ్యరూపమూ; ఐన= అయినటువంటి; వాక్+అమృతమున్= వాగ్రూపమైన అమృతాన్ని; గారవమునన్= ప్రేమతో; కర్ణపుట= (చెవులు అనే దొప్పలతో) చెవులతో; పేయముగన్= క్రోలబడేదిగా; చేయున్= చేశాడు (వాగమృతాన్ని మునుల చెవులకు పానీయంగా అందించాడు - అని).

**తాత్పర్యం:** విష్ణుమూర్తి దగ్గర సెలవు తీసికొని వెళ్ళిన నారదుడు తాను స్వామినుండి గ్రహించిన ఉపదేశామృతాన్ని తక్కిన మహర్షులందరికీ కర్ణరసాయనంగా అందించాడు. అదియే వేదసారం. యోగసారం. సాంఖ్యసారం.

**వ.** **నారదుం డట్లు విష్ణుని దివ్యవాక్యవితతి విద్వజ్జనంబులకు వినిపించుచు బ్రహ్మసభ కరిగి యందునుం బ్రకటించె' ననుటయు 'నప్పద్మభవునకు నది వింతయే?' యనిన నక్కౌంతేయాగ్రజుతో శాంతనవుం 'డా శతానందునకు నపరిజ్ఞాతంబునుం గలదే? యతనిం గొలువ వచ్చినట్టి సిద్ధసాధ్యాదులకు వినిపించెఁగాక' యని పలికి వెండియు నిట్లనియె.** **390**

**ప్రతిపదార్థం:** నారదుండు; అట్లు; విష్ణుని= విష్ణుమూర్తియొక్క; దివ్య= దివ్యమైన; వాక్య+వితతిన్= వాక్సమూహాన్ని; విద్వత్+జనంబులకున్= పండితులకు; వినిపించుచున్= వినిపిస్తూ; బ్రహ్మసభకున్= బ్రహ్మదేవుడి సభకు; అరిగి= వెళ్ళి; అందునున్= ఆ సభలోకూడా; ప్రకటించెన్= అందరికీ వినిపించాడు; అనుటయున్= అని భీష్ముడు చెప్పటంతోనే; ఆ+పద్మభవునకున్= ఆ బ్రహ్మదేవుడికి; అది= ఆ విషయం; వింతయే?= అంత కొత్తదా (ఎరుగనిదా)?; అనిన= అని అడిగిన; ఆ+కౌంతేయ+అగ్రజుతోన్= కుంతీపుత్రులలో (మొదటివాడైన) పెద్దవాడైన ఆ ధర్మరాజుతో; శాంతనవుండు= శంతను సుతుడు ఆ భీష్ముడు - ఇట్లా అన్నాడు: ఆ+శతానందునకున్= ఆ బ్రహ్మదేవుడికి; అపరిజ్ఞాతంబునున్+కలదే?= తెలియనిది కూడా ఉన్నదా? (ఆయనకు అన్నీ తెలుసు అని); అతనిన్= ఆ బ్రహ్మను; కొలువన్= సేవించటానికి; వచ్చినట్టి= వచ్చినటువంటి; సిద్ధసాధ్య+ఆదులకున్= సిద్ధులూ,సాధ్యులూ ఈ మొదలైన జనాలకు; వినిపించెన్+కాక= (నారదుడు) వినిపించాడు కానీ - అని పలికి= అని భీష్ముడు; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అట్లా నారదుడు బ్రహ్మలోకానికి కూడా వెళ్ళాడు. అక్కడ కూడా ఆ ఉపదేశామృతాన్ని ప్రకటించాడు' అని భీష్మ డనగా, 'ఆ విషయం బ్రహ్మకు క్రొత్తదా?' అని ఆ ధర్మరాజు అడిగాడు. 'బ్రహ్మకు తెలియదని కాదు. ఆ సభకు వచ్చిన సిద్ధసాధ్యాదులకొరకు ఆయన అట్లా చేశాడు' అని భీష్ముడు బదులిచ్చి, చెప్పటం మొదలుపెట్టాడు.

**క.** **'క్రమమున వాఙ్మయమగు న । య్యమృతము లోకమునఁ బరఁగె నది మజ్జనకుం**
**డమితదయఁ జెప్పె నాకును । శమయుత! యేఁజెప్పితిని విశదముగ నీకున్.** **391**

**ప్రతిపదార్థం:** శమయుత!= ఇంద్రియనిగ్రహం కలవాడా!; క్రమమునన్= క్రమక్రమంగా (ఆనోటా ఆనోటా); వాక్+మయము+అగు= వాగ్రూపమైన; ఆ+అమృతము= ఆ ఉపదేశామృతం; లోకమునన్= భూలోకమంతటా; పరఁగెన్= వ్యాపించింది; అది= దాన్ని; మత్+జనకుండు= మా తండ్రిగారు; అమితదయన్= మిక్కిలి దయతో; నాకునున్= నాకు; చెప్పెన్= తెలియజేశారు; ఏన్= నేను; నీకున్= నీకు; విశదముగన్= స్పష్టంగా; చెప్పితిని= తెలియజెప్పాను.

**తాత్పర్యం:** 'ఓ శాంతస్వభావా! విష్ణుమూర్తి అందించిన ఆ ఉపదేశామృతం క్రమక్రమంగా కర్ణాకర్ణికగా లోకమంతటా వ్యాపించింది. మా తండ్రి దానిని నాకు అత్యంతదయతో బోధించాడు. నేనేమో నీకు విశదంగా తెలియజెప్పాను.

**క. మునులును సురలును దీనిని । విని కొనియాడుదురు విష్ణు వినుతింతురు భ**
**క్తినిరూఢులై జపింతురు । మనమునఁ జపింతు రతిసమాహితు లగుచున్. 392**

**ప్రతిపదార్థం:** మునులునున్= మహర్షులూ; సురలునున్= దేవతలూ; దీనినిన్= ఈ ఉపదేశసారాన్ని; విని= ఆలకించి; కొనియాడుదురు= ప్రశంసిస్తారు; విష్ణున్= విష్ణుమూర్తిని; వినుతింతురు= స్తుతిస్తారు; భక్తి+నిరూఢులై= గాఢమైన భక్తి కలవారై; మనమునన్= మనస్సులో; జపింతురు= జపిస్తారు; అతి= మిక్కిలి; సమాహితులు+అగుచున్= సావధానులు అవుతూ; చర్చింతురు= (దీన్ని పలురకాలుగా) చర్చిస్తారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! విష్ణుమూర్తి అందించిన ఈ ఉపదేశసారాన్ని మునులూ, ఋషులూ మెచ్చుకొంటారు. విష్ణుమూర్తిని స్తుతిస్తారు. భక్తితో దీన్ని జపిస్తారు. నలుగురూ కలిసినచోట ఏకాగ్రచిత్తులై దీనినే చర్చిస్తారు. ఇవన్నీ జరగటం నేను ఎరుగుదును.

**తే. నీవు నిట్టుల చేయు వినీతిపరుఁడు । విష్ణుభక్తుండు శమదమాన్వితుఁడు నైన**
**యట్టివానికిఁ జెప్పుమీ యచ్యుతాన । నోద్గతంబైన యిప్పురాణోత్తమంబు. 393**

**ప్రతిపదార్థం:** నీవున్= నీవుకూడా; ఇట్టులన్= ఇట్లాగే; చేయు(ము)= స్తుతించటం, జపించటం, చర్చించటం చేయుము; వినీతి పరుఁడున్= వినయ సంపన్నుడూ; విష్ణుభక్తుండున్= విష్ణుభక్తుడూ; శమ+దమ+అన్వితుఁడున్= అంతర్బహిరింద్రియ నిగ్రహం కలవాడూ; ఐన+అట్టివానికిన్= అయినటువంటి వాడికి; అచ్యుత= విష్ణుమూర్తియొక్క; ఆనన= ముఖంనుంచి; ఉద్గతంబు+ఐన= వెలువడిన; ఈ+పురాణ+ఉత్తమంబున్= ఈ ఉత్తమ పురాణగాథను; చెప్పుమీ!= ఉపదేశించు సుమీ!

**తాత్పర్యం:** ధర్మరాజా! నీవు కూడా ఇట్లాగే విష్ణుమూర్తిని స్తుతించుము. ఈ ఉపదేశం చర్చించుము. ఈ మంత్రం జపించుము. అంతేకాదు, నీవు ఎవరికైనా ఈ ఉత్తమపురాణాన్ని చెప్పదలచుకొంటే వినయపరుడూ, విష్ణుభక్తుడూ ఇంద్రియనిగ్రహం కలవాడూ అయిన వ్యక్తికే ఉపదేశించుము.

**క. నీ వినిన యుపాఖ్యానము । లేవియు సరిగావు దీని కిది దీర్ఘాయుః ।**
**శ్రీవిభవారోగ్యములం । గావించుఁ బఠించినం దగం దను వినినన్.' 394**

**ప్రతిపదార్థం:** నీ= నీయొక్క; వినిన= (ఇంతవరకూ) విన్నటువంటి; (నీవు విన్న - అని); ఉపాఖ్యానములు= ఉపకథలు; ఏవియున్= ఏవీ కూడా; దీనికిన్= ఈ ఉపాఖ్యానానికి; సరిగావు= సాటిరావు (సమానం కావు); ఇది= ఈ ఉపాఖ్యానం; తగన్= శ్రద్ధగా; తనున్= తనను; పఠించినన్= చదివినా; వినినన్= ఆలకించినా; దీర్ఘాయువుః= దీర్ఘమైన ఆయుర్దాయాన్నీ; శ్రీవిభవ= సంపద్వైభవాన్నీ; ఆరోగ్యములన్= ఆరోగ్యాన్నీ (ఆయుశ్శ్రీ= ఆయుస్సంపదనూ); కావించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మజా! ఇంతవరకూ నీవు విన్న ఉపాఖ్యానాలు ఏవీ దీనికి సరిపోలవు. దీనిని శ్రద్ధగా చదివినా, వినినా అట్టివారికి దీర్ఘాయుస్సూ, సకల సంపదలూ, వైభవాలూ, ఆరోగ్యమూ అన్నీ సమకూడుతాయి.'

**క. అని శాంతనవుఁడు సెప్పిన । విని మోదమునొంది పాండవేయులు దీనిన్**
**వినుచుఁ బఠించుచు విష్ణుం । గొనియాడుదు రధికభక్తిఁ గురువంశవరా!' 395**

**ప్రతిపదార్థం:** కురువంశవరా!= కురువంశంలో ఉత్తముడా! ఓ జనమేజయుడా!; అని= ఈ ప్రకారంగా; శాంతనవుఁడు= శంతనుకుమారుడైన భీష్ముడు; చెప్పినన్= చెబితే; విని= ఆలకించి; మోదమున్+ఒంది= సంతోషించి; పాండవేయులు= పాండుపుత్రులు; దీనిన్= ఈ ఉపాఖ్యానాన్ని; వినుచున్= వింటూ; పఠించుచున్= పఠిస్తూ; విష్ణున్= విష్ణుమూర్తిని; అధికభక్తిన్= అత్యంతభక్తితో; కొనియాడుదురు= స్తుతించేవారు.

**తాత్పర్యం:** (కథను మళ్ళీ జనమేజయ వైశంపాయనులకు కలుపుతున్నాడు.) 'ఓ జనమేజయా! భీష్ముడు ఇట్లా చెప్పితే శ్రద్ధగా విన్న పాండుపుత్రులు దీనినే వింటూ, పఠిస్తూ భక్తితో విష్ణుమూర్తిని స్తుతిస్తూ కాలం గడిపారు.'

**వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు. 396**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వైశంపాయనుండు= వ్యాసశిష్యుడైన వైశంపాయనముని; వెండియున్= తిరిగి ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ఇంకా వ్యాసశిష్యు డైన వైశంపాయనముని ఇట్లా చెప్పాడు.

**ఉ. ' సాత్యవతేయుఁ డీ పరమ జప్యము భక్తిఁ బఠించుచున్ వియ**
**ద్గత్యభిరాముఁడై నియమతత్పరతం జను దుగ్ధవార్ధికిన్**
**నిత్యము విష్ణుఁగాంచి మహనీయతరం బగు పూజనంబు సం**
**స్తుత్యముగాఁగఁ జేఁతకుఁ గుతూహలసంపద పల్లవింపఁగన్.' 397**

**ప్రతిపదార్థం:** నిత్యమున్= ప్రతిరోజూ; విష్ణున్= విష్ణుమూర్తిని; కాంచి= దర్శించి; మహనీయతరంబు+అగు= మిక్కిలి పవిత్రమైన (విలువైన); పూజనంబు= అర్చనను; సంస్తుత్యము+కాఁగన్= పొగడొందేట్టు; చేఁతకున్= చేయటానికి; కుతూహల సంపద= ఉత్సాహశ్రీ; పల్లవింపఁగన్= చిగురొత్తగా; సాత్యవతేయుఁడు= సత్యవతీ తనయుడైన వ్యాసుడు; ఈ+పరమ+జప్యమున్= ఉత్తమమూ జపించదగినదీ అయిన ఈ ఉపాఖ్యానాన్ని; భక్తిన్= భక్తితో; పఠించుచున్= పఠిస్తూ; వియత్+గతి+అభిరాముఁడై= ఆకాశగమనంతో శోభిల్లినవాడై; నియమతత్పరతన్= నియమనిష్ఠాపరుడై; దుగ్ధవార్ధికిన్= క్షీరసముద్రానికి; చనున్= వెడతాడు.

**తాత్పర్యం:** ఈ పరమపవిత్రమైన ఉపాఖ్యానాన్ని భక్తితో జపిస్తూ వ్యాసుడు ఆకాశమార్గాన ప్రయాణం చేసి క్షీరసముద్రానికి వెళ్ళుతాడు. నిత్యమూ విష్ణుమూర్తిని దర్శించాలి, ఉత్తమపూజలు ఆచరించాలి అనే కుతూహలం వ్యాసుడి మనస్సులో ఎప్పుడూ పల్లవిస్తూ ఉంటుంది.'

**వ. అనిన విని జనమేజయుండు మోదంబునొంది యమ్ముని సత్తమునితోడ నీవు మోక్షం బత్యంత సుఖం బని చెప్పుదు. సకలజనంబులు నభ్యుదయకరంబులైన కర్మవిశేషంబులం దగిలి యుండుదు 'రొరుల ననవేల? దేవతలును దద్ధర్మంబు వాటింపక హవ్యభోజనపరత్వం బూని యుండుదు రమ్మహాత్ము లట్లగుట యెట్లొకో? యని యేను విచారించుచుండుదు నత్తెఱంగు దేటపడ నెఱింగింపవే?' యని యడిగిన నప్పారాశర్యశిష్యుం డా భూవరున కిట్లనియె. 398**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వైశంపాయనుడు చెబితే; విని= ఆలకించి; జనమేజయుఁడు= జనమేజయుడు; మోదంబున్+ఒంది= సంతోషించి; ఆ+మునిసత్తమునితోడన్= ఆ మునీశ్వరుడితో (వైశంపాయనుడితో); నీవు; మోక్షంబు= ముక్తి అనేది; అత్యంత సుఖంబు= మిక్కిలి సుఖమైనది; అని; చెప్పుదు(వు)= చెబుతావు; కానీ - సకలజనంబులున్= జనులందరూ; అభ్యుదయ కరంబులు+ఐన= భౌతికంగా అభివృద్ధిని కలిగించే; కర్మవిశేషంబులన్= ఆయా విశేషమైన పనులలో; తగిలి+ఉండుదురు= సక్తులై ఉంటున్నారు; ఒరులన్= ఇతరులను; అనన్+ఏల= అనటం ఎందుకుగానీ; దేవతలునున్= దేవతలుకూడా; తద్+ ధర్మంబున్= మోక్షధర్మాన్ని; పాటింపక= ఆచరించకుండా; హవ్యభోజన పరత్వంబున్= పురాడోశాన్ని తినటమే పనిగా; ఊని= స్వీకరించి; ఉండుదురు= జీవిస్తుంటారు (ఊనియుండుదురు); ఆ+మహాత్ములు= ఆ మహనీయులు; అట్లు= ఆ విధంగా; అగుట= కావటం; ఎట్లొకో!= ఎట్లా సమంజసం!; అని; ఏనున్= నేను; విచారించుచుండుదున్= ఆలోచిస్తూ ఉంటాను; ఆ+ తెఱంగున్= వారు అట్లా ఉండటానికి కారణాన్ని; ఎఱింగింపవే= తెలియజెప్పవా!; అని; అడిగినన్= అడిగితే; ఆ+పారాశర్యశిష్యుండు= ఆ వ్యాసశిష్యుడైన వైశంపాయనుడు; ఆ+భూవరునకున్= ఆ జనమేజయ మహారాజుకి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని వైశంపాయనుడు చెప్పగా విని, జనమేజయుడు ఆ మునీశ్వరుడితో 'నీవు ముక్తి అనేది మిక్కిలి సుఖమైనది అని చెప్పుతావు కానీ, జనులందరూ కేవలం భౌతిక విషయాలపైన మాత్రమే ఆసక్తి చూపుతున్నారు. అంతే కాదు, దేవతలు కూడా మోక్షధర్మాన్ని ఆచరించకుండా పురోడాశాన్ని తినటమే పనిగా జీవిస్తుంటారు. ఇదేమిటి?- వీరెందుకు ఇట్లా అయ్యారు? అని నేను ఆలోచిస్తూ ఉంటాను. వారు అట్లా ఉండటానికి గల కారణాన్ని తెలియజెప్పు' మని అడుగగా వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు ఈ విధంగా తెలిపాడు.

**క. విమలాత్ముఁడు పారాశ । ర్యమునీంద్రుఁడు శిష్యులను మహాభారతపం**
**చమములగు వేదముల మే । రుమహీధరవాసియై కరుణఁ జదివించెన్. 399**

**ప్రతిపదార్థం:** విమల+ఆత్ముఁడు= నిర్మలాంతరంగుడైన; పారాశర్యమునీంద్రుఁడు= ఆ వ్యాసుడు; మేరుమహీధర+వాసియై= మేరుపర్వతంమీద నివసిస్తున్నవాడై; శిష్యులను= తన శిష్యులను; మహాభారత పంచమములు+అగు= మహాభారతం అయిదవదిగా కలదైన; వేదములన్= వేదాలను (వేదాలు నాలుగయితే మహాభారతం అయిదవది. పంచమవేదం); కరుణన్= శిష్యులపట్ల దయతో; చదివించెన్= చదివించాడు (వేదాలను శిష్యులతో చదివించాడు అంటే నేర్పాడు అని).

**తాత్పర్యం:** నిర్మలమనస్వి ఆ వ్యాసుడు మేరుపర్వతంమీద నివసిస్తూ తన శిష్యులకు నాలుగు వేదాలూ, పంచమవేదమైన మహాభారతమూ దయతో నేర్పాడు.

**వ. అట్టియెడ నేనును సుమంతు - పైల - జైమినులు నీ విప్పుడు నన్నడిగిన చందంబున నమ్మహాత్ము నడిగితిమి దానికి సుముఖుండయి సర్వజ్ఞుండును సదయహృదయుండును నగు సాత్యవతేయుండు మాకు నిట్లని యానతిచ్చె. 400**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= అలా చదివిస్తున్న సమయంలో; ఏనునున్= నేనూ; సుమంతు= సుమంతుడూ; పైల= పైలుడూ; జైమినులు= జైమిని - అనే మేము నలుగురమూ; నీవు; ఇప్పుడు; నన్నున్= నన్ను; అడిగిన+చందంబునన్= అడిగినట్టే; ఆ+ మహాత్మున్= ఆ మహానుభావుడు వ్యాసుడిని; అడిగితిమి= అడిగాం; దానికిన్= ఆ విషయానికి; సుముఖుండు+అయి= అనుకూలుడై; సర్వజ్ఞుండునున్= అన్నీ తెలిసినవాడూ; సదయ+హృదయుండునున్= దయతో కూడిన హృదయం కలవాడూ; అగు= అయిన; సాత్యవతేయుండు= సత్యవతీతనయుడు - వ్యాసుడు; మాకున్= మాకు; ఇట్లు+అని= ఇట్లాగని; ఆనతి+ఇచ్చెన్= సెలవిచ్చాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో నేనూ, సుమంతుడూ, పైలుడూ, జైమిని అనే నలుగురమూ నీవు ఇప్పుడు నన్ను అడిగినట్టే ఆ వ్యాసభగవానుడిని అడుగగా ఆయన ఇట్లా బదులిచ్చాడు.

**తే.** **ఏ నతీతంబులును వర్తమానములు న । నాగతమ్ములు నగు జగదఖిలవర్త**
**నంబులును గను దివ్యబోధంబు గోరి । పాలకడలి తీరమునఁ దపంబుసేసి. 401**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అతీతంబులును= కడచిపోయినవీ; వర్తమానములున్= జరుగుతున్నవీ; అనాగతమ్ములున్= (ఇంకా రానివీ) జరగబోయేవీ; అగు= అయిన; జగత్= ప్రపంచంయొక్క; అఖిల= సమస్తమైన; వర్తనంబులును= నడవడికలూ; కను= తెలిసికొనేటువంటి (దర్శించే); దివ్యబోధంబు= దివ్యజ్ఞానం; కోరి= వాంఛించి; పాలకడలి+తీరమునన్= క్షీరసముద్రతీరంలో; తపంబు+చేసి= తపస్సు చేసి.

**తాత్పర్యం:** శిష్యులారా! భూతభవిష్యద్వర్తమానాలలో ప్రపంచప్రవర్తనను తెలిసికొనగలిగిన దివ్యదృష్టిని పొందాలని కోరి నేను క్షీరసముద్రతీరంలో తపస్సు చేశాను.

**వ.** **నారాయణప్రసాదంబునం జేసి సిద్ధమనోరథుండ నైతిం గావునం గల్పాదియందుఁ గమలసంభవప్రముఖ బృందారకు లాచరించిన కృత్యంబులు గానవచ్చు వానిం జెప్పెద దాన మీ యడిగిన యర్థంబు దేటపడు వినుండు. 402**

**ప్రతిపదార్థం:** నారాయణప్రసాదంబునన్+చేసి= నారాయణుడి అనుగ్రహంచేత; సిద్ధమనోరథుండను+ఐతిన్= సిద్ధించిన కోరిక కలవాడను అయ్యాను (నా కోరిక సిద్ధించి ఆ దివ్యజ్ఞానమూ, దివ్యదృష్టీ లభించాయి అని); కావునన్= కాబట్టి; కల్పాదియందున్= సృష్టి ప్రారంభంలో; కమలసంభవ= బ్రహ్మదేవుడూ; ప్రముఖ= మొదలైన; బృందారకులు= దేవతలు; ఆచరించిన= చేసినటువంటి; కృత్యంబులు= పనులు; కానవచ్చువానిన్= కనిపించే వాటిని (ఏవి ఎంత కనిపిస్తే అంత); చెప్పెదన్= చెబుతాను; (కానవచ్చున్= కనబడతాయి వానిన్= వాటిని, చెప్పెదన్= చెప్పుతాను); దానన్= దానివలన; మీ+అడిగిన+అర్థంబు= మీరు అడిగిన విషయం (ప్రయోజనం); తేటపడున్= స్పష్టపడుతుంది; వినుండు= వినండి.

**తాత్పర్యం:** నారాయణుడి అనుగ్రహంచేత నా కోరిక సిద్ధించి, ఆ దివ్యజ్ఞానమూ, దివ్యదృష్టీ లభించాయి. కాబట్టి, సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవుడూ మొదలైన దేవతలు చేసినటువంటి పనులు చెప్పుతాను. దానివలన మీకు ప్రయోజనం సిద్ధిస్తుంది. మీ రడిగిన విషయం స్పష్టమౌతుంది.

**క.** **ఆదిత్యమరుద్వసురు । ద్రాదిసురులు మునులు నంబుజాసనుఁగని మా**
**కేది కరణీయ మీశ? ద । యా దృష్టిని మమ్ముఁ జూచి యానతి యీవే? 403**

**ప్రతిపదార్థం:** ఆదిత్య= ఆదిత్యులూ; మరుత్= మరుత్తులూ; వసు= వసువులూ; రుద్ర= రుద్రులూ; ఆది= మొదలైన; సురులున్= దేవతలూ; మునులున్= ఋషులూ; అంబుజ+ఆసనున్= పద్మగర్భుడైన బ్రహ్మదేవుడిని; కని= దర్శించి; ఈశ!= ప్రభూ!; మాకున్= మాకు; ఏది; కరణీయము?= కర్తవ్యం?; దయాదృష్టిని= దయగల దృష్టితో; మమ్మున్= మమ్మల్ని; చూచి= వీక్షించి; ఆనతి+ఈవే?= ఆజ్ఞాపించవా?

**తాత్పర్యం:** ఆదిత్యాది సమస్తదేవతలూ, మహర్షులూ ఒకరోజున బ్రహ్మదేవుడిని దర్శించి ఇట్లా అడిగారు: 'ప్రభూ! మాకు కర్తవ్యం ఏమిటో దయతో ఆజ్ఞాపించవా?' - అని.

**వ.** **అని విన్నవించిన విని భరితాదరుండగుచు నప్పరమేష్ఠి వారితో 'మీ కెయ్యది కర్తవ్యంబో యను తలంపు మున్న నా చిత్తంబునం బొడమి యున్నయది. మీరు నిమ్మాట సెప్పి మేలు సేసితిరి. మీకును నాకును బ్రబలత్వం**

**బెద్దానం గలుగు దాని నుపదేశించుటకుం బురుషోత్తము శరణు సొత్తము రం' డని పలికి వారునుం దానును దుగ్ధవారాశితీరంబునకుం బోయి ఘోరంబగు తపంబు బహుసహస్ర సఖ్యంబులగు దివ్యవర్షంబు లాచరించిన వారలకు గంభీరమధురప్రకారయగు వాణి యిట్లని వీతెంచె. 404**

**ప్రతిపదార్థం:** అని; విన్నవించినన్= విజ్ఞప్తి చేస్తే; విని= ఆలకించి; భరిత+ఆదరుండు+అగుచున్= ఆదరంతో నిండినవాడు అవుతూ; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మ; వారితోన్= వారితో; మీకున్= మీకు; ఎయ్యది= ఏది; కర్తవ్యంబో= కర్తవ్యమో; అను= అనేటటువంటి; తలంపు= ఆలోచన; మున్ను+అ= మునుపే; నా చిత్తంబునన్= నా హృదయంలో; పొడమి+ఉన్నయది= పుట్టి ఉన్నది; మీరున్= మీరూ; ఈ+మాటన్= ఇదే మాట; చెప్పి= అడిగి; మేలు+చేసితిరి= మేలు చేశారు; మీకునున్= మీకూ; నాకునున్= నాకూ; ప్రబలత్వంబు= పుష్టి (ఆధిక్యం); ఎద్దానన్= దేనివలన; కలుగున్= కలుగుతుందో; దానిన్= దానిని; ఉపదేశించుటకున్= ఉపదేశించటానికి; పురుష+ఉత్తమున్= శ్రీమన్నారాయణుడిని; శరణు+చొత్తము= శరణువేడుదాం; రండు= రండి; అని పలికి= అని చెప్పి; వారునున్= వారందరూ; తానునున్= తానూ; దుగ్ధవారాశి తీరంబునకున్= క్షీరసముద్రతీరానికి; పోయి= వెళ్ళి; ఘోరంబు+అగు= తీవ్రమైన; తపంబు= తపస్సు; బహుసహస్ర సంఖ్యంబులు+అగు= వేలకువేల సంఖ్య కలవైన; దివ్యవర్షంబులు= దివ్యసంవత్సరాలు (మానుష సంవత్సరాలు కాదు - వేలకు వేల దివ్యసంవత్సరాలు); ఆచరించినన్= చేస్తే; వారలకున్= వారికి; గంభీర= గంభీరమూ; మధుర= మధురమూ అయిన; ప్రకార+అగు= విధానం కలదైన; వాణి= (సరస్వతి) ఒక వాక్కు; ఇట్లు+అని= ఇలాగని; వీతెంచెన్= వినవచ్చింది (గాలిలో తేలివచ్చింది).

**తాత్పర్యం:** అని వారు అడుగగా, ఆదరంతో ఆ బ్రహ్మ వారితో 'ఇదే ఆలోచన మునుపే నా హృదయంలో పుట్టి ఉన్నది. మీరూ ఇదే మాట అడిగారు. మీకూ, నాకూ ఆధిక్యం దేనివలన కలుగుతుందో, దానిని ఉపదేశించు మని శ్రీమన్నారాయణుడిని శరణు వేడుదాం రండి' అని చెప్పి వారందరూ తానూ క్షీరసముద్రతీరానికి వెళ్ళి, తీవ్రమైన తపస్సు వేలకువేల దివ్యసంవత్సరాలు చేయగా వారికి గంభీరమూ, మధురమూ అయిన ఒక వాక్కు ఈ విధంగా వినవచ్చింది.

విష్ణుఁ డదృశ్యరూపంబున బ్రహ్మాదిదేవతల కుపదేశించిన హితప్రకారము: (సం. 12-327-47,48,49)

**క. ' మీ వచ్చినపని యెఱుఁగుదు । నీ వనజభవుండు జగము లిన్నిటికి గురుం**
**డే విధిఁ బనిచిన నది శ్రుతి । భావితకర్మంబు దానఁ బరఁగుదుఁ దగఁగన్. 405**

**ప్రతిపదార్థం:** మీ+వచ్చినపని= మీరు వచ్చిన పని ఏమిటో; ఎఱుఁగుదున్= ఎరుగుదును; ఈ+వనజభవుండు= ఈ బ్రహ్మ (వనజము= పద్మం); జగములు+ఇన్నిటికిన్= ఈ జగత్తులు అన్నింటికీ; గురుండు= గురువు(తండ్రి); ఏ విధిన్= ఏ కర్తవ్యాన్ని; పనిచినన్= ఆజ్ఞాపించినా; అది; శ్రుతి= వేదాలలో; భావిత= ప్రతిపాదింపబడిన; కర్మంబు= పనే (అయి ఉంటుంది); దానన్= ఆ వేదంలోనే; తగఁగన్= తగినట్టు; పరఁగుదున్= నేనూ ఉంటాను (దానన్ అంటే ఆ ఆజ్ఞలోనే అనీ చెప్పవచ్చును).

**తాత్పర్యం:** 'దేవతలారా! మునులారా! మీరు వచ్చిన పని ఏమిటో నేను ఎరుగుదును. ఈ బ్రహ్మదేవుడు ముజ్జగాలకూ గురువు (సృష్టికర్త, తండ్రి). ఈయన ఏ కర్తవ్యాన్ని నిర్ణయించినా అది వేదప్రతిపాదితమే. నేనూ అందులోనే చరిస్తాను.

**వ. ఏనునుం జెప్పెద వినుండు వేదహితం బగు నొక్క యాగంబు సేయుం డందు భాగంబు నాకుం గల్పింపవలయు' ననిన వారుం బ్రీతిఁ బొంది. 406**

**ప్రతిపదార్థం:** ఏనునున్= నేనుకూడా; చెప్పెదన్= చెబుతాను; వినుండు= ఆలకించండి; వేదహితంబు+అగు= వేదవిహితమైన (వేదాలకు హితమైన); ఒక్క= ఒకానొక; యాగంబు= యజ్ఞం; చేయుండు= చెయ్యండి; అందున్= ఆ యాగంలో; నాకున్= నాకు; భాగంబు= భాగం; కల్పింపన్+వలయున్= కల్పించాలి; అనినన్= అని ఆకాశంలో ఒక కంఠం వినిపించేసరికి; వారున్= వారందరూ; ప్రీతిన్= సంతోషాన్ని; పొంది= పొంది;

**తాత్పర్యం:** నేను కూడా చెప్పుతాను వినండి. వేదవిహితమైన యజ్ఞం చెయ్యండి. ఆ యాగంలో నాకు భాగం కల్పించాలి' అని ఆకాశంలో ఒక కంఠం వినిపించే సరికి వారందరూ సంతసించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కమలజు పంచిన క్రియ యా । గము వైష్ణవ మనఁగఁ జేసి, కల్పించిరి భా**
**గము విష్ణున కం, దతఁ డ । య్యమరుల మునివరులపై దయను గగనమునన్. 407**

**ప్రతిపదార్థం:** కమలజు= పద్మసంభవుడైన బ్రహ్మదేవుడియొక్క; పంచిన= ఆజ్ఞాపించిన; క్రియన్= విధంగా (బ్రహ్మ ఆజ్ఞాపించినట్టు); వైష్ణవము+అనఁగన్= వైష్ణవం అనేటటువంటి; యాగము= యజ్ఞం; చేసి= నిర్వహించి; అందున్= ఆ యాగంలో; విష్ణునకున్= విష్ణుమూర్తికి; భాగము= భాగం; కల్పించిరి= కల్పించారు; అతఁడు= ఆ విష్ణుమూర్తి; ఆ+అమరుల= ఆ దేవతల; మునివరుల= మహర్షుల; పైన్= పైని; దయను= కృపతో; గగనమునన్= ఆకాశంలో.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించిన విధంగా 'వైష్ణవం' అనే యజ్ఞం చేసి దేవతలూ, మునులూ అందులో విష్ణుమూర్తికి భాగం కల్పించారు. దానికి సంతోషించి ఆ విష్ణుమూర్తి వారిపై దయతో ఆకాశంలో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అదృశ్యుండై నిలిచి వారలతో నిట్లనియె. 408**

**ప్రతిపదార్థం:** అదృశ్యుండు+ఐ= కంటికి కనబడకుండా; నిలిచి= ఆకాశంలో నిలబడి; వారలతోన్= బ్రహ్మాదిదేవతలతో, ఋషులతో; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అదృశ్యరూపంలో ఆకాశంనుండి బ్రహ్మాదిదేవతలతో విష్ణుమూర్తి ఈ విధంగా అన్నాడు:

**క. నా పంపునను బ్రవృత్తి । వ్యాపకయైనట్టి సత్క్రియం జేసితి రి**
**ట్లీ పుణ్యంబునకును ఫల । రూపంబగుదాని నే నిరూపింతుఁ దగన్. 409**

**ప్రతిపదార్థం:** నా= నాయొక్క; పంపునను= ఆజ్ఞతో; ప్రవృత్తి వ్యాపక+ఐనట్టి= విస్తరించి జరిగినటువంటి; సత్క్రియన్= మంచిపనిని (సత్కార్యాన్ని); చేసితిరి= చేశారు; ఇట్లు= ఇట్లా చేసినటువంటి; ఈ పుణ్యంబునకున్= ఈ సుకృతానికి; ఫలరూపంబు+అగుదానిన్= ప్రతిఫలమైనదాన్ని; నేన్= నేను; తగన్= తగినట్టు; నిరూపింతున్= మీకు నిర్ణయిస్తాను.

**తాత్పర్యం:** మహర్షులారా! నా ఆజ్ఞమేరకు విస్తరించే ప్రవృత్తి కలిగిన ఒక మంచిపనిని చేశారు. ఇట్లా చేసిన ఈ పుణ్యానికి ఫలితాన్ని తగినట్లు మీకు నేను నిర్ణయిస్తాను.

**వ. మరీచి యంగిరసుం డత్రి పులస్త్యుండు పులహుండు క్రతువు వసిష్ఠుఁడను వీర లవ్వారిజభవునకు మానసపుత్రు లిమ్మహాత్ములు నట్టివార; వేదాచార్యులు యజ్ఞకార్యధుర్యులు; వీరు విధింప సర్వయజ్ఞంబులును మానవులు మాననీయంబులుగా నడప మీ కెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల నాప్యాయితులై యుపబృంహణంబు నొందువారలు సన సనక సనందన సనాతన కపిల సనత్కుమారులు**

**పరమేష్ఠిమనోనిర్మితులు సహజజ్ఞాన విజ్ఞానులు నివృత్తిపరులునై సాంఖ్యయోగంబులకుం బ్రవర్తకు లగుచుండుదురు. వీరలచేత మోక్షధర్మంబులు సువ్యంజితంబు లగు. మీకుం దల్లియుం దండ్రియు గురుండును నివ్విరించియ. మదీయానుశాసనంబున నితండు సర్వానుశాసకుండై వర్తిల్లువాఁడు. మత్ఫాలప్రభవుండైన రుద్రుండు సర్వలోకారాధనీయుండును సకలవరప్రదుండునుం జుండీ! మీరు వొండు ; వేదోదితకర్మంబు లిక్కమలభవుండును మరీచ్యాది ప్రజాపతులునుం బంచినట్లు నడవం గలయవి. యిది కృతయుగం బను పేరింటి యుత్తమకాలంబు; దీనియందుఁ బశువులు హింస్యంబులు గావు సంశయంబు వలవదని నిర్దేశించిన.**

**410**

**ప్రతిపదార్థం:** మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు - అను వీరలు= అనే వీరంతా; ఆ+వారిజభవునకున్= ఆ బ్రహ్మకు; మానసపుత్రులు= మనస్సు నుండి ప్రభవించిన కుమారులు; ఈ+మహాత్ములున్= ఈ మహానుభావులందరూ కూడా; అట్టివారు+అ= అంతటివారే (బ్రహ్మతో సమానులు); వేద+ఆచార్యులు= వీరు వేదాలకు గురువులు; యజ్ఞకార్య= యజ్ఞకృత్యాలకు; ధుర్యులు= నిర్వాహకులు; వీరు= ఈ మరీచి ప్రభృతులు; విధింపన్= నియమాలు చేయగా; సర్వ యజ్ఞంబులును= అన్ని యజ్ఞాలూ; మానవులు= మనుష్యులు; మాననీయంబులుగాన్= గౌరవింపదగినవిగా; నడపన్= నిర్వహించగా; మీకున్= మీకు; ఎల్లను= అందరికీ; ఆ+యాగంబులన్= ఆ యజ్ఞాలలో; భాగంబులు= భాగాలు; కలిగి= లభించి; తద్+భాగంబులన్= ఆ భాగాలతో; ఆప్యాయితులై= తృప్తిపొందినవారై; ఉపబృంహణంబున్= వృద్ధిని; ఒందువారలు= మీరంతా పొందుతారు; సన, సనక, సనందన, సనాతన, కపిల, సనత్కుమారులు= సనుడు, సనకుడు, సనందనుడు, సనాతనుడు, కపిలుడు, సనత్కుమారుడు - అనే వీరు; పరమేష్ఠి= బ్రహ్మయొక్క; మనః= మనస్సుచేత; నిర్మితులు= సృష్టింపబడినవారు (సంకల్పమాత్ర సంభవులు); సహజ= జన్మసిద్ధంగానే; జ్ఞానవిజ్ఞానులు= జ్ఞానవిజ్ఞానాలు కలవారు; నివృత్తిపరులునై= ముక్తి పరాయణులూ అయి (ప్రవృత్తి= విస్తరించటం; నివృత్తి= మరలటం); సాంఖ్యయోగంబులకున్= సాంఖ్యానికీ, యోగానికీ; ప్రవర్తకులు+అగుచుండుదురు= ప్రచారకులు అవుతుంటారు; వీరలచేతన్= వీరిచే; మోక్షధర్మంబులు= ముక్తికి సంబంధించిన ధర్మాలు; సువ్యంజితంబులు+అగున్= స్పష్టం చేయబడతాయి; మీకున్= మీకందరికీ; తల్లియున్= తల్లీ; తండ్రియున్= తండ్రీ; గురుండున్= గురువూ; ఈ+విరించి+అ= ఈ బ్రహ్మదేవుడే; మదీయ= నాయొక్క; అనుశాసనంబునన్= ఆజ్ఞతో; ఇతండు= ఈ బ్రహ్మ; సర్వ+అనుశాసకుండై= సమస్తాన్నీ శాసించేవాడై; వర్తిల్లువాఁడు= వర్తిస్తాడు; మత్= నాయొక్క; ఫాల= నుదుటినుంచి; ప్రభవుండైన= పుట్టినవాడైన; రుద్రుండు= శివుడు; సర్వలోక= సమస్తలోకాలకూ; ఆరాధనీయుండును= పూజింపదగినవాడూ; సకల= సమస్తమైన; వర= వరాలనూ; ప్రదుండునున్= ఇచ్చేవాడూ; చుండీ!= సుమా!; మీరు+పొండు= ఇంక మీరు వెళ్ళండి; వేద+ఉదిత= వేదాలలో చెప్పబడిన; కర్మంబులు= పనులు; ఈ+కమలభవుండును= ఈ బ్రహ్మదేవుడూ; మరీచి+ఆది+ప్రజాపతులునున్= మరీచి మొదలైన ప్రజాపతులూ (బ్రహ్మతుల్యులు అన్నాడు కనక ప్రజాపతులే); పంచినట్లు= ఆజ్ఞాపించినట్టుగా; నడవన్+కలయవి= నడుస్తాయి; ఇది= ఇప్పుడిది; కృతయుగంబు అను+పేరిట= కృతయుగం అనే పేరుగల; ఉత్తమకాలంబు= ఉత్తమమైన కాలం; దీనియందున్= ఈ యుగంలో; పశువులు= జంతువులు; హింస్యంబులు= హింసించదగినవి (యజ్ఞాలలో పశుబలి); కావు= కాదు; సంశయంబు+వలవదు= సందేహం వద్దు; అని; నిర్దేశించినన్= ఆజ్ఞాపించేసరికి.

**తాత్పర్యం:** మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు - అనే బ్రహ్మమానసపుత్రులూ, ఈ మహాత్ములూ సమానులే. వీరు వేదపండితులు, యజ్ఞకార్య నిర్వాహకులు. వేదం నిర్దేశించగా మానవులు యజ్ఞాలన్నీ గౌరవంగా నిర్వహించి మీకందరికీ హవిర్భాగాలు కల్పించగా వాటిని మీరు గ్రహించి తృప్తిపడి అభివృద్ధి పొందండి. సన, సనక, సనందన, సనాతన, కపిల, సనత్కుమారులు బ్రహ్మ మానసపుత్రులు. వారు సహజజ్ఞానులు. ముముక్షువులు అయి సాంఖ్యయోగ మార్గాలను ప్రవర్తింప చేస్తారు. వీరిచేత మోక్షధర్మాలు స్పష్టమౌతాయి. మీకు తల్లీ, తండ్రీ, గురువు ఈ బ్రహ్మయే. నా ఆజ్ఞచేత బ్రహ్మ సర్వశాసకుడిగా ఉంటాడు. నా నుదురునుండి పుట్టిన

రుద్రుడు లోకాలన్నింట పూజించదగినవాడు, వరాల నిచ్చేవాడు సుమా! ఇక మీరు వెళ్ళండి. ఈ బ్రహ్మదేవుడూ, మరీచి మొదలైన ప్రజాపతులూ ఆజ్ఞాపించినట్లు నడుచుకొనండి. ఇప్పుడు ఉత్తమకాలమైన కృతయుగం. దీనిలో పశువులను చంపకూడదు. అనుమానం వద్దు' అని ఆదేశించగా.

**క. మునులును సురలును విష్ణు । న్వినుతించి నమస్కరించి నిజపదములకుం**
**జనిరి పరమేష్ఠి యొకరుఁడ । చన కచ్చట నిలిచె హరియు సన్నిహితుండై. 411**

**ప్రతిపదార్థం:** మునులునున్= మహర్షులూ; సురలునున్= దేవతలూ; విష్ణున్= విష్ణుమూర్తిని; వినుతించి= స్తుతించి; నమస్కరించి= మ్రొక్కి; నిజపదములకున్= తమ తమ స్థానాలకు (నెలవులకు); చనిరి= వెళ్ళిపోయారు; పరమేష్ఠి= బ్రహ్మ; ఒకరుఁడు+అ= ఒక్కడే; చనక= వెళ్ళకుండా; అచ్చటన్= అక్కడ; నిలిచెన్= నిలబడ్డాడు; హరియున్= విష్ణుమూర్తికూడా; సన్నిహితుండు+ఐ= బ్రహ్మదేవుడి చేరువకు వచ్చి -

**తాత్పర్యం:** విష్ణుమూర్తి ఆజ్ఞను శిరసావహించి మునులూ, దేవతలూ నుతించి, నతించి ఎవరి నెలవులకు వారు వెళ్ళిపోయారు. బ్రహ్మ ఒక్కడే వెళ్ళకుండా అక్కడే నిలబడ్డాడు. అప్పుడు విష్ణుమూర్తి ఆయన సమీపానికి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. హయశిరోభాసితుండును హస్తకలిత । లలిత దండకమండలూజ్జ్వలుఁడు సాంగ**
**వేదముఖరముఖుండునై యాదరార్ద్ర । దృష్టి నిగుడంగ నిలిచి యద్దివిజముఖ్యు. 412**

**ప్రతిపదార్థం:** హయశిరః= గుర్రపు తలతో; భాసితుండునున్= ప్రకాశిస్తున్నవాడూ (హయగ్రీవుడు); హస్త= చేతిలో; కలిత= ధరించిన (అలరారుతున్న); లలిత= (సుకుమారమైన) అందమైన; దండ= దండమూ; కమండలు= కమండలువు-వీటితో; ఉజ్జ్వలుండున్= ప్రకాశిస్తున్నవాడూ; స+అంగ= ఛందోజ్యోతిషాది షడంగాలతో కూడిన; వేద= వేదంతో; ముఖర= మారుమ్రోగుతున్న; ముఖుండును= వదనంకలవాడు; ఐ= అయి; ఆదర+ఆర్ద్ర+దృష్టి= ఆదరంతో (ప్రేమతో); చెమ్మగిల్లిన చూపు; నిగుడంగన్= ప్రసరించగా; నిలిచి= చేరువలో నిలిచి; ఆ+దివిజముఖ్యున్= దేవతలలో ముఖ్యుడయిన ఆ బ్రహ్మను (కౌగిలించుకొని).

**తాత్పర్యం:** విష్ణుమూర్తి హయగ్రీవుడుగా దర్శనమిచ్చాడు. చేతులలో దండకమండలువులు భాసిస్తున్నాయి. సాంగంగా వేదధ్వని ముఖంలో మారుమ్రోగుతున్నది. ఆదరంతో నిండి చెమ్మగిల్లిన కన్నులతో చూస్తూ బ్రహ్మను. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. కౌఁగిలించుకొని నీవు సర్వంబునకును విధాతవు గురుండవు ప్రభువవు నయి నడపుము. నీయందు సర్వభారంబునుం బెట్టి సుఖినై యుండెద. నడపుట నీకెప్పుడేనిఁ గడిందియై తోఁచె నప్పు డేను దోఁచి సమస్తంబును సునీతంబు సేయంగలవాఁడ ననియెఁ దదనంతరం బావిష్ణుం డంతర్హితుం డయ్యె. నిట్లు యజ్ఞంబు లందగ్రభాగార్హుండును యజ్ఞధారియునైన యప్పద్మనాభుండు ప్రవృత్తిధర్మంబు బ్రహ్మాదులకుం గృత్యంబుసేసి నివృత్తి ధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండునునై సర్వగతుం డగుచుఁ జరియించు నని చెప్పి యప్పారాశర్యుండు. 413**

**ప్రతిపదార్థం:** కౌఁగిలించుకొని= బ్రహ్మను ఆలింగనం చేసికొని; నీవు; సర్వంబునకునున్= సమస్తానికీ (యజ్ఞాలు అన్నింటికీ); విధాతవు= సృష్టికర్తవూ; గురుండవు= గురువువు; ప్రభువవు= అధికారివీ; అయి; నడపుము= నడిపించుము; నీయందున్= నీమీద; సర్వభారంబునున్= సమస్తభారాన్నీ (మొత్తం బాధ్యతల బరువునంతటినీ); పెట్టి= ఉంచి; సుఖినై= నేను సుఖిగా; ఉండెదన్=

ఉంటాను; నడపుట= ఈ కార్యభారాన్ని సాగించటం; నీకున్= నీకు; ఎప్పుడేనిన్= ఎప్పుడయినా; కడిందియై= కష్టమై; తోఁచెన్= తోస్తే (కష్టమనిపిస్తే); అప్పుడు; ఏనున్= నేను; తోఁచి= ప్రత్యక్షమై; సమస్తంబునున్= అంతటినీ; సునీతంబు= బాగా నడప బడినదిగా; చేయంగలవాఁడన్= చేస్తాను; అనియెన్= అన్నాడు విష్ణుమూర్తి; తద్+అనంతరంబు= ఆ తరువాత; ఆ+విష్ణుండు= ఆ విష్ణుమూర్తి; అంతర్హితుండు+అయ్యెన్= అంతర్ధానం చెందాడు; ఇట్లు; యజ్ఞంబులందున్= యాగాలలో; అగ్రభాగ+అర్హుండున్= అగ్రస్థాన గౌరవానికి యోగ్యుడూ (అగ్రతాంబూలం అందుకుంటూ); యజ్ఞధారియున్+ఐన= యజ్ఞాలను ధరించేవాడూ అయిన; ఆ+పద్మనాభుండు= ఆ విష్ణుమూర్తి (పద్మం నాభియందు కలవాడు); ప్రవృత్తి ధర్మంబు= క్రియాశీలమైన ప్రవృత్తిధర్మాన్ని (కర్మాచరణమే ప్రవృత్తి); బ్రహ్మాదులకున్= బ్రహ్మాదిదేవతలకూ, ఋషులకూ; కృత్యంబు+చేసి= కర్తవ్యంగా ఏర్పరిచి; నివృత్తి ధర్మంబునందు= (నిష్క్రియారూపమై అంతర్ముఖలక్షణమైన) నివృత్తిధర్మంలో; నిష్ఠుండునూ= (స్థిరపడినవాడూ) నిష్ఠ కలవాడూ; విద్యా+సహాయుండునున్= జ్ఞానమే సహాయంగా కలవాడూ; ఐ= అయి; సర్వగతుండు అగుచున్= అన్నింటా ఉన్న వాడవుతూ (సర్వత్ర నివసిస్తూ); చరియించున్= సంచరిస్తూ ఉంటాడు; అని చెప్పి= అని వివరించి; ఆ+పారాశర్యుండు= ఆ వ్యాసుడు - ఇంకా ఇట్లా అంటున్నాడు. (అగ్రభాగ+హరుండు= ప్రథమభాగం లేదా ఉత్తమభాగం అందుకొనేవాడు - అని పాఠాంతరం.)

**తాత్పర్యం:** బ్రహ్మను ఆలింగనం చేసికొని, 'నీవు యజ్ఞాల కన్నిటికీ సృష్టికర్తవు, గురువువు, అధికారివీ అయి నడిపించుము. నీమీద భారమంతా ఉంచి సుఖంగా ఉంటాను. నీ కెప్పుడైనా కష్టమనిపిస్తే నేను ప్రత్యక్షమై అన్నీ నడిపిస్తాను' - అని చెప్పి విష్ణువు అంతర్ధాన మయ్యాడు. ఇట్లా యజ్ఞాలలో అగ్రభాగానికి యోగ్యుడూ, యజ్ఞధారీ అయిన ఆ విష్ణువు కూడా జ్ఞానకారకుడై, అన్నిటా ఉన్నవాడై ప్రవర్తిల్లుతూ ఉంటాడు' అని చెప్పి ఆ వ్యాసుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **మొదలఁ గలిగించి జగములఁ । బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తనయం**
**దొదిఁగించి మఱియు నెమ్మెయి । నుదారగతి నడపు చిన్మయుని గొలుతు హరిన్.** **414**

**ప్రతిపదార్థం:** జగములన్= లోకాలను; మొదలన్= ముందుగా; కలిగించి= సృష్టించి; పదిలంబుగన్= జాగ్రత్తగా; ఉనిచి= ఉంచి (పోషించి); వానిన్= ఆ లోకాలను; పదపడి= ఆ తరువాత; తనయందున్= తనలో; ఒదిఁగించి= లీనం చేసికొని; మఱియున్= ఇంకా; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; ఉదారగతిన్= ఉదారమైన పద్ధతిలో; నడపు= నిర్వహించే; చిన్మయునిన్= జ్ఞానమయ స్వరూపుడైన; హరిన్= విష్ణుమూర్తిని; కొలుతున్= (సేవిస్తాను) సేవిస్తున్నాను.

**తాత్పర్యం:** లోకాలను సృష్టించి, పోషించి, కట్టకడపటికి వాటిని తనలోనే లీనం చేసికొని అన్నివిధాలా ఉదారంగా నడిపించే జ్ఞానమయుడు విష్ణుమూర్తి. ఆ దేవుడిని నేను సేవించుకొంటున్నాను.

**ఆ.** **అజుని విశ్వరూపు నమరుని సర్వామ । రాధినాథు నాద్యు సాంగవేద**
**వేదితవ్యు నాత్మవేద్యు నీశాను న । వ్యయుఁ దపఃఫలాత్ము నాశ్రయింతు.** **415**

**ప్రతిపదార్థం:** అజునిన్= పుట్టుకలేని వాడినీ; విశ్వరూపున్= విశ్వస్వరూపుడినీ; అమరునిన్= మృతిలేనివాడినీ (శాశ్వతుడు); సర్వ+అమర+అధినాథున్= సకలదేవతలకూ నాయకుడినీ; ఆద్యున్= తొట్టతొలివాడినీ; సాంగవేద= షడంగసహితాలైన వేదాలతో; వేదితవ్యున్= తెలుసుకోదగినవాడినీ; ఆత్మవేద్యున్= ఆత్మతోమాత్రమే తెలియదగినవాడినీ; ఈశానున్= ఈశ్వరుడినీ; అవ్యయున్= వ్యయంలేనివాడినీ (మార్పులేనివాడు లేదా వినాశం లేనివాడు); తపః= తపస్సులకు; ఫల+ఆత్మున్= ఫలస్వరూపమైనవాడూ - అయిన శ్రీ మహావిష్ణుమూర్తిని; ఆశ్రయింతున్= ఆశ్రయిస్తున్నాను (శరణు వేడుతున్నాను).

**తాత్పర్యం:** అజ, విశ్వరూప, అమర, అమరాధినాథ, ఆద్య, వేదవేద్య, ఆత్మవేద్య, ఈశాన, అవ్యయ, తపఃఫలాత్మ అనే విశేషణాలు ఆయా లక్షణాలను బట్టి విష్ణుమూర్తికి ఏర్పడ్డాయి. ఏవంవిధ లక్షణలక్షితుడైన ఆ దేవదేవుడిని సేవించుకొంటున్నాను.

**వ. అని మఱియు ననేకప్రకారంబుల నప్పరమముని యప్పుడు భావంబున నెలకొన్న నారాయణుం బ్రస్తుతించి మమ్ముం గలయ నవలోకించి పూర్వవృత్తాంతంబు ప్రజ్ఞాదృష్టిని నా కన్నయది మీ కెఱింగించితి విష్ణుని దివ్యవచనంబుల చొప్పున నడచునది. యప్పరమేశ్వరుం గొలువుండు; వేదవాక్యంబులం దత్ప్రకీర్తనంబు సేయుం డనియె; నేము నట్లకాక యని ఋగ్యజుస్సామంబుల నా త్రిధాముం బ్రస్తుతించి మనంబుల నారాధించితి' మని చెప్పి వైశంపాయనుండు వెండియు. 416**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; మఱియున్= ఇంకా; అనేకప్రకారంబులన్= చాలా విధాలుగా; ఆ+పరముని= ఆ దివ్యర్షి వ్యాసుడు; అప్పుడు= ఆ సమయంలో; భావంబునన్= హృదయంలో; నెలకొన్న= నివసిస్తున్న (నెలవు+కొను= నెలకొను); నారాయణున్= శ్రీమహావిష్ణుమూర్తిని; ప్రస్తుతించి= బాగా స్తుతించి; మమ్మున్= శిష్యులమైన మమ్ములను; (వైశంపాయన పైల సుమంతు ప్రభృతులను); కలయన్+అవలోకించి= పరిశీలనగా చూచి; పూర్వవృత్తాంతంబు= కడచిన కథను; ప్రజ్ఞాదృష్టిని= దివ్యదృష్టితో (తెలివి అనే చూపుతో); నా+కన్న+అది= నేను చూచినది; మీకున్= మీకు; ఎఱింగించితిన్= తెలియజేశాను; విష్ణుని= విష్ణుమూర్తి చెప్పినటువంటి; దివ్యవచనంబుల+చొప్పునన్= దివ్యమైన వాక్కుల ప్రకారం; నడచునది= వర్తించండి; ఆ+పరమేశ్వరున్= ఆ పరమేశ్వరుడిని; కొలువుండు= సేవించండి; వేదవాక్యంబులన్= వేదమంత్రాలతో; తద్= ఆ స్వామియొక్క; ప్రకీర్తనంబు= సంస్తుతి; చేయుండు= చేయండి; అనియెన్= అని చెప్పాడు వ్యాసుడు; ఏమున్= మేముకూడా; అట్లకాక= అట్లాగే; అని; ఋక్+యజుస్+సామంబులన్= మూడు వేదాలతోనూ; ఆ+త్రిధామున్= ఆ విష్ణుమూర్తిని; ప్రస్తుతించి= బాగా స్తుతించి; మనంబులన్= మనస్సులలో; ఆరాధించితిమి= పూజించాము; అని చెప్పి= అని పలికి; వైశంపాయనుండు= ఆ వైశంపాయనమహర్షి; వెండియున్= తిరిగి ఇలా అంటున్నాడు:

**తాత్పర్యం:** అని, ఇంకా పెక్కు విధాలుగా వ్యాసుడు భావనాపథంలో నిలిచిన నారాయణుడిని కీర్తించి, మమ్ముల నందరినీ తేరిపారచూచి, 'దివ్యదృష్టితో నేను చూచిన పూర్వవృత్తాంతం మీకు తెలియజెప్పాను. విష్ణుదేవుడి దివ్య వచనాల నాశ్రయించి ముందుకు నడవండి. పరమేశ్వరుడు కొలువుండే వేదవాక్యాలను గానం చేయండి.' అన్నాడు. 'అట్లాగే చేస్తా' మని మేము ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదంలో నివసించే విష్ణువును స్తుతించాము' అని చెప్పి వ్యాసుడు మళ్ళీ (ఇట్లా అన్నాడు).

**సీ. సర్వజ్ఞుఁడగు పరాశరనందనుని చేత । భాషితంబైన యప్పరమపుణ్య**
**వృత్తంబు సదివిన విన్నను విప్రుండు । వేదవేదియు, రాజు విజయశాలి**
**యును, వణిజుండు లాభోపేతుఁడును, శూద్రుఁ । డత్యంతసుఖియును నగు నరేంద్ర!**
**కన్య సద్వరకరగ్రహణంబు వడయు, గ । ర్భిణియైన కాంత సద్గుణునిఁ బుత్రుఁ**

**ఆ. గాంచుఁ, బ్రసవకాలకలయందు నెఱి దప్పి । యున్న బిడ్డగలుగునువిద సుఖక**
**రప్రసూతి నిర్భరతనొందు, వంధ్య సం । తానసిద్ధి సమ్మదంబు నొందు. 417**

**ప్రతిపదార్థం:** సర్వజ్ఞుఁడు= సమస్తమూ తెలిసినవాడైన; పరాశరనందనునిచేతన్= వ్యాసునిచే; భాషితంబైన= చెప్పబడిన; ఈ+పరమపుణ్య వృత్తంబు= మిక్కిలి పావనమైన ఈ కథను; చదివినన్= చదివినా; విన్ననున్= విన్నా; విప్రుండు= బ్రాహ్మణుడు;

వేదవేదియున్= వేదాలను తెలిసికొన్నవాడూ; రాజు= క్షత్రియుడు; విజయశాలియునున్= విజయవంతుడూ; వణిజుండు= వ్యాపారస్థుడు; లాభ+ఉపేతుఁడునున్= అధికలాభాలు పొందేవాడూ; శూద్రుఁడు= నాల్గవజాతివ్యక్తి; అత్యంత సుఖియునున్= మిక్కిలి సుఖాలు పొందేవాడూ; అగున్= అవుతాడు; నరేంద్ర= జనమేజయా!; కన్య= కన్య ఎవరయినా ఇది చదివినా, విన్నా; సత్+వర= ఉత్తమవరుడియొక్క; కరగ్రహణంబు= పాణిగ్రహణం (వివాహం); పడయున్= పొందుతుంది; గర్భిణియైన+కాంత= గర్భిణీస్త్రీ అయితే; సద్గుణునిన్= మంచి గుణవంతుడైన; పుత్రున్= తనయుడిని; కాంచున్= ప్రసవిస్తుంది; ప్రసవకాల+కలయందున్= ప్రసవించే ముహూర్తంలో ఈ కథ వింటే (కళ= ముప్పది కాష్ఠలకాలం); నెటిదప్పియున్న బిడ్డ గలుగు నువిద= గర్భకోశంలో ఉండవలసిన తీరును తప్పి ఉన్న శిశువును ధరించిన స్త్రీ (గర్భంలో బిడ్డ అడ్డంతిరిగితే); సుఖకరప్రసూతి నిర్భరతన్= సుఖంగా ప్రసవించే స్థితిని; ఒందున్= పొందుతుంది (సుఖప్రసవం అవుతుంది - అని); వంధ్య= గొడ్రాలు; సంతానసిద్ధి= సంతానప్రాప్తి వలన కలిగే; సమ్మదంబున్= సంతోషాన్ని; ఒందున్= పొందుతుంది (గొడ్రాలు కూడా సంతానవతి అవుతుందని ఈ కథ విన్నా చదివినా అని).

**తాత్పర్యం:** వ్యాసుడు మాకందరికీ చెప్పిన ఈ పవిత్రకథను విన్నా, చదివినా విప్రుడు వేదవేత్త అవుతాడు. రాజు విజయశాలి అవుతాడు. వ్యాపారి అధికలాభాలు పొందుతాడు. శూద్రుడు సుఖాలు పొందుతాడు. కన్యకు మంచి వరుడు దొరుకుతాడు. గర్భిణీస్త్రీకి గుణవంతుడైన కొడుకు పుట్టుతాడు. గర్భకోశంలో బిడ్డ అడ్డం తిరిగి ఉన్న స్త్రీకయితే సుఖంగా ప్రసవం అవుతుంది. గొడ్రాలు సంతానవతి అవుతుంది. అంత పరమపావనమైనది ఈ కథ' అని వైశంపాయనుడు ఫలశ్రుతి చెప్పాడు.

**విశేషం:** నెటి దప్పియున్న బిడ్డ గలుగునువిద - ప్రసవకాల కళయందున్ - సుఖకర ప్రసూతి నిర్భరతన్ - ఒందున్ అనే దానికి సంస్కృతమూలం ఇట్లా ఉన్నది: **"లగ్నగర్భా విముచ్యేత గర్భిణీ జనయేత్సుతమ్."**

### భగవన్నామ నిర్వచన ప్రకారము (సం. 12-328-3)

**వ. ' మఱియు నెవ్విధంబు మనోరథంబులైనను సఫలంబు లను ననిన విని జనమేజయుండు 'గూఢంబు లగు విష్ణునామంబు లనిర్వచనంబులు వినవలతు వివరింపవే' యనుటయు వైశంపాయనుం డమ్మహీ నాయకులతో నర్జునుం డడుగం గృష్ణుండు వివరించిన నిజనామంబుల నిరుక్తి తెఱంగెఱింగించెద నాకర్ణింపు మప్పార్థుని బోధించుటకై యద్దేవుం డిట్లనియె. 418**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఏ+విధంబు= ఏ రకమైన; మనోరథంబులైనను= కోరికలైనా; సఫలంబులు+అగున్= ఫలిస్తాయి; అనినన్= అని చెబితే; విని; జనమేజయుండు= ఆ జనమేజయుడు; గూఢంబులు+అగు= రహస్యాలైన; విష్ణు నామంబులు= విష్ణుమూర్తి నామధేయాలు; అనిర్వచనంబులు= నిర్వచనాలకు లొంగేవి కావు; వినన్+వలతున్= వినాలి అని కోరు కుంటున్నాను; వివరింపవే= దయచేసి వివరించవా?; అనుటయును= అనటంతోనే; వైశంపాయనుండు= వైశంపాయనుడు (ఇలా చెబుతున్నాడు); అర్జునుండు= కిరీటి; అడుగన్= అడిగినప్పుడు; ఆ+మహీ+నాయకులతోన్= ఆ పాండవులకు(తో); కృష్ణుండు= శ్రీకృష్ణపరమాత్మ; వివరించిన= వివరించి చెప్పినటువంటి; నిజనామంబుల= తన నామధేయాల; నిరుక్తి= నిర్వచనంయొక్క; తెఱంగున్= పద్ధతిని; ఎఱింగించెదన్= నీకు తెలియజెపుతాను; ఆకర్ణింపుము= వినుము; ఆ+పార్థునిన్= ఆ అర్జునుడిని; బోధించుటకై= జ్ఞానవంతుడిని చెయ్యటంకోసం; ఆ+దేవుండు= ఆ శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'ఇంకా ఎటువంటి కోరికలైనా ఫలిస్తాయి' - అనగా విని జనమేజయుడు 'గూఢములైన విష్ణువు నామాలు నిర్వచనాలకు లొంగేవికావు. అయినా వాటిని వినాలని ఉన్నది. చెప్పుము' అనగా వైశంపాయనుడు జనమేజయుడితో - 'ఇదే ప్రశ్నను అర్జునుడు అడుగగా విష్ణువు తన నామాలను నిర్వచించిన విధం చెప్పుతాను వినుము' అని ఇట్లా అన్నాడు.

**తే.** **' నరుఁడు నారాయణుండు ననంగఁ బరఁగు । నిత్యపురుషులు నీవును నేనుఁ జుమ్ము,**
**భువనహిత మాచరింపఁగాఁ బూని వేడ్క । వచ్చి యిమ్మహిఁ బుట్టినవార మనఘ! 419**

**ప్రతిపదార్థం:** అనఘ!= పావనుడా! అర్జునా!; నరుఁడున్= నరుడూ; నారాయణుండున్= నారాయణుడూ; అనంగన్= అని; పరఁగు= ఒప్పే; నిత్యపురుషులు= సదాతన పురుషులు; నీవునున్= నీవూ; నేనున్= నేనూ; భువన= లోకాలకు; హితము= మేలు; ఆచరింపఁగాన్= చెయ్యటంకోసం; పూని= పూనుకొని; వేడ్కన్= వేడుకగా (లీలావిలాసంగా); వచ్చి= అవతరించి; ఈ+మహిన్= ఈ భూలోకంలో; పుట్టినవారము= మనం ఇద్దరమూ జన్మించాం. చుమ్ము= సుమా!;

**తాత్పర్యం:** 'పావనా! అర్జునా! నీవూ నేనూ - నరుడూ నారాయణుడూ అనే నిత్యపురుషులం. లోకహితం కోరి ఈ భూలోకంలో ఇట్లా జన్మించాం సుమా!

**వ.** **గూఢంబులగు మదీయాభిధానంబుల యర్థంబులు దేటపఱిచెద నాకర్ణింపుము. 420**

**ప్రతిపదార్థం:** గూఢంబులు+అగు= అతి నిగూఢాలైన; మదీయ= నాయొక్క; అభిధానంబుల= నామధేయాల; అర్థంబులు= అర్థాలు; తేటపఱిచెదన్= నీకు విశదపరుస్తాను; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** అతి నిగూఢాలైన నా నామధేయాల అర్థాలు నీకు విశదపరుస్తాను. ఆలకించుము.

**క.** **నారము లనఁగా జలముల । పే రయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్**
**నారము లయనం బగుటను । నారాయణుఁ డండ్రు జనులు నన్నుఁ గిరీటీ! 421**

**ప్రతిపదార్థం:** కిరీటీ!= అర్జునా!; నారములు+అనఁగాన్= నారములు అంటే; జలముల+పేరు= నీటికి పర్యాయపదం (పేరు); అయనంబు+అనఁగన్= అయనము అంటే; నెలవు= స్థానం అని అర్థం; ప్రీతిగన్= ఇష్టంగా; నాకున్= నాకు; నారములు= నీళ్ళు; అయనంబు= నివాసస్థానం; అగుటను= అవ్వటంవలన; నన్నున్= నన్ను; జనులు= ప్రజలు; నారాయణుఁడు+అండ్రు= నారాయణుడు అంటారు.

**తాత్పర్యం:** అర్జునా! నారములు అంటే నీళ్ళు. అయనము అంటే నివాసం. నాకు నారములు అయనం కాబట్టి (నార+అయన - నార మయనం యస్య సః - నారాయణః) నన్ను ప్రజలంతా నారాయణుడు అంటారు.

**క.** **వసియింతు నే జగములన్ । వసియించున్ జగములెల్ల నాయం దిమ్మై**
**పొసఁగి వెలుంగుచునుండుట । నసదృశగుణ! వాసుదేవుఁ డనఁగఁ బరఁగుదున్. 422**

**ప్రతిపదార్థం:** అసదృశగుణ!= సాటిలేని సద్గుణాలు కలవాడా!; ఏన్= నేను; జగములన్= జగత్తులలో; వసియింతున్= నివసిస్తూంటాను; జగములు+ఎల్లన్= జగత్తులన్నీ; నాయందున్= నాలో; ఇమ్ము+ఐ= నెలకొన్నవై (స్థానం కల్పించుకొని, ఇమ్ము= స్థానం); వసియించున్= నివసిస్తూ ఉంటాయి; పొసఁగి= అట్లా పొల్పారి; వెలుంగుచున్+ఉండుటన్= విరాజిల్లుతూండటంచేత; వాసుదేవుఁడు+అనఁగన్= వాసుదేవుడు అనే పేరుతో; పరఁగుదున్= ఒప్పుతాను.

**తాత్పర్యం:** సద్గుణసంపన్నా! నేను జగత్తులన్నింటా ఉంటాను. అన్ని జగత్తులూ నాలో ఉంటాయి. ఇట్లా ఒప్పెసలారటంవలన నన్ను 'వాసుదేవుడు' అంటారు.

**క.** **వ్యాపించి రోదసీకుహ । రాపూర్ణత్వమున నునికి నధికక్రమణ**
**శ్రీ పొలుపున విష్ణుండను । దీపితనామంబునను బ్రతీతుఁడ నగుదున్. 423**

**ప్రతిపదార్థం:** వ్యాపించి= విస్తరించి; రోదసీకుహర= అంతరిక్షగుహలో (కుహరం= గుహ); ఆపూర్ణత్వమునన్= పూర్తిగా పిక్కటిల్లి; ఉనికిన్= ఉండటంచేత; అధిక= అధికంగా; క్రమణ= ఆక్రమించటమనే; శ్రీ= సంపత్తియొక్క; పొలుపునన్= అందంచేత (జగద్వ్యాపకత); విష్ణుండు= విష్ణుడు (వ్యాపనశీలుడు); అను= అనేటువంటి; దీపిత= ప్రకాశించే; నామంబునను= పేరుతో; ప్రతీతుఁడన్+అగుదున్= ప్రసిద్ధిపొందాను (పొందుతాను).

**తాత్పర్యం:** రోదసీకుహరంలో నేనే పిక్కటిల్లి ఉంటాను. మిగతా జగత్తు అంతటా ఆక్రమించి ఉన్నవాడినీ నేనే. ఈ రెండు లక్షణాలవలనా నాకు 'విష్ణుడు' అనే పేరు ప్రసిద్ధికెక్కింది.

**తే.** **దమమునాఁ గల యుత్తమధర్మ మెడఁద । నలవటిచి నన్నుఁ గామించు నార్యజనము**
**దివియు భువియు నా నడుమన తేజరిల్లు । నట్టు లగుట దామోదరుఁ డండ్రు నన్ను.** **424**

**ప్రతిపదార్థం:** దమము+నాన్= దమం అనే పేరుతో (ఇంద్రియ నిగ్రహం); కల= ఉన్న; ఉత్తమ ధర్మము= ఉత్తమగుణం; ఎడఁదన్= హృదయంలో; అలవటిచి= అభ్యసించి; నన్నున్= నన్ను; ఆర్యజనము= సజ్జనసమూహం; కామించున్= కోరుకొంటుంది; దివియున్= ఊర్ధ్వ లోకమూ; భువియున్= భూలోకమూ; నా+నడుమన్+అ= నా పొట్టలోనే (ఉదరంలోనే); తేజరిల్లున్= ప్రకాశిస్తూంటాయి; అట్టులు+అగుటన్= అలా కావటం వలన; నన్నున్= నన్ను; దామ+ఉదరుఁడు= దామోదరుడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** దమము అనే ఉత్తమ లక్షణం ఉన్న సజ్జనులు నన్ను ధ్యానిస్తూ ఉంటారు. ఊర్ధ్వలోకమూ, భూలోకమూ నా ఉదరంలోనే ఉంటాయి. ఈ రెండు కారణాలవలనా నాకు దామోదరుడు అనే పేరు ఏర్పడింది.

**విశేషం:** దీని మూలశ్లోకం ఇట్లా ఉన్నది: **"దమాత్సిద్ధిం పరీప్సంతో మాం జనాః కామయంతి హి । దివం చోర్వీం చ మధ్యం చ తస్మాత్ దామోదరో హ్యహమ్ ॥" (12-328-39). "దామ్ని ఉదరే మనసి కుర్వంతి ధ్యాయంతీతి దామోదరః"** అని వ్యాఖ్యానం.

**ఆ.** **అన్నమును జలంబు నమృతంబు వేదంబుఁ । బృశ్ని యనఁగ నొప్పుపేరఁ బరఁగు,**
**నది మదీయగర్భ మగుట విద్వజ్జను । లనఘ! పృశ్నిగర్భుఁ డండ్రు నన్ను.** **425**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! పార్థా!; అన్నమును= అన్నమూ (తినేది ఏదయినా); జలంబున్= నీరూ; అమృతంబున్= అమృతమూ (సు ధ); వేదంబున్= వేదమూ; పృశ్ని+అనఁగన్= పృశ్ని అని; ఒప్పు= ఒప్పేటటువంటి; పేరన్= పేరుతో; పరఁగున్= అలరారుతూ ఉంటాయి; అది= ఆ పృశ్ని అనేది; మదీయ= నాయొక్క; గర్భము+అగుటన్= గర్భంలో ఉండటంచేత (అదే నా గర్భం కావటంచేత); విద్వత్+జనులు= పండితులు; నన్నున్= నన్ను; పృశ్ని గర్భుఁడు= పృశ్నిగర్భుడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** పార్థా! అన్నమూ, జలమూ అమృతమూ, వేదమూ - వీటికి పృశ్ని అని పేరు. అదే నా గర్భం. అందుచేత పండితులు నన్ను పృశ్నిగర్భుడు (పృశ్ని గర్భంగా కలవాడు) అంటారు.

**విశేషం:** **"పృశ్ని రిత్యుచ్యతే చాన్నం వేదా ఆపోఽమృతం తథా। మమైతాని సదా గర్భే పృశ్నిగర్భస్తతో హ్యహమ్ ॥"** అని దీని మూలశ్లోకం.

**క.** **ఇనరశ్ములుఁ జంద్రాంశులు । ననలశిఖలు గేశ సంచయము నాకుం గా**
**వునఁ గేశవాభిధానం । బునఁ గొనియాడుదురు నను బ్రబుద్ధజనంబుల్.** **426**

**ప్రతిపదార్థం:** ఇనరశ్ములున్= సూర్యకాంతులూ; చంద్ర+అంశులు= చంద్రకాంతులూ; అనల+శిఖలు= అగ్నిజ్వాలలూ (శిఖ= చివరిభాగం); నాకున్= నాకు; కేశసంచయము= కేశసమూహం; కావునన్= కాబట్టి; ననున్= నన్ను; ప్రబుద్ధజనంబుల్= జ్ఞానులైన ప్రజలు (మహర్షులు); కేశవ+అభిధానంబునన్ (అభిధానమునన్)= కేశవ అనే పేరుతో; కొనియాడుదురు= స్తుతిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** సూర్యకిరణాలూ, చంద్రకిరణాలూ, అగ్నిజ్వాలలూ నాకు కేశసమూహం. అందుచేత జ్ఞానులైన పెద్దలు నన్ను కేశవనామంతో స్తుతిస్తూ ఉంటారు.

**క. క్షత్త్రము బ్రహ్మము నై లో । కత్రాణన మాచరింపఁ గావలసి పృథా**
**పుత్త్రా! యగ్నీషోములు । చిత్రస్థితి వెలుఁగుదురు ప్రసిద్ధాకృతులన్. 427**

**ప్రతిపదార్థం:** పృథా+పుత్రా= పృథాదేవి కుమారుడా! పార్థా!; క్షత్రము= క్షత్రియత్వమూ; బ్రహ్మమున్= బ్రహ్మత్వమూ; ఐ= పొంది; లోక+త్రాణనమున్= లోకాలను రక్షించటం; ఆచరింపన్+కావలసి= చేయవలసి వచ్చి; అగ్నీషోములు= అగ్ని,చంద్రుడూ; చిత్రస్థితిన్= విచిత్రమైన స్థితితో; ప్రసిద్ధ+ఆకృతులన్= ప్రసిద్ధమైన రూపాలతో వెలుఁగుదురు= ప్రకాశిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** పార్థా! లోకరక్షణకొరకు క్షత్రియత్వమూ, బ్రాహ్మణత్వమూ స్వీకరించి అగ్ని, చంద్రుడు విచిత్రస్థితితో ప్రసిద్ధమైన ఆకారాలతో ప్రకాశిస్తూ ఉంటారు.

**వ. అని చెప్పి బ్రహ్మక్షత్రపదంబులు విప్రరాజ నిర్దేశంబు లగుట దేటపడం బలికి విప్రుల రాజుల మహానుభావంబులు విలసిల్లినయెడలు నిదర్శనంబులుగా నిరూపించి యుపన్యసించి యవియెల్ల నగ్నీషోమమాహాత్త్మ్యంబు గావు టెఱింగించి. 428**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; బ్రహ్మక్షత్రపదంబులు= బ్రహ్మ అనే పదమూ, క్షత్ర అనే పదమూ; విప్ర -రాజ - నిర్దేశంబులు= విప్రుడికీ, రాజుకీ నిర్దేశకాలు (వాచకాలు); అగుట= అవ్వటం; తేటపడన్= స్పష్టపడేట్టు; పలికి= వివరించి; విప్రుల= బ్రాహ్మణుల యొక్క; రాజుల= రాజులయొక్క; మహానుభావంబులు= మాహాత్మ్యాలు; విలసిల్లిన ఎడలు= విరాజిల్లిన తావులు; నిదర్శనంబులుగాన్= సాక్ష్యాలుగా; నిరూపించి= చూపించి; ఉపన్యసించి= ప్రసంగించి; అవి ఎల్లన్= అవి అన్నీ; అగ్నీషోమ మాహాత్మ్యంబు= అగ్నీషోమ మాహాత్మ్యము; కావుట= కావటం; ఎఱింగించి= తెలియజెప్పి -

**తాత్పర్యం:** అని బ్రహ్మ, క్షత్రపదాలు వరుసగా విప్రుడికీ, రాజుకీ నిర్దేశకాలు కావటం వివరించి, బ్రాహ్మణులయొక్క, రాజులయొక్క మాహాత్మ్యాలు విరాజిల్లిన తావులు సాక్ష్యాలుగా చూపి, అవి అన్నీ అగ్నీ షోమ మాహాత్మ్యము కావటం తెలియజెప్పి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. బోధనస్థాపనంబులు బుధవరేణ్య! । యగ్నియును సోముఁడును జేసి యఖిలజగము**
**నఖిలహర్షంబుఁ బొందింతు రవ్యయప్ర । వర్తనత్వంబు దమయందు వఱలుచుండ. 429**

**ప్రతిపదార్థం:** బుధవరేణ్యా!= ఓ పండితాగ్రణీ! విజయా!; బోధన= మేలుకొల్పటం (వికాసం); స్థాపనంబు= స్థిరపరచటం లేదా వృద్ధిపొందించటం అనే పనులను; అగ్నియును= అగ్నిదేవుడూ (ఇతడే సూర్యుడు); సోముఁడును= చంద్రుడూ; చేసి= నిర్వర్తించి; అవ్యయ= వ్యయంకాని; ప్రవర్తనత్వంబు= చైతన్యం (జగత్తును ప్రవర్తింపజేసే అవ్యయ శక్తి - సూర్యచంద్రులు); తమయందున్= తమలో; వఱలుచున్+ఉండన్= ఒప్పి ఉండటంచేత; అఖిలజగమున్= సకల ప్రపంచాన్నీ; అఖిలహర్షంబున్= అంతులేని ఆనందం (ఖిలము కానిది అఖిలం= వినాశం లేనిది); పొందింతురు= పొందేటట్లు చేస్తారు.

**తాత్పర్యం:** మేలుకొల్పటం, వృద్ధిపొందించటం అనే పనులు వరుసగా అగ్నిదేవుడూ, చంద్రుడూ చేస్తారు. ప్రపంచానికి అవ్యయమైన చైతన్యాన్ని వీరు ప్రసాదించి ఆనందింపజేస్తుంటారు.

**విశేషం:** దీనికి మూలమైన శ్లోకాలు ఇట్లా ఉన్నాయి. **"సూర్యాచంద్రమసౌ శశ్వత్ కేశైర్మే ऽంశుసంజ్ఞితైః । బోధయం స్తాపయంశ్చైవ జగదుత్తిష్ఠతః పృథక్ ॥ బోధనాత్తాపనాచ్చైవ జగతో హర్షణం భవేత్। అగ్నీషోమకృతైరేభిః కర్మభిః పాండునందన ॥" (12330 - 1,2).** వీటిలో 'స్థాపనాత్' అనేది పాఠాంతరంగా కనపడుతున్నది. దానినే తిక్కన స్వీకరించాడు. తాపనం అంటే వేడితో తపింపజేయటం. అది చంద్రుడి పనిగా మూలశ్లోకం చెప్తున్నది. ప్రకృతివిరుద్ధం. కాబట్టి స్థాపనాత్ అనేదే సాధుపాఠంగా భావించాలి. చంద్రుడు ఓషధీకారకుడూ, వృద్ధికారకుడూను. సూర్యాచంద్రమసౌ అని మొదటి శ్లోకంలోనూ, అగ్నీషోమౌ అని రెండవశ్లోకంలోనూ ఉన్నది. సూర్యాగ్నులకు అభేదం. సూర్యుడు అస్తమిస్తూ తన తేజస్సును అగ్నిలో నిక్షేపిస్తాడని వేదోక్తి. 'దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః' అని కాళిదాససూక్తి. (రఘు - 4-1).

**క. అనఘా! యగ్నీషోముల । ననుఁగా భావింప జగమునకు నెపుడు హితం**
**బొనరింతుఁ దత్సుకృతములఁ । బొనరిన మద్భవ్యనామముల వివరింతున్. 430**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; అగ్నీషోములన్= ఈ సూర్యచంద్రులను; ననున్+కాన్= నన్నుగా; భావింపన్= తెలిసికొంటే; జగమునకున్= ప్రపంచానికి; ఎపుడున్= ఎల్లవేళలా; హితంబు+ఒనరింతున్= మేలు చేకూరుస్తాను; తద్= అలా చేసిన; సుకృతములన్= మంచిపనులవలన; ఒనరిన= నాకు దక్కిన; భవ్యనామములన్= పవిత్రమైన నామధేయాలను; వివరింతున్= వివరిస్తాను - విను.

**తాత్పర్యం:** అర్జునా! అగ్నీషోములను నన్నుగా భావించుము. సూర్యచంద్ర రూపాలలో నేను ఎల్లవేళలా ప్రపంచానికి మేలు చేకూరుస్తూ ఉంటాను. అలా మేలు చేసినందువలన నాకు కొన్ని భవ్యనామధేయాలు ఏర్పడ్డాయి. వాటిని వివరిస్తాను. ఆలకించుము.

**ఆ. పరమ వరద, లోకభావనేశ్వర హృషీ । కేశనామకము లహీనచిత్త!**
**యనియు మఱియు నిట్టు లను యాగముల భాగ । మాహరింతుఁ గాన హరియునండ్రు. 431**

**ప్రతిపదార్థం:** అహీనచిత్త!= ఓ ఉత్తమచిత్తం కలవాడా!; పరమవరద= వరాలను ఇచ్చే (వరద) పరముడు; లోకభావన= లోకభావనుడు; ఈశ్వర= ఈశ్వరుడు; హృషీకేశ= హృషీకేశుడు అనే; నామకములు= ప్రసిద్ధనామధేయాలు (ఏర్పడ్డాయి); అనియున్= అని చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్టులు= ఇట్లా; అనున్= అంటున్నాడు శ్రీకృష్ణుడు; యాగములన్= యజ్ఞాలలో; భాగము= పాలు; ఆహరింతున్= రాబట్టుకుంటాను; కానన్= కాబట్టి; హరియున్= నన్ను హరి అనికూడా; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఓ అహీనచిత్తా! వరదుడు, లోకభావనుడు, ఈశ్వరుడు, హృషీకేశుడు అనే ప్రసిద్ధనామధేయాలు నాకు ఏర్పడ్డాయి' అని చెప్పి శ్రీకృష్ణుడు ఇంకా ఇట్లా అంటున్నాడు: 'అర్జునా! యాగాలలో భాగాలు ఆహరిస్తాను కాబట్టి నన్ను హరి అని కూడా అంటారయ్యా!

**విశేషం:** జగత్తును హర్షింప చేస్తారు కనుక సూర్యచంద్రులు - హృషీ (ద్వివచనం). వారి కిరణాలే కేశాలుగా కలవాడు హృషీకేశుడు. సంస్కృతవ్యాఖ్యానం ఇట్లా ఉన్నది: **"జగద్ధర్షయతో యస్మాత్తస్మాత్తౌ హృషీ - అగ్నీషోమౌ కేశౌ అంశూ యస్య స హృషీకేశః. హృషీరితి ఈకారాంతం పదం వా తదా హృష్యౌ కేశౌ యస్యేతి సమాసః."**

సీ. గో వన మహి యది గుహలోనఁ బడకుండ । జెంది యెత్తుటను గోవిందుఁడనియు
వీతంపు రోమంబుచేత నొప్పార నా । విష్టుం డగుట శిపివిష్టుఁడనియుఁ,
గర్షణక్రియ భూమిఁ గావింతుఁ, జాయయుఁ । గృష్ణంబు గావునఁ గృష్ణుఁడనియు,
నలవడ సదసద్ద్వయంబును నాయందు । సమవేతమై యున్కి సత్యుఁడనియుఁ,

తే. దాత్త్వికంబైన నాకు జాతత్వవికృతి । లేమి నజుఁడనియును, నది లేకపోయి
నపుడు తదనంతరక్షయ మంద కునికి । బుధు లధోక్షజుఁడనియుఁ జెప్పుదురు నన్ను. 432

**ప్రతిపదార్థం:** గోవు+అనన్= గోవు అంటే; మహి= భూమి; అది= ఆ భూమి; గుహలోనన్= (యుగాంతంలో ఏర్పడిన) గుహలో; పడకుండన్= పడిపోకుండా; చెంది= (వరాహరూపంలో) సమీపించి; ఎత్తుటన్= (భూగోళాన్ని జలప్రళయంనుంచి) ఉద్ధరించాను కనుక; గోవిందుఁడు+అనియున్= గోవిందుడు అనీ; వీతంపు+రోమంబుచేతన్= తొలగిపోయిన రోమాలతో (రోమాలు తొలగిపోవటంతో); ఒప్పారన్= అందంగా; ఆవిష్టుఁడన్= కూడుకొన్నవాడిని; అగుటన్= కావటంచేత (నీరోమత్వం వలన); శిపివిష్టుఁడు; అనియున్= అనీ; కర్షణక్రియన్= దున్నటం అనే పనిని; భూమిన్= ఈ భూమిమీద; కావింతున్= చేస్తాను; చాయయున్= నా శరీరం రంగుకూడా; కృష్ణంబు= నలుపు; కావునన్= అందుచేత (ఈ రెండు కారణాలతోనూ); కృష్ణుఁడు+అనియున్= నన్ను కృష్ణుడు అనీ; అలవడన్= కుదురుగా; సత్+అసత్+ద్వయంబునున్= సత్తూ, అసత్తూ (చిత్తు) అనే జంట; నాయందున్= నాలో; సమవేతమై+ఉన్కిన్= కూడి ఉండటం వలన (చేరి ఉండటంతో); సత్యుఁడు+అనియున్= సత్యుడు అనీ; తాత్త్వికంబు+ఐన= తత్త్వసిద్ధమైన; నాకున్= నాకు; జాతత్వ= పుట్టుక అనే; వికృతి= వికారం; లేమిన్= లేకపోవటంచేత; అజుఁడు+అనియునున్= అజుడు అనీ; అది= ఆ పుట్టుక అనేది; లేకపోయినపుడు= లేకపోయాక; తద్+అనంతర= దానికి తరువాతిదైన; క్షయమున్= మరణం అనేదాన్ని; అందక+ఉనికిన్= పొందకపోవటంచేత; బుధులు= పండితులూ, దేవతలూ; అధోక్షజుఁడు+అనియున్; నన్నున్= నన్ను; చెప్పుదురు= వివరిస్తారు, కీర్తిస్తారు.

**తాత్పర్యం:** గోవు అంటే భూమి. దానిని కాపాడాడు కనుక గోవిందుడు. రోమరహితంగా ఒప్పారటం వలన శిపివిష్టుడు. భూమిని దున్నటంవలనా, నల్లగా ఉండటంవలనా కృష్ణుడు. సత్తూ, అసత్తూ ఆయనలోనే ఉండటం వలన సత్యుడు. పుట్టుక అనేది లేదు కాబట్టి అజుడు. క్షయము అనేదీ లేదు కాబట్టి అధోక్షజుడు. అర్జునా! ఇట్లా ఈ పేర్లు నాకు ఏర్పడ్డాయి.

**విశేషం:** సంస్కృతమూలంలో ఈ పేర్లను రెండు గణాలుగా విభజించాడు వ్యాసుడు. గుణాలను బట్టి ఏర్పడినవి కొన్నీ, చేసిన పనులనుబట్టి వచ్చినవి కొన్నీ. **"గౌణాని తత్ర నామాని కర్మజాని చ కానిచిత్ । నిరుక్తం కర్మజానాం శృణుష్వ ప్రయతోఽనఘ॥" (12-328-10).** నారాయణాదులు గౌణనామాలు. హృషీకేశ గోవిందాదులు కర్మజనామాలు. ఈ రెండింటినీ వేర్పరచటంకొరకూ, మూలంలో విస్తృతంగా ఉన్న అగ్నీషోమమాహాత్మ్యాన్ని రెండు పంక్తులలోనికి సంగ్రహించటం కొరకూ నాలుగువందల ఇరవై ఎనిమిదవ వచనం అవతరించింది.

క. సత్త్వముననుండి తొలఁగమి । సత్త్వము నాచేఁతఁ జేసి సత్తఁ బొరయుటన్
సత్త్వమయజన్ముఁ డగుటను । సాత్త్వతుఁ డను నామ మయ్యె జనవర! నాకున్. 433

**ప్రతిపదార్థం:** జనవర!= నరవరా!; సత్త్వముననుండి= సత్త్వగుణంనుంచి; తొలఁగమిన్= తప్పుకోకపోవటంచేతా (సత్త్వగుణాన్ని ఎప్పుడూ విడవకుండా ఉండటంచేత); సత్త్వము= ఆ సత్త్వగుణం అనేది; నా= నాయొక్క; చేఁతన్+చేసి= పనితో (చేతలు); సత్తన్= అస్తిత్వాన్ని; పొరయుటన్= పొందటంచేతా; సత్త్వమయ= సత్త్వరూపమైన; జన్ముఁడు= జన్మ కలవాడు; అగుటన్= కావటంచేతా; నాకున్= నాకు; సాత్త్వతుఁడు+అను= సాత్త్వతుడు అనే; నామము= పేరు; అయ్యెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** నేను ఏనాడూ సత్త్వగుణాన్ని వదలిపెట్టను. నా పనులవలననే సత్త్వగుణానికి ఉనికి ఏర్పడుతున్నది. నా జన్మ సత్త్వమయం. కాబట్టి నన్ను సాత్త్వతుడు అంటారు.

**తే. చ్యుతము లేకున్కిఁ జేసి యచ్యుతుఁడ వాత । ముఖ్య ధాతుత్రయాకారమున శరీర**
**ధారకుండనై యున్కిఁ ద్రిధాతువును న । నంగఁ బరఁగుదు మునివచనంబులందు. 434**

**ప్రతిపదార్థం:** చ్యుతము= జారుపాటు (వినాశం); లేక+ఉన్కిన్+చేసి= లేకపోవటం చేత; అచ్యుతుఁడన్= నేను అచ్యుతుడిని; వాతముఖ్య= వాయువు మొదలైన (వాత - పిత్త - శ్లేష్మాలు); ధాతుత్రయ= మూడు ధాతువుల; ఆకారమునన్= రూపంతో; శరీర= ప్రాణులదేహాలకు; ధారకుండను= పోషకుడను (ఆధారం); ఐ+ఉన్కిన్= అయి ఉండటం చేత; త్రిధాతువును= త్రిధాతువు; అనంగన్= అని; మునివచనంబులందున్= ఋషివాక్కులలో; పరఁగుదున్= అలరారుతాను.

**తాత్పర్యం:** చ్యుతము అనేది నాకు లేదు. కాబట్టి నేను అచ్యుతుడను. వాతపిత్తశ్లేష్మాల రూపంలో నేనే జీవుల శరీరాలకు ధారకం. కాబట్టి నన్ను ఋషులు త్రిధాతువు అంటారు.

**క. ఘృత మర్చిస్సంపద యయి । ఘృతార్చి రభిధాన మొందెఁ గ్రీడి! వృషము వి**
**శ్రుత ధర్మము - ధర్మమయ । స్థితి కతమున వృషుఁడనం బ్రసిద్ధి వహింతున్. 435**

**ప్రతిపదార్థం:** క్రీడి!= ఓ అర్జునా!; అర్చిః+సంపద= నా తేజస్సంపత్తిచే ఘృతము+అయి= నేయి ఏర్పడటం కారణంగా; ఘృతార్చిః+అభిధానము= ఘృతార్చి అనే పేరు; ఒందెన్= నాకు ఏర్పడింది; విశ్రుత= ప్రసిద్ధికెక్కిన; ధర్మము= ధర్మమే; వృషము= వృషము అనబడుతోంది; ధర్మమయ= ధర్మస్వరూపమైన; స్థితి+కతమునన్= నా స్థితివలన; వృషుఁడు+అనన్= వృషుడు అని; ప్రసిద్ధిన్+వహింతున్= ప్రసిద్ధి పొందాను.

**తాత్పర్యం:** కిరీటీ! నా తేజస్సంపద వలననే ఆయా జంతువులలో ప్రాణధారకమైన ఘృతం ఏర్పడుతున్నది. కాబట్టి నన్ను ఘృతార్చి అంటారు. "ఘృతం మమార్చిషో లోకే జంతూనాం ప్రాణధారణం। ఘృతార్చి రహమవ్యగ్రైః వేదజ్ఞైః పరికీర్తితః ॥" ధర్మానికే వృషము అని పేరు. నేను ధర్మమయుడను. కాబట్టి నాకు వృషుడు అని ప్రసిద్ధి ఏర్పడింది.

**తే. ఆదిమధ్యాంతములు నాకు నరయ లేమి । నై యనాది యమధ్యుఁ డనంతుఁ డనఁగఁ**
**జెల్లు పేళ్లులు, శుచులు నా చెవుల కింపు । లగుట మునులు శుచిశ్రవుఁ డండ్రు నన్ను. 436**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఆది= మొదలూ; మధ్య= నడుమా; అంతములు= అంతమూ అనేవి; అరయన్ లేమిన్+ఐ= ఎవరూ తెలిసికొనలేరు కనక; అనాది= అనాది; అమధ్యుఁడు= అమధ్యుడు; అనంతుఁడు= అనంతుడు; అనఁగన్= అని; పేళ్ళులు= పేర్లు; చెల్లున్= చెల్లుతున్నాయి; నా+చెవులకున్= నా చెవులకు; శుచులు= శుచి అయిన మాటలు; ఇంపులు+అగుటన్= ఇంపు కూర్చేవి అవుతాయి కనక; మునులు= ఋషులు; నన్నున్= నన్ను; శుచిశ్రవుఁడు= శుచిశ్రవుడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** అర్జునా! నాకు మొదలూ నడుమా అంతమూ అనేవి లేవు. ఎవరూ వీటిని తెలిసికొనలేరు. అందుకని అనాది, అమధ్యుడు, అనంతుడు అనే పేర్లు ఏర్పడ్డాయి. శుచి అయిన పలుకులే నా చెవులకు హితవుగా ఉంటాయి. వాటినే వింటాను. అందుచేత నన్ను శుచిశ్రవుడు (శుచిశ్రవసుడు) అంటారు మహర్షులు.

**ఆ. ఒక్క శృంగముననె యుర్వి యెత్తితి వరా । హావతారలీల యతిశయిల్ల**
**నట్టు లగుటఁ జేసి యార్యజనప్రియ । నాకు నేక శృంగనామ మయ్యె. 437**

**ప్రతిపదార్థం:** ఆర్యజనప్రియ!= సజ్జనులకు ప్రియమైనవాడా!; ఒక్క శృంగమునన్+అ= ఒకే ఒక్క కోరతోనే; ఉర్వి= భూమిని; వరాహ+అవతార+లీల= వరాహావతారం తాలూకు విలాసం; అతిశయిల్లన్= అతిశయించేట్టు; ఎత్తితిన్= ఉద్ధరించాను; అట్టులు+అగుటన్+చేసి= అట్లా కావటం వలన; నాకున్= నాకు; ఏకశృంగనామము= ఏకశృంగుడు అనే పేరు; అయ్యెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** ఆర్యజనప్రియా! వరాహావతారంలో ఒకే కోరతో మొత్తం భూగోళాన్ని ఎత్తి రక్షించాను. అప్పటినుండీ నాకు ఏకశృంగుడు అనే పేరు వచ్చింది.

**క. వినుత మగు లోకరేచన । మున నన్ను విరించుఁ డండ్రు బుధనుత! రవియం**
**దనుపాధిక విద్యాస్థితి । నునికిం గపిలాభిధాన ముల్లసిత మగున్. 438**

**ప్రతిపదార్థం:** బుధనుత!= పండితులచే స్తుతింపబడేవాడా!; వినుతము+అగు= ప్రసిద్ధి కెక్కిన; లోకరేచనమునన్= ప్రపంచకోత్తేజనంవలన (లోకాన్ని చైతన్యవంతం చేయటంవలన); నన్నున్= నన్ను; విరించుఁడు+అండ్రు= విరించుడు అంటారు; అనుపాధిక= శరీరంలేని; విద్యాస్థితిన్= విద్యారూపంతో; రవియందున్= సూర్యుడిలో; ఉనికిన్= ఉండటంచేత; కపిల+అభిధానము= కపిలుడు అనే పేరు; ఉల్లసితము+అగున్= నాకు ప్రకాశిస్తోంది.

**తాత్పర్యం:** పండితస్తవనీయా! లోకాన్ని చైతన్యవంతం చేస్తాను కాబట్టి (రేచనం) నన్ను విరించుడు అంటారు. నిరుపాధికమైన జ్ఞానరూపంతో సూర్యుడిలో ఉంటాను కాబట్టి కపిలుడు అంటారు నన్ను.

**క. విను యోగంబు హిరణ్యం । బనఁ బరఁగును యోగగర్భుఁడగుటను విద్వ**
**జ్జనములు హిరణ్యగర్భుం । డని ననుఁ గొనియాడుదురు మహాగుణశాలీ! 439**

**ప్రతిపదార్థం:** మహాగుణశాలీ!= గొప్ప గుణవంతుడా!; విను= వింటున్నావా? వినుము; యోగంబు= యోగమే; హిరణ్యంబు+అనన్= హిరణ్యము అని; పరఁగున్= ఒప్పుతోంది; యోగగర్భుఁడు+అగుటను= నేను యోగగర్భుడను కనుక; విద్వత్+జనములు= పండితులు; హిరణ్యగర్భుండు+అని= హిరణ్యగర్భుడు అని; ననున్= నన్ను; కొనియాడుదురు= స్తుతిస్తారు.

**తాత్పర్యం:** సద్గుణసంపన్నా! యోగాన్నే హిరణ్యం అంటారు. నేను యోగగర్భుడను. అందుచేత నన్ను హిరణ్యగర్భుడు అని కూడా అంటారు.

**తే. నరుఁడు నారాయణుండు ననంగ లోక । రక్షణార్థంబు గాఁగ ధర్మమున కేను**
**బుట్టినాఁడఁ గావున బాండుభూపతనయ! । నాకు ధర్మజుఁ డనియెడు నామమయ్యె. 440**

**ప్రతిపదార్థం:** పాండుభూపతనయ!= పాండురాజుగారి కుమారుడా!; నరుఁడున్+నారాయణుండున్+అనంగన్= నరనారాయణులు అనే పేరుతో; లోకరక్షణార్థంబు+కాఁగన్= లోకాలను రక్షించటం కోసం కాగా; ధర్మమునకున్= ధర్మరక్షణార్థం; ఏను= నేను; పుట్టినాఁడన్= జన్మించాను; కావునన్= కాబట్టి; నాకున్= నాకు; ధర్మజుఁడు+అనియెడు= ధర్మజుడు అనే; నామము+అయ్యెన్= పేరు ఏర్పడింది.

**తాత్పర్యం:** అర్జునా! నరుడూ నారాయణుడూ అనే అవతారాలు లోకరక్షణార్థం కాగా ధర్మరక్షణార్థం నేను జన్మించాను కాబట్టి నన్ను ధర్మజుడు అంటారు.

**వ. ఇట్లు వుట్టి గంధమాదనంబున నేను దపంబు సేయుచుండ నక్కాలంబునఁ గాలాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన నది భీతిం బఱతెంచి నా యురఃస్థలంబు నొందిన మదీయ కేశంబులు ముంజనిభంబులగుటం జేసి**

**ముంజకేశుండనుపేరు గలిగె నా రుద్రుండు రౌద్రాకారంబున నయ్యజ్ఞంబు వెనుకొని నాపయిం గవిసిన నొక్క యిషీక పరశురూపంబుగా నభిమంత్రించి యతనిపయిం బ్రయోగించిన నతండు దాని ఖండితధారంబు సేయుటంజేసి ఖండపరశు వను నభిధానంబునుం గలిగె ననుటయు. 441**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; పుట్టి= జన్మించి; గంధమాదనంబునన్= గంధమాదన పర్వతంమీద; నేను; తపంబు= తపస్సు; చేయుచుండన్= చేస్తూండగా; ఆ+కాలంబునన్= ఆ సమయంలో (ఆ రోజుల్లోనే); కాలాంతకుండు= కాలాంతకుడైన శివుడు (యముడిని జయించినవాడు); దక్షుని= దక్షప్రజాపతిచేసే; యజ్ఞంబునకున్= యజ్ఞానికి; అలిగినన్= కోపించగా (యజ్ఞంమీద కోపించితే); అది= ఆ యజ్ఞం; భీతిన్= భయంతో; పఱతెంచి= పారిపోయి వచ్చి; నా+ఉరః స్థలంబున్= నా వక్షఃస్థలాన్ని; ఒందినన్= శరణుజొచ్చితే; మదీయ= నాయొక్క; కేశంబులు= (గుండెపై) వెంట్రుకలు; ముంజనిభంబులు= ముంజగడ్డిలాగా; (గోధుమరంగు); అగుటన్+చేసి= కావటం చేత; ముంజకేశుండు= ముంజకేశుడు; అను పేరు= అనే పేరు; కలిగెన్= ఏర్పడింది; ఆ+రుద్రుండు= ఆ శివుడు; రౌద్ర+ఆకారంబునన్= భయంకరమైన ఆకారంతో; ఆ+యజ్ఞంబున్= ఆ యజ్ఞాన్ని; వెనుకొని= వెన్నంటి (తరుముకు వస్తూ); నాపయిన్= నామీదకు; కవిసినన్= కలియబడితే; ఒక్క= ఒకే ఒక్క; ఇషీక= బాణం; పరశురూపంబుగాన్= గొడ్డలి రూపం ధరించేట్టు; అభిమంత్రించి= మంత్రం పెట్టి; అతనిపయిన్= ఆ శివుడిమీద; ప్రయోగించినన్= ప్రయోగిస్తే; అతండు= శివుడు; దానిన్= ఆ పరశువును; ఖండిత= ఖండింపబడ్డ; ధారంబు= అంచుకలదిగా (అంచు ఖండింపగా); చేయుటన్+చేసి= చేయటంచేత; ఖండపరశువు= ఖండపరశువు; అను= అనేటటువంటి; అభిధానంబు= పేరు; కలిగెన్= నాకు సిద్ధించింది; అనుటయున్= అని శ్రీకృష్ణుడు చెప్పగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పుట్టి నేను గంధమాదన పర్వతంమీద తపస్సు చేస్తున్నప్పుడు దక్షప్రజాపతి యాగం చేస్తున్నాడు. ఆ యాగానికి శివుడు కోపించాడు. అప్పుడు ఆ యజ్ఞం భయంతో హడలిపోయి నా వక్షఃస్థలాన్ని ఆశ్రయించింది. ఆ కారణంవలన అక్కడి నా రోమాలు ముంజగడ్డివలె మారాయి. అందువలన నాకు ముంజకేశుడనే పేరు వచ్చింది. రుద్రుడు ఆ యజ్ఞాన్ని తరుముకొని వచ్చి నన్ను తాకగా నేనొక బాణాన్ని పరశురూపంలో ప్రయోగించగా శివుడు దాని అంచును ఖండించాడు. అందువలన నాకు 'ఖండపరశువు' అనే పేరు వచ్చింది.

**క. ' విని పార్థుఁ డిట్లు గలిగిన । యనియం దా రుద్రునొకొ జయము నీకో క**
**ల్గెను? దాని తెఱంగేర్పడ । వినఁ గౌతుక మొలసెఁ జెప్పవే విశ్వాత్మా!' 442**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; పార్థుఁడు= అర్జునుడు; ఇట్లు= ఇట్లా; కలిగిన= ఏర్పడ్డ; అనియందున్= యుద్ధంలో; జయము= జయమనేది; ఆ రుద్రునకొ= ఆ శివునికో; నీకో= నీకో; కల్గెను?= కలిగింది?; దాని తెఱంగు= ఆ యుద్ధం పద్ధతిని; ఏర్పడన్+వినన్= స్పష్టంగా వినాలని; కౌతుకము= ఉత్సాహం; ఒలసెన్= కలుగుతోంది (కలిగింది); విశ్వాత్మ= విశ్వరూపా!; చెప్పవే?= చెప్పవా?

**తాత్పర్యం:** అర్జునుడు అంతా విని ఇట్లా అన్నాడు: 'ఓ విశ్వరూపా! ఆ యుద్ధంలో నీవు గెలిచావా? శంకరుడు గెలిచాడా? ఆ కథ అంతా వినాలనే కుతూహలం కలిగింది దయచేసి వివరంగా చెప్పవా?'

**వ. అనిన విష్ణుం డర్జునున కిట్లనియె. 443**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడిగేసరికి; విష్ణుండు= శ్రీకృష్ణుడు; అర్జుననకున్= పార్థుడికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు:

**తాత్పర్యం:** అని అడుగగా శ్రీకృష్ణుడు పార్థుడితో ఇట్లా అన్నాడు:

## శివకేశవుల పరస్పరకోపప్రసాదముల విధము (సం. 12-309-2)

**సీ. రుద్ర నారాయణరూప ప్రవర్తిత । మూర్తి ద్వయము రణమునకుఁ జొచ్చి**
**పరమసంరంభంబు వాటింప, నుద్వేజి । తములయ్యె నఖిలభూతములు, శ్రుతులు**
**మునులకుఁ దోఁపవ, యనలంబు లాహుతుల్ । గొనవయ్యెఁ, బగిలె దిక్కులు నభంబు**
**ధరణి వడంకె, భూధరములు దిర్దిరం । దిరిగె, దేవతలకు దిగులు సొచ్చె**

**తే. నాననము పల్లటిల్లంగ నజుఁడు గలఁగె, । నిట్టు లెందును సంక్షోభ మెసకమెసఁగ,**
**నా విధాత - మునీంద్రులు దేవతలును । దన్ను వేష్టింప వచ్చె సత్వరముగాఁగ. 444**

**ప్రతిపదార్థం:** రుద్ర (రూప)= రుద్రరూపంతోనూ; నారాయణ రూప= నారాయణ రూపంతోనూ; ప్రవర్తిత+ప్రవృత్తిని పొందిన; మూర్తిద్వయము= మూర్తుల జంట; రణమునకున్= యుద్ధానికి; చొచ్చి= దిగి (పూనుకొని); పరమ సంరంభంబు= గొప్ప హడావుడి; పాటింపన్= చేసేసరికి; అఖిలభూతములున్= పంచభూతాలూ (సకలప్రాణులూ); ఉద్వేజితములు+అయ్యెన్= ఏమి జరుగుతుందో అనే ఉద్వేగం పొందాయి; మునులకున్= మహర్షులకు; శ్రుతులు= వేదమంత్రాలు; తోఁపవు+అ= స్ఫురించటమే లేదు (మంత్రాలు దర్శనం ఇవ్వటమే లేదు); అనలంబులు= హోమాగ్నులు; ఆహుతుల్= ఆహుతులను (ఆజ్యంతో అగ్నిలో వేల్చే వస్తువుల్నీ - వేల్చటాన్నీ ఆహుతులు - ఆహుతి అంటారు); కొనవు+అయ్యెన్= స్వీకరించటం లేదు (హోమాగ్నిలో ఏదీ ఆహుతి కావటం లేదు అని); దిక్కులున్= దశదిశలూ; నభంబున్= ఆకాశమూ; పగిలెన్= బ్రద్దలయ్యాయి; ధరణి= భూమి; వడంకెన్= కంపించింది; భూధరములు= పర్వతాలు; దిర్దిరన్+తిరిగెన్= గిరగిరా తిరిగాయి; దేవతలకు= అమరులకు; దిగులు= దిగులు(కుందు); చొచ్చెన్= ప్రవేశించింది(మొదలయ్యింది); ఆననము= ముఖం; పల్లటిల్లంగన్= వాడిపోగా; అజుఁడు= బ్రహ్మదేవుడు; కలఁగెన్= కలతచెందాడు; ఇట్టులు= ఇలా; ఎందునున్= అంతటా; సంక్షోభము= అల్లకల్లోలం; ఎసకము+ఎసఁగన్= వ్యాపించగా; ఆ విధాత= ఆ బ్రహ్మదేవుడు; మునీంద్రులున్= మహర్షులూ; దేవతలునున్= అమరులూ; తన్నున్= తనను; వేష్టింపన్= చుట్టూ చేరిరాగా; సత్వరము+కాఁగన్= సత్వరంగా (వేగంగా); వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అర్జునా! రుద్రుడూ, నారాయణుడూ యుద్ధానికి దిగారు. భయంకరమైన సంక్షోభం ఏర్పడింది. సకలప్రాణులూ ఉద్వేగం పొందాయి. (ఊపిరి బిగ్గబట్టుకొన్నాయి). మహర్షులకు వేదమంత్రాలు స్ఫురించటం లేదు. హోమాగ్నికుండాలలో వేల్చిన ఆహుతులు ఆహుతి కావటం లేదు. దశదిశలూ ఆకాశమూ బీటలు వారుతున్నాయి. భూమి, పర్వతాలు బొంగరాలవలె తిరుగుతున్నాయి. దేవతలకు ఎక్కడ లేని దిగులూ పట్టుకుంది. దేవతలతో, మునీంద్రులతో కలిసి బ్రహ్మదేవుడు యుద్ధభూమికి వచ్చాడు.

**వ. వచ్చి రుద్రునకుం బ్రణమిల్లి సంప్రార్థనంబు దోఁప నిట్లనియె: 445**

**ప్రతిపదార్థం:** వచ్చి= అలా వచ్చి; రుద్రునకున్= శివుడికి; ప్రణమిల్లి= నమస్కరించి; సంప్రార్థనంబు= అభ్యర్థన; తోఁపన్= స్ఫురించేట్టు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా వచ్చి శివుడికి నమస్కరించి, ఈ విధంగా శివుడిని అభ్యర్థించాడు.

**క. ' శివుఁడవు నీవు జగములకు । శివ మొనరింపంగ వలదె? చేయుము క్రోధ**
**ప్రవిహతి, విష్ణుండనఁగా । శివుఁడన నొకఁడౌట దివ్యచిత్తమ యెఱుఁగున్. 446**

**ప్రతిపదార్థం:** నీవు శివుఁడవు; జగములకున్= ప్రపంచాలకు; శివము= శుభం; ఒనరింపంగన్+వలదె?= చేయవద్దా?; క్రోధ= నీ కోపంయొక్క; ప్రవిహతిన్= విడుమరను; చేయుము= చేయుము (క్రోధం విడిచిపెట్టుము అని); విష్ణుండు+అనఁగాన్= విష్ణుమూర్తి

అన్నా; శివుఁడు+అనన్= శివుడు అన్నా; ఒకఁడు+ఔట= ఒక్కడే అవటాన్ని; దివ్యచిత్తము+అ= తమ దివ్యచిత్తమే; ఎఱుఁగున్= ఎరుగును. (శివకేశవుల అభేదాన్ని దివ్యమైన హృదయమే తెలుసుకోగలదు అని కానీ)

**తాత్పర్యం:** 'రుద్రా! నీవు శివుడవు. లోకాలకు శివం (శుభం) కలిగించాలి కానీ ఇదేమిటి? కోపం ఉపసంహరించుకొనుము. విష్ణువు అన్నా శివుడు అన్నా ఒక్కరే అని నీ దివ్యచిత్తానికి తెలుసును కదా!

**తే. నిగమవేద్య మద్వంద్వంబు నిర్గుణం బ । మూర్తమనియెడు తత్త్వంబు మూర్తిభేద**
**కలనమున లోకమున ద్విధాకారి యయ్యెఁ । గాక - హరియన నీవనఁ గలదె వేఱు!' 447**

**ప్రతిపదార్థం:** నిగమ= వేదాలతో; వేద్యము= తెలిసికొనదగినదీ; అద్వంద్వంబు= రెండు కానిదీ (ఒక్కటే అని); నిర్గుణంబు= సత్త్వరజస్తమోగుణాలకు అతీతమైనదీ; అమూర్తము= రూపం లేనిదీ; అనియెడు= అని చెప్పబడే; తత్త్వంబు= ఒకానొక మూలతత్త్వం; మూర్తిభేదకలనమునన్= రూపభేదాన్ని (భిన్న రూపాలను) పొందటంవలన; లోకమునన్= లోకంలో; ద్విధాకారి+అయ్యెన్+కాక= రెండుగా అయ్యింది గానీ - నిజానికి; హరి+అనన్= విష్ణుడు అనీ; నీవు+అనన్= నీవనీ (శివుడు అనీ); వేఱు= భేదం; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** వేదవేద్యమూ, అద్వంద్వమూ, నిర్గుణమూ, అమూర్తమూ అయిన ఒకే ఒక్క మూలతత్త్వం లోకం కొరకని రెండు రూపాలు ధరించింది. అందులో ఒకటి నీవూ, మరొకటి విష్ణుడూను. అంతేకానీ నిజానికి శివకేశవులకు భేదం లేదు.'

**వ. అని బోధించి వెండియు. 448**

**ప్రతిపదార్థం:** అని= ఇలా; బోధించి= ఉపదేశించి; వెండియున్= మళ్ళీ కొనసాగించాడు.

**తాత్పర్యం:** ఇట్లా ఉపదేశించి మళ్ళీ.

**క. ' నరనారాయణు లనఁగాఁ । బురహర! జగదాదియైన పురుషులు, మనముం**
**బరికింపఁ దన్మయత్వ । స్ఫురితులము ప్రసన్న దివ్యబుద్ధిం గనుమా! 449**

**ప్రతిపదార్థం:** పురహర!= త్రిపురాసుర సంహారం చేసిన ఓ రుద్రుడా!; నరనారాయణులు+అనఁగాన్= నరనారాయణులు అంటే; జగత్+ఆదియైన+పురుషులు= ఈ జగత్తుకు మొట్టమొదటి పురుషులు; పరికింపన్= లోతుగా ఆలోచించి చూస్తే; మనమున్= మనమందరం కూడా; తద్+మయత్వ+స్ఫురితులము= వారి అంశలతో ఏర్పడినవాళ్ళమే; ప్రసన్న= కోపం విడిచి తేరుకున్న; దివ్యబుద్ధిన్= దివ్యమైన బుద్ధితో; కనుమా!= ఒక్కసారి చూడుము.

**తాత్పర్యం:** 'త్రిపురాంతకా! నరనారాయణులు అంటే జగదాది పురుషులు. ఇంకాస్త లోతుగా ఆలోచిస్తే నీవూ నేనూ ఈ దేవతలూ, ఋషులూ అందరమూ తదంశలతో స్ఫురించిన వాళ్ళమే. ప్రసన్నమూ, దివ్యమూ అయిన బుద్ధితో ఆలోచించి చూడుము. నీకే తెలుస్తుంది.

**ఆ. తెలుపు మితని, ననుడుఁ దేఱి కోపంబు వో । విడిచి నన్నుఁ గొలిచె మృడుఁడు పార్థ!**
**యేను నతనితోడ నిట్లంటి మృదుసత్య । పథ్య ముని మనోజ్ఞ భంగికముగ. 450**

**ప్రతిపదార్థం:** పార్థ!= పృథానందనా! అర్జునా!; ఇతనిన్= ఈ విష్ణుమూర్తిని; తెలుపుము= ప్రసన్నుడిని చేయుము; అనుడున్= అని బ్రహ్మ చెప్పగానే; మృడుఁడు= శివుడు; తేఱి= తేరుకొని; కోపంబు= క్రోధం; పోన్+విడిచి= విడిచిపెట్టి; నన్నున్= నన్ను;

కొలిచెన్= శరణు వేడాడు(సేవించాడు); ఏనున్= నేను; అతనితోడన్= ఆ శివుడితో; మృదు= సుకుమారమూ; సత్య= సత్యమూ; పథ్య= హితమూ; మునిమనోజ్ఞ= మునులకు మనోహరమూ అయిన; భంగికముగన్= భంగిగా; ఇట్లు+అంటిన్= ఇలా అన్నాను.

**తాత్పర్యం:** రుద్రా! ఈ విష్ణుమూర్తిని ప్రసన్నుడిని చేసికొమ్ము' అని బ్రహ్మదేవుడు చెప్పగానే కోపం వదిలి శివుడు నన్ను (విష్ణువును) శరణువేడాడు. అప్పుడు నేను శివుడితో మృదువుగా సత్యమూ, పథ్యమూ అయ్యేటట్లూ మునులు హర్షించేటట్లూ ఇట్లా అన్నాను.

**క. ' నిను నెవ్వఁ డెఱిఁగె నాతఁడు । నను నెఱిఁగినవాఁడ, నిన్ను నమ్మిక సేవిం**
**చిన నదియ నన్నుఁ గొల్చుట । యను వాసిగ లేదు భేద మరయఁగ మనకున్. 451**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; ఎవ్వఁడు= ఏ వ్యక్తి; ఎఱిఁగెన్= తెలుసుకున్నాడో; ఆతఁడు= ఆ వ్యక్తి; ననున్= నన్నుకూడా; ఎఱిఁగినవాఁడు+అ= తెలిసికొన్నవాడే; నినున్= నిన్ను; నమ్మికన్= విశ్వాసంతో; సేవించినన్= సేవిస్తే; అది+అ= అదే; నన్నున్= నన్ను కూడా; కొల్చుట= సేవించటం; అను= అనేటువంటి; వాసిగన్= పద్ధతిగా; మనకున్= మన ఇద్దరికీ; అరయఁగన్= పరిశీలిస్తే; భేదము= వేర్పాటు (భిన్నత్వం); లేదు= లేదంటే లేదు.

**తాత్పర్యం:** 'శివా! నిన్ను తెలిసికొంటే నన్ను తెలుసుకొన్నట్లే. నిన్ను సేవిస్తే నన్నే సేవించినట్లే. ఈ పద్ధతిగా మన ఇద్దరికీ భేదం అనేది లేనే లేదు.

**క. శ్రీవత్సము శూలాంకిత । మై వెలయుంగాక యిప్పు డాదిగ నాకున్**
**నీవును మత్పాణ్యంకో । ద్భావన శ్రీకంఠుఁడనఁగఁ బరఁగుము శర్వా!' 452**

**ప్రతిపదార్థం:** శర్వా!= ఓ శివా!; ఇప్పుడు+ఆదిగన్= ఇది మొదలుగా; నాకున్= నాకు; శ్రీవత్సము= గుండెపై ఉన్న శ్రీవత్సము అనే పుట్టుమచ్చ; శూల+అంకితమై= త్రిశూలచిహ్నమై; వెలయున్+కాక= ఒప్పునుగాక!; నీవునున్= నీవుకూడా; మత్= నా; పాణి+అంక= చేతిముద్ర యొక్క; ఉద్భావనన్= ప్రస్ఫుటీకరణంతో; శ్రీకంఠుఁడు+అనఁగన్= శ్రీకంఠుడు అనే పేరుతో; పరఁగుము= ఒప్పుము.

**తాత్పర్యం:** ఓ శర్వా! ఈ రోజునుండీ నా గుండెలపై శ్రీవత్సం నీ త్రిశూలానికి ప్రతీకగా గుర్తించబడుతుంది. నీ కంఠంమీద ఉన్న నలుపు నా చేతిముద్రగా నీకు శ్రీకంఠుడు అనే పేరు సార్థకమవుతుంది.' (విష్ణుమూర్తి శివుడిని కంఠాలింగనం చేసికొంటే గళం చుట్టిన చేతి నలుపురంగుగా అతడు శ్రీకంఠుడు అయ్యాడని భావం).

**వ. అని యివ్విధంబున. 453**

**ప్రతిపదార్థం:** అని; ఈ+విధంబునన్= ఈ విధంగా.

**తాత్పర్యం:** అనిచెప్పి, కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**క. ' ఇతరేతర మతి సంభా । విత లక్షణకలన మొంది వృషవాహనుతో**
**నతినిర్మల సఖ్యము సే । సితి బ్రహ్మాదులును సంతసిల్లిరి విజయా! 454**

**ప్రతిపదార్థం:** విజయా!= ఓ అర్జునా!; ఇతర+ఇతర= పరస్పరం; మతి= బుద్ధితో; సంభావిత= (గౌరవించుకొన్న) ఆలోచించి ఏర్పరుచుకొన్న; లక్షణకలనము= చిహ్నధారణం; ఒంది= పొంది; వృషవాహనుతోన్= వృషభవాహనుడైన శివుడితో; అతి నిర్మలసఖ్యము= మిక్కిలి పావనమైన (నిర్మలినమైన) మైత్రి; చేసితిన్= కుదుర్చుకొన్నాను - చేశాను; బ్రహ్మాదులునున్= బ్రహ్మదేవుడూ (దేవతలూ, మునులూ) మొదలైనవారుకూడా; సంతసిల్లిరి= సంతోషించారు.

**తాత్పర్యం:** 'అర్జునా! ఇట్లా పరస్పరం ఆలోచించి ఏర్పరుచుకొన్న మైత్రీచిహ్నాలను ధరించాం. నిర్మలమైన సఖ్యాన్ని శివుడితో కుదుర్చుకొన్నాను. దీనికి బ్రహ్మాదులు అందరూ ఎంతో సంతోషించారు.

**మ. మదీయనామ నిర్వచనంబులును రుద్రునితోడి రణంబుననైన జయంబు తెఱంగును నీ కెఱింగించితి. 455**

**ప్రతిపదార్థం:** మదీయ= నాయొక్క; నామ= నామధేయాల; నిర్వచనంబులునున్= వ్యుత్పత్తులూ; రుద్రునితోడి= శివుడితో జరిగిన; రణంబునన్= యుద్ధంలో; ఐన= లభించిన; జయంబు= విజయం తాలూకు; తెఱంగునున్= విధానమూ; నీకున్= నీకు; ఎఱింగించితిన్= తెలియజేశాను.

**తాత్పర్యం:** నా నామధేయాల వ్యుత్పత్తులూ, శివుడితో చేసిన యుద్ధంలో లభించిన విజయవిధానమూ నీకు తెలియజేశాను.

**క. నానారూపంబుల ని । ట్లేను బ్రవర్తింతు జగము లిన్నింటను, నీ**
**శానుఁడు నభవుఁడు నమృతుఁడు । నైన శివుని నీవుఁ గొలువు మర్జున! యెపుడున్. 456**

**ప్రతిపదార్థం:** అర్జున!; నానారూపంబులన్= అనేక రూపాలతో; ఇట్లు= ఇలా; ఏను= నేను; జగములు+ఇన్నింటనున్= ఇన్ని జగత్తులలోనూ; ప్రవర్తింతున్= సంచరిస్తూ ఉంటాను; నీవున్= నీవు కూడా; ఎపుడున్= ఎల్లవేళలా; ఈశానుఁడున్= ప్రభువూ; అభవుఁడున్= పుట్టుకలేనివాడూ; అమృతుఁడున్= మృతిలేనివాడూ; ఐన= అయినటువంటి; శివునిన్= శివుడిని; కొలువుము= సేవించుము.

**తాత్పర్యం:** అర్జునా! ఇట్లా అనేకరూపాలలో నేను ఈ జగత్తులన్నింటా సంచరిస్తూ ఉంటాను. ఈశానుడూ, అభవుడూ, అమృతుడూ అయిన శివుడిని నీవు కూడా ఎల్లవేళలా అర్చించుము. (12-330-67,81).

**తే. ఏను రక్షింప జయము నీ కెసకమెసఁగె । సమరమున శూలపాణియై శత్రుకోటి**
**నీదు మునుమున వధియించు నిరుపమాన । తేజు రుద్రుఁగా నెఱుఁగుము ధీరచిత్త!' 457**

**ప్రతిపదార్థం:** ధీరచిత్త!= ధీరమైన హృదయం కలవాడా!; సమరమునన్= కురుక్షేత్ర సంగ్రామంలో; ఏను= నేను; రక్షింపన్= కాపాడటం వలన; జయము= విజయం; నీకున్= నీకు; ఎసకము+ఎసఁగెన్= ఒప్పించింది; నీదు+మునుమునన్= నీ మునుముందట (అగ్రభాగంలో); శూలపాణియై= శూలం చేతబట్టినవాడై; శత్రుకోటిన్= శత్రుసమూహాన్ని; వధియించు= సంహరించేటువంటి నిరుపమాన తేజున్= సాటిలేని తేజస్సుకల వానిని; రుద్రున్+కాన్= రుద్రుడుగా; ఎఱుఁగుము= తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** ధీర హృదయుడా! నేను రక్షించాను కాబట్టి కురుసంగ్రామంలో నీకు జయం లభించింది. నీ అగ్రభాగంలో శూలపాణిగా రుద్రుడు సంచరిస్తూ నీకంటె ముందే నీ శత్రువులను సంహరించాడు. ఇదికూడా నీవు తెలిసికొనటం మంచిది.'

**వ. అనియె నని చెప్పిన విని జనమేజయుండు. 458**

**ప్రతిపదార్థం:** అనియెన్= శ్రీకృష్ణుడు అర్జునునితో ఇలా అన్నాడు; అని చెప్పినన్= అని వైశంపాయనుడు తెలియజేస్తే; విని= ఆలకించి; జనమేజయుఁడు= జనమేజయమహారాజు - ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడని వైశంపాయనుడు తెలుపగా, జనమేజయమహారాజు మరల ప్రశ్నిస్తున్నాడు.

**క. ' అరుదే సర్వేశ్వరుఁ డగు । హరి తోడుగ జయము గొనుట యర్జునునకు? న**
**ప్పురుషోత్తము బాంధవులై । పరఁగిరి; పెఱ వినుతు లేల పాండుసుతులకున్?' 459**

**ప్రతిపదార్థం:** సర్వేశ్వరుఁడు+అగు= సర్వేశ్వరుడైన; హరి= విష్ణుమూర్తి; తోడుగన్= సహాయుడుగా ఉండగా; జయము+కొనుట= జయాన్ని పొందటం; అర్జుననకున్= కిరీటికి; అరుదే?= దుర్లభమా?; ఆ+పురుషోత్తము= ఆ పురుషోత్తముడైన ఆ శ్రీకృష్ణుడికి; బాంధవులై= బంధువులై; పరఁగిరి= అలరారిరి; పాండుసుతులకున్= ఆ పాండవులకు; పెఱ వినుతులు= మరింక వేరే స్తుతులు; ఏల?= ఎందుకూ?

**తాత్పర్యం:** వైశంపాయనా! సర్వేశ్వరుడైన హరి తోడుగా ఉంటే కురుసంగ్రామంలో అర్జునుడు విజయుడయ్యాడు. ఇందులో ఆశ్చర్యం ఏముంది? అదీగాక ఆ పురుషోత్తముడికి మా పాండవులు బంధువులయ్యారు. ఇంతకన్నా ప్రశంసావాక్యాలు ఏమి కావాలి చెప్పుము?

**వ. అని పలికి యిట్లనియె. 460**

**ప్రతిపదార్థం:** అని= అని; పలికి= మాట్లాడి; ఇట్లు+అనియెన్= ఇంకా జనమేజయుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి జనమేజయుడు మళ్ళీ ఇట్లా అడుగుతున్నాడు.

**క. నారదుఁడు పరమపురుషుని । కారుణ్యము వడసి వచ్చి క్రమ్మఱ నరునిన్**
**నారాయణునిం గాంచుట । సారమతిం జెప్పి తీవు సంయమివర్యా! 461**

**ప్రతిపదార్థం:** సంయమివర్యా!= నిగ్రహ సంపన్నులలో (మునులలో) అగ్రగణ్యుడా!; నారదుఁడు= నారదమహర్షి; పరమపురుషుని= పరాత్పరుడైన శ్రీమహావిష్ణువుయొక్క; కారుణ్యమున్= దయను; పడసి= శ్వేతద్వీపంలో పొంది; వచ్చి; క్రమ్మఱన్= మళ్ళీ; నరునిన్= నరుడినీ; నారాయణునిన్= నారాయణుడినీ; కాంచుట= బదరికాశ్రమంలో దర్శించటం; సారమతిన్= శ్రేష్ఠమైన మతితో; ఈవు= నీవు; చెప్పితి(వి)= చెప్పావు.

**తాత్పర్యం:** ఓ వైశంపాయనా! శ్వేతద్వీపానికి వెళ్ళి నారదమహర్షి శ్రీమహావిష్ణువును సందర్శించుకుని తిరిగివచ్చి బదరికాశ్రమంలో నరనారాయణులను కలిసికొన్నాడు - అన్నదాకా ఆ కథ చెప్పావు. సారమతితో వివరించావు. బాగుంది.

**వ. తదీయసల్లాప విశేషంబులు వినవలతుం జెప్పుమనిన నప్పుడమిఱేనికి వైశంపాయనుం డిట్లనియె. 462**

**ప్రతిపదార్థం:** తదీయ= ఆ ముగ్గురి; సల్లాప= సంభాషణల; విశేషంబులున్= వివరాలూ; వినన్+వలతున్= వినాలని అనుకుంటున్నాను; చెప్పుము+అనినన్= చెప్పు అని అడిగితే; ఆ+పుడమిఱేనికిన్= ఆ రాజుగారికి; వైశంపాయనుండు= వైశంపాయనుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** వారి సంభాషణలను వినగోరుతున్నాను చెప్పు మని ఆ రాజు అడుగగా వైశంపాయనుడు ఇట్లా వివరించసాగారు.

### నరనారాయణ నారద సల్లాపప్రకారము (సం. 12-331-36)

**క. నారదుఁడు వచ్చి నరునిన్ । నారాయణుఁగాంచి భక్తినమ్రుండైనన్**
**వా రతనికి నాతిథ్యము । గారవమున నడపి యడుగఁగా వారలతోన్. 463**

**ప్రతిపదార్థం:** నారదుఁడు= నారదమహర్షి; వచ్చి= శ్వేతద్వీపంనుంచి బదరికాశ్రమానికి వచ్చి; నరునిన్= నరుడినీ; నారాయణున్= నారాయణుడినీ; కాంచి= దర్శించి; భక్తినమ్రుండైనన్= భక్తితో వంగి నమస్కరించగా; వారు= నరనారాయణులు; అతనికిన్= ఆ నారదమహర్షికి; ఆతిథ్యమున్= అతిథిమర్యాదను; గారవమునన్= ప్రేమతో (గౌరవంతో); నడపి= చేసి; అడుగఁగాన్= కుశల విశేషాదులు అడిగితే; వారలతో= ఆ ఇద్దరితోనూ.

**తాత్పర్యం:** నారదమహర్షి శ్వేతద్వీపంనుండి బదరికాశ్రమానికి తిరిగి వచ్చాడు. నరనారాయణులను మళ్ళీ దర్శించాడు. వారు ఆ మహర్షికి ఆదరంతో అతిథిమర్యాదలు జరిపారు. కుశలం అడిగారు. శ్వేతద్వీపం విశేషాలు అడిగారు. అప్పుడు వారితో. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. అద్దేవముని యిట్లనియె. 464**

**ప్రతిపదార్థం:** ఆ+దేవముని= దేవర్షి అయిన ఆ నారదుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** దేవర్షి నారదుడు ఇట్లా చెప్పాడు.

**క. శ్వేతద్వీపంబున భవ । దాతతకృపఁ గానఁ బోలె నచ్యుతుఁ దద్రూ**
**పాతిశయము మీ చందమ । యాతని కడఁ గంటి మిమ్ము నద్భుత మెసఁగన్. 465**

**ప్రతిపదార్థం:** భవత్= మీయొక్క; ఆతత కృపన్= విస్తారమైన దయవలన; శ్వేతద్వీపంబునన్= శ్వేతద్వీపంలో; అచ్యుతున్= శ్రీమహావిష్ణువును; కానన్+పోలెన్= దర్శించటమయ్యింది (దర్శించగలిగాను); తద్= ఆ విష్ణుమూర్తియొక్క; రూప+అతిశయము= రూపవైభవం; మీ+చందము+అ= అచ్చం మీవంటిదే; ఆతని కడన్= ఆయన సన్నిధిలో; అద్భుతము+ఎసఁగన్= ఆశ్చర్యజనకంగా (ఆశ్చర్యం ఎసగేట్టు); మిమ్మున్= మీ ఇద్దరినీ; కంటిన్= దర్శించాను.

**తాత్పర్యం:** 'నరనారాయణులారా! మీ దయావిశేషంవలన నేను శ్వేతద్వీపంలో శ్రీమహావిష్ణువును దర్శించగలిగాను. ఆయన రూపం అచ్చం మీవలెనే ఉన్నది. తేడా ఏమీ లేదు. ఇంకా ఆశ్చర్యం ఏమిటంటే - మిమ్ములను ఇద్దరినీ ఆయన సన్నిధిలోనూ చూశాను.

**క. శ్వేతులు నింద్రియ వర్జిత । చేతస్కులునైన నరులఁ జెలువుగ మౌనో**
**పేతులఁ గంటి నచట వా । రాతేజోమూర్తికిని దయాపాత్రంబుల్. 466**

**ప్రతిపదార్థం:** అచటన్= ఆ శ్వేతద్వీపంలో; శ్వేతులు= తెల్లని శరీరంకలవారూ; ఇంద్రియవర్జిత= ఇంద్రియాలచే విసర్జించబడిన; చేతస్కులున్= మనస్సులు కలవారూ (ఇంద్రియ వికారాలకు లొంగని మనస్సులు కలవారూ); చెలువుగన్= అందంగా; మౌన+ఉపేతులన్= మౌనదీక్షతో ఉన్నవారూ; ఐన= అయినటువంటి; నరులన్= పురుషులను; కంటిన్= చూసాను. (చెలువుగన్+ కంటిన్= అందంగా తిలకించాను); వారు= ఆ శ్వేతశరీరులైన నరులు; ఆ+తేజోమూర్తికిని= తేజఃస్వరూపుడైన ఆ విష్ణుమూర్తికి; దయాపాత్రంబుల్= కృపాపాత్రులు (దయకు అర్హమైనవారు).

**తాత్పర్యం:** ఆ శ్వేతద్వీపంలో ఇంద్రియనిగ్రహం కలిగి, మౌనదీక్షతో తపస్సు చేసికొంటున్న శ్వేతశరీరులైన నరులను దర్శించాను. వారందరూ విష్ణుమూర్తికి దయాపాత్రులు కావటాన్ని గుర్తించాను.

**వ. అద్దేవుండు వత్సలుండయి వారలతోడం గూడి విహరించుచుండు నామీఁదం గృపసేసి క్షేత్రజ్ఞప్రకారంబు సకలంబును దేటపడ ననుగ్రహించి యాగామినిజప్రాదుర్భావంబుల తెఱంగెల్ల నెఱింగించె. శ్వేతద్వీపం**

**బనునది శాంతిస్వరూపం బందు సూర్యసోమాంశువ్యాప్తియు వాయుసంచారంబును లే దా లోకనాథునకు నేకాంతిక జనంబులం గడచిన ప్రియులు లేకునికి యెఱింగి యేకాంతినై యుండితి; నవ్విభుండువీడుకొలుప మీకడకు వచ్చితి; నిచ్చట మీకుం గారుణ్యభాజనంబనై యుండెద ననుటయు వార లతని కిట్లనిరి. 467**

**ప్రతిపదార్థం:** ఆ+దేవుండు= ఆ విష్ణుమూర్తి; వత్సలుండయి= వాత్సల్యం కలవాడై; వారలతోడన్= ఆ శ్వేతశరీరులతో; కూడి= కలిసి; విహరించుచుండున్= విహరిస్తుంటాడు; నామీఁదన్= నా పట్ల; కృప+చేసి= దయను వహించి; క్షేత్రజ్ఞప్రకారంబు= క్షేత్రజ్ఞుని పద్ధతి; సకలంబును= అంతా; తేటపడన్= స్పష్టమయ్యేట్టు; అనుగ్రహించి= నాకు ఉపదేశించి; ఆగామి= రాబోయే; నిజ= తనయొక్క; ప్రాదుర్భావంబులన్= జన్మలయొక్క (అవతారాల); తెఱంగు+ఎల్లన్= విధానమంతా; ఎఱింగించెన్= తెలియజేశాడు; శ్వేతద్వీపంబు+అనునది= శ్వేతద్వీపం అనేది; శాంతి స్వరూపంబు= పూర్తిగా శాంతియే రూపంగా ధరించిన చోటు; అందున్= అక్కడ; సూర్యసోమ= సూర్యచంద్రుల; అంశు= కిరణాల; వ్యాప్తియున్= ప్రసారంకానీ; వాయు= గాలియొక్క; సంచారంబునున్= సంచారంకానీ; లేదు= లేనేలేదు; ఆ+లోకనాథునకున్= జగదీశ్వరుడైన ఆ విష్ణుమూర్తికి; ఏకాంతికజనంబులన్= ఏకాగ్రచిత్తులైన వ్యక్తులను; గడచిన= మించిన; ప్రియులు= ఇష్టులు; లేక+ఉనికి= లేకపోవటం (లేరన్న సంగతి); ఎఱింగి= గుర్తించి; ఏకాంతినై= నేను కూడా ఏకాగ్రచిత్తుడనై; ఉండితిన్= ఉన్నాను; ఆ+విభుండు= ఆ ప్రభువు; వీడుకొలుపన్= సాగనంపగా; మీకడకున్= మీ దగ్గరకి; వచ్చితిన్= వచ్చాను; ఇచ్చటన్= ఇక్కడ ఈ బదరికాశ్రమంలో; మీకున్= మీ ఇద్దరికీ; కారుణ్యభాజనంబను+ఐ= దయాపాత్రుడనై; ఉండెదన్= ఉంటాను (నివసిస్తాను); అనుటయున్= అనేసరికి; వారలు= ఆ నరనారాయణులు; అతనికిన్= ఆ నారదమహర్షికి; ఇట్లు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** ఆ విష్ణుమూర్తి వాత్సల్యంతో వారితో కలిసి విహరిస్తుండగా, నామీద గల దయతో క్షేత్రజ్ఞుడిని గురించినదంతా తేటపడేటట్లు చేసి, రాబోయే తన జన్మలను తెలియచేశాడు. శ్వేతద్వీపం అనేది శాంతి స్వరూపం. అందులో సూర్యచంద్రకాంతులుగానీ, వాయుప్రసారంగానీ లేవు. విష్ణువుకు ఏకాగ్రచిత్తుల కంటె మించిన ఇష్టులు లేరని తెలిసికొని నేనుకూడా ఏకాంతినై ఉన్నాను. విష్ణువు వీడ్కోల్పగా మీ దగ్గరకు వచ్చాను. ఇక్కడ మీఇద్దరి దయకూ పాత్రుడనై నివసిస్తాను' అనగా ఆ నరనారాయణులు నారదుడితో ఇట్లా అన్నారు:

**తే.** **' పడసి తద్దేవుఁ గానఁ , దద్భాషణములు । వింటి, నీవు ధన్యుండవు, గంటి మేము**
**నచట నీయున్న తెఱఁగెల్ల, నిచట నునికి । మేలకాక - యుండుము - పరమేష్ఠితనయ! 468**

**ప్రతిపదార్థం:** పరమేష్ఠితనయ!= బ్రహ్మపుత్రా! ఓ నారదా!; ఆ+దేవున్= ఆ విష్ణుమూర్తిని; కానన్= దర్శించటం; పడసితి(వి)= పొందావు (కానన్+పడసితివి= దర్శించగలిగావు); తద్= ఆయనయొక్క; భాషణములు= పలుకులు; వింటి(వి)= విన్నావు; నీవు; ధన్యుండవు= నిజంగా చరితార్థుడవే ; ఏమున్= మేము కూడా; అచటన్= ఆ శ్వేతద్వీపంలో; నీ+ఉన్న= నీవు నివసించిన (ప్రవర్తించిన); తెఱఁగు+ఎల్లన్= తీరు అంతా; కంటిమి= చూశాం; ఇచటన్= ఈ బదరికాశ్రమంలో; ఉనికి= నీవు ఉండటం; మేలు+అ+కాక= మేలే కదా!; ఉండుము.

**తాత్పర్యం:** 'ఓ నారదా! విష్ణుమూర్తిని దర్శించగలిగావు, ఆయనతో సంభాషించగలిగావు. నీవు నిజంగా ధన్యుడవయ్యా! మేము కూడా అక్కడి నీ ప్రవర్తనను తిలకించాము. ఇక్కడ ఉంటాను - అంటున్నావు. మంచిదే. ఉండుము.

**క.** **దైవముఁ బిత్ర్యంబును ద । ద్దేవసమారాధనంబు దెల్లము శ్రుతి సం**
**భావిత మది తత్పరతన్ । నీ వేకాంతివయి నిలువు నిర్మలహృదయా!' 469**

**ప్రతిపదార్థం:** నిర్మలహృదయా!= నిర్మలమైన హృదయం కలవాడా!; దైవమున్= దైవమూ (దేవసంబంధమైనది= దైవము, ఇష్టదేవతారాధన); పిత్ర్యంబునున్= పిత్ర్యమూ (పితృదేవతారాధన) అనే పేరులతో ఉన్న; తద్+దేవ+సమారాధనంబు= ఆ దైవార్చన; అది; శ్రుతి+సంభావితము= వేదప్రతిపాదితం; తెల్లము= స్పష్టం (అది తెల్లము= ఆ విషయం స్పష్టం); తత్పరతన్= వాటిపట్ల ఆసక్తితో; నీవు; ఏకాంతివి+అయి= ఏకాగ్రచిత్తుడవై; నిలువు(ము)= ఉండుము.

**తాత్పర్యం:** నిర్మలాంతరంగా! దైవమూ, పిత్ర్యమూ అనే ఆరాధనలు వేదప్రతిపాదితాలు అన్న సంగతి స్పష్టమేకదా! నీవు వాటిపట్ల భక్తిశ్రద్ధలతో (తాత్పర్యంతో) ఇక్కడ ఉండుము.'

**ఆ. అనిన సంతసిల్లి యద్దేవముని వేయు । దివ్యవత్సరములు భవ్యతపము**
**నియతి నాచరించెఁ బ్రియమున వారు ద । న్నాదరింపఁగాఁ దదాశ్రమమున. 470**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నరనారాయణులు అనుమతించగా; సంతసిల్లి= సంబరపడి; ఆ+దేవముని= ఆ నారదమహర్షి; వారు= నరనారాయణులిద్దరూ; ప్రియమునన్= ప్రేమతో; తన్నున్= తనను; ఆదరింపఁగాన్= ఆదరిస్తూండగా; తద్+ఆశ్రమమునన్= వారి ఆశ్రమంలో; వేయు= వెయ్యి; దివ్యవత్సరముల్= దివ్యసంవత్సరాలు (మానుష సంవత్సరాలు కాదు - దివ్యవత్సరాలు); భవ్యతపమున్= పవిత్రమైన తపస్సును; నియతిన్= నియమంతో; ఆచరించెన్= చేసాడు.

**తాత్పర్యం:** నరనారాయణులు ఇట్లా అనుమతించేసరికి నారదుడు సంతోషించాడు. ఆ బదరికాశ్రమంలోనే వేయి దివ్యసంవత్సరాలపాటు భవ్యమైన తపస్సు చేసాడు. అంతకాలమూ నరనారాయణులు ప్రేమగా నారదుడిని ఆదరించారు.

**వ. అ ట్లేకాంతియై తపంబుసేసి యత్యంతశాంతి నొంది నారదుండు నరనారాయణుల వీడ్కొని హిమవన్నగంబునకుం జని తన యాశ్రమంబునందు బృందారకాది విశిష్టపూజితుండై యుండె నని చెప్పిన విని సంప్రీతుండైన జనమేజయుతో వెండియు వైశంపాయనుం డిట్లనియె. 471**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఏకాంతియై= ఏకాగ్రచిత్తుడై; తపంబు+చేసి= తపస్సుచేసి; అత్యంతశాంతిన్= మిక్కిలి శాంతిని; ఒంది= పొంది; నారదుండు= నారదమహర్షి; నరనారాయణులన్= నరనారాయణులనిద్దరినీ; వీడ్కొని= విడిచి; హిమవత్+నగంబునకున్= హిమవత్పర్వతమునకు; చని= వెళ్ళి; తన= తనయొక్క; ఆశ్రమంబునందున్= తపోవనంలో; బృందారక+ఆది= దేవతలూ మొదలైన; విశిష్ట= విశిష్టులచేత; పూజితుండై+ఉండెన్= అర్చించబడుతూ ఉన్నాడు; అని; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; సంప్రీతుండైన= సంతోషించినవాడైన; జనమేజయుతోన్= జనమేజయుడితో; వెండియున్= మళ్ళీ; వైశంపాయనుండు= వైశంపాయనుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా ఏకాగ్రచిత్తుడై తపస్సుచేసి నారదుడు ప్రశాంతిని పొందాడు. వారివద్ద సెలవు తీసికొని, హిమాలయాలకు వెళ్ళి తన ఆశ్రమంలో గొప్పవారిచేత సేవించబడ్డాడు' అని చెప్పగా జనమేజయుడు సంతసిల్లాడు. వైశంపాయనుడు ఇట్లా కొనసాగించాడు.

**ఉ. ' పాండవవంశవర్య! పటుపాపవినాశనియైన యిక్కథన్**
**నిండుమనంబుతో వినుట నీవు గృతార్థుఁడ వైతి శాశ్వతా**
**ఖండసుఖాత్ము విష్ణు నధికస్థిరభక్తి సమాశ్రయింపు నీ**
**కొండొకఁ డేల? యిమ్మెయి మహోన్నతిఁ జేయు జగత్త్రయంబునన్. 472**

**ప్రతిపదార్థం:** పాండవ వంశ= పాండవవంశంలో; వర్య!= శ్రేష్ఠమైనవాడా!; పటుపాప= మహాపాపాలను; వినాశని+ఐన= విధ్వంసం చేయగలిగిన; ఈ+కథన్= ఈ వృత్తాంతాన్ని; నిండు మనంబుతోన్= నిండు మనస్సుతో; వినుటన్= వినటంచేత; నీవు; కృతార్థుడవు+ఐతి(వి)= కృతకృత్యుడవయ్యావు; శాశ్వత= శాశ్వతమైన; అఖండ= అఖండమైన (పరిపూర్ణమైన); సుఖ+ఆత్మున్= ఆనందమయుడైన (ఆనందరూపి); విష్ణున్= విష్ణుమూర్తిని; అధిక= అధికమైన; స్థిర= స్థిరమైన; భక్తిన్= భక్తితో; సమాశ్రయింపు(ము)= శరణుపొందుము; నీకున్= నీకు; ఒండొకఁడు= ఇతరులకు; ఏల?= ఎందుకు?; ఈ+మెయి= ఈ విధానం; జగత్+త్రయంబునన్= ముల్లోకాలలోనూ; మహోన్నతిన్+చేయున్= (నీకు) గొప్ప ఉన్నతిని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఓ పాండవోత్తమా! మహాపాపాలను కూడా కడిగివేయగలిగిన ఈ కథను నీవు నిండుమనసుతో ఆలకించావు. కృతార్థుడవయ్యావు. శాశ్వత అఖండ సుఖస్వరూపుడైన విష్ణుమూర్తిని సుస్థిరభక్తితో సమాశ్రయించుము. ఇతర దైవాలు ఎందుకు! విష్ణుమూర్తినే ఆశ్రయించుము. ఆ విష్ణుభక్తి నిన్ను ముల్లోకాలలోనూ మహోన్నతుడిని చేస్తుంది.

**క. లే వుభయలోకములు హరి । పై విద్వేషంబు గలుగు పాపాత్ములకున్,**
**భూవర! యట్టి జనుల పితృ । దేవతలకు నరక మగుటఁ దెలుపును శ్రుతులున్. 473**

**ప్రతిపదార్థం:** భూవర!= జనమేజయ మహారాజా!; హరిపైన్= విష్ణుమూర్తిమీద; విద్వేషంబు+కలుగు= ద్వేషం పెంచుకున్న; పాపాత్ములకున్= పాపిష్ఠులకు; ఉభయలోకములున్= ఇహపరలోకాలు రెండూ; లేవు; అట్టి జనుల= అటువంటి పాపాత్ముల; పితృదేవతలకున్= పితృదేవతలకు కూడా (పెద్దలకు); నరకము= నరకలోకం; అగుటన్= ప్రాప్తించటాన్ని; శ్రుతులున్= వేదాలుకూడా; తెలుపును= తెలియజేస్తున్నాయి.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! హరిని ద్వేషించే పాపాత్ములకు ఇహపరలోకాలు (పుట్టగతులు) ఉండవు. వారి పితృదేవతలకు కూడా నరకమే ప్రాప్తిస్తుం దని వేదాలు చెబుతున్నాయి.

**క. హరి యాత్మ యెల్లవారికి । నరవర! తన యాత్మపై మనంబున దృఢత**
**త్పరభావము లేని కుజనుఁ । బొరయవె యాపదలు? వేఱ బోధన మేలా? 474**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; ఎల్లవారికిన్= అందరికీ; హరి= విష్ణుమూర్తి; ఆత్మ; తన+ఆత్మపైన్= ఇలా తనదే అయిన ఆత్మమీద; దృఢ+తత్పర+భావము= దృఢమైన (భక్తి) తాత్పర్యం; లేని= లేనటువంటి; కుజనున్= దుర్జనుడిని; ఆపదలు= దుఃఖాలు; పొరయవె?= చుట్టుముట్టవా?; వేఱు+అ= వేరే; బోధనము= జ్ఞానం; ఏలా?= ఎందుకు?

**తాత్పర్యం:** మహారాజా! అందరికీ శ్రీ విష్ణువే ఆత్మ. మరి తమ ఆత్మమీద తమకే భక్తితాత్పర్యాలు లేవంటే ఆ దుర్జనులు ఆపదలపాలు కారా?

**క. మునివరుఁడు గంధవతి నం । దనుండు నా గురుఁడు గరుణ దళుకొత్తఁగఁ జె**
**ప్పిన వాక్యంబుల యర్థము । లనఘా! యివి నీవు వీని నలవఱుపు మదిన్. 475**

**ప్రతిపదార్థం:** అనఘా!= పవిత్రుడా!; గంధవతి= మత్స్యగంధి అయిన సత్యవతియొక్క; నందనుండు= కుమారుడూ; నా+గురుఁడు= నాకు గురువుగారూ అయిన; మునివరుఁడు= వ్యాసమునీంద్రుడు; కరుణ= దయ అనేది; తళుకొత్తఁగన్= చిగురించగా (ప్రకాశించగా); చెప్పిన= నాకు ఉపదేశించిన; వాక్యంబుల= వాక్యాల; అర్థములు= భావాలు; ఇవి= ఇవి (ఇంతవరకూ నేను నీకు చెప్పినవి); నీవు= నీవునూ; మదిన్= మనస్సులో; వీనిన్= వీటిని; అలవఱుపు(ము)= అలవరుచుకొమ్ము (అభ్యసించుము).

**తాత్పర్యం:** జనమేజయా! నా గురువు సాత్యవతేయ మునీంద్రుడు దయతో నాకు చెప్పిన మాటల సారాంశం అంతా నీకు చెప్పాను. వీటిని నీవు అర్థం చేసికొని ఆచరణలో అలవాటు చేసికొమ్ము.

**శా.** **విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తి విఖ్యాతుఁ గృ**
**ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుం గా విప**
**శ్చిద్వంద్యంబగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధ**
**ర్మాద్వైతుండు సరోజలోచనుఁడకా కన్యుండు తద్వాచ్యుఁడే! 476**

**ప్రతిపదార్థం:** విద్వత్= విద్వాంసులకు; మోదవిధాయిన్= ఆనందాన్ని కలిగించేవాడూ; నిర్మల= పావనమైన; వచః= వాక్కుల యొక్క; విస్ఫూర్తి= విస్ఫురణతో; విఖ్యాతున్= ప్రఖ్యాతి పొందినవాడూ అయిన; కృష్ణద్వైపాయనున్= కృష్ణద్వీపంలో పుట్టిన వ్యాసుడిని; నీవు= నీవునూ; విభున్= ప్రభువైన; నారాయణున్+కాన్= విష్ణుమూర్తిగా; ఎఱుంగుము= తెలిసికొమ్ము; విపశ్చిత్= పండితులచేత; వంద్యంబు+అగు= నమస్కరింపదగినది అయిన; భారత+అధ్యయనమున్+చేయంగన్= భారతాన్ని అవగాహన చేసికొనటానికి; శక్తుండు= సమర్థుడు; ధర్మ+అద్వైతుఁడు= ధర్మానికి అభిన్నుడు (ధర్మస్వరూపుడు) అయిన; సరోజలోచనుఁడు+అ+కాక= పుండరీకాక్షుడే తప్ప; అన్యుండు= మరొకడు; తద్= శక్తుడు అనే ఆ మాటతో; వాచ్యుఁడే= చెప్పబడతాడా?

**తాత్పర్యం:** మహావిద్వాంసులకు ఆనందాన్ని కలిగించే వచోవిలాసానికి పెట్టిందిపేరు మా గురువుగారు వ్యాసులవారు. ఆయనను సాక్షాత్తూ నారాయణుడుగా తెలియుము. మహాభారతానికి పండితులంతా నమస్కారం పెడతారు. అటువంటి భారతాన్ని అధ్యయనం చేయాలి అంటే ధర్మస్వరూపుడైన పుండరీకాక్షుడికి తప్ప మరొకరికి ఎవరికైనా అయ్యే పనేనా!

**క.** **బహు విధ ధర్మంబులు లో । క హితంబుగ నిట్లు సెప్పఁగా నిర్మలతా**
**మహనీయధిషణుఁడగు న । మ్మహాత్మునక తీరుఁ గురుసమాజవరేణ్యా!' 477**

**ప్రతిపదార్థం:** కురుసమాజవరేణ్యా!= కురువంశంలో ఉత్తముడా (కౌరవసమూహంలో అగ్రగణ్యుడా!) ఓ జనమేజయా!జనమేజయుడా!; బహువిధ= రకరకాలైన; ధర్మంబులు= ధర్మాలు; లోకహితంబుగన్= లోకానికి హితంగా; ఇట్లు= ఈ విధంగా; చెప్పఁగాన్= చెప్పటానికి; నిర్మలతా= నిర్మలత్వంతో; మహనీయ= గొప్పదైన; ధిషణుఁడు+అగు= బుద్ధి కలిగిన; ఆ+మహాత్మునకున్+అ= ఆ మహానుభావుడు వ్యాసుడికే; తీరున్= చెల్లును (తగును).

**తాత్పర్యం:** కురువంశసంభవుల బృందంలో ఉత్తముడవైన ఓ జనమేజయా! రకరకాల ధర్మాలు ఇట్లా లోక శ్రేయస్సుకొరకు చెప్పటమంటే అది మా గురువుగారికే తగును. ఆయన మహానుభావుడు. నిర్మలమూ, మహనీయమూ అయిన బుద్ధివైభవం కలవాడు. అందుకని అది ఆయనకే చెల్లింది.'

**విశేషం:** సమాజం అంటే మానవసమూహం అని అర్థం. సమజం అంటే పశువుల గుంపు అని. కురుసమాజమంటే కురువంశజులైన మానవుల సమూహం. అందులో జనమేజయుడు వరేణ్యుడు అని సంబోధన.

### హయగ్రీవదేవ మాహాత్మ్యాభివర్ణనము (సం. 12-335-9,10)

**వ.** **అనిన విని సవిశేష సమ్మదుండై జనమేజయుండు వైశంపాయనుతో 'హయశిరోభాసితుం డగు విష్ణుండు వేధకు సన్నిహితుండయ్యె నని చెప్పితి వప్పురుషోత్తముం డప్పు డేమిటికై యా మూర్తి వహించె? నత్తెఱం గెఱింగింపు' మని యడిగిన నమ్ముని య మ్మనుజపతి కిట్లనియె.. 478**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; సవిశేష= అత్యధికంగా; సమ్మదుండై= సంతోషించినవాడై; జనమేజయుండు= జనమేజయుడు; వైశంపాయనుతోన్= వైశంపాయన మహర్షితో; హయశిరః= గుఱ్ఱపుతలతో; భాసితుండు+అగు= విరాజిల్లేవాడై; విష్ణుండు= విష్ణుమూర్తి; వేధకున్= బ్రహ్మదేవునికి; సన్నిహితుండు= దగ్గరకి వచ్చినవాడు; అయ్యెన్= అయ్యాడు (ఆ రూపంలో బ్రహ్మను సమీపించాడు); అని= అని; చెప్పితి(వి)= చెప్పావు (శాంతి - 6-412); ఆ+పురుషోత్తముండు= ఆ విష్ణువు; అప్పుడు= ఆ సమయంలో; ఏమిటికై= ఎందుకోసమని; ఆ మూర్తి= ఆ రూపం (హయగ్రీవ రూపం); వహించెన్?= వహించాడు?; ఆ+తెఱంగున్= ఆ రీతి అంతా; ఎఱింగింపుము= తెలియజెప్పుము; అని= అని; అడిగినన్= అడిగితే; ఆ+ముని= ఆ వైశంపాయనముని; ఆ+మనుజపతికిన్= ఆ జనమేజయమహారాజుకి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడు చెప్పినదంతా వినిన జనమేజయుడు 'గుఱ్ఱపుతలతో ఒప్పే విష్ణువు బ్రహ్మను సమీపించా డని చెప్పావు. ఎందు కాయన ఆ రూపాన్ని ధరించాడు? ఆ వివరములు చెప్పు' మని అడుగగా వైశంపాయనుడిట్లా చెప్పసాగాడు.

**సీ.** **ప్రళయకాలంబున జలముల విష్ణుండు । యోగనిద్రారతి నొంది మేలు**
**కాంచి లోకంబులు గావింపఁ దలఁప న । హంకార మెసఁగె బ్రహ్మాభిధాన**
**కలితమై తన్నాభికమలంబునం దిట్లు । జనియించి యా బ్రహ్మ సకలసృష్టి**
**కాదిభూతములుగ వేదముల్ నాలుగు । గలిగించె నప్పు డక్కమలనాభు**

**తే.** **నందు మును లయించినట్టి గుణంబులు । మూఁటఁ దొలుత సత్త్వమునకుఁ దోఁపు**
**కలిమి దాననుండెఁ గమలోద్భవుఁడు రజ । స్తమము లసురలయ్యె ధరణినాథ!** **479**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= జనమేజయమహారాజా!; ప్రళయకాలంబునన్= సృష్టి అంతం అయినప్పుడు (జలప్రళయం వచ్చినపుడు); జలములన్= నీటిలో; విష్ణుండు= విష్ణుమూర్తి; యోగనిద్రారతిన్= యోగనిద్రపట్ల ఆసక్తి; పొంది= పొంది (యోగనిద్ర కానిచ్చి); మేలుకాంచి= మేల్కొని; లోకంబులు= లోకాలు; కావింపన్+తలఁపన్= సృష్టిస్తాను అనుకునేసరికి; బ్రహ్మ= బ్రహ్మ అనే; అభిధాన= పేరుతో; కలితమై= ఒప్పినదై; అహంకారము+ఎసఁగెన్= అహంకారం జనించింది; తద్+నాభికమలంబునందున్= ఆ విష్ణుమూర్తి పొక్కిలినుంచి (బొడ్డునుంచి) పుట్టిన పద్మంలో; ఇట్లు= ఈ విధంగా; జనియించి= జన్మించి; ఆ+బ్రహ్మ= ఆ బ్రహ్మదేవుడు; సకలసృష్టికిన్= మొత్తం (జరగబోయే) సృష్టికి అంతటికీ; ఆదిభూతములుగన్= మొట్టమొదటివిగా; వేదముల్= వేదాలు; నాలుగు= నాల్గు; కలిగించెన్= సృష్టించాడు; అప్పుడు= ఆ సమయాన; ఆ+కమలనాభునందున్= ఆ విష్ణుమూర్తిలో (కమలం నాభియందు కలవాడు); మును= (యోగనిద్రాసమయంలో) పూర్వకాలం; లయించినట్టి గుణంబులు= లీనమైన సత్త్వరజస్తమోగుణాలు; మూఁటన్= మూడింటిలోనూ; తొలుతన్= మొట్టమొదట; సత్త్వమునకున్= సత్త్వగుణానికి; తోఁపు+కలిమిన్= ఆవిర్భావం జరగటం వలన (తోఁచు-తోఁపు. తోఁచుట= ఉదయించుట); దానన్= ఆ సత్త్వగుణంలో (నాభికమలంలో);కమలోద్భవుఁడు= బ్రహ్మ; ఉండెన్= స్థిరపడ్డాడు; రజః+తమములు= రజోగుణతమోగుణాలు; అసురలు= రాక్షసులు; అయ్యెన్= అయ్యాయి.

**తాత్పర్యం:** జనమేజయా! ప్రళయకాలంలో యోగనిద్రకు ఉపక్రమించిన విష్ణుమూర్తి మేల్కొని 'జగత్తులను సృష్టిద్దాం' అనుకొన్నాడు. అనుకొనటమేమిటి - అహంకారం ఆవిర్భవించింది. దానికి బ్రహ్మ అనే పేరు ఏర్పడింది. విష్ణుమూర్తి నాభికమలంనుండి ఇట్లా జన్మించిన ఆ బ్రహ్మదేవుడు సృష్టికి శ్రీకారంగా వేదాలను నాల్గింటిని సృష్టించాడు. ప్రళయవేళ యోగనిద్రాసమయాన విష్ణుమూర్తిలో లీనమైపోయిన సత్త్వరజస్తమోగుణాలలో మొట్టమొదటగా సత్త్వగుణం ఆవిర్భవించింది. బ్రహ్మ ఆ సత్త్వగుణంలోనే ఉన్నాడు. తరువాత వెలువడ్డ రజస్తమోగుణాలు రాక్షసులు అయ్యాయి.

**క. వినుం కైటభుండు నా మధు । వనఁ బేర్చిన యద్దురాత్ము లవ్వేదములం**
**గొని వేగ చని రసాతల । మున వైచిరి గాఢబంధములు సేసి నృపా! 480**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; విను= ఆలకించుము; కైటభుండు+నాన్= కైటభుడు అనీ; మధువు+అనన్= మధువు అనీ;పేర్చిన= విజృంభించిన; ఆ+దురాత్ములు= ఆ దుష్టులు (రాక్షసులు); ఆ+వేదములన్+కొని= ఆ వేదాలను నాల్గింటినీ అపహరించి; వేగ+ చని= వేగంగా వెళ్ళి (పారిపోయి); గాఢబంధములు+చేసి= గట్టిగా కట్టివేసి; రసాతలమునన్= పాతాళంలో; వైచిరి= విసరివేశారు (దాచారు).

**తాత్పర్యం:** రాజా! కైటభుడు అనీ, మధువు అనీ ఇద్దరు దుష్టస్వభావులు ఉండేవారు. వాళ్ళు నాలుగు వేదాలనూ అపహరించుకొనిపోయి గట్టిగా కట్టేసి పాతాళంలో పారవైచారు.

**వ. దాన నవ్వేధ విహ్వలించి. 481**

**ప్రతిపదార్థం:** దానన్= అందువల్ల; ఆ+వేధ= ఆ బ్రహ్మదేవుడు; విహ్వలించి= బాధపడి.

**తాత్పర్యం:** దానితో ఆ బ్రహ్మదేవుడు బాధపడి.

**క. ' లావును దృష్టియు గతియును । నా వేదచయంబ నాకు నవి యడఁగిన నే**
**నేవిధి సృజింతు లోకము? । లే వాఁ డీ యెడరు తలఁగు నిం కెట్లొక్కో?' 482**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; లావును= బలమూ; దృష్టియున్= చూపూ; గతియునున్= ఆధారమూ (నడవడిక); ఆ+ వేదచయంబు+అ= ఆ వేదసమూహమే; అవి= ఆ వేదాలు; అడఁగినన్= అంతరించిపోతే; నేను= నేను; ఏ విధిన్= ఏ విధంగా; లోకములు= లోకాలు; సృజింతున్?= సృష్టిస్తాను?; ఏవాఁడు= ఏ వ్యక్తి; ఈ+ఎడరు= ఈ ఆపదను; ఇంకన్= ఇక ఏవిధంగా; ఎట్లు+ఒక్కో?= ఎట్లాగో ఏమిటో కదా; తలఁగున్= తప్పిస్తాడు;

**తాత్పర్యం:** 'నాకు బలమూ, చూపూ, ఆధారమూ - అన్నీ వేదాలే. అవే నశించిపోతే నే నింక జగత్తులను ఎట్లా సృష్టిస్తాను? ఈ ఆపదనుంచి నన్ను ఎవరు ఎలా తప్పించగలరు?

**వ. అని పలవించి. 483**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లాగ; పలవించి= దుఃఖించి.

**తాత్పర్యం:** ఇట్లా దుఃఖించి.

**ఆ. విష్ణు బహువిధముల వినుతింప నజ్జల । శాయి హయశిరంబు సకలవర్ణ**
**భాసురంబునైన పరమాద్భుతంపు రూ । పంబు దాల్చి వేదపరత నొంది. 484**

**ప్రతిపదార్థం:** విష్ణున్= విష్ణుమూర్తిని; బహువిధములన్= అనేక ప్రకారాలుగా; వినుతింపన్= స్తుతించేసరికి; ఆ+జలశాయి= ప్రళయ జలధిలో శయనించిన ఆ విష్ణుమూర్తి; హయశిరంబున్= గుఱ్ఱపు తలకలదీ; సకలవర్ణ= అన్ని రంగులూ కలిగి; భాసురంబు= ప్రకాశిస్తున్నదీ; ఐన= అయినటువంటి; పరమ+అద్భుతంపు+రూపంబు= మిక్కిలి ఆశ్చర్యకరమైన మూర్తి; తాల్చి= ధరించి; వేదపరతన్= వేదాన్వేషణ తత్పరతను; ఒంది= పొంది - 'నానామూర్తిభిరావృతమ్' - అని మూలంలో ఉంది. సకలవర్ణ భాసురము అన్నాడు తిక్కన.)

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు విష్ణుమూర్తిని బహువిధాలుగా స్తుతించాడు. ప్రళయజలధిలో నిద్రిస్తున్న విష్ణువు అప్పుడు హయగ్రీవరూపం ధరించాడు. గుఱ్ఱపుతల, వివిధ వర్ణాలతో ప్రకాశించే శరీరం - ఈ రూపంతో వేదాన్వేషణకు ఉపక్రమించాడు.

క. **పాతాళమునకుఁ జని యం । దాతతమై ప్రణవరూప మగు నాదం బు**
**ద్ద్యోతితము సేసె నది యా । దైతేయులు విని పటుప్రతాపం బెసఁగన్. 485**

**ప్రతిపదార్థం:** పాతాళమునకున్= పాతాళలోకానికి; చని= వెళ్ళి; అందున్= అక్కడ; ఆతతమై= సుదీర్ఘమూ; ప్రణవరూపము= ఓంకారరూపమూ; అగు= అయిన; నాదంబున్= ధ్వనిని; ఉద్ద్యోతితము+చేసెన్= మారుమ్రోగించాడు; అది= ఆ ప్రణవధ్వని; ఆ+దైతేయులు= ఆ రాక్షసులు ఇద్దరూ (మధుకైటభులు); విని= ఆలకించి; పటుప్రతాపంబు+ఎసఁగన్= గొప్ప శౌర్యం అతిశయించేటట్టు.

**తాత్పర్యం:** హయగ్రీవరూపంలో విష్ణువు పాతాళానికి వెళ్ళి అక్కడ సుదీర్ఘంగా ప్రణవధ్వని చేసాడు. అది విన్న మధుకైటభులు మహాప్రతాపంతో అటువైపు వచ్చారు.

క. **ఆ నాదము దెసకుం జన । దానవరిపుఁ డొండువలనఁ దా నరిగి తదీ**
**యానూనబంధపీడిత । లైన శ్రుతులు విడిచి తెచ్చి యజునకు నిచ్చెన్. 486**

**ప్రతిపదార్థం:** ఆ+నాదము+దెసకున్= ఆ ప్రణవధ్వని వైపు; చనన్= మధుకైటభులు రాగా; దానవరిపుఁడు= రాక్షసుల శత్రువైన విష్ణువు; ఒండువలనన్= మరొకవైపు; తాన్+అరిగి= తాను వెళ్ళి; తదీయ= వారియొక్క; అనూన= దృఢమైన; బంధ= బంధనాలతో; పీడితలు+ఐన= హింసింపబడుతున్న; శ్రుతులు= వేదాలు; విడిచి= కట్లు విప్పి (విడిపించి); తెచ్చి= తీసుకువచ్చి; అజునకున్= బ్రహ్మకు; ఇచ్చెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** ఆ ప్రణవధ్వని వినవస్తున్న వైపు పరుగుతీసారు మధుకైటభులు. అప్పుడు హయగ్రీవుడు మరొకవైపు వెళ్ళి, అక్కడ బంధపీడితాలై పడి ఉన్న వేదాలకు కట్టులు విప్పి వాటిని తీసికొనివచ్చి, బ్రహ్మకు అప్పగించాడు.

తే. **ఇచ్చి యెప్పటి యట్ల యహీంద్రతల్ప । శయనుఁడై యుండె నటఁ దమ చనినచోట**
**నెవ్వరినిఁ గాన కా దైత్యు లెచట శ్రుతులు । దారు మును పెట్టి రందు సత్వరముగాఁగ. 487**

**ప్రతిపదార్థం:** ఇచ్చి= బ్రహ్మకు అప్పగించి; ఎప్పటియట్ల+అ= ఎప్పటిలాగానే; అహి+ఇంద్ర+తల్ప+శయనుఁడై - అహీంద్ర= సర్పరాజయిన ఆదిశేషుడు అనే; తల్ప= శయ్యమీద; శయనుఁడు+ఐ= శయనించినవాడై; ఉండెన్= ఉన్నాడు; అటన్= ఆ పాతాళంలో; తమ+చనిన+చోట= తాము వెళ్ళినవైపున; ఎవ్వరినిన్= ఎవరినీ; కానక= చూడక (ఎవ్వరూ కనపడకపోవటంతో); ఆ+దైత్యులు= ఆ మధుకైటభ రాక్షసులు; ఎచటన్= ఏ ప్రదేశంలో; శ్రుతులు= వేదాలు; తారు= తాము; మును= ఇంతకుపూర్వం; పెట్టిరి= దాచారో; అందున్= ఆ ప్రదేశంలోకి; సత్వరము+కాఁగన్= గబగబా వెళ్ళిచూశారు.

**తాత్పర్యం:** వేదాలను బ్రహ్మకు అప్పగించి విష్ణుమూర్తి వెళ్ళి ఏమీ ఎరగనట్లు ఎప్పటివలె శేషతల్పంమీద శయనించాడు. ఇంక పాతాళంలో సంగతి - ఓంకారం వినిపించిన వైపు పరుగుపరుగున వెళ్ళిన మధుకైటభులకు అక్కడ ఎవ్వరూ కనబడలేదు. వాళ్ళు మునుపు వేదాలు ఎక్కడ దాచారో గబగబా అక్కడికి వెళ్ళిచూశారు. (తరువాతి పద్యంతో అన్వయం).

ఆ. **అరిగి యచట వాని నరసి కానక రభ । సమునఁ గలయఁ దిరిగి శార్ఙ్గిఁ గాంచి**
**యుద్ధమునకుఁ బిల్వ నద్ధరణీధరుం । డడరి సమయఁ జూచె నసురయుగము. 488**

**ప్రతిపదార్థం:** అరిగి= వెళ్ళి; అచటన్= అక్కడ; వానిన్= ఆ వేదాలను; అరసి= వెదికి; కానక= (చూడక) కనిపించకపోవటంతో; రభసమునన్= కంగారుగా; కలయన్+తిరిగి= చిందుతొక్కి (అంతటా వెదకి); శార్ఙ్గిన్= విష్ణుమూర్తిని; కాంచి= చూచి;

యుద్ధమునకున్= యుద్ధానికి; పిల్వన్= పిలిచేసరికి; ఆ+ధరణీధరుండు= ఆ విష్ణుమూర్తి (వరాహావతారంలో భూగోళాన్ని ధరించినవాడు); అడరి= విజృంభించి; అసురయుగమున్= ఆ రాక్షసుల జంటను; సమయన్+చూచెన్= చనిపోవటం చూచాడు. (చనిపోయేట్టు చేసాడు - సంహరించాడు అని ఫలితార్థం.)

**తాత్పర్యం:** వేదాలను ఎక్కడ దాచారో అక్కడ అంతా వెదికారు. అవి కనిపించలేదు. అంతటా గాలించారు. యోగనిద్రలో ఉన్న విష్ణుమూర్తి కనిపించాడు. వీళ్ళు యుద్ధానికి ఆహ్వానించారు. కయ్యానికి కాలుదువ్వారు. స్వామి చూశాడు, యుద్ధం చేశాడు. సంహరించాడు.

**వ.** **ఇట్లు విష్టరశ్రవుండు సృష్టకార్యంబు నిర్విఘ్నంబుఁ జేసిన విధాత యప్పని సునీతంబు సేసె నాఁటనుండియు హయశిరోమహితయగు నమ్మూర్తి దక్కిన మూర్తులకంటె నెక్కు డయ్యె నా జగత్కర్తను వేదంబులు నాశ్రయించియుండు'నని చెప్పి వెండియు.** **489**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; విష్టరశ్రవుండు= విష్ణుమూర్తి; సృష్టికార్యంబున్= జగత్తులను సృష్టించటం అనే పనిని; నిర్విఘ్నంబున్+ చేసినన్= (ఆటంకం తొలగించి) నిర్విఘ్నం చేస్తే; విధాత= బ్రహ్మదేవుడు; ఆ+పని= ఆ సృష్టికార్యాన్ని; సునీతంబు+చేసెన్= నెరవేర్చాడు (కడతేర్చాడు); నాఁటినుండియున్= ఆ రోజునుంచీ; హయశిరః= గుర్రపుతలతో; మహిత+అగు= కూడినదైన; ఆ+మూర్తి= ఆ స్వరూపం; తక్కిన= మిగిలిన; మూర్తులకంటెన్= స్వరూపాలకన్నా; ఎక్కుడు+అయ్యెన్= ఎక్కువది అయ్యింది; ఆ జగత్కర్తను= లోకకారకుడైన ఆ విష్ణుమూర్తిని; వేదంబులున్= వేదాలుకూడా; ఆశ్రయించి+ఉండున్= ఆశ్రయించుకొని ఉంటాయి; అని చెప్పి= అని వివరించి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఇట్లా విష్ణువు జగత్తును సృష్టించటంలో ఉన్న ఆటంకాన్ని తొలగించగా, బ్రహ్మ సృష్టికార్యాన్ని నెరవేర్చాడు. ఆనాటినుండి హయగ్రీవమూర్తి తక్కిన మూర్తులకంటె మహిమాన్వితమయింది. వేదాలు కూడా ఆ విష్ణువును ఆశ్రయించి ఉన్నాయి' అని చెప్పి తిరిగి.

**క.** **' హరి సత్త్వాదిగుణంబులఁ । బొరిఁబొరిఁ గలిగింపఁ బెంపఁ బొలియింపఁగ భూ**
**వర! యవి యెక్కువఁ దక్కువఁ । బొరయుచుఁ బరివర్తనంబుఁ బొందుచునుండున్.** **490**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; హరి= విష్ణుమూర్తి; సత్త్వ+ఆది+గుణంబులన్= సత్త్వరజస్తమోగుణాలను; పొరిన్+పొరిన్= క్రమక్రమంగా; కలిగింపన్= కల్గించటం; పెంపన్= పెంచటం; పొలియింపఁగన్= త్రుంచటం చేస్తే; అవి= ఆ గుణాలు; ఎక్కువన్+పొరయుచున్= ఎక్కువ అవుతూ; తక్కువన్+పొరయుచున్= తక్కువ అవుతూ (పొరయు= పొందు); పరివర్తనంబున్= ఇలా మార్పును; పొందుచున్+ఉండున్= పొందుతూ ఉంటాయి.

**తాత్పర్యం:** 'ఓ జనమేజయ మహారాజా! విష్ణుమూర్తి తన చిత్తం వచ్చినట్లు సత్త్వరజస్తమో గుణాలను కలిగిస్తూ పెంచుతూ తగ్గిస్తూ ఉంటాడు. దానినిబట్టి అవతారమూర్తులలో ఎక్కువలూ, తక్కువలూ వస్తూ ఉంటాయి. ఇట్లా మార్పులు జరుగుతుంటాయి.

**క.** **గుణవంతుఁడు గుణరహితుఁడు । గుణకల్పనతత్పరుండు గుణనాశనుఁడై**
**పుణశాలి గుణనిబద్ధుఁడు । గుణమోక్షణకరుఁడు శార్ఙ్గీ కురుకులముఖ్యా!** **491**

**ప్రతిపదార్థం:** కురుకుల= కురువంశంలో; ముఖ్యా!= ముఖ్యుడా! ఓ జనమేజయా!; శార్ఙ్గీ= విష్ణుమూర్తి (విష్ణుమూర్తి ధనుస్సుపేరు శార్ఙ్గం. అది కలవాడు కాబట్టి శార్ఙ్గీ); గుణవంతుఁడు= త్రిగుణాలూ కలవాడూ; గుణరహితుఁడు= గుణాలు లేనివాడు,

గుణకల్పన తత్పరుడు= గుణాలకల్పనలో ఆసక్తి కలవాడూ (గుణాలను కల్పించేదీ అతడే); గుణనాశన= గుణాలను నాశనంచేసే; నైపుణశాలి= నేర్పరీ అతడే; గుణ= గుణాలకు; నిబద్ధుఁడు= కట్టుబడి ఉండేవాడూ; గుణ= గుణాలకు; మోక్షణ+కరుఁడు= విముక్తి కలిగించేవాడూ అతడే.

**తాత్పర్యం:** జనమేజయా! విష్ణుమూర్తి తత్త్వం చాలా విచిత్రంగా ఉంటుంది. గుణవంతుడూ ఆతడే, గుణరహితుడూ ఆతడే. గుణాలను సృష్టించేదీ అతడే, తుదముట్టించేదీ అతడే. గుణాలకు నిబద్ధుడై ఉండేదీ అతడే, విముక్తి కలిగించేదీ అతడే.

**క. విను నారాయణపరములు । జననాయక! వేదములును జన్నంబులుఁ ద**
**క్కిన పుణ్యసమారంభము । లును రసముఖగోచరంబులును భూతములున్. 492**

**ప్రతిపదార్థం:** జననాయక!= నరాధిపా!; విను= వినుము; వేదములును= వేదాలూ; జన్నంబులున్= యజ్ఞాలూ; తక్కిన= ఇంకా మిగిలిన; పుణ్యసమారంభములును= పవిత్రకార్యక్రమాలూ; రసముఖ= నీరు మొదలుగా; గోచరంబులును= ఇంద్రియగ్రాహ్యాలైన (తెలిసే); భూతములున్= పంచభూతాలూ; నారాయణపరములు= నారాయణాత్మకాలు.

**తాత్పర్యం:** రాజా! వేదాలూ, యజ్ఞాలూ, సకలపుణ్యకార్యాలూ, పంచభూతాలూ - ఇవన్నీ నారాయణ స్వరూపాలూ, నారాయణపరాలూను.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో 'నేకాంతికజనులు లోకోత్తరులని చెప్పి; తయ్యేకాంతికత్వం బెట్టిది? యెఱింగింపవే?' యనుటయు నతం డతని కిట్లనియె. 493**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలించి; జనమేజయుండు= ఆ జనమేజయుడు; వైశంపాయనుతోన్= వైశంపాయన మహర్షితో; ఏకాంతికజనులు= ఏకాగ్రచిత్తం కలవారు; లోక+ఉత్తరులు+అని= చాలా గొప్పవారని (లోకంలో - లోకులలో గొప్పవారు - లోకోత్తరులు); చెప్పితి(వి)= అన్నావు; ఆ+ఏకాంతికత్వంబు= ఆ ఏకాగ్రచిత్తత; ఎట్టిది= ఎటువంటిది?; ఎఱింగింపవే?= తెలియజెప్పవా?; అనుటయున్= అని అడగగానే; అతండు= ఆ వైశంపాయనుడు; అతనికిన్= ఆ జనమేజయుడికి; ఇట్లు= ఇలా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అంతా విని, జనమేజయుడు 'ఏకాగ్రచిత్తం అంటే ఏమిటి? తెలుపుము.' అని అడుగగా దానికి వైశంపాయనుడు ఇట్లా బదులిచ్చాడు.

**ఆ. 'సాంఖ్యయోగ పరమసారభూతం బిది । మున్ను వింటి యుద్ధమునకుఁ జొరక**
**కరుణ నార్ద్రుఁడైన గాండీవి బోధింపఁ । గృష్ణు చెప్పినట్టి గీత లందు. 494**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పబోయే ఏకాంతికత్వం అనేది; సాంఖ్య-యోగ= సాంఖ్యమూ, యోగమూ అనే రెండింటియొక్క; పరమసారభూతంబు= ఉత్తమసారమయినది; యుద్ధమునకున్= కురుక్షేత్రంలో యుద్ధానికి; చొరక= దిగకుండా; కరుణన్= దుఃఖంతో; ఆర్ద్రుఁడు+ఐన= మెత్తబడిపోయిన; గాండీవిన్= గాండీవధారి అయిన అర్జునుడిని; బోధింపన్= మేలుకొల్పటంకోసం (జ్ఞానిని చేయటంకోసం); కృష్ణు= కృష్ణుడు; చెప్పినట్టి= ఉపదేశించిన (కృష్ణుడు ఉపదేశించిన - అని); గీతలందున్= భగవద్గీతలలో; ఇది= దీనిని; మున్ను= వెనుకటికి; వింటిన్= విన్నాను (అది నీకు చెబుతున్నాను అని).

**తాత్పర్యం:** 'జనమేజయా! నీవు అడిగిన ఏకాంతికత్వం అనేది సాంఖ్యయోగశాస్త్రాల సారం. వెనుకటికి - కురుక్షేత్ర సంగ్రామంలో యుద్ధవిముఖుడైన పార్థుడిని ప్రబోధించటానికి శ్రీకృష్ణుడు ఉపదేశించిన గీతలలో ఉన్న విషయం ఇది. దీనిని అప్పు డెప్పుడో విన్నాను. ఇప్పుడు నీకు చెప్పుతున్నాను.

## వైశంపాయనుఁడు జనమేజయున కేకాంతికధర్మ మెఱింగించుట (సం. 12-336-8)

**క. నిర్మలమగు నేకాంతిక । ధర్మము నారాయణోదితంబై క్రియలం**
**గర్మఠుఁడగు బ్రహ్మమతిని । ధార్మికవర! యొలసె, నతఁడు దయ సిగురొత్తన్. 495**

**ప్రతిపదార్థం:** ధార్మికవర!= ధార్మికులలో ఉత్తముడా!; నిర్మలము+అగు= పవిత్రమైన; ఏకాంతిక ధర్మము= ఈ ఏకాంతిక లక్షణం; నారాయణ+ఉదితంబై= విష్ణుమూర్తిచేత చెప్పబడినదై; క్రియలన్= పనులలో; కర్మఠుఁడు+అగు= కర్మిష్ఠి (నైష్ఠికుడు) అయినటువంటి; బ్రహ్మమతినిన్= బ్రహ్మదేవుని బుద్ధిని; ఒలసెన్= పొందింది; (నారాయణుడు చెప్పగా బ్రహ్మదేవుడుగ్రహించాడు) - అని; అతఁడు= ఆ బ్రహ్మ; దయ= కరుణ; చిగురొత్తన్= పల్లవించగా.

**తాత్పర్యం:** ధర్మాచరణంలో ఉత్తముడవైన ఓ జనమేజయా! ఏకాంతికతత్త్వాన్ని ముందుగా నారాయణుడు బ్రహ్మకు చెప్పాడు. అటుపైన బ్రహ్మదేవుడు దయతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దక్షునకు నెఱింగించిన । దక్షుఁడు బోధించెఁ దనదు దౌహిత్త్రు జగ**
**చ్చక్షుని నా సవితృండు మ । నుక్షితిపతి కిచ్చె నవ్వినుతధర్మంబున్. 496**

**ప్రతిపదార్థం:** దక్షునకున్= దక్షప్రజాపతికి; ఎఱింగించినన్= బ్రహ్మదేవుడు చెప్పగా; దక్షుడు= ఆ దక్షప్రజాపతి; తనదు+దౌహిత్రున్= తన మనుమడూ (కూతురి కొడుకు); జగత్+చక్షునిన్= లోకనేత్రమూ అయిన సూర్యుడిని ఉద్దేశించి; బోధించెన్= ఉపదేశించాడు; ఆ+సవితృండు= ఆ సూర్యుడు; ఆ+వినుత+ధర్మంబున్= నుతింపదగిన ఆ ధర్మాన్ని; మనుక్షితిపతికిన్= మను మహారాజుకి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు దక్షప్రజాపతికీ, దక్షుడు సూర్యుడికీ, సూర్యుడు మనువుకూ ఈ ఏకాంతికధర్మాన్ని ఉపదేశించారు.

**క. మను విక్ష్వాకున కొసఁగె న । తని వలనఁ దదీయ యోగ్యతా కలితులు స**
**జ్జనములు వడసి రనేకులు । విను నారాయణునిచేత విని నారదుఁడున్. 497**

**ప్రతిపదార్థం:** మనువు= ఆ మనువు; ఇక్ష్వాకునకున్= ఇక్ష్వాకుమహారాజుకు; ఒసఁగెన్= ఇచ్చాడు; అతనివలనన్= ఆ ఇక్ష్వాకువు నుండి; తదీయ= దానికి అవసరమైన; యోగ్యతా= అర్హతలతో; (ఆ) కలితులు= కూడుకొన్న; సత్+జనములు= సత్పురుషులు; అనేకులు= చాలామంది; పడసిరి= పొందారు; విను= జనమేజయా! ఆలకించుము; నారాయణునిచేతన్= నారాయణునినుంచి; విని= తెలిసికొని; నారదుఁడున్= నారదమహర్షి కూడా.

**తాత్పర్యం:** మనువునుండి ఇక్ష్వాకుమహారాజుకూ, అతడినుండి దానిని అందుకొనే యోగ్యత ఉన్న సజ్జనులకు చాలామందికీ ఆ ఏకాంతికధర్మం అందింది. సాక్షాత్తూ నారాయణుడినుండి తెలిసికొన్న నారదుడు కూడా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తగియెడు శిష్యుల కొసఁగెను । జగతీశ్వర! యిట్టు లది ప్రశస్తంబై యి**
**జ్జగములను గలిగె విను మ । య్యగాధ ధర్మంబు దుష్కృతాప్రాప్యమగున్. 498**

**ప్రతిపదార్థం:** జగతీ+ఈశ్వర!= మహారాజా!; తగియెడు= తగిన; శిష్యులకున్= శిష్యులకు; ఒసఁగెను= (ఉపదేశం) ఇచ్చాడు;ఇట్టులు= ఇలా; అది= ఆ ఏకాంతికధర్మం; ప్రశస్తంబు+ఐ= ప్రసిద్ధికెక్కి; ఈ+జగములను= ముల్లోకాలలోనూ; కలిగెన్= వెలిసింది; వినుము= విను; ఆ+అగాధధర్మంబు= లోతైన (అంతుచిక్కని) ఆ ఏకాంతికధర్మం; దుష్కృత= పాపాత్ములకు; అప్రాప్యము+అగున్=అందదు.

**తాత్పర్యం:** ఆ నారదుడు తగిన శిష్యులకు నేర్పాడు. ఇట్లా పరంపరగా ఈ ఏకాంతికధర్మం సకల లోకాలలోనూ ప్రసిద్ధికెక్కింది. అగాధమైన ఈ ధర్మం పాపాత్ములకు మాత్రం అందదు.

**క. దాని కహింసయ మూలము । దానన హరి ప్రీతుఁ డగు నతం డన ధరణీ**
**జానీ! క్షేత్రజ్ఞుం డనఁ । గా నొక్కఁడ యగుట దెలియఁగా వలయుఁ గడున్. 499**

**ప్రతిపదార్థం:** ధరణీజానీ!= (భూమి భార్యగా కలవాడా!) ఓ రాజా!; దానికిన్= ఆ ఏకాంతికధర్మానికి; అహింస+అ= అహింస ఒక్కటే; మూలము= (ఆధారం) మూలం; దానన్+అ= దానితోనే; హరి= విష్ణుమూర్తి; ప్రీతుఁడు+అగున్= సంతుష్టుడు అవుతాడు; అతండు+అనన్= విష్ణుమూర్తి అన్నా; క్షేత్రజ్ఞుండు+అనఁగాన్= క్షేత్రజ్ఞుడు అన్నా; ఒక్కఁడ+అగుట= ఒక్కడే కావటం (ఇద్దరూ అభిన్నం); కడున్= బాగా; తెలియఁగాన్+వలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** ఈ ఏకాంతికధర్మానికి అహింస ఒక్కటే మూలం. ఈ ధర్మంతోనే హరి సంప్రీతుడు అవుతాడు. హరి అన్నా క్షేత్రజ్ఞుడన్నా ఒక్కడే అనే విషయం తప్పక గుర్తించాలి.

**క. ఏకద్విత్రిచతుర్వ్యూ । హాకారతఁ దోఁచుచుండు హరి భక్తజనా**
**లోకమున వాసుదేవా । ద్యోకః ప్రాప్తముగఁ దత్తదుచితస్ఫూర్తిన్. 500**

**ప్రతిపదార్థం:** ఏక(వ్యూహ+ఆకారతన్)= ఒక వ్యూహంతోనూ; ద్వి+వ్యూహాకారతన్= రెండు వ్యూహాల ఆకారంతోనూ; త్రివ్యూహాకారతన్= మూడు వ్యూహాల ఆకారంతోనూ; చతుః+వ్యూహాకారతన్= నాలుగు వ్యూహాల ఆకారంతోనూ; హరి= విష్ణుమూర్తి; భక్తజన+ఆలోకమునన్= భక్తులైన జనుల చూపులకు (అంతర్ దృష్టికి); వాసుదేవ+ఆది= వాసుదేవుడూ మొదలైన; ఓకః= నివాసాల (ఉపాధులు); ప్రాప్తముగన్= ప్రాప్తితో (వాసుదేవాది వ్యూహాలను ధరించి అని); తత్తత్= ఆయావాటికి; ఉచిత= తగిన; స్ఫూర్తిన్= ప్రకాశంతో (స్ఫురణతో); తోఁచుచుండున్= దర్శనం ఇస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఒక్కొక్కటీ రెండేసీ మూడేసీ నాలుగేసీ వ్యూహాలతో వాసుదేవాది ఉపాధులను (జీవుడికి నివాసం శరీరం కనుక అదే ఉపాధి. దానినే 'ఓకస్' అన్నాడు తిక్కన.) ఉచితరీతిలో స్వీకరించి విష్ణుమూర్తి భక్తుల చూపులకు దర్శనం అనుగ్రహిస్తూ ఉంటాడు. ఏకవ్యూహం ద్వివ్యూహం - అంటూ ఇక్కడ వ్యూహాల సంఖ్య పెరిగినా, ప్రథమవ్యూహం ద్వితీయవ్యూహం ఇత్యాదిగా పరిగణించటమే సంప్రదాయం.

**విశేషం:** దీనికి మూలశ్లోకం ఇట్లా ఉన్నది - **"ఏకవ్యూహ విభాగో వా క్వచిద్ ద్వివ్యూహసంజ్ఞితః । త్రివ్యూహశ్చాపి సంఖ్యాతః చతుర్వ్యూహశ్చ దృశ్యతే" (53)** వ్యూహం అనేది ఆధ్యాత్మికంగా ఒక పారిభాషికపదం. అవతార ప్రణాళిక లేదా తత్త్వం అని తేలికగా చెప్పుకొనవచ్చును.

**తే. వాసుదేవుండు ప్రథమంబు వసుమతీశ! । యొలి సంకర్షణుండుఁ బ్రద్యుమ్నుఁడును ద్వి**
**తీయకంబుఁ దృతీయంబుఁ దెల్ల మచ్చ । తుర్థ మనిరుద్ధుఁ డిట్లు చతుర్విధములు. 501**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూమీశా! జనమేజయా! ఈ వ్యూహంలో; వాసుదేవుండు= వాసుదేవవ్యూహం; ప్రథమంబు= మొదటిది; ఓలిన్= క్రమంగా; సంకర్షణుండున్= సంకర్షణవ్యూహమూ; ప్రద్యుమ్నుఁడునున్= ప్రద్యుమ్నవ్యూహమూ అనేవి; ద్వితీయకంబున్= రెండవదీ; తృతీయంబున్= మూడవదీను; తెల్లము= స్పష్టం(గా); ఆ+చతుర్థము= నాల్గవది; అనిరుద్ధుఁడు= అనిరుద్ధవ్యూహం; ఇట్లు= ఈ విధంగా; చతుర్విధములు= వ్యూహాలు నాలుగు విధాలు.

**తాత్పర్యం:** జనమేజయా! వాసుదేవావతారం ప్రథమవ్యూహం. సంకర్షణుడు అనేది ద్వితీయవ్యూహం. ప్రద్యుమ్నుడు -తృతీయవ్యూహం. అనిరుద్ధుడు చతుర్థవ్యూహం. ఇట్లా ఇవి నాలుగు విధాలు.

**క. ఈ నెలవులఁ దోఁచును హరి । దా నొక్కఁడ; యింద్రియప్రతతి కందం; డే**
**కానూనభక్తి కగపడు; । దానికిఁ దపమును శమంబు దమమును వలయున్. 502**

**ప్రతిపదార్థం:** ఈ నెలవులన్= ఈ స్థానాలలో (వ్యూహాలలో - ఉపాధులలో); హరి= విష్ణువు; తోఁచును= కనిపిస్తుంటాడు; తాను+ఒక్కఁడు+అ= అతడు ఒక్కడే; ఇంద్రియ ప్రతతికిన్= ఇంద్రియ సమూహానికి; అందండు= అందడు; ఏక= అద్వితీయమూ; అనూన= అత్యధికమూ అయిన; భక్తికిన్= భక్తికి; అగపడున్= కనపడతాడు; దానికిన్= అటువంటి భక్తికి (అంతటి/భక్తి/ కుదరాలంటే); తపమును= తపస్సూ; శమంబున్= అంతరింద్రియ నిగ్రహమూ; దమమునున్= బాహ్యేంద్రియ నిగ్రహమూ; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** మహారాజా! శ్రీమహావిష్ణువు ఈ నాలుగు నెలవులలోనూ దర్శనమిస్తాడు. ఇంద్రియాలకు గోచరుడు కాని దైవం అత డొక్కడే. అద్వితీయమూ అత్యధికమూ అయిన భక్తికి మాత్రమే అతడు కనపడతాడు. అంతటి భక్తి కుదరాలి అంటే తపస్సూ ఇంద్రియ నిగ్రహమూ ఉండాలి.

**క. శాంతిపరినిష్ఠునకు నే । కాంతికధర్మంబు గరతలామలక మగుం**
**జింతాతంతుత్రుటనా । త్యంతవిదగ్ధంబు సూవె యది మనుజేంద్రా! 503**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్రా!= మానవనాయకా! (ఇంద్రశబ్దం శ్రేష్ఠతార్థకం కూడా); శాంతిపరినిష్ఠునకున్= శాంతిపట్ల పరినిష్ఠ కుదిరిన వ్యక్తికి (శమగుణ ప్రధానుడికి - లేదా - శాంతిపరినిష్ఠకల వ్యక్తికి); ఏకాంతిక ధర్మంబు= ఈ ఏకాంతిక లక్షణం; కరతల+ఆమలకము= అరచేతిలో ఉసిరిక పండు; అగున్= అవుతుంది (కైవసమై ఉంటుంది - అని); అది= ఆ ఏకాంతికధర్మం అనేది; చింతాతంతు త్రుటనాత్యంత విదగ్ధంబు సూవె - చింతా= దిగుళ్ళు అనే; తంతు= దారాలను; త్రుటనా= తుంపివెయ్యటంలో; అత్యంత= మిక్కిలి; విదగ్ధంబు= (నేర్పు కలది) సమర్థం; చూవె= సుమా!

**తాత్పర్యం:** మానవేంద్రా! శాంతిపట్ల ప్రగాఢమైన నిష్ఠ కల వ్యక్తికి ఏకాంతికధర్మమనేది కరతలామలకం, అత్యంత సులభం. అది చింతలు అనే దారాలను తెంపివెయ్యటంలో మిక్కిలి సమర్థం సుమా!

**క. అనిన నతఁ 'డిట్టి ధర్మముఁ । గొనియాడక వ్రతము లొండు గోరి నడపఁగాఁ**
**బని యేమి? యెఱింగింపుము । జనముల చందంబు నాకు సంయమివర్యా!' 504**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వైశంపాయనుడు చెప్పగా; అతఁడు= ఆ జనమేజయుడు ఇట్లా అన్నాడు; సంయమివర్యా!= మునీశ్వరా!; ఇట్టి= ఇంతటి ఉత్తమమైన; ధర్మమున్= ఏకాంతికధర్మాన్ని; కొనియాడక= స్వీకరించి ఆచరించకుండా (స్తుతించక); ఒండు వ్రతములు= ఇతర వ్రతాలను (ధర్మాలను); కోరి= కావాలని చేపట్టి; నడపఁగాన్= ఆచరించటానికి; పని+ఏమి?= అవసరం ఏమిటి?; జనముల+చందంబు= ఈ ప్రజల తీరు; నాకున్= నాకు ఎఱింగింపుము= అర్థమయ్యేటట్టు చెప్పుము.

**తాత్పర్యం:** 'వైశంపాయనా! ఇంత గొప్పదయిన ఈ ఏకాంతిక ధర్మాన్ని ఆచరించకుండా ఇతర వ్రతాలు ఏవేవో చేపట్టవలసిన అవసరం ఏముంది అసలు? ప్రజలు ఇట్లా ఎందుకు చేస్తున్నారు? వీరి తీరు ఏమిటో నాకు కొంచెం తెలియజెప్పుము.'

**క. అని యడిగిన వైశంపా । యనుఁ డతనికి నిట్టు లనియె 'నది గల దధిపా!**
**విను సాత్త్వికమును రాజస । మును దామసమును వికారములు మానసముల్. 505**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని అడిగేసరికి; వైశంపాయనుఁడు= వైశంపాయన మహర్షి; అతనికిన్= ఆ జనమేజయుడికి; ఇట్టులు+అనియెన్= ఇలా అన్నాడు; అధిపా!= జనమేజయా!; అది= అటువంటిది; కలదు= ఉంది; విను= ఆలకించుము; సాత్త్వికమును= సాత్త్వికమూ; రాజసమును= రాజసమూ; తామసమును= తామసమూ అనే; వికారములు= వికృతులు; మానసముల్= మనస్సుకు సంబంధించినవి.

**తాత్పర్యం:** జనమేజయుడు ఇట్లా అడిగేసరికి వైశంపాయనుడు వివరిస్తున్నాడు. 'ఓ రాజా! సాత్త్వికం, రాజసం, తామసం అని మనోవికారాలు మూడురకాలు.

**తే. వికృతు లందును సత్త్వస్థ విధము మేలు । దాన హరిఁ బొందవచ్చు నతండు నడపుఁ**
**దత్ప్రకారుల కుశలంపుఁ దంత్ర మెల్ల । వార లేకాంతికులు పెఱవారి వినుము. 506**

**ప్రతిపదార్థం:** వికృతులందునున్= ఈ మనోవికారాలలో; సత్త్వస్థ+విధము= సాత్త్వికవికారం పద్ధతి; మేలు= ఉత్తమం; దానన్= దానితో; హరిన్= విష్ణువును; పొందవచ్చున్= పొందవచ్చు; తద్+ప్రకారుల= ఆ సాత్త్వికుల; కుశలంపున్+తంత్రము+ఎల్లన్= యోగక్షేమాల కార్యక్రమమంతా; అతండు= ఆ విష్ణువే; నడపున్= నడిపిస్తాడు (చూచుకుంటాడు); వారలు= ఆ సత్త్వనిష్ఠకలవారే; ఏకాంతికులు= ఏకాంతికులంటేను (ఏకాగ్రచిత్తులు-అద్వితీయులు); పెఱవారిన్= తక్కినవారిని గురించి; వినుము= వినుము.

**తాత్పర్యం:** పైన చెప్పిన మూడు మనోవికారాలలోనూ సాత్త్వికం ఉత్తమం. అది కలవారి యోగక్షేమాలన్నీ ఆ విష్ణువే చూచుకొంటాడు. వారే ఏకాంతికు లంటేను. ఇంక మిగతావారిని గురించి చెప్పుతాను ఆలకించుము.

**క. కలగొన రాజసతామస । ము లయిన భావములు వికృతిఁ బొందింపఁగ మ**
**ర్త్యుల కేకాంతికవృత్తిని । నెలకొనఁగా నెట్లువచ్చు? నిర్మలధిషణా! 507**

**ప్రతిపదార్థం:** నిర్మలధిషణా!= నిర్మలమైన బుద్ధికలవాడా!; కలగొనన్= క్రమ్ముకొనేట్టు (కలవు+కొను= కలగొను= వ్యాపించు; క్రమ్ము. కలఁక+కొను= కలగొను= క్షోభించు, వ్యాకులపడు); రాజసతామసములు+అయిన+భావములు= రాజసములయిన భావాలూ తామసములయిన భావాలూ; వికృతిన్+పొందింపఁగన్= వికారాన్ని కలిగిస్తూంటే; మర్త్యులకున్= మానవులకు; ఏకాంతికవృత్తిని= ఏకాంతికవ్రతదీక్షతో; నెలకొనఁగాన్= ఉండటం; ఎట్లు వచ్చున్?= ఎట్లా కుదురుతుంది?

**తాత్పర్యం:** మలినరహితమైన హృదయం కలవాడా! జనమేజయా! పరస్పరం ఆవరించి రాజసతామసభావాలు మానవుల హృదయాలను వికారపరుస్తూంటే వారు ఏకాంతికధర్మాన్ని అవలంబించటం ఎట్లా సాధ్యపడుతుంది?

**క. వారికిఁ బ్రవృత్తి లక్షణ । తారూఢంబైన ధర్మ మలవడు హరికిం**
**గారుణ్య పాత్రములు గా । రారయ వా రన్యపథసమాశ్రితు లగుటన్. 508**

**ప్రతిపదార్థం:** వారికిన్= అటువంటి వారికి; ప్రవృత్తి లక్షణతా= సంసారంలో ప్రవర్తించే లక్షణంతో (నివృత్తి లక్షణం కానిది); ఆరూఢంబైన= స్థిరపడిన; ధర్మము= మార్గం (వ్రతం); అలవడున్= అలవడుతుంది; (నివృత్తిధర్మం అలవడదు-అని); ఆరయన్= చూడగా; వారు= అటువంటివారు; అన్యపథ= వేరేమార్గాలను; సమాశ్రితులు+అగుటన్= ఆశ్రయించినవారు కావటంవలన; హరికిన్= విష్ణుమూర్తికి; కారుణ్యాపాత్రములు= దయాపాత్రులు; కారు= కాలేరు.

**తాత్పర్యం:** రాజసతామసగుణాలు కలవారికి ప్రవృత్తి లక్షణమే అలవడుతుంది కాని నివృత్తి లక్షణమైన ఏకాంతికధర్మం అలవడదు. అన్యమార్గాలను అవలంబించారు కాబట్టి వారు హరికి దయాపాత్రులుకూడా కాలేరు.

**క. ఏకాంతికజనంబులు సు। శ్లోకుండగు హరిమనంబులో నుండుదు రా**
**లోకింప వారి కతనికి। నేకత్వము గలదు దెల్లమిది వేదములన్. 509**

**ప్రతిపదార్థం:** ఏకాంతికజనంబులు= ఏకాంతికధర్మాన్ని అనుష్ఠించేనరులు (అద్వితీయులు); సుశ్లోకుండు+అగు= స్తుతిపాత్రుడైన; హరి= విష్ణుమూర్తియొక్క; మనంబులోన్= హృదయంలో; ఉండుదురు= ఉంటారు; ఆలోకింపన్= చూడగా; వారికిన్= వారికీ; అతనికిన్= హరికీ; ఏకత్వము+కలదు= అభేదముంది; ఇది= ఈ విషయం; వేదములన్= వేదాలలో; తెల్లము= స్పష్టం.

**తాత్పర్యం:** ఏకాంతిక ధర్మాన్ని అనుష్ఠించే ఉత్తములు ఎప్పుడూ విష్ణుమూర్తి మనస్సులోనే ఉంటారు. నిజానికి వారికీ హరికీ అభేదమే. ఇదే చెప్పుతున్నాయి వేదాలు.

**క. ఈ తెరువు మద్గురుఁడు సం। ప్రీతిని దయ నన్ను నాదరించుచుఁ జెప్పెం**
**జేతశ్శుద్ధికలనమెయి। వీతదురితమైన భంగి విన్నది యధిపా! 510**

**ప్రతిపదార్థం:** అధిపా!= జనమేజయా!; ఈ తెరువు= ఈ మార్గం; మద్గురుఁడు= మా గురువుగారు వ్యాసమునీంద్రుడు; సంప్రీతిని= ప్రేమతో; దయన్= దయతో; నన్నున్= నన్ను; ఆదరించుచున్= ఆదరిస్తూ; చెప్పెన్= ఉపదేశించాడు; చేతః+శుద్ధి= మనశ్శుద్ధి; కలనమెయిన్= ఉండటంతో; వీత= పోగొట్టబడిన; దురితము+ఐన భంగిన్= పాపాలు కలదయ్యేట్టు; విన్నది= నేను విన్నది - ఈ తెరువు (నాకు చేతశ్శుద్ధికలనమెయిన్ ఉండటంచేత, మద్గురుఁడు చెప్పెన్ అని కూడా అన్వయించవచ్చును).

**తాత్పర్యం:** మా గురువుగారు నామీద ప్రేమతో దయతో నాకు ఈ మార్గం ఉపదేశించారు. నాకు అంతశ్శుద్ధి ఉన్నది కనుక ఉపదేశించారు. నేను కూడా పాపాలు అన్నీ పోగొట్టుకొనగలిగిన పద్ధతిలో దీనిని విన్నాను. ఇది వినటంతో ఆచరించటంతో పాపాలు తొలగిపోయి పవిత్రుడను అయ్యాను.

**క. చాలిన నీవును హరి ని। ట్లాలోకింపుము నిరంతరానందశ్రీ**
**శాలివగు దనిన నా భూ। పాలోత్తముఁ డా తపస్విపతి కిట్లనియెన్. 511**

**ప్రతిపదార్థం:** చాలినన్= సమర్థుడవైతే - లేదా - ఇష్టపడితే; నీవునున్= నీవుకూడా; హరిన్= విష్ణుమూర్తిని; ఇట్లు+ఆలోకింపుము= ఇలా దర్శించుము (ఈమార్గంలో చూడుము); నిరంతర= ఎడతెరిపిలేని; ఆనంద+శ్రీశాలివి= ఆనందమనే భాగ్యం కలవాడివి (ఆనందభాగ్యశాలివి); అగుదు(వు)= అవుతావు; అనినన్= అని చెప్పగా; ఆ+భూపాల+ఉత్తముఁడు= ఆ రాజశ్రేష్ఠుడు; ఆ+తపస్విపతికిన్= ఆ మునీశ్వరునికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** రాజా! ఇష్టపడితే, నియమాలను పాటించగలను అనుకొంటే నీవుకూడా ఏకాంతికధర్మాన్ని ఆచరించి ఈ మార్గంలో హరిని దర్శించుము. ఎడతెరిపి లేని నిజమైన ఆనందం అనే సౌభాగ్యాన్ని (ఆనందశోభను) పొందగలుగుతావు' అనేసరికి వైశంపాయనుడితో జనమేజయుడు ఇట్లా అంటున్నాడు మళ్ళీ.

**తే. 'వేదములు సాంఖ్యమును యోగవిధియుఁ బాశు। పతముఁ బాంచరాత్రంబు నా బహువిధములఁ**
**జెల్లు బోధసాధనముల కెల్ల నిష్ఠ। యొక్కటియొ? యివి భిన్ననిష్ఠోదితములో? 512**

**ప్రతిపదార్థం:** వైశంపాయనా! వేదములున్= వేదాలూ; సాంఖ్యమునున్= సాంఖ్యమూ; యోగవిధియున్= యోగశాస్త్రమూ; పాశుపతమున్= పాశుపతమూ; పాంచరాత్రంబున్= పాంచరాత్రమూ; నాన్= అని; బహువిధములన్= పలు రకాలుగా; చెల్లు= ఒప్పుతున్న; బోధసాధనములకున్+ఎల్లన్= జ్ఞానమార్గాలకు అన్నింటికీ (సాధనం= ఉపకరణం); నిష్ఠ= (శ్రద్ధ) ఆశ్రయం; ఒక్కటియొ?= ఒకటేనా?; ఇవి= ఇవన్నీ; భిన్ననిష్ఠా+ఉదితములొ?= వేరువేరు ఆధారాలనుండి ఆవిర్భవించాయా?

**తాత్పర్యం:** మహర్షీ! వేదాలనీ, సాంఖ్యమనీ, యోగశాస్త్రమనీ, పాశుపతమనీ, పాంచరాత్రమనీ ఇట్లా రకరకాలుగా ఉన్నాయి జ్ఞానాన్ని ఇచ్చే మార్గాలు. వీటికి అన్నింటికీ నిష్ఠ అనేది ఒకటేనా? లేకపోతే దేనికదిదే విభిన్న నిష్ఠలూ ఆశ్రయాలూ ఉన్నాయా?

**వ. నా కెఱింగింపవే వీనికిఁ బ్రవర్తకు లెవ్వరు? వారలం జెప్పు'మని యడిగిన జనమేజయునకు వైశంపాయనుండు. 513**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఎఱింగింపవే?= తెలియజేయవా?; వీనికిన్= ఈ విభిన్న సాధనాలకు (మార్గాలకు); ప్రవర్తకుల్= (ఆదిలో కర్తలై అమలు జరిపినవారు) ఉపదేశకులు; ఎవ్వరు= ఎవరు?; వారలన్= వారిని గురించి; చెప్పుము= తెలియజెప్పుము; అని= అని; అడిగిన= అడిగినటువంటి; జనమేజయునకున్= జనమేజయుడికి; వైశంపాయనుండు= వైశంపాయనమహర్షి (ఇట్లా చెబుతున్నాడు).

**తాత్పర్యం:** వీటి ప్రవర్తకు లెవరు? ఈ వివరాలు నాకు తెలియజెప్పవలసినది' అని జనమేజయుడు అడుగగా తిరిగి వైశంపాయనుడు చెప్పుతున్నాడు.

**ఉ. ద్వీపమునం బ్రబోధపరిదీప్తుని వేదనిధానమున్ జగ**
**ద్వ్యాపకతేజు గంధవతియందుఁ బరాశరసంయమీశ్వరుం**
**డే పురుషోత్తముం బడసి యీడ్యతమోన్నతి నొందె లోకశి**
**క్షాపరు భారతాధ్యయన కారకుఁ గొల్చెద నమ్మహాత్మునిన్. 514**

**ప్రతిపదార్థం:** ద్వీపమునన్= కృష్ణద్వీపంలో; ప్రబోధ= జ్ఞానంతో; పరిదీప్తునిన్= ప్రకాశించినవాడూ; వేద= వేదాలకు; నిధానమున్= నిధి అయినవాడూ (ఆకరమైనవాడూ); జగత్= ప్రపంచమంతటా; వ్యాపక= విస్తరించే; తేజున్= తేజస్సుకలవాడూ; (మరియు) పరాశర= పరాశరుడు అనే; సంయమీశ్వరుఁడు= ఋషీశ్వరుడు; ఏ పురుషోత్తమున్= ఏ ఉత్తమ మానవుడినీ; గంధవతియందున్= మత్స్యగంధియందు (సత్యవతియందు); పడసి= పుత్రుడుగా పొంది; ఈడ్యతమ= మిక్కిలి స్తుతించదగిన; ఉన్నతిన్= ఔన్నత్యాన్ని (గౌరవాన్ని); ఒందెన్= పొందాడో; లోక= ప్రపంచానికి (ప్రజలకు); శిక్షా= విద్యనేర్పటంలో; పరున్= ఆసక్తి కలవాడూ; భారత+అధ్యయన+కారకున్= భారత అధ్యయనానికి హేతువైనవాడూ (మాకు భారతం రచించి నేర్పినవాడు) అయిన; ఆ+మహాత్మునిన్= మహానుభావుడైన ఆ వ్యాసుడిని; కొల్చెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** రాజా! ముందుగా వ్యాసమహర్షికి నమస్కరిస్తున్నాను. ఆయన కృష్ణద్వీపంలో పరాశరుడికీ మత్స్యగంధికీ జన్మించి జ్ఞానతేజస్సుతో ప్రకాశిస్తున్నవాడు. ప్రపంచమంతటా ఆయన తేజస్సు వ్యాపించింది. ఆయన వేదాలకు నిధి. ఆయనను పుత్రుడుగా పొందటంవలన పరాశరుడికి లోకోన్నత విఖ్యాతి కలిగింది. ఆయనే లోకాల కన్నింటికీ ఉపదేశకుడు. భారతాధ్యయనానికి సృష్టికర్త.

**వ. అనుచుం గృష్ణద్వైపాయనధ్యానపరాయణుం డగుచుం బలికి యా భూవిభున కభిముఖుండై. 515**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని; కృష్ణద్వైపాయన+ధ్యాన+పరాయణుండు+అగుచున్= వ్యాసుడిని తత్పరతతో ధ్యానిస్తూ; పలికి= మాట్లాడి; ఆ+భూవిభునకున్= ఆ జనమేజయ మహారాజుకు; అభిముఖుండై= ముఖాముఖిగా కూర్చుని.

**తాత్పర్యం:** ఇట్లా వ్యాసుడిని ధ్యానించుకొని, రాజైన జనమేజయుడికి ఎదురుగా కూర్చొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుమీ తంత్రంబుల కె । ల్లను నరయ బరాయణం బలఘుతరసంవి**
**త్తనుఁడగు నారాయణుఁడ, య । తనిఁ బొందఁగ ఋజువులగు పథములివి యధిపా! 516**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; వినుము; ఈ+తంత్రంబులకున్+ఎల్లను= ఈ శాస్త్రాలకు అన్నింటికీ; అరయన్= పరిశీలించి చూసినట్టయితే; అలఘుతర= మిక్కిలి గొప్పదయిన; సంవిత్+తనుఁడు+అగు= జ్ఞానమే శరీరంగా (రూపంగా) కలవాడైన; నారాయణుఁడు+అ= నారాయణుడే; పరాయణంబు= ఆశ్రయం (గమ్యం); అతనిన్= ఆ శ్రీమన్నారాయణుడిని; పొందఁగన్= చేరటానికి; ఇవి= ఈ తంత్రాలన్నీ; ఋజువులు+అగు= తిన్ననైన; పథములు= మార్గాలు.

**తాత్పర్యం:** రాజా! వేదసాంఖ్యాదిశాస్త్రాలక న్నింటికీ పరమగమ్యం, ఆశ్రయం శ్రీమన్నారాయణుడే. ఆయన జ్ఞానస్వరూపుడు. ఆయనను అందుకొనటానికి ఈ శాస్త్రాలు ఋజుమార్గాలు. (ఇక్కడికి నిష్ఠనుగురించి ప్రథమభాగానికి సమాధానం అయ్యింది).

**వ. వేదంబులకుం బ్రవర్తకుండు నారాయణనందనుం డపాంతరతముం డనుపేరం బ్రసిద్ధుండగు వేదవ్యాసుండు, సాంఖ్యంబునకుం గపిలుండును, యోగంబునకు హిరణ్యగర్భుండును, బాశుపతంబునకు శివుండును బాంచరాత్రంబునకు విష్ణుండును బ్రవర్తకులు. పాంచరాత్రంబు వైష్ణవం బనం బరఁగు' ననిన విని యజ్ఞనపతి యమ్మునిపతితో 'వేదవ్యాసుండు పరాశరపుత్రుండని చెప్పి తప్పరమమునికి నారాయణనందనత్వం బెట్లు వచ్చె? ననుటయు నతం డతని కిట్లనియె. 517**

**ప్రతిపదార్థం:** (ఇంక ప్రవర్తకులను గురించిన రెండవభాగానికి సమాధానం చెబుతున్నాడు) వేదంబులకున్= వేదాలకు; ప్రవర్తకుండు= ఉపదేశకుడు; నారాయణనందనుండు= శ్రీమన్నారాయణుని పుత్రుడూ; అపాంతరతముండు= అపాంతరతముడు; అనుపేరన్= అనే పేరుతో; ప్రసిద్ధుండు= విఖ్యాతుడూ; అగు= అయిన; వేదవ్యాసుండు= వేదవ్యాసుడే; సాంఖ్యంబునకున్= సాంఖ్యశాస్త్రానికి; కపిలుండును= కపిలుడూ; యోగంబునకున్= యోగశాస్త్రానికి; హిరణ్యగర్భుండునున్= బ్రహ్మదేవుడూ; పాశుపతంబునకున్= పాశుపతానికి; శివుండునున్= శివుడూ; పాంచరాత్రంబునకున్= పాంచరాత్రానికి; విష్ణుండునున్= విష్ణువూ; ప్రవర్తకులు= ఉపదేశకులు; పాంచరాత్రంబు= ఈ పాంచరాత్రమే; వైష్ణవంబు+అనన్+పరఁగున్= వైష్ణవమనీ పిలవబడుతుంది; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ఆ+జనపతి= ఆ నరేంద్రుడు; ఆ+మునిపతితోన్= ఆ మునీంద్రుడితో; వేదవ్యాసుండు; పరాశరపుత్రుండు+అని= పరాశరమహర్షికి కుమారుడు అని; చెప్పితి(వి)= చెప్పావు; ఆ+పరమమునికిన్= ఆ వ్యాసమహర్షికి; నారాయణనందనత్వంబు= నారాయణుడికి పుత్రుడు కావటం అనేది; ఎట్లు= ఏ విధంగా; వచ్చెన్?= సిద్ధించింది?; అనుటయున్= అని అడిగేసరికి; అతండు= ఆ వైశంపాయనుడు; అతనికిన్= ఆ జనమేజయునికి; ఇట్లు+అనియెన్= ఇట్లా బదులు పలికాడు.

**తాత్పర్యం:** వేదాలకు ఉపదేశకుడు అపాంతరతముడనే పేరుకల వేదవ్యాసుడు. సాంఖ్యానికి కపిలుడు, యోగానికి హిరణ్యగర్భుడు, పాశుపతానికి శివుడు, పాంచరాత్రానికి విష్ణువూ ప్రవర్తకులు. పాంచరాత్రం వైష్ణవం అనబడుతుంది' అనగా విని ఆ రాజు ఆ మునితో 'వేదవ్యాసుడు పరాశరుడి కుమారు డని చెప్పావు; ఆ మునిశ్రేష్ఠుడిని నారాయణ పుత్రుడు అనే మాట ఎట్లా కలిగింది?' అని అనగా వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా బదులు చెప్పాడు.

**సీ.** **హిమవన్నగంబు పాదమున మహాభార । తం బొనర్చి పరిశ్రమంబు దోఁప**
**భావించి శిష్యులు గావించు పరిచర్యఁ । దద్వినోదనపరత్వమున నొంది**
**వారికి వేదార్థభారతార్థంబులు । సాత్యవతేయుండు సదయబుద్ధి**
**నెఱిఁగించు చున్నట్టియెడ నేను లోనుగాఁ । గొందఱు దత్పాదవందనంబు**

**తే.** **భక్తిఁ జేసి నారాయణప్రభవుఁ డండ్రు । నిన్నుఁ గృపఁ జెప్పవే మాకు నిర్మలాత్మ!**
**యత్తెఱం గని యడిగిన నమ్మహాను । భావుఁ డత్యంతకరుణార్ద్రభావుఁ డగుచు.** **518**

**ప్రతిపదార్థం:** హిమవత్+నగంబు= హిమవత్పర్వతంయొక్క; పాదమునన్= సమీపంలో (ప్రత్యంత పర్వతంమీద. (పెద్దపర్వతానికి చుట్టూ ఉండే చిన్నపర్వతాలను ప్రత్యంత పర్వతాలనీ పాదపర్వతాలనీ అంటారు); మహాభారతంబు+ఒనర్చి= మహాభారతరచన పూర్తిచేసి; పరిశ్రమంబు= అలసట; తోఁపన్= కనిపించగా; భావించి= గుర్తించి; శిష్యులు= ఛాత్రులు; కావించు= చేసిన; పరిచర్యన్= సేవకు; తద్= ఆ శిష్యులను; వినోదనపరత్వమునన్+ఉండి(ఒంది)= ఆనందింపజేస్తూ ఉండి (ఆనందపరచటం మొదలుపెట్టి); వారికిన్= శిష్యులకు; వేదార్థ= వేదార్థమూ; భారతార్థంబులు= భారతార్థమూ; సదయబుద్ధిన్= కరుణ కలిగిన మనస్సుతో; సాత్యవతేయుండు= వ్యాసుడు; ఎఱిఁగించుచున్నట్టి ఎడన్= నేర్పుతున్న సమయంలో; నేను లోనుగాన్= నేను మొదలుగా; కొందఱు= కొందరు శిష్యులం; తద్+పాద+వందనంబు= వ్యాసుడి పాదాలకు నమస్కారం; భక్తిన్= భక్తితో; చేసి= చేసి; నిర్మలాత్మ!= పవిత్రమనస్వీ!; నిన్నున్= నిన్ను; నారాయణప్రభవుఁడు+అండ్రు= నారాయణాత్మజుడు అంటారు; ఆ+తెఱంగు= (అది ఎట్లా వచ్చిందో) ఆ తీరు; మాకున్= మాకు; కృపన్= దయతో; చెప్పవే?= తెలియజేయవా?; అని= అని; అడిగినన్= ప్రార్థించేసరికి; ఆ+మహానుభావుఁడు= ఆ మహాత్ముడు-వ్యాసుడు; అత్యంత= మిక్కిలి; కరుణా+ఆర్ద్ర+భావుఁడు+అగుచున్= దయతో చెమ్మగిల్లిన హృదయం కలవాడు అవుతూ -

**తాత్పర్యం:** వ్యాసమునీంద్రుడు హిమాలయాలలో భారతరచన పూర్తిచేసి అలసిపోయి ఉన్న సమయంలో మేమంతా ఆయనకు పరిచర్యలు చేశాము. దానికి ఆయన సంతోషించి, మమ్ములను వినోదింపజేయటానికి వేదార్థమూ భారతార్థమూ చెప్తుతూ వచ్చాడు. ఆ సమయంలోనే మేము కొందరం ఆయనకు సాష్టాంగపడి, 'గురుదేవా! నారాయణాత్మజుడు అని నిన్ను పెద్దలు చెప్తుతుంటారు. అది ఎట్లా? తెలియజేయవా?' అని ప్రార్థించాము. అప్పుడు వ్యాసుడు దయబూని. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **మాతోడ నిట్లనియె.** **519**

**ప్రతిపదార్థం:** మాతోడన్= మాతో; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మాతో ఈ విధంగా అన్నాడు.

**వేదవ్యాసునకు నారాయణనందనత్వంబు గలిగిన ప్రకారము (సం. 12-336-24)**

**సీ.** **ఆదికాలమునఁ బ్రజాభిసర్గమునకు । నారాయణుఁడు నిజనాభిపద్మ**
**మున బ్రహ్మఁ గల్పింప భూతసంఘమ్ముల । నెల్ల నాతఁడు సృజియించె నతని**
**ముఖమున బహువేదములు ప్రసరింపఁగఁ । జేసి వానికి మేలుసేఁత బుద్ధిఁ**
**దలఁచి యవ్విష్ణుండు నలఘుబోధుని నపాం । తరతముం డనియెడు తనయుఁ జిత్త**

**తే.** **మునన కల్పించి యతిభక్తి మ్రొక్కి నిలిచి । యున్న యక్కుమారుని శ్రుతు లన్నియును దృ**
**ఢావధానుండవై విని నీవు వాని । నంచితవ్యాస మొందింపు మనియెఁ బ్రీతి.** **520**

**ప్రతిపదార్థం:** ఆదికాలమునన్= సృష్టికన్నా ముందరికాలంలో; నారాయణుఁడు= శ్రీమహావిష్ణువు; ప్రజా+అభిసర్గమునకున్= జీవ సృష్టికోసమని; నిజ= తనయొక్క; నాభి= పొక్కిలినుంచి వికసించిన; పద్మమునన్= పద్మంలో; బ్రహ్మన్= బ్రహ్మదేవుడిని; కల్పింపన్= ఉత్పాదించగా; ఆతఁడు= ఆ బ్రహ్మదేవుడు; భూతసంఘములన్+ఎల్లన్= ప్రాణికోటినంతటినీ; సృజియించెన్= సృష్టించాడు; అతని ముఖమునన్= ఆ బ్రహ్మదేవుని ముఖంనుంచి; బహువేదములు= అనేక వేదాలు; ప్రసరింపఁగన్+చేసి= ప్రసారం అయ్యేట్టు తానే చేసి; వానికిన్= ఆ వేదాలకు; మేలుచేఁతన్= మేలు చెయ్యటం అనే విషయాన్నికూడా; బుద్ధిన్= బుద్ధిలో; తలఁచి= ఆలోచించి; ఆ+విష్ణుండు= ఆ శ్రీమన్నారాయణుడు; అలఘు= గొప్పదైన; బోధునిన్= జ్ఞానం కలవాడూ; అపాంతరతముండు+ అనియెడు= అపాంతరతముడు అనే పేరున్నవాడూ అయిన - తనయున్= కుమారుడిని; చిత్తమునన్+అ= మనస్సులోనే; కల్పించి= సృష్టించి; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; మ్రొక్కి నిలిచియున్న= నమస్కరిస్తూ నిలబడ్డ; ఆ+కుమారునిన్= ఆ తనయుడిని; దృఢ= గాఢమైన; అవధానుండవు+ఐ= ఏకాగ్రత కలవాడవై; శ్రుతులు+అన్నియును= వేదాలు అన్నీ; విని= ఆలకించి; నీవు= నీవు; వానిన్= ఆ వేదాలను; అంచితవ్యాసమున్= అందమైన విభజనను (వ్యాసము= విడమరిచినది); ఒందింపుము= పొందించుము; అనియెన్+ప్రీతిన్= అని ప్రేమతో ఆజ్ఞాపించాడు - చెప్పాడు.

**తాత్పర్యం:** ఆదికాలంలో శ్రీమన్నారాయణుడు ప్రజాసృష్టి చేయటంకొరకని తన నాభికమలంనుండి బ్రహ్మను సృష్టించాడు. ఆయన సకలభూతాలనూ సృష్టించాడు. బ్రహ్మదేవుడి ముఖంనుండి వేదాలు ప్రసరించేటట్లు చేశాడు. ఆ వేదాలకు మేలు చేయటంకొరకని ఒక మహాజ్ఞానిని పుత్రుడుగా పొందాడు. ఆయన పేరే అపాంతరతముడు. ఆ కుమారుడు తండ్రికి భక్తితో నమస్కరించి నిలబడ్డాడు. 'నాయనా! ఏకాగ్రతతో వేదాలను అధ్యయనం చేయుము. వాటిని అందంగా విభజించుము' అన్నాడు.

**ఆ.** **అనిన నట్లకాక యని యయ్యపాంతర । తముఁడు వేదభేదనము నొనర్చె**
**దాని కవ్విభుండు దద్దయుఁ బ్రీతుఁడై । వత్సలత్వ గౌరవం బెలర్ప.** **521**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శ్రీమన్నారాయణుడు చెప్పగానే; అట్లు+అ+కాక= అట్లాగే; అని; ఆ+అపాంతరముఁడు= ఆ అపాంతరముడు; వేదభేదనమున్= వేదాల విభజనను (వేదాలను నాలుగుగా); ఒనర్చెన్= చేశాడు; దానికిన్= ఆ విభాగానికి; ఆ+విభుండు= ఆ శ్రీమన్నారాయణుడు; తద్దయున్= మిక్కిలి; ప్రీతుఁడై= సంతోషించి; వత్సలత్వగౌరవంబు= వాత్సల్యాతిశయం (వాత్సల్యరూపమైన గౌరవం); ఎలర్పన్= వికసింపగా.

**తాత్పర్యం:** శ్రీమన్నారాయణుడి ఆజ్ఞను స్వీకరించి, అపాంతరతముడు వేదాలను అధ్యయనం చేసి, వాటిని నాలుగుగా విభజించాడు. దానికి నారాయణుడు చాలా సంతోషించి వాత్సల్యంతో ఇట్లా అన్నాడు.

**క.** **వేదవ్యాసుఁడ! రమ్మని । యాదరమునఁ బిలిచి నాకు నాత్మజుఁడై సం**
**పాదించువాఁడ వధికా । హ్లాదము మన్వంతరంబు లన్నిటియందున్.** **522**

**ప్రతిపదార్థం:** వేదవ్యాసుఁడ= ఓ వేదవ్యాసుడా!; రమ్ము= ఇట్లా రావయ్యా!; అని= అంటూ; ఆదరమునన్= ఆదరంతో; పిలిచి= ఆహ్వానించి; నాకున్= నాకు; ఆత్మజుఁడై= కుమారుడవై; మన్వంతరంబులు+అన్నిటియందున్= అన్ని మన్వంతరాలలోనూ (కల్పాలలోనూ); అధిక+ఆహ్లాదము= మిక్కిలి ఆనందం; సంపాదించువాఁడవు= పొందుతావు.

**తాత్పర్యం:** 'ఓ వేదవ్యాసుడా! రమ్ము. నాకు పుత్రుడవై నీవు అన్ని మన్వంతరాలలోనూ అత్యధికంగా ఆహ్లాదించుము.'

**క. అని యానతిచ్చి మఱియును । జననంబులు నీకుఁ గల్గు సంయమిమాన్యా!**
**యనియుఁ బలికి వెండియు ని । ట్లనియెను విష్ణుండు పేర్చు నర్మిలితోడన్. 523**

**ప్రతిపదార్థం:** అని=అంటూ; ఆనతి+ఇచ్చి= ఆజ్ఞాపించి; సంయమిమాన్యా!= మునీశ్వరా!, వేదవ్యాసా!; మఱియునున్= ఇంకా; జననంబులు= జన్మలు; నీకున్= నీకు; కల్గున్= లభిస్తాయి; అనియున్= అనికూడా; పలికి= చెప్పి; వెండియున్= మళ్ళీ; విష్ణుండు= ఆ నారాయణుడు; పేర్చు+నర్మిలితోడన్= అతిశయించే ప్రేమతో; ఇట్లు= ఈ విధంగా; అనియెను= అన్నాడు.

**తాత్పర్యం:** అని ఆనతిచ్చిన విష్ణుమూర్తి వేదవ్యాసుడికి ఇంకా మరికొన్ని జన్మలు లభిస్తాయని చెప్పాడు. ఇంకా ప్రేమతో ఇట్లా అన్నాడు.

**క. 'నా చరితంబులుఁ ద్రైలో । క్యాచరణంబులును ధర్మ మఖిలంబు మదిం**
**జూచి త్రికాలజ్ఞత్వస । మీచీనత వెలయు - మునులు మేటి యనంగన్. 524**

**ప్రతిపదార్థం:** మునులు= మహర్షులు; మేటి+అనంగన్= గొప్పవాడు - అని నిన్ను పొగడేటట్టు; నా+చరితంబులున్= నా కథలూ; త్రైలోక్య= ముల్లోకాలకూ; ఆచరణంబులునున్= ఆచరించదగిన అంశాలూ; అఖిలంబు= సమస్తమైన; ధర్మము= ధర్మమూ; మదిన్= అంతరంగంలో; చూచి= దర్శించి; త్రికాలజ్ఞత్వ= భూతభవిష్యద్వర్తమానాలను తెలియటం అనే; సమీచీనతన్= సామంజస్యంతో, వెలయు(ము)= విరాజిల్లుము.

**తాత్పర్యం:** 'నా కథలూ, ముల్లోకాలూ ఆచరించవలసిన అంశాలూ, అఖిలధర్మాలూ మనస్సులో దర్శించి త్రికాలజ్ఞుడవై మహర్షులలోకెల్లా ఉత్తముడవుగా విరాజిల్లుము నాయనా!

**క. ఉత్తరకాలంబున లో । కోత్తరుఁడు వసిష్ఠపౌత్రుఁ డుదితజ్ఞానో**
**దాత్తుఁడు పరాశరుండను । నుత్తమసంయమికిఁ బుట్టు దుజ్జ్వలతేజా! 525**

**ప్రతిపదార్థం:** ఉజ్జ్వలతేజా!= అధికంగా ప్రకాశించే తేజస్సుకలవాడా!; ఉత్తరకాలంబునన్= భవిష్యత్కాలంలో; లోక+ఉత్తరుఁడు= లోకంలో ఉత్తమోత్తముడూ; వసిష్ఠపౌత్రుఁడూ= వసిష్ఠమహర్షికి మనుమడూ (పౌత్రుడు= పుత్రుని పుత్రుడు); ఉదిత= ఆవిర్భవించిన; జ్ఞాన= జ్ఞానంతో; ఉదాత్తుఁడు= గొప్పవాడూ; పరాశరుండు+అను= పరాశరుడనే; ఉత్తమసంయమికిన్= గొప్ప మహర్షికి; పుట్టుదు(వు)= కుమారుడుగా జన్మిస్తావు.

**తాత్పర్యం:** ఓ వేదవ్యాసా! భవిష్యత్కాలంలో నీవు పరాశరుడికి పుత్రుడుగా జన్మిస్తావు. ఆ పరాశరుడు లోకోత్తరుడు. జ్ఞాని. వసిష్ఠుడికి మనుమడు. ఆయనకు నీవు పుత్రుడుగా జన్మిస్తావు.

**క. నీ వలనన కలిగి కురు । క్ష్మావలయం బేలునట్టి జనపతు లన్యో**
**న్యావిష్టరోషులై రణ । సేవనమునఁ గులము తఱచు సెఱుతురు వత్సా! 526**

**ప్రతిపదార్థం:** వత్సా!= తనయుడా! (అపాంతరతమా! వ్యాసా!); నీవలనన్+అ= నీవల్లనే; కలిగి= జన్మించి; కురుక్ష్మావలయంబు= కురు సామ్రాజ్యాన్ని; ఏలునట్టి= పరిపాలించే; జనపతులు= రాజులు (కౌరవపాండవులు); అన్యోన్య= పరస్పరం; ఆవిష్ట= ఏర్పడ్డ (నాటుకొన్న); రోషులై= రోసం కలవారై; రణసేవనమునన్= యుద్ధాన్ని ఆశ్రయించటంతో (ఆచరించటంతో); కులము+తఱచున్= వంశపు ఆధిక్యాన్ని; చెఱుతురు= నాశనం చేస్తారు.

**తాత్పర్యం:** నాయనా! అపాంతరతమా! నీవలన జన్మించినవాళ్ళే కురుసామ్రాజ్యాన్ని పరిపాలిస్తారు. ఆ రాజులకు పరస్పరం రోషాలు పెరుగుతాయి. యుద్ధానికి దిగుతారు. వంశవినాశనం అవుతుంది.

**తే.** **కాలముల కీడు కతమునఁ గలఁగఁ బడిన । వేదముల నీవు నాఁడును విమలబుద్ధి**
**నంచితవ్యాస మొందించి యఖిల దివిజ । మునిగణముల కొనర్తు సమ్మోద మనఘ! 527**

**ప్రతిపదార్థం:** అనఘ!= పవిత్రుడా!; కాలముల= కాలాలు గలిగించిన; కీడుకతమునన్= కీడు కారణంగా; కలఁగఁబడిన= కలగాపులగం అయిపోయిన; వేదములన్= వేదాలను; నీవు= నీవు; నాఁడునున్= అప్పుడు కూడా మళ్ళీ; విమలబుద్ధిన్= నిర్మలమైన బుద్ధితో; అంచితవ్యాసము= అందంగా విభజనం; ఒందించి= చేసి; అఖిల= సమస్తమైన; దివిజ= దేవతలూ; మునిగణములకున్= ఋషి బృందాలకూ; సమ్మోదము= ఆనందం; ఒనర్తు(వు)= కలిగిస్తావు.

**తాత్పర్యం:** పవిత్రుడా! ఓ అపాంతరతమా! (వ్యాసా!) కాలం కలిగించిన కీడు కారణంగా వేదాలు అన్నీ మళ్ళీ కలగాపులగం అయిపోతే నీవు మళ్ళీ నీ బుద్ధివైభవంతో వాటిని నాలుగుగా విభజిస్తావు. దేవతలకూ, ఋషులకూ ఆనందం కలిగిస్తావు.

**తే.** **ధర్మసందేహములు నీవు నిర్మలంపు । వాక్యములఁ బాపి జగములవార లెల్ల**
**నఖిల సంశయచ్ఛేత్త పుణ్యాత్మకుండు । లోకహితవాణి యనఁగ సుశ్లోకుఁ డగుదు. 528**

**ప్రతిపదార్థం:** ధర్మసందేహములు= ధర్మానికి సంబంధించిన సందేహాలు; నీవు= నీవు; నిర్మలంపు వాక్యములన్= నిర్మలమైన వాక్యాలతో; పాపి= తీర్చి; జగములవారలు+ఎల్లన్= ప్రపంచంలోని ప్రజలు అందరూ; అఖిల సంశయచ్ఛేత్త= అన్ని సంశయాలనూ ఛేదించేవాడు; పుణ్యాత్మకుండు= పుణ్యాత్ముడు; లోకహితవాణి= లోకానికి హితం కలిగించే వాక్కు కలవాడు; అనఁగన్= అనేట్టు; సుశ్లోకుఁడు= స్తుతింపబడేవాడవు; అగుదు(వు)= అవుతావు.

**తాత్పర్యం:** ప్రపంచంలో ప్రజలకు వచ్చే ధర్మసందేహాలన్నీ నీ మాటలతో తీరుతాయి. నిన్ను అఖిలసంశయ విచ్ఛేదకుడ వనీ, పుణ్యాత్ముడ వనీ లోకానికి హితం కలిగించే వాక్కు కలవాడ వనీ ప్రజలు స్తుతిస్తారు.

**క.** **రాగిత్వము విడువదు నిను, । రాగవిదూరుఁడగు సుతుఁడు ప్రభవించును నీ,**
**కాగమ విధానబుద్ధియు । యోగము సాంఖ్యంబు మది సముదితంబు లగున్. 529**

**ప్రతిపదార్థం:** వ్యాసుడా!; నినున్= నిన్ను; రాగిత్వము= అనురాగసహితత్వం అనేది (లోకమూ కుటుంబమూ - వీటిపట్ల ప్రేమ); విడువదు= విడిచిపెట్టదు (నీవు విరాగివి కాలేవు అని); నీకున్= నీకు; రాగవిదూరుఁడు+అగు= రాగరహితుడైన (విరాగి అయిన); సుతుఁడు= తనయుడు; ప్రభవించును= జన్మిస్తాడు (శుకుడు నీకు కుమారుడుగా జన్మిస్తాడని); ఆగమవిధాన= శాస్త్ర సమ్మతమైన; బుద్ధియున్= మతియూ; యోగమున్= యోగమూ; సాంఖ్యంబున్= సాంఖ్యమూ; మదిన్= అంతరంగంలో; నీకున్= నీకు; సముదితంబులు+అగున్= ఉదయిస్తాయి (ప్రకాశిస్తాయి, ఆవిర్భవిస్తాయి).

**తాత్పర్యం:** తనయుడా! నీవు విరాగివి కాలేవు. కాని, ఒక విరాగి నీకు కుమారుడుగా జన్మిస్తాడు. శాస్త్రాలనూ, ఆగమాలనూ అనుసరించే బుద్ధితోపాటు నీ అంతరంగంలో సాంఖ్యయోగాలు కూడా వికసిస్తాయి.

**వ.** **అని నిర్దేశించి నీవు నిజేచ్ఛం బ్రవర్తింపు మని పలికి యద్దేవుం డంతర్హితుం డయ్యె నిది మదీయ నారాయణసంభవత్వంబు తెఱం గేను యమనియమనిరూఢి నిర్మలతపఃకరణంబు చిరకాలం బాచరించి యప్పురుషోత్తము కారుణ్యంబు నామీఁద నంతకంతకు నెక్కుడగునట్లు సేసితి నని మద్గురుండును త్రికాల వేదియు నగు వేదవ్యాసుండు సెప్పె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయునితో వెండియు నిట్లనియె. 530**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; నిర్దేశించి= ఆజ్ఞాపించి; నీవు= నీవు; నిజ+ఇచ్ఛన్= నీ కోరికమేరకు; ప్రవర్తింపుము= సంచరించుము; అని= అట్లా; పలికి= అనుమతించి; ఆ+దేవుండు= ఆ శ్రీమన్నారాయణుడు; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడయ్యాడు; ఇది= ఇంతవరకూ చెప్పినది; మదీయ= నాయొక్క; నారాయణసంభవత్వంబు= నారాయణపుత్రత్వం తాలూకు; తెఱంగు= తీరు. (నేను నారాయణపుత్రుడిని ఎట్లాగయ్యానో తెలియజేసే కథ - అని); ఏనున్= నేను; యమ= ఇంద్రియనిగ్రహమూ; నియమ= ఇంకా తక్కిన నియమాలయొక్క; ఆరూఢిన్= గాఢతతో (ప్రసిద్ధితో); నిర్మల= పవిత్రమైన; తపఃకరణంబు= తపస్సమాచరణ; చిరకాలంబు= చాలాకాలం; ఆచరించి= చేసి; ఆ+పురుషోత్తము= ఆ పురుషోత్తముడైన విష్ణుమూర్తియొక్క; కారుణ్యంబు= దయ; నామీఁదన్= నాపైని; అంతకంతకున్= పోనుపోనూ; ఎక్కుడు+అగునట్లు= అధికం అయ్యేట్టు; చేసితిన్= నడచుకొన్నాను (చేసికొన్నాను); అని= ఆ విధంగా; మత్+గురుండును= నా గురువుగారూ; త్రికాల+వేదియున్= భూత భవిష్యద్వర్తమానాలను ఎరిగినవాడూ; అగు= అయిన; వేదవ్యాసుండు= వేదవ్యాసుడు; చెప్పెన్= చెప్పాడు; అని చెప్పి= ఇట్లా వివరించి; వైశంపాయనుండు= వైశంపాయనమహర్షి; జనమేజయునితోన్= ఆ జనమేజయ మహారాజుతో; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించి 'నీ కోరిక ననుసరించి నడచుకొనుము' అని పలికి నారాయణుడు అంతర్ధానమొందాడు. ఇదీ నేను నారాయణుడికి పుట్టిన విధం. నేను యమ నియమాలతో నిర్మలమైన తపస్సు చాలాకాలం చేసి విష్ణుదేవుడి దయ నామీద అంతకంతకూ ఎక్కువయ్యేటట్లు చేసికొన్నాను' అని నా గురువు, త్రికాలజ్ఞుడు అయిన వేదవ్యాసుడు చెప్పాడు - అని వైశంపాయనుడు జనమేజయుడితో మరల ఇట్లా అన్నాడు:

**సీ.** **అట్లు ధర్మజుఁడు నారాయణనారద । సంవాదకథ విన్న సమయమునను**
**నారదుఁ డచ్యుతు కారుణ్య మమ్మెయిఁ । బడసి క్రమ్మఱి వచ్చి బదరికాశ్ర**
**మమున నారాయణు మన్ననతోడి సం । భాషణంబును గాంచి పరమతపము**
**దాఁ జేఁత యెఱింగించి తదనంతరంబ య । య్యమరమునీంద్రుఁ డే మడిగినట్ల**

**ఆ.** **యడుగ ధర్మనందనాదులుఁ గృష్ణుండు । వినఁగ మద్గురుం డతనికిఁ జెప్పె**
**సురలు మోక్షధర్మపరులు గా కధ్వరా । యత్తచిత్తులైన యత్తెఱంగు.** **531**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారం; ధర్మజుఁడు= ధర్మరాజు; నారాయణ నారద సంవాదకథ= నారాయణ నారద సంభాషణ రూపమైన ఇతివృత్తాన్ని; విన్న సమయమునను= ఆలకించిన వేళలో; నారదుఁడు= నారదమహర్షి; అచ్యుతు+కారుణ్యము= విష్ణుమూర్తి దయను; ఆ+మెయిన్= ఆ విధంగా; పడసి= పొంది; క్రమ్మఱి= తిరిగి; వచ్చి= వచ్చి; బదరికా+ఆశ్రమమునన్= బదరి కాశ్రమంలో; నారాయణు= నారాయణునియొక్క; మన్ననతోడి= మన్ననతో (గౌరవం) కూడిన; సంభాషణంబును= సల్లాపాన్ని; కాంచి= పొంది (నారాయణుడితో సంభాషించగలిగి అని); పరమతపము= గొప్ప తపస్సును; తాన్= తాను(నారదుడు); చేఁత= చేయటం; ఎఱింగించి= తెలియజేసి; తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే; ఆ+అమరముని+ఇంద్రుడు= దేవఋషి వర్యుడయిన నారదుడు; ఏము+అడిగినట్ల= మేము అడిగినట్టే; అడుగన్= అడిగితే; ధర్మనందనాదులున్= ధర్మజాది పాండవులూ; కృష్ణుండున్= శ్రీకృష్ణుడూ; వినఁగన్= వినేటట్టు (తెలిసికొనేటట్టు); మత్+గురుండు= మా గురువుగారు వ్యాసుడు; అతనికిన్= ఆ నారదుడికి; సురలు= దేవతలు; మోక్షధర్మపరులు+కాక= మోక్షధర్మంపట్ల ఆసక్తులు కాకుండా; అధ్వర+ఆయత్త+చిత్తులైన= యజ్ఞయాగాదుల పట్ల సంసక్తమైన హృదయాలు కలవారుగా అయినటువంటి; ఆ+తెఱంగున్= ఆ తీరును; చెప్పెన్= వివరించాడు.

**తాత్పర్యం:** (ఇంక శ్రోతల పరంపరను కలుపుతున్నాడు.) నారదనారాయణ సంవాదకథను శ్రీకృష్ణుడు చెప్పగా ధర్మరాజాదులు విన్నారు. ఆ కథలో నారదుడు శ్వేతద్వీపంనుండి తిరిగి బదరికాశ్రమానికి రావటం, అక్కడ నరనారాయణులతో సంభాషించటం ఉన్నది. ఆ తరువాత అదే ఆశ్రమంలో నారదుడు వారి అనుమతి పొంది

నివసిస్తూ తపస్సు చేసికొంటున్నాడు. జనమేజయా! ఒకరోజున మేము అడిగినట్లే నారదుడు మా గురువు గారిని అడిగాడు. దేవతలు మోక్షపరులు కాకుండా పురోడాశపరాయణులు అవుతున్నారు ఇ దేమిటి స్వామీ! - అని (చూ. శాంతి-6-400). వారు అట్లా ఉండటానికి కారణం ఏమిటో మా గురువుగారు చెప్పారు. అప్పుడు దానిని ధర్మజాదులూ, శ్రీకృష్ణుడూ అంతా విన్నారు.

**వ. ఇట్లు సెప్పి. 532**

**తాత్పర్యం:** ఇట్లా వివరించి.

**క. వేదవ్యాసుఁడు సుముఖత । నా దైవతమునికిఁ జెప్పె హయశిరుఁడగు దా**
**మోదరుని దివ్యలీల స । మాదరమున ధర్మనందనాదులు వినఁగన్. 533**

**ప్రతిపదార్థం:** వేదవ్యాసుఁడు= ఆ వ్యాసమునీంద్రుడు; సుముఖతన్= ఆనుకూల్యంతో; ఆ+దైవతమునికిన్= ఆ దేవర్షికి (నారదుడికి); హయశిరుఁడు+అగు= హయగ్రీవుడైన; దామోదరుని= శ్రీమహావిష్ణువుయొక్క; దివ్యలీలన్= దివ్యవిలాసాన్ని; సమాదరమునన్= ఆదరంతో (అనురక్తితో); ధర్మనందన+ఆదులు= ధర్మరాజు మొదలైనవారు; వినఁగన్= వింటూండగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** వేదవ్యాసుడు సుముఖుడై ఆ నారదుడికి ఆదరంతో హయగ్రీవుడి దివ్యవిలాసాన్ని వివరించాడు. ధర్మరాజూ, ఆయన సోదరులూ ఆదరంతో దానిని ఆలకించారు.

**వ. అని చెప్పి వెండియు. 534**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; వెండియున్= మళ్ళీ; వైశంపాయనుడే అంటున్నాడు.

**తాత్పర్యం:** అని పలికి మరల.

**క. నిజనామ నిర్వచనములు । విజయుం డడుగంగ నెల్లవియు నెఱిఁగించెం**
**ద్రిజగద్భజనీయపదాం । బుజుఁ డగు కృష్ణుండు భరితపుణ్యచరిత్రా! 535**

**ప్రతిపదార్థం:** భరిత= వహించబడిన; పుణ్యచరిత్రా!= పవిత్రగాథ కలవాడా! (పవిత్రమైన చరిత్ర కలవాడా!); త్రిజగత్= ముల్లోకాలచేతనూ; భజనీయ= సేవింపబడే; పద+అంబుజుఁడు= పాదపద్మాలు కలవాడు; అగు= అయిన; కృష్ణుండు; నిజ= తనయొక్క; నామ= నామధేయాల; నిర్వచనములు= వ్యుత్పత్తులు (వివరాలు); విజయుండు= అర్జునుడు; అడుగంగన్= అడగగా; ఎల్ల+అవియున్= అన్నీ; ఎఱిఁగించెన్= తెలియజెప్పాడు.

**తాత్పర్యం:** పవిత్రచరిత్ర కలిగిన ఓ జనమేజయా! ముల్లోకాలకూ ఆరాధ్యుడైన శ్రీకృష్ణుడు తన నామధేయాల గాథలనూ అంతరార్థాలనూ విజయుడు అడిగితే తానే స్వయంగా అన్నీ వివరించాడు.

**వ. ఇ ట్లగుట ము న్నెఱింగించితి. 536**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అగుట= కావటం; మున్ను= ఇంతకుపూర్వమే; ఎఱింగించితిన్= నీకు తెలియజెప్పాను.

**తాత్పర్యం:** దీనిని ఇంతకు పూర్వమే నీకు తెలియజేశాను.

క. వేదాదులైన పథము ల। భేదప్రాప్యంబు లగుట ప్రియ మెసఁగఁగ న
వ్వేదవ్యాసుఁడు సెప్పె స। మాదరమునఁ బార్థుఁ డడుగ నందఱు వినఁగన్. 537

**ప్రతిపదార్థం:** వేద+ఆదులు+ఐన= వేదమూ, సాంఖ్యమూ మొదలైన (యోగ-పాశుపత-పాంచరాత్రాలు ఆదిపదంతో గ్రహించాలి చూ. శాంతి - 6-512); పథములు= మార్గాలు; అభేద= భేదంలేకుండా (ఉత్తమమనీ మధ్యమమనీ ఇట్లాంటి తేడాలు లేకుండా); ప్రాప్యంబులు= పొందదగినవి; అగుట= కావటాన్ని; పార్థుఁడు+అడుగన్= అర్జునుడు అడిగినప్పుడు; అందఱున్+వినఁగన్= అందరూ వినేట్టు; ఆ+వేదవ్యాసుడు= ఆ వేదవ్యాసుడు; ప్రియము+ఎసఁగఁగన్= ప్రేమ అతిశయించేటట్టు; చెప్పెన్= నిర్ధారించి చెప్పాడు.

**తాత్పర్యం:** వేదమూ, సాంఖ్యమూ, యోగమూ, పాశుపతమూ, పాంచరాత్రమూ అని ఉన్న మార్గాలలో భేదాలూ హెచ్చుతగ్గులూ ఏమీ లేవు - అని ఆ వేదవ్యాసుడు పార్థుడి సందేహానికి సమాధానంగా చెప్పాడు. దీనిని అందరూ అప్పుడు విన్నారు.

క. ఏకాంతికధర్మము సు। శ్లోకుండగు నాతఁ డడుగ లోకోత్తర! యా
లోకారాధ్యుఁడు సెప్పె ద। యాకరమతి కృష్ణధర్మజాదులు వినఁగన్. 538

**ప్రతిపదార్థం:** లోకోత్తర!= ఓ సర్వోత్తమా!; సుశ్లోకుండు+అగు= స్తుతింప దగినవాడైన; ఆతఁడు= ఆ అర్జునుడు; ఏకాంతిక ధర్మమున్= ఏకాంతిక లక్షణాన్ని; అడుగన్= అడిగితే; ఆ+లోక+ఆరాధ్యుఁడు= సకలలోకాలకూ ఆరాధింపదగినవాడైన ఆ వేదవ్యాసుడు; దయా+ఆకర+మతిన్= కృపకు నిలయమైన మనస్సుతో; కృష్ణ ధర్మజ+ఆదులు= శ్రీకృష్ణుడూ, ధర్మరాజూ ఇంకా మొదలైనవారు; వినఁగన్= వినేటట్టు; చెప్పెన్= వివరించాడు. (వారు వింటూండగా దయతో వివరించాడు - అని).

**తాత్పర్యం:** ఓ లోకోత్తరుడా! ఏకాంతికధర్మాన్ని గురించి అర్జునుడు అడిగితే వేదవ్యాసుడు దయతో వివరించాడు. అప్పుడు దానిని కృష్ణుడూ, ధర్మరాజూ ఇంకా మరికొందరూ (భీమ నకుల సహదేవాదులు) విన్నారు.

క. దైవవశంబున నేఁడును। నీ వడుగఁగ నింతవట్టు నిస్సందేహం
బై వఱలఁగ నేఁ జెప్పితిఁ। బావన మిది యసదృశంబు పౌరవముఖ్యా!' 539

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశంలో ముఖ్యుడైనవాడా!; దైవవశంబునన్= అదృష్టవశాత్తూ; నేఁడునున్= ఈ రోజయినా; నీవు= నీవు; అడుగఁగన్= అడిగావు కాబట్టి; ఇంతవట్టు= ఇంతవరకూ (ఇంతమటుకు); నిస్సందేహంబు+ఐ+వఱలఁగన్= సందేహరహితమై అతిశయించేటట్టు; నేన్= నేను; చెప్పితిన్= చెప్పాను; ఇది= ఈ ఏకాంతిక ధర్మం; పావనము= పవిత్రం; అసదృశంబు= సాటిలేనిది.

**తాత్పర్యం:** ఓ కౌరవశ్రేష్ఠా! అదృష్టవశాత్తూ ఈరోజు అడిగావు కాబట్టి నీ సందేహం నివృత్తి అయేటట్లుగా నేను చెప్పాను. ఈ ఏకాంతిక ధర్మం సాటిలేనిది.'

వ. అని పలికి నారాయణ నారద సంవాదాదికంబైన యివ్వాఙ్మయం బంతయుం బేర్కొని. 540

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వివరించి; నారాయణనారద సంవాద+ఆదికంబైన= నారద నారాయణ సంవాదమూ మొదలైన; ఈ+వాఙ్మయంబు+అంతయున్= ఈ వాక్యరూపమైనది (సాహిత్య రూపమైనది) అంతా; పేర్కొని= చెప్పి.

**తాత్పర్యం:** ఈ విధంగా వివరించి, ఈ సంవాదం మొదలైన సాహిత్యాన్నంతా చెప్పి.

**క. నారాయణీయమగు నీ । సారాఖ్యానంబు వినినఁ జదివిన సంప**
**త్తారోగ్యాయుస్సద్గతు । లేరికినైనం గురుక్షితీశ్వర! కలుగున్. 541**

**ప్రతిపదార్థం:** కురుక్షితి+ఈశ్వర!= కౌరవసామ్రాజ్యాధిపతీ!; నారాయణీయము+అగు= నారాయణుడికి సంబంధించినదైన; ఈ= ఈ; సార= శ్రేష్ఠమైన; ఆఖ్యానంబున్= కథను; వినినన్= విన్నా; చదివినన్= చదివినా; సంపత్తు= సకలసంపదలూ; ఆరోగ్య= ఆరోగ్యమూ; ఆయుస్= ఆయుర్దాయమూ; సద్గతులు= ఉత్తమలోకాలూ; ఏరికిన్+ఐనన్= ఎవ్వరికైనా; కలుగున్= లభిస్తాయి.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! నారాయణీయమైన ఈ పవిత్రగాథను విన్నవారికీ, చదివినవారికీ సకల సంపదలూ సిద్ధిస్తాయి. ఆయురారోగ్యాలు ఇహంలోనూ, సద్గతులు పరంలోనూ లభిస్తాయి.

**వ. అనిన విని యత్యంతాహ్లాద భరితాంతఃకరణుం డయిన యక్కౌరవేంద్రుతో నమ్మునీంద్రుం డిట్లను నిట్లు సకలలోకసంభావనీయ సత్కథ లాకర్ణించి సముదీర్ణ సంప్రీతుండగు నప్పాండవాగ్రజుండు. 542**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వైశంపాయనుడు చెప్పగా; విని= ఆలకించి; అత్యంత= మిక్కిలి; ఆహ్లాద= ఆనందంతో; భరిత= నిండిన; అంతఃకరణుండు+అయిన= మనస్సు కలవాడైన; ఆ+కౌరవేంద్రుతోన్= ఆ జనమేజయుడితో; ఆ+మునీంద్రుండు= ఆ వైశంపాయనుడు; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; ఇట్లు= ఈ ప్రకారంగా; సకలలోక= సర్వలోకాలలోనూ; సంభావనీయ= గౌరవింపదగినవైన; సత్కథలు= మంచి ఉపాఖ్యానాలు; ఆకర్ణించి= భీష్ముడినుండి విని; సముదీర్ణ= వికసించిన; సంప్రీతుండు+అగు= సంతృప్తి కలవాడైన; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** ఇది విన్న జనమేజయుడు చాలా సంతోషించాడు - అని భీష్ముడి నుండి విన్న ధర్మజుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అమరతటినీసుతున కిట్టు లనియె రాజ । ధర్మముఖ్యంబులగు సర్వధర్మముల ను**
**దాత్తకృప నెఱిఁగించి తత్యుత్తమంపు । ధర్మమెయ్యది సెప్పుము ధర్మనిత్య! 543**

**ప్రతిపదార్థం:** అమరతటినీ+సుతునకున్= గాంగేయునికి (అమరులనది - గంగ. గంగానది పుత్రుడు - భీష్ముడు); ఇట్టులు+అనియెన్= ఇలా అన్నాడు; రాజధర్మముఖ్యంబులు+అగు= రాజనీతి మొదలైన; సర్వధర్మములన్= అన్ని ధర్మాలనూ; ఉదాత్తకృపన్= గొప్ప దయతో; ఎఱిఁగించితి(వి)= తెలియజెప్పావు; ధర్మనిత్య!= ధర్మస్వరూపా!; అత్యుత్తమంపు= అత్యుత్తమమైన; ధర్మము= ధర్మం; ఏ+అది= వీటిలో ఏది; చెప్పుము= చెప్పు.

**తాత్పర్యం:** ఓ ధర్మనిత్యుడా! రాజనీతి మొదలుకొని అన్ని ధర్మాలూ చెప్పావు. వీటిలో ఏది ఉత్తమధర్మమో చెప్పుము. అని గాంగేయుడిని ధర్మరాజు అడిగాడు.

**వ. అనుటయు నా దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లనియె. 544**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనటంతోనే; ఆ+దేవవ్రతుండు= దేవవ్రతుడు అనేపేరుగల భీష్ముడు; ఆ+నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజులలో ఉత్తముడైన ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు (దేవవ్రతుడు అనేది తల్లిదండ్రులు చేసిన నామకరణం. భీష్ముడు అనేది ప్రతిజ్ఞతో ఏర్పడినది).

**తాత్పర్యం:** అనగా ఆ భీష్ముడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థములే దొకండు, నె
వ్వరిమది యెందు వ్రాలెఁ దగ వారలు దానిని పూని యాచరిం
తు, రదియ వారి కిష్టఫల దోహనకార్య మొనర్చు, నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలిన ధర్మములన్ వెలుంగఁగన్? 545

**ప్రతిపదార్థం:** అరయఁగన్= పరిశీలించి చూస్తే; ధర్మతంత్రములయందున్= ఈ ధర్మశాస్త్రాలలో; ఒకండున్= ఒక్కటికూడా; నిరర్థము= నిష్ప్రయోజనమైనది; లేదు= లేదు; ఎవ్వరి+మది= ఎవరి మనస్సు; ఎందున్= ఏ ధర్మశాస్త్రంలో; వ్రాలెన్= మొగ్గు చూపుతుందో; తగన్= అందంగా; వారలు= వారు; దానినిన్= ఆ శాస్త్రాన్ని; ఆచరింతురు= అనుసరిస్తారు; అది+అ= అదే; వారికిన్= వారికి; ఇష్టఫల= కోరుకొన్న ఫలితాలకు సంబంధించిన; దోహనకార్యము= పెంపుదలను; ఒనర్చున్= చేస్తుంది; తమకున్= తమకు; పోలిన= (అనుకూలమైన) తగిన; ధర్మములన్= ధర్మాలతో; వెలుంగఁగన్= ప్రకాశిస్తున్న; పురుషులన్= మానవులను; ఎల్లెడన్= ప్రపంచంలో అంతటా; చూడమే?= మనం చూడటం లేదా?

**తాత్పర్యం:** ధర్మశాస్త్రాలలో అన్నీ పనికివచ్చేవే. ఒక్కటికూడా పనికిరానిది అంటూ లేదు. ఎవరికి నచ్చిన ధర్మశాస్త్రాన్ని వారు అనుసరిస్తారు. అదే వారి కోరికలు పండటానికి దోహదం చేస్తుంది. తమకు తగిన ధర్మాలను ఆచరిస్తున్నవారిని లోకంలో ఎంతమందిని మనం చూడటంలేదు కనుక?

ఇంద్రునకు నారదుఁడు సెప్పిన భృగునామక విప్రుని చరిత్రము (సం. 12-340-4, 5)

వ. అది యట్లుండె; నప్రతిహతగతియై చరించుచుండి యొక్కనాఁడు నారదుం డాఖండలు పాలికిం జనిన నతం డతనికి సముచిత సత్కారంబు లాచరించి సుఖాసీనుండై యున్న యమ్మునివరు నాననంబునం జూడ్కి నిలిపి నీవు మెలంగునెడ నెద్దియేనియు నాశ్చర్యంబు గన్నయది గలదే?యని యడిగిన నమ్మహితాత్ముం డమ్మహేంద్రునకుం జెప్పిన కథ సెప్పెద; నది భవత్ప్రశ్నంబున కుత్తరం బైయుండు. దాని వినుము. భాగీరథీదక్షిణతీరంబున మహాపద్మం బనియెడు పురవరంబునఁ గులశ్రేష్ఠుండగు భృగుండను విప్రుండు గలం; డప్పురుషవరుండు. 546

**ప్రతిపదార్థం:** అది+అట్లుండెన్= అది అట్లా ఉండగా ; నారదుండు= నారదమహర్షి; అప్రతిహతగతియై= నిరాటంకమైన గమనం కలవాడై; చరించుచుండి= లోకాలన్నీ సంచరిస్తూ; ఒక్కనాఁడు= ఒకరోజున; ఆఖండలు పాలికిన్= ఇంద్రుడి సన్నిధికి; చనినన్= వెళ్ళగా; అతండు= ఆ ఇంద్రుడు; అతనికిన్= నారదుడికి; సముచిత సత్కారంబులు= తగిన మన్ననలు; ఆచరించి= చేసి; సుఖ+ఆసీనుండై+ఉన్న= సుఖంగా ఆసనంపై కూర్చుని ఉన్న; ఆ+మునివరు= ఆ నారదుడియొక్క; ఆననంబునన్= ముఖంమీద; చూడ్కి= తన దృష్టి; నిలిపి (నారదుడి ముఖం చూస్తూ); నీవు= నారదా! నీవు; మెలంగునెడన్= సంచరించే చోటులలో; ఎద్ది+ఏనియున్= ఏదయినా; ఆశ్చర్యంబు= అద్భుతం; కన్న+అది= నీవు చూచినది; కలదే?= ఉన్నదా?; అని; అడిగినన్= అడిగితే; ఆ+మహితాత్ముండు= ఆ మహాత్ముడు నారదుడు; ఆ+మహేంద్రునకున్= ఆ దేవేంద్రుడికి; చెప్పిన= చెప్పినటువంటి; కథ= వృత్తాంతం; చెప్పెదన్= నీకు చెబుతాను; అది= ఆ కథ; భవత్+ప్రశ్నంబునకున్= నీ ప్రశ్నకు; ఉత్తరంబు+ఐ+ఉండున్= సమాధానం అవుతుంది; దానిని= దాన్ని; వినుము= వినుము; భాగీరథీ= గంగానదియొక్క; దక్షిణతీరంబునన్= దక్షిణపు ఒడ్డున; మహాపద్మంబు+అనియెడు= మహాపద్మం అనే; పురవరంబునన్= గొప్పపట్టణంలో; కులశ్రేష్ఠుండు+అగు= వంశంలో ఉత్తముడైన; భృగుండు+అను= భృగుడు అనే; విప్రుండు= బ్రాహ్మణుడు; కలండు= ఉన్నాడు; ఆ+పురుషవరుండు= ఆ మానవోత్తముడు.

**తాత్పర్యం:** అది అట్లా ఉండగా, నారదుడు నిరాటంకంగా లోకాలనన్నిటినీ సంచరిస్తూ, ఒకనాడు ఇంద్రుడి వద్దకు వెళ్ళగా అతడు నారదుడిని సత్కరించి 'నారదా! నీవు తిరిగిన చోటులలో ఏదైనా అద్భుతం చూచావా?' అని అడిగాడు.

అప్పుడు నారదుడు ఇంద్రుడికి చెప్పిన కథ వినిపిస్తాను. అది నీ ప్రశ్నకు ఉత్తర మౌతుంది. వినుము. గంగానది దక్షిణతీరాన మహాపద్మ మనే మహానగరంలో భృగుడు అనే బ్రాహ్మణుడు ఉన్నాడు. ఆ ఉత్తముడు (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ధర్మనిత్యుండు సత్యవ్రత పరుఁ డహిం । సాశాలి యింద్రియజయ విభాసి**
**నిజకర్మతృప్తుండు నిష్క్రోధుఁ డంచిత । న్యాయసంప్రాప్త ధనముల దేవ**
**పిత్రతిథిజ్ఞాతి మిత్రకార్యములు ని । ర్వర్తించు, సువినయవంతులైన**
**తనయులఁ గన్నాఁడు, ద న్నెల్లవారును । వినుతింప మన్నాఁడు, దన మనమున**

**తే. నెట్టి కృత్యంబు మేలొ యే నెద్దిసేసి । కృతపరాయణ ధర్మతా స్థితి వహింతు**
**నొక్కొ?యని చింతఁ బొందుచు నుండు నాత్మ । నిష్ఠ యలవాటు కాంక్షించి నృపవరేణ్య! 547**

**ప్రతిపదార్థం:** ధర్మనిత్యుండు= ధర్మంపట్ల నిత్యస్పృహ కలవాడు - ఎప్పుడూ ధర్మం తప్పనివాడు; సత్యవ్రతపరుఁడు= సత్యంపట్ల దీక్ష కలిగినవాడు; అహింసాశాలి= అహింసావ్రతం వహించినవాడు; ఇంద్రియజయ= ఇంద్రియాలను జయించి; విభాసి= ప్రకాశించేవాడు (ఇంద్రియజయంతో విరాజిల్లేవాడు); నిజకర్మ= తన పనులతో; తృప్తుండు= సంతుష్టి పడేవాడు (ఆత్మసంతృప్తిగా కర్మాచరణం చేసేవాడు); నిష్క్రోధుఁడు= క్రోధం అనేది లేనేలేనివాడు; అంచిత= ఒప్పిన; న్యాయ= ధర్మబద్ధంగా; సంప్రాప్త= లభించిన; ధనములన్= డబ్బుతో (సంపదలతో); దేవ (కార్యములు)= దేవతల; పిత్ర= పితృదేవతల; అతిథి= అతిథుల; జ్ఞాతి= దాయాదుల; మిత్ర= స్నేహితుల; కార్యంబులు= పనులు (విధులు); నిర్వర్తించున్= నిర్వహిస్తూ ఉంటాడు; సువినయవంతులైన= మంచి వినయసంపన్నులైన; తనయులన్= పుత్రులను; కన్నాఁడు= పొందాడు; తన్నున్= తనను; ఎల్లవారున్= అందరూ; వినుతింపన్= స్తుతించగా; మన్నాఁడు= జీవితం గడిపాడు (మనుట= జీవించుట); నృపవరేణ్య!= రాజోత్తమా!; ఆత్మనిష్ఠ= ఆత్మనిష్ఠయొక్క (పరమాత్మపట్ల నిష్ఠ); అలవాటు= అభ్యాసాన్ని; కాంక్షించి= కోరి; తన= తనయొక్క; మనమునన్= మనస్సులో - ఎట్టి= ఎటువంటి; కృత్యంబు= పని; మేలొ= మంచిదో; ఏను= నేను; ఎద్ది= ఏది; చేసి= ఆచరించి; కృత= చేయబడిన; పరాయణ= ఉత్తమోత్తమ; ధర్మతా= ధర్మాలు కలిగిన; స్థితి= దశ (ఉత్తమ ధర్మాలను ఆచరించిన స్థితి); వహింతునొక్కొ?= వహిస్తానో?; అని= అనే; చింతన్= ఆలోచనను; పొందుచున్+ఉండున్= పొందుతూ ఉంటాడు (ఎప్పుడూ అదే ఆలోచనతో ఉంటాడు అని).

**తాత్పర్యం:** ఆ భృగువు ధర్మనిత్యుడు. సత్యవ్రత పరాయణుడు. అహింసాపరుడు. ఇంద్రియనిగ్రహం కలవాడు. తన కర్మాచరణం పట్ల తృప్తికలవాడు. క్రోధం ఎరుగనివాడు. న్యాయంగా లభించిన ధనంతో దేవకార్యాలూ, పితృకార్యాలూ, అతిథి సత్క్రియలూ, మిత్రకార్యాలూ నిర్వర్తిస్తూ ఉంటాడు. అతడికి వినయవంతులైన కుమారులు కలిగారు. లోకంలో అందరి మన్ననలూ పొందాడు. అతడికి ఎప్పుడూ ఒక్కటే ఆలోచన - ఏవి మంచి పనులు? వేటిని ఆచరిస్తే మేలు? ధార్మికుడను ఎలా అవుతాను? నాకు ఆత్మనిష్ఠ ఎట్లా అలవాటవుతుంది? - ఇదే అతడి చింత.

**వ. అట్లుండ నొక్కనాఁడు. 548**

**ప్రతిపదార్థం:** అట్లు+ఉండన్= అలా ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజున.

**తాత్పర్యం:** అట్లా ఉండగా ఒకరోజున.

**తే. తన గృహంబున కతిథి యుదాత్తుఁ డొక్క । బ్రాహ్మణుఁడు వచ్చె; వచ్చినఁ బరమభక్తి**
**యుక్తి నాతిథ్య మొనరించియున్నయప్పు । డమ్మహాద్విజుతోడ నిట్లనియె భృగుఁడు. 549**

**ప్రతిపదార్థం:** తన= ఆ భృగువుయొక్క; గృహంబునకున్= ఇంటికి; ఉదాత్తుఁడు= గొప్పవాడైన; ఒక్కబ్రాహ్మణుఁడు= ఒక విప్రుడు; అతిథి= అతిథిగా; వచ్చెన్= వచ్చాడు; వచ్చినన్= వస్తే; పరమభక్తియుక్తిన్= మిక్కిలి భక్తితో (భక్తియొక్క యుక్తితో= కూడికతో); ఆతిథ్యము= అతిథిమర్యాద; ఒనరించి= చేసి; ఉన్న+అప్పుడు= ఉన్న సమయంలో; ఆ+మహాద్విజుతోడన్= ఆ ఉత్తమ విప్రుడితో; భృగుఁడు= భృగువు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఒక ఉత్తమబ్రాహ్మణుడు తన ఇంటికి అతిథిగా వచ్చాడు. భృగువు అతిథిమర్యాదలన్నీ యథావిధిగా జరిపాడు. అది అయ్యాక నెమ్మదిగా ఇట్లా అడిగాడు.

**సీ. ' అనఘ! నీ మధుర వాక్యంబులఁ జేసి మి । త్రత్వంబు నొంది మద్భాగవతము**
**నీ కెఱింగించెద నీవు నెయ్యమెలర్ప । హిత ముపదేశింపు మేను నియతి**
**నాత్మావలోకన మాచరించెద నని । తొడఁగుదు నది యలవడదు నాకు**
**లోకసామాన్య గుణాకలనంబున । బద్ధుండ నగుట నెబ్భంగి నాత్మ**

**తే. నాత్మయంద కని యనామయత్వముఁ బొంది । ఖండరహిత మగు సుఖమున మునిఁగి**
**యుండువాఁడ? భూసురోత్తమ! చెప్పవే । యనిన నతని కిట్టు లనియె నతఁడు. 550**

**ప్రతిపదార్థం:** అనఘ!= పవిత్రుడా!; నీ= నీయొక్క; మధురవాక్యంబులన్+చేసి= తీయని మాటలచేత; మిత్రత్వంబు= స్నేహం; ఒంది= కుదిరి(పొంది); మత్+భాగవతమున్= నా భాగవతాన్ని (భగవద్భక్తికి సంబంధించిన విషయాన్ని); నీకున్= నీకు; ఎఱింగించెదన్= తెలియజేస్తాను (చెప్పుతున్నాను); నీవు= నీవు; నెయ్యము+ఎలర్పన్= స్నేహం వికసించేట్టు; హితము= మేలు చేకూర్చేదానిని; ఉపదేశింపుము; ఆత్మావలోకనము= ఆత్మదర్శనం; ఆచరించెదన్= ఆచరిస్తాను; అని= ఆ విధంగా; ఏనున్=నేను; నియతిన్= నియమబద్ధంగా (నిష్ఠతో); తొడఁగుదున్= పూనుకొంటాను; అది= (కానీ) అది; నాకున్= నాకు; లోకసామాన్య= సర్వజనసాధారణమైన; గుణ= సత్త్వాదిగుణాల; ఆకలనంబునన్= సమ్మిశ్రణంలో; బద్ధుండను+అగుటనన్= తగుల్కొన్నవాడిని కావటం వలన; అలవడదు= కుదరటంలేదు (ఆత్మదర్శనం కావటంలేదు); ఏ+భంగిన్= ఎలా; ఆత్మన్= ఆత్మను; ఆత్మ యందున్+అ= ఆత్మలోనే; కని= దర్శించి; అనామయత్వమున్= ఆరోగ్యాన్ని; పొంది= పొంది; ఖండరహితము+అగు= అఖండమైన; సుఖమునన్= సుఖంలో; మునిఁగి+ఉండువాఁడన్?= మునిగి ఉండిపోగలుగుతాను?; భూసుర+ఉత్తమ!= ఓ బ్రాహ్మణోత్తమా!; చెప్పవే?= దయచేసి తెలియజేయవా?; అనినన్= అని అడిగేసరికి; అతనికిన్= ఆ భృగువుకు; అతఁడు= ఆ అతిథి; ఇట్టులు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ రాజోత్తమా! నీ తీయనిమాటలు మనకు మైత్రి కలిగించాయి. కనుక నా భక్తివిషయం నీకు వినిపిస్తున్నాను. ఆలకించి, మేలైన సలహా చెప్పుము. నేను నియమనిష్ఠలతో ఆత్మావలోకనానికి కూర్చుంటాను (పూనుకొంటాను) కానీ' అది నాకు సిద్ధించటం లేదు. లోకసాధారణమైన సత్త్వరజస్తమోగుణాలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే ఎట్లా సిద్ధిస్తుంది మరి? అందుచేత ఆత్మసందర్శనం పొంది అఖండమైన ఆనందాన్ని పొందుతూ అట్లా ఉండిపోవాలి - అంటే దానికి మార్గం ఏమిటి? దయచేసి అది ఉపదేశించవా?' అని అడుగగా ఆ బ్రాహ్మణుడు భృగువుతో ఇట్లా అన్నాడు:

**క. ఏనును నిట్టుల మోహా । ధీనుఁడ నై యాత్మఁగాంచు తెఱఁ గొలయుటకుం**
**బూని వడుదు, నెయ్యదియో! । కానం దెరు వా శుభప్రకలనంబునకున్. 551**

**ప్రతిపదార్థం:** ఏనునున్= నేనుకూడా; ఇట్టులన్= ఇలా నీవలెనే; ఆత్మన్= ఆత్మను; కాంచు= దర్శించే; తెఱఁగు= విధానం; ఒలయుటకున్= పొందటానికి; పూని= పూనుకొని; మోహ+అధీనుఁడను+ఐ= మోహానికి లొంగిపోయి; పడుదున్= జారిపోతూ

ఉంటాను; ఆ+శుభప్రకలనంబునకున్= ఆత్మసందర్శనం అనే ఆ శుభాన్ని పొందటానికి; తెరువు= మార్గం; ఎయ్యదియో!=ఏదోకదా!

**తాత్పర్యం:** ఓ భృగూ! నేనూ నీవలెనే ఆత్మదర్శనంకొరకు ప్రయత్నించి సఫలం కాలేక జారిపోతున్నాను. మోహం అడ్డు వస్తున్నది. మరి ఆ శుభసందర్శనానికి సరియైన దారి ఏదో మరి!

**ఉ. కొందఱు బ్రహ్మచర్యమునఁ గొందఱు భవ్యగృహస్థధర్మముం**
**బొందుటఁ గొంద ఱిద్ధ తపమున్ వనభూమిఁ దగం జరించుటం**
**గొందఱు నిష్క్రియత్వమునఁ గొందఱు యజ్ఞవిధాన శాలితం**
**గొంద అనూనదానములఁ గోరి యొనర్తురు నిత్యసౌఖ్యమున్. 552**

**ప్రతిపదార్థం:** నిత్యసౌఖ్యమున్= నిరంతరం ఆనందస్థితిని; కోరి= కాంక్షించి; కొందఱు= కొంతమంది; బ్రహ్మచర్యమునన్= బ్రహ్మచర్యంద్వారా; ఒనర్తురు= ఆత్మసందర్శనం చేస్తారు; కొందఱు= మరికొంతమంది; భవ్య= పవిత్రమైన; గృహస్థధర్మమున్= గృహస్థాశ్రమ ధర్మాన్ని; పొందుటన్= పొందటంద్వారా; ఒనర్తురు= ఆత్మసందర్శనం చేస్తారు; కొందఱు= ఇంకా కొంతమంది; ఇద్ధతపమున్= గొప్ప తపస్సును; వనభూమిన్= అరణ్యంలో; తగన్= తగినట్లు; చరించుటన్= ఆచరించటంద్వారా; ఒనర్తురు= ఆత్మదర్శనం చేస్తారు; కొందఱు= ఇంకొంతమంది; నిష్క్రియత్వమునన్= నిష్కర్మత్వం ద్వారా; కొందఱు= మరికొంతమంది; యజ్ఞవిధానశాలితన్= యజ్ఞాలను చెయ్యటంపట్ల తత్పరులై (నేర్పరులై); కొందఱు= మరికొందరు; అనూన= అత్యధికమైన; దానములన్= దానాలను చెయ్యటం ద్వారా; ఒనర్తురు= (ఆ శుభప్రకలనంబు) ఆత్మసందర్శనం చేస్తారు.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యంద్వారా కొందరూ, గృహస్థ ధర్మాచరణంద్వారా కొందరూ, తపస్సుతో కొందరూ, నిష్కర్మత్వంతో కొందరూ, యజ్ఞాలద్వారా కొందరూ, దానధర్మాలద్వారా కొందరూ ఆత్మసందర్శనం పొందుతూ ఉంటారు.

**క. జననీజనకారాధన । మున గురుభక్తిని సువృత్తమున శాంతిని దాం**
**తిని సత్యమున నహింసను । విను కాంతురు మోక్షపదము వేర్వేఱ జనుల్. 553**

**ప్రతిపదార్థం:** ఓ భృగూ! విను= వినుము; జననీజనక= తల్లిదండ్రులను; ఆరాధనమునన్= సేవించటంద్వారా; గురుభక్తినిన్= గొప్ప భక్తితోనూ (గురువుపట్ల భక్తితోనూ); సువృత్తమునన్= మంచి నడవడికతోనూ; శాంతినిన్= శాంతస్వభావంతోనూ; దాంతినిన్= ఇంద్రియనిగ్రహంతోనూ; సత్యమునన్= సత్యవాక్య నియమపాలనంతోనూ; అహింసనున్= అహింసతోనూ ఇట్లా= ఈ విధంగా; జనుల్= ప్రజలు; వేర్వేఱ= వేరువేరుగా (ఎవరిదారిని వారు ప్రయాణించి); మోక్షపదము= ముక్తిపదవిని; కాంతురు= పొందుతారు (దర్శిస్తారు).

**తాత్పర్యం:** ఓయీ భృగూ! తల్లిదండ్రులను సేవించి కొందరూ, భక్తితో కొందరూ, మంచి శీలంతో కొందరూ, శాంతస్వభావంతో కొందరూ, ఇంద్రియ నిగ్రహంతో కొందరూ, సత్యవాక్య నియమంతో కొందరూ, అహింసావ్రతంతో కొందరూ - ఇట్లా ప్రజలు వేరే వేరే మార్గాలలో ముక్తిపదం పొందుతారు.

**వ. అట్లు బహువిధంబు లగు ధర్మద్వారంబులు గలవు?; గలిగిన కలుచ నెల్లవారికి నాత్మానందం బలవడ నేర్చునే?**
**యొకటి యుపదేశించెద నాకర్ణింపుము. 554**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; బహువిధంబులు+అగు= అనేక విధాలయిన; ధర్మద్వారంబులు= ముక్తిమార్గాలు; కలవు= ఉన్నాయి; కలిగిన కలుచన్= (ముక్తిపొందాలి అనే) బుద్ధి పుట్టినప్పుడల్లా (కోరినప్పుడల్లా - అనికాదు. కలుచన్ అనే మాటకు

క్రోధము - క్షోభ - దోషము అనే అర్థాలను నిఘంటువులు చెబుతున్నాయి; అవి ఏవీ ఇక్కడ కుదరటంలేదు. కారణము అనే అర్థాన్ని శబ్దార్థ చంద్రిక ఇచ్చింది. ఈ వాక్యార్థానికి అది కొంత సరిపోతోంది. కోరిక పుట్టటమే కారణం కనుక); ఎల్లవారికిన్= అందరికీ; ఆత్మానందంబు= ఆత్మానందం అనేది; అలవడన్+నేర్చునే?= దొరుకుతుందా?; ఒకటి= ఒక్కవిషయం; ఉపదేశించెదన్= చెబుతాను; ఆకర్ణింపుము= శ్రద్ధగా విను.

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మద్వారాలు ఎన్నో ఉన్నాయి. మోక్షం కావాలి అనుకొనగానే అందరికీ వెంటనే అది లభిస్తుందా? ఒక విషయం చెప్పుతాను. వినుము.

**తే.** **నైమిశారణ్యమునయందు గోమతి యనఁ । బరఁగు నుత్తమనది, మహాపద్మ మనఁగఁ**
**గలదు పుణ్యప్రదము దాని యలఘుతటత । లంబు నెలవుగానుండు నాగం బొకండు.** **555**

**ప్రతిపదార్థం:** నైమిశ+అరణ్యమున+అందున్= నైమిశారణ్యంలో; గోమతి+అనన్= గోమతి అనే పేరుతో; ఉత్తమనది= ఒక ఉత్తమమైన నది; పరఁగున్= ఉన్నది; మహాపద్మము+అనఁగన్= మహా పద్మము అనే పేరుతో; పుణ్యప్రదము= పవిత్రమైన మడుగు; కలదు= అక్కడే ఉన్నది; దాని= దానియొక్క; అలఘు= పెద్దదయిన; తట= ఒడ్డుయొక్క; తలంబునన్= పరిసరం (తటతలంబు= ఒడ్డు); నెలవుగాన్= నివాసస్థలంగా; ఒకండు= ఒక; నాగంబు= సర్పం; ఉండున్= నివసిస్తోంది.

**తాత్పర్యం:** నైమిశారణ్యంలో పవిత్ర గోమతీనదీతీరంలో మహాపద్మమనే పవిత్ర తటాకం ఉన్నది. దాని ఒడ్డున ఒక సర్పం నివసిస్తున్నది.

**క.** **ఆ తీర్థోత్తమమున మాం । ధాతృఁడు లోనుగ విశిష్టతపముల నిహలో**
**కాతిశయముఁ బరలోక । ద్యోతనముం బడసినారు దొల్లి యనేకుల్.** **556**

**ప్రతిపదార్థం:** ఆ+తీర్థ+ఉత్తమమునన్= ఉత్తమమైన ఆ తీర్థంలో (జలాశయంలో, రేవులో); మాంధాతృఁడు లోనుగన్= మాంధాతృడు మొదలుగా; అనేకుల్= చాలామంది; తొల్లి= పూర్వకాలంలో; విశిష్ట తపములన్= ప్రత్యేకమైన (విశిష్టమైన) తపస్సులతో; ఇహలోక= ఈ లోకంలో; అతిశయమున్= ఔన్నత్యాన్నీ; పరలోక= పరలోకానికి చెందిన; ద్యోతనమున్= తేజస్సునూ (పరలోక స్ఫూర్తినీ); పడసినారు= పొందారు.

**తాత్పర్యం:** 'మహాపద్మము' అనే ఆ తటాకప్రాంతంలో గొప్పగొప్ప తపస్సులు చేసి మాంధాతృడు మొదలుగా చాలామంది పూర్వకాలంలో ఇహపర శ్రేయస్సులు పొందారు.

**వ.** **అప్పుణ్యక్షేత్రంబున.** **557**

**ప్రతిపదార్థం:** ఆ+పుణ్యక్షేత్రంబునన్= ఆ పవిత్రస్థలంలో.

**తాత్పర్యం:** ఆ పవిత్రస్థలంలో.

**తే.** **పద్మునుఁడను పేరి యన్నాగపతి యుదాత్తుఁ । డఖిల ధర్మజ్ఞుఁ డతుల దయాన్వితుండు**
**సుజన సంభావ్యమానుఁ డస్తోకపుణ్య । నియత నిత్యుఁ డాగంతుకప్రియతముండు.** **558**

**ప్రతిపదార్థం:** పద్మునుఁడు+అను+పేరి= పద్మునుడు అనే పేరు కలిగిన; ఆ+నాగపతి= ఆ సర్పరాజు; ఉదాత్తుఁడు= గొప్పవాడు; అఖిలధర్మజ్ఞుఁడు= సమస్త ధర్మాలూ తెలిసినవాడు; అతుల= సాటిలేని; దయా+అన్వితుండు= దయతో కూడినవాడు; సుజన= సజ్జనులతో; సంభావ్యమానుఁడు= గౌరవింపబడేవాడు; అస్తోక= అధికమైన; పుణ్య= పుణ్యకార్యాలతో; నియత= నియతమైన;

నిత్యుఁడు= ప్రతిక్షణమూ కలవాడు. (అనుక్షణం - నిత్యం - పుణ్యకార్యాలను నియతంగా - విధిగా - ఆచరించేవాడు అని); ఆగంతుక= అతిథులకు; ప్రియతముండు= మిక్కిలి ఇష్టుడు (ఆగంతకులే ప్రియతములుగా కలవాడు అని కానీ).

**తాత్పర్యం:** ఆ పుణ్యక్షేత్రంలో ఉండే నాగరాజు పేరు పద్మడు. అతడు ఉత్తముడు. అన్ని ధర్మాలూ తెలిసినవాడు. గొప్ప దయాశాలి. సజ్జనులతో గౌరవించబడే వ్యక్తిత్వం కలవాడు. నిరంతరం పుణ్యప్రదమైన కార్యక్రమాలను ఆచరిస్తూ ఉంటాడు. అతిథులంటే అతడికి వల్లమాలిన ప్రేమ. అతిథులకూ అతడు ప్రియతముడే.

**ఉ. ఆతనిఁ గానఁ బొమ్ము ప్రచురాదరణంబున నీదుకోర్కి సం**
**ప్రీతిగఁ దీర్చు నా గుణగరిష్ఠుఁడు నా పలుకూఁదు మన్న మో**
**దాతిశయంబు నొంది భృగుఁ డా ధరణీసురవర్యుతో మహా**
**త్మా! తెలివొందె నా మనము తావక పావన వాక్యసంపదన్. 559**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆ పద్మడిని; కానన్= దర్శించటానికి; పొమ్ము= వెళ్ళుము; ఆ+గుణగరిష్ఠుఁడు= గుణాలలో దొడ్డవాడైన ఆ పద్మడు; ప్రచుర+ఆదరణంబునన్= విస్తృతమైన ఆదరంతో; సంప్రీతిగన్= ప్రీతి కలిగేటట్టు (నీకు తృప్తికలిగేటట్టు); నీదుకోర్కి= నీ కోరిక; తీర్చున్= తీరుస్తాడు; నా పలుకున్= నామాటను; ఊఁదుము= ఆధారంగా స్వీకరించుము (విశ్వసించుము); అన్నన్= అని అతిథి చెప్పేసరికి; భృగుఁడు= భృగుడు; మోద+అతిశయంబున్= అతిశయించిన ఆనందాన్ని (ఆనందాధిక్యాన్ని); ఒంది= పొంది; ఆ+ధరణీసుర+వర్యుతోన్= బ్రాహ్మణోత్తముడైన ఆ అతిథితో; మహాత్మా!= మహానుభావా!; తావక= నీయొక్క; పావన= పవిత్రమైన; వాక్యసంపదన్= మాటల సంపత్తితో; నా మనము= నా మనస్సు; తెలివి+ఒందెన్= తెలివిని (జ్ఞానాన్ని) పొందింది.

**తాత్పర్యం:** ఓ భృగూ! ఆ పద్మడిని దర్శించుము. అతడు నీ కోరిక తీరుస్తాడు' అని అతిథి చెప్పాడు. దానికి భృగువు ఎంతో సంతోషించాడు. 'మహాత్మా! నీ మాటలతో నాకు జ్ఞానోదయమయింది' అన్నాడు.

**క. అని పలికి యిట్లనియె ని । ద్దినశేషము రాత్రియును మదీయనివాసం**
**బున నిలువు నిలిచి మత్పా । వనుఁడవు గావలయు గౌరవశ్రీభరితా! 560**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఇంకా ఇట్లా అన్నాడు; గౌరవశ్రీ= గౌరవశోభతో; భరితా!= నిండినవాడా!; ఈ+దినశేషమున్= ఈ పగటిపూటలో మిగిలిన ఈ కాస్తసేపూ; రాత్రియునున్= ఈ రాత్రీ; మదీయనివాసంబునన్= మా ఇంటిలో; నిలువు(ము)= ఆగుము; మత్పావనుఁడవు= నన్ను పవిత్రుడిని చేసేవాడవు; కాన్+వలయున్= అవ్వాలి.

**తాత్పర్యం:** ఇంకా, గౌరవసంపన్నుడా! ఈ పూటకూ ఈ రాత్రికీ నీవు నా నివాసంలోనే ఉండాలి. నన్ను పావనుడిని చేయాలి' అన్నాడు.

**క. అనిన నతఁడట్ల చేయ న । తనిఁ బూజించుటను మధురతరసల్లాపం**
**బున ధర్మసత్కథావ । ర్తనమున నక్కాల మతఁ డుదాత్తతఁ గడపెన్. 561**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అభ్యర్థించగా; అతఁడు= ఆ అతిథి; అట్లు+అ= అట్లాగే; చేయన్= చేయగా; అతనిన్= ఆ అతిథిని; పూజించుటను= అర్చించటంతోనూ; మధురతర= మిక్కిలి మధురమైన; సల్లాపంబునన్= సంభాషణతోనూ; ధర్మ= ధర్మంతో కూడిన (ధర్మాలను ఉపదేశించే); సత్కథా+ఆవర్తనమునన్= మంచి కథలను కలబోసికొనటంతోనూ; ఆ+కాలమున్= ఆ సమయాన్ని; అతఁడు= ఆ భృగువు; ఉదాత్తతన్= ఉత్తమంగా(ఉదాత్తంగా); కడపెన్= కడపాడు.

**తాత్పర్యం:** భృగువు అభ్యర్థనను అతిథి అంగీకరించి ఆగిపోయాడు. అతడిని అర్చించటంలోనూ, మధుర సంభాషణలతోనూ, ధార్మికగాథలను ఆలకించటంలోనూ ఉదాత్తంగా ఆ సమయాన్ని భృగువు గడిపాడు.

క. వేగిన నామంత్రితుఁడై । యా గుణనిధి వీడుకొలిపి యతఁడు ప్రయాణో
ద్యోగంబు సమీచీనవి । ధా గరిమప్రౌఢవృత్తిఁ దగ నొనరించెన్. 562

**ప్రతిపదార్థం:** వేగినన్= తెల్లవారింది - అప్పుడు; ఆమంత్రితుఁడై= వీడ్కొల్పబడినవాడై; ఆ గుణనిధిన్= గుణసంపన్నుడైన ఆ అతిథిని (గుణాలకు నిధి); వీడుకొలిపి= పంపించి (పరస్పరం వీడ్కోలు చెప్పుకొని - అని); అతఁడు= ఆ భృగువు; సమీచీన= సరియైన; విధా= విధానం యొక్క; గరిమ= గొప్పదనంతో కూడిన; ప్రౌఢవృత్తిన్= నేర్పరితనంతో; ప్రయాణ+ఉద్యోగంబు= తన ప్రయాణ ప్రయత్నాన్ని; తగన్+ఒనరించెన్= తగినట్టుగా చేశాడు.

**తాత్పర్యం:** మధురసంభాషణలతో తెల్లవారింది. అప్పుడు అతిథి భృగువుకు వీడ్కోలు చెప్పాడు. భృగువు అతిథిని వీడ్కొలిపాడు. ఆ తరువాత తన ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లను సరియైన పద్ధతిలో నేర్పుగా తగిన రీతిలో చేశాడు.

### భృగుం డను విప్రుండు పద్ముం డను సర్పరాజుం గనవచ్చుట (సం. 12-343-2)

వ. ఇవ్విధంబున నుద్యుక్తుండై భృగుండు బంధుమిత్రజన సమ్మతం బగు తెఱంగునం గదలి యెడనెడ బహుతీర్థసేవనంబు సేయుచుం జని పుణ్యంబగు నైమిశారణ్యంబు సొచ్చి గోమతీతీరంబు సేరి, సుప్రసిద్ధం బగు మహాపద్మహ్రదంబు తటంబునం బొలుచు భుజగేంద్రమందిరంబు గాంచి తగం బ్రవేశించి నట్టియెడ. 563

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా ఉద్యుక్తుండై= సన్నద్ధుడై; భృగుండు= భృగువు; బంధు(జన)= బాంధవులకూ; మిత్రజన= మిత్రులకూ; సమ్మతంబు+అగు= అంగీకార యోగ్యమైన; తెఱంగునన్= పద్ధతిలో; కదలి= బయలుదేరి; ఎడనెడన్= అక్కడక్కడా; బహుతీర్థ సేవనంబు= అనేక తీర్థాలను సేవించటం; చేయుచున్= చేస్తూ; చని= వెళ్ళి; పుణ్యంబు+అగు= పుణ్యప్రదమైన; నైమిశ+అరణ్యంబు= నైమిశారణ్యం; చొచ్చి= ప్రవేశించి; గోమతీతీరంబు= గోమతీ నది ఒడ్డు; చేరి= సమీపించి; సుప్రసిద్ధంబు+అగు= మిక్కిలి ప్రసిద్ధమైన; మహాపద్మ హ్రదంబు= మహాపద్మము అనే తటాకంయొక్క; తటంబునన్= ఒడ్డున; పొలుచు= ఒప్పారుతున్న; భుజగేంద్ర మందిరంబు= నాగేంద్రుడి గృహం; కాంచి= చూచి; తగన్= తగినట్టు; ప్రవేశించినట్టి+ఎడన్= ప్రవేశించిన సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా పూనుకొని భృగుడు బంధుమిత్రుల అనుమతిగల పద్ధతిలో పయనించి, అక్కడక్కడ పుణ్యతీర్థాలను సేవిస్తూ వెళ్ళి, పవిత్ర నైమిశారణ్యంలో ప్రవేశించి, గోమతీనది తీరం చేరి, ప్రసిద్ధమయిన మహాపద్మ మనే సరస్సు గట్టుమీద ఉన్న నాగేంద్రమందిరం చూచి, సముచితంగా అందులో ప్రవేశించే సమయంలో.

తే. భక్తితోడ నన్నాగేంద్రుపత్ని యెదురు । వచ్చి తోడ్కొని చని యర్చలిచ్చి 'మీర
లిందు రాకకుఁ గారణమేమి సెప్పుఁ । డెద్ది పనిచినఁ జేసెద నిద్ధచరిత!' 564

**ప్రతిపదార్థం:** ఆ+నాగేంద్రు= ఆ నాగేంద్రుని; పత్ని= భార్య; భక్తితోడన్= భక్తితో; ఎదురువచ్చి= ఎదురువచ్చి; తోడ్కొని చని= వెంట తీసికొనివెళ్ళి; అర్చలు+ఇచ్చి= (అతిథి మర్యాదలుగా) పూజలు చేసి; ఇద్ధచరిత!= పవిత్రమైన నడవడి కలవాడా!; మీరలు= తమరు; ఇందున్+రాకకున్= ఇక్కడకు రావటానికి; కారణము= కారణం (హేతువు); ఏమి= ఏమిటో; చెప్పుఁడు= దయచేసి చెప్పండి; ఎద్ది= ఏది; పనిచినన్= ఆజ్ఞాపించినా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ఆ నాగేంద్రుడి భార్య ఎదురువచ్చి భృగువును భక్తితో ఇంటికి తీసికొనివెళ్ళింది. అతిథిపూజలు చేసింది. 'మీరు ఏమి పనిమీద ఇక్కడికి వచ్చారో చెప్పండి. ఏది ఆజ్ఞాపిస్తే అది చేస్తాను' అన్నది.

**వ. అనుటయు నమ్మహీదేవుండు 'దేవీ! భవదీయపతిం గాన వచ్చితి నెచ్చోనున్నవాఁ డవ్విభుం గానిపింపు' మనిన నతని కా భుజంగాంగన యిట్లనియె. 565**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ఆవిడ అనేసరికి; ఆ+మహీదేవుండు= ఆ బ్రాహ్మణుడు - భృగువు; దేవీ!= అమ్మా!; భవదీయపతిన్= నీ భర్తను; కానన్= చూడటానికి; వచ్చితిన్= వచ్చాను; ఎచ్చోన్= ఎక్కడ; ఉన్నవాఁడు= ఉన్నాడు?; ఆ+విభున్= ఆ నీ భర్తను; కానిపింపుము= చూపించుము; అనినన్= అంటే; అతనికిన్= భృగువుకు; ఆ భుజంగ+అంగన= ఆ సర్పకాంత; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పింది.

**తాత్పర్యం:** దానికి ఆ బ్రాహ్మణుడు 'అమ్మా! నీ భర్తను కలిసి వెళ్ళటానికి వచ్చాను. ఆయన ఎక్కడున్నాడో తెలుపుము' అనగా ఆ సర్పకాంత ఇట్లా అన్నది.

**క. ' తనకు నెలవరుస వచ్చిన । నినరథ వహనమున కాతఁడేఁగినవాఁ డే**
**డెనిమిది దివసములకు నిట । ననుదెంచుం దథ్యమిది ప్రసాద ప్రవణా! 566**

**ప్రతిపదార్థం:** ప్రసాద= ప్రసన్నతాగుణంపట్ల; ప్రవణా!= తత్పరత కలవాడా! (ప్రసన్నమైన ఆకృతి కలవాడా! - అని అర్థం); తనకున్= నా భర్తకు; నెలవరుస= నెలవారీవంతు; వచ్చినన్= వచ్చి; ఇనరథ+వహనమునకున్= సూర్యరథాన్ని మోయటానికి; ఆతఁడు= ఆయన; ఏఁగినవాఁడు= వెళ్ళాడు; ఏడు+ఎనిమిది= ఏడులేక ఎనిమిది; దివసములకున్= రోజులకు; ఇట= ఇక్కడికి; చనుదెంచున్= తిరిగి వస్తాడు; ఇది= ఇది; తథ్యము= నిజం.

**తాత్పర్యం:** 'ఓ ప్రసన్నమూర్తీ! నెలవారీ వంతు రావటంతో నా భర్త సూర్యరథాన్ని మోయటానికి వెళ్ళాడు. ఏడు ఎనిమిది రోజులలో వస్తాడు. ఇది నిజం. (సూర్యరథానికి సర్పాలే రజ్జువులని పురాణప్రసిద్ధి.)

**క. అతని తెఱంగిట్టిది వాం । ఛిత మెయ్యది యిత్తు ననఘ! చెప్పు' మనుడు నా**
**సతి కిట్లను భృగుఁడు 'భవ । త్పతిఁ గనుటయ కాక వాంఛ దక్కును గలదే? 567**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పవిత్రుడా!; అతని తెఱంగు= నా భర్త (ఉద్యోగ) పద్ధతి; ఇట్టిది= ఇటువంటిది (నెలనెలా ఒక వారం రోజులు సూర్యరథవహనానికి వెళ్ళటం); వాంఛితము= నీ కోరినది; ఏ+అది?= ఏమిటి?; ఇత్తున్= ఇస్తాను; చెప్పుము; అనుడున్= అనేసరికి; ఆ సతికిన్= ఆ పతివ్రతతో; భృగుఁడు= భృగువు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; భవత్= నీయొక్క;పతిన్= భర్తను; కనుట+అ+కాక= దర్శించటం ఒక్కటే తప్ప; తక్కును= మరొక; వాంఛ= కోరిక; కలదే?= నాకు ఉన్నదా?(లేదని అర్థం).

**తాత్పర్యం:** ఓ పావనుడా! నా భర్త చేసే ఉద్యోగం పద్ధతి ఇది. నెలనెలా ఒకవారం రోజులు సూర్యరథ వహనానికి వెళ్ళుతాడు. నీ కోరిక ఏమిటో చెప్పుము, తీరుస్తాను' అన్నది ఆ పతివ్రత. 'అమ్మా! నీ భర్తను దర్శించటంకంటె నాకు వేరే కోరిక ఏమీ లేదు' అని అన్నాడు భృగువు.

**వ. అయ్యురగవల్లభు వచ్చునంతకు నుల్ల వనంబున నిలిచెద; నవ్విభుండు వచ్చినప్పుడు మఱవక నా తెఱం గెఱింగింపవలయు' నని పలికి పోయి భృగుండు గోమతీతట పుణ్యారణ్యంబున జప్యపరుండును నిరాహారుండునునై యుండె; నట్లుండ నా భుజంగపతి బాంధవులు దదీయ పత్నీపుత్ర సహితంబుగా నమ్మహీసురవరు పాలికిం జనుదెంచి మృదుమధురవాక్యంబుల ననునయించి 'నీ వాహారంబుగొనక నిలువం దొడంగిన నాఁటికి నేఁ డాఱవదినం బయ్యె నే మతిథిపూజా పరులము మాకు ధర్మవిరోధంబు గాకుండ మా చేయు నాతిథ్యంబు నాదరింపు మస్మత్ప్రార్థనంబున నన్నంబు ఫలంబు మూలంబు మఱియు నెయ్యదియైనను భుజించి మమ్ము రక్షింపవే?' యనిన వారలతో నా సువ్రతశీలుం డిట్లనియె. 568**

**ప్రతిపదార్థం:** ఆ+ఉరగవల్లభుండు= ఆ సర్పరాజు; వచ్చునంతకున్= వచ్చేదాకా; ఉల్ల= అదిగో అల్లంతదూరంలో ఉన్న (ఉల్ల= అల్ల); వనంబునన్= అరణ్యంలో; నిలిచెదన్= వేచి ఉంటాను; ఆ+విభుండు= ఆ నాగరాజు; వచ్చినప్పుడు+అ= వచ్చిన వెంటనే; మఱవక= మరచిపోకుండా; నా తెఱంగు= నా విషయం; ఎఱింగింపన్+వలయున్= తెలియజేయాలి సుమా!; అని పలికి= అని చెప్పి; పోయి= వెళ్ళి; భృగుండు= భృగువు; గోమతీతట= ఆ గోమతి ఒడ్డున ఉన్న; పుణ్య+అరణ్యంబునన్= పవిత్రమైన అడవిలో; జప్యపరుండును= జప తత్పరుడూ; నిరాహారుండును+ఐ= ఆహారం తీసికోనివాడూ అయి; ఉండెన్= ఉన్నాడు; అట్లుండన్= అట్లా ఉండగా; ఆ భుజంగపతి= ఆ సర్పరాజు; బాంధవులు= బంధువులు; తదీయ= అతడి; పత్నీపుత్ర సహితంబుగాన్= భార్యాపుత్రులతో సహా; ఆ+మహీసురవరు= ఆ బ్రాహ్మణుడి; పాలికిన్= దగ్గరకు; చనుదెంచి= వచ్చి; మృదు= సున్నితమైన; మధుర= తీయనైన; వాక్యంబులన్= మాటలతో; అనునయించి= బుజ్జగించి; నీవు; ఆహారంబు+కొనక= ఆహారం తీసుకోకుండా; నిలువన్+తొడంగిన+నాఁటికిన్= ఇక్కడ ఉండటం మొదలుపెట్టినరోజుకు; నేఁడు= ఈనాడు; ఆఱవదినంబు= ఆరవ రోజు; అయ్యెన్= అయింది; ఏము= మేమంతా; అతిథిపూజాపరులము= అతిథులను అర్చించటమే వ్రతంగా కలవారం; మాకున్= మాకు; ధర్మవిరోధంబు= ధర్మలోపం (అతిథులను అర్చించకపోవటం అనే ధర్మవిరోధం); కాకుండన్= జరగకుండా; మా చేయు= మేము చేస్తున్న; ఆతిథ్యంబున్= అతిథిమర్యాదను; ఆదరింపుము= మన్నించి స్వీకరించుము; అస్మత్= మా; ప్రార్థనంబునన్= అభ్యర్థనతో; అన్నంబు= అన్నమో; ఫలంబు= ఫలమో; మూలంబు= దుంపయో; మఱియున్= ఇంకా; ఏ+అది+ఐనన్= ఏదయినా; భుజించి= ఆహారంగా తీసికొని; మమ్మున్= మమ్ములను; రక్షింపవే!= కాపాడవా! (ధర్మలోపం నుంచి రక్షించుము); అనినన్= అనివారు అభ్యర్థించగా; ఆ సువ్రతశీలుండు= మంచిదీక్ష, మంచి శీలమూ కలిగిన ఆ భృగువు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ నాగరాజు వచ్చేంతవరకు ఆ వనంలో ఉంటాను. ఆ రాజు రాగానే నా సంగతిని తెలపండి' అని చెప్పి, భృగుడు గోమతీపుణ్యారణ్యంలో జపం చేస్తూ, నిరాహారుడై ఉన్నాడు. అట్లా ఉండగా ఆ నాగరాజు బంధువులు అతడి భార్యాపుత్రులతో కలిసివచ్చి భృగువును తియ్యనిమాటలతో అనునయించి, 'నీవు ఆహారం తీసికొనక నేటికి ఆరునాళ్ళయింది. మేము అతిథిపూజాప్రియులం. మాకు ధర్మలోపం జరుగకుండా మా ఆతిథ్యం స్వీకరించుము. మా కోరిక మన్నించి అన్నమో, పండ్లో, కందమూలాలో - ఏవైనా తిని మమ్ములను రక్షించుము' అని అనగా, ఆ నిష్ఠాపరుడైన భృగువు ఇట్లా అన్నాడు:

**ఉ. ' ఇంతన నేల? యేను భుజగేశ్వరు రాకయ వార్చినాఁడ, నా**
**కం తవునంతకుం గుడువ నాఁకలి నీళ్ళు ద్రావఁ దృష్ణ యొ**
**క్కింతయు లేదు గా కలిగి యే యటవీస్థలి కేఁగుదెంచి యే**
**కాంతమ యున్నవాఁడ? నియమాభిరతున్ నను నేఁపనేటికిన్? 569**

**ప్రతిపదార్థం:** ఇంత+అనన్+ఏల?= ఇంతగా చెప్పటం ఎందుకు?; ఏను= నేను; భుజగ+ఈశ్వరు= ఆ సర్పరాజు యొక్క; రాకయ= రాకకే; వార్చినాఁడన్= ఎదురుచూస్తున్నాను; అంత+అవునంతకున్= అంతవరకూ (అది సిద్ధించే దాకా); నాకు; కుడువన్= భుజించటానికి; ఆఁకలి= ఆకలీ; నీళ్ళులు= నీరు; త్రావన్= త్రాగటానికి; తృష్ణ= కోరికా; ఒక్కింతయున్= కాసింతకూడా; లేదు; (ఆకలీ ఉండదు దప్పికా ఉండదు అని - లేదు+కాక= ఉండనే ఉండదు - అని కానీ); కాక= అట్లా కాక; అలిగియే= కోపించినందువలనా; అటవీస్థలికిన్= ఈ అరణ్యప్రదేశానికి; ఏఁగుదెంచి= వచ్చి; ఏకాంతము+అ= ఒంటరిగా; ఉన్నవాఁడన్?= నేను ఉన్నది? (అలిగి ఇక్కడికి రాలేదు కదా!- అని); నియమ= ఒక నియమంపట్ల; అభిరతున్= పట్టుదల గలవాడనైన; ననున్= నన్ను; ఏఁపన్+ఏటికిన్= ఇట్లా బాధపెట్టటం ఎందుకు? (ఇబ్బంది పెట్టటం దేనికి?)

**తాత్పర్యం:** 'అయ్యా! ఇంతంతమాటలు అనటం ఎందుకు? సర్పరాజు రాకకొరకు ఎదురు చూస్తున్నాను. అది సిద్ధించేవరకూ నాకు ఆకలీ ఉండదు, దప్పికా ఉండదు. అంతేకాని, నేను అలిగి ఇట్లా వచ్చేసి ఈ అడవిలో ఏకాంతంగా కూర్చుండలేదుగదా! ఒక నియమంతో ఉన్నాను. నన్ను బాధపెట్టటం ఎందుకు చెప్పండి!

**క.** **మీకును ధర్మవిరోధము । గాకుండుట కేన పూఁట గారవమున నా**
**లోకింపుఁ డింక దివసయు । గాకలనమునఁ గల్గ వ్రతసమాప్తియుఁ గలుగున్. 570**

**ప్రతిపదార్థం:** మీకునున్= మీకు కూడా; ధర్మవిరోధము= ధర్మలోపం; కాకుండుటకున్= కాకుండా ఉండటానికి; ఏను+అ= నేనే; పూఁట= పూచీ (ఆ బాధ్యతనాది - అని); గారవమునన్= ప్రేమతో; ఆలోకింపుఁడు= చూడండి (వేచి ఉండండి); ఇంకన్= మరొక; దివసయుగ= రెండురోజులు; ఆకలనమున్= కడవటంకూడా; కల్గన్= జరిగితే; వ్రతసమాప్తియున్= నా (నిరాహార) దీక్షాసమాప్తి కూడా; కలుగున్= జరుగుతుంది.

**తాత్పర్యం:** మీకు ధర్మవిరోధం జరుగకుండా ఉండటానికి నాదీ పూచీ. కాస్త గౌరవంతో వేచి చూడండి. మరొక రెండురోజులు ఇట్లాగే గడిస్తే నా వ్రతం కూడా పూర్తి అయిపోతుంది.

**క.** **వినుఁ డష్టమమగు దివసం । బున ముదమారంగ నిందు భుజగేంద్రుఁడు రా**
**కునికి గలిగెనేనియుఁ బర । దినమునఁ గుడిచెద భవన్మతిం బ్రియ మెసఁగన్. 571**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; అష్టమము+అగు= ఎనిమిదవదైన; దివసంబునన్= రోజున; ముదమారంగన్= సంతోషకరంగా; ఇందున్= ఇక్కడికి; భుజగ+ఇంద్రుఁడు= ఆ సర్పరాజు; రాక+ఉనికి= రాకపోవటం; కలిగెన్+ఏనియున్= జరిగినట్టయితే (రాకపోతే); పరదినమునన్= ఆ మరుసటిరోజున; భవత్+మతిన్= మీ కోరికమేరకు (మీ ఆలోచన ప్రకారం); ప్రియము+ఎసఁగన్= ఇష్టం అతిశయించేట్టు (పూర్తి ఇష్టంతో); కుడిచెదన్= భుజిస్తాను.

**తాత్పర్యం:** అయ్యా! వినండి. ఎనిమిదవ రోజుకు ఆ సర్పరాజు రావాలి. ఒకవేళ రాకపోతే ఆ మర్నాడు మీరు కోరినట్లే హాయిగా ఇష్టపడి భోజనం చేస్తాను.

**వ.** **మీర లిత్తెఱంగున కనుజ్ఞ సేయవలయు' నని సంప్రార్థనీయస్వరంబునం బలికిన వారలందఱు నొడంబడి నిజనివాసంబులకుం జని రయ్యష్టమ దివసంబున. 572**

**ప్రతిపదార్థం:** మీరలు= మీరు; ఈ+తెఱంగునకున్= ఈ పద్ధతికి; అనుజ్ఞ= అనుమతి; చేయవలయున్= ఈయవలెను; అని= అని; సంప్రార్థనీయ+స్వరంబునన్= వేడుకొనే కంఠస్వరంతో; పలికినన్= అడిగేసరికి; వారలు+అందఱున్= వారంతా; ఒడంబడి= అంగీకరించి; నిజనివాసంబులకున్= తమ తమ గృహాలకు; చనిరి= వెళ్ళారు; ఆ+అష్టమ దివసంబునన్= ఆ ఎనిమిదవ రోజున-

**తాత్పర్యం:** మీరు దీనికి అంగీకరించాలి' అని ఆయన వేడుకొనగా, వాళ్ళందరూ దానికి అంగీకరించి తమ నివాసాలకు వెళ్ళిపోయారు. ఎనిమిదవ రోజున. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **వరుస దినంబులు దీఱిన । నరవిందాప్తుండు దనకు ననుమతి సేయం**
**గురువంశముఖ్య! తగ న । య్యురగాధీశుండు విభవమొప్పఁగ వచ్చెన్. 573**

**ప్రతిపదార్థం:** కురువంశముఖ్య!= కురువంశంలో ప్రధానమైనవాడా (పెద్దవాడా) ఓ ధర్మరాజా!; వరుసదినంబులు= తనవంతు రోజులు (తన చుట్టు రోజులు); తీఱినన్= తీరిపోగా; అరవింద+ఆప్తుఁడు= పద్మాలకు మిత్రుడైన సూర్యుడు; తనకున్= తనకు;

అనుమతి+చేయన్= వెళ్ళటానికి అనుమతి ఈయగా; తగన్= తగినట్లు; ఆ+ఉరగ+అధీశుండు= ఆ సర్పరాజు; విభవము+ఒప్పఁగన్= తన వైభవం అతిశయించేటట్టు; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! సర్పరాజుకు సూర్యరథాన్ని మోయవలసిన తనవంతు రోజులు గడిచిపోయాయి. సూర్యుడు అనుమతి ఇచ్చాడు. ఆ సర్పరాజు వైభవంగా ఇంటికి తిరిగివచ్చాడు.

**ఉ. వచ్చిన సంభ్రమంబు గరువంపు టెలర్పును నుల్లసిల్లి మే**
**నచ్చు పడంగఁ జేయఁ జెలు వా భుజగేశ్వరుపత్ని యాతనిం**
**జెచ్చెరఁ దా నెదుర్కొని విశిష్టసమాదరయై యుపాయనం**
**బిచ్చి తదీయచిత్తమునకిం పెసలారఁగఁ బాద్య మిచ్చినన్. 574**

**ప్రతిపదార్థం:** వచ్చినన్= వచ్చేసరికి; సంభ్రమంబున్= హడావుడీ; గరువంపు+ఎలర్పునన్= అతిశయం తాలూకు విజృంభణలతో; ఉల్లసిల్లి= సంతోషించి; మేను= శరీరం (ఆకారం); చెలువున్= ఆ సౌందర్యాన్ని (సంభ్రమమూ గరువమూ - వీటి విలాసాన్ని); అచ్చుపడంగన్+చేయన్= స్పష్టపడేటట్టు చేయగా (స్వేదరోమాంచాదులతో అవి స్పష్టపడ్డాయి - అని); ఆ+భుజగ+ఈశ్వరు+పత్ని= ఆ సర్పరాజుగారి భార్య; ఆతనిన్= ఆ సర్పరాజును; చెచ్చెరన్= వెంటనే (వేగంగా); తాను= సర్పరాజు భార్య; ఎదుర్కొని= ఎదురు సన్నాహం వెళ్ళి; విశిష్ట= విశేషమైన; సమాదరయై= ఆదరంతో కూడినదై; ఉపాయనంబు+ఇచ్చి= (ప్రేమసూచకంగా) బహుమతి ఇచ్చి; తదీయ= ఆతని; చిత్తమునకున్= హృదయానికి; ఇంపు+ఎసలారఁగన్= ఇంపు కలిగేటట్టు; పాద్యము= పాదోదకం; ఇచ్చినన్= ఈయగా (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** సర్పరాజు భార్య హడావుడిగా 'నా భర్త ఇంటికి వచ్చాడు' అనే అతిశయంతో ఎదురువెళ్ళి ఆదరంగా బహూకరించి తీసికొని వచ్చింది. కాళ్ళకు నీళ్ళు ఇచ్చింది. సర్పరాజు మనస్సు ఈ ఆదరానికి సంతోషించింది.

**వ. సంప్రీతుండై సముచితప్రకారంబున నుండె నట్లున్న యన్నాగేంద్రుండు సమీపాసీనయైన యద్దేవి నాలోకించి. 575**

**ప్రతిపదార్థం:** సంప్రీతుండై= సంతోషించినవాడై; సముచితప్రకారంబునన్= తగిన పద్ధతిలో; ఉండెన్= ఉన్నాడు; అట్లు+ఉన్న= అలా ఉన్నటువంటి; ఆ+నాగేంద్రుండు= ఆ నాగరాజు; సమీప= తనకు దగ్గరగా; ఆసీనయైన= కూర్చునిఉన్న; ఆ+దేవిన్= ఆమెను (తనభార్యను); ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** సర్పరాజు సంతోషించాడు. తనకు దగ్గరగా ఉన్న భార్యను చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'అతివ! సేమమె? తగ దేవతాతిథి ప్ర। పూజనంబులు నడచునే? పూర్వవృత్తి**
**యెడలి యేను లేకునికి నేమేని వికల। మయ్యెనో? చెప్పు' మనవుడు నా మృగాక్షి. 576**

**ప్రతిపదార్థం:** అతివ= ఓ మగువా! సేమమె?= క్షేమమేనా?; తగన్= తగిన పద్ధతిలో; దేవతా+అతిథి+ప్రపూజనంబులు= దేవతాపూజలూ, అతిథిసేవలూ; నడుచునే?= సాగుతున్నాయా?; ఏనున్= నేను; లేకునికిన్= లేకపోవటంతో; పూర్వవృత్తి+ఎడలి= మునుపటి పద్ధతి తప్పిపోయి; ఏమేనిన్= ఏదయినా; వికలము+అయ్యెనో?= పొరపాటు జరిగిందా?; చెప్పుము; అనవుడున్= అనగానే; ఆ+మృగాక్షి= లేడి కన్నులవంటి కన్నులుగల ఆ వనిత.

**తాత్పర్యం:** 'ఓ అతివా! క్షేమమే కదా! దేవతాపూజలూ, అతిథి పూజలూ యథావిధిగా జరుగుతున్నాయా? నేను ఊళ్ళో లేనుకదా అని మునుపటి పద్ధతి తప్పిపోయి ఏమయినా మార్పులూ పొరపాట్లూ జరిగాయా? చెప్పుము' అని ఆ సర్పరాజు ప్రేమగా అడిగాడు.

ఉ. ఆతనితోడ నిట్లనియె 'నంత యెఱుంగమి రాదు నీదు శి
క్షాతిశయంబు గల్మి భుజగాధిప! నాకుఁ దగన్ సమస్తదే
వాతిథి పూజనంబులు సమగ్రములై నడచెన్ సుహృజ్జన
ప్రీతియు మున్నపోలె నవిభేదత యొప్పఁగ నిర్వహించితిన్.' 577

**ప్రతిపదార్థం:** ఆతనితోడన్= ఆ సర్పరాజుతో; ఇట్లు+అనియెన్= ఆమె ఇలా అంది; భుజగ+అధిప!= ఓ సర్పరాజా!; నీదు= నీవు ఇచ్చిన; శిక్షా= అభ్యాసంతాలూకు (తర్ఫీదు); అతిశయంబు+కల్మిన్= ఔన్నత్యం ఉండటంవల్ల; నాకున్= నాకు; అంత+ఎఱుంగమి= ఆ మాత్రం ఎరగకపోవటం; కాదు= లేదు (ఆమాత్రం ఎరుగుదునులెమ్ము - అని); తగన్= తగినపద్ధతిలో; సమస్తదేవ= సకలదేవతల; అతిథి= అతిథుల పూజనంబులు= అర్చనలు; సమగ్రములై= పరిపూర్ణాలై; నడచెన్= సాగాయి; సుహృద్+జన= స్నేహితుల; ప్రీతియున్= సంతృప్తికూడా (వారిని గౌరవించి ఆనందింపజేయటమనేది సైతం); మున్ను+అ+పోలెన్= మునుపటివలెనే; అవిభేదతన్= ఏమీ తేడా లేకుండా; ఒప్పఁగన్= ఒప్పేట్టు; నిర్వహించితిన్= నిర్వహించాను.

**తాత్పర్యం:** 'ఓ సర్పరాజా! నే నేమీ ఆమాత్రం ఎరుగనిదానిని కాదు. ఇంతకాలమూ నీవు ఇచ్చిన శిక్షణ ఉన్నది కదా! దేవతాపూజలూ అతిథిసత్కారాలూ అన్నీ సమగ్రంగా యథావిధిగా జరిగాయి. స్నేహితులను గౌరవించి సంప్రీతులను చేయటమనేది కూడా మునుపటివలెనే ఏమీ తేడా లేకుండా నిర్వహించాను' అని బదు లిచ్చింది.

వ. అని వెండియు. 578

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ - (తరువాతి పద్యంతో అన్వయం).

సీ. గురుభక్తి శిష్యులకును, వేదపరత వి । ప్రులకును, జనరక్ష భూపతులకు,
న్యాయార్జనంబు వైశ్యజనంబులకుఁ ద్రివ । ర్ణారాధనంబు శూద్రావళికిని,
బతివాక్య కరణంబు భటులకు, సర్వోప । కారక్షమంబైన సారభూత
మనఁగఁ బెంపొందు గృహస్థాశ్రమంబుపై । వారని ప్రియ మెల్లవారలకును,

తే. లోక మేల? యేనేల? యి ట్టేకతంబ । యింద్రియంబులఁ గుదియించి యిచ్చ నడఁచి
యుండువాఁడఁ గాకను మతి యోగికిని, బ । తివ్రతాత్వంబు భార్యకు సువ్రతములు. 579

**ప్రతిపదార్థం:** గురుభక్తి= గురువుపట్ల భక్తి; శిష్యులకును= శిష్యులకూ; వేదపరత= వేదాలపట్ల తత్పరత; విప్రులకును= బ్రాహ్మణులకూ; జనరక్ష= ప్రజలను రక్షించటం; భూపతులకున్= రాజులకూ; న్యాయ+ఆర్జనంబు= న్యాయంగా ధనాన్ని సంపాదించటం; వైశ్యులకున్= కోమటులకూ; త్రివర్ణ= పై మూడు వర్ణాలవారినీ; ఆరాధనంబు= అర్చించటం; శూద్ర+ఆవళికిని= శూద్రుల సమూహానికీ; పతి= ప్రభువుయొక్క; వాక్య= ఆజ్ఞను; కరణంబు= చేయటం; భటులకున్= సేవలకూ( సైనికులకూ); సర్వ= అందరికీ; ఉపకార= ఉపకరించటంలో; క్షమంబు+ఐన= సమర్థమైన; సారభూతము= సారప్రాయమయినది; అనఁగన్= అని; పెంపొందు= ప్రశస్తిని పొందిన; గృహస్థ+ఆశ్రమంబుపైన్= గృహస్థాశ్రమం మీద; వారని= వారింపరాని; ప్రియము= ప్రేమ; ఎల్లవారలకును= అందరికీ; (సువ్రతములు); లోకము+ఏల?= ఈ లోకం ఎందుకు? ఏను+ఏల?= నేను ఎందుకు?; ఇట్టు= ఇట్లా; ఏకతంబు+అ= ఒంటరిగా (ఏకాంతంలో)నే; ఇంద్రియంబులన్= ఇంద్రియాలను; కుదియించి= నిగ్రహించి; ఇచ్చన్= కోరికను; అడఁచి= అణచివేసి; ఉండువాఁడన్+కాక= ఉండిపోతానే తప్ప; అను= అనేటటువంటి; మతి= బుద్ధి; యోగికినిన్= యోగికీ; పతివ్రతాత్వంబు= పాతివ్రత్యం; భార్యకున్= భార్యకూ; సువ్రతములు= ఆచరించదగిన వ్రతాలు (నియమాలు).

**తాత్పర్యం:** గురువుపట్ల భక్తి శిష్యులకు వ్రతం. వేదతత్పరత బ్రాహ్మణులకు వ్రతం. లోకరక్షణ రాజులకు వ్రతం. న్యాయంగా ధనం సంపాదించటం వైశ్యులకు వ్రతం. పై మూడు వర్ణాలవారినీ సేవించటం శూద్రులకు వ్రతం. రాజాజ్ఞను శిరసావహించటం భటులకు వ్రతం. సర్వాశ్రమాల వారికీ ఉపకారం అందించే గృహస్థాశ్రమం మీద ప్రేమ అందరికీ వ్రతం. లోకం ఏమిటి? నే నేమిటి? ఇవన్నీ నాకెందుకట! హాయిగా ఏకాంతంలో తపస్సు చేసికొంటూ ఇంద్రియాలను జయిస్తాను, కోరికలను జయిస్తాను - అనే బుద్ధి కలిగి ఉండటం యోగికి వ్రతం. పాతివ్రత్యం భార్యకు వ్రతం.

**వ.** **కావున ధర్మసూక్ష్మ సంవేది వగు నీదు చిత్తంబున భేదం బొక్కింతయేనియు దొడరునట్టి విధంబున వర్తింతునే? యొకండు విన్నపంబు సేయంగల దవధరింపుము. పరమపావనమూర్తి యొక్క మహీసురోత్తముం డిచ్చటికి వచ్చి యభ్యర్చితుండై భవత్పతి దర్శింప వచ్చితిననియెఁ గార్యంబేమి? యని యడిగిన నాకుం జెప్పకుండె; నేను నీ వట సనుటం జెప్పిన విని యట్లయిన నా భుజంగవిభుండు వచ్చునంతకు నుల్ల వనంబున నుండెద నతండు వచ్చిన నా తెఱం గెఱింగింపు మని చని యేడెనిమిది నాళ్ళైని జప్యపరుండును నిరాహారుండునై యున్నవాఁడు; నీ వచ్చటి కరిగి యతని సంభావింపవలయు నని చెప్పిన నా సర్ప గ్రామణి గుపితచిత్తుండై.** **580**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ధర్మసూక్ష్మ= ధర్మసూక్ష్మాలను; సంవేదివి+అగు= తెలిసినవాడవైన; నీదు= నీయొక్క; చిత్తంబునన్= మనస్సులో; భేదంబు= బాధ; ఒక్కింత+ఏనియున్= కొంచెమయినా; తొడరునట్టి= కలిగేటటువంటి; విధంబునన్= విధంగా; వర్తింతునే?= ప్రవర్తిస్తానా?; ఒకండు= ఒకానొకటి; విన్నపంబు= విజ్ఞాపన; చేయన్= చేయటానికి; కలదు= ఉంది; అవధరింపుము= దయతో ఆలకించుము; పరమపావనమూర్తి= మిక్కిలిపవిత్రమైన ఆకారం కలవాడు; ఒక్క= ఒకానొక; మహీసుర+ఉత్తముండు= బ్రాహ్మణోత్తముడు; ఇచ్చటికిన్= ఇక్కడికి (మన ఇంటికి); వచ్చి= విచ్చేసి; అభ్యర్చితుండై= పూజింపబడినవాడై; భవత్= (అమ్మా!) నీయొక్క; పతిన్= భర్తను; దర్శింపన్= దర్శించటంకోసం; వచ్చితిన్= వచ్చాను; అనియెన్= అన్నాడు; కార్యంబు= పని; ఏమి?= ఏమిటి?; అని; అడిగినన్= అడిగితే; నాకున్= నాకు; చెప్పక+ఉండెన్= చెప్పలేదు; నేనున్= నేను; నీవు; అట= సూర్యరథవహనం కోసమని అట్లా; చనుటన్= వెళ్ళటాన్ని; చెప్పినన్= తెలియజేస్తే; విని; అట్లు+అయినన్= అట్లాగైతే; ఆ+భుజంగవిభుండు= ఆ సర్పరాజు; వచ్చునంతకున్= వచ్చేదాకా; ఉల్ల= అల్లదిగో ఆ; వనంబునన్= అరణ్యంలో; ఉండెదన్= (నిరీక్షిస్తూ) ఉంటాను; అతండు= ఆ సర్పరాజు; వచ్చినన్= వస్తే (రాగానే); నా తెఱంగున్= నా విషయం; ఎఱింగింపుము= తెలియచేయుము; అని; చని= వెళ్ళి; ఏడు+ఎనిమిదినాళ్ళు+ఏనిన్= ఏడెనిమిది రోజులయినా; జప్యపరుండును= జపతత్పరుడూ; నిరాహారుండునున్+ఐ= ఆహారం ఏమీ తీసికోనివాడుగా; ఉన్నవాఁడు= ఉన్నాడు; నీవు= నీవు; అచ్చటికిన్= అక్కడికి; అరిగి= వెళ్ళి; అతనిన్= ఆ బ్రాహ్మణుడిని; సంభావింపన్+వలయున్= గౌరవించాలి; అని= అని; చెప్పినన్= ఆమె చెప్పేసరికి; ఆ సర్పగ్రామణి= ఆ నాగరాజు (గ్రామణి= నాయకుడు); కుపిత= కోపించిన; చిత్తుండై= హృదయం కలవాడై (కోపించిఅని).

**తాత్పర్యం:** కాబట్టి ధర్మరహస్యం తెలిసిన నీదు హృదయంలో ఏమాత్రం భేదం కలిగే విధం వర్తిస్తుందా? నాది ఒక విన్నపం ఉన్నది. వినుము. పవిత్రుడైన ఒక బ్రాహ్మణోత్తముడు ఇచ్చటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించి 'మీ భర్తను దర్శించటానికి వచ్చాను' అన్నాడు. 'పని ఏమిటి?' అని అడిగాను. దాని కతడు సమాధానం చెప్పలేదు. నేను-నీవు అక్కడికి వెళ్ళటం తెలిపాను. 'అయితే, ఆ నాగరాజు వచ్చేంతవరకు అల్లంత దూరంలో ఉన్న వనంలో ఉంటాను. ఆయన వస్తే నా సంగతి తెలియజేయుము' అని వెళ్ళి, ఏడెనిమిది నాళ్ళైనా జపంలో ఉండి, నిరాహారుడై ఉన్నాడు. నీవు అక్కడికి వెళ్ళి అతడిని పలుకరించాలి' అని చెప్పగా, ఆ నాగరాజు కుపితుడై.

**క. ' ఏనటె! యొక్కెడ కొక్కొరుఁ । గానఁగఁ బోదు నటె! దేవగణము నసురులున్**
**లోనుగ నన్నే చందము । మానుగ నడపుదురు తలఁపుమా చతురమతీ! 581**

**ప్రతిపదార్థం:** చతురమతీ!= ఓ నెఱజాణా! (చతురమైన మతి కలదానా!); ఏనటె!= నేనా!; ఒక్క+ఎడకున్= మరొకచోటుకు; ఒక్కొరున్= మరొకరిని; కానఁగన్= దర్శించటానికి; పోదునటె!= వెడతానా! (వెళ్ళటమా!); దేవగణమున్= దేవతల సమూహమూ; అసురలున్= రాక్షసులూ; లోనుగన్= మొదలైనవారు; నన్నున్= నన్ను (నాపట్ల); ఏ చందము= ఏ ప్రకారం; మానుగన్= గౌరవంగా (ఏ చందముమానుగన్= ఏ ప్రకారంగా); నడపుదురు= నడుపుతూ ఉంటారో (నన్ను ఎట్లా గౌరవిస్తుంటారో); తలఁపుమా= ఒకసారి గుర్తుచేసుకో.

**తాత్పర్యం:** 'ఓ నెఱజాణా! నేనా! ఇంకొక చోటికి ఎక్కడికో వెళ్ళి ఎవరినో దర్శించటమా! అసంభవం. దేవతలూ, రాక్షసులూ ఇంకా తక్కినవారూ నాపట్ల ఎట్లా ఉంటారో, ఎంత గౌరవం చూపుతారో నీవు ఎరుగుదువు అది ఒకసారి గుర్తుకు తెచ్చుకొమ్ము. వా డెవడి దర్శనానికో నన్ను వెళ్ళమంటా వేమిటి!

**తే. అనిన నీ రాక వార్చి మహాశతోడ । నున్న విప్రుని యభిలాష మొక్కభంగిఁ**
**దీర్పకుండుట ధర్మువే? ధీరశాంత । చిత్త! నీయట్టి యాచారవిత్తమునకు. 582**

**ప్రతిపదార్థం:** అనినన్= అనేసరికి; ధీర శాంత చిత్త!= గంభీరమైన శాంతమైన చిత్తం కలవాడా!; నీ రాక= నీ ఆగమనం; వార్చి= (ఎదురుచూస్తూ) ప్రతీక్షించి; మహా+ఆశతోడన్= పెద్ద ఆశతో; ఉన్న= ఉన్నటువంటి; విప్రుని= బ్రాహ్మణుడియొక్క; అభిలాషము= కోరికను; ఒక్కభంగిన్= ఒక విధంగా; తీర్పక+ఉండుట= తీర్చకపోవటం; నీ+అట్టి= నీవంటి; ఆచారవిత్+తమునకున్= సదాచారం తెలిసినవారిలో గొప్పవాడికి; ధర్మువు+ఏ ?= ధర్మమా? (న్యాయమా?)

**తాత్పర్యం:** ధీరశాంతచిత్తుడా! నీ రాకకొరకు వేచి ఆశతో ఎదురుచూస్తున్న ఒక బ్రాహ్మణుడి కోరికను తీర్చకపోవటం నీవంటి ధర్మవేత్తకు న్యాయమా? చెప్పుము.

**క. ధరణీసురు నాస సెఱిచినఁ । బొరసిన పాపాగ్నిఁ గాల్పఁ బూనెదవే? నీ**
**పురుషార్థంబును సముచిత । పరత్వమును గృపయు ధర్మపాండిత్యంబున్. 583**

**ప్రతిపదార్థం:** ధరణీసురు= బ్రాహ్మణుడియొక్క; ఆస= ఆశను; చెఱిచినన్= నాశనం చేసినందువలన; పొరసిన= ఉత్పన్నమైన; పాప+అగ్నిన్= పాపము అనే అగ్నిలో; నీ= నీయొక్క; పురుషార్థంబునున్= ముక్తినీ; సముచిత పరత్వమునున్= ఉచితజ్ఞతను (సముచితమైన దానిపట్ల తత్పరత కల్గి ఉండుట) లేదా సత్ప్రవర్తననూ; కృపయున్= దయనూ; ధర్మపాండిత్యంబున్= ధర్మాలపట్ల నీకున్న పాండిత్యాన్నీ; వీటన్నింటినీ; కాల్పన్+పూనెదవే?= దగ్ధం చెయ్యటానికి పూనుకొంటావా?;

**తాత్పర్యం:** ఒక బ్రాహ్మణుడిని నిరాశపరిచి, ఆ పాపాగ్నిలో నీ ముక్తినీ, ఔచిత్యాన్నీ, దయనూ, ధార్మిక పాండిత్యాన్నీ - వీటన్నింటినీ తగులబెట్టుకొంటావా?

**క. విను మాశావిచ్ఛేదన । మునఁ బాటిలు బ్రహ్మహత్య, భుజగోత్తమ! ధ**
**ర్మనిరూఢుఁడైన పురుషున । కును దద్విజునాస దీర్పఁగోరుట వలదే? 584**

**ప్రతిపదార్థం:** భుజగ+ఉత్తమ!= ఓ సర్పరాజా!; వినుము= వినండి; ఆశా+విచ్ఛేదనమునన్= ఆశను సంహరించటంవలన; బ్రహ్మ హత్య= బ్రాహ్మణుడిని సంహరించిన దోషం; పాటిలున్= కలుగుతుంది (చుట్టుకొంటుంది); ధర్మ= ధర్మంపట్ల; నిరూఢుఁడు+ఐన=

నిష్ఠకల్గినవాడైన; పురుషునకును= మానవుడికి; తద్= ఆ; ద్విజు= బ్రాహ్మణుడి; ఆస= కోరిక; తీర్పన్+కోరుట+వలదే?= తీర్చాలి అనుకోవటం అవసరంలేదా?

**తాత్పర్యం:** ఓ సర్పరాజా! బ్రాహ్మణుడి ఆశను ఖండిస్తే బ్రాహ్మణుడినే సంహరించినంతటి పాపం చుట్టుకొంటుంది. నీవు ధర్మపరుడవు. అట్లాంటి విప్రుల కోరిక తీర్చటం నీవు కోరుకొనవలసింది కాదంటావా!

**క. మౌనమున దృఢజ్ఞానము । దానంబున నభ్యుదయము ధర్మనిరత! యా**
**శా నిర్వహణంబున నర । కానీక నిహరణ సౌఖ్య మగునండ్రు బుధుల్. 585**

**ప్రతిపదార్థం:** ధర్మనిరత!= ఓ ధర్మతత్పరుడా! (ధర్మంపట్ల నిరతి కలవాడా!); మౌనమునన్= మౌనంవలన; దృఢజ్ఞానము= నిశ్చలమైన (గాఢమైన); జ్ఞానమున్= జ్ఞానమూ; దానంబునన్= దాతృత్వంవలన; అభ్యుదయమున్= అభివృద్ధీ; ఆశా నిర్వహణంబునన్= ఆశలు తీర్చినందువలన; నరక+అనీక= నరకలోకాల (అనీకం= గుంపు); నిహరణ= పరిహరణరూపమైన (పరిహరణంతో కలిగిన); సౌఖ్యము= సుఖమూ; అగున్= కలుగుతాయి అని; బుధుల్= పండితులు; అండ్రు= అంటూ ఉంటారు.

**తాత్పర్యం:** ఓ ధార్మికా! మౌనంవలన దృఢజ్ఞానమూ, దానంవలన అభ్యుదయమూ, ఆశలు తీర్చినందువలన నరకలోక బాధ తప్పిపోయి స్వర్గలోకసుఖాలు లభిస్తా యని పెద్దలు చెప్తుతూ ఉంటారు.

**తే. చాతకము వానఁగోరెడు చందమొంద । నెదురుచూచుచు నున్నవాఁ డిందు నీదు**
**రాక కక్కట! యడవిలో బ్రాహ్మణుండు । రోష ముడుగుము ధర్మనిరూఢ హృదయ!' 586**

**ప్రతిపదార్థం:** ధర్మ= ధర్మంపట్ల; నిరూఢ= గాఢంగా నాటుకొన్న; హృదయ!= హృదయం కలవాడా!; చాతకము= చాతకపక్షి; వానన్= తొలకరివానను; కోరెడు+చందము+ఒందన్= కోరినరీతిలో పొందేవిధంగా; ఇందున్= ఇక్కడ; అడవిలోన్= అరణ్యంలో; బ్రాహ్మణుండు= ఆ విప్రుడు; నీదు= నీయొక్క; రాకకున్= ఆగమనానికి; ఎదురుచూచుచున్నవాఁడు= నిరీక్షిస్తున్నాడు; అక్కట!= అయ్యో!; రోషము= రోషాన్ని (నేనా! వెళ్ళటమా! అనే రోషాన్ని); ఉడుగుము= విడిచిపెట్టుము.

**తాత్పర్యం:** ధర్మనిరూఢమైన హృదయం కలిగిన ఓ సర్పరాజా! తొలకరి వానకొరకు చాతకం ఎదురుచూసేటట్లు నీ రాకకొరకు ఎదురుచూస్తూ ఆ విప్రుడు ఇక్కడే ఈ అడవిలోనే ఉన్నాడు. అయ్యో! నీ రోషం చాలించుము.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని పత్ని బోధించిన. 587**

**ప్రతిపదార్థం:** అని; పత్ని= భార్య; బోధించినన్= బోధించేసరికి.

**తాత్పర్యం:** అని భార్య బోధించగా.

**చ. అనయముఁ దేఱి నాగపతి యక్కమలానన మోము సూచి యి**
**ట్లను 'నొరుఁ గానఁ బొమ్మనిన యంతన రోషము వచ్చి యిట్టు లొ**
**ప్పని పలుకుల్ సగర్వమునఁ బల్కితి దానికి శంకలేక చె**
**ప్పిన జతనంపు ధర్మమునఁ బేర్మియు నాకు నొనర్చి తుగ్మలీ! 588**

**ప్రతిపదార్థం:** అనయమున్= పూర్తిగా (నయము= నీతి. అది కానిది అనయము= అధర్మం. దానినుండి); తేఱి= తేరుకొని; నాగపతి= ఆ నాగరాజు; ఆ+కమల+ఆనన= ఆ పద్మముఖి; మోము= ముఖం; చూచి; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు (అన్నాడు);

ఉగ్మలీ!= ఓ వనితా!; ఒరున్= పరుడిని; కానన్= దర్శించటానికి; పొమ్ము= వెళ్ళు; అనిన+అంతన= అన్న వెంటనే; రోషమువచ్చి= నాకు రోషం పొడుచుకు వచ్చి; ఇట్టులు= ఇట్లా; ఒప్పని= తగని; పలుకుల్= మాటలు; సగర్వమునన్= అహంకారంతో; పల్కితిన్= పలికాను; దానికిన్= అలా చేసినదానికి; శంకలేక= జంకూ గొంకూ లేకుండా (ఇంక ఎంత మండిపడతానో - అనే శంక పెట్టుకోకుండా); చెప్పిన= నీవు ఉపదేశించినటువంటి; జతనంపు ధర్మమునన్= ప్రయత్నధర్మంవలన (ఆచరించవలసిన ధర్మంవలన); నాకున్= నాకు; పేర్మియున్= ప్రతిష్ఠను; ఒనర్చితి(వి)= సమకూర్చావు.

**తాత్పర్యం:** భార్య చేసిన ఉపదేశంతో నాగరాజు తేరుకొన్నాడు. సౌమ్యంగా మాట్లాడుతున్నాడు. 'ఓ వనితా! ముక్కూ మొగమూ తెలియనివాడిని దర్శించి రమ్మని నీవు అనటంతోనే నాకు రోషం పొడుచుకొని వచ్చింది. ఆ గర్వంతో అనరాని మాటలు అన్నాను. అయినా నీవు జంకకుండా, నన్ను శంకించకుండా నాకు చేయవలసిన ధర్మాన్ని తెలియచేశావు. దానితో నా ప్రతిష్ఠను కాపాడావు. లేకపోతే ఎంత అప్రతిష్ఠపాలు అయ్యేవాడినో కదా!

**ఆ. కార్తవీర్య దశముఖ ప్రముఖులు జమ । దగ్ని తనయ రాఘవాదులైన**
**పురుషవరులచేతఁ బొలియరే సక్రోధ । వృత్తిఁ గాన యలుకవిడుపు మేలు. 589**

**ప్రతిపదార్థం:** కార్తవీర్య= (వేయిబాహువులు కల) కార్తవీర్యార్జునుడూ; దశముఖ= పది తలకాయలు గల రావణుడూ; ప్రముఖులు= ఇత్యాదులు; జమదగ్నితనయ= పరశురాముడూ; రాఘవ+ఆదులైన= దశరథ రాముడూ మొదలైన; పురుషవరులచేతన్= మహాపురుషుల చేతులలో; సక్రోధవృత్తిన్= క్రోధంతో కూడిన ప్రవర్తనవల్ల; పొలియరే!= నశించిపోలేదా! (చనిపోలేదా); కాన= కాబట్టి; అలుక విడుపు= కోపాన్ని విడిచిపెట్టటం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** క్రోధం కారణంగానే కార్తవీర్యార్జునుడు పరశురాముడి చేతిలో మరణించాడు. క్రోధం కారణంగానే దశకంఠుడు దశరథరాముడి చేతిలో సమసిపోయాడు. ఇంకా చాలామంది కోపంవలన దెబ్బతిన్నవారు ఉన్నారు. కాబట్టి కోపాన్ని వదలుకొనటం ఎవరికైనా ఎప్పటికైనా మేలు.

**క. నీయట్టి భార్య కలుగుటఁ । దోయజదళనయన! యిట్లు దొలఁగితి దురితా**
**పాయంబునఁ బొరయక, యేఁ । బోయెద నవ్విప్రు కోర్కి పూర్ణము సేయన్. 590**

**ప్రతిపదార్థం:** తోయజదళ= పద్మదళాలవంటి (తామరపువ్వు రేకులవంటి); నయన!= నేత్రాలు కలదానా!; నీ+అట్టి= నీలాంటి; భార్య= ధర్మపత్ని; కలుగుటన్= లభించటంవలన; ఇట్లు; దురిత= పాపరూపమైన; అపాయంబునన్= ప్రమాదంలో; పొరయక= నశించిపోకుండా; తొలఁగితిన్= తప్పించుకున్నాను; ఆ+విప్రు= ఆబ్రాహ్మణుడి; కోర్కి= కోరిక; పూర్ణము+చేయన్= నిండించటం కోసం (తీర్చటానికి); ఏన్= నేను; పోయెదన్= ఇదే పోతున్నాను.

**తాత్పర్యం:** ఓ పద్మాక్షీ! నీవంటి భార్య దొరకటంవలన గొప్ప ప్రమాదంనుండి తప్పించుకొనగలిగాను. లేకపోతే మహాపాపకూపంలో పడి నశించిపోయి ఉండేవాడిని. సరే. ఆ విప్రుడిని దర్శించటంకొరకు ఇదిగో ఇప్పుడే వెళ్ళుతున్నాను.

**క. అని పలికి సత్వరంబుగఁ । జని భృగునిం గాంచె వినయసంభ్రమములతో**
**జనపాలోత్తమ! యతఁడు న । తనిఁగని యుల్లమునఁ బ్రియము దళుకొత్తంగన్. 591**

**ప్రతిపదార్థం:** జనపాల+ఉత్తమ= రాజోత్తమా! ధర్మజా!; అని పలికి= అని చెప్పి; సత్వరంబుగన్= మిక్కిలి వేగంగా; చని= వెళ్ళి; వినయ+సంభ్రమములతోన్= వినయంతోనూ, సంభ్రమంతోనూ; భృగునిన్= భృగువును; కాంచెన్= సర్పరాజు దర్శించాడు;

అతఁడున్= ఆ భృగువుకూడా; అతనిన్+కని= ఆ సర్పరాజును చూచి; ఉల్లమునన్= హృదయంలో; ప్రియము= ప్రేమ(ఇష్టం); తళుకు+ఒత్తంగన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** అని భార్యను మెచ్చుకొని, ఆ సర్పరాజు వేగాతివేగంగా వెళ్ళి భృగువును వినయసంభ్రమాలు ఉట్టిపడేటట్లు దర్శించాడు. సర్పరాజును చూసి భృగువుకూడా సంతోషించాడు. హృదయంలో ప్రేమ తళుక్కుమనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

పద్మఁడను సర్పరాజు భృగుఁడను విప్రుఁ గానవచ్చుట (సం. 12-349-2,3)

**వ. అంగంబులు పొదల నెదురుకొనియె; ని ట్లిరువురు సుసంగతులై సుసంగతపత్ర ప్రకరతరుచ్ఛాయాశీతల సికతాతలంబున సుఖాసీనులై; రయ్యహీంద్రుం డా మహీసురవరునితో మధురస్వరంబున నిట్లనియె. 592**

**ప్రతిపదార్థం:** అంగంబులు= శరీరావయవాలు; పొదలన్= ఉప్పొంగగా; ఎదురుకొనియెన్= భృగువు ఎదురుసన్నాహం వెళ్ళాడు; ఇట్లు= ఈ విధంగా; ఇరువురున్= ఇద్దరూ; సుసంగతులై= కలిసినవారై; సుసంగత= దట్టంగా అలుముకున్న; పత్రప్రకర= ఆకుల గుబురులు కలిగిన; తరు= చెట్లయొక్క; ఛాయా= నీడతో; శీతల= చల్లనైన; సికతాతలంబునన్= ఇసుక తిన్నెమీద; సుఖ+ ఆసీనులై= సుఖంగా కూర్చున్నవారై; ఆ+అహి+ఇంద్రుండు= ఆ సర్పరాజు; ఆ+మహీసురవరునితోన్= ఆ బ్రాహ్మణోత్తమునితో; మధురస్వరంబునన్= తియ్యని కంఠధ్వనితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శరీరం ఉప్పొంగుతుండగా భృగువు ఎదురు వెళ్ళాడు. ఇట్లా ఇద్దరూ కలిసికొని, చెట్లనీడలో ఇసుకతిన్నెమీద కూర్చొన్నారు. ఆ సర్పరాజు ఆ బ్రాహ్మణుడితో తీయనైన స్వరంతో ఇట్లా అన్నాడు:

**తే. 'అనఘ! నా రాక వార్చి నీ వధికనిష్ఠ । నిట్టు లునికికిఁ గారణమేమి గోర్కి**
**యెవ్విధంబైన దాని నే నిపుడ నిర్వ । హించి పుచ్చెద నత్తెఱం గెఱుఁగఁ జెపుమ! 593**

**ప్రతిపదార్థం:** అనఘ!= పావనుడా!; నా రాక!= నా ఆగమనాన్ని; వార్చి= ప్రతీక్షించి; నీవు= మహర్షీ; అధికనిష్ఠన్= పెద్ద నియమంతో; ఇట్టులు= ఇట్లా; ఉనికికిన్= ఉండటానికి; కారణము= హేతువు; ఏమి?= ఏమిటి?; కోర్కి= నీ కోరిక; ఏ+విధంబు+ఐనన్= ఎటువంటిదయినా; దానిన్= దానిని; ఏన్= నేను; ఇప్పుడు+అ= ఇప్పుడే; నిర్వహించి= తీర్చి; పుచ్చెదన్= పంపుతాను; ఆ+తెఱంగు= ఆ తీరు ఏదో; ఎఱుఁగన్= తెలిసేటట్టు; చెపుము!= దయచేసి చెప్పుము.

**తాత్పర్యం:** 'పావనుడా! ఓ బ్రాహ్మణోత్తమా! నా రాకను ప్రతీక్షిస్తూ నిరాహార దీక్షతో ఇట్లా నీవు ఉండటానికి కారణం ఏమిటి? నీ కోరిక ఏమిటో చెప్పుము. అది ఎటువంటిదైనా సరే తీరుస్తాను. ఇప్పుడే తీర్చివేస్తాను (తీర్చి పంపుతాను). అదేమిటో తెలియజెప్పుము.

**వ. స్వజనంబులచేత నిచ్చట నీ యునికి విని యభిగమ్యుండ వగు నీ కడకుం జనుదెంచితి; ననవుడు నద్ధరామరవరుండు ధర్మారణ్యంబుననుండి నిన్నుం గాన వచ్చితి; మాననీయమహీసురసూనుండ; భాను నారాధింప నీ చనుట భవదీయ వల్లభవలన నెఱింగి వాడిన చేనివాఁడు వానకెదురుచూచునట్లు భవదాగమనంబు వార్చి నియతవృత్తి నున్నవాఁడ. మదీయమనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండ' వనుటయు. 594**

**ప్రతిపదార్థం:** స్వజనంబులచేతన్= మావాళ్ళవలన; ఇచ్చట= ఇక్కడ; నీ+ఉనికిన్= నీవు నివసించటాన్ని; విని= ఆలకించి; అభిగమ్యుండవు+అగు= నిన్నుచేరి దర్శింపదగిన వాడవైన; నీ కడకున్= నీ దగ్గరకు; చనుదెంచితిన్= వచ్చాను; అనవుడున్= అని సర్పరాజు పలకగా; ఆ+ధరా+అమరవరుండు= ఆ బ్రాహ్మణోత్తముడు (ఇట్లాఅన్నాడు); ధర్మారణ్యంబుననుండి=

ధర్మారణ్యంనుంచి; నిన్నున్= నిన్ను; కానన్+వచ్చితిన్= దర్శించటానికి వచ్చాను; మాననీయ= గౌరవింపదగిన; మహీసుర బ్రాహ్మణుని; సూనుండన్= కుమారుడను; భానున్= సూర్యుడిని; ఆరాధింపన్= అర్చించటం కోసం; నీ చనుట= నీవు వెళ్ళటం; భవదీయ= నీయొక్క; వల్లభవలనన్= భార్యనుంచి; ఎఱింగి= తెలిసికొని; వాడిన= వడలిపోయిన; చేనివాఁడు= చేను కలవాడు (రైతు); వానకున్= వానకోసం; ఎదురుచూచునట్లు= ఎదురుచూసినట్టు; భవత్+ఆగమనంబు= నీ రాకకై; వార్చి= నిరీక్షించి; నియతవృత్తిన్= నియమ సహితమైన ప్రవర్తనతో (నిష్ఠతో); ఉన్నవాఁడన్= ఈ అడవిలో ఇక్కడ ఉన్నాను; మదీయ= నాయొక్క; మనః= మనస్సుకు సంబంధించిన; క్లేశంబు= కష్టం; నిరసింపన్= తొలగించటానికి; నీవు+అ= నీవే; అర్హుండవు= తగినవాడవు; అనుటయున్= అనటంతో.

**తాత్పర్యం:** మా వాళ్ళు నీ విక్కడ ఉన్నావని చెప్పగా విని, దర్శనీయుడవైన నీవద్దకు వచ్చాను' అని సర్పరాజు అనగా, దానికి ఆ బ్రాహ్మణుడు 'నే నొక బ్రాహ్మణకుమారుడను. నీవు సూర్యార్చనకై వెళ్ళినట్లు నీ భార్య చెప్పగా విని, ఈ అడవిలో నీకొరకు నిరీక్షిస్తున్నాను. నా మనసులోని బాధను తొలగించటానికి నీవే అర్హుడవు' అనగా.

**తే. ' నీవు కల్యాణమూర్తివి నీ మనోర । థంబు సఫలంబు సేసికదా మదీయ**
**జనన సఫలత గలిగింతు' నను భుజంగ । మాధిపతి మోముఁ జూచి యిట్లనియె నతఁడు. 595**

**ప్రతిపదార్థం:** నీవు= ఓ భృగూ! నీవు; కల్యాణమూర్తివి= శుభస్వరూపుడవు; నీ; మనోరథంబు= కోరిక; సఫలంబు+చేసి కదా!= నెరవేర్చి కదా!; మదీయ= నాయొక్క; జనన= జన్మకు; సఫలత= చరితార్థత; కలిగింతున్!= కల్పించుకుంటాను!; అను= అన్నటువంటి; భుజంగమ+అధిపతి= ఆ సర్పరాజుయొక్క; మోమున్= ముఖాన్ని; చూచి= వీక్షించి; అతఁడు= ఆ భృగువు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ భృగూ! నీవు శుభస్వరూపుడవు. నీ కోరిక తీర్చినప్పుడే నా జన్మ చరితార్థం అవుతుంది. చరితార్థం చేసికొంటాను' అన్నాడు సర్పరాజు. అప్పుడు భృగువు ఇట్లా అంటున్నాడు.

**క. నా కోర్కి పిదపఁ జెప్పెద । లోకనుతా! యొకటి యడుగ లోలత్వము చి**
**త్తాకలితమయ్యెఁ బ్రార్థన । సేకొని యది నాకు మున్ను చెప్పఁగవలయున్. 596**

**ప్రతిపదార్థం:** లోకనుతా!= లోకంలో నుతిపొందినవాడా! (లోకంచేత నుతింపబడినవాడా!); నా కోర్కి= నా కోరిక ఏమిటో; పిదపన్= తరవాత; చెప్పెదన్= చెప్పుతాను; ఒకటి= ఒక్కవిషయం; అడుగన్= అడగడానికి; లోలత్వము= చపలత్వం; చిత్త+ఆకలితము+అయ్యెన్= మనస్సులో పుట్టుతోంది; ప్రార్థనన్= నా అభ్యర్థనను; చేకొని= విని (స్వీకరించి); అది= ఆ విషయం; నాకున్= నాకు; మున్ను= ముందుగా; చెప్పఁగన్+వలయున్= చెప్పాలి.

**తాత్పర్యం:** లోకస్తుత్యా! నా కోరిక ఏమిటో తరవాత చెప్పుతాను కాని, నిన్ను మరొకటి అడగాలని మనస్సు తొలుస్తున్నది. అది అడుగుతాను. విని ముందు అది చెప్పుము.

**వ. అనుటయు నయ్యురగ వల్లభుం 'డది యెయ్యది యడుగు' మనిన భృగుండు 'నీవు రవిరథంబు వహింపం జనినయెడఁ గనిన వినినయట్టి యాశ్చర్యంబులు గలవేని వాని నా కెఱింగింపవే?' యనిన నతం డతని కిట్లనియె. 597**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనటంతోనే; ఆ+ఉరగవల్లభుండు= ఆ సర్పరాజు; అది= నీవు అడగాలి అనుకొంటున్నది; ఏ+అది= ఏది?; అడుగుము; అనినన్= అనేసరికి; భృగుండు= భృగువు; నీవు= ఓ సర్పరాజా! నీవు= అడుగుము; రవిరథంబున్= సూర్యరథాన్ని; వహింపన్= మోయటానికి; చనినయెడన్= వెళ్ళినపుడు; కనిన= చూచిన; వినిన+అట్టి= విన్నట్టి; ఆశ్చర్యంబులు= అద్భుతాలు;కలవేనిన్=

ఉన్నట్టయితే; వానిన్= వాటిని; నాకున్= నాకు; ఎఱింగింపవే?= తెలియజెప్పవా?; అనినన్= అని అడిగితే; అతండు= ఆ సర్పరాజు; అతనికిన్= ఆ భృగుడితో; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దానికి సర్పరాజు 'నీవు అడుగవలెనని అనుకొంటున్న దేదో అడుగుము' అన్నాడు. బదులుగా దానికి భృగువు ' ఓ సర్పరాజా! నీవు సూర్యరథాన్ని మోయటానికి వెళ్ళినపుడు నీవు చూచిన, విన్న అద్భుతాలు ఏవైనా ఉంటే నాకు చెప్పాలి' అన్నాడు. దానికి సర్పరాజు తిరిగి ఈ విధంగా బదులిచ్చాడు.

**సీ. ' ఆశ్చర్యములకెల్ల నాస్పదం బాదిత్యుఁ । డాతని వలనన భూతజాల**
**మఖిలంబుఁ జరియించు నది యచ్చెరువు గాదె! । యద్దేవు నంశువులందుఁ బ్రీతి**
**నమరులు వాలఖిల్యాదిమునీంద్రులు । సిద్ధులు శాఖలఁ జెంది యుండు**
**విహగకులంబుల విధమున వసియింతు । రంతకంటెను నెక్కు డద్భుతంబు**

**తే. గలదె! యమ్మహాత్మువలనన వాయువు । వెడలి యతని నడిమి విపుల రశ్మిఁ**
**బొంది వృష్టి గురియు నెందును నట్టి చో । ద్యములు గలవె? భూసురాగ్రగణ్య! 598**

**ప్రతిపదార్థం:** భూసుర+అగ్రగణ్యా= బ్రాహ్మణులలో మొదట లెక్కింపదగినవాడా! ఓ బ్రాహ్మణోత్తమా!; ఆశ్చర్యములకున్= అద్భుతాలకు; ఎల్లన్= అన్నింటికీ; ఆదిత్యుఁడు= సూర్యుడు; ఆస్పదంబు= స్థానం; ఆతనివలనన్+అ= ఆ సూర్యుడివల్లనే; భూతజాలము= ప్రాణిసమూహం; అఖిలంబున్= అంతా; చరియించున్= చైతన్యవంతమై సంచరిస్తూ ఉంటుంది (జనియించున్= పుట్టుతుంది - అని పాఠాంతరం); అది= ఆ విషయం; అచ్చెరువు+కాదె!= ఆశ్చర్యం కాదా!; ఆ+దేవు= ఆ సూర్యభగవానుడియొక్క; అంశువులందున్= కిరణాలలో; ప్రీతిన్= ప్రేమతో; అమరులున్= దేవతలూ; వాలఖిల్య+ఆది= వాలఖిల్యులు మొదలైన; మునీంద్రులున్= మహామునులూ; సిద్ధులున్= సిద్ధులూ - వీరంతా; శాఖలన్= కొమ్మలను; చెంది= ఆశ్రయించి; ఉండు= ఉండే; విహగకులంబుల+విధమునన్= పక్షులవలె; వసియింతురు= నివసిస్తూ ఉంటారు; అంతకంటెనున్= అంతకన్నా; ఎక్కుడు= అధికమైన; అద్భుతంబు+కలదె!= ఆశ్చర్యం ఉన్నదా?; ఆ+మహాత్మువలనన్+అ= ఆ మహానుభావుడివల్లనే; వాయువు= (ఒకానొక విధమైన) గాలి; వెడలి= బయలుదేరి; అతని= ఆ సూర్యుడి; నడిమి= (గోళం) మధ్యలో ఉన్న; విపులరశ్మిన్= దట్టమైన కాంతిని; పొంది= కలిసి; వృష్టి+కురియున్= వర్షం కురుస్తుంది; ఎందునున్= ఎక్కడయినా; అట్టి= అటువంటి; చోద్యములు= అద్భుతాలు; కలవె?= ఉన్నాయా?;

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణోత్తమా! ఆశ్చర్యాలకన్నింటికీ నిలయం సూర్యుడే. అతడినుండే సకలప్రాణికోటీ జన్మిస్తున్నదంటే ఇంతకంటె ఆశ్చర్యం ఏమి ఉంటుంది! వాలఖిల్యాది ఋషులూ, సిద్ధులూ, దేవతలూ అందరూ సూర్యుడి కిరణాలలోనే - చెట్టుకొమ్మలమీద పిట్టలున్నట్లు - నివసిస్తూ ఉంటారు. ఇది అద్భుతం కాదా! సూర్యగోళంనుండి వెలువడే వాయువు గోళం మధ్యలో ఉండే దట్టమైన కాంతితో కలిసి వర్షం కురుస్తుంది. ప్రపంచంలో ఎక్కడయినా ఇట్లాంటి అద్భుతాలు ఉన్నాయా?

**క. రవి సృజియించును వర్షము । రవియ మగుడఁ గిరణతతుల రస మంతయుఁ దాఁ**
**దివుచును విస్మయకారక । మవనీసురవర్య! దాని కధికము గలదే? 599**

**ప్రతిపదార్థం:** అవనీసురవర్య!= ఓ బ్రాహ్మణోత్తమా!; రవి= సూర్యుడు; వర్షమున్= వానను; సృజియించును= సృష్టిస్తాడు; రవి+అ= సూర్యుడే; మగుడన్= మళ్ళీ; కిరణతతులన్= కిరణసమూహాలతో; రసము+అంతయున్= నీటినంతటినీ; తాన్= తాను; తివుచును= వెనుకకు లాగుకొంటాడు (ఎండిస్తాడు, ఆవిరిచేస్తాడు); దానికిన్= దానికన్నా; విస్మయకారకము= ఆశ్చర్యకరమైన విషయం; అధికము= గొప్పది (మరొకటి); కలదే?= ఉన్నదా? (ఉంటుందా?)

**తాత్పర్యం:** ఓ బ్రాహ్మణోత్తమా! సూర్యుడే వర్షాలు కురిపిస్తాడు. మళ్ళీ అతడే తన కిరణాలతో నీటినంతటినీ వెనుకకు లాగుకొంటాడు. ఇంతకన్నా ఆశ్చర్యకరమైన సంగతి ఈ సృష్టిలో మరొకటి ఉంటుందా?

**క. ఇనువేఁడిమి శోషించిన । జనములయం దాత్మనిష్ఠ శాశ్వతికత్వం**
**బున వెలుఁగుచుండు దానికి । ననఘా! మిగులంగఁ జిత్రమైనది గలదే! 600**

**ప్రతిపదార్థం:** అనఘా!= పావనుడా!; ఇను= సూర్యుడియొక్క; వేఁడిమి= ఉష్ణత; శోషించినన్= ఎండిపోతే; జనములయందున్= ప్రజలలో; ఆత్మనిష్ఠ= మోక్షం; శాశ్వతికత్వంబునన్= శాశ్వతమై; వెలుఁగుచుండున్= ప్రకాశిస్తూ ఉంటుంది; దానికిన్= దానికన్నా మిగులంగన్= మించిన; చిత్రమైనది= ఆశ్చర్యకరమైన విషయం; కలదే!= ఉన్నదా!

**తాత్పర్యం:** పాపరహితుడా! సూర్యుడి వేడిమి తగ్గిపోతే ప్రజలలో ఆత్మనిష్ఠ అనేది శాశ్వతంగా ప్రకాశిస్తుంది. ఇంతకంటె ఆశ్చర్యకరమైన అంశం ఏముంది చెప్పుము.

**తే. సూర్యువలనన బీజంబు ధార్యమాణ । మగుఁ జరాచరధారిణియైన ధరణి**
**చేత నంతకు మిగులఁ జర్చింప నక్క । జంబు లెందును గలవె? నిష్ఠానిరూఢ! 601**

**ప్రతిపదార్థం:** నిష్ఠానిరూఢ!= నియమాసక్తా!; చరాచర= జంగమస్థావరాలను; ధారిణి+అయిన= ధరించేదయిన; ధరణిచేతన్= ఈ భూమిచేత; బీజంబు= విత్తనం; సూర్యువలనన్+అ= సూర్యుడివలననే; ధార్యమాణము+అగున్= జీవింపజేయబడుతోంది - మొలకెత్తుతోంది; చర్చింపన్= ఆలోచిస్తే; అంతకున్+మిగులన్= అంతకంటె మించి; అక్కజంబులు= అద్భుతాలు; ఎందునున్= ఎక్కడైనా; కలవె?= ఉన్నాయా?

**తాత్పర్యం:** సూర్యుడివలననే విత్తనాలు భూమిలో మొలకెత్తుతున్నాయి. ఇంతకంటె అద్భుతాలు ఎక్కడ ఉంటాయి స్వామీ!

**క. పరముండు నిరంజనుఁ డ । క్షరుఁ డజరుం డద్వయుండు శాశ్వతుఁ డగు న**
**ప్పురుషుఁడు రవియంద వెలుఁగు । నరుఁ దంతటికంటెఁ గలదె? యగ్రిమవర్ణా! 602**

**ప్రతిపదార్థం:** అగ్రిమవర్ణా!= అగ్రవర్ణంలో జన్మించినవాడా! (బ్రాహ్మణుడా!); పరముండు= పరాత్పరుడూ; నిరంజనుఁడు= నిర్గుణుడూ; అక్షరుఁడు= నాశనం లేనివాడూ; అజరుండు= ముసలితనం లేనివాడూ; అద్వయుండు= ద్వయము కానివాడూ (అద్వితీయుడు); శాశ్వతుఁడు= శాశ్వతమైనవాడూ; అగు= అయినటువంటి; ఆ+పురుషుఁడు= ఆ మహాపురుషుడు; రవియందున్+అ= సూర్యుడిలోనే; వెలుఁగున్= ఒప్పారుతుంటాడు; అంతటికంటెన్= అంతకన్నా; అరుదు= అద్భుతం; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు సూర్యమండలంలోనే ప్రకాశిస్తుంటాడు. ఓ బ్రాహ్మణుడా! అంతకంటె ఆశ్చర్యం ఏముంది చెప్పుము!

**వ. అని వెండియు. 603**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; వెండియున్= మళ్ళీ ఇట్లా కొనసాగించాడు.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ ఇట్లా కొనసాగించాడు.

## ఉంఛవృత్తి మహిమ (సం. 12-350-8)

**క. విను మత్యాశ్చర్య మొకటి । మనుజోత్తమ! యొక్కనాఁడు మధ్యాహ్నమునం**
**దన వెలుఁ గినుని వెలుఁగుతో । నెనగా గగనమున నొక్కఁ డేతెంచె వడిన్. 604**

**ప్రతిపదార్థం:** మనుజ+ఉత్తమ!= ఓ మానవోత్తమా!; అతి+ఆశ్చర్యము= ఎంతో ఆశ్చర్యకరమైనది; ఒకటి= ఒక్కటి ఉంది ; వినుము; ఒక్కనాఁడు= ఒకరోజు; మధ్యాహ్నమునన్= మధ్యాహ్నసమయంలో; ఒక్కఁడు= ఒకానొక పురుషుడు; తన= తనయొక్క; వెలుఁగు= తేజస్సు; ఇనుని= సూర్యుడి; వెలుఁగుతోన్= కాంతితో; ఎనగాన్= సాటిరాగా; గగనమునన్= ఆకాశంలో; వడిన్= వేగంగా; ఏతెంచెన్= ఎదురు వచ్చాడు.

**తాత్పర్యం:** ఓ మానవోత్తమా! అత్యాశ్చర్యకరమైన విషయం ఒకటి చెప్పుతాను. శ్రద్ధగా వినుము. ఒకరోజున మధ్యాహ్నం ఆకాశంలో ఒక పురుషుడు ఎదురయ్యాడు. ఆయన తేజస్సు సూర్యుడి తేజస్సుతో పోటీ పడుతున్నట్లు అనిపించింది.

**క. అంబరపాటనమునఁ బో । లెం బెద్దయు మెఱయు తనదు లీలాగతి క**
**య్యంబరమణి యధికప్రమ । దంబున నభిముఖుఁడుగా నుదగ్రస్ఫూర్తిన్. 605**

**ప్రతిపదార్థం:** అంబరపాటనమునన్+పోలెన్= ఆకాశాన్ని బద్దలు కొట్టేస్తుందా అన్నట్టు (బద్దలు కొట్టిందా అన్నట్టు); పెద్దయున్= ఎక్కువగా; మెఱయు= ప్రకాశించే; తనదు= అతడియొక్క; లీలాగతికిన్= సవిలాసగమనానికి; ఆ+అంబరమణి= ఆ సూర్యుడు; అధికప్రమదంబునన్= అత్యధిక సంతోషంతో; ఉదగ్రస్ఫూర్తిన్= ఇంకా అతిశయించిన స్ఫురణతో; అభిముఖుఁడుగాన్= ఎదురుగా.

**తాత్పర్యం:** ఆకాశాన్ని పగులగొట్టేస్తాడా? - అన్నంతటి తేజస్సుతో సవిలాసంగా వస్తున్న ఆ పురుషుడికి సూర్యుడు చేయిసాచాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**చ. కదియఁగఁ బాఱుతెంచిన వికాసవిభాసిముఖారవిందుఁడై**
**యెదురుగఁ జేయి సాఁచె దివసేశుఁ డతండును లీలఁ గేలు నొ**
**ప్పిదముగఁ బట్టి రూపము లభిన్నతఁ బొందఁగఁ జొచ్చె బింబమున్**
**సదనముఁ జొచ్చునట్ల విలసద్గతి నింకిట యేమి సెప్పుదున్? 606**

**ప్రతిపదార్థం:** కదియఁగన్= తనను సమీపించటానికి; పాఱుతెంచినన్= ఆ తేజస్వి పరుగు పరుగునరాగా; దివస+ఈశుఁడు= దినపతి అయిన సూర్యుడు; వికాస= ఆనందంతో (వికాసంతో); విభాసి= వెలిగిపోతున్న; ముఖ+అరవిందుఁడై= ముఖపద్మం కలవాడై; ఎదురుగన్= ఆతనికి అభిముఖంగా; చేయి సాఁచెన్= చెయ్యి చాపాడు; అతండునున్= ఆ పురుషుడు సయితం; లీలన్= విలాసంగా; కేలున్= ఆ చేతిని; ఒప్పిదముగన్= అందంగా; పట్టి= పట్టుకొని; రూపములు= ఆకారాలు; అభిన్నతన్= అభేదాన్ని; పొందఁగన్= పొందుతూండగా (ఒకటే అయిపోతూండగా); విలసత్+గతిన్= అందమైన పద్ధతిలో (సవిలాసగమనంతో అని కానీ); సదనమున్+చొచ్చునట్లు= గృహంలోకి ప్రవేశించినట్టు; బింబమున్= ఆ సూర్యబింబంలోకి; చొచ్చెన్= ప్రవేశించాడు; ఇంకన్+ఇటన్= ఇంక ఇక్కడ; ఏమి+చెప్పుదున్?= ఏమి చెప్పను!

**తాత్పర్యం:** ఆ దివ్యతేజస్వి తనకు ఎదురుగా వేగంగా వచ్చేసరికి సూర్యుడి ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. సాదరంగా చేయి చాపాడు. ఆతడు దానిని ఒయ్యారంగా అందుకొన్నాడు. ఇద్దరి ఆకారాలూ క్రమక్రమంగా ఏకమయిపోతున్నాయి. ఇంటిలోనికి ప్రవేశించినంత విలాసంగా ఆ తేజస్వి సూర్యబింబంలోనికి ప్రవేశించాడు.

**వ. అట్టియెడ. 607**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ. అరదముమీఁద మున్ పొలుచునాతఁడొ? యిప్పటియాతఁడో? దివా**
**కరుఁ డను సందియంబు భుజగంబుల చిత్తము లందుఁ బుట్టి యొం**
**డొరువులతోడ వారు గడు నొయ్యనఁ బల్కఁగ నే వినీతసు**
**స్థిరమృదుభాషినై యడిగితిం బ్రభువున్ ధరణీసురోత్తమా! 608**

**ప్రతిపదార్థం:** ధరణీసుర+ఉత్తమా!= ఓ బ్రాహ్మణోత్తమా!; అరదముమీఁదన్= రథంపైని; మున్= అంతకుముందు; పొలుచునాతఁడొ?= ఉన్నవాడో?; ఇప్పటియాతఁడో?= ఇప్పుడు వచ్చి ఉన్నవాడో?; దివాకరుఁడు= సూర్యుడు; అను= అనే; సందియంబు= సందేహం; భుజగంబుల= సర్పాల; చిత్తములందున్= హృదయాలలో; పుట్టి= కలిగి; ఒండొరువులతోడన్= పరస్పరం; వారు= ఆ సర్పశ్రేష్ఠులు; కడున్+ఒయ్యనన్= మెల్లమెల్లగా; పల్కఁగన్= గుసగుసలు పోతోంటే; ఏన్= నేను; వినీత= వినయ సంపన్నమైన; స్థిర= నిశ్చలమైన; మృదుభాషిన్+ఐ= మృదుభాషలు కలవాడనై (మృదువుగా పలుకుతూ); ప్రభువున్= మా అధిపతిని (సూర్యుడిని); అడిగితిన్= అడిగాను.

**తాత్పర్యం:** ఓ బ్రాహ్మణోత్తమా! ఇప్పటిదాకా రథంమీద ఉన్నవాడా? లేకపోతే ఇప్పుడు వచ్చినవాడా? - ఎవరు సూర్యుడు? అనే సందేహం రథం లాగుతున్న మా సర్పరాజుల కందరికీ కలిగింది. పరస్పరం గుసగుసలు పోతున్నారు అందరూ. అప్పుడు వినయంగా మృదువుగా నిశ్చలంగా నేనే మా ప్రభువును అడిగాను.

**క. ఇతఁ డెవ్వం?డని యమ్మెయి । నతిచకితాత్ముండ నగుచు నడుగుటయు నహః**
**పతి నా మీఁదఁ గృపాసం । గతమగు తన చూడ్కి వొలయఁగా వత్సలుఁడై. 609**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= అట్లా; అతిచకిత+ఆత్ముండన్+అగుచున్= మిక్కిలి ఆశ్చర్యపోయిన వాడిని అవుతూ; ఇతఁడు= ఈయన; ఎవ్వండు= ఎవరు?; అని; అడుగుటయున్= నేను అడగటంతో - అహఃపతి= దివసనాథుడు (సూర్యుడు); నామీఁదన్= నా పైని; కృపాసంగతము+అగు= దయతో కూడిన; తన= తనయొక్క; చూడ్కి= చూపు; పొలయఁగాన్= వ్యాపించేట్టు (చూసి); వత్సలుఁడై= ప్రేమ కలవాడై.

**తాత్పర్యం:** ఇతడు ఎవరు? - అని నేను చాలా ఆశ్చర్యపోయి అడిగాను. దానికి సూర్యుడు నా వైపు ఒకసారి దయనిండిన కన్నులతో చూచి ప్రేమగా ఇట్లా అన్నాడు.

**సీ. 'సురయక్ష గంధర్వ గరుడోరగాదుల । లోన నెవ్వఁడు గాఁ డలోలుపాత్ముఁ**
**డుంఛవృత్తి మహీసురోత్తముం డస్థల । నియముండు ఫలమూల నీరమారు**
**తాహారుఁడగు ముని యాకాంక్ష సేయఁడు । ప్రాప్తంబు గాని పదార్థములకు**
**సర్వభూత హితత్వశాలి యిమ్మెయి సిద్ధిఁ । బ్రాపించె నని చెప్పెఁ బ్రకటఫణితి**

**తే. ననఘ! యిట్టి విశేషంబు గనుఁగొనంగ । వినను గాంచితి' ననిన నవ్విప్రవరుఁడు**
**ప్రమద మెద నిండి పొంగారఁ బాపఱేని । యాననము సూచి యిట్లను మానవేంద్ర! 610**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పావనుడా! ; ఓ పద్మడా! ఈ వచ్చిన వ్యక్తి -సురయక్షగంధర్వగరుడ+ఉరగ+ఆదులలోనన్= సురలలో, యక్షులలో, గంధర్వులలో, ఉరగులలో (సర్పజాతి), ఇంకా తక్కిన జాతులలో; ఎవ్వఁడున్+కాఁడు= ఎవ్వడూ కాడు; ఇతఁడు - అలోలుప+ఆత్ముఁడు= దేనిపట్లా తగులు చెందని మనస్సుకలవాడు (నిరీహుడు - నిశ్చలాత్ముడు); ఉంఛవృత్తి= నూర్చిన పొలాలలో చెదిరిపడిన ధాన్యపుగింజలను ఏరుకొని వాటితో పొట్టగడుపుకొనే; మహీసుర+ఉత్తముండు= బ్రాహ్మణోత్తముడు; అస్ఖల= చెదరని; నియముండు= నియమాలు కలవాడు (స్థిరనిష్ఠ కలవాడు); ఫల= పళ్ళూ; మూల= దుంపలూ; నీర= నీళ్ళూ; మారుత= వాయువూ; ఆహారుఁడు= ఆహారంగా కలవాడు - అగు= అయిన; ముని= ఒక ముని ఈయన; ప్రాప్తంబు+కాని= తనకు ప్రాప్తంలేని; పదార్థములకున్= వస్తువులకోసం; ఆకాంక్ష+చేయఁడు= కోరిక పెట్టుకోడు; సర్వభూత= సమస్తప్రాణులకూ; హితత్వశాలి= మేలుకోరేవాడు - మేలు చేసేవాడు; ఈ+మెయిన్= ఇలా; సిద్ధిన్+ప్రాపించెన్= సిద్ధిపొందాడు; అని; ప్రకటఫణితిన్= స్పష్టమైన మాటలతో (శైలితో); చెప్పెన్= (సూర్యుడు నాకు) చెప్పాడు; ఇట్టి= ఇటువంటి; విశేషంబున్= విశేషాన్ని; కనుఁగొనంగన్+ వినమన్+కాంచితిన్= చూడగలిగాను; వినగలిగాను (కనుగొనంగన్/కాంచితిన్. వినమన్/కాంచితిన్); అనినన్= అని పద్మడు చెప్పేసరికి; ఆ+విప్రవరుఁడు= ఆ బ్రాహ్మణోత్తముడు - భృగువు; ప్రమదము= ఆనందం; ఎదన్= హృదయంలో; నిండి+పొంగారన్= నిండి పెల్లుబుకగా; పాపఁతేని= ఆ సర్పరాజుయొక్క; ఆననము+చూచి= ముఖంలోకి చూసి; మానవేంద్ర!= ఓ ధర్మరాజా!; ఇట్లు= ఇలా; అనున్= అన్నాడు (అంటున్నాడు).

**తాత్పర్యం:** ఓ పద్మడా! ఈ వచ్చినవాడు సురయక్ష గంధర్వ గరుడోరగాదులలో ఎవ్వడూ కాడు. నిశ్చలమైన మనస్సు కలవాడూ, ఉంఛవృత్తితో జీవించే బ్రాహ్మణుడూ, నిశ్చలమైన నియమాలు కలవాడూ, కందమూల ఫలోదక మారుతాలు మాత్రమే ఆహారంగా స్వీకరించేవాడూ, నిరాకాంక్షుడూ, సర్వభూతహితం కోరుకొనేవాడూ, మునీశ్వరుడూ అయిన ఒక మహానుభావుడు. ఇట్లా సిద్ధి పొందాడు - అని సూర్యుడు స్పష్టం చేశాడు. ఓ భృగూ! అటువంటి అద్భుతం చూడగలిగాను, వినగలిగాను' అని పద్మడు చెప్పేసరికి ఆ భృగువు పరమానంద సంభరితుడై ఇట్లా అన్నాడు.

**క. ' ఇవి యన్నియు నాశ్చర్యము । లవుఁ దెరువును నాకుఁ జూపి తన్వర్థత నొ**
**ప్పు వివిధ శబ్దంబుల బో । ధవరేణ్యా! పోయి వచ్చెదం బ్రియమొందన్. 611**

**ప్రతిపదార్థం:** బోధవరేణ్యా!= జ్ఞానంచేత ఉత్తముడా! (గురూత్తమా!); ఇవి= నీవు చెప్పిన ఈ విషయాలు; అన్నియున్= అన్నీ; ఆశ్చర్యములు= అద్భుతాలు; అవున్= అవును (నిజమే); అన్వర్థతన్= సార్థకంగా; ఒప్పు= ఒప్పేటటువంటి; వివిధ శబ్దంబులన్= వివిధ పదాలతో; నాకున్= నాకు; తెరువునున్= మార్గంకూడా; చూపితి(వి)= చూపించావు; ప్రియము+ఒందన్= ప్రియం కలిగేటట్టు; పోయివచ్చెదన్= నేనింక వెళ్ళివస్తాను.

**తాత్పర్యం:** 'ఓ పద్మడా! నీవు ఇంతవరకూ చెప్పినవి అన్నీ అద్భుతాలే. అవును. నిజమే. వీటిని చెప్పటంలోనే సార్థకపదాలతో నాకు మార్గంకూడా చూపించావు. ఓ గురూత్తమా! చాలాసంతోషం! నే నింక వెళ్ళివస్తాను.

**క. నను మఱవక పనుపం దగు । పనులెల్లను బనుపు శిష్యభావశుభము నా**
**కనఘా! కలిగెను నీ దెస । ననూనభద్రములు నీకు నయ్యెడు మెపుడున్.' 612**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పవిత్రుడా, పద్మడా!; ననున్= నన్ను; మఱవక= మర్చిపోకుండా; పనుపన్+తగు= ఆజ్ఞాపించదగిన; పనులు+ఎల్లనున్= పనులు అన్నీ; పనుపు(ము)= ఆజ్ఞాపించు; నీదెసన్= నీపట్ల; నాకున్= నాకు; శిష్యభావ= శిష్యుడను అనే భావం తాలూకు; శుభము= పుణ్యం; కలిగెను= కలిగింది (నీకు శిష్యప్రాయుడను అనే భావం నాకు కలిగింది - అని); నీకున్= నీకు; ఎపుడున్= ఎల్లవేళలా; అనూన= అత్యధికమైన; భద్రములు= అయ్యెడున్= అగుగాక!

**తాత్పర్యం:** ఓ పద్మడా! నన్ను మరిచిపోవద్దు. ఆజ్ఞాపించదగినవన్నీ నాకు ఆజ్ఞాపించుము. నీకు శిష్యుడను అనే భావం నాకు ఏర్పడింది. అది శుభప్రదం. నీకు ఎల్లవేళలా శుభాలు కలగాలని ఆకాంక్షిస్తున్నాను.'

**విశేషం:** అయ్యెడున్+ఎపుడున్. ఆశీరర్థంలో 'ఎడున్' లోని నకారం మకారంగా మారింది. ఎడుతల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు (క్రియ-18) అని బాలవ్యాకరణం.

**చ.** **అన విని, నన్నుఁ గాంచితి ప్రయత్నమునన్, వినిపింపు మీవు వ**
**చ్చిన పని నాకు, నీ కొకటి సేసితినే? యిటు వృక్షమూల వా**
**సుని క్రియ లేచిపోక తగుచొ ప్పగునే? భవదీయవాంఛ సె**
**ప్పిన నది యేను దీర్తు, మఱి పెం పెసఁగం జను భూసురోత్తమా!'** **613**

**ప్రతిపదార్థం:** అనన్= అని భృగుడు పలికేసరికి; విని= ఆలకించి; పద్మడు ఇట్లా అంటున్నాడు - నన్నున్= నన్ను; ప్రయత్నమునన్= ప్రయత్నపూర్వకంగా (ఇంతదూరం వచ్చి ఎనిమిదిరోజులు ఉపవాసం ఉండీ); కాంచితి(వి)= చూశావు; ఈవు= నీవు; వచ్చిన పనిన్= వచ్చిన పని ఏమిటో దానిని; నాకున్= నాకు; వినిపింపుము= వినిపించవయ్యా!; నీకున్= నీకు; ఒకటి= ఒక్కటయినా; చేసితినే?= (ఉపకారం) చేసానా? (నీకు ఇంతవరకూ ఏ ఉపకారమూ చెయ్యనే లేదుగదా నేను); ఇటు= ఇట్లా; వృక్షమూలవాసుని+క్రియన్= చెట్టు మొదట్లో కాపురం ఉన్నవాడివలె; లేచిపోక= చటుక్కున లేచి ఉన్నపళంగా వెళ్ళిపోవటం; తగుచొప్పు+అగునే?= తగిన పద్ధతేనా (మంచి పద్ధతే అవుతుందా చెప్పుము!); భవదీయ= నీయొక్క; వాంఛ= కోరిక; చెప్పినన్= చెబితే; అది; ఏనున్= నేను; తీర్తున్= తీరుస్తాను; మఱి= అటుపైని; భూసుర+ఉత్తమా!= ఓ బ్రాహ్మణోత్తమా!; పెంపు+ఎసఁగన్= గొప్పదనం అతిశయించేట్టు; చను(ము)= వెళ్ళుము (వెడుదువుగాని).

**తాత్పర్యం:** భృగువు చెప్పిన పలుకులు ఆలకించి పద్మడు ఇట్లా అన్నాడు. 'ఓ బ్రాహ్మణోత్తమా! కష్టపడి ప్రయత్నపూర్వకంగా వచ్చి నన్ను చూచావు. ఇంతకీ నీవు వచ్చిన పని ఏమిటో చెప్పనే లేదు. చెప్పుము. ఇంతవరకూ నీకు నే నేమీ చేయనే లేదు. చెట్టుక్రింద కాపురం ఉన్నవాడివలె ఉన్నపళంగా ఇట్లా దులుపుకొని లేచి చక్కా పోవటం భావ్యమా? సమంజసమా? నీ కోరిక ఏమిటో చెప్పుము. తీరుస్తాను. అటుపైని వెళ్ళిపోదువుగాని.'

**వ.** **అని వెండియు.** **614**

**ప్రతిపదార్థం:** అని= అని; వెండియున్= ఇంకా ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** అని ఇంకా ఈ విధంగా అంటున్నాడు.

**తే.** **' అనఘ! నాయందు నీవు నీయందు నేనుఁ। గలము నీకు నీ సర్వలోకంబుఁ గలదు**
**చింత కవకాశ మెద్ది? నిశ్చింతభావ। మొందు' మనియె నా దందశూకోత్తముండు.** **615**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పావనుడా! భృగూ!; నాయందున్= నాలో; నీవున్= నీవూ; నీయందున్= నీలో; నేనున్= నేనూ; కలము= ఉన్నాం; నీకున్= నీకు (ఇంకా); ఈ సర్వలోకంబున్= ఈ సమస్త ప్రపంచమూ; కలదు= ఉంది; చింతకున్= దిగులుకు; అవకాశము+ఎద్ది?= చోటు ఏది?; నిశ్చింతభావమున్= నిశ్చింత అయిన స్థితిని; ఒందుము= పొందు - అని; ఆ+ దందశూక+ఉత్తముండు= సర్పశ్రేష్ఠుడైన ఆ పద్మడు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ భృగూ! నాలో నీవు ఉన్నావు. నీలో నేను ఉన్నాను. నీకు ఇంకా ప్రపంచమంతా ఉన్నది. దిగులు పడకుము. నిశ్చింతగా ఉండుము' అని ఆ సర్పరాజు పలికాడు.

**వ. అనిన విని భృగుండు పద్మునకి ట్లనియె. 616**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని= ఆలించి; భృగుండు; పద్మునకున్; ఇట్లు; అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ఆలకించి, భృగుడు పద్మునితో ఇట్లా అన్నాడు:

**తే. 'భోగివర! యిది యిట్టిద భూతములును। నీవు నేనును సర్వగతావిశిష్ట**
**విధములము వేదితవ్యంబు విదితమయ్యె। నిట్టి సందర్శనము వ్రతమింక నాకు. 617**

**ప్రతిపదార్థం:** భోగివర!= ఓ సర్పరాజా! (భోగము= పడగ. అది కలది -భోగి); ఇది= నీవు అన్నది; ఇట్టిది+అ= నిజమే (ఇంతటిదే); నీవున్= నీవూ; నేనునున్= నేనూ; భూతములును= పంచభూతాలూ (నిఖిలప్రాణికోటీ); సర్వగత= అన్నిటా అంతటా వ్యాపించిన; అవిశిష్ట= భేదంలేని; విధములము= తీరు కలవాళ్ళం; వేదితవ్యంబు= తెలుసుకోవలసింది; విదితము+అయ్యెన్= తెలిసింది; ఇట్టి= ఇటువంటి; సందర్శనము= తత్త్వదర్శనం; ఇంకన్= ఇటుపైని; నాకున్= నాకు; వ్రతము= నియమం.

**తాత్పర్యం:** 'ఓ సర్పరాజా! నీవు అన్నది నిజమే. నీవూ నేనూ ఈ ప్రాణికోటీ, పంచభూతాలూ అంతటా వ్యాపించి ఏ భేదమూ లేని వాళ్ళం. అభిన్నులం. సమానులం. తెలిసికొనదగినది ఏదో తెలిసిపోయింది. ఇదే తత్త్వదర్శనం - సర్వసమతాదృష్టి ఇకపైని నాకు వ్రతం.

**క. ఈ విధము నిశ్చయము నే। భావింపఁగఁ గంటి నీ కృపారతివలనన్**
**నీవు కృతార్థుఁడవు సుజన। సేవిత! యామంత్రణంబు సేసినవాఁడన్.' 618**

**ప్రతిపదార్థం:** సుజనసేవిత!= సజ్జనులచేత సేవింపబడినవాడా!; ఈ విధము నిశ్చయము= ఇటువంటి నిశ్చయాన్ని (పుంప్వాదేశం చేయలేదు); నీ= నీయొక్క; కృపారతివలనన్= దయారూపమైన ఆసక్తివలన; భావింపఁగన్+కంటిన్= ఆలోచించగలిగాను (చేసికోగలిగాను - అని); నీవు= నీవు; కృతార్థుఁడవు= చరితార్థుడవు; ఆమంత్రణంబు= వీడ్కోలు; చేసినవాఁడన్= చెప్తున్నాను; (ఆమంత్రణశబ్దానికి ఆహ్వానమూ వీడ్కోలు అని రెండు అర్థాలూ ఉన్నాయి. నమస్కారం అనే అర్థంలో కూడా దీని వాడుక ఉంది. నమస్కారం చేస్తున్నాను అనే అర్థం ఇక్కడ ఇంకా బాగా కుదురుతుంది).

**తాత్పర్యం:** సజ్జనసేవితా! నీ దయావిశేషంవలన నేను ఈ రకం నిశ్చయానికి రాగలిగాను. అటువంటి పరిణతి నీ మాటలవలన నాకు వచ్చింది. నీవు చరితార్థుడవు. నీకు నమస్కరించి సెలవు తీసికొంటున్నాను.'

**వ. అని పలికి యివ్విధంబునఁ గృతనిశ్చయుండై భృగుండు భుజంగవిభు వీడ్కొని దీక్షావిశేషకాంక్షం జేసి భార్గవకుల పవిత్రుం జ్యవనుం గాంచి నిజవృత్తాంతంబు సెప్పి తత్కృతసంస్కారంబునం గృతకృత్యుం డయ్యె; నిప్పుణ్యకథ యబ్భార్గవుండు జనకసదనంబున నారదునకు వివరించె; నద్దేవమునివరుండు దేవతావరునకు వినిపించె నమ్మహాత్ముండు వసువులకుం జెప్పె జామదగ్న్యుతోడి సంగ్రామంబున నుద్దామచిత్తుండనైన నన్నుం దేర్చుటకై వసువులు సకలభూత సమదర్శిత్వ సంపాదకంబైన యీ యితిహాసంబు నాకుం జెప్పిరి. నీవు పరమధర్మం బెయ్యది? యని యడిగిన నేను నీకుం జెప్పితి సర్వసమతాసముపహితంబైన యనాకాంక్షిత్వంబు ధర్మోత్తమంబు నిరతిశయానందంబునకు నిధానంబు.' 619**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఈ విధంబునన్= ఈ ప్రకారంగా; కృతనిశ్చయుండై= నిశ్చయం చేసుకున్నవాడై; భృగుండు= భృగుడు; భుజంగవిభున్= సర్పరాజును; వీడ్కొని= విడిచిపెట్టి; దీక్షా= దీక్షపట్ల; విశేష= విశేషమైన; కాంక్షన్+చేసి= కోరికచేత

(దీక్షవిశేషం పట్ల కోరికతో అని కానీ); భార్గవకుల= భృగువంశంలో; పవిత్రున్= పావనుడైన; చ్యవనున్= చ్యవన మహర్షిని; కాంచి= దర్శించి; నిజ= తనయొక్క; వృత్తాంతంబు= కథ; చెప్పి= వివరించి; తద్= ఆ చ్యవనునిచేత; కృత= చేయబడిన; సంస్కారంబునన్= (దీక్ష ఇచ్చేటప్పుడు కులంపెద్ద చెయ్యవలసిన) మంత్ర సంస్కారంతో; కృతకృత్యుండు+అయ్యెన్= చరితార్థుడు అయ్యాడు; ఈ+పుణ్యకథ= ఈ పవిత్రకథ; ఆ+భార్గవుండు= ఆ చ్యవనుడు (పరశురాముడు); జనకసదనంబునన్= జనకమహారాజుగారి నివాసంలో; నారదునకున్= నారదమహర్షికి; వివరించెన్= తెలియజేశాడు; ఆ+దేవమునివరుండు= ఆ దేవర్షివర్యుడు - నారదుడు; దేవతావరునకున్= ఇంద్రుడికి; వినిపించెన్= వివరించాడు (దేవేంద్రసన నివేశనే -4); ఆ+మహాత్ముండు= మహానుభావుడైన ఆ ఇంద్రుడు; వసువులకున్= అష్టవసువులకూ; చెప్పెన్= చెప్పాడు; జామదగ్న్యుతోడి= పరశురామునితో ఏర్పడిన; సంగ్రామంబునన్= యుద్ధంలో; ఉద్దామచిత్తుండను+ఐన= కలతచెందిన హృదయం కలవాడనైన; నన్నున్= నన్ను; తేర్చుటకై= ప్రసన్నపరచటం కోసం; వసువులు= ఆ వసువులు; సకలభూత= సమస్తప్రాణికోటినీ; సమ= సమానంగా; దర్శిత= చూడటం అనే గుణాన్ని; సంపాదకంబైన= కలిగించేదైన; ఈ+ఇతిహాసంబు= ఈ వృత్తాంతం; నాకున్= నాకు; చెప్పిరి= తెలియజేశారు. (భీష్ముడు పూర్వజన్మలో అష్టవసువులలో ఒకడు); నీవు= ధర్మరాజా! పరమధర్మంబు= అత్యుత్తమధర్మం; ఏ+అది= ఏది; అని; అడిగినన్= అడిగితే; నేనున్= నేను; నీకున్= నీకు; చెప్పితిన్= తెలియజేశాను; సర్వసమతా= సర్వప్రాణి సమానత్వంతో; సముపహితంబైన= కూడుకొన్న; అనాకాంక్షిత్వంబు= వాంఛారహితస్థితి (ఏ కోరికలూ లేకపోవటం - నిష్కామత్వం); ధర్మ+ ఉత్తమంబు= ధర్మాలలోకెల్లా శ్రేష్ఠమైనది; నిరతిశయ+ఆనందంబునకున్= సర్వోత్కృష్టమైన ఆనందానికి; నిధానంబు= నిలయం.

**తాత్పర్యం:** అని పలికి, ఈ విధంగా గట్టిగా నిశ్చయించుకొన్నవాడై భృగుడు నాగరాజును వీడ్కొని, విశేషదీక్షకొరకు భార్గవకులశ్రేష్ఠుడైన చ్యవనమహర్షిని దర్శించి, తన కథ చెప్పుకొని, అతడు చేసిన సంస్కారంతో ధన్యుడయ్యాడు. ఈ పుణ్యకథ జనకుడి గృహంలో భార్గవుడు నారదుడికి వివరించాడు. నారదుడు ఇంద్రుడికి చెప్పాడు. అతడు వసువులకు చెప్పాడు. పరశురాముడితో కలిగిన యుద్ధ సందర్భంలో కలత చెందిన నన్ను తేర్చటానికై వసువులు సకలభూత సమభావాన్ని పొందాలని ఈ ఇతిహాసం నాకు తెలిపారు. 'పరమధర్మం ఏది?' అని నీవు అడుగగా నేను నీకు చెప్పాను. సమస్త భూతాలను సమదృష్టితో కూడిన నిష్కామత్వం ఉత్తమధర్మం. ఉత్తమమైన ఆనందానికి అది నిలయం.'

**క. అని యిట్లు ధర్మసుతునకు । ననిమిషతటినీతనూజుఁ డధికప్రేమం**
**బునఁ బెప్పట వైశంపా । యనుఁడును జనమేజయునకు నర్థిం జెప్పెన్. 620**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఇలా; ధర్మసుతునకున్= ధర్మరాజుకు; అనిమిషతటినీ= గంగాదేవి; తనూజుఁడు= కుమారుడైన భీష్ముడు (అనిమిషులు= దేవతలు, తటిని= నది); అధికప్రేమంబునన్= మిక్కిలి ప్రేమతో; చెప్పుట= చెప్పటాన్ని; వైశంపాయనుఁడు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయుడికి; అర్థిన్= కోరికతో; (ఇష్టంతో) చెప్పెన్= వినిపించాడు.

**తాత్పర్యం:** అని ఇట్లా భీష్ముడు ధర్మరాజుకు చెప్పటాన్ని వైశంపాయనుడు తన శ్రోత అయిన జనమేజయుడికి వివరించాడు.

**వ. చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుతో నిత్తెఱంగునఁ బితామహుండు హితోపదేశంబు సేసిన నమ్మహీశుం డెవ్విధంబు దశావిశేషంబు నొందె మునీంద్రా! చెప్పవే యనుటయు. 621**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= చెబితే; విని= ఆలకించి; జనమేజయుండు= ఆ జనమేజయమహారాజు; వైశంపాయనుతోన్= ఆ వైశంపాయనమహర్షితో; ఈ+తెఱంగునన్= ఇలా; పితామహుండు= భీష్ముడు; హిత+ఉపదేశంబు= మేలును గురించిన

ఉపదేశం; చేసినన్= చేస్తే; ఆ+మహీ+ఈశుండు= ఆ మహారాజు ధర్మజుడు; ఏ+విధంబు= ఏ రకమైన; దశావిశేషంబున్= విశిష్టమైన అవస్థను (దశను); ఒందెన్= పొందాడో; మునీంద్రా!= ఓ మహామునీ!; చెప్పవే= తెలియజెయ్యవా!; అనుటయున్= అనటమూ.

**తాత్పర్యం:** దీనినంతా విని జనమేజయుడు వైశంపాయనుడితో 'భీష్ముడి ఉపదేశం విని ధర్మజుడు ఎట్టి అనుభూతిని పొందాడు?' నాకు తెలిసికొనాలని ఉన్నది. తెలియజేయుము' అని అడుగగా. (తరువాతి పర్వంలోని కథతో అన్వయం).

**ఆశ్వాసాంతము**

**ఉ. ఆగమపుష్ప సౌరభశుభాంగ! నివాస బుధాంతరంగ! వి**
**ద్యా గృహమేధితా సుభగతా మహనీయ! సురార్చనీయ! ని**
**ర్భోగ సభోగ సంపదనిరూప్య! సుసంవిదవాప్య! భక్తి ల**
**క్ష్మీగురునిత్య యోగిజన సేవిత! శాంతిసుఖైకభావితా! 622**

**ప్రతిపదార్థం:** ఆగమ= వేదాలూ, శాస్త్రాలూ అనేటువంటి; పుష్ప= పూవులయొక్క; సౌరభ= సుగంధంతో కూడిన; శుభ= శుభప్రదమైన; అంగ= శరీరంకలవాడా!; నివాస= ఆవాసమైన; బుధ= పండితుల (దేవతల) యొక్క; అంతరంగ!= హృదయాలు కలవాడా! (బుధుల హృదయాలే నివాసంగా కలవాడా! - అనే భావంలో వ్యధికరణ బహువ్రీహిగా దీనిని సంభావించటమైనది- ఆలోచించాలి); విద్యా= జ్ఞానానికి; గృహమేధితా= యజమానత్వం వల్లనైన; సుభగతా= సౌందర్యంతో; మహనీయ!= మహనీయుడా! (గృహమేధి= కుటుంబయజమానుడు, అధికారి); సుర= దేవతలచే; అర్చనీయ!= పూజింపదగినవాడా! నిర్భోగ= భోగరహితమైన; సంపద్= సంపదలతోనూ; సభోగ= భోగసహితమైన; సంపద్= సంపదలతోనూ; అనిరూప్య!= నిరూపించటానికి శక్యం కానివాడా! (నిర్గుణసంపత్తి - సగుణ సంపత్తి. రెండింటికీ అందనివాడా!); సుసంవిత్= సరియైన జ్ఞానంతో (ఆత్మజ్ఞానంతో); అవాప్య= పొందదగినవాడా!; (జ్ఞానైకసులభుడా!); భక్తి= భక్తి అనేటువంటి; లక్ష్మీ= లక్ష్మికి (సంపదకు); గురు= గురువులైన; నిత్యయోగిజన= నిత్యయోగులచేత; సేవిత!= భజింపబడేవాడా!; శాంతిసుఖ+ఏక= శాంతిసుఖాలతో మాత్రమే; భావితా!= భావింపబడేవాడా!; శాంతిసుఖస్వరూపా - అని; (ఆగమపుష్పసౌరభశుభాంగనివాస! - అటువంటి శరీరాంగాలకు నివాసమైనవాడా అని; బుధాంతరంగ విద్యాగృహమేధితా సుభగతామహనీయ! - అంతరంగ విద్య అంటే ఆత్మజ్ఞానం. దానికి అధికారి - పరమాత్మ. ఇట్లా కూడా అన్వయించవచ్చునంటున్నారు కొందరు పెద్దలు).

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! ఆగమాలు అనే పుష్పాల సౌరభంతోకూడిన శరీరం కలవాడా! బుధుల అంతరంగాలే నివాసంగా కలవాడా! విద్యకు అధికారివైన సౌందర్యంతో విరాజిల్లేవాడా! (జ్ఞానసౌందర్యం - తేజస్సు). దేవతలచేత అర్చించబడేవాడా! నిర్భోగ సభోగసంపదలకు అందనివాడా! ఒక్క ఆత్మజ్ఞానానికే అందేవాడా! భక్తి అనే లక్ష్మికి గురువులైన నిత్యయోగీశ్వరులతో సేవించబడేవాడా! శాంతిస్వరూపా! సుఖస్వరూపా!

**క. అభిమతఫల సంపాదన । విభవమహీయః ప్రసాద! విశ్రుతవేదా!**
**ఋభు విభు విలోచనాంబుజ । శుభద రవిత్వా! హరిత్వ సుభగహరత్వా! 623**

**ప్రతిపదార్థం:** అభిమత= కోరుకొన్న; ఫల= ఫలాలను; సంపాదన= సమకూర్చటమనే; విభవ= సంపదతో (వైభవంతో); మహీయః= గొప్పదైన; ప్రసాద= అనుగ్రహం కలవాడా!; విశ్రుత+వేద= చెవికెక్కిన (వీను మిగిలిన) వేదాలు కలవాడా!; ఋభువిభు= దేవతల నాయకుడైన దేవేంద్రుడియొక్క; విలోచన+అంబుజ= నేత్రపద్మాలకు; శుభద= శోభను కలిగించే; రవిత్వా!= సూర్యత్వం కలవాడా!;

హరిత్వ= విష్ణుత్వంతో; సుభగ= అందమయిన (సొంపిల్లిన); హరత్వా!= శివత్వం కలవాడా! (హరిత్వమూ హరత్వమూ పరస్పర సౌందర్యదాయకాలుగా విరాజిల్లుతున్నవాడా! - అని).

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! భక్తులకు కోరుకొన్న ఫలాలను అందించటంలో ఘనత వహించింది నీ అనుగ్రహం. వేదాలను నిరంతరం వింటూ ఉంటావు. దేవేంద్రుడి నేత్రపద్మాలను వికసింపజేసే సూర్యుడివి నీవే. నీలో హరిత్వమూ హరత్వమూ సొగసుగా జతగూడి ఉన్నాయి.

**మాలిని.**

**వరబహునుత వేదవ్యాస! విశ్వాత్మభాసా!**
**నిరుపమతను లీలానిత్య! సత్యాధికృత్యా!**
**నిరతిశయ సమత్వోన్నిద్ర! కారుణ్యభద్రా!**
**భరితభువనవర్గా! భాస్వదానందమార్గా!** **624**

**ప్రతిపదార్థం:** వర= ఉత్తమంగా; బహు= (అధికంగా) బహువిధాలుగా; నుత= నుతించిన; వేదవ్యాస!= వేదవ్యాసుడు విశ్వ+ఆత్మ+భాసా!= విశ్వాత్ముడవై ప్రకాశించేవాడా! (విశ్వాత్మకమైన తేజస్సు కలవాడా!); నిరుపమ= సాటిలేని; తను= అవతార రూపాలయొక్క (శరీరాలయొక్క); లీలా= విలాసాలతో; నిత్యా!= నిత్యుడా!; సత్య+అధికృత్యా!= సత్యస్వామీ! (సత్యరూపా!); నిరతిశయ= సాటిలేని; సమత్వ= సకలప్రాణి సమానత్వంతో; ఉన్నిద్ర!= తేజరిల్లేవాడా!; కారుణ్యభద్రా!= దయానిలయా! (కృపారూపమైన శుభస్వరూపా!); భరిత= భరింపబడిన; భువనవర్గా!= లోకసమూహం కలవాడా!; భాస్వత్= ప్రకాశించే; ఆనందమార్గా!= ఆనందమార్గం కలవాడా! (ప్రకాశించే ఆనందానికి మార్గమైనవాడా!)

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నిన్ను వేదవ్యాసుడు ఉత్తమంగా బహువిధంగా నుతించాడు. నీ తేజస్సు విశ్వవ్యాప్తమై విశ్వాత్మగా ఉంటుంది. నీ అవతారలీలలు నిత్యాలూ నిరుపమాలూ. సత్యస్వరూపుడవు నీవే. సర్వప్రాణి సమతాభావంతో నీవెప్పుడూ జాగరూకుడవై ఉంటావు. నీవు కారుణ్యమూర్తివి. భద్రప్రదాతవు. సకల భువనాలనూ నీవే భరిస్తావు. నీవే నిజమైన ఆనందమార్గానివి, ఆనంద స్వరూపుడవూ, ఆనందప్రదాతవూ - అని హరిహరనాథుడిని స్తుతించే స్తోత్రములు.

**విశేషం:** మాలినీ వృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న,న,మ,య,య అనే గణాలుంటాయి. తొమ్మిదవ అక్షరానికి యతిమైత్రి ఉంటుంది. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున శాంతిపర్వమునందు సర్వంబును షష్ఠాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరులైన ఉభయ (సంస్కృతాంధ్ర) కవులకు మిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, పండితులను ఆరాధించటంచేత ప్రకాశించేవాడూ (పండితులచేత ఆరాధించబడి రాజిల్లేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలోని శాంతిపర్వం ముగించే ఆరవ ఆశ్వాసం.

**శాంతిపర్వంలోని ఆరవ ఆశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలోని శాంతిపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శాంతి పర్వము

(రెండవ భాగము)

## గద్య పద్య ప్రథమ పాద సూచి

## గ

## ద



## ధ

## హ

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

**( సరళ వ్యాఖ్యాన సహితం )**

**సంపుటము - 14**

**ఆనుశాసనిక పర్వము**


కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు
డా॥ శలాక రఘునాథశర్మ
శ్రీ ముదివర్తి కొండమాచార్యులు
డా॥ యం.కులశేఖరరావు

ప్రధానసంపాదకుడు
డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Anusasanika parvamu of Tikkana Somayaji
Vol. XIV.

Commentary by
**Dr. Tummapudi Koteswara Rao - 1,2 Cantos**
**Dr. Salaka Raghunatha Sarma - 3,4 Cantos**
**Sri Mudivarthi Kondamacharyulu, Dr. M. Kulasekhara Rao - 5th Canto**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Series No.613
First Edition : August 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by

**Sri. M.G. Gopal, I.A.S.**

Executive Officer,

T.T.Devasthanams,

Tirupati - 517 507

D.T.P. Type Setting

**Editor-In-Chief Office**

T.T.D. Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

**నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.**

ఆంధ్రమహాభారతంలో అనుశాసనిక పర్వం పదమూడవ పర్వం. ఇది మహాభారతవ్యాఖ్యానసంపుటాల్లో పదునాల్గవది. శాంతి పర్వంలో కథా వస్తువు ధర్మ వివేచన. అది ఈ పర్వంలోను ధారావాహికంగా ముందుకు సాగుతుంది. భీష్ముడు కురుక్షేత్ర సంగ్రామంలో పదిరోజులు చెలరేగి శత్రుసంహారం చేసి, ఆవల శరతల్పమున పవళించి శరీరత్యాగానికి ఉత్తరాయణ పుణ్యకాలానికై ఎదురుచూస్తూ తాను అవగాహన చేసుకొనిన ధర్మసూక్ష్మాలను ముందుతరం వారికై ధర్మరాజుకు ఉపదేశం చేయడం ఈ పర్వంలోని వృత్తాంతం. ఇది అయిదు ఆశ్వాసాలలో సాగిన కథనం అనడం కంటే ధర్మవిశ్లేషణ, ధర్మ సూక్ష్మ వివరణలకు ఆకరం అనడం బాగుంటుంది. ఈ పర్వంలో కథా కథనం కంటే ప్రశ్న ప్రతివచనాల మూలంగా పలు ధార్మిక విషయాలు తేటతెల్లంగా తెలుపబడ్డాయి.

ఈ అనుశాసనిక పర్వంలోని ఐదు ఆశ్వాసాలకు వ్యాఖ్యాతలు నలుగురు. వీరు తిక్కన హృదయాన్ని ఆకళింపు చేసుకొన్న పెద్దలే. డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు, డా॥ శలాక రఘునాథశర్మ, డా॥ ఎమ్. కులశేఖరరావు, శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యుల వారు – వీరంతా ఎంతో ప్రతిభాపాటవాలతో కూడిన పాండిత్య ప్రకర్షతో ఈ పర్వానికి వ్యాఖ్యానాన్ని సమకూర్చారు. దేవస్థానం తరఫున వీరికి అభినందనలు తెలుపుతున్నాను. ఈ సంపుటానికి ప్రధాన సంపాదకులు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు. వీరికి మా శుభాభినందనలు.

**కార్యనిర్వహణాధికారి,**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

## పూర్వరంగం:

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమ స్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం – ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

## నన్నయ భారత ప్రాజెక్టు :

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో – అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు – రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 –' 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి – ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది;

'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) – అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' – అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జులై 11వ తేదీన హైదరాబాదు బాలాజీభవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

ఆ సూత్రాల సారాంశం :

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ – భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అర సున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట– ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో

సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో – సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయతల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్లవేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను."

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి– వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్పురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్లవేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో – 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ" కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశా స్త్రి గారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగా పర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము – మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశా స్త్రిగారి గృహంలో 1991 జులై 3వ తేదీన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన :**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డి గారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక"ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం :**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యవంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం– అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥కె. సర్వోత్తమరావు** | **శ్రీడి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటి దొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥ రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీ కాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు – వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన – కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

## ఆ నియమాల సారాంశం :

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్లు రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉట్టంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జులై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీడి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య – ఆ యా రచయితలు వ్రాసి పంపనందున – దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

## కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం – సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీస్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing) లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను,  విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం :**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పంద్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులుబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి".

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాష్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదక మండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) – అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

**సంపాదకమండలి సభ్యులు**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు** — **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు**

**డా॥ ఎస్.బి. రఘునాథాచార్య** — **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ కె.జె. కృష్ణమూర్తి** — **డా॥ కే. సర్వోత్తమరావు**

**సలహామండలి సభ్యులు**

**పౌరసంబంధాధికారి, తి.తి.దే.** — **డా॥ బిరుదురాజు రామరాజు**

**అన్నమాచార్యప్రాజెక్ట్ డైరెక్టర్, తి.తి.దే.** — **డా॥ ఎం. కులశేఖరరావు**

**ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే.** — **డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు**

**డా॥ ఎం. బుద్ధన్న**

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలుల లోని సభ్యులయొక్క సంయుక్త సమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటాలన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్త పాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ప్రథమ సంపుటం– ఆదిపర్వం

(రెండు భాగాలు), ద్వితీయ సంపుటం – సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి.సుబ్బారావుగారి తరువాత కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్., గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణ ప్రణాళికను ఆసక్తితో గమనిస్తూ అన్ని విధాల సహకరించి ఆది, సభా పర్వాల విడుదలకు ఏర్పాటు చేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ ప్రణాళిక వ్యాఖ్యా సహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. అప్పట్లో తీవ్రతరం అయిన ప్రయత్నంతో గోదావరి పుష్కరాల సమయానికి ఆరణ్యపర్వం (2 భాగాలు), విరాటపర్వం విడుదల అయ్యాయి. తర్వాత శ్రీ అజేయ కల్లంగారు కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన వెనువెంటనే ఈ మహాభారత వ్యాఖ్యాన సహిత ప్రకటనా ప్రణాళికను మరింత వేగిరపరచి కృష్ణాపుష్కరాల లోపల యుద్ధపంచకాన్ని విడుదల చేయాలనీ, 2004 సంవత్సరం చివరకు మిగిలిన పర్వాష్టకము వెలుగుచూడాలనీ నిర్ణయించడం జరిగింది. 2004 కృష్ణాపుష్కరాల సమయంలో ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వాలు వెలువడ్డాయి. తరువాత కర్ణపర్వం ఒక సంపుటంగాను, తరువాతి పర్వాలైన శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు మూడింటిని కలిపి ఒకే సంపుటంగాను, శాంతి పర్వాన్ని రెండు సంపుటాలుగాను ముద్రించాము. ఇవి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డిగారి చేతులమీదుగా విడుదల అయ్యాయి. ఆ తరువాత అనుశాసనికపర్వం (ఐదు ఆశ్వాసాలు) ఒక సంపుటంగాను, మిగిలిన ఐదుపర్వాలను (అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణపర్వాలు)ఒక సంపుటంగాను ప్రచురించాలని నిర్ధారణచేసి త్వరితగతిని ఉపక్రమించినప్పటికి అనుకోని ఆటంకాలు ఏర్పడి జాప్యం జరిగిన సంగతి నిజం. అపుడు మనలను ఆదుకున్నవారు ఎడిటోరియల్‌సెల్‌లో సభ్యులైన శ్రీముదివర్తి కొండమాచార్యులువారు. ఆయన కష్టపడి కునుకువేయక తుదిమెరుగుల వరకు పనిచేసి ఇస్తేకాని గట్టు ఎక్కలేకపోయాము.

ఈ మధ్యకాలంలో అంటే మహాభారత వ్యాఖ్యాన ప్రచురణ యజ్ఞం చివరిదశలో ఉండగా సంచాలకులైన సప్తగిరి సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తిగారు పదవీ విరమణ చేయడం జరిగింది. 1994 సం॥లో సప్తగిరి సంపాదకుడిగా పదవి స్వీకరించిన నాటినుండి మహాభారత వ్యాఖ్యాన ప్రచురణ భారాన్ని భుజానవేసుకొని సమర్థంగా అన్ని ఆటంకాలను అధిరోహించి ఆంధ్రదేశం గర్వించతగ్గ ఒక మహా గ్రంథాన్ని వెలుగులోకి తీసుకురావడానికి ఆయన చేసిన కృషి అభినందనీయము.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. లోగడ తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా వున్న శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహానికి కృతజ్ఞతాభివందనాలు. ఈ మహాగ్రంథం పూర్తిగా వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ఏ.పి.వి.ఎన్. శర్మ

ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. తి.తి.దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి సాహిత్య ప్రియులూ ఐన శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్., గారు మరింత ప్రోత్సాహం ఇచ్చి ప్రాజెక్టు పనిని వేగవంతం చేశారు. దీనికోసం ప్రతిరోజు నిరంతరాయంగ పని జరిగేటట్లు చూడడమే కాకుండ వారానికొక 'నివేదిక'ను అడిగి తగు మార్గదర్శనాన్ని చేసినవారు ఆయన. వారికి గౌరవాదరాలతో కృతజ్ఞతలు తెలుపటానికి సంతోషిస్తున్నాము.

సంబంధిత విభాగాధిపతిగా, సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన శ్రీ కె.రాంపుల్లారెడ్డి, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి– వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయ సహకారాలందించిన తదితర అధికారిగణానికి నమస్సులు. ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధాన పాత్ర వహించిన– వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదక మండలి, సలహా మండలి) విద్యావేత్తలకు, ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారికి– నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి.దేవస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడంలో వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్ కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానిక పండితవర్యుల ఉప సంఘం (ఎడిటోరియల్ సెల్) నిర్మాణానికి సిఫారసు చేస్తే దేవస్థానం ఆమేరకు పండితవరేణ్యులు డా॥ కే. సర్వోత్తమరావు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీముదివర్తి కొండమాచార్యులు గారలతో ఎడిటోరియల్ సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈ సెల్ ఉపకారం అద్వితీయమై మరువరానిది. వర్క్‌షాపువలె నిర్వహింపబడుతున్న కవిత్రయ మహాభారత యజ్ఞంలో వీరు పాలుపంచుకుంటున్నారు. ఆ కారణంగానే తక్కిన పర్వాలను త్వరితంగా గుణాత్మకంగా వెలువరించగలుగుతున్నాం.

"సప్తగిరి" సంపాదకులుగా, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి అమరులయ్యేవరకూ ప్రముఖ పాత్ర వహించిన కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దికకృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥ కోరాడ రామకృష్ణ, తెలుగు ఉప–సంపాదకులు డాక్టర్ కే.రాధారమణ, డాక్టర్ అల్లాడి సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ ఉప–సంపాదకులు శ్రీ బి.ఎన్.శ్రీనివాసన్‌గారికి, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగసుందరంగా తీర్చి దిద్ది పాఠకులకు తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయాధికారి శ్రీ.జి.వెంకటేశ్వరరావుగారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూఉన్న ఈ 'వ్యాఖ్యానసహిత

కవిత్రయ భారత' ముద్రణలో ఏవైనా నూతన్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహ విశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

సి.శైలకుమార్

కన్వీనర్

సంపాదకుడు – సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| | వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|---|
| 1. | డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. | డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా. 1 |
| 3. | డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా 1,2 |
| 4. | డాక్టర్ నందూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ. ఆశ్వా. 1,2 |
| 5. | డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా. 1 |
| 6. | డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. | శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా. 2 |
| 8. | డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా. 4 |
| 9. | డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా. 5 |
| 10. | డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. | శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. | శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. | డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. | డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. | డాక్టర్ కె. రాజన్నశాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. | శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. | డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. | డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. | డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. | డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా. 1; స్వర్గా-1 |
| 21. | డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. | డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. | డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. | డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. | డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | అను. ఆశ్వా. 1,2 |
| 27. | డాక్టర్ శలాక రఘునాథశర్మ | అను. ఆశ్వా. 3,4 |
| 28. | డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | అను. ఆశ్వా. 5 |
| 29. | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. | డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| అను. | – | ఆనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |

| | | |
|---|---|---|
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభవిక్రీడితం |
| శా. | – | శార్దూలవిక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము

## గద్య పద్య ప్రథమ పాద సూచి

### ఆ

## ఇ

## య



## ర



## ల



## వ

## హ

# పీఠిక

[**పీఠిక - విషయసూచిక :** (1) ముగ్గురు మహాపురుషులు - పు.1* (2) ధర్మజుడు జిజ్ఞాసువే కాని ముముక్షువుకాడు - పు.2* (3) పర్వ ప్రబంధ ధ్వని - పు.2* (4) పర్వ పరిమాణం పు.3.* (5) ధర్మజుడి చిత్తపరిపాకాన్ని పెంచిన దానధర్మాల ప్రశస్తి - పు.4* (6) ఉత్తమ ధర్మ నిర్దేశం పర్వవస్తు ప్రత్యేకత - పు. 5* (7) తిక్కన చేసిన సంగ్రహరచన - పు 7* (8) సంవాదాలు: ఉపాఖ్యానాలు- పు. 7* (9) సంవాదరచనా శిల్పం - పు. 8* (10) ఉపాఖ్యాన రచనా వైభవం - పు. 10* (11) భీష్మ నిర్యాణం- పు. 16* (12) హరిహరనాథతత్త్వం- పు. 18* (13) కవిత్రయమహాభారతం: వ్యాఖ్యానం - పు.36* (14) కథాసారం - పు.38*]

---

తే. 'దేవదేవ! జీవాత్మక! దేవవంద్య!
శంఖచక్ర గదాపద్మ చారుహస్త!
వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమ
పురుష! ప్రణుతి యొనర్చెదఁ గరుణఁ జూడు!' (అను.5.461)

### 1. ముగ్గురు మహాపురుషులు :

కురుక్షేత్రంలో మహాయుద్ధం ముగిసింది. మహాజ్ఞాన యజ్ఞం మొదలయింది. దేవర్షులు, మహర్షులు, మహీపతులు, మేధావులు, జిజ్ఞాసువులు అసంఖ్యాకంగా గుమిగూడి శాంతనవుడు ప్రబోధించే ప్రజ్ఞాపూర్వక వాక్యాలను వాఙ్మయ వేదాలుగా వింటున్నారు. ఆ విజ్ఞాన పరిషత్తులో త్రేతాగ్నులవలె వెలుగుతున్నారు ముగ్గురు మహాపురుషులు. ఆ ముగ్గురూ మూడు ప్రవృత్తులకు ముచ్చటైన ప్రతినిధులవలె ప్రకాశిస్తున్నారు.

అంపశయ్యమీద పరున్న కురువృద్ధుడు భీష్ముడు - ఆచార్య (బోధక) స్థానీయుడు, మరొకడు జ్ఞానపిపాసతో ప్రశ్న లడుగుతున్నాడు. జిజ్ఞాసువు ధర్మరాజు సాధన స్థానీయుడు. ఇంకొకడు పరమాత్మ స్వరూపుడు శ్రీకృష్ణుడు - సర్వజ్ఞుడు. సర్వసాక్షీభూతుడు. భీష్ముడు కర్మయోగి. అపూర్వ సాహసి. తాను చేపట్టిన ప్రతిజ్ఞయే, పరమధర్మమని భావించే పట్టుదల కలవాడు. గురుభక్తి, దైవభక్తి కలవాడైనా యుద్ధప్రియుడు. అపార విజ్ఞానఖని. తండ్రి కొరకు భీష్మ ప్రతిజ్ఞలు చేసి అతడి దయవలన తాను కోరుకొన్నప్పుడే చనిపోయే 'ఇచ్ఛామరణ'మనే అపూర్వ వరాన్ని పొందినవాడు. శిఖండితో యుద్ధం చేయనన్న వ్రతంతో యుద్ధంలో అర్జునుడు తన శరీరంలో నింపిన బాణాలను శయ్యగా ఏర్పరచుకొన్న యోగి. ఉత్తరాయణకాలం వచ్చేంతవరకు తనువును బాణశయ్యపై ఉంచుకొని జీవించిన ఘోరకర్మశీలి. అతడు చనిపోతే సమకాలీన జ్ఞానకోశం ఒకటి కనుమరుగైపోయినట్లే అని శ్రీకృష్ణాదులు భావించి, అతడి చేత ధర్మరాజునకు ధర్మనీతి బోధలు చేయించారు. భీష్ముడు ధర్మరాజునకు తగిన గురువు. ఆ గురువుకు తగిన శిష్యుడు ధర్మరాజు. ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేంతవరకు అంపశయ్యమీద ఒంటిగా యోగవృత్తిలో ఉండాలని అనుకొన్న కర్మయోగి లక్షణం - అతడిలో పురుషకారప్రవృత్తికి గల ప్రాధాన్యాన్ని తెలుపుతుంది. భీష్ముడు పురుషకారానికి ఇచ్చిన ప్రాముఖ్యాన్ని దైవానుకూల్యానికి ఇచ్చినట్లు కానరాడు. అందువలననే జీవితంలో అప్పుడప్పుడు ఎదురుదెబ్బలు తిన్నాడు. శ్రీకృష్ణుడి కరుణకొరకు భక్తితో ప్రార్థనలు చేసిన ఘట్టాలు కూడా కనపడతాయి. హస్తినాపుర సింహాసన రక్షణకే అంకితమైపోయి కౌరవుల పక్షాన యుద్ధం చేసిన రణకర్మశూరుడు అతడు. ప్రవృత్తి విద్యకు సంబంధించిన విజ్ఞానం అపారంగా గడించి, నివృత్తి జ్ఞాన సంస్కారాన్ని పండించుకొన్న పండితుడు అతడు.

అతడికి మోక్షకాంక్ష ఉన్నట్లు లేదు. ధర్మకర్మనిర్వహణ వలన కలిగే సహజ స్వర్గసుఖమే అతడు కోరుకొన్నాడు. అతడు నేర్చిన విజ్ఞానమే ధర్మజుడికి సజాతీయంగా ఉంటుందని వాసుదేవుడు భావించి భీష్ముడి ప్రబోధానికి శ్రోతగా అతడిని నియోగించాడు.

భీష్ముడు ఇప్పటికే ధర్మరాజుకు శాంతిపర్వ విశేషాలను వినిపించాడు. అందులో ప్రధానంగా రాజధర్మాలూ, ఆపద్ధర్మాలూ వినిపించిన తరువాత వేటిని తెలిసికొంటే సర్వజ్ఞానసంపన్ను లౌతారో అటువంటి మోక్షధర్మాలను కూడా వినిపించి అతడి జ్ఞానతృష్ణను తీర్చటానికి యత్నించాడు. కాని అన్నీ విన్న ధర్మరాజుకు బంధుజన సంహారం వలన కలిగిన పాపభీతివలన మనశ్శాంతి కుదరలేదు. మరల విషాదాన్ని ప్రకటించాడు. భీష్ముడు సర్వధర్మ నిశ్చయ జ్ఞానం కలిగే విశేషాలూ, దానవిధులు, తీర్థసేవలూ, ఆచారవిధులు మొదలైన అంశాలు వివరించి చెప్పి, ధృతరాష్ట్రాదులకు హితవు పలికి, ఉత్తరాయణపుణ్యకాలం వచ్చిన తరువాత స్వర్గస్థు డయ్యాడు. ఈ ధర్మాలు చెప్పే భాగంగా ఆనుశాసనికపర్వం మహాభారతంలో పదమూడవపర్వంగా ఒప్పారుతున్నది.

## 2. ధర్మజుడు జిజ్ఞాసువే కాని ముముక్షువు కాడు :

కొందరు ఆనుశాసనిక పర్వాన్ని శాంతిపర్వంలో భాగంగానే పరిగణిస్తారు. కాని, దీనిని ప్రత్యేక పర్వంగా పరిగణించటమే వ్యాసహృదయం. అయితే, శాంతిపర్వంలో మోక్షధర్మాలను అడిగి తెలిసికొన్న ధర్మరాజు మరల ఈ పర్వంలోని లౌకికధర్మాలను, వర్ణాశ్రమ ధర్మాలను, దాన తీర్థాది విశేషాలను విరివిగా అడిగి తెలిసికొనటంలోని తాత్పర్యమేమై ఉంటుందని కొందరు విచారించారు. అడిగింది ధర్మరాజు కాబట్టి, ఆ ప్రశ్నల వెనుక అతడి చిత్తవృత్తి, వ్యక్తిత్వ స్వభావాలు ఎక్కువగా ప్రతిఫలిస్తాయి. ధర్మజుడు ముముక్షువయితే లౌకికధర్మాలమీద, ప్రవృత్తి ధర్మాలమీదా అనురక్తి ఎక్కువగా ఉండేది కాదు. అతడు మౌలికంగా కర్మయోగి. పుణ్యవ్రతశీలి, ధర్మనీతి వర్తనుడు కాబట్టి అతడు వినే మోక్షధర్మాలన్నీ వ్యుత్పత్తిని మాత్రం కలిగిస్తాయనీ, అతడి సహజ ధర్మప్రవృత్తి లౌకిక ధర్మాలయందే రమిస్తుందనీ పండితులు భావించారు. ఉదాహరణకు శ్రీయల్లంరాజు శ్రీనివాసరావుగారి మాటలు కొన్ని గమనిద్దాం. "మోక్షధర్మాలు శ్రవణం చేసినా జిజ్ఞాసువై చేశాడేకాని, ముముక్షువై చేయలేదు ధర్మరాజు. అంచేత అది జీవిత లక్ష్యంగా పెట్టుకోలే దాయన. పెట్టుకొన్న జీవితలక్ష్యం ధర్మమే. ధర్మం తప్పకుండా నడవడమే సర్వస్వ మాయనకు. అందుకే దానిఫల మేదో అదే అనుభవానికి వచ్చింది. ఏమిటి ధర్మాచరణకు ఫలం? స్వర్గం. స్వర్గమే ప్రాప్తించింది గాని ధర్మరాజుకు మోక్షం కాదు. మహాప్రస్థానం చేసి పరివ్రాజకుడై చివర కాయన గడించింది స్వర్గఫలమే. స్వర్గారోహణంతోనే పరిసమాప్తమయింది జీవితయాత్ర. ఆయన జీవితమే కాదు. ఆ మాటకు వస్తే భారతవీరులందరి జీవితాలూ అంతే'' (మహాభారత వైభవము - పుట 485) అందువలన శాంతిపర్వంలోగాని, ఆనుశాసనిక పర్వంలోగాని ధర్మరాజు సహజంగా రమించేది మోక్షధర్మాలు కావు. ప్రవృత్తి ధర్మాలే. అందుకే ఆనుశాసనికపర్వం లోకధర్మ విజ్ఞానసర్వస్వంగా వెలువడింది. ఇందులో మోక్షధర్మ ప్రసక్తికూడా ఉన్నది. అది విన్న తరువాత కూడా ధర్మరాజుకు శాంతి కలుగలేదు. తేలిన తాత్పర్య మేమిటంటే - చెప్పిన వక్త ముముక్షువు కాడు. విన్న శ్రోత కూడా ముముక్షువు కాడు. శాంత్యనుశాసనిక పర్వాలలోని ప్రబోధమంతా ధర్మరాజులో శాస్త్రజ్ఞానంగా వెల్లివిరిసిందే కాని, ప్రజ్ఞానంలో అనుభవజ్ఞానంగా పల్లవించలేదు.

## 3. పర్వప్రబంధధ్వని:

స్థూలంగా పరిశీలిస్తే శాంతిపర్వంలోని ధర్మాల కథనానికీ, ఆనుశాసనిక పర్వంలోని ధర్మాల కథనానికీ భేదం కొంత కానవస్తుంది. శాంతిపర్వంలోని ధర్మాలు విశ్వజనీనంగా ధర్మపరులైన రాజులందరికీ పనికివచ్చే సామాన్య ధర్మాలుగా గోచరిస్తాయి. ఆనుశాసనికపర్వంలోనివి విశేషధర్మాలవలె స్ఫురిస్తాయి. ఎట్లాగంటే - ఒకరాజు ప్రజాపాలన చేస్తున్నపుడు అతడు ధర్మాసనం మీద కూర్చుండి చెప్పవలసిన తీరులు ఎన్నో ఉంటాయి. ప్రజల జీవన విధానంలో అనుశాసించ వలసిన లౌకికధర్మాచరణ పద్ధతులు మరెన్నో ఉంటాయి. మరొక విధంగా చెప్పాలంటే - నిత్యజీవితంలో రాజు ప్రజల సమస్యలపై ఇవ్వవలసిన ధార్మికమైన న్యాయబద్ధమైన, సాంస్కృతికమైన తీర్పులకు సంబంధించిన విషయాలు ఎన్నో ఉంటాయి. వాటికి సంబంధించిన అనుశాసనాలను ధర్మరాజు ఈ పర్వంలో తెలిసికొన్నాడని స్పష్టమౌతుంది.

దీనివలన కథాపరమైన ప్రయోజనం కూడా ఏర్పడింది. ధర్మరాజు ప్రభువైన తరువాత చేసిన ప్రజాపరిపాలన విశేషాలను గురించికాని, తీర్చిన ప్రజల న్యాయ, ధర్మ సమస్యలను గురించిగాని, ఏర్పడిన ధర్మసంఘర్షణలు, ధర్మసంశయాలు, వాటి నివారణల గురించిన వివరాలుగాని, కథాసందర్భాలుగాని ప్రధానేతివృత్తంతో మనకు కానరావు. వాటన్నిటికి బదులు ఆనుశాసనిక పర్వంలో ధర్మరాజు అడిగిన ప్రశ్నలే సమస్యల పరిష్కారాలుగా సూచింపబడ్డాయి. హస్తినాపుర సింహాసనం రక్షణతోపాటు, హస్తినాపురంలోని ధర్మరక్షణకు తోడ్పడే అనుశాసనాన్ని అందించి భీష్ముడు ధర్మసంప్రదాయ పరిరక్షకుడైనాడు. భీష్మానుశాసనాన్ని తన పరిపాలనలో రాజానుశాసనంగా ధర్మజుడు ప్రవర్తిల్లచేసికొన్నాడు అన్నది ఈ పర్వంలో అందించే ప్రబంధధ్వనిగా గ్రహించవచ్చును.

## 4. పర్వ పరిమాణం:

ఆనుశాసనికపర్వం పన్నెండువేల శ్లోకాల పరిమాణం కలిగిందని నన్నయ పర్వసంగ్రహపర్వంలో పేర్కొన్నాడు. కాని, చిత్రశాల ప్రతిలో ఎనిమిదివేల శ్లోకాలే ఉన్నాయి. భండార్కరుసంస్థవారి ప్రతిలో 6700 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. అయితే, పి.పి.యస్.శాస్త్రి ప్రతిలో మాత్రం 12వేల శ్లోకాలని పేర్కొనబడింది. కాబట్టి నన్నయాదులు ఉత్తరాది ప్రతులకంటె దాక్షిణాత్య ప్రతులనే అనుసరించారని, వీటిలో దాదాపు నాలుగువేల శ్లోకాలు ప్రత్యక్షంగా చేరి ఉన్నాయని స్పష్టమౌతున్నది. ఉదాహరణకు ఆంధ్రమహాభారతంలోని ఆనుశాసనికపర్వంలోని చతుర్థాశ్వాసంలో హరసంపత్కుమారపర్వం ఉత్తరాదిప్రతులలో కానరాదు. ఇట్లాగే గోవులను గూర్చి బ్రాహ్మణమాహాత్మ్యాన్ని గురించి చెప్పిన అంశాలు తెలుగులో విస్తారంగా చేరాయి. సంస్కృత భారతంలో ఆనుశాసనికపర్వంలో 146 అధ్యాయాలు ఉన్నట్లు చిత్రశాలా ప్రతిలో ఉండగా అది 168 అధ్యాయాల గ్రంథంగా విస్తరించింది. ఆయాకాలాలలో ప్రజలు జీవిత ధర్మాలలో వస్తున్న పరిణామాలను, అప్పటి అవసరాలను అనుసరించి, ఈ పర్వంలో లౌకిక ధర్మాలను గురించిన అనేకాంశాలు చేర్పబడుతూ ఉండి ఉండవచ్చును. పంచమవేదంలో చెప్పబడిన ధార్మికాంశాలను అనుశాసనాలుగా ప్రామాణికాలుగా భావించడం ఈ విస్తృతికి కారణం కావచ్చును.

ప్రక్షిప్తాలుగా భావించబడే అంశాలమీద కొందరు విమర్శకులకు ఉదాత్తమైన అభిప్రాయం కూడా లేదు."ఇట్లు చేర్చబడిన యంశము లన్నియు ఉదాత్తములైనవి, కథామహితము లైనవి అని చెప్పుటకు వీలులేదు. అవి కొన్ని మిక్కిలి పేలవములు. శిశుప్రాయములు. ఉదాహరణకు పితృకార్యములందు ఉపానత్తులు, ఛత్రము ఈయవలెనని చెప్పుదురు. దీని భావ మేమని ధర్మరాజు అడుగును. వృద్ధుడగు గాంగేయుడు శ్రద్ధతో సమాధానము చెప్పును. సర్వసర్వంసహా చక్రవర్తి యగు పాండవాగ్రజు డిట్టి చొప్పదంటు ప్రశ్న వేసె నేమి? యని పైకి అనిపించును. పంచమవేదమునందు వివరించవలసిన యంశమేనా ఇది? యని తోచును. మహాభారతము కేవలము కథాకావ్యము కాదు. అది ప్రాచీన విజ్ఞాన సర్వస్వము. మానవ నాగరకతా యాత్రయందలి మజిలీలన్నియు దానియందు వింతగా పరిస్ఫురించును. ఒకప్పుడు మానవునకు ఉపానత్తులు - పాదరక్షలు లేక చెప్పులు, గొడుగు - వీని ప్రయోజనము తెలియకుండెను. ఎండకును, చలికిని అతడు బాధపడుచుండెను. ప్రాచీన సంఘమందలి యొక బుద్ధిమంతుడు చెప్పులు, గొడుగు - వీనిని బుద్ధికుశలతచే కల్పించగల్గెను. ప్రాక్తన మానవుని దృష్టిలో ఇది యొక అద్భుతకల్పనమేకదా! అతడు సంతోషము చెంది దాని కొక కథారూపమును కల్పించినాడు. ఆ కథయు మహాభారతమున కందమే అయినది. (చూడు కథాసారం. ప్రశ్న 60కి ఉత్తరం - సూర్యజమదగ్ని సంవాదం అనే ఇతిహాసం)... ఇది పసిబాలురకు చెప్పవలసిన 'అనగనగా' కథవంటిది అయినను విపులముగా పరిశీలించినచో ప్రాచీన సంఘము యొక్క సంస్కృతి విశేషములు దీనియందు గోచరించును. ప్రాచీన మహర్షులు వీరవ్రతులు. వారు శరాసన విద్యను చక్కగా నేర్చుచుండిరి. జనసమ్మర్దము లేని మైదానమునందు వారు అస్త్రసాధన చేయుచుండిరి. కర్ణుడు దీనికి భిన్నముగా ప్రవర్తించి ఒక బ్రాహ్మణుని గోవును బాణముతో కొట్టుటచే శాపగ్రస్తు డాయెను. రాజులవలె మహర్షులు సంపన్నులు కాకపోవుటచే వారికి పరివారము లేకుండెను. జమదగ్నికి అతని కుటుంబమే పరివారము. ఆమె యాతని యమ్ములపొదులను మోసి తెచ్చెను. దూరమున పడిన బాణములను ఏరి తెచ్చుచుండెడిది. తపోనిష్ఠులయ్యును మునిజనులు తమ స్త్రీ జనమునందు అనురాగము కలిగి యుండిరి. ఎండనుండియు, అమితమైన చలినుండియు తనదేహమును కాపాడుకొనుట ప్రాచీన మానవునకు ఒక

సమస్యగానే యుండెను. చెట్టు నీడ నిచ్చుటను అతడు చూచెను. చెట్టును మోసికొని పోకుండ నీడను వెంటగొని పోవుటెట్లు? అనునది కొంతకాలము మానవునకు సమస్యగానే యుండెను. బుద్ధిశాలి యొక్కడు గొడుగు కల్పించెను. ఇది నేడు మనకు అత్యంత పరిచితమైన వస్తువగుటచే అద్భుతమును గొల్పదు. దానిని ఇతివృత్తముగా చేసిన కథ ఈ కాలమున వెలువడదు. అట్లే చెప్పులును, పాదములకు శీతాతపములు సోకకుండుటకై రక్షణ అవసర మనిపించెను. నేర్పరియైన మానవుడు శుష్కకాష్ఠమును, చర్మమును శీతోష్ణవాహకములు కావని (నాన్ కండక్టర్స్) కొంతకాలమునకు కనిపెట్టెను. మొదట ఎండుకట్టెతో పావకోళ్ళు నిర్మించుకొనెను. సన్న్యాసులు పావకోళ్ళనే ధరింతురు. వివాహాదులయందు కూడ వీనినే ధరింప చేయుదురు. కావున కట్టెతో నిర్మించిన పాదరక్షలే మొదటి దశయని చెప్పవలెను. చర్మ నిర్మితమైన పాదరక్షలు ఎక్కువ సుఖకరము లైనను తోలు అంటుటకు మహర్షులంతగా సమ్మతించి యుండరు. చర్మకాష్ఠములు విద్యుద్వాహకములు కూడ కావని ఇటీవల శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. మహాభారతమునందు సూర్య జమదగ్ని సంవాదమువంటి చిట్టి కథలును కలవు. అహింసాతత్త్వ బోధకమైన సక్తుప్రస్థుని వృత్తాంతమువంటి గొప్పకథలును కలవు. అందుచేతనే మహాభారతము విశ్వజనీనమని నన్నయభట్టు ఉచితముగ ప్రశంసించెను (ఆది. 1.32)'' - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము - (ఆనుశాసనికపర్వ పీఠిక -(ఉస్మానియాప్రతి). పుట.11-12)

## 5. ధర్మజుడి చిత్తపరిపాకాన్ని పెంచిన దానధర్మాల ప్రశస్తి:

ఆనుశాసనికపర్వంలో దాదాపు మూడవవంతు ప్రశ్నలు దానధర్మాలను గురించి తెలుసుకొనటానికి ధర్మరాజు అడిగాడు. (చూడు. వివరాలకు కథాసారంలో ప్రశ్నోత్తరాల సంఖ్యలు : 21-25; 40-50; 54, 59, 60, 63, 64, 77, 80 మొదలుగునవి). దానితో ఈ పర్వం దానధర్మాలకు ప్రాధాన్య మున్నదానిగా భావించటం కొంతమందికి పరిపాటి అయిపోయింది కూడా. అయితే అట్టి దానధర్మప్రబోధం సార్థకమని భావించే పండితులే ఎక్కువమంది కనపడతారు. వారందరి అభిప్రాయాలకూ ప్రాతినిధ్యం వహిస్తాయి. శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారి మాటలు "భారతానుశాసనిక పర్వంలో భీష్ముడు దానా లెన్ని ఉన్నవో అన్నీ ఏకరువు పెడతాడు. గోదానమే కాదు, భూదానమే గాదు, హిరణ్యదానమే గాదు, మాషయవగోధూమ తండులాది దానాలే కాదు. తుదకు పాదుకాఛత్ర చామరాది దానాలే కాదు, ఏదంటే అది. ఎవ రడిగితే వారికి ఆఖరుకు శిబిచక్రవర్తి లాగా - దధీచిలాగా తన ప్రాణా లడిగినా దానం చేయవలసి వస్తుంది. భౌతికంగా ఇవన్నీ చేయాలని చేస్తేనే గొప్ప అనీ కాదు మన మర్థం చేసుకోవలసింది. అలా చేసే బుద్ధీ, సంసిద్ధతా - కలిగి ఉండాలి మానవుడు, క్రియ గాదు, బుద్ధి, అంతరమైన ఆ బుద్ధికి బాహ్యమైన ప్రతీకలే భీష్ముడు వర్ణించిన కథలన్నీ. అన్నీ ఈ సిద్ధాంతాని కుదాహరణలే. నిజంగా ఆ కథలలో చెప్పిన వన్నీ జరిగాయనీ, చేశాయనీ, అలాగే జరగాలనీ కాదు. చారిత్రకంగా జరిగితే జరగవచ్చు. లేకుంటే లేదు. మానసికంగా అలవరచుకోవలసిన ఒకానొక భావన ఇది. త్యాగభావన త్యాగక్రియ గాదు. ద్రవ్యత్యాగంతో నిమిత్తం లేదు. త్యాగభావ ముంటే జ్ఞానికి పూచికపుల్ల అయినా సరే. ఇది నా దగ్గర ఉంటే బాగుంటుందనుకొంటే ఆమేర కది బంధమే మానవుడికి. జ్ఞాన ప్రవాహానికి ప్రతిబంధమే. నిరాఘాటంగా జ్ఞానం నిలవాలంటే ఈ మమత్వబుద్ధి అనేది ఉండరాదు. అంటే అంతా 'మమే'. లేకుంటే ఏదీ 'మమ' కాదనే దృష్టి ఏర్పడాలి. ఇదీ జ్ఞానానికి పరాయణం.''

"ఇంతకూ పశ్చాత్తప్తుడైన మానవుడు గురూపసదనం చేసి, సకల ధర్మాలూ శ్రవణం చేయగలిగితే, అందులో ప్రవృత్తి ధర్మం సత్త్వాన్ని శుద్ధిచేసి, నివృత్తిరూపమైన మోక్షధర్మానికి దారితీస్తే - అది కదలకుండా నిలకడ చెంది మోక్షసుఖాన్నే మన కందివ్వటానికి త్యాగసన్న్యాస వైరాగ్యాపర పర్యాయమైన దానగుణాన్ని పూర్తిగా అలవరచుకోవాలి. అప్పుడే మనకు కలిగిన ఆత్మ జ్ఞాన మనుభవంగా మారగలదు. మారితే అదే పరిపూర్ణత జీవితానికి. ఇలాంటి పరిపూర్ణతను ప్రసాదించడానికే రాజధర్మాలు మొదలుకొని దానధర్మాలవరకూ ఈ చతుర్విధ ధర్మాలనూ ఈ వరుసలో బోధించాడు పితామహుడు.'' (మహాభారత వైభవము పుట.419-420)

ఆనుశాసనిక పర్వంలో బోధగా జాలువారిన దానధర్మసంస్కారం అశ్వమేధ పర్వంలో ధర్మరాజు అఖండ స్వర్ణదానం చేయటానికీ, చివరకు సర్వ సామ్రాజ్యాన్ని వేదవ్యాసుడికి దక్షిణగా ఇవ్వటానికీ తగిన చిత్తపరిపాకాన్ని కలిగించింది.

## 6. ఉత్తమ ధర్మ నిర్దేశం పర్వవస్తు ప్రత్యేకత:

ధర్మరాజు అనేక విశేషాలను, వివరాలను భీష్ముడిని అడిగి తెలిసికొంటూనే ఆయా అంశాలలో శ్రేష్ఠములైనవి, గొప్పవి, ఉత్తమములైనవి, ఏవి? అని అడగటం ఒక విశేషం. 'రత్నహారీ తు పార్థివ' అనే కాళిదాసోక్తి స్ఫురణకు వస్తుంది. లోకానికి వివిధ ధర్మాలలో వస్తుసముదాయాలలో తరతమ బేధం తెలియవస్తుంది. ఈ పర్వంలో అటువంటి ప్రశ్నలు 12కు మించే ఉండటం గమనార్హం. (వివరాలు చూడు కథాసారం, మచ్చుకు కొన్ని అంశాలు.

రాజులకు కర్తవ్యాలు ఎన్నో ఉంటాయి. కాని, వాటిలో ప్రధానకృత్యం ఏమిటి? అన్నది ధర్మరాజు ప్రశ్న. (చూడు ప్రశ్న 32) బ్రాహ్మణపూజ మూర్ధాభిషిక్తుల ప్రథమ కర్తవ్యమని భీష్ముడు చెప్పి విప్రసేవ కల్పవృక్ష సేవవంటిదని పేర్కొని, శంబరాది రాక్షసులు సైతం బ్రాహ్మణసేవవలన అపార సంపదలు గడించారని వివరించాడు.

దానాలలో గోదానం గొప్పదనీ, భూదానం ఉత్తమమనీ, ఇట్లా వివరాలన్నీ విన్న ధర్మరాజు అన్నిటికంటె గొప్పదాన మేది? అని ప్రశ్నించాడు. (ప్రశ్న 41). యాచకుడు కోరిన దానిని ప్రేమతో ఇచ్చినదాని కంటె గొప్పదానం మరొకటి లేదని భీష్ముడు ఘంటాపథంగా చెప్పాడు. దానాలను గురించి ఇన్ని విశేషాలు విన్నా అడిగిన దానిని ఇచ్చే సత్త్వగుణం దానగుణ శిఖరం.

గోవులలో కపిలగోవు గొప్పదని తెలిసికొన్న తరువాత, సమస్త లోకాలనూ సృష్టించిన బ్రహ్మలోకంకంటె గోలోకం ఉన్నతంగా ఉండటానికి కారణం అడిగాడు ధర్మరాజు. (ప్రశ్న 52) బ్రహ్మ సృష్టించిన సురభి మార్తాండుల ఇతిహాసాన్ని వినిపించి, వారికి పుట్టిన గోవులు బ్రహ్మలోకం కంటె పై భాగాన ఉండి క్షీరాల నిస్తాయని పేర్కొన్నాడు భీష్ముడు. గోమహిమలను తెలిపే ఇతిహాసాలు తెలిపాడు. (చూడు ప్రశ్న 52 సమాధాన వివరాలు)

పుణ్య తీర్థాలనుగురించి అడిగి తెలిసికొన్న ధర్మరాజు ఆ తీర్థాలన్నింటిలో ఎక్కువ పవిత్రత కలిగిన దేది? అని భీష్ముడిని ప్రశ్నించాడు. (ప్రశ్న 73 కథాసారం) భీష్ముడు భౌతిక తీర్థాలకంటె అంతస్తీర్థాలు గొప్పవని తెలిపాడు. మానస తీర్థం మేలైనది అన్నాడు. దానిపేరు 'సత్యం' అని చెప్పి, దాని విశేషాలు వివరించాడు. దమము, తపస్సు, శమము - అనే గుణాలు కూడా తీర్థాలే. భౌతిక తీర్థాలకంటె ఆధ్యాత్మికగుణాలే తీర్థాలని వివరించి నదులలో ఊరికే స్నానాలు చేసినదానికంటె, దొరకని వాటికై తాపత్రయ పడకుండా, దొరికినవాటితో తృప్తిపడి, ఆశకు దూరంగా ఉంటూ జీవించే సత్పురుషులే నిజమైన పుణ్యతీర్థాలని ప్రబోధించాడు.

విద్య, తపస్సు, దానం - ఈ మూడింటిలో ఏది గొప్పది? అని అడిగాడు ధర్మరాజు (ప్రశ్న.77). భీష్ముడు 'వ్యాసమైత్రేయ సంవాదం' అనే ఇతిహాసాన్ని వినిపించాడు. తపస్సు విద్య మొదలైన ధర్మాలన్నింటిలో దానం గొప్పదనీ, దానాలలో అన్నదానం గొప్పదని వ్యాసుడు మైత్రేయుడికి చెప్పాడు. విద్య తపస్సును వృద్ధి చేస్తుంది. తపస్సు, విద్యా, దాన మహిమతో పెంపొందుతాయి- అని వివరించాడు.

ఆచారాలను గురించి ఎన్నో వివరాలు విన్న ధర్మరాజు 'సర్వశాస్త్ర సారమైనదీ, సర్వశ్రేష్ఠమైనదీ అయిన ఆచరణ (ఆచారం) ఏది? అని భీష్ముడిని అడిగాడు. పితామహుడు 'నారదపుండరీక సంవాదం' అనే ఇతిహాసాన్ని వినిపించాడు. ఇరువది నాల్గవ తత్త్వమైన ప్రకృతికి తరువాతి తత్త్వం జీవాత్మ, అతడు సర్వభూతాల స్వరూపం అయినవాడు. అతి

వ్యవహారనామం 'నరుడు' అతివలన ఏర్పడిన తక్కిన తత్త్వాలన్నీ నారములు. అతడు నారములు స్థానంగా కలవాడు కాబట్టి నారాయణుడు. ఆ ప్రభువు విశ్వాన్ని సృష్టిస్తూ మరల తనలోనే లీనం చేసికొంటూ 'విభుడు' ఔతున్నాడు. ఆ నారాయణుడే పరబ్రహ్మం, పరతత్త్వం, పరమపదం, ఈశ్వరుడు, విష్ణువు - అనే పేర్లతో పిలువబడుతూ ఉంటాడు. అతడు వాసుదేవుడు. ఆత్మ - అనే పేర్లతో ఉపనిషత్తులు పిలుస్తాయి. ఆ పేర్లు నరుడికి కూడా వర్తిస్తాయి. సర్వశాస్త్రాల వాక్యాలనూ పరిశీలించి నిర్ణయించిన తాత్పర్యమిది. కాబట్టి ఎల్లవేళలా నారాయణుడిని స్మరించాలి. మరణకాలంలో 'నమో నారాయణాయ' అనే మంత్రాన్ని పలికితే నరులు ప్రణవానికి అర్థమైన పరమపదాన్ని పొందుతారు' అని నారదుడు చెప్పాడు. విష్ణువును సేవించుమని భీష్ముడు ధర్మరాజుకు హితవు చెప్పాడు. అదే ఉత్తమ ఆచారమని బోధించాడు.

పాపాలన్నింటినీ పారదోలే ప్రాచీన గాథను వినిపించుమని ధర్మజుడు భీష్ముడిని కోరాడు. ఆయన 'ఉమామహేశ్వర సంవాదం' అనే ఇతిహాసాన్ని వినిపించాడు. ఈ పర్వంలో ఉన్న ఇతిహాసాలన్నింటిలో పెద్దదీ, సకల పుణ్యప్రదమూ అయిన ఇతిహాస మిది.

ఆనుశాసనిక పర్వాంతంలో ధర్మరాజు ఆధ్యాత్మికమైన ప్రశ్నలను పుంఖానుపుంఖాలుగా వర్షించాడు. ఉదాహరణకు కొన్ని. దారిద్ర్యం, దుఃఖం పోగొట్టే జపం ఏది? లోకాల కన్నిటికీ మహనీయమై ఆశ్రయించి అనుభవించగల దైవం ఎవరు? అర్చనతో, స్తుతితో ఎవరిని కొలిస్తే జనులు శుభాన్ని పొందుతారు? అనేక ధర్మాలలో ఉత్తమమైన అభిమతాన్ని చూరగొనేది ఏది? జపాలన్నింటిలో ఉత్తమ జపం ఏది? తనను జపించేవారికి జన్మమూ, సంసార బంధాలను పోగొట్టేది ఏది? కర్మ యోగులకూ, ధర్మసాధకులకూ తరణోపాయాలుగా భాసించే ఈ ప్రశ్నలు ఈ పర్వానికి భరత వాక్య తుల్యాలుగా ప్రకాశిస్తూ ఉన్నాయి.

"ఓం నమో భగవతే వాసుదేవాయ, నమః పురుషోత్తమాయ, నమ స్సర్వలోక గురవే, నమ స్సర్వలోక పిత్రే, నమ స్సర్వలోక పితామహాయ, నమ స్సర్వలోక ప్రపితామహాయ, నమ స్సర్వలోకేశ్వరాయ, నమ స్సర్వలోక విశిష్టాయ, నమ స్సర్వలోకసుఖప్రదాయ, నమ స్సర్వలోక కర్త్రే, నమ స్సర్వలోక భర్త్రే, నమ స్సర్వలోక హర్త్రే, నమ స్సర్వలోక నిధయే, నమ స్సర్వలోక విధానాయ, నమ స్సర్వలోక హితాయ, నమ స్సర్వలోక హితకరాయ, నమ స్సర్వలోక ధ్రువాయ, నమ స్సర్వలోకోద్భవకరాయ, నమో విష్ణవే, ప్రభవిష్ణవే" అని జపించటమే మహాజపం.

సమస్త జగత్తులకు ప్రభువు, దేవదేవుడు, అనంతుడు, పురుషోత్తముడు అనే పేరుగలవాడి సహస్రనామాలను నిరంతరం స్తుతిస్తూ, జాగృత మనస్కుడై యజ్ఞకర్తను, అవ్యయుడైన అతడిని అర్చనం చేస్తూ అచంచల ధ్యానంతో నమస్కరిస్తూ, ఆద్యంతాలు లేని ఆ విష్ణుదేవుడిని, సర్వలోకాధ్యక్షుడిని, బ్రహ్మణ్యుడిని, త్రిలోక కీర్తి వర్ధనుడిని, సర్వ ధర్మాలూ తెలిసిన వాడిని, దయామయుడిని, లోకనాథుడిని, పంచభూతాల ఉత్పత్తికి కారకుడైన వాడిని నమ్మి భక్తితో సేవిస్తే అతడు దుఃఖాల నన్నింటినీ తొలగదోస్తాడు. పుండరీకాక్షుడిని స్తుతిస్తూ పరమభక్తితో పూజించటమే నా మతం. ధర్మరాజా! ధర్మా లన్నింటికంటే ఉత్తమధర్మం ఇదే అని తెలిసికొనుము. పరబ్రహ్మమైన ఆ విష్ణుదేవుడి సహస్రనామ సంకీర్తనం పాపాలను, భయాలను పోగొట్టుతుంది. సకల సంపదలను సమకూరుస్తుంది. 'విశ్వంబు, విష్ణుండు, వషట్కారుండు, భూతభవిష్యత్ప్రభు' మొదలైన నామాలతో మొదలుపెట్టి, 'రథాంగపాణి, అక్షోభ్యుడు, సర్వప్రహరణాయుధుడు' అనే నామాలు తుదిగాగల సహస్రనామాలను భీష్ముడు ఉపన్యసించాడు. తరతరాలుగా ఆ సహస్రనామాలు ప్రసిద్ధి కెక్కాయని తెలిపాడు. విష్ణు సహస్రనామాలను నిత్యం పఠించిన మనుష్యుడు ఇహపరశుభాలను పొందుతాడు. చతుర్వర్ణాలవారికీ బహువిధలాభాలు కలుగుతాయి. చతుర్విధ పురుషార్థ ఫలసిద్ధి కలుగుతుంది. సర్వవిధాల అరిష్టాలకూ, దుఃఖాలకూ దూరమై పరమపదం పొందుతాడు. విష్ణువొక్కడే మహాభూతం, భూతము లెన్ని ఉన్నా త్రిలోక వ్యాప్తుడుగా విస్తరించి ఈ విశ్వాన్ని అనుభవిస్తాడు. ధర్మరాజా! వ్యాసవిరచితమైన విష్ణుసహస్రనామాలను పఠించి శుభాలు, సుఖాలు అనుభవించుమని బోధించాడు.

ధర్మరాజు అడిగిన ప్రశ్నలు గమనిస్తే - అవి ఒక వ్యక్తికి కలిగిన సంశయాలుగా మాత్రమే కాకుండా ఒక సమాజంలో జీవనయాత్ర సాగిస్తున్న మానవులు ఎదుర్కొంటున్న వివిధ ధార్మిక జీవన సమస్యల సమాహారంగా గోచరిస్తాయి. ధర్మరాజు ఒక వ్యక్తిగా గాక ఒక సమాజానికి జిజ్ఞాసువైన ప్రతినిధిగా గోచరిస్తాడు. అందుకే ఈ పర్వం విశ్వజనీనంగా పరిగణించబడుతుంది.

## 7. తిక్కన చేసిన సంగ్రహ రచన:

ఆనుశాసనిక పర్వంలో తిక్కన సోమయాజి పాటించిన రచనా ప్రణాళికను గురించి ప్రసిద్ధ విమర్శకులు కీ॥శే॥ కురుగంటి సీతారామయ్యగారు చెప్పిన మాటలు గమనార్హాలు. "తిక్కన భారతమును, యథామాతృకముగా భాషాంతరీకరించలేదని మీ కిదివరకే తెలియును. తిక్కన యొక్కడే కాదు నన్నయ కూడ తన యిచ్చవచ్చినట్లు కుదించుట, పెంచుట చేసెను. సంస్కృతమునకుఁ జేయు భాషాంతరీకరణమునందును దెనుఁగులోఁ జేయునది సరియై, మాతృక ననుసరించిన యెడలఁ దప్పక మాతృక కంటె విస్తరించు ననుట నిజము. తిక్కన కృతి మాతృక కంటెఁ గొన్ని మడుగుల పరిమితిలో న్యూనము. దాదాపు మూడవవంతుండవచ్చునని నా యూహ... ఈ కుదింపు చేసిన తెరువుకూడ దిఙ్మాత్రముగా నుల్లేఖింతును."

"ఆనుశాసనిక పర్వమునందును సంగ్రహకథనము గలదు. సుదర్శనోపాఖ్యానమును సంగ్రహించినను మిక్కిలి రసవంతముగాఁ జేసినాడు. గరుత్మంతుని చరిత్రమును మిక్కిలి రసవంతము చేసెను. కాని, యిది మాతృకలోఁ గాన రాదు. శివమాహాత్మ్యమును విడిచివైచెను. అష్టావక్రచరిత్రముతో నానుశాసనిక ద్వితీయాశ్వాస మారంభమగును. ఈ పర్వమున దాన తీర్థ మాహాత్మ్యము లనేకములు కలవు. వానిలో ననేకాధ్యాయముల నెగురగొట్టెను. తన విషయ వివేచనాశక్తి నుపయోగించి రసవంతములుగా నుండు ఘట్టముల నేరి రచించెను. మూడధ్యాయములలో నున్న విపులోపాఖ్యానమును 38 పద్యములలో ముగించెను. కాని, మాతృకలో కంటె రసవంత మొనర్చెను. చ్యవనోపాఖ్యానమును సంగ్రహించిన వెనుక నౌద్దాలిక పుత్ర చరిత్రముతో ద్వితీయాశ్వాసము ముగియును. ఆరంభమైన గోదాన మహిమాదికము తృతీయాశ్వాసములోని కనువృత్తములయ్యెను. శ్రాద్ధ ప్రకరణమును స్పృశించి వదలెననియే చెప్పవలెను. గోదానములతోఁ జతుర్థాశ్వాస మారంభమగును. ఇది మాతృకయందు 100వ అధ్యాయము. హస్తికూటాధ్యాయమును రసవంతముగా 30 పద్యముల సంతరించెను. ఈ యుపాఖ్యానమును మిక్కిలి సరళముగను సులభగ్రాహ్యముగను నొనరించెను. ఉమామహేశ్వర సంవాదముతోఁ, జతుర్థాశ్వాసము ముగిసి తదనంతర సంభాషణ మంతయుఁ బంచమాశ్వాసములోని కనువృత్త మగుచున్నది. శివపార్వతీ సంవాదమున విష్ణుసహస్రనామములు తిక్కన తన మామూలు ననుసరించి విడచివైచెను. మిగిలిన యీ యాశ్వాసమంతయు శివపార్వతీ సంవాదమే యనవచ్చును. భీష్ముడు మఱికొన్ని ధర్మములను దెలిపి, ధర్మజు నొడంబఱచి హస్తిపురికిఁ బోవ ననుజ్ఞ నిచ్చును. మరల ధర్మజుడు కృష్ణసహితముగాఁ బితామహుని యంత్యకాలమునఁ గురుక్షేత్రమునకు వచ్చిన తదుపరి శ్రీకృష్ణుని యనుజ్ఞను గొని భీష్ముడు శరీరమును జాలించును. ఆయన యంత్యక్రియలు జరిగిన వెనుక గంగను గృష్ణుడు సమాశ్వాసము చేయుటతో నానుశాసనికము ముగియును."

"ఇది తిక్కనార్యుని సంగ్రహకథన పద్ధతి. పాఠకులకు విసుగు జనించకుండ తాత్త్విక భాగములను మిక్కిలి కుదించిన స్థలములోఁ గూడ రసమునకు గొఱవడకుండ రచించుటయుఁ, గథయుఁ గాక, యేమియుఁ గాక, నామపుంజములగు సహస్రనామములను వదలుటయు మొదలగు పద్ధతులచే నాంధ్రమహాభారతమును సర్వజన పఠనీయముగాను, మహాకావ్యముగాను తిక్కనార్యుడు సంతరించెను. దీనినే నాయన రచించిన భాగము ప్రబంధమండలి యయ్యెను."

**(ఆంధ్ర మహాభారతోపన్యాసములు, పుట. 212. 215,216)**

## 8. సంవాదాలు, ఉపాఖ్యానాలు:

ఆనుశాసనికపర్వంలో భీష్ముడు చెప్పిన సమాధానాలు స్థూలంగా మూడు విధాలుగా ఉంటాయి. 1. ప్రశ్నలకు తగిన అంశాలకు సూటిగా భీష్ముడే సమాధానాలు చెప్పినవి. 2. అడిగిన ప్రశ్నలకు అనువైన పూర్వప్రముఖుల సంవాదాలను

ఇతిహాసాలుగా వినిపించి విషయాలు వివరించినవి. 3.పృచ్ఛకు డడిగిన ప్రశ్నలోని పరమార్థాన్ని తెలుపగల కథనుగాని, ఉపాఖ్యానాన్ని గాని ఇతిహాసంగా వినిపించి తాత్పర్యాన్ని తేటపరచినవి. ఇతిహాస కథనంలో ఈ మూడూ ముచ్చట కొలిపే రచనా శిల్పాలే. వాటి స్థూల స్వరూప స్వభావాలు తెలియటానికి ఈ పర్వకథాసారంలో ప్రశ్నోత్తర మాలికగా వాటిని ప్రదర్శించటం జరిగింది. పఠితలు వాటిని ప్రాతిపదికలుగా స్వీకరించ ప్రార్థన. ధర్మరాజు వేసిన ప్రశ్నలు మొత్తం మీద 95గా గుర్తించటం జరిగింది. (ఇది రమారమి మాత్రమే) వాటిలో 62 ప్రశ్నలకు సూటి సమాధాలున్నాయి. దాదాపు 19 ప్రశ్నలకు సంవాదాలను దృష్టాంతాలుగా పేర్కొనబడిన ఉత్తరాలున్నాయి. (ప్రశ్నసంఖ్యలు 1, 13, 16, 38, 39, 50, 53, 60, 61, 62, 65, 67, 71, 72, 77, 78, 79, 81, 86); దాదాపు 15 ప్రశ్నలకు ఉపాఖ్యానాలను ఉదాహరించి సమాధానాలు చెప్పినవి ఉన్నాయి. (ప్రశ్నల సంఖ్యలు 2, 4, 5, 8, 10, 14, 18, 49, 51, 52, 54, 59, 66, 88) సంవాదాలలో - గౌతమీలుబ్ధక సర్పమృత్యుకాల సంవాదము ప్రశ్న 1, ఇంద్రమతంగ సంవాదం. (ప్ర.3); సనత్సుజాత నారదసంవాదం (ప్ర.16); చ్యవన నహుష సంవాదం (ప్ర.38); చ్యవన కుశికసంవాదం (ప్ర.39); బృహస్పతి మాంధాతృ సంవాదం (ప్ర.50); గో శ్రీ సంవాదం (ప్ర.53); సూర్యజమదగ్ని సంవాదం (ప్ర.60); పరాశర శిష్య సంవాదం (ప్ర.61); భూదేవీ విష్ణుదేవుల సంవాదం (ప్ర.62); శుక్రబలిసంవాదం (ప్ర.65); గౌతమదేవేంద్ర సంవాదం (ప్ర.67); అంగీరస భీష్మసంవాదం (ప్ర.71); హరసనత్కుమార సంవాదం (ప్ర.72); వ్యాసమైత్రేయ సంవాదం (ప్ర.77); సుమనాశాండిలీసంవాదం (ప్ర.78); శారదపుండరీక సంవాదం (ప్ర.79); ఉమామహేశ్వర సంవాదం (ప్ర.81); పవనార్జున సంవాదం (ప్ర.86); ముఖ్యమైనవి. ఉపాఖ్యానాలలో ప్రసిద్ధమైనవి - సుదర్శన కథ (ప్ర.2); ఋచీకుడి కథ (ప్ర.4); వీతహవ్యుడి కథ (ప్ర.5); చిలుక కథ (ప్ర.8); గరుత్మంతుడి కథ (ప్ర.10); భంగాస్వనుడి కథ (ప్ర.14); అష్టావక్రవృత్తాంతం (ప్ర.18); నచికేతుడి కథ (ప్ర.49); కపిల ధేనువు కథ; సౌదాసుడి కథ (ప్ర.51); సుమిత్రుడి కథ (ప్ర.52); పరశురాముడి స్వర్ణదాన కథ (ప్ర.54); ఇంద్రసప్తర్షుల కథ (ప్ర.59); క్షత్రబిందు కథ (ప్ర.66); దుర్వాసుడి కథ (ప్ర.88); వీటిని సంగ్రహంగా రచించినా తిక్కన సోమయాజి శిల్పసుందరంగా రసవంతంగా తీర్చిదిద్దాడు.

## 9. సంవాద రచనా శిల్పం:

శాంతి పర్వ కథార్థాలు విన్న ధర్మరాజు మనస్సుకు శాంతి కుదరలేదు. దానికి ముఖ్యకారణం బంధువధవలన, రాజవధ వలన కలిగిన పాపభయం. దానికి హేతువులుగా అతడు భావించినది - దుర్యోధన ధర్మజులు ఇరువురూ రాజ్యం పంచుకొని అనుభవించటానికి అంగీకరించని లోభక్రోధగుణాలు. అందువలన అతడికి పశ్చాత్తాపం తప్పలేదు. దానిని నివారించటానికి భీష్ముడు ఒక ఇతిహాసం చెప్పాడు. అది సంవాద ప్రధానమైనది. అందులో గౌతమి, బోయవాడు, సర్పం, మృత్యువు, కాలపురుషుడు పాత్రలు. వీరి మధ్య సాగిన సంభాషణమే అందులో కథ. సంభాషణ ఫలితాంశమే ఇతిహాస బోధ. గౌతమి కొడుకును పాము కరిచింది. బాలుడు చనిపోయాడు. తల్లి రోదిస్తుంది. అతడి మృతికి పాము కారణమని భావించి అర్జునకుడు అనే బోయవాడు ఆ పామును తాడుతో కట్టి చంపబోయాడు. గౌతమి పామును చంపటంవలన బాలుడు బ్రతకడని భావించి కిరాతకుడిని వారించింది. క్రూరజంతువును చంపటం పాపం కాదని బోయవా డన్నాడు. ఆ మాట విని పాము తాను మృత్యుదేవత పంపగా వచ్చిన సాధనమే కాని, బాలుడి మృతికి తాను ప్రత్యక్ష కారణం కాదని వాదించింది. మృత్యువు కూడా అక్కడకు వచ్చి తాను యముడు పంపగా తన కర్తవ్యాన్ని నిర్వహించాననీ, అతడి మరణానికి తాను కర్త కాదని వాదించాడు. అప్పుడు యముడు అక్కడకు వచ్చి తా మెవ్వరూ బాలుడి మరణానికి కర్తలం కామనీ, అతడి కర్మయే అతడి చావుకు కారణమనీ, జీవుడు కర్మఫలాన్ని తప్పించుకొనలేడనీ, కాబట్టి పామును వదలిపెట్టుమనీ కిరాతుడిని కోరాడు. అతడు తత్త్వాన్ని గ్రహించి పామును వదలిపెట్టాడు.

ఈ కథలో ఆయువుపట్టు యముడి సందేశం. తిక్కన ప్రబోధాన్నీ, తత్త్వాన్నీ పఠిత హృదయానికి సూటిగా హత్తుకొనటానికి అనువుగా కందాన్ని ఎన్నుకొనటం ఒక రచనాశిల్పం. ఈ కథలో సంభాషణలు చాలావరకు కందాలలో సాగాయి. కందాన్ని స్పష్టతకూ, నాటకీయతకూ, సారళ్యానికి, సార్థకశబ్ద ప్రయోగానికీ శక్తిమంతమైన సాధనంగా తిక్కన వాడుకొన్నాడు. ఈ కథాప్రాణం ఈ క్రింది కందంలో నిక్షిప్తం.

క. 'విను; కర్మం బొనరించును । జననము మరణంబు; నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం; దన చే । సినదానం బడకపోవ శివునకు వశమే!'' **(అను.1.34)**

సంస్కృతంలో అనుష్టుప్పులకు వలె తెలుగులో కందపద్యాలకు ధారణానుకూల్యం ఉన్నదన్న సత్యాన్ని గుర్తించి, దానికి ఆ శక్తి నిచ్చి, నీతికీ, బోధకూ, తత్త్వానికీ, భాషణకూ దానిని సరళవాహికగా సాగించిన సవ్యసాచి తిక్కన సోమయాజి. బంధువుల మరణానికి, ధర్మరాజుగానీ, దుర్యోధనుడుగానీ కర్తలు కారు. వారి కర్మలే వారి మరణానికి కారణాలని తెలిసికొంటే ధర్మరాజు మనస్సుకు శాంతి లభిస్తుం దని ఈ సంవాద సారాంశం! సందేశం!

ఆధ్యాత్మికం, అధిదైవం, అధిభూతం అనే మూడు తత్త్వాలకు ఆధారమై, వాటిలో తానూ జీవిస్తూ కర్తా, భర్తా, హర్తా అయిన భగవంతుడిని గురించి సనత్సుజాతుడు వివరించి, నారదుడికి చెప్పిన అంశాలను అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అందించి, భీష్ముడు ముగింపుగా చెప్పిన ఈ పద్యం భక్తిజ్ఞాన ప్రదీపిక!

ఉ. 'ఇంతకు మూలమై యిరువదేనవ తత్త్వ మనంగ వేద వే
దాంతపురాణవేద్యుఁ డగు నప్పురుషుండు వెలుంగు; వాఁడ కా
లాంతకుఁ డైన యచ్యుతుఁ డనంతుఁడు యోగిజనాంతరంగ వి
శ్రాంతుఁడు విష్ణుఁ డద్వయుఁ డసంగుఁడు గౌరవవంశదీపకా!' **(అను.1.336)**

కృష్ణభక్తుడైన భీష్ముడి నోట పలికించిన ఈ పద్యం తిక్కనలో పోతన ఆవేశించి పలికించిన భక్తికవితవలె భాసించింది. ముక్తిపథాన్ని చూపించే తాత్త్విక వచనాలలో భక్తిరసాన్ని చిలికించే రచనా శిల్పం తిక్కన కవితా కళ!

అధ్యాత్మ విద్యా వివరణం కలిగించే మహిమాన్వితవాక్యాలకు రత్నాకరం వంటిది - 'హరసనత్కుమార సంవాదం'. సనత్కుమారుడు మహాజ్ఞాని. ఆయనవద్దకు మహాశివుడే వచ్చి ఆధ్యాత్మిక తత్త్వాలను అడిగి తెలిసికొన్న అపూర్వ సంవాదం ఉత్తరాదిప్రతులలో లేదు. దక్షిణాది ప్రతులలో కానవస్తున్నది. సంస్కృత వేదాంత పరిభాషనూ, తార్కిక క్లిష్టతనూ తెలుగులో దూరం చేసి తేటతెలుగులో వివరించి విజ్ఞత ప్రకటించాడు తిక్కన సోమయాజి. హరసనత్కుమార సంవాదం వచనంలో వ్రాస్తుంటే, అసంకల్పితంగా అది ఛందోగతి నాశ్రయించిందా అన్నట్లు తిక్కన రచన గోచరిస్తుంది. కందం, తేటగీతి, ఆటవెలది - అనే దేశి వృత్తాలు తిక్కన రచనకు భావవాహికలుగా పరిఢవిల్లాయి. మచ్చుకు ఆ మూడు పద్యాలలో చెప్పిన మూడు ఆధ్యాత్మికాంశాలు గమనించండి.

క. 'జలమున మీను, నుదుంబర । ఫలమున మశకములుఁ బోలెఁ బ్రకృతిం దా ని
మ్ముల నునికి దెలిసి, వేర్పా । టలవఱచిన పురుషుఁ డవ్యయత్వముఁ బొందున్.'

తే. 'కమలదళమున నున్న జలమువిధమునఁ । బ్రకృతి నుండి తదీయ సంబంధవికృతి
లేని తనుఁ గని వెలుఁగు నిర్లేపనిశ్చ । లాజరామర పదవి జీవాహ్వయుండు.'

ఆ. 'ప్రకృతి నిట్లు వాసి పంచవింశుండు ష । డ్వింశభావ మొంది విమలశివ ని
రంజన స్వరూపుఁ డై వెలుఁగొందు న । త్తెఱఁగు ముక్తి యంద్రు దేవదేవ!'

**(అను.4.232-234)**

సనత్కుమారుడు రుద్రుడికి తెలిపిన సాంఖ్యయోగవిధానం తెలుగున పారాయణ పర్వంగా తిక్కన సోమయాజి సంతరించాడు.

క. 'సంగము బంధ; మఖిలని । స్సంగత మోక్షంబు; బహువిచారము లేలా?
పింగజటాజూట కలిత । గంగాబాలేందు మహిత ! గౌరీసహితా!' **(అను.4.238)**

అనే ముగింపు పద్యం వేదాంత సూత్రం కందార్థంగా జాలువారి తెలుగువారి గళంలో గేయంగా రూపొందినట్లు రక్తికట్టింది. తిక్కన రచన తెలుగుదనపు పూదోట!

విద్య, తపస్సు, దానం - అనే మూడింటిలో దానమే గొప్పదని నిరూపించేది వ్యాసమైత్రేయ సంవాదం. ఆకలి గొన్న వ్యాసుడికి మైత్రేయుడు అతిథి సత్కారంతోపాటు మృష్టాన్న మిచ్చి తృప్తుడిని చేశాడు. వ్యాసమహర్షి దానాలలో అన్నదానం మిన్న అని ప్రతిపాదించాడు. ఆ వాదం మొత్తం నాలుగు పద్యాల పరిమాణంలో ఉంటుంది. వాదం మూడు కందాలు. ఫలితాంశం ఒక ఉత్పలమాల. సముచిత ఛ్ఛందశ్శిల్పం.

క. 'దానార్హ వస్తువులలో । మానిత మన్నంబ ; యన్నమయము లసువులున్
మేనుఁ దదీయ బలంబును । గాన బుధులు దానిఁ దద్దఁ గైకొంద్రు మదిన్.'

క. 'తప ముల్లము కల్మషముల । నపగతములఁ జేయు విద్య కాస్పద మగు నా
తపసి మహితదానంబున । నుపచిత మగు విద్య దపము నుత్కర్షించున్.'

క. 'కాన తపంబును విద్యయు । దానౌదాత్త్య ప్రవర్ధితంబులు విద్యా
నూనత్వం బచ్యుతుఁ గను । దానికి దీపంబు సద్వ్రత ప్రవణులకున్!'

ఉ. 'కావున నన్నదానమునఁ గా కెటులుండు మహాప్రమోద మ
త్యావిలచిత్తుఁ డైనను మహత్తర దానమునన్ విశుద్ధస
ద్భావత నొందు నిక్క' మని పల్కె నరేంద్ర! తపంబు విద్యయున్
దైవత పూజనీయములు; దానము వానికిఁ బోషకం బగున్.' **(అను.4.350-353)**

సర్వశాస్త్ర సారరూపమైనదీ, సర్వశ్రేష్ఠమైనదీ ఏది? అని ధర్మరాజు అడిగితే భీష్ముడు నారద పుండరీక సంవాదం తెలిపాడు. నారదుడు చెప్పిన పరమార్థాన్ని పుండరీకుడికి చెప్పాడు. తిక్కన ఆ పరమార్థ సారాన్ని ఒక ఆటవెలదిలో తెలుగువారి కందించాడు.

ఆ. 'సర్వశాస్త్ర వాక్య సమితి నాలోకించి । మఱియు దృఢవిచార మహిమఁ దెలిసి
నిశ్చయింపఁ బడియె నిష్ఠ నారాయణు । నెపుడుఁదలఁప వలయు నిది యొకండ.' **(అను.4.368)**

ఈ ఒక్క పద్యం చాలు - ఆచారాల కన్నింటికీ ఆచార్యకం!

సంవాదా లన్నింటికీ శిఖరప్రాయం 'ఉమామహేశ్వర సంవాదం'. భూలోకంలో ధర్మరాజు భీష్ముడిని అడిగినట్లుగానే ఎన్నో యుగాల పూర్వం పార్వతి శివుడిని అడిగింది. పరమేశ్వరతత్త్వం నుండి పరమలౌకిక విషయాల వరకూ ఆమె అడిగిన ప్రశ్నల పరంపర ఒక మహా విజ్ఞాన జిజ్ఞాస సంప్రదాయానికి ఇతిహాసగౌరవాన్ని కలిగించింది. తిక్కన తెలుగులో ఆ వెలుగుబాటను ఆనుశాసనిక పర్వం నిర్వహణ రంగంగా నిలిపి నిండుదనం కలిగించాడు.

### 10. ఉపాఖ్యాన రచనా వైభవం:

ఉపదేశానికి ఉపాఖ్యానం ఊతకర్రగా ఉపయోగిస్తుంది. ప్రబోధానికి బలవర్ధకంగా పనిచేస్తుంది. ప్రతిపాద్యాంశానికి ప్రమాణంగా పనికివస్తుంది. జీవిత సత్యానికి అనుభవచిత్రంగా అన్వయిస్తుంది. వర్తమానానికి కర్తవ్యాన్ని బోధించే ఇతిహాస స్మృతిగీతిగా వినిపిస్తుంది. ఉపాఖ్యానం కావ్యార్థాలకు రసవత్తర వ్యాఖ్యానం. ఆనుశాసనిక పర్వం దాదాపు నూరు ప్రశ్నలకు

ఉత్తరాలు చెప్పే చర్చావేదిక. వాటిలో దాదాపు 15 ప్రశ్నార్థాలకు ఉపరంజనాత్మకమైన ఉపాఖ్యానాలు రమణీయ రసోల్లాసాన్ని కలిగించాయి.

## సుదర్శనోపాఖ్యానం : (ప్రశ్న - 2)

గృహస్థాశ్రమంలో ఉండికూడా మృత్యుభయం పోగొట్టుకొన వచ్చునా? అనే ప్రశ్నకు సమాధానంగా ధర్మానికి స్థిరంగా నిలబడగలిగితే గృహస్థుడు సశరీర స్వర్గాన్ని, ముక్తిని సాధించవచ్చునని చెప్పే కథ ఇది. ఈ కథలో రెండు కథలున్నాయి. ఒకటి దుర్యోధనుడనే రాజుకూ నర్మదానదికీ పుట్టిన సుందరాంగి సుదర్శన అనే కన్య కథ. రెండవది ఓఘవతిని వివాహమాడిన సుదర్శనుడి చరిత్ర. నిజానికి గృహస్థాశ్రమధర్మానికి నిలబడిన దంపతులు ఓఘవతీసుదర్శనులు. వారికి ధర్మదేవత సశరీరస్వర్గాన్ని ప్రసాదించాడు. ఈ కథా నిర్మాణంలో ఒక చక్కని ధర్మ మర్మం ఇమిడి ఉన్నది. అపూర్వ సౌందర్యవతి అయిన సుదర్శనను తండ్రి దుర్యోధనుడు అగ్నిహోత్రుడి సేవలో నియుక్తురాలినిగా చేశాడు. ఆమె నిష్ఠతో గృహంలోని అగ్నిని ఆరాధిస్తున్నది. కాని, ఆమె సౌందర్యానికి అగ్ని ముగ్ధుడై ఆమె మీద మరులు గొన్నాడు. అగ్ని మదనాగ్నికి వశుడై పోయిన వింతపోకడలను తిక్కన ప్రబంధశైలిలో శృంగార రసపోషకంగా ఇట్లా వర్ణించాడు.

సీ. 'అర్చించునప్పు డయ్యంగన కెంగేలి । జిగి సొంపు చిత్తంబు దిగిచికొనఁగ
నరసి కన్గొనునప్పు డయ్యింతి కనుఁగవ । పొలపంబు రాగంబు వొదలఁ జేయ
నన్యులఁ బనిఁ బంచునప్పు డమ్ముద్దియ । పలుకులతీపు గోర్కులఁ గెరల్ప
నల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ వా । తెఱతావి ధైర్యంబు ద్రిప్పుకొలుప

తే. మరుఁడు దోడ్తోడఁ దేకువ మాలి కదిసి । తూపుగముల క్రొవ్వాఁడిమి సూప నంత
కంత కగ్గల మగు వలవంతఁ దూలి । పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర!' **(అను.1.48)**

అర్చించేటప్పుడు ఎర్రని ముంజేతులు దగ్గరకు వచ్చేవి కావు. అవి అగ్నిదేవుడి హృదయాన్ని దగ్గరకు లాగుకొనేవి; అగ్నిని పరిశీలించి చూస్తున్నపుడు ఎర్రబడ్డ కన్నుగవ హృదయంలో అనురాగాన్ని పెంచేది. ఇతరులకు పనులను పురమాయించేటప్పుడు ఆమె మాటల తియ్యనిదనం హృదయంలో తియ్యని రాగాల వలపు భావాలను రేకెత్తించేది. అగ్నిని వెలిగించేటప్పుడు ఆమె ఊదేది. అప్పుడు ఆమె పెదవుల సుగంధం అగ్నిదేవుడి మనోధైర్యాన్ని దూరం చేసేది. మన్మథుడు విడువకుండా వరుసగా బాణాలు వేయటంవలన అగ్నికి వలపులవేడి ఎక్కువ అయి నిలువరించుకొనటం సాధ్యం కాకపోయింది. ఇందులో చేష్టాగతమైన విరహం భావోన్మీలనం వలన ప్రదర్శితమైనట్లు మనోహరంగా చిత్రించబడింది. మనస్సు లగ్నం కావటం, రాగోదయం కావటం, వలపుకోర్కెలు, రేగటం, మనోధైర్యం పోవటం, వలపు వేడి పొంగటం అనే మదనదశా వికాసం పైసీసంలో పరమరమణీయంగా వర్ణించబడింది.

మదనావేశపరుడైన అగ్ని ఏకాంతంలో ఆమెకు తన మనసులోని మాటను మధుర మధురంగా బైట పెట్టాడు. తిక్కన రచనలో మరొకవలపుతీగ వంటిసీసం అల్లుకొని వచ్చింది.

సీ. 'చిగురుటాకుల గాసిసేయు నీ యడుగుల । చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె;
మారేడుపండులగారాము సెఱుచునీ । యెలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె;
నునుఁదీవఁ జీరికిఁ గొనని నీ మైఁదీప । మురిపంబు డెందంబు మరులు కొలిపె
నెఱచందురుని సిగ్గువఱుపంగఁ జాలు నీ । నెమ్మోము దాలిమి వమ్ము సేసె;

తే. నాతి! నీకునై పెక్కుబన్నములు వడితి । నంగజుని చేత; వల్లభ వగుము నాకు'
నావుడును సిగ్గు గదిరి యాననము వాంచి । యలఁతి యెలుఁగున నిట్లను నాలతాంగి.' **(అను.1.50)**

నాయికా సౌందర్యాన్ని పొగడుతూ, దానివలన తాను పొందిన మదనావస్థలను మనసుకు హత్తుకొనేటట్లు చెప్పే వలపుమాటల చమత్కారం ఈ పద్యంలోని శృంగార రసోల్లాసం. చిగురుటాకులను ధిక్కరించే ఆమె అడుగుల కోమలత్వ సౌందర్యం ఆయన చూపులను ఆకర్షించింది. మారేడుపండ్ల పొంకాన్ని కాదనే ఆమె చన్నుగవ పొంకం అతడిలో ఆసక్తిని రేకెత్తించింది. లేత తీవ అందాన్ని లెక్కచేయని ఆమె మైదీవ లావణ్యం మనసులోని విరహాన్ని విరజిమ్ముతున్నది. పూర్ణచంద్రబింబాన్నే అవమానించగల ఆమె అందమైన ముఖం అతడి ధైర్యాన్ని వమ్ముచేసింది. మన్మథుడు పెట్టే బాధలన్నీ అగ్నిదేవుడు పొందాడట! ఆ బాధ లన్నీ తీరాలంటే సుదర్శన ఆయనను వివాహమాడి ఇల్లాలిగా మారాలి - అని కోరుకొన్నాడు.

అగ్నిదేవుడు పొందిన విరహావేదన ఆ సుందరాంగిని భోగించటానికి పడిన వలపుల వంత కాదు. అతడు శృంగారాన్ని ఒలకపోసినా శృంగార నాయకుడిగా కాక ధర్మబద్ధమైన వివాహం చేసికొనటానికి సిద్ధమైన ఉదాత్తుడిగా గోచరించాడు. ఈ కథలోని కీలకం ఇదే. శృంగారం ధర్మబద్ధమైనప్పుడు మాత్రమే గృహస్థులకు ఆదర్శజీవితాన్ని అందించగలుగుతుంది.

అగ్నిదేవుడి కోరికను సుదర్శన తిరస్కరించలేదు. అతడి మాటలు విని కోపగించుకొనలేదు. సిగ్గు లొలకపోసింది. తలవంచి లజ్జను అభినయించింది. సన్నని గొంతుతో బదులుపలికి సౌముఖ్యాన్ని ప్రకటించింది. అయితే, క్షత్రియ వనిత కదా అని గాంధర్వ వివాహానికి ముందుకు రాలేదు. కులకన్యల ధర్మాన్ని పేర్కొని తన తండ్రియొక్క గృహస్థాశ్రమ గౌరవాన్ని నిలువబెట్టింది.

క. కులకన్యకలకు వేడుకఁ । దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం
దులకొనఁ దగునే? గురుజన । ముల కా కత్తెఱఁగు వారు పురుషార్థ నిధీ!' **(అను.1.51)**

ఈ మాటలు సుదర్శనా సౌందర్యానికి శీలసౌందర్యాన్ని కలిగించిన అమృతవాక్కులు. అగ్నిదేవుడు గంభీరుడు. తన కోర్కెను సుదర్శనకు తెలియజెప్పాడు. ఆమె అతడిమాటను తిరస్కరించలేదు. కాని, పెద్దల అనుమతి కావాలని భావించింది. పెద్దలతో ఎవరు చెప్పాలి? ఆమెయే తండ్రికి చెప్పి ఒప్పింపచేస్తుందని అగ్నిదేవుడు భావించాడు. కాని, అది జరుగలేదు. అందువలననే యజ్ఞంలో బ్రాహ్మణవేషంలో కనపడి కన్యను అడిగిన అగ్నిదేవుడి కోర్కెను రాజు తిరస్కరించాడు. అప్పుడు తన కోర్కెను బయటపెట్టటం అగ్నికి ఔచిత్యం కాదని తెలిసింది. యజ్ఞంలోనుండి రూపాన్ని ఉపసంహరించుకొన్నాడు. ఋత్విక్కులు యజ్ఞభంగం ఔతుందని భయపడి అగ్నిఋక్కులు చదివారు. అప్పుడు అగ్ని తన మనసులోని మాట వారికి చెప్పుకొన్నాడు. రహస్యంగా వారు రాజుకు చేరవేశారు. అతడు సంతోషించి తన కుమార్తె నిచ్చి అగ్నికి వివాహం చేశాడు. యజ్ఞం సక్రమంగా ముగిసింది.

ఈ కథలో కేంద్ర బిందువు కులకన్య సుదర్శన. ఆమె తన తండ్రికి గృహస్థగౌరవానికి దివ్యజ్యోతివలె నిలిచింది. దైవస్వరూపుడయిన అగ్నిని తాను వరించా నని కాని, అతడు వరిస్తే తాను అంగీకరించానని గాని ఎక్కడా బయటికి పొక్కనీయలేదు. అట్లని అగ్నిసేవలు ఉపసంహరించుకొనలేదు. వివాహానికి ముందు కన్య తండ్రి యొక్క రక్షలో ఉంటుంది. అగ్ని తనను అడిగినట్లే, తన తండ్రిని అడిగి అనుమతి పొందాలని ఆమె ఆకాంక్ష! ఆ మాట వ్యంగ్యంగా సూచించింది. మౌనంగా ఉండిపోయింది. అగ్నియే అన్నిపనులూ తానే ముగించి తన గౌరవాన్నీ, కులకన్య మర్యాదనూ, గృహస్థధర్మాన్నీ నిలువబెట్టి, గృహస్థాశ్రమం ఒక పవిత్ర యజ్ఞ కర్మవంటిది అన్న సత్యాన్ని తన ప్రవర్తనం ద్వారా లోకానికి తెలిపాడు.

సుదర్శనకూ అగ్నిదేవుడికీ కలిగిన సంతానంలో ఒకడు సుదర్శనుడు. అతడి భార్య ఓఘవతి. ఆమె పతివ్రత. పతిమాట జవదాటని ఇల్లాలు. సుదర్శనుడు గృహస్థాశ్రమ ధర్మనిష్ఠాపరుడు. నిరంతరం అతిథిపూజ చేయటం, గృహస్థ ధర్మాలలో ఉత్తమమని భావించి త్రికరణశుద్ధిగా దానిని ఆచరించ నారంభించాడు. ధర్మపత్నిని కూడా ధర్మాచరణంలో నిమగ్నురాలినిగా చేశాడు. ఆమె కిట్లా బోధించాడు.

క. 'అతిథిజనులు దమతమ వాం । ఛితము లనుభవించునట్లు సేయం గనినం
గృతకృత్యతఁ బొందరె గృహ । పతియును గృహిణియును ధర్మభారమువలనన్.'

క. 'అతిథి నినుఁ గోరె నేనియు । మతిఁ గింకిరిపడక యోలమాసగొనక నీ
వతనికిఁ బ్రియంబు సల్పుము । సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లదియున్.' **(అను.1.67, 68)**

అతిథి సత్కారం పరమధర్మమే అయినా, సతిశీలదానం ధర్మవిరుద్ధం కాదా? అనే ధర్మసందేహం కలుగుతుంది. ఆ నియమం సుదర్శనుడు గృహస్థ ధర్మంగా ప్రకటించాడు. ధర్మదేవతకే అది ప్రశ్నార్థక మయింది. ఆ నియమానికి పరీక్ష పెట్టాడు. సుదర్శనుడు ఇంట లేనప్పుడు ధర్మదేవత అతిథిగా వచ్చి ఓఘవతిని కోరాడు. ఆమె ధర్మపథాన్ని తెలిపి వారించ యత్నించింది. అతడు మదనాతురుడై ఆమెను కోరాడు. ఆమె భర్త ఆనతిని మనసులో తలంచి అతిథికోర్కెను తీర్చటానికి వెనకాముందూ ఆడి జంకుతూ సంకట పడింది. కాని, పతి మాటకు తలయొగ్గి అతిథికి సుముఖురా లయింది. ఆత డామెను మరుగునకు తీసికొని వెళ్ళాడు. అంతలో సుదర్శనుడు వచ్చి భార్యను పిలిచాడు. ఆమె మాట్లాడలేదు. అతడు పెద్దగా ఎలుగెత్తి పిలిచాడు. ఆమె అతిథి సేవలో ఉన్నదనీ, కోపగించవద్దనీ లోనినుండి ధర్మదేవత పలికాడు. ఆ మాటలు విని సుదర్శనుడు త్రికరణశుద్ధిగా సంతోషించి, తన భార్యను అతిథి సేవకు పురికొల్పాడు. అప్పుడు సుదర్శను డిట్లా ప్రకటించాడు.

ఉ. 'నా వచనంబు నట్టుల మనంబును; దీనికి సాక్షు లుర్వియుం
బావకుఁడున్ జలంబును నభంబును వాయువుఁ జంద్రసూర్యులున్'
నావుడు మ్రోసె నాకసమునన్ విశదంబుగ దివ్యవాణి సం
భావితుఁ డీతఁ డీవిభునిపల్కు నిజంబని కౌరవేశ్వరా!' **(అను. 1.78)**

'ధర్మో రక్షతి రక్షితః' అన్న న్యాయం ప్రకారం ధర్మదేవత గృహస్థ ధర్మరక్షణం చేశాడు. ఆ దేవుడు సాకారుడై ప్రత్యక్షమై మాట తప్పితే సుదర్శనుడిని చంపటానికి మృత్యువు అతడి వెనువెంటనే వేచి ఉన్నాడనీ, కాని, ధర్మాన్ని త్రికరణ శుద్ధిగా పాటించిన ఆ దంపతులకు సశరీరస్వర్గసుఖాన్ని ఇస్తున్నాననీ ప్రకటించాడు. ఓఘవతి తన పుణ్యంలోని సగభాగంతో పుణ్యనదిగా ప్రవహించి లోకులను ఉద్ధరిస్తుందనీ, మిగిలిన సగంతో పతిని సేవిస్తుందనీ వరమిచ్చాడు. ఇది పుణ్యకథగా, ఇతిహాసంగా ప్రసిద్ధికెక్కింది.

ఆ. 'అతిథిపూజఁ గడచినట్టి ధర్మువు గృహ । స్థులకు నొండు లేమి దెలుపుచున్న
యది; సమస్త కిల్బిషాపహ మీయితి । హాస మిచ్చు నెల్ల యభిమతములు.' **(అను.1.84)**

అని ఫలశ్రుతి పలికాడు పితామహుడు. తిక్కన ఈ చిన్న ఇతిహాసాన్ని స్వయంసమగ్రమైన ప్రబంధంగా తీర్చిదిద్దాడు.

**సౌపర్ణోపాఖ్యానము : ప్రశ్న : 10)**

గరుత్మంతుడు మహాత్ముడని ధర్మరాజు విన్నాడు. దాని తాత్పర్యం వివరించు మని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు ఆ ప్రశ్న వెనుక ఉన్న రహస్యాన్ని భావించి శ్రీకృష్ణుడి వైపు మొగం త్రిప్పి 'స్వామీ! నీవే ఆ గరుత్మంతుడవై పుట్టావని విన్నాను' అని అడిగాడు. శ్రీకృష్ణుడు నవ్వి 'అడుగుతున్నవాడి అభిప్రాయాన్ని గమనించి కథను సాగించు' మని సూచించాడు. భీష్ముడు కథ చెప్పాడు.

సౌపర్ణోపాఖ్యానం ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలో ఒకసారి చెప్పబడింది. నాగమాత కద్రువ తన కొడుకుకు శాప మెందు కిచ్చింది? అనే ప్రశ్నకు సమాధానంగా ఆదిపర్వంలో కథ చెప్పబడింది. ఈ పర్వంలో గరుత్మంతుడి మాహాత్మ్య లక్షణాలను నిరూపించటానికి కథ చెప్పబడింది. కథా ప్రయోజనాన్ని బట్టి కథాకథనం, దానిశిల్పం మార్పు చెందటం సహజం. ప్రస్తుత కథా ప్రణాళికలో ఆ మార్పు కనబడుతుంది. స్థూలంగా గోచరించే అంశా లివి:

1. ఇందులో కథా కాలక్రమ పద్ధతి ననుసరించి సాగదు. కార్యకారణ క్రమపద్ధతి ననుసరించి సాగుతుంది. అందువలన కథలో కద్రువకు సర్పాలు పుట్టిన తరువాత వినత అసూయతో తన మొదటి అండాన్ని పగులకొట్టుతుంది. అందులోనుండి సగం శరీరంతో అరుణుడు పుట్టి, తల్లి తొందరపాటుకు కోపించి, ఆమె కద్రువకు దాసి అయ్యేటట్లు శపించాడు. ఇది పూర్వకథకంటె భిన్నమైన కల్పన.

2. ఆ తరువాత అయిదువేల సంవత్సరాలకు మహాబలవంతుడు పుట్టి స్వేచ్ఛగా అంతరిక్షంలో తిరుగుతూ బ్రహ్మ సూచించిన ఆహారాన్ని తింటూ ఉంటాడు. అరుణుడే గరుత్మంతుడు తల్లి దాస్యాన్ని తొలగిస్తాడని సూచించాడు. ఇది పూర్వకథకంటె విలక్షణంగా ఉన్నది. గరుత్మంతుడు పుట్టి స్వేచ్ఛగా తిరుగుతూ తల్లిని పట్టించుకొనకపోవడం విశేషం. నారదుడు చెప్పేంతవరకు అతడికి తల్లి సవతికి దాస్యం చేస్తున్నదని తెలియకపోవటం ఈ కథలో విశేషం.

3. కద్రువా, వినతలు సముద్ర తీరానికి పోయి, ఉచ్చైశ్రవాన్ని చూచి, దాని తోక నల్లగా ఉన్నదా లేదా? అన్నదాని మీద శపథాలు చేసికొని, మరునాడు కద్రువ కపట వర్తనంవలన వినత మోసపోయి సవతికి దాసిగా దైన్యజీవితాన్ని గడుపుతూ ఉన్న కథను గరుత్మంతుడి జన్మకథ తరువాత చెప్పటం ఈ కథలో విశేషం. వినతాదాస్యం గరుత్మంతుడి మహాపురుష లక్షణాన్ని నిరూపించటంలో ప్రాధాన్యం వహించలేదు కాబట్టి కార్యకారణసంబద్ధమైన కథన శిల్పం పాటించబడింది.

4. తల్లి సవతికి దాస్యం చేస్తున్న విషయం గరుత్మంతుడికి నారదుడివలన తెలియటం ఈ కథలో విశేషం. కద్రువ వినతాదాస్య విముక్తికి అమృతం తేవాలి అన్న నియమం పెట్టింది. దాని ప్రకారం గరుత్మంతుడు అమృతభాండాన్ని తెచ్చి చూపించి, వెంటనే దానిని దేవేంద్రుడికి ఒప్పచెప్పుతాడు. ఈ కల్పన ఈ కథకే ప్రత్యేకం. మిగిలిన కథంతా సామాన్యమే.

5. చివరకు ఇంద్రుడు గరుత్మంతుడు సాక్షాత్ విష్ణువుగా పేర్కొని కీర్తించాడు. 'అతండు సాక్షాద్విష్ణుండు; కృష్ణుండన శూరుఁ డను యాదవ ధాత్రీశునకుఁ బౌత్రుండై లోక హితార్థంబుగాఁ జరియింపంగలవాఁ; డీమూర్తియు విడువండు; వివిధవర్తనంబుల వినోదించుచుండు ననియె' (ఆను.1.269). గరుత్మంతుడు మహాత్ము డనటానికి ఈ అంశం పరాకాష్ఠ. దీనితో కథముగియటం ఈ ఇతిహాస వైశిష్ట్యం. ఈ ఇతిహాసానికి తిక్కన తన వర్ణనా సామర్థ్యంతో ప్రబంధ గౌరవాన్ని కలిగించాడు. గరుత్మంతుడి వర్ణనం.

చ. ఘనతరకంధరుండు, దృఢకాయుఁడు, దీప్తముఖుండు, రక్తలో
చనుఁడు, మహోత్తమాంగకుఁడు, చారుసుసంగత పక్షసారమం
డనుఁడు, పరిస్ఫుర ద్యుతి విడంబిత బాలదివాకరుండు, లో
కనయన పర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా! **(ఆను.1.177)**

ఇందులో వాడిన ప్రతి విశేషణమూ కథతో ముడిపడి ఉండటం సార్థక్యం. సముద్రతీర వర్ణనం కావ్యోచితరీతిలో సాగి ఉపాఖ్యానానికి అందాన్ని చేకూర్చింది.

సీ. చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి । నెలుఁగించు గండుఁగోయిలలసొంపు,
నలరుఁ దేనియఁ గ్రోలి, యన్ను సోలంబుల । మురియు తేఁటుల నునుమ్రోఁత యింపుఁ,
దమిఁ బండ్ల రసమాని తమలోనఁ జెలఁగుచుఁ । బలికెడు రాచిల్క పటురవంబు,
గొలఁకుల కెలఁకులఁ గూడి క్రీడించుచుం । డెడు నంచతండంబు నడబెడంగుఁ,

తే. దరఁగఁ దేలుచుఁ, బూఁదీవఁ దగులఁ బడుచు । వచ్చు చిఱుగాలి సోఁకును, మెచ్చి మెచ్చి,
తగిలి కొనియాడుచును, వినతయునుఁ గద్రు । వయును మున్నీటి చేరువ వనమునందు. **(ఆను.1.181)**

ఉత్ప్రేక్షాలంకారంలో ఉచ్చైశ్రవ వర్ణనం ఉజ్జ్వలం!

చ. కరువునఁ బోసిరో విధుని కాంతి సుధాబ్ధి తరంగఁ దెచ్చి గం
డరు వొనరించిరో! హరుజటాస్థలికిం దొడ వైన యేటి పె
న్నురువునఁ జేసిరో! యన మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు సుం
దర తురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్. **(ఆను.1.183)**

ఈ ఉపాఖ్యానం మహాపురుష ప్రశస్తితో ముగిసినట్లు రచించిన తిక్కన ప్రబంధ రచనా ప్రతిభను ప్రదర్శించాడు. గమనించండి.

సీ. 'అజుఁ డుపలాలింప నద్దేవు కావించు । వరభోజనంబులఁ బెరిఁగె నితఁడె!
ఘనకాయజవసత్త్వ గజకచ్ఛపముల నొ । క్కెత్తున లీలమై నెత్తె నితఁడె!
విపులభూరుహశాఖ విఱిగిన మునిహితా । ర్థంబుగాఁ జంచునఁ దాల్చె నితఁడె!
సురసేనతోఁ బురందరుని నిర్జించి యు । ద్దీప్తుఁడై యమృతంబుఁ దెచ్చె నితఁడె!

తే. తల్లిదాస్యంబు దనబాస దప్పకుండఁ । బాపి యాసుధ మరల నప్పాకశాస
ననకు దయ నిచ్చె నీతఁడె యనుచు సిద్ధ । సాధ్యు లగ్గింప గరుడుఁడు సనియె మగిడి'. **(ఆను.1.270)**

పునరుక్తమైనా ఈ ఉపాఖ్యానం పునరుద్భవ గౌరవం పొందింది.

అష్టావక్రుడి చరిత్ర : (ప్రశ్న.18)

ఈ పర్వంలో చాలామంది దృష్టిని ఆకర్షించే ఉపాఖ్యాన మిది. కన్యాదానానికి ఎటువంటి వరుడు కావాలి? అన్నది ధర్మజుడి ప్రశ్న. అస్ఖలిత బ్రహ్మచారి అని సమాధానం. ఆ అంశాన్ని నిరూపించే వ్యక్తి అష్టావక్రుడు. వదాన్యుడనే ముని తన కూతురైన సుప్రభను వివాహమాడుతానని కోరుకొన్న అష్టావక్రుడిని పరీక్షించిన కథ ఇది. శ్రీ కురుగంటి సీతారామయ్యా గారీ ఉపాఖ్యానాన్ని గురించి ఇట్లా సమీక్షించారు. "మూడధ్యాయముల కథను 30 పద్యములలో (తిక్కన) సంతరించెను. స్త్రీ స్వభావము మాతృకలో నతివిపులముగా నున్నది. దానినంతను తిక్కన యొక్క పద్యములో ముగించినాడు. దీని వెనుకటి ఘట్టము అనఁగా భంగాస్వన చరిత్రము కూడ స్త్రీ స్వభావ వర్ణనమునకు సంబంధించినదే.

సీ. 'వనితలు కామార్తి వశతఁ బొంది

తే. వంశహానిఁ దలంపరు వరుస కలుక
రాత్మజులఁ జూడ రగ్రజు ననుజుఁ గొనరు' **(ఆను.2.17)**

అని కొంచె మతిశయోక్తిగఁ గనఁ బడినను నిందు లోకవృత్త మెఱింగినవారికి సత్య మున్నదని తోఁచును. సోదరీమణులు నన్ను మన్నింతురు గాక! అష్టావక్రపాత్రము మిక్కిలి యుదాత్తమైన ఘట్టము. స్వచ్ఛంద యగు నుత్తరదిశయు, స్వచ్ఛుఁ డగు నష్టావక్రుఁ డును విరుద్ధ స్వభావములు గల పాత్రలు. వారి పరస్పర సంభాషణము మిక్కిలి హృదయంగమము. ఒకరి నొకరు జయింప నుద్దేశింతురు. కానఁ దుదకు సుశీలమే గెలిచెను. అష్టావక్ర పాత్రపోషణమును ఒరవడిగాఁ గొని ప్రవరపాత్రను దీర్చి దిద్దినాడు పెద్దన యని నాయూహ. చూడుఁడు.

క. పదపడి నయమున మెయిమెయిఁ । గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం,
గదలని చిత్తము గలిగియు, । మద మేమియు లేక, యతఁడు ప్రాణై యుండెన్. **(ఆను.2.14)**

కౌఁగిలించిన కాంతను ద్రోసి పడవేసిన ప్రవరునికంటె నితని ప్రవర్తన యెక్కువ చిత్త స్థైర్యమును దెల్పుట లేదా? 'మెయిమెయి' యనునుడికారము రెండు శరీరముల సామీప్యమును జెప్పక చెప్పుచున్నది. "అశిథిల పరిరంభము"ను జెప్పఁ

దల(చి 'మెయి' శబ్ద పునరుక్తితో( గార్యమును సంతరించినాడు తిక్కన. 'మ్రానై యుండెన్' అని వెనుకటి పరిరంభము యొక్క వైఫల్యమును దెలిపినా(డు. అందులకై 'కదలని చిత్తము' 'మదము లేకపోవుట' యను కారణములను దెల్పు కావ్యార్థములతో గార్యమును సాధించినా(డు. అష్టావక్రపాత్ర మాదర్శబ్రహ్మచారి పాత్రము. తాను ప్రేమించిన కన్యయెడల నతని కెంత గాఢరతియున్నదో తెల్పినా(డు''. (ఆంధ్ర మహాభారతోపన్యాసములు. పు.232-233)

ప్రతి ఉపాఖ్యానంలోనూ ఏదో ఒక ప్రత్యేకత కానరావటం తిక్కన రచనా శిల్ప విశేషం. ఆనుశాసనిక పర్వంలో ఎన్నో సూక్తులు తెలుగువారి నాల్కలకు రుచులు కలిగిస్తూ ఉన్నాయి. మచ్చుకు కొన్ని.

తే. 'బాల్యమున( దండ్రి, యౌవనప్రాప్తి మగ(డు, । వార్ధకంబున( దనయు(డు, వామనయన
నరసి నడపన కా కెందు నంగనలకు । వలసినట్టులు సేయ(గా వచ్చు నెట్లు? **(అను.2.22)**

క. పరమజ్ఞానుల యొద్దను । బర(గిన నజ్ఞు(డును బోధభరితు(డగు నిరం
తర మేరుసమీపస్థితి । హిరణ్యరుచి( గాక మెసక మెస(గిన పగిదిన్. **(అను.3.325)**

ఆ. 'దంతియడుగు లోన( దక్కిన జంతుచ । యంబు నడుగు లెల్ల నడ(గి యుండు
నట్ల ధర్మకోటు లన్నియు లోనగు । నిద్దగుణ! యహింస కింత నిజము. **(అను.4.383)**

తే. క్రోధకామాదులైన దుర్గుణము లెల్ల । వాయుహతి మేఘపటలంబు వాయు పగిది
శ్రుతముచే( బాయు; నరులలో సురల కరణి । శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి. **(అను.5.148)**

ఆనుశాసనిక పర్వం అక్షరాలా సూక్తి రత్నాకరం!

## 11. భీష్మ నిర్యాణం:

ఆనుశాసనిక పర్వం భీష్మ నిర్యాణంతో ముగుస్తుంది. అది ఒక ఉజ్జ్వలమైన నిర్వహణ. భీష్ము డెంతటి మహావీరుడో అంతటి కృష్ణభక్తుడు. శ్రీకృష్ణుడిలో పరమాత్మ తత్త్వాన్ని దర్శించిన అంతర్యోగి. పాండవులు అతడిని దివ్యపురుషుడిగా భావించి సేవించారు. భీష్ముడు ఆయన దైవమని ధ్యానించాడు. ఉత్తరాయణపుణ్యకాలం రాగానే ఆయన ఎదుట శ్రీకృష్ణుడు నిలిచాడు. విష్ణువును దర్శించినట్లు భీష్ముడు తన్మయుడయ్యాడు. ఆ దేవదేవుని దివ్యనామాలతో స్తుతించాడు. సంకల్పమరణం తన ఆధీనంలో ఉన్నా స్వర్గగమనానికి శ్రీకృష్ణుడి అనుమతిని కోరాడు. మానుష సంకల్పంకంటె దైవసంకల్పం గొప్పదని నమ్మి దేవదేవుడిని మనసారా ప్రార్థించాడు.

ఆ. 'బలము నీవ నాకు, భక్తుండ నీయెడ, । నాలుబిడ్డ లేని యట్టివా(డ(,
గావు నన్ను నధిక కారుణ్యమున నిమ్మ । నుజ్జ( గమలదళమనోజ్ఞనయన!' **(అను.5.463)**

అల్పాక్షరాలలో అనల్పార్థ రచన ఇది. బ్రతికినన్నాళ్ళు ఎదురులేని వీరుడుగా బ్రతికాడు భీష్ముడు. అతడి బలం అతడి అహంకారానికి చిహ్నం. ఇప్పుడు ఆ బలం పరమాత్మ శక్తిగా భావిస్తున్నాడు. దీనితో అతడు సాధించిన విజయాలన్నీ బ్రహ్మార్పణమైనట్లే అయింది. సర్వధర్మాలను పరిత్యజించి అంపశయ్యమీద ఉన్న భీష్ముడు శ్రీకృష్ణుడినే శరణు వేడుతున్నాడు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ!' అన్న భగవానుడి వాక్యాన్ని అక్షరాలా పాటించాడు. 'ఆలు బిడ్డలు లేనియట్టివా(

డన్' అనే వాక్యం వినేవారికి కన్నీరు పెట్టిస్తుంది. పున్నామ నరకాన్ని తప్పించే పుత్రులు కాని, ఆ సంతానాన్ని ఇవ్వగల భార్య గాని లేని భీష్ముడు నరకలోకం పొందక తప్పదనీ దాని నుండి భీష్ముడిని కాపాడే భారం బాధ్యత శ్రీకృష్ణుడిదే అనే అర్థం ఒకటి. పెండ్లాంబిడ్డలు లేని బ్రహ్మచారి కాబట్టి అతడికి సద్గతుల కొరకు అపరకర్మలు చేసే పుత్రులు లేరనీ ఒక భావం. సంసారబంధం లేకపోవటంచేత స్వర్గాది ఉత్తమ లోకాలను ఇవ్వటం శ్రీకృష్ణుడికి కష్టం కాదనీ అర్థాలు ఏర్పడతాయి. ఏమైనా అధిక కారుణ్యబుద్ధి లేకపోతే భీష్ముడిని రక్షించి ఉత్తమగతి కల్పించటం కష్టమని అతడి బాధ. ప్రాణత్యాగానికి విష్ణుమూర్తి (కమలాక్షుడు) అయిన శ్రీకృష్ణుడి అనుజ్ఞ కోరుతున్నాడు. ఆర్తితో కూడిన అనన్య భక్తికి ఈ పద్యం అక్షరోదాహరణం.

శ్రీకృష్ణుడు 'యోగక్షేమం వహామ్యహమ్' అన్నట్లు అభయ మిచ్చి అనుజ్ఞ ఇచ్చాడు.

ఆ. 'కీ డొకప్డు లేదు; కృతపుణ్యుఁ డవు, తండ్రి । వలని భక్తి పెంపు గలవు; దానఁ
గాదె బంటుఁ బోలె గాంగేయ! మృత్యువు । నీవశమున నిలిచె నిర్భరముగ'!

వ. 'నీకు నే ననుజ్ఞ యిచ్చితి; వసువులం బొందుము'
అన్నాడు. భీష్ముడి జన్మ కృతార్థ మయింది. (అను.467,468)

భీష్మపితామహుడి వ్యక్తిత్వాన్ని గురించి డా॥ వేదాంతం సంపత్కుమారాచార్యగారు పలికిన ఈ క్రింది వాక్యాలు ఆ అద్భుతమూర్తికి అక్షర నీరాజనాలు.

"నిశిత శరశయ్యపై శయనించి ఏబది యెనిమిది దినము లుండి ఉత్తరాయణ పుణ్యకాలములో మాఘ శుక్ల అష్టమి నాడు తన యిచ్ఛ ననుసరించి మరణించిన మహితాత్ముడు భీష్ముడు. ముప్పదిమూడుకోట్ల దేవతలకు మూల దేవతలు ముప్పది ముగ్గురు మాత్రమే. ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, అశ్వినీదేవతలు ఇద్దరు. అష్టవసువులలో ద్యౌ అను ఎనిమిదవవాడు వసిష్ఠుని శాపముచే భూలోకమున సిద్ధపురుషుడైన శాంతనవునకు త్రిలోకపావనియైన గంగవలన పుత్రుడై జన్మించి దేవవ్రత (ప్రభాసుడు అనియు అందురు) నామధేయుడై తండ్రికొరకు భీషణ ప్రతిజ్ఞ గావించి భీష్ముడై, ఆజన్మబ్రహ్మచర్య నియమ నిష్ఠుడై అప్రతిహత పరాక్రమ సమన్వితుడై నిష్కపటవర్తనుడై, కూలంకష విజ్ఞానఖనియై, శ్రీకృష్ణపరమాత్మ యందు అనన్య భక్తుడై వేదతుల్యమగు అమృతోపదేశములు ధర్మజున కుపదేశించిన లోకోత్తర మహావ్యక్తియై విరాజిల్లుచున్నాడు. శ్రీకృష్ణుడే అనినట్లు మానవులలోనే కాదు దేవతలయందు కూడా ఇంతటివాడు లేడనుట అతిశయోక్తి కానేరదు.

శ్రీకృష్ణుని మహత్త్వమునకు ప్రభావమునకు సంబంధించిన జ్ఞానము ఆ కాలములో భీష్మునియం దున్నంతగా ఇతరులయందు లేదు. అనేక పర్యాయములు ధృతరాష్ట్రునకు దుర్యోధనునకు శ్రీకృష్ణుని మహత్త్వము తెలియజెప్పెను. రాజసూయయాగములో అగ్రపూజకు అర్హుడెవరను ప్రశ్న తలయెత్తినపుడు నిండుసభలో శ్రీకృష్ణుడు మాత్రమే సర్వవిధముల పాత్రుడని స్పష్టపరచి, అతని మహత్త్వమును ఉగ్గడించి సాక్షాత్తు భగవంతుడని తెలియజేసెను. అర్జునుని రక్షణము కోరి సుదర్శనమును చేత బూని తనవైపు పరుగిడి వచ్చువేళ భీష్ముడు ఆ పరమపురుషుని చేతిలో మరణము తన భాగ్యవిశేషముగా భావించి శరసముదాయముతో పూజింపనెంచి సంతోషముతో శ్రీకృష్ణునకు ఆవాహనము తెలిపెను. యుధిష్ఠిరున కుపదేశించిన విష్ణుసహస్రనామస్తోత్రములో ప్రత్యక్షరములోను భీష్ముడి భగవద్భక్తి భగవత్తత్త్వపరిజ్ఞానము ప్రతిబింబిత మగుచుండును. శ్రీకృష్ణ పరమాత్మ భీష్ముని అవసానసమయమున దర్శనమును ప్రసాదించి కృతకృత్యుని గావించెను. ఏ విధముగా పరిశీలించినను భీష్ముడు మనకు పరమాదర్శమూర్తి. అపుత్రకుడై మరణించినను హిందువులలో మూడు వర్గములవారు ఈ నాటికి పితృతర్పణ లిచ్చువేళ భీష్మునకు తర్పణలు అర్పించుచుండుటకు ఆ మహనీయునిలోని విశిష్టతయే హేతువు.

అర్థ కామములకు హేతువులైన కామినీ కాంచనములు త్యాగము చేసి కేవలము ధర్మము మాత్రము స్వీకరించిన భీష్మపితామహుని గురించి శాంతి పర్వము ద్వితీయాశ్వాసమున తిక్కన గారిచే చెప్పబడిన పద్యమిది.

ఉ. 'రాజటె! రాగహీనుఁ డటె! రాజిత సుందరమూర్తి యట్టె! వి
భ్రాజిత సంపదున్నతి విభాసితవర్తనుఁ డట్టె! కామినీ
రాజిమనోజ్ఞభంగి చతురత్వధనుండటె! బ్రహ్మచర్య దీ
క్షాజిత మన్మథుండు నటె! జన్మము లిట్టివి యెందుఁ గల్గనే!'' **(శాంతి. 2.103)**

**12. హరిహరనాథతత్త్వం :**

విష్ణుశివ సహస్రనామాలను వర్ణించి హరిహరతత్త్వాలను వ్యాసుడు ఈ పర్వంలో కీర్తించాడు. తిక్కన హరిహరనాథ తత్త్వాన్ని ఉపాసించి ఆ దేవుడికి తాను రచించిన ఆంధ్ర మహాభారతం పదునేను పర్వాలను అంకితం చేశాడు. ఆ హరిహర నాథ తత్త్వాన్ని గురించి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు రచించిన వ్యాసాన్ని కృతజ్ఞతలతో ఇక్కడ పొందుపరచు కొంటున్నాను. (చూడు.ఆంధ్రమహాభారత సంశోధితముద్రణము. 8వ సంపుటము, పు.43-64)

"కవిబ్రహ్మ తిక్కనసోమయాజి ఆంధ్రమహాభారతమున హరిహరినాథదేవుని సంబోధించి చెప్పిన విషయము సర్వజనవిదితము. ఈ హరిహరనాథ భావన అతని కెట్లు కలిగెను? ఇది యాతడు క్రొత్తగా కల్పించిన దేవతాస్వరూపమా? ఇట్టికల్పనచే అతడు సాధింపదలచిన ప్రయోజనమేమి? ఈ మొదలైన ప్రశ్నలు స్ఫురించును. విమర్శకలోకమునందు దీనిని గూర్చి ఎక్కువ వివేచనము జరిగినట్లు కాన్పింపదు. సామాన్యపాఠకు లీసమస్యచే నాకర్షింపబడరు. వారు కథామాత్రసంతృప్తులు గనుక భారతమందలి ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతపద్యముల జోలికిపోరు. పోయినను వారి కవి ఒక పట్టాన అర్థము కావు. అందును తిక్కనసోమయాజి హరిహరనాథ సంబోధన పద్యములు విద్వాంసులను కూడా చిక్కుపెట్టునవిగా ఉన్నవి. అర్థము మాట యటుంచి వాని పదచ్ఛేదము కూడ క్లిష్టతరముగనే యున్నది. సరియైన పదచ్ఛేదము కుదిరిన గాని అర్థనిర్ణయము చేయుటకు వీలులేదు. కొన్ని కొన్ని సంబోధనములు కష్టము మీద మూర్తస్థితికి వచ్చినను, పెక్కుసంబోధనములు అమూర్తములుగనే నిలిచిపోవుచున్నవి. అవి గంభీరార్థమహితములు, యోగ, సాంఖ్య, అద్వైతవేదాంతముల నిగూఢభావములు తెలిసిన కాని ఆ సంబోధనములు తమయర్థపీయూషమును స్రవింపజేయవు. కావున తిక్కనసోమయాజి హరిహరనాథ సంబోధనములు ప్రగాఢ పాండితీమండితులకు మాత్రమే ఉపగమ్యము లగుచున్నవి. పోనిండు. "వాని నుపేక్షింపరాదా. కథావగతి కవి ఏ విధముగను తోడ్పడవు'' అనవచ్చును. కాని, హరిహరనాథసంబోధనముల నుపేక్షించుట మహాకవి అంతర ప్రభాప్రపంచమును ఉపేక్షించుటయే యగును. ఆతని బాహ్యప్రతిభా సంపత్తితో మాత్రమే తృప్తిపడినట్లగును. తిక్కనసోమయాజి కవితాశిల్పము గొప్పదే. కాని యాతని యాంతరవిజ్ఞానము ఇంకను గొప్పదిగా తోచును. అతడు శబ్దార్థ శిల్పియే కాదు. వాని వెనుక నున్న స్ఫోటకబ్రహ్మోపాసకుడు. కావుననే అతడు లోకోత్తరుడును, కాలాతీతుడును అగుచున్నాడు.

హరిహరనాథసంబోధనమునందు కవి యొక పద్ధతి నవలంబించెను. ఆశ్వాసారంభమున ఒక కందపద్యము, ఆశ్వాసాంతమందు మూడు పద్యములు. వీనిలో మొదటిది ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము - వీనిలో ఒకటిగా నుండును. దీనికి కొంత యపవాదము కలదు. సౌప్తిక పర్వము ప్రథమాశ్వాసము చివర మహాస్రగ్ధరయు, ద్వితీయాశ్వాసము అంతమున స్రగ్ధరావృత్తమును కూర్పబడినవి. ఇట్లే స్త్రీ పర్వము ప్రథమాశ్వాసము చివర శిఖరిణీ వృత్తమును, రెండవ యాశ్వాసము కడపట మందాక్రాంతా వృత్తమును ఉన్నవి. రెండవపద్యము కందముగను మూడవది మాలినీ వృత్తముగను ఉన్నవి. ఆద్యంతముల నివి యిట్లే ఉన్నవి. తాను వ్రాసిన 46 యాశ్వాసముల చివరను తిక్కనసోమయాజి మాలినీ వృత్తమునే ఏల యాదరించెనో ఛందశ్శిల్పము తెలిసినవారు ఊహింపదగియున్నది. హరిహరనాథున కిది అక్షరరూపమైన మాలగా నాతడు భావించెనేమో! సంబోధన పద్యములు ఆద్యంతములందు ఆశ్వాసమునకు నాలుగు చొప్పున 46 యాశ్వాసములకు 184 పద్యములను, షష్ఠ్యంతములు ఐదున్ను, కథాప్రారంభమునకు ముందు మూడున్ను, వెరసి 129 పద్యము లగుచున్నవి. విరాటపర్వము ప్రస్తావన భాగమంతయు హరిహరనాథ విషయకమే. కావున ఇంచుమించు 200 పద్యముల గ్రంథమును హరిహరనాథుని ఆరాధనమునకు తిక్కనసోమయాజి వినియోగించె నని చెప్పవచ్చును.

ఈ పద్యములను పదచ్ఛేదము చేయుట యందు అంత్యానుప్రాస నియమము మార్గబోధకముగా కన్పించును. సంబోధనాత్మక రచనయందు అనుప్రాసము శ్రుతిసుభగముగ నుండును. తిక్కనసోమయాజి యీ యుద్దేశ్యముతోనే సమాసాంతములందు వర్ణ సామ్యమును కూర్చియుండును.

+'క్రమపరిణతమూర్తీ! శ్రౌతశాఖాగ్రవర్తీ! (4-1-335)
పరమకృపా విధేయ! నిరుపాధికచిన్మయకాయ!
గాఢవిస్తర నిగమైక వేద్య! గుణతత్త్వవికారనియత్యభేద్య!
సంస్మరణ నిరస్తతాప! ఘనసంసృతి సంతమసప్రదీప!
(సంసారమను చీకటికి దీపమువంటివాడా!)

నిష్ఠురభుజసార దానవ నిషూదన! భక్తజన ప్రమోదనా! (4-2-363)
భూరికృపానుషంగ! మునిపుంగవ చిత్తసరోజభృంగ!

సంసారదవప్రవర్ష! సురసంస్తుత దివ్యగుణప్రకర్ష! (5-1-383)

ఒక్కొక్కప్పుడు పద్యపాదమంతయు సమాసముగా చేసి దానిమీద అంత్యవర్ణ సామ్యమును పాటించుట కవికి సమ్మతము.

తపస్స్వాధ్యాయాదిక్షపితమల చిత్తప్రకలితా!
విపజ్జాల జ్వాలా విరమణ సుఖా వృష్టిలలితా! (11-1-187)

పరమ మునీంద్ర సంయమన పక్వవివేక విభూతరమ్య!
విస్తరమహనీయ తార్కిక వచః కలనానభిగమ్య! (12-4-455)

ధర్మాధర్మవిదూర నీతి పరవిద్వచ్చిత్తయోగీ!
జగన్నిర్మాణస్థితి తంత్రసంహరణ ధూర్నిర్వాహరాగీ! (13-2-476)

ఒక్కొక్క సందర్భమున మహాకవి ప్రౌఢరచనా ప్రీతిచేత కాబోలు పద్యము మూడు పాదము లాక్రమించు సమాసము కూర్చి దానికి నాల్గవపాదములో అంత్యానుప్రాస ఘటించును. ఇట్టివి నకృత్తుగనే ఉన్నవి.

కమల భవాది దైవత ముఖస్ఫుట నిర్గళితప్రశస్త వా
గమృత రస ప్రసార కలితాంచిత నైకవిధిప్రకర్ష సం
గమ సముదీరితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా!
సుమహదుపాశ్రయ ప్రమద శోభిత విశ్వజగన్మధువ్రతా! (5-4-426)

బ్రహ్మమున్నగు దేవతల ముఖనిర్గళితములగు స్తోత్రములను జలసేచనముచేత పుట్టినదై చిగుళ్ళు దాల్చిన కృపాగుణమను లతకు ఆలవాలమైనవాడా! గొప్ప ఆశ్రయము లభించుటచేత సంతోషభరితమైన జగత్తను తుమ్మెద కలవాడా! అని యర్థము భాసించును. ఇట్టి దీర్ఘ సమాన కల్పనా చణత్వము స్త్రీ పర్వము రెండవ యాశ్వాసము 184వ పద్యము నందును కన్పించును.

వీణానాద ప్రతిమ నిగమావిర్భవత్సారపుణ్యా
శ్రేణీసంపాదిత విమలతాస్థేమ నిర్లేప చిత్త
త్రాణక్రీడాకలన సతతోత్సాహవద్దివ్యభావా!
ప్రాణాపానా హరణ నిపుణ ప్రాపణీయానుభావా!

---

+ పద్యసంఖ్యనిచ్చుటలో మొదటిది పర్వసంఖ్యను, రెండవది ఆశ్వాస సంఖ్యను, మూడవది పద్యసంఖ్యను తెలుపును.

(సుస్వరయుక్తమై వీణానాద సదృశమగు వేదపఠనముచే సంపాదింపబడిన పుణ్యాబాహుళ్యముచేత నిర్మలచిత్తము గలవారిని రక్షించుటయందు సంతతోత్సాహము కలవాడా! వాయు నిరోధనమునందు నిపుణులైన యోగులచేత కుద్దాలింపదగిన అనగా తెలుసుకోదగిన అనుభావము కలవాడా! స్వరయుక్తమైన వేదపఠనమునందు తిక్కన సోమయాజికి గల ప్రత్యయము దీనివలన తెల్లమగుచున్నది. హరిహరనాథుడు 'వైదిక ధ్యాయిత కిచ్చమెచ్చు' వాడని గ్రంథారంభమునందే కవి వాక్రుచ్చెను.

సంబోధనమునందు అంత్యానుప్రాసము ఇంపుగా నుండు నని మహాకవి తలచినను దీనిని ఎల్లయెడలను వాడలేదు.

మర్దిత తాప సంకలన మంజులనామ; దురంత దుర్దశా
కర్దములేప నిర్హరణకారి కృపామృతపూర; కర్మస
మ్మర్ద నిరాసకర్మఠ; సమత్వ పరిస్ఫుట రూపభావనా;
నిర్దళితారివర్గ; మహనీయ మనోరమణీయవైభవా! (6-3-453)

కర్ణపర్వము ప్రథమాశ్వాసము 320 పద్యముకూడ ఈ విధమైన రచనకు ఉదాహరణము కాగలదు. అరుదుగ ఈయన ముక్తపదగ్రస్తమును కూడా ఆదరించినట్లు కనబడును.

బాంధవ శాత్రవాకలిత భావభవా; భవపాశబంధ (4-1-333)

ఇట్లు కొన్ని మెలకువలతో క్లిష్టాన్వయము గల ఈ సంబోధన పద్యములను అన్వయింపవలెను. శ్రద్ధాళువులకు గాని తత్త్వవిషయములను చెప్పకూడదను పెద్దల సంప్రదాయమును పాటించుటకై కవిబ్రహ్మ వీనియందు గ్రంథ గ్రంథులను కావలెననియే కూర్చెనేమో. లేనిచో సాధారణముగా ప్రసన్నమగు నాతని కవిత్వమునం దివి గులకరాళ్ళవలె నుండును.

మన మిదివరలో వేసికొన్న ప్రశ్నలకు సమాధానము లరయుదము. హరిహరనాథ కల్పనము తిక్కనసోమయాజి క్రొత్తగా చేసెనా? అంతకుముందే యున్నదా? ఈ భావము తిక్కన మనస్సునందు కొంతకాలమునుండియు మెదలుచుండెననుటకు విరాటపర్వారంభము నందలి స్వప్నవృత్తాంతమే తార్కాణము, కొమ్మనామాత్యుడు కవికి స్వప్నసాక్షాత్కార మిచ్చి ఇట్లు పలికెను. " కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా । పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్ । కిం కాలకూటః కిమువా యశోదాస్తన్యం తవస్వాదు వద ప్రభో మే॥" అని నీవు తొల్లి రచించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం డగు హరిహరనాథుండు నిన్నుం గృతార్థుంజేయ విజయం చేయుచున్నవాడు. ("ఓ దేవా! నీకు ఎముకలపేరు సమ్మతమా? కౌస్తుభము సమ్మతమా?, కాలకూట విషము నీకు రుచికరమా?, యశోదాస్తన్యమా?" అని పద్యభాగము,) ఆదియు తొల్లి రచించిన పద్యము. అనగా మహాభారత రచనాకాలమునకు చాలాముందుగనే హరిహరాభేదభావము తిక్కన మనస్సులో రూఢమయ్యెను. నిర్వచనోత్తరరామాయణమునందు 'మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక శీలుండ' అని అతడు చెప్పుకొనినను కొట్టరువు వారిది స్మార్తులు పాటించు సామాన్యశైవమే కాని వేదమును గర్హించిన తీవ్రశైవము కాదు. ఈ కాలమునకే అతని మనస్సు అద్వైత ప్రవణముగా నుండినట్లు సూచన కలదు. నిర్వచనోత్తర రామాయణమునందు మనుమసిద్ధి తాతనుగూర్చి చెప్పుచు అతడు ధర్మాద్వైతమూర్తి యని వర్ణించెను. ఈ ధర్మాద్వైత పదమే విరాటపర్వమునందు తిరిగి వచ్చినది. 'ధర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యమ్నాయమున్' (4-1-3) పురుషార్థములలో ధర్మమునకును వేదాంతములలో అద్వైతమునకు ప్రాధాన్యము కలుగునట్లు కృష్ణద్వైపాయనుడు మహాభారతమును రచించెనని సోమయాజి నిశ్చితాభిప్రాయముగ కన్పించుచున్నది. అద్వైతము, ఘనిష్ఠమైన తత్త్వచింతనము. అది జీవేశ్వర అభేదమూలకము. సామాన్యజనుల భావనకు అందుబాటులోనికి రానిది. సామాన్యజనులకు కూడా నానాత్వమునందు ఏకత్వమును బోధించుటకై ప్రాచీనులు "శివాయ విష్ణురూపాయ - శివరూపాయ విష్ణవే । శివస్యహృదయం విష్ణుః । విష్ణోశ్చ హృదయగ్ం శివః" అను మంత్రమును దర్శించిరి. ఇంతకు ముందే 'ఏకం సద్విప్రా బహుధా వదంతి - ఇంద్రం యమం వరుణం మాతరిశ్వాన మాహుః' అను ప్రాచీన ఋక్కు వెలువడినది. 'అగ్నిశ్చమే ఇంద్రశ్చమే సోమశ్చమ ఇంద్రశ్చమే' అను యజుస్సు కూడా సర్వదేవతలును

ఇంద్రస్వరూపమని సూచించుచున్నది. విష్ణుపారమ్యమును చెప్పు వాక్యములును రుద్రపారమ్యమును చెప్పు వాక్యములును వేదములందు కలవు. తిక్కనసోమయాజి ఈ యుభయ దైవముల అభేదమును భావనచేసి లోకమునకు చాటినవాడు.

హరిహరభావము అమూర్తస్థితినుండి మూర్తస్థితికి తిక్కనకు ముందే వచ్చినట్లు కన్పించును. హరిహరదేవునిపేర గుళ్ళును, విగ్రహములును వెలసెను. తూర్పుచాళుక్య వంశీయుడగు మొదటి శక్తివర్మ (క్రీ.శ.999-1012) పెన్నేరు (పెనికేరు) శాసనమునందు పిణ్ణెయ భట్టారకుడను బ్రాహ్మణవీరుని ప్రశంస వచ్చినది. ఈయన జైనుడుగ తోచును. అట్లయ్యును ఈ భట్టారకుడు హరిహరభక్తుడని కూడా వర్ణింపబడినది. దీనిని బట్టి తిక్కనసోమయాజికి రెండువందల ఏబది సంవత్సరములకు పూర్వమే ఆంధ్రదేశమునందు హరిహరనాథ సంప్రదాయము ప్రవర్తిల్లెనని చెప్పవీలగుచున్నది. పిణ్ణెయ భట్టారకుడు జినభక్తుడును హరిహరనాథ భక్తుడునుకూడా అగుట విశేషము. నెల్లూరు పట్టణమునందు తిక్కన సోమయాజి కాలమున ఇప్పటి రంగనాథస్వామి ఆలయ స్థానమునందు హరిహరనాథాలయముండెనని కొందరు ఊహించుచున్నారు. కన్నడదేశమునందు హరిహర అనుచోట హరిహరనాథాలయము ప్రసిద్ధమై యున్నది. ఈ ఆలయమునందలి ఒక శాసనములో హొయసల రెండవనరసింహునకు సేనాపతియైన పోలాళ్వ దండనాథుడు క్రీ.శ.1220 ప్రాంతమున హరిహరాలయమును జీర్ణోద్ధారము చేసినట్లు చెప్పబడి యున్నది. అనగా ఈ దేవళము అంతకుముందే ఉండెననియు, దాని నాతడు మరమ్మత్తు చేయించె ననియు ఊహింపవచ్చును. అక్కడ హరిహరేశ్వర విగ్రహము 6 అడుగుల ఎత్తుగలిగి వామపార్శ్వమున శంఖచక్రచిహ్నితమై విష్ణుని యర్ధరూపమును, దక్షిణభాగమున అక్షమాలయు త్రిశూలము గల హరరూపము చెక్కబడెనని తెలియుచున్నది. విష్ణుని యర్ధమున కిరీటమును, శివుని సగమున జడలును చంద్రవంకయు కన్పించును. కాని, కన్నడకవులలో ప్రసిద్ధులైన వారెవరును హరిహరదేవుని ప్రశంసయైన చేయలేదు. 13వ శతాబ్దమునందలి కన్నడకవులలో ముఖ్యులైనవారు కవిచక్రవర్తి జన్న, అండయ్య, కేశిరాజు, చౌండరసు మున్నగువారు. వీరిలో మొదటిముగ్గురును జైనులు. చౌండరసు తన కావ్యమును పండరిక్షేత్రమునందలి విఠోభాదేవున కంకితము ఇచ్చెను. ఆ కాలపు శివకవులలో ముఖ్యులు హరిహరుడు, రాఘవాంకుడు, కెరెయపద్మరసు మొదలైనవారు. వీరెవ్వరును కవిబ్రహ్మ తిక్కన సోమయాజివలె అద్వైతామృతమును సేవించినవారు కారు. ఆంధ్ర కన్నడదేశములు సంస్కృతియందు అక్కచెలియళ్ళవంటివి. కావున తెలుగుదేశమునందును హరిహరనాథభావనయు, ఆ దేవునకు గుళ్ళుగోపురములును వెలసియుండును. ఈ యంశమునకు పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర మనకు తార్కాణము.

పాల్కురికి సోమనాథుడు అచ్చపు శివారాధకుడు, మహావిద్వాంసుడు, మహాకవి. ఈతడు తిక్కన సోమయాజికి పూర్వుడని పూర్వ విమర్శకులు కొందరు భావించిరి. పండితారాధ్య చరిత్రము వాదప్రకరణమునం దీతడు హరిహరదేవప్రశంస తెచ్చి ఆ భావమును దీర్ఘముగను తీవ్రముగను ఖండించినాడు. అవహేళనమును చేసినాడు. ఇంతవిపులముగ హరిహరనాథ కల్పనను ఖండించుట కాతనిని ప్రేరేపించినది తిక్కనసోమయాజి మహాభారతమే కావలెను.

ఇది సత్యమైనచో పాల్కురికి సోమనాథుడు తిక్కనకు సమకాలికుడో అనంతరుడో కావచ్చునను విశ్వాసము బలపడుచున్నది. సోమనాథుడు హరిహరరూపమున ఒక దైవము ఉండుటకే వీలులేదని పెక్కు ఉక్తిప్రత్యుక్తులతో వాదము సాగించెను. హరిని ఒక సందర్భమున సంహరించుటచే శివుడు హరిహరుడయ్యెనని వ్యుత్పత్తి కల్పించెను. 'శివాయ విష్ణురూపాయ' అను సూక్తి ప్రక్షిప్తమని త్రోసి పుచ్చెను. హరిహరనాథుని ఆరాధించినవారు ముఖముమీద ఒక వంక విభూతియు మరొకవంక తిరుచూర్ణముతో నామములను దిద్దుకొనవలదా? అని అవహేళన చేసెను. హరిహరనాథుని గుళ్ళమీద నందియు పందియు చెక్కవలదా? అని యాక్షేపము తెల్పెను. హరిహరనాథుని సేవించువారికి హరిహరలోకమను పుణ్యలోక మెక్కడ ఉన్న? దని ప్రశ్నించెను. ఇటువంటి కల్పనలో అనౌచిత్యమున్నదని వాదించెను. హరియున్న దేహమున పార్వతి యుండునా? హరుడున్న దేహమున లక్ష్మీదేవి ఎట్లు నిలుచును? హరియు హరుడును సమానులు తుల్యులు కారని ఆవేశముతో చర్చించెను. హరి పంచవింశకుడనియు (అనగా సాంఖ్యులు చెప్పు చతుర్వింశతి తత్త్వములకు ఒక మెట్టుపై వాడనియు) హరుడు షడ్వింశకుడు (అనగా పంచవింశకుని కంటె అధికుడు) అనియు వేదాంతపరముగ అన్వయించి హరిహరులు సమానులు కారని స్థాపించి, హరిహరనాథుడను ఏకరూపముండుటకే వీలులేదని గర్జించెను.

తక్కిన యాక్షేపము లెట్లున్నను పాల్కురికి సోమనాథుడు చూపిన ఒక యాక్షేపణ గణింపదగియున్నది.

"హరి గొన్నయర్థంబు నద్రిజ గొనునె?
హరి యద్రిసుత గొన్నయర్థంబుఁ గొనునె''? (పండితారాధ్య చరిత్ర)

లోకసామాన్యదృష్టికి ఇది గొప్ప యనౌచిత్యమే. దీనిని తిక్కనసోమయాజి యెట్లు వారించుకొనెను? అను ప్రశ్న కలుగును. దీనికి సమాధానము కొంత విరాటపర్వాదియందలి 'శ్రీయన గౌరి నాఁబరఁగు చెల్వకు' అనుపద్యమునందే కలదు. శ్రీయనియు గౌరియనియు వ్యవహారమునందు వేర్వేరు స్త్రీమూర్తులైనను, పరమార్థదృష్టితో వారిద్దరును ఒక్కతత్త్వమే. భిన్నతత్త్వములు కావు. కావుననే మహాకవి 'గౌరినాఁబరఁగు చెల్వకు చిత్తము పల్లవింప' అని వారినిద్దరిని ఉద్దేశించి ఏకవచనమునే ప్రయోగించెను. అనగా లక్ష్మీపార్వతులకు నామభేదమే కాని వ్యక్తిభేదము లేదు. అట్లే హరిహరనాథ శబ్దమును ఏకవచనముగనే కవి ఎల్లయెడలను ప్రయోగించెను. ఇంద్రాగ్నులు, మిత్రవరుణులు మున్నగు దేవతాద్వంద్వముల వంటివి కావు, హరిహరశబ్దము. విడిగా నాత డెక్కడను హరిహరులు అని వాడలేదు. ఎప్పుడును హరిహరనాథుడనియే. శివకేశవులకంటె పరుడైన పరబ్రహ్మము అనియే తిక్కన భావముగా స్ఫురించును. హరిహరనాథుడును, లక్ష్మీపార్వతులును ప్రకృతి పురుషులకు ప్రతీకలు. వీరికి నామభేదమే కాని వస్తుభేదము లేదు. శ్రీ గౌరులు వ్యావహారిక సత్యములే కాని పారమార్థిక సత్యములు కారు. వారు తత్త్వములే కాని వ్యక్తులు కారని తిక్కన సోమయాజి యొక సందర్భమున వ్యక్తము చేసెను.

గౌరీత్వోజ్జ్వల తత్త్వ భాస్వర! నిజగారాత్మకశ్రీశ్వరా!- 17-1-77

లక్ష్మీపార్వతు లను ఉజ్జ్వలతత్త్వము చేత ప్రకాశించువాడా! అని సంబోధనము. కావున అనుచిత స్త్రీ పురుష సంబంధమును హరిహరనాథకల్పనకు ఆరోపించుట నిర్హేతుకమనియు భ్రాంతిమూలకమనియు చెప్పదగియున్నది.

హరిహరనాథభావనచే తిక్కనసోమయాజి సాధింపదలచిన మహాప్రయోజన మేమి? ఒకటి వైయక్తికమైనది. రెండవది సాంఘికమైనది. అతడు సాధారణ శైవుల కుటుంబమున జనించినను యౌవనమునుండియు అతనియందు శివకేశవ అభేదభావము విరూఢమగుచుండెను. దీనికి తార్కాణము 'కిమస్థిమాలాం' అను భావగర్భితమైన శ్లోకమే. ఈ కాలమున తిక్కన భావనచేయుచున్న హరిహరనాథైక్యరూపమైన పరతత్త్వము ద్వంద్వాతీతము. ఆ తత్త్వమునందు అన్ని రుచులును ఒకటే. అది సుందరము. బీభత్సము, క్రమముగా ఆయన మనస్సునందు అద్వైతభావన నెలకొని స్థిరపడజొచ్చెను. కావుననే మహాభారతమునందు ముఖ్యవేదాంతము అద్వైతమైనట్లు గ్రంథారంభముననే సూచించెను. "ధర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్' (4-1-3)' తిక్కన యాధ్యాత్మిక జీవితమునందు నాలుగు ప్రధాన సూత్రములు భాసించుచున్నవి. (1) వేదములందు పూజ్యభావన (2) వైదిక మార్గమునందు అనగా కర్మమార్గమునందు అవిరళ నిష్ఠ (3) అభేదభక్తి (4) అద్వైతసాధన. దీనిలో మొదటిమెట్టు శివకేశవ అభేదచింతనము. పై మెట్టు జీవేశ్వర అభేదమననము. ఈ క్రమముయొక్క ఫలితము మోక్షసాధనము. అది జననమరణ దుఃఖరూప సంసారతరణము. పునర్జన్మ లేకుండుట. ఈ భావములన్నియు హరిహరనాథుడు స్వప్న దర్శన మొసగినప్పుడు వివృతమైనవి.

'నీ కరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జన్మాంతర దుఃఖముల్ దొలఁగు నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే။(4-1-21)

అని యుపలాలితుండగు డింభకుండు తన కొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగు నమస్కారంబు సేసిన నజ్జగన్నాథుండు.

జనన మరణాదులైన సంసారదురిత
ములకు నగపడ కుండంగఁ దొలఁగు తెరువు

గను వెలుంగు నీ కిచ్చితి ననిన లేచి (4-1-22, 23)

హరిహరాభేదభావముచే తిక్కన సాధింపదలచిన మరియొక మహాప్రయోజనము లోక కల్యాణము. సమకాలిక సంఘోద్ధరణము. ఇది మొదటి దానివలె విస్పష్టముగా విస్తరింపబడలేదు. ఒక్క చిన్న వాక్యములో మాత్రమే ఇది సూచితమైనది.

కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముంబొరయునట్లుగ - (4-1-30)

గ్రంథరచన చేయుట ఆయన సంకల్పము. మునిమాన్యుడైన పారాశర్యుడు కూడ లోకకల్యాణము నుద్దేశించియే పంచమవేదమును కూర్చెనని తిక్కన ఇదివరలో చెప్పియున్నాడు.

'కృష్ణద్వైపాయనుఁ డర్థి లోకహిత నిష్ఠం బూని కావించె' (4-1-8)

ఇక్కడ మిక్కిలి సంక్షిప్తముగా సూచింపబడిన ఆ లోకకల్యాణము, లోకహితనిష్ఠ ఏ రూపమైనదో మనము సమకాలిక పరిస్థితులనుబట్టి ఊహింపవలెను. ఆంధ్రదేశమునందును పరిసర దేశములందును కూడా మతవిషయికమైన కల్లోలము తీవ్రముగా నుండెను. చార్వాకులనువారు తప్ప మిగిలిన వారందరును భగవంతుడున్నాడని దృఢముగా నమ్మి, అతనిని చేరుటకు తమకు తోచిన మార్గములు అభినివేశముతో ప్రచారమొనర్చినవారే. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్ర వాదప్రకరణమునందు తనకాలమున ఉండిన వివిధసమయములవారిని గూర్చి విపులమైన పరిజ్ఞానమును మనకు కలిగించినాడు. అతడు వీరిని గూర్చి దూషణవాక్యకలితముగా వ్రాయక, కొంచెము సహనమును, సంయమనమును ప్రదర్శించినచో సోమనాథుడు మనకు గొప్ప ఉపకారము చేసినవాడయి యుండును. ఏమయిన క్రీ.శ.12వ శతాబ్దమునందు దేశమును చైతన్యవంతమొనర్చిన ఆస్తికశాఖలను గురించి సోమనాథుడు చెప్పకున్నచో మనకు ఆ యుగము అంధకార భూయిష్ఠముగా నిలిచిపోవును. పాల్కురికి కవి గుర్తించిన వివిధ మతశాఖ లీరీతిగ నున్నవి. బౌద్ధులు, జైనులు, సన్న్యాసులు, అద్వైతవాదులు, బ్రహ్మవాదులు, అవేదవాదులు (వేదప్రమాణము నంగీకరింపనివారు కావచ్చును), పాంచరాత్రులు, అంతరాలికులు, ఏకాత్మవాదులు, అభేదవాదులు, శూన్యవాదులు, కాలవాదులు, కర్మవాదులు, నాస్తికులు, చార్వాకులు, ప్రకృతివాదులు, మాయావాదులు, శబ్దబ్రహ్మవాదులు, పురుషత్రయైకవాదులు (నన్నయ భట్టారకుడు త్రిపురుషులను గ్రంథారంభమున స్తుతించెను. ఇది యాతనిమీద విసురుకావచ్చును), ద్విపురుషైక కలితవాదులు, మూర్త్యైకవాదులు (కాళిదాసు అష్టమూర్తియైన శివుని స్తుతించెను); స్మార్తులు, యోగశాస్త్రభ్రమితులు, రసమంత్రవాద సిద్ధులు, షట్తర్కవిదులు, కౌటిల్యశాస్త్రప్రబుద్ధులు (అర్థశాస్త్రవేత్తలు కావచ్చును), నక్షత్రపాఠకులు; ఈ విధముగ లెక్కలేనన్ని శాఖలవారిని సోమనాథుడు నిరసనవాక్యములతో పేర్కొనెను. అద్వైతులను నీతివర్జితులనియు, పాంచరాత్రులను భ్రాంతచిత్తులనియు, శూన్యవాదులను జఘన్యచరిత్రులనియు, మాయావాదరతులను ప్రచ్ఛన్న బౌద్ధనిబద్ధులనియు ఈ విధముగా ఒక్కొక్కరికి ఒక్కొక్క దూషణ విశేషములను సోమనాథుడు జతపరిచెను. అతడు పేర్కొన్న వారందరను ప్రత్యేకశాఖలు కాకపోవచ్చును. మాయావాదము, శూన్యవాదము, బ్రహ్మవాదము (సర్వంఖల్విదం బ్రహ్మ నేహనా నాస్తి కించన) ఏకాత్మవాదము ఇవన్నియు అద్వైత వాదమందలి అవాంతరభావములే కాని విభిన్నశాఖలు కాకపోవచ్చును. ఎట్లైనను ఇంత విస్తృతమైన మత విశ్వాససంపద ఆనాడు ఉండెననుట గమనింపదగినది.

పైని పేర్కొన్న పెక్కు సమయములలో చెప్పుకోదగిన అనుయాయివర్గము కలవారు బౌద్ధులు, జైనులు, అద్వైతులు, పాంచరాత్రులు, కర్మవాదులు. పాల్కురికి సోమనాథుడు పతిత వర్గమునకు అతీతమని భావించిన శివపారమ్యవాదులును వీరిలో చేర్చదగినవారే. క్రమముగ రాజాదరణము కోల్పోవుటచే బౌద్ధజైన శాఖలు ప్రక్షీణములగుచుండెను. శైవులును, పాంచరాత్రులును ప్రజాహృదయమున జైన బౌద్ధులు పోగొట్టుకొనిన స్థానమును ఆక్రమించుకొనుచు, ఆధిక్యమునకై అఱ్ఱులుసాచుచుండిరి. మొదట శైవులదే పైచేయిగా నుండెను. అప్పు డాంధ్రదేశమునంతను పాలించిన కాకతీయులు పరమమాహేశ్వరులై యుండుటచే శైవమునకు రాజాదరణము విస్తారముగా లభించెను. కానైతే కాకతీయులు వీరశైవులు కారు.

బసవేశ్వరుని ఉపజ్ఞా ఫలితముగ శైవము వీర శైవముగా మారి పరసమయములను సహింపక వానిపై ధ్వజమెత్తు పరిణామమునకు లోనయ్యెను. పాల్కురికి సోమనాథుని రచనలయందు తీవ్రవైఖరియే ప్రత్యక్షమగును.అప్పటి వైష్ణవమింకను వీరశైవమునకు ప్రతిద్వంద్వి కాదగినస్థితిలో లేకుండవచ్చును. సోమనాథుడు విష్ణువుపేరు పేర్కొని ఆ దైవము శివునితో సమానుడు కాజాలడని నిరూపించుటకు వాదప్రకరణమున చాలగా రచించెను. అయినను అతడు వైష్ణవమును పేరెత్తి చెప్పక పాంచరాత్రులను ఉదాహరించెను. వారైనను ఉపేక్షణీయులని కాబోలు ఒక్క తిరస్కార వాక్యముతో 'భ్రాంత చిత్తులు' అని త్రోసిపుచ్చెను. అద్వైతమునుండి సోమనాథుడు వీరశైవమునకు ఎక్కువ ప్రతిఘటనమును ఎదురుచూచి యుండవచ్చును. అభేదవాదులైన వీరు గోడమీదిపిల్లివంటివారని యాతని భావము. కావుననే కాబోలు అద్వైత సిద్ధాంతమునకు చెందిన వేర్వేరు భావములను ప్రత్యేకశాఖలుగా పరిగణించి వానిని ఆగ్రహముతో తెగడెను.

దేశమునందు చెలరేగుచున్న మతసంబంధకమైన అసహనమును ద్వేషమును ఉపశమిల్లునట్లు చేయుటకు కవిబ్రహ్మ సంకల్పించెను. హరిహరనాథ కల్పన మాతనికి ఈ సదుద్దేశమునందు మిక్కిలి సహకారి అయ్యెను. సామాన్య జనులకు హరిహర అభేదమును బోధించి వారిని శాంతచిత్తులను చేసెను. వ్యుత్పన్నమతులైన వారికి జీవేశ్వరాభేదరూపమైన వేదాంతమును ప్రతిపాదించెను. సాంఖ్య, యోగ సిద్ధాంతములను అద్వైతమునకు బాసటగా స్వీకరించెను. వీని కన్నిటికిని భక్తియోగమును మూలకందముగా గ్రహించెను.

హరిహరనాథతత్త్వపటము నందలి కొన్ని ముఖ్య తంతువులను గుర్తింతము.

1. వేదప్రామాణ్యము, వేదములు ఈశ్వరుని నిశ్శ్వసితములు. అవి భగవంతుని రూపమును ప్రతిపాదించును.
2. కర్మప్రాధాన్యము, కర్మలు మనస్సును నిర్మలము చేయు సాధనములు. ఫలాభిసంధిలేని కర్మాచరణము మోక్షహేతువు.
3. వేదవ్యాససంస్తుతి, వేదవ్యాసుడు వేదవిభజనము చేసెను. బ్రహ్మసూత్రకర్త, విజ్ఞానఖని.
4. హరిహరుల అభేద సంకలనము, ఏకతా నిరూపణము.
5. సామాన్యస్తుతి, భగవంతునిలీలలు, పరతత్త్వమహత్త్వము, భక్తపోషణము, రాక్షససంహారము.
6. యోగము, యమనియమాదులు, షట్చక్రములు, కుండలినీసంచారము.
7. సాంఖ్యము, ప్రకృతిపురుషులు, చతుర్వింశతి తత్త్వములు.
8. అద్వైతము, మాయావాదము, జీవేశ్వరాభేదము.

హరిహరనాథ సంబోధన పద్యములం దీ అష్టసూత్ర విధానమును తిలకింతము. క్రింద నీయబడిన ఉదాహరణములు? సూచనప్రాయములే కాని సమగ్రవ్యవస్థను సందర్శించునవికావు.

**1. వేదప్రామాణ్యము :**

శ్రౌతశాఖాగ్రవర్తీ 4-1-335; గాఢవిస్తర నిగమైకవేద్య 4-2-363; నిగమకుసుమ గంధోన్మేష భూతాభిధానా 4-6-407; పదనసముత్థితవేదా 7-2ı382; తపస్స్వాధ్యాయాదిక్షపితమల చిత్తప్రకలితా 11-1.187; వేదపరిషత్సంస్తుత్య 12-1-398; నిగమాంత స్ఫీత హర్మ్యాగ్ర సంచరణ ప్రౌఢమయూర 12-2-447;; (వేదములను హర్మ్యాగ్రములందు సంచరించు నెమలియైనవాడా అనుట) వేదవిద్యా విభావ్యా 12-3-531; వేదజలద శ్రేణీమయూరా 11-5-630; సుతపస్స్వాధ్యాయ సద్మా 13-2-476, వేదసభైక నాయకా 14-3-226; ప్రణవైకభావ్య 17-1.78.

**2. కర్మప్రాధాన్యము :**

వైదికమార్గనిష్ఠమగు వర్తనము 4-1-15; యజ్ఞాత్మకరూప 4-3-239; కర్మసమ్మర్ద నిరాసకర్మఠ 6-3-454; యజనవిధిఫలత్వవ్యాప్త 8-2-401; కరణఫలపరిత్యాగ ప్రవోదాత్తచేతః పరిణత సుఖపీఠ భ్రాజమానా (కర్మఫలత్యాగముచే

ఉదాత్తమైన చేతస్సనుపీఠమందు ప్రకాశించువాడా అనుట); 8-3-401; (కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన అను గీతావాక్యభావము; కర్మ ప్రాధాన్యము చెప్పుచు ఫలత్యాగబుద్ధిని ప్రశంసించుచున్నది) సాయం ప్రాతర్హుత ప్రజ్వలిత హుతవహస్వైర నిర్ధూత జాడ్య । స్ఫాయచ్చేతః ప్రసాదప్రసృమర విమలప్రౌఢ బోధానుమోదీ (ఉదయాస్తమయములందు వేల్చబడిన ప్రజ్వలితుడైన అగ్నిదేవునిచేత స్వేచ్ఛగనే పోగొట్టబడిన అజ్ఞానరూపమైన జాడ్యము కలదగుటచేత వికాసము నొందిన మనస్సు యొక్క ప్రసాదత్వముచేత వ్యాపించు స్వచ్ఛమైన ఆత్మజ్ఞానమును అనుమోదించువాడా అనుట. విధ్యుక్తకర్మానుష్ఠానముచే మనస్సు నిర్మలమై అజ్ఞాన దూరమయి బ్రహ్మాత్మజ్ఞానము ప్రకాశించుననుట) 10-2-134; మఖతతి హ్వాతినిర్మాణ సంపాద్యమానా 10-2-134; హవ్యకవ్య ప్రసాద్యా 12-4-457.

**3. వేదవ్యాస సంస్తుతి :**

తిక్కన సోమయాజికి వేదవ్యాసమహర్షియందు గాఢ ప్రత్యయము కలదు. ఆ మునీంద్రుడు చేసిన కార్యములును అసాధారణములు. ఆయన వేదవిభజనము చేసెను. బ్రహ్మసూత్రముల నిర్మించెను. మహాభారతమును పెక్కుపురాణములను గ్రథించెను. శుకయోగీంద్రుని తండ్రి, భారతవంశవివర్ధనుడు, అద్వైత సిద్ధాంత ప్రతిపాదనమునందు తిక్కన సోమయాజి తనకు మిక్కిలి సన్నిహితుడైన ఆచార్యశంకరుని ఎచ్చటను పేర్కొనలేదు. వ్యాసమహర్షియే సర్వవేదాంత విజ్ఞానమునకు మూలకందముగా తిక్కన గ్రహించెను. 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు' 4-1-3; ప్రాంశు పయోదనీలతను భాసితు 6-1-71 మున్నగు పద్యములందు తిక్కనసోమయాజి తనకు బాదరాయణమునీంద్రుని యెడ గల గౌరవతాత్పర్యములను చక్కగా ప్రకటించెను. హరిహరనాథ సంబోధన పద్యములందు వ్యాసమునీంద్రుని ప్రస్తావనము తరచు వచ్చును.

వ్యాసాదిముని ప్రోక్తమ । హా సందర్భాప్రమేయతారూఢగుణో । ల్లాసా 5-2-333; సాత్యవతేయ భారతీప్రోక్త 5-3-413; సాత్యవతేయ వాఙ్మయ విశాల గృహస్ఫురిత ప్రదీపితా 7-1-395; జనవినుత బాదరాయణ మునీంద్ర వాగమృతనిధి సముద్భూతాహ్లా దనకీర్తిసుధాకిరణ 7-5-433; వేదవ్యాస వచోవిభవలక్ష్య 12-1-1; వ్యాసచేతోనివాసీ 12-4-457; వేదవ్యాస వచోవిభవవేద్య 15-1-1.

**4. హరిహరుల అభేదసంకలనము :**

హరిహరాత్మకమైన ఏకరూపమును కవిబ్రహ్మ బహుధా భావన చేసి బహుభంగుల, బహుచమత్కృతులతో తీర్చి మనకు ప్రత్యక్షము చేసినాడు. తన ప్రశస్తకవితానైపుణినంతను హరిహరనాథ చిత్రణమునందు వ్యక్తీకరించినాడు. ఇదియంతయు హరిహరనాథుని సాకారరూపమును భక్తులు భావనచేయుటకు వీలుగా వర్ణించుట. ఆయన ఆంతరము, నిరాకారము అయిన రూపము యోగ, సాంఖ్య, అద్వైత భావములతో నిండియున్నది. ఆరంభమునందే హరిహరనాథుడు కలలో తనకు ప్రత్యక్ష్యమైనప్పుడు ప్రదర్శించిన ప్రసన్నరూపమును తిక్కన వర్ణించినాడు.

కరుణారసము వొంగి తొరఁగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ 4-1-12.

ఈ మొదటి పద్యమునందే హరిహరనాథుని మూర్తమైన రూపమును చిత్రించుటలో తానవలంబింపబోవు పద్ధతులకు కవిబ్రహ్మ బీజావాపము చేసినాడు. శశిరేఖ నమృతంబు జాలువార అనుటచే శంకరుని ఒక పంక్తిలో సూచించి, 'నాభిధవళపంకజము మెఱయ' అనుటచే రెండవ పంక్తియందు నీలమేఘశ్యాముడైన విష్ణువును సూచించినాడు. మూడవ పంక్తియందు 'గళంబుచాయ' అనుటచే కాలకంఠుని సూచించి, ఉరమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప అనుటచే విష్ణువును జ్ఞప్తికి తెచ్చినాడు. గీతపాదద్వయమునందు సితాసిత దేహకాంతులు గల శివకేశవులను రూపొందించినాడు. హరిహరనాథుడు అనంతశక్తిమంతుడు. విశ్వాకారుడు. సూర్యచంద్రులాయనకు నయనములు అను మహాభావమును తనదక్షిణనేత్రమును, సుధారోచియ కా నను వింతలేక చూచి, 4-1-14 అను వాక్యమునందు వ్యంజింపజేసినాడు.

షష్ఠ్యంతములు మొదటి నాలుగు పద్యములలో గంభీరవేదాంతార్థములను ప్రతిపాదించినాడు. ఇవి హరిహరనాథుని అమూర్తస్వభామునకు సంబంధించినవి. 'ఆ దేవుడు ఓంకారవాచ్యుడు. అహంకారరహితమైన భావనచేతమాత్రమే తెలుసుకొనబడువాడు. మంత్రశాస్త్రము ఆయనకు అలంకారమైనది. అది హ్రీంకారమయము, హరిహరనాథుడు పాంచభౌతికమైన జగత్తంతను నిండియున్నాడనియు, విశ్వమంతయు ఆయనలో ఇమిడియున్న దనియు చెప్పుటకు అర్థవంతమైన రూపకములను కల్పించినాడు. ముల్లోకములను చిలుకకు ఆయన దృఢపంజరమైనవాడు. త్రిభువనముల కుబుసము హరిహరనాథుడను భుజంగమపతిని కప్పియుండును. ఆయన శ్రుతి సీమంతమణి, ఆశ్రితుల వాంఛలను పూర్తి చేయుటయందు చింతామణి. అజ్ఞానమను చీకటికి సూర్యుడు, శమనిరతులైన సంయమీంద్రుల మనస్సులను కుముదములను వికసింపజేయును ఆయన చరణనఖచంద్రికలు. ఇంతలో కవికి ఆ భగవంతుని మూర్తరూపము జ్ఞప్తియందు వెలసి ఇట్లు చమత్కారముగా పలికినాడు. హరిహరనాథునకు మందాకినీనది పాదభూషణము, శిరోవేష్టనము. అనగా విష్ణురూపుడైన ఆ దేవునకు సురనది పాదములందు పుట్టినది. శివరూపుడైన ఆయనకు జటాభూషణమైనది. హరిహరనాథమూర్తియందు భిన్నవస్తువులు సమన్వయించుట ఆయన అవలంబించిన యొక రమ్యమార్గము. 'వనమాలికా భుజంగాభరణా' (ఆభరణములలో వైచిత్రి. ఒకరికి తులసిమాలయు, ఒకరికి పాములును భూషణములు, ధనుస్సమన్వయము) 4-1-38; అజగవశార్ఙ్గాలంకృత (ఒకే వస్తువు ఒకరికి ఒక విధముగను మరొకరికి మరొకవిధముగ ఉపకరించుట మరొకవైచిత్రి) 4-1-39. భుజగ సమాచరితశయన భూషణకృత్యా. (సర్పము విష్ణువునకు శయ్య, శివునకు ఆభరణము, ఒకచో అనంతుడు, మరొకచో వాసుకి, శివకేశవుల అత్తవారిండ్లు వేర్వేరు) 4-1-39, జలనిధిహిమవద్భూధర, కలిత జననకేళికౌతుక.. స్త్రీసనాథ (వారి స్త్రీ జనము వ్యక్తావ్యక్త లలితసౌందర్యము కలవారు. వారు లోకసామాన్య వనితలు కారు. ప్రకృతిస్వరూపిణులు) అనుట 4-1-40. సృష్టికార్యమునకు పూర్వముండునది అవ్యక్తరూపము సృష్టియనంతరము వ్యక్తరూపము. మహాకవి గూఢవేదాంతార్థములను ఇట్లు వ్యంజితము చేయుచుండును.

ఈ దేవతామూర్తిని మహాకవి పాదములనుండి మౌళివరకును ఆయావిశేషణములతో స్తుతించును. నిర్వృతిపణ్యాపణపదారవింద వికాసా (పరమశాంతియను వెలగల వస్తువునకు ఆపణమైన పదారవిందము కలవాడు) 4-2-364; పునర్భవ పరిహార హరి పదపద్మయుగ 8-1-320; సురమకుట ఘటితరత్న స్ఫురితచరణ 12-5-631; జరామరణనోదక పదస్మరణా 12-5-631; మహాశర్మాపాదన పాదపద్మ 13-2-476; వినుత చతుర్వర్ణక సంజనక ముఖభుజోరుపాద (చాతుర్వర్ణ్యమునకు సంభవకారణమైన ముఖాద్యంగములు కలవాడా) 14-2-227; అజరామరపదకరపదభజనా 14-4-286.

**హరిహరనాథుని పరిధానము :**

1. పరిధాన ప్రావరణీకరణాదృత పీతవసనగజచర్మ 7-3-309.
2. పీతస్ఫీత సామాజగత్వగ్వసనా 15-1-185

**వక్షశ్శోభ :**

1. శ్రీమత్తులసీపల్లవ దామచ్ఛవిలబ్ధ మరకతప్రతిమత్వోద్దామప్రభాస్థిమాలా శ్యామాయిత విపులవక్ష (తద్గుణాలంకారము) 5-4-1.
2. భసిత పరభాగ హేలాలసిత శ్రీవత్సలలిత లాంఛన 6-3-454.
3. వనమాలికోరగహార పరిష్కారసార 7-3-1
4. తులసీదళదామ కపాలమాలికాభావిభవాభిరామ 18-1-95.

**భుజములు :**

నిష్ఠుర భుజసార 4-2-363; కరఖేలచ్చక్రశూలా 10-1-338; స్మయభయదర్పిత క్షుభిత సామజమర్దన రక్షణక్రియాశ్రయణ విలాస భాసురభుజా 12-3-529; (గర్వముచేత దర్పితమైనట్టియు భయము చేత క్షుభితమైనట్టియు సామజములను

మర్దించుట రక్షించుట అనుక్రియలకు ఆశ్రయమైన భుజవిలాసము గలవాడు. క్రమాలంకారము. శివునిగజాసుర సంహారమును విష్ణువు గజేంద్రమోక్షణ వృత్తాంతమును స్మరింపవలెను.)

**నేత్రములు :**

రవిశశిమయనేత్రా 4-3-415; దివాకరచంద్ర కృశానులోచనా (త్రిలోచన వైభవము); 8-3-3939; దేవతాసుర పరిరక్షణోన్మథనశోభి కటాక్షవిహార - (క్రమాలంకారము) 12-4-455, లసదపాంగోత్సార్యమాణాశ్రితార్తీ - 13-2-478.

**మౌళి :**

పింఛ ప్రస్మమరరుచి శబలోరగ విస్మమర దీధితి కలాపవేష్టితమౌళీ 6-3-454 సరిద్వరా బర్హి బర్హా చారుశిరస్కా 10-2-135; పింఛదామ భుజగాభరణా 12-5-631; సోమపింఛాభిరామా 13-3-347.

**కేతనములు :**

ద్విజపతి వృషభాంకోదీర్ణ 8-2-401; తార్క్ష్యశాక్వరమహామూర్తిస్ఫురత్కేతనా 12-1-398; గరుడ వృషపతాకా 13-1-388.

**వాహనములు :**

సముద్ధురవాహనీకృతోజ్జ్వల గరుడ వృషభ 7-3-309

లక్ష్మీపార్వతుల యాలంబనముచే నైన హరిహరనాథుని మూర్తి సౌందర్యమును మహాకవి పెక్కువిధముల ప్రత్యక్షీకరించును.

శ్రీగౌరి పల్లవపుటయోగాశ్రయమంజరీ సముజ్జ్వల మూర్తీ 5-1-1;
లక్ష్మీరమణత్వ శివాప్రియతా సమవాయాలంబ్యమాన సౌందర్యనిధీ 8-1-321;
శ్రీ గిరిజా సమవాయ మహాగురుతర సుభగ సంపదాలంబ 9-1-1.

**గమనిక :** లక్ష్మీపార్వతులకు హరిహరనాథునితో నుండు సంబంధము సమవాయసంబంధ మని తిక్కనసోమయాజి సూచించినాడు. సంబంధము రెండువిధములు. సంయోగసంబంధము, సమవాయ సంబంధము. సమవాయము నిత్య సంబంధము 'నిత్యసంబంధ స్సమవాయః' లక్ష్మీపార్వతులు ప్రకృతి స్వరూపిణులు. ప్రకృతికి పురుషునితో నిత్యసంబంధమును వేదాంతము చెప్పును. లక్ష్మీపార్వతులు తత్త్వమూర్తులే కాని లౌకికవనితలు కారని క్రింది సంబోధనమున కవి చెప్పుచున్నాడు.

మా గౌరీత్వోజ్జ్వల తత్త్వభాస్కర 17-1-77. దీనిని బట్టి పాల్కురికి సోమనాథుని వంటివారు చేసిన ఆక్షేపణలు పేలవము లనియు పారమార్థికములు కావనియు నిశ్చితమగుచున్నది. ఆ దేవునకు మిత్రులును లేరు. శత్రువులును లేరు. మన్మథు డాయన కొకప్పుడు కుమారుడు. ఒకప్పుడు వైరి. క్రింది సంబోధనములలో నిది సూచితమగుచున్నది.

రతిపతి హితాహితాక్షా 5-1-384; సంజనిత సముపసంహృత మదనా 13-1-387; "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్" అను గీతావాక్యముమేరకు భగవంతునకు దుష్టవర్తనులే శత్రువులు. శిష్టవర్తనులే ఆప్తులు. ఈ భావము హరిహరనాథసంబోధనములందు ఎడనెడ వచ్చుచునే యుండును. ఆ దేవుడు సంహారకారకుడు.

దానవ నిషూదన 4-2-363

చక్ర త్రిశూల ధారణరక్షో భీకర 7-2-1

దుర్దమ దనుసూను సంచయవిదారణ 7-5-431

చక్రపరశుచ్ఛిన్నాసురానీక 15-1-184

(భగవంతుడు ధర్మమునకు కవచము. భక్తపరాధీనుడు)

భక్తి నిగమానుభవోజ్జ్వల దివ్యవర్మ 4-5-405

భక్తసంపోషణశాలీ.... సదవనపరచిత్తా 14-2-228

ధర్మసరోజాసీన 6-2-1; ధర్మశీలానురక్తా 7-1-240

ధర్మపాలనా 13-1-368

శ్రీధర్మ కామహృదయ సమాధానాధాన కారకాంఘ్రియ సరోజా 16-1-1

దుశ్శీలాంతఃకరణావిభావ్య 16-1-224

(హరిహరనాథుని మార్గము సచ్చిదానందపథము. అది సరళమార్గము)

సమయ బహుత్వారణ్యా పరిశ్రామ్యదంతరంగ నితాంతోత్తమ సరళమార్గదర్శన సమర్థ! - పెక్కుమతములను అరణ్యామార్గముల సంచరించి మిక్కిలి శ్రమగొన్న మనస్సునకు ఉత్తమ సరళమార్గమును చూపగల తెరువరి హరిహరనాథదేవుడు. 5-4-427 'గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే' అను శివానందలహరీ శ్లోకభావము ననువదించుట.

శశ్వదాహ్లాదవర్మా 7-2-383

శాశ్వతానందమూర్తీ 7-5-438

వైభవానందదీపా 11-1-189

భాస్వదానందమార్గా 12-6-624

నిష్కలానందమూర్తీ 13-5-484

దర్శితానందవర్మా 14-4-287

**హరిహరనాథలీలలు - మహిమలు :**

లోకామయ నిర్వారణ నిపుణ 4-2-1

శ్రీవాగ్విభవారోగ్య ప్రావీణ్య ప్రాభవానుభావమహిత సౌఖ్యావహ పదస్మరణ 5-3-1

(భగవంతుని పాదస్మరణము సమస్త వైభవముల నిచ్చునది అనుట)

ఘోర సంసార దురామయా పదవసాయక 6-2-408

జననమరణ దుఃఖోత్సారి 7-1-397

జగజ్జనిస్థితి ప్రలయవిధానకేళి పరిపాటి వికస్వర 7-2-381

(హరిహరనాథుడు సృష్టిస్థితి సంహారకారకు డనుట)

రసాత్మక 8-1-320

'రసోవైసః' అని యుపనిషత్తు.

నిరవధి పరిణాహా 8-3-401.

భణన మనన దూరస్ఫార విస్తారసీమా - 9-1-405

'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' అని యుపనిషత్తు. విస్తర మహనీయ తార్కిక వచః కలనానభిగమ్య 12-4-455. తర్కకౌశలముచే సాధింపబడదు అనుట. భక్తిగమ్యుడు.

అకలుష హృదయాంతర్యాగ సంసిద్ధమూర్తీ 13-2-478

అంతర్యాగముచే సిద్ధించువాడనుట. దంభపూరిత బహిర్యాగములచే కాదనుట.

పావకబహుదివ్యనామ 13-5-482

కాలస్వైరవిహార భంజన కళాకౌతూహల స్తవ్య 16-1-224. కాలము మహాప్రభావము కలది. అది ఎట్టివారికిని దుర్వార్యము, హరిహరనాథుడు కాలముయొక్క స్వైరవిహారమునకు అతీతుడు కాడు అనుట. ఈ భావమునే కవీంద్రుడు మరియొకచోట ఇట్లు ప్రకటించెను.

నవతాదూర, పురాణతానుపగతా, నానాత్వ సంశోభితా 4-4-275 అతడు నవ్యుడు పురాణపురుషుడు అనుట. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అనుభావమును మహాకవి ఇట్లు ప్రదర్శించెను.

సూక్ష్మతర సంభాసా, మహాస్థూలమూర్తి విశేషా 4-4-275

వ్యాస సమాసైకరూప 4-5-1.

ఇట్లు బహుముఖములుగా హరిహరనాథుని మూర్తరూపమును సాధారణభక్తుల కర్థమగునట్లు చిత్రించి శివకేశవుల యభేదము వారిమనస్సులకు హత్తుకొనునట్లు తిక్కనసోమయాజి కావించినాడు. లోకమునందు ముగ్ధభక్తులును ఉన్నారు. 'నీటికొలది తామరసుమ్మీ, యన్నట్లు ఎవరి అధికారమునకు తగినట్లు వారికి పరతత్త్వనిర్దేశము చేయవలెను. 'యే యథా మాం ప్రపద్యంతే, తాం స్తథైవ భజామ్యహమ్' అని భగవంతుని వాక్యము. హరిహరనాథుని అమూర్తరూపమును అందుకొనుటకు యోగము, సాంఖ్యము, వేదాంతము మొదలగు జ్ఞానమాత్రసాధ్యములైన దుర్గమపథములు కలవు. అధిగతపరమార్థుడైన తిక్కనసోమయాజికి అవియును సుపరిచితములు. ఇక ముందు వాని వెంట పాఠకుని గొనిపోవుచున్నాడు.

**యోగము :**

'యోగ శ్చిత్తవృత్తినిరోధః' అని మనోవ్యాపారములను అరికట్టుటచే అది క్షుద్రలౌకిక వృత్తులనుండి మరలి భగవంతునకు ఉన్ముఖ మగునని యోగులు భావింతురు. మనస్సు అతిచంచలము. 'చంచలం హి మనః కృష్ణ!' అని అర్జునుడు నిర్వేదముతో పలికినాడు. అట్టి మనస్సును నియమించుటకు ఏర్పడిన కట్టుత్రాళ్ళు యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన

ధారణా సమాధులు. దీనినే అష్టాంగ యోగమందురు. యోగము రెండు విధములు. అభ్యాసయోగము, క్రియాయోగము. యమనియమాదు లభ్యాసయోగము, రెండవది జ్ఞానయోగము. దీనినే రాజయోగమనియు చెప్పుదురు. అభ్యాసయోగమున యమనియమాసన ప్రాణాయామములు పూర్వయోగము. ప్రత్యాహార ధ్యానధారణాసమాధులు ఉత్తరయోగము. రేచక పూరక కుంభకములు ప్రాణయామాంగములు. దేహాభ్యంతరమున ఆరు నాడీకేంద్రములు కలవు. వీనిని షట్చక్రము లందురు. మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములు బ్రహ్మదండియనబడు వెన్నెముక వెంటనుండును. బ్రహ్మదండినంటియే మూడు ప్రధాననాడులు దేహమునందు ఊర్ధ్వముఖముగ ప్రసరించును. అవి ఇడా, పింగళ, సుషుమ్న యనబడును. ఇడా, పింగళలు సుషుమ్నకు ఉభయపార్శ్వముల చెలగును. ఇడా పింగళలకు పితృయాన దేవయానములను సంకేతము కలదు. ప్రాణాయామముచే కుండలిని యను పరాశక్తిమూలాధారమునుండి ఊర్ధ్వాభిముఖముగా సంచరించి షట్చక్రముల తాకుచు సహస్రారమనబడు బ్రహ్మరంధ్రము పర్యంతము విజృంభించుననియు, అచ్చటినుండి యమృతము స్రవించుననియు యోగజ్ఞులు చెప్పుదురు. యోగమునందు నాదబిందుకళలను త్రిపుటికి విశేషప్రాధాన్యము కలదు. నాదమనగా ప్రణవము నుండి యుద్భవించినది. యోగసిద్ధులు మాత్రమే దీనిని ఆకర్ణింపగలుగుదురు. బిందువనగా జీవుడనియు, అన్నమయాదిపంచకోశములలో నొక్కటైన విజ్ఞానకోశమనియు, ఇచ్చట బుద్ధి యుండుననియు, బుద్ధియే బిందుస్థానమనియు చెప్పబడుచున్నది. కళ యనగా విజ్ఞానకోశము నందు ప్రతిఫలించు ఆనందకోశము యొక్క తేజోంశము. ఆనందమయకోశము బ్రహ్మస్థానము. కావున బ్రహ్మము జీవునియందు ప్రతిబింబించుట కళ యనదగును. అట్లే హంసశబ్దమునకును యోగశాస్త్రమునందు గొప్ప ప్రమేయము కలదు. హకారము బ్రహ్మమనియు, నకారము మాయాస్థానమనియు ఈ రెండింటినడుమ నున్న బిందువే జీవుడనియు యోగవేత్తలు భావింతురు. ఇట్లు గహనమైన యోగసాధనచే చిత్తవృత్తులు శమించి బ్రహ్మసాక్షాత్కారమగునని యోగతంత్రజ్ఞులు విశ్వసింతురు. క్లేశబహుళమైన అభ్యాసయోగముకన్న జ్ఞానయోగము మేలని కొందరు తలతురు. తిక్కనసోమయాజి యోగవిద్యానిపుణుడని ఆయన చేసిన ప్రసంగములవలన విశదమగును. హరిహరనాథుని చేరుటకు యోగము మహత్తర సాధనమని యాతని మతము. షట్ప్రమాణ పరమ దూర 4-3-238

ప్రత్యక్షాది ప్రమాణ సాధ్యుడు కాడనుట. భగవంతుడు విపుల తర్కవాక్యముల కందడని ఇదివరకే చెప్పనైనది.

దేవపితృ పథప్రవర్తన 4-3-238 ఇడా పింగళా నాడులు పితృయాన దేవయానములు.

నిర్భరనిష్ఠా మర్దిత వివిధ వికారామల చేతోనివాస 4-4-1

అవగమిత రహస్యాష్టాంగ సమ్యక్ప్రకారోత్సవ గురు కరుణా విస్తార 5-4-428. గురువు కరుణా విస్తారముచేతనే రహస్యమైన అష్టాంగయోగము సుసాధ్యమనుట.

నాసాగ్ర నివాసరసిక, నాదామృత ధారాసారరూప 6-1-1

యోగానుభావ్యా 6-1-306

హంస నాదైక వేద్యా 6-2-410

నాదాంతస్సార; వాదవిదూరా 7-1-396 లలిత చతుర్దళాఢ్యకమల ప్రసవ ప్రసరత్సరస్వతీ విలసన సౌరభోద్గమ నివిష్ట 7-2-381. మూలాధారచక్రము చతుర్దళకమలము. అచ్చటినుండి సరస్వతీవాహిని ప్రసరించును. సుషుమ్నానాడికి సావిత్రి సరస్వతియను సంకేతములు కలవు. ఇడా పింగళలు గంగాయమునలు - బ్రహ్మము సుషుమ్నయందు నివిష్టమై యుండుననుట.

బిందు చిదాత్మనాదమయపీఠ చతుష్కలసద్విహార 7-4-34

శమదమ పరివర్తీ 7-5-433

అవిరళ దర్శన స్థిర మహాముని మానసవాస ఖేలనోత్సవరసికా 8-1-320

హంసభావైకగమ్యా 8-1-322

పశ్చిమ నాడీసరణ 9-1-404. పశ్చిమనాడి యనగా పింగళనాడిగా తోచును. అది దేవయానసంజ్ఞికము. భరిత వికసనాంతః పద్మనిశ్రేణికా - ఇత్యాది 9-2-422. పద్యమునందు యోగసిద్ధాంత క్రమమంతయు సంగ్రహరమ్యముగా చెప్పనైనది. అంతః పద్మములు షట్చక్రస్థానములు - బ్రహ్మదండి నిశ్రేణిక. కుండలినీ శక్తి ప్రాణాయామబలముచే మేల్కని షట్చక్రములను నిచ్చెనమీదుగా ఎక్కి సహస్రారమను చంద్రబింబమునుండి స్రవించు అమృతమును గ్రహించి ఆనందరూపమున పర్యవసించును.

యమనియమాద్యష్టాంగ క్రమాభ్యసన నిర్మథిత వికార సుచేతః కమలామోదమయాత్మా 12-2-448

యోగభావ్యైకరమ్యా 12-5-632

పవన విజయలీలా ప్రౌఢ చేతోనివాసా 14-1-233

సతతాభ్యాస వికాసి సమాధి సమాసాదిత శాంతిలోల 14-2-1

పశ్చిమనాళ నందితా 14-2-226

మాన్యయోగప్రతోషీ 14-2-228

పాశ్చాత్యనాడికార్ద్రవ్యజనా 14-4-286 పశ్చిమనాడి పింగళనాడియైనచో యమునాసంకేతముగల ఈ నాళము హరిహరనాథునకు చల్లనితాళవృంత మగుట యుక్తముగానే యున్నది.

యమనియమాది ప్రావీణ్యపూర్ణమిత్ర 18-1-1 యోగశక్తి విశదాద్భుత ఖేలన 18-1-95

**సాంఖ్యము :**

సాంఖ్యము ప్రాచీనదర్శనము. సృష్టినిర్మాణమునందలి వివిధ తత్త్వములను సాంఖ్యులు నిపుణతతో పరిశీలించి ప్రదర్శించిరి. వీరు ఇరువదియైదు తత్త్వములను ప్రతిపాదించిరి. అందు రెండు అత్యంత ప్రధానములు. పురుషుడు చేతనుడు. ప్రకృతి జడము. తత్కారణముగా దానినుండి ప్రభవించిన సమస్త పదార్థజాతమును జడము. పురుషుడు జీవులకు మూలము. జీవులు అనంతము. పురుషుడు నిష్క్రియుడు. అసంగుడు. స్వతఃశుద్ధుడు. తామరాకును నీరు అంటని విధమున సుఖదుఃఖము లితనిని అంటనేరవు. అయినను అవి బుద్ధియందు ప్రతిఫలించుటచే పురుషుడు బుద్ధితో తాదాత్మ్యమును పొంది సుఖదుఃఖములను తాను అనుభవించుచున్నట్లు భావించి మోదవిషాదముల నొందును. జడప్రకృతి సంసర్గముచే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధిదైవికములైన త్రివిధ దుఃఖములకు పాల్పడును. ఈ విధముగ పురుషుడును, ప్రకృతియు, కుంటివాడును, గుడ్డివాడును కలిసి పయనించినట్లు సృష్టిలీలను నిర్వహింతురు. బుద్ధితాదాత్మ్యముచే గలిగిన బంధమునుండి పురుషుడు విడివడుటయే కైవల్యము. దీనికి జ్ఞానము ఆవశ్యకము.

సాంఖ్యులు ఇరువదినాలుగు తత్త్వములను పరిగణించి చెప్పిరి. సృష్టిక్రియ కంతకును ఆద్యమైనది మూలప్రకృతి. అది దేనికిని వికృతి కాదు. దానినుండి మహత్తు(బుద్ధి), దానినుండి అహంకారము జనించును. అందుండి పంచతన్మాత్రలు (శబ్దస్పర్శ రూపరస గంధములు) ఉద్భవించినవి. ఇవి ఏడును ప్రకృతివికృతులు. అనగా నివి మీదితత్త్వములకు వికృతులు. క్రింది తత్త్వములకు ప్రకృతులు. కేవలవికృతులు పదునారు. పంచమహాభూతములు జ్ఞానేంద్రియకర్మేంద్రియములు, మనస్సు,

ప్రకృతి క్రియాశీలము, పురుషుడు తటస్థుడు, ప్రకృతి త్రిగుణాత్మకమైనది. మూలప్రకృతియందు సత్త్వరజస్తమోగుణములు సామ్యావస్థయందుండును. సత్యము సుఖమును, రజస్సు దుఃఖమును, తమస్సు మోహమును జనింపజేయును. గుణత్రయమునందలి సామ్యావస్థ పరిత్యజింప బడుటచే ఆయావస్తుసృష్టి జరుగుచున్నది. కారణమగు మూల ప్రకృతియందు గుణత్రయ ముండుటచే కార్యములైన సృష్టిపదార్థము లన్నింటను గుణవ్యవస్థ సంక్రమించినది. మట్టివిత్తనమునందు వటవృక్షమువలె కార్యమగు జగత్తు కారణమగు ప్రకృతియందు లీనమైయున్నది. మట్టి, నీరు గాలితో సంబంధం కల్గినప్పుడు విత్తనమునుండి వటవృక్షము అభివ్యక్తమగుచున్నది. లేని పదార్థమునుండి ఉన్న పదార్థము పుట్టుట అసంభవము గనుక జగన్నిర్మాణకారణమైన ప్రకృతి అసత్తు అనుటను సాంఖ్యులు అంగీకరింపరు. వేదాంతులు చెప్పినట్లు జగత్తు మిథ్య యనుట వీరికి సమ్మతము కాదు. సాంఖ్యులు ఈశ్వరతత్త్వమును అంగీకరింపరు. జగదావిర్భావమునందు ఈశ్వరునకు ప్రసక్తియే లేదని వీరి మతము. ప్రకృతియే అంతయు నిర్వహించునని వీరి విశ్వాసము. కావున ప్రాచీన సాంఖ్యము నిరీశ్వరమను ఖ్యాతిని పొందెను. అయినను సాంఖ్యులు వేదప్రమాణము నంగీకరింతురు. పునర్జన్మయందు వీరికి విశ్వాసము ఉన్నది. కావున సాంఖ్యము ఆస్తిక దర్శనములలోనే పరిగణింపబడుచున్నది.

**అద్వైతము :**

వేదాంతులు సాంఖ్యదర్శనమునందలి భావములన్నిటిని గ్రహించి దానికి ఈశ్వరుని చేర్చి, తమ సిద్ధాంతమును ప్రతిపాదించిరి. మహాభారతమునందు కేవలసాంఖ్యము ప్రతిబింబించదు. ఈశ్వరసహితముగనే సృష్టిక్రమమంతయు వివరింపబడును. సాంఖ్యులు పురుషునితో కలిపి పంచవింశతితత్త్వములను ప్రతిపాదింపగా వేదాంతులు షడ్వింశుని కూడా చేర్చి ఇరువదియారు తత్త్వములను గ్రహించిరి. జడ మగు ప్రకృతి, ఈశ్వరచైతన్యము గల జీవుడు లేక ప్రత్యగాత్మ. జీవుని అధిగమించి సచ్చిదానంద లక్షణములు గల పరమాత్మ - ఇది వీరి తత్త్వక్రమము. "క్షరః సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరాదపిచోత్తమః అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః'' పంచదశాధ్యాయమున గీతావాక్యము. సర్వభూతములు క్షర మనబడును. కూటస్థుడు (జీవాత్మ) అక్షరుడు అనబడును. వీరిని మించిన తత్త్వము పరమాత్మ యనబరగుచున్నది. ఇది ముల్లోకములను ఆవరించి భరించుచున్నది. అక్షర తత్త్వమునకు పురుషుడు అను వ్యవహారము కూడా నుండుటచే సర్వాతిశాయియైన పరతత్త్వమును పురుషోత్తముడు అందురు.

శ్రుతివాక్యములను భిన్నప్రస్థానముల వారు భిన్నరీతుల అన్వయించిరి. ద్వైతులు జీవేశ్వరులకు భేదమునే నమ్మెదురు. విశిష్టాద్వైతులు బ్రహ్మము సగుణము, అనంతకల్యాణగుణయుక్తము అని భావింతురు. అద్వైతులు జీవేశ్వరుల కభేదమును నిశ్చయించిరి. వీరు జడపదార్థమైన ప్రపంచము కూడా బ్రహ్మాభిన్నమనియే చెప్పుదురు. అద్వైతుల దృష్టియందు సత్పదార్థమంతయు ఒక్కటే. అదియే బ్రహ్మము. వీరు 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా నేహనా నాస్తికించన సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ తత్త్వమసి' ఇత్యాది శ్రుతివాక్యముల నాశ్రయించి తమ ఆధ్యాత్మికవిచారణను సాగించిరి. జీవాత్మ బ్రహ్మచైతన్యమునకు మారురూపమని వీరి మతము అయినచో జీవుడు సంసారగతుడై సుఖదుఃఖములు పొంద నేల? అను ప్రశ్న రాగా, అవిద్యచే నాతడు ప్రకృతి కధీనుడై దేహాత్మ భ్రాంతి కలిగియున్నాడని వీరి సమాధానము. అవిద్య తొలగగనే జీవగతాత్మ శుద్ధమై తాను పరమాత్మ అంశమే కాని జడమైన ప్రకృత్యంశము కాదని తెలిసికొనును. అవిద్యావరణచ్ఛేదమే మోక్షహేతువు.

సృష్టివిధానమును అద్వైతులు ఇట్లు అన్వయింతురు. బ్రహ్మముకంటె జగత్తు వేరు కాదు. అదియు బ్రహ్మపదార్థమే ఇది యెట్లు? ప్రకృతి శుద్ధజడము పూర్ణచైతన్యము బ్రహ్మమూ, జడమూ చైతన్యమని యెట్లు చెప్పనగును? అను ప్రశ్నకు వీరిట్లు సమాధానము చెప్పుదురు. సృష్టికి బ్రహ్మమే ఉపాదానకారణము. కార్యమైన జగత్తు కారణమైన బ్రహ్మము కన్న వ్యతిరిక్తముగా ఉన్నది కదా యన్నచో ఇది వివర్తోపాదానమే అని అన్వయింతురు. ఉపాదానము రెండు విధములు.

పరిణామోపాదానము, వివర్తోపాదానము. క్షీరము దధిగా మారుట పరిణామోపాదనమునకు ఉదాహరణము. శుక్తిరజత భ్రాంతి వివర్తోపాదానమునకు ఉదాహరణము. వివర్తోపాదానమునకు మూలము భ్రాంతి లేక మోహము అని చెప్పవచ్చును. ముత్యపుచిప్పయందు వాస్తవముగా వెండి లేకున్నను ఉన్నట్లు భాసించి సంతోషమును కలిగించుచున్నది. అట్లే జగత్తు మిథ్యాపదార్థమైనను సత్యమువలె భాసించి మోహకారణమగుచున్నది. జగత్సృష్టికి మూలమైన ఈశ్వరశక్తిని అద్వైతులు మాయ అని వ్యవహరింతురు. ఈ మాయయొక్క తత్త్వము తెలియరాదని చెప్పుదురు. 'మమ మాయా దురత్యయా' అని గీతయు నుడువుచున్నది. ఈశ్వరగతమైనప్పుడు మాయ యనియు జీవగతమైనప్పుడు అవిద్య యనియు దీనికే సంకేతములు. ఇవి తొలగినప్పుడు జీవాత్మ వాస్తవముగ తాను పరమాత్మ సంబంధియనియు, ప్రకృతి కాదనియు పరమార్థమును తెలిసికొనును. వేదాంతులుకూడ సాంఖ్యులు గుణవాదమును అంగీకరింతురు. బ్రహ్మము మాత్రము గుణాతీతమని వారి భావన. మాయతో కూడిన బ్రహ్మ పరాంశమే సృష్టికార్యము నిర్వహించు ననియు వాస్తవముగా బ్రహ్మము నిష్క్రియ మనియు వారు ప్రతిపాదింతురు.

తిక్కనసోమయాజి బాదరాయణ మహర్షి ప్రోక్తమైన అద్వైతమునందు పరమ ప్రమాణబుద్ధి కలవాడు. మధ్యమాధికారులకు హరిహరనాథరూపమును మూర్తముగ చిత్రించి చెప్పినను వేదాంతదృష్టితో ఆయన నిర్గుణ నిష్క్రియ శుద్ధ పరబ్రహ్మమనియే బహుధా ప్రపంచించి స్తుతించెను. తిక్కన మతములో మోక్షసిద్ధికి కేవలజ్ఞానము చాలదు. హరిహరాభేద జ్ఞానము కాని బ్రహ్మైక్యజ్ఞానము కాని భక్తి సహితమైనప్పుడే ఫలము నిచ్చును. భక్తిరహితమైన శుష్కజ్ఞానము ఫలసిద్ధి కావింపదని సోమయాజి నిశ్చయము. కావుననే గ్రంథారంభ పద్యమందే 'భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్' అని ప్రకటించినాడు. వైదికధ్యాయిత ఆయనకిష్టమే కాని అది భక్తజన సంబంధియైనచో భగవంతునకు ఎక్కువ కూర్చునని సోమయాజి సందేశము. ఈ భావమునే 'వైదికమార్గ నిష్ఠమగు' అను పద్యమున విశదము చేసినాడు. హరిహరనాథుడు తిక్కనసోమయాజి 'భేదము లేని భక్తిని' అనుగ్రహముతో ప్రశంసించినాడు. భక్తి సూచకముగా తిక్కన చేసిన స్తుతులు అసంఖ్యాకములు. నిరీశ్వరమైన సాంఖ్యమునకు ఆయన సుముఖుడు కాడు గనుక సేశ్వర సాంఖ్యమునే ఆశ్రయించి హరిహరనాథుని స్తుతించును. వేదాంతమునందు ఆయనకు అభిమతమైన మార్గము అద్వైతపథము. క్రింద నీయబడు ఉదాహరణములలో భక్తి, సేశ్వరసాంఖ్యము అద్వైతముల ఉజ్జ్వల వర్ణకిర్మీరము శోభిల్లును.

భవపాశబంధ సంబంధ విరామరామ; పరిపక్వవివేక నిరూఢ భక్తహృద్గ్రంథి విభేదనా 4-1-333.

అన్నమయత్వాది విరామోన్నతః జగదాధారా 4-1-334

గుణతత్త్వవికార నియత్యభేద్య 4-2-363

శ్రీత్వ శివాత్వాలంబన 4-3-1 అను ఈ చిన్న కందపద్యములో అద్వైత వేదాంతమంతయు ఇమిడ్చినాడు. హరిహరనాథ రూపబ్రహ్మము వాస్తవముగా కర్తృత్వరహితము. ఐనను స్వేచ్ఛచేతనే ఆయన లక్ష్మి పార్వతి యను తత్త్వాశ్లేషముచేత శబలితుడై జగత్కర్తృత్వాది లక్షణము కలవాడగుచున్నాడు. అనగా నిష్క్రియుడు క్రియాశీలి అయినవాడు. ప్రకృతి రూపములైన లక్ష్మీ పార్వతీతత్త్వమునుండి మహదహంకారము లుద్భవించుచున్నవి. మహదహంకారాది వికృతుల కతీతుడైన యాశుద్ధ బ్రహ్మమే స్వలీలచేత వాటితో కూడినట్లు భాసించుచున్నాడు.

నిరుపాధికా, గుణమయా, నిష్క్రియా 4-4-275

అంతఃకరణ చతుష్టయ శాంతిసముద్య ద్వివేక సంపద్వేద్యా 4-4-276

పురుషత్రయతా వివృతస్వభావ 4-5-405

దుర్వహ పటుతాపత్రయ నిర్వాపణకరణ 4-5-406

సాక్షిత్వ నానా జగదవనపిధానస్థైర్య దత్తావధానా 4-5-407

యోగీంద్ర సంతతాంతర్యాగ పరీపాకరూప 5-1-1

ఇద్ధమాయావిలాసా 5-1-385

నిత్యానిత్య వివేకవైభవ సమున్నిద్రాంత రంగస్ఫుట ప్రత్యక్షా 5-2-332

నైర్గుణ్య సముద్భాసి రహస్యానుభావ 5-2-333

గుణవర్జన, నిష్కల, నిత్యపుష్కలా 5-3-413

వికారవిదూర విలాసభాస్వరా 6-1-304

దూరాంతిక దుర్గమవిస్తార 6-1-305

(దూరస్థం చాంతికే చ తత్ - భగవద్గీత)

కర్మ సమ్మర్దనిరాసకర్మఠ 6-3-452

క్షరణ రహితవృత్తీ 6-3-454

వివిక్త యుక్త జనకౌశలభావిత 7-1-395

మూల విద్యానవద్యా 7-2-383

నిరుపమ గుణరాశీ - నిర్గుణత్వ ప్రకాశీ 7-3-310

ఈ పద్యమంతయు అన్వయ వ్యతిరేకములచేత హరిహరనాథ బ్రహ్మమును ప్రతిపాదించుచున్నది. ఆయన గుణరాశి. నిర్గుణుడు. నిర్మాణకార్యము నిర్వహించువాడు. అయ్యును నైష్కర్మ్యధుర్యుడు. ఆయన స్ఫురిత బహుశరీరుడు అయ్యును శుద్ధవైరూప్యసారుడు.

మోహవ్యతికరతిమిర ప్రధ్వంసనాదీపరూపా 7-4-337

వీతరాగాదిగమ్యా 7-5-433

సత్త్వనలినగంథరూప; నిత్యనిష్క్రియా 8-2-399

ప్రమితివిదూరా 8-2-400

కేవల సత్త్వసద్మ మాయా వ్యవధూత్యేకాయనగమ్యా 9-2-1 (మాయానిరసనమను ఏక మార్గముచేత పొందదగినవాడు అనుట).

మాయా వ్యాపారదూరా 10-2-134

ప్రకృతి వికృతి భావప్రాప్త సాంఖ్యప్రదీప్తా 10-2-136

'మూలప్రకృతి రవికృతిర్మహదాద్యాః ప్రకృతి వికృతయః' అని సాంఖ్యవేత్తల భావము.

సత్యత్వానంతత్వ నిరత్యయ శుభసారమయ సమగ్ర వికాసా 11-1-188 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని శ్రుతి.

సదసదనభిషిక్తా 11-1-189 'నసత్తన్నా సదుచ్యతే' గీతావాక్యము.

త్వంతాహంతా నిరసన శాంతాంతః కరణయోగి జనవిజ్ఞేయా 11-2-186 తత్వమసి, అహంబ్రహ్మాస్మి మున్నగు మహావాక్యముల సారము.

నివృత్తి లంపటచిత్తోల్లాసన దక్షా 12-1-1

మాయా వినిర్ముక్త ద్యోతన 12-1-398

ప్రకృతి పురుషయోగీ 12-1-400 ఇది అచ్చుపుసాంఖ్యభావన, వేదాంతమునందు రెండవదశ.

వీతకారణా 12-4-455

కామదూరానుభావ్యా; యమనియమ వికాసీ 12-4-457

జరామరణనోదక పదస్మరణా 12-5-631

సంగనిర్ముక్త భావ్యా 12-5-632

వ్యామోహవిదూర 13-1-1

మనోంతర్ముద్రా లతికాఫలత్వలసితా 13-2-476

ప్రమద విషాదాదిద్వంద్వ మలావిహితాంతరంగవాసా 13-2-477 స్థితప్రజ్ఞుడు ద్వంద్వాతీతుడని గీతలో బహుధా చెప్పనైనది.

వికృతిదశక షట్క స్వీకృతి ప్రౌఢవర్తీ 13-2-478 షోడశవికారములు సాంఖ్యభావన అపగత కామరోషహృదయాంతరఖేలన కల్య (13-3-345) (అరిషడ్వర్గ నిరసనము).

సత్త్వాధిష్ఠాన; తత్త్వంపదార్థరూపా 13-3-346 త్రుటితాపత్వ సమున్నతాశ్రితజనా 13-4-449

గుణసమతాను భూతిహృతికోవిద సార వివేక భవ్య 14-1-231

సృష్టికి పూర్వము మూలప్రకృతియందు గుణసమత్వముండునని సాంఖ్యులు.

నవ్యత్వపురాణత్వ దశావ్యపనయ దుర్నిరూప సౌందర్యా 14-1-232

అనపేక్షిత ఫలతాశోభన మహనీయక్రియా విపాకాత్మక 14-3-227

ఫలాభినంది లేని మహనీయుల క్రియాపరిణామమైనవాడు. అనగా హరిహరనాథుడు ఫలాపేక్షలేని కర్మచేత అభిగమ్యుడు. ఫలాపేక్షతో చేసిన కర్మకు స్వర్గాదులు గమ్యము కావచ్చును. జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత - శ్రుతి

తరుణ జరఠభావద్రావణోదారమూర్తీ 14-3-228 (భగవంతుడు నిత్యతరుణుడు. నిత్యవృద్ధుడు అనుట.)

ఆశాపాశవిమోచనోపకరణవ్యాకోచహృద్ధామ 15-1-184 (ఆశాపాశమును విడుచుటయను సాధనముచే వికసించిన హృదయమునందు వసించువాడు)

విద్యావిద్యాఘనచింతాంతిక దూరలసన 15-1-185 విద్యతో కూడిన చింతనకు సమీపమందును అవిద్యాచింతనకు దూరమునందును ప్రకాశించువాడు హరిహరనాథదేవుడు. క్రమాలంకారము.

గత సంకల్పాంతరంగస్థితిస్మేరాకార 15-2-174

నానాగమక్షీరోద్యన్నవనీతతాలసిత 15-2-174

(ఆగమ క్షీరములనుండి ఉద్భాసించు నవనీతము హరిహరనాథుడు)

సమదవిమదదూరాసన్నరక్షాప్రసన్నా 15-2-176 (క్రమాలంకారము)

సంగిగాఢ త్రితాపా 16-1-226 (సంగము కలవారికి అనగా విషయాసక్తులకు గాఢమైన తాపత్రయము కలిగించువాడా అనుట.)

విస్తారోదారగుణత్రయ స్ఫుటవిశేషా; నిర్గుణాశ్లేష 17-1-77 సృష్టి నిర్మాణదశయందు గుణత్రయ విశిష్టుడు. సృష్టి పూర్వదశయందు నిర్గుణుడు.

జన్యసకలద్రవ్యా 17-1-78 (సర్వపదార్థములు హరిహరనాథజన్యము.)

మహావిద్యోన్మేషగాత్ర 18-1-1

సాంఖ్య విద్యావహ 18-1-95

హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్ 18-1-94,,

**13 కవిత్రయ మహాభారతం : వ్యాఖ్యానం**

తెలుగులో ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం అవతరించి వెయ్యేళ్ళు కావస్తున్నా, ఇంతవరకు దానికి సమగ్ర వ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమానదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మ ప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమ వేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలరాయడు మాత్రమే చేపట్టి ధర్మరక్షణ కళా ప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమదయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు వ్యాఖ్యానించిన పదునెనిమిది పర్వాల ఈ దివ్యప్రబంధమండలిని పరిష్కరించి, సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్యజనులకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుడి పక్షాన బాధ్యత వహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు మహనీయులు టి.టి.డి.బోర్డు ఛైర్మన్; సభ్యులూ, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వారి సహకారులూ, సంపాదకులూ, సంపాదక సలహామండలి సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్ సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికారులూ, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం మూడవ సంపుటిగా, రెండు భాగాలుగా ప్రచురించబడింది. మొదటిభాగం నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం, రెండవభాగం ఎఱ్ఱాప్రెగడ పూరించిన ఆరణ్యపర్వశేషం. ఈ విధంగా ఆరణ్యపర్వం విభజించబడి ప్రచురించటం తెలుగులో ఇది ప్రథమం. నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ సంపుటాలుగా విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ పర్వాలు వెలువడ్డాయి. తొమ్మిదవ సంపుటిగా శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు వెలశాయి. పదవసంపుటిగా శాంతిపర్వం రెండు భాగాలలో వెలువడింది. పదకొండవ సంపుటిగా ఈ ఆనుశాసనిక పర్వం వెలువరించటం జరుగుతున్నది.

ఆనుశాసనిక పర్వంలోని మొదటి రెండాశ్వాసాలకూ వ్యాఖ్యానం రచించారు ప్రసిద్ధ విమర్శకులూ కవులూ అయిన డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు, తృతీయ చతుర్థాశ్వాసాలకు వ్యాఖ్యను సంతరించారు ప్రసిద్ధ సాహిత్యాచార్యులు డాక్టర్ శలాక రఘునాథశర్మగారు, పంచమాశ్వాసానికి వ్యాఖ్య రచించిన వారు ప్రసిద్ధ పరిశోధకులు, కవులు

డాక్టర్ యం.కులశేఖరరావుగారూ,

ప్రముఖ కవులూ, విద్వన్మణులూ శ్రీ ముదివర్తి కొండమాచార్యులుగారు. ఈ పర్వానికి సంపాదకుడుగా నేను పీఠికను సంతరించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తున్నాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు, విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారికి, శ్రీ సత్యరామ్ ప్రసాదుగారికి, శ్రీ జి.రాధాకృష్ణగారికి, శ్రీమతులు సుశీలా, లక్ష్మీవిద్యానాథులకూ, డాక్టర్ వి.యన్.లక్ష్మికీ నా కృతజ్ఞతలు.

పరమ కల్యాణభద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరస్వామి వేదవేద్యులు, వేదాంతగమ్యులు, పరతత్త్వరూపులు. అయినా భక్తసులభులు, సాహిత్య సంగీత కళాప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ, వ్యాఖ్యానం సుగంధ పరిమళసేవ; విశేషాంశాలు ఉజ్జ్వలాలంకారసేవ; పీఠిక ఆ విరాణ్మూర్తికి మంగళ నీరాజనసేవ, ఈ పర్వం శ్రీ స్వామివారికి సారస్వతమైన అక్షరార్చన.

సత్య శివ సుందర రూపులైన శ్రీ స్వామివారి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యాన సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజకు సుమమంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని స్వామివారిని వేడుకొంటున్నాను.

హైదరాబాదు

15-8-2005

ప్రధాన సంపాదకుడు

కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానం.

# ఆనుశాసనిక పర్వ కథాసారం

**ప్రశ్నోత్తర మాలిక:**

ధర్మరాజు భక్తి వినయాలతో అడుగుతూ ఉండగా భీష్ముడు అతడి ప్రశ్నలకు తగిన సమాధానాలు ఈయనారంభించాడు.

ధర్మరాజు :

ప్రశ్న 1 : పితామహా! మునులు కూడా గౌరవించే పుణ్యామూర్తివి నీవు. ఎన్నో నీతులను, ధర్మాలను దయతో నాకు బోధించావు. అయినా నాకు శాంతి కలగలేదు. పట్టుదలతో చుట్టాలను పక్కాలను చంపుకొన్నాను. నీపై కోపంతో క్రూరకర్మ చేసి నిన్ను పడగొట్టాను. ఈ రెండూ నా మనస్సును తీవ్రంగా బాధిస్తున్నాయి. లోభి అయిన దుర్యోధనుడు రాజ్యం పంచుకొని అనుభవించటానికి అంగీకరించలేదు. నేను కూడా కోపం మాని అతడిని రాజ్యం అనుభవించనీయలేదు. మా ఇద్దరివలన ఇంతటి కీడు పుట్టింది. ఏ విధంగా కూడా నాకు పశ్చాత్తాపం తప్పటంలేదు.

భీష్ముడు : ధర్మరాజా! చంపటానికి మనుజుడు కర్త కాడు. దీనికి ఉదాహరణగా ఒక ఇతిహాసం చెప్పుతాను వినుము. గౌతమి అనే పేరుగల బ్రాహ్మణ వనిత ఉండేది. ఆమె శాంత స్వభావురాలు. ఆమె కొడుకు విధివశాన పాము కరిచి చనిపోయాడు. ఆమె దుఃఖిస్తూ ఉండగా, ఒక కిరాతుడు పామును తాడుతో కట్టి తెచ్చి దాని తలను నరకబోయాడు. గౌతమి అతడిని వారించింది. 'విధి వశాన పాము కరిచింది. దీనికి అల్పులు బాధపడతారు. పామును చంపితే బిడ్డ బ్రతుకుతాడా?' అని వారించింది. అర్జునకుడు అనే ఆ బోయవాడిని పేరుకు తగినట్లు ప్రవర్తించుమన్నది. శత్రువునైనా తనచేత చిక్కినప్పుడు చంపటం న్యాయం కాదన్నది. కిరాతుడు ఆమె మాటలను అంగీకరించలేదు. క్రూరజంతువును చంపటం పాపం కాదని వాదించాడు. ఆ మాటలు విన్న పాము 'తాను మృత్యుదేవత పంపగా వచ్చిన సాధనమే కాని స్వయంగా కర్తను కా'నని వాదించింది. అంతలో మృత్యువు అక్కడికి వచ్చి తనను యముడు పంపగా వచ్చాననీ, బాలుడి చావుకు తాను కారణం కాననీ పేర్కొన్నది. కాని, బోయవాడు వారిద్దరూ పాపానికి వశమైన మనస్సుతో వ్యవహరించారు కాబట్టి బాలుడి మరణానికి వారే బాధ్యులని వాదించాడు. అంతలో యమధర్మరాజు అక్కడికి వచ్చి బోయవాడితో ఇట్లా అన్నాడు. 'నేనూ, పామూ, మృత్యువూ ఈ బాలుడి చావుకు కారణాలు కాము. అతడి కర్మయే దానికి కారణం. జీవుడు తన కర్మఫలాన్ని తప్పించుకొనలేడు. కాబట్టి పామును వదలిపెట్టుము, అన్నాడు. కిరాతుడికి జ్ఞానోదయమై పామును వదలి పెట్టాడు.

కాబట్టి ధర్మరాజా! నీవూ దుఃఖాన్ని వదలిపెట్టుము. యుద్ధంలో బంధువులు మరణించటానికి కారణం వారి కర్మలే కాని నీవు కాని, దుర్యోధనుడు కాని కాదు. ఈ సత్యం తెలిసికొని శాంతిని పొందుము.

ప్రశ్న 2 : గృహస్థాశ్రమంలో ఉండికూడా మృత్యుభయం పోగొట్టుకొనవచ్చునా ?

ఉత్తరం : ధర్మానికి స్థిరంగా నిలబడగలిగితే గృహస్థుడు ముక్తిని పొందగలడు. దీనికి ఒక కథ చెప్పుతాను వినుము. పూర్వం మనువంశంలో దుర్యోధనుడు అనే అందమైన రాజు ఉండేవాడు. అతడి సౌందర్యాన్ని చూచి

నర్మదానది మోహించి స్త్రీ రూపం తాల్చి వివాహమాడింది. వారిరువురికీ సుదర్శన అనే సుందరాంగి పుట్టింది. ఆ రాజు ఆ కన్యను అగ్ని సేవకు నియోగించాడు. అగ్నిదేవుడు ఆ కన్య సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను కోరాడు. ఆమె పెద్దల నడిగి తనను వివాహమాడుమని చెప్పింది. దుర్యోధనుడు ఒక మహాయజ్ఞం చేస్తూ విప్రులకు దానాలిచ్చే సందర్భంలో అగ్ని బ్రాహ్మణ వేషంతో సుదర్శనను తన కిచ్చి వివాహం చేయుమని రాజును కోరగా పేదబాపడికి కన్యనివ్వటానికి దుర్యోధనుడు ఇచ్చగించలేదు. దానితో అగ్ని కోపించి యజ్ఞంలో తన తేజస్సును ఉపసంహరించుకొన్నాడు. ఋత్విక్కులు దానికి భయపడి మంత్రాలను పఠించటం మొదలుపెట్టారు. అగ్ని తన మనసులోని మాటను వారికి చెప్పాడు. దుర్యోధనుడు సంతోషించి సుదర్శనను అగ్నిదేవుడి కిచ్చి వివాహం చేశాడు. అగ్ని సంతోషించి మరల తన తేజస్సును ప్రకాశింపజేసి యజ్ఞాన్ని సఫలం చేశాడు. వారిరువురికి సుదర్శనుడు అనే కొడుకు పుట్టాడు. అతడు పెద్దవాడై రాజ్యభారాన్ని వహించి నిర్వహించాడు. అతడికి ఓఘవంతుడు, అతడికి ఓఘరథుడు, ఓఘవతి అనే కొడుకు, కూతురు పుట్టారు. ఓఘవతిని సుదర్శనుడి కిచ్చి పెండ్లి చేశాడు. అతడు గృహస్థాశ్రమాన్ని పాటిస్తూ మృత్యువును జయించాలని నిశ్చయించాడు. ఓఘవతితో కలిసి కురుక్షేత్రంలో ఒక ఆశ్రమం కట్టుకొని నివసించాడు. అతిథిపూజను నిత్యవ్రతంగా స్వీకరించాడు. అతిథులు ఎవరి ఇంట్లో తమ కోరికలన్నీ తీర్చుకోగలుగుతారో ఆ యజమానుడూ, యజమానురాలూ కృతార్థులౌతారని ఆ దంపతులు విశ్వసించారు. అతిథి యజమానురాలిని కోరినా జుగుప్సపడకుండా అతడిని సంతోషపెట్టాలని నిశ్చయించారు. ఒకనాడు సుదర్శనుడు సమిధల కొరకు అడవికి పోగా ధర్మదేవత బ్రాహ్మణ రూపంలో అతిథి అయి వచ్చి ఆమెను కోరాడు. గృహస్థధర్మాలు అతడికి తెలియజెప్పినా అతడు ఆమెను వాంఛించాడు. భర్త నియమాన్ని మనస్సులో భావించి ఆమె అంగీకరించింది. అతిథి ఆమెను చాటుకు తీసుకొని వెళ్ళాడు. అంతలో సుదర్శనుడు వచ్చి భార్యను పిలిచాడు. ఆమె పలుకలేదు. ఆమె తనను సేవిస్తున్నదని అతిథి పలికాడు. త్రికరణశుద్ధిగా ఆమె చర్యకు సుదర్శనుడు హర్షించాడు. అప్పుడు ధర్మదేవత సంతోషించి, తన తేజోమయరూపాన్ని ప్రదర్శించి అతడిని ప్రశంసించాడు. ప్రతిజ్ఞకు లోపం జరిగితే చంపటానికి మృత్యువు వెన్నంటే ఉన్నదనీ, దానిని సుదర్శనుడు జయించాడనీ ధర్మదేవత ప్రకటించాడు. ఆ భార్యాభర్తలకు బొందితో స్వర్గాన్ని ప్రసాదించాడు. ఓఘవతి తన మనస్సులోని సగభాగంతో పుణ్యనదిగా ప్రవహిస్తుందనీ మిగిలిన సగంతో భర్తను సేవిస్తుందనీ అనుగ్రహించాడు. ధర్మరాజా! అతిథి పూజాధర్మంతో గృహస్థు మృత్యువును జయించవచ్చునని ఈ కథవలన తాత్పర్యం గ్రహించుము.

ప్రశ్న 3 : క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాల వారికి గుణ కర్మలతో బ్రాహ్మణత్వం సిద్ధిస్తుందా?

ఉత్తరం : బ్రాహ్మణత్వం కడు దుర్లభం. ఎన్నో జన్మల ఫలం. ఈ సంగతి 'ఇంద్ర మతంగ సంవాదం' అనే ఇతిహాసంవలన స్పష్టమౌతుంది. మతంగు డనే బ్రాహ్మణ బాలుడు తండ్రి పంపున ఒక యజ్ఞానికి పోతూ దారిలో ఒక గాడిద పిల్లను కర్రతో కొట్టాడు. అది బాధతో తల్లిగాడిదతో చెప్పింది. ఆ తల్లిగాడిద ఆ బాలుడిని 'చండాలుడా'! అని తిట్టింది. ఆ తిట్టుకు కారణ మడిగి తెలిసికొని తన తల్లికి ఒక మంగలివలన పుట్టినట్లు గ్రహించి, ఆ సంగతి తండ్రికి చెప్పి, తపస్సుచేత బ్రాహ్మణత్వాన్ని పొందుతానని చెప్పి ఇంద్రుడిని గురించి తపస్సు చేయ మొదలు పెట్టాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై బ్రాహ్మణత్వం ఇతర జాతులకు లభించేది కా దని చెప్పినా వినక మతంగుడు ఘోర తపస్సు చేయసాగాడు. ఎంత తపస్సు చేసినా శరీరం శుష్కించిందే కాని బ్రాహ్మణత్వం సిద్ధించలేదు.

ప్రశ్న 4 : విశ్వామిత్రు డెట్లా బ్రాహ్మణత్వాన్ని పొందగలిగాడు ?

ఉత్తరం : జహ్నుడి కులంలో గాధి జన్మించాడు. అతడి కూతురు సత్యవతి. ఆమెను భృగుకులంలో పుట్టిన ఋచీకుడు

భార్యగా నిమ్మని గాధిని కోరాడు. అతడికి ఇష్టం లేక ఒక చెవి నల్లగా ఉన్న వేయి తెల్లని గుర్రాలను శుల్కంగా అడిగాడు. ఋచీకుడు వరుణుడిని యాచించాడు. అతడు కరుణించి 'ఎక్కడ కోరితే అక్కడ అటువంటి గుర్రాలు పుట్టగల'వని వరమిచ్చాడు. అతడు గంగానది ఉత్తరతీరంలో నియమంతో సంకల్పించగా నేలనుండి వేయి గుర్రాలు పుట్టాయి. ఆ స్థలానికి అశ్వతీర్థమనే పేరు కలిగింది. ఋచీకుడు ఆ గుర్రాలను గాధికి శుల్కంగా సమర్పించాడు. గాధి సత్యవతి నిచ్చి అతడికి వెంటనే పెండ్లి చేశాడు. ఋచీకుడు సంతానం కావాలనుకొని భావించి బ్రాహ్మణత్వం గల కొడుకు నిచ్చే ఒక చరువును కల్పించాడు. బ్రాహ్మణ కుమారుడి నిచ్చే చరువును తన భార్యను, క్షత్రియత్వంగల కొడుకు నిచ్చే చరువును ఆమె తల్లిని తీసికొని ఋతుకాలంలో భార్యను మేడిచెట్టును, అత్తను రావిచెట్టును కౌగలించుకొనేటట్లు నిర్దేశించాడు. కాని, దైవవశాత్తు తల్లీకూతుళ్ళు వాటిని వ్యత్యాసంగా చేసి గర్భాలు తాల్చారు. దానిని గ్రహించిన ఋచీకుడు భార్యకు ఆ సంగతి తెలియచెప్పాడు. సత్యవతి దుఃఖించి తనకు బ్రాహ్మణత్వం గల కొడుకు కలిగేటట్లు వరమిమ్మని కోరింది. ఋచీకుడు దయామయుడై ఆమెకు బ్రాహ్మణుడు పుట్టుతాడనీ, అతడి కొడుకు రాజలక్షణాలు కలిగి ఉంటాడనీ వరమిచ్చాడు. దానివలన సత్యవతికి జమదగ్ని బ్రాహ్మణ తేజస్సుతో పుట్టాడు. అతడికి పరశురాముడు క్షత్రియ తేజస్సుతో కలిగాడు. గాధి భార్యకు విశ్వామిత్రుడు పుట్టాడు. చరుతరుగుణాల తారుమారువలన అతడిలో బ్రాహ్మణత్వ స్ఫురణ, తపశ్శక్తి ఎక్కువగా కలిగాయి.

ప్రశ్న 5 : వీతహవ్యుడనే రాజు బ్రాహ్మణత్వాన్ని పొందాడని వింటాం. ఆ సంగతి తెలుపుము.

ఉత్తరం : మను వంశజుడైన హైహయుడికి (ఇతడికే వీతశమ్యుడనే మరొక పేరుండేది) పదిమంది భార్యలవలన వందమంది వీరపుత్రులు పుట్టారు. వారందరు కలిసి కాశీరాజైన హర్యశ్వుడిని యుద్ధంలో చంపారు. ఆ తరువాత అతడి కొడుకు సుదేవుడినీ చంపారు. అతడి కొడుకు దివోదాసుపై కూడా దాడి చేసి ఓడించారు. అతడు భరద్వాజ మహర్షిని ఆశ్రయించి హైహయులనుండి తన వంశ రక్షణాన్ని కోరాడు. ఆ మహర్షి యజ్ఞంనుండి ప్రతర్దనుడు అనే పుత్రుడిని సృష్టించి రాజుకు ఇచ్చాడు. అతడు ఆ నూరుగురు హైహయులను చంపి వీతహవ్యుడి మీదకు పోయాడు. అతడు భయపడి భృగుమహర్షిని ఆశ్రయించాడు. అతడు తన ఆశ్రమంలోని శిష్యులలో ఆ రాజును దాచాడు. ప్రతర్దనుడు భృగుమహర్షి వద్దకు వెళ్ళి, వీతహవ్యుడిని తనకు వశం చేయుమని కోరాడు. అప్పుడు భృగుమహర్షి తన ఆశ్రమంలో అందరూ బ్రాహ్మణులే ఉన్నారని పలికాడు. ఆ మహర్షి మాటవలన వీతహవ్యుడు బ్రాహ్మణుడయ్యాడు. ప్రతర్దనుడు సంతోషించి వెళ్ళిపోయాడు. వీతహవ్యుడు అనేకమంది బ్రాహ్మణ పుత్రులను కన్నాడు. ఆ వంశానికి అతడే మూలపురుషు డయ్యాడు.

ప్రశ్న 6 : దైవం, పౌరుషం ఈ రెండింటిలో ఏది గొప్పది?

ఉత్తరం : పురుషకారం చేను, దైవం బీజం. ఈ రెండింటిని కలిపే ప్రయత్నం చేస్తే మానవుడు ఫలాన్ని పొందుతాడు. దైవం సహకరించకపోతే పురుషకారం ఫలం పొందలేదు. అగ్ని కొంచెమైనా గాలితో పెరిగి ప్రకాశించినట్లు మంచిపనులు చేయటంవలన దైవానుకూల్యం పెరుగుతుంది. నేయి తగ్గిపోతే దీపకాంతి తగ్గినట్లే పురుషకారంలో పవిత్రత లోపిస్తే దైవానుకూల్యం కూడా లోపిస్తుంది. కాబట్టి దైవ పౌరుషాలు రెండూ సమానమే.

ప్రశ్న 7 : సత్కర్మవలన కలిగే ఫలాలు ఎట్లా ఉంటాయి?

ఉత్తరం : సత్కర్మలకూ, దుష్కర్మలకూ తగిన సమయాలలో వాటికి తగిన ఫలితాలు కలుగుతాయి. లోకానురక్తులకు పాప పుణ్య కర్మలు దుఃఖాన్ని కలిగిస్తాయి. విరక్తులకు ఆ ఫలాలు కలుగవు.

ప్రశ్న 8 : తమ జీవితాలకు ఆధారమైన యజమాని పట్ల ఆశ్రితులు ఎట్లా నడచుకొనాలి ?

ఉత్తరం : తనను కాపాడిన యజమాని ఆశ్రితులు రక్షిస్తారు. ఉదాహరణకు ఒక కథ. కాశీదేశంలో ఒక వేటగాడు విషబాణాన్ని ఒక లేడిపై ప్రయోగించగా అది గురితప్పి ఒక ఫలవృక్షాన్ని తాకింది. దాని ప్రభావం వలన ఆ చెట్టు ఎండిపోయింది. ఆ చెట్టు తొర్రలో ఒక చిలుక నివసిస్తూ ఉన్నది. ఎండిపోయిన చెట్టును వీడిపోకుండా చిలుక ఆ చెట్టుతొర్రలోనే ఉండసాగింది. ఇంద్రుడు ఆ చిలుకను మరొక ఫలవృక్షాన్ని ఆశ్రయించుమని సలహా ఇచ్చాడు. కాని, చిలుక 'చెట్టు పండినపుడు ఉండటం, ఎండినపుడు విడిపోవటం కృతఘ్నత కదా' అని సమాధానం చెప్పింది. ఇంద్రుడు సంతోషించి చిలుకను వరం కోరుకొను మన్నాడు. వెంటనే చిలుక 'స్వామీ! ఈ చెట్టుకు పూర్వవైభవాన్ని అనుగ్రహించుము' అని కోరింది. ఆ విధంగా ఆశ్రితురాలివలన ఆ చెట్టుకు మేలు జరిగింది. ఇది ఆశ్రిత లక్షణం.

ప్రశ్న 9 : యజమానులు ఆశ్రితులలో ఎవరిని ఎట్లా ఆదరించాలి ?

ఉత్తరం : రాజు బ్రాహ్మణుడిని కొడుకువలె కాపాడాలి. గురువువలె గౌరవించాలి. అగ్నివలె పూజించాలి. అతడిని అవమానిస్తే ఆపద కలుగుతుంది. వ్యాసమహర్షి శల్యుడితో జ్ఞానాలలో ఉత్తమ జ్ఞానమేది? అనే అంశాన్ని వివరిస్తూ యజ్ఞమూర్తి విష్ణువు, అతడిని తెలియటమే ఉత్తమ జ్ఞానం. ఆ విష్ణువే శ్రీకృష్ణుడు. ఆశ్రితుడైన శ్రీకృష్ణుడే నీవు ఆశ్రయించదగిన పరమజ్ఞానమని తెలియటం ఉత్తమ జ్ఞానం. అదియే బ్రాహ్మణత్వ సిద్ధికి ఫలం అని చెప్పాడు.

ప్రశ్న 10 : గరుత్మంతుడు మహాత్ముడని విన్నాను. అతడి కథను చెప్పుము.

ఉత్తరం : భీష్ముడు శ్రీకృష్ణుడిని చూచి 'స్వామీ! నీవు ఆ గరుత్మంతుడవని విన్నాను' అన్నాడు. శ్రీకృష్ణుడు నవ్వి అడుగుతున్న ఆ రాజు కోర్కెను తీర్చుమని' అన్నాడు. భీష్ముడు చెప్పటం ప్రారంభించాడు.

కశ్యప ప్రజాపతికి కద్రువ, వినత అనేవారు ఇద్దరు భార్యలు. భర్త వలన కద్రువ వేయిమందినీ, వినత ఇద్దరినీ కొడుకులను వరాలుగా పొందారు. 1500 సంవత్సరాలు గడచిన తరువాత కద్రువ పెట్టిన గ్రుడ్లనుండి వేయి పాములు పుట్టాయి. వినత గ్రుడ్లు పిగలలేదు. ఆమె అసూయతో ఒక గ్రుడ్డును పగులగొట్టింది. అందులోనుండి సగం శరీరం గల అరుణుడు పుట్టి, తల్లి తొందరపాటుకు కోపించి, ఆమె కద్రువకు దాసి అయ్యేటట్లు శపించాడు. ఆ తరువాత అయిదువేల సంవత్సరాలకు రెండవ అండం నుండి మహా బలవంతుడు పుట్టి, తల్లికి దాస్యవిముక్తి చేస్తాడని అనుగ్రహించాడు. గరుత్మంతుడు మహాబలశాలిగా పుట్టి స్వేచ్ఛగా అంతరిక్షంలో తిరుగుతూ బ్రహ్మ సూచించిన ఆహారాన్ని గ్రహిస్తూ ఉన్నాడు. అరుణుడు సూర్యుడిని సేవించటానికి వెళ్ళాడు.

ఒకనాడు కద్రూ వినతలు విహారార్థం సముద్రతీరానికి పోయి అక్కడ ఉచ్చైశ్రవాన్ని చూచారు. ధవళకాంతులతో వెలుగొందుతున్న ఆ ఇంద్రాశ్వాన్ని చూచి వినత ఆశ్చర్యాన్ని ప్రదర్శించింది. కద్రువ ఆ గుర్రం తోక నల్లగా ఉన్నది కదా! అని అన్నది. వినత దానికి అంగీకరించలేదు. తోక నల్లగా ఉంటే వినత కద్రువకు దాస్యం చేసేటట్లు పందెం వేసికొన్నారు. ఆనాడు పతిసేవకు సమయం కావటంతో ఇంటికి వెళ్ళి, మరునాడు ఉదయం వచ్చి సత్యాసత్యాలు నిరూపించుకొనాలని నిశ్చయించుకొన్నారు. ఆ రాత్రి కద్రువ కుటిలబుద్ధితో తన కొడుకులతో కుతంత్రం చేసింది. కొడుకులను తోకకు వ్రేలాడి అది నల్లగా తోచేట్లు చేయండని అడిగింది. చాలామంది అది అన్యాయమని భావించి తల్లి ఆనతిని తిరస్కరించారు. వారిని జనమేజయుడు చేయబోయే

సర్పయాగంలో హతులయ్యేట్లు కద్రువ నిర్దాక్షిణ్యంగా శపించింది. ఆ శాపానికి భయపడిన కొందరు నాగులు తల్లి మాటను పాటించి ఉచ్చైశ్రృవ వాలానికి నల్లగా వ్రేలాడి నిలిచారు. వినత కద్రువకు దాసిగా ఉండవలసి వచ్చింది. సవతిని హీనంగా చూస్తూ దాస్య వృత్తిని చేయించుకొనేది కద్రువ. వినత గరుత్మంతుడివలన తనకు దాస్య విముక్తి కలుగుతుందని ఆశతో కాలం గడపసాగింది.

ఒకనాడు నారదుడివలన ప్రబోధితుడై గరుత్మంతుడు మాతృదాస్యాన్ని తొలగించటానికి పూనుకొని కద్రువ వద్దకు వచ్చి వేడుకొన్నాడు. అమృతాన్ని తెచ్చి మాతృదాస్య విముక్తి చేసికొమ్మని కద్రువ గరుత్మంతుడిని ఆజ్ఞాపించింది. అమృతాన్ని తెస్తానని శపథం చేసి గరుత్మంతుడు వెంటనే కశ్యప ప్రజాపతి వద్దకు వెళ్ళి ఉపాయాన్ని కోరుకొన్నాడు.

ఇంద్రుడు అమృతాన్ని భద్రంగా రక్షిస్తుంటాడు. జలం మధ్య అగ్ని మండుతూ ఉండగా తీవ్రమైన ఆయుధాలతో భయంకర రాక్షసులు రక్షిస్తుండగా ఇనుప వలలో అమృతం సురక్షితంగా ఉంటుంది. దానిని సాధించటం దేవతలకైనా సాధ్యం కాదు. దానిని సాధించాలంటే గరుత్మంతుడు తూర్పు సముద్రం చెంత ఉండే మహా పర్వతం మీద రెండు మహా గజ కచ్ఛపాలున్నాయి. ఆ రెండూ పూర్వకాలంలో మధుకైటభులు. పరస్పరం ఘర్షణపడుతుంటాయి. ఆ సందర్భంలో ఆ రెండింటినీ పట్టి భక్షిస్తే కలిగే బలంవలన గరుత్మంతుడు అమృతాన్ని హరించగలడని కశ్యపుడు సూచించాడు. గరుత్మంతుడు తన వాడి గోళ్ళతో ఆ గజ కచ్ఛపాలను పట్టి ఆకాశానికి ఎగిరి, ఐదు యోజనాల పొడవున ఉన్న ఒక మహావృక్షశాఖ మీద వాలాడు. ఆ బరువుకు ఆ కొమ్మ విరిగింది. ఆ కొమ్మ మీద మహామునులు తపస్సు చేసుకుంటున్నారు. అందువలన ఆ కొమ్మ కిందపడకుండా ముక్కుతో పట్టుకొని గరుత్మంతుడు ఎగిరాడు. మునులు ఆ మహాత్ముడి మహిమను చూచి కొమ్మనుండి దిగిపోయారు. ఆ కొమ్మను దురాచారంతో అపవిత్రమైన కులింద దేశ సముద్ర ప్రాంతంతో వదలుమని చెప్పారు. గరుత్మంతు డాపని చేసి, ఒక మహాగిరి శిఖరం మీద విశాల ప్రాంతంలో గజకచ్ఛపాలను భక్షించి మహాబలోపేతుడై అమృతమున్న స్థానానికి చేరాడు. దానిచుట్టూ మండుతున్న అగ్నిని దాటటానికి ఉపాయం కొరకు బ్రహ్మను ఆశ్రయించాడు. కొండంత వెన్నను అగ్నిపై ఉంచుమని పితామహుడు ఉపాయం చెప్పాడు. సప్రయత్నంగా వెన్నను సంపాదించి అగ్నిపై ఉంచి దాని ఉద్ధృతి తగ్గటంతో అమృతభాండంపై లంఘించాడు. ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించినా అది విఫలమై పోవటంతో అతడు విముఖుడయ్యాడు. గరుత్మంతుడు అమృతాన్ని తెచ్చి కద్రువ ముందుపెట్టి తల్లి దాస్యానికి విముక్తి కలిగించాడు. అమృతం తేవటమే నియమం కాబట్టి తెచ్చి కద్రువకు చూపించి, మరల ఆ అమృతాన్ని ఇంద్రుడికి ఒప్పగించి గరుత్మంతుడు దేవతల మన్ననలను పొందాడు. పాములపై పగ సాధించాడు. ఇంద్రుడు గరుత్మంతుడిని సాక్షాద్ విష్ణువుగా కీర్తించి, భవిష్యత్కాలంలో యదువంశంలో శ్రీకృష్ణుడుగా అవతరించి లోకకల్యాణం నిర్వహిస్తాడని ప్రకటించాడు. ధర్మరాజా! ఈ గరుత్మంతుడి కథ ముక్తికి సోపానం. నీవు విని ధన్యుడవైనావు.

ప్రశ్న 11 : బ్రాహ్మణుడికి ఏదైనా ఇస్తానని మాట ఇచ్చి ఇవ్వనివాడు ఏ గతి పొందుతాడు?

ఉత్తరం : పూర్వజన్మలో బ్రాహ్మణుడికి ఇస్తానన్నది ఇవ్వకపోవటంవలన నక్కగా పుట్టి పీనుగు మాంసం తినే గతి పట్టిన నక్క కోతి కథనం భీష్ముడు వినిపించాడు.

ప్రశ్న 12 : గొప్పగుణాలున్న హీనవర్ణుడికి మంత్ర తంత్రాదులు బోధించటం ధర్మమా? కాదా?

ఉత్తరం : బ్రాహ్మణుడు మూడు కులాలవారికి మాత్రమే పరీక్షించి మంత్ర తంత్రాదులు చెప్పాలని ఒక కథ భీష్ముడు తెలిపాడు.

ప్రశ్న 13 : లక్ష్మీదేవి ఎక్కడెక్కడ నివసిస్తుందో తెలుపుము.

ఉత్తరం : ఒకసారి లక్ష్మీదేవి రుక్మిణీదేవితో తన నివాస స్థానాలను గురించి ఇట్లా చెప్పింది. నిత్యసత్యులు, శౌచనిరతులు, గురుభక్తులు, అప్రమత్తులు, దక్షులు, నిర్మలమతులు, సత్కర్మపరులు, విజ్ఞానం, తపం, దానం, బ్రహ్మచర్యం, శమం మొదలైన గుణాలు కలవారు లక్ష్మీ నివాసస్థానాలు. క్రూరులు, నాస్తికులు, కృతఘ్నులు, దుష్టబుద్ధుల పాలిట లక్ష్మి ఉండదు. గృహనీతి గల స్త్రీలయందు లక్ష్మి ఉంటుంది. పతి వ్యతిరేకులు, కఠిన చిత్తులు, అధిక నిద్రాసక్తలు అయిన స్త్రీలయందు లక్ష్మి ఉండదు. సరస్సులలో, పూల తోటలలో లక్ష్మి నివసిస్తుంది.

ప్రశ్న 14 : స్త్రీ పురుషుల రతిలో ఎవరికి ఎక్కువ సుఖ ముంటుంది?

ఉత్తరం భంగాస్వనుడు అనే రాజు ఇంద్రుడికి ఇష్టం లేని యజ్ఞం చేసి నూరుగురు కొడుకులను పొందాడు. అతడు ఒకసారి వేటకు వెళ్ళినపుడు ఒక కొలనులో దిగి నీరు త్రాగి స్త్రీగా మారిపోయాడు. ఆశ్చర్యంతో అతడు నగరానికి తిరిగి వచ్చి, మంత్రులకు, బంధువులకు జరిగింది తెలియచెప్పి, కొడుకులకు రాజ్యం కట్టబెట్టి, అతడు అడవికి వెళ్ళి మునులతో కలిసి నివసించాడు. స్త్రీ రూపంలో ఉన్న అతడిని ఒక ముని ప్రేమించి వరుసగా ఆమెయందు నూరుగురు కొడుకులను పొందాడు. రాజు ఆ కొడుకులను కూడా పూర్వ పుత్రులతో చేర్చి, రాజ్యసుఖాలను కలిగించాడు. ఇంద్రుడు ఆ శుభ పరిణామాలకు అసూయపడి రాకుమారుల నడుమ కలతలు రేపి, వారిని యుద్ధంలో చనిపోయేటట్లు చేశాడు. స్త్రీ రూపంలో ఉన్న ఆ రాజు రోదించాడు. ఇంద్రుడు కరుణించి కొందరు కొడుకులను బ్రతికిస్తానన్నాడు. స్త్రీ రూపంలో ఉన్న ఆ రాజు తాను స్త్రీగా ఉన్నప్పుడు కలిగిన కొడుకులను బ్రతికించుమని కోరాడు. ఇంద్రుడు దానికి కారణమడిగాడు. తల్లికి బిడ్డల మీద ప్రేమ ఎక్కువ అని అతడు సమాధానం చెప్పాడు. ఇంద్రుడు సంతోషించి అతడికి పోయిన మగతనాన్ని కూడా ఇస్తానన్నాడు. అప్పుడు ఆ రాజు తనను స్త్రీగానే ఉండనిమ్మని ఇంద్రుడిని కోరాడు. దానికి ఇంద్రుడు ఆశ్చర్యపడి కారణం అడుగగా 'రతిలో పురుషులకంటె స్త్రీలకు సుఖమెక్కువ కాబట్టి నేను స్త్రీగానే ఉండి సుఖించాలని కోరుకొంటున్నాను' అని అన్నాడు. ధర్మజా! ఈ తాత్పర్యం తెలిసికొమ్ము.

ప్రశ్న 15 : సంసార చక్రంలో పడి తిరుగకుండా ముక్తిని కలిగించే విష్ణుభక్తిని బోధించుము.

ఉత్తరం : శాశ్వత సుఖం పేరే మోక్షం. అదే నిర్వాణం. పురుషాతీతంగా ప్రకృతి ఉంటుంది. దానిని నిరూపించటం కష్టం. అదే సంసార చక్రం. దానిని త్రోసివేయటమే మోక్షం. అది పొందాలంటే కామక్రోధాలను జయించి మనస్సును సత్త్వగుణ భరితం చేసికొనుము. అదే వైష్ణవ ధర్మం. దానిని అనుసరించి సంసార భయాన్ని జయించుము.

ప్రశ్న 16 : ఆధ్యాత్మికం, అధిదైవం, అధిభూతం అనే మూడు తత్త్వాలకు ఆధారమై, వాటిలో తానూ జీవిస్తూ కర్తా, భర్తా, హర్తా అయిన భగవంతుడిని గురించి చెప్పుము.

ఉత్తరం : సనత్సుజాతుడు నారదుడికి చెప్పిన తత్త్వసారం వినుము. అవ్యక్తమైన విష్ణువు తన స్వరూపంతో తానుంటాడు. అతడు పదివేల యుగాలు నిద్రపోయి లేచి బ్రహ్మను సృష్టించి దాని కతడిని భర్తగా నియమించాడు. అతడు అహంకారాన్ని పొంది పంచభూతాలనూ, గుణాలనూ సృష్టించాడు. వాటన్నిటిలో అహంకారం వ్యాపించి ఉంటుంది. అవన్నీ అవ్యక్త సముద్రంలో మునిగి తేలుతూ ఉంటాయి. ఈ సమస్త సృష్టి స్థితి లయాలకు ప్రభువై విష్ణుమూర్తి శుభాశుభాలను కల్పిస్తూ ఈ సంసార చక్రాన్ని త్రిప్పుతూ వినోదిస్తూ ఉంటాడు. ఆధ్యాత్మమంటే అనుభవించే జీవుడు. తాను ద్రష్ట చూచేవాడు. అధిభూతమంటే ద్రష్ట - అనుభవించే పరార్థ సృష్టిలోని గుణం దృశ్యం.

అధిదేవత అంటే దృక్కు. చూచే శక్తి తేజస్సు. ఈ కెరటాలు వ్యక్తమయ్యే దానిని సృష్టి అంటారు. పంచభూతాలే దేవతలు. వాటి గుణాలే అధిభూతం. అనుభవించే నేనే అధ్యాత్మంగా చెప్పబడుతున్నాము.

ప్రశ్న 17: నియమంతో అగ్నులను తమలో ఆవహింపజేసికొని మహాత్ములు పరమాత్ముడిని ఎట్లాంటి వాడినిగా భావిస్తారు?

ఉత్తరం : గరుత్మంతుడికి విష్ణువు తన తత్త్వాన్ని ఇట్లా బోధించాడు. నా స్వరూపం దేవతలకూ తెలియదు. సమస్తం నాలో పుట్టి, జీవించి, మరణించినా నేనా సంసార చక్రంలో బంధితుడను కాను. కాని, వాటికి లోబడి అన్నింటిలోనూ ఉంటాను. నా తత్త్వం జడులు కానివారూ, అహింసా ప్రవృత్తి కలవారూ, కామం లేనివారూ, అహంకారం లేనివారూ, దానంగా దేనినీ స్వీకరించనివారూ, కోపం లేనివారూ, స్వచ్ఛమైన జ్ఞానం కలవారూ, నిత్యతృప్తులూ, శాంతీ, భక్తీ కలవారూ, నిష్ఠ కలవారూ, తమలో అగ్నిని సన్నిహితం చేసికొంటే నన్ను పొందగలరు. రజస్తమస్సులతో మలినం కాని కేవల సత్త్వగుణాన్నే స్థిరంగా చేసికొన్న జ్ఞానంతో నన్ను ధ్యానించటమే ముక్తిమార్గం. నానా విధాలైన సంకల్పాలు, యజ్ఞాలు, విడిచిపెట్టి ఆత్మలో అగ్నిని ప్రతిష్ఠించుకొని విరక్తుడై విష్ణువులో మనస్సును లయం చేసినవాడు ముక్తిని పొందుతాడు.'

ప్రశ్న 18 : కన్యాదానానికి ఎట్లాంటి వరుడు కావాలి?

ఉత్తరం : దీనికి ఒక ఇతిహాసం చెప్పుతాను వినుము. వదాన్యుడనే మునికి సుప్రభ అనే కుమార్తె ఉన్నది. అష్టావక్రుడు ఆమెను వివాహమాడగోరి వదాన్యుడిని అడిగాడు. ఆయన రూపగుణవర్తనాలలో యోగ్యుడైన అష్టావక్రుడికి కూతురి నిస్తానని మాట ఇచ్చి, అతడిని ఉత్తరదిశగా పయనించి పార్వతి శివుడికొరకు తపస్సు చేసిన ప్రాంతం దాటి కదంబవనంలో ప్రవేశించి, అక్కడ నివసించే ఒక పవిత్ర ప్రౌఢ వనితను దర్శించి తిరిగి రమ్మని కోరాడు. ఆ వెంటనే వివాహం చేస్తానన్నాడు. అష్టావక్రుడు దానికి అంగీకరించి ఆ రాత్రి బాహుదానదీతీరంలో ఆగి, మరునాడు కుబేర నగరానికి పోయి ఆయన కల్పించిన వినోదాలను వీక్షిస్తూ నిశ్చల మనస్సుతో ఏడాది గడపి, ఈశ్వరుడి క్రీడా క్షేత్రాలను దర్శించి, కడిమి చెట్ల వనం చేరి బంగారు మేడలో నివసించే ఒక పవిత్ర వనితను దర్శించాడు. ఆమె అతడికి ఎన్నో అతిథి సత్కారాలను చేసింది. రాత్రి శయ్యపై అతడితో శయనించి భోగించుమని కోరింది. అష్టావక్రుడు తనను తాకకుండా ఉంటే ఉంటానని లేకపోతే వెంటనే వెళ్ళిపోతానని అంటాడు. ఆ రోజు మిన్నకుండి మరునాడు రాత్రి మరల అతడిని కోరింది. అష్టావక్రుడు ఇట్లా అన్నాడు. స్త్రీని పసితనంలో తండ్రి, వివాహమైన తరువాత భర్త, ముసలితనంలో కొడుకు రక్షిస్తారు తప్ప ఆమె స్వతంత్రంగా ఏమీ చేయతగదు కాబట్టి నిన్ను నేను స్వీకరించను' అన్నాడు. ఆమె ఎన్ని విలాసాలు ప్రదర్శించినా చలించలేదు. అప్పు డామె సంతోషించి, తాను ఉత్తరదిశా కన్యనని, వదాన్యుడి ఆనతితో అతడిని పరీక్షించానని చెప్పి అభినందించి పంపింది. అష్టావక్రుడు తిరిగి వచ్చి వదాన్యుడి అభినందనలతో పాటు, సుప్రభను భార్యగా పొంది సుఖించాడు. కాబట్టి కన్యాదానానికి అర్హుడు ఉత్తమ బ్రహ్మచారి.

ప్రశ్న 19 : మునులవలన శూద్ర స్త్రీలకు కలిగిన వారు బ్రహ్మర్షులు ఎట్లా ఔతారు? ఆ రహస్యం తెలుపుము.

ఉత్తరం : మునులకు, రాజులకు కలిగిన సంతానం బీజ ప్రధానమే. వసిష్ఠుడు, ఋశ్యశృంగుడు, అగస్త్యుడు, వ్యాసమహర్షి, మందపాలుడి సంతానం, ద్రోణుడు, కృపుడు మొదలైనవారు దీనికి ఉదాహరణప్రాయులు.

ప్రశ్న 20 : బ్రాహ్మణుడు దాన యోగ్యుడు కావటం అతడి వృత్తి వలననా లేక విరక్తుడై బ్రతకటం వలననా?

ఉత్తరం : తన కులానికి తగిన ఆచార వ్యవహారాలతో బ్రతుకుతూ, మనస్సులో సర్వ బాహ్య చిహ్నాలకు అతీతుడైతే అతడు దానయోగ్యుడు.

ప్రశ్న 21 : శ్రద్ధతో జను లిచ్చే భూరిదానాలు పాపం పొందవు కదా?

ఉత్తరం : పవిత్రులు, శ్రద్ధకలవారు, ఆదరంతో చేసిన దానం పాపపరిహారం చేస్తుందే కాని పాపం కలిగించదు.

ప్రశ్న 22 : దేవ పితృ కార్యాలలో బ్రాహ్మణుడిని పరీక్ష చేసికొని దానాదు లివ్వాలా?

ఉత్తరం : అవును.

ప్రశ్న 23 : అపూర్వమైన దైవ సంబంధం గల పండితులు, సోమయాజులు, తపస్వులు - వీరిలో ఎవరు దానయోగ్యులు?

ఉత్తరం : అందరూ దానయోగ్యులే. ఎవడు ధర్మపన్నాలు చెప్పుతూ వాటిని ఆచరించడో వాడు అయోగ్యుడు. అతడికి దానమిస్తే నరకమే ఫలం.

ప్రశ్న 24 : ధర్మార్థ కామాలను ఆచరించే కాలాలు ఏవి ?

ఉత్తరం : అర్థం తెల్లవారు జామున, ధర్మం పగటివేళ, రాత్రివేళ కామం ఆచరించాలి. అర్థ కామాలపై ఆసక్తి మంచిది కాదు. ధర్మాచరణ శ్రేష్ఠం.

ప్రశ్న 25 : దానయోగ్యు లెవరు ?

ఉత్తరం : ధర్మం చేసేవారు, కోపం లేనివారు, సత్యం పలికేవారు, దాంతులు, ధీరులు, నిజకర్మలు చేసేవారు, ఇంద్రియ నిగ్రహం కలవారు, భూతదయ కలవారు, లోభం లేనివారు, శుచులు, దానయోగ్యులు, వేదవేదాంగాలు చదివి షట్కర్మలు చేసే బ్రాహ్మణులు, మేధాశక్తి, ఉత్తమశీలం, ప్రవర్తన కలవారు దానయోగ్యులు.

ప్రశ్న 26 : దేవ పితృ మనుష్య పూజల కాలాలను తెలుపుము.

ఉత్తరం : ఉదయం దేవతలను, సాయంకాలం పితృదేవతలను, మధ్యాహ్నం మనుష్యులను పూజించాలి.

ప్రశ్న 27 : దైవ, పితృ కార్యాలలో దానం ఇవ్వటానికి ఉత్తమ యోగ్యులు ఎవరు?

ఉత్తరం : భోజనం పెట్టి తృప్తి పరిచేవాడు, దొంగలవలన అంతా పోగొట్టుకొన్నవాడు. వ్రతోద్యాపన కోరి యాచించేవాడు, గురువు, తల్లి, తండ్రి, భార్యా పుత్రులపై ఆధారపడి బ్రతికేవాడు, దీర్ఘవ్యాధిని పోగొట్టుకొనాలనుకొనేవాడు ఎప్పుడూ భిక్షాటనతో జీవించే పుణ్య బ్రాహ్మణుడు - ఈ ఆరుగురూ ఉత్తమ దానయోగ్యులు.

ప్రశ్న 28 : బ్రహ్మహత్యతో సమానమైన కర్మ లేవి ?

ఉత్తరం : దీనుడైన వేదబ్రాహ్మణుడిని ఆహ్వానించి అన్నం పెట్టకపోవటం, విప్రుడి జీవనాధారమైన వృత్తిని చెడగొట్టి వాడి నోరుకొట్టటం, నీరు త్రాగటానికి వచ్చిన ఆలమందలను తరిమి కొట్టటం, చెవిటి, కుంటి, గ్రుడ్డి వారి డబ్బు దొంగిలించటం, వేద శాస్త్రాదులను నిందించటం, కోపంతో నగరానికీ, ఊరికీ, తోటకూ నిప్పు పెట్టటం, పాపస్వభావంతో అబద్ధమాడి బ్రాహ్మణుడికి దుఃఖం కలిగించటం, యోగ్యుడైన వరుడికి పిల్లనీయకుండా ఉండటం బ్రహ్మహత్యతో సమానం.

ప్రశ్న 29 : పితామహా! పుణ్యతీర్థాల విశేషాలు చెప్పుము.

ఉత్తరం : భీష్ముడు పూర్వం అంగిరసుడు గౌతముడికి చెప్పిన పుణ్యతీర్థవిశేషాలను వివరించాడు. (చూడు. 2.79-90) కామక్రోధ విరహితమైన మనస్సుతో తీర్థాలను సేవించాలి. దూరదూర తీర్థాలను భక్తితో స్మరిస్తే చాలు పాపాలు తొలగిపోతాయి.

ప్రశ్న 30 : తాతా! ఏ ఊళ్ళు, కొండలు, ఏళ్ళూ మాహాత్మ్యం కలవో చెప్పుము.

ఉత్తరం : యోగి బ్రాహ్మణుడికి చెప్పిన గంగామాహాత్మ్యాన్ని భీష్ముడు వివరించాడు. (చూడు. 2.101-129) గంగ ఏ దేశంలో ప్రవహిస్తుందో ఆ దేశంలో ఉన్న ప్రతి వస్తువు పవిత్రమైనదే. గంగలో మునిగితే పాపాలన్నీ పోతాయి. దేవతలకు అమృతం ఎట్లాగో నరులకు నదులలో గంగనీరు అట్లాంటిది. గంగను చూడనివాడు గొడ్డుతో సమానుడు. సాగరులను స్వర్గానికి పంపిన గంగమాహాత్మ్యం స్మరణీయం. గంగ దివ్య గుణాలను లెక్కించటం సముద్రంలో నీటి బొట్లను లెక్కించటం వంటిది.

ప్రశ్న 31 : లోకంలో ఎవ్వరు సర్వజన పూజ్యులు ?

ఉత్తరం : వాసుదేవ నారద సంవాదం దీనికి చక్కని తార్కాణం. దాని తాత్పర్యమిది - వరుణాది దేవతలు, వేదవేత్తలు, తపోధనులు, ధనధాన్య భూములను గోవులను దానం చేసేవారు, అతిథి పూజాపరులు, పితృదేవతలను పూజించేవారు, భిక్షాన్నంతో తృప్తిపడే శాంతస్వభావులు, సత్యవ్రతులు, ధర్మార్థకామ సేవనులు, అహంకార మమకార రహితులు, వ్యామోహ రహితులు, సత్ప్రవర్తనులు, జ్ఞానులు - పూజించదగినవారు.

ప్రశ్న 32 : రాజులకు కర్తవ్యాలు ఎన్నో ఉంటాయి. వాటిలో ప్రధాన కృత్యం ఏమిటి?

ఉత్తరం : రాజ్యాభిషిక్తుడైన రాజు చేయదగిన ముఖ్య కర్తవ్యం బ్రాహ్మణ పూజ. పూజ పాపాలను తొలగిస్తుందని భూదేవి వాసుదేవుడికి చెప్పింది. ఆత్మోపాసనం, ధర్మబుద్ధితో పరబ్రహ్మను ఉపాసించటం బ్రాహ్మణధర్మ మని బ్రహ్మదేవుడు పేర్కొన్నాడు. విప్రసేవ కల్పవృక్ష సేవ వంటిది. శంబరాది రాక్షసులు బ్రాహ్మణ సేవవలన అధిక సంపదలు పొందారు.

ప్రశ్న 33 : అపూర్వులు, చిరకాలం నుండి ఆశ్రయించుకొన్నవారు, దూరంనుండి వచ్చినవారు - వీరిలో ఎవరు ఉత్తములు?

ఉత్తరం : ఈర్ష్యాసూయాదులు లేని స్నేహితులు, చుట్టాలు, ఋత్విజులు, పురోహితులు యోగ్యులు. విద్యావంతులూ ఆచారవంతులైతే దూరం నుండి వచ్చినవారుకూడా పూజార్హులే.

ప్రశ్న 34 : పాపాలన్నింటికి మూలం స్త్రీలంటారు నిజమేనా? వారిని ఎట్లా కాపాడుకొనాలి ?

ఉత్తరం : పూర్వం స్త్రీలు సాధువులై పవిత్రలై ఉండేవారు. వారి మనస్సులు పవిత్రంగా ఉండేవి. మాయామర్మాలు లేని ఆ రోజులలో పురుషులంతా కావలసినప్పుడు దైవత్వాన్ని పొందేవారు. స్త్రీ రక్షణను గురించి కథ చెప్పుతాను వినుము. దేవశర్మ అనే మునికి రుచి అనే పేరుగల భార్య ఉండేది. ఆమె అపూర్వ సౌందర్యవతి. ఇంద్రుడు ఆమెను పొందాలని ఉవ్విళ్ళూరుతుండేవాడు. దేవశర్మ రుచిని కాపాడుకొంటూ ఉండేవాడు. ఒకసారి దేవశర్మ ఒక యజ్ఞాన్ని నిర్వహించటానికి పోతూ తన భార్యను ఇంద్రుడి దృష్టినుండి రక్షించే బాధ్యత తన శిష్యుడైన విపులుడికి ఒప్పజెప్పాడు. విపులుడు తన యోగశక్తితో రుచిని ఆవహించాడు. విపులుడి ఆత్మ రుచిలో

ప్రవేశించింది. ఆమె చైతన్యం జడంగా మారింది. అప్పుడు ఇంద్రుడు సుందరరూపంతో ఆమెను సమీపించి ఆమెను వలపుమాటలతో వశం చేసికొనటానికి యత్నించాడు. అప్పుడు ఆమె శరీరంలో ఉన్న విపులుడు ఇంద్రుడిని 'నీవు ఇక్కడికి రావలసిన పని ఏమిటి?' అని ప్రశ్నించి, రుచిని సొమ్మసిల్లచేసి, తన ఆత్మను తన శరీరంలో ఉంచుకొని ఇంద్రుడిని ముఖాముఖి మందలించాడు. ఇంద్రుడు సిగ్గుపడి అదృశ్యుడయ్యాడు. తరువాత విపులుడు రుచిని మేల్కొల్పి, గురువు వచ్చిన తరువాత జరిగిన సంగతి తెలియచెప్పి, అతడివలన వరం పొంది తపస్సుకు వెళ్ళాడు. రుచి దేవశర్మలు సుఖంగా జీవించారు. పతివ్రతకూ దైవానికీ భేదం లేదు. సద్భార్యవలన పురుషుడికి పురుషార్థసిద్ధి కలుగుతుంది.

ప్రశ్న 35 : వధువును ఎన్నుకొనే పద్ధతిని తెలియపరచుము.

ఉత్తరం : కులం, శీలం, విద్య కలవాడిని పిలిచి ప్రీతితో కన్యనివ్వటం బ్రాహ్మవివాహం. కన్యా వరుడూ పరస్పరం కోరుకొని వివాహమాడటం క్షాత్రం.కన్నె తాను కోరుకొన్నవాడితో వివాహమాడటం గాంధర్వం. కట్నంతో చేసికొనేది ఆసురం. బంధువులను చంపి, కన్నెను బలవంతంగా ఎత్తుకొనిపోయి వివాహమాడటం రాక్షసం. ఈ అయిదు రకాలలో మొదటి మూడూ ధర్మవివాహాలు. మిగిలినవి ధర్మాలు కావు. బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్గాలలోని కన్యను వివాహం చేసికొనవచ్చును. శూద్ర స్త్రీ యందు సంతానం కనటం నిషేధం. రాజు క్షత్రియకన్యను, వైశ్యకన్యను శూద్రుడు శూద్రకన్యను, వైశ్యుడు వైశ్య శూద్ర కన్యలను వివాహమాడవచ్చును. బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహమాడవచ్చునని కొన్ని సందర్భాలలో చెప్పబడింది.

ప్రశ్న 36 : బ్రాహ్మణుడివలన నాలుగు వర్ణాల స్త్రీలకు సంతానం కలిగితే వారందరికి ఆస్తిపాస్తు లెట్లా పంచాలి? మిగిలిన వర్ణాలవారికి విభాగం ఎట్లా ఉంటుంది?

ఉత్తరం : బ్రాహ్మణుడి ఆస్తి 10 భాగాలు చేసి అందులో 4 పాళ్ళు బ్రాహ్మణస్త్రీవలన పుట్టినవాడికి, 3 పాళ్ళు క్షత్రియ సంతానానికి, 2 పాళ్ళు వైశ్యస్త్రీ సంతానానికి, 1 పాలు శూద్ర సంతానానికి ఇవ్వాలి. క్షత్రియుడి ఆస్తి 8 భాగాలు చేసి అందులో 4 భాగాలు క్షత్రియ స్త్రీ సంతానానికి, 3 వైశ్యస్త్రీ సంతానానికి, 1 శూద్ర స్త్రీ సంతానానికి ఇవ్వాలి. శూద్రుడు తన సంతానానికి ఆస్తి సమంగా పంచి ఇవ్వాలి. వైదిక కర్మలు చేసే అర్హత బ్రాహ్మణ స్త్రీలకే ఉంటుంది.

ప్రశ్న 37 : కొడుకులు బహువిధా లంటారు వారి విధం తెలపండి.

ఉత్తరం : ధర్మపత్నియందు ధర్మబద్ధంగా పుట్టిన కొడుకు ఔరసుడు. కూతురి కొడుకును దత్తత తీసికొంటే వాడు దౌహిత్రుడు. ధర్మమార్గంలో తన భార్యను ఇతరుల కర్పించగా అతడివలన కలిగినవాడు క్షేత్రజుడు. తల్లిదండ్రులు జలధార పూర్వకంగా దానం చేయగా దక్కినవాడు దత్రిముడు; అనాథ బాలుడిని కొడుకుగా గ్రహిస్తే అతడు కృత్రిముడు. అజ్ఞాతంగా ఎవరివలన కలిగినా, పరభార్యకు పుట్టినా, భార్య కలవాడికి అతడు గూఢజుడు. తల్లిదండ్రులు వదలివేసిన వాడిని కొడుకుగా స్వీకరిస్తే అతడు అపవిద్ధుడు. కన్యగా స్త్రీ కన్నకొడుకు కానీనుడు. పెండ్లికాకముందే గర్భవతియై వివాహానంతరం స్త్రీ కన్నకొడుకు సహోఢుడు. భర్తను విడిచిన భార్య, భార్యను విడిచిన భర్త, విధవ-ఎవడి వలన కొడుకును కంటారో ఆ కొడుకు కన్నవాడికే కొడుకు. అతడి పేరు పౌనర్భవుడు. తనను తాను ఇతరులకు దానం చేసికొన్నవాడు స్వయందత్తుడు. తల్లిదండ్రులు అమ్మగా కొనబడినవాడు క్రీతుడు. ఈ పన్నెండుమంది పుత్రులలో ఔరసుడు శ్రేష్ఠుడు. వైదికకర్మలకు తగినవాడు. ఔరసుడితో కూతురుకొడుకు (దౌహిత్రుడు) సమానుడని పండితుల అభిప్రాయం. వేదకర్మలను, శాస్త్రవిధులను పాటించి ఉభయ కులాలను ఉద్ధరిస్తే ద్వాదశపుత్రులూ యోగ్యులే.

ప్రశ్న 38 : కలిసి ఉండటం (సహవాసం) వలన, దర్శనం (చూడటం) వలన పుట్టే స్నేహాలు ఎట్లాంటివి? గోవుల మాహాత్మ్యం ఎటువంటిది?

ఉత్తరం : ఈ సందేహాన్ని చ్యవన నహుష సంవాదం తీరుస్తుంది. చ్యవనమహర్షి గంగాయమునల సంగమ తీర్థంలో మునిగి తపస్సు చేస్తూ ఉండగా అతడి శరీరాన్ని చేపలు తాకుతూ ఉండేవి. వాటిమీద స్నేహంతో (సహవాసంతో) పన్నెండేళ్ళు తపస్సు చేశాడు. ఒకసారి జాలరులు చేపలు పట్టుతూ, చేపలతో పాటు ఆ మునినీ వలలో బంధించి ఒడ్డుకు లాగారు. ఋషిని చూచి జాలరులు భయపడి క్షమాపణ వేడి, చేసిన పనికి ప్రాయశ్చిత్తం చెప్పుమని కోరారు. చ్యవనుడు చేపలమీద ప్రేమతో - వాటితోపాటు తనను కూడా తగిన వెలకు అమ్ముకొనండని సూచించాడు. ఆ మాట విని బోయలు భయపడి నహుషుడనే రాజు వద్దకు వెళ్ళి చ్యవనుడి వృత్తాంతం చెప్పారు. అతడు తొట్రుపాటుతో ఋషివద్దకు వచ్చి క్షమాపణ కోరుకొన్నాడు. చ్యవనుడు తన శరీరం ధర నిర్ణయించి బోయల కిమ్మన్నాడు. రాజు సంతోషించి వేయి మాడల నుండి సర్వరాజ్యంవరకు వెల నిశ్చయించినా, చ్యవనుడు సమ్మతించక 'న్యాయం తెలిసి వెల నిర్ణయించు' మనేవాడు. చివరకు ఆ రాజును మంత్రులతో మంతనం చేసి వెల నిర్ణయించుమని సూచించాడు. రాజు అట్లాగే చేశాడు. అప్పుడక్కడికి గవిజాతుడనే ముని వచ్చి 'రాజా! గోవూ, బ్రాహ్మణుడూ ఒకటేకులం. కాకపోతే బ్రహ్మ రెండుగా సృష్టించాడు. గోవు హవిస్సుకూ, బ్రాహ్మణుడు మంత్రాలకూ ఆధారం. సర్వవేదాలకూ మూలమైన బ్రాహ్మణుడి వెలను శివుడు కూడా నిర్ణయించలేడు. గోవుకు కూడా అంతే. కాబట్టి చ్యవనుడికి వెలగా గోవును ఇవ్వటం న్యాయం' అని నిర్ణయించాడు. ఆ ప్రతిపాదనకు చ్యవనుడు సంతోషించి అంగీకరించాడు. 'గోవు అగ్నిమయం, అమృతమయం, యజ్ఞవిధానానికి పవిత్ర ప్రవాహం. స్వర్గానికి గోవు నిచ్చెన. దేవతలకైనా గోవు పూజ్యమే' అని ప్రశంసించి గోవును తనకు వెలగా ఇమ్మన్నాడు. బోయలు ఆ గోవును స్వీకరించి, చ్యవనుడికి దానం చేశారు. సహవాసంవలన చేపలమీదా, దర్శనంవలన బోయలమీదా స్నేహం ఏర్పడటంవలన చ్యవనుడు వారిరువురికీ బొందితో స్వర్గాన్ని ప్రసాదించాడు. గవిజాతుడు, చ్యవనుడు కలిసి రాజుకు ధర్మ పరాయణత్వాన్ని, ఇంద్రైశ్వర్యాన్నీ వరాలుగా ఇచ్చారు.

ప్రశ్న 39 : మహత్తరమైన బ్రాహ్మణశక్తి గల భృగువంశంలో విచిత్రమైన క్షత్రియ శీలం గల పరశురాము డెట్లా జన్మించాడు? మహోత్తమమైన క్షాత్రశక్తితో ప్రకాశించే కుశికవంశంలో బ్రాహ్మణ తేజస్సుగల విశ్వామిత్రు డెట్లా పుట్టాడు? ఇదివరకు కొంత విన్నా సంశయం తీరలేదు. వివరించుము.

ఉత్తరం : చ్యవన కుశిక సంవాదం దీనికి తగిన సమాధానం. వినుము. కుశికుడివలన తనవంశం సంకరమౌతుందని తెలిసికొని చ్యవనుడు కుశికవంశానికి ఆపద కలిగించాలని భావించి కుశికుడి ఇంటికి అతిథిగా పోయాడు. కుశికుడు సతీసమేతంగా చ్యవనుడికి అతిథిపూజలు చేశాడు. రాజ్యా న్నిచ్చి దాస్యం చేయటానికి పూనుకొన్నాడు. చ్యవనుడు తనకు రాజ్యకాంక్ష లేదనీ, ఒక వ్రతాన్ని పూర్తిచేసికొనాలని ఉన్నదనీ, కుశికుడి ఇంటనుండి ఆ వ్రతాన్ని పూర్తి చేసికొంటాననీ పేర్కొన్నాడు. కుశికుడు దాని కంగీకరించి ఒక దివ్య భవనాన్ని చ్యవనుడికి విడిదిగా ఇచ్చాడు. చ్యవనుడు ఒక శయ్యపై పవళించి కుశిక దంపతులను తాను నిద్రలేచేంతవరకు పాదాలను ఒత్తుతుండండని కోరాడు. వా రట్లాగే చేస్తూ ఉండగా ఇరవై ఒక్కరోజులు ఒకే ప్రక్క పడుకొని నిద్రపోయి, ఆ మరునాడు లేచి నగరం దాటిపోయి మాయమయ్యాడు. రాజ దంపతులు తిరిగివచ్చి భవనంలో చూస్తే శయ్యమీదనే మరొకవైపు తిరిగి పడుకొన్నాడు. వారు ఆశ్చర్యపోయి అతడి పాదాలు ఒత్తుతూ ఉండగా మరొక 21 రోజులు అట్లాగే పరుండి నిద్రలేచి తలంటి నీరు పోయుమన్నాడు. వారు సుగంధతైలంతో తలంటుతుండగా వారిని తెగ తిట్టి మాయమయ్యాడు. రాజదంపతులు అన్నపానీయాలు లేకపోయినా, అలసటతో నీరసించినా కోపతాపాలకు గురికానందుకు సంతోషించి వారిచేత స్నానం చేయించుకొన్నాడు. భోజనానికి వస్తానని రాక

ఎక్కడికో వెళ్ళాడు. రాజదంపతులు భోజనాలు మాని అట్లాగే ఉండిపోయారు. చ్యవనుడు తెల్లవారిన తరువాత వచ్చి ఒక రథం మీద తనను కూర్చుండబెట్టి రాజూ రాణీ దానిని లాగుతూ తీసికొని వెళ్ళాలని కోరాడు. అలసటతో ఉన్న ఆ రాజదంపతులు అలజడిపడక రథాన్ని లాగుతూ ఉండగా వారిని ముల్లుగ్రలతో పొడిచి బాధించాడు. అయినా వారు భక్తిశ్రద్ధలతో రథాన్ని లాగటం చ్యవనుడు సంతోషించి రథం దిగి వారిని కరుణించి వారి శరీరాలకు శ్రమలేకుండా చేసి, నవయౌవనాన్ని ప్రసాదించి, తాను తపోవనానికి వెళ్ళాడు. మరునాడు ఉదయం రాజదంపతులు ఆ తపోవనానికి పోగా అక్కడ స్వర్గలోక భోగాలు కానవచ్చాయి. ఆ తరువాత చ్యవనుడు తపోవనంలో మునివృత్తిలో గోచరించాడు. చ్యవనుడు ఆ దంపతుల ఇంద్రియ నిగ్రహానికి ఆశ్చర్యపడి ప్రశంసించాడు. భృగు వంశసాంకర్యం ఏర్పడుతుందని బ్రహ్మలోకంలో విని, కుశిక వంశాన్ని నాశనం చేద్దామని వచ్చాననీ, కాని ఆ దంపతుల నిష్ఠాప్రపత్తులను చూచి సంతోషించి, రాచరికంమీదకంటె బ్రాహ్మణత్వం మీద ఉన్న మక్కువను గమనించి హర్షించాననీ పేర్కొన్నాడు. కుశికుడి మనుమడు బ్రహ్మతేజోమయు డౌతాడని వరమిచ్చాడు. దానిని వివరిస్తూ చ్యవనుడి వంశంలో ఋచీకుడు జన్మించి కుశిక వంశంలోని గాధి కూతురును పెళ్ళాడతాడనీ, వారిరువురికి జమదగ్ని జన్మిస్తే అతడు విలువిద్యను పొందేటట్లు చేస్తాడనీ, ఆ ధనుర్విద్య అతడికొడుకు పరశురాముడిలో ఫలిస్తుందనీ పేర్కొన్నాడు. పరశురాముడు సకల క్షత్రియ కులనాశనం చేస్తాడనీ తెలిపాడు. దైవఘటనవలన ఋచీక, గాధి వధువుల అనుష్ఠానాలు మార్పు చెంది జమదగ్నికి క్రూరభావంకల క్షత్ర ధర్మంతో పరశురాముడు జన్మిస్తాడు. గాధికి బ్రాహ్మణ తేజోనిధి అయిన విశ్వామిత్రుడు జన్మిస్తాడు - అని వివరించి చ్యవనుడు తీర్థయాత్రలకు పోయాడు. రాజదంపతులు రాచనగరుకు తిరిగి వచ్చారు.

ప్రశ్న 40 : పితామహా! దాన విశేషాలను తెలుపుము.

ఉత్తరం : కన్య, గృహం, భూమి, నీరు, వస్త్రం ఇట్లాంటి వాటికంటె గోదానం గొప్పది. గోవు కెన్ని రోమా లుంటాయో అన్ని దివ్య సంవత్సరాలు గోదానంవలన స్వర్గంలో ఉంటారు.

ప్రశ్న 41 : అన్నింటికంటె గొప్పదాన మేది?

ఉత్తరం : యాచకుడు కోరిన దానిని ప్రేమతో ఇవ్వటం అన్నింటికంటె గొప్పదానం. వీరశయనం అన్నిటికంటె గొప్పదానం. మిగిలినవి అసలు దానాలే కావు. అన్ని పుణ్యవ్రతాలలోనూ అదే గొప్పది.

ప్రశ్న 42 : అడిగినవాడికి దానం చేయటం మంచిదా? అడగనివాడికి దానం చేయటం మంచిదా?

ఉత్తరం : అడిగినవాడికంటె అడగనివాడికి ఇవ్వటమే శ్రేష్ఠం.

ప్రశ్న 43 : దానాలలో ఉత్తమ దాన మేది?

ఉత్తరం : దానాలలో భూదానం శ్రేష్ఠం. (వివరాలకు చూడు 2.350-366)

ప్రశ్న 44 : దానం చేయటానికి తగిన వస్తువు లేవి ?

ఉత్తరం : అన్నం, బంగారం, పానీయాలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. వాటిలో అన్నదానం విశిష్టం. (వివరాలకు చూడు. 2.367-376)

ప్రశ్న 45 : ఏ నక్షత్రంలో ఏ దానం చేస్తే పుణ్యమో చెప్పుము.

ఉత్తరం : వివరాలకు (2.377-379)

ప్రశ్న 46 : స్వర్ణాది దానాల వివరణ.

ఉత్తరం : వివరాలకు (2.381-396) గోదాన మహిమ (2.379-404), అన్న పానీయాది దాన మహిమ (2.405-407) తిలదాన మహిమ (2.408-413) గోమహిమ (2.414-445)

ప్రశ్న 47 : గోదానంవలన కలిగే విశేషఫలం వినాలని ఉన్నది చెప్పుము.

ఉత్తరం : ఉద్దాలకుని కొడుకు ఔద్దాలకి. అతడి కొడుకు నాచికేతుడు. ఒకనాడు ఔద్దాలకి ఏటిరేవులో కుశలు, సమిధలు, కమండలువు, పూలూ - అన్నీ మరచిపోయి ఇంటికివచ్చి వాటిని నాచికేతుడిని తీసికొని రమ్మని పంపాడు. అతడు ఏటివద్దకు పోయేసరికి ఏరు పొంగి వాటిని తనలో కలుపుకొన్నది. నాచికేతుడు వాటిని కానక ఇంటికి తిరిగివచ్చి తండ్రితో ఆ సంగతి చెప్పాడు. ఔద్దాలకి కోపంతో కొడుకును 'యముడి వద్దకు పొమ్ము' (చావుము) అని తిట్టాడు. నాచికేతుడు తండ్రిని క్షమించుమని కోరుతూ ఉండగానే నేలపై పడి ప్రాణాలు కోల్పోయాడు. దానిని గమనించి ఔద్దాలకి పుత్రుడి శవంమీద పడి కన్నీరు మున్నీరుగా దుఃఖించసాగాడు. ఒక పగలు రాత్రి అట్లా గడచిపోయాయి. తండ్రి కన్నీటితో తడిసిన కొడుకు శవం ఆ తరువాత చైతన్యవంతమైనది. అతడి శరీరం సుగంధయుతమై ఇంపుగొలిపింది. కొడుకు బ్రతికేసరికి తండ్రి ఆహ్లాదంతో అతడిని జరిగిన సంగతిగురించి అడిగాడు. నాచికేతుడు తండ్రికి నమస్కరించి ఇట్లా చెప్పాడు. 'నీ ఆనతితో నేను అందమైన యముడి పట్టణానికి వెళ్ళి సమున్నత సింహాసనం మీద ఉన్న యమధర్మరాజును దర్శించాను. ఆయన నేను చావలేదనీ, నీ ఆజ్ఞప్రకారం యముడిని దర్శించాననీ, తిరిగి వెళ్ళుమనీ తెలిపాడు. నేను ధర్మమూర్తి అయిన ఆయనను పుణ్యలోకాలను చూపుమని అడిగాను. ఆయన ప్రీతితో ఒక రథంమీద నన్ను ఎక్కించుకొని పుణ్యలోకాలన్నీ దర్శింపజేశాడు. 'ఈ పుణ్యలోకాలు ఎవరికి లభిస్తాయి?' అని నేను అడుగగా 'అవన్నీ గోదానంవలన కలిగే ఫలా'లని పేర్కొన్నాడు. గోవులు అంటే సూర్యకిరణాలు కాబట్టి గోదానం చేసినవారు సూర్యుడివలె ప్రకాశిస్తారన్నాడు. నన్ను తిరిగి పంపాడు' అని చెప్పి తండ్రికి పరమానందాన్ని కలిగించాడు. నాచికేతుడు.

ప్రశ్న 48 : గోదానం చేసినవారు ఏ లోకాలకు పోతారో చెప్పుము.

ఉత్తరం : పూర్వం ఇదే ప్రశ్నకు బ్రహ్మ ఇంద్రుడి కిచ్చిన సమాధానం చెప్పుతాను వినుము. ఆ లోకంలో కాలక్రమముండదు. ఋతువులుండవు. దప్పి, రోగాలు, ముసలితనం లేవు. ఆ ప్రశస్తలోకం నాశనం లేనిది. స్వచ్ఛమైన ఆనందాన్ని కలిగించేది. దానిపేరు గోలోకం. గోలోకాన్ని మించిన పుణ్యలోకంగాని, గోదానాన్ని మించిన శుభమైన ధర్మంగాని లేవు.

ప్రశ్న 49 : తాతా! శ్రద్ధతో చేయదగిన పను లేవో చెప్పుము.

ఉత్తరం : నియమం, వేదపఠనం వాటిని ధారణచేయటం, దమము, వేదాలను ఇతరులకు నేర్పటం, దానాలు పట్టకపోవటం, స్వీయకర్తవ్య నిష్ఠ, ఇంద్రియాలను జయించటం, సత్యనిరతి, చదవటంలో ఆసక్తి చూపటం, బ్రహ్మచర్యం, తల్లిదండ్రులను గురువులను సేవించటం, దయకలిగి ఉండటం, గోవ్రతాలను విరివిగా చేయటం - ఇవి శ్రద్ధతో చేయదగిన పనులు.

ప్రశ్న 50 : గోవులను దానమిచ్చే పద్ధతిని గురించి తెలుపుము.

ఉత్తరం : బృహస్పతి మాంధాతకు చెప్పిన గోదానవిధిని గురించిన విశేషాలు సంగ్రహంగా చెప్పుతాను వినుము. ఒక మంచిరోజు ఉపవాసముండి గోశాలకు పోయి రోజల్లా నిష్ఠతో గడిపి, మరునాడు సంగవముహూర్తంలో బ్రహ్మ చెప్పిన ఈ వాక్యాన్ని స్మరించాలి. 'ఆవు నా తల్లి. ఎద్దు నా తండ్రి. వీటికి గర్భప్రదేశం స్వర్గం. అది నిలిచిన తావే నాకు తగిన స్థలం' - అని చదివి యోగ్యుడు, పండితుడు అయిన బ్రాహ్మణుడికి దానం చేయాలి. గోదానానికి ఆశ్వయుజమాసంలోని కృష్ణపక్షంలో అష్టమి మొదలు మూడు రోజులు మంచివి. భరత, దిలీపాది మహారాజు లెందరో గోదానాలు చేసి పుణ్యలోకాలు పొందారు. ఆవులలో కపిలగోవు శ్రేష్ఠమైనది. దానిని దానం చేస్తే పాపాలన్నీ పోతాయి.

ప్రశ్న 51 : కపిల గోవుకు ఆ విశేషం ఎట్లా కలిగింది?

ఉత్తరం : దేవతలకు ఆకలివేసి బ్రహ్మవద్దకు పోయారు. ఆయన వారికి అమృతాన్ని అందించాడు. ఆ అమృతపు వాసనలకు కామధేనువు పుట్టింది. దానికి ఆవులు పుట్టాయి. ఒకప్పుడు ఆవులు హిమాలయ పర్వత పై భాగాన తిరుగుతున్నాయి. ఒక లేగదూడ తల్లిపాలు త్రాగుతూ ఉండగా పాలనురుగు గాలివాటానికి ఎగిరి శివుడి శిరస్సుమీద పడింది. దానికి ఆయన కోపించి మూడవ కన్ను తెరిచాడు. ఆ మంటకు ఆవులు ఎర్రబడిపోయాయి. బ్రహ్మదేవుడు శివుడివద్దకు వచ్చి ఆవుపాలు అమృతంవంటివని ప్రశంసించి ఆయనను ప్రసన్నుడిని చేసికొన్నాడు. శివుడు గోవులకు ఎక్కడైనా తిరిగే వరమిచ్చాడు. తన కంటి మంటకు ఎర్రబడిన ఆవులు శ్రేష్ఠమైనవని పేర్కొన్నాడు. దానితో కపిలగోవులను దానం చేయటం ఉత్తమమైనదనే ప్రశస్తి ఏర్పడింది. కపిలగోవుల కథ పుణ్యప్రదమైనది. ధర్మరాజాదులు ఈ కథ విని కపిలగోదాన వ్రతులయ్యారు. భీష్ముడు ధర్మరాజుకు గోదాన మహిమలు తెలిపే సౌదాసుడి కథను (3.28-41) వ్యాసుడు శుకుడికి తెలిపిన గోప్రభావాన్నీ (3.42-51) వివరించాడు.

ప్రశ్న 52 : బ్రహ్మ సమస్త లోకాలకూ ప్రభువు కదా! గోలోకం ఆయన లోకానికి పైన ఉంటుందని విన్నాను. దానికి కారణం ఏమి ?

ఉత్తరం : పూర్వం బ్రహ్మ అపూర్వ సౌందర్యరాశి అయిన సురభి అనే కన్యను, మార్తాండు డనే మగవాడిని సృష్టించి, వారిరువురకు కలిగే సంతానం యాగాలకూ, మోక్షానికీ పనికివచ్చే పాలను సృష్టించి, బ్రహ్మలోకానికి పైభాగాన ఉండేటట్లు వరమిచ్చాడు. వారికి పుట్టిన ఆవులు క్షీరము లిచ్చాయి. ఆవులకు ముందు వారికి ఏకాదశ రుద్రులు జన్మించారు. ఆవుల శరీరాంగాలలో దేవతలు వెలసి ఉండేవారు. గోమహిమ తెలిపే ఒక ఇతిహాసం ఉన్నది. భృగువంశంలో పుట్టిన సుమిత్రు డనే ముని గోశర్కర అనే పదార్థ ప్రభావంతో గోగణాన్ని పొందాడు. ఆ ఆవుల మందను శ్రద్ధతో పెంచి పోషించాడు. దూడలు పాలుత్రాగేటప్పుడు ఏర్పడే నురుగును ఆ ముని త్రాగుతూ ఫేనపుడు అనే పేరుతో ప్రసిద్ధి పొందాడు. ఒకనాడు కామరూపధారులైన గోవులు స్త్రీరూపాలను ధరించి కొలనులో స్నానం చేస్తుండగా మిగిలిన గోవులు వారిని వరాలు అడిగాయి. హవ్యకవ్యాలకూ, అతిథిపూజలకూ, ఆహారానికి తగిన క్షీరాల నివ్వటంవలన మునులు వరా లిచ్చారనీ, దానివలన గోలోకానికీ కూడా పోగలమనీ ఆ ఆవులు తెలిపి, మిగిలిన గోవులు కూడా రంతిదేవుడు చేసే వేయేండ్ల యజ్ఞంలో బలి అయితే గోలోకం సిద్ధిస్తుందని సూచించాడు. కొన్ని గోవులు ఆ విధంగా గోలోకాన్ని సంపాదించాయి. కొన్ని గోవులు కొమ్ములతో ఫేనపుడిని చంపి అతడిని గోలోకానికి పంపాయి. భీష్ముడు ధర్మరాజు కోరికపై గోమహిమలను గురించి

మరెన్నో విశేషాలను వివరించి చెప్పాడు. (చూ.3.89-109). బ్రాహ్మణులు, గాయత్రి, వసంతకాలం, సత్యం, గోవులు, బంగారం అనేవి ఒకదాని నుండియే పుట్టాయి. కాబట్టి భూమీ, బంగారమూ, ఆవూ దానమివ్వదగిన వస్తువు లన్నింటికంటె గొప్పవి.

ప్రశ్న 53 : ఆవుపేడలో లక్ష్మి ఉంటుందంటారు. దానికి కారణం ఏమిటి?

ఉత్తరం : దీనికి తగిన సమాధానం గో శ్రీసంవాదం అనే పూర్వగాథ. దానిని వినుము. ఒకసారి లక్ష్మీదేవి గోవులమందలోనికి వెళ్ళి వాటి మధ్య ఉండటానికి అభిలషించింది. కాని, లక్ష్మి చంచల స్వభావురాలు కాన అవి ఆమె కోర్కెను మన్నించలేదు. ఆవులు తిరస్కరిస్తే లోకం గౌరవించదని పలికి లక్ష్మి గోవులను ప్రార్థించింది. గోవులు తమ మలమూత్రాలు పరమ పవిత్రమైనవని వేదం పేర్కొన్నది కాబట్టి వాటిలో వసించుమని అనుమతించాయి. లక్ష్మి దానికి ఆమోదించి వాటియందు వసించింది. అందువలన వాటి మహిమ పెరిగింది. మరొకసారి బ్రహ్మ కామధేనువు చేసే తపస్సుకు మెచ్చి గోలోకాన్ని వరంగా ప్రసాదించాడు. ఆ విధంగా బ్రహ్మలోకంకంటె గోలోకం ఉన్నతంగా నిలిచింది. గోమాహాత్మ్యం తెలిపే కథలు వినినవారికి ఆయువు, సంపద, అధికారం, కీర్తి, సద్గతి కలుగుతాయి.

పశ్న 54 : స్వర్ణదాన మహిమాతిశయం వినగోరుతాను.

ఉత్తరం : భీష్ముడు తాను పితృకార్యం నిర్వహిస్తున్నప్పుడు పితృదేవతలు స్వర్ణదానమహిమను గురించి చెప్పగా అతడు బంగారం దానం చేసి ధన్యుడైన అంశం వివరించాడు. పరశురాముడు వసిష్ఠుడి ప్రబోధంవలన స్వర్ణదానమహిమను తెలిసి, ఆచరించిన కథను కూడా వివరించి చెప్పాడు. పార్వతీపరమేశ్వరులు కలిసి ఉన్నప్పుడు పరమేశ్వరుడి వీర్యం వెలువడింది. అతడు ఆ వీర్యాన్ని అగ్నియందు నిలిపాడు. తారకాసురుడిచేత బాధితులైన దేవతలు బ్రహ్మ వద్దకు వచ్చి మొరపెట్టుకొనగా, ఆ పితామహుడు వారిని అగ్నిని వేడుకొండని ఆదేశించాడు. అగ్ని పాతాళంలో దాగి ఉండగా కప్ప ఆ రహస్యాన్ని దేవతలకు తెలిపింది. దానికి కోపించి అగ్ని కప్ప నాలుక కదలకుండా ఉండాలనీ, రుచులు తెలియరాకుండా ఉండాలనీ శపించాడు. దేవతలు కరుణించి కప్పలు ఎండలకు బొరియలలో ఎండిపోయినా నీరు రాగానే అవి జీవించి బెకబెకలాడుతాయని వరమిచ్చారు. అగ్ని రావిచెట్టులో దాగి ఉండగా ఏనుగు సైగ చేసి దేవతలకు తెలిపింది. అగ్ని కోపించి ఏనుగులకు నాలుక తిరుగబడాలని శపించాడు. దేవతలు ఏనుగులకు నాలుకలు తిరగబడినా రుచులు కలిగేటట్లు వరమిచ్చారు. అగ్ని జమ్మిగర్భంలో దాగి ఉండగా చిలుక ఆ రహస్యాన్ని దేవతలకు తెలిపింది. అగ్ని కోపించి చిలుక నాలుక తిరుగబడేటట్లు శపించాడు. దేవతలు చిలుకకు పలుకులు వచ్చే వరమిచ్చారు. చివరకు అగ్ని దేవతలకు కనిపించి, తారకాసుర వధను గురించిన వారి కోర్కెను తెలిసికొని దానిని తీర్చగలనని మాట ఇచ్చి వారిని పంపాడు. అగ్ని తనలో ఉన్న శివరేతస్సును గంగలో గర్భరూపంగా వదిలాడు. అది చాలా పెద్దదిగా పెరగటంవలన గంగ భరించలేక మేరుపర్వతం ఒడ్డున ఉన్న రెల్లుతోటలో దానిని నిలిపింది. అది బంగారు వన్నెతో మిలమిలలాడుతూ బాలుడి రూపం తాల్చింది. ఆ బాలుడిని కృత్తికలు ఆరుగురూ తమకొడుకుగా భావించి లాలించారు. ఆరుగురు తల్లుల లాలనను అందుకొనటానికి ఆ బాలుడు ఆరు మొగాలవాడయ్యాడు. ఆ విధంగా అగ్నిపుత్రుడు గంగాపుత్త్రుడూ, కృత్తికాపుత్రుడూ అయ్యాడు. బ్రహ్మాదులు అతడిని పూజించి దేవసేనకు నాయకుడిని చేశాడు. అతడు తారకాసురుడిని సంహరించి దేవతలకూ, మునులకూ సంతోషాన్ని కలిగించాడు. ఆ కుమారస్వామి బంగారమే స్వరూపంగా కలవాడు కావటం, అతడు శివరూపుడు కావటం, అగ్ని హిరణ్యరేతుడు కావటం, శివుడు వహ్నిరేతుడే కావటంవలన బంగారం జాతరూపమనే పేరుతో ప్రసిద్ధి చెందింది. పరశురాముడు స్వర్ణమహిమను తెలిసి దానిని విపులంగా దానం చేసి కృతార్థుడయ్యాడు.

కాబట్టి ధర్మరాజును కూడా స్వర్ణదానం చేసి సంసార సముద్రాన్ని దాటుమని హితవు చెప్పాడు భీష్ముడు.

ప్రశ్న 55 : తాతా! పితృయజ్ఞం ఎట్లా చేయాలో చెప్పుము.

ఉత్తరం : దేవతలు కూడా పితృదేవతలను పూజిస్తారు కాబట్టి దేవపూజకంటె పితృదేవతల పూజ శ్రేష్ఠం. అమావాస్యనాడు పిండప్రదానంతో శ్రద్ధతో చేసిన పితృపూజ నిత్యశ్రాద్ధం చేసిన ఫలితాన్ని ఇస్తుంది. పాడ్యమి మొదలైన తిథులలో కృత్తిక మొదలైన నక్షత్రాలలో శ్రాద్ధకర్మలు ఆచరిస్తే ఆయా విశేష ఫలాలు ఏర్పడుతాయి. కృష్ణపక్షం, అపరాహ్ణం శ్రాద్ధానికి తగిన సమయాలు.

ప్రశ్న 56 : శ్రాద్ధం ఏ వస్తువులతో చేస్తే ఎక్కువ ఫలం వస్తుంది?

ఉత్తరం : నువ్వులు, పాయసం, నేయి శ్రాద్ధాలకు మేలైన వస్తువులు. ఆవులనుండి ఏర్పడేది ఏదైనా గొప్ప ఫలాన్ని ఇస్తుంది. చేపలు, మాంసం, అందులోనూ గోర్రె, ఖడ్గమృగం, గండభేరుండం, మేక మాంసాలు శ్రేష్ఠాలు.

ప్రశ్న 57 : పితృదేవతల ఆరాధనకు యోగ్యులు ఎవరు?

ఉత్తరం : కులవయోరూపశీలవిద్యలలో ఉదాత్తులయినవారు ఆరాధనకు యోగ్యులు. జూదరులు మొదలైనవారు పంక్తిదూషకులు, పగవారిని శ్రాద్ధంలో భోక్తలుగా నియోగించరాదు. అత్రి మహాముని నిమికి శ్రాద్ధక్రియా విశేషాలను తెలిపాడు. (3.184-202) శ్రాద్ధం అగ్నిపూజతో కలిపి చేస్తే ఎంతో ప్రశస్తం.

ప్రశ్న 58 : ఉపవాసవ్రతాన్నే తపస్సని పెద్దలంటారు. అదేనా లేక మరొకటి ఉన్నదా? చేవగల తపస్సు పద్ధతిని నాకు తెలుపుము.

ఉత్తరం : పస్తులుండటం తపస్సు కానేకాదు. అది ఆత్మను హింసించటం. కనుక దానివలన నరుడు తపస్వి కాజాలడు. సత్యం, బ్రహ్మచర్యం, నిత్య పవిత్రత, మౌనం, సాటిలేని నిష్ఠ, భూతదయ, శుద్ధత్యాగం - అనేవి తపస్సంపదయొక్క ఆకారాలని తత్త్వవేత్త లంటారు.

ప్రశ్న 59 : దాన శీలుడి విశేషమూ, దానం పుచ్చుకొననివాడి ప్రత్యేకతా ఎట్టివో నాకు తెలుపుము.

ఉత్తరం : సప్తర్షులు, అరుంధతి, గండ, పశుసఖు డనే పదిమంది తపస్సు చేసికొంటూ భూమిమీద తిరుగుతూ ఉండేవారు. ఒకసారి భయంకరమైన అనావృష్టి ఏర్పడి తినటానికి పదార్థాలేవీ దొరకక బాధపడ్డారు. శిబి కొడుకు యాజ్యుడనేవాడు తన కొడుకైన నీలుడిని ఋత్విక్కులకు యజ్ఞదక్షిణగా ఇచ్చాడు. అతడు కాలంతీరి చనిపోగా, అతడి శవాన్ని తినటానికి సప్తర్షులు సిద్ధమయ్యారు. అప్పుడు వృషాదర్భి అనే రాజు వారికి అగ్రహారాలతోపాటు ఆహారధాన్యాలను ఇస్తానని పిలిచాడు. వారు రాజునుండి దానం పుచ్చుకొనే ఆచారం తమకు లేదని అతడి దానాన్ని తిరస్కరించారు. అతడు కోపించి యజ్ఞంచేసి 'కృత్య'ని సృష్టించి వారిని చంపటానికి పురికొల్పి పంపాడు. సప్తర్షులకు తోడుగా శునస్సఖుడనే సన్న్యాసి వారితో కలిసి తిరుగ నారంభించాడు. వా రొకసారి సరోవరంలోని తామరతూండ్లను తిని బ్రతుకుదామని భావించగా కృత్య వారిని వారించింది. శునస్సఖుడు ఆమెను మంత్రదండంతో భస్మం చేశాడు. ఋషులు తామరతూండ్లను త్రెంచుకొని కట్టకట్టి ఒడ్డున పెట్టి స్నానాదులు ముగించుకొని వచ్చేసరికి తామరతూండ్ల కట్ట మాయమైపోయింది. ఋషులు ఒకరిపై మరొకరు అనుమానపడ్డారు. అప్పు డా పదిమంది తామరతూండ్లను దొంగిలించలేదని ఘోరప్రతిజ్ఞలు చేశారు. శునస్సఖుడు చివరకు తాను తీశానని ఒప్పుకొని

వారి చిత్తవృత్తులను పరీక్షించటానికే అట్లా చేశానని పేర్కొని, తాను ఇంద్రుడనని ప్రకటించుకొని, కృత్యనుండి వారిని కాపాడిన సంగతి చెప్పి, ఎన్ని కష్టాలు వచ్చినా లోభగుణానికి లోనుకాని వారి చిత్తవృత్తులకు మెచ్చుకొని, వారికి శాశ్వతలోకాలను సిద్ధింపజేశాడు. ఈ ఇతిహాసాన్ని విననవారికి ఆయువూ, సంపదా, ధర్మమూ, దొడ్డ కీర్తీ పుష్కలంగా కలుగుతాయి. అతడిని పితృదేవతలు సర్వదా రక్షిస్తారు.

ప్రశ్న 60 : శ్రాద్ధాదులలో గొడుగులు, చెప్పులు దానం చేస్తారు ఎందుకు?

ఉత్తరం : సూర్యజమదగ్ని సంవాదమనే పూర్వేతిహాసం నీ ప్రశ్నకు తగిన సమాధానం. జమదగ్ని ఒకనాడు బయలుప్రదేశానికి వెళ్ళి బాణప్రయోగం సాధన చేస్తున్నాడు. అతడు వదలిన బాణాలు అతడి భార్య రేణుక తెచ్చి ఇస్తూ ఉండేది. మధ్యాహ్నమయింది. రేణుక సూర్యరశ్మికి నేల కాలుతూ ఉంటే త్వరగా రాలేక చెట్లనీడలలో నిలిచి రావటంవలన ఆలస్యమయింది. అందుకు జమదగ్ని సూర్యుడిపై కోపించి, అతడిపై బాణప్రయోగం చేసి నేలపై కూలనేయబోయాడు. అంతలో సూర్యుడు బ్రాహ్మణవేషంలో అతడి వద్దకు వచ్చి తనను ఎరిగించుకొని శరణు వేడాడు. జమదగ్ని సంతోషించి అప్పుడు సూర్యుడు సంకల్పమాత్రంచేత గొడుగూ చెప్పులూ సృష్టించితెచ్చి అతడి దగ్గర ఉంచి 'ఇవి పూర్వం లేవు. ఈ గొడుగువలన నావేడి శరీరానికి తాకదు. ఈ చెప్పులవలన కాళ్ళకు తాకదు. వీటిని దానం చేస్తే నరులకు ఇహపరలోకసుఖాలు కలుగుతాయి' అని తెలిపాడు. సూర్యుడు మనస్సుతో సృష్టించినవీ, మహర్షి మన్నించినవీ అయిన ఈ మంచి వస్తువులు విలువైనవి. వీటిదానంవలన పుణ్యలోకాలు లభిస్తాయి.

ప్రశ్న 61 : శూద్రుడు ఎటువంటి నడవడితో ఇహపరసుఖాలనూ, పరమసౌఖ్యాన్నీ పొందుతాడు?

ఉత్తరం : పూర్వం పరాశరుడు శిష్యులకు అందరూ అనుసరించదగిన ధర్మాలను పెక్కింటిని చెప్పాడు. వాటి తాత్పర్యం చెప్పుతాను వినుము. శూద్రుడు ఇంద్రియాలపై పట్టుగలిగి, కామాదులైన అంతశ్శత్రువులను గెలిచి, గర్వం వదలి తక్కిన మూడు వర్ణాలపట్ల భక్తికలిగి వారికి సేవలు చేస్తే, ఉభయలోక సుఖాలనూ పొందగలడు. బహిరంగ స్థలాలలో మలమూత్రాదులు వదలరాదు. ఆ పనులకూ, వాటి శుద్ధి పనులకూ మరుగుతావులు ఉండాలి. శూద్రుడు ఏ విధంగానైనా శుచిత్వాన్ని నిష్ఠతో సాధించి సేవాభావంతో విద్వాంసులయెడ వినయంగా మెలగాలి. బ్రాహ్మణుడికి జపమే యజ్ఞం. అధ్యయనమే బ్రదుకుతెరువు. తపస్సు శోభ నిస్తుంది. క్షత్రియుడికి ప్రయత్నం యజ్ఞం. దండనీతి బ్రతుకుతెరువు. పాలన శోభ తెస్తుంది. వైశ్యుడికి హవ్యం యజ్ఞం. అమ్మకం బ్రదుకుతెరువు. ఆతిథ్యం శోభ తెస్తుంది. శూద్రుడికి సేవ లందించటం యజ్ఞం. సేవలే అతడి బ్రతుకుదెరువు. పనిలో సామర్థ్యం అతడికి వన్నె తెస్తుంది. యతిపట్ల భక్తితో సేవ చేయటం కర్తవ్యం. అది అతడికి సుగతిని కలిగిస్తుంది. పరాశరుడు సర్వవర్ణ సామాన్య ధర్మాలు కూడా చెప్పాడు. (చూడు.2.296-327)

ప్రశ్న 62 : దేవతలుకూడా మ్రొక్కదగిన నరులు ఉంటారని వింటుంటాను. అట్టివారి నడవడి ఎట్లా ఉంటుందో తెలియజెప్పుము.

ఉత్తరం : ధర్మార్థ కామ పురుషార్థాలను ధర్మం తప్పక ఆచరించేవారూ, సుందరాంగులు స్వయంగా కోరినా కామాన్ని వదలి మెలిగేవారూ, విద్యాగర్వం, ధనగర్వం, ప్రభుత్వగర్వం మొదలైనవి లేనివారూ, ఇంద్రియ నిగ్రహం కలవారూ, స్వీయ భార్యలతో తృప్తిపొందేవారూ, దృఢమైన పట్టుదలతో తపోధనాన్ని కూడబెట్టే మహాత్ములూ, సత్యనిష్ఠ కలవారూ, అంతర్బహిశ్శుద్ధి కలవారూ, గుట్టుగా ధర్మాన్ని ఆచరించేవారూ, సన్న్యాస ధర్మాలను నేర్పుతో పాటించేవారూ దేవతలకు కూడా నమస్కార యోగ్యులు.

పశ్న 63 : చెరువు త్రవ్వించటం అనే ధర్మంలోని గొప్పతనం తెలుపుము.

ఉత్తరం : చెరువు దేవతలకు, పశువులకు, పక్షులకు, రాయి రప్పలవంటి స్థావరాలకు నెలవైనది. అంతే కాదు. అందులో నీరు త్రావి ఆవులమందలు దానిని త్రవ్వించినవారి కులాన్నంతటినీ పుణ్యలోకాలకు పంపుతాయి. ఈ లోకంలో గొప్ప సంపదనూ, చెడని కీర్తినీ కలిగిస్తాయి. వానాకాలంలో, చలికాలంలో, ఎండకాలంలో చెరువులో నీళ్ళుంటే మహాయజ్ఞాలు చేసిన ఫలం ఆ తటాకకర్తకు లభిస్తుంది. కట్టమీద తగిన చెట్లు నాటితే పక్షులు మొదలైన ప్రాణికోటికి నిలువనీడ నిచ్చి సుఖం కూర్చినవాడు కనుక అతడికి ఇహపరసుఖాలు కలుగుతాయి. పితృదేవతలు తమ వంశంవాడు చెరువులు త్రవ్విస్తే పరమానందం పొందుతారు. దానివలన తమకు ఉత్తమ లోకాలకు పోయే వీలు కలుగుతుందని దాని నెప్పుడూ కోరుతూ ఉంటారు. చెరువుగట్లమీదిచెట్లు నీడతో అతిథులకూ, పూవులతో దేవతలకూ, పండ్లతో పితృదేవతలకూ పరమానందం కలిగిస్తాయి.

ప్రశ్న 64 : గృహస్థ ధర్మపరిజ్ఞానం నాకు సమగ్రంగా కలిగేటట్లు ఉపదేశించుము.

ఉత్తరం : పూర్వం విష్ణువుకు భూదేవి తెలిపిన విశేషాలు తెలుపుతాను వినుము. గృహస్థుడు అగ్నిని ఆరాధనం చేయాలి. పూర్ణభక్తితో భూతబలి చేయాలి. దానివలన దేవతలు ఆనందిస్తారు. అన్నం, పాలు, దుంపలు, చల్లని నీరు - వీటిలో దేనితోనైనా ప్రతిదినమూ పితృదేవతలకు తర్పణం చేయాలి. వైశ్వదేవం తప్పనిసరిగా నిర్వహించాలి. ఆ తరువాత శక్తిమేరకు దానాలు చేయాలి. బిచ్చమెత్తుకొనే విద్యావంతులైన బ్రాహ్మణులకొరకు ఎదురు చూచి భిక్షలివ్వాలి. భోజన సమయానికి అతిథులు రాకపోతే వండిన పదార్థాలలో ముందుభాగాన్ని హోమకుండంలోనైనా వేయాలి. తరువాత మిత్రులకు, చుట్టాలకు, అతిథులకు, గురువులకు అన్నం పెట్టి తృప్తిపరచాలి. పిదప బలికార్యం చేయాలి. ఇది గృహస్థధర్మం. ఈ పద్ధతిని సాగించి విప్రుడు భోజనం చేయాలి. అట్టివాడు ఇహపర సుఖాలను పొందుతాడు. కాబట్టి ధర్మరాజా! నీవు కూడా గృహస్థధర్మాన్ని చక్కగా నిర్వహించుము. గృహస్థధర్మం పాపాలను పటాపంచలు చేస్తుంది. శుభాలను కలిగిస్తుంది. కీర్తి సంపదలను ప్రసాదిస్తుంది. పుణ్యలోకాలను పొందిస్తుంది.

ప్రశ్న 65 : పూలనూ, ధూప దీప నైవేద్యాలనూ పూజా సాధనాలని వాటితో దేవతలను పూజిస్తారు. వాటి విశేష మేమిటో తెలియ చెప్పుము.

ఉత్తరం : ఈ విషయాన్ని పూర్వం శుక్రుడు బలికీ, అతడు మనువుకూ, అతడు సువర్ణుడనే తపస్వికీ, ఆతడు నారదుడికీ, ఆ మహర్షి నాకూ తెలియచెప్పారు. దాని తాత్పర్యాన్ని చెప్పుతాను వినుము. ఓషధులు అమృతంవంటివి. పూలు పూచే చెట్లు శ్రేష్ఠమైనవి. పూలతో పూజించేవారికి మంచి మనస్సు కలుగుతుంది. అందుకే పూలను 'సుమనస్సులు' అంటారు. పూలతో పూజించే మానవుల కోర్కెలను దేవతలు మంచి మనస్సుతో తీరుస్తారు. అందుకే వారికి 'సుమనస్కులు' అనే పేరు వచ్చింది. పూలవాసనలతో దేవతలు, వాటి దర్శనంతో యక్షులూ, వాటి అనుభవంతో పాములూ, ఆ మూడు పద్ధతులతో మానవులూ ప్రీతి పొందుతారు. పూలపూజలతో దేవతలు వెంటనే భక్తుల కోర్కెలు తీరుస్తారు. ధూపంవలన భక్తుడు పుష్టినీ, ఆయువునూ పొందుతాడు. దీపం వెలిగించటమంటే వెలుగును ప్రసాదించటం. దీపారాధనంవలన భక్తుడి హృదయం పరమాత్మ ధర్మాలను చూచే స్వభావం కలది ఔతుంది. బాటలోని చావడిలో, దేవాలయంమీదా, కొండమీదా దీపం పెట్టినవారికి ఐశ్వర్యం ప్రాప్తిస్తుంది. ఆవునేయితో దీపం వెలిగించి దానంచేస్తే జ్యోతిర్లోకసిద్ధీ, కులప్రకాశం, మహాజ్ఞాన వికాసం కలుగుతాయి. దేవతలకు మొదట నైవేద్యం ఇచ్చి తరువాత భక్తుడు భుజించాలి. లేకపోతే బుద్ధిహీనుడూ,

రాక్షసుడూ కావటం తథ్యం. నివేదనతో అర్పించే వ్యక్తికి గృహదేవతలు సకల శుభాలు కలిగిస్తారు. నహుషుడు ధూపదీప దానాదులు చేయటంవలననే ఇంద్రపదవి పొందాడు. బ్రహ్మసభకు సొంత ఇంటికి వెళ్ళినట్లు వెళ్ళాడు. దానాలన్నిటిలో దీపదానం శ్రేష్ఠమైనది.

ప్రశ్న 66 : విప్రుడి సొమ్ము దొంగిలించినవాడి గతి ఏమిటి?

ఉత్తరం : బ్రహ్మజ్ఞానం కలవాడి సంపదను దొంగిలిస్తే కులనాశనం జరుగుతుంది. మరుజన్మలో చండాలు డయ్యే గతి పట్టుతుంది. దీనికి ఒక ఇతిహాసం ఉన్నది చెప్పుతాను వినుము. క్షత్రబంధు డనే రాజు ఒకనాడు బ్రాహ్మణుడి పొలంపై నుండి గాలికి రేగిన దుమ్మును తప్పించుకొని పోతున్న దుఃఖితుడైన ఒక మాలవాడిని చూచాడు. కారణ మడిగాడు. ఆ మాలవాడు పూర్వజన్మలో బ్రాహ్మణబాలుడు. బ్రహ్మచారిగా భిక్షమెత్తుకొని పోతుండగా బ్రాహ్మణుడి పొలం నుండి రేగిన దుమ్ము వానిపై పడింది. అతడు దానిని తిన్నాడు. ఆ పాఫఫలితంగా చండాలజన్మ నెత్తాడు. ఒకనాడు కలలో ఆ బ్రాహ్మణుడు కనపడి క్షత్రబంధు సంవాదం వినిపించి, దానితో అతడి దుఃఖం నశించి పోతుందని చెప్పాడు. ఆనాటితో అతడి దుఃఖం తీరింది. పూర్వపుణ్యఫలంగా ఆ బ్రహ్మచారి ఉత్తమగతి పొందాడు.

ప్రశ్న 67 : స్వర్గం ఒకేరకమైన ఆనందం కలిగిస్తుందా? పెక్కు రీతుల ఆనందం కలిగించేదై ఉంటుందా?

ఉత్తరం : పుణ్యకర్మలు పెక్కు తీరులై ఉండటంవలన, ఆయా కర్మలకు తగిన భోగాలను అందించే పెక్కుతావులు కలదై స్వర్గం దుఃఖం లేనిదీ, అమితమైన సుఖాన్ని కలిగించేదీ అయి ఎంతో ఒప్పారుతూ ఉంటుంది. గౌతమ దేవేంద్ర సంవాదం అనే ఇతిహాసం ఈ ప్రశ్నకు సమాధానంగా తోడ్పడుతుంది. దాని సారాంశ మిది - ఒక అరణ్యంలో గౌతముడనే బ్రాహ్మణుడు తపస్సు చేసికొంటూ ఉండగా తల్లిని కోల్పోయిన ఒక పిల్లఏనుగు కనుపించింది. దానిని పుత్రవాత్సల్యంతో పెంచి పెద్దచేశాడు. ఒకనాడు దేవేంద్రుడు ధృతరాష్ట్రుడు అనే రాజు రూపంలో వచ్చి ఆ ఏనుగును తనకు కావాలని కోరాడు. గౌతముడు ఆ ఏనుగు తనకు చేసేసేవలు పేర్కొని పుత్రుడివంటి దానిని ఈయజాలనని అన్నాడు. 'మునులకు ఏను గెందుకు? వెలలేని ఆవులను ఇస్తాను, మిక్కుటమైన బంగారాన్ని ఇస్తాను. ఏనుగు నిమ్మ'ని ధృతరాష్ట్రుడు పట్టుపట్టాడు. గౌతముడు వాత్సల్యంతో ఏనుగును ఇవ్వలేనన్నాడు. రాజునకు ఏనుగు యోగ్యమైనది కావున దాని నిమ్మని ధృతరాష్ట్రుడు బెదిరించాడు. గౌతముడు భయం వదలి యమలోకంలోగాని, గంగా ఒడ్డునగాని, మేరుపర్వతంలోగాని, నారద వనంలోగాని, ఉత్తర కురుభూములలోగాని, చంద్రుడివద్దగాని, సూర్యుడివద్దగాని, వరుణుడి నగరంలోగాని, ఇంద్రుడి పట్టణంలోగాని, బ్రహ్మలోకంలోగాని, గోలోకంలోగాని ఏనుగు నిస్తాను తీసుకొనుమని వరుసగా అడిగాడు. ఆయా లోకాలలో ఆయా పుణ్యకర్మలకు ఫలాల ననుభవించే వారిని ధృతరాష్ట్రుడు చెప్పి వాటికి అంగీకరించలేదు. గౌతముడు దానిని గమనించి ధృతరాష్ట్ర రూపంలో ఉన్నది దేవేంద్రుడని భావించాడు. ఆయా లోకాలన్నీ తిరిగినవాడు కావటంచేత ఆయా సుఖాల భేదాలను తెలిసికొనగలిగాడని గుర్తించాడు. దేవేంద్రుడు దానికి సంతోషించి గౌతముడికీ, ఏనుగుకూ స్వర్గలోక సౌఖ్యాన్ని ప్రసాదించాడు.

ప్రశ్న 68 : మహాత్మా! మీరు తపస్సును సారమైన ధర్మంగా నొక్కి చెప్పుతూ ఉంటారు. దానికి మించిన ధర్మం మరొకటి లేదా?

ఉత్తరం : తపస్సులన్నీ కొనియాడదగినవే. తపస్సుకు దీటైన ధర్మం మరెక్కడ ఉన్నది? తపస్సు అనగా నియమంగా

భోజనం చేయటం. ఈ సంగతి బ్రహ్మ భగీరథుడనే రాజుకు చెప్పాడు.

ప్రశ్న 69 : వేదం పురుషుడికి ఆయువు నూరేళ్ళని చెప్పుతున్నది. కాని, చిన్నతనంలోనే కొందరు మృతి పొందుతున్నారు. దేనిచేత ఆయువు వృద్ధి పొందుతుంది? దేనిచేత తరిగిపోతుంది?

ఉత్తరం : ఆచారం ఆయువును పెంచుతుంది. అంతే కాదు సంపదను, కీర్తిని కలిగిస్తుంది. దురాచారం ఆయువును క్షీణింప చేస్తుంది. ఉత్తమపురుషులు ఆచరించే మార్గాన్ని తెలిసికొని నడచుకొనటం ఆచారం. అది వర్ణ ధర్మాలకు, ఆశ్రమ ధర్మాలకు అనుగుణంగా ఉంటుంది. (వివరాలకు చూ. 4.90-126) ఆచారాన్ని తప్పనిసరిగా నడిపించాలి. అది ధర్మానికి కుదురు. ధర్మం ఆయువును పెంచుతుంది. సంపదను కీర్తిని వృద్ధి చేస్తుంది. ఆచారాలన్నిటిలో సర్వభూతదయ మిన్న అయినదని ఆదిమును లంటారు. కాబట్టి అన్ని వర్ణాలవారూ దయకలిగి ఉండటం ఉత్తమం.

ప్రశ్న 70 : అన్నదమ్ము లే విధంగా తమలో తాము పొందిక కలిగి ఉండాలి?

ఉత్తరం : తమ్ములు అన్నయెడ భయభక్తులు కలిగి అతడిని ఆరాధించాలి. అన్న తమ్ములను మన్నిస్తూ ఉండాలి. తమ్ముడొకడు బుద్ధిహీనుడైనా ప్రమాదం లేదు కాని అన్న కార్యదక్షత లేనివాడైతే తమ్ముళ్ళు ఇబ్బందుల పాలౌతారు. అన్నదమ్ములు కలతలు లేని బుద్ధితో సంపదను పంచుకొని అనుభవించాలి. అప్పుడు లోకులు వారిని మెచ్చుకొంటారు. సంపద కూడా క్రమంగా వృద్ధి పొందుతుంది. అట్లా కాక ఒకడు అత్యాశతో ఎక్కువ భాగాన్ని ఆపేక్షిస్తే ప్రాణాంతకపు పనులు ఏర్పడుతాయి. తండ్రి తరువాత అన్నయే తమ్ములందరికీ తండ్రి. తల్లి చనిపోయిన తరువాత వదినయే తల్లి. అన్నగాని, తమ్ముడుగాని న్యాయం తప్పి అన్నదమ్ములకు కీడు చేస్తే రాజువలన శిక్షార్హుడౌతాడు. అక్కను, పెంచిన తల్లిని తల్లితో సమానంగా చూడాలి. ఉపాధ్యాయుడికంటె తండ్రి పదిరెట్లు ఎక్కువ మాన్యుడు. తండ్రికంటె తల్లి పదిరెట్లు గౌరవంలో మిన్న. తల్లిదండ్రులవలన కలిగిన జన్మ దేహసంబంధి. ఆచార్యుడివలన కలిగిన జ్ఞానజన్మ జరామరణాలు లేనిది. గౌరవంలో ఆచార్యుడు అందరికంటె మిన్న.

ప్రశ్న 71 : ఉపవాసవిధికి యోగ్యత, దాని గొప్ప ఫలం - అనేవాటిని గురించి వినగోరుతాను.

ఉత్తరం : అంగిరసు డనే ముని ఈ విషయంలో నాకు చెప్పిన వివరాల సారాన్ని వినిపిస్తాను. బ్రాహ్మణ క్షత్రియులు మూడు రోజులు ఉపవాసం చేయవచ్చును. వైశ్యులు శూద్రులు నాలుగు భోజనాలు మానవచ్చును. ఏక భుక్తంతో నెలరోజులు ఉపవసిస్తే శుభాలు కలుగుతాయి. ఉపవాసాలు పెరిగినకొద్దీ శుభాలు కూడా పెరుగుతాయి. మహాత్ములు తల్లిని మించిన గురువూ, వేదాన్ని మించిన శాస్త్రమూ, ధర్మాన్ని మించిన లాభమూ, అట్లాగే ఉపవాసాన్ని మించిన తపస్సూ లేదంటారు. దేవతలు, ఆదిమునులు ఉపవాసనియమం చేతనే గొప్ప ప్రభావం కలవారయ్యారు. విశ్వామిత్రుడు వెయ్యేళ్ళు ఏకభుక్తంతో బ్రాహ్మణత్వాన్ని పొందగలిగాడు. అర్థబలమూ, అంగబలమూ లేకున్నా ఏ లోపమూ లేకుండా చేయదగినది ఉపవాస వ్రతమని అంగిరసుడు చెప్పాడు. ఉపవాస వ్రతంలో తేలిక పద్ధతి ఉన్నది. పగలు ఒకమారూ, రాత్రి ఒకమారూ నీటితో తృప్తిగా భుజిస్తూ మధ్యలో మరేమీ తినకుండా హోమకార్యం తగిన విధంగా చేస్తూ ఉంటే పుణ్యలోకాలు సులభంగా లభిస్తాయి.

ప్రశ్న 72 : 'ఎవరిని తెలిసికొంటే తెలియదగిన విషయాలన్నీ తెలుస్తాయో అట్టివాడు శ్రీకృష్ణుడు' అని వేదవ్యాసుడు తనను ఆశ్రయించినవారందరికీ తెలియ చెప్పాడు. కాబట్టి ఆధ్యాత్మిక వాక్యాలకు ఆతడే గమ్యం. మహామహిమకు

గమ్యం శ్రీకృష్ణుడు. నేను ఆ మహిమాన్విత వాక్యాలను వినగోరుతాను. ఇంకా నాకు ఆధ్యాత్మ విద్యావరణం కలిగించే వాక్యాలు వినిపించుము.

ఉత్తరం : 'హరసనత్కుమార సంవాదం' అనే విషయం వింటే పరమార్థ విద్యకు ఉపకరించే అంశాలు తెలుస్తాయి. సంగ్రహంగా చెప్పుతాను వినుము. ఒకసారి శివుడు సనత్కుమారుడివద్దకు వచ్చాడు. మహర్షి మహేశ్వరుడికి అతిథిసత్కారాలు చేశాడు. 'పుణ్యాత్మా! ధ్యానంలో చూడదగిన వస్తు వేది? చక్కగా భావించదగిన తత్త్వాలు ఎన్ని? జ్ఞానమూ, యోగమూ ఏ విధంగా ప్రవర్తిల్లుతాయి?' అని శివుడు అడిగాడు. మరికొన్ని ఆధ్యాత్మ విశేషాలు చెప్పు'మన్నాడు. సనత్కుమారుడు శివుడితో ఇట్లా చెప్పాడు. 'తత్త్వాలు ఇరవైమూడని కొందరు పామరులంటారు. ఇరవైనాలుగని కొందరు అంటారు. నా దృష్టిలో తత్త్వాలు ఇరవైఅయిదు. ఇరవైఅయిదవ తత్త్వం 'అధిష్ఠానం' రూపంలో ఉంటుంది. అది మిగిలిన ఇరవైనాలిగింటికీ ఒక స్థితిని కలిగిస్తుంది. తనయందే లీనమయ్యేటట్లు చేస్తుంది. కాబట్టి అది ఉండటమూ, లేకపోవటమూ రెండూ సంభవమే. కాబట్టి 24 తత్త్వాలను వివరిస్తాను. అవి 5 భూతాలు, 5 వాటి గుణాలు, 10 ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, ప్రకృతి - మొత్తం 24 తత్త్వాలు. వీటిని దేహమని జ్ఞానులు భావిస్తారు. కట్టెలో నిప్పువలె అందులో 'పురుషుడు' ఉంటాడు. అతడే 'నేను'. పురుషతత్త్వాన్ని వేదం 'అమృతార్థతత్త్వ'మనీ, 'బ్రహ్మ' మనీ తెలియజేస్తుంది. ఇది అన్ని తత్త్వాలకంటె అతీతమైనది. ఇదే ఈశ్వరం, అనీశ్వరం, సత్యపాకం, అతిరహస్యం. దానిని దర్శిస్తే మృత్యువువలననుండి తప్పుకొన్నట్లే. బ్రహ్మతత్త్వం ఓంకారంచేత మాత్రమే చెప్పదగింది. అనహంకార నిరూఢ భావనారాధ్యం. ఏ మాలిన్యం లేనిది. ద్వంద్వాతీతమైనది. సర్వం శుభమయమైనది. అది అప్రమేయం, అవిజ్ఞేయం, పుండరీకాక్షం, అనక్షయవిషయం, అచ్యుతం, సదసత్తుల సమైక్యభావంతో ప్రకాశించేది. ఆ పరతత్త్వం మొదట నారాయణుడి కొక్కడికే తెలిసింది. అతడివలన దేవతలు, మునులు, సిద్ధులు, సాధ్యులు మొదలగువారికి అందింది. అది బంధవిముక్తులకే దర్శనమౌతుంది. అహంకారం వదలిన జీవుడిలో దశేంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ లీనమైపోతాయి. ఆ జీవుడు పరతత్త్వంలో లీనమైపోతాడు. యోగనిష్ఠ కలవాడు ఆ తత్త్వాన్ని అందుకొని దుఃఖాలన్నింటిని తొలగించుకొని, చావు, ముదిమి లేని తావులలో శాశ్వతంగా ఉంటాడు. అణిమాది సిద్ధుల సంపదలతో విహరిస్తూ ఉంటాడు. యోగసాంఖ్యాలు రెండూ ఒకటే అనే భావంతో సంసార సముద్రాన్ని దాటుతాడు. చైతన్యం గల 'పురుషుడు' అనే తత్త్వాన్ని ఆశ్రయించి, చైతన్యం లేని ప్రకృతి పుష్టికలది ఔతుంది. తక్కిన తత్త్వాలు ఆ తత్త్వమహాసముద్రంలోని తరంగాలు. పురుషుడికి ఏ గుణాలూ లేవు. ప్రకృతియే గుణాలకు ఏవైనా గుణాలను ఇస్తుంది. దానిచేత తక్కిన తత్త్వాలు గుణాలు కలవై గుణాలు లేని పరమాత్మకు గుణాలు కలిగిన స్థితిని కలిగిస్తాయి. వీటినన్నంటిని సత్త్వదార్థానికి వేరైనవిగా తెలిసికొని, ప్రకృతిని జయించి తనకు తానే కాని మరొకటి ఏమీ లేదని గుర్తించినపుడు సాధకుడైన పురుషుడు పొగ లేని నిప్పువలె ప్రకాశిస్తాడు. పురుషుడు సత్త్వాన్ని, తత్త్వాన్ని ఆశ్రయించి, ఆ రెండింటిని చక్కగా తెలిసికొని, వాటితో కలియక చైతన్యవంతుడౌతాడు. పెక్కులు కావటం అజ్ఞానంవలన కలిగినస్థితి. ఒక్కటికావటం జ్ఞానంవలన కలిగే స్థితి. పండితులు దీనినే అవిద్య, విద్య అంటారు. ఈ రెండూ ఇరవై అయిదవ తత్త్వమైన జీవుడి దశలు. పరికించగా విద్యయే స్వరూపంగా గల ఇరవై ఆరవ తత్త్వం. వాడు విద్య, అవిద్య అనే దశలు లేనివాడు. ముసలితనం లేనివాడు. మొట్టమొదటివాడు. అంతం లేనివాడు. ఏ విధమైన మార్పులేనివాడు. అనంతుడు, అచ్యుతుడు, అద్వైతనుడు, అనాది, కేవలాత్మకుడు. నీటిలో చేపా, మేడిపండులో పురుగులూ ఉన్నట్లుగా తాను ప్రకృతిలో ఉన్నానని తెలిసికొని, దానినుండి వేరుకావటం అభ్యాసం చేసి, సిద్ధిపొందిన పురుషుడు అమృతత్వస్థితి పొందుతాడు. జీవుడు తామరాకుమీది నీటి బిందువువలె ప్రకృతియందు ఉండి కూడా దానికి సంబంధించిన వికారాలు లేకుండా వెలుగొందుతాడు. ఈ విధంగా ప్రకృతిని వదలి పరమాత్మస్థితిని పొందటమే ముక్తి. ఈ జ్ఞానాన్ని

కపిలమహర్షి లోకానికి అనుగ్రహించాడు. దివ్యమును లెందరో దీనిని మన్నించారు. జీవుడు ప్రకృతితో అంటిపెట్టుకొని ఉండటం బంధం. దానినుండి పొందిన విముక్తియే మోక్షం.

ప్రశ్న 73 : ఎక్కువ పవిత్రతను కలిగించగల తీర్థం ఏదో తెలుపుము.

ఉత్తరం : తీర్థాలన్నీ మేలైనవే. మానవ తీర్థం ఒకటి ఉన్నది. దానిపేరు 'సత్యం'. అదే మిక్కిలి పవిత్రత కలిగిస్తుంది. 'ధృతి' అనే మహాజలాశయంలో అది విరాజిల్లుతూ ఉంటుంది. తమస్సు, రజస్సు అనే రెండు గుణాలను దూరంగా తొలగించుకొంటూ, సత్యాన్ని ఊతకర్రగా తీసికొని దానిలోనికి ప్రవేశించి స్నానం చేసినవాడు పరిశుద్ధతతో ప్రకాశిస్తాడు. రాగద్వేషాలు వదలి, ఇంద్రియాలు వికారాలను తొలగించుకొని, ఏ మాత్రమూ సడలని వ్రతం పాటిస్తూ వివేకం కలిగిన మహాత్ములు కూడా గొప్ప నిర్మలతీర్థాలే. వినయపూర్వకంగా ఆశ్రయించటం కూడా తీర్థాలవలన కలిగే సిద్ధిని కలిగిస్తుంది. దమము, తపము, అహింస, శమము కూడా తీర్థాలే. వాటివలన ఎక్కువ శుద్ధత కలుగుతుంది. ఊరకే నీటిలో స్నానంచేస్తే పరిశుద్ధత కలుగదు. దొరకని వాటిని కోరక, దొరికినవాటియందు తృప్తి పొందక ఆశను విడనాడి బ్రదికే నరులు పవిత్రులు. వారికి వేరైన తీర్థాలు అవసరం లేదు.

ప్రశ్న 74 : ఎట్టి ప్రవర్తనతో మానవుడు, ఉత్తమపదం చేరుకొంటాడు? మరణించినవాడు దేహాన్ని వదలి ఏది తోడుగా వెళ్ళుతాడు?

ఉత్తరం : 'నీవడిగిన గూఢమైన అంశాన్ని బృహస్పతి చెప్పగలడు' అని భీష్ము డనగా బృహస్పతి అక్కడకు వచ్చి అతిథిపూజలు స్వీకరించి ధర్మజుడి ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. 'మేలు తొలుత ధర్మం మీద ఆధారపడి ఉంటుంది. చచ్చినవారికి ధర్మమే తోడుగా వస్తుంది. ధర్మం చేయనివాడు నరకానికి పోతాడు. నరుడు తాను చేసిన పుణ్యాలకు తగిన విధంగా సుఖమయ సంసారంలోనూ, పాపాలకు అనుగుణంగా దుఃఖమయ సంసారంలోనూ ప్రవేశిస్తాడు. పుణ్యపాపాలకు అనుగుణంగానే ఆయా జన్మ లెత్తుతాడు. (చూడు.4.258-270). పాపాలు దానాలతో నశిస్తాయి. దానాలలో అన్నదానం మిన్న. (4.271-277). ధ్యానం, ఇంద్రియనిగ్రహం, అహింస, గురుసేవ, నిత్యకర్మాచరణం, తపస్సు - అనే వాటిలో అహింస పవిత్రమైనది. ఏ ఉత్తమ ధర్మాలనైనా ప్రకాశింపజేస్తుంది.

ప్రశ్న 75 : దేవతలూ, బ్రాహ్మణులూ, మునిశ్రేష్ఠులూ అహింసను ప్రశంసిస్తూ ఉంటారు. దాని తీరును తెలియజెప్పుము.

ఉత్తరం : ఏనుగు అడుగులో జంతువుల అడుగులన్నీ ఇమిడి ఉండే తీరుగా అహింస అనే ధర్మంలో సర్వధర్మాలూ ఇమిడి ఉంటాయి. ఇది సత్యం. ఆవుకు నాలుగు కాళ్ళున్నట్లుగానే అహింసకు కూడా నాలుగు తీరులుంటాయి. అవి - మనసుచేత, మాటచేత, దేహంచేత హింస చేయటం, మాంసం తినటం అనేవి. మాంసభోజనం హింసను కలిగిస్తుంది. కనుక అది మహాదోషం. పై నాలుగు తెరగుల హింసమానటం అహింస. మాంసం పితృదేవతలకు కూడా ఇష్టమని శ్రాద్ధవిధులలో చెప్పారని అనుమానం రావచ్చును. మాంసభోజనం వదలటం అశ్వమేధయాగంకంటె కూడా పూజనీయం అంటారు. చంపటం, చంపించటం పాపాలన్నింటికంటె గొప్పపాపం. శ్రాద్ధాలలో, యజ్ఞాలలో వేదవిధులలోని హింసవలన దోషం కలుగబోదు కాని మాంసపు రుచి మరగి తినటానికై ప్రాణులను చంపటంవలన పాపం కలుగుతుంది. మాంసం తనను నమిలినవాడిని నమలుతుంది అని ఆగమాలు అంటున్నాయి. మాంసాహారం మానటం తపస్సుతో సమానం - అని మహర్షులు చెప్పారు. దానం, ధర్మం, తపస్సు, యజ్ఞం, పరిశుద్ధత, మంత్రం, అనుష్ఠానం, సత్యం - ఇవన్నీ అహింసారూపాలే కాబట్టి అహింస ఉంటే సంపదలన్నీఉన్నట్లే.

ప్రశ్న 76 : కురుక్షేత్రయుద్ధంలో చచ్చినవారు ఎక్కడికి పోతారో తెలుపుము. బ్రతుకు సుఖాన్నిచ్చేదనీ, చావు దుఃఖాన్ని కలిగిస్తుందనీ ప్రాణులు భావిస్తారు. ప్రాణాలను వదలుకొనటం చాలా అరుదు. అందుకు అడుగుతున్నాను.

ఉత్తరం : కురుక్షేత్రంలో అద్భుతభయంకర యుద్ధంలో దేహాలు వదలిన రాజులకు అనంత సుఖాలు గల గతులు కలగటంలో అనుమానం లేదు. వారందరూ ఉత్తమలోకాలను పొందినవారే. (అని చెప్పి బ్రతుకు సుఖాన్ని, చావు దుఃఖాన్ని గురించిన శంకను నివారించే ఒక ఉదంతం - కీటకానికీ వేదవ్యాసుడికీ జరిగిన సంవాదాన్ని వినిపించాడు (చూడు 4.314-343)

ప్రశ్న 77: విద్య, తపస్సు, దానం - అనే వాటిలో ఏది గొప్పది ?

ఉత్తరం : వ్యాసమైత్రేయ సంవాదం నీ ప్రశ్నకు మంచి సమాధానం. వినుము. ఒకనాడు వ్యాసుడు కాశీక్షేత్రానికి వెళ్ళాడు. అంతకుముందే ఆ నగరంలో ఉన్న మైత్రేయుడి ఇంటికి గుట్టుగా వెళ్ళాడు. మైత్రేయుడు ఆ మహర్షిని గర్తుపట్టి భోజనం పెట్టి సంతుష్టిపరచాడు. వ్యాసుడు పరమానందంతో ఇట్లా అన్నాడు. 'తపస్సు, విద్య మొదలైన ధర్మాలన్నింటిలో దానం గొప్పది. దానాలలో అన్నదానం గొప్పది. ప్రాణాలూ, దేహమూ, దాని బలమూ అన్నం స్వరూపాలే. తపస్సు మనస్సులోని మాలిన్యాల నన్నింటిని తొలగించి వేస్తుంది. విద్యకు అవకాశం కలిగిస్తుంది. ఆ తపసి చేసిన గొప్పదానం వలన విద్య పెంపొందుతుంది. ఆ విద్య తపస్సును వృద్ధి చేస్తుంది. కాబట్టి తపస్సూ, విద్యా, దాన మహిమచేత పెంపొందుతాయి. విద్య వ్రతనిష్ఠాపరుడికి పరమాత్మను చూపించే దీపం వంటిది. కాబట్టి అన్నదానం చేత పరమానందం కలుగుతుంది.

ప్రశ్న 78 : కులస్త్రీ ప్రవర్తన గురించి తెలియపరచుము.

ఉత్తరం : కేకయరాజపుత్రి సుమన అమరావతిలో శాండిలిని చూచి 'కాంతా! ఇంత శ్రేష్ఠమైన దేవలోకనివాసం నీకు ఏ నడవడివలన కలిగింది?' అని అడిగింది. శాండిలి ఇట్లా చెప్పింది. 'నేను అత్తమామలకు ఎదురు చెప్పను. దేవపూజలు శ్రాద్ధములు, అతిథిసపర్యలు చేయటంలో ఎడమొగం పెట్టను. మంచి నడవడితో ఉంటాను. వీథివాకిలి దాటను. పకపకా నవ్వను. విద్య గలవారికి నిర్మలబుద్ధితో భిక్షపెట్టుతూ తక్కిన పనులు చూచుకొంటూ ఉంటాను. భర్త ఇంటికి వచ్చినప్పుడు కాళ్ళకు నీళ్ళు ఇవ్వటం మొదలైన సపర్యలు అనుకూలభావంతో చేస్తాను. బిడ్డలను అలసట లేకుండా తీర్చిదిద్దుతాను. భర్త ఇష్టపడే వంటలు చేసి పెట్టుతూ ఉంటాను. ఏ పనిమీదనైనా భర్త పొరుగూళ్ళకు పోతే, తిరిగివచ్చేంతవరకు పూలు, మైపూతలు, మంచి చీరలు, నగలు, విందులు ఆదరించను. ధాన్యాన్నీ, అన్నాన్నీ వ్యర్థపరచను. బంధువులను తగిన విధంగా గౌరవిస్తాను. ఆవులు మొదలైన పాడిపశువుల సుఖజీవనాన్ని పరీక్షించి సాగిస్తాను. భర్తహృదయం కలతపడే విధంగా ఒక్కమాట కూడా పలకను. భర్త నిత్యాగ్నిహోత్రి అయితే ఆ అగ్నిని ఓపికతో కాపాడుతూ ఉంటాను. రహస్యాన్ని బయటపెట్టను. కడుపుతో ఉన్నప్పుడు బిడ్డ కేవి మేలు చేస్తాయో వాటినే భుజిస్తాను' అని చెప్పింది. ఈ విధంగా ప్రవర్తించిన ఉత్తమ వనిత ఇహపరలోకాలు రెండింటిలో శాశ్వతసుఖం పొందుతుంది. ఆ ఇల్లాలు అరుంధతివలె ప్రశంస కెక్కుతుంది.

ప్రశ్న 79 : సర్వశాస్త్రసారం, సర్వశ్రేష్ఠం అయిన ఆచరణ ఏది?

ఉత్తరం : 'నారద పుండరీక సంవాదం' చెప్పుతాను వినుము. నీ వడిగిన విషయం తేటతెల్లమౌతుంది. తీర్థయాత్రాశీలి అయిన పుండరీకుడు నారదుడు నీవు అడిగిన ప్రశ్ననే అడిగాడు. నారదుడు ఇట్లా చెప్పాడు. బ్రహ్మ చెప్పిన పరమ ధర్మం ఒకటి ఉన్నది. దానిని వినుము. ఇరువదినాలుగవ తత్త్వమైన ప్రకృతికి తరువాతి తత్త్వం, జీవాత్మ.

అతడు సర్వభూతాల స్వరూపం అయినవాడు. అతడి వ్యవహార నామం 'నరుడు'. అతడివలన ఏర్పడిన తక్కిన తత్త్వాలన్నీ నారములు. అతడు నారములు స్థానంగా కలవాడు కాబట్టి నారాయణుడు. ఆ ప్రభువు విశ్వాన్ని సృష్టిస్తూ మరల తనలోనే లీనం చేసికొంటూ 'విభుడు' ఔతున్నాడు. ఆ నారాయణుడే పరబ్రహ్మం, పరతత్త్వం, పరమపదం, ఈశ్వరుడు, విష్ణువు - అనే పేర్లతో పిలువబడుతూ ఉంటాడు. అతడే వాసుదేవుడు. ఆత్మ అనే పేర్లతో ఉపనిషత్తులు పిలుస్తాయి. ఈ పేర్లు నరుడికి కూడా వర్తిస్తాయి. సర్వశాస్త్రాల వాక్యాలను పరిశీలించి నిర్ణయించిన తాత్పర్యమిది. కాబట్టి ఎల్లవేళలా నారాయణుడిని స్మరించాలి. మరణకాలంలో 'నమో నారాయణాయ' అనే మంత్రాన్ని పలికితే నరులు ప్రణవానికి అర్థమైన పరమపదాన్ని పొందుతారు అని చెప్పాడు. ధర్మరాజా! నీవు కూడా పరమ భక్తితో విష్ణువును సేవించుము.

ప్రశ్న 80 : దానం, ప్రియభాషణం - ఈ రెండింటిలో ఏది ఎక్కువ ప్రీతి కలిగిస్తుంది?

ఉత్తరం : రెండూ ప్రీతి కలిగించేవే. దానం ప్రీతికరమైనదని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. ప్రియభాషణంకూడా ప్రీతికరమైన దనటానికి ఒక పురాతన కథ ఉన్నది. చెప్తుతాను వినుము. మాటకారి, బుద్ధిశాలి అయిన ఒక బ్రాహ్మణుడు జనసంచారంలేని అడవికి పోయాడు. ఒక రాక్షసుడు అతడి మాంసం తినగోరి అతడిని పట్టుకొన్నాడు. అతడు కలతపడకుండా ఆ రక్కసుడి మొగంవైపు చూస్తూ ఉండిపోయాడు. ఆ రక్కసుడు ఆశ్చర్యపోయి 'నా ప్రశ్నకు సమాధానం చెప్పితే నిన్ను వదలుతాను' అని 'నా శరీరం కృశించిపోవటానికీ, పాలిపోవటానికీ కారణం ఏమిటి?' అని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు తొందరపడక నిబ్బరంగా, అనుకూలభావంతో ఇట్లా చెప్పాడు. 'చుట్టాలు నీ దుష్టస్వభావంతో విసిగి వదలి తరువాత బాధపడటం, దారిద్ర్యం కలిగినప్పుడు అపూర్వ గౌరవాలు కోరటం, ఇతరులు పెట్టిన బాధలను నీవు మొగమాటంవలన అనుభవించగా వారు జయించామని పొంగిపోవటం, జాలి తలచి నీవు మేలు చేయగా ఆ మేలు పొందినవాడు అది తన పరాక్రమమే అని చెప్పటం, బుద్ధి కలవారు నిన్ను పొగడుతూ ఉంటే సిగ్గుపడుతూ పండితుల మెప్పుకొరకు చూస్తూ ఉండటం, నీవు న్యాయంగా పలికిన దానిని జనసభ అంగీకరించకపోవటం, నీ తప్పు నీ భార్యకు తెలిసి ఆమె కుమిలిపోతూ ఉంటే ఆమెను నీవు సముదాయించ లేకపోవటం, నీ సొమ్మును కొట్టివేయాలని ఇతరులు కనిపెట్టుకొని ఉంటే దానికి ఏది దిక్కు అని నీవు ఆలోచిస్తూ ఉండటం, దుర్మార్గుడు చాటున నిన్ను గూర్చి చేసిన నిందలను నీ బంధువులు వినాలని భావించటం, నీవు గొప్ప పనులు చేస్తూ ఉంటే నీ స్నేహితులు నిన్ను మాయలవాడిగా భావించటం, నీ మనసులో ఉన్న పెనువగపును బయట పెట్టుకొనలేకపోవటం, భార్య, కొడుకు, అల్లుడు మంచి నడవడిలేనివారై త్రిప్పలు పెట్టటం, తండ్రి, తల్లి, అన్నదమ్ములు రోగాదులచేత కృశించటం, పూర్వజన్మలో బ్రాహ్మణుడి ఆవును చంపటం, పనికిమాలినవాడిని పనిలో పెట్టుకొని పేరు పాడుచేసికొనటం, ఎంతోకాలం ఎన్నో ప్రయత్నాలు చేసి ఒక కొలికికి తెచ్చిన పనిని నీచుడైన పగవాడు పాడుచేయటం - వీటిలో ఒకదానిచేత మానవుడు కృశిస్తాడు. పాలిపోతాడు' అని అన్నాడు. ఆ మాటలు విని రాక్షసుడు అతడిని వదలిపెట్టాడు. మంచిమాటల తీరు ఇట్లా ఉంటుంది.

ప్రశ్న 81 : మహాత్మా! సంసార సముద్ర తీరాన్ని చేర్చగల ఓడ నీ దయా విశేషమే. పాపాలన్నింటినీ పారద్రోలే ఒక ప్రాచీనగాథను వినిపించుము. శ్రీకృష్ణుడు మునులతో, మహారాజులతో కలిసి నీవు చెప్పే గాథను వినాలని వేడుకతో ఉవ్విళ్ళూరు తున్నారు. నేనూ నా తమ్ముళ్ళూ పరమానందంలో తేలియాడే విధంగా మంచి కథను చెప్పుము.

ఉత్తరం : ధర్మరాజా! కరుణానిధీ, సర్వలోకశరణ్యుడూ అయిన శ్రీకృష్ణుడు వింటూ ఉండగా పుణ్యేతిహాసాన్ని చెప్పే

అదృష్టాన్నీ, పుణ్యాన్నీ పొందాను. వ్యాసాదిమహర్షులూ, రాజవంశంవారూ వినటంవలన నా గౌరవం పెరిగింది. ఇదే ఒక పరమపదం. నీవడిగినదానికి 'ఉమామహేశ్వర సంవాదం' అనే ఇతిహాసం ఉన్నది. అది ప్రవర్తిల్లటానికి కారణమైన కథను ముందుగా చెప్పి ఆ తరువాత దానిని చెప్పుతాను' అని శ్రీకృష్ణుడికి నమస్కరించి ధర్మరాజుతో చెప్పనారంభించాడు.

శ్రీకృష్ణుడు పుత్ర సంతానార్థి అయి రుక్మిణితో కలిసి హిమవత్పర్వతానికి వెళ్ళి పన్నెండేళ్ళు వ్రతం చేసి కృశించి ఉన్నాడు. అప్పుడు నారదాది మహర్షులు శిష్యసమూహంతో వచ్చి శ్రీకృష్ణుడిచుట్టూ కూర్చుండి పుణ్యగోష్ఠి చేస్తూ ఉండగా అతడి ముఖం నుండి ఒక మహాగ్ని వెలువడి ఆ పర్వతవనాలను కాల్చివేసింది. ఆ తరువాత శ్రీకృష్ణుడు తన సౌమ్యదృష్టితో ఆ మంటను చల్లార్చి అడవిని మునుపటివలెనే సవ్యంగా ఉండేటట్లు చేసి, అందరినీ ఆశ్చర్యంలో ముంచి ఎత్తాడు. వారి ప్రార్థన మేరకు ఆ అగ్నిని గురించి శ్రీకృష్ణుడు వివరించి చెప్పాడు. 'ఒక రాక్షసుడు నా వరంవలన అస్త్రవిద్యతో అద్భుతశక్తి పొంది, అహంకరించి లోకకంటకుడయ్యాడు. అతడిని సంహరించగల కొడుకును పొందటానికి ఈ మహావ్రతాన్ని చేపట్టాను. నా ఆత్మ అగ్నిగా మారి, నా ముఖం నుండి వెలువడి బ్రహ్మదగ్గరకు వెళ్ళింది. ఆ మహానుభావుడు మన్మథుడిని నా కుమారుడిగా పంపి, ఆ అగ్నిని మరలించాడు. అది తిరిగిపోతూ ఈ అడవిని కాల్చింది. నేను కరుణించి మరల దానికి మొదటిరూపు కల్పించాను' అని అగ్ని కథ చెప్పి ఋషులను 'నా కొక ఉత్తమ ఇతిహాసాన్ని చెప్పి నా కోరిక తీర్చండి' అని కోరాడు. ఋషులు ఆ పనికి సమర్థుడు నారదుడే అని పేర్కొని, అతడిని 'కథ చెప్పు'మని ప్రార్థించారు. అతడు 'ఉమామహేశ్వర సంవాదం' అనే ఇతిహాసాన్ని శ్రీకృష్ణుడికి వినిపించాడు. దానిని నీకు చెప్పుతున్నాను.

నారదుడు : నేను లోక సంచారంచేస్తూ హిమవత్పర్వతంమీద ఒక సుందర దివ్యోద్యాన వనాన్ని చూచాను. ఆ ఉద్యానంలో శార్దూల చర్మధారి, భుజగాభరణుడు, విభూతి సుందరుడు అయిన మహాదేవుడు సురసిద్ధ విద్యాధరమునిగణ, భూతగణ పరివృతుడై ఉండగా ఆ సభలో నేనుకూడా చేరి స్వామిని సేవిస్తూ ఉన్నాను. అంతలో సపరివారంగా పార్వతీదేవి వచ్చి తన కరకమలాలతో పరమేశ్వరుడి కన్నుదోయిని విలాసంగా మూసింది. దానితో లోకంలో సూర్యచంద్రుల కాంతి లోపించి కారుచీకటి వ్యాపించింది. లోకాలు భీతిల్లగా పరమేశ్వరుడు మూడవ కంటిమంటతో వెలుగులు ప్రసాదించాడు. పార్వతి భీతిల్లి పరమేశ్వరుడి పాదాలకు ప్రణమిల్లింది. స్వామి కరుణతో చూడగా మంటలు చల్లారి కొండ చల్లబడింది. అప్పుడు పార్వతి ఇట్లా అడిగింది.

పార్వతి : సర్వేశా! నొసటికన్ను తెరవటానికి గల కారణ మేమిటి?

శివుడు : ఈ లోకాలన్నీ నా స్వరూపాలే. నా కేది కలిగితే లోకాలకు కూడా అది కలుగుతుంది. నీవు నా కన్నులు మూశావు. లోకాలలో చీకటి వ్యాపించింది. భూతాలు భయపడ్డాయి. నీ చేతులు తొలగించకుండా చీకటి పోగొట్టటానికి నా ఫాలనేత్రం తెరవవలసి వచ్చింది.

పార్వతి : స్వామీ! నీకు నాలుగు మొగా లెందుకు ఉన్నాయి?

శివుడు : సుందోపసుందులనే మహాబలవంతులైన రాక్షసులను చంపటానికి విశ్వకర్మ తిలోత్తమను సృష్టించి నా వద్దకు పంపాడు. ఆమె దేవకార్య నిమిత్తమై నా చుట్టూ ప్రదక్షిణాలు చేసింది. నేనే ఆమెను రక్షించటానికై నాలుగు దిక్కులా చూచాను. అప్పుడు నాలుగు మొగాలు మొలిచాయి.

పార్వతి : జగదీశా! నీ కంఠంలో నలుపెందుకు కలిగింది?

శివుడు : క్షీరసాగర మథన సమయంలో వెలువడిన కాలకూటాన్ని లోక సంరక్షణార్థమై నా కంఠంలో ధరించాను. బ్రహ్మాదు లందుకే నన్ను నీలకంఠుడని పిలుస్తారు.

పార్వతి : స్వామీ! నీకు పినాక మనే ఆయుధం మీద ఎక్కువ మక్కువ ఎందుకు?

శివుడు : కృతయుగంలో కణ్వుడు అనే మహర్షి మహాతపస్సు చేశాడు. అతడిమీద పెద్ద పుట్ట, దానిమీద మిక్కిలి పొడవూ వెడల్పూ గల వెదురు మొలిచింది. బ్రహ్మ ఆ మహర్షికి ప్రత్యక్షమై వరమిచ్చి ఆ వెదురును తీసికొని, లోకశ్రేయస్సును కాంక్షించి దానిని మూడు ముక్కలు చేసి మూడవ ముక్కతో పినాకాన్ని నిర్మించి నా కిచ్చాడు. రెండవ ముక్కతో శార్ఙ్గమును నిర్మించి విష్ణువుకు ఇచ్చాడు. మొదటి తునుకతో గాండీవాన్ని కల్పించి తాను తీసికొనిపోయాడు. అందువలన నేను పినాకాన్ని అభిమానిస్తాను.

పార్వతి : నంది వాహనాన్ని ఎందుకు ఆదరిస్తారు?

శివుడు : నేను హిమవత్పర్వతంమీద తపస్సు చేసికొంటున్నప్పుడు ఆవులు నా చుట్టూ నిర్భయంగా తిరుగుతూ కష్టపెట్టాయి. నేను కోపించి చూడగా అవి బాధపడ్డాయి. బ్రహ్మ, దేవతలు నా వద్దకు వచ్చి ప్రార్థించి నా కొక ఎద్దును కానుకగా ఇచ్చి 'గోపతి' అని పేరుపెట్టి గోవుల బాధ తీర్చారు. అది మొదలు నేను ఆ ఎద్దును వాహనంగా, ధ్వజంగా చేసికొని సంచరిస్తున్నాను.

పార్వతి : నీవు మనోహరమైన నెలవులను వదలి అశుచి అయి, కేశాస్థికపాల దుర్గంధ దుర్దర్శన మైన శ్మశానంలో ఉండటానికి కారణమేమి?

శివుడు : క్రూరభూతాలు జనులను ఘోరంగా వధ చేయటం గమనించి బ్రహ్మ నన్ను ఆ విపత్తును తొలగించుమని ప్రార్థించాడు. మోక్షమందు ఆసక్తి కలవారు నిర్జనమైన శ్మశానాన్ని పవిత్రస్థానంగా భావిస్తారు. కాబట్టి నేను వల్లకాటిలో ఉండటానికి ఇష్టపడతాను. అక్కడే ఉండి లోకరక్షాకార్యాన్ని నిర్వహిస్తాను.

పార్వతి : బూదిపూత, ఎముకల, పాముల సొమ్ములు, గొడ్డలి, శూలం - అనే ఆయుధాలతో భయంకరమైన రూపం ఎందుకు ధరించావు?

శివుడు : జగత్తంతా సౌమ్యం, ఆగ్నేయం అనే రెంటి కలయికతో కూడి ఉన్నది. సౌమ్యమైన దానిని విష్ణువూ, ఆగ్నేయమైన దానిని నేనూ భరిస్తూ ఉంటాము. ఈ రెంటిని కలిపి ఈ విశ్వాన్ని నేను వహిస్తున్నాను. అందువలన అగ్నిసంబంధ భావంతో కూడుకొనిన ఆకారాన్ని లోకహితంకొరకు తాల్చాను.

పార్వతి : నీవు చంద్రుడిని ప్రేమతో తలపై ధరించటానికి కారణం ఏమిటి?

శివుడు : దక్షయజ్ఞంలో నేను ఆగ్రహించినప్పుడు దేవతలందరినీ హింసించాను. ఆ సందర్భంలో చంద్రుడి దేహాన్ని అడ్డదిడ్డంగా త్రొక్కివేశాను. అతడు నన్ను శరణు కోరాడు. జాలిపడి చేసిన కీడు తొలగటానికి అతడిని తలపై ధరించాను.

పార్వతి : శివా! వర్ణాశ్రమ ధర్మాలను చక్కగా తెలియజెప్పుము.

శివుడు : లోకహితం కొరకు బ్రహ్మ ముఖంనుండి బ్రాహ్మణులను, భుజాలనుండి క్షత్రియులను, తొడలనుండి వైశ్యులను, పాదాలనుండి శూద్రులను సృష్టిచేశాడు. ఆయా వర్ణాలవారికి విధులను, ధర్మాలను నిర్దేశించాడు. బ్రాహ్మణులు లోకానికి ఆధారమైనవారు. వారిని అవమానించటంగాని, అగౌరవపరచటం కాని తగదు. వారికి దానాలు చేయటంవలన శుభాలు కలుగుతాయి. బ్రాహ్మణనింద ఈశ్వరనిందవంటిది వేదాధ్యయనం చేయటం. యజ్ఞాలు

చేయటం, తగినవారికి దానాలు చేయటం, వేదాలు శిష్యులకు నేర్పటం, యజ్ఞాలలో దానాలు స్వీకరించటం, క్రోధాదులు లేని చిత్తంతో భగవద్ధ్యానం చేయటం, మనోవాక్కాయకర్మలలో శుచిగా ఉండటం, సత్యవాక్యపాలనం బ్రాహ్మణవిధులు. తపస్సు యొక్క గొప్పతనాన్ని సాధించటానికీ, ధర్మానికి పునాదిగా ఉండటానికీ, బ్రహ్మ బ్రాహ్మణులను సృష్టించాడు. క్షత్రియులు రాజ్యాన్ని పాలిస్తూ బ్రాహ్మణులను పరిరక్షించాలి. ధనుర్వేదం, నీతిశాస్త్రం, రాజనీతి మొదలైన విద్యలను నేర్పటం, యజ్ఞయాగాది కర్మలు చేయించటం, దానాలు యోగ్యులకు చేయటం, సాధువులను పండితులను రక్షించటం, దుష్టులను శిక్షించటం, ఆయుధ జీవులు కావటం, వ్యవసాయంలోనూ వ్యాపారంలోనూ ఆరవభాగం పన్నుగా గ్రహించటం, ప్రజలను ధర్మంగా న్యాయంగా పాలించటం క్షత్రియుల విధులు. వైశ్యులు లోకులకు ఉపకారం చేసేవారు. వ్యవసాయం, వ్యాపారం, పశుపోషణ వారి ప్రధాన విధులు. వీరికి ద్విజత్వం ఏర్పడింది. విద్యార్జన, యజ్ఞాలు చేయటం, గోభూదానాలు చేయటం తగిన పనులు. అతిథిసత్కారం అవశ్య కర్తవ్యం. శూద్రులకు సేవాధర్మం ముఖ్యమైనది. బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు సేవలు చేసి ప్రత్యుపకారం పొందాలి. వినయంతోనూ, సాధు స్వభావంతోనూ వ్యవహరించాలి. వర్ణధర్మాలు ఆచరిస్తే సమాజంలో సుఖశాంతులు కలుగుతాయి. ఇక ఆశ్రమ ధర్మాలు చెప్పుతాను. బ్రహ్మచర్యాశ్రమంలో బ్రహ్మచర్యం, గురుసేవ, విద్యాభ్యాసం, నిత్యాగ్నిహోత్రం అవశ్యకర్తవ్యాలు. గృహస్థాశ్రమం అన్నింటిలో ముఖ్యమైనది. పంచయజ్ఞాలు ఆచరించటం, స్వీయభార్యను పాలించటం, దానాలు చేయటం, బంధువులను గౌరవించటం గృహస్థాశ్రమ ధర్మాలు. అడవిలో నివసించటం, కందమూలాలు భుజించటం, స్త్రీ సంగమం వర్జించటం, జడలు ధరించి జింకచర్మాన్ని కట్టుకొనటం, వానప్రస్థాశ్రమ ధర్మాలు. కోపగించుకోకుండా ఉండటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, ఓర్పు వహించటం, బ్రాహ్మణులతో కలిసి జీవించటం, ప్రశాంతంగా, నిష్పక్షపాతంగా, శుచిగా, శుభ్రంగా ఉండటం, సద్వ్రతనిష్ఠ. భిక్షాభోజనం, నేలపై మాత్రమే శయనించటం, దయాస్వభావం కలిగి ఉండటం, సదా తత్త్వచింతనతో, యతి ధర్మాలతో జీవించటం సన్న్యాసాశ్రమ విధులు. ఇవి వేదాలు సమ్మతించిన విధులు.

పార్వతి : ముని జనులు చేసే తపస్సుయొక్క విధానం తెలియజెప్పుము.

శివుడు : తపమంటే సామాన్యంగా వానప్రస్థులు చేసే ధర్మాలు. ఇంద్రియ నిగ్రహం, యోగాభ్యాసం, ఫలాభిరహిత కర్మాచరణం, పంచాగ్ని మధ్య తపస్సు మొదలైనవి చేసి స్వర్గం పొంది సుఖించేవారు తపస్వులు. భార్యాయుతులై తపస్సు చేసేవారు అహింస, దయ మొదలైన గుణాలు కలిగి, సర్వభూత సమభావంతో వర్తిస్తారు. ఉపవాసం, మౌనం, భూతలశయనం మొదలైన వానప్రస్థాశ్రమ నియమాలు తపస్వులు పాటిస్తారు.

పార్వతి : దేశ ద్రిమ్మరులైన విరాగులను గురించి చెప్పుము.

శివుడు : వీరు యాయావరులు, పుణ్యతీర్థాలను సేవిస్తూ నిరాహారవ్రతాలను పాటిస్తుంటారు. బక్కచిక్కిన శరీరాలతో నియమనిష్ఠలతో జీవించి స్వర్గం చేరతారు.

పార్వతి : వైఖానసుల పద్ధతి తెలపండి.

శివుడు : వైఖానసులు కఠిన వ్రతాలు పాటిస్తారు. రాళ్ళతో, నివ్వరిధాన్యాలను దంచుకొని వానిని మాత్రమే నమలుతారు. కొందరు గాలి, నీరు మాత్రమే స్వీకరిస్తారు.

పార్వతి : గృహస్థాశ్రమ ధర్మాలను తెలపండి.

శివుడు : గృహస్థాశ్రమంలో కామం ధర్మప్రధానమై ఉండాలి. ఆత్మనిగ్రహం, భూతదయ, శాంత స్వభావం, అతిథి సత్కారం, మిగిలిన ఆశ్రమవాసులను గౌరవించటం గృహస్థాశ్రమ ధర్మంలో ముఖ్యం. స్త్రీకి పతిని సేవించటం ప్రధాన విధి. గృహస్థుడు నిజభార్యయందే రమించాలి. ఆహారనియమం పాటిస్తే ముక్తి మార్గం సులభం.

పార్వతి : రాజు అందరివలెనే శరీరం కలిగి, భోజనాదులు చేస్తూ ఉండి కూడా అందరిచేత నమస్కరించబడతాడు. నిగ్రహాను గ్రహాలలో సమర్థుడౌతాడు. సర్వాధిపత్యంతో శోభిల్లుతాడు. దీనికి కారణం ఏమిటి?

శివుడు : రాజార్హత తపస్సువలన లభిస్తుంది. అందువలననే ఇతరులకు నమస్కార యోగ్యుడౌతాడు. నిగ్రహానుగ్రహ సమర్థు డౌతాడు. తాను నీతిపరుడై ఇతరులను నీతిపరులుగా చేస్తాడు. అవసరం వస్తే శిక్షిస్తాడు. కామాది అంతశ్శత్రువులను జయించి సప్తాంగాలను శాసిస్తాడు. ధర్మాన్ని రక్షిస్తాడు. చారచక్షువై లోకాన్ని గమనిస్తాడు. ధర్మాన్ని రక్షిస్తాడు. అధర్మాన్ని శిక్షిస్తాడు. అకారణంగా యుద్ధం చేయడు. న్యాయబద్ధంగా యుద్ధానికి పూనుకొంటాడు. యజ్ఞాలు దానాలు చేస్తాడు. ఈ నీతులకు వ్యతిరేకంగా వ్యవహరిస్తే రాజుకు పాపం కలుగుతుంది. ప్రజలను బిడ్డలవలె కాపాడి సంపదను, పేరు ప్రఖ్యాతులను గడిస్తాడు. చివరకు స్వర్గసుఖాలను పొందుతాడు.

పార్వతి : ధర్మరహస్యం వినగోరుతాను.

శివుడు : ధర్మాలన్నింటిలో అహింస సూక్ష్మమైన ధర్మం.

పార్వతి : లోకులకు హింసను వదలటం సాధ్యం కాదు. మరి అహింస అంటే ఏమిటి?

శివుడు : శాంతగుణంతో తపస్సు చేసికొనేవారు అహింసావ్రతం పాటించేవారు. లోకులు తమ కర్తవ్యాలు చేస్తూ ఉండగా కొన్ని ప్రాణులు చనిపోతాయి. అప్పుడు వారికి చంపే బుద్ధి ఉండదు. పాపపుణ్యాలకు బుద్ధి ప్రధానం. యుద్ధాలలో మరణించటం, యుద్ధాలలో సంహరించటం హింస కాదు. స్వర్గప్రాప్తికి హేతువులు కూడా. వేటాడటం హింస కాదు. వేదమంత్రయుతంగా యజ్ఞంలో పశువిశసనం హింస కాదు. శిక్షకు తగినవాడిని శిక్షించటం కూడా హింస కాదు.

పార్వతి : జనులు జీవించే విధానాన్ని గురించి చెప్పుము.

శివుడు : మనుష్యజన్మం కర్మభూమి. సుఖదుఃఖాలకు మూలం ధనం. అందువలన ధనసంపాదన మార్గాలు మానవుడు యోచిస్తాడు. అయితే అవి ధర్మపథంలో సాగాలి. కర్మలలో మోసం ఉండకూడదు. ఉపాయంతో పనులు చేయాలి. ఇతరుల ధనాన్నీ, వనితలనూ దొంగిలించరాదు. తల్లిదండ్రులను, అతిథులను, దేవతలను గౌరవించి పూజించాలి. ఇవి అందరూ ఆచరించదగిన జీవన విధానం.

పార్వతి : నాలుగు వర్ణాలవారు చేసే కర్మలు ఏ విధంగా ఫలిస్తాయి?

శివుడు : చాతుర్వర్ణ్యములవారు తమ తమ వర్ణాలకు తగిన పనులు పద్ధతి తప్పక నిర్వహిస్తే స్వర్గసుఖం లభిస్తుంది. మంచి పనులు చేస్తే ఉత్తమ పదాలు లభిస్తాయి.

పార్వతి : లోకంలో కొందరు మానవులు సంపదలతో సుఖిస్తారు. కొందరు పేదరికంతో బాధపడతారు. దీనికి కారణం ఏమిటి?

శివుడు : దైవానికి ఒకరిమీద కోపంగానీ, ఒకరిమీద ప్రేమకాని ఉండవు. పూర్వజన్మలో చేసిన కర్మలయొక్క ఫలితాలు క్రమంగా అనుభవంలోకి వస్తాయి. సమయాన్ని బట్టి కష్టసుఖాలు, సంపదలు, పేదరికాలు ఏర్పడుతాయి. (చూడు. వివరాలకు 5.86-126)

పార్వతి : పసివారు మరణించటానికి, ముసలివారు చాలాకాలం జీవించటానికి కారణ మేమి?

శివుడు : శరీరం శిథిలమౌతున్నది కాని వృద్ధులకు చావు త్వరగా రావటం లేదన్నావు. మృత్యువు నరుడిని చేరినప్పుడు చావు కలుగుతుంది. పూర్వజన్మలో చేసిన కర్మలు మానవుడికి ఆయుస్సును వృద్ధి చేస్తాయి. తగ్గిస్తాయి కూడా. దానివలన బ్రతుకు చావులు సంభవిస్తూ ఉంటాయి.

పార్వతి : ఆయుస్సు ఏమి చేయటంవలన అధికమౌతుంది? దేనివలన తగ్గిపోతుంది?

శివుడు : క్షమ, సత్యం, కృప, శౌచం, గురుభక్తి - ఆయుస్సును వృద్ధి చేస్తాయి. అసత్యభాషణం, క్రౌర్యం, అశుభ్రత, గురువిరోధం ఆయుస్సును తగ్గిస్తాయి. బ్రహ్మచర్యవ్రతం, హితమితాశనం, జరావ్యాధులు పోగొట్టే ఔషధాలను సేవించటంచేతను ఆయుస్సు పెరుగుతుంది. శక్తికి మించిన పనులు చేయటం, తగనటువంటి, అనుసరణీయం కానటువంటి పదార్థాలు తినటం చేతను ఆయుస్సు తగ్గిపోతుంది. ఇవన్నీ పూర్వజన్మలో చేసిన కర్మలవలననే సంభవిస్తాయి.

పార్వతి : స్త్రీ పురుష భేదంతో ఉన్న మానవులలో జీవుడు వర్తించే విధం వివరించుము.

శివుడు : తాత్త్వికంగా జీవుడికి పురుష స్త్రీత్వాలు లేవు. అహంకారం కారణంగా కర్మానుభవం కలిగి భావించిన విధంగా జరుగుతుంది. ఆత్మ శరీరానికి అతీతమైనది. కర్మలకు ఆత్మ కర్త కాదు. అతడి త్రిగుణాత్మక చైతన్యం శరీరాన్ని పొంది కర్తృత్వం వహిస్తుంది. మనుష్యులు చేసే కర్మలను బట్టి ఫలితాలు కూడా కలుగుతాయి. జంతువులలో మానవుడు శ్రేష్ఠుడు. అతడికి గొప్పతనం కలిగించేది విద్య. విద్యవలన అజ్ఞానంవలన, సంసారంవలన కలిగే కష్టనష్టాలు తొలగిపోతాయి. వేదాలవలన జ్ఞానం కలుగుతుంది. వేదవిజ్ఞానంవలన మానవుడిలోని అంతశ్శత్రువులు గాలికి మేఘాలు విచ్చి పోయినట్లుగా తొలగిపోతాయి. విద్యావంతులు దేవతలవలె ప్రకాశిస్తారు.

పార్వతి : స్వప్న మంటే ఏమిటి?

శివుడు : స్వప్నమంటే నిద్రించేవారి మనశ్చేష్ట. అది భవిష్యత్తులో జరుగబోయే శుభాశుభాలను కూడా తెలియజేస్తుంది.

పార్వతి : కర్మాచరణంలో దైవం ముఖ్యమా? మానవుడి ఉత్సాహం ముఖ్యమా?

శివుడు : పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితమే ప్రయత్నం వలన మానవుడు పొందుతాడు. దానికి దైవసహాయం తప్పక కావాలి. కాబట్టి కర్మఫలానికి రెండూ కావాలి. అందులో సందేహం లేదు.

పార్వతి : గర్భంలో ప్రాణి ఏ విధంగా ప్రవేశిస్తాడు?

శివుడు : రతిలోని పురుషుడి శుక్లంవలన, స్త్రీ రజస్సువలన, దైవానుగ్రహంవలన ఆత్మ గర్భప్రవేశం చేస్తుంది. జీవుడు మాయారహితుడైనా అహంకారంవలన పుట్టుకకు గురి ఔతున్నాడు.

పార్వతి : నరులకు పునర్జన్మ ఉన్నదా? లేదా?

శివుడు : దేవతలకే ఆ సంగతి తెలియదు. ఇక నరులకు సాధ్యమా? పునర్జన్మ నరులకు ఉంటుంది. కాని, దానిని తెలిసికొనటం కష్టం. వేదవిజ్ఞానంవలన దానిని తెలిసికొనవచ్చును.

పార్వతి : మరణించినవారు ఆకారం లేకుండా ఉంటారు. వారిని యమభటులు బంధించి తీసికొనిపోవటం ఏమిటి? యముడు శిక్షించటం ఏమిటి?

శివుడు : మరణం ఆసన్నమైనపుడు శరీరాన్ని విడిపించి, మనుష్యులను అదృశ్య శరీరం వహించే విధంగా చేసి యమదూతలు తీసికొని వెళ్ళతారు. వారిలో ధార్మికులను సువాసన భరితంగానూ, సుకుమారంగా ఉండే మార్గంలో కొనిపోతారు. ధర్మాధర్మాలను మిశ్రమంగా చేసినవారిని బాధలు లేనిదారిలో తీసికొనిపోతారు. అధర్మపరులను కఠినం, మలినం అయిన దారిలో నడిపిస్తారు. యమధర్మరాజు వారికి తగిన శిక్షలను విధిస్తాడు.

పార్వతి : నరకం ఎటువంటిది? ఏ విధంగా ఉంటుంది? పాపాత్ములను యముడు ఏ విధమైన బాధలతో శిక్షిస్తాడు?

శివుడు : నరకాలు అయిదు. అవి: రౌరవం, మహారౌరవం, కంటకావనం, అగ్నికుండం, పంచకష్టం. జీవులు చేసిన పాపాలను బట్టి ఆయా నరకాలకు యముడు పంపుతాడు. యమభటులు వారికి కాల్చటం, కత్తిరించటం, కట్టివేయటం, కొట్టటంవంటి శిక్షలు విధిస్తారు. ఆ పాపాత్ములను కుక్కలు కరుస్తాయి. కీటకాలు తొలుస్తాయి. గ్రద్దలు ముక్కుతో పొడుస్తాయి. ఇటువంటి అనేక దుఃఖాలు అనుభవించి పురుగులుగానూ, పక్షులుగానూ, జంతువులుగానూ, మనుష్యులుగానూ జన్మిస్తారు. ఇనుమును వేడిచేసినప్పుడు తుప్పు తొలగిపోయినట్లు, యమ శిక్షలతో పాపాలు తొలగిపోతాయి.

పార్వతి : పాపాలు ఎటువంటివి ?

శివుడు : మానసములనీ, వాచికములనీ, కాయికములనీ పాపాలు మూడు రకాలు. అన్యుల ద్రవ్యాన్ని ఆశించటం, పాపకృత్యాలకు పాల్పడటం, ధర్మాన్ని ద్వేషించటం మొదలైనవి మానసాలు. అసత్యమాడటం, కఠిన సంభాషణం మొదలైనవి వాచికాలు. హత్యచేయటం, ఇతరులను బంధించటం, మద్యపానం అనేవి కాయికాలు. అన్నిటిలో మద్యపానం మహాపాపం. దానిని వదలి యశస్సు, సంపద, సౌఖ్యం, పుణ్యగతి పొందవచ్చును.

పార్వతి : పుణ్యాలంటే ఎటువంటివి?

శివుడు : పుణ్యకర్మలు లోకంలో మూడురకాలు: 1.ఔపమికం, 2.నిరుపకరణం, 3.సోపకరణం. ఔపమికమంటే పాపాన్ని తొలగించేది. నరకభయంతో పాపాలు చేయకుండా ఉండటం. దీనివలన స్వర్గం లభిస్తుంది. నిరుపకరణం అంటే శుచిగా ఉండటం, నిజం మాట్లాడటం, అహింసను పాటించటం, వ్రతదీక్ష, ఉపవాసం. స్త్రీ సంగమ వర్జనం, పుణ్యతీర్థ సేవనంవంటి నియమాలు పాటించటం. దానాదులు చేయటం సోపకరణం.

పార్వతి : దానం చేయదగిన వస్తువు లేవి?

శివుడు : జంతువు లన్నింటికి అన్నం, నీరు, ప్రాణంవంటివి కాబట్టి వాటిని దానంచేయటం దానాలలో శ్రేష్ఠం. ఆ తరువాత బంగారం, గోవు, భూమి, కన్య, విద్య, తిలలు, గొడుగు, దాసదాసీజనం, దీపం, ఔషధం, ఆశ్రయం మొదలైనవి ఉత్తమగతులు కలుగజేస్తాయి.

పార్వతి : యజ్ఞం చేసే పద్ధతిని తెలుపుము.

శివుడు : యజ్ఞవిధులు వైదికాలనీ, లౌకికాలనీ రెండు విధాలు. ఆయావర్ణాలకు తగినట్లుగా ధనధాన్యాలను గ్రహించి వేదవిధులతో దేవతలకు అర్పించేది వైదికం. దేవతలకు ఉత్సవాదులు నిర్వహించటం లౌకికం. దాన ధర్మాలు వ్రతాలు యజ్ఞాలతో సమానం కావు. యజ్ఞం శ్రద్ధతో చేయాలి. హవ్యాలను దేవతలకు అర్పించాలి.

పార్వతి : పితృసంబంధమైన విధులను తెలియపరచుము.

శివుడు : పితృకార్యాలు గయ, కురుక్షేత్రం, గంగ మొదలైన పుణ్యక్షేత్రాలలో చేయటం శ్రేష్ఠం. మాసాలలో మాఘం, భాద్రపదం మేలైనవి. తిథులలో అమావాస్య, ద్వాదశి, నవమి శ్రేష్ఠాలు. పితృదేవతలకు దర్భలు, మినుములు, నువ్వులు ప్రీతి ప్రదాలు. వేదవిదులు భోక్తలుగా పనికివస్తారు. వారికి భోజనం పెట్టి పిండప్రదానం చేయటం పితృకార్యవిధి. దానివలన శివుడు మెచ్చుకొంటాడు.

పార్వతి : మరణించినవారు వారి పుణ్యాల ననుసరించి పునర్జన్మ పొందుతారు కదా! అప్పుడు భూలోకంలో వారి బంధువులు పితృపూజ ఎవరికి చేయాలి? దానివలన ఎవరికి మేలు కలుగుతుంది?

శివుడు : ఈ సందేహం సరైనదే. ఇది చాలా రహస్యమైనది. పితృదేవతలూ ఇతర దేవతలవంటివారే. దేవతలు ఉత్తరదిక్కులో ఉంటే పితృదేవతలు దక్షిణదిక్కులో ఉంటారు. దేవతల కిచ్చేవి హవ్యములు, పితృదేవతల కిచ్చేవి కవ్యములు. మరణించిన తల్లిదండ్రులకు, బంధువులకు శ్రాద్ధకర్మలు చేస్తే పితృదేవతలు సంతోషించి, కర్తకు ఆయురారోగ్యైశ్వర్యాదులే కాక మోక్షం కూడా ప్రసాదిస్తారు. పితృదేవతలు దేవతలవలెనే రాక్షసులకు, గరుడులకు, యక్షులకు కూడా పూజనీయులు.

పార్వతి : ధర్మం అనేకవిధాలుగా ఉంటుంది. దానిని గురించి చెప్పండి.

శివుడు : జాతినిబట్టి, దేశాన్నిబట్టి, కులాన్నిబట్టి, గుణాన్నిబట్టి చేసే ధర్మాలనీ, ఆపద్ధర్మాలనీ ధర్మాలు అయిదు విధాలు.

పార్వతి : స్వర్గంలో లభించే సౌఖ్యాలు ఏ విధంగా ఉంటాయి?

శివుడు : స్వర్గంలో పుష్పాలు వాడవు; కల్పవృక్షం సువాసన ద్రవ్యాలను అందిస్తుంది. వారి ఆహారం అమృతం. శుభ్రమైన దుస్తులూ, అపూర్వాభరణాలు వారికి సహజం. ద్వేషాదిభావాలు లేక మైత్రితో ఉంటారు. ఎల్లప్పుడూ ఆనందంగా ఉంటారు.

పార్వతి : ధర్మాలలో శ్రేష్ఠమైన ధర్మాలు ఏవి?

శివుడు : ధర్మార్థకామాలకంటె మోక్షధర్మం ఉత్తమమైనది. మానవుడు ఇంద్రియాలను నిగ్రహించటం ద్వారా మోక్షాన్ని పొందగలుగుతాడు. ఎంత ద్రవ్యం ఉన్నా, ఎన్ని దానాలు చేసినా, ఎంత తపస్సు చేసినా, అశ్వమేధాలు రాజసూయాలు చేసినా ముసలితనాన్నీ, మరణాన్నీ నివారించలేవు. మోక్షకాంక్ష ఒక్కటే వాటిని జయించగలదు. వైరాగ్యమే శాంతినీ, మోక్షాన్నీ కలిగిస్తుంది. సాంఖ్యమనే యోగవిశేషం సంసారమనే రోగానికి వైద్యంవలె ఉపయోగిస్తుంది. (వివరాలకు చూడు. 5.244-263)

పార్వతి : భక్తులు ఏ పరిచర్యలవలన నీ సాయుజ్యాన్ని పొందుతారు?

శివుడు : నేను దేవతలకూ, మనుషులకూ అచింత్యుడను. యోగసాంఖ్యాలు నేను చేసినవే. నేను ఈశ్వరుడను, సనాతనుడను, అవ్యయుడను, సత్యాత్ముడను. పంచాక్షరీత్యాది మంత్రాలతో, స్మరణంచేత, నమస్కారంచేత, వివిధ సేవలచేత నియమంతో నన్ను సేవించాలి. చతురాశ్రమాలను పాటించే వారికి పాశుపతవ్రతాన్ని బోధించాను. శివలింగారాధనం, భస్మరుద్రాక్షధారణంవలన పరిశుద్ధులై అభిషేకాదులతో నన్ను ఆరాధిస్తే నా సాయుజ్యాన్ని పొందుతారు.

శివుడు : పార్వతీ! నీవు నారీ శిరోమణివి. నీవలన స్త్రీధర్మాలను వినవలెనని నా కోరిక. వాటిని నీవు నాకు తెలుపుము.

పార్వతి : ప్రభూ! మీరు సర్వజ్ఞులు. మీకు చెప్పేటంతటిదానిని కాను. అయినా మీ ఆజ్ఞను పాటించి నా నేర్చినంత చెప్పుతాను అని పార్వతి గంగాది నదులతో సంప్రదించి పతివ్రతాధర్మాలను చెప్పటం ప్రారంభించింది. కన్యాదానం జరిగిన తరువాత స్త్రీకి భర్త అధికారి. ఆమె భర్తను దైవంగా భావించాలి. అతడి అభిప్రాయాన్ని అనుసరించి దైవపితృకార్యాలు చేయాలి. భర్తకు మేలే చేయాలి. ఆమెను పతివ్రత అంటారు. ఆమెకు ఇహపరలోక సుఖాలు లభిస్తాయి. స్త్రీ గృహనీతి విద్యకు ఆచార్యకం. వంటచేయుటం, కాపురం చేయటం ఆమె కర్తవ్యం. భర్త ఎటువంటివాడైనా, ఎట్టి స్థితిలో ఉన్నా అతడిని ఆమె గౌరవించాలి. జంతువులకు బలి, బీదవారికి భిక్షం తప్పక ఇయ్యాలి. భార్యకు భర్తయే గతి. అక్రమంగా ప్రవర్తించే స్త్రీలు మూడురకాలు. 1.ఆసురి, 2.పైశాచి, 3.రాక్షసి. ఆసురి చంచల మనస్సుతో ధనవ్యయం చేస్తుంది. పైశాచికి కోపం అధికం. రాక్షసి కలహప్రియ. వీరు భర్తవంశంవారిని పాడుచేసి తాము పాపలోకానికి పోతారు. ఈ ముగ్గురూ పశ్చాత్తాపంతో ధర్మమార్గంలో నడిస్తే పాపాలు పోగొట్టుకొని భర్తతో కలిసి స్వర్గానికి పోతారు. సతికి పతితో సహగమనం స్వర్గాన్ని కలిగిస్తుంది. సంతానవతికి సహగమనం ధర్మం కాదు.

శివపార్వతుల సంవాదం విన్నవారికి సర్వశుభాలు కలుగుతాయని పరమేశ్వరుడు ప్రకటించాడు. నారదుడు చెప్పిన ఈ అద్భుత వృత్తాంతాన్ని భీష్ముడు ధర్మరాజుకు వినిపించాడు.

ప్రశ్న 82 : మోక్షం ఎట్లా కలుగుతుంది?

ఉత్తరం : విష్ణుమూర్తిని మనస్సులో మననం చేయటంవలన, పుష్పాదులతో అర్చించటంవలన, కీర్తనంచేయటంవలన, అతడి పుణ్యకథలు వినటంవలన మోక్షం కలుగుతుంది. అంతేకాక పండితులను, విద్వాంసులను కాపాడుటచేత పుణ్యం లభిస్తుంది.

ప్రశ్న : దారిద్ర్యం, దుఃఖం పోగొట్టే జపం ఏది?

ఉత్తరం : ఓం నమో భగవతే వాసుదేవాయ, నమః పురుషోత్తమాయ, నమ స్సర్వలోక గురవే, నమ స్సర్వలోక పిత్రే, నమ స్సర్వలోక పితామహాయ, నమ స్సర్వలోక ప్రపితామహాయ, నమ స్సర్వలోక ప్రధానాయ, నమ స్సర్వలోకేశ్వరాయ, నమ స్సర్వలోక విశిష్టాయ, నమ స్సర్వలోక సుఖప్రదాయ, నమ స్సర్వలోక కర్త్రే, నమ స్సర్వలోక భర్త్రే, నమ స్సర్వలోక హర్త్రే, నమ స్సర్వలోక నిధయే, నమ స్సర్వలోక నిధానాయ, నమ స్సర్వలోక హితాయ, నమ స్సర్వలోక హితకరాయ, నమ స్సర్వలోకోద్భవాయ, నమ స్సర్వలోకోద్భవకరాయ, నమో విష్ణవే, ప్రభవిష్ణవే'' అని (విష్ణుసహస్ర నామాలు జపించటమే మహాజపం. (వివరాలకు చూడు. 5.314)

ప్రశ్న 84 : లోకాలన్నిటికీ మహనీయమై ఆశ్రయించి అనుభవించదగిన దైవం ఎవరు? అర్చనతో, స్తుతితో ఎవరిని కొలిస్తే జనులు శుభాన్ని పొందుతారు? అనేక ధర్మాలలో ఉత్తమమైన అభిమతాన్ని చూరగొనేది ఏది? జపాలన్నిటిలో ఉత్తమజపం ఏది? తనను జపించేవారికి జన్మనూ, సంసార బంధాలనూ పోగొట్టేది ఏది?

ఉత్తరం : సమస్త జగత్తులకు ప్రభువు, దేవదేవుడు, అనంతుడు, పురుషోత్తముడనే పేరుగలవాడి సహస్రనామాలను నిరంతరం స్తుతిస్తూ, జాగృతమనస్కుడై యజ్ఞకర్తను, అవ్యయుడైన అతడిని అర్చనం చేస్తూ, అచంచల ధ్యానంతో నమస్కరిస్తూ, ఆద్యంతాలు లేని ఆ విష్ణుదేవుడిని, సర్వలోకాధ్యక్షుడిని, బ్రహ్మణ్యుడిని, త్రిలోకకీర్తివర్ధనుడిని, సర్వధర్మాలు తెలిసినవాడిని, దయామయుడిని, లోకనాథుడిని, పంచభూతాల ఉత్పత్తికి కారకుడైనవాడిని నమ్మి భక్తితో సేవిస్తే అతడు దుఃఖాలనన్నింటిని తొలగదోస్తాడు. పుండరీకాక్షుడిని స్తుతిస్తూ పరమభక్తితో పూజించటమే నా మతం. ధర్మజా! ధర్మా లన్నింటికంటె ఉత్తమ ధర్మం ఇదే అని తెలిసికొనుము. పరబ్రహ్మమైన ఆ విష్ణుదేవుడి సహస్రనామ సంకీర్తనం, పాపాలను, భయాలను పోగొట్టుతుంది. సకల సంపదలను సమకూరుస్తుంది. 'విశ్వంబు, విష్ణుండు, వషట్కారుండు, భూత భవ్యభవత్ప్రభుడు' మొదలైన నామాలతో మొదలుపెట్టి 'రథాంగపాణి, అక్షోభ్యుడు, సర్వప్రహరణాయుధుడు' అనే నామాలు తుదిగాగల సహస్రనామాలను భీష్ముడు ఉపన్యసించాడు. తరతరాలుగా ఆ సహస్రనామాలు ప్రసిద్ధికెక్కాయని తెలిపాడు. విష్ణుసహస్ర నామాలను నిత్యం పఠించిన మనుష్యుడు ఇహపర శుభాలను పొందుతాడు. చతుర్వర్ణాల వారికీ బహువిధ లాభాలు కలుగుతాయి. చతుర్విధ పురుషార్థ ఫలసిద్ధి కలుగుతుంది. సర్వవిధ అరిష్టాలకూ దుఃఖాలకూ దూరమైనవారు పరమపదం పొందుతారు. విష్ణు వొక్కడే మహాభూతం. భూతములెన్ని ఉన్నా త్రిలోకవ్యాప్తుడుగా ఆయన విస్తరించి ఈ విశ్వాన్ని అనుభవిస్తాడు. ధర్మరాజా! వ్యాసవిరచితమైన విష్ణు సహస్రనామాలను పఠించి శుభాలు సుఖాలు అనుభవించుము.

ప్రశ్న 85 : పూజా నమస్కార గౌరవాలు ఎవరికి చేయాలి? ఎవరికి చెడు చేస్తే కీడు కలుగుతుంది? ఎవరు సంతోషిస్తే శుభాలు కలుగుతాయి?

ఉత్తరం : పూజా నమస్కారాలకు బ్రాహ్మణులు తగినవారు. వారికి అశుభం కలిగితే ఇంద్రుడికి కూడా కీడు కలుగుతుంది. వారికి సంతోషం కలిగితే అన్ని శుభాలు కలుగుతాయి.

ప్రశ్న 86 : బ్రాహ్మణులలో మెచ్చుకొనదగిన ప్రవర్తన ఏమున్నది?

ఉత్తరం : ఈ ప్రశ్నకు పవనార్జున సంవాదం అనే ఇతిహాసం చక్కని ఉదాహరణం. వేయిభుజాలుగల కార్తవీర్యార్జునుడు సప్తద్వీపాలకు అధిపతి అయి తనంత వారెవ్వరూ లేరని గర్వించాడు. ఒక భూతం బ్రాహ్మణుల అధిక్యాన్ని గురించి అతడికి చెప్పింది. బ్రాహ్మణులు రాజులను ఆశ్రయించి జీవిస్తారని అతడు ఆ ప్రతిపాదనను తిరస్కరించాడు. ఆ సమయంలో వాయువు చొరవతీసుకొని బ్రాహ్మణశక్తివలననే రాజులు ప్రజలను రక్షిస్తున్నారనీ, బ్రాహ్మణులను మించినవారు లేరనీ పేర్కొన్నాడు. గౌతముడు, భృగుమహర్షి, ఉచథ్యుడు, అగస్త్యుడు, వసిష్ఠుడు, అత్రి, భార్గవచ్యవనుడు, దత్తాత్రేయుడు మొదలైనవారి మహిమలు చెప్పి బ్రాహ్మణులను దైవస్వరూపులుగా భావించి వారి నీడలో ప్రకాశించటం శుభమని వాయువు హితవు చెప్పాడు. కార్తవీర్యార్జునుడు వాయువు మాటలలోని సత్యాన్ని గ్రహించి బ్రాహ్మణులను గౌరవించాడు.

ప్రశ్న 87 : పితామహా! బ్రాహ్మణ ప్రభావాన్ని ఇంకా వివరించుము.

ఉత్తరం : సూర్యుడు దక్షిణగోళం చివర ఉన్నాడు. నాకు దేహానికి, మనస్సుకు, మాటకు బలం తగ్గుతున్నది. నీవు శ్రీకృష్ణుడిని కోరితే అతడు బ్రాహ్మణుల గొప్పతనాన్ని గురించి వివరిస్తాడు. నేను శ్రీకృష్ణుడిని బాగా ఎరుగుదును. ఆదివరాహ రూపంలో భూమిని ఉద్ధరించిన విష్ణువు అతడే. అతడి లీలలవలననే పంచభూతాలు ఉద్భవించాయి. అతడి నాభికమలం నుండి పుట్టిన బ్రహ్మ ఈ లోకాలను సృష్టించాడు. శ్రీకృష్ణుడి లీలలు సామాన్యమైనవి కావు. ధర్మాలకు రాక్షసులవలన గ్లాని కలిగితే తాను అవతరించి అసురులను సంహరించి ధర్మాన్ని, ధర్మాత్ములను కాపాడుతాడు. శ్రీకృష్ణుడు శుచి, సర్వవ్యాపి, శివుడు. అతడే దిక్పాలకుడు, విశ్వనాథుడు, కాలస్వరూపుడు, దిక్కులు మొదలైన సమస్తం అతడే, అతడు యజ్ఞపురుషుడు, సర్వమంత్ర తంత్రగమ్యుడు, ఋగ్వేదం శ్రీకృష్ణుడి మాహాత్మ్యాన్ని కీర్తించింది. సర్వవేదాలూ అతడి తత్వాన్నే ప్రతిపాదిస్తాయి. యజ్ఞంలో అగ్నీ, యజమానుడూ, ఆహుతులూ, యాగఫలం కూడా కృష్ణుడే. సూర్యచంద్ర నక్షత్రాలలోని వెలుగు అతడే. అతడే పరంజ్యోతి. స్వర్గం, అమృతం, వేదాంత వేద్యుడు అతడే.

ప్రశ్న 88 : శ్రీకృష్ణా! బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని వివరించ కోరుతున్నాను.

ఉత్తరం : నే నిదివరలో ప్రద్యుమ్నుడికి చెప్పినట్లు నీకు వివరిస్తాను. వేదత్రయ విజ్ఞానాన్ని సంపాదించాలన్నా, మోక్షాన్ని సాధించాలన్నా, పితృదేవతల దయ పొందాలన్నా, ఐహిక సుఖాలు గడించాలన్నా బ్రాహ్మణులను ఆశ్రయించాలి. ఆయురారోగ్య యశస్సంపదలు వారివలన లభిస్తాయి. కోరితే వారు వరాలు ఇవ్వగలరు. కోపిస్తే భస్మం చేయగలరు. వారికి ఉన్నదానిలో దానం చేసివారిని తృప్తిపరిస్తే ఇహపరసుఖాలు కలుగుతాయి. నీ కొక ఆశ్చర్యకరమైన వృత్తాంతాన్ని చెప్పుతాను వినుము. స్వతంత్రవర్తనుడైన దుర్వాసుడు ఒకసారి మా ఇంటికి వచ్చాడు. చిత్రవిచిత్రంగా వ్యవహరించాడు. ఒకసారి ఒంటినిండా పాయసాన్ని పూయించుకొన్నాడు. రథానికి రుక్మిణిని కట్టి లాగించి బాధించాడు. ఆమె మూర్ఛపోగా రథాన్ని వదలి వెడలిపోయాడు. నేను అతడివెంట వెళ్ళి అనునయించి ప్రార్థించాను. అతడు ప్రసన్నుడై 'అందరూ తమను తాము ఎంత ప్రేమించుకొంటారో అంతగా నిన్నుకూడా ప్రేమించి పూజిస్తా' రని వరం ఇచ్చాడు. పాయసం అరికాలికి పూయలేదని చెప్పి దానివలన నాకు ప్రమాదముంటుందని సూచించాడు. రుక్మిణికి అపూర్వ సౌందర్యాన్నీ, భర్తృవాల్లభ్యాన్నీ ప్రసాదించాడు. కాబట్టి బ్రాహ్మణులపట్ల భక్తి కలిగి ఉండడంవలన శుభాలు చేకూరుతాయి. (అని ప్రద్యుమ్నుడికి వలెనే ధర్మరాజుకు కూడా శ్రీకృష్ణుడు బ్రాహ్మణ మాహాత్మ్యాన్ని ప్రబోధించాడు).

ప్రశ్న 89 : దుర్వాసుడు శివాంశసంభూతు డని వింటూంటాం. శివుడి మహిమను గురించి వివరించుము.

శ్రీకృష్ణుడు : ఎవరు శివుడిని మనస్సులో నిలుపుకొని శతరుద్రీయ మంత్రాన్ని జపిస్తారో వారు ఇహపరసుఖాలు పొందుతారు. శివుడు మహాదేవుడు. దానికి మించిన పేరు మరొకటి లేదు. అతడి మూడవ కంటిమంట ధర్మవిరోధులను కాల్చివేస్తుంది. దక్షాధ్వరధ్వంస వృత్తాంతం ప్రసిద్ధం కదా! త్రిపురాసుర సంహారం ఆ దేవుని ప్రతాపానికి చిహ్నం. త్రిపురాసురులను సంహరించిన అస్త్రాన్ని, ఆ దేవుడు ఒడిలో పెట్టుకొనగా, అది బాలుడుగా మారింది. ఆ బాలుడే దుర్వాసుడు.

ప్రశ్న 90 : శివుడి ప్రధాన నామాలు స్తుతిస్తే భోగమోక్షాలు కలుగుతాయి అంటారు. వాటి వ్యుత్పత్తిని తెలిపి నాకు బోధించుము.

శ్రీకృష్ణుడు : శివనామాలన్నీ చెప్పి వివరించటానికి నాకు గానీ, బ్రహ్మకుగానీ సాధ్యం కాదు. కానీ, నీ వడిగావు కాబట్టి నేను ఎరిగినంతవరకు చెప్పుతాను. శివుడు సార్థకనాముడైన మహేశ్వరుడు. ఉగ్రత్వము, ఉన్నత ప్రతాపం ఉండటంచేత

రుద్రు డయ్యాడు. దేవతలలో కెల్ల గొప్పవాడు కావున మహాదేవు డయ్యాడు. సత్కర్మఫలాలైన శుభాలు కలిగినవాడు కావటం చేత శివుడయ్యాడు. సుస్థిర తేజస్సుతో వెలుగొందటంవలన స్థాణు డయ్యాడు. స్థావర జంగమాత్మక రూపాలనన్నింటిని పొందటంచేత బహురూప నామధారి అయ్యాడు. పొగరంగువంటి జటలు కలిగినవాడు కావటంచేత ధూర్జటి అయ్యాడు. విశ్వులనే దేవతలు అతడియందు పుట్టారు కాబట్టి అతడు విశ్వరూప నామధేయు డయ్యాడు. తన శరీరంలో బహునేత్రా లుండటంవలన సర్వతశ్చక్షువనే నామంతో ఒప్పుతున్నాడు. భూతములన్నీ పశువులై తాను వాటికి పతి కావటంచేత పశుపతి అయ్యాడు. నందివాహనుడు కావటంచేత వృషవాహను డయ్యాడు. ప్రాణులను సమభావంతో పాలిస్తాడు కాబట్టి మృత్యువయ్యాడు. ఇవన్నీ వేదాలలో చెప్పిన శివనామాలు. ఇంకా ఎన్నో పేర్లు శివుడికి ఉన్నాయి. వేదవేత్తలు వాటిని తెలిసి శివానందులై విహరిస్తారు. శివనామావళిని భక్తితో చదివినా, విన్నా సౌఖ్యానందాలు జనులు పొందుతారు. వ్యాసమహర్షి లోకహితం కొరకు శివస్తుతిని పఠనీయంగా అందించాడు. దాని భావ మిది - సర్వజగత్తుకు నిత్యసాక్షి, లోకైక శుభావహమూర్తి, నిరామయుడు, పంచభూతాలకు మూలమైనవాడు, ఉదాత్తభూతము, శివుడు, ఫాలాక్షుడు. తనను భక్తితో సేవించేవారికి భవబంధమోక్షాన్ని కలిగించేవాడు. తన పదములపై మనస్సు నిలిపేవారికి ఉత్తమ పదాలను ప్రసాదించేవాడు ఆ మహాదేవుడు. ఈ స్తుతిని చేసేవారికి శివుడు ఆయురారోగ్యైశ్వర్యాదులను ప్రసాదిస్తాడు.

ప్రశ్న 91 : పితామహా! ధర్మాలు అనేక విధాలుగా ఉంటాయి. వాటిలో ఆచరించదగిన ఉత్తమ ధర్మం ఏది?

భీష్ముడు : ధర్మవేత్తలు ధర్మమంటే ఏమిటో చెప్పుతారు. కాలం గడచిన కొద్దీ మరొక విధంగా మారుతుంది. ఒక్కొక్కసారి అధర్మమే ధర్మంగా మనసుకు స్ఫురిస్తుంది. నిశిత పరిశీలనం లేకపోవటంవలన ధర్మానికి సంబంధించిన విశేషాలు తప్పుగా చెప్పటంచేత ధర్మం మార్గం తప్పుతుంది. దానివలన దోషం ఏర్పడుతుంది. దానివలన ధర్మాచరణ పరులు కష్టాలకు లోనౌతారు. కాబట్టి ధర్మం సూక్ష్మ ప్రకారం కలది. వేదవిదులైన సజ్జనులనుండి వివరాలను తెలిసికొనాలి.

ప్రశ్న 92 : వేదాలలో చెప్పబడిందీ, ఎదుట కనబడేదీ, ఆచరణలో ఉన్నదీ - అని ధర్మం వేరువేరుగా ఉండి చీకాకు కలిగిస్తుంది. ధర్మసూక్ష్మతతో ఈ మూడింటిలో సరి అయినది ఏదో తెలియటం కష్టంగా ఉన్నది.

ఉత్తరం : ఈ మూడువిధాలూ ధర్మవిశేషాన్ని తెలిసికొనటంలో మూడు దశలు. ధర్మరాజా! అహింస, దానం, సత్యం, క్రోధపరిత్యాగం అనేవి ఉత్తమ ధర్మాలు. ఇది ధర్మానికి పరసీమ. దీనిని మనస్సులో నిలుపుకొమ్ము.

ప్రశ్న 93 : ఎవరు ధర్మంపట్ల ఈర్ష్య వహిస్తారు? ఎవరు దానిని ఉపాసిస్తారు? ఈ ఇరు తెగలవారూ పొందే గతులు ఎటువంటివి?

ఉత్తరం : రజస్తమోగుణ వికారాలు గల మనస్సున్నవారు ధర్మాన్ని ద్వేషిస్తారు. వారు నరకానికి వెళ్ళుతారు. సత్యవ్రతులు ధర్మాన్ని ఉపాసిస్తారు. వారు ఊర్ధ్వలోకాలకు పోతారు.

ప్రశ్న 94 : సాధులు, అసాధులు - అనేవారు ఎట్టివారు?

ఉత్తరం : అసాధువులు తమంత తాము తెలిసినవారు కారు. ఇతరులు బోధించిన సదుపదేశాలను గ్రహించలేరు. సాధువులు అట్లా కాదు. వారు స్వయంగా తెలిసినవారు; ఇతరులు మంచి చెప్పగా స్వీకరిస్తారు. వారు శిష్టులతో కలిసి భుజిస్తారు. తగినవారికి దారి ఇచ్చి గౌరవిస్తారు. తగనిచోట్ల మలమూత్రాలు విడువరు. సత్యాన్ని,

ఋజుమార్గాన్ని అనుసరిస్తారు. రక్షణకోరిన వారిని కాపాడుతారు. సరసభోజనం, భార్యాసంభోగం, గురువులను గౌరవించటం, నిర్మలహృదయాలను, నిత్య సంతోషాన్ని కలిగి ఉండటం వారి లక్షణాలు. వారు విషయ చాపల్యాన్ని వదలుతారు. పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటారు. ధర్మాన్ని అప్రకాశంగా ఆచరిస్తారు. భూతదయను ప్రదర్శిస్తారు.

ప్రశ్న 95 : లోకంలో కొందరికి ప్రయత్నం లేకుండానే ధనం లభిస్తుంది. ధర్మాన్ని ఆచరించేవారు, నీతి తెలిసినవారు పెక్కు మంచి పద్ధతులతో ధనాన్ని కోరినా అది లభించదు. కొందరికి అది లభించినా అది వారి సౌఖ్యానికి ఉపయోగపడదు. గురుబోధ ఎక్కువగా లేకపోయినా కొందరికి విద్య అలవడుతుంది. కొందరు బోధ పొందికూడా దుర్విద్యులౌతున్నారు. కొందరు రోగాలపాలబడి దెబ్బలు తినకుండా చావరు. కొందరు గడ్డిపరక తగలటంచేతకూడా మరణిస్తారు. ఇట్లా జరగటానికి గల కారణ మేమి?

ఉత్తరం : విత్తు లేకుండానే చెట్టు మొలుస్తుందా? అట్లాగే పూర్వజన్మలో చేసిన కర్మ ఈ జన్మలో ఫలాన్నిస్తుంది. గతంలో దానాలవంటి సత్కార్యాలు చేస్తే ఈ జన్మలో ప్రయత్నం లేకుండానే కోరికలు ఫలిస్తాయి. పూర్వజన్మలో తపస్సులు చేసే ఈ జన్మలో అనేక సౌఖ్యాలూ, గురుసేవ చేస్తే విద్యాబలం, అహింస పాటిస్తే నిండు సుఖజీవితం లభిస్తాయి. అటువంటివి పూర్వజన్మలో చేయకపోతే ఈ జన్మలో అనేక కష్టాలు కలుగుతాయి. ఎల్లప్పుడూ ధర్మం మీద నిష్ఠ కలవాడికి కాలమే ధర్మరహస్యాన్ని కలిగిస్తుంది. ధర్మసాధనవలన మానవుడు ఇహలోకంలో శాంతినీ, పరలోకంలో ఆనందాన్నీ పొందుతాడు. మోక్షాన్ని సాధిస్తాడు.

ధర్మరాజా! వేదవ్యాస మునీంద్రుడు నీకు మార్గదర్శి. శ్రీకృష్ణుడు నీకు ఆశ్రయం. అందుచేత చింత విడనాడి శాంతవృత్తితో ప్రజలను పాలించుము. నీకు సర్వత్రా విజయం లభిస్తుంది.

వేదవ్యాసుడు :భీష్మా! ధర్మరాజుకు జ్ఞానం కలిగింది. ఆ జ్ఞానం అమృతంవంటి నీ ఉపదేశంవలన సిద్ధించింది. అతడి సోదరులు, కృష్ణుడు, ఆప్తులైన రాజులు, ధృతరాష్ట్రుడు నిన్ను తగినట్లుగా గౌరవించి నీ దయకు పాత్రులయ్యారు. ఇతడికి ఇక సెలవిమ్ము, సమయం వచ్చినప్పుడు అతడు నీ వద్దకు తిరిగి వస్తాడు.

భీష్ముడు : (ఆర్ద్రమైన కన్నులతో) ధర్మరాజా! నీవు పట్టణానికి వెళ్ళుము. సర్వశుభాలూ నిన్ను పొందుగాక! నీ బుద్ధి ధర్మంలో మాత్రమే నిష్ఠమై ఉండుగాక! యయాతివలె సమగ్ర దక్షిణలతో యజ్ఞాలు నిర్వహించుము. రాజధర్మాలతో ప్రజలను రంజింపజేయుము. ఫలవృక్షాన్ని పక్షులు చేరి సుఖించేటట్లుగా నీ బంధువులు, స్నేహితులు నిన్ను ఆశ్రయించి సుఖిస్తారు గాక! సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించటం తెలిసికొని నా వద్దకు రమ్ము. ఇక వెళ్ళుము. నీవూ, నీ తమ్ములూ, ధృతరాష్ట్రుడూ సుఖంగా ఉండండి.

ధర్మరాజు పులకితుడై, ఆనందంతో దండప్రణామం చేసి 'అట్లే చేస్తాను' అని అనుమతి తీసికొని కృష్ణాదులందరితో కూడి హస్తినాపురం చేరాడు. భీమాదులు తనను సేవిస్తూ ఉండగా ధర్మరాజు పట్టాభిషేక సమగ్ర రాజ్యాధికారాన్ని పొంది మనస్సులో ఊరటచెంది ఆనందించాడు. సమగ్రరాజ్యాన్ని స్వీకరించి, ప్రజలు మెచ్చుకొనేటట్లు పాలిస్తూ ఏభైదినాలు గడచిన తరువాత సూర్యుడు ఉత్తరాయణంలో ప్రవేశించాడని తెలిసికొని భీష్ముడిని దర్శించటానికి బయలుదేరాడు.

**భీష్మ నిర్యాణం:**

గాంధారీ, ధృతరాష్ట్రుడూ, కుంతీ ముందు నడువగా, శ్రీకృష్ణాది బంధువర్గం, ధౌమ్యాది పురోహితవర్గం వెంట నడువగా భీష్ముడు శయనించి ఉన్న అంపతల్పం వద్ద ధర్మరాజు చేరాడు. ధ్యానమగ్నుడై ఉన్న భీష్ముడికి తన రాకను,

బంధువుల రాకను ఎరిగించాడు. మాఘమాసం శుక్లపక్షం వచ్చినదని భీష్ముడు సంతోషించాడు. అందరినీ ఆదరంగా చూచాడు. ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'ధృతరాష్ట్రా! నీవు వేదశాస్త్రాలు చదివావు. వ్యాసాదులు బోధించిన ధర్మాలు విన్నావు. పాండవులను పుత్రప్రేమతో పాలించుము. ధర్మరాజు నీ పట్ల భక్తి ప్రేమలు కలవాడు. అవినీతులై దుర్యోధనాదులను గురించి విచారింపకుము.'

ఆ తరువాత శ్రీకృష్ణుడివైపు చూచి భక్తితో ఇట్లా పలికాడు. 'దేవదేవ! జీవాత్మక! దేవవంద్య! శంఖచక్ర గదాపద్మ చారుహస్త! వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమపురుష! ఇవే నా ప్రణతులు. కరుణించుము. నీవే నాకు బలం. నేను నీ భక్తుడను. ఆలుబిడ్డలు లేనివాడను, మిక్కిలి దయతో కాపాడి నాకు అనుజ్ఞనిమ్ము! మాధవా! పాండవులకు నీవే దిక్కు. శ్రీకృష్ణు డే పక్షంలో ఉంటే ఆ పక్షంలో విజయం తథ్యమని నేను దుర్యోధనుడికి చాలాసార్లు చెప్పాను. కాని, అతడు వినలేదు. తనవారిని నశింపజేసి, తానూ నశించాడు. నీ వెవరో నాకు తెలుసు. నరనారాయణులు లోకరక్షణార్థం అవతరించి భూతలంమీద తిరుగుతారని వ్యాసనారద మహర్షులు నాతో చెప్పారు' అని అన్నాడు.

శ్రీకృష్ణుడిని భీష్ముడిని అత్యాదరంతో చూచి ఇట్లా పలికాడు. 'శాంతనవా! నీయం దే దోషమూ లేదు. పైగా పితృభక్తితో మరణాన్ని సైతం నీ అదుపులో పెట్టుకొనగలిగావు. నీకు నేను అనుజ్ఞ ఇచ్చాను. నీతోడివారైన వసువులను కలిసికొనుము' అన్నాడు.

భీష్ముడు సంతోషించి పాండవులను, ధృతరాష్ట్రుడు మొదలైనవారిని చూచాడు. 'మీరుకూడా ఆజ్ఞ ఇచ్చినట్లే కదా!' అని అడిగాడు. అందరినీ ఆలింగనం చేసికొన్నాడు. క్రౌర్యం మాని, సత్యాన్ని నిత్యం పాటించండని పలికాడు. బ్రాహ్మణులను గౌరవించుమనీ, యజ్ఞాలు చేయుమనీ ధర్మరాజుతో పేర్కొని మౌనం తాల్చాడు. ధారణ అనే యోగ విశేషం చేత సమాధిలోనికి వెళ్ళి ప్రాణవాయువులను శరీరంనుండి వెడలించాడు. శరీరంలో ఉన్న బాణాలు రాలిపోయాయి. అది చూచి అందరూ ఆశ్చర్యపడ్డారు. భీష్ముడి ఆత్మ అతడి కపాలాన్ని చీల్చికొని నక్షత్రంవలె ఎగిరిపోయింది. దేవతలు పూలవాన కురిపించారు. వాద్యాలు మ్రోగించారు. భీష్ముడిని స్తుతించారు. ఈ విధంగా భీష్ముడు స్వర్గగతు డయ్యాడు.

పాండవులూ, ధృతరాష్ట్రుడూ రాజలాంఛనాలతో చందన కాష్ఠాలతో కూర్చిన చితిపై భీష్ముడి శరీరాన్ని ఉంచి దహన సంస్కారం చేశారు. గంగను చేరి తిలోదకా లిచ్చారు. గంగాదేవి పుత్రశోకంతో విలపించింది. భీష్మ వ్యక్తిత్వాన్ని కీర్తించింది. శ్రీకృష్ణుడూ, కృష్ణద్వైపాయనుడూ ఆమెను ఓదార్చారు.

**'అతని శిఖండి యేల? యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే?**
**యతఁడు నిజేచ్ఛఁ జేసి నరునంచిత దివ్యశరంబు లంగ సం**
**గతములు చేసి పొన్పుగ సుఖస్థితి మృత్యువు మాన్పియుండి కీ**
**ర్త్యతిశయ మొంది తా వలచినప్పుడు పోయె; విషాద మేటికిన్?'** **(అను.5.480)**

అని శ్రీకృష్ణుడు భీష్మచరిత్రకు భరతవాక్యం పలికాడు.

# శ్రీమదాంధ్ర మహాభారతము
## ఆనుశాసనిక పర్వము

## విషయసూచిక

### ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ మత్కటాక్షరోచి । స్తోమ సముల్లాస విహిత సుస్థిర లక్ష్మీ**
**భూమానందిత భక్త! వ్యామోహ విదూరయుక్త! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= విష్ణు శివస్వరూపుడవైన ఓ పరబ్రహ్మమా! శ్రీమత్=మంగళకరమైన, శోభాజనకమైన; కటాక్షరోచిస్= కడగంటిచూపుల వెలుగులయొక్క; స్తోమ= సముదాయంయొక్క; సముల్లాస= వికసనంచేత; విహిత= కలిగించబడిన; సుస్థిర= మిక్కిలి శాశ్వతమైన; లక్ష్మీ= సంపత్తియొక్క; భూమ= అతిశయంచేత; ఆనందిత భక్త!= సంతోషపరచబడిన భక్తులు కలవాడా!; వ్యామోహవిదూర= అజ్ఞానమునకు దూరగు లెవ్వరో వారితో; యుక్త!= కూడినవాడా!

**తాత్పర్యం:** దేవా! హరిహరనాథా! మంగళకరములైన నీ దయాదృక్కులు తమమీద పొలయుటచేత నీ భక్తులు సుస్థిర లక్ష్మీ సంపన్నులై పరమానంద భరితులవుతారు. స్వామీ! నీవు వ్యామోహరహితులైన జ్ఞానులతో కూడిఉంటావు.

**విశేషం:** 1. పై రెండూ హరిహరనాథుడికి సంబోధనలు. మొదటిది భగవంతుడి నేత్ర సౌందర్యాన్ని వర్ణిస్తుంది. ఆ నేత్ర సౌందర్యమే భక్తులకు జ్ఞాన ప్రదాయకమై వారి వ్యామోహాన్ని దూరంగా తొలగిస్తున్నది. మొదటి సంబోధన భగవంతుడి సగుణ రూపాన్ని వర్ణిస్తే, రెండవ సంబోధన ఆయన కేవలం ఆనంద స్వరూపుడని నిర్గుణ తత్త్వాన్ని వర్ణిస్తున్నది.

2. ''ఈ పర్వమునకు సంస్కృత ప్రతులన్నిటిలోను 'అనుశాసన పర్వము' అనియే వ్యవహారము. వి.వి.శాస్త్రి ప్రతియందు 'అనుశాసన', ఆనుశాసనిక' - అను రెండు పేర్లును గలవు. నన్నయభట్టు 'ఆనుశాసనిక' మనియే వాడినాడు'' (1-1-33 & 60)' (ఉస్మానియా సంశోధిత ముద్రిత ప్రతి పుట 1.)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు దివ్యజ్ఞాన దేదీప్యమానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబులగు ధర్మంబు లాకర్ణించి, యజాతశత్రుం డతనికి సభక్తిక ప్రణామం బాచరించి, వినయ విశేష విభూషితుండై. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా (తిక్కన తాను చెప్పే తెనుగు భారతాన్ని హరిహరనాథుడికి విన్నవిస్తున్నాడు. దీని కాయన శ్రోత. ఈ భారతాన్ని సంస్కృతంలో వ్యాసుడు వ్రాసినదాన్ని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు) వైశంపాయనుండు= వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; దివ్యజ్ఞాన= భగవంతుడిచ్చిన జ్ఞానంచేత; దేదీప్యమానుండు+ఐన= ప్రకాశిస్తున్నవాడైన; దేవవ్రతుండు= యావజ్జీవితమూ దేవతల కనుగుణంగా వ్రతంగా బ్రతికినవాడు - భీష్ముడు; వివరింపన్= చెప్పగా; వివిధంబులు+అగుధర్మంబులు+ఆకర్ణించి= అనేక ధర్మాలు విని; అజాతశత్రుండు= మనస్సులో ఎవరిపైనా శత్రుత్వ భావన లేనివాడు - ధర్మరాజు; అతనికిన్= భీష్మునకు; సభక్తిక ప్రణామంబు= భక్తితో కూడుకొన్న నమస్కారం; ఆచరించి= చేసి; వినయ విశేషభూషితుండు+ఐ= వినయమన్న విశిష్టమైన అలంకారంతో అలంకరించబడినవాడై.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా అన్నాడు. ఆ విధంగా దివ్యజ్ఞానంతో ప్రకాశిస్తున్న భీష్ముడు వివరించగా అనేక ధర్మాలను విని ధర్మరాజు భీష్ముడికి భక్తితో నమస్కరించి వినయంతో శోభించి.

**సీ. 'అనఘ! నాదగు చిత్తమునకు శమంబు గా । వించుటకై నీవు వివిధ విశద**
**భంగులఁ బరమ కృపానిరతుండ వై । సకల ధర్మోపదేశములుఁ జేసి;**
**తిమ్మెయిఁ జెప్పఁగా నించుక యేనియు। శమము లేకున్నది; చలముకొని య**
**నేక బంధుల వధియించితి; నది యొక్క । తలయు, నీ కలిగిన దారుణత్వ**

**ఆ. మొక్కతలయు నైన యుగ్రకర్మంబులు । చిత్తవృత్తిఁ దగిలి, యుత్తలంబుఁ**
**జేయ, శాంతి యెట్లు సిద్ధించు మునిమాన । నీయ! యింక నేమి సేయువాఁడ? 3**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! నీవు; నాదగు చిత్తమునకున్= నా మనస్సుకు; శమంబు కావించుటకై= ఓదార్పు పొందించటానికి; వివిధ విశద భంగులన్= అనేకంగా విస్తారమైన పద్ధతులతో; పరమకృపా నిరతుండవు+ఐ= మహాదయగల వాడవై; సకల ధర్మోపదేశములున్+చేసితి(వి)= సకలధర్మాలు చెప్పావు; ఈ+మెయిన్ చెప్పఁగాన్= ఇంతగా చెప్పినా; ఇంచుక+ఏనియున్= కొంచెం కూడా; శమము లేకున్నది= ఊరట లభించటం లేదు (నేను); చలముకొని= పట్టుదలతో; అనేకబంధులన్= చాలామంది చుట్టాలను; వధియించితిన్= చంపితిని; అది ఒక్క తలయున్= అదొక ఎత్తూ; నీకున్+అలిగిన= నీపై కోపగించి నీ కొనర్చిన; దారుణత్వము+ఒక్క తలయున్= క్రూరత్వమొకెత్తూ; ఐన= అయిన; ఉగ్రకర్మంబులు= క్రూర కర్మలు; చిత్తవృత్తిన్+తగిలి= మనస్సు నంటుకొని; (వృత్తి= కదలిక, చేష్ట); ఉత్తలంబున్ చేయన్= కలతపెట్టగా; శాంతి= మనశ్శాంతి; ఎట్లు సిద్ధించున్?= ఏ విధంగా లభిస్తుంది; ముని, మాననీయ!= మునులకు కూడా గౌరవించ దగినవాడా!; ఇంకన్+ఏమి చేయువాఁడన్?= ఇంక ఏమి చేయగలను?

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడితో ఈ విధంగా అన్నాడు; 'మునులు కూడా నిన్ను గౌరవిస్తారు. నీవు పుణ్యమూర్తివి. ఎన్నో ధర్మాలు చెప్పావు. ఎన్నో నీతులు బోధించినావు. ఎంతో దయతో మన్నించి ఎన్నో రీతులుగా చెప్పినా నా మనస్సు శాంతి పొందటం లేదు. పట్టుదలతో చుట్టాలను ఎందరినో చంపుకొన్నాను. అదొక ప్రక్కా, నీపై కోపం వహించి నిన్ను పడగూల్చిన క్రూరకర్మ మొక ప్రక్కా నా మనస్సును బాధిస్తున్నవి. నా మనశ్శాంతికి మార్గమేదయ్యా? ఏం చేసేది? చెప్పుము.

**విశేషం:** పద్యమంతా మాటమీద మాటగా ఎడతెగకుండా అల్లబడింది. వాక్యంలో సాఫీదనం లేదు. మనశ్శాంతి లేనివాడు పడే బాధంతా పద్య, వాక్యరచన తెలియజేస్తున్నది.

**వ. దుర్యోధనుం డతి లోభంబున నాతోఁ బంచి కుడువ నొడంబడండ; యేనును నాగ్రహంబున నతనికి, రాజ్యం బిచ్చి, తొలంగి నిలువను; మా యిద్దఱ కతంబున నింత పుట్టెం; బశ్చాత్తాపం బెప్పాటనుం ద్రోపువడ దయ్యెడు'.4**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు= దుర్యోధనుడు; అతిలోభంబునన్= మిక్కిలి లోభగుణంతో; నాతోన్; పంచి కుడువన్= రాజ్యం పంచుకొని తినటానికి; ఒడంబడండు+అ= ఒప్పుకోడయ్యె; ఏనును= నేను కూడా; ఆగ్రహంబునన్= పట్టుదలతో;

అతనికిన్; రాజ్యంబు+ఇచ్చి= రాజ్యం కట్టబెట్టి; తొలంగి= తప్పుకొని; నిలువను= ఉండను; మా ఇద్దఱ కతంబునన్= మా ఇరువురి కారణంగా; ఇంతపుట్టెన్= ఇంత జరిగింది; పశ్చాత్తాపంబు= తర్వాతి బాధ; ఏ+పాటనున్= ఏ విధంగానూ; త్రోపు పడదయ్యెడున్= త్రోసి పారేయటానికి వీలు పడనిదయింది.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పరమ లోభి కనుక రాజ్యం చెరిసగం పంచుకొని తిందామంటే కుదరనివ్వలేదు. పోనీ, నేనైనా కోపంలేకుండా సరే పోనివ్వు వాడినే తిననిమ్మని ఊరకున్నా పోయేదేమో! మా ఇద్దరి వలన ఇంత చేటు పుట్టింది. ఈ పశ్చాత్తాపాన్ని త్రోసి వేయటం సాధ్యం కావటం లేదు'.

**విశేషం:** ధర్మరాజు తనకూ యుద్ధంలో బాధ్యత ఉందనటంలోనే ఆతని మంచితనం వ్యక్త మౌతున్నది

## గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము (సం. 13-1-9)

**చ. అనవుడు భీష్ముఁ డిట్టు లను నాతనితో 'నకటా! వధింపఁగా**
**మనుజుఁడు గర్త గాఁడు, వినుమా! యితిహాస మొకండు సెప్పెదన్;**
**మనుజవరేణ్య! గౌతమి యనంగ శమాన్విత యొక్క భూసురాం**
**గన యురగంబుచే సుతుఁడు గాలవశత్వముఁ బొంది యుండఁగన్. 5**

**ప్రతిపదార్థం:** అనవుడున్= ధర్మజు డిట్లా అనగా; భీష్ముఁడు; అతనితోన్= ధర్మజుడితో; ఇట్టులనున్= ఇట్లు చెప్పుతున్నాడు; అకటా!= అయ్యో! వధింపఁగాన్= చంపుటకు; మనుజుఁడు= మనిషి, కర్తకాఁడు= చేసే వాడు కాడు; ఇతిహాసము+ఒకండు= ఒక పురాణకథ; చెప్పెదన్= చెప్పుతాను; వినుమా!= జాగ్రత్తగా ఆలకించుము; మనుజవరేణ్య!= మానవులలో గొప్పవాడా!, రాజా!, గౌతమి అనంగన్= గౌతమి అనే పేరుగల; శమ+అన్విత= శాంతంతో కూడుకొన్నది; ఒక్క; భూసుర+అంగన= బ్రాహ్మణ స్త్రీ; ఉరగంబు చేన్= పామువలన; సుతుఁడు= తన కొడుకు; కాలవశత్వమున్= మృతిని (కాలానికి లోబడిన దశ); పొంది ఉండఁగన్= పొందగా.

**తాత్పర్యం:** అయ్యో! రాజా! మనిషి దేనికీ కర్త కాడయ్యా. (కర్తననుకొనటంతోనే ఇబ్బందులన్నీ) ఒక పూర్వ కథ చెప్పుతాను వినుము. (చాలా ప్రసిద్ధమైనదని భావం). గౌతమి అన్న పేరుగల ఒక బ్రాహ్మణ స్త్రీ ఉండేది. ఆమె కోపతాపాది భావాలను అదుపులో పెట్టుకొన్న మహాత్మురాలు. ఆమె కుమారుడు పాము కరచినందున మరణించాడు.

**విశేషం:** పుణ్యాత్మురాలికికూడా బాధ తప్పదనటానికి ఆమె శమాన్విత అని చెప్పటం. బుద్ధదేవుని జీవితచరిత్రలో కూడా కిసగౌతమికి (క్షీరగౌతమి= పాలమ్ముకొనే స్త్రీ) తన కుమారు డిట్లాగే పాము కాటుచేత మరణిస్తే బుద్ధదేవుడిని ఆశ్రయిస్తుంది. బుద్ధదేవుడంటాడు 'తల్లీ! ఇది కాల నియతి. దాని నేమీ చేయలేము. మృత్యు తరణోపాయమే శరణ్య' మంటాడు. బహుశః రెండు కథ లొకటే.

**చ. వగచుచుఁ జూడ నయ్యురగవల్లభు రజ్జునఁ గట్టి తెచ్చి య**
**మ్మగువకుఁ జూపి 'దీనిఁ దల వ్రుందఁగ మోఁదెదఁ గోల నొండె, రెం**

**డుగ నెఱగత్తి వ్రేసెదఁ; గడుం జెడు గీపాడపాఁప పుర్వు, నే**

**మిగతి వధింతు?' నంచు నొక మేటి కిరాతుఁడు రోషదీప్తుఁడై. 6**

**ప్రతిపదార్థం:** ఒక మేటి కిరాతుఁడు = ఒక గొప్ప అడవిజాతివాడు; రోషదీప్తుఁడు+ఐ= కోపంతో మండిపోతున్నవాడై; ఆ+ఉరగవల్లభున్= ఆ పెద్దపామును; రజ్జునన్= త్రాటితో; కట్టి తెచ్చి; వగచుచున్+చూడన్= దుఃఖిస్తూ చూడగా; (మరణించిన కొడుకుకై) ఆ+మగువకున్= ఆ తల్లికి; చూపి= కిరాతుడు పామును చూపి; దీనిన్, కోలన్= కఱ్ఱతో; తల మ్రందఁగన్+మోఁదెదన్= తలను చితకబాదుతాను; ఒండెన్= లేదా; నెఱకత్తిన్= వాడి కత్తితో; వ్రేసెదన్= నరుకుతాను; కడున్= మిక్కిలి; చెడుగు= చెడ్డది; ఈ పొడ పాఁప పుర్వు= ఈ పొడలుగల నికృష్టమైన పాము; ఏమిగతిన్ వధింతున్?= ఏ విధంగా చంపుమంటావు? అంచున్= అంటూ ( ఆ కిరాతు డడుగగా)

**తాత్పర్యం:** కొడుకు చావును చూచి దుఃఖిస్తూ ఉన్న తల్లి దగ్గర కొక అడవిజాతివాడు, పామును త్రాడుతో కట్టి దెచ్చి, కోపంతో అన్నాడు; 'తల్లీ! ఇది చాలా దుష్టసర్పం. దీని తలను కఱ్ఱతో చితక గొట్టేదా? లేక కత్తితో దీనిని నరికేదా? ఏం చేయుమంటావో చెప్పుము' అన్నాడు.

**క. ఉన్నఁ గని యప్పడఁతి 'యో । యన్న! విడువు భుజగనాథు' ననవుడు నతఁ 'డీ**

**పిన్నాతని ప్రాణంబులు । గొన్నది యిది, దీనియుసుఱు గొనియెద' ననియెన్. 7**

**ప్రతిపదార్థం:** ఉన్నన్+కని= పై విధంగా అంటూ ఉండగా (వాడిని) చూచి; ఆ+పడఁతి=ఆ స్త్రీ; ఓ+అన్న!= ఓ అన్నా! (ప్రేమతోడి పిలుపు); భుజగనాథున్= పెద్దపామును; విడువు= వదలిపెట్టుము; అనవుడున్= అనగా; అతఁడు= ఆ కిరాతుడు; ఇది= ఈ పాము; ఈ పిన్న+ఆతని= ఈ పసివాడి; ప్రాణంబులు కొన్నది= ప్రాణాలు తీసింది; దీని ఉసుఱు= దీని ప్రాణం; కొనియెదన్= తీస్తాను; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'అన్నా! ఈ సర్పరాజును వదలి పెట్టుము' అని ఆ తల్లి కిరాతుడితో అన్నది, ఆ మాటకు ఆతడు ఇట్లా అన్నాడు. 'ఈ పసివాడి ప్రాణాన్ని తీసిన ఈ పాము ప్రాణం తీస్తాను.

**విశేషం:** ఆ సందర్భంలో - లోకంలో ఏ తల్లీ పామును పోనివ్వు అనదు.కానీ ఈ కథ కాల స్వభావమే మనిషి జీవన్మరణాలకు కారణమని చెప్పటానికి చెప్పుతున్న ఉపాఖ్యానం కనుక - ఇట్లా వ్రాయవలసి వచ్చింది.

**వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి. 8**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+కోమలి= ఆ సుకుమారి (స్త్రీ); ఆ+కిరాతున్+చూచి= ఆ బోయవాడిని జాలిగా చూచి.

**తాత్పర్యం:** ఆమె కిరాతుడిని జాలిగా చూచి.

**విశేషం:** ఇక్కడ మగువ, పడతి ఇట్లా స్త్రీ పర్యాయ వాచకాలేవీ వాడకుండా కోమలి అనటం ఆమె మెత్తని మనసు కలదని చెప్పటం కొరకే.

**క. 'విధివశమున వచ్చిన కీ । డధములు గొనియాడి వెడఁగులై, విపులభవాం**

**బుధి మునుఁగుదురు; మునుంగరు । సధర్మలగు నుత్తములు, ప్రశాంతిఁ జులుకనై. 9**

**ప్రతిపదార్థం:** విధి వశమునన్= దైవవశంగా వచ్చిన; కీడు= ఆపద, అధములు= క్షుద్రస్వభావం కలవారు; వెడఁగులు+ఐ= బుద్ధిలేనివారై; కొనియాడి= పెద్దగా చేసి; విపుల= విస్తారమైన; భవ+అంబుధిన్= సంసార సముద్రంలో; మునుఁగుదురు= మునిగిపోతారు; సధర్ములు+అగు+ఉత్తములు= ధర్మబుద్ధి గలవారైన మహనీయులు (మాత్రం) ప్రశాంతిన్= మనశ్శాంతి కలవారైనందున; చులుకన్+ఐ= తేలికగా; మునుంగరు= సంసార సముద్రంలో మునుగరు.

**తాత్పర్యం:** 'అన్నా! (రహస్యం చెప్పుతున్నాను వినుము) ఆపదలు మన పూర్వజన్మ కర్మానుసారంగా వస్తాయి. (వాటిని వేరే ఎవడూ నీ మీద కోపంతో సృష్టించటం లేదు) కనుక అధములైన వారు తల్లడిల్లి సంసార సముద్రంలో మునిగిపోతున్నారు (విచారించటం లేదు). ఉత్తములు మాత్రం అట్లాకాక ధర్మవేత్తలు కనుక (సృష్టి నడతలోని క్రమాన్ని చూచినవారు కనుక) శాంతి పొంది సంసార సాగరాన్ని దాటిపోతున్నారు. (కనుక పాము విధి ఆజ్ఞతో కరిచింది. కనుక వదలిపెట్టుము)

**విశేషం:** ఈ పద్యంలో వెడఁగులై అని ఉన్నదానికి 'వ్రేఁగులై' అనే పాఠాంతరం ఉన్నది. అది దీనికంటె బాగైన పాఠమని తోస్తుంది. వ్రేఁగులై= బరువైనవారై - వారు బరువైనవారు కనుకనే భవాంబుధిలో మునిగిపోతారు. ఉత్తములు ప్రశాంతిచే చులుకనై= తేలికైనవారై - వారు తేలికైనవారు కనుకనే మునిగిపోరు అనే స్వారస్యం లభిస్తుంది.

**వ. అదియునుం గాక! 10**

**తాత్పర్యం:** అంతేకాక (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఈ పాముఁ జంప బ్రదుకునె । నా పుత్త్రుఁడు? విడువు మర్జునక!' నావుడు 'వాఁ**
**డీ పేద మాట లెల్లను । గోప వివశుఁడైన నాకుఁ గొలుపవు, ముగ్ధా!' 11**

**ప్రతిపదార్థం:** ఈ పామున్+చంపన్= ఈ పామును చంపితే; నాపుత్రుఁడు= నా కొడుకు; బ్రదుకునె?= బ్రతుకుతాడా? (ఆలోచించు); అర్జునక!= కిరాతుడా!; విడువుము= పామును వదిలిపెట్టుము; నావుడున్= అనగా; వాఁడు= కిరాతుడు; ఈ పేదమాటలు= ఈ పనికిరాని మాటలు; ఎల్లను= అన్ని; కోప= కోపంతో; వివశుఁడు+ఐన= పరవశుడ నైన; నాకున్; కొలుపవు= నచ్చవు; ముగ్ధా!= అమాయకులారా!

**తాత్పర్యం:** 'అర్జునకా! దీనిని చంపితే నాబిడ్డ బ్రతుకుతాడా? వదలుము' అన్న దామె. అతడు 'నీవు తెలివి తక్కువదానివి కనుక (ముగ్ధ అని ఇందుకే అన్నాడు) పామును వదలు మంటున్నావు. నేను కోపంతో మైమరచి ఉన్నాను. కనుక నీ మాటలు నాకు నచ్చవు' అన్నాడు.

**విశేషం:** అర్జునక! అని ఆమె సంబోధన. వీడి మాట ముగ్ధ. ఈ మాటలు చాటున కవి విశేషార్థాన్ని దాచాడు. ముగ్ధ= తెలివి తక్కువదానా - అని. పసిపిల్లవాడిని చంపిన పామును వదలమంటా వేమిటి? పిచ్చితల్లీ - అని ఈతడి సంబోధన.

**ఉ. కావున నెట్లుఁ జంపుదున; కాని భుజంగముఁ బోవ నీను జూ**
**నావుడు; నింతి యర్జునక నామము నీ కవదాత భంగికిం**
**గావలదే? మహీసురులు గా దను చొప్పునఁ దత్సహాయులుం**
**బోవరు గాదె! యేల నినుబోఁటికిఁ గ్రూరత నాదు సన్నిధిన్? 12**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఎట్లున్= తప్పక; భుజంగమున్= పామును; చంపుదున కాని= చంపుతానే తప్ప; పోవనీను= వదలిపెట్టను; చూ+ చుమ్ము; నావుడున్= అనగా; ఇంతి= (ఆ) స్త్రీ; నీకున్, అర్జునక నామము= అర్జునుడన్న పేరు; అవదాత= స్వచ్ఛత (తెల్లని); భంగికిన్= పద్ధతికి; కావలదే= కావద్దా!; మహీసురులు= భూదేవతలు (బ్రాహ్మణులు); కాదను చొప్పునన్= కాదన్న పద్ధతిలో; తత్సహాయులున్= వారికి సాయపడేవారు (స్నేహితులు) కూడా; పోవరుకాదె!= పోరుకదా!; నినుబోఁటికిన్= నీవంటి వాడికి; క్రూరత= క్రూరత్వం; నాదు సన్నిధిన్= నా మ్రోల; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** నీ వెన్నైనా చెప్పుము. ఈ పామును చంపకుండా పోనివ్వ' నని ఆ కిరాతు డంటే, ఆమె ఇట్లా అన్నది 'నీ పేరు అర్జునకుడు. అంటే స్వచ్ఛమైనవాడని కదా! ఆ పేరునకు అర్థం మహాత్ములు కాదనేటట్లుగా వారి స్నేహితులు ప్రవర్తించరు కదా! నీ వంటి వాడికి నా సాన్నిధ్యంలో ఈ క్రూరమైన మనస్సేమిటి?

**విశేషం:** ఆమె శమాన్విత కనుక ఆమె సన్నిధానంలో ఎవరూ ఆమె మాటను కాదని ఒక అంగుళమైనా పోలేరు. మహీసురులు కాదనే మార్గాన్ని వారికి తోడ్పడేవారు అనుసరించరు గదా! అట్లాంటప్పుడు నా ముందు నీ వంటివారు ఈ క్రూరబుద్ధిని ప్రదర్శించవచ్చునా? అని ఆమె ఆశ్చర్యపడుతున్నది.

**సీ.** **హింసకు నొడఁబడ నే నెట్లు? 'ననవుడు, । 'జనబాధకము లైన జంతువులను**
**జంపినఁ బాపంబు సమకూర' దని పల్కె । బోయ; 'వట్టిన రిపుఁ బొరిగొనంగ**
**వల' దని చెప్పె నవ్వనిత; వాఁ డహిఁ దెగఁ । జూచి జనంబులఁ గాచు టుఱదె?**
**వృత్రుఁ జంపఁడె దేవవిభుఁడు? యజ్ఞధ్వంస । నము సేయఁడే? ఫాలనయనుఁ డట్ల**

**తే.** **కావె? ధర్మువు హింసలు నీవు దీని । కియ్యకొను' మని తఱిమె; నట్లెంత దఱిమి**
**నను దయావతి యైన యన్నాతి పాప । మునకుఁ జొరదయ్యెఁ; బోయ కిట్లనియెఁ బాము.** **13**

**ప్రతిపదార్థం:** నేను; ఎట్లున్= ఏ విధంగానూ; హింసకున్= క్రూరకర్మకు; ఒడంబడన్= ఒప్పుకోను; అనవుడున్= అని ఆమె అనగా; బోయ=కిరాతుడు; జనబాధకములు+ఐన= జనులను పీడించే; జంతువులను= మృగాలను; చంపినన్= చంపితే; పాపంబు= పాపం; సమకూరదు= రాదు; అని పల్కెన్= అని కిరాతు డన్నాడు; ఆ+వనిత= ఆ స్త్రీ; పట్టినరిపున్= బంధించిన శత్రువును; పొరిగొనంగన్ వలదు= చంపవలదు; అని చెప్పెన్, వాఁడు= బోయ; అహిన్= పామును; తెగన్+చూచి= చంపి; జనంబులన్= మనుష్యులను; కాచుట= రక్షించటం; ఉఱదె!= మంచిదికాదా; దేవవిభుఁడు= దేవేంద్రుడు; వృత్రున్= వృత్రుడన్న రాక్షసుడిని; చంపఁడు+ఎ= సంహరించ లేదా?; ఫాలనయనుఁడు= లలాటంలో కన్ను కల శివుడు; యజ్ఞధ్వంసనము= దక్షయజ్ఞ నాశనం; చేయఁడే= చేయలేదా; అట్ల కావె!= అట్లా కాదా!; హింసలు= క్రూరకర్మలు; ధర్మువు= ధర్మం; నీవు= తల్లీ నీవుకూడా; దీనికిన్= ఈ పామును చంపటానికి; ఇయ్యకొనుము= అంగీకరించుము అని; తఱిమెన్= ఒత్తిడి చేశాడు; అట్లు; ఎంతతఱిమినను= ఎంతగా ఒత్తిడి చేసినా; దయావతి= దయకలది; ఐన; ఆ+నాతి= ఆ స్త్రీ; పాపమునకున్= హింసకు; చొరదయ్యెన్= అంగీకరించలేదు; (అప్పుడు) పాము; బోయకున్= బోయవాడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** (ఈ పద్యమంతా స్త్రీకి, కిరాతుడికి జరిగిన సంభాషణ) ఆమె 'హింస కంగీకరించ' ననగా, వాడు 'మనుష్యులకు బాధ కలిగించే జంతువులను చంపటంలో పాపం లేదమ్మా!' అని చెప్పాడు. దాని కామె 'శత్రువైనా సరే మన చేత చిక్కినపుడు చంపరాదురా నాయనా' అన్నది. వాడు దాని కంగీకరించక 'పూర్వం దేవేంద్రుడు వృత్రాసురుడిని చంపలేదా? శివుడు దక్షుడి యజ్ఞాన్ని నాశనం చేయలేదా? ఈ హింసలు ధర్మమే కదా! కనుక దీనిని

చంపనిమ్ము' అని వా డెంత బలవంతం చేసినా ఆమె అంగీకరించలేదు. ఇదంతా వింటూ ఉన్న పాము బోయతో అన్నది.

**క. 'ఏ నేమి తప్పు సేసితిఁ? గానవు । నెఱి నీవు లెస్సగా, మృత్యుపరా**
**ధీనత బాలునిఁ గఱచితిఁ । గాని, వినుము! లేవు రోషకామాదు లెదన్'. 14**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఏమితప్పు= ఏ దోషం; చేసితిన్?= చేశాను; నీవు; నెఱిన్= న్యాయం; లెస్సగాన్= చక్కగా; కానవు= తెలియవు; మృత్యు పరాధీనతన్= మృత్యుదేవతకు లోబడి; బాలునిన్= పసివాడిని; కఱచితిన్= కాటువేశాను; కాని= అంతేకాని; వినుము; రోష+కామ+ఆదులు= కోపం, కోరిక మొదలైనవి; ఎదన్= నా మనసులో; లేవు.

**తాత్పర్యం:** 'నా దేమి తప్పున్నది? నేను మృత్యుదేవత ఆజ్ఞకు లోనై బాలుడిని కరచాను అంతే, కానీ నాకు కోపం కానీ, కోరిక కానీ ఏమీ లేవు. ఈ రహస్యం నీకు తెలియదు'.

**వ. అనుటయు నతండు 15**

**తాత్పర్యం:** అని పాము పలుకగా ఆ బోయవాడు (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'విను! మృత్యువునకుఁ దగు సా । ధనమ వగుటఁ జేసి నిన్ను దండింపంగాఁ**
**జను' ననవుడుఁ' గుమ్మరికో । లను సారెం బోలితిం దలఁచి చూడు మెడన్. 16**

**ప్రతిపదార్థం:** విను= (నాకు విషయం తెలియదన్నావు కనుక నేను చెప్పుతాను) బాగా వినుము; మృత్యువునకున్= మృత్యుదేవతకు; తగు= తగిన; సాధనమవు+అగుటన్+చేసి= (నీవు) పనిముట్టువైనావు కనుక; నిన్నున్; దండింపంగాన్+చనున్= శిక్షించి తీరాలి; అనవుడున్= అనగా (పామన్నది); కుమ్మరికోలన్= కుమ్మరివాని చేతి కర్రను; సారెన్+పోలితిన్= సారెవలెనైనాను; ఎడన్= మనస్సులో; తలఁచి= ఆలోచించి; చూడుము.

**తాత్పర్యం:** 'నీవు మృత్యువు చేతిలో పనిముట్టువైనావు కనుక నిన్ను చంపి తీరవలసిందే' అని కిరాతు డనగా, పామన్నది 'అయ్యా! కొంచె మాలోచించి చూడుము. కుండలు చేసేవాడు చేతికర్రతో సారెను త్రిప్పుతాడు కదా! తిరిగే సారెది దోషమా? కర్రతో త్రిప్పిన కుమ్మరిదా దోషం?

**విశేషం:** అలం: ఉపమ. ఈ పోలిక వేదాంత శాస్త్రంలోనిది. భగవంతుడు కుమ్మరివంటివాడు. కుండను చేయటానికి మట్టి - సారె - కోల అవసరం. ఇవి బాహ్యసాధనాలు. మట్టి కుండగా పరిణమింప చేసే సృజనాత్మక క్రియ, దానివెనుక నున్న భావం - భగవంతుడి సంకల్పంలోనివి. చేతి సాధనాలు అచేతనాలు. సృష్టి చేసే సామర్థ్యం అతడిదే. అట్లాగే మట్టి - కోల-సారెలు కావు కుండను చేసింది. అవి కేవలం సాధనాలు.

**వ. ఈ క్రియ నావశం బగునే? యని పల్కినం బామున కర్జునకుం డిట్లనియె. 17**

**ప్రతిపదార్థం:** ఈ క్రియ= ఈ చంపటమన్న పని; నా వశంబు+అగునే?= నాకు శక్యమా?; అని పల్కినన్= అని చెప్పగా; పామునకున్= పాముతో; అర్జునకుండు= కిరాతుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'అయ్యా! చంపేశక్తి నాకెక్కడిది? అని పామనగా కిరాతు డా పాముతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** పాము కరిస్తే చాలామంది బ్రతకటం లోకంలో ఉన్నది కనుక చంపే శక్తి తనకు లేదని పామన్నది.

**తే.** **'ఏయువాఁ డుండ, న మ్మేమి సేయు । ననక, యోపి తత్ఖండనముసేఁత పాప మండ్రె?**
**యెవ్వరేఁ బంపఁ; గఱతు గా కేమి? క్రూరు । నిన్ను గీటడఁగించిన నింద రాదు.** **18**

**ప్రతిపదార్థం:** ఏయువాఁడు+ఉండన్= బాణం వేసే విలుకాడుండగా; అమ్ము= బాణం; ఏమిచేయున్= ఏం చేస్తుంది; అనక= అనకుండా; ఓపి= శక్తి గలిగి; తత్ ఖండనము= దానిని నరకటం; పాపము+అండ్రె?= పాపమంటారా? ఎవ్వరేన్= ఎవరైనా; పంపన్= పంపిస్తే; కఱతుకాక ఏమి?= కరుస్తావా; క్రూరున్= క్రూరుడవైన; నిన్ను; గీఁటు+అడఁగించినన్= చంపినందువలన; నింద= అపకీర్తి; రాదు= నాకు రాదు.

**తాత్పర్యం:** 'విల్లు ఎక్కు పెట్టి విలుకాడు శత్రువుపై బాణమేస్తే, అదేం చేస్తుంది లెమ్మని ఊరుకొనకుండా నడుమనే దానిని విరుగగొట్టినందువలన పాప మంటారా ఎవరైనా? ఎవరో పంపించారని నీ వాబాలుడిని కరుస్తావా? నిన్ను నరికినా పాపం లేదు'.

**విశేషం:** నేను మృత్యువు చేతిలో సాధనాన్ని అని పామన్న దానికిది కిరాతుడు చెప్పిన సమాధానం. చాలా తెలివిగా ఉన్నది.

**తే.** **అదియుఁ గాక, విశేషించి యరయ బుద్ధి । గలుగునట్టి సాధనములు గారె మీరు**
**మృత్యువున? కట్లు గావున మెలఁగ మిడుక । నీక, పొరిగొనవలయు; మి మ్మెల్లభంగి.'** **19**

**ప్రతిపదార్థం:** అదియున్+కాక= అంతే కాకుండా; విశేషించి= ప్రత్యేకించి; అరయన్= ఆలోచిస్తే; మీరు= మీవంటివారు; మృత్యువునకున్= మృత్యుదేవతకు; బుద్ధికలుగు+అట్టి= మనస్సున్నట్టి; సాధనములు కారె?= పనిముట్లు కాదా? అట్లు కావునన్= కాబట్టి; మెలఁగన్= తిరుగుటకు; మిడుకనీక= కిక్కురుమన నివ్వకుండా; మిమ్మున్= మిమ్ములను; ఎల్లభంగిన్= సర్వవిధాలా; పొరిగొనన్ వలయున్= చంపితీరవలసిందే.

**తాత్పర్యం:** అంతేకాకుండా; ప్రత్యేకంగా ఆలోచిస్తే మీరు మృత్యువు చేతిలో మనస్సున్న సాధనాలు. కనుక ఇకముందు మిమ్మల్ని తిరగనివ్వకుండా అన్నివిధాలా చంపటమే మంచిది'.

**విశేషం:** 'కుమ్మరి కోలకు సారె వంటి దాన్ని మృత్యువు చేతిలో నే నన్న పై పద్యంలోని మాట' కిది సమాధానం. కోలా, సారె మనస్సు లేనివి. పాము అట్లా కాదు. అది బుద్ధి ఉన్నట్టి జీవి; అని. ఇక్కడ బుద్ధి అన్నమాట ప్రతి తెలుగువాడూ వాడేదే.

**వ.** **అనిన విని బోయకు భుజంగం బిట్లనియె.** **20**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; భుజంగంబు= పాము; బోయకున్= కిరాతుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అనగా విని కిరాతుడితో పాము ఇట్లా అన్నది.

**తే.** **'బుద్ధి గల్గు సాధనముల పో హవిస్సు, లరసి వేల్తురు ఋత్విజు, లా ఫలంబు**
**గాంచు నధ్వరకర్తయ । కాక వారి కేమి పని?' యనఁగా మృత్యు వేఁగుదెంచె.** **21**

**ప్రతిపదార్థం:** ఋత్విజులు= యజ్ఞం చేయించే పురోహితులు; బుద్ధి కల్గు= మనస్సున్న; సాధనములపో!= సాధనాలే కదా!; అరసి= (మంత్రాలను చక్కగా) విచారించి; హవిస్సులు= అగ్నియందు హోమంచేసే నేయి మొదలైనవి; వేల్తురు= హోమం చేస్తారు; ఆ ఫలంబు= ఆ యజ్ఞఫలం; అధ్వరకర్తయ= యజ్ఞం చేసే యజమానుడే; కాంచున్= పొందుతాడు; కాక= అట్లా కాకుండా; వారికిన్+ఏమిపని?= ఋత్విజుల కేమిఫలం?; అనఁగాన్= అన్నంతలో; మృత్యువు= ఆ దేవత; ఏఁగుదెంచెన్=వచ్చింది.

**తాత్పర్యం:** 'నీ వన్నట్లు బుద్ధి గలుగు సాధనాలు కదా యజ్ఞం చేయించే పురోహితులు. వారు చేయించే హోమాల ఫలితం యజమానుడికి వస్తున్నది తప్ప పురోహితులకు వస్తున్నదా? అట్లాగే బుద్ధి ఉన్న సాధనాలమైన మా పని కూడా అంతే' అని పామన్నంతలో మృత్యుదేవత వచ్చింది.

**విశేషం:** ఈ చర్చ చాలా తర్కంతో కూడుకొన్నది. తెలివితేటలే కాకుండా విషయం తెలిసిన పండితుల చర్చగా ఉన్నది. ఇక్కడ యజ్ఞ మన్న దృష్టాంతా న్నివ్వటం చాలా ప్రజ్ఞావంతమైనది.

**క. చనుదెంచి పామునకు ని । ట్లను 'నిను నేఁ గోరి పనిచినట్టుల, నన్నున్**

**బనిచెం గాలుం; డీ చా । వున కీవును నేను హేతువులు గా మనఘా! 22**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; పామునకున్= పాముతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది; అనఘా!= పాపంలేనివాడా! (ఇది పామునకు సంబోధన); నినున్= నిన్ను; నేను; కోరి= చెప్పి; పనిచినట్టులన్= పంపినట్లుగానే; కాలుండు= కాలస్వరూపుడైన యముడు; నన్నున్= నన్నూ; పనిచెన్= పంపించాడు; ఈ చావునకున్= ఈ బాలుడి మృతికి; ఈవును, నేనున్= ఇద్దరమూ; హేతువులు కాము= కారణం కాము.

**తాత్పర్యం:** 'పాపం లేనివాడా! నిన్ను నేను చెప్పి పంపినట్లుగానే నన్ను యముడు పంపించాడు. అందువలన అతడి ఆజ్ఞనే నీకు వినిపించాను. కనుక మన మీ బాలుడి చావునకు కారణం కాము.

**విశేషం:** అనఘా! అన్న సంబోధన వలన ఈ మృతికి పాము కారణం కాదని చెప్పబడింది.

**క. ఇన, శశి, పావక, భూమి, గ । గన, జల, పవనాది వస్తుగతు లెల్లను గా**

**లుని యఱచేతి వనినఁ ద । క్కిన పని సెప్పంగ నేటికిని భుజగేంద్రా! 23**

**ప్రతిపదార్థం:** భుజగ+ఇంద్రా!= పాములలో గొప్పవాడా!; ఇన= సూర్యుడు; శశి= చంద్రుడు; పావన్= అగ్ని; భూమి= నేల; గగన= ఆకాశం; జల= నీరు; పవన= గాలి; ఆది= మొదలైన; వస్తుగతులు= వస్తువుల నడకలు; ఎల్లను= అన్నీ; కాలుని= యముడి; అరచేతివి= అరచేతిలోనివి (వశమున ఉన్నట్టివి); అనినన్= అనగా; తక్కిన= మిగిలిన; పని= కార్యం; చెప్పంగన్= చెప్పటం; ఏటికిని?= ఎందుకు?

**తాత్పర్యం:** ఓయీ! పాములరేడా! సూర్యచంద్రాగ్నులు, నేల, ఆకాశం, నీరు, గాలి మొదలైనవి (ఇవి 7 జీవుడు-జీవాత్మ= యజమానుడు= కలిసి 8. వీరే అష్టమూర్తులు= శివుడి శరీరంగా చెప్పారు). వస్తువుల కదలికలన్నీ కాలస్వరూపుడైన ఆ దేవుడి చేతిలోని పనులు. ఇంతకంటె ఇంకా ఏమి చెప్పాలి?

**విశేషం:** ఇక్కడ యముడే విశ్వానికి అధిపతిగా, సర్వకర్తగా చెప్పబడింది. ఇదే కఠోపనిషత్తు వంటి చోట్ల మిక్కిలిగా వివరించబడినది. కాలుడు కూడా పరబ్రహ్మ స్వరూపుడే.

**క. విను మిట్లగు టేర్పడ నెఱిఁ । గిన నాపై నిడుదు వెట్లు, కిల్బిషముం గా**
**లుని చెయిది నన్ను దూఱిన । నిను దూఱుట' యుఱదె నాదు నిర్మాణమునన్. 24**

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; ఇట్లు+అగుటన్= విషయమిట్లాంటిదని; ఏర్పడన్= స్పష్టంగా; ఎఱిఁగినన్= తెలిస్తే; నాపైన్= నామీద; ఎట్లు= ఏ విధంగా; కిల్బిషమున్= పాపమును; ఇడుదువు?= మోపగలవు?; కాలుని= యముడియొక్క; చెయిది= చేష్ట (ఇది); నన్నున్= నన్ను; దూఱినన్= నిందిస్తే; నాదు= నాయొక్క; నిర్మాణమునన్= నిర్మించటంలో; పనిలో; నినున్= నిన్ను; దూఱుట= నిందించటం; ఉఱదె= తగదా.

**తాత్పర్యం:** విషయ మిట్లాంటిదని తెలిసిన తరువాత నాపై పాపాన్ని మోపటమంటే నీపై నీవే మోపుకొనటం కదా! నేను నిన్ను ఈ పనికి నియోగించినట్లు నన్నాయన నియోగించినాడు కనుక మన ఇద్దరిదీ పాపం కాదు'.

**ఆ. అనిన భుజగ మిట్టులను 'నీవలన నేను । గుణము సెప్ప, దోష గణన సేయ**
**నన్నుఁ బనిచె నంటి, నామీఁది దోషంబుఁ । బాపి కొనుట నాకుఁ బాడి గాదె? 25**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; భుజగము= పాము; ఇట్టులు+అనున్= ఈ విధంగా అంటున్నది; నీవలనన్= నీయందు; ఏను; గుణము= గుణాన్ని, చెప్పన్= చెప్పగా; దోషగణన= తప్పు లెక్కించటం; చేయన్= చేయగా; నన్నున్; పనిచెను= పంపెను; అంటిన్= అంటిని; నామీఁది దోషంబున్= నాపై తప్పు; పాపికొనుట= పోగొట్టుకొనటం; నాకున్= నాకు; పాడి= న్యాయం; కాదె= కాదా?

**తాత్పర్యం:** పై రీతిగా మృత్యువనిన తరువాత పామంటున్నది; 'నీమీద నేను గుణాన్ని ఆరోపించి మాట్లాడితే నీ వేమో నన్ను పంపావని, నా దేదో తప్పున్నట్లు చెప్పుతున్నావు. ఆ తప్పు పోగొట్టుకొనటంకొరకే నేనట్లా అన్నది.

**క. విను మటు కాలుని దెసనై । నను దోషము కలిమి లేమి, నా కాడంగాఁ**
**బని యేమి? దోష గతిచిం । తన భాషణములకు నేను దగుదునె యనఘా!' 26**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపం లేనివాడా!; వినుము; అటు= ఆ ప్రక్క; కాలునిదెసన్= యముడి పక్షాన; ఐనను= ఐనప్పటికిని; దోషము= తప్పు; కలిమి= ఉండటం; లేమి= లేకపోవటం; నాకున్; ఆడంగాన్= చెప్పగా; పని ఏమి= ఏమిపని; దోష= పాప; గతి= పాటు; చింతన= ఆలోచన; భాషణములకున్= తర్కించటానికి, మాట్లాడటానికి; నేను; తగుదునె?= అర్హుడనా?

**తాత్పర్యం:** అయ్యా! నీ దే పాపం లేదు వినుము. యముడిపై తప్పు మోపటానికి గానీ, తప్పు లేదనటానికి గానీ నే నెవడను? ఆ విధంగా పాపగతిని గురించి ఆలోచించటానికి గానీ, మాట్లాడటానికి గానీ నాకు సత్తా ఎక్కడున్నదసలు?

**వ. అని పలికి పాము బోయమొగంబు సూచి. 27**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఈ విధంగా అని; పాము= పాము; బోయ= బోయవాడి; మొగంబు చూచి= ముఖం చూచి.

**తాత్పర్యం:** పాము ఈ రీతిగా పలికి బోయవాడి ముఖం చూచి (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'వింటే, మృత్యువు మాటలు? గంటే నామీఁదఁ దప్పు గలిగించెద; వి**

**ట్లంటం గట్టం దగునే? యంటకు । నగి, బోయ యిట్టు లనియె, నరేంద్రా! 28**

**ప్రతిపదార్థం:** మృత్యువు మాటలు= మృత్యుదేవత చెప్పినవన్నీ; వింటే?= ఆలకించావా?; నా మీఁదన్= నాపై; తప్పున్= దోషాన్ని; కలిగించెదవు= కలిగిస్తున్నావు; కంటే?= (విషయమంతా) చూచావా?; ఇట్లు= ఈ విధంగా; అంటన్+కట్టన్ తగునే?= అంటగట్టటం తగదుకదా!; అంటకున్= అట్లా పాము అనటానికి; నగి= నవ్వి; బోయ= కిరాతుడు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; నరేంద్రా!= ధర్మరాజా! (భీష్మ డతడితో చెప్పుతున్నాడు)

**తాత్పర్యం:** పాము బోయతో అంటున్నది; 'నీవు మృత్యువు మాటలు విన్నావు. విషయమంతా స్పష్టంగా చూచావు కదా! కనుక ఈ పాపం నాకంటగట్ట దగదు'. అప్పుడు బోయ నవ్వి అన్నాడయ్యా! ధర్మరాజా!

**క. నీవును, మృత్యువుఁ బాప స । మావేశితమతుల రొఱగ నాడినయంతం**

**బోవునె మీపై దోషము, లే । వెఱతునె యిట్టు లనిన యింతన మీకున్'. 29**

**ప్రతిపదార్థం:** నీవును= నీవూ; మృత్యువున్= మృత్యువూ; పాప= పాపం వల్ల; సమ్+ఆవేశిత= చక్కగా ఆవేశించబడిన; మతులరు= మనస్సు కలవారు; ఒఱగన్+ఆడిన+అంతన్= ఒరిగేటట్లుగా చెప్పినంత మాత్రంచేత; మీపైన్ దోషములు= మీమీదనున్న పాపాలు; పోవునె= పోతాయా? ఇట్టులు+అనిన ఇంతన్+అ= ఈ విధంగా చెప్పినంత మాత్రాన; ఏన్= నేను; మీకున్= మీకు; వెఱతునె?= భయపడతానా?

**తాత్పర్యం:** బోయ పాముతో అన్నాడు - 'నీవూ, మృత్యువూ ఇద్దరూ పాపానికి వశమైన మనస్సు కలవారు కనుక మీరెంత చెప్పినా మీ మీదనున్న దోషాలు తొలగిపోతాయా? ఇందులో ఒరిగే దేమీ లేదు. మీరట్లా అన్నంత మాత్రాన నే నేమీ జడిసేది లేదు'.

**వ. అనిన మృత్యువునుం బామును. 30**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; మృత్యువును= మృత్యువూ; పామును= పామూ.

**తాత్పర్యం:** అని అనగా మృత్యువూ, పామూ (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'ఘనుఁ డగు కాలుని వశమునఁ । జనియెడుమా, కరయ దోష సంగతి గలదే?'**

**యనునెడఁ గాలుం డచటికిఁ । జనుదెంచెం, బ్రీతి ధర్మ సంశయ ముడుపన్. 31**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు+అగు= గొప్పవాడైన; కాలుని= యముడి; వశమునన్= లోనై; చనియెడు= నడుస్తున్న; మాకున్= మాకు; అరయన్= చూడగా; దోష=తప్పుయొక్క; సంగతి= కూడిక; కలదే?= ఉన్నదా?; అను+ఎడన్=అనే సమయంలో; కాలుండు= యముడు; అచటికిన్= అక్కడకు; ప్రీతిన్= ప్రేమతో; ధర్మ= ధర్మసంబంధమైన; సంశయము= సందేహమును; ఉడుపన్= పోగొట్టటానికి; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** 'మాదేమున్నది? తప్పు మాది కాదు. అంతా కాలానికి లోబడి నడుస్తుంది' అని వారిద్ద రన్నంతలో యముడు ధర్మసందేహాన్ని పోగొట్టటానికి అక్కడికి ప్రేమతో వచ్చాడు.

**వ. చనుదెంచి యర్జునకు నాలోకించి.** **32**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; అర్జునకున్= కిరాతుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** వచ్చి కిరాతుడిని చూచి.

**క. 'పామును, మృత్యువు, నేనును । గా మీదారకుని మృతికిఁ గారణ, మీతం**
**డేమేఁ గర్మముఁ జేసెం దా । మృతిఁ బొందించె నదియ, తలకొని, యితనిన్.** **33**

**ప్రతిపదార్థం:** పామును= పామూ; మృత్యువున్= మృత్యువూ; ఏనును= నేనూ; ఈ దారకుని= ఈ పసివాడి; మృతికిన్= చావుకు; కారణము= హేతువు; కాము; ఈతండు= ఈ పిల్లవాడు; ఏమేన్= ఏమేమి; కర్మమున్= పాప పుణ్య సంబంధమైన చేష్ట; చేసెన్= చేసెనో; అదియ= అదే; తాన్= తానే; తలకొని= పూనుకొని; ఇతనిన్= ఇతడిని; మృతిన్= చావును; పొందించెన్= కలిగించింది.

**తాత్పర్యం:** యము డీ విధంగా పలికాడు; 'నేనూ, పామూ, మృత్యువూ ఈ పసివాడి చావుకు కారణం కాము. మరేమిటంటే - వీడి కర్మే పూనుకొని వీడి కా చావును తెచ్చిపెట్టింది.

**క. విను కర్మం బొనరించును । జననము, మరణంబు, నదియ సౌఖ్యము, దుఃఖం**
**బును గావించుం, దనచే । సిన దానిం బడకపోవ శివునకు వశమే?'** **34**

**ప్రతిపదార్థం:** విను= వినుము; కర్మంబు= తాను చేసిన కర్మ; జననమున్= పుట్టుకను; మరణంబున్= చావును; పొనరించును= చేస్తుంది; అదియ= అదే, కర్మే, సౌఖ్యమున్= సుఖాన్ని; దుఃఖంబున్= దుఃఖాన్ని; కావించున్= కలిగిస్తుంది; తన=తాను; చేసిన దానిన్= చేసిన దానిచేత; పడకపోవన్= వశపడకుండా పోవటం; శివునకున్= శివుడికి కూడా; వశము+ఏ?= శక్యమా?

**తాత్పర్యం:** ఉన్న విషయ మేమంటే, చెప్పుతాను వినుము. జీవుడు తాను చేసిన కర్మవలననే పుట్టుక చావూ పొందుతున్నాడు. అదే సుఖ దుఃఖాలకూ కారణమౌతున్నది. తాను చేసిన కర్మను తప్పుకొనిపోవటం శివుడికి కూడా సాధ్యం కాదు'. (అంటే ఇక మనిషెంత?)

**విశేషం:** పద్యంలో నాల్గవ పాదం ఒక జాతీయం.

**వ. అని చెప్పి.** **35**

**తాత్పర్యం:** ఈ విధంగా పలికి

**క. 'కావున, నిందఱు, నుడుగుం డీ । వాదం' బనుడు, బోయ కిట్లను, ధరణీ**
**దేవాంగన దన యెఱుకయు । దేవాలాపములు నొక్క తెరువై యున్నన్.** **36**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఇందఱున్= మీరంతా; ఈ వాదంబు= ఈ చర్చ; ఉడుగుండు= మానండి; అనుడున్= అనగా; ధరణీదేవ= భూసురుడి, బ్రాహ్మణుడి; అంగన= స్త్రీ (బ్రాహ్మణ స్త్రీ); తన ఎఱుకయున్= తన జ్ఞానం; దేవ=దేవుడి; ఆలాపములు= మాటలు; ఒక్క= ఒకే; తెరువై= విధంగా; ఉన్నన్= ఉండగా; బోయకున్= కిరాతుడితో, ఇట్లు+అనున్= ఈరీతిగా అన్నది.

**తాత్పర్యం:** 'కాబట్టి మీరంతా ఈ చర్చ మానండి' అనేటప్పటికి ఆ బ్రాహ్మణ స్త్రీ తన జ్ఞానం, యము డన్నమాట లోకే రకంగా ఉన్నందున బోయవాడితో ఇట్లనింది.

**ఆ. ఇట్టి వనటఁ బొందునట్టి పాపము సేసి । వనిత లిట్ల యగుదు రనఘ! యివ్వి**
**ధంబు మరణ మొందఁ దగు కిల్బిషంబున । బాలు రిట్ల పోదు రేల కలఁగ.' 37**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!; ఇట్టి= ఇట్లాంటి; వనటన్= దుఃఖమును; పొందునట్టి= పొందినటువంటి; పాపముచేసి= పాపం చేసి; వనితలు= స్త్రీలు; ఇట్ల అగుదురు= ఇట్లాగే ఔతారు; ఈ+విధంబు= ఈ పద్ధతి; మరణము= చావు; ఒందన్+తగు= పొందదగిన; కిల్బిషంబునన్= పాపాన; బాలురు= పిల్లలు; ఇట్లు+అ= ఇదే విధంగా; పోదురు= పోతారు; కలఁగన్= కలతపడటం; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** పాపం లేనివాడా! అర్జునకా! ఇట్లాంటి దుఃఖం మన పాపంవలననే వస్తుంది. ఈ విధంగా పిల్లలు చచ్చిపోవటానికి వారి పాపకర్మే కారణం తప్ప ఎవరూ కారు'.

**వ. అని వెండియు. 38**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'సకల జనంబులుఁ గర్మము । నకు ననుగుణమైన తెరువునం బోదురు దీ**
**నికి రోష విషాదము లే । టికి విడువుము పాము, సంఘటింపుము శమమున్. 39**

**ప్రతిపదార్థం:** సకలజనంబులు= జనులంతా; కర్మమునకున్= కర్మకు; అనుగుణంబు+ఐన= తగిన, తెరువునన్= బాటలో; పోదురు= పోతారు; దీనికిన్= దీనికొరకు; రోష= కోపం; విషాదము= దుఃఖం, ఏడ్పూ; దేనికి?= ఎందుకు?; పామున్= పామును; విడువుము= వదలిపెట్టుము; శమమున్= శాంతిని; సంఘటింపుము= పొందుము.

**తాత్పర్యం:** 'కర్మానుగుణంగానే మనుషులంతా ప్రవర్తిస్తారు. దీనికొరకు కోపం, ఏడ్పూ దేనికి? పామును వదలిపెట్టి శాంతిని పొందుము'.

**క. అన విని తెలిసి విడిచె, న । ర్జునకుఁడు భుజగము, నపాస్తరోషుం డగుచుం**
**జని రెలమిఁ బొంది, కాలుం । డును, మృత్యువుఁ గావునను విడువు మీ వడలున్. 40**

**ప్రతిపదార్థం:** అనన్= అని ఆమె చెప్పగా; విని= ఆలకించి; తెలిసి= విషయ మెరిగి; అర్జునకుఁడు= కిరాతుడు; అపాస్త= పోయిన; రోషుండు= కోపం కలవాడు; అగుచున్= అవుతూ; భుజగమున్= పామును; విడిచెన్= వదలిపెట్టాడు; కాలుండును= యముడును; మృత్యువున్= మృత్యుదేవత; ఎలమిన్= సంతోషం; పొంది= పొంది; చనిరి= వెళ్ళిపోయారు; కావునన్= కాబట్టి; ఈవున్= ధర్మరాజా! నీవు కూడా; అడలున్= దుఃఖాన్ని; విడువుము= విడిచిపెట్టుము.

**తాత్పర్యం:** అంతా విన్న తరువాత జ్ఞానోదయమైన కిరాతుడికి కోపం పోగా పామును వదలిపెట్టాడు. మృత్యువూ, కాలుడూ సంతోషంతో వెళ్ళిపోయారు. కాబట్టి ధర్మరాజా! నీవూ దుఃఖాన్ని పరిత్యజించుము'.

**తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ గారణములు । బాంధవుల రణ మరణ సంప్రాప్తి కనఘ!**
**వారు, దమతమ కర్మముల్ కారణములు । గాఁగ నిట్లయి; రేల శోకంబు నీకు ? 41**

**ప్రతిపదార్థం:** అనఘా! దోషరహితుడవైన, ధర్మరాజా!; దుర్యోధనుఁడున్= సుయోధనుడుకానీ; నీవున్= నీవుకానీ; బాంధవుల= చుట్టాలయొక్క; రణ మరణ= యుద్ధంలోని చావులు; సంప్రాప్తికిన్= పొందటానికి; కారణములు= కారణాలు; కారు; తమ తమ= వారి వారి; కర్మముల్= కర్మలే; కారణములు= కారణాలు; కాఁగన్= అయినందున; ఇట్లు+అయిరి= ఈ విధంగా యుద్ధంలో మరణించినవారు అయ్యారు; నీకున్= నీకు; శోకంబు= దుఃఖం; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** నాయనా ధర్మరాజా! యుద్ధంలో చుట్టాలంతా అట్లా మరణించటానికి కారణం వారి కర్మలే కాని నీవు కానీ, దుర్యోధనుడు కానీ కారణం కారు. కనుక దుఃఖం విడిచిపెట్టుము.

**వ. గౌతమీ, లుబ్ధక, భుజంగ, మృత్యు, కాల, సంవాదం బను నియ్యితిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి, యా పుట్టిన కలంకం దొలంగ జడిసి శమంబున సుఖివి గ' మ్మనం, గౌంతేయాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో ని ట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** గౌతమీ= గౌతమి అనే ఆ బ్రాహ్మణస్త్రీ; లుబ్ధక= కిరాతుడు; భుజంగ= పాము; మృత్యు= మృత్యువు; కాల= కాలుడు అనువారి; సంవాదంబు= సంభాషణ; అను= అన్న; ఈ ఇతిహాసంబు= ఈ పురాణకథయొక్క; తాత్పర్యంబు= భావం, రహస్యం; మనంబునన్= మనస్సులో; పట్టుకొలిపి= నిలుపుకొని; ఆ పుట్టిన= నీకు కలిగిన ఆయొక్క; కలంకన్= కలతను; తొలంగన్ జడిసి= పోగొట్టుకొని; శమంబునన్= శాంతితో; సుఖివి కమ్ము= సుఖం పొందుము; అనినన్= అనగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీ పుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; సంతసిల్లి= సంతోషించి, శాంతనవునితోన్= శంతనుడి కుమారుడైన భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ గౌతమి, మృత్యువు, కాలుడు, బోయ, పాము వీరి సంభాషణ రూపమైన పురాణకథ యొక్క భావాన్ని మనస్సులో పెట్టుకొని నీకు కలిగిన దుఃఖాన్ని తొలగించుకొని శాంతిని పొంది సుఖించుము' - అనగా ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఈ కథలో పాత్రలు అయిదుగురు. కథ సంభాషణ రూపంలో చెప్పబడింది. అది సంవాదం. ఇతిహాసమంటే పరంపరగా జనం చెప్పుకొనే పురాణకథ. ఈ కథ తాత్పర్య మిది - 'నీకు కలిగిన కష్టనష్టాలకు సుఖదుఃఖాలకు కారణం నీ కర్మతప్ప ఎవరూ కాదు'. ఈ దృష్టితో బ్రతకటమే భక్తి, జ్ఞానం. దీనివలననే శాంతి లభిస్తుంది. సంఘంలో ఘర్షణలు లోపించిపోతాయి. ఇది భారతీయ సంస్కృతి.

### అగ్నిదేవుఁడు సుదర్శన యను కన్యకను వివాహంబు సేసికొనుట (సం.13-2-12)

**చ. 'అనఘ! గృహస్థధర్మమునయందుఁ జరించి నరుండు మృత్యు సం**
**జనితభయంబు పాపికొనఁ జాలునొ చాలఁడొ?' యన్న నా సరి**
**త్తనయుఁడు 'దానికిం దగు విధంబు దిరం బగు నేనిఁ జాలు న**
**య్యను వొడగూడునట్టి యితిహాసము విన్ము నరేంద్ర! చెప్పెదన్. 43**

**ప్రతిపదార్థం:** అనఘ!= (భీష్ముడికి సంబోధన) పాపం లేనివాడా!; నరుండు= మనిషి; గృహస్థ ధర్మమునఅందున్= గృహస్థాశ్రమ ధర్మంలో; చరించి= ప్రవర్తించి; మృత్యుసంజనిత= చావువలన పుట్టే; భయంబు= భయం; పాపికొనన్= పోగొట్టుకొనుటకు; చాలునొ?= సమర్థుడగునా?; చాలఁడొ?= సమర్థుడు కాడా!; అన్నన్= అని ప్రశ్నించగా; ఆ సరిత్+తనయుఁడు= ఆ (గంగా) నది కొడుకు భీష్ముడు; నర+ఇంద్ర!= ప్రజలను పాలించే రాజా!; దానికిన్+తగు విధంబు= దానికి తగిన పద్ధతి; తిరంబు=స్థిరం; అగున్+ఏని= అయితే; చాలున్= సమర్థమే; ఆ+అనువు= ఆ ఉపాయం; ఒడన్+కూడునట్టి= కలిగించే; ఇతిహాసము= పూర్వకథ; చెప్పెదన్= చెప్పుతాను; విన్ము= వినుము.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడా! మనిషి గృహస్థాశ్రమంలో ఉండి మృత్యుభయం పోగొట్టుకొనగలడా?' అని ధర్మరాజు ప్రశ్నిస్తే తాతగారైన భీష్ముడు 'ధర్మానికి స్థిరంగా నిలబడగలిగితే ముక్తి పొందగలడు. దాని కొక కథ ఉన్నది చెప్పుతాను వినుము.

**విశేషం:** 1. పాపమంటే బ్రతుకులో ఎటువీలైతే అటు నడుస్తూ పోవటం. ధర్మానికి కట్టుబడి నడవటం పుణ్యం. 2. మృత్యువంటే చావు కాదు. ధర్మం, భగవంతుడు, ఆత్మవిచారం లేకుండా బ్రతికే వట్టి గొడ్డు బ్రతుకు. మామూలు జీవితం. 3. ఇతి+హ+అస్= ఇది ఇట్లా ఒకప్పుడు ఉన్నది. ఒకప్పుడు ఇట్లా జరిగిందని జన పరంపర చెప్పుకొనే ప్రాచీన కథ. కథ జరిగిందని చెప్పినా ఆ పద్ధతిగా జీవిస్తే ఇప్పటికీ జరుగుతుందని చెప్పేది. కనుక మూడు కాలాలకూ అన్వయించే కథ.

**మ. మనువంశంబునఁ బుట్టి, సర్వజనతామందారమై నేలయె**
**ల్లను బాలించి, జగత్త్రయీప్రణుతలీలం బొల్చె దుర్యోధనుం**
**డను రా జవ్విభు నొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్**
**వనితారూపము దాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్య హృద్యంబుగన్. 44**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు= దుర్యోధనుడు; అనురాజు= అనే పేరు గల ఒకానొక రాజు (పూర్వం జరిగిన కథలో రాజు); మనువంశంబునన్= మనువుతో ప్రారంభమైన వంశంలో; పుట్టి= జన్మించి; సర్వజనతా= అందరు మనుషులకూ; మందారము+ఐ= కల్పవృక్షమై; నేల ఎల్లను= భూమినంతా; పాలించి= ఏలి; జగత్త్రయీ ప్రణుతలీలన్= మూడులోకాలచేత మిక్కిలి స్తుతించదగ్గ విధంగా; పొల్చెన్= ఒప్పారెను; ఆ+విభు= ఆ రాజుయొక్క; ఒప్పు= అందం (దేహసౌందర్యం, మనస్సౌందర్యం); నర్మదకున్= నర్మద అనే నదికి; కామ+ఆవేశమున్= ప్రేమోత్సాహం; చేసినన్= కలిగించగా; వనితారూపము= స్త్రీరూపం; తాల్చి= పొంది; వైదగ్ధ్య= నేర్పుతో; హృద్యంబుగన్= మదికి ఇంపుకాగా; అతనిన్= ఆ రాజును; పొందెన్= వివాహం చేసికొన్నది.

**తాత్పర్యం:** పూర్వం మనువంశంలో దుర్యోధను డనే రాజు పుట్టి ముల్లోకాలచేత మిక్కిలి స్తుతించబడేటట్లు పాలించాడు. అతడి అందాన్ని చూచి నర్మదానది ప్రేమావేశం పొంది స్త్రీరూపం ధరించి అతడిని పెండ్లి చేసుకొన్నది.

**విశేషం:** భారతంలో చాలాచోట్ల నదులు స్త్రీలై వచ్చి రాజులను పెండ్లి చేసుకొన్న కథలు చాలా ఉన్నాయి. ఈ కథ చెప్పే భీష్ముడే గంగకు శంతనుడికి పుట్టినవాడు కదా! ప్రపంచ ఇతిహాస వాఙ్మయంలో ఇట్లాంటి కథలు చాలా ఉన్నాయి.

తిక్కనగారు 'ఆంధ్రావళి మోదముం బొరయ' ఆంధ్రులంతా సంతోషించే విధంగా వ్రాస్తానన్నారు కనుక తెలుగు మాటలలోనే తన రచనను చేశాడనటానికి ప్రతిపద్యమూ ఉదాహరణమే - 'నేలయెల్లను' అననక్కరలేదు. భూమిలేదా రాజ్యమెల్లను అనవచ్చునుకదా! ఈ పద్యం ప్రారంభించటం, ముగించటం, యతి, ప్రాస అంతా చాలా గొప్పగా నిర్మించిన శిల్పమయమైన పద్యం.

ఇతిహాసాన్ని ఎట్లా చెప్పాలో ఆ పద్ధతి కిదొక నమూనా.

**క. ఆ రమణికి నతనికిఁ గ । న్యారత్నం బుద్భవించె నమరపురంధ్రీ**
**శ్రీరామణీయకము ని । స్సారం బగునట్లు గాఁగ జగతీనాథా! 45**

**ప్రతిపదార్థం:** జగతీ= లోకానికి, నాథా!= పాలకుడా!; ఆ రమణికిన్= ఆ నర్మదానదీదేవతకు; అమరపురంధ్రీ= దేవతా స్త్రీలయొక్క; శ్రీరామణీయకము= శోభావంతమైన అందం; నిస్సారంబు= సారంలేనిది; అగునట్లు= అయ్యేటట్లు; కాఁగన్= కాగా; కన్యారత్నంబు= శ్రేష్ఠురాలైన కూతురు; ఉద్భవించెన్= పుట్టింది.

**తాత్పర్యం:** అందమైన ఆ నర్మదకూ ఆ రాజుకూ దేవతాస్త్రీల అందాలను తిరస్కరించగలిగేటటువంటి అందమైన కూతురు పుట్టింది.

**విశేషం:** ముందుకథలో అగ్నిదేవు డీమె అందం చూచి పెండ్లి చేసికోబోతున్నాడు కనుక దేవతాస్త్రీల అందాలను తలదన్నే అందం కల రత్నంవంటి కూతు రన్నాడు కవి. దానికొరకే ఆ సమాసం. మహాకవి దీర్ఘసమాసం వాడితే ఇట్లా విశేషార్థాలు భావించాలి.

**వ. విను! దానికిఁ బేరు సుద । ర్శన, యన్నరనాయకుండు సంప్రీతి మెయిం**
**బెనిచి, తన యగ్నిహోత్రం । బున పరిచర్యలకుఁ బనిచె బుజ్జవ మొప్పన్. 46**

**ప్రతిపదార్థం:** విను= వినుము; దానికిన్= ఆ కూతురుకు; పేరు; సుదర్శన= అందమైన రూపం కలది; ఆ+నరనాయకుండు= ప్రజాపాలకుడు; సంప్రీతిమెయిన్= మిక్కిలి ప్రేమతో; పెనిచి= పెంచి; అగ్నిహోత్రంబున= అగ్నిని పూజించేశాలలో; పరిచర్యలకున్= సేవలకు; బుజ్జవము= లాలన, వాత్సల్యం; ఒప్పన్= ప్రకాశించగా, స్పష్టపడగా; పనిచెన్= నియోగించాడు.

**తాత్పర్యం:** ఆ కన్యకు సుదర్శన అని పేరు పెట్టి, ప్రేమతో పెంచి, తండ్రి తన అగ్నిశాలలో అగ్ని పరిచర్యల నిమిత్తం ఆమెను నియోగించాడు.

**విశేషం:** సుదర్శన అనే పేరు నాటి స్త్రీలకు పెట్టుకొనే రివాజుండేది. క్రీ.పూ. నిర్మించిన భారత్ బౌద్ధస్తూపం మీద సుదర్శన అనే యక్షిణి బొమ్మ ఉన్నది. కనుక అందమైన స్త్రీకి ఆ పేరు పెట్టే ఆచారముండేది.

**వ. పనిచిన నప్పొలంతి యప్పనులవెంట మెలంగుచుండె; నట్టియెడ. 47**

**ప్రతిపదార్థం:** పనిచినన్= నియోగించగా; ఆ+పొలంతి= ఆ స్త్రీ; ఆ+పనులవెంటన్= ఆ పనుల ననుసరించి; మెలంగుచున్+ఉండెన్= మెలగుతున్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** తండ్రి ఆ విధంగా నియోగించగా ఆమె ఆయా పనులను తప్పక చేస్తూ ఉన్న సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. అర్చించునప్పు డయ్యంగన కెంగేలి । జిగిసొంపు, చిత్తంబు దిగిచి కొనఁగ,**
**నరసి కన్గొనునప్పు డయ్యింతి కనుఁగవ । పొలపంబు రాగంబు వొదలఁజేయ,**

**నన్యులఁ బని పంచునప్పు డమ్ముద్దియ । పలుకుల తీపు గోర్కులఁ గెరల్ప**

**నల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ వా ।తెఱతావి ధైర్యంబు ద్రిప్పకొలుప.**

**తే. మరుఁడు దోడ్తోడఁ దేఁకువ మాలి కదిసి । తూపుగముల క్రొవ్వాఁడిమి సూప నంత**

**కంత కగ్గల మగు వలవంతఁ దూలి । పోయెఁ బావకుఁ; డేమి సెప్పుదు నరేంద్ర! 48**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా!; పావకుఁడు= అగ్ని; అర్చించునప్పుడు= పూజించేవేళ; ఆ+అంగన= ఆ స్త్రీ యొక్క; కెంగేలి- కెంపు+కేలి= ఎర్రని చేయియొక్క; జిగి= కాంతి; సొంపు= అందం; చిత్తంబు= మనస్సును; తిగిచికొనఁగన్=లాగగా, ఆకర్షించగా; అరసి= నిగాతో, ఏకాగ్రంగా; కన్గొనునప్పుడు= చూస్తున్న సమయంలో; ఆ+ఇంతి= ఆ స్త్రీ యొక్క; కనుఁగవ= కన్నులజంట; పొలపంబు= అందం; రాగంబు= ప్రేమను; పొదలన్+చేయన్= పెంపొందించగా; అన్యులన్= ఇతరులను; పనిన్= ఆయా పనులకు; పంచునప్పుడు= పంపేవేళ; ఆ+ముద్దియ= ఆ ముద్దులాడి (తియ్యగా మాట్లాడేది); పలుకుల= మాటల; తీపు= తియ్యదనం; కోర్కులన్= కోర్కెలను; వాంఛలను; కెరల్పన్= రెచ్చగొట్టగా; అల్లన= నెమ్మదిగా; ఊఁదెడునప్పుడు= (మండించే ప్రయత్నం చేసేవేళ) ఊదేవేళ; ఆ+కొమ్మ= ఆ స్త్రీ, ఆ యౌవనవతి యొక్క; వాతెఱ= పెదవి; తావి= వాసన; ధైర్యంబు= గుండె నిబ్బరాన్ని; త్రిప్పకొలుపన్= కలతపెట్టగా; మరుఁడు= మరులు కొల్పేవాడు; మన్మథుడు; తోడ్తోడన్= వెన్వెంటనే; తేఁకువ= ధైర్యం; మాలి= కోల్పోయి; కదిసి= సమీపించి; తూపు= అమ్ముల (బాణాల); గములన్= సమూహంతో; క్రొత్త+వాఁడిమి= క్రొత్తపదును; చూపన్= చూపగా; అంతకంతకున్= క్రమక్రమంగా; అగ్గలము+అగు= ఎక్కువయైన; వలపువంతన్= మన్మథబాధతో - విరహంతో; తూలిపోయెన్= ధైర్యం కోల్పోయాడు; ఏమిచెప్పుదున్?= ఇంకేమి చెప్పేది?

**తాత్పర్యం:** ఏమి చెప్పేది? చిత్రంగా అగ్నిదేవుడు కూడా ఆమెపట్ల ఆకర్షితుడై క్రమంగా ఆమెయందు అనురక్తుడయ్యాడు. తనను పూజించేటప్పుడు ఆ సుదర్శన ఎర్రని వ్రేళ్ళ కాంతికి అతడి మనస్సు ఆకర్షించబడింది. పరిచర్య చేస్తూ ఆమె ఏకాగ్రంగా చూచేటప్పుడు కళ్ళ అందం ప్రేమను గిల కొట్టింది. ఇతరులను ఆయా పనులకు పురమాయించేటప్పుడు ఆ ముద్దులాడి తీపిమాట లాయనలో కోర్కెలను రెచ్చగొట్టేవి. నెమ్మదిగా పొయ్యిని ఊదేటప్పుడు ఆమె పెదవి వాసన అతడి ధైర్యాన్ని తూలిపోయేటట్లు చేసేది. దీనితోపాటుగా మరుడు భయం వీడి, అగ్నిని సమీపించి, తన పంచబాణాల పదను చూపించగా క్షణక్షణానికి విరహవేదన ఎక్కువ కాగా అగ్ని ధైర్యాన్ని పోగొట్టుకొన్నాడు.

**విశేషం:** ఈ నేపథ్యంలో శృంగార రసవర్ణన చాలా మృదువుగా, నాగరికంగా చేయబడింది. నాయికావర్ణనలో ఎక్కడా ఔచిత్యం కోల్పోలేదు. వ్రేళ్ళు, కళ్ళు, మాటా, వాతెఱతావీ ఇవే చెప్పిన అవయవాలు. ఇది తిక్కనగారు ప్రదర్శించిన ఔచిత్యం. ఈ పద్యం కవి చేసిన వర్ణన.

**వ. ఇట్లు మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున నిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మదన+అగ్నిన్= మన్మథతాపంతో; ఉదిలకొని= చలించిపోయి; అగ్నిదేవుండు; ఆ+కాంతతోన్= ఆ అందమైన స్త్రీతో; ఏకాంతంబునన్= ఒంటరిగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అగ్నిదేవుడు మదనాగ్ని ప్రభావంతో చలించిపోయి ఆ స్త్రీతో ఒంటరిగా ఈ విధంగా పలికాడు.

**సీ.** **'చిగురుటాకుల గాసి సేయు నీ యడుగుల । చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె,**
**మారేడు పండుల గారాము సెఱుచు నీ । యెలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె**
**నునుఁదీవఁ జీరికిఁ గొనని నీ మైఁదీవ । మురిపంబు డెందంబు మరులుకొలిపె,**
**నెఱచందురుని సిగ్గువఱుపంగఁ జాలు నీ । నెమ్మోము దాలిమి వమ్ముసేసె.**

**తే.** **నాతి నీకునై పెక్కుబన్నములు వడితి । నంగజునిచేత; వల్లభ వగుము, నాకు'**
**నావుడును సిగ్గు గదిరి, యాననము వాంచి । యలఁతి యెలుఁగున నిట్లను నా లతాంగి.** **50**

**ప్రతిపదార్థం:** నాతి!= ఓ అమ్మాయి!; చిగురు+ఆకుల= లేత ఆకుల; గాసిచేయు= బాధించే (తిరస్కరించే); నీ+అడుగుల= నీ పాదాల; చెలువంబు= అందం; చూడ్కులన్= చూపులను; చేర్చికొనియెన్= తమలో లీనం చేసికొన్నాయి; మారేడుపండుల= మారేడుపండ్ల యొక్క; గారాము= గోము, ముగ్ధసౌందర్యం; చెఱుచు= చెడగొట్టు; నీ; ఎల= లేత; చన్నుఁగవ= చనులజంట; వేడుకలన్= పండుగలను, ఉత్సవాలను; పొనర్చెన్= చేసింది; నును+తీవన్= లేతతీగను; చీరికిన్= లెక్కకు; కొనని= గ్రహించని (లెక్కచేయని); నీ; మై= శరీరమన్న; తీవ= తీగయొక్క; మురిపంబు= సౌకుమార్యం; డెందంబున్= మనస్సును; మరులు కొలిపెన్= మోహింపజేసింది; నెఱ= నిండు; చందురుని= జాబిల్లిని; సిగ్గుపఱుపంగన్+చాలు= సిగ్గులపాలు చేసే; నీ; నెఱ+మోము= అందమైన ముఖం, తాలిమిన్= నా ధైర్యాన్ని; వమ్ము చేసెన్= నాశనం చేసింది; నీకునై= నీ కోసమై; అంగజుని చేతన్= మన్మథుడి చేత; పెక్కు= అనేకమైన; బన్నములు= కష్టాలు; పడితిన్= పడ్డాను; నాకున్= నాకు; వల్లభవు= భార్యవు; అగుము= కమ్ము; నావుడును= అనగా; ఆ+లతాంగి= తీగవంటి శరీరం కల ఆ సుదర్శన; సిగ్గు కదిరి= లజ్జ తొణికిసలాడగా; ఆననము వాంచి= తలను వంచుకొని; అలఁతి= సన్నని; ఎలుఁగునన్= స్వరంతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** 'సుదర్శనా! చిగురాకులను తృణీకరించే నీ పాదాల సొగసు నా చూపులను తనలో లీనం చేసికొన్నది. మారేడుపండ్ల అందాన్ని కాదనే నీ చనులజంట నాకు నేత్రోత్సవాన్ని కల్పించింది. లేత తీగలను కాలదన్నే నీ శరీరమన్న తీగ నాకు మరుల తీగైనది (అడవిలో ఉండే ఈ తీగను త్రొక్కిన బాటసారులు దారి తప్పిపోతారట). నిండు జాబిల్లిని సిగ్గుపరిచే నీ గుండ్రని ముఖం నా గుండె దిటవును కూల్చివేసింది. ఇవి నాకు మన్మథుడు పెట్టిన బాధలు. కనుక నాకు రాణివి కమ్ము' అని అనగా, విని ఆమె ముఖం కొంచెం వంగి సిగ్గుతో సన్నని గొంతుతో ఇట్లా అన్నది.

**విశేషం:** ఇందులో వర్ణించబడిన అవయవాలు, పాదాలు, చనుగవ, శరీరం, ముఖం, క్రిందినుండి పైకి వర్ణించబడ్డాయి. పై పద్యంలో చెప్పిన అవయవాలు వేరు. ఆమె ముఖం వాల్చటం, అలతి యెలుఁగు - ఇవన్నీ ఆమె కన్యాత్వాన్ని స్థాపించే మాటలు. అగ్ని ఔచిత్యం మరిచిపోకుండా తన ప్రేమను నాజూకుగా తెలియచేశాడు.

**క.** **'కులకన్యకలకు వేడుకఁ । దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం**
**దలకొనఁ దగునే? గురుజన । ముల కా కర్తెఱఁగువారు పురుషార్థనిధీ!'** **51**

**ప్రతిపదార్థం:** పురుష+అర్థ= ధర్మ, అర్థ, కామ, మోక్షాలకు; నిధీ!= స్థానమైనవాడా! పురుషార్థాలను ఇచ్చేవాడా!; కులకన్యకలకున్= ఉత్తమకులంలో పుట్టిన కన్యలకు (లోకం తెలియని అమాయికలకు); వేడుకన్= కోర్కెతో; తలవీడులన్= సమీప ప్రదేశంలో;

పరులతోడి= ఇతరులతో, పరపురుషులతో; తగుమాటలకున్= వయస్సుకు తగినమాటలకు; తలకొనన్= పూనుకొన; తగునే?= తగునా? - తగదు; ఆ+తెఱఁగువారు= ఆ విధంగా మాట్లాడదగినవారు; గురుజనముల కాక= పెద్దలే అగుదురు.

**తాత్పర్యం:** 'పురుషార్థప్రదాతవు నీవు. కులకన్యలు తలవాకిట్లో బయటివారితో ఇష్టానుసారంగా మాట్లాడుతారా? అట్లా మాట్లాడతగినవారు పెద్దలే కదా!

**వ. అనిన విని హుతవహుం 'డట్లకాక' యనియె; నా సమయంబున. 52**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; హుతవహుండు= వేల్చినవాటిని మోసికొనిపోయి దేవతలకిచ్చేవాడు- అగ్ని; అట్ల కాక= సరేలే, అట్లాగే; అనియెన్= అన్నాడు; ఆ సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** సుదర్శన ఆ విధంగా అనగా అగ్ని విని సరే అన్నాడు. ఆ తరువాత.

**ఉ. ఆ నరనాయకుం డొక మహాధ్వర మెంతయుఁ వేడ్కఁ జేయఁగాఁ**
**బూని, మహీసురావళికిఁ బూజ లొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం**
**డై నయ మారఁగా ననలుఁ డాతని పాలికి వచ్చి 'నాకు నీ**
**వే నృప! నీదుపుత్త్రిఁ గృప యేర్పడ దానము గాఁగ' నావుడున్. 53**

**ప్రతిపదార్థం:** ఆ+నరనాయకుండు= ఆ ప్రజలను పాలించే రాజు (దుర్యోధనుడు); ఒక= ఒకానొక; మహా=గొప్ప; అధ్వరము= యజ్ఞం; ఎంతయున్= ఎంతో; వేడ్కన్= కోర్కెతో; చేయఁగాన్= చేయటానికి; పూని= పూనుకొని; మహీసుర= భూదేవతల (బ్రాహ్మణుల); ఆవళికిన్= సమూహానికి; పూజలు= అర్చనలు; ఒనర్పఁగన్= చేయగా; తాను= తానుగా వచ్చి; అనలుఁడు= అగ్ని; బ్రాహ్మణుండు+ఐ= బ్రాహ్మణవేషాన్ని ధరించినవాడై; అతనిపాలికిన్= అతడి వద్దకు; వచ్చి= వచ్చి; నయము= ప్రేమ; అరఁగాన్= నిండగా; నృప!= రాజా!; నాకున్= నాకు; నీదు= నీయొక్క; పుత్రిన్= కుమార్తెను; దానముకాగన్= దానంగా; కృప= దయ; ఏర్పడన్= స్పష్టంకాగా; ఈవే?= ఈయువయ్యా!

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు ఒక మహాయజ్ఞం చేయాలని తలపెట్టి, బ్రాహ్మణుల కనేక దానాలు చేస్తూ ఉండగా, అగ్నికూడా వాళ్ళల్లో ఒక బ్రాహ్మణుడై వచ్చి రాజును అతడి కూతురును తనకు దానం చేయుమని అర్థించాడు.

**వ. అ వ్విభుండు. 54**

**ప్రతిపదార్థం:** ఆ+విభుండు= ఆ రాజు

**తాత్పర్యం:** ఆ రాజు

**తే. 'అన్యవర్ణుండు, దీనుఁ డీయనకు నెట్లు । గూఁతు నీవచ్చు?' నని మదిఁ గుత్స పుట్టి,**
**యీఁడ ప్రార్థన మఫల మై యేఁగి యజ్ఞ । సమయమున నగ్ని తనమూర్తి సంహరించె. 55**

**ప్రతిపదార్థం:** అన్యవర్ణుండు= ఇతర కులంవాడు (క్షత్రియుడు కానివాడు); దీనుఁడు= పేదవాడు; ఈయనకున్= ఇతడికి; ఎట్లు= ఏ విధంగా; కూఁతున్= కుమార్తెను; ఈవచ్చున్= ఇయ్యవచ్చును; అని; మదిన్= మనస్సులో; కుత్స= అసహ్యం; పుట్టి=

జనించి; ఈడు+అ= ఇవ్వడు కదా!; అగ్ని= అగ్నిదేవుడు; ప్రార్థనము= తన అభ్యర్థన, వేడుకోలు; అఫలము+ఐ= ఫలించకపోగా; ఏఁగి= పోయి; యజ్ఞసమయమునన్= యజ్ఞం చేసేవేళ; తనమూర్తిన్= తన తేజస్సును; సంహరించెన్= కన్పించకుండా చేశాడు.

**తాత్పర్యం:** రాజు ఇట్లా తనలో తా ననుకొన్నాడు. 'ఇతడు వేరే కులంవాడు. పైగా పేదవాడు. ఇతడికెట్లా కూతురు నివ్వగలను?' అని మనస్సులో అనుకొని ఇవ్వలేకపోయాడు. అగ్ని తన ప్రార్థన ఫలవంతం కాకపోగా, వెళ్ళి యజ్ఞ సమయంలో తన తేజస్సును ఉపసంహరింపజేశాడు. (అగ్ని మండలేదు)

**క. కని యజ్ఞనపతి ఋత్విజు । లును, దానును, వెఱఁగుపడి, 'విలోపము వాటి**
**ల్లెనొకో! కర్మగతుల' నని । మనమున నూహించి, భవ్యమంత్రముఖరులై. 56**

**ప్రతిపదార్థం:** ఆ+జనపతి= ఆ ప్రజాపాలకుడు, రాజు; కని=చూచి; ఋత్విజులును= పురోహితులును; తానును= తానూ; వెఱఁగుపడి= విస్తుపోయి; కర్మగతులన్= యజ్ఞవిధులలో; విలోపము= పెద్దలోపం; వాటిల్లెన్+ఒకో!= ఏర్పడినదా!; అని; మనమునన్= మనస్సులో; ఊహించి= ఆలోచించి; భవ్య= శ్రేష్ఠమైన; మంత్ర= మంత్రాలను; ముఖరులై= ఉచ్చరిస్తూ.

**తాత్పర్యం:** రాజూ, పురోహితులూ చూచి విస్తుపోయారు. ఇదేమిటి అగ్ని మండటంలేదని, కర్మలోపంవలన ఇట్లా జరిగి ఉంటుందని భావించి, ఇంకా గొప్ప మంత్రాలను ఉచ్చరిస్తూ (తరువాతి పద్యంతో అన్వయం)

**వ. పావకునిం బ్రస్తుతించుచుండ నద్దేవుం డా భూదేవతలకు నల్లన తనతెఱం గెఱింగించిన. 57**

**ప్రతిపదార్థం:** పావకునిన్= అగ్నిని; ప్రస్తుతించుచున్+ఉండన్= పొగడుతుండగా; ఆ+దేవుండు= ఆ అగ్నిదేవుడు; ఆ భూదేవతలకున్= ఆ పురోహిత బ్రాహ్మణులకు; అల్లన= నెమ్మదిగా; తన తెఱంగు= తన విషయం; ఎఱింగించినన్= తెలుపగా.

**తాత్పర్యం:** భవ్యమంత్రాలతో స్తుతిస్తుండగా ఆ అగ్ని వారితో తన విషయం చెప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. వార లానృపుతోఁ జెప్ప, గారవంబు । సంతసముఁ దలకొనఁగ నయ్యింతిఁ బెండ్లి**
**సేసె, విప్రకుమారుఁ డై చెన్ను మెఱసి । యగ్ని వరియించె నచ్చెరువంద జనులు. 58**

**ప్రతిపదార్థం:** వారలు= ఋత్విజులు; ఆ నృపుతోన్= ఆ రాజుతో; చెప్పన్= చెప్పగా; గారవంబు= గౌరవం; సంతసమున్= సంతోషం; తలకొనఁగన్= కలుగగా; ఆ+ఇంతిన్ పెండ్లి చేసెన్= తన పుత్రికా వివాహం జరిపించాడు; అగ్ని; విప్రకుమారుఁడు+ఐ= బ్రాహ్మణపుత్రుడై; చెన్ను= అందం; మెఱసి= ప్రకాశించగా; జనులు= ప్రజలు; అచ్చెరువందన్= ఆశ్చర్యపడగా; వరియించెన్= పెండ్లాడాడు.

**తాత్పర్యం:** ఆ పురోహితులు అగ్ని కోర్కెను రాజుతో చెప్పగా అతడు గౌరవంతో, సంతోషంతో కుమార్తె పెండ్లి చేశాడు. అగ్ని అందమైన బ్రాహ్మణ కుమారుడై ఆమెను వరించాడు. ఇది చూచి ప్రజలు ఆశ్చర్యపడ్డారు.

**వ. ఇట్లు సుదర్శనా వివాహోత్సవం బనుభవించి విభావసుండు విభాప్రభాసమానుం డగుచు హుతంబులు పరిగ్రహింప దుర్యోధను యాగంబును సుప్రయోగం బై చెల్లెఁ; బదంపడి. 59**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సుదర్శనా వివాహ+ఉత్సవంబు= సుదర్శన పెండ్లివేడుక; అనుభవించి= పొంది; విభావసుండు= అగ్ని; విభా= కాంతితో; ప్రభాసమానుండు+అగుచున్= వెలుగొందుతూ; హుతంబులు= యజ్ఞంలో వేల్చబడిన ద్రవ్యాలను; పరిగ్రహింపన్= స్వీకరించగా; దుర్యోధను యాగంబును= రాజు యజ్ఞం కూడా; సుప్రయోగంబు+ఐ= చక్కగా నెరవేర్చబడినదై; చెల్లెన్= సమాప్తమయింది; పదంపడి= తర్వాత.

**తాత్పర్యం:** ఈ విధంగా తాను కోరిన సుదర్శన పెండ్లివేడుక లనుభవించి ఆనందంతో ఉపసంహరించుకొన్న రూపాన్ని ఉజ్జ్వలంగా ప్రకాశింపచేసి అగ్నిదేవుడు దుర్యోధనుడి యజ్ఞ పరిసమాప్తిని చేయించాడు. తరువాత.

**విశేషం:** 'విభావసుండు విభాప్రభాసమానుండై' - సామాన్యంగా తిక్కనగారు ఇటువంటి సమాసాలు వాడడు. ఇక్కడ పెండ్లికొడుకు ఆనందాన్ని చెప్పటానికి వాడాడు. ఇది ఆయన రచనాశిల్పం.

**క. అనలునకు సుదర్శనకును । జనియించె నుదాత్తగుణవిశాలుండు, సుద**
**ర్శననామధేయుఁ డాన్నృపుఁ । డనూనధర్మమునఁ దాల్చె నవనీభరమున్. 60**

**ప్రతిపదార్థం:** అనలునకున్= అగ్నికి; సుదర్శనకును= ఆ పేరుకల అగ్ని భార్యకు; ఉదాత్తగుణవిశాలుండు= ఉన్నతగుణాలతో పేరుపడ్డవాడు (విశాలబుద్ధి); సుదర్శన నామధేయుఁడు= (తల్లిపేరే కుమారునకు పెట్టారన్నమాట) సుదర్శనుడన్న పేరుకలవాడు; జనియించెన్= పుట్టాడు; ఆ నృపుఁడు= ఆ రాజు; అవనీభరమున్= భూభారాన్ని; అనూన= గొప్ప; ధర్మమునన్= ధర్మంతో; తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** భార్యాభర్తలకు గొప్ప గుణాలు కల కొడుకు పుట్టాడు. అతడికి సుదర్శనుడు అని తల్లిపేరే పెట్టారు. అతడు పెద్దవాడై రాజ్యభారాన్ని ధర్మదృష్టితో మోయటం మొదలుపెట్టాడు.

**విశేషం:** తల్లిపేరు పెట్టడం అతి ప్రాచీన సమాజపు అలవాటు.

**వ. ఆ సమయంబున. 61**

**తాత్పర్యం:** ఆ వేళలో.

**ఆ. అతని కోఘవంతుఁ డనువాఁడు జనియించె । నుదితయశుఁడు; వాని కోఘరథుఁడు,**
**నోఘవతియు ననఁగ నుదయించి; రయ్యోఘ । వతికి నా విభుండు వరుని నరసి. 62**

**ప్రతిపదార్థం:** అతనికిన్= సుదర్శనునకు; ఉదితయశుఁడు= కీర్తిశాలి; ఓఘవంతుఁడు= ఓఘవంతుడనే పేరుకలవాడు; అనువాఁడు; జనియించెన్= పుట్టాడు; వానికిన్= ఆ ఓఘవంతుడికి; ఓఘరథుడు, ఓఘవతియున్; అనఁగన్= అన్న పేర్లుకల కొడుకు, కూతురు; ఉదయించిరి= జన్మించారు; ఆ+ఓఘవతికిన్= ఆ కుమార్తెకు; ఆ విభుండు= ఆ రాజు; వరునిన్= పెండ్లి కుమారుడిని; అరసి= వెదకి.

**తాత్పర్యం:** ఆ సుదర్శనునకు ఓఘవంతుడు, ఇతడికి ఓఘరథుడు, ఓఘవతి జన్మిస్తే ఆ తండ్రి కుమార్తెకు వరుడిని వెదకుతుండగా. (ఈ పేర్లన్నీ నదీ ప్రవాహమన్న అర్థాన్నిచ్చేవే. తల్లి తల్లి నర్మదానది కనుక మాతృవంశాన్ని సూచించే నామాలే వారు ధరిస్తూ వచ్చారన్నమాట.)

**వ. ఒరుల మెచ్చక. 63**

**తాత్పర్యం:** ఇతరులను అంగీకరించక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఆ లేమ సుదర్శనునకు । నాలింగా నిచ్చె, నద్దహననందనుఁడున్**
**లోలతఁ గైకొని, పరిణయ । కేలి నడపి, విమలబుద్ధిఁ గృతనిశ్చయుఁడై. 64**

**ప్రతిపదార్థం:** ఆ లేమన్= ఆ కన్యను; సుదర్శనునకున్= తాతగారైన అగ్నికొడుకునకు; ఆలిన్+కాన్= భార్యగా; ఇచ్చెన్= ఇచ్చెను; ఆ+దహన నందనుఁడున్= అగ్నికొడుకును; లోలతన్= ఆసక్తితో; కైకొని= గ్రహించి; పరిణయకేళిన్= వివాహోత్సవమును; నడపి= చేసి; విమలబుద్ధిన్= స్వచ్ఛమైన బుద్ధితో; కృత= చేయబడిన; నిశ్చయుఁడు+ఐ= నిశ్చయం కలవాడై.

**తాత్పర్యం:** తండ్రి ఓఘవతిని సుదర్శనుడికిచ్చి పెండ్లి చేశాడు. ఆ అగ్నికొడుకు ఆమెను ప్రేమతో వివాహం చేసికొని స్వచ్ఛమైన మనస్సుతో ఒక నిశ్చయానికి వచ్చాడు.

**విశేషం:** తాత మనుమరాలిని పెండ్లి చేసుకొనే ఆచారం ఉండేది. దానినిబట్టి ఇది జరిగింది.

**వ. 'గృహస్థ ధర్మానుష్ఠానంబునన మృత్యువు జయింతు' నని ప్రతిజ్ఞ చేసి యోఘవతియునుం దానును గురుక్షేత్రంబునకుం జని, యందు రమణీయ ప్రదేశంబున విశాలమగు పర్ణశాల కావించుకొనియుండె; నట్టియెడ న య్యెలనాగతో నతం డిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** గృహస్థధర్మ+అనుష్ఠానంబునన్= గృహస్థుడి ధర్మాలను అనుసరించటంవలననే; మృత్యువున్ జయింతును= ముక్తి నొందుతాను; అని= ఆలోచించి; ప్రతిజ్ఞచేసి= ప్రతినపూని; ఓఘవతియునున్+తానును= భార్యతోపాటుగా తానూ, కురుక్షేత్రంబునకున్= ఆ పేరుగల పుణ్యప్రదేశానికి; చని= పోయి; అందున్= అక్కడ; రమణీయ= చక్కని; ప్రదేశంబునన్= స్థలంలో; విశాలము+అగు= పెద్ద; పర్ణశాల=పూరిగుడిసె (ఆకులతో కప్పిన చిన్ని గుడిసె); కావించుకొని= నిర్మించుకొని; ఉండెన్= ఉన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+ఎలనాగతోన్= ఆ స్త్రీతో (భార్యతో) అతండు= భర్త; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'గృహస్థాశ్రమధర్మాన్ని పాటిస్తూ మృత్యువును జయిస్తాను' అని శపథంచేసి ఓఘవతీ తానూ కలిసి కురుక్షేత్రానికి వెళ్ళి, అందు అందమైన ప్రదేశంలో విశాలమైన పర్ణశాలను కట్టుకొని ఉన్నాడు. ఆ సమయంలో అతడు భార్యతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** గృహస్థుడై ఉంటూనే మోక్షం పొందవచ్చును. ఒక్క సన్న్యాసమే కాదు ముక్తిమార్గ మనటానికి చెప్పిన కథ కనుక ఆ విషయ మిక్కడ స్పష్టం చేస్తున్నాడు కవి. మృత్యువు, అమృతము అనే రెండు మాటలు; ఈ లోకం, పరలోక మన్న అర్థాలలో వైదిక వాఙ్మయంలో వాడబడినవి. అంతేకాని చావు అని కాదు. ఇది ప్రతి జీవికీ తప్పదు కనుక. కురుక్షేత్రం ధర్మక్షేత్రమని గీత వర్ణిస్తుంది. కనుక అది తపోయోగ్యమైన ప్రదేశమని భారతంలో చాలాచోట్ల దీని ప్రసక్తి వస్తుంది.

**తే. 'అతిథిఁ బూజించువేడ్క, నాకగ్గలంబు । వెలఁది । నీవును, ననుకూలవృత్తిఁ దాల్చి**
**సొలయ కప్పని నడపఁగా వలయుఁబూని । యే నిచట నున్న యప్పుడు, లేనియపుడు. 66**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; అతిథిన్= అతిథిని; పూజించు= అర్చించే; వేడ్క= కోరిక; అగ్గలంబు= ఎక్కువ; వెలఁది!= గృహిణీ! (స్త్రీ); నీవును= నీవు కూడా; అనుకూలవృత్తిన్= నాకు అనుకూలమైన ప్రవర్తనను; తాల్చి= వహించి; సొలయక= విసుగు కొనక; ఆ+పనిన్= ఆ అతిథి పూజా కార్యమును; ఏను= నేను; ఇచటన్= ఇక్కడ - పర్ణశాలలో; ఉన్న అప్పుడు= ఉన్నప్పుడు; లేనిఅపుడు= లేనప్పుడు; పూని= ఎట్లాగైనా సరే, ప్రయత్నంతో; నడపఁగాన్వలయున్= జరిగేటట్లు చూడాలి.

**తాత్పర్యం:** 'ఇల్లాలా! నాకు అతిథి పూజ చాలా ఇష్టం. కనుక నే నింట్లో ఉన్నా లేకున్నా నీవు నా కనుకూలంగా ఆ కార్యం జరిగేటట్లు చూడాలి.

**విశేషం:** గృహస్థాశ్రమంలో స్వార్థముంటుంది కనుక దానిని జయించటానికి అతిథిపూజ ఒక పూజ. అదే తపస్సు. పేదలను ఆదరించటం - వారూ తనవంటి వారేనని ధర్మదృష్టితో పూజించటం ప్రతికావ్యమూ వర్ణించింది. ఈనాటి సమాజంలో దీనికి చాలా ప్రాశస్త్యమున్నది. కావ్యం ధర్మబోధ చేస్తుందనటాని కిదొక ఉదాహరణ.

**క. అతిథిజనులు దమతమ వాం । ఛితము లనుభవించునట్లు సేయం గనినం**

**గృతకృత్యతఁ బొందరె? గృహ । పతియును గృహిణియును ధర్మభారమువలనన్. 67**

**ప్రతిపదార్థం:** అతిథిజనులు= చెప్పా పెట్టకుండా తిథివారనక్షత్రాలతో పనిలేకుండా వచ్చేవారు; తమ తమ వాంఛితములు= తమతమ కోరికలు; అనుభవించునట్లు చేయన్+కనినన్= అనుభవించేటట్లు చేయగలిగితే; గృహపతియును= యజమానుడు; గృహిణియును= యజమానురాలునూ; ధర్మభారమువలనన్= ధర్మమును మోయటంవలన; కృతకృత్యతన్= చరితార్థతను; పొందరె!= పొందరా? తప్పక పొందగలరు.

**తాత్పర్యం:** అతిథులు ఎవరి ఇంట్లో తమ కోరికల నెల్ల తీర్చుకొనటానికి వీలు కల్పించబడుతుందో ఆ ఇంటి యజమానుడు; యజమానురాలు ఆ ధర్మాచరణవలన కృతార్థు లౌతారు.

**క. అతిథి నినుఁగోరెనేనియు । మతిఁ గింకిరి పడక, యోలమాస గొనక, నీ**

**వతనికిఁ బ్రియంబు సల్పుము । సతికిం బతిపనుపు సేయఁ జను నెల్లదియున్. 68**

**ప్రతిపదార్థం:** అతిథి= ఆ వచ్చినవాడు; నినున్= నిన్ను; కోరెనేనియున్= కోరుకొన్నా; మతిన్= మనస్సులో; కింకిరిపడక= అసహ్యించుకొనక; ఓలమాసగొనక= చాటున దాగుకొనకుండా; నీవు= నీవు; అతనికిన్= అతిథికి; ప్రియంబు= ఇష్టం; సల్పుము=చేయుము; సతికిన్= భార్యకు; పతిపనుపు= భర్త ఆజ్ఞ; ఎల్లదియున్= ప్రతిదీ; చేయన్చనున్= విధిగా చేయాలి.

**తాత్పర్యం:** అతిథి నిన్ను కోరినా మనస్సులో జుగుప్స వహించి చాటుకుపోయి దాక్కొనకుండా అతడి కోర్కె తీర్చాలి. పతి చెప్పిన మాట ప్రతిదానినీ సతి నెరవేర్చక తప్పదు'.

**విశేషం:** ఈ ఆచారం అతి ప్రాచీన కాలంలో ఉండేది. మన పురాణాల్లో చాలాచోట్ల ఇది కన్పిస్తుంది. ఆ నా డిది ధర్మంగానే పరిగణించబడి ఉండాలి కదా!

## సుదర్శను నింటికి ధర్మదేవత యతిథియై వచ్చుట (సం.13-2-48)

**క. అని యూఁది చెప్పి, యొకనాఁ । డనఘ! యతం డిధ్మములకు నటవీస్థలికిం**

**జనినయెడ నతిథి యొక్కఁడు । సనుదెంచిన నాసనాది సంభావనలన్. 69**

**ప్రతిపదార్థం:** అనఘ!= దోషరహితుడా (ధర్మరాజా); అని; ఊఁదిచెప్పి= ఆ విధంగా నొక్కి చెప్పి; ఒకనాఁడు= ఒకరోజున; అతండు= సుదర్శనుడు; ఇధ్మములకున్= సమిధలకు; అటవీస్థలికిన్= అరణ్యప్రదేశానికి; చనిన+ఎడన్= వెళ్ళిన సమయంలో; అతిథి+ఒక్కఁడు= ఒక అతిథి; చనుదెంచినన్= రాగా; ఆసన+ఆది= పీఠమిడుట మొదలైన; సంభావనలన్= మర్యాదలతో.

**తాత్పర్యం:** ఆ విధంగా అతడు చెప్పి సమిధలకొరకు అడవికిపోగా ఒక అతిథి అతడి పర్ణశాలకు వచ్చాడు. ఆ ఓఘవతి అతడికి ఆసన మొసగటంవంటి మర్యాదలతో (తరువాతి పద్యంతో అన్వయం)

**క. అతివినయంబున సమ్మా ।నితుఁ జేయఁగ నా లతాంగి నెమ్మోమునఁ జూ**

**పతఁడు నిలిపి, కామాతుర । మతి నైతిం ; బ్రియ మొనర్పు మానిని! నాకున్. 70**

**ప్రతిపదార్థం:** ఆ లతాంగి= తీగవంటి శరీరంకల ఆ ఇల్లాలు; అతి వినయంబునన్= మిక్కిలి నమ్రతతో; సమ్మానితున్ చేయఁగన్= పూజించగా; అతఁడు; (ఆమె); నెమ్మోమునన్= నిండుముఖంమీద; చూపు నిలిపి= చూపులు ప్రసరించి; మానిని!= గృహిణీ!; కామ= కామంతో; ఆతురమతిన్= త్వరపడే మనస్సుకలవాడను; ఐతిన్= అయినాను; నాకున్=నాకు; ప్రియము= ఇష్టం; ఒనర్పుము= చేయుము.

**తాత్పర్యం:** ఆ గృహిణి అతివినయంతో సపర్యలు చేయగా, అత డామె ముఖం చూస్తూ 'ఓఘవతీ! నీపై మరులుకొన్నాను. నా కోరిక తీర్చుము అన్నాడు.

**విశేషం:** లతాంగి అన్నమాట ఆమె అందాన్ని చెప్పేది. మానిని అన్నమాట ఆమె గౌరవమర్యాదలు కలదని చెప్పేది.

**వ. 'గృహస్థధర్మ ప్రకారంబు నీయెఱుంగనియదియే! యని' పలికిన, నప్పరమపతివ్రత, వేఱొండు దెఱంగుల నభ్యర్థనీయంబు లయిన వస్తువుల నుపన్యసించిన, నతం డవి యెవ్వియు' నొల్ల ననుటయు. 71**

**ప్రతిపదార్థం:** గృహస్థ= గృహయజమాని; ధర్మంబు= విధినిర్వహణ; ప్రకారంబు= పద్ధతి; నీ+ఎఱుంగని+అదియే!= నీకు తెలియనిదా?; అని పలికినన్= అని చెప్పగా; ఆ+పరమ పతివ్రత= ఆ గొప్ప సతి; వేఱు+ఒండు= మరొక; తెఱంగులన్= తీరుల; అభి+అర్థనీయంబులు= మిక్కిలి కోరదగిన; వస్తువులన్= పదార్థాలను; ఉపన్యసించినన్= పేర్కొనగా; అతండు= ఆ అతిథి; అవి+ఎవ్వియున్= అవి ఏవికూడా; ఒల్లను= అంగీకరించను; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** గృహస్థ ధర్మవిధులు నీకు తెలిసినవే కదా! అని చెప్పగా ఆ సతి కోరదగిన వేరే వస్తువులు కోరుకొమ్మన్నది. అత డవేమియు నాకు అక్కర్లే దన్నాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. సతి దనపతి వచనంబులు। మతిఁ జొనుపుం దెంపు మాను, మాన వెఱచు, న**

**య్యతిథి పనుపు సేయక త్రో । చు తలంపలవఱుచుఁ, జేయఁ జూచుం, దలరున్. 72**

**ప్రతిపదార్థం:** సతి= పతివ్రత; తన= తనయొక్క; పతివచనంబులు= భర్తమాటలు; మతిన్= మనస్సులో; చొనుపున్+ ప్రవేశపెట్టుతుంది (ఆలోచిస్తుంది); తెంపు= సాహసము; మానున్= వదలిపెట్టుతుంది; మానన్ వెఱచున్= తెగించకుండా ఉండటానికి భయపడుతుంది; ఆ+అతిథి= ఆ అతిథియొక్క; పనుపు= ఆనతి (కోరిక); చేయక= చేయకుండా; త్రోచు= వదలే; తలంపు= ఆలోచన; అలవఱుచున్= మనస్సులో ఊహిస్తుంది; చేయన్ చూచున్= చేద్దామని అనుకొంటుంది; తలరున్= చేయడానికి భయపడుతుంది.

**తాత్పర్యం:** ఆ పతివ్రత భర్త మాటలను గురించి ఆలోచిస్తుంది. తెంపు చేద్దామనుకొని, మరలా చేయలేక, అతిథి కోరికను చెల్లించాలనుకొంటుంది కొంచెం సేపు. మరలా (శీలం పోతుందని) భయపడుతుంది.

**విశేషం:** ఈ పద్యం ఆమె మనస్సులో పడుతున్న ఆవేదన, ఆలోచన, ఆమె ఆలోచనలోని సుడులు, ఏదీ తేల్చుకోలేని పరిస్థితిని చాలా గొప్పగా చిత్రిస్తున్నది. తిక్కనగారి కవిత్వంలో ఒక గొప్ప నేర్పు ఇట్లా మానసిక పరిస్థితులను చిత్రించటం.

**తే. ఇట్టు లురియాడు చిత్తంబు నెట్టకేని । నాథు చెప్పిన ధర్మంబునకుఁ జొరంగ**
**నూలుకొల్పి, నిర్ణయమునఁ గీలుకొన్న । లజ్జవ్రేగునఁబోలె వ్రాలంగ మోము. 73**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఈ విధంగా; ఉరియాడు= ఉయ్యాలలూగే (ముందు వెన్కల ఆలోచనలతో); చిత్తంబును= మనస్సును; ఎట్టకున్+ఏని= చిట్టచివరకు; నాథు చెప్పిన; ధర్మంబునకున్= పెనిమిటిచెప్పిన విధి నిర్వహణకు; చొరంగన్= పూనుకొనుటకు; నూలుకొల్పి= అంగీకరింపజేసి, ఉత్సహింపచేసి; నిర్ణయమునన్= నిశ్చయంలో; కీలుకొన్న= పూనుకొన్న; లజ్జవ్రేగునన్= సిగ్గుబరువున; పోలెన్= అన్నట్లుగా; మోము= ముఖం; వ్రాలంగన్= వంగిపోగా.

**తాత్పర్యం:** ఈ విధంగా వివిధాలోచనలతో ఉయ్యాల లూగే మనస్సును ఎట్లాగో చివరకు ఒప్పించి భర్త మాటను నెరవేర్చాలనే నిర్ణయానికి వచ్చిందా, అన్నట్లుగా సిగ్గు బరువున ముఖం వంచింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. తెఱవ యొడఁబాటు మాటం । బఱివోయిన గొంకుతోడ బ్రాహ్మణుఁ గొని, క**
**న్మఱుఁ గగునెడకు నరిగె; న । త్తఱి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా! 74**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ధర్మరాజా!; తెఱవ= స్త్రీ; ఒడఁబాటు= అంగీకారం; మాటన్= మాటచేత; పఱివోయిన=తీరిపోయిన; కొంకుతోడన్= సందేహంతో; బ్రాహ్మణున్= బ్రాహ్మణుని; కొని;= తీసికొని; కన్మఱుఁగు= కంటిచాటు; అగు= అయిన; ఎడకున్= చోటుకు; అరిగెన్= వెళ్ళింది; ఆ+తఱిన్= ఆ సమయంలో; సుదర్శనుండు= భర్త; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** సిగ్గుతో ముఖాన్ని వ్రాల్చటం ద్వారా ఆమె అంగీకారం తెలిపింది. జంకుమాని బ్రాహ్మణునితో రహస్య స్థలానికి వెళ్ళినంతలో భర్త వచ్చాడు.

**ఆ. వచ్చి, పర్ణశాలవాకిట నిల్చి, య । త్తన్విఁ బిల్చె; నతిథి దాని నల్ల**
**నూరకుండు మనియె; నువిదయు భూసుర । శాపభీతి నెలుఁగు సూపకుండె. 75**

**ప్రతిపదార్థం:** వచ్చి= సుదర్శనుడు అరుదెంచి; పర్ణశాల= పూరిల్లు; వాకిటన్= వాకిట్లో; నిల్చి= నిలబడి; ఆ తన్విన్= ఆ స్త్రీని; పిల్చెన్= పిలిచాడు; అతిథి; దానిని= ఓఘవతిని; అల్లన్ ఊరకుండుము+అనియెన్= మాట్లాడక ఉండుమని చెప్పాడు; ఉవిదయున్= ఆమెకూడా (స్త్రీ); భూసుర= బ్రాహ్మణుడియొక్క; శాపభీతిన్= శాప (శపిస్తాడేమోనన్న) భయంతో; ఎలుఁగు= గొంతును; చూపక= విప్పక, మాట్లాడక; ఉండెన్= ఉన్నది.

**తాత్పర్యం:** భర్త పర్ణశాల వాకిట్లోకి వచ్చి భార్యను పిలిచాడు. అతిథి ఆమెను మాట్లాడవద్దన్నాడు. ఆమెకూడా అతిథి శపిస్తాడేమోనన్న భయంతో మాట్లాడలేదు.

**విశేషం:** పై పద్యంలో బ్రాహ్మణశబ్దం వచ్చింది. ఓఘవతి క్షత్రియ సంతానం. వచ్చిన అతిథి ఎవ్వడో? కవి ముందుగా చెప్పలేదు. కనుక ఇవి వర్ణవాచకాలు కావు. ఒక ఆధ్యాత్మిక ధర్మాన్ని అవలంబించే మనస్తత్వం కలవాడు బ్రాహ్మణు డవాలి.

**సీ. పేర్కొని, పలుమాఱుఁ బలిచి, యో! యనుట లే । కున్న నయ్యింటిలోఁ గన్ను వఱపి,**

**వల్లభఁ గానక, వహ్నితనూజుండు । దలఁకొంది ప్రేముడి పలుకు వలుక,**

**నతని నుద్దేశించి యతిథి 'నాకాతిథ్య । మొనరించుచున్నది వనిత, నీవు**

**గృహధర్మవిధుఁడవు; కినియకుమయ్య మ' । మ్మనుడు, నప్పరమపుణ్యాత్మకుండు**

**తే. 'నీదుకతమున నేను సమ్మోదమగ్న । మానసుఁడ నైతి, నతిథులు మహితపూజ**

**నములు గాంచిన గృహములు విమల తరము । లండ్రు బుధు లింత యెఱుఁగుదు; నట్ల నడతు'. 76**

**ప్రతిపదార్థం:** వహ్నితనూజుండు= అగ్నికొడుకు; పేర్కొని= పేరున; పలుమాఱు= పెక్కుసార్లు; పిలిచి; ఓ యనుట= ఓహో యన్న సమాధానం; లేక+ఉన్నన్= లేకపోగా; ఆ+ఇంటిలోన్= ఆ ఇంటిలోపల; కన్నున్= నేత్రమును; పఱపి= ప్రసరింపచేసి; వల్లభన్= భార్యను; కానక= చూడక; తలఁకు+ఒంది= భయపడి; ప్రేముడిపలుకు= ప్రేమవాక్యం; పలుకన్= పలుకగా; అతిథి= ఇంటికి వచ్చినవాడు; అతనిన్= భర్తను; ఉద్దేశించి= గురించి; వనిత= (నీ భార్య) స్త్రీ; నాకు; ఆతిథ్యము+ఒనరించుచున్+ఉన్నది= ఆతిథ్యం చేస్తున్నది; నీవు; గృహధర్మవిదుఁడవు= గృహస్థధర్మం తెలిసినవాడవు; అయ్య= ఆర్యా!; మమ్మున్= మా ఇద్దరను; కినియకుము= కోపింపకుము; అనుడున్= అనగా; ఆ+పరమ= ఆ శ్రేష్ఠ; పుణ్య+ఆత్మకుండు= పుణ్యజీవి; నీదుకతమునన్= నీవలన; నేను= నేను; సమ్మోద= సంతోషంలో; మగ్న= మునిగిన; మానసుఁడన్+ఐతిన్= మనస్సు కలవాడనైనాను; బుధులు= పండితులు; అతిథులు= ఆతిథ్యంకొరకు వచ్చినవారు; మహిత= గొప్ప; పూజనములు= పూజలు; కాంచిన= పొందిన; గృహములు= ఇళ్ళు; విమలతరములు= నిర్మలములు; అండ్రు= అంటారు; ఇంత ఎఱుఁగుదున్= ఇంత మాత్రం నాకు తెలుసు; అట్లన్=అట్లాగే; నడతున్= నడచుకొంటాను.

**తాత్పర్యం:** అగ్ని కొడుకు ఆ విధంగా భార్యను పేరెత్తి ఎంత పిలిచినా పలుకకపోయేసరికి లోపలికి చూచి ప్రేమతో మాట్లాడేసరికి (భార్య నుద్దేశించి ప్రేమతో కొన్ని మాటలు అనేటప్పటికి) అతిథి ఇట్లా అన్నాడు; 'నీభార్య నాకు ఆతిథ్య మిస్తున్నది. నీవా ధర్మం తెలిసినవాడవు. కనుక మమ్మ కోపించవద్దయ్యా!' అని. ఆ మాటలు విన్న భర్త 'అట్లాగా! సంతోషం. ఎవరి ఇంట్లో అతిథులు కోరినది పొందుతారో ఆ ఇల్లే పవిత్రం. కనుక నీవన్నట్లే నడచుకుంటాను'.

**వ. అని పలికి వెండియు. 77**

**తాత్పర్యం:** ఆ విధంగా అని మరలా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'నావచనంబునట్టుల మనంబును; దీనికి సాక్షు లుర్వియుం,**

**బావకుఁడున్, జలంబును, నభంబును, వాయువుఁ, జంద్ర సూర్యులున్'**

**నావుడు మ్రోసె నాకసమునన్ విశదంబుగ దివ్యవాణి 'సం**

**భావితుఁ డీతఁ; డీ విభుని పల్కు నిజం' బని కౌరవేశ్వరా! 78**

**ప్రతిపదార్థం:** నా వచనంబునట్టుల= నా మాటలవలెనే; మనంబును= నా మనస్సుకూడా; దీనికిన్= ఇందుకు; సాక్షులు= చూచేవారు; ఉర్వియున్= భూమీ; పావకుఁడున్= అగ్నీ; జలంబును= నీళ్ళూ; నభంబున్= ఆకాశం; వాయువున్= గాలీ; చంద్రసూర్యులున్= చంద్రుడూ, సూర్యుడూ (నేనన్న దానికి సాక్షులు); నావుడున్= అనగా; కౌరవ+ఈశ్వరా!= ధర్మరాజా!; ఆకసమునన్= అంతరిక్షంలో; దివ్యవాణి= దేవతా వాక్కు (అదృశ్యవాక్కు); విశదంబుగన్= స్పష్టంగా; ఈతఁడు= ఇతడు; సంభావితుఁడు= సన్మానించదగినవాడు; ఈ విభునిపల్కు= ఈ రాజుమాట; నిజంబు+అని= నిజమేనని; మ్రోసెన్= విన్పించింది.

**తాత్పర్యం:** 'నా మాట ఎంతో మనస్సూ అంతే. దీనికి పంచభూతాలు అనగా నీరూ, నిప్పూ, ఆకాశం, భూమీ, గాలీ, సూర్యచంద్రులూ అంతా సాక్షులే'. అన్నంతనే ఆకాశంనుండి ధర్మరాజా! దివ్యవాణి ఇట్లా విన్పించిందయ్యా! స్పష్టంగా 'ఈ యజమాను డన్న మాట నిజం' అని.

**ఆ. అప్పు డతిథి ప్రీతి నతని సన్నిధి కేఁగు । దెంచి, దుర్నిరీక్ష్యతేజ మడర,**
**తనదుమూర్తి యధికతర సమున్నతిఁ బొలు । పెసఁగ నిల్చి, యతని కిట్టు లనియె. 79**

**ప్రతిపదార్థం:** అతిథి= ఆ యింటికి వచ్చినవాడు; అప్పుడు= భర్త ఆ విధంగా అన్న తర్వాత; ప్రీతిన్= సంతోషంతో; అతని సన్నిధికిన్= అతడి దగ్గరకు; ఏఁగుదెంచి= వచ్చి; దుర్‌నిరీక్ష్య= చూడటానికి వీలులేని; తేజము= కాంతి; అడరన్= వ్యాపించగా; తనదు= తనయొక్క; మూర్తి= రూపం; అధికతర= మిక్కిలి; సమ్+ఉన్నతిన్= గొప్పగా; పొలుపు ఎసఁగన్= అంద మెక్కువ కాగా; నిల్చి= ఎదుటగా నిలబడి; అతనికిన్= అతడితో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పు డతడి దగ్గరకు వచ్చి, చూడటానికి వీలు లేనంత కాంతితో శరీరం ప్రకాశించగా అతిథి అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** వచ్చిన అతిథి ధర్మదేవత కనుక దేవతా రూపాన్ని ధరించాడన్నమాట.

**సీ. 'ధర్మదేవత నేను; దగ నీదుచిత్తంబు । నారయ వచ్చితి ననఘ! నీవు**
**నిశ్చలవ్రతుఁడవు, నీప్రతిజ్ఞకు హాని గలిగినఁ । దెగఁజూడఁ దలఁచి, తిరుగు**
**వెనువెంట మృత్యువు, విను జయించితి దానిఁ । గామరోషాదివికారసహిత**
**ముగ నంతరంగంబు మున్ను గెల్చితి, భవ । త్సతియుఁ బవిత్ర, యస్ఖలితచరిత.**

**తే. యొడలితోడ నీకు నూర్ధ్వ లోకమునకు । నరుగవచ్చు నెప్పుడరుగు తలఁపు**
**దోఁచె నప్పు డిదియుఁ దోడిదయై ప్రీతి । నరుగుదెంచు' ననియెఁ గురువరేణ్య! 80**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= ధర్మరాజా!; ఏను= నేను; ధర్మదేవతన్= ధర్మమూర్తియైన దేవతను; అనఘ!= పాపంలేనివాడా!; తగన్= ఒప్పిదంగా; నీదుచిత్తంబు= నీ మనస్సు; అరయన్= చూడగా; వచ్చితిన్= వచ్చాను; నీవు నిశ్చలవ్రతుఁడవు= నీవు చెదరని వ్రతం కలవాడవు; నీ ప్రతిజ్ఞకున్= నీ శపథానికి; హాని= లోపం; కలిగినన్= కలిగితే; తెగన్+చూడన్+తలఁచి= చంపాలనుకొని; మృత్యువు= మృత్యుదేవత; వెనువెంటన్= నీ వెన్నును అంటుకొని; తిరుగున్= తిరుగుతున్నది; విను= వినుము; దానిన్= మృత్యువును; జయించితి(వి)= గెలిచావు;కామ= కామం; రోషం= కోపం; ఆది= మొదలైన (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు ఆరుగురు అంతశ్శత్రువులు); వికార సహితముగన్= దోషాలతోపాటు (వికారం=

సహజతకు విరుద్ధమైన కదలిక); అంతరంగంబు= మనస్సు; మున్న= ముందే; గెల్చితి(వి)= జయించితివి; భవత్= నీ; సతియున్= భార్యయు; పవిత్ర= పావనురాలు; అస్ఖలిత= (ధర్మమునుండి) చలించని; చరిత= నడవడి కలది; నీకున్= నీకు; ఎప్పుడు= ఏ సమయంలో; ఒడలితోడన్= శరీరంతో; ఊర్ధ్వలోకమునకున్= పై లోకానికి; అరుగుతలఁపు= వెళ్ళాలన్న ఆలోచన; తోఁచెన్= కలిగిందో; అప్పుడు= ఆ వేళ; ఇదియున్= ఈ భార్యకూడా; తోడిద+ఐ=నీతో కూడినదై; ప్రీతిన్= సంతోషంతో; అరుగుదెంచున్= వస్తుంది.

**తాత్పర్యం:** 'నేను ధర్మదేవతను. నీ వ్రతాన్ని పరీక్షించటానికి వచ్చాను. నీ ప్రతినకు ఎప్పుడు లోపం కలుగుతుందో అప్పుడు నిన్ను చంపుదామని మృత్యువు నీ వెన్నంటే తిరుగుతున్నది. దానిని జయించావు. కామక్రోధాది షట్ శత్రువులున్న మనస్సును పూర్వమే జయించావు. నీ భార్యకూడా నీవంటిదే. గొప్ప ధర్మచరిత్ర కలది. నీ కెప్పుడు పైలోకాలకు పోవా లనిపిస్తుందో అప్పుడు నీ భార్యతో పాటుగా సశరీరంగా పోవచ్చు' నని ఆ దేవత వరమిచ్చింది ధర్మరాజా!'

**విశేషం:** దేవత అంటే మూలభావం. ప్రతిభావానికీ ఒక మూలరూప ముండాలి. చెట్టుకు గింజవలె. దాని పేరు దేవత. (ధర్మస్వరూపం) అది రూపధారణం కూడా చేయగలదు. ఇది వేదకాలం నాటి భావన.

**వ. అని వెండియు.** **81**

**తాత్పర్యం :** ఆ విధంగా చెప్పి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. నరవర! పొల్చు నోఘవతి నా నదియై, జనపావనాకృతిం**
**బరమతపంబులోని, సగపాలను నియ్యమ యున్న సామునన్**
**వెరవునఁ దొంటిమై నిలిచి నీకుఁ దగం బరిచర్య సేయు; ని**
**చ్చరితము మీకు నిర్మలయశంబు నొనర్చుట కే నొనర్చితిన్'.** **82**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా! (సుదర్శనుడు); ఇయ్యమ= ఈ+అమ= ఈమె; పరమ తపంబులోని= గొప్ప తపస్సులో; సగపాలను= అర్ధభాగంతో; ఓఘవతినాన్= ఓఘవతిఅన్నపేరుతో; నది+ఐ= ఏరై; జనపావన= మనుష్యులను పవిత్రం చేసే; ఆకృతిన్= రూపంతో; ఉన్న= ఉన్నట్టి; సామునన్= సగంలో; వెరవునన్= ఉపాయంతో; తొంటిమైన్= పూర్వదేహంతో; నిలిచి= ఉండి; నీకున్= నీకు; తగన్= తగునట్లుగా; పరిచర్య= సేవ; చేయున్= చేస్తుంది; ఈ+చరితము= ఈ చరిత్ర; మీకున్; నిర్మల యశంబు= స్వచ్ఛమైన కీర్తి; ఒనర్చుటకున్= ఒడగూర్చి పెట్టటానికి; ఏను= నేను; ఒనర్చితిన్= చేశాను.

**తాత్పర్యం:** మీ తపస్సులోని సగభాగంతో నీ భార్య ఓఘవతి అనే పేరుగల ఏరై మానవజాతిని పూతం చేస్తూ ప్రవహిస్తుంది. మిగిలిన తపశ్శక్తితో పూర్వం వలెనే నీకు పరిచర్యలు చేస్తూ ఉంటుంది. ఈ కథంతా నేనే మీకు కీర్తి కల్గించటం కొరకు, మీ కొరకే కల్పించాను'.

**విశేషం:** ఈ కథ నర్మదానదీ సంతానం కథ కనుక - దానితోనే ప్రారంభమై ఆ వంశంలోని మరొక స్త్రీ నదిగా ప్రవహించటంతో ముగిసింది. ఈ విధంగా కథ మొదలూ చివరా ఒకే రకంగా ఉండేటట్లు నిర్మించటం కథ చెప్పటంలో ఒక అందం.

**వ. అని చెప్పి ధర్ముండు ధవళహయసహస్రంబుపూనిన మాననీయ రథంబునం జనియె నోఘవతి యద్దేవుని చెప్పినట్ల వర్తిల్లె; సుదర్శనుండును బరమసంతోష భరితుండయ్యెఁ; బాండవాగ్రజా! నీ మనంబున నెక్కొలుపు మిక్కథయభిప్రాయంబు. 83**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఆ విధంగా చెప్పి; ధర్ముండు= ధర్మదేవత; ధవళ= తెల్లని; హయ= గుర్రాల, సహస్రంబు= వేయి; పూనిన= కట్టిన; మాననీయ= గౌరవించదగిన, (మహత్తరమైన); రథంబునన్= రథంమీద; చనియెన్= వెళ్ళాడు; ఓఘవతి= ఆ గృహిణి; ఆ+దేవునిచెప్పినట్ల= ఆ దేవుడు చెప్పినట్లుగానే; వర్తిల్లెన్= నడుచుకొన్నది; సుదర్శనుండు= రాజు; పరమ= గొప్ప; సంతోష= సంతోషంతో; భరితుండు= నిండినవాడు; అయ్యెన్= అయ్యాడు; పాండవ+అగ్రజా!= ధర్మరాజా! (పాండవులలో పెద్దవాడా!); నీ మనంబునన్= నీ మనస్సులో; ఇక్కథ= ఈ కథయొక్క; అభిప్రాయంబు= సారాంశమును; నెక్కొలుపుము= భావించుము, నిలుపుకొమ్ము.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి ధర్మదేవత వేయిగుర్రాలు కట్టిన రథంమీదెక్కి వెళ్ళిపోయాడు. తర్వాత ఓఘవతి కూడా ఆ దేవుడు చెప్పినట్లుగా ప్రవర్తించింది. (సగం తపస్సుతో నదిగా లోకాన్ని పావనం చేయటం, సగం తపస్సుతో భర్తను సేవించటం) ఆమె భర్త కూడా సంతోషభరితుడైనాడు. నాయనా! ధర్మరాజా! ఈ కథాసారాంశాన్ని మనస్సున నిలుపుకొమ్ము.

**ఆ. అతిథిపూజఁ గడచినట్టి ధర్మువు గృహ । స్థులకు నొండు లేమిఁ దెలుపుచున్న
యది; సమస్త కిల్బిషాపహ మీ యితి । హాస; మిచ్చు నెల్లయభిమతములు'. 84**

**ప్రతిపదార్థం:** గృహస్థులకున్= గృహస్థాశ్రమాన్ని స్వీకరించినవారికి; అతిథిపూజన్= ఆతిథ్యమన్న పూజను; కడచినట్టి= మించిన; ధర్మువు= ధర్మం; ఒండు= మరొకటి; లేమిన్= లేకపోవటాన్ని; ఈ+ఇతిహాసము= ప్రాచీనకథ; తెలుపుచున్న+అది= తెలుపుతున్నది, సమస్త, కిల్బిష+అపహము= పాపాలన్నిటినీ పోగొట్టేది; ఎల్ల= సమస్త; అభిమతములు= కోర్కెలను; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** గృహస్థులకు అతిథిపూజకంటె గొప్ప ధర్మం లేదని ఈ పవిత్రమైన ప్రాచీనకథ చెప్తుతున్నది. ఇది సమస్త పాపాలను పోగొట్టి కావలసిన కోర్కెలను తీరుస్తుంది.

**విశేషం:** ఈ మాటలు భీష్ముడివి. ధర్మరాజు ప్రశ్న కీ కథ సమాధానంగా చెప్పబడింది కనుక వక్త తన సమాధానాన్ని ముగిస్తూ చివరిమాటగా అన్నాడు.

ఆశ్రమాలు 4. 1.బ్రహ్మచర్య, 2.గృహస్థ, 3.వానప్రస్థ, 4.సన్న్యాస ఆశ్రమాలు. నరుడికి నాల్గంచెలు (అంశలు) అని ఒక సామెత. ఈ నాల్గాశ్రమాలే మనిషి 100 ఏళ్ళ పూర్ణజీవితానికివి నాల్గు మెట్లు. మొదటిది విద్యార్థి దశ. గురువు దగ్గరుండి ఇహలోక పరలోక జీవితాలకు సంబంధించిన విద్య (తెలిసికొనదగినది కనుక విద్య) నభ్యసించిన తర్వాత గృహస్థు అవుతున్నాడు మనిషి. ఇక్కడ తాను, భార్య, సంఘం మూడు విషయాలకు ముడి ఉన్నది. మొదటి రెండు కుటుంబం. ఇదే ప్రాచీనకాల సంఘానికి పునాది కనుక సంతానానికి శిక్షణాలయం గృహమే. తానూ ఉన్నాడు; సంఘంతో సంబంధమూ ఉన్నది. దీనికి సూచనమే అతిథి మర్యాదలివన్నీ. మూడవ దశలో సంఘాన్ని వదలి భార్యా తానూ వనవాసం, ఆశ్రమజీవితం జీవిస్తాడు. చివరిది సన్న్యాసం. తానొక్కడే మరలా వచ్చిన చోటికి పోయే మార్గం. దీనితో నూరేళ్ళ జీవితం గట్టెక్కింది. ఇది సంపూర్ణజీవితం. ప్రాచీన ఇతిహాసాలు భారతం - రామాయణం ఈ పూర్ణ మానవ జీవితాన్ని చెప్పినందువలననే మనకు పవిత్రగ్రంథాలై

మానవాళికి మార్గదర్శకాలుగా మిగిలిపోయాయి. ఈ నాల్గింటిలో గృహస్థధర్మాన్ని చెప్పిన కథ ఇది. మనిషికి తాను సంపాదించిన దానిమీద ఒక హక్కు, మమకారం ఉంటాయి. ఈ విషయాలలో ముఖ్యమైన వ్యక్తి భార్య. ఆమె ఉన్న స్వత్వాన్ని కూడా దానం చేయటం - పరులకు ఇవ్వటం ధనాదులవలె - ఈ త్యాగం చాలా గొప్పదని ఈ కథ చెప్తున్నది. పురుషునకు భార్యకంటె ప్రియమైన దేమీ లేదు. కనుకనే వానప్రస్థంలో ఆమె తనకు తోడుగానే వస్తున్నది. మను వన్నాడు 'స్త్రీ పూజింపబడ్డ చోట దేవత లానందిస్తున్నారు. ఆమె పురుషునకు జీవనసముద్రం దాటే నౌక' అని. కనుకనే ఆమె లేకుండా ఏ కర్మా చేయటానికి వీలులేదన్నారు. అయితే ధర్మదేవత ఆమెను, అతడిని పరీక్షించాడే తప్ప ఆమె శీలాన్ని అపహరించలేదని కథలో చెప్పబడింది. ఈ ధర్మాన్ని - సర్వాన్ని త్యజించే బుద్ధి - ఇతరులకు దానం చేయటం - నీవూ అలవరచుకొమ్ము అన్నది భారతం - నీవు అంటే ప్రతి పాఠకుడున్నూ.

**క. అనినఁ బితామహుతో న । జ్జనపతి 'బ్రాహ్మణ్య మవులజాతులు మూఁటన్**
**జనియించినవానికి దొర । కొనునొకొ? యతివిమలకర్మ గుణయోగమునన్'. 85**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+జనపతి= ఆ రాజు (జనులకు పాలకుడు); పితామహుతోన్= తాతతో; అవులజాతులు= బ్రాహ్మణుడు కాక మిగిలిన జాతులు; మూఁటన్= మూడిటిలో; జనియించిన= పుట్టిన; వానికిన్= వాడికి; బ్రాహ్మణ్యము= బ్రాహ్మణత్వం; అతివిమల కర్మగుణ యోగమునన్= మిక్కిలి నిర్మలమైన కర్మములయొక్కయు గుణములయొక్కయు కూడికచేత; దొరకొనునొకొ?= సంభవిస్తుందా?

**తాత్పర్యం:** ఆ విధంగా తాత చెప్పగా ధర్మరాజిట్లా అన్నాడు. 'బ్రాహ్మణేతరమైన మూడు వర్ణాలవారికీ గుణకర్మలతో బ్రాహ్మణత్వం సంభవిస్తుందా?'

**విశేషం:** గీత చెప్తున్నది - "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" - అని త్రిగుణాల విభాగం చేత కర్మల విభాగం చేత నాల్గువర్ణాలను నేనే సృజించాను. కర్మలు= వేదం చెప్పిన విధులు, మనిషి తప్పక చేయవలసినవి.

**వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 86**

**తాత్పర్యం:** అని అడుగగా భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తే. 'బ్రాహ్మణత్వంబు గడుదుర్లభం; బనేక । జన్మములఁ బొంది తిరుగంగ సంభవించి**
**నపుడు గనునది; యున్నతమైన యప్ప । దంబు విను మెఱిఁగించెద దాని తెఱఁగు. 87**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణత్వంబు= బ్రాహ్మణపదం, స్థితి; కడున్= మిక్కిలి; దుర్లభంబు= లభించటం కష్టం; అనేక= చాలా; జన్మములన్= పుట్టుకలను; పొంది= పడసి; తిరుగంగన్= మరలా; సంభవించినపుడు= పుట్టినపుడు; ఉన్నతము+ఐన= గొప్పదైన, మహత్తరమైన; ఆ+పదంబు= ఆ స్థితి; కనునది= పొందదగినది; దాని తెఱఁగు= దాని విషయం; ఎఱిఁగించెదన్= చెప్తాను; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణుడుగా పుట్టటం చాలా కష్టం. ఎన్నో ఎన్నో జన్మలు ఎత్తితే తప్ప ఆ జన్మ సంభవించదు. దాని సంగతి చెప్తాను వినుము.

## ఇంద్రమతంగసంవాదం బను నితిహాస ప్రకారము (సం. 13-3-8)

**వ. అది యింద్రమతంగ సంవాదం బను నితిహాసం బాకర్ణించిన నెఱుంగ నగుం గావున నక్కథ యుపన్యసించెద; నొక్క విప్రుని కొడుకు మతంగుం డనువాఁడు యజ్ఞార్థంబైన పనికిం దండ్రిపనుపునం బోయి. 88**

**ప్రతిపదార్థం:** అది= ఆ సంగతి; ఇంద్ర, మతంగ సంవాదంబు+అను= ఇంద్రుడికీ, మతంగుడికీ మధ్య జరిగిన సంభాషణం అనే పేరుగల; ఇతిహాసంబు= పూర్వకథను; ఆకర్ణించినన్= వింటే; ఎఱుంగన్+అగున్= తెలియవచ్చును; కావునన్=కాబట్టి; ఆ+కథ; ఉపన్యసించెదన్= చెప్పుతాను; ఒక్క విప్రుని కొడుకు= ఒక బ్రాహ్మణుడి కుమారుడు; మతంగుండు+అనువాఁడు= మతంగుడు అనే పేరుకలవాడు; యజ్ఞ+అర్థంబు+ఐన పనికిన్= యజ్ఞం కొరకైన పనిమీద; తండ్రిపనుపునన్= తండ్రి ఆజ్ఞతో; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** ఆ సంగతి ఇంద్రమతంగ సంవాదం అనే ఇతిహాసం వింటే స్పష్టం అవుతుంది. కాబట్టి ఆ కథ వినిపిస్తాను. మతంగుడు అనే పేరుగల ఒక బ్రాహ్మణపుత్రుడు తండ్రి పంపగా ఒక యజ్ఞం కొరకు పోయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మదమునఁ బెలుచన యొకగా । డిద కొదమం గోల గొని యడిచె, నడిచిన నొ**
**వ్వొదవి, తనతల్లిఁ జేరఁగ । నది సని, నన్నీతఁ డడిచె నని చెప్పుటయున్. 89**

**ప్రతిపదార్థం:** మదమునన్= మదంతో; పెలుచన= అధికంగా, గట్టిగా; ఒక గాడిదకొదమన్= ఒక గాడిద పిల్లను; కోలకొని= కర్ర తీసికొని; అడిచెన్= కొట్టాడు; అడిచినన్= కొట్టగా; అది= ఆ కొదమ; నొవ్వు= బాధ; ఒదవి= కలిగి; తనతల్లిన్= తనయొక్క తల్లిని; చేరఁగన్ చని= సమీపించి; నన్నున్= నన్ను; ఈతఁడు=వీడు; అడిచెన్= కొట్టాడు; అని చెప్పుటయున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** వాడు దారిన పోతూ పోతూ ఒక గాడిదపిల్లను కర్రతో గట్టిగా కొట్టగా అది బాధతో తల్లి దగ్గరకు పోయి ఆ సంగతి చెప్పగా. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. ఆ గార్దభి తన కొదమతో 'వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గాకుండునే?' యనినం, బూర్వజన్మకర్మ విశేషంబునం దిర్యగ్జాతి భాషావిదుండగుట నవ్విప్రపుత్త్రుం డప్పల్కులు విని, 'యిది దూషణ భాషణంబు గాదు; నిరూపణాలాపంబై యున్నది; యట్లు గావున మాలతనంబు గలుగనేర్చు'నని నిశ్చయించి యగ్గాడిద కడకుం బోయి. 90**

**ప్రతిపదార్థం:** ఆ గార్దభి= ఆ ఆడగాడిద; తన కొదమతోన్= తన పిల్లతో; వీడు చండాలుండు= వీడు క్రూరజన్మకలవాడు; ప్రచండ= భయంకరమైన; స్వభావుండు= స్వభావం కలవాడు; కాకుండునే!= కాకుండా ఎట్లా పోతాడు? (తప్పక వాడే); అనినన్= అనగా; పూర్వజన్మ కర్మ విశేషంబునన్= పూర్వజన్మలో చేసిన పనుల విశేషంతో; ఆ+విప్రపుత్రుండు= ఆ బ్రాహ్మణకుమారుడు; తిర్యక్‌జాతి= పశుపక్షిజాతి; భాషావిదుండు= భాష తెలిసినవాడు; అగుటన్= కావటంచేత; ఆ+పల్కులు= ఆ మాటలు; విని; ఇది దూషణభాషణంబు కాదు= ఇది తిట్టుకాదు; నిరూపణ= (నా జన్మవిశేషాన్ని గుర్తించి) వ్రేలెత్తి చూపే; ఆలాపంబు+ఐ= సంభాషణ; యై ఉన్నది; అట్లు కావునన్= కాబట్టి; మాలతనంబు= చండాలస్వభావం; కలుగనేర్చున్= కలుగవచ్చును; అని నిశ్చయించి= అని భావించి; ఆ+గాడిదకడకున్= ఆ గాడిద దగ్గరకు; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** ఆ తల్లిగాడిద పిల్లగాడిదతో ఇట్లా అన్నది. 'వీడు చండాలుడు, క్రూరస్వభావుడు కనుకనే ఇట్లా చేశాడు' అని. అది విని ఆ బ్రాహ్మణబాలుడు పూర్వజన్మలో చేసికొన్న పుణ్యకర్మల ప్రభావంచేత పశు పక్ష్యాదుల భాషలు తెలిసినవాడుకావటంవలన 'ఈ గాడిద మాట నన్ను గూర్చిన నిందావచనం కాదు. నా జన్మవిశేషం తెలిసి అన్నట్లున్న' దని ఆ గాడిద దగ్గరకు పోయి. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** ప్రతిజీవికీ ప్రత్యేక భాష ఉన్నది. చెట్టు, పిట్ట, జంతువూ అన్నీ సంభాషించేవే. అక్కడ మన భాషవలె అక్షరరూపమైనది కాకపోవచ్చును కాక సంజ్ఞకూడా భాషే. పూర్వకాలం మనిషి ప్రకృతిమధ్య, చెట్లు జంతువుల మధ్య ఎక్కువ జీవించినవాడు కావటం వలన వాడి కా భాష తెలుసు. పశు సంజ్ఞలు రైతుకు తెలుసు. తేనెటీగలు పెంచేవారికి వాటి భాష తెలుసునని చాలామంది వ్రాశారు. కనుక ఇది సంభవమే.

**క. తనకుం జండాలత వ । చ్చిన కారణ మడిగి, దానిచేతం గంద**
**ర్పుని చెయిది మంగలికి నిజ । జననికిఁ బొందగుట విని విషాదముతోడన్. 91**

**ప్రతిపదార్థం:** తనకున్= తనకు; చండాలత= చండాల జన్మ; వచ్చిన= కలిగిన; కారణము= హేతువు; అడిగి= అడిగి; దానిచేతన్= గాడిదవలన; నిజజననికిన్= తన తల్లికీ; మంగలికిన్= మంగలివాడికీ; కందర్పుని= మన్మథుడి; చెయిదిన్= చేష్టవలన; పొందు= సంభోగం; అగుట విని= కావటం తెలిసికొని; విషాదముతోడన్= దుఃఖంతో.

**తాత్పర్యం:** 'మన్మథుడి ప్రేరణవలన తన తల్లి మంగలితో సంగమిస్తే తాను పుట్టినట్లు ఆ గాడిదవలన విని దుః ఖంతో (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. తనపోయెడు పనికిం బోవక, మరలి సదనంబునకుం జని, జనకున కత్తెఱం గెల్ల నెఱింగించి, యతనితో 'శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు చండాలుం డగుటకు సందియం బేమి? గార్దభి శాపజాత గానోపు నది యున్నరూపపలికె; బ్రాహ్మణ్యంబు దపంబున సంపాదించెదం గాక' యని పల్కి, వీడ్కొని వనంబునకుం బోయి. 92**

**ప్రతిపదార్థం:** తన పోయెడు పనికిన్= తానుపోతున్న పనికి; పోవక= పోకుండా; మరలి= వెనుకకు తిరిగి; సదనంబునకున్= ఇంటికి; చని= పోయి; జనకునకున్= తండ్రికి; ఆ+తెఱంగు= ఆ విషయం; ఎల్లన్= అంతా; ఎఱింగించి= చెప్పి; అతనితోన్= తండ్రితో; శూద్రబీజంబునన్= శూద్రుని బీజంతో; బ్రాహ్మణియందున్= బ్రాహ్మణస్త్రీకి; జన్మించినవాఁడు= పుట్టినవాడు; చండాలుండు+అగుటకున్= చండాలుడు కావటానికి; సందియంబు= సందేహం; ఏమి?= ఏమున్నది?; గార్దభి= ఆ ఆడగాడిద; శాపజాత= శాపంవలన (అట్లా) పుట్టింది; కానోపున్= కాబోలు; ఉన్నరూప= ఉన్నమాట; పలికెన్= అన్నది; బ్రాహ్మణ్యంబు= బ్రాహ్మణత్వం; తపంబునన్= తపస్సు చేతనే; సంపాదించెదన్ కాక= పొందుతాను సుమా!; అని; వీడ్కొని= తండ్రిని వదలి; వనంబునకున్= అడవికి; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** యజ్ఞం పనిమీద పోతున్నాడుకదా! అది వదలి ఇంటికి తిరిగిపోయి ఆ గాడిద చెప్పినదంతా తండ్రికి చెప్పి, 'నా జన్మ బ్రాహ్మణ బీజానికి కలిగింది కాదు కనుక ఆ బ్రాహ్మణత్వం తపస్సుచేత సాధిస్తా' నని పలికి తండ్రిని వదలిపెట్టి అడవికి పోయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పరమ తపమాచరింపఁగ । సురపతి వొడచూపి యడుగు సువ్రత! నీకున్**

**వర మిచ్చెద' ననిన; 'ధరా । మరత్వ మి' మ్మనియె; నతఁడు మది ముద మొదవన్. 93**

**ప్రతిపదార్థం:** పరమ= గొప్ప; తపము= తపస్సు; ఆచరింపఁగన్= చేయగా; సురపతి= దేవతలరాజు, ఇంద్రుడు; పొడచూపి= కన్పించి (పొడ-నీడ-తనపొడ గిట్టదని సామెత); సువ్రత!=మంచి తపస్సు చేసినవాడా!; నీకున్; వరము+ఇచ్చెదన్= వరమిస్తాను; అడుగు; అనినన్= అనగా; అతఁడు= వాడు; మదిన్= మనస్సులో; ముదము= సంతోషం; ఒదవన్= కలుగగా; ధరా+ అమరత్వము= భూమిపై దేవతాత్వము - భూదేవత అంటే బ్రాహ్మణుడు కనుక బ్రాహ్మణత్వమని భావం; ఇమ్ము= ఇవ్వు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** గొప్ప తపస్సు చేయగా ఇంద్రుడు ప్రత్యక్షమై 'సువ్రతా! నీకేమి వరం కావాలో కోరుకొమ్ము' అని అడుగగా అతడు సంతోషంతో 'నాకు బ్రాహ్మణత్వ మి' మ్మన్నాడు.

**చ. అనవుడు 'బ్రాహ్మణత్వము మహత్త్వ మెఱుంగవ? యన్యజాతి కం**

**దునె యది? యొండు వేఁడు; మది దోఁచిన మే' లనియెన్ బలారి; వాఁ**

**'డనితరసాధ్య మైన తప మస్ఖలితంబుగఁ జేయుచుండెదం;**

**జనుము మహాత్మ! నీ' వనిన, సస్మితుఁడై యతఁ డేఁగె; నేఁగినన్. 94**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; బల+అరి= బలుడన్న రాక్షసుడిని చంపినవాడు - ఇంద్రుడు; బ్రాహ్మణత్వము మహత్త్వము= బ్రాహ్మణస్థితి గొప్పతనం; ఎఱుంగవె?= తెలియవా?, అన్యజాతికిన్= మరొకవర్ణంలో పుట్టినవాడికి; అది= ఆ బ్రాహ్మణ్యం; అందునె?= అందుతుందా? (అందదు); ఒండు= మరొకవరం; వేడుము= కోరుకొమ్ము; అది= మరొక కోరిక; తోఁచినన్= తోస్తే; మేలు= మంచిది ( నీ మనస్సులో మరొక కోరిక తోస్తే అది చెప్పుము మంచిది); అనియెన్= అన్నాడు; వాఁడు= మతంగుడు; మహాత్మ!= (దేవతలకు రాజువైన) స్వామీ!; అనితర సాధ్యము+ఐన= ఇతరులకు సాధ్యం కాని; తపము= తపస్సు; చేయుచున్= చేస్తూ; ఉండెదన్= ఉంటాను; నీవు; చనుము= వెళ్ళుము; అనినన్= అంటే; అతఁడు= ఇంద్రుడు; స+స్మితుఁడు+ఐ= నవ్వుతో కూడినవాడై; ఏఁగెన్= వెళ్ళాడు; ఏఁగినన్= అట్లా వెళ్ళగా.

**తాత్పర్యం:** మతంగు డట్లా చెప్పగా ఇంద్రుడు ఇట్లా అన్నాడు. 'బ్రాహ్మణత్వం ఇతర జాతులకందేది కాదు. మరొకవరం కోరుకొమ్ము' అని.కాని అతడు 'మహాత్మా! నీవు వెళ్ళుము. నా కోరిక ఫలించేంతవరకు నే నిట్లా ఇతరులకు సాధ్యం కాని తపస్సు చేస్తూనే ఉంటాను' అని చెప్పగా అతడు వెళ్ళిపోగా. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** బ్రాహ్మణత్వ మన్నది పుట్టగానే ఎవరికీ దక్కేది కాదు. అది తపస్సుచేత సాధ్య మన్నమాట.

**వ. మతంగుం డేకపాదంబున నూఱేండ్లు తపంబు సేసిన నింద్రుండు గ్రమ్మఱ వచ్చి. 95**

**ప్రతిపదార్థం:** మతంగుండు= చండాలుడు (క్రూరకర్మలు చేసేవాడు); ఏకపాదంబునన్= ఒకేపాదంమీద (నిలిచి); నూఱు+ఏండ్లు= నూరు సంవత్సరాలు; తపంబు= తపస్సు; చేసినన్= చేయగా; క్రమ్మఱన్= మళ్ళీ; ఇంద్రుండు వచ్చి.

**తాత్పర్యం:** మతంగుడు ఒంటికాలి మీద నిలిచి నూరేళ్ళు తపస్సు చేయగా మళ్ళీ ఇంద్రుడు ప్రత్యక్షమై.

**తే. 'ఏను వలదని చెప్పిన మాన వెట్లు? । పరమదుర్లభ పద మాసపడి, కరంబు**
**మేలితప మాచరించి చండాలు డిట్టి । దాన నశియించు; నిది నీకుఁ దగదు, విడువు. 96**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వలదు= వద్దు; అని చెప్పినన్= అని చెప్పినప్పటికీ; మానవు= వదలవు; ఎట్లు?= ఎట్లాగా?; పరమ= మిక్కిలి; దుర్లభ= లభించని; పదము= స్థితి; ఆసపడి= కోరి; కరంబు= మిక్కిలి; మేలితపము= గొప్ప తపస్సు; చండాలుఁడు= మతంగుడు; ఆచరించి= చేస్తే; ఇట్టిదానన్= ఇట్లాంటి దానివలన; నశియించున్= నశిస్తాడు; ఇది నీకున్= ఇది నీకు; తగదు= మంచిదికాదు.

**తాత్పర్యం:** 'నేను వద్దని చెప్పినా నీవు వినకుండా ఉన్నావు. చండాలుడు ఇట్లాంటి తపస్సు చేస్తే చస్తాడు తప్ప మేలు పొందడు. కాబట్టి నీకు ఈ తపస్సు తగదు.

**వ. విను మిత్తెఱంగుతపంబునకుఁ బదిమడుంగులు సేసి చండాలుండు శూద్రుండగు; నూఱుమడుంగు లనుష్ఠించి శూద్రుండు వైశ్యుండగు; వేయిమడుంగు లాచరించి వైశ్యుండు క్షత్రియుం డగు; నప్పుణ్యాచరణంబునకుఁ బదివేలు మడుంగులు నిర్వర్తించి క్షత్రియుండు దుర్బ్రాహ్మణుం డగు; నా నియమంబునకు లక్షమడుంగులు సల్పి శమదమ సత్యాహింసల సమాత్సర్యంబున నార్య బ్రాహ్మణహృదయంబులు సదయంబులు గావించి దుర్బ్రాహ్మణుండు సద్బ్రాహ్మణుం డగు; నిట్లు బ్రాహ్మణ్యం బలఁతులం బడయవచ్చునే; పడసియు, నది సెడకుండ నడప శక్యంబగునే? యనేక జన్మంబుల నొకప్పుడు బ్రాహ్మణజన్మంబు నొందియుం గొందఱు ధనవాంఛా విషయ లౌల్యాదులం దదాచారంబు దిగవిడిచి చెడుదు; రిట్టి మహాపదంబు గోరి నిన్ను నీవ యేల వినాశంబు నొందించుకొనియెద? వీ తపోనిష్ఠ సాలించి, తగునది యొక్క వరంబు వేడు' మనియె, ననిన వాఁడూరకున్న నాఖండలుం డరిగె; వెండియు. 97**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఈ తెఱంగు తపంబునకున్= ఇటువంటి తపస్సునకు; పదిమడుంగులు= పదిరెట్లు; చేసి= ఆచరించి; చండాలుండు= కడజాతివాడు; శూద్రుండు= నాలుగవజాతివాడు; అగున్= అవుతాడు; నూఱు మడుంగులు= వందరెట్లు; అనుష్ఠించి= శ్రద్ధతో చేసి; శూద్రుండు= శూద్రుడు; వైశ్యుండు= మూడవవర్గంవాడు; అగున్= అవుతాడు; వేయి మడుంగులు= వేయిరెట్లు; ఆచరించి= చేసి; వైశ్యుండు= వైశ్యవర్ణంవాడు; క్షత్రియుండు= క్షత్రియవర్ణంవాడు; అగున్= అవుతాడు; ఆ+పుణ్య+ఆచరణంబునకున్= ఆ పుణ్యమైన పనికి; పదివేలు మడుంగులు= పదివేలరెట్లు; నిర్వర్తించి= చక్కగా ఆచరించి; క్షత్రియుండు= రెండవవర్ణంవాడు; దుర్బ్రాహ్మణుండు= చెడ్డబాపడు; అగున్= అవుతాడు; ఆ నియమంబునకున్= అటువంటి నిష్ఠకు; లక్షమడుంగులు= లక్ష రెట్లు; చల్పి= చేసి; శమ, దమ, సత్య+అహింసలన్= లోపలియింద్రియాలను కట్టడి చేయటం, వెలుపలి ఇంద్రియాలను జారిపోనీకుండటం, అబద్ధాలాడకపోవటం, ఎవరికీ దేనికీ బాధ కలిగించకుండటం అనేవాని చేతనూ, అమాత్సర్యంబునన్= ఇతరుల మేలును చూడలేకపోవటం అనే స్వభావం లేకపోవటం చేతనూ; ఆర్య, బ్రాహ్మణ హృదయంబులు= ఉత్తమ స్వభావం కల బ్రాహ్మణుల హృదయాలను; సదయంబులు= రక్షించాలి అనేభావన కలవిగా; కావించి= చేసి; దుర్బ్రాహ్మణుండు= పుట్టుకచేత మాత్రమే బ్రాహ్మణుడైనవాడు; సత్+బ్రాహ్మణుండు= ఉత్తముడైన విప్రుడుగా; అగున్= అవుతాడు; ఇట్లు= ఈ విధంగా; బ్రాహ్మణ్యంబు= బ్రాహ్మణుడు కావటం; అలఁతులన్= తక్కువతీరు కర్మలచేత; పడయన్+వచ్చునే= పొందనగునా? పడసియున్= పొందికూడా; అది= ఆ బాపనితనం; చెడక+ఉండన్= చెడిపోకుండా; నడపన్= ప్రవర్తింపజేయటం; శక్యంబు+అగునే= సాధ్యం అవుతుందా? అనేక జన్మంబులన్= పెక్కు పుట్టుకల తరువాత;

ఒక+అప్పుడు= ఒకపుట్టుకలో; బ్రాహ్మణజన్మంబున్= బ్రాహ్మణుడుగా పుట్టటం; ఒందియున్= పొందికూడా; కొందఱు= కొంతమంది; ధనవాంఛా విషయ తౌల్య+ఆదులన్= ధనం మీది కోరిక, ఇంద్రియాలకు సంబంధించిన శబ్దముమొదలైనవాని యందలి చపలత్వం మొదలైనవానిచేత, తత్+ఆచారంబున్= ఆ బ్రాహ్మణుని నడవడిని; దిగన్+విడిచి= పూర్తిగా వదలివైచి; చెడుదురు= పాడైపోతారు; ఇట్టి మహా పదంబున్= ఇటు వంటి గొప్పస్థితిని; కోరి= కాంక్షించి; నిన్నున్= నిన్ను; నీవు+అ= నీవే; ఏల= ఎందుకు; వినాశంబున్= పాడగుటను; ఒందించుకొనియెదవు= చేసుకుంటావు; ఈ తపస్+నిష్ఠన్= ఈ తపస్సునందలి మిక్కిలిశ్రద్ధను; చాలించి= ఆపివేసి; తగు+అది= యోగ్యమైనదైన; ఒక్క వరంబున్= ఒక్కవరాన్ని; వేడుము= కోరుకో; అనియెన్= అన్నాడు; అనినన్= అట్లు పలికినా; వాఁడు= ఆ చండాలుడు; ఊరక+ఉన్నన్= బదులు చెప్పక ఉంటే; ఆఖండలుండు= దేవేంద్రుడు; అరిగెన్= వెళ్లి పోయాడు; వెండియున్= తరువాత.

**తాత్పర్యం:** ఇటువంటి తపస్సునకు పదిరెట్లు తపస్సు చేసి చండాలుడు శూద్రుడౌతాడు. అతడు వందరెట్లు తపస్సు చేస్తే కాని వైశ్యుడు కాడు. అతడు వేయిరెట్లు చేస్తే క్షత్రియుడౌతాడు. అతడు పదివేల రెట్లు చేస్తే దుర్బ్రాహ్మణుడు ఔతాడు. అతడు లక్షరెట్లు చేస్తే కాని బ్రాహ్మణుడు కాడు. కనుక ఆ మహాపదవి అల్పులకు పొందరాదు. ఒకవేళ పొందినా నిలుపుకొనటం కష్టం. కొందరు వేలజన్మల తర్వాత బ్రాహ్మణులై పుట్టి కూడా ధనలోభాదులవలన చెడిపోతున్నారు. కనుక నీ తపస్సు వదలిపెట్టుము' అని చెప్పి ఇంద్రుడు వెళ్ళిపోయాడు. తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అంగుష్ఠ మొకటి మోపి, మ । తంగుఁడు నూఱేండ్లు సేసెఁ దపము నియతిమై.**
**నంగము తో లస్థులతో । సంగతముగఁ దోఁప, వెక్కసముగా నరముల్. 98**

**ప్రతిపదార్థం:** మతంగుఁడు; అంగుష్ఠము= కాలిబొటనవ్రేలు; ఒకటి మోపి= ఒకదానిపై నిలిచి; నూఱు= వంద; ఏండ్లు= సంవత్సరాలు; నియతిమైన్ = నియమంతో; అంగము= అవయవం; తోలు= చర్మం; అస్థులతోన్= బొమికలతో; నరముల్= నరాలు; సంగతముగన్= అంటుకొన్నట్లు; వెక్కసముగాన్= కంటికిబరువుగా, భయంకరంగా; తోఁపన్= కన్పించగా, తపము చేసెన్= తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** నూరేళ్ళు కాలిబొటనవ్రేలిపై నిలిచి, శరీరంలో తోలు, ఎముకలు, నరాలు తప్ప ఏమీ మిగులకుండు నంతగా భయంకరంగా కన్పించేంత వరకు తపస్సు చేశాడు.

**విశేషం:** ప్రతి పద్యంలోనూ తిక్కనగారు కావాలని తెలుగు పదాలు వాడటం గమనించాలి. ఉదా; తోలుకు బదులు చర్మం వాడవచ్చు. కాని అది సంస్కృతం. తపస్సు చేసి చిక్కి శల్యమైన బుద్ధవిగ్రహాలు మనదేశంలో వచ్చాయి. పోల్చుకొనవచ్చును.

**ఆ. ఇట్లు సేసి శక్తి యెల్లను గడచన్న । నతఁడు, నేల వ్రాలె; నతిరయమున**
**వచ్చి, యమరఁ బట్టి వాసవుఁ 'డక్కట! నీకుఁ జెప్పనయ్య! నెమ్మి నేను. 99**

**ప్రతిపదార్థం:** ఇట్లు చేసి= ఈ విధంగా చేసి; శక్తిఎల్లను= ఓపిక అంతా; కడచన్నన్= వట్టిపోగా; (కడ=చివరకు; చన్నన్= పోగా); అతఁడు= మతంగుడు; నేలన్= భూమిపై; వ్రాలెన్= పడ్డాడు; వాసవుఁడు= ఇంద్రుడు; అతిరయమునన్= మిక్కిలి వేగంతో; వచ్చి; అమరన్= చక్కగా; పట్టి= పట్టుకొని; నేను; నీకున్; నెమ్మిన్= ప్రేమతో; చెప్పనయ్య!= అయ్యా! చెప్పనా? (ఇదివరకే చెప్పాను కదా!)

**తాత్పర్యం:** ఇట్లా తపస్సు చేసి అతని శరీరం శుష్కించి శక్తి అంతా క్షీణించిపోగా నేలపై కుప్పకూలిపోయాడు. (అప్పుడు) మిక్కిలివేగంతో ఇంద్రుడు వచ్చి అతడిని పడకుండా చక్కగా పట్టుకొని, అయ్యా! నే నిదివరకే చెప్పలేదా?

**వ. క్షత్రియాదులచేతనుం బట్టువడని బ్రాహ్మణశార్దూలంబుతోడి మేలంబు దక్కుము; నీకు నొక్కవరం బిచ్చెదం గైకొను' మని పల్కుటయు, నతం డొడంబడినం బరమాదరంబున. 100**

**ప్రతిపదార్థం:** క్షత్రియ+ఆదులచేతనున్= రాజులు మొదలైనవారికి కూడా; పట్టువడని= లభించని; బ్రాహ్మణశార్దూలంబు= బ్రాహ్మణత్వమన్న పులికి; తోడి= సంబంధించిన; మేలంబు= ఆట, నవ్వులాట; తక్కుము= వదలిపెట్టుము; నీకున్= నీకు; ఒక్క వరంబు= ఒక్క వరాన్ని; ఇచ్చెదన్= ఇస్తాను; కైకొనుము= తీసికొనుము; అని; పల్కుటయున్= చెప్పగా; అతండు= ఆ మతంగుడు; ఒడంబడినన్= అంగీకరించగా; పరమ= గొప్ప; ఆదరంబునన్= ప్రేమతో.

**తాత్పర్యం:** క్షత్రియుడికి కూడా లభించని ఆ బ్రాహ్మణత్వమన్న పులితో ఆటలాడటం మానివేస్తే నీకొక వరమిస్తా' నని ఇంద్రుడంటే అతడూ సరే నన్నాడు. అప్పుడు ఇంద్రుడు ప్రేమతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. చండదేవుఁ డనఁ బ్రశస్తి వహించి, సు । స్త్రీలు, పూజనంబు సేయఁ, గామ**
**రూపధారివై, నిరూపింప విహగభా। వంబుగల్గి, ప్రమదవర్తి వగుము'. 101**

**ప్రతిపదార్థం:** చండదేవుఁడు+అనన్= ఆ పేరుతో; ప్రశస్తి= కీర్తి; వహించి= మోసి; సు స్త్రీలు= మంచి ఆడువారు; పూజనంబు= పూజలు; చేయన్= చేస్తూ+ఉండగా; కామరూపధారివి+ఐ= ఇష్టం వచ్చిన రూపాన్ని ధరించగలవాడివై; నిరూపింపన్= అందరు గుర్తించేటట్లుగా; విహగభావంబు= ఆకాశంలో ఎగిరే పక్షి స్వభావం; కల్గి= పొంది; ప్రమద= సంతోషంతో; వర్తివి= చరించేవాడవు; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** చండదేవుడనే పేరుతో కీర్తిశాలివై స్త్రీల పూజలందుతూ కామరూపంతో పక్షిభావం పొంది సంతోషంతో విహరించుము'.

**క. అని వరమిచ్చి, మహేంద్రుఁడు । సనియె' ననిన విని, యజాతశత్రుఁడు గాంగే**
**యునితో 'బ్రాహ్మణ్యము పెఱ । జనులకుఁ బొందంగ ని ట్లశక్యం బేనిన్. 102**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; వరము+ఇచ్చి= కోరిన కోరిక తీర్చి; మహేంద్రుఁడు= ఇంద్రుడు; చనియెన్= వెళ్ళాడు; అనినన్= చెప్పగా; విని; అజాత= పుట్టని, లేని; శత్రుఁడు= శత్రువులు కలవాడు (శత్రువు లేనివాడు ధర్మరాజు); గాంగేయునితోన్= గంగాతనయుడైన భీష్ముడితో; పెఱ= ఇతర; జనులకున్= వర్ణాలవారికి; బ్రాహ్మణ్యము= బ్రాహ్మణత్వం; పొందంగన్= పొందటం; ఇట్లు= ఈ విధంగా; అశక్యంబు+ఏనిన్= సాధ్యం కాకపోతే.

**తాత్పర్యం:** అని వరమిచ్చి ఇంద్రుడు వెళ్ళాడని విన్న ధర్మరాజు భీష్ముడిని ఇట్లా ప్రశ్నించాడు. 'ఇతరుల కీ విధంగా బ్రాహ్మణత్వం పొందరానిదే అయితే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అజాతశత్రువు అంటే ఇతడిని దుర్యోధనాదులు శత్రువుగా చూచారు తప్ప ఇతడు వారి నట్లా చూడలేదని అర్థం. ఎవడి మనస్సులో ద్వేషం, విరోధం లేవో వా డజాతశత్రువు. అశోకుడు, గాంధీ, బుద్ధులూ ఇట్టివారే.

## విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగిన తెఱంగు (సం. 13-3-1)

**వ. విశ్వామిత్త్రుం డెట్లు వొందె? నత్తెఱం గెఱింగింపవే!' యని యడిగిన నన్నరదేవునకు దేవవ్రతుం డిట్లనియె.103**

**ప్రతిపదార్థం:** విశ్వామిత్రుండు= విశ్వానికంతా స్నేహితుడైన ఋషి; ఎట్లు= ఏ విధంగా, పొందెన్= బ్రాహ్మణత్వాన్ని పొందాడో; ఆ+తెఱంగు= ఆ పద్ధతి; ఎఱింగింపవే= తెల్పవే; అని; అడిగినన్= అడుగగా; ఆ నరదేవునకున్= ఆ రాజునకు; దేవవ్రతుండు= భీష్ముడు; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణత్వం ఇతరవర్ణాలవారికి లభ్యం కాదన్నావు కదా! మరి విశ్వామిత్రు డెట్లా పొందగలిగాడో చెప్పుము' అని అడిగిన ధర్మరాజుతో భీష్ము డిట్లా అన్నాడు.

**సీ. 'జాహ్నవీదేవికి జనకుఁడై వెలసిన । జహ్నుని కులమున సంభవించె**
**గాధినాఁ బ్రకట భూకాంతుఁ ; డాతనిపుత్త్రి । యగు సత్యవతిఁ దన కాలి గాఁగ**
**నిమ్మని యర్థించె నమ్మహీశ్వరు ఋచీ । కుం డనుముని; భృగుకులవరేణ్యుఁ**
**డతని కీ నొల్ల కప్పతి దనకూఁతున । కుంకువగాఁ, జెప్పెనొక్క కర్ణ**

**తే. మసితమై తెలుపారెడు హరులు వేయి । మానియై భార్గవుఁడు దేరఁబూని వరుణుఁ**
**గానఁ జని యవ్విధము ఘోటకముల వేఁడె । నాతఁ డిచ్చుట కొడఁబడి యతనితోడ. 104**

**ప్రతిపదార్థం:** జాహ్నవీదేవికిన్= గంగాదేవికి; జనకుఁడు+ఐ= తండ్రి అయి; వెలసిన= ప్రకాశించిన; జహ్నుని కులమునన్= జహ్నుడన్న ముని వంశంలో (జహ్నుడి కూతురు కనుక జాహ్నవి అని పేరు వచ్చింది); గాధినాన్= గాధి అన్న పేరు కలవాడుగా; ప్రకట= అందరకు తెలిసిన; భూకాంతుఁడు= రాజు (భూమికి పాలకుడు); సంభవించెన్= జన్మించాడు; అతని పుత్రి= అతడి కుమార్తె; అగు; సత్యవతి= సత్యవతి అనే పేరుగలది (సత్యం కలది); తనకున్= ఋచీకు డన్న మునికి; ఆలికాఁగన్= భార్యకాగా; ఋచీకుండు+అనుముని; భృగుకులవరేణ్యుఁడు= భృగుకులంలో శ్రేష్ఠుడు; ఆ+మహీశ్వరున్= ఆ రాజైన గాధిని; అర్థించెన్= కోరాడు; తనకూఁతును= తన కుమార్తెను; అతనికిన్= ఋచీకునకు; ఈన్= ఇవ్వటానికి; ఒల్లక= ఇష్టపడక; ఉంకువగాన్= ఓలిగా, శుల్కం కాగా; ఒక్క కర్ణము= ఒక చెవి; అసితము+ఐ= నల్లనిదై; తెలుపు+ఆరెడి= స్వచ్ఛమైన తెలుపుగల; హరులు= గుఱ్ఱాలు; వేయి= సహస్రం; చెప్పెన్= ఋచీకుడికి గాధి ఆ విధంగా చెప్పాడు; మాని+ఐ= పౌరుషంగలవాడై; భార్గవుఁడు= భృగు కులంలో పుట్టిన ఆ ఋచీకుడు; తేరన్= తెచ్చుటకు; పూని= పూనుకొని; వరుణున్= వరుణదేవుని; కానన్= చూడగా; చని= వెళ్ళి; ఆ విధము= అలాంటి; ఘోటకములన్= గుఱ్ఱాలను; వేఁడెన్= ప్రార్థించెను; ఆతఁడు= ఆ వరుణుడు; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; ఒడఁబడి= అంగీకరించి; అతని తోడన్= ఋచీకుడితో.

**తాత్పర్యం:** జాహ్నవీదేవికి తండ్రి అయిన జహ్నుడికులంలో గాధి అనేవాడు జన్మించాడు. అతడి కూతురు సత్యవతి. ఆమెను భృగుకులంలో పుట్టిన ఋచీకు డనేవాడు భార్యగా నిమ్మని ఆమె తండ్రి గాధిని కోరాడు. గాధికి ఇష్టం లేదు. అందుకని ఒక చెవి నల్లగా ఉన్న తెల్లని వేయి గుఱ్ఱాలను శుల్కంగా తెస్తే, ఇస్తా నన్నాడు. అభిమాన ధనుడైన ఋచీకుడు వరుణుడి దగ్గరకు వెళ్ళి యాచించాడు. ఆయన ఇవ్వటానికి ఒప్పుకొని ఈ క్రింది విధంగా అన్నాడు.

**విశేషం:** ఆ రోజులలో ఓలి ఇచ్చి వివాహం చేసికొనే ఆచార ముండేది.

**క. 'నీ వలసినప్పు డట్టి హ । యావలి ప్రభవించు నెచటనైన' ననవుడున్**
**దీవించి యరిగి యమ్ముని । దేవతటిని యుత్తరంపుఁ దీరమునఁ దగన్. 105**

**ప్రతిపదార్థం:** నీ= నీకు; వలసినప్పుడు= అవసరమైనప్పుడు; (నీకు అవసర మేర్పడినపుడు); అట్టి= అట్లాంటి; హయ+ఆవలి= గుఱ్ఱాల సమూహం; ఎచటన్+ఐనన్= నీవు కోరినచోట; ప్రభవించున్= పుట్టుతాయి; అనవుడున్= అనగా; ఆ+ముని= ఆ ఋచీకుడు; దీవించి= ఆశీర్వదించి; అరిగి= పోయి; దేవతటిని= గంగానది (దేవతా నది); ఉత్తరము+తీరమునన్= ఉత్తరదిక్కున ఉన్న ఒడ్డున; తగన్= చక్కగా

**తాత్పర్యం:** 'నీ వెక్కడ కోరితే అక్కడ అట్లాంటి గుఱ్ఱాలు పుట్టుతాయి' అని వరుణు డన్నాడు. సంతోషించి ఆ ఋచీకుడు వరుణుడిని ఆశీర్వదించి గంగానది ఉత్తరపుటొడ్డున.

**వ. నియతుండై తలఁచిన తత్క్షణంబ గాధి చెప్పిన చందంబగు గుఱ్ఱంబులు వేయునుం బుడమిఁ బొలిచి నిలిచె; దానం గన్యాకుబ్జంబున కనతిదూరం బగు తత్ప్రదేశం బశ్వతీర్థం బనం బరఁగె; నమ్ముని కుమారుం డత్తురంగంబుల నిచ్చిన, నచ్చెరువును సంతోషంబును శాపభయంబును హృదయంబున ముప్పిరిగొనం దనపుత్త్రికి నుంకువగా నియ్యకొని. 106**

**ప్రతిపదార్థం:** నియతుండు+ఐ= నియమం కలవాడై; తలఁచిన= అనుకొనగానే; తత్క్షణంబు+అ= వెనువెంటనే; గాధి చెప్పిన చందంబు+అగు= గాధి చెప్పినటువంటి; వేయునున్= వేయీ; పుడమిన్= భూమిపై; పొలిచి= సంభవించి; నిలిచెన్= నిలిచాయి; దానన్= అందువలన; కన్యాకుబ్జంబునకున్= ఆ పేరున్న దేశానికి; అనతి దూరంబు+అగు= కొంచెం దూరంలో ఉన్న; తత్ప్రదేశంబు= ఆ చోటు (గుఱ్ఱాలు పుట్టిన స్థలం); అశ్వతీర్థంబు= గుఱ్ఱాలు పుట్టిన పవిత్రస్థలం; అనన్= అన్నపేరున; పరఁగెన్= వ్యాప్తి చెందెను; ఆ+ముని= ఆ ముని; కుమారుండు=కొడుకు; ఆ+తురంగంబులన్= ఆ గుఱ్ఱాలను; ఇచ్చినన్= ఇవ్వగా; అచ్చెరువును= ఆశ్చర్యం; సంతోషంబును= ఆనందమూ; శాపభయంబును= శపిస్తాడేమోనన్న భీతి; హృదయంబునన్= మనస్సునందు; ముప్పిరిగొనన్= ముప్పేటలు పడగా (మూడు పిరము - త్రాడు మూడు పేటలుగా పేనటం); తన పుత్రికిన్= తన కూతురునకు; ఉంకువగాన్= శుల్కంగా (ఓలిగా); ఇయ్యకొని= అంగీకరించి, ఒప్పుకొని.

**తాత్పర్యం:** నియమంతో సంకల్పించగానే వెంటనే గాధి చెప్పినవిధంగా వేయి గుఱ్ఱాలు నేలనుండి పుట్టి ఎదుట నిలిచాయి. దానివలన కన్యాకుబ్జానికి కొద్దిదూరంలో ఉన్న ఆ ప్రదేశం అశ్వతీర్థమని ప్రసిద్ధి కెక్కింది. ఋచీకుడు ఆ గుఱ్ఱాలను ఇచ్చాడు. గాధి సంతోషంలోనూ, ఆశ్చర్యంలోనూ, శాపభయంలోనూ మునిగిపోయాడు. ఆ ముప్పేటభావంతో కూతురుకు ఆ గుఱ్ఱాలను శుల్కంగా అంగీకరించాడు.

**తే. గాధి యమ్మునిపుత్త్రు శీఘ్రమునఁ బెండ్లి । సేసె; నిట్లు, వరించి ఋచీకుఁ డధిక**
**సమ్మదమున గృహస్థ ధర్మమ్ము నడపు । చుండి, సంతాన కాంక్ష, నయ్యువిదతోడ. 107**

**ప్రతిపదార్థం:** గాధి= గాధిరాజు; ఆ+మునిపుత్రున్= ఆ ఋచీకుడికి; శీఘ్రమునన్= వెంటనే; పెండ్లిచేసెన్= వివాహం చేశాడు; ఋచీకుఁడు= మునికొడుకు; ఇట్లు వరించి= ఈ విధంగా సత్యవతిని పెండ్లి చేసుకొని; అధిక= ఎక్కువ; సమ్మదమునన్= సంతోషంతో; గృహస్థ ధర్మమ్ము= గృహస్థుడి విధులను; నడపుచున్+ఉండి= నిర్వహిస్తూ; సంతానకాంక్షన్= సంతానంమీద కోర్కెతో; ఆ+ఉవిదతోడన్= భార్యతో.

**తాత్పర్యం:** రాజు ఋచీకుడికి తన కూతురు సత్యవతి నిచ్చి వెంటనే పెండ్లి చేశాడు. ఆ ముని గృహస్థాశ్రమాన్ని సంతోషంతో నడుపుతూ, సంతానం కావాలనుకొని భార్యతో (అన్నాడు).

**వ. 'నీకుం బుత్రోత్పత్తి గావింపం జాలు చరువు సంపాదించెద ననియెఁ; దొల్లి దానితల్లి దనయల్లుని మహానుభావం బెఱుంగుటంజేసి, యా సత్యవతితో 'నాకుం దనయుండు గలుగ, దయసేయునట్లుగాఁ బుణ్యకర్తయగు నీభర్తం బ్రార్థింపు' మనినయది గావున నమ్మాట యమ్ముద్దియ యతనికిం జెప్పిన నప్పరమధర్మపరుండు. 108**

**ప్రతిపదార్థం:** పుత్ర+ఉత్పత్తి= కుమారుడి పుట్టుకను; కావింపన్+చాలు= కలిగించగలుగు; చరువు= హవ్యము, హోమం చేసే అన్నం; సంపాదించెదను= తెస్తాను; అనియెన్= అన్నాడు; తొల్లి= పూర్వం; దానితల్లి= సత్యవతి తల్లి; తన అల్లుని= తన అల్లుడియొక్క; మహానుభావంబు= మాహాత్మ్యం, ఎఱుంగుటన్+చేసి= తెలియటంచేత; ఆ సత్యవతితోన్= సత్యవతితో; నాకున్= నాకు; తనయుండు+కలుగన్= కుమారుడు పుట్టేట్లు; దయచేయు+అట్లుగాన్= అనుగ్రహించేటట్లుగా; పుణ్యకర్త+అగు= పుణ్యకార్యాలు చేసేవాడైన; నీ భర్తన్= నీ పెనిమిటిని; ప్రార్థింపుము= నాకు మారుగా వేడుము; అనిన+అది= అని అడిగింది; కావునన్= కాబట్టి; ఆ+మాట= ఆ పలుకు; ఆ+ముద్దియ= ఆ ముగ్ధ (నూతన వధువు); అతనికిన్ చెప్పినన్= అతడికి చెప్పగా; ఆ+పరమ= ఆ గొప్ప; ధర్మపరుండు= ధర్మబుద్ధి కలవాడు.

**తాత్పర్యం:** ఋచీకుడు (క్రొత్తగా కాపురానికి వచ్చిన) భార్యతో ఇట్లా అన్నాడు. 'నీకు సంతానా న్నివ్వగల చరువును సంపాదిస్తాను' అన్నాడు. అంతకుముందే సత్యవతి తల్లి - గాధి భార్య - తన అల్లుడు మహానుభావుడన్న సంగతి తెలిసినది కాబట్టి కూతురుతో చెప్పింది 'నాకు కొడుకును అనుగ్రహించుమని నీ భర్తతో చెప్పు' మని. ఆమె భర్తతో ఆ మాట చెప్పింది. ఆ ధర్మమూర్తి (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. రెండు చరువు లొనర్చి, యొక్కండు బ్రాహ్మ । ణత్వ మత్యుజ్జ్వలముగ నొనర్ప, నొకటి**
**రాజభావంబు నధిక తీవ్రముగఁ జేయఁ । జాలునట్లుగ నిజతపశ్శక్తిఁ జేసె. 109**

**ప్రతిపదార్థం:** నిజ= (ఋచీకుడు) తనయొక్క; తపః= తపస్సుయొక్క; శక్తిన్+చేసి= శక్తితో (తపశ్శక్తివలన); రెండు చరువులు= రెండు హవ్యములు; ఒక్కండు= ఒకటి; అతి+ఉజ్జ్వలముగన్= మిక్కిలి వెలిగేటట్లుగా; బ్రాహ్మణత్వము= బ్రాహ్మణలక్షణం; ఒనర్పన్= చేయగా; ఒకటి= మరొకటి; రాజభావంబు= రాజత్వం; అధిక= మిక్కిలి; తీవ్రముగన్= తీవ్రంగా; చేయన్+చాలునట్లుగన్= చేయగలిగేటట్లు; చేసెన్= (రెండు చరువులను) నిర్మించాడు.

**తాత్పర్యం:** ఒకటి గొప్పగా వెలిగే బ్రాహ్మణత్వం కల కుమారుడి నిచ్చేదీ, మరొకటి తీవ్రమైన రాజభావం కల కొడుకును కల్పించేదీ అయిన రెండు చరువులను ఋచీకుడు నిర్మించాడు.

**వ. ఇట్లు గావించి, యా రెంటిని సత్యవతికిం జూపి, తత్ప్రభావంబు వేఱువేఱ యుపన్యసించి, క్షాత్రంబైన చరువు మీతల్లి కిచ్చి, బ్రాహ్మం బయిన దాని నీవు పుచ్చికొనుము. ఋతుకాలంబున నీతల్లి యశ్వత్థంబును, నీ వుదుంబరంబును నాలింగనంబు సేసి భక్తితో మీమీ చరువు లుపయోగించునది' యని నియోగించె; వారి యుపయోగంబు సమయంబున విధివశంబునంజేసి. 110**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; కావించి= ఏర్పాటుచేసి; ఆ రెంటినిన్= ఆ రెండింటినీ; సత్యవతికిన్= సత్యవతికి; చూపి= చూపించి; తత్ ప్రభావంబు= వాని గొప్పశక్తిని; వేఱు, వేఱు+అ= విడివిడిగా; ఉపన్యసించి= వివరంగా చెప్పి; క్షాత్రంబు= క్షత్రియ సంబంధం; ఐన= అయిన; చరువున్= హవ్యమును; మీతల్లికిన్= మి అమ్మకు; ఇచ్చి= ఒసంగి; బ్రాహ్మంబు= బ్రాహ్మణసంబంధం; అయినదానిన్= అయినచరువును; నీవు= నీవు; పుచ్చికొనుము= తీసుకో; ఋతుకాలంబునన్= నెలసరి ఋతువుకాలంలో; నీతల్లి= మీ అమ్మ; అశ్వత్థంబును= రావిచెట్టును; నీవు= నీవు; ఉదుంబరంబును= మేడిచెట్టును; ఆ లింగనంబు+చేసి= కౌగిలించుకొని; భక్తితోన్= గౌరవంతో; మీమీ చరువులు= మీయిరువురకు విడిగా ఏర్పాటయిన హవ్యములను; ఉపయోగించునది= పుచ్చుకోండి; అని; నియోగించెన్= ఆజ్ఞాపించాడు; వారి ఉపయోగంబు సమయంబునన్= వారు అవి పుచ్చుకొనే వేళలో; విధివశంబునన్+చేసి= దైవం నిర్ణయం ప్రకారం.

**తాత్పర్యం:** భార్య కా రెండు చరువులను చూపించి, 'ఇది బ్రాహ్మణ కుమారుడిని, ఇది క్షత్రియుడైన కొడుకును ఇస్తుందని, దేని కది చెప్పి నీ తల్లికి క్షత్రియ చరువు నిచ్చి, నీవు బ్రాహ్మణ చరువును తీసికొని ఋతుకాలంలో నీవు మేడిచెట్టును, నీతల్లి రావిచెట్టును కౌగలించుకోవాలని చెప్పాడు. తరువాత వారుపయోగించేవేళ దైవవశాత్తుగా.

**క. చరువులు, నమ్ముని చెప్పిన । తరువులు, వీడ్వడియె సుతకుఁ దల్లికి; నట్ల**
**య్యిరువురు నుపయోగింపఁగఁ । గరువులు దత్తత్ప్రకార కలితము లయ్యెన్. 111**

**ప్రతిపదార్థం:** ఆ+ముని= ఆ ఋచీకుడు; చెప్పిన= చెప్పినటువంటి; చరువులున్= అన్నములు; తరువులున్= చెట్లూ; సుతకున్= కూతురుకు; తల్లికిన్= జననికిన్; వీడ్వడియెన్= మారిపోయాయి, తారుమారయ్యాయి; అట్లు= ఆ విధంగా; ఆ+ఇరువురు= ఆ ఇద్దరు; ఉపయోగింపఁగన్= వాడుకోగా; కరువులు= గర్భాలు; తత్+ప్రకార= ఆయా విధంగా; ముని చెప్పినట్లుగా; కలితములు= కూడినవి; అయ్యెన్= అయినవి.

**తాత్పర్యం:** ఋచీకుడు చెప్పిన చరువులూ చెట్లూ తల్లీ కూతుళ్ళకు మారిపోగా, ఆ ఇద్దరకు గర్భాలు కూడా ఆ విధంగానే తారుమారయ్యాయి.

**వ. దివ్యబోధ మహనీయుండు గావున. 112**

**ప్రతిపదార్థం:** దివ్య= దేవతాసంబంధమైన; బోధ= జ్ఞానం చేత; మహనీయుండు= మహానుభావుడు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** ఆ ముని దివ్యజ్ఞానం కల మహాత్ముడు కనుక. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. చ్యవననందనుండు సత్యవతీ గర్భ । భంగి సూచి, 'యకట! బ్రాహ్మణుండు**
**గాఁడు, తరుణి! నీదు కడుపులోపలి బిడ్డ । క్రూరుఁడైన రాచకొడుకు గాని.' 113**

**ప్రతిపదార్థం:** చ్యవన నందనుండు= చ్యవనుడి కొడుకు (ఋచీకుడు); సత్యవతీ= సత్యవతియొక్క; గర్భభంగి= గర్భపద్ధతి; చూచి= పరీక్షించి; తరుణి!= సత్యవతీ! (స్త్రీ); నీదు= నీయొక్క; కడుపులోపలి= కడుపులో ఉన్న; బిడ్డ= పిండం; బ్రాహ్మణుండు కాఁడు; క్రూరుఁడు+ఐన= కఠినుడైన; రాచకొడుకుగాని= క్షత్రియకుమారుడు తప్ప.

**తాత్పర్యం:** ఋచీకుడు తన భార్య గర్భపద్ధతిని పరీక్షించి 'తరుణీ! నీ కడుపులో పెరిగే బిడ్డ దుర్మార్గుడైన రాచకొడుకు తప్ప బ్రాహ్మణ కుమారుడు కాడు'.

**వ. అని పలికి, చరుతరువ్యత్యాసంబున నట్లగుట దేటపడం జెప్పిన, నబ్బోటి యత్యంత విషాదవేదనాదూయమాన మానసయై. 114**

**ప్రతిపదార్థం:** అని; పల్కి= చెప్పి; చరు, తరు, వ్యత్యాసంబునన్= చరువు, చెట్టు తారుమారు కావటం వలన; అట్లు= ఆ విధంగా; అగుటన్= కావటం; తేటపడన్= స్పష్టంగా; చెప్పినన్= చెప్పగా; ఆ+బోటి= ఆమె (బోటి = స్త్రీ); అత్యంత= మిక్కిలి; విషాద= దుఃఖంతో; దూయమాన= బాధపడుతున్న; మానస+ఐ= మనస్సు కలదై.

**తాత్పర్యం:** చరువులు, చెట్లు తారుమారు కావటంవలన ఇట్లా జరిగిందని చెప్పటం విని ఆమె దుఃఖంతో బాధపడుతున్న మనస్సు కలదై.(తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'నీకుం బుట్టెడు కొడుకు వి । వేకనిధీ! బ్రాహ్మణత్వ విరహితుఁ డైనన్**
**లోకము మెచ్చునె? యట్టులు । గాకుండఁగఁ జేయు తపము గౌరవ మొప్పన్. 115**

**ప్రతిపదార్థం:** వివేకనిధీ!= దివ్యజ్ఞానవంతుడా!; నీకున్= నీవంటిమునికి; పుట్టెడు= జన్మించే; కొడుకు; బ్రాహ్మణత్వ విరహితుఁడు+ఐనన్= బ్రాహ్మణజాతిలక్షణాలు లేనివాడైతే; లోకము మెచ్చునె?= జనం మెచ్చుకొంటుందా? అట్టులు= ఆ విధంగా; కాకుండఁగన్= కాని విధంగా; తపము= నీ తపస్సు; గౌరవము= గురుత్వం, గొప్పతనం; ఒప్పన్= వెల్లడి కాగా; చేయు= చేయుము.

**తాత్పర్యం:** నీవు జ్ఞానసంపన్నుడవు. నీకు పుట్టే కొడుకు బ్రాహ్మణత్వం కోల్పోయినవాడైతే లోకం మెచ్చుకోదు. కనుక నీవు తపస్సు, గొప్పతనం స్పష్టపడేటట్లుగా అట్లా కాకుండా చేయుము!

**తే. నాకు నివ్వర మి 'మ్మని నమ్ర యగుడు, । 'వీడు బ్రాహ్మణుఁ డగుఁ గాక, వీని కొడుకు**
**నందు రాజత్వ సంపద యతిశయిల్లు' । ననియెఁ గరుణార్ద్రచిత్తుఁడై యత్తపస్వి. 116**

**ప్రతిపదార్థం:** ఈ+వరము= ఈ వరం; నాకున్ఇమ్ము+అని= నాకు ఇమ్మని; నమ్ర= నమస్కరించుటకై వంగినది; అగుడున్= కాగా; ఆ తపస్వి= ఆ ఋచీకుడు; కరుణా= దయతో, ఆర్ద్ర= మెత్తబడిన; చిత్తుఁడు+ఐ= మనస్సు కలవాడై; వీఁడు= నీ కొడుకు; బ్రాహ్మణుఁడు+అగున్+కాక!; వీని కొడుకు= నీ కొడుకు యొక్క కొడుకు; రాజత్వ సంపద= రాజలక్షణాల సమూహంతో; అతిశయిల్లున్= ప్రకాశిస్తాడు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'నాకు ఈ వరం ప్రసాదించు'మని నమస్కరించగా ఆ ముని దయతో ఇట్లా అన్నాడు. 'వీడు బ్రాహ్మణుడౌతాడు. కాని వీడికొడుకు రాజలక్షణాలు కలవా డౌతాడు' అని వరమిచ్చాడు.

**వ. అ ట్లమ్ముని యావహించుట కతంబున సత్యవతీ పుత్త్ర పౌత్త్రులైన జమదగ్ని పరశురాములు గ్రమంబున బ్రహ్మక్షత్త్ర తేజోవిరాజితు లయిరి; గాధి భార్యకు జనియించి విశ్వామిత్త్రుండు. 117**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఆ+ముని= ఆ ఋచీకుడు; ఆవహించుట= ఆవరించటం; కతంబునన్= కారణంగా; సత్యవతీ పుత్త్రపౌత్త్రులైన= సత్యవతికి కొడుకు, మనుమలైన; జమదగ్ని పరశురాములు; క్రమంబునన్= వరుసగా; బ్రహ్మ క్షత్త్ర= బ్రాహ్మణ, క్షత్రియ; తేజోవిరాజితులు= తేజస్సుతో ప్రకాశించినవారు; అయిరి= అయ్యారు; గాధిభార్యకున్ జనియించి= గాధి భార్యకు పుట్టి; విశ్వామిత్రుండు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఆ ముని ఆనతిచ్చిన విధంగా సత్యవతికి బ్రాహ్మణుడైన జమదగ్ని కొడుకుగా, క్షత్రియ తేజస్సుతో పరశురాముడు మనుమడై పుట్టాడు. గాధిభార్యకు విశ్వామిత్రుడు జన్మించాడు.

**విశేషం:** విశ్వామిత్రకథ కిది మొదలు. అతడు రాజై బ్రాహ్మణత్వం పొందటానికి హేతువుగా చెప్పబడిన పూర్వకథ. ఆవహించటమంటే తన తేజస్సుతో సంతానాన్ని ఆవరించి వారి భవిష్యత్తులు తారుమారు చేయటం. 113వ పద్యంలో చెప్పిన క్రూరుడైన రాచకొడుకును మనుమడిగా మార్చటం.

**క. నరనాథుండై యుండియుఁ, । జరు తరు గుణ సంక్రమమున సద్బ్రాహ్మణతా**
**స్ఫురణంబు వడసెఁ, దపమును । గరమధికం బతనియందుఁ గలిగెఁ గుమారా!'. 118**

**ప్రతిపదార్థం:** కుమారా!= నాయనా! (ధర్మరాజా!); నరనాథుండు+ఐ= రాజై (ప్రజలకు పాలకుడై), ఉండియున్= ఉండికూడా; చరు= చరువుయొక్క; తరు= చెట్టుయొక్క; గుణసంక్రమమునన్= గుణాల తారుమారుచేత; సత్=మంచి; బ్రాహ్మణతా= బ్రాహ్మణత్వంయొక్క; స్ఫురణంబు= స్ఫురణ (మనస్సును ప్రేరేపించే సూక్ష్మస్వభావం); పడసెన్= పొందాడు; అతనియందున్= అతడిలో; తపమును= తపస్సుకూడా; కరము= మిక్కిలి; అధికంబు= ఎక్కువ; కలిగెన్= కలిగింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! రాజై కూడా చరుతరు గుణాల తారుమారుచేత అతడిలో బ్రాహ్మణత్వ స్ఫురణ, తపశ్శక్తి మిక్కిలి ఎక్కువగా కలిగాయి'.

**విశేషం:** రాజు కావటం రాజుకొడుకైనందున, ఋషి కావటం ఋచీకుడి వరంవలన. ఇది లోపల స్ఫురణ. బూడిదలో నిప్పురవ్వవలె గాలికి మండి మంటలైనట్లు అణగిఉన్న స్ఫురణ క్రమంగా ఋషిత్వంగా పరిణమించింది.

ఇంతటితో ఈ కథ త్రెంచివేయటం జరిగింది. తర్వాతి కథ రామాయణంలో, భారతంలో ఇతర పర్వాలలో చెప్పబడింది. ఏ కథ ఎంతవరకు, ఎక్కడ చెప్పాలో కవి చేసికొన్న పథకాన్ని అనుసరించి ఉంటుంది. వ్యాసమహర్షి భారత రచనా ప్రణాళికలో ఇట్లాంటి విశేషాలు చాలా కన్పిస్తాయి.

## వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వంబు గలిగిన ప్రకారము (సం. 13-8-1 (కుంభ)

**వ. అనిన విని, ధర్మజుండు 'వీతహవ్యుం డనురాజు బ్రాహ్మణత్వంబుఁ బడసె నని విందు; నత్తెఱం గెఱింగింపు' మనవుడు నతనికి శంతనునందనుం డిట్లనియె; 'మనుసంభవుఁడైన శర్యాతి యన్వయంబున హైహయుండను నొక్క జనపతి జనియించి వత్సదేశాధీశుండై పాలిచె, నాతనికి వీతహవ్య నామంబునుం గలిగియుండుఁ; దదీయభార్యలు పదుండ్రు; వారలు వీరులుం బ్రబలులు నగు పుత్త్రుల నూర్వురఁ గాంచి; రమ్మహారథులు విక్రమ కుతూహలంబున. 119**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని భీష్ముడు పలుకగా ఆలకించి; ధర్మజుండు; వీతహవ్యుండు+అనురాజు= వీతహవ్యుడనే నరపాలుడు; బ్రాహ్మణత్వంబున్= బ్రహ్మణుతనమును; పడసెన్= పొందెను; అనివిందున్= అని విన్నాను; ఆ+తెఱంగు= ఆ విధం; ఎఱింగింపుము= తెలుపుము; అనవుడున్= అని ధర్మజుడు అడిగినమీదట; అతనిన్= ధర్మపుత్రునకు; శంతనునందనుండు= శంతనుని కొడుకు భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు; మనుసంభవుఁడు+ఐన=

మనువు వలన జన్మించిన; శర్యాతి= శర్యాతి అనువానియొక్క; అన్వయంబునన్= వంశంలో; హైహయుండు+అను= హైహయుడనే; ఒక్కజనపతి= ఒకరాజు; జనియించి= పుట్టి; వత్సదేశ+అధి+ఈశుండు+ఐ= వత్సదేశమునకు రాజై; పొలిచెన్= కీర్తి పొందాడు; అతనికిన్= ఆ హైహయునకు; వీతహవ్యనామంబునున్= వీతహవ్యుడనే పేరు కూడా; కలిగి ఉండున్= లభించి ఉండేది; తదీయ భార్యలు= అతనియొక్క పెండ్లాలు; పదుండ్రు= పదిమంది; వారలు= ఆ వీతహవ్యుని పెండ్లాలు; వీరులున్= శూరులూ; ప్రబలులున్+అగు= మిక్కిలి బలము గల్గిన; నూర్వురన్+పుత్త్రులన్= వందమంది కొడుకులను; కాంచిరి= పొందిరి; ఆ+మహారథులు= ఆ గొప్పవీరులు; విక్రమ కుతూహలంబునన్= శౌర్యోత్సాహంతో;

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు 'వీతహవ్యు డనేరాజు బ్రాహ్మణత్వాన్ని పొందా డని వింటాం. ఆ సంగతి తెలుపుము' అని అడుగగా అతడితో భీష్ముడిట్లా అన్నాడు. మనువుకు పుట్టిన శర్యాతివంశంలో హైహయుడు అనే రాజు పుట్టి, వత్సదేశాధీశుడై వెలుగొందాడు. అతడికి వీతహవ్యుడు అనే మరొకపేరు కూడా ఉండేది. అతడి పదిమంది భార్యలు వీరులైన నూరుమంది పుత్రులను కన్నారు. ఆ మహారథులు పరాక్రమ ప్రదర్శన కుతూహలంతో.(తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. హర్యశ్వుఁ గాశీశు నాజికిఁ బిలిపించి, । యొక్క యుమ్మడి లావు నుక్కు మెఱయఁ**
**బొదివి చంపిరి, వానిపుత్త్రుండు పట్టంబు । గట్టె, సుదేవుండు గ్రమ్మఱంగ**
**నురవడి నరిగి, యద్ధరణీశు ననిఁ దెగఁ । జూచి, రాహైహయసుతులు గడిమి,**
**నాతని నందనుఁ డగు దివోదాసుండు । రాజైన నమ్మహీరమణుమీఁద**

**తే. నడచి, వారు ఘనరణం బొనరించి సై । న్యంబుఁ ద్రుంచి,రోడి యతఁడు వాఱి,**
**ప్రకటసంయమిని భరద్వాజ మునిఁ గని । యధికభక్తి నతని నాశ్రయించి. 120**

**ప్రతిపదార్థం:** హరి+అశ్వున్= ఆ పేరుగలరాజును (పచ్చని గుర్రాలు కలవాడు); కాశీ+ఈశున్= కాశీరాజును; ఆజికిన్= యుద్ధానికి; పిలిపించి= పిలిపింపజేసి; ఒక్క ఉమ్మడిన్= ఒకేసారి హఠాత్తుగా; లావున్= బలం; ఉక్కు= శక్తి; మెఱయన్= ప్రకాశించగా; పొదివి= క్రమ్ముకొని, మీదపడి; చంపిరి; వానిపుత్త్రుండు= వాడి కొడుకు; సుదేవుండు= సుదేవుడు; పట్టంబున్= రాజ్యపాలనను; కట్టెన్= కట్టుకొన్నాడు; క్రమ్మఱంగన్= మరల; ఆ హైహయసుతులు= ఆ హైహయుడి కొడుకులు; ఉరవడిన్= వేగంగా; అరిగి= వెళ్ళి; ఆ+ధరణీ+ఈశున్= ఆ భూమికి పతిని, సుదేవుడిని; అనిన్= యుద్ధంలో; కడిమిన్= మగతనంతో, పౌరుషంతో; తెగన్= చచ్చేటట్లు; చూచిరి= చేశారు (తెగఁజూచిరి= చంపారు); ఆతని= సుదేవుడి; నందనుఁడు= కొడుకు; అగు= అయిన; దివోదాసుండు= ఆ పేరుగలవాడు; రాజు+ఐనన్= రాజు కాగా; ఆ+మహీ+రమణుమీఁదన్= ఆ భూమికి పతిఅయిన వాడిమీద; వారు= ఆ హైహయసుతులు; నడచి= దండెత్తి; ఘన= గొప్ప; రణంబు= యుద్ధం; ఒనరించి= చేసి; సైన్యంబున్= సేనను; త్రుంచిరి= చంపారు; అతఁడు= ఆ దివోదాసుడు; ఓడి= ఓడిపోయి; పాఱి= పారిపోయి; ప్రకట= గొప్ప; సంయమినిన్= ప్రసిద్ధుడైన మునిని (ఇంద్రియనిగ్రహం కలవానిని); భరద్వాజమునిన్= భరద్వాజుడన్న మునిని; కని= దర్శించి; అధిక భక్తిన్= గొప్పభక్తితో; అతనిన్+ఆశ్రయించి= ఆతని ఆశ్రయం పొంది.

**తాత్పర్యం:** కాశీరాజైన హర్యశ్వుడిని యుద్ధానికి పిలిపించి ఒకేసారి అందరూ పైబడి పరాక్రమంతో చంపారు. అతడి తరువాత అతడి కొడుకు, సుదేవుడనే వాడు పట్టం కట్టుకోగా, మరల అతడినీ చంపారు. అతడి కొడుకు దివోదాసు డనేవాడు రాజైనాడు. వాడి మీదకు పోయి మరల వాడినీ ఓడించగా వాడు పారిపోయి ప్రసిద్ధమునీశ్వరుడైన భరద్వాజమునిని ఆశ్రయించాడు.

**క. తనకులము వీతహవ్యుని । తనయులచేఁ ద్రుంపఁబడుట దగ నెఱిఁగింపన్**
**విని, యతఁ 'డోడకు, నీ కొక । తనయునిఁ గల్పింతు రిపువిదారణ నిపుణున్'. 121**

**ప్రతిపదార్థం:** తనకులము= తన వంశమంతా; వీతహవ్యుని తనయులచేన్= వీతహవ్యుని కొడుకులచేత; త్రుంపన్+పడుటన్= చంపబడటం; తగన్= స్పష్టంగా; ఎఱిఁగింపన్= తెలుపగా; అతఁడు= ఆ భరద్వాజుడు; విని= ఆలకించి; ఓడకు= భయపడకు; నీకున్= నీకు; ఒక తనయునిన్= ఒక కొడుకును; రిపు= శత్రువులను; విదారణ= చంపటంలో; నిపుణున్= నేర్పరిని; కల్పింతున్= సృష్టిస్తాను.

**తాత్పర్యం:** తన వంశాన్ని వీతహవ్యుడి కొడుకులు చంపటం విన్పించగా ఆ భరద్వాజముని విని 'భయపడకుము. నీకొక శత్రుసంహారిఅయిన కొడుకును సృష్టిస్తాను'. (అన్నాడు)

**వ. అని పుత్రకామేష్టి సేసినం బ్రభవించిన పుత్త్రుం డప్పుడ పదుమూఁడేండ్ల ప్రాయంబువాఁడయ్యెఁ బ్రతర్దన నామధేయుం డక్కుమారుం డమ్మహాత్ముని యనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి. 122**

**ప్రతిపదార్థం:** అని= అనిపల్కి; పుత్రకామ+ఇష్టి= పుత్రులను కోరిచేసే యజ్ఞం; చేసినన్+చేయగా; ప్రభవించిన= పుట్టిన; పుత్త్రుండు; పదుమూడేండ్ల ప్రాయంబువాఁడు= పదమూడుసంవత్సరాల వయసు కలవాడు; అయ్యెన్; ప్రతర్దన= ప్రతర్దనుడన్న; నామధేయుండు= పేరుగలవాడు; ఆ+కుమారుండు= ఆ పుత్రుడు; ఆ+మహాత్ముని= ఆ మహానుభావుడి; అనుగ్రహంబునన్= దయతో; వేదంబులు= వేదాలు; ధనుః+వేదంబును= విలువిద్యను; వేగంబు+అ= త్వరగా; అధిగమించి= అభ్యసించి (పొంది).

**తాత్పర్యం:** అని పుత్రుడిని కలిగించే యజ్ఞం చేసి ప్రతర్దనుడనే పేరుగల కొడుకును సృష్టించాడు. అతడు పుట్టటం తోటే పదమూడేళ్ళవాడుగా పుట్టి వేదాలను, విలువిద్యను నేర్చాడు.

**చ. మునికృప నావహింపఁగ సముజ్జ్వల తేజముఁ బొంది ప్రీతిమై**
**జనకుఁడు యౌవరాజ్యపద సంగతుఁ జేసినఁ బేర్చి యవ్విభుం**
**డనుమతి సేయ నెత్తి చని, యాజిముఖంబున వీతహవ్య నం**
**దనతతి నెల్ల గీటడఁచె దర్ప మెలర్పఁగ నశ్రమంబునన్. 123**

**ప్రతిపదార్థం :** ముని కృపన్= ముని దయతో; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; తేజమున్= ప్రకాశం, తేజస్సు; ఆవహింపఁగన్= ఆవరింపగా (క్రమ్ముకొనగా); పొంది= లభ్యమైన దానిని తీసికొని; జనకుఁడు= తండ్రి; ప్రీతిమైన్= ప్రేమతో, సంతోషంతో; యౌవరాజ్య పదసంగతున్= యువరాజపట్టస్థితి కలవాడినిగా; చేసినన్= చేయగా; పేర్చి= విజృంభించి; ఆ+విభుండు= ఆ రాజు (తండ్రి); అనుమతిచేయన్= ఆజ్ఞాపించగా; ఎత్తి= దండెత్తి; చని= పోయి; ఆజిముఖంబునన్= యుద్ధరంగంలో; వీతహవ్య= వీతహవ్యుడి యొక్క; నందన= కుమారుల; తతిన్= సమూహాన్ని; ఎల్లన్= అందరినీ; దర్పము= గర్వం; ఎలర్పఁగన్= ప్రకాశించగా; అశ్రమంబునన్= తేలికగా; గీటడఁచెన్= చంపాడు.

**తాత్పర్యం:** మునిదయతో ఆవరించిన తేజస్సును పొంది, తండ్రి తనను యువరాజును చేసి ఆజ్ఞాపించగా దండెత్తి పోయి వీతహవ్యుడి కొడుకుల నందరినీ అవలీలగా శౌర్యంతో చంపాడు.

**క. తనయులఁ దెగటార్చి వడిం । దనమీఁదం గవిసినం బ్రతర్దను శౌర్యం**
**బున కలికి వీతహవ్యుం । డనయము వెసఁ బాఱె భృగువునాశ్రమమునకున్. 124**

**ప్రతిపదార్థం:** తనయులన్= కొడుకులను; తెగటార్చి= చంపి; వడిన్= వేగంగా; తనమీఁదన్= తనమీదకు; కవిసినన్= దూకగా; వీతహవ్యుండు= రాజు; ప్రతర్దను శౌర్యంబునకున్= ప్రతర్దనుని విక్రమమునకు; అలికి= భయపడి; అనయమున్= మిక్కిలి; వెసన్= వేగంగా; భృగువు నాశ్రమమునకున్= భృగుమహర్షి ఆశ్రమానికి; పాఱెన్= పరుగెత్తాడు.

**తాత్పర్యం:** ప్రతర్దనుడు కొడుకులనందరినీ చంపి వీతహవ్యుడి మీదకు దూకగా, అతడు భయపడి భృగుమహర్షి ఆశ్రమానికి పారిపోయాడు.

**ఆ. పాఱి, భీతి దోఁపఁబల్క, నమ్ముని తన । దైన శిష్య సమితి లోన నునిచె**
**నతనిఁ, గాశిరాజసుతుఁడును, వెనువెంటఁ । దగిలి యచటి కరిగి, తగువిధమున. 125**

**ప్రతిపదార్థం:** పాఱి= పరుగెత్తి; భీతి= భయం; తోఁపన్= స్పష్టపడేటట్లు; పల్కన్= పలుకగా; ఆ+ముని= ఆ ముని; అతనిన్= వీతహవ్యుడిని; తనదైన= తనయొక్క; శిష్యసమితిలోనన్= శిష్య సమూహం లోపల; ఉనిచెన్= దాచాడు; కాశిరాజసుతుఁడును= కాశీరాజు కొడుకు ప్రతర్దనుడు కూడా; వెనువెంటన్= అతని వెనుకనే; తగిలి= వెంబడించి; అచటికిన్= ఆ భృగుని ఆశ్రమానికి; అరిగి= వెళ్ళి; తగువిధమునన్= తగిన పద్ధతిగా.

**తాత్పర్యం:** పారిపోయి భయం తోపగా పలికినంతనే ఆ ముని అతడిని తన శిష్య సమూహంలో దాచాడు. కాశీరాజు కొడుకు కూడా వెన్నంటి ఆశ్రమానికి వచ్చి తగురీతిగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. మునిపతికిని వినయము సే । సిన నిట రాకకుఁ గతంబు సెప్పు మనియె న**
**జ్జనవంద్యుఁ డక్కుమారుం । 'డనఘా! మధ్యస్థవృత్తివై వినవలయున్'. 126**

**ప్రతిపదార్థం:** మునిపతికిని= మునిరాజునకు; వినయముచేసినన్= నమస్కరించగా; ఆ+జనవంద్యుఁడు= ఆ జనులకు నమస్కరించ దగిన మునిరాజు; ఇట రాకకున్= ఇచటికి వచ్చుటకు; కతంబు= కారణం; చెప్పుము+అనియెన్= చెప్పుము అన్నాడు; ఆ+కుమారుండు= ఆ కాశీరాజు కొడుకు; అనఘా!= పాపం లేనివాడా!; మధ్యస్థవృత్తివై= నడుమసాక్షివై; వినవలయున్= వినాలి.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠుడికి నమస్కరించినంతనే ఆయన 'నీ విక్కడకు వచ్చిన కారణ మే?'మని అడిగాడు. ఆ రాజకుమారుడు 'మహాత్మా! నీవు మా మధ్య సాక్షివై వినాలి'.

**వ. అని పలికి, తమకులంబు వీతహవ్యుని కొడుకులచేత నశించిన విధంబును, దాను వారల నందఱ వ్రుందించుట యును, వీతహవ్యుం డాహవంబునం దనకు నోడి పాఱుటయును జెప్పి, 'మునీంద్రా! యారా జిటవచ్చె; నాతనిం బొలియించుటకై వచ్చితి' ననిన నత్తపోధనసత్తముండు. 127**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; తమకులంబు= తమ వంశం; వీతహవ్యుని కొడుకులచేతన్= వీతహవ్యుని కుమారులచేత; నశించిన విధంబును= నాశనమైన పద్ధతిని; తాను= ప్రతర్దనుడనే పేరుగల తాను; వారలన్+అందఱన్= వారినందరినీ; వ్రుందించుటయును= చంపటాన్నీ; వీతహవ్యుండు= వీతహవ్యుడు; ఆహవంబునన్= యుద్ధంలో; తనకున్= తనకు; ఓడి=

పరాజయం పొంది; పాఱుటయును= పారిపోవటాన్నీ; చెప్పి= తెలియజేసి; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడైనవాడా! ఆరాజు= ఆ వీతహవ్యుడనే నరపతి; ఇటన్= ఇచటికి; వచ్చెన్= వచ్చాడు; ఆతనిన్= అతనిని; పొలియించుటకై= రూపుమాపటానికై; వచ్చితిని= వచ్చాను; అనినన్= అని చెప్పగా; ఆ తపస్+ధన, సత్తముండు= తపస్సే ధనంగా గల గొప్పవాడైన ఆ భృగుమహర్షి.

**తాత్పర్యం:** అని చెప్పి తన వంశమంతా వీతహవ్యుడి కొడుకులచేతిలో నాశనం కావటం, తాను వాళ్ళ నందరినీ చంపటం, వీతహవ్యుడు యుద్ధంలో తనచేత ఓడిపోయి పారిపోవటం చెప్పి 'మునీంద్రా! ఆ రాజిక్కడ దాక్కున్నాడు కనుక అతడిని చంపటానికై వచ్చాను' అని చెప్పగా విని ఆ మునిశ్రేష్ఠుడు (అన్నాడు).

**క. 'విను మిచ్చట నృపకుల సం । జనితుఁడు, లేఁ; డింతయుం బ్రశస్త మహీదే**
**వ నికాయమ; కనుఁగొను'మని । తన శిష్య ప్రతతిఁ జూపె దయ చిగురొత్తన్. 128**

**ప్రతిపదార్థం:** వినుము= (విషయం చెప్పుతాను జాగ్రత్తగా) వినుము; ఇచ్చటన్= ఇక్కడ; నృపకుల= రాజవంశంలో; సంజనితుఁడు= పుట్టినవాడు; లేఁడు; ఇంతయున్= వీరంతా; ప్రశస్త= శ్రేష్ఠమైన; మహీదేవ= భూదేవతల, బ్రాహ్మణులయొక్క; నికాయము+అ= సమూహమే; కనుఁగొనుము= చూడుము; అని= అట్లాచెప్పి; దయ= కారుణ్యం; చిగురు+ఒత్తన్= పల్లవించగా, చిగురించగా; తన శిష్య= తన శిష్యులయొక్క; ప్రతతిన్= సమూహాన్ని, చూపెన్= చూపించాడు.

**తాత్పర్యం:** 'చెప్పుతున్నాను వినుము. ఇక్కడ రాజవంశీయు డెవడూ లేడు. ఉన్న వారంతా బ్రాహ్మణులే. చూడు' మని దయతో వీతహవ్యుడితో కూడియున్న తన శిష్యులను చూపించాడు.

**వ. చూపినం జూచి. 129**

**తాత్పర్యం:** అలా చూపించగా తాను పరీక్షగా చూచి.

**ఆ. అతఁడు నగుచు, భృగుని యడుగుల కెఱఁగి, మ । హాత్మ! దీన నేఁ గృతార్థవృత్తి**
**నైతిఁ బగతు నిట్లు జాతికిం బెడఁ బాపి । గాసి గాఁగఁ జేయఁగంటిఁ గాన. 130**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ కాశీరాజు కొడుకు; నగుచున్= నవ్వుతూ; భృగుని అడుగులకున్= భృగుమహర్షి పాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; మహాత్మ!= మహానుభావా!; దీనన్= దీనితో; నేన్= నేను; కృత+అర్థవృత్తిన్+ఐతిన్= నెరవేరిన ప్రయోజనం కలవాడనైనాను; ఇట్లు= ఈ విధంగా; పగతున్= శత్రువును; జాతికిన్= తన జాతికి; పెడన్+పాపి= దూరం చేసి; గాసికాఁగన్= దుఃఖపడువానినిగా; చేయన్ కంటిన్= చేయగలిగాను; కానన్= కనుక.

**తాత్పర్యం:** అతడు నవ్వి మహర్షి పాదాలకు నమస్కరించి, 'మహాత్మా! నేను దేనికొరకు ఇంతకాలం ప్రయత్నించానో, ఆ ప్రయోజనం నెరవేర్చుకోగలిగాను. అదేమంటే క్షత్రియుడైన వీతహవ్యుడిని అతడి జాతికి దూరం చేసి బాధపడేట్లు చేయగలిగాను.

**క. కలుగునె యమోఘ మగు నీ । పలుకున, కన్యతత్వ? మేను బనివినియెద, న**
**న్నలఘు కృపఁ జూడు మని తగఁ । బలికిన, ముని ప్రీతి నానృపతి వీడ్కొలిపెన్. 131**

**ప్రతిపదార్థం:** అమోఘము= వమ్ముకాని; నీపలుకునకున్= నీ వాక్కునకు; అన్ృతత్వము= అసత్యం; కలుగునె?= అంటునా? ఏను= నేను; పని వినియెదన్= సెలవు తీసికొంటాను; నన్నున్= నన్ను; అలఘుకృపన్= గొప్పదయతో; చూడుము= రక్షించుము; అని; తగన్= తగునట్లుగా (పెద్దలతో మాట్లాడేపద్ధతిగా); పలికినన్= పలుకగా; ముని= భృగుమహర్షి; ప్రీతిన్= ప్రేమతో; ఆ నృపతిన్= ఆ రాజును; వీడ్కొలిపెన్= పంపాడు.

**తాత్పర్యం:** మహాత్మా! నీ మాటకు అసత్యదోష మంటుతుందా? ఇక నేను సెలవు తీసికొంటాను. నన్ను దయతో చూడుము' అని చక్కగా (వినయంగా) చెప్పేసరికి ముని సంతోషంతో ఆ రాజును పంపాడు.

**ఆ. వీతహవ్యుఁడును మహాతపస్సందీప్తుఁ । డైన యమ్మునీంద్రు నప్రతర్క్య**
**భంగి భాషణముల బ్రాహ్మణుఁ డై గృత్స । మద సమాఖ్యుఁ గాంచె మహితసుతుని. 132**

**ప్రతిపదార్థం:** వీతహవ్యుఁడును= వీతహవ్యుడు కూడా (తర్వాత); మహాతపః= గొప్ప తపస్సుచేత; సందీప్తుఁడు+ఐన= ప్రకాశించే; ఆ+ముని+ఇంద్రు= ఆ మునిశ్రేష్ఠుడియొక్క; అప్రతర్క్య= తర్కించరాని; భంగి= పద్ధతిగల; భాషణములన్= మాటలతో; బ్రాహ్మణుఁడు+ఐ= విప్రుడై; మహిత= గొప్ప; సుతునిన్= కొడుకును; గృత్సమద= గృత్సమదుడన్న; సమాఖ్యున్= పేరుగలవాడిని; కాంచెన్= కన్నాడు, పొందాడు.

**తాత్పర్యం:** తరువాత వీతహవ్యుడు కూడా మహాతపశ్శక్తి గల ఆ మునీంద్రుడి గొప్ప మాటల ప్రభావంతో బ్రాహ్మణుడై గృత్సమదు డనే కొడుకును కన్నాడు.

**వ. తత్పుత్రపౌత్ర క్రమంబున సుతేజసుండును, వర్చసుండును, నిహవ్యుండును, వితత్యుండును, సత్యుండును, సంతుండును, శ్రవసుండును, దమసుండును, బ్రకాశుండును, వాగీంద్రుండును, బ్రమతియును, రురుండును, సముదుండును, శునకుండును, శౌనకుండును నన మహాద్విజులు జన్మించి; రిట్లు విద్యా మౌక్తిక శ్రేణి వంశంబగు మునివంశంబునకు మూలం బయి యవ్వీతహవ్యుండు భవ్యకీర్తి వడసెఁ; బాండవాగ్రజా! యింక నెయ్యది యడిగెద వడుగు' మనుటయు, నతండు 'దైవంబును, బౌరుషంబును నను రెంటియందు నెయ్యది యధికంబు సెప్పు' మనిన నప్పురుషవరుండు 'దొల్లి' యిట్లు వసిష్ఠుండు బ్రహ్మ నడిగిన నమ్మహాత్ముం డుపదేశించిన వాక్యంబుల యర్థంబు లుపన్యసించెద నాకర్ణింపు' మని యిట్లనియె. 133**

**ప్రతిపదార్థం:** తత్= అతడియొక్క; పుత్రపౌత్ర = కొడుకులు, మనుమల; క్రమంబునన్= వరుసలో; సుతేజసుఁడు, వర్చసుఁడు, నిహవ్యుఁడు, వితత్యుఁడు, సత్యుఁడు, సంతుఁడు, శ్రవసుఁడు, దమసుఁడు, ప్రకాశుఁడు, వాగీంద్రుఁడు, ప్రమతి, రురుఁడు, సముదుఁడు, శునకుఁడు, శౌనకుఁడు; అనన్= అన్న పేర్లుగల; మహాద్విజులు= మహాబ్రాహ్మణులు; జన్మించిరి= పుట్టిరి; ఇట్లు= ఈ విధంగా; విద్యా= విద్యలన్న (14 శాస్త్రవిద్యలు); మౌక్తిక= ముత్యాల; శ్రేణి= వరుస; సమూహం; వంశంబు= కులం; అగు= అయిన; మునివంశంబునకున్= ముని కులానికి; మూలంబు+అయి= మొదలై; ఆ+వీతహవ్యుండు= ఆ వీతహవ్యుడు; భవ్య= శ్రేష్ఠమైన; కీర్తిన్= పేరు ప్రఖ్యాతులను; పడసెన్= పొందాడు; పాండవ+అగ్రజా! పాండవులలో తొలుత పుట్టిన ధర్మజా! ఇంకన్= మరి; ఏ+అది= (ఎయ్యది)= ఏది; అడిగెదవు= చెప్పుమందువో; అడుగుము= చెప్పుము; అనుటయున్= అనిపల్కగా; అతండు= ధర్మజుడు; దైవంబును= అదృష్టం; పౌరుషంబును= మానవప్రయత్నం; (ఇది మనిషియొక్క కృషి దానిఫలితమిచ్చే దాని పేరు దైవం. అది కన్పించదు); అను రెంటియందున్= అనే రెండింటిలో; ఏ+అది(ఎయ్యది)= ఏది;

అధికంబు= గొప్పది; చెప్పుము= తెల్పుము; అనినన్= అని అడుగగా; ఆ+పురుషవరుండు= ఆ మానవశ్రేష్ఠుడు, భీష్ముడు; తొల్లి= పూర్వం; ఇట్లు= ఈ ప్రకారం; వసిష్ఠుండు= వసిష్ఠుడు; బ్రహ్మన్= బ్రహ్మదేవుని; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; ఉపదేశించిన= చెప్పిన; (మంత్రోపదేశమన్న మాటలో ఉపదేశం వేరు) వాక్యంబుల= మాటలయొక్క; అర్థంబులు= అభిప్రాయం, సారాంశం; ఉపన్యసించెదన్= చెపుతాను; ఆకర్ణింపుము= వినుము; అని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వీతహవ్యుడికి సుతేజసుడు మొదలుగాగల పుత్రపౌత్రు లనేకులు జన్మించారు. వారంతా మహాబ్రాహ్మణులై అనేక విద్యలనే ముత్యాలను పండించారు. ఆ వంశానికి మూలం వీతహవ్యుడే. నాయనా! పాండవాగ్రజా! ఇంకా ఏమడుగుతావో అడుగు చెప్పుతాను. అన్నంతనే ధర్మరా జడిగాడు. 'మహాత్మా! దైవం, పౌరుషం - ఇందులో ఏది గొప్పది? (కొందరు మనిషి చేతిలో ఏమున్నది అంతా దైవానిదే అంటున్నారు. మరికొందరు దేవుడు అన్నం పెట్టుతాడా? మనమే పండించుకొనాలి అంటున్నారు కనుక) అని అడిగితే ఆ మానవోత్తముడు భీష్మ డన్నాడు. 'పూర్వం నీవలెనే వసిష్ఠుడు బ్రహ్మ నడిగాడు. ఆయన చెప్పిన మాటలు నీకు చెప్పుతాను. సారాంశం గ్రహించుము' అని ఇట్లా చెప్పసాగాడు.

**విశేషం:** అలం: శ్లేష. విద్యామౌక్తిక శ్రేణి వంశంబు - వంశము : వెదురుపొద అని కూడా అర్థమున్నది. అది ఏ విధంగా అల్లుకుపోతుందో అలాగే కులం కూడా పుత్ర పౌత్రాది రూపంగా అధికమౌతుంది. వెదురులో ముత్యాలు పుట్టుతాయని కవిసమయం ఉన్నది. ఇక్కడ విద్యలే ముత్యాలు. అందుకని వంశమంటే రెండర్థాలలో కవిబ్రహ్మ ప్రయోగించాడని భావించాలి.

### భీష్ముండు ధర్మరాజునకు దైవపౌరుషంబులతెఱం గెఱింగించుట (సం. 13-6-1)

**క. క్షేత్రంబు పురుష కారము । ధాత్రీశ్వర! బీజ మరయ దైవము! రెండున్**
**సూత్రపడఁ గూడె నేని౦ । బాత్రం బగుఁ, గర్మకరుఁడు ఫలమున కెందున్. 134**

**ప్రతిపదార్థం:** ధాత్రీ+ఈశ్వర!= భూమికి పాలకుడైనవాడా! (ధర్మజా!); పురుషకారము= మానవప్రయత్నం, పౌరుషం; క్షేత్రంబు= భూమి (స్త్రీ); దైవము= అదృశ్య శక్తి (కన్పించని అదృష్టశక్తి); అరయన్= పరికించగా; బీజము= విత్తు; రెండున్= ఈ రెండు; సూత్రపడన్= ఒకే సూత్రానికి సరిగా; కూడెన్+ఏనిన్= కూడగలిగితే; కర్మకరుఁడు= కర్మ చేసే మనిషి (పౌరుషశక్తి); ఫలమునకున్= ఫలితానికి; ఎందున్= ఎప్పుడైనా, ఎక్కడైనా; పాత్రంబు= అర్హుడు; అగున్= కాగలడు.

**తాత్పర్యం:** పౌరుషం చేను. దైవం విత్తు. ఈ రెండు కలవగలిగేటట్లు ప్రయత్నించే మనిషి చక్కని ఫలం పొందగలడు.

**విశేషం:** దైవం+పౌరుషం = మానవజీవితం; బీజం+క్షేత్రం= పంట; మనిషి జీవితంలో ఈ రెండూ విరుద్ధశక్తులు. ఒకటి పౌరుషం మన చేతిలో ఉన్నది. ఫలమిచ్చే అదృష్టం - కన్పించని శక్తి దైవం. ఈ రెండూ కలిస్తే మానవజీవితం సఫలమౌతుంది. ఈ విధంగా భారతీయ సంస్కృతి రెంటినీ - మనిషినీ, దైవాన్నీ కలుపుకొన్నది. జీవిత సాఫల్యాని కిదే మార్గం.

**క. విను, పురుషుఁడు గావింపని । పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్?**
**జనములు గార్యము నడపఁగ । ననుకూలత నిచ్చుఁ గాక యయ్యైఫలముల్. 135**

**ప్రతిపదార్థం:** విను= జాగ్రత్తగా ఆలకించుము (అన్న అర్థంలోనే ఈ క్రియను ప్రయోగిస్తాడు కవిబ్రహ్మ); పురుషుఁడు= వ్యక్తి; మనిషి (మగవాడని అర్థం లేదు. స్త్రీకూడా); కావింపని= చేయని; పనులకున్= కార్యాలకు; దైవము= అదృష్టం; అది ఎట్లు= అది ఏ విధంగా; ఫలమున్= ఫలితమును; ఒనరించున్?= చేస్తుంది?, ఇస్తుంది?; జనములు= మానవులు; కార్యమున్= పనులను; నడపఁగన్= చేయగా; అయ్యై ఫలముల్= ఆయా ఫలితాలు; అనుకూలతన్= ఆనుకూల్యంతో; ఇచ్చున్ కాక= ఇస్తాడు తప్ప.

**తాత్పర్యం:** మనిషి ఏ పనీ చేయకుండా కూర్చుంటే దైవం మాత్ర మేం చేస్తుంది? మనుషులు పనులు చేస్తే ఆయా ఫలాలను దైవ మిస్తుంది తప్ప. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** మనిషిలోని అలసతను, బద్ధకాన్ని పోగొట్టే సూక్తి ఇది. చాలా గొప్పది.

**తే.** **పౌరుషమ్ము. దైవంబు తోడ్పాటు లేక । ఫలముఁ బొందంగనేరదు పార్థివేంద్ర!**
**విత్తు సహకారి గాకున్న రిత్తనేల । వంధ్య మగుఁ గాక, తా ఫలవంత మగునె?** **136**

**విశేషం:** పార్థివ+ఇంద్ర!= రాజులలో గొప్పవాడా!; పౌరుషంబు= పురుష ప్రయత్నం; దైవంబు= దైవముయొక్క; తోడ్పాటు లేక= సహకారం లేక; ఫలమున్= ఫలితాన్ని; పొందంగనేరదు= పొందలేదు; విత్తు= గింజ; సహకారి= తోడ్పాటు, తోడు; కాకున్నన్= కాకపోతే; రిత్తనేల= వట్టినేల; వంధ్యము= గొడ్డుబోతు (ఎడారి); అగున్+కాక= అవుతుంది తప్ప; తాన్= నేల; ఫలవంతము+అగునె!= ఫలిస్తుందా?

**తాత్పర్యం:** రాజులలో గొప్పవాడా! దైవం సహకరించకపోతే పౌరుషం ఫలవంతం కాలేదు. విత్తు తోడ్పాటు లేకుండా నేల బీడుపడ్డట్లు అవుతుంది తప్ప ఫలాన్ని ఇస్తుందా? (ఇవ్వదని భావం.)

**తే.** **మేలు రెండు లోకంబుల మేల తెచ్చు; । గీడు సేసినఁ దప్పదు కీడ యగుట**
**కాన పురుషవర్తనమున కానుకూల్య । శీల మగు దైవ మది ఫలసిద్ధిఁ జేయు.** **137**

**ప్రతిపదార్థం:** మేలు= ఇతరులకూ తనకూ క్షేమం కోరితే; రెండు లోకంబులన్= ఈ లోకంలో పరలోకంలో; మేలు+అ, తెచ్చున్= క్షేమాన్నే కలిగిస్తుంది; కీడు+అ= ఆపద; చేసినన్= చేస్తే; కీడు+అ= కీడే; అగుట తప్పదు= కాక తప్పదు; కాన= కాబట్టి; పురుషవర్తనమునకున్= మనిషి నడవడికి; ఆనుకూల్య= అనుకూలతను కల్పించే; శీలము= స్వభావం; అగు= అయిన; దైవము= అదృష్టం; అది= ఆ దైవం; ఫలసిద్ధిన్= ఫలమును కల్గించటం; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** మేలు చేస్తే రెండు లోకాలలో మేలే. కీడు చేస్తే కీడే. కనుక మనిషి ప్రయత్నానికి అనుకూలించే స్వభావం కల దైవం పని ఏదైతే అదే ఫలితాన్నిస్తుంది. (మేలో కీడో నీవే ఎంచుకొని చేయాలి)

**క.** **అనలం బించుక యైనఁ బ । వనుచే వెలుఁగొందు మాడ్కి వర్ధనముం బొం**
**దును సత్కర్మాచరణం । బున దైవము నానుకూల్యము గురుప్రవరా!** **138**

**ప్రతిపదార్థం:** కురు ప్రవరా!= కురువంశంలో శ్రేష్ఠుడా!; అనలంబు= అగ్ని; ఇంచుక+ఐనన్= కొంచెమైనా; పవనుచేన్= గాలిచేత; వెలుఁగు+ఒందు= ప్రకాశించే; మాడ్కిన్= విధంగా; సత్కర్మ = మంచిపనులు; ఆచరణంబునన్= చేయటంవలన; దైవము= దైవముయొక్క; ఆనుకూల్యము= అనుకూలత; వర్ధనమున్= పెరుగుటను; పొందును= పొందగలదు.

**తాత్పర్యం:** ధర్మజా! నిప్పు కొంచెమైనప్పటికీ గాలితో పెరిగి ప్రకాశించినట్లు మంచిపనులు చేయటంవలన దైవానుకూల్యం పెరుగుతుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. నేయి పాలు పఱిన దీవియ । మాయుకరణిఁ, గర్మశుద్ధి మలిఁగిన హీన**
**త్వాయత్తంబై తానును । మాయును దైవానుకూల్య మహిమ మహీశా! 139**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశా!= రాజా!; నేయి= నెయ్యి; పాలుపు= ఉనికి; అఱిన= నశించిన; దీవియ= దీపం; మాయుకరణిన్= ఆరిపోయినట్లు; కర్మశుద్ధి= పనులలో స్వచ్ఛత్వం; మలిఁగినన్= నశించిపోగా; దైవ+ఆనుకూల్య= దైవానుకూలత్వముయొక్క; మహిమ= మహత్త్వం; తానును= తాను కూడా; మాయును= నశిస్తుంది.

**తాత్పర్యం:** రాజా! నేయి తగ్గిపోతే దీపకాంతీ తగ్గిపోతుంది కదా! అట్లాగే మనిషి చేసే కర్మలలో పవిత్రత లోపిస్తే దైవానుకూలత కూడా లోపిస్తుంది.

**విశేషం:** అలం : ఉపమ. ఈ పద్యంలో దీపం అందమైన ఉపమానం. అది నేతి దీపం. అదీ పూజలలో వెలిగించే దీపం. కనుక ఆరిపోకూడదు. మనిషి పరిశుద్ధ కర్మ నెయ్యి. దైవం అనుకూలించటం దీపం వెలగటం. ఆ వెలుగు ఇంటికి అలంకారమే కాక ఏదెక్కడ ఉన్నదో కన్పింప చేస్తుంది. అట్లాగే సత్కర్మ కూడా.

**తే. పరశురాముఁడు, భృగుఁడును, బలియు, లోను । గాఁగ మహనీయ పురుషులు గర్మసూక్ష్మ**
**భంగిఁ గలుషితదైవప్రభావితాత్ము । లైరి; కర్మంబు దైవంబు నలఁతు లెట్లు. 140**

**ప్రతిపదార్థం:** పరశురాముఁడు, భృగుఁడును; బలియున్= బలిచక్రవర్తి; లోనుగాఁగన్= మొదలైన; మహనీయ పురుషులు= మహానుభావులైన వ్యక్తులు; కర్మ= కర్మలయొక్క; సూక్ష్మభంగిన్= రహస్యం వలన; కలుషిత= మలినం చేయబడిన, దైవప్రభావిత= దైవ ప్రభావానికి లోనైన; ఆత్ములు+ఐరి= ఆత్మలు కలవారయ్యారు; కర్మంబు= కార్యము; దైవంబు= దైవమూ; అలఁతులు= తక్కువవి; ఎట్లు= ఎట్లాగా; ఏ విధంగా? (తక్కువ విషయాలు కావు).

**తాత్పర్యం:** పరశురాముడు మొదలైన వారు మహాత్ములయినా కర్మలు బహుసూక్ష్మరహస్యం కలవి కావటంచేత వారికి దైవం కలుషితమైపోయింది. దాని ప్రభావానికి వారూ లోనుకాక తప్పలేదు. కాబట్టి కర్మ, దైవం తక్కువ విషయాలుకావు.

**క. విను, పౌరుషమును, దైవము । నన రెండును గార్యఫలము నందింపఁగ నె**
**ట్టనఁ గారణములు గావున । జననాయక! సదృశములు విచారింపంగన్' 141**

**ప్రతిపదార్థం:** జననాయక!= ప్రజలకు నాయకుడైనవాడా!; విను= ఆలకించుము; విచారింపంగన్= ఆలోచిస్తే; పౌరుషమును= పురుష ప్రయత్నమూ; దైవమున్= దేవుడూ; అనన్= అనే; రెండును= రెండూ కూడా; కార్యఫలమును= పనికి ఫలితాన్ని, అందింపఁగన్= అందివ్వటానికి; నెట్టనన్= తప్పనిసరి అయిన; కారణములు= హేతువులు; కావునన్= కాబట్టి; సదృశములు= రెండు సమానాలే.

**తాత్పర్యం:** ఆలోచిస్తే ఒక పని ఫలవంతం కావటానికి దైవ పౌరుషాలు రెండూ ఉండి తీరాలి. కనుక ఆ రెండింటిలో ఎక్కువ తక్కువలు లేవు. రెండూ సమానమే'.

**వ. అనిన విని ధర్మ తనయుండు 'సత్కర్మంబుల నయ్యెడు ఫలంబులు వినవలతు' ననుటయు నక్కురుసత్తమునకు నక్కురు పితామహుం డిట్లనియె. 142**

**ప్రతిపదార్థం:** ధర్మతనయుండు= యముడి కుమారుడు (ధర్ముఁడు= యముడు), సత్కర్మంబులన్= మంచిపనులవలన; అయ్యెడు= కలిగే; ఫలంబులు= ఫలితాలు; వినన్= వినాలని, వినటానికి; వలతున్= కోరుకొంటున్నాను, ఇష్టపడుతున్నాను; అనుటయున్= అనగా; ఆ+కురు సత్తమునకున్= కురువంశంలో ఉత్తముడైన వాడికి - ధర్మరాజుకు; ఆ+కురు పితామహుండు= కౌరవులకు తాత - భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పటం విని ధర్మరాజు 'మంచి పనులకు కలిగే ఫల మెట్లా ఉంటుందో వినాలని కుతూహలంగా ఉన్న' దనగానే తాత భీష్మ డిట్లా అన్నాడు.

**సీ. 'అధ్వపరిశ్రాంతుఁ డగు వింతవానికి । నన్నం బిడిన ఫల మట్టి దిట్టి**
**దనఁ బెద్ద యగ్ని సమారాధనమునకుఁ । బౌరుష శ్రేష్ఠత భవ్యదాన**
**ములకుఁ, దత్తద్వస్తువులమహామహిమలు । మౌనంబునకుఁ బరిజ్ఞానశక్తి**
**యతుల తపంబున కధికభోగము లహిం । సకు రూప, బల, చిదైశ్వర్య, సిద్ధి**

**తే. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాస । ములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబు**
**లాహరించి యునికి కాధిరాజ్యము, పత్త్ర । భక్షతకు, దివంబు ఫలము లధిప! 143**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; (అధి= పైనుండి అధిష్ఠించి; ప= పాలించేవాడు); అధ్వ= బాటలో; పరిశ్రాంతుఁడు+అగు= అలసినవాడైన; వింతవానికిన్= పరాయివాడికి (దారిన పోయే వాడికి); అన్నంబు= అన్నం; ఇడినఫలంబు= పెట్టినదానికి వచ్చే ఫలితం; అట్టిది+ఇట్టిది అనన్= అట్లాంటిది, ఇట్లాంటిది, అనటానికి; పెద్ద= గొప్పది; అగ్ని= అగ్నియొక్క; సమారాధనమునకున్= చక్కని పూజకు; పౌరుషశ్రేష్ఠత= శ్రేష్ఠమైన ప్రయత్నం (ఫలం); భవ్యదానములకున్= మంచి దానకర్మలకు (మంచివారికి చేసే దానకర్మలకు); తత్ తత్= ఆయా; వస్తువుల= ద్రవ్యములయొక్క; మహా= గొప్ప; మహిమలు= మహత్త్వములు; మౌనంబునకున్= మౌన (మాట్లాడకుండా ఉండటం) వ్రతానికి; పరిజ్ఞానశక్తి= మంచిజ్ఞానశక్తి; అతుల= సాటిలేని; తపంబునకున్= తపస్సుకు; అధికభోగంబులు= గొప్పసుఖానుభవాలు; అహింసకున్= దేనినీ చంపని వ్రతానికి; రూప= మంచి ఆకారం; బల= సత్తువ, శక్తి; చిత్= జ్ఞానం; ఐశ్వర్య= ధన అధికారాలు; సిద్ధి= లబ్ధి; బ్రహ్మచర్యమునకున్= బ్రహ్మచారి వ్రతానికి; పరమ= గొప్ప; ఆయువు= ఆయుష్షు; ఉపవాసములకున్= అన్నం తినకుండా; జపసంధ్యాదులు చేస్తూ భగవంతుడికి మనస్సులో దగ్గరకావటానికి (ఉప= సమీపంలో; వాసము= ఉండటం, భగవంతుడికి సమీపంగా ఉండటం); చిత్తశుద్ధి= స్వచ్ఛమైన మనస్సు (కలగటం ఫలం); ఫల= పండ్లు; జల= నీళ్ళు; ఆహరించి= తిని; ఉనికిన్= ఉండటానికి; ఆధిరాజ్యము= రాజ్యపాలనం; పత్త్ర భక్షతకున్= ఆకులు తినే వ్రతానికి; దివంబు= స్వర్గం; ఫలములు= ఫలితాలు.

**తాత్పర్యం:** అలసిపోయిన బాటసారికి అన్నం పెట్టటంకంటె గొప్ప ధర్మం లేదు. దానివల్ల వచ్చే ఫలితాన్ని ఎంచటానికి వీల్లేదు. అగ్ని ఆరాధనంవలన మంచి ప్రయత్న సిద్ధి కలుగుతుంది. మంచివారికి దానం చేస్తే ఆయా

వస్తువుల సిద్ధి (కలుగుతుంది). మౌన వ్రతానికి ఫలితం జ్ఞానశక్తి లభించటం, గొప్ప తపస్సుకు అధికభోగం, అహింసకు రూపబలజ్ఞాన ఐశ్వర్యాలు ఫలాలు. బ్రహ్మచర్య వ్రతానికి దీర్ఘాయువు ఫలం. ఉపవాసానికి ఫలం చిత్తశుద్ధి. నీళ్ళూ, పండ్లూ తింటూ బ్రతకటానికి ఫలితం రాజ్యపరిపాలన. ఆకులు మాత్రం తింటూ చేసే తపస్సుకు స్వర్గం ఫలం. (బాటసారికి అన్నదానం, అగ్ని ఆరాధన, దానకర్మ, మౌనం, తపస్సు, అహింస, బ్రహ్మచర్యం, ఉప వాసం, పండ్లు, ఆకులు తింటూ బ్రతకటం - ఇవన్నీ పవిత్ర వ్రతాలుగా చేసేవారికి ఆయా ఫలితాలు చెప్పే పద్యం.)

**క. శ్రుతిపఠనమునకు, నర్థ । ప్రతి బోధంబునకు, వరుస ఫలములు సౌఖ్య**
**స్థితియును, సుగతియు; సత్య । వ్రతమునకు ఫలంబు ముక్తి వసుధాధీశా! 144**

**ప్రతిపదార్థం:** వసుధా= భూమికి; అధి+ఈశా!;= అధిపతివైన రాజా!; శ్రుతి= వేదం; పఠనమునకున్= చదవటానికి; అర్థ= దాని అర్థంయొక్క; ప్రతిబోధంబునకున్= జ్ఞానానికి, చెప్పటానికి; వరుసన్= వరుసగా; సౌఖ్యస్థితియును= సుఖంగా ఉండటం; సుగతియున్= మరణానంతరం స్వర్గస్థితి; ఫలములు= ఫలితాలు; సత్యవ్రతమునకున్= సత్యం చెప్పాలన్న నియతికి; ముక్తి= మోక్షం; ఫలంబు= ఫలితం.

**తాత్పర్యం:** భూమికి అధిపతివైన ఓ రాజా! వేదం పఠిస్తే సౌఖ్యమూ, దానికర్థం గ్రహిస్తే సుగతీ, సత్యవ్రతానికి ముక్తి ఫలితం.

**క. ద్రుమముల దళకుసుమఫలో । ద్గమములక్రియఁ గర్మముల నొదవుఁ దత్ఫలముల్**
**దమ తమ తఱిఁ గర్తకు భో । గ్యములై నియతిని శుభాశుభాకారములన్. 145**

**ప్రతిపదార్థం:** ద్రుమములన్= చెట్లలో; దళ= ఆకులూ; కుసుమ= పూలూ; ఫల= పండ్లూ (వీటియొక్క); ఉత్+గమముల= పొటమరించటం, ఆకుతొడగటం, పూలు పూయటం, కాయలు కాయటం; క్రియన్= వలె; కర్తకున్= కర్మలు చేసేవాడికి; భోగ్యములై= అనుభవించ దగినవై; నియతిని= నియమం తప్పక; శుభ= శుభం; అశుభ= చెడు; ఆకారములన్= రూపాలలో; (మంచి చెడు రూపాలలో); తమ తమ = శుభ అశుభ కర్మలు; తఱిన్= సమయాలలో; తత్ తత్= ఆయా (శుభాశుభ); కర్మములన్= కర్మల వలన; ఫలితముల్= ఫలితాలు; ఒదవున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** మనిషి చేసే మంచి పనులకు, చెడ్డ పనులకు ఆయా సమయాలలో ఆయా కర్మలవల్ల మంచి చెడు ఫలితాలు కలుగుతాయి. ఎట్లాగంటే కాలానుగుణంగా చెట్లకు ఆకులు, పువ్వులు, కాయలు, పండ్లు కలిగినట్లుగా మంచి చెడ్డ ఫలితాలుకూడా కలుగుతాయి.

**విశేషం:** అలం: ఉపమ. చాలా అందమైన పోలిక.

**వ. అని చెప్పి. 146**

**తాత్పర్యం:** ఆ విధంగా ఉదాహరణ పూర్వకంగా బోధించి.

**చ. వినుము, జరానుబంధమున వెండ్రుకతండముఁ, బండ్లు, వీనులుం**
**గనుఁగవయున్, జరం బొరయుఁ గాని యొకప్పుడు దృష్ణ జీర్ణగా;**

**దనయముఁ బేర్చి, ప్రాణముల నన్నక పోవనిరోగ మల్పబు**

**ద్ధినరులు ద్రోవ లే రది, మదిం జొరనీరు సుఖార్థులై బుధుల్.** **147**

**ప్రతిపదార్థం:** వినుము; జరా+అనుబంధమునన్= ముసలితనంయొక్కసంబంధం చేత; వెంద్రుక= జుట్టు; తండము= సమూహం; పండ్లు= దంతాలు; వీనులున్= చెవులున్నూ; కను+కవయున్= కళ్ళజంటా; జరన్= వృద్ధాప్యమును; పొరయున్= పొందుతాయి; కాని; ఒకప్పుడున్= ఏనాటికీ; తృష్ణ= కోరిక; జీర్ణగాదు= జీర్ణించదు,నశించదు; పేర్చి= ఎసరేగి, విజృభించి; ప్రాణములన్= ప్రాణాలను; అన్నక= అణచక, చావగొట్టక; పోవనిరోగము= చచ్చినా పోనిరోగం; అల్పబుద్ధి= స్వల్పబుద్ధి కల; నరులు= మనుష్యులు, త్రోవ లేరు= త్రోసివేసికొనలేరు; అది= అట్లాంటి ఆలోచన; మదిన్= మనస్సులో; చొరనీరు= ప్రవేశించనివ్వరు; బుధుల్= పండితులున్నూ; సుఖార్థులు+ఐ= సుఖం కోరుకొన్నవారై; త్రోవలేరు= త్రోసికొనలేరు; అది= అట్లాంటి ఆలోచన; మదిన్= మనస్సులో; చొరనీరు= ప్రవేశించనివ్వరు; బుధుల్= పండితులున్నూ; సుఖార్థులు+ఐ= సుఖం కోరుకొన్నవారై.

**తాత్పర్యం:** ముసలితనం రాకతో జుట్టు, దంతాలు, చెవులు, కళ్ళూ ముసలివౌతాయి. కాని, కోరికకు మాత్రం ముసలితనం రాదు. ప్రాణా లున్నంతవరకూ పోని రోగ మది. అది రోగ మని కూడా అల్పబుద్ధులైన నరులు ఆలోచించరు. పండితులు కూడా సుఖాలు మరిగి, కోరిక అన్న రోగాన్ని పోగొట్టుకొందామన్న ఆలోచన మనస్సులోనికి కూడా రానివ్వరు.

**క. పాపంబుఁ బుణ్యమును దృ । ష్ణా పరులకు దుఃఖసౌఖ్య సంపాదులగున్**

**భూపాల! వితృష్ణులు, ని । ర్లేపు లగుట వారిఁ బొందలే వా ఫలముల్.** **148**

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; పాపంబున్= పాపం; పుణ్యమును= పుణ్యమూ; తృష్ణాపరులకున్= కోరికలున్నవారికి; దుఃఖ, సౌఖ్య సంపాదులు+అగున్= దుఃఖాన్ని, సౌఖ్యాన్ని కలిగిస్తాయి; వితృష్ణులు= కోరికలు లేనివారు; నిర్లేపులు= విరక్తులు; అగుటన్= అయినందువలన; ఆ ఫలముల్= ఆ సుఖదుఃఖాలు; వారిన్= నిర్లేపులను; పొందలేవు= పొందజాలవు.

**తాత్పర్యం:** లోకానురక్తులైన వారికి పాపపుణ్యకర్మలు దుఃఖాన్ని కలిగిస్తే, మమకారం లేనివారికి విరక్తులకు ఆ ఫలాలు కలుగవు. (వారికి సుఖదుఃఖ అనుభవం ఉండదు. రెంటినీ ఒకటిగానే చూస్తారు)

**వ. అని పల్కినం, బాండునందను లందఱుం ప్రభూత హర్షోత్కర్షంబు నొందిరి; గంగానందనుండు ధర్మనందను నుద్దేశించి, యీ యర్థజాతంబు మునిప్రణీతంబయి యధిగతం బైనది, నీకు నుపదేశించితి 'నీవింక నేమి వినవల' తనవుడు, నా భూవల్లభుండు 'నిజాశ్రయంబున కాస్పదం బయిన పురుషునెడ భక్తజనంబు చరితం బెట్టిది గావలయు?' నని యడిగిన నతం డతని కిట్లనియె.** **149**

**ప్రతిపదార్థం:** పాండు నందనులు= పాండురాజు కొడుకులు; ప్రభూత= మిక్కిలి; హర్ష= సంతోషముయొక్క; ఉత్కర్షంబున్= ఆధిక్యం; ఒందిరి= పొందినారు; గంగానందనుండు= గంగకొడుకు భీష్ముడు; ధర్మనందనున్= ధర్మరాజును; ఉద్దేశించి= లక్షించి; ఈ+అర్థజాతంబు= ఈ శాస్త్రవిషయ సమూహం; ముని ప్రణీతంబు+అయి= మునులచేత రచించబడి; అధిగతంబు+ఐనది= చదువబడినది, పొందబడినది; నీకున్; ఉపదేశించితిన్= బోధించాను; నీవు; ఇంకన్; ఏమి; వినవలతు(వు)= వినగోరెదవు; అనవుడున్= అనిన మీదట; ఆ భూ వల్లభుండు= భూమికి పతి, రాజు; నిజ= తనకు, తనయొక్క;

ఆశ్రయంబునకున్= ఆధారానికి; ఆస్పదంబు= తావు, ఆటపట్టు; అయిన; పురుషునెడన్= యజమానుడైన వ్యక్తి విషయంలో; భక్తజనంబు= భక్తులైన మానవులయొక్క; చరితంబు= నడవడి; ఎట్టిదికావలయున్= ఎట్లా ఉండాలి? అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్!

**తాత్పర్యం:** అని చెప్పగా పాండవులంతా బ్రహ్మానంద భరితులయ్యారు. అప్పుడు భీష్ముడు ధర్మరాజుతో అన్నాడు; 'ఈ విషయం పూర్వ మునులు చెప్పగా మనకు దక్కిన విద్య. అదే నీకూ చెప్పాను. ఇంకా ఏమి వినాలనుకొంటున్నావో చెప్పుము' అనగానే ధర్మరాజు 'తమ జీవితాలకు ఆధారమైన యజమానుని యెడల అతడి దగ్గర బ్రతికే వా రెట్లా నడచుకొనాలో చెప్పుము' అని అడుగగా భీష్మ డతడితో ఈ విధంగా అన్నాడు.

**భీష్ముఁడు ధర్మజున కాశ్రయం బెప్పుడు నపరిత్యాజ్యం బని చెప్పుట (సం.13-11-1 (కుంభ))**

**క. 'విను, కాశీశ్వరుదేశం । బున నొక లుబ్ధకుఁడు వేఁట వోయిన చోటన్**
**ఘనతర విషదిగ్ధశరం । బున నేసిన మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్. 150**

**ప్రతిపదార్థం:** కాశీ+ఈశ్వరు= కాశీరాజు; దేశంబునన్= రాజ్యంలో; ఒక లుబ్ధకుఁడు= ఒక కిరాతుడు; వేఁట పోయినచోటన్= వేటకై వెళ్ళినచోట; ఘనతర= మిక్కిలి గొప్ప; విషదిగ్ధ= విషం పూసిన; శరంబునన్= బాణంతో; మృగమున్= లేడిని; ఏసినన్= కొట్టగా; తప్పి= అది తప్పిపోయి; భూజమున్= చెట్టును; తాఁకెన్= తగిలింది.

**తాత్పర్యం:** కాశీదేశంలో ఒక వేటగా డున్నాడు. వా డొక రోజున వేటకు పోయి విషంపూసిన వాడి అయిన బాణాన్ని ఒక లేడిపై ప్రయోగించాడు. అది తప్పిపోయి చెట్టుకు గ్రుచ్చుకొన్నది.

**క. పూవులఁ గాయలఁ బెరిగిన । యా వృక్షము శుష్క మయ్యెఁ; నవ్విధమున ధా**
**త్రీవర! తదీయ కోటర । మావాసము గాఁగ, నొక మహాశుక ముండున్. 151**

**ప్రతిపదార్థం:** ధాత్రీవర!= భూపతికి పతివైనవాడా! పూవులన్= పూలతో; కాయలన్= కాయలతో; పెరిగిన; ఆ వృక్షము= ఆ చెట్టు; ఆ+విధమునన్= ఆ రీతిగా (ఉన్నదున్నట్లుగా); శుష్కము+అయ్యెన్= ఎండిపోయింది; తదీయ= ఆ చెట్టుయొక్క; కోటరము= తొర్ర; ఆవాసము= ఇల్లు, నివాసం; కాఁగన్= అవునట్లుగా; ఒక మహాశుకము= గొప్ప పేరుగల చిలుక; ఉండున్= ఉండేది.

**తాత్పర్యం:** పూలతో కాయలతో ఏపుగా పెరిగిన ఆ చెట్టు ఆ బాణానికి నిలువునా మాడిపోయింది. దాని తొర్రలో ఒక పెద్ద చిలుక కాపురముండేది. (గొప్ప పేరుగల అన్నమాటకు అర్థం 155వ పద్యంలో ఉన్నది)

**క. అది తరువు విడిచిపోవక, । హృదయంబున భక్తి పేర్మి నెండను గాలిన్**
**బెదరక ధృతిమై నయ్యెడఁ । గదలకయుండె ననుజీవిగౌరవ మెసఁగన్. 152**

**ప్రతిపదార్థం:** అది= ఆ చిలుక; తరువున్= చెట్టును; విడిచిపోవక= విడిచివెళ్ళకుండా; హృదయంబునన్= మనస్సులో; భక్తి పేర్మిన్= భక్తియొక్క అతిశయంతో; ఎండను= ఎండకు; గాలిన్= గాలికి; బెదరక= భయపడక; ధృతిమైన్ = ధైర్యంతో; ఆ+ఎడన్= అక్కడే; అనుజీవి= ఆశ్రయించిన ప్రాణియొక్క; గౌరవము= మర్యాద; ఎసఁగన్= ప్రకాశించగా; కదలక ఉండెన్= ఎటూ పోకుండా అక్కడే ఉన్నది.

**తాత్పర్యం:** ఆ చిలుక గాలికీ, ఎండకూ బెదరక ఎండిన ఆ చెట్టునే ఆశ్రయించుకొని ఉన్నది. ఇన్నాళ్ళు ఆ చెట్టు తన కాశ్రయ మిచ్చిందన్న గౌరవ భావమే ధైర్యం కాగా ఎటూ పోలేదు.

**ఉ. దాని యుదాత్త వృత్తము శతక్రతుఁ, డాత్మ నెఱింగి వచ్చి , 'బెం**
**డైనది యిమ్మహీజము; మహాతరువుల్ ఫలవృద్ధి నొంది యి**
**క్కాన ననేకముల్ గలుగఁగా, నిటు లేటికి నిందు నిల్వ నో**
**మానితకీరమా!' యనియె మానుష భంగికరూప మొప్పఁగన్. 153**

**ప్రతిపదార్థం:** శతక్రతుఁడు= ఇంద్రుడు (నూరు యజ్ఞాలు చేసినవాడు); దాని= ఆ చిలుకయొక్క; ఉదాత్త= నీతి కల గొప్ప; వృత్తము= నడవడి; ఆత్మన్= తనలో; ఎఱింగి= చూచి; ఈ+మహీజము= చెట్టు; (మహీ= భూమినుండి; జము= పుట్టినది); బెండు+ఐనది= ఎండిపోయినది; ఫలవృద్ధిన్= పండ్ల సమృద్ధి; ఒంది= పొంది; మహాతరువుల్= ఉన్నత వృక్షాలు; ఈ+కానన్= ఈ అడవిలో; అనేకముల్= చాలా; కలుగఁగాన్= ఉండగా; ఇందున్= ఈ ఎండిన చెట్టుపైనే; ఏటికిన్= ఎందుకు; ఇటులు= ఈ విధంగా; నిల్వన్= నిల్చుట; ఓ మానిత= ఓ పొగడదగిన; కీరమా!= చిలుకా!; మానుషభంగిక రూపము= మనిషివలె ఆకారం; ఒప్పఁగాన్= ప్రకాశింపగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు చిలుక వృత్తాంతం తనంత తాను తెలిసికొని చిలుక దగ్గరకు వచ్చి 'ఓ చిలుకా! ఈ అడవిలో ఫలసమృద్ధి గల చెట్లు ఎన్నో ఉన్నాయి కదా! ఇంకా ఈ ఎండిన చెట్టునే ఆశ్రయించి దేని కున్నట్లు?' అని అన్నాడు.

**వ. అనిన విని యా శుకంబు. 154**

**తాత్పర్యం:** అనగా విని ఆ చిలుక.

**చ. 'అనయము పండుచుండు నెడ నాశ్రయ మొప్పిన నిల్చి, యెండి పో**
**యినతఱిఁ బాసి పోక తగ వెట్లు? కృతఘ్నత గాదె యివ్విధం**
**బనిమిషనాథ!' యన్న నతఁ డచ్చెరువంది 'పురాకృతోప సం**
**జనిత విశేష మీ ఖగము జానుగ నన్ను నెఱింగె, దీనికిన్. 155**

**ప్రతిపదార్థం:** అనయము= ఎప్పుడు; పండుచుండునెడన్= పండ్లు పండేవేళ; ఆశ్రయము= ఆధారం; ఒప్పినన్= చిక్కగా; నిల్చి= ఉండి; ఎండిపోయిన తఱిన్= ఎండినప్పుడు; పాసి= వదలి; పోక= పోవటం; కృతఘ్నతకాదె= చేసినమేలు మరవటం కదా; అనిమిషనాథ!= దేవతలకు రాజా! ఇంద్రా! (అనిమిషులు= రెప్పపాటు లేనివారు, దేవతలు); అన్నన్= అనగా; అతఁడు= ఇంద్రుడు; అచ్చెరువు= ఆశ్చర్యం; అంది= పొంది; ఈ ఖగము= ఈ పక్షి, పురాకృత= పూర్వజన్మలో చేసిన పుణ్యం వలన; ఉపసంజనిత= చక్కగా పుట్టిన; విశేషము= ఎన్నదగినది; జానుగన్= చక్కగా; నన్నున్= దేవతలకు రాజైన నన్నే; ఎఱింగెన్= గుర్తించింది; (కనుక) దీనికిన్= దీనికి.

**తాత్పర్యం:** 'చెట్లు పండినపుడు ఉండటం, ఎండినపుడు విడిచిపెట్టి పోవటం కృతఘ్నత కదా! మహేంద్రా!' అని చిలుక అనేటప్పటికి ఇంద్రు డనుకొన్నాడు - 'అరే! ఇది పూర్వజన్మ వాసనా విశేషంవలన నన్ను గుర్తుపట్టగలిగింది. కనుక ఈ గొప్ప పక్షికి. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. మే లొనర్చెదం గాక!** **156**

**తాత్పర్యం:** శుభం చేస్తాను గాక! (నిశ్చయించటం)

**క. 'అని తలఁచి నీదు పలుకులు । విని మెచ్చితి; వరము గోరు విహగోత్తమ! నీ'**
**వనిన, శుకంబు మహీజం । బునకుం బే రెలమి వేఁడె భూపవరేణ్యా!** **157**

**ప్రతిపదార్థం:** భూ ప= భూమికి పతులైనవారిలో; వరేణ్యా!= మిక్కిలి శ్రేష్ఠమైనవాడా!; అని= ఈ విధంగా; తలఁచి= ఇంద్రుడనుకొని; నీదు= నీయొక్క; పలుకులు= మాటలు; విని; మెచ్చితిన్= మెచ్చుకొన్నాను; విహగ= పక్షులలో; ఉత్తమ!= గొప్పదానా!; వరమున్= శ్రేష్ఠమైన కోరికను; కోరు= కోరుకొమ్ము; నీవు; అనినన్= అనగానే; శుకంబు= చిలుక; మహీజంబునకున్= చెట్టుకు; పేరు+ఎలమిన్= గొప్ప సంతోషాన్ని; వేఁడెన్= కోరింది.

**తాత్పర్యం:** రాజా! ఇంద్రు డావిధంగా మనస్సులో భావించుకొని చిలుకతో 'మహా శుకమా! నీ మాటలు నాకు ఆనందాన్ని కలిగించాయి. కనుక నీ కేదైనా వరమిస్తాను కోరుకొమ్ము' అన్నాడు. వెంటనే చిలుక 'స్వామీ! ఈ చెట్టుకు పూర్వవైభవాన్ని అనుగ్రహించుము' అని అన్నది. (చూచావా ఆ చిలుక ఎంత గొప్పదో తనకు ఏ మేలూ కోరుకోకుండా చెట్టు మేలును కోరింది).

**ఆ. అమరవల్లభుండు నమృతసేచనమునఁ । భూజమునకుఁ దొంటి పొల్పు కంటె**
**మిగుల నెలమి సేసె; మేలియాశ్రితు లిట్ల । మనుతు రధిపుఁ గురుకుమారవర్య!** **158**

**ప్రతిపదార్థం:** కురుకుమార వర్య!= కౌరవులలో మంచివాడా!, శ్రేష్ఠుడా!; అమర= దేవతలకు; వల్లభుండు= రాజు; అమృత సేచనమునన్= అమృతాన్ని చల్లటం వలన; భూజమునకున్= భూమినుండి పుట్టినది, చెట్టునకు; తొంటి= ముందటి; పొల్పుకంటెన్= అందంకంటె; మిగులన్= ఎక్కువ; ఎలమిన్= సంతోషమును; చేసెన్= కల్గించాడు; అధిపున్= ఏలినవాడిని, యజమానుని, ఆశ్రయమిచ్చిన వాడిని; మేలి= మంచి; ఆశ్రితులు= ఆశ్రయించి బ్రతికేవారు; ఇట్లు+అ= ఇదే విధంగా; మనుతురు= రక్షిస్తారు.

**తాత్పర్యం:** కౌరవులలో ఉత్తముడా! ఇంద్రుడు అమృతం చల్లి చెట్టుకు పూర్వ వైభవంకంటె గొప్ప వైభవా న్నిచ్చాడు. తనను కాపాడినవారిని మంచి ఆశ్రితులు ఇట్లాగే రక్షిస్తారు'.

## విభునకుం బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట (సం.13-8-1)

**వ. అనిన నతం'డెవ్వరిఁ బాటించుట విభులకు వలయు'నని యడిగిన నా భూపతికి భీష్ముం డిట్లనియె.** **159**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అతండు= ధర్మరాజు; విభులకున్= రాజులకు, యజమానులకు; ఎవ్వరిన్= ఎవరిని; పాటించుట= ఆదరించటం; వలయును= చేయాలి; అని; అడిగినన్; ఆ భూపతికిన్= భూమికి పతియైన ధర్మజునకు; భీష్ముండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు 'ఆశ్రితులలో ఎవరిని ఎట్లా యజమానులు ఆదరించాలి'? అని అడుగగా భీష్ముడు అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది పోషించే వారికి సంబంధించిన విషయం.

**సీ.** **'జననాథ! విను, తప స్స్వాధ్యాయముఖ కర్మ । కరణత నుభయలోకముల వశగ**
**తములఁ జేయఁగఁ జాలు ధాత్రీసురులు మన్న । నకుఁ బాత్రములు; పతి నాతి కెట్లు**
**రాజునకును నట్లు బ్రాహ్మణుఁ డొడయుండు । బ్రాహ్మణుం డను మాట పావనంబు,**
**హర్షించి శుభముల నలిగి యాపదల నిం । ద్రునికైనఁ జేయు విప్రుండు నృపతి**

**తే.** **గొడుకుఁ బోలె నరయ, గురుఁ బోలెఁ గొలువంగ । నగ్నిఁ బోలె నిష్ఠ నర్చితుఁడుగఁ**
**జేయవలయు విప్రుఁ జెప్పెద, వేదసం । వాద; మేకబుద్ధి నాదరింపు.** **160**

**ప్రతిపదార్థం:** జననాథ!= ప్రజలకు స్వామి!; తపః+స్వాధ్యాయ, ముఖ, కర్మ, కరణతన్= తపస్సు, వేదము చదవటం మొదలైన పనులను చేయటం వలన; ఉభయలోకములన్= రెండులోకాలను, ఈ లోకము, పరలోకము అనేవానిని; వశగతములన్= అధీనమైనవానినిగా; చేయఁగన్+చాలు= చేయటానికి సమర్థులైన; ధాత్రీసురులు= భూదేవతలు (బ్రాహ్మణులు); మన్ననకున్= గౌరవానికి; పాత్రములు= యోగ్యులు; పతి= మగడు; నాతికిన్= స్త్రీకి; ఎట్లు= ఎట్లో; అట్లు= ఆ విధంగా; బ్రాహ్మణుఁడు= విప్రుడు; రాజునకును= ఏలికకు; ఒడయుండు= స్వామి; బ్రాహ్మణుండు+అను మాట= బ్రాహ్మణుడు పలికేమాట; పావనంబు= పవిత్రమైనది; విప్రుండు= జ్ఞానవిద్యాసంపదగల బ్రాహ్మణుడు; ఇంద్రునికిన్+ఐనన్= దేవేంద్రునకు కూడా; హర్షించి= సంతోషము పొంది; శుభములన్= మేలైన ఫలములను; అలిగి= కోపించి; ఆపదలను= కీడులను; చేయున్= చేయగలడు; నృపతి= రాజు; విప్రున్= ఉత్తమబ్రాహ్మణుని; కొడుకున్, పోలెన్= కన్నకుమారుని వలె; అరయన్ వలయున్= కాపాడాలి; గురున్+పోలెన్= జ్ఞానమును ప్రసాదించిన గురువును వలె; కొలువంగన్, వలయున్= పూజించాలి; నిష్ఠన్= చెదరని బుద్ధితో; అగ్నిన్+పోలెన్= అగ్నిదేవుని విధంగా; అర్చితుఁడుగన్= పూజలందుకొనిన వానినిగా; చేయన్, వలయన్= చేయాలి; (దీనికి ప్రమాణభూతంగా) వేద సంవాదమున్= వేదంలోని తార్కాణరూపమైన వాక్యాన్ని; చెప్పెదన్= నీకు తెలియజేస్తాను; ఏకబుద్ధిన్= చెదరని మదితో; ఆదరింపు= శ్రద్ధతో గ్రహించు.

**తాత్పర్యం:** రాజా! వినుము. తపస్సు, వేదాధ్యయనం వంటి కర్మలు చేయటం వలన ఉభయలోకాలను అరచేతిలో పెట్టగల బ్రాహ్మణులను గౌరవించాలి. వారు సతికి పతివలె రాజుకు యజమానులు. వారి మాటలు పావనమైనవి. ఇంద్రుడికైనా సరే! వారు హర్షిస్తే సుఖం. అలిగితే కీడు కల్పించగలరు. రాజు విప్రుడిని కొడుకువలె కాపాడాలి. గురువువలె చూడాలి. అగ్నివలె పూజించాలి. దీనికి సంబంధించిన వేద సంభాషణం చెప్పుతున్నాను. ఏకాగ్రబుద్ధివై వినుము.

**విశేషం:** తపస్సు అంటే ఒక విషయాన్ని గూర్చి అతిగాఢంగా భావన చేయటం. దానికోసం చేసే అతికఠినమైన దేహేంద్రియాలను వశం చేసుకొనే ప్రక్రియలన్నీ తపస్సు క్రిందికి వస్తాయి. స్వాధ్యాయం అంటే తనకు సంప్రదాయ సిద్ధంగా ఏర్పడిన వేదాన్ని లేదా వేదశాఖలను గురుముఖాన అభ్యసించటం. విప్రుడు- 'విద్యయా యాతి విప్రత్వమ్' అన్నమాటను బట్టి విద్య అంటే విముక్తిని ప్రసాదించే జ్ఞానమే కనుక అది పుష్కలంగా కలవాడు.

**వ.** **వేదంబులు దమలోన గోష్ఠి సేయుచున్న సమయంబున.** **161**

**తాత్పర్యం:** వేదాలు తమలో తాము చర్చిస్తున్న వేళ.

**సీ. బ్రాహ్మణజాతికిఁ బరిభవం బొనరింప । మున్ను చేసిన పుణ్యములు నశించు,**
**జపహోమముఖ కర్మసంచయంబున కధి । కతరంబు విప్రముఖమున నిడుట.**
**భూసురార్చన మొక మాసంబు సలిపినఁ । బాపంబులెల్లను బాసిపోవు,**
**నగ్రవర్ణులఁ గాంచి యాదరింపక యుండు । కంటెను, గీడొండు గలుగ దరయ,**

**తే. నని క్రమంబున ఋగ్వేదమును యజుస్సు । సామము నధర్వణమ్మును, సారభూత**
**భవ్య సంభాషణముసేఁత దివ్యమునుల । వలన విందుము, కౌరవకులపవిత్ర!' 162**

**ప్రతిపదార్థం:** కౌరవకుల= కురువంశంలో; పవిత్ర= పావనమైనవాడా!; ఋగ్వేదం చెప్పుతున్నది; బ్రాహ్మణ జాతికిన్= బ్రాహ్మణ జాతికి; పరిభవంబున్= అవమానం; ఒనరింపన్= చేస్తే; మున్ను చేసిన= పూర్వం చేసిన; పుణ్యములు= పవిత్రకర్మఫలాలు; నశించున్= నశిస్తాయి; యజుర్వేదం చెప్పినది; జప, హోమ, ముఖ= జపం, హోమం చేయటంవంటి; కర్మసంచయంబునకున్= కర్మలను చక్కగా కూర్చుటకన్నను; అధికతరంబు= చాలా ఎక్కువ; విప్రముఖమునన్= బ్రాహ్మణున కెదురుగా (భక్తితో); ఇడుట= ఇవ్వటం; సామవేదమిట్లా అంటున్నది; భూసుర= భూదేవతలైన బ్రాహ్మణులయొక్క; అర్చనము= పూజను; ఒక మాసంబు= ఒక నెల; సల్పినన్= చేస్తే; పాపంబులు= అపవిత్రకర్మల ఫలాలు; ఎల్లను= అన్నీ; పాసిపోవున్= నశిస్తాయి; అధర్వణవేద మన్నది; అగ్రవర్ణులన్= పైకులంవారిని; కాంచి= చూచి; ఆదరింపక= ఆదరించకుండా; ఉండుటకంటెను= ఉండటం కంటె; అరయన్= ఆలోచించి చూస్తే; ఒండు= మరొక; కీడు= ఆపద, అశుభం; కలుగదు; అని= ఈ విధంగా; ఋగ్యజుస్సామాధర్వణ వేదాలు క్రమక్రమంబునన్= వరుసగా (గీతపద్యంలోని నాలుగు వేదాలు కర్తలు. పై నాలుగు పాదాలు వీటికి క్రమంగా అన్వయించుకొనటమే క్రమం); సారభూత= సారాంశమైన; భవ్యసంభాషణము= మేలైన వాదం; చేఁత= చేయటం; దివ్యమునులవలనన్ విందుము= దివ్యులైన మునుల ద్వారా వింటున్నాము.

**తాత్పర్యం:** కురువంశంలో పవిత్రమైనవాడా! మునులద్వారా వింటున్నాము. బ్రాహ్మణజాతికి అవమానం చేస్తే పూర్వం చేసిన పుణ్యాం నశిస్తుందని ఋగ్వేదం చెప్పుతున్నది. విప్రులకు చేసే దానం, జపం, హోమం మొదలైన వైదిక కర్మలకంటె ఎక్కువైనదని యజుర్వేదం చెప్పుతున్నది. ఒక నెల బ్రాహ్మణులను పూజిస్తే పాపాలన్నీ తొలగుతాయని సామవేదం చెప్పుతున్నది. పై కులం వారిని చూచి ఆదరించకుండా ఉండటం కంటె ఆలోచించి చూస్తే మరొక ఆపదలేదని అధర్వణవేదం తెలుపుతున్నది'.

### భీష్ముఁడు ధర్మరాజునకుఁ బరమమైన ధర్మంబు చెప్పుట (సం.13-18-1 (కుంభ))

**సీ. అని చెప్పి, భీష్ముఁ డమ్మనుజేంద్రుతోఁ 'బర । మశ్రేష్ఠమైన ధర్మంబుఁ దెలియ**
**విను' మని పల్కి యిట్లను; మద్రనాథుండు । సత్యవతీ పుత్రచరణములకు**
**నెఱఁగి కేలు మొగిడ్చి, యెద్దాని నెఱుఁగుట । యెఱుకల కెల్లను నెక్కుడని, స**
**భక్తిక సమ్మతిఁ బ్రార్థించి యడిగిన;। నమ్మహాముని దయ నతనిఁ జూచి**

**తే. విష్ణు నెఱుఁగు టధిక విమలబోధము, యజ్ఞ । మూర్తి, యజ్ఞకర్తృమూర్తి, యజ్ఞ**
**కలనమూర్తి, యజ్ఞ ఫలమూర్తి, విష్ణుఁ; డ । తండు కృష్ణుఁ డమలతరచరిత్ర!' 163**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; భీష్ముఁడు= భీష్ముడు ఆ విధంగా పల్కి; ఆ+మనుజ+ఇంద్రుతోన్= ఆ రాజుతో - ధర్మరాజుతో; పరమ= గొప్ప; శ్రేష్ఠము= ఉన్నతం; ఐన; ధర్మంబున్= ధర్మాన్ని; తెలియన్ వినుము; అని పల్కి; ఇట్లు; అనున్; మద్రనాథుండు= మద్రదేశానికి రాజైనవాడు - శల్యుడు; సత్యవతీ పుత్ర= సత్యవతి కుమారుడైన వ్యాసుడి; చరణములకున్= పాదాలకు; కేలు మొగిడ్చి= అంజలిఘటించి; ఎఱఁగి= నమస్కరించి; ఏ+దానిన్= దేనిని; ఎఱుఁగుట= తెలియటం; ఎఱుకల కెల్లనున్= అన్ని జ్ఞానాలలోకీ; ఎక్కుడు= ఎక్కువ; అని; సభక్తిక= భక్తితో కూడిన; సమ్మతిన్= ఇష్టంతో; ప్రార్థించి= ప్రార్థనాపూర్వకంగా; అడిగినన్= అడుగగా; ఆ+మహాముని= ఆ మహర్షి; దయన్= కృపతో; అతనిన్= అతడిని; చూచి; విష్ణున్= శ్రీమహావిష్ణుని; ఎఱుఁగుట= తెలియుట; విమలబోధము= స్వచ్ఛమైన జ్ఞానం; అమలతర చరిత్ర= నిర్మలమైన నడవడి కలవాడా!; యజ్ఞమూర్తి= యజ్ఞమే ఆకారంగా కలవాడు; యజ్ఞకర్తృమూర్తి= యజ్ఞం చేసే యజమానుని స్వరూపుడు; యజ్ఞకలనమూర్తి= యజ్ఞమందుండేవాడు; యజ్ఞఫలమూర్తి= యజ్ఞఫలమే ఆకారమైనవాడు; విష్ణుఁడు= విష్ణుమూర్తి; అతండు; కృష్ణుఁడు= ఆ కృష్ణుడే విష్ణువు;

**తాత్పర్యం:** అని చెప్పి మరల భీష్ము డిట్లా ధర్మరాజుతో అన్నాడు. 'నీవలెనే మద్రరాజు వ్యాసమహర్షి పాదాలకు నమస్కరించి జ్ఞానాలలో ఉత్తమజ్ఞానమే' దని అడిగితే ఆ మహర్షి చెప్పాడు; 'నిర్మలచరిత్రా! యజ్ఞమూర్తి, యజమానమూర్తి. యజ్ఞకలనమూర్తి, యజ్ఞఫలమూర్తియే విష్ణువు. అతడిని తెలియటమే ఉత్తమజ్ఞానం. ఆ విష్ణువే ఈ కృష్ణుడు.

**వ. అని పల్కి యమ్మహాత్ముండు వెండియు శల్యున కిట్లనుఁ 'గృష్ణుండు వినుచుండఁ గొందఱు బ్రాహ్మణు లతని నుపలక్షించి, నాతో నిబ్బాలుండు యాదవుండైన వసుదేవునకుఁ గంసానుజయైన దేవకియందు జన్మించిన వాఁ; డితని నీవు క్రతుపురుషుండని కొనియాడుటకుఁ గతం బేమి? యని యడిగిన నన్నారాయణుండు నగుచు నన్నుఁ గన్గొని 'వీరలప్రశ్నంబునకు నుత్తరంబు దగనిత్తుగాక' యనిన నద్దేవునికిం బ్రణమిల్లి యే నిట్లంటి.164**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పల్కి= మాటాడి; ఆ+మహా+ఆత్ముండు= దొడ్డబుద్ధిగల వ్యాసమహర్షి; వెండియున్= ఇంకా; శల్యునకున్= మద్రరాజైన శల్యునకు; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; కొందరు, బ్రాహ్మణులు= కొందరు బ్రాహ్మణ జాతికి చెందినవారు; కృష్ణుండు= వాసుదేవుడు; వినుచుండన్= వింటూ ఉండగా; అతనిన్= ఆ శ్రీకృష్ణుని; ఉపలక్షించి= ఉద్దేశించి; నాతోన్= నాతో; ఈ+బాలుండు= ఈ పసివాడు; యాదవుండు= యదువంశంవాడు; ఐన= అయినట్టి; వసుదేవునకున్= వసుదేవుడనేవానికి; కంస+అనుజ= కంసుని చెల్లెలు; ఐన= అయిన; దేవకియందున్= దేవకి అనే స్త్రీయందు; జన్మించినవాఁడు= పుట్టినవాఁడు; నీవు; ఇతనిన్= ఇట్టి ఈ బాలుని; క్రతు పురుషుండు= యజ్ఞాత్మకుడైన వ్యక్తి; అని; కొనియాడుటకున్= పొగడటానికి; కతంబు= కారణం; ఏమి= ఏమిటి?; అని; అడిగినన్= ప్రశ్నింపగా; ఆ+నారాయణుండు= సాక్షాత్తు నారాయణుడే అయిన వాసుదేవుడు; నగుచున్= నవ్వుతూ; నన్నున్= నన్ను (వ్యాసుని) కన్గొని= చూచి; వీరలప్రశ్నంబునకున్= వీరిప్రశ్నకు; ఉత్తరంబున్= సమాధానాన్ని; తగన్= తగు విధంగా; ఇత్తు+కాక= ఇవ్వు; అనినన్= అంటే; ఆ+దేవునికిన్= దేవుడైన ఆ శ్రీకృష్ణునకు; ప్రణమిల్లి= సాష్టాంగదండ నమస్కారం చేసి; ఏను= నేను; ఇట్లు= ఈ విధంగా; అంటిన్= చెప్పాను.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి ఇట్లా చెప్పి ఇంకా అన్నాడు; 'శల్యా! కొంతమంది బ్రాహ్మణులు ఒకసారి కృష్ణుడిని దృష్టిలో పెట్టుకొని ఆయనముందే నాతో అన్నారు. 'ఇతడు యాదవుడైన వసుదేవుడికీ, కంసుని చెల్లెలు దేవకికీ పుట్టినబాలుడు. ఇతడిని యజ్ఞపురుషుడైన విష్ణు వంటా వేమిటి?' అని. అది విని కృష్ణుడు నవ్వుతూ నాతో అన్నాడు; 'వీళ్ళ ప్రశ్నలకు సరిపోయే సమాధానం చెప్పుము' - అని అపు డా దేవుడికి నమస్కరించి నే నిట్లా అన్నాను.

**వ. 'వేదమయుఁడు, వేదవేద్యుండు, వేదార్థ । విత్తమప్రియుండు, విష్ణుఁ డీతఁ**
**డిట్టిఁ డగుట, యాత్మ నెఱుఁగుట యుత్తమ । బ్రాహ్మణత్వసిద్ధి భవ్యులార!' 165**

**ప్రతిపదార్థం:** భవ్యులు+ఆర!= ఉత్తములారా!; విష్ణుఁడు+ఈతఁడు= ఈ కృష్ణుడే విష్ణువు; వేదమయుఁడు= వేదములే స్వరూపంగా కలవాడు; వేదవేద్యుండు= ఆ వేదములచేతనే తెలియదగినవాడు; వేదార్థ= వేదాల అర్థాన్ని; విత్= తెలిసినవారిలో; తమ= శ్రేష్ఠులకు; ప్రియుండు= ఇష్టమైనవాడు; ఇట్టిఁడు= ఇటువంటివాడు (ఈ కృష్ణుడు); అగుటన్= కావటం; ఆత్మన్= మనసులో; ఎఱుఁగుట= తెలియటం; ఉత్తమ= గొప్ప; బ్రాహ్మణత్వ సిద్ధి= బ్రాహ్మణత్వాన్ని పొందటం.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణత్వ సిద్ధికి ఫలమేమంటే - శ్రీకృష్ణుడే వేదమయుడు. వేదవేద్యుడు. వేదార్థం తెలిసిన పండితులకు ఇష్టుడైనవా డని తెలియటమే'.

**వ. అనిన విని వారలు దద్భావనం గృతకృత్యులై 'రని చెప్పిన మద్రవిభుండు మానసంబు మాలిన్యరహితంబును బ్రసాద సహితంబును నయి చరితార్థుండయ్యెఁ; బాండవాగ్రజా! నీకు నీయర్థంబు విజ్ఞాతం బగుట యెఱుంగుదు, నైననుం బ్రజ్ఞావిశుద్ధి కరణం బాచరించితి' నని చెప్పుటయు నతం డత్యంత సంతుష్టాంత రంగుండై 'గరుత్మంతుండు మహానుభావుం డని విందు, నవ్విహగవిభుని వృత్తాంతంబు తెఱం గెఱుంగ వినవలతు వివరింపవే', యనుటయు నతం డచ్యుతునాలోకించి, 'యాసుపర్ణుండు నీవ కా వినియుండుదుం జెప్పెద' ననవుడు నప్పుండరీకాక్షుండు వికచవదనుండై 'యట్లచేయు; మిక్కురుపతి కోర్కి దీర్చుట కర్తవ్యం' బని పల్కిన, నా దేవవ్రతుండు భూవల్లభున కిట్లనియె. 166**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; వారలు= శ్రోతలు, విన్నవారు; తత్= (వ్యాసమహర్షి చెప్పిన కృష్ణ సంబంధమైన) దానియొక్క, అతడియొక్క; భావనన్= ఏకాగ్రధ్యానంచేత; కృతకృత్యులు+ఐరి= ధన్యులైరి; అని చెప్పినన్; మద్రవిభుండు= మద్రదేశరాజు, శల్యుడు; మానసంబు= మనస్సు; మాలిన్యరహితంబు= మలినం లేనిదీ; ప్రసాదసహితంబును= ప్రసన్నతతో కూడినదీ; అయి; చరిత+అర్థుండు= నెరవేరిన ప్రయోజనం కలవాడు (ధన్యుడు); పాండవ+అగ్రజా! పాండవులలో జ్యేష్ఠుడా! నీకున్= నీకు; ఈ అర్థంబు= ఈ విషయం (శ్రీకృష్ణుడే విష్ణువన్న జ్ఞానం); విజ్ఞాతంబు= తెలిసిందే; అగుట; ఎఱుంగుదున్= తెలియుదును; ఐననున్= ఐనప్పటికి; ప్రజ్ఞా= మేధాశక్తిని; విశుద్ధి కరణంబు= పరిశుద్ధం చేయటం; ఆచరించితిన్= చేశాను; అని; చెప్పుటయున్= చెప్పగా; అతండు= ధర్మరాజు; అత్యంత= మిక్కిలి; సంతుష్ట ఐ= అయి; సంతోషించిన; అంతరంగుండు= ఆత్మ కలవాడు; గరుత్మంతుండు, మహా+అనుభావుండు; అని విందున్= అని విన్నాను; ఆ+విహగ విభుని= ఆ పక్షిరాజు యొక్క; వృత్తాంతంబు= కథయొక్క; తెఱంగు= విధానం; ఎఱుంగన్= తెలిసికొనటానికి; వినన్ వలతున్= వినటానికి ఇష్టపడుతున్నాను; వివరింపవే= విశదీకరించవే (ప్రార్థన); అనుటయున్= అతండు; అచ్యుతున్= (సచ్చిదానంద స్వరూపం నుండి చ్యుతి లేనివాడు ఏమరుపాటు జారుపాటు లేనివాడు) శ్రీకృష్ణుడిని; ఆలోకించి= చూచి; ఆ సు+పర్ణుండు= ఆ గరుత్మంతుడు (గట్టి రెక్కలున్న వాడు) నీవకాన్= నీవే ఐనట్లు (నీవేనని); విని+ఉండుదున్= విని ఉన్నాను; చెప్పెదన్= తెల్పెదను; అనవుడున్= అని చెప్పినమీదట; ఆ+పుండరీక+అక్షుండు= తెల్లని తామరరేకులవంటి కన్నులున్నవాడు; వికచ= వికసించిన; వదనుండై= ముఖం కలవాడై; అట్లు+అ= ఆ ప్రకారమే; చేయుము; ఈ+కురుపతి= ఈ కౌరవరాజు యొక్క; కోర్కి+తీర్చుట; కర్తవ్యంబు= చేయవలసిన పని; అని పల్కినన్; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; భూవల్లభునకున్= భూమిపతికి, రాజుకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని వారా భావనతో ధన్యులైనారు 'అని చెప్పగా విన్న శల్యుడు స్వచ్ఛమైన మనస్సు కలవాడై - మహామాలిన్యాలన్నీ పోగా ధన్యుడైనాడు. ధర్మజా! నీకీ విషయం తెలిసిందే ఐనా నీ మనస్సును పరిశుద్ధం చేయటానికి ఇది చెప్పాను' అని చెప్పగా విని ధర్మరాజు 'గరుత్మంతుడు మహాత్ముడని విన్నాను. అతడి కథ వినాలని ఉన్నది చెప్పవా' అని ప్రార్థించాడు. భీష్ముడు శ్రీకృష్ణుడిని చూచి 'స్వామీ! నీవే ఆ గరుత్మంతుడవని విన్నాను' అన్నాడు. ఆయన కూడా తెల్లని కన్నులు విప్పారగా ముఖం వికసింప చేసికొని, 'మంచిది. ఈ రాజు కోర్కె తీర్చటం ముఖ్యం కనుక చెప్పు' మనగా, ఆ భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

### భీష్ముఁడు ధర్మజునకు గరుత్మంతుని చరిత్రంబు చెప్పుట (సం. 13-19-1 (కుంభ))

**సీ. 'కశ్యపు భార్యలు కద్రువ, వినత నాఁ। గల రాతపస్వి వారలకు వరము**
**గరుణ నిచ్చెద నన్నఁ గద్రువ వేవుర, । వినత యిద్దఱ, వేఁడికొనిరి సుతుల;**
**మునియు 'నట్లగుఁగాక' యనియెఁ; బదంపడి । యండముల్ వేయును, నండయుగము,**
**వరుసన, యా కద్రువకు వినతకుఁ బుట్టె, । నవి కుండముల నిడి, యరసి యుండి**

**తే. రహి సహస్ర మేనూఱేండ్ల నంత నుదయ । మయ్యె, నవ్వేయి గ్రుడ్డుల నధికబలముఁ**
**దేజమును గల్గి యా సర్పరాజి యొప్పు చుండె, నారెండు విరియక యుండె, మఱియు. 167**

**ప్రతిపదార్థం:** కశ్యపుభార్యలు= తొమ్మిదిమంది ప్రజాపతులలో ఒకడగు కశ్యపుని యొక్క పత్నులు; కద్రువ, వినత; నాన్= అనగా; కలరు; ఆ తపస్వి= ఆ ముని; వారలకున్; వరము; కరుణన్= దయతో; ఇచ్చెదన్= ఇస్తాను; అన్నన్= అని పల్కగా; కద్రువ; వేవురన్= వేయిమందిని; వినత; ఇద్దఱన్; సుతులన్= కొడుకులను; వేఁడికొనిరి= కోరుకొన్నారు; మునియున్= కశ్యపుడును; అట్లు+అగుఁగాక= అట్లాగే అవుతుంది; అనియెన్; పదంపడి= తరువాత; అండముల్= గ్రుడ్లు; వేయునున్= వెయ్యి; అండయుగము= గ్రుడ్లయొక్క జత; వరుసన= క్రమంగా; ఆ కద్రువకున్; వినతకున్; పుట్టెన్; అవి= వాటిని; కుండములన్+ఇడి= కుండలలో పెట్టి; అరసి+ఉండిరి= రక్షించుకొంటూ ఉన్నారు. అహిసహస్రము= వేయి పాములు; ఏనూఱు+ఏండ్లు+అంతన్= ఐదువందలసంవత్సరాల తరువాత; ఆ+వేయి గ్రుడ్డులన్= ఆ వేయి గ్రుడ్లనుండి; ఉదయము+అయ్యెన్= జన్మించాయి; అధికబలము= మిక్కిలి బలం, శరీరబలం; తేజమును+కల్గి= ప్రాణశక్తి కల్గి; ఆ సర్పరాజి= ఆ పాముల సమూహం; ఒప్పుచున్+ఉండెన్= ప్రకాశిస్తూ ఉండింది; మఱియున్= ఇంకా; ఆ+రెండున్= వినతగ్రుడ్లు రెండూ; విరియక= పిగులక; ఉండెన్= ఉన్నాయి;

**తాత్పర్యం:** కద్రువ, వినత కశ్యపబ్రహ్మకు భార్యలు. వారికి దయతో 'వరా లిస్తాను కోరుకొ'మ్మన్నాడు ముని. కద్రువ వేయిమంది, వినత ఇద్దరు కొడుకులు కావాలని వేడుకొన్నారు. ఆయన 'అట్లాగే జరుగుతుం దని అన్నాడు. తర్వాత కద్రువకు వేయి, వినతకు రెండు గ్రుడ్లు కలిగితే వారు వాటిని కుండలలో పెట్టి కాపాడుతున్నారు. ఐదువందలేండ్లు గతించినాక కద్రువ వేయిగ్రుడ్ల నుండి వేయి పాములు పుట్టి అధికబలము, తేజస్సుతోను పెరుగుతుండగా, వినతగ్రుడ్లు రెండు పగలనేలేదు.

**క. తన సవతి యైన కద్రువఁ । గని వగపును మత్సరంబుఁ గదిరెడు మదితో**
**వినత గడున్ వేగిరపడి । యనీతి నొకయండ మవియ నడిచె నరేంద్రా! 168**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ప్రజలకు పతివైన రాజా!; వినత; తన సవతిన్ కద్రువన్ కని= సపత్నిఅయిన కద్రువను చూచి; వగపు= దుఃఖం (తనకు సంతానం కలుగలేదని); మత్సరంబున్= అసూయ (దానికి కలిగారని); కదిరెడు= వ్యాపించిన; మదితోన్= మనస్సుతో; కడున్= మిక్కిలి; వేగిరపడి= తొందరపడి; అనీతిన్= నీతిమాలి; ఒకఅండము= ఒక గ్రుడ్డు; అవియన్= పగులునట్లుగా; అడిచెన్= కొట్టింది.

**తాత్పర్యం:** రాజా! సవతి కద్రువను చూచి దుఃఖం, అసూయ కలుగగా వినత తొందరపడి ఒక గ్రుడ్డు పగులకొట్టింది. ఇది నియమాన్ని తప్పటం (సృష్టి నియమాన్ని కాదనటం. ఆ గ్రుడ్లు వాటంతటవే పిగిలి పిల్లలు పుట్టాలి తప్ప పగులకొట్టితే ఎట్లా? అది అనీతి)

**వ. అడిచిన నందు. 169**

**ప్రతిపదార్థం:** అడిచినన్= పగులగొట్టగా; అందున్= అందులోనుండి.

**తాత్పర్యం:** పగులగొట్టగా అందులోనుండి.

**క. పులుఁగొక్కఁడు పూర్వాంగము । గలిగి జనించుటయు, వానిఁ గని, యానతి గ**
**న్నుల నశ్రుకణంబులు పె । ల్లొలుకఁగ శోకమున మునుఁగు నుల్లముతోడన్. 170**

**ప్రతిపదార్థం:** పులుఁగు= పిట్ట; ఒక్కఁడు= ఒకటి; పూర్వ+అంగము= పై శరీరం; కలిగి; జనించుటయున్= పుట్టగా; ఆ సతి= ఆ వినత; వానిన్+కని= అర్ధశరీరం గల కొడుకును చూచి; కన్నులన్= కళ్ళనుండి; అశ్రుకణంబులు= కన్నీటిబొట్లు; పెల్లు= ఎక్కువ; ఒలుకఁగన్= కారగా; శోకమునన్= దుఃఖంలో; మునుఁగు= మునిగిన; ఉల్లముతోడన్= మనస్సుతో;

**తాత్పర్యం:** ఊర్ధ్వశరీరం మాత్రం కల పక్షి పుట్టింది. ఆ తల్లి ఆ కొడుకును చూచి కన్నీళ్ళు కారుస్తూ దుఃఖంలో మునిగిపోయిన మనస్సుతో (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. నివ్వెఱపడి యుండ నయ్యండజంబు. 171**

**ప్రతిపదార్థం:** నివ్వెఱపడి= నిశ్చేష్టురాలై; ఉండన్= ఉండగా, నిలబడి పోగా; ఆ+అండజంబు= ఆ గ్రుడ్డు నుండి పుట్టినపక్షి.

**తాత్పర్యం:** నిశ్చేష్టురాలై ఉండగా ఆ గ్రుడ్డునుండి పుట్టిన పక్షి.

**చ. 'ఇరువుర మేము పుట్టుదు మహీనపు మేనులతో, మహాబల**
**స్ఫురణ వెలుంగ నప్పెనుపుఁ బొందఁగ నీ కవియించి తిట్లు మ**
**త్సరమునఁ జాపలంబునను దత్ఫల మందుము, నీ సపత్నికిన్**
**వరవుడవై చరింపు మని, వారని నెవ్వగ శాప మిచ్చినన్. 172**

**ప్రతిపదార్థం:** మేము; ఇరువురము= ఇద్దరం; పుట్టుదుము= పుట్టేవాళ్ళం; అహీనపు= గొప్ప, తక్కువకాని; మేనులతోన్= శరీరాలతో; మహాబల స్ఫురణ = గొప్ప బలకాంతి; వెలుంగన్= ప్రకాశించగా; ఆ+పెనుపు= ఆ అభివృద్ధి; పొందఁగ నీక= పొందకుండా; అవియించితి (వి)= పగులగొట్టావు; ఇట్లు= ఈ విధంగా; మత్సరమునన్= అసూయతో; చాపలంబునను= చాపల్యంతో; తత్= దానికి; ఫలము= ఫలితం; అందుము= గ్రహించుము; నీ; సపత్నికిన్= సవతికి; వరవుడవై= దాసివై;

చరింపుము= బ్రతుకు; అని; వారని= మళ్ళించరాని; నెఱ+వగన్, నెవ్వగన్= నిండు దుఃఖంతో; శాపము= శాపాన్ని; ఇచ్చినన్= ఇవ్వగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** మహాబలవంతులమై గొప్ప శరీరాలతో ఇద్దరం పుట్టేవాళ్ళం. ఆ పరిణతిని పొందనివ్వకుండా చేశావు. కేవలం నీ సవతిపై నున్న అసూయా, చపలత్వంవలన. కనుక దానికి ఫల మనుభవించుము. 'నీ సవతికి దాసివై బ్రతుకు' మని తీరని దుఃఖంతో శపించాడు.

**క. వెలవెలఁ బాఱుచు, వడఁకుచు । నలుకుచుఁ, దనమోముఁ జూచు నయ్యంగన న**

**ప్పులుఁగు కృపఁ జూచి, తల్లీ! వలవ దడల నిది విధాతృ వశమయి వచ్చెన్. 173**

**ప్రతిపదార్థం:** వెలవెల+పాఱుచున్= పాలిపోతూ (ముఖాన కత్తివేటుకు నెత్తురు చుక్క లేకపోవటం); వడఁకుచున్= వణకుతూ; అలుకుచున్= (గాలికి చిగురాకువలె) భయంతో కంపిస్తూ; తన మోమున్= తన ముఖాన్ని; చూచు=చూస్తున్న; ఆ+అంగనన్= ఆ తల్లిని; ఆపులుఁగు= ఆ పక్షి; కృపన్= జాలితో; చూచి; తల్లీ= అమ్మా! (ప్రేమతో పిలిచిన పిలుపు;) అడలన్ వలదు= భయపడవద్దు; ఇది = ఈ శాపం; విధాతృ వశమయి= బ్రహ్మ (కర్మ) అనుసారంగా; వచ్చెన్= దాపురించింది.

**తాత్పర్యం:** పాపం సవతిసంతానాన్ని చూచి వాపోయి ఈ పనిచేస్తే జరిగింది. సరిగా అవయవాలు ఏర్పడకుండానే కొడుకు పుట్టాడు. తనను సరిగా పెరగనివ్వకుండా చేసిన తల్లి మాత్సర్యం, దుఃఖచాపల్యం చూచి కొడుకుకు కోపం వచ్చి శపించాడు. అట్లా పుట్టిన కొడుకును చూచి దుఃఖపడింది. ఆ తల్లి; కొడుకు శాపానికే భయపడుతుందా? ఈ సంకటంలో ఆమె తెల్లబారిపోయింది. వణికింది, భయంతో కంపించిపోయింది. అమాయకురాలైన ఆ తల్లి 'నాయనా! నన్నా శపించా' వన్నట్లు తన ముఖాన్ని చూస్తూ నిలబడిపోతే కొడుకు గుండె కరిగి నీరై పోయింది. 'అమ్మా! ఇది సృష్టికర్త సంకల్పంవలన వచ్చింది. భయపడకుము' అని ఓదార్చాడు.

**విశేషం:** ఒక చిన్న పద్యంలో మహాకవి ఎంత శోచనీయస్థితిని సృష్టించాడు. తల్లీ కొడుకులు ఎట్లాంటి పరిస్థితులలో చిక్కుకుపోయారు. అంత విచిత్ర పరిస్థితిని కల్పించిం దెవరు? సృష్టికర్త తప్ప. దానికి లోబడిన లోకం అనుభవించటంకంటె చేసేదేముంది? ఆ బ్రహ్మ సంకల్పం ఈ నాటకం. సుఖమూ, దుఃఖమూ కలది.

**వ. అని వెండియు. 174**

**తాత్పర్యం:** మళ్ళీ ఇంకా.

**శా. 'ఏనూఱేండ్లకుఁ బుట్టు నాయనుజుఁ; డిం కీయున్న యండంబు నె**

**ట్లైనన్ ధైర్యము గల్గి కావుము ప్రయత్నాసక్తివై వాఁడు ద**

**ర్పానూనుండు బలాభిరాముఁడు మదీయస్ఫూర్తి మన్మూర్తి నీ**

**కానందంబుగ నీఁగు దాస్యము త్రిలోకాశ్చర్య సంపాదియై. 175**

**ప్రతిపదార్థం:** నా= నాయొక్క; అనుజుఁడు (అనుసరించి పుట్టేవాడు) తమ్ముఁడు; ఏనూఱు= ఐదువందలు; ఏండ్లకున్= సంవత్సరాలకు; పుట్టున్= పుట్టగలడు; ఇంకన్= ఇక; ఈ ఉన్న= ఈ మిగిలిన; అండంబున్= రెండో గ్రుడ్డును; ఎట్లు+ఐనన్=

ఎట్లాగైనా; ధైర్యము కల్గి= ధైర్యంతో; ప్రయత్న+ఆసక్తిమైన్= ప్రయత్నంతో; కోర్కెతో, ప్రయత్న పూర్వకమైన ఆసక్తి గలిగి; కావుము= రక్షించుము; వాఁడు= ఇక ఆ పుట్టబోయేవాడు; దర్ప+అనూనుండు= గొప్ప దర్పం (దర్జా) కలవాడు; బల+అభిరాముఁడు= బలంతో అందమైనవాడు; మదీయ= నా యొక్క; స్ఫూర్తిమత్= తేజస్సు కల; మూర్తి= ఆకారం కలవాడు; త్రిలోక= ముల్లోకాలకు; ఆశ్చర్య= అబ్బురపాటును; సంపాది+ఐ= కల్గించగలవాడై; నీకున్; ఆనందంబుగన్= సంతోషం కలిగేటట్లు; దాస్యమున్= బానిసతనాన్ని; ఈఁగున్= పోగొట్టును.

**తాత్పర్యం:** ఈ ఉన్న గ్రుడ్డునైనా జాగ్రత్తగా కాపాడుకొమ్ము. ఇంకా ఐదువందల ఏండ్లు గడచిన తరువాత నాకు తమ్ముడు జన్మిస్తాడు. ఆ పుట్టే వాడున్నాడే వాడు మహా దర్పం కలిగి గొప్ప బలశాలియై, నా తేజస్సునంతా తాను పొందిన ఆకారంతో జన్మించి, ముల్లోకాలకు ఆశ్చర్యం కలిగిస్తూ, నీకానందం కలిగిస్తూ, నీ దాస్యాన్ని పోగొట్టుతాడు.

**విశేషం:** పై పద్యంలో తల్లిని శపించాడు. ఈ పద్యంలో తల్లిని ఓదారుస్తున్నాడు. అందుకే పెద్ద పద్యం. పుట్టే తమ్మునిమీద ప్రేమకొద్దీ పెద్ద మాటలతో వాడిని పొగడుతున్నాడు. అట్లాంటివాడు జన్మిస్తాడు. పుట్టి తల్లికి కలిగిన దాస్యాన్ని పోగొట్టుటే కాక ముల్లోకాలకు ఆశ్చర్య కారకుడౌతాడు. కనుక ఐదువందల ఏళ్ళు ఎట్లాగైనా ఓపిక పట్టుమని తల్లిని ఓదార్చటం పద్యభావం. పుట్టబోయే గరుత్మంతుడిని పరిచయం చేయటం రాబోయేపాత్రను ముందుగానే మరొక పాత్రతో పరిచయం చేసినట్లు. చాలా గొప్ప పద్యం. పై పద్యంలో దుఃఖం. ఈ పద్యంలో ఆనందం. వెరసి మానవజీవితం.

**వ. అనియె; నిట్లు ప్రథమ పుత్రుండు వికలాంగుం డగుటకును, శాపప్రాప్తికిని, బరమనిర్వేదంబు నొంది, వినతయు నవ్విహంగంబు నిర్దేశించిన కాలంబు ప్రతీక్షించి, యయ్యండంబు రక్షించి కాచియుండం, దత్సమయ సమాగమంబున. 176**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని చెప్పాడు; ఇట్లు= ఈ విధంగా; ప్రథమపుత్రుండు= పెద్దకొడుకు; వికల+అంగుండు= సరిగా పెరగని అవయవాలు కలవాడు (కుంటివాడు); అగుటకును; శాపప్రాప్తికిని= శాపం కలిగినందుకూ; పరమ= చాలా గొప్ప; నిర్వేదంబు= దుఃఖం; ఒంది= పొంది; ఆ+విహంగంబు= ఆ పక్షి (పెద్దకొడుకు); నిర్దేశించిన= చెప్పిన; కాలంబు= ఐదువందల ఏండ్లు; ప్రతీక్షించి= ఎదురుచూచి; ఆ+అండంబున్= ఆ గ్రుడ్డును; రక్షించి= కాపాడి; కాచియుండన్= కనిపెట్టుకొని ఉండగా; తత్= ఆ, ఐదువందల ఏళ్ళ; సమయ= కాలం; సమాగమంబునన్= రాకతో.

**తాత్పర్యం:** ఈ విధంగా పెద్దకొడుకు వికలాంగుడు కావటం - శాపం రావటంతో గుండె చెదరిపోయిన తల్లి ఆ పెద్దకొడుకు చెప్పిన కాలంకొరకు నిరీక్షిస్తూ ఆ గ్రుడ్డును కాపాడుతూ ఉండగా, కాలం తిరిగి వచ్చింది. (ఐదువందల ఏళ్ళు గడచిపోయాయి)

**చ. ఘనతరకంధరుండు, దృఢకాయుఁడు, దీప్తముఖుండు, రక్తలో**
**చనుఁడు, మహోత్తమాంగకుఁడు, చారుసుసంగత పక్షసారమం**
**డనుఁడు, పరిస్ఫుర ద్ద్యుతి విడంబిత బాలదివాకరుండు, లో**
**కనయన పర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా! 177**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూమికి రాజా!, సుపర్ణుఁడు= మంచి రెక్కలు గలవాడు, గరుత్మంతుడు; ఘనతర= చాలాగొప్ప; కంధరుండు= మెడ కలవాడు, బలిసిన మెడ కలవాడు; దృఢ= బలిష్ఠమైన; కాయుఁడు= శరీరం కలవాడు; దీప్త= కాంతితో

వెలిగే; ముఖుండు= ముక్కు కలవాడు, (ముఖం కలవాడు); రక్త= నెత్తురువలె ఎ్రని; లోచనుఁడు= నే్రాలున్నవాడు; మహా+ఉత్తమ+అంగకుఁడు= గొప్ప తల కలవాడు; చారు= అందంగా; సుసంగత= కూడిన - పొందిపొసగినట్లున్న; పక్ష= రెక్కల; సార= సారం, శక్తి; మండనుఁడు= అలంకారంగా కలవాడు; పరి= మిక్కిలిగా; స్ఫురత్= ప్రకాశించే; ద్యుతి= కాంతితో; విడంబిత= పోలిన; బాలదివాకరుండు= బాలసూర్యుడు; లోక= ముల్లోకాల; నయన= నే్రాలకు; పర్వ= పండుగను; నిర్వహణ= నిర్వహించటం; చక్కగా మోయటం; కారి= చేసేవాడు; (పర్వ నిర్వహణకారి= పండుగను కల్పించటం చేసేవాడు;) పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! గరుత్మంతుడు (రెక్కలు కలవాడు) జన్మించాడు. (అత డెట్లా ఉన్నాడంటే) అతడు బలిసినమెడతో; బలిష్ఠమైన దేహంతో, అగ్నివలె జ్వలించే ముఖంతో, ఎ్రని నే్రాలతో, కాంతితో ప్రకాశించే బాలసూర్యుడి వంటివాడు, సర్వలోకాల నే్రాలకు పండుగను కల్పించేవాడు (ఆనందదాయకుడు) ఐనవాడు.

**విశేషం:** పద్యమంతా సుపర్ణుడి గొప్ప ఆకారాన్ని వర్ణిస్తున్నది. 175వ పద్యంలో చెప్పినట్లుగా ఒక మహాపురుషుడి ఆకార విశేషం ఇందులో వర్ణించబడింది. కనుక పద్యరచనలో ఒక సాంద్రత కన్పిస్తుంది. బిగువుగా నడుస్తుంది పద్యం. ఆ బిగువంతా మహా పురుషుడి గొప్పతనానికి సంకేతం.

**క. ఆ సమయంబున నరుణో । ద్భాసిత గాత్రుండు, తొలుతపట్టి యరుణుఁ డు**
**ల్లాసి యగుచు రవి పరిచ । ర్యాసుఖ మెదఁ గోరి చనియె నంబరవీథిన్. 178**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సమయంలో; అరుణ= ఎ్రని కాంతితో; ఉత్+భాసిత= చక్కగా ప్రకాశించే; గాత్రుఁడు= శరీరం కలవాడు; తొలుత పట్టి= వినత మొదటి కొడుకు; అరుణుఁడు= ఆ పేరు కలవాడు; ఉల్లాసిఅగుచున్= సంతోషిస్తూ; రవి= సూర్యుడి; పరిచర్యా= సేవా; సుఖము= సుఖాన్ని; ఎదన్= మనస్సులో; కోరి= కోరుకొని; అంబరవీథిన్= ఆకాశమార్గంలో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ వేళ ఎ్రని శరీరం కల వినత మొదటి కొడుకు అరుణుడు సంతోషించి, సూర్యుడిని సేవించటానికి ఇష్టపడి ఆకాశంలో ఎగిరిపోయాడు. (తమ్ముడు పుట్టేంతవరకు తల్లిని కాపాడుకొంటూ తోడుగా ఉన్నాడని భావం.)

**మ. జననిం బాసి జనించునప్డ తనయిచ్ఛం బక్షినాథుండునుం**
**జని, పద్మోద్భవకల్పితంబు లగు భోజ్యంబుల్ శరీరంబు వ**
**ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ దన్ ముద్దు సేయంగఁ గ్రీ**
**డన లోలత్వమునం జరించుఁ బరితుష్టస్వాంతుఁడై యెల్లెడన్. 179**

**ప్రతిపదార్థం:** జనించునప్డు+అ= పుట్టినప్పుడే; పక్షినాథుండునున్= పక్షులకు రాజైనవాడు; జననిన్= తల్లిని; పాసి= వదలి; తన= తన యొక్క; ఇచ్ఛన్= ఇష్టానుసారంగా; కోర్కెతో; చని= వెళ్ళి; పద్మ+ఉద్భవ= పద్మంనుండి పుట్టిన బ్రహ్మచేత; కల్పితంబులు= సృష్టిచేయబడిన; భోజ్యంబుల్= ఆహారాలు; శరీరంబున్= దేహాన్ని; వర్ధనమున్= పెరుగుదలను; ఒందింపఁగన్= పెంపొందింపగ చేయగా; ఎల్లెడన్= ఎల్ల యెడల; పరితుష్ట = సంతుష్టి పొందిన; (స+అంత= స్వాంతము= మనస్సు (లోపలిది)) స్వాంతుఁడై= మనస్సు కలవాడై; సిద్ధ, సాధ్య గణముల్= సిద్ధుల, సాధ్యుల (దేవతలలో జాతులు) సమూహాలు; తన్= తనను; ముద్దుచేయంగన్= ముద్దు చేస్తుండగా; క్రీడన= ఆటలపై; లోలత్వమునన్= ఆసక్తితో; చరించున్= విహరిస్తాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు పుట్టినప్పుడే తల్లిని వదలి తన ఇష్టానుసారంగా బ్రహ్మ సృష్టించిన ఆహారానికై లోకాలన్నీ క్రీడగా విహరిస్తుంటే; సిద్ధ సాధ్యులైన దేవతలందరు తనను ముద్దు చేస్తుండేవారు.

**వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్క యెడ. 180**

**ప్రతిపదార్థం:** ఆ+కాలంబునన్= ఆ సమయంలో; వినోదంబునకై= ఆటకై; అరిగి= వెళ్ళి; ఒక్క ఎడన్= ఒకచోట.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆటకై వెళ్ళి ఒకచోట. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి । నెలుఁగించు గండుఁగోయిలలసొంపు,**
**నలరుఁ దేనియఁ గ్రోలి, యన్ను సోలంబుల । మురియు తేఁటుల నునుమ్రోఁత యింపుఁ,**
**దమిఁ బండ్ల రసమాని తమలోనఁ జెలఁగుచుఁ । బలికెడు రాచిల్క పటురవంబు,**
**గొలఁకుల కెలఁకులఁ గూడి క్రీడించుచుం । డెడు నంచతండంబు నడబెడంగుఁ,**

**తే. దరఁగఁ దేలుచుఁ, బూఁదీవఁ దగులఁ బడుచు । వచ్చు చిఱుగాలి సోఁకును, మెచ్చి మెచ్చి,**
**తగిలి కొనియాడుచును, వినతయును గద్రు । వయును మున్నీటి చేరువ వనమునందు. 181**

**ప్రతిపదార్థం:** చంచులన్= ముక్కులతో, చిగురాకున్= చివురాకులను; చించి= చీల్చి; ఆడుచున్= ఆడుతూ; నలిన్= ప్రేమతో; సన్నగా; ఎలుఁగించు (ఎలుఁగు+ఇంచు)= కూసే, పాడే; గండుకోయిలల= మగకోకిలల; సొంపున్= అందాన్ని; అలరుఁదేనియన్= పూలతేనెను; క్రోలి= త్రాగి; అన్ను= అందమైన; సోలంబులన్= కుత్తుకలతో; మురియు= మురిసిపోతున్న; తేఁటుల= తుమ్మెదల; నును= సన్నని; సుకుమారమైన; మ్రోఁత= ధ్వని; ఇంపున్= అందమున్నూ; తమిన్= కోర్కెతో; పండ్లరసము= పళ్ళరసాలను; ఆని= త్రాగి; తమలోనన్= తమలో తాము; చెలఁగుచున్= ఏపురేగి, విజృంభించి; పలికెడు= పలుకుతున్న; రాచిల్క= రాజచిలుకలయొక్క; ముక్కు ఎరుపు; దేహం పచ్చదనం); పటురవంబున్= పటిష్ఠమైన స్వరం; కొలఁకులన్= చెరువులలోనూ; కెలఁకులన్= వాటిప్రక్కలా; కూడి= కూడుకొని; క్రీడించుచుండెడు= ఆడుకొంటున్న; అంచతండంబు= హంసల గుంపుల; నడ= నడకల; బెడంగున్= అందాలనూ; తరఁగన్= తరగలమీదుగా; తేలుచున్= తేలిపోతూ; పూఁదీవన్= పూలతీగలో; తగులన్‌బడుచున్= చిక్కుకుపోతూ; వచ్చు= వచ్చే; చిఱుగాలి= లేతగాలి; సోఁకునున్= స్పర్శను; మెచ్చిమెచ్చి= తెగమెచ్చుకొంటూ; తగిలి= ఆసక్తితో; కొనియాడుచున్= ప్రశంసిస్తూ; మును+నీటి= సముద్రంయొక్క; చేరువ= దగ్గరలో ఉన్న; వనమునందున్= తోటలో; వినతయును, కద్రువయును= సవతులిద్దరూ.

**తాత్పర్యం:** మదించిన మగ కోకిలలు ముక్కులతో చిగురాకులను చీలుస్తూ ఆడుతూ గొంతెత్తి పాడుతున్నాయి. వాటి పాటల అందాలనూ, పూల తేనెలు త్రాగిన మత్తుతో మురిసే తుమ్మెదల ఝుంకారాల అందాలనూ, పండ్లరసం త్రాగి తమలో చెలరేగుతూ అరుస్తున్న చిలుకగుంపుల ధ్వనులున్నూ, చెరువులలోనూ, వాటి చుట్టుపట్లా కూడి మాడి ఆటలాడే హంసల గుంపుల నడకల అందాలనూ, కెరటాలు కెరటాలుగా వస్తూ, తీగెలలో చిక్కుపడుతూ వచ్చే లేతగాలి స్పర్శకు ఆనందిస్తూ సముద్రతీరంలో ఉన్న చెట్ల తోపులలో వినత కద్రువలనే సవతులిద్దరూ. (క్రింది వచనంతో అన్వయం)

**విశేషం:** ఇది చాలా గొప్ప వర్ణన.

**వ. మెలఁగుచుండి రట్టియెడ. 182**

**విశేషం:** విహరిస్తున్న సమయంలో.

**చ. కరువునఁ బోసిరో! విధుని కాంతి, సుధాబ్ధి తరంగఁ దెచ్చి, గం**
**డరు వొనరించిరో! హరుజటాస్థలికిం దొడ వైన యేటి పె**
**న్నురువునఁ జేసిరో! యన మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు సుం**
**దర తురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్. 183**

**ప్రతిపదార్థం:** చారు= అందమైన; లోచనల్= కన్నులున్న కద్రూవినతలు; దవు దవ్వులన్= అల్లంత దూరంలో; విధుని కాంతి= చంద్రుడి వెలుగును; కరువునన్= మూసలో; పోసిరో?= పోసినారా!; సుధాబ్ధి తరంగన్= పాలసముద్రం అలను; తెచ్చి= తీసికొని వచ్చి; గండరువు= పడియచ్చు; ఒనర్చిరో?= చేశారా?; హరు= శివుడియొక్క; జటాస్థలికిన్= జడలప్రదేశానికి; తొడవు= అలంకారం, భూషణం; ఐన= అయినటువంటి; ఏటి= గంగయొక్క; పెన్+నురువునన్= పెద్ద నురుగుదిబ్బతో; చేసిరో!= చేశారో; అనన్= అన్నట్లుగా; మనోజ్ఞ= మనస్సును హరించే; సిత= తెల్లని; ఛవిన్= కాంతితో; ఉల్లసిల్లు= ప్రకాశించే; సుందర= అందమైన; తురగ+ఉత్తమంబు= శ్రేష్ఠమైన గుర్రాన్ని; దవుదవ్వులన్= అల్లంతదూరంలో; కాంచిరి= చూచారు

**తాత్పర్యం:** (పద్యమంతా అందమైన తెల్లని గుర్రం వర్ణన. ఆ తెలుపు ఎంత అందంగా ఉన్నదంటే) చంద్రకాంతిని మూసలో పోసి చేసినట్లు, పాలసముద్రపు అలను తెచ్చి శిల్పంగా చెక్కినట్లు, శివుడి జడల కలంకారమైన దేవతా గంగలోని నురుగుతో చేసినట్లు ఆశ్చర్యంగా ఉన్న ఆ గుర్రాన్ని అల్లంతదూరంలో అందమైన కళ్ళతో ఆస్వాదించారు.

**విశేషం:** ఇవన్నీ అందమైన ఉత్ప్రేక్షలు.

**వ. నిజేచ్ఛమై వచ్చిన యుచ్చైశ్శ్రవంబు నాలోకించి. 184**

**ప్రతిపదార్థం:** నిజ= తనయొక్క; ఇచ్ఛమైన్ = కోర్కెతో; వచ్చిన; ఉచ్చైశ్శ్రవంబున్= ఇంద్రుడి గుర్రాన్ని; (ఉచ్చైః= పైకి నిగిడి ఉన్న; శ్రవంబు= చెవులు కలది); ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇష్టానుసారంగా వచ్చిన ఇంద్రుడి అశ్వమైన ఉచ్చైశ్శ్రవాన్ని చూచి.

**క. వినత 'హయ మింత యొప్పనె । యనూన ధవళప్రభాఢ్యమై' యని పలుకన్**
**విని, కద్రువ 'యపరాంగం । బున నీలిమ దోఁచె' ననియె భూపవరేణ్యా! 185**

**ప్రతిపదార్థం:** భూప= భూమిపతులలో; వరేణ్యా!= శ్రేష్ఠుడా!; వినత; అనూన= అతిశయమైన; మిక్కిలి; ధవళ= తెల్లని; ప్రభా= కాంతితో; ఆఢ్యమై= కలిగినదై; హయము= గుర్రం; ఇంత ఒప్పునె!= ఇంత అందంగా ఉన్నదే; అని; పలుకన్= పలుకగా;; విని; కద్రువ; అపర+అంగంబునన్= చివరి అవయవంలో; తోకమీద, నీలిమ= నలుపు; తోఁచెన్= కనిపిస్తున్నది; అనియెన్= అని పలికింది.

**తాత్పర్యం:** వినత అన్నది: 'అబ్బా! ఇంత తెల్లని కాంతితో గుర్రం ఎంత అందంగా ఉన్నదే'? అని అంటే విని కద్రువ అన్నది; 'తోక నల్లగా ఉన్నది కదా!' అని.

**చ. అనవుడు నమ్మృగాక్షి 'యిటు లాడితి, నవ్వుల కాడితో? నిజం**
**బునకునొ? నీదు చూపునకుఁ బోలిన భంగియొ? చెప్పు' మన్న న**
**వ్వనిత దరస్మితస్ఫురితవక్త్రముతో 'నిది యేటి మాట? న**
**ల్లనియెడ గానరాదె? తెరలం బలుకం బని యేమి? నావుడున్. 186**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా, అట్లా అంటే; ఆ+మృగ+అక్షి= ఆ లేడికన్నులవంటి కన్నులు కలది - వినత; ఇటులు= ఈ విధంగా; ఆడితి= అన్నావు; నవ్వులకున్= నవ్వులాటగా; ఆడితో(తివి+ఓ)?= అన్నావా?; నిజంబునకునొ?= నిజంగానేనా?; నీదు= నీ; చూపునకున్= దృష్టికి; పోలిన భంగియొ?= ఉచితరీతియా?, తగిన విధానమా? (నీ కళ్ళ కట్లా కన్పిస్తున్నదా?); చెప్పుము= చెప్పుము; అన్నన్= అనగా; ఆ+వనిత= ఆ స్త్రీ, కద్రువ; దర= కొంచెం; స్మిత= లేతనవ్వు; స్ఫురిత= స్ఫురించిన, కన్పించిన; వక్త్రముతోన్= ముఖంతో; ఇదిఏటిమాట?= ఇదేం మాట? నల్లని+ఎడ= నల్లనిచోటు; కానరాదె?= కన్పించదా? తెరలన్+పలుకన్= కాదనటం, అబద్ధం చెప్పటం; పని ఏమి= ఏమిపని?; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** అట్లా అనేసరికి, వినత అన్నది 'నవ్వులాటగా అన్నావా? లేక నిజంగా నీ చూపున కట్లాగే కనిపిస్తున్నదా?' అని ప్రశ్నించగానే ఆమె చిన్నగా నవ్వుతూ 'నీవన్నమాట కాదనవలసిన అవసర మేమిటి? అదిగో నల్లగా ఉన్న ప్రదేశం కన్పించటంలేదా?' అని అనగానే. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** వినత అమాయకురాలు కనుక మృగాక్షి. లేడి అమాయక జంతువు. కనుకనే ఉన్న మాట అన్నది. కద్రువ మోసగత్తె. కనుకనే సన్నగా నవ్వింది. ఆ నవ్వు మోసగాళ్ళ లక్షణమని చెప్పటానికే కవి వ్రాశాడు.

**వ. వినత తెలియం జూచి. 187**

**ప్రతిపదార్థం:** వినత; తెలియన్= తెలిసేటట్లుగా; చూచి= మళ్ళీ చూచి.

**తాత్పర్యం:** ఆమె అట్లా అనేసరికి స్పష్టంగా చూచింది వినత.

**ఉ. కాదని పూని పల్కుటయుఁ గద్రువ 'పన్నిద మేమి దీనికి?**
**న్వా దిది యేల? రిత్త' యనినన్ విని యాసతి 'నిక్కమేని నీ**
**వేది పణంబుగాఁ దలఁచి యేర్పడఁ జెప్పితి దాని కేను సం**
**వాదము సేయుదాన గరువంబుగ నొక్కటి నిశ్చయింపుమా!' 188**

**ప్రతిపదార్థం:** కాదు+అని= వినత ఆ విధంగా చూచి నీ వన్నది కాదు అని; పూని= నిశ్చయంగా; పల్కుటయున్= అనగానే; కద్రువ; పన్నిదము+ఏమి?= ఏమి పందెం?; దీనికిన్= ఈ విషయానికి; వాదు ఇది= ఈ వివాదం; రిత్త= వ్యర్థంగా; ఏల?= ఎందుకు?; అనినన్= అనగా; ఆ సతి= ఆ వినత; విని; నిక్కము= సత్యం; ఏని= అయితే; నీవు; ఏది; పణంబుగాన్= పందెంగా; తలఁచి= ఆలోచించి; ఏర్పడన్= స్పష్టంగా; చెప్పితి(వి)= చెప్పుతావో; దానికిన్; ఏను; సంవాదము= అంగీకారం; చేయుదానన్= చేస్తాను; గరువంబుగన్= సగర్వంగా; ఒక్కటి= ఏదో ఒకటి; నిశ్చయింపుమా!= నిర్ణయించుము.

**తాత్పర్యం:** వినత కద్రువతో 'నీవు చెప్పినది సరికాదు' అన్నది. దానికి కద్రువ 'ఈ వివాదం వ్యర్థంగా దేనికి?

ఒక పందెం వేయుము' అన్నది. దాని కా వినత 'నీవేది పందెంగా నిర్ణయిస్తావో దానికి నేనంగీకరిస్తాను. కనుక పందె మేదో ఒకటి నిశ్చయించుము' అన్నది.

**వ. అనిన విని కద్రువ వినత వదనంబునఁ జూడ్కి నిలిపి. 189**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; కద్రువ; వినత వదనంబునన్= వినత ముఖంమీద; చూడ్కి= చూపు; నిలిపి= లగ్నంచేసి.

**తాత్పర్యం:** అనగా విని వినత ముఖంలోకి చూచి కద్రువ. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. 'నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను । జేయఁ గలదాన, నేను గెల్చినను నీవు**
**నాకుఁ జేయంగఁ గలదాన; వీ కడింది । పన్నిదము సఱ' మని తెగఁబాఱి పలికె. 190**

**ప్రతిపదార్థం:** నీవు గెల్చినన్= నీవు గెలిస్తే; నీకున్ నేను; దాస్యంబు= బానిసతనం; చేయగలదానన్; నేను గెల్చినన్= నేను గెలిస్తే; నీవు నాకున్; చేయంగన్+కలదానవు= చేయాలి; ఈ కడింది= ఈ గట్టి; పన్నిదము= పందెం; చఱము= వేద్దాం; అని; తెగఁబాఱి= తెగించి; పలికెన్= అన్నది.

**తాత్పర్యం:** ' ఈ విషయంలో నీవు గెలిస్తే నేను దాస్యం చేస్తాను. నేను గెలిస్తే నీవు దాస్యం చేయాలి. ఈ పందెం కాద్దాం' అని పలికింది కద్రువ.

**క. ఆ పొలఁతి యట్లు పలికిన । శాపము ప్రేరేఁప నరుణ జననికి నుత్సా**
**హోపేత మయ్యెఁ జిత్తం । బాపన్నిదమునకు; నేమి యనఁగల దధిపా! 191**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! (ధర్మరాజా!) ఆ పొలఁతి= ఆ స్త్రీ (కద్రువ); అట్లు పల్కినన్= అట్లా అనగా; అరుణ జననికిన్= అరుణుడి తల్లికి; శాపము ప్రేరేఁపన్= (అతడి) శాపం ప్రేరేపించగా; ఆ పన్నిదమునకున్= ఆ పందెమునకు; చిత్తంబు= వినత మనస్సు; ఉత్సాహ= ఉత్సాహంతో; ఉపేతము= కూడుకొన్నది; అయ్యెన్= ఐనది; ఏమి అనన్+కలదు?= ఏమనటాని కేమున్నది?

**తాత్పర్యం:** రాజా! కద్రువ అట్లా పందెం కాయగానే అరుణుడి తల్లికి మనస్సు ప్రేరేపించగా, పందెం అంగీకరించటానికి ఉత్సాహపడింది.

**వ. ఇట్లు వినతయుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె; నయ్యిరువురుఁ బంచమహాభూతంబులు సాక్షులుగాఁ బల్కి పన్నిదంబు సఱచిరి; కద్రువ 'పతిపరిచర్యకుం గాలమయ్యె; మఱివచ్చి యశ్వంబు నాలోకింత' మని నెపంబిడి యప్పటికిం జూపుఁ దప్పించె; నవ్విధంబున మగిడి యరుగుదెంచిరి; తదనంతరంబ. 192**

**ప్రతిపదార్థం:** ఇట్లు వినతయున్= ఈ విధంగా వినత; ఆలితెంపుచేసి= తెగించి; ఆ+తెఱంగునకున్= ఆ పద్ధతికి; ఇయ్యకొనియెన్= అంగీకరించింది; పంచమహాభూతంబులు= భూమి, వాయువు, జలం, అగ్ని, ఆకాశమన్న అయిదుమహాశక్తులు; సాక్షులుగాన్= సాక్ష్యంగా; పన్నిదంబు= పందెం; చఱచిరి= వేసికొన్నారు; కద్రువ; పతిచర్యకున్= భర్తసేవకు; కాలము+అయ్యెన్= సమయమైంది; మఱి= మరలా; వచ్చి; అశ్వంబున్= గుర్రాన్ని; ఆలోకింతము అని= చూద్దాం అని; నెపంబు+ఇడి= మిష పెట్టి;

అప్పటికిన్= ఆ సమయానికి; చూపున్= చూపును; తప్పించెన్= దాటవేసింది; ఆ+విధంబునన్= ఆ రీతిగా; మగిడి= తిరిగి; అరుగుదెంచిరి= వచ్చారు; తత్+అనంతరంబు+అ= అటు తర్వాత.

**తాత్పర్యం:** వినత కూడా తెగించి పందెం అంగీకరించింది. ఆ విధంగా వా రిద్దరూ పంచభూతాలు సాక్షిగా పందెం వేసికొన్నారు. కద్రువ తెలివిగా 'ఇప్పుడు భర్తకు సేవ చేసే సమయమైనది కనుక రేపు వచ్చి గుర్రాన్ని చూద్దా'మని అప్పటికి చూపు తప్పించింది. వినత అమాయకురాలు. కనుక సరే అన్నది. ఆ విధంగా వారిద్దరు ఇంటికి తిరిగి వచ్చారు. ఆ తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కుటిలంపుఁ దలఁపునఁ గొడుకుల రావించి । కద్రువ యిట్లనుఁ గన్నునీరు**
**దొరఁగంగ వారలతో 'నబ్ధి పొంతకు । వినతయు నేనును వేడ్క నరిగి**
**యచ్ఛ తెల్పునఁ గడునభిరామ మగునొక్క । యశ్వంబు గాంచితి; మవ్వధూటి**
**గేవలధవళంబు నా విని, యొడ్డార । మునకు నే నదె నల్లదనముఁ గంటె**

**తే. వెనుకదెస 'నన్న వాదయ్యెఁ, గనలి పన్ని । దంబు సఱచితి; మోడిన దాస్యవృత్తి**
**వచ్చు సవతికి; నే నెట్లు వరవుడంబు । సేయఁ దగు?; దోఁక నల్లగాఁ జేయరయ్య! 193**

**విశేషం:** కద్రువ; కుటిలంపుఁదలఁపునన్= కుటిలమైన ఆలోచనతో; కొడుకులన్= తన కుమారులను; రావించి= పిలిపించి; కన్ను నీరు తొరఁగంగన్= కన్నీళ్ళు కారగా; వారలతోన్= వాళ్ళతో; ఇట్లు+అనున్= ఆ విధంగా అంటున్నది; వినతయున్; నేనును; వేడ్కన్= ఉత్సాహంతో; అరిగి= వెళ్ళి; అచ్ఛ తెల్పునన్= అచ్ఛమైన తెలుపుతో; కడున్= మిక్కిలి; అభిరామము= అందమైనది; అగు= ఐన; అశ్వంబున్= గుర్రాన్ని; కాంచితిమి= చూచాము; ఆ+వధూటి= ఆమె (వినత); కేవలధవళంబు= కేవలం తెలుపు; నాన్= అనగా; విని= నేను విని; ఒడ్డారమునకున్= ప్రతిఘటనకు, ద్వేషానికి; నేను; అదె నల్లఁదనమున్ కంటె?= అదుగో నలుపును చూచావా; వెనుక దెసన్ = వెనకప్రక్క; అన్నన్= అనగా; వాదు= వివాదం; అయ్యెన్= ఐనది; కనలి= కోపగించి; పన్నిదంబు= పందెం; చఱచితిమి= వేసికొన్నాం; ఓడినన్= ఓడిపోతే; సవతికిన్= నా సవతికి; దాస్యవృత్తి= పనులు చేయవలసిన స్థితి; వచ్చున్= వస్తుంది; నేను; ఎట్లు= ఏ విధంగా; వరవుడంబు= దాస్యం; చేయన్= చేయగా; తగున్= వీలౌతుంది; తోఁకన్= తోకను; నల్లగాన్= నలుపుగా; చేయరు+అయ్య= బాబూ చేయండిరా!

**తాత్పర్యం:** కద్రువ కుటిలబుద్ధితో కొడుకులను పిలిచి కన్నీళ్ళు కారుస్తూ 'నేనూ వినతా సముద్రతీరానికి ఉత్సాహంగా వెళ్ళాం. అక్కడ అచ్ఛమైన తెల్లని గుర్రం కన్పించింది. వినత అది చూచి 'గుర్రమెంత తెల్లగా ఉన్నది'! అన్నది. నేను ఆమె అన్నదానిని కాదనటానికే 'తోకలో నలు పున్న' దన్నాను. కోపంతో ఇద్దరం పందెం వేసికొన్నాం. ఓడిపోతే సవతికి దాస్యం చేయాలి. నే నెట్లా చేయగలను? కనుక నాయనలారా! తోకను నలుపు చేయండిరా' అన్నది.

**చ. అనవుడు వాసుకి ప్రభృతు లక్కట! ధర్మువు గాదు; నీవు సూ**
**చినతెరు వట్టి గెల్పు శుభసిద్ధి యొనర్చునె? యట్లుగాక య**
**వ్వనితయుఁ దల్లి గాదె? గరువంపుఁ దనంబునఁ జూడ మాకు ని**
**ట్లనఁ దగునమ్మ? యెట్లయిన నయ్యెను; బాపము సేయవచ్చునే? 194**

**ప్రతిపదార్థం:** అనవుడున్= తల్లి అట్లా అన్నంతట; వాసుకి ప్రభృతులు= వాసుకి మొదలైన (కొడుకులు) వారు; అక్కట!=అయ్యో!; నీవు చూచిన తెరువు= నీవు చెప్పిన పద్ధతి; ధర్మువు కాదు= ధర్మం కాదు; అట్టిగెల్పు= అట్లాంటిజయం; శుభసిద్ధి, ఒనర్చునె!= శుభాన్ని కల్గిస్తుందా? అట్లుకాక= అట్లాగూ కాక; ఆ+వనితయున్= ఆమెకూడా; గరువంపుఁదనంబునన్= గౌరవబుద్ధితో; చూడన్= పరికింపగా; మాకున్= మాకు; తల్లిగాదె!= తల్లియే కదా!; ఇట్లు+అనన్+తగు+అమ్మ!= నీవు ఇట్లా అనవచ్చునా తల్లీ!; ఎట్లు అయినన్+అయ్యెను= ఎట్లా జరుగవలసింది అట్లాగే జరుగుతుంది; పాపము చేయవచ్చునే!= పాపం చేయరాదు కదా!

**తాత్పర్యం:** కద్రువ అట్లా అనగానే వాసుకి మొదలైన వారు అన్నారు 'అయ్యో! తల్లీ! ఇది ధర్మం కాదు. నీవు చెప్పిన పద్ధతి శుభాలను కల్గించదు. అంతేకాక ఆమె కూడా గౌరవబుద్ధితో పరికించినప్పుడు మాకు తల్లియే గదా! మమ్మా పనికి ఆదేశింపవచ్చునా? జరుగనున్నది జరుగకమానదు. మేమీ పాపకృత్యము చేయలేము.

**క. ఈ విధ మెమ్మెయి నైనం । గావింపఁగ వలయు ననుట గల్గినఁ బరదే**

**శావాసుల మగుదుము; మము । నీ వింకం దగదు తల్లి! నిర్బంధింపన్. 195**

**ప్రతిపదార్థం:** ఈ విధము= నీవు చెప్పిన పద్ధతినే; ఏ+మెయిన్+ఐనన్= ఏ విధంగా నైనా సరే; కావింపఁగ వలయున్+ అనుట కల్గినన్= చేయాలి అని అనటమే జరిగితే; పరదేశ= ఇతర దేశాలలో; ఆవాసులము+అగుదుము= నివసిస్తాము (కానీ); నీవు+ఇంకన్= నీవింకా; మమున్= మమ్మల్ని; తల్లి!= అమ్మా!; నిర్బంధింపన్ తగదు= నిర్బంధించటం మంచిదికాదు, బలవంతం చేయటం కూడదు.

**తాత్పర్యం:** అట్లాకాదు. నేను చెప్పిందే చేసి తీరాలని కనుక నీ వంటే మే మిల్లూ, ఊరూ వదలి పొరుగు దేశాలకైనా పోతాం తప్ప తల్లీ! మమ్ములను నిర్బంధించటం మంచిది కాదు.

**క. అని రట్టియెడం గొందఱు । జననిఁ దొఱఁగి యెక్కడేనిఁ జని; రా భంగిం**

**జనిన తనూజులఁ బేర్కొని । నెనరు విడిచి, యా నెలంత నిష్ఠురమతియై. 196**

**ప్రతిపదార్థం:** అనిరి= వాసుకి మొదలైన వారట్లా అన్నారు; అట్టి+ఎడన్= తల్లితో వాసుకి మొదలైనవారు మాట్లాడుతున్న సమయంలో; కొందఱు= మిగిలిన కొడుకులలో కొంతమంది; జననిన్= తల్లిని; తొఱఁగి= వదలి; ఎక్కడ+ఏనిన్= ఎక్కడకైనా; చనిరి= వెళ్ళారు; ఆ భంగిన్= ఆ విధంగా; చనిన= వెళ్ళిన; తనూజులన్= కొడుకులను; పేర్కొని= పేరుపేరున పిలుస్తూ; ఆ నెలంత= ఆమె (కద్రువ); నెనరున్= ప్రేమను; విడిచి= త్యజించి; నిష్ఠుర= కఠిన; మతి+ఐ= హృదయం కలదై.

**తాత్పర్యం:** ఆ సమయంలో కొందరు కొడుకులు మన కెందుకీ గోలంతా; అమ్మకు ముఖం తప్పించుదామని ఎక్కడికో వెళ్ళిపోయారు. వారిని గురించి తల్లి మాతృప్రేమను కూడా వదలిపెట్టి రాతిగుండె కలదై.

## కద్రువ తనకొడుకులకు జనమేజయునివలన నాశంబు గల్గునట్లు శపించుట(సం.13-23-1(కుంభ))

**చ. 'అమృతకరాన్వయంబున మహాముని వేడ్క నరుండు పాండుభూ**

**రమణుని దేవి గొంతి యుదరంబునఁ బుట్టి, ధనంజయాది నా**

**మముల వెలుంగు దత్సుతుని మన్మఁడు సంభృతధర్మమైన పే**

**ర్మి మెఱయ నేల యేలు; జనమేజయనాముఁ డరాత్యజయ్యుఁడై. 197**

**ప్రతిపదార్థం:** అమృతకర= అమృతమే కిరణాలుగా కల చంద్రుడియొక్క; అన్వయంబునన్= వంశంలో; మహాముని నరుండు= నరనారాయణులన్న మహా మునులలో నరుడన్నవాడు; వేడ్కన్= కోరికతో; పాండుభూరమణుని= పాండురాజుయొక్క; దేవి= భార్యయైన; గొంతి= కుంతియొక్క; ఉదరంబునన్= కడుపునందు; పుట్టి= జన్మించి; ధనంజయ+ఆదినామములన్= ధనంజయుడు మొదలైన పేర్లతో; వెలుంగున్= ప్రఖ్యాతి పొందుతాడు; తత్=అతడి; సుతుని= కొడుకు అభిమన్యుడికి; మన్మఁడు= మనుమడు, పరీక్షిత్తు కొడుకు; జనమేజయనాముఁడు= జనమేజయు డన్న పేరుగలవాడు; సంభృత= చక్కగా భరించిన; ధర్మము= ధర్మం; ఐన= కల; పేర్మిన్= పెంపున (గొప్ప ధర్మం అతిశయించగా); అరాతి= శత్రువులకు; అజయ్యుఁడు+ఐ= జయించరానివాడై; నేలన్= భూమిని; ఏలున్= పాలిస్తాడు.

**తాత్పర్యం:** ఆదిముని నరుడన్నవాడు కోర్కెతో చంద్రవంశీయుడైన పాండురాజునకు కుంతీదేవి కడుపున పుట్టి ధనంజయుడు మొదలైన పేర్లతో ప్రపంచ ప్రఖ్యాతుడైన వానికి మనుమడు జనమేజయుడు శత్రుభయంకరుడై రాజ్యపాలనం చేస్తాడు.

**ఉ. ఆతఁడు సర్పయాగమను నధ్వరముం గుపితాత్ముఁడై పితృ**

**ప్రీతిగఁ జేయుఁ; దద్దహనభీకర భూరి శిఖా ప్రవేశసం**

**జాతదురంతతాపమునఁ జావఁగలా' రని శాప మిచ్చెఁ; ద**

**త్పాతన వృత్తికిన్ వెఱచి తక్కటి నాగము లా భుజంగితోన్. 198**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ జనమేజయుడు; సర్పయాగము= ఆ పేరుగల (సర్పాలను చంపే); ఆధ్వరమున్= యజ్ఞమును; కుపిత+ఆత్ముఁడై= కోపం కలవాడై; పితృ= తండ్రికి; ప్రీతిగన్= సంతోషం కొరకు; చేయున్= చేస్తాడు (ముందుకాలంలో); తత్ ఆ యజ్ఞంలోని; దహన= అగ్నియొక్క; భీకర= భయంకరమైన; భూరి= పెద్ద; శిఖా= మంటలలో; ప్రవేశ= ప్రవేశించటంవలన, పడటంవలన; సంజాత= పుట్టిన; దురంత= దాటరాని; తాపమునన్= వేడికి; చావగన్‌కలారు= చావగలరు; అని; శాపము ఇచ్చెన్= శపించింది; తత్= ఆ; పాతనవృత్తికిన్= యజ్ఞకుండాలలో పడటమనే స్థితికి; వెఱచి= భయపడి; తక్కటి= మిగిలిన; నాగములు= పాములు; ఆ, భుజంగితోన్= ఆ ఆడుపాముతో, కద్రువతో.

**తాత్పర్యం:** ఆ జనమేజయుడు తండ్రి ప్రీతికొరకు కోపంతో సర్పయాగం చేస్తాడు. మీరంతా భయంకరమైన ఆ నిప్పు మంటలలో పడి మాడండి అని తల్లి పిల్లలను శపించింది. ఆ శాపానికి భయపడి పాములు కద్రువతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** పద్యంలో దీర్ఘసమాసం చాలా విచిత్రార్థసముపేత మైనది. 'తద్దహన - సంతాపమునన్' తత్ దహన - ఈ ఒత్తక్షరం, భీకర-భూరి-శిఖా ప్రవేశ- సంతాప-దురంత-తాపము- ఈ దీర్ఘాక్షరాలు. సంతాప - దురంత-బిందుపూర్వక - తకరాలు - ఆమె కోపతీవ్రతను వ్యక్తపరుస్తున్నవి. చావగలారు - అని చేతులు కలుపుకోవటం - భుజంగి - ఆడుపాము - తన పిల్లలను తానే కొరికి తింటుందనటాన్ని ధ్వనిస్తుంది.

**తే. నల్లగాఁ జేయువార, మే మెల్లభంగి । నాతురంగమపతివాల। మని, రయమునఁ**

**బోయి, వాలధి రోమముల్ వొదివి, నీల - రోమసంచయమైరి కురుక్షితీశ! 199**

**ప్రతిపదార్థం:** కురు= కౌరవ; క్షితి= భూమికి; ఈశ!= రాజా!; ఏము= మేము; ఎల్లభంగిన్= అన్నివిధాలా; ఆ తురంగము= ఆ గుర్రాలలో; పతి= రాజుయొక్క; వాలము= తోకను; నల్లన్+కాన్= నల్లగా; చేయువారము= చేస్తాము; అని; రయమునన్= వేగంగా; పోయి= వెళ్ళి; వాలధి=తోకయొక్క; రోమముల్= వెంఱ్రుకలను; పొదివి= కప్పి; నీలరోమ= నల్లని వెంఱ్రుకల; సంచయము= గుంపు; ఐరి= అయినారు.

**తాత్పర్యం:** రాజా! తల్లీ నీవు చెప్పినట్లు అన్ని విధాలా ఆ ఉత్తమాశ్వం తోకను నల్లగా చేస్తామని పాములు వేగంగా వెళ్ళి గుర్రం తోకను చుట్టుకొని నల్లని వెంట్రుకల గుంపైనారు.

**క. కద్రువ, గన్గొని సంతో । షద్రుతమతి యగుచుఁ బిలిచి సవతికిఁ జూపెన్**
**భద్రాత్మక యవ్వినతయు । దద్ద్రోహం బెఱుఁగలేమి దైన్యము నొందెన్. 200**

**ప్రతిపదార్థం:** కద్రువ; కన్గొని= చూచి; సంతోష= సంతోషంతో కలిగిన; ద్రుత= వేగంతో కూడుకొన్న; మతి+ఐ= మనస్సు కలదై; పిలిచి; సవతికిన్= వినతకు; చూపెన్= చూపించింది; భద్ర+ఆత్మక= శుభమైన మనస్సుకల; ఆ+వినతయున్= ఆ వినత; తత్= (కద్రువయొక్క); ఆ; ద్రోహంబు= వంచన, మోసం; ఎఱుఁగలేమిన్= తెలిసికొనలేకపోవటం వలన; దైన్యమున్= దీనత్వాన్ని, దిగులు; ఒందెన్= పొందింది.

**తాత్పర్యం:** కద్రువ చూచి, సంతోషంతో ఆగలేక వినతను పిలిచి చూపించింది. అభం శుభం తెలియనిది కనుక వినత కూడా సవతి వంచనను గుర్తించలేక దైన్యం పొందింది.

**క. నగుచుం గద్రువ 'వరవుడ । వగుము విచారంబు విడిచి' యనుడు, వినత 'య**
**ట్లగుఁగా' కని, లజ్జయుఁ బెను । వగయుఁ దొలఁగఁ ద్రోచి, చేసె వరవుడము దగన్. 201**

**ప్రతిపదార్థం:** కద్రువ; నగుచున్= నవ్వుతూ; విచారంబున్= దిగులు; విడిచి= వదలి; వరవుడవు= దాసివి; అగుము= కమ్ము; అనుడున్= అనగా; వినత; అట్లు+అగున్+కాక= సరే అట్లాగే అని; లజ్జయున్= సిగ్గును; పెను= పెద్ద; వగయున్= దుఃఖం; తొలఁగన్+త్రోచి= అవతలకు నెట్టి; వరవుడము= దాస్యం; తగన్= చక్కగా; చేసెన్= చేసింది.

**తాత్పర్యం:** సంతోషం పట్టలేక నవ్వుతూ కద్రువ నాకు దాసివికమ్ము. ఈ దిగులు వదలిపెట్టుము. అనగానే వినత సరే లెమ్మని సిగ్గూ, దిగులూ వదలి ఆమెకు చక్కగా దాస్యం చేసింది.

**వ. ఇట్లు కపట జయంబునఁ గద్రువ సత్యవినయాది గుణవతి యయిన వినతం దనకు దాసి చేసికొని, పరిహీణంబు లయిన, పరిచారికాకృత్యంబుల నిత్యంబు నలంచుచుండెం; బదంపడి యప్పరమసాధ్వి దన యగ్రతనయుం డాదేశించిన తెఱం గూహించి, రెండవ యండంబున జనియించిన తనూజుం దలంచుచు నాసపాటు గదిరిన హృదయంబుతో దాస్యం బనాలస్యంబున నడపుచుండ. 202**

**ప్రతిపదార్థం:** ఇట్లు; కద్రువ; కపట విజయంబునన్= వంచనతో సాధించిన గెలుపుతో; సత్య, వినయ+ఆది గుణవతి= నిజం చెప్పటం; అణకువ మొదలైన గుణాలు కలది; అయిన వినతన్, తనకున్= తనకు (కద్రువకు); దాసి చేసికొని= దాసిగా చేసికొని; పరి= మిక్కిలి; హీనంబులు+అయిన= నీచములైన; పరిచారికా కృత్యంబులన్= సేవికలు చేసే పనులతో; నిత్యంబున్= ఎల్లప్పుడును; నలంచుచుండెన్= బాధ పెట్టుతున్నది; పదంపడి= తర్వాత; ఆ+పరమ= ఆ గొప్ప; సాధ్వి= పతివ్రత; తన

అగ్రతనయుండు= తన పెద్దకొడుకు అరుణుడు; ఆదేశించిన= చెప్పిన; తెఱంగు= విధానం; ఊహించి= ఆలోచించి; రెండవ అండంబునన్= రెండో గ్రుడ్డునుండి; జనియించిన= పుట్టిన; తనూజున్= కొడుకును; తలంచుచున్= తలచుకొంటూ; ఆసపాటు= ఆశ; కదిరిన= కలిగిన; హృదయంబుతోన్= మనస్సుతో; న+ఆలస్యంబునన్= అనాలస్యంబునన్= అలసతలేకుండా; దాస్యంబున్; నడపుచుండన్= సాగిస్తుండగా

**తాత్పర్యం:** కపట విజయంతో కద్రువ సత్యవినయాదిగుణవతి అయిన వినతను దాసిగా చేసి మామూలు పరిచారికలు చేసే పనులు చెప్పి హీనంగా బాధిస్తున్నది. మహాపతివ్రత అయిన వినతమాత్రం తన పెద్దకొడుకు చెప్పినట్లు రెండో గ్రుడ్డు పగిలి బైటపడే కొడుకును తలచుకొంటూ ఎప్పుడు తన కీ దాస్యం పోతుందా అని ఆశతో దాస్యం జాగ్రత్తగా చేస్తూ ఉన్నది.

**ఉ. యౌవనదర్ప మంది, జవ మంతకు నంతకు నగ్గలింప, మై**
**లా వధికంబు గాఁగ, నుపలాలన సేయఁగఁ బద్మసంభవుం**
**డా విహగోత్తముండు హృదయంబున గర్వ మెలర్ప నుద్ధతుం**
**డై విహరింపఁ జూచి యొక యప్పుడు, నారదుఁ డల్లఁ జేరినన్. 203**

**ప్రతిపదార్థం:** యౌవనదర్పము= యువకత్వంవలన కలిగిన ఔద్ధత్యం; అంది= పొంది; ఆ విహగ+ఉత్తముండు= ఆ పక్షిరాజు (విహంగము= ఆకాశంలో ఎగిరేది) జవము= వేగం; అంతకున్+అంతకున్ (అంతంతకు)= నానాటికి; అగ్గలింపన్= అతిశయించగా; మై= శరీరంయొక్క; లావు= బలం; అధికంబుకాఁగన్= ఎక్కువ కాగా, పద్మసంభవుండు= బ్రహ్మ, పద్మం నుండి పుట్టినవాడు; ఉపలాలనన్= మంచిలాలన; చేయఁగన్= చేస్తూ ఉండగా; హృదయంబునన్= మనస్సులో; గర్వము; ఎలర్పన్= తుళ్ళింతలాడగా; ఉద్ధతుండై= గర్విష్ఠిఅయి; విహరింపన్= తిరుగుతుండగా; ఒక+అప్పుడు= ఒకసారి; నారదుఁడు; అల్లన్= మెల్లగా; చేరినన్= సమీపించగా.

**తాత్పర్యం:** ఆ గరుత్మంతుడిని తాత బ్రహ్మ గోముతో లాలిస్తున్నాడు. పైగా యౌవనమదం. శరీరంలో క్రొవ్వు బలిసిపోతున్నది. గర్వం, దర్పం, ఔద్ధత్యం రోజురోజుకూ అతిశయిస్తుండగా లోకాలన్నిటా యథేచ్ఛగా విహరిస్తున్నాడు. ఒకరోజు నారదమహర్షి నెమ్మదిగా అతడిని సమీపించగా.

**విశేషం:** అక్కడ తల్లి నానా బాధలూ పడుతున్నది. ఒక కొడు కట్లా శపించి పోయాడు. వీ డేమో ఇల్లు పట్టకుండా మదించి తెగ తిరుగుతున్నాడు. ఈ సందర్భంలో నారదుడు కథలో ప్రవేశించాడు. సామాన్యంగా మన పురాణాలలో కథ మలుపు తిరిగే సమయంలో పాత్ర క్లిష్ట పరిస్థితులలో ఉండగా నారద పాత్ర ప్రవేశించి కథ నడుపుతుంది. అంటే నారదు డెవరు? దేవర్షి. ఋషి అంటే జ్ఞానశక్తికి ప్రతీక. నారదు డంటే జ్ఞానా న్నిచ్చేవాడు. జ్ఞానస్వరూపుడైన ఋషి. నీ వొక క్లిష్టపరిస్థితులలో ఏమీ దిక్కుతోచని స్థితిలో ఉన్నప్పుడు ఒక మార్గాన్ని చెప్పేవాడు బయటనుండీ రావచ్చును. లేదా నీకే తోచవచ్చును. ఆ స్ఫురణశక్తి పేరు నారదుడు.

**వ. అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు నమ్మునిపుంగవుం డిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** అతఁడు= గరుత్మంతుడు; భక్తిన్= భక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి; నిల్చినన్= నిలువగా; ఆ+పక్షిపుంగవునకున్= ఆ పక్షిరాజునకు; ఆ+మునిపుంగవుండు= ఆ మునిరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు నమస్కరించి నిలువగా అతడితో నారదుడు ఇట్లా అన్నాడు.

**తే. 'దాసియై సవతాలికిఁ దల్లి పనులు । సేసి నలఁగంగ, నద్దెసఁ జింత వంత**
**లేక నీ విట్లు దిరుగుట లెస్స యగునె? । యద్భుతోజ్జ్వలతేజ! కశ్యపతనూజ!' 205**

**ప్రతిపదార్థం:** అద్భుత+ఉజ్జ్వలతేజ!= ఆశ్చర్యకరంగా ప్రకాశించే తేజస్సు కలవాడా!; కశ్యప తనూజ!= కశ్యపమహర్షి కొడుకా!; తల్లి= వినత; సవతి+ఆలికిన్= సవతి అయిన భార్యకు, సవతికి; దాసి+ఐ= బానిస అయి; పనులుచేసి= కద్రువ చెప్పే నీచమైన కార్యాలు చేస్తూ; నలఁగంగన్= నలిగిపోగా (మనస్సులో క్రుంగిపోవటం, శరీరదృష్టితో కృశించిపోవటం); ఆ+దెసన్= ఆ వైపున; చింత వంత= ఆలోచన కానీ, బాధ కానీ; లేక= లేకుండా; నీవు; ఇట్లు= ఈవిధంగా; తిరుగుట= విహరించటం; లెస్సఅగునె?= బాగున్నదా?

**తాత్పర్యం:** నాయనా! నీవు గొప్ప పరాక్రమశాలివి. కశ్యపబ్రహ్మకుమారుడవు అయి ఉండి నీ తల్లి ఒక ప్రక్క తన సవతికి నీచంగా దాస్యం చేస్తుంటే అదేమీ పట్టించుకొనకుండా ఇట్లా తిరగటం ఏం బాగుంది?

**విశేషం:** ఇది పెద్దవారు చీవాట్లు పెట్టే పద్ధతి. తెలుగు వాడి నోటినిండుగా అమరిన వాక్యవిన్యాసం కాకువు-తిక్కనగారి సొత్తు.

**చ. అనుడు, విహంగనాథుఁడు 'మదంబకు దాస్యము రాకకుం గతం**
**బనఘవిచార!యెద్ది? తెలియన్ వినిపింపవె!' యన్నఁ జెప్పె న**
**మ్మునివరుఁ డున్నరూపు, హయముం గను టాదిగఁ గల్గు కశ్యపాం**
**గనల చరిత్ర మాతని కఖండ పరిస్ఫుట భాషణంబులన్. 206**

**ప్రతిపదార్థం:** అనుడున్= అట్లా నారదముని చెప్పగా; విహంగనాథుఁడు= పక్షిరాజు; మత్= నా; అంబకున్= అమ్మకు; దాస్యమురాకకున్= దాస్యం రావటానికి; కతంబు= కారణం; ఎద్ది= ఏది?; అనఘ విచార!= పవిత్రమైన వివేకం కల స్వామీ! తెలియన్= నాకు స్పష్టపడేటట్లు; వినిపింపవె?= సవిస్తరంగా చెప్పవా!; అన్నన్= అనగా; ఆ+మునివరుఁడు= ఆ మునిశ్రేష్ఠుడు; హయమున్= గుర్రాన్ని; కనుట ఆదిగన్= చూచింది మొదలు; కల్గు= జరిగిన; కశ్యప+అంగనల= కశ్యపుడి భార్యల; చరిత్రము= కథ; ఉన్నరూపు= ఉన్న వైఖరి; అతనికిన్= గరుత్మంతుడికి; అఖండ= పూసగ్రుచ్చినట్లుగా (ఖండము = ముక్క; అక్కడక్కడ ముక్కలు ముక్కలుగా కాకుండా ఏకధాటిగా); పరిస్ఫుట= విస్పష్టమైన; భాషణంబులన్=మాటలలో; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** నారదముని అట్లా అనగానే విన్న గరుత్మంతుడు 'అయ్యో! మా అమ్మ దాస్యం చేస్తున్నదా? ఎందుకో చెప్పుము నారదా, అని ప్రార్థించగా ఆయన స్పష్టమైన మాటలలో గుర్రాన్ని చూచింది మొదలు కద్రూ వినతల మధ్య జరిగిన కథనంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

**విశేషం:** నాకు తెలిసేటట్లు చెప్పుమన్నాడు గరుత్మంతుడు. ఈయన 'అఖండ - భాషణంబులన్' చెప్పాడట. ప్రశ్నకు తగ్గ సమాధానం చెప్పాలి కనుక. తెలిసేటట్లు అనటంలోని రహస్యం 173వ పద్యంలోని అరుణుడు చెప్పిన విధాతృ వశమయివచ్చిన రీతి వివరించటం. ఆ కథ అట్లా ఎందుకు జరిగిందో ఆ సృష్టి రహస్యాన్ని వ్యాఖ్యానించటం.

**చ. చెప్పినఁ, గోపమున్ వగపుఁ జిత్తమునం గదురంగ 'మేలు మే**
**లప్ప హితంబు సేసెఁ, జెలియల్ మనుచున్నది, పెంపుతోడ' నం**
**చప్పుడ వాయువేగమున నయ్యెడకుం జని, మాట యెద్దియుం**
**జెప్పక తల్లికిం బ్రణతి సేసె విషాద భరార్తమూర్తియై. 207**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= చెప్పగా; కోపమున్= కోపమూ; వగపున్= దుఃఖం; చిత్తమునన్= మనస్సులో; కదురంగన్= కలుగగా; మేలుమేలు= ఓహో, సెబాసు (కోపంతో ఎగతాళిగా అనటం); అప్ప= అక్కయ్య; హితంబుచేసెన్= మేలు చేసింది; చెలియల్= చెల్లెలు; పెంపుతోడన్= హాయిగా, సుఖంగా; మనుచున్+ఉన్నది= బ్రతుకుచున్నది; అంచున్= అంటూ; వాయువేగమునన్= గాలి వేగంతో; అప్పుడు+అ= వెంటనే; ఆ+ఎడకున్= ఆ చోటికి; చని= వెళ్ళి; మాట ఎద్దియున్= ఏ మాటా; చెప్పక= చెప్పకుండా; తల్లికిన్; విషాదభర= దుఃఖభారంతో; ఆర్తమూర్తి+ఐ= చింతయే ఆకారం కలవాడై; ప్రణతి= నమస్కారం; చేసెన్= చేశాడు. (విషాదంతో చెక్కిన ఆకారం కలవాడై, మనస్సులోని చింత, దుఃఖం బయటకు వస్తే ఎట్లా ఉంటాయో అట్లా ఉన్నాడని భావం.)

**తాత్పర్యం:** చెప్పగానే ఆయన మనస్సంతా కలత చెందింది. కోపం వచ్చింది. ఆ బాధతో, కోపంతో అన్నాడు; 'ఆహా! చాలా బాగుంది. అప్పగారు మేలు చేసింది. చెల్లెలు కనీసం బ్రతుకుతున్నది' అని అంటూ వెంటనే వాయువేగంతో వెళ్ళి ఏమీ మాట్లాడకుండా దుఃఖంతో తల్లికి ప్రణామం చేశాడు.

**విశేషం:** పద్యంలో వాక్యం - మాట - పూటంతా కోపంతో బాధలో ఉన్నవాడు ఎట్లా ఉంటాడో అట్లాగే వ్రాయడం గమనించ దగింది. పెదతల్లిమీద కోపం, తల్లి అమాయకత్వానికి జాలిపడిన పాటుకు విషాదం, తనతో చెప్పనైనా లేదే తల్లి అన్న చింతా, అనేక భావాలతో నిండిన హృదయం నుండి వచ్చిన మాట ఈ పద్యం. అందుకే ఏమీ మాట్లాడకపోవటం.

**వ. కద్రువపాలికిం బోయి. 208**

**తాత్పర్యం:** కద్రువ దగ్గరకు వెళ్ళి (గరుత్మంతుడు)

**చ. పరమ వినీతిమై నెఱఁగి, బాంధవ మారఁగ నల్ల నిట్లనున్**
**గరుడుఁడు దారితారి వగఁ గందుచు 'నీ చెలియల్ చరించు ని**
**వ్వరవుడపుం జరిత్రమున వచ్చునె నీ కొక పేర్మి? యీసతిం**
**గరుణ యెలర్పఁగా విడువ గౌరవ సంపదఁ జేయు నెంతయున్. 209**

**ప్రతిపదార్థం:** గరుడుఁడు= గరుత్మంతుడు; పరమ= గొప్ప; వినీతిమైన్= వినయంతో; ఎఱఁగి= నమస్కరించి; బాంధవము+ ఆరఁగన్= బంధుత్వం వెల్లివిరిసేటట్లు; తారితారి= తారట్లాడుతూ (భయంతో వినయంతో చెప్పలేక పెద్దవారిముందు చిన్నవాళ్ళు పడేపాట్లు సూచించే మాట); అల్లన్= నెమ్మదిగా; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; నీ చెలియల్= నీ చెల్లెలు; వగన్= దుఃఖంతో; కందుచున్= బాధపడుతూ కందిపోతూ; చరించు= చేసే; ఈ; వరవుడము+చరిత్రమునన్= దాస్య కథతో; నీకున్; ఒక పేర్మి= ఒక గొప్ప కూడా; వచ్చునే? = కలుగుతుందా? (కలగదు); ఈ సతిన్= ఈ అమాయకురాలిని; కరుణ= దయ; ఎలర్పఁగాన్= చిగురించగా; విడువన్= విడిచిపెట్టితే; గౌరవ సంపదన్= గొప్ప గౌరవాన్ని; ఎంతయున్ చేయున్= మిక్కిలి కలిగిస్తుంది.

**తాత్పర్యం:** మహావినయంతో నమస్కరించి తారట్లాడుతూ, బంధుత్వాల్ని త్రవ్వుతూ గరుత్మంతు డీ విధంగా అన్నాడు; 'నీ చెల్లెలు పాపం దుఃఖంతో కందిపోతూ చేసే ఈ దాస్యం కథవలన నీకు వచ్చే గొప్ప ఏమిటి? ఆ అమాయకురాలిని వదలిపెట్టుము. నీకెంతో గౌరవం దక్కుతుంది.

**విశేషం:** మా అమ్మను వదలిపెట్టుము. లేకపోతే ఊరుకొనేది లేదని అనవచ్చును. అట్లా అనకుండా పెదతల్లి కనుక మర్యాదతో, వినయంతో సంభాషించటం ఇందులో చెప్పుకొనదగ్గ అంశం. ఆ మాట బంధుత్వ దృష్ట్యా అన్నాడు. కనుకనే నీ చెల్లెలు అని అనటం, మా అమ్మ అనటం వేరు. ఇట్లా అనటం వేరు కదా! కనుక గరుత్మంతుడి మాటలో వ్యవహారం తెలిసినవాడి లక్షణమున్నది.

**చ. నీకును నేను బుత్త్రుఁడన; నెమ్మిఁ దగన్ ననుఁ జూచియైనఁ ద**
**ల్లీ! కృపసేఁత పెద్దయును లెస్స; యధర్మము ధర్మ మన్వగల్**
**నా కవి యేల? దాస్యకృతి నా జనయిత్రికి నివ్విధంబునన్**
**రాకయు దైవకృత్యమ మనంబునఁ బొంగుదు విడ్పుగల్గినన్. 210**

**ప్రతిపదార్థం:** తల్లీ!= అమ్మా!; నీకును= నీకూ; నేను; పుత్త్రుఁడన= కొడుకునే (నీ కొడుకులతోపాటు); నెమ్మిన్ తగన్= ప్రేమతో తగినట్లు, తగిన ప్రేమతో; ననున్‌చూచిఐనన్= నా ముఖం చూచి అయినా; కృపసేఁత= దయచూపించటం; పెద్దయును= చాలా; లెస్స= గొప్ప, మంచిది; నాకున్; అధర్మము, ధర్మము; అన్ వగల్= ఇది ధర్మం, అది అధర్మం అన్న వగలమాటలు (వగలాడి లోని వగలు); అవి+ఏల? అవెందుకు?; నా జనయిత్రికిన్ ధర్మము= నా తల్లికి; ఈ+విధంబునన్= ఈ విధంగా; దాస్యకృతి= దాస్యం చేసేపని; రాకయున్= రావటం కూడా; దైవకృత్యము+అ= దైవం తప్ప జూడటమే; విడ్పు= నా తల్లి విడుదల; కల్గినన్= కలిగితే; మనంబునన్= మనస్సులో; పొంగుదున్= సంతోషిస్తాను.

**తాత్పర్యం:** అమ్మా! నీ వేయిమంది కొడుకులతో పాటుగా నేనూ నీకు కొడుకునే. కనుక నా ముఖం చూచైనా మా అమ్మను వదలిపెట్టుము. ఇది ధర్మమా! అధర్మమా అనే వగలమాటలు నాకెందుకు? నా తల్లికీ దైన్యం కలగటం కూడా దైవం పనే. కనుక విడిచిపెట్టితే నేను సంతోషిస్తాను.

**విశేషం:** పై పద్యంలో చెప్పినమాటకు కద్రువ ఉలకలేదు, పలకలేదు. కనుకనే నేనూ కొడుకునే కదా! నా ముఖం చూచైనా అని అన్నాడు. ధర్మాధర్మ జిజ్ఞాస నా కెందు కనకుండా వగలు అనటంలో లోకం ఆ రెండు మాటలను అట్లా వినియోగించుకొంటుంది కనుక. మనస్సులో ఏమీ లేకుండా పైకున్నట్లు నటించటం వగలు.

**వ. అనిన విని మొగంబు మఱకటించు కొనుచుఁ గద్రువ గరుత్మంతున కిట్లనియె. 211**

**ప్రతిపదార్థం:** మొగంబు= ముఖం; మఱకటించుకొనుచున్= మూతి ఒక ప్రక్కకు త్రిప్పి ఎగతాళితో అభినయిస్తూ; కద్రువ; గరుత్మంతునకున్= గరుత్మంతుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆమెకు ఈ మాటలు రుచించలేదు. అందుకని మూతి ఒక ప్రక్కకు తిప్పి ఎగతాళిగా గరుత్మంతుడితో ఈ విధంగా అన్నది;

**మ. 'బలవంతుండవు, నేర్పు చందములఁ జెప్పంజాలి యీరిత్త ప**
**ల్కులఁ దేర్పం బనిలేదు; తల్లికి మదిం గూర్తేని వే పోయి లో**
**కులు నిన్నుం బ్రణుతింపఁ దె మ్మమృతమున్; ఘోరంపు దాస్యంబు నేఁ**
**దొలఁగం బెట్టెద మీ కనంతమగు సంతోషంబు సంధిల్లఁగన్. 212**

**ప్రతిపదార్థం:** బలవంతుండవు= చాలా గొప్ప బలశాలివే (ఎగతాళి- నిజాన్ని ఎగతాళి చేయటం); ఈ రిత్తపల్కులన్= ఈ వట్టిమాటలతో; తేర్పన్= మంచి చేసికొనటం వలన; పని లేదు= పని లేదు, లాభంలేదు; తల్లికిన్; మదిన్= మనస్సులో; కూర్తు (వు)+ఏని= (ప్రేమ కలవాడవైతే; వేపోయి= వెంటనే పోయి; లోకులు= జనం; నిన్= నిన్ను; ప్రణుతింపన్= పొగడగా; అమృతమున్= సుధను; తెమ్ము= తీసికొనిరమ్ము; ఘోరంపు= ఘోరమైన; దాస్యంబున్= బానిసతనాన్ని; నేన్= నేను; తొలఁ గన్ పెట్టెదన్= తొలగిస్తాను; (నే నున్నాను కదా తొలగించటానికి నీ వది త్వరగా తీసికొనిరా. ఇదీ వాక్య నిర్మాణానికి పునాది); అనంతమగు= లెక్కింపరాని; సంతోషంబు= ఆనందం; మీకున్= నీకూ, నీ తల్లికీ; సంధిల్లఁగన్= కలుగగా (నేను దాస్యాన్ని తొలగిస్తాను)

**తాత్పర్యం:** 'చాలా బలవంతుడవే! చాలా నేర్పుగానే మాట్లాడావు. పోరా పో! ఈ వట్టిమాటలతో ఏమి లాభం? (బంధుత్వం, చెల్లెలు, కొడుకు వంటి మాటలు) మీ అమ్మమీద నీకు నిజంగా ప్రేమంటూ ఉంటే పోయి వెంటనే అమృతం తీసికొనిరా. మీ అమ్మను నేను వదిలిపెట్టుతాను. మీకు నీ వన్నట్లు అనంత సంతోషం కలుగుతుంది.

**చ. అన విని, దాని కియ్యకొని, యప్డు సుపర్ణుఁడు పోయి, కశ్యపుం**
**గని, తన భాషణంబులును, గద్రువ పల్కులుఁ జెప్పి, 'తెచ్చువాఁ**
**డ నమృత మెట్లు నే నని యొడంబడి వచ్చితి' నన్న నాతఁ డ**
**త్తనయునిఁ జూచి యుల్లము ముదంబును నచ్చెరుపాటు వొందఁగన్. 213**

**ప్రతిపదార్థం:** అనన్, విని; సుపర్ణుండు= గరుత్మంతుడు (మంచి రెక్కలు గలవాడు); దానికిన్= కద్రువమాటకు; ఇయ్యకొని= అంగీకరించి; అప్డు= ఆ సమయంలో; పోయి= వెళ్ళి; కశ్యపున్= తండ్రిని; కని= చూచి; తన భాషణంబులును= తన మాటలూ; కద్రువపల్కులున్= తల్లిమాటలూ; చెప్పి= వివరించి; ఎట్లున్= ఏ విధంగానైనా సరే; నేను; అమృతమున్= సుధను; తెచ్చువాఁడను= తెస్తాను; అని; ఒడంబడి= అంగీకరించి; వచ్చితిని= మీ దగ్గరకు వచ్చాను; అన్నన్= అనగా; ఆతఁడు= కశ్యపుడు; ఆ తనయునిన్= ఆ కొడుకును; చూచి= తేరిపార చూచి (ఎంతవాడైనా డన్నట్లుగా); ఉల్లము= మనస్సు; ముదంబును= సంతోషం; అచ్చెరుపాటు= ఆశ్చర్యం; ఒందఁగన్= పొందగా.

**తాత్పర్యం:** కద్రువ చెప్పిన మాటలు విని వెంటనే సుపర్ణుడు తండ్రి దగ్గరకు వెళ్ళి, తనకూ, పెద్దమ్మకు జరిగిన సంభాషణ అంతా వివరించి 'ఎట్లాగైనా సరే అమృతం తెస్తానని అంగీకరించి వచ్చాను' అని చెప్పాడు. అంతా విని కొడుకును తేరిపార చూచి మనస్సులో ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ పొందాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** ఒక తండ్రి ప్రయోజకు డైన కొడుకును చూచి పొందే ఆనందలక్షణ మిట్లాగే ఉంటుంది.

**క. 'అమృతంబు దుర్లభం, బ । య్యమరుల కేనియు నతిప్రయత్నంబున గు**
**ప్తము సేసి యుండు వాసవుఁ । డమలచరిత! నీకు నగునె యట్టిది తేరన్' 214**

**ప్రతిపదార్థం:** అమల= నిర్మలమైన, మచ్చలేని; చరిత!= ప్రవర్తన కలవాడా!; అమృతంబు= అమృతం; అ+అమరులకేనియున్= ఆ దేవతలకైనా; దుర్లభంబు= లభించటం కష్టం - దొరకదు; వాసవుఁడు= ఇంద్రుడు; అతి ప్రయత్నంబునన్= చాలా జాగ్రత్తగా; గుప్తము చేసిఉండున్= దాచి ఉంచుతాడు; అట్టిది= అట్లాంటిదాన్ని; తేరన్= తేవటం; నీకున్= నీకైనా; అగునె?= సాధ్యమా?

**తాత్పర్యం:** నీవు నిర్మల హృదయుడవే! కానీ ఆ అమృతం వాసవుడు చాలజాగ్రత్తగా భద్రం చేస్తాడు. కనుక దేవతలకే అది చిక్కదు. మరి నీ కట్లాంటిది ఎట్లా సాధ్యం?

**వ. వినుము.** **215**

**తాత్పర్యం:** (రహస్యం చెప్పుతాను) వినుము.

**చ. ఉదకము రక్షకం బగుచునుండఁగ, నుజ్జ్వలవహ్నియందునుం**
**పొదువఁ, గృపాణశక్తి ముఖ భూరితరాయుధహస్తులై బలో**
**న్మదులు, మహోగ్రకోపులు, ఘనస్థిరకాయు లనేకరాక్షసుల్**
**పొదిగొని కావ నిన్పవలలో నమృతంబు సురక్షితస్థితిన్.** **216**

**ప్రతిపదార్థం:** ఉదకము= నీరు; రక్షకంబు= కాపాడేది; అగుచున్ ఉండన్= కాగా; అందునున్= అందులో, దానిమధ్యలో; ఉజ్జ్వల= మండే; వహ్ని= అగ్ని; పొదువన్= అమృతాన్ని ఆవరించి క్రమ్మగా; అనేక రాక్షసుల్= పెక్కుమంది రాకాసులు; కృపాణ=కత్తి; శక్తి= ఒక రకం బల్లెం; ముఖ= మొదలైన; భూరితర= గొప్ప; ఆయుధ= ఆయుధాలున్న; హస్తులై= చేతులు కలవారై; బల+ఉన్మదులు= బలంతో మదించినవారు; మహా+ఉగ్రకోపులు= గొప్ప తీవ్రమైన కోపం కలవారు; ఘన=పటిష్ఠమైన, పెద్ద; స్థిర= చెదరని; కాయులు= శరీరాలవారు; పొదిగొని= చుట్టూ మూగి; కావన్= కాపాడుతూ ఉండగా; ఇన్పవలలోన్= ఇనుముతో చేసిన వల లోపల; అమృతంబు= అమృతం; సురక్షితస్థితిన్= భద్రంగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** జలం రక్షిస్తుంటే దాని మధ్య అగ్ని మండుతూ ఉండగా, కత్తులతో, బల్లెంవంటి పదునైన ఆయుధాలతో మదించి, తీవ్రకోపిష్ఠులై, పెద్ద శరీరాలున్న రాక్షసు లనేకమంది కాపలా కాస్తుండగా ఇనుపవలలో అమృతం సురక్షితంగా ఉంటుంది. అందుకని అది దేవతలకైనా దుర్లభమనటం జరిగింది.

**క. ఉండు నన విని, విహంగ వి । భుం డల్లన నగుచు, 'నీవు పుత్రస్నేహా**
**ఢ్యుండవయి పలికితే; బలి । యుండ, నుపాయజ్ఞుఁడను, మహోజ్జ్వలతేజా!** **217**

**ప్రతిపదార్థం:** ఉండున్= ఉంటుంది; అనన్ విని; విహంగ విభుండు= పక్షిరాజు; అల్లనన్= నెమ్మదిగా; నగుచున్= నవ్వుతూ; మహా+ఉత్జ్వల= గొప్పగా పైకి అంతటా ప్రసరించే; తేజా!= కాంతికలవాడా!; నీవు; పుత్రస్నేహ= కొడుకుమీది ప్రేమచేత; ఆఢ్యుండవు+ అయి= దొడ్డవాడవై; పలికితి= అన్నావు; ఏన్= నేను; బలియుండన్= బలవంతుడిని;ఉపాయజ్ఞుఁడను= ఉపాయం తెలిసినవాడిని.

**తాత్పర్యం:** తండ్రి అట్లా చెప్పగా విని పక్షిరాజు నవ్వుతూ 'దివ్యతేజస్సు కల తండ్రీ! పుత్రస్నేహంతో అన్నావే తప్ప నా శక్తి తెలియదా? చాలా బలశాలిని. ఉపాయం తెలిసినవాడను (నన్ను చిన్నవాడిగా భావించవద్దు అని సూచన).

**మ. అనుమానం బది యేల? తెత్తు నమృతం 'బన్నం గడుం బొంగి, యా**
**తనిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి కశ్యపుఁడు, పుత్రా! నిశ్చయం బట్లయే**
**ని, నిభంబుం గమఠంబునుం గలవు; వానిం దిన్న లావెక్కుఁ; నా**
**ఘనజంతు ద్వితయంబు నీకు నెరగాఁ గల్పించితిం బోవనా!' 218**

**ప్రతిపదార్థం:** అనుమానంబు= సందేహం; అది+ఏల?= నీకెందుకు? అమృతంబున్= సుధను; తెత్తున్= తప్పక తెస్తాను; అన్నన్= అంటే; కశ్యపుఁడు= తండ్రి; కడున్= చాలా; పొంగి= ఉబ్బిపోయి; అతనిన్= అతడిని; తాన్= తాను; కౌఁగిటన్= తన సందిట్లో; చేర్చి= చేర్చికొని; పుత్రా!= కుమారా! (ప్రేమతో పొంగిపోయి పిలిచిన పిలుపు); నిశ్చయంబు= నీ నిర్ణయం; అట్లు+అ+ఏనిన్= అట్లాగే అయితే; ఇభంబున్= ఏనుగు; కమఠంబున్= తాబేలున్నూ; కలవు= ఉన్నాయి; వానిన్= వాటిని; తిన్నన్= తింటే; లావు= బలం; ఎక్కున్= ఎక్కువౌతుంది; ఆ; ఘన= గొప్ప; జంతుద్వితయంబున్= జంతువులజంటను; నీకున్; ఎరగాన్= ఆహారంగా; కల్పించితిన్= సృష్టించాను; పోవనా= పోవయ్యా!

**తాత్పర్యం:** నీ కనుమాన మక్కరలేదు. అమృతం తప్పక తెస్తాను'. అనేసరికి తండ్రి ఉబ్బితబ్బిబ్బైపోయి కౌగిలించుకొని 'బాబూ! నీ నిర్ణయ మంతే అయితే సరే. ఒక యేనుగూ, ఒక తాబేలూ ఉన్నాయి. అవి ఘనజంతువులు. వాటిని తింటే బలం వస్తుంది. నీకు వాటిని నీ ఆహారంగా నిశ్చయించాను. అన్నా! అవి తిని పోయిరా!'

**వ. అనుటయు సంతోషించి గరుత్మంతుం 'డా గజకచ్ఛపంబు లెచ్చట నుండు? నెబ్బంగివి? యని యడిగిన నమ్మునీంద్రుం డవ్విహగేంద్రున కిట్లనియె. 219**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనటంతోనే; సంతోషించి= ఆనందపడి; గరుత్మంతుండు= సుపర్ణుడు; ఆ గజ, కచ్ఛపంబులు= ఆ ఏనుగు, తాబేలు; ఎచ్చటన్+ఉండున్?= ఎక్కడుంటాయి; ఏ+భంగివి?= ఎట్లాంటివి?; అని అడిగినన్= అని అడుగగా; ఆ+మునీంద్రుండు= ఆ ఋషీశ్వరుడు; ఆ విహగ+ఇంద్రునకున్= ఆ పక్షిరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు, చెప్పాడు.

**తాత్పర్యం:** అనటంతోనే సంతోషంతో 'ఆ ఏనుగు, తాబేలు ఎక్కడున్నాయి? వాటి సంగతేమిటి?' అని కొడుకు ప్రశ్నించగా తండ్రి ఇట్లా అన్నాడు.

### కశ్యపుఁడు గరుడునకు గజకచ్ఛపంబుల తెఱం గెఱింగించుట (సం.13-25-1 (కుంభ))

**సీ. 'ప్రాక్పయోనిధి పొంతఁ బర్వతం బొక్కటి । ఘన శృంగ కబళితాకాశ మగుచు,**
**నురగనామంబున నొప్పు, నచ్చేరువ । వసియించు నొక మహావారణంబు,**
**దానితటంబునఁ దామరకొల నబ్ధి । ననుకరించుచు మధురాచ్ఛవారి**
**సంపద సొంపారు సమదలీలల నగ్గ । జం బా నగంబుపై సంచరింప**

**తే. మిట్టుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క । మట్టమైయది నునుపారు మహిత మైన**
**యక్కొలన నీరు ద్రావఁగా ననుదినంబు । నరుగు నయ్యిభవల్లభుఁ డనఘచరిత! 220**

**విశేషం:** అనఘ చరిత= పాపరహితమైన నడవడి గలవాడా!; ప్రాక్+పయోనిధి= తూర్పు సముద్రం; పొంతన్= ప్రక్కనే; పర్వతంబు= కొండ; ఘనశృంగ= ఎత్తైన శిఖరాలతో; కబళిత= మ్రింగబడిన; ఆకాశము+అగుచున్= మిన్ను కలదై; ఉరగ నామంబునన్= ఉరగమన్న పేరుతో; ఒప్పున్= పేరొందెను; ఆ+చేరువన్= ఆ ప్రక్కనే; ఒక మహావారణంబు= ఒక పెద్ద ఏనుగు; వసియించున్= నివశిస్తుంది; దానితటంబునన్= దాని ఒడ్డునే, ఆ పర్వతం చరియలో; తామర సరస్సు= తామరపూల సరస్సు; అబ్ధిన్= సముద్రాన్ని; అనుకరించుచున్= సరి పోలుతూ; మధుర= తీయని; అచ్ఛ= స్వచ్ఛమైన; వారి= నీటియొక్క; సంపదన్= సమృద్ధితో; సొంపు+ఆరున్= అందగిస్తుంది; ఆ+గజంబు= ఆ ఏనుగు; సమదలీలన్= మదంతో కూడిన విలాసంతో; ఆ నగంబుపైన్= ఆ కొండపై; సంచరింపన్= తిరుగగా; మిఱ్ఱు= ఎత్తు; పల్లంబు= లోతు, నిమ్న ప్రదేశం; గట్టును మెట్టును= గట్టూ, మెట్టూ; ఒక్కమట్టమై= సమమై; నునుపారున్= నున్నబడుతుంది; అనుదినంబు= ప్రతిరోజూ; మహితమైన= గొప్పదైన; ఆ+కొలన నీరు= ఆ చెరువునీరు; త్రావఁగాన్= త్రాగటానికి; ఆ+ఇభవల్లభుఁడు= ఆ ఏనుగు రాజు; అరుగున్= వెళ్ళుతాడు, వెళుతుంది.

**తాత్పర్యం :** తూర్పు సముద్రం చెంత ఒక గొప్ప పర్వతం ఉన్నది. దాని శిఖరాలు ఆకాశాన్ని కప్పివేస్తుంటాయి. దానిపేరు ఉరగము. దాని ప్రక్కనే ఒక ఏనుగు నివసిస్తూ ఉన్నది. ఆ కొండ ప్రక్క ఒక కొలను. అందులో నీరు స్వచ్ఛంగా తియ్యగా ఉంటుంది. ఆ ఏనుగు ఆ కొండపై తిరుగాడుతూ ఉంటే ఎత్తూ పల్లాలూ, గట్టూ మెట్టూ, ఏకచదరమైపోతుంది. ఆ ఏనుగు ఆ కొలనులో నీరు త్రాగటానికి ప్రతిరోజూ వెళ్ళుతుంది.

**ఉ. అందొక కచ్ఛపప్రవరుఁ, డత్యధికంబగు కాయమున్, బలం**
**బుం దనరన్ వసించు, జలముం గొను వాంఛ, గజంబు వోయినం**
**జెందఁగనీక, సంగరముఁ జేయుఁ బెనంగుచు నీరుద్రావు, గౌ**
**రుం దెగియుండు నిట్ల పగ రోష మెలర్పఁగ నాఁడు నాఁటికిన్. 221**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ కొలనులో; ఒక; కచ్ఛప ప్రవరుఁడు= ఒక శ్రేష్ఠమైన తాబేలు; అతి= మిక్కిలి; అధికంబు+అగు= గొప్పదైన; కాయమున్= శరీరమూ; బలంబున్= బలమూ; తనరన్= ఒప్పగా; వసించున్= నివసిస్తున్నది; గజంబు= ఏనుగు; జలమున్+కొను వాంఛన్= నీరు త్రాగాలన్న ఆసక్తితో; పోయినన్= కొలని చెంతకు పోగా; చెందఁగనీక= నీరందనివ్వకుండా; పెనంగుచున్= పెనగులాడుతూ; సంగరమున్ చేయున్= యుద్ధం చేస్తుంది; నీరుత్రావు= నీరుత్రాగే; గౌరున్= ఏనుగుకూడా; తెగి= తెగించి; నాఁడు నాఁటికిన్= రోజు రోజుకూ; పగ= వైరం; రోషము= కోపం; ఎలర్పఁగన్= ఎక్కువకాగా; ఇట్లు+అ= ఇదే రీతిగా; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ కొలనులో పెద్ద శరీరం కల బలిష్ఠమైన పెద్ద తాబేలు ఉంటున్నది. నీరు త్రాగటానికి ఏనుగు దప్పికతో వస్తే అది త్రాగనివ్వకుండా పోట్లాడుతుంది. ఆ ఏనుగుకూడా అట్లాగే పగ, రోషం రోజురోజుకూ ఎక్కువ కాగా జీవిస్తూ ఉన్నది.

**క. విను, మధు కైటభు లనియెడు । దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియు నై పు**
**ట్టినవారు దమ్మెఱుంగమిఁ । బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్. 222**

**ప్రతిపదార్థం:** మధుకైటభులు+అనియెడు= ఆ పేర్లు కల; దనుజ+ఇంద్రులు= రాక్షసరాజులు; కచ్ఛపంబు= తాబేలు; దంతియున్= ఏనుగు ఐ; పుట్టినవారు= జన్మించినవారు; తమ్మున్= తమను తాము; ఎఱుంగమిన్= తెలియనందువలన; భీకరభంగిన్= భయంకర విధంగా; ఒండొరులతోడన్= ఒకరితో నొకరు; పెనఁగుదురు = పోట్లాడుకొంటారు.

**తాత్పర్యం:** వాళ్ళు మధుకైటభులనే రాక్షస శ్రేష్ఠులు. కానీ తాబేలు, ఏనుగులుగా పుట్టినందువలన తా మెవ్వరో తమకు తెలియనందున భయంకరంగా ఒకరితో ఒకరు కయ్యమాడుకొంటున్నారు.

**క. ఒంటిమెయి నుండఁగా ము । క్కంటికి నా కచ్ఛపంబు గౌరుం బట్టం**
**గంట యరిది, యొకపటి నా । రెంటిం బొదువంగవలయు రే వెర వారన్. 223**

**ప్రతిపదార్థం:** ఆ కచ్ఛపంబున్= ఆ తాబేలును; ఆ గౌరున్= ఆ ఏనుగును; ఒంటిమెయిన్= ఒంటరిగా; ఉండగాన్= ఉన్నప్పుడు; పట్టన్+కంట= పట్టుకొగలగడం; ముక్కంటికిన్= మూడు కన్నులున్న శివుడికైనా; అరిది= అసాధ్యం; ఒకపటిన్= ఒకేసారి; ఆ రెంటిన్= ఆ రెండింటినీ; రే= రాత్రివేళ; వెరవారన్= ఉపాయంతో; పొదువంగవలయున్= పొదివి పట్టుకొనాలి.

**తాత్పర్యం:** ఆ రెండూ విడివిడిగా ఉన్నప్పుడు శివుడైనా పట్టుకొనలేడు. రాత్రిపూట ఆ రెంటిని ఒకేసారి పట్టుకొనాలి. ఇదే ఉపాయం.

**వ. అనవుడు వైనతేయుండు. 224**

**తాత్పర్యం:** కశ్యపు డట్లా అనగా వినత కుమారుడైన గరుత్మంతుడు (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. 'ఒకటి గొలనిలోన నుండు నొక్కటి గొండ । మీఁద సంచరించు, మీరు రెంటి**
**నడఁగ నొక్కమాట యడరి పట్టుట కృత్య । మనియెదరు, వశంబె? యట్ల చేయ?' 225**

**ప్రతిపదార్థం:** ఒకటి= తాబేలు; కొలని లోనన్ ఉండున్= చెరువులో ఉంటుంది; ఒక్కటి= ఒక్కటి; కొండమీఁదన్= పర్వతంపైన; సంచరించున్= తిరుగుతుంది కదా!; మీరు= మీరేమో!; రెంటిన్= రెండింటినీ; అడఁగన్= అణగారేటట్లు; అడరి= ఏపురేగి; ఒక్కమాటు+అ= ఒకేసారి; అడరి= విజృంభించి; పట్టుట= బంధించటం; కృత్యము= చేయదగినపని; అనియెదరు= అంటారు; అట్లు+అ= అట్లాగే; చేయన్= చేయటానికి; వశంబె?= శక్యమా?

**తాత్పర్యం:** మీరు రెంటినీ ఒకేసారి పొదివి పట్టుకొనాలి అంటారు. ఒకటేమో చెరువులో ఉంటుంది. మరొకటి కొండమీద తిరుగుతుంది కదా! ఇ దెట్లా వీలుపడుతుంది?

**విశేషం:** ఇది పాఠకుడికి కలిగే ప్రశ్న. పాత్రద్వారా కవి చెప్పిస్తున్నాడు. కథ చెప్పటంలో ఇది గడుసుతనం. మీరు అనటం తండ్రి గారిని గౌరవించటం.

**వ. అనిన 'నది యట్టిద, ఉపాయంబు సెప్పెద; నాకర్ణింపు' మని యమ్మునివరుండు. 226**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా (గరుత్మంతుడు) అది అట్టి= అది అంతే; ఆకర్ణింపుము= వినుము; ఉపాయంబు= ఉపాయం; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము; అని; ఆ+మునివరుండు= ఆ మునిరాజు, కశ్యపుడు.

**తాత్పర్యం:** అదంతే. అని ఆ మునిశ్రేష్ఠుడు 'ఉపాయం చెప్పుతాను వినుము' అని. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. 'కరిపతి నీరు ద్రావుటకుఁ గాఁ జనుదెంచినఁ గూర్మరాజు సం**
**గర మొనరించుచుండి తమకంబున నీళ్ళులఁ బాసి వీఁకమై**

**దరి నడరంగఁ బట్టునది, తత్సమయంబున రెంటిఁ గూడ నీ**

**వెరవున నూఁది చిత్తమున వేగిరపా టెటు లేక పొంచుమీ'! 227**

**ప్రతిపదార్థం:** కరిపతి= ఏనుగురాజు; నీరు+త్రావుటకున్ కాన్= నీరు త్రాగటానికై; చనుదెంచినన్= రాగా; కూర్మరాజు= తాబేలు రాజు; సంగరము= యుద్ధం; ఒనరించుచుండి= చేస్తూ చేస్తూ; తమకంబునన్= పట్టుదలతో; నీళ్ళులన్= నీటిని; పాసి= వదలి; వీఁకమైన్= ఉదుటుతో; దరిన్= ఒడ్డున; అడరంగన్= విజృంభించగా; పట్టునది= పట్టుకొనేది; తత్+సమయంబునన్= అప్పుడు; రెంటిన్= రెండిటిని; కూడన్= కలిసేటట్లు కలిపి; ఈ వెరవునన్= ఈ ఉపాయంతో; ఊఁది= నొక్కి; చిత్తమునన్= మనస్సులో; వేగిరపాటు= తొందరపాటు; ఎటు లేక= ఏదీ లేకుండా; పొంచుమీ!= పొంచి ఉండాలి సుమా!

**తాత్పర్యం:** 'ఏనుగు నీళ్ళకు రాగానే తాబేలు పోట్లాడటం ప్రారంభిస్తూ ఒడ్డుమీదికి వస్తుంది. ఆ సమయం కొరకు నీవు ఉపాయంగా తొందరపడకుండా పొంచి ఉండాలి'.

**విశేషం:** చిన్న పిల్లవాడికి తండ్రి చెప్పే వైనం భావించుకొని చూస్తే కాని ఈ సంభాషణలో అందం తెలియదు.

**వ. అని యుపదేశించిన వీడ్కొనుటకు వినతుం డయిన తనయు నత్యాదరంబునం గనుంగొని యత్తపోధన సత్తముండు 'నీవు గజకచ్ఛపంబుల నాహారంబుగాఁ గొనిన నీకుం ద్రిదశాహారంబు తేర దొరకొనుటకు సందేహంబు లేదను పల్కు వల్కి పరమాశీర్వాదంబు లిచ్చిన. 228**

**ప్రతిపదార్థం:** అని ఉపదేశించినన్= అని బోధించగా; వీడ్కొనుటకున్= వదలివెళ్ళుటకు; వినతుండు+అయిన= వంగి నమస్కరించిన; తనయున్= కొడుకును; అతి+ఆదరంబునన్= మిక్కిలి వాత్సల్యంతో; కనుంగొని= చూచి; ఆ+తపోధన= ఆ తపస్సే ధనంగా కలవారిలో (అతడి ఐశ్వర్యమంతా అదే); సత్తముండు = శ్రేష్ఠుడు; నీవు; గజ= ఏనుగు; కచ్ఛపంబులన్= తాబేలులను; ఆహారంబుగాన్= అన్నంగా; కొనినన్= గ్రహిస్తే; నీకున్; త్రిదశ+ఆహారంబు= దేవతల అన్నమైన అమృతం; త్రిదశులు= బాల్య యౌవన కౌమార దశలు మూడే కలవారు; (దేవతలు. వారికి వృద్ధాప్యం లేదు); తేరన్= తేవటానికి; దొరకొనుటకున్= పూనుకొనటానికి; సందేహంబు= సంశయం; లేదు= లేదు; అనుపల్కు పల్కి= అనే మాటలు చెప్పి; పరమ= గొప్ప, మహత్తరమైన; ఆశీర్వాదంబులు= ఆశీస్సులు; ఇచ్చినన్= ఇవ్వగా (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** తండ్రి మార్గం చెప్పగానే ప్రయాణమై పోవటానికి వంగి నమస్కరించిన కొడుకును ప్రేమగా చూచి ఆ మహా తపస్వి ఇట్లా అన్నాడు; 'నీవు ఆ ఏనుగు తాబేళ్ళను ఆహారం చేసికొంటే అమృతం తెచ్చే శక్తి నీకు వస్తుంది. సందేహం లేదు' అని ఆశీర్వదించాడు.

**మ. విని యుత్సాహము గందళింపఁగ వియద్వీథీగతుం డై, విమా**

**న నికాయంబులు దూలఁ బక్షతివితానస్ఫార దీప్తి వ్రజం**

**బినరశ్మి ప్రకరంబుఁ గీడ్పఱుపఁ బక్షీంద్రుండు చంచద్గతిం**

**జనియెం దానురగాభిధాన మగు నా శైలంబు పెంపిప్పకున్. 229**

**ప్రతిపదార్థం:** పక్షి+ఇంద్రుండు= పక్షులరాజు; విని= ఆలించి; ఉత్సాహము= పనిమీద తొందర; కందళింపఁగన్= అంకురించగా; వియత్= ఆకాశమనే; వీథీ= మార్గం; గతుండై= పొందినవాడై; విమాన నికాయంబులు= విమానసమూహాలు; తూలన్=

చెల్లాచెదరుకాగా; పక్షతి= రెక్కల; వితాన= సమూహం యొక్క; స్ఫారదీప్తి వ్రజంబు= కదిలే కాంతుల గుంపు; ఇనరశ్మి= సూర్యకాంతి; ప్రకరంబున్= సమూహాన్ని; కీడ్పఱుపన్= కీడుపరచగా; చంచద్గతిన్= ఉత్సాహంతో చలించే నడకతో; తాను= గరుత్మంతుడు; ఉరగ+అభిధానము+అగు= ఉరగమన్న పేరుగల; ఆ= ఇదివరకే తెలిసిన; శైలంబు= కొండమీద ఉన్న; పెన్+తిప్పకున్= పెద్ద శిఖరానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు తండ్రి చెప్పినదంతా శ్రద్ధగా విని ఉత్సాహం ఉరకలు వేస్తుండగా, రెక్కల జంట నుండి వెలువడే కాంతులు సూర్యకాంతిని కప్పివేయగా, ఆకాశంలో దేవతల విమానాలు అతడి రెక్కల గాలికి చెల్లాచెదరు కాగా, ఉరగమన్న పేరున్న ఆ కొండతిప్పకు వెళ్ళాడు.

**విశేషం:** పద్యంలో గుంపు - అన్న అర్థంలో ఎన్ని పర్యాయపదాలు వచ్చాయో పాఠకులు గుర్తించాలి.

**క. చని, యల్పశరీరుండై, తను నెఱుఁగక యుండ, మెలఁగి దానోగ్ర గజేం**
**ద్రునిఁ గాంచి నీరి కది పో । యిన యప్పుడు వెనుకఁ జనియె నెలమి దలిర్పన్. 230**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; అల్పశరీరుండు+ఐ= చిన్న శరీరం కలవాడై; తనున్= తనను; ఎఱుఁగక ఉండన్= ఎవ్వరూ గుర్తించకుండా ఉండునట్లు; మెలఁగి= ప్రవర్తించి; దాన+ఉగ్ర= మదజలంతో భయంకరమైన; గజ+ఇంద్రునిన్= ఏనుగులరాజును; కాంచి= చూచి; నీరికిన్= నీటికొరకై; అది= ఆ యేనుగు; పోయిన= వెళ్ళిన; అప్పుడు= ఆ సమయంలో; ఎలమి= సంతోషం; తలిర్పన్= చిగురెత్తగా; వెనుకన్ చనియెన్= వెనుకగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** తన శరీరాన్ని చిన్నదిగా చేసికొని ఎవరికీ తెలియకుండా దాక్కొంటూ భయంకరమైన ఆ యేనుగు నీళ్ళకు బయలుదేరగా, వెన్నంటి తానూ వెళ్ళాడు.

**విశేషం:** అల్పశరీరం= అణిమ అన్న అష్టసిద్ధులలో ఒకటి. దాన+ఉగ్ర= మదించిన ఏనుగు దౌడల నుండి మదపువాసన గల నీరు స్రవిస్తుంది అని గజశాస్త్రం.

**ఉ. దంతి సనంగ, భూరిమదధారల గాలి యెఱింగి, కూర్మ మ**
**త్యంత సముద్ధతిం గొలని కడ్డపడన్ వెసవచ్చె; వచ్చినన్,**
**దంతియు నీరువట్టున నుదగ్రపుఁ గోపము సందడింప, దు**
**ర్దాంతసముద్యమం బెసఁగ దాని పయిన్ గవిసెన్ మహోగ్రమై. 231**

**ప్రతిపదార్థం:** దంతి= ఏన్గు; చనంగన్= వెళ్ళగా; భూరి= గొప్ప; మదధారల= మదజలపు ధారల; గాలి= వాసన; ఎఱింగి= తెలిసి; కూర్మము= తాబేలు; అతి+అంత= అత్యంత= చాలా ఎక్కువ; సముద్ధతిన్= గర్వంతో; కొలనికిన్= చెరువుకు; అడ్డపడన్= అడ్డపడటానికి; వెసన్= శీఘ్రముగా; వచ్చెన్= వచ్చింది; వచ్చినన్= వచ్చేటప్పటికి; దంతియున్= ఏనుగుకూడా; నీరువట్టునన్= దప్పికవలన; ఉత్+అగ్రపు= చాలా భయంకరమైన; కోపము= రోషం; సందడింపన్= ముసురుకొనగా; దుర్+దాంత= అణచరాని; సముద్యమంబు= గొప్ప ప్రయత్నం; ఎసఁగన్= అతిశయించగా; దాని పయిన్= తాబేలు మీదకు; మహా+ఉగ్రము+ఐ= మహా భయంకరంగా; కవిసెన్= దూకింది.

**తాత్పర్యం:** ఏనుగు చెరువును సమీపిస్తుండగానే గాలివలన దాని మదజల వాసనను పసిగట్టి తాబేలు మహోద్రేకంతో కొలను కడ్డంగా నిలబడింది. అసలే దప్పికతో ఉన్న ఏనుగుకు కోపం హద్దులు దాటింది. వెంటనే మహాభయంకరంగా తాబేలుపైకి దూకింది.

**చ. కవిసి, ఖరంబులైన మునికాళ్ళను వ్రేయఁగ, సాము నీరిలో**
**ను వెడలకుండి కూర్మ మతను స్థిర తీవ్రనఖంబులం బదా**
**గ్ర విదళనంబు సేయఁగఁ గరంబున మోఁదఁగ వారణంబు దం**
**తివిహతి నొంపఁ గచ్ఛపము, దారుణ మయ్యె రణంబు భూవరా! 232**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూమికి భర్తవయిన ధర్మరాజా! (ఈ కథను భీష్ముడు ధర్మరాజుకు చెప్పుతున్నాడు. అని మరచిపోయిన పాఠకులకు గుర్తుచేయటం, వక్త-శ్రోత-వీరిద్దరినీ ఆశ్రయించే పురాణం వచ్చింది; కవిసి= (ఏనుగు) ఎదిరించి; ఖరంబులు+ఐన= వాడిఅయిన; మునికాళ్ళను= ముందుకాళ్ళతో; వ్రేయఁగన్= వేసికొట్టేసరికి; కూర్మము= తాబేలు; సాము= సగం; నీరిలోను= నీటిలోనుండి; వెడలక+ఉండి= బయటకు రాకుండా ఉండి; అతను = బలిష్ఠమైన; స్థిర= గట్టిగా ఉన్న; తీవ్ర= భయంకరమైన; నఖంబులన్= గోళ్ళతో; పద+అగ్ర= పాదాల పైభాగాన్ని; విదళనంబు= చీల్చటం; చేయఁగన్= చేసేసరికి; వారణంబు= ఏనుగు; కరంబునన్= తొండంతో; మోదఁగన్= గట్టిగా కొట్టగా; కచ్ఛపము= తాబేలు; దంత= పండ్ల; విహతిన్= దెబ్బతో; నొంపన్= నొప్పింపగా; రణంబు= యుద్ధం; దారుణము= భయంకరం; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** ధర్మరాజా! దప్పికతో వచ్చిన ఏనుగు అడ్డుపడిన తాబేలును తన వాడియైన మునికాళ్ళతో త్రొక్కింది. తాబేలేమో సగం నీటిలోనే ఉంటూ తన గట్టిగోళ్ళతో ఏనుగు పాదాల పైభాగాలను చీల్చింది. ఏనుగు తొండంతో బాదింది. తాబేలు దంతాలతో కొరికింది. ఈ విధంగా యుద్ధం భయంకరంగా సాగింది.

**విశేషం:** తెలుగు సాహిత్యంలో జంతువుల యుద్ధవైఖరిని అద్భుతంగా చిత్రిస్తున్న పద్య మిది. ఆముక్తమాల్యదలో ఖాండిక్య కేశి ధ్వజసంవాదంలో యాగగోవును పులి చంపిన వైనం రాయలవారు చిత్రించారు. దీనికి తిక్కన్నగారి పద్యం మూలంవలె ఉన్నది. అంటే రెండూ చదివి తీరాలని భావం.

**ఉ. ఇమ్మెయిఁ బోరి పోరి, మది నేపును గోపము నగ్గలింపఁ, గూ**
**ర్మమ్ము గడంగి, నీ ర్వెడలి మత్తకరిన్ వడి నాక్రమింపఁగా,**
**గ్రమ్మన రెంటినిం బొదివి, కచ్ఛపమున్ వలకాల వామపా**
**దమ్మున వారణంబును ముదమ్మునఁ బట్టి తగిల్చె గోళ్ళులన్. 233**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; పోరిపోరి= పోరాడి పోరాడి; మదిన్= మనస్సులో; ఏపును= విజృంభణ; కోపము= రోషం; అగ్గలింపన్= ఎక్కువకాగా; కూర్మమ్ము= తాబేలు; కడంగి= పూనుకొని; నీరు+వెడలి= నీటినుండి బైటికి దూకి; మత్తకరిన్= మదించిన ఏనుగును; వడిన్= వేగంగా; ఆక్రమింపఁగాన్= పైకి దూకేసరికి; గ్రమ్మనన్= హఠాత్తుగా; రెంటినిన్= రెండింటినీ; పొదివి= ఆక్రమించి; వలకాలన్= కుడికాలితో; కచ్ఛపమున్= తాబేటిని; వామపాదమ్మునన్= ఎడమకాలితో; వారణంబును= ఏనుగును; ముదమ్మునన్= సంతోషంతో; పట్టి= పట్టుకొని; గోళ్ళులన్= గోళ్ళకు; తగిల్చెన్= వ్రేలాడదీశాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా రెండూ పోరిపోరి విసుగెత్తి కోపం, మదం విజృంభించగా తాబేలు నీటిలోనుండి బైటకు వచ్చి గజరాజును ఆక్రమించింది. అదను చూచి గరుత్మంతుడు తాబేలును కుడికాలితో, ఏనుగును ఎడమ కాలితో గోళ్ళకు పట్టుకార్లకు వ్రేలాడదీసినట్లు వ్రేలాడదీశాడు.

**విశేషం:** ఇది చాలా గొప్ప వర్ణన. రెంటినీ గరుత్మంతుడు పట్టుకొన్న వైనం చాలా గొప్పగా చిత్రం గీసి చూపించాడుకవిబ్రహ్మ.

**వ. ఇట్లు వినతపట్టి పట్టిన నవి దమయంగంబులు పొరలం బడ నడిచిపడుటయు నతండు. 234**

**ప్రతిపదార్థం:** ఇట్టు= ఈ విధంగా; వినతపట్టి= వినతకొడుకు - గరుత్మంతుడు; పట్టినన్= గోళ్ళతో పట్టుకొనగా; అవి= తాబేలూ, ఏనుగు; తమ; అంగంబులు= అవయవాలు; పొరలన్+పడన్= తిరగబడగా, బోర్లపడగా; అడిచిపడుటయున్= ఎగిరిపడగా; అతండు= గరుత్మంతుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా గరుత్మంతుడు గోళ్ళతో పట్టుకొనగా తాబేలూ, ఏనుగూ తమ శరీరాలు తిరగబడగా ఎగిరిపడ్డాయి. అప్పు డతడు.

**విశేషం:** గరుత్మంతుడి గోళ్ళకు వ్రేళ్ళాడే జంతువుల స్థితిని వర్ణిస్తుంది ఈ చిన్న వచనం.

**మ. పెలుచన్ గోళుల నొత్తి, యగ్గజముఁ దాఁబేలున్ వసం బేది మూ**
**ర్ఛల నొందన్ వెస నెత్తి, మేఘయుగళీసక్తోల్లసద్గైరికా**
**చలవైహాయసకేళియో యన నభస్సంచారియై, యుబ్బు న**
**గ్గలికన్ దవ్వుగఁ బాఱి, యొక్క ఘనవృక్షం బయ్యెడం దోఁచినన్. 235**

**ప్రతిపదార్థం:** పెలుచన్= గట్టిగా; గోళులన్= గోళ్ళతో; ఒత్తి= అదిమి పట్టుకొని; ఆ+గజమున్= ఆ ఏనుగు; తాఁబేలున్= కచ్ఛపమున్నూ; వసంబు+ఏది= స్వాధీనత కోల్పోయి; మూర్ఛలనొందన్= మూర్ఛపోగా; వెసన్= త్వరగా; ఎత్తి= పైకిలేపి; మేఘ యుగళీ= రెండు మేఘాలతో; సక్త= కూడియున్న; ఉత్+లసత్= ప్రకాశించే; గైరిక= బంగారు; అచల=కొండయొక్క; వైహాయస కేళియోఅనన్= ఆకాశసంచారక్రీడా అన్నట్లుగా; నభః+సంచారిఐ= ఆకాశంలో ఎగురుతూ; ఉబ్బు= గర్వం యొక్క; అగ్గలికన్= ఆధిక్యంతో; దవ్వుగన్= దూరంగా; పాఱి= ఎగిరిపోయి; ఒక్క= ఒక; ఘన= పెద్ద; వృక్షంబు= చెట్టు; అయ్యెడన్= అక్కడ; తోఁచినన్= కనిపించగా.

**తాత్పర్యం:** ఆ రెండు జంతువులనూ గోళ్ళతో అదిమి పట్టుకొనేసరికి అవి స్వాధీనము తప్పి మూర్ఛపోయాయి. ఆ రెండింటితో ఆకాశంలోకి ఎగరటం ఎట్లా ఉన్నదంటే - రెండు మేఘాలు తనమీద వాలగా బంగారుకొండ ఆకాశంలో ఎగిరిపోతున్నట్లుగా ఉన్నది. అట్లా గర్వాతిశయంతో ఎగురుతూ దూరంగా పోయి ఒక చెట్టు కనిపించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఇందులో చెప్పిన పోలిక (అలంకారం) చాలా అందమైనదే కాక చాలా గంభీరమైనది కూడా. గరుత్మంతుడు ఎఱ్ఱనివాడు కనుక బంగారుకొండ. జంతువులు రెండు నల్లనివి కనుక మేఘాలు.

**ఆ. దానిమీఁద నుండి, వాని రెంటిని భుజిం । పంగ మదిఁ దలంచి, పంచయోజ**
**నముల నిడువు గల్గు రమణీయశాఖపై । గరుడుఁ డెలమి నెఱఁగెఁ గురువరేణ్య! 236**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కౌరవశ్రేష్ఠుడా!; దానిమీఁదన్= చెట్టుపైన; ఉండి= కూర్చొని; వానిన్ రెంటినిన్= ఆ రెండు జంతువులను; భుజింపంగన్= తినటానికి; మదిన్= మనస్సులో; తలంచి= అనుకొని; పంచ= ఐదు; యోజనములు= యోజనమంటే సుమారు 4 క్రోసులు - ఆమడ; ఐదు యోజనములు= 20 ఆమడలు; నిడుపు= పొడవు; కల్గు= ఉన్న రమణీయ= అందమైన; శాఖపైన్= కొమ్మ మీద; గరుడుఁడు= గరుత్మంతుడు; ఎలమిన్= సంతోషంతో; ఎఱఁగెన్= వ్రాలెను.

**తాత్పర్యం:** ఐదు యోజనాల పొడవున్న ఆ చెట్టు కొమ్మమీద కూర్చొని ఆ రెంటిని తిందామని అనుకొని గరుత్మంతుడు సంతోషంతో దానిమీదికి వ్రాలాడు.

**క. ఎఱఁగిన, యప్పెను వ్రేఁగున । విఱుగుటయును, శాఖ చూచి విహగేంద్రుఁడు గొం**
**దఱు మునుల నందు గన్గొని । వెఱపున నాత్మీయ చిత్తవృత్తి గలంగన్. 237**

**ప్రతిపదార్థం:** ఎఱఁగిన= వ్రాలగా; ఆ+పెను= ఆ పెద్ద; వ్రేఁగునన్= బరువుచేత; శాఖ= కొమ్మ; విఱుగుటయునున్= విరుగగా; చూచి= కన్గొని; విహగ+ఇంద్రుఁడు= పక్షిశ్రేష్ఠుడు, గరుత్మంతుడు; అందున్= ఆ కొమ్మలో; కొందఱు మునులన్= కొంతమంది తపస్వులను; కన్గొని= చూచి; వెఱపునన్= భయంతో; ఆత్మీయ= తన; చిత్తవృత్తి= మనస్సు; కలంగన్= కలతచెందగా.

**తాత్పర్యం:** వ్రాలేసరికి ఆ పెద్దబరువుకు అంతకొమ్మకూడా విరిగిపోయింది. ఆ కొమ్మలో కొందరు మునులుండటం చూచిన గరుత్మంతుడి మనస్సు బాధపడి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. అవనిఁ బడనీక, శాఖఁ జంచువునఁ బట్టి । పట్టి వారల సుస్థితుల్ పల్లటిలక**
**యుండ, వెరవున ధరియించి, యొయ్య నెగయఁ । జూచి యవ్వాలఖిల్యులు చోద్య మంది. 238**

**ప్రతిపదార్థం:** అవనిన్= నేలపై; పడనీక= పడనివ్వక; శాఖన్= కొమ్మను; చంచువునన్= ముక్కుతో; పట్టిపట్టి= గట్టిగా కరచుకొని; వారల= మునుల; సుస్థితుల్= కూర్చున్నతీరు; పల్లటిలకయుండన్= చెదరిపోకుండా; వెరవునన్= నేర్పుతో; ధరియించి= ధరించి, పట్టుకొని; ఒయ్యన్= నెమ్మదిగా; ఎగయన్= ఎగరటం; చూచి; ఆ+వాలఖిల్యులు= వాలఖిల్యులనబడే ఆ మునులు; చోద్యము+అంది= ఆశ్చర్యపడి.

**తాత్పర్యం:** భూమిపై పడబోతున్న ఆ కొమ్మను ముక్కున పట్టుకొని ఆ మునుల క్షేమాత్రం స్థానభ్రంశం కాకుండా చూస్తూ నెమ్మదిగా ఎగిరేసరికి ఆ మునులు చూచి ఆశ్చర్యపడి.

**విశేషం:** ఆ మునులు 360 మంది సంవత్సరకాలమనీ, గరుత్మంతుడు సూర్యుడనీ, కాలస్వరూపుడనీ వేదం వర్ణిస్తుంది.

**వ. వైనతేయుం డగుట మనంబుల ననుసంధించి కరుణించి. 239**

**ప్రతిపదార్థం:** వైనతేయుండు= వినతకొడుకు; అగుట= కావటం; మనంబులన్= మనసులలో; అనుసంధించి= భావించి; కరుణించి= దయతలచి.

**తాత్పర్యం:** అతడు గరుత్మంతుడని మనస్సులలో భావించి దయతలచి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'ఈతఁడు దక్కఁగ, నొరులకు । నీతెఱఁగు బలంబు, వెరవు నేల కలుగు? నం**
**చాతరుశాఖ విడిచి చని । రాతని దీవించి యోగ్య మయ్యెడు నెడకున్. 240**

**ప్రతిపదార్థం:** ఈతఁడు= ఈ గరుత్మంతుడు; తక్కఁగన్= తప్ప; కాక; ఒరులకు= ఇతరులకు; ఈ తెఱఁగు= ఈ విధమైన; బలంబు= బలమూ; వెరవు= నేర్పూ; ఏల కలుగున్= ఎట్లా కలుగుతాయి? అంచున్= అనుకొంటూ; ఆ తరుశాఖన్= ఆ చెట్టుకొమ్మను; విడిచి= వదలిపెట్టి; అతనిన్ దీవించి= అతడి కాశీస్సు లిచ్చి; యోగ్యము+అయ్యెడు= తగినటువంటి; ఎడకున్= చోటికి; చనిరి= పోయారు.

**తాత్పర్యం:** గరుత్మంతుడికి తప్ప ఈ విధమైన బలము, నేర్పూ ఇతరులకు లేవని ఆ మునులు అతడిని దీవించి ఆ చెట్టుకొమ్మను వదలిపెట్టి వాళ్ళకిష్టమైన చోటికి వెళ్ళిపోయారు.

**వ. చనినన్ గరుత్మంతుండు సంతోషించెఁ; దదనంతరంబ. 241**

**ప్రతిపదార్థం:** చనినన్= వెళ్ళగా; గరుత్మంతుఁడు= వినతకొడుకు; సంతోషించెన్= ఆనందించాడు; తత్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** వెళ్ళగా గరుత్మంతుడు సంతోషించాడు. ఆ తరువాత.

**ఆ. 'విపులశాఖ నిచట విడిచిన నిచ్చటి । జంతుకులము లెల్లఁ జచ్చు; నింక**
**నేమి సేయువాఁడ? నే' నను నెవ్వగ । పుట్టె నవ్విహంగపుంగవునకు. 242**

**ప్రతిపదార్థం:** విపుల= విస్తారమైన; శాఖన్= కొమ్మను; ఇచటన్= ఇక్కడ; విడిచినన్= వదలితే; ఇచ్చటి= ఇక్కడి; జంతు కులములు= జంతువుల గుంపులన్నీ; చచ్చున్= చస్తాయి; ఇంకన్= మరి; ఏమిచేయువాఁడన్? = ఏం చేసేది?; అను= అన్నటువంటి; నెఱ+వగ= నిండు దుఃఖం; ఆ+విహంగ= ఆ పక్షి; పుంగవునకున్= శ్రేష్ఠునకు; పుట్టెన్= కలిగింది.

**తాత్పర్యం:** 'ఈ పెద్దకొమ్మ నిక్కడ వదలిపెట్టితే ఇక్కడున్న జంతువులన్నీ నలిగి చచ్చిపోతాయి. మరి ఇప్పుడేం చేయాలన్న బాధ కలిగింది ఆ గరుత్మంతుడికి.

**విశేషం:** ఈ ఆలోచన అతడి దయను ప్రకటిస్తుంది. గరుత్మంతుడు ఎంత మహానుభావుడో వివరించే కథ కనుక ఆయా గుణాలను చెప్పుతూ పోతాడు మహాకవి. వాటిని మనం భావించాలి.

**వ. అట్టి యెడ. 243**

**తాత్పర్యం:** అప్పుడు.

**తే. 'నిందితాచార యుతము, కులింద దేశ । మంబుధి ప్రాంత; మీశాఖ యందు విడువు,**
**మమరవరుల పం పిది, విహగాధినాథ!' యను నెలుంగు నభంబునం దావహిల్లె. 244**

**ప్రతిపదార్థం:** విహగ =(ఆకాశంలో ఎగిరే) పక్షులకు; అధినాథ!= అధిపతీ! రాజా!; నిందిత= అపవిత్రమైన; ఆచార= ఆచారాలతో; యుతము= కూడుకొన్నది; కులింద దేశము= ఆ పేరుగల దేశము; అంబుధిప్రాంతము= అది సముద్రప్రాంతంలో

ఉంది; ఈ శాఖ= ఈ కొమ్మను; అందున్= అక్కడ; విడువుము= వదలిపెట్టుము; ఇది; అమరవరుల= పూజించదగిన దేవతలయొక్క; పంపు= ఆజ్ఞ; అను+ఎలుంగు= అన్న కంఠధ్వని; నభంబునందున్= ఆకాశంలో; ఆవహిల్లెన్= వ్యాపించెను.

**తాత్పర్యం:** 'ఓయీ! పక్షిరాజా! పూజ్యులైన దేవతలు నీ కనుజ్ఞ ఇస్తున్నారు. 'దురాచారాలతో అపవిత్రమైన కులిందదేశ సముద్ర ప్రాంతంలో ఈ కొమ్మను వదలిపెట్టుము' అన్న మాటలు ఆకాశంలో వినిపించాయి.

**విశేషం:** అధర్మం, శిక్షించదగింది కనుక ఆ శిక్షించే అధికారులు దేవతలు కనుక వా రాజ్ఞాపించారు. ప్రపంచగతిలో సమత్వాన్ని కాపాడేవారు దేవతలు. అసమత్వాన్ని కల్పించే శక్తులు రాక్షసులు. వీళ్ళిద్దరూ వ్యక్తులు కారు. విశ్వంలో భావశక్తులు.

**క. విని, సత్వరముగ నటఁ గొని । చని, యద్దేశమునఁ గల్గు జనములు మృతిఁ బొం**
**ద, నతం డా చక్కటి నా । ఘనశాఖయు నెమ్మనంబు కలఁకయు విడిచెన్. 245**

**ప్రతిపదార్థం:** విని= ఆలించి, సత్వరముగన్= తొందరగా; అటన్= అక్కడకు; కొని= గ్రహించి; చని= వెళ్ళి; ఆ+దేశమునన్= ఆ ప్రాంతంలో; కల్గు= ఉండే; జనములు= ప్రజలు; మృతిన్ పొందన్= చావగా; అతండు= ఆ గరుత్మంతుడు; ఆ చక్కటిన్= ఆ ప్రదేశంలో; ఆ ఘనశాఖయున్= ఆ పెద్దకొమ్మను; నెమ్మనంబు= నిండు మనస్సులోని; కలఁకయున్= కలతను; విడిచెన్= త్యజించాడు.

**తాత్పర్యం:** వినీ వినగానే ఆ ప్రదేశానికి వెళ్ళి అక్కడివారు చచ్చేటట్లుగా; ఆ పెద్దకొమ్మను తన మనస్సులోని కలతతో పాటు విడిచిపెట్టాడు.

**విశేషం:** కొమ్మను విడవటమూ - కలతపోవటమూ ఒకేసారి జరిగాయన్నమాట.

**వ. విడిచి భరితలీలంబుగా నొక్క శైలంబు విశాల తటంబునకుం బోయి. 246**

**ప్రతిపదార్థం:** విడిచి= కొమ్మను విడిచి; భరిత= భరించబడిన; లీలంబుగాన్= విలాసంగా; ఒక్క శైలంబు= ఒక కొండయొక్క; విశాల తటంబునకున్+పోయి= విశాలమైన చదునైన ప్రదేశానికి వెళ్ళి.

**తాత్పర్యం:** కొమ్మను అట్లా వదలిపెట్టి చాలా విలాసంగా ఒక కొండపై ఉన్న చదరమైన మైదానానికి పోయి.

**విశేషం:** భరితలీలంబుగాన్= బరువు దించుకొన్న తరువాత కలిగే ఉల్లాసాన్ని సూచించే మాట.

**క. కరికచ్ఛపముల పెన్నె । త్తురుఁ, గండలుఁ, గ్రొవ్వు, మెదడుఁ, దుష్టిగఁ బక్షీ**
**శ్వరుఁ డాని, యధికబలబం । ధురుఁడై యమృతమున కేఁగె దుర్దాంతగతిన్. 247**

**ప్రతిపదార్థం:** కరి కచ్ఛపముల= ఏనుగు తాబేళ్ళ యొక్క; పెన్= పెద్ద; నెత్తురున్= నెత్తురును; కండలున్= కండలును; క్రొవ్వు; మెదడున్; తుష్టిగన్= సంతోషంగా; పక్షి+ఈశ్వరుఁడు= పక్షిరాజు; అని= తిని; అధిక= ఎక్కువ; బలబంధురుఁడు+ఐ= బలంతో కూడుకొన్నవాడై; దుర్+దాంత= ఆపరాని, గతిన్= నడకతో, ప్రయాణంతో; అమృతమునకున్= అమృతంకొరకు; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఏనుగూ, తాబేలూ ఆరెండింటి నెత్తురూ, కండలూ, క్రొవ్వూ, మెదడూ తృప్తిగా భుజించి సంతుష్టుడై పక్షిరాజు కావలసిన బలాన్ని పొంది, ఆపరాని వేగంతో అమృతం కొరకు వెళ్ళాడు.

**వ. ఇవ్విధంబున.** **248**

**తాత్పర్యం:** ఈ విధంగా.

**క. చని, దానిచుట్టు మండెడు । ననలంబును జూచి, తన్మహత్తర జిహ్వల్**

**దనికిన నెఱకలు గమరునొ । యను తలఁపున బ్రహ్మఁ గాన నరిగె రయమునన్.** **249**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; దాని= అమృతంయొక్క; చుట్టు= చుట్టూరా; మండెడు= మండే; అనలంబును= అగ్నిని; చూచి= కని; తత్= ఆ అగ్నియొక్క; మహత్తర= గొప్ప; జిహ్వల్= నాల్కలు; తనికినన్= తాకితే; ఎఱకలు= రెక్కలు; కమరునొ= కాలునో; అను= అన్న; తలఁపునన్= ఆలోచనతో; బ్రహ్మన్= తాతగారైన బ్రహ్మదేవుడిని; కానన్= చూడటానికి; రయమునన్= వేగంగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అమృతం దగ్గరకు వెళ్ళేసరికి దానిచుట్టూ అగ్ని మండుతున్నది. ఆ మంటలు తాకితే రెక్కలు కమిలిపోతాయేమోనన్న భయంతో తాత బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు. (ఉపాయం కొరకు)

**వ. అరిగి తచ్చరణ పద్మంబులకుం బ్రణతుఁడై కేలు మొగిచి.** **250**

**ప్రతిపదార్థం:** అరిగి= వెళ్ళి; తత్= బ్రహ్మ యొక్క; చరణ= పాదాలనెడి; పద్మంబులకున్= తామరపూలకు; ప్రణతుఁడు+ఐ= వంగి; కేలు మొగిచి= చేతులు జోడించి, నమస్కరించి;

**తాత్పర్యం:** వెళ్ళి, ఆయన పాదపద్మాలకు వంగి నమస్కరించి.

**చ. 'వినతకు దాస్య మొందె నొకవెంటఁ, దదీయ నిరాసహేతువై**

**యనఘవిచార! నాకు నమృతాహరణంబు విధేయ మయ్యెఁ; న**

**ప్పనిమెయి నగ్నిచేత నగుఁబా టగు నన్వెఱతో భవద్దయా**

**వననిధి నాశ్రయించుటకు వచ్చితి; నార్తశరణ్య! కావవే!'** **251**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపంలేని; విచార!= ఆలోచన కలవాడా!; ఒక వెంటన్= ఒకానొక కారణంగా; వినతకున్= మా అమ్మకు; దాస్యము+ఒందెన్= దాస్యం కలిగింది; తదీయ= దాని; నిరాసహేతువు+ఐ= పోగొట్టే కారణంగా; నాకున్= నాకు; అమృత= అమృతాన్ని; ఆహరణంబు= తేవటం; విధేయము= చేయవలసిన పని; అయ్యెన్= సంభవించింది; ఆ పనిమెయిన్= ఆ కార్యంలో; అగ్నిచేతన్= అగ్నివలన; నగుఁబాటు= అవమానం; అగున్= ఔను; అన్= అన్నట్టి; వెఱతోన్= భయంతో; భవత్=నీ; దయా= కరుణ అనే; వననిధిన్= సముద్రాన్ని; ఆశ్రయించుటకున్= శరణొందటానికి; వచ్చితిన్= వచ్చాను; ఆర్తశరణ్య!= బాధలలో ఉన్నవారికి దిక్కైనవాడా!; కావవే!= రక్షించుమా!

**తాత్పర్యం:** 'పవిత్రమైన ఆలోచన కలవాడా! మా అమ్మ కొక కారణంగా దాస్యం కలిగింది. దానిని పోగొట్టుకొనే నిమిత్తం నాకు అమృతం తేవలసి వచ్చింది. ఈ పనిలో నా కగ్నివలన అవమానం కలుగుతుందన్న భయంతో నీ శరణాగతుడనై వచ్చాను. దుఃఖంలో ఉన్నవారికి ఆశ్రయమైన వాడా! నన్ను రక్షించవా?' అని గరుత్మంతుడు ప్రార్థించాడు.

**విశేషం:** అగ్నిచేత అవమానం కలుగుతుందేమో అన్న భయంతో సముద్రాన్ని ఆశ్రయించటానికి వచ్చినాడనటం సముచితంగా ఉన్నది.

**వ. అనుటయు. 252**

**తాత్పర్యం:** అనగా.

**చ. అతనికి వత్సలుం డగుట నంబుజగర్భుఁడు 'వెన్న పై పయిన్**
**వితతము గాఁగ జిహ్వలకు వ్రేఁగగునట్లుగఁ జాల వైచినం,**
**బతగవరేణ్యఁ! మ్రుక్కఁబడుఁ బావకుఁ; డయ్యెడఁ జొచ్చి నీదువాం**
**ఛితము ఫలింప సత్వరతఁ జేకొను మయ్యమృతంబు' నావుడున్. 253**

**ప్రతిపదార్థం:** అంబుజ= పద్మం; గర్భుఁడు= జన్మస్థానంగా కలవాడు - బ్రహ్మ; అతనికిన్= గరుత్మంతుడిపై; వత్సలుండు= ప్రేమగలవాడు; అగుటన్= అయినందువలన; వెన్న= వెన్నను; పైపయిన్= పైన; వితతము= విస్తారంగా; కాఁగన్= అగునట్లుగా; జిహ్వలకున్= అగ్నిమంటలకు; వ్రేఁగు= బరువు; అగునట్లుగన్= అయ్యేటట్లుగా; చాలన్= ఎక్కువ; వైచినన్= వేస్తే, పతగవరేణ్యా!= పక్షులలో శ్రేష్ఠుడా!; పావకుఁడు= అగ్ని; మ్రక్కఁబడున్= అణగును; అయ్యెడన్= అప్పుడు; చొచ్చి= ప్రవేశించి; నీదు= నీయొక్క; వాంఛితము= కోరిక; ఫలింపన్= నెరవేరేటట్లుగా; ఆ+అమృతంబున్= ఆ అమృతాన్ని; సత్వరతన్= శీఘ్రమే; చేకొనుము= పుచ్చుకొనుము; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** బ్రహ్మకు గరుత్మంతుడిపైన వాత్సల్యమున్నది (మనుమడు కదా!) అందుకని చెప్పుతున్నాడు 'నాయనా! వెన్న తెచ్చి ఆ అగ్నిలో వేస్తే ఆయన దానికడుగునబడి ఆ బరువుకు తగ్గి ఉంటాడు. నీ కోరిక నెరవేరుతుంది. సమయం చూచి అమృతం తీసికొనిపొమ్ము!' అని చెప్పగా.

**ఆ. ఆత్మఁ బొంగి, మ్రొక్కి యతఁ డాలమందలు । పరపులైన యెడల కరిగి యరిగి**
**కొండ యంత వెన్నఁ గూర్చి, వేగము కొని । పోయి, యమ్మహాగ్నిఁ బొదువవైచె. 254**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆయన; ఆత్మన్= హృదయంలో; పొంగి= సంతోషించి; మ్రొక్కి= నమస్కరించి; ఆలమందలు= ఆవులమందలు; పరపులు= విస్తారంగా; ఐన+ఎడలకున్= ఉన్న చోట్లకు; అరిగి అరిగి=పోయి పోయి (చాలాచోట్లకు); కొండఅంత= పర్వతమంత; వెన్నన్= వెన్నను; కూర్చి= ప్రోగుచేసి; కొనిపోయి= తీసికొని వెళ్ళి; అ+మహా= ఆ గొప్ప; అగ్నిన్= అగ్నిదేవుణ్ణి; పొదువన్= కప్పేటట్లు - కన్పించకుండా; వైచి= వేసి.

**తాత్పర్యం:** మనస్సులో సంతోషంతో పొంగిపోయి ఆలమందలున్న చోట్లన్నీ వెదకి వెదకి కొండంత వెన్న కూర్చుకొని ఆ అగ్నిదేవుడి మీద వేశాడు.

గరుడుఁ డింద్రుని జయించి యమృతంబు దెచ్చి కద్రువకుఁ జూపుట (సం.13-28-1(కుంభ))

**శా. నీరుం బాయఁగఁ జల్లి, రాక్షసుల యున్మేషంబు మర్దించి, హృ**
**త్సారోదారుఁ డయోమయం బయిన యజ్ఞాలంబు వే వ్రచ్చి, దు**

**ర్వారస్వైరవిహార మొప్ప, నమృతగ్రాహం బొడం గూడుడుం**

**దారావీథిఁ జనం దొడంగె మగుడన్ దర్పం బెలర్పన్ వడిన్. 255**

**ప్రతిపదార్థం:** నీరున్= నీళ్ళను; పాయఁగన్= తొలగునట్లు; చల్లి= పారబోసి; రాక్షసులు= కాపలా ఉన్న రక్కసుల యొక్క; ఉన్మేషంబున్ = పరాక్రమాన్ని; మర్దించి= అణచి; హృద్+సార+ఉదారుఁడు= మనస్సులోని గొప్ప బలంతో ఉదారుడైనవాడు; అయోమయంబు= ఇనుపదైన; ఆ+జాలంబున్= ఆ వలను; వేఁ= వేగంగా; వ్రచ్చి= త్రెంచి; దుర్వార= వారించటానికి; వీలులేని; స్వైర విహారము= స్వేచ్ఛతోకూడిన క్రీడ; ఒప్పన్= ప్రకాశించగా; అమృతగ్రాహంబు= అమృతస్వీకారం; ఒడన్+కూడుడున్= లభించగా; దర్పంబు= గర్వం; ఎలర్పన్= చిగుర్పగా; తారావీథిన్= నక్షత్రమార్గంలో, ఆకాశమార్గంలో; వడిన్= వేగంగా; మగుడన్= మరలా; చనన్= వెళ్ళటానికి; తొడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** అగ్ని ఆరిపోగా, చుట్టూఉన్న నీళ్ళను బయటకు చల్లి కాపలా ఉన్న రాక్షసుల విజృంభణం అణచి హృదయోల్లాసంతో ఇనుపవలను ఛేదించి, అడ్డూ అదుపు లేని స్వేచ్ఛా విహారంతో అమృతాన్ని అపహరించి నక్షత్రమార్గాన ఎగిరిపోవటం మొదలుపెట్టాడు.

**వ. అంతయు నెఱింగి. 256**

**ప్రతిపదార్థం:** అంతయున్= దానినంతా; ఎఱింగి= తెలిసికొని.

**తాత్పర్యం:** దాని నంతా తెలిసికొని.

**మ. అమరేంద్రుండు సముద్ధతిన్ వెడలి దేవానీకముల్ దోడ్పడన్**

**సమరక్రీడకుఁ జొచ్చి పక్షిపతిచే సైన్యంబు లెల్లన్ విధూ**

**తము లైనం గనుఁగ్రేవఁ గెం పెసఁగ రౌద్రం బైన చిత్తంబుతో**

**డ మహోదగ్రతఁ బొల్చు వజ్రము నవష్టంభోగ్రుఁడై వైచినన్. 257**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్రుండు= దేవతలరాజు; సముద్ధతిన్= మిక్కిలి దర్పంతో; వెడలి= దండెత్తి; దేవ+అనీకముల్= దేవతల సేనలు; తోడ్పడన్= సహాయం కాగా; సమరక్రీడకున్= యుద్ధమన్న ఆటకు; చొచ్చి= ప్రవేశించి; పక్షిపతిచేన్= గరుత్మంతుడిచేత; సైన్యంబులు= సేనలు; ఎల్లన్= అన్నీ; వి+ధూతములు= చెదరగొట్టబడినవి; ఐనన్= కాగా; కను+క్రేవన్= కనులచివళ్ళలో; కెంపు+ఎసఁగన్= ఎర్రదనం ఎక్కువ కాగా; రౌద్రంబు=కోపం; ఐన= అయినటువంటి; చిత్తంబుతోడన్= మనస్సుతో (మనస్సు కోపంగా పరిణామం పొందగా); మహా= గొప్ప; ఉత్+అగ్రతన్= ఉద్రేకంతో; అవష్టంభ= గర్వంతో; ఉగ్రుఁడు+ఐ= భయంకరుడై; వజ్రమున్= వజ్రాయుధాన్ని; వైచినన్= ప్రయోగించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** కయ్యానికని దేవేంద్రుడు సేనతో భయంకరంగా బయలుదేరి, యుద్ధంలో తన సేననంతా గరుత్మంతుడు చెల్లాచెదరు చేయగా, కోపంతో కళ్ళెర్రపడగా రౌద్రంతో మనస్సంతా నిండిపోగా ఇంద్రుడు భయంకరమైన వజ్రాయుధాన్ని ప్రయోగించాడు.

**క. అది యొకఁడుఁ జేయఁ జాలక । విదళితశైల మగు తనదు విలసన మచటం**

**గుదియుటఁ దనకుం దెలిసిన । మద మఱి గిరిభేదికడకు మగుడం జనియెన్. 258**

**ప్రతిపదార్థం:** అది= ఆ వజ్రాయుధం; ఒకఁడున్= ఏమీ; చేయన్+చాలక= చేయలేక; విదళితశైలము= నరకబడ్డ కొండలు గలది; అగు= ఐన; తనదు= తనయొక్క; విలసనము= విలాసం; అచటన్= ఈ విషయంలో; కుదియుటన్= సమసిపోవటం; తనకున్= వజ్రాయుధానికి; తెలిసినన్= తెలిసేసరికి; మదము+అఱి= గర్వంపోయి; గిరిభేది కడకున్= పర్వతాలను భేదించిన ఇంద్రుడి దగ్గరకు; మగుడన్+చనియెన్= తిరిగి వెళ్ళింది.

**తాత్పర్యం:** ఆ వజ్రాయుధం తానేమీ చేయలేక, పర్వతాలను నరికిన తన గొప్పతనమంతా గరుత్మంతుడి విషయంలో మొక్కపోవటం తెలిసికొని ఇంద్రుడి దగ్గరకు తిరిగిపోయింది.

**విశేషం:** ఇవీ గరుత్మంతుడి మాహాత్మ్యం, బలపరాక్రమాలు.

**క. చేయునది లేక నిర్జర । నాయకుఁడును వెఱఁగుపాటునను బ్రూన్పడుచుం**
**బోయెం గ్రమ్మఱి ధరణీ । నాయక! నిజపట్టణంబునకు దీనగతిన్. 259**

**ప్రతిపదార్థం:** ధరణీనాయక!= భూమికి నాథుడా!, రాజా; నిర్జర= దేవతల; నాయకుఁడును= ఇంద్రుడుకూడా; చేయునదిలేక= చేసేది ఏమీలేనందువలన, ఏమీ చేయలేక; వెఱగుపాటునను= ఆశ్చర్యంతో (వజ్రాయుధం కూడా ఏమీ చేయలేకపోయిందేమిటని); బ్రూన్పడుచున్= నిశ్చేష్టుడగుచు; క్రమ్మఱి= తిరిగి; నిజపట్టణంబునకున్= తన నగరానికి; దీనగతిన్= దైన్యంతో; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు కూడా చేసేదేమీ లేక ఆశ్చర్యంతో నిశ్చేష్టుడై తన నగరానికి దిగులుతో తిరిగిపోయాడు.

**చ. అజుని యనుగ్రహంబునఁ విహంగమవల్లభుఁ డట్లు సాలన**
**క్కజ మగు శౌర్యసంపద ప్రకాశతఁ బొందఁగఁ గేలి సల్పి యిం**
**ద్ర జయమహోత్సవంబున నుదాత్తయశః పరిపూరితంబు లై**
**త్రిజగములున్ వెలుంగ నలిఁ దెచ్చె సుధారసపూర్ణభాండమున్. 260**

**ప్రతిపదార్థం:** విహంగమ= ఆకాశంలో ఎగిరే పక్షులకు; వల్లభుఁడు= రాజు; అజుని= బ్రహ్మయొక్క; అనుగ్రహంబునన్= దయతో; అట్లు= ఆ విధంగా; చాలన్= ఎక్కువ; అక్కజము= ఆశ్చర్యం; అగు= అయిన; శౌర్యసంపద= పరాక్రమ సంపద; ప్రకాశతన్= వెలుగు; పొందఁగన్= చెందగా,లోకానికి తెలియగా; కేలి= క్రీడ; సల్పి= చేసి; ఇంద్రజయ= ఇంద్రుని గెల్చుట వలన లభించిన; మహా+ఉత్సవంబునన్= గొప్ప పండుగతో; ఉదాత్త= గొప్ప; యశః= కీర్తితో; పరిపూరితంబులు+ఐ= నిండినవై; త్రిజగములున్= ముల్లోకాలూ; వెలుంగన్= వెలిగిపోగా; సుధారస= అమృతద్రవంతో; పూర్ణ= నిండిన; భాండమున్= కుండను; నలిన్= సంతోషంతో; తెచ్చెన్= తెచ్చాడు.

**తాత్పర్యం:** గరుత్మంతు డా విధంగా బ్రహ్మదయవలన ఆశ్చర్యకరమైన బలపరాక్రమాలు వెల్లడి కాగా, యుద్ధం చేసి ఇంద్రుడిని ఓడించి ఆ విజయమహోత్సవంతో ముల్లోకాలలో తనకీర్తులు నిండారగా అమృతభాండాన్ని తెచ్చాడు.

**తే. తెచ్చి డించి, కద్రువ ప్రీతిఁ దేలఁ జూపి । తల్లి చెఱవాపికొని పొంగి చెల్లునాగ**
**డమున మగుడ నయ్యమృతభాండంబు దాన । పుచ్చికొని యెడఁ గలుగంగఁ బోయి నిలిచి. 261**

**ప్రతిపదార్థం:** తెచ్చి= అమృతభాండం తీసికొని వచ్చి; డించి= క్రిందపెట్టి; కద్రువ= అతని పెద్దతల్లి; ప్రీతిన్= సంతోషంలో; తేలన్= తేలిపోవగా; చూపి= చూపించి; తల్లిచెఱ= తనతల్లి దాసాన్ని; పాపికొని= పోగొట్టుకొని; పొంగి= పొంగిపోయి; చెల్లు= సాగే; ఆగడమునన్= అల్లరితనంతో; మగుడన్= తిరిగి; ఆ+అమృతభాండంబున్= ఆ అమృతపు కుండను; తాన= తానే; పుచ్చికొని= గ్రహించి; ఎడ= దూరం; కలుగంగన్= కలిగేటట్లు; పోయి= వెళ్ళి; నిలిచి= నిలబడి.

**తాత్పర్యం:** అమృతభాండం తెచ్చి క్రిందపెట్టి కద్రువకు సంతోషం కలిగేటట్లు చూపించి, తనతల్లి దాస్యం చెల్లిపోయిందనిపించుకొని తిరిగి ఆ అమృతం కుండను తానే తీసికొని గడుసుదనంతో దూరంగా పోయి నిలబడి.

**విశేషం:** కద్రువ 212వ పద్యంలో అన్నది. 'లోకులు నిన్నుం బ్రణుతింపఁ దెమ్మమృతమున్' అని. అత డట్లాగే తెచ్చాడు. ఇందుకే 260వ పద్యం వ్రాసింది కవి. తెమ్మన్నదే కాని ఇమ్మనలేదు. అందుకని ఇవ్వలేదు.

**వ. తన్ను వెఱఁగుపడి చూచుచున్న కద్రువ నుద్దేశించి. 262**

**ప్రతిపదార్థం:** తన్నున్= గరుత్మంతుడిని; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; చూచుచున్+ఉన్న= చూస్తూ ఉన్న; కద్రువన్= పెదతల్లిని; ఉద్దేశించి= దృష్టిలో ఉంచుకొని; చూస్తూ;

**తాత్పర్యం:** గరుత్మంతుడిని భయపడుతున్న చూపులతో చూస్తూ ఉన్న కద్రువతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**మ. 'జననీ! నీ వమృతంబు తె' మ్మనిన, యా సత్యోక్తి పాటించి యేఁ**
**జని నానావిధ కర్మకర్మఠుఁడ నై సాధించి, వే తెచ్చితిన్**
**విను, నా నీయొడఁబాటు సెల్లె జనులన్ విన్పించితిం దెల్లఁగా**
**వినతం దోడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లే కుండుమీ!' 263**

**ప్రతిపదార్థం:** జననీ!= అమ్మా!; నీవు; అమృతంబు= అమృతం; తెమ్ము= తేవోయి; అనినన్= అనగా; ఆ+సత్య+ఉక్తి= ఆ నిజమైన మాట; పాటించి= అంగీకరించి; ఏన్= నేను; నానావిధ= అనేకమైన; కర్మ= కార్యాలు; కర్మఠుఁడనై= చేసినవాడనై; సాధించి (అమృతాన్ని) సంపాదించి; వే= త్వరగా; తెచ్చితిన్= తెచ్చాను; విను= జాగ్రత్తగా వినుము; నా నీ= మన ఇద్దరి; ఒడఁబాటు= సంధి, అంగీకారం; చెల్లెన్= నెరవేరింది; తెల్లఁగాన్= స్పష్టంగా; జనులన్= జనానికి; విన్పించితిన్= చాటిచెప్పాను; వినతన్= మా అమ్మను; తోడ్కొని= వెంటబెట్టుకొని; పోయెదన్= పోతున్నాను; మనమునన్= మనస్సులో; విభ్రాంతి= భ్రమ; లేకుండుమీ= లేకుండా ఉండుము.

**తాత్పర్యం:** 'తల్లీ! నీవన్నావు! అమృతం తీసికొని రమ్ము' అని. ఆ మాటను పట్టుకొని అనేకవిధాల కష్టాలుపడి కార్యం సాధించుకొని వచ్చాను. మన ఒప్పందం చెల్లింది. జనులందరికీ ఈ విషయం స్పష్టంగా చాటి చెప్పాను. మా అమ్మను తీసికొని పోతున్నాను. నీవు ఏమీ భ్రమపెట్టుకోకు'.

**విశేషం:** 212వ పద్యంలో కద్రువ ఎగతాళిగా అన్నది. 'అమృతం తేరా చూద్దాం' అని. అది మత్తేభం పద్యంలో ఉన్నది. ఈ పద్యం గరుత్మంతుడి సమాధానం. ఇదీ మత్తేభమే. ఎగతాళిమాటకు తగినట్లు బుద్ధి చెప్పటం ఆయన చేసిన పని. దుర్మార్గులను శిక్షించటమే ధర్మం. కనుక గరుత్మంతుడి గొప్పతనానికి ఇదొక గుర్తు.

**మ. అని ధర్మస్థితి తోఁప మాట వెర వేపారం దగం బల్కి నే**
**ర్పునకున్ లోకము మెచ్చఁ గద్రువకుఁ బెంపుం గీర్తియున్ మాయ సొం**
**పునఁ దల్లిం దనయింటి కన్పి యమృతంబుం గ్రమ్మఱన్ గ్రక్కునం**
**గొని, పక్షీంద్రుఁడు వోయి యింద్రుఁ డెలమిం గూరంగ నిచ్చెం దగన్. 264**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా చెప్పి; ధర్మస్థితి= ధర్మంయొక్క ఉనికి; తోఁపన్= స్పష్టం కాగా; మాట వెరపు= మాట ఉపాయం; ఏపారన్= తెలిసేటట్లుగా; తగన్= ఉచితంగా; పల్కి= చెప్పి; నేర్పునకున్= తన తెలివికి; లోకము= జనమంతా; మెచ్చన్= మెచ్చుకొనగా; కద్రువకున్= పెదతల్లికి; పెంపున్= గొప్పతనం; కీర్తియున్= కీర్తి; మాయన్= లోపించగా; సొంపునన్= చక్కగా; తల్లిన్= వినతను; తన ఇంటికిన్= స్వగృహానికి; అన్పి= పంపి; అమృతంబున్= సుధను; క్రమ్మఱన్= తిరిగి; గ్రక్కునన్= వెంటనే; పక్షి+ఇంద్రుఁడు= పక్షిరాజు; కొని= గ్రహించి; పోయి= వెళ్ళి; ఇంద్రుఁడు= సురరాజు; ఎలమిన్= సంతోషంలో; కూరంగన్= కూరుకొనిపోగా; తగన్= ఒప్పిదముగా; ఇచ్చెన్= అర్పించాడు.

**తాత్పర్యం:** అని ధర్మానుగుణంగా చెప్పి తనమాట నేర్పుకు లోకం మెచ్చుకొనగా, కద్రువకు కీర్తి గొప్పతనం పోగా, చక్కగా తనతల్లిని ఇంటికి పంపి అమృతాన్ని తిరిగి ఇంద్రుడి కర్పించాడు.

**విశేషం:** గరుత్మంతుడు ధర్మం పాటించటమంటే పాపాత్మురాలికి అమృతం ఇవ్వకపోవటమే. ఆమెను మాటతోనే జయించాడు. అందుకని లోకం మెచ్చుకొన్నది.

**వ. 'ఇవ్విధంబున నౌచిత్యంబు సంస్తుత్యంబుగా నమృతం బమృతాశన పతికి నొసంగి యెసకం బెసంగు తేజంబున విరాజితుం డయి యావృత్రవైరిని సూరెల నున్న సురలను మునులను గలయం గనుంగొని. 265**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; ఔచిత్యంబు= ఉచితత్వం; సంస్తుత్యంబుగాన్= స్తుతికి యోగ్యం కాగా; అమృతంబున్= సుధను; అమృత+ఆశన= అమృతం ఆహారంగా కలవారు దేవతలు; వారియొక్క పతికిన్= రాజుకు; ఒసంగి= ఇచ్చి; ఎసకంబు= ఆధిక్యం; ఎసంగు= ఎక్కువగు; తేజంబునన్= తేజస్సుతో; విరాజితుండు+అయి= ప్రకాశించి; ఆ వృత్రవైరిని= ఆ వృత్రాసురుడి శత్రువైన దేవేంద్రుణ్ణి; సూరెలన్= ప్రక్కల; ఉన్న= ఉన్నట్టి; సురలను= దేవతలను; మునులను= ఋషులను; కలయన్+కనుంగొని= తేరిపారజూచి

**తాత్పర్యం:** ఈ విధంగా ఆమెకు తగినట్లు బుద్ధి చెప్పి అమృతాన్ని ఇంద్రుడి కర్పించి అందరిచేత మన్ననలంది ఆ ఇంద్రుడిని అతడితోపాటు ఇరుప్రక్కల కొలువు దీరిన దేవతలను మునులను చూచి.

**చ. 'కొడుకులఁ బంచి తెల్పెసఁగు గుఱ్ఱము వాలమునందు నల్ల గ**
**ల్గెడు క్రియఁ దీర్చి, పన్నిదము గెల్చిన కద్రువ నేను మాటమై**
**నొడిచితిఁ దల్లి దాసి యగు టోర్వక, తండ్రి యనుజ్ఞ, మీ కెదు**
**ర్పడిన దురుద్ధతిన్ మఱచి బాంధవసత్కృతి నాదరింపుఁడీ!' 266**

**ప్రతిపదార్థం:** కొడుకులన్= కుమారులను; పంచి= ఆజ్ఞాపించి; తెల్పు+ఎసఁగు= తెల్లనైన; గుఱ్ఱము వాలమునందున్= గుర్రం తోకలో; నల్ల= నలుపు; కల్గెడు క్రియన్= కలిగేటట్లు; తీర్చి= చేసి; పన్నిదము= పందెం; గెల్చిన= జయించిన;

కద్రువన్= పెదతల్లిని; ఏను= నేను; మాటమైన్= మాటతోనే; ఒడిచితిన్= గెల్చాను; తల్లి= మా తల్లి వినత; దాసి అగుటకున్= దాసి కావటానికి; ఓర్వక= సహించలేక; తండ్రి= కశ్యపుడి; అనుజ్ఞన్= ఆనతితోన; మీకున్= ఇంద్రుడికి; ఎదుర్పడిన= ఎదురించిన; దురుద్ధతిన్= చెడుగర్వాన్ని; మఱచి= విస్మరించి; బాంధవ, సత్కృతిన్= బంధుప్రేమతో; ఆదరింపుఁడీ!= నన్ను ఆదరించండి

**తాత్పర్యం:** 'కద్రువ తన కొడుకులను ఆజ్ఞాపించి పంపి తెల్లని గుర్రం తోకను నలుపుగా చేసి, పందెంగెల్చి నా తల్లిని దాసిగా చేసికొన్నది. కనుక నేనూ నా తండ్రి ఆనతితో మా పెదతల్లిని మాటతోనే ఓడించాను. ఈ విషయంలో మిమ్మల్ని ఎదురించవలసి వచ్చింది. దానిని మరచిపోయి నన్ను బంధుప్రీతితో చూడండి'.

**విశేషం:** ఇవి గరుత్మంతుడికి పెద్దలయందున్న భక్తిశ్రద్ధలు. ఎక్కడా పొల్లుమాట అనడు. తూచినట్లు మాట్లాడటం, తగినట్లుగా చేయటం. ఎంతవరకుండాలో అంతవరకే ఉండటం అతడిస్వభావం. దుర్మార్గుడికి బుద్ధి చెప్పకపోతే సన్మార్గు డెట్లా ఔతాడు?

**వ. అని వెండియు. 267**

**తాత్పర్యం:** అని ఇంకా.

**క. 'వినుఁ! డట్టులు పాపము సే । సిన కద్రువ సుతులఁ బొదివి చెండుదు, మత్తుం**
**డనితాంతోగ్ర విహారం । బునఁ దండ్రియు మీరు ధర్మమును సాక్షులుగన్'. 268**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి (కోపంతో నొక్కి చెప్పటం); అట్టులు= ఆ విధంగా (గుర్రం తెల్లని తోకను నల్లగా చేసిన); చేసిన= చేసినటువంటి; కద్రువ సుతులన్= కద్రువ కొడుకులను; పాములను; పొదివి= కాళ్ళతో తొక్కిపట్టి; తండ్రియున్= నా తండ్రి కశ్యపులు; మీరు= ఇంద్రాదులు; ధర్మమును= (లోకం సాఫీగా నడవటానికాధారమైన) న్యాయం; సాక్షులుగన్= చూస్తూండగా (స+అక్షి= కన్ను కలవాడు, చూచేవాడు) మత్= నా యొక్క; తుండ= ముక్కుయొక్క; నితాంత= అంతులేని; ఉగ్ర= భయంకరమైన; విహారంబునన్= క్రీడతో; చెండుదున్= చీల్చిచెండాడుతా.

**తాత్పర్యం:** ఆ విధంగా మా అమ్మను బానిసగా చేసిన పాపాన బోయిన ఆ కద్రువ సంతానాన్ని మా తండ్రి, మీరూ, ధర్మం సాక్షులుగా. నా ముక్కుతో పొడిచి ఉగ్రంగా చీల్చి చెండాడుతాను.

**విశేషం:** చాలా కోపంతో ఊగిపోతూ అన్నమాటలు ఇవి. సామాన్యంగా తిక్కన గారి కందపద్యం చాలా అందమైనదన్న ప్రశస్తి ఉన్నది. దాని కీ పద్యాలవంటివి సాక్ష్యంగా తీసికొనాలి.

**వ. అని పలికిన నతని నందఱు నభినందించి; రమ్మునులును సురలునుం బురందరుని తోడ 'నితనికి నొక్కవరం బొసంగ వలదే!' యనిన, నతండు దలంచికొని దరహసితంబుతో వారల నాలోకించి 'మనవరంబునకు నాసపడియెడు కొలంది వాఁడు గాఁ; డతండు సాక్షాద్విష్ణుండు కృష్ణుండనశూరుఁ డను యాదవ ధాత్రీశునకుఁ బౌత్రుండై లోకహితార్థంబుగాఁ జరియింపం గలవాఁడీమూర్తియు విడువండు; వివిధ వర్తనంబుల వినోదించుచుండు' ననియెఁ; దదనంతరంబ సముచితప్రకారంబున నాజంభారిని వారలను దా నామంత్రితులం జేసి. 269**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని చెప్పిన; అతనిన్= గరుత్మంతుడిని; అందఱున్= ఇంద్రాదులు; అభినందించిరి= పొగడారు; పురందరునితోడన్= దేవేంద్రుడితో; ఆ+మునులును= ఆ మునులు; సురలునున్= దేవతలు; ఇతనికిన్= ఈ గరుత్మంతుడికి; ఒక్క వరంబున్= ఒక వరాన్ని; ఒసంగన్వలదే!= ఇవ్వవద్దా!; అనినన్= అనగా; అతండు= దేవేంద్రుడు; తలంచికొని= ఆలోచించుకొని; దరహసితంబుతోన్= చిరునవ్వుతో; వారలన్= మునులను, సురలను; ఆలోకించి= చూచి; అతండు= ఆయన; మన వరంబునకున్= మన వరానికి; ఆసపడియెడు కొలందివాఁడు కాఁడు= ఆశపడేటంత తక్కువవాడు కాడు; సాక్షాద్విష్ణుండు= సాక్షాత్తుగా విష్ణువు; కృష్ణుండు+అనన్= కృష్ణుడనే పేరున; శూరుఁడు అను= శూరుడనే పేరుగల; యాదవ ధాత్రీశ్వరునకున్= యాదవ రాజునకు; పౌత్రుండు+ఐ= మనుమడై; లోకహిత+అర్థంబుగాన్= లోకక్షేమంకొరకు; చరియింపన్+కలవాఁడు= విహరించగలడు; ఈ మూర్తియున్= ఈ రూపం కూడా; విడువండు= వదలిపెట్టడు; వివిధ= అనేక; వర్తనంబులన్= ప్రవర్తనలతో; చరియించుచుండున్= విహరిస్తాడు; అనియెన్= అన్నాడు; తత్+అనంతరంబ= ఆ తర్వాత; సముచిత= తగిన; ప్రకారంబునన్= విధంగా; ఆ జంభ+అరిని= ఆ ఇంద్రుడిని (జంభుడన్న రాక్షసుడిని చంపినవాడిని); వారలను= ఆ మునులను, దేవతలను; తాను= గరుత్మంతుడు; ఆమంత్రితులన్= పంపించటం; చేసి= ఆచరించి.

**తాత్పర్యం:** అని అనగా ఆ గరుత్మంతుడిని అందరూ ప్రశంసించారు. ఆ మునులూ, దేవతలూ ఇంద్రుడితో ఇట్లా అన్నారు. 'ఈయన కేదేనా వరమివ్వరాదా?' అని. ఆయన ఆలోచించి 'ఈయన మన వరాల కాశపడేటంత తక్కువ శక్తి కలవాడు కాడు. ఈయన సాక్షాద్విష్ణువు. భవిష్యత్తులో శూరుడనే యాదవరాజునకు మనుమడై పుట్టి కృష్ణుడన్న పేరుతో లోకకల్యాణం కొరకు అవతరించనున్నాడు. ఈ ప్రస్తుతమూర్తిలో కూడా అనేక కార్యాలు నిర్వహిస్తాడు' అని చెప్పాడు. అంతట గరుత్మంతుడు వారి నందరినీ పంపించివేసి. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** ఈ మాటలన్నీ ఇంద్రుడు గరుత్మంతుడి మాహాత్మ్యాన్ని గురించి వివరించటాని కన్నవి. గరుత్మంతుడే అక్క డున్న కృష్ణుడు. ఇందుకే భీష్ముడు కథను ప్రారంభిస్తూనే ఇట్లా అన్నాడు కృష్ణుడితో ' ఆ సుపర్ణుండు నీవ కా వినియుండుదున్' (166 వ పద్యం) అని. కథ అదే మాటలతో ముగిస్తున్నాడు కవి.

**సీ.** **'అజుఁ డుపలాలింప నద్దేవు కావించు । వరభోజనంబులఁ బెరిఁగె నితఁడె!**
**ఘనకాయజవసత్త్వ గజకచ్ఛపముల నొ । క్కెత్తున లీలమై నెత్తె నితఁడె!**
**విపులభూరుహశాఖ విఱిగిన మునిహితా । ర్థంబుగాఁ జంచునఁ దాల్చె నితఁడె!**
**సురసేనతోఁ బురందరుని నిర్జించి యు । ద్దీప్తుఁడై యమృతంబుఁ దెచ్చె నితఁడె!**

**తే.** **తల్లిదాస్యంబు దనబాస దప్పకుండఁ । బాపి యాసుధ మరల నప్పాకశాస**
**నునకు దయ నిచ్చె నీతఁడె!' యనుచు సిద్ధ । సాధ్యు లగ్గింప, గరుడుఁడు సనియె మగిడి'.** **270**

**ప్రతిపదార్థం:** అజుఁడు= బ్రహ్మ; ఉపలాలింపన్= ముద్దు చేస్తుండగా; ఆ+దేవు= ఆ దేవుడు; కావించు= సృష్టించే; వర= శ్రేష్ఠ; భోజనంబులన్= ఆహారాలలో; పెరిఁగెన్+ఇతఁడె= ఇతడే పెరిగి పెద్దవాడైనాడు; ఘన= పెద్ద; కాయ= శరీరం; జవ= వేగం; సత్త్వ= బలం కల; గజ= ఏనుగును; కచ్ఛపములన్= తాబేలును; ఒక్క+ఎత్తునన్= ఒకేసారి; లీలమైన్= విలాసంగా; ఎత్తెన్= పైకి ఎత్తుకొనిపోయినది; ఇతఁడె!= ఇతడేకదా! అని ఆశ్చర్యం; విపుల= విస్తారమైన; భూరుహ= చెట్టు; శాఖ= కొమ్మ; విఱిగినన్= విరిగితే; మునిహిత+అర్థంబుగాన్= మునుల క్షేమంకోరి; చంచునన్= ముక్కున; తాల్చెన్= ధరించాడు; ఇతఁడె!= ఈయనేకదా!; ఇతఁడె= ఈయనే; సురసేనతోన్= దేవతాసైన్యంతో; పురందరునిన్= ఇంద్రుడిని; నిర్జించి= జయించి;

ఉత్+దీప్తుఁడు+ఐ= మిక్కిలి (కీర్తితో, పరాక్రమంతో) ప్రకోపించినవాడై; అమృతంబున్= సుధను; తెచ్చెన్= తెచ్చాడు; తల్లిదాస్యంబు= తల్లియైన వినత బానిసతనం; తన బాస= తన ప్రతిజ్ఞ; తప్పకుండన్= తప్పిపోకుండా; పాపి= పోగొట్టి; మరలన్= తిరిగి; ఆ సుధన్= ఆ అమృతం; ఆ పాకశాసనునకున్= ఆ ఇంద్రుడికే (పాకుడనే రాక్షసుడిని చంపినవాడు); దయన్= దయతో; ఈతఁడె= ఈయనే; ఇచ్చెన్= ఇచ్చాడు; అని=అంటూ; సిద్ధసాధ్యులు= సిద్ధులు, సాధ్యులు (దేవతలలో తెగలు); అగ్గింపన్= స్తుతించగా; మగిడి= తిరిగి; గరుడుఁడు చనియెన్= గరుత్మంతుడు వెళ్ళాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవు డంతటి వాడు ముద్దుగా ప్రత్యేకాహార మేర్పాటుచేసి పెంచితే పెరిగినవా డీయనే కదా! అంత పెద్ద శరీర, బల వేగాలున్న గజకచ్ఛపాలను ఒకేసారి అవలీలగా పైకెత్తుకొని పోయిన బలశాలి ఈయనేకదా! అంతపెద్ద కొమ్మ విరిగితే దానిపై నున్న వాలఖిల్యులనే మునుల క్షేమంకొరకు ముక్కున ధరించినవా డీయనే కదా! దేవతా సైన్యంతో దండెత్తివచ్చిన ఇంద్రుడిని జయించి అమృతం తెచ్చిన వా డీయనే. తన మాట తప్పకుండా తల్లి దాస్యాన్ని పోగొట్టి తిరిగి తానుతెచ్చిన అమృతాన్ని ఇంద్రుడి కర్పించిన మహానుభావు డీయనే కదా!'

**విశేషం:** ముగింపుగా ఈ పద్యం వ్రాయటం తిక్కనగారి కథ చెప్పే నేర్పును ప్రకాశింపచేస్తుంది. ఈ పద్యంలో 5 పాదాల మీదుగా మొదటినుండి చివరిదాకా కథనంతా పూసగ్రుచ్చినట్లు చెప్పటం లోకోత్తరమైన శిల్పం. తిక్కనగారు ఇలాంటి పద్యాలు ముగింపుగా వ్రాయటం చాలా చోట్ల కన్పిస్తుంది. గరుత్మంతుడు పెరగటం దగ్గరనుంచి మొదలుపెట్టి కథాంతం వరకూ చెప్పినవైనం భావించదగింది. ప్రతివాక్యం 'ఇతడె' అన్న సర్వనామంతో అంతం కావటంతో పద్యంలో మంచి శైలి ఏర్పడింది.

**వ. అని చెప్పి భీష్ముండు. 271**

**తాత్పర్యం:** ఈ విధంగా వర్ణించి భీష్ముడు.

**క. 'మానవలోక కలిత బహు । ళానందకరంబు, నిష్కలావ్యయసుఖ సో**
**పానము నగు సౌపర్ణా । ఖ్యానము విని పుణ్యతముఁడ వైతి నరేంద్రా!' 272**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ప్రజలకు నాయకుడా! ధర్మరాజా!; మానవలోక= మనుష్య స్వభావంతో; కలిత= కూడుకొన్నది; బహుళ= విస్తారమైన; ఆనంద కరంబు= ఆనందాన్ని కలిగించేది; నిష్కల= నిర్గుణమైన; అవ్యయ= తరగని; సుఖ= ముక్తికి; సోపానము= మెట్టు; అగు= అయిన; సౌపర్ణ= గరుత్మంతుడియొక్క (సు+పర్ణ= బలిష్ఠమైన రెక్కలు కలవాడు); ఆఖ్యానము= కథ (ఆఖ్యానమంటే ప్రసిద్ధమైనదీ జరిగినదీ అయిన కథ); విని; పుణ్యతముఁడవు= పుణ్యాశాలివి; ఐతి (వి) = అయినావు.

**తాత్పర్యం:** ధర్మజా! నీవు గొప్ప పుణ్యాశాలివైనావు. ఎందుకంటే ఈ గరుత్మంతుడి కథ ముక్తికి సోపానం. వ్యయంకాని నిర్గుణమైన సుఖం ముక్తి కదా! ఈ కథలో మానవస్వభావ మున్నందున గొప్ప ఆనందాన్ని కలిగిస్తుంది.

**విశేషం:** కథలో లక్షణాన్ని చెప్పుతున్న పద్య మిది. సవతుల మధ్య తగాదాలు, వాటినుండి మనిషి బయట పడటానికి పడే తంటాలు, ఇవన్నీ కథలో ఉండటమే మానవ లోక ముండటం. ఆ దృష్టితో ఈ కథ చదువుకొమ్మని కవి మనకు సూచించటం.

**వ. అనినం బాండవాగ్రజుండు సంతసించి, 'విప్రున కెద్దియేనియు నిచ్చువాఁడుగా నొడంబడి యీనివాఁ డేమి గతిం బోవం గలవాఁ? డని యడుగుటయు, నతం డతనితో నొక నిదర్శనంబున, నది యెఱింగించెద విను' మని యిట్లనియె. 273**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో జ్యేష్ఠుడు; సంతసించి=సంతోషించి; విప్రునకున్= బ్రాహ్మణుడికి; ఎద్ది ఏనియున్= ఏమైనా; ఇచ్చువాఁడుగాన్= ఇస్తానన్నవాడై; ఒడంబడి= ఒప్పుకొని; ఈనివాఁడు= ఇవ్వనివాడు; ఏమిగతిన్= ఏ గతిని; పోవన్+కలవాఁడు?= పోతాడు? అని అడుగుటయున్= అని అడుగగా; అతండు= భీష్ముడు; అతనితోన్= ధర్మరాజుతో; ఒక నిదర్శనంబునన్= ఒక ఉదాహరణతో; అది ఎఱింగించెదన్= అది తెలుపుతాను; వినుము+ అని+ఇట్లు+అనియెన్= వినుమని ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడి కథ విన్న తరువాత ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు 'బ్రాహ్మణున కేదైనా ఇస్తానని ఇవ్వనివా డేగతి పొందుతాడో చెప్పు'మని అడుగగా; 'ఒక ఉదాహరణంతో నీ కది స్పష్టం చేస్తాను విను' మని భీష్ము డన్నాడు.

**సీ.** **ఒక్క సృగాలంబు, నొక వానరంబును। బ్రీతిమైఁ గూడి వర్తించుచుండుఁ,**
**దొలుపుట్టువున మానవులును నెచ్చెలులు నై। యుండుట గూర్చు నొండొంటి; కొక్క**
**యెడ, నొకనాఁ డవ్వఱడుతోడ నాక్రోఁతి। 'గటకటా! నీ కిట్లు గడును హేయ**
**మైన పీనుఁగునంజు డాహార మైనట్టి ' భవము వాటిల్లు టేపాపముననొ?'**

**తే.** **యనిన జాతిస్మరణవంత మగుటఁ జేసి। యది విషాదముఁ బొంది 'ధరామరునకు**
**నీ నొడంబడ్డ ధన మీన కాన యిట్టు। నీచతరజాతియందు జన్మింపవలసె.** **274**

**ప్రతిపదార్థం:** ఒక్క= ఒక; సృగాలంబున్= నక్క; ఒక వానరంబును= ఒక కోతియును; ప్రీతిమైన్= స్నేహంతో; కూడి= కలిసి; వర్తించుచుండున్= జీవిస్తూ ఉండేవి; తొలుపుట్టువునన్= పూర్వజన్మంలో; మానవులును= మనుషులూ; నెచ్చెలులును+ఐ= స్నేహితులు కూడా ఐ; ఉండుటన్= ఉండటంవలన; ఒండు+ఒంటికిన్= పరస్పరం, ఒకదానితో ఒకటికి; కూర్చున్= స్నేహమున్నది; ఒక్కఎడన్= ఒక సమయంలో; ఒకనాఁడు= ఒకరోజున; ఆ క్రోఁతి= ఆ కోతి; ఆ+వఱడుతోడన్= ఆ నక్కతో; కటకటా!= అయ్యో; నీకున్+ఇట్లు= నీకీ విధంగా; కడునున్= మిక్కిలి; హేయము+ఐన= నికృష్టమైన; పీనుఁగు= శవపు; నంజుడు= మాంసం; ఆహారము= తిండి; ఐనట్టి= ఐనటువంటి; భవము= జన్మ; పాటిల్లుట= కలగటం; ఏ పాపముననొ?= ఏ పాపం వల్లనొ?; అనినన్= అనగా; అది = ఆ నక్క; జాతిస్మరణవంతము= పూర్వజన్మకు సంబంధించిన స్మృతి కలది; అగుటన్ చేసి= అవటం వలన; విషాదమున్= దుఃఖాన్ని; పొంది; ధరా+అమరునకున్= భూదేవతకు - బ్రాహ్మణుడికి; ఈన్= ఇవ్వటానికి; ఒడంబడ్డ= ఒప్పుకొన్న; ధనమున్= డబ్బును; ఈన= ఇవ్వలేదు; కాన= కాబట్టి; ఇట్లు= ఈ విధంగా; నీచతర తెగయందున్= మిక్కిలి నీచమైన తెగలో; జన్మింపన్‌వలసెన్= పుట్టవలసి వచ్చింది.

**తాత్పర్యం:** ఒక నక్క, ఒక కోతి స్నేహంగా ఉండేవి. ఎందుకంటే పూర్వజన్మలో అవి, మనుషులూ స్నేహితులూ కావటంవలన. ఇట్లా ఉండగా ఒకరోజు కోతి నక్కతో ఇట్లా అన్నది 'ఏ పూర్వ జన్మ పాపం వలన నీ వీ జన్మలో పీనుగు మాంసం తిండిగా బ్రతకవలసి వచ్చిందో కదా!' అని. ఆ మాట విన్న నక్క పూర్వజన్మ జ్ఞానులజాతిలో పుట్టినది కావటం వలన దుఃఖం పొంది 'నేను పూర్వజన్మలో ఒక బ్రాహ్మణుడి కిస్తానన్న ధన మివ్వనందువలన నాకీ నీచజన్మ వచ్చింది' అని చెప్పింది.

**వ.** **అని తెలిపె; నట్లగుటంజేసి 'యాస గొల్పి, విప్రున కియ్యకున్కి యొప్ప' దని చెప్పిన, నప్పాండవాగ్రజుం 'డహీనగుణ వర్ణనీయుం డయిన హీనవర్ణునకు మంత్రతంత్రాదు లుపదేశించుట ధర్మవిరుద్ధం బయి యుండు నొకో?'**

**యని యడిగిన నయ్యనిమిష నదీనందనుం 'డీప్రశ్నంబున కుత్తరం బగునది యొక యితిహాసము గల; దాకర్ణింపు' మని యిట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** అని తెలిపెన్= అని చెప్పింది; అట్లు+అగుటన్+చేసి= అట్లా కావటం వల్ల; ఆస+కొల్పి= ఆశపెట్టి; విప్రునకున్= బ్రాహ్మణుడికి; ఇయ్యక+ఉన్కి= ఇవ్వకపోవటం; ఒప్పదు= మంచిదికాదు; అని చెప్పినన్= అని చెప్పగా; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడైన ధర్మరాజు; అహీన= గొప్ప; గుణ= గుణాలతో; వర్ణనీయుండు= పొగడదగిన; హీన= నీచమైన; వర్ణునకున్= వర్ణంలో పుట్టినవాడికి; మంత్ర తంత్ర= మంత్రం, పూజ చేసే విధానాలు; ఆదులు= మొదలైనవి; ఉపదేశించుట= బోధించటం; ధర్మవిరుద్ధంబు= ధర్మానికి వ్యతిరేకం; అయి ఉండునొకో!= ఔతుందా? అని అడిగినన్= అని అడిగితే; ఆ+అనిమిష= ఆ దేవతల; నదీ= గంగయొక్క; నందనుండు= కొడుకు (భీష్ముడు); ఈ ప్రశ్నంబునకున్= ఈ ప్రశ్నకు; ఉత్తరంబు= సమాధానం; అగునది= అయినది; ఒక+ఇతిహాసము = ఒక ఇతిహాసం; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము; అని; ఇట్లు; అనియెన్= చెప్పాడు

**తాత్పర్యం:** 'అందువలన ఆశ పెట్టి బ్రాహ్మణుడి కివ్వకపోవటం మంచిది కాదు' అని చెప్పగా విని ధర్మరాజు 'గొప్ప గుణా లున్న హీనవర్ణుడికి మంత్రతంత్రాదులు బోధించటం ధర్మమా? కాదా?' అని అడిగాడు. దానికి భీష్మ డిట్లా అన్నాడు. 'నీ ప్రశ్నకు సమాధానంగా ఒక కథ ఉదాహరణంగా చెప్పుతాను వినుము' - అని ఇట్లా చెప్పాడు.

### బ్రాహ్మణుఁడు హీనవర్ణునకు వైదికమంత్రంబు లుపదేశింపఁ గూడదనుట (సం.13-10-1)

**సీ. హిమగిరిమీఁద ననేకద్విజులు దప । మాచరింపంగ నయ్యాశ్రమమున**
**కొక్కశూద్రుండు ధర్మోపేతుఁ డేతెంచి । యమ్మునులకు గురుఁ డగు మునీంద్రుఁ**
**గని, 'కృప నుపదేశ మొనరింపవే తపో । వృత్తికై నా' కని వేఁడుటయును,**
**'జనదు వైదికము శూద్రున కుపదేశింప; । నీవు శుశ్రూషమై నిలువు' మనియె,**

**తే. ననుడు, వాఁడు శుశ్రూషకుఁడై వసించె । గుడిసె యొకదెసఁ గావించుకొని ముదమున**
**నతిథి సురపితృపూజ లత్యధిక భక్తి । తోడఁ జేయుచు నొక్కింత కీడు లేక. 276**

**ప్రతిపదార్థం:** హిమగిరి= మంచుకొండ; మీఁదన్= పైన; అనేకద్విజులు= పలువురు బ్రాహ్మణులు; తపము+ఆచరింపంగన్= తపస్సు చేస్తుండగా; ఆ+ఆశ్రమమునకున్= ఆ ఆశ్రమానికి; ఒక్క= ఒక; ధర్మ+ఉపేతుఁడు= ధర్మాత్ముడు; శూద్రుండు= నాల్గవ కులంవాడు; ఏతెంచి= వచ్చి; ఆ+మునులకున్= ఆ ఋషులకు; గురుఁడు= గురువైన; ముని+ఇంద్రున్= మునిశ్రేష్ఠుడిని; కని= దర్శించి; కృపన్= దయతో; తపోవృత్తికై= తపస్సు చేయటానికి; ఉపదేశము= బోధ; ఒనరింపవే?= చేయవా? నాకున్+అని= నాకోసమని; వేఁడుటయునున్= ప్రార్థించగా; శూద్రునకున్= శూద్రుడైన వాడికి; వైదికము= వేద సంబంధమైన తపస్సు; ఉపదేశింపన్= బోధించటానికి; చనదు= కూడదు; నీవు; శుశ్రూషమైన్= సేవతో; నిలువుము+అనియెన్= ఉండుము అన్నాడు; అనుడున్= అనగా; వాఁడు= ఆ శూద్రుడు; శుశ్రూషకుఁడు+ఐ= సేవకుడై; ముదమునన్= సంతోషంతో; ఒక దెసన్= ఒక ప్రక్క; గుడిసెన్= పర్ణశాలను; కావించుకొని= నిర్మించుకొని; ఒక్కింత= కొంచెంకూడా; కీడు= లోపం; లేక= లేకుండా; అతిథి= అతిథులకు (తిథి లేకుండా వచ్చేవాడు); సుర= దేవతలకు; పితృ= పితృదేవతలకు; పూజలు= అర్చనలు; అతి= మిక్కిలి; భక్తితోడన్= భక్తితో; చేయుచున్= చేస్తూ; వసించెన్= నివసించాడు.

**తాత్పర్యం:** హిమాలయంమీద అనేకమంది బ్రాహ్మణులు తపస్సు చేసికొంటూ ఉండగా, ఆ ఆశ్రమానికి ఒక శూద్రుడు వచ్చి, గురువుగారిని ప్రార్థించాడు. 'నాకూ తపస్సును బోధించండి' అని. దాని కాయన 'శూద్రుడికి వైదికం బోధించకూడదు. నీవు మాకు సేవ చేసికొంటూ ఉండుము' అని చెప్పాడు. వాడు కూడా ఒక పర్ణశాల కట్టుకొని ఒక ప్రక్క ఉంటూ అతిథులకు, దేవతలకు, పితృదేవతలకు పూజలు చేసికొంటూ ఉండేవాడు.

**క. నియతియు, వినయముఁ జూచిన । దయ పుట్టెడునట్లు గాఁగ, ధర్మనిరూఢ**
**క్రియ లొనరింపఁగ, మునిపతి । ప్రియమునఁ గనుఁగొనుటకై యరిగె నచ్చటికిన్. 277**

**ప్రతిపదార్థం:** నియతియున్= నియమమూ; వినయమున్= అణకువయును; చూచినన్= చూస్తే; దయ= కరుణ; పుట్టెడునట్లు= పుట్టేటట్లు; కాఁగన్= కాగా; ధర్మనిరూఢ= ధర్మబద్ధమైన; క్రియలు= పనులు; (క్రియ=యాగం - అతిథిసుర పితృపూజలే యజ్ఞాలు); ఒనరింపఁగన్= చేస్తూ ఉండగా; ప్రియమునన్= ప్రేమతో; మునిపతి= మునిరాజు; కనుఁగొనుటకై= చూడటానికి; అచ్చటికిన్= అతడి ఆశ్రమానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** నియమంతో, వినయంతో జాలి కలిగేటట్లుగా ధర్మబద్ధుడై అతడు క్రియలు చేస్తుంటే దయతో చూడటానికని మునుల గురువు అతడి గుడిసెకు వెళ్ళాడు.

**ఆ. అరిగి యతనిచేయు నయ్యనుష్ఠానంబు । లోనఁ గానివాని మానఁ జెప్పి,**
**'యనఘ! యిట్లు సేయు' మని యుపదేశింపఁ । గరుణపేర్మిఁ బుణ్యకర్మగతులు. 278**

**ప్రతిపదార్థం:** అరిగి= పోయి; అతనిచేయు= అతడు చేసే; ఆ+అనుస్ఠానంబులోనన్= ఆ వైదిక కర్మాచరణంలో; కానివానిన్= పనికిరానివాటిని; మానన్= మానుకొనేటట్లు; చెప్పి; అనఘ!= పుణ్యాత్ముడా!; ఇట్లు= ఈ విధంగా; చేయుము+అని= చేసికొమ్మని; పుణ్య= పవిత్ర; కర్మ= వేదవిధుల; గతులు= పద్ధతులు; కరుణ పేర్మిన్=అధికమైన దయతో; ఉపదేశింపన్= బోధించగా.(తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** వెళ్ళి అతడు చేసే వేద కర్మానుష్ఠానం చూచి అందులో ఉన్న లోపాలు చెప్పి 'పుణ్యాత్ముడా! పుణ్యకర్మ ఇట్లా చేయాలి' అని దయతో బోధించాడు.

**విశేషం:** అనఘ! అన్న సంబోధన మునికి కలిగిన దయను చెప్పుతున్నది. దానికి కారణం అతడు చేసే పనుల మీద ఉన్న శ్రద్ధా భావం.

**క. ఆతఁడు దానికి నతిసం । ప్రీతాత్ముం డగుచు నడపి పిదపం గాలం**
**బై తెగి, యొకనృపునకు సం । జాతుం డయ్యెను సమస్త సద్గుణములతోన్. 279**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ శూద్రుడు; దానికిన్= ముని చెప్పిన దానికి; అతి= మిక్కిలి; సంప్రీత= సంతోషించిన; ఆత్ముండు+అగుచున్= ఆత్మకలవాడగుతూ; నడపి= చేసి; పిదపన్= తర్వాత; కాలంబు+ఐ= కాలం సమీపించి; తెగి= మరణించి; ఒకనృపునకున్= ఒకరాజుకు; సమస్త= అన్నీ; సత్= మంచి; గుణములతోన్= గుణాలతో; సంజాతుండు+అయ్యెను= పుట్టాడు.

**తాత్పర్యం:** అతడు దానికి సంతోషించి అదే విధంగా ఆయా కర్మలు చేసి చివరకు కాలం సమీపించగా మరణించి, ఒకరాజునకు అన్ని సద్గుణాలు కల కొడుకై జన్మించాడు.

**క. మునిపతియుం దఱితోడన, । తనువు విడిచి యరిగి, యతని తండ్రి యగుడు, వి**
**ప్రునకుం బుట్టెన్, వేదా । ద్యనుపమ విద్యలకు నెల్ల నావాసం బై. 280**

**ప్రతిపదార్థం:** మునిపతియున్= మునిశ్రేష్ఠుడు కూడా; తఱితోడన= కాలంతోపాటు; తనువు= శరీరం; విడిచి= వదలి; అరిగి= పోయి; అతని తండ్రి= అతడికి తండ్రి; అగుడున్= కాగా; విప్రునకున్= బ్రాహ్మణుడికి; వేద+ఆది= వేదం మొదలైన; విద్యలకున్= చదువులకు; ఎల్లన్= అన్నిటికీ; ఆవాసంబు+ఐ= నిలయమై; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** మునినాథుడు కూడా కాలాంతరంలో శరీరాన్ని విడిచి, ఆ రాజకుమారుని దగ్గర, ఒక బ్రాహ్మణుడికి కుమారుడై సకల వేదవిద్యలకు నిలయంగా జన్మించాడు.

**చ. పదపడి యక్కుమారకుఁడు పట్టముగట్టి, పురోహితత్వమున్**
**విదిత విభూతితో నొసఁగె విప్రుని పుత్త్రున; కవ్విభుండు న**
**వ్వొదవెడు మోముతో నతనినోరలు వాఱఁగ జూచు; నాతఁ డె**
**య్యది గత మొక్కొ నవ్వునకు నంచు మదిం దలపోయు భూవరా! 281**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; పదపడి= తర్వాత; ఆ+కుమారకుఁడు= ఆ రాజకుమారుడు; పట్టముకట్టి= రాజ్యానికి పట్టాభిషిక్తుడై; విప్రునిపుత్త్రునకున్= బ్రాహ్మణపుత్రుడికి; పురోహితత్వమున్= రాజపురోహితవృత్తిని; విదిత= లోకానికంతా తెలిసిన; విభూతితోన్= ఐశ్వర్యంతో; ఒసఁగెన్= ఇచ్చాడు; ఆ+విభుండు= ఆ రాజు; నవ్వు+ఒదవెడు= నవ్వు కలిగిన; మోముతోన్= ముఖంతో; అతనిన్= పురోహితుడిని; ఓరలువాఱగన్= కన్ను ఓరగా పెట్టి; చూచున్= చూచేవాడు; ఆతఁడు= ఆ పురోహితుడు; నవ్వునకున్= ఆ నవ్వుకు; ఏ+అది= ఏది; కతము= కారణం; ఒక్కొ= ఒకో; అంచున్= అంటూ; మదిన్= మనస్సులో; తలపోయున్= ఆలోచించేవాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! తర్వాత ఆ రాజకుమారుడు రాజై బ్రాహ్మణ కుమారుడిని పురోహితుడిగా చేసి కావలసిన సంపద నిచ్చాడు. ఆ రా జెప్పుడూ ఆ పురోహితుడిని ఓరకంట చూచి నవ్వేవాడు. అతడి కర్థం కాక ఆ నవ్వుకు కారణం ఏమిటా అని ఆలోచించేవాడు.

**వ. ఒక్కనాఁడవసరంబు గాంచి, యప్పురోహితుం డా భూవరునితో 'దేవా! నన్నుం గనినప్పుడు నవ్వుదు; నావలన నేమి కీడు గలద యెఱింగింపవే! యిదియ నాకు వరం' బని వేఁడిన, నజ్జనపతి దనకు జాతి స్మరత్వంబు గలుగుటం జేసి, పూర్వజన్మంబు దెలిపి యక్కాలంబునం దన యనుష్ఠానంబున నేమేని విహితంబు లుపదేశించుట దేటవడం బలికి, శూద్రవిషయోపదేశంబునం బరమగతి దప్పి యిప్పాట రాజసేవాత్మకంబైన పౌరోహిత్యంబు నడపుటకై నీకుం బుట్టవలసె; నేను బుట్టువెఱింగి పుట్టినవాఁడ నగుటం జేసి యెఱింగి నవ్వుదు; నవ్వునకుఁ గతంబింతియ కాని, నీ వొండుకల్మషంబు గల వాఁడవే? మహాధర్మపరుండవు గురుండ;**

**వాదుష్కర్మంబునకుం బ్రాయశ్చిత్తంబు సేసికొ' మ్మని యనేక గోవులం గనకరాశులను నొసంగిన, నా భూసురోత్తముండు పురాతన జననకృతం బగు సుకృతంబునం జిత్తంబు నిర్మలంబై యుండుకతంబున నారాజు సెప్పినంత వట్టునుం గలవోలెఁ దనకుఁ దోఁచినం దోషితుండై దానంబులం దీర్థస్నానంబుల మఱియు జపహోమాదిపుణ్య విధానంబులం బాపంబులు వాపికొని, యీ పుట్టువును నీఁగికొని, సంయమి సంతానజాతుండై యెప్పటి యాశ్రమంబునం దపం బాచరించి మహాపదంబు నొందెఁ గావున బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకుం దక్కఁ దక్కటివారికి నుపదేశించి బ్రాహ్మణుండు కల్మషభాజనంబగు బ్రాహ్మణాదులకుం బరీక్షాపూర్వకంబుగా నుపదేశింప వలయు నని చెప్పిన నప్పుడమిఱేఁడు, 'లక్ష్మియెట్టి జనంబులయందు వసియించు?' నని యడిగిన నాదేవవ్రతుం డతని కిట్లనియె. 282**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకరోజు; అవసరంబుకాంచి= సమయం చూచి; ఆ+పురోహితుండు= ఆ పురోహితుడు; ఆ భూవరునితోన్= ఆ రాజుతో; దేవా!= ప్రభూ!; నన్నున్= నన్ను; కనినప్పుడు= చూచినప్పుడెల్లా; నవ్వుదు= నవ్వుతావు కదా!; నావలనన్= నావలన; ఏమి కీడు= ఏమి లోపం; కలదు?= ఉన్నది? అది= దానిని; ఎఱింగింపవే?= తెలుపవా?; ఇది+అ= ఇదే; నాకున్ వరంబు=నాకు వరం; అని వేఁడినన్= అని ప్రార్థించగా; ఆ+జనపతి= ఆ రాజు; తనకున్= తనకు; జాతి స్మరత్వంబు= పూర్వజన్మ నెరుగుట; కలుగుటన్+చేసి= కలగటంవలన; పూర్వ జన్మంబు= తమ పూర్వజన్మం; తెలిపి= చెప్పి; ఆ+కాలంబునన్= ఆ జన్మలో; తన = తనయొక్క; అనుష్ఠానంబునన్= కర్మాచరణంలో; ఏమి+ఏని= ఏమైనా; విహితంబులు= చేయవలసినవి; ఉపదేశించుట= బోధించటం; తేటపడన్+పలికి= స్పష్టంగా చెప్పి; శూద్ర= శూద్రుడికి; విషయ+ఉపదేశంబునన్= వేద విషయాన్ని బోధించటంవలన; పరమగతి= ముక్తి; తప్పి= తొలగి; ఈ+పాటన్= ఈ విధంగా; రాజ= రాజుయొక్క; సేవా+ ఆత్మకంబు+ఐన= సేవారూపమైన; పౌరోహిత్యంబు= పురోహితత్వం; నడపుటకై= చేయటానికి; నీకున్+పుట్టవలసెన్= నీకు జన్మనెత్తవలసి వచ్చింది; నేను; పుట్టువు= జన్మ; ఎఱింగి= తెలిసి; పుట్టినవాఁడను; అగుటన్+చేసి= కావటంవలన; ఎఱింగి= తెలిసి; నవ్వుదున్= నవ్వుతాను; నవ్వునకున్= నా నవ్వుకు; కతంబు= కారణం; ఇంతియ= ఇంతే; కాని; నీవు; ఒండు= ఒక; కల్మషంబు= పాపం; కలవాఁడవే!= కలవాడివా!; మహా=గొప్ప; ధర్మపరుండవు= ధర్మాత్ముడవు; గురుండవు= గురువవు; ఆ దుష్కర్మంబునకున్= ఆ పాపకర్మకు; ప్రాయశ్చిత్తంబు= దోషంపోయే కర్మ; చేసికొమ్ము; అని; అనేక= చాలా; గోవులన్= ఆవులను; కనక= బంగారు; రాశులను= ప్రోగులను; ఒసంగినన్= ఇస్తే, ఇవ్వగా; ఆ భూసుర+ఉత్తముండు= ఆ ఉత్తముడైన బ్రాహ్మణుడు; పురాతన= పూర్వం; జనన= జన్మలో; కృతంబు+అగు= చేసిన; సుకృతంబునన్= పుణ్యంవలన; చిత్తంబు= మనస్సు; నిర్మలంబు+ఐ= స్వచ్ఛమై; ఉండుకతంబునన్= ఉన్నందువలన; ఆ రాజు; చెప్పినంతవట్టునున్= చెప్పినంతవరకు; కలపోలెన్= స్వప్నంవలె; తనకున్= తనకు; తోఁచినన్= తోచగా; తోషితుండు+ఐ= సంతోషించినవాడై; దానంబులన్= దానాల వలన; తీర్థ= పుణ్యనదుల, స్నానంబులన్= స్నానాలవలన; మఱియున్= ఇంకా; జపహోమ= జపం, అగ్నిహోత్రం; ఆది= మొదలైన; పుణ్యవిధానంబులన్= పుణ్యకార్యాలవలన; పాపంబులు= పాపాలను; పాపికొని= పోగొట్టుకొని; ఈ పుట్టువును= ఈ జన్మను; ఈఁగికొని= పోగొట్టుకొని; సంయమి= మునుల; సంతానజాతుండు+ఐ= సంతానంగా పుట్టి; ఎప్పటి= మునుపటి; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; తపంబు= తపస్సును; ఆచరించి= చేసి; మహాపదంబున్= గొప్ప స్థానాన్ని; ఒందెన్= పొందాడు; కావునన్= కాబట్టి; బ్రాహ్మణుండు= విప్రుడు; బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియలకున్+తక్కన్= ఈ మూడు కులాలవారికి దప్ప; తక్కటివారికిన్= మిగిలిన వారికి; ఉపదేశించి= బోధించి; కల్మష= దోషానికి, పాపానికి; భాజనంబు+అగున్= స్థానమవుతాడు; బ్రాహ్మణ+ఆదులకున్= బ్రాహ్మణుడు మొదలైనవారికి; పరీక్షాపూర్వకంబుగాన్= పరీక్షించి; ఉపదేశింపవలయున్= బోధించాలి; అని చెప్పినన్= అని చెప్పగా; ఆ+పుడమిఱేఁడు= ఆ భూమికిరాజు; లక్ష్మి= లక్ష్మీదేవి; ఎట్టి= ఎట్లాంటి; జనంబుల అందున్= జనాలలో; వసియించున్?= నివసిస్తుంది?; అని అడిగినన్= అని ప్రశ్నించగా; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఒకనాడు సమయం చూచి ఆ పురోహితుడు ఆ రాజుతో 'ప్రభూ! నన్ను చూచినప్పుడల్లా మీరు నవ్వుతారు. నావలన ఏదయినా దోషం ఉన్నదా? ఉంటే చెప్పండి. ఇదే నాకు వరం' అని అడిగాడు. దానికి రాజు తనకు పూర్వజన్మ స్మృతి ఉండటంచేత పూర్వజన్మ తెలిపి ఆ సమయంలో తన అనుష్ఠానంలో ఏమయినా విధులను బోధిస్తానని స్పష్టం చేసి, శూద్ర విషయోపదేశం వలన పరమగతిని తప్పి, ఈ విధంగా రాజసేవాత్మకమైన పౌరోహిత్యాన్ని నడపటానికి నీకు పుట్టవలసి వచ్చింది. నేను పూర్వజన్మస్మృతి కలవాడనవటం చేత నవ్వాను. ఇంతేకాని నీవు ఒక్క కల్మషం కూడా లేనివాడవు. ధర్మపరుడవు. గురుడవు. ఆ పాపానికి ప్రాయశ్చిత్తం చేసికొమ్ము' అని పెక్కు గోవులనూ, కనకరాసులనూ ఇవ్వగా ఆ బ్రాహ్మణోత్తముడు పూర్వజన్మ పుణ్యం వలన మనస్సు నిర్మలమై ఉండటంచేత ఆ రాజు చెప్పినదంతా కలవలె తనకు తోచగా సంతుష్టుడై దానాలవలనా తీర్థస్నానాలవలనా జపహోమానుష్ఠానాలవలనా పాపాలు పోగొట్టుకొని ఆ పుట్టుకను విడిచి మునికి పుట్టి ఎప్పటి ఆశ్రమంలో తపస్సు చేసి మహాపదం పొందాడు. కాబట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు తప్ప తక్కినవారికి ఉపదేశం చేస్తే బ్రాహ్మణుడు పాపాత్ము డవుతాడు. బ్రాహ్మణాదులను కూడా పరీక్షించి మరీ ఉపదేశించాలి' అని చెప్పగా ఆ రాజు 'లక్ష్మి ఎటువంటి జనులలో ఉంటుంది?' అని అడుగగా భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

## లక్ష్మీనివాసస్థానములు (సం. 13-11-1)

**క. నారాయణాంకతలమున । శ్రీ రాజిల్లంగఁ జూచి, చిత్తం బతి వి**
**స్మేరం బై రుక్మిణి వి । స్తారరుచిరనయన యగుచు, సంభావనతోన్. 283**

**ప్రతిపదార్థం:** రుక్మిణి= రుక్మిణీదేవి, శ్రీకృష్ణుడి భార్య; శ్రీ= లక్ష్మీదేవి; నారాయణ= (నార+అయన) నీరునివాసంగా గల్గిన విష్ణుమూర్తి యొక్క అంకతలమునన్= ఒడిలో; రాజిల్లంగన్= ఒప్పారగా (అందంగా ఉండగా); చూచి= రుక్మిణి చూచి; చిత్తంబు= మనస్సు; అతి= మిక్కిలి; విస్మేరంబు+ఐ= ఆశ్చర్యచకితమై; విస్తార= విశాలమైన; రుచిర= అందమైన; నయన= కనులు కలది; అగుచున్= ఔతూ; సంభావనతోన్= గౌరవంతో.

**తాత్పర్యం:** శ్రీ నారాయణుడి ఒడిలో అందంగా కూర్చుని ఉన్న లక్ష్మిని చూచి మనస్సు ఆశ్చర్యమును పొందగా రుక్మిణీదేవి విప్పారిన అందమైన కళ్ళతో చూస్తూ లక్ష్మీదేవితో భక్తితో ఇట్లా అన్నది.

**వ. 'నీ వెట్టి పురుషులయందు, నెబ్భంగి భామలపాల వసియింతు?' వనిన నా దేవి మకరధ్వజమాతకుం జెప్పిన వాక్యంబుల యర్థంబు లుపన్యసించెద; దాన నీ యడిగినయది తేటపడు; నాకర్ణింపుము. 284**

**ప్రతిపదార్థం:** నీవు= లక్ష్మీ! నీవు; ఎట్టి= ఎట్లాంటి; పురుషులయందున్= మగవారిలో; ఏ భంగి= ఎట్లాంటి; భామలపాలన్= స్త్రీలలో; వసియింతువు= నివసిస్తావు; అనినన్= అనగా; ఆ దేవి= ఆ లక్ష్మి; మకరధ్వజ= మన్మథుడి; (జెండాపై మొసలి గుర్తుగా గలవాడు); మాతకున్=తల్లికి, రుక్మిణికి; చెప్పిన వాక్యంబుల= చెప్పినమాటల, అర్థంబులు= భావాలు; ఉపన్యసించెదన్= వివరిస్తాను; దానన్= దానితో; నీ అడిగిన అది= నీవడిగింది; తేట+పడున్= స్పష్టపడుతుంది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** 'నీవెట్లాంటి మగవారిలో, ఎట్లాంటి స్త్రీలలో ఉంటావు?' అని అడిగిన రుక్మిణికి ఆ లక్ష్మి చెప్పినమాటల తాత్పర్యం నీకు వివరిస్తాను. దానితో నీ వడిగినది స్పష్టపడగలదు వినుము.

**సీ. 'నిత్యసత్యులు, శౌచనిరతులు, గురుభక్తు, । ల ప్రమత్తులు, దక్షు లమలమతులు,**
**సత్కర్మపరులు, విజ్ఞానముఁ దపము దా । నము బ్రహ్మచర్యంబు శమముఁ గల్గు**
**వారలు, ప్రీతి నా వసియించు నిక్కలు । క్రూరు, నాస్తికుఁ, గృతఘ్నునిఁ, గుబుద్ధి**
**వర్జింతు; నెంగిలి వర్జించి, యిలువాడి । ఘటశుద్ధి గలిగిన కాంతలందు**

**తే. నిల్తు ; వల్లభ ప్రతికూల, నిష్ఠురాత్మ । నన్యమందిరగామిని, నధికనిద్ర**
**యైన మానినిఁ దొఱఁగుదు ; నబ్జినీ త । టాక తరుషండ పుష్ప వాటముల నిలుతు'. 285**

**ప్రతిపదార్థం:** నిత్య= ఎల్లవేళలా; సత్యులు= సత్యం చెప్పేవారు; శౌచ నిరతులు= శుచిత్వం నిత్యమూ పాటించేవారు; గురుభక్తులు= చదువు చెప్పినవారికి భక్తులైనవారూ; అప్రమత్తులు= మదించనివారు; దక్షులు= నేర్పరులు; అమల= స్వచ్ఛమైన; మతులు= మనస్సు కలవారు; సత్= మంచి; కర్మపరులు= కర్మలు చేసేవారు; విజ్ఞానమున్= విశిష్టమైన జ్ఞానం; తపము= తపస్సు; దానము= దానం (జలధారా పూర్వకంగా ఇచ్చేది); బ్రహ్మచర్యంబున్= బ్రహ్మచర్యం; శమము= అంతరింద్రియ నిగ్రహం; కల్గువారలు- కలవారు; ప్రీతిన్= ప్రేమతో; నా వసియించు= నే నుండే; ఇక్కలు= చోట్లు; క్రూరున్= కఠినమనస్కుడిని; న+అస్తికున్= (నాస్తికున్) తన యథార్థస్వరూపం తెలియనివాడిని, వేదాలను నిందించేవాడిని; కృతఘ్నునిన్= చేసిన మేలు మరచినవాడిని; కుబుద్ధిన్= చెడుబుద్ధిగలవాడిని, దుర్మార్గుడిని; వర్జింతున్= విడిచిపెడతాను; ఎంగిలి వర్జించి= ఎంగిలిని వదలి, మరొకడు తినగా మిగిలిన దానిని వదలిపెట్టి; ఇలు+పాడి= ఇలుపాడి= గృహనీతి కలిగి; ఘటశుద్ధిన్= పాత్రల శుభ్రత; కలిగిన= ఉన్న; కాంతల+అందున్= స్త్రీలలో; నిల్తున్= ఉంటాను; వల్లభ ప్రతికూలన్= మగడికి ప్రతికూల అయిన దానిని; నిష్ఠుర+ఆత్మన్= కఠినమైన మనస్సు కలదానిని; అన్య= ఇతర; మందిర= ఇళ్ళకు; గామినిన్= పోయే దానిని; అధిక= ఎక్కువ; నిద్రఐన= నిద్రపోయే; మానినిన్= స్త్రీని; తొఱఁగుదున్= వదలిపెట్టుతాను; అబ్జినీ= తామరతీగలు; తటాక= చెరువులు; తరుషండ= చెట్ల సమూహం; పుష్ప వాటములన్= పూల తోటలలో; నిలుతున్= ఉంటాను.

**తాత్పర్యం:** లక్ష్మి ఉండేచోట్లు, ఉండనిచోట్లు ఈ పద్యంలో చెప్పబడ్డవి. లక్ష్మి అంటే ధనమే కాదు. శుచీ, శుభ్రత, సరళత, అందం - ఇట్లాంటివన్నీ. 'నిత్యమూ సత్యం చెప్పేవారు, శుచికలవారు, గురుభక్తులు, మత్తులు కానివారు, కార్యసాధకులు, స్వచ్ఛమైన మనస్సు కలవారు, మంచి కర్మలు చేసేవారు, విజ్ఞానం, తపస్సు, దానం, బ్రహ్మచర్యం, ఇంద్రియ నిగ్రహం కలవారు - నేను నివసించేచోట్లు. నే నుండని స్థలాలు - క్రూరులు, నాస్తికులు, కృతఘ్నులు, చెడ్డబుద్ధి కలవారు (లోకంలో వీరిదగ్గర డబ్బుండటం చూస్తున్నాం. కాని లక్ష్మి అంటే డబ్బు కాదు. తృప్తి, ఆనందం, నిండుదనం, సంతోషం). ఎంగిలి కాని పాత్రశుద్ధి కలిగిన గృహనీతి కల స్త్రీల దగ్గర ఉంటాను. భర్తను ఎదిరించే స్త్రీ, కఠినమైన మనస్సుకలదీ, కొంపలవెంట తిరిగేదీ, ఎక్కువ నిద్రపోయేదీ - ఈ స్త్రీలు నాకు నచ్చరు. ఇట్లాంటివారిలో నేనుండను. తామరపూలతో నిండిన సరస్సులు, చెట్లు, పూలు కల తోటలలో ఉంటాను. (కనుక అందమున్న చోట్లు లక్ష్మికి నివాసాలు)

**విశేషం:** మనుషులలో పవిత్రత, ధర్మం, జ్ఞానం, సత్కర్మలుండాలి. లక్ష్మి అంటే ఇదే. కేవలం ధనం కాదు. దుర్మార్గులు, నాస్తికులు, సంఘవిద్రోహులు. వారికి డబ్బున్నా లక్ష్మి లేనివారే. స్త్రీలు గృహనీతి తప్పి చరిస్తే వారూ ద్రోహబుద్ధులే కనుక లక్ష్మి ఉండదు. ఇదంతా సాంఘికదృష్టి, వ్యక్తి ధర్మం వీటిని గురించి చెప్పినదే.

**వ. అని చెప్పెఁ దత్ప్రకారంబులు బుద్ధిగతంబులు సేసికొమ్మనినం, గురుపతి 'పురుషుల పురంధ్రులసంగతి యందు సంస్పర్శ సుఖంబు నతిశయం బెవ్వరికిం గలుగు?' నని యడిగిన వియత్తటినీ తనూజుం 'డివ్విషయంబున కొక్క యితిహాసంబు గలదు; విను' మని యిట్లనియె. 286**

**ప్రతిపదార్థం:** అని చెప్పెన్= అట్లా చెప్పాడు; తత్= ఆయా; ప్రకారంబులు= పద్ధతులు; బుద్ధిగతంబులు= మనస్సులో నాటుకొనేటట్లు; చేసి కొమ్మనినన్= చేసికొమ్మనగా; కురుపతి= ధర్మరాజు (కౌరవవంశ శ్రేష్ఠుడు); పురుషుల= మగవారియొక్క; పురంధ్రుల= స్త్రీలయొక్క; సంగతి+అందున్= కూడిక లోపల; సం స్పర్శ= మంచి స్పర్శకు సంబంధించిన; సుఖంబు+ అతిశయంబు= ఎక్కువ సౌఖ్యము; ఎవ్వరికిన్= ఎవరికి; కలుగున్?= ఉంటుంది?; అని అడిగినన్= అని ధర్మరాజు అడుగగా; వియత్= ఆకాశ; తటినీ= నది; తనూజుండు= కొడుకు (భీష్ముడు); ఈ విషయంబునకున్= ఈ సంగతికి; ఒక్క= ఒక; ఇతిహాసంబు= పూర్వగాథ; కలదు= ఉన్నది; వినుము; అని; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** లక్ష్మీనివాస స్థానాలు చెప్పి ఆయా విషయాలు మనస్సులో నిలుపుకోవయ్యా!' అని చెప్పగా, ధర్మరాజు మరల ప్రశ్నించాడు. 'స్త్రీపురుషుల రతిలో ఎవరి కెక్కువ సుఖ ముంటుంది?' అని. దానికి గంగకొడుకు ఇట్లా అన్నాడు. 'ఒక కథ ఉన్నది చెప్పుతాను. దానివలన నీకు విషయం తెలుస్తుంది. వినుము అని కథ చెపుతున్నాడు.

## భంగాస్వనుం డను రాజు స్త్రీయై కుమారులం గాంచిన ప్రకారము (సం.13-12-1)

**సీ. 'అనఘ! భంగాస్వనుం డనురాజు పుత్రార్థి । యై వజ్రి కప్రియం బగుమఖంబు**
**సేసి, పుత్రుల సవిశేషుల నూర్వురఁ । గని, సంతసంబునఁ గ్రాలుచుండు;**
**నాతఁడు వేటకై యరిగినచో వజ్రి । దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు**
**సనునట్లు సేయ నజ్జనపతి యెక్కిన । తురగంబుతో నొంటి దూరమైన**

**ఆ. కాన కేఁగి, తృష్ణ గదిరిన, నలుగడ । నరసి, యొక్క పద్మసరసి గాంచి**
**వెన్ను మునుఁగ హయము నన్నీరఁ దిగిచి, తాఁ । దనివు సొంపు మిగుల మునిఁగి లేచి. 287**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; భంగాస్వనుండు; అను రాజు= ఆ పేరుగల రాజు; పుత్ర+అర్థిఐ= కొడుకులను కోరి; వజ్రికిన్= ఇంద్రుడికి; అప్రియంబు= ఇష్టంలేని; మఖంబు= యజ్ఞం; చేసి= నిర్వహించి; సవిశేషులన్= విశేషగుణ వంతులైన; పుత్రులన్= కొడుకులను; నూర్వురన్+కని= వందమందిని కని; సంతసంబునన్+క్రాలుచున్+ఉండున్= సంతోషంతో ఉండేవాడు; ఆతఁడు= ఆ రాజు; వేఁటకై= వేటకొరకు; అరిగినచోన్= వెళ్ళినపుడు; వజ్రి= ఇంద్రుడు; దిక్+భ్రాంతి= దిశలు తెలియని అజ్ఞానం; పుట్టించి= కల్గించి; తేరకాఁడు= పిచ్చివాడు; చనునట్లు= వెళ్ళేవిధంగా; చేయన్= చేస్తే; ఆ+జనపతి= ఆ రాజు; ఎక్కిన= కూర్చున్న; తురగంబుతోన్= గుర్రంతో; ఒంటి= ఒంటరిగా; దూరమైన= దూరంగా ఉన్న; కానకున్= అడవికి; ఏఁగి= వెళ్ళి; తృష్ణ= దప్పిక; కదిరినన్= కలుగగా; నలుగడన్= నాలుగు దెసలు; అరసి= చూచి; ఒక్క పద్మసరసిన్= ఒక తామరలున్న చెరువును, కాంచి= చూచి; హయము= గుర్రం; వెన్ను= వీపు; మునుఁగన్= మునిగేటట్లు; ఆ+నీరన్= ఆ నీటిలో; తిగిచి= లాగి; తాన్= తానూ; తనివు= తృప్తి; సొంపు= హాయి; మిగులన్= ఎక్కువ కాగా; మునిఁగి= నీట స్నానం చేస్తూ మునిగి; తేలి= పైకి వచ్చి.

**తాత్పర్యం:** ఒక రాజుండేవాడు. అతడి పేరు భంగాస్వనుడు. సంతానంకొరకు తపించి యజ్ఞం చేసి నూర్గురు కొడుకులను కన్నాడు. కాని, ఆ యజ్ఞం ఇంద్రుడికి ఇష్టంలేనిది కావటం వలన రాజు వేటకు వెళ్ళినపుడు ఇంద్రుడు అతడికి ఏ దిక్కు ఎటో తెలియని మాయ కల్గించాడు. ఆ రాజు పిచ్చిగా ఎటో దూరాన అడవులలోకి పోయి అక్కడ దప్పిక కలుగగా ఒక తామరల చెరువు చూచి, గుర్రాన్ని వీపుమునిగే టట్లు నీటిలోనికి లాగుతూ, తానూ మునిగి లేచాడు.

**క. భూనాథుఁడు తృష్ణ సెడం । బానక్రియ యాచరించి, భామినియై తన్**
**దాన కనుంగొని, విస్మయ । మూనెడుమదితోడ సరసి నొయ్యన వెడలెన్. 288**

**ప్రతిపదార్థం:** భూ= భూమికి; నాథుఁడు= పతి - భంగాస్వనుడు; తృష్ణ= దప్పిక; చెడన్= పోగా; పానక్రియ= త్రాగటం; ఆచరించి= చేసి; భామిని+ఐ= స్త్రీ అయి; తన్+తాన= తనను తానే; కనుంగొని= చూచి; విస్మయము= ఆశ్చర్యం; ఊనెడు= కలిగే; మదితోడన్= మనస్సుతో; ఒయ్యనన్= నెమ్మదిగా; సరసిన్= చెరువులోనుండి; వెడలెన్= బయటకు వచ్చాడు;

**తాత్పర్యం:** ఆ చెరువులో మంచినీళ్ళు త్రాగేసరికి రాజు స్త్రీగా మారిపోయాడు. తనను తానే చూచికొని ఆశ్చర్యం పొంది బరువైన మనస్సుతో ఒడ్డుకు చేరాడు.

**విశేషం:** భారతంలో శిఖండి కథలోవలె - ఇక్కడా లింగ పరిణామం చెందిన విషయం చెప్పబడింది. ఇది సాధ్యమేనని ఇవ్వాళ మనం పత్రికలలో చదవటమే కాక శాస్త్రీయంగా ఇది సత్యమేననీ తెలిసికొంటున్నాం. ప్రతి స్త్రీ పురుషులలో తల్లి అంశ సగం, తండ్రి అంశ సగం ఉంటుంది కనుక. ఇది సత్యమే. శాస్త్రీయమే.

**సీ. వెడలి, చింతించి, యీ యొడలితో నే భంగిఁ । దురగంబు నెక్కుదుఁ? బురజనంబు**
**లేను బోయినఁ జూచి యే మని తలఁతురో? । పొలఁతు లేమను వారొ? పుత్త్రు లేమి**
**గాఁగ నూహింతురో ? కానన యుండంగ । వచ్చునే? పోవంగ వలయు నెట్లు?**
**నని విచారించి, పోయిన నెల్లవారును । నాశ్చర్య మందుచు నంత నంతఁ**

**ఆ. గనుఁగొనంగ, మంత్రిగణము రావించి దిగ్ । భ్రాంతిఁ దాను బోయి పద్మసరసి**
**యందు మునిఁగి వనిత యగుట యెఱింగించి । రాజ్యమునఁ దనూజరాజి నిలిపి. 289**

**ప్రతిపదార్థం:** వెడలి = బైటకు వచ్చి; చింతించి= ఆలోచించి; ఈ ఒడలితోన్= ఈ శరీరంతో; ఏ+భంగిన్= ఏ విధంగా; తురంగంబున్= గుర్రాన్ని; ఎక్కుదున్.= ఎక్కేది?; ఏను+పోయినన్= నేను ఇట్లా వెళ్ళితే; పురజనంబులు= నగరంలోని ప్రజలు; చూచి= స్త్రీనైన నన్ను చూచి; ఏమి+అని తలఁతురో?= ఏమనుకుంటారో?; పొలఁతులు= భార్యలు; ఏమి+అనువారొ?= ఏమంటారో?; పుత్రులు=కొడుకులు; ఏమి కాఁగన్= ఎట్లా; ఊహింతురో?= ఊహిస్తారో; కానన్+అ= (అట్లా నగరానికి పోకుండా) అడవిలోనే; ఉండంగన్ వచ్చును+ఏ= ఉండవచ్చునా? ఎట్లు= ఏ విధంగానైనా; పోవంగన్ వలయున్= వెళ్లి తీరాలి; అని= ఈ విధంగా; విచారించి= తర్కించి, పోయినన్=పోగా; ఆశ్చర్యము= అబ్బురపాటు; అందుచున్= పొందుతూ; ఎల్లవారున్= అందరూ; అంతన్+అంతన్= అక్కడ కూడా బెరుకు బెరుకుగా; కనుఁగొనంగన్= తన్ను చూడగా; మంత్రిగణమున్= మంత్రిమండలిని; రావించి = పిలిపించి; దిగ్భ్రాంతిన్= దిశాజ్ఞానం లేకుండా; తాను పోయి= తాను వెళ్ళి; పద్మసరసియందున్= తామరల చెరువులో; మునిఁగి= స్నానమాడి; వనిత= స్త్రీ; అగుటన్= కావటం; ఎఱింగించి= తెలిపి; రాజ్యమునన్= సింహాసనంమీద; తనూజ= కొడుకుల; రాజిన్= సమూహాన్ని (వందమంది కనుక సమూహం); నిలిపి= నియమించి.

**తాత్పర్యం:** ఒడ్డుకు వచ్చి ఆలోచించటం ప్రారంభించాడు. ఈ శరీరంతో గుర్రాన్ని ఎట్లా ఎక్కేది ? ఇట్లా పోతే నగరంలో ప్రజలేమనుకుంటారో? నా భార్య లేమంటారో? కొడుకు లేవిధంగా ఆలోచిస్తారో? అని భావించి అడవిలో ఎట్లా ఉండటం?; ఏ విధంగా నైనా సరే నగరానికి పోక తప్పదు అని నిశ్చయించుకొని వెళ్ళి, మంత్రులందరినీ పిలిచి, తాను దిగ్భ్రాంతినిపొందటం, చెరువులో మునగటం, స్త్రీ కావటం, అంతా చెప్పి కొడుకులకు రాజ్యమప్పగించి (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** పద్యమంతా గజిబిజి ఆలోచనలు. అనిశ్చిత స్థితి. ఆ స్థితిలో ఉన్నవాడి మానసిక పరిస్థితి ఎట్లా ఉంటుంది? పద్యం పద్యమంతా ఆ విధంగా వ్రాయటం వలన నడకపోయింది. పద్యం వచన వాక్యాలుగా విరిగిపోతున్నవి. ఆరువిధాల వాక్యాలుగా పాదాలు మలచటం శిల్పం.

**ఉ. కానకు నేఁగి తాపసులఁ గాంచి, తపం బొనరింప, నం దొకం**
**డా నలినాక్షిఁ బొంది ప్రియుఁడై నడచెం, గ్రమవృత్తి నందనుల్**
**దానికిఁ బుట్టి రిద్ధబలదర్పులు నూర్వురు; వారిఁ గొంచు న**
**మ్మానిని పూర్వ పుత్రక సమాజము పాలికిఁ బోయి, నెమ్మితోన్. 290**

**ప్రతిపదార్థం:** కానకున్= అడవికి; ఏఁగి= పోయి; తాపసులన్= తపస్వులను; కాంచి= దర్శించి; తపంబు= తపస్సును; ఒనరింపన్= చేయగా; అందున్= ఆ తాపసులలో; ఒకండు= ఒకడు (పేరు చెప్పకుండా ఎవడో ఒకడు అనటం); ఆ నలిన+అక్షిన్= ఆ స్త్రీని; (పద్మాలసరసిలో మునగటంవలన స్త్రీరూపం వచ్చింది కనుక తామరలవంటి నేత్రాలు కలవని అన్నాడు); పొంది= కలిసి; ప్రియుఁడై= ప్రేమకలవాడై; నడచెన్= ప్రవర్తించాడు; క్రమవృత్తిన్= క్రమపర్యాయంగా; దానికిన్= ఆ స్త్రీకి; నందనుల్= కొడుకులు; ఇద్ధ= శుద్ధమైన; బల= బలంతో; దర్పులు= గర్వించినవారు; నూర్వురు= వందమంది; పుట్టిరి= పుట్టారు; వారినిన్+కొంచున్= వారిని తీసికొని; ఆ+మానిని= ఆ స్త్రీ; పూర్వపుత్రక సమాజము= ముందు పుట్టిన కొడుకుల సమూహం; పాలికిన్= దగ్గరకు; పోయి= వెళ్ళి; నెమ్మితోన్= సంతోషంతో.

**తాత్పర్యం:** అడవికి పోయి అక్కడ మునుల దగ్గర తపస్సు చేస్తుండగా ఆమెను ఒకడు ప్రేమించాడు. తత్ఫలితంగా ఆమెకు గొప్ప బలవంతులు వందమంది కొడుకులుపుట్టారు. తాను రాజుగా ఉన్నప్పుడు పుట్టిన కొడుకుల దగ్గరకు వారిని తీసికొనిపోయి సంతోషంతో. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. తనకు నొక్క తాపసుండు ప్రియుం డగుటయు, వానివలన నత్తనయశతంబు జనియించుటయు నెఱింగించి. 291**

**ప్రతిపదార్థం:** తనకున్; ఒక్క తాపసుండు= ఒక తపస్వి; ప్రియుండు= భర్త; అగుటయున్= కావటం వలనను; వానివలనన్= ఆ తాపసుడి ద్వారా; ఆ+తనయ శతంబు= ఆ నూర్గురు కొడుకులు; జనియించుటయున్= పుట్టటం; ఎఱింగించి= తెలిపి.

**తాత్పర్యం:** తనకు ఒక తపస్వి ప్రియుడైనాడనీ, అతడివలన ఆ నూరుగురు కొడుకులు కలిగారనీ చెప్పి.

**క. 'మగతనమునాఁడు మీరున్ । మగువతనము నపుడు వీరు నాయం దుదయం**
**బగుటను దోడంబుట్టువు । లగుదురు; ధర వంచి కుడువుఁ డందఱు' ననుడున్. 292**

**ప్రతిపదార్థం:** మీరున్= మీరు; మగతనమునాఁడు= నేను మగవాడుగా ఉన్నపుడు; వీరు; మగువతనమునపుడు= నేను ఆడదానిగా ఉన్నప్పుడు; నాయందున్= నాకు; ఉదయంబు+అగుటను= పుట్టటంవలన; తోడంబుట్టువులు= అన్నదమ్ములు; అగుదురు= (వీరుమీరు) అవుతారు; ధరన్= రాజ్యాన్ని; పంచి= పంచుకొని, అందఱున్= అంతా; కుడువుఁడు= అనుభవించండి; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** నేను మగవాడుగా ఉన్న రోజుల్లో మీరు పుట్టారు. స్త్రీగా ఉన్నపుడు వీరు జన్మించారు. కనుక మీరంతా తోబుట్టువులు. అందుచేత ఈ రాజ్యాన్ని అందరూ సమానంగా పంచుకొని అనుభవించండి, అనగా.

**క. భ్రాతృస్నేహము గల్గి, య । రాతులు భయమందఁగా ధరారాజ్యము సం**
**ప్రీతి ననుభవించిరి జను । లాతతహర్షమునఁ బొంద నందఱు నెమ్మిన్. 293**

**ప్రతిపదార్థం:** భ్రాతృస్నేహము= అన్నదమ్ముల అనురాగం; కల్గి= పొంది; అరాతులు= శత్రువులు; భయము+అందఁగాన్= భయపడగా; జనులు= ప్రజలు; ఆతత= విస్తారంగా; హర్షమునన్; పొందన్= సంతోషించగా; అందఱున్= అంతా; నెమ్మిన్= సంతోషంతో; ధరారాజ్యము= భూసామ్రాజ్యము; ప్రీతిన్= ప్రేమతో; అనుభవించిరి= అనుభవించారు.

**తాత్పర్యం:** అంతా అన్నదమ్ములై కలిసి మెలిసి రాజ్యాన్ని పంచుకొని శత్రువులు భయపడేటట్లుగా, ప్రజలు సంతోషమును పొందగా, హాయిగా పాలించారు.

**తే. దానిఁ గని, పాకశాసనుఁ 'డేను వీని । కహితముగఁ జేయ నిది హితమై ఘటించె**
**నధిక పుత్త్రసమృద్ధి రాజ్యాభివృద్ధి; నిమ్మహీపతి సమ్మదం బినుమడించె. 294**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ విషయం లేదా ఆమెను; కని= చూచి; పాకశాసనుఁడు= పాకుడను రాక్షసుడిని చంపినవాడు - ఇంద్రుడు; ఏను= నేను; వీనికిన్= వీడికి; అహితముగన్= అశుభమని; చేయన్= చేస్తే; హితము+ఐ= శుభమై; ఘటించెన్= ఒనరింది; అధిక= ఎక్కువ; పుత్త్ర= కుమారుల; సమృద్ధి= సంపదయు; రాజ్య+అభివృద్ధి= రాజ్యం పెంపుదల కారణంగా; ఈ+మహీపతి= ఈ రాజుయొక్క; సమ్మదంబు= సంతోషం; ఇనుమడించెన్= రెట్టింపైనది.

**తాత్పర్యం:** జరిగిన విషయమంతా చూచి ఇంద్రు డనుకొన్నాడు. 'వీడికి అశుభం చేద్దామనుకొంటే అదంతా వీడికి మేలైనదే. రాజ్యంతోపాటుగా సంతానాభివృద్ధీ అయినది కనుక వీడికి సంతోషం రెండింతలైనది' అని.

**వ. దీని విఘటింపం జేయుదు' నని భూసురాకారుండై వచ్చి పూర్వులం గాంచి. 295**

**ప్రతిపదార్థం:** దీనిన్= ఈ సమృద్ధిని; విఘటింపన్+చేయుదును= నాశనం చేస్తాను; అని; భూసుర+ఆకారుండు+ఐ= బ్రాహ్మణ రూపంలో; వచ్చి; పూర్వులన్= మొదటి సంతానాన్ని; కాంచి= చూచి.

**తాత్పర్యం:** ఈ సమృద్ధిని నాశనం చేస్తాను' - అని బ్రాహ్మణరూపంలో వచ్చి, మొదటి సంతానాన్ని చూచి.

**క. ఆ రాజకుమారుల మతి । నీరసము జనించునట్టు ।'లెక్కడి జనకుం?**
**డేరికినేనియుఁ బుట్టిన । వారిం దోబుట్టువులుగ వల్వం జనునే?' 296**

**ప్రతిపదార్థం:** ఆ రాజకుమారుల= మొదటి సంతానమైన ఆ రాజుకొడుకుల యొక్క; మతిన్= మనస్సులో; ఈరసము= అసూయ; జనించునట్టులు= పుట్టేటట్లుగా; ఎక్కడి జనకుండు= ఎక్కడ తండ్రి?; ఏరికిన్+ఏనియున్= ఎవడికో (తండ్రి ముని కనుక తర్వాతి వారికి); పుట్టిన= జన్మించిన; వారిన్= వారలను; తోఁబుట్టువులుగన్= తమ్ములుగా; వల్వన్= ప్రేమించ; చనునే?= చెల్లుతుందా? (కుదరదు).

**తాత్పర్యం:** ఆ రాజు మొదటి సంతానం మనస్సులో అసూయ పుట్టేట్లుగా అన్నాడు. 'ఈ పిల్లలకు తండ్రి ఎవడో? ఆ సంతానం మీకు తోబుట్టువు లనుకొనటం వెర్రికాదా?' అని.

**వ. అని మఱియు, ననేక ప్రకారంబులం జెప్పి, వార లెఱుంగకుండ నపరకుమారకుల కడకు నేఁగి యితకరి మాటలమొత్తంబుల వారలచిత్తంబులను గలంచె. 297**

**ప్రతిపదార్థం:** అని; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= అనేక రకాలుగా; చెప్పి= పూసగ్రుచ్చినట్లు చెప్పి; వారలు= మొదటి సంతానం; ఎఱుంగకుండన్= తెలియకుండా; అపర= రెండో; కుమారకుల= కొడుకుల; కడకున్= దగ్గరకు; ఏఁగి= పోయి; ఇతకరి= హితం కలిగించే, మాటల= వాక్కులయొక్క; మొత్తంబులన్= సమూహంతో; వారల= రెండో సంతానంయొక్క; చిత్తంబులను= మనస్సులను; కలంచెన్= కలతపెట్టాడు.

**తాత్పర్యం:** ఇంకా చెప్పవలసిన రీతులలో అనేకం చెప్పి, వారికి తెలియకుండా రెండో సంతానం దగ్గరకుపోయి చుట్టంవలె మెత్తనిమాటలతో వారి మనస్సులనూ కలతపరచాడు.

**విశేషం:** అనేక ప్రకారంబులన్-సామాన్యంగా వచనంలో తిక్కన గారిట్లా వ్రాస్తే, మూలంలో అనేక శ్లోకా లుంటా యని అర్థం. వాటిని పండితులు చూచుకొనవచ్చునన్న సూచనమేరకు ఇట్లా వ్రాయటం ఆ మహానుభావుడి అనువాద పద్ధతులలో ఒకటి.

**క. అనిమిషవరుఁ డివ్విధమున; । జనియింపఁగఁ జేసెఁ బగ; యసంగతు లై వా**
**రును దెగి, యొండొరువులతో । ననిఁ బెట్టుగఁ జేసి చచ్చి రందఱు నధిపా! 298**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! ధర్మరాజా!; ఈ+విధమునన్= ఈ విధంగా; అనిమిషవరుఁడు= దేవతలరాజు (అనిమిష:= నిమిషం - అంటే కనురెప్పపాటు లేనివారు దేవతలు); పగ= వైరాన్ని; జనియింపఁగన్= పుట్టేటట్లు; చేసెన్= చేశాడు; వారునున్= ఆ రాజకుమారులంతా; తెగి= (కోపంతో) ఏపురేగి; అసంగతులు+ఐ= స్నేహం పోగొట్టుకొని; అనిన్= యుద్ధం; ఒండొరువులతోన్= పరస్పరం; బెట్టుగన్= తీవ్రంగా చేసి; అందఱున్= అంతా; చచ్చిరి= చనిపోయారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఇంద్రుడు పెట్టిన కుంపటితో రాజకుమారులు తమ మధ్య స్నేహాన్ని పోగొట్టుకొని శత్రువులైనారు. యుద్ధం తీవ్రంగా చేసికొని, చచ్చారు.

**విశేషం:** లోకంలో బెట్టు అనే మాటను 'వాడు చాలా బెట్టుసరి మనిషి' అన్న పదం వాడుకలో ఉన్నది. 'వానలు లేక పొలం బెట్టు తీసింది'. అన్న ప్రయోగంలో కఠినమని అర్థం. ఈ అర్థంలో బెట్టు వేరు.

**ఉ. చచ్చిన నత్తపస్విసతి సన్నులు మోమును మోదికొంచుఁ బై**
**వెచ్చని కన్ను నీ రడర, వీడిన వేనలితోడఁ బెల్చ వా**
**పుచ్చి, తనూజులం బనువఁ బొంచి కనుంగొని పోయె విప్రుఁ డై**
**యచ్చటికిన్ సురాధిపతి; యాతనిఁ జూచి లతాంగి వెక్కుచున్. 299**

**ప్రతిపదార్థం:** చచ్చినన్= చస్తే; ఆ+తపస్విసతి= ఆ మునిభార్య; చన్నులున్= రొమ్ములు; మోమునున్= ముఖం; మోదికొంచున్= కొట్టుకొంటూ; పైన్= రొమ్ములపైన; ముఖానికీ పైన; వెచ్చని= వేడి; కన్నునీరు= కన్నీరు; అడరన్= వ్యాపించగా; వీడిన= చెదరిన; వేనలితోడన్= జడతో; పెల్చన్= పెద్దగా; వా= వాక్కు (ఏడ్పు); పుచ్చి= అరిచి; తనూజులన్= కొడుకులను గూర్చి; పనువన్= ఏడ్వగా; పొంచి= చాటునఉండి; కనుంగొని= చూచి; సుర+అధిపతి= దేవతల రాజు; విప్రుఁడు+ఐ= బ్రాహ్మణుడై; అచ్చటికిన్= ఆమె దగ్గరకు; పోయెన్= వెళ్ళాడు; లతాంగి= స్త్రీ; అతనిన్+చూచి= అతడిని చూచి; వెక్కుచున్= వెక్కిపడుతూ (వెక్కివెక్కిపడి ఏడ్వటం - వ్యవహారంలోమాట).

**తాత్పర్యం:** కొడుకులంతా చావగా తల్లి రొమ్మూ, మొగమూ బాదుకొంటూ వాటిమీద కన్నీళ్ళు కారగా, జడముడి ఊడిపోగా, పెద్ద గొంతుకతో కొడుకులను పేరుపేరున తలచుకొంటూ ఏడుస్తూ ఉండగా, చాటున నుండి చూస్తున్న ఇంద్రుడు బ్రాహ్మణరూపంలో ఆమెను సమీపించాడు. ఆమె ఇంకా వెక్కి వెక్కి పడుతూ, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: స్వభావోక్తి. తల్లి దుఃఖవర్ణన యథార్థంగా చిత్రించబడటం చూడవచ్చును.

**ఆ.** **కరుణ మొగమునందుఁ గనుఁగొని, తాను ము । న్నర్థి వేఁట వోవు టాదిగాఁగ**
**సకల సుతులు నాజిఁ జచ్చుట తుదియు గఁ । గలుగు వర్తనంబు దెలియఁ బలికె.** **300**

**ప్రతిపదార్థం:** కరుణ= జాలి; మొగమునందున్= అతడి ముఖంలో; కనుఁగొని= చూచి; తాను= భంగాస్వనుండు; మున్ను= పూర్వం; అర్థిన్= కోర్కెతో; వేఁటపోవుట= వేటకైపోవటం; ఆదికాఁగన్= మొదలుకొని; సకల, సుతులు= కొడుకులంతా; ఆజిన్= యుద్ధంలో; చచ్చుట= చావటం; తుదియుగన్= ముగింపు కాగా; కలుగువర్తనంబు= జరిగిన కథనంతా; తెలియన్ పలికెన్= అతడికి తెలిసేటట్లుగా చెప్పింది.

**తాత్పర్యం:** అతడి ముఖంలో తనపట్ల కనబరుస్తున్న జాలిని చూచి తాను పూర్వం రాజుగా ఉన్నపుడు వేట కేగిన దగ్గరనుండి కొడుకులంతా చచ్చినదాకా జరిగిన కథనంతా చెప్పింది.

**క.** **విని, యతఁ 'డే నింద్రుఁడ, నా కనిష్ట మగు క్రతువుఁ జేసి; తది హేతువుగా**
**నినుఁ బఱచితి నిత్తెఱఁగున' । ననుటయు, సంభ్రమ సమేతమైన భయమునన్.** **301**

**ప్రతిపదార్థం:** విని= విన్నాక; అతఁడు= వాడు; ఏన్= నేను; ఇంద్రుఁడన్= దేవతలరాజును; నాకున్; అనిష్టము+అగు= ఇష్టంలేని; క్రతువున్= యజ్ఞం; చేసితి(వి)= చేశావు; అది హేతువుగాన్= అది కారణంగా; నినున్= నిన్ను; ఈ+తెఱఁగునన్= ఈ విధంగా; పఱచితిన్= పరుగెత్తించాను (కష్టాలు పెట్టాను); అనుటయున్= అనటంతోనే; సంభ్రమ= తొట్రుపాటుతో; సమేతము+ఐన= కూడిన; భయమునన్= భయంతో.

**తాత్పర్యం:** విని 'నేను ఇంద్రుడను. నాకిష్టం లేని యజ్ఞం చేసినందువలన ని న్నీ విధంగా కష్టపెట్టాను'. అనటంతోనే ఆమె తొట్రుపాటుతో కూడిన భయంతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**క.** **ఇలఁ జాఁగి మ్రొక్కి 'యటు తన । యులకై సమ్మూఢబుద్ధి నొనరించితిఁ ద**
**ప్పలఘు దయఁ జూడు; నీ కేఁ జలమునకుం బాత్రమే విశాలయశోర్థీ!'** **302**

**ప్రతిపదార్థం:** ఇలన్= నేలపై; చాఁగి= సాష్టాంగపడి; మ్రొక్కి= నమస్కరించి; తనయులకై= కొడుకులకొరకు; అటు= ఆ విధంగా; సమ్మూఢ= మూర్ఖమైన; బుద్ధిన్= ఆలోచనతో; తప్పు= దోషం; ఒనరించితిన్= చేశాను; అలఘు= గొప్ప; దయన్= కరుణతో; చూడు= చూడుము; నీకున్; ఏన్= నేను; చలమునకున్= పట్టుదలకు; పాత్రమే= తగిన వ్యక్తినా; విశాల= అనంతమైన; యశః+అర్థీ!= కీర్తిని కోరేవాడా!

**తాత్పర్యం:** 'గొప్పకీర్తి గల నీకు నేనా దొరికాను? కొడుకులకొరకు చేసిన తప్పునకు నా కింత శిక్ష విధించాలా? గొప్ప మనసుతో కరుణించుము'.

**వ. అని రామయై యున్న రాజన్యుండు, దైన్యంబు దోఁపం బలికిన, బలసూదనుండు ప్రసన్నుండై. 303**

**ప్రతిపదార్థం:** అని; రామఐ= స్త్రీగా ఉన్న; రాజన్యుండు= రాజు; దైన్యంబు= దీనత్వం; తోఁపన్= కన్పించేటట్లు; పలికినన్= చెప్పితే; బలసూదనుండు= బలుడన్న రాక్షసుడిని చంపిన ఇంద్రుడు; ప్రసన్నుండు+ఐ= దయ కలవాడై.

**తాత్పర్యం:** స్త్రీ రూపంలో రాజు ఆ విధంగా ఏడ్చేసరికి ఇంద్రుడు ప్రసన్నుడైనాడు.

**ఇంద్రుఁడు భంగాస్వనునకుఁ గోరిన వరంబు లిచ్చి యనుగ్రహించుట (సం.13-12-38)**

**సీ. 'ఇచ్చెదఁ గొందఱ; నెత్తఱిఁ గాంచిన । తనయుల నొసఁగుదు' ననిన నతఁడు**
**'కాంతనై యుండి యేఁ గనిన వారల నిమ్ము । దేవ!' నావుడుఁ దొల్లి నీవు గన్న**
**ప్రజల నే లడుగవు? నిజము సెప్పుము నాకు' । ననియెఁ బురందరుం డవ్విభుండు**
**వెడసిగ్గుపాటుతోఁ 'పడఁతుల కర్మిలి । బిడ్డలదెసఁ గడుఁ బెద్ద' యనిన**

**తే. 'సత్యవాది వైతి సకలతనూజులు । బ్రదికి నెగడువారు భామినీత్వ**
**దైన్య ముడిపి పురుషతయు నిత్తు నీ' కని । పాకశాసనుండు వల్కె నధిప! 304**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; పురందరుండు= ఇంద్రుడు; కొందఱన్= కొంతమందిని; ఇచ్చెదన్= బ్రతికిస్తాను; ఎత్తఱిన్= ఏ సమయంలో; కాంచిన= కన్న; తనయులన్= కొడుకులను; ఒసఁగుదున్= ఇచ్చెదను; అనినన్= అనగా, అంటే; అతఁడు= భంగాస్వనుడు; కాంతనై ఉండి= స్త్రీనై ఉండి; ఏన్= నేను; కనిన= కన్నట్టి; వారలన్= వారిని; ఇమ్ము= ఇవ్వు; దేవ= స్వామీ!; నావుడున్= అనగా; తొల్లి= అంతకుముందు; నీవు; కన్న= కన్నట్టి; ప్రజలన్= సంతానాన్ని; ఏల?= ఎందుకు; అడుగవు= అడగలేదు; నిజము చెప్పుము= సత్యం చెప్పుము; నాకున్; అనియెన్= ఇంద్రుడన్నాడు; ఆ+విభుండు= ఆ రాజు; వెడ= కొంచెం; సిగ్గుపాటుతోన్= సిగ్గుతో; పడఁతులకున్= స్త్రీలకు; బిడ్డలదెసన్= బిడ్డలమీద; అర్మిలి= ప్రేమ; కడున్= మిక్కిలి; పెద్ద= ఎక్కువ; అనినన్= అనగా; పాకశాసనుఁడు= ఇంద్రుడు; సత్యవాదివి= నిజం చెప్పేవాడివి; ఐతి(వి)= ఐనావు; సకల తనూజులు= కొడుకులంతా; బ్రదికి= జీవించి; నెగడువారు= వర్ధిల్లగలరు; భామినీత్వదైన్యమున్= స్త్రీత్వంవలన కలిగిన దీనత్వం కూడా; ఉడిపి= పోగొట్టి; పురుషతయున్= మగతనాన్ని కూడా; నీకున్; ఇత్తున్= ఇస్తాను; అని పలికెన్= అని అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఇంద్రు డన్నాడు; 'చచ్చినవారిలో కొందరిని బ్రతికిస్తాను. ఎవరిని కోరుకొంటావో చెప్పుము' అంటే అతడన్నాడు. 'నేను స్త్రీగా ఉండి కన్నవారి నిమ్ము' అని. 'ముందరి బిడ్డల నెందు కడగలే' దని ఇంద్రుడంటే - అత డన్నాడు 'స్త్రీకి పిల్లలమీద ప్రేమ ఎక్కువ కదా! అందుకని' అని కొంచెం సిగ్గుపడుతూ అంటే- ఇంద్రుడు 'నీవు నిజం చెప్పావు. కనుక నీ కొడుకులందరినీ బ్రతికించి ఇస్తాను. అంతేకాక నీకు మగతనాన్ని కూడా ఇస్తాను' అని చెప్పాడు.

**క. విని, యజ్జగతీనాథుఁడు । 'దనయుల నందఱను నీదుదయఁ బడసితి; నే**
**వనిత నయి యిట్ల యుండెద । ననఘా యివ్వరము నొసఁగు' మని పల్కుటయున్. 305**

**ప్రతిపదార్థం:** ఆ+జగతీనాథుఁడు= ఆ రాజు (జగత్తు= ప్రపంచం, రాజ్యం); విని; నీదు= నీయొక్క; దయన్= దయతో; తనయులన్= కొడుకులను; అందఱన్= అందరినీ; పడసితిన్= పొందాను; నేన్= నేను; వనితన్+అయి= స్త్రీనై; ఇట్ల+ఉండెదన్= ఇదేవిధంగా ఉంటాను; అనఘా!= పుణ్యాత్ముడా!; ఈ+వరము= ఈ వరం; ఒసఁగుము= ఇమ్ము; అని; పల్కుటయున్= అనగా.

**తాత్పర్యం:** ఆ రాజు ఇంద్రుడి మాటలు విని 'నీ దయవలన నాకు కొడుకు లందరూ దక్కారు. కాని నన్నిట్లాగే స్త్రీగానే ఉండనిమ్ము. ఈ వరం చాలు' అని అన్నాడు.

**వ. విస్మితుండై యింద్రుండు 'దీనికిం గతం బేమి? యని యడిగిన నా భంగాస్వనుం డిట్లనియె. 306**

**ప్రతిపదార్థం:** ఇంద్రుండు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడి; దీనికిన్= నీ వడిగిన దానికి; కతంబు= కారణం; ఏమి?= ఏమిటి?; అని; అడిగినన్= అడుగగా; ఆ భంగాస్వనుండు; ఇట్లు అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు ఆశ్చర్యపడి ' ఈ విధంగా నీవు అడగటానికి కారణ మేమి?' టని అడిగాడు. దానికి భంగాస్వనుడు ఈ విధంగా పలికాడు.

**క. 'సురతంబునఁ గడు నెక్కుడు । పురుషులకంటెను సుఖంబు పొలఁతులకు, సురే**
**శ్వర! యట్లగుటను నాకీ । వెరవున రమియించి నిలువ వేడుక గలిగెన్.' 307**

**ప్రతిపదార్థం:** సుర+ఈశ్వర!= దేవతలకు రాజా!; పొలఁతులకున్= స్త్రీలకు; సురతంబునన్= రతిలో; కడున్= మిక్కిలి; సుఖంబు= సుఖం; ఎక్కుడు= ఎక్కువ; అట్లు= ఆ విధం; అగుటను= కావటంవలన; నాకున్; ఈ వెరవునన్= ఈ ఉపాయంతో; రమియించి= సుఖించి; నిలువన్= బ్రదకటానికి; వేడుక= కోరిక; ఉత్సాహం; కలిగెన్= కలిగింది.

**తాత్పర్యం:** 'ఇంద్రా! రతిలో పురుషులకంటె స్త్రీలకు సుఖ మెక్కువ కనుక నే నదే రీతిగా స్త్రీనై సుఖించాలని ఉత్సాహపడుతున్నాను.'

**ఆ. అనిన, నట్టులేని నౌఁ గాక, యిమ్మెయి । విపుల సౌఖ్య మొంది, విహరణంబు**
**సలిపి నిలువు' మనుచు, శక్రుండు సనియె భం । గాస్వనుండుఁ బ్రీతి నట్ల యుండె'. 308**

**ప్రతిపదార్థం:** అనినన్; శక్రుండు= ఇంద్రుడు; అట్టులు+ఏని= అలాగైతే; ఔన్+కాక= సరే అట్లాగే; ఈ+మెయిన్= ఈ విధంగా (స్త్రీవై); విపుల= విస్తారమైన; సౌఖ్యము+ఒంది= సుఖాలు పొంది; విహరణంబు సలిపి= విహరించి; నిలువుము= బ్రతుకుము; అనుచున్= అంటూ; చనియెన్= పోయాడు; భంగాస్వనుండున్= ఆ రాజుకూడా; ప్రీతిన్= సంతోషంతో; అట్లు+అ= అదే విధంగా; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా విని ఇంద్రుడు 'అట్లాగా! సరే! నీ వట్లాగే ఉండి సుఖించుము' అని దీవించి వెళ్ళిపోయాడు. భంగాస్వనుడు కూడా స్త్రీగానే ఉండిపోయాడు.

**వ. అని చెప్పి భీష్ముండు 'పాండవాగ్రజా! దీన నీయడిగిన యర్థంబు దెలిసికొ' మ్మనిన, నమ్మనుజపతి 'బహువిధము లగు ధర్మంబులు భవత్ప్రసాదంబున వినుచున్నవాఁడ; నవియెల్లను జన్మ మరణాది దుఃఖంబులం బాపంజాలునే? యనేక జననీ జనకులకుం బుట్టుచు సంసార చక్రంబునం దిరుగంజాల; గర్భవాసంబన నరకంబన భేదంబు గలదె? సచరాచరంబైన యిజ్జగం బస్థిరం; బట్లుంగాక దీని విషాన్నంబు చందముగాఁ గనియెద; భవమోక్షణం బగు వైష్ణవధర్మం బుపదేశింపవే! యది యీ యుగంబునం దిరోహితం బగుట కృష్ణద్వైపాయనుండు సెప్పె; మీ యనుగ్రహంబుల నెఱింగెద; భవదీయ చరణంబులు శరణంబులుగాఁ బ్రసన్నుండ నైతి' నని ప్రార్థించిన నమ్మహాత్ముండు 'పగతురం దెగటార్చి పేర్చి పూజ్యంబగు సామ్రాజ్యంబు గైకొని, తదీయంబు లగు సుఖంబు లనుభవించుచుండుట గీడుగాఁ జూడఁ గురుకుల చూడా మణియగు నీకుం జనుఁగాక, యౌవనస్థ లగు రాజ్య పదస్థుల తలంపుల చొప్పె యిది? మిథిలాపతియగు జనకుండుం బోలెం బలికెద' వని యుపలాలించి యమ్మహీపాలున కిట్లనియె. 309**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అనివచించి; భీష్ముడు; పాండవ+అగ్రజా!= పాండవులలో పెద్దవాడా!; ధర్మరాజా!; నీ అడిగిన= నీ వడిగిన; అర్థంబు= అర్థాన్ని; దీనన్= ఈ కథ ద్వారా; తెలిసికొమ్ము= తెలిసికొనుము; అనినన్= అనగా; ఆ మనుజపతి= ఆ రాజు; బహువిధములు+అగు ధర్మంబులు= అనేక ధర్మాలను; భవత్= నీయొక్క; ప్రసాదంబునన్= దయతో; వినుచున్నవాఁడన్= వింటున్నాను; అవి ఎల్లనున్= అవన్నీ; జన్మ= పుట్టుక; మరణ= చావు; ఆది=మొదలైన; దుఃఖంబులన్= దుఃఖాలను; పాపన్+చాలునే?= పోగొట్టునా? అనేక= చాలామంది; జననీ= తల్లులకు; జనకులకున్= తండ్రులకు; పుట్టుచున్= జన్మలెత్తుతూ; సంసారచక్రంబునన్= పుట్టుక చావులతో గూడిన సంసారమనే చక్రంలో చిక్కుకొని; తిరుగన్+చాలన్= తిరగలేను; గర్భవాసంబు+అనన్= కడుపులో ఉండటం అనగా; నరకంబు= నరకము; అనన్= అంటే; భేదంబు కలదె?= భేద మున్నదా?; సచర+ఆచరంబు= కదలెడివి, కదలనివి అయిన వానితో కూడినదైన; ఈ+జగంబు= ఈ లోకం; అస్థిరంబు= స్థిరంగా ఉండనిది; అట్లుంగాక= అందువలన; దీనిన్= దీనిని; విష+అన్నంబు= విషం కలిపిన అన్నం; చందముగాన్= వలె; కనియెదన్= చూస్తాను; భవ= జన్మ; మోక్షణంబు+అగు= తప్పించునట్టి; వైష్ణవధర్మంబు= విష్ణువే దైవమని చెప్పే మార్గం; ఉపదేశింపవే!= బోధించవా!; అది= ఆ ధర్మం; ఈ యుగంబునన్= ఈ ద్వాపరయుగంలో; తిరోహితంబు= అదృశ్యం; అగుట= కావటం; కృష్ణద్వైపాయనుండు= వ్యాసమహర్షి; చెప్పెన్; మీ అనుగ్రహంబులన్= మీ దయతో; (ఇక్కడ బహువచనం లోకంలో వాడటం లేదు. కాబట్టి మిక్కిలి దయతో అని చెప్పుకొనాలి); ఎఱింగెదన్= తెలిసికొంటాను; భవదీయ= మీ; చరణంబులు= పాదాలు; శరణంబులుగాన్= దిక్కుగా; ప్రపన్నుండను= భక్తుడను; ఐతిని; అని; ప్రార్థించినన్= మిక్కలి కోరగా- వేడుకొనగా; ఆ+మహా+ఆత్ముండు= ఆ విశాలమైన హృదయం కలవాడు (ఎవడు తనను విశ్వంలో, విశ్వాన్ని తనలో దర్శించగలడో వాడే గొప్ప ఆత్మ కలవాడు); పగతురన్= శత్రువులను; తెగటార్చి= నరికి; పేర్చి= వర్ధిల్లి; పూజ్యంబు= పవిత్రమైన; సామ్రాజ్యంబు= గొప్ప రాజ్యం; కైకొని= పొంది; తదీయంబులు= దానికి సంబంధించిన; సుఖంబులు=సౌఖ్యాలు, భోగాలు; అనుభవించుచున్+ఉండుట= అనుభవించటం; కీడుగాన్= ఆపదగా; చూడన్= చూడటం; కురుకుల= కురువంశానికే; చూడామణి= తలపై పెట్టుకొనే మణి; అగు నీకున్= అయిన నీకు; చనున్‌గాక!= చెల్లుగాక! యౌవనస్థులు= యువకులు; రాజ్యపదస్థుల= రాజ్యపాలన అందున్నవారి (యౌవరాజ్య పట్టాభిషిక్తులైనవారి); తలంపుల చొప్పె?= ఆలోచనల పద్ధతియా? ఇది= నీవు చెప్పింది; మిథిలాపతి= మిథిలారాజ్య పాలకుడైన; జనకుండున్+పోలెన్= జనకుడివలె; పలికెదవు= చెప్పుతున్నావు; అని; ఉపలాలించి= ముద్దుచేసి; బుజ్జగించి; ఆ+మహీపాలునకున్= ఆ భూమిపతితో.

**తాత్పర్యం:** ఈ కథవలన నీవడిగిన అర్థం తెలిసికొనుము' అని భీష్ముడనగా విని ధర్మరా జన్నాడు. 'మహాత్మా! నీ వలన ఎన్నో ధర్మాలు వింటున్నాను. చావు పుట్టుకల చక్రంలో పడి తిరుగుతూ ఎన్నిసార్లు జన్మించాలి? నాకీ

బంధం వద్దు. తల్లి కడుపులో ఉండటమంటే నరకవాసమే కదా! కనుక విష్ణుభక్తిని బోధించుము. నీ పాదాలే నాకు దిక్కు' అని ప్రార్థించేసరికి భీష్ము డన్నాడు. 'నాయనా! నీ మాటలు చూస్తే ఎవరో జనకమహారాజు మాటలుగా ఉన్నాయిరా! లేకపోతే ఇంత సామ్రాజ్యం పొంది కూడా ఆ భోగాలు వద్దనుకొనటం సామాన్యమా? నీవు కురువంశోద్ధారకుడవయ్యా!' అని మెచ్చుకొని ఇట్లా అన్నాడు.

**క. 'పురుషాతిగ యై తోఁచును, । నిరూపణము సేయ నూఁది నిర్దేశింపన్**
**వెరవుపడక, శాశ్వతసుఖ । భరితతత, నిర్వాణ మనఁగఁబడుఁ బ్రకృతి నృపా! 310**

**ప్రతిపదార్థం:** నృపా= రాజా!; నిర్వాణము= మోక్షం; అనఁగన్+పడు= అనబడే; ప్రకృతి= వ్యక్త, అవ్యక్త రూపిణి అయిన ప్రకృతి; పురుష+అతిగ+ఐ= పురుషుడికంటె మించినదై; తోఁచును= ప్రకాశిస్తుంది; నిరూపణము చేయన్= నిరూపించుటకు; ఊఁది= నొక్కి; నిర్దేశింపన్= వ్యాఖ్యానించుటకు; వెరవుపడక= అంతు చిక్కక; సుఖ భరితతత= నశించని సుఖంతో నిండినదై.

**తాత్పర్యం:** శాశ్వతసుఖం పేరే మోక్షం. అదే నిర్వాణం. అది పురుషుడికంటె అధికమైన ప్రకృతి అనబడుతుంది. దానిని నిర్దేశించటానికిగానీ, 'ఇది' అని చెప్పటానికి గానీ, చూపటానికి గానీ, తర్కించటానికి గానీ వీలుపడదు.

**విశేషం:** ప్రకృతి, పురుషులు సాంఖ్యయోగంలోనివి. ప్రకృతి, పురుషు లనేకంగా ఉంటారని సాంఖ్యులు చెప్పారు. తర్వాత వచ్చిన వేదాంతులు దీన్ని ఖండించారు. ఈ సాంఖ్యయోగం గీతలోనూ చెప్పబడింది. ఈ సిద్ధాంత స్థాపకుడు కపిలమహర్షి. ఆయన 5000 సంవత్సరాల క్రితం వాడని చెప్పుతారు.

**క. ప్రకృతులు పె; క్కన్నింటికి । నకృతి యనం జనిన యదియ యాద్య; మహీపా**
**లక! పురుషరూపిణియు నై । వికృతిం బొరయదు వివేకవిజ్ఞాత యగున్. 311**

**ప్రతిపదార్థం:** మహీపాలక!= భూమిపాలకా!; ప్రకృతులు పెక్కు= ప్రకృతులు అనేకం; అన్నింటికిన్= అన్నిటికీ; ఆద్య= మూలము; అకృతి+అనన్+చనిన+అది+అ= అకృతి అని పేర్కొనదగినది; పురుషరూపిణియున్+ఐ= ఆ అకృతి పరమపురుష స్వరూపిణియై; వికృతిన్= వికారమును (పరిణామం); పొరయదు= పొందదు; వివేక= జ్ఞానముచేతనే (ఆత్మానాత్మ వివేకము చేత) విజ్ఞాత= స్పష్టంగా తెలుసుకోబడినది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! ప్రకృతులు పెక్కింటికి అకృతియే తల్లి. అది పరమపురుష రూపిణియై ఏవికృతిని పొందదు. అది జ్ఞానము చేతనే తెలియదగినది.

**క. విను, సంసార పథమునకు । ననురూపతఁదోఁచుచుండఁ, నన్యప్రకృతుల్**
**దనతోఁపు భవనిరాసం । బునకుం గారణము, గామమునఁ బిహిత మగున్. 312**

**ప్రతిపదార్థం:** విను= ఆలకింపుము; అన్యప్రకృతుల్= అకృతి కంటే వేరైన ప్రకృతులు; సంసార పథమునకున్= జనన మరణ రూపమైన సంసార మార్గానికి; అనురూపతన్= అనుకూలముగా; తోఁచుచుండన్= స్ఫురించుచుండగా; భవనిరాసంబునకున్= సంసార విచ్ఛేదానికి; తనతోఁపు= అకృతి యొక్క స్ఫురణ; కారణము= హేతువు; కామమున్= కామము చేత; అది= (ఆ కారణము); పిహితమగున్= కప్పబడును.

**తాత్పర్యం:** అకృతికంటే వేరైన ప్రకృతులన్నీ సంసార మార్గానికి అనుకూలంగా తోస్తూ ఉంటాయి. అలా తోస్తూ ఉండగా సంసార నిర్మూలనానికి కారణమైనది అకృతియొక్క స్ఫురణ మాత్రమే. అది కూడా కామము చేత కప్పబడుతున్నది.

**క. కావునఁ గామక్రోధము । లావిర్భూతములు గానియట్లుగఁ దత్స**
**త్త్వావేశంబునఁ దనుపుము । భావం; బివ్విధము విష్ణుపరతఁ గుమారా! 313**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; కుమారా!= నాయనా!; కామ, క్రోధములు= కోరిక, కోపాలు; ఆవిర్భూతములు కాని అట్లుగన్= పుట్టకుండా ఉండేటట్లు; తత్= ప్రసిద్ధమైన; సత్త్వ= సత్త్వగుణం యొక్క; ఆవేశంబునన్= ఆవహించటంచేత; భావంబు= మనస్సును; ఈ+విధము= ఈ పద్ధతి; విష్ణుపరతన్= విష్ణుభక్తితో; తనుపుము= తృప్తి పొందించుము.

**తాత్పర్యం:** నాయనా! కాబట్టి కామక్రోధాలను అణచి మనస్సును సత్త్వగుణభరితం చేసికొమ్ము. ఇదే వైష్ణవ ధర్మమంటే.

**విశేషం:** సత్త్వం - రజస్సు - తమస్సు అని గుణాలు మూడు. రజస్సు ఉద్రేకం - కర్మ చేయించే స్వభావం. తమస్సు - చీకటి - అజ్ఞానం. ఏ పనీ చేయించని బద్దకం దీని లక్షణం. సత్త్వం= శుభాన్ని గూర్చే ధర్మాదులను చేయించే ఉద్రేకం లేని శాంతగుణం.

**క. నృప! వైష్ణవధర్మము నీ । కుపదేశించితిఁ; బ్రసాదయుతుఁడ వగుచు సా**
**రపుఁ దెరు వగు నిది గనికొని, । యపగత సంసార భయుఁడ వై నడపు తగన్. 314**

**ప్రతిపదార్థం:** నృప= రాజా!; నీకున్= నీకు; వైష్ణవ ధర్మము= విష్ణుసంబంధమైన ధర్మాన్ని; ఉపదేశించితిన్= బోధించాను; ప్రసాదయుతుఁడవు= శాంత గుణంతో కూడుకొన్నవాడవు; అగుచున్= ఔతూ; ఇది= ఈ వైష్ణవ ధర్మం; సారపు= సారవంతమైన; తెరువు= మార్గం; అగున్= ఔతుంది; కనికొని= విచారించి; అపగత= పోయిన; సంసార= జనన మరణ ప్రవాహంవలని; భయుఁడవై= భయం కలవాడవై; తగన్= చక్కగా; నడపు= జీవించుము.

**తాత్పర్యం:** నీ వడిగిన ధర్మం చెప్పాను. దీనితో ఉద్రేకాలు లేని మనస్సుతో సంసార భయాన్ని జయించి జీవించుము.

**వ. అనిన సంప్రీతుండై ధర్మజుండు భీష్మునితోఁ 'తత్త్వంబులు నధ్యాత్మంబులు, నధిభూతంబులు, నధి దైవంబులు, ననుసర్వంబునకుం గర్తయు, భర్తయు, హర్తయు నగుచు సకల భూతంబులుం దనుపజీవింపం బెంపారు వాని నెఱింగింపవే!' యని ధర్మజుం డడుగుటయు నతనికి నమ్మహితాత్ముం డిట్లనియె. 315**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; సంప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; ధర్మజుండు; భీష్ముని తోన్= భీష్ముడితో; అధ్యాత్మంబులు= ఆత్మ సంబంధమైనవీ; అధిభూతంబులు= పంచభూతాలకు సంబంధించినవీ; అధిదైవంబులు= దైవాలకు సంబంధించినవీ; తత్త్వంబులు= శాస్త్రీయసత్యాలు; అను= ఈ చెప్పినవాటిని; సర్వంబునకున్= అన్నింటికీ; కర్త= చేసినవాడు; భర్త= పోషించేవాడు; హర్త= చంపేవాడు; అగుచున్; సకలభూతంబులున్= సర్వజీవులూ; తన్నున్= తనను; ఉపజీవింపన్= బ్రదికిస్తూ ఉండగా (తన ఉనికిని చాటుతుండగా); పెంపారువానిన్= పేరుగన్న వాడిని; ఎఱింగింపవే= తెలుపవే; అని;

ధర్మజుండు; అడుగుటయున్= అడుగగా; ఆ+మహిత+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మ కలవాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** ఆ మాటలు విని ధర్మరాజు సంతోషించి ఆ మహాత్ముడితో అన్నాడు 'ఆధ్యాత్మికం, అధిదైవం, అధిభూత మన్న మూడు తత్త్వాలకు ఆధారమై, వాటిలో తానూ జీవిస్తూ కర్తా, భర్తా, హర్తా అయిన భగవంతుడి గురించి చెప్పవా?' అని అడుగగా; భీష్ముడన్నాడు.

**క. 'సనకుఁడు, సనందనుండును, । సనత్కుమారుఁడు, సనత్సుజాతుఁడు, నలువుర్**
**తనయుల్ బ్రహ్మకుఁ, బంచము । డును షష్ఠుండును వసిష్ఠుఁడును, శంకరుఁడున్. 316**

**ప్రతిపదార్థం:** బ్రహ్మకున్ = బ్రహ్మదేవునికి; సనకుఁడు, సనందనుండును, సనత్కుమారుఁడు, సనత్సుజాతుఁడు; తనయుల్= కొడుకులు; నలువుర్= నలుగురు; తనయుల్= కుమారులు; పంచముఁడును= ఐదవవాడును; షష్ఠుండును= ఆరవవాడును, (వరుసగా) వసిష్ఠుఁడును= వసిష్ఠమహర్షి, శంకరుఁడున్= శంకరుడూ (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు, వసిష్ఠుడు, శంకరుడు. ఈ ఆరుగురూ బ్రహ్మకు కొడుకులు.

**ఆ. అనఘ! విను మరీచి యనఁగ, భృగుం డన, । నంగిరసుఁ డనఁగ, ననంతరంబ**
**యత్రి యనఁ, బులస్త్యుఁ డన, బులహుం డనఁ, । గ్రతు వనంగఁ, బుట్టు సుతచయంబు. 317**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విను= ఆలకించుము; మరీచి; అనఁగన్; భృగుండు; అనన్; అంగిరసుఁడు; అనఁగన్; అనంతరంబు+అ= తర్వాత; అత్రిఅనన్; పులస్త్యుఁడు+అనన్; పులహుండు+అనన్; క్రతువు అనంగన్; పుట్టు= జన్మించిన; సుతచయంబు= కొడుకుల సమూహం;

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! వినుము. ఆ తరువాత మరీచి, భృగుడు, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనే పేర్లుగల కొడుకులు పుట్టారు.

**వ. ఆ సనత్సుజాతుం డంగుష్ఠ ప్రమాణమూర్తియుం, బ్రజ్వల దనలస్ఫూర్తియునయి లోకంబుల నెందునుం జరియించుచు నొక్కనాఁడు మేరు శిఖరంబున నారదుండు సన్నిహితుం డగుటయుఁ దదీయసల్లాపసౌఖ్యం బనుభవించుచున్న యెడ నిట్లపోలె నడిగిన నారదునకు నమ్మహాయోగీశ్వరుండు సెప్పిన వాక్యంబు లితిహాసరూపంబునం జెల్లునవి యుపన్యసించెద; నవి భవత్ప్రశ్నంబున కుత్తరంబగు; నాకర్ణింపుము. 318**

**ప్రతిపదార్థం:** ఆ సనత్సుజాతుండు; అంగుష్ఠప్రమాణ మూర్తియున్= బొటనవ్రేలంత ఎత్తున్నవాడూ; ప్రజ్వలత్+అనల స్ఫూర్తియున్= మండుతున్న అగ్నివంటివాడూ; అయి=ఐ; లోకంబులన్= లోకాలలో; ఎందునున్= అన్నిచోట్లా; చరియించుచున్= సంచరిస్తూ; ఒక్కనాఁడు= ఒక రోజున; మేరు శిఖరంబునన్= మేరుపర్వత శిఖరంమీద; నారదుండు; సన్నిహితుండు+ అగుటయున్= ప్రత్యక్షం కాగా; తదీయ సల్లాప సౌఖ్యంబు= అతడితో మాట్లాడటంవలన కలిగే హాయి; అనుభవించుచున్+ ఉన్న=పొందుతూ ఉన్న; ఎడన్= సమయంలో; ఇట్లు+అ+పోలెన్= ఈ విధంగానే; అడిగినన్= అడుగగా; ఆ+మహాయోగి+

ఈశ్వరుండు= గొప్పయోగులలో గొప్పవాడైన ఆ సనత్సుజాతుడు; నారదునకున్; చెప్పిన; వాక్యంబులు= వాక్యాలు, సూక్తులు; ఇతిహాస రూపంబునన్= పూర్వగాథవలె; చెల్లున్= ప్రచారంలో ఉన్నాయి; అవి= వాటిని; ఉపన్యసించెదన్= వివరిస్తాను; అని= ఆ వాక్యాలు; భవత్+ప్రశ్నంబునకున్= నీ ప్రశ్నకు; ఉత్తరంబు= సమాధానం; అగున్= ఔతుంది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ సనత్సుజాతుండు బొటనవ్రేలంత ఎత్తున్నవాడూ, మండుతూ ఉన్న అగ్నివలె ప్రకాశించేవాడూ అయి, లోకాలన్నీ సంచరిస్తూ ఉండేవాడు. ఒకనాడు మేరుపర్వత శిఖరం మీద నారదుడు కన్పించగా అతడితో సంభాషిస్తూ ఉండగా నీవలెనే నారదు డడిగితే ఆయన చెప్పిన మాటలు లోకంలో వ్యాపించాయి. ఆ పురాతన వాక్యాలు నీ వడిగిన ప్రశ్నకు సమాధానాలు. కనుక వినుము చెప్పుతాను.

## సనత్సుజాతుండు నారదున కుపదేశించిన తత్త్వప్రకారము (సం.13-38-1 (కుంభ))

**క. దశకల్ప సహస్రంబులు । నిశ, యింతియ దివస, మిది సునిద్రారతికిన్.**

**విశదప్రబోధమునకున్ । వశగతకాలములు విష్ణునకు విమలమతీ! 319**

**ప్రతిపదార్థం:** విమల= కల్మషంలేని; మతీ!= మనస్సు కలవాడా!; దశకల్ప సహస్రంబులు= పదివేలకల్పాలు; నిశ= రాత్రి; ఇంతియ= ఇంతే; దివసము= పగలు; ఇది= ఈ లెక్క; సునిద్రా రతికిన్= మంచి నిద్రాసుఖానికీ; విశద= స్పష్టమైన; ప్రబోధమునకున్= మేల్కొని ఉండటానికీ; విష్ణునకున్= విష్ణుదేవుడికి; వశగత= వశమైన; కాలములు= సమయాలు.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన మనస్సు కలవాడా! నారదా! విష్ణువు చక్కగా నిద్రపోవటానికి రాత్రి పదివేల కల్పాలు. మేల్కొనే కాలమూ అంతే. ఇవి విష్ణుమూర్తికి రేయింబవళ్ళు.

**క. అవ్యక్తం బనఁగాఁ దన । దివ్యాత్మన కలిగియుండు ధీసారనిధీ!**

**భవ్యాత్ము లభేదస్థితి । సవ్యాహతదృష్టిఁ గాంతు రయ్యమళమ్మున్. 320**

**ప్రతిపదార్థం:** ధీ= బుద్ధి; సార= సారమునకు; నిధీ!= భండారమైనవాడా!; అవ్యక్తంబు= వ్యక్తం కానిది (వ్యక్తం ప్రపంచం= పదార్థ సృష్టి) అనఁగాన్; తన; దివ్య+ఆత్మన= దివ్యాత్మతోనే; కలిగిఉండున్= కలిగి వుంటాడు; భవ్య= శ్రేష్ఠ; ఆత్ములు= ఆత్మలు కలవారు (పండితులు); ఆ+యమళమ్మున్= ఆ జంటను (యమళము= జంట) - రేయింబవళ్ళు; అవ్యాహత= ఎదురులేని; దృష్టిన్= చూపుతో; అభేద= భేదం లేని; స్థితిన్= ఉనికిని; కాంతురు= చూస్తారు.

**తాత్పర్యం:** సారవంతమైన ఆలోచనకు నిధి వంటివాడా! అవ్యక్తమంటే విష్ణువు తన స్వరూపంతో తా నుండటం. మహానుభావులు వ్యక్తాన్నీ (పగలు), అవ్యక్తాన్నీ (రాత్రినీ) ఒకే విధంగా చూస్తారు. (అవి రెండూ ఒకటే)

**వ, అప్పరమేశ్వరుండు. 321**

**ప్రతిపదార్థం:** ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ మహేశ్వరుడు.

**తాత్పర్యం:** ఉన్నతుడైన ఆ భగవంతుడు.

**క. రే నిద్రించు, ప్రభాతం । బైనన్ మేల్కని సృజించు నంబువులఁ దగం**

**దా నం దిడుఁ దనవీర్యము । దాన మహాండ మగు హేమతాస్ఫురితంబై. 322**

**ప్రతిపదార్థం:** రే= రాత్రి; నిద్రించున్= నిద్రపోతాడు; ప్రభాతంబు= పగలు; ఐనన్= కాగా; మేల్కని= లేచి; సృజించున్= సృష్టిస్తాడు; అంబువులన్= నీళ్ళలో; తగన్= తగునట్లుగా; తాను; అందున్= నీళ్ళలో; తన; వీర్యమున్= బీజాన్ని; ఇడున్= నిక్షేపిస్తాడు; దానన్= దానితో; హేమతా= బంగారు కాంతితో; స్ఫురితంబు+ఐ= ప్రకాశిస్తూ; మహా+అండము+అగున్= పెద్ద గ్రుడ్డు ఔతుంది.

**తాత్పర్యం:** రాత్రి కాగానే ఆయన నిద్రపోయి, మరలా వేకువ రాగానే లేచి సృష్టి చేస్తాడు. ఎట్లా అంటే తన బీజాన్ని నీళ్ళలో నిక్షేపించి ఉంచటంవలన. దానితో ఒక పెద్ద బంగారు గ్రుడ్డు ఏర్పడుతుంది.

**విశేషం:** ఇది సృష్టి విద్య. నీళ్ళంటే సృష్టి చేయటాని కాధారమైన ప్రకృతి. విష్ణువు పురుషుడు. ఇతడి వీర్యధారణ వలన ఒక బంగారు గ్రుడ్డు పెడుతుంది ఆ ప్రకృతి.

**వ. తదనంతరంబ. 323**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ= ఆ వెంటనే

**తాత్పర్యం:** దాని తరువాత.

**తే. బ్రహ్మఁ గల్పించి, దానికిఁ బతిగఁ జేయు, । నమ్మహాత్ముఁ డహంకార మావహించి,**
**మనసుఁ బదియింద్రియములు, బుద్ధిని ఘటించి । చదలు మొదలగు భూత పంచకముఁ జేయు. 324**

**ప్రతిపదార్థం:** బ్రహ్మన్= బ్రహ్మను; కల్పించి= సృష్టించి; దానికిన్= అండానికి; పతిగన్= భర్తగా; చేయున్= చేయగా; ఆ+మహాత్ముఁడు; అహంకారము= నేను అన్న వ్యక్తిత్వభావం; ఆవహించి= పొంది; మనసున్; పది యింద్రియములు= కర్మేంద్రియాలు 5, జ్ఞానేంద్రియాలు 5; బుద్ధిని= ఆలోచనలో మంచి చెడూ నిర్ణయించేది; ఘటించి= నిర్మించి; చదలు= ఆకాశం; మొదలు+అగు= మొదలైన; భూతపంచకమున్= పంచ(5) భూతాలు (ఆకాశం, నీరూ, నిప్పూ, గాలీ, భూమీ); చేయున్= సృష్టిస్తాడు.

**తాత్పర్యం:** విష్ణువు బ్రహ్మను సృష్టించి దానికి భర్తగా నియమించాడు. ఆయన 'నేను' అన్న భావాన్ని పొంది మనసు, బుద్ధి, పది ఇంద్రియాలు, ఆకాశం మొదలైన పంచభూతాలను సృష్టించాడు.

**వ. అ య్యాకాశ పవనాగ్ని జలభూము లగుభూతంబు లేనింటికి గుణంబులుగా శబ్దస్పర్శరూపరసగంధంబు లావహించుం; గ్రమంబున దేవముని దానవ గంధర్వ కిన్నర నరజాతి జంతు జాలంబులం గల్పించు నన్నియు నహంకార వ్యాప్తంబు లయి యవ్యక్త సాగరంబున మగ్నోన్మగ్నంబు లగుచుండు. 325**

**ప్రతిపదార్థం:** ఆ+ఆకాశ= ఆ మిన్ను; పవన= వాయువు; అగ్ని= నిప్పు; జల= నీరు; భూములు= నేలలు; అగు= అయిన; భూతంబులు ఏనింటికిన్= ఆ పంచభూతములకు; గుణంబులుగాన్= గుణాలుగా; శబ్ద, స్పర్శ, రూపరసగంధంబులు= శబ్దమూ, స్పర్శ, రూపమూ, రసమూ, వాసనలు; ఆవహించున్= కల్పిస్తాడు; క్రమంబునన్= వరుసగా; దేవ= దేవతలు; ముని= మునులు; దానవ= రాక్షసులు; గంధర్వ= గంధర్వులు, కిన్నర= కిన్నరులు, నర= నరులు అనే; జాతి= జాతులను; జంతు= జంతువుల; జాలంబులన్= సమూహాలను; కల్పించున్= సృజించును; అన్నియున్= అన్నీ; అహంకార= నేనన్న వ్యక్తిత్వభావం;

వ్యాప్తంబులు+అయి= వ్యాపించినవై; అవ్యక్త= వ్యక్తం కాని; ప్రధాన తత్త్వమన్న; సాగరంబునన్= సముద్రంలో; మగ్న= మునుగుతూ; ఉన్మగ్నంబులు= లేస్తూ ఉన్నవి; అగుచుండున్= అవుతుంటాయి.

**తాత్పర్యం:** పంచభూతాలకు గుణాలు అయిదు. ఆకాశానికి శబ్దం, గాలికి స్పర్శ, అగ్నికి రూపం, నీటికి రుచి, భూమికి వాసన అనేవి గుణాలు. క్రమంగా దేవదానవాది జాతులు సృష్టించబడ్డాయి. వీటన్నింటియందు అహంకారం వ్యాపించి ఉంటుంది. ఇవన్నీ అవ్యక్త సముద్రంలో మునుగుతూ లేస్తూ, జన్మిస్తూ, చస్తూ ఉంటాయి.

**క. విభుఁ డావిష్ణుం డేతత్ । ప్రభవస్థితి విలయముల, శుభము నశుభంబుం**
**బ్రభువై తగఁ గాంచి, నడపి । విభవోజ్జ్వలకేలి సల్పు, వినుము, మహాత్మా! 326**

**ప్రతిపదార్థం:** మహాత్మా= మహాత్ముడా!; వినుము; విభుఁడు= ప్రభువైన; ఆ విష్ణుండు= ఆ విష్ణువు; ఏతత్= ఈ; ప్రభవ=సృష్టి, స్థితి= ఉనికి; విలయముల= ప్రళయాలయొక్క; శుభము= మేలు; అశుభంబున్= కీడు; ప్రభువై= పాలకుడై; తగన్= చక్కగా; కాంచి= కని; నడపి= ప్రవర్తింపచేసి; విభవ+ఉజ్జ్వల= ప్రకాశించే వైభవంతో; కేలి= క్రీడ; సల్పున్= చేస్తాడు.

**తాత్పర్యం:** ఈ సమస్త సృష్టి స్థితి లయాలకు ప్రభువై విష్ణుమూర్తి శుభాశుభాలు కల్పిస్తూ ఈ సంసార చక్ర భ్రమణాన్ని కలిగిస్తూ గొప్ప వినోదంలో మునిగి తేలుతూ ఉంటాడు.

**తే. అంబరాదిభూతములు శబ్దాది గుణము । లింద్రియంబు, లహంకార, మిద్ధతేజ!**
**మనము, బుద్ధి, యవ్యక్తంబు, మహితవేద । వేద్యతత్త్వంబు లీ చతుర్వింశతియును. 327**

**ప్రతిపదార్థం:** ఇద్ధతేజ!= ప్రకాశించే తేజస్సు కలవాడా! అంబర= ఆకాశం; ఆది= మొదలుగాగల; భూతములు= పంచభూతాలు; శబ్ద= సద్దు; ఆది= మొదలుగాగల; గుణములు= గుణాలు అయిదు; ఇంద్రియంబులు= కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు, అహంకారము= అహంకారం; మనము= మనస్సు; బుద్ధి= బుద్ధి; అవ్యక్తంబు= అవ్యక్తము; మహిత= గొప్ప; వేద= వేదవిద్య వలన; వేద్య= తెలియదగిన; తత్త్వంబులు= సత్యాలు; ఈ చతుర్వింశతియును= ఈ 24 తత్త్వాలు.

**తాత్పర్యం:** ఆకాశం మొదలైన అయిదు భూతాలు, అహంకారం, మనస్సు, బుద్ధి, అవ్యక్తం మొదలైన 24 తత్త్వాలు వేదవేద్యతత్త్వాలు.

**విశేషం:** అవ్యక్తం నుండి మొదలైన సృష్టి 24 తత్త్వాలు కలది. అవే ఈ పద్యంలో చెప్పబడ్డవి. ఇదంతా సాంఖ్యం చెప్పిన సిద్ధాంతం.

**వ. అధ్యాత్మాదులు సెప్పెద నాకర్ణింపుము. 328**

**తాత్పర్యం:** ఆత్మకు సంబంధించినవి చెప్పుతాను వినుము.

**సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూవె, శబ్దం బధి । భూతంబు దిక్కులు పురుషముఖ్య!**
**యధిదైవముల్, చర్మ మధ్యాత్మమందలి । సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు,**

**దానికి నధిదైవతంబు మరుత్తు, నే । త్రంబు దా నధ్యాత్మకంబు, రూప**

**మధిభూత, మాదిత్యుఁ డధిదైవతము, జిహ్వ । యధ్యాత్మకము, రస మారయంగ**

**తే. దాని యధిభూత ముదకము, దదధిదైవ । తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ**

**మనఘ! యధిభూత మగుఁ దదీయాధిదైవ । తంబు, మేదిని యండ్రు విద్వజ్జనమ్ము. 329**

**ప్రతిపదార్థం:** పురుషముఖ్య= ఉత్తమపురుషుడా!; శ్రోత్రము= శ్రవణేంద్రియం; అధ్యాత్మంబు= అధ్యాత్మము; చూవె= సుమా!; శబ్దంబు= సద్దు; (అక్షర రూపమైన భాషకు ఆధారమైనది శబ్దం) అధిభూతంబు= అధిభూతము (పంచభూత విషయమైనది); దిక్కులు= దిశలు; అధిదైవముల్= అధిదైవములు; చర్మము= త్వగింద్రియము; అధ్యాత్మము= అధ్యాత్మము; అందలి సంస్పర్శము= అందున్న స్పర్శ; అధిభూతసంజ్ఞకంబు= అధిభూతమను పేరుగలది; దానికిన్= ఆ స్పర్శకు; అధిదైవతంబు= అధిదైవము; మరుత్తు= గాలి; నేత్రంబు= చక్షురింద్రియము; తాన్= తాను; అధ్యాత్మకంబు= అధ్యాత్మకము; రూపము= రూపము; అధిభూతము= దానికి అధిభూతము; ఆదిత్యుఁడు= సూర్యుడు; అధిదైవతము= అధి దైవము; జిహ్వ= రసనేంద్రియము; అధ్యాత్మకము= అధ్యాత్మము; రసము= రుచి; ఆరయంగన్= చూడగా; దాని+అధిభూతము= దానియొక్క అధిదేవత; ఉదకము= నీరు; తత్+అధిదైవతంబు= దానియొక్క అధిదేవత; ఘ్రాణము= ఘ్రాణేంద్రియము; అధ్యాత్మంబు= అధ్యాత్మము; తలఁపన్= ఆలోచించగా; అనఘ= పుణ్యాత్ముడా!; గంధము= వాసన; అధిభూతము+అగున్= అధిభూత మవుతుంది; తదీయ= దానికిసంబంధించిన; అధిదైవతంబు= అధిదైవము; మేదిని= భూమి అని; విద్వజ్జనంబు= పండితులైన మనుష్యులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** శ్రవణేంద్రియము అధ్యాత్మము. శబ్దము అధిభూతము; దిక్కులు అధిదైవములు; త్వగింద్రియము అధ్యాత్మము. త్వగింద్రియములోని స్పర్శ అధిభూతము. స్పర్శమునకు అధిదైవతము వాయువు. చక్షురింద్రియము అధ్యాత్మము. చక్షురింద్రియమునకు విషయమైన రూపము అధిభూతము. సూర్యుడు అధిదైవతము. జిహ్వేంద్రియము అధ్యాత్మకము. దానికి విషయమైన రసము అధిభూతము. ఉదకము అధిదైవము. ఘ్రాణేంద్రియము అధ్యాత్మము. దానికి విషయమైన గంధము అధిభూతము. భూమి దానికి అధిదైవతము అని పండితులంటారు.

**వ. ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు. 330**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పినది; బుద్ధి+ఇంద్రియ ప్రపంచంబు= బుద్ధి మొదలైన ఇంద్రియాల సముదాయం.

**సీ. పాద, పాయూ పస్థ, పాణి, వాగ్వర్గంబు । గర్మేంద్రియము లివి నిర్మలాత్మ !**

**యధ్యాత్మములు, వాని కగు నధిభూతముల్ । గంతవ్యమును విసర్గంబు నోలి**

**నానందమును విను మనఘ! కర్తవ్య వ । క్తవ్యంబు లన, నధిదైవతములు**

**వాసుమిత్ర ప్రజాపతి శక్రవహ్నులు । మఱి యహంకారంబు మనసు బుద్ధి**

**తే. పూజితాధ్యాత్మకము, లధిభూతవృత్తి । వెలయు, నభిమానమంతవ్యములును, నిశ్చ**

**యంబు నధిదైవములు, మేధ యమృతకరుఁడు' । బ్రహ్మ మిది వేదవాక్య నిర్ణయవిధంబు. 331**

**ప్రతిపదార్థం:** నిర్మల+ఆత్మ!= స్వచ్ఛమైన ఆత్మ కలవాడా!; పాద= అడుగు; పాయు= గుదము, ముడ్డి; ఉపస్థ= యోని (లింగం); పాణి= చేయి; వాక్= మాట; వర్గంబు= గుంపు; ఇవి; కర్మ ఇంద్రియములు= పనిచేసే ఇంద్రియాలు; వానికిన్+అగు=

వాటికి సంబంధించిన; అధిభూతముల్= భూతసంబంధమైనవి; గంతవ్యమును= పోదగినదియు (నడువదగినది= దూరం కాలికి); విసర్గంబును= విసర్జనమును; (పాయూపస్థలకు సంబంధించిన మలమూత్రాదులు); ఓలిన్= క్రమంగా; వినుము; అనఘ!= దోషరహితుడా!; ఆనందమును= సంతోషం; కర్తవ్య= చేయదగినది; వక్తవ్యంబులు= చెప్పదగినది; అనన్= అనగా; వీటికి అధి దైవతములు= దేవతలు; వాసు= విష్ణువు; మిత్ర=సూర్యుడు; ప్రజాపతి= సృష్టికర్త; శక్ర= ఇంద్ర; వహ్నులు= అగ్ని దేవులు; పాదం= విష్ణువు; పాయువు= సూర్యుడు; ఉపస్థ= ప్రజాపతి; పాణి= ఇంద్రుడు; వాక్కునకు; అగ్ని; అధి దేవతలు; మఱి= ఇంకనూ; అహంకారంబు; మనసు; బుద్ధి - ఇవి; పూజిత= పూజించదగిన అధ్యాత్మకములు; వీటికి అధిభూత వృత్తి= ఆధి భౌతిక వ్యాపారాలు; వెలయున్= ప్రకాశిస్తూ; అభిమాన= పౌరుషం; మంతవ్యములును= మనసు చేయదగినదియును; నిశ్చయంబును= తర్కించి నిశ్చయించటం; అహంకారానికి అభిమానం; అధిభూతం; మనసునకు ఆలోచనకు; బుద్ధికి నిశ్చయజ్ఞానం, వీటికి వరుసగా అధి దైవములు= దేవతలు; మేధ= ప్రజ్ఞ (ఇది అహంకార దేవత); అమృతకరుఁడు= చంద్రుడు; అమృతమే కిరణాలుగా కలవాడు - ఇతడు మనస్సుకు దేవత; బ్రహ్మము= పరాత్పరుడు - బుద్ధికి దేవత.

**తాత్పర్యం:** పాదానికి నడక, పాయువునకు విసర్జనం, ఉపస్థకు ఆనందం, పాణికి కర్తవ్యం, వాక్కునకు వక్తవ్యం వరుసగా అధిభూతములు. వరుసగా పైన చెప్పిన పాదాది కర్మేంద్రియ పంచకానికి దేవతలు. విష్ణువు, సూర్యుడు, బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని. అలాగే అహంకారం, మనస్సు, బుద్ధి అనే అధ్యాత్మములకు పౌరుషం, మంతవ్యం నిశ్చయం అనేవి అధిభూతాలు. మేధ, చంద్రుడు, బ్రహ్మము అనేవి అధిదైవాలు.

**క. ఇవి యెల్ల విష్ణునం దు । ద్భవము లయముఁ బొందుచుండు; బహువీచిక ల**
**ర్ణవమునఁ బొడమి యడఁగుమా । డ్కి విశేషము గల్గ దతనికిన్ విభుఁ డగుటన్. 332**

**ప్రతిపదార్థం:** ఇవి ఎల్లన్= ఇవన్నీ; విష్ణునందున్= విష్ణుమూర్తిలో; ఉద్భవము= పుట్టువు; లయము= మృత్యువును; పొందుచున్+ ఉండున్= పొందుతుంటాయి; అర్ణవమునన్= సముద్రంలో; బహు= అనేక; వీచికలు= అలలు; పొడమి= పుట్టి; అడఁగుమాడ్కిన్= అణగారినట్లుగా; అతనికిన్= ఆ విష్ణువునకు; విభుఁడు+అగుటన్= ప్రభువైనందున; విశేషము= పైన మరొకటి; కల్గదు= ఉండదు.

**తాత్పర్యం:** ఇవన్నీ విష్ణువన్న మహాసముద్రంలో పుట్టి, అణగారిపోయే అలలవంటివి. ఆయనకంటె పైన మరొక సత్యం లేదు. ఆయనే అన్నిటికి ప్రభువు కనుక.

**క. విను మవ్యక్తం బనఁగాఁ । జను, మూలప్రకృతి పురుష చైతన్యము నె**
**క్కొనినం జేతన యగుచు భు । వనతంత్రం బెల్ల నడపు వైభవ మెసఁగన్. 333**

**ప్రతిపదార్థం:** వినుము= విను; అవ్యక్తంబు+అనఁగాన్+చను= అవ్యక్తమనే పేరుతో ప్రకాశించు; మూలప్రకృతి= ఈ కన్పించే సర్వానికి మూలమైన ప్రకృతి; పురుషచైతన్యము= పురుషుడనే చేతనత్వం= ఆత్మ; నెక్కొనినన్= ప్రవేశిస్తే; చేతన అగుచున్= ఆ మూలప్రకృతి ప్రాణవంతమై; భువన తంత్రంబు+ఎల్లన్= ప్రపంచ సృష్టి, స్థితి, లయాదులన్నిటినీ; వైభవము= పరిపాలన; ఎసఁగన్= ప్రకాశించగా; నడపున్= నిర్వహిస్తుంది.

**తాత్పర్యం:** అవ్యక్తమంటే మూలప్రకృతి. దానిలోకి పురుషుడు ప్రవేశిస్తే అది చైతన్యవంతమై సృష్టికార్యాన్ని నిర్వహిస్తుంది.

**ఆ. అట్లు లోకకర్త యగు నంబుజాక్షుండు । పట్టుఁ గొమ్ము, భావభవహరుండు**
**హరుని యనుమతమున నఖిలాబ్జజాండంబు । లట్లు పుట్టఁజేసి, యడఁచుచుండు'. 334**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; లోకకర్త+అగు= లోకాలను నిర్మించినవాడైన; అంబుజ+అక్షుండు= పద్మాలవంటి కనులుగల విష్ణువు; పట్టుఁగొమ్మ= ఈ సృష్టికంతా ఆధారం; భావభవహరుండు= మన్మథుని సంహరించినవాడైన; హరుని= శివుడియొక్క; అనుమతమునన్= అంగీకారముతో; అఖిల= సమస్తమైన; అబ్జజ+అండంబులు= బ్రహ్మాండాలు; పుట్టన్+చేసి= జన్మింపజేసి; అడచుచున్+ఉండున్= లయింపజేస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** లోకకర్త విష్ణువు సమస్త సృష్టికి ఆధారం. ఆయన శివుడి అనుమతితో సమస్తబ్రహ్మాండాలు సృష్టించటం, లయించటం చేస్తూ ఉంటాడు.

**విశేషం:** ఇంతవరకూ రాని శివుడు ఈ పద్యంలో ఎందుకు వచ్చినట్లు? 326వ పద్యంలో రాని శివ ప్రసక్తి ఇక్కడ దేనికి? కనుకనే ఇది చాలా తాళపత్ర ప్రతులలో లేదని గుర్తించటం జరిగింది. ఈ పద్యం లేకపోయినా నష్టం లేదు.

**వ. ఇట్లు సెప్పి సనత్సుజాతుండు నారదుం జరితార్థుం జేసె నని చెప్పి భీష్ముండు భీమాగ్రజుతో వెండియు.335**

**ప్రతిపదార్థం:** ఇట్లు+చెప్పి= ఈవిధంగా వచించి; సనత్సుజాతుండు; నారదున్= నారదుణ్ణి; చరితార్థున్+చేసెన్= ధన్యుని చేశాడు; అని చెప్పి= అనిపల్కి, భీష్ముండు; భీమ+అగ్రజుతోన్= భీముడి అన్నతో, ధర్మరాజుతో; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి సనత్సుజాతుడు నారదుడిని కృతార్థుడిని చేశాడని చెప్పి, భీష్ముడు ధర్మరాజుతో మరలా (ఇట్లా అన్నాడు)

**ఉ. 'ఇంతకు మూలమై, యిరువదేనవ తత్త్వ మనంగ, వేద వే**
**దాంత పురాణవేద్యుఁ డగు నప్పురుషుండు వెలుంగు, వాఁడ కా**
**లాంతకుఁడైన యచ్యుతుఁ డనంతుఁడు, యోగిజనాంతరంగ వి**
**శ్రాంతుఁడు, విష్ణుఁ డద్వయుఁ, డసంగుఁడు గౌరవవంశదీపకా!' 336**

**ప్రతిపదార్థం:** కౌరవ వంశదీపకా!= కౌరవవంశాన్ని వెలిగించినవాడా!; ఇంతకున్= ఇందాక చెప్పిన సృష్టికంతటికి; మూలము+ఐ= ఆధారమై; ఇరువది+ఏనవ= ఇరవై అయిదో; తత్త్వము= సత్యం; అనంగన్; వేద వేద+అంత= వేదాలకు, ఉపనిషత్తులకు; పురాణ= పురాణాలకూ; వేద్యుఁడు= తెలియదగినవాడు; అగు= అయిన; ఆ+పురుషుండు= ఆ తత్త్వమూర్తి; వెలుంగున్= వెలుగొందుతున్నాడు; వాడు+అ= అతడే; కాల+అంతకుఁడు= కాలాన్ని అంతం చేసేవాడు; ఐన= ఐనట్టి; అచ్యుతుఁడు= చెడనివాడు; అనంతుఁడు= అంతంలేనివాడు; యోగిజన= యోగుల; అంతరంగ= హృదయమే; విశ్రాంతుఁడు= సేదే దీరే స్థానంగా ఉన్నవాడు; విష్ణుఁడు= వ్యాపనశీలుడు; అద్వయుండు= ఏకతత్త్వం, రెండవది లేనివాడు; అద్వైతమూర్తి; అసంగుఁడు= దేనియందు తగుల్కొననివాడు.

**తాత్పర్యం:** 'ధర్మజా! ఈ ఇరవైనాలుగు తత్త్వాలకు మూలమైన తత్త్వం ఇరవై ఐదవది విష్ణువన్న పేరున ఉన్న పురుషుడనే పేరు గలది. అది పురాణ, వేద, ఉపనిషత్తులచేత ఎరుగనైనది. కాలమున కంతకుడు, అద్వయుడు, అసంగుడు అతడు. అతడి పేరు విష్ణువు.

**విశేషం:** 24 తత్త్వాల విచారణ చేసింది సాంఖ్యం. అందులో ఈశ్వరతత్త్వం చెప్పబడలేదు. ఈ ఇరవైఐదవతత్త్వం చెప్పింది యోగదర్శనం. కనుకనే కవి - వేదవేదాంత పురాణ వేద్యుడన్నాడు. ఇట్లు తత్త్వం అక్కడే చెప్పబడింది. బ్రహ్మసూత్రాలలో,

భాష్యాలలో ఈ విషయం వ్యాఖ్యానించబడింది. కనుక ఇది యోగదర్శనం లోనిది. ఇందుకే 'యోగి జనాంతరంగ విశ్రాంతుడు' అనబడింది. ఇది చెప్పుమనే ధర్మరాజు అడిగింది.

**వ. అనిన విని యజాతశత్రుండు సరిత్పుత్రునితో 'నియతు లయి యగ్నులు దమయంద సమాహితంబులు సేసికొని మహితాత్ములు నిజాత్మల నప్పరమాత్ము నెట్టివానింగా, భావింతు రెఱింగింపవే' యనుటయు నతనికి భీష్ముం డిట్లనియె. 337**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అజాతశత్రుండు= ధర్మరాజు; న+జాత= పుట్టని; శత్రుండు= శత్రువులు కలవాడు; సరిత్+పుత్రునితోన్= గంగకొడుకు భీష్మునితో; నియతులు+అయి=నియమం కలవారై; అగ్నులు= అగ్నులను; తమ+అందున్+అ= తమలో; సమాహితంబులు చేసికొని= ఆవహింపచేసికొని; మహిత+ఆత్ములు= మహానుభావులు; నిజ= తమ యొక్క; ఆత్మలన్= ఆత్మలలో; ఆ+పరమ+ఆత్మున్= ఆ భగవంతుడిని; ఎట్టివానిన్+కాన్= ఎట్లాంటివాడినిగా, భావింతురు?= భావిస్తారు; చూస్తారు?; ఎఱింగింపవే= తెలుపుమా; అనుటయున్= అని అడుగగా; అతనికిన్= ధర్మజుడికి; భీష్ముండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడిని మరలా ప్రశ్నిస్తున్నాడు. 'నియమంతో అగ్నులను తమలో ఆవహింపచేసికొని మహాత్ములు పరమాత్ముడిని ఎట్లాంటి వాడినిగా భావిస్తారు. చెప్పవే' అని.

**విశేషం:** ఆ రోజులలో వేదం చెప్పిన అగ్నులను ఉపాసించే వారిని గురించి ఈ ప్రశ్న వేయబడింది. గీతలో కూడా ఈ విషయం వస్తుంది.

**క. అమృతోత్పత్తి సమయమున । నమరులకును, దానవులకు నని వాటిలె; నం**
**దమరులు దప్పిం జేడ్పడి । కమలభవుని నాశ్రయింపఁగా నియతిమెయిన్. 338**

**ప్రతిపదార్థం:** అమృత= అమృతం; ఉత్పత్తి= పుట్టుక; సమయమునన్= వేళలో; అమరులకును= దేవతలకూ; దానవులకున్= రాక్షసులకూ; అని= యుద్ధం; పాటిలెన్= కలిగింది; అందున్= ఆ యుద్ధంలో; అమరులు= దేవతలు; డప్పిన్= దప్పికతో; చేడ్పడి= వశంతప్పి, నియతిమెయిన్= నియమంతో; కమలభవునిన్= బ్రహ్మను (పద్మంలో పుట్టినవాడు); ఆశ్రయింపఁగాన్= ఆశ్రయించగా.

**తాత్పర్యం:** సముద్ర మథనంతో అమృతం పుట్టింది. అప్పుడు దేవదానవులకు యుద్ధం జరుగగా అందులో దేవతలకు దప్పి కలిగి, ఆయాసపడి బ్రహ్మను నిష్ఠతో ఆశ్రయించారు.

**వ. అతండు నారాయణు నాత్మయందు నిలిపి. 339**

**ప్రతిపదార్థం:** అతండు= బ్రహ్మ; నారాయణున్= విష్ణుని; ఆత్మఅందున్= తన ఆత్మలో; నిలిపి= స్థాపించుకొని.

**తాత్పర్యం:** బ్రహ్మ నారాయణుడిని హృదయంలో నిలిపికొని.

**తే. 'భక్తవత్సల! పరమాత్మ! పద్మనేత్ర! సర్వభూతమహేశ । ఋక్సామ యజురు**
**పాస్య! సాధుసంరక్షణ పరవిహార! సురలు రిపులచే నలఁగిరి, శరణ మగుము'. 340**

**ప్రతిపదార్థం:** భక్తవత్సల!= భక్తులపై వాత్సల్యము కలవాడా!; పరమాత్మ= పరమేశ్వరా!; పద్మనేత్ర!= తామరపూలవంటి కన్నులున్న వాడా!; సర్వభూత= అఖిల ప్రపంచానికీ; మహేశ!= పరమేశ్వరా; ఋక్= ఋగ్వేదం; సామ= సామవేదం; యజుః = యజుర్వేదంచేత; ఉపాస్య!= ఉపాసించదగ్గవాడా!; సాధు= సత్పురుషులను; సంరక్షణ= రక్షించటమనే కర్మకు; పర= బద్ధుడవై; విహారా!= విహరించేవాడా!; సురలు= దేవతలు; రిపులచేన్= శత్రువులవలన; నలఁగిరి= బాధపడ్డారు; శరణము= దిక్కు; అగుము= కమ్ము.

**తాత్పర్యం:** 'మూడువేదాల ద్వారా ఉపాసించబడే భక్తవత్సలా! పరమాత్మా! సత్పురుషులను రక్షించటమన్న కర్మతో విహరించేవాడా! దేవతలు రాక్షసులవలన బాధపడ్డారు. రక్షించు.

**వ. అని సంస్తుతిపూర్వకంబుగాఁ బ్రార్థించె; నట్టియెడ. 341**

**ప్రతిపదార్థం:** అని; సంస్తుతి= గొప్ప స్తోత్రం; పూర్వకంబుగాన్= ముందు కలదిగా; ప్రార్థించెన్= వేడుకొన్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో

**తాత్పర్యం:** అని స్తుతితో కూడిన ప్రార్థన చేశారు. ఆ సమయంలో.

**విశేషం:** ప్రార్థన స్తుతిపూర్వకంగా ఉంటుంది. కనుక దాని ద్వారా ప్రార్థించారు.

**క. జలదస్వనసన్నిభమై । యెలుఁ గొక్కటి సదలఁ జెలఁగె; 'నే నిదె మిమ్మున్**
**గెలిపింపఁగ వచ్చితి; నను । విలసద్వర్ణములు, గాఢ విశదంబులుగాన్. 342**

**ప్రతిపదార్థం:** ఎలుఁగు+ఒక్కటి= ఒక కంఠస్వరము; జలద= నీటినిచ్చేది, మేఘంయొక్క; స్వన= ఉరుము; సన్నిభమై= పోలినదై; చదలన్= ఆకాశంతో; నేను; ఇదె= ఇదుగో; మిమ్మున్= మిమ్మల్ని; గెలిపింపఁగన్= గెలిపించటానికి; వచ్చితిన్= వచ్చేశాను; అను= అన్న; విలసత్= అందమైన; వర్ణములు= అక్షరాలు; గాఢ= పెద్దగా; విశదంబులుగాన్= స్పష్టంగా; చెలఁగెన్= ధ్వనించింది.

**తాత్పర్యం:** ఆకాశంలో ఉరు మురిమిన ట్లొక ధ్వని వినిపించింది. అందులోనుండి స్పష్టమైన మాటలు ఇట్లా వినిపించాయి - 'ఇదుగో మిమ్మల్ని కాపాడటానికి వస్తున్నాను' అని.

**వ. తదనంతరంబ యకుంఠిత విక్రముం డగు వైకుంఠుండు 343**

**ప్రతిపదార్థం:** తత్= దానికి; అనంతరంబ= అంతరం; ఎడం లేకుండా వెంటనే; అకుంఠిత= మొక్కవోని; విక్రముండు= పరాక్రమం కలవాడు; అగు; వైకుంఠుండు= విష్ణువు.

**తాత్పర్యం:** వెంటనే మొక్కవోని పరాక్రమం కలవాడైన విష్ణువు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** మాటలు విన్పించటం, వెంటనే విష్ణువు రావటం ఒకేసారి జరిగాయి.

**క. గరుడారోహణలీలా । సరభసుఁడై, చక్రగదలు శార్ఙ్గముఁ, జంచ**
**త్కరముల వెలుంగ నడరి య । సురగణములఁ ద్రుంచె సురలు చోద్యంబందన్. 344**

**ప్రతిపదార్థం:** గరుడ+ఆరోహణ= గరుత్మంతుడిపై ఎక్కి; లీలా= అందమైన; సరభసుఁడు+ఐ= ఆటోపం కలవాడై; చక్రగదలు= చక్రము, గద - అనే రెండు ఆయుధాలు; శార్‌ఙ్గము= విల్లు; చంచత్= ఒప్పుతున్న; కరముల= చేతులలో; వెలుంగన్= ప్రకాశించగా; అడరి= విజృంభించి; సురలు= దేవతలు; చోద్యంబు= ఆశ్చర్యం; అందన్= పొందగా; అసురగణములన్= రాక్షస సేనలను; త్రుంచెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడిపై నెక్కి, విలాసంగా తొందర కలవాడై చక్ర గదా శార్‌ఙ్గములనే ఆయుధాలు అందమైన చేతులలో ప్రకాశించగా, రాక్షస సమూహాన్ని సంహరించాడు. అదిచూచి దేవతలు ఆశ్చర్యపడ్డారు.

**వ. ఇట్లు నిర్జించి తత్‌క్షణంబ యతం డంతర్ధానంబు నొందిన సంతసంబును, నచ్చెరువును బెనంగొను డెందంబుతో బృందారక బృందంబు 'లిమ్మహాత్ముం డెవ్వం? డేమి భంగివాఁ డెఱింగింపవే?' యని యడిగిన నజుం 'డితండు విష్ణుండు; వైకుంఠాభిధానం బగు మూర్తి విశేషంబున విహరించె; విష్ణుని విధం బిట్టిదని యెఱుంగను; నెఱింగింపను శక్యం బగునే?' యయిన నొక్క తెఱంగునం దెలిపెడునట్టి యితిహాసంబు గలదు; వినుం 'డని పలికి వినిపించె' ధర్మనందనా! యా నిర్మలవాక్యంబు లుపన్యసించెద; దాన నీయడిగిన యర్థంబు దేటవడు; నాకర్ణింపుము. 345**

**ప్రతిపదార్థం:** ఇట్లు; నిర్జించి= జయించి; తత్‌క్షణంబు+అ= ఆ క్షణంలోనే; అంతర్ధానంబు నొందినన్= అదృశ్యుడు కాగా; సంతసంబును= సంతోషం; అచ్చెరువును= ఆశ్చర్యం; పెనంగొను= ముప్పిరిగొన్న; డెందంబులతోన్= మనస్సులతో; బృందారక=దేవతల; బృందంబులు= సమూహాలు; ఈ+మహాత్ముండు= ఈ మహానుభావుడు; ఏమిభంగివాఁడు?= ఎట్లాంటివాడు; ఎఱింగింపవే= తెలుపవే; అని; అడిగినన్; అజుండు= బ్రహ్మ; ఇతండు= ఈయన; విష్ణుండు= విష్ణువు; వైకుంఠ= వైకుంఠుడనే; అభిదానంబు+అగు= పేరుగల; మూర్తి విశేషంబునన్= ప్రత్యేక ఆకారంతో; విహరించెన్= యుద్ధ విహారం చేశాడు; విష్ణునివిధంబు= విష్ణుడి పద్ధతి; ఇట్టిదని= ఇట్లాంటిదని; ఎఱుంగను= తెలిసికొనటానికిగానీ; ఎఱింగింపను= చెప్పటానికి గానీ; శక్యంబు+అగునే?= సాధ్యమౌతుందా? అయినన్= అయినా; ఒక్క తెఱంగునన్= ఒక పద్ధతిగా; తెలిపెడు+అట్టి= అతడిని గూర్చి చెప్పే; ఇతిహాసంబు= పురాణకథ; కలదు= ఉన్నది వినుండు; అని; పలికి= చెప్పి; వినిపించెన్= తెలియజెప్పాడు; ధర్మనందనా= ధర్మజా!; ఆ నిర్మలవాక్యంబులు= ఆ పుణ్యావాక్యాలను; ఉపన్యసించెదన్= యథాతథంగా చెప్పుతాను; దానన్= దానితో; నీ అడిగిన అర్థంబు= నీ వడిగిన విషయం; తేటపడున్= స్పష్టపడుతుంది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఈ విధంగా జయించి వెంటనే ఆయన అదృశ్యుడు కాగా సంతోషం, ఆశ్చర్యం పెనవేసుకొని పోయిన మనస్సులతో దేవతలు బ్రహ్మను ప్రశ్నించారు. 'స్వామీ! ఈయన ఎవరు? ఎట్లాంటివాడు? అని. బ్రహ్మ అన్నాడు - 'ఆయనే విష్ణువు. వైకుంఠనామధేయంతో ప్రత్యేకరూపంతో విహరించాడు. ఆయన ఇట్లాంటివాడని ఎవరికి తెలుసు? ఎవరు చెప్పగలరు? అయినా ఒకరకంగా ఆయనను గురించి చెప్పే పురాణకథ ఒకటి ఉన్నది' అని బ్రహ్మ వినిపించాడు. దానిని నీకు చెప్పుతాను. ధర్మదేవతకుమారుడా! అది నీ వడిగిన విషయానికి సమాధానమౌతుంది. వినుము!' అని భీష్ముడు చెప్పుతున్నాడు.

### గరుత్మంతుండు మునులకు విష్ణుదేవుని మహిమాతిశయంబు సెప్పుట (సం.13-40-1 (కుంభ))

**సీ. హిమగిరిమీఁద ననేక మునీంద్రులు । సిద్ధులుఁ గూడి గోష్ఠీసుఖంబు**

**ననుభవింపఁగ లీల నచటికి వచ్చి సు । పర్ణుండు వారికిఁ బ్రణతుఁ డగుడు,**

**వా రభినందించి గారవమున సుఖా । సీనుఁ గావించి, యర్చించి, ప్రీతి**

**నతనితో సల్లాపమాచరించుచు నుండి । 'యొక్కటి యడిగెద ముజ్జ్వలాత్మ!'**

**తే. యనిన నాతండు 'ధన్యుండ నైతి; మీర । లెద్ది యడిగెద? రేను నా యెఱిఁగినంత,**

**యతులమతులార ! చెప్పెద' ననుడు, వార । లెలమి నవ్విహగేంద్రున కిట్టు లనిరి. 346**

**ప్రతిపదార్థం:** హిమగిరిమీఁదన్= మంచుకొండమీద, హిమాలయంమీద; అనేక= చాలామంది; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; సిద్ధులున్= దేవతాజాతివారు; కూడి= కలిసికొని; గోష్ఠీ= స్నేహపూర్వక చర్చా సమావేశంయొక్క; సుఖంబు= సౌఖ్యం; అనుభవింపఁగన్= అనుభవిస్తుండగా; లీలన్= విలాసముగా; సుపర్ణుండు= గరుత్మంతుడు (మంచి బలమైన రెక్కలు గలవాడు); అచటికిన్; వచ్చి; వారికిన్= మునిశ్రేష్ఠులకు; ప్రణతుఁడు= నమస్కరించినవాడు; అగుడున్= కాగా; వారు= మునులు సిద్ధులు; అభినందించి= పొగడి; గారవమునన్= గౌరవంతో; సుఖ+ఆసీనున్ గావించి= సుఖమైన ఆసనమందు కూర్చుండబెట్టి; ప్రీతిన్= భక్తితో; అర్చించి= పూజించి; అతనితోన్= సుపర్ణుడితో; సల్లాపము= సంభాషణ; ఆచరించుచున్= చేస్తూ ఉండి; ఉజ్జ్వల+ఆత్మ!= ప్రకాశించే ఆత్మకలవాడా! (దివ్యదృష్టితో చూస్తే తెలిసే విషయం); ఒక్కటి అడిగెదము= ఒక టడుగుతాం; అనినన్= అంటే; ఆతండు= సుపర్ణుడు; ధన్యుండను+ఐతిన్= నేను పవిత్రుడ నైనాను; మీరలు; ఎద్ది= ఏది; అడిగెదరు?= అడుగుతారు?; ఆతుల= సాటిలేని; మతులార!= మనస్సు కలవారలారా!; ఏను= నేను; నా ఎఱిఁగినంతన్= నాకు తెలిసినంత; చెప్పెదన్= చెప్పుతాను; అనుడున్= అనగా; వారలు= ఆ సిద్ధులు, మునులు; ఎలమిన్= సంతోషంతో; ఆ+విహగ+ఇంద్రునకున్= ఆ పక్షిరాజుతో (విహగము= ఆకాశంలో ఎగిరేది= పక్షి); ఇట్టులు= ఈ విధంగా; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ఒకప్పుడు హిమాలయం మీద మునులూ, సిద్ధులూ కూర్చుని ఆధ్యాత్మిక విషయ చర్చ చేస్తూ ఉండగా అక్కడకు గరుత్మంతుడు వచ్చి, వారందరికి నమస్కరించాడు. అతడిని వారు సుఖంగా కూర్చోబెట్టి గౌరవంతో సల్లాపం చేస్తూ 'మహాత్మా! నిన్నొకటి అడగాలని ఉన్నది' అన్నారు. ఆయన 'నేను ధన్యుడనైనాను. మీరేమడుగుతారో అడగండి. నాకు తెలిసినంత చెప్పుతాను' అనగానే వా రిట్లా అన్నారు.

**క. 'ప్రియభక్తుండవు, భక్త । ప్రియుఁడును విష్ణుండు, నీవు ప్రియుఁడై భక్తుం**

**డయి వర్తిం తా విభుకడ । దయఁ దెలియఁగఁ జెప్పవే యతని తెఱఁ గెల్లన్'. 347**

**ప్రతిపదార్థం:** ప్రియ= ఇష్టుడవైన; భక్తుండవు= భక్తుడవు; విష్ణుండు; భక్తప్రియుఁడును= పూజించే వారియందు ప్రేమ కలవాడు; ఆ విభుకడన్= ఆ స్వామి దగ్గర; నీవు; ప్రియుఁడు+ఐ= ఇష్టుడవై; భక్తుండు+అయి= సేవించేవాడవై; వర్తింతు(వు)= ఉంటావు; అతని తెఱఁగు= ఆయన విషయం; ఎల్లన్= అంతా; దయన్= దయతో; తెలియఁగన్= స్పష్టపడేటట్లుగా; చెప్పవే!= విన్పించవా!

**తాత్పర్యం:** 'సుపర్ణా! నీవు విష్ణువునకు ఇష్టుడవైన భక్తుడవు. ఆ స్వామి భక్తులపై వాత్సల్యం కలవాడు. నీవా స్వామి వద్ద ప్రియభక్తుడవై ఉంటావు కనుక ఆయన విషయమంతా దయతో మాకు చెప్పుము'.

**వ. అని యడిగిన నతండు వారల కిట్లనియె. 348**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్= ప్రశ్నించగా; అతండు= గరుత్మంతుడు; వారలకున్= వారికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగగా వారితో సుపర్ణు డిట్లా అన్నాడు.

**క. స్థూలప్రకారమున నీ । త్రైలోక్యము గావఁబూని, దయ చిగురొత్తన్**
**లీలఁ బ్రవర్తింపఁగ మన । మాలోకింతు మది గనుట యనవచ్చునొకో! 349**

**ప్రతిపదార్థం:** దయ= కృప; చిగురొత్తన్= చిగుర్చగా; ఈ త్రైలోక్యము= ఈ ముల్లోకాలను; కావన్+పూని= రక్షించాలని; లీలన్= క్రీడగా; ప్రవర్తింపఁగన్=(భగవంతుడు) ప్రవర్తిస్తున్నాడు; మనము; ఆలోకింతుము= చూస్తున్నాం; స్థూలప్రకారమునన్= స్పష్టంగా కన్పించేటట్లుగా (కొండ గుర్తుగా); అది; కనుటఅనవచ్చున్+ఒకో?= చూచామని చెప్పవచ్చునా?

**తాత్పర్యం:** ఒక విషయాన్ని స్థూలంగా చూచి అది నాకు తెలుసు అని చెప్పలేం కనుక. భగవంతుడు (ఈ సృష్టి చేయటం మనకు తెలియదు కానీ) రక్షిస్తున్నాడు కదా! ఇదే స్థూలంగా మనకు తెలిసింది. ఇంతమాత్రాన ఆయన విషయం సాంతం నాకు తెలుసు నని ఎట్లా చెప్పేది?

**ఉ. ఏనును, మీరు, నేల మఱి యెవ్వరు? దక్షులు, విష్ణుచందమున్**
**బూని యెఱుంగ, నవ్విభుఁడు భూరి దయారతి నాకు నేర్పడం**
**దాను మహాద్భుతంపుఁ జరితంబులు సూపుచు భాషణామృతం**
**బానఁగఁ జేసె నా చెవుల; నవ్విధముం దెలియంగఁ జెప్పెదన్. 350**

**ప్రతిపదార్థం:** ఏనును= నేనూ; మీరున్= మీరూ; ఏల= ఏమిటి?; మఱి= ఇంకా; ఎవ్వరు; విష్ణుచందమున్= విష్ణువు ఉనికి; పూని= పూనుకొని; ఎఱుంగన్= తెలిసికొనటానికి; దక్షులు?= సమర్థులు? ఆ+విభుఁడు= ఆ స్వామి; భూరి= గొప్ప; దయారతిన్= కృపాసక్తితో (నిండు దయతో); నాకున్; ఏర్పడన్= స్పష్టపడేటట్లు; తాను; మహా+అద్భుతంపు= గొప్ప విచిత్రమైన; చరితంబులు= కథలు; చూపుచున్= ప్రదర్శిస్తూ; భాషణామృతంబు= అమృతంవంటి మాటలను; నా చెవులన్= నా చెవులతో; ఆనఁగన్+చేసెన్= త్రాగించాడు; ఆ+విధమున్= దానిని; తెలియంగన్= స్పష్టంగా; చెప్పెదన్= చెప్తుతాను.

**తాత్పర్యం:** ఆ స్వామి విషయం నాకూ మీకూ కాదు కదా మరి ఎవరికీ తెలియదు. కాకపోతే తన కథలు తాను నాకు చూపించి వాటి అర్థాలను నా చెవులలో అమృతంవలె పోశాడు (నింపాడు) కనుక ఆ విషయం మాత్రం చెప్పగలను.

**సీ. అమరేంద్రు నిర్జించి యమృతంబు గొనిపోవు । నప్పుడు వీతెంచె నాకసమున**
**'మెచ్చితి విహగేంద్ర! యిచ్చెద వరము నీ' । కనుమాట యది విని, హర్షమెసఁగ**
**'నెవ్వరో! యెఱుఁగ ని న్నెఱిఁగించి మఱి వర । మి' మ్మంటి, దానికి నెలమి నగుచుఁ**
**'గాలంబుతోఁ గూడఁగా నెఱింగెదవు, వా । హనమవు గమ్ము నా' కనుచుఁ బురుషుఁ**

**తే. డొక్కఁ, డుజ్జ్వల తేజోమయుండు తోఁచి । 'జరయు మరణంబు లేక యసురుల సురల**
**నోర్వఁ జాలిన బలముతో నుల్లసిల్లు' । మనివరం బిచ్చె; నిచ్చిన నధికభక్తి. 351**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్రున్= దేవతలరాజును; నిర్జించి= జయించి; అమృతంబున్= సుధను; కొనిపోవునప్పుడు= తీసికొని పోయేవేళ; ఆకసమునన్= ఆకాశంలో; విహగ+ఇంద్ర!= పక్షిరాజా! మెచ్చితిన్= మెచ్చుకొన్నాను; నీకున్; వరము;

ఇచ్చెదన్= ఇస్తాను; అనుమాట= అన్నమాట; వీతెంచెన్= విన్పించింది; అది విని; హర్షము= సంతోషం; ఎసఁగన్= ఎక్కువ కాగా; నిన్నున్; ఎవ్వరో ఎఱుఁగన్= ఎవరో తెలియదు; ఎఱిఁగించి= తెలిపి; మఱి= తర్వాత; వరమున్= వరాన్ని; ఇమ్ము+అంటిన్= అన్నాను; దానికిన్= నా మాటకు; ఎలమిన్= సంతోషంతో; నగుచున్= నవ్వుతూ; కాలంబుతోన్+కూడఁగాన్= కాలంతోపాటుగా; ఎఱింగెదవు= తెలిసి కొంటావు; నాకున్; వాహనమవు కమ్ము= వాహనానివికా; అనుచున్= అంటూ; ఒక్క పురుషుఁడు= ఒక దేవతామూర్తి; ఉజ్జ్వలతేజో మయుండు= ప్రకాశించే తేజస్స్వరూపుడు; తోఁచి= కన్పించి; జరయున్= ముసలితనం; మరణంబున్= మృతీ; లేక= లేకుండా; అసురులన్= రాక్షసులను; సురలన్= దేవతలను; ఓర్వన్+చాలిన= ఎదిరించి నిలువగల; బలముతోన్= బలంతో; ఉల్లసిల్లుము= కీర్తి పొందుము, వెలుగొందుము; అని; వరంబు; ఇచ్చెన్; ఇచ్చినన్= ఇవ్వగా; అధికభక్తిన్= ఎక్కువభక్తితో. (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** నేను దేవేంద్రుడిని జయించి అమృతం తెస్తున్నపుడు ఆకాశంలో 'పక్షిరాజా! నిన్ను మెచ్చానోయి. నీకు వరమిస్తాను' అన్నమాట విన్పించింది. విని సంతోషంతో నే నన్నాను 'నీ వెవ్వరవో తెలిపి తర్వాత వర మిమ్ము' అన్నాను. దాని కాయన నవ్వి 'కాలం తోడ్పాటుతో నీకు నా సంగతి తర్వాత తెలుస్తుంది. నాకు వాహనానివి కమ్ము. సురాసురులను జయించే బలం నీ కిస్తున్నాను' అంటూ ఒక మహావ్యక్తి కళ్ళు మిరుమిట్లు గొలిపే తేజస్సుతో కన్పించి వర మిచ్చాడు. ఇవ్వగా నేను మిక్కిలి భక్తితో.

**వ. ఏను దండప్రణామం బాచరించి. 352**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; దండ= కట్టెవలె పడి; ప్రణామంబు= సాష్టాంగనమస్కారం; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** నేను దండప్రణామం చేసి.

**క. 'నీ వాహన మయ్యెద, రథ। మీ వెక్కినఁ గేతువై వహింతుఁ బెనుపు, నా**
**కీ వరము నిచ్చి మనుపుము'। నావుడు 'నవుఁ గాక!' యని మనఃప్రియ మెసఁగన్. 353**

**ప్రతిపదార్థం:** నీ వాహనము+అయ్యెదన్= నీకు వాహన మౌతాను; ఈవు; రథము+ఎక్కినన్= రథమెక్కితే; కేతువై= జెండామీద గుర్తునై; పెనుపున్= పెంపును; వహింతున్= పొందుతాను; నాకున్; ఈ వరమున్; ఇచ్చి; మనుపుము= కాపాడుము; నావుడున్= అనగా; అవున్+కాక= సరే; అని; మనఃప్రియము= మనస్సంతోషం; ఎసఁగన్= ఎక్కువ కాగా.

**తాత్పర్యం:** నేను నీకు వాహనమౌతాను. నీవు రథమెక్కినప్పుడు జెండామీద గుర్తునై కీర్తి పొందాలని ఉన్నది. నాకీ వర మిచ్చి రక్షించుము. అని అనగా సరే లెమ్మని, నా మనస్సునకు సంతోషం కలిగేటట్లుగా. (తరువాతి వచనంతో అన్వయం)

**ఉ. పలికి యంతర్హితుం డయ్యెఁ; నంత సంతసంబు నచ్చెరువు బెరయు మనంబుతో మదీయ జనకుపాలికిం జని, యీ వృత్తాంతం బెఱింగించిన, నతండు వికసిల్లుచు నా వదనంబు వీక్షించి 'ధన్యుండ వైతి; వమ్మహాత్ముండు నారాయణుండు; నీ వలని యనుగ్రహంబున సల్లాపసౌఖ్యంబుఁ బ్రసాదించెఁ; దపంబున నేక యోగసమాధి నవలంబించి యేను దన్నెఱుంగుటం గోరి యారాధించిన నాకు నీల, శ్వేత, పీతారుణ పింగళంబును బహూదర పాదపాణి శిరో నేత్రంబును నైన దివ్యగాత్రంబు సూపి, 'సంగంబు గల యంతరంగంబున న న్నెఱుంగ వచ్చునే;**

**నిస్సంగుండవై యెఱింగెదవు గాక!' యనియె; నట్టి యవ్విశ్వరూపునకు శాశ్వతపరిచర్య సేయంగల వాఁడ వగుటం గృతార్థతం బొందితి; బదరికాశ్రమంబున కరిగి యచ్చట సకల లోకసేవ్యుం డగు నా భవ్యమూర్తి సేవింపు' మని యానతిచ్చిన, నయ్యెడకు ముదంబునం బొదలుచుం బోయి. 354**

**ప్రతిపదార్థం:** పలికి; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడై పోయాడు; అంతన్= తర్వాత; సంతసంబున్= సంతోషం; అచ్చెరువున్= ఆశ్చర్యం; బెరయు= పెనగొను; మనంబుతోన్= మనస్సుతో; మదీయ= నా; జనకు పాలికిన్= తండ్రి దగ్గరకు; చని= పోయి; ఆ వృత్తాంతంబు= ఆ విషయం; ఎఱింగించినన్= చెప్పగా; అతండు= నాతండ్రి; వికసిల్లుచున్= సంతోషిస్తూ; నా వదనంబు= నా ముఖం; వీక్షించి= చూచి, ధన్యుండవు= అదృష్టవంతుడవు; ఐతివి; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; నారాయణుండు= విష్ణువు; నీవలని= నీమీద, అనుగ్రహంబునన్= దయతో; సల్లాప= సంభాషణ; సౌఖ్యంబున్= సుఖం; ప్రసాదించెన్= అనుగ్రహించాడు; తపంబునను= తపస్సుతో; ఏకయోగసమాధిని= మిక్కిలి ఏకాగ్రత కల యోగసమాధిని; అవలంబించి= ఆధారంగా చేసికొని; ఏను= నేను; తన్నున్= తనను; ఎఱుంగుటన్+కోరి= తెలిసికొనాలన్న కోరికతో; ఆరాధించినన్= ఉపాసించగా; నాకున్, నీల= ఊదారంగు; శ్వేత= తెలుపు; పీత= పసుపు; అరుణ= ఎరుపు; పింగళంబును= వైడూర్యంరంగు కల; బహు= అనేక; ఉదర=పొట్టలు; పాద= కాళ్ళు; పాణి= చేతులు; శిరోనేత్రంబును+ఐన= శిరస్సులు కళ్ళు కల; దివ్యగాత్రంబు= దివ్యమైన శరీరాన్ని; చూపి= చూపించి; సంగంబు= రక్తి; కల; అంతరంగంబునన్= అంతఃకరణంతో; నన్నున్; ఎఱుంగవచ్చునే?= చూడగలవా?; నిస్సంగుండవు+ఐ= విరక్తి కలవాడవై; ఎఱింగెదవు గాక= తెలిసికొనగలవు; అనియెన్= అని అన్నాడు; అట్టి= అట్లాంటి; ఆ విశ్వరూపునకున్= లోకమే శరీరంగా కలవాడికి; శాశ్వత= నిత్యం; పరిచర్య= సేవ; చేయన్+కలవాఁడవు+అగుటన్= చేయగలిగే స్థితి పొందావు కనుక; కృత+అర్థతన్= ధన్యతను; పొందితి(వి)= పొందావు; బదరికా+ఆశ్రమంబునకున్= ఆ పేరుగల ఆశ్రమం (బదరి= రేగుచెట్లు! కల వనంలో ఉన్నందున ఆ పేరు వచ్చింది); అరిగి= పోయి; అచ్చటన్= అక్కడ; సకల లోక= లోకాలన్నిటికిని; సేవ్యుండు= పూజించదగినవాడు; అగు= ఐన; ఆ భవ్య= ఆ దివ్య; మూర్తిన్= రూపుడిని; సేవింపుము= పూజించుము; అని; ఆనతి= ఆజ్ఞ; ఇచ్చినన్= ఇవ్వగా; ఆ+ఎడకున్= ఆ చోటికి; ముదంబునన్= సంతోషంతో; పొదలుచున్= పొంగుతూ; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** అట్లా చెప్పి అదృశ్యుడు కాగా, నేను సంతోషం, ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరై పోయి వెళ్ళి, మా తండ్రిగారితో ఆ వృత్తాంతం చెప్పగా ఆయన నా ముఖం చూస్తూ, ఉల్లాసంతో 'నీవు అదృష్టవంతుడవయ్యా! ఆయన శ్రీమన్నారాయణుడు. నీమీద అనుగ్రహంతో నీ కా సంభాషణ ప్రసాదించాడు. సంతోషం. నేను ఏకభుక్తుడనై తపస్సు చేస్తే నీ కాయన నీలం, తెలుపు, ఎరుపు, వైడూర్యం (పిల్లి కళ్లకాంతి) రంగులు గల తన దివ్యమూర్తిని చూపించి అన్నాడు - 'నన్ను విరక్త బుద్ధితో చూడగలవు తప్ప లోకరక్తి గల మనస్సుతో చూడలేవు' అని. అట్లాంటి దివ్యమూర్తికి నిత్యం సేవ చేసే భాగ్యం నీకు కలిగింది. బదరికావనానికి పోయి ఆ స్వామిని సేవించుకో' మ్మని ఆజ్ఞాపిస్తే, నేను సంతోషంతో వెళ్ళి.

**సీ. అచట నారాయణు, నచ్యుతుహరిఁ బుండ । రీకాక్షుఁ, గోవిందు, లోకజనకుఁ**
**గని, భక్తిఁ బ్రణమిల్లి వినుతిసేయంగఁ, బీ । తాంబర కలితమై యష్టభుజము**
**శంఖ చక్రగదా సిశార్ఙ్గ ధరంబును । నైనరూపము దాల్చి యవ్విభుండు**
**సిఱునవ్వుతోడ 'వచ్చితి మేలు సేసితి । ర' మ్మంచుఁ దా నుత్తరంపుఁ దూర్పు**

**తే. దెసకు నల్లన పోవఁ బెంపెసఁగఁ గడఁగి । పాఱ వలయు; నా కెమ్మెయి బహుసహస్ర**
**యోజనంబులునని వితతోజ్జ్వలాగ్ని । యద్భుతముగ ననింధన మై వెలుంగ. 355**

**ప్రతిపదార్థం:** అచటన్= బదరికాశ్రమంలో; నారాయణున్, అచ్యుతున్, హరిన్; పుండరీక+అక్షున్= పద్మంవంటి నేత్రాలు గలవాడిని; గోవిందున్; లోకజనకున్= లోకాలకు తండ్రిని; కని= చూచి; భక్తిన్= భక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి; వినుతిచేయంగన్= స్తుతించగా; పీత+అంబర= పచ్చని పట్టువస్త్రంతో; కలితము+ఐ= కూడినదై; అష్టభుజము= ఎనిమిది భుజాలు కలిగి; శంఖ= శంఖం; చక్ర= చక్రం, గదా= గద; అసి= కత్తి; శార్ఙ్గము= విల్లు; ధరంబును+ఐన= ధరించినదైన; రూపము= ఆకారం; తాల్చి= ధరించి; ఆ+విభుండు= ఆ ప్రభువు; చిఱు= చిన్న; నవ్వుతోడన్= నవ్వుతో; వచ్చితి(వి)= వచ్చావు; మేలు= మంచి; చేసితి(వి)= చేసావు; రమ్ము+అంచున్= రమ్మంటూ; తాను; ఉత్తరంపుఁ దూర్పు దెసకున్= ఈశాన్య దిక్కునకు; అల్లన= నెమ్మదిగా; పోవన్= పోగా; పెంపు= ఆధిక్యం; ఎసఁగన్= ఎక్కువ కాగా; కడఁగి= ప్రయత్నంతో; నాకున్= నాతో; పాఱవలయున్= పరుగెత్తాలి; బహు= అనేక; సహస్ర= వేల; యోజనంబులు= ఆమడలు; అని; వితత= విస్తారమైన; ఉజ్జ్వల= వెలిగే; అగ్ని= నిప్పు; అద్భుతముగన్= ఆశ్చర్యంగా; అనింధనము+ఐ= ఇంధనం (కట్టె) లేకుండా; వెలుంగన్= ఆ అగ్ని వెలుగగా. (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** అక్కడ అచ్యుతుడు, పద్మాక్షుడు, గోవిందుడు సర్వలోకాలకు తండ్రి అయిన శ్రీమన్నారాయణుడికి భక్తితో నమస్కరించి స్తుతించగా ఆయన పీతాంబరం, ఎనిమిది భుజాలలో, శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గములను దాల్చిన రూపముతో, చిరునవ్వుతో ఇట్లా అన్నాడు. 'మంచిది వచ్చావు. నాతో రమ్ము! అంటూ ఈశాన్య దిక్కునకు పోయాడు. నేనూ ఆయన వెంటనంటి అనేక వేలయోజనాలదూరం పరుగెత్తవలసి ఉంటుందని భావించాను. ఎదురుగా ఒక మహాద్భుతమైన అగ్ని కట్టెలు లేకుండా మండుతున్నది.

**వ. కని, యప్పావకుం బావకద్యుతి యగు నమ్మహాయోగి ప్రవేశించి, యందు శివాసహితుం డై శివుండు దపంబుసేయఁ దదీయ సంవిత్సౌఖ్యం బనుభవించి, యయ్యనలంబు గడచి యరుగుచుండ, నేనును బథిశ్రమాభిభూతుండ నగుచు విడువక వెనుకఁ బోవు చుండితి; నిట్లు మఱియునుం బెద్దయు దవ్వు సని యద్దేవుండు భాస్కరకిరణంబులకుం బ్రవేశంబు లేని మహాతమంబు సొచ్చె; నచ్చటం జూడ్కిసెడి మూఢత్వంబు నొంది. 356**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఆ+పావకున్= ఆ అగ్నిదేవుడిని; పావక ద్యుతి+అను= అగ్నివంటి కాంతికలిగిన; ఆ+మహాయోగి= ఆ మహాయోగమూర్తి (విష్ణువు); ప్రవేశించి= అగ్నిలోచొచ్చి; అందున్= ఆ అగ్నిలో; శివా= పార్వతితో; సహితుండు+ఐ= కూడినవాడై; శివుండు= ఈశ్వరుడు; తపంబుచేయన్= తపస్సు చేస్తూ ఉండగా; తదీయ= దానికి సంబంధించిన; సంవిత్= జ్ఞానం; సౌఖ్యంబు= సంతోషం (శివుని తపస్సు చూస్తూ జ్ఞానానందాన్ని పొంది); ఆ+అనలంబున్= ఆ అగ్నిని; కడచి=దాటి; అరుగుచుండన్= పోతూ ఉండగా; నేనునున్= నేనుకూడా; పథిశ్రమ= మార్గశ్రమతో; అభిభూతుండను= అలసట పొందినవాడను; అగుచున్; విడువక= వదలక; వెనుకన్= వెన్నంటి; పోవుచుండితిన్= పోతూనే ఉన్నాను; ఇట్లు= ఈ విధంగా; మఱియునున్= ఇంకా; పెద్దయున్దవ్వు= చాలా దూరం; చని= పోయి; ఆ+దేవుండు= ఆ భగవంతుడగు విష్ణువు; భాస్కర= సూర్యుడి; కిరణంబులకున్= కిరణాలకున్నూ; ప్రవేశంబు లేని= దూరటానికి వీలుకాని; మహాతమంబు= గొప్ప చీకటిలోనికి; చొచ్చెన్= ప్రవేశించాడు; అచ్చటన్= అక్కడ; చూడ్కి= చూపు; చెడి= చెడిపోయి; మూఢత్వంబును+ఒంది= దారి తెన్నూ తెలియనివాడనై.

**తాత్పర్యం:** అగ్నివంటి ఆ మహాయోగి అగ్నిలో ప్రవేశించాడు. అక్కడ పార్వతీ సహితుడై శివుడు తపస్సు చేస్తున్నాడు. అది చూచి జ్ఞానసౌఖ్యం పొంది, ఆ అగ్నిని దాటి పోతున్నాడు స్వామి. నేను మార్గాయాసం లెక్క చేయక వెనకనే పోతున్నాను. ఈ విధంగా పోయి పోయి సూర్యకిరణాలు కూడా ప్రవేశించ వీలులేని అంధకారంలోనికి ప్రవేశించేసరికి, నాకు దిక్కు తెన్ను తెలియక. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఆ దేవుఁ జిత్తమున నిడి । 'యాదిపురుష! కరుణ నన్ను నరయుము; మెచటికో**
**యేది గతియొ నా?' కనఁగా । 'నీ దెస ర' మ్మనుచుఁ దీపుటెలుఁగుం జూపెన్. 357**

**ప్రతిపదార్థం:** ఆ దేవున్= ఆ స్వామిని; చిత్తమునన్= బుద్ధిలో; ఇడి= పెట్టుకొని; ఆదిపురుష!= సృష్టికి మొదలైనస్వామీ!; కరుణన్= దయతో; నన్నున్; అరయుము= చూడుము; ఎచటికో= ఈ ప్రయాణ మెక్కడకు; ఏది గతియొ= ఏది దిక్కో; నాకున్?; అనఁగాన్= అనేసరికి; ఈ దెస= ఈ దిక్కునకు; రమ్ము; అనుచున్; తీపు+ఎలుఁగు= ఒక తీయని కంఠస్వరాన్ని; చూపెన్= ప్రదర్శించాడు.

**తాత్పర్యం:** ఆ దేవుడినే మనస్సులో పెట్టుకొని 'ఆదిపురుషా! (పరమాత్మా!) ఈ ప్రయాణం ఎక్కడికో తెలియదు. నా కేది గతి?' అనేసరికి ' ఈ దెసకు రమ్మ!' అన్న ఒక తీయని కంఠధ్వని వినిపించింది.

**క. మది ఖేదము, మై దప్పియుఁ । గదిరిన నే శరణు వేఁడఁగా దమ మెల్లం**
**దుది వోయి లేక తక్కెను । హృదయానందకర మైన యెడయై యుండెన్. 358**

**ప్రతిపదార్థం:** మదిన్= మనస్సులో; ఖేదము= దైన్యం; మైన్= శరీరంలో; దప్పియున్= దప్పిక, ఆయాసం; కదిరినన్= కలుగగా; నేన్= నేను; శరణు వేఁడఁగాన్= ఆశ్రయం కోరగా; తమము+ఎల్లన్= చీకటిఅంతా; తుదిన్= చివరకు; పోయి= అంతరించి, నశించి; లేక= కొంచెమూ మిగలక; తక్కెను= లోపించింది; హృదయ+ఆనందకరము=హృదయానికి ఆనందాన్ని కల్గించిన; ఎడయై= సమయమై; ఉండెన్= ఉన్నది.

**తాత్పర్యం:** మనస్సులో దుఃఖం, శరీరంలో శ్రమ కలిగేసరికి నేను శరణు కోరాను. ఆ చీకట్లన్నీ కొంచెం కూడా మిగలకుండా అంతరించాయి. ఆ సమయ మెంత ఆనందాన్ని కల్గించిందో చెప్పలేను.

**తే. పట్టపగలింటి సూర్యుని పగిది నతఁడు । దోఁచెఁ సూర్యేందు తారక ద్యుతుల కచటు**
**గోచరము గాదు; దేవతాకోటి యాది । యైన జంతువులకు నగమ్యస్థలంబు. 359**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భగవంతుడు; పట్టపగలింటి= పట్టపగటియందలి; సూర్యుని పగిదిన్= సూర్యుడివలె; తోఁచెన్= వెలుగుతున్నాడు; తారక= నక్షత్ర; ద్యుతులకున్= కాంతులకు; అచటు= ఆ స్థలం; గోచరము కాదు= కన్పించదు; దేవతాకోటి= దేవతల సమూహం; ఆది= మొదలు, ఐన= కాగల; జంతువులకున్= జీవులకు; అగమ్య స్థలంబు= పోరానిచోటు.

**తాత్పర్యం:** ఆయన మిట్టమధ్యాహ్నం సూర్యుడివలె వెలుగుతున్నాడు. చుక్కల కాంతుల కా చోటు కన్పించదు. దేవతలు మొదలైన జీవులకు పోరానిచోటు.

**క. దుందుభి నిస్వనములు, నా । నందనమృదుమధుర గీతనాదములుఁ జెవిం**

**బొందె మకరందబిందు । స్యంది కమల సుభగ నదులు నచ్చటఁ దోఁచెన్. 360**

**ప్రతిపదార్థం:** దుందుభి= భేరుల; నిస్వనములు= ధ్వనులు; ఆనందన= ఆనందంతో; మృదు= మెత్తని; మధుర= తీయని; గీత= పాటల; నాదములు= ధ్వనులు; చెవిన్= చెవులను; పొందెన్= పొందాయి; మకరంద= తేనె; బిందు= బొట్లు; స్యంది= స్రవించే; కమల= తామరపూలతో, సుభగ= అందమైన; నదులును= ఏరులుకూడా; అచ్చటన్= అక్కడ; తోఁచెన్= కన్పించాయి.

**తాత్పర్యం:** భేరీ నినాదాలు ఆనందంతో నిండిన మెత్తని తీయనిపాటల సంగీతాలూ వినిపించాయి. తేనెను స్రవించే తామరపూలతో అందమైన నదులూ అక్కడ వెలిశాయి.

**క. సురలకు నిమ్మెయిఁ దేజ । స్స్ఫురణము లేదన్న యట్టిపొలుపున వెలుఁగన్**

**నరులం గొందఱఁ గాంచితి । దరుణులనుం గంటి నద్భుతతమాకృతులన్. 361**

**ప్రతిపదార్థం:** సురలకున్= దేవతలకు కూడా; ఈ+మెయిన్= ఈ విధంగా; తేజఃస్ఫురణము= కాంతి ప్రకాశం; లేదన్న అట్టి= లేదు అనిపించే; పొలుపునన్= అందంతో; వెలుఁగన్= ప్రకాశించే; నరులన్= మనుష్యులను; కొందఱన్= కొంతమందిని; కాంచితిన్= చూచాను; అద్భుతతము= మిక్కిలి విచిత్రమైన; ఆకృతులన్= ఆకారాలు కల; తరుణులనున్= ఆడవారిని కూడా; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** దేవతలకు కూడా ఇట్లాంటి తేజస్సు లేదనిపించే మగవారినీ, ఆశ్చర్యకరమైన రూపవతులు కొందరు స్త్రీలనూ చూచాను.

**తే. వారు పూజ లొనర్పంగ గారవంపుఁ । జూడ్కి నద్దేవుఁ డందఱఁ జూచు చరిగె;**

**మఱియు నట తత్ప్రదేశంబు మహితవహ్ని । మయతఁ జేసి భయంకర మయి వెలింగె. 362**

**ప్రతిపదార్థం:** వారు= ఆ స్త్రీ పురుషులు; పూజలు+ఒనర్పంగన్= పూజలు చేయగా, ఆ+దేవుఁడు= ఆ భగవంతుడు; గారవంపు= ముద్దుచేసే; చూడ్కిన్= చూపుతో; అందఱన్= అందరినీ; చూచుచున్= చూస్తూ; అరిగెన్= వెళ్ళాడు; మఱియున్= ఇంకా; అటన్= అక్కడ; తత్ప్రదేశంబు= ఆ చోటు; మహిత= దివ్యమైన; వహ్నిమయతన్+చేసి= అగ్నిమయమైన కారణంగా; భయంకరము+అయి= భయము కొల్పుతూ; వెలింగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** వారంతా పూజిస్తూ ఉండగా, ఆ స్వామి వారిని వాత్సల్యంతో చూస్తూ వెళ్ళాడు. ఆ ప్రదేశమంతా అగ్నిమయంగా ఉన్నందున భయంకరంగా వెలిగిపోయింది.

**వ. అచ్చట నే నతనిం గానక. 363**

**ప్రతిపదార్థం:** అచ్చటన్= పైన వర్ణించిన తేజోమయలోకంలో; నేను; అతనిన్= భగవంతుని; కానక= చూడలేక.

**తాత్పర్యం:** అక్కడ నేను అతడిని చూడలేక.

**క. భ్రమ గొని యద్దేవునిఁ జి । త్తమునం దిడి 'శరణు శరణు, దయఁ గావుము' న**

**న్న మితైశ్వర్య ! యనుడు శ్రీ । తమధుర లలితాక్షరముగఁ దా నిట్లనియెన్. 364**

**ప్రతిపదార్థం:** భ్రమకొని= భ్రాంతిపడి; ఆ+దేవునిన్= ఆ స్వామిని; చిత్తమునందున్= మనస్సులో; ఇడి= పెట్టుకొని; అమిత= అమితమైన; ఐశ్వర్య!= సంపద కలవాడా!; (ఈశ్వర!= ఈశ్వరత్వం కలవాడు) ఈశ్వరత్వమంటే సర్వాధికారం - సంపద - శాసించే శక్తి అని అర్థం); శరణు= దిక్కు నీవే; దయన్= దయతో; నన్నున్; కావుము= రక్షించుము; అనుడున్=అనగా; శీత= చల్లని; మధుర= తీయని; లలిత= కోమలమైన; అక్షరముగన్= అక్షరాలు కల మాటలతో; తాను= భగవంతుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** నాకు భ్రాంతి కలిగి దిక్కు తోచక ఆ స్వామిని మనస్సులో నుంచుకొని శరణని ప్రార్థించేసరికి ఆయన చల్లగా మధురంగా కోమలంగా ఇట్లా అన్నాడు.

**క. 'నిను నే మఱతునె? నీదగు। జనకునిచే నన్ను విని సుసంగతమతివై**
**చనుదెంచు టే నెఱుంగనె? వినతాసుత! యిందు రమ్ము, విడువుము భయమున్. 365**

**ప్రతిపదార్థం:** వినతాసుత!= వినతా కుమారా!; నినున్= నిన్ను; నేన్= నేను; మఱతునె?= మరిచిపోతానా?; నీదగు= నీ యొక్క; జనకునిచేన్= తండ్రివలన; నన్నున్ విని= నన్ను గురించి విని; సుసంగతమతివి+ఐ= నాయందు చక్కగా లగ్నమైన మనస్సుగలవాడవై; చనుదెంచుట= రావటం; ఏన్= నేను; ఎఱుంగనె?= ఎరుగనా? ఇందున్ రమ్ము= ఇట్లా రమ్ము; భయమున్ విడువుము= భయాన్ని విడిచిపెట్టుము.

**తాత్పర్యం:** 'వినతాకుమారా! నిన్ను నేను మరచిపోతానా? నీ తండ్రివలన నన్ను గురించి విని నా దర్శనం కొరకు వచ్చావుకదా! భయం దేనికి? ఇట్లా రమ్ము.

**వ. నన్నుం గానమికిం గలంక వలవదు. 366**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; కానమికిన్= చూడకపోవటం వలన; కలంక= దుఃఖం; వలవదు= వద్దు.

**తాత్పర్యం:** నన్ను చూడలేనందుకు కలత పడవద్దు.

**క. మమకారాహంకారము। ల మతిం జొరనీక, నిశ్చలంబగు చూడ్కిన్**
**సమవేతరూపు నన్నున్। శమభరితాత్మకులు గంద్రు సారవిచారా! 367**

**ప్రతిపదార్థం:** సార విచారా!= సారవంతమైన ఆత్మ వివేకం కలవాడా!; మమకార= నా దనే వ్యామోహం; అహంకారములన్= నేను అనే గర్వం; మతిన్= మనస్సులో; చొరనీక= ప్రవేశించనివ్వక; నిశ్చలంబు+అగు= చలించని, ఏకాగ్రమైన; చూడ్కిన్= చూపుతో; సమవేతరూపున్= విశ్వరూపుడనైన; నన్నున్= నన్ను; శమ= శాంతి; భరిత= నిండిన; ఆత్మకులున్= ఆత్మకలవారు; కంద్రు= చూస్తారు.

**తాత్పర్యం:** ఆత్మ విచారణ కలవాడా! మమకారం, అహంకారం మనస్సులో ఏమాత్రం ప్రవేశించనివ్వకుండా, ఏకాగ్రమైన చూపుతో విశ్వస్వరూపుడను, సర్వాత్ముడను ఐన నన్ను శాంతి నిండిన ఆత్మకలవారు చూస్తారు.

**తే. నీవు నామీఁది వేడుక నెఱయ నిష్ఠ। తోడఁ దలఁచుట మామక స్థూలరూప**
**దర్శి వై యుండు; దని నన్ను దయదలిర్ప। గారవించిన ననలంబు క్రందు వాసె. 368**

**ప్రతిపదార్థం:** నీవు; నామీఁది= నాపైన; వేడుక= కోరిక; నెఱయన్= నిండుగా; నిష్ఠతోడన్= నియమంతో; తలఁచుట= భావించటం; మామక= నాదైన; స్థూలరూప= బాహ్యరూపాన్ని; దర్శివి= చూచేవాడివి; ఐ ఉండుదు+అని= ఐ ఉంటావని; నన్నున్= నన్ను; దయ తలిర్పన్= దయ చిగురించగా; గారవించినన్= మన్నించగా; అనలంబు= అగ్ని సంబంధమైన; క్రందు= బాధ; పాసెన్= పోయింది.

**తాత్పర్యం:** నీవు నిష్ఠతో నన్ను భావించటంవలన నా స్థూలరూప దర్శనం కలవాడివై ఉండగల' వని దయతో చెప్పేసరికి అగ్ని వేడి బాధ ఉపశమించింది.

**వ. ఇవ్విధంబున సుఖిం జేసి ననుం గొలిపించుకొని మఱియు దవ్వుసని యాకాశంబున కెగసిన నేనుం దోన తగిలిపోవ నంతర్ధానంబు సేసె; నిట రమ్మను నెలుంగ యాధారంబుగా నా చక్కటికిం బోయి. 369**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; సుఖిన్+చేసి= నన్ను సుఖపడేటట్లు చేసి; ననున్= నన్ను; కొలిపించుకొని= సేవించుకొనేటట్లు చేసి; మఱియున్= ఇంకా; దవ్వు= దూరం; చని= వెళ్ళి; ఆకాశంబునకున్= మింటిపైకి; ఎగసినన్= ఎగిరిపోగా; నేనున్= నేను కూడా; తోన= వెన్నంటి; తగిలి= అంటుకొని; పోవన్= పోగా; అంతర్ధానంబు చేసెన్= అదృశ్యుడై పోయాడు; ఇటన్= ఇక్కడకు; రమ్ము= రా; అను= అన్న; ఎలుంగు+అ= కంఠధ్వనియే; ఆధారంబుగాన్= ఆశ్రయంగా, ఊతగా; ఆ చక్కటికిన్+పోయి= ఆ ప్రదేశానికి వెళ్ళి.

**తాత్పర్యం:** ఈ రకంగా నన్ను సుఖపెట్టి నా సేవ లందుకొని ఇంకా దూరంపోయి ఆకాశాని కెగిరి అదృశ్యుడు కాగా, నేను కూడా వెంబడించి 'ఇలా రా' అన్న మాటనే ఆధారంగా గ్రహించి ఆ ప్రదేశానికి వెళ్ళాను.

**క. కమనీయహంస కుల సం । గమశోభిత మైన యొక్క కమలాకరముం**
**బ్రమదమున దాన నవగా । హము సేయుచునున్న తన్ను నచటం గంటిన్. 370**

**ప్రతిపదార్థం:** కమనీయ= అందమైన; హంసకుల= అంచల గుంపుయొక్క; సంగమ= కలయికతో; శోభితము+ఐన= సుందరమైన; ఒక్క; కమల+ఆకరమున్= తామరపూలకు నిలయమైన చెరువును; ప్రమదమునన్= సంతోషంతో; దానన్= దానియందు; అవగాహము= స్నానం; చేయుచున్+ఉన్న= చేస్తున్న; తన్నున్= తనను; అచటన్= అక్కడ; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** అందమైన హంసల గుంపులు చేరటం చేత మరీ అందంగా ఉన్నట్టిదీ, తామరపూలతో అందమైనదీ అయిన చెరువునూ, తా నొక్కడే అందులో స్నానం చేస్తున్న భగవంతుడినీ చూచాను.

**క. నా దిక్కు కనుంగొని, తా । నాదరమునఁ బిల్చె; నేను నచటికిఁ జని యం**
**దాదేవునిఁ గానమికి వి । షాదం బందుమదితోడఁ జంచల దృష్టిన్. 371**

**ప్రతిపదార్థం:** నా దిక్కు= నా వైపు; కనుంగొని= చూచి; తాను; ఆదరమునన్= ఆదరంతో; పిల్చెన్= పిలిచాడు; నేనున్; అచటికిన్; చని; అందున్= అక్కడ; ఆ దేవునిన్= ఆ భగవంతుడిని; కానమికిన్= చూడలేక పోవటంవలన; విషాదంబు= దుః ఖం; అందు= పొందు; మదితోడన్= మనస్సుతో; చంచల= చలించే; దృష్టిన్= చూపుతో.

**తాత్పర్యం:** నా వైపు చూచి ప్రేమతో పిలిచినందువలన వెళ్ళగా, ఆయన కన్పించలేదు. నేను దుఃఖంతో వెతికే చూపులతో (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. కలయఁగఁ జూడ నద్భుతము గాఁగ ననేక శతాగ్నిహోత్రముల్**
**వెలుఁగుట గానవచ్చె, బహువేదరవంబులు వింటిఁ, దత్ప్రవ**
**క్తలఁ బొడగాన, నట్టియెడ దారుణరూప సుపర్ణ సంఘముల్**
**బలువిడి నాపయిం; గవిసె; భ్రాంతుఁడ నైతి భయంబు పెంపునన్. 372**

**ప్రతిపదార్థం:** కలయఁగన్= అంతటా; చూడన్= చూడగా; అద్భుతము= చిత్రం; కాఁగన్= కాగా; అనేక= ఎన్నో; శత= వందల; అగ్నిహోత్రముల్= అగ్నిహోత్రాలు; వెలుఁగుట= ప్రకాశించటం; కానన్ వచ్చెన్= కన్పించాయి; బహు= అనేక; వేద రవంబులు= వేదధ్వనులు; వింటిన్= విన్నాను; తత్ ప్రవక్తలన్= ఆ వేద మంత్రాలు చదివిన వారిని; పొడగానన్= దర్శించలేదు; అట్టి+ఎడన్= అట్లాంటి సమయంలో; దారుణ= క్రూరమైన; సుపర్ణ= గరుత్మంతుల; సంఘముల్= సమూహాలు; బలు విడి= హఠాత్తుగా; నాపయిన్= నామీద; కవిసెన్= దూకాయి; భయంబు= భయముయొక్క; పెంపునన్= అతిశయంచేత; భ్రాంతుఁడన్+ఐతిన్= ఏమీ చేయలేని మూఢుడ నయ్యాను

**తాత్పర్యం:** అంతటా కలయజూస్తే అనేకవందల అగ్నిహోత్రాలు వెలిగాయి. ఎవరూ కనిపించకుండా అనేక వేదమంత్రాలు చదివిన ధ్వనులు వినిపించాయి. అట్లాంటి సమయంలో క్రూరమైన గరుత్మంతుల గుంపులెన్నో ఒకేసారి నా పయికి హఠాత్తుగా విజృంభించాయి. నేను భయభ్రాంతుడనయ్యాను.

**ఆ. అట్లు భయముఁ బొంది, 'యచ్యుత! శివ! సహ! స్రాక్ష! వేదమయ!, యనాదినిధన!**
**త్రిభువనైకనాథ! త్రినయన! గోవింద! పద్మనాభ! హర! కృపావిధేయ! 373**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; భయమున్= భీతిని; పొంది= చెంది; అచ్యుత!= (పరమాత్మ స్థితినుండి) చ్యుతి (భ్రష్టత) లేనివాడా!; శివ!= మంగళరూపుడా!; సహస్ర+అక్ష!= వేయి కనులు కలవాడా!; వేదమయ!= వేదమూర్తీ!; అనాదినిధన!= (న+ఆది+నిధన)= చావు పుట్టుకలు లేనివాడా!; (ఆది= మొదలు; జన్మ!; నిధన= మరణం; న= లేనివాడా); త్రిభువన= ముల్లోకాలకు; ఏక= ఏకైక; నాథ!= పతీ!; త్రినయన= మూడు కన్నులు కలవాడా!; గోవింద!= గోవులను కాపాడేవాడా!; (గో అంటే శబ్దం, కిరణం - అని అనేక అర్థాలు. కనుక గోవిందుడంటే సూర్యుడనీ అర్థం); పద్మనాభ!= తామరపువ్వు బొడ్డులో ఉన్నవాడా! (అందులో నుండే బ్రహ్మ పుట్టి సృష్టి చేస్తున్నాడని పురాణగాథ; పద్మమంటే కంటికి కన్పించే ప్రకృతి= విశ్వం. అంతా. దానికి కేంద్ర బిందువుగా - చక్రానికి ఇరుసువలె ఉండేవాడని అర్థం); హర!= హరించేవాడా!= (ప్రళయం చేసేవాడా!); కృపా విధేయ!= దయకు లోబడినవాడా! (దయ కలవాడా!)

**తాత్పర్యం:** ఆ విధంగా భయపడి 'అచ్యుతా! శివా! సహస్రాక్షా! వేదమయా! అనాదినిధనా! త్రిభువనైకనాథా! త్రినయన! గోవింద! పద్మనాభ! హర! కృపావిధేయ!'

**విశేషం:** ఇది వైదిక స్తోత్రం. పురాణస్తోత్రం కాదు. స్తుతింపబడేది విష్ణువైనా, శివ, సహస్రాక్ష (ఇంద్రుడు) త్రినయన - అనే నామాలు వాడటం వలన ఇక్కడ శబ్దాల కున్న అర్థాలే ప్రధానం తప్ప పైన వ్రాసిన విధంగా, తర్వాత వచ్చిన మతాల ప్రకారం, పురాణాల ప్రకారం - శివుడు, పద్మనాభుడు వేరు దేవతలు కారు. ఎట్లాగంటే మూడవకన్ను యోగనేత్రం. అది సాధన చేస్తే ఎవరికైనా లభించే దివ్యదర్శన శక్తి. యోగి కూడా త్రినయనుడే. కనుక ఈ సమన్వయం కొరకు కవి ఇట్లా వ్రాశాడు.

**క. అని మఱియుఁ, బెక్కు పేళ్ళన్, । వినుతించుచు, శరణు వేఁడి వినత శిరస్కుం**
**డును, ముకుళీకృత హస్తుం । డును నై యే నుండ దేవుఁడు ప్రసాదమునన్. 374**

**ప్రతిపదార్థం:** అని= అట్లా స్తుతించి; మఱియున్= ఇంకా; పెక్కు= అనేకమైన; పేళ్ళన్= పేర్లతో; వినుతించుచున్= స్తుతిస్తూ; శరణువేఁడి= శరణుకమ్మని ప్రార్థించి; వినత= వంగిన; శిరస్కుండును= తల కలవాడును; ముకుళీకృత= ముడిచిన; హస్తుండును= చేతులు కలవాడును; ఐ= అవుతూ; ఏన్= నేను; ఉండన్= ఉండగా; దేవుఁడు= స్వామి; ప్రసాదమునన్= ప్రసన్నతతో.

**తాత్పర్యం:** ఇట్లా ఎన్నో నామాలతో స్తుతించి తలవాల్చి, దోసిలొగ్గిన నన్ను చూచి స్వామి దయతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అని మఱియుఁ బెక్కు పేళ్ళన్= సహస్రనామాలు. ఈ మాట తిక్కనగారి అనువాద పద్ధతిని తెలియచేస్తుంది. ఈ ఘట్టమంతా ఉత్తరదేశప్రతులలో లేదు. కుంభకోణ ప్రతిలోనే ఉన్నది. మూలంలో సహస్రనామాలు(శివ, విష్ణు) వాటిని తెలుగులో వ్రాయటానికి వీలులేదు కనుక తిక్కనగారు ముక్కికి ముక్కి అనువదించలేదు. కనుక మూలంలో ఎన్నో నామాలుంటే వాటిలో ప్రధానమైనవి తీసికొని వ్రాస్తున్నాను - అనటానికి సూచన 'పెక్కు పేళ్ళు'.

**క. తనుఁ జూపి, 'యోడ కోడకు । వినతాసుత!' యనియె నపుడు వినుఁడే మొదలం**
**గనిన బదరికాశ్రమ మ । య్యె నచటు విష్ణుని ప్రభావ మేమనవచ్చున్! 375**

**ప్రతిపదార్థం:** తనున్= తనను; చూపి= కన్పింపచేసి; వినతాసుత!= వినత కొడుకా!; ఓడకు+ఓడకు= భయపడకు భయపడకు; అనియెన్= అన్నాడు; అపుడు= ఆ సమయంలో; వినుఁడు= వినండి (ఒక తమాషా); ఏన్=నేను; మొదలన్= మొదట; కనిన= చూచిన; బదరికాశ్రమము= రేగుచెట్ల గుంపులలోని (పూరి గుడిసె) ఆశ్రమం; అయ్యెన్= ఐనది; అచటు= ఆ స్థలం; విష్ణుని ప్రభావము= విష్ణువు మహత్త్వం; ఏమనవచ్చున్!= ఎంతని పొగడగలము!

**తాత్పర్యం:** అప్పు డాయన కన్పించి 'భయపడవద్దయ్యా! వినతాసుత!' అన్నాడు. అప్పు డాస్థలం నేను మొదట చూచిన బదరికాశ్రమమే. ఎంత విచిత్రమో! ఆ భగవంతుడి లీల నెవ్వడు కొనియాడగలడు?

**ఉ. అ ప్పరమేశ్వరుండు లలితాష్టభుజం బగు రూపుఁ దాల్చి, తా**
**నెప్పటియట్ల నిల్చెఁ; గని యేను మనంబున నద్భుతంబుతో**
**ముప్పిరి యైన కౌతుకము మోదము నెక్కొన, నాకు సత్కృపం**
**జెప్పెడుఁ, గాక యెట్లు నని చేరితి నంజలి మౌళిఁ జేర్చుచున్. 376**

**ప్రతిపదార్థం:** అ+పరమేశ్వరుండు= ఆ మహాదేవుడు; లలిత= కోమలములైన; అష్టభుజంబు= ఎనిమిది చేతులు కల; రూపున్= ఆకారాన్ని; తాల్చి= ధరించి; తాన్= తాను; ఎప్పటిఅట్ల= ఎప్పటివలెనే; నిల్చెన్= నిలబడ్డాడు; కని= చూచి; ఏనున్= నేను కూడా; మనంబునన్= మనస్సులో; అద్భుతంబుతోన్= ఆశ్చర్యంతో; ముప్పిరి+ఐన= మూడు పేటలుగా పెనవేసికొన్న; కౌతుకము= కుతూహలం; మోదము= సంతోషం; నెక్కొనన్= ఎక్కువ కాగా; నాకున్; సత్కృపన్= చక్కని దయతో; చెప్పెడున్+కాక!= తప్పక చెప్పగలడు; ఎట్లున్= ఎట్లాగైనా సరే!; అని= అనుకొంటూ; అంజలిన్= దోసిలిని; మౌళిన్= తలపై; చేర్చుచున్= చేరుస్తూ; చేరితిన్= ఆయన దగ్గరకు చేరాను.

**తాత్పర్యం:** ఆ మహాస్వామి ఎనిమిది చేతులతో కనిపించాడు. నేను ఆశ్చర్యపోయాను. నాకు కుతూహలమూ, సంతోషమూ ముప్పిరిగొన్నాయి. దయతో తన స్వరూపం ఎట్లాగూ తెలియచేస్తా డీ స్వామి అనుకొంటూ తలపై చేతులు మోడ్చి ఆయన దగ్గరకు చేరాను.

**వ. చేరి వినయావనతుండ నయి 'దేవా! యేను భవత్పాద భక్తుండనేని నీ దయకు భాజనంబనేని నాకు వినందగునేని దురధిగమసారంబైన భవదీయప్రకారం బిట్టిదని యెఱుంగు నట్లుగాఁ జెప్పవే' యనిన నా సర్వలోక శరణ్యుండు గారుణ్యామృత మయం బైన చూడ్కి నామీఁద నొలయ నిట్లనియె. 377**

**ప్రతిపదార్థం:** చేరి= సమీపించి; వినయ+అవనతుండన్+అయి= వినయంతో తలనువంచినవాడనై; దేవా!= స్వామీ!; ఏను= నేను; భవత్= తమ; పాదభక్తుండను= పాదాలపై భక్తి కలవాడను; ఏనిన్= అయితే; నీదయకున్; భాజనంబను= పాత్రుడను; ఏనిన్= ఐతే; నాకున్, వినన్ తగునేని= వినటానికి అర్హతుంటే; దుర్+అధిగమ= కష్టంతో పొందదగిన; సారంబు+ఐన= సారముగలదైన; భవదీయ= తమ; ప్రకారంబు= పద్ధతి; ఇట్టిది+అని= ఇట్లాంటిదని; ఎఱుంగునట్లుగాన్= తెలిసేటట్లుగా; చెప్పవే= అనుగ్రహించవే; అనినన్= అనగా; ఆ; సర్వలోక= అన్ని లోకాలకు; శరణ్యుండు= శరణని చేరదగినవాడు; కారుణ్యా= దయ అన్న; అమృతమయంబు= అమృతంతో నిండిన; చూడ్కిన్= చూపుతో (దయ అన్న అమృతం వర్షించే చూపు); నామీఁదన్= నాపయి; ఒలయన్= వ్యాపించగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా దగ్గరకు పోయి 'స్వామీ! నేను నీకు భక్తుడనైతే, నీ దయకు పాత్రుడనైతే, వినే అర్హత నాకుంటే, తపస్సుచేతకాని పొందలేని నీ సారవంతమైన తత్త్వం నాకు బోధించవా?' అని వేడికొనగా, ముల్లోకాలకూ ఆశ్రయమైన ఆ స్వామి దయామృతాన్ని వర్షిస్తూ నన్ను చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

### విష్ణుదేవుఁడు గరుత్మంతున కుపదేశించిన యాత్మతత్త్వ ప్రకారము (సం.13-43-1 (కుంభ))

**సీ. 'అనిమిష గంధర్వదనుజు లాదిగ నెవ్వ । రును విను, నాయున్న రూ పెఱుంగ;**
**రఖిలభూతములు నాయం దుద్భవించు, వ । ర్తించు, లయించు, వర్తింప నేను**
**వాని వశంబున వసియింతు సర్వంబు । నందును, నాతత్త్వ మధిగమింప**
**నగు నగ్ని యాత్మ సమాహితంబుగఁ జేయఁ । గామవర్జిత మహంకారవిముఖ**

**తే. మజడ, మపరిగ్రహం బహింసానుమోది । క్రోధరహితంబు నిర్మలబోధయుతము**
**నిత్యతృప్తంబు, శాంతంబు, సత్యభక్తి । యైన చిత్తంబు గల నియతాత్మకులకు. 378**

**ప్రతిపదార్థం:** విను= (రహస్యం చెప్పుతున్నాను జాగ్రత్తగా) వినుము; అనిమిష= రెప్పపాటు లేనివారు, దేవతలు; గంధర్వ= గంధర్వులు; దనుజులు= రాక్షసులు; ఆదిగన్= మొదలుగా; ఎవ్వరును= ఎవ్వరు కూడా; నా= నా యొక్క; ఉన్నరూపు= కల స్వరూపం; ఎఱుంగరు= తెలిసికొనలేరు; అఖిలభూతములు= సమస్త జీవరాసులు; నాయందున్= నాలో; ఉద్భవించున్= పుట్టుతాయి; వర్తించున్= బ్రతుకుతాయి; లయించున్= చస్తాయి; నేను వర్తింపన్= నేను మాత్రం ఈ సంసారచక్రంలో జన్మమృత్యురూపంలో తిరగటం లేదు; వానివశంబునన్= వాటికి లోబడి; సర్వంబునందునున్= అన్నింటిలో; వసియింతున్= నివసిస్తాను; నా తత్త్వము= నా స్వరూపం; అధిగమింపన్= పొందటానికి; అగు= ఔనట్టి మార్గం; అగ్నిన్= అగ్నితత్త్వాన్ని (దీన్ని

గురించి వేదం అనంతంగా వర్ణించింది); ఆత్మన్= తనలో; జీవుడిలో; సమ+ఆహితంబుగన్ చేయన్= సన్నిహితం చేసికొంటే; కామవర్జితమున్= కామంలేనిదీ; అహంకార= నేనన్న భావనకు; విముఖము= విరుద్ధమైనది; అజడము= జడంకానిది (కదిలేది); అపరిగ్రహంబు= దానంగా ఏదీ స్వీకరించనిది; అహింసా= హింస లేకపోవటాన్ని; అనుమోది= అంగీకరించేదీ; క్రోధరహితంబున్= కోపం లేనిదీ; నిర్మల= స్వచ్ఛమైన; బోధయుతము= జ్ఞానంతో కూడుకొన్నదీ; నిత్య= ఎల్లప్పుడూ; తృప్తంబు= తృప్తి కలదీ; శాంతంబు= శాంతి స్వరూపమైనదీ; సత్య= నిజమైన; భక్తిఐన చిత్తంబున్= భక్తి కల మనస్సు; కల= ఉన్న; నియత+ఆత్మకులకున్= నిష్ఠకల ఆత్మలు కలవారికి.

**తాత్పర్యం:** నా స్వరూపం దేవతలు, గంధర్వులు, రాక్షసులు మున్నుగా గలవారెవ్వరికినీ తెలియదు. సమస్త ప్రాణకోట్లు నాయందేపుట్టి మెలగుతూ, నాయందే లయిస్తాయి. నేను మాత్రం ఆ భూతకోటులకు వశపడి వర్తించను. సర్వమూ నాయందే వసిస్తుంది. నా తత్త్వం జడులు కానివారూ, అహింసా ప్రవృత్తి కలవారూ, కామం లేనివారూ, అహంకారం లేనివారూ, దానంగా దేన్నీ స్వీకరించనివారూ, కోపం లేనివారూ, స్వచ్ఛమైన జ్ఞానంకలవారూ, నిత్యతృప్తులూ, శాంతీ, భక్తీ కలవారూ, నిష్ఠ కలవారూ, తమలో అగ్నిని సన్నిహితం చేసికొంటే నన్ను పొందగలరు.

**వ. సాంఖ్యయోగయుక్తులు, బహిర్దర్శనులై నిశ్చయరహితు లైరేని నస్మదీయ తత్త్వంబు గాన నేర; రది మోహపంకమగ్ను లగువారికి నుపవాసంబుల నియమంబుల వ్రతంబుల నెఱుంగ శక్యంబుగా, దేకాంతిక ధ్యానపరుల కెఱుంగుట గలుగు; రజస్తమోదూషితంబు గాక కేవలసత్త్వాధిష్ఠితంబయిన జ్ఞానంబున న నన్నవలం బించునది, సూక్ష్మ సరణి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నామంబులం జతుర్విధంబుల విభక్తుండనై, ప్రాణులయం దాత్మ బుద్ధ్యహంకార మనోరూపవ్యాపకత్వంబు నొంది యుండుదు; నిట్టిది మదీయ స్థూల ప్రకారంబు; కశ్యపనందనా! నీవు మన్మనస్కుండవు, మద్భక్తుండవు మత్పరాయణుండవు నై మత్స్వరూపవేది వగు' మనియె నని చెప్పి సుపర్ణుండు. 379**

**ప్రతిపదార్థం:** సాంఖ్యయోగయుక్తులు=సాంఖ్యయోగాన్ని అనుసరించేవారు; బహిర్దర్శనులు+ఐ= బాహ్యదృష్టికలవారై; నిశ్చయ రహితులు= నిశ్చయబుద్ధిలేనివారు; ఐరేనిన్= ఐతే; అస్మదీయ= నా; తత్త్వంబు= యథార్థరూపం; కాననేరరు= చూడలేరు; అది= నా యథార్థస్వరూపం; మోహ= వ్యామోహమన్న; పంక= బురదలో; మగ్నులు= మునిగినవారు; అగువారికిన్= ఐనట్టివారికి; ఉపవాసంబులన్= భోజనం లేకుండా భగవదారాధన చేసినా; నియమంబులన్= నియమాలతో; వ్రతంబులన్= ఉపవాసాది పుణ్యకర్మలతో; ఎఱుంగన్= తెలియటం; శక్యంబుకాదు= అసాధ్యం; ఏక+అంతిక= భగవత్సాన్నిధ్యాన్ని ముఖ్యంగా అనుభవించే వారు ఏకాంతిక భక్తులు; ధ్యానపరులకున్= ధ్యానపరాయణులైతే (వారికి); ఎఱుంగుట= తెలియటం; కలుగున్= సాధ్యపడుతుంది, భగవద్దర్శనం ఆత్మానుభవం ధ్యానంతోనే సాధ్యం; రజః= రజోగుణం; తమః=తమోగుణం; దూషితంబుకాక= ఆ గుణాలతో మలినంకాని; కేవల సత్త్వ= పరిశుద్ధసత్త్వగుణంలో; అధిష్ఠితంబు+అయిన= అధిష్ఠించిన; కూర్చున్న, జ్ఞానంబునన్= జ్ఞానంతో; నన్నున్; అవలంబించునది= ఆధారంగా, ధ్యేయంగా చేసికొనాలి; సూక్ష్మ= స్థూలంకానిది; సరణిన్= రీతిలో; వాసుదేవ, సంకర్షణ= బలరామ; ప్రద్యుమ్న= మన్మథ; అనిరుద్ధ= అడ్డంలేని విజృంభణం లేదా వ్యాప్తి కలవాడు; నామంబులన్= పేర్లతో; చతుర్విధంబులన్= నాలుగు రకాలుగా; విభక్తుండనై= విభాగించుకొని; ప్రాణులయందున్= జీవులలో; ఆత్మ, బుద్ధి, అహంకార, మనః= మనస్సులన్న; రూప= రూపాలతో; వ్యాపకత్వంబు= వ్యాప్తి; ఒంది= పొంది; ఉండుదున్= ఉంటాను; ఇట్టిది= ఇట్లాంటిది; మదీయ= నా; స్థూల ప్రకారంబు= బాహ్య పద్ధతి; కశ్యపనందనా!= కశ్యపుడి కుమారుడా!; నీవు; మత్= నాయందు; మనస్కుండవు= మనస్సు కలవాడవు; మత్= నాపై; భక్తుండవు= భక్తి కలవాడవు; మత్పరాయణుండవును+ఐ= నా స్మరణ కలవాడవై; మత్= నా; స్వరూప= తత్త్వం; వేదివి= తెలిసిన వాడవు; అగుము= కమ్ము; అనియెన్= అన్నాడు; అని చెప్పి; సుపర్ణుండు= గరుత్మంతుడు.

**తాత్పర్యం:** సాంఖ్యయోగులై కూడా అంతర్దృష్టి లేక, నిశ్చయబుద్ధిలేక చంచల మనస్కులైనవారికి నా యథార్థ రూపం తెలియదు. వ్యామోహ మన్న బురదలో కూరుకొనిపోయి ఏవో వ్రతాలనీ, ఉపవాసాలనీ, నియమాలనీ ఆచరించినంత మాత్రాన నా తత్త్వం తెలిసేది కాదు. (లోకంలో దేవుడన్నా మతమన్నా వ్రతాలు - ఉపవాసాలు ఇవి కావంటున్నాడు) రజస్తమస్సులతో మలినం కాని కేవల సత్త్వగుణాన్నే స్థిరంగా చేసికొన్న జ్ఞానంతో నన్ను ధ్యానించటమే ముక్తిమార్గం. వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నాలుగు పేర్లతో నన్ను నేను విభాగించుకొని సూక్ష్మంగా, సర్వజీవులలోను ఆత్మ (వాసుదేవుడు), బుద్ధి (సంకర్షణుడు), అహంకారం (ప్రద్యుమ్నుడు), మనస్సు (అనిరుద్ధుడు) ఈ నాలుగు రూపాలుగా వ్యాపించి ఉంటాను. ఇదీ నా స్థూలరూపం. కశ్యపకుమారా! నీవు నా యందే మనస్సు నిలిపి, నన్నే భక్తితో ఆరాధిస్తూ, నిత్యం నన్నే స్మరిస్తూ నా రూపం తెలిసికొమ్ము' అని చెప్పి గరుత్మంతుడు (తరువాతి పద్యంతో అన్వయం)

**క. పురుషవరులార! యద్భుత । తర మగు హరి దివ్యచేష్టితము నాకుం ద**
**త్కరుణం దోఁచిన యట్టిది । పరిపాటిని మీకుఁ దేటపఱిచితి భక్తిన్!' 380**

**ప్రతిపదార్థం:** పురుషవరులార!= మానవశ్రేష్ఠులారా!; అద్భుతతరము+అగు= మిక్కిలి చిత్రమైన; హరి= విష్ణువు యొక్క; దివ్య= అతిలోకమైన (లోకాతీతమైన); చేష్టితము= చేష్ట; నాకున్; తత్= ఆ స్వామి; కరుణన్= దయతో; తోఁచినఅట్టిది= అనుభవానికి వచ్చిన దానిని; మీకున్; పరిపాటిని= క్రమంగా; భక్తిన్= భక్తితో; తేటపఱిచితిన్= స్పష్టం చేశాను.

**తాత్పర్యం:** మానవశ్రేష్ఠులారా! నారాయణుడి దివ్యచేష్టావిలాసం నా కాయన దయతో తెలిసింది. అది మీకు క్రమంగా భక్తితో స్పష్టం చేశాను.

**వ. అనిన విని యమ్ముని సిద్ధజనంబులు పరమాదరంబున నప్పక్షిదేవు దీవించి, యామంత్రణంబు సేసి, హర్షోత్కర్షంబునం జిత్తంబులు జొత్తిల్లఁ దమలోన. 381**

**ప్రతిపదార్థం:** అనినన్= సుపర్ణుడు చెప్పగా; విని; ఆ+ముని= ఆ మునుల; సిద్ధ= ఆ సిద్ధుల; జనంబులు= సమూహాలు; పరమ= గొప్ప; ఆదరంబునన్= ఆదరంతో; ఆ+పక్షిదేవున్= ఆ పక్షిరాజును; దీవించి= ఆశీర్వదించి; ఆమంత్రణంబుచేసి= వీడ్కొల్పి (పంపించి); హర్ష= సంతోషం యొక్క; ఉత్కర్షంబునన్= అతిశయంతో; చిత్తంబులు= మనస్సులు; జొత్తిల్లన్= సొమ్మసిల్లగా; తమలోనన్= తమలో తాము.

**తాత్పర్యం:** చెప్పగా విన్న మునులు, సిద్ధులు ప్రేమతో సుపర్ణుడిని దీవించి పంపించి సంతోష పారవశ్యంతో మనస్సులు సొమ్మసిల్లిపోగా తమలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'అక్కజం బగుచున్న యిక్కథ యితనిచే । విని కృతార్థుల మైతి' మనిరి, మఱియుఁ**
**'బుణ్య మాయుష్యంబు భూతిప్రదము; భక్తి । వినిన విప్రుఁడు వేదవిద్య పెంపు,**
**నృపవైశ్య శూద్రు లనుపమాన జయధన । సౌఖ్యంబులను గంద్రు; సర్వ జనుల**
**కిహపర సిద్ధుల కిది సాధనం బగు' । నని పల్కి యాత్రేచ్ఛఁ జనిరి; దీని**

**ఆ. బ్రహ్మ సురలకుఁ జెప్పిన భంగి వసువు । లవనిసురు లయి వచ్చి మాయమ్మపాల**
**నున్న నా కర్థిఁ జెప్పిఁ రయ్యున్న రూపు । నీకు జెప్పితిఁ గురుకులనృపవరేణ్య! 382**

**ప్రతిపదార్థం:** అక్కజంబు= ఆశ్చర్యం; అగుచున్న= అవుతున్న; ఇక్కథ= ఈ ఉపాఖ్యానం; ఇతనిచేన్= సుపర్ణునిచేత; విని; కృత+అర్థులము= నెరవేరిన కోరికలు కలవారం; ఐతిమి= అయ్యాము; అనిరి= అన్నారు; మఱియున్= ఇంకనూ; పుణ్యము= పుణ్యవ్రతం; ఆయుష్యంబు= ఆయుస్సును వద్ధిచేసేది; భూతిప్రదము= ఐశ్వర్యాన్నిచ్చేది; భక్తిన్= భక్తితో; వినిన విప్రుఁడు= విన్న బ్రాహ్మణుడు; వేదవిద్య= వేదవిద్యలయొక్క; పెంపు= సంపద; నృప= రాజు; వైశ్య= కోమట్లు; శూద్రులు= నాలుగవ కులంవారు; అనుపమాన= సాటిలేని; జయ= విజయం; ధన= ధనం; సౌఖ్యంబులను= సౌఖ్యాలను; కంద్రు= పొందుతారు; సర్వజనులకున్= లోకానికంతా; ఇహ= ఈ లోకం; పర= ఆ లోకం; సిద్ధులకున్= సంపదలకు; ఇది= ఈ కథ; సాధనంబు+అగున్= ఉపాయమౌతుంది; అని పల్కి= అని చెప్పుకొంటూ; యాత్రా= తీర్థయాత్రలపై; ఇచ్ఛన్= కోరికతో; చనిరి= వెళ్ళారు; దీనిన్= ఈ కథను; కురుకుల= కురువంశ; నృపవరేణ్య!= రాజశ్రేష్ఠుడా!; బ్రహ్మ= సృష్టికర్త; సురలకున్= దేవతలకు; చెప్పిన భంగిన్= చెప్పిన తీరుగా; వసువులు= అష్టవసువులు; అవనిసురు లయి= భూదేవతలైన బ్రాహ్మణ రూపంలో; వచ్చి; మా యమ్మపాలన్= మా అమ్మ గంగాదేవి దగ్గర ఉన్న; నాకున్= ఉన్నట్టినాకు; (భీష్ముడు); అర్థిన్= కోర్కెతో; చెప్పిరి= చెప్పారు; ఆ+ఉన్నరూపు= ఆ ఉన్న విషయం; నీకున్; చెప్పితిన్= నేను చెప్పాను.

**తాత్పర్యం:** 'అద్భుతమైన ఈ కథ ఇతడివలన విని కృతార్థుల మైనాం. ఇది పుణ్యం. ఆయురైశ్వర్యాల నిచ్చేది. భక్తితో వింటే బ్రాహ్మణులకు వేదవిద్య పెరుగుతుంది. రాజులకు విజయాలు కలుగుతాయి. కోమట్లు ధనలాభం పొందుతారు. శూద్రులకు సౌఖ్యాలు సమకూడుతాయి. సర్వజనులకు ఇహపరతారకమైన కథ' అని ప్రశంసించి వారంతా తీర్థయాత్రలకు వెళ్ళారు. నాయనా! ధర్మజా! ఈ కథ నట పూర్వం బ్రహ్మ వసువులకు చెప్పగా వారు బ్రాహ్మణాకారాలు ధరించి మా అమ్మ దగ్గరున్న నాకు కావాలని చెప్పి వెళ్ళారయ్యా! అదంతా నీకు వినిపించాను.'

**విశేషం:** వసువులు ఎనిమిదిమంది. వారే గంగకు కొడుకులై పుట్టి వెంటనే మరణించారు. ఎనిమిదవ వసువే భీష్ముడు.

**వ. అని చెప్పి దేవవ్రతుండు వెండియు నిట్లనుఁ 'బాండవాగ్రజా! వైకుంఠ సుపర్ణ సంవాదంబగు నీ యాఖ్యానంబునకు నభిప్రాయం బాకర్ణింపుము. 383**

**ప్రతిపదార్థం:** వెండియున్= ఇంకా; దేవవ్రతుండు= దైవమే జీవితధ్యేయంగా బ్రతికేవాడు భీష్ముడు; ఇట్లు; అనున్; పాండవ= పాండురాజు కొడుకులలో; అగ్రజా!= ముందుపుట్టినవాడా!; వైకుంఠ= విష్ణువు; సుపర్ణ= గరుత్మంతుడి; సంవాదంబు= సంభాషణం; అగు; ఈ; ఉపాఖ్యానంబునకున్=కథకు; అభిప్రాయంబు= భావం, తాత్పర్యం; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** దేవవ్రతు డా విధంగా చెప్పి ఇంకా అంటున్నాడు. 'నాయనా! ధర్మరాజా! విష్ణువునకు, సుపర్ణుడికి మధ్య జరిగిన సంభాషణం విన్నావు కదా! దాని తాత్పర్యం కూడా చెప్తుతాను వినుము.

**తే. వివిధ సంకల్ప యజ్ఞముల్ విడిచి యాత్మ । యందు నిష్ఠమై నగ్ని సమాహితముగఁ**
**జేసి నిస్పృహుఁడై విష్ణుఁ జిత్తవృత్తిఁ । జేర్చు వాఁ డవ్యయస్థితిఁ జేరనేర్చు.' 384**

**ప్రతిపదార్థం:** వివిధ = అనేకమైన; సంకల్ప= కోరికలు; యజ్ఞముల్= జన్నాలను; విడిచి= పరిత్యజించి; ఆత్మఅందున్= ఆత్మలో; నిష్ఠమైన్= నియమంతో; అగ్నిన్= అగ్నిని; సమాహితముగన్+చేసి= చక్కగా సన్నిధి కల్పించుకొని; నిస్పృహుఁడు+ఐ=

విరక్తుడై; విష్ణున్= నారాయణుడిని; చిత్తవృత్తిన్= మనసునందు; చేర్చువాఁడు= లగ్నం చేసినవాడు; అవ్యయ= శాశ్వతమైన; స్థితిన్= దశను; చేరనేర్చున్= చేరుకొనగలడు.

**తాత్పర్యం:** నానావిధాలైన సంకల్పాలు, యజ్ఞాలు విడిచిపెట్టి, ఆత్మలో అగ్నిని ప్రతిష్ఠించుకొని విరక్తుడై విష్ణువులో మనస్సును లయం చేసినవాడు ముక్తి నందగలడు.'

**వ. అని యిట్లు భీష్ముండు విష్ణు స్వరూప జ్ఞానప్రకారం బితిహాస రూపంబున ధర్మజునకుం జెప్పెనని చెప్పిన 'సప్పురుష వరుల యడుగుటలును, జెప్పుటలును లోకహితంబులై యింత యొప్పియుండునే! యటమీఁది సంభాషణ విశేషంబులు సెప్పు' మని యడుగుటయు. 385**

**ప్రతిపదార్థం:** విష్ణుస్వరూప= విష్ణురూప సంబంధమైన, జ్ఞాన= జ్ఞాన సంబంధమైన; ప్రకారంబు= పద్ధతి; ఇతిహాస రూపంబునన్= కథారూపంలో; ధర్మజునకున్= ధర్మరాజునకు; చెప్పెను; అని; చెప్పినన్= చెప్పగా; ఆ+పురుషవరుల= ఆ మహాత్ముల; అడుగుటలును= ప్రశ్నించిన రీతులూ; చెప్పుటలును= సమాధాన రీతులున్నూ; లోక= లోకానికి; హితంబులు+ఐ= కళ్యాణదాయకాలై; ఇంత ఒప్పిఉండునే!= ఇంత చక్కగా ఉంటాయా!; అట మీఁది= ఆ తరువాతి; సంభాషణ= పరస్పరం మాట్లాడుకొన్నవాటి; విశేషంబులు= ప్రధాన విషయాలు; చెప్పుము; అని; అడుగుటయున్= అడుగగా.

**తాత్పర్యం:** భీష్ము డీవిధంగా విష్ణు రూప, జ్ఞాన పద్ధతులను కథారూపంలో ధర్మరాజుకు వివరించిన విధానం విని 'ఆ మహాత్ములు అడగటం, చెప్పటం లోకహితాన్ని కలిగించేదిగా ఉండి ఇంత అందంగా ఉంటుందా? తరువాతి సంభాషణ విశేషాలు చెప్పవయ్యా!' అని అడుగగా.

## ఆశ్వాసాంతము

**చ. మునిహృదయాబ్జ శాంతిమధుమోద వినోది మరాళ! గాఢ చ**
**క్రనిహత శూలనిర్మథిత రాక్షసయూథ! నితాంత భక్తి భా**
**వన రమణీయ! వేద పరివాదనిరర్గళ సేవనీయ! ని**
**త్యనిరుపమాన నిర్మల నిరంజన ఖేలన! ధర్మపాలనా! 386**

**ప్రతిపదార్థం:** ముని= మునులయొక్క; హృదయ+అబ్జ= హృదయాలనే తామరపూలలో; శాంతి మధు= శాంతి అనే తేనెవలని; మోద వినోది= సంతోషంతో వినోదించే; మరాళ!= హంసా!; గాఢ= గాఢంగా; చక్ర= చక్రాయుధంతో; నిహత= చంపబడిన; శూల= శూలంతో; నిర్మథిత= సంహరించబడిన; రాక్షస= రాకాసుల, యూథ!= గుంపు కలవాడా!; నితాంత= ఎడతెగని; భక్తిభావన= భక్తి కల భావనకు; రమణీయ!= అందమైనవాడా!; వేద= మంత్రాలాపంచేసే; పరివాద= వీణానాదంతో; నిరర్గళ= ఏకధాటిగా, (అడ్డు లేకుండా); సేవనీయ!= సేవించబడే వాడా!; (పరివాదం= నింద, వీణ) నిత్య= ఎల్లప్పుడు, నిరుపమాన= సాటిలేని; నిర్మల= స్వచ్ఛమైన; నిరంజన= జ్ఞానంతో; ఖేలన!= క్రీడించేవాడా!; ధర్మ= ధర్మాన్ని; పాలనా= రక్షించేవాడా!

**తాత్పర్యం:** మునుల హృదయాలనే తామరపూలనుండి స్రవించే శాంతి మధువును త్రాగిన ఆనందంతో విహరించే హంసస్వరూపుడా! చక్రంతో; శూలంతో రాక్షసులను చంపేవాడా! నిత్యభక్తిభావ దృష్టికి అందమైనవాడా!, వేదాలాపన

చేసే వీణానాదంతో సేవించదగినవాడా; (లేదా) వేదనింద చేసేవారికి సేవించదగినవాడా!, నిత్యమూ సాటిలేనివాడా!, స్వచ్ఛమైన జ్ఞానంతో క్రీడించేవాడా!, ధర్మపాలన చేసేవాడా!

**విశేషం:** ఇది హరిహరనాథ స్తుతి కనుక 2వ వాక్యంలో శూలం, చక్రం చెప్పబడ్డాయి. 4వ వాక్యాన్ని రెండు రకాలుగానూ అన్వయించుకొనవచ్చును. వేద నిరసన చేసినవారు రాక్షసులు. సోమకాసురుడిని వధించి వేదాలను ఉద్ధరించినవాడు విష్ణువు. ఇదే మత్స్యావతార కథ అని విష్ణుపరమైన అర్థం. శివుడు వీణాధరుడు కనుక వీణ ప్రాచీనకాలంలో వేదమంత్రగాన సాధనం కనుక శివపరంగా చెప్పుకొనవచ్చును. రెంటికీ తగిలి వచ్చేటట్లు పరివాద శబ్దాన్ని వాడిన తిక్కనగారి ప్రతిభకు నమస్కరించాలి.

**క. సదయాపాంగా! పరిణా । మదశా సంగమ నిరాసమధురతమాంగా!**
**మదశోక రహితచేత । స్సదనా! సంజనిత సముపసంహృతమదనా! 387**

**ప్రతిపదార్థం:** సదయ= దయతో (తడిసిన) కూడుకొన్న; అపాంగా!= కంటి చివరి చూపు (కటాక్షం) కలవాడా!; పరిణామ= మార్పు; దశా= స్థితి; సంగమ= ఆసక్తిని; నిరాస= తిరస్కరించేవారికి; మధురతమ= మిక్కిలి తీయనైన; అంగా!= అవయవాలు కలవాడా! మద= గర్వం; శోక= దుఃఖం; రహిత= లేని; చేతస్= మనస్సులే; సదనా!= ఇల్లుగా ఉండేవాడా!; సంజనిత= చక్కగా పుట్టించబడిన; సమ్+ఉపసంహృత= చక్కగా ఉపసంహరించబడిన (చంపబడ్డ); మదనా!= మన్మథుడు కలవాడా!

**తాత్పర్యం:** దయతో కూడిన క్రీగంటి చూపులు కలవాడా! పరిణామ దశలయందు ఆసక్తిలేని మధురతమమైన ఆకృతి కలవాడా! మదం, శోకాదులు లేని మనస్సును మందిరంగా చేసికొన్నవాడా! మన్మథుడి పుట్టుకకు, మరణానికీ కారణమైన నాథా! హరిహరనాథా!

**విశేషం:** భగవంతుడి కటాక్షం దయాస్నిగ్ధం దయను వర్షించేది. పరిణమించే సృష్టియందు ఆసక్తిలేనివారికి మధురమైన శరీరం కలవాడు. గర్వం దుఃఖం లేని మనస్సులలో ఉండేవాడు, విష్ణువు మన్మథుడిని కన్నాడు. శివుడు దహించాడు.

**మాలిని**

**గరుడవృషపతాకా! కల్పితాశేషలోకా!**
**సురపరిషదుపాస్యా! శుద్ధసంవిద్వికాస్యా!**
**పరమమహిమసీమా! భవ్యకారుణ్యధామా!**
**నిరతిశయగుణాలీ! నిష్కలానందశాలీ! 388**

**ప్రతిపదార్థం:** గరుడ= గరుత్మంతుడు; వృష= ఎద్దు; పతాకా!= జెండాలపై గుర్తులుగా కలవాడా! (వాహనమే పతాకల చిహ్నం); కల్పిత= సృష్టించబడిన; అశేష= సమస్త; లోకా!= లోకాలు కలవాడా!; సురపరిషత్= దేవతల సముదాయానికి; ఉపాస్యా!= సేవింపదగినవాడా!; శుద్ధసంవిత్= అద్వైతజ్ఞానంతో; వికాస్యా!= వికసించేవాడా!; పరమ= గొప్ప; మహిమ= మాహాత్మ్యానికి; సీమా!= సరిహద్దయినవాడా!; భవ్య= శ్రేష్ఠమైన; కారుణ్యా= దయకు; ధామా!= గృహమైనవాడా!; నిరతిశయ= మిక్కిలి ఎక్కువైన; గుణాలీ!= గుణసమూహం కలవాడా!; నిష్కల= అద్వైత; ఆనందశాలీ= ఆనందం కలవాడా!

**తాత్పర్యం:** గరుత్మంతుడు, ఎద్దు పతాకలపై గుర్తులుగా ఉన్నవాడు, సమస్త సృష్టి చేసేవాడు, దేవతల కుపాసించదగినవాడు, అద్వైతజ్ఞానంతో వికసించేవాడు, గొప్ప మాహాత్మ్యానికి అవతలి ఒడ్డున ఉన్నవాడు, దివ్యమైన దయకు స్థానమైనవాడు, మహాగుణాలున్నవాడు, కేవలానందస్వరూపుడు అయిన హరిహరనాథుడికి నమస్కారము.

**విశేషం:** మాలినీవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, న, మ, య, య అనే గణాలుంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాస నియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున నానుశాసనిక పర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= మంగళకరుడైన; ఉభయకవిమిత్త్ర= కావ్యశాస్త్ర కవులిరువురికీ మిత్రుడైనవాడు; బుధ+ఆరాధన విరాజి= పండితులను (జ్ఞానులను) సేవించటం వలన కీర్తితో ప్రకాశించేవాడు; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కన చేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీ మహాభారతంబున; ఆనుశాసనిక పర్వంబునందున్; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది ఉభయకవిమిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, జ్ఞానులచేత ఆరాధించబడి రాణించే వాడూ అయిన తిక్కన సోమయాజి శుభప్రదంగా రచించిన శ్రీ మహాభారతంలోని ఆనుశాసనికపర్వంలో మొదటి ఆశ్వాసం.

**ఆనుశాసనిక పర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీమయ వక్షస్థల గౌ । రీమయ వామార్ధ । బంధురీ కృత సౌంద**
**ర్యామృత రసకీర్తన వి । ద్యామయ! నిగమాంతవేద్య! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీమయవక్షస్థల = లక్ష్మీమయమైన గుండె చేతను; గౌరీమయ= పార్వతీమయమైన; వామ+అర్ధ= ఎడమ సగం శరీరం చేతను; బంధురీకృత = ఇంపుగా చేయబడిన; సౌందర్య= అందమనెడు; అమృతరస= సుధాద్రవాన్ని; కీర్తన= కొనియాడెడు; విద్యామయ!= కళ్యాణస్వరూపుడా!; నిగమ+అంత= ఉపనిషత్తులచేత; వేద్య= తెలియదగినవాడా!; హరిహరనాథ!= హరిహరనాథ దేవా!

**తాత్పర్యం:** లక్ష్మీదేవి నివసించే వక్షస్థలం చేతను, పార్వతితో కూడిన ఎడమ శరీరార్థముతోను శోభిల్లే నీ అందమనెడు అమృతరసాన్ని కీర్తించే విద్య ఏదికలదో అదియే స్వరూపమైనవాడా! ఉపనిషత్తులచేత తెలియదగినవాడా! హరిహరనాథా! చిత్తగించుము.

### అష్టావక్రుం డను మునికుమారు చరిత్రము (సం.13-19-10)

**వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; అట్లు నారాయణ స్వరూప నిరూపణ ప్రకారంబు విని యజాతశత్రుండు సంజాతప్రీతుండై, పితామహుతోఁ 'గన్యాదానంబునకు వరుం డెట్టివాఁడు గావలయు?' ననుటయు' నక్కురువంశవరుం 'డీవిషయంబున నొక్క యితిహాసంబు గలదు విను' మని యమ్మానవపతి యాననం బాలోకించి. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయనుడనే కథకుడు; జనమేజయునకున్= జనమేజయ మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అట్లు= ఆరీతి; నారాయణ స్వరూప నిరూపణ ప్రకారంబు= విష్ణుతత్త్వం బోధించిన పద్ధతి; విని; అజాతశత్రుండు= ధర్మరాజు; సంజాతప్రీతుండు+ఐ= పుట్టిన ఆనందం కలవాడై (ఆనందించి); పితామహుతోన్= తాతతో (భీష్ముడితో); కన్యాదానంబునకున్= పెండ్లిలో పిల్ల నివ్వటానికి; వరుండు; ఎట్టివాఁడు= ఎట్లాంటివాడు; కావలయున్?= కావాలి?; అనుటయున్= అంటే; ప్రశ్నిస్తే; ఆ+కురువంశవరుండు= ఆ కౌరవవంశశ్రేష్ఠుడు భీష్ముడు; ఈ విషయంబునన్= ఈ విషయంలో; ఒక్క ఇతిహాసంబు= ఒక దృష్టాంత కథ; కలదు; వినుము; అని; ఆ+మానవపతి= ఆ ప్రజలకు భర్త అయిన ధర్మరాజు యొక్క; ఆననంబు= ముఖం, ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** వైశంపాయనుడు జనమేజయుడితో అంటున్నాడు. ఆ విధంగా విష్ణుతత్త్వం చెప్పటం విన్న ధర్మరాజు సంతోషించి భీష్ముడిని అడిగాడు. 'కన్యాదానానికి ఎట్లాంటి వరుడు కావాలి?' అని. దాని కాయన 'ఒక ఇతిహాసం ఉన్నది వినుము' అని చెప్పుతున్నాడు.

**సీ. 'అనఘ! యష్టావక్రుఁడను బ్రహ్మచారి స । త్తముఁడు. వదాన్యుఁ డన్తాపసోత్త**
**మునికూఁతు, సుప్రభ యను కన్యఁ బెండ్లిగాఁ । గోరి యాతని నడుగుటయు, నతఁడు**
**'నీవు యోగ్యుండవు, నీ కిత్తు నా పుత్రి; । నంతకు నుత్తర మరిగి రమ్ము'**
**నావుడు, సంయమినందనుం 'డెందుల । కరుగుదు? నే పని యాచరింతుఁ**

**ఆ. బనుపు 'మనుడు వదాన్యుండు 'ధనదుపురము । గడచి హిమగిరి కరుగుము; మృడుని గుఱిచి**
**గిరిజ తప మొనరించె నగ్గిరితటమునఁ । దత్ప్రదేశంబు పుణ్యంబు దానియందు. 3**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; అష్టావక్రుఁడు+అను= అష్టావక్రుడనే పేరుగల; బ్రహ్మచారి= వటువు; సత్ తముఁడు= బ్రహ్మచారులలో చాలా ఉత్తముడు; వదాన్యుఁడు+అన్= వదాన్యుడనే పేరుగల; తాపస+ఉత్తముని= ఋషిశ్రేష్ఠుడి; కూఁతున్=కూతురిని; సుప్రభ= సుప్రభ అనే పేరు గల; కన్యన్= పెండ్లిగాని కన్నెను; పెండ్లికాన్+కోరి= వివాహం చేసికొనాలని; ఆతనిన్= ఆ వదాన్యుడిని; అడుగుటయున్= వేడుకొనగా; అతఁడు; నీవు; యోగ్యుండవు= తగినవాడవు (నేటికీ ఈ పదాన్ని ఈ సందర్భంలో ఇట్లాగే వాడుకొంటున్నాం. యోగ్యుడైన వరుడికిచ్చి అని వ్యవహారంలో మాటే); నాపుత్రిన్= నా కూతురిని; నీకున్+ఇత్తును; అంతకున్= అంతలో-ఈ లోపల; ఉత్తరము= ఉత్తర దిక్కునకు; అరిగి= పోయి; రమ్ము; నావుడున్= అనగా విని; సంయమి నందనుండు= మునికుమారుడు; ఎందులకున్= ఏ అక్కరగల్గి; అరుగుదున్= వెళ్ళుదును (వెళ్ళుతాను); ఏ పని ఆచరింతున్= ఏ పని చేయాలి; పనుపుము= ఆజ్ఞాపించుము; అనుడున్= అనగా; వదాన్యుండు; ధనదు= ధనాన్ని ఇచ్చేవాడు కుబేరుడి; పురము= నగరం; కడచి= దాటి; హిమగిరికిన్= మంచుకొండకు; అరుగుము= వెళ్ళుము; మృడుని= శివుడిని; గుఱిచి= గురించి; గిరిజ= హిమాలయుడి కూతురు - పార్వతి; తపము= తపస్సు; ఒనరించెన్= చేసిందో; ఆ+గిరి= ఆ కొండ; తటమునన్= ఒడ్డున; తత్ ప్రదేశంబు= ఆ ప్రదేశం; చోటు; పుణ్యంబు= పవిత్రం; దానియందున్= అక్కడ.

**తాత్పర్యం:** అష్టావక్రుడని ఒక బ్రహ్మచారి వదాన్యుడనే మునికుమార్తెను - సుప్రభను పెండ్లి చేసికొనాల నుకొన్నాడు. వదాన్యుడు కూడా ఇద్దామనుకొన్నాడు. కానీ, ఈ లోపల ఉత్తరదిశకు పోయి రమ్మన్నాడు. ఎందుకని అడిగితే శివుడిగురించి పార్వతీదేవి తపస్సుచేసిన చోటు చాలా పవిత్రమైనది. అక్కడ.

**క. ఆడుచుఁ బాడుచు గణములు । గూడి చరింపంగ గిరిజకుం బ్రియముగఁ, దా**
**వేడుక నమ్మృడుఁ డెప్పుడుఁ । గ్రీడించుచు నుండు మునులు గీర్తింపంగన్. 4**

**ప్రతిపదార్థం:** గణములు= శివుడి గణాలు; కూడి= కలసి మెలసి; ఆడుచున్ పాడుచున్= ఆడుతూ పాడుతూ; చరింపంగన్= వినోదిస్తుండగా; గిరిజకున్= పార్వతికి; ప్రియముగాన్= ఇష్టమైనట్లు; ఆ+మృడుఁడు= ఆ శివుడున్నూ; తాన్= తాను; వేడుకన్= ఉత్సాహంతో; ఎప్పుడున్= నిత్యం; మునులు కీర్తింపంగన్= మునులు స్తుతిస్తుండగా; క్రీడించుచున్+ఉండున్= విహరిస్తుంటాడు.

**తాత్పర్యం:** శివుడి గణాలు కూడి యాడి వినోదిస్తూ ఉంటే ఆటలతో, పాటలతో శివుడు కూడా తపస్సు మాని పార్వతికి వేడుక కలిగించటానికై తానూ విహరిస్తుంటాడు. వారి క్రీడలను మునులు స్తుతిస్తుంటారు.

**ఆ. అది పవిత్రదేశ ; మచ్చటు సూచుచుఁ । గడచి చనఁగ నీపకాననంబు**
**కానవచ్చు నందు గట్టి ప్రాయమునది । పుణ్యమూర్తి యమలబుద్ధి యొర్తు. 5**

**ప్రతిపదార్థం:** అది పవిత్రదేశము; అచ్చటు= ఆ చోటు; చూచుచున్= చూస్తూ; కడచి= దాటి; చనఁగన్= పోగా; నీప= కడిమిచెట్ల; కాననంబు= తోపు; కానవచ్చున్= కనిపిస్తుంది; అందున్= అందులో; గట్టి ప్రాయమునది= ప్రౌఢవయస్సు కలది; పుణ్యమూర్తి= పవిత్రమైన రూపం కలది (చూడగానే నమస్కరించే బుద్ధి కలిగేది); అమల= నిర్మలమైన; బుద్ధి= మనస్సు కలది; ఓర్తు= ఒక స్త్రీ.

**తాత్పర్యం:** ఆ పవిత్ర ప్రదేశం చూస్తూ, దాటిపోగా, కదంబవనం కనిపిస్తుంది. అందులో ఒక ప్రౌఢవయస్కురాలూ, పవిత్రరూపం కలదీ, సద్బుద్ధి కలదీ అయిన ఒకామె ఉంటుంది.

**క. వసియించు నమ్ముదితఁ బ్రియ । మసలారఁగఁ గాంచి వచ్చు నప్పుడ ప్రమదం**
**బెసఁగంగఁ బెండ్లి సేసెద । నసదృశ రూప గుణవర్త నాన్వయ విద్యా!' 6**

**ప్రతిపదార్థం:** వసియించున్= ఉంటుంది; ఆ+ముదితన్= ఆ స్త్రీని; ప్రియము= ప్రీతి; అసలు+ఆరఁగన్= ఒప్పుతుండగా; కాంచి= చూచి; వచ్చునప్పుడు+అ= వచ్చేటప్పుడు; అసదృశ= సాటిలేని; రూప= ఆకారం; గుణ= సద్గుణాలు; వర్తన= నడవడి; అన్వయ= వంశం; విద్యా!= విద్యకలవాడా! ప్రమదంబు= సంతోషం; ఎసఁగంగన్= అతిశయించగా; పెండ్లి= వివాహం; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ఆమెను చూచిరాగానే నీకు సంతోషంతో వివాహం చేస్తాను. రూపంలో, గుణంలో, ప్రవర్తనలోను, వంశంలోను, విద్యలోను సాటిలేనివాడవు కదా! తప్పక వివాహం చేస్తాను'.

**సీ. అనిన నష్టావక్రుఁ 'డట్ల కా' కని చని, । బాహుదా తీరభూభాగవర్తి**
**యై, రాత్రి గడపి, ధనాధీశు ప్రోలికి । నరుగఁగ నతఁ డమ్మహాత్మురాక**
**విని, యెదురేతెంచి, వినయంబుతోడఁ దో । డ్కొనిపోయి, మహిత పూజన మొనర్చి**
**యూర్వశి రంభ తిలోత్తమ మొదలగు । నప్సరోవనితల యాటపాట**

**తే. లాదిగాఁ గల, వివిధ వినోదకృతుల । ననుదినంబు నారాధింప, నందు నిల్చె**
**నమ్మునీంద్రుండు, దగులు లే కభిమత ప్ర । వర్తనంబుల నొక్క సంవత్సరంబు. 7**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అష్టావక్రుఁడు; అట్లకాక అని= సరేఅని; చని= వెళ్ళి; బాహుదా= బాహుదానది యొక్క (మన రాష్ట్రంలో కడపజిల్లాలో చెయ్యేరు అనేపేరుతో బాహుదానది అన్న నది ఉన్నది); తీర= ఒడ్డునగల; భూభాగ= ప్రదేశంలో; వర్తి+ఐ= నివసించినవాడై; రాత్రి గడపి= రాత్రిని గడిపి; ధన+అధీశు= కుబేరుడి; ప్రోలికిన్= నగరానికి; అరుగఁగన్= పోగా; అతఁడు; ఆ+మహాత్ము= అష్టావక్రుడి రాక; విని; ఎదురు+ఏతెంచి= గౌరవంతో ఎదురుగా ఆహ్వానించటానికి వచ్చి; వినయంబుతోడన్= అణకువతో; తోడ్కొనిపోయి= తీసికొనివెళ్ళి; మహిత= గొప్ప; పూజనము= పూజ; ఒనర్చి= చేసి; ఊర్వశి, రంభ, తిలోత్తమ= దేవలోకంలో ఉన్న ఊర్వశి, రంభ, తిలోత్తమ అనే నర్తకీమణులు; మొదలగు= మొదలైన; అప్సరోవనితల= అప్సరస్ స్త్రీల యొక్క; ఆటపాటలు; ఆదిగాన్‌కల= మొదలైన; వివిధ= అనేక; వినోదకృతులన్= వినోద కార్యాలతో; అనుదినంబున్= ప్రతిరోజు; ఆరాధింపన్= పూజించగా; అందున్; ఆ+ముని+ఇంద్రుండు= ఆ మునిశ్రేష్ఠుడు; తగులు లేక= ఆసక్తిలేక, విరక్తితో; అభిమత= ఇష్టం వచ్చిన; ప్రవర్తనంబులన్= చర్యలతో; ఒక్కవత్సరంబు= ఒక సంవత్సర కాలం; నిల్చెన్= అక్కడే ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని అష్టావక్రుడు వెళ్ళి ఆ రాత్రి బాహుదా నదీతీరంలో కడిపి, కుబేరుడి నగరానికి వెళ్ళాడు. అతడి రాక తెలిసి కుబేరుడు ఎదురు పోయి సాదరంగా ఆహ్వానించి తెచ్చి అతిథిపూజ చేసి అతడికి వినోదార్థం రంభాదుల నాట్యాలు ఏర్పాటు చేశాడు. అష్టావక్రుడు మనస్సు చలించకుండా ఒక ఏడాది అక్కడ ఉన్నాడు.

**వ. పదంపడి ధనదుండు 'నీ కేమి సేయవలయుం జేసెదం జెప్పు' మనిన నతండును 'సర్వంబును సంపన్నంబ, నీవు నిత్యసంపద నున్నతుండవై యుండు; మేనొక్క మునిపతి సెప్పిన పనికై పోయెద; నీతోడి వేడుక నిల్చితి; నింతియ కాని నా కభ్యర్థనీయం బొండు లే' దని పల్కి యట వోయి. 8**

**ప్రతిపదార్థం:** పదంపడి= తరువాత; ధనదుండు= కుబేరుడు; నీకున్= నీకు; ఏమిచేయవలయున్= ఏమిసల్పవలెనో; చేసెదన్= చేస్తాను; చెప్పుము= తెల్పుము; అనినన్, అతండును; సర్వంబును= అంతా; సంపన్నంబు+అ= నిండుగా, తృప్తిగా ఉన్నది; నీవు; నిత్యసంపదన్= శాశ్వతమైన ఐశ్వర్యంతో; ఉన్నతుండవై= గొప్పవాడవై; ఉండుము; ఏను= నేను; ఒక్కమునిపతి+ చెప్పినపనికై= ఒక మునీశ్వరుడు చెప్పిన పని నెరవేర్చుటకై; పోయెదన్; నీతోడివేడుకన్= నీతో కలిసిఉండే కోర్కెతో; నిల్చితిన్= ఉన్నాను; అంతియకాని= అంతేతప్ప; నాకున్= నాకు; అభి= మిక్కిలి; అర్థనీయంబు= కోరదగినది; ఒండు= వేరేదీ; లేదని; పల్కి; అటపోయి= ఆ చోటు వదలి వెళ్ళిపోయి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** తర్వాత కుబేరు డడిగాడు; 'నీకేమి కావాలో చెప్పితే ఇస్తా'నని. అత డన్నాడు- 'నీతో ఒక ఏడాది సంతోషంగా గడిపాను. అది చాలు. నా కేమీ కోరదగినవి లేవు. నే నొక మునిపనిమీద వెళ్ళుతున్నాను' అని చెప్పి ఆ నగారాన్ని వదలి వెళ్ళిపోయాడు.

**సీ. హిమశైలతట మెక్కి యీశ్వర క్రీడన । స్థలిఁ గాంచి మ్రొక్కి ప్రదక్షిణముగఁ**
**జని, యట యరుగంగ మునివరు చెప్పిన । కడిమిలేమ్రాఁకుల యడవి దోఁచె;**
**దానిఁ బ్రవేశింపఁగా, నందు మణిహేమ । మయ చిత్రరమ్య హర్మ్యము లనేక**
**ములు గానవచ్చె; నుజ్జ్వల సమున్నతరమ్య । హర్మ్యంబు వానిలో నధిక విభవ**

**ఆ. సారమై యున్నఁ జూచితద్ద్వారభూమిఁ । జేరి, లోనికిఁ దనపేరు సెప్పి పుచ్చఁ**
**గన్యకలు పఱతెంచిరి, కాంతిరూప । విలసనము లొప్పఁ గొందఱు, వినయ మెసఁగ. 9**

**ప్రతిపదార్థం:** హిమశైల తటము= మంచుకొండ పార్శ్వం; ఎక్కి= అధిరోహించి; ఈశ్వర= శివుడి; క్రీడన స్థలిన్= విహారస్థలం; కాంచి= చూచి; మ్రొక్కి= నమస్కరించి; ప్రదక్షిణముగన్= ప్రదక్షిణపూర్వకంగా; చని= వెళ్ళి; అట= పైకి; అరుగంగన్= పోగా; మునివరుచెప్పిన= మునీశ్వరుడు తెల్పిన; కడిమి= కదంబ; లే= లేత; మ్రాఁకుల= చెట్ల; అడవి= వనం; తోఁచెన్= కనపడింది; దానిన్= అందులో; ప్రవేశింపఁగాన్= వెళ్ళేసరికి; అందున్= ఆ లోపల; మణి= రత్నాలు; హేమ= బంగారం; మయ= మయమైన; చిత్ర= ఆశ్చర్యకరమైన; రమ్య= అందమైన; హర్మ్యములు= మేడలు; అనేకములు+కానవచ్చెన్= పెక్కు కనబడినవి; ఉజ్జ్వల= ప్రకాశించే; సమున్నత= చాలా ఎత్తైన; రమ్య హర్మ్యంబు= అందమైన మేడ; వానిలోన్= ఆ మేడల వరుసలో (ఇది); అధిక= ఎక్కువ; విభవ= వైభవ; సారము= సారం; ఐ=కలిగి; ఉన్నన్+చూచి= ఉండటం చూచి; తత్ద్వార భూమిన్= ఆ మేడ ద్వార ప్రదేశం; చేరి= సమీపించి; లోనికిన్= మేడలోపలికి; తనపేరు చెప్పి పుచ్చన్= ఫలానా మనిషి వచ్చాడని కబురు చేయగా;

కన్యకలు= అవివాహితలు; కాంతి= లావణ్యం; రూప= అందమైన రూపాలు; విలసనములు= అందాలు; ఒప్పన్= ప్రకాశించగా; వినయము ఎసఁగన్= వినయం వెల్లడి అయ్యేటట్లు; కొందఱు= కొంతమంది; పఱతెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** మంచుకొండ లెక్క ఈశ్వరుడి క్రీడా స్థలాలు దర్శించి మునివరుడు చెప్పిన లేత కడిమిచెట్ల వనంలో రత్నాలు పొదిగిన బంగారు మేడల వరుస లనేకం చూచాడు. అందులో అధిక వైభవంతో ప్రకాశించే బంగారుమేడ చూచి ద్వారం దగ్గరకు పోయి లోపలకు కబురు చేశాడు ఫలానా వారు వచ్చారని. వినీవినగానే అందాలరాసులైన కన్యకలు కొందరు వినయంతో పరుగు పరుగున వచ్చారు.

**వ. పఱతెంచి పరమాదరంబునం దోడ్కొని పోవునప్పు, డప్పొలంతుల యొప్పు, సూడ్కులకుం జిత్తంబునకు వేడ్కలు సేయంజాలినను, లోలత్వ రాహిత్యంబున నత్యుదాత్తుం డగుచుం జని, యభ్యంతర మందిరంబున వివిధ రత్నరశ్మి విరాజితంబైన పర్యంకంబున నార్యమూర్తియు, ధవళవసనాంగరాగయు, రుచిరాభరణ భూషితయు, ప్రౌఢవయస్కయు, నగు నొక్క వనితం గని 'మే లయ్యెడు' మనుచు నిలిచిన, నయ్యిందువదన 'యిందు రం' డని పలుకుచుం బ్రత్యుత్థానంబు సేసి. 10**

**ప్రతిపదార్థం:** పఱతెంచి= వచ్చి; పరమ+ఆదరంబునన్= మంచి ప్రేమతో; తోడ్కొని= వెంటబెట్టుకొని; పోవునప్పుడు= వెళ్ళేటప్పుడు; ఆ+పొలంతుల= ఆ స్త్రీల; ఒప్పు= అందం; చూడ్కులకున్= చూపులకు; చిత్తంబునకున్= మనస్సుకు; వేడ్కలు= కోర్కెలు; చేయన్ చాలినను= కల్గించగలిగినా; లోలత్వ= ఆసక్తి; రాహిత్యంబునన్= లేనందువలన; అతి= మిక్కిలి; ఉదాత్తుండు= మహాత్ముడు; అగుచున్; చని= వెళ్ళి; అభ్యంతర మందిరంబునన్= లోపలి సౌధంలో; వివిధ రత్న= అనేక రత్నాల; రశ్మి= కాంతులతో; విరాజితంబు+ఐన= ప్రకాశించే; పర్యంకంబునన్= వేదికపై; ఆర్యమూర్తియున్= పుణ్యాకృతి కలదీ; ధవళ= తెల్లని; వసన= వస్త్రం; అంగరాగయున్= శరీరానికి పూసికొన్న వాసన ద్రవ్యాలు కలది, (కస్తూరి, జవ్వాది మొదలుగునవి); రుచిర= అందమైన; ఆభరణ= నగలచేత; భూషితయున్= అలంకరించుకొన్నది; ప్రౌఢవయస్కయున్= మంచి ప్రాయం కలది; అగు= అయిన; ఒక్కవనితన్= ఒక వెలదిని; కని= చూచి; మేలు+అయ్యెడున్+అనుచున్= శుభమగుగాక అని పలుకుతూ; నిలిచినన్= నిలువగా; ఆ+ఇందువదన= చంద్రుడిని పోలిన ముఖం కల్గిన ఆమె; ప్రతి+ఉత్థానంబు ఒనర్చి= ఎదురుగా లేచివెళ్ళటం చేసి. (మీది పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** కన్యకలు పరుగు పరుగున వచ్చి అష్టావక్రుడిని వెంటబెట్టుకొని తీసికొనిపోయారు. వారి అందచందాలకు అతడి మనస్సు చలించలేదు. అంతఃపురంలో పలురత్నాలకాంతులతో ప్రకాశించే పర్యంకముమీద పవిత్రస్వరూపిణీ (పార్వతీదేవివంటిది) తెల్లనిచీర, మైపూతలు ధరించినదీ, అందమైన ఆభరణాలు అలంకరించుకొన్నదీ, ప్రౌఢవయస్కురాలు అయిన ఒక కాంతను అతడు దర్శించి శుభమస్తు అంటూ నిలిచాడు. అపుడా చంద్రవదన 'ఇట్లా రండి' అంటూ లేచి ఎదురుగా వెళ్ళి ఆహ్వానించి తెచ్చింది.

**క. అమ్మునివరు నాపర్యం । కమ్ము పయిం బ్రీతి నునిచి, గారవమునఁ బా**
**ద్యమ్మును నర్ఘ్యము శ్రుతివిహి । తమ్మైన విధమున నిచ్చి, తత్పార్శ్వమునన్. 11**

**ప్రతిపదార్థం:** ఆ+మునివరున్= ఆ మునిశ్రేష్ఠుడిని; ఆ= పైన చెప్పిన; పర్యంకమ్ముపయిన్= వేదికమీద, ఆసనంమీద; ప్రీతిన్= సంతోషంతో; ఉనిచి= కూర్చోబెట్టి; గారవమునన్= గౌరవంతో; పాద్యమ్మునున్= పాదాలు కడుగుకొనటానికి నీళ్ళు;

అర్ఘ్యమున్= పూజకు తగిన నీళ్ళు; శ్రుతివిహితమ్ము+ఐన= వేదం చెప్పిన; విధమునన్= రీతిగా; ఇచ్చి; తత్= అతడి; పార్శ్వమునన్= ప్రక్కనే.

**తాత్పర్యం:** అష్టావక్రుడిని ఆపర్యంకంమీద కూర్చుండబెట్టి ప్రీతితో అర్ఘ్యపాద్యాలను వేదం చెప్పిన రీతిగా ఇచ్చి అతడి ప్రక్కనే.

**వ. తానును వేఱొక్క సెజ్జం గూర్చుండె; నమ్ముని గలయం గనుంగొని యక్కన్నియల విభ్రమ వికారంబులు దన లోచనంబులకు గోచరంబులగుటకు నొల్లక 'యిమ్మదవతీ జనంబు లిచ్చట నేల?' యనిన నక్కాంత యక్కన్యల నెల్లం బోవం బనిచి సముచిత సల్లాపంబులు సేయుచుండి, రాత్రి యగుటయు. 12**

**ప్రతిపదార్థం:** తానును= తానుగూడ; వేఱొక్క= మరొక; సెజ్జన్= శయ్యపై; కూర్చుండెన్; అమ్మని; కలయన్+కనుంగొని= పరిసరాలన్నీ చూచి; ఆ+కన్నియల= ఆ కన్యల యొక్క; విభ్రమ వికారంబులు= కామభావంవలన శరీరంమీద కలిగే అందమైన చేష్టలు; తన; లోచనంబులకున్= కళ్ళకు; గోచరంబులు+అగుటకున్= కనిపించటానికి; ఒల్లక= ఇష్టపడక; ఈ+మదవతీజనంబులు= కామంతో కలిగే మత్తు కళ్ళు మొదలైన అవయవాలతో ఉన్న స్త్రీల గుంపు; ఇచ్చటన్; ఏల; అనినన్; ఆ+కాంత= ఆ స్త్రీ; ఆ కన్యలన్= ఆ కన్నియలను; ఎల్లన్= అందరినీ; పోవన్+పనిచి= పోయేటట్లు ఆజ్ఞాపించి; సముచిత= తగిన; సల్లాపంబులు= సంభాషణలు; చేయుచున్+ఉండి= సల్పుతూ ఉండి; రాత్రి; అగుటయున్= కాగా.

**తాత్పర్యం:** అతడి ప్రక్కనే మరొక శయపై కూర్చుండగానే ఆ ముని - ఆ కన్యల అందచందాలు చూడటానికి ఇష్టపడక వారిని పంపించివేయుమని ఆమెతో చెప్పగానే ఆమె కూడా వారిని పంపించివేసింది. తరువాత అతడితో తగిన సంభాషణలు చేస్తూ ఉన్నది. ఇంతలో రాత్రి కావటంతోనే.

### ఉత్తరదిశ అష్టావక్రుని చిత్తశుద్ధిఁ బరీక్షించుట (సం.13-20-50)

**క. సీతయ్యె ననుచు, నల్లన । యాతని శయనమున కరిగి, యతఁ డెడ యీఁగా,**
**నా తల్పంబున నొక దెసఁ । బ్రీతహృదయయై శయించెఁ బృథ్వీనాథా! 13**

**ప్రతిపదార్థం:** పృథ్వీనాథా!= భూమికి నాథుడా! రాజా! సీతు= చలి; అయ్యెన్+అనుచున్= పుట్టుతున్నదని; అల్లన= నెమ్మదిగా; అతని శయనమునకున్= ఆయన సెజ్జకు; అరిగి= పోయి; ఆతఁడు= ఆయన; ఎడ= చోటు; ఈఁగాన్= ఇవ్వగా; ఆ తల్పంబునన్= ఆ సెజ్జపై; ఒకదెసన్= ఒక ప్రక్క; ప్రీతహృదయ+ఐ= సంతోషించిన మనస్సు కలదై; శయించెన్= పవ్వళించింది, పండుకొన్నది.

**తాత్పర్యం:** ధర్మరాజా! రాత్రి అయినందువలన ఆమె చలి పుట్టుతున్నదని చెప్పుతూ అతడి మంచం దగ్గరకు రాగా అతడు అవతలకు జరిగి ఆమెకు చోటిచ్చాడు. ఆమె కూడా సంతోషించి ఒక ప్రక్కగా పండుకొన్నది.

**క. పదపడి నయమున మెయిమెయిఁ । గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం,**
**గదలని చిత్తము గలిగియు, । మద మేమియు లేక, యతఁడు మ్రానై యుండెన్. 14**

**ప్రతిపదార్థం:** పదపడి= తరువాత; నయమునన్= నేర్పుగా; మెయిన్= తన దేహాన్ని; మెయిన్= అతడి శరీరంతో; కదియించి= చేర్చి; లతా+అంగి= తీగవంటి సన్నని శరీరం కలది; చిక్కన్= గట్టిగా; కౌఁగిటన్= కౌగిటిలో; చేర్పన్=

చేర్చుకొనగా; కదలని= చలించని; చిత్తము= మనస్సు; కలిగియున్= ఉండి; మదము= కామవికారం; ఏమియున్= కొంచెంకూడా; లేక= లేకుండా; ద్రుమాను+ఐ= చెట్టువలె; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** తరువాత నేర్పుగా ఆమె తన శరీరాన్ని అతడి దగ్గరకు చేర్చి గట్టిగా కౌగిలించుకొన్నది. అతడి మనస్సులో చలనం కానీ, మదం కానీ ఏమీ లేక వట్టి కట్టెవలె ఉన్నాడు.

**ఆ. అట్టు లున్నఁ జూచి యత్తన్వి 'మగవారు । భోగపరులు, తాల్మి పొలఁతులందుఁ**

**గలుగు; నవ్విధంబు గాక యేఁ గోరంగ । ననుభవింప కునికి యగునె నీకు? 15**

**ప్రతిపదార్థం:** అట్టులు= ఆ విధంగా; ఉన్నన్= ఉంటే; చూచి; ఆ+తన్వి= ఆ సన్నని శరీరం కలది; మగవారు= పురుషులు; భోగపరులు= భోగాలకు లోబడేవారు; పొలఁతులందున్ = స్త్రీలలో; తాల్మి= ఓర్పు; కలుగున్= ఉంటుంది; ఆ+విధంబు= ఆ పద్ధతి; కాక= కాకుండా; ఏన్= స్త్రీనైన నేను; కోరంగన్= కోరగా; అనుభవింపక+ఉనికి= అనుభవించకుండా ఉండటం; నీకున్; అగునె?= తగునా?

**తాత్పర్యం:** అప్పు డామె అతడితో అన్నది 'ఇదేమిటి? పురుషులు భోగతత్పరులు. స్త్రీలకు ఓర్పు ఉంటుంది. ఇది లోకంలో పద్ధతి. కాని మనపట్ల అది విపరీతంగా ఉన్నది. స్త్రీనైన నేను నిన్ను కోరగా, అనుభవించకుండా ఉండడం నీకు తగునా?

**క. సంపదయు దివ్యభోగము । లింపారఁ బరిగ్రహింపుఁ; డే మీ ధనమై**

**పం పొనరించెద? ననుఁ గా । రింపక, కైకొని వరింపరే? యిచ్చోటన్. 16**

**ప్రతిపదార్థం:** సంపదయున్= నా ఐశ్వర్యం; దివ్య= దేవలోక సంబంధమైన; భోగములు= అనేక భోగాలు (సుఖాలు); ఇంపారన్= ఇష్టమైనట్లు; పరిగ్రహింపుఁడు= స్వీకరించండి; ఏన్= నేను; మీ ధనమై= మీకు సొమ్మై; పంపు= మీ ఆజ్ఞలను; ఒనరించెదన్= చేస్తాను; ననున్= నన్ను; కారింపక= బాధపెట్టక; కైకొని= అంగీకరించి; ఇచ్చోటన్= ఇక్కడ; వరింపరే?= చేకొనరా?

**తాత్పర్యం:** నా కున్న ఈ ఐశ్వర్యాన్ని, భోగాలను స్వీకరించండి. నేనూ మీ సొమ్మై మీరు చెప్పిన పనులన్నీ చేస్తాను. నన్ను బాధించక వివాహం చేసికొనండి.

**సీ. అనిన నష్టావక్రుఁ 'డతిదూష్యమగు పర । దారాభిగమనంబు దగదు; శూద్ర**
**సతి యైన నధిక దోషంబు, బ్రాహ్మణపత్ని । యగునేనిఁ బాతక మప్రమేయ;**
**మదియును గాక, నే నస్ఖలిత బ్రహ్మ । చర్యంబునం దుండి భార్యఁ గోరి**
**యున్నాఁడ 'ననుడు; 'నీ యొప్పునం దగిలితి । వనితలు గామార్తి వశతఁ బొంది**

**తే. వంశహాని దలంపరు, వరుస కలుక; । రాత్మజులఁ జూడ; రగ్రజు ననుజుఁ గొనరు**

**పురుష శతకంబు సంగమంబునను దృప్తి । సనరు; దీని విచారింపు మనియె' నువిద. 17**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అష్టావక్రుఁడు; అతిదూష్యము+అగు= మిక్కిలి నిందించదగిన; పర= ఇతరుడి; దార= భార్యతో; అభిగమనంబు= తిరగటం; తగదు= కూడదు; శూద్రసతి= శూద్రుడి భార్య; ఐనన్= అయితే; అధిక= మిక్కిలి;

దోషంబు= తప్పు; బ్రాహ్మణపత్ని= బ్రాహ్మణుడి భార్య; అగున్+ఏనిన్= అయితే; పాతకము= పాపం; అప్రమేయము= మితిలేనిది; అదియును+కాక= అంతేకాకుండా; ఏను= నేను; అస్ఖలిత బ్రహ్మచర్యంబునందున్= చెదరని బ్రహ్మచర్య వ్రతంలో; ఉండి; భార్యన్+కోరి ఉన్నాడన్= అనుడున్= పత్నిని వాంఛించి ఉన్నాను అనగా; ఉవిద= ఆ స్త్రీ, ఆమె; నీ ఒప్పునన్= నీ అందంలో; తగిలితిన్= చిక్కుకొన్నాను; వనితలు= స్త్రీలు; కామ+ఆర్తి= మన్మథ బాధకు; వశతన్= లోబడటం; పొంది; వంశహాని= కులనాశనం; తలంపరు= భావించరు; వరుసకున్= వావివరుసలకు; అలుకరు= జంకరు; ఆత్మజులన్+ చూడరు= కొడుకులను గమనించరు; అగ్రజున్= అన్నను; అనుజున్= తమ్ముడిని; కొనరు= సరకుగొనరు, లెక్కించరు; పురుషశతకంబు= నూరుమంది మగవారి; సంగమంబునను= రతితో; తృప్తిచనరు= తృప్తిపడరు; దీనిన్= ఈ విషయం; విచారింపుము= ఆలోచించుము; అనియెన్= అనిపల్కింది.

**తాత్పర్యం:** అష్టావక్రు డన్నాడు 'పరునిభార్యతో పోవటం నింద్యం. శూద్రసతి అయితే మరీపాపం. బ్రాహ్మణ సతి అయితే మహాపాపమే. పైగా నేను బ్రహ్మచారినై భార్యను కోరి ఉన్నాను' అని చెప్పటంతో ఆమె అన్నది 'నేను నీ అందానికి బానిసనై పోయాను. స్త్రీకి కామం కలిగితే వంశహానిని, వావి వరుసలను, అన్నదమ్ములను లక్ష్యపెట్టదు. నూరుమంది మగవారితోనూ తృప్తిపొందదు'. ఈ విషయం ఆలోచించు అన్నది.

**వ. అనిన నమ్మునివరుండు. 18**

**తాత్పర్యం:** అనగానే ఆ మునిశ్రేష్ఠుడు.

**క. 'ఇది యేటి కార్యముగ నా । మది కెక్కఁగఁ జెప్పె? దిట్టి మాటలుఁ గలవే?**
**మదవృత్తి మాను; మేఁ బో । యెద' నావుడు నమ్మృగాక్షి యెలన వ్వొలయన్. 19**

**ప్రతిపదార్థం:** ఇది ఏటి కార్యముగన్= ఇదేమంత చేయదగిన పని అయినట్లుగా; నా మదికిన్= నా మనస్సునకు; ఎక్కఁగన్= ఎక్కేటట్లుగా; చెప్పెదు= చెప్పుతావు; ఇట్టి= ఇట్లాంటి; మాటలున్= మాటలు కూడా; కలవే?= ఉన్నవా?; మదవృత్తిన్= మనస్సులోని కామాన్ని; మానుము= వదలుము; ఏన్= నేను; పోయెదన్= పోతాను; నావుడున్= అనగా; ఆ మృగాక్షి= ఆ లేడి కన్నులవంటి కన్నులు కలది; ఎల= లేత; నవ్వు= నగవు; ఒలయన్= (పెదవులపై) వ్యాపించగా.

**తాత్పర్యం:** 'ఇదేమంత ఘనకార్యమని నా మనసు కెక్కేటట్లు చెప్పుతున్నావు? ఇట్లాంటి మాటలు కూడా ఉంటాయా? నాకు తెలియదా? ఈ కోరికను వదలిపెట్టుము. నేను పోతున్నాను' అని అనగా ఆమె లేత నవ్వు చిందించి.

**తే. 'కార్య మగుటయు నరిగెదు గాక పిదప, నిల్వు మంతకు' ననుటయు 'నీవు నన్నుఁ**
**గదియ కుండెద వేని నిల్చెద; సధర్మ । వృత్తి వగు' మని వారించె నత్తపస్వి. 20**

**ప్రతిపదార్థం:** కార్యము= పని; అగుటయున్= కాగానే; పిదపన్= తరువాత; అరిగెదుగాక= వెళ్ళుదువుగాని; అంతకున్= అందాకా; నిల్వుము= నిలువుము; అనుటయున్= అనగా; నీవు; నన్నున్; కదియక= తాకక; ఉండెదవు+ఏనిన్= ఉంటే; నిల్చెదన్= ఉంటాను; సధర్మవృత్తివి= ధర్మదృష్టి కలదానివి; అగుము= కమ్ము; అని; ఆ+తపస్వి= ఆ ముని; వారించెన్= అడ్డగించాడు.

**తాత్పర్యం:** 'పనికాగానే పోదువుగానిలే. అందాక ఉండుము' అని ఆమె అనగా, అత డన్నాడు 'నీవు నన్ను తాకకుండా ఉంటే ఉంటాను. ధర్మంగా ప్రవర్తించుము' అని వారించాడు.

**వ. ఇట్లు వారించి యిది శాపంబున ముదురుదనంబు నొందిన బృందారక సుందరి గావలయు; నట్లయ్యేం గాకుండె, దీని తెఱంగు నా కెఱుంగన్ జాలిం బడనేల?' యని యాత్మ నూహించి యూరకుండె; నంతఁ బ్రభాతం బైనం 'గాలోచిత కృత్యంబులు దీర్పు' మని పలికి యప్పొలంతి యుత్తమ స్నానీయ ద్రవ్యంబులు దెచ్చి, యమ్ముని యనుజ్ఞ వడసి మృదుకరతలంబుల మేను దొడసి కృతస్నానుం జేసి, యతండు సంధ్యావందనాగ్ని కార్యంబు లాచరించిన, నమృతోపమానంబులగు నన్నపానంబుల నతనిం దృప్తునిం గావించి, యుచిత సంభాషణబులం బ్రొద్దు పుచ్చి నిశాసమయం బగుటయు శయనంబునకుఁ బిలిచిన నా సుశ్లోకుండు రాకున్న 'నేనుం గన్యక; నస్ఖలిత బ్రహ్మచర్యంబునన చూవె పరిణత వయస్క నైతి; స్వతంత్ర నై యుండుదుం; బాణిగ్రహణ మహోత్సవం బనుభవింపు' మని పలికిన నమ్మహాత్ముం డిట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** ఇట్లు వారించి; శాపవశంబునన్= శాపవశాత్తు; ఇది= ఈమె; ముదురుదనంబు= గట్టివయస్సు; ఒందిన= పొందిన; బృందారక= దేవజాతి; సుందరి= అందగత్తె; కావలయున్ అయి ఉండవలెను; అట్లు+అయ్యేన్ అట్లాగే కావచ్చు; కాక+ఉండెన్= కాకపోవచ్చు; నాకున్= నాకు; దీనితెఱంగు= దీని జన్మకథ; ఎఱుంగన్= తెలిసికొనటానికి; జాలిన్+పడన్+ఏల?= జాలిపొందటం దేనికి?; అని; ఆత్మన్= తనలో; ఊహించి= ఆలోచించుకొని; ఊరకుండెన్= మిన్నకున్నాడు; అంతన్= అటుపిమ్మట; ప్రభాతంబు+ఐనన్= తెల్లవారగా; కాల+ఉచిత= ఆ సమయానికి తగిన; కృత్యంబులు= చేయదగిన పనులు; తీర్పుము;+అని+పలికి; ఆ+పొలంతి= ఆ స్త్రీ; ఉత్తమ= శ్రేష్ఠమైన; స్నానీయ= స్నానయోగ్యమైన; ద్రవ్యంబులు= వస్తువులు; తెచ్చి; ఆ+ముని; అనుజ్ఞ= అనుమతి; పడసి= పొంది; మృదు= మెత్తని; కరతలంబులన్= చేతులతో; మేను= శరీరాన్ని; తొడసి= తడిపి; కృతస్నానున్‌చేసి= స్నానంచేయించి; అతండు= ఆయన; సంధ్యావందన+అగ్నికార్యంబులు= బ్రాహ్మణ కర్మలైన ప్రాతఃకాలసంధ్యావందనం, అగ్నిహోత్రాదులు; ఆచరించినన్= చేయగా; అమృత+ఉపమానంబులు+అగు= అమృతం వంటి; అన్నపానంబులన్= అన్న, పానీయాలతో; అతనిన్; తృప్తునిన్= తృప్తి పొందినవాడిని; కావించి= చేసి; ఉచిత= తగిన; సంభాషణంబులన్= మంచిమాటలతో; ప్రొద్దుపుచ్చి= ప్రొద్దుగడిపి; నిశాసమయంబు= రాత్రి; అగుటయున్= కాగా; శయనంబునకున్= తనపడకకు; పిలిచినన్= పిలిస్తే; ఆ సుశ్లోకుండు= ఆ స్తుతింప దగ్గవాడు; రాకున్నన్= రాకపోతే; నేనున్= నేనుకూడా; కన్యకన్; అస్ఖలిత= చెదరని; బ్రహ్మచర్యంబునన= బ్రహ్మచర్యంలోనే; పరిణత= ముదిరిన; వయస్కను= వయస్సు కలదానను; ఐతిన్+చూవె= అయినాను సుమా!; స్వతంత్రను+ఐ+ఉండుదున్= నా ఇష్టం చొప్పున ప్రవర్తిస్తాను; పాణిగ్రహ+మహా+ఉత్సవంబు= పెండ్లి సంబరం; అనుభవింపుము= పొందుము; అని పల్కినన్; ఆ+మహా+ఆత్ముండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా వారించి 'ఈమె శాపవశాత్తు ఇట్లా ముదిరిపోయిన దేవకాంత కాబోలు! అట్లా కాదేమో. ఏమైనా దీని ఆలోచనతో నేను సతమతం కావటం దేనికి?' అని ఆలోచిస్తూ అతడు ఊరుకొన్నాడు. అంతలో తెల్లవారింది. ఆమె అతడితో అన్నది 'ఈ సమయానికి తగిన పనులన్నీ పూర్తి కానిమ్ము' అని. అతడి స్నానానికి ఏర్పాట్లు చేసి, అతడి అనుమతితో తన మెత్తటిచేతులతో అతని శరీరం రుద్ది స్నానం చేయించింది. అతడు తరువాత ప్రాతఃకాల విధ్యుక్త కర్మలు పూర్తి చేసుకొన్నాక అతడిని అన్నపానాలతో తృప్తిపరచి మంచి మాటలతో ప్రొద్దు గడపింది. తరువాత రాత్రి కాగా ఆమె తనపడకకు రమ్మన్నది. అతడు కదలలేదు. అప్పు డామె 'నేను బ్రహ్మచర్య వ్రతంలోనే జీవితాన్ని గడిపాను. అందువలననే నా కింత వయసు వచ్చింది. నన్ను వివాహం చేసికొమ్ము' అంటే ఆ మహాత్ము డిట్లా అన్నాడు.

**తే. 'బాల్యమునఁ దండ్రి, యౌవనప్రాప్తి మగఁడు, । వార్ధకంబునఁ దనయుఁడు, వామనయన**

**నరసి నడపన కా కెందు నంగనలకు । వలసినట్టులు సేయఁగా వచ్చు నెట్లు? 22**

**ప్రతిపదార్థం:** వామనయనన్= అందాల కళ్ళు కల స్త్రీని; అరసి= కాపాడి; నడపన= జీవించేటట్లుగా (చేసేవారు); తండ్రి; బాల్యమునన్= పసితనంలో; మగఁడు= భర్త; యౌవనప్రాప్తిన్= యుక్తవయస్సులో; తనయుఁడు= కొడుకు; వార్ధకంబునన్= ముసలితనంలో; కాక; ఎందున్= ఎప్పుడూ; అంగనలకున్= స్త్రీలకు; వలసినట్టులు= వారు ఇష్టం వచ్చినట్లు; చేయఁగాన్= చేయటానికి; ఎట్లు వచ్చున్= ఎట్లా వీలౌతుంది?

**తాత్పర్యం:** 'స్త్రీకి పసితనంలో తండ్రి, వివాహమైన తరువాత భర్త, ముసలితనంలో కొడుకు రక్షిస్తారు తప్ప ఆమెకు స్వతంత్రంగా ఏమీ చేయటానికి వీలు లేదు కదా!

**వ. 'కావున నీవు ని న్నిచ్చినం బరిగ్రహించుట పాడిగా' దను సమయంబునం జూడఁ జూడ నచ్చేడియ సుభగ యౌవన సుందరాంగియు మనోహర విలాస భంగియు నయ్యె; నైనను దానియందుఁ దగులని చిత్తంబుతో నత్తపోధన కుమారుండు. 23**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నీవు= నీకై నీవు; నిన్ను ఇచ్చినన్= నిన్ను సమర్పించుకొన్నా; పరిగ్రహించుట= నేను స్వీకరించటం; పాడికాదు= న్యాయం కాదు; అను= మాట లంటున్న; సమయంబునన్= వేళలో; చూడన్+చూడన్= చూస్తూ ఉండగా; ఆ+చేడియ= ఆ స్త్రీ; సుభగ= అందమైన; యౌవన= యుక్త వయస్సులో; సుందరాంగియున్= అందమైన అవయవాలు కలది; మనోహర విలాసభంగియున్= అందమైన ఒయ్యారం కలదీ; అయ్యెన్= అయింది; ఐనను్= అయినప్పటికి; దానియందున్= ఆమెపై; తగులని= ఆసక్తి పొందని; చిత్తంబుతోన్= మనస్సుతో; ఆ+తపోధన కుమారుండు= తపస్సే సంపదగా కల ఋషి కొడుకు, మునికుమారుడు.

**తాత్పర్యం:** 'కాబట్టి స్వతంత్రించి నీకై నిన్ను అర్పించుకొన్నా నేను స్వీకరించలేను. అది న్యాయం కాదు' అని అంటూ ఉండగానే ఆమె వికసించిన యౌవనం అందమైన అవయవాలూ, మనస్సును హరించే విలాసం కలదీ అయింది. ఐనప్పటికీ అతడు చలించలేదు.

**క. 'ఈ యన్నృత వర్తనము లే । లా? యున్న నిజంబు నీ తలంపును నిన్నుం**

**దోయజలోచన! చెప్పుము; । పోయెదఁ బనులు గల; వనిచి పుచ్చుము నన్నున్. 24**

**ప్రతిపదార్థం:** ఈ అన్నృత= ఈ అబద్ధపు; వర్తనములు= చేష్టలు; ఏలా?= ఎందుకు?; ఉన్న నిజంబు= కలమాట; నీ తలంపును= నీ ఆలోచన; నిన్నున్= నీ వెవరవో, నిన్ను గురించి; తోయజలోచన!= తామరపూలవంటి కళ్ళున్నదానా!; చెప్పుము; పోయెదన్= పోతాను; పనులు కలవు= చేయవలసిన కార్యాలు ఉన్నాయి; నన్నున్; అనిచి పుచ్చుము= నన్ను సాగనంపుము.

**తాత్పర్యం:** 'ఈ అబద్ధపు చేష్టలు దేనికి? నీ సంగ తేమిటి? నీ వెవరవు? వివరంగా చెప్పుము. నాకు చాల పనులు ఉన్నాయి. కనుక నన్ను పంపించు పోతాను'.

**సీ. అనవుడుఁ బ్రీతయై 'యనఘ! ని న్నారయు । తలఁపునఁ జూవె వదాన్యుఁ డిందుఁ**

**బుత్తెంచె; నేను నీ యుత్తరదిశఁ జుమ్ము; । నీ నిష్ఠ గాంచితి; దీన నతఁడు**

నిను మెచ్చు; నాదెస మనమునఁ బ్రియమొందు; । మరుగుము సుప్రభా పరిణయమున'

కనిన నద్దేవికి వినతుఁడై, వీడ్కొని । యరిగి, యమ్మునిపతి, యాత్మఁ గనియుఁ

తే. దన్ను నడుగంగ సకలవృత్తంబుఁ జెప్పి । యతని పుత్త్రికఁ బెండ్లియై యతుల ధర్మ

భోగ గౌరవకీర్తులఁ బొంది జగతి । నతిశయిల్లె నష్టావక్రుఁ డధిపముఖ్య!' 25

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పల్కగా; అధిపముఖ్య!= రాజశ్రేష్ఠుడా!; ప్రీత+ఐ= సంతోషించినదై; అనఘ!= పుణ్యాత్ముడవైన అష్టావక్ర మునీంద్రా!; నిన్నున్; అరయు తలఁపునన్= పరీక్షించే ఆలోచనతో; చూవె= సుమా!; వదాన్యుఁడు= సుప్రభ తండ్రి; ఇందున్= ఇక్కడకు; పుత్తెంచెన్= నిన్ను పంపించాడు; నేను; ఈ ఉత్తర దిశన్ చుమ్ము= ఈ ఉత్తర దిక్కాంతను సుమా!; నీనిష్ఠ=నీ బ్రహ్మచర్య నియమం; కాంచితిన్= పరీక్షించాను; దీనన్= ఈ పరీక్షవలన; అతఁడు= వదాన్యుడు; నినున్ మెచ్చున్= నిన్ను మెచ్చుకొంటాడు; నా దెసన్= నా యందు; మనమునన్= మనస్సులో; ప్రియము+ఒందుము= ప్రీతిపొందుము; సుప్రభా పరిణయమునకున్= సుప్రభను వివాహం చేసికొనటానికి; అరుగుము= వెళ్ళుము; అనినన్; ఆ+దేవికిన్= ఆ దేవతకు; వినతుఁడు+ఐ= నమస్కరించి; వీడ్కొని= ఆమెవద్ద సెలవు పుచ్చుకొని; అరిగి= వెళ్ళి; ఆ+మునిపతి= ఆ వదాన్యుడన్న మునిరాజు; ఆత్మన్= తనలో; కనియున్= జరిగిన కథనంతా చూచికూడా; తన్నున్= అష్టావక్రుడిని; అడుగంగన్= అడుగగా; సకల వృత్తంబున్= జరిగినదంతా; చెప్పి= తెలిపి; అతని; పుత్రికన్= అతని కుమార్తెను; పెండ్లి+ఐ= వివాహం చేసికొని; అతుల= సాటిలేని; ధర్మ= ధర్మం; భోగ= సుఖాలు; గౌరవ= గౌరవం; కీర్తులన్= కీర్తిని; పొంది; జగతిన్= లోకంలో; అష్టావక్రుఁడు; అతిశయిల్లెన్= గొప్పవాడయ్యాడు.

**తాత్పర్యం:** అనేసరికి ఆమె సంతోషించి 'నిన్ను పరీక్షించే నిమిత్తం వదాన్యుడు న న్నిక్కడకు పంపించాడు. నేను ఉత్తర దిక్కాంతను. నీ నియమం చూచాను. దీనితో వదాన్యుడు సంతోషిస్తాడు. నాయందు ప్రీతినెరపుము. వెళ్ళి సుప్రభను వివాహం చేసికొను' మనగా అతడు ఆమెకు నమస్కరించి వెళ్ళి వదాన్యుడికంతా చెప్పి అతడి కూతుర్ని వివాహం చేసికొని గొప్ప ధర్మపరుడుగా గౌరవమర్యాదలతో కీర్తిపొందాడు'.

వ. అని యష్టావక్రదిశా సంవాదంబు సెప్పిన విని యప్పాండవాగ్రజుండు 'మునులవలన శూద్రజాతి భామలయందుఁ బ్రభవించిన వారికి బ్రహ్మర్షిత్వంబు గల్గుట యది యెట్లొకో'! యని వితర్కింతు; నత్తెఱంగు నాకెఱింగింపవే!' యని యనిమిషనదీనందను నడుగుటయు, నక్కురుపతికిఁ గురుపితామహుం డిట్లనియె. 26

**ప్రతిపదార్థం:** అని= అంటూ; అష్టావక్రదిశా సంవాదంబు= అష్టావక్రునకు ఉత్తరదిక్కాంతకు జరిగిన సంభాషణ; చెప్పినన్ విని= భీష్ముడు తెల్పగా ఆలకించి; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడు; మునులవలనన్= మునులద్వారా; శూద్రజాతి భామలయందున్= నాలుగవజాతి స్త్రీలలో; ప్రభవించిన= పుట్టిన; వారికిన్, బ్రహ్మర్షిత్వంబు= బ్రహ్మర్షిత్వం; కల్గుట= సంభవించుట; ఎట్లు+ఒకో!= ఎట్లాగబ్బా!; అని; వితర్కింతున్= ఆలోచిస్తాను; ఆ+తెఱంగు= ఆ విధానం; నాకున్; ఎఱింగింపవే= తెలుపవా; అని; అనిమిషనదీ నందనున్= గంగాపుత్రుడైన భీష్ముడిని; అడుగుటయున్= అడుగగా; ఆ+కురుపతికిన్= ఆ కురువంశ చక్రవర్తి అయిన ధర్మజుడితో; కురుపితామహుండు= కురువంశస్థులకు తాత ఐన భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అష్టావక్రుడికి దిశాకన్యకు జరిగిన సంవాదం చెప్పగా విని ధర్మరాజు ఇట్లా అడిగాడు; 'మునుల వలన శూద్రస్త్రీలకు కలిగిన సంతానం బ్రహ్మర్షులు ఎట్లా కావటం? అని నాకు చాలా రోజులుగా ఆలోచన తెగటం లేదు. దీని రహస్యం విప్పి చెప్పు' మని. భీష్ముడు ఇట్లా అన్నాడు.

**సీ.** **నాలుగు జాతుల నాతులు, విప్రున । కాండ్రుగాఁ గైకొన నగు; నృపునకుఁ**

**దనకులంబున నట తక్కువ కులములు । రెంటను బరిణయశ్రీ వహింపఁ**

**జను; వైశ్యునకు నాత్మజాతి, శూద్రాన్వ యం । బునఁ బెండ్లి గాఁ దగు భూపవర్య!**

**శూద్రున కర్థంబు శూద్రకన్యకఁ బెండ్లి । యగుటయు; నిది వివాహ ప్రకార**

**ఆ.** **కథిత ధర్మ; మిట్టిగతిఁ దప్పి ప్రతిలోమ । సరణి యైనఁ, గల్గు సంకరంబు;**

**తల్లి యెట్టి కులము దాని కులంబ యౌ । సన్నుతానులోమ సంభవునకు.** **27**

**ప్రతిపదార్థం:** విప్రునకున్= బ్రాహ్మణుడికి; నాలుగు జాతుల= నాలుగు వర్ణాల; నాతులు= స్త్రీలను; ఆండ్రు+కాన్= భార్యలుగా; కైకొనన్= స్వీకరించటానికి; అగున్= తగును; నృపునకున్= రాజునకు; తన కులంబునన్= తన క్షత్రియ కులంకంటె; అట తక్కువ= ఆ తక్కువ; కులములు రెంటను= రెండు కులాలనుండి; పరిణయశ్రీ= వివాహ మంగళం; వహింపన్ చనున్= చేసికొనవచ్చును; వైశ్యునకున్= కోమటికి; ఆత్మ జాతిన్= తమ కులంలో; శూద్ర+అన్వయంబునన్= శూద్రకులంలోను; పెండ్లికాన్= పెండ్లి అగుట; తగున్= న్యాయం; భూపవర్య!= రాజశ్రేష్ఠుడా!; శూద్రునకున్; శూద్రకన్యకన్= తమకులం పిల్లనే; పెండ్లిఅగుటయున్= వివాహం చేసికొనటమే; అర్థంబు= యుక్తము; ఇది= ఇయ్యది; వివాహప్రకార= వివాహ విధానంగా; కథిత= చెప్పబడిన; ధర్మము= న్యాయం; ఇట్టి= ఇట్లాంటి; గతిన్= పద్ధతిని; తప్పి= త్రోసిరాజని; ప్రతిలోమ సరణి= పై కులాలవారిని క్రిందికులాలవారు చేసికొనటం; ఐనన్= అయితే; సంకరంబు= వర్ణసాంకర్యం (కులాలన్ని కలగాపులగంగా కలిసిపోవటం); కల్గున్= అవుతుంది; తల్లి; ఎట్టికులము= ఏ కులందో; దాని= తల్లి; సన్నుత= పొగడ దగిన; అనులోమ= పై కులం వారినుండి; సంభవునకున్= పుట్టిన వానికి; కులంబ ఔ= కులమే అవుతుంది.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడైతే నాలుగు కులాల వారినీ పెండ్లి చేసికొనవచ్చును. క్షత్రియుడైతే మూడు కులాల నుండి, వైశ్యుడు రెండు కులాల నుండి, శూద్రుడు తన కులంనుండి మాత్రమే వివాహం చేసికొనటం ధర్మం. ఇది తప్పితే వర్ణసాంకర్యం కలుగుతుంది. ప్రతిలోమ వివాహం పనికిరాదు. అనులోమ వివాహమే అయితే తల్లి ఏ కులానికి చెందిందో ఆమె యొక్క కులమే సంతానానిది ఔతుంది.

**విశేషం:** ప్రతిలోమం= క్రమంగా క్రిందికి రావటం - అవరోహణ క్రమం. అనులోమ= ఆరోహణ క్రమం. క్రమంగా పైకిపోవటం.

**వ.** **ఇది సకలజన సామాన్యంబైన తెఱంగు; విశేషించి ముని సత్తముల యుత్తమ తపోజ్ఞాన విద్యాప్రభావంబులం జేసి తదీయబీజ సంజాతులు యోని యెద్దియైనను బ్రాహ్మణుల యగుదురు; మహా క్షత్రియులు ననులోమవృత్తి నాత్మ ప్రభావంబులం జేసి నిజబీజ సంజనితులకుఁ దమకులంబ కలిగింపం జాలుదురు; నీవు వియోని జాతులని శంకించి యడిగితివి; వారల యేల? పశు యోని జాతులు నయోనిజాతులును లోనుగా సద్విజులును రాజవరులు నగుట గన్నదిగాదె! కావున మునివరుల నృపవరుల వలనం గలిగిన జన్మంబులెల్లను; బీజ ప్రధానంబులై యతిశయిల్లు; వినుము వసిష్ఠుండు, ఋశ్యశృంగుం, డగస్త్యుండు, సత్యవత్యుద్భవుం డగు కృష్ణద్వైపాయనుండు, మందపాలనందనులు, మఱియు ద్రోణ కృపాదులుం, బ్రభవించిన భంగులు విందుమకాదె! వార లెట్టెట్టి వారయి రెఱుంగవె? యివ్విషయంబున మనువాక్యంబు గల దాకర్ణింపుము.28**

**ప్రతిపదార్థం:** ఇది= ఇయ్యది; సకల జనసామాన్యంబు+ఐన= మానవులందరకు సంబంధించినదైన; తెఱంగు= పద్ధతి; విశేషించి= ప్రత్యేకించి; మునిసత్తములు= మునిశ్రేష్ఠుల; ఉత్తమ= గొప్ప; తపః= తపస్సు; జ్ఞాన= జ్ఞానం; విద్యా=చదువు; ప్రభావంబులన్+చేసి= మాహాత్మ్యంవలన; తదీయ= ఆ; బీజ= విత్తు వలన; సంజాతులు= చక్కగా పుట్టినవారు; యోని= క్షేత్రం(భార్య); ఎద్దిఐననున్= ఏదైనా; ఏ కులస్త్రీఅయినా; బ్రాహ్మణుల= బ్రాహ్మణులే; అగుదురు= ఔతారు; మహాక్షత్రియులు= మహారాజులు; అనులోమ వృత్తిన్= ధర్మప్రకారంగా; ఆత్మ= తమ ఆత్మల; ప్రభావంబులన్+చేసి= శక్తితో; నిజ= తమ; బీజ= గింజ వలన; సంజనితులకున్= పుట్టినవారికి; తమకులంబ= తమ వర్ణం; కలిగింపన్+చాలుదురు= కలిగిస్తారు; నీవు; వియోని= విరుద్ధ క్షేత్రంలో; జాతులు= పుట్టినవారు; అని శంకించి= అని సందేహించి; అడిగితివి= అడిగావు; వారలు+అ ఏల?= వారిలోనే ఎందుకు? పశుయోని జాతులు= పశు సంతానం; అయోనిజాతులును= గ్రుడ్డునుండి పుట్టినవారు; లోనుగాన్= మొదలైన; సద్విజులు= మంచి విప్రులు; రాజవరులున్= రాజశ్రేష్ఠులు; అగుట; కన్నదికాదె!= చూచిందే కదా! కావున; మునివరుల, నృపవరుల వలనన్= మనిశ్రేష్ఠులవలన, రాజశ్రేష్ఠులవలన; కలిగిన= ఏర్పడిన; జన్మంబులు+ఎల్లను= పుట్టుక లన్నియూ; బీజప్రధానంబులు+ఐ= క్షేత్రంకంటె బీజం ముఖ్యమైనవై; అతిశయిల్లున్= ప్రకాశిస్తాయి; వినుము= ఆలకింపుము; వసిష్ఠుండు; ఋశ్యశృంగుండు; అగస్త్యుండు; సత్యవతి+ఉద్భవుండు= సత్యవతికి పుట్టినవాడు; అగు= ఐనట్టి; కృష్ణ ద్వైపాయనుండు మందపాలనందనులు; మఱియున్= ఇంకను; ద్రోణకృప ఆదులున్= ద్రోణుడు, కృపుడు మొదలైనవారు; ప్రభవించిన= పుట్టిన; భంగులు= పద్ధతులు; విందుము+అ కాదె= విన్నారముగదా! వారలు= వారు; ఎట్టి+ ఎట్టివారు+అయిరి= ఎంతటివారలైనారో; ఎఱుంగవె= నీకు తెలియదా?; ఈ+విషయంబునన్= ఈ సంగతియందు; మనువాక్యంబు= స్మృతికారుడైన మనువు చెప్పిన మాట; కలదు= ఉన్నది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇది సామాన్యధర్మం. విశేషధర్మాలు వేరు. మునిశ్రేష్ఠులు ఉత్తమ తపస్సు, జ్ఞానం, విద్యలు కలవారు కనుక వారి బీజశక్తిచేత పుట్టినవారు బ్రాహ్మణులే ఔతారు. తమ తల్లి లక్షణాలు రావు. అట్లాగే ఉత్తమ క్షత్రియులు కూడా తమ బీజశక్తి చేత అనులోమ పద్ధతిచేత తమ కులాన్నే కలిగించగలరు. నీవు విరుద్ధ క్షేత్రంలో పుట్టుతారు కదా అని శంకించి అడిగావు. కాని, పశుపక్ష్యాదులలో కూడా మహాబ్రాహ్మణులు, రాజులు జన్మించటం మనకు తెలుసును కదా! కాబట్టి మునులకు, రాజులకు కలిగిన సంతానం బీజ ప్రధానమే. వసిష్ఠుడు, ఋశ్యశృంగుడు, అగస్త్యుడు, వ్యాసమహర్షి, మందపాలుడి సంతానం, ద్రోణుడు, కృపుడు మొదలైన వారు పుట్టిన కథలు విన్నాం కదా! వారలు ఎట్లాంటివారైనారో నీకూ తెలుసును కదా! ఈ సందర్భంలో మనువు చెప్పిన మాటలు వినుము.

**క. మునిజనుల, నదుల, సిద్ధుల । జననంబులు బుద్ధి వృత్తిఁ జర్చింపఁగ నె**
**వ్వనికిన్ వశంబు గా; వవి । తనతన యైనట్ల యై యుదాత్తతఁ బొందున్.' 29**

**ప్రతిపదార్థం:** ముని జనుల= మునులైన మానవుల యొక్క; నదుల= నదులయొక్క; సిద్ధుల= యోగులయొక్క; జననంబులు= పుట్టుకలు; బుద్ధివృత్తిన్= ఆలోచనలతో; చర్చింపఁగన్= తర్కించటానికి; ఎవ్వనికిన్= ఎంతటి వానికిని; వశంబు కావు= వీలు కావు; అవి= అయ్యవి; తన తన+ఐనట్లు+ఐ= తమంత తామై; ప్రత్యేకంగా; ఉదాత్తతన్= గౌరవం; పొందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** మునుల, నదుల, సిద్ధుల జన్మ రహస్యాలు మనబుద్ధికి తోచినట్లు చర్చించటానికి వీలుకావు. అవి ప్రత్యేకమైనవై తమంత తాము గౌరవాన్ని పొందుతాయి'.

**విశేషం:** ఏరుల జన్మంబు వీరుల జన్మంబు అని నన్నయ్యగా రన్నారు.

**వ. అనిన విని యుధిష్ఠిరుండు. 30**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు (ఇట్లా అడిగాడు)

**ఆ. 'అనఘ! దానపాత్ర మగుట విప్రుఁడు లింగి । యైననో యలింగుఁ డై చరించు**
**టనో యెఱుంగఁ జెప్పు' మనవుడు గాంగేయుఁ । డిట్టు లనియె నమ్మహీశ్వరునకు. 31**

**ప్రతిపదార్థం:** అనఘ!= మహాత్మా!; విప్రుఁడు= బ్రాహ్మణుడు; దానపాత్రము= దానమునకు యోగ్యుడు; అగుట= కావటం; లింగిఐననో= లింగవృత్తి కలవాడు కావటంవలననా! (లింగవృత్తి= ఆచారపరంగా బాహ్యంగా జీవించేవాడు); అలింగుఁడు+ఐ= సన్న్యాసియై, విరక్తుడై; చరించుటనో= తిరగటం వలననా; ఎఱుంగన్= తెలిసేటట్లు; చెప్పుము; అనవుడున్= అనగా; గాంగేయుఁడు= భీష్ముడు; ఆ+మహీశ్వరునకున్= ఆ రాజుతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణుడు దాన యోగ్యుడు కావటం వాడి వృత్తి విశేషంతోనా? లేక విరక్తుడై బ్రతకటంవలననా?' - అని ధర్మరాజు ప్రశ్నిస్తే గంగాపుత్రుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** లింగం= గుర్తు; బ్రాహ్మణుడు ఆచారాలు (లింగం) బాహ్యంగా అనుసరిస్తూ జీవించేవాడు. ఆలింగుడు= బాహ్యమైన గుర్తులు ఏమీ లేకుండా విరక్తబుద్ధితో జీవించేవాడు.

### భీష్ముఁడు ధర్మరాజునకు దానపాత్రభూతుల తెఱం గెఱింగించుట (సం.13-23-1)

**క. 'విను, సద్విజుండు, నిజవ । ర్తనమునఁ జరియించుచున్న దానార్హత్వం**
**బున వెలుఁగు, లింగియైనను । మనుజేంద్ర! యలింగవృత్తి మహితుం డేనిన్'. 32**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= మానవులకు అధిపతివైన రాజా!; విను= వినుము; సత్= మంచి; ద్విజుండు= బ్రాహ్మణుడు; లింగిఐననున్= బాహ్యాచార సంపన్నుడైనా; నిజ= తన కులానికి తగిన; వర్తనమునన్= ప్రవర్తనతో; చరియించుచున్+ఉన్నన్= బ్రతికితే; అలింగవృత్తి= బాహ్యచిహ్నాలు లేని, విరక్త చిత్తంతో; మహితుండు+ఏనిన్= గొప్పవాడైతే; దాన+అర్హత్వంబునన్= దానానికి యోగ్యమైన లక్షణంతో; వెలుఁగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** 'తన కులానికి తగిన ఆచార వ్యవహారాలతో బ్రతుకుతూ; బాహ్యవేషధారణాదులు కల్గియున్నా ఆంతరంగికంగా వీటన్నింటికి అతీతమైన ఔన్నత్యం గలవాడైతే అతడు దానయోగ్యుడు.

**వ. అనుటయుఁ బాండవాగ్రజుండు. 33**

**తాత్పర్యం:** అని అనగా విని ధర్మరాజు.

**తే. శ్రద్ధ సాలంగఁ గల్గిన జనము లిచ్చు । భూరిదానముల్ దురితంబుఁ బొంద నేర**
**వేయెడల నని తలఁచెద నేను బుద్ధి । నను డు నాతని కతఁ డిట్టు లను నృపాల! 34**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా!; శ్రద్ధ= విశ్వాసం; చాలంగన్= ఎక్కువ; కల్గిన= ఉన్న; జనములు= మనుష్యులు; ఇచ్చు= ఇచ్చే; భూరి= పెద్ద; దానముల్= దానాలు, ఏ+ఎడలన్= ఏ సందర్భంలోనూ; దురితంబున్= పాపమును; పొందనేరవు; అని;

ఏను= నేను; బుద్ధిన్= మనస్సులో; తలఁచెదన్= అనుకొంటాను; అనుడున్= అనగా; ఆతనికిన్= ధర్మరాజుతో; అతఁడు= భీష్ముడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** రాజా! 'శ్రద్ధతో జనాలిచ్చే గొప్పదానాలు పాపం పొందవని అనుకొంటాను' అని ధర్మరాజు అనగా భీష్ముడు ఇట్లా అన్నాడు.

**క. 'నరవర! దుర్దాంతు లయినఁ । బరిపూతులు శ్రద్ధ గల్గు భవ్యులుఁ దా రా**

**దర మొప్ప నిచ్చు దానము । దురితహరమ కాక, కీడు దొడరునె యెందున్?' 35**

**ప్రతిపదార్థం:** నరవర!= మానవశ్రేష్ఠుడా!; రాజా!; దుర్దాంతులు= అణచరాని గొప్పతనం కలవారు; అయినన్= అయితే; పరిపూతులు= పవిత్రులు; శ్రద్ధ= విశ్వాసం; కల్గు= కలిగిన; భవ్యులు= మహాత్ములు; తారు= తాము; ఆదరము= ప్రేమ; ఒప్పన్= ప్రకాశించగా; ఇచ్చు= ఇచ్చే; దానం; దురితహరమ కాక= పాపం పోగొట్టేదే తప్ప; కీడు= ఆపద; ఎందున్= ఎక్కడైనా; తొడరునె?= కలుగునా;

**తాత్పర్యం:** 'రాజా! మహాపవిత్రులు, శ్రద్ధ కలిగినవారు, ఆదరంతో చేసిన దానం పాప పరిహారం చేస్తుందే తప్ప పాపం కలిగించదు.'

**సీ. అనుడు ధర్మాత్మజుఁ డతనితో 'దైవ కా । ర్యము నప్డ, విప్రుని నతిపరీక్షి**

**తునిఁ జేయ వలయునే? యనఘ! పైతృకము వి । ధంబున నన్న నాతండు, నీవు**

**దలఁచిన యట్టిద తగవు?' నావుడు నా నృ । పాలుం 'డపూర్వ సంబంధి సూరి**

**యాజి తపోనిత్యులందు సత్పాత్రము । లెవ్వార?' లనుటయు 'నింతవట్టు**

**తే. వారు సత్పాత్రముల, వంశవర్య ధర్మ । భాషణమ కాని తత్క్రియాపరత లేని**

**యట్టివానికి నరుఁడు హేమాదు లిచ్చి । పొరయుఁ బదియేండ్లు నరకానుభూతి' ననియె. 36**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; ధర్మ+ఆత్మజుఁడు= యముని కొడుకు ధర్మరాజు; అతనితోన్= భీష్ముడితో; అనఘ!= దోషరహితుడా! పైతృకము విధంబునన్= పితృకార్యములోవలెనే, శ్రాద్ధక్రియలోమాదిరిగా; దైవకార్యము+అప్డు+అ= దేవతా పూజయందును; విప్రునిన్= బ్రాహ్మణుని; అతిపరీక్షితునిన్= మిక్కిలి పరీక్షించబడినవానిగా; చేయన్+వలయునే= చేయవలెనా? (దైవకార్యం= దేవతాపూజ; పైతృకము= పితృకార్యం; శ్రాద్ధం మున్నగునది) అన్నన్= అని ప్రశ్నించగా; ఆతండు= భీష్ముడు; నీవు= ఓ ధర్మజా నీవు; తలఁచిన+అట్టిది= భావించి నట్టిది; తగవు= న్యాయము; నావుడున్= అని భీష్ముడు అనగానే; ఆ నృపాలుండు= రాజైన ధర్మతనయుడు; అపూర్వ= పూర్వపరిచయం లేనివాడు; సంబంధి= చుట్టము; సూరి= పండితుడు; యాజి= యజ్ఞం చేసినవాడు; తపోనిత్యులు= నిత్యం తపస్సు చేసేవాడు; అందున్= వీరిలో; సత్+పాత్రములు= దానం పుచ్చుకొనటానికి యోగ్యులు; ఏ+వారలు= ఎవ్వరు; అనుటయున్= అని అడిగితే; ఇంతవట్టువారు= నీవు చెప్పిన వారంతా; సత్పాత్రములు+అ= మిక్కిలి అర్హులే; వంశవర్య= కులోద్ధారకుడవైన ధర్మజా!; ధర్మ భాషణము+అ+కాని= మాటలలో ధర్మమే తప్ప; తత్+క్రియాపరత= ధర్మసంబంధ కార్యకలాపములపట్ల ఆసక్తి; లేని+అట్టివానికిన్= లేనటువంటివాడికి; నరుఁడు= మనుజుడు; హేమ+ఆదులు= బంగారం మొదలైనవి; ఇచ్చి= దానంచేసి; పది+ఏండ్లు= దశవర్షాలు; నరక+అనుభూతిన్= నరకలోకానుభవం, నరకబాధలు; పొరయున్= పొందుతాడు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు. పితృకార్యంలో వలెనే దేవకార్యంలోనూ బ్రహ్మణుడిని నిశితంగా పరీక్ష చేసికొని దానాదులివ్వాలా అనగా భీష్ముడు "నీ యాలోచన సరైనదే అని పలికాడు. ధర్మరాజు మరల ఇట్లా అడిగాడు. పూర్వపరిచయం లేనివారు చుట్టాలు, పండితులు, యజ్ఞం చేసినవారు, తపస్వులు వీరిలో ఎవరు దానయోగ్యులు? అని. అందుకు భీష్ముడు "వీళ్లంతా దానయోగ్యులేనని చెప్పి" ఎవడు ధర్మపన్నాలు పలుకుతూ ధర్మాన్ని ఆచరించడో వా డయోగ్యుడు. వాడికి బంగారం మొదలైనవి దానమిస్తే పదేళ్లు నరకలోకానుభవం తప్పదు అన్నాడు.

**వ. అని భీష్ముఁడు వెండియు. 37**

**తాత్పర్యం:** అని భీష్ముడు పలికి ఇంకా (ఇట్లా అన్నాడు).

**క. 'ధరణియుఁ, గాశ్యప, వైశ్వా । నర, మార్కండేయు లోలిన జగద్ధిత వా**
**క్పరులై రొక్కెడ; వారొక । మరి గోష్ఠీనిరతి నుండి మనుజాధీశా! 38**

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా!= ప్రజలకు అధిపతివైన ధర్మజా! ధరణియున్= భూదేవి; కాశ్యప= కాశ్యప మహర్షి; వైశ్వానర= అగ్ని; మార్కండేయులు= మార్కండేయ మహర్షి; ఓలిన= క్రమంగా; వారు= వారలు; ఒకమరి= ఒకసారి; గోష్ఠీనిరతిన్+ఉండి= చర్చా సమావేశంలో ఉన్నవారై; జగత్+హిత= లోకానికి మేలుకూర్చే; వాక్పరులు= సంభాషణా తత్పరులు; ఐరి= ఐనారు.

**తాత్పర్యం:** ఒకసారి భూదేవి, కాశ్యపుడు, అగ్ని, మార్కండేయుడు ధర్మవిచారణ చేస్తూ లోకానికి మేలు చేసే మాట లన్నారు. వాటిని క్రమంగా చెప్తుతాను వినుము.

**వ. అవ్వాక్యంబు లాకర్ణింపుము. 39**

**ప్రతిపదార్థం:** ఆ+వాక్యంబులు= ఆ వాక్యాలు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ వాక్యాలు వినుము.

**క. 'ఘనతర మగు హ్రీ గౌరవ । మున మునిఁగినఁ బాప మఖిలమును, రూపు సెడుం**
**బెనుపున యగ్గలికఁ బొగడు । గనిన పయోరాశిఁ బడ్డ గడ్డయుఁ బోలెన్. 40**

**ప్రతిపదార్థం:** ఘనతరము అగు= చాలా గొప్పదైన; హ్రీ= సిగ్గు; గౌరవమునన్= గురుత్వంలో, ఎక్కువ సిగ్గులో; మునిఁ గినన్= మునిగితే; పెనుపునన్= విస్తారంలో; అగ్గలికన్= ఆధిక్యత; పొగడు= పొగడ్త; కనిన= పొంది; పయోరాశిన్= సముద్రలో; పడ్డ= పడిన; గడ్డయున్= మట్టిగడ్డ; పోలెన్= వలె; పాపము అఖిలమున్= పాపమంతా; రూపుచెడున్= నశిస్తుంది.

**తాత్పర్యం:** గొప్ప సిగ్గు కలిగి ఉంటే విశాలమైన సముద్రంలో పడ్డ గడ్డవలె పాపాలన్నీ నశిస్తాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. సత్కులంబునఁ బుట్టుట, సకలవేద । ములుఁ బురాణంబులును, శాస్త్రములును జదువు**
**టయును సద్గతిఁ జేయఁ బ్రౌఢములు గావు । శీలసామగ్రి లేని దుశ్చేష్టితునకు. 41**

**ప్రతిపదార్థం:** శీల= మంచిస్వభావం యొక్క; సామగ్రి= సాధనం; లేని; దుస్= చెడ్డ; చేష్టితునకున్= చేష్టలు కలవాడికి; సత్కులంబునన్= మంచికులంలో; పుట్టుట= జన్మించటం; సకల= అన్ని; వేదములు; పురాణములు= భాగవతాదులు; శాస్త్రములును= సాంఖ్యం యోగం వంటి శాస్త్ర గ్రంథాలు; చదువుటయునున్= చదవటం; సత్‌గతిన్= మంచి స్థితిని, సుగతిని; చేయన్= చేయటానికి; ప్రౌఢములు కావు= సమర్థం కావు.

**తాత్పర్యం:** శీలంలేనివాడు ఎంత గొప్ప కులంలో పుట్టినా, అన్నివేదాలూ, పురాణాలూ, శాస్త్రాలూ చదువుకొన్నా వాడికి అవి సద్గతుల నీయలేవు.

**ఆ. పలు సదువులు సదివి, పండిత మానియై, । తనదు విద్య నొరుల ఘనయశంబుఁ**
**దూలపుచ్చునట్టి దుష్టాత్మకుని బ్రహ్మ । హత్య వొందు; సందియంబు లేదు. 42**

**ప్రతిపదార్థం:** పలు= అనేకం; చదువులు= శాస్త్రాలు; చదివి= అభ్యసించి; పండిత మాని+ఐ= పండితుడననుకొంటూ ఉండేవాడై; తనదు= తన; విద్యన్= చదువుతో; ఒరులన్= ఇతరుల; ఘన= గొప్ప; యశంబున్= కీర్తినీ; తూలపుచ్చునట్టి= గడ్డిపోచవలె ఎగరగొట్టే; దుష్టాత్మకునిన్= చెడ్డ మనస్సు కలవాడిని; బ్రహ్మహత్య= బ్రాహ్మణుడిని చంపితే కలిగే పాపం; పొందున్= కలుగుతుంది; సందియంబు= సందేహం; లేదు= లేదు.

**తాత్పర్యం:** అనేక విద్యలు నేర్చుకొని, పండితుడనే అహంకారంతో తన విద్యచేత ఇతరుల కీర్తిని గడ్డిపోచవలె భావించే దుర్మార్గుడికి బ్రహ్మహత్యా పాపం కలుగుతుంది. అందులో సందేహం లేదు.

**తే. వాజిమేధముల్ వే యొక్క వలనఁ బెట్టి, । యలఘు సత్యంబు దక్కటివలనియందు**
**నిల్పి, తులఁ దూపఁగా, సత్యనిష్ఠ లోని । యర్ధమున కెత్తు వచ్చె నయ్యధ్వరములు.' 43**

**ప్రతిపదార్థం:** వే= వేయి; వాజి మేధముల్= అశ్వమేధ యజ్ఞాలు; ఒక్క వలనన్= ఒక ప్రక్కన; పెట్టి= ఉంచి; అలఘు= గొప్ప; సత్యంబు= సత్యవాక్యం; తక్కటివలని యందున్ నిల్పి= మిగిలిన రెండవ ప్రక్కనుంచి; వలని; తులన్= త్రాసులో; తూపఁగాన్= తూస్తే; సత్యనిష్ఠలోని= సత్య నియమంలో ఉన్న; అర్ధమునకున్= సగానికి; ఆ+అధ్వరములు= ఆ యజ్ఞాలు; ఎత్తు= బరువు, తూకం; వచ్చెన్= వచ్చింది;

**తాత్పర్యం:** వేయి అశ్వమేధాలు ఒక ప్రక్కా, మరొకప్రక్క సత్యవాక్యాన్ని పెట్టి తూస్తే ఆ యజ్ఞాల బరువు సత్యవాక్యానికే సగం తూకం వచ్చింది.

**వ. అని యిట్లు వర్తిల్లు నాలుగు వాక్యంబులుం జెప్పి. 44**

**తాత్పర్యం:** అని ఈ విధంగా ప్రవర్తించిన నాలుగు మాటలు చెప్పి.

**విశేషం:** నాలుగు మాటలు= లోకంలో పలుకుబడి ఇక్కడ నల్గురు చెప్పిన మాటలు - అని రెండర్థాలు.

**తే. 'బ్రహ్మచర్యంబు కంటెను, బరము మద్య । మాంసములు రెండు నుడుగుట మనుజనాథ!**
**లోకయాత్ర వాటించు చలోలుపతయు । శమముఁ గల్గి వర్తించుట శౌచవిధము'. 45**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; మద్య= కల్లు (సారాయి); మాంసములు= నంజుళ్ళు; రెండును= రెంటినీ; ఉడుగుట= మానటం; బ్రహ్మచర్యంబు కంటెను= బ్రహ్మచారిగా ఉండటం కంటె; పరము= శ్రేష్ఠం; లోకయాత్ర= బ్రతుకు తెరువు; పాటించుచున్= నడుపుకొంటూ; అలోలుపతయున్= విరక్తి; శమమున్= కామం, క్రోధంవంటివి లేకుండా శాంతి; కల్గి; వర్తించుట= బ్రతకటం; శౌచవిధము= శుచిత్వమార్గం.

**తాత్పర్యం:** 'రాజా! మద్య మాంసాలు మానటం బ్రహ్మచర్యం కంటె గొప్పశౌచమంటే సంసారయాత్ర సాగిస్తూ కూడా దేనియందు ఆసక్తి లేకుండా శాంతితో బ్రతకటం.

**వ. అనిన విని, యజాతశత్రుండు 'ధర్మంబు నర్థంబును గామంబును నాచరించు కాలంబు లెఱింగింపవే' యనుటయు నాపగేయుం డతని కిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని పలుకగా విని; అజాతశత్రుండు= శత్రువులు లేనివాడు, ధర్మజుడు; ధర్మంబు, అర్థంబును, కామంబును= ధర్మ అర్థ కామాలన్న పురుషార్థాలను; ఆచరించు= అనుష్ఠించే; కాలంబులు= సమయాలు; ఎఱింగింపవే అనుటయున్= తెల్పుమా అనగా; ఆపగేయుండు= గంగానది కొడుకు - భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ధర్మార్థ కామాలను ఆచరించే వేళలు ఏవి?' అని ధర్మరాజు అడుగగా భీష్ము డిట్లా అన్నాడు.

**తే. 'రేపకడయును, బగలును, మాపు, వరుస । నర్థ ధర్మ కామంబుల నాచరింప**
**వలయు; వానియం దాసక్తి వలదు; సక్తుఁ । డయ్యె నేనియు మేలు ధర్మాభినిరతి'. 47**

**ప్రతిపదార్థం:** వరుసన్= క్రమంగా; రేపకడయును= తెలవారు జాము; పగలును= పగటిపూట; మాపు= సాయంకాలం; అర్థ - ధర్మ - కామంబులన్= ధర్మము, అర్థము, కామములను; ఆచరింపన్= చేయగా; వలయున్= వలెను; వానియందున్= వాటిపై; అసక్తి= అనురక్తి; వలదు= వద్దు; సక్తుఁడు= అనురక్తుడు; ధర్మ+అభినిరతిన్= ధర్మాచరణంలో; అయ్యెన్+ఏనియున్= అయితే; మేలు= మంచిది.

**తాత్పర్యం:** 'అర్థం తెల్లవారుజామున, ధర్మం పగలు; రాత్రిపూట కామం - ఈ వరుసలో అనుష్ఠించాలి. అయినా అర్థకామాలపై అంత ఆసక్తి ఉండటం మంచిది కాదు. ధర్మమందలి ఆసక్తితో అర్థకామాలయందు ఆసక్తుడు గావడం మంచిదే. ధర్మానికి అవిరుద్ధంగా అర్థకామాలు అనుభవించడం తప్పుగాదని భావం.

**వ. అని మఱియును 48**

**తాత్పర్యం:** అని ఇంకా.

**క. 'విను, గురుపూజన విప్రా । ర్చనము లధిక పుణ్యములు, ధరావల్లభ! వి**
**పుని నిందించుటయును, న । గ్నిని వేదము విడుచుటయును గిల్బషతమముల్'. 49**

**ప్రతిపదార్థం:** ధరా= భూమికి; వల్లభ!= రాజా!; విను= వినుము; గురుపూజన= గురువులను పూజించటం; విప్ర= బ్రాహ్మణుల; అర్చనములు= పూజలు; అధిక పుణ్యములు= మిక్కిలి పుణ్యాన్ని కలిగించే పనులు; విప్రునిన్= బ్రాహ్మణుడిని; నిందించుటయును= తిట్టడం; అగ్నినిన్= అగ్నిదేవుడినీ; వేదమున్= వేదాన్ని; విడుచుటయున్= త్యజించటం; కిల్బిషతమముల్= మహాపాపాలు.

**తాత్పర్యం:** 'రాజా! గురువులను, బ్రాహ్మణులను పూజించటం పుణ్యం. బ్రాహ్మణ నిందా; వేదాన్నీ, అగ్నులనూ విడవటం మహాపాపం'.

**సీ.** **అనుటయు, ధర్మనందనుఁడు 'దానంబుల । కెవ్వరు పాత్రంబు లేర్పరింపు'**
**మనిన 'సద్ధర్ములు, నక్రోధనులు, సత్య । రతులు, దాంతులును, ధీరత్వ యుతులు,**
**నిజకర్మ నిరతులు, విజితేంద్రియులు సర్వ । భూతహితులు, నలుబ్ధులును, శుచులు**
**దానపాత్రములు, వేదంబు సాంగంబుగాఁ । జదివి షట్కర్మ నిష్ఠలఁ దొడంగి**

**తే.** **తత్త్వవిదులైన బ్రాహ్మణోత్తముల కీగి । విను సహస్రగుణంబగు, విశ్రుత శ్రు**
**తంబుఁ బ్రజ్ఞయు, శీలవృత్తములుఁ గలుగు । వారి కిచ్చుట వంశవిస్తారకంబు'.** **50**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని భీష్ముడు చెప్పగా; ధర్మనందనుఁడు= ధర్మరాజు; దానంబులకున్= దానాలకు; ఎవ్వరు; పాత్రంబులు= యోగ్యులు; ఏర్పరింపుము= వేర్వేరుగా చెప్పండి; అనినన్= అని అడుగగా; సద్ధర్ములు= మంచి ధర్మనిష్ఠ కలవారు; అక్రోధనులు= కోపం లేనివారు; సత్యరతులు= సత్యనిష్ఠులు; దాంతులున్= మనో నిగ్రహం కలవారు; ధీరత్వయుతులు= ధైర్యంతో కూడినవారు; నిజకర్మనిరతులున్= తమకు విధించిన కర్మలు చేసేవారు; విజిత= జయించబడిన; ఇంద్రియులున్= ఇంద్రియాలు కలవారు; సర్వభూతహితులున్= అన్ని భూతాలపై ప్రేమ కలవారు; అలుబ్ధులున్= లోభంలేనివారు; శుచులు= పవిత్రులు; దానపాత్రములు= దానయోగ్యులు; స+అంగంబుగాన్= జ్యోతిషం మొదలైన అంగాలు గల; వేదంబున్= వేదాన్ని చదివి; షట్కర్మనిష్ఠలన్= ఆరు కర్మలయందు నియమం; తొడంగి= పూనుకొని; తత్త్వ విదులు+ఐన= తత్త్వం తెలిసిన; బ్రాహ్మణ+ ఉత్తములకున్= ఉత్తములైన బ్రాహ్మణులకు; ఈగి= దానం చేయటం; విను= వినుము; సహస్ర గుణంబు+అగున్= వేయిరె ట్లవుతుంది; విశ్రుత= విస్తారమైన; శ్రుతంబున్= వినికిడి, శాస్త్రము; ప్రజ్ఞయున్= ప్రతిభ; శీల= స్వభావం; వృత్తములున్= ప్రవర్తన; కలుగు= కలిగిన; వారికిన్; ఇచ్చుట= దానమివ్వటం; వంశవిస్తారకంబు= కులాన్ని విస్తరింపచేస్తుంది.

**తాత్పర్యం:** 'దానయోగ్యు లెవ్వరో వేర్వేరుగా చెప్పు' మని ధర్మరా జడుగగా - భీష్ముడన్నాడు 'ధర్మం చేసేవారు, కోపం లేనివారు, సత్యం చెప్పేవారు, దాంతులు, ధీరులు, నిజకర్మలు చేసేవారు, ఇంద్రియ నిగ్రహం కలవారు, భూతదయ కలవారు, లోభం లేనివారు, శుచులు దానయోగ్యులు. ఆరు అంగాలు గల వేదాన్ని చదివి, షట్కర్మ లాచరించే ఉత్తమ బ్రాహ్మణులకు చేసే దానం వేయిరెట్లు ఫలిస్తుంది. విస్తారమైన వినికిడి, గొప్పమేధాశక్తి, ఉత్తమశీలం, ప్రవర్తన కలవారి కిస్తే వంశం విస్తరిస్తుంది.

**విశేషం:** షట్కర్మలు :1. యజ్ఞం చేయటం, 2. యజ్ఞం చేయించటం, 3. వేదం చదవటం, 4. వేదం చదివించటం, 5. దానం చేయటం, 6. దానం పుచ్చుకొనటం.

**వ.** **అని నిర్దేశించి భీష్ముండు వెండియు.** **51**

**తాత్పర్యం:** అని స్పష్టంగా నిరూపించి భీష్ముడు ఇంకా (ఇట్లా అన్నాడు)

**ఆ. 'యోగ్యుఁడైన విప్రుఁ డొకరుండు సంతృప్తిఁ । బొంద నధిక తృప్తిఁ బొందు దేవ**
**వితతి, ముని సమూహ పితృ సమాజములు; న । ట్లగుట వెదకి తెచ్చు నది విశిష్టు'. 52**

**ప్రతిపదార్థం:** యోగ్యుఁడు+ఐన= పాత్రుడు, తగినవాడు అయిన; విప్రుఁడు= బ్రాహ్మణుడు; ఒకరుండు= ఒక్కడు; సంతృప్తిన్= సంతోషం; పొందన్= పొందితే; దేవ= దేవతలయొక్క; వితతి= సమూహం; ముని= మునుల; సమూహ= గుంపు; పితృ= పితృదేవతల; సమాజములు= సంఘాలు; సమూహం; అధిక= మిక్కిలి; తృప్తిన్= తుష్టిని; పొందున్= పొందుతుంది; అట్లు+అగుటన్= అందువలన; విశిష్టున్= ఉత్తముడిని; వెదకి= వెతికి, అన్వేషించి; తెచ్చునది= తేవాలి.

**తాత్పర్యం:** 'ఉత్తమ బ్రాహ్మణుడిని ఒక్కడినైనా సంతృప్తిపరిస్తే చాలు. సర్వదేవతలు, పితృదేవతలు, మునులు, అంతా సంతోషిస్తారు. కనుక వెదకి వేసారి అయినా ఒక శిష్టబ్రాహ్మణుడిని తేవాలి.'

**వ. అనిన విని కౌంతేయాగ్రజుం డతనితో 'దేవ పితృ మనుష్య పూజల కాలంబు లెఱింగింపవే' యనుటయు నతండు. 53**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; అతనితోన్= భీష్ముడితో; దేవ= దేవతల; పితృ= పితృదేవతల; మనుష్య= మానవుల; పూజలకాలంబులు= పూజాసమయాలు; ఎఱింగింపవే= తెలుపవా? అనుటయున్= అనగా; అతండు= అతడు.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో 'దేవతలను, పితృదేవతలను, మనుష్యులను పూజించే సమయాలు తెలుపుము' అని అడిగాడు. భీష్ముడు (ఇట్లా అన్నాడు)

**క. 'నృపవర! పూర్వాహ్ణంబును, । నపరాహ్ణము దేవ పితృ సమారాధన వి**
**ధ్యుపదిష్ట కాలములు; మ । ధ్యపు సమయము మానుషార్చనార్హం బరయన్.' 54**

**ప్రతిపదార్థం:** నృపవర!= రాజులలో శ్రేష్ఠుడవైన ధర్మరాజా!; అరయన్= విచారిస్తే; పూర్వ+అహ్ణంబును= ప్రొద్దుటిపూటా; అపర+ అహ్ణము= ప్రొద్దువాలే వేళా; దేవ= దేవతలకు; పితృ= పితృ దేవతలకు; సమారాధన= చక్కని పూజకు; విధి= బ్రహ్మ చేత, వేదంచేత; ఉపదిష్ట= నిర్దేశించబడిన; కాలములు= సమయాలు; మధ్యపు సమయము= ప్రాహ్ణ, అపరాహ్ణకాలాల మధ్యవేళ; మధ్యాహ్నం; మానుష= నరులను; అర్చన= పూజించటానికి; అర్హంబు= తగినది.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ప్రొద్దుటిపూట దేవతల నారాధించాలనీ, అపరాహ్ణసమయంలో పితృదేవతలను పూజించాలనీ, మధ్యాహ్నం మనుష్యులను ఆరాధించాలనీ విధి నిర్దేశించాడు'.

**వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 55**

**తాత్పర్యం:** అని చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'నరనాథ! కాలహీనంబును, నశుచిసం । స్పృష్టంబుఁ, బరిభుక్తశేషమును, న**
**మంత్రకంబును, వీతతంత్రంబుఁ, గీటకే । శ ప్రదుష్టంబు, రాక్షసులు గొంద్రు;**
**మానవీయ ద్రవ్యమేనియు సురపితృ । క్రియల దురాత్మకు లయినవారు**
**గుడిచిన నట్ల యక్కుడుపులఁ జొనుపక । మత్తుని,జడుని, నున్మత్తుఁ బతితుఁ**

**తే. గ్లీబుఁ గుష్ఠి, దేవలకుఁ, జికిత్సకునిని; వీతనియము, నపస్మారి, శ్విత్రి రాజ**
**యక్ష్మయుతుని, నర్తకుని, గాయకుని, సోమ । విక్రయుని, వేదవిక్రయు విడువ వలయు. 56**

**ప్రతిపదార్థం:** నరనాథా!= రాజా!; కాలహీనంబును= కాలనియమం లేనిదీ; అశుచి= అపవిత్రునిచే; సంస్పృష్టంబు= ముట్టుకొనబడినదీ; అమంత్రకంబును= మంత్రం లేనిది; వీత= పోయిన (లేని); తంత్రంబున్= పూజా పద్ధతి కలది; కీట= పురుగులతో; కేశ= వెండ్రుకలతో; ప్రదుష్టంబున్= మిక్కిలి చెడ్డది అయిన; పరిభుక్తశేషమును= తినగా మిగిలిన దానిని; రాక్షసులు; కొంద్రు= తీసికొంటారు; మానవీయ= మానవ సంబంధమైన; ద్రవ్యము+ఏనియున్= వస్తువైనా; సుర= దేవతల; పితృ= పితృదేవతల; క్రియలన్= యజ్ఞాలలో; దురాత్మకులు= దుష్టబుద్ధులు; అయినవారు= అయినటువంటివారు; కుడిచినన్= తిన్నా; అట్ల= అంతే; ఆ+కుడుపులన్= ఆ తిండ్లలో; చొనుపక= ప్రవేశించనివ్వక; మత్తునిన్= మదించిన వాడినీ; జడునిన్= బుద్ధిలేనివాడినీ; ఉన్మత్తునిన్= పిచ్చివాడినీ, పతితున్= భ్రష్టుడైనవాడినీ; క్లీబున్= నపుంసకునీ; కుష్ఠిన్= కుష్ఠరోగినీ; దేవలకున్= పూజారినీ; చికిత్సకునినిన్= వైద్యుడినీ; వీతనియమున్= నియమంలేని వాడిని; అపస్మారిన్= అపస్మారం కలవాడినీ (మూర్ఛరోగగ్రస్తుడినీ); శ్విత్రిన్= బొల్లికలవాడినీ; రాజయక్ష్మయుతునిన్= క్షయరోగినీ; నర్తకునిన్= నాట్యం చేసేవాడినీ; గాయకునిన్= సంగీత విద్వాంసుడినీ, సోమ విక్రయునిన్= సోమరసం అమ్ముకొనేవాడినీ; వేద విక్రయున్= వేద విద్యను అమ్ముకొనేవాడినీ (ధనం తీసుకొని వేదాన్ని చెప్పేవాడిని); విడువవలయున్= పరిత్యజించాలి, వదలాలి.

**తాత్పర్యం:** 'రాజా! కాలనియమం లేకుండా శుచిలేని వానిచే ముట్టుకొన్నదానినీ, ఎంగిలి చేసినదానినీ, మంత్రపూతం కానిదానినీ, పురుగులు, వెండ్రుకలు కలదీ, పూజాతంత్రం లేనిదీ అయిన తిండిని రాక్షసులు తింటారు. మనుష్యులకూ, పితృదేవతలకూ సంబంధించిన ద్రవ్యాలను దుష్టబుద్ధులు గ్రహించకుండా చూడాలి. మదించినవాడినీ, బుద్ధిలేనివాడినీ, పిచ్చివాడినీ, భ్రష్టుడినీ, నపుంసకుడినీ, కుష్ఠరోగినీ, పూజారినీ, వైద్యుడినీ, నియమం లేనివాడినీ, మూర్ఛరోగినీ, బొల్లివ్యాధి కలవాడినీ, క్షయరోగినీ, నర్తకుడినీ, గాయకుడినీ, సోమరసం అమ్ముకొనేవాడినీ, వేదాలను విక్రయించుకొనేవాడినీ దానయోగ్యులుగా పరిగణించరాదు.

**ఆ. వడ్డి కిచ్చి కుడుచువాఁడు, నననగ్నియుఁ । బ్రాణి విక్రయమున బ్రదుకు నతఁడు,**
**దైవ పిత్ర్యములకుఁ దగరు, సంధ్యోపాస । నములు లేనివారు నరవరేణ్య!' 57**

**ప్రతిపదార్థం:** నరవరేణ్యా!= మానవులలో మహోత్తముడా! రాజశ్రేష్ఠుడా!; వడ్డికిన్= వడ్డీకి; ఇచ్చి= డబ్బునిచ్చి; కుడుచువాఁడు= బ్రతికేవాడు; అనగ్నియున్= అగ్నిహోత్రం చేయనివాడు; ప్రాణి= పశుపక్ష్యాదులయొక్క; విక్రయమునన్= అమ్ముకొనటంచేత; బ్రదుకునతడున్= జీవించేవాడు; సంధ్యా+ఉపాసనము= సంధ్యాకాలంలో చేసే జపాదులు లేనివారు, సంధ్యావార్చనివారు; దైవ= దేవతా కార్యాలకు; పిత్ర్యములకున్= పితృకార్యాలకు; తగరు= పనికిరారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణజాతిలో ఎవరైతే అగ్నిహోత్రం, సంధ్యోపాసన మాని వడ్డీ వ్యాపారస్థు లౌతారో, ప్రాణులనమ్మి జీవిస్తారో వారు దైవపితృ కార్యాలలో చేసే దానాలకు తగరు'.

**వ. అనిన విని ధర్మనందనుండు శంతను నందనునితో 'దైవపిత్ర్యంబు లగు దానంబులకు నుత్తమపాత్రంబు లెవ్వ రెఱింగింపవే? యని యడుగుటయు నతం డతని కిట్లనియె. 58**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= భీష్ముడట్లు చెప్పగా విని; ధర్మనందనుండు= ధర్మరాజు; శంతను నందనునితోన్=భీష్ముడితో (శంతనుడి కుమారుడితో); దైవ పిత్ర్యంబులు= దేవతలకు; పితృదేవతలకు సంబంధించినవి; అగు= అయినట్టి; దానంబులకున్= దానాలకు; ఉత్తమ= విశిష్ట; పాత్రంబులు= యోగ్యులు; ఎవ్వరు= ఎవరు; ఎఱింగింపవే= తెలుపుమా; అని+అడుగుటయున్= అని అడుగగా; అతండు= భీష్ముండు; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు. 'దైవకార్యాలలో, పితృకార్యాలలో దానం ఇవ్వటానికి ఉత్తములైన యోగ్యులు ఎవ్వరు? నాకు తెలుపుము' అని ఆ అభ్యర్థనకు సమాధానంగా భీష్ముడు ఇట్లా అన్నాడు.

### దైవ పిత్ర్యంబులగు దానంబులకుఁ బాత్ర భూతుల నిరూపించుట (సం.13-24-49)

**సీ. 'భోజనార్థులఁ దుష్టిఁ బొందించునతఁడును, । దెరువాటువలనఁ దస్కరులచేతఁ**
**జే టొంది ధనము వాంఛించు నతండు, వ్ర । తంబున కుద్యాపనంబు సేయఁ**
**దలఁచి యర్థించునతండును, గురుఁ దల్లి । దండ్రుల సంక్లిష్ట దారపుత్రు**
**లను బ్రోవఁ బడునతండును, మహావ్యాధి ని । రాసంబు సేయంగ నాస చేయు**

**తే. నతఁడు, నిష్పాపుఁ డైన ధరామరుండు, । నెపుడు భిక్షయ బ్రదుకగునేని నట్టి**
**యతఁడు, దైవపిత్ర్యములకు నతిశయంబు । గల్గు పాత్రంబు లగుదురు కౌరవేంద్ర!' 59**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర! = కురుసంతానంలో రాజా! (కురురాజ్యపాలకా); భోజన+అర్థులన్= అన్నం కావాలని వచ్చినవారిని; తుష్టిన్= తృప్తిని; పొందించు అతఁడును= పొందించేవాడునూ; తెరువాటువలనన్= దారిదోపిడి చేత; తస్కరుల చేతన్= దొంగల వలన; చేటు+ఒంది= కీడుపొంది; ధనము= డబ్బు; వాంఛించు= కోరే; అతండున్= వాడునూ; వ్రతంబునకున్= వ్రతానికి; ఉద్యాపనంబు= ముగింపు; చేయన్+తలఁచి= చేయాలనుకొని; అర్థించునతండును= డబ్బు యాచించేవాడు; గురున్= గురువును; తల్లిదండ్రులన్= జననీ జనకులను; సంక్లిష్ట= చిక్కులలోనున్న; దార= భార్య; పుత్రులను= పుత్రులను; ప్రోవన్= పోషించుటకు; పడు+అతండును= పాటుపడేవాడు; మహావ్యాధి= దీర్ఘవ్యాధి; నిరాసంబు+చేయన్= తొలగించుకొనుట కొరకు; ఆసచేయునతఁడున్= కోరుకొనేవాడునూ; నిష్పాపుఁడు= పాపంలేనివాడు; ఐన= అయినట్టి; ధరా+అమరుండు= బ్రాహ్మణుడును; భిక్షయ= బిచ్చమెత్తుకొనటమే; బ్రదుకు= జీవనోపాధి; అగునేనిన్= అయితే; అట్టిఅతఁడు= అట్లాంటివాడు; దైవ పిత్ర్యములకున్= దైవ పితృకార్యాలలో దానాలకు; అతిశయంబు+కల్గు= మిక్కిలి; పాత్రంబులు= యోగ్యులు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** 'కౌరవరాజా! దేవతారాధనలలో, పితృదేవతారాధనలలో దాన ధర్మాలకు యోగ్యులైనవారిని వినుము. భోజనం పెట్టి తృప్తిపరిచేవాడు, దొంగలవలన అంతా పోగొట్టుకొన్నవాడు; వ్రతోద్యాపన కోరి యాచించేవాడు, గురువు, తల్లి, తండ్రి, భార్యా పుత్రులను పోషించుటకై పాటుపడేవాడు, దీర్ఘవ్యాధిని పోగొట్టుకొనాలనుకొనేవాడు, ఎప్పుడూ భిక్షాటనంతో జీవించే పాపంలేని బ్రాహ్మణుడు - ఈ ఆరుగురు ఉత్తమ దానయోగ్యులు.'

**వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 60**

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'సత్రంబు, సాలయు, జలిపందిరియు, రచ్చ । కొట్టము ప్రచ్చుట, గురుజనముల**
**నిందించు, టాగమనింద, దదీయ వి । క్రయవిధి, దద్విలేఖనము, గొండి**
**యము, సంధిభేదన, మన్య కర్మోప జీ । వన, మకృతజ్ఞత, పారదార**
**వృత్తి, మంత్ర సుశాస్త్ర విధ్వంసనము, మద । లోల, నానాథను, బాలవృద్ధఁ**

**తే. దాపసిని, భీతివంచనఁ దలరఁజేయు । టతిథి పుత్రభృత్యులకు నాహారకలన**
**మాచరింపక కుడుచుట, యార్యకోటి । నిరయహేతువులుగఁ జెప్పు నృపవరేణ్య! 61**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= మహారాజా!; సత్రంబు= ధర్మ సత్రాలు; సాలయున్= సభాశాలలు; చలిపందిరియున్= వేసవిలో నీరుపోసేచోటు; రచ్చకొట్టము= రచ్చచావడి; ప్రచ్చుట= (వీటిని) కూల్చటం; గురుజనములన్= పెద్దవారిని; నిందించుట= తిట్టటం; ఆగమనింద= వేదనింద; తదీయ= ఆ వేదవిద్యను; విక్రయవిధి= అమ్ముకొని బ్రతకటం; తత్= ఆవేదం; విలేఖనము= వ్రాయటం; కొండియము= కొండెం చెప్పటం; సంధిభేదనము= చేసికొన్న సంధిని త్రోసిరాజనటం; అన్యకర్మ= ఇతరున కుచితమైన కర్మలతో; ఉపజీవనము= బ్రతకటం; అకృతజ్ఞత= కృతజ్ఞత లేకపోవటం (చేసినమేలు మరవటం); పారదారవృత్తి= ఇతరుల భార్యలతో వ్యభిచరించటం; మంత్రసుశాస్త్ర విధ్వంసనము= మంచి మంత్రశాస్త్రాలను నాశనం చేయటం; మదలోలన్= మదంతో చపలచిత్తం కలదానిని; అనాథను= ఆధారం లేనిదాన్ని; బాలన్= చిన్నదాన్ని; వృద్ధన్= వృద్ధురాలిని; తాపసిని= స్త్రీ సన్యాసిని; భీతిన్= భయంతో; వంచనన్= మోసంతో; తలరన్‌చేయుట= కలతపెట్టటం; అతిథి= తిథి లేక వచ్చేవానికి (ఎప్పుడైనా సరే వచ్చే చుట్టం); పుత్ర= కొడుకులకు; భృత్య= సేవకులకు; ఆహార కలనము= తిండిపెట్టటం; ఆచరించక= చేయక; కుడుచుట= (తాను) తినటం; నిరయ= నరక; హేతువులుగన్= కారణాలుగా; ఆర్యకోటి= పెద్దల సమూహం; చెప్పున్= చెబుతున్నది.

**తాత్పర్యం:** సత్రాలు, సభాశాలలు, రచ్చకొట్టాలు, చలిపందిళ్ళు కూల్చటం; గురువులను, వేదాన్ని నిందించటం; వేదాన్ని అమ్ముకొనటం; వ్రాయటం, కొండెం చెప్పటం, సంధిని ఉల్లంఘించటం, ఇతరులు చేసే వృత్తిని తాను చేయటం (ఇతర వర్ణాలకు చెప్పబడ్డ కర్మలను చేయటం), కృతజ్ఞత లేకపోవటం, పరస్త్రీతో వ్యభిచరించటం; మంత్రశాస్త్రాన్ని ధ్వంసంచేయటం; మదించినది, అనాథ, బాలిక, ముసలిది, తపస్విని మొదలైన వాళ్ళను భయపెట్టడం; వంచించటం; అతిథికి పుత్రులకు సేవకులకు పెట్టకుండా తానుతినటం - ఇవన్నీ నరకద్వారాలని పెద్దలు చెప్పుతున్నారు.

**సీ. విషశస్త్ర కేశముల్ విక్రయించుట, శస్త్ర । ములచేత కన్యాజనులను విప్ర**
**తతిని గోగణమును దఱిసిపోవుట, యుపా । ధ్యాయు సభక్తికుం డైన భృత్యు**
**విడుపు మార్గముఁ గ్రంప నడిచి కొయ్యలు ప్రాఁతి । చెఱుచుట నరకంబు సేయు నండ్రు;**
**నేరమి లేకయు నెపమిడి యర్థంబు । గొనురాజుఁ బ్రజరక్ష వినికి గలిగి**

**తే. యాచరింపని విభుఁడును, నప్పనంబు । పలుకుబడి దప్పి కొనియెడు పతియు, గోవు**
**ముక్కు గుట్టెడివాఁడుఁ, దన్ముష్కఘాతి । యగునతండు నధోగతి కరుగువారు. 62**

**ప్రతిపదార్థం:** విషశస్త్ర కేశముల్= విషము, ఆయుధాలు, తల వెంట్రుకలు; విక్రయించుట= అమ్మటం; శస్త్రములచేఁత= ఆయుధాలు తయారు చేయడం; కన్యాజనులను= కన్యకలను; విప్రతతినిన్= బ్రాహ్మణ సమూహాన్ని; గోగణమును= ఆవుల మందలను; తటిసిపోవుట= దాటిపోవడం, అతిక్రమించడం; ఉపాధ్యాయున్= గురువును; సభక్తికుండు+ఐన= భక్తితో కూడిన; భృత్యున్= సేవకుడిని; విడుపు= విడుచుట; మార్గము= దారిలో; క్రంప నడిచి= కంపగొట్టి; కొయ్యలు= కర్రలు; ప్రాఁతి= నాటి; చెఱుచుట= చెడగొట్టడం; నరకంబు చేయున్+అండ్రు= నరకాన్ని కలిగిస్తాయంటారు; నేరమి= నేరం; లేకయున్= లేకుండానే; నెప మిడి= ఏదో తప్పు నారోపించి; అర్థంబు= డబ్బును; కొను= తీసికొనే; రాజున్= రాజూ; వినికి కలిగి= వినియుండి; ప్రజరక్ష= ప్రజలను రక్షించటం; ఆచరింపని= చేయని; విభుఁడునున్= రాజును; పలుకుబడి= అన్నమాట; తప్పి= మీరి; అప్పనంబు= వస్తువులను ఇల్లడ పెట్టటం; కొనియెడు= గ్రహించే; పతియున్= రాజును; గోవు= ఆవుయొక్క; ముక్కున్= ముక్కును; కుట్టెడివాఁడున్= కుట్టేవాడు; తత్= ఆ గోజాతికి చెందిన ఎద్దులయొక్క; ముష్క= వృషణం; ఘాతి= నలగ కొట్టేవాడు; అధోగతికిన్= క్రిందిలోకాలకు; అరుగువారు= పోతారు.

**తాత్పర్యం:** విషము, ఆయుధాలు, తలవెంట్రుకలు విక్రయించడం, ఆయుధాలు తయారుచేయడం, కన్నెపిల్లలను, విప్రవరులను, ఆవులను దాటుకొంటూపోవటం; చదువు చెప్పే అయ్యవారిని భక్తిగల భృత్యుడిని విడిచిపెట్టటం, మార్గంలో ముళ్ళ కంప వైచి కర్రలు నాటి దారిని చెడగొట్టటం, ఇవన్నీ నరకానికి మార్గాలు. (ఇక రాజులసంగతి) - లేని నెపం పెట్టి డబ్బుగుంజే రాజు, ప్రజల కష్టాలు విని కూడా తీర్చని ప్రభువూ, ఒక వస్తువును దాచిపెట్టినప్పుడు మాట తప్పి తీసికొనేవాడు - (సామాన్య ప్రజలు) - ఆవుముక్కు కుట్టేవాడు; ఎద్దు వృషణాలు నలగ కొట్టేవాడు అధోగతి పాలౌతారు.

**సీ. ధర్మంబు భయమున, దారిద్ర్య సంబాధ । మున రోగమునుఁ బాపములుఁ దొఱంగఁ**
**జేఁతకునైనఁ జేసిన దేవకార్యార్థ । పశుహింసనంబును, బరమ తపము**
**శుశ్రూషయును గల్గి శ్రుతము సంపాదించి । యప్రతిగ్రాహకుఁ డైన, మద్య**
**మాంస పరస్త్రీ సమాగమ వైముఖ్య । మున నాశ్రమస్థులఁ దనకులంబు**

**తే. వారి భరియించినను, హేమవస్త్ర మంది । రాన్నపానంబు లొసఁగిన, నాశ్రయంబు**
**దీనులకు నిచ్చినను, హింస మానినను, స । మంచిత స్వర్గలక్ష్మి సిద్ధించు నండ్రు. 63**

**ప్రతిపదార్థం:** ధర్మంబు భయమునన్= ధర్మ భీతితో; దారిద్ర్య= పేదరికం వలని; సంబాధమునన్= మిక్కిలి బాధతో; రోగమునున్= రోగం; పాపములున్= పాపాలు; తొఱంగన్+చేఁతకున్+ఐనన్= తొలగద్రోయటానికైనా; చేసిన= చేసినటువంటి; దేవకార్య+అర్థ= దేవతల పనికొరకై; పశుహింసనంబును= పశువులను చంపటం; పరమ= శ్రేష్ఠమైన; తపమును= తపస్సును; శుశ్రూషయునున్= సేవ; కల్గి= కలిగి; శ్రుతము= పాండిత్యం, విద్య; సంపాదించి= కష్టపడి గడించి; అప్రతిగ్రాహకుఁడు= దానం పుచ్చుకొననివాడు; ఐనన్= అయితే; మద్య= మత్తుపానీయం; మాంస= మాంసం; పరస్త్రీ సమాగమ= ఇతర స్త్రీలతో తిరగటం; వైముఖ్యమునన్= విముఖత్వంతో (వ్యతిరేకతతో); ఆశ్రమస్థులన్= బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలలో ఉండేవారిని; తనకులంబువారిన్= స్వకులస్థులను; భరియించినను= పోషించినా; హేమ= బంగారం, వస్త్ర= బట్టలు; మందిర=

ఇల్లు; అన్నపానంబులు= భోజనం, త్రాగటానికి నీరు; ఒసఁగినన్= ఇచ్చినా; దీనులకున్= దరిద్రులకు; ఆశ్రయంబు= ఆధారము, గృహాదికము; ఇచ్చినను= ఒసంగినా; హింస= జీవరాసులను చంపటం; మానినను= మానినా; సమంచిత= ఒప్పిదమైన; స్వర్గలక్ష్మి= స్వర్గభోగం; సిద్ధించున్= లభిస్తుంది, దొరకుతుంది; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ధర్మభీతితోనూ; దారిద్ర్య బాధలోనూ రోగాలను, పాపాలను తొలగించుకొనటానికైనా, దైవప్రీతికొరకు పశుహింస చేసినా, ఉత్తమ తపస్సు, గురుశుశ్రూష కలిగి పాండిత్యం సంపాదించి కూడ దానం స్వీకరించనివాడైనా, మద్యం, మాంసం, పరవనితాసంగమం మొదలైన వాటియందు విముఖుడై తన కులంవారిని భరించినా, బంగారంవస్త్రాలూ, మందిరాలూ, అన్నపానీయాలూ ఇచ్చినా, దీనులకు ఆశ్రయమొసంగినా, హింసమానినా సముచితమైన స్వర్గలక్ష్మి సిద్ధిస్తుందని పెద్ద లంటారు.

**సీ. రచ్చకొట్టంబు, నారామంబుఁ గూపంబుఁ । బ్రపయుఁ గావించుట, భయభరార్త**
**కోటిఁ గాచుట, కన్య, గోవు, వాహనము, దా । సుని దాసి నిచ్చుట, దనకుఁ గీడు**
**సేసిన సైఁచుట, చెలులఁ జుట్టంబులఁ । బ్రోచుట, పెక్కండ్ర పొంటెఁ గార్య**
**మునఁ బరాక్రమమున ధనమునఁ దా నల । జడిపాటు, దుష్కర్మ సరణిఁ బొరయ**

**ఆ. కునికి, నాకలోకమునకు నిచ్చెన లగు । నెక్కులమునఁ బుట్టిరేని బహు సు**
**తుండు, నతికృపాన్వితుఁడు, వేయు నెలలపై । బ్రతికినతఁడుఁ గండ్రు త్రిదశపదము'. 64**

**ప్రతిపదార్థం:** రచ్చకొట్టంబున్= రచ్చచావడి; ఆరామంబున్= తోట; కూపంబున్= నూయి; ప్రపయున్= చలిపందిరి; కావించుట= నిర్మించటం; భయభర= భయ భారంతో; ఆర్త= దుఃఖితులైన మానవుల; కోటిన్= సమూహాన్ని; కాచుట= కాపాడటం; కన్య= కన్యను; గోవున్= గోవును; వాహనమున్= మోసేజంతువును (గుర్రం, ఎద్దు); దాసునిన్= సేవకుడిని; దాసిన్= సేవకురాలిని; ఇచ్చుట= ఇవ్వటం; తనకున్; కీడు= ఆపద; చేసినన్= కలిగిస్తే; సైఁచుట= సహించటం; చెలులన్= స్నేహితులను; చుట్టంబులన్= బంధువులను; ప్రోచుట= కాపాడటం; పెక్కండ్ర పొంటెన్= అనేకులకొరకు; కార్యమునన్= పనిలో; పరాక్రమమునన్= పరాక్రమంలో; ధనమునన్= డబ్బులో; తాన్= తాను; అలజడిపాటు= అలజడిని; దుష్కర్మ= చెడ్డపనుల; సరణిన్= పద్ధతిని; పొరయకునికి= పొందకుండా వుండటం; నాకలోకమునకున్= స్వర్గలోకానికి; నిచ్చెనలు= మెట్లు; అగున్= ఔతాయి; ఏ+కులమునన్= ఏ కులంలో; పుట్టిరేని= పుట్టినా; బహు= పలువురు; సుతుండు= కొడుకులు కలవాడు; అతికృపా+అన్వితుఁడు= మిక్కిలి దయకలవాడు; వేయు= వేయి; నెలలపైన్= నెలలకుపైగా; బ్రతికిన+అతఁడున్= జీవించినతడూ సహస్రమాసోపజీవి; త్రిదశపదమున్= స్వర్గలోకాన్ని; కండ్రు= పొందుతారు.

**తాత్పర్యం:** రచ్చచావిడి, తోట, బావి, చలిపందిరి కల్పించటం, భయపీడితులను రక్షించటం, కన్యలను, గోవులను, వాహనాలను, దాసులనూ దాసిని ఇవ్వటం; తనకు అపకారం చేసినవాడిని క్షమించటం, స్నేహితులను, బంధువులను రక్షించటం, పెక్కుమంది కొరకు చేసే కార్యాలలో ధనం వెచ్చించి అలజడి పొందకుండా ఉండటం, దుర్మార్గవర్తనంలో చొరకుండా ఉండటం - అనేవి స్వర్గలోకప్రాప్తికి నిచ్చెనలవంటివి. ఏ కులంలో పుట్టినా, పెక్కురు కొడుకులు కలిగి మిక్కిలి దయామయుడై వేయి నెలలకాలం బ్రతికినవాడు స్వర్గలోకం చేరుకొంటాడు.'

**వ. అని నిర్దేశించి. 65**

**తాత్పర్యం:** అని స్పష్టం చేసి.

**ఆ. 'నరకవాసకారణము నెఱింగించితిఁ । బుణ్యలోక హేతు భూతములును**

**దేట పడఁగఁ జెప్పితిని, గురుసంతతి । శ్రేష్ఠ ! యింక నేమి సెప్పవలయు? 66**

**ప్రతిపదార్థం:** కురుసంతతి= కౌరవులలో; శ్రేష్ఠ!= శ్రేష్ఠుడైనవాడా!; ధర్మరాజా! నరకవాస= నరకంలో ఉండటానికి; కారణమున్= హేతువును; ఎఱింగించితిన్= చెప్పాను; పుణ్యలోక= స్వర్గలోక; హేతుభూతములును= కారణములైనవాటినీ; తేటపడఁగన్= స్పష్టంగా; చెప్పితిని= చెప్పాను; ఇంకన్= ఇకమీద; ఏమి చెప్పవలయున్= ఏమి చెప్పాలి?

**తాత్పర్యం:** కౌరవవంశ శ్రేష్ఠుడా! నరక, స్వర్గలోకాలు కలగటానికి కారణాలేవో స్పష్టంగా వేర్వేరుగా చెప్పాను. ఇంకా ఏమి చెప్పాలి?

**వ. అడుగు 'మనినం, గౌంతేయపూర్వజుండు శాంతనవుతో 'బ్రహ్మహత్యాసమంబు లని కొందఱు గొన్ని కర్మంబు లుగ్గడింతురు; హింస లేకయు నట్లయ్యెడు నవి యెయ్యవి? వాని నేర్పడ నెఱింగింపవే' యనుటయు నతం డతని కిట్లనియె. 67**

**ప్రతిపదార్థం:** అడుగుము; అనినన్= అనిచెప్పగా; కౌంతేయ= కుంతీ సంతానంలో; పూర్వజుండు= ముందుపుట్టినవాడు - ధర్మరాజు; శాంతనవుతోన్= భీష్మునితో; బ్రహ్మహత్యా= బ్రాహ్మణహత్య - (ఆత్మను అధర్మంతో చంపుకొనటం); సమంబులు= సమానాలు; అని; కొందఱు= కొంతమంది; కొన్ని కర్మంబులు= కొన్ని పనులు; ఉగ్గడింతురు= చెప్తుతారు; హింసలేకయున్= చంపటం లేకుండా; అట్లు= ఆ విధంగా; అయ్యెడునవి= అయ్యేవి; ఎయ్యవి= ఏవి; వానిన్; ఏర్పడన్= విడివిడిగా; ఎఱింగింపవే= తెల్పుమా; అనుటయున్= అనగా; అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు 'కొందరు బ్రహ్మహత్యతో సమానమైన కర్మలు కొన్ని ఉన్నాయంటారు కదా! హింస లేకుండా ఏ కర్మ అయినా సరే బ్రహ్మహత్య ఎట్లా ఔతుంది? అట్లా అయ్యేకర్మ లుంటే వాటిని గూర్చి వివరించండి' అని ప్రశ్నించాడు. అతడితో భీష్ముడు ఇట్లా అన్నాడు.

**సీ. 'దివ్యబోధాఢ్యు, వేదవ్యాసమునినాథు । నడిగితి నొక్కనాఁ డధిక భక్తి**

**నిట్లని; యా సంయమీంద్రుండు గృప నాకు । నెఱిఁగించె, ననఘ! నా యెఱిఁగినట్టి**

**విధము లెఱింగింతు వినుము; విప్రునిఁ గృశు । నామంత్రితునిఁ జేసి యతఁడు, గుడువ**

**వచ్చినఁ బెట్టమి, వరకులంబును, సార । విద్యయుఁ, గల, విప్రవృత్తి గొనుట**

**తే. నీరు ద్రావంగ గోవు లేతేర, విఘ్న । మాచరించుట, బధిర పంగ్వంధ ధనము**

**లపహరించుట, వేదశాస్త్రాదినింద, । బ్రహ్మహత్య లెట్టట్టుల పౌరవేంద్ర! 68**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర= పురువంశరాజా!; దివ్య= దివ్యమైన; బోధ+ఆఢ్యున్= జ్ఞానంచేత గొప్పవాడు అయిన; వేదవ్యాస= అనంతంగా ఉన్న వేదరాశిని నాలుగుగా విభాగం చేసిన కృష్ణద్వైపాయనుడు అను; మునినాథున్= మునిశ్రేష్ఠుడిని; అధికభక్తిన్=

మిక్కిలి భక్తితో; ఇట్లు= ఇది ఇట్లా అని; ఒక్కనాఁడు+అడిగితిన్; సంయమి+ఇంద్రుండు= ఆ మునినాథుడు; అనఘ!= పుణ్యాత్ముడా! కృపన్= దయతో; నాకున్= నాకు; ఎఱింగించెన్= తెల్పినాడు; నా ఎఱిఁగినట్టి= ఆయనవలన నాకు తెలిసిన; విధములు= తీరులు; ఎఱింగింతున్= నీకు చెపుతాను; వినుము= ఆలకించుము; కృశున్= దీనుడిని; విప్రునిన్= బ్రాహ్మణుడిని; ఆమంత్రితునిన్+చేసి= ఆహ్వానించి, అతఁడు= ఆయన; కుడువన్= తినటానికి; వచ్చినన్= రాగా; పెట్టమి= పెట్టకపోవటం; వరకులంబును= గొప్పకులమునూ; సారవిద్యయున్= సారవంతమైన విద్య, విద్యాసారం; కల= ఉన్న; విప్ర= బ్రాహ్మణుడి; వృత్తిన్= బ్రతుకు తెరువును; కొనుట= గ్రహించటం; నీరు= నీటిని; త్రావంగన్= త్రాగటానికి; గోవులు= ఆవులు; ఏతేరన్= రాగా; విఘ్నము= అడ్డంకి; ఆచరించుట= చేయటం; బధిర= చెవిటివాడు; పంగు= కుంటివాడు; అంధ= గ్రుడ్డివాడు వీరియొక్క; ధనములు= డబ్బులు; అపహరించుట= దొంగిలించటం; వేద శాస్త్ర+ఆది నింద= నాలుగు వేదాలను - ఇతర శాస్త్ర విద్యలను నిందించటం, తిట్టటం; బ్రహ్మహత్యలు; ఎట్టు=ఎట్లో; అట్టుల= అట్లాంటివి.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! దివ్యజ్ఞానం కల వేదవ్యాస మునినాథుడిని ఒకసారి అడిగితే ఆయన నాకు చెప్పిన దేదో అదే నీకు చెప్తున్నాను. దీనుడైన వేద బ్రాహ్మణుడిని ఇంటికి ఆహ్వానించి అతడికి అన్నం పెట్టకపోవటం, చక్కగా చదువుకొన్న, మంచి కులం కల విప్రుడి జీవనాధారమైన వృత్తిని చెడగొట్టి అతడి నోరు కొట్టటం, నీరు త్రాగటానికి వచ్చిన ఆలమందలను తరిమికొట్టటం, చెవిటి గ్రుడ్డి మొదలగువారి డబ్బులు దొంగలించటం, వేదశాస్త్రాది నింద - ఇవి బ్రహ్మహత్యలతో సమానం.

**తే. అలుకఁ బురి నూర వనమున నగ్ని యిడుట, । పాపశీలతమై బొంకి బ్రాహ్మణునకు**
**నధికతర మగు శోకంబు నావహించు । టంచితాచార! బ్రహ్మహత్యా సమములు. 69**

**ప్రతిపదార్థం:** అంచిత= ఒప్పిదమైన; ఆచార!= ఆచారంకలవాడా!; అలుకన్= కోపంతో; పురిన్= నగరంలో; ఊరన్= గ్రామంలో; వనమునన్= తోటలో; అగ్నిఇడుట= నిప్పుపెట్టటం; పాపశీలతమైన్= పాపస్వభావంతో; బొంకి= అబద్ధమాడి; బ్రాహ్మణునకున్= విప్రునకు; అధికతరము+అగు= మిక్కిలి ఎక్కువైన; శోకంబున్= దుఃఖాన్ని; ఆవహించుట= కలిగించటం; బ్రహ్మహత్యా సమములు= బ్రహ్మహత్యతో సమానాలు.

**తాత్పర్యం:** మంచి ఆచారాలను అనుసరించేవాడా! కోపంతో నగరానికీ, ఊరికీ, తోటకూ నిప్పుపెట్టటం, పాప స్వభావంతో అబద్ధమాడి బ్రాహ్మణుడికి మిక్కిలి దుఃఖం కలిగించటం బ్రహ్మహత్యతో సమానం.

**విశేషం:** ఆచారం= చక్కగా ఆచరించిన వైదికకర్మలు - సంప్రదాయానుసారంగా సంక్రమించేవి.

**తే. రూప గుణ శీలముల ననురూపుఁ డైన । వరుని కీక కన్నియఁ దన వలసినట్లు**
**తగని వానికి నిచ్చుట ధర్మదేవ । తాతనూభవ ! బ్రహ్మహత్యాసమంబు. 70**

**ప్రతిపదార్థం:** ధర్మదేవతా= యముడి; తనూభవ= కుమారా! ధర్మరాజా! (ధర్మరాజు యముడి అంశంతో పుట్టినవాడు); రూప= అందమైన ఆకారంలో; గుణ= మంచిగుణాలలో; శీలములన్= స్వభావములో; అనురూపుఁడు+ఐన= తగినవాడైన; వరునికిన్= పెండ్లికొడుకునకు; కన్నియన్= కన్యను; ఈక= ఇవ్వక; తన వలసినట్లు= తండ్రి తనకిష్టమైనట్లు; తగనివానికిన్= అర్హుడుకాని వాడికి; ఇచ్చుట= ఇచ్చి పెండ్లిచేయటం; బ్రహ్మహత్యా సమంబు= బ్రహ్మహత్యతో సమానం.

**తాత్పర్యం:** ధర్మదేవతాంశంలో జన్మించినవాడా! రూపం, గుణం, శీలంలో యోగ్యుడై ఉన్నవాడికి పిల్ల నిచ్చి చేయకుండా తన ఇష్టం వచ్చినట్లుగా కన్యనిచ్చి వివాహం చేయటం బ్రహ్మహత్యతో సమానం'.

**విశేషం:** రూపం= కంటికి కనిపించే శరీర సౌందర్యం. గుణ= మనస్సునకు సంబంధించిన అందం. శీలం= ఆత్మకు సంబంధించిన అందం. ఈ మూడు ఉన్నవాడికిచ్చి వివాహం చేయటం ధర్మం.

### భీష్ముఁడు ధర్మరాజునకుఁ బుణ్యతీర్థ విశేషంబుల నెఱింగించుట (సం.13-26-1)

**వ. అనిన విని యజాతశత్రుండు, గంగాపుత్త్రుతోఁ 'బుణ్యతీర్థ విశేషంబులు వినవలతుం జెప్పవే' యనుటయు నమ్మహీపతికి నమ్మహితాత్ముం డిట్లనియె; 'తొల్లి గౌతముఁ డడుగ నంగిరసుండు దీర్థంబులు గొన్నింటి ప్రకారంబు సెప్పెఁ; నప్పరిపాటి సెప్పెద; నాకర్ణింపుము. 71**

**ప్రతిపదార్థం:** అనినన్‌విని =అని భీష్ముడు చెప్పగా ఆలించి; అజాతశత్రుండు= ధర్మరాజు; గంగా పుత్త్రుతోన్= భీష్ముడితో; పుణ్యతీర్థ= పుణ్యక్షేత్రం ప్రక్కన పారే నదుల; విశేషంబులు= ప్రత్యేకతలు; వినవలతున్= వినాలని కోరుకొంటున్నాను; చెప్పవే= ఎరిగింపుమా; అనుటయున్= అనటంతోనే; ఆ+మహీపతికిన్= ఆ భూమి పతియైన ధర్మజునకు; ఆ+మహిత+ఆత్ముండు= ఆ మహాత్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; తొల్లి= మునుపు; గౌతముండు= గౌతముడనే ఋషి; అడుగన్= చెప్పుమని కోరగా; అంగిరసుండు= ఆ పేరుగల ముని; తీర్థంబులు కొన్నింటి ప్రకారంబు= కొన్ని పుణ్యతీర్థముల విధములు; చెప్పెన్= తెల్పినాడు; ఆ+పరిపాటి= ఆ క్రమం, ఆ విధానం; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు 'పుణ్యతీర్థాల విశేషాలు చెప్పు'మని అడుగగా భీష్మ డిట్లా అన్నాడు. 'పూర్వం నీవలెనే గౌతము డడిగితే అంగిరసుడు చెప్పిన విధానం నీకు చెప్పుతాను వినుము.

**సీ. సప్తదినంబులు చంద్రభాగను, విత । స్తను, నూర్మి మాలినిఁ దగ వసించి**
**యాహారవిరహితుండై యుండ ముని సమా । నుం డగుఁ, గాశ్మీర మండలమున**
**నదులు గొన్ని మహావనము సొచ్చి పాఱు ది । వంబు సిద్ధించుఁ దదంబుసేవఁ;**
**బుష్కరమ్ముఁ బ్రభాసమును, నైమిశము, నింద్ర । మార్గంబు, దేవికా స్వర్గబిందు**

**తే. లును, సమవగాహనంబున జనుల నప్ప । రస్సమేత విమానవర్తనులఁ జేయు**
**నవనినాథ! హిరణ్యబిందువుఁ, గుశేశ । యంబు, నెల్ల పాపంబుల నపనయించు. 72**

**ప్రతిపదార్థం:** చంద్రభాగను, వితస్తను, ఊర్మిమాలినిన్= అన్న ఈ మూడు నదులలో; సప్తదినంబులు= ఏడు రోజులు; తగన్= ఆచారయుక్తంగా; వసించి= (తీరంలో) నివసించి; ఆహార విరహితుండు+ఐ= అన్నంలేకుండా ఉపవాసం చేస్తూ; ఉండన్= ఉంటే; ముని సమానుండు+అగున్= మునితో సమానుడౌతాడు; కాశ్మీర మండలమునన్= కాశ్మీర దేశంలో; నదులు కొన్ని= కొన్ని నదులు; మహావనము= సముద్రం (వనం= నీరు; మహా=గొప్ప), అధికజలం కలది; చొచ్చి= ప్రవేశించి; పాఱున్= ప్రవహిస్తాయి; తత్= వాటి; అంబు= నీటిని; సేవన్= సేవించటంతో; దివంబు= స్వర్గం; సిద్ధించున్= లభిస్తుంది; పుష్కరమ్మున్= పుష్కరము; ప్రభాసమును= ప్రభాసం; నైమిశమున్= నైమిశం; ఇంద్రమార్గంబు= ఇంద్రమార్గం; దేవికా= దేవిక; స్వర్గబిందులును=

స్వర్గ బిందువు; సమవగాహనంబునన్= చక్కగా స్నానం చేయటంవలన; జనులన్= మనుష్యులను; అప్సరః+సమేత= అచ్చరలతో కూడిన; విమానవర్తనులన్= విమానాలలో విహరించేటట్లు; చేయున్= చేస్తాయి; అవనినాథ= ఓ భూమీశా!; హిరణ్య బిందువున్, కుశేశయంబున్= కుశేశయమనే ఈ తీర్థాలు; ఎల్లపాపంబులన్= పాపాలన్నిటినీ; అపనయించున్= పోగొడతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! చంద్రభాగలో, వితస్తలో, ఊర్మిమాలినిలో ఏడురోజులు తగినవిధంగా నివసించి ఉపవాసం చేస్తే నరుడు ముని సమాను డౌతాడు. కాశ్మీర ప్రాంతంలో కొన్ని నదులు మహావనంలో ప్రవేశించి ప్రవహిస్తాయి. వాటి నీరు సేవిస్తే స్వర్గం లభిస్తుంది. పుష్కరంలో, ప్రభాసంలో, నైమిశంలో, ఇంద్రమార్గంలో, దేవికలో, స్వర్గబిందువులో స్నానం చేసిన జనులకు అప్సరసలతో కూడిన విమానయానం లభిస్తుంది. హిరణ్య బిందువు, కుశేశయములు పాపాల నన్నిటినీ తొలగిస్తాయి.

**విశేషం:** పుష్కరం, ప్రభాస, నైమిశం, ఇంద్రమార్గం, దేవిక, స్వర్గబిందువులు - ఇవన్నీ తీర్థాలు. (వాటిలో) ఈ పుణ్యతీర్థ విశేషాలు శల్యపర్వంలో చెప్పబడ్డాయి. భారతం క్షేత్ర - తీర్థ విశేషాలను వర్ణిస్తుంది. హిరణ్య= బంగారం. బిందువు, బొట్టు= బంగారం రంగులో నీటి బొట్లు కలది; కుశేశయము= తామరపూలు కలది.

**వ. గంధమాదన సంగతయైన యింద్రతోయయుం, గురంగదేశగత యగు కరతోయ యుం, ద్విరాత్రోపవాసోపేత స్నాతకులకు నశ్వమేధఫలంబు గలుగం జేయు. 73**

**ప్రతిపదార్థం:** గంధమాదన= ఒక పర్వతం; సంగత+ఐన= ఆ పర్వతం నుండి ప్రవహించే; ఇంద్రతోయ= నదిపేరు; కురంగదేశ= ఒక దేశం; గత= ఉన్న; కరతోయయున్= నదిపేరు; త్రిరాత్ర= మూడు రాత్రులు; ఉపవాస+ఉపేత= ఉపవాసంతో పాటుగా; స్నాతకులకున్= స్నానంచేసేవారికి; అశ్వమేధ ఫలంబు= అశ్వమేధ యాగఫలం; కలుగన్+చేయున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** గంధమాదన పర్వతం నుండి ప్రవహించే ఇంద్రతోయ కురంగదేశంలోని కరతోయ - అనే నదులలో మూడురాత్రు లుపవసించి స్నానం చేస్తే చాలు అశ్వమేధఫలం అవి కలిగిస్తాయి.

**తే. కనఖలమున, గంగాద్వారమునను, నీల । భూధరమునఁ, గుశావర్తమునను, బిల్వ**
**కమున, సుస్నాతుఁ డై పాతకములు దొఱఁగి । నాకలోక విహారంబు నరుఁడు వొందు. 74**

**ప్రతిపదార్థం:** కనఖలమునన్, గంగాద్వారమునను, నీల (నల్లని) భూధరమునన్ (కొండలలో పుట్టిన నదిలో) కుశావర్తమునను, బిల్వకమునన్ - ఇవన్నీ నదుల పేర్లు (వాటిలో); సుస్నాతుఁడు+ఐ= భక్తితో స్నానంచేసినవాడై; పాతకములు= పాపాలు; తొఱఁగి= పోగొట్టుకొని; నరుఁడు= మానవుడు; నాకలోక= స్వర్గలోక; విహారంబు= వాహ్యాళి (సరదాగా తిరగటం); పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కనఖలము గంగాద్వారము, నీలపర్వతము, కుశావర్తము, బిల్వకము అనే పేర్లుగల తీర్థాలలో భక్తితో స్నానంచేస్తే చాలు స్వర్గలోకం లభిస్తుంది.

**క. భాగీరథి యెచట నుద । గ్భాగమునను శివుని నెలవు ప్రాంతమునఁ జనున్**
**ధీగణ్య! యచట నెలకు స । మాగతులగు సురలఁ గం డ్రనాహారవిధిన్. 75**

**ప్రతిపదార్థం:** ధీగణ్యా!= బుద్ధిమంతులలో గణింప దగినవాడా!; భాగీరథి= గంగ; ఎచటన్= ఎక్కడ; ఉదగ్= ఉత్తర; భాగమునను= ప్రదేశంలో; శివుని= మహేశ్వరుడి, నెలవు= స్థానం, ఉండేచోటు; ప్రాంతమునన్= ప్రదేశంలో; చనున్= ప్రవహిస్తుందో; అచటన్= అక్కడ; నెలన్= ప్రతినెలా; సమాగతులు+అగు= వచ్చేటటువంటి; సురలన్= దేవతలను; అనాహార విధిన్= ఉపవాస వ్రతంతో; కంద్రు= చూస్తారు.

**తాత్పర్యం:** ఎక్కడగంగానది ఉత్తరదిక్కున శివుడి నివాసమైన కైలాసశిఖరం దగ్గర ప్రవహిస్తుందో అక్కడ ఉపవాసముండేవారికి అక్కడికి ప్రతినెలా వచ్చే దేవతలు దర్శనమిస్తారు.

**సీ. ఆహార ముడిగి మహాశ్రమంబున నగ్ని । హోత్రియై యొకమాస ముండి నరుఁడు**
**సకల సిద్ధులు మహాశ్చర్యంబుగాఁ గను, । జననాథ! భృగుతుంగమను మహా ప్ర**
**దమ్మున వాసరత్రయ ముపవాసి యై । బ్రహ్మవధంబు పాపంబుఁ దొఱఁగు;**
**వినుము! కన్యాకూపమున సాగ్నిహోత్రత । నున్నఁ గీర్తితుఁ డగు; నుభయలోక**

**తే. ములను సుందరికాహ్రదంబునను దగఁగ । సకృదుపస్పర్శనము చేసి చారుమూర్తి**
**యై జనించు; వైమానిక మనఁగఁ బరఁగు । భవ్యతీర్థంబు సేవించి పడయు దివము. 76**

**ప్రతిపదార్థం:** జననాథ!= ప్రజాపతీ! రాజా!; మహాశ్రమంబునన్= (ఆ పేరుగల తీర్థము) మహాశ్రమంలో; అగ్నిహోత్రిఐ= అగ్నిహోత్రం చేస్తూ; ఒకమాసము= ఒక నెల; ఉండి; నరుఁడు= మనుష్యుడు; మహాశ్చర్యంబుగాన్= మిక్కిలి చిత్రంగా; సకలసిద్ధులు= అన్ని యోగసిద్ధులు; కనున్= పొందుతాడు; భృగుతుంగము అను= భృగుతుంగమనే పేరుగల; మహా= గొప్ప; హ్రదమ్మునన్= తీర్థంలో; వాసరత్రయము= మూడురోజులు; ఉపవాసిఐ= ఉపవాస ముండి; బ్రహ్మవధంబు పాపంబున్= బ్రహ్మహత్యాపాపం; తొఱంగున్= విడుచును; వినుము= ఆలకించుము; కన్యాకూపమునన్= ఆ పేరుగల కుండంలో (తీర్థం); స+అగ్ని హోత్రతన్= అగ్నిహోత్రంచేస్తూ; ఉన్నన్= ఉంటే; ఉభయలోకములను= ఈలోకంలో, పైలోకంలో; కీర్తితుఁడు= కీర్తించబడినవాడు; అగున్; సుందరికా= సుందరిక అన్న పేరుగల; హ్రదంబునన్= తీర్థంలో; తగఁగన్= చక్కగా; సకృత్= ఏ కొంచెమైనా; ఉపస్పర్శనము = జలములను తాకి; చారుమూర్తిఐ= అందమైన రూపంకలవాడై; జనించున్= జన్మిస్తాడు; వైమానికము అనఁగన్+పరఁగు= వైమానికము అనే ఆ పేరుతో ప్రసిద్ధమైన; భవ్య= శ్రేష్ఠమైన; తీర్థంబు= పుణ్యతీర్థమును; సేవించి= పూజించి; దివము= స్వర్గం; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఒకమాసంపాటు నిత్యాగ్నిహోత్రిఅయి మహాశ్రమంలో ఉంటే మనిషికి అన్ని సిద్ధులు లభిస్తాయి. చాలా ఆశ్చర్యంగా భృగతుంగమన్న (సరస్సు) తీర్థకుండంలో మూడురోజులు ఉపవాసముంటే బ్రహ్మహత్యాపాపం పోతుంది. కన్యాకూపంలో అగ్నిహోత్రిఅయి నివసిస్తే ఇహ, పరలోకాలలో స్తుతించబడతాడు. సుందరికాతీర్థంలో కొంచెం మునిగితే అందమైన రూపంతో తిరిగి జన్మిస్తాడు. వైమానిక తీర్థ సేవచేస్తే స్వర్గం లభిస్తుంది.

**తే. కృత్తికాంగార సంసేవ గిల్బిషములఁ । బాపి నాకంబుఁ జేర్చు విపాశఁ ద్రిదివ**
**సములు, గాలికాశ్రమ బ్రహ్మచర్య నియతి । తోడ సేవింప జన్మంబు దొఱఁగు నరుఁడు. 77**

**ప్రతిపదార్థం:** కృత్తికా+అంగార= కృత్తిక, అంగారముల యొక్క; సంసేవ= పూజ; కిల్బిషములన్= పాపాలను; పాపి= పోగొట్టి; నాకంబున్= స్వర్గానికి; చేర్చున్= చేరుస్తుంది; విపాశన్= ఆ పేరుగల నదిలో; త్రి=మూడు; దివసములు= రోజులు; కాలికాశ్రమ=

ఆ ఆశ్రమాన్ని ఆశ్రయించి; బ్రహ్మచర్య నియతితోడన్= బ్రహ్మచర్య నియమంతో; సేవింపన్= కొలిస్తే; నరుఁడు= మనుష్యుడు; జన్మంబున్= పుట్టుక; తొఱఁగున్= విడుచును.

**తాత్పర్యం:** కృత్తిక, అంగార సేవలవలన పాపాలు పోయి స్వర్గం లభిస్తుంది. కాళికాశ్రమంలో బ్రహ్మచర్య నియమం పాటిస్తూ ప్రక్కనే ఉన్న విపాశానదిలో మూడురోజులు మునిగితే ముక్తి లభిస్తుంది.

**విశేషం:** ఉస్మానియా - వావిళ్ళ ప్రతులలో 'కాలికాశ్రయ' అని ఉన్నది. ఇది తప్పు. "కాళికాశ్రమాసాద్య - విపాశాయాం కృతదోకః బ్రహ్మచారీ జితక్రోధః త్రిరాత్రం ముచ్యతే భవాత్' అని మూలం. కాళికాశ్రమాన్ని ఆశ్రయించి ... స్నానంచేస్తే కోపంలేకుండా, బ్రహ్మచర్యవ్రతంతో - జన్మరాహిత్యం కలుగుతుంది. పైగా ఇక్కడనుండి ఆశ్రమ విషయం చెప్పబడుతున్నది.

**క. స్నానముఁ బితృతర్పణమును । మానితగుణ! కృత్తికాశ్రమంబున నియతిన్**
**మానవులు సేసి శివు కొలు । వానందాత్మకతఁ గాంతు రండ్రు మునీంద్రుల్. 78**

**ప్రతిపదార్థం:** మానిత= గౌరవించదగిన; గుణ= గుణాలు కలవాడా!; స్నానమున్; పితృతర్పణమును= పితృదేవతలకు తర్పణాలివ్వటం; కృత్తికా= కృత్తిక అన్న పేరుగల; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; నియతిన్= నియమంతో; చేసి= చేసి, కావించి; మానవులు= జనులు; శివు కొలువు= శివుడి యొక్క సంసేవ; ఆనంద+ఆత్మకతన్= ఆనందహృదయంతో; కాంతురు= పొందుతారని; ముని+ఇంద్రుల్= మునీశ్వరులు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! కృత్తికాశ్రమంలో స్నానం, పితృతర్పణం చేస్తే వారికి శివుడి సన్నిధానంలో ఆనందంతో ఉండే స్థితి లభిస్తుందని మునీంద్రు లంటారు.

**తే. ద్రోణశర్మ పదంబున రూఢ మైన । తీర్థమును, శరస్తంబంబు, దేవదారు**
**వనముఁ దమ్ము సేవించిన మనుజు నెట్టి । వానినైనను నప్సరోవరునిఁ జేయు. 79**

**ప్రతిపదార్థం:** ద్రోణశర్మ పదంబునన్= ద్రోణశర్మమన్న పేరుగల ఆశ్రమంలో; రూఢమైన= ప్రసిద్ధమైన; తీర్థమును; శరస్తంబంబు= ఆ పేరుగల తీర్థం; దేవదారువనమున్= ఆ పేరుగల ఆశ్రమం; తమ్మున్= తమను; సేవించిన= పూజించిన; మనుజున్= మనిషిని; ఎట్టివానిన్+ఐనను= ఎట్లాంటివాడినైనా; అప్సరస్= అప్సరసలకు; వరునిన్= భర్తను; చేయున్= చేస్తాయి.

**తాత్పర్యం:** ద్రోణశర్మంలోని తీర్థం, శరస్తంబం, దేవదారువనం - తమను సేవించిన వారిని అప్సరసలకు భర్తలను చేస్తాయి.

**తే. చిత్రకూట జనస్థాన సేవనములు । రాజలక్ష్మి నొసఁగు; వీతభోజనత్వ**
**మహితవృత్తుఁడై; శ్యామాశ్రమమున నొక్క । పక్ష మున్న నంతర్ధాన ఫలము గలుగు. 80**

**ప్రతిపదార్థం:** చిత్రకూట, జనస్థాన= చిత్రకూట జనస్థానములయొక్క; సేవనములు= సేవలు; రాజలక్ష్మిన్= రాజు వైభవాన్ని; ఒసఁగున్= ఇస్తాయి; శ్యామ+ఆశ్రమమునన్= శ్యామ మన్న పేరుగల ఆశ్రమంలో; వీత= వదలిన; భోజనత్వ= భోజనముచేత; మహిత= గొప్ప; వృత్తుఁడు+ఐ= వృత్తి కలవాడై; ఒక్క పక్షము= పదునైదు రోజులు; ఉన్నన్= ఉంటే; అంతర్ధాన = ఆత్మధ్యాన; ఫలము= ఫలితం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** చిత్రకూటం, జనస్థానం సేవలవలన రాజలక్ష్మి కలుగుతుంది. శ్యామాశ్రమంలో భోజనం లేకుండా పదునైదు రోజులుంటే ఆత్మలోపల ధ్యానం చేసిన ఫలితం కలుగుతుంది.

**విశేషం:** బహిర్ధ్యానం= బయటనున్న విగ్రహాలను ధ్యానించటం. అంతర్ధ్యానం = ఆత్మధ్యానం. ఇది శ్రేష్ఠమంటారు పెద్దలు.

**క. విమలమతిం గౌశిక వా । లమున, ననాహార మౌనలంపటుఁ డై యు**
**న్న మనుజుఁ డిరువదియొక్కది । నములం బరమగతి సాధనశ్రీ నొందున్. 81**

**ప్రతిపదార్థం:** విమల= స్వచ్ఛమైన; మతిన్= ఆలోచనతో; న+ఆహార (అనాహార)= ఆహారం లేకుండా; మౌన= మౌనవ్రతమునందు; లంపటుఁడు+ఐ= ఆసక్తి కలవాడై; కౌశికవాలమునన్= ఆ పేరుగల ఆశ్రమంలో; ఉన్న= నివసించిన; మనుజుఁడు= మనిషి; ఇరువదియొక్క దినములన్= మూడు వారాలలో; పరమగతి= ముక్తి; సాధనశ్రీన్= మార్గ సంపదను; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కౌశికవాలమనే ఆశ్రమంలో మూడువారాలపాటు నిర్మలమైన మనస్సుతో ఉపవాసముండి మౌనవ్రతం పాటిస్తే వాడు ముక్తికి సాధన సంపత్తిని పొందుతాడు.

**సీ. పేర్చు మతంగవాపిక నేకరాత్రంబు । నిలిచి సిద్ధుం డగు, నెల వసించి**
**నైమిశంబునఁ బొందు నరవర! పురుష మే । ధ ఫలంబు, నట్టి విధంబ యుత్ప**
**లావనంబునఁ జేయఁగా విను మశ్వమే । ధంబు ఫలంబు నర్ధంబుఁ బడయు**
**నరుఁడు గంగా యమునా సంగమంబునఁ । గాలాంజనం బను శైలమునను**

**తే. నియతి నాచరితస్నానుఁ డయి విముక్తి । తెరువు గాంచు, వైవస్వత తీర్థసేవఁ**
**దీర్థభూతత్వ మొందు విధేయ చిత్త । వృత్తిఁ గౌరవవంశ పవిత్ర చరిత! 82**

**ప్రతిపదార్థం:** కౌరవవంశ= కురువంశంలో; పవిత్ర చరిత!= పుణ్యమైన నడవడి కలవాడా!; ఏకరాత్రంబు= ఒకరాత్రి; పేర్చు= అతిశయమైన; మతంగ వాపికన్= మతంగమనే కుండంలో (వాపిక=బావి); నిలిచి= వసించి; సిద్ధుండు+అగున్=సిద్ధి పొందిన వాడౌతాడు; నరవర!= మనుష్యులలో శ్రేష్ఠుడా!; నైమిశంబునన్= నైమిశమనే ఆశ్రమంలో; నెల వసించి= ఒక నెల ఉండి; పురుషమేధ= మనిషిని బలిచ్చే యజ్ఞంయొక్క; ఫలంబు= ఫలితం; పొందున్= పొందును; వినుము= ఆలకించుము; అట్టివిధంబు+అ= అట్లాంటి విధానమే; ఉత్పలావనంబునన్= ఆ పేరుగల ఆశ్రమంలో; చేయఁగాన్= చేస్తే; అశ్వమేధంబు= గుర్రాన్ని బలి ఇచ్చే యజ్ఞం యొక్క; ఫలంబు= ఫలితంలో; అర్ధంబున్= సగం; పడయున్= పొందును; నరుఁడు= మనిషి; గంగా యమునా సంగమంబునన్= గంగా యమునా నదుల కూడలిలో; కాల+అంజనంబను= నల్లని కాటుక అనే; శైలముననున్= కొండపై; నియతిన్= నియమంతో; ఆచరిత= చేసిన; స్నానుఁడు+అయి= స్నానం కలవాడై; విముక్తి తెరువు= మోక్షమార్గం; కాంచున్= పొందుతాడు; వైవస్వత తీర్థ సేవన్= వైవస్వత తీర్థాన్ని సేవిస్తే; విధేయ= వినయం కల; చిత్తవృత్తిన్= మనస్సుతో; తీర్థభూతత్వము= తీర్థమైన లక్షణాన్ని; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కురువంశంలో పవిత్రచరిత్ర కలవాడా! జాగ్రత్తగా వినుము. మతంగవాపికలో ఒకరాత్రి నివసిస్తే సిద్ధుడౌతాడు. నైమిశారణ్యంలో నెల నివసిస్తే పురుషమేధ ఫలం పొందుతాడు. అదే విధంగా ఉత్పలావనంలో చేస్తే అశ్వమేధ ఫలంలో సగం ఫలం పొందుతాడు. గంగాయమునలకూడలిలో కాలాంజనంబన్న కొండలో (ఊటలో) స్నానం నియమంతో చేస్తే మోక్షమార్గం దొరుకుతుంది. వైవస్వత తీర్థాన్ని సేవిస్తే మహాభాగ్యుడౌతాడు.

**విశేషం:** తీర్థభూతుఁడు - తీర్థమైనవాడు. కావ్యతీర్థ - వంటి బిరుదులున్నాయి.

**ఆ. విను, ప్రయాగమునకుఁ జనుదెంచుఁ గోటిత్ర । యంబు, దశ సహస్రకంబుఁ, దీర్థ**
**ములు నరేంద్ర! దర్శమున నందు నెలనాళ్ళు । లున్న నరుఁడు ముక్తి కొడయఁ డండ్రు. 83**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; విను= వినుము; దర్శమునన్= అమావాస్యనాడు; ప్రయాగమునకున్= గంగాయమునల కూడలి క్షేత్రమైన ప్రయాగకు; కోటిత్రయంబు= మూడుకోట్లు; దశ=పది; సహస్రకంబున్= వేలు; తీర్థములు= పుణ్యతీర్థాలు; చనుదెంచున్= వస్తాయి; అందున్= ప్రయాగలో; నెలనాళ్ళులు= మాసంపాటు; ఉన్న= నివసించిన; నరుఁడు= మానవుడు; ముక్తికిన్= మోక్షానికి; ఒడయఁడు= రాజు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! విను. అమావాస్యనాడు ప్రయాగకు మూడుకోట్ల పదివేల తీర్థాలు చేరుకుంటాయి. కనుక అక్కడ నెలనాళ్ళ ఉన్నవ్యక్తి ముక్తికి అధికారి అవుతాడని చెబుతారు.

**క. విను, గంగను బ్రహ్మశిరం । బను తీర్థమునందు నెల నిరాహారతమై**
**నునికిని మర్త్యుం డమృతాం । శునిలోకంబున మహాయశుండై యుండున్. 84**

**ప్రతిపదార్థం:** విను= వినుము; గంగను= గంగలో; బ్రహ్మశిరంబు+అను= బ్రహ్మశిరమనే పేరుగల; తీర్థమునందున్= తీర్థంలో; నెల= ఒక మాసం; నిరాహారతమైన్= ఆహారం లేకుండా; ఉనికిని= ఉన్నందువలన; మర్త్యుండు= నరుడు; అమృత+అంశుని= అమృత కిరణాలు కల చంద్రుడి; లోకంబునన్= లోకంలో; మహా=గొప్ప; యశుండు+ఐ= కీర్తి కలవాడై; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** గంగలో, బ్రహ్మశిరమనే తీర్థంలో నెలనాళ్ళు ఉపవాసముంటే నరుడు చంద్రలోకంలో గొప్ప కీర్తితో ఉంటాడు.

**సీ. అనఘ! యష్టావక్రమును, గలవింకము, దేవహ్రదము, బ్రహ్మభావ మొసఁగు**
**నాచరితస్నానుఁ డగు మర్త్యునకు నుర్వ । శీ కృత్తికా యోగసిద్ధ కీర్తి**
**యైన, లౌహిత్యంబునందు సుస్నాతుఁడై । పుండరీకాధ్వరమున ఫలంబుఁ**
**బొందు, రామహ్రదంబున నిరాహారుఁడై । పండ్రెండు దినములు భరిత నియతి**

**తే. నున్న సకలకల్మషములు నుజ్జగించు । నరుఁడు, నిర్భోజనత నెలనాళ్ళు దా మ**
**హాహ్రదావాసియై జమదగ్నిఁ గన్న । పుణ్యలోకంబుఁ గను మునిగణ్యుఁ డగుచు. 85**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; అష్టావక్రమును, కలవింకము, దేవహ్రదము= అన్నతీర్థాలు; బ్రహ్మభావము= పరమాత్మ భావాన్ని (అహంబ్రహ్మాస్మి= నేను పరబ్రహ్మాన్ని) అన్న దర్శనాన్ని; ఒసఁగున్= ఇస్తాయి; ఆచరిత= చేసిన; స్నానుఁడగు= స్నానంకల; మర్త్యునకున్= మనిషికి; ఉర్వశీ= అప్సరస; కృత్తికా= ఆ నక్షత్రం; యోగ= కలయిక వలన; సిద్ధ= లభించిన; కీర్తిఐన= కీర్తికల; లౌహిత్యంబునందున్= ఆ పేరుగల తీర్థంలో; సుస్నాతుఁడు+ఐ= చక్కఁగా స్నానంచేసి; పుండరీక+అధ్వరమునన్= పౌండరీక యాగంలోని; ఫలంబున్= ఫలితం; పొందున్= పొందుతాడు; రామహ్రదంబునన్= రామహ్రద మనేచోట; నిరాహారుఁ

డు+ఐ= ఆహారం లేకుండా; పంద్రెండు దినములు= పన్నెండు రోజులు; భరిత నియతిన్= నిండైన నిష్ఠతో; ఉన్నన్= ఉంటే; సకల కల్మషములు= పాపాలన్నీ; ఉజ్జగించున్= విడుస్తాడు, పోగొట్టుకొంటాడు; నరుఁడు తాన్= మనిషితాను; నిర్భోజనతన్= భోజనం లేకుండా; మహాహ్రద= ఆ పేరుగల తీర్థంలో; ఆవాసిఐ= నివసించినవాడై; జమదగ్ని (జమత్+అగ్ని) కన్న= ఆ మహర్షి పొందిన; పుణ్యలోకంబున్= పవిత్రలోకాన్ని; మునిగణ్యుఁడు= మునులలో లెక్కింపదగినవాడై; అగుచున్= అవుతూ; కనున్= ఆ పుణ్యలోకాలు పొందుతాడు.

**తాత్పర్యం:** ఆ మూడు తీర్థాలలో స్నానం చేసినవాడు పరబ్రహ్మ దర్శనం చేస్తాడు. ఊర్వశీ కృత్తికా యోగంలో (జ్యోతిశ్శాస్త్ర సంబంధం కావచ్చును). లౌహిత్య తీర్థంలో స్నానంచేస్తే పౌండరీకయాగ ఫలం పొందుతాడు. రామహ్రదంలో ఉపవాసియై పన్నెండు రోజులు నియమంతో ఉంటే పాపాలన్నీ పోతాయి. మహాహ్రదంలో భోజనం లేకుండా నెలనాళ్ళుంటే జమదగ్ని పొందిన పుణ్యలోకాలు కలుగుతాయి.

**క. విను వింధ్యంబున నొక నెల । తనుతాపము నోర్చి చేయుతపమున జనరం**

**జన! సర్వప్రాయశ్చి । త్త నిరూఢిం బొంది నరుఁడు ధర్మజ్ఞుఁ డగున్. 86**

**ప్రతిపదార్థం:** విను= వినుము; జనరంజన!= ప్రజారంజకుడా!; వింధ్యంబునన్= వింధ్య పర్వతంమీద; ఒకనెల= ఒక మాసం; తను తాపమును= శరీరశ్రమను; ఓర్చి= సహించి; చేయు= చేసే; తపమునన్= తపస్సువలన; సర్వ= అన్ని; ప్రాయశ్చిత్త= పాపాలుచేసి వాటిని పోగొట్టుకొనటానికి చేసే వైదిక కర్మల; నిరూఢిన్= ప్రసిద్ధిని - ఫలితాన్ని; నరుఁడు= మనిషి; పొంది; ధర్మజ్ఞుఁడు= ధర్మం తెలిసినవాడు; అగున్= ఔతాడు.

**తాత్పర్యం:** ప్రజారంజకుడైనరాజా! వినుము. వింధ్యంమీద ఒక నెల శరీరతాపాన్ని (ఉష్ణాన్ని) ఓర్చుకొని తపస్సు చేస్తే మనిషి సర్వప్రాయశ్చిత్త ఫలం పొందుతాడు. ధర్మవేత్తా ఔతాడు.

**సీ. నర్మద నాడి భూనాథనందనుఁ డగు, । జంబుమార్గంబున సంయతాత్ముఁ**

**డై మాసములు మూఁడు నట యొక్క నాఁడును । నిలిచిన, సర్వసిద్ధులను బొందుఁ**

**గోకాముఖము నీరఁ గ్రుంకి, తండులికాశ్ర । మమునకుఁ జని, వల్కలము ధరించి,**

**శాకభోజనుఁ డయి, శాంతిమై నున్న న । న్నెలవున నున్న కన్నెలు పదుంద్ర**

**తే. కధిపుఁడై యజరామరుండయి సుఖించుఁ, । గుల్యయందుఁ ద్రిరాత్రమ్ము, గుడుపు దక్కి**

**శౌచియై యఘమర్షణ జపము చేసి । యశ్వమేధఫలముఁ బొందు ననఘ! నరుఁడు. 87**

**ప్రతిపదార్థం:** నర్మదన్= నర్మదానదిలో; ఆడి= స్నానమాడి; భూనాథ= రాజు యొక్క; నందనుఁడు= కొడుకు; అగున్= ఔతాడు; జంబు= నేరేడు - ఆ పళ్ళు రాలినందున నీరు నీలివన్నెతో ప్రవహిస్తుందట; మార్గంబునన్= ఆ మార్గంలో ప్రవహించే నదులలో; సంయత = నియమించిన; ఆత్ముఁడు+ఐ= మనస్సు కలవాడై; ఏకాగ్రతతో; మాసములుమూఁడు= మూణ్ణెల్లు; అట= ఆపై; ఒక్క నాఁడును= ఒక రోజు; నిలిచినన్= ఉంటే; సర్వసిద్ధులను= సిద్ధులన్నిటినీ; పొందున్= పొందుతాడు; కోకాముఖము= కోక అన్న పేరుగల నదీ ద్వారంలో; నీరన్= నీటిలో; క్రుంకి= మునిగి; తండులికా= ఆ పేరుగల; ఆశ్రమమునకున్= ఆశ్రమానికి; చని= వెళ్ళి; వల్కలము= నారబట్ట; ధరించి= కట్టుకొని; శాకభోజనుఁడు+అయి= కూరగాయలు తింటూ; శాంతిమైన్= శాంతితో; ఉన్నన్= ఉంటే; ఆ+నెలవునన్= ఆ చోట; ఉన్న; కన్నెలు= కన్యలు; పదుంద్రకున్= పదిమందికీ; అధిపుఁడై = నాథుడై; అజరా+ అమరుండు+అయి= ముసలితనం, మరణంలేనివాడై; సుఖించున్=

భోగిస్తాడు; కుల్య+అందున్= కుల్యలో, ఆపేరుగల తీర్థంలో; (కుల్య= కాల్వ); త్రిరాత్రమ్ము= మూడు రాత్రులు; కుడుపు= అన్నం; తక్కి= విడిచి; శౌచిఐ= శుచిత్వం కలిగి; అఘ= పాపం; మర్షణ= పోగొట్టే; జపముచేసి= జపమొనర్చి; నరుఁడు= మనుష్యుడు; అశ్వమేధ ఫలమున్ పొందున్= అశ్వమేధమనే యజ్ఞఫలం పొందుతాడు.

**తాత్పర్యం:** నర్మదానదిలో స్నానం చేస్తే రాజకుమారుడై పుట్టుతాడు. జంబూనదిలో నియమంతో మూడు మాసాలపై ఒకరోజుంటే సర్వసిద్ధులూ కలుగుతాయి. కోకాముఖంలో స్నానంచేసి తండులికాశ్రమంలో నారబట్ట ధరించి శాకాహారంతో శాంతంగా ఉంటే అక్కడున్న పదిమంది కన్యలకు మగడౌతాడు. అతడి కిక ముసలితనంగానీ, మృత్యువుగానీ ఉండదు. కుల్యానదిలో మూడురాత్రులు ఉపవాసం చేస్తే పాపాలు పోగొట్టే మంత్రాలు శుచిగా జపిస్తే - అశ్వమేధ ఫలం పొందుతాడు.

**వ. ఆర్ష్టిసేనాశ్రమంబున నుజ్జానక స్నాతుండై, మర్త్యుం డఖిల పాపంబులం దొఱంగు; పిండారకంబున నేకరాత్రంబు నిలిచి యగ్నిష్టోమఫలంబుం బడయు; ధర్మారణ్యంబున బ్రహ్మసరస్సు సేవించి పౌండరీకఫలప్రాప్తిఁ గాంచు. 88**

**ప్రతిపదార్థం:** ఆర్ష్టిసేనా+ఆశ్రమంబునన్= ఆ పేరుగల ఆశ్రమంలో ఉన్న; ఉజ్జానక= ఆ పేరుగల తీర్థంలో; స్నాతుండు+ఐ= స్నానం చేసి; మర్త్యుండు= (మరణం కలవాడు); నరుడు; అఖిల= సమస్త; పాపంబులన్= పాపాలను; తొఱంగున్= విడుస్తాడు; పిండారకంబునన్= ఆ పేరున్న తీర్థంలో; ఏకరాత్రంబు= ఒక రాత్రి; నిలిచి= ఉండి; అగ్నిష్టోమ ఫలంబున్= అగ్నిష్టోమమనే యజ్ఞం చేసిన ఫలం; పడయున్= పొందుతాడు; ధర్మ+అరణ్యంబునన్= ధర్మమన్న పేరుగల అరణ్యంలో (అడవి) ఉన్న; బ్రహ్మసరస్సు= ఆ పేరుగల చెరువును; సేవించి= పూజించి (పవిత్రభావంతో స్నానంచేసి); పౌండరీకఫల= పౌండరీకమనే యాగం చేసిన ఫలితం; కాంచున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఆర్ష్టిసేనాశ్రమంలోని ఉజ్జానకతీర్థంలో స్నానంచేసిన నరుడికి పాపాలన్నీ తొలగిపోతాయి. పిండారక తీర్థంలో ఒకరాత్రి ఉంటే అగ్నిష్టోమయజ్ఞ ఫలం కలుగుతుంది. ధర్మారణ్యంలో ఉన్న బ్రహ్మసరస్సును సేవిస్తే పౌండరీకయాగం చేసిన ఫలం మానవులకు లభిస్తుంది.

**చ. జనకుఁడు గౌరికిన్, వినుము, శంకరు మామ, హిమాద్రి సర్వర**
**త్ననికర విశ్వపుణ్య భవనంబు ప్రశాంతత నందు నిల్చి స**
**న్మునిగణ సేవనంబుఁ దపమున్ నడపంగ నరుండు సిద్ధుఁడై**
**వినుతికి నెక్కుఁ బొందు నరవిందభవాంతిక వాస సంపదన్. 89**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; గౌరికిన్= పార్వతికి; జనకుఁడు= తండ్రి; శంకరు మామ= శివుడికి మామ; హిమ+అద్రి= మంచుకొండ; సర్వరత్న= అన్నిరత్నాల; నికర= సమూహమునకు; విశ్వపుణ్యభవనంబు= ఎల్లపుణ్యములకు నిలయం; అందున్= ఆ హిమాద్రిలో; ప్రశాంతతన్= మిక్కిలి శాంతంతో; నిల్చి= ఉంటూ; సత్+ముని= మహామునుల; గణ= సమూహం; సేవనంబున్= సేవనూ; తపమున్= తపస్సునూ; నడపంగన్= చేస్తే; నరుండు= మానవుడు; సిద్ధుఁడు+ఐ= సిద్ధిపొందినవాడై; వినుతికిన్= ప్రస్తుతికి; ఎక్కున్= పొందును; అరవిందభవ= పద్మంలో పుట్టిన బ్రహ్మ; అంతిక= సమీపంలో; వాస= నివాస; సంపదన్= కలిమిని; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** వినుము - గౌరీదేవికి తండ్రి, శివుడికి మామ, సర్వరత్న సమూహాలకూ, సర్వ పుణ్యాములకూ స్థానమైన హిమాలయంమీద ప్రశాంతంగా మునిసేవతో, తపస్సుతో ఉంటే, నరుడు సిద్ధ పురుషుడై ఈ లోకంలో కీర్తి పొందటమేకాక బ్రహ్మలోకంలో ఉండే అదృష్టం పొందగలడు.

**క. విను, తీర్థసేవ గామం । బును గ్రోధము మదము లోభమును జేరని నె**
**మ్మనము గలిగి నడపవలయు । ననఘా! ఫలసిద్ధి దాననగుఁ బురుషునకున్. 90**

**ప్రతిపదార్థం:** విను= ఆలకింపుము; కామంబును= కామం; క్రోధము= కోపం; మదము= గర్వం; లోభమును= లోభగుణం; చేరని= సోకని; నెమ్మనము= నిండు మనస్సు కలిగి; తీర్థసేవ= తీర్థాలను సేవించటం; నడపవలయున్= చేయాలి; అనఘా!= పుణ్యాత్ముడా!; దానన్= దానితో; పురుషునకున్= మనిషికి; ఫలసిద్ధి= ఫలితం పొందటం; అగున్= జరుగుతుంది.

**తాత్పర్యం:** కామాదులు లేని మనస్సుతో తీర్థాలను సేవించాలి. దానివలననే కోరిన ఫలం సిద్ధిస్తుంది.

**క. దమమును దపము నహింసయు । శమమును తీర్థముల వాన శౌచాతిశయం**
**బమలగుణ; కల్గు, రిత్త జ । లములం దోఁగిన శుచిత్వ లాభము గలదే? 91**

**ప్రతిపదార్థం:** దమమును= కర్మేంద్రియ నిగ్రహం; తపము= (వేడి) ఏకాగ్ర భావనతో చేసే ధ్యానం మొదలైనవి; అహింసయున్= జీవహింస చేయకపోవటం; శమమును= జ్ఞానేంద్రియ నిగ్రహం; తీర్థముల= తీర్థములే; వానన్= వాటిలో (ఈ శమదమాదులలో); శౌచ= శుచిత్వ; అతిశయంబు= ఆధిక్యం; కల్గున్= కలుగుతాయి; అమలగుణ!= నిర్మలమైన గుణాలు కలవాడా! ధర్మరాజా!; రిత్త= వట్టి; జలములన్= నీళ్ళలో; తోఁగినన్= మునిగితే; శుచిత్వ లాభము= మనస్సు నిర్మలం కావటం అనే సిద్ధి; కలదే= ఉన్నదా?

**తాత్పర్యం:** నిర్మలములైన గుణములుగల ధర్మజా! దమము, శమము, అహింస, తపము అనునవి తీర్థములే. వాటివలన అతిశయమైన శుచిత్వం లభిస్తుంది. పై గుణములు లేక వట్టినీళ్ళలో మునిగితే పావనత్వం చేకూరుతుందా! చేకూరదని భావం.

**క. దొరకొనని వానిఁ గోరక, । దొరకొనినందున మమత్వ తుష్టహృదయతం**
**బొరయక, విగతస్పృహులగు । పురుషులు, శుచు; లేల తీర్థములు వారలకున్? 92**

**ప్రతిపదార్థం:** దొరకొనని= లభించని; వానిన్= వాటిని; కోరక= కోరుకొనక; దొరకొనినందునన్= దొరకినందువలన లేదా దొరికిన వాటియందు; మమత్వ= మమకారం; తుష్ట= తృప్తి చెందిన; హృదయతన్= హృదయమును; పొరయక= పొందక; విగత= పోయిన; స్పృహులు= కోరికలు కలవారు; అగు= అయిన; పురుషులు= వ్యక్తులు; శుచులు= పవిత్రులు; వారలకున్= వారికి; తీర్థములు= ఈ పుణ్య తీర్థాలు; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** ఏది నీకు అందుబాటులో ఉండదో దానిని కోరకుండా, దొరుకుతున్నవి కదా అని వాటిమీద మమకారం పెంచుకొనకుండా వాంఛలను జయించినవారు నిత్యము పవిత్రులే. వారి కీ తీర్థాల గొడవ దేనికి?

**ఆ. అరయ దుర్గమములు, నతి విషమంబులు । నైన తీర్థములు ధరాధినాథ!**
**యధిక భక్తి యుక్తి నాత్మఁ దలంచినఁ । జాలు నరుల కల్మషములు వాయు. 93**

**ప్రతిపదార్థం:** ధరా= భూమికి; అధినాథ!= పతీ!; అరయన్= విచారిస్తే; దుర్గమములు= పోరానివి; అతి= మిక్కిలి; విషమంబులు= కష్టంతో కూడుకొన్నవి; ఐన= అయినటువంటి; తీర్థములు= తీర్థాలు; అధిక= మిక్కిలి; భక్తి= పరమ ప్రేమ యొక్క; యుక్తిన్= కూడికతో; ఆత్మన్= హృదయంలో; తలంచినన్= భావిస్తే; చాలున్= సరిపోతుంది; నరుల= మనుష్యులయొక్క; కల్మషములు= పాపాలు; పాయున్= పోతాయి.

**తాత్పర్యం:** పోవటానికి వీల్లేనివి, దూరప్రదేశాలలో ఉండేవి, అయిన తీర్థాలను భక్తితో స్మరిస్తే చాలయ్యా ధర్మరాజా! మనుష్యుల పాపాలన్నీ పోతాయి.

**క. జనవర! తీర్థ విధాశం । సన మగు నీ పుణ్యవాక్యచయము పవిత్రం**

**బనుపమము మాననీయం । బనిమిషపదవీప్రదము రహస్యము సుమ్మీ! 94**

**ప్రతిపదార్థం:** జనవర!= ప్రజలను పాలించేవాడా!; తీర్థ= తీరముల; విధా= పద్ధతి; ఆశంసనము= కోరినది; అగు= అయిన; ఈ పుణ్యా= ఈ పవిత్రమైన; వాక్య= మాటల; చయము= సమూహం; పవిత్రంబు= పుణ్యమైనది; అనుపమము= సాటిలేనివి; మాననీయంబు= గౌరవించదగినది; అనిమిష= దేవతల; పదవీ= స్థానం; ప్రదము= ఇచ్చేది; రహస్యము= ఇది చాలా గోప్యమైనది; సుమ్మీ!= సుమా!

**తాత్పర్యం:** రాజా! తీర్థ విధానాలకు సంబంధించిన ఈ స్పష్టమైన పవిత్ర వాక్యాలు సాటిలేనివి, గౌరవించదగినవి, స్వర్గప్రదాలుకూడా. చాలా రహస్యం సుమా!

**క. అనుగతుఁ డగు శిష్యునకుం' । దనసుతునకుఁ, జుట్టమునకు, ధరణీసుర ము**

**ఖ్యనియతి పదద్విజాతుల । కును, దగ నెఱిఁగించునది యకుంఠిత కరుణన్. 95**

**ప్రతిపదార్థం:** అకుంఠిత= అడ్డులేని; కరుణన్= దయతో; అనుగతుఁడు= అనుసరించేవాడు; అగు= అయిన; శిష్యునకున్= శిష్యుడికీ; తన సుతునకున్= తన కుమారుడికీ; చుట్టమునకున్= చుట్టానికీ; ధరణీసుర ముఖ్య= బ్రాహ్మణశ్రేష్ఠులకు; నియతి= నియమం; పద= స్థానం కల్గిన; ద్విజాతులకును= రెండు జన్మలు కలవారికి, అనగా క్షత్రియ, వైశ్యులకు; తగన్= చక్కగా; ఎఱిఁగించునది= చెప్పాలి.

**తాత్పర్యం:** ఈ విషయం అందరితో చెప్పరాదు. ఎవరైతే గురువులను చక్కగా సేవిస్తారో ఆ శిష్యులకు, కుమారులకు, బంధువులకూ. బ్రాహ్మణశ్రేష్ఠులకూ, నియమం అనే యోగఅంగాన్ని సాధించటంలో పట్టుదలగల వైశ్యులకు, క్షత్రియులకూ నిండు ప్రేమతో చెప్పాలి.

**క. నరవర! గౌతమునకు నం । గిరసుఁడు సెప్పినది యిది, యకిల్బిషబుద్ధిం**

**బరిపాటిఁ బఠించినఁ ద । త్పరత వినిన నపుడ పాయుఁ బాపము లెల్లన్. 96**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; గౌతమునకున్= గౌతముడికి; అంగిరసుఁడు= అంగీరస ఋషి; చెప్పినది= చెప్పింది; ఇది= ఈ వాక్య సమూహం; అకిల్బిష= పాపంలేని; బుద్ధిన్= మనస్సుతో; పరిపాటిన్= నిత్యం క్రమం తప్పక; తత్పరతన్= ఆసక్తితో; పఠించినన్= పారాయణం చేసినా; వినినన్= విన్నా; పాపములు ఎల్లన్= అన్ని పాపాలు; అపుడు+అ= అప్పుడే; పాయున్= తొలగుతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! గౌతముడికి అంగిరసుడు చెప్పిన ఈ వాక్యాలు పవిత్ర మనస్సుతో పారాయణం చేసినా విన్నా పాపాలన్ని పోతాయి.

**క. మునులకు జప్యం బిది, స । ద్వినుతముఁ నిత్యముఁ బఠించు విమలాత్ములకున్;**

**విను, జాతి స్మరణముతో । జననం బతిపుణ్యపురుష సంతతి గలుగున్.' 97**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ వాక్యాల సముదాయం; మునులకున్= మునులకు; జప్యంబు= జపించదగినది; సత్= మంచివారిచే; వినుతమున్= స్తుతించదగింది; నిత్యము= ప్రతిదినము; పఠించు= పారాయణంచేసే; విమల= నిర్మలమైన; ఆత్ములకున్= హృదయాలున్నవారికి; జాతిస్మరణముతోన్= పూర్వజన్మ వాసనలస్మృతితో; జననంబు= జన్మ; అతి= మిక్కిలి; పుణ్యపురుష= పవిత్ర వ్యక్తుల; సంతతి= సంతానం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఈ విషయం మునులకు జపించతగింది. సత్పురుషులచేత స్తుతించతగింది. దీన్ని పారాయణం చేసే నిర్మల మనస్కులకు పూర్వజన్మ ఏ జాతిలో కలిగిందో ఆ స్మరణకల మరుజన్మ కలుగుతుంది. పుణ్యపురుష సంతానమూ కలుగుతుంది.'

### అత్రి ప్రముఖ మహర్షులు శరతల్పగతుఁడైన భీష్ముఁ జూడవచ్చుట (సం.13-27-1)

**వ. అని చెప్పె నయ్యవసరంబునఁ బుణ్యవిశేష గణ్యుండైన యగ్గాంగేయుం డట్లు గాండీవిశరంబులు శయ్యగా వీరశయనంబున నునికి నతని వీక్షింప నత్రియు, వసిష్ఠుండును, భృగుండును, బులహుండును, బులస్త్యుండును, గ్రతువు, నంగిరసుండును, నగస్త్యుండును, గణ్వుండును, గౌతముండును, విశ్వామిత్రుండును, జమదగ్నియు మొదలైన మహామునులు శిష్యవ్రాతంబుతో నేతెంచి తపఃప్రభావ స్ఫురిత ప్రభాపూరంబు భూనభోంతరంబున సంతతంబు లగుచుండ నిలిచి, యద్దేవవ్రతుని యున్న తెఱంగు గలయం గనుంగొనిరి, పాండవు లాశ్చర్య భరిత చిత్తులగుచు నత్తపోధనవర్యులం బ్రస్తుతించుచుం బ్రణమిల్లిరి; అప్పుడప్పరమసంయము లంతర్ధానంబు సేసిరి, అక్కౌరవులు నక్కురుపితామహుండును దారును వారల మాహాత్మ్యంబు లుగ్గడించుచుఁ దద్విషయంబైన సంభాషణం బొనర్చిరి; తదనంతరంబ. 98**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; పుణ్యవిశేష= విశేషపుణ్యం కలిగినందువలన; గణ్యుండు= గణించదగినవాడు; ఐన; ఆ+గాంగేయుండు= ఆ గంగానది కుమారుడు; అట్లు= ఆరీతిగా; గాండీవి= గాండీవమన్న విల్లు కలవాడు, అర్జునుడి; శరంబులు= బాణాలు; శయ్యగాన్= సెజ్జగా; వీరశయనంబునన్= వీరులకు ఉచితమైన శయ్యపై; ఉనికిన్= ఉన్నందువలన; అతనిన్; వీక్షింపన్= చూడటానికి; అత్రియున్, వసిష్ఠుండును, భృగుండును, పులహుండును; పులస్త్యుండును; క్రతువును, అంగిరసుండును; అగస్త్యుండును, కణ్వుండును, గౌతముండును, విశ్వామిత్రుండును, జమదగ్నియు మొదలైన; మహామునులు; శిష్య= శిష్యులయొక్క; వ్రాతంబుతోన్= సమూహంతో; ఏతెంచి= వచ్చి; తపఃప్రభావ= తపస్సుయొక్క మాహాత్మ్యంతో; స్ఫురిత= ప్రకాశించే; ప్రభాపూరంబు= కాంతి ప్రవాహం; భూ= భూమికి; నభః= ఆకాశానికి; అంతరంబునన్= మధ్యలో; సంతతంబులు= మిక్కిలి వ్యాపించినవి; అగుచుండన్= కాగా; నిలిచి= క్రిందికి దిగకుండా, మీదనే నిలచి; ఆ+దేవవ్రతుని= ఆ భీష్ముడియొక్క; ఉన్నతెఱంగున్= ఉన్నవిధానం; కలయన్= అంతటా; కనుంగొనిరి= చూచారు; పాండవులు= పాండురాజు కుమారులు; ఆశ్చర్యభరిత= ఆశ్చర్యంతో నిండిన; చిత్తులు= మనస్సులుకలవారు; అగుచున్= అయి; ఆ+తపోధన+

వర్యులన్= ఆ తపస్సు ఐశ్వర్యంగా కల మునిశ్రేష్ఠులను; ప్రస్తుతించుచున్= మిక్కిలి కొనియాడుతూ; ప్రణమిల్లిరి= నమస్కరించారు; అప్పుడు; ఆ+పరమ సంయములు= ఆ గొప్ప మునులు; అంతర్ధానంబు చేసిరి= అదృశ్యమయ్యారు; ఆ+కౌరవులు= పాండవులు - కురువంశ సంతానం; ఆ కురుపితామహుండును= ఆ కౌరవుల తాత, భీష్ముడూ; తారును= తామూ; వారల=ఆ మహామునుల; మాహాత్మ్యంబు= మహిమను; ఉగ్గడించుచున్= చెప్పుకొంటూ; తత్+విషయంబైన= వారికి సంబంధించిన; సంభాషణంబు= ప్రసంగం; ఒనర్చిరి= చేశారు; తత్+అనంతరంబు+అ= అటు తరువాత.

**తాత్పర్యం:** ఆ సమయంలో విశేషపుణ్య పురుషులలో లెక్కించతగిన భీష్ముడు, అర్జునుడు బాణాలతో నిర్మించిన తల్పంమీద మహావీరునకు తగినట్లుగా శయనించి ఉన్నాడు కనుక చూడటానికి మహర్షులు పెక్కుమంది శిష్యులతో సహా వచ్చారు. భూమికీ ఆకాశానికీ గల మధ్యభాగం వారి తపో మహత్త్వంవలన ఏర్పడిన కాంతితో నిండిపోయింది. వారంతా భీష్ముడి పరిస్థితిని పరికించారు. ఇది చూచి ఆశ్చర్యపడి పాండవులు వారికి నమస్కరించారు. ఆ మునులు అదృశ్యమైపోయారు. అది చూచిన పాండవులు, భీష్ముడు వారి చరిత్రలను ముచ్చటించుకొన్నారు. ఆ తరువాత.

**తే. తాత పాదపద్మములు మస్తకము సోఁక । వినతుఁడై, ధర్మతనయుఁ 'డే జనపదంబు**
**లే నగంబు లేనదులు పుణ్యానుభావ । సమధికత్వంబు గలయవి జనవరేణ్య!। 99**

**ప్రతిపదార్థం:** ధర్మతనయుఁడు= యముడి పుత్రుడైన పాండవాగ్రజుడు; తాత= భీష్ముడి; పాదపద్మములు= తామరపూలవంటి అడుగులు; మస్తకము= (తన) తలకు; సోఁకన్= తగిలేటట్లుగా; వినతుఁడు+ఐ= వంగి నమస్కరించి; జనవరేణ్యా= మానవులలో శ్రేష్ఠుడా!; ఏ జనపదంబులు= ఏ పల్లెపట్లు (జనులు నివసించే చోట్లు); ఏ నగంబులు= ఏ కొండలు; ఏ నదులు= ఏ ఏరులు; పుణ్య అనుభావ= పవిత్ర మాహాత్మ్యం చేత; సమధికత్వంబు= గొప్ప అతిశయం; కలయవి= కలవి.

**తాత్పర్యం:** యమధర్మరాజు కొడుకు ధర్మరాజు తాతగారి అడుగు దమ్ములకు తన తల తాకేటట్లు నమస్కరించి, 'తాతా! ఏ ఊళ్ళు, కొండలు, ఏళ్ళూ మాహాత్మ్యం కలవో చెప్పుము'.

**వ. అని యడుగుటయు. 100**

**తాత్పర్యం:** అని అడుగగా.

### భీష్ముఁడు ధర్మజునకు గంగాప్రభావంబు సెప్పుట (సం.13-27-19)

**సీ. అతనికి నాతఁ డిట్లను; 'నివ్విషయమునఁ । గల దితిహాస మొకండు, దానిఁ**
**వివరింతు నీ కుంఛవృత్తిపరుం డగు । నొక విప్రునింటికి నొక్క సిద్ధుఁ**
**డతిథియై వచ్చిన, నాతిథ్య మొనరించి । యతనితో సల్లాప మాచరింప,**
**నమ్మహాత్ముండు నీ యడిగిన యట్టుల । యా సిద్ధు నడిగిన, నతఁడు సెప్పె**

**తే. ననఘ! యెవ్వాని నడుముగా నరిగెఁ బావ । నాంబుపూర భాగీరథి యట్టి దేశ**
**భూధరాది పదార్థముల్ పుణ్యతమము; లట్లు గాకయు గంగ మహత్త వినుము. 101**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ ధర్మరాజుతో; అతఁడు= భీష్ముడు; ఇట్లనున్= ఈ విధంగా చెప్పుతున్నాడు; ఈ విషయమునన్= ఈ విషయంలో ఒకండు= ఒకటి; ఇతిహాసంబు= పురాణ కథ;కలదు; దానిన్; నీకున్; వివరింతున్= వివరించి చెప్పుతాను; ఉంఛవృత్తిపరుండు+అగు= భిక్షాటనమే జీవనోపాధిగా గల; ఒక విప్రు+ఇంటికిన్= ఒక బ్రాహ్మణుడి, గృహానికి; ఒక్క; సిద్ధుఁడు= యోగి; అతిథిఐ= అతిథిగా వచ్చినన్= రాగా; ఆతిథ్యము= అతిథి సత్కారం; ఒనరించి= చేసి; అతనితోన్= ఆ సిద్ధుడితో; సల్లాపము= సరస సంభాషణ; ఆచరింపన్= చేయగా; ఆ మహాత్ముండు= ఆ విప్రుడు; ఆ సిద్ధున్= ఆ సిద్ధుడిని; నీఅడిగిన అట్టుల= నీ వడిగినట్లుగానే; అడిగినన్= అడుగగా; అతఁడు= సిద్ధుడు; చెప్పెన్= చెప్పాడు; అనఘ!= పుణ్యాత్ముడా!; ఎవ్వాని= ఏయే దేశములయొక్క; నడుముగాన్= మధ్యలో; పావన= పవిత్రమైన; అంబుపూర= నీటి ప్రవాహం గల; భాగీరథి= భగీరథుడివలన భూమికి దిగివచ్చిన గంగ; అరిగెన్= ప్రవహించిందో; అట్టి దేశ= అట్లాంటి దేశంలో ఉన్న; భూధర= కొండలు; అది= మొదలైన; పదార్థముల్= వస్తువులు; పుణ్య తమములు= మిక్కిలి పవిత్రములు; అట్లు కాకయున్= అంతే కాకుండా; గంగ= గంగానదియొక్క; మహత్త= ప్రభావం, మహిమ; వినుము= ఆలింపుము.

**తాత్పర్యం:** ధర్మరాజుతో భీష్ముడన్నాడు 'దీనికి సంబంధించిన ఒక పురాణ కథ ఉన్నది. అది నీ వడిగిన ప్రశ్నకు సమాధానం. భిక్షాటనంతో జీవించే ఒక బ్రాహ్మణుడి ఇంటికి ఒక యోగి అతిథిగా వచ్చాడు. ఆ విప్రు డతడికి మర్యాదలు చేసి కూర్చుండబెట్టి మాట్లాడుతూ నీ వడిగినట్లే యోగిని అడిగాడు. అతడు చెప్పాడు. పుణ్యాత్ముడా!; ఏ దేశాల నడుమగా గంగ ప్రవహిస్తుందో ఆ దేశంలో ఉన్న పర్వతాదులైన వస్తువులన్నీ పవిత్రములే. ఇంతేకాక గంగా మాహాత్మ్యం చెప్పుతాను వినుము.

**తే. త్రిపథగా సేవనమున సిద్ధించునట్టి । గతి, జనములకు నియత కల్పితము లయ్యు**
**నధ్వరంబును, బ్రహ్మచర్యంబు, దపము । సంపరిత్యాగమును, జేయఁజాల వనఘ! 102**

**ప్రతిపదార్థం:** అనఘ!= పవిత్రుడా!; త్రి= మూడు; పథ= మార్గాలలో; గ= నడిచేది- (స్వర్గంలో మందాకిని, భూలోకంలో భాగీరథి, పాతాళంలో భోగవతి అనే పేర్లతో సాగే గంగ యొక్క); సేవనమునన్= సేవతో; సిద్ధించునట్టి= లభించే; గతి= ఉత్తమ స్థితి; జనములకున్= మనుషులకు; నియత కల్పితములు+అయ్యున్= నియమానుసారంగా చేయబడినవైనా; ఆధ్వరంబును= యజ్ఞం; బ్రహ్మచర్యంబు= వేదాభ్యాసం; తపము= తపస్సు; సంపరిత్యాగమును= చక్కని దానం; చేయన్ చాలవు= సమకూర్చలేవు.

**తాత్పర్యం:** అనఘా! గంగను సేవిస్తే వచ్చే ఫలితం - యజ్ఞం, బ్రహ్మచర్యం, తపస్సు; త్యాగాదులచేతను వచ్చేది కాదు.

**క. మే నించుక సోఁకిన గం । గానది తోయములు జనుల కల్మష కోటిం**
**బో నడిచి పురందర లో । కానందముఁ బొందఁ జేయు నాగమవేదీ! 103**

**ప్రతిపదార్థం:** ఆగమవేదీ!= వేదం తెలిసినవాడా!; మేను= శరీరం; ఇంచుక= కొంచెం; సోఁకినన్= తాకితే; గంగానది తోయములు= గంగానదినీరు; జనుల= మానవుల; కల్మష= పాపాల; కోటిన్= సమూహాన్ని; పోన్= పోయేటట్లుగా; అడిచి= అణగగొట్టి; పురందర లోక ఆనందము= స్వర్గలోకానందాన్ని; పొందన్ చేయున్= లభింపజేస్తుంది.

**తాత్పర్యం:** గంగానది నీరు కొంచెం శరీరానికి తాకితే చాలు. మనిషి చేసిన పాపాలన్నీ పోవటమే కాక స్వర్గలోకానందాన్నిస్తుంది.

**విశేషం:** శ్రీరామకృష్ణ పరమహంస తరచుగా ఇదే మాట చెప్పేవారట. గంగను వారు 'బ్రహ్మచారి' అనేవారట. సాక్షాత్తు బ్రహ్మము నుండి ప్రవహించిన జలమని తాత్పర్యం.

**క. మును పాపము లెన్ని యొన । ర్చినఁ బిదపను గంగ నాడఁ జీఁకటి రవి దోఁ**

**చిన విరియుగతి విరియు; న । య్యనఘుఁ డిలాతలము దొఱఁగి యమరత నొందున్. 104**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; పాపములు; ఎన్ని; ఒనర్చినన్= చేసినా; పిదపను= తరువాత; గంగన్= గంగలో; ఆడన్= స్నానం చేస్తే; రవి= సూర్యుడు; తోఁచినన్= ఉదయిస్తే; చీఁకటి= అంధకారం; విరియుగతిన్= విరిసిపోయిన రీతిగా; విరియున్= చెదరిపోతాయి; ఆ+అనఘుఁడు= ఆ పుణ్యాత్ముడు; ఇలాతలము= భూమిని; తొఱఁగి= వదలి; అమరతన్= అమరత్వమును, దేవతాత్వం; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పూర్వం పాపా లెన్ని చేసినా తరువాత గంగలో మునిగితే పాపాలన్ని పటాపంచలౌతాయి - సూర్యుడు రాగానే చీకట్లు తొలగినట్లు. అంతేకాక వాడు మరణించి దేవలోకాలకు పోతాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. ఎన్ని యేఁడులు, మనుజుని యెమ్ము గంగ । వారియం దుండు, నన్ని వేల్వత్సరములు**

**నాకలోక మహాసుఖశ్రీకి నాతఁ । డత్తి యుండును నిర్మలచిత్తవృత్తి. 105**

**ప్రతిపదార్థం:** ఎన్ని ఏఁడులు= ఎన్నేళ్ళు; మనుజుని= మనిషియొక్క; ఎమ్ము= ఎముక; గంగవారియందున్+ఉండున్= గంగనీళ్ళలో ఉంటుందో; అన్నివేల్= అన్నివేల; వత్సరములు= ఏళ్ళు; నాకలోక= స్వర్గలోకమందలి; మహాసుఖశ్రీకిన్= చెడని సుఖసంపదకు; ఆతఁడు= ఆ మనిషి; నిర్మల= స్వచ్ఛమైన; చిత్తవృత్తిన్= మనస్సుతో; అత్తియుండును= హత్తుకొని ఉంటాడు.

**తాత్పర్యం:** మనిషి ఎముక గంగనీళ్ళలో ఎన్నేళ్లుంటుందో అన్నివేల సంవత్సరాలు స్వర్గలోకంలో అతడు మహాసుఖాలు పొందగలుగుతాడు.

**సీ. అనఘ! సోమము లేని యధ్వరంబును, శశి । లేని రాత్రియు, రవి లేని నభము**

**నాత్మధర్మము లేని యాశ్రమంబును, బుష్ప । సంపద లేని భూజమును బోలె,**

**హీనత నొందు, గంగానది లేని దే । శంబు, చాంద్రాయణ శతము లైన**

**గంగాపయః పానకరణంబు గావించు । నిర్మలత్వముఁ జేయ నేర; వగ్ని**

**ఆ. యందుఁ బడిన దూది యట్లగు గంగావ । గాహనమునఁ బాతకంబు లఖిల**

**భూతములకు దుఃఖములు వాపి కొనుటకు । నేవిధములు గంగ కీడు గావు. 106**

**ప్రతిపదార్థం:** అనఘ!; సోమము= సోమరసం; లేని; అధ్వరంబును= యజ్ఞం; శశి= చంద్రుడు; లేని; రాత్రియున్= రేయి; రవి= సూర్యుడు; లేని= లేనట్టి; నభమున్= ఆకాశం; ఆత్మధర్మము=స్వధర్మంలేని; ఆశ్రమంబును= ఆశ్రమము - నాలుగు ఆశ్రమాలు- బ్రహ్మచర్యం; గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం; పుష్పసంపద= పూలసమృద్ధి; లేని; భూజమును పోలెన్= చెట్టు

వలె; గంగానది లేని దేశంబు= గంగపారని దేశం; హీనతన్+ఒందున్= హీనత్వం పొందుతుంది; చాంద్రాయణ= చాంద్రాయణమనే వ్రతం, చంద్రకళలు తరగటం; పెరగటం బట్టి భోజనం తగ్గించటం, పెంచటములయొక్క; శతములు= వందలు; ఐనన్= అయినప్పటికి; గంగాపయః పానకరణంబు= గంగనీటిని త్రాగటం; కావించు= చేసే; నిర్మలత్వమున్= పవిత్రతను; చేయన్‌నేరవు= చేయజాలవు; గంగా+అవగాహమునన్= గంగలో మునుగుట వలన; పాతకంబులు= పాపములు; అగ్నియందున్= నిప్పులో; పడిన= పడ్డ; దూది అట్లగున్= దూదివలె అయిపోతాయి; అఖిల= సమస్త; భూతములకున్= జీవరాసులకు; దుఃఖములు= శోకాలు; పాపి కొనుటకున్= పోగొట్టుకొనటానికి; ఏవిధములు= ఏ పద్ధతులు కూడా; గంగకున్= గంగానదికి; ఈడుకావు= సమానం కావు.

**తాత్పర్యం:** సోమం లేని యజ్ఞం; చంద్రుడు లేని రాత్రి, సూర్యుడు లేని ఆకాశం; స్వధర్మం లేని ఆశ్రమం, పూలు లేని చెట్టు ఎట్లా శోభను కోల్పోతాయో, అదే విధంగా గంగలేని దేశం కూడా దైన్యం పొందుతుంది. చాంద్రాయణవ్రతాలు వందచేసినా గంగ నీరు త్రాగిన ఫలితం రాదు. సకలపాపాలు గంగలో మునిగితే పోతాయి. అగ్నిలో పడ్డ దూదివలె సమస్త జీవరాసులకు దుఃఖం పోగొట్టుకొనటానికి ఎన్నిమార్గాలున్నా గంగతో సమానం కావు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. శరణంబు లేని జనులకుఁ। బరమశరణ మండ్రు మునులు భాగీరథి, ని**
**ర్జరులకు నమృతము లట్టుల। నరులకు గంగాజలం బనఁగ నే విందున్. 107**

**ప్రతిపదార్థం:** మునులు= ఋషులు; శరణంబు= దిక్కు; లేని; జనులకున్; భాగీరథిన్= గంగను; పరమ= గొప్ప; శరణము= దిక్కు; అండ్రు= అంటారు; నిర్జరులకున్= దేవతలకు (జర=ముసలితనం లేనివారు); అమృతములు+అట్టుల= అమృతమెట్లాగో అట్లాగే; నరులకున్= భూలోకంలోని వారికి; గంగా జలంబులు= గంగనీళ్ళు; అనఁగన్= అనటం; నేన్= నేను; విందున్= వింటాను.

**తాత్పర్యం:** దిక్కులేని జనులకు గంగ గొప్ప దిక్కని మును లంటారు. దేవతలకు అమృతమెట్లాగో, నరులకు గంగ నీరు అట్లాంటిది - అని అనటం నేను విన్నాను.

**విశేషం:** అలం: ఉపమ.

**క. తలపై జాహ్నవి వాలుక। యలికికొనిన ఫాలతటిఁ దదంతర్మృత్సం**
**కలితముఁ జేసిన, బాపం। బులు దొలఁగు సుపర్ణుఁ గనిన భుజగముల క్రియన్. 108**

**ప్రతిపదార్థం:** తలపైన్= నెత్తిపైన; జాహ్నవి= గంగలోని; వాలుక= ఇసుక; అలికికొనినన్= రాసుకొన్నా; ఫాలతటిన్= నుదుటియందు; తత్= ఆ గంగ యొక్క; అంతర్= లోపలి; మృత్= మట్టిని; సంకలితము= కూడుకొన్నట్లు; చేసినన్= చేసినా; సుపర్ణున్= గరుత్మంతుడిని; కనిన= చూచిన; భుజగముల= పాముల; క్రియన్= విధంగా; పాపంబులు; తొలఁగున్= పోతాయి.

**తాత్పర్యం:** తలమీద గంగ ఇసుక, నొసటిపై గంగమన్ను రాసుకొంటే గరుత్మంతుడిని చూచి పాములు పారిపోయినట్లుగా పాపాలు తొలగిపోతాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. గంగాతరంగశీకర । సంగతమగు మారుతమున సద్య స్స్పర్శం**
**బంగీకరించునెవ్వఁడు । భంగపఱుచు నతఁడు ఘోరపాపచయంబున్. 109**

**ప్రతిపదార్థం:** గంగా తరంగ= గంగానది అలల యొక్క; శీకర= తుంపర్లతో; సంగతము+అగు= కూడుకొన్న; మారుతమునన్= గాలితో; సద్యః= అప్పటికప్పటి; స్పర్శంబు= స్పర్శ; ఎవ్వఁడు= ఎవడు; అంగీకరించున్= స్వీకరిస్తున్నాడో; అతఁడు= వాడు; ఘోర= భయంకరమైన; పాపచయంబున్= పాపసమూహాన్ని; భంగపఱుచున్= వమ్ముచేస్తాడు.

**తాత్పర్యం:** గంగా తరంగాల తుంపర్లు చిందే గాలి శరీరానికి తాకితే వాడి పాపాలన్నీ అప్పటికప్పుడే పోతాయి.

**తే. ఇవుల నేడు దరంబుల, నవుల నేడు । దరములను, బితృవర్గంబు, నరుఁడు గంగ**
**నాడి శుచిఁ జేయుఁ జూచిన యంతమాత్రఁ । బాచు వాఙ్మనః కాయజ పాపతతుల. 110**

**ప్రతిపదార్థం:** ఇవులన్= ఇవతల; ఏడుతరంబులన్= ఏడు తరాలు; అవులన్= అవతల; ఏడు తరములన్= ఏడు తరాలు (14 తరాలు); పితృవర్గంబున్= పితృదేవతలను; నరుఁడు; గంగన్= గంగలో; ఆడి= స్నానంచేసి; శుచిన్= స్వచ్ఛతను; చేయున్= చేస్తాడు; చూచిన అంతమాత్రన్= చూచినంత మాత్రాన; వాక్= మాటవలన; మనః= మనస్సువలన; కాయజ= శరీరం వలన పుట్టిన; పాపతతులన్= పాప సమూహాలను; పాచున్= పోగొట్టుతాడు.

**తాత్పర్యం:** మనుష్యుడు గంగా స్నానం చేసి పదునాలుగు తరాల పితృదేవతలను పావనుల గావిస్తాడు. గంగను చూచినంతమాత్రాన మాట, మనస్సు, శరీరం వలన కల్గిన పాపాలన్నీ పోతాయి.

**తే. వినిన, వేడుక సేసినఁ, గనినఁ జేత । నంటినను, రెండు కులములయందుఁ గలుగు**
**పితృగణంబుల నెల్ల, సద్గతికిఁ బుచ్చు;। గంగ యెటు సేయునో యవగాహనమున. 111**

**ప్రతిపదార్థం:** వినినన్= విన్నా; వేడుక= ఉత్సవం; చేసినన్= చేసినా; కనినన్= చూచినా; చేతన్= చేత్తో; అంటినను= తాకినా; రెండు కులములఅందున్= రెండు కులాలలోనూ - మాతృపితృ వంశాలలో; కలుగు=ఉన్నట్టి; పితృగణంబులన్= పితృదేవతా సమూహాన్ని; ఎల్లన్= అందరినీ; సత్‌గతికిన్= మంచి పరలోకస్థితికి; పుచ్చున్= పంపుతుంది; గంగ= గంగానది; అవగాహనమునన్= స్నానంచేస్తే; ఎటుచేయునో= ఇంక ఎట్టి సద్గతులు కల్గిస్తుందో చెప్పశక్యంగాదు (చాలా మేలుచేస్తుంది)

**తాత్పర్యం:** గంగను గురించి విన్నా, ఉత్సవం చేసినా, చూచినా, చేతితో తాకినా, రెండు కులాలలోని (పుట్టినింటి - మెట్టినింటి) పితృదేవతలను స్వర్గానికి పంపిస్తుంది. అట్లాంటప్పుడు ఇక స్నానం చేస్తే వారికేమిస్తుందో ఆ గంగాదేవి? మాటలలో చెప్పలేను.

**క. విను, గంగ గంగ యను కీ । ర్తనములతో నొండునీటఁ దగ మునిఁగిన య**
**జ్జనులు దురితములఁ దొఱఁగుదు । రని యార్యులు సెప్ప విందు నంచితచరితా! 112**

**ప్రతిపదార్థం:** అంచిత= మంచి; చరితా!= నడవడి కలవాడా!; విను= శ్రద్ధగా ఆలకించుము; గంగ గంగ= గంగ గంగ; అను= అన్న; కీర్తనములతోన్= స్తుతులతో (గంగా గంగా అన్నమాటలే కీర్తన); ఒండునీటన్= మరొక నీటిలో; తగన్=

తగువిధంగా; మునిఁగిన= స్నానంచేసిన; ఆ+జనులు= ఆ మనుష్యులు; దురితములన్= పాపాలను; తొలఁగుదురు= పోగొట్టుకొంటారు; అని; ఆర్యులు= పెద్దలు; చెప్పన్= చెప్పగా; విందున్= విన్నాను.

**తాత్పర్యం:** గంగా, గంగా అంటూ పరవశంతో కీర్తిస్తూ ఏ నీటిలో మునిగినా పాపాలు పోతాయంటారు పెద్దలు. (ఇంక గంగలో మునిగితే వేరే చెప్పాలా?

**సీ. అనఘ! చూడ సమర్థుఁ డగువాఁడు జాహ్నవిఁ। జూడకయున్నఁ బశుప్రతిముఁడు**
**నంధ సమానుండు నగు ; నింద్రుఁ డాదిగా। సురలు గోరెదు గంగ నరులు గోర**
**వలదె? చేకుఱు నపవర్గ ముత్క్రమణ కా। లంబున గంగఁ దలంచి రేని;**
**రాజభయంబుఁ, జోరభయంబుఁ బాప భ। యంబును, భూతభయంబు, లోను**

**ఆ. గాఁగఁ గలుగు భయనికాయంబు, గంగా ప్ర। శంసనమునఁ బాయు; శంభుఁ డర్థి**
**నతులపుణ్య యైన యద్దేవి దివినుండి। రా ధరింపఁడే శిరస్తలమున. 113**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! చూడన్= దర్శించటానికి; సమర్థుఁడు+అగువాఁడు= శక్తికలవాడు; జాహ్నవిన్= గంగను, (జహ్నుడన్న ముని చెవినుండి ప్రవహించింది కనుక అతడి కూతురు గంగ); చూడక+ఉన్నన్= చూడకపోతే; పశుప్రతిముఁడు= గొడ్డుతో సమానం; అంధ సమానుండు= గ్రుడ్డివాడితో సమానం; అగున్= అవుతాడు; ఇంద్రుఁడు+ఆదిగాన్= ఇంద్రుడు మొదలుకొని; సురలు= దేవతలు; కోరెడు= కోరుకొనే; గంగన్= గంగను; నరులు= మనుష్యులు; కోరన్‌వలదె?= కోరుకొనవద్దా?; గంగన్; ఉత్క్రమణ కాలంబునన్= ప్రాణంపోయే సమయంలో; తలంచిరి+ ఏనిన్= తలచుకొంటే; అపవర్గము= ముక్తి; చేకుఱున్= లభిస్తుంది; రాజభయంబున్= రాజువలన కలిగే భయం; చోరభయంబున్= దొంగలవలని భయం; పాపభయంబును= పాపంవలనిభయం; భూత భయంబున్= ప్రేత, పిశాచాదులవలని భయం; లోనుగాఁగన్‌కలుగు= మొదలుగా కలుగు; భయ నికాయంబున్= ఉండే భయాలన్ని; గంగా ప్రశంసనమునన్= గంగాస్తుతివలన; పాయున్= పోవును; శంభుఁడు= శివుడు; అర్థిన్= కోరికతో; అతుల= సాటిలేని; పుణ్యైన= పుణ్యవతిఅయిన; ఆ+దేవి= ఆ దేవత; దివినుండి= ఆకాశంనుండి; రాన్= రాగా; శిరస్తలమునన్= తలమీద; ధరింపఁడే= తాల్చడా!

**తాత్పర్యం:** చూడటానికి శక్తి ఉండి గంగను చూడనివాడు గొడ్డుతో సమానం. గ్రుడ్డివాడితో సమానం; ఇంద్రుడు మొదలైన దేవతలే గంగ కావాలనుకొంటే నరు లనుకోవద్దా! ప్రాణం పోయేవేళ గంగను స్మరించినంతమాత్రాన ముక్తి కలుగుతుంది. రాజ, చోర, పాప భయాలన్నీ గంగను కీర్తిస్తే పోతాయి. శివునివంటివాడు ఆ దేవత స్వర్గం నుండి దిగివస్తే తన తలమీద పెట్టుకొన్నాడు కదయ్యా!

**తే. మూఁడు పథములఁ జని, లోకములకు మూఁటి। కుజ్జ్వలాలంకృతియుఁ బెంపు నొసఁగినట్టి,**
**యమలతరమూర్తి యగు దేవి నాశ్రయించు। వాఁడు కృతకృత్యుఁ డిది నిక్కువము కృతాత్మ! 114**

**ప్రతిపదార్థం:** కృత+ఆత్మ!= ధన్యమూర్తీ!; మూఁడు పథములన్= మూడు దారులలో (స్వర్గ, మర్త్య, పాతాళలోకాల మార్గాలలో); చని= ప్రవహించి; లోకములకున్ మూఁటికిన్= మూడు లోకాలకు; ఉజ్జ్వల= ప్రకాశవంతమైన; అలంకృతియున్= అలంకారమునూ; పెంపును= ఆధిక్యమును; ఒసఁగినట్టి= ఇచ్చినటువంటి; అమలతర= మిక్కిలి నిర్మలమైన; మూర్తి= ఆకారం కలది; అగు= అయిన; దేవిన్= దేవతను; ఆశ్రయించువాఁడు= శరణన్నవాడు; కృతకృత్యుఁడు= ధన్యుడు; ఇది; నిక్కువము= సత్యం.

**తాత్పర్యం:** మూడు మార్గాలలో ప్రవహిస్తూ ముల్లోకాలకూ గొప్ప అలంకారమై కీర్తిని కలిగిస్తూ ఉండే స్వచ్ఛమూర్తి గంగాదేవిని ఎవడు ఆశ్రయిస్తున్నాడో వాడు ధన్యుడు.

**విశేషం:** అమలతరమూర్తి - స్వచ్ఛమైన రూపంకలది; జలానికి ఆకారం, రంగు లేవు. ఆకాశంవలె ప్రతిఫలించి నీలమౌతున్నది తప్ప, పైగా ఈ జలమూర్తులలో మిక్కిలి నిర్మలమైనది గంగాదేవి. హిమాలయాలలో జన్మించినది కాబట్టి ఎన్నో ఓషధుల గుణాలు కలిగినది కాబట్టి పవిత్రమైనది. ఈ దేశసంస్కృతి గాంగేయ సంస్కృతి, గంగకు కుమారస్వామి, భీష్ములిద్దరూ సంతానం. వారిద్దరు గాంగేయులు. గంగ ఒడ్డున కాశి మొదలైన పవిత్ర పుణ్యక్షేత్రాలు వెలిశాయి కనుక భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతికి చిహ్నం - గంగ.

**క. జనులకు నింద్రుఁడు, గ్రహముల । కినుఁడును, దారలకు నోషధీశుఁడ పోలెన్**
**మనుజోత్తమ ! కడు నెక్కుడు । వినుము, నరుల కెల్ల జాహ్నవి మహత్త్వమునన్. 115**

**ప్రతిపదార్థం:** మనుజ+ఉత్తమ!= మానవులలో శ్రేష్ఠుడా! రాజా!; వినుము= ఆలకించుము; జనులకున్= మానవులకు; ఇంద్రుఁడు= దేవతలరాజు; గ్రహములకున్= చంద్రాది గ్రహాలకు; ఇనుఁడును= సూర్యుడు; తారలకున్= నక్షత్రాలకు; ఓషధి+ఈశుఁడు+అ= ఓషధులకు (ఔషధాలకు ఉపయోగించే మొక్కలు లేదా వృక్షాలు) రాజు - చంద్రుడు; పోలెన్= వలె; నరులకు+ఎల్లన్= మనుజులకంతా; మహత్త్వమునన్= మాహాత్మ్యంలో; జాహ్నవి= జహ్నుడనే ముని కూతురు- గంగ; కడున్= మిక్కలి; ఎక్కుడు= గొప్పది;

**తాత్పర్యం:** రాజా! వినుము. మనుష్యులకు ఇంద్రుడు, గ్రహాలకు సూర్యుడు, నక్షత్రాలకు చంద్రుడు ఎట్లాగో; అట్లాగే మనుషుల కన్ని విషయాలలో మాహాత్మ్యంగల గంగ చాలా గొప్పది.

**విశేషం:** అలం: ఉపమ. భగీరథుడు తపస్సు చేస్తే గంగ శివుడి జటాజూటంనుండి క్రిందికి ప్రవహించి దారిలో ఉన్న జహ్నుముని ఆశ్రమాన్ని ముంచివేసింది. అది చూచి ఆయన గంగను త్రాగివేశాడు బొట్టు మిగులకుండా. మరల భగీరథుడు ప్రార్థిస్తే ఆ మహర్షి చెవినుండి తిరిగి గంగ ప్రవహించింది. అందుకని ఆమె జహ్నుకన్య - జాహ్నవి అయింది.

**అ. సగరనృపతి పుత్త్రచయము, మునీంద్ర శా । పమున భస్మమై యపారదురిత**
**కల్మషంబుఁ బొందఁగా గంగ నిజజల । సేక మొసఁగి యనిచె నాకమునకు. 116**

**ప్రతిపదార్థం:** సగర నృపతి= సగరుడన్న రాజు యొక్క; పుత్త్రచయము= కుమారుల సమూహం; ముని+ఇంద్ర= మునులకు రాజైన మునిశ్రేష్ఠుడైన కపిల మహర్షియొక్క; శాపమునన్= శాపంతో; భస్మమై= బూడిదై; అపార= అంతులేని; దురిత= పాప; కల్మషంబు= మాలిన్యం; పొందఁగాన్= పొందితే; గంగ= భాగీరథి; నిజ= తన; జల= నీళ్ళయొక్క; సేకమున్= తడుపుట; ఒసఁగి= చేసి; నాకమునకున్= స్వర్గానికి; అనిచెన్= పంపింది.

**తాత్పర్యం:** కపిలుడి శాపంవలన సగరుడి కొడుకులైన సాగరులు బూడిద కుప్పలుకాగా గంగ ఆ కుప్పలపై ప్రవహించి వారిని స్వర్గానికి పంపించింది. ఇది గంగా మాహాత్మ్యం.

**విశేషం:** సగరుడు యజ్ఞం చేస్తుండగా యాగాశ్వం తప్పిపోయింది. అతని కొడుకులు 60వేలమంది ఆ గుర్రాన్ని వెదకటానికి వెళ్ళారు. ఆ గుర్రం కపిలముని ఆశ్రమ ప్రాంతంలో తిరుగుతూ ఉండటం చూచి వారు కపిలుడే గుర్రాన్ని అపహరించా

డనుకొని ఆయనను శిక్షించటానికి పోయి, ఆ మహర్షి కోపాగ్నికి భస్మమైపోయారు. ఆ స్థితి వారికి పోవాలంటే గంగ ఆ బూడిద కుప్పలపైకి ప్రసరించాలనే ఉపాయం మహర్షి తానై చెప్పగా చివరకు భగీరథు డా పని సాధించిన వాడయ్యాడు. స్వర్గం నుండి గంగ భూమిపైకి ప్రసరించి ఆ బూడిద కుప్పలపై సుళ్ళు తిరిగితే తిరిగి సాగరులు మనుజులై స్వర్గ గతులైనారని గంగావతరణ కథ. ఇది రామాయణంలో మహర్షి వాల్మీకి ఆశ్చర్యకరంగా వర్ణిస్తాడు. ప్రవహించాలని కోరుకొన్నాడు భగీరథుడు. బ్రహ్మ 'సరే, గంగ భూమిపైకి దిగితే క్రుంగిపోతుంది కనుక శివుడిని ప్రార్థించు' అన్నాడు. మరలా భగీరథుడు శివుడి కొరకు తపస్సు చేస్తే ఆయన ప్రత్యక్షమై భగీరథుడి కోరిక మన్నిస్తానన్నాడు. గంగ ఆయన జటాజూటంలో దూరింది. భూమిపై ప్రవహిస్తూ జహ్నుడి ఆశ్రమాన్ని ముంచెత్తితే ఆయన గంగను త్రాగివేశారు. మరలా భగీరథుడు జహ్నుమునిని ప్రార్థించాడు. అప్పుడు గంగ అతని చెవినుండి నిర్గమించి సాగరుల భస్మరాసులపై ప్రవహించి వారిని సద్గతికి పంపింది.

ఇదీ భగీరథుడి చిత్ర తపస్సు. ప్రచుర పౌరుషం. ఎన్ని విఘ్నాలు వచ్చినా ప్రయత్నం విరమించకుండా సాధించే కృషిని భగీరథ ప్రయత్న మంటారు.

**తే. దేవతలఁ జిత్రతపమునఁ దెలచి, గంగఁ । బ్రచుర పౌరుషుఁ డగు భగీరథుఁడు దనదు**

**పూర్వులైన సగర నృపపుత్రులకు ను । దాత్త గతికయి తెచ్చె నిద్ధరణి కనఘ! 117**

**ప్రతిపదార్థం:** అనఘ! = పుణ్యాత్ముఁడా!; దేవతలన్= దేవతలను; చిత్ర= అద్భుతమైన; తపమునన్= తపస్సు ద్వారా; తెలచి= నమస్కరించి, సేవించి; ప్రచుర= అత్యధికమైన; పౌరుషుఁడు= ప్రయత్నం కలవాడు; అగు= అయిన; భగీరథుఁడు; తనదు= తనయొక్క; పూర్వులు+ఐన= తనవంశంలో ముందు పుట్టినవారైన (తాత ముత్తాతలు); సగర నృప= సగరరాజుయొక్క; పుత్రులకున్= కుమారులకు; గతికి+అయి= ముక్తికొరకు; ఇద్ధరణికిన్= ఈ లోకానికి; గంగన్= గంగను; తెచ్చెన్ = తీసికొని వచ్చాడు.

**తాత్పర్యం:** ప్రసిద్ధ పౌరుషంతో దేవతలను గురించి తపస్సుచేసి వారిని మెప్పించి సాగరుల భస్మరాసులపై ప్రవహింపచేసి, వారిని ముక్తులను చేయటం కొరకు భూలోకంలోకి గంగను తెచ్చినవాడు భగీరథుడు.

**విశేషం:** దైవము - పౌరుషము అని రెండున్నాయి. పౌరుషమంటే ఉత్సాహంతో మనిషి చేసే దృఢమైన ప్రయత్నం. దానికి ప్రతీక భగీరథుడు. అందుకే ఇప్పటికీ భగీరథ యత్నమన్న మాటను సామెతగా వాడుతున్నాం.

సగరుని కొడుకులు సాగరులు అరవైవేల మంది. వారు కపిలుడి కోపాగ్నికి గురి అయ్యారు. సగరుడికి మరొక భార్యకు జన్మించినవాడు అంశుమంతుడు. అతడు గంగను తేలేకపోగా అతని కొడుకు దిలీపుడు ప్రయత్నించి మరణిస్తే అతని కొడుకు భగీరథుడు బ్రహ్మను గురించి వేయేండ్లు తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై వరంకోరుకొమ్మంటే గంగ భూమికి ముందుగా బ్రహ్మ నుండి బయలుదేరి ఆకాశం మీదకు వ్యాపించి అక్కడి నుండి సూర్యమండలం ద్వారా మేరుపర్వతంపైకి దూకింది. అక్కడ నుండి నాలుగు పాయలుగా చీలి నాలుగు దిక్కులకు ప్రవహించింది. ఆ నాలుగు దిశలకు పారిన గంగకు నాలుగు పేర్లు;

అలకనంద : ఇది హిమాలయంమీదుగా భారతదేశంలో ప్రవహించిన పాయ - దక్షిణం

సీత : గంధమాదన పర్వతంమీదుగా భద్రేశ్వర దేశాలకు పారిన పాయ - తూర్పు.

సుచక్షువు : మాల్యవంతం మీదుగా కేతుమాల దేశాలలో ప్రవహించిన పాయ - పడమర.

విష్ణుభద్ర : ఉత్తర కురుభూములలో పారే పాయ - ఉత్తరదిశ.

ఈ మేరుపర్వతం భూచక్రాని కిరుసుగా మధ్యలో ఉంటుందని పురాణాలు చెప్పినమాట.

**ఆ. విష్ణుపదము వలన, విధుని వలన, సూర్యు । వలన, మేరురూపకలితుఁ డైన**
**విష్ణువలనఁ, ద్రిపుర విజయి మౌళివలన । నుండి హిమనగమున నొలసె గంగ. 118**

**ప్రతిపదార్థం:** విష్ణుపదము= ఆకాశం; వలనన్= ద్వారా, నుండి; విధునివలనన్= చంద్రుడివలన; సూర్యువలనన్= సూర్యుడినుండి; మేరు రూప కలితుఁడు= మేరు పర్వత స్వరూపుడైన; విష్ణువలనన్= విష్ణుదేవుడివలన; త్రిపురవిజయి= మూడు నగరాలను జయించినవాడు శివుడు (అతడి); మౌళివలనన్= జటాజూటంనుండి; హిమనగమునన్= మంచుకొండపై; గంగ; ఒలసెన్= ప్రవహించింది.

**తాత్పర్యం:** ఆకాశంనుండి చంద్రుడిమీదికి, అతడినుండి సూర్యుడిమీదికి, అతడినుండి మేరుపర్వత స్వరూపుడైన విష్ణువు వద్దకు, అక్కడినుండి శివుడి శిరస్సుమీదకు, అక్కడి నుండి హిమాలయపర్వతం మీదకు గంగ ప్రవహించింది.

**క. విను, తత్పర భావంబున । మనంబు నిశ్చలత వొంద మనుజుఁడు శరణం**
**బని యాశ్రయింప జాహ్నవి । సనాతన పదోపలబ్ధి సంపద నొసఁగున్.' 119**

**ప్రతిపదార్థం:** విను= వినుము; తత్పర భావంబునన్= భక్తిభావంతో; మనంబు= మనస్సు; నిశ్చలత పొందన్= నిశ్చలత్వం పొందగా; మనుజుఁడు= మనుష్యుడు; శరణంబు+అని= దిక్కని; ఆశ్రయింపన్= ఆశ్రయిస్తే; జాహ్నవి= గంగ; సనాతన= నిత్యమైన; పద= స్థానంయొక్క; ఉపలబ్ధి= లాభమన్న; సంపదన్= ఐశ్వర్యాన్ని; ఒసఁగున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** వినుము. తాత్పర్య బుద్ధితో ఎవరైతే నిశ్చలమైన మనస్సుతో శరణని ఆశ్రయిస్తారో వారి జన్మను తరింపచేసి గంగ వారి స్వస్థానమైన ముక్తి నిస్తుంది.'

**వ. అని చెప్పి సిద్ధుండు, వెండియు. 120**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; చెప్పి; సిద్ధుండు= సిద్ధపురుషుడు; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** అని చెప్పి సిద్ధుడు ఇంకా (ఇట్లా చెప్పాడు)

**క. ఏ నెఱిఁగినంత సెప్పితిఁ గాని యనంత మహిమంబు గంగా గుణ సం**
**తానంబు, శతానందము । ఖానిమిష ప్రవరకీర్త్య మనఘచరిత్రా! 121**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపంలేని; చరిత్ర!= ప్రవర్తన కలవాడా!; ఏను= నేను; ఎఱిఁగినంత= తెలిసినంత; చెప్పితిన్= చెప్పాను; కాని; గంగా గుణ సంతానంబు= గంగాదేవి గుణ సమూహం; అనంత= విశాలమైన; మహిమంబు= మహత్త్వం కలది; శతానంద= బ్రహ్మ; ముఖ= మొదలైన; అనిమిష= దేవతలలో; ప్రవర= శ్రేష్ఠులచేత; కీర్త్యము= స్తుతించదగింది.

**తాత్పర్యం:** నాకు తెలిసినంత చెప్పాను. కానీ, నాయనా! ఆ తల్లి గుణగణాలు మాహాత్మ్యం బ్రహ్మాదులచేత స్తుతింప తగినదంటే ఇక మానవుల సంగతి వేరే చెప్పాలా?

**క. మేరువు మణులును, వారిధి । వారి కణంబులును నెన్ను వడు వగు గంగా**

**స్ఫారగుణంబులు తగు సం । ఖ్యారూఢంబులుగఁ జేఁత యతులవివేకా! 122**

**ప్రతిపదార్థం:** అతుల= సాటిలేని; వివేకా!= వివేకం కలవాడా!; గంగా= గంగాదేవియొక్క; స్ఫారగుణంబులు= దివ్యగుణాలు; తగు= తగిన; సంఖ్యారూఢంబులుగన్= లెక్కపెట్టెడి; చేఁత= చేష్ట; మేరువు మణులను= మేరుపర్వతంలోని రత్నాలను; వారిధి= సముద్రంలోని; వారి= నీటి యొక్క; కణంబులును= బొట్లను; ఎన్ను= లెక్కపెట్టే; వడువు+అగున్= పద్ధతిగా ఉంటుంది.

**తాత్పర్యం:** సాటిలేని వివేకం కలవాడా! గంగ దివ్యగుణాలను వ్రేలు మడిచి ఇన్ని - ఇది అని చెప్పటం ఎట్లాంటిదంటే - మేరుపర్వతంలోని రత్నాలను, సముద్రంలోని నీటి బొట్లను లెక్కపెట్టటంవంటి అవివేకపు పనే అవుతుంది.

**వ. అని పలికి యిట్లనియె. 123**

**తాత్పర్యం:** అని ఈ విధంగా చెప్పి ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** అంటే అతడి కెంత చెప్పినా తనివితీరటం లేదని తాత్పర్యం. గంగ అంటే ఈ భారతీయ సంస్కృతిలో ఎట్లాంటిదో కవి తన ఆర్ష (ఋషిసంబంధమైన) నేత్రంతో దివ్యదర్శనంతో చెప్పేమాట. ఈ భావాన్ని వ్యక్తీకరించే వచనపు ముక్కలు 120,123.

లండను ప్రక్కనున్న థేమ్సు నదిలోని నీటిని ఓడపై భారతదేశానికి తెస్తే పురుగు పట్టిందట! ఇక్కడకు వచ్చేలోపల. కానీ గంగనీటిని లండను తీసికొని వెళ్తే పురుగు పట్టలేదట! హిమాలయాలలో - ఎన్నో ఓషధులను కరిగించుకొంటూ మహర్షుల, సిద్ధుల, మునుల, యోగుల, పవిత్ర శరీరాల తపస్సుల శక్తిని సంగ్రహించుకొని ప్రవహించేది గంగ. గంగ వట్టి నది మాత్రమే కాదని మన విశ్వాసం. పరమహంస శ్రీరామకృష్ణవంటి మహాత్ములెప్పుడూ తమ శిష్యులకు ఈ మాటనే చెప్పేవారట! ఒక్కసారి స్నానంచేస్తే చాలురా పాపాలన్నీ పటాపంచలౌతాయని అనేవారట! ఈమాట మొదట శ్రీస్వామి వివేకానందవంటి తర్కబుద్ధికలవారికి రుచించలేదు కాని, తరువాత ఆ మాటలలోని సత్యాన్ని వారు గ్రహించారట!

**ఆ. వేడ్క నీకు నేను వివరించినట్టి యీ । జాహ్నవీ గుణములు, సంతతంబు**

**మనసు, వాక్కుఁ దనువు ననఁగల సాధన । ముల భజింపు భక్తిపూర్వకముగ. 124**

**ప్రతిపదార్థం:** వేడ్కన్= కోరికతో కావాలని; నీకున్; నేను; వివరించినట్టి= విడమరచి చెప్పిన; ఈ జాహ్నవీ గుణములు= ఈ గంగా గుణాలు; సంతతంబున్= నిత్యము, ఎడతెగకుండా; మనసు; వాక్కున్; తనువున్= శరీరం; అనన్= అనగా; కల= ఉన్న; సాధనములన్= కర్మసాధనాలతో; భక్తిపూర్వకముగన్= భక్తి శ్రద్ధలతో; భజింపు= సేవించుము.

**తాత్పర్యం:** సంతోషంగా నేను నీకు వివరించిన ఈ గంగాగుణాలు ఎల్లప్పుడూ మనోవాక్కాయములనే సాధనాలతో భక్తిపూర్వకంగా కొలువుము.

**విశేషం:** మనిషికి ఏ పనిచేయటానికైనా మూడే సాధనములు ఉన్నాయి. శరీరం, వాక్కు, మనస్సు. ఈ మూటిని కలిపి ఒకటిగా చేయటమే త్రికరణ పారిశుద్ధ్యం. ఒక టనుకొని మనస్సులో మరొకటి చెప్పి, ఇంకొకటి చేసే నాగరికత ఈనాటిది.

మనిషి మనిషి కాకుండా పోవటానికి ఈ త్రికరణ పరిశుద్ధి, త్రికరణ సమైక్యం లేకపోవటమే కారణం. ఆ మూటిని ఏకం చేసే సాధన పవిత్ర ఉపాయమే ఇట్లాంటివి వినటం, చదవటం. భారతాదులవలన మనకు కలిగే ప్రయోజన మిదే నని నన్నయ, తిక్కనలు తమ అవతారికలలో చెప్పారు. మరీ నన్నయగారు భారత శ్రవణ ఫలితం చాలా చెప్పారు. కనుక కథంటే త్రికరణ పారిశుద్ధ్యం కొరకు వినేదే అది కలిగించేదే కథంటే - కాబట్టి నీవూ గంగను సేవించి ధన్యుడ వౌతావు.

**తే. అట్టులైన గంగా ప్రసాదాతిశయము । వలన సిద్ధుండవై, త్రిభువనములందు**
**నర్చనీయ సంక్రీడన మవిహతముగ । సంచరించు మాహాత్మ్యంబు సంభవించు. 125**

**ప్రతిపదార్థం:** అట్టులు+ఐనన్= పైన చెప్పిన మాటలు పాటిస్తే - త్రికరణ పరిశుద్ధితో గంగను సేవిస్తే; గంగా ప్రసాద+అతిశయము వలనన్= గంగయొక్క అధికమైన దయ వలన; సిద్ధుండవు+ఐ= నెరవేరిన కోరికలు కలవాడవై; త్రి= మూడు; భువనములందున్= లోకాలలో; అర్చనీయ= సేవించదగిన; సం= చక్కని; క్రీడనము= విహారం; అవిహతముగన్= ఎదురు లేనిదికాగా; సంచరించు= తిరిగే; మాహాత్మ్యంబు= ప్రభావం; సంభవించున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** అట్లా చేస్తే గంగ దయవలన నీవూ సిద్ధపురుషుడ వౌతావు. మూడులోకాలలో నీ విహారాలకు అడ్డుండదు. నీకు ఎదురు లేని సంచార మార్గం - మాహాత్మ్యం లభిస్తుంది.

**క. నిజధర్మ నిరతుఁడై తను । భజించు సజ్జనుని చిత్తపద్మము గృపఁ దా**
**భజియింప గంగ యతనిం । బ్రజనిత చిరసౌఖ్యుఁ జేయుఁ బావనచరితా!' 126**

**ప్రతిపదార్థం:** పావనచరితా= పవిత్రమైన నడవడిగల ధర్మజా! నిజధర్మ నిరతుఁడు+ఐ= స్వధర్మంలో ఆసక్తిగలవాడై; తనున్= తన్ను; భజించు= సేవించే; సత్+జనునిన్= సత్పురుషుని; చిత్తపద్మము= తన హృదయమనే పద్మం; తాన్= తాను; కృపన్= దయను; భజియింపన్= సేవించగా, పొందగా; గంగ= గంగాదేవి; అతనిన్= తన్ను భజించే సత్పురుషుణ్ణి; ప్రజనిత= కల్గించబడిన; చిర సౌఖ్యున్= శాశ్వతసుఖాలు గలవాడిని; చేయున్= చేస్తుంది;

**తాత్పర్యం:** పావనమైన నడవడిగల ధర్మజా! స్వధర్మాచరణంలో ఆసక్తిగల్గిన సత్పురుషుడు తనని సేవించగా గంగ తనహృదయ పద్మం దయను హత్తుకొనగా అతణ్ణి శాశ్వతసుఖవంతుణ్ణి చేస్తుంది.

**విశేషం:** ఈ పద్యంలో అన్వయక్లేశముంది. చిత్త పద్మం సజ్జనుడిదైతే అర్థం పొసగదు. గంగాదేవిదైతే కుదురుతుంది. అప్పుడు "సజ్జనునిఁ జిత్తపద్మము" అని ఖండబిందువుంచి రచనను సరిదిద్దాలి. ఉస్మానియా ప్రతిలో ఈ పద్యం యొక్క మూడవచరణం" భరియింప" అని ఉండగా వావిళ్లవారి భారతప్రతిలో "భరియించి" అని వుంది. అప్పుడు ఈ పద్యానికి తాత్పర్యాన్నిలా పొసగించవచ్చు. స్వధర్మనిరతుడై తనను భజించే సత్పురుషుడి యొక్క చిత్తపద్మాన్ని కృపతో తాను భజించి గంగ అతణ్ణి ప్రజనితచిర సౌఖ్యుణ్ణి చేస్తుంది. భజియించి అనే క్రియా పదానికి ప్రకరగోచితంగా "అనుగ్రహించి" ఇత్యాదిగ అర్థం చెప్పాలి. "యే యథా మాం ప్రపద్యన్తే.

**వ. అని యిట్లు గంగా గుణంబు లమ్మహాద్విజునకు వివరించి యా సిద్ధుండు గగన గమనంబునం జనియె; అ విప్రోత్తముండు నియతచిత్తుండై గంగాసేవనం బాచరించి యనన్యసులభ యగు సిద్ధింబడసెఁ; బాండ వాగ్రజా! నీవును గంగా భజనంబునం బరమశుభంబు నొందుము.' 127**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ విధంగా; గంగాగుణంబులు= గంగ గుణాలు; ఆ+మహాద్విజునకున్= ఆ గొప్ప బ్రాహ్మణుడికి; వివరించి= తెలియజెప్పి; ఆ సిద్ధుండు= ఆ యోగి; గగన= ఆకాశంలో; గమనంబునన్= నడకతో, ప్రయాణంతో; చనియెన్= వెళ్ళాడు; ఆ+విప్ర+ఉత్తముండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; నియత= నియమబద్ధమైన; చిత్తుండు+ఐ= మనస్సు కలవాడై; గంగాసేవనంబు= గంగాసేవ; ఆ+చరించి= చక్కగా చేసి; అనన్య= సాటిలేని; సులభఅగు= తేలికఅయిన; సిద్ధిన్= ఫలాన్ని; పడసెన్= పొందాడు; పాండవ+అగ్రజా!= పాండవులలో పెద్దవాడా!; నీవునున్= నీవున్నూ; గంగా భజనంబునన్= గంగను సేవించటంవలన; పరమ= శ్రేష్ఠమైన; శుభంబును= శ్రేయస్సును; ఒందుము= పొందుము.

**తాత్పర్యం:** అని ఈ విధంగా సవిస్తరంగా ఆ మహాబ్రాహ్మణుడికి ఆ సిద్ధుడు వివరించి ఆయన ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు. ఆ బ్రాహ్మణుడు కూడా ఆ విధంగా నిష్ఠాపరుడై గంగను సేవించి ఇతర మార్గంలో సులభంగా దొరకని సిద్ధిని పొందాడు. ధర్మరాజా! నీవు కూడా గంగాసేవతో శుభాలు పొందుము.'

**విశేషం:** ఇంతగా గంగను గురించి చెప్పవలసిన అగత్య మేమిటి? అంటే వేదవాఙ్మయంలో ఇట్లా చెప్పబడింది. "సృష్టికారణమైన జలం పేరే గంగ. భగీరథుడి ద్వారా భూమికి రావటమంటే భావరూపమైన భగవచ్ఛక్తి సృష్టిగా వికసించటమే. ఈ సృష్టి ఐదు అంచెలుగా వచ్చింది. కనుకనే సృష్టికి ప్ర+పంచ= ఐదు కలదని పేరు వచ్చింది. పంచ సింధూనదులంటే సృష్టి ఐదంచెల మీదుగా వచ్చిన విషయాన్ని సూచిస్తుంది'' కనుకనే గంగకు ఒక మూర్తి ఉన్నది. ఆ వర్ణన పురాణాల ప్రకారం ఇట్లా ఉన్నది.

"రత్నపాదుకలు కలది. మకరవాహనం కలదీ, తెల్లని వెన్నెలవంటి శరీరం కలది'' అని ఈ రూపంలో గంగను ఆరాధించాలని పురాణాలు చెప్పుతున్నాయి.

అన్ని పురాణాలు గంగావతరణమును కీర్తించాయి. మహాబలిపురం కొండపై ఈ కథ చెక్కబడింది. ప్రపంచంలో అదొక అపూర్వ శిల్పం. ప్రాచీన భరతనాట్యంలో ఈ గంగావతరణ కథ అభినయించబడేది. దాని విషయం నందికేశ్వరుడు వ్రాసిన భరతార్ణవంలో ఉన్నది. ప్రభావతీప్రద్యుమ్న మన్న కావ్యంలో నటకు లీకథ నభినయించినట్లు పింగళి సూరన్న వర్ణించాడు.

**క. అని చెప్పి, శాంతనవుఁ డి । ట్లను ; 'గంగాస్తోత్ర సహితమై పరఁగిన యి**
**వ్వినుతేతిహాసముఁ బఠిం । చిన వినినను రుజలు వాయుఁ జెంద వఘంబుల్.' 128**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= సిద్ధుడు చెప్పిన కథనంతా పూసగ్రుచ్చినట్లు చెప్పి; శాంతనవుఁడు= శంతను కుమారుడైన భీష్ముడు; గంగాస్తోత్రసహితముఐ= గంగాస్తుతితో కూడినదై; పరఁగిన= ఒప్పిన; ఈ+వినుత= ఈ వినుతించదగిన, పొగడదగిన; ఇతిహాసమున్= పురాణకథ; పఠించినన్= చదివినా; వినినను= విన్నా; రుజలు= రోగాలు; పాయున్= తొలగుతాయి; అఘంబుల్= పాపాలు; చెందవు= పొందవు.

**తాత్పర్యం:** భీష్ముడు కథంతా చెప్పి ఇట్లా అన్నాడు. 'ధర్మరాజా! గంగాదేవి స్తోత్రంతో కూడిన ఈ పురాణ కథను చదివినా, విన్నా రోగాలు పోవటమే కాదు, పాపాలు కూడా పోతాయి.'

**విశేషం:** పురాణాలలో కథ చెప్పిన ఫలితం, ప్రయోజనమూ చెప్పటం జరుగుతుంది. ఇది అట్లాంటి పద్యం. కథ దీనితో ముగుస్తుంది.

**క. అనిన విని, యన్నరేంద్రుం । డనుజ సహితముగఁ బ్రభూతహర్ష సమున్మీ**
**లన కలనా సంవేశిత । మనస్కుఁడై యాతనికి నమస్కృతి సేసెన్. 129**

**ప్రతిపదార్థం:** అనినన్= భీష్ముడట్లా చెప్పగా; విని= ఆలకించి; ఆ+నర+ఇంద్రుండు= ఆ రాజు; అనుజ సహితముగన్= తమ్ములతోపాటుగా; ప్రభూత= అధికమైన; హర్ష= సంతోషంతో; సమున్మీలన= బాగుగా వికసించిన, వికాసంతో; కలనా= కూడిక; సంవేశిత= స్థానంగా చేయబడిన; మనస్కుఁడు+ఐ= మనస్సు కలవాడై; ఆతనికిన్= ఆ భీష్మునికి; నమస్కృతి= నమస్కారం; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** చెప్పినదంతా విని ధర్మరాజు సంతోషంతో వికసించిన మనస్సు కలవాడై తమ్ములతోపాటుగా భీష్మునికి నమస్కరించాడు.

**విశేషం:** ఆ సంస్కృత సమాసం - భీష్మునిమీద ధర్మరాజుకు కలిగిన భక్తియొక్క ఆవేశాన్ని సూచిస్తున్నది, ధ్వనిస్తున్నది. దీనికి కారణం భీష్ము డంత అందంగా గంగా మహిమను గానంచేయటం. ఈ సంతోషం పాఠకుడు పొందే అనుభవాన్ని సూచిస్తుంది.

**వ. ఇట్లు పరమహర్షంబునం బ్రణతుండై, ధర్మజుండు మందాకినీ తనయుతో 'నెవ్వరు సర్వ జనపూజ్యు? లెఱింగింపవే? భవద్వచనామృతంబునఁ దృప్తి సనక యడిగెద' ననిన, నమ్మహాత్ముండు 'వాసుదేవ నారద సంవాదంబను నితిహాసంబు వినుము; నీ యడిగిన యర్థంబు దానం దేటపడియెడు' నని పలికి యతని కిట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారం; పరమ= గొప్ప; హర్షంబునన్= సంతోషంతో; ప్ర+నతుండై= నమస్కరించి; ధర్మజుండు= ధర్మనందనుండు (యముడికి ధర్ముడని పేరు); మందాకినీ తనయుతోన్= గంగ కుమారుడితో; ఎవ్వరు= ఎవరు; సర్వజన= అందరికీ; పూజ్యులు= పూజించదగినవారు; ఎఱింగింపవు+ఏ= తెలుపవా?; భవత్= నీ; వచనామృతంబునన్= మాటలన్న అమృతంతో; తృప్తి= సంతృప్తి; చనక= తీరక; అడిగెదన్= అడుగుతున్నాను; అనినన్= అనగా; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; వాసుదేవ= శ్రీకృష్ణ; నారద= నారదుల; సంవాదంబు= సంభాషణం; అను= అన్న; ఇతిహాసంబు= పురాణ గాథ; వినుము; నీ అడిగిన= నీవు అడిగిన; అర్థంబు= తాత్పర్యం; దానన్= దానితో; తేటపడియెడున్= స్పష్టపడుతుంది; అని పలికి= అని వచించి; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆయనతో ఈ రీతి వచించాడు.

**తాత్పర్యం:** అట్లా సంతోషంతో నమస్కరించి యమధర్మరాజు కుమారుడు గంగా తనయుడిని అడిగాడు. 'నీ మాటలనే అమృతం త్రాగి తృప్తితీరక అడుగుతున్నాను. లోకంలో అందరకూ పూజనీయు లెవ్వరో చెప్పుము' అని అడిగితే భీష్ముడు 'నీ వడిగిన ప్రశ్నకు సమాధానంగా వాసుదేవ నారద సంవాద మనే పురాణగాథ చెప్పుతాను వినుము' అని చెప్పుతున్నాడు.

## వాసుదేవ నారద సంవాద ప్రకారము (సం.13-66-1 (కుంభ))

**వ. 'తన కడకు నారదుఁడు వ । చ్చిన సత్కారము దగంగఁ జేసి, ముకుందుం**
**డను సమధిక బహుమానం । బున 'నెవ్వారలకు నీవు మ్రొక్కుదు చెపుమా!' 131**

**ప్రతిపదార్థం:** ముకుందుండు= శ్రీకృష్ణుడు (మోక్ష మిచ్చేవాడు); తనకడకున్= తన దగ్గరకు; నారదుఁడు; వచ్చినన్=రాగా; సత్కారము= అతిథి సపర్యలు; తగంగన్= తగినట్లుగా; చేసి; సమధిక= మిక్కిలి ఎక్కువ; బహుమానంబునన్= గౌరవంతో; ఏ+వారలకున్= ఎవరికి; నీవు; మ్రొక్కుదు= నమస్కరిస్తావో; చెపుమా!= చెప్పుము; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** ఒకసారి నారదమహర్షి విష్ణుదేవుడి దగ్గరకు రాగా ఆయన సత్కారం చేసి ప్రశ్నించాడు. "నీవు మిక్కిలి గౌరవంతో ఎవరికి నమస్కరిస్తావో చెప్పుము" అని.

**విశేషం:** నమస్కారమంటే వినయంతో వంగి, గౌరవబుద్ధితో, హృదయపూర్వకంగా, అహంకారం లేశమాత్రం లేకుండా దండం పెట్టడం. ఆ దండంలో నేను, అన్న పదార్థమంతా లీనం కావాలి. దానిని నమస్కారమంటారు. ఇది అందరకూ చేతనయ్యేది కాదు.

**వ. అనిన నద్దేవముని యద్దేవకీనందనున కిట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** ఆ+దేవముని= నారదుడు; ఆ+దేవకీ నందననకున్= దేవకీ కుమారుడితో; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని నారదుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'వరుణు, సమీరణుఁ, దరణిఁ, బర్జన్యుని, । సప్తార్చి, నీశాను, షణ్ముఖుని, మ**
**హాలక్ష్మి విష్ణుని, నజు, బృహస్పతిఁ, జంద్రు । జలముల, భూమి, నెజ్జనము లెపుడు**
**నతిభక్తి సేవింతు రట్టి వారలకు నే । మ్రొక్కుదు; వేదపరులుఁ, దపోధ**
**నులు, దేవతా పూజనులు, భూమి ధన ధాన్య । గోదాన శీలురు, నాదరంబు**

**ఆ. గల్గి యతిథిపూజ గావించువారలుఁ । బితృసమర్చకులును, భిక్షితాన్న**
**పూత శాంత భావములు గలవారు స । త్యవ్రతులును బూజ్యు లనఘ! నాకు. 133**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యశాలీ!; వరుణున్= సముద్రములకు పశ్చిమదిక్కున అధిపతిని; సమీరణున్= వాయుదేవుడిని; తరణిన్= సూర్యుడిని; పర్జన్యునిన్= మేఘుడిని; సప్తార్చిన్= అగ్నినీ; ఈశానున్= ఈశాన్య దిక్కున ఉండే దేవతను; షణ్ముఖునిన్= కుమారస్వామిని; మహాలక్ష్మిన్= లక్ష్మీదేవిని; విష్ణునిన్; అజున్= బ్రహ్మను; బృహస్పతిన్= దేవతాగురువును; చంద్రున్; జలములన్= నీటిని; భూమిన్= భూమినీ; ఏ+జనములు= ఏ మానవులు; ఎప్పుడున్= నిత్యమూ; అతి= మిక్కిలి; భక్తిన్= భక్తితో; సేవింతురు= పూజిస్తారో; అట్టివారలకున్= అట్లాంటి వారికి; నేన్= నేను; మ్రొక్కుదున్= నమస్కరిస్తాను; వేదపరులున్= వేదం నిత్యం చదివేవారు; తపోధనులు= తపస్సే సంపదగా కలవారు; దేవతాపూజనులు= దేవతలను పూజించేవారు; భూమి= భూమినీ; ధన= డబ్బును; ధాన్య= పంటను; గో= ఆవులను; దాన= దానం చేసే; శీలురు= స్వభావం కలవారు; ఆదరంబు కల్గి= ఆదరంతో; అతిథిపూజన్= అతిథుల పూజను; కావించువారలున్= చేసేవారు; పితృ= తండ్రిని; సమర్చకులున్= పూజించేవారు; భిక్షిత+అన్నమున్= బిచ్చమడిగి తెచ్చిన అన్నంతో; పూత= పవిత్రమైన; శాంత= ఉద్రేకాలు లేని; భావములు= మనస్సులు కలవారు; సత్యవ్రతులును= నిజం మాట్లాడే స్వభావం కలవారు; నాకున్= నాకు; పూజ్యులు= పూజించ దగ్గవారు.

**తాత్పర్యం:** వరుణుడినీ, వాయువునూ, సూర్యుడినీ, మేఘుడినీ, అగ్నినీ, ఈశానుడినీ, కుమారస్వామినీ, మహాలక్ష్మినీ, విష్ణువునూ, బ్రహ్మనూ, బృహస్పతినీ, చంద్రుడినీ, నీటినీ, భూమినీ ఎవరు పూజిస్తారో వారిని నేను భక్తితో సేవిస్తాను. వేదవేత్తలు, తపోధనులు, దేవతలను పూజించేవారు, ధన ధాన్యభూములను, గోవులను దానం చేసేవారు, అతిథిపూజ చేసేవారు, పితృదేవతలను పూజించేవారు, భిక్షాన్నంతో తృప్తిపడే శాంతస్వభావులు, సత్యవ్రతులు - నాకు పూజ్యులు.

క. వినుత త్రివర్గనిరతులు, । ననహంకార మమకారులగు జనులు, సువ
ర్తన యుతులు, నలోలురు, బో । ధనులు, నమస్కార్యు లద్రిధర! విను నాకున్. 134

**ప్రతిపదార్థం:** అద్రి ధర!= (గోవర్ధనమన్న) కొండను మోసినవాడా!; విను; నాకున్= నాకు; నమస్కార్యులు= నమస్కరించ తగ్గవారు (ఈ క్రింద చెప్పినవారు); వినుత= స్తుతింపదగ్గ; త్రివర్గ= ధర్మ, అర్థ, కామాలు; నిరతులు= నిత్యం సేవించేవారు; న+అహంకార= నే నన్న భావం లేనివారు; న+మమకారులు= వ్యామోహం లేనివారు; అగు= అయిన; జనులు= మానవులు; సు= మంచి; వర్తన= ప్రవర్తనతో; యుతులు= కూడినవారు; అలోలురు= ఆసక్తి లేనివారు; బోధనులు= జ్ఞానం కలవారు.

**తాత్పర్యం:** ధర్మార్థ కామసేవనులు, అహంకార మమకారాలు లేనివారు, వ్యామోహం లేనివారు, సత్ప్రవర్తన కలవారు, జ్ఞానులు నాకు నమస్కరించ తగినవారు.

క. నీవును, మత్సంపూజ్య జ । నావలిఁ జిత్తమున నెఱిఁగి, యర్చనమును, సం
సేవనము, నడుప భూరి శు । భావహ మగు నవ్విధంబు యాదవసింహా! 135

**ప్రతిపదార్థం:** యాదవ సింహా!= యదువంశ శ్రేష్ఠుడా!; నీవును= నీవూ; మత్= నా చేత; సం= బాగా; పూజ్య= పూజింపదగిన; జన+ఆవలిన్= మానవ సమూహాన్ని; చిత్తమునన్= మనస్సులో; ఎఱిఁగి= తెలిసి; అర్చనము= పూజ; సంసేవనము= సేవించటం; నడుపన్= నడిపితే; ఆ+విధంబు= ఆ పద్ధతి; భూరి= మిక్కిలి; శుభ= మేలు; ఆవహము+అగున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** కృష్ణా! నీవున్నూ నేనూ పూజించేవారిని మనస్సులో తెలిసికొని పూజిస్తూ సేవిస్తూ ప్రవర్తిస్తే శుభం కలుగుతుంది.

క. అనియెం గావునఁ గుంతీ । తనయాగ్రజ! నీవు నివ్విధముల జనములం
గొనియాడుము, వారలు శో । భనము లొసంగుదు రఘంబుఁ బాపుదురు కృపన్.' 136

**ప్రతిపదార్థం:** అనియెన్+కావునన్= అన్నాడు కాబట్టి; కుంతీ తనయ+అగ్రజ!= కుంతీ కుమారులలో పెద్దవాడా!; నీవున్= నీవూ; ఈ+విధములన్= ఈ రీతిగా; జనములన్= మనుషులను; కొనియాడుము= స్తుతించుము; వారలు= వారు; శోభనములు=శుభాలు; ఒసంగుదురు= ఇస్తారు; అఘంబున్= పాపాలను; కృపన్= దయతో; పాపుదురు= పోగొట్టుతారు.

**తాత్పర్యం:** అన్నాడు కనుక ధర్మరాజా! నీవూ అదే విధంగా మనుజులను సేవించుము. వారు నీకు మేలు కలిగిస్తారు. పాపాలను పోగొట్టగలరు. వారి దయను పొందుము'

వ. అనిన విని యమ్మహీశ్వరుం డమ్మహితాత్మున కిట్లనియె. 137

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా ఆలించి; ఆ+మహీ= భూమికి; ఈశ్వరుండు= ప్రభువు; ఆ+మహిత+ఆత్మునకున్= ఆ మహానుభావుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు.

క. 'జనపతులకుఁ గర్తవ్యము । లనేకములు గలవు వానియన్నిటిలోనన్;
వినుత ప్రధానకృత్యం । బనఘచరిత ! చెప్పవే దయం దెలియంగన్.' 138

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యమైన; చరిత!=ప్రవర్తన కలవాడా!; జనపతులకున్= జనులయొక్క అధిపతులకు; కర్తవ్యములు= చేయతగిన పనులు; అనేకములు= చాలా; కలవు; వాని అన్నిటిలోనన్= వాటన్నింటిలో; వినుత= మెచ్చదగిన; ప్రధాన= ముఖ్య; కర్తవ్యంబు= పని; దయన్= దయతో; తెలియంగన్= తెలిసేటట్లు; చెప్పవే!= చెప్పవా?

**తాత్పర్యం:** 'రాజులు చేయవలసిన పను లనేకం ఉన్నాయి. అందులో మహత్తరమైన ముఖ్యమైన పని ఏదో దయతో చెప్పుము.'

**క. అనుటయు నతనికి నతఁడి । ట్లను; 'సామ్రాజ్యాభిషిక్తుఁడైన నృపతికిన్**
**విను, కర్తవ్యతమం బగు । పని, బ్రాహ్మణపూజనంబు భవ్యవిచారా! 139**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; అతనికిన్= ధర్మరాజుతో; అతఁడు= భీష్ముడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; భవ్య= శ్రేష్ఠమైన; విచార!= ఆలోచన కలవాడా!; సామ్రాజ్య+అభిషిక్తుఁడు+ఐన= మహారాజ్యానికి అభిషేకం చేయబడిన; నృపతికిన్= రాజుకు; కర్తవ్యతమంబు+అగు పని= మిక్కిలి తప్పక చేయతగిన పని; బ్రాహ్మణ= బ్రాహ్మణులను; పూజనంబు= పూజించటం.

**తాత్పర్యం:** అని అడుగగా ధర్మరాజుతో భీష్మ డిట్లా అన్నాడు. 'రాజు రాజ్యాని కభిషేకం చేసికొన్న తరువాత చేయతగిన ముఖ్యమైన పని బ్రాహ్మణపూజ! మంచి ఆలోచన కలవాడా! వినుము.

**క. భూనాథ! విప్రులు సమా । ధానంబున నున్నఁ బొదలు ధరణి, శుభమ్ముల్**
**మానార్హు లగుట, వారికి । మానన లేకున్న నడఁగు మనుజాధీశా! 140**

**ప్రతిపదార్థం:** భూ= భూమికి; నాథా!= రాజా; విప్రులు= బ్రాహ్మణులు, సమ+ఆధానంబునన్= సమతా దృష్టితో, ప్రశాంత చిత్తంతో; ఉన్నన్= ఉంటే; ధరణిన్= లోకంలో; శుభమ్ముల్= శుభాలు; పొదలున్= ఎక్కువౌతాయి; మాన= గౌరవానికి; అర్హులు+అగుటన్= తగినవారు కావడం వల్ల; వారికిన్= వాళ్ళకు; మానన= మన్నన; లేకున్నన్= లేకపోతే; అడఁగున్= లోకంలో శుభాలు అణగిపోతాయి.

**తాత్పర్యం:** రాజా! విప్రులు సమాధానపడితే (రాజులు వారితో స్నేహం కలిగి ఉంటే) లోకానికి మేలు. వారు గౌరవించదగినవారు కనుక వారికి మన్నన లోపిస్తే లోకాలకు మేలు లేదు.

**క. దైవంబు నదైవముగ, న । దైవము దైవముగఁ జేయ ధరణీదివిజుల్**
**భూవర! శక్తులు విను వా । రేవానికిఁ గూర్తు రతఁ డధీశత నొందున్. 141**

**ప్రతిపదార్థం:** భూవర!= భూమికి నాథుడా!, రాజా!; దైవంబున్= దైవాన్ని; అదైవముగన్= దయ్యంగా; అదైవమున్= దయ్యాన్ని; దైవముగన్= దైవంగా; చేయన్= చేయటానికి; ధరణీదివిజుల్= భూదేవులు; బ్రాహ్మణులుః శక్తులు= సమర్థులు; విను= వినుము; వారు= ఆ విప్రులు; ఏ వానికిన్= ఎవడికి; కూర్తురో= ప్రేమకలిగి ఉంటారో; అతఁడు= అతడు; అధీశతన్= ఆధిపత్యాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** విప్రులు దైవాన్ని అదైవంగా, అదైవాన్ని దైవంగా చేయటానికి సమర్థులు. వా రెవరిపై ప్రేమకలిగి ఉంటారో వారు రాజ్యానికి అధిపతులు కాగలరు.

క. కోపమునఁ, బ్రసాదంబున, । నాపదయును,సంపదయును, నప్పుడ తే వా
రోపుదు రింద్రునకైనను; । శాపానుగ్రహము లా సుచరితుల లీలల్. 142

**ప్రతిపదార్థం:** వారు= బ్రాహ్మణులు; కోపమునన్= కోపంతో; ప్రసాదంబునన్= దయతో; ఆపదయును= ఆపదను; సంపదయును= ఐశ్వర్యాన్ని; అప్పుడు+అ= వెంటనే; తేన్= తెచ్చుటకు; వారు+ఓపుదురు= సమర్థులగుదురు; ఆ సుచరితుల= ఆ మంచి నడవడి కల వారియొక్క; లీలల్= క్రీడలు; ఇంద్రునకున్+ఐనన్= దేవతల రాజునకైనా; శాప+అనుగ్రహములు= శాపము, వరములు. (అగును)

**తాత్పర్యం:** వారు ఇంద్రుడికైనా కోపంతో ఆపదలు కలిగించగలరు. దయ తలిస్తే సంపదను సృష్టించగలరు. శాపానుగ్రహ సమర్థులు విప్రులు.

క. ద్రవిడ కళింగ గాశీనర । యవన శక పుళింద నృపతు లవని సురపరా
భవమునఁ గాదే, ధరణీ । ధవ! పొందిరి తొల్లి శూద్రతా దైన్యంబున్. 143

**ప్రతిపదార్థం:** ధరణీ ధవ!= భూమికి నాథుడా!; ద్రవిడ= ద్రావిడ దేశం - (తమిళ దేశం); కళింగ= త్రికళింగము (ఉత్తర కళింగం - నేటి ఒరిస్సా, మధ్యకళింగం - కృష్ణా గోదావరి నదీమధ్య దేశం; దక్షిణకళింగం - కృష్ణ మధ్యదిక్కున ఉన్న ప్రాంతం); ఆశీనర= ఉత్తర భారతంలో ఒక ప్రాంతం; యవన= గ్రీసుదేశం; శక పుళింద= శకులు, పుళిందులు అనే జాతివారున్న దేశాలయొక్క; నృపతులు= రాజులు; అవనిసుర= భూ దేవతల; పరాభవమునన్= అవమానంచేతనే; కాదే!= కాదా!; శూద్రతాదైన్యంబున్= శూద్రజాతులయొక్క హీనత్వం; తొల్లి= పూర్వం; పొందిరి= పొందారు.

**తాత్పర్యం:** ద్రవిడాది దేశాధిపతులు బ్రాహ్మణావమానంచేతనే హీనమైన శూద్రత్వం పాలైనారు కదా!

క. సోమాత్మకు లీశ్వరతా । శ్రీమహితులు, సర్వసౌఖ్య సిద్ధి కరులు, గో
త్రామరులు, వారి నెప్పుడు । భూమీశ్వర! పూజనములఁ బోషింపు తగన్. 144

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ్వర!= రాజా!; గోత్రా= భూమియందు; అమరులు= దేవతలు, బ్రాహ్మణులు; సోమాత్మకులు= చంద్రుడు ఆత్మగా కలవారు సౌమ్యులు; ఈశ్వరతాశ్రీ= ఐశ్వర్యంతో; మహితులు= గొప్పవారు; సర్వసౌఖ్య= అన్ని సుఖాలను; సిద్ధికరులు= సిద్ధింప చేసేవారు; వారిన్= ఆ బ్రాహ్మణులను; ఎప్పుడున్= నిత్యమూ; పూజనములన్= పూజలతో; తగన్= చక్కగా; పోషింపు= పోషించుము.

**తాత్పర్యం:** రాజా! విప్రులు చంద్రుడే ఆత్మగా కలవారు, ఐశ్వర్యం కలవారు, సర్వసౌఖ్యాలను సిద్ధింపచేసేవారు. వారి నెల్లప్పుడూ పూజలతో తనుపుము.

క. వినుతాచారుం డగు వి । ప్రునకు, సభక్తికము గాఁగ, భోజన మిడినన్
విను, దేవపితృ సమూహము । లనూనపరితృప్తిఁ బొందు నతులచరిత్రా!' 145

**ప్రతిపదార్థం:** అతుల= సాటిలేని; చరిత్రా!= కీర్తికలవాడా!; విను= వినుము; వినుత= సన్నుతమైన, పొగడదగిన; ఆచారుండు= ఆచారము కలవాడు, సదాచార సంపన్నుడు; అగు= అయిన; విప్రునకున్= బ్రాహ్మణుడికి; సభక్తికముగాఁగన్= భక్తితోపాటుగా,

భక్తిపూర్వకంగా; భోజనము+ఇడినన్= అన్నం పెట్టితే; దేవ= దేవతల; పిత్ర= పితృదేవతల; సమూహములు= గుంపు; అనూన= అధికమైన; పరితృప్తిన్= మిక్కిలి సంతృప్తిని; పొందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** పదిమంది పొగడే చరిత్ర కలవాడా! వినుము. సదాచార సంపన్నుడైన బ్రాహ్మణుడికి భక్తితో అన్నం పెట్టితే దేవతలు, పితృదేవతలు మిక్కిలిగా సంతృప్తి పడతారయ్యా!'

**విశేషం:** పితృదేవతలు= వంశకర్తలు. కులంలో పుట్టి పోయిన పెద్దలు. దేవతలు= అగ్ని మొదలైనవారు.

### వాసుదేవ పృథివీ సంవాద ప్రకారము (సం.13-66-1 (కుంభ))

**వ. అని చెప్పి భీష్ముం డా భూపతితో వెండియు నిట్లను; 'భూసుర విషయంబై వాసుదేవునకుం బృథివికి సంవాదంబు గలిగె; నది యితిహాస రూపంబునఁ జెల్లు; దానిఁ జెప్పెద నాకర్ణింపుము. వాసుదేవుం డొక్కసమయంబునం బృథ్వి నాలోకించి. 146**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; భీష్ముండు= దేవవ్రతుడు; ఆ భూపతితోన్= రాజుతో; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పాడు; భూసుర విషయంబు+ఐ= బ్రాహ్మణులకు సంబంధించినట్టిదై; వాసుదేవునకున్= విష్ణునకు; పృథివికిన్= భూదేవికి; సంవాదంబు= సంభాషణం; కలిగెన్= కల్గినది; అది= ఆ సంభాషణం; ఇతిహాసరూపంబునన్= కథారూపంగా; చెల్లున్= వ్యాప్తిపొందింది; దానిన్; చెప్పెదన్= తెల్పెదను; ఆకర్ణింపుము= వినుము; వాసుదేవుండు= మహావిష్ణువు; ఒక్క సమయంబునన్= ఒకా నొక వేళ; పృథ్విన్= భూదేవతను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి భీష్మ డింకా ధర్మరాజుతో ఇట్లా అంటున్నాడు. 'ఒకసారి భగవంతుడైన నారాయణుడికీ, భూదేవికీ ఒక సంభాషణం జరిగింది. అది పురాణంగా లోకంలో వ్యాపించింది. దానిని చెప్పుతాను వినుము. అది బ్రాహ్మణ సంబంధమైనది. ప్రస్తుత సందర్భానికి సరిపోతుంది. వాసుదేవుడు ఒకసారి భూదేవిని చూచి.

**క. లోకజనని వగుటన్ నిను । నోకాశ్యపి ! యడుగవలయు నొక్కటి దెలియన్**
**నాకుం జెపుమా ! పాపము । లే కృత్యము సేసి గెలుతు రెల్ల జనములున్.' 147**

**ప్రతిపదార్థం:** ఓ కాశ్యపి= ఓ భూదేవి!; లోకజననివి= లోకాలను కన్న తల్లివి; అగుటన్= అయినందువలన; నినున్= నిన్ను; ఒక్కటి= ఒక విషయం; తెలియన్= తెలిసికొనటానికి; అడుగన్ వలయున్= అడగాల్సి ఉన్నది; పాపంబులు= పాపాలు; ఏకృత్యము= ఏ పని; చేసి= ఆచరించి; ఎల్లజనములున్= మనుష్యులంతా; గెలుతురు= గెలుస్తారో; నాకున్= నాకు; చెపుమా= చెప్పవలయును.

**తాత్పర్యం:** భూదేవీ! నీవు లోకజననివి కనుక అడుగుతున్నాను. లోకంలో మనుష్యులు ఏ పని చేస్తే పాపాలు పోతాయో నాకు చెప్పుము. వినాలని ఉన్నది.

**ఆ. అనినఁ బృథివి యిట్టులను; 'విప్రసేవను; విప్రపూజనమున, విప్రహిత వి**
**ధానమునను, బాపతతి నోర్చు, మానవ । ప్రతతి, యెందు నివి నృపాలు పనులు. 148**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పృథివి= భూమి; ఇట్టులు+అనున్= ఇట్లా అంటుంది; విప్ర= బ్రాహ్మణుల; సేవను= సేవతో; విప్ర పూజనమునన్= బ్రాహ్మణ పూజతో; విప్రహితవిధానమునను= విప్రులకు మేలుకూర్చే పద్ధతులవల్లనూ; మానవ ప్రతతి=

మానవ సమూహం; పాపతతిన్=పాపాల సమూహాన్ని; ఓర్చున్= జయిస్తుంది; ఎందున్= ఎక్కడైనా; ఇవి= ఇవే; నృపాలు పనులు= రాజులు చేయదగిన పనులు.

**తాత్పర్యం:** అనగా భూమి ఇట్లా అంటున్నది. ఎప్పుడైనాసరే ఏమరక బ్రాహ్మణులను సేవించటంవల్లా, పూజించటం వల్లా, వారికి శుభాలు కలిగించే విధానాలతో మానవులు పాపాలను సహించుకొనగలరు. ఇదే రాజులకు హితమైన మార్గం.

**ఆ. అమరవిభుని, భగసహస్ర చిహ్నునిఁ గాఁగఁ । జేసినదియు, నేత్రభాసురుండు**
**గా నొనర్చినదియుఁ, । గమలాక్ష! విప్రున । ల్కయుఁ బ్రసాద సంపదయును గావె!' 149**

**ప్రతిపదార్థం:** అమరవిభుని= దేవతల నాయకుడు ఇంద్రుడిని; భగసహస్ర చిహ్నునిన్= వేయి యోనులు గుర్తులు కలవాడిని; కాఁగన్= అగునట్లు; చేసినదియున్= చేసింది; నేత్ర= కళ్ళచే; భాసురుండు= ప్రకాశించేవాడు; కాన్= అగునట్లు; ఒనర్చినదియున్ చేసింది; కమల+అక్ష!= పద్మాలవంటి నేత్రాలు కలవాడా!; విప్రు= బ్రాహ్మణుడియొక్క; అల్కయున్= కోపమూ; ప్రసాద సంపదయున్= అనుగ్రహ సమృద్ధియూ; కావె!= కారణములు కావా?

**తాత్పర్యం:** దేవేంద్రుడి శరీరం వేల యోని చిహ్నాలు కలదిగా చేసింది విప్రుని అలుకయే కదా! ఆ గుర్తులనే నేత్రాలుగా ఇతరులకు కనిపించేటట్లు చేసిందీ ఆ బ్రాహ్మణుడి దయయే కదా!'

**విశేషం:** అహల్యను కామించినప్పుడు గౌతమమహర్షి కోపించి ఇంద్రుడిని శపించి మరలా దయతలచి ఆ యోనుల్ని నేత్రాలుగా కనిపించేటట్లు చేశాడు. ఈ రెండు చర్యలకు ఆయన శాపానుగ్రహాలే కారణం.

**క. అనిన విని మెచ్చి, పృథివిం । గొనియాడె రథాంగ పాణి గురునృపవర! నీ**
**వనిశంబు మిగులనుతిమ । న్ననలను విప్రులకుఁ బ్రియ మొనర్పుము కృపతోన్. 150**

**ప్రతిపదార్థం:** కురు నృపవర= కురువంశంలో రాజ శ్రేష్ఠుడా!; రథ+అంగపాణి= చక్రమే ఆయుధంగా చేతిలో ఉన్నవాడు విష్ణువు; అనినన్ విని= ఆ విధంగా భూమి చెప్పగా విని; మెచ్చి= మెచ్చుకొని; పృథివిన్= భూమిని; కొనియాడెన్= పొగడాడు; నీవున్= ధర్మరాజా! నీవు; అనిశంబున్= ఎల్లప్పుడు; మిగులన్= ఎక్కువగా; నుతి= పొగడ్త; మన్ననలన్= గౌరవంతో; విప్రులకున్= బ్రాహ్మణులకు; కృపతోన్= దయతో; ప్రియము= ప్రేమ; ఒనర్పుము= చేయుము.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పగా మెచ్చుకొని చక్రపాణి భూదేవిని పొగడినాడు. కనుక ధర్మరాజా! నీవూ అట్లాగే బ్రాహ్మణులను గౌరవిస్తూ సేవిస్తూ వారికి ప్రియము చేయుము.

**క. అని మఱియు శాంతనవుఁ డి । ట్లను 'జననంబునన విప్రు నధిప! మహా భా**
**గునిఁగాఁ జెప్పుదు రార్యులు । జనులకు వంద్యంబు లతని చరణాంబుజముల్. 151**

**ప్రతిపదార్థం:** అని= చెప్పి; మఱియున్= ఇంకా; శాంతనవుఁడు= శంతనుడి కుమారుడు భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; జననంబునన= పుట్టుకతోనే; విప్రున్= బ్రాహ్మణుడిని; అధిప!= రాజా!; మహాభాగునిన్+కాన్= మహానుభావుడిగా; ఆర్యులు= పెద్దలు; చెప్పుదురు= చెప్తుతారు; అతని= బ్రాహ్మణుడి; చరణాంబుజముల్= పాదపద్మాలు; జనులకున్=మనుష్యులకు; వంద్యంబులు= నమస్కరింపతగినవి.

**తాత్పర్యం:** అని చెప్పి శాంతనవు డింకా ఇట్లా అంటున్నాడు. 'పుట్టుకతోనే బ్రాహ్మణుడు మహానుభావుడని పెద్దలంటారు. అతడి పాదపద్మాలు అందరూ పూజించతగినవి.

**వ. బ్రాహ్మణుల సృజియించి బ్రహ్మ వారలతోఁ జెప్పిన విధం బాకర్ణింపుము. 152**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణులన్= విప్రులను; సృజియించి= సృష్టించి; బ్రహ్మ= సృష్టికర్త; వారలతోన్= వారితో; చెప్పిన విధంబు= నుడివిన తీరు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు బ్రాహ్మణులను సృష్టించి, వారితో చెప్పిన పద్ధతి వినుము.

**ఆ. 'అరయ మీకుఁ గృత్య మన్యంబు లే; దాత్మ। కర్మ మూఁది యుక్తధర్మనిరతి**
**బ్రహ్మగోపనంబుఁ బాటింపుఁ డవ్విధ। మధిక శోభనంబు నావహించు. 153**

**ప్రతిపదార్థం:** అరయన్= విచారిస్తే; మీకున్; అన్యంబు= మరొక; కృత్యము= పని లేదు; ఆత్మకర్మము= మీ జాతికి విధించబడిన ఆధ్యాత్మిక ధర్మం; ఊఁది= ఆధారంగా చేసికొని; యుక్త= తగిన; ధర్మనిరతిన్= నిత్యం ధర్మబద్ధతతో; బ్రహ్మ గోపనంబున్= ఆత్మతత్త్వ రక్షణను; పాటింపుఁడు= అనుసరించండి; ఆ+విధము= ఆ పద్ధతి; అధిక= మిక్కిలి; శోభనంబున్= శుభాన్ని; ఆవహించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఆత్మోపాసనమే మీరు చేయతగినది. అన్య ధర్మం లేదు. నిత్యం ధర్మబుద్ధితో పరబ్రహ్మను రక్షించుకొంటూ ప్రవర్తించండి. ఆ విధం మీకు మంచి శుభాలను కలిగిస్తుంది.

**విశేషం:** విప్ర= శబ్దంలో; వి- ప్ర రెండక్షరాలూ శ్రేష్ఠ అన్న అర్థం కలిగించేవి. మహాశ్రేష్ఠుడని ఆ శబ్దార్థం. బ్రాహ్మణ అంటే బ్రహ్మమునందు నిత్యాను సంధానం కలవాడు. బ్రాహ్మణములన్న వేదశాఖ యున్నది. వేదమంత్రాలతో యజ్ఞ కర్మ లెట్లా చేయాలో చెప్పేవి. ఉపనిషత్తులు జ్ఞాన యోగ ప్రతిపాదకాలు. బ్రాహ్మణాలు కర్మ ప్రధానాలు, యజ్ఞవిషయకాలు. ఉపనిషత్తులు జ్ఞానప్రధానాలని ఒక వివరణ ఉన్నది. బ్రాహ్మణులు బ్రాహ్మణాల ప్రకారం యజ్ఞం చేయించే పురోహితులు; విప్రుడంటే దైవ - ఆత్మ దర్శనం కలవాడని (SEER) అర్థం. కనుక ఈ శబ్దాలు జాతి, గుణ వాచకాలు తప్ప కుల బోధకాలు కావని నేటి పండిత సంప్రదాయం.

**వ. బ్రాహ్మణ్యం బెల్ల వర్ణంబులకుం దారకంబు బ్రాహ్మియైన శ్రీఁ దపస్స్వాధ్యాయంబుల వెలుంగంజేయుం డనియె; నట్లు గావున రాజులకు బ్రహ్మ వచన పరిపాలనంబు ప్రధాన కర్తవ్యం బని చెప్పి వెండియు. 154**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ్యంబు= బ్రాహ్మణవర్ణం; వర్ణంబులకున్= కులాలకు; తారకంబు= తరింపచేసేది; బ్రాహ్మిఐన శ్రీన్= బ్రాహ్మణులయందున్న బ్రహ్మ సంబంధమైన శక్తితో; తపః= తపస్సు; స్వాధ్యాయంబులన్= వేదాధ్యయనాదులను; వెలుంగన్= ప్రకాశించేటట్లు, లోకాలకు వ్యాపించేటట్లు; చేయుండు+అనియెన్= చేయండని పల్కినాడు; కావునన్= కాబట్టి; రాజులకున్= ప్రభువులకు; బ్రహ్మవచన= బ్రహ్మదేవుడిమాట; పరిపాలనంబు= ఆచరించటం; ప్రధాన= ముఖ్యమైన; కర్తవ్యంబు= చేయతగినపని.

**తాత్పర్యం:** బ్రాహ్మణవర్ణం మిగిలిన వర్ణాలకు తారకం కనుక మీయందున్న ఆధ్యాత్మిక శక్తితో వేదాధ్యయనాదుల ఫలాన్ని లోకాలలో వ్యాపించేటట్లు చేయండి - అని బ్రహ్మ అన్నాడు. కాబట్టి బ్రహ్మ మాటను పాటించటం

రాజులకు ముఖ్య కర్తవ్యం' అని చెప్పి ఇంకా.

**ఆ. అగ్ని నంట, హిమవదచలంబుఁ గదలుప । గంగఁ గట్టవచ్చుఁ గాని, విప్ర**
**రాజిఁ బరిభవింపరాదు; విప్రుల కొల్వు । కల్పవృక్ష సేవకరణి యధిప! 155**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అగ్ని= నిప్పును; అంటన్‌వచ్చున్= తాకవచ్చు; హిమవత్+అచలంబున్= మంచుకొండను; కదలుపన్‌వచ్చున్= కదల్చవచ్చు; గంగన్= నీటిని; కట్టన్ వచ్చున్= మూటకట్టవచ్చును; కాని; విప్రరాజిన్= బ్రాహ్మణ సమూహాన్ని; పరిభవింపన్ రాదు= అవమానించ కూడదు; విప్రుల కొల్వు= బ్రాహ్మణసేవ; కల్పవృక్షసేవ కరణి= కల్పవృక్షాన్ని పూజించటం వంటిది.

**తాత్పర్యం:** నిప్పును తాకవచ్చును, హిమాలయాన్ని కదలించవచ్చును, గంగను మూటకట్టవచ్చును, కాని విప్రులను అవమానించరాదు. విప్రసేవ కల్పవృక్ష సేవ వలె ఫలదాయకం.

**విశేషం:** అలం: ఉపమ. కల్పవృక్షం= కోర్కెలు తీర్చే దేవతా వృక్షం.

**వ. ఏ తద్విషయంబైనది శక్రశంబర సంవాదంబను నితిహాసంబు గలదు వినుము. శక్రుండు జటాసురనందనుండైన శంబరు కడకుంబోయి తదీయ గోష్ఠి నుండి, యతనితో, 'నీ వేమిట నున్నతిం బొంది యుందు?' వనిన నతం డతని కిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** ఏ తత్ విషయంబు+ఐనది= దీనికి సంబంధించినది; శక్ర= ఇంద్ర; శంబర= ఆ పేరు గల రాక్షసునియొక్క; సంవాదంబు= సంభాషణ; అను; ఇతిహాసంబు= పురాణ గాథ; కలదు= ఉన్నది; వినుము= ఆలింపుము; జటా+అసుర= జడలుకలవాడు కనుక ఆ పేరుతో ప్రకాశించు; వాని యొక్క; నందనుండు+ఐన= కుమారుడైన; శంబరు కడకున్+పోయి= శంబరుడి చెంతకు వెళ్ళి; తదీయ గోష్ఠిన్+ఉండి= అతడితో చర్చిస్తూ ఉండి; అతనితోన్= ఆ శంబరుడితో; నీవు; ఏమిటన్= ఏ కారణంవల్ల; ఉన్నతిన్; పొంది+ఉందువు= గొప్పతనాన్ని వహించి ఉన్నావు; అనినన్= అని అడుగగా; అతండు= శంబరుడు; అతనికిన్= ఇంద్రుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దీనికి సంబంధించిన కథ ఒకటి ఉన్నది. ఇంద్రుడికీ జటాసురుడి కొడుకు శంబరుడికీ మధ్య నడచిన సంభాషణ. ఒకసారి ఇంద్రుడు శంబరుడి దగ్గరకు పోయి 'నీ వీ ఉన్నతి పొందటానికి కారణమేమి?' టని అడిగితే అత డన్నాడు.

**క. 'అలుకయు, నసూయయును, వి । ప్రులయెడ లే వనఘ! వారిఁ బ్రోతుం గాతున్**
**సొలయఁ దదీయారాధన । ముల కట్టులు గావునన్ విభూతి వహింతున్. 157**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విప్రులయెడన్= బ్రాహ్మణులయందు; అలుకయున్= కోపం; అసూయయును= ద్వేషం; లేవు; వారిన్= వారిని; ప్రోతున్= పోషిస్తాను; కాతున్= కాపాడుతాను; తదీయ= వారియొక్క; ఆరాధనములకున్= పూజలకు; సొలయన్= అలసిపోను; అట్టులుకావునన్= అందుచేత; విభూతిన్= ఐశ్వర్యాన్ని; వహింతున్= పొందుతాను.

**తాత్పర్యం:** 'నాకు బ్రాహ్మణులపై కోపం, ద్వేషం లేకపోగా వారిసేవలో నేను విసిగిపోను. అలసిపోను. అందుకే నాకీ ఉన్నతి కలిగింది.

**వ. దేవాసుర యుద్ధంబున విప్రానుగ్రహంబు దేవతల గెలిపించుట గని, మజ్జనకుండు సోమునితో 'భూమిసురులు మహానుభావులుగదే!' యనుటయు నమ్మహితాత్ముం డతని కిట్లను 'వారలు తపస్స్వాధ్యాయ సిద్ధులై యుండుదురు. వారితెఱం గాకర్ణింపుము. 158**

**ప్రతిపదార్థం:** దేవ= దేవతల యొక్క; అసుర= రాక్షసుల యొక్క; యుద్ధంబునన్= యుద్ధంలో; విప్ర+అనుగ్రహంబు= విప్రుల దయ; దేవతలన్= దేవతలను; గెలిపించుట= గెలిపించటం; కని= చూచి; మత్= నా; జనకుండు= తండ్రి; సోమునితోన్= చంద్రుడితో; భూమిసురులు= బ్రాహ్మణులు; మహానుభావులు కదే!= మహాత్ములు కదా!; అనుటయున్= అనగా; ఆ మహిత+ఆత్ముండు= ఆ మహానుభావుడు; అతనికిన్= అతడితో; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; వారలు= వారు; తపః= తపస్సు; స్వ+అధ్యాయ= (తమ జాతికి విధించబడిన) వేద అధ్యయనం; సిద్ధులు+ఐ= సిద్ధించినవారై; ఉండుదురు= ఉంటారు; వారి తెఱంగు= వారి విధానం; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** దేవతలకు రాక్షసులకు జరిగిన సంగ్రామంలో బ్రాహ్మణుల దయతో దేవతలు గెలిచారు. కనుక వారు మహానుభావులు కదా! అని నా తండ్రి చంద్రుడితో అంటే ఆయన అన్నాడు 'వారు తపస్సు నందు వేదాధ్యయనమునందు సిద్ధులు కనుక వారి విషయం చెప్పుతాను వినుము'.

**ఆ. 'అప్రవాసి యైన యవనీసురుని యుద్ధ । శాలి గాని ధరణిపాలు నురగ**
**ముల బిలాంధకారమున నడంచిన యట్లు । మెఱయనీక భూమి మ్రింగు నండ్రు. 159**

**ప్రతిపదార్థం:** అప్రవాసిఐన= దూరదేశంపోని; అవనీసురునిన్= బ్రాహ్మణుడిని; యుద్ధశాలికాని= యుద్ధం చేయలేని; ధరణిపాలున్= రాజును; ఉరగములన్= పాపములను; బిల= బొక్కల; అంధకారమునన్= చీకటిలో; ఆడంచినఅట్లు= చంపినట్లు; మెఱయనీక= ప్రకాశింపనీయక; భూమి= నేలతల్లి; మ్రింగును= కబళిస్తుంది; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** విద్యార్జనకై దూరదేశం పోని బ్రాహ్మణుడిని, యుద్ధవిద్యావేత్త కాని రాజును కీర్తిపొందనివ్వక భూదేవి కబళిస్తుందంటారు. ఎట్లాగంటే పాములను బొక్కలలోనే చంపినట్లు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. దాని నెఱింగి, గృహంబున, । మానిత మగు చదువునందు మనసు గొలుప కెం**
**దేనిఁ జని చదువుదురు శ్రుతు । లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్. 160**

**ప్రతిపదార్థం:** దానిన్= పై దృష్టాంతం; ఎఱింగి= తెలిసి; గృహంబునన్= ఇంట్లో; మానితము+అగు= గౌరవించతగిన; చదువునందున్= విద్యలో; మనసు కొలుపక= మనస్సును పెట్టక; విప్రులు; ఎందేనిన్= ఎక్కడికైనా; చని= వెళ్ళి; చదువుదురు= చదువుకొంటారు; శ్రుతులు= వేదాలు; ఆనంత్యమునకున్= జీవిత చరమ దశలో; తపస్వులు= తపస్సు చేసుకొనేవారు; అగుదురు= ఔతారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు పై దృష్టాంతం తెలిసి, ఇంట్లో విద్య ఉన్నా లేదని బయట దూరదేశాలకు పోయి వేదాలు చదువుకొని చివరకు తపస్సు చేస్తారు. ఇది బ్రాహ్మణ కర్మ.

**వ. కావున వారలు సర్వాధికులు; వారల యెడ బహుమానావమానంబు లెట్టివారికి శుభాశుభంబుల నొందించుటకు సందియంబు లే 'దనిన సోముని వాక్యంబులు పాటించి మజ్జనకుండు విప్రజనంబులం బూజించి తేజిష్ణుం డయ్యె; నేనుం దదాచారంబునం బెంపువడసితి' నని పలుకుటయు నయ్యసురేంద్రుని వచనంబు లూఁది, సురేంద్రుండు భూసురులకుం బరితోషంబు గావించి సవిశేష సమున్నతిం బొందె 'నని చెప్పిన విని గాంగేయునితోఁ గౌంతేయాగ్రజుం 'డపూర్వ చిరసమాశ్రిత దూరాగతులలోన, నధికతమం బగు పాత్రం బెవ్వ?' రని యడిగిన, నప్పుడమిఱేనికి నప్పురుషవరుం డిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; వారలు= విప్రులు; సర్వ+అధికులు= అందరికంటె గొప్పవారు; వారల+ఎడన్= వారి విషయంలో; బహుమాన= గౌరవం; అవమానంబులు= అగౌరవాలు; ఎట్టివారికిన్= ఎంతటివారికైనా; శుభ+అశుభంబులను= మేలు కీళ్ళను; ఒందించుటకున్= పొందించటానికి; సందియంబు లేదు= సందేహం లేదు; అనిన= అని పల్కిన; సోముని= చంద్రుడి; వాక్యంబులు= మాటలు; పాటించి= అనుసరించి; మత్= నా; జనకుండు= తండ్రి; విప్రజనంబులన్+పూజించి= బ్రాహ్మణులను పూజించి, తేజిష్ణుండు= తేజోవంతుడు; అయ్యెన్= అయినాడు; నేనున్= నేనుకూడా; తత్= ఆ; ఆచారంబునన్= ఆచారంతో; పెంపు= ఆధిక్యం; పడసితిన్= పొందాను; అనిపల్కుటయున్= అని పలుకగా; ఆ+అసుర+ఇంద్రుని= ఆ రాక్షస రాజుయొక్క; వచనంబులు= మాటలు; ఊఁది= పట్టుకొని; సుర+ఇంద్రుండు= దేవరాజు; భూ+సురులకున్= బ్రాహ్మణులకు; పరితోషంబు= సంతోషం; కావించి= చేసి; సవిశేష= విశేషమైన; సమున్నతిన్= ఔన్నత్యాన్ని; పొందెన్+అని; చెప్పినన్ విని; గాంగేయునితోన్= గంగా పుత్రుడితో; కౌంతేయ+అగ్రజుండు= కుంతి కుమారులలో పెద్దవాడు ధర్మరాజు; అపూర్వ చిరసమాశ్రిత దూర+ఆగతులలోనన్= క్రొత్తవారు, చాలాకాలం నుండి తన్నాశ్రయించిఉన్నవారు, దూరప్రాంతాలనుండి వచ్చినవారిలో; అధికతమంబు= మిక్కిలి గొప్ప; అగు; పాత్రంబు= యోగ్యుడు; ఎవ్వరు+అని+అడిగినన్; ఆ పుడమి ఱేనికిన్= ఆ మహీవల్లభునికి, ధర్మజునకు; ఆ పురుషవరుండు= పురుష శ్రేష్ఠుడు - భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తాత్పర్యం:** కాబట్టి వారందరి కంటె గొప్పవారు. వారిని అగౌరవిస్తే కీడూ; గౌరవిస్తే మేలూ జరుగుతాయి. ఇందులో సందేహం లేదన్న చంద్రుడి మాటలు పాటించి మాతండ్రి తేజస్వంతుడయ్యాడు. నేనూ అదే ఆచారం పాటించి ఉన్నతిని పొందాను. ఆ మాటలు విని ఇంద్రుడు కూడా అదే విధంగా చేసి విశిష్టమైన ఉన్నతిని పొందాడు' అని చెప్పితే విని ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు. క్రొత్తవారూ, చాలాకాలం తన్ను ఆశ్రయించి ఉన్నవారు, దూరదేశం నుండి వచ్చినవారూ వీరిలో ఎవరు ఉత్తములు?' అని అడుగగా భీష్మ డంటున్నాడు.

**క. 'చెలులుం జుట్టలు, సంబం । ధులు, ఋత్విజులును, బురోహితులుఁ, దగు పాత్రం**
**బులు, హింసా క్రోధేర్ష్యా । దులు లేని జనంబు లైన దురితవిదూరా! 162**

**ప్రతిపదార్థం:** దురిత= పాపానికి; విదూరా!= చాలా దూరాన ఉన్నవాడా!; చెలులున్= స్నేహితులు; చుట్టలు= చుట్టాలు; సంబంధులు= సంబంధించినవారు, వియ్యమందినవారు; ఋత్విజులునున్= యజ్ఞం చేయించే; బ్రాహ్మణులు; పురోహితులున్= పురోహితులున్నూ; తగు= తగిన; పాత్రంబులు= యోగ్యులు; హింసా= జీవహింస; క్రోధ= కోపం; ఈర్ష్య= అసూయ; ఆదులు= మొదలైనవి; లేని= లేనట్టి; జనంబులు= మనుజులు; ఐనన్= అయితే.

**తాత్పర్యం:** పాపం లేనివాడా! ఈర్ష్య, అసూయ మొదలైనవి లేనివారు అయితే, స్నేహితులు, చుట్టాలు, సంబంధించినవారు, ఋత్విజులు, పురోహితులు తగిన యోగ్యులు.

**విశేషం:** పురః= రాబోయే; హితుడు= హితాన్ని సూచించేవాడు. అతిప్రాచీన కాలంలో పురోహితుడు మన మానవ లోకానికి రాబోయే మంచిచెడులు సూచించేవాడు. అతడు దైవానికీ, లోకానికీ వంతెనగా ఉండి దేవతలకు రాయబారిగా ఉండేవాడట! ధ్యానంలో దేవతలు చెప్పిన విషయాలను లోకానికి చెప్పేవాడట! లోకం ఆ మాటను పాటించి నడుచుకొనేదట. తరువాతి కాలంలో వారు రాజునకు మంత్రులై రాజ్యానికి కలిగే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములైన ఆపదలు తొలగించే వారట! - అని రాజనీతి గ్రంథాలలో చెప్పబడింది.

**క. దూరాగతులు, నపూర్వులుఁ, గౌరవకులముఖ్య! పూజఁ గనుటకు నర్హుల్;**
**సారాచారము విద్యా । గౌరవముం గలుగఁ జూపు కరణీయ మగున్. 163**

**ప్రతిపదార్థం:** కౌరవకుల ముఖ్య!= కురుకులంలో శ్రేష్ఠుడా!; దూర+ఆగతులు= దూరంనుండి వచ్చినవారు; అపూర్వులు= ముందు రానివారు; పూజన్=పూజను; కనుటకున్= పొందటానికి; అర్హుల్= తగినవారు; సార= అర్థవంతమైన; ఆచారము= ఆచరణ, కర్మ; విద్యాగౌరవమున్= గొప్ప విద్యావేత్త అనే మర్యాద; కలుగన్= కలవారయితే; చూపు= దర్శనం; కరణీయము= చేయతగింది; అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** దూరం నుండి వచ్చినవారు ఇంతకుముందు తెలియనివారూ - పూజార్హులెప్పుడౌతారంటే వారు మంచి ఆచారవంతులు, విద్యావంతు లైతే అప్పుడు.

**విశేషం:** చూపు. అన్నచోట కొన్ని ప్రతులలో పూజ అని ఉన్నది. ఈ పాఠమే బాగుంది. అర్థం సులభంగా కుదురుతుంది.

**క. ఈ మూఁడు తెఱంగుల జను । లే మెయిఁ జూచినను నశుచు లేనియుఁ బాత్ర**
**శ్రీ మహితుల నిజభృత్య । స్తోమము జీవనము నడపి చుమ్మీ యీగుల్.' 164**

**ప్రతిపదార్థం:** ఈ; మూఁడు తెఱంగుల జనులు= మూడు రకాల మనుజులు; ఏమెయిన్= ఏ విధంగా; చూచినను= చూచినప్పటికి; అశుచులు= శుచిత్వం లేనివారు; ఏనియున్= అయినా; పాత్రశ్రీ= యోగ్య సంపదచేత; మహితులు+అ= గొప్పవారే; నిజ= తనయొక్క; భృత్య= సేవకుల; స్తోమము= సమూహం; జీవనము= బ్రతుకు; నడపి= గడపి; చుమ్మీ= సుమా; ఈగుల్= దానాలు.

**తాత్పర్యం:** అపూర్వ చిరసమాశ్రిత దూరాగతు లన్న మూడు రకాల జనులు ఏ విధంగా చూచినా అశుచులైనా, దానార్హులే. కాని, ఇందులో ఒక రహస్యమున్నది. నీ సేవకుల బ్రతుకు తెరువు చక్కగా గడపిన తరువాతే దానధర్మాలు చేయాలి సుమా!'

**క. అనిన విని ధర్మసుతుఁ డి । ట్లను శంతనుసుతునితోడ 'నఘకోటికి నె**
**ల్లను మూలము వనితల య । జ్జనముల తెఱఁ గెఱుఁగఁ జెప్పు చాతుర్యనిధీ'! 165**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధర్మసుతుఁడు= యముడి కుమారుడు; శంతను సుతుని తోడన్= శంతనుడి కుమారుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; చాతుర్యనిధీ!= నేర్పు కలవాడా!; అఘ= పాపాల; కోటికిన్= సమూహం; ఎల్లను=

మొత్తానికి; మూలము= వేరు, ప్రధాన కారణం; వనితల= స్త్రీలే; ఆ+జనముల= ఆ స్త్రీల; తెఱఁగు= పద్ధతి; ఎఱుఁగన్= తెలిసేటట్లు; చెప్పు= వివరించుము.

**తాత్పర్యం:** తరువాత ధర్మరాజు మరొక విషయం ప్రశ్నిస్తున్నాడు. 'పాపాలన్నిటికి మూలం స్త్రీలంటారు. వారి సంగతి చెప్పుము. నీవు చెప్పటంలో చాలా నేర్పు కలవాడవు కదా?'

**నారద పంచచూడా సంవాదంబను నితిహాసము (సం.13-38-1)**

**వ. అనుటయు నతం డతని కిట్లనియె; 'అతివలు నీ చెప్పినట్టివార; దీనికి నారద పంచ చూడా సంవాదం బనంబరఁగు నితిహాసంబు గలదు; వనితా స్వభావ విషయంబయి యుండు; దాని నాకర్ణింపుము. దేవ మునివరుం డగు నారదుం డెందునుం జరించుచుండి పంచచూడ యను నచ్చరలేమ నొక్కెడం గాంచి.166**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అతివలు= స్త్రీలు; నీ చెప్పినట్టివారు+అ= నీవెట్లా చెప్పావో అట్లాంటివారే; దీనికిన్; నారద పంచచూడా సంవాదంబు అనన్+పరఁగు; ఇతిహాసంబు= చరిత్ర; కలదు; వనితా= స్త్రీల యొక్క; స్వభావ విషయంబు= స్వభావానికి సంబంధించినది; అయి+ఉండున్= కలదైఉన్నది; దానిన్; ఆకర్ణింపుము= వినుము; దేవముని వరుండు+అగునారదుండు= దేవతాముని శ్రేష్ఠుడైన నారదుడు; (మునులలో దేవతా మునులు, మానవ మునులని భేదమున్నది, నారదుడు దేవముని) ఎందునున్+చరించుచుండి; పంచచూడయను; అచ్చరలేమన్= అప్సరః కాంతను; ఒక్క+ఎడన్= ఒకచోట; కాంచి= చూచి.

**తాత్పర్యం:** అనగా విని భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. 'నీవు చెప్పినట్లే స్త్రీలు అట్లాంటివారే. పూర్వం నారదుడు ఒక అప్సరసను - పంచచూడను చూచి అడిగి తెలుసుకొన్న కథ ఉన్నది. అది స్త్రీల స్వభావాన్ని వ్యాఖ్యానించేది. ఆ కథను చెప్పుతాను వినుము. దేవఋషి శ్రేష్ఠుడైన నారదుడు ఎక్కడెక్కడో తిరుగుతూ ఉండి ఒకచోట పంచచూడ అనే అప్సరసను చూచి.

**విశేషం:** పంచచూడ= అయిదు తలకొప్పులు కలది. ప్రాచీనకాలశిల్పాలలో ఈ కొప్పులు మనం చూడగలం.

**క. 'ఏ నొక్కటి యడిగెదఁ జెపు। మా నళినదళాక్షి'! యనుడు మా కొలఁదుల ప**
**ల్కైన సదుత్తర మిచ్చెద। నానతి యి 'మ్మనియె నది ప్రియం బెసఁగంగన్. 167**

**ప్రతిపదార్థం:** నళిన= తామర పువ్వు; దళ= రేకువంటి; అక్షి!= నేత్రాలు కలదానా!; ఏను= నేను; ఒక్కటి= ఒక సంగతి; అడిగెదన్= ప్రశ్నిస్తాను; చెపుమా= సమాధానం చెప్పుము; అనుడున్= అనగా; అది= ఆ అప్సరస; ప్రియంబు= ప్రేమ, గౌరవం; ఎసఁగంగన్= అతిశయించగా; మా కొలఁదుల= మాకు తగిన; పల్కు= మాట; ఐనన్= అయితే; సత్+ఉత్తరము= సరియైన సమాధానం; ఇచ్చెదన్= ఇస్తాను; ఆనతి ఇమ్ము= ఆనతివ్వండి; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** నారదు డామెతో అంటున్నాడు. 'నళినదళాక్షీ! నే నొకటి అడుగుతాను చెప్పుము' అని అంటే ఆమె అన్నది 'మీ రడిగేమాట మా బోటివాళ్ళకు తెలిసేదయితే తప్పక సమాధాన మిస్తాను' అని భక్తితో అన్నది.

**విశేషం:** అడిగింది దేవముని కనుక 'ప్రియంబెసఁగంగన్' మాకొలఁదుల పల్కు' - అని కవి వ్రాయటం ఆమె భక్తి వినయాలను సూచిస్తాయి.

**వ. అనుటయు నతండు. 168**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనటంతో; అతండు= నారదుడు;

**తాత్పర్యం:** అట్లా అనగా నారదుడు.

**క. 'వనితా స్వభావ మిట్టిది । యని తెలియం జెప్పు 'మనుడు, నల్ల నగుచు న**
**వ్వనిత' తగునయ్య! వనితకు । వనితల దుశ్చేష్టితములు వాక్రువ్వంగన్.' 169**

**ప్రతిపదార్థం:** వనితా= స్త్రీ యొక్క; స్వభావము= సహజమైన లక్షణం; ఇట్టిది= ఇట్లాంటిది; అని; తెలియన్= స్పష్టంగా; చెప్పుము= చెప్పుము; అనుడున్= అంటే; అల్లన్= నెమ్మదిగా; నగుచున్= నవ్వుతూ; ఆ వనిత= ఆ పంచచూడ; వనితల= స్త్రీల; దుస్+చేష్టితములు= చెడ్డచేష్టలు; వనితకున్= స్త్రీకి; వాక్రువ్వంగన్= చెప్పటం; తగున్+అయ్య!= అయ్యా! ఏం న్యాయం?

**తాత్పర్యం:** స్త్రీ స్వభావం ఇట్లాంటిదని చెప్పుము అన్నాడు నారదుడు. ఆమె నవ్వి 'స్త్రీ స్వభావంలో దుర్లక్షణాలను స్త్రీగా నే నెట్లా చెప్పేది? అది న్యాయం కాదు కదా!'

**క. అనిన విని, 'నిక్క మాడిన, । విను, త ప్పించుకయు లేదు; వివరింపు నిజం'**
**బని ముని పల్కిన, నయ్యం । గన యతనికి నిట్టు లనియెఁ గౌరవముఖ్యా! 170**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని= నారదుడు ఆలకించి; నిక్కము= సత్యం; ఆడినన్= చెప్పితే; విను; తప్పు= దోషం; ఇంచుకయున్= కొంచెంకూడా; లేదు; నిజంబున్= సత్యం; వివరింపు= చెప్పుము; అని; ముని= నారదుడు; పల్కినన్= అనగా; ఆ+అంగన= ఆ స్త్రీ; కౌరవముఖ్యా!= కురువంశంలో ముఖ్యమైనవాడా!; అతనికిన్= నారదుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** ధర్మరాజా! పంచచూడ పలికిన మాటలు విని నారదుడు 'నిజం చెప్పితే పాపం ఆవంతకూడా రాదు. నిజం చెప్పుము' అని అన్నాడు. అతడితో ఆమె ఇట్లా అన్నది.

**వ. 'స్త్రీ స్వభావంబులు నీ వెఱుంగని యవి లేవు, ఐనను జెప్పెద నవధరింపుము. 171**

**ప్రతిపదార్థం:** స్త్రీ స్వభావంబులు; నీవు; ఎఱుంగని యవి= తెలియనివి; లేవు; ఐననున్= అయినా; చెప్పెదన్; అవధరింపుము= శ్రద్ధగా వినుము.

**తాత్పర్యం:** స్త్రీల స్వభావాలు నీకు తెలియనివి లేవు. అయినా చెప్పుతాను వినుము.

**విశేషం:** నారదుడిపై నున్న మర్యాదకొరకు అన్నమాట లివి. ఆమె వినయ స్వభావాన్ని తెలుపుతున్నవి.

**క. కులమును, సమ్మాన్యతయును । గలిగి, యొరుని భార్య యైన గౌరవలీలన్**
**మెలఁగుచు వెలిఁ జరియించున్ । లలన వలసినట్ల యే మనం గల దనఘా!' 172**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపం లేనివాడా!; కులమును= సత్కులం; సమ్మాన్యతయును= గౌరవం; కలిగి= ఉండి;

ఒరునిభార్య ఐనన్= మరొకడి భార్య అయినా; గౌరవలీలన్= మర్యాద పద్ధతిగా; మెలఁగుచున్= ప్రవర్తిస్తూ; లలన= స్త్రీ; వలసినట్లు= ఇష్టం వచ్చినట్లు; వెలిన్= బయట; చరియించున్= తిరుగుతుంది; ఏమి+అనన్+కలదు?= అనటాని కేమున్నది?

**తాత్పర్యం:** సత్కులం, గౌరవమర్యాద లుండి మరొకడి భార్య అయి కూడా గౌరవంతో ఉంటూనే బయట తిరుగుళ్ళు తిరుగుతుంది స్త్రీ. ఇంకా అనటాని కేముంది స్వామీ!'

**వ. అని పల్కి వెండియు. 173**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**సీ. 'యోషిజ్జనంబులు దోషంబులకు నెల్ల । మూలంబు; వారల నేల చెప్ప**
**నడిగితి గానఁ గన్నంత సెప్పెద విను, । పురుషులమేలిమి పొలఁతు లెఱుఁగ;**
**రదిగాక నిర్లజ్జలై కుత్సితుల భజి । యింతురు కదిసినయంతఁ జేసి,**
**వర్జనీయులు లేరు వారల కెవ్వరు । దండభీతిన పాడి దప్పకునికి,**

**తే. యగ్ని కాష్ఠముల మహాంబుధి యేఱుల । నంతకుండు భూతసంతతులను**
**వనజముఖులు పురుషులను దృప్తిఁ బొందుట । గలుగదండ్రు కోవిదులు మునీంద్ర! 174**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్ర!= ముని ముఖ్యుడా!; యోషిత్+జనంబులు= స్త్రీలు; దోషంబులకున్+ఎల్లన్= అన్ని తప్పులకు; మూలంబు= స్థానం; వారలను= వారిని గురించి; ఏల చెప్పన్?= చెప్పేదేముంది?; అడిగితికానన్= అడిగావు కనుక; కన్న+అంత= తెలిసినంత; చెప్పెదన్= చెప్పుతాను; విను; పురుషుల= మగవారి; మేలిమి= మంచి; పొలఁతులు= స్త్రీలు; ఎఱుఁగరు= తెలియలేరు; అదిగాక= అంతేకాక; కుత్సితులన్= కుచ్చితం కలవారిని; నిర్+లజ్జలు+ఐ= సిగ్గుమాలినవారై; కదిసిన+అంతన్+చేసి= సమీపించినంత మాత్రంచేత; భజియింతురు= పొందుదురు; వారలకున్= వారికి; ఎవ్వరు= ఎవరు కూడా; వర్జనీయులు= విసర్జింప తగ్గ వారు; లేరు; దండభీతిన= దండనభయంచేతనే; పాడి= న్యాయం; తప్పక= తప్పకుండా; ఉనికి= ఉండటం; కాష్ఠములన్= కట్టెలతో; అగ్ని= నిప్పు; మహా+అంబుధి= పెద్దసముద్రం; ఏఱులన్= ఏర్లతో; భూత= జీవుల; సంతతులను= సమూహంతో; అంతకుండు= మృత్యుదేవత; వనజముఖులు= పద్మంవంటి ముఖం కలవారు-స్త్రీలు; పురుషులను= పురుషులతో; తృప్తిన్+పొందుట= సంతృప్తి చెందటం; కలుగదు= కుదరదు; అని; కోవిదులు= పండితులు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** మునీంద్రా! స్త్రీలు సర్వదోషాలకు మూలం. వారిని గురించి చెప్పటం దేనికి? అడిగావు కనుక తెలిసినంత చెప్పుతాను. పురుషులలోని గొప్పతనం స్త్రీలు గ్రహించలేరు. అంతేకాక సిగ్గులేకుండా దగ్గరకు వచ్చిన కుత్సిత స్వభావులను కూడా వదలిపెట్టరు. శిక్షపడుతుందనే భయం కనుక లేకపోతే వాళ్ళకు పరిత్యజించ తగ్గ వారెవ్వరూ లేరు. ఏ విధంగా నిప్పు కట్టెలతో, సముద్రం నదులతో, మృత్యువు జీవులతో తృప్తి పడదో అదే విధంగా స్త్రీలు పురుషులతో తృప్తి పడరు.

**క. కల దొక రహస్య గోపన । మలఘుమతీ! వినుము పురుషు నన్యుం గనినం**
**బొలఁతులకు, నేమి సెప్పుదుఁ? । గలుగుఁ బదను తోడి కళలు గామగృహమునన్' 175**

**ప్రతిపదార్థం:** అలఘు= గొప్ప; మతీ!= మనస్సు కలవాడా!; ఒక; రహస్యగోపనము= దాచదగిన రహస్యం; కలదు= ఉన్నది; వినుము= జాగ్రత్తగా వినుము; అన్యున్= మరొక (భర్తకాక); పురుషున్= మగవాడిని; కనినన్= చూస్తే; ఏమి చెప్పుదున్= ఏం చెప్పేది; పొలఁతులకున్= స్త్రీలకు; కామగృహమునన్= యోనిలోపల; పదను= తడి; తోడి= తడితో; కళలు= కామ వాంఛలు, కలుగున్= ఏర్పడుతాయి.

**తాత్పర్యం:** మహామనస్వీ! వినుము. ఒక రహస్య మున్నది. బైటకు చెప్పరానిది. అయినా నీకు చెప్తున్నాను. పరపురుషుడిని చూస్తే స్త్రీకి యోని ఆర్ద్రమౌతుంది. ఇం కేం చెప్పేది?

**వ. అని వెండియు. 176**

**తాత్పర్యం:** అని ఇంకా.

**క. 'కుడుచుట, కట్టుట, పూయుట । తొడుగుటయును, వివిధ ధనతతులు గూడుట, యె**
**క్కుడు వేడ్కసేయఁ జాలవు । పడఁతికిఁ బరపురుషుఁ గవయఁబాఱుట వోలెన్.' 177**

**ప్రతిపదార్థం:** పడఁతికిన్= స్త్రీకి; పరపురుషున్= ఇతరుడైన మగవాడిని; కవయన్= పొందటానికి; పాఱుట= పరుగెత్తటం; పోలెన్= వలె; కుడుచుట= తినటం; కట్టుట= వస్త్రధారణం; పూయుట= గంధం మొదలైనవి పూసికొనటం; తొడుగుటయును= నగలు మొదలైనవి ధరించటం; వివిధ= అనేక; ధనతతులు= ధనరాసులు; కూడుట= లభించటం; ఎక్కుడు= ఎక్కువ; వేడ్కన్= సంతోషాన్ని; చేయన్+చాలవు= కలిగించలేవు.

**తాత్పర్యం:** పరపురుషులతో వ్యభిచరించటంమీద ఉన్నంత ప్రీతి స్త్రీకి తినటం, బట్టలు వేసికొనటం, నగలు పెట్టుకొనటం, డబ్బు కూడబెట్టుకొనటం మీద కూడా ఉండదు.

**వ. అని చెప్పిన విని నారదుండు 'నిజంబు పల్కి'తని పంచచూడ ననిపి నిజేచ్ఛం జనియె' నని చెప్పిన విని, ధర్మజుండు 'సుందరీ జనంబులఁ గాచు తెఱం గెఱింగింపవే' యని యడిగిన, నాపగాతనూజుం డతని కిట్లను 'వారు మయశంబరాది మాయలం గడచిన మతకంబులు గలిగి నిరూపింపరాక యుండుదురు; అది యునుం గాక వేఱొక్క విశేషం బాకర్ణింపుము. 178**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్; విని; నారదుండు; నిజంబు పల్కితి+అని= నిజం చెప్పావని; పంచచూడను; అనిపి= పంపి; నిజ+ఇచ్ఛన్= తనకిష్టం వచ్చిన చోటికి; చనియెన్= పోయాడు; అని చెప్పినన్ విని ధర్మజుండు; సుందరీ జనంబులన్= స్త్రీల సమూహాన్ని; కాచు= రక్షించు; తెఱంగు= విధానం; ఎఱింగింపవే= చెప్పవే; అని అడిగినన్= అని అడుగగా; ఆపగా తనూజుండు= గంగానది కొడుకు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనున్; వారు= స్త్రీలు; మయ, శంబర+ఆది= మయుడు, శంబరుడు మొదలైన వారి; మాయలన్= మాయలను; కడచిన= అతిక్రమించిన; మతకంబులు= మాయలు; కలిగి; నిరూపింపన్ రాక= ఇది యని చెప్పటానికి వీలు లేకుండా; ఉండుదురు= ఉంటారు; అదియునుంగాక= అంతేకాక; వేరొక్క విశేషంబు= మరొక్క సంగతి; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని చెప్పగా నారదుడు పంచచూడతో 'చాలా యథార్థం చెప్పా'వని మెచ్చుకొని ఆమెను పంపి తాను ఇష్టం వచ్చిన చోటికి పోయా'డని చెప్పగా ధర్మ రాజన్నాడు. 'ఈ ఆడవాళ్ళను ఎట్లా కాపాడుకొనాలో చెప్పు'మన్నాడు.

దానికి భీష్మ డన్నాడు 'వారు మయశంబరాది రాక్షసుల మాయలకంటె మించిన మాయలు కలవారు. వారి మాయలు ఇట్లాంటి వని నిరూపించటం కష్టం. అదీ కాక మరొక్క విశేషం చెప్పుతాను వినుము.

**తే. తొల్లి నిర్దోషచిత్తత నెల్ల జనులు । వలచినప్పుడ దేవత్వ వైభవంబు**
**నొందఁ జాలి యుండుదురు మాయోపయుక్తి । వనితలకు లేక, సాధ్వులై యునికిఁ జేసి. 179**

**ప్రతిపదార్థం:** వనితలకున్= స్త్రీలకు; మాయా= మాయామర్మాల; ఉపయుక్తిన్= కలిగి ఉండటం; లేక; సాధ్వులై= సాధు స్వభావలై; ఉనికిన్+చేసి= ఉన్నందువలన, తొల్లి= పూర్వం; నిర్దోషచిత్తతన్= దోషం లేని మనస్సుతో; ఎల్లన్ జనులు= మనుషులంతా; వలచినప్పుడు+అ= కావలసినప్పుడే; దేవత్వవైభవంబున్= దివ్యవైభవాన్ని; ఒందన్= పొందగా; చాలి= సమర్థులై; ఉండుదురు= ఉంటారు.

**తాత్పర్యం:** పూర్వం స్త్రీలు సాధువులై పవిత్రలై ఉండేవారు. వారికి మాయా మర్మాలు లేని ఆ రోజులలో పురుషులంతా కావలసినప్పుడు దైవత్వాన్ని పొందేవారు. వారి మనస్సులు పవిత్రంగా ఉండేవి కనుక.

**వ. దానికి దివిజులు అసూయాగ్రస్తులై కమలయోనిం గానం జని నిజచిత్త ప్రకారం బెఱింగించిన, నతం డతివల మాయావతులం గావించి, వారికిఁ గామం బగ్గలంబుగాఁ జేసినం; బురుషులు వారి చిక్కులంబడి రోషాది దుర్గుణ దూషితు లగుటం జేసి విగతానుభావు లైరి; దేవతలును బ్రియం బందిరి; అట్లు గావున. 180**

**ప్రతిపదార్థం:** దానికిన్= పురుషుల కా దైవత్వశక్తి కలగటం వలన; దివిజులు= దేవతలు; అసూయా+గ్రస్తులు= అసూయ భావంతో మ్రింగబడినవారై; కమలయోనిన్= పద్మంలో పుట్టిన బ్రహ్మను; కానన్= చూడటానికి; చని= పోయి; నిజ= తమ; చిత్త= మనస్సులలోని; ప్రకారంబు= ఆలోచన; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= బ్రహ్మ; అతివలను= స్త్రీలను; మాయావతులన్= మాయలు నేర్చిన వారినిగా; కావించి= చేసి; వారికిన్; కామంబు; అగ్గలంబు= ఎక్కువ; చేసినన్= చేయగా; పురుషులు= మగవారు; వారి= స్త్రీల; చిక్కులన్= వలలో; పడి= చిక్కి; రోష+ఆది= రోషం మొదలైన; దుర్గుణ= చెడ్డగుణాలచేత; దూషితులు= కలుషితులు; అగుటన్+చేసి= అయినందువలన; విగత= పోయిన; అనుభావులు= మాహాత్మ్యం కలవారు; ఐరి= ఐనారు; దేవతలును= దేవతలూ; ప్రియంబు= సంతోషం; అందిరి= పొందారు; అట్లు+కావునన్= ఆకారణంవల్ల;

**తాత్పర్యం:** దానికి దేవతలు అసూయపడి బ్రహ్మ దగ్గరకు పోయి తమ మనసులలోని మాట చెప్పగా ఆయన స్త్రీలను మాయలు కలవారినిగా చేసి వారికి కామం హెచ్చుగా కల్గించాడు. దానితో పురుషులు వారి వలలో చిక్కుపడి కోపాది భావాలకు లోనై తమలో ఉన్న ఆ పూర్వపు ప్రభావం పోగొట్టుకొన్నారు. దేవతలు కూడా సంతోషించారు.

**క. వనితలు మాయావిను లై । యనిరూపిత చిత్తవృత్తి నంచిత రక్షం**
**బనువడ కుండుదు; రైనను । వినినది కథయొకటి నీకు వినిపింతుఁ దగన్. 181**

**ప్రతిపదార్థం:** వనితలు= స్త్రీలు; మాయావినులు+ఐ= మాయలు కలవారై; అనిరూపిత= నిరూపించరాని; చిత్తవృత్తిన్= మనస్సులోని తలంపులతో; అంచిత= మంచి; రక్షన్= కట్టుదిట్టాలలో; పనుపడక= లోబడక; ఉండుదురు= ఉంటారు; ఐననున్= అయినప్పటికి; వినినది= నేను విన్నది; కథ+ఒకటి= ఒకకథ; నీకున్; తగన్= చక్కగా; వినిపింతున్= వినిపిస్తాను.

**తాత్పర్యం:** స్త్రీలు మాయలు కలవారు కనుక వారి మనస్సులోని ఆలోచనలు పసికట్టి అరికట్టటం కష్టం. ఐనా నేను విన్న కథ నొకదాన్ని వినిపిస్తాను వినుము.

## దేవశర్మయను మునివరు భార్య రుచి యనుదాని చరిత్రము (సం.13-40-1)

**వ. దేవశర్మ యను మునిభార్య రుచి యను నంగన సర్వాంగ సుందరియై యుండుఁ; దదీయ రూపాతిశయంబు దేవగంధర్వాదులకును లోచనీయంబు. 182**

**ప్రతిపదార్థం:** దేవశర్మ అను ముని భార్య; రుచి= రుచిఅనేపేరుగల (లావణ్యం, కాంతి కలదని అర్థం); అంగన= స్త్రీ; సర్వ+అంగసుందరిఐ= అన్ని అంగాలు అందంగా ఉన్నదై; ఉండున్= ఉన్నది; తదీయ= ఆమెయొక్క; రూప+అతిశయంబు= అందముయొక్క; ఆధిక్యం= అతిశయం; దేవ= దేవతలు; గంధర్వ= గంధర్వులు; ఆదులకును= మొదలైనవారికి; లోచనీయంబు= చూడదగింది.

**తాత్పర్యం:** దేవశర్మ అని ఒక ముని. అతని భార్య రుచి. ఆమె సర్వాంగసుందరి. ఆమె రూపలావణ్యం దేవగంధర్వాదులకు కూడా వాంఛింప తగ్గది.

**క. అతఁ డొక నాఁ డొక యెడ కొక । క్రతువున కుపదర్శనంబు గావింపఁగఁ బో**
**వు తలంపు పుట్టి, వికస । న్మతి యగు తన శిష్యు విపులనామకునిఁ దగన్. 183**

**ప్రతిపదార్థం:** అతఁడు= దేవశర్మ; ఒకనాఁడు; ఒక ఎడకున్= ఒకచోటికి; ఒక క్రతువునకున్= ఒక యజ్ఞానికి; ఉపదర్శనంబు= యాజకత్వం - పురోహితత్వం; కావింపఁగన్= చేయటానికి; పోవు= వెళ్ళే; తలంపు= ఆలోచన; పుట్టి= కలిగి; వికసత్+మతి= పరిపక్వమైన మనస్సు కలవాడు; అగు= అయిన; తన; శిష్యున్; విపుల నామకునిన్= విపులుడు అనే పేరుగల వాడిని; తగన్= చక్కగా. (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** ఒకసారి దేవశర్మ ఒక యజ్ఞం చేయటానికి పోవాలనుకొని వికసించిన ఆలోచనలు కల తన శిష్యుడు విపులు డనే వాడిని పిలిచి.

**విశేషం:** విపులుఁడు= విపులమైన విశాలమైన బుద్ధి కలవాడు కనుక వికసన్మతి - అని పేర్కొన్నాడు కవి. అతడి విశాలబుద్ధి ముందు కథలో తెలుస్తుంది. ఇది 37 పద్యాలకథ. స్త్రీని రక్షించటం కష్టమని చెప్పటానికై చెప్పబడుతున్నది. ఇదే కథ పురుషుడి దుశ్శీలతకూ ఉదాహరణమే.

**వ. పిలిచి యేకాంతంబున నతని కిట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** ఏక+అంతంబునన్= ఒకడే ఉన్న రహస్యస్థానంలో.

**తాత్పర్యం:** పిలిచి రహస్యంగా అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'రుచి నెపుడు వేచి తిరుగును । శచీవిభుఁడు; దాని నెఱిఁగి సంరక్షణ మే**
**నుచితంబుగ నొనరింతు, వి । కచకమలనిభాస్యఁ జేరఁ గానఁ డతండున్. 185**

**ప్రతిపదార్థం:** శచీవిభుఁడు= శచి భర్త ఇంద్రుడు; రుచిన్= రుచిని; ఎపుడున్= నిత్యమూ; వేచి= వెన్నాడుతూ; తిరుగును= తిరుగుతూ ఉంటాడు; దానిన్= ఆ విషయం; ఎఱిఁగి= తెలిసి; సంరక్షణము= కాపాడటం; ఉచితంబుగన్= తగినట్లు; ఏను= నేను; ఒనరింతున్= చేస్తూ ఉంటాను; వికచ= వికసించిన; కమల= తామరపూవు; నిభ= వంటి; ఆస్యన్= ముఖంకల దానిని; అతండున్= ఇంద్రుడు; చేరన్= సమీపించటానికి; కానఁడు= నేరడు.

**తాత్పర్యం:** రుచికొరకు ఇంద్రుడు చాలాకాలంగా పొంచులు వేస్తున్నాడు. అది తెలిసిన నేను తగిన రక్షణ విధాన మాచరిస్తూ ఉన్నందువలన అతడు ఈ ఛాయలకు రాలేకున్నాడు.

**తే. నాకుఁ గ్రతువు సేయింపఁ జనంగ వలసి । యున్నయది; పరదారసముత్సుకుండు**
**శక్రుఁ; డటుగాన, రుచికి రక్షావిధాన । మాచరింపుము నీవు దృఢావధాన!' 186**

**ప్రతిపదార్థం:** దృఢ= గట్టి; అవధాన!= జాగ్రత్త కలవాడా!; నాకున్; క్రతువు= యజ్ఞం; చేయింపన్= చేయించటానికి; చనంగన్ వలసి ఉన్న+అది= పోవలసి ఉన్నది; శక్రుఁడు= ఇంద్రుడు; పరదార= పరభార్యలపై; సముత్సుకుండు= వాంఛలు కలవాడు; అటుకానన్= అందుకని; నీవు; రుచికిన్; రక్షావిధానము= రక్షించే పద్ధతిని; ఆచరింపుము= చేయుము.

**తాత్పర్యం:** నేను యజ్ఞం చేయించే పనిమీద పోవలసి ఉన్నది. ఇంద్రు డేమో రుచికొరకు వేచి ఉంటాడు. కనుక నీవు ఆమె నతడినుండి కాపాడే బాధ్యత తీసికొనుము.'

**క. అనిన విని 'యట్లు సేసెద' । నని విపులుఁడు గురునితోడ 'నమరవిభుం డే**
**యనువునఁ జొచ్చు నొకో పర । వనితాహరణమున' కనియె వసుధాధీశా! 187**

**ప్రతిపదార్థం:** వసుధా+అధీశా!= భూమికి పతీ! ధర్మజా! అనినన్; విని; అట్లు= అదే విధంగా; చేసెదన్= చేస్తాను; అని; విపులుఁడు= శిష్యుడు; గురునితోడన్= గురువుతో; పర= ఇతరుల, వనితా= స్త్రీ; ఆహరణమునకున్= అపహరించటానికి; అమర= దేవతల; విభుండు= రాజు; ఏ అనువునన్= ఏ ఉపాయంతో; చొచ్చునొకో!= ప్రవేశిస్తాడో కదా!; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** గురువు చెప్పినది విని 'అట్లాగే చేస్తాను. కాని, పరస్త్రీ కొరకు ఇంద్రు డే రూపంలో ఎట్లా ప్రవేశిస్తాడో కదా!' అని అన్నాడయ్యా ధర్మరాజా!

**విశేషం:** పరవనితా హరణమునకు విటుడు ఎట్లా వస్తాడో బ్రహ్మచారి శిష్యుడి కెట్లా తెలుస్తుంది? అందుకే అట్లా ప్రశ్నించాడు.

**క. అనుటయు ననేక మాయలు, । పొనరుపఁగా నేర్చు రూపములు పెక్కులు గై**
**కొను పక్షిమృగాదిత్వము । లొనరఁగ నవి నియతి నరసి యుండఁగ వలయున్. 188**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అంటే; అనేక మాయలు= పలు మాయలు; పొనరుపఁగాన్= చేయగా; నేర్చున్= అతడికి తెలుసు; పక్షి మృగ+ఆదిత్వములు= పక్షి జంతువు మొదలైన; రూపములు= రూపాలు; పెక్కులు= అనేకం; కైకొనున్= వేసికొంటాడు; ఒనరఁగన్= చక్కగా; అవి= వాటిని; నియతిన్= శ్రద్ధగా; అరసిఉండఁగన్+వలయున్= జాగ్రత్తగా చూస్తూ ఉండాలి.

**తాత్పర్యం:** శిష్యు డట్లా అనగానే గురు వన్నాడు. 'అతడు మహామాయావి. పక్షి, మృగాది రూపాలు చక్కగా ధరిస్తాడు. జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండాలి.

**క. రుచి మీఁదం గన్నిడి యా । శచీవిభుఁడు దిరుగు, విను మసంశయము సుమీ!**
**యిచటికి నాతఁడు వచ్చుట; । యచలితమతి నమ్మృగాక్షి నరయఁగ వలయున్.' 189**

**ప్రతిపదార్థం:** ఆ శచీవిభుఁడు= ఆ ఇంద్రుడు; రుచిమీఁదన్= రుచిపై; కన్ను+ఇడి= కన్నువేసి; తిరుగున్, వినుము; ఇచటికిన్; అతఁడు; వచ్చుట; అసంశయము సుమీ= సందేహం లేదు సుమా!; ఆ+మృగ+అక్షిన్= లేడికన్నుల వంటి కన్నులు కలదానిని; అచలితమతిన్= జారుపాటులేని, ఏమరుపాటులేని మనస్సుతో; అరయఁగన్ వలయున్= నీవు చూస్తూ ఉండాలి.

**తాత్పర్యం:** రుచిమీద కన్నువేసిన ఆ ఇంద్రుడు తిరుగుతూ ఉంటాడు. కనుక అత డిక్కడకు రావటం తథ్యం. ఆమెను జాగ్రత్తగా చూస్తూ ఉండుము.'

**క. అని యప్పగించి యాగం । బున కమ్ముని సనియె; నవ్విపులుఁడును జిత్తం**
**బున నవధానము దృఢముగ । వనితం గాచికొని యుండె వసుధాధీశా! 190**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; అప్పగించి= ఆమె బాధ్యత నతడిపై పెట్టి; ఆ ముని; యాగంబునకున్= యజ్ఞానికి; చనియెన్= పోయాడు; ఆ విపులుఁడును; చిత్తంబునన్= మనస్సులో; అవధానము= ఏకాగ్రత, జాగ్రత్త; దృఢముగన్= దృఢం కాగా; వసుధా+అధీశా!= రాజా!; వనితన్= రుచిని; కాచికొని= రక్షిస్తూ; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** అని అప్పగించి ముని వెళ్ళిపోగా, జాగ్రత్తగా శిష్యుడు గురుపత్నిని కాచుకొని ఉన్నాడు.

**వ. అట్లుండి యొక్క యనువు విచారించుకొని. 191**

**ప్రతిపదార్థం:** అట్లు+ఉండి= అట్లా ఉంటూ; ఒక అనువు= ఒక ఉపాయం; విచారించుకొని= ఆలోచించుకొని.

**తాత్పర్యం:** అట్లా ఉంటూ ఒక ఉపాయం ఆలోచించుకొని.

**క. 'ఆవేశించెద యోగ । ప్రావీణ్యంబున మునీంద్రు భార్యం, దప్పే?**
**యా విశ్రుతాత్ము మనమున । కీ విజ్ఞానంబు దోఁచునే? వెఱ పేలా?' 192**

**ప్రతిపదార్థం:** యోగప్రావీణ్యంబునన్= యోగశక్తితో; ముని+ఇంద్రు= దేవశర్మ గురువు యొక్క; భార్యన్= పత్నిని; ఆవేశించెదన్= ఆవహించి ఉంటాను; తప్పే?= ఇది తప్పా? కాదు కదా? ఆ విశ్రుత+ఆత్ము= ఆ జ్ఞానమూర్తియైన గురువుగారి; మనమునకున్= మనస్సుకు; ఈ విజ్ఞానంబు= ఈ (నేను చేసిన ఈ విషయానికి సంబంధించిన) తెలివి; తోఁచునే?= స్పష్టమౌతుందా?; వెఱపు= భయం; ఏలా?= దేనికి?

**తాత్పర్యం:** 'గురుపత్నిని నా యోగశక్తితో ఆవహించి ఉంటాను. మహాజ్ఞాని అయిన గురువుగారి కిది తెలిసే జాడ లేదు కనుక సందేహం లేకుండా ఈ పని చేస్తాను.

**వ. అని వితర్కించి యమ్ముని చాతుర్య కారుణ్యంబు లూఁది శంకదక్కియక్కొమ్మ కింతనంత నాసీనుండై యుచిత కథ లొక్కింతసేపు సెల్లించి, యోగమాయాబలంబునం జేసి నడపుటయు. 193**

**ప్రతిపదార్థం:** వితర్కించి= ముందు వెనుకలు ఆలోచించి; ఆ ముని= గురువు; చాతుర్య కారుణ్యాంబులు= నేర్పు, దయ అనుగుణాలను; ఊఁది= ఆధారంగా చేసికొని; శంక= సందేహం; తక్కి= మాని; ఆ కొమ్మకున్= ఆ స్త్రీకి; అంతన్+ఇంతన్ ఆసీనుండై= దగ్గర కూర్చున్నవాడై; ఉచిత= తగిన; కథలు= పురాణగాథలు (సీతాదుల కథలు); ఒక్క+ఇంతసేపు= కొంచెంసేపు; చెల్లించి= గడపి; యోగమాయాబలంబునన్+చేసి= యోగమాయాశక్తితో; నడపుటయున్= ప్రవర్తించగా.

**తాత్పర్యం:** అని ఆలోచించి తన గురువుయొక్క చాతుర్యం, కారుణ్యం ఆధారంగా చేసికొని సందేహం లేకుండా ఆమె సమీపంలో కూర్చుండి ఒప్పిదాలైన కథలు కొంతసేపు చెప్పి, యోగమాయా బలంతో ప్రవరిస్తూ ఉండగా.

**ఆ. పవనుఁ డాకసమునఁ బరఁగు విధంబున । నమ్మృగాక్షి తనువునందుఁ గలయ**
**విపులు నాత్మ దగఁ బ్రవేశించె నవ్వధూ । రత్నమునకు నెఱుఁగ రాకయుండ. 194**

**ప్రతిపదార్థం:** ఆ+వధూ రత్నమునకున్= శ్రేష్ఠమైన ఆమెకు; ఎఱుఁగన్= తెలియగా; రాక+ఉండన్= వీలులేకుండా; పవనుఁడు= గాలిదేవుడు; ఆకసమునన్= అంతరిక్షంలో; పరఁగు విధంబునన్= తిరిగేటట్లు; విపులుఆత్మ= విపులుడి ఆత్మశక్తి; ఆ మృగ+అక్షి= లేడికన్నులవంటి కనులుగల ఆమె యొక్క; తనువు+అందున్= శరీరంలో; తగన్= చక్కగా; ప్రవేశించెన్= ప్రవేశించింది.

**తాత్పర్యం:** గాలి ఆకాశంలో వ్యాపించినట్లు ఆ విపులుడి ఆత్మ ఆమె శరీరంలో ఆమెకు తెలియకుండానే ప్రవేశించింది.

**విశేషం:** అతడి ఆత్మ ఆమెకు తెలియకుండా ఆమె శరీరంలోకి ప్రవేశించటం - అంతరిక్షంలో గాలి తిరగటంవలె అన్న పోలికవలన ఆత్మ పదార్థం గాలివలె కనిపించేది కాదు, కాని ఉన్నదని తెలుస్తుంది. అనుభవాని కందుతుంది.

ఈ విషయం ఆధునిక పరిశోధనలలోనూ స్పష్టపడింది. దయ్యం పట్టిందనటానికి గాలి సోకిందనటం అందరకూ తెలిసిందే.

**వ. ఇట్లు ప్రవేశించి యయ్యోగివరునాత్మ యన్నాతి చైతన్యంబు జడంబుగాఁ జేసికొని యుండె; అట్టియెడం బురందరుం డతిసుందరం బగు నాకారంబు దాల్చి యచ్చటికి వచ్చి విపులుని శరీరంబు సూచి నిద్రితునింగాఁ దలఁచుచు నున్మదుండగుటం జేసి యొండు పరికింపక మునిపత్నిం జేరవచ్చి. 195**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రవేశించి= చొచ్చి; ఆ యోగివరుఆత్మ= ఆ యోగిశ్రేష్ఠుడి ఆత్మ; ఆ నాతి= ఆ స్త్రీ; చైతన్యంబు= జీవాత్మను; జడంబుగాన్= చైతన్యంబు లేకుండా; చేసికొని ఉండెన్= చేసికొని ఉన్నాడు; అట్టి ఎడన్= ఆ సమయంలో; పురందరుండు= ఇంద్రుడు; అతి= మిక్కిలి; సుందరంబు+అగు= అందమైన; ఆకారంబు= రూపం; తాల్చి= ధరించి; అచ్చటికిన్= అక్కడకు; వచ్చి; విపులుని శరీరంబు= దేహం; చూచి; నిద్రితునిన్+కాన్= నిద్రపోయినవాడిగా; తలఁచుచున్= భావిస్తూ; ఉన్మదుండు= మిక్కిలి మదించినవాడు; అగుటన్+చేసి= అయినందువలన; ఒండు= ఇంకొకటి; పరికింపక= చూడక; మునిపత్నిన్= ముని భార్యను; చేరవచ్చి= సమీపించి.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రవేశించి ఆ యోగివరుడి ఆత్మ ఆమె చైతన్యాన్ని జడంగా చేసింది. అప్పుడు ఇంద్రుడు సుందరమైన రూపం ధరించి అక్కడకు వచ్చి విపులుడి శరీరాన్ని చూచి, నిద్రపోతున్నాడని తలచి కామంతో కన్ను కాననివాడు కాబట్టి మునిభార్యను సమీపించి.

**క. 'నీవు కతంబుగ నాదగు । భావంబును భావభవుఁడు పఱచుట యరయం**
**గావలదే; యని పలికిన, । భూవర! యప్పొలఁతి మూఢబుద్ధిత్వమునన్. 196**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; నీవు కతంబుగన్= నీవలన; నాదగు భావంబును= నా మనస్సును; భావభవుఁడు= మన్మథుడు; పఱచుట= బాధలపాలుచేయటం; అరయన్+కాన్ వలదే= విచారించాలి కదా; అని; పలికినన్= అంటే; ఆ పొలఁతి= ఆ స్త్రీ; మూఢ= జడమైన; బుద్ధిత్వమునన్= బుద్ధికలదైనందువలన.

**తాత్పర్యం:** ఇంద్రు డామెతో అన్నాడు. 'నీ వలన నా మనస్సును మన్మథుడే కలత పెట్టుతున్నాడు. నీవు కొంచెమైనా ఆలోచించాలి కదా!' అని అనగా రాజా! ఆమె బుద్ధి చైతన్యం కోల్పోయినందువలన.

**క. సముచితముగఁ బ్రతుత్థా । నము సేయను, దగిన పలుకునకుఁ జొరఁగను నే**
**రమి నూరకున్ననుం దమ । కము పెంపున నతఁడు మఱియుఁ గమలాననతోన్. 197**

**ప్రతిపదార్థం:** సముచితముగన్= తగిన విధంగా; ప్రతి+ఉత్థానము= ఎదురుగా లేచి వెళ్ళటం (ఆహ్వానించటానికి); చేయను= చేయటానికి; తగిన; పలుకునకున్= మాటలకు; చొరఁగను= పూనుకొనటానికి గాని; నేరమిన్= తెలియక; ఊరకున్ననున్= కదలకుండా ఉండగా; తమకము= కోర్కెయొక్క; పెంపునన్= అతిశయంతో; అతఁడు= ఇంద్రుడు; మఱియున్= ఇంకా; కమల= తామరవంటి; ఆననతోన్= ముఖంకలదానితో.

**తాత్పర్యం:** తగినరీతిగా ఆహ్వానించటానికి లేచి ఎదురు పోవటంగానీ, తగినట్లుగా మాట్లాడటంగానీ, చేయకుండా ఉండగా ఇంద్రుడు కోరికతో ఇంకా ఆ పద్మముఖితో ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** మునిపత్నిపేరు రుచి (కాంతి - లావణ్యం) కనుక ప్రతిపద్యంలో కవి దాన్ని సూచిస్తూ విశేషణాలు వాడటం గమనించాలి. (కమలానన - వలె)

**క. ' ఏ నమరేంద్రుఁడ నాదగు । మానముఁ గామశిఖి గ్రాఁచె; మానిని! దడయం**
**గా నేల? నన్నుఁ దగ స । మ్మానింపుము; నీకు సిగ్గు మా టింకేలా?' 198**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అమర= దేవతలకు; ఇంద్రుఁడన్= రాజును; నాదగుమానమున్= నా గౌరవం; కామశిఖి= కామాగ్ని; క్రాఁచెన్= తప్తం చేశాడు; మానిని!= మానంగల దానా!; తడయంగాన్+ఏల?= ఆలస్యం దేనికి?; నన్నున్; తగన్= చక్కగా; సమ్మానింపుము= గౌరవించుము; నీకున్, సిగ్గుమాట= సిగ్గు విషయం; ఇంకన్= ఇంకా; ఏలా?= దేనికి?

**తాత్పర్యం:** నేను దేవతల రాజును. నా గౌరవాన్ని కామాగ్ని కాల్చి వేస్తున్నాడు. ఆలస్యం దేనికి? మానినీ? నన్ను తగ్గట్లు గౌరవించుము. నీకు ఇంక సిగ్గుతో పని లేదు.'

**వ. అనుటయు నత్తన్వి తనువున నున్న విపులుండు దన యోగమాయం జేసి యవ్వనిత వాసవునితో 'నీకు నిందు రాఁ బనియేమి?' యనిపలికి పరవశ యగునట్లుగాఁ జేసినం జూచి యతండు వ్రీడా భయభరిత చిత్తుండయ్యె; నయ్యవసరంబున. 199**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+తన్వి= ఆ స్త్రీ యొక్క; తనువునన్= శరీరంలో ఉన్న; విపులుండు; తన; యోగమాయన్+ చేసి= యోగశక్తితో; ఆ+వనిత= ఆ స్త్రీ; వాసవునితోన్= ఇంద్రునితో; నీకున్, ఇందున్= ఇక్కడకు; రాన్= రావటానికి; పనియేమి?= ఏం పని? అనిపలికి; పరవశఅగునట్లుగాన్= సొమ్మసిల్లిపోయేటట్లుగా; చేసినన్= చేయగా; చూచి; అతండు= ఇంద్రుడు; వ్రీడా= సిగ్గుతో; భయ= భయంతో; భరిత= నిండిన; చిత్తుండు= మనస్సు కలవాడు; అయ్యెన్= అయ్యాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అనటంతోనే ఆమె శరీరంలో ఉన్న విపులుడు తన యోగశక్తితో ఆమె వాసవుడితో 'నీ విక్కడకు రావలసిన పనేమి'టని అనిపించి ఆమెను సొమ్మసిల్లి పడిపోయేటట్లు చేయగా చూచి ఇంద్రుడు సిగ్గుపడ్డాడు. భయపడ్డాడు. అప్పుడు.

**ఉ. అమ్మునిశిష్యుఁ డయ్యువిద యంగము వాసి, నిజాంగవర్తియై**
**యమ్మరుదీశుతో 'మఱచితా మును మూఁడిన యబ్భగాంకిత**
**త్వ మ్మొకభంగి నీఁగు టిది, దైవతసంయమి సేవనీయ భా**
**వమ్ము గలట్టి నీకుఁ దగవా? యిసిరో! యని పల్కి వెండియున్. 200**

**ప్రతిపదార్థం:** ఆ+ముని శిష్యుఁడు= ఆ ముని శిష్యుడు విపులుడు; ఆ+ఉవిద= ఆమె; అంగము= శరీరం; పాసి= వదలి; నిజ= తనయొక్క; అంగవర్తిఐ= శరీరంలోకి ప్రవేశించి; ఆ+మరుత్+ఈశుతోన్= ఆ దేవరాజుతో; మఱచితా?= మరిచిపోయినావా? మును= పూర్వం; మూఁడిన= సంప్రాప్తమైన; ఆ+భగాంకితత్వమ్ము= ఆ యోని గుర్తులు కలగటం; ఒక భంగిన్= ఒక రీతిగా; ఈఁగుట= పోగొట్టుకొనటం; ఇది= ఈ పని; దైవత సంయమి= దేవమునులచే; సేవనీయ భావమ్మ= సేవింపదగిన మనస్సు కల; అట్టి= కలిగినట్టి; నీకున్; తగవా?= న్యాయమేనా? ; ఇసిరో= ఛీ ఛీ; అని పల్కి; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** ఆ విపులుడు గురుపత్ని శరీరంనుండి బయటకువచ్చి తన శరీరంలో ప్రవేశించి ఇంద్రుడితో ఇట్లా అన్నాడు. 'నీకు పూర్వం మునిశాపవశాత్తు సంక్రమించిన యోనిగుర్తులన్నీ ఎట్లాగో దేవముని సేవవలన పోగొట్టుకొన్నావు కదా! అట్లాంటి నీ కిది ధర్మమా?' అని ఇంకా.

**తే. 'అవిజితేంద్రియబల! కుత్సితాత్మ। నీచ!, యెట్లు పాపంబు దొడరుట కియ్యకొంటి?**
**నాదు గురుని కోపాగ్నిచే నీదుదేవ। గణ విభుత్వ మహోన్నతి గ్రాఁగి పోదె?' 201**

**ప్రతిపదార్థం:** న+విజిత= చక్కగా జయించబడని; ఇంద్రియ= అవయవాలయొక్క (కన్ను మొ॥) బల!= బలం కలవాడా!; కుత్సిత= కుచ్చితమైన; ఆత్మ= బుద్ధికలవాడా!; నీచ!= నీచుడా! (అధముడు); ఎట్లు= ఏ విధంగా; పాపంబు= పాపం; తొడరుటకున్= చేయటానికి; ఇయ్యకొంటి?= అంగీకరించావు?; నాదు= నా; గురుని కోప+అగ్నిచేన్= గురువుగారి కోపమన్న నిప్పుతో; నీదు= నీ; దేవగణ= దేవతా సమూహము యొక్క; విభుత్వ మహోన్నతి= రాచరికపు ఐశ్వర్యం; క్రాఁగిపోదె= నశించదా.

**తాత్పర్యం:** 'ఇంద్రియాలను అదుపులో పెట్టుకోలేనివాడా! అసహ్యమైన బుద్ధికలవాడా! నీచుడా! పాపం చేయటానికి ఎట్లా పూనుకొన్నావు? నీ దేవేంద్ర పదవి నా గురుకోపాగ్నికి బలి కాగలదు. జాగ్రత్త!

**వ. అనిన విని దివ్యబోధంబును విపులుని యోగ బలంబు తెఱం గెఱింగి వెలవెలం బాఱు నబ్బలవైరి నాలోకించి యత్తపోధనుండు. 202**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని విపులుడు పల్కగా ఆలకించి; దివ్య= దేవతా సంబంధమైన; బోధంబునన్= జ్ఞానంతో; విపులుని; యోగబలంబు; తెఱంగు= సంగతి; ఎఱింగి= తెలిసి; వెలవెలన్‌పాఱు= భయంతో తెల్లబడు; ఆ+బలవైరిన్= బలుడనే రాక్షసుడిని చంపినవాడిని - ఇంద్రుడిని; ఆలోకించి= చూచి; ఆ తపోధనుండు= తపస్సే సంపదగా కల విపులుడు,

**తాత్పర్యం:** దివ్య జ్ఞానంతో ఇంద్రుడు విపులుడి యోగబలం తెలిసికొని భయంతో వెలవెల పోగా ఆ బలారిని చూచి విపులుడు.

**క. 'ఏ నొల్లఁ గాక! భస్మము । గా, నిన్నుం జూతునే వికారీ!' యనుడుం**
**దా నెదురు పలుక కంత । ర్ధానము వెసఁ జేసె నతఁడు ధరణీనాథా! 203**

**ప్రతిపదార్థం:** ఏను; ఒల్లన్+కాక= అంగీకరించను తప్ప; నిన్నున్; భస్మముకాన్= బూడిద అయ్యేటట్లుగా; చూతునే= చూడగలను కదా!; వికారీ!= వికారపు బుద్ధికలవాడా! అనుడున్= అనగా; తాను= ఇంద్రుడు; ఎదురు పలుకక= సమాధానం చెప్పక; అతఁడు= ఇంద్రుడు; అంతర్ధానమున్= అదృశ్యమగుటను; వెసన్= వెంటనే; చేసెన్= చేశాడు; ధరణీనాథా!= రాజా!

**తాత్పర్యం:** 'నా కిష్టంలేదు. లేకున్న నిన్ను భస్మంచేయనా? వికారపు బుద్ధి కలవాడా! అనగా ఏమీ మాటడలేక వెంటనే ఇంద్రుడు అంతర్ధానమైపోయాడు.

**వ. తదనంతరంబ విపులుండు రుచిం బ్రబుద్ధం జేసి పదంపడి దేవశర్మ వచ్చిన నా శిష్యోత్తముండు వినయాచారంబు నడపి యేకాంతంబున నమ్మునితోడ. 204**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ= అటు తరువాత; విపులుండు; రుచిన్= ముని పత్నిని; ప్రబుద్ధన్+చేసి= జాగ్రద్దశకు తెచ్చి (లేపి); పదంపడి= పిదప; దేవశర్మ= గురువు; వచ్చినన్= రాగా; ఆ శిష్య+ఉత్తముండు= ఆ గొప్ప శిష్యుడు; వినయ+ఆచారంబు= వినయంగా గురువుకు చేయవలసిన సేవ; నడపి= చేసి; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్నప్పుడు; ఆ మునితోడన్= గురువుతో.

**తాత్పర్యం:** తరువాత విపులుడు రుచిని జాగ్రత్స్థితికి తెచ్చి తరువాత గురువుగారు రాగానే వినయంతో నమస్కరించి ఏకాంతంలో.

**తే. 'నాకపతి యిచ్చటికి వచ్చి, నాకతమునఁ । జిక్కువడి, మది భయమున సిగ్గు గదురఁ**
**జనియె' ననవుడు నాతఁడు సంతసిల్లి । యభిమతం బగు వరమిచ్చె నధిపవర్య! 205**

**ప్రతిపదార్థం:** అధిపవర్య!= రాజశ్రేష్ఠుడా! నాకపతి= స్వర్గరాజు; ఇచ్చటికిన్= మన ఇంటికి; వచ్చి; నాకతమునన్= నావలన; చిక్కువడి= చిక్కులలోపడి, ఇబ్బందిపడి; మదిన్= మనస్సులో; భయమునన్= భయంతో; సిగ్గు; కదురన్= కలుగగా,

వ్యాపించగా; చనియెన్= వెళ్ళిపోయాడు; అనవుడున్= అనగా; ఆతఁడు= గురువు; సంతసిల్లి= సంతోషించి; అభిమతంబు+అగు= ఇష్టమైన; వరము+ఇచ్చెన్= వరమిచ్చాడు.

**తాత్పర్యం:** రాజా! శిష్యు డిట్లా చెప్పాడు. 'దేవరాజు ఇక్కడకు వచ్చి నావలన చిక్కుపడి భయంతో సిగ్గుతో వెళ్ళిపోయాడు' అని చెప్పగా గురువు సంతోషించి ఇష్టమైన వరా లిచ్చాడు.

**వ. ఇచ్చినఁ బ్రీతుండై యవ్విపులుండు విపుల తపం బాచరించె; దేవశర్మయు దేవేంద్రుని వలని శంక దక్కి సుఖంబుండె; ఒక్కనాఁడయ్యాశ్రమంబు చక్కటి చదల దేవాంగన యోర్తు వోవ దాని చేతినుండి ప్రిదిలి భూరి పుష్పదామంబు. 206**

**ప్రతిపదార్థం:** ఇచ్చినన్= ఇస్తే; ఆ+విపులుండు= ఆ విపులుడు; ప్రీతుండు+ఐ= సంతోషించి; విపులతపంబు= విస్తారమైన తపస్సు; ఆచరించెన్= చేశాడు; దేవశర్మయున్= మునికూడా; దేవ+ఇంద్రునివలని= దేవతలరాజునుండి; శంక= భయాన్ని; తక్కి= వదలి; సుఖంబు+ఉండెన్= సుఖంగా ఉన్నాడు; ఒక్కనాఁడు= ఒకరోజున; ఆ+ఆశ్రమంబు= ఆ ఆశ్రమంయొక్క; చక్కటి= నడినెత్తిపైన; చదలన్= ఆకాశంనుండి; దేవ+అంగన= దేవతా స్త్రీ; ఓర్తు= ఒకతె; పోవన్= పోగా; దానిచేతినుండి; ప్రిదిలి= జారి; భూరి= పెద్ద; పుష్ప= పూల; దామంబు= దండ. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** గురువు వరమిస్తే సంతోషించి శిష్యుడు గొప్ప తపస్సు చేశాడు. దేవశర్మకు దేవేంద్రుడినుండి ఇక ఏమీ ఆపదరాదని సుఖంగా ఉన్నాడు. ఇంతలో ఒకరోజున నడినెత్తిపైన ఆకాశంనుండి దేవతాస్త్రీ చేతిలో ఉన్న పూలదండ జారిపడింది.

**ఆ. దివ్య పరిమళంబు, నవ్య వికాసంబు । నుల్లసిల్ల వచ్చి యుర్విఁ బడినఁ**
**గాంచి రుచి యుదీర్ణ కౌతుకచిత్తయై । దానిఁ బుచ్చికొనియె మానవేంద్ర! 207**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర!= మానవులకు ప్రభూ!; దివ్య పరిమళంబు= స్వర్గలోకంలోని వాసన; నవ్య= అపూర్వమైన; వికాసంబున్= కాంతి; ఉల్లసిల్లన్= వెదజల్లుతూ; వచ్చి; ఉర్విన్= భూమిమీద; పడినన్= పడగా; కాంచి= చూచి; రుచి; ఉదీర్ణ= అతిశయమైన; కౌతుక= కుతూహలం కల; చిత్తయై= మనస్సు కలదై; దానిన్= దండను; పుచ్చికొనియెన్= తీసికొన్నది.

**తాత్పర్యం:** రాజా! దివ్యమైన పరిమళం, నవ్యకాంతి కల ఆ పూలదండను భూమిమీదనుండి రుచి తీసుకొన్నది.

**వ. తదవసరంబున వంగాధీశ్వరుం డగు చిత్రరథుం డయ్యాశ్రమంబున కరుగుదెంచె; అతనిదేవియు రుచియుఁ దోడంబుట్టువు లగుటంజేసి నిజగృహంబునం గలిగిన యుత్సవంబున కతండు రుచి సహితంబుగా దేవశర్మఁ బ్రార్థించి పిలిచినఁ జంపానగరంబున కరుగుచుండి రుచి గైసేసి యద్దివ్య కుసుమ దామంబునం గేశకలాపం బలంకరించుకొనినం దత్సమాగమ సమాచారంబు నడపి తద్భగిని తదీయ కుసుమ పరిమళంబున కచ్చెరువంది. 208**

**ప్రతిపదార్థం:** తత్+అవసరంబునన్= ఆ సమయంలో; వంగ+అధీశ్వరుండు= వంగదేశానికి రాజు (వంగ= నేటి బెంగాల్); చిత్రరథుండు= అద్భుతమైన రథంగలవాడు, సూర్యునకు చిత్రరథస్వామి అనే పేరుంది; ఆ+ఆశ్రమంబునకున్; అరుగుదెంచెన్=

వచ్చాడు; అతని దేవియున్= అతడి భార్యా; రుచియున్= రుచీ; తోడంబుట్టువులు= ఒకే కడుపున పుట్టినవారు; అగుటన్+చేసి= అయినందువలన; నిజ= తన; గృహంబునన్= ఇంట్లో; కలిగిన= వచ్చిన; ఉత్సవంబునకున్= పండుగకు; అతండు= చిత్రరథుండు; రుచిసహితంబుగాన్= భార్యతోపాటుగా; దేవశర్మన్= దేవశర్మను; ప్రార్థించి= చక్కగా వేడికొని; పిలిచినన్= ఆహ్వానిస్తే; చంపా నగరంబునకున్= ఆ పేరుగల పట్టణానికి; అరుగుచుండి= పోతూ; రుచి; కైసేసి= అలంకరించుకొని; ఆ+దివ్య కుసుమ దామంబునన్= ఆ దేవతల పూలదండతో; కేశకలాపంబున్= జడముడిని; అలంకరించుకొనినన్= అలంకరించు కొనగా; తత్= వారి; సమాగమ= రాకకు చెందిన; సమాచారంబున్= విషయాన్ని; నడపి= ప్రవర్తింపజేసి; తత్+భగిని= రుచి సోదరి; తదీయ= ఆ; కుసుమ= పూల; పరిమళంబునకున్= వాసనకు; అచ్చెరువు+అంది= ఆశ్చర్యపడి.

**తాత్పర్యం:** ఆ సమయంలో వంగదేశపురాజు చిత్రరథుడనేవాడు భార్యతోసహా దేవవర్మ ఆశ్రమానికి వచ్చి తన భార్య - రుచి అక్కా చెల్లెళ్ళు కావటం వలన తమ ఇంట్లో ఒక ఉత్సవానికి రమ్మని దేవశర్మను అతని భార్యను ప్రార్థించగా చంపానగరానికి వారూ వెళ్ళారు. ఆ వెళ్ళేటప్పుడు రుచి తనకు దొరికిన పూలదండ నలంకరించుకొని పోయింది. ఆ పూలవాసన చూచి ఆమె సోదరి ఆశ్చర్యపడి.

**విశేషం:** ఆ దండ దొరికినరోజే సోదరి రావటం తటస్థించింది. ఇది కథలో స్పష్టంగా లేదు. లేదా ఆ పూలదండ దివ్యమైనది కనుక వాడిపోవటం, పరువం తప్పటం జరగనిదనీ అనుకొనవచ్చు.

**ఆ. 'ఇట్టి సౌరభంబు నెన్నఁడు నెఱుఁగ; ని। పువ్వు లెచటఁ గలిగెఁ బువ్వుఁబోఁడి!**
**యనినఁ 'గలిగె నస్మదాశ్రమంబున' నని। పలికి, దేవశర్మ పాలి కరిగి. 209**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇట్లాంటి; సౌరభంబున్= వాసనను; ఎన్నఁడున్= ఎప్పుడూ; ఎఱుఁగన్= తెలియను; ఈ+పువ్వులు= ఈ పుష్పాలు; ఎచటన్= ఎక్కడ; కలిగెన్= పూచాయి; పువ్వుబోఁడి= పూవువంటి మేనుగలదానా!; (పువ్వు+పోఁడిమి= పూలమెత్తదనంకల స్త్రీని పువ్వుబోఁడి అంటారు;) అనినన్= అంటే; అస్మత్= మా; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; కలిగెన్= పూచినవి; అని పలికి; దేవశర్మ పాలికిన్= దేవశర్మ దగ్గరకు; అరిగి= వెళ్ళి. (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** 'ఇట్లాంటి వాసనగల పూలను ఎప్పుడూ చూడలేదు. ఇవి ఎక్కడివి? అని అడుగగా మా ఆశ్రమంలో ఉన్నా' యని చెల్లెలికి చెప్పి రుచి భర్త దగ్గరకు వెళ్ళి.

**వ. రుచి యప్పువ్వులకుం దన చెలియలు వేడుక పడుట యెఱింగించిన, నమ్మహానుభావుండు విపులుని రావించి యత్తెఱంగు దేట వడం బలికి 'యిట్టి కుసుమంబులు గొనిరావలయు' నని పలికిన నతం డప్పువ్వులు గనిన చోటు రుచి నడిగి చెప్పించుకొని గురుప్రభావంబును నిజతపశ్శక్తియు నూఁది యప్పనిపూని చనియె; దైవికంబయి యచ్చట నెప్పటి చందంబు పుష్ప దామంబున్నం బుచ్చికొని వచ్చునప్పు డొక్కయెడ నారీ పురుషలొండొరుల చెట్టలు వట్టికొని చక్రభ్రమణభంగిఁ దిరుగుచుండి యొకళ్ళొకళ్ళగతి యొప్పదని పలికి కాలుదొడరితి, కడువేగ తిరిగి తని వివాదంబు పుట్టి యందొకం డేనట్లు సేసితినేనిం బరలోకంబున విపులుని చన్నగతికిం జనుదునని శపథంబు సేసిన, నమ్మాట వినుచు విపులుండు అట సనంజన మఱియు మార్గంబున నార్వురు జూదంబాడుచుండ వాదైన యొకం డట్ల యొట్టిడిన నప్పలుకు నాకర్ణించి యత్తపోధనుండు**

**చిత్తంబున విషాదంబు గదుర నేమి దోషంబు సేసితి నొకో!' యని విచారించి రుచి శరీరంబునందుఁ బ్రవేశించుట గురునకు నెఱింగింపమి గానోపునని తలంచుచు నరుగుదెంచి యక్కుసుమ మాలిక యొప్పించినం గైకొని యమ్మునివరుండు మఱఁదలి కొసంగి సంతోషం బొలయించెఁ, దదనంతరంబ తమయంతనున్న యవసరంబున నగ్గురుం డా శిష్యునితో నిట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** రుచి; ఆ+పువ్వులకున్= ఆ పుష్పాలకు; తన చెలియలు= తన చెల్లెలు; వేడుకపడుట= ముచ్చటపడుట; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+మహా+అనుభావుండు= గొప్పవ్యక్తిత్వంగల దేవశర్మ; విపులునిన్; రావించి= పిలిపించి; ఆ+తెఱంగు= ఆ విషయం; తేటపడన్= స్పష్టంగా; పలికి= చెప్పి; ఇట్టి కుసుమంబులు= ఇలాంటి పూలు; కొనిరావలయున్= తప్పకతీసికొని రావాలి; అనిపలికినన్; అతండు= విపులుడు; ఆ+పువ్వులు; కనినచోటు= చూచిన ప్రదేశం; చెప్పించుకొని= రుచి చెప్పగా తెలిసికొని; గురు ప్రభావంబును= గురుని మాహాత్మ్యం; నిజ= తన; తపః+శక్తియున్= యోగబలం; ఊఁది= ఆధారంగా గ్రహించి; ఆ+పనిపూని= ఆ పనికై ఉద్యమించి, ఆ పనిచేయుటకు అంగీకరించి; చనియెన్= పోయాడు; దైవికంబు+అయి= అదృష్టవశాత్తు; అచ్చటన్= ఆ ప్రదేశంలో; ఎప్పటిచందంబు= ఎప్పటివలెనే; పుష్ప= పూల; దామంబు= దండ; ఉన్నన్= ఉండగా; పుచ్చికొని వచ్చునప్పుడు; ఒక్క+ఎడన్; నారీ పురుషులు= స్త్రీ పురుషులు; ఒండు+ఒరుల= ఒకరినొకరు; చెట్టలు పట్టుకొని= చేతి దండలు పుచ్చుకొని; చక్ర భ్రమణ భంగిన్= రథచక్రం తిరిగేటట్లు; తిరుగుచున్+ఉండి= తిరుగుతూ; ఒకళ్ళు= ఒకరు; ఒకళ్ళ= మరొకరి; గతి= ఆట, పద్ధతి; ఒప్పదు= సరికాదు; అనిపలికి; కాలు+తొడరితి= కాలుపెట్టావు; కడున్+వేగ= మిక్కిలివేగంగా; తిరిగితి(వి)= తిరిగావు; అని; వివాదంబు= వాదం, తగవులాట; పుట్టి= కలిగి; అందున్= వారిద్దరిలో; ఒకండు= ఒకడు; ఏను+అట్లు+చేసితిన్+ఏనిన్= ఆ విధంగా నేను చేసినట్లయితే; విపులునిచన్న గతికిన్= విపులుడు పోయిన స్థితికి; చనుదును+అని= పోతానని; శపథంబు= ప్రతిజ్ఞ; చేసినన్; ఆ+మాట; వినుచున్= ఆలించుచు; విపులుండు; అట= అక్కడ; చనన్+చనన్= పోగా పోగా; మఱియున్= ఇంకా; మార్గంబునన్= దారిలో; ఆర్వురు= ఆరుగురు; జూదంబు+ఆడుచున్+ఉండన్; వాదు= తగవు; ఐనన్= ఏర్పడగా; ఒకండు; అట్లు+అ= పై విధంగానే; ఒట్టు+ఇడినన్= ఒట్టుపెట్టగా; ఆ+పలుకు= ఆ మాట; ఆకర్ణించి= విని; ఆ+తపోధనుండు= ఆ యోగి, (విపులుడు) చిత్తంబునన్= మనస్సులో; విషాదంబు= దుఃఖం; కదురన్= కలుగగా; ఏమిదోషంబు= ఏమితప్పు; చేసితిన్+ఒకో= చేశానోకదా! అని విచారించి= అని ఆలోచించి; రుచి శరీరంబు+అందున్+ప్రవేశించుట; గురునకున్; ఎఱింగింపను= చెప్పక పోవటం; కానోపు= కావచ్చు; అనితలంచుచున్; అరుగుదెంచి= వచ్చి; ఆ+కుసుమమాలిక= ఆ పూలదండను; ఒప్పించినన్= ఇవ్వగా; కైకొని= తీసికొని; ఆ+మునివరుండు; మఱఁదలికిన్+ఒసంగి= భార్యచెల్లెలికిచ్చి; సంతోషంబు; ఒలయించెన్= కల్గించాడు; తత్+అనంతరంబు+అ= ఆ తర్వాత; తమ+అంతన్+ఉన్న= ఏకాంతంగా ఉన్న; అవసరంబునన్= వేళలో; ఆ+గురుండు; ఆ శిష్యునితోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** రుచి తన చెల్లెలి కా పువ్వులు కావాలని చెప్పగా, ఆయన విపులుడితో పూలు తెమ్మని చెప్పాడు. అతడు రుచి నడిగి ఆ పూ లెక్కడ దొరుకుతాయో తెలిసికొని అక్కడకు వెళ్ళాడు. దైవికంగా ఆ పూలదండ అక్కడ కన్పించింది. అది తీసికొని వస్తూ ఉండగా దారిలో ఒక జంట నాట్యం చేస్తూ ఒకరు వేసిన అడుగు మరొకరు తప్పంటే - కాదంటూ వాదాడుకోగా, వారిలో ఒకరు నేను తప్పు చేస్తే విపులుడు పోయేగతికి పోతానని శపథం చేశాడు. విపులు డది వింటూ ముందుకు సాగిపోయాడు. దారిలో ఆరుగురు జూదమాడుకొంటూ ఉండగా వారిలో వారికి వాదు కలిగింది. అందులో ఒకడు పై రీతిగానే ఒట్టు పెట్టుకొనటం విపులుడు విన్నాడు. 'విని నే నేమి తప్పు చేశానో అనుకొంటూ వచ్చి గురువుగారికి దండ నప్పగించాడు. గురువు తన మరదలికి ఆ దండ నిచ్చి సంతోషపెట్టాడు. గురువు ఏకాంతంగా ఉండగా శిష్యుడితో ఇట్లా అన్నాడు.

**క. 'తెరువున నొక మిథునము, జూ । దరులను గనుఁగొంటి, నీ వధర్మము నీయం**
**దరసి కనిన వారై పలి । కిరి వారల నెఱుఁగుదే యకిల్బిషచరితా! 211**

**ప్రతిపదార్థం:** అకిల్బిష చరితా!= పాపంలేని నడవడి కలవాడా!; తెరువునన్= మార్గంలో; నీవు; ఒక; మిథునము= జంట, భార్యా భర్తలు; జూదరులను= జూదమాడే వారిని; కనుఁగొంటి= చూచావు కదా; అధర్మము= ధర్మవ్యతిరేకత; నీయందున్= నీలో; అరసి= విచారించి; కనిన వారు+ఐ= చూచిన వారై; పలికిరి= అన్నారు; వారలన్= వా రెవ్వరో; ఎఱుఁగుదే?= తెలుసా?

**తాత్పర్యం:** పాపం లేనివాడా! నీ వచ్చే దారిలో ఒకజంట, ఆరుగురు జూదరులు కనిపించారు కదా! నీపై అధర్మాన్ని ఆరోపించారే - వా రెవరో తెలిసికొన్నావా?

**విశేషం:** తిక్కన్నగారు వాడే సంబోధనలు చాలా అర్థవంతంగా ఉంటాయి. అవి కథను, పాత్రను, వారితత్త్వాన్ని, ఆలోచనలను బోధించేవిగా వాడటమే అర్థవంతంగా ఉండటమంటే. కథారంభంనుండి విపులుడికి వాడిన విశేషణాలు.

183. 'వికసన్మతి' - ఇది మొదటి సంబోధన. కథ మొదలు కాబోతూ ఉండగా వాడిన ఈ సంబోధన కథలో అతడెంత పవిత్రంగా, పరిపక్వ బుద్ధిఅయి ప్రవర్తించేదీ సూచించేదిగా ప్రయోగించబడింది.

186. 'దృఢావధాన!' - మంచి కట్టుదిట్టమైన జాగ్రత్త కలవాడా! తన భార్య నెట్లా రక్షించాలో ఈ సంబోధనమే చెప్పుతున్నది. తరువాత కథలో అత డెలా రక్షించాడో మనకు తెలిసింది.

201. ఇంద్రుడిని నిందిస్తూ విపులుడు వాడిన మాటలు. అవిజితేంద్రియబల - జితేంద్రియుడని వాడటం తప్ప ఇట్లా లేదు. ఇంద్రుడి బలమంతా ఏమిటి? కామాదుల ప్రేరణకు లోబడి యథేచ్ఛగా ప్రవర్తించటం, విచ్చలవిడితనమే వాడి బలం. ఇంద్రుడంటే - ఇంద్రియాలపై అజమాయిషీ చేసే దేవుడని అర్థం కనుక. ఈ సంబోధన చాలా అర్థవంతం. మనిషికూడా ఇంద్రియాలకు లోబడిపోవటానికే కారణం ఇంద్రియాధిదేవత అయినవాడే వాటికి లోబడి పోతున్నాడు కనుక మనిషి లెక్కేమిటని అర్థం. కనుకనే ఇంద్రజాల మన్నమాట పుట్టింది. ఇంద్రుడు మనపై వేసిన వల. ఇంద్రియాలకు లోబడటమే వలలో పడటం.

211. అకిల్బిష చరితా! - పై 210 వచనంలో విపులుడు మనస్సులో బాధపడటం చెప్పబడింది. నావలన ఏ తప్పు జరిగిందో అని. దానిని తీసివేయటానికి అకిల్బిషచరితా అనే ఈ సంబోధన ఉపయోగించబడింది.

**తే. నీవు రుచిఁ గాచు నప్పటి నిపుణ వృత్తి । నాకు నెఱిఁగింపకునికి యన్యాయముగఁ ద**
**లంచిరో? లేక దానిఁ గల్మషము గాఁగ । నేను దలఁచిన శాప మీ నెట్లు నీకు? 212**

**ప్రతిపదార్థం:** నీవు; రుచిన్; కాచు= రక్షించు; అప్పటి= వేళ; నిపుణవృత్తిన్= నైపుణ్యంతో - నేర్పుతో; నాకున్; ఎఱిఁగింపక+ ఉనికి= తెలుపకపోవటం; అన్యాయముగన్= న్యాయం కాదని; తలంచిరో?= అనుకొన్నట్లున్నారేమో! లేక; దానిన్= నీవు చేసిన పనిని; నేను; కల్మషముకాఁగన్= పాపమని; తలఁచినన్= అనుకొంటే; నీకున్; ఎట్లున్= ఏ విధంగానైనా సరే; శాపమున్= శాపాన్ని; ఈను= ఇవ్వను (ఇచ్చేవాడినే).

**తాత్పర్యం:** నీవు నైపుణ్యంతో రుచిని రక్షించిన విధానం (ఆమె శరీరంలో ప్రవేశించటం) నాకు చెప్పకపోవటం అన్యాయ మనుకొని ఉంటారు వారు. కాని, అది పాపమైతే నీకు ఎట్లాగైనా సరే శాప మిచ్చి ఉండేవాడినే కదా!

**విశేషం:** న్యాయం - సాంఘిక ధర్మం - దానిని ఉల్లంఘించడం అన్యాయం.

ధర్మం : సకల ప్రపంచానికీ, భగవంతుడికీ, తనకూ ఉన్న సంబంధం. ఇది ఆత్మ ధర్మం.

కనుకనే సామాజిక ధర్మం యొక్క ఉల్లంఘనం - తాను గురు భార్యా శరీరంలో ప్రవేశించిన విషయం గురువుగారికి చెప్పకపోవటం - చేయటం. కానీ ఆత్మ ధర్మోల్లంఘనం కాదు. కాబట్టి పాపం లేదు. ఇందుకని కవి 'కల్మషముగా॰గ' - గురువనుకోలేదు.

**వ. అప్పని పాపంబు గాకుండ వరం బిచ్చితి నది మఱవు; మమ్మిథునంబు లహోరాత్రంబులు, నయ్యార్వురు ఋతువులు' అని పలికిన గురునిబోధనంబునకు నాశ్చర్యంబును బ్రసాదంబునకుఁ బ్రమోదంబునుం బొందు శిష్యునితో నతండు వెండియు. 213**

**ప్రతిపదార్థం:** ఆ+పని= ఆ కార్యం; పాపంబుకాక+ఉండన్= పాపం కాకుండా; వరంబున్; ఇచ్చితిని; అది; మఱవుము= మరిచిపొమ్ము; ఆ+మిథునంబులు= ఆ దంపతులు; అహః+రాత్రంబులు= పగలు, రేయి; ఆ+ఆర్వురు= ఆ ఆరుగురు; ఋతువులు= వసంతాది ఋతువులు; అని పలికిన గురుని; బోధనంబునకున్= జ్ఞానానికి; ఆశ్చర్యంబును; ప్రసాదంబునకున్= దయకు; ప్రమోదంబునున్= ఆనందం; పొందు శిష్యునితోన్; అతండు= గురువు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఆ పని పాపం కాకుండా వర మనుగ్రహిస్తున్నాను. దాని సంగతి మరిచిపొమ్ము. ఆ జంట రేయింపగళ్ళు ఆ యారుగురు ఋతువులు' అని చెప్పిన గురువుగారి జ్ఞానానికీ, వర మనుగ్రహించిన దయకూ సంతోషిస్తున్న శిష్యుడితో గురు వింకా అంటున్నాడు.

**విశేషం:** ఆదిపర్వంలో ఉదంకుడి కథలో కూడా ఈ విషయమే వస్తుంది. "సిత+అసిత తంతు సంతాన పటంబు ననునయించువారి నిద్దఱ స్త్రీలను, ద్వాదశ+అర చక్రంబుఁ బరివర్తించుచున్నవారి నార్వురఁ గుమారులను" 1-117.

దీన్ని వివరిస్తూ 118వ పద్యంలో - సిత తంతువు = తెల్లదారం, అసితతంతువు= నల్లదారంతో నేసే వస్త్రం - పగలు రేయి, అనీ, ఆర్వురు కుమారులు 6 అరలున్న చక్రం - 6 ఋతువుల కాలచక్రమనీ - చెప్పాడు కవి. రెంటినీ పోల్చి చూచుకొనవచ్చును.

**తే. దినము, రాత్రియు, ఋతువులు, మనుజు చేయు । సుకృతమును దుష్కృతంబును జూచుచుండుఁ**
**గాని, యెంత రహస్యపుఁ గార్యమైన । నొరు లెఱుంగరు న న్నని యునికి మోస.' 214**

**ప్రతిపదార్థం:** దినము= పగలు; రాత్రియున్= రాత్రీ; ఋతువులు; మనుజుచేయు= మనిషి చేసే; సు+కృతమును= మంచిపని; దుస్+కృతంబును= చెడ్డపనీ; చూచుచున్+ఉండున్= చూస్తూ ఉంటాయి; కాని; ఎంత= ఎట్లాంటి; రహస్యపు కార్యము= రహస్యపు పని; ఐనన్= అయినా; నన్నున్= చేస్తున్న నన్ను; ఒరులు= ఇతరులు; ఎఱుంగరు= తెలిసికొనలేరు; అని= అనుకొంటూ; ఉనికి= ఉండుట; మోస= మోసం.

**తాత్పర్యం:** రేయింబవళ్ళు, ఋతువులు - మనిషి చేసే మంచిపనీ చెడ్డపనీ చూస్తూ ఉంటాయి. కాని నేను చేస్తున్న ఈ రహస్యకార్యం ఎవరూ చూడటం లేదనుకొంటే మోసపోతావు సుమా!

**విశేషం:** ఇది చాలా గొప్ప విషయం. మనిషి ప్రకృతినుండి వస్తున్నాడు. తనకంటె అది పెద్దది. కనుక దాని కళ్ళకు దాని

సంతానం మనిషి గంతలు కట్టలేడు. ఇది ఆనాటి మనిషిభావన. నే డది పోవటం వలననే అనేక రకాల అన్యాయాలు జరుగుతున్నాయి.

ఇట్లాగే దుష్యంతోపాఖ్యానంలోనూ శకుంతల దుష్యంతుడితో అంటుంది. పోల్చి చూచుకొనవచ్చును.

**వ. అనిన మఱియును. 215**

**తాత్పర్యం:** అని ఇంకా.

**క. 'స్త్రీ రక్ష సూక్ష్మ మీ వ । ట్లేరూపున నైన వంశహీనత మమ్ముం**
**జేరక యుండం దగఁ బరి । హారము సేసి; తది యేల యవగుణ మయ్యెన్? 216**

**ప్రతిపదార్థం:** స్త్రీ రక్ష= స్త్రీని కాపాడటం; సూక్ష్మము= కష్టం; ఈవు= నీవు; అట్లు= ఆ విధంగా; ఏ రూపునన్+ఐనన్= ఏ విధంగానైనా; మమ్మున్= మా దంపతులను; వంశహీనత= కులహీనత; చేరక+ఉండన్= చేరకుండా; తగన్= చక్కగా; పరిహారము= తొలగించటం; చేసితి= చేశావు; అది; ఏల= ఎందుకు; అవగుణము= చెడ్డగుణం, అయ్యెన్= ఐనది?

**తాత్పర్యం:** 'స్త్రీని కాపాడటం చాలా కష్టం. నీ వా విధంగా మాకు కులం తక్కువతనం రాకుండా కాపాడావు. అది మంచిదే తప్ప చెడ్డది కాదు.

**విశేషం:** కథ స్త్రీ రక్షణ కష్టమని చెప్పటం కొరకని వచ్చింది కనుక ఇది ముగింపు.

**వ. దాని తెఱంగు నా కెఱింగింపకున్న నేమి?' అనుపలుకు వలికి దేవశర్మ విపులు నుల్లం బూరడిల్లం జేసె. అవ్వధూవరులును, విపులుండును బుణ్యలోకంబులు వడసిరి, పాండవాగ్రజా! తెఱవల తెఱంగెఱింగించితి వారి రక్షించుటయు నిట్లరిదియై యుండు' నని చెప్పి భీష్ముండు. 217**

**ప్రతిపదార్థం:** దాని తెఱంగు= రక్షణ విషయ విధానం; నాకున్; ఎఱింగింపక= చెప్పక; ఉన్నన్= ఉన్నంత; ఏమి= ఏమైనది; అనుపలుకు= అన్నమాట; పలికి= చెప్పి; విపులు= విపులుడియొక్క; ఉల్లంబు= మనస్సును; ఊరడిల్లన్+చేసెన్= ఊరట పొందేటట్లు చేశాడు; ఆ వధూవరులును= ఆ భార్యాభర్తలు; విపులుండును; పుణ్యలోకంబులు= స్వర్గం; పడసిరి= పొందారు; పాండవ+అగ్రజా!= పాండవులలో పెద్దవాడా!; తెఱవల= స్త్రీల; తెఱంగున్= పద్ధతి; ఎఱింగించితిన్= చెప్పాను; వారిన్= వారిని; రక్షించుటయున్= కాపాడటం; ఇట్లు; అరిది= సూక్ష్మం; ఐ, ఉండునని చెప్పి భీష్ముండు.

**తాత్పర్యం:** రుచిని రక్షించిన విషయం చెప్పనంతమాత్రాన ఏమైనది? అని శిష్యుడిని ఊరడించాడు గురువు. గురువూ, అతడి భార్యా, శిష్యుడూ మరణించి పుణ్య లోకాలకు పోయారు. ధర్మరాజా! స్త్రీ సంగతి చెప్పాను. వారిని రక్షించటం కష్టమనీ చెప్పాను.' అని భీష్ముడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'పలువురు గ్రీడింతురు, భూ । వలయాధిప ! యరయ మంచివారును గల; ర**
**క్కులధర్మ సతులకతమున । నిల నిరపాయత్వ మొంది, యెసకం బెసఁగున్. 218**

**ప్రతిపదార్థం:** భూ+వలయ+అధిప= భూ చక్రమునకు రాజా!; పలువురు= అనేకులు; క్రీడింతురు= యథేచ్ఛగా తిరుగుతారు; అరయన్= జాగ్రత్తగా విచారిస్తే; మంచివారును= (స్త్రీలలో) మంచివారు కూడా; కలరు= ఉంటారు; ఆ+కుల ధర్మసతుల= మంచివంశంలో పుట్టి అగ్నిసాక్షిగా వివాహమైన పతివ్రతల; కతమునన్= కారణంచేత; ఇల= భూమి; నిర్+అపాయత్వమున్= అపాయం లేనితనమును; ఒంది= పొంది; ఎసకంబు+ఎసఁగున్= అతిశయంగా ప్రకాశిస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** 'రాజా! స్త్రీలలో పలువురు యథేచ్ఛగా సంచరిస్తారు. కాని, చూస్తే వారిలోనూ మంచివా రుంటారు సుమా! ఆ కులసతుల వలననే ఈ లోకం పచ్చగా ఉన్నది.

**క. పాతివ్రత్యము గలిగిన । నాతి యనఁగ దైవ మన జనస్తుత! వేఱే?**
**యాతత ధర్మార్థ సుఖ । ఖ్యాతులు, సద్భార్యవలనఁ గాదే కలుగున్.' 219**

**ప్రతిపదార్థం:** పాతివ్రత్యము= పతినే దైవంగా ఆరాధించే వ్రతం; కలిగిన; నాతి= స్త్రీ; అనఁగన్; దైవము= దేవుడు; అనన్, జనస్తుత!= లోకంతో నుతింపబడు రాజా!; వేఱే?= వేరా? కాదు ఒకరే (పతివ్రతే దైవం); ఆతత= విస్తారమైన; ధర్మ= ధర్మము; అర్థ= ధనం; సుఖ= సుఖము; ఖ్యాతులు= కీర్తులు; సత్=మంచి; భార్యవలనన్= పత్నివలననే; కాదే= కదా; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** జననుతుడవైన ధర్మజా! పతివ్రతకూ దైవానికీ భేదం లేదు. సద్భార్యవలననే పురుషార్థ సిద్ధి. ధర్మం, అర్థం, సుఖం, కీర్తి ఇవన్నీ పురుషుడికి ఆమెవలననే లభిస్తాయి కదా!'

**విశేషం:** ఇది స్త్రీ ప్రశంస. భారత మొక చిత్రమైన ఇతిహాసం. లోకంలో ఏ విధంగా మంచి చెడులు మనిషిని ఆశ్రయించుకొని ఉంటాయో అదే విధంగా స్త్రీలలో ఈ రెండు పార్శ్వాలు. అట్లాగే పురుషులలోనూ (ధర్మరాజు, దుర్యోధనుడు) ఉంటాయని చూపించటమే వైచిత్రి. కనుక రేయింబవళ్ళ వలె; స్త్రీలలో చెడువారివలె మంచివారూఉన్నారు. ఆ తల్లుల ఉనికి వలననే ఈ భూమి పచ్చగా ఉన్నది - అన్న వాక్యంతో చేసిన ముగింపు చాలా అద్భుతం.

### భీష్ముఁడు ధర్మజునకు గాంధర్వాది వివాహ పద్ధతులఁ దెలుఁ గెఱింగించుట (సం.13-41-1)

**వ. అనిన విని యజ్జనపతి జాహ్నవీనందనుతోఁ 'గన్యావరణ ప్రకారంబు విచారణీయం బైన కృత్యంబు; దాని తెఱం గెఱింగింపవే' యనుటయు, నతం డతని కిట్లనియె. 220**

**ప్రతిపదార్థం:** అనినన్‌విని; ఆ+జనపతి= ఆ నరేశ్వరుడైన ధర్మజుడు; జాహ్నవీ= గంగయొక్క; నందనుతోన్= కొడుకుతో; కన్యావరణ ప్రకారంబు= వధువు నెన్నుకొనే పద్ధతి; విచారణీయంబు= ఆలోచించదగ్గది ఐన; కృత్యంబు= పని; దాని తెఱంగు= దాని విధము, ఎఱింగింపవు+ఏ= తెల్పవా? అనుటయున్= అనిప్రశ్నించగా; అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మజునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పగా విన్న ఆ రాజు గంగకొడుకుతో అన్నాడు. 'వధువును ఎంచుకొనే పద్ధతి ఆలోచించదగ్గ విషయం. కనుక దాని సంగతి చెప్పుము' అనగా ఆయన ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. 'కులమును, శీలము, విద్యయు । గలవానిం బిలిచి , ప్రీతిఁ గన్నియ నీఁ గా**
**వలయు, నుదక ప్రదానా । కలితంబుగ; బ్రాహ్మ కర్మ గతి యిది యధిపా! 221**

**ప్రతిపదార్థం:** అధిపా!= (ధర్మాన్ని) అధిష్ఠించి పాలించేవాడా!; కులమును= మంచి సంసారంగల కుటుంబం; శీలమున్= పవిత్రమైన ప్రవర్తన, స్వభావం; విద్యయున్= చదువూ; కలవానిన్= ఉన్నవాడిని; పిలిచి= ఆహ్వానించి; ఉదక= నీరు; ప్రదాన= ఇచ్చుట; కలితంబుగన్= కూడుకొనేటట్లుగా; కన్నియన్= కూతురును; ప్రీతిన్= ప్రేమతో; ఈఁగాన్ వలయున్= ఇవ్వాలి; ఇది; బ్రాహ్మ= బ్రాహ్మణ లేదా వైదిక; కర్మ గతి= కర్మ విధానం.

**తాత్పర్యం:** మంచికులం, శీలం, విద్య ఉన్న వరుడిని చూచి సాదరంగా పిలిచి ప్రేమతో కన్యను ఉదకధారా పూర్వకంగా  కన్యాదానం చేయాలి. ఇది వైదిక కర్మ. వేదోక్తమైన బ్రాహ్మ వివాహం.

**ఆ. క్షాత్ర  మండ్రు బుధులు, గన్య పురుషుఁ గోర । నతఁడు గన్య మీఁద నాస సేయ,**
**నచల మగు పరస్పరానురాగము గని । ప్రమదమెసఁగఁ జేయు పరిణయంబు. 222**

**ప్రతిపదార్థం:** కన్య= వధువు; పురుషున్= వరుని; కోరన్= కోరితే; అతఁడున్= వరుడున్నూ; కన్య మీఁదన్= కన్నెపై; ఆస చేయన్= ఆశపడితే; అచలము+అగు= చలనంలేని; పరస్పర అనురాగమున్= ఒకరిపై ఒకరికి కల ప్రేమను; కని= చూచి; ప్రమదము= సంతోషం; ఎసఁగన్= ఎక్కువ కాగా; చేయు= చేసే; పరిణయంబు= వివాహం; బుధులు= పండితులు; క్షాత్రము= క్షత్రియ సంబంధమని; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** కన్య వరుడిని కోరుకొనటం, వరుడు కన్యను కోరుకొంటూ ఉండటంతో వారిరువురి నడుమ గట్టిదైన అనురాగం గోచరించటంవలన వారిరువురికి జరిగే వివాహం క్షాత్రవివాహం.

**విశేషం:** వధూవరులు ప్రేమించుకొనటం చూచి చేసిన వివాహం క్షాత్రం. ఇదే నేడు మనం గొప్పదిగా చెప్పుకొనే ప్రేమవివాహం. బ్రాహ్మం వైదిక కర్మ ప్రధానం. ఇది ప్రేమ ప్రధానం. ఇందులో వ్యక్తి ప్రాధాన్యం. అందులో కర్మప్రాధాన్యం. ఈ భేదం గమనించాలి. మనదేశంలో మొదటి దానికే ప్రాధాన్యమున్నది.

**క. కన్ను మనంబును దనిసిన । గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా**
**యన్ను నతని కిచ్చుట, వెల । వన్నుట యాసురము సూవె పౌరవముఖ్యా! 223**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా= పురువంశంలో శ్రేష్ఠుడా!; కన్ను; మనంబును= మనసు; తనిసిన= తృప్తిపడిన; కన్నియ= వధువు; ఎవ్వానిన్= ఎవరిని; కోరున్= కోరుకొంటుందో; ఆ అన్నున్= ఆ స్త్రీని; అతనికిన్= కోరినవాడికి; ఇచ్చుట= వివాహం చేయటం; గాంధర్వంబు= గంధర్వులకు సంబంధించింది కనుక దానికా పేరు; వెల పన్నుట= కట్నం కావాలనటం; ఆసురము= అసుర సంబంధమైనది; సూవె= సుమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! కన్నెను తాను కోరుకొన్న వాడి కిచ్చి చేసే వివాహం గాంధర్వం. కట్నంతో చేసికొనేది ఆసురం.

**విశేషం:** గంధర్వ అంశతో మనిషికి సౌందర్యం వస్తుంది. సంగీతం వస్తుంది. గంధర్వులు కళా - సౌందర్య ప్రియులు.

**క. బలిమి మెయి వరుఁడు గన్నెకుఁ । గలవారిం బొడిచి, కరము క్రౌర్యంబున, న**

**ప్పొలఁతుక దుఃఖింపఁగ, వా । రలు వొగులఁగఁ, దెచ్చికొనుట రాక్షసము నృపా! 224**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా! (నృ= మనుష్యులకు; ప= పాలకుడు); బలిమి మెయిన్= బలంతో; వరుఁడు= మగవాడు; కన్నెకున్; కలవారిన్= కన్యా బంధువులైన వారిని; పొడిచి= చంపి, జయించి; కరము= మిక్కిలి; క్రౌర్యంబునన్= క్రూరత్వంతో; ఆ పొలఁతుక= ఆ కన్య; దుఃఖింపఁగన్= ఏడ్వగా; వారలు= బంధువులు; పొగులఁగన్= ఏడ్వగా; తెచ్చికొనుట= బలవంతంగా లాక్కొనిరావటం; రాక్షసము= రాక్షసమన్న పేరు గల వివాహం;

**తాత్పర్యం:** రాజా! బలవంతంగా కన్నె నెత్తుకొనిపోయి క్రూరంగా ఆమె బంధువులను చంపి, వాళ్ళంతా ఏడుస్తూ ఉండగా చేసికొనే వివాహం రాక్షసం.

**వ. ఇట్లు సెప్పంబడునట్టి. 225**

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పబడే.

**ఆ. అయిదు దెఱఁగులందు నారయ మూఁడు వి । ధములు ధర్మకృతులు ధర్మపుత్ర!**

**యాసురంబు రాక్షసాహ్వయంబును ధర్మ । దూర సంవిధాన దూషితములు. 226**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్ర!= యముని కుమారుడా!; అయిదు తెఱఁగులందున్= అయిదు రకాల వివాహాలలో; ఆరయన్= విచారిస్తే; మూఁడు విధులు= మొదటి మూడు పద్ధతులు; ధర్మకృతులు= ధర్మ సహితాలైన విధులు; ఆసురంబున్; రాక్షస+ఆహ్వయంబును= ఆసుర, రాక్షసమన్న పేర్లు కలవి; ధర్మదూర= ధర్మానికి దూరంగా ఉండే; సంవిధాన= పద్ధతితో; దూషితములు= కలుషితాలు (ధర్మక్రమానికి దూరమైనవని తాత్పర్యం)

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ ఐదు రకాలలో మొదటి మూడు ధర్మవివాహాలు; మిగిలినవి రెండూ ధర్మానికి దూరంగా ఉండే పద్ధతితో కూడుకొన్నందున కలుషితాలు.

**విశేషం:** బహుశా రాక్షస - ఆసురములు అతి ప్రాచీన ఆటవిక జాతులలో ఆచారాలై ఉండవచ్చును. స్త్రీలు తక్కువగా ఉండే జాతులలో ఇట్లాంటి ఆచారాలు వచ్చే అవకాశ మెక్కువ కనుక ఇట్లాంటివి సంభవిస్తా యంటారు పరిశోధకులు.

**తే. మాతృ పితృ హీనయైనను, భ్రాతృరహిత । భావ మొందిన నబ్బాల పరిణయార్థ**

**వరణమున కర్హ గా దని, కురుకులాగ్ర । గణ్య! చెపుదురు పరిణయకల్పవిదులు. 227**

**ప్రతిపదార్థం:** కురుకుల=కౌరవకులంలో; అగ్రగణ్య!= మొదట ఎన్నదగ్గవాడా! మాతృ= తల్లి; పితృ= తండ్రి; హీనఐననున్= లేనిదైనా; భ్రాతృ= సోదర; రహిత భావము= లేనితనం; ఒందినన్= పొందితే; ఆ బాల= ఆ కన్య; పరిణయార్థ వరణమునకున్= వివాహం కొరకు ఎన్నికకు; అర్హ కాదు= తగినది కాదు; అని; పరిణయకల్ప= వివాహశాస్త్ర విధానం ; విదులు= తెలిసినవారు; చెపుదురు= చెప్పుతారు;

**తాత్పర్యం:** తల్లీ, తండ్రీ, అన్నా లేని పిల్లను వివాహానికి ఎన్నుకొనకూడదని వివాహశాస్త్రవేత్తలు చెప్పుతారు.

**విశేషం:** అట్లాంటి దురదృష్టవంతురాలు మెట్టినింటినీ అట్లాగే చేస్తుందన్న భావంతో ఈ నిషేధం వచ్చి ఉంటుంది.

**ఆ. ఆత్మజాతియందు, నవుల జాతులు రెంటఁ । గ్రమవివాహ మొప్పు బ్రాహ్మణునకు**
**ననఘ! శూద్రవనితయందు నాతని కప । త్యంబు గలిమి పాప మనియుఁ గలదు. 228**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణునకున్= విప్రకులంలో పుట్టిన వాడికి; ఆత్మ= తనయొక్క; జాతి యందున్= వర్ణంలో; అవులజాతులు రెంటన్= తరువాతి రెండు వర్ణాలలో (క్షత్రియ - వైశ్య జాతులలో); క్రమ= క్రమంగా - సక్రమంగా; వివాహము= పెండ్లి; ఒప్పున్= ఒప్పుతుంది; అనఘ!= పుణ్యాత్ముడా!; ఆతనికిన్= ఆ బ్రాహ్మణుడికి; శూద్రవనితయందున్= శూద్ర స్త్రీ వలన; అపత్యంబు= సంతానం; కలిమి= కలిగి ఉండటం; పాపము= సక్రమం కాదు; అనియున్= అని కూడా; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడు క్రమంగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణాలలోని కన్యలను వివాహం చేసికొనవచ్చును. కాని, శూద్రస్త్రీ నుండి సంతానం కనటం మాత్రం నిషేధం అని శాస్త్రం.

**తే. రాజునకు రాజవంశజ రమణి యైన । వెనుక వైశ్యవరించుట విహిత విధము**
**వైశ్యునకు శూద్రునకుఁ దమ వంశములన । పరిణయంబు గాఁదగు నరపాలవర్య! 229**

**ప్రతిపదార్థం:** నర= మానవులను; పాల= పాలించేవారిలో; వర్య!= గొప్పవాడా!; రాజునకున్= క్షత్రియుడికి; రాజవంశజ= రాజవంశంలో పుట్టిన; రమణి= పత్ని; ఐన వెనుకన్= ఐన తరువాత; వైశ్యన్= కోమటిస్త్రీని; వరించుట= వివాహం కావటం; విహిత= వేదంలో విధించబడిన; విధము= పద్ధతి; వైశ్యునకున్= కోమటికి; శూద్రునకున్= నాలుగవ జాతివాడికి; తమ= తమ తమ; వంశములన్+అ= వంశాలలోనే; పరిణయంబు= వివాహం; కాన్+తగున్= చేసికొనటం బాగు.

**తాత్పర్యం:** రాజుకు ముందు క్షత్రియ కన్యను ఆ తరువాత వైశ్యకన్యను వివాహం చేసికొనటం శాస్త్రం విధించిన కర్మ. వైశ్యుడికి, శూద్రుడికి తమ తమ కులాలలోనే వివాహం చేసికొనాలి. నీవు రాజువు గనుక ఈ నీతిని పాటించాలి.

**వ. రాజునకు, వైశ్యునకు శూద్రకన్యావరణంబు సేయుటయును గలిగియుండు' నని చెప్పిన విని యక్కొంతే యాగ్రజుండు శాంతనవుతో' బాహ్మణునకు శూద్రజాతి యందు భార్యా పరిగ్రహంబు సేయందగు నని విందును; అతనికి భార్యలు ముప్పురని నిర్దేశించితిరి. అది యెట్లొకో? యనుటయు నతం డమ్మహీపతి కిట్లనియె.230**

**ప్రతిపదార్థం:** రాజునకున్; వైశ్యునకున్; శూద్రకన్య= నాలుగవ జాతి కన్యను; వరణంబు చేయుటయునున్= వివాహం చేసికొనట మున్నూ; కలిగి ఉండున్= ఆచారమున్నది; అని; చెప్పినన్= చెప్పగా; విని; ఆ+కౌంతేయ+అగ్రజుండు= ఆ కుంతీనందనులలో పెద్దవాడు; శాంతనవుతోన్= శంతనమహారాజు కుమారుడితో; బ్రాహ్మణునకున్; శూద్రజాతి యందున్= నాలుగవజాతిలో; భార్యా పరిగ్రహంబు= భార్యగా గ్రహించటం; చేయన్+తగున్= చేయవచ్చును; అని విందును= అని వింటున్నాను; అతనికిన్= ఆ బ్రాహ్మణుడికి; భార్యలు= ముప్పురు; అని; నిర్దేశించితిరి= సూచించారు; అది+ ఎట్లు+ఒకో+అనుటయున్, అతండు= భీష్ముడు; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** రాజా! వైశ్యుడు శూద్రకన్యలను చేసికొనటమూ కద్దు' అని చెప్పగా విన్న ధర్మరా జన్నాడు; 'బ్రాహ్మణుడికి ముగ్గురే భార్య లన్నారు మీరు. మరి అతడు నాలుగవ జాతిలోను కన్యావరణం చేయవచ్చునని విన్నానే; ఇదెట్లాగా? అని అనగా భీష్మ డిట్లా చెప్పాడు.

**ఆ. అనఘ! విషమ మైన యట్టికార్యంబు వా । టిలినఁ జూచి, పెద్ద వలచి యైన**
**లోభమునను శూద్రఁ దా భార్యఁగాఁ గొను । విప్రుఁ డధికపాపవృత్తి గామి. 231**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విషమము+ఐన= తీవ్రమైన (అక్రమమైన); అట్టి కార్యంబు= అటువంటి ఘటన; పాటిలినన్= కలిగితే; చూచి; పెద్ద= గొప్పగా; వలచిఐనన్= ప్రేమించి అయినా; లోభమునను= పినాసితనంతోనైనా; శూద్రన్= శూద్ర స్త్రీని; తాన్= తాను; భార్యన్+కాన్= పెండ్లాముగా; విప్రుఁడు= బ్రాహ్మణుడు; కొనున్= గ్రహిస్తాడు; అధిక= మిక్కిలి; పాపవృత్తి= పాపపు నడవడి; కామిన్= కానందున.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! ఏదైనా దుర్ఘటనవలన కాని, ప్రేమించి కానీ, లోభంవలన గానీ విప్రుడు నాలుగవ జాతి పిల్లను పెండ్లిచేసికొనవచ్చును. అది మిక్కిలి పాపపునడవడి కానందువలన.

**వ. అవ్విధంబు నొక్కొక్క యెడం గల్గి దూష్యంబు గాక చెల్లునని చెప్పి వెండియు. 232**

**ప్రతిపదార్థం:** ఆ+విధంబును= ఆ పద్ధతికూడ; ఒక్క+ఒక్క= ఒక్కొక్క; ఎడన్= సందర్భంలో; కల్గి= ఏర్పడి; దూష్యంబు కాక= నింద్యం కాకుండా; చెల్లును= చెల్లుబాటౌతుంది; అని చెప్పి; వెండియున్= మరల

**తాత్పర్యం:** ఆ పద్ధతికూడా ఒక్కొక్క సందర్భంలో నింద్యంగాకపోతుంది' అని మరలా ఇట్లా అన్నాడు.

**క. 'ధరణీసుర, రాజ, వణిక్ । తరుణులకును విప్రువలనఁ గల్గిన తనయుల్**
**కురునాథా! ద్విజు లనఁగా । బరఁగుదు; రది లేదు శూద్రభామ సుతులకున్.' 233**

**ప్రతిపదార్థం:** విప్రువలనన్= బ్రాహ్మణుడి వలన; ధరణీసుర= బ్రాహ్మణ, రాజ= క్షత్రియ; వణిక్= కోమటి; తరుణులకును= స్త్రీలకు; కల్గిన; తనయుల్= కొడుకులు; కురునాథా!= కురువంశ శ్రేష్ఠుడా!; ద్విజులు= రెండు జన్మలు కలవారు; అనఁగాన్= అన్న పేరున; పరఁగుదురు= ప్రకాశిస్తారు; శూద్రభామ= శూద్ర స్త్రీ యొక్క; సుతులకున్= కొడుకులకు; అది= బ్రాహ్మణత్వం; లేదు.

**తాత్పర్యం:** బ్రాహ్మణునకు మొదటి మూడు కులాలలో పుట్టిన సంతానం బ్రాహ్మణులుగానే పిలువబడుతున్నారు. శూద్ర స్త్రీకి పుట్టిన సంతానం మాత్రం అట్లా లేదు.'

**వ. అనవుడు ధర్మపుత్త్రుండు 'భూసురుని వలన నాలుగు జాతుల నాతులకును బ్రసూతులైన సుతులకును నతని ధనంబునందు భాగం బెట్లుండు?' నని యడిగిన. 234**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ధర్మపుత్త్రుండు; భూసురునివలనన్= భూలోకంలో దేవత - బ్రాహ్మణుడి వలన; నాలుగుజాతుల; నాతులకును= స్త్రీలకు; ప్రసూతులు+ఐన= పుట్టినవారైన; సుతులకును= కొడుకులకు; అతని ధనంబునందున్; భాగంబు; ఎట్లు+ఉండున్; అని అడిగినన్.

**తాత్పర్యం:** అనిన తరువాత ధర్మరాజు బ్రాహ్మణుడివలన నాలుగు జాతుల స్త్రీలకు సంతానం కలిగితే వారందరికి తండ్రి ఆస్తిపాస్తు లెట్లా పంచాలి?' అని ప్రశ్నించాడు.

**సీ. 'విను, జనమేజయ మనుజేంద్ర! యమ్మేది । నీశ్వరుతో భీష్ముఁ డిట్టులనియెఁ;**
**బ్రాహ్మణు నర్థంబు పది పాళ్ళుగాఁ జేయ । నాలుగు బ్రాహ్మణి నందనుండు,**
**క్షత్రియాత్మజుఁడు భాగములు మూఁడును, వైశ్య । తనయుండు రెండు, శూద్రాతనూజుఁ**
**డొక పాలు గొనుటకు నొడయులు; తుదివాఁడు । వలచి పెట్టఁగఁ గొనువాఁడు గాని**

**తే. తండ్రితోడఁ ద్రివిధ తనయులతోడను । దనదు భాగమునకుఁ బెనఁగి కొనఁగఁ**
**దగదు వారలకును దగదు నిర్దయతఁ ద । ద్దశమభాగ మీక తార కుడువ.' 235**

**ప్రతిపదార్థం:** జనమేజయ మనుజ+ఇంద్ర!= జనమేజయ మహారాజా! ఆ మేదినీ+ఈశ్వరుతోన్= ఆ రాజుతో, ధర్మజునితో; భీష్ముఁడు; ఇట్టులు; అనియెన్; బ్రాహ్మణు+అర్థంబు= బ్రాహ్మణుడి ధనం; పదిపాళ్ళుగాన్+చేయన్= పది భాగాలుగా చేస్తే; బ్రాహ్మణి నందనుండు= బ్రాహ్మణ స్త్రీ కొడుకు; నాలుగు= నాల్గుభాగాలు; క్షత్రియ+ఆత్మజుఁడు= క్షత్రియస్త్రీ కొడుకు; భాగములు మూఁడును= మూడుభాగములు; వైశ్య తనయుఁడు= వైశ్య స్త్రీ కొడుకు; రెండు= రెండుభాగలు; శూద్రా తనూజుఁ డు= శూద్ర స్త్రీ కొడుకు; ఒక పాలు; కొనుటకున్= పై విధంగా పంచుకొనటానికి; ఒడయులు= అర్హులు; తుదివాఁడు= శూద్రసంతానం; వలచి= ప్రేమించి; పెట్టఁగన్= పెట్టితే; కొనువాఁడుకాని= తీసికొనేవాడే తప్ప; తండ్రితోడన్= తండ్రితో; త్రివిధ= ఆ ముగ్గురు; తనయులతోడను= కొడుకులతో; తనదు= తనయొక్క; భాగమునకున్= పాలుకు; పెనఁగి= పెనగులాడి; కొనఁగన్= తీసికొనటం; తగదు= న్యాయం కాదు; వారలకును= తండ్రికి, ఆ ముగ్గురు మిగిలిన కొడుకులకు; నిర్దయతన్= దయలేకుండా; తత్= ఆ శూద్రునకు పోవలసిన; దశమ= పదవ; భాగము= పాలు; ఈక=ఇవ్వకుండా; తార= తామే; కుడువన్= తినటం; తగదు= న్యాయం కాదు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడి ఆస్తి పది భాగాలు చేసి అందులో నాలుగుపాళ్ళు బ్రాహ్మణ స్త్రీ కొడుకునకు, మూడు పాళ్ళు క్షత్రియ స్త్రీ సంతానానికి, రెండు పాళ్ళు వైశ్య స్త్రీ కొడుకుకు, ఒక పాలు శూద్ర స్త్రీ సంతానానికీ ఇవ్వాలి. ఇందులో నాలుగోజాతివాడు ప్రేమించి పెట్టితే తినేవాడే కాని వా రివ్వకపోతే పోట్లాడకూడదు. అట్లాగే తండ్రి, ఆ మిగిలిన ముగ్గురు కొడుకులు కూడా పదవ పాలు వాడికి ఇవ్వాలి. తామే అంతా దయమాలి తినకూడదు'.

**విశేషం:** ఈ పద్యం ఒక చారిత్రక సామాజిక స్థితికి అద్దం పడుతున్నది. క్రీ.పూ. 2,3 వేల సంవత్సరాల క్రితం పరిస్థితి ఇది. ఈ విభాగంలో సమత్వం లేదు.

**వ. అనిన విని పాండవాగ్రజుండు 'దక్కిన వర్ణంబులవారి ధనంబు లెట్లుగాఁగలయవి సెప్పు' మనుటయు ననిమిష నదీనందనుం డతని కిట్లనియె. 236**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; పాండవ అగ్రజుండు= పాండవులలో ముందు పుట్టినవాడు; తక్కిన వర్ణంబులవారి ధనంబులు ఎట్లు కాగలయవి సెప్పుము; అనుటయున్= అనగా; అనిమిషనదీ= దేవతలనది యొక్క; నందనుండు= కొడుకు; అతనికిన్= ఆ ధర్మజుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు;

**తాత్పర్యం:** అని చెప్పగా విన్న ధర్మరాజు 'తక్కిన వర్ణాలవారి ధన విభాగం ఎట్లా ఉంటుంది? చెప్పు'మంటే భీష్ము డిట్లా అన్నాడు.

**విశేషం:** అనిమిష - న+నిమిష (అనిమిష)= రెప్పకొట్టటం; లేనివాడు, కళ్ళుమూత పడటం లేనివాడు= దేవత.

**సీ. 'క్షత్రియు ధనము భాగము లెనిమిది సేయ, । భూపాల వైశ్యుల పుత్రికలకు,**
**శూద్ర పుత్రికకును, సుతులైన యట్టి వా । రోలి నాలుగు, మూఁడు నొక్కటియును,**
**గొనువారు పాళ్ళులు, కురుముఖ్య! వైశ్యుని । సొమ్మున వైశ్యకు సూనుఁ డైన**
**యతఁడు నాలుగును శూద్రాత్మజుఁ డొకటియుఁ । గాఁగ నైదుగ నంశకములు గొంద్రు**

**తే. పెనఁగి కొనఁగఁ దగమి విన శూద్ర కొడుకున । కెందుఁ గలదు; వాని కీక కుడువఁ**
**గామియును సమంబ యేమి జాతులవారి । కయిన నిట్లు దెలియు మంశకృతులు. 237**

**ప్రతిపదార్థం:** క్షత్రియు ధనమున్= క్షత్రియుడి ధనం; ఎనిమిది; భాగములు; చేయన్= చేస్తే; భూపాల వైశ్యుల= రాజుల కోమటులయొక్క; పుత్రికలకున్= కూతుండ్రకు; శూద్రపుత్రికకును; సుతులైన+అట్టివారు= కొడుకులుగా పుట్టినట్టివారికి; ఓలిన్= క్రమంగా; నాలుగు, మూఁడు, ఒక్కటియును; పాళ్ళులు= పాళ్ళుగా; కొనువారు= తీసికొనదగినవారు; కురుముఖ్య!= కురువంశ శ్రేష్ఠుడా!; వైశ్యుని సొమ్మునన్= వైశ్యుడి సొమ్ములో; వైశ్యకున్= వైశ్య స్త్రీకి; సూనుఁడు= కొడుకు; ఐన అతఁడు= అయినవాడు; నాలుగును; శూద్ర+ఆత్మజుఁడు= శూద్రస్త్రీ కొడుకు; ఒకటియున్; కాఁగన్= కాగా; ఐదుగన్= ఐదుగునట్లుగా; అంశకములు= పాళ్ళు; కొంద్రు= తీసికొంటారు; శూద్ర కొడుకునకున్= శూద్రస్త్రీ కుమారునకు; పెనఁగి= పోట్లాడి; కొనఁగన్= ఆస్తి తీసికొనటం; తగమి= న్యాయం కాకపోవటం; విను; ఎందున్= ఎక్కడైనా; కలదు= ఉన్నది; వానికిన్= శూద్రుడికి; ఈక= ఇవ్వక; కుడువన్= తినటం; కామియును= కాకపోవటం; సమంబ= సమానమే; ఏమిజాతుల వారికిన్= ఏ జాతివారికైనా; అంశకృతులు= భాగాలు పంచటం; ఇట్లు= ఇంతేనని; తెలియుము= తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** క్షత్రియుడి ఆస్తి ఎనిమిది భాగాలుచేసి క్షత్రియ స్త్రీ కొడుకునకు నాల్గు, వైశ్య స్త్రీ కొడుకునకు మూడు, శూద్ర స్త్రీ కొడుకునకు ఒకపాలు; ఇది పాళ్ళ పంపకం. వైశ్యుడి ధనం ఐదు భాగాలు చేసి, కోమటి స్త్రీ కొడుకునకు నాల్గు; శూద్ర స్త్రీ కొడుకునకు ఒక పాలుగా పంచుకొనాలి. శూద్ర స్త్రీ కొడుకు పోట్లాడి తీసికొనకూడదు. వారూ ఇతడికి ఇవ్వకుండా తినకూడదు అనటం సాధారణాంశమే.

**తే. ఆలు నిజజాతియందు, శూద్రాలి కెల్ల । సమములుగఁ బంచికొంద్రు భాగముల శూద్ర**
**తనయు లెందఱు గల్గినఁ దండ్రి ధనము । ధర్మసంగ్రహతత్పర! ధర్మతనయ!। 238**

**ప్రతిపదార్థం:** ధర్మ= ధర్మముయొక్క; సంగ్రహ సారాంశం గ్రహించటంలో; తత్పర!= భక్తికలవాడా!; ధర్మతనయ!= ధర్మజా!; శూద్ర+ఆలికిన్+ఎల్లన్= శూద్ర సమూహానికి; ఆలు= భార్య; నిజ= తనయొక్క; జాతి= వర్గం; అందున్= అందులోనే; తండ్రి ధనమున్= శూద్ర తండ్రి డబ్బు; తనయులు= కొడుకులు; ఎందఱు= ఎంతమంది; కల్గినన్= ఉన్నా; భాగములన్= పాళ్ళను; సమములుగన్= సమానంగా; పంచి కొంద్రు= పంచుకొంటారు.

**తాత్పర్యం:** ధర్మసారాంశం వినటంలో ఆసక్తి కలవాడా! ధర్మరాజా! శూద్రుడు మాత్రం వారి జాతులలోనే వివాహం చేసికొనాలి. వాడి ఆస్తిని కొడుకులంతా సమంగా పంచుకొంటారు.'

**వ. అని నిర్దేశించి వెండియు. 239**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; నిర్దేశించి= ఏర్పరచి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏర్పరచి ఇంకా (ఇట్లా తెలిపాడు)

**క. 'విను హవ్య కవ్యములు మ । జ్జన భోజనములును, విప్రజాతి వనిత దాఁ**
**బనిసేయ నడపునది, య । ప్పనులకుఁ బెఱసతులు గామి బ్రాహ్మణుఁడు నృపా!' 240**

**ప్రతిపదార్థం:** నృపా!= మానవులను పాలించేవాడా!; విను; బ్రాహ్మణుఁడు= నాలుగు కులాలనుండి వివాహం చేసికొనటానికి అర్హత ఉన్నవాడు; తాన్= తాను; విప్రజాతి వనితన్= బ్రాహ్మణ స్త్రీని; హవ్య= దేవతలకర్పించేది; కవ్యములు= పితృదేవతల కర్పించేది; మజ్జన= స్నానం; భోజనములు= ఆహారం పక్వంచేయటం - వడ్డించటం; పనిచేయన్= ఈ పనులు చేయటానికి; నడపునది= ఆజ్ఞాపించాలి; ఆ+పనులకున్= ఆ పనులను చేయటానికి; పెఱ= మిగిలిన మూడు వర్ణాల; సతులు= భార్యలు; కామి= అర్హతలేనివారు కావున.

**తాత్పర్యం:** వైదిక కర్మలు, హవ్య, కవ్యాల అర్పణం; తనకు స్నాన, భోజనాదులు ఏర్పాటు చేసే అర్హత ఒక్క బ్రాహ్మణ స్త్రీకే ఉన్నది. ఇతర భార్యల కీ అర్హత లేదు. కనుక బ్రాహ్మణభర్త తన బ్రాహ్మణపత్నివల్లనే ఈ పనులు అమలుపరచాలి.

### భీష్ముఁడు ధర్మజున కౌరసాది పుత్త్రభేదంబు తెఱంగు సెప్పుట (సం.13.49-1)

**వ. అనిన విని యుధిష్ఠిరుండు. 241**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు.

**క. 'కొడుకులు బహువిధు లని యె । ప్పుడు విందును; వారి తెఱఁగు పురుషవరా! యే**
**ర్పడఁ జెప్పవలయు నా' కని । యడిగిన, గాంగేయుఁ డిట్టులను నాతనితోన్. 242**

**ప్రతిపదార్థం:** కొడుకులు; బహు= అనేక; విధులు= విధాలు; అని; ఎప్పుడున్= నిత్యం; విందును; పురుష వరా!= మానవులలో శ్రేష్ఠుడా!; నాకున్= నాకు; వారి తెఱఁగు= వారి విధానం; ఏర్పడన్= దేనికదిగా; స్పష్టంగా; చెప్పన్ వలయున్= వివరించాలి; అని అడిగినన్; గాంగేయుఁడు= గంగ కొడుకు - భీష్ముడు; ఆతనితోన్; ఇట్టులు+అనున్= ఇట్లు అన్నాడు.

**తాత్పర్యం:** 'పురుష శ్రేష్ఠుడా! కుమారు లనేకవిధా లంటారు కదా! నాకు వివరించి చెప్పుము.' అని అడుగగా భీష్ముడిట్లా అంటున్నాడు.

**విశేషం:** పురుషుడు; పురము= శరీరం; అందులో శయనించేవాడు= ఉండేవాడు; జీవాత్మ. ఈ జీవాత్మ పరమాత్మ అయిన సర్వేశ్వరుడి స్వరూపుడు.

**తే. పరమసంస్కృత యగు నాత్మభార్యయందు । ధర్మవిధిఁ గలిగించిన తనయుఁ డనఁగఁ**
**దాన యౌరసుఁ డను నభిధాన మొప్పఁ । బరఁగు నుత్తముఁ డాతఁడు ప్రథముఁ డధిప! 243**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; పరమ సంస్కృత+అగు= మంచి సంస్కారం గలదైన; ఆత్మ భార్యయందున్= తన భార్య ఆధారంగా; ధర్మవిధిన్= ధర్మబద్ధంగా; కలిగించిన= పుట్టించిన; తనయుఁడు+అనఁగన్= కొడుకు అనగా; తాను+అ= తానే; ఔరసుఁడు= ఉరస్సు - ఆత్మనుండి పుట్టినవాడు; అను= అన్న; అభిధానము= పేరు; ఒప్పన్= వెలయగా; పరఁగు= కీర్తికల; ఉత్తముఁడు= శ్రేష్ఠుడు; ఆతఁడు= అతడు; ప్రథముఁడు= మొదటివాడు.

**తాత్పర్యం:** ధర్మపత్నియందు ధర్మబద్ధంగా పుట్టిన కొడుకు ఔరసుడు. మిగిలిన కొడుకులందరికంటె ఉత్తముడితడే. ఇతడే మొదటివాడు.

**విశేషం:** ఔరసుఁడు= గుండె- హృదయం నుండి పుట్టినవాడు. తండ్రి తన ఆత్మను భార్యాగర్భంలో నిక్షేపించి కన్నకొడుకు 'అంగాత్- అంగాత్ సంభవసి' - తండ్రి ప్రతి అవయవం నుండి పుట్టిన కొడుకు ఔరసుడు. దీపం నుండి మరొక దీపం పుట్టినట్లు తండ్రియే భార్యాగర్భం ద్వారా కొడుకై పుట్టుతున్నాడు. ఇందుకే భారతీయ మహిళ ఒక దృష్టితో భార్య - ప్రేయసి, మరొక దృష్టితో తల్లి. ఈ భార్యాత్వం, మాతృత్వం కలబోసి చిత్రించిన ప్రతిమలే మన స్త్రీ శిల్పాలు. కావాలనుకొన్న సంతానం ఔరసుడు. పుత్రకామేష్టి అంటే ఇదే.

**తే. తగిన వరునకు నిచ్చిన తనదు దుహితఁ। గనిన పుత్త్రు నయ్యిరువురు వినఁగ నియ్య**
**కొనఁగ వీఁడు నా కొడు కనఁ గొడుకు వాని। పేరు పుత్త్రికా పుత్త్రుండు పౌరవేంద్ర! 244**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర!= పురువంశంలో గొప్పవాడా!; తగిన= అర్హుడైన; వరునకున్= పెండ్లి కొడుకునకు; ఇచ్చిన= వివాహం చేసిన; తనదు= తనయొక్క; దుహిత= కూతురు; కనిన= కన్న; పుత్రున్= కొడుకును; ఆ+ఇరువురు= కూతురు, అల్లుడు ఇద్దరు; వినఁగన్= వింటూ ఉండగా; ఇయ్యకొనఁగన్= అంగీకరిస్తే; వీఁడు= మనుమడు; నా కొడుకు; అనన్= అనగా; కొడుకు= కుమారుడు ఔతాడు; వానిపేరు; పుత్రికా పుత్రుండు= కూతురు కొడుకు దౌహిత్రుడు.

**తాత్పర్యం:** పురువంశ రాజా! మంచివాని కిచ్చి పెండ్లి చేసిన తనకూతురు కొడుకును - వాళ్ళిద్దరూ అంగీకరిస్తే దత్తత చేసికొనగా - ఆ దౌహిత్రుడు కూడా కొడుకే.

**విశేషం:** కొడుకులు లేని తండ్రి తనకు పితృక్రియలు ఎవరో ఒకరు చేయాలి కనుక దౌహిత్రుడిని దత్తత చేసికొనవచ్చును. వాడు పుత్రసమానుడై ఉత్తరక్రియలు నిర్వహించే హక్కు పొందుతున్నాడు.

**తే. ధర్మపథమునఁ బనిచినఁ దనదుపత్ని। యర్హపురుష సంగతిఁ గన్న యాత్మజుండు**
**క్షేత్రజుం డనఁగా నిజపుత్ర భావ। మొందు ధర్మప్రపంచాభినందితాత్మ! 245**

**ప్రతిపదార్థం:** ధర్మ ప్రపంచ= ధార్మికవర్గముచేత; అభి= మిక్కిలి; నందిత+ఆత్మ!= ఆనందించిన హృదయం కలవాడా!; ధర్మపథమునన్= ధర్మమార్గంలో; పనిచిన= ఆనతిచ్చిన; తనదు= తన; పత్ని= భార్య; అర్హ= తగిన; పురుష= మగవాడి; సంగతిన్= రతిద్వారా; కన్న; ఆత్మజుండు= కొడుకు; క్షేత్రజుండు= భార్యకొడుకు (క్షేత్రం - భార్య); అనఁగాన్; నిజ= తనయొక్క; పుత్రభావము= పుత్రత్వం; ఒందున్= పొందును.

**తాత్పర్యం:** ధర్మమార్గంలో తన భార్యను తానే తగిన పురుషుడి కర్పిస్తే ఆమె కన్నసంతానం కూడా తనకు కొడుకే.

**విశేషం:** ఆ నాటికి ఈ ధర్మం ఉండేది. మనుస్మృతి మొదలైన గ్రంథాలలో ఈ విషయం చెప్పబడింది. ధృతరాష్ట్ర- పాండు రాజులు ఈ ధర్మదృష్టితోనే వ్యాసుడి ద్వారా జన్మించారు. కనుక పద్యంలో అర్హ అంటే వ్యాసుడివంటివాడని. కేవలం

ధర్మదృష్టితోనే సంగమం జరగాలి తప్ప అన్యంకాదు. ఈనాడు "వీర్యనిధి" - "నాళికాశిశువులు" ఉన్నట్లు ఆనా డవకాశం లేదు. కాని, దీనికంటె అది మహోత్తమం.

**క. జననీ జనకు లుదక దా । న నిరూఢము గాఁగ నిచ్చినం బడసిన నం**

**దనుపేరు దత్రిముం డని । ముని జనములు సెప్పుదురు విమోహవిదూరా! 246**

**ప్రతిపదార్థం:** వి+మోహ= మిక్కిలి విషయాసక్తికి; విదూరా!= దూరంగా ఉండేవాడా!; జననీ జనకులు= తల్లి దండ్రులు; ఉదక= నీటి యొక్క; దాన= దానముచే; నిరూఢముకాఁగన్= ప్రసిద్ధంగా; ఇచ్చినన్= ఇస్తే; పడసిన=పొందిన; నందను పేరు= కొడుకుపేరు; దత్రిముండు; అని; మునిజనములు= ముని జనులు; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** జలధారాపూర్వకంగా తల్లిదండ్రులు దానం చేసిన కొడుకుపేరు దత్రిముడు.

**విశేషం:** కొన్ని ప్రతులలో దత్తకుఁడు - అని ఉన్నది. (దత్తత చేసికొనబడ్డవాడు పెంపుడు కొడుకు). దత్రిముఁడు= ధారా పూర్వకంగా దానం చేయబడ్డ కొడుకు కనుక తల్లిదండ్రులు ఇష్టంతో దానం చేయటం చెప్పబడింది.

**ఆ. తల్లిఁ దండ్రిఁ బాసి తనయంత నెచ్చట । నేనిఁ దిరుగునట్టి వానిఁ జూచి,**

**యాత్మసదృశుఁడైన యాత్మజుఁ జేసి కొ । నంగఁ గృత్రిముం డనంగఁ బరఁగు. 247**

**ప్రతిపదార్థం:** తల్లిన్, తండ్రిన్= ఇద్దరినీ; పాసి= పోగొట్టుకొని; తన అంతన్= తనంత; ఎచ్చటనేనిన్= ఎక్కడైనా; తిరుగునట్టివానిన్; చూచి; ఆత్మసదృశుఁడు= తనకు ప్రీతిపాత్రుడు ఐన; ఆత్మజున్= కొడుకుగా; చేసికొనంగన్= చేసికొంటే; కృత్రిముండు= కృత్రిమంగా కొడుకుగా గ్రహించబడినవాడు కనుక; కృత్రిముండు; అనంగన్= అనునట్టి పేరుతో; పరఁగున్= ప్రసిద్ధుడౌతాడు.

**తాత్పర్యం:** తల్లిదండ్రులను పోగొట్టుకొని ఒంటరిగా తిరిగేవాడిని తన కిష్టమైన కొడుకుగా చేసికొంటే వాడిపేరు కృత్రిముడు.

**తే. ఎవ్వనికిఁ బుట్టె నేనియు నెఱుఁగకుండ । నొక్కనికిఁ బరభార్యయం దుదయ మైన**

**సూనుఁ డా భార్య గలవాని సుతుఁడు, వాని । పేరు 'గూఢజుఁ' డనఁబడుఁ గౌరవేంద్ర! 248**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కురువంశ రాజా!; ఒక్కనికిన్= ఒక్కడికి; పరభార్యయందున్= ఇతరుడి భార్యకు; ఉదయము+ఐన= పుట్టిన; సూనుఁడు= కొడుకు; ఎఱుఁగకుండన్= తెలియకుండా; ఎవ్వనికిన్= ఎవడికైనా; పుట్టెనేనియున్= పుట్టినా; ఆ భార్య గలవాని సుతుఁడు= ఆ భర్త కొడుకు; వానిపేరు; గూఢజుఁడు= రహస్యంగా పుట్టినవాడు; అనఁబడున్= పదిమందితో చెప్పుకొనబడేవాడు.

**తాత్పర్యం:** తెలియకుండా ఎవడికి పుట్టినా, పరభార్యకు పుట్టినవాడు ఆ భార్య గలవాడి కొడుకే. వాడిపేరు గూఢజుడు.

**క. విను తల్లిదండ్రు లొల్లక । తనయుని విడిచిన నొరుండు తనకుఁ దనయుఁగాఁ**

**గొని నెమ్మి నడప నపవి । ద్ధనాముఁ డగువాఁడు విమలధర్మప్రవణా! 249**

**ప్రతిపదార్థం:** విమల= నిర్మలమైన; ధర్మప్రవణా!= ధర్మమునం దాసక్తి కలవాడా!; విను; తల్లిదండ్రులు; ఒల్లక= ఇష్టపడక; విడిచిన= విడిచిపెట్టిన; తనయునిన్= కొడుకును; ఒరుండు= మరొకడు; తనకున్; తనయుకాన్+కొని= కొడుకుగా స్వీకరించి; నెమ్మిన్= సంతోషంతో; నడపన్= పోషిస్తే; వాఁడు= అతడు; అపవిద్ధనాముఁడు= అపవిద్ధుడన్న పేరు గలవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** మంచి ధర్మాలు వినటంలో భక్తిశ్రద్ధలు కలవాడా! తల్లీదండ్రీ కాదని వదలివేసిన పిల్లవాడిని కొడుకుగా స్వీకరిస్తే వాడిపేరు అపవిద్ధుడు.

**విశేషం:** అప= చెడ్డగా; విద్ధుఁడు= నిరసింపబడ్డవాడు (విద్ధము= గ్రుచ్చబడినది, కొట్టబడినది)

**తే.** **పెండ్లి గాకమున్న పితృగృహంబునఁ గన్య । సూనుఁ గనిన వినుము దానిఁ జేసి**
**కొనిన యతని కతఁడు గొడు కగుఁ గానీన । నామకమున బరఁగు నరవరేణ్య! 250**

**ప్రతిపదార్థం:** నరవరేణ్యా!= మానవులలో గొప్పవాడా, రాజా!; వినుము= ఆలకించుము; కన్య= అవివాహిత, పెండ్లికాకమున్న= వివాహం కాకముందే; పితృగృహంబునన్= తండ్రి ఇంట్లో; సూనున్= కొడుకును; కనినన్= కంటే; దానిన్= ఆ కన్యను; చేసికొనిన అతనికిన్= చేసికొన్న వాడికి; అతఁడు= ఆ కన్యకు పుట్టినవాడు; కానీన నామకమునన్= కానీను డన్న పేరుతో; కొడుకు+అగున్= కొడుకు అవుతాడు.

**తాత్పర్యం:** పెండ్లిగాక ముందే తండ్రి ఇంట్లో కొడుకును కంటే ఆమెను వివాహం చేసికొన్నవాడి కా బిడ్డ కొడుకే. వాడి పేరు కానీనుడు.

**విశేషం:** కానీనుఁడు= కన్నెకొడుకు. భారతంలో కర్ణుడికా పేరున్నది. మనకంటె ఆనాటివారి కా విశాల దృష్టి ఉన్నట్లున్నది.

**క.** **విను గర్భిణి యగు టెఱుఁగక । యును, నెఱిఁగియుఁ బెండ్లియైన, నుదయించిన నం**
**దనుఁ డావరునకుఁ గొడు కగు । జననాథ! సహోఢుఁ డనఁగఁ జను నండ్రు బుధుల్. 251**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా!; విను; గర్భిణిఅగుట= గర్భవతి కావటం; ఎఱుఁగకయునున్= తెలియకపోయి, ఎఱిఁగియున్= తెలిసియూ; పెండ్లిఐనన్= పెండ్లి చేసికొన్నాక; ఉదయించిన= పుట్టిన; నందనుఁడు= కొడుకు; ఆ వరునకున్= ఆ పెండ్లి చేసికొన్న వాడికి; కొడుకు+అగున్; సహ+ఊఢుఁడు= (సంతానం)తోపాటు భరించబడువాడు; అనఁగన్= అన్నపేరున; చనున్= లోకంలో చెలామణి ఔతాడు; అని బుధుల్= స్మృతి గ్రంథకర్తలు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** పెండ్లి కాకపూర్వమే గర్భవతి అయిన కన్య - ఈ విషయం తెలిసినా తెలియకున్నా పెండ్లి చేసికొన్నాక కంటే ఆ కొడుకు పేరు సహోఢుడు. వాడిని కొడుకుగా ఆమెను వివాహం చేసికొన్నవాడు స్వీకరిస్తాడు.

**తే.** **విభునిఁ దాను దొఱంగిన వెలఁది, విభుఁడు । విడిచినట్టి సుమధ్యమ, విధవ, యక్ష**
**తాత్వ దశ నెవ్వనికిఁ గనఁ దనయుఁ డాతఁ । డతని కొడుకు పౌనర్భవుం డనఁగఁ బరఁగు. 252**

**ప్రతిపదార్థం:** విభునిన్= భర్తను; తాను= తానై; తొఱంగిన= విడిచిన; వెలఁది= స్త్రీ; విభుఁడు= భర్త; విడిచినట్టి= విడిచిపెట్టిన; సుమధ్యమ= అందమైన నడుము కలది, స్త్రీ; విధవ= భర్త లేనిది; అక్షతాత్వదశన్= కన్యాత్వం భంగంకాని దశలో; ఎవ్వనికిన్=

ఎవడివలననైనా; కనన్= కంటే; తనయుఁడు+ఆతఁడు= ఆ కొడుకు; అతని కొడుకు= ఎవ్వడికి పుట్టాడో అతడికే కొడుకు; పౌనర్భవుండు= తిరిగి పుట్టినవాడు; అనఁగన్; పరఁగున్= ఒప్పును.

**తాత్పర్యం:** భర్తను విడిచిన భార్య, భర్త విడిచిన భార్య, విధవ, ఎవడికి కొడుకును కంటారో, ఆ కొడుకు కన్నవాడికే కొడుకు. వాడిపేరే పౌనర్భవుడు.

**విశేషం:** అక్షతాత్వదశ - మూడు రకాలు. 1.భర్తవిడిచిపెట్టినది, 2. భర్తను విడిచిపెట్టినది, 3. విధవ - వీరు కన్యాత్వ భంగంకాని వారై ఉండాలని తాత్పర్యం.

**క. జననీజనకులు లేకు । న్నను వారలు దన్ను విడిచినం దాన తనున్**

**దనయుఁడుగ నొరుల కిచ్చిన । ననఘా! యాతండు సను స్వయందత్తుఁ డనన్. 253**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా! జననీ జనకులు= తల్లిదండ్రులు; లేక+ఉన్నను= లేకపోయినా; వారలు= తల్లీదండ్రి; తన్నున్= తనను; విడిచినన్= వదలిపెట్టినా; తాన= తానే; తనున్= తనను; ఒరులకున్= ఇతరులకు; తనయుఁడుగన్= కొడుకుగా; ఇచ్చినన్= ఇచ్చినా; అతండు= అతడు; స్వయందత్తుఁడు= తనను తానే ఇచ్చుకొన్నవాడు; అనన్= అనగా; చనున్= ఒప్పును.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! తల్లిదండ్రులు లేకపోయినా, వారు తనను విడిచిపెట్టినా, తనను తానై ఇతరులకు అర్పణంచేసికొన్నా వాడిని స్వయందత్తు డంటారు.

**ఆ. తల్లిదండ్రు లమ్మఁ దనయుఁగా నొక్కరుఁ । డాత్మసదృశజన్ముఁ డైన వాని**

**విలిచికొనినఁ బాండవేయ మహత్తర! యక్కుమారుఁ గ్రీతుఁ డండ్రు బుధులు.' 254**

**ప్రతిపదార్థం:** తల్లిదండ్రులు; అమ్మన్= అమ్ముకొనగా; ఒక్కరుఁడు= మరొకడు; తనయుఁగాన్= కొడుకుగా; ఆత్మ సదృశ జన్ముఁడు= తనతో సమానమైన జన్మకలవాడు; ఐనవానిన్= అయినటువంటివాడిని; విలిచికొనినన్= డబ్బిచ్చి కొనుక్కొంటే; పాండవేయమహత్తర!= పాండవులలో గొప్పవాడా!; బుధులు= పండితులు; ఆ+కుమారున్= ఆ కొడుకును; క్రీతుఁడు= కొనబడినవాడని; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** తల్లిదండ్రు లమ్మితే, తనకు తగినటువంటి వాడిని కొడుకుగా కొనుక్కొంటే వాడిని క్రీతు డని పండితు లంటారు.'

**క. అని భీష్ముడు వెండియు ని । ట్లను ' నా పన్నిరువురును ధరాధిప! యోగ్య**

**త్వ నిరూఢు లెల్ల కర్మం । బున; కౌరసుఁ డందులోన ముఖ్యుం డరయన్. 255**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; భీష్ముడు; వెండియున్= ఇంకా; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; ఆ పన్నిరువురును= ఆ పదురెండు మంది; ధరా+అధిప!= రాజా; ఎల్ల కర్మంబునకున్= అన్నివైదిక కర్మలకు; యోగ్యత్వ నిరూఢులు= తగినవారు; అందులోనన్= ఆ పన్నెండు మందిలో; అరయన్= విచారిస్తే; ఔరసుఁడు= ఆ పేరుగల కొడుకు; ముఖ్యుండు= ప్రధానమైనవాడు.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ము డింకా ఇట్లా అంటున్నాడు. 'ఆ పన్నెండు మంది తగినవారే. అయినా వారిలో ఔరసుడే ముఖ్యుడు. ఎందుకంటే వైదిక కర్మల కన్నిటికీ తగినవాడు వాడే కనుక.

**ఉ. వానిన పోలు నండ్రు బుధవర్యులు కౌరవనాథ! పుత్రికా**
**సూనునిఁ దక్కునీ వినిన సూనులు, యోగ్యత గాంతు రుత్తమం**
**బైన కులద్వయంబును, సమాగతమై, విధివత్ప్రయోగతా**
**నూనతఁ గల్గెనేని, నిగమోదిత కర్మకలాప యుక్తికిన్.' 256**

**ప్రతిపదార్థం:** కౌరవనాథ!= కురువంశ శ్రేష్ఠుడా!; బుధవర్యులు= పండితశ్రేష్ఠులు; వానిన= వాడినే, ఔరసుడినే; పుత్రికాసూనునిన్= కూతురు కొడుకును; పోలును+అండ్రు= సమానుడంటారు; తక్కు= మిగిలిన; నీ వినిన= నీవు విన్న; సూనులు= కొడుకులు; ఉత్తమంబు+ఐన= శ్రేష్ఠమైన; కులద్వయంబును= రెండు కులాలు; సమాగతము+ఐ= కలిసి, సమన్వయం పొంది; విధివత్= శాస్త్ర ప్రకారంగా; ప్రయోగితా+అనూనతన్= ప్రయోగాతిశయం; కల్గెన్+ఏనిన్= పొందితే; నిగమ= వేదముచే; ఉదిత= చెప్పబడిన; కర్మకలాప= కర్మ సమూహం; యుక్తికిన్= కూడికకు; యోగ్యతన్= అర్హతను; కాంతురు= పొందుతారు.

**తాత్పర్యం:** ఔరసుడితో కూతురు కొడుకు సమానుడని పండిత వర్యులు అంటారు. వేద కర్మలను చక్కగా కూర్చటానికి తగిన శాస్త్ర విధులను పాటించి రెండు కులాలను ఉద్ధరిస్తే మిగిలినవారూ యోగ్యులే.'

### చ్యవన నహుష సంవాదం బను నితిహాసము (సం.13-50-1)

**వ. అనిన విని ధర్మజుండు 'సహవాసంబునను దర్శనంబునను బుట్టెడి స్నేహంబు లెట్టివి? వానిని గోవుల మాహాత్మ్యంబును నెఱుంగవలతుం జెప్పవే' యని యడిగిన నప్పుడమిఱేనికి భీష్ముం డిట్లనియె. 257**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధర్మజుండు; సహవాసంబుననున్= కలిసి ఉండటంవలన; దర్శనంబుననున్= చూడటంవలన; పుట్టెడి= కలిగెడు; స్నేహంబులు= ప్రేమలు; ఎట్టివి; వానినిన్= వాటిని; గోవుల= ఆవులయొక్క; మాహాత్మ్యంబును= ప్రభావమునూ; ఎఱుంగన్+వలతున్= తెలియవలెనని, వాంఛిస్తాను; చెప్పవే= తెల్పుమా; అని; అడిగినన్; ఆ+పుడమి ఱేనికిన్= ఆ భూమిపతికి, రాజుకు; భీష్ముండు+ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విన్న ధర్మరాజు భీష్ముడితో అన్నాడు. 'కలిసి ఉండటంవలన చూడటంవలన పుట్టే స్నేహాలు ఎట్లాంటివి? వాటినీ, గోవులమాహాత్మ్యమూ వినాలని ఉన్నది. చెప్పవా! అని ప్రార్థిస్తే ఆ రాజుతో భీష్ము డంటున్నాడు.

**సీ. 'చ్యవనుని, నహుషుని సంవాద మితిహాస । మై చెల్లు జగమున ననఘ! నీకు**
**దానిఁ జెప్పెద విను; దాన నీ యడిగిన । యర్థముల్ దెలియు, మహాత్ముఁడైన**
**భార్గవచ్యవనుండు, భాగీరథీ యము । నలు గూడినెడ కేఁగి, యలఘునిష్ఠఁ**
**గ్రుంకి సుస్థిరుఁ డయి కూర్చుండి, యతుల స । మాధిపరుం డయి, మత్స్య కులము**

**తే. దనదు చుట్టు మెలఁగఁ దనువునఁ జెందంగ । మూరుకొనఁగఁ గృపయు ముదముఁ గదుర**
**భావవృత్తి తోడఁ బండ్రెండు వర్షము । లుండె; నట్టు లుండ నొక్కనాఁడు. 258**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా! (నాయనా అనటంవంటి సంబోధన); చ్యవనుని= ఆ పేరుగల ఋషియొక్క; నహుషుని= ఆ పేరుగల ప్రాచీన రాజుయొక్క; సంవాదము= ప్రశ్న ఉత్తర రూపమైన గోష్ఠి; జగమునన్= లోకంలో; ఇతిహాసమై= ఒక పురాణ కథగా; చెల్లున్= ప్రకాశిస్తుంది; నీకున్; దానిన్; చెప్పెదన్; విను; దానన్= దానివలన; నీ అడిగిన= నీవు అడిగిన; అర్థముల్= విషయములు; తెలియున్= తెలుస్తాయి; మహా+ఆత్ముఁడు+ఐన= మహత్త్వం కల; భార్గవచ్యవనుండు= భృగువంశంలో పుట్టిన చ్యవన మహర్షి; భాగీరథి= గంగ; యమునలు= యమునానది; కూడిన+ఎడకున్= సంగమ స్థలానికి; ఏఁగి= వెళ్ళి; అలఘు= గొప్ప; నిష్ఠన్= నియమంతో; గ్రుంకి= స్నానంచేసి; సుస్థిరుఁడు+అయి= కదలకుండా; కూర్చుండి; అతుల= సాటిలేని; సమాధిపరుండు+అయి= సమాధియందు మునిగి; మత్స్య కులము= చేపల గుంపు; తనదు= తనయొక్క; చుట్టు= చుట్టూరా; మెలఁగన్= మెలగుతూ ఉండగా; తనువునన్= శరీరమునందు; చెందంగన్= పొందగా; మూరుకొనఁగన్= వాసన చూడగా - (పశుపక్ష్యాదులు ప్రేమతో మనిషిని నాకటం, ముట్టెతో వాసన చూడటం); కృపయున్= దయ; ముదమున్= సంతోషం; కదురన్= వ్యాపించగా; భావవృత్తితోడన్= వాటియందు లగ్నమైన మనోభావనతో; పంఁడ్రెండు; వర్షములు= సంవత్సరాలు; ఉండెన్= ఉన్నాడు; అట్టులు= ఆ విధంగా; ఉండన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజున.

**తాత్పర్యం:** చ్యవన నహుష సంవాదంవలన నీ సందేహం తీరుతుంది. దానినే చెప్పుతున్నాను వినుము. భృగువంశంలో పుట్టిన మహాత్ముఁడు చ్యవనుడు గంగా యమునలు కలిసిన చోటికి పోయి తపోనిష్ఠతో సమాధి గతుడయ్యాడు. అప్పుడు చేపలు అతడి చుట్టూ మూగి అతని శరీరాన్ని తాకుతూ అతనిని ముద్దుపెట్టుకొంటూ ఉంటే అతడు సంతోషంతో దయతో మనస్సులో వాటిమీదే భావం లగ్నం కాగా పదురెండు సంవత్సరా లున్నాడు.

**విశేషం:** ఈ చ్యవనుడి కథ అరణ్యపర్వంలో వచ్చింది. నహుషుడి కథ ఉద్యోగపర్వంలో ఉన్నది.

**క. జాలరులు వలల నచ్చటి । మీలఁ దిగుచుచుండి, యయ్యమేయోగ్రతప**
**శ్శీలునిఁ గూడఁగఁ దిగిచి, భ । యాలోల మనస్కు లగుచు నమ్మునిపతికిన్. 259**

**ప్రతిపదార్థం:** జాలరులు= పల్లెకార్లు; అచ్చటిమీలన్= ఆ మునిఉన్నతావులోని చేపలను; వలలన్= వలలతో; తిగుచుచున్+ఉండి= లాగుతూ; ఆ+అమేయ= ఆ మహత్తర; ఉగ్ర= భయంకర; తపః+శీలునిన్ కూడన్గన్= తపస్సే స్వభావంగా కల మహర్షిని కూడా; తిగిచి= లాగి; భయ+ఆలోల= భయంతో చలించే; మనస్కులు= మనస్సు కలవారు; అగుచున్= అవుతూ; ఆ+ముని పతికిన్= ఆ మునిశ్రేష్ఠుడితో.

**తాత్పర్యం:** మత్స్యకారు లా ముని ఉన్నచోట వలలతో చేపలను పట్టుతూ ఆ మహామునిని కూడా చేపలతో పాటుగా వలలతో లాగి, భయంతో వణికిపోతూ ఆ మహామునితో.

**విశేషం:** ఆ ముని గంగా యమునా సంగమంలో నీళ్ళలో మునిగి తపస్సు చేస్తున్నాడు. కనుకనే వలలో తగుల్కొన్నాడు. యోగులు ప్రాణవాయువును బంధించి సమాధిలోకి పోతున్నారు కనుక నీటిలో భూమిలో ఎక్కడైనా గాలి లేకపోయినా సమాధి గతులు కావటం సహజమే. శ్రీరామకృష్ణ పరమహంస సమాధి నిష్ఠులు కాగానే ఉచ్ఛ్వాస నిశ్వాసలుండేవి కావట.

**ఆ. చాఁగి మ్రొక్కి 'తప్పసైఁపు మెఱుంగమి । నింతపుట్టె, సంయమీంద్ర! మమ్ముఁ**
**బరమకరుణఁ జూచి పనుపుము; దీనికి । నేమి సేయువార మింక?' ననుడు. 260**

**ప్రతిపదార్థం:** చాఁగి మ్రొక్కి= సాష్టాంగ నమస్కారం చేసి; తప్పు= అపచారం; సైఁపుము= సహించుము; ఎఱుంగమిన్= తెలియకపోవటంవలన; ఇంత పుట్టెన్= ఇంత జరిగింది; సంయమి+ఇంద్ర!= మునిశ్రేష్ఠా!; మమ్మున్= మమ్ము; పరమ= గొప్ప; కరుణన్= దయతో; చూచి= క్షమించి; పనుపుము= ఆజ్ఞాపించుము; దీనికిన్= ఈ పనికి; ఇంకన్; ఏమి చేయువారము= ఏం చేయగలమో; అనుడున్= అనగా (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** మునీంద్రా! మమ్ము దయతో క్షమించుము. మాకు తెలియనందువలన ఇంత జరిగింది. దీనికి ప్రాయశ్చిత్త మేదో చెప్పి మమ్ములను రక్షించుము' అనగా.

**క. జలచరములపై నర్మిలి । గలిగెడు మదిఁ దాల్చి చేర్చి కారుణ్యము బో**
**యలమీఁద నించుకేనియు । నలుక వొడమనీక యుండె నతఁ డవికృతుఁడై. 261**

**ప్రతిపదార్థం:** అతఁడు= చ్యవనుడు; అవికృతుఁడై= మనోవికారాలు (కోపాదులు) లేనివాడై; జలచరములపైన్= నీటిలో తిరిగే (బ్రతికే); జీవరాసులపై; అర్మిలి= ప్రేమ; కలిగెడు= జనించే; మదిన్= మనస్సును; తాల్చి= పూని; బోయల మీఁదన్= చేపలు పట్టేవారిపై; కారుణ్యము= దయ; చేర్చి= నాటి; ఇంచుక+ఏనియున్= కొంచెమైనా; అలుక= కోపం; పొడమనీక= కలుగనీయక; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** చేపలపై ప్రేమ పూని బోయలపై దయతో మనస్సులో కోపతాపాదులే లేనివాడై ముని ఉన్నాడు.

**వ. ఏటిదరికిం దిగువఁబడిన మీలదెస వారికిం జూపి వారితోడ. 262**

**ప్రతిపదార్థం:** ఏటిదరికిన్= ఏటి ఒడ్డుకు; తిగువఁబడిన= లాగబడిన; మీల= చేపలయొక్క; దెసన్= దిశను; వారికిన్= బోయలకు; చూపి= చూపించి; వారితోడన్= బోయలతో.

**తాత్పర్యం:** వలలో పట్టి ఒడ్డున పెట్టబడిన చేపలవైపు చూపి ఆ బోయలతో.

**తే. 'వీనితోడి సంవాసంబు మానసమునఁ । జాల నర్మిలిఁ బెనిచె; నిమ్మీలతోడఁ**
**గూడఁ బ్రాణంబు విడుచుట కూడదండ్రె । జనులు; గావున నటుసేయుఁ డనఘులార! 263**

**ప్రతిపదార్థం:** అనఘులు+అర!= పాపంలేనివారైన ఓ బోయలారా! మీరు (ఆర= సంబోధనలో వచ్చే ప్రత్యయం); వీనితోడి= ఈ చేపలతో; సంవాసంబు= కలిసి బ్రతకటం; మానసమునన్= మనస్సులో; చాలన్= మిక్కిలి; అర్మిలిన్= ప్రేమను; పెనిచెన్= పెంచింది; జనులు= లోకులు; ఈ మీలతోడన్+కూడన్= ఈ చేపలతోపాటుగా; ప్రాణంబు విడుచుట= వదలుట, మరణించటం; కూడదు= పనికిరాదు; అండ్రె?= అంటారా? కావునన్= కాబట్టి; అటుచేయుఁడు= అట్లా చేయండి.

**తాత్పర్యం:** ఈ చేపలతోపాటుగా కలిసి నివసించాను కనుక వాటిమీద వల్లమాలిన ప్రేమ ఏర్పడింది. కనుక వాటితోపాటుగా మరణించటమూ మంచిదే. దీన్ని లోకులు మాత్రం కాదంటారా? కాబట్టి నేను చెప్పినట్లు చేయండి.

**వ. తగిన తెఱంగు సెప్పెద వినుండు. 264**

**ప్రతిపదార్థం:** తగిన తెఱంగు= వీలైన మార్గం; చెప్పెదన్; వినుండు= ఆలకించండి.

**తాత్పర్యం:** ఉచితపద్ధతిని చెప్పుతాను వినండి.

**క. ఇమ్మీలను నన్నును మీ । రమ్మికొనుఁడు సేయువెలల ' కనుటయుఁ గడు శీ**

**ఘ్రమ్మున నహుషు కడకుఁ జని । యమ్ముని తెఱఁ గెల్లఁ జెప్పి రలుకుచు బోయల్. 265**

**ప్రతిపదార్థం:** ఈ+మీలనున్= ఈ చేపలను; నన్నునున్= నన్నూ; చేయు వెలలకున్= అయిన ధరకు; మీరు; అమ్మికొనుఁడు= అమ్ముకొనండి; అనుటయున్= అనగా; బోయల్; అలుకుచున్= భయపడుతూ; శీఘ్రమ్మునన్= వేగంగా; నహుషు కడకున్= రాజైన నహుషుడి దగ్గరకు; చని= పోయి, ఆ ముని= ఆ చ్యవనుడి; తెఱఁగున్+ఎల్లన్= విషయమంతా; చెప్పిరి= చెప్పారు.

**తాత్పర్యం:** ఈ చేపలనూ, నన్నూ అయినకాడి కమ్ముకొనండి' అని ముని చెప్పేసరికి పాపం బోయలు బిక్కు బిక్కుమంటూ పరుగులతో నహుషుడనే రాజు దగ్గరకు పోయి ఆ ముని సంగతి అంతా చెప్పారు.

**వ. చెప్పిన భయంబును సంభ్రమంబును బెనంగొన నమ్మనుజపతి మంత్రి పురోహిత సహితంబుగా నప్పరమ మునిపాలికిం జనుదెంచి సాష్టాంగ దండప్రణామంబు సేసి 'బోయలు సేసిన యపరాధంబు నేమి భంగి నీఁగు వాఁడ' నని విన్నవించిన, నద్దయాళుం డిట్లనియె.' 266**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= చెప్పగా; భయంబునున్; సంభ్రమంబునున్= తొట్రుపాటు; పెనంగొనన్= పెనవేసికొనగా; ఆ మనుజపతి= రాజు; మంత్రి= మంత్రులు; పురోహిత సహితంబుగాన్= పురోహితులతో పాటుగా; ఆ పరమ ముని= ఆ మహాముని; పాలికిన్= దగ్గరకు; చనుదెంచి= వెళ్ళి; సాష్టాంగ దండ ప్రణామంబు= ఎనిమిది అంగములు ఏక మౌనట్లుగా; దండ ప్రణామంబు= కర్రవలె చాగిలబడి చేసే నమస్కారం; చేసి= ఆచరించి; బోయలు; చేసిన; అపరాధంబు= తప్పు; ఏమి భంగిన్= ఏ విధంగా; ఈఁగువాఁడను= పోగొట్టుకొనగలను; అని; విన్నవించినన్= మనవి చేసుకొనగా; ఆ దయాళుండు= ఆ దయగలవాడు, చ్యవనమహర్షి; ఇట్లు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** చెప్పేసరికి తొట్రుపాటూ భయం రెండూ పెనవేసికొనగా ఆ రాజు మంత్రులను, పురోహితులను వెంటబెట్టుకొని సాష్టాంగంగా నమస్కరించి ఆ మహామునితో 'ఈ బోయలు చేసిన తప్పును నే నేవిధంగా సరిదిద్దుకొనగలనో?' అని విన్నవించుకొనగా ఆ దయగల ముని ఇట్లా అన్నాడు.

**విశేషం:** మంత్రి= రాజనీతివేత్తలు, భౌతిక రాజ్యాంగవేత్తలు, పురోహిత= వైదికులై దైవిక విపత్తులను నివారించేవారు. వీరుకూడా మంత్రులలో ఒకరు. రాష్ట్రానికి సంభవించే భౌతిక విపత్తును నివారించేవారు ఆధి దైవిక విపత్తులను నివారించేవారూ - ఆనాటి మంత్రి మండలిలో ఉండేవారు.

అష్ట+అంగము= రొమ్ము, ముఖం, మోకాళ్ళు, హస్తాలు మొదలైన అవయవాలన్నీ భూమికి తాకేటట్లుగా కర్రవలె (దండం) బోర్లాపడి చేసే నమస్కారం. అచ్చమైన భక్తి ఉన్నచోట మాత్రమే ఇట్లా కుదురుతుంది. కర్రవలె అంటే మనస్సు నణచుకొని ఏకాగ్రంగా ఉండటం. నిశ్చలమైన మనస్సుతో చేసే నమస్కారం.

**క. 'బోయలు నిజకుల ధర్మము । సేయుట యపరాధ మగునె? చెప్పెద విను వీ**

**రాయాసపడిరి; వీరికి । నాయొడలికిఁ దగిన వెల జనస్తుత యీవే!' 267**

**ప్రతిపదార్థం:** జనస్తుత!= జనులచే స్తుతింపబడిన రాజా!; బోయలు; నిజ= తమ; కుల= వర్ణము యొక్క; ధర్మము= ఆచారం; చేయుట= పాటించటం; అపరాధము+అగునె?= తప్పు అవుతుందా? కాదు; చెప్పెదన్; విను; వీరు; ఆయాసపడిరి= కష్టపడ్డారు; నా యొడలికిన్= నా శరీరానికి; తగిన= అర్హమైన; వెల= ధర; వీరికిన్= బోయలకు; ఈవే!= ఇయ్యవయ్యా!

**తాత్పర్యం:** 'బోయలు తమ కుల ధర్మం పాటించటంలో తప్పులేదు. విషయం చెప్తుతాను వినుము. వీరు పాపం చాలా కష్టపడ్డారు. కనుక నా శరీరం ధర ఎంతో నిర్ణయించి అది వీరి కియ్యవయ్యా!'

**విశేషం:** వర్ణం వేరు. కులం వేరు. వర్ణాలు నాలుగే. కులమంటే ఒకే పద్ధతి, ఆహార విహారాచారాలు గల గుంపు.

**క.** **అనుటయు మునివరు మనమునఁ । గినుక యొకింతయును లేమికిం బ్రీతుండై**
**జనపతి గిరాతులకు నిం । డని పనిచెను వేయుమాడ లాత్మసచివులన్** **268**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనటంతోనే; మునివరు= మునిశ్రేష్ఠుడి; మనమునన్= మనస్సులో; కినుక= కోపం; ఒకింతయును= కొంచెంకూడా; లేమికిన్= లేకపోవటంవలన; ప్రీతుండై=సంతోషించి; జనపతి= రాజు; కిరాతులకున్= బోయలకు; వేయు= వేయి; మాడలు= నాణెములు (ఆనాటి రూపాయలు); ఇండు= ఇవ్వండి; అని; ఆత్మ= తన; సచివులన్= మంత్రులను; పనిచెను= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** అనటంతోనే రాజునకు సంతోషం కలిగింది. ఈ మునివరుడి మనస్సులో కోపం లేదు కదా అని. మంత్రులను పిలిచి 'వేయిమాడ లివ్వండి బోయలకు' అని ఆనతిచ్చాడు.

**వ.** **పనిచిన యప్పలుకులు విని యమ్ముని యమ్మనుజ విభునితోఁ, 'దగవెఱింగి యిత్తుగా' కనవుడు, నప్పుడమిఱేఁడు పదివేలు సెప్పిన, నప్పరమ సంయమి యప్పటి మాటయ యాడిన, నా రాజు లక్ష యుగ్గడించె; దానికిం దపస్వి ముందటి పలుకు పలికిన; నతండు కోటి యిమ్మనియె; నమ్మాటకు నమ్మహాత్ముండు.** **269**

**ప్రతిపదార్థం:** పనిచినన్= ఆనతివ్వగా; ఆ+పలుకులు= ఆ మాటలు; విని; ఆ ముని= ఆ చ్యవనుడు; ఆ మనుజ విభునితోన్= ఆ రాజుతో; తగవు= న్యాయం; ఎఱిఁగి= తెలిసి; ఇత్తుగాక= ఇస్తావు కాక; అనవుడున్= అంటే; ఆ పుడమిఱేఁడు= ఆ భూమిపతి; పదివేలు= పదివేలు మాడలు; చెప్పినన్= చెప్పగా; ఆ పరమ= ఆ శ్రేష్ఠుడైన; సంయమి= ముని; అప్పటిమాటయ= ఇదివరకు చెప్పిన మాటే; ఆడినన్= అనగా; ఆ రాజు; లక్ష; ఉగ్గడించెన్= చెప్పాడు; దానికిన్= దానికీ; తపస్వి= ముని; ముందటిపలుకు= ఇదివరకు మాటే; పలికినన్; అతండు= రాజు; కోటి; ఇమ్ము+అనియెన్, ఆ మాటకున్; ఆ మహాత్ముండు= ఆ మహానుభావుడు.

**తాత్పర్యం:** ఆనతివ్వగా ఆ మాటలు విని 'న్యాయం తెలిసి వెల నిర్ణయించుము' అన్నాడు. రాజు పదివేలన్నాడు. మునీ అదే మాటన్నాడు. రాజు లక్ష అన్నాడు. దానికీ ముని ముందటిమాటే అన్నాడు. మరలా రాజు కోటి అన్నాడు. అప్పుడు ఆ మహాముని.

**క.** **తల విసరి 'వెలఁ దగఁగ బో । యల కీ వలదయ్య!' యనిన నన్నరపతి 'వా**
**రల కిల సగ మిచ్చెద' నని । పలికిన, నప్పలుకు ద్రోపు వడ ముని పల్కెన్.** **270**

**ప్రతిపదార్థం:** తల విసరి= తల విదలించి; వెలన్= ధరను; తగఁగన్= తగునట్లు; బోయలకున్; ఈన్+వలదు+అయ్య!= ఇవ్వాలి కదయ్యా!; అనినన్; ఆ నరపతి= ఆ రాజు; వారలకున్; సగము; ఇలన్= రాజ్యాన్ని; ఇచ్చెదన్= ఇస్తాను; అని పలికినన్= అని చెప్పగా; ఆ పలుకు= ఆ మాట; త్రోపువడన్= తిరస్కృతము కాగా; ముని; పల్కెన్.

**తాత్పర్యం:** అనంగీకారంగా తలను ప్రక్కకుత్రిప్పి 'వెల సరిగా నిర్ణయించుము' అన్నాడు ముని. రాజేమో తన రాజ్యంలో సగ మిస్తా నన్నాడు. దానినీ కాదని ముని.

**ఆ. రాజు దనదు సకలరాజ్యంబు బోయల । కిత్తు ననుడు నమ్మునీశ్వరుండు**
**'నీవు మంత్రివరులు నెయ్యురుఁ దలపోసి । యుచితమైన మూల్య మొసఁగు' మనియె. 271**

**ప్రతిపదార్థం:** రాజు; తనదు= తనయొక్క; సకలరాజ్యంబు= రాజ్యమంతా; బోయలకున్; ఇత్తున్= ఇస్తాను; అనుడున్= అనగా; ఆ ముని+ఈశ్వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; నీవున్= నీవూ; మంత్రివరులు= శ్రేష్ఠులైన మంత్రులు; సచివులు; నెయ్యురున్= స్నేహితులూ; తలపోసి= ఆలోచించి; ఉచితమైన= తగినదైన; మూల్యము= వెల; ఒసఁగుము= బోయలకు ఇమ్ము; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** రాజు తన రాజ్యమంతా ఇస్తా నన్నాడు. అది విని ముని 'నీవూ' నీ మంత్రులూ, స్నేహితులూ అందరూ కలిసి ఆలోచించి తగినమూల్యం నిర్ణయించండి' అన్నాడు.

**వ. అనిన విని విషాదంబుతో నహుషుం డవులం జని సచివులుం దానును నింకనేమి సేయువాఁడ నని చింతిల్లుచున్న సమయంబున నయ్యెడకు గవిజాతుండను సంయమి సనుదెంచి వారలతో 'మీరు చింత విడువుఁ డే నిమ్మునిపతి మూల్యంబు నిశ్చయించెద' ననుటయు నయ్యవనీవిభుం డప్పరివారం 'బింతటితో నాపత్పయోధి మునుంగకుండు నట్లుగా నన్నుంగావవే' యనుపలుకు పలికిన నతం డతని కిట్లనియె.272**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; విషాదంబుతోన్= దుఃఖంతో; నహుషుండు; అవులన్+చని= అవతలకు వెళ్ళి; సచివులున్= మంత్రులును; తానునున్= తానూ; ఇంకన్+ఏమిచేయువాఁడను= ఇంకేమి చేసేది; అని; చింతిల్లుచున్= చింతిస్తూ; ఉన్న సమయంబునన్= ఉన్నవేళలో; ఆ+ఎడకున్= ఆ చోటికి; గవిజాతుండు= ఆ పేరుకల; సంయమి= ముని; చనుదెంచి= వచ్చి; వారలతోన్= రాజుతో, మంత్రులతో; మీరు; చింత= దుంఃఖం, విడువుఁడు= వదలిపెట్టండి; ఏను= నేను; ఈ+మునిపతి మూల్యంబున్= ఈ మునీశ్వరుని వెలను; నిశ్చయించెదన్= నిర్ణయిస్తాను; అనుటయున్= అనటంతో; ఆ+అవనీ విభుండు= ఆ భూమికి పతి, రాజు; ఆ పరివారంబు= రాజుతోపాటు వచ్చిన మంత్రులు మొదలగువారు; ఇంతటితోన్= ఈ నిర్ణయంతో; ఆపత్పయోధిన్= ఆపద అన్న సముద్రంలో; మునుంగక= మునగక; ఉండునట్లుగాన్= ఉండేటట్లుగా; నన్నున్; కావవే= రక్షించవే; అను పలుకు= అన్న మాట; పలికినన్= అనగా; అతండు= గవిజాతుండు; అతనికిన్= రాజుతో; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** అని అన్నాక విన్న రాజు క్రుంగిపోయి దుఃఖంతో మంత్రులూ తానూ అవతలకు పోయి విచారించటం ప్రారంభించగా అక్కడకు గవిజాతు డన్న ముని వచ్చి 'మీరు దుఃఖించవద్దు. నే నా ముని వెల నిర్ణయిస్తాను.' అనేసరికి రాజు తేరుకొని 'నేనూ నా పరివారమూ ఈ ఆపద అనే సముద్రంలో మునిగిపోకుండా కాపాడవయ్యా' అని వేడుకొనగా అతడు రాజుతో అంటున్నాడు.

**తే. 'గోవునకు బ్రాహ్మణులకును గుల మొకండ । కమలజుఁడు రెండు దెఱఁగులుగా నొనర్చెఁ;**
**హవికిఁ బూర్వంబు గారణ మఖిల మంత్ర । ములకధిష్ఠాన మపరంబు భూపవర్య! 273**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజశ్రేష్ఠుడా!; గోవునకున్= ఆవుకు; బ్రాహ్మణునకున్= పారునకు; కులము= వర్ణం; ఒకండ= ఒకటే; కమలజుఁడు= పద్మంలో పుట్టినవాడు, బ్రహ్మ; రెండు తెఱఁగులుగాన్= రెండు విధాలుగా; ఒనర్చెన్= నిర్మించాడు; హవికిన్= హవిస్సునకు (యజ్ఞంలో వేసే వస్తువు; నేయి, పాలు మొదలగునవి); కారణము= హేతువు; పూర్వంబు= మొదలైన, గోవు; అపరంబు= రెండవది (బ్రాహ్మణుడు); అఖిల= సమస్తమైన; మంత్రములకున్= వేదమంత్రాలకు; అధిష్ఠానము= ఆధారం.

**తాత్పర్యం:** రాజా! గోవూ, బ్రాహ్మణు డొకటే కులం. కాకపోతే బ్రహ్మ రెండుగా సృష్టించాడు. మొదటిదైన గోవు హవిస్సుకు కారణం కాగా (పాలు, నెయ్యి ఇచ్చేది కనుక) రెండవదైన తత్త్వం బ్రాహ్మణుడు సకల మంత్రాలకూ ఆధారం.

**క. వివిధాగమాశ్రయం బగు । నవనీదేవునకు మూల్య మని వాక్రువ్వన్**
**శివునకును గాదు ధరణీ । ధవ! గోవును నట్టిదగుట దగు నది యొసఁగన్.' 274**

**ప్రతిపదార్థం:** వివిధ= అనేకములైన; ఆగమ= వేదాలకు; ఆశ్రయంబు= ఆధారం; అగు= అయిన; అవనీ దేవునకున్= భూమిపై ఉన్న దేవత - బ్రాహ్మణుడికి; మూల్యము= వెల ఇది; అని; వాక్రువ్వన్= చెప్పగా; శివునకును= శివుడికైనా; కాదు= చేతకాదు; ధరణీ= భూమికి; ధవ!= పతీ; గోవునున్= ఆవుకూడా; అట్టిది+అగుటన్= అట్లాంటిది కావటంవలన; ఒసఁగన్= వెలగా ఇవ్వటానికి; అది= ఆవు; తగున్= తగును.

**తాత్పర్యం:** సర్వవేదాలకు మూలం బ్రాహ్మణుడే కనుక అతడివెల నిర్ణయించటానికి శివుడికే శక్తి లేదు. గోవుకూడా అట్లాంటిదే కనుక దానినే వెలగా ఇవ్వటం న్యాయం.'

**తే. అనినఁ బ్రియమంది నృపతి సంయమి సమీప । మునకు వచ్చి మహాభాగ! ననుఁ గృపార్ద్ర**
**దృష్టిఁ జూడుము; భవదీయ దేహమునకు । నింత వెల యన వచ్చునే యేరికైన? 275**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ప్రియము= సంతోషం; అంది= పొంది; నృపతి= రాజు; సంయమి= ముని; సమీపమునకున్= దగ్గరకు వచ్చి; మహాభాగ!= మహానుభావుడా!; ననున్= నన్ను; కృపా+ఆర్ద్ర= దయతో తడిసిన; దృష్టిన్= చూపుతో; చూడుము; ఏరికిన్+ఐనన్= ఎవరికైనా; భవదీయ= నీ యొక్క; దేహమునకున్= ఒడలికి; ఇంత వెల; అనన్ వచ్చునే?= అనుటకు వీలున్నదా?

**తాత్పర్యం:** గవిజాతు డట్లా వెల నిర్ణయించేసరికి రాజు సంతోషించి చ్యవనుడిని సమీపించి 'మహాత్మా! నన్ను కనికరించుము. నీ శరీరం వెల ఇంతని ఎవరు నిర్ణయించగలరు?

**క. మునినాథ! గోవు నిచ్చెద । ననవుడు వికచముఖుఁ డగుచు 'ననుగుణ మూల్యం**
**బున సంప్రీతిం బొందితి' । నని భృగుకులముఖ్యుఁ డిట్టు లను నహుషునితోన్. 276**

**ప్రతిపదార్థం:** మునినాథ!= మునులలో శ్రేష్ఠుడా!; గోవున్= ఆవును; ఇచ్చెదన్; అనవుడున్; భృగుకుల ముఖ్యుఁడు= భృగుకులంలో గొప్పవాడు చ్యవనుడు; వికచ= విప్పారిన; ముఖుఁడు= ముఖం కలవాడు; అగుచున్= అవుతూ; అనుగుణ= తగిన; మూల్యంబునన్= వెలతో; సంప్రీతిన్= చక్కని ప్రీతిని, నిండుగా ఆనందం; పొందితిన్; అని= అంటూ; నహుషునితోన్=రాజుతో; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు.

**తాత్పర్యం:** మునినాథ! గోవు నిస్తా' ననేసరికి సంతోషంతో వికసించిన ముఖంతో భార్గవకులనాథుడైన చ్యవనుడు రాజుతో 'నీ వెలకు సంతోషించా' నంటూ ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. 'గో వగ్ని మయ మమృతమయ । మో వసుధాధీశ ! వినుము హోమ విధాన**
**శ్రీవాహిని, నిచ్చెన త్రిద । శావాసంబునకుఁ బూజ్య మమరుల కైనన్.' 277**

**ప్రతిపదార్థం:** ఓ వసుధా+అధీశ!= ఓయీ రాజా! (వసుధ= రత్నగర్భ, భూదేవికి; అధి+ఈశుఁడు= భర్త); గోవు= గోవంటే; అగ్నిమయము= అగ్ని స్వరూపం; అమృతమయము= అమృత స్వరూపం; వినుము= రహస్యం చెప్తున్నాను, జాగ్రత్తగా వినుము; హోమ విధాన= హోమం చేసే పద్ధతికి (అగ్నిలో హవిస్సులను అర్పించే విధానానికి); శ్రీ= పవిత్రమైన; వాహిని= మార్గం లేదా నది; త్రిదశ= దేవతల; ఆవాసంబునకున్= నివాసమైన స్వర్గానికి; నిచ్చెన= మెట్టు; అమరులకున్+ఐనన్= దేవతలకైనా; పూజ్యము= పూజించ తగింది.

**తాత్పర్యం:** రాజా! గోవంటే ఏమనుకున్నావు? జాగ్రత్తగా వినుము. గోవు అగ్నిమయం. అమృతమయం. యజ్ఞవిధానానికి పవిత్రమైన నది - మార్గం. దేవతలకు నివాసమైన స్వర్గానికి వేసిన నిచ్చెన దేవతల కైనా పూజ్యమే.'

**విశేషం:** ఈ పద్యం తిక్కనగారి శైలికి పరాకాష్ఠ. ఆయన మహేతిహాస శైలి(Sublime style)కి ప్రతీక.

నన్నయగారి శైలి మధురం. కవిబ్రహ్మశైలి విచిత్రమైనది. మొదటిది స్త్రీ సౌందర్యం వంటిది. ఇది పురుష గాంభీర్యం. క్షాత్ర శైలి. ఇది భావిస్తేనే తెలుస్తుంది. అది వినగానే తెలిసేది. ప్రాసస్థానం మీద ఒక ఊనిక పెట్టి పద్యం చదువుకొనాలి. పూర్వకాలం పద్యం పౌరాణికులు పాడేవారు. అదొక కళ. శ్రావ్యంగా ఆలపించటం ఒక కళగా పౌరాణికుడు అభ్యసించాడు. జానపద కళకారుల వలెనే లోకంలోకి జనమధ్యంలోకి పురాణ విద్యను ప్రచారం చేసినవాడు పౌరాణికుడు. అతడికి తెలిసినవిద్య ఈ పద్యం పాడే విద్య. అదొక అభినయ విశేషం. ఏ మాటను నొక్కి చదవాలి. ఏది తేల్చి చదవాలి. యతి, ప్రాస అంటే ఏమిటి? - ఈ రచనా కళ తెలిస్తే అప్పుడు శైలి తెలిసినట్లు.

గో - వగ్ని - గో అన్న అక్షరాన్ని దీర్ఘంగా సాగదీసి చదివి వ - ను తేల్చి దానిబరువు నంతా - గ్ని - మీద పడేటట్లు చదవాలి. మయమో - మరలా మో, మీవ దీర్ఘం, మోను - సాగదీసి చదవాలి - శ్రీ నీ అట్లాగే త్రిద - ను తేల్చి - "శా"ను సాగదీసి నొక్కుతూ చదివితే - ఆవు గొప్పతనం తెలుస్తుంది. పద్యరచనతో శైలిని సృష్టించటం తిక్కన మార్గం.

నన్నయగారి శబ్దమే మధురం. అల్లికా మధురమే. ఇది అలా కాదు. నన్నయగారి పద్యం అజంతా చిత్రం. తిక్కన్నగారి పద్యం ఎలిఫెంటా గుహలలోని త్రిమూర్తి శివవిగ్రహం. ఇది బరువుతో భూమిలోకి దిగిపోయింది. అది గాలిలో ఎగిరిపోతుంది.

అగ్ని - అమృత - హోమ వంటి శబ్దాలన్నీ వేదంలోని వేదవిద్యలోనివి.

జగత్తును అగ్నిహోమాత్మక అంటారు. ఉష్ణ - శీతశక్తుల ద్వంద్వ సమ్మేళనమే జగత్తు. 1. రేయింబవళ్ళు; 2. స్త్రీ పురుషులు; 3. రాజా ప్రజా; 4. గురువూ శిష్యుడూ; 5. మనిషి దైవం; 6. భూమి ఆకాశం - ఇట్లా ద్వంద్వం విరుద్ధాంశాల సమన్వయం.

1. కాలసూత్రం, 2. గృహస్థాశ్రమం; 3. రాష్ట్రవ్యవస్థ; 4. విద్యావ్యవస్థ; 5.దేవ స్వరూపం.

మతవ్యవస్థ - ఇట్లా ద్వంద్వ శక్తుల సమ్మేళనమే జగత్తు. దానినే సూర్యుడు చంద్రుడు = ఉష్ణశీతశక్తులంటుంది వేదం. అగ్ని= పురుష - ఉష్ణశక్తి; సోమ= చంద్రుడు - స్త్రీ - శీత శక్తి. కనుక గోవంటే ఈ రెండు శక్తుల సమ్మేళనం. ఇందుకే గోవు నారాధించటం ఆర్య సంస్కృతిలో ప్రధానాంశ మైనది.

ఈ ప్రాచీన వైదిక సంప్రదాయం తెలిసిన మహాకవి కనుక కవిబ్రహ్మ ఇంతటి అద్భుతమైన పద్యం వ్రాయగలిగాడు.

**చ. అని యిటు లేర్పడం బలికి, 'యా తలఁ పెంతయు మేలు; గోవు ని**
**మ్మనఘచరిత్ర! యన్న, విభుఁడట్టుల చేసిన, బోయ లప్డు నె**
**మ్మనములు, మోద మంద గరిమంబున భార్గవుఁ జేరి 'మమ్ముఁ గ**
**న్గొనినది యాదిగాఁ గరుణ గూరెద వొక్కటి విన్నవింతుమే?' 278**

**ప్రతిపదార్థం:** అని; ఇటులు; ఏర్పడన్= స్పష్టంగా; పలికి; ఆ తలఁపు= ఆ ఆలోచన; ఎంతయున్= మిక్కిలి; మేలు= మంచిది; గోవును= ఆవును; ఇమ్ము; అనఘ!= పాపంలేని; చరిత్ర!= శీలం కలవాడా!; అన్నన్= అనగా; విభుఁడు= రాజు; అట్టుల= అట్లే; చేసినన్= చేయగా; బోయలు; అప్డు; నెఱ+మనములు= నిండు మనస్సులు; మోదము= సంతోషం; అందన్= పొందగా; గరిమంబునన్= గౌరవంతో; భార్గవున్= చ్యవనుడిని; చేరి= సమీపించి; మమ్మున్; కన్గొనిన+అది= చూచినది; ఆదిగాన్= మొదలుగా; కరుణ= దయను; కూరెదవు= నింపుతావు; ఒక్కటి; విన్నవింతుమే?= మనవి చేసుకొందుమే?

**తాత్పర్యం:** అని ఈ విధంగా చెప్పి ' ఆ ఆలోచన మంచిది. పుణ్యాత్ముడా! గోవు నర్పించుము' అని అనేసరికి రాజు అట్లాగే చేశాడు. బోయ లప్పుడు నిండు మనస్సులు సంతోషించగా గౌరవంతో మునిని సమీపించి 'మమ్మ్ము చూచిన దాదిగా దయను వర్షిస్తున్నావు. మేము ఒక్కటి విన్నవించుకొంటాము (నీవు అనుమతిస్తే).'

**క. అని ప్రీతిఁ బలికి, యమ్ముని । యనుజ్ఞఁ గొని, 'మమ్ము, గావు మక్కటికమునం**
**గొనవయ్య! గోవు మాచే' । నన విని మొగమాట మనము నార్ద్రతఁ బెనుపన్. 279**

**ప్రతిపదార్థం:** అని; ప్రీతిన్= ప్రేమతో; పలికి; ఆ ముని; అనుజ్ఞన్= అనుమతిని; కొని= తీసికొని; మమ్మున్; అక్కటికమునన్= దయతో; కావుము= కాపాడుము; మాచేన్= మానుండి; గోవున్= ఆవును; కొనవయ్య!= తీసికొనవయ్యా!; అనన్, విని; మొగమాట= మొగమాటచేత; మనమున్= మనస్సును; ఆర్ద్రతన్= కరిగిపోవటం; పెనుపన్= పెంచగా.

**తాత్పర్యం:** అని ప్రీతితో చెప్పి ఆ ముని అనుజ్ఞతో 'మమ్ములను రక్షించుము. దయతో ఆ గోవును నీవే మానుండి తీసికొనవయ్యా!' అని బోయలు వేడగా మొగమాటతో మనస్సు ద్రవించిపోగా.

**తే. వేఁడికొనినట్టి కృపణుపై, వాఁడి చూడ్కి । యరయ నాశీవిషము చూపునట్ల కాన**
**చేయఁ బ్రార్థనా భంగంబు, మీ యభీష్ఠ । మాచరించెద నని గోవు నతఁడు గొనియె. 280**

**ప్రతిపదార్థం:** వేడికొనిన+అట్టి= ప్రార్థించినట్టి; కృపణుపైన్= దీనునిపై; వాఁడి చూడ్కి= నిశితమైన చూపు; అరయన్= విచారించగా; ఆశీవిషము= పాము (కోరలలో విషమున్నది); చూపునట్లు= చూపు వంటిదే; కానన్= కావునన్; ప్రార్థనాభంగంబున్=

ప్రార్థనను నాశనం చేయటం; చేయన్= చేయను; మీ; అభి+ఇష్టము= కోరికను; ఆచరించెదను= అనుసరిస్తాను; అని; గోవును= ఆవును; అతఁడు=చ్యవనుడు; కొనియెన్= తీసికొన్నాడు.

**తాత్పర్యం:** వేడుకొన్నవారిపై కాఠిన్యం వహించటం పాము కాటువేయటంవంటిది. కనుక మీ ప్రార్థనను మన్నిస్తాను. భగ్నం చేయను 'మీరు కోరినట్లే గోవును గ్రహిస్తా'నని తీసికొన్నాడు.

**వ. కొని యంత నిలువక. 281**

**ప్రతిపదార్థం:** కొని= గ్రహించి; అంతన్= అంతటితో; నిలువక= ఆగక.

**తాత్పర్యం:** తీసికొని అంతటితో ఆగక.

**తే. దర్శనప్రీతి వారిపైఁ దగుల, మీల । వలని యర్మిలి మనమున దళముకొనఁగ,**

**మీరు, మీలును, సమ్మోదమార దివికి । నేఁగుఁ'డని పల్కె భార్గవుం డెల్ల వినఁగ. 282**

**ప్రతిపదార్థం:** దర్శనప్రీతి= చూడటంవలన ఏర్పడిన స్నేహం; వారిపైన్= బోయలపై; తగులన్= నాటుకొనగా; మీలవలని= చేపల మీదున్న; అర్మిలి= ప్రేమ; మనమునన్= మనస్సులో; దళము కొనఁగన్= దట్టం కాగా; మీరున్= బోయలైనమీరు; మీలునున్=చేపలును; సమ్మోదము= సంతోషం; ఆరన్= విచ్చుకొనగా; దివికిన్= స్వర్గానికి; ఏఁగుఁడు=పొండు; అని; ఎల్లన్= అందరూ; వినఁగన్= వినేటట్లు; భార్గవుండు= భృగువంశమౌని; పల్కెన్= అన్నాడు.

**తాత్పర్యం:** చూడటంవలన కలిగే ప్రేమ బోయలపై నాటుకొనగా, చేపలపై నున్న ప్రేమ దట్టం కాగా, బోయలతో ముని అన్నాడు అందరూ వినేటట్లుగా 'మీరూ, చేపలూ స్వర్గానికి పోదురు గాక!' అని.

**విశేషం:** ఇది వరం తప్ప శాపం కాదు. అకృత్రిమమైన స్వచ్ఛమైన హృదయం కలవారికి మాటలోని స్వచ్ఛత ఋజుత్వం, నిజాయితీ తెలుస్తాయి. కృత్రిమమైన మనస్సు కలవాడు ప్రతిమాటకూ వక్రభాష్యం చెప్పుకొంటాడు. ఇది నేటి మనిషి లక్షణ మని పైన చెప్పబడింది కదా! ఆ దృష్టితో చూస్తే 'ముని బోయలను చావగొట్టా డనవచ్చును. 'ఆశ్రమవాసపర్వం ద్వితీయాశ్వాసంలో ధృతరాష్ట్రుడికి వ్యాసుడు చనిపోయిన వారిని చూపించిన ఘట్టముంది. కొందరు ఆధునిక పండితులు దీనిని వివరిస్తూ వ్యాసుడు వారిని గంగలో త్రోసి చంపిం చాడని చెప్పారు. ఇదే హేతువాద దృష్టి అన్నారు. కాబట్టి శబ్దానికున్న ఋజువైన అర్థమేదో దాన్ని చెప్పటం వ్యాఖ్యానం తప్ప వక్ర వివరణం కాదు.

**వ. పలికినఁ దత్క్షణంబ. 283**

**తాత్పర్యం:** పలికిన వెంటనే.

**తే. మీనములుఁ దారుఁ దనువుల తోన నెగసి । నాకలోకంబునకుఁ బోవ, నహుష నృపతి**

**సపరివారంబు గాఁగ నాశ్చర్య పూర । మగ్న మానసుఁ డయి యుండె మానవేంద్ర! 284**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర!= మానవలోకానికి రాజైనవాడా!; మీనములున్= చేపలును; తారున్= తాము, బోయలును; తనువులతోనన్= శరీరాలతోపాటుగా; ఎగసి= ఎగిరి; నాక లోకంబునకున్= స్వర్గలోకానికి; పోవన్= పోగా; నహుష నృపతి=

నహుష చక్రవర్తి; సపరివారంబుగాన్= పరివారంతోపాటుగా; ఆశ్చర్యపూర= ఆశ్చర్య ప్రవాహంలో; మగ్న= మునిగిన; మానసుఁడు+అయి= మనస్సు కలవాడై; ఉండెన్= నిశ్చేష్టుడై ఉన్నాడు.

**తాత్పర్యం:** చేపలు, బోయలు శరీరాలతో పైకి ఎగిరి స్వర్గానికి పోయారు. చూచిన రాజు, పరివారంతోపాటుగా ఆశ్చర్య సముద్రంలో మునిగిపోయాడు.

**విశేషం:** న+అ+కం= నాకం; కం=సంతోషం; ఆకం= దుఃఖం - సంతోషం లేకపోవటం; న+అకం= దుఃఖంలేనిది - ఆనందనిలయం.

**వ. అప్పుడు. 285**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. చ్యవనుఁడు, గవిజాతుఁడు, న । య్యవనీశ్వరుఁ బిల్చి 'వరము లడుగుము రెం డీఁ**
**దివిరితి' మనుడు నతఁడు 'మీ । యవిరళ సంప్రీతికంటె నర్థము గలదే!' 286**

**ప్రతిపదార్థం:** చ్యవనుఁడు=భార్గవుడు; గవిజాతుఁడున్= ఆ పేరుగల మునియు (గవి= ఆవుకు; జాతుఁడు= పుట్టినవాడు- గోసంతానం కనుకనే గోమాహాత్మ్యం చెప్పాడు. చూ.పై.273- 274 పద్యాలు); ఆ+అవనీ+ఈశ్వరున్= ఆ భూమిపతిని; పిల్చి= పిలిచి; వరములు= అనుగ్రహరూపంగా; అడుగుము; రెండున్= రెంటిని; ఈన్= ఇవ్వటానికి; తివిరితిమి= పూనుకొన్నాము; అనవుడున్= అనగా; అతఁడు= రాజు; మీ= మీయొక్క; అవిరళ= ఎడతెగని; (విరళము= పలుచగా - దూరంగా; న=లేనిది, దట్టంగా); సంప్రీతి కంటెన్= మంచి ప్రేమ కంటె; అర్థము= ప్రయోజనం; వరం; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** ఇద్దరు మునులు రాజుతో అన్నారు. 'రెండు వరాలనివ్వాలనుకున్నాం. కోరుకొమ్మంటే రాజన్నాడు 'మీకు నాపై నున్న ప్రేమకంటె కావలసిన దేమున్నది. (కోరదగిన దేమున్నది).'

**తే. అనిన విని, యగ్గలం బైన యాదరమున । వారు ధర్మపరత్వంబు వాసవాభ**
**వైభవము నయ్యెడుమ నీకు వంశపావ । నాత్మ!' యనుచు, నంతర్హితు లైరి వత్స! 287**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; వారు; అగ్గలంబు+ఐన= ఎక్కువైన; ఆదరమునన్= ప్రేమతో; నీకున్; వంశపావన+ఆత్మ!= వంశంలో ఉన్నతుడైనవాడా!; ధర్మపరత్వంబు= ధర్మబుద్ధి; వాసవ+ఆభ= వాసవుడివంటి; వైభవము= ఐశ్వర్యం; అయ్యెడుమ= కలుగుగాక!; అనుచున్= అంటూనే; అంతర్హితులు= అంతర్ధానం; ఐరి= అయ్యారు; వత్స!= నాయనా!

**తాత్పర్యం:** అనేసరికి అధికమైన ఆదరంతో వారిద్దరూ రాజునాశీర్వదించారు. 'వంశోద్ధారకా! నీకు ధర్మపరాయణత్వం, ఇంద్రుడివంటి ఐశ్వర్యం కలుగుగాక! అంటూ అంతర్ధానమయ్యారు.

**క. మది నద్భుతంబుఁ బ్రమదముఁ । బొదలఁగ నమ్మునుల మహిమఁ బొగడుచుఁ జనియెం**
**దదనంతరంబ పతి నిజ । సదనమునకు నెల్ల జనులు సమ్మద మందన్. 288**

**ప్రతిపదార్థం:** మదిన్= మనస్సులో; అద్భుతంబు= ఆశ్చర్యం; ప్రమదమున్= సంతోషం; పొదలంగన్= కలుగగా; ఆ+మునుల;

మహిమన్= మాహాత్మ్యమును; పొగడుచున్= స్తుతిస్తూ; తత్+అనంతరంబు+అ= ఆ తరువాత; ఎల్లన్‌జనులు= జనులంతా; సమ్మదము= సంతోషం; అందన్= పొందగా; పతి= రాజు; నిజ= తన; సదనమునకున్= సౌధానికి - మేడకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** రాజు మనస్సులో ఆశ్చర్యం, సంతోషం ముప్పిరిగొనగా ఆ మునుల మాహాత్మ్యం స్తుతిస్తూ జనులంతా ఆనందిస్తుండగా తన సౌధానికి పోయాడు.

**వ. అని చెప్పి భీష్ముండు. 289**

**తాత్పర్యం:** అని భీష్ముడు కథను వివరించి.

**క. వినిపించితి సంవాసం । బున దర్శనమునను౯ జిత్తమున నధిక స్నే**
**హ నిరూఢి గల్గుటయు గో । వునందు గల గౌరవము౯ జెవుల కింపెస౯గన్. 290**

**ప్రతిపదార్థం:** సంవాసంబునన్= కలిసి జీవించటంవలన; దర్శనమునను= చూడటంవలన; చిత్తమునన్= మనస్సులో; అధిక= మిక్కిలి; స్నేహ నిరూఢి= స్నేహ దృఢత్వం; కల్గుటయున్= కలుగుట; గోవునందున్= గోవుపై; కల; గౌరవము= గురుత్వ భావం, గొప్పతనం; చెవులకున్; ఇంపు= ఆనందం; ఎస౯గన్= అతిశయం కాగా; వినిపించితిన్= వినిపించాను.

**తాత్పర్యం:** కలిసిమెలిసి బ్రతకటంవలన, దర్శనంవలన మనస్సులో స్నేహం నాటుకొనటం, ఆవుల గొప్పతనం చెవుల కింపుగా వినిపించాను.

## చ్యవన కుశిక సంవాదంబను నితిహాసము (సం.13-52-1)

**వ. అనిన విని యక్కురువంశవర్యుం డా ధర్మధుర్యునితో, 'నాకు నొక్కటి వినుటకుం గుతూహలం బెప్పుడుం గల్గియుండు; ఉదాత్తబ్రాహ్మ్యనిధి యైన భార్గవాన్వయంబునం జిత్రతర క్షాత్త్ర చరిత్రుం డగు పరశురాముండు జనియించుటయు, నుత్తమ క్షత్రియత్వ మహోష్మంబైన కుశిక కులంబునం బరమ బ్రాహ్మణ్యవిశ్రుతుం డైన విశ్వామిత్రుం డుదయించుటయును, నది యెట్లొకో? అనుచుండుదు౯ దొల్లియు౯ గొంత వింటి; నిస్సంశయంబు గాదు; మహాత్మా! మదీయచిత్తాయత్తంబుగా నత్తెఱం గెఱింగింపవే!' యనుటయు నయ్యనిమిషనదీ నందనుండు గుంతీనందనాగ్రజు తోడం 'జ్యవనకుశిక సంవాదంబను నితిహాసంబు వినుము. దాన భవత్సంశయంబు వాయు; జ్యవనుండు నిజవంశంబునకుం గుశిక కులంబు కారణంబుగా సంకరంబు గలుగ౯ గలయది అని యెఱింగి యక్కుశిక కలంబునకు నుత్పాతం బాపాదింపంగోరి కుశిక భూపాలు పాలికిం జనిన నతండు. 291**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+కురువంశ వర్యుండు= ఆ కురువంశ శ్రేష్ఠుడు, ధర్మరాజు; ఆ ధర్మధుర్యునితోన్= ఆ ధర్మవేత్తతో; నాకున్ ఒక్కటి వినుటకున్; కుతూహలంబు= కోరిక; ఎప్పుడున్; కల్గి+ఉండున్= కలుగుతుంటుంది; ఉదాత్త= ఉన్నతమగు; బ్రాహ్మ్యనిధి= బ్రాహ్మ్యశక్తికి, బ్రాహ్మణమాహాత్మ్యానికి నిధి అయిన; భార్గవ+అన్వయంబునన్= భార్గవ వంశంలో; చిత్రతర= మిక్కిలి అద్భుతమైన; క్షాత్ర చరిత్రుండు= క్షత్రియ చరిత్ర కలవాడు; అగు; పరశురాముండు; జనియించుటయున్; ఉత్తమ క్షత్రియత్వ= ఉత్కృష్ట క్షాత్ర; మహా+ఊష్మంబు= గొప్ప నిప్పు (వేడి) గల; కుశిక కులంబునన్= కుశిక వంశంలో;

పరమ బ్రాహ్మణ్య విశ్రుతుండు= బ్రాహ్మణశక్తితో ప్రఖ్యాతుడు; ఐన విశ్వామిత్రుండు ఉదయించుటయును; అది ఎట్లు+ఒకో!= అదెట్లా సాధ్యం!; అనుచుండుదున్; తొల్లియున్= పూర్వంకూడా; కొంత+వింటిన్; నిస్సంశయంబు కాదు= సందేహం తీరదు; మహా+ఆత్మా; మదీయ= నా; చిత్త+ఆయత్తంబుగాన్= నా మనస్సుకు హత్తుకొనేటట్లు; ఆ+తెఱంగు= ఆ విషయం; ఎఱింగింపవే; అనుటయున్; ఆ+అనిమిష నదీనందనుండు= ఆ దేవతానది అయిన గంగ కొడుకు; కుంతీనందన+అగ్రజుతోడన్= కుంతికొడుకులలో పెద్దవాడైన ధర్మరాజుతో; చ్యవనకుశిక సంవాదంబు+అను ఇతిహాసంబు; వినుము, దానన్; భవత్= నీ; సంశయంబు= సందేహం; పాయున్= తొలగిపోతుంది; చ్యవనుండు; నిజ= తన; వంశంబునకున్; కుశిక కులాలు; కారణంబుగాన్; సంకరంబు=సాంకర్యం; కలుగన్ కలయది= సంభవింపగల్గును; అని; ఎఱింగి= తెలిసి; ఆ+కుశికకులంబునకున్; ఉత్పాతంబు= విపత్తు; ఆపాదింపన్= కలిగింపగా; కోరి; కుశిక భూపాలు పాలికిన్= ఆ కుశికరాజువద్దకు; చనినన్= వెళ్ళగా; అతండు.

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడిని ప్రశ్నిస్తున్నాడు. నాకు ఒక విషయాన్ని తెలుసుకోవాలని ఎప్పటినుంచో కుతూహలంగా ఉంది. 'మహత్తరమైన బ్రాహ్మణశక్తి కల భృగువంశంలో విచిత్రమైన క్షత్రియశీలం కల పరశు రాముడెట్లా జన్మించాడు? మహోత్తమమైన క్షాత్రశక్తితో మండే కుశికవంశంలో బ్రాహ్మణ తేజస్సు కల విశ్వామిత్రు డెట్లా పుట్టాడు? ఇదివరకు కొంత విన్నాను. కాని సంశయం తీరలేదు. కనుక నా మనస్సున నాటుకొనేటట్లు స్పష్టంగా ఆ కథ చెప్పుము' అంటే భీష్ముడు 'అయితే చ్యవన కుశిక సంవాదం వినుము. నీ సందేహం తీరుతుంది. చ్యవనుడు కుశికుడివలన తన వంశం సంకరమౌతుందని తెలిసికొని ఆ కులానికి ఆపద నాపాదించాలనుకొని కుశికుడి దగ్గరకు పోయి.

**విశేషం:** ఇదివరకు విన్నాను. అన్నమాట చాలా నేర్పుగా అన్నాడు. ఎందుకంటే ఈ కథలు పూర్వపర్వాలలో వచ్చాయి కనుక.

**క.** **భార్యా సహితముగా న । య్యార్య వరుని కనుగుణంపు టర్చన విధివ**
**చ్చర్యాపూర్వముగ వినయ । ధుర్యత వెలయంగఁ జేసె దోహల మమరన్.** **292**

**ప్రతిపదార్థం:** భార్యాసహితముగాన్= భార్యతోపాటుగా; ఆ+ఆర్యవరునికిన్= ఆ పూజనీయులలో శ్రేష్ఠుడికి; అనుగుణంపు= తగిన; అర్చనన్= పూజను; విధివత్= శాస్త్రానుగుణమైన; చర్యాపూర్వముగన్= చేష్టా పూర్వకంగా; వినయ ధుర్యత= వినయభారం; వెలయంగన్= ప్రకాశించేటట్లు; దోహలము= ఉత్సాహం; అమరన్ చేసెన్= అమరేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** కుశికుడు భార్యతో కలిసి ఆ మునివరునకు శాస్త్రం చెప్పిన పద్ధతిగా వినయంతో ఉత్సాహంగా పూజలు చేశాడు.

**విశేషం:** ఆర్యుడు= పూజింపదగినవాడన్న అర్థంలోనే ప్రాచీన గ్రంథాలలో ఉన్నది. కాని నేడు చరిత్రకారులు ద్రావిడజాతిని అణగద్రొక్కి, ఆర్యులెక్కడ నుండో కొన్నివేల ఏళ్ళక్రితం భారతదేశానికి వచ్చారని చెప్పుతున్నారు. ఈ దేశాన్ని అప్పటికే పాలించేవారు ద్రావిడజాతి అని వీళ్ళవాదన. కానీ వేదంలో ఎక్కడా ఈ అర్థంలో లేదని పండితులంటున్నారు.

**క.** **పూజితునిఁ జేసి, యతనికి । రాజవరుం డిట్టులనియె 'రాజ్య విభుత్వ**
**భ్రాజిష్ణుఁడవై భృత్యుని । యోజను నను నడపి యేలు ముర్వి మునీంద్రా!** **293**

**ప్రతిపదార్థం:** పూజితునిన్+చేసి= పూజించి (పూజించబడిన వాడినిగా చేసి); అతనికిన్= అతడితో; రాజవరుండు= రాజశ్రేష్ఠుడు; ఇట్టులు; అనియెన్; మునీంద్రా!= మునిశ్రేష్ఠా!; రాజ్యవిభుత్వ= రాజ్యసంబంధమైన ప్రభు భావంతో (రాజత్వంతో);

భ్రాజిష్ణుఁడవు+ఐ= ప్రకాశించేవాడివై; ననున్= నన్ను; భృత్యుని= సేవకుని; ఓజను= వలె; నడపి= నియోగించి; ఉర్వి ఏలుము= భూమిని పాలించుము.

**తాత్పర్యం:** మునీంద్రుడిని పూజించి రాజేంద్రు డతనితో అన్నాడు. 'మునీంద్రా! నీవు రాజ వైభవంతో వెలుగొందుతూ నన్ను నీ సేవకుడిగా చేసికొని ఈ ధరణిని పాలించుము.

**క. ఏనును, భార్యయు, బంధులు, । నానా జనసహితముగ సనాథతఁ గని య**

**ట్లైనం బెంపుం బొరయం । గా నిలకుఁ బ్రమోద మొందఁ గైకొను మమ్మున్. 294**

**ప్రతిపదార్థం:** ఏనునున్= నేనూ; భార్యయున్= భార్యా; బంధులున్=చుట్టాలూ; నానా జనసహితముగన్= అనేకులతో పాటుగా; సనాథతన్+కని= సభర్తృకత్వమునుపొంది; ఇలకున్= నేలకు (రాజ్యానికి); అట్లు= ఆవిధంగా; అయినన్= అయితే; పెంపున్= శుభం,అభివృద్ధి; పొరయంగాన్= కలుగగా; ప్రమోదము= సంతోషం; ఒందన్= పొందేటట్లుగా; మమ్మున్; కైకొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** నేనూ, నా భార్య, చుట్టాలు, పక్కాలు అంతా నిన్ను రాజుగా అంగీకరించి సేవిస్తాం. రాజ్యానికి శుభాభివృద్ధి కలిగేటట్లు మమ్ములను స్వీకరించుము.'

**చ. అన విని, యమ్ముని ప్రవరుఁ డాతని కిట్లను 'రాజ్యకాంక్ష నా**

**మనమున లేదు, సద్వ్రతము, మానిత వృత్తిఁ జరించువాఁడ నై**

**జనవర! వచ్చినాఁడఁ; బరిచారము నీవును నీదు పత్నియున్**

**గొనకొని చేయఁ గావలయుఁ గోరిక యింతియ తీర్చు మోపినన్.' 295**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; ఆ ముని= మునులలో; ప్రవరుఁడు= శ్రేష్ఠుడు; అతనికిన్= రాజుతో; ఇట్లు; అనున్; జనవర= మానవనాథా!; నా మనమునన్= నా మనస్సులో; రాజ్యకాంక్ష= రాజ్యంమీద కోరిక; లేదు; మానిత= గౌరవించ దగ్గ; వృత్తిన్= ప్రవర్తనతో; సత్+వ్రతము= మంచి వ్రతం; చరించువాఁడనై= ఆచరించేవాడనై; వచ్చినాఁడన్= వచ్చాను; నీవునున్= నీవూ; నీదు= నీ; పత్నియున్= భార్యా; కొనకొని= పూనుకొని; పరిచారము= సేవ; చేయఁ గావలయున్=చేయాలి; ఇంతియ= ఇంతే; కోరిక= నా అభిలాష!; ఓపినన్= ఓపిక ఉంటే; తీర్పుము= చెల్లించుము.

**తాత్పర్యం:** అంతా విని మునీంద్రు డన్నాడు. 'రాజా! నాకు రాజ్యమేలాలన్న కోరిక ఏ కోశానా లేదు. నేను ఒక వ్రతాన్ని పూని దానిని చెల్లించుకొనటానికై తిరుగుతున్నాను. నీకు ఓపిక ఉంటే నీవూ, నీ భార్యా, బంధువులూ నాకు సేవచేస్తే చాలు. నా కోరిక ఇంతే.'

**వ. అనిన విని యా దంపతులు ముదంబునం బొదలి 'యట్ల చేయువార' మనిరి; తదనంతరంబ. 296**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనటం విని; ఆ దంపతులు= రాజూ రాణీ; ముదంబునన్= సంతోషంతో; పొదలి= వర్ధిల్లి; అతిశయించి; అట్ల= అట్లే; చేయువారము= చేస్తాము; అనిరి= అన్నారు; తత్+అనంతరంబు+అ= అటు తరువాత.

**తాత్పర్యం:** అనగా విని ఆ దంపతులు సంతోషించి 'అట్లాగే చేస్తా' మన్నారు. ఆ తరువాత.

క. అమ్ముని నభ్యంతర సద । నమ్మునకుం గొని విభుండు నాతియుఁ దానున్,
సమ్మోదమ్మునఁ జని, హృ । ద్యమ్మగు, నొక చోటు సూపి యాతనితోడన్. 297

**ప్రతిపదార్థం:** ఆ+మునిన్= చ్యవన మహర్షిని; అభ్యంతర= లోపలి; సదనమ్మునకున్= ఇంట్లోకి; అంతఃపురానికి; కొని= తీసికొని; విభుండు= రాజు; నాతియున్= స్త్రీ (రాణి); తానున్= (రాజు) తాను; సమ్మోదమ్మునన్= సంతోషంతో; చని= పోయి; హృద్యమ్ము+ అగు= అందమైన; ఒకచోటు= ఒక స్థలం; చూపి; అతనితోడన్= మునితో.

**తాత్పర్యం:** ఆ మునిని అంతఃపురానికి తీసికొనిపోయి రాజూ రాణీ సంతోషంతో ఆయన కొక అందమైన నివాసం చూపించి ఆ మునితో.

ఆ. 'అనఘ! యిచట నుండు' మని పల్కి, మృదులత । ల్పంబు నంచితాసనంబు నచటఁ
బెట్టఁ బనిచి యేము ప్రీతి నొనర్చెద । మిష్టభంగిఁ బనుపుఁ డెద్దియైన' 298

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!, స్వామీ; ఇచటన్= ఈ చోట; ఉండుము; అని; పల్కి= చెప్పి; మృదుల= మెత్తని; తల్పంబు= శయ్య; అంచిత= ఒప్పిదమైన; ఆసనంబు= పీఠం; అచటన్= అక్కడ; పెట్టన్= పెట్టుమని; పంచి= ఆజ్ఞాపించి; ఏము= మేమిద్దరం; ప్రీతిన్= ప్రేమతో; ఒనర్చెదము= సేవిస్తాము; ఇష్టభంగిన్= నీకిష్టమైన విధంగా; ఎద్దిఐనన్= ఏదైనా సరే; పనుపుము= ఆనతిమ్ము!

**తాత్పర్యం:** 'పాపంలేనివాడా! నీవు ఇక్కడ ఉండుము.' అని పరుండుటకు మెత్తని శయ్య, కూర్చోటానికి చక్కనిపీఠం ఉంచుమని ఆజ్ఞాపించి; 'స్వామీ! తమయిష్టానుసారంగా మేము సేవిస్తాము. మీ కేమి చేయాలో చెప్పండి.'

వ. అనియె; నంత నినుం డపరగిరికడచనినం, గాలోచిత కృత్యంబు లాచరించి యమ్మహాత్ముం డాహార మడిగిన నమ్మహీపతి మహితభోజనంబున నతనిం దృప్తునిం గావించిన.' 299

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అంతన్= అంతలో; ఇనుండు= సూర్యుడు; అపరగిరికడ= పశ్చిమదిక్కున నున్న పర్వతందగ్గరికి; - క్రుంకు కొండకు; చనినన్= పోగా; కాల= ఆ సంధ్యాసమయానికి; ఉచిత= తగిన; కృత్యంబులు= వైదిక కార్యాలు (పనులు); ఆచరించి= చేసి; ఆ మహాత్ముండు= ఆ ముని; ఆహారము= భోజనం; అడిగినన్= అడుగగా; ఆ మహీపతి= ఆ భూమిపతి, రాజు; మహిత= గొప్ప; భోజనంబునన్= ఆహారంతో; అతనిన్= మునిని; తృప్తునిన్+కావించినన్= తృప్తిపడేటట్లు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** అని అన్నాడు. ఇంతలో సాయంకాలమైనది. ముని సంధ్యాకాలంలో చేయదగ్గ సంధ్యావందనాది వేదోక్త కర్మ లాచరించి రాజుతో భోజనం కావా లన్నాడు. రాజు గొప్ప విందు భోజనంతో మునిని తృప్తుడిని చేశాడు.

ఆ. అతఁడు సెజ్జఁ జేరి, యధిపుతో 'నియ్యెడ । నిద్రవోదు నేను నృపవరేణ్య!
మీరు నిదుర దక్కి, మెలపున నాచర । ణంబు లొత్తు చునికి నాకుఁ బ్రియము. 300

**ప్రతిపదార్థం:** అతఁడు= ముని; సెజ్జన్= శయ్యను; చేరి= సమీపించి; అధిపుతోన్= రాజుతో; ఈ+ఎడన్= ఇక్కడ; నేను నిద్రపోదున్= నిద్రపోతాను; నృపవరేణ్య!= రాజులలో చాలా గొప్పవాడా!; మీరు= మీ దంపతులిద్దరు; నిదుర; తక్కి= లేకుండా; మెలపునన్= చక్కగా; నా చరణంబులు= నా కాళ్ళు; ఒత్తుచున్+ఉనికి= ఒత్తుతూ ఉండటం; నాకున్; ప్రియము= ఇష్టం.

**తాత్పర్యం:** ముని భోజనం చేసి మంచమెక్కి రాజుతో అన్నాడు 'నే నిక్కడ నిద్రిస్తానయ్యా! రాజశ్రేష్ఠుడా! మీ దంపతులిద్దరూ నిద్రపోకుండా నా కాళ్ళు పిసుకుతూ మేల్కొని ఉండండి: అదే నాకిష్టం.

**క. ఏనై మేల్కనునంతకు । భూనాయకవర్య! నన్ను బోధింపకుఁ డీ**
**మానినియు నీవు' నని, ని । ద్రా నిరతుం డయ్యె, వారుఁ దద్దయు భక్తిన్. 301**

**ప్రతిపదార్థం:** ఏను+ఐ= నా అంత నేనుగా; మేల్కను+అంతకున్= మేలుకొనే టంతవరకు; భూనాయకవర్య!= రాజులలో శ్రేష్ఠుడా!; నన్నున్; ఈ మానినియున్= ఈ నీ భార్యయూ; నీవున్; బోధింపకుఁడు= మేల్కొలుపవద్దు; అని; నిద్రానిరతుండు+ అయ్యెన్= నిద్రలో మునిగిపోయాడు; వారున్= దంపతులు; తద్దయున్= మిక్కిలి; భక్తిన్= భక్తితో.

**తాత్పర్యం:** నా అంత నేనై లేచేటంతవరకు మీ ఇద్దరిలో ఎవరూ నన్ను నిద్ర లేపవద్దు' అని నిద్రించాడు. ఆ దంపతులు మిక్కిలి భక్తితో. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. కుడుపు నిదురయు, వర్జించి యడుగు లొత్తు । చుండి రమ్ముని వల్లభుఁ డొక్కప్రక్క**
**నచలగాత్రుఁడై నిద్రింప నద్భుతముగ । దినము లిరువది యొక్కటి సనియె నధిప! 302**

**ప్రతిపదార్థం:** కుడుపు= తిండి; నిదురయున్= నిద్రా; వర్జించి= వదలి; అడుగులు= పాదాలు; ఒత్తుచున్+ఉండిరి= ఒత్తుతూ ఉన్నారు; ఆ ముని వల్లభుఁడు= ఆ మునిరాజు; ఒక ప్రక్కన్= ఒకే ప్రక్కకు తిరిగి; అచల= కదలిక లేని; గాత్రుఁడై= శరీరం కలవాడై; అద్భుతముగన్= ఆశ్చర్యముగా; నిద్రింపన్= నిద్రపోగా; ఇరువదిఒక్కటి; దినములు= రోజులు; చనియెన్= గతించాయి; అధిప!= రాజా! - ధర్మరాజా! (శ్రోత).

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ దంపతులు అన్నం నిద్రా విసర్జించి పాదాలు ఒత్తుతూనే ఉన్నారు. ఆ ముని ఒకే ప్రక్కకు తిరిగి పడుకొన్నవాడు పడుకొన్నట్లుగానే ఉన్నాడు. శరీరంలో కదలిక లేదు. ఈ విధంగా ఇరవై ఒక్క రోజులు గతించిపోయాయి.

**విశేషం:** ఇరవై ఒక్క రోజులు ఎట్లా పడుకుంటాడు? పిచ్చికథ అనవచ్చును. కానీ, యోగులు సమాధిలో మునిగి ఉండగలరు. ఈ యుగంలో శ్రీ రామకృష్ణ పరమహంస అట్లా ఉన్నారని వారి జీవిత చరిత్రలో ఉన్నది. ఒత్తుచుండిరి= ఒత్తుతూ ఉన్నారు. ఏమరుపాటు లేకుండా భక్తితో - దీన్ని శత్రర్థక క్రియ అంటారు.

**వ. ఇరువది రెండవనాఁ డమ్ముని తనయంతన మేల్కొని. 303**

**తాత్పర్యం:** ఇరవైరెండో రోజున ఆ ముని తనంత తానే నిద్ర లేచి.

**క. ఇలు వెడలి పోయె నేమియుఁ । బలుకక; యా దంపతులును బరమశ్రాంతా**
**త్ము లగుచు వెనుకన చని; ర । క్కులపతి యించుకయు సరకుగొనఁ డవ్విధమున్. 304**

**ప్రతిపదార్థం:** ఏమియున్= ఏమీ; పలుకక= మాట్లాడక; ఇలు వెడలిపోయెన్= ఇల్లు వదలి వెళ్ళిపోయాడు; ఆ దంపతులును= రాజూ రాణీ; పరమ= మిక్కిలి; శ్రాంత+ఆత్ములు= అలసిపోయిన శరీరం కలవారు; అగుచున్= అవుతూ; వెనుకన= ఆముని

వెనుకనే; చనిరి= వెళ్ళారు; ఆ+కులపతి= ఆ ముని; ఇంచుకయున్= కొంచెమైనా; ఆ విధమున్= ఆ పద్ధతిని; సరకుకొనఁడు= లెక్కపెట్టడు.

**తాత్పర్యం:** ముని లేచిందే తడవుగా ఏమీ మాట్లాడకుండానే ఇల్లు వదలి వెళ్ళిపోయాడు. బాగా అలసిపోయిన దంపతులు ఆయన వెనుక పడ్డారు. దానికీ ఆయన లెక్కచేయలేదు.

**విశేషం:** కులపతి= పదివేల శిష్యులకు అన్నదానంతోపాటు విద్యాదానం చేసే గురువు. (ఇవ్వాళ వైస్‌ఛాన్సలరు - అన్నమాట కిది తెలుగుగా వాడుతున్నారు - ఆయన అట్లాంటి పనిచేయకపోయినా).

**ఆ. అట్లు వారివలన నాదర రహితుఁడై । పురవరంబు వెడలి పోయి పోయి**
**యతఁడు సూడఁజూడ 'నంతర్హితుం డైనఁ । బతియు సతియు మూర్ఛపాలు పడిరి. 305**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; వారివలనన్= వారిపై; ఆదర= ప్రేమ; రహితుఁడై= లేనివాడై; పురవరంబు= శ్రేష్ఠమైన నగరం; వెడలి= బహిర్గమించి - బయటకు వచ్చి; పోయిపోయి= చాలా దూరం పోయి; చూడన్+చూడన్= చూస్తూ ఉండగానే; అతఁడు= ఆ ముని; అంతర్హితుండు= అదృశ్యుడు; ఐనన్= కాగా; పతియు సతియున్= భర్త, భార్య; మూర్ఛపాలు పడిరి= మూర్ఛపోయారు.

**తాత్పర్యం:** ఆ విధంగా వారిని నిరాదరించిన ముని నగరం దాటి పోయిపోయి అదృశ్యం కాగా రాజూ రాణీ మూర్ఛపోయారు.

**క. కొంతవడికిఁ దెప్పిఱి యెద । నెంతయు వగ నూనఁ బురికి నేతెంచి గృహా**
**భ్యంతరము సొచ్చి కని ర । య్యింతియును విభుండు నమ్మునీశ్వరు సెజ్జన్. 306**

**ప్రతిపదార్థం:** కొంతవడికిన్= కొంచెం సేపటికి; తెప్పిఱి= మూర్ఛనుండి తెప్పరిల్లి; ఎదన్= హృదయంలో; ఎంతయున్= ఎంతో; వగన్= దుఃఖం; ఊనన్= పొందగా; పురికిన్= నగరానికి; ఏతెంచి= వచ్చి; గృహ+అభి+అంతరమున్= అంతఃపురం లోనికి; చొచ్చి= ప్రవేశించి; ఆ+ఇంతియును= ఆ స్త్రీ (రాణి); విభుండున్= రాజూ; ఆ+ముని+ఈశ్వరున్= ఆముని శ్రేష్ఠుడిని; సెజ్జన్= శయ్యపై; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొని మనస్సులో బాగా మథనపడి తిరిగి నగరం ప్రవేశించి అంతఃపురంలోకి పోయి చూస్తే మునీశ్వరుడు మంచంపైనే ఉన్నాడు.

**వ. మును నిద్రించు ప్రక్కదక్క యొండు ప్రక్క నిద్రించు భార్గవు నట్లు గాంచి సంతోషించి, పరిశ్రాంతి దిగద్రావి యెప్పటి చొప్పున నడుగు లొత్తుచుండ, మఱియు దినంబు లిరువది యొక్కటి సనినం బ్రబుద్ధుండై. 307**

**ప్రతిపదార్థం:** మును= ముందు - పూర్వం; నిద్రించు ప్రక్క= నిద్రించే వైపు; తక్కి= వదలి; ఒండుప్రక్కన్= మరొకప్రక్క; నిద్రించు= నిద్రపోయే; భార్గవున్= చ్యవనుడిని; అట్లు= ఆ విధంగా; కాంచి= చూచి; సంతోషించి= ఆనందించి; పరిశ్రాంతిన్= అలసటను; దిగన్ త్రావి= దిగవిడిచి, త్యజించి; ఎప్పటి చొప్పునన్= ఎప్పటివలెనే; అడుగులు= పాదాలు; ఒత్తుచున్+ఉండన్= ఒత్తుతూ ఉండగా; మఱియున్= మరలా; ఇంకా; దినంబులు= రోజులు; ఇరువది= ఇరవై పై; ఒకటి; చనినన్= గడవగా; ప్రబుద్ధుండు+ఐ= మేల్కొని

**తాత్పర్యం:** ముని పూర్వం నిద్రించిన వైపు వదలి మరొక ప్రక్క తిరిగి నిద్రిస్తున్నాడు. అట్లాంటివాడిని చూచి రాజూ రాణీ కలిగిన అలసట కూడా లెక్కసేయక ఎప్పటివలెనే పాదా లొత్తుతూ ఉన్నారు. మరలా ఇరవై ఒక్క రోజులు గడిచాయి. అప్పు డా భార్గవుడు నిదుర లేచి.

**సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి కమ్మ । నూనియఁ దెప్పించి మేను శిరము**
**నభ్యక్తములు సేయ, నమ్ముని సెడ నాడి । యంతర్హితుం డయ్యె నపరఘటికఁ**
**దోఁచి వికారంబు దొడరక యున్న రా । జును దేవులను గని, సుముఖుఁ డగుచు**
**నాచరితస్నానుఁ డగుటయు, వారు మ । హార్హంబు లగు వివిధాన్నపాన**

**ఆ. ములు ఘటించి, కుడువఁ బిలిచినఁ జని, వాని । నెల్లఁ గాంచి, యెక్కడేనిఁ బోయె**
**వార లడలు గదుర నూరకయుండి రా । పగలు రేయుఁ గురునృపాలవర్య! 308**

**ప్రతిపదార్థం:** కురునృపాల వర్య!= కౌరవరాజశ్రేష్ఠుడా! అతఁడు= చ్యవనుడు; తైల+అభ్యంగము= నూనెరాసుకొని చేసే స్నానం, తలంటు; అడిగినన్= అడుగగా, పతి= రాజు; కమ్మనూనియన్= కమ్మని వాసనవేసే నూనెను; తెప్పించి; మేనున్= శరీరము; శిరమున్= తల; అభ్యక్తములు సేయన్= అభిషేకించగా; ఆ ముని; చెడన్+ఆడి= చెడదిట్టి; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడయ్యాడు; అపరఘటికన్= మరునిముసంలో; తోఁచి= కనిపించి; వికారంబు= బాధ, దుఃఖం, విసుగు మొదలైన భావాలు; తొడరక= కలుగక; ఉన్న= ఉన్నట్టి; రాజునున్; దేవులను= దేవేరులను, రాణులను; కని; సుముఖుఁడు+అగుచున్= ప్రసన్నముఖం కలవాడై; ఆచరిత= చేయబడిన, చేయించబడిన; స్నానుఁడు= స్నానం కలవాడు; అగుటయున్= కాగా; వారు= రాజు రాణి; మహా+అర్హంబులు+అగు= మిక్కిలితగిన; వివిధ= అనేకములు; అన్న= భోజనం; పానములు= త్రాగేవి; ఘటించి= కూర్చి; కుడువన్= తినడానికి; పిలిచినన్= పిలిస్తే; చని= వెళ్ళి; వానిన్+ఎల్లన్= వాటినన్నిటినీ; కాంచి= చూచి; ఎక్కడ+ఏనిన్= ఎక్కడికైనా, ఎక్కడకో; పోయెన్= పోయాడు; వారలు= రాజు, రాణులు; ఆ పగలు రేయున్= ఆ రోజంతా; అడలు= బాధ, దుఃఖం; కదురన్= కలుగగా; ఊరక ఉండిరి= అట్లాగే కూర్చుండి పోయారు;

**తాత్పర్యం:** కౌరవరాజులలో శ్రేష్ఠుడైనవాడా! ఆ ముని నూనెతో తలంటు స్నానం చేయాలన్నాడు. రాజు వాసననూనె తెప్పించి తలకు శరీరానికి నూనె పూయగా ఆయన తెగ తిట్టి కనిపించకుండాపోయాడు. మరునిముసంలో కనిపించి రాజూ, రాణీ ముఖంలో కోపతాపాలు లేకపోవటం చేసి సంతోషంతో వికసించిన ముఖం కలవాడై స్నానం చేయించుకొనగా వారున్నూ తగిన అనేక అన్నపానీయాదులు సమకూర్చి భోజానానికి పిలువగా వాటిని చూచి తినకుండానే ఎక్కడికో వెళ్ళిపోయాడు. వారు ఆ రోజంతా అట్లాగే చింతిస్తూ గడిపారు.

**వ. ఆ భృగువంశ వర్యుండు. 309**

**ప్రతిపదార్థం:** ఆ భృగువంశ వర్యుండు= ఆ భృగువంశంలో శ్రేష్ఠుడు, చ్యవనుడు.

**తాత్పర్యం:** ఆ చ్యవనుడు.

**సీ. వేగినఁ బొడసూపి, 'వేగంబ యరదంబు । వన్నింపు; నీవు నీ భామినియు వ**
**హింపఁగా రథికత యెసఁగఁ గాంచన రత్న । గోహయముల యాచకులకు నిచ్చు**

**చును జనవలయు నా 'కనుడు భూపతి తేరు । సమకట్టి, దాపటఁ జామ, దాను**

**వలపటఁ బూని, యావస్తువు లెల్లను । గొనివచ్చి యా మంత్రి జనులఁ బనుప**

**తే. నెక్కి వారల నా సంయమీశ్వరుండు । నిశితతర మగు మునికోల నెత్తు రొలుక**

**మోపుచును దీనకోటికి నా పదార్థ । చయము నెడనెడ నొసఁగుచుఁ, జనుచునుండె. 310**

**ప్రతిపదార్థం:** వేగినన్= తెల్లవారగా; పొడసూపి= కనిపించి; వేగంబు+అ= వేగంగా; అరదంబు= రథాన్ని; పన్నింపు= పూన్పుము, కట్టించుము; నీవున్; నీ భామినియున్= నీ భార్యయును, (భామ= స్త్రీ); వహింపఁగాన్= గుఱ్ఱాలై లాగగా; రథికత= నేను రథంలో కూర్చొనటం; ఎసఁగన్= ప్రకాశించగా; కాంచన= బంగారం; రత్న= మణులు; గో= ఆవులు; హయములు= గుఱ్ఱాలు; యాచకులకున్= బిచ్చగాళ్ళకు; ఇచ్చుచును= ఇస్తూ; నాకున్; చనవలయున్= పోవాలి; అనుడున్; భూ+పతి= భూమికి భర్త, రాజు; తేరు= రథం; సమకట్టి= సిద్ధపరచి; దాపటన్= ఎడమప్రక్క; చామ= భార్య; వలపటన్= కుడిప్రక్క; తానున్= రాజూ; పూని= లాగుతూ; వస్తువులు= ముని చెప్పినవి; ఎల్లనున్= అన్ని; కొనివచ్చి= తెచ్చి; ఈన్= ఇవ్వటానికి; మంత్రిజనులన్= మంత్రులను; పనుపన్= నియోగించగా; ఆ సంయమి+ఈశ్వరుండు= ఆ మునినాథుడు; ఎక్కి= రథమెక్కి; వారలన్= గుఱ్ఱాలుగా లాగుతున్న రాజును; రాణిని; నెత్తురు= రక్తం; ఒలుకన్= కారగా; నిశితతరము= మిక్కిలి వాడి; అగు= అయిన; మునికోలన్= ములుకోలతో, ములుగఱ్ఱతో; మోపుచును= పొడుస్తూ; ఆ పదార్థచయమున్= ఆ బంగారు మొదలైన వస్తువుల సమూహం; ఎడన్+ఎడన్= అక్కడక్కడా; దీనకోటికిన్= దీనుల బృందానికి; ఒసఁగుచున్= ఇస్తూ; చనుచున్+ఉండెన్= వెళ్ళుతున్నాడు.

**తాత్పర్యం:** తెల్లవారగానే కనిపించి 'వెంటనే రథ మేర్పాటు చేయుము; నీవూ నీ భార్యా దాన్ని లాగుతూ ఉండగా నేను అందులో కూర్చుని బంగారం, రత్నాలు, గుఱ్ఱాలు బిచ్చగాళ్ళకు ఇస్తూ పోతూ ఉండాలి' అని చెప్పగానే రాజు రథాన్ని సిద్ధపరచి తన భార్య ఎడమప్రక్క, తాను కుడిప్రక్క గుఱ్ఱాలై లాగుతూ ఉండగా, చ్యవనుడు రథమెక్కి మంత్రులు తెచ్చిన ఆ వస్తువులను దీనజన సమూహానికి ఇస్తూ, మునికోలతో రాజునూ రాణినీ పొడుస్తూ పోతున్నాడు.

**వ. పెక్కుదినంబు లాహార నిద్రలు లేమి డప్పిఁ దూలు నమ్మహీపాలు నమ్మహిషి నమ్ముని ములుకోల పోట్లనట్లు పూచిన మోదువుల చందంబు నొందింపఁ జూచి జనంబు లల్లన తమలోన 'నిట్టితపో మహిమయుం గలదే యిది యన్యాయ్యం' బని యలుగను దగవు వలుకను దేఱి చూడను రాదయ్యెడు నీ దంపతుల ధీరత్వంబును నిష్ఠాపరత్వంబును నింతయొప్పునే! దుర్వహంబగు భారంబు నిర్వికారులయి వహించుచున్న వారనుచు నుమ్మలించుచుఁ బరివేష్టించి చనం జ్యవనుండు పురంబు వెడలి వారి మనంబుల వికారంబులు గానక, యచ్చెరువును మెచ్చును బెనంగొను హృదయంబుతో నరదంబు డిగ్గి, వారల శిరంబులం గట్టిన పగ్గంబులు విడిచి, శరీరంబులు కరంబున సంస్పర్శించి, యజ్ఞనపతి యాననం బాలోకించి, 'దస్సితిగదే, వరంబిచ్చెద, వగపు దక్కి పురంబునకుం జను; మేను గంగాతీరవనంబున వ్రతచర్యా శేషంబు నిర్వహించెద; నీవు మహిషీ సహితంబుగా నెల్లి నా కడకుం జనుదె' మ్మని పలుకుటయు 'నాకు వగ పెక్కడి?' దని పలికి యవ్విభుండు.311**

**ప్రతిపదార్థం:** పెక్కు దినంబులు= అనేక దినాలు; ఆహారనిద్రలు; లేమి= ఆహారం, నిద్ర లేనందువల్ల; డప్పిన్= అలసటతో; తూలు= సొమ్మసిలుతున్న; దప్పిక; ఆ+మహీపాలున్= ఆ రాజును; ఆ మహిషిన్= ఆ రాణిని; ఆ+ముని; ములుకోల=

ముల్లున్న కర్రయొక్క; పోట్లన్= పోట్లతో; అట్లు= ఆ విధంగా; పూచిన మోదువులచందంబున్= పూచిన మోదుగుల విధంగా; ఒందింపన్= పొందించగా; అల్లన= నెమ్మదిగా; తమలోననిట్టి తపోమహిమయుంగలదె; ఇది అన్యాయ్యంబు+అని; అలుగను; తగవు= న్యాయం; పలుకను= చెప్పటానికి; తేఱిచూడను= తేరిచూడటానికీ; రాదయ్యెడున్= వీలులేదు కదా!; ఈ దంపతుల ధీరత్వంబును= ధైర్యం, కష్టాలలో చెదరని మనస్సు కలిగి ఉండటం; నిష్ఠాపరత్వంబునున్= కార్యదీక్ష; ఇంత ఒప్పునే; దుర్వహంబు= మోయరాని; భారంబు= బరువు; నిర్వికారులయి= ఏమీ మార్పు లేనివారై, వహించుచున్నవారనుచు; ఉమ్మలించుచున్= మనస్సులలో బాధపడుతూ; పరివేష్టించి= చుట్టుకొని; మూగి; చనన్= పోగా; చ్యవనుండు; పురంబు వెడలి= పట్టణం దాటి; వారిమనంబులన్= ఆరాజదంపతుల మనస్సులలో; వికారంబులు= మార్పులు; కానక= చూడక; అచ్చెరువును= ఆశ్చర్యం; మెచ్చునున్= మెప్పుదల; పెనంగొను= ముడిపడు; హృదయంబుతోన్; అరదంబు డిగ్గి= రథం దిగి; వారల శిరంబులన్= తలలపై; కట్టిన; పగ్గంబులు= తాళ్ళు; విడిచి= తొలగించి; శరీరంబులు; కరంబునన్= చేతితో; సంస్పర్శించి= ముట్టుకొని నిమిరి; ఆ+జనపతి= ఆ రాజుయొక్క; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి; డస్సితి గదే= అలసిపోయినావు గదవయ్యా!; వరంబు+ఇచ్చెదన్; వగవు దక్కి= దుఃఖం వదలిపెట్టి; పురంబునకున్+చనుము; ఏను= నేను; గంగాతీరవనంబునన్= గంగ ఒడ్డున ఉన్న అడవిలో; వ్రతచర్యాశేషంబు= మిగిలిన వ్రతకార్యం; నిర్వహించెదన్= పూర్తిచేస్తాను; నీవు; మహిషీ సహితంబుగాన్= రాణితోపాటుగా; ఎల్లి= రేపు; నా కడకున్= నా దగ్గరకు; చనుదెమ్ము= రమ్ము; అని పలుకుటయున్= అని చెప్పగా; ఆ+విభుండు= ఆరాజు; నాకున్; వగపు+ఎక్కడిది= దుఃఖం లేదు; అని పలికి (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** అనేక దినాలు తిండి నిద్ర లేనందువలన ఆ రాజు, రాణి దప్పికతో అలసి తూలిపోతూ ముని ముల్లుకర్రపోట్ల వలన శరీరాలు పూచిన మోదుగచెట్లుకాగా, చూచిన ప్రజలు 'అయ్యో! ఇదేం న్యాయం? ఈ ముని తపోమహిమవలన ఏమీ అనలేము; కానీ, ఈ దంపతు లెంత ధైర్యంగా కార్యదీక్షను వహిస్తున్నారు?' అని అనుకొన్నారు. రాజు రాణి మనస్సులలో స్వచ్ఛమైన భక్తితో ఉండటం ముని చూచి ఆశ్చర్యంతో మెచ్చుకొంటూ రథం దిగి వాళ్ళ తలలకు కట్టన త్రాళ్ళూడదీసి, రాజుతో 'నాయనా! చాలా అలసిపోయావు. నీకు వరమిస్తాను; నీవూ, నీ భార్యా ఇంటికి పోయి రేపు రండి. నేను మిగిలిన వ్రతాన్ని ఈ గంగా తీరంలో ఉన్న అడవిలో పూర్తి చేసికొంటాను, అని చేతులతో వారి శరీరాలను నిమరగా; రాజు 'స్వామీ! మాకు అలుపుసొలుపు లేదు' అంటూ.

**క. తన తనువు వనిత మేనును । గనుఁగొని యచ్చెరువు ముదము గడలుకొనఁగ న**
**మ్మునితో భవత్ప్రభావముఁ । గొనియాడఁగఁ దరమె మాకు గురుతరకరుణా!' 312**

**ప్రతిపదార్థం:** తనతనువున్= తన శరీరం; వనిత= స్త్రీ; రాణి; మేనునున్= శరీరం; కనుఁగొని= చూచి; అచ్చెరువున్= ఆశ్చర్యం; ముదమున్= సంతోషం; కడలుకొనఁగన్= ముంచెత్తగా; ఆ+మునితోన్= ఆ మునితో; గురుతర కరుణా!= గొప్పదయకలవాడా!; భవత్= మీ; ప్రభావము= మహత్తు; కొనియాడఁగన్= స్తుతింపగా; మాకున్; తరమె= శక్యమా!;

**తాత్పర్యం:** తన శరీరం, రాణి శరీరం చూచి సంతోషం, ఆశ్చర్యం తన మనస్సును ముంచెత్తగా 'గొప్ప దయగల స్వామీ! మీ మహిమను కొనియాడ మాకుశక్యమా?

**వ. అని వెండియు. 313**

**తాత్పర్యం:** అని ఇంకా.

**తే. 'శ్రమము లేదు, ప్రతోద వ్రణములు లేవు, । నాతియును, నేను, నెలజవ్వనంబుఁ గంటి**
**మిది మహాద్భుతతర మందుమే! భవన్మ । హానుభావత్వ మేమి సేయదు? మునీంద్ర !' 314**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్ర!= మునీశ్వరా!; శ్రమము= అలసట; ప్రతోద= ముల్లుకోలచే కల్గిన; వ్రణములు= గాయాలు; లేవు; నాతియునున్= నా భార్య; నేను; ఎల= లేత; జవ్వనంబున్= యౌవనం; కంటిమి= పొందితిమి; ఇది; మహా+అద్భుతతరము= మహాశ్చర్యం; అందుమే!= అంటామా!; భవత్= మీ; మహా+అనుభావత్వము= గొప్ప వ్యక్తిత్వం; ఏమిచేయదు?= ఏం చేయలేదు?

**తాత్పర్యం:** 'మునిచంద్రా! మాకు శ్రమ లేదు సరికదా! ముల్లుకర్ర వలన కలిగిన పుండ్లూ లేవు. పైగా మేము నూత్న యౌవనం పొందాము. ఇదంతా మీ మాహాత్మ్య మనుకొనమంటారా? అయినా మీ గొప్పతన మేమి చేయలేదుకనుక.

**వ. అని సవినయంబుగాఁ దానును దేవియు దండప్రణామంబులు సేసి, యా సంయమివరు వీడ్కొని, సాద్భుత చిత్తులైన సకల జనులుం బరివేష్టింపఁ బురంబు ప్రవేశించి, ప్రమోదమయమూర్తు లగుచు, దివసవర్తనంబును, రాత్రి చర్యయుం గడపి, సూర్యోదయం బగుటయు.' 315**

**ప్రతిపదార్థం:** అని= అనిపల్కి; సవినయంబుగాన్= వినయంతో; తానునున్= రాజు; దేవియున్= రాణీ; దండప్రణామంబుచేసి= సాష్టాంగంగా కాళ్ళపై పడి; ఆసంయమివరున్= ఆ మునిచంద్రుడిని; వీడ్కొని= సెలవు తీసికొని; స+అద్భుత= ఆశ్చర్యంతో కూడిన; చిత్తులు= మనస్సులు కల; సకల జనులున్= జనమంతా; పరివేష్టింపన్= చుట్టూ మూగగా; పురంబు= నగరం; ప్రవేశించి; ప్రమోదమయ= సంతోషంతో చేసిన; మూర్తులు= శరీరాలు కలవారు; అగుచున్= అవుతూ; దివస వర్తనంబునున్= పగలు చేసే పనులు; రాత్రి చర్యయున్= రాత్రిపూట కార్యాలు; కడపి= ఆచరించి; సూర్య+ఉదయంబు= ప్రొద్దుపొడవటం; అగుటయున్= కాగానే.

**తాత్పర్యం:** అని వినయంతో దండ ప్రణామం చేసి, ఆ మునివరుడిని వదలి ఆశ్చర్యంలో మునిగిపోయిన జనులంతా తమ చుట్టూ మూగి వెంబడించి రాగా, సంతోషంతో నిండిన శరీరాలతో నగరంలోకి ప్రవేశించి, పగలు రాత్రి చేయదగిన పనులుచేసి తెల్లవారగానే.

**క. వారలు ప్రాతస్సమయా । చారంబులు నడపి భక్తి సంపద లొదవన్**
**గారవమున ముని నిర్ది । ష్టారణ్యమ్మునకుఁ బోయి రవనీనాథా! 316**

**ప్రతిపదార్థం:** అవనీనాథా!= రాజా!; వారలు= రాజదంపతులు; ప్రాతస్సమయ= ప్రొద్దుటిపూట; ఆచారంబులు= ఆచారాలు; నడపి= చేసి; భక్తిసంపదలు= భక్తి అనే సంపదలు; ఒదవన్= కలుగగా; గారవమునన్= గౌరవంతో; ముని నిర్దిష్ట= ముని చెప్పిన; అరణ్యమ్మునకున్= అడవికి; పోయిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** రాజా! వారు ప్రొద్దున్నే నిర్వర్తించవలసిన విధులు నిర్వర్తించి భక్తి వైభవంతో, గౌరవంతో ముని చెప్పిన అడవికి వెళ్ళారు.

**ఆ. అచట మణిమయంబు, నతిసుందరము, దివ్య । సదన నిభము నగు విశాలరమ్య**
**హర్మ్యమున్నఁ, జూచి యచ్చెరువందు చి । త్తములతోడఁ జనఁగ దానిచుట్టు. 317**

**ప్రతిపదార్థం:** అచటన్= ఆ అడవిలో; మణిమయంబు= మణులతో చేసిన; అతి సుందరము= మిక్కిలి చక్కని; దివ్యసదననిభము= దేవతల సౌధము వంటిది; అగు= అయిన; విశాలరమ్య= పెద్దది, అందమునైన; హర్మ్యము= సౌధం; ఉన్నన్= ఉంటే; చూచి; అచ్చెరువు= ఆశ్చర్యం; అందు= పొందే; చిత్తములతోడన్= మనస్సులతో; చనఁగన్= పోగా; దానిచుట్టు= మేడకు చుట్టూరా.

**తాత్పర్యం:** అక్కడ రత్నాలతో చెక్కిన దేవతాభవనం వంటిది, విశాలమైన అందమైన సౌధముండగా చూచి ఆశ్చర్యంతో పోగా దాని చుట్టూ. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ్యవనుఁడు తన యోగబలంబునఁ గుశికునకు నాకలోకంబు సూపుట (సం.13-54-1)**

**సీ. స్వాధ్యాయ సంగీత సాహిత్య వర్తన । మాననీయము లగు మండపములుఁ,**
**గోకిల శుకభృంగ కులనాదముల నభి । రామంబు, లైన యారామములును**
**హంస సారసరవాత్యంత మనోజ్ఞంబు । లై సొంపు మిగులు పద్మాకరములుఁ,**
**జారుమయూర కేకారుత కలితంబు । లగుచు నొప్పారు క్రీడాచలములు;**

**తే. వీనులకుఁ జూడ్కులకు నింపు వెల్లి గొల్ప । నేర్పు గలిగిన విభవంబు నెఱయ మెఱయఁ**
**గరము విలసిల్లుచునికి నాకంబు వేడ్క । నయ్యెడకుఁ గాపు వచ్చిన యట్టు లుండె. 318**

**ప్రతిపదార్థం:** స్వ+అధ్యాయ= వేదపఠనంతో కలిసిన; సంగీత= సంగీతం యొక్క; సాహిత్య= సాహిత్యము యొక్క; వర్తన= ప్రవర్తనతో; మాననీయములు= గౌరవించ దగినవి; అగు; మండపములు= మంటపాలు; కోకిల= పికములు; శుక=చిలుకలు; భృంగ= తుమ్మెదల యొక్క; కుల= సమూహంయొక్క; నాదములన్= ధ్వనులతో; అభిరామంబులు= మిక్కిలి అందమైన; ఆరామములును= తోటలు; హంస= అంచలు; సారస= బెగ్గురు పక్షులు (ఒకరకమైన కొంగలు) వీటి; రవ= ధ్వనులచే; అతి+అంత= మిక్కిలి; మనోజ్ఞంబులై= అందములై; సొంపు= ఇంపు; మిగులు= అతిశయించిన; పద్మ+అకరములు= తామరపూలకు నిలయములైన చెరువులు, చారు= అందమైన; మయూర= నెమళ్ళ యొక్క; కేకా= కూతల యొక్క; రుత= ధ్వనితో; కలితంబులు= కూడుకొన్నవి; అగుచున్; ఒప్పు+ఆరు= అందమైన; క్రీడా= ఆటలాడుకొనటానికి వీలైన; అచలములున్= కొండలును; వీనులకున్= చెవులకు; చూడ్కులకున్= చూపులకు; ఇంపు= వేడుక; వెల్లిగొల్పన్= అతిశయింపచేయగా; నేర్పు= చాతుర్యం; కలిగిన విభవంబు= ఐశ్వర్యం; నెఱయమెఱయ= విస్తరించి విలసిల్లగా; కరమున్= మిక్కిలి; విలసిల్లుచున్= శోభిల్లుచు; ఉనికి= ఉండడం వలన; నాకంబు= స్వర్గం; వేడ్కన్; ఆ+యెడకున్; కాపు వచ్చిన+అట్టులు+ఉండెన్.

**తాత్పర్యం:** అక్కడ మండపాలలో సంగీతంతో సాహిత్యంతో ప్రవర్తించే వేదమంత్ర పఠనం జరుగుతున్నది. కోకిలల, చిలుకల, తుమ్మెదల గుంపులు చేసే ధ్వనులతో చాలా అందమైన తోటలున్నూ, హంసలు, కొంగలు చేసే ధ్వనులతో (కంటికి, చెవికి) ఇంపైన తామరపూలున్న చెరువులు, అందమైన నెమళ్ళ కూతలుకల విహారపు కొండలు, చెవులకూ, చూపులకూ సంతోషం కలిగించే నేర్పుగల వైభవం ప్రకాశిస్తూ ఉండగా స్వర్గమే అక్కడికి వలస వచ్చిందా అన్నట్లున్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. సురలును, గంధర్వులు, న । ప్సరోనికాయములు, వివిధ సరస విహారా**
**దరలీల నందు నెడనెడఁ । జరించుచుండిరి నితాంత సమ్మోదమునన్. 319**

**ప్రతిపదార్థం:** సురలును= దేవతలును; గంధర్వులున్= ఆ జాతి దేవతలు; అప్సరోనికాయములున్= అచ్చరల సమూహాలు; వివిధ= అనేకములగు; సరస= రసవత్తరమైన; విహార= విహరించుటలోగల; ఆదరలీలన్= ఆదరంతో కూడిన విలాసంతో; అందున్= అక్కడ; నితాంత= ఎడతెగని; సమ్మోదమునన్= సంతోషంతో; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; చరించుచున్+ఉండిరి= తిరుగుతున్నారు.

**తాత్పర్యం:** దేవతలు, సంగీత విద్వాంసులైన గంధర్వులు, అప్సరసల సమూహం అనేకమైన రసవత్తర విహారాలతో, క్రీడలతో అక్కడక్కడ ఆ స్థలంలో సంతోషంగా తిరుగుతున్నారు.

**తే. అవ్విధంబున కా రాజు నంగనయును । మనము లద్భుత రసమున మునుఁగుచుండఁ**
**'గలయొకో యిది! నిక్కమ కానినాఁడు । మిగుల ననుభవ గోచర మగునె యిట్లు?' 320**

**ప్రతిపదార్థం:** ఆ+విధంబునకున్= ఆ పద్ధతికి; ఆ రాజున్; అంగనయును= స్త్రీయూ (రాణి); మనములు= మనస్సులు; అద్భుత రసమునన్= ఆశ్చర్య రసంలో; మునుఁగుచున్+ఉండన్= మునుగుతుండగా; కలఒకో ఇది?= ఇది కలా!; నిక్కమ కానినాఁడు= సత్యం కాకపోతే; ఇట్లు= ఈ విధంగా; మిగులన్= మిక్కిలి; అనుభవగోచరము= అనుభవానికి తోచేది; అగునె?= ఔతుందా?

**తాత్పర్యం:** ఆ దృశ్యానికి ఆ రాజూ, రాణీ మనస్సులు ఆశ్చర్యంతో మునిగిపోగా 'ఇది నిజమా? కలా? నిజమే కాకపోతే అనుభవానికి ఎట్లా అందుతున్నది?'

**వ. అని వెండియు. 321**

**తాత్పర్యం:** అని ఇంకా.

**క. 'ఉత్తర కురు భూమియొ? లో । కోత్తర మగునట్టి నాకమొకొ? తనువులతో**
**నిత్తాపసవరుని కరుణ । నిత్తెఱఁగున సంభవించె నిచ్చోటు సొరన్.' 322**

**ప్రతిపదార్థం:** ఉత్తర కురుభూమియొ?= ఈ పేరుగల రాజ్యం (ప్రాచీన కాలంలో భారతవర్షం నేటి చైనా మంగోలియా దాకా వ్యాపించి ఉండేదట. ఈ ఉత్తర కురుభూములు హిమాలయ ప్రాంతమో అవతలిదో? కొందరు హిమాలయాలకు అవతలి దంటారు); లోకోత్తరము= లోకానికిపైది; అగునట్టి; నాకము+ఒకొ?= స్వర్గమా?; తనువులతోన్= శరీరాలతో; ఇచ్చోటు= ఈ ప్రాంతంలోకి; చొరన్= ప్రవేశించటం; ఈ+తాపసవరుని= ఈ మునిశ్రేష్ఠుడి; కరుణన్= దయవలన; ఈ+తెఱగునన్= ఈ విధంగా; సంభవించెన్= కలిగింది.

**తాత్పర్యం:** 'ఈ ప్రాంత మేదో? ఉత్తర కురుభూములా? లేక లోకోత్తరమైన స్వర్గమా? సశరీరంగా ఇక్కడకు రావటం కేవలం ఈ మునీశ్వరుడి దయ.'

**విశేషం:** కురుభూములు= కురుక్షేత్రం, ఇది నేటి ఢిల్లీ ప్రాంతం. దానికి ఉత్తరదిక్కున ఉన్న ప్రదేశం ఉత్తర కురుభూములు,

హిమాలయాలు కావచ్చును. ఎందుకంటే నేటికీ ఆ ప్రాంతం పవిత్రంగా, మహాయోగులు నివసించేదిగా చెప్పబడుతున్నది కనుక. ఈ విషయాలకొరకు 'హిమాలయంలో మహర్షులతో నివసించటం వంటి ఆంగ్ల గ్రంథాలు చూచినా, మహాయోగి ఆత్మకథ చూచినా తెలుస్తుంది. నేటి విద్యావేత్తల కా విషయాలు తెలియకపోవటంవలన భారత ఆధ్యాత్మిక యోగ విద్యలతో పరిచయం లేనందున అబద్ధాలుగా గోచరిస్తున్నవి తప్ప మహాత్ముల జీవితాలలో ఇవి నగ్న సత్యాలే.

**వ. అనుచు నమ్మహనీయ హర్మ్యంబు సొచ్చి, యందు మణిమయ పర్యంకంబునం బవ్వళించి యున్న యప్పరమ మునిం గనిరి, అపరక్షణంబున నతం డంతర్ధానంబు సేసె. అతనితోడన యా మేడయు మున్ను గన్న యశేష విశేషంబులును నదృశ్యంబు లయ్యె, అయ్యిరువురు నిట్టట్టు మెలంగి యక్కాన నొక్కెడఁ గౌశబృసీ సమాసీనుండును జపపరుండునునైన యాసంయమివరు నాలోకించి; రట్లు గాంచి భూవిభుండు భార్యతో నిట్లనియె. 323**

**ప్రతిపదార్థం:** అనుచున్; ఆ+మహనీయ= ఆ మహత్తరమైన; హర్మ్యంబు= సౌధం; చొచ్చి= ప్రవేశించి; మణిమయ= రత్నాలతో చేసిన; పర్యంకంబునన్= మంచంమీద; పవ్వళించిఉన్న= పడుకొని ఉన్న; ఆ+పరమ మునిన్= ఆ గొప్పమునిని; కనిరి= చూచారు; అతండు= ఆ ముని; అపరక్షణంబునన్= మరుక్షణంలో; అంతర్ధానంబు చేసెన్= కనిపించకుండా పోయాడు; అతనితోడన; ఆమేడయున్; అశేష విశేషంబులు= అనంత విశేషాలు; అదృశ్యంబులు= కనిపించనివి; అయ్యెన్; ఆ+ఇరువురున్= రాజు రాణి; ఇట్టున్+అట్టున్= ఇటూ అటూ ; మెలంగి=తిరిగి; ఆ+కానన్= ఆ అడవిలో; ఒక్క+ఎడన్= ఒకచోట; కౌశ= దర్భతో నేసిన (కుశ=దర్భ); బృసీ= చాపమీద; సమాసీనుండునున్= కూర్చున్నవాడు; జపపరుండును= జపమగ్నుడైనవాడు; ఐన; ఆ సంయమివరున్= ఆ మునిశ్రేష్ఠుడిని; ఆలోకించిరి= చూచారు; అట్లు; కాంచి= చూచి; భూవిభుండు= భూమిపతి; భార్యతోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంటూ ఆ మహాభవనంలోకి వెళ్ళిచూస్తే రత్నమంచంపైన మునీంద్రుడు నిద్రిస్తున్నాడు. అంతలోనే మరలా అదృశ్యుడైపోగా; ఆ భవనం, వాళ్ళు చూచిన విశేషాలు అన్నీ కనిపించకుండా పోయాయి. మునిమాత్రం అడవిలో ఒకచోట దర్భచాపపై కూర్చుని జపం చేసికొంటూ కనిపించాడు. అప్పుడు రాజు రాణితో అన్నాడు.

**తే. 'ఉవిద! మునియోగబల మిట్టు లుండునే! య । నూనరాజ్యంబు సులభంబు మానవులకు**
**బ్రాహ్మణత్వంబుఁ దపము దుర్లభము దపము । కలిమిఁ జేయుచు నున్నాఁడు వలసినట్లు.' 324**

**ప్రతిపదార్థం:** ఉవిద!= రాణీ! (స్త్రీ); ముని= ముని యొక్క; యోగబలము= యోగశక్తి; ఇట్టులు= ఈ విధంగా; ఉండునే?= ఉంటుందా?; అనూన= గొప్ప; రాజ్యంబున్; సులభంబు= తేలిక; మానవులకున్= మనుషులకు; బ్రాహ్మణత్వంబున్= బ్రాహ్మణ లక్షణం; తపము= తపస్సు; దుర్లభము= కష్టపడి పొందదగినది; తపముకలిమిన్= తప స్సంపదచేత; వలసినట్లు= ఇష్టం వచ్చినట్లు; చేయుచున్+ ఉన్నాఁడు= చేస్తున్నాడు.

**తాత్పర్యం:** 'రాణీ! మునియోగశక్తి చూచావా? ఇంతగొప్పదా? మనిషికి రాజ్యం సులభం తప్ప బ్రాహ్మణత్వం, తపస్సు సులభం కావు. ఈయన తపస్సంపద ప్రభావంచేత ఇష్టం వచ్చినట్లుగా సృష్టిస్తున్నాడు.

**చ. అనునెడ నిందు రండని సమాదర మొప్పఁగ వారిఁ బిల్చె న**
**మ్ముని; నరనాథుఁడున్, సతియు, మోడ్చిన చేతులతోడఁ జేరఁగాఁ**

**జని, ధరఁ జాఁగి మ్రొక్కుటయు, సంయమి దీవన లిచ్చి, రాజు నా**

**ననమున సుప్రసన్న నయన ప్రభ పర్వఁగ నెమ్మి నిట్లనున్. 325**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= అనే సమయంలో; ఆ+ముని; వారిన్= రాజ దంపతులను; ఇందున్= ఇక్కడకు; రండు+అని= రండు అంటూ; సమాదరము= మంచి ఆదరణ; ఒప్పఁగన్= కలుగగా; పిల్చెన్= పిలిచాడు; నరనాథుఁడున్= రాజు; సతియున్=భార్య; మోడ్చిన= అంజలించిన (దండంపెట్టిన); చేతులతోడన్= హస్తాలతో; చేరఁగాన్ జని= దగ్గరకు వెళ్ళి; ధరన్= నేలపై; చాఁగి= సాగిలబడి; మ్రొక్కుటయున్= నమస్కరించగా; సంయమి= ముని; దీవనలు=ఆశీస్సులు; ఇచ్చి; రాజు+ఆననమునన్= రాజు ముఖంమీద; సు ప్రసన్న= మంచి శాంతం కల; నయన= నేత్రాల; ప్రభ= వెలుగు; పర్వఁగన్= వ్యాపించగా; నెమ్మిన్= సంతోషంతో; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** అంటున్న సమయంలో ముని ఆదరంతో వాళ్ళనిద్దరిని ఇట్లా రండని పిలువగానే వారు చేతులుమోడ్చి మునిని సమీపించి భూమిపై చాగిలపడి మ్రొక్కగా ముని ఆశీర్వదించి రాజు ముఖంమీద తన ప్రశాంత నేత్ర కాంతులు వ్యాపించగా సంతోషంతో ఇట్లా అంటున్నాడు.

**ఆ. 'మనసు నింద్రియములు మనుజేంద్ర! యింత వ । శ్యంబు లగునె నీకు? నరయఁ గీ డొ**

**కింత యైన లేదు సంతసమందితి; । నిత్తు వరము వేఁడు మెద్దియైన.' 326**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= రాజా!; మనసు= మనస్సు; ఇంద్రియములు= అవయవాలు; ఇంత= ఇంతగా; నీకున్; వశ్యంబులు+అగునె?= వశమైనవా? అరయన్= పారచూచినా; కీడు= లోపం; ఒక+ఇంతయైనన్= ఇంతైనా; లేదు; సంతసము= సంతోషం; అందితిన్= పొందాను; వరమున్; ఇత్తున్= ఇస్తాను; ఎద్దిఐనన్= ఏదైనా; వేఁడుము= కోరుకొమ్ము.

**తాత్పర్యం:** 'రాజా! నీకు నీ మనస్సూ, ఇంద్రియా లింతగా వశమైనాయా? ఆశ్చర్యమయ్యా! ఎంతో ఆలోచించి చూచినా నీ వలన లోపమింతైనా లేదు వరం కోరుకొమ్ము. ఏదైనాసరే ఇస్తాను. నీవంటే నాకు చాలా సంతోషంగా ఉన్నది.'

**క. అనిన విని యగ్ని కల్పుఁడ । వనఁ జను 'నీమది ప్రసన్నమగునట్టులుగా**

**మునిజనవంద్యా ! కొల్వం । గను కంటెను మిగులమేలు గలదే కోరన్.' 327**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; మునిజనవంద్యా!= ముని సమూహంచేత పొగడదగినవాడా!; అగ్ని కల్పుఁడవు= అగ్నివంటివాడవు; అనన్ చను= అనదగ్గ; నీ మది= నీ మనస్సును; ప్రసన్నము= ప్రశాంతం; అగునట్లుగాన్= అయ్యేటట్లుగా; కొల్వన్= సేవించుట; కనుకంటెన్= పొందటంకంటే; కోరన్= కోరుటకు; మిగుల= అధికమైన; మేలుకలదే!= శుభమున్నదా!

**తాత్పర్యం:** మునులకే నమస్కరించదగిన నీవు అగ్నితో సమానుడవు. ఇట్లాంటి నీ మనస్సు ప్రసన్నమయ్యేటట్లు సేవించుట కంటే గొప్ప మే లేమున్న దని కోరనయ్యా!

**వ. అని పలికి కుశికుండు వెండియు. 328**

**తాత్పర్యం:** అని చెప్పి కుశికుడు ఇంకా (అంటున్నాడు)

**తే. ‘ఒకటి యడిగెదఁ గృప చిగురొత్తఁ జెప్ప । వలయు; మీరు మా యింటికి వచ్చి యొక్క**
**ప్రక్కక్రిందుగ నిరువది యొక్క దినము । లనఘ! నిద్రించి; తది మొదలైన నీదు. 329**

**ప్రతిపదార్థం:** ఒకటి అడిగెదన్= ఒక టడుగుతాను; కృప= దయ; చిగురు+ఒత్తన్= చిగురింపగా; చెప్పన్ వలయున్= చెప్పాలి; మీరు; మాఇంటికిన్; వచ్చి; ఒక్క ప్రక్క= ఒకవైపు; క్రిందుగన్= క్రిందుగా చేసి; ఇరువదిఒక్క దినములు= ఇరవై ఒక్క రోజులు; అనఘ!= పుణ్యాత్ముడా!; నిద్రించితి= నిద్రించావు; అది మొదలు+ఐన= అది మొదలుగా; నీదు= నీ యొక్క.

**తాత్పర్యం:** ‘స్వామీ! ఒకటడుగుతాను. దయతో చెప్పాలి. మీరు మా ఇంటికి వచ్చి ఒకవైపే ఒత్తిగిలి ఇరవైయొక్క రోజులు పడుకొన్నారు కదా! అది మొదలుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చరితం బద్భుతము మునీ । శ్వర! దీనికిఁ గారణము విచారమున కగో**
**చర; మెఱిఁగింపు ‘మనుడు నా । ధరణీవల్లభునితో నతం డిట్లనియెన్. 330**

**ప్రతిపదార్థం:** చరితంబు= కథ, ప్రవర్తన; అద్భుతము= ఆశ్చర్యం; ముని+ఈశ్వర!= మునినాథా!; దీనికిన్; కారణము= ఇందుకు హేతువు; విచారమునకున్= ఆలోచనకు; అగోచరము= కనిపించదు; ఎఱిఁగింపుము= తెలుపుము; అనుడున్; అతండు= ఆ ముని; ఆ ధరణీ విభునితోన్= రాజుతో; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** కథ చాలా అద్భుతం. మునీశ్వర! కారణం గోచరించటం లేదు. కనుక చెప్పండి’ అనగా రాజుతో ముని ఇట్లా అంటున్నాడు.

**వ. సురలు మునులు సురజ్యేష్ఠుం గొలిచియుండం బ్రసంగ వశంబున నప్పరమేష్ఠి వారలతో భృగు కుశిక వంశంబులకు బ్రహ్మక్షత్రంబులు తడంబడి సంకరంబు వాటిల్లు నని చెప్పెఁ; నప్ప దేనచ్చట నుండి వినుటం జేసి యాసంకరంబున కోర్వక మీ యన్వయంబు నిర్మూలంబు సేయువాఁడ నయి వ్రతంబు నెపంబిడి, భవద్గృహంబు సొచ్చి యున్ని పోకలం బోయితి; అలసి డస్సి యెప్పుడేని మీర లడ్డ మాడుదురు అప్పుడ శపింతు నిట్టిద నా యెత్తికోలు; మీ యందు ధైర్యహానియు శోకంబును గోపంబును లేమిని మెచ్చి వరం బిచ్చియుం దనివి సనక, తనువులతోడన మీరు నాకలోకం బాలోకించు నట్లుగా నీ గంగాతీరంబున సంఘటించితి; దానిం గని నరేంద్రత్వంబుదెస నుదాసీన భావంబు నొంది బ్రాహ్మణ్యంబునందు స స్పృహుండ వై తది యెఱుఁగుదు; నీకు మూఁడవవాఁడు బ్రహ్మతేజో దీప్తుం డయి జనియించు; వరంబు వేఁడు’ మనుటయు నమ్మానవపతి దీనికంటెను గడచిన వరంబునుం గలదే? మదీయ సంతానంబు బ్రహ్మత్వ ప్రాప్త మహత్త్వ నిరూఢంబును, గాఢధర్మ తత్పరంబునుంగా నను గ్రహింపు’ మనిన నమ్ముని ‘యట్ల యయ్యెడు నూఱడిల్లుము. నీదు మనుమండు త్రిలోక పూజనీయుండు’ అని పల్కిన నప్పతి ‘వాఁడేమి కతంబున బ్రాహ్మణుం డగు నత్తెఱంగెఱిఁగింపవే’ యనవుడు నత్తాపసోత్తముండు ‘విను మస్మద్వంశంబున ఋచీకుం డనువాఁడు జన్మించి నీ తనయుం’ డైన గాధి యనియెడు వాని పుత్రి భార్యగాఁ బరిగ్రహించు; నత్తపోధనుండు దననందనుం డగు జమదగ్నియందు సమస్త ధనుర్వేదంబును నావహించు, నవ్విశేషంబు తత్పుత్త్రునందు ఫలియించు; నది యంతయు సకల క్షత్రియ క్షయకారి యైన దైవంబు కృత్యంబు, దానివలన ఋచీక, గాధి వధూజనానుష్ఠాన పరివర్తనంబు గలుగు;**

**నది కారణంబుగా నుగ్రక్షత్రధర్ముండగు పరశురాముండు జమదగ్నికిం, బరమ బ్రాహ్మణ్యగణ్యుం డయిన విశ్వామిత్రుండు గాధికి జనియింతురు, బ్రహ్మ పలుకు సత్యంబ; యుష్మదన్వయంబు భార్గవ కులసంబంధంబున జనశ్లాఘనీయంబై వెలయం గలయది, యేను తీర్థంబునకుం జనియెద, నీవు సుఖివై యుండుము' అని చెప్పుటయు, నప్పుడమిఱేఁడు భార్యాసహితంబుగ సవిశేష వినయంబగు వందనం బాచరించి వీడ్కొని చనియె; జ్యవనుండును నిజేచ్ఛం జనియె; నిది పరశురామ విశ్వామిత్ర జన్మ ప్రకారంబు. 331**

**ప్రతిపదార్థం:** సురలు, మునులు, సురజ్యేష్ఠున్= దేవతలలో పెద్దవాడు బ్రహ్మను; కొలిచిఉండన్= సేవిస్తూ ఉండగా; ప్రసంగవశంబునన్= మాటల సందర్భంలో; ఆ పరమేష్ఠి= ఆ బ్రహ్మ; వారలతోన్= వారితో; భృగుకుశిక వంశంబులకున్; బ్రహ్మక్షత్రంబులు= బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాలు; తడంబడి= మారుదలపొంది, తలక్రిందులై; సంకరంబు= సాంకర్యం; పాటిల్లున్= జరుగుతుంది; అని చెప్పెన్; అప్పుడు ఏను అచ్చటన్+ఉండి వినుటన్+చేసి; ఆ సంకరంబునకున్; ఓర్వక= సహించక; మీ; అన్వయంబున్= వంశాన్ని; నిర్మూలంబు= నాశనం; చేయువాడను+అయి= చేద్దామనుకొని; వ్రతంబు నెపంబు+ఇడి= వ్రతమిషతో; భవత్= మీ; గృహంబు= ఇల్లు; చొచ్చి= ప్రవేశించి; ఇన్ని; పోకలన్+పోయితిన్= నాటకా లాడాను; అలసి; డస్సి= తూలి; ఎప్పుడేని మీరలు; అడ్డము+ఆడుదురు= ఎదురు చెప్పుతారు; అప్పుడు+అ+శపింతున్; ఇట్టిద; నా; ఎత్తికోలు= పూనిక, ప్రయత్నం; మీయందున్; ధైర్యహానియున్= కష్టాలలో చెదరకుండా ఉండే మనస్తత్వం; శోకంబును కోపంబును లేమిని= లేకపోవటం; మెచ్చి; వరంబు; ఇచ్చియున్; తనివి చనక= తృప్తిపడక; తనువులతోడన; మీరు; నాకలోకంబు; ఆలోకించునట్లుగాన్= చూచేటట్లు; ఈ గంగాతీరంబునన్; సంఘటించితిన్= ఏర్పాటు చేశాను; దానిన్; కని; నర+ఇంద్రత్వంబు దెసన్= రాజత్వంవైపు; ఉదాసీనభావంబున్= ఔదాసీన్యం, తక్కువ చూపు; ఒంది= పొంది; బ్రాహ్మణ్యంబునందున్= బ్రాహ్మణ ధర్మంమీద; సస్పృహుండవు+ఐతి(వి)= కోరిక కలవాడవైతివి; అది ఎఱుఁగుదున్; నీకున్; మూడవవాఁడు= మూడవ తరంవాడు; బ్రహ్మతేజో దీప్తుండు= బ్రాహ్మణ తేజస్సుతో ప్రకాశించేవాడు; అయి జనించు; వరంబు; వేడుము+అనుటయున్; ఆ మానవపతి= ఆ రాజు; దీనికంటెను; కడచిన= దాటిన; అధికమైన; వరంబునున్; కలదే= ఉన్నదా? బ్రహ్మత్వప్రాప్త=బ్రాహ్మణత్వము చేత పొందబడిన; మహత్త్వ= గొప్పతనంచేత; నిరూఢంబునున్= ప్రసిద్ధియైనదిగానూ; గాఢ= గట్టి; ధర్మ తత్పరంబునుంగాన్= ధర్మం మీద తాత్పర్యబుద్ధి గలదిగానూ అనుగ్రహింపుము; అనినన్; ఆ+ముని; అట్ల అయ్యెడున్; ఊఱడిల్లుము; నీదు మనుమండు; త్రిలోకపూజనీయుండు= మూడులోకాలకు పూజించదగ్గవాడు; అనిపల్కినన్; ఆ+పతి= ఆ రాజు; వాఁడు= అతడు; ఏమికడంబునన్= ఏ కారణంవలన; బ్రాహ్మణుండగున్ ఆ తెఱంగు; ఎఱింగింపవే; అనవుడున్; అ+తాపస+ఉత్తముండు= ఆ మునీశ్వరుండు; వినుము, అస్మత్= నా; వంశంబునన్, ఋచీకుండను వాడు జన్మించి నీ తనయుండైన గాధి; అనియెడు; వాని; పుత్రిన్= కూతురును; భార్యగాన్ పరిగ్రహించున్; ఆ+తపోధనుండు; తననందనుండగు జమదగ్నియందున్; సమస్త; ధనుర్వేదంబునున్= ధనుర్విద్య, విలువిద్యను; ఆవహించున్= కల్గించును; ఆ+విశేషంబు; తత్+పుత్రునందున్= అతని కుమారుని యందు; ఫలియించున్; అది+అంతయున్; సకలక్షత్రియ= సమస్తరాజుల; క్షయకారి= వినాశము గల్గించునది; ఐన= ఐనట్టి; దైవంబు= దైవముయొక్క; కృత్యంబు= పని,విధి ఘటన; దాని వలనన్; ఋచీక గాధి వధూజనానుష్ఠాన పరివర్తనంబు గలుగు; అది కారణంబుగాన్; ఉగ్ర= క్రూర; క్షత్ర ధర్ముండు= క్షత్రియ స్వభావం కలవాడు అగు పరశురాముండు జమదగ్నికిన్; పరమ= గొప్ప; బ్రాహ్మణ్య= బ్రాహ్మణ సమూహానికి; గణ్యుండు= లెక్కింపదగ్గవాడు అయిన; విశ్వామిత్రుండు; గాధికి జనియింతురు; బ్రహ్మపలుకు సత్యంబు+అ; యుష్మత్+అన్వయంబు= నీ కులం; భార్గవకుల సంబంధంబునన్= సంబంధం వలన, బంధుత్వం చేత; జన= జనులచేత; శ్లాఘనీయంబు+ఐ= పొగడదగ్గదై; వెలయన్ కలయది= ప్రకాశించగలది; ఏను= నేను; తీర్థంబునకున్; చనియెదన్= వెళ్ళెదను; నీవు సుఖివి+ఐ= సుఖవంతుడవై; ఉండుము; అని చెప్పుటయున్; ఆ+పుడమి= భూమికి; ఱేఁడు= రాజు; భార్యసహితంబుగన్= భార్యతోకూడ; సవిశేష వినయంబు+అగు= అధికమైన వినయముతో కూడినదైన; వందనంబు; ఆచరించి వీడ్కొని చనియెన్; చ్యవనుండును; నిజ+ఇచ్ఛన్= తన ఇష్టం వచ్చినచోటికి; చనియెన్= వెళ్ళాడు; ఇది; పరశురామ విశ్వామిత్ర జన్మప్రకారంబు= పుట్టినవిధము.

**తాత్పర్యం:** దేవతలు మునులు బ్రహ్మదేవుడిని సేవిస్తున్న సమయంలో, ప్రసంగవశాత్తు బ్రహ్మ వారితో ఇట్లా అన్నాడు. 'భవిష్యత్తులో భృగు, కుశిక వంశాలకు బాంధవ్య మేర్పడుతుంది' అని. అది విని వర్ణసాంకర్యాని కిష్టపడక నీ వంశాన్ని నాశనం చేద్దామన్న తలంపుతో మీ ఇంటికి వచ్చి పోకిళ్ళు పోయాను. కాని, మీలో కోపతాపాదులేవీ నాకు గోచరించలేదు. దానికి సంతోషించి వరమిచ్చాను. అయినా నాకు తృప్తి తీరక స్వర్గలోకం చూపించాను. నీకు రాచరికంమీద కంటె బ్రాహ్మణ్యం మీద మక్కువ. నీకు మూడోతరంలో బ్రహ్మతేజోమయుడు జన్మిస్తాడు. కాబట్టి వరం కోరుకొమ్ము రాజా! అనుగ్రహిస్తాను.' అంతా విని రాజన్నాడు 'నా కింతకంటె వర మేమి కావాలయ్యా! నా సంతానం బ్రాహ్మణత్వం ధర్మపరత్వం పొందే వర మనుగ్రహించుము' అనగా ముని 'నీ మనుమడు మూడులోకాలకు వందనీయు డౌతాడు' అని అన్నాడు. రా జన్నాడు 'నా మనుమడు బ్రాహ్మణు డెట్లా ఔతాడో చెప్పుము' అనగా అత డన్నాడు. 'నా వంశంలో ఋచీకు డనే వాడు జన్మించి నీ కుమారుడైన గాధి కూతురును పెళ్ళి చేసికొనగా అతడికి జమదగ్ని జన్మిస్తే అతడు విలువిద్య నంతా జమదగ్ని పొందేటట్లు చేస్తాడు. ఆ ధనుర్విద్య అతడి కొడుకు పరశురాముడిలో ఫలిస్తుంది. ఈ విద్య సకల క్షత్రియ కుల నాశనం చేస్తుంది. ఇదంతా దైవఘటన. దానివలన ఋచీక, గాధి వధువుల అనుష్ఠానాలు మార్పు పొంది జమదగ్నికి క్రూరస్వభావం కల క్షత్ర ధర్మంతో పరశురాముడు జన్మిస్తాడు. గాధికి మహాబ్రాహ్మణ తేజోనిధి విశ్వామిత్రుడు జన్మిస్తాడు. మీ కులాల కలయిక లోకానికే కీర్తి పాత్రమౌతుంది. నేనిక తీర్థయాత్రలకు పోతాను. నీవు సుఖంగా ఉండుము' అంటూ ముని తన దారిన తాను పోయాడు. రాజు భార్యతో సహా అతడికి వినయంతో నమస్కరించాడు.

**విశేషం:** ఈ కథను చెప్పుమని అడిగినప్పుడు ధర్మరా జన్నాడు 'మహాత్మా!' మదీయ చిత్తాయత్తంబుగా నత్తెఱంగెఱింగింపవే' యని. ఈ కథ నట్లా మనస్సునకు హత్తుకొనేటట్లు చెప్పాడు మహాత్ముడైన కవిబ్రహ్మ. ఓర్పు ఎంత చేకూరుస్తుందో పాఠకులు గమనించాలి. అచ్చమైన మనిషిని నిర్మించటం సాహిత్య ప్రయోజన మన్నారు తొల్లిటి పెద్దలు. ఇంతకంటె దాని కుదాహరణ మేమున్నది కనుక.

### భీష్ముఁడు ధర్మజునకు దానవిశేషముల నెఱింగించుట (సం.13-92-28 (కుంభ))

**క. అని కురుపితామహుఁడు సె । ప్పిన విని, ధర్మాత్మజుండు ప్రియమందుచు నా**
**తనితో 'దానవిశేషము । లనఘా! యెఱిఁగింపు' మనుడు నతఁ డిట్లనియెన్. 332**

**ప్రతిపదార్థం:** అని; కురుపితామహుఁడు= కౌరవుల తాత, భీష్ముడు; చెప్పినన్= చెప్పగా, చెప్పితే; విని; ధర్మ+ఆత్మజుండు= యమధర్మరాజు కొడుకు; ప్రియమున్= ప్రీతిని; అందుచున్= పొందుతూ; అతనితోన్= ఆ భీష్ముడితో; అనఘా!= పుణ్యాత్ముడా!; దానవిశేషములు; ఎఱిఁగింపుము= చెప్పుము; అనుడున్= అంటే; అతండు; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగా విని ధర్మరాజు సంతోషించి తాతగారిని దాన విశేషాలు చెప్పుమని అడిగాడు.

**సీ. 'కాంస్యోపదోహయుఁ గాంచన చారుశృం । గయు ధవళాంబర కలితయును, స**
**దక్షిణయును నయి తగుగోవుఁ బాత్రత్వ । భవ్యవిప్రునకు సద్భక్తితోడ**

**నిచ్చిన దానికి నెన్ని రోమము లన్ని । దివ్యవత్సరములుఁ ద్రిదశలోక**

**మున వసింతురు; కులంబున యేడు తరముల । జనముల సుగతికి ననుతు రధిప!**

**ఆ. కన్య, భూమి, గృహము, గనక, మన్నము, జల । మంబరంబు, శయన, మాసనంబు,**

**వాహనంబు, విప్రవరునకు నీగి లో । కముల రెంట సౌఖ్యకారి యండ్రు. 333**

**ప్రతిపదార్థం:** కాంస్య= కంచుతో చేసిన; ఉపదోహయున్= పాలు పితికెడుపాత్రతో కూడినది; కాంచన= బంగారు; చారు= అందమైన; శృంగయున్= కొమ్ములు కలది; ధవళ= తెల్లని; అంబర= వస్త్రంతో; కలితయును= కూడుకొన్నదియు; సదక్షిణయును= దక్షిణతో కూడుకొన్నది అయి; తగు= ఒప్పునట్టి; గోవున్= ఆవును; పాత్రత్వ= అర్హతకల; భవ్య= శ్రేష్ఠుడైన; విప్రునకున్= బ్రాహ్మణుడికి; సత్= మంచి; భక్తితోడన్= భక్తితో; ఇచ్చినన్= దానమిస్తే; దానికిన్= ఆ గోవునకు; ఎన్ని; రోమములు= వెంట్రుకలో; అన్ని; దివ్య వత్సరములు= దేవతా సంవత్సరాలు; త్రిదశ లోకమునన్= దేవతల లోకంలో, స్వర్గంలో; వసింతురు= ఉంటారు; కులంబున= తన కులంలో, ఏడు తరముల; జనములన్= మనుష్యులను; సుగతికిన్= మంచిస్థితికి; అనుతురు= పంపిస్తారు; అధిప!= రాజా!; కన్య= వివాహం కాని పడుచు; భూమి= పంటనేల; గృహము= ఇల్లు; కనకము= బంగారం; జలము= నీరు; అంబరంబు= వస్త్రం; శయనము= మంచం; ఆసనంబు=కుర్చీ, పీట; వాహనంబు= ప్రయాణ సౌకర్యానికి గుర్రం మొదలగునవి; విప్రవరునకున్= బ్రాహ్మణ శ్రేష్ఠుడికి; ఈగి=దానమివ్వటం; లోకములరెంటన్= ఇహపరలోకాలందు; సౌఖ్యకారి= సుఖాన్ని కలిగిస్తుందని; అండ్రు= పెద్దలు అంటారు.

**తాత్పర్యం:** పాలుపితికెడు కంచుపాత్ర బంగారు కొమ్ముల తొడుగులు తెల్లని వస్త్రాలు వీటితోకూడిన ఆవును దక్షిణతో పాటుగా యోగ్యత గల గొప్పవిప్రునకు మంచిభక్తితో దానమిస్తే ఆ గోవుకు ఎన్ని వెంట్రుకలు ఉన్నాయో అన్ని దివ్యసంవత్సరాలు దేవతలలోకంలో నివసిస్తారు. తమ కులంలో ఏడుతరాల జనాలను ఉత్తమలోకాలకు పంపుతారు. ఆడుపిల్ల, భూమి, ఇల్లు, బంగారము, అన్నము, నీరు, వస్త్రము, పాన్పు, కూర్చుండేపీట, వాహనము అనేవానిని విద్యాపుష్కలంగా ఉన్న బ్రాహ్మణునకు దానం ఇవ్వటం ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖాన్ని కలిగించే కార్యం అని పెద్దలు చెబుతారు.

**క. అనిన విని పాండవాగ్రజుఁ । 'డనఘా! యిన్నింటికంటె నధికంబగు దా**

**ని నెఱింగింపు' మనుడు, న । జ్జనపతి కిట్లను నతఁడు ప్రసన్నాత్మకుఁడై. 334**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; పాండవ+అగ్రజుండు= పాండవులలో ముందు పుట్టినవాడు, పెద్దవాడు; అనఘా!= పాపం లేనివాడా!; ఇన్నింటికంటెన్= వీటన్నిటికన్నా; అధికంబు= గొప్పది; అగుదానిన్= అయిన దానిని; ఎఱింగింపుము= తెలియజేయుము; అనుడున్; ఆ+జనపతికిన్= ఆ రాజుతో; అతఁడు= భీష్ముడు; ప్రసన్న+ఆత్మకుఁడై= ప్రశాంత హృదయం కలవాడై; ఇట్లు; అనున్.

**తాత్పర్యం:** విని ధర్మరా జన్నాడు; 'పాపం లేనివాడా! వీటన్నిటికంటె గొప్ప దానమేదో చెప్పుము' అని. దాని కతడు సంతోషించి ప్రసన్నమైన మనస్సుతో.

**తే. 'అర్థి గోరిన వస్తువు లర్థితోడ । నీగి యెల్ల దానములకు నెక్కుడరయ;**

**నఖిల భూతమ్ములకు నభయంబు నిచ్చు ।టంతకంటెను మే లందు రార్యజనులు.' 335**

**ప్రతిపదార్థం:** అర్థి= యాచకుడు; కోరిన వస్తువులు= ఏది కోరితే అది; అర్థితోడన్= ప్రేమతో; ఈగి= ఇవ్వటం; ఎల్లన్ దానములకున్; ఎక్కుడు= అన్ని దానాలలోకి ఎక్కువ; అరయన్= ఆలోచిస్తే; అంతకంటెన్= దానికంటె కూడా; అఖిల భూతమ్ములకున్= సర్వ జీవరాసులకు; అభయంబున్+ఇచ్చుట= భయం పోగొట్టటం, రక్షణ కల్పించటం; ఆర్యజనులు= ధర్మవేత్తలు, పండితులు; మేలు= గొప్ప; అందురు.

**తాత్పర్యం:** ఏది కోరి యాచకుడు తన దగ్గరికి వస్తాడో దాన్నే ప్రేమతో ఇవ్వటం అన్ని దానాలలో శ్రేష్ఠం. దానికంటె కూడా సర్వజీవులకు అభయ మివ్వటం చాలా గొప్పది.

**విశేషం:** దీనికి ఉదాహరణగా ఇదే పర్వంలో నాలుగవ ఆశ్వాసం 314 పద్యం నుండి ప్రారంభమైన పురుగు కథ గ్రహించాలి. మహాభారతమంటే పురుగు దగ్గర నుండి శ్రీకృష్ణపరమాత్మ దాకా వ్యాపించి ఉన్న సమస్త సృష్టి కథ.

**వ. 'అని చెప్పి వినుమని మఱియు నిట్లనియె'. 336**

**తాత్పర్యం:** అని ఆ విధంగా వివరించి, ఇంకా విను మని ఇట్లా చెప్తున్నాడు.

**తే. వీరశయనంబు మేలండ్రు వీనికంటె । మఱియుఁ గొన్నింటి కంటెను మనుజనాథ!**
**దానముల కావు, వెదకిన దానిఁ బోల । లేవు, పుణ్య కర్మములలో నేవియైన.' 337**

**ప్రతిపదార్థం:** వీనికంటెన్= ఈ చెప్పిన వాటికంటె; వీరశయనంబు= యుద్ధంలో మరణించటం; మేలు+అండ్రు= గొప్పదంటారు; మనుజనాథ!= మానవులకు పాలకుడా!; మాదియున్= ఇంకా కొన్నింటికంటెను; దానముల కావు= అసలు దానాలే లేవు; వెదకినన్= వెతికిచూచినా; పుణ్యకర్మములలోన్= పుణ్య చేష్టలలో; ఏని ఐనన్= ఏవైనాసరే; దానిన్= వీరశయనాన్ని; పోలన్ లేవు= సరిపోలగా లేవు.

**తాత్పర్యం:** వీరశయన మన్నింటికంటె గొప్పది. దానితో పోలిస్తే మిగిలినవి అసలు దానాలే కావు. సర్వపుణ్య కర్మలలోను అదే గొప్పది.'

**వ. అనుటయు ధర్మజుండు తమ్ములం దెసం గనుంగొనిన, వార లతని చిత్తం బెఱింగి రణమరణ స్తుతి సేయ, నతండు సమరంబునం జచ్చిన బంధు, మిత్ర జ్ఞాతి, జనంబుల వలని శోకంబు వదలి వాహినీ నందను వాక్యంబు లభినందించె; నా దేవవ్రతుండు వెండియు. 338**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ధర్మజుండు= ధర్మరాజు; తమ్ములదెసన్= తమ్ముళ్ళవైపు; కనుంగొనినన్= చూడగా; అతని చిత్తంబు= అన్న మనస్సు; ఎఱింగి= తెలిసికొని; రణ= యుద్ధంలో; మరణ= మరణించినవారి; స్తుతి= ప్రశంస; చేయన్= చేయగా; అతండు; సమరంబునన్= యుద్ధంలో; చచ్చిన=మరణించిన; బంధు= చుట్టాలు; మిత్ర= స్నేహితులు; జాతి జనంబులవలని= దాయాది జనులకారణంగా ఏర్పడిన; శోకంబు= దుఃఖము; వదలి= వదలి; వాహినీ= నది; నందనుండు= కొడుకు; వాక్యంబులు= మాటలు; అభినందించెన్= పొగడినాడు; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** అనగానే ధర్మరాజు తమ్ముళ్ళవైపు చూచాడు. వారు ఆయన మనసు తెలిసికొని యుద్ధంలో చనిపోయిన వారిని స్తుతించారు. చచ్చిపోయిన బంధువులు, స్నేహితులు, దాయాదులపై ఉన్న దుఃఖాన్ని పోగొట్టుకొని ధర్మరాజు గంగాదేవికొడుకు చెప్పిన మాటలను స్తుతించాడు. భీష్ముడు మరలా ఇట్లా అన్నాడు.

**క. 'అరియైన దీనుఁడై తను । శరణం బని వేఁడినం , బ్రసన్నాత్మత న**

**ప్పురుషుని కోరిక దీర్చినఁ । బురుషోత్తముఁ డందు రతనిఁ బురుషవరేణ్యా! 339**

**ప్రతిపదార్థం:** పురుషవరేణ్యా!= మనుష్యులలో శ్రేష్ఠుడా!, వీరులలో శ్రేష్ఠుడా!; అరి ఐనన్= శత్రువు ఐనా; దీనుఁడై= దైన్యంతో; తనున్= తనను; శరణంబని= దిక్కు అని రక్షింపుమని; వేఁడినన్= ప్రార్థిస్తే; ప్రసన్న+ఆత్మతన్= సమమైన మనస్సుతో, ప్రశాంతబుద్ధితో; ఆ పురుషుని= ఆ వీరుడి, ఆ వ్యక్తియొక్క; కోరిక; తీర్చినన్; అతనిన్= అతనిని; పురుషోత్తముఁడు+ అందురు= నారాయణుడు అని అంటారు; పురుషులలో ఉత్తముడని అంటారు,

**తాత్పర్యం:** శత్రు వెట్లాంటివా డైనా దైన్యంతో శరణు కోరితే అతడి కోరిక తీర్చిన వాడిని పురుషోత్తము డంటారు.

**క. అడుగక యున్నను, నాలిం । గొడుకుల రక్షింప లేక, కుతిలపడుచు నె**

**ప్పుడుఁ బేదతనము గల నరు । నెడ రుడుపఁగవలయు నది మహితగుణ మనఘా! 340**

**ప్రతిపదార్థం:** అనఘా!; అడుగక ఉన్ననున్= అడుగక పోయినా; ఆలిన్= భార్యను; కొడుకులన్= సంతానాన్ని; రక్షింపలేక= సాక లేక; కుతిలపడుచున్= బాధపడుతూ; ఎప్పుడున్; పేదతనము= పేదరికం; కల; నరుని= మనుష్యుడి; ఎడరు= ఆపద, దుఃఖం; ఉడుపఁగ వలయున్= పోగొట్టాలి; అది; మహిత= గొప్ప; గుణము= స్వభావం.

**తాత్పర్యం:** భార్యా పుత్రులను పోషించుకొనలేక పేదరికంతో బాధపడే మనిషి దుఃఖాన్ని పోగొట్టటం గొప్ప గుణమయ్యా! ధర్మజా!

**క. నిజదారపరులు సంతత । యజనరతులుఁ గామరోష హంతలు నగు స**

**ద్ద్విజుల నరసి ధన మిచ్చుట । త్రిజగత్పూజ్య మగు నండ్రు ధీరవిచారా!' 341**

**ప్రతిపదార్థం:** ధీరవిచారా! చెదరని మనస్సుతో ఆలోచించేవాడా!; నిజదారపరులు= స్వంత భార్యలయందే ప్రేమకలవారు; సంతత= నిత్యం; యజనరతులు= యాగం చేయడంలో ఆసక్తి కలవారు; కామ=కామాన్ని; రోష= కోపాన్ని; హంతలు= చంపినవారు అగు; సత్+ద్విజులన్= మంచి బ్రాహ్మణులను; అరసి= పరిశీలించి; ధనమున్= డబ్బు; ఇచ్చుట; త్రిజగత్ పూజ్యము= మూడు లోకాలలో పూజించ దగ్గది; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** సమబుద్ధితో విచారించేవాడా! స్వభార్యలయందే మనస్సు లగ్నమైనవారు, నిత్యమూ యజ్ఞయాగాదులు చేస్తూండేవారు, కామ రోషాలు లేనివారూ అయిన మంచి బ్రాహ్మణులను పరిశీలించి దానంచేయటం మూడు లోకాలలో గొప్పవిషయం. లేదా, మూడు లోకాలకూ పూజించదగ్గది.'

**విశేషం:** ధర్మపరుడైన మనిషి ఎవరు అంటే ఈ మూడు లక్షణాలు కలవాడు. 1.స్వభార్యారక్తుడు - ఇతర స్త్రీలను ధర్మబుద్ధితో చూచేవాడు, 2. యజనపరుడు - యజ్ఞ యాగాదులు చేయటంలో ఆసక్తుడు; 3.కామ-రోషహంత అవి కలవాడు ఇట్లా ధర్మ - అధర్మ పరులుంటారు. ఈ పద్య రచన చాలా అందమైనది. మూడు గుణాలను ముచ్చటగా సమంగా

పద్యపాదాలలో మూడేసి వాక్యాలుగా సమవాక్యాలుగా చెప్పటంవలన పద్యరచనలో సమత్వం తూగు వచ్చాయి.

**వ. అనినం బాండవాగ్రజుండు 'యాచనా యాచనంబులలో నెయ్యది దానార్హం బగు?' నని యడిగిన నతనికిఁ బితామహుం డిట్లనియె. 342**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పాండవాగ్రజుండు= ధర్మరాజు; యాచన= భిక్షాటన, దానమడగటం; అయాచనంబులలోన్= దానం కోరకపోవటంలో; ఏ+అది= ఏది; దాన+అర్హంబు= దానానికి తగింది; అని= అని; అడిగినన్= అడుగగా; అతనికిన్= అతడికి; పితామహుండు= తాత భీష్ముండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా జవాబు చెప్పాడు.

**తాత్పర్యం:** అనగా, ధర్మరా జన్నాడు 'అడిగిన వాడికి దానం చేయటం మంచిదా? అడగనివాడికి దానం చేయటం మంచిదా?' దీనికి తాతగారు సమాధానం చెప్పుతున్నారు.

**చ. 'అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁ గాఁగ నెఱింగి యిచ్చు టె**
**క్కుడు ఫలమిచ్చు; దానవిధికోవిద! వేడుట సావు వేఁడఁగా**
**బడు టది పెద్దసావు; దగు ప్రార్థన పూర్ణము సేయునాతఁ డా**
**యడిగిన వానిఁ దన్నును దయారతిఁ గావఁగఁ జాలు వాఁడగున్.' 343**

**ప్రతిపదార్థం:** అడిగినన్= అడిగితేనే; ఇచ్చుకంటెను= ఇవ్వటం కంటె; అయాచకున్+కాఁగన్= అడగనివాడినిగా; ఎఱింగి= తెలిసి; ఇచ్చుట; ఎక్కుడు= ఎక్కువ; ఫలము= ఫలితం; ఇచ్చున్; దానవిధి కోవిద!= దాన సంబంధమైన విధులు తెలిసినవాడా!; వేఁడుట= కోరటం; చావు= మరణం; వేఁడఁగాఁబడుట= ప్రార్థించబడటం; అది; పెద్దచావు= అన్నిటికంటె పెద్దదైన మరణం; తగు ప్రార్థన= అర్హమైన కోరికను; పూర్ణము= సంపూర్ణము; ఫలవంతం; చేయునాతఁడు= చేసేవాడు; అడిగినవానిన్= వేడుకొన్నవాడిని; తన్నునున్= తనను; దయారతిన్= దయాగుణమందలి ఆసక్తితో; కావఁగన్= రక్షించటానికి; చాలువాఁడు= సమర్థుడైనవాడు; అగున్= ఔతాడు.

**తాత్పర్యం:** 'అడిగితే ఇవ్వటం కంటె అడగనివాడు వీడు అని తెలిసి వాడికి ఇవ్వటం చాలా గొప్పదానం. దానవిధులు తెలిసినవాడా! అసలు అడగట మన్నది చావువంటిది. అడగబడటం పెద్దచావు వంటిది. కనుక అడగని వాడి కివ్వటంవలన వాడినీ, పుచ్చుకొన్నవాడినీ, తననూ రక్షించేవా డౌతాడు.'

**వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 344**

**తాత్పర్యం:** ఆ విధంగా భీష్ముడు చెప్పగా విని ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. దానము యజ్ఞక్రియ నాఁ। గా నతులిత ధర్మవిధులు గల; వందు ధరి**
**త్రీ నాథోత్తమ! యధిక ఫ। లానూనంబై వెలుంగు నది యెయ్యదియో?' 345**

**ప్రతిపదార్థం:** దానము; యజ్ఞక్రియ= యజ్ఞ కర్మ; నాన్+కాన్= అనగా; అతులిత= సాటిలేని; ధర్మవిధులు= ధర్మపద్ధతులు; కలవు= ఉన్నవి; అందున్= దానిలో; ధరిత్రీ నాథ!+ఉత్తమ!= రాజులలో శ్రేష్ఠుడా!; అధిక= గొప్ప; ఫల= ఫలితం; అనుమానంబు+ఐ= ఎక్కువై; వెలుంగునది= ప్రకాశించేది; ఎయ్యదియో?= ఏదో?

**తాత్పర్యం:** 'దానం యజ్ఞంవంటిది. అందులోనే ధర్మవిధు లున్నాయి. మహారాజా! వాటిలోకెల్లా అధికమైన ఫలితాల నిచ్చే దేదో?

**వ. వినవలఁతుం జెప్పవే యని యడిగిన నయ్యనిమిష నదీనందనుం డప్పాండు నందనాగ్రజున కిట్లనియె.346**

**ప్రతిపదార్థం:** వినవలఁతున్= వినటానికిష్టపడుతున్నాను, వినాలనుకొంటున్నాను; చెప్పవే!= చెప్పవా?; అని అడిగినన్; ఆ+అనిమిష= దేవతల; నదీ= ఏరు; నందనుఁడు= కొడుకు, దేవతానది గంగ - ఆమె కొడుకు; ఆ పాండు నందన+అగ్రజునకు= పాండురాజు కొడుకులలో పెద్దవాడు ధర్మరాజుకు; ఇట్లు అనియెన్.

**తాత్పర్యం:** వినాలనుకొంటున్నాను' అని అడుగగా భీష్ముడు ధర్మరాజుతో ఇలా అంటున్నాడు.

**ఉ. భూసురకోటికిన్ వినయపూర్వముగా ధన ధాన్య గో మణి**
**క్ష్మా సలిలాన్న ముఖ్యములు సమ్మతి నీగి సుయజ్ఞ మాసనో**
**ద్భాసితసత్క్రియన్ నడపు భవ్యుఁడు యజ్ఞములుం దపంబులుం**
**జేసిన పుణ్యముం బడయుఁ; జేయుము దానము లోపి నిత్యమున్.' 347**

**ప్రతిపదార్థం:** వినయపూర్వముగాన్= వినయపూర్వకంగా, సమస్కారపూర్వకంగా (వినతి= వినయం, మనస్సులో, వాక్కులో, శరీరంలో, వంగి నమస్కరించే లక్షణం, ఇచ్చేవాడికుండాలి); భూసుర= భూమిపై దేవతలైన - బ్రాహ్మణులయొక్క; కోటికిన్= సమూహానికి; ధన= డబ్బు; ధాన్యం=పంట; గో= ఆవు; మణి= మణులు; క్ష్మా= భూమి; సలిల= నీరు; అన్న= భోజన; ముఖ్యములు= మొదలైనవి; సమ్మతిన్= ఇష్టంతో; ఈఁగి= ఇవ్వటం; సు+యజ్ఞము= మంచి యజ్ఞము; ఆసన= పీట; ఉత్+భాసిత= పైకి వెలుగొందే; సత్క్రియన్= మంచిపని; ఆసనం మీద కూర్చుండి చేసే పని; నడపు= నడిపే; భవ్యుఁడు= శ్రేష్ఠుడు; యజ్ఞములున్; తపంబులున్; చేసిన పుణ్యమున్= చేసినంత పున్నెం; పడయున్= పొందుతాడు; దానములు; ఓపి= ఓర్పుతో; నిత్యమున్; చేయుము= కావింపుము.

**తాత్పర్యం:** నిత్యము బ్రాహ్మణులకు వినయపూర్వకంగా, ధనధాన్యాలు, ఆవు, రత్నం, భూమి, నీరు, అన్నాదులు సద్బుద్ధితో ఇవ్వటం యజ్ఞమే. కనుక దానం చేయుము. అది తపస్సు, యజ్ఞం చేసిన ఫలితమిస్తుంది.'

**క. అనవుడు నాతనితో ని । ట్లనుఁ గుంతీతనయముఖ్యుఁ 'డనఘా! పెక్కుల్**
**వినఁబడు దానము లధికం । బనఁ దగియెడు దాన మెద్ది? యన్నిటిలోనన్.' 348**

**ప్రతిపదార్థం:** అనవుడున్; ఆతనితోన్= భీష్ముడితో; కుంతీ తనయ ముఖ్యుఁడు= కుంతి కొడుకులలో పెద్దవాడు; ఇట్లు; అనున్; అనఘా!; దానములు; పెక్కుల్= అనేకం; వినఁబడున్= చెప్పబడుచున్నవి; అన్నిటిలోనన్= వాటన్నిటిలో; అధికంబు= గొప్పది; అనన్= అనుటకు; తగియెడు= అర్హమైన; దానము= దానం; ఎద్ది?= ఏది?

**తాత్పర్యం:** అనగానే భీష్ముడితో ధర్మరాజు అన్నాడు. 'అనేక దానాలు చెప్పబడుతున్నాయి కదా! వాటిలో ఉత్తమమైనది ఏది?'

**వ. అని యడిగిన నయ్యాపగాసూనుం డమ్మానవపతి కిట్లనియె. 349**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్; ఆ+ఆపగాసూనుండు= నదీకుమారుడు, భీష్ముడు; మానవపతికిన్= రాజుకు; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** అని ప్రశ్నించిన ధర్మరాజుతో భీష్ముడు ఇట్లా అన్నాడు.

## భూదాన మహిమాభివర్ణనము (సం.13-61-1)

**క. దానము లన్నిటికిని భూ । దానం బెక్కుడు సమస్త ధాన్యములుఁ బ్రభూ**
**తానేక వస్త్ర ధన ర । త్నానూనత్వమును భూమి నవుట కతమునన్. 350**

**ప్రతిపదార్థం:** సమస్త ధాన్యములు= అన్ని పంటలు; ప్రభూత= అధికమైన; అనేక= పెక్కు; వస్త్ర= గుడ్డ; ధన= డబ్బు; రత్న= మణులు; వీనియొక్క అనూనత్వమును= అధిక్యమును; భూమిన్= భూమిలో; అవుట కతమునన్= అవుతున్నందువలన; దానములు; అన్నిటికిని= అన్నిటికంటె; భూదానంబు= నేలను దానం చేయటం; ఎక్కుడు= ఎక్కువ.

**తాత్పర్యం:** దానాలన్నింటిలో భూదానమే శ్రేష్ఠం. ధాన్యాలన్నిటికి నేలయే ఆధారం. అంతే కాదు, బట్టకు ప్రత్తి అక్కడే పండుతుంది. రత్నాలూ భూమిలోనే కదా దొరికేవి. కనుక అతిశయంగా డబ్బిచ్చేది నేలయే.

**క. కనకము రజతము వస్త్రం । బును ధాన్యము వివిధ రత్నములు నిచ్చిన య**
**వ్వినుత ఫలంబుల నెల్లను । గను నుత్తమభూమి దానకర్త నరేంద్రా! 351**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= మానవనాథా!, రాజా!; కనకము= బంగారం; రజతము= వెండి; వస్త్రంబును= గుడ్డా; ధాన్యము= పంట; వివిధ రత్నములు= అనేక రత్నాలు; ఇచ్చిన= దానం చేసిన; ఆ+వినుత= ఆ పొగడ దగ్గ; ఫలంబులన్+ఎల్లన్= ఫలితాలన్నింటినీ; ఉత్తమ భూమి దానకర్త= మంచిభూమిని దానంచేసినవాడు; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** బంగారం, వెండి, వస్త్రం, ధాన్యం, వివిధ రత్నాలు - ఇచ్చిన ఫలా లన్నిటినీ శ్రేష్ఠమైన భూదానం చేసినవాడు పొందుతాడు.

**సీ. భూమి కెంతాయువు భూదానకర్తయు । నంతకాలము సుఖ మందుచుండు**
**నమరలోకంబున; నల్పమైనను భూమి । యిచ్చిన బహుభూమి యేలు నతఁడు;**
**రాజు విశేషించి రణమృతి యొండెను । భూదాన కర్తృత్వ పుణ్య మొండెఁ**
**బడయంగవలయుఁ బాపఁగ నోపు బ్రహ్మ హ । త్యాది పాతకముల నైన భూమి**

**తే. దాన మెంత పాపాత్ముచే నైన భూమిఁ । గొనిన గల్మష మొందదు; వినుము మహిత**
**మైన భూదానవిధియును నశ్వమేధ । యాగమును సదృశంబులం డ్రాదిమునులు. 352**

**ప్రతిపదార్థం:** భూమికిన్; ఎంత; ఆయువు= ఆయుస్సో; భూదానకర్తయున్= భూదానం చేసినవాడున్నూ; అమర లోకంబునన్= దేవతాలోకంలో; అంత కాలమున్; సుఖమున్; అందుచున్; ఉండున్; భూమి; అల్పము+ఐనను= కొంచెమైనాసరే; ఇచ్చినన్=

ఇస్తే; అతఁడు= ఇచ్చినవాడు; బహుభూమి= ఎక్కువ నేలను; ఏలును= పాలించగలడు; విశేషించి= వీరికంటె ఎక్కువగా; రణమృతి= యుద్ధంలో చావు; ఒండెన్= ఐనా; భూదాన= భూమి నివ్వటం; కర్తృత్వ పుణ్యము+ఒండెన్= కర్తయైన పున్నెమైనా సరే (భూమిని దానం చేసిన కర్త పున్నెమైనా; పడయంగన్ వలయున్= పొందవలెను; భూమిదానము; బ్రహ్మహత్య= బ్రాహ్మణ హత్య; అవి= మొదలైన; పాతకములన్+ఐనన్= పాపాలనైనా; పాపఁగన్= పోగొట్టగా; ఓపున్= సమర్థమగును; ఎంత పాపాత్ముంచే నైనన్; భూమిన్ కొనినన్= భూమిని గ్రహిస్తే; కల్మషము= పాపం; ఒందదు= తగులదు; వినుము; ఆది మునులు= ప్రాచీన కాలఋషులు; మహితము+ఐన= గొప్పదైన; భూదాన విధియునున్= భూమిని దానంచేసే కర్మ; అశ్వమేధయాగమును= అశ్వమేధమన్న యాగమూ; సదృశంబులు= సమానములు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** భూమి ఎంత కాలం ఉంటుందో భూదానం చేసినవాడుసైతం స్వర్గలోకంలో అంతకాలం ఉంటాడు. కొంచెం నేలను దానంచేసినా ఎంతో నేలను పొందగలడు. రాజు రణమరణమైనా పొందాలి, భూదానమైనా చేయాలి. భూదానంవలన బ్రహ్మహత్యవంటి పాపాలు పోతాయి. భూదానాన్ని ఎంత పాపాత్ముడు చేసినా, గ్రహించినవానికి కల్మషం రాదు. భూదానం అశ్వమేధం సమాన మని ఆదిమునులు అంటారు.

**క. దారిద్ర్యముచేఁ గుందుచు । నేరిని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం**
**గూరిన విప్రున కుర్వర । వారని దయ నీగి ఫలము వాగ్గోచరమే? 353**

**ప్రతిపదార్థం:** దారిద్ర్యముచేన్= పేదరికంతో; కుందుచున్= బాధపడుతూ; ఏరినిన్= ఎవరినీ; అడుగంగన్= అడగటానికి; పోవక= పోకుండా; ఎంతయున్= మిక్కిలి; కృశతన్= లేమిడిలో; కూరిన= కూరుకొనిపోయిన; విప్రునకున్= బ్రాహ్మణుడికి; ఉర్వరన్= భూమిని; వారని దయన్= ఎక్కువ దయతో; ఈఁగి= దానము చేయడంలోని; ఫలము= ఫలితం; వాక్+గోచరమే?= వాక్కున కందునా? అందదు.

**తాత్పర్యం:** "దారిద్ర్యంతో బాధపడుతూ ఎవరినీ యాచించడానికి పోకుండా ఎంతోలేమిడిలో కూరుకుపోయిన బ్రాహ్మణుడికి ఎక్కువ దయతో పంటపండే భూమిని దానం చేస్తే కలిగే ఫలితాన్ని మాటల్లో చెప్పడం సాధ్యమా?"

**విశేషం:** అన్ని రకాల పైరులచే నిండిన నేల 'ఉర్వర'.

**తే. యాగకర్తయు శాంతుండు నైన యట్టి । విప్రుఁ బ్రార్థించి యైన నుర్వీప్రతి గ్ర**
**హంబు సేయించు టత్యధికంబు భూమి । దానవిధి విశేషంబులలోన నెల్ల. 354**

**ప్రతిపదార్థం:** భూమిదాన విధి విశేషంబులు= భూదాన సంబంధమైన విశేష విధానాలు; లోనన్= లోపల; ఎల్లన్= అన్నిటిలో; యాగకర్తయున్= యజ్ఞాలు చేసినవాడు; శాంతుండును= సమత్వం కలవాడును; ఐన అట్టి= అయినటువంటి; విప్రున్= బ్రాహ్మణుడిని; ప్రార్థించియైనన్= మిక్కిలిగా వేడుకొనిఐనాసరే; ఉర్వీ= భూమి; ప్రతిగ్రహంబు= గ్రహించటం; చేయించుట= చేయించటం; అతి+అధికంబు= మిక్కిలి అధికమైనది.

**తాత్పర్యం:** భూదాన విధులలో విశేషమైన విధి ఏమంటే యాగం చేసినవాడు శాంతుడైనవాడు అయిన బ్రాహ్మణుడిని ప్రార్థించయినాసరే భూమిని గ్రహించేటట్లు చేయించటం గొప్ప విశేషం.

**విశేషం:** ప్రతి పద్యంలోనూ విప్రశబ్దమే కనిపిస్తున్నది. ఇది చాలా విచారింపదగ్గది. వేదంలో "ఏకం సత్ విప్రా బహుధా

వదంతి'' అని ఉన్నది. 'ఉన్న సత్య మొక్కటే దానినే విప్రు లనేక రకాలుగా వివరిస్తున్నారు' అన్నచోట విప్రశబ్దంలో వి= విశిష్టమైన; ప్ర= అధికమైన; అన్న అర్థంలో ఉపసర్గలు. ఆనాటి కాలంలో శబ్దం నిజమైన అర్థంలోనే వాడబడేది. రానురాను ఆ అర్థం పోయి శబ్దం అరిగిన నాణెమై పోతుంది. కనుక తిక్కనగారు వాడే విప్ర శబ్దం వేదంలో చెప్పిన అర్థంలోనే గ్రహించాలి. విప్ర=ఋషి.

**క. విను మర్హుఁడైన విప్రున । కనఘా! గోచర్మమాత్ర యగు మేదిని ని**

**చ్చినఁ బోని యట్టి పాపము । నినుపొడుపునఁ జెడని తమము నెందును గలవే? 355**

**ప్రతిపదార్థం:** అనఘా!; వినుము; అర్హుఁడు+ఐన= తగినవాడైన; విప్రునకున్; గోచర్మమాత్ర= గోవు చర్మమంత మాత్రం; అగు= అయిన; మేదినిన్= భూమిని; ఇచ్చినన్= దానమిస్తే; పోని= పోవని; అట్టి= అటువంటి; పాపము; ఇనుపొడుపునన్= సూర్యోదయంతో; చెడని= నాశంకాని; తమమున్= చీకటి; ఎందునున్= ఎక్కడైనా; కలవే?= ఉన్నాయా?

**తాత్పర్యం:** ధర్మరాజా! తగినబ్రాహ్మణుడికి గోచర్మమంత భూమిని దానమిస్తే పోని పాపంకానీ, సూర్యోదయంతో తొలగని చీకటికానీ ఎక్కడైనా ఉంటాయా?

**విశేషం:** అలం: సహోక్తి.

**క. ఆజిప్రాప్త మృతులు గురు । పూజకులును, మఱియు నెట్టి పుణ్యాత్మకులున్**

**రాజోత్తమ! భూదాన । భ్రాజిష్ణునిఁ బోల రండ్రు పరమమునీంద్రుల్. 356**

**ప్రతిపదార్థం:** రాజ+ఉత్తమ!= ఉత్తముడవైన రాజా!; ఆజి= యుద్ధంలో; ప్రాప్త= పొందిన; మృతులు= చావుకలవారు; గురు= ఆచార్యుని; పూజకులును= పూజించేవారును; మఱియున్; ఎట్టి= ఎట్లాంటి; పుణ్య+ఆత్మకులున్= పుణ్యం చేసినవారున్నూ; రాజ+ఉత్తమ= ఉత్తముడవైన రాజా!; పరమ= గొప్ప; ముని+ఇంద్రుల్= మునిశ్రేష్ఠులు; భూదాన= భూమిని దానంచేయుటంవలన; భ్రాజిష్ణునిన్= ప్రకాశించేవాడిని; పోలరు= సరితూగరు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** యుద్ధంలో మరణించినవారు, గురువులను పూజించేవారు, మరి ఎట్లాంటి పుణ్యాత్ములైనా సరే భూదానంతో ప్రకాశించేవాడితో సరిపోలరు అంటారు మునీశ్వరులు.'

**వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను 'భూదేవి జనులకు హితంబుగా నానతిచ్చిన వాక్యంబులు భూగీత లనంబరఁగు; వాని విని పరశురాముండు భూదానపరుం డయ్యె నని విందుము పాండవాగ్రజా! యవి నీ వాకర్ణింపుము. 357**

**ప్రతిపదార్థం:** అనిచెప్పి; భీష్ముండు; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; భూదేవి; జనులకున్= జనులకు; హితంబుగాన్= మేలుకొరకుగా; ఆనతి+ఇచ్చిన= సెలవిచ్చిన; వాక్యంబులు= మాటలు; భూగీతలు= భూదేవి చెప్పిన మాటలు; అనన్= అనే పేరున; పరఁగున్= వ్యాప్తిపొందాయి; వానిన్= వాటిని; విని= ఆలకించి, పరశురాముండు= పరశురాముడు; భూదానపరుఁడు= భూమిని దానం చేసేవాడు; అయ్యెన్= అయ్యాడు; అని; విందుము= విన్నాము; పాండవాగ్రజా!= ధర్మరాజా!; అవి= వాటిని, భూగీతలను; నీవు= నీవు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** పాండవులలో పెద్దవాడా! భూదేవి జనం శుభం కోరి చెప్పిన మాటలు భూగీత లనే పేరున లోకంలో పేరు పొందాయి. అవి విని పరశురాముడు భూదానంచేశాడు. నీవూ అవి వినాలి.

**విశేషం:** గీత= పాడబడినది. పాట= పరమాత్మ దర్శనంతో ఆనందావేశం పొందిన ఋషి పాడినపాట గీత. ఇదే ఉత్ గీత (థ) లన్న పేరున ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. భగవద్గీత - భగవంతుడి పాట, మాట. బ్రహ్మగీత, దేవీగీతలు ఇట్లా అనేకం వచ్చాయి. ఆత్మానందాన్ని అందించేకొరకు వ్యక్తమైన పాట. పూర్వం మాట లేదు. పాటే ఉండేది. మాట మంత్రమైన పాటయిన దశ ఒకటే ఉన్నది. మాటయినా పాటవలె ఉంటుంది. మహాత్ముల వాక్యాలే గీతలు.

**క. 'నను నిండు రెండు లోకము । లను జెడని యశస్సుఖంబులం బడయఁగఁ గో**

**రినయట్లయినను దీనికి । నెన లేవు సుఁడీ! తలంప నే ధర్మములున్. 358**

**ప్రతిపదార్థం:** రెండు లోకములను= ఇహ పరలోకాలలో; యశః= కీర్తి; సుఖంబులన్= సుఖాలు; పడయఁగన్= పొందటానికి; కోరినఅట్లు+అయిననున్= కోరేటట్లయితే; దీనికిన్= భూదానానికి; ననున్+ఇండు= నన్ను దానం చేయండి; తలంపన్= ఆలోచింపగా; ఏ ధర్మములున్= ఏ ధర్మాలున్ను; ఎనలేవు సుఁడీ= సరిగావు సుమా!

**తాత్పర్యం:** నన్ను దానంచేస్తే రెండు లోకాలలో మేలు కలుగుతుంది. ఈ లోకంలో కీర్తి, ఆలోకంలో సుఖమూ కావాలనుకొంటే నన్ను దానం చేయండి. దీనికి సమాన మైన ధర్మాలేవీ లేవు.

**చ. ఇతరుల దాన మేనిఁ దమ యీగియ యేనిని నన్ను మార్తురే**

**మతి నరకాధివాసగతి మాన్పఁ దలంచుట గల్గినన్ సమం**

**చితముగ భక్తి నిచ్చుట కుశీలత మార్చుట నాకు హర్ష భా**

**సితయుఁ; బరాభవ వ్యథయు జేఁత సుఁడీ! యిదె చాటి చెప్పితిన్.' 359**

**ప్రతిపదార్థం:** ఇతరుల దానము+ఏనిన్= ఇతరుల దానమైనా; తమ= స్వంత; ఈగియ ఏనిని= దానమైనా; నన్నుమార్తురే?= నన్ను మారుస్తారా; మతి= ఆలోచనలో; నరక= నరకంలో; అధివాసగతి= ఉండేస్థితి; మాన్పన్= మానుకొనే; తలంచుట= తలంపు; కల్గినన్= కలిగితే; సమంచితముగన్= చక్కగా; భక్తిన్= భక్తితో; ఇచ్చుట= దానంచేయటం; కుశీలతన్= చెడ్డస్వభావంతో; మార్చుట= మార్చటం; నాకున్; హర్షభాసితయున్= సంతోషంతో తృప్తినివ్వటం; పరాభవవ్యథయున్= అవమాన బాధ; చేఁత సుఁడీ= చేయటం సుమా!;= ఇదె= ఇదుగో; చాటి= ఎలుగెత్తి; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** నరకంలో ఉండాలన్న కోరిక లేకపోతే దానమైనా స్వదానమైనా నన్ను మార్చరు. సంతోషంగా నన్ను ఇస్తే నాకు చాలా ఆనందం కలిగించినట్లు. దుష్టస్వభావంతో ఆ దానాన్ని మారిస్తే, హరిస్తే నాకు అవమానం కలిగించినట్లు. ఇదే వినండి అంతవరకు ఎలుగెత్తి చెప్పుతున్నాను.'

**విశేషం:** ఉద్గీత= ఉత్ గీత= ఎలుగెత్తి చెప్పినదే. అతి ప్రాచీనకాలంలో భూమిపై ఎవరికీ హక్కుండేది కాదు. అంతా రాజాధీనంలోనే ఉండేది. రిజిస్ట్రేషన్ వ్యవస్థ ఆంగ్లేయులు ప్రవేశపెట్టారు. ఈ గీతార్థం అతి ప్రాచీనవ్యవస్థను చెప్పుతుంది.

**క. 'వినుఁ డుభయలోకముల మే । లొనరింతుం గీ డొకింతయును నిలువఁగ నీ**

**క నిరాసంబు నొనర్తును । నను నిచ్చిన నెట్టి దుర్జనములకు నైనన్.' 360**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఆలకించండి; ననున్= నన్ను; ఇచ్చిన= ఇచ్చినటువంటి; ఎట్టి= ఎట్లాంటి; దుర్జనములకున్+ఐనన్= చెడ్డవారికైనను; ఉభయ లోకములన్= ఇహపరలోకముల యందును; మేలు+ఒనరింతున్= శుభములు కలుగ జేస్తాను; కీడు+ఒకింతయును= అశుభం ఏమాత్రమయినా; నిలువఁగనీయక= కలుగనీయక; నిరాసంబున్+ఒనర్తున్= నిరసిస్తాను.

**తాత్పర్యం:** 'వినండి. ఎట్టి దుర్మార్గులకైనా నన్ను ఇస్తే, నేను ఇహపరాలకు మేలు చేస్తాను. కీడు ఏమాత్రం కలుగకుండా నివారిస్తాను.'

**వ. అనియె 'నని యవ్వాక్యంబు లుపన్యసించి దేవవ్రతుం డన్నర దేవోత్తమునకు మఱియుం జెప్పు; 'నవ్విషయంబున నింద్రుం డడుగ బృహస్పతి సెప్పిన వచనంబులు వినుము చెప్పెద. 361**

**ప్రతిపదార్థం:** అనియెన్; అని; ఆ+వాక్యంబులు= ఆ మాటలు; ఉపన్యసించి= వివరించి; దేవవ్రతుండు= భీష్ముడు; ఆ నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజశ్రేష్ఠుడికి; మఱియున్; చెప్పున్; ఆ+విషయంబునన్= ఆ సందర్భంగా; ఇంద్రుండు; అడుగన్; బృహస్పతి చెప్పిన; వచనంబులు= పలుకులు; వినుము= ఆలకించుము; చెప్పెదన్= చెప్పెదను.

**తాత్పర్యం:** అని చెప్పినట్లు ఆ మాటలు భీష్ముడు ధర్మరాజుతో అన్నాడు. ' ఆ విషయంలో ఇంద్రు డడిగితే బృహస్పతి చెప్పిన మాటలు ఉన్నాయి. వినుము చెప్పుతాను.

**ఆ. 'భూమి రత్నగర్భ పురుహూత! యటు గాన । కలుగు భూమిదాన కర్త యైన**
**వాని కశ్వ హస్తి వనితాది సర్వ ర । త్నములు నిచ్చునట్టి యమితఫలము. 362**

**ప్రతిపదార్థం:** భూమి; రత్నగర్భ= రత్నాలు కడుపులో కలది (రత్నమంటే చెట్టూ; బొగ్గూ, పంటా అన్నీ రత్నాలే ధనాన్నిచ్చేవి కనుక); పురుహూత!= ఇంద్రా!; అటుకాన= అట్లు కాబట్టి; భూమిదానకర్తఐన వానికిన్= భూమిని దానంచేసిన వాడికి; అశ్వ= గుర్రం; హస్తి= ఏనుగు; వనిత= స్త్రీ; ఆది= మొదలైన; సర్వ= అన్ని; రత్నములు= మణులు; ఇచ్చునట్టి= దానం చేసినట్టి; అమిత= అధికమైన; ఫలము= ఫలితం; కలుగుతుంది.

**తాత్పర్యం:** ఇంద్రా! భూదేవి రత్నగర్భ కాబట్టి భూదానం చేసినవాడికి గుర్రం, ఏనుగు, స్త్రీ మొదలైన రత్నాలను ఇచ్చినటువంటి ఫలితం కలుగుతుంది.

**విశేషం:** రాజనీతి శాస్త్రాలలో సప్తరత్నాలు చెప్పబడ్డాయి. అందులో కొన్ని ఈ పద్యంలో చెప్పబడ్డాయి.
1. గుర్రం, 2.ఏనుగు, 3. స్త్రీ= రాజశ్రీ, రాజు ఐశ్వర్యం. ఈ 7లో రత్నాలు. రథం, ధర్మచక్రం సేనాపతి. మంత్రి మొదలైనవి ఆ ఏడులో ఉన్నాయి. కనుకనే ఆది అని చెప్పబడినది. రాజు రాజ్యపాలనం చేయటానికి ఆధారాలు.

**క. వసుదాయిని యైన వసుధ । నొసఁగి నతనిఁ దన్న తన్న యొసఁగె ననుచు సం**
**తసపడు భూతము లన్నియు । నసమానము భూమిదాన మమరాధీశా! 363**

**ప్రతిపదార్థం:** అమర= దేవతలకు; అధి+ఈశా!= పాలకుడా!; వసుదాయిని= బంగారాన్నిచ్చేది; ఐన; వసుధన్= నేలను (వసువును ధరించేది); ఒసఁగిన= ఇచ్చిన; అతనిన్= అతడిని; తన్న తన్న= తనను, తననే; ఒసఁగెన్= ఇచ్చెను; అనుచున్= అంటూ; భూతములు= పంచభూతాలు (ఆకాశం, అగ్ని, నిప్పు; నీరూ, నేల); అన్నియున్= అయిదూ; సంతసపడున్= సంతోషిస్తాయి; భూమిదానము; అసమానము= సాటిలేనిది.

**తాత్పర్యం:** దేవరాజా! వసుధ బంగారాన్నిస్తుంది. కనుక సకలభూతాలు తనను, తనను దానంచేశాడని చేసినవాడిని చూచి సంతోషిస్తాయి.

**విశేషం:** పంచభూతాలలో భూమి అట్టడుగున ఉన్నది. దీనిలో మిగిలిన నాలుగు ఉన్నాయి. కనుక అవి సంతోషిస్తాయి.

**క.** **విను రాజులకు నవశ్యం । బును జేయఁగవలయు నధిక భూదానము; రా**
**జనువాఁ డఘముల కాకర । మనఘా! యది దక్కనొంట నది వ్యయ మగునే? 364**

**ప్రతిపదార్థం:** అనఘా; విను; రాజులకున్; అవశ్యంబును= తప్పక; భూదానమున్; చేయఁగన్ వలయును= చేయాలి; రాజు; అనువాఁడు; అఘములకున్= పాపాలకు; ఆకరము= నిలయం, స్థానం; అది తక్కన్= భూదానం తప్పించి; ఒంటన్= మరొకదానితో; అది= ఆ పాపం; వ్యయము= నాశనం; అగునే= ఔతుందా? కాదని భావం.

**తాత్పర్యం:** అనఘా! రాజులకు భూదానం తప్పక చేయవలసిన విధి ఉన్నది. ఎందుకంటే రాజైనవాడు పాలనలో అనేక పాపాలు చేయవలసి వస్తుంది. అది పోవాలంటే భూదానమే మార్గం.

**విశేషం:** రాజ్యాంతే నరకం ధ్రువమ్ - రాజ్యపాలన చివర నరకం తప్పక కలుగుతుంది అని పెద్దలమాట. పరిపాలనలో ఎన్ని అధర్మాలైనా కలిగే అవకాశమున్నది కనుక ఆ సూక్తి పుట్టింది. అది పోగొట్టుకొనటానికి మార్గ మొక్క భూదానమే. ఆ రోజులలో కోశాగారంలో మిగిలిన ధనాన్ని ప్రజలకు పంచి ఇచ్చే అలవాటుండేది. హర్షుడు మొదలగువారిట్లా చేశారని చరిత్ర చెప్పుతున్నది. ప్రాచీన చక్రవర్తుల ధర్మపాలన కది గుర్తు. రాజు ప్రజలకు తండ్రి. ప్రజ అంటేనే సంతానమని అర్థం. తన సంతానాన్ని కాపాడుకొనవలసిన బాధ్యత తండ్రివంటి రాజుదే. కనుకనే రాజంటే ప్రజారంజనం, ఆనందం చేసేవాడని అర్థం. భారతం ఆ ధర్మచక్రవర్తి ఎట్లా ఉంటాడో చెప్పటానికే వ్రాయబడిన ఇతిహాసం. కనుకనే ధర్మరాజని భారత నాయకుడికి పేరు. కనుకనే ఇతడే ధర్మాలన్నిటికీ శ్రోతగా చేయబడ్డాడు. ఇదొక రాజ శిక్షణ. (ధర్మరాజు రాజధర్మ స్వరూపుడు).

**క.** **పూర్వదత్త యైన భూమి నెవ్వఁడు పుచ్చి । కొనియె, నతఁడు దనదు కులమువారి**
**నిరువదొక్కతరము నరకవాసులఁ జేయు । దాను నడుము గాఁగ ధర్మనిరత! 365**

**ప్రతిపదార్థం:** ధర్మనిరత!= ధర్మమునందు నిష్ఠకలవాడా!, నిరంతరము ధర్మము నందు లగ్నమైన బుద్ధి కలవాడా!; పూర్వదత్త+ఐన= పూర్వమే ఇవ్వబడిన; భూమినిన్; ఎవ్వఁడు; పుచ్చుకొనియెన్= తీసికొన్నాడో; అతఁడు; తనదు= తన; కులమువారిన్; ఇరువదొక్క తరమున్; నరకవాసులన్= నరకంలో నివసించేవారిగా; చేయున్= చేస్తాడు; తాను; నడుమ= కేంద్రం; కాఁగన్= కాగా.

**తాత్పర్యం:** ముందిచ్చిన భూమిని తిరిగి ఎవ్వడు గ్రహిస్తాడో తిరిగి తీసికొంటాడో వాడు తన కులంలో ఇరవైయొక్క తరాల వాళ్ళను నరకంలో పడేటట్లు చేస్తాడు. మహాపాపానికి తాను కేంద్రమౌతాడు. (ఈ పాపభారమంతా వాడే మోయాలి)

**క.** **మును దా విప్రున కిచ్చెద । నని భువి యీ కుండుకంటె నధికపుఁ బాపం**
**బును నడుగ కిచ్చుటకు మిగి । లిన పుణ్యము నెందు నరయ లేవండ్రు బుధుల్.' 366**

**ప్రతిపదార్థం:** మును= ముందుగా; తాన్= తాను; విప్రునకున్= బ్రాహ్మణుడికి; ఇచ్చెదన్= ఇస్తాను; అని; భువిన్=భూమిని; ఈక+ఉండు కంటెన్= ఇవ్వకుండా ఉండటం కంటే; అధికపుఁ బాపంబును= ఎక్కువ పాపం; అడుగక= అడగకుండానే; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; మిగిలిన= మించిన; పుణ్యమున్; ఎందున్= ఎక్కడా; అరయన్= విచారిస్తే; బుధుల్= పండితులు; లేవు+అండ్రు= లేవని అంటారు.

**తాత్పర్యం:** ఇస్తానని వాగ్దానం చేసిన భూమిని ఇవ్వకపోవటం కంటె మహాపాపం లేదు. అడక్కుండానే ఇచ్చినంత మహాపుణ్యమూ లేదు - అని పండితులంటారు.'

**వ. అనిన విని యజాతశత్రుండు సురనదీపుత్త్రుతో 'దానపరులయిన మానవులకు దాతవ్యంబులగువాని విశేషంబు లెఱింగింపవే' యనుటయు, నతం డన్న కనక పానీయ ప్రముఖంబులైన పదార్థంబుల విశేషంబులు గల; వవి యెఱింగించెద; నొక్కనాఁ డన్నంబు విషయం బైన దానంబు ప్రకారంబు. 367**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అజాత= పుట్టని (లేని); శత్రుండు= శత్రువులు కలవాడు, ధర్మరాజు; సురనదీ= గంగా; పుత్త్రుతోన్= కొడుకుతో; దానపరులు= దానబుద్ధికలవారు; అయిన; మానవులకున్= మనుష్యులకు; దాతవ్యంబులు+అగువాని= ఈయదగిన వాటియొక్క; విశేషంబులు= విశేషాలు; ఎఱింగింపవే= తెలుపవే; అనుటయున్; అతండు= భీష్ముడు; అన్న= భోజనం; కనక= బంగారం; పానీయ= త్రాగదగ్గవి; ప్రముఖంబులు= మొదలైన; పదార్థంబుల= వస్తువుల; విశేషంబులు; కలవు= ఉన్నాయి; అవి= వాటిని; ఎఱింగించెదన్= చెప్పుతాను; ఒక్కనాఁడు= ఒక్కరోజు; అన్నంబు విషయంబు+ఐ= అన్నానికి సంబంధించిన; దానంబు ప్రకారంబు= దానం పద్ధతి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** చెప్పగా విని ధర్మరాజు భీష్ముడితో 'దానస్వభావం కలవారికి దానం చేయటానికి తగిన వస్తువు లేవి? వాటి విశేషాలు చెప్పు'మని అడుగగా భీష్ముడంటున్నాడు. 'అన్నం, బంగారం, పానీయాలు మొదలైన పదార్థాల విశేషాలు ఉన్నాయి. వాటి సంగతి తరువాత చెప్పుతాను. 'ముందు ఒకరోజన్నదాన విషయం వినుము.

**క. ఏ నడుగఁగ నారదముని । మానితముగఁ జెప్పినట్టి మాటలు సువ్య**
**క్తానూన వృత్తిఁ జెప్పెద । భూనాయక! యేక చిత్తమున విను వానిన్. 368**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అడుగఁగన్= అడిగితే; నారదముని= నారదమహర్షి; మానితముగన్= ఆదరంగా; చెప్పినట్టి మాటలు; సువ్యక్త= బాగా తెలిసేటట్లు; అనూన= అధికమైన; వృత్తిన్= బుద్ధితో; చెప్పెదన్; భూనాయక!= భూమిపాలకుడా! ఏకచిత్తమునన్= ఏకాగ్రబుద్ధితో; వానిన్= వాటిని; విను= వినుము.

**తాత్పర్యం:** నేనడిగితే నారదముని ఆదరబుద్ధితో చెప్పిన మాట లున్నాయి. వాటిని స్పష్టపడేటట్లు చేయాలన్న సంకల్పంతో రాజా! చెప్పుతున్నాను; ఏకాగ్రబుద్ధితో వినుము.

**విశేషం:** సమ్యక్ శ్రవణం బుద్ధదేవుడి అష్టాంగసూక్తులలో ఒకటి. గురువుల వాక్యాలను చక్కగా విని మననం చేసుకోవాలి. దానికే ఈ మాట.

**క. మునులును దివిజులు నన్నము । వినుతింతురు లోకతంత్రవిధిఁ గ్రతువులు ద**
**క్కనుగల సర్వము నన్నం । బున నడచుం గాన యన్నము విశిష్ట మిలన్. 369**

**ప్రతిపదార్థం:** మునులును= మునులున్నూ; దివిజులున్= దేవతలున్నూ; అన్నమున్, వినుతింతురు= స్తుతిస్తారు; లోకతంత్ర విధిన్= లోకయాత్రా పద్ధతిలో; క్రతువులు= యజ్ఞాలు; తక్కునుగల= మిగిలిన; సర్వమున్= సమస్తమూ; అన్నంబునన్= అన్నంతోనే; నడచున్= నడుస్తాయి; కాన= కాబట్టి; అన్నము; ఇలన్= లోకంలో; విశిష్టము= గొప్పది,

**తాత్పర్యం:** దేవతలు, ఋషులు అన్నాన్ని పొగడుతున్నారు. లోకయాత్రలో యజ్ఞయాగాదులు మిగిలినవన్నీ అన్నంతోనే ప్రవర్తిస్తున్నాయి. కనుక అన్నంకంటె విశిష్టమైన దేదీ లేదు.

**విశేషం:** వేదంలో అన్నం పరబ్రహ్మంగా స్తుతించబడింది. గీతలోనూ అన్నంనుండి సకల భూతాలు పుట్టుతున్నాయని చెప్పబడ్డది. "అన్నాద్భవంతి భూతాని' - 3.14. నేటి వేదవేత్తలు అన్నము అంటే పదార్థ జగత్తు= భూదేవి అంటున్నారు.

**ఆ. అన్నదాన సదృశ మగు దాన మెందు నె । న్నఁడును లేదు గావునను విధేయ**
**మన్నదాన మధిక యత్నపూతంబుగాఁ । బూని దానిచేఁత పుణ్యతమము. 370**

**ప్రతిపదార్థం:** అన్నదాన సదృశము= అన్నదానంతో సమానము; అగు= అయిన; దానము; ఎందున్= ఎక్కడా; ఎన్నఁడును= ఎప్పుడు; లేదు; కావునను= కాబట్టి; అన్నదానము; విధేయము= విధిగా చేయదగింది; అధికయత్న= మిక్కిలి ప్రయత్న; పూతంబుగాన్= పవిత్రంగా; పూని= పూనుకొని; దానిచేఁత= అన్నదానం చేయటం; పుణ్యతమము= మిక్కిలిపుణ్యం.

**తాత్పర్యం:** అన్నదానంతో సమానమైనది లేదు. కనుక అది తప్పక చేయదగింది. ఎక్కువ ప్రయత్నంతో నైనా సరే పవిత్రంగా చేయటం ఎక్కువ పుణ్యమిస్తుంది.

**సీ. ప్రాణంబులకు విధారక మన్న మింటి జ । నంబుల కుడిగి యైనను సుభక్తి**
**నతిథికిఁ బెట్టుట యధిక పుణ్యము శ్రాంతు । వృద్ధుఁ దాపసు బాలు వికలు వనితఁ**
**గడపఁగా దాఁకలి గదిరి యర్థించిన । గృహమేధి కవమతి గినుక దగదు**
**కాలంబుతోఁ గుక్క మాలఁడు దుదిగాఁగ । నాఁకొని వచ్చిన ననుగుణముగ**

**ఆ. నాచరింపవలయు నాహార కల్పన । మునుల దేవ పితృ సముత్క రముల**
**నన్నదాన విధుల నాదరంబుగఁ బ్రియ । మొందఁ జేఁతఁబోల వొండు విధులు. 371**

**ప్రతిపదార్థం:** ప్రాణంబులకున్= ప్రాణాలకు; విధారకము= చక్కని ధారకము, ధరింపచేసేది; అన్నము; ఇంటి జనంబులకున్= ఇంట్లోని మనుష్యులకు; ఉడిగి ఐననున్= మానుకొనైనా; సుభక్తిన్= మంచిభక్తితో; అతిథికిన్= తిథిలేకవచ్చేవాడికి; పెట్టుట; అధిక= పెద్ద; పుణ్యము= పవిత్రం; శ్రాంతున్= అలసిపోయినవాడిని; వృద్ధున్= ముసలివాడినీ; తాపసున్= తపస్సు చేసికొనేవాడినీ; బాలున్= పసివాడినీ; వికలున్= అంగలోపం కలవాడినీ; వనితన్= స్త్రీనీ; ఆఁకలి కదిరి= ఆకలి వేసి; అర్థించినన్= అర్థిస్తే; కడపన్ కాదు= పెట్టకుండా త్రోసివేయరాదు; గృహమేధికిన్= గృహస్థుకు; అవమతి= అవమానము; కినుక= కోపం; తగదు= యుక్తం కాదు; ఆఁ కొనివచ్చినన్= ఆకలితో వస్తే; కాలంబుతోన్= సకాలంలో; కుక్క; మాలఁడు; తుదిగాగన్= చివరకాగా; అనుగుణముగన్= తగినట్లుగా; ఆహారకల్పన= భోజన సదుపాయం; ఆచరింప వలయున్= సమకూర్చాలి; మునులన్= ఋషులను; దేవ= దేవతలను; పితృసముత్కరములన్= పితృదేవతా సమూహాన్ని; ఆదరంబుగన్= భక్తితో; అన్నదాన విధులన్= అన్నం పెట్టటంతో; ప్రియము= సంతోషం; ఒందన్= పొందేటట్లు; చేఁతన్= చేయటాన్ని; ఒండు= మరొక; విధులు= కర్మలు; పోలవు= సరికావు, సాటికావు.

**తాత్పర్యం:** అన్నం ప్రాణధారకం కనుక ఇంట్లో వాళ్ళకు మానుకొనైనా అతిథులకు పెట్టటం పుణ్యం. అందులోనూ అలసినవాడు, స్త్రీ, బాలుడు, అంగవైకల్యం కలవాడు, ముసలి, తాపసి అయినవారి నసలే కాదనకూడదు. ఆకలితో వచ్చిన కుక్కను, మాలవాడిని గృహస్థు అన్నదానంతో తగినట్లు ఆదరించాలి. అవమానించడం, కోపగించడం కూడదు. మునులు, పితృదేవతలు, దేవతలు - వీరిని అన్నదానంతో సంతోషపెట్టటం శ్రేష్ఠకర్మ.

**విశేషం:** ధారకమన్నమాటను మన మీనాటికీ ఇట్లాగే వాడుతున్నాము. "ధారకమేమీ లోపలకు పోవటంలేదు" రోగిని చూచి అనేమాట ధారకమంటే; ప్రాణాన్ని నిలబెట్టేది.

కుక్క, మాలడు - "శుని చైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః" అని గీత. పండితులంటే ఉత్తములతో పాటు, కుక్కనూ, మాలనూ, సమానంగా చూచేవాడని అర్థం.

**క. కులమును, విద్యయు, వృత్తము । నలఘుమతీ! యన్న మిడుటకై యడుగంగా**
**వలవదు; విప్రుని నాదర । మలరంగా నిడుట లెస్స యడిగిన మాత్రన్.' 372**

**ప్రతిపదార్థం:** అలఘుమతీ!= గొప్ప మనసు కలవాడా!; కులమున్= ఉత్తమకులం; విద్యయున్= చదువూ (సంస్కారాన్ని పెంచేది); వృత్తమున్= నడవడిక; అన్నమున్; ఇడుటకై= పెట్టటానికి; అడుగంగాన్ వలవదు= అడగకూడదు; ఆదరము= ఆదరణ; అలరంగాన్= వికసించగా; విప్రునిన్= బ్రాహ్మణుడికి; అన్నము; అడిగిన మాత్రన్= అడిగినంత మాత్రంతోనే; ఇడుట= పెట్టటం; లెస్స= గొప్ప.

**తాత్పర్యం:** పెద్దమనసు కలవాడా! అన్నం పెట్టటానికి కులము, విద్యా, నడవడిక అడగరాదు. బ్రాహ్మణుడు అన్నం కావాలంటే చాలు. ఆదరపూర్వకంగా పెట్టాలి.'

**విశేషం:** అలఘుమతీ!= సంబోధన గీతలోని పండితశబ్దాన్ని తాకేది; సమదర్శనం కలవాడని భావం.

**వ. అని వెండియు. 373**

**తాత్పర్యం:** అని ఇంకా.

**తే. అజుఁడు కల్పాదియం దన్న మమృత మనియె । నన్న హాని బలాధికు నైన దుర్బ**
**లాత్ముఁగాఁ జేయుఁ, గావున నన్న భుక్తి । సకలధాతు వృద్ధికినయి జనము గోరు.' 374**

**ప్రతిపదార్థం:** అజుఁడు= జన్మలేనివాడు (మనిషివలె పుట్టేవాడు కాడు) బ్రహ్మ; కల్ప+ఆది+అందున్= సృష్టికి మొదలునందు; అన్నము; అమృతము= మృతిలేనిది; అనియెన్; అన్నహాని= అన్నంలేకపోవటం; బల+అధికున్= అధికబలం కలవాడిని; ఐనన్=అయినా; దుర్బల+ఆత్ముఁగాన్= బలహీనుడిగా; చేయున్= చేస్తుంది; కావునన్= కాబట్టి; అన్నభుక్తి= అన్నం తినటం; సకలధాతు= అన్ని ధాతువుల; వృద్ధికిన్+అయి= పెరుగుదల కొరకు; జనము= ప్రజ; కోరున్= కోరుకొంటుంది.

**తాత్పర్యం:** సృష్టి ప్రారంభంలో బ్రహ్మ అన్నం అమృతమని చెప్పాడు. కనుకనే అన్నంలేనివా డెంత బలంకలవా డయినా బలహీను డౌతున్నాడు. ఎందుకంటే అన్నం సప్తధాతువులను పోషిస్తుంది కనుక.'

**విశేషం:** అమృతశబ్దం వేదంలో పరబ్రహ్మ అన్న అర్థంలో ఉన్నది. లోకం మృత్యువనీ, తత్త్వం అమృతమనీ చెప్పబడింది. కనుకనే అన్నం తినకపోతే ఎంత బలం కలవాడయినా బలహీనపడుతున్నాడు. శరీరం సప్త ధాతువులతో నిర్మితమైనది. వస, నెత్తురు, మాంసం, మేదస్సు, ఎముక, మజ్జ, వీర్యం - అనేవి సప్తధాతువులు.

**క. అని యతఁడు పల్కె ననియును । విని యన్నము సవినయముగ విప్రాదులకున్**

**మనుజేశ! యిడుదు నీవును । మన మలరఁగఁబెట్టుమీ సమస్త జనులకున్. 375**

**ప్రతిపదార్థం:** అని; అతఁడు= బ్రహ్మ; పల్కెన్= చెప్పాడు; అనియును విని; సవినయముగన్= వినయంతో; విప్ర+ఆదులకున్= బ్రాహ్మణులు మొదలైనవారికి; అన్నమున్; మనుజ+ఈశ= రాజా!; ఇడుదు= పెడుతున్నావు; నీవునున్= నీవు కూడా; ఇడుదు= పెడుతున్నావు; సమస్తజనులకున్= మనుషులందరకూ; మనము= మనస్సు; అలరఁగన్= సంతోషంతో వికసించేటట్లు; పెట్టుమీ!= పెట్టవయ్యా!

**తాత్పర్యం:** అని నారదుడు చెప్పిన మాట విని నీవున్నూ ధర్మరాజా! బ్రాహ్మణులు మొదలైనవారికి అన్నం సవినయంగా పెట్టుతున్నావు. కాని, అందరికీ అట్లాగే పెట్టుము.

**ఆ. అన్న మిడిన మణిమయావాసశయ్యాస । నములు నమృత భోజనంబు హృద్య**

**మాల్య లేపనములు మహనీయ మహిళాను । భవముఁ జిరతనొందు దివమునందు.' 376**

**ప్రతిపదార్థం:** అన్నము; ఇడినన్= పెట్టితే; మణిమయ+ఆవాస= మణులతో చేసిన సౌధం; శయ్యా= మణులతో చేసిన మంచం; ఆసనములు= సింహాసనములు; అమృతభోజనంబు= అమృతంతో సమానమైన అన్నం; హృద్య= మదికింపైన; మాల్య= పూలదండలు; లేపనములు= గంధం మొదలైన పూతలు; మహనీయ= మహత్తర; మహిళా+అనుభవమున్= స్త్రీలతో పొందే అనుభవం; దివము నందున్= స్వర్గంలో; చిరతన్= చిరకాలం; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** అన్నదానం వలన స్వర్గసుఖాలు లభిస్తాయి. అవెట్లా ఉంటాయి? అంటే - మణిసౌధాలలో నివసించటం, రత్నాల మంచాలపై శయనించటం, రత్నాల సింహాసనాలపై కూర్చొనటం, మదికింపైన పూలదండలతో, గంధం పూతలతో మహత్తరమైన అప్సరసలను అనుభవించటం - ఇవి చిరకాలం లభిస్తాయి.'

**విశేషం:** ఈ ఫలాలు శ్రోత కాసక్తి కలిగించే లౌకిక సుఖాలు లేదా స్వర్గసుఖాలు. ఇది పురాణకథా పద్ధతి.

## నక్షత్రదాన మహిమాతిశయ నిరూపణము (సం.13-63-1)

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'నక్షత్ర విషయంబులైన దానంబుల తెఱంగెఱింగింపవే' యనుటయు 'నిట్లు దేవకీదేవి యడుగ నన్నారీరత్నంబునకు నారదుండు సెప్పిన వాక్యంబుల యర్థంబు లుపన్యసించెద నాకర్ణింపుము.'377**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నక్షత్ర విషయంబులు+ఐన= నక్షత్రం దృష్టిగా గల; దానంబుల= దానాల; తెఱంగు+ఎఱింగింపవే= విధానం తెలియజేయవే; అనుటయున్= అనగా; ఇట్లు; దేవకీదేవి; అడుగన్; ఆ+ నారీరత్నంబునకున్= స్త్రీరత్నానికి, - మహాత్మురాలైన స్త్రీకి; (ఎందుకంటే శ్రీకృష్ణుడికి కన్నతల్లి కనుక); నారదుండు; చెప్పిన= విశదీకరించిన; వాక్యంబుల+అర్థంబులు= మాటల తాత్పర్యం; ఉపన్యసించెదన్= వినిపిస్తాను; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** యుధిష్ఠిరు డన్నాడు భీష్ముడితో 'ఏ నక్షత్రంలో ఏ దానం చేస్తే పుణ్యమో చెప్పుము' అని. భీష్ము డన్నాడు 'దేవకీదేవి ఇట్లాగే అడిగితే నారదమహర్షి వివరించిన తాత్పర్యం చెప్పుతాను వినుము.

**విశేషం:** నారదుడు - ప్రతికథలో వస్తాడు. చివరకు మొన్న మొన్నటి త్యాగరాజస్వామికి సంగీత గ్రంథాన్నిచ్చి ప్రేరణ కలిగించినాడు కదా! దీని కర్థమేమిటి? అంటే నారదుడు దివ్యజ్ఞానాన్ని ఇచ్చేవాడు అని అర్థం. అజ్ఞానం ప్రతిమనిషిలోనూ ఉంటుంది. నిద్రపోయేదాన్ని కొందరు మేల్కొలుపుకొంటే కొందరు నిద్రపోతారు. ఆ జ్ఞానవృద్ధుడు తెల్లనివాడు, వీణవాయించేవాడు. వీణ- నాదమాధుర్య సంకేతం - యోగభాషలో వెన్నుపాము. దానిలో నిద్రించే శక్తి యోగాభ్యాసంతో మేల్కొల్పబడగలిగితే ఆ శక్తి నిద్రలేస్తూ చేసే నాదమాధుర్యం వీణ. కనుక నారదుడికి చావు, పుట్టుకలు లేవు. నీలో ఉన్న జ్ఞానాని కతడు సంకేతం.

ప్రతిచోట యుధిష్ఠురుడనే కవి వాడటం గమనించాం. రెండు రకాల యుద్ధాలున్నట్లు భారతమే చెప్పింది.

1. రాజులు చేసేది, ఇక్కడ శత్రువు బైటివాడు.

2. తనపై తాను చేసికొనేది. ఇక్కడ శత్రువులు - కామ, క్రోధాదులు. తనకు శత్రువు తానే. ఇది అంతర్యుద్ధం. అది మిథ్యాయుద్ధమట. ఇవి తథ్య యుద్ధములు. తిక్కనగారన్న మాటలే. మొదటిది స్త్రీపర్వంలో ముగిసి రెండవది శాంతిపర్వంతో ఆరంభమైనది. దీనిలోనూ జయం సాధించినవాడే ధర్మచక్రవర్తి అని భారతీయ రాజధర్మం చెప్పుతున్నది. యుదిష్ఠిరు డంటే ఈ అంతర్యుద్ధంలో ఉన్న వీరుడని తాత్పర్యం.

**సీ. కార్తెఁ బాయస మబ్జగర్భునితార మా । షములు మాంసమ్ము నంజంగఁ గలుగు**
**నన్నంబు శశితారయందు గోవార్ద్ర న । దితి తారఁ బులగంబు దీపుగలయు**
**నట్టులు గురుతార నధిప ! సువర్ణమా । శ్లేష రూప్యము మఖఁ జెల్లు నుప్పు**
**తిలలు భగుం డధిదేవత యగు తారఁ । జెఱకుఁ దేనియ నుపాసిక్త మైన**

**తే. భక్త ముత్తరఫల్గునిఁ బాలతోడ । పౌష్టికాన్నంబు రవితార సకరిరథము**
**చిత్తనాఁడు శ్రీగంధపుఁ జెక్క స్వాతిఁ । దనకుఁ బ్రియమైన యది మేలు దానమునకు. 378**

**ప్రతిపదార్థం:** కార్తెన్= కార్తెలో - కృత్తికా నక్షత్రంలో; పాయసము= పాలతో చేసిన అన్నం, క్షీరాన్నం; అబ్జగర్భునితారన్= బ్రహ్మఅధిదేవతగల నక్షత్రంలో; మాషములు= మినుములు; శశితారయందున్= చంద్ర నక్షత్రంలో; మాంసమ్ముఁ; నంజంగన్+ కలుగు అన్నంబు= నంజుకొనటానికి వీలైన అన్నం; ఆర్ద్రన్= ఆర్ద్రా నక్షత్రంలో; గోవు; అదితితారన్= అదితి నక్షత్రంలో; తీపుగలయునట్టులు= తీపికలిసేవిధమైన; పులగంబు= పులగం అన్నం; అధిప!= రాజా!; గురుతారన్= బృహస్పతి నక్షత్రంలో; సువర్ణము= బంగారం; ఆశ్లేషన్= ఆశ్లేష నక్షత్రంలో; రూప్యము= వెండి; ఉప్పు; తిలలున్= నువ్వులు; మఖన్= మఖా నక్షత్రంలో; చెల్లున్= తగును; భగుండు= సూర్యుడు; అధి దేవతయగు తారన్= అధిదేవతగా కల నక్షత్రంలో; చెఱకుఁ దేనియ= చెఱకు రసం (లేదా చెఱకురసం తేనెతో కలిపి); ఉపాసిక్తము= చక్కగా తడిసిన; భక్తము= అన్నం; ఉత్తర ఫల్గునిన్= ఉత్తర ఫల్గునీ నక్షత్రంలో; పాలతోడన్; పౌష్టికాన్నంబు; రవితారన్= సూర్యదేవతా నక్షత్రంలో, స+కరి+రథము= ఏనుగుతోపాటుగా రథం; చిత్తనాఁడు= చిత్తా నక్షత్రంలో; శ్రీగంధపుఁజెక్క= మంచి గంధంచెక్క; స్వాతిన్= స్వాతిలో; తనకున్; ప్రియమైనఅది= ఏది ఇష్టమో అదీ; దానమునకున్; మేలు= మంచిది.

**తాత్పర్యం:** కార్తెలో పాయసం, బ్రహ్మఅధిదేవతగాకల నక్షత్రంలో మినుములు, చంద్రతారలో మాంసాన్నం, ఆర్ద్రలో ఆవూ, అదితిలో తీయని పులగం; బృహస్పతి నక్షత్రంలో బంగారం, ఆశ్లేషలో వెండి, మఖలో ఉప్పు, నువ్వులు, భగునితారలో చెఱకు రసంతో నిండిన అన్నం, ఉత్తర ఫల్గునిలో పాలతో వండిన పౌష్టికాన్నం; సూర్య నక్షత్రంలో ఏనుగూ,రథం, చిత్తలో మంచి గంధపు చెక్క; స్వాతిలో తనకిష్టమైన దేదో అది దానానికి మంచిది.

**విశేషం:** ఈ పద్యంలో ఉన్న నక్షత్రాలను ఈక్రింది విధంగా గుర్తించాలి.

అబ్జగర్భునితార - (అభిజిత్తు లేదా) రోహిణి
శశితార - మృగశిర
అదితితార - పునర్వసు
గురుతార - పుష్యమి.
భగుండధిదేవత అగుతార - హస్త

**సీ.** **అనఘ! విశాఖ నె ద్దనురాధఁ బైచీర । విను జ్యేష్ఠఁ దగఁ గటివేము గూర్చి**
**ముల్లంగి మూల సన్మూలఫలంబుఁ బూ । ర్వాషాఢఁ బెరు వుత్తరాఖ్య యైన**
**యాషాడ మాక్షికార్ద్రాన్నంబు హరివసు । జలతారకములఁ గంబళము గుజ్జు**
**లమరిన బండియు యవలుఁ బూర్వోత్తరా । భాద్ర పౌష్ణాశ్వినీ భరణులందుఁ.**

**తే.** **గ్రొవ్వుగల మేక నంజుడు గొఱియ యెఱచి । కంచుకుండతో మొద వశ్వకలిత శకట**
**మతుల తిలధేను లీఁ బాడి; యఖిలతార । కముల నీగులు నూర్ధ్వలోకములఁ జేయు.'** **379**

**ప్రతిపదార్థం:** అనఘ! విను; విశాఖన్= విశాఖలో; ఎద్దు; అనురాధన్= ఆ నక్షత్రంలో; పై చీర= పైన వేసికొనే పంచె; జ్యేష్ఠన్= జ్యేష్ఠలో; తగన్= ఒప్పిదముగా; కటివేము= కరివేప; కూర్చి= చేసిన, ముల్లంగి; మూలన్= మూలానక్షత్రంలో; సన్మూల= మంచివేరు; ఫలంబు= పండు; పూర్వాషాఢన్= పూర్వాషాఢలో; పెరువు= పెరుగు; ఉత్తర+ఆఖ్య= ఉత్తర పేరుగల; ఆషాఢన్= ఆషాఢలో; ఉత్తరాషాఢలో; మాక్షిక= తేనెతో; ఆర్ద్ర= తడిసిన; అన్నంబు; హరి= విష్ణు; వసు= అష్టవసువులు; జల= నీరు - ఈ మూడు దేవతలుగాగల; తారకములన్= నక్షత్రాలలో వరుసగా; కంబళము= గొర్రె ఉన్నితో నేసిన దుప్పటి (- విష్ణు నక్షత్రంలో;) గుజ్జులు= వసికొయ్యలు; అమరిన= ఏర్పాటైన; బండియున్; (వసు నక్షత్రంలో;) యవలున్= ధాన్య విశేషం (జలతారకలో); పూర్వ+ఉత్తరా భాద్రన్; పౌష్ణ అశ్వినీ, భరణులందున్= ఈ నక్షత్రాలలో వరుసగా; క్రొవ్వుగల మేక నంజుడు= కొవ్వు పట్టిన మేక మాంసం (పూర్వాభాద్రలో దానంచేయాలి); గొఱియయెఱచి= గొర్రెమాంసం (ఉత్తరాభాద్రలో); కంచుకుండతోన్= పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలలో మట్టికుండ కాకుండా కంచుతో చేసిన కుండతోపాటుగా; మొదవు= ఆవు (పౌష్ణంలో); అశ్వకలిత= గుర్రంతో కూడిన; శకటము= బండి (అశ్వినిలో); అతులితిలధేనులు= సాటిలేని నువ్వులు; ఆవులు (భరణిలో); ఈన్= ఇవ్వటం; పాడి= న్యాయం; అఖిల= సమస్త; తారకములన్= నక్షత్రాలలో; ఈగులు= దానాలు; ఊర్ధ్వ లోకములన్= పైలోకాలను; చేయున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! విశాఖలో ఎద్దును, అనూరాధలో ఉత్తరీయం, పై కండువా, జ్యేష్ఠలో కరివేపాకుతో కూడిన ముల్లంగి, మూలానక్షత్రంలో మంచి వేరుగల పండు, పూర్వాషాఢలో పెరుగు, ఉత్తరాషాఢలో తేనెతో తడిసిన అన్నం, శ్రవణంలో కంబళి, ధనిష్ఠలో వసికొయ్యలుగల బండి, శతభిషంలో యవలు, పూర్వాభాద్రలో క్రొవ్విన మేకనంజుడు,

ఉత్తరాభాద్రలో గొర్రెమాంసం, రేవతిలో కంచుకుండతో ఆవు, అశ్వినిలో గుర్రపుబండి, భరణిలో మేలైన నువ్వులు, ఆవులు దానం చేయటం మేలు. అన్ని నక్షత్రదానాలూ సద్గతులను కలిగిస్తాయి.'

**వ. అని యెఱింగించి యమ్మానవపతితో నమ్మాననీయుండిట్లనియె. 380**

**ప్రతిపదార్థం:** అని; ఎఱింగించి= తెలిపి; ఆ+మానవపతితోన్= ఆ రాజుతో; ఆ+మాననీయుండు= గౌరవించదగినవాడు;

**తాత్పర్యం:** అని తెలిపి రాజుతో ఆ మాననీయుడు ఈ విధంగా ప్రసంగం కొనసాగించాడు.

**క. 'అలఘుతర సకల కామ్యం । బుల నిచ్చినయట్టి మహిత పుణ్యంబై తా**
**వెలుఁగుఁ గనక మిచ్చుట యని । పలికెం గర్మజ్ఞుఁ డత్రి పరహితచరితా! 381**

**ప్రతిపదార్థం:** పరహిత= ఇతరుల మేలు కోరే; చరితా!= నడవడి కలవాడా!; అలఘుతర= మిక్కిలి గొప్ప; సకల= సమస్త; కామ్యంబులను= కోరికలను; ఇచ్చినఅట్టి= ఇచ్చునట్టి, ఇవ్వగల; మహిత= మహత్తర; పుణ్యంబు+ఐ= పుణ్యంకలదై; తాన్; వెలుఁగున్= ప్రకాశిస్తుంది; కనకము= బంగారం; ఇచ్చుట= ఇవ్వటం; అని; కర్మజ్ఞుఁడు= వేద కర్మలు (దాన విధులు) తెలిసిన; అత్రి= అత్రిమహాముని; పలికెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇతరుల మేలుకొరకు జీవించేవాడా! చాలా గొప్పకోరికలను తీర్చగలిగేదీ, పుణ్యమైనదీ, బంగారు దానమని అత్రి మహర్షి చెప్పాడు.

**తే. కనక మాయుఃప్రదంబు, పావనము, భావ । శుద్ధి నొనరించు దాతకు; సువ్రతమున**
**వేడ్కతో దాని నిచ్చుట వేఱ పొగడ । నేల? యనియె హరిశ్చంద్రుఁ డిద్ధతేజ! 382**

**ప్రతిపదార్థం:** ఇద్ధ= ప్రకాశించే; తేజ!= క్షాత్ర తేజస్సు కలవాడా!; దాతకున్= దానం చేసినవాడికి; కనకము= బంగారం; ఆయుఃప్రదంబు= ఆయుస్సు నిచ్చేది; పావనము= పవిత్రం; భావశుద్ధిన్= చిత్త నైర్మల్యాన్ని; ఒనరించున్= కలిగిస్తుంది; హరిశ్చంద్రుఁడు; సువ్రతమునన్= మంచి వ్రతంలో; వేడ్కతోన్= వేడుకతో; దానిన్= బంగారం; ఇచ్చుట; వేఱ= వేరే; పొగడన్ ఏల= ఎందుకు ప్రశంసించాలి; (అని) అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ప్రకాశించు తేజస్సు కలవాడా! హరిశ్చంద్రు డిట్లా అన్నాడు. 'బంగారం దాతకు ఆయుస్సు నిస్తుంది. మనస్సును నిష్కల్మషం చేస్తుంది. ఏదైన మంచివ్రతం చేసే సమయంలో దానిని ఇవ్వటం చాలా మంచిదని వేరే చెప్పటం దేనికి?'

**క. పానీయదాన ముత్తమ । దానం బని యఖిల ధర్మతత్త్వ దృఢ పరి**
**జ్ఞానానూనుం డగు మను । మానవపతి సెప్పె నృపసమాజ వరేణ్యా! 383**

**ప్రతిపదార్థం:** నృప సమాజ= రాజసమూహంలో; వరేణ్యా!= గొప్పవాడా!; అఖిల= సమస్త; ధర్మతత్త్వ= ధర్మరహస్య; దృఢ= గట్టి; పరిజ్ఞాన= చక్కని జ్ఞానంతో; అనూనుండు= గొప్పవాడు; అగు= ఐన; మను మానవపతి= మనువన్న రాజు (మానవులకు పాలకుడు); పానీయదానము= త్రాగదగినది, దానంచేయుట; ఉత్తమ= గొప్ప; దానంబు; అని చెప్పెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఓయీ! రాజశ్రేష్ఠుడా! సకలమానవ లోకానికి ఆద్యుడైన మనువు సమస్త ధర్మ రహస్యాలను గట్టిగా తెలిసిన గొప్పవాడు. ఆయన అన్నాడు - 'త్రాగటానికి చేసేదానం ఉత్తమదాన'మని.

**విశేషం:** మను శబ్దంనుండి మానవ శబ్ద మేర్పడింది. - ఆంగ్లంలో మాన్ కూడా ఇదే. సకల మానవులకు ఆద్యుడైనవాడు మనువు. మానవజాతి కాయన మూలపురుషుడు. ఆయన వ్రాసిందే మనుస్మృతి. వేల సంవత్సరాలుగా ఈ దేశంలో సకల ధర్మాల కదే ప్రమాణం. అది జర్మన్ భాషలోనికి అనువదించబడింది.

**క. కావునఁ జెఱువులు నూతులు । బావులుఁ గొలఁకులును నెపుడుఁ బౌరవవర్యా!**
**కావింపవలయు; నవి గడుఁ । బావనములు పుణ్యలోక భాగిత నిచ్చున్. 384**

**ప్రతిపదార్థం:** పౌరవవర్యా!= పురువంశంలో శ్రేష్ఠుడా!; కావునన్= కాబట్టి; చెఱువులు; నూతులున్= చేదుడుబావులు; బావులున్= రాతి కట్టడంగల దిగుడుబావులు; కొలఁకులునున్= కోనేళ్లు; ఎపుడున్= ఎల్లప్పుడు; కావింపవలయున్= నిర్మించాలి; అవి; కడున్= మిక్కిలి; పావనములు= పవిత్రాలు; పుణ్యలోక= స్వర్గలోకంలో; భాగితన్ ఇచ్చున్= నివసించే అర్హతనిస్తాయి.

**తాత్పర్యం:** చెరువులు, కొలనులు, నూతులు, బావులు త్రవ్వించటం మంచిపని. స్వర్గలోక నివాసాన్ని కలిగించే ఈ పనులు దానకర్మలలో పవిత్రమైనవి.

**విశేషం:** నూయి= ఇది చిన్న నీటి చెలమగుంట. బావి= పెద్ద నుయ్యి, (వాపీ సంస్కృతం, బావి వెలుగు); కొలను= చిన్న నీటి గుంట; చెఱువు= పెద్ద కొలను; కొలను (ఏకవచనం) - కొలకులు, (బహువచనం.)

సప్త సంతానాలలో చెరువులు, బావులు త్రవ్వించటం ఒకటి. నేటికీ రాయలసీమవంటి ప్రాంతాలలో పూర్వపు రాజులు త్రవ్వించిన చెరువులే నీటి కాధారం. నడక ప్రయాణంగాకల రోజులలో అట్లాగే బండ్లపై పోయే రోజులలో దారి ప్రక్క చెట్టు, బావీ ఏర్పాటు చేయటం గొప్ప పుణ్య కర్మగా భావించబడేది. ఎండన పడి వచ్చిన బాటసారి, బండి, ఎడ్లు, నీళ్ళుత్రాగి, సేదదీరి పోయేవి. ఒక మనిషికి, జంతువుకు, పిట్టకు, నీరు పోయటం కంటె గొప్ప మానవ సేవ ఏముంటుంది? ఈ నాటికీ ఇది మనం నేర్చుకొనదగిందే కదా! పట్టణాలలో కొళాయిలు వచ్చాక బాటసారికి నీరిచ్చేవారికి కరువైన దంటే ఆ దుస్థితి నేమనాలి. మనకంటె నాటి మానవుడు మానవధర్మవేత్త అనటాని కిదే సాక్ష్యం కదా!

**క. అనఘా! యెవ్వని కావిం । చిన సలిలాశయమునందుఁ జెలఁగుచు గోవుల్**
**గొను నీ రాతని వంశం । బున కవి గావించు నూర్ధ్వ భువన ప్రాప్తిన్. 385**

**ప్రతిపదార్థం:** అనఘా= పుణ్యాత్ముడా!; ఎవ్వని= ఎవడియొక్క; కావించిన= నిర్మించిన; సలిల+ఆశయము+అందున్= నీటి నిలయం, చెరువులు మొదలగువాటియందు; గోవుల్= ఆవులు; చెలఁగున్= ఆటలాడుతూ; నీరున్= నీటిని; కొనున్= త్రాగునో, గ్రహిస్తాయో; ఆతని= అతడి యొక్క; వంశంబునకున్= కులానికి; అవి= ఆవులు; ఊర్ధ్వభువన= పైలోకాలయొక్క; ప్రాప్తిన్= పొందుటను; కావించున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** నాయనా! ఎవడు త్రవ్వించిన చెరువులు మొదలైన జలాశయాల్లో ఆవులు కేరింతలుగొడుతూ నీరు త్రాగుతాయో వాడి కులాని కవి స్వర్గాన్నిస్తాయి.

**విశేషం:** గోలోకమని పద్నాలుగు లోకాలలో ఒకటి. దానికథ హరివంశంలో మనోహరంగా ఉన్నది. గోవు అంటే వెలుగు కిరణం. గోపతి= సూర్యుడు (కృష్ణుడు). చీకటిలోనుండి వెలుగురావటమే సృష్టి. (ప్రళయం చీకటి.) కనుక గోవు అంటే విశ్వం.

(భూమి). సకల చరాచర జీవరాశికీ అది తల్లివంటిది. గోవు అంటే కదిలేది; జగత్తు అన్నా కదిలేదనే అర్థం. కదలిక ప్రాణి లక్షణం. మృత్యు లక్షణం అచేతనత్వం. ఇందుకని మనకు గోవు పూజింపదగింది.

**తే. ఆఁకలేక యెవ్వాని జలాశయమున । మండు వేసవి యందును మనుజకోటి**
**యవభృథస్నాన పానంబు లాచరించు । నతఁడు వొందఁడు వివిధ దుర్గాది గతులు. 386**

**ప్రతిపదార్థం:** ఆఁక లేక= అడ్డం లేకుండా; ఎవ్వాని= ఎవనియొక్క; జల+ఆశయమునన్= నీటికి నిధిఅయిన చెరువులు మొదలగు వాటిలో; మండు వేసవి+అందునున్= మంటలు చెరిగే వేసవిలోనూ; మనుజకోటి= మానవ సమూహం; అవభృథస్నానము= యజ్ఞాంతంలో చేసే మంగళస్నానం; పానంబులు= నీరుత్రాగటం; ఆచరించున్= చేస్తుందో; అతఁడు=ఆ జలాశయం నిర్మించినవాడు; వివిధ= అనేక; దుర్గ+అదిగతులు= దుర్గతులు మొదలైనవి; పొందఁడు.

**తాత్పర్యం:** ఎవడు త్రవ్వించిన జలాశయాలలో అడ్డం లేకుండా మండు వేసవిలో మానవులు, అవభృథస్నాన పానాలు చేస్తారో ఆ చెరువు త్రవ్వించినవాడు దుర్గతులు పొందడు.

**క. యాగాది కర్మముల కుప । యోగింపంబడుటఁజేసి యుత్తమము, ఘృతం**
**బాగురు వస్తువు నిచ్చుట । యాగములకు నగ్నికిం బ్రియంబై యుండున్. 387**

**ప్రతిపదార్థం:** యాగ= యజ్ఞం; ఆది= మొదలైన; కర్మములకున్= వేదం చెప్పిన కర్మలకు; ఉపయోగింపన్+పడుటన్చేసి= ఉపయోగింప బడటం వలన; ఘృతంబు= నేయి; ఉత్తమము= శ్రేష్ఠం; ఆ గురువస్తువున్= ఆ గొప్ప పదార్థమును; ఇచ్చుట= దానం చేయటం; యాగములకున్= యజ్ఞాలకున్నూ; అగ్నికిన్= అగ్నిదేవుడికీ; ప్రియంబు+ఐ= ప్రీతి కలదై; ఉండున్= ఉన్నది.

**తాత్పర్యం:** ఘృతదానం చాలా శ్రేష్ఠం. అది యాగాదులలో ఉపయోగిస్తుంది. కనుక అట్లాంటి ఘనవస్తువు నివ్వటం వలన యాగాలకూ, అగ్నికీ ప్రీతిపాత్రమౌతున్నది.

**తే. గరగ లొసఁగిన నరుఁడు భూసురు లొనర్చు । ఆచమనముఖ కర్మంబులందు షష్ఠ**
**భాగఫల మొందు నెగడికిఁ బాచనమున । కింధనము లిచ్చి ధనముల నెసక మెసఁగు. 388**

**ప్రతిపదార్థం:** గరగలు= కుండలు; ఒసఁగిన= ఇచ్చిన; నరుఁడు= మనిషి; భూసురులు= భూ దేవతలు (బ్రాహ్మణులు); ఒనర్చు= చేసే; ఆచమన= ఆచమించటం; ముఖ= మొదలైన; కర్మంబులందున్= వేద విధులలో; షష్ఠ= ఆరవ; భాగ= అంశ; ఫలము= ఫలితం; ఒందున్= పొందుతాడు; నెగడికిన్= నెగడునకు; (నెగడు= పెద్దమంట;) పాచనమునకున్= వంటకు; ఇంధనములు= కట్టెలు; ఇచ్చి= దానంచేసి; ధనములన్= డబ్బుతో; ఎసకము+ఎసఁగున్= అతిశయిస్తాడు; తులదూగుతాడు.

**తాత్పర్యం:** కుండలు దానం చేస్తే బ్రాహ్మణుడు చేసే ఆచమనాది వైదిక విధుల పుణ్యంలో ఆరవభాగం పుణ్యం పొందుతాడు. నెగళ్ళకు, వంటకు కట్టె లిస్తే ధనంతో తులతూగుతాడు.

**విశేషం:** అతిప్రాచీనమైన పాత్ర కుండ. దానిని చాలా పవిత్రంగా చూడటం ఒక ఆచారమైపోయింది. వివాహాలలో గరగముంత నేటికీ దాంపత్య పూర్ణతకు సాక్షిగా మనకు మిగిలేఉన్నది. అదే ఇక్కడ గరగ.

**ఆ. ఛత్ర మిచ్చి కాంచుఁ బుత్త్రులఁ బురుషుండు । సకల కామ్య దానసమము శకట**
**మిచ్చు టనఘ! చెప్పు లిచ్చినఁ గంటకు । లైన రిపులఁ ద్రొక్కి యతఁడు దిరుగు. 389**

**ప్రతిపదార్థం:** పురుషుండు= మానవుడు; ఛత్రము= గొడుగు; ఇచ్చి; పుత్త్రులన్= కొడుకులను; కాంచున్= పొందుతాడు; శకటమున్= బండిని; ఇచ్చుట= ఇవ్వటం; సకల= అన్ని; కామ్య= కోరికలతో చేసే; దానసమము= దానాలతో సమానం; అనఘ!= పుణ్యాత్ముడా!; చెప్పులు; ఇచ్చినన్= ఇస్తే; కంటకులు= ముండ్లు (విరోధులు); ఐన= అయినటువంటి; రిపులన్= శత్రువులను; త్రొక్కి= కాలరాచి; అతఁడు= దానంచేసినవాడు; తిరుగున్= సంచరిస్తాడు.

**తాత్పర్యం:** మనిషి గొడుగును దానంచేయటంవలన పుత్రసంతానాన్ని పొందగలడు. బండిని దానం చేయడం అన్ని కోరికలనూ తీర్చే దానంతో సమానం. చెప్పులిస్తే కంటకులైన శత్రువులను అణచి హాయిగా బ్రతుకుతాడు.

**విశేషం:** కామ్యదానం= స్వర్గాదిసుఖాలను కోరి చేసేదానం. అకామ్యదానం= ఏమీ కోరకుండా చేసేది.

కంటకం= ఇది రాజనీతి శాస్త్రంలోని మాట. రాజుకు అనేకమంది విరోధులు ఉంటారు. ఎవడు విరోధి? ఎవడు కాడు? తెలిసికొనటానికి వీలుగా కౌటిల్యుని అర్థశాస్త్రంలో కంటక శోధనాధ్యాయం వ్రాయబడింది.

ఇక్కడ కంటకం రాజుకు సంబంధించింది కాదు. అయితే రాజుకు చెప్పులు దానం చేయట మేమిటి?

**క. తిలలు పితృభోజ్యములుగా । జలజభవుఁడు సేసెఁ బితృనిచయ మలరఁ గడుం**
**దిల లిచ్చిన శుచు లగుదురు । దొలఁగుం బర్వసురతాది దోషము లెల్లన్. 390**

**ప్రతిపదార్థం:** జలజభవుఁడు= పద్మంలో జన్మించినవాడు, బ్రహ్మ; పితృనిచయము=పితృదేవతల సమూహం; అలరన్= సంతోషించేటట్లు; తిలలు= నువ్వులు; పితృ= పితృదేవతలకు; భోజ్యములుగాన్= తిన దగ్గవిగా; చేసెన్= విధించాడు; కడున్= ఎక్కువ; తిలలు= నువ్వులు; ఇచ్చినన్= ఇస్తే; శుచులు= మలినం (పాపంలేనివారు)); అగుదురు= అవుతారు; పర్వ= పర్వములందలి, (అమావాస్య, పూర్ణిమ); సురత+ఆది= సంభోగం మొదలైన వాటివల్లకలిగే; దోషములు= పాపాలు; ఎల్లన్= అన్ని; తొలఁగున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** పితృదేవతలకు ఆహారంగా నువ్వులను సృష్టించాడు బ్రహ్మ. తిలలిస్తే పితృదేవత లందరూ సంతోషిస్తారు. కనుక తిలలను ఎవడు ఎక్కువ దానం చేస్తాడో వాడు పవిత్రుడవుతాడు. పర్వదినంలో సంభోగం చేసిన పాపాలవంటివి అన్నీ పోతాయి.

**విశేషం:** ఆ దినాలలో రతి నిషిద్ధ మన్నమాట.

**తే. దివ్యముని యగు కాశ్యపు భవ్య గాత్ర । ముల జనించి భవ్యంబు లై తిలలు వెలయు;**
**నట్లు గావునఁ దత్కృతయజన మఖిల । వస్తు యజనంబుతో సరివచ్చు నండ్రు. 391**

**ప్రతిపదార్థం:** తిలలు= నువ్వులు; దివ్యముని= దేవతల ముని; అగు; కాశ్యపు= కాశ్యపుడి యొక్క; భవ్య= మహత్తుగల; గాత్రములన్= అవయవాలనుండి, శరీరం నుండి; జనించి= పుట్టి; భవ్యంబులు+ఐ= శ్రేష్ఠములై; వెలయున్= ప్రకాశిస్తాయి; అట్లు కావునన్= అందువలన; తత్= వాటితో; కృత= చేసిన; యజనము= యాగం; అఖిల= సమస్త; వస్తు= పదార్థ; యజనంబుతోన్= యజ్ఞంతో; సరివచ్చును= సమానమౌతుంది; అండ్రు= అని పెద్దలంటారు.

**తాత్పర్యం:** దివ్యముని అయిన కాశ్యపుని శరీరాంగాలనుండి పుట్టాయి కనుక తిలలు శ్రేష్ఠము లయ్యాయి. కనుక వాటితో చేసే యజ్ఞకర్మ సమస్త వస్తువులతో చేసిన యుగకర్మతో సమానం.

**క. తిలదాన మఖిల దానం । బుల కంటె విశిష్ట మెల్ల మునులును నియతిం**
**దిల లర్హములగు పాత్రం । బుల కిచ్చియ కాదె పెంపు వొందిరి వత్సా!' 392**

**ప్రతిపదార్థం:** వత్సా!= నాయనా!; తిలదానము= నువ్వులను దానంచేయటం; అఖిల= సమస్త; దానంబులకంటెన్= దానాలకంటె; విశిష్టము= గొప్పది; ఎల్లమునులును= మునులందరూ; నియతిన్= నియమంతో; తిలలు= నువ్వులను; అర్హములగు= యోగ్యులైన; పాత్రంబులకున్= వ్యక్తులకు; ఇచ్చియకాదె= ఇచ్చే కదా; పెంపు= అతిశయాన్ని, గొప్పతనాన్ని; పొందిరి= పొందినారు.

**తాత్పర్యం:** నాయనా! తిలదానం సర్వశ్రేష్ఠం. ఇందుకే మునులంతా వీటిని అర్హులు, యోగ్యులైనవారికి దానం చేసికదా అంతగొప్ప వా రైనారు.'

**విశేషం:** మన కనేక క్రతువులలో (వైదిక విధులలో) నువ్వులకు విశిష్ట స్థానం ఉన్నది. ఇది ఈనాటికీ ప్రసిద్ధమే.

**వ. 'అని చెప్పి యాపగాతనయుం డొక విశేషంబు వినిపింపవలసి ధర్మజున కిట్లనియె.' 393**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; ఆపగా తనయుండు= నది కొడుకు, భీష్ముడు; ఒక; విశేషంబున్= ప్రత్యేక విషయాన్ని; వినిపింప వలసి= తప్పక వినిపించదలంచి; ధర్మజునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు ఒక విశేషాన్ని వినిపించవలసి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**ఉ. 'దానము లాదిగాఁ గలుగు ధర్మము లెల్లను జేఁతకున్ నిజా**
**ధీనపుఁ జోటు గావలయు దేవతలున్ మునులుం జతుర్ముఖుం**
**గానఁగఁ బోయి యజ్ఞముఖ కర్మ సమాచరణార్థ మై తదీ**
**యానుమతిం దగం బడసి యయ్యయిచోటుల నాచరింపరే. 394**

**ప్రతిపదార్థం:** దానములు; ఆదిగాన్; కలుగు= ఉన్న; ధర్మములు= ధర్మాలు; ఎల్లను= అన్నీ; చేఁతకున్= చేయటానికి; నిజ= తనకు; ఆధీనపు= స్వాధీనమైన; చోటు కావలయున్= తావు కావాలి; దేవతలున్; మునులున్= మునులున్నూ; చతుర్ముఖున్= నాలుగు మొగాలు కల బ్రహ్మను; కానఁగన్= దర్శించగా; పోయి; యజ్ఞముఖ= యాగమూ మొదలైన; కర్మ= కర్మలయొక్క; సమాచరణ+అర్థమై= చక్కగా చేయటం కొరకు; తదీయ= అతడి; అనుమతిన్= సమ్మతిని; తగన్= చక్కగా; పడసి= పొంది; అయ్యయి= ఆయా చోటులన్= స్థలాలలో; ఆచరింపరే= చేయరా?

**తాత్పర్యం:** దానాది కర్మలు చేయటానికి తనకు లోబడిన చోటు కావాలి. పూర్వం మునులూ, దేవతలూ, బ్రహ్మను దర్శించి యజ్ఞం మొదలైన వేద కర్మలు చేయటానికి ఆయన అనుమతి పొంది ఆయా చోట్ల చేశారు కదా!

**క. కాననము గిరులు నదులును । నానా తీర్థములు భూజనంబుల కెల్లన్**
**భూనుత! సాధారణములు । వానను ధర్మములు సేయవచ్చు నిజేచ్ఛన్. 395**

**ప్రతిపదార్థం:** కాననమున్= అడవీ; గిరులున్= కొండలున్నూ; నదులునున్= నదులూ; నానా= అనేక; తీర్థములున్= తీర్థాలు; భూ= భూమిపై; జనంబులకున్= జనాలకు; ఎల్లన్= అందరకూ; భూనుత!= భూప్రజచేత స్తుతింప దగ్గవాడా!; సాధారణములు= సామాన్యాలు; వాననున్= వాటిలో; నిజ+ఇచ్ఛన్= స్వేచ్ఛతో; ధర్మములు= ధర్మాలు; చేయవచ్చున్= చేయవచ్చును.

**తాత్పర్యం:** భూమిచేత అంటే రాష్ట్ర ప్రజలచేత పొగడదగ్గవాడా! అడవీ, కొండలూ, నదులూ అనేక తీర్థాలు దానధర్మాలు చేయటానికి యోగ్య స్థలాలు. అక్కడ భూప్రజ లంతా దానం చేయవచ్చును.

**విశేషం:** తీర్థం= నదీ, క్షేత్రం కలచోటు. పుణ్యక్షేత్రం ప్రక్కనున్న నది తీర్థం.

**ఆ. అధిప! నా మనమునయందుఁ దోఁచినయది। యాచరింపవలయు నర్థమగుటఁ**
**జేసి దీని నీకుఁ జెప్పితి గో దాన। శస్తమహిమ వినుము విస్తరింతు. 396**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నా మనమునయందున్= నా మనస్సులో; తోఁచిన అది= స్ఫురించినట్టిది; ఆచరింపన్ వలయు= చేయవలసిన; అర్థము= విషయం; అగుటన్‌చేసి= కావటంవలన; దీనిన్= ఈ విషయం; నీకున్; చెప్పితిన్; గోదాన= గోవులను దానం చేయటంయొక్క; శస్త= ప్రశస్తమైన, నుతింపదగ్గ; మహిమ= మహత్త్వం; విస్తరింతున్= వ్యాఖ్యానిస్తాను; వినుము= ఆలకించుము;

**తాత్పర్యం:** రాజా! నా మనస్సునకు తోచిన దాన్ని ఆచరించదగ్గ విషయం కావటంవలన నీ కిది చెప్పాను. ఇక గోదాన మహిమను వివరిస్తాను వినుము.

**సీ. గోవు లెక్కుడు తపోభావితాత్ముల కంటె। ననినఁ దద్గౌరవంబునకు మేర**
**గలదె? సత్యాఖ్య లోకంబున నవి సోమ। సంగతత్వంబున సంచరించు**
**వినుత హోమముల కెల్లను బాలుఁ బెరువు నే। యును నిచ్చుఁ గర్సనంబునకు నొదవుఁ**
**దోలు శృంగంబులు వాలంబు రోమ చ। యము శకృన్మూత్రము లఖిలవర్త**

**ఆ. నముల కుపకరించు; శ్రమము శీతాతప। వ్యథయు లేమి నెపుడు నతిభరంపుఁ**
**బనులు సేయు గోవు బ్రాహ్మణుఁ డన నేక। తత్త్వ మగుటఁ బరపదంబుఁ గాంచు. 397**

**ప్రతిపదార్థం:** తపోభావితాత్ములకంటెన్= తపస్సుద్వారా భావించే ఆత్మలు కలవారికంటే; గోవులు= ఆవులు; ఎక్కుడు= ఎక్కువ; అనినన్= అంటే; తత్= వాటియొక్క; గౌరవంబునకున్= గొప్పతనానికి; మేర= సరిహద్దు; కలదె? =ఉన్నదా? సత్య+ఆఖ్య= సత్యమన్న పేరుగల; లోకంబునన్= లోకంలో; అవి= గోవులు; సోమ= చంద్రుడి; సంగతత్వంబునన్= స్నేహంతో; సంచరించున్= తిరుగుతాయి; వినుత= ప్రశస్త; హోమములకున్+ఎల్లనున్= అన్నిహోమాలకు; పాలున్; పెరువున్= పెరుగు; నేయునున్= నేయీ; ఇచ్చున్= ఇస్తాయి; కర్సనంబునకున్= వ్యవసాయానికి; ఒదవున్= ఉపయోగపడతాయి; తోయిన్= చర్మం; శృంగంబులున్= కొమ్ములూ; వాలంబున్= తోకా; రోమచయమున్= వెంట్రుకల గుంపు; శకృత్= పేడ; మూత్రములున్= మూత్రాలు; అఖిల= సమస్త; వర్తనములకున్= పనులకు; ఉపకరించున్= ఉపయోగిస్తాయి; శ్రమము= శ్రమా; శీత= చలి; ఆతప= ఎండ వీటివల్ల; వ్యథయున్= బాధా; లేమి= లేకపోవటంవలన; ఎపుడున్= ఎల్లప్పుడూ; అతి= మిక్కిలి;

భరంపు= బరువైన; పనులు= కార్యములు; చేయున్; గోవు= ఆవు; బ్రాహ్మణుఁడున్= విప్రుడు; అనన్= అనగా; ఏకతత్త్వము= ఒకే సత్యం; అగుటన్= కావటంవలన; పరమ= గొప్ప; పదంబు= స్థానం; కాంచున్= పొందుతాయి.

**తాత్పర్యం:** తపస్సుద్వారా భగవంతుడిని భావించే వారికంటె ఆవులు గొప్ప - అని అంటే వాటి గౌరవానికి హద్దేమిటి? చంద్రుడితో కలిసి అవి సత్యలోకంలో సంచరిస్తాయి. హోమాలకు కావలసిన పాలు, పెరుగు, నెయ్యి ఇస్తాయి. ఎద్దులు సేద్యానికి పనికివస్తాయి. వాటి చర్మం, కొమ్ములు, తోకా, వెంద్రుకలు, పేడా, మూత్రం అన్ని పనులకు ఉపకరిస్తాయి. ఎండకూ, చలికీ, బాధపడనివి కావటంవలన బరువైన పనులన్నిటికీ పనికి వస్తాయి. గోవన్నా బ్రాహ్మణుడన్నా ఒకే తత్త్వం కావటంవలన గోదానం చేసినవాడు ముక్తిపొందుతాడు.

**క. గోవుల విప్రుల కిచ్చిన । నే విషమపు గతులఁ బొరయ కేరికి నరుగం**
**గా వశము గానిలోకము । లావాసంబులుగ నిలుతు రతి సుఖవృత్తిన్. 398**

**ప్రతిపదార్థం:** గోవులన్= ఆవులను, విప్రులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చినన్; ఏ విషమపు గతులన్= ఎట్లాంటి చెడ్డస్థితులను; పొరయక= కలుగక, పొందక; ఏరికిన్= ఎవరికీ; అరుగంగాన్= పోవటానికి; వశముకాని=వీలుపడని; లోకములు= పుణ్యలోకాలు; ఆవాసంబులుగన్= నివాసములుకాగా; అతి= మిక్కిలి; సుఖవృత్తిన్= సుఖమయమైన మనస్సుతో; నిలుతురు= ఉంటారు.

**తాత్పర్యం:** ఆవులను బ్రాహ్మణులకు దానంచేస్తే ఎట్లాంటి సంకటస్థితులు పొందక, ఎవరూ పొందరాని పుణ్యలోకాలలో సుఖంగా ఉండగలరు.

**క. గోవుల పాలమృతం బని । దేవేంద్రుఁడు సెప్పెఁ గాన ధీరత్వనిధీ!**
**గోవు నొసఁగ నమృతము స । ద్భావంబున నిచ్చినట్టి ఫల మొడఁగూడున్. 399**

**ప్రతిపదార్థం:** ధీరత్వనిధీ!= ధైర్యానికి నిలయమైనవాడా; గోవులపాలు= ఆవులపాలు; అమృతంబు= కేవలం అమృతమే అని; దేవేంద్రుఁడు= వేల్పులదొర; చెప్పెన్+కాన= చెప్పారు కనుక; గోవున్; ఒసఁగన్= ఇవ్వటం; అమృతమున్; సద్భావంబునన్= మంచిమనస్సుతో; ఇచ్చినట్టి; ఫలము= ఫలితం; ఒడన్+కూడున్= లభించును.

**తాత్పర్యం:** ఆవులపాలు అమృతమేనని దేవేంద్రుడు చెప్పాడు కనుక గోవును ఇవ్వటంవలన అమృతాన్ని దానం చేసిన ఫలాన్ని పొందగలడు.

**విశేషం:** ధీరత్వము= కష్టనష్టాలలో మనస్సు చెదరకుండా జీవించటం, ఆపదల నెదిరించ గలగటం.

**తే. అనఘ! గోవులు ప్రాణంబు లని సమస్త । మునులు సెప్పుదు; రట్లు గావునఁ దలంపఁ**
**బ్రాణదాన విధాన సంప్రాప్త మైన । ఫలము గోదానకర్తకుఁ గలుగుఁ జూవె! 400**

**ప్రతిపదార్థం:** అనఘ!; గోవులు; ప్రాణంబులు= ప్రాణాలు; అని; సమస్త= అందరు; మునులు= ఋషులు; చెప్పుదురు; అట్లుకావునన్= అందువలన; తలంపన్= ఆలోచిస్తే; ప్రాణదానవిధాన= ప్రాణాన్ని దానం చేసేపద్ధతివల్ల; సంప్రాప్తమైన= లభించిన; ఫలము; గోదానకర్తకున్= గోవును దానం చేసినవాడికి; కలుగున్ చూవె!= కలుగును సుమా!

**తాత్పర్యం:** మునులు 'ఆవులంటే ప్రాణాలు' అని చెప్పుతారు. కనుక ప్రాణదానం చేయడంవల్ల లభించే ఫలం గోదానకర్తకు కలుగుతుందిసుమా!

**క. క్రూరునకు నాస్తికునకు దు । రారంభున కిచ్చినం బరమ దుఃఖమునుం**

**గూరును గో; వది దాతను । నారకిఁ జేయుం; బరీక్షణము గడు వలయున్. 401**

**ప్రతిపదార్థం:** క్రూరునకున్= హింసించేవాడికీ; నాస్తికునకున్= దైవమంటూ ఎవరూ లేరని నమ్మేవానికీ; దుర్+ఆరంభునకున్= దుష్టబుద్ధితో పనులు ప్రారంభించేవాడికీ; ఇచ్చినన్; గోవు; పరమ దుఃఖమునన్= మహా దుఃఖంలో; కూరును= కూరుకొనిపోతుంది; అది= దాని శోకం; దాతనున్= ఇచ్చిన వాడిని; నారకిన్ చేయున్= నరకంలో నివాసిగా చేస్తుంది; పరీక్షణము= పరిశీలన; కడున్= చాలా; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** బాగా పరీక్షించి గోవును దానం చేయాలి. క్రూరుడికీ, నాస్తికుడికీ, చెడ్డపనులు చేసేవాడికీ ఇస్తే గోవు శోకిస్తుంది. ఆ శోకం దాతను నరకలోకంలో పడవేస్తుంది.

**ఆ. గొడ్డు బడుగుఁ దెవులు గొంటుఁ గ్రే పెడలిన । దాని నెచ్చటేని నూన మైన**

**యట్టిదాని నొకట నాయాసపడి యున్న । దాని నీరు గోప్రదానవిదులు. 402**

**ప్రతిపదార్థం:** గొడ్డున్= గొడ్డుబోతు, చూలు కలగనిది; బడుగున్= బక్కచిక్కినది; తెవులుగొంటున్= రోగాలు కలది (గొడ్లకు వచ్చే ఒక రకమైన వ్యాధి, దాటికుట్టు అని కూడా అంటారు); క్రేపు= దూడ; ఎడలిన= పోయిన; దూరమైన; దానిన్(ఒకచూలు తరువాత మరలా చూలు దాల్చనిది); ఎచ్చటన్+ఏనిన్= ఎక్కడైనా; ఊనము= దోషం; ఐన అట్టి దానిన్= కలదానిని; ఒకటన్= ఒకే విధంగా; ఆయాసపడి ఉన్న దానిన్= రొప్పేదానిని; గోప్రదాన విదులు= ఆవులను దానంచేయటం తెలిసినవారు; ఈరు= ఇవ్వరు.

**తాత్పర్యం:** గొడ్డుబోతుని, తెవులుగొంటును, బక్కచిక్కినదానిని ఎక్కడైనా సరే చెడ్డసుడి ఉన్న దానిని, ఒకేరీతిగా రొప్పు రోగం గల దానిని గోదానవిధి తెలిసినవా రివ్వరు.

**విశేషం:** దానం చేయట మంటే పనికిరాని దాని నివ్వట మనుకొనవచ్చును కనుక ఈ పద్యం చెప్పబడింది. కఠోపనిషత్తులో తండ్రి ఇట్లాంటి ఆవులనే దానంచేస్తుంటే కొడుకు నచికేతుడు చూచి బాధపడ్డాడని కథ ఉన్నది. అది దానం కాదు - అని చెప్పటం ప్రధానం.

**క. విను పుణ్యలోకముల కా । వనఘా! విప్రులకు గోచయంబులఁ బెక్కి**

**చ్చిన నవి దాతకు మోక్షం । బును జేయఁగఁ జాలు నండ్రు పూర్వాచార్యుల్.' 403**

**ప్రతిపదార్థం:** విను; అనఘా!; విప్రులకున్= బ్రాహ్మణులకు; గోచయంబులన్= ఆవుల మందలను; పెక్కు= ఎక్కువ; ఇచ్చినన్; అవి; దాతకున్= ఇచ్చినవాడికి; పుణ్యలోకములు+అ= పుణ్యలోకాలే; కావు= కావు; మోక్షంబునున్= మోక్షాన్ని; చేయఁ గన్ చాలును= కలిగించగలవు అని; పూర్వ= ముందరి; ఆచార్యుల్= గురువులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** "అనఘా! వినుము బ్రాహ్మణులకు గోవుల గుంపులను ఎక్కువగా దానం చేస్తే ఆ గోవులు పుణ్యలోకాలనే కాదు మోక్షాన్నికూడ కలిగించ కలవని పూర్వాచార్యులు అన్నారు.

**వ. 'అని చెప్పి గాంగేయుం దన్న పానీయ దానఫలాతిశయంబులు వెండియు వినిపింప వేడ్కసేసి యవ్విభున కిట్లనియె' 404**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; గాంగేయుండు= గంగకొడుకు భీష్ముడు; అన్న= అన్నం; పానీయ= త్రాగేవి; దానఫల+అతిశయంబులు= దానంచేయటం వల్ల కలిగే గొప్పఫలితాలు; వెండియున్= ఇంకా; వినిపింపన్= వినిపించాలని; వేడ్క+చేసి= వేడుకపడి; ఆ+విభునకున్= ఆ రాజుతో; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా వివరించి భీష్ముడు అన్నపానీయ దానాల గొప్పతనం చెప్పాలని ముచ్చటపడి ధర్మరాజుతో అన్నాడు;

**సీ. 'అధిప! యింకను విను మన్నంబు జలమును । నిచ్చుట యీవుల కెల్ల నెక్కు**
**డగుట నేఁ జెప్పెద నమృత సుధాస్వధా । నామముల్ సురలందు నాగకులము**
**నందును బితృకోటియందును వర్తిల్లు । నన్నంబునకు నోలినట్లుఁ గాక**
**యది ప్రాణ మండ్రు మహాత్ములు గావున । దానిఁ బెట్టుట ప్రాణదాన సమము;**

**తే. విను విశేషించి తత్పాకమునకు జల ము । పాశ్రయము చంద్రునకుఁ బుట్టఁ బట్టునయ్యె**
**జలము చంద్రుండు గాఁడె యోషధులఁ బ్రోచుఁ । గాన యుత్తమ మన్నంబు కంటె జలము.' 405**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఇంకను= ఇంకా; వినుము; అన్నంబు; జలమునున్= నీటిని; ఇచ్చుట; ఈవులకున్+ఎల్లన్= అన్ని దానాలకంటె; ఎక్కుడు= ఎక్కువ; అగుటన్=అయినందువలన; నేన్= నేను; చెప్పెదన్= చెపుతాను; అమృత= అమృతమనునట్టి; సుధా= సుధా అనేటి; స్వధా= స్వధా అనేటి; నామముల్= పేర్లు; (క్రమంగా) సురలందున్= దేవతలలో; నాగకులమునందున్= సర్పజాతిలోను (పాతాళలోకంలో ఉండేది నాగులు; స్వర్గలోకంలో ఉండేది దేవతలు; పితృకోటియందునున్= పితృదేవతల సమూహంలో; వర్తిల్లున్= ప్రవర్తిస్తాయి; అన్నంబునకున్= అన్నానికి; ఓలిన్= క్రమంగా (అన్నాన్ని దేవలోకంలో అమృతమనీ, పాతాళంలో సుధ అనీ, పితృలోకంలో స్వధ అనీ అంటారు); అట్లున్‌కాక= అంతేకాక; అది; ప్రాణము= ప్రాణశక్తి; అని; మహాత్ములు; అండ్రు= అంటారు; కావునన్; దానినీ; పెట్టుట= అన్నం పెట్టటం; ప్రాణదానసమము= ప్రాణం దానంచేయటంతో సమానం; విను= వినుము; విశేషించి= మీదు మిక్కిలి; తత్+పాకమునకున్= అన్నంవండుటకు; జలము= నీరు; ఉప+ఆశ్రయంబు= ఉనికిపట్టు; చంద్రునకున్= చంద్రుడికి; పుట్టన్= జన్మించుటకు; జలము= నీరు; పట్టున్= స్థానంకూడా; అయ్యెన్= అయినది చంద్రుండుకాఁడె= చంద్రుడే కదా; ఓషధులన్= మొక్కలను; ప్రోచున్= రక్షిస్తాడు; కాన= కనుక; అన్నంబుకంటెన్; జలము= నీరు; ఉత్తమము= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** 'రాజా! ఇంకా చెప్పుతాను వినుము. అన్నదానం అన్నిటికంటె చాలా గొప్పది. అన్నాన్ని స్వర్గలోకంలో అమృతమనీ, నాగలోకంలో సుధ అనీ, పితృలోకంలో స్వధ అనీ అంటారు. దాన్నే మహాత్ములు ప్రాణమంటారు. కనుక అన్నదానం ప్రాణదానంతో సమానం. ఇంకా విశేషించి చెప్పుతాను వినుము. అన్నంకంటె జలదానం గొప్పది. అది అన్నపాకానికి ఉపాశ్రయం. జలంలోనే చంద్రుడు పుట్టి సకల ఓషధులకు రక్షకుడయ్యాడు. కనుక అన్నంకంటె జలం గొప్పది.'

**విశేషం:** దేవతలకు హోమం చేసే మంత్రాలు స్వాహాతోను,
పితృదేవతా మంత్రాలు స్వధాతోనూ అంతమౌతాయి.

**వ. అని పలికి మఱియును. 406**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**క. 'తనకుఁ గలయట్టి యన్నము । నన సుర పితృపూజనములు నరునకు నడపం**
**జను నతిథి తర్పణము దా । నన తగ నొనరించు వాఁడు నరవరముఖ్యా!' 407**

**ప్రతిపదార్థం:** నరవరముఖ్యా!= రాజశ్రేష్ఠుడా!; తనకున్ కల అట్టి= తనకున్నటువంటి; అన్నమునన=అన్నంతోనే; నరునకున్= మనిషికి; సుర= దేవతల; పితృ= పితృదేవతల; పూజనములు= పూజలు; నడపన్= చేయగా; చనున్= వలయును; అతిథి= అతిథులను; తర్పణము= తృప్తిని; దానన= అన్నంతోనే; వాఁడు; తగన్= చక్కగా; ఒనరించున్= చేస్తాడు.

**తాత్పర్యం:** 'తనకున్న అన్నంతోనే దేవతల పితృదేవతల పూజలు చెల్లించాలి. అతిథులను దానితోనే తృప్తి పొందించాలి.'

**వ. అని నిర్దేశించి తిలదానం బత్యాదరణీయంబని ప్రసంగించి 'యది వినినది యైనను నేమి? తద్విషయంబున కొక్క యితిహాసంబు గలదు; చెప్పెద విను 'మని పలికి, యనిమిష నదీనందనుండు కుంతీనందనాగ్రజుతో నిట్లనియె. 408**

**ప్రతిపదార్థం:** అని; నిర్దేశించి= సెలవిచ్చి, చెప్పి; తిలదానంబు= నువ్వులను దానం చేయటం; అతి+ఆదరణీయంబు= మిక్కిలి ఆదరించదగ్గది;అని; ప్రసంగించి= ప్రసంగం చేసి; అది వినినది+ ఐననున్= అది విన్నదైనా; ఏమి= ఏముంది? (వింటే మాత్రమేమి?); తద్విషయంబునకున్= ఆ విషయానికి సంబంధించి; ఇతిహాసంబు= కథ; కలదు= ఉన్నది; చెప్పెదన్; వినుము+అని= ఆలకించుమని; పలికి= వచించి; అనిమిష నదీ నందనుండు= దేవతలనదియైన గంగయొక్క కొడుకు భీష్ముడు; కుంతీనందన= కుంతి కొడుకులలో; అగ్రజుతోన్= పెద్దవాడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పి తిలదానం చాలా ఆచరించదగ్గది అని వివరించి ఆ విషయం నీవు విన్నదైనా మరలా ఒక కథ చెప్పుతాను వినుము. దానివలన నీకు నష్ట మేమిటి?' కనుక అని భీష్ముడు ధర్మరాజుతో అన్నాడు.

### తిలదాన విషయక యమ బ్రాహ్మణ సంవాదము (సం.13-67-1)

**సీ. మధ్యదేశమున గ్రామంబు విద్వజ్జన । బహులమై యొక్కటి పర్ణశాల**
**యను పేర నొప్పారు నందుల విప్రుని । శర్మి నామునిఁ బ్రీతి జముఁడు పిలువఁ**
**బనిచి దానముల కెల్లను దిలదాన మె । క్కుడు తిలలకుఁ బితృకోటి వేడ్క**
**సేయుఁ బాపంబులు సెందవు తిలభక్షిఁ । బుణ్య కర్తృత్వంబు బుద్ధిఁ గోరు**

**తే. దేనిఁ దిల లెప్డువిప్రుల కిమ్ము భక్తి । ననియె వస్త్ర దీపము లీగి యతుల దాన**
**మనఘ! చీరల దివియల నమర పితృ స । మర్చనము సేఁత పరమధర్మ మని చెప్పె. 409**

**ప్రతిపదార్థం:** పర్ణశాల= ఆకులతో కప్పిన ఇల్లు; అనుపేరన్= అన్నపేరుతో; గ్రామంబు= ఊరు; మధ్యదేశమునన్= మధ్యప్రదేశంలో; విద్వత్+జన బహులమై= పండితుల సమూహంతో క్రిక్కిరిసి; ఒక్కటి, ఒప్పారున్= పేరు పొందింది;

అందులన్= అక్కడ; శర్మి నామునిన్= శర్మి అన్న పేరుగల వాడిని; విప్రునిన్= బ్రాహ్మణుడిని; జముఁడు= యముడు; ప్రీతిన్= ప్రేమతో; పిలువన్ పనిచి= పిలిపించి; దానములకున్+ఎల్లను= అన్ని దానాలలో; తిలదానము; ఎక్కుడు= గొప్పది; తిలలకున్= నువ్వులకు; పితృకోటి= పితృదేవతల సమూహం; వేడ్క సేయున్= ముచ్చటపడుతుంది; తిలభక్షిన్= నువ్వులు తినేవాడిని; పాపంబులు= పాపాలు; చెందవు= పొందవు; పుణ్యకర్తృత్వంబున్= పవిత్ర కర్తృత్వాన్ని; బుద్ధిన్= బుద్ధియందు; కోరుదు+ఏని= కోరితే; విప్రులకున్= బ్రాహ్మణులకు; తిలలు; ఎప్డున్= ఎప్పుడూ; ఇమ్ము= ఇవ్వు; భక్తిన్= భక్తితో; అని; అనియెన్; వస్త్ర= వస్త్రము; దీపములు= దివ్వెలు; ఈగి= దానం; అతుల= సాటిలేని దానము; అనఘ! చీరలన్= వస్త్రాలతో; దివియలన్= దీపాలతో; అమర= దేవతల; పితృ= పితృదేవతల; సమర్చనముచేఁత= పూజించటం; పరమ= గొప్ప; ధర్మము; అని; చెప్పెన్.

**తాత్పర్యం:** మధ్యప్రదేశములో పర్ణశాల అని ఒక గ్రామమున్నది. అందులో అనేకమంది పండితులు ఉండేవారు. వారిలో శర్మి అనే పేరుగలవాడిని పిలిచి యముడన్నాడు - 'అన్ని దానాలలో తిలదానం గొప్పది. పితృదేవతలు దానికొరకు వేడ్కపడతారు. నువ్వులు తిన్న వానిని పాపాలు పొందవు. కనుక నీవు మంచి పని చేయదలచుకొంటే బ్రాహ్మణులకు నువ్వులు దానం చేయుము. వస్త్రాలు, దీపాలు దానం చేయటం గొప్పది. వస్త్రాలతో దేవతలు, దీపాలతో పితృదేవతలు సంతోషిస్తారు కనుక.

**వ. అని యిట్లు యమబ్రాహ్మణ సంవాదంబు వినిపించి శాంతనవుం దమ్మహీకాంతు నాననంబు సవిశేషాదరంబున నాలోకించి. 410**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; యమ= యముడు; బ్రాహ్మణ= శర్మి; సంవాదంబు= సంభాషణ; వినిపించి, శాంతనవుండు= శంతనుడి కుమారుడు; ఆ మహీకాంతు= ఆ రాజుయొక్క, ఆననంబు= ముఖం; సవిశేష= విశిష్టమైన; ఆదరంబునన్= ఆదరణతో; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని ఈ విధంగా యమ శర్మి సంవాదం వినిపించి శాంతనవుడు ధర్మరాజును ఆదరణతో చూచి.

**క. 'విను పృథివియును సరస్వతి । యును గోవును దాన విధికి నొక్కంతలుగా**
**విని యుండుదు వీనిం బో । లిన దాతవ్యములు నొండు లేవని విందున్. 411**

**ప్రతిపదార్థం:** పృథివియునున్= భూమి; సరస్వతియునున్= చదువు; గోవునున్= ఆవునూ; దాన విధికిన్= దానం చేయటానికి; ఒక్క+అంతలుగాన్= ఒకటేనని; వినియుండుదున్= విన్నాను; వీనిన్= వీటిని; పోలిన; దాతవ్యములు= ఇవ్వదగ్గవి; ఒండు= మరొకటి; లేవు; అని; విందున్= విన్నాను.

**తాత్పర్యం:** దానం చేయదగ్గవి మూడే అవి 1.భూమి, 2.చదువు, 3.గోవు. వీటికంటె గొప్పవి లేవు.

**ఆ. రాజముఖ్య! తగు సరస్వతి శిష్యున । కొసఁగ, భూమి దాన మూర్జితముగఁ**
**జేసినట్టి ఫలము సిద్ధించు, ధేనువు । నిచ్చుటయును భూమి నిచ్చినట్ల. 412**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజశ్రేష్ఠుడా!; శిష్యునకున్= విద్యార్థికి; సరస్వతి= విద్య; ఒసఁగన్= ఇవ్వటం; తగున్= యోగ్యం; భూమిదానము= భూదానం; ఊర్జితముగన్= ఎక్కువగా; చేసినట్టి ఫలము; సిద్ధించున్= కలుగుతుంది; ధేనువును= ఆవును; ఇచ్చుటయును= ఇవ్వటమూ; భూమిన్= నేలను; ఇచ్చినట్లు+అ= దానం చేసినట్లే.

**తాత్పర్యం:** రాజముఖ్య! శిష్యుడికి తగునట్లుగా విద్యాదానం చేయటం భూదానం చేసినంత! గోవునివ్వటం కూడా భూదానం చేసినంతే!

**క. అనయముఁ గొంచెపు వెలకుం । గొనవచ్చును సారభూత గోవును దానం**
**బున ఫల మధికము దానము । గొని నాతఁడు సుఖము దానఁ గొనుఁ జేసేతన్. 413**

**ప్రతిపదార్థం:** అనయమున్= ఎప్పుడు; కొంచెపు= తక్కువ; వెలకున్= ధరకు; కొనవచ్చును= కొనుక్కొనవచ్చును; సారభూత= అన్నిటికి సారమగుతున్న లేదా పంచభూత సారమైన (గోవు విశ్వసంకేతం కనుక); గోవును= ఆవును; దానంబునన్= గోదానంవలన; ఫలము= ఫలితం; అధికము= ఎక్కువ; దానము కొనినాతఁడు= దానం గ్రహించినవాడూ; చేసేతన్= చేతులారా!; సుఖమున్= సౌఖ్యాన్ని; దానన్= గోదానంతో; కొనున్= గ్రహిస్తాడు.

**తాత్పర్యం:** పంచభూతస్వరూపిణి అయిన గోమాతను తక్కువ వెలకు కొనవచ్చును. గోదానఫలం ఇచ్చినవాడికీ, - తీసికొన్నవాడికీ కలుగుతుంది.

**ఆ. దేవ పితృ సమర్చనావాసములు గోశ । కృత్ప్రలేపనమునఁ గీర్తనీయ**
**శుచితఁ బడయు ననిన సువ్రత! గోవుల । భూరి మహిమ వేఱ పొగడ నేల? 414**

**ప్రతిపదార్థం:** సువ్రత!= వ్రతనిష్ఠ కలవాడా!; దేవ= దేవతల; పితృ= పితృదేవతల; సమర్చనా= పూజా; ఆవాసములు= నివాసాలు, పూజా మందిరాలు; గో= ఆవు; శకృత్= పేడ; ప్రలేపనమునన్= అలకటంవలన; కీర్తనీయ= పొగడదగ్గ; శుచితన్ పడయున్= శుచిత్వాన్ని పొందుతాయి; అనినన్= అనగా; గోవుల; భూరిమహిమ= గొప్పమహిమ; వేఱ= ప్రత్యేకంగా; పొగడన్+ఏల= పొగడటం దేనికి?

**తాత్పర్యం:** ధర్మరాజా! దేవతలను, పితృదేవతలను ఆరాధించే నివాసాలు ఆవులపేడతో అలకటం వలన పొగడదగిన పవిత్రత కలుగుతుం దనగా ఇక గోవుల గొప్ప మహిమ వేరే పొగడటం ఎందుకు?

**తే. కుడుపునకు ముందు రొడ్డుల గోవునకు స । మంచిత గ్రాసముష్టి నిత్యంబు నేఁడు**
**గాల మిచ్చిన నతఁ డెల్ల కామ్యములును । బ్రాహ్మణుల కర్థి నొసఁగిన ఫలము వడయు. 415**

**ప్రతిపదార్థం:** ఏఁడుకాలము= సంవత్సరకాలం; నిత్యము= ప్రతిరోజు; కుడుపునకున్= తాను భుజించటానికి; ముందర= ముందే; ఒడ్డుల= మరొకరి; గోవునకున్= ఆవుకు; సమంచిత= చక్కని; గ్రాసముష్టి= పిడికెడు గడ్డి; ఇచ్చినన్= ఇస్తే; అతఁడు; ఎల్ల కామ్యములును= అన్ని కోరికలను; బ్రాహ్మణులకున్= విప్రులకు; అర్థిన్= ప్రేమతో; ఒసఁగిన= ఇచ్చిన; ఫలము= ఫలితం; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** తాను తినే ముందు ఆవుకు పిడికెడు గడ్డి సంవత్సరం పొడుగునా ప్రతి దినమూ ఎవ డిస్తాడో వాడు బ్రాహ్మణులకు కోర్కెలన్నీ తీర్చినంత ఫలం పొందుతాడు.

**క. గోదాన విధము సుపథగ । మై దాతకు నెల్ల మేలు నాపాదించున్**
**వేదప్రియ! యది దురితో । త్పాదక మగు నాతనికి విపథగతమైనన్. 416**

**ప్రతిపదార్థం:** వేదప్రియ!= వేదాలపై ప్రీతికలవాడా!; గోదాన విధము= గోదానం పద్ధతి; సుపథగము+ఐ= మంచి మార్గం పొంది; దాతకున్= ఇచ్చినవాడికి; ఎల్లన్ మేలున్= శుభాన్నంతా (అన్ని శుభాలను); ఆపాదించున్= కలిగిస్తుంది; అతనికిన్= అతనికీ; విపథగతము+ఐనన్= చెడ్డమార్గాన పోతే; అది; దురిత= పాపం; ఉత్పాదకము= పుట్టించేది; అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** గోదానవిధము సన్మార్గంలో సాగితే దాతకు మేలు చేకూరుతుంది. చెడుమార్గంలో అయితే కీడు కలిగిస్తుంది.

**విశేషం:** వేదప్రియ సంబోధన రహస్యమేమంటే - సుపథ అన్నమాట ఈశావాస్యంలో మోక్షమార్గ మని భావం. విపథ= పాపమార్గం. కనుక వేదప్రియ అనే సంబుద్ధి వాడబడింది.

## నృగచరిత్రము (సం.13-69-1)

**తే. దుష్టమైన గోదానంబు గష్టవృత్తిఁ దెచ్చె నృగనామునఁ దగు జగతీవిభునకు**
**నత్తెఱం గితిహాసమై యవనిఁ బరఁగు; వినుము సెప్పెద దాని వివేకధుర్య! 417**

**ప్రతిపదార్థం:** వివేకధుర్య!= బుద్ధిమంతుడా!; దుష్టమైన= చెడ్డదైన; గోదానంబు= గోదానం; నృగనామునఁడు= నృగు డన్న పేరుగల; జగతీ విభునకున్= రాజునకు; కష్టవృత్తిన్= కష్టపాటు; తెచ్చెన్= కలిగించింది; ఆ తెఱంగు= ఆ విధానం; ఇతిహాసము+ఐ= పూర్వకథగా; అవనిన్= లోకంలో; పరఁగున్= వ్యాప్తమైనది; దానిన్; చెప్పెదన్; వినుము.

**తాత్పర్యం:** నృగుడన్న రాజు చెడ్డగా గోదానంచేసినందువలన కీడు కలిగిన విషయం ఒక పూర్వకథగా లోకంలో ప్రసిద్ధమైనది. అది నీకు చెప్పుతాను వినుము.

**క. ద్వారవతి నొక్క నూతం। దోరపుఁ దను వక్కజమగు తొండ నొకటి న**
**చ్చేరువ మెలఁగుజనులు గని। నీ రిది గలఁగించు నిట్ల నిలిచిన యేనిన్. 418**

**ప్రతిపదార్థం:** ద్వారవతిన్= ద్వారకలో; ఒక్క నూతన్= ఒక నూతిలో; తోరపుఁ దనువు= పెద్ద శరీరంతో; అక్కజము= ఆశ్చర్యం; అగు= అయిన; తొండన్= తొండను; ఒకటిన్= ఒకదానిని; ఆ చేరువ= ఆ సమీపంలో; మెలఁగు జనులు= మసలే మనుషులు; కని= చూచి; ఇది= ఈ తొండ; ఇట్లు= ఇట్లాగే; నిలిచిన ఏనిన్= ఉంటే; నీరు= నీటిని; కలఁగించున్= బురద చేస్తుంది.

**తాత్పర్యం:** ద్వారకలోని ఒకనూతిలో ఒక పెద్ద శరీరం గల తొండ ఉన్నది. దగ్గరలో ఉన్న మనుష్యులు చూచి దీ న్నిట్లాగే ఉండనిస్తే నీరంతా పాడైపోతుంది. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అని బలు మ్రోకులు వేగమ। కొని వచ్చి తగిల్చి లావుగొని తిగువఁగ నా**
**ఘనజంతు వచలితంబై। యునికికి విస్మయము నొందు నుల్లంబులతోన్. 419**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; బలు= పెద్ద; మ్రోకులు= త్రాళ్ళు; వేగమ= వెంటనే; కొనివచ్చి= తెచ్చి; తగిల్చి= దానికి తగిలించి; లావు+కొని= బలం పుంజుకొని; తిగువఁగన్= లాగగా; ఆ ఘన జంతువు= ఆ పెద్ద ప్రాణి; అచలితంబు+ఐ= కదలకుండా; ఉనికికిన్= ఉండటానికి; విస్మయము= ఆశ్చర్యం; ఒందు+ఉల్లంబులతోన్= పొందిన మనస్సులతో.

**తాత్పర్యం:** ఆ విధంగా భావించి వారు బలమైన మోకులు తెచ్చి దానికి తగిలించి పైకి లాగటానికి ప్రయత్నించారు. కాని, అది కదల్లేదు. అందుకు వారు ఆశ్చర్యపోయారు.

**తే. కృష్ణు పాలికిఁ బోయి యక్కీట మున్న । తెఱఁగు సెప్పినఁ జని దానిఁ దిగిచె వెడల**
**నమ్మహాత్ముఁ డెఱింగియు నర్థితోడ । నడుగ నది 'యేను నృగుఁడఁ జు' మ్మనియె ననఘ! 420**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; కృష్ణుపాలికిన్= శ్రీకృష్ణుడి దగ్గరకు; పోయి; ఆ కీటము= ఆ పురుగు; ఉన్న తెఱఁగు= ఉన్న విధము; చెప్పినన్= చెప్పగా; చని= పోయి; దానిన్= తొండను; వెడలన్= బయటకు వచ్చేటట్లుగా; తిగిచెన్= పైకి లాగాడు; ఆ+మహాత్ముఁడు= ఆ స్వామి; ఎఱింగియున్= తెలిసికూడా; అర్థితోడన్= కోర్కెతో; అడుగన్= అడిగితే; అది= ఆ తొండ; ఏను= నేను; నృగుఁడన్ చుమ్ము= నృగుడను సుమా! అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** వారు శ్రీకృష్ణుడికి విన్నవించగా ఆయన వచ్చి దాన్ని బయటకు లాగాడు. ఆయన కదేదో తెలిసికూడా ప్రశ్నించగా 'నేను నృగుడను సుమా!' అని తొండ చెప్పింది.'

**వ. అనిన విని యద్దేవుండు 'నీ వనేక గో సహస్రంబుల విప్రజనంబుల కిచ్చి తని విందు; మిట్టి దుర్జన్మంబు నీకేల వాటిల్లె?' ననుటయు నమ్మనుజవల్లభుండు. 421**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ దేవుండు= ఆ శ్రీకృష్ణుడు; గోసహస్రంబులు= వేల గోవులు; విప్రజనంబులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చితి అని విందున్= ఇచ్చావని విన్నానే; ఇట్టి= ఇటువంటి; దుర్జన్మంబు= దుష్టమైన పుట్టుక; నీకున్; ఏల= ఎందుకు; పాటిల్లెన్?= కలిగింది?; అనుటయున్= అనగా; ఆ మనుజవల్లభుండు= ఆ రాజు.

**తాత్పర్యం:** కృష్ణు డన్నాడు 'అరే! నీవు ఎన్నో గోవులను దానం చేశావని విన్నానే! నీకీ పాడు పుట్టుక ఎట్లా కలిగింది? అనగా అతడు.

**సీ. ఉత్తమ బ్రాహ్మణుం డొకనికి నొక్కనాఁ । డొక గోవు నిచ్చితి నుల్ల మలర**
**నతఁడును గొనిపోయె; నది మేఁత కర్థి మా । కదుపుల లోపలఁ గలసి వచ్చె**
**గోవుల మఱియును గోపాలకులు దాన । విధికినై తెచ్చుచో విధివశమున**
**వానిలో నదియును వచ్చిన నెఱుఁగక । దానంబు సేసితి; దాని మున్న**

**ఆ. గొనినయతఁడు దడవి కని 'యిది నాదు గో' । వనియెఁ బిదపఁ గొనిన యతఁడు పెనఁగి**
**'నాకు నృపతి యొసఁగె' నా నిద్దఱకును వా। దైన నన్నుఁ గాన నరుగుదెంచి. 422**

**ప్రతిపదార్థం:** ఉత్తమ= మంచి; బ్రాహ్మణుండు+ఒకనికి; ఉల్లము= మనస్సు; అలరన్= వికసించగా; ఒక్కనాఁడు; ఒక గోవున్; ఇచ్చితిన్= ఇచ్చాను; అతఁడును= ఆయన; కొనిపోయెన్= తీసికొనిపోయాడు; అది= ఆ గోవు; మేఁతకున్= మేతకొరకు; అర్థిన్= కోర్కెతో; మా కదుపులలోపలన్= మా ఆలమందలతో కలిసి; వచ్చెన్= వచ్చింది; మఱియును= ఇంకనూ, ఆ పిదప; గోపాలకులు= ఆలమేపరులు, ఆలమందలు మళ్ళవేసేవారు; దానవిధికిన్+ఐ= దాన విధానం కొరకు; గోవులన్ తెచ్చుచోన్= ఆవులను తోలుకొని వస్తున్నప్పుడు; విధివశమునన్= దైవవశాత్తు; వానిలోన్= ఆ గోవులతో కలిసి; అదియున్= ఇదివరకు

దానం చేసిన గోవు; వచ్చినన్= రాగా; ఎఱుఁగక= తెలియక; దానంబు చేసితిన్= దానిని మరొకరికి దానం చేశాను; దానిన్; మున్ను= పూర్వం; కొనిన యతఁడు= తీసికొన్నవాడు; తడవి= పరిశీలించి; కని= చూచి; ఇది; నాదుగోవు= నా గోవు; అనియెన్= అన్నాడు; పిదపన్= తరువాత; కొనిన అతఁడు= తీసికొన్నవాడు; పెనఁగి= మారుపల్కి, ఎదురొడ్డి; నాకున్; నృపతి= రాజు; ఒసఁగెన్= ఇచ్చాడు; నాన్= అనగా; ఇద్దఱకున్; వాదు= తగాదా; ఐనన్= జరిగితే; నన్నున్; కానన్= చూడటానికి; అరుగు దెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ఒక ఉత్తమ బ్రాహ్మణుడికి ఒక గోవును ఇచ్చాను. అది మేతకొరకు తిరిగి మా ఆలమందలలో చేరిరాగా, మావారు తెలియక దానంకొరకు ఆవులను తెమ్మంటే దాన్ని వీటితోపాటు తెచ్చారు. దానిని మరొకరికి ఇచ్చాను. మొదటివా డా గోవును చూచి ఇది నాదంటే, రెండోవాడు నాకిది రాజుగారు ఇచ్చారన్నాడు. ఇద్దరకు వాదు కలిగితే నా దగ్గరకు వచ్చి.

**వ. తనముందటి తెఱం గెఱింగించి. 423**

**తాత్పర్యం:** తనయొక్క పూర్వస్థితి చెప్పి.

**క. ఇచ్చినవారల కొనఁగా । వచ్చిన నడ్డంబు గలదె వసుధాధిప! యం**
**చిచ్చఁగడు నొచ్చి పలికిరి । వెచ్చని నిట్టూర్పులడర విప్రులిరువురున్. 424**

**ప్రతిపదార్థం:** వసుధా+అధిప!= రాజా! (భూమి నేలేవాడా!); ఇచ్చినవారలు+అ= ఇచ్చినవారే; కొనఁగాన్ వచ్చినన్= తీసికొనటానికి వస్తే; అడ్డంబు కలదె?= అడ్డమున్నదా? అంచున్= అని; ఇచ్చన్= మనస్సులో; కడున్= మిక్కిలి; నొచ్చి= బాధపడి; విప్రులు= బ్రాహ్మణులు; ఇరువురునున్= ఇద్దరూ; వెచ్చని= వేడి; నిట్టూర్పులు= నిశ్శ్వాసాలు; అడరన్= వ్యాపించగా; పలికిరి= మాట్లాడారు.

**తాత్పర్యం:** రాజా! ఇచ్చినవాడే తీసికొంటే అడ్డ మేమున్నదని ఇద్దరు బ్రాహ్మణులు మనస్సులో బాధపడి వేడి నిట్టూర్పులు విడుస్తూ అన్నారు.

**విశేషం:** పద్యమంతా కోపం వచ్చినవాడు మాటాడే తీరును తెలుపుతున్నది. ద్విత్వ చకారప్రాస దాని కూతం. వేడి నిట్టూర్పులు ఏమీ చేయలేని కోపాన్ని తెలియజేసేవి.

**వ. మఱియుం బొడము మాటల నమ్మొదవు పోకడ నాకుఁ దెల్లం బగుటయు. 425**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా, అనేకంగా; పొడము= పుట్టిన; మాటలన్= మాటలవలన; ఆ మొదవు= ఆ గోవు; పోకడ= విధానం, లేదా పోవటం; నాకున్; తెల్లంబు= స్పష్టం; అగుటయున్= కావటంతో.

**తాత్పర్యం:** వాళ్ళన్న మాటలనుబట్టి ఆ గో విదివరకే దత్తం చేయబడిందని నాకు స్పష్టం కావటంతో.

**ఉ. దానికి నేను జిత్తమునఁ దాపము నొందుచు మున్ను గొన్న య**
**మ్మానితవిప్రు వేఁడికొని 'మంచివి గోవులు నీకు నూఱు వే**
**యైనను నిచ్చెదన్ విడువవయ్య మహీసురవర్య! నెమ్మి న**
**ద్ధేనువు' నన్న నాస్యమున దీనత దోఁపఁగ నాతఁ డిట్లనున్. 426**

**ప్రతిపదార్థం:** దానికిన్= జరిగిపోయిన విషయానికి; నేను; చిత్తమునన్= మనస్సులో; తాపమున్= బాధను; ఒందుచున్= పొందుతూ; మున్ను= పూర్వము; కొన్న= దానం తీసికొన్న; ఆ+మానిత= ఆ గౌరవింపదగ్గ; విప్రున్= బ్రాహ్మణుడిని; వేఁడికొని= బ్రతిమాలి; గోవులు; మంచివి; నీకున్; నూఱు వేయి= లక్ష; ఐననున్= ఐనాసరే; ఇచ్చెదన్= ఇస్తాను; మహీసురవర్య!= బ్రాహ్మణ శ్రేష్ఠుడా!; నెమ్మిన్= సంతోషంతో; ఆ+ధేనువున్= ఆ గోవును; విడువవయ్య!= వదలిపెట్టవయ్యా!; అన్నన్= అనగా; అతఁడు; అస్యమునన్= ముఖంలో; దీనత= దైన్యం; తోఁపఁగన్= కనిపిస్తుండగా; ఇట్లు; అనున్.

**తాత్పర్యం:** జరిగిపోయినదానికి మనస్సులో బాధపడి నేను మొదట తీసికొన్న విప్రుడితో 'స్వామీ! గోవును ఇమ్ము. దానికి బదులు నీకు మంచి గోవులు లక్ష ఇస్తా' ననగా - అతడు దైన్యంతో ఇట్లా అన్నాడు.

**తే. 'పాలు గడుఁ బెక్కు దాని సబాము లెస్స । పెయ్య కర్మిలి గలదు మత్ప్రియ సుతుండు**

**పాల కేడ్చిన యపుడ చన్పట్టనిచ్చు - నేది ప్రొద్దైన నట్టి గో వెందుఁ గలదు? 427**

**ప్రతిపదార్థం:** పాలు; కడున్+పెక్కు= చాలా ఎక్కువ; దాని సబాము లెస్స= ఆ ఆవుస్వభావం మంచిది; పెయ్యకున్= దూడపై; అర్మిలి= ప్రేమ; కలదు= కలిగిఉన్నది; మత్= నా; ప్రియసుతుండు= కూర్మి కొడుకు; పాలకున్= పాలకొరకు; ఏడ్చినఅపుడు+అ= ఎప్పుడు ఏడిస్తే అప్పుడు; ఏది ప్రొద్దు+ఐనన్= ఏ వేళనైనా; చన్= పొదుగు; పట్టన్+ఇచ్చున్= పట్టుకొననిస్తుంది, అట్టిగోవు, ఎందున్= ఎక్కడ; కలదు?= ఉన్నది?

**తాత్పర్యం:** దానికి పాలెక్కువ. దూడమీద దానికి మక్కువ ఎక్కువ. నా చిన్నారి కొడుకు ఏడ్చినప్పుడు ఏ వేళనైనా సరే పొదుగును పట్టుకొన నిస్తుంది. అట్లాంటి గోవు ఎక్కడ ఉంటుంది?

**క. శ్రీవోలె నింటిలో నా । గోవుండఁగఁ జూతుఁగాని కోటి మొదవులుం**

**గావు సరి దాని' కని భూ । దేవుఁడు వోవుటయు నేను దీనత దోఁపన్. 428**

**ప్రతిపదార్థం:** శ్రీ= మహాలక్ష్మి; పోలెన్= వలె; ఆ గోవు; ఇంటిలోన్= ఇంట్లో; ఉండఁగన్= ఉంటే; చూతున్ కాని= చూడగలను కానీ; కోటి; మొదవులున్= ఆవులైనా; దానికిన్; సరికావు= సమానం కావు; అని; భూదేవుఁడు= బ్రాహ్మణుడు; పోవుటయున్= పోగా; నేను; దీనత= దైన్యం; తోఁపన్= తోపగా.

**తాత్పర్యం:** అది మహాలక్ష్మివలె ఇంట్లో ఉంటే చూడగలను కాని, కోటిగోవులైనా దానితో సమానం కా'వని ఆయన కోపంతో వెళ్ళిపోగా నేను దైన్యంతో.

**విశేషం:** ఇందాక బ్రాహ్మణుడు దైన్యంతో అంటే ఇప్పుడు రాజు దైన్యం తోపగా అంటున్నాడు.

**చ. 'కనకము ధేనువుల్ మణి నికాయము లిచ్చెద; నేమి యైనఁ ద**

**క్కును మది కిష్టమైన యది గోరుము గోవున' కంచుఁ జేరి త**

**క్కిన ధరణీసుపర్వునకుఁ గీడ్పడి యెమ్మెయి వేఁడికొన్న 'నేఁ**

**గొన భవదీయ రాజ్యమును; గుత్సితవృత్తికి నియ్యకొందునే?' 429**

**ప్రతిపదార్థం:** కనకము= బంగారం; ధేనువుల్= గోవులు; మణినికాయములు= అనేక రత్నాలు; ఏమిఐనన్= ఏమైనాసరే; ఇచ్చెదన్= ఇస్తాను; తక్కునున్= మిగిలినది (ఏదైనాసరే); మదికిన్= మనస్సుకు; ఇష్టము= ఇష్టం; ఐనఅది= ఐనదాన్ని;

గోవునకున్= ఆవునకు బదులు; కోరుము= కోరుకొమ్ము; అంచున్= అంటూ; చేరి= సమీపించి; తక్కిన= రెండవ; ధరణీ సుపర్వునకున్= భూదేవుడికి, బ్రాహ్మణుడికి; కీడ్పడి= దైన్యంతో; ఏ+మెయిన్= ఏ విధంగా; వేఁడికొన్నన్= వేడుకొనినా; ఏన్= నేను; భవదీయ= నీ; రాజ్యమును= రాజ్యమైనా; కొనన్= తీసికొనను; కుత్సిత వృత్తికిన్= కుచ్చితపు ఆలోచనకు; ఇయ్యకొందునే?= ఇష్టపడతానా?

**తాత్పర్యం:** బంగారం, మణులు, ఆవులు ఏదైనా సరే కోరుకొమ్ము కానీ 'ఈ ఆవు నిమ్ము' అని ఎంత దీనంగా బ్రతిమిలాడినా ఆ రెండవ బ్రాహ్మణుడు అంగీకరించక 'నాకు రాజ్యమైనా సరే వద్దు పొమ్ము. ఇంత కుత్సితబుద్ధిని నే నంగీకరించను.'

**తే. అనియెఁ గాని నా మాట గైకొనఁడ యాతఁ; డట్టి యెడఁ గాలవశగతి యావహిల్లి**
**యముని కడ కేఁగ నాతోడ నతఁడు వికచ । నలినలోచన! యిట్లని పలికెఁ బ్రీతి. 430**

**ప్రతిపదార్థం:** అనియెన్+కాని= అన్నాడు తప్ప; ఆతఁడు= అతడు; నా మాటన్; కైకొనఁడ= వినిపించుకొనలేదు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కాలవశగతి= మరణదశ; ఆవహిల్లి= కలిగి; యముని; కడకున్= సమీపానికి; ఏఁగన్= పోగా; నాతోడన్= నాతో; అతఁడు= యముడు; వికచ= విప్పారిన; నలిన= తామరపూలవంటి; లోచన!= నేత్రాలవాడా!; ఇట్లని= ఈ విధంగా; ప్రీతిన్= ప్రేమతో; పలికెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వికసించిన తామరపూలవంటి నేత్రాలున్నవాడా! ఆ రెండవ బ్రాహ్మణు డట్లా అన్నాడు తప్ప నా మాట పట్టించుకొనలేదు. అప్పుడు మృత్యువు సంభవించి నేను యముని దగ్గరకు పోగా అతడు నాతో ప్రేమగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** వికచ నళిన లోచన= ఈ సంబోధన భగవంతుడి నేత్ర సౌందర్యాన్ని సూచించేదే. అయినా ఇక్కడ కథ విన్నాక కలిగే ఆశ్చర్యాన్ని సూచిస్తుంది.

**చ. 'జనవర! పుణ్యకర్మము లసంఖ్యము లీవొనరించి తొక్క వి**
**ప్రునిధన మజ్ఞతం గొనుటఁ బొందె సకిల్బిషభావ మల్ప మి**
**ట్లొనరిన రెంట నయ్యెడు మహోన్నతి దుర్గతులందు మున్ను నీ**
**చనునెడ యెద్ది నావుడు న సౌఖ్యపుఁ జోటని సమ్మతించితిన్. 431**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; ఈవు= నీవు; పుణ్య కర్మములు= పుణ్య కార్యాలు; అసంఖ్యములు= లెక్కలేనన్ని; ఒనరించితి= చేశాడు; ఒక్క; విప్రుని ధనము= బ్రాహ్మణుడి సొమ్ము; అజ్ఞతన్= తెలియక; కొనుటన్= గ్రహించడంవల్ల; సకిల్బిష= పాపంతో కూడిన; భావము= సంస్కారం; అల్పము= కొంచెం; పొందెన్= కలిగింది; ఇట్లు; ఒనరిన= ఒనగూడిన, సంభవించిన; రెంటన్= రెంటితో; అయ్యెడు= కలిగే; మహా+ఉన్నతి= గొప్పదశ; సద్గతి; దుర్గతులు= చెడ్డదశ; అందున్= అందులో; మున్ను= ముందుగా; నీ చనునెడ= నీవు వెళ్ళేలోకం; ఎద్ది= ఏది; నావుడున్= అంటే; అసౌఖ్యపుఁజోటు= సుఖంలేనిచోటు - నరకం; అని; సమ్మతించితిన్= అంగీకరించాను.

**తాత్పర్యం:** 'రాజా! నీ వనేక పుణ్యకార్యాలు చేసినందున సద్గతి కలుగుతుంది. కాని, తెలియకుండా బ్రాహ్మణుడి సొమ్ము నీకు చేకూరటంవలన పాప మింత అంటింది. కనుక సద్గతి, దుర్గతులలో నీ వేది ముందుగా అనుభవించాలనుకుంటున్నావో చెప్పు'మని యముడు అనగా నేను దుర్గతినే ఎన్నుకొన్నాను.

**ఆ. అట్టు లియ్యకొనిన యా క్షణమాత్ర మ । స్తకము క్రిందు గాఁగ ధరణిఁ బడఁగ**
**వలసె; నపుడు వింటి నలఘు కృపార్ద్ర వ । ర్ణాలికలితమైన యముని పలుకు. 432**

**ప్రతిపదార్థం:** అట్టులు= ఆ విధంగా; ఇయ్యకొనిన= అంగీకరించిన; ఆక్షణమాత్రన్= ఆక్షణంలో; మస్తకము= తల; క్రిందు+ కాఁగన్= క్రిందై; ధరణిన్= భూమిమీద; పడఁగన్ వలసెన్= పడవలసి వచ్చింది; అపుడు; అలఘు= గొప్ప; కృపా+ఆర్ద్ర= దయతో తడిసిన; వర్ణ+ఆలి= అక్షరాల సమూహంతో; కలితమైన= కూడిన; యముని పలుకున్= యముడి మాటను; వింటిన్= విన్నాను.

**తాత్పర్యం:** అట్లా అంగీకరించానో లేదో తలక్రిందులుగా భూమిపై పడ్డాను. పడుతుండగా దయగల యముని మాట వినిపించింది.

**వ. అది యెయ్యది యంటేని. 433**

**ప్రతిపదార్థం:** అది; ఏ+అది= ఏది; అంటేని= అంటే.

**తాత్పర్యం:** అది ఏమంటే.

**తే. వాసుదేవుఁ డనేక సంవత్సరముల । కధిప! నీ యున్న చోటికి నరుగుదెంచి**
**యుద్ధరించు ని న్నట నిత్యసిద్ధ సౌఖ్య । మైన లోకమునకుఁ జను దనఘ! నీవు. 434**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నీ+ఉన్నచోటికిన్= నీవుండే స్థలానికి; అనేక సంవత్సరములకున్= చాలా కాలం తరువాత; వాసుదేవుఁడు= శ్రీకృష్ణుడు; అరుగుదెంచి= వచ్చి; నిన్నున్; ఉత్+హరించున్= పైకి తీస్తాడు; (ఉత్+ధరించు= చక్కగా ఆదుకొంటాడు, రక్షిస్తాడు) అటన్= అక్కడ; అనఘ!= పుణ్యాత్ముడా!; నీవు; నిత్య= శాశ్వత; సిద్ధ= ఉన్న; సౌఖ్యము= సుఖాలు కలది; ఐన= అయిన; లోకమునకున్= లోకానికి, చనుదు= వెళ్ళుతావు.

**తాత్పర్యం:** రాజా! చాలా కాలం తరువాత భగవంతుడైన శ్రీకృష్ణుడు నీవున్న చోటికి వస్తాడు. నిన్ను పైకి తీయటమే కాక సద్గతి ననుగ్రహిస్తాడు. తరువాత నీకు అతడి అనుగ్రహంతో శాశ్వత సుఖాలు కల లోకం లభిస్తుంది.

**విశేషం:** ఇది యముడి దయగల మాట. అతడికీ రాజుమీద జాలి కలిగింది. 'అయ్యో! పాపం దానం చేసి పాపం కొనుక్కొన్నాడే' అని.

**వ. ఇట్లు వినుచు నిలాతలంబునం బడి కృకలాసత్వంబు నొంది చరియించుచుండి, నేఁడు దైవదత్తంబయిన చిత్తవర్తనంబునం జేసి యికూపంబునకు వచ్చిన యపర క్షణంబునం గృకలాసంబులకు లేనిమేని పెం పావహిల్లిన నుల్లంబు సవిస్మయం బగుచునుండ యమప్రసాదంబున నెప్పుడును మాయని పరిజ్ఞానంబు వర్తిల్లనున్నంతం బరమ యోగీంద్ర భావ్యంబగునీ భవ్యసన్నిధి దొరకొనియె' నని పలికె నప్పు డప్పుడమితేనికిఁ బూర్వాచరిత పుణ్య కర్మానురూపం బగు రూపం బావిర్భవించిన దానికిం బ్రమోదభరితుం డై యతండు. 435**

**ప్రతిపదార్థం:** ఇట్లు వినుచున్= ఇట్లా వింటూ; ఇలా తలంబునన్+పడి= భూమిపై పడి; కృకలాసత్వంబున్= తొండ స్వభావాన్ని, రూపాన్ని; ఒంది= పొంది; చరియించుచుండి= తిరుగుతూ ఉండి; నేఁడు; దైవదత్తంబు+అయిన= దైవ మనుగ్రహించిన; చిత్తవర్తనంబునన్+చేసి= మనసు సంకల్పంతో; ఈ+కూపంబునకున్= ఈ బావికి; వచ్చిన; అపర క్షణంబునన్= మరుక్షణంలో; కృకలాసంబులకున్= తొండలకు లేని; మేని పెంపు= శరీర విస్తృతి; ఆవహిల్లినన్= కలిగితే; ఉల్లంబు= మనస్సు; సవిస్మయంబు+ అగుచున్+ఉండన్= ఆశ్చర్యంపొందుచుండగా; యమప్రసాదంబునన్= యముడి దయతో; ఎప్పుడును= నిత్యం; మాయని= మాసిపోని; పరిజ్ఞానంబు= గొప్ప తెలివి; వర్తిల్లనున్నంతన్= ప్రవర్తిస్తుండగా; పరమ= గొప్ప; యోగి+ఇంద్ర= మహాయోగులకు; భావ్యంబు+అగు= భావించ దగ్గ; నీ; భవ్య= మహా; సన్నిధి= సాన్నిధ్యం; దొరకొనియెన్= లభించింది; అని పలికెన్= అని చెప్పాడు; అప్పుడు; ఆ+పుడమి= ఆ భూమి; తేనికిన్= రాజుకు; పూర్వ+ఆచరిత= పూర్వజన్మంలో చేసిన; పుణ్య= పవిత్ర; కర్మ+అనురూపంబు+అగు= కర్మానుగుణమైన; రూపంబు= ఆకారం; ఆవిర్భవించినన్= కలిగినంత; దానికిన్= ఆ అదృష్టానికి; ప్రమోద= సంతోషంతో; భరితుండై= నిండినవాడై; అతండు= రాజు.

**తాత్పర్యం:** ఇట్లా వింటూనే భూమిపై పడ్డాను. వెంటనే తొండరూపం వచ్చింది. ఇవ్వాళ దైవానుగ్రహంతో కలిగిన సంకల్పానుసారంగా ఈ బావి దగ్గరకు వచ్చిన మరుక్షణంలో శరీరం సాధారణంగా తొండలకు లేని విధంగా పెరిగిపోతే ఆశ్చర్యపోయాను. యముడి దయతో నాకు మంచి జ్ఞానమున్నది కనుక ఈ రోజు యోగులకు లభించే నీ దివ్య సన్నిధి నాకు లభించింది' అని చెప్పాడు. పూర్వ జన్మకర్మానుగుణమైన రూపం కలిగింది. దాని కతడు సంతోషించి.

### నృగుఁడు శ్రీకృష్ణువలనం బాపవిముక్తుఁడై పుణ్యలోకమునకుఁ బోవుట (సం.13-69-28)

**తే.** **'దేవ! నీ దగు కారుణ్య దృష్టి యమృత । పూరమును బోలె నా మీఁదఁ బొలయుటయును**
**దీనదశ పాసె; భవదనుజ్ఞానిరూఢి । నేను జనియెద సంచిత స్థానమునకు.'** **436**

**ప్రతిపదార్థం:** దేవ!= స్వామీ!; నీ దగు= నీదైన; కారుణ్యదృష్టి= దయగల చూపు; అమృతపూరమును పోలెన్= అమృత ప్రవాహంవలె; నా మీఁదన్= నాపైన; పొలయుటయును= వ్యాపించటంవలన; దీనదశ పాసెన్= దైన్యస్థితి పోయింది; భవత్= నీ; అనుజ్ఞానిరూఢిన్= ఆనతి మేరకు; సంచిత= కర్మతో సంపాదించుకొన్న; స్థానమునకున్= గతికి; నేనున్; చనియెదన్= పోతాను.

**తాత్పర్యం:** 'స్వామీ! నీ దయ అమృతప్రవాహమై నాపయి పొంగి పొరలినందువలన నా దీనత్వం తొలగిపోయింది. నీ ఆజ్ఞవలన సద్గతికి పోతాను.'

**క.** **అని సవినయ ప్రణామం । బున నారాధించి వృష్ణిపుంగవుఁ దగ వీ**
**డ్కొని యా నృగుఁడు విమానం । బున నుత్తమలోకమునకుఁ బోయె నరేంద్రా!** **437**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= మానవులకు అధిపతీ!; అని; స+వినయ= వినయంతో కూడిన; ప్రణామంబునన్= నమస్కారంతో; ఆరాధించి= పూజించి; వృష్ణిపుంగవున్= వృష్ణివంశంలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడిని; తగన్= అర్హమైన రీతిగా; వీడ్కొని= సెలవు కైకొని; ఆనృగుఁడు= ఆ నృగుడనురాజు; విమానంబునన్= విమానంమీద; ఉత్తమ= శ్రేష్ఠమైన; లోకమునకున్= లోకానికి; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** రాజా! ఈ విధంగా వినయంతో నమస్కరించి, శ్రీకృష్ణుడిని పూజించి, తగినట్లుగా వారి సెలవు గైకొని విమానంమీద ఉత్తమలోకాలకు నృగుడు వెళ్ళిపోయాడు.

**వ. ఇవ్విధంబున. 438**

**తాత్పర్యం:** ఈ విధంగా.

**క. భరితానందుఁ డగుచు నృగుఁ । డరిగిన, లోకహితకారియై కృష్ణుఁడు ని**
**ర్భర మధురతాతిహృద్యా । క్షరంబుఁగా నిట్టు లనియెఁ గౌరవముఖ్యా! 439**

**ప్రతిపదార్థం:** నృగుఁడు= ఆ రాజు; భరిత= నిండిన; ఆనందుఁడు= ఆనందం కలవాడు; అగుచున్= అవుతూ; అరిగినన్= పోగా; కృష్ణుఁడు; లోకహితకారిఐ= లోకానికి మేలుకోరినవాడై; నిర్భర= నిండారిన; మధురతా= మాధుర్యంతో; అతి= మిక్కిలి; హృద్య= హృదయరంజకమైన; అక్షరంబుఁగాన్= అక్షరాలు కలిగినట్లుగా; కౌరవముఖ్యా!= కౌరవశ్రేష్ఠుడా!; ఇట్టులు; అనియెన్.

**తాత్పర్యం:** నృగుడు ఈ విధంగా ఆనందభారంతో పోయిన తరువాత శ్రీకృష్ణుడు మాధుర్యం నిండారిన అక్షరాలతో ఇట్లా సెలవిచ్చాడు.

**క. 'ధరణీసుర ధన హరణము । దురితతమము నృపున కధిక దోషము నృగగో**
**హరణ క్రియ విప్రస్వా । హరణము భూపాలవరున కాపదఁ దెచ్చున్.' 440**

**ప్రతిపదార్థం:** నృపునకున్= రాజునకు; ధరణీసుర= బ్రాహ్మణుల; ధనహరణము= సొమ్ము నపహరించటం; దురిత తమము= మిక్కిలి పాపం; అధిక దోషము= అతిశయమైన తప్పు; నృగ గోహరణ క్రియన్= నృగుడు గోవును హరించిన రీతిగా; భూపాలవరునకున్= భూమిని పాలించే ఏ రాజుకైనా; విప్ర= బ్రాహ్మణుడి యొక్క; స్వ+ఆహరణము= సొమ్మును కాజేయటం; ఆపద తెచ్చున్= ఆపదను కలిగిస్తుంది.

**తాత్పర్యం:** 'రాజునకు విప్రుని సొమ్ము అపహరించటం చాలా పాపం. కనుక విప్రుడి సొంత ధనాన్ని ఏ రాజూ హరించరాదు. అది మహాపాపం. నృగుడు విప్రుడి ఆవును అపహరించటం వలన కదా! అంత ఆపద పొందాడు.'

**వ. అనియె; నివ్వాక్యంబులు నీకుం జెప్పవలవ దైన నితిహాసావసానువర్తి యగుటం జేసి వినిపించితి' నని చెప్పి యప్పాండవాగ్రజుతో భీష్ముండు వెండియు. 441**

**ప్రతిపదార్థం:** ఈ+వాక్యంబులు= ఈ వాక్యాలు; నీకున్= నీకు; చెప్పన్= చెప్పటం; వలవదు= అక్కర్లేదు; ఐనన్= ఐనా; ఇతిహాస+అవసాన= కథ చివరలో; అనువర్తి= అనుసరించినది; అగుటం జేసి= అయినందువలన; వినిపించితిన్= వినిపించాను.

**తాత్పర్యం:** ఈ వాక్యాలు నీకు చెప్పనక్కర్లేదు. కాని, ఈ పురాణ కథాంతంలో ఉన్నందున నీకు చెప్పవలసి వచ్చింది.' అని చెప్పి ధర్మరాజుతో భీష్ముడు ఇంకా.

**క. 'సత్సంగతి సజ్జనులకు । నుత్సవ మొనరించు నృగున కున్నతిఁ ద్విజగ**
**ద్వత్సలుఁ డగు కృష్ణుండు స । ముత్సుకతం జేరఁ జనుట యొసఁగిన మాడ్కిన్.' 442**

**ప్రతిపదార్థం:** త్రిజగత్+వత్సలుఁడు= మూడు లోకాలయందు వాత్సల్యంగలవాడు; అగు= ఐన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; సముత్సుకతన్= మంచి ఉత్సాహంతో; చేరన్+చనుట= చెంతకు జేరుట; నృగునకున్= నృగు మహారాజుకు; ఉన్నతిన్= సద్గతిని; ఒసఁగినమాడ్కిన్= అనుగ్రహించిన విధంగా; సత్+జనులకున్= మంచివారికి; సత్+సంగతి= మంచివారిస్నేహం; ఉత్సవము= పండుగ, కోర్కెలు కొనసాగడం; ఒనరించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** 'సత్పురుషులకు మహాత్ములతో కలియటం పండుగవంటిది. శ్రీకృష్ణానుగ్రహంవలన కదా నృగు డుత్తమలోకాలకు వెళ్ళాడు.'

**వ. అని పలికి మఱియును. 443**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా.

**క. 'దానము సమగ్ర ఫలదము । భూనాయక! గోవునెడ విబుద్ధిత్వము గీ**
**డైనది గావున గోస । మ్మానన మేమఱక యుండు మది యేప్రొద్దున్.' 444**

**ప్రతిపదార్థం:** భూనాయక!= రాజా!; దానము; సమగ్ర= పూర్ణసమస్త; ఫలదము= ఫలాన్నిస్తుంది.; గోవునెడన్= ఆవు విషయంలో; విబుద్ధిత్వము= అజ్ఞానం; కీడు= ఆపద; ఐనది; కావునన్= కాబట్టి; ఏ ప్రొద్దున్= ఎప్పుడును; గో సమ్మాననము= ఆవును ఆరాధించటం; మదిన్= మనస్సులో; ఏమఱక= మరువక; ఉండుము.

**తాత్పర్యం:** 'రాజా! దానం అమిత ఫలదాయి. కనుక ఆవు విషయంలో అజ్ఞానం పనికిరాదు. దానిని గౌరవంతో నిత్యమూ పూజించుము.'

**వ. అనిన విని ధర్మజుండు 'గోవులయెడ విరుద్ధాచరణంబున నయ్యెడు దురితంబు తెఱంగెఱింగించితి; గో దాన ఫలవిశేషం బింకను విన వలతుం జెప్పవే' యనుటయు, ననిమిష నదీనందనుం 'డివ్విషయంబున నైనది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపు' మని యతని కిట్లనియె. 445**

**ప్రతిపదార్థం:** అనినన్, విని; ధర్మజుండు= ధర్మరాజు; గోవుల ఎడన్= ఆవుల విషయంలో; విరుద్ధ+ఆచరణంబునన్= వ్యతిరేకమైన కర్మచేత; అయ్యెడు= కలిగే; దురితంబు= పాపంయొక్క; తెఱంగు= విధానం; ఎఱింగించితి= స్పష్టం చేశావు; గోదాన ఫలవిశేషంబు= ఆవును దానం చేయటంవలన కలిగే విశేషఫలం; ఇంకనున్= ఇంకా; వినవలతున్= వినాలనివాంఛిస్తున్నాను; చెప్పవే అనుటయున్= అని అడుగగా; అనిమిష నదీ= దేవతానదియైన గంగయొక్క; నందనుండు= కొడుకు; ఇవ్విషయంబునన్= ఈ విషయంలో; ఐనది= జరిగినది; ఒక్క+ఇతిహాసంబు+కలదు= ఒక పూర్వకథ ఉన్నది; అకర్ణింపుము= వినుము అని; అతనికిన్= ధర్మజునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆవు విషయంలో వ్యతిరేకంగా చేయటంవలన కలిగే పాపం సమగ్రంగా చెప్పావు. గోవును దానం చేసినందువలన కలిగే విశేషఫలం వినాలని ఉన్నది. చెప్పు' మని అడిగితే దేవతానది కొడుకు 'ఈ విషయంగా ఒక కథ ఉన్నది చెప్పుతాను వినుము' అని ఇట్లా అన్నాడు.

## గో ప్రభావ విషయకం బగు నౌద్దాలకి పుత్త్ర చరిత్రము (సం.13-70-1)

**సీ. 'అనఘుఁ డౌద్దాలకి యను మహాముని । దన తనయునిఁ బిలిచి యిధ్మములు దర్భ**
**కట్టయు జలపూర్ణ కలశంబుఁ బువ్వులు । మఱచి వచ్చితి నేటి మడఁ గుమార!**
**గొని రమ్ము వేగంబ చని' । యన్ననాచికేతాహ్వయుం డగు నతం దరుగునంత**
**వాహిని పొంగిన వఱ్ఱోడి యవి వోయెఁ । గానక యాతండు క్రమ్మఱంగ**

**ఆ. నరుగుదెంచి కాన ననుటయు నాఁకలి । దనదు కర్మవైకృతంబు సైఁపఁ**
**జాలకలిగి 'యోరి! జముఁ జూడఁ బొమ్మని । శాప మిచ్చెఁ దండ్రి భూపవర్య! 446**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పుణ్యాత్ముడు; ఔద్దాలకి= ఉద్దాలకుడి కొడుకు; అనుమహాముని= అనేగొప్ప ఋషి; తన; తనయునిన్= కొడుకును; పిలిచి; ఇధ్మములు= అగ్నిలో వేసే సమిధలు; దర్భకట్టయున్= దర్భలకట్ట; జలపూర్ణకలశంబున్= నీరునిండా ఉన్న చెంబు; పువ్వులున్; ఏటిమడన్= ఏటిరేవులో - ఒడ్డున; మఱచివచ్చితిన్; కుమార!= నాయనా!; వేగంబ చని= త్వరగా పోయి; కొనిరమ్ము= తీసికొనిరమ్ము; అన్నన్= అని చెప్పగా; నాచికేత+ఆహ్వయుండు+అగు+అతండు= నాచికేతుడన్నపేరుగల ఆతడు; అరుగునంతన్= వెళ్ళేలోపల; వాహిని= నది; పొంగినన్= పొంగగా; వఱ్ఱు ఓడి= వరదపాలై, ప్రవాహంపాలై; అని పోయెన్= తండ్రి చెప్పినవన్నీ నీటిలో కొట్టుకొనిపోయాయి; ఆతండు= నాచికేతుడు; కానక= చూడక; క్రమ్మఱంగన్= తిరిగి; అరుగుదెంచి= వచ్చి; కానన్= వాటిని చూడలేకపోయాను; అనుటయున్= అనగా; ఆఁకలి; తనదు= తన; కర్మవైకృతంబు= కర్మ దుష్ఫలితం; సైఁపన్‌చాలక= ఓర్చుకొనలేక; తండ్రి; ఓరీ= కోపంతోచేసిన సంబోధన; జమున్= యముడిని; చూడన్= చూడటానికి; పొమ్ము= పో; అని; అలిగి= కోపించి; శాపమున్; ఇచ్చెన్.

**తాత్పర్యం:** ఉద్దాలకుని కొడుకు ఔద్దాలకి. అతడి కొడుకు నాచికేతుడు. ఒకరోజు తండ్రి కొడుకుతో 'నాయనా! ఏటిరేవులో కుశలు, సమిధలు, కమండలువు, పూలూ అన్నీ మరచిపోయి వచ్చాను. త్వరగా పోయి తీసికొనిరమ్ము' అన్నాడు. కొడుకూ సరే నని పోగా, అంతకుముందే నది పొంగి వాటిని తనతోపాటు తీసికొనిపోయింది. కొడుకు వాటిని కానక తిరిగివచ్చి తండ్రితో చెప్పగానే ఆయనకు ఆకలి, దుష్ట కర్మఫలం ఏకమై క్రమ్ముకోగా కొడుకును 'యముడి దగ్గరికి పొమ్ము' (చావుము) అని శపించాడు.

**విశేషం:** ఇందులో తెలుగు మాటలు - ఏటిమడ, వఱ్ఱు, ఓడి (నీరు ఓడటం) చాలా అందమైనవి.

ఈ ఔద్దాలకి - నాచికేతుల కథ కఠోపనిషత్తులోనిది. ఇందులో తండ్రి ముసలి ఆవులను దానంచేస్తూ ఉంటే చూచిన కొడుకు న న్నెవరికి దానం చేస్తా? వని ముమ్మా రడిగితే 'యముడికి' అని తండ్రి కోపంతో విసుగుతో అంటాడు. వాడు యముడి దగ్గరకు వెళ్ళి ఆధ్యాత్మికవిద్య నెరిగి వస్తాడు. అదే కఠోపనిషత్తు.

**వ. ఇట్లు శపియించిన నబ్బాలకుండు గేలు మోడ్చి ఫాలంబున మోపికొనుచుం 'బ్రసన్నుండ వగు' మని పలుకు పలుకఁగాఁ జేతనారహితుండై పడుటయు నమ్మునివరుండు. 447**

**ప్రతిపదార్థం:** ఇట్లు; శపియించినన్; ఆ+బాలకుండు= ఆ పిల్లవాడు; కేలు= చేయి; మోడ్చి= ముడిచి; ఫాలంబునన్= నుదుటిపై; మోపికొనుచున్= ఆనిస్తూ; ప్రసన్నుండవు= ప్రశాంత మనస్కుడవు; అగుము= కమ్ము; అని పలుకు= మాట; పలుకఁగాన్= అన్నంతలో; చేతనా= చైతన్యం, ప్రాణం; రహితుండై= పోయినవాడై; పడుటయున్= క్రిందపడటంతో; ఆ మునివరుండు= ఆ మునిరాజు.

**తాత్పర్యం:** తండ్రి శపించేసరికి కొడుకు నమస్కరించి తండ్రీ నా పై దయ చూపించుమని అంటూ ఉండగానే అతడి ప్రాణం పోయి క్రింద పడ్డాడు. అప్పుడు తండ్రి.

**క. కనుఁగొని పశ్చాత్తాపం । బున నుల్లం బెరియ నిట్లు పుత్త్రకు నే నే**
**పనికై చేసితి విగతా । సునిఁగా నని మూర్ఛ మునుఁగుచుం బడియె ధరన్. 448**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; పశ్చాత్= వెనుక కలిగే; తాపంబునన్= బాధచేత; ఉల్లంబు= మనస్సు; ఎరియన్= మాడిపోగా; ఇట్లు; పుత్త్రకున్= కొడుకును; నేను; ఏ పనికై= దేనికొరకు; విగత+అసునిన్ కాన్= పోయిన ప్రాణాలు కలవాడినిగా; చేసితిన్= చేశాను; అని; మూర్ఛన్= మూర్ఛలో; మునుఁగుచున్= మునుగుతూ; ధరన్= భూమిపై; పడియెన్=పడ్డాడు.

**తాత్పర్యం:** చూచి తండ్రి పశ్చాత్తాపంతో కుమిలి 'అయ్యో! కొడుకును దేనికొరకు చంపుకొన్నా?'నని మూర్ఛపడ్డాడు.

**వ. పడి యొక్కింతసేపునకుం దేఱి తనయుం దేఱి చూచి యశ్రులొలుక నబ్బాలకు నురంబున మొగంబు మోపి చేష్ట దక్కి యుండ, నద్దినశేషంబును నయ్యామినియునుం జనియె సూర్యోదయ సమయంబున. 449**

**ప్రతిపదార్థం:** పడి= భూమిపై పడి ఒక్కింతసేపునకున్= కొంచెం సేపటికి; తేఱి= తేరుకొని; తనయున్= కొడుకును; తేఱి జూచి= తేరిపార చూచి; అశ్రులు+ఒలుకన్= కన్నీరు పారగా; ఆ+బాలకు= ఆ కొడుకుయొక్క; ఉరంబునన్= రొమ్ముపై; మొగంబు= తనమొగం; మోపి= ఆనించి; చేష్ట+తక్కి= చైతన్యంపోయి; ఉండన్= ఉన్నంతలో; ఆ+దినశేషంబును= ఆ మిగిలిన పగలు; ఆ+యామినియున్= ఆ రాత్రికూడా; చనియెన్= కడచింది; సూర్య+ఉదయ సమయంబునన్= తెల్లవారి ప్రొద్దుపొడిచేవేళ.

**తాత్పర్యం:** కొంతసేపటికి తేరుకొని కొడుకును చూచి ఏడ్చి, పిల్లవాడి రొమ్మున మొగంపెట్టి నిశ్చేష్టుడై ఉన్నంతలో మిగిలిన పగటితోపాటు రాత్రికూడ గడచిపోయింది. ప్రొద్దుపొడుస్తున్న వేళలో.

**ఆ. అతని కన్ను నీర నాప్లుతంబైన యా । శవము చేతనించి చలన మొంది**
**యెలమి నత్తపస్వి యీక్షించుచుండఁ గ । న్దెఱచె, నిట్లు మగుడఁ దెలివినొంది. 450**

**ప్రతిపదార్థం:** అతనికన్ను నీరన్= తండ్రియొక్క కన్నీటితో; ఆప్లుతంబైన= అంతటా తడిసిపోయిన; ఆ శవము; చేతనించి= చైతన్యం పొంది; చలనమొంది= కదలిక కలిగి; అత్తపస్వి= ఆ ముని; ఎలమిన్= సంతోషంతో; ఈక్షించుచుండన్= చూస్తుండగా; అట్లు; మగుడన్= తిరిగి; తెలివిన్+ఒంది= తెలివి కలిగి; కన్+తెఱచెన్= కన్ను విప్పాడు.

**తాత్పర్యం:** తండ్రి కన్నీటిలో నానిపోయిన ఆ శవం క్రమంగా చైతన్యం పొంది తెలివి కలుగగా తిరిగి కళ్ళు తెరిచాడు.

**క. తనుఁ గనుఁగొనియెడి సుతుతో । మునిపతి యి ట్లనియెఁ 'బుణ్యముల ప్రోఁకవు నీ**
**వనఘ! చని పుణ్యలోకముఁ । గని మత్పుణ్యమున రాక గలిగెను మగుడన్. 451**

**ప్రతిపదార్థం:** తనున్= తనను; కనుఁగొనియెడి= చూచెడు; సుతుతోన్=కొడుకుతో; మునిపతి= మునిరాజు; ఇట్లు; అనియెన్; పుణ్యముల ప్రోఁకవు= నా పున్నెముల రాశివి; అనఘ!; నీవు; చని= పోయి; పుణ్యలోకమున్= ఏ స్వర్గలోకమునో; కని= చూచి; మత్= నా; పుణ్యమునన్= పుణ్యంతో; మగుడన్= తిరిగి; రాక= రావటం; కలిగెను= సంభవించింది.

**తాత్పర్యం:** తనను చూస్తున్న కొడుకుతో తండ్రి 'నా పుణ్యాలరాశీ! నాయనా! ఏ పుణ్యలోకమో పోయి తిరిగి నా అదృష్టంచేత తిరిగి రావటం కలిగిందిరా!

**క. నీదగు తనువున దివ్యా । మోదము సాంద్రమయి సోడు ముట్టెడు నత్యా**
**హ్లాదమహాశ్చర్యసము । త్పాది యగుచు; నీగతాగతములం జెపుమా!' 452**

**ప్రతిపదార్థం:** అతి= మిక్కిలి; ఆహ్లాద= సంతోషం; మహా+ఆశ్చర్యం= గొప్ప అద్భుతం; సముత్పాది= కలిగించేది; అగుచున్= అవుతూ; నీది+అగు= నీదైన; తనువునన్= శరీరంలో; దివ్య= దేవతా సంబంధమైన; ఆమోదము= పరిమళం; సాంద్రము+అయి= దట్టమై; సోడు= బ్రహ్మరంధ్రము; ముట్టెడున్= తాకుతున్నది; నీ= నీయొక్క; గత= పోక; ఆగతములన్= రాకలను గురించి; చెపుమా!= చెప్పరా!

**తాత్పర్యం:** నీ శరీరం నుండి దివ్యమైన వాసనలేవో గుబులుకొంటూ నాసాగోళాలనంట తాకుతున్నవి. ఇది చాలా ఆహ్లాదంగా, ఆశ్చర్యంగా ఉన్నది. కనుక నీ వెక్కడికి వెళ్ళావు? మరలా ఎట్లా తిరిగి రాగలిగావు? ఆ కథ చెప్పవయ్యా!'

**వ. అనిన విని యమ్మునిపతికిం బ్రణమిల్లి యక్కుమారుం డిట్లనియె. 453**

**ప్రతిపదార్థం:** అనినన్‌విని; ఆ మునిపతికిన్= ఆ మునిశ్రేష్ఠుడికి; ప్రణమిల్లి= నమస్కరించి; ఆ కుమారుండు= ఆ బాలకుడు; ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** ఆ మాటలు విని కొడుకు తండ్రికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

**సీ. ' నీ యాజ్ఞఁ జని కమనీయ విశాలమై । మణిమయత్వంబున మహిత మగుచు**
**వెలిఁగెడు సమవర్తి కొలువు కూటముఁ బ్రవే । శించితి నాతఁడు సేరఁ బిలిచి**
**యంచితాసనము వెట్టించి భవద్గౌర వాతిశయంబున నర్ఘ్య ముఖ్య**
**పరిపూజనముల సంభావించె నతనితో । 'నే లోకమున వసియించువాఁడ**

**తే. ననఘ! యానతి యిమ్ము నా కంటి 'ననిన । 'నీవు సావవు; నీ తండ్రి నిన్ను జమునిఁ**
**జూడఁ బొమ్మని పనిచినఁ జూచి; తంద । యరుగు మమ్ముని వగ పేద' ననియె నతఁడు. 454**

**ప్రతిపదార్థం:** నీ యాజ్ఞన్= నీ ఆనతితో; చని= వెళ్ళి; కమనీయ= అందమైన; విశాలమై= విశాలమైన; మణిమయత్వంబునన్= మణులు నిండారి ఉన్నందున, మణులతో స్థగితమైనందున; మహితము= గొప్పది; అగుచున్= అవుతూ; వెలిఁగెడు= ప్రకాశించే; సమవర్తి= యముడి; కొలువుకూటమున్= సభాశాలలో; ప్రవేశించితిన్= ప్రవేశించాను; ఆతఁడు= ఆ యముడు; చేరన్ పిలిచి= దగ్గరకు పిలిచి; అంచిత= అందమైన; ఆసనము= పీఠం; పెట్టించి= భటులతో ఏర్పాటుచేసి; భవత్= నీపై మున్న; గౌరవ అతిశయంబునన్= అధిక గౌరవ భావంతో; అర్ఘ్య= ఆచమించే నీరు; ముఖ్య= మొదలైన; పరిపూజనములన్= గొప్ప పూజలతో; సంభావించెన్= నన్ను గౌరవించాడు; అతనితోన్; అనఘ!= పుణ్యాత్ముడా!; ఏ లోకమునన్= ఏ లోకంలో; (నేను) వసియించువాఁడను= వసించాలి; నాకున్; ఆనతిఇమ్ము= సెలవిమ్ము; అంటిన్= అన్నాను; అనినన్; నీవు; చావవు= చచ్చిపోలేదు; నీ తండ్రి; నిన్నున్; జమునిన్= యముడిని; చూడన్+పొమ్ము= చూడటానికి పొమ్ము; అని; పనిచినన్= ఆజ్ఞాపిస్తే; చూచితి= (వచ్చి నన్ను) చూచావు; ఆ+ముని= ఆ మునియొక్క; వగపు= దుఃఖం; ఏదన్= పోగా; అంద= అక్కడికే; అరుగుము= పొమ్ము; అని అతఁడు= ఆ యముడు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నీ యానతితో నేను వెళ్ళి విశాలమైన మణులు పొదిగిన అందమైన యముడి కొల్వుకూటంలో ప్రవేశించేసరికి ఆయన నీమీదున్న గౌరవభావంతో నాకు సింహాసనం, అర్ఘ్యం మొదలైనవి ఇచ్చి గౌరవించాడు. నే నన్నాను అర్థంగాక - 'ప్రస్తుతం నేను ఏ లోకంలో ఉండాలని అని అడుగగా అత డన్నాడు 'నీవు చావలేదురా! నీ తండ్రి యముడిని చూడరా' అని తిట్టాడు కదా! చూచావు. అక్కడికే పొమ్మ! పాపం మీ నాయన ఏడుస్తున్నాడు' అని అన్నాడు.

**విశేషం:** భవత్ గౌరవాతిశయంబునన్ - అని అనటం గొప్ప సంస్కార ఫలితం. అది తన గొప్పతనమని భ్రమించవచ్చునుగదా! కనుక నాచికేతుడి మర్యాదను సూచిస్తున్నది. యముడి మాటలు పెద్దవాడు చిన్నవాడితో ముద్దుగా అన్నట్లున్నాయి.

**వ. అనుటయు 'నట్లకాక! మగిడిపోయెద; నీ కడకు వచ్చితి, ధర్మమయుండవగు నిన్ను దర్శించితిం; బుణ్యలోకంబులు దర్శింప వేడ్క పుట్టెడుఁ జూపవే' యని విన్నవించిన. 455**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనియముడు పలుకగా; అట్లకాక= అట్లాగే; మగిడి= తిరిగి; పోయెదన్= పోతాను; నీ కడకున్= నీ దగ్గరకు; వచ్చితిన్= వచ్చాను; ధర్మమయుండవు= ధర్మ స్వభావుడవు; అగు= అయిన; నిన్నున్= నిన్ను (యమధర్మరాజును) దర్శించితిన్= దర్శించగలిగాను; పుణ్యలోకంబులు= స్వర్గాది పుణ్యలోకాలు; దర్శింపన్= చూడాలనే; వేడ్క+పుట్టెడున్= కోరిక కలుగుతున్నది; చూపవే= చూపించవా; అని= అని; విన్నవించినన్= విన్నపం చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** 'అట్లాగే తిరిగి వెళ్ళుతాను. ధర్మమూర్తివైన నిన్ను దర్శించాను. పుణ్యలోకాలని ఉంటాయట గదా! వాటిని దర్శించాలని కోరికగా ఉన్నది. చూపించవా!' అని విన్నవించుకొనగా.

**ఉ. అంచిత వాహనా కలిత యానముఁ దేరఁగఁ బంచి నన్ను నె**
**క్కించి సహాధిరూఢుఁ డయి కేల్ దన కేల నమర్చి సత్కథా**
**సంచయవర్తనుం డగుచుఁ జారుముఖాబ్జవికాస మొప్ప వ**
**ర్తించుచుఁ బుణ్యలోకములు ప్రీతి యెలర్పఁగ నాకుఁ జూపినన్. 456**

**ప్రతిపదార్థం:** అంచిత= అందమైన; వాహన+ఆకలిత= గుర్రాలను పూంచిన; యానమున్= బండిని; తేరఁగన్+పంచి= తెప్పించి; నన్నున్; ఎక్కించి; సహ+అధిరూఢుఁడు+అయి= నాతోపాటు తానూకూర్చుండి; కేల్= నా చేతిని; తనకేలన్= తన హస్తంలో; అమర్చి= ఘటించి, పట్టుకొని; సత్ కథా సంచయ= దివ్యకథలసమూహం; వర్తనుండు+అగుచున్= చెప్పుతూ; చారు= అందమైన; ముఖ= ముఖం అనెడి; అబ్జ= తామరపూవుయొక్క; వికాసము+ఒప్పన్= వికసించిన అందం ప్రకాశించగా; వర్తించుచున్= మెలగుతూ; పుణ్యలోకములు= స్వర్గాది లోకాలను; ప్రీతి= ప్రేమ; ఎలర్పఁగన్= తేటపడగా; నాకున్; చూపినన్= చూపించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** అందమైన గుర్రాలు కట్టిన రథం తెమ్మని ఆజ్ఞాపించి నన్ను ఎక్కించి (చేతితో పట్టి) తానూ నాతోపాటు కూర్చుండి తనచేతితో నాచేయి పట్టుకొని, మంచి కథలు చెప్పుతూ వికసించిన ముఖంతో నవ్వుతూ నాకు పుణ్యలోకాలన్నీ చూపించగా.

**తే. నయనములకుఁ జిత్తమున కానంద మొసఁగు । నట్టి మణిగేహవాపికోద్యానములును**

**బరమభక్ష్య భోజ్యాత్మక గిరులు హృద్య । దుగ్ధ ఘృతమయ ఘనసరిత్తులును గంటి. 457**

**ప్రతిపదార్థం:** నయనములకున్= కన్నులకు; చిత్తమునకున్= మనస్సుకు; ఆనందమున్= ఆనందం; ఒసఁగునట్టి= కలిగించే; మణిగేహ= మణులు తాపిన ఇండ్లు; వాపికా= దిగుడు బావులున్నూ; ఉద్యానములును= ఉద్యాన వనాలున్నూ; పరమ= గొప్ప; భక్ష్య= నమిలి తినేవి; భోజ్య= భుజించేఆహారాలు; ఆత్మక= కల; గిరులు= కొండలు; హృద్య= ఆప్యాయమైన; దుగ్ధ= పాలు; ఘృత= నేయి; మయ= మయమైన; ఘన= గొప్ప; సరిత్తులును= నదులును; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** కళ్ళకూ మనస్సుకూ ఆహ్లాదాన్ని కలిగించే మణిసౌధాలు, దిగుడుబావులు, ఉద్యానవనాలూ, కొండలవలె ఉన్న భక్ష్యాలు, భోజ్యాలు, నదులై పారే పెరుగు, పాలు, నేయి చూచాను.

**విశేషం:** కొండలే భక్ష్యభోజ్యాలుగా ఉన్నాయి. పాలు, నేయి నదులుగా పారుతున్నాయి.

**వ. మఱియు గంధమాల్య దివ్యాంబరాభరణ ప్రముఖంబులగు భోగ యోగ్య పదార్థంబులు మహారాసులై యుండ నాలోకించితి; 'నీ లోకంబు లే పుణ్యంబులు సేసిన జనుల కనుభావ్యంబు?' లని యడిగితి; నడిగిన ధర్మరా జిట్టిట్టి వారివని యెఱింగించి 'యిం దధిక విభవంబులైన యట్టి మాననీయ స్థానంబులు గోదానంబు లాచరించిన వారలయవి; భక్ష్యభోజ్య గిరులును దుగ్ధ ఘృతనదులును వారివ' యని చెప్పి, వెండియు.458**

**ప్రతిపదార్థం:** గంధ= చందనం; మాల్య= పూదండలు; దివ్య= దేవతా సంబంధమైన; అంబర= వస్త్రాలు; ఆభరణ= నగలు; ప్రముఖంబులు+అగు= మొదలైనవి; భోగయోగ్య= అనుభవించటానికి తగిన; పదార్థంబులున్= వస్తువులు; మహా= గొప్ప; రాసులై= గుట్టలై; ఉండన్= ఉండగా; ఆలోకించితిన్= చక్కగా చూచాను; ఈ లోకంబులు= ప్రస్తుతం నేను చూస్తున్న ఈ లోకాలు; ఏ పుణ్యంబులు= ఎట్లాంటి పుణ్యాలు; చేసిన; జనులకున్; అనుభావ్యంబులు= భోగించ దగ్గవి; అని; అడిగితిన్; అడిగినన్; ధర్మరాజు; యముడు; ఇట్టిట్టివారివి= ఇట్లాంటి వారికి సంబంధించినవని; ఎఱింగించి= స్పష్టపరచి; ఇందున్; అధిక విభవంబులు= మిక్కిలి వైభవం కలవి; ఐనయట్టి; మాననీయ= గౌరవింపదగ్గ; స్థానంబులు= లోకాలు; గోదానంబులు; ఆచరించిన వారలయవి= చేసినవారివి; భక్ష్యభోజ్య గిరులును= భక్ష్యాల, భోజ్యాల కొండలు; దుగ్ధ= పాలు; ఘృత= నేయి; నదులును; వారివ= గోదానం చేసినవారివే, అని చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** మంచిగంధం, పూలమాలలు, దేవలోకంనుండి వచ్చిన వస్త్రాలు, ఆభరణాలు మొదలైన భోగాలకు తగిన పదార్థాలు పెద్దరాసులుగా ఉండగా చూచాను. ఈ లోకాలు ఏ పుణ్యకార్యాలు చేసినవారికి అనుభవించదగినవి అని అడిగాను. అప్పుడు ధర్మరాజు ఇటువంటివారివి యీలోకాలు అని తెలియజేసి ఇందులో చాలా గొప్ప సంపదలుగలవి, గొప్పగా భావింపదగినవి అయిన స్థానాలు గోదానాలు చేసిన వారివి. భుజింపదగిన పదార్థాలకొండలు, పాలు, నెయ్యి అనేవాని నదులున్నూ వారివే అని చెప్పి యింకా.

**క. మానిత పాత్రము సద ను । ష్ఠానంబును బ్రీతి భక్తి సంపన్నతలున్**

**ధేనువు మేలిమియుం గల । దానముఫల మిట్టి దనఁగఁ దరమె యజునకున్. 459**

**ప్రతిపదార్థం:** మానిత= గౌరవింప దగ్గదీ; పాత్రము= యోగ్యమైనదీ; సత్+అనుష్ఠానంబును= మంచి కర్మానుష్ఠానానికి యోగ్యమైనదీ; ప్రీతి= ప్రేమ; భక్తి; సంపన్నతలున్= సంపదలును; ధేనువు= ఆవే; మేలిమియున్= మేలు; ఆధిక్యం; కల= కలిగిన; దానము ఫలము= దానఫలం; అజునకున్= బ్రహ్మకు; ఇట్టిది; అనఁగన్= అనటానికి; తరమె!= శక్యమా!

**తాత్పర్యం:** గౌరవించ దగినదీ, యోగ్యమైనదీ, అనుష్ఠానం, ప్రేమ, భక్తి సంపదల మేల్మిగలట్టి గోదాన ఫల మింతింతని చెప్పటానికి బ్రహ్మకు శక్యం కాదు.

**తే. బలము లేఁబ్రాయమును రూపుఁ గలుగునట్టి । గనపయెద్దు సద్ధర్మ విప్రునకు నిచ్చి**

**నతఁడు సద్విధి గోదాన మాచరించి । నతని పడసిన గతిఁ గాంచు ననఘచరిత! 460**

**ప్రతిపదార్థం:** అనఘ చరిత!= పుణ్య ప్రవర్తన కలవాడా!; బలము; లేఁబ్రాయమును= లేతవయస్సు; రూపు= రూపం; కలుగు+అట్టి= ఉన్నటువంటి; గనపయెద్దున్= ఎత్తైన, బలిసిన ఎద్దు; సత్+ధర్మ విప్రునకున్= మంచి ధర్మపరుడైన బ్రాహ్మణుడికి; ఇచ్చినతఁడు= దానం చేసినవాడు; సత్+విధిన్= వేదోక్తంగా; గోదానమున్; ఆచరించినతని= చేసినవాడు; పడసిన గతిన్= పొందిన దశను; కాంచున్= పొందగలడు.

**తాత్పర్యం:** బలం, రూపం, లేతవయస్సు గల గనపయెద్దును ధర్మపరుడైన సద్బ్రాహ్మణునకు దానంచేస్తే వేదోక్తంగా గోదానం చేసినవాడు పొందే సద్గతి పొందగలడు.

**క. గోవులు సూర్యుని యుజ్జ్వల । గోవులయ ట్లగుటఁ జేసి గోదానపరుల్**

**భూవినుతా! సూర్య సదృశు । లై వెలుఁగుదు; రిట్ల చెప్పు నాగమఫణితుల్.' 461**

**ప్రతిపదార్థం:** గోవులు= ఆవులు; సూర్యుని= సూర్యుడియొక్క; ఉత్+జ్వల= ప్రకాశించే; గోవుల కిరణాల; అట్లు; అగుటన్+చేసి= అయినందువలన; గోదానపరుల్= ఆవులను దానం చేసేవారు; భూవినుతా!= లోకంచేత పొగడబడేవాడా! సూర్యసదృశులు+ఐ= సూర్యుడివంటివారై; వెలుఁగుదురు= ప్రకాశిస్తారు; ఆగమ ఫణితుల్= వేదవాక్యాలు; ఇట్లు+అ చెప్పున్= ఇట్లా చెప్పుతున్నాయి.

**తాత్పర్యం:** ఆవు లంటే సూర్యకిరణాలవంటివి. కనుక గోదానం చేసేవారు సూర్యుడివలె ప్రకాశిస్తా రని ఆగమమార్గాలు చెప్పుతున్నాయి.'

**క. అని పలికి వీడుకొలిపిన । మునివర! యజ్జముని చరణముల కెఱఁగి ముదం**

**బున వచ్చితి' ననె జనకుని । మన మానందరసపూర మయతం బొంగన్. 462**

**ప్రతిపదార్థం:** అని పలికి; వీడుకొలిపినన్= సెలవిప్పించగా; మునివర!= మునిశ్రేష్ఠా!; ఆ+జముని= ఆ యముని; చరణములకున్= పాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; ముదరంబునన్= సంతోషంతో; వచ్చితిన్= వచ్చాను; అనెన్= అన్నాడు; జనకుని= తండ్రి; మనము= మనస్సు; ఆనందరస= ఆనందరసమనెడు; పూర= ప్రవాహ; మయతన్= స్వరూపంతో; పొంగన్= పొంగులెత్తగా.

**తాత్పర్యం:** అని చెప్పి నన్ను పొమ్మనగా ఆ యముడి పాదాలకు నమస్కరించి సంతోషంతో వచ్చాను' అని తండ్రి మనస్సులో ఆనందరసం పొంగిపొరలేటట్లుగా వినిపించాడు.

### ఇంద్రునకు బ్రహ్మ చెప్పిన గోదాన విషయక వాక్యము (సం.13-71-5)

**వ. అని చెప్పిన విని కుంతీతనయాగ్రజుండు 'గోదాన కర్త లెందేని వసింతు రాలోకం బెట్టి? దెఱింగింపు' మనిన నన్నరదేవునితో దేవవ్రతుండు 'దీనికి బ్రహ్మావాక్యంబులు గల; విట్ల యింద్రుం డడిగిన నతనికి బ్రహ్మ యిట్లనియె. 463**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని భీష్ముడుచెప్పగా, విని= ఆలకించి; కుంతీతనయ+అగ్రజుండు= కుంతి కొడుకులలో పెద్దవాడు; గోదానకర్తలు= ఆవులను దానంచేసినవారు; ఎందున్+ఏని= ఎక్కడ; వసింతురు= నివాసం చేస్తారో; ఆలోకంబు= ఆ గోలోకం; ఎట్టిది= ఎట్లాంటిది; ఎఱింగింపుము= తెలియజేయుము; అనినన్=అనగా; ఆ+నరదేవునితోన్= ఆ రాజుతో; దేవవ్రతుండు= భీష్ముడు; దీనికిన్; బ్రహ్మ వాక్యంబులు= బ్రహ్మచెప్పిన సమాధానములు; కలవు= ఉన్నవి; ఇట్లు+అ = ఈ విధంగా; ఇంద్రుండు=ఇంద్రుడు; అడిగినన్= అడుగగా; అతనికిన్= ఇంద్రునికి; బ్రహ్మ= బ్రహ్మ; ఇట్లు+అ= ఈ విధంగా జవాబు చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా భీష్ముడు చెప్పిన తరువాత ధర్మరా జన్నాడు 'గోదానం చేసినవా రేలోకాలకు పోతారో చెప్పుము' అని. దానికి భీష్ముడు 'నీవలె పూర్వం ఇంద్రుడు బ్రహ్మ నడిగితే ఆయన చెప్పిన మాటలు వినిపిస్తాను విను' మని ఇట్లా అన్నాడు.

**ఆ. 'అడిగి మేలు సేసి; తాలోక మెవ్వరు । నెఱుఁగ కునికిఁ దెల్ల; మేను సువ్ర**
**తాత్ములైన మునులు నతుల పాతివ్రత్య । సతులు నెఱుఁగుదుము విశాలచిత్త! 464**

**ప్రతిపదార్థం:** విశాలచిత్త!= గొప్ప మనస్సు కలవాడా! అడిగి= ప్రశ్నించి; మేలుచేసితి= మేలు చేశావు; ఆలోకమున్= ఆలోకాన్ని; ఎవ్వరున్= ఎవ్వరూ; ఎఱుఁగక+ఉనికి= తెలియకుండటం; తెల్లము= స్పష్టం; ఏనున్= నేను; సువ్రత+ఆత్మలు= గొప్ప వ్రతాలు చేసే స్వభావం కలవారు; ఐన మునులు= ఐనటువంటి ఋషులు; అతుల= సాటిలేని; పాతివ్రత్య సతులు= పతియే (భర్తే) దైవమని ఆరాధించే శీలవతులు; ఎఱుఁగుదుము= ఆ లోకం గురించి ఎరిగినవాళ్ళం.

**తాత్పర్యం:** 'ఆలోకం తెలిసినవారు నేను, వ్రతనిష్ఠులైన మునులు, పతివ్రతలైన స్త్రీలు మాత్రమే. కనుక నీ వడిగి లోకానికి మేలు చేశావు. నీ వడగకపోతే ఈ విషయం మాలోనే ఉండి ఎవరికీ తెలిసేది కాదు.

**క. విను మయ్యెడఁ గాలక్రమ । మును డప్పియు రోగములును ముదిమియు లే; వ**
**వ్వినుత స్థానం బవ్యయ । మును గేవల సార సంప్రమోదకరంబున్. 465**

**ప్రతిపదార్థం:** వినుము; ఆ+ఎడన్= ఆ చోట; కాల= కాలంయొక్క; క్రమమును= క్రమం; డప్పియున్= దప్పిక; రోగములునున్= రోగాలు; ముదిమియున్= ముసలితనం; లేవు; ఆ+వినుత= ఆ పొగడదగిన; స్థానంబు= చోటు; న+వ్యయమునున్= నాశనంలేనిది; కేవల= ముఖ్య; సార= సారవంతమైన; సంప్రమోదకరంబున్= మంచి ఆనందం కలిగించేది.

**తాత్పర్యం:** ఆ లోకంలో కాలక్రమ ముండదు. ఋతువు లుండవు, దప్పి, రోగాలు ముసలితనం లేవు. ఆ ప్రశంసింపదగ్గ లోకం నాశనం లేనిది. స్వచ్ఛమైన ఆనందాన్ని కలిగించేది.

**వ. దానిపేరు గోలోకంబు. 466**

**తాత్పర్యం:** దాని పేరు గోలోకం.

**క. గురు శుశ్రూషకులును, స । త్యరతులు శమదమ వినిర్మలాత్ములు దుర్భ**
**క్ష్యరహితులును నిల్తు రను । త్తర మగునచ్చోట గోప్రదానపరులతోన్. 467**

**ప్రతిపదార్థం:** న+ఉత్తరము= అత్యుత్తమమైనది; అగు; ఆ+చోటన్= ఆ గోలోకంలో; గోప్రదాన పరులతోన్= ఆవులను దానం చేసేవారితోపాటుగా; గురు శుశ్రూషకులునున్= గురువులను సేవించేవారున్నూ; సత్యరతులున్= నిజాన్నే చెప్పేవారున్నూ;

శమ, దమ= బయటి ఇంద్రియాలను, లోపలి ఇంద్రియాలను (జయించిన); వినిర్మల+ఆత్ములు= స్వచ్ఛమైన ఆత్మలు కలవారు; దుర్+భక్ష్య రహితులున్= చెడు తిండి తిననివారూ; నిల్తురు= నివసిస్తారు.

**తాత్పర్యం:** ఆ లోకంలో గోదానం చేసేవారితోపాటుగా, గురువులను సేవించేవారూ, సత్యమే చెప్పేవారూ, అంతరింద్రియ, బహిరింద్రియ జయంద్వారా పరిశుద్ధమైన ఆత్మలు కలవారూ, అపవిత్రాహారం తిననివారూ నివసిస్తారు.'

**వ. అని వెండియు. 468**

**తాత్పర్యం:** అని చెప్పి, మరలా (ఇట్లా అన్నాడు)

**ఉ. 'దాయధనంబు సంగరవిధా సముపార్జితమున్ సధర్మ కో**
**పాయసమాహితంబును శుభప్రతిపాదనలబ్ధమున్ మరు**
**న్నాయక! వెండియుం గలుగు నాయపుఁ జొప్పుల సొమ్ములుం దగన్**
**గో యజనార్థ సత్క్రియలకుం బెఱసొమ్ముల నైనఁ గీడగున్. 469**

**ప్రతిపదార్థం:** మరుత్+నాయక!= ఇంద్రుడా! (దేవతలరాజా!); గో=ఆవులు; యజన= యజ్ఞం; అర్థ= విషయమైన; సత్ క్రియలకున్= మంచికార్యాలకు; (ఆవులను దానం చేయటమనే యజ్ఞరూపమైన మంచికర్మల కొరకు లేదా గోదాన యజ్ఞం మొదలైన మంచి పనులకొరకు;) దాయ ధనంబు= దాయాదుల సొమ్ము; సంగరవిధా= యుద్ధ విధానంతో; సముపార్జితమున్= సంపాదించినది; స+ధర్మక+ఉపాయ= ధర్మంతో కూడుకొన్న ఉపాయం ద్వారా; సమాహితంబునున్= కూడబెట్టినదీ; శుభప్రతిపాదన= శుభమైన వృత్తి మొదలైన చేష్టద్వారా; లబ్ధమున్= లభించిందీ; వెండియున్= ఇంకా; కలుగు= ఉన్న - చెప్పక వదలిన; ఆయము+చొప్పులన్= ఆదాయం పద్ధతులతో లభించిన; సొమ్ములున్= ధనం; తగున్= ఉచితమైనది; పెఱ= ఇతరమైన; సొమ్ములను+ఐనన్= ధనంతో నయితే; కీడు+అగున్= హాని కలుగుతుంది.

**తాత్పర్యం:** ఆవులను దానం చేయటానికి కావలసిన ధనం పవిత్రంగా సంపాదించినదై ఉండాలి. దాయల ధనం, యుద్ధజయం ద్వారా, ధర్మసాధనలద్వారా, శుభవృత్తులద్వారా సంపాదించిన డబ్బే కావాలి. ఇంకా ఇట్లాంటి పవిత్ర కార్యాల ద్వారా లభించిన ధనం కావాలి తప్ప పెర సొమ్ములు పనికిరావు. దీనివలన కీడు తప్ప మంచి జరుగదు.

**క. విను గోలోకంబును గడ । చిన లోకము గలుగ; దూఁది చెప్పెదఁ బుణ్యం**
**బును గోప్రదాన విధి మిగి । లిన యట్టిది వత్స! యొండు లే దరయంగన్. 470**

**ప్రతిపదార్థం:** విను= వినుము; గోలోకంబును= గోలోకాన్ని; కడచిన= అతిక్రమించిన; లోకము= లోకం; కలుగదు= ఉండదు; ఊఁది= నొక్కి; చెప్పెదన్= చెప్పుతాయి; పుణ్యంబునున్= పవిత్రమైనది; గోప్రదాన విధిన్= ఆవులను దానంచేయటమన్న ధర్మాన్ని; మిగిలిన అట్టిది= అతిక్రమించిన ధర్మం; వత్స!= నాయనా!; అరయంగన్= విచారిస్తే; ఒండు= మరొకటి; లేదు.

**తాత్పర్యం:** నాయనా! గట్టిగా చెప్పుతున్నాను నమ్ముము. గోలోకాన్ని మించిన పుణ్యలోకం కానీ, గోదానంకంటె మించిన శుభమైన ధర్మం కానీ లేవు.

**తే. ఆగమాధ్యయనంబు, వ్రతాభిరతియు, । నైజకర్మ శీలము, గురుపూజనంబు,**

**మాతృపితృ రక్షణముఁ, బాత్ర మహిమ లప్ర । తర్క్య ఫలదాయి యైన గోదానవిధికి. 471**

**ప్రతిపదార్థం:** అప్రతర్క్య= తర్కించటానికి వీలుకాని; ఫలదాయి= ఫలితాన్నిచ్చే; గోదాన విధికిన్= గోదాన కర్మకు; పాత్రమహిమలు= తగిన గొప్పదానాలు; ఆగమ=వేద; అధ్యయనంబు= చదవటం; వ్రత= వ్రతాలలో; అభిరతియున్= మక్కువయు; నైజ= తన; కర్మ శీలమున్= కర్మలు చేసే స్వభావం; గురు= గురువులకు; పూజనంబున్= ఆరాధన; మాతృ పితృ రక్షణమున్= తల్లిదండ్రులను రక్షించుటయును;

**తాత్పర్యం:** గొప్ప ఫలితాల నిచ్చే గోదాన క్రియ కర్హమైన మహిమలు గలవి, వేదాన్ని చదవటం, వ్రతాలపై అభిలాష, స్వభావసిద్ధమైన కర్మల నైజం, గురువులను పూజించటం, తల్లిదండ్రులను పూజించట మన్నవి.'

**క. అని నిర్దేశించిన న । వ్వనరుహసంభవుని దివ్యవాక్యంబులు నె**

**మ్మనమున నిడి గోయజ్ఞము । లనూనవిధి నడపె నింద్రుఁ డమలచరిత్రా! 472**

**ప్రతిపదార్థం:** అమల= పవిత్రమైన; చరిత్రా!= నడవడి కలవాడా!; అని= ఈ విధంగా; నిర్దేశించినన్= సెలవియ్యగా; ఆ+వనరుహ= నీటిలో పుట్టిన పద్మం నుండి; సంభవుని= పుట్టినవాని - బ్రహ్మ; దివ్య = మహత్తరమైన; వాక్యంబులు= మాటలు; నెఱ+మనమునన్= నిండైన మనస్సులో; ఇడి= ధరించి; గోయజ్ఞములు= గోదాన కర్మలు; ఇంద్రుఁడు; అనూన= అధికమైన; విధిన్= శాస్త్రోక్తపద్ధతిలో; నడపెన్= చేశాడు.

**తాత్పర్యం:** పవిత్ర ప్రవర్తన కలవాడా! బ్రహ్మ చెప్పిన దివ్య వాక్యాలు విని ఇంద్రుడు అదే విధంగా గోయజ్ఞం నిర్వహించాడు.

**క. నీవును నవధానముతో । గోవుల మన్నింపు పాత్రకోటి కొసఁగు స**

**త్సేవిత పుణ్య చరిత్రము । లా వెరవునఁ బోల వెన్నియైనఁ గుమారా!' 473**

**ప్రతిపదార్థం:** కుమారా!= నాయనా!; నీవును= నీవున్నూ; అవధానముతోన్= ఏకాగ్రతతో; గోవులన్= ఆవులను; మన్నింపుము= గౌరవించుము; పాత్ర= అర్హులైన; కోటికిన్= జనసమూహానికి; ఒసఁగు(ము)= దానంచేయుము; సత్+సేవిత= మంచివారిని సేవించేవారి; పుణ్య= పవిత్రమైన; చరిత్రములు= కథలు; ఎన్నిఐనన్= ఎన్నైనా; ఆ వెరవునన్= గోదానమునకు; పోలవు= సరికావు.

**తాత్పర్యం:** నాయనా! నీవూ నిష్ఠతో గోవులను పూజించుము. తగినవారికి దానంచేయుము. పుణ్యపురుషుల చరిత్రలు కూడా గోదానానికి సరికావు.'

**క. అని యిట్లు గోవిశేషము । లనేక భంగులను బాండవాగ్రజునకు శం**

**తనుసుతుఁడు సెప్పె నన విని । 'మునివర! యేభంగి వాక్యములు మఱి సెల్లెన్?' 474**

**ప్రతిపదార్థం:** గో విశేషములు= ఆవునకు సంబంధించిన విశేషాలు; అనేక భంగులను= అనేక విధాలుగా; పాండవ= పాండవులలో; అగ్రజునకున్= ముందుపుట్టిన ధర్మరాజునకు; శంతను సుతుఁడు= శంతనుడి కొడుకు - భీష్ముడు; చెప్పెను; అనన్= అనగా; విని; మునివర!= మునిశ్రేష్ఠుడా!; ఏ భంగి= ఏ తీరు; వాక్యములు= మాటలు; మఱి= తరువాత; ఇంకా; చెల్లెన్= నడిచాయి.

**తాత్పర్యం:** అని ఈ విధంగా గో విశేషా లెన్నో ధర్మరాజుకు భీష్ముడు చెప్పటం విని శ్రోతలైన మహర్షులు సూతుడితో - 'మునివరా! ఇంకా ఏతీరు మాటలు చెల్లాయో వినిపించుము'.

**వ. అని యడుగుటయు. 475**

**తాత్పర్యం:** అని అడుగగా.

## ఆశ్వాసాంతము

**శా. ధర్మాధర్మ విదూర నీతి పరవిద్వచ్చిత్తయోగీ! జగ**
**న్నిర్మాణ స్థితి తంత్ర సంహరణధూర్నిర్వాహరాగీ! మహా**
**శర్మాపాదనపాదపద్మ సుతపస్స్వాధ్యాయసద్మా! మనో**
**తర్ముద్రాలతికా ఫలత్వలసితా! దాంతి స్ఫుటోద్భాసితా! 476**

**ప్రతిపదార్థం:** ధర్మ+అధర్మ= ధర్మము, అధర్మము రెంటికీ; విదూర= చాలా దూరంగా ఉన్న; నీతిపర= నీతిపరులైన; విద్వత్= పండితుల; చిత్త= మనస్సులలో ఉన్న; యోగీ!= మహాయోగీ!; జగత్= లోక; నిర్మాణ= సృష్టించటం; స్థితితంత్ర= సృష్టిని భద్రంగా రక్షించే ఉపాయం; సంహరణ= లయ కృత్యముల; ధూః= భారమును; నిర్వాహ= నిర్వహించే; రాగీ!= అనురక్తి కలవాడా!; మహా= గొప్ప; శర్మ= సుఖం; ఆపాదన= కలిగించే; పాదపద్మ= తామరపూలవంటి అడుగులు కలవాడా!; సు=మంచి; తపస్= తపస్సు; స్వ+అధ్యాయ= వేదపఠనమే; సద్మా!= గృహంగా కలవాడా; మనః+అంతర్= మనస్సు లోపల; ముద్రా= ఆనందం, లేదా యోగముద్రలన్న; లతికా= తీగకు (పడ్డ); ఫలత్వ= ఫలరూపంతో; లసితా!= అందమైనవాడా!; దాంతి= ఇంద్రియ నిగ్రహంతో ఏర్పడ్డ మనశ్శాంతితో; స్ఫుట= స్పష్టంగా; ఉత్+భాసితా!= పైకి ప్రకాశించేవాడా!

**తాత్పర్యం:** స్వామీ! నీవు ధర్మాధర్మాలకు అతీతమైన దివ్యవిద్యాపరులైన పండితుల మనస్సులలో ఉన్న యోగీశ్వరుడవు! లేదా - యోగమంటే చిత్తవృత్తములను నిరోధించటం కనుక విద్వాంసుల చిత్తవృత్తులను నిరోధించే సాధనరూపమైన యోగమే నీవు. నీకూ యోగానికీ అభేదం. సృష్టి స్థితి సంహారాలన్న బరువును మోయటంలో అనురాగం, రక్తి కలవాడా! తపస్సులోనూ, వేదాధ్యయనంలోనూ, అంటే వాటిని ఆచరించే వారి హృదయాలే నివాసంగా కలవాడా! ముత్+ర= మోదమును సంతోషాన్ని తెచ్చేది (కలిగించేది) కనుక ముద్ర, చిన్ముద్ర అభయముద్ర ఇట్లాంటి యోగముద్రలన్న లతకు కాచిన పండువంటివాడా! ప్రశాంత మనస్కులైన యోగుల హృదయాలనుండి పైకి లోకంలోకి ప్రకాశం చిమ్మేవాడా!

**విశేషం:** గతంలో శ్రీకృష్ణుడు యోగీశ్వరేశ్వరుడుగా చెప్పబడ్డాడు. కనుక ఈ సంబోధన సార్థకమౌతున్నది.

పై వాక్యంలో విరక్తి స్వరూపుడైన యోగిగా పిలువబడ్డ భగవంతు డిక్కడ రాగిగా స్తుతించబడుతున్నాడు. ఈ హరిహరస్తుతులన్నీ సమాస భూయిష్ఠమైన రచన కలవి. వేదాంత, యోగశాస్త్ర సంబంధం కలవీ, హరుడు(శివుడు) యోగి హరి రాగి. హరి సగుణమూర్తి కనుక పాదపద్మాలు కలవాడు = (శరీరం ఉన్నవాడుగా స్తుతించబడుతున్నవాడు). మరలా తపస్స్వాధ్యాయ స్వరూపుడంటే నిర్గుణస్వరూపుడై హరుడుగా స్తుతించటం. చివరి రెండు విశేషాలూ కేవల జ్ఞానస్వరూప వర్ణనలు. చిత్-ఆనంద స్వరూప వర్ణనలు.

**క. ప్రమద విషాదాది ద్వం । ద్వమలావిహితాంతరంగవాసా! విశ్వా**
**గమవేద్య సముల్లాసా! శమరమ్య విభాస! నియమ జనిత వికాసా! 477**

**ప్రతిపదార్థం:** ప్రమద= సంతోషం; విషాద=దుఃఖం; ఆది= మున్నుగాగల; ద్వంద్వ= రెండు; మల= దోషం - మలినం; అవిహిత= లేని; అంతరంగ= అంతఃకరణం; వాసా!= నివాసంగా కలవాడా!; విశ్వ= ప్రపంచమనే; ఆగమ= వేదంద్వారా; వేద్య= తెలియదగిన; సముల్లాసా!= ఆనంద, ఉత్సాహ స్వరూపుడా!; శమ= అంతరింద్రియ నిగ్రహం చేత; రమ్య= అందమైన; వి+భాస= విశిష్టమైన ప్రకాశం కలవాడా!; నియమ= యోగనియమాలతో; జనిత= పుట్టిన; వికాసా!= వికాసం కలవాడా!

**తాత్పర్యం:** సంతోష, దుఃఖాలు అనే ద్వంద్వం లేని మనసులే ఆవాసంగా కలవాడా! సృష్టి అన్నదే వేదం. దానిద్వారా సృష్టించటంద్వారా పరమేశ్వరుడి అనురాగస్వరూపమైన ఆనందోత్సాహాలు తెలుస్తున్నాయి. సృష్టిద్వారానే అతడి ఉనికి తెలుస్తున్నది కనుక అదే వేదం. శమాన్వితులైన మహాత్ములనుండి విశిష్టంగా ప్రకాశిస్తున్నాడు. యోగ నియమాలనుండి వికసించే ఆనందమన్న తామరపూవు భగవంతుడు యోగసాధన లేనివారి హృదయాలలో నిద్రపోతున్నవాడు. యోగులలో మేల్కొంటున్నాడు. ఇదే వికాస మంటే.

**విశేషం:** శ్రీ రామకృష్ణ పరమహంస వంటివారు లేకపోతే మనకు భగవంతుడి ఉనికి తెలిసేది కాదు. కనుక అట్లాంటివారే భగవంతుడన్న దీపం వెలిగిన గృహాలు. ఆ దీపపు వెలుగు కూడా రమ్యమైనది.

**మాలిని.**

**'అకలుష హృదయాంతర్యాగ సంసిద్ధి మూర్తీ!**
**వికృతి దశక షట్క స్వీకృతి ప్రౌఢవర్తీ!**
**సకృపలసదపాంగోత్సా ర్యమాణాశ్రితార్తీ!**
**సకల నిగమచూడా చారురంగైక వర్తీ! 478**

**ప్రతిపదార్థం:** అకలుష= నిష్కల్మషమైన; హృదయ= హృదయాలలోని; అంతర్యాగ= లోపలియజ్ఞంద్వారా; సంసిద్ధిమూర్తీ!= సిద్ధించిన ఫల స్వరూపం కలవాడా!; వికృతి= వికారాలు; దశక= పది; షట్క= ఆరు; స్వీకృతి= స్వీకరించటంచేత; ప్రౌఢ= పరిపక్వతతో; వర్తీ!= ప్రవర్తించేవాడా!; స+కృప= దయాసహితత్వంతో; లసత్= ప్రకాశించే; అపాంగ= కడకంటి చూపుతో; ఉత్సార్యమాణ= నశింపచేస్తున్న; ఆశ్రిత= ఆశ్రితులైన భక్తుల; ఆర్తీ!= దుఃఖం కలవాడా!; సకల నిగమ= వేదాలన్నిటియొక్క; చూడా= శిరస్సులే; చారు= అందమైన; రంగ= నాట్యరంగస్థలంమీద; ఏక= ముఖ్యమైన; వర్తీ!= నటకుడా!

**తాత్పర్యం:** అంతర్యాగం, బహిర్యాగమని ఉపాసనలు రెండు రకాలు. బయటచేసే షోడశోపచారపూజలు బహిర్యాగం. జ్ఞానం, వివేక దృష్ట్యా సర్వపూజలు మనస్సులో భావించిచేయటం అంతర్యాగం. ఇదే సిద్ధిని కలిగించేది. కనుక సంసిద్ధిమూర్తీ - అంతర్యాగ ఫలమే సంసిద్ధి ముక్తి. అదే ఆకారంగా కలవాడా! 16 వికారాలను స్వీకరించి కూడా, చెదరకుండా ప్రవర్తించేవాడా! (ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి పంచ భూతాలు (5), జ్ఞానేంద్రియాలు-5, కర్మేంద్రియాలు-5, మనస్సు-1). దయతో తొణికిసలాడుతున్న కడగంటి చూపుతో ఆశ్రితుల దుఃఖాలను చెదరగొట్టేవాడా! సకల వేదాల శిరస్సులనే నాట్యరంగంమీద నాట్యంచేసే ప్రధాన నటకుడైనవాడా! హరిహరనాథా!

**విశేషం:** శివుడి నాట్యాన్ని ఇట్లా వ్యాఖ్యానించటం చాలా అందంగా ఉన్నది.

ఆశ్వాసాంతాలన్నీ అంత్యానుప్రాసాలంకారంతో అంతమయ్యే సంబోధనలు కలవి. ప్రతి వాక్యము ఒక సంబోధన. ఈ అంత్యానుప్రాసవలననే వాక్యాలు ఎక్కడకు తెగిపోతున్నాయో, ఎంతవరకు సంబోధనో తెలుస్తుంది. లేకపోతే అర్థం చెప్పటం సాధ్యంకాదు. ఒక సంబోధన హరునకు తరువాతిది హరికి అన్వయించేవిగా ఉంటాయి. కొన్నిచోట్ల మొదటిదీ, చివరిదీ హరునకు అన్వయిస్తూ మధ్యలో రెండూ హరి కన్వయిస్తాయి. ఏది ఏదో తెలిసికొనటం పండితులకూ ఇబ్బందిగానే ఉంటుంది.

ఉదాహరణకు చివరి పద్యంలో మొదటి వాక్యం, చివరివాక్యం హరుని సంబోధనలు. మధ్యలోవి రెండు హరి కన్వయించేవి. లేదా అన్ని భగవత్సంబోధనలే. ఈ ఏర్పాటున్నదా అంటే ఉన్నది. లేదా అంటే లేదు. స్పష్టంగా ఉండదు కనుక మూర్తి వర్ణనమున్న సంబోధన సగుణతత్త్వమైన హరికీ, కానిది నిర్గుణతత్త్వమైన హరునకూ అన్వయించి తీరాలి. ఎందుకంటే విరాటపర్వ అవతారికలో హరిహరనాథమూర్తినట్లా వర్ణించాడు కనుక.

**'కరుణారసము పొంగి పొరలెడు చాడ్పున । శశిరేఖ నమృతంబు జాలువాఱ**

**హరినీలపాత్రిక సురభి చందన మున్న । గతి నాభి ధవళపంకజము మెఱయ.'**

అన్న ఆ పద్యంలో మొదటిచరణం శివవర్ణన, మూడోచరణమూ శివునకే అన్వయిస్తుంది. 2, 4 చరణాలూ హరి కన్వయించేవి. కాబట్టి ఆశ్వాసాంతాలలోనూ ఇదే పద్ధతి అన్వయిస్తుంది. మాలిని వృత్తలక్షణానికి ఆను.1.388 పద్యం చూడండి.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన**

**శ్రీ మహాభారతంబున నానుశాసనిక పర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైనదీ, ఉభయ కవిమిత్రుడని ప్రశస్తిని పొందిన కొమ్మనామాత్యపుత్రుడూ, పండితులను సేవించటం వలన ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలో ఆనుశాసనిక పర్వంలో రెండవ ఆశ్వాసం.

**ఆనుశాసనిక పర్వంలోని రెండవ ఆశ్వాసం సమాప్తం.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - తృతీయాశ్వాసము

**శ్రీ మహిమ దానకరుణా । భూమోద్భాసి బహునామ! పుణ్యస్తోమా**
**రామహృదయధామ! విత । ర్కామేయ విభూతిసీమ హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= ఓ హరిహరనాథస్వామీ!; శ్రీ= సంపద; మహిమ= గొప్పతనం; దాన= దానం; కరుణా= దయ అనే వాటి; భూమ= ఎక్కువతనాన్ని; ఉద్భాసి= బాగుగా ప్రకాశింపజేసే; బహునామ!= పెక్కు పేరులు గలవాడా!; పుణ్య= పుణ్యాల; స్తోమ= సముదాయానికి; ఆరామ= పూలతోటవంటి; హృదయ= హృదయమే; ధామ= నివాసమైనవాడా!; వితర్క= గొప్ప ఊహలకు; అమేయ= అందని; విభూతి= మహిమయొక్క; సీమ!= హద్దు గలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథ స్వామీ! నీ పేర్లన్నీ నీలోని ఐశ్వర్యం, గొప్పతనం, దానం, దయ అనే గుణాలను చక్కగా ప్రకటిస్తూ ఉంటాయి. ఎన్నో పుణ్యాల పూలతోట లయిన హృదయాలలో నీవు నివసిస్తూ ఉంటావు. ఏ తర్కమూ నీ మహిమను అందుకోలేదు.

**విశేషం:** భగవంతుడికి బహునామాలు. ఏ నామమైనా ఆయన మహాగుణాలయిన దాన దయాదులను ప్రకటిస్తూ భక్తులను ఆకట్టుకొంటుంది. అంటే ఆయనపేరేదీ నేతిబీరకాయవంటిది కాదన్నమాట. ఆ పేరు స్మరిస్తే సంపదో, మహిమో, మహావస్తువో, ఆపదలు తొలగటమో సిద్ధిస్తుందని తాత్పర్యం. ఆయన పుణ్యాత్ముల హృదయాలలో కాపురం ఉంటాడు. అంటే అట్టివారి హృదయాలే నిజమైన దేవాలయా లన్నమాట! కాబట్టి మానవులందరూ పుణ్యకార్యాలు చేసి భగవంతుడిని గుండెలో నిలుపుకొనాలని సూచన. ఆయన మహిమ తర్కానికి అందదు. కనుక తర్కంతో తలలు బ్రద్దలు కొట్టుకొనటంవలన మానవుడు భగవంతుడికి దూరమవుతున్నాడని హెచ్చరిక.

ఇందులో నామకీర్తనా, పుణ్యసాధనా, భగవత్ప్రాప్తీ అనేవి ఒకదానికొకటి సాధనాలుగా మనం సంభావించాలి.

### ధర్మజునకు భీష్ముం డనుష్ఠేయంబులఁ జెప్పుట (సం.13-74-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు గోవుల మహానుభావంబు విని పాండవాగ్రజుండు భీష్మునితో 'ధర్మంబులు తేటపడ ననుగ్రహించుచుం బుయిలోట వాపి నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ జేయుటం జేసి కొంకక యింకను నడిగెదఁ; దాత్పర్యంబున ననుష్ఠింపవలయునవి యెయ్యవి యెఱింగింపవే!' యనుటయు నతనితో నతండు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ప్రభూ!; వైశంపాయనుండు= వైశంపాయనుడనే ముని; జనమేజయునకున్= జనమేజయ మహారాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; గోవుల మహానుభావంబున్= ఆవుల గొప్పతనాన్ని; విని= విని; పాండవ+అగ్రజుండు= పాండురాజు కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు; భీష్మునితోన్= భీష్ముడితో; ధర్మంబులు= ధర్మాలు; తేటపడన్= చక్కగా తెలిసేవిధంగా; అనుగ్రహించుచున్= దయచూపుతూ; పుయిలోట= సంకోచభావాన్ని; పాపి= తొలగించి; నన్నున్= నన్ను; కలిపికొని= మీలోని వాడినిగా చేసికొని; కృపకున్= దయకు; భాజనంబుగాన్= పాత్రమయ్యే విధంగా; చేయుటన్+చేసి= చేయటంవలన; కొంకక= వెనుకాడకుండా; ఇంకనున్= ఇంకా; అడిగెదన్= అడుగుతాను; తాత్పర్యంబునన్= శ్రద్ధ సడలకుండా; అనుష్ఠింపవలయునవి= చేయవలసినవి; ఏ+అవి= ఏవి; ఎఱింగింపవే?= తెలుపవా?; అనుటయున్= అనగా; అతనితోన్= ఆ ధర్మరాజుతో; అతండు= ఆ భీష్ముడు.

**తాత్పర్యం:** ప్రభూ! వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా చెప్పుతున్నాడు: ధర్మరాజు గోవుల గొప్పతనాన్ని ఆలకించి భీష్ముడితో ఇట్లా అంటున్నాడు. 'తాతా! నే నడిగిన ధర్మాలన్నీ స్పష్టంగా తెలిసేవిధంగా దయతో చెప్పుతున్నావు. నా మనస్సులోని సంకోచాన్ని తొలగించి నన్ను నీ దయకు పాత్రం చేసికొన్నావు. కనుక సందేహం వదలి ఇంకా అడుగుతున్నాను. శ్రద్ధతో చేయదగిన పను లేవో నాకు చెప్పుము' అనగా భీష్ముడు ధర్మరాజుకు ఇట్లా చెప్పుతున్నాడు.

**విశేషం:** శాస్త్రాలలో పరిప్రశ్న అని ఒకటి ఉన్నది. మహావిషయాలు తెలిసికొనదలచినవాడు వినయపూర్వకంగా తనకు కావలసిన విషయాలను పెద్దవారిని అడుగుతూ ఉండాలి. 'అడగందే చెప్పరాదు' అని కూడా ధర్మశాస్త్రం శాసిస్తున్నది. కాబట్టి ధర్మరాజు భీష్ముడి దయను కొనియాడుతూ ప్రసన్నుడిని చేసికొంటున్నాడు. పుయిలోటవాపి - మహాయుద్ధంలో పాండవులు భీష్ముడిని కూడా చిత్రహింసకు గురిచేశారు. ఇప్పుడు ఆయననే అడుగవలసి వచ్చింది అని ధర్మరాజు గుండెగుబులు. దానిని భీష్ముడు తొలగించాడు. నన్నుం గలిపికొని - యుద్ధం ముగిసేవరకు భీష్ముడూ ధర్మరాజూ పగవారు. భీష్ముడు దానిని పట్టించుకొనక ధర్మరాజును హృదయానికి దగ్గరగా తీసికొన్నాడు.

**సీ. 'విను నియమంబును వేదపాఠంబుఁ ద । ద్ధరణంబు దమము నధ్యాపనంబు**
**నప్రతిగ్రహమును నాత్మీయకర్మని । ష్ఠయు సకలేంద్రియ జయము సత్య**
**నిరతియు శ్రుతదాన పరతయు బ్రహ్మ చ । ర్యముఁ బితృశుశ్రూషణమును మాతృ**
**శుశ్రూషణము గురుశుశ్రూషణము నను । కంపయు గోవ్రత సంపదయును**

**ఆ. వత్స! యాచరింపవలయునట్టివి' యని । పలుకుటయును నా నృపాలవరుఁడు**
**'గో ప్రదానవిధి యకుంఠిత కృప నాకు । నెఱుఁగఁ జెప్పవే సమిద్ధబుద్ధి.' 3**

**ప్రతిపదార్థం:** వత్స!= నాయనా!; విను= వినుము; నియమంబును= నియమమున్నూ; వేద పాఠంబున్= వేదాలను నేర్చుకొనటమూ; తత్+ధరణంబు= వానిని వదలకుండా పట్టుకొనటమూ; దమము= మనస్సును అదుపులో పెట్టుకొనటమూ; అధ్యాపనంబున్= వేదాలను బోధించటమూ; అప్రతిగ్రహమునున్= దానాలు పట్టకపోవటమూ; ఆత్మీయ కర్మ నిష్ఠయున్= తన కర్తవ్యాలయందు శ్రద్ధా; సకల+ఇంద్రియ జయమున్= అన్ని ఇంద్రియాలనూ గెలవటమూ; శ్రుత దాన పరతయున్= చదువునందూ; దానమునందూ ఆసక్తి ఉండటమూ; బ్రహ్మచర్యమున్= బ్రహ్మమునందు ప్రవర్తిస్తూ ఉండటమూ; పితృ శుశ్రూషణమును= తండ్రిని సేవించటమూ; మాతృశుశ్రూషణమున్= తల్లిని సేవించటమూ; గురుశుశ్రూషణమున్= గురువులను సేవించటమూ; అనుకంపయున్= దయకలిగి

ఉండటమూ; గో వ్రత సంపదయును= ఆవులను సేవించటం అనే సంపదా; ఆచరింపవలయునట్టివి= చేయదగినట్టివి; అని= అని; పలుకుటయున్= చెప్పగా; ఆ నృపాలవరుఁడు= ఆ రాజశ్రేష్ఠుడు; సమిద్ధబుద్ధి!= చక్కగా వెలుగొందుచున్న బుద్ధిగల ఓతాతా!; గో ప్రదానవిధి= గోవులను దానంచేసే కార్యాన్ని; నాకున్= నాకు; అకుంఠితకృపన్= ఏ మాత్రమూ మొక్కవోని దయతో; ఎఱుఁగన్+చెప్పవే!= తెలిసే విధంగా చెప్పవయ్యా!

**తాత్పర్యం:** 'నాయనా! వినుము. నియమమూ, వేదాలను చదవటం, వాటిని హృదయంలో నిలుపుకొనటం, మనస్సును అదుపులో పెట్టుకొనటం, వేదాలను ఇతరులకు నేర్పటం, దానాలు పట్టకపోవటం, తన కర్తవ్యాన్ని శ్రద్ధతో చేయటం, ఇంద్రియాలన్నింటినీ గెలవటం, సత్యంపై ఆసక్తి ఉంచటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, తల్లిదండ్రులను, గురువులను సేవించటం, దయకలిగి ఉండటం, గోవులకు సంబంధించిన వ్రతాలను సమృద్ధిగా చేయటం - ఇవి చేయదగిన పనులు' అని భీష్ముడు చెప్పగా విన్న ధర్మరాజు 'తాతా! నీది మంచి వెలుగొందుతున్న బుద్ధి. గోవులను దానమిచ్చే పద్ధతిని గూర్చి నాకు మిక్కిలి దయతో తెలియజెప్పుము' అన్నాడు.

**విశేషం:** ఇవన్నీ ఉత్తమ మానవుడు తప్పక చేయవలసిన పనులు. వేదం ధర్మమూలం కాబట్టి దానిని చదవాలి. చదివించాలి. తా నాచరించాలి. ఇతరులచేత ఆచరింపజేయాలి. దానాలు పుచ్చుకొనటంవలన ఇచ్చేవారి పాపాలు సంక్రమిస్తాయి. ఆ కారణంగా పుచ్చుకొనకూడదు. బ్రహ్మచర్యం పాటించాలి. అంటే కామాదిభావాలను దగ్గరకు రానీయరాదు. పితృశుశ్రూషణం - వేదం మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, తల్లీదండ్రీ గురువూ దైవమైనవాడవు కావాలి అని శాసిస్తున్నది. అనుకంప సర్వభూతాల యందు దయకలిగి ఉండటం, ఎందుకంటే అన్నింటియందూ భగవంతుడే కదా నిండి ఉన్నాడు.

**వ. అని యడిగిన యక్కురుపతికిం గురుపితామహుం డిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** అని; అడిగిన; ఆ+కురుపతికిన్= ఆ కౌరవమహారాజునకు; కురు పితామహుండు= కురువంశంవారికి తాత అయిన భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లా అడుగగా భీష్మ డిట్లా చెప్పాడు.

**ఆ. 'తనియ మేసి నీరు ద్రావి మందకు వచ్చి । సౌఖ్య మెసఁగఁ బసులు శయన మొంది**
**యుండ నచట నియతి నుండి మాంధాతృండు । పరమభక్తి నమరగురునిఁ దలఁచి. 5**

**ప్రతిపదార్థం:** పసులు= పశువులు; తనియన్= తృప్తిపడేటట్లుగా; మేసి= మేసి; నీరు= నీటిని; త్రావి= త్రాగి; మందకున్= గోశాలలోనికి; వచ్చి; సౌఖ్యము= సుఖం; ఎసఁగన్= ఎక్కువయ్యేటట్లుగా; శయనము+÷ఒంది= పడుకొని; ఉండన్= ఉండగా; అచటన్= అక్కడ; నియతిన్= నిష్ఠతో; ఉండి= నిలిచి; మాంధాతృండు= మాంధాత అనే రాజు; పరమభక్తిన్= గొప్పభక్తితో; అమరగురునిన్= దేవతలకు గురువైన బృహస్పతిని; తలఁచి= తలపోసి.

**తాత్పర్యం:** 'ఆవులు కడుపారా మేత మేశాయి. నీరు త్రాగాయి. గోశాలకు వచ్చి సుఖంగా పడుకొన్నాయి. అప్పుడు మాంధాత అక్కడ నిష్ఠతో ఉండి గొప్ప భక్తితో బృహస్పతిని తలచుకొన్నాడు.

**విశేషం:** మాంధాతకు పశువులమీద ఎంత భక్తి ఉన్నదో దీనివలన తెలుస్తున్నది. మహారాజు అంతఃపురంలో హంసతూలికా తల్పాలమీద సుఖనిద్ర పొందవలసినవాడు, మందలో నిష్ఠతో ఉన్నాడు. అంటే అతడి భక్తి ఎంత గొప్పదో మనం ఊహించుకొనవచ్చును.

**వ. ఇట్లు యడుగం గలవాఁడై కరంబులు మొగిచి బహువిధంబులం బ్రస్తుతించిన, నా పురుహూత పురోహితుండు ప్రత్యక్షం బగుటయు, న ప్పుడమితేఁ డమ్మహాత్ముని పాదంబులకుం బ్రణమిల్లి యడిగిన నద్దేవగురుం డన్నర దేవోత్తమున కిట్లనియె. 6**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగానే; అడుగన్ కలవాఁడు+ఐ= అడగదలచినవాడై; కరంబులు= చేతులు; మొగిచి= మోడ్చి; బహువిధంబులన్= పెక్కురీతులతో; ప్రస్తుతించినన్= కొనియాడగా; ఆ పురుహూత పురోహితుండు= దేవేంద్రుడి పురోహితుడైన ఆ బృహస్పతి; ప్రత్యక్షంబు+అగుటయున్= సాక్షాత్కరించగా; ఆ+పుడమితేఁడు= ఆ రాజు; ఆ+మహాత్ముని పాదంబులకున్= ఆ మహాత్ముడి కాళ్ళకు; ప్రణమిల్లి= దండ నమస్కారం చేసి; అడిగినన్= అడుగగా; ఆ+దేవగురుండు=దేవతలకు గురువైన ఆ బృహస్పతి; ఆ+నరదేవ+ఉత్తమునకున్= రాజులలో శ్రేష్ఠుడయిన ఆ మాంధాతకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** నీ వడిగినట్లే అడుగదలచి చేతులు మోడ్చి ఎన్నో విధాలుగా స్తోత్రాలు చేయగా ఆ బృహస్పతి ప్రత్యక్షమయ్యాడు. ఆ రాజు అతడి కాళ్ళమీద పడి నమస్కరించాడు. అప్పుడు అడిగాడు. బృహస్పతి ఆ రాజు కిట్లా చెప్పాడు.

**విశేషం:** మహా విషయాలు తెలిసికొనదలచినవాడు ఎట్లా మహాత్ములను ప్రసన్నం చేసికొనాలో ఇందులో కవి సూచిస్తున్నాడు. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా'' అని గీత. కాళ్ళమీద పడటం ప్రణిపాత. అడగటం పరిప్రశ్న. ఈ రెంటివలన సేవకూడా చేశాడని మనం ఊహించుకొనవచ్చును. చక్కని సంప్రదాయం పాటిస్తున్నాడు కనుకనే రాజు నరదేవులలో ఉత్తము డయ్యాడు. కనుకనే దేవగురువు వంటివాడు ప్రసన్నుడై అడిగిన విషయాన్ని వివరించి చెప్పటానికి సుముఖుడయ్యాడు.

## బృహస్పతి మాంధాతకుఁ దెలిపిన గోదానవిధి ప్రకారము (సం.13-75-4)

**ఆ. పుణ్యదినమునందు భూసురానుజ్ఞతో। నుపవసించి గోవు లున్న మంద**
**కరిగి పరమ నియతి నయ్యహోరాత్ర మ। గ్గోష్ఠమున వసించి నిష్ఠతోడ. 7**

**ప్రతిపదార్థం:** పుణ్యదినమునందున్= తిథివార నక్షత్రాదులు బాగా ఉన్న రోజున; భూసుర+అనుజ్ఞతోన్= బ్రాహ్మణుడి, పురోహితుడి అనుమతితో; ఉపవసించి= ఉపవాసం చేసి; గోవులు+ఉన్న మందకున్= ఆవులున్న శాలకు; అరిగి= వెళ్ళి; పరమ నియతిన్= గొప్ప నియమంతో; ఆ+అహోరాత్రము= ఆ పగలూ రాత్రీ; నిష్ఠతోడన్= దీక్షతో; ఆ+గోష్ఠమునన్= ఆ గోవుల శాలలో; వసించి= ఉండి.

**తాత్పర్యం:** గోదానం చేయదలచినవాడు మంచి రోజు చూచుకొని పురోహితుడి అనుమతి పొంది ఉపవాసం చేసి గోవులున్న శాలకు వెళ్ళి గట్టి నియమంతో ఒక రోజల్లా నిష్ఠతో అక్కడ గడపాలి.

**విశేషం:** ఏ శుభకార్యానికైనా మంచిరోజు అవసరం. అది తప్పక ఫలా న్నిస్తుంది. పురోహితుడు రాబోయే కష్టసుఖాలు ముందే విచారించి తెలియజేస్తాడు. అందుకని అతనితో సంప్రతించటం అవసరం. వ్రతానికి నియమాలు చాలాముఖ్యం. అవి లేకపోతే ఫలం దక్కదు. ఉపవాసంవలన దేహమూ, ఇంద్రియాలూ స్వాధీనమవుతాయి. దానివలన నిష్ఠ చెడకుండా ఉంటుంది.

**వ. మఱుఁనాఁడు. 8**

**తాత్పర్యం:** ఆ తరువాతి రోజున.

**ఆ. సంగవాభిధాన సత్కాలమునఁ దన । యిచ్చుగోవుఁ బేర నెలమిఁ బిలిచి**

**యజుఁడు కరుణఁ జెప్పినట్టి యవ్వాక్య ర । త్నముఁ బఠించునది యుదాత్తచరిత! 9**

**ప్రతిపదార్థం:** ఉదాత్త చరిత!= గొప్ప నడవడి కల ఓ రాజా! సంగవ+అభిధాన సత్కాలమునన్= సంగవమనే పేరుగల మంచి వేళలో; తన+ఇచ్చు గోవున్= తా నీయదలచిన ఆవును; పేరన్= పేరుతో; ఎలమిన్= ప్రీతితో; పిలిచి; అజుఁడు= బ్రహ్మ; కరుణన్= దయతో; చెప్పిన+అట్టి= చెప్పిన; ఆ+వాక్యరత్నమున్= ఆ గొప్ప వాక్యాన్ని; పఠించునది= చదవాలి.

**తాత్పర్యం:** మంచివాడా! సంగవం అనే పేరుగల మంచి సమయంలో తాను ఇవ్వదలచిన ఆవును ప్రీతితో పేరుపెట్టి పిలిచి బ్రహ్మదేవుడు దయతో చెప్పిన మహాకావ్యాన్ని పఠించాలి.

**విశేషం:** పగటిని ఆరు భాగాలుగా భావిస్తారు. 1. ఉషస్సు, 2. సంగవం, 3.మధ్యాహ్నం, 4.అపరాహ్ణం, 5.సాయంకాలం, 6.నిశాముఖం. ఇందులో రెండవ భాగం అయిన సంగవ కాలం దానయోగ్యమని బృహస్పతి చెప్తుతున్నాడు. ఆవులను పాలుపితికే సమయం, ఆవులు దూడలతో కలిసి ఉండే కాలం అని దీనికర్థం. సూర్యోదయం అయిన తరువాత మూడు ముహూర్తాల కాలం సంగవకాలం. పేరన్- పెంపుడు జంతువులకు పేర్లు పెట్టటం చాలా ప్రాచీనకాలం నుండీ ఉన్నదన్నమాట.

**ఆ. తల్లి గోవు, వృషము దండ్రి, గర్భప్రదే । శంబు దివము, ధరణి సంప్రతిష్ఠ**

**యని పఠించి యోగ్యుఁడగు విప్రు నర్చించి । పలుకవలయు నీఁగి కలిమి దెలియ. 10**

**ప్రతిపదార్థం:** గోవు= ఆవు; తల్లి= మా అమ్మ; వృషము= ఎద్దు; తండ్రి= మా నాయన; దివము= స్వర్గం; గర్భప్రదేశంబు= కడుపు; ధరణి= భూమి; సంప్రతిష్ఠ= (నాకు) నిలుకడ; అని; పఠించి= చదివి; యోగ్యుఁడు+అగు విప్రున్= అర్హతగల విద్యావంతుడిని; అర్చించి= పూజించి; ఈఁగి కలిమి= ఇచ్చే సంకల్పం; తెలియన్= తెలిసేవిధంగా; పలుకవలయున్= పలకాలి.

**తాత్పర్యం:** 'ఆవు నా తల్లి, ఎద్దు నా తండ్రి, స్వర్గం వీరి గర్భప్రదేశం, ఇది నిలిచి ఉన్న తావే నాకు నిలుకడ ఇచ్చే తావు' అని చదివి దానం గ్రహించటానికి అర్హతగల విద్యగలవాడిని అర్చించి దానమిచ్చే సంకల్పం తనకున్నదని తెలిసే విధంగా పలకాలి.

**విశేషం:** మూలంలో బ్రహ్మ పలికిన వాక్యం ఈ విధంగా ఉన్నది.

> **"గౌర్మేమాతా వృషభః పితా మే**
> **దివం శర్మ జగతీ మే ప్రతిష్ఠా"** అను. 76. 7

'దివంశర్మ' అనే దానికి నీలకంఠులు - ఆవు, ఎద్దు అనేవి నాకు స్వర్గాన్నీ, ఇహసుఖాన్నీ ఇచ్చుగాక అని వ్యాఖ్యానించారు. దీనిని బట్టి 'గర్భప్రదేశంబు దివము' ఆవు ఎద్దుల గర్భప్రదేశం స్వర్గంలోని సుఖంవంటి సుఖాన్నిస్తుందని సంభావించాలి. అట్లాగే జగతీ - అనే పదానికి 'గోవు' అనే అర్థాన్ని నీలకంఠులు చెప్పారు. గోవే నాకు ప్రతిష్ఠ అని అర్థం. కాగా తిక్కనగారు ధరణి అనే పర్యాయ పదం వాడారు. కనుక ఆవు నిలుచున్న తావు నాకు స్థిరత్వాన్ని కూర్చే భూమి అనే అర్థాన్ని ఆయన సంభావించినట్లుగా ఊహించాలి.

యోగ్యుడగు విప్రున్= బ్రాహ్మణ పర్యాయ పదాలలో విప్రశబ్దం విద్యావంతుడిని తెలుపుతుంది. "విద్యయా యాతి విప్రత్వమ్'' అని లోకరూఢి. విద్య అంటే పరమార్థ విద్యయే.

**వ. తదనంతరంబ. 11**

**తాత్పర్యం:** ఇట్లా పఠించి చెప్పిన వెంటనే.

**క. సారములగు గోవులు మ । ద్ఘోర సకల కల్మషములుఁ ద్రుంచును సౌమ్య**

**త్వారూఢంబులు శాశ్వత । సారోదారపద మిచ్చి సౌఖ్యముఁ జేర్చున్. 12**

**ప్రతిపదార్థం:** సారములు+అగు గోవులు= చక్కని శక్తి కల ఆవులు; మత్+ఘోర సకల కల్మషములన్= నా భయంకరాలైన అన్ని పాపాలనూ; త్రుంచును= ముక్కలు చేస్తాయి; సౌమ్యత్వ+ఆరూఢంబులు= సాధువర్తనంలో పేరుగొన్న ఆవులు; శాశ్వత సార+ఉదారపదమున్= అంతం లేని స్థిరమైన గొప్పస్థానాన్ని; ఇచ్చి= కలిగించి; సౌఖ్యమున్= సుఖాన్ని; చేర్చున్= చేరుస్తాయి.

**తాత్పర్యం:** మంచి సత్తువ గల ఆవులు నా భయంకర పాపాలన్నింటినీ రూపుమాపుతాయి. మంచి సాధుశీలం గల ఆవులు శాశ్వతమూ, సారమూ, మహిమగలదీ అగు స్థానాన్ని ఇచ్చి సుఖాన్ని కూరుస్తాయి.

**విశేషం:** పాపాలు మనిషిని నరకానికి చేరుస్తాయి. ఆవులు ఆ పాపాలను పటాపంచలు చేస్తాయి. శాశ్వత, సార, ఉదారపదం అంటే మోక్షం. కనుక అక్కడి సౌఖ్యం బ్రహ్మానందం అని భావం.

**క. అని పలికి గోవు నిచ్చితి । ననుచు నుదకధారఁ బ్రీతి నవ్విప్రుకరం**

**బునఁ బోయవలయు నర్ఘ్యం । బని చెప్పుదు రజ్జలంబు నాదిమునీంద్రుల్. 13**

**ప్రతిపదార్థం:** అని; పలికి= చెప్పి; ఆవును; ఇచ్చితిన్= ఇచ్చాను; అనుచున్= అంటూ; ఉదకధారన్= నీటిధారను; ప్రీతిన్= ప్రీతితో; ఆ+విప్రు కరంబునన్= ఆ విద్యావంతుడి చేతిలో; పోయవలయున్= విడవాలి; ఆది ముని+ఇంద్రుల్= తొలుతటి మునివర్యులు; ఆ+జలంబున్= ఆ నీటిని; అర్ఘ్యంబు+అని= పూజకు పనికివచ్చే పవిత్రమైనదని; చెప్పుదురు= చెప్తుతారు.

**తాత్పర్యం:** ఇట్లా అని గోవు నిచ్చాను. ఆ విద్యావంతుడి చేతిలో ప్రీతితో నీటిధార వదలాలి. అట్లా వదలిన నీరు అర్ఘ్యం అని తొలుతటి మునిశ్రేష్ఠులు చెప్తుతారు.

**విశేషం:** ఇచ్చితి - ఇది భూతకాలక్రియ. ఇది దీని మీది మమకారాన్ని ఇంతకుముందే కోసివేశాను అన్న స్ఫురణ కలిగిస్తుంది. దానం ధారాపూర్వకంగా చెయ్యాలి. చేతిలోనుండి వదలిన నీరు మళ్ళీ తనకు అందని విధంగా దానం ఇచ్చిన వస్తువు మళ్ళీ తన దగ్గరకు చేరకూడదు అనే స్ఫూర్తి ఇందులో ఉన్నది. అర్ఘ్యం అంటే పవిత్రజలం. ఆదిమునీంద్రులు చాలా ప్రామాణికులు. వారు చెప్పిన మాటలలో పొల్లు ఉండదు అని భావం.

**క. విను శిష్యుఁడు వ్రతశీలుం । డనఘుఁడు శాంతుండు దాంతుఁ డక్రోధనుఁ డీ**

**వినుత ప్రదాన విధికిని । జననాథవరేణ్య! యెఱుఁగు సత్పాత్రంబుల్. 14**

**ప్రతిపదార్థం:** జననాథవరేణ్య!= రాజోత్తమా! విను= వినుము; ఈ వినుత ప్రదాన విధికిని= కొనియాడ దగిన ఈ దాన కార్యానికి; శిష్యుఁడు= విద్యనేర్చుకొనే స్వభావం కలవాడూ; వ్రతశీలుఁడు= పుణ్యకార్యాలు చేయటం శీలంగా ఉన్నవాడూ;

అనఘుఁడు= పాపాలు లేనివాడూ; శాంతుండు= కామమూ, క్రోధము మొదలగు వికారాలు లేనివాడూ; దాంతుఁడు= ఇంద్రియాలమీద అదుపుగలవాడూ; అక్రోధనుఁడు= క్రోధం లేనివాడూ; సత్పాత్రంబుల్= మంచి యోగ్యత కలవారు; ఎఱుఁగు= తెలిసికొనుము.

**తాత్పర్యం:** నాయనా! రాజశ్రేష్ఠా! గోవులను దానం పుచ్చుకొనటానికి విద్యావంతుడూ, పుణ్యకారాలు చేసేవాడూ, పాపాలు లేనివాడూ, శాంతమైన మనస్సు కలవాడూ, ఇంద్రియాల వికారం లేనివాడూ, క్రోధం లేనివాడూ యోగ్యులు.

**విశేషం:** శిష్యుడంటే గురుశాసనానికి లోబడి ప్రవర్తించేవాడు. ఎన్ని వ్రతాలు చేసినా ఒక్కపాపం ఆ పుణ్యాన్నంతటినీ కొట్టివేస్తుంది. కనుక వ్రతాలు చేసినా పాపాల జోలికి పోనివాడై ఉండాలి. 'శాంతుండు' అన్న దానిలోనే క్రోధం లేకపోవటం ఉన్నది. మరల 'అక్రోధనుడు' అని అనటం ఎందుకంటే ఎంత శాంతుడైనా క్రోధానికి బలియైపోయే ప్రమాదం ఎక్కువ. కనుక హెచ్చరిక కొరకు పునరుక్తి.

**ఆ. ఇవ్విధమున గోవు నిచ్చిన యాతండు । చంద్రలోక వసన సౌఖ్య మొందు'**
**నని సురేంద్ర మంత్రి యమ్మహీపాలుతో । నాదరమున నిట్టు లనియె మఱియు. 15**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ విధంగా; గోవున్= ఆవును; ఇచ్చిన+ఆతండు= ఇచ్చిన వ్యక్తి; చంద్రలోక వసన సౌఖ్యము= చంద్రలోకంలో నివాసం పొందిన సుఖాన్ని; ఒందున్= పొందుతాడు; అని= అని పలికి; సురేంద్రమంత్రి= దేవేంద్రుడి మంత్రి అయిన బృహస్పతి; ఆ+మహీపాలుతోన్= ఆ రాజు మాంధాతతో; ఆదరమునన్= ఆదరంతో; మఱియున్= ఇంకా; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా గోవును దాన మిచ్చిన వ్యక్తి చంద్రలోకంలో నివసించే సుఖం పొందుతాడు' అని చెప్పి బృహస్పతి ఆ మాంధాతతో ప్రీతితో ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** మాంధాత అడిగిన విషయం బృహస్పతి చెప్పాడు. కానీ విషయంమీద ఉన్న ప్రీతితో అడక్కపోయినా బృహస్పతి మరికొంత విషయాన్ని చెప్పుతున్నాడు.

**ఉ. మానవుఁ డోపి యాశ్వయుజ మాసము రెండవు నష్టమిం దగం**
**బూని దినత్రయంబు పరిపూజిత గోష్ఠతలంబునన్ వ్రతా**
**ధీనతఁ బెండ యన్నమును ధేనువు మూత్రముఁ బాలుఁ బానముం**
**గా నియతిన్ వసించి బహు కామ్యఫలంబులఁ బొందు భూవరా! 16**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; మానవుఁడు= మనుష్యుడు; ఓపి= సమర్థుడై; ఆశ్వయుజ మాసము రెండు+అవు+అష్టమిన్= ఆశ్వయుజ మాసం కృష్ణపక్షం అష్టమినాడు; తగన్= చక్కగా; పూని= సంకల్పించి; దినత్రయంబు= మూడు రోజులు; గోష్ఠతలంబునన్= గోశాలలో; వ్రత+అధీనతన్= వ్రతానికి పూర్తిగా వశమయి; పెండ= పేడ; అన్నమును= అన్నము; ధేనువు మూత్రమున్= ఆవు పంచితం; పాలున్= పాలూ; పానమున్ = త్రాగేదీ; కాన్= కాగా; నియతిన్= నిష్ఠతో; వసించి= ఉండి; బహు కామ్య ఫలంబులన్= పెక్కు కోరిన ఫలాలను; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజా! మానవుడు ఆశ్వయుజ మాసం కృష్ణపక్షం అష్టమి మొదలుకొని మూడు రోజులు గొడ్ల సావిడిలో వ్రతనిష్ఠతో ఉండాలి. పేడనే అన్నంగా, మూత్రమే పాలూ నీరుగా నిష్ఠతో నివసించాలి. ఆ విధంగా కోరిన కోర్కెలు ఎన్నింటినో పొందుతాడు.

**విశేషం:** ఓపి తగన్ అనే మాటలు ఏ కొంచెమూ ఏవగించుకొనరా దనే హెచ్చరికను సూచిస్తాయి. నిజానికి ఆవులు పేడా మూత్రమూ రోగాలన్నీ రూపుమాపే పదార్థాలుగా ఇప్పటి శాస్త్రవేత్తలు కూడా గుర్తిస్తున్నారు.

**వ. అని చెప్పె నట్లు బృహస్పతి నిర్దేశించిన తెఱంగున మాంధాతృండు మహీసురులకు గోవుల నిచ్చి యుభయ లోకంబులను వినుతుండయి వెలింగె; నవ్విధం బెఱింగి గో ప్రదానపరులైన భరత దిలీప భగీరథ దాశరథి ప్రభృతి భూపతులు పుణ్యలోకంబులు వడసిరి; పాండవాగ్రజా! నీవును దేవగురూపదిష్టంబు లయిన యివ్వాక్యం బులు భావగతంబులు సేసికొని గో విషయ విధిజ్ఞుండవై విప్రోత్తములకు నుత్తమ గో ప్రచయంబుల ని' మ్మనిన నమ్మనుమండు తాతకుం బ్రీతిం బ్రణామంబు సేసిన, నమ్మహాత్ముండు వెండియు నవ్విభున కిట్లనియె. 17**

**ప్రతిపదార్థం:** అని; చెప్పెన్= చెప్పాడు; అట్లు= ఆ విధంగా; బృహస్పతి నిర్దేశించిన తెఱంగునన్= బృహస్పతి చెప్పిన పద్ధతి ప్రకారం; మాంధాతృండు= మాంధాత; మహీసురులకున్= బ్రాహ్మణులకు; గోవులన్= ఆవులను; ఇచ్చి= దానం చేసి; ఉభయ లోకంబులను= ఈ లోకంలోనూ, పరలోకంలోనూ; వినుతుండు+అయి= ప్రశంసలు పొందినవాడై; వెలంగెన్= ప్రకాశించాడు; ఆ+విధంబు= ఆ పద్ధతిని; ఎఱింగి= తెలిసికొని; గో ప్రదానపరులు+ఐన= ఆవులను దానమిచ్చే ఆసక్తికల; భరత, దిలీప,భగీరథ, దాశరథి, ప్రభృతి భూపతులు= భరతుడు, దిలీపుడు, భగీరథుడు, రాముడు మొదలైన రాజులు; పుణ్యలోకంబులు= పుణ్య లోకాలను; పడసిరి= పొందారు; పాండవ+అగ్రజ!= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజా!; నీవును= నీవుకూడా; దేవగురు+ ఉపదిష్టంబులు+అయిన= దేవగురువు బృహస్పతి చెప్పిన; ఈ+వాక్యంబులు= ఈ మాటలు; భావగతంబులు= భావంలో నిలిచినవిగా; చేసికొని; గో విషయ విధిజ్ఞుండవు+ఐ= ఆవులకు సంబంధించిన కర్తవ్యాలను తెలిసికొన్నవాడవై; విప్ర+ ఉత్తములకున్= శ్రేష్ఠులూ; విద్యావంతులూ అయిన బ్రాహ్మణులకు; ఉత్తమ గో ప్రచయంబులన్= మేలైన ఆవుల మందలను; ఇమ్ము= ఇవ్వుము; అనినన్= అని పలుకగా; ఆ+మనుమండు= ఆ మనుమడు; తాతకున్= తాతకు; ప్రీతితోన్= ప్రేమతో; ప్రణామంబు+ చేసినన్= మ్రొక్కగా; ఆ+మహాత్ముండు= గొప్పహృదయ ధర్మంగల ఆ భీష్ముడు; వెండియున్= ఇంకా; ఆ+విభునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పాడు. మాంధాత బృహస్పతి మాట ప్రకారం శ్రేష్ఠులైన బ్రాహ్మణులకు ఆవులను దానంచేసి ఇహపరలోకాలలో ప్రసిద్ధిపొందాడు. ఆ విధానం తెలిసికొని భరతుడు, దిలీపుడు, భగీరథుడు, రాముడు మొదలైన రాజులు కూడా శ్రద్ధతో గోదానాలు చేసి పుణ్యలోకాలు చేరుకొన్నారు. ధర్మరాజా! నీవు కూడా బృహస్పతి చెప్పిన మాటలను హృదయంలో పదిలపరచుకొని ఆవులకు సంబంధించిన శాస్త్రవిషయాలను చక్కగా తెలిసికొని బ్రహ్మవిద్యలో ఆరితేరిన బ్రాహ్మణులకు మేలైన ఆవులను మందలకొలదీ దానమిమ్ము' అన్నాడు. ఆ మాటలకు ధర్మరాజు ఎంతో ఆనందపడి తాతకు సాష్టాంగ దండప్రణామం చేశాడు. అప్పుడు భీష్ముడు అతనికి ఇంకా ఇట్లా చెప్పాడు.

**విశేషం:** మాంధాతతోపాటు మరికొందరు పురాతన రాజులను చెప్పటం భావం దృఢపడటం కొరకు. విప్రోత్తములకు అనటం వలన 'విద్యయా యాతి విప్రత్వం' - విద్యచేతనే విప్రత్వం కలుగుతుంది అన్నమాటలనుబట్టి విద్య అంటే పరమార్థ విద్యయే. కనుక అట్టి వారిలో ఉత్తములకు దానమిస్తే దానఫలం ఉత్తమంగా ఉంటుందని సూచన. ఉత్తమ గోవులను అనటంవలన పనికిమాలిన వాటిని వదలించుకొనటానికి దానం ఇవ్వరాదని హెచ్చరిక.

క. రేపకడ నీరు ద్రావక । మేపు గొనక మున్న గోవు మిక్కిలి భక్తిన్
భూపాల యిచ్చునది ది । వ్యాపార సుఖంబుఁ బడయ నాత్మఁ దలఁచినన్. 18

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; దివ్య+అపార సుఖంబున్= స్వర్గంలోని అంతులేని సుఖాన్ని; పడయన్= పొందటానికి; ఆత్మన్= హృదయంలో; తలఁచినన్= తలచినట్లైతే; రేపకడన్= ప్రొద్దుననే; నీరు= నీటిని; త్రావక= త్రాగకుండా; మేపుకొనక మున్న= మేత మేయకముందే; మిక్కిలి భక్తిన్= గొప్ప భక్తితో; గోవున్= ఆవును; ఇచ్చునది= ఇమ్ము.

**తాత్పర్యం:** ధర్మరాజా! స్వర్గ సుఖాలు అపారంగా పొందాలి అనే కోరిక మనసులో ఉంటే ఉదయాన్నే గోవు నీరుత్రాగకముందే మేతమేయకముందే గొప్ప భక్తితో దానము చేయవలయును.

**విశేషం:** దానం ఒక పవిత్రమైన ఉపాసనవంటిది. అది చేయదలచినవాడు శాస్త్రవిధి నతిక్రమించకూడదు.

క. మొదవులలో నెల్లఁ గపిల । మొదవు వరిష్ఠంబు రాజముఖ్య! నియతిమై
నది విప్రున కిచ్చు టరయఁ । దుది దానంబులకు; నఱకు దురితాటవులన్.' 19

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజశ్రేష్ఠా!; మొదవులలోన్ ఎల్లన్= ఆవులన్నింటిలో; కపిల మొదవు= పుల్లావు; వరిష్ఠంబు= మేలైనది; నియతిమైన్= నిష్ఠతో; అది= దానిని; విప్రునకున్= విద్యలో ఆరితేరిన వాడికి; ఇచ్చుట= ఇవ్వటం; అరయన్= పరిశీలిస్తే; దానంబులకున్= దానాలకు; తుది= చివరిది; దురిత+అటవులన్= పాపాలనే అడవులను; నఱకున్= నరికివేస్తుంది.

**తాత్పర్యం:** రాజా! ఆవులలో పుల్లావు చాలా మేలైనది. దానిని నిష్ఠతో విప్రుడికి దానం చేయటం దానాలకు చివరిమెట్టు. అది పాపమనే అడవులను నరికివేస్తుంది.'

**విశేషం:** గోరోజనం రంగుగల ఆవులను పుల్లావు లంటారు. 'తుది' అంటే మరొకదానం చేయనక్కరలేదని భావం. 'దురిత మనే అటవి' అన్నరూపకంవలన పాపాల చెడ్డఫలితాలు ఎంత గాఢంగా ఉంటాయో భావనకు వస్తుంది.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు 'కపిలగోవున కీ విశేషం బెట్లు గలిగె నెఱింగింపవే' యనుటయు గాంగేయుం డతని కిట్లనియె. 20

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని=ఆలకించి; కౌంతేయ+అగ్రజుండు= కుంతికొడుకులలో పెద్దవాడు; కపిల గోవునకున్= పుల్లావుకు; ఈ విశేషంబు= ఈ గొప్పతనం; ఎట్లు= ఏ విధంగా; కలిగెన్= కలిగింది; ఎఱింగింపవే= తెలియజేయుము; అనుట యున్= అనగా; గాంగేయుండు= గంగకొడుకు భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు= ఈ విధంగా; అని యెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని ధర్మరాజు 'తాతా! పుల్లావుకు ఆ మహిమ ఎట్లా వచ్చిందో చెప్పుము' అంటే భీష్ము డతడితో ఇట్లా అన్నాడు.

## గోవులకుఁ గపిలత్వంబు సిద్ధించిన ప్రకారము (సం.13-76-21)

సీ. 'దేవత లాఁకొని దేవతాజ్యేష్ఠునిఁ । గానంగఁ బోవ నా కమలజన్ముఁ
డమృత మిచ్చిన ముదమారఁగాఁ ద్రావఁ ద । త్పరభిత్వ సంపద సురభి పుట్టె;

**నది సౌరభేయుల నధిప! యుత్పాదించె; నొక యప్డు హిమగిరి యుపరితల మ**

**లంకరించుచు నవి శంక యించుక లేక। యున్నెడ వానిలో నొకటి లేఁగ**

**ఆ. చన్ను గుడువఁ దదాస్య నిష్యంద మాన। మైన దుగ్ధ ఫేనము పవమాన నిహతిఁ**

**దూలి తప ముగ్రముగఁ జేయు శూలి మౌళిఁ। బడిన నద్దేవుఁ డధికకోపంబు గదుర. 21**

**ప్రతిపదార్థం:** దేవతలు= దేవలోకంవారు; ఆఁకొని= ఆకలిపొంది; దేవతాజ్యేష్ఠునిన్= బ్రహ్మను; కానంగన్= చూడటానికి; పోవన్= పోతే; ఆ కమలజన్ముఁడు= కమలంలో పుట్టిన ఆ బ్రహ్మ; అమృతమున్= అమృతాన్ని; ఇచ్చినన్= ఇవ్వగా; ముదము+ ఆరఁగాన్= తృప్తితీరేటట్లు; త్రావన్= త్రాగగా; తత్ సురభిత్వ సంపదన్= దాని వాసన ఎక్కువతనానికి; సురభి= కామధేనువు; పుట్టెన్= పుట్టింది; అధిప!= రాజా!; అది= కామధేనువు; సౌరభేయులన్= ఆవులను; ఉత్పాదించెన్= పుట్టించింది; ఒక+అప్డు= ఒక సమయంలో; అవి= ఆ ఆవులు; హిమగిరి ఉపరితలము= మంచుకొండ పై భాగాన్ని; అలంకరిం చుచున్= అందగింపజేస్తూ; శంక= జంకు; ఇంచుక= కొంచెం కూడా; లేక ఉన్న+ఎడన్= లేకుండా ఉన్నప్పుడు; వానిలోన్= ఆ ఆవులలో; ఒకటి= ఒక్కటి; లేఁగ= దూడ; చన్ను కుడువన్= పొదుగులో పాలు త్రాగుతూ ఉంటే; తత్ ఆస్య నిష్యంద మానము+ఐన= దాని మోమునుండి జారుచున్న; దుగ్ధ ఫేనము= పాల నురుగు; పవమాన నిహతిన్= గాలిదెబ్బకు; తూలి= చెదరి; తపము= తపస్సు; ఉగ్రముగన్= తీవ్రంగా; చేయు= చేస్తున్న; శూలి= శివుడి; మౌళిన్= తలమీద; పడినన్= పడగా; ఆ+దేవుఁడు= ఆ ప్రభుడు; అధిక కోపంబు= ఎక్కువ కోపం; కదురన్= కలుగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** దేవతలకు ఆకలి వేసింది. బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. ఆయన అమృత మిచ్చాడు. వారు తనివితీరా త్రాగారు. ఆ అమృతపు సువాసనకు కామధేనువు పుట్టింది. దానికి ఆవులు పుట్టాయి. అవి ఒకప్పుడు హిమాలయం పై భాగాన అలంకారంగా తిరుగుతున్నాయి. వానిలో ఒక ఆవు లేగ పాలు త్రాగుతూ ఉంటే దానినోటి దగ్గరి నురుగు గాలివాటానికి ఎగిరి అక్కడ తీవ్రంగా తపస్సు చేస్తున్న శివుడి నెత్తిమీద పడింది. శివుడికి చాలా కోపం వచ్చింది.

**విశేషం:** 'శూలి' అనే పదం సాభిప్రాయం. అది ఆయనకోపానికి అనుగుణంగా వచ్చి పడింది.

**క. చిచ్చఱకన్నదరు లెగయ। విచ్చినఁ గపిలత్వ మొందె విబుధప్రకరం**

**బచ్చెరు వందుచుఁ గన్గొన। నచ్చేరువ సౌరభేయు లమలచరిత్రా! 22**

**ప్రతిపదార్థం:** అమల చరిత్రా!= స్వచ్ఛమైన ప్రవర్తనగల ఓ రాజా!; చిచ్చఱ కన్ను= నిప్పులు గ్రక్కే (మూడవ) కన్ను; అదరులు= నిప్పు కణికలు; ఎగయన్= ఎగిరి పడేటట్లుగా; విచ్చినన్= తెరువగా; ఆ+చేరువ సౌరభేయులు= ఆ దగ్గరలో ఉన్న ఆవులు; విబుధ ప్రకరంబు= దేవతల సముదాయం; అచ్చెరువు+అందుచున్= ఆశ్చర్యపడుతూ; కన్గొనన్= చూస్తూ ఉండగా; కపిలత్వము= గోరోచనం వన్నెను; ఒందెన్= పొందాయి.

**తాత్పర్యం:** శివుడి అగ్నిమయమైన మూడవ కన్ను నిప్పులు గ్రక్కుతూ తెరుచుకొనేసరికి ఆ ప్రాంతంలో ఉన్న ఆవులన్నీ, దేవతలు ఆశ్చర్యపడుతూ ఉండగా, ఎర్రని రంగును పొందాయి.

**విశేషం:** పద్యం చిన్న ప్రమాణం. అది హఠాత్తుగా జరిగిన సంఘటనకు వ్యంజకంగా రూపొందింది. 'చిచ్చు' అనే చిన్న శబ్దంలో మూడు చకారాలు ఉన్నాయి. అవి అగ్ని చిటపటలను సూచిస్తాయి.

**క.** **అవి బిట్టు బెదరఁ దక్కటి । యవియు నదరి బెదరె; నిట్టు లగ్గోవులు వా**
**ఱె వెసను సోముని పాలికి । నవనీశ్వర! దాని నెఱిఁగి యజుఁ డేతెంచెన్.** **23**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ్వర!= రాజా!; అవి= అట్లా క్రొత్త రంగు వచ్చిన ఆవులు; బిట్టు= పెద్దగా; బెదరన్= భయపడగా; తక్కటి అవియున్= మిగిలినవి కూడా ; అదరి= హడలి; బెదరెన్= భయపడిపోయాయి; ఇట్టులు= ఈ విధంగా; ఆ+గోవులు= ఆ ధేనువులు; పాఱెన్= పారిపోయాయి; వెసను= వెంటనే; దానిన్= ఆ సంగతిని; ఎఱిఁగి= తెలిసికొని; అజుఁడు= బ్రహ్మ; సోముని పాలికిన్= శివుడి దగ్గరకు; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అట్లా రంగుమారిన ఆవులు బెదరేసరికి తక్కిన ఆవులు బెదరి పారిపోయాయి. ఆ సంగతి తెలిసికొని బ్రహ్మదేవుడు శివుడి దగ్గరకు వచ్చాడు.

**విశేషం:** తాను సృజించిన గోవులు శివుడి కోపానికి గురి అయ్యాయి కనుక ఆ కోపాన్ని పోగొట్టటం బ్రహ్మ బాధ్యత.

**సీ.** **ఏతెంచి నిభృతిమై నీశ్వరు చరణాంబు । జములకు నెఱఁగి హస్తములు మొగిచి**
**యమృతసిక్తుఁడ వైతి వఖిలేశ! గోవుల । కెంగిలి లే; దిందుఁ డెట్టు లమృత**
**మొసఁగు నట్టుల గోవు లొసఁగు దుగ్ధంబులఁ । దద్వత్స పీత దుగ్ధంబు శుచియ**
**కాన కోపము దక్కి కరుణింపు' మని యొక్క । కమనీయ వృషభంబుఁ గప్ప మిచ్చె;**

**ఆ.** **శివుఁడు ప్రియమంది దానిఁ గేతువును వాహ । నంబుగాఁ జేసి సకలజనంబు నెలమి**
**వృషభకేతనుఁ డనియును, వృషభవాహ । నుం డనియుఁ బేర్కొనఁగ నొప్పియుండె నధిప!** **24**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! ఏతెంచి= వచ్చి; నిభృతిమైన్= నిండుదనంతో; ఈశ్వరు చరణ+అంబుజములకున్= శివుడి పాదములనే పద్మాలకు; ఎఱఁగి= మ్రొక్కి; హస్తములు= చేతులు; మొగిచి= మోడ్చి; అఖిల+ఈశ= సర్వప్రభూ!; అమృత సిక్తుఁడవు= అమృతంతో తడిసినవాడవు; ఐతివి= అయ్యావు; గోవులకున్= ఆవులకు; ఎంగిలి= నోటినుండి జారిన దాని దోషం; లేదు; ఇందుఁడు= చంద్రుడు; ఎట్టులు= ఏ విధంగా; అమృతము= అమృతాన్ని; ఒసంగున్= ఇస్తాడో; అట్టులన్= ఆ విధంగానే; గోవులు= ఆవులు; దుగ్ధంబులన్= పాలను; ఒసఁగున్= ఇస్తాయి; తద్ వత్స పీత దుగ్ధంబున్= వాటి దూడలు త్రావినపాలు కూడా; శుచి+అ= నిర్మలమే; కాన= కనుక; కోపము= కోపాన్ని; తక్కి= వదలి; కరుణింపుము= దయజూడుము; అని= అని పలికి; ఒక్క కమనీయ వృషభంబున్= ఒక అందమైన ఎద్దును; కప్పమున్= కానుకగా; ఇచ్చెన్= ఇచ్చాడు; శివుఁడు= ఈశ్వరుడు; ప్రియము+అంది= సంతోషం పొంది; దానిన్= ఆ ఎద్దును; కేతువును= జెండామీద గుర్తుగా; వాహనంబుగాన్= ఎక్కిరింతగా; చేసి= ఏర్పరచి; ఎలమిన్= ప్రీతితో; సకలజనంబున్= జనులంతా; వృషభకేతనుఁడు=ఎద్దు టెక్కెంగా కలవాడు; అనియును= అనీ; వృషభ వాహనుండు= ఎద్దు వాహనంగా కలవాడు; అనియున్= అనీ; పేర్కొనఁగన్= పేరు పెట్టి వ్యవహరిస్తూ ఉంటే; ఒప్పి+ఉండెన్= చక్కగా ఉన్నాడు.

**తాత్పర్యం:** రాజా! బ్రహ్మ అట్లా వచ్చి ఈశ్వరుడి కాళ్ళకు మ్రొక్కాడు. చేతులు జోడించి స్వామీ! 'నీవు అమృతంతో తడిశావు. ఆవులకు ఎంగిలి లేదు. చంద్రు డమృతం ఇచ్చినట్లు ఆవులు పాలిస్తాయి. కాబట్టి వాటి దూడలు త్రావిన పాలు కూడా పరిశుద్ధాలే. కనుక కోపం వదలి మమ్మల్ని కరుణించుము' అని ఒక చక్కని ఎద్దును కానుకగా ఇచ్చాడు. శివుడు ప్రీతిపొంది దానిని ధ్వజంమీద గుర్తుగా, వాహనంగా చేసికొని వృషభకేతనుడు, వృషభవాహనుడు అని అందరూ తన్ను పిలుస్తూ ఉంటే సంతోషంతో ఉన్నాడు.

**విశేషం:** శంకరుడు బోళావ్యక్తి కదా! వెంటనే కోపం పోగొట్టుకొన్నాడు. ఉచ్ఛిష్టం అంటే తింటున్న పదార్థం వెలుపలికి రావటం. అది ఎంగిలి. దానిని ఆచారనిష్ఠ కలవారు అంటరు. బ్రహ్మ ఆవులకు ఆ దోషం లేదని శివుడికి చెప్పాడు.పైగా ఆ ఆవు పాలూ అమృతమూ ఒకే రకమైనవని కూడా చెప్పాడు.

**వ. ఇట్లు ప్రసన్నుండయి గో సంచారం బెందునుం గలుగునట్లుగా ననుగ్రహించిన నా సౌరభేయీ సముదయంబు మగుడ నన్నగంబునకు వచ్చి విచ్చలవిడి వర్తింపంజూచి, తన చూపునం గపిల లయిన గోవులకుం దక్కిన వర్ణంబుల కంటె నుత్తమత్వంబు గలుగ వరం బిచ్చి విరించిని వీడ్కొలిపె; నట్లు గావునం గపిల గోప్రదానంబు గోదాన కల్పంబున కంతకు నధికం బని చెప్పి. 25**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రసన్నుండు+అయి= కోపం పోయినవాడై; గో సంచారంబు= ఆవులు తిరగటం; ఎందునున్= ఎక్కడయినా; కలుగు+అట్లు+కాన్= కలిగే విధంగా; అనుగ్రహించినన్= వరంగా ఇవ్వగా; ఆ సౌరభేయీ సముదయంబు= ఆ ఆవుల మంద; మగుడన్= తిరిగి; ఆ+నగంబునకున్= ఆ కొండకు; వచ్చి; విచ్చలవిడిన్= ఇష్టం వచ్చినట్లుగా; వర్తింపన్= తిరుగుతూ ఉంటే; చూచి= కనుగొని; తన చూపునన్= తన దృష్టిచేత; కపిలలు అయిన గోవులకున్= కపిలవర్ణం పొందిన ఆవులకు; తక్కిన వర్ణంబుల కంటెన్= తక్కిన రంగుల ఆవులకంటె; ఉత్తమత్వంబు= శ్రేష్ఠత్వం; కలుగన్= కలిగేటట్లు; వరంబు= వరాన్ని; ఇచ్చి; విరించిని= బ్రహ్మను; వీడ్కొలిపెన్= పంపించాడు; అట్లు+కావునన్= ఆ తీరు అయినది కనుక; కపిల గోప్రదానంబు= పుల్లావులను దానం చేయటం; గో దాన కల్పంబునకున్= గోవులను దానం చేయటమనే విధానానికి; అంతకున్= మొత్తానికి; అధికంబు= మిన్న; అని; చెప్పి.

**తాత్పర్యం:** శివు డిట్లా ప్రసన్నుడై గోవులు ఎక్కడైనా ఇచ్చవచ్చినట్లు తిరిగేటట్లుగా వరం ఇచ్చాడు. ఆవుల మంద మరల ఆ కొండకు వచ్చి స్వేచ్ఛగా తిరగటం చూచి, తన చూపునకు కపిలవర్ణం పొందిన ఆవులు తక్కిన రంగుల ఆవులకంటె గొప్పవిగా వర మిచ్చి బ్రహ్మను అతడి లోకానికి పంపాడు. కనుక గోదాన పద్ధతిలో కపిలగోవులను దానం చేయటం గొప్ప విషయం అని చెప్పి.

**విశేషం:** మహానుభావుల కోపం కూడా విశేషఫలాన్ని ఇస్తుం దనటానికి ఇది ఒక దృష్టాంతం.

**క. ఈ కపిలాఖ్యానము సు । శ్లోకము; దీని పఠనంబు శ్రుతముఁ గలిమలో**
**ద్రేకంబుఁ బాచి సుతుల న । నేక ధనంబులను బెంపు నిచ్చు నరేంద్రా!' 26**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; ఈ కపిలా+ఆఖ్యానము= ఈ కపిలగోవు కథ; సుశ్లోకము= మిక్కిలి పవిత్రమైనది; దీని పఠనంబు= దీనిని చదవటమూ; శ్రుతమున్= వినటమూ; కలిమల+ఉద్రేకంబున్= కలి కల్మషం పెచ్చు పెరగటాన్ని; పాచి=తొలగించి; సుతులన్= కుమారులను; అనేక ధనంబులను= పెక్కు ధనాలను; పెంపున్= గొప్పతనాన్నీ; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** రాజా! ఈ కపిల గోవుల కథ చాలా పవిత్రమైనది. దీన్ని చదివినా, విన్నా సకల పాపాల విజృంభణం అణగి పోతుంది. మంచి సంతానాన్ని, గొప్ప ధనాలను ఇది ఇస్తుంది.'

**విశేషం:** మానవుడు వివేకంతో కోరవలసినవి అనిష్టాన్ని తొలగించుకొనటం, ఇష్టాన్ని కూర్చుకొనటం. అందుకే ఈ పద్యంలో ముందు పాపాలు పటాపంచ లవటాన్నీ, తరువాత సుతధనలాభాన్నీ చెప్పాడు.

**వ. అనిన విని ధర్మపుత్త్రుండును దమ్ములును సమ్మోదంబు నొంది భీష్మునకుం బ్రణమిల్లి గోప్రదానంబులు విధి సంపన్నంబులుగాఁ జేయువారై మనంబులం బూని; రప్పితామహుం డప్పాండవాగ్రజు నుద్దేశించి వెండియు నిట్లనియె. 27**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ధర్మపుత్త్రుండును= ధర్మరాజున్నూ; తమ్ములును= తమ్ముళ్ళూ; సమ్మోదంబున్+ఒంది= ఎంతో ఆనందపడి; భీష్మునకున్= భీష్ముడికి; ప్రణమిల్లి= సాష్టాంగ దండం చేసి; గో ప్రదానంబులు= గోవులను మంచి బుద్ధితో ఇవ్వటాలను; విధి సంపన్నంబులుగాన్= శాస్త్ర విధానం నిండుగా ఉండే విధంగా; చేయువారు+ఐ= చేసేవారై; మనంబులన్= హృదయాలలో; పూనిరి= సంకల్పించారు; ఆ+పితామహుండు= ఆ తాత; ఆ+పాండవ+అగ్రజున్= పాండుకుమారులలో పెద్దవాడైన ధర్మరాజును; ఉద్దేశించి= చూచి; వెండియున్= ఇంకను; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** తాత ఇట్లా చెప్పగా ధర్మరాజూ, తమ్ములూ పరమానందం పొందారు. భీష్ముడికి సాష్టాంగ నమస్కారం చేశారు. గోదానాలను శాస్త్రవిధానంతో ఏ లోపం లేకుండా చేయాలని సంకల్పించారు. ఆ తాత మళ్ళీ ధర్మరాజును చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** తమ్ములును అనటంవలన మంచిపనులు చేయటంలో వారు ధర్మరాజువంటివారే అనే అర్థం స్ఫురిస్తుంది. ప్రణమిల్లి- ఒక్కొక్క మహావిషయం విన్నప్పుడల్లా వారికి భీష్ముడిమీద గౌరవం ఇనుమడిస్తున్నదని తాత్పర్యం. పితామహుడు - తాతకు మనుమల మీద విశేషానురాగం ఉంటుంది.

**సీ. 'సౌదాసుఁ డనఁగ నిక్ష్వాకు కులంబున । జనియించె; నాతఁడు మునివరేణ్యుఁ**
**డైన వసిష్ఠుని నాత్మపురోహితు । వినతుఁ డై యడిగెఁ బవిత్ర మెద్ది?**
**యని దాని కాదర మతిశయిల్లఁగ నమ్మ । హాత్ముఁ డిట్లనియెఁ 'బుణ్యాత్మ! వినుము**
**గోవు పవిత్రంబు గోవు హవిర్జన్మ । భూమి గో వరయఁగా భూతములకు**

**ఆ. నెల్ల నాధారభూతమౌ నీడ్యవస్తు । వతుల లక్ష్మికి మూల; మత్యంత దురిత**
**జలనిధికి నోడ; నిర్జర సద్మమునకు । ననఘ! నిచ్చెన సురలకు మనికిపట్టు.' 28**

**ప్రతిపదార్థం:** ఇక్ష్వాకు కులంబునన్= ఇక్ష్వాకుడి కులంలో; సౌదాసుఁడు అనఁగన్= సౌదాసుడనే పేరుతో; జనియించెన్= (ఒక రాజు) పుట్టాడు; ఆతఁడు= ఆ రాజు; మునివరేణ్యుఁడు+ఐన= మునులలో శ్రేష్ఠుడైన; వసిష్ఠునిన్= వసిష్ఠుడిని; ఆత్మ పురోహితున్= తన పురోహితుడిని; వినతుఁడు+ఐ= వినయం కలవాడై; పవిత్రము= పవిత్రమైనది; ఎద్ది= ఏది? అని, అడిగెన్= అడిగాడు; ఆ+మహాత్ముఁడు= దొడ్డబుద్ధి గల ఆ వసిష్ఠుడు; దానికిన్; ఆదరము= ప్రీతి; అతిశయిల్లఁగన్= పెంపొందగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; పుణ్య+ఆత్మ= ఓయి పుణ్య హృదయుడా!; వినుము; అనఘ!= పాపాలు లేనివాడా; గోవు= ఆవు; పవిత్రంబు= పవిత్రం అయినది; గోవు= ఆవు; హవిస్+జన్మభూమి= హోమపదార్థాలకు పుట్టిన ఇల్లు; అరయఁగాన్= మెలకువతో చూస్తే; గోవు= ఆవు; భూతములకున్+ఎల్లన్= అన్ని ప్రాణులకు; ఆధార భూతము+ఔ= ఆధారంగా అయిన; ఈడ్య వస్తువు= పూజించదగిన వస్తువు; అతుల లక్ష్మికిన్= సాటిలేని సంపదకు; మూలము= కుదురు; అత్యంత దురిత జనిధికిన్= మిక్కిలి ఘోరమైన పాపాలనే సముద్రానికి; ఓడ; నిర్జరసద్మమునకున్= దేవతల నెలవైన స్వర్గానికి; నిచ్చెన= నిచ్చెన; సురలకున్= దేవతలకు; మనికిపట్టు= నివసించే చోటు.

**తాత్పర్యం:** ఇక్ష్వాకువంశంలో సౌదాసుడనే రాజు ఉండేవాడు. మునులలో ఉత్తముడూ, తన పురోహితుడూ అయిన వసిష్ఠుడిని ఆ రాజు వినయంతో 'స్వామీ! పవిత్రమైన దేది?' అని అడిగాడు. ఎంతో ప్రీతి పొంది ఆ మహాత్ముడు ఇట్లా అన్నాడు. 'పుణ్యాత్ముడా! వినుము! గోవు పవిత్రమైనది. గోవు హోమద్రవ్యాలకు పుట్టినిల్లు. అన్ని ప్రాణులకూ గోవే ఆధారం. అది పూజ్యమైనది. సాటిలేని సంపదలకు మూలం. మహాపాపా లనే సముద్రాన్ని దాటటానికి ఓడ, స్వర్గానికి నిచ్చెన, దేవతలకు నివాసస్థలం.'

**విశేషం:** మునివరేణ్యుడు, ఆత్మ పురోహితుడు కనుక తా నడిగే ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పగలడని రాజునకు నమ్మకం. మంచి ప్రశ్న అడిగినందుకు వసిష్ఠుడికి ఎంతో ప్రీతి కలిగింది. అందుకనే 'పుణ్యాత్మ' అని సంబోధిస్తున్నాడు. పుణ్యాత్ములకు కాని ఇటువంటి జిజ్ఞాస కలుగదని భావం. వ్యవసాయానికీ, పాడిపంటలకు, యజ్ఞద్రవ్యాలకు గోవే ఆధారం కనుక దానివలననే మానవులకు సుఖశాంతులు వర్ధిల్లుతాయి కనుక ఈ ప్రశంస అస్థాన పతితం కాదు.

**వ. అని చెప్పి మఱియును. 29**

**తాత్పర్యం:** వసిష్ఠ డిట్లా చెప్పి మరికొన్ని విషయాలు చెప్పుతున్నాడు.

**క. 'పదియును నూఱును వేయును। మొదవులు గలవారు దానములుగా నొకటిం**
**బదియింటి నూటి నిచ్చిన। నదియు నదియు నదియు నదృశమగు ఫలము నెడన్. 30**

**ప్రతిపదార్థం:** పదియును= పదిన్నీ; నూఱును= వందా; వేయును= వేయీ; మొదవులు= ఆవులు; కలవారు= ఉన్నవారు; దానములుగాన్= దానాలుగా; ఒకటిన్= ఒక దానినీ; పదియింటిన్= పదింటినీ; నూటిన్= నూరింటినీ; ఇచ్చినన్= ఇస్తే; అదియున్= ఆ ఒక్కటి నిచ్చినదానమూ; అదియున్= ఆ పదింటి నిచ్చినదానమూ; అదియున్= ఆ నూరింటి నిచ్చిన దానమూ; ఫలము+ఎడన్= అందించే ఫలం విషయంతో; సదృశము= సమానం; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** 'పది ఆవులున్నవారు ఒకదానినీ, వంద ఆవులున్నవారు పదింటినీ, వేయి ఆవులున్నవారు నూరింటినీ దానం చేస్తే ఆ మూడు దానాల ఫలమూ సమానం అవుతుంది.

**విశేషం:** దానం అనేది శక్తినిబట్టి చేయాలి. దానం ముఖ్యం కానీ ఎంత? అనేది ప్రధానం కాదు. ఆ విధంగా ఫలితం సమానం అవుతుంది.

**క. విను గోవులను బ్రభాతం। బునఁ దలఁచుట, తద్గుణములు వొగడుట, భక్తిం**
**గనుఁగొనుట యధిక పుణ్యము। లని యెఱిఁగించు జనములకు నాగమఫణితుల్. 31**

**ప్రతిపదార్థం:** వినుము; ఆగమ ఫణితుల్= వేదకావ్యాలు; జనములకున్= జనాలకు; గోవులను= ఆవులను; ప్రభాతంబునన్= ప్రొద్దున; తలఁచుట= స్మరించటమూ; తత్‌గుణములు= వాని గుణాలను; పొగడుట= కొనియాడటమూ; భక్తిన్= భక్తితో; కనుఁగొనుట= (ఆవులను) చూడటమూ; అధిక పుణ్యములు= ఎక్కువ పుణ్యాలు; అని; ఎఱిఁగించున్= తెలియజేస్తాయి.

**తాత్పర్యం:** ఉదయకాలంలో ఆవులను తలవటమూ వాటి గుణాలను కొనియాడటమూ, భక్తితో వాటిని చూడటమూ గొప్ప పుణ్యకార్యాలని వేదవాక్యాలు జనాలకు తెలియజేస్తున్నాయి.

**విశేషం:** 'ఆగమం' అంటే శబ్ద ప్రమాణం. అది అన్ని ప్రమాణాలకంటె మిన్న అయినది. కాబట్టి దీనిలో సంశయించవలసిన దేమీ లేదని భావం. ప్రభాతంబున= అంటే దినారంభంలో, పుణ్యకార్యాలతో రోజుపని ప్రారంభిస్తే రోజంతా పుణ్యంతో నిండుతుందని భావం. 'విను' అనే మాట శ్రద్ధను సూచిస్తుంది.

**ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రముల కేవ । పడుట సకలమాంసభక్షి కైన**
**ఘోరపాప మండ్రు గోమాంస భక్షణ । మబ్జసంభవాదు లైన సురలు. 32**

**ప్రతిపదార్థం:** గో శకృత్+మూత్రములకున్= ఆవు పేడ, పంచితములకు; ఏవపడుట= రోతపడటం; కిల్బిషంబు= పాపం; అబ్జసంభవ+ఆదులు+ఐన= బ్రహ్మ మొదటగా ఉన్న; సురలు= దేవతలు; సకల మాంస భక్షికిన్+ఐనన్= అన్ని జంతువుల మాంసాలు తినేవానికి కూడా; గో మాంస భక్షణము= ఆవుల మాంసం తినటం; ఘోర పాపము= చాలా భయంకరమైన పాపం; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఆవుల మలమూత్రాలకు రోతపడటం పాపం. అన్ని జంతువుల మాంసాలు తినే వారికైనా ఆవు మాంసం తినటం చాలా ఘోరమైన పాపం అని బ్రహ్మ మొదలైన దేవతలు అంటారు.

**క. జనములు దుస్స్వప్నంబులు । గని గో కీర్తనము సేయఁగాఁ దద్దురితం**
**బునఁ బొరయరు గోమయయుత । వినుతాంబు స్నాన మతిపవిత్రం బనఘా! 33**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; జనములు= మానవులు; దుస్ స్వప్నంబులు= పీడకలలు; కని= పొంది; గో కీర్తనము= ఆవులను పొగడటం; చేయఁగాన్= చేస్తే; తత్ దురితంబునన్= ఆ పాపాన్ని; పొరయరు= పొందరు; గోమయ యుత వినుత+ అంబు స్నానము= ఆవుపేడతో కలిసి ప్రశస్తమైన నీటితో (చేసే) స్నానం; అతి పవిత్రంబు= మిక్కిలి పరిశుద్ధమైనది.

**తాత్పర్యం:** మానవులు పాడుకలలు కన్నప్పుడు ఆవులను గురించి మంచి మాటలు పలికితే ఆ పాపాలను పొందరు. ఆవుపేడ కలిపిన నీటి స్నానం ఎంతో పరిశుద్ధి నిస్తుంది.

**చ. సురభులు, సౌరభేయులును సుస్థితి నాకడ నుండుఁ గాత మేఁ**
**గరము వినీతి గోగణముఁ గన్గొనుచుండెద నర్థి గో సము**
**త్కరమును నన్ను నెప్డుఁ గనుఁ గావుత మం చెద గోవులం దలం**
**తురు బుధబోధితుల్ భయము దోఁచిన చోటులఁ దత్ప్రశాంతికై.' 34**

**ప్రతిపదార్థం:** బుధబోధితుల్= పండితులచే ఉపదేశింపబడినవారు; భయము= భీతి; తోఁచినచోటులన్= ఏర్పడిన తావులలో; తత్ ప్రశాంతికై= అది అణగిపోవటానికి; సురభులు= ఆవులు; సౌరభేయులును= ఆవుదూడలున్నూ; సుస్థితిన్= మంచి నిలుకడతో; నాకడన్= నా దగ్గర; ఉండున్+కాతన్= ఉండుగాక; ఏన్= నేను; కరము= మిక్కిలి; వినీతిన్= వినయంతో; గోగణమున్= ఆలమందను; అర్థిన్= కోరికతో; కన్గొనుచుండెదన్= చూస్తూ ఉంటాను; గో సముత్కరమును= ఆవులమందకూడా; నన్నున్= నన్ను; ఎప్డున్= ఎల్లవేళలా; కనున్ కావుతన్= చూచుగాక; అంచున్= అంటూ; ఎదన్= హృదయంలో; గోవులన్= ఆవులను; తలంతురు= భావిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** పండితులచే ఉపదేశాలు పొందినవారు, భయాందోళనలు పొందేటప్పుడు వాటిని ఉపశమింపజేసికొనటానికి ఆవులను, దూడలను తమవద్ద సుస్థిరంగా ఉండాలని కోరుకొంటారు. నేను వినయంతో వాటి యోగక్షేమాలను ప్రీతితో చూస్తూ ఉంటాననీ, గో సమూహంకూడా నన్నెపుడూ చల్లగా చూడాలని వారు భావిస్తుంటారు.

**వ. అని నిర్దేశించి వెండియు నమ్మునీంద్రుం డా నరేంద్రున కిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; నిర్దేశించి= చెప్పి; వెండియున్= ఇంకా; ఆ+ముని+ఇంద్రుండు= ఆ మహర్షి శ్రేష్ఠుడు; ఆ నరేంద్రునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి ఆ వసిష్ఠ మహాముని సౌదాస మహారాజుతో ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. 'అరుణ ధవళ మేచక ధూ । సరవర్ణాకలిత గో విషయదానంబుల్**
**ఖరకర సురపాగ్ని పవన । పరలోక సుఖముల నిచ్చు వసుధాధీశా! 36**

**ప్రతిపదార్థం:** వసుధా+అధీశా!= రాజా!; అరుణ= ఎరుపు; ధవళ= తెలుపు; మేచక= నలుపు; ధూసర= బూడిదరంగు; అనే; వర్ణ= వన్నెలతో; ఆకలిత= చక్కగా కూడుకొన్న; గో= ఆవుల; విషయ= సంబంధమైన; దానంబుల్= దానాలు; ఖరకర= సూర్యుడి; సురప= ఇంద్రుడి; అగ్ని= అగ్నిదేవుడి; పవన= వాయుదేవుడి; వర= శ్రేష్ఠమైన; లోక= లోకములందలి; సుఖములన్= సుఖాలను; ఇచ్చున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** రాజా! ఎర్రని ఆవుల దానం సూర్యలోక సుఖాన్నీ, తెల్లని ఆవుల దానం ఇంద్రలోక సుఖాన్నీ, నల్లని గోవుల దానం అగ్నిలోక సుఖాన్నీ, బూడిదరంగు ఆవుల దానం వాయులోక సుఖాన్నీ ఇస్తుంది.

**విశేషం:** నాలుగురంగులూ, నాలుగు లోకాలూ క్రమంగా అన్వయించే విధంగా చెప్పటంవలన ఇందులో క్రమాలంకారం (యథాసంఖ్యాలంకారం) గోచరిస్తున్నది. ఏ రంగు గోవు ఉన్నా దాని దానం ఏదో ఒక పుణ్యలోకాన్నిస్తుంది అనే అర్థం ఇక్కడ ఈ అలంకారంవలన స్ఫురిస్తుంది. కనుక 'అలంకారకృత వస్తుధ్వని' రూపంగా ఈ అలంకారం ఔచిత్యాన్ని సాధించుకొంటున్నది. ఆ లోకాలుకూడా వట్టివికావు 'వరా'లు అంటే కోరదగినవి.

**క. విను తక్కిన వర్ణంబులు । జనవర గంధర్వ సిద్ధ సాధ్యాది నివా**
**స నితాంత సౌఖ్యదము లగు । ననిమిష యోషి త్ప్రియత్వ మన్నియు నిచ్చున్. 37**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; విను= వినుము; తక్కిన వర్ణంబులు= తక్కిన రంగుల ఆవులు (దానాలు); గంధర్వ= గంధర్వులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; ఆది= మొదలైనవారి; నివాస= ఉనికిపట్టుల; నితాంత= ఎడతెగని; సౌఖ్య దములు= సుఖములను ఇచ్చేవి; అగున్= అవుతాయి; అన్నియున్= అన్నిరకాల ఆవులు (ఆవుల దానాలు); అనిమిష యోషిత్ ప్రియత్వము= దేవతా కాంతలకు ప్రియుడయ్యే భావాన్ని; ఇచ్చున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** రాజా! తక్కిన వర్ణాల ఆవుల దానం గంధర్వ, సిద్ధ, సాధ్యనామాలుగల దేవజాతుల లోకాల సుఖాన్ని అనంతంగా ఇస్తాయి. అన్ని రకాల గోవులదానాలు అప్సరఃకాంతలకు వల్లభుడయ్యే భాగ్యాన్ని కలుగజేస్తాయి.

**విశేషం:** గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు - వీరిని దేవయోనులు అంటారు. వీరు అటు దేవతలంత మహిమగలవారు కారు. కేవలం మనుష్యులవంటి అల్పశక్తిమంతులూ కారు. అనిమిషులు - రెప్పపాటులేనివారు. అది దేవతల కొక గుర్తు. 'నితాంత' అన్నారు కనుక కొన్ని తరగతుల వారికి అదికూడా అపేక్షణీయమే అవుతుంది.

**క. ధేను ప్రమాణ యగు తిల । ధేనువు నిచ్చిన నరుండు దీప్తుండగుఁ బు**
**ణ్యానూన లోక సంవా । సానందోన్నతిఁ జరించు నప్రతిహతుఁడై. 38**

**ప్రతిపదార్థం:** ధేనుప్రమాణ అగు= ఆవు తూకానికి సరిపడే; తిలధేనువున్= నువ్వుల ఆవును; ఇచ్చిన నరుండు= ఇచ్చే మానవుడు; దీప్తుండు= ప్రకాశించేవాడు; అగున్= అవుతాడు; అప్రతిహతుఁడు+ఐ= ఏ అడ్డూ అదుపు లేనివాడై; పుణ్య= పుణ్యంతో; అనూన= ఏ తక్కువతనమూ లేని; లోక= లోకంలో; సంవాస= చక్కగా ఉండటంవలన కలిగిన; ఆనంద= ఆనందంయొక్క; ఉన్నతిన్= ఎక్కువతనంతో; చరించున్= తిరుగుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ వెత్తు నువ్వుల ఆవును దానం చేసిన మానవుడు మంచి తేజస్సుతో ఒప్పారుతూ ఉంటాడు. పుణ్యం ఏ మాత్రమూ తక్కువ కాని లోకాల నివాసంవలన కలిగే ఆనందాతిశయంతో విహరిస్తూ ఉంటాడు.

**విశేషం:** ఇది ప్రత్యామ్నాయ పద్ధతి అంటారు. ఆవులు దానమివ్వటానికి లేనివాడు పుణ్యలోకాలకు అనర్హుడా? అన్న ప్రశ్నకు ఇది సమాధాన మిస్తుంది. 'తిలధేనువు' అంటే నువ్వులతో ఆవు బొమ్మ చేయాలని తాత్పర్యం. 'అనూన' 'ఉన్నతి' అనే పదాలచేత ప్రత్యామ్నాయ పద్ధతి అయినా ఫలం విశేషంగా ఉంటుందనే సూచన వ్యక్తమవుతుంది.

**క. బహురూప విశ్వరూపక । మహిత సురూపత్వ దివ్యమహిమ గలుగు గో**
**మహనీయమూర్తి మన్మతి । సహిత మగుం గాత మనుట సంపద లొసఁగున్.' 39**

**ప్రతిపదార్థం:** బహురూప= పెక్కురూపాలు గల; విశ్వరూపక= సమస్తమైన రూపాలుగల; మహిత= గొప్పతనంగల; సురూపత్వ= చక్కని ఆకారంగల; దివ్య= దేవలోకపు; మహిమ కలుగు= మహిమ ఉన్నట్టి; గో= ఆవులయొక్క; మహనీయమూర్తి= గొప్ప ఆకృతి; మత్+మతి సహితము= నా బుద్ధితో కూడినది; అగున్ కాతన్= అగుకాక; అనుట= అని పలకటం; సంపదలు=సంపదలను; ఒసఁగున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** ఎన్నో రూపాలు, అన్ని రూపాలు కలిగి గొప్పతనం కల చక్కని ఆకారంతో దేవలోకపు మహిమ కలిగి ఉండే ఆవుల మహనీయ రూపం నా బుద్ధిలో నిలిచి ఉండుగాక అనుకొనటం సంపదల నిస్తుంది.'

**విశేషం:** 'విశ్వరూపక' - అనే పదప్రయోగంవలన గోవునకు విరాట్స్వరూపంతో సామ్యం స్ఫురిస్తుంది.

**క. అని ముని చెప్పిన సౌదా । స నరేంద్రుఁడు గో ప్రదాన సక్తాత్ముండై**
**యనితర సులభావ్యయ సుఖ । జనకస్థానంబు వడసె జనసంస్తుత్యా! 40**

**ప్రతిపదార్థం:** జనసంస్తుత్యా!= జనులచేత స్తుతింప బడే ఓ రాజా!; అని= ఆ విధంగా; ముని= వసిష్ఠముని; చెప్పినన్= చెప్పగా; సౌదాస నర+ఇంద్రుఁడు= సౌదాస రాజు; గో ప్రదాన సక్త+ఆత్ముండు+ఐ= ఆవులను శ్రద్ధతో దానమివ్వటంలో లగ్నమైన మనస్సు కలవాడై; అనితరసులభ= ఇతరులకు తేలికగా దొరకని; అవ్యయ= తరుగులేని; సుఖ= సుఖానికి; జనక స్థానంబు= పుట్టిన చోటును; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** రాజా! ఆ వసిష్ఠుడట్లా చెప్పగా సౌదాస మహారాజు గోవులను శ్రద్ధగా దానం చేసే పనిలో మనస్సును లగ్నం చేసి ఇతరుల కందని నాశనంలేని సుఖం పుట్టేస్థానాన్ని సంపాదించాడు.

**విశేషం:** దీన్ని ఆఖ్యాయిక అంటారు. అంటే ఒక పుణ్యకార్యం చేసినవాని కథ. దీనివలన మానవులకు గోదాన విషయంలో ప్రచోదన కలుగుతుంది. 'ప్ర' 'సక్త' అనే పదాలు దానంలో ఉన్న విశిష్టతను వ్యక్తం చేస్తున్నాయి. కనుకనే 'అనితర సులభ', 'అవ్యయ' అనే పదాలకు సార్థకత సిద్ధిస్తుంది.

**క. అని గంగాపుత్త్రుఁడు గో । వినుత మహిమఁ దెలియఁ జెప్ప విని ధర్మసుతుం**
**'డనఘచరిత్రా! యిట్లుం । డునె గోవుల పెంపు?' నావుడుం దగ మఱియున్. 41**

**ప్రతిపదార్థం:** అని; గంగాపుత్త్రుఁడు= భీష్ముడు; గో వినుత మహిమన్= గోవుల కొనియాడ దగిన గొప్పతనాన్ని; తెలియన్= తెలిసే విధంగా; చెప్పన్= చెప్పగా; విని; ధర్మసుతుండు= ధర్మరాజు; అనఘ చరిత్రా!= పాపాలులేని నడవడి కల ఓ మహానుభావా!; గోవులపెంపు= ఆవుల గొప్పతనం; ఇట్లు= ఈ విధంగా; ఉండునె= ఉంటుందా? నావుడున్= అని పలుకగా; తగన్= తగునట్లుగా; మఱియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఇట్లా భీష్ముడు గోవుల గొప్పతనాన్ని తెలియజెప్పగా విన్న ధర్మరాజు 'పుణ్యచరిత్రా! గోవుల మహిమ ఇంత గొప్పదా?' అన్నాడు. అప్పుడు మళ్ళీ. (తరువాతి వచనంతో అన్వయం)

**విశేషం:** 'ఇట్లుండునె' అనే పదబంధం ధర్మరాజు హృదయంలో కలిగిన ఆనందాశ్చర్యాలను అభివ్యక్తం చేస్తున్నది. శ్రోత ప్రీతితో వింటుంటే వక్తకు మరింత ఉత్సాహం కలుగుతుంది. అందుకనే భీష్ముడు ఇంకా చెప్పాలని ఉబలాట పడుతున్నారు.

**వ. అమ్మహాత్ముం డమ్మహీపతితో 'గో విశేషం బింకను విను' మని యిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్ముండు= దొడ్డబుద్ధిగల ఆ భీష్ముడు; ఆ+మహీపతితోన్= ఆ రాజుతో; గో విశేషంబు= గోవుల గొప్పతనం; ఇంకను= ఇంకా; వినుము; అని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** దొడ్డబుద్ధి గల భీష్ముడు ధర్మరాజుతో ఆవుల గొప్పతనం ఇంకా వినుము అని ఇట్లా చెప్తుతున్నాడు.

### వేదవ్యాసముని శుకునకుఁ దెలిపిన గో ప్రభావ ప్రకారము (సం.13-80-6)

**సీ. 'సర్వజ్ఞుఁ డగు పరాశరనందనుని పాద । పద్మంబులకు దృఢభక్తి నెఱఁగి**
**యతని నందనుఁడు సమంచిత మతియును । నవు శుకుం డెల్ల వస్తువులకంటె**
**నధికతమంబును యజ్ఞమూలంబును । నగు నది యెయ్యది? యతులకరుణ**
**నా కెఱింగింపవే' నావుడు నమ్మహి । తాత్ముఁ డివ్విధము మహానుభావ;**

**తే. మనఘ! యెందు నెక్కాలము నన్యవస్తు । వులకు లేదరయంగ గోవులకుఁ దక్కఁ**
**బుణ్యతమతయు యాగవిభూతి మూల । కారణత్వంబు వానిక కాక కలవె? 43**

**ప్రతిపదార్థం:** సర్వజ్ఞుఁడు+అగు= అంతయు తెలిసినవాడైన; పరాశరనందనుని= పరాశరుడి కుమారు డగు వ్యాసుడి; పాద పద్మంబులకున్= తామరపూలవంటి అడుగులకు; అతని నందనుఁడు= అతని కొడుకు; సమంచిత మతియును= మన్నింపదగిన

బుద్ధి కలవాడు; అవు= అయిన; శుకుండు= శుకుడు; దృఢభక్తిన్=గట్టిదైన భక్తితో; ఎఱఁగి= మ్రొక్కి; ఎల్ల వస్తువులకంటెన్= అన్ని వస్తువులకన్నా; అధికతమంబును= మిక్కిలి గొప్పదీ; యజ్ఞమూలంబును= యజ్ఞాలకు ఆధారమూ; అగునది= అయినది; ఏ+అది?= ఏది? అతులకరుణన్= సాటిలేనిదయతో; నాకున్= నాకు; ఎఱింగింపవే= దయతో తెలుపుమా? నావుడున్= అన్నంతనే; ఆ+మహిత+ఆత్ముఁడు= దొడ్డబుద్ధిగల ఆ వ్యాసుడు; అనఘ!= పాపరహితుడా?; ఈ+విధము= ఇట్టిదైన; మహానుభావము= గొప్ప ప్రభావం; ఎందున్= ఎక్కడా; ఏ+కాలమున్= ఏ కాలంలోనూ; అరయంగన్= పరీక్షించిచూడగా; గోవులకున్= ఆవులకు; తక్కన్= కాక; అన్య వస్తువులకున్= వేరు పదార్థాలకు; లేదు; పుణ్యతమతయున్= అన్నింటికంటె ఎక్కువ పుణ్యం కలది కావటమూ; యాగ విభూతి మూల కారణత్వంబున్= యజ్ఞాల ఐశ్వర్యానికి మొదటి హేతువు కావటమూ; వానిక= ఆ ఆవులకే; కాక; కలవె?= ఉన్నాయా?

**తాత్పర్యం:** సర్వమూ ఎరిగిన వ్యాసుడి పాదాలకు చెదరని భక్తితో మ్రొక్కి అతడి కుమారుడూ, మంచి బుద్ధి విశేషం కలవాడూ అయిన శుకుడు 'అన్ని వస్తువుల కంటె గొప్పదీ, యజ్ఞాలకు మూలమైనదీ ఏది? దయతో నాకు తెలుపుమా!' అని ప్రార్థించాడు. అప్పుడు వ్యాసుడు 'ఈ విధమైన గొప్ప ప్రభావం ఎక్కడా ఎప్పుడూ ఆవులకు తప్ప మరొకదానికి లేదు. పుణ్యం తుదిమెట్టు అనదగిన లక్షణమూ, యజ్ఞాల సంపదకు మూలకారణం కావటమూ ఆవులకే తప్ప మరొకదానికి కలవా?' (అని చెప్పాడు).

**విశేషం:** దృఢభక్తి నెఱఁగి - ఏదైనా తెలియ దగిన విషయాన్ని పెద్దల దగ్గర తెలుసుకొనటానికి ప్రణిపాతం - కాళ్ళకు మ్రొక్కటం ఒక సముదాచారం. ఎఱింగింపవే - తెలిసికొనటంలో శుకున కున్న గాఢవాంఛ నిది అభివ్యక్తం చేస్తుంది. అతుల కరుణ - అనేది దీనికి బలా న్నిస్తుంది.

**క. అని చెప్పి మఱియు నిట్లను । 'విను గోవులు పరమ నియతి వేధఁ గొలువ నె**
**మ్మన మలర నతఁడు గనుఁగొని । మును వానికి లేని శృంగములు కల్పించెన్. 44**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; చెప్పి= తెలియజేసి; మఱియున్= ఇంకా; ఇట్లు= ఇట్లా; అనున్= చెప్పాడు; విను= శ్రద్ధతో ఆలకించుము; గోవులు= ఆవులు; పరమనియతిన్= గొప్ప నిష్ఠతో; వేధన్= బ్రహ్మదేవుడిని; కొలువన్= పూజించగా; అతఁడు= బ్రహ్మ; నెఱ+మనము= నిండు హృదయం; అలరన్= ప్రీతి పొందగా; కనుఁగొని= చూచి; మును= ముందు; వానికిన్= ఆ ఆవులకు; లేని= లేనట్టి; శృంగములు= కొమ్ములను; కల్పించెన్= పుట్టించాడు.

**తాత్పర్యం:** వ్యాసు డిట్లా చెప్పి ఇంకా ఈ విధంగా పలికాడు. 'నాయనా! వినుము. ఆవులు బ్రహ్మను గొప్ప నిష్ఠతో సేవించగా అతడు గుండెనిండుగా సంతోషపడి పూర్వం వాటికి లేని కొమ్ములు సృష్టించాడు.

**వ. అట్లు కొమ్ము లొసఁగి సురముని లోకంబు నాలోకించి. 45**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కొమ్ములు= కొమ్ములను; ఒసఁగి= ఇచ్చి; సుర ముని లోకంబున్= దేవతల మునుల సముదాయాలను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా కొమ్ము లిచ్చి దేవతల సముదాయాన్నీ, మునుల సముదాయాన్నీ చూచి (ఇట్లా అన్నాడు).

**చ. 'పరమ పవిత్రముల్ యజన భాజనముల్ దము విన్నఁ జూచినన్**
**దురితచయంబులం దొలఁగఁ ద్రోవఁగఁ జాలుఁ బ్రధానకర్త కు**

**త్తరగతి లాభవైభవము తంగెటి జున్నుగఁ జేయు గోవు లె**

**వ్వరు దగ వీనిఁ గొల్తు రనివారణఁ జొత్తురు వారు నాకమున్.'** **46**

**ప్రతిపదార్థం:** పరమపవిత్రముల్= మిక్కిలి పావనమయినవీ; యజనభాజనముల్= యజ్ఞాలకు పాత్రమయినవీ అయిన గోవులు; తమున్= తమను; విన్నన్= విన్నా; చూచినన్= కన్నా; దురిత చయంబులన్= పాపాల రాసులను; తొలఁగన్= తొలగిపోయే విధంగా; త్రోవఁగన్+చాలున్= త్రోసివేయగలవు; గోవులు= ఆవులు; ప్రధానకర్తకున్= యజ్ఞకార్యంలో ముఖ్యుడైన యజమానునకు; ఉత్తరగతి లాభ వైభవము= ఉత్తర లోకాలకు పోవటం అనే లాభపు సంపదను; తంగెటి జున్నుగన్= తంగేటి చెట్టుకు బట్టిన తేనె పట్టువలె; చేయున్= చేస్తాయి; ఎవ్వరు= ఎవరు; తగన్= చక్కగా; వీనిన్= ఈ ఆవులను; కొల్తురు= పూజిస్తారో; వారు= ఆ మనుష్యులు; అనివారణన్= అడ్డులేకుండా; నాకమున్= స్వర్గాన్ని; చొత్తురు= ప్రవేశిస్తారు.

**తాత్పర్యం:** 'ఆవులు పరమపవిత్రమైనవి. యజ్ఞాలకు మూలకారణం అయినవి. వాటిని గూర్చి విన్నా, వాటిని చూచినా పాపాలను పటాపంచలు చేస్తాయి. యజమానులకు ఉత్తర లోకాలకు పోవటం అనే గొప్పతనాన్ని తంగెటిజున్నుగా సమకూరుస్తాయి. వాటిని శ్రద్ధతో పూజించినవారు అడ్డులేకుండా స్వర్గానికి చేరుకొంటారు.

**విశేషం:** పరమపవిత్రాలు కనుకనే యజ్ఞభాజనాలు అవుతున్నాయి. తంగెటిజున్ను సులభప్రాప్తికరమూ, రుచికరమూ, హితకరమూ కనుక అందరూ అపేక్షిస్తారు. గోవులను సేవించటంవలన ఉత్తరగతి ఆ విధంగా సిద్ధిస్తుంది. అనివారణన్ - స్వర్గం వారి సొంత ఇల్లువంటి దవుతుం దని భావం.

**వ. అనియె గోవుల పావనత్వంబు విశేషించి చెప్పెద వినుము.** **47**

**ప్రతిపదార్థం:** అనియెన్= బ్రహ్మ ఈ విధంగా చెప్పాడు; గోవుల పావనత్వంబు= ఆవుల పవిత్రతను గూర్చి; విశేషించి= ఇంకా ఎక్కువగా; చెప్పెదన్= చెప్పుతాను; వినుము.

**తాత్పర్యం:** అని బ్రహ్మ చెప్పాడు. వ్యాసుడు గోవుల పావనత్వాన్ని గురించి మరికొన్ని విశేషాలు చెప్పుతాను వినుము' అన్నాడు.

**సీ. అమలాత్మ! గోవు మూత్రముఁ బాలు నేయిని । బానార్హ మగు పెండతోన వరుస**

**మూఁడు దినంబులు మును ద్రావి మఱి మూఁడు । దివసంబులందు వాయువు భుజించి**

**యవలు నుగ్గుగ ధేనునివహంబు ద్రొక్కించి । వెలవ నత్తెఱఁగు నూకలన కాఁచి**

**నెలలు మూఁ డత్యంత నియతి నాహారంబు । గొన బ్రహ్మహత్యఁ బోలినవి యైనఁ**

**తే. బాయుఁ బాపముల్ దివిజు లీపావన క్రి । యా విధానంబునన కాదె యసురగణము**

**గెలిచి రావులనేయి విపులకు నీగి । దాని వేల్చుట ద్రావు టుదాత్తతరము.** **48**

**ప్రతిపదార్థం:** అమల+ఆత్మ= నిర్మలమైన హృదయం కలవాడా!; గోవు మూత్రమున్= ఆవు మూత్రాన్నీ; పాలున్= పాలను; నేయిని= నేతినీ; పాన+అర్హము+అగు= త్రాగుటకు యోగ్యం అయిన; పెండతోన= పేడతో; వరుసన్= వరుసగా; మును= ముందు; మూఁడు దినంబులు= మూడు రోజులు; త్రావి= త్రాగి; మఱి మూఁడు దివసంబులందున్= తరువాతి మూడు రోజులలో; వాయువున్= గాలిని; భుజించి= తిని; యవలు= యవలనే ధాన్యాన్ని; నుగ్గుగన్=రవ్వగా అయ్యేవిధంగా; ధేను నివహంబున్= ఆవులమందతో; త్రొక్కించి; ఆ+తెఱఁగు నూకలన= ఆ విధంగా అయిన నూకలతోనే; వెలవన్= గంజిని;

కాఁచి=కాచి; నెలలు= మాసాలు; మూఁడు= మూడు; అత్యంతనియతిన్= ఎక్కువ నిష్ఠతో; ఆహారంబు= అన్నంగా; కొనన్= తీసికొంటే; బ్రహ్మహత్యన్= బ్రాహ్మణుడిని చంపటాన్ని; పోలినవి= పోలేవి; ఐనన్= అయినా; పాపముల్= పాపాలు; పాయున్= పోతాయి; దివిజులు= స్వర్గంలో పుట్టిన దేవతలు; ఈ పావన క్రియా విధానంబునన= ఇట్టి పవిత్రమైన పని తీరుననే; కాదె= కదా; అసురగణమున్= రక్కసుల గుంపును; గెలిచిరి= గెలిచారు; ఆవులనేయి= ఆవుల నేతిని; విప్రులకున్= వేద విద్యగల బ్రాహ్మణులకు; ఈఁగి= ఇవ్వటమూ; దాని వేల్చుట= దానిని హోమం చేయటమూ; త్రావుట= త్రాగటమూ; ఉదాత్త తరము= చాలా గొప్పది.

**తాత్పర్యం:** నిర్మలాత్ముడా! ఆవుమూత్రాన్నీ, పాలనూ, నేతినీ, పేడనూ కలిపి ముందు వరుసగా మూడు రోజులు త్రాగాలి. తరువాత మూడు రోజులు ఉపవాసం ఉండాలి. ఆ తరువాత మూడు నెలలు ఆవులు త్రొక్కిన యవలనూకలతో కాచిన గంజిని భోజనంగా గ్రహించాలి. ఇట్లా చేస్తే బ్రహ్మహత్యవంటి పాపాలు కూడా రూపుమాసిపోతాయి. దేవతలు ఈ పని చేసే కదా రాక్షసులమూకలను గెలిచారు. ఆవులనెయ్యిని విద్యావంతులకు దానం చేయటమూ హోమం చేయటమూ, త్రాగటమూ చాలా గొప్ప విషయం.

**విశేషం:** వాయువు భుజించి - ఉపవాసం ఉండి అని భావం. మహాపాపాలు పోవటం మాత్రమే కాదు స్వర్గసుఖం కూడా లభిస్తుంది. అంటే ఒక పనితో రెండు ప్రయోజనాలు సిద్ధిస్తాయని భావం. దృష్టాంతంగా దేవతల విజయాన్ని చెప్తున్నారు.

**క. విమలాంబువుల నుప స్ప । ర్శము నిర్వర్తించి గో ప్రచయ మధ్యమునన్**
**దమయుతముగ గోమతి చి । త్తమున జపించిన శుచిత్వ ధన మొదఁగూడున్. 49**

**ప్రతిపదార్థం:** విమల+అంబువులన్= స్వచ్ఛమైన నీటితో; ఉపస్పర్శము= ఆచమనం; నిర్వర్తించి= చేసి; గో ప్రచయ మధ్యమునన్= ఆవులమంద నడుమ; దయయుతముగన్= ఇంద్రియాలను అదుపుచేసికొనటంతో పాటుగా; గోమతి= గోమతి అనే మంత్రాన్ని; చిత్తమునన్= హృదయంలో; జపించినన్= జపిస్తే; శుచిత్వ ధనము= పరిశుద్ధత అనే సొమ్ము; ఒడఁగూడున్= సిద్ధిస్తుంది,

**తాత్పర్యం:** స్వచ్ఛమైన నీటితో ఆచమనం చేసి ఆవులమందనడుమ ఇంద్రియ నిగ్రహంతో 'గోమతి' మంత్రాన్ని హృదయంలో జపిస్తే మానవుడికి పవిత్రత అనే ధనం చేకూరుతుంది.

**విశేషం:** ఉపస్పర్శం అంటే ఆచమనం. లోపల ఉన్న సూక్ష్మశరీర శుద్ధికొరకు భగవన్నామం మూడు మారులూ అంటూ నీటిని కొంచెంగా లోపలికి పుచ్చుకొనటాన్ని ఆచమనం అంటారు. ఉపస్పర్శం అంటే స్నానం కూడా అని కూడా అర్థం ఉన్నది. కాబట్టి 'స్వచ్ఛమైన నీటిలో స్నానం చేసి' అని కూడా అర్థం చెప్పుకొనవచ్చును. 'దమయుతముగన్' - ఇంద్రియాల అదుపులేకుండా చేసే జపాదులు ఫలాన్నివ్వవు అని భావం. చిత్తమునన్ - జపం మూడు విధాలు. మంత్రాన్ని పైకి, ఇతరులకు వినపడే విధంగా ఉచ్చరిస్తూ జపం చేయటం మొదటి పద్ధతి. పెదవుల కదలిక లేకుండా నోటిలో శబ్దం పైకిరాకుండా చేసే జపం రెండవ పద్ధతి. మంత్రాన్నీ, మంత్రార్థాన్నీ హృదయంలో మాత్రమే భావన చేయటం మూడవది. వీటిలో మూడవది సర్వశ్రేష్ఠమైనది. ఈ పద్యంలో 'చిత్తమున' అనే మాటద్వారా దానినే చెప్పారు. 'శుచిత్వధనము' - మానవుడు సాధారణంగా లోపలా, వెలుపలా ఎన్నో మలినాలతో కూడి ఉంటాడు. అవి అతనిని పాప కూపానికి లాగుతూ ఉంటాయి. స్నానాదులచేత వెలుపలి మలాన్నీ, జపాదులచేత లోపలిమలాన్నీ (మనస్సు) మొదలైన సూక్ష్మదేహపు మలాన్నీ) పోగొట్టుకొంటే అతడు పరమార్థానికి సన్నిహితుడవుతాడు. అందుకని అది ఒక మహాధనంగా ఈ పద్యంలో చెపుతున్నాడు.

**తే. అగ్ని సన్నిధి గోనిచయంబు నడుమ । బ్రాహ్మణుల పాల గోమతీపఠన మాచ**
**రించినను విన్నఁ గోర్కి సిద్ధించు; గోవుఁ । గడచినట్టిది లేదు జగత్త్రయమున. 50**

**ప్రతిపదార్థం:** అగ్ని సన్నిధిన్= అగ్ని సమీపంలో; గోనిచయంబు నడుమన్= ఆవుల మంద మధ్యలో; బ్రాహ్మణుల పాలన్= బ్రహ్మజ్ఞానం కలవారి దగ్గర; గోమతీ పఠనము= గోమతి మంత్రాన్ని చదవటం; ఆచరించినను= చేసినా; విన్నన్= విన్నా; కోర్కి= కాంక్ష; సిద్ధించున్= నెరవేరుతుంది; జగత్త్రయమునన్= మూడు లోకాలలో; గోవున్= ఆవును; కడచినట్టిది= మించినట్టిది; లేదు.

**తాత్పర్యం:** అగ్ని దగ్గరా, ఆవులమందలోనూ, బ్రహ్మజ్ఞానం కలవారిదగ్గరా గోమతీమంత్రాన్ని పఠించినా, విన్నా కోరిన కోరిక నెరవేరుతుంది. మూడులోకాలలో ఆవును మించినది మరొకటి లేదు.

**విశేషం:** అగ్ని, ఆవు, బ్రాహ్మణుడు పరమ పవిత్ర స్వరూపాలని భావం. వారి దగ్గర చదివిన మంత్రం శీఘ్రంగా ఫలాన్నిస్తుందని భావన. స్వయంగా చదవలేనివారికి కూడా గతి ఉన్నది. అది శ్రవణం ద్వారా సిద్ధిస్తుంది. జగత్త్రయం -స్వర్గం, మర్త్యం, పాతాళం.

**క. అని యి ట్లుపన్యసించిన । జనక వచన రచనఁ గల్గు సార మఖిలముం**
**గని శుకుఁడు గోసమారా । ధన తత్పరచిత్తుఁ డయ్యెఁ ధర్మతనూజా!' 51**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజా!= ధర్ముడి కుమారా!; అని= ఇట్లని; ఇట్లు= ఈ విధంగా; ఉపన్యసించినన్= ప్రమాణపూర్వకంగా చెప్పగా; జనక వచన రచనన్= తండ్రి మాటల కూర్పులో; కల్గు= ఉన్న; సారము= నిగ్గు; అఖిలమున్= మొత్తంగా; కని= తెలిసికొని; శుకుఁడు= శుక మహర్షి; గో సమారాధాన తత్పర చిత్తుఁడు= ఆవులను చక్కగా పూజించటంలో చెడని శ్రద్ధగల హృదయం గలవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! వ్యాసు డిట్లా ప్రీతితో నిరూపించి చెప్పగా తండ్రి మాటలలోని సారమంతా గ్రహించి శుకుడు గోవులను చక్కగా ఆరాధించటంలో ఆసక్తిగల మనస్సుకలవా డయ్యాడు.'

**విశేషం:** సారము - ఒక విషయాన్ని ప్రతిపాదించటానికి సంబంధించిన అనేక విషయాలు ప్రస్తావనకు వస్తాయి. అందులో శ్రోత సారాన్ని గ్రహించాలి. తత్పర, చిత్తుఁడు - అందే లగ్నమైన మనస్సు కలవాడు. మనస్సు లగ్నమైతే తక్కిన రెండు కరణాలు - మాటా, చేష్టా - తప్పక లగ్న మవుతాయి. అప్పుడే ఆరాధన ఫలదాయక మవుతుంది. ఉపన్యసించటం - అంటే ఉప=దగ్గర, న్యసించటం=ఉంచటం, హృదయానికి హత్తుకొనేటట్లు చెప్పటం అని భావం.

**వ. అనిన విని పాండవాగ్రజుండు 'బ్రహ్మ విశ్వంబునకు విభుండు తదీయస్థానంబునకు మీఁదు గోలోకంబని విందు; నట్లుగాఁ గతంబేమి?' యని యడుగుటయు నాపగాతనయుం డతని నాదర భరితుం డగుచు నాలోకించి 'వినుము వివరించెద; విశ్వకర్మ తపో నియతుండయి యజ్ఞార్థంబును మోక్షార్థంబునుంగా నమృతమయ మూర్తియుఁ గామరూపిణియు నగు సురభి యను కన్యకం దన మనోవృత్తి గల్పించి మహాతేజోమయుండగు నొక్క పురుషుని సృజియించిన, దేదీప్యమానుం డగు నాతం డతి మనోహరాకృతి యగు నయ్యతివం గనుంగొని కామమోహితుం డయి యార్తి నొందుటయు నఖిల లోక పావనుండైన చతురాననుండు సన్నిహితుండై 'మార్తో భవ' యని పలికి యతని యార్తత్వం బుడిపి తన పల్కు కారణంబుగా మార్తాండ నామం బొసంగి యన్నారీ**

**రత్నంబు నిచ్చి, యన్నెలంతకు నీకును జనియించిన యపత్యంబులు యాగాపవర్గార్థ క్షీర జనకంబులై మదీయ లోకంబునకు నుపరిభాగంబున వర్తింప వరంబిచ్చితి' ననియె; నట్లొందిన యయ్యిరువురకుం బ్రభవించిన సౌరభేయీకులం బా కమలాసను నిర్దేశించినట్టిదై సురాసుర ప్రముఖ నిఖిల జనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు నని చెప్పి వెండియు. 52**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇట్లు చెప్పగా; విని= ఆలకించి; పాండవ+అగ్రజుండు= పాండుకుమారులలో పెద్దవాడు ధర్మరాజు; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; విశ్వంబునకున్= సమస్తానికి; విభుండు= ప్రభువు; తదీయ స్థానంబునకున్= అతనిదైన నెలవునకు; మీఁదు= పైది; గోలోకంబు= గోవుల లోకం; అని; విందును= వింటున్నాను; అట్లు కాన్= ఆ విధంగా అవటానికి; కతంబు= కారణం; ఏమి అని; అడుగుటయున్= అడిగినంతనే; ఆపగా తనయుండు= నది కొడుకు భీష్ముడు; అతనిన్= ఆ ధర్మరాజును; ఆదర భరితుండు= ప్రీతి నిండినవాడు; అగుచున్= అవుతూ; ఆలోకించి= చూచి; వివరించెదన్= వివరిస్తాను; వినుము; విశ్వకర్మ= దేవతల శిల్పి; తపస్+నియతుండు+అయి= తపస్సునందు నిష్ఠ కలవాడై; యజ్ఞ+అర్థంబును= యజ్ఞాల కొరకున్నూ; మోక్ష+అర్థంబునున్+కాన్= మోక్షంకొరకున్నూ; అమృతమయమూర్తియున్= అమృతమే అంతా అయిన ఆకారం కలదీ; కామ రూపిణియున్= ఇచ్ఛవచ్చిన రూపం పొందగలదియు; అగు= అయిన; సురభి అను కన్యకన్= సురభి అనే బాలికను; తన మనస్+ వృత్తిన్= తన సంకల్పాన్ని బట్టి; కల్పించి= ఏర్పాటు చేసి (సృష్టించి); మహత్+తేజస్+మయుండు+అగు= గొప్ప తేజస్సుతో నిండిన స్వరూపంగల; ఒక్క పురుషునిన్= ఒక్క మగాడిని; సృజియించినన్= పుట్టించగా; దేదీప్యమానుండు+అగు ఆతండు= కాంతితో ఎక్కువగా విరాజిల్లుతున్న ఆ పురుషుడు; అతి మనస్+హర+ఆకృతి అగు= మిక్కిలిగా మనస్సును ఆకర్షించే రూపంగల; ఆ+అతివన్= ఆ ఇంతిని; కనుంగొని= చూచి; కామ మోహితుండు+అయి= కామంతో ఒడలెరుగనివాడై; ఆర్తిన్= దుఃఖాన్ని; ఒందుటయున్= పొందగా; అఖిల లోక పావనుండు+ఐన= అన్ని లోకాలలో పవిత్రుడయిన; చతుర్+ఆననుండు= నాలుగు మోముల దేవర; సన్నిహితుండు+ఐ= సమీపానికి వచ్చినవాడై; మా+ఆర్తః+భవ= దుఃఖము కలవాడవు కాకుము; అని; పలికి; అతని ఆర్తత్వంబు= అతడి దుఃఖాన్ని; ఉడిపి= పోగొట్టి; తన పల్కు= తన మాట (మార్తో అన్న తన మాట); కారణంబుగాన్= హేతువుగా; మార్తాండ నామంబు= మార్తాండు డనే పేరు; ఒసఁగి= ఇచ్చి; ఆ+నారీ రత్నంబున్= స్త్రీలలో శ్రేష్ఠ అయిన ఆ ఇంతిని; ఇచ్చి= భార్యగా ఇచ్చి; ఆ+నెలంతకున్= ఆ స్త్రీకీ; నీకున్= నీకూ; జనియించిన+అపత్యంబులు= పుట్టిన సంతానాలు; యాగ+అపవర్గ+అర్థ క్షీర జనకంబులు+ఐ= యజ్ఞాలకూ, మోక్షానికీ పనికివచ్చే పాలను పుట్టించేవి అయి; మదీయ లోకంబునకున్= నాదైన సత్యలోకానికి; ఉపరిభాగంబునన్= పై భాగంలో; వర్తింపన్= ఉండటానికి; వరంబు= వరాన్ని; ఇచ్చితిన్= ఇచ్చాను; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; ఒందిన= ఏర్పడ్డ; ఆ+ఇరువురకునున్= ఆ ఇద్దరికీ; ప్రభవించిన= పుట్టిన; సౌరభేయీ కులంబు= సురభి సంతానం అయిన ఆవుల సముదాయం; ఆ కమలాసను నిర్దేశించిన+అట్టిది+ఐ= ఆ బ్రహ్మచెప్పిన విధంగా అయినదై; సుర+అసుర ప్రముఖ నిఖిల జనంబులకున్= దేవతలు, రాక్షసులు మొదలగు సకల జనాలకూ; నమస్కార్యంబును= నమస్కరించదగినదీ; సపర్యా భాజనంబును= పూజకు యోగ్యమైనదీ; అయి; రాజిల్లున్= ఒప్పుతున్నది; అని చెప్పి= అని తెలియజేసి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఆ మాట విని ధర్మరాజు భీష్ముడిని ఇట్లా అడిగాడు. 'బ్రహ్మ ఈ సమస్త లోకాల సముదాయానికీ ప్రభువు కదా! గోలోకం ఆయన లోకానికి కూడా పైన ఉంటుందని విన్నాను. దానికి కారణం ఏమిటి?' అంటే భీష్ముడు నిలువెల్లా ఆదరంతో మనుమడిని చూచి 'విను వివరిస్తాను. పూర్వం దేవతల శిల్పి యజ్ఞంకొరకని, మోక్షంకొరకని అమృతమే అయిన స్వరూపంగలదీ, ఇష్టరూపం ధరించగలదీ అయిన సురభి అనే కన్యకను మనస్సుతీరు కనుగుణంగా సృష్టించాడు. అట్లాగే గొప్పతేజోవంతు డయిన ఒక్కమగవాడిని కూడా సృష్టించాడు. తేజస్సుతో వెలిగిపోతున్న ఆ పురుషుడు మనస్సును మరపించివేసే ఆకారంగల ఆ యింతిని చూచి కామభావన

పొంది చెప్పరాని వేదన పొందాడు. లోకాలన్నింటిని పవిత్రం చేయగల బ్రహ్మ అతని దగ్గరకు వచ్చి 'మార్తోభవ' (ఆర్తుడవు కావద్దు) అని పలికి అతడి దుఃఖం పోగొట్టాడు. తానన్న మాట కారణంగా అతడికి 'మార్తాండుడు' అని పేరు పెట్టి ఆ చక్కని యింతిని భార్యగా ఇచ్చి ఈమెకూ నీకూ పుట్టిన సంతానం యాగాలకూ, మోక్షాలకూ కావలసిన పాలను సృష్టిస్తూ నా లోకానికి పై భాగాన ఉండే వరం ఇచ్చాను అన్నాడు. ఆ విధంగా కలిపిన వారిద్దరికీ పుట్టిన సంతానం బ్రహ్మశాసనం మేరకు దేవతలు, రాక్షసులు మొదలైన వారందరికీ నమస్కార యోగ్యమూ, పూజకుపాత్రమూ అయి ఒప్పుతున్నది' అని చెప్పి ఇంకా ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** ఆదర భరితుండు - శిష్యుడు మంచి ప్రశ్నవేస్తే గురువు ఆనందం పొందుతాడు. తపోనియతుండయి తపస్సు అంటే తీవ్రభావన. అది దేన్నయినా సాధిస్తుంది. ఆమె అమృతమయమూర్తి. అతడు మహా తేజోమయుడు కనుక వారి సంతానం అత్యున్నత స్థితి నందటం మహా ఫలసాధనకు కావలసిన వస్తువును అందించటం సంభవించింది. యజ్ఞము కర్మకాండకు సంబంధించినది. దానివలన యజమానుని మూడు కరణాలు - మనస్సు, వాక్కు, చేష్ట అనేవి పరమ పవిత్రాలవుతాయి. అప్పుడు అవి జ్ఞాననిష్ఠకు యోగ్యాలై ముక్తికి కారణా లవుతాయి. కాబట్టి 'యాగాపవర్గార్థ క్షీరజనకములు' అనటం. గోవులు సురలకే కాదు అసురులకు కూడా పూజాస్థానాలు. అంటే గోవులను హింసించేవారు రక్కసులకంటే హీను లని భావం.

**క. 'అది కారణముగ గోవులు । తుది ముట్టిన పెంపు గలిగి దురితహరగుణా**
**స్పదమయి తమ్ము సభక్తిక । హృదయు లగుచుఁ గొలుచు వారి కిష్టము లొసఁగున్.' 53**

**ప్రతిపదార్థం:** అది= ఆ బ్రహ్మదేవుడి ఏర్పాటు; కారణముగన్= హేతువుగా; గోవులు= ఆవులు; తుది ముట్టిన పెంపు= చిట్టచివరకు చేరిన గొప్పతనం; కలిగి= పొంది; దురిత హర గుణ+ఆస్పదము+అయి= పాపాలను పోగొట్టే గుణానికి తావు అయి; తమ్మున్= వానిని; సభక్తిక హృదయులు+అగుచున్= భక్తితో కూడిన భావం కలవారగుచూ; కొలుచువారికిన్= సేవించేవారికి; ఇష్టములు= కోరిన కోర్కెలను; ఒసఁగున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** 'బ్రహ్మచేసిన కట్టడినిబట్టి ఆవులు గొప్పతనపు తుదియంచు చేరుకొని పాపాలను పటాపంచలు చేసే గుణానికి స్థానమై, భక్తితో నిండిన హృదయంతో సేవించే వారికి కోరిన కోర్కెలను ఇస్తున్నాయి.'

**విశేషం:** గోవుల గొప్పతనం సృష్టికర్త ఏర్పాటువలన సిద్ధించింది. ఆ గొప్పతనం కూడా కడముట్టా లభించింది. కాబట్టి అవి పాపాలను పటాపంచలు చేస్తాయి. కోరిన కోర్కెలను తీరుస్తాయి. 'అగుచున్' అనటంవలన భక్తి నిరంతరంగా సాగుతూనే ఉండాలి అనేది సూచన.

**క. అని చెప్పినఁ బాండునృపతి । తనయుఁడు మార్తాండ సురభి దాంపత్యమునన్**
**మును పుట్టిన ప్రజ యెయ్యది? । వినవలతు మహాత్మ చెప్పవే నా' కనుడున్. 54**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; చెప్పినన్= భీష్ముడు చెప్పగా; పాండు నృపతి తనయుఁడు= పాండురాజు కొడుకు యుధిష్ఠిరుడు; మహాత్మ!= ఓ మహానుభావా!; మార్తాండ సురభి దాంపత్యమునన్= మార్తాండుడు సురభి అనే వారి సంసార ధర్మంవలన; మును= ముందుగా; పుట్టిన ప్రజ= పుట్టిన సంతానం; ఏ+అది= ఏది?; వినన్ వలతున్= వినగోరుతున్నాను; నాకున్= నాకు; చెప్పవే!= చెప్పుమా!; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** అని చెప్పగా ధర్మరాజు 'మహాత్మా! ఆ మార్తాండుడూ సురభీ సంసారధర్మం నిర్వహించగా ముందుగా పుట్టిన సంతానం ఏదో వినగోరుతున్నాను. దయతో నాకు చెప్పుము' అన్నాడు.

**విశేషం:** దాంపత్యానికి సంతానమే ఉత్తమ ఫలం. అందుకే 'ప్రజాయై గృహమేధినామ్' - సంతానం కొరకే గృహమేధులు- అని కాళిదాసు అంటాడు. కనుకనే ధర్మ విషయ జిజ్ఞాసగల ధర్మరాజుకు అది తెలియదగిన అంశం అయింది. మహాత్మా! అనే సంబోధనా; చెప్పవే! అనే ప్రార్థనార్థక క్రియా అతని జిజ్ఞాసను చక్కగా అభివ్యక్తం చేస్తున్నాయి. 'నాకు' అనే పదం ఇక్కడ వ్యంజకం. 'ఎంతో ఆసక్తిగల' నాకు అని దాని వ్యంగ్యార్థం. దీన్ని 'అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని' అంటారు.

**వ. భీష్ముం డిట్లనియె. 55**

**తాత్పర్యం:** భీష్ముడు ఇట్లా చెప్పాడు.

**తే. 'తపము పెంపున సురభి మార్తాండు వలన । ధరణినాథ! యేకాదశాత్మజులఁ బడసె**
**నిగమ సంకీర్తనీయులు నిఖిలలోక । పతులు వారు బ్రాహ్మణులకుఁ బ్రకృతి సుమ్ము. 56**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; సురభి= సురభి అనే ఆ వనిత; తపము పెంపునన్= తపస్సు గొప్పతనంచేత; మార్తాండువలనన్= మార్తాండుడి నుండి; ఏకాదశ+ఆత్మజులన్= పదకొండు మంది కొడుకులను; పడసెన్= పొందింది; నిగమ సంకీర్తనీయులు= వేదాలకును కొనియాడ దగినవారు; నిఖిల లోక పతులు= అన్ని లోకాలకు ఏలికలు అయిన; వారు= ఆ కుమారులు; బ్రాహ్మణులకున్= బ్రాహ్మణులకు; ప్రకృతి= మూలకారణం; సుమ్ము!= సుమా!

**తాత్పర్యం:** ఆ సురభి తపస్సు గొప్పతనంతో మార్తాండుడివలన పదకొండు మంది కొడుకులను పొందింది. వారిని వేదాలు కూడా కొనియాడతాయి. లోకాలన్నిటికీ వారు పాలకులు. బ్రాహ్మణులకు మూలకారణం అయినవారు సుమా!

**విశేషం:** కుమారులు లోకసామాన్యంగా పుట్టినవారు కాదు. తపస్సు మహిమవలన కలిగారు. కనుకనే వేదాలు వారిని కొనియాడు తున్నాయి. లోకాలన్నింటికీ పాలకులయ్యారు. అంతేకాదు బ్రహ్మజ్ఞాన సంపన్నులైన వారికి వీరు ప్రకృతి.

**వ. వారల నేకాదశ రుద్రులంగా నెఱుంగుము. 57**

**ప్రతిపదార్థం:** వారలన్= ఆ కుమారులను; ఏకాదశ రుద్రులన్+కాన్= పదకొండు సంఖ్యతో ఒప్పారే రుద్రులనుగా; ఎఱుంగుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** వారే ఏకాదశ రుద్రులని తెలిసికొనుము.

**తరువోజ.**

**అనఘాత్మ! యజపాదుఁ డన, నహిర్బుధ్న్యుఁ । డనఁ గడు విలసిల్లి, త్ర్యంబకుఁ డీతఁ**
**డనఁ(గ, వృషాకపి యన నొప్పి, శంభుఁ । డను పేరి పెంపున, నమరి కపాలి**

**యనఁగ, రైవతుఁ డన నతులానుభావ । మతిశయిల్లఁగ, హరుఁ డన బహురూపుఁ**

**డనఁ గీర్తిఁ గని, యుగ్రుఁ డన విశ్వరూపుఁ । డనఁ బేర్చి యా రుద్రు లర్చితు లైరి. 58**

**ప్రతిపదార్థం:** అనఘ+ఆత్మ!= పాపములేని ఆత్మ కలవాడా!; అజపాదుఁడు= అజపాదు డనగా; అహిర్బుధ్న్యుఁడు+అనన్= అహిర్బుధ్న్యుడు అనగా; కడున్= మిక్కిలి; విలసిల్లి= ఒప్పారి; త్ర్యంబకుఁడు; ఈతఁడు= ఇతడు; అనఁగన్= అనగా; వృషాకపి; అనన్= అనగా; ఒప్పి= ఒప్పారి; శంభుఁడు అను పేరి పెంపునన్= శంభుడనే నామము యొక్క మహిమతో; అమరి= ఒప్పి; కపాలి అనఁగన్= కపాలి అనగా; రైవతుఁడు+అనన్= రైవతు డనగా; అతుల+అనుభావము= సాటిలేని గొప్పతనం; అతిశయిల్లఁగన్= పెంపొందగా; హరుఁడు+అనన్= హరుడనగా; బహురూపుఁడు+అనన్= బహురూపుడనగా; కీర్తిన్ కని= కీర్తి పొంది; విశ్వరూపుఁడు+అనన్= విశ్వరూపు డనగా; పేర్చి= అతిశయించి; ఆ రుద్రులు= రుద్రులు అను పేరుగలవారు; అర్చితులు= పూజింపబడేవారు; ఐరి= అయ్యారు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! అజపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్ర్యంబకుడు, వృషాకపి, శంభుడు, కపాలి, రైవతుడు, హరుడు, బహురూపుడు, ఉగ్రుడు, విశ్వరూపుడు అని ప్రసిద్ధికెక్కి ఆ రుద్రులు లోకాలకు పూజ్యులయ్యారు.

**వ. తదనంతరంబ సౌరభేయీ ప్రచయంబు ప్రభవించె; నగ్గోకులంబు విశేషం బాకర్ణింపుము. 59**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ= ఆ తరువాతనే; సౌరభేయీ ప్రచయంబు= ఆవుల సముదాయం; ప్రభవించెన్= పుట్టింది; ఆ+గోకులంబు విశేషంబు= ఆ ఆవుల సముదాయం విశిష్టత; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ తరువాతనే ఆవుల సముదాయం పుట్టింది. ఆ ఆవుల సముదాయం ప్రత్యేకతను వినుము.

**సీ. ఆననంబునను జిహ్వను శృంగముల బల । వైరి, రంధ్రంబుల మారుతుండు,**

**కకుదంబునందు శ్రీకంఠుండు, పదముల । యందు మరుద్గణ మనఘ! కుక్షి**

**వహ్ని, చన్నుల సరస్వతి, పెండఁ బంచిత । మున లక్ష్మియును, గీర్తియును గ్రమమున**

**రుధిరంబునందుఁ జంద్రుఁడు, హృదయంబున । భగుఁడను దేవత, పాల వేధ**

**తే. వెంద్రుకలయం దనుష్ఠాన వితతి, దోఁక । ధర్ముఁ, డక్షుల సూర్యుండు, చర్మమునఁ ద**

**పంబు సిద్ధి తేజము సంధిపట్ల సిద్ధు । లునికి గల దటె; గోవు నేమనఁగవచ్చు! 60**

**ప్రతిపదార్థం:** ఆననంబునను= మోమునందు; జిహ్వను= నాలుకయందు; శృంగములన్= కొమ్ములందు; బలవైరి= ఇంద్రుడు; రంధ్రంబులన్= ఇంద్రియ ద్వారాలలో; మారుతుండు= గాలి; కకుదంబునందున్= మూపురంలో; శ్రీకంఠుండు= శివుడు; పదముల అందున్= కాళ్ళయందు; మరుత్+గణము= దేవతల సముదాయం; అనఘ!= పుణ్యాత్మ!; కుక్షిన్= కడుపునందు; వహ్ని= అగ్ని; చన్నులన్= పొదుగులలో; సరస్వతి= చదువుల తల్లి; క్రమమునన్= క్రమంగా; పెండన్= పేడయందు; పంచితమునన్= మూత్రంలోను; లక్ష్మియును= లక్ష్మీదేవి; కీర్తియును= కీర్తి; రుధిరంబునందున్= రక్తంలో; చంద్రుఁడు= చంద్రుడు; హృదయంబునన్= హృదయంలో; భగుఁడు+అనుదేవత= భగుడనే పేరుగల దేవత; పాలన్= పాలలో; వేధ=బ్రహ్మ; వెంద్రుకలయందున్= వెంద్రుకలలో; అనుష్ఠాన వితతి= ఆచారాల సముదాయమూ; తోఁకన్= తోకయందు; ధర్ముఁడు= యమధర్మరాజు; అక్షులన్= కన్నులలో; సూర్యుండు= భాస్కరుడూ; చర్మమునన్= తోలునందు; తపంబు= తపస్సు; సిద్ధి=

కార్యాలు నెరవేరటమూ; తేజము= తేజస్సూ; సంధిపట్లన్= కీళ్ళచోటులందు; సిద్ధులు= అణిమ మొదలైన అష్ట సిద్ధులూ; ఉనికి+కలదు+అటె= నివాసముగా ఉన్నాయట; గోవున్= ఆవును; ఏమి+అనఁగన్ వచ్చున్= ఏమనవచ్చును!

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఆవు మోములో, నాలుకలో, కొమ్ములలో ఇంద్రుడున్నాడు. ఇంద్రియద్వారాలలో వాయుదేవుడున్నాడు. మూపురంలో శివుడు, పాదాలలో దేవతల సముదాయం, కడుపులో అగ్ని ఉన్నారు. పొదుగులో సరస్వతీ, పేడలో లక్ష్మి, మూత్రంలో కీర్తి, రక్తంలో చంద్రుడూ ఉన్నారు. హృదయంలో భగుడనే దేవతా, పాలలో బ్రహ్మ ఉన్నారు. వెంద్రుకలలో ఆచారాల సముదాయమంతా ఉన్నది. తోకలో యముడూ, కన్నులలో సూర్యుడూ ఉన్నారు. చర్మంలో తపస్సు, సిద్ధీ, తేజమూ ఉన్నాయి. కీళ్ళలో అష్టసిద్ధులు ఉన్నాయి. ఇట్టివి గల గోవు మహిమ ఇంతటిది అని చెప్పటం ఎట్లా సాధ్యమవుతుంది?

**విశేషం:** ఈ పద్యం ప్రకారం గోవు అంటే విశ్వమూ, విశ్వకర్తా, విశ్వభర్తా మొదలైన సర్వమునకూ నివాస భూమి అని తెలుస్తున్నది.అంటే సమస్త విశ్వమూ సూక్ష్మరూపంలో గోవుగా ఉన్నదని భావం. సిద్ధులు - అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అని ఎనిమిది. 'ఏమనఁగవచ్చు' - గోమహిమ మాటల కందనిది అని భావం.

**వ. మఱియు నొక్కటి యక్కజం బగునది గో మహానుభావ ప్రకటంబయిన యితిహాసంబు సెప్పెద వినుము. 61**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఒక్కటి= ఒకటి; అక్కజంబు+అగునది= ఆశ్చర్యకరమైనది; గో మహానుభావ ప్రకటంబు+అయిన= గోవుల గొప్పతనాన్ని తెలియజేసేదయిన; ఇతిహాసంబు= ప్రాతగాథ; చెప్పెదన్= చెప్పుతాను; వినుము.

**తాత్పర్యం:** ఇంకా గోవుల మహిమను తెలియజేసే ఆశ్చర్యకరమైన ఇతిహాసం ఒకటి ఉన్నది. చెప్పుతాను వినుము.

**విశేషం:** ధర్మరాజు ప్రత్యేకించి అడుగకపోయినా భీష్ముడు ఉత్సాహంతో చెప్పబూనుకొన్నాడు. అంటే విషయం చాలా శ్రద్ధగా వినదగినదని తాత్పర్యం. ఇతిహాసం - తొల్లిటి కథ - ఇతిహాసాలు చెప్పదలచిన విషయానికి ప్రామాణ్యాన్ని సంపాదిస్తాయి.

### సుమిత్రుఁ డను మునిచేఁ బోషింపఁబడిన గోవుల ప్రభావము (సం.13-120-1(కుంభ))

**తే. త్రిశిఖరం బనుపేరి ధాత్రీధరము ను। పాంతమున రుద్ర కల్పితంబైన కూల**
**హాభిధాన కల్లోలిని శోభితోప। కంఠయై యొప్పుఁ దత్తీర కాననమున. 62**

**ప్రతిపదార్థం:** త్రిశిఖరంబను పేరి ధాత్రీధరము+ఉపాంతమునన్= త్రిశిఖరం అనే పేరుగల కొండ దగ్గర; రుద్ర కల్పితంబు+ఐన= రుద్రుడిచేత సృష్టింపబడిన; కూలహా+అభిధాన కల్లోలిని= కూలహా అను పేరుగల నది; శోభిత+ఉపకంఠ+ఐ= శోభతో కూడిన ప్రాంత ప్రదేశాలు కలదై; ఒప్పున్= విరాజిల్లుతూ ఉండేది; తత్+తీర కాననమునన్= దాని ఒడ్డున ఉన్న అడవిలో.

**తాత్పర్యం:** త్రిఖరం అనే కొండ ఉండేది. దాని సమీపంలో రుద్రుడు సృష్టించిన 'కూలహా' అనేనది చక్కని అందమైన పరిసరాలతో అలరారుతూ ఉండేది. దాని ఒడ్డున ఉన్న అడవిలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**వ. భృగు వంశ సంభవులగు సంయమీశ్వరులు గొంద ఱాశ్రమంబులు గావించుకొని తపఃపరులై యుండుదు; రందు సుమిత్త్రుం డను పేరం బరఁగి పరమాచారభవ్యుం డగు నొక్క భార్గవునకు నంగిరసుం డను నొక్క**

**మహాద్విజుండు సఖ్యంబునను సౌజన్యంబునను గో శర్కర యొసంగిన నమ్ముని తన గోవు నయ్యోషధి మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయునై యొక్క వృషభంబు పొందు వడసి గర్భిణియై మిథునంబు నీనిన. 63**

**ప్రతిపదార్థం:** భృగు వంశ సంభవులు+అగు= భృగు అనే మహర్షి వంశంలో పుట్టినవారగు; సంయమి+ఈశ్వరులు= గొప్ప నిగ్రహంగల వారిలో శ్రేష్ఠులు; కొందఱు= కొంతమంది; ఆశ్రమంబులు= పర్ణశాలలు; కావించుకొని= ఏర్పాటు చేసికొని; తపః పరులు+ఐ= తపస్సే ప్రధానమైన పనిగా గలవారై; ఉండుదురు= ఉండేవారు; అందున్= వారిలో; సుమిత్రుండు+అను= సుమిత్రుడనే; పేరన్= పేరుతో; పరఁగి= ఒప్పి; పరమ+ఆచార భవ్యుండు+అగు+ఒక్క భార్గవునకున్= గొప్ప ఆచారంచేత శుభాలుగల ఒక్క భృగువంశ వ్యక్తికి; అంగిరసుండు, అను+ఒక్క మహాద్విజుండు= అంగిరసుడనే ఒక గొప్ప బ్రాహ్మణుడు; సఖ్యంబునను= చెలిమివలన; సౌజన్యంబునను= మంచితనంచేతనూ, గో శర్కర= గోశర్కర అనే ఒక తీగను; ఒసంగినన్= ఇవ్వగా; ఆ+ముని= ఆ మహర్షి సుమిత్రుడు; తన గోవును= తన ఆవును; ఆ ఓషధిన్= ఆ తీగను; మేపి= తినిపించి; పోషించినన్= పెంచగా; అది= ఆ ఆవు; సుపుష్టయున్= చక్కగా బలిసినదీ; సుస్వరయున్= మంచి నాదం కలదీ; సురూపయున్= మంచి రూపం కలదీ; ఐ= అయి; ఒక్క వృషభంబు పొందు= ఒక ఎద్దు సంపర్కాన్ని; వడసి= పొంది; గర్భిణి+ఐ= గర్భం ధరించినదై; మిథునంబున్= జంటను; ఈనినన్= కనగా.

**తాత్పర్యం:** భృగువంశంలో పుట్టిన కొందరు మహామునులు పర్ణశాలలు వేసికొని తపస్సునందు శ్రద్ధతో ఉండేవారు. వారిలో సుమిత్రుడని ఒక ముని గొప్ప ఆచార నిష్ఠతో ఉండే ఒక భార్గవుడికి అంగిరసుడనే గొప్ప బ్రాహ్మణుడు గోశర్కర అనే పదార్థం చెలిమివలనా, మంచితనం వలనా ఇచ్చాడు. ఆ పదార్థాన్ని ఆయన తన ఆవుకు మేపగా అది మంచి బలమూ, నాదమూ, రూపమూ పొంది ఏపుగా పెరిగింది. ఒక ఎద్దుతో కలిసి గర్భం తాల్చి పెయ్యను, కోడెదూడను కనింది.

**విశేషం:** సంయమి+ఈశ్వరులు= 'యమం' అంటే ఇంద్రియ నిగ్రహం. ఇది ఉపలక్షణంగా ఎనిమిది అంగాల యోగమార్గంలో వారు సిద్ధి పొందిన వారని భావించాలి. అందుకే ఈశ్వరులు - శ్రేష్ఠులు, ఆచారభవ్యుడు, విష్ణుసహస్రనామం ధర్మం ఆచారం నుండి పుడుతున్నదని చెప్పుతున్నది. "ఆచార ప్రభవో ధర్మః" దానిచేత అతడు భవ్యుడు, శ్రేష్ఠుడు అవుతున్నాడు. అందుకనే మహాద్విజుడు చెలిమిచేశాడు. మంచితనాన్ని భావించాడు. కానుక ఇచ్చాడు. సురూప, రూపం అంటే ఏ విధమైన అలంకారాలు లేకపోయినా అలంకారాలవలన కలిగే సౌందర్యం ఉన్నట్లు భాసింపజేసే లక్షణం. 'ఆవేధ్యా రోప్య నిక్షేప్య బన్ధనీయై రభూషితమ్, యేన భూషిత వద్భాతి తద్రూపమితి కథ్యతే".

**క. అమ్మిథునము బహుసంతా। నమ్మయ్యెం బెరఁగి క్రమమునను గో నిచయం**

**బిమ్మెయిఁ బెక్కు సహస్రము। లమ్మునికిం గల్గె గోవు లతఁడును వానిన్. 64**

**ప్రతిపదార్థం:** ఆ+మిథునము= ఆ జంట; బహు సంతానమ్ము= పెక్కు బిడ్డలు గలది; అయ్యెన్= అయింది; ఈ+మెయిన్= ఈ విధంగా; క్రమమునను= క్రమంగా; గో నిచయంబు= ఆవులమంద; పెరఁగి= వృద్ధిపొంది; పెక్కు సహస్రములు= చాలా వేల కొలదిగా; గోవులు= ఆవులు; ఆ+మునికిన్= ఆ సుమిత్రుడనే మునికి; కల్గెన్= ఏర్పడ్డాయి. అతఁడును= ఆ ముని; వానిన్= ఆ ఆవులను.

**తాత్పర్యం:** ఆ జంట క్రమక్రమంగా పెరిగి పెక్కు వేల ఆవులు ఆ మునికి సొమ్ముగా ఏర్పడ్డాయి. అతడు కూడా వాటిని. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. వేడ్కఁ జూచుచు నెప్పుడు వెనుకఁ దిరిగి । మేపు నీరును గలచోటి కోపి వెలిచి**
**పాలు గ్రేపులు గుడువ సప్రమదుఁ డగుచుఁ దాను గోస్తన ఫేనంబు ద్రావియుండు. 65**

**ప్రతిపదార్థం:** వేడ్కన్= ప్రీతితో; చూచుచున్= చూస్తూ; ఎప్పుడున్= ఎల్లవేళలా; వెనుకన్= వెనుకవైపుగా; తిరిగి; మేపు= గడ్డి; నీరు= నీళ్ళూ; కల చోటికి= ఉన్న తావునకు; ఓపి= కష్టాలకు తట్టుకొని; వెలిచి= త్రిప్పి; పాలు= పాలను; క్రేపులు= దూడలు; కుడువన్= త్రాగుతుంటే; సప్రమదుఁడు= నిండైన ఆనందంతో కూడినవాడు; అగుచున్= అవుతూ; తాను; గో స్తన ఫేనంబు= ఆవు చన్నుల దగ్గరి నురుగును; త్రావి= త్రాగి;ఉండున్= ఉండేవాడు.

**తాత్పర్యం:** ఆ ముని వాటిని ప్రీతితో పరామరిక చేస్తూ ఉండేవాడు. వాటివెంట తిరుగుతూ మంచి పచ్చికా నీరూ కలచోటులలో ఓపికతో త్రిప్పుతూ, దూడలు తల్లుల పాలు త్రాగుతూ ఉంటే పరమానంద పడుతూ తాను మాత్రం ఆ పాలు త్రాగేటప్పుడు వచ్చే నురుగును త్రాగుతూ ఉండేవాడు.

**విశేషం:** ఉన్నవి కొన్నివేల ఆవులు. వాటికి కావలసిన పచ్చికా నీరూ ఉన్నచోటనే దొరకవు అయినా అవి పుష్టిగా ఉండటమే తన కానందం కనుక పచ్చికా, నీరూ, ఎక్కడ దొరికితే అక్కడకు శ్రమకోర్చి వెళ్ళేవాడు అని 'ఓపి' అన్నమాటకు భావం. ఆవుల పొదుగులలో దూడలు పాలు త్రావటం ఒక మనోజ్ఞమైన దృశ్యం. స్వార్థంలేని వాడికి అది మరింత ఆనంద కారణమవుతుంది. అందుకనే 'సప్రమదుఁడు' తన పుష్టికి నురుగు చాలు. అంటే దూడల నోట్లో దుమ్ముకొట్టే బుద్ధి ఏ మాత్రమూ లేదని భావం.

**క. దానన చేసి యతనికిన్ । ఫేనపుఁ డను నామ మొసఁగెఁ బ్రియమున ముని స**
**మ్మానితుఁ డగు గౌతముఁ డి । ట్లా నిర్మలబుద్ధి గోసమారాధకుఁడై. 66**

**ప్రతిపదార్థం:** ముని సమ్మానితుఁడు= మునుల మన్ననగొన్నవాడు; అగు= అయిన; గౌతముఁడు= గౌతముడనే ఋషి; దానన చేసి= ఆ కారణంచేతనే; అతనికిన్= ఆ సుమిత్రుడికి; ఫేనపుఁడు అను నామము= ఫేనపుడనే పేరును; ప్రియమునన్= ప్రియంతో; ఒసఁగెన్= ఇచ్చాడు; ఇట్లు= ఈ విధంగా; ఆ నిర్మల బుద్ధి= ఆ స్వచ్ఛమైన బుద్ధిగల సుమిత్రుడు; గో సమారాధకుఁడు+ఐ= గోవులను చక్కగా భక్తితో పూజించేవాడై.

**తాత్పర్యం:** మునుల మన్ననగొన్న గౌతముడనే మహర్షి ఆ సుమిత్రుడికి ఆ కారణంచేతనే (పాలనురుగు త్రాగే కారణం చేతనే) అదే అర్థంగల 'ఫేనపుడు' అనే పేరు పెట్టాడు. ఇట్లా నిర్మలమైన బుద్ధిగల ఆ ముని గోవులను చక్కగా ఆరాధిస్తూ. (తరువాతి వచనంతో అన్వయం)

**విశేషం:** ముని సమ్మానితుడు కనుక అతని పెద్దతనంవలన అతడు పెట్టిన పేరు అందరికీ ప్రీతిపాత్రమైనదని ధ్వని, బిరుదువంటి ఆ పేరు సుమిత్రుడి స్వభావాన్ని కలుషితం చేయలేదు. కాబట్టే అతడు 'నిర్మలబుద్ధి'.

**వ. వర్తిల్లుచుండ నొక్కనాఁడు కామరూపిణు లగు గోవులు కొన్ని కాంతాకారంబులు గైకొని కమనీయంబగు కొలన జలక్రీడలు సలుపుచుండఁ దోడిధేనువు లచ్చట మెలంగి కనుంగొని 'మీ రెవ్వ?' రని మానుష భాషణంబుల నడిగిన నయ్యంగనా జనంబులు. 67**

**ప్రతిపదార్థం:** వర్తిల్లుచుండన్= కాలం గడుపుతుండగా; ఒక్కనాఁడు= ఒక రోజున; కామరూపిణిలు+అగు గోవులు= కోరిన రూపం ధరించగల ఆవులు; కొన్ని; కాంతా+ఆకారంబులు= మంచి రూపవంతులైన స్త్రీల రూపాలను; కైకొని= ధరించి; కమనీయంబు+అగు= మనోహరమైన; కొలనన్= ఒక కొలనిలో; జలక్రీడలు= నీటి యాటలు; సలుపుచున్+ఉండన్= చేస్తూ ఉండగా; తోడి ధేనువులు= తమతోపాటుగా ఉండే ఆవులు; అచ్చటన్= ఆ తావులో; మెలంగి= తిరుగుతూ; కనుంగొని= చూచి; మీరు; ఎవ్వరు; అని; మానుష భాషణంబులన్= మనుష్యుల మాటలతో; అడిగినన్= అడుగగా; ఆ+అంగనా జనంబులు= ఆ సుందరకాంతలు.

**తాత్పర్యం:** ఆయన అట్లా ప్రవర్తిస్తూ ఉండగా ఒక రోజున కోరిన రూపం ధరించగల కొన్ని ఆవులు చక్కని మగువల రూపాలను ధరించి ఒక అందమైన కొలనులో జలకాలాడుతూ ఉండగా తోడి ఆవులు 'మీరెవ్వరు?' అని మనుష్యుల మాటలతో అడుగగా ఆ కాంతలు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అంగనలు - అంటే మంచి అందంగల, అంగం= దేహం కలవారు.

**తే. 'ఏము గోవుల' మనవుడు 'నిట్టి యద్భు । తానుభావంబు మీ కెట్టు లావహిల్లె?'**
**ననిన విని వానితోడ నయ్యతివ లిట్టు । లనిరి 'మా తెఱఁ గేర్పడ వినుఁడు మీరు. 68**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; గోవులము= ఆవులం; అనవుడున్= అనగా; ఇట్టి= ఈ విధమైన; అద్భుత+అనుభావంబు= అచ్చెరువు గొల్పే మహిమ; మీకున్; ఎట్టులు= ఏ విధంగా; ఆవహిల్లెన్?= కలిగింది; అనినన్= అనగా; విని; వానితోడన్= ఆ ఆవులతో; ఆ+అతివలు= ఆ సుందర వనితలు; ఇట్టులు= ఈ విధంగా; అనిరి= పలికారు; మీరు; మా తెఱఁగు= మా పద్ధతి; ఏర్పడన్= చక్కగా తెలిసే విధంగా; వినుఁడు= వినండి.

**తాత్పర్యం:** 'మేము ఆవులం' అన్నాయి. అంటే 'మీకీ ఆశ్చర్యకరమైన గొప్పతనం ఎట్లా కలిగింది?' అని గోవు లడుగగా వాటితో ఆ కాంతలు ఇట్లా అన్నారు. 'మా తీరు తేటతెల్లంగా వినండి.'

**విశేషం:** 'మీకు' మేము గోవులమే కదా! మాకు లేని మహిమ మీ కెట్లా కలిగింది అనే జిజ్ఞాసను ఈ పద్యం వ్యక్తం చేస్తుంది. మీరు - అనేది కూడా వ్యంజకమే. మమ్ములను గూర్చి ఆసక్తితో వినగోరుతున్న మీరు అని అర్థం. అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని అంటారు.

**వ. హవ్య కవ్యంబులకు నతిథిపూజనంబులకు నిజాహారంబులకు సద్విజావలి సంతోషింప నింపారు పాలు వారికిం గురియుదుము, కృషిక్రియా సర్వ నిర్వర్తనంబులకు మా పుత్రులం బనుతు; మా సుకృతంబుల నివ్విశేషంబు కలిగె; మాకును గోలోకంబును సులభంబు; మీ రా సుకర్మంబులు సూచి యసూయ సేయుదురు గావున.69**

**ప్రతిపదార్థం:** హవ్య కవ్యంబులకున్= హవ్యానికీ, కవ్యానికీ (హవ్యం= దేవతలకిచ్చే పదార్థం; కవ్యం= పితృదేవతలకిచ్చే పదార్థం); అతిథిపూజనంబులకున్= అతిథుల మన్నించటానికీ; నిజ+ఆహారంబులకున్= తమ భోజనాలకూ; సత్+ద్విజ+ఆవలి= ఉత్తమ బ్రాహ్మణుల సముదాయం; సంతోషింపన్= చక్కని తృప్తిపొందే విధంగా; ఇంపు+ఆరు పాలు= శ్రేష్ఠమైన పాలను; వారికిన్= ఆ బ్రాహ్మణులకు; కురియుదుము= ఎక్కువ ప్రమాణంలో అందిస్తాం; కృషి క్రియా సర్వ నిర్వర్తనంబులకున్= వ్యవసాయం మొదలైన అన్ని పనులకు; మా పుత్రులన్= మా సంతానాన్ని కోడెలను, ఎద్దులను; పనుతుము=పంపుతాం; ఆ సుకృతంబులన్= ఆ పుణ్యాలవలన; ఈ+విశేషంబులు= ఈ గొప్పతనాలు; కలిగెన్= కలిగాయి; మాకును= మాకుకూడా;

గోలోకంబును= గోవుల లోకం; సులభంబు= తేలికగా అందుతుంది; మీరు; ఆ సుకర్మంబులు= మంచి పనులు; చూచి; అసూయ+చేయుదురు= అసూయ పొందుతారు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** హవ్యకవ్యాలకూ, అతిథిపూజలకూ, ఆహారానికీ చక్కగా తృప్తిగా వినియోగించుకొనటానికి వీలుగా పాలు సమృద్ధిగా ఉత్తమ బ్రాహ్మణులకు ఇస్తాం. మా సంతానాన్ని వ్యవసాయం మొదలైన పనులు చేయటానికి పంపుతాం. ఆ పుణ్యాలవలన మా కీ విశేషాలు కలిగాయి. మాకు కూడా గోలోకం తేలికగా సిద్ధిస్తుంది. మా పుణ్యకార్యాలు చూచి మీరు అసూయపడతారు. కనుక.

**విశేషం:** మానవుడు ఎన్నో ఋణాలతో పుడతాడు. అవి తీర్చుకొనటానికి అయిదు యజ్ఞాలు ప్రతిదినమూ చేస్తూ ఉండాలి. అవి బ్రహ్మయజ్ఞం; పితృయజ్ఞం; దేవయజ్ఞం; మనుష్యయజ్ఞం; భూతయజ్ఞం అనేవి ఇందులో ఇంచుమించుగా అన్నింటికీ కావలసిన పదార్థం గోవులు సమర్పిస్తాయి. కనుక ఉత్తమ బ్రాహ్మణులు చేసిన కర్మల ఫలితాలు అవి కూడా పొందుతాయి. ఇక పురుష సంతానం వ్యవసాయానికి ఉపయోగపడుతూ అందరినీ కాపాడుతుంది. అసూయ అంటే గుణాలను దోషాలుగా భావించి చెప్పటం 'అసూయాతు దోషారోపో గుణేష్వపి' - అమ. కురియుదుము - క్రియ వ్యంజకం. వర్షం కురిస్తే జలం ఎంత సమృద్ధిగా ఉంటుందో అంత సమృద్ధిగా పాలు ఇస్తాము అని ధ్వని.

**క. క్రేపులు తో రా దుర్గతిఁ । బ్రాపింపఁ గలార యిట్టి భావిచరిత ము**
**ద్దీపిత బోధమునం గని । మీపై కృపఁ జెప్పవలసె మీకుం దెలియన్. 70**

**ప్రతిపదార్థం:** క్రేపులు= దూడలు; తోన్= వెంటనంటి; రాన్= రాగా; దుర్గతిన్= దుఃఖపు గతిని; ప్రాపింపఁగలార= పొందుతారు; ఇట్టి= ఈ విధమైన; భావిచరితము= రాబోయే స్థితిని; ఉద్దీపిత బోధమునన్= ప్రకాశించే జ్ఞానంతో; కని= చూచి; మీ పై కృపన్= మీమీది అనుగ్రహంతో; మీకున్= మీకు; తెలియన్= తెలిసే విధంగా; చెప్పవలసెన్= చెప్పవలసి వచ్చింది.

**తాత్పర్యం:** మీ దూడలు మీతో రాగా మీరు చెడుదశను పొందుతారు. మా హృదయాలలో వెలుగొందే జ్ఞానం ఆధారంగా ఈ విషయాన్ని మేము ముందుగా తెలిసికొని మీ మీది దయతో మీకు తెలిసే విధంగా చెప్పవలసి వచ్చింది.

**విశేషం:** ఉద్దీపిత బోధము - సాధారణంగా భవిష్యత్తు ఎవరికీ తెలియదు. కాని, మహాపుణ్యాత్ములకు తపస్సంపన్నులకూ అది తెలుస్తుంది. ఇది కూడా ఆ కాంతారూప గోవులు చేసిన పుణ్య ఫలమే. రాబోయే అనర్థాన్ని ముందుగా తెలియజెప్పటం పరిహార మార్గాలను అన్వేషించి పాటించటంకొరకు. అదే ఇక్కడ కృప.

**వ. అనుటయు నగ్గోవులు దీనాననలై. 71**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అన్నంతనే; ఆ+గోవులు= ఆ ఆవులు; దీన+ఆననలు+ఐ= జాలిగొలిపే మోములు గలవై.

**తాత్పర్యం:** అన్నంతనే ఆ గోవులు దీనమైన మొగాలు కలవై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'గోవులకును గోవులు గతి । గావున మీ రరసి సుగతి గలుగు తెరువు మా**
**కే విధి నైనను జెప్పం । గా వలదే యనిన నట్ల కా' కని వారల్. 72**

**ప్రతిపదార్థం:** గోవులకును= ఆవులకు; గోవులు= ఆవులు; గతి= దిక్కు; కావునన్= కాబట్టి; మీరు; అరసి= చక్కగా పరిశీలించి; సుగతి కలుగు తెరువు= మంచి గతి గలిగే మార్గం; మాకున్; ఏ విధిన్ ఐనను= ఏ విధంగానైనా; చెప్పంగాన్ వలదే= చెప్పవద్దా?; అనినన్= అంటే; అట్ల కాక= సరే అట్లాగే; అని; వారల్= ఆ కాంతలు.

**తాత్పర్యం:** 'గోవులకు గోవులే దిక్కు కనుక మీరు మెలకువతో ఆలోచించి మాకు మంచి గతి కలిగే మార్గం ఎట్లాగైనా చెప్పాలి కదా!' అంటే 'సరే అట్లాగే' అని ఆ కాంతలు (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** మీరు, మాకు అనేవి అర్థాంతర సంక్రమిత వాచ్యాలు. మాతో సమానజాతి అయి, మా యందు కృపగల మీరు, దిక్కుతోచక దుఃఖపడుతున్న మాకు - అని వ్యంగ్యార్థం ఏ విధినైనను ఇది ఒత్తిడితో కూడిన ప్రార్థనను తెలియజేస్తుంది.

**తే.** **రంతిదేవుండు వేవత్సరములు సేయు । నధ్వరమునకుఁ బశువులై యరుగుఁ; డతఁడు**
**విశసనము సేయ గోలోక విభవ మొందఁ । గాంతు' రని నెమ్మిఁ బల్కిన సంతసిల్లి.** **73**

**ప్రతిపదార్థం:** రంతిదేవుండు= రంతి దేవుడనే రాజు; వే వత్సరములు= వేయి యేండ్లు; చేయు+అధ్వరమునకున్= చేసే యజ్ఞానికి; పశువులు+ఐ= పశువులుగా; అరుగుఁడు= వెళ్ళండి; అతఁడు= ఆ రాజు; విశసనము+చేయన్= చంపగా; గోలోక విభవము= గోవుల లోకపు మహిమ; ఒందన్+కాంతురు= పొందగలుగుతారు; అని; నెమ్మిన్= ప్రీతితో; పల్కినన్= పలుకగా; సంతసిల్లి= సంతోషించి.

**తాత్పర్యం:** 'రంతిదేవుడు వేయి యేండ్లు చేసే యజ్ఞంలో మీరు పశువులుగా వెళ్ళండి. ఆ రాజు మిమ్ములను యజ్ఞంలో బలియిస్తే మీకు గోలోకంలో ఉండే మహిమ కలుగుతుంది' అని ప్రీతితో చెప్పగా ఆ గోవులు సంతోషించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **అగ్గోవు లవ్విభు నధ్వరంబునకుఁ బో । నుత్సహించుటయు నం దొక్క గోవు**
**'మనము సుమిత్రుని ధన । మాతఁ డనుమతి । సేయక యెట్లు వోఁ జెల్లు?' ననిన**
**'నాతనిఁ జంపుద మతఁడును గోలోక । మున కేఁగుదెంచుఁగా!' కని కడంగి**
**చని మునిఁ దేఱి చూడను జాల కంతంత । నతిభీతిఁ గ్రమ్మఱి యరుగుటయును**

**తే.** **గొన్ని కపిలధేనువు లతి క్రూరచిత్త । 'లేము వధియించెదము మాకు నేమి మేలు**
**సేయు వారలు దగ మీరు సెప్పుఁ' డనిన । నన్ని మొదవులు నేకవాక్యత్వ మొంది.** **74**

**ప్రతిపదార్థం:** ఆ+గోవులు= ఆ ఆవులు; ఆ+విభు+అధ్వరంబునకున్= ఆ రాజు రంతిదేవుడి యాగానికి; పోన్= పోవటానికి; ఉత్సహించుటయున్= వేడుక పడగా; అందున్= వాటిలో; ఒక్క గోవు= ఒక ఆవు; మనం; సుమిత్రుని ధనము= సుమిత్రుడి సొమ్ము; అతఁడు= ఆ సుమిత్రుడు; అనుమతి+చేయక= ఒప్పుకొనకుండా; ఎట్లు= ఏ విధంగా; పోన్= పోవటం; చెల్లును?= కుదురుతుంది?; అనినన్= అంటే; అతనిన్= ఆ సుమిత్రుడిని; చంపుదము= చంపివేద్దాం; అతఁడును= అతడు కూడా; గోలోకమునకున్= గోవుల లోకానికి; ఏఁగుదెంచున్+కాక= వస్తాడు; అని; కడంగి= పూనుకొని; చని= వెళ్ళి; మునిన్= మునిని; తేఱి చూడను+చాలక= నిబ్బరంగా చూడను కూడా శక్తిలేక; అంతన్+అంతన్= దవ్వులనుండియే; అతిభీతిన్= ఎక్కువ భయంతో; క్రమ్మఱి= మరలి; అరుగుటయును= పోగా; కొన్ని కపిల ధేనువులు= కొన్ని పుల్లావులు; అతి క్రూరచిత్తలు= మిక్కిలి

క్రూరమైన హృదయం కలవి; ఏము= మేము; వధియించెదము= చంపుతాము; మాకున్= మాకు; ఏమి= ఏ విధమైన; మేలు= మంచిని; చేయువారలు?= చేస్తారు; తగన్= తగువిధంగా; మీరు; చెప్పుఁడు= చెప్పండి; అనినన్= అనగా; అన్ని మొదవులు= ఆవులన్నీ; ఏకవాక్యత్వము= ఒక అభిప్రాయం కలగటం; ఒంది= పొంది.

**తాత్పర్యం:** ఆ ఆవులన్నీ రంతిదేవుడి యాగానికి వెళ్ళటానికి సిద్ధపడ్డాయి. అందులో ఒక ఆవు 'మనం సుమిత్రుడి ధనం కదా! అతడి అంగీకారం లేకుండా పోవటం ఎట్లా కుదురుతుంది?' అన్నది. 'అయితే అతడిని చంపుదాం. అతడు కూడా గోలోకానికి వస్తాడు' అని నిర్ణయించుకొని ముని దగ్గరకు బయలుదేరాయి. కాని అతడిని సూటిగా చూడను కూడా చూడ లేక దూరం నుండియే తిరిగి వెళ్ళిపోయాయి. కొన్ని పుల్లావులు హృదయంలో క్రూరత్వం నింపుకొని 'మేము అతడిని చంపుతాం. మాకు మీ రేమి మేలు ఇస్తారు? తగు విధంగా చెప్పండి' అనగా ఆవులన్నీ కూడబలుకుకొని ఒకమాటకు వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'చంపుదము' - ఇది కృతఘ్నతగాదు. వాటిని విడిచి అతడూ, అతడిని విడిచి అవీ ఉండలేవు. కనుక తాము పొందే సద్గతికి అతడుకూడా చేరుకొనాలని మాత్రమే వాటి భావన. దీనిని కవి ముందు స్పష్టం చేస్తాడు. 'తేఱిచూడను చాలక' - అతడిని ఫేనపునితనం ఒక మహా తపస్సు. దానితో తాము చంపటమనే చెడు తలంపుతో (లోక సామాన్య దృష్టితో) దరికి చేరలేకపోయాయి. కనీసం కన్నులతో సూటిగా చూడటం కూడా సాధ్యం కాలేదు. 'అతి క్రూరచిత్తత్వం' - సంకల్పం మంచిదయినా చేష్ట లోకం చూపునకు విరుద్ధమైనది. కాబట్టి గుండెలో దయలేకుండా చూచుకొనాలి. కనుక అవి గుండెను బండ చేసికొన్నాయి అని భావం.

**ఆ. 'సకల వర్ణ ధేను సమితికి నెల్లను । గపిల గోవు శ్రేష్ఠ గాఁగఁ గపిల**
**నీగి గో శతంబు నిచ్చిన యట్లుగా । వరము మీకు నిచ్చు వార' మనియె. 75**

**ప్రతిపదార్థం:** సకల వర్ణ ధేను సమితికిన్= అన్ని రంగుల ఆవుల సముదాయానికి; ఎల్లను= అంతా; కపిలగోవు= గోరోచన వర్ణంగల ఆవు; శ్రేష్ఠ= అన్నింటికంటె మిన్న; కాఁగన్= అయ్యేవిధంగాను; కపిలను= పుల్లావును; ఈగి= దానంచేయటం; గోశతంబున్= నూరు ఆవులను; ఇచ్చిన+అట్లుగాన్= ఇచ్చినదానితో సమానం అవునట్లుగాను; మీకున్= మీకు; వరము= వరాన్ని; ఇచ్చువారము= ఇస్తాము; అనియెన్= అన్నాయి.

**తాత్పర్యం:** 'అన్ని రంగుల ఆవులన్నింటిలో కపిలవర్ణం గలవి మిక్కిలి గొప్పవి అయ్యే విధంగానూ, ఒక కపిలగోవును దానంచేస్తే అది వందగోవుల దానంతో సమానం అయ్యేవిధంగానూ మీకు వరమిస్తాం' అన్నాయి.

**వ. అనిన విని కరంబుప్రియంబునం గామరూపిణులైన యగ్గోవులు రూపాంతరంబులు గైకొని యా భృగువంశ వర్యు పాలికిం బోయి 'యేము గోమాతలము; నీదగు గో సమారాధనంబునకు మెచ్చి వరంబిచ్చువారమై వచ్చితి; మిష్టం బెయ్యది యడుగు' మనుటయు నమ్ముని 'యిప్పటి యట్ల యెల్లప్పుడును గోవులవలన భక్తిస్నేహంబులు గలుగ నిం' డనియె నమ్మాటకు నవి 'యట్ల యయ్యెడుఁగాక!' యని పలికి వెండియు నిట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; కరంబు= మిక్కిలి; ప్రియంబునన్= ఇష్టంతో; కామరూపిణులు+ఐన= ఇచ్చవచ్చిన రూపం పొందగల; ఆ+గోవులు= ఆ ఆవులు; రూప+అంతరంబులు= వేరు రూపాలు; కైకొని= ధరించి; ఆ భృగువంశవర్యు పాలికిన్= భృగువంశంలో ఎన్నదగినవాడైన ఆ సుమిత్రుడి దగ్గరకు; పోయి= వెళ్ళి; ఏము= మేము;

గోమాతలము= ఆవుల తల్లులము; నీది+అగు= నీదైన; గోసమారాధనంబునకున్= ఆవుల భక్తితోడి పూజకు; మెచ్చి= ఆనం దపడి; వరంబు= వరాన్ని; ఇచ్చువారము+ఐ= ఇచ్చేవారమై; వచ్చితిమి= వచ్చాము; ఇష్టంబు= ఇష్టమైనది; ఏ+అది=ఏదో; అడుగుము= కోరుకొనుము; అనుటయున్= అనగా; ఆ+ముని= ఆ ముని; ఇప్పటి+అట్లు+అ= ఇప్పటివలెనే; ఎల్ల+అప్పుడున్= సర్వకాలాలలో; గోవులవలనన్= ఆ గోవుల విషయంలో; భక్తి స్నేహంబులు= భక్తీ చెలిమీ; కలుగన్= కలిగేటట్లు; ఇందు= వరం ఇవ్వండి; అనియెన్= అన్నాడు; ఆ+మాటకున్= ఆ మాటకు; అవి= ఆ ఆవులు; భక్తి చెలిమీ; కలుగన్= కలిగేటట్లుగా; ఇందు= వరం ఇవ్వండి; అనియెన్= అన్నాడు; ఆ+మాటకున్= ఆ మాటకు; అని= ఆ ఆవులు; అట్ల= అట్లాగే; అయ్యెడున్+కాక= అవుతుంది; అని; పలికి= మాట్లాడి; వెండియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాయి.

**తాత్పర్యం:** ఆ ఆవులు అట్లా చెప్పగా పుల్లావులు విని ఎంతో ప్రీతితో కోరినరూపాలు ధరించగలిగినవి కనుక వేరురూపాలు పొంది ఆ సుమిత్రుడి కడకరిగి 'అయ్యా! మేము గోమాతలం. నీవు చేసే ఈ గో పూజకు సంతోషం కలిగి నీకు వరమివ్వటానికి వచ్చాం. నీ కేది ఇష్టమో దాన్ని కోరుకొనుము' అన్నాయి. అప్పు డా ముని 'ఇప్పటిదానివలెనే నాకు ఆవులమీద భక్తి స్నేహాలు ఎప్పటికీ ఉండేవరం ఇవ్వండి' అన్నాడు. దానికి అవి 'అట్లాగే అవుతుంది' అని ఇంకా ఇట్లా అన్నాయి.

**క. ' ఈ లోకం బేటికి? మన । గోలోకంబునకు రమ్ము కులవర!' యనుడుం**
**'జాలుదునే మద్గో ర । త్నాలి విడిచి యందు రాక' కని ముని పల్కెన్. 77**

**ప్రతిపదార్థం:** కులవర!= కులంలో శ్రేష్ఠుడా!; ఈ లోకంబు= ఈ లోకం; ఏటికిన్= ఎందుకు? మన గో లోకంబునకున్= మనదైన ఆవుల లోకానికి; రమ్ము= రా; అనుడున్= అన్న వెంటనే; మత్ గో రత్న+ఆలిన్= నా గోవులనే రత్నాల వరుసను; విడిచి= వదలి; అందు= ఆ గోలోకం; రాకకున్= రావటానికి; చాలుదునే?= శక్తికలవాడనా?; అని; ముని; పల్కెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'కులశ్రేష్ఠా! ఈ లోకంతో పనియేమి? మన గోలోకానికి రమ్ము!' అన్నంతనే 'నేనీ గో రత్నాల వరుసను వదలి అక్కడికి రాగలనా?' అని ముని పలికాడు.

**విశేషం:** 'ఈ లోకంబు ఏటికి' - ఇది విశిష్టమైనదీ, కోరదగినదీ కాదని తాత్పర్యం. 'మన' - నీవు మాతో ఏ మాత్రమూ భేదంలేనివాడవని భావం. చాలుదునే - ఆ లోకం ఎంత గొప్పదయినా నా ప్రాణానికి ఈ గోవులే సర్వస్వం అని అతని అభిప్రాయం.

**క. విని యా ధేనువు లాతని । తను వాకసమునకు నెత్తి తమ యోగబలం**
**బునఁ జైతన్యముఁ బాపి య । వని మీఁదఁ గళేబరంబు వైచి రయమునన్. 78**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; ఆ ధేనువులు= ఆ ఆవులు; అతని తనువు= ఆ సుమిత్రుడి దేహాన్ని; ఆకసమునకున్= ఆకాశానికి; ఎత్తి; తమ యోగ బలంబునన్= తమ యోగశక్తిచేత; చైతన్యమున్= ప్రాణాన్ని; పాపి= పోగొట్టి; కళేబరంబున్= ప్రాణం లేని దేహాన్ని; అవనిమీఁదన్= నేలమీద; వైచి= వేసి; రయమునన్= వేగంతో.

**తాత్పర్యం:** ఆ మాట విన్న ఆవులు అతని దేహాన్ని ఆకాశానికి ఎత్తి తమ యోగబలంవలన ప్రాణాలు పోగొట్టి దేహాన్ని క్రిందవేసి వేగంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆకాశానికి ఎత్తటం అంటే ఊర్ధ్వగతి - ఉత్తమగతి కల్పించటం. యోగబలంచేత ప్రాణశక్తిని దేహంనుండి వేరు చేశాయి. కనుక ఆ ప్రాణశక్తి అంత్యకాలంలో చికాకు పొందలేదు - అనే అంశం ఊహకు వస్తుంది.

**క. కొమ్ములఁ గాళ్ళం బిండిగఁ। గ్రుమ్మి మగిడిపోయి పూసగ్రుచ్చిన గతి మున్**
**తమ్ముం బనిచిన గోవుల। కమ్ముని తెఱఁ గెల్లఁ జెప్పి హర్ష మొనర్చెన్. 79**

**ప్రతిపదార్థం:** కొమ్ములన్= కొమ్ములతో; కాళ్ళన్= కాళ్ళతో; పిండిగన్= పిండి అయ్యేటట్లు; క్రుమ్మి= పొడిచి; మగిడి పోయి= తిరిగి వెళ్ళి; పూసగ్రుచ్చినగతిన్= పూసగ్రుచ్చినట్లుగా; మున్= ముందు; తమ్మున్= తమ్ము; పనిచిన గోవులకున్= పంపిన ఆవులకు; ఆ+ముని తెఱఁగు= ఆ ముని తీరును; ఎల్లన్= అంతా; చెప్పి= వివరించి; హర్షము= ఆనందం; ఒనర్చెన్= కలిగించాయి.

**తాత్పర్యం:** కొమ్ములతో కాళ్ళతో ఆ దేహాన్ని పిండి పిండి అయ్యేవిధంగా పొడిచి తిరిగివెళ్ళి మునుపు తమ్ము పంపించిన ఆవులకు ఆ ముని తీరును పూసగ్రుచ్చినట్లుగా చెప్పి ఆనందం కలిగించాయి.

**విశేషం:** కొమ్ముల..... క్రుమ్మి - ఇది ప్రాణం పోయిన తరువాత దేహానికి చేసే సంస్కారం వంటిది. 'పూసగ్రుచ్చిన గతిన్' - ఇది ఒక జాతీయం - ఏ చిన్న అంశాన్నీ వదలకుండా అని దీని భావం.

**వ. గోలోకంబునకు ముఖ్యలగు గోమాత లంతయు నెఱింగి తమ కడకుం జనుదెంచిన సుమిత్రు నాదరించి సుదతులై విహరించిన గోవులు మొదలుగా సకల గోవుల తెఱంగు నతని కెఱింగించి 'నీకు నిది మేల కాక' యని పలికి యతనిం బ్రీతునిం జేసి బ్రహ్మ ఘాతిక లయిన యన్ని గోవులకును 'మీ వంశం బశుచి వదనం' బయ్యెడు మని శాపం బిచ్చిన నాధేనువులు రంతిదేవు పాలికిం బోయి సుగతి వేఁడి తమ్ముం బశువులుంగా విశసింపు మని మానుష భాషణంబులం బ్రార్థించుటయు. 80**

**ప్రతిపదార్థం:** గోలోకంబునకున్= గోవుల లోకానికి; ముఖ్యలు+అగు= ప్రధాన వ్యక్తులయిన; గోమాతలు= గోవుల తల్లులు (గోమాతలనబడే వారు); అంతయున్= ఆ విషయమంతా; ఎఱింగి= తెలిసికొని; తమ కడకున్= తమ దగ్గరకు; వచ్చిన సుమిత్రున్= వచ్చిన సుమిత్రుడిని; ఆదరించి= మన్నించి; సుదతులు+ఐ= ఆడవాండ్రై; విహరించిన గోవులు= తిరిగిన ఆవులు; మొదలుగాన్= ఆదిగా; సకల గోవుల తెఱంగున్= అన్ని ఆవుల తీరును; అతనికిన్= ఆ సుమిత్రుడికి; ఎఱింగించి= తెలిపి; నీకున్= నీకు; ఇది= ఇట్లాంటి స్థితి; మేలు+అ= మేలే; కాక= అగుగాక; అని; పలికి; అతనిన్= అతడిని; ప్రీతునిన్= ప్రీతికలవాడినిగా; చేసి= ఒనర్చి; బ్రహ్మఘాతికలు= బ్రాహ్మణుడిని చంపినవి; అయిన అన్ని గోవులకును= అయిన ఆవులన్నింటికీ; మీ వంశంబు= మీ కులం; అశుచి వదనంబు+అయ్యెడున్= శుచిలేని మొగం కలదవుతుంది; అని; శాపంబు= శాపాన్ని; ఇచ్చినన్= ఇవ్వగా; ఆ ధేనువులు= ఆ ఆవులు; రంతిదేవు పాలికిన్= రంతిదేవుడి దగ్గరకు; పోయి= వెళ్ళి; సుగతి= మంచిగతిని; వేఁడి= కోరుకొని; తమ్మున్= తమను; పశువులు+కాన్= యజ్ఞ పశువులుగా; విశసింపుము= చంపుము; అని; మానుష భాషణంబులన్= మనుష్యుల మాటలతో; ప్రార్థించుటయున్= వేడినంత.

**తాత్పర్యం:** గోలోకంలో ప్రధానస్థితి గల గోమాతలు ఆ విషయమంతా తెలిసికొని తమ దగ్గరకు వచ్చిన సుమిత్రుడిని ప్రేమతో లాలించి స్త్రీలై తిరిగి ఆవులు మొదలుకొని తక్కిన అన్నింటి తీరును అతడికి తెలిపి 'నీకిది మేలే అవుతుంది' అని అతడికి ప్రీతి కలిగించాయి. తరువాత ఆ బ్రాహ్మణుడిని హత్య చేసిన ఆవులన్నింటికీ మీముఖం

నల్లగా అవుతుంది అని శాపం పెట్టాయి. ఆ ఆవులు రంతిదేవుడి దగ్గరకు పోయి 'మాకు మంచిగతి కలిగించుము. మమ్ము నీ యజ్ఞంలో పశువులుగా బలి ఇమ్ము' అని మనుష్యుల మాటలతో ప్రార్థించాయి. అట్లా ప్రార్థించగా.

**విశేషం:** ఇక్కడ కపిల గోవులకు పాపం ఎట్లా వచ్చింది? అని సందేహం కలుగుతుంది. మేము ఈ పాపం చేశామనే భావన ఉన్న వాటికి - అంటే అహంకారభావన ఉన్నవాటికి పాపం అంటుతుంది. అది లేనివాటికి అంటదు. **"యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే; హత్వా పి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే"** అన్న గీతావాక్యం దీనికి ప్రమాణం. ఎవనికి అహంకారభావన ఉండదో; బుద్ధి చేసినపనియందు అంటులేకుండా ఉంటుందో వాడు ఈ లోకాలను రూపుమాపినా చంపిన వాడు కాడు. అతడికి పాప బంధం ఉండదు. పశువులుగా యజ్ఞంలో బలియివ్వటం పాప పరిహారార్థమని ఇందు సూచన.

**క. 'మిమ్ముఁ దెగఁ జూచి సద్గతి । కెమ్మెయిఁ బోవంగ నేర్తు నే' నని వినయా**

**ర్ద్రమ్ముగ మ్రొక్కుచుఁ బలికిన । నమ్మానవపతికి నిట్టులను నగ్గోవుల్. 81**

**ప్రతిపదార్థం:** నేను; మిమ్మున్= మిమ్ములను; తెగన్+చూచి= చంపి; సద్గతికిన్= ఉత్తమ స్థితికి; ఏ+మెయిన్= ఏ విధంగా; పోవంగన్ నేర్తున్;= పోగలను?; అని; వినయ+ఆర్ద్రమ్ముగన్= వినయపు చెమ్మ కలిగే విధంగా; మ్రొక్కుచున్= పాదాలకు నమస్కరిస్తూ; పలికినన్= పలుకగా; ఆ+మానవపతికిన్= ఆ రాజునకు (రంతిదేవునకు); ఆ+గోవుల్= ఆ ఆవులు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాయి.

**తాత్పర్యం:** 'మిమ్మల్ని చంపి నేను ఉత్తమగతి ఎట్లా పొందుతాను?' అని వినయం ఉట్టిపడే విధంగా మ్రొక్కుతూ పలుకగా ఆ ఆవులు ఆ రాజుతో ఇట్లా అన్నాయి.

**విశేషం:** వినయార్ద్రమ్ముగన్ - వినయం అణువణువునా నిండినట్లు అని భావం. మ్రొక్కటం అంటే సాధారణంగా సాష్టాంగదండ ప్రణామం చేయటం అని అర్థం. మిమ్మున్, నేనె - అనే పదాలు అర్థాంతర సంక్రమిత వాచ్యాలు - పరమ పూజ్యులైన మిమ్ములను, ప్రాణాలు ఒడ్డి అయినా రక్షించుకొనదగిన మిమ్ములను ఇత్యాద్యర్థం వ్యంగ్యం. అట్లాగే 'గోవులయందు పరమభక్తిగల' నేను అనే అర్థం ఇక్కడ స్ఫురిస్తుంది.

**క. జ్ఞానుల యీ పనికై నినుఁ గానఁగఁ బుత్తెంచి, రట్లు గావున సుమనో**

**మానితగతి నీకును నగు । భానునిభా! నీయశంబుఁ బరఁగు జగములన్. 82**

**ప్రతిపదార్థం:** భానునిభా!= సూర్యుడి వంటివాడా!; జ్ఞానులు+అ= జ్ఞానం కలవారే; ఈ పనికై= ఈ పనికొరకు; నినున్=నిన్ను; కానఁగన్= చూడటానికి; పుత్తెంచిరి= (మమ్ములను) పంపారు; అట్లు కావునన్= కాబట్టి; సుమనస్+మానితగతి= దేవతలు గౌర వించే స్థితి; నీకునున్= నీకు కూడా; అగున్= అవుతుంది; నీ యశంబున్= నీకీర్తికూడా; జగములన్= లోకాలలో; పరఁగున్= వ్యాపిస్తుంది.

**తాత్పర్యం:** సూర్యసమానుడా! ఈ పనికొరకు జ్ఞానులే నిన్ను చూడవలసినదిగా మమ్మల్ని పంపారు. కాబట్టి దేవతలు కూడా గౌరవించే గతి నీకు సిద్ధిస్తుంది. నీ కీర్తి లోకాలలో వ్యాపిస్తుంది.

**విశేషం:** భానునిభా! - అనటంవలన సూర్యుడివలె నీవు తత్కాలంలో మమ్ములను బాధించినా అది ఉత్తర కాలంలో సత్ఫల దాయకమే అవుతుంది అన్న అర్థం ప్రతీయమానం అవుతుంది. నీకును - గోహత్య చేసిన నీకును - అని భావం. యశస్సు లోకాలలో ఎంతకాలం ఉంటుందో అంతకాలం ఆ వ్యక్తి పుణ్యలోకాలలో ఉంటాడని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. జ్ఞానులు

'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్' - జ్ఞాని ఆత్మయే అని నా అభిప్రాయం అన్న గీతావాక్యం ప్రమాణంగా జ్ఞానులు - అందులోను పెక్కండ్రు చెప్పారంటే అది పరమాత్మ పలుకువలె అనుల్లంఘనీయం అని తాత్పర్యం.

**క. నావుడు మీలోపల నొక । గోవైనను మోహవశతఁ గూరుటయు మఖం**

**బావేళఁ బరిసమాప్తము । గావలయును వినుఁడు సమయ కల్పన దెలియన్.' 83**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; మీలోపలన్= మీలో; ఒక గోవు+ఐనను= ఒక్క ఆవైనా; మోహవశతన్= మోహానికి లొంగటం; కూరుటయున్= పొందినట్లైతే; మఖంబు= యజ్ఞం; ఆ వేళన్= ఆ సమయంలో; పరిసమాప్తము= పూర్తిగా ముగిసినది; కావలయును= అవ్వాలి; సమయ కల్పన= ఈ ఒడంబడిక ఏర్పాటు; తెలియన్= చక్కగా తెలిసే విధంగా; వినుండు= వినండి.

**తాత్పర్యం:** అని ఆ ఆవులు అంటే ఆ రాజు 'మీలో ఒక్క ఆవైనా చావుకు వెనుకాడితే వెంటనే నా యజ్ఞం ముగిసిపోవాలి. ఈ ఒడంబడికను మీరు చక్కగా వినండి.'

**విశేషం:** మోహవశతఁ గూరుట - అయ్యో! నాకీ ఘోరమైన చావు వచ్చిపడిందే అని బాధపడటం.

**క. అని యవ్విభుండు పలికిన । విని గోవులు సమ్మతింప విశసించుచు వే**

**ల్చె నతఁడు యజ్ఞానలమున । ననేక గోచయములం గ్రమాకలనమునన్. 84**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా అని; ఆ+విభుండు= ఆ రాజు; పలికినన్= పలుకగా; విని= ఆలకించి; గోవులు= ఆవులు; సమ్మతింపన్= ఒప్పుకొనగా; అతఁడు= ఆ రంతిదేవుడు; క్రమ+ఆకలనమునన్= శాస్త్ర విధి పద్ధతిలో; అనేక గోచయములన్= పెక్కు ఆవుల మందలను; విశసించుచున్= చంపుతూ; యజ్ఞ+అనలమునన్= యజ్ఞాగ్నిలో; వేల్చెన్= హోమం చేశాడు.

**తాత్పర్యం:** రా జిట్లా పలుకగా ఆ ఆవులు ఒప్పుకొన్నాయి. ఆ రంతిదేవుడు పెక్కు ఆవుల మందలను విధి ననుసరించి చంపి యజ్ఞపు అగ్నిలో హోమం చేశాడు.

**విశేషం:** క్రమ+ఆకలనమునన్= అతడు చేసిన పని శాస్త్ర సమ్మతం అనే విషయాన్ని ఈ పదం వ్యక్తం చేస్తుంది. యజ్ఞాలను దేవతలకూ, మనుష్యులకూ పరస్పరం ఉపకారకాలుగా భగవంతుడు సృష్టించాడని భగవద్గీత చెప్పుతున్నది.

**క. ఒకనాఁడు గో వొకటి లేఁ । గకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని నీ విం**

**కకటా! యెక్కడఁ జేరెద । వకృపులు వచ్చెదరు చంప' నని పల్కుటయున్. 85**

**ప్రతిపదార్థం:** ఒకనాఁడు= ఒక దినాన; గోవు= ఆవు; ఒకటి= ఒక్కటి; లేఁగకున్= చిన్న దూడకు; చన్ను+ఇచ్చుచును= పాలిస్తూ; దానిన్= ఆ దూడను; కనుఁగొని= చూచి; అకటా!= అయ్యో!; నీవు ఇంకన్= ఇటుపై; ఎక్కడన్= ఏ తావునందు; చేరెదవు?= చేరుతావు?; అకృపులు= దయలేనివారు; చంపన్= చంపటానికి; వచ్చెదరు= వస్తారు; అని; పల్కుటయున్= పలుకగా.

**తాత్పర్యం:** ఒక రోజున ఒక ఆవు తన చిన్ని దూడకు పాలిస్తూ 'అయ్యో బిడ్డా! దయలేనివారు చంపటానికి వస్తారు. నీ వెక్కడకు పోతావు?' అని పలుకగా. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** నిజానికి చావు కోరింది తామే అయినా ఆ ఆవుకు కర్మబద్ధతవలన చావుభయం, దానివలన దుఃఖం కలిగాయి.

### గోవులు రంతిదేవు యజ్ఞ పశువులై గోలోకంబునకుఁ బోవుట (సం.13-123-26 (కుంభ))

**వ. మహానుభావుండు గావున నప్పలుకులు విని రంతిదేవుం డయ్యాగంబు సుప్రయోగంబుగా సమాప్తంబు గావించెఁ; గొన్ని గోవులు కడమవడి పుడమిన నిలిచె; నధ్వరోపయోగంబు వడసిన గోగణంబులు గోలోకంబునకుం బ్రమోదంబునం బోయెఁ; దదీయ చర్మాస్థి శ్రేణులు తటంబులై తనరం బ్రభూత రక్తమేదః క్లేదంబు లేఱై పాఱి చర్మణ్వతి యను పేరం బరఁగెఁ; నా రంతిదేవ భూపతియును యజ్ఞ సమృద్ధుండై వృద్ధశ్రవుని తోడి సఖ్యంబునం బొలిచి యక్షయ నాకంబున సుశ్లోకుండై యుండె; ఫేనపాఖ్యుండును గోలోకంబున శాశ్వతుండై వసించె' నని చెప్పి భీష్ముండు వెండియు. 86**

**ప్రతిపదార్థం:** మహా+అనుభావుండు= గొప్ప ప్రభావం కలవాడు; కావునన్= కాబట్టి; రంతిదేవుండు= రంతిదేవుడు; ఆ+పలుకులు= ఆ ఆవు మాటలు; విని= ఆలకించి; ఆ+యాగంబు= ఆ యజ్ఞం; సుప్రయోగంబు+కాన్= చక్కగా చేసినదయ్యే విధంగా; సమాప్తంబు= ముగిసినదానిని; కావించెన్= చేశాడు; కొన్ని గోవులు= కొన్ని ఆవులు; కడమ+పడి= మిగిలిపోయి; పుడమిన్+అ= భూమియందే; నిలిచెన్= ఉండిపోయాయి; అధ్వర+ఉపయోగంబు= యజ్ఞంలో ఉపయోగాన్ని; పడసి= పొందిన; గోగణంబులు= ఆవులమందలు; గోలోకంబునకున్= గోలోకానికి; ప్రమోదంబునన్= మంచి ఆనందంతో; పోయెన్= పోయాయి; తదీయ చర్మ+అస్థి శ్రేణులు= వానివైన తోళ్ళు, ఎముకలు అనే వాటి వరుసలు; తటంబులు= ఒడ్డులు; ఐ= అయి; తనరన్= ఒప్పగా; ప్రభూత రక్త మేదః క్లేదంబులు= చాలా ఎక్కువ అయిన నెత్తురు, మెదడు అనేవాటి తడులు; ఏఱు+ఐ= నది అయి; పాఱి= ప్రవహించి; చర్మణ్వతి+అను పేరన్= చర్మణ్వతి (చర్మములు గలది) అనే పేరుతో; పరఁగెన్= ఒప్పింది; ఆ రంతిదేవ భూపతియును= ఆ రంతిదేవ మహారాజున్నూ; యజ్ఞ సమృద్ధుండు+ఐ= యజ్ఞాల నిండైన సంపద కలవాడై; వృద్ధశ్రవునితోడి సఖ్యంబునన్= ఇంద్రుడితోడి చెలిమితో; పొలిచి= ఒప్పి; అక్షయ నాకంబునన్= తరుగు లేని స్వర్గంలో; సుశ్లోకుండు+ఐ= అందరి పొగడ్తలు అందినవాడై; ఉండెన్= ఉన్నాడు; ఫేనప+ఆఖ్యుండును=ఫేనపుడన్న పేరుగల ఆ సుమిత్రుడున్నూ; గోలోకంబునన్= గోలోకంలో; శాశ్వతుండు+ఐ= ఎల్లవేళల ఉండేవాడై; వసించెన్= ఉన్నాడు; అని= ఇట్లా అని; చెప్పి; భీష్ముండు= భీష్ముడు; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** గొప్ప మహిమగలవాడు కనుక ఆ రంతిదేవుడు ఆ ఆవు మాట విని ఆ యాగాన్ని ఏలోపం లేకుండా ముగించాడు. ఆ విధంగా కొన్ని ఆవులు మిగిలిపోయి భూమిమీదనే నిలిచిపోయాయి. యజ్ఞంలో వినియోగం పొందిన ఆవుల మందలు ఆనందంతో గోలోకానికి వెళ్ళాయి. వాటి చర్మాలూ, ఎముకలూ ఒడ్డులు కాగా వాని నెత్తురు, మెదడులోని తడి ఏఱై ప్రవహించి చర్మణ్వతి అనే పేరున ఒప్పింది. రంతిదేవ మహారాజున్నూ యజ్ఞపుపంట పండించుకొని ఇంద్రుడితోడి చెలిమితో సుఖంగా చెడని స్వర్గంలో మంచి కీర్తి పొందుతూ ఉన్నాడు. ఫేనపుడున్నూ గోలోకంలో శాశ్వతంగా నివసించాడు' అని చెప్పి భీష్ముడు ఇంకా ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** ఇందులో యజ్ఞంలో మిగిలిన ఆవులు తప్ప తక్కిన వారంతా సుఖస్థితి పొందటాన్ని వివరించారు. దీనివలన యజ్ఞం సత్ఫలదాయకమే అన్న భావం తెలియవస్తున్నది.

**సీ. 'మానవనాథ! యీ ఫేనపాఖ్యానంబు । బదరికాశ్రమమున బాదరాయ**
**ణుఁడు ప్రీతి నారాయణునకుఁ జెప్పిన నమ్మ । హాత్ముండు గో యజనార్థి యగుచు**
**నిది గొనియాడంగ విదితమై జగమునఁ । బరఁగెఁ; బుణ్యతమంబు పావనంబు**
**దీనిఁ బఠించిన వీనుల నించిన । దురిత వర్గంబులఁ బొరయ వలదు;**

**తే. పూరు నృపకుల భూషణ! పూత చరిత! నీవు నతిభక్తి గలుగుము గోవులందుఁ**
**బరమనియతి నీ తంత్రంబు పఠన విధియు । నేత దాకర్ణనంబును నెపుడుఁ జలుపు.' 87**

**ప్రతిపదార్థం:** మానవనాథ!= రాజా!; ఈ ఫేనప+ఆఖ్యానంబున్= ఈ ఫేనపుని కథను, బదరికా+ఆశ్రమమునన్= బదరికాశ్రమంలో; బాదరాయణుఁడు= శ్రీ వ్యాసుడు; ప్రీతిన్= ప్రీతితో; నారాయణునకున్= నారాయణుడనే మునికి; చెప్పినన్= చెప్పగా; ఆ+మహాత్ముండు= ఆ దొడ్డబుద్ధిగలవాడు; గో యజన+అర్థి= గోవుల యజ్ఞం కోరినవాడు; అగుచున్= అవుతూ; ఇది= దీనిని; కొని+అడంగన్= ప్రీతితో పలుకగా; జగమునన్= లోకంలో; విదితము+ఐ= అందరికీ తెలిసినదై; పరఁగెన్= ఒప్పింది; పుణ్యతమంబు= అన్నింటికన్నా పుణ్యమైనదీ; పావనంబు= పవిత్రం చేసేదీ అయిన; దీనిన్= దీనిని; ఈ ఫేనపుని కథను; పఠించినన్= శ్రద్ధతో చదివినా; వీనులన్= చెవులయందు; నించినన్= నింపుకొన్నా; దురిత వర్గంబులన్= పాప సముదాయాలలో; పొరయన్= కలిసిపోవటం; వలదు= కలుగదు; పూరు నృప కులభూషణ!= పూరుడు అనే రాజు కులానికి అలంకారమైనవాడా; పూతచరిత!= పవిత్రమైన చరిత్ర కలవాడా!; నీవును= నీవుకూడా; గోవులందున్= గోవుల విషయంలో; అతిభక్తిన్= మిక్కిలి భక్తిని; కలుగుము= పొందుము; పరమనియతిన్= గొప్పనిష్ఠతో; ఈ తంత్రంబు= ఈ క్రియయొక్క; పఠన విధియున్= చదవటమనే పనినీ; ఏతత్+ఆకర్ణనంబును= దీనిని వినటాన్నీ; ఎపుడున్= ఎల్లవేళలా; చలుపు= చేస్తూ ఉండుము.

**తాత్పర్యం:** 'రాజా! ఈ ఫేనపుని కథను బదరికాశ్రమంలో శ్రీ వేదవ్యాసుడు నారాయణమునికి ప్రీతితో చెప్పాడు. ఆ మహానుభావుడు గో యజ్ఞం చేయగోరి దీనిని గూర్చి అందరకూ తెలుపుతూ ఉండగా అది లోకంలో క్రమంగా అందరికీ తెలిసింది. ఎంతో పుణ్యమైనదీ, పావనమైనదీ అయిన దీనిని చదివినా, విన్నా పాపాల సంగతి కలుగదు. నీవుకూడా గోవుల విషయంలో గొప్ప భక్తి కలిగి ఉండుము. గోవులను సేవించిన విధానాన్ని చదవటం, వినటం ఎప్పుడూ చేస్తూ ఉండుము.'

**విశేషం:** బాదరాయణుడు నారాయణుడికి బదరికాశ్రమంలో చెప్పాడంటే నరనారాయణులనే మునులలో నారాయణుడు అనుకొనాలి. ఇది మానవులలో రుచి పుట్టటానికి దోహదం చేస్తుంది. పూరునృప కులభూషణ! పూతచరిత్ర! - అనే రెండు సంబోధనలు సాభిప్రాయాలు. పూరుడు స్వార్థం ఏ మాత్రమూ లేకుండా తండ్రికి యౌవనం ఇచ్చి అతడి ముదిమిని గొన్నవాడు - ఆ విధంగా వంశకర్త అయినవాడు. నీవు కూడా అటువంటి వాడవు కనుక సత్కార్యాచరణ నీవు తప్పక చేయగలవాడవే - అనే భావం ఇందులో స్ఫురిస్తుంది. గోవులందు అతిభక్తి కలుగుము - ఈ క్రియా ప్రయోగం ఇప్పుడు వ్యవహారంలో కనబడదు. తంత్రంబు పఠనవిధి - తంత్రంయొక్క పఠనవిధి అని షష్ఠీ తత్పురుషం.

**క. అనిన విని 'యట్ల చేసెద । ననఘా! గోమహిమ యిట్టు లాకర్ణింపం**
**గనియును దనివి సనదు నా । మన; మింకను జెప్పు నీ విమల వాక్యములన్.' 88**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆకర్ణించి (ధర్మరాజు); అనఘా!= పుణ్యాత్ముడా!; అట్లు+అ= అట్లాగే; చేసెదన్= చేస్తాను; గోమహిమ= ఆవుల గొప్పతనం; ఇట్టులు= ఈ విధంగా; ఆకర్ణింపన్ కనియును= వినగలిగి కూడా; నా మనము= నా హృదయం; తనివి+చనదు= తృప్తిపొందదు; నీ విమల వాక్యములన్= స్వచ్ఛమైన నీ మాటలతో; ఇంకను= ఇంకా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** భీష్ము డట్లా చెప్పిన దానిని విని ధర్మరాజు 'పుణ్యాత్మా! గోవుల మహిమ ఈ విధంగా వినగలిగినా ఇంకా నా మనస్సు తృప్తి పొందలేదు. స్వచ్ఛమైన నీ మాటలతో మరింతగా నాకు దయతో చెప్పుము' (అని ప్రార్థించాడు)

**విశేషం:** అనఘా! అన్న సంబోధనా, నీ విమలవాక్యములన్' అన్నమాటా ధర్మరాజు జిజ్ఞాస ఎంత ఘనమైనదో అభివ్యక్తం చేస్తున్నాయి.

**క. అని ధర్మతనయుఁ డడిగిన । ననయంబుఁ బ్రియంబుఁ బొంది యమరనదీనం**
**దనుఁ డిట్లను 'సత్యవతీ । తనయుని వాక్యములు సెప్పెదను వినుము నృపా! 89**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; ధర్మతనయుఁడు= ధర్మరాజు; అడిగినన్= అడుగగా; అమరనదీ నందనుఁడు= దేవనది అయిన గంగ కొడుకు భీష్ముడు; అనయంబున్= మిక్కిలి ఎక్కువగా; ప్రియంబున్= ప్రీతిని; పొంది; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; నృపా!= రాజా!; సత్యవతీ తనయుని వాక్యములు= సత్యవతి కుమారుడైన వ్యాసుడి పలుకులు; చెప్పెదను= చెప్పుతాను; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు అడుగగా భీష్ముడు పట్టరాని సంతోషం పొంది ఇట్లా అన్నాడు. 'నాయనా! వ్యాసుడి మాటలు చెప్పుతాను వినుము.

**విశేషం:** అమరనదీనందనుడు; సత్యవతీనందనుడు అనే పదాలు ఆ ఇరువురి ఆజన్మ శుద్ధతను తెలియజేస్తాయి.

**ఆ. గోవిశేష మర్థి నీవు నన్నడిగిన । యట్ల శుకుఁడు దండ్రి నడిగె; దాని**
**కాత్మఁ బ్రియముఁ బొంది యా మహాసంయమి । యా సుబుద్ధి కిట్టు లనియె నధిప! 90**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నీవు; అర్థిన్= కోరికతో; గో విశేషము= ఆవుల గొప్పతనాన్ని గురించి; నన్నున్= నన్ను; అడిగిన+ అట్లు+అ= అడిగిన విధంగానే; శుకుఁడు= శుకమహర్షి; తండ్రిన్= తండ్రి అయిన వ్యాసుడిని; అడిగెన్= అడిగాడు; దానికిన్= అట్లా అడిగిన దానికి; ఆత్మన్= హృదయంలో; ప్రియమున్= ప్రీతిని; పొంది; ఆ మహాసంయమి= ఆ గొప్ప నిగ్రహవంతుడు; ఆ సుబుద్ధికిన్= మంచిబుద్ధిగల ఆ శుకునకు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** రాజా! నీవు కోరికతో గోవుల గొప్పతనాన్ని గూర్చి నన్నడిగినట్లే శుకుడు తన తండ్రి నడిగాడు. దానికాయన ఎంతో ప్రీతి పొంది ఆ మహర్షి ఆ సుబుద్ధికి ఇట్లా చెప్పాడు.

**విశేషం:** మహాసంయమి అనటంవలన అతడు చెప్పే విషయం యొక్క ప్రామాణ్యం స్ఫురిస్తుంది. సుబుద్ధికి అనటంచేత సుబుద్ధులు మాత్రమే చెప్పిన దానిని సార్థకం చేస్తారు అన్నభావం తెలియవస్తున్నది.

సీ. స్థావర జంగమాత్మకమైన భూత జా । లంబు సుస్థితి గోగణంబు నాశ్ర
యమునన తత్సంభవమును గోవులయంద; । యవి మూల సంతాన మజున; కట్లుఁ
గాక సిద్ధుల సాధ్యగణముల మాత లి । ట్లగుట యెఱింగిన యతఁడు బ్రహ్మ
లోక గోలోకాది లోకాంతరములకుఁ । దనయింటి కరుగు చందమున నరుగుఁ

తే. బరమగతిఁ గోరువారలు పాదముష్టి । యష్టి వాక్చిత్తముల గోవు నభిభవింప
కుండ వలయు నివ్విద్యఁ బద్మోద్భవుండు । సెప్పె నది యాత్మపావన శిష్ట సేవ్య. 91

**ప్రతిపదార్థం:** స్థావర జంగమ+ఆత్మకము= కదలనివి, కదిలేవి అన్న సుస్థితి గలది; ఐన= అయిన; భూతజాలంబు సుస్థితి= వస్తువుల ప్రాణుల యొక్క సముదాయపు చక్కని స్థితి; గోగణంబు+ఆశ్రయంబునన= గోవుల సముదాయం యొక్క ఆధారం మీదనే; తత్ సంభవంబును= వాని పుట్టుకకూడా; గోవులయందు+అ= ఆవులయందే; అవి= ఆ ఆవులు; అజునకున్= బ్రహ్మకు; మూలసంతానము= మొదటి బిడ్డలు; అట్లున్ కాక= అంతేకాక; సిద్ధుల సాధ్యగణముల మాతలు= ఆవులు సిద్ధులు సాధ్యుల సముదాయాలు అనే దేవజాతి వారి తల్లులు; ఇట్లు= ఈ విధంగా; అగుట= అవటం; ఎఱింగిన+అతఁడు= తెలిసికొన్నవాడు; బ్రహ్మలోక గోలోక+ఆది లోక+అంతరములకున్= బ్రహ్మలోకమూ, గోవుల లోకమూ మొదలైన ఇతరలోకాలకు; తన ఇంటికిన్= సొంత ఇంటికి; అరుగుచందమునన్= వెళ్ళేవిధంగా; అరుగున్= వెళ్ళుతాడు; పరమగతిన్= మిక్కిలి ఉత్తమమైన లక్ష్యాన్ని; కోరువారలు= కోరే మనుష్యులు; గోవును= ఆవును; పాద ముష్టి యష్టి వాక్ చిత్తములన్= కాలితో; పిడికిలితో, కర్రతో, మాటతో, మనస్సుతో; అభిభవింపక= తిరస్కరించక; ఉండవలయున్= ఉండాలి; ఈ+విద్యన్= ఈ విద్యను; పద్మ+ఉద్భవుండు= బ్రహ్మ; చెప్పెన్= ఉపదేశించాడు; అది= ఆ విద్య; ఆత్మపావన= ఆత్మను పవిత్రం చేసేది; శిష్ట సేవ్య= ఉత్తమ ప్రవృత్తి కలవారికి సేవించదగింది.

**తాత్పర్యం:** నాయనా! సృష్టిలో ఉన్న కదలని పదార్థాలు, కదిలే ప్రాణులు అనే అన్నింటి చక్కని స్థితీ గోవులను ఆశ్రయించినందువలననే కలుగుతున్నది. వాటి పుట్టుకకూడా వాటివలననే ఏర్పడుతున్నది. ఆవులు బ్రహ్మకు తొలిబిడ్డలు. అంతే కాదు; సిద్ధులు, సాధ్యులు మొదలైన దేవయోనిగణాలకు కూడా ఆవులు తల్లులు. ఈ విషయం తెలిసినవాడు బ్రహ్మలోకం, గోలోకం మొదలైన లోకాలకు సొంత ఇంటికి వెళ్ళినట్లు వెళ్ళుతాడు. అత్యుత్తమగతిని కోరేవారు కాలితో, పిడికిలితో, కర్రతో, మాటతో, మనస్సుతో ఆవును తిరస్కరించరాదు. ఇది బ్రహ్మ చెప్పిన విద్య. ఆత్మను పవిత్రం చేసేది, ఉత్తములు సేవించవలసినది.

**విశేషం:** 'తన ఇంటి కరుగుచందమున' - అంటే సర్వ స్వతంత్రతా భావంతో అని భావం. ఇది ఒక మంచి జాతీయం. పాదముష్టి - వీటివలన గోవును ఏ విధంగానూ హింసింపరాదని సూచన. 'పద్మోద్భవుండు చెప్పెన్' - అంటే ఇది తిరుగులేని శాసనం. దీనిని ధిక్కరించినవాడు దిక్కులేని వాడవుతా డని తాత్పర్యం. ఆత్మపావన, శిష్టసేవ్య అనేవి 'విద్య' అనే స్త్రీలింగ శబ్దానికి విశేషణాలు కావున స్త్రీ లింగరూపాలు.

క. పావనమని శ్రుతి సెప్పిన । యే వస్తువు నాశ్రయించి యెక్కుడయిరి భూ
తావలులకు సుర లట్టిది । గోవు; తదీయ మగు మహిమకున్ గుఱిగలదే? 92

**ప్రతిపదార్థం:** పావనము= పవిత్రం; అని; శ్రుతి= వేదం; చెప్పిన ఏ వస్తువున్= చెప్పిన ఏ వస్తువును; ఆశ్రయించి= ఆధారం చేసికొని; సురలు= దేవతలు; భూత+ఆవలులకున్= ప్రాణుల సముదాయాలకు; ఎక్కుడు= అధికులు; అయిరి=అయ్యారో;

అట్టి+అది= ఆ విధమైనది; గోవు=ఆవు; తదీయము= దానిది; అగు= అయిన; మహిమకున్= గొప్పతనానికి; గుఱి= హద్దు; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** వేదం పవిత్రమని చెప్పి గోవు నాశ్రయించి దేవతలు తక్కిన అన్ని ప్రాణికోటులకంటె గొప్పవారయ్యారు. కాబట్టి గోవుల మహిమకు హద్దు ఉన్నదా?

**క. వీణా కాహళ వేణు । క్వాణ ప్రతిమములు ధేనువర్గధ్వను ల**

**క్షీణ సుకృతంబు నిర్మల । వాణి తదాకర్ణనంబు వర్ణన విధమున్. 93**

**ప్రతిపదార్థం:** ధేనువర్గధ్వనులు= ఆవుల జాతుల నాదాలు; వీణా కాహళ వేణు క్వాణ ప్రతిమములు= వీణ, బూర పిల్లనగ్రోవి, అనేవాటి నాదాలకు సాటి వచ్చేవి; నిర్మలవాణి= ఆవుల నిర్మలమైన నాదం; తత్+ఆకర్ణనంబు= దానిని వినటమూ; వర్ణ నవిధమున్= వర్ణించటమూ; అక్షీణ సుకృతంబు= తరగని పుణ్యం.

**తాత్పర్యం:** ఆవుల కంఠనాదాలు వీణా, కాహళ, వేణు నాదాల వంటివి. ఆ ధ్వని అతి స్వచ్ఛమైనది. దానిని వినటమూ, చెప్పుకొనటమూ తరగని పుణ్యాన్ని ఇస్తాయి.

**విశేషం:** కాహళ= నాలుగు అయిదు లోహపు గొట్టాలు ఒకదానితో ఒకటి బిగించి ఏర్పాటు చేసికొనటానికి వీలుగా ఉండే ఒక వాద్యం.

**క. క్షీరము దధియును ఘృతము సు । ధా రూపము లగుట దేవతా ప్రీణన య**

**జ్ఞారంభంబులు విమలా । చారా! గో దోహ నైక సాధ్యము లయ్యెన్. 94**

**ప్రతిపదార్థం:** విమల+ఆచారా!= మాలిన్యంలేని ప్రవర్తన కలవాడా!; క్షీరము= పాలు; దధియును= పెరుగును; ఘృతము= నేయియు; సుధా రూపములు= అమృతం రూపాలు; అగుటన్= కావటంవలన; దేవతా ప్రీణన యజ్ఞ+ఆరంభంబులు= దేవతలను ప్రీతిపరచే యజ్ఞాలు అనే కార్యాలు; గో దోహన+ఏక సాధ్యములు= ఆవుల పాలు అనే ఒక్కదానిచేతనే సాధించదగినవి; అయ్యెన్= అయ్యాయి.

**తాత్పర్యం:** విమలాచారా! పాలు పెరుగు నెయ్యి అమృతస్వరూపాలు కనుక దేవతలను తృప్తిపరచే యజ్ఞ కార్యాలు ఆవుల పాలవలన మాత్రమే సాధ్యాలవుతున్నాయి.

**విశేషం:** విమలాచారా! అనే సంబోధన తాను పెక్కు మంచి విషయాలు యోగ్యతను తెలియజేస్తున్నాయన్న స్ఫూర్తిని కలిగిస్తుంది.

**ఆ. శ్రుతులు నౌపనిషద సూక్తులు గో స్వరూ । పంబు లని సరోజభవుఁడు సెప్పె**

**ధర్మపరత పరమతపము మహాధ్వర । మనఁగఁ బరఁగు గో సమర్చనంబు. 95**

**ప్రతిపదార్థం:** సరోజభవుఁడు= పద్మంలో పుట్టిన బ్రహ్మ; శ్రుతులును= వేదాలు; ఔపనిషద సూక్తులు= ఉపనిషత్తులకు సంబంధించిన మంచి మాటలు; గో స్వరూపంబులు= గోవుల స్వరూపాలు; అని; చెప్పెన్= చెప్పాడు; గో సమర్చనంబు= ఆవులను భక్తితో పూజించటం; ధర్మపరత= ధర్మమే తుది మెట్టు కావటం; పరమతపము= గొప్పతపస్సు; మహా+అధ్వరము= గొప్ప యజ్ఞం; అనఁగన్= అనటానికి; పరఁగున్= ఒప్పును.

**తాత్పర్యం:** వేదాలూ, జ్ఞాన విషయాలైన ఉపనిషత్తులూ గో స్వరూపాలే అని బ్రహ్మ చెప్పాడు. ఆవులను భక్తితో పూజించటం ధర్మం తుది మెట్టు, గొప్పతపస్సు, మహిమగల యజ్ఞం అనటానికి ఒప్పుతుంది.

**విశేషం:** శ్రుతులు - వేదాలు నాలుగు భాగాలుగా ఉన్నాయి. అందులో సంహిత, బ్రాహ్మణం, ఆరణ్యకం అనేవి ఒక విభాగంగా, ఉపనిషత్తులు ఒక విభాగంగా చెప్తుతారు. మొదటి విభాగానికి కర్మకాండ అనీ, చివరిదానికి జ్ఞానకాండ అనీ పేరు. బ్రహ్మ చెప్పాడు కనుక తప్పక విశ్వసించాలి అని భావం.

**క. ఈ వాక్యంబులు భూదే । వావలి సన్నిధిఁ బఠించు నాతఁడు పుణ్యుం**
**డై వెలయు; విన్నవారలు । పావనగుణ! తత్క్షణంబ పాతు రఘములన్. 96**

**ప్రతిపదార్థం:** పావనగుణ!= పవిత్రగుణాలుగల శుకా!; ఈ వాక్యంబులు= ఈ మాటలను; భూదేవ+ఆవలి సన్నిధిన్= బ్రాహ్మణుల సముదాయం దగ్గర; పఠించు+ఆతఁడు= శ్రద్ధతో చదివేవాడు; పుణ్యుండు+ఐ= పుణ్యంకలవాడై; వెలయున్= ఒప్పుతాడు; విన్నవారలు= విన్న మనుష్యులు; తత్ క్షణంబు+అ= అప్పటికప్పుడు; అఘములన్= పాపాలను; పాతురు= పోగొట్టుకొంటారు.

**తాత్పర్యం:** పావనగుణా! ఈ వాక్యాలు బ్రాహ్మణుల సమీపంలో చదివేవాడు పుణ్యమూర్తి అవుతాడు. విన్నవారు అప్పటి కప్పుడు పాపవిముక్తి పొందుతారు.

**తే. గో ఘృతంబు ప్రాశించియు గోకరీష । సువిహిత స్నానుఁ డయ్యు భూదివిజుఁ డధిక**
**భక్తి నిత్యంబు గోమతీపఠన మాచ । రించియును గల్మషముల నిర్జించు ననఘ! 97**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; భూదివిజుఁడు= బ్రాహ్మణుడు; గో ఘృతంబు= ఆవు నేయి; ప్రాశించియున్= లోపలికి పుచ్చుకొనీ; గోకరీష సువిహిత స్నానుఁడు= ఆవుపేడ కలిసిన నీళ్ళతో చక్కగా చేయబడిన స్నానం కలవాడు; అయ్యున్= అయినప్పటికీ; అధికభక్తిన్= ఎక్కువ భక్తితో; నిత్యంబు= ప్రతిదినము; గోమతీపఠనము= గోమతీమంత్రాన్ని చదవటం; ఆచరించియును= చేసినీ; కల్మషములన్= పాపాలను; నిర్జించున్= పూర్తిగా గెలుస్తాడు (త్రోసి వేస్తాడు).

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఆవు నెయ్యి లోపలికి పుచ్చుకొనీ, ఆవుపేడ కలిసిన నీళ్ళతో స్నానంచేసీ, మహాభక్తితో ప్రతిదినమూ గోమతీ పఠనం గావించే బ్రాహ్మణుడు పాపాలన్నింటినీ త్రోసి పారవేస్తాడు.

**విశేషం:** గో ఘృతం తాగడం వగైరా కాయిక నిష్ఠ. 'భక్తి' మానసనిష్ఠ. గోమతీ పఠనం వాచికనిష్ఠ. ఇట్లా మూడు నిష్ఠలూ కలవటమే త్రికరణశుద్ధి. అది తప్పక సత్ఫలితాన్ని సాధిస్తుంది.

**చ. అనిమిషులున్ మహామునులు నయ్యయి పెంపులు గోమతిం బఠిం**
**చిన సుకృతంబునం గనిరి శ్రీయును శత్రుజయంబుఁ బేర్మియుం**
**దనయ సమృద్ధియుం గలుగుఁ దత్పఠనంబున బంధుకోటి బం**
**ధనమునఁ బాయు; మార్గమునఁ దప్పు మృగార్తియుఁ జోరబాధయున్.' 98**

**ప్రతిపదార్థం:** అనిమిషులున్= దేవతలూ; మహామునులు= గొప్ప మునులూ; ఆ+అయి పెంపులు= ఆయా మహిమలు; గోమతిన్= గోమతిని; పఠించిన సుకృతంబునన్= పారాయణం చేసిన పుణ్యంవలన; కనిరి= పొందారు; తత్ పఠనంబునన్= దాన్ని చదవటంవలన; శ్రీయును= సంపదా; శత్రుజయంబున్= పగవారి మీద గెలుపూ; పేర్మియున్= పెద్దతనమూ; తనయ సమృద్ధియున్= బిడ్డలసంపదా; కలుగున్= కలుగుతుంది; బంధుకోటి= పఠించినవారి చుట్టాల సముదాయంకూడా; బంధనమునన్= బంధాలనుండి; పాయున్= విడివడుతుంది; మార్గమునన్= దారిలో; మృగ+ఆర్తియున్= క్రూరజంతువుల పీడా; చోర బాధయున్= దొంగలబాధా; తప్పున్= కలగకుండా ఉంటుంది.

**తాత్పర్యం:** దేవతలు, మహామునులు గోమతిని పఠించిన పుణ్యం వలననే ఆయా గొప్ప స్థితులను పొందారు. దానిని పఠించటంవలన సంపదా, పగవారిని గెలవటం, అభివృద్ధీ, పుత్రులు ఎక్కువగా కలగటం సిద్ధిస్తాయి. వారి చుట్టాలకు కూడా బంధాలు నశిస్తాయి. ప్రయాణాలలో క్రూరమృగాల బాధా, దొంగలబాధా తప్పిపోతాయి.'

**విశేషం:** చదివినవాడు తనవారికి కూడా మేలు కూర్చగల సామర్థ్యం పొందటం ఇక్కడ గొప్ప విశేషం.

**వ. అనిన విని యమ్మునిపతికి శుకుం డిట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ఆ+మునిపతికిన్= మునులలో గొప్పవాడైన ఆ వ్యాసుడికి; శుకుండు= కొడుకైన శుకమహర్షి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా వ్యాసుడితో శుకు డిట్లా అన్నాడు.

### వేదవ్యాసముని శుకునకుఁ జెప్పిన కపిల గో మహానుభావము (సం.13-126-2 (కుంభ))

**క. తమజాతికిఁ దగుకర్మ । క్షమతలు లేకున్న యట్టి జనములు కపిలా**
**సమధిక పూజన తద్దా । నము లొనరింతు; రవి వాచు నా దురితంబుల్. 100**

**ప్రతిపదార్థం:** తమజాతికిన్= తమ పుట్టుకకు; తగు= తగిన; కర్మక్షమతలు= కర్మం చేసే యోగ్యతలు; లేక+ఉన్న+అట్టి జనములు= లేనట్టి మానవులు; కపిలా సమధిక పూజన తత్+దానములు= పుల్లావుల గొప్ప పూజలూ; వాటి దానాలు; ఒనరింతురు= చేస్తారు; అవి= ఆ పూజలు, దానాలు; ఆ దురితంబుల్= ఆ పాపాలను; పాచునా= పోగొట్టుతాయా?

**తాత్పర్యం:** తాము పుట్టిన జాతికి తగిన కర్మల యోగ్యతలు లేని మానవులు కపిల గోవులను మిక్కిలిగా పూజిస్తారు. దానం చేస్తారు. అవి వారి పాపాల నన్నింటినీ పోగొట్టుతాయా?

**సీ. అనుటయు 'సందియం బది యేల?' కపిలఁ బూ । జించినఁ, బ్రీతి నిచ్చినను జెడని**
**యఘములు గల్గునే?' యనియెఁ బరాశర । తనయుఁ డవ్వాక్యంబు విని తదీయ**
**తనయుండు గపిల కంతటి పెంపురాఁ గతం । బేమి?' నావుడు నమ్మునీశ్వరుండు**
**విను మని యిట్లను 'ననిమిష సంఘంబు । నొక కారణమునఁ బావకుఁడు మొఱఁగి**

**తే. యరిగి తనదుగుప్తి యర్థించి గోవుల । నాశ్రయించె నవియు నగ్ని గోప**
**నంబు సేసె నవ్విధంబున శిఖియున్కి । సుర లెఱింగి రెల్లచోటు నరసి. 101**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని శుకు డనగా; పరాశర తనయుఁడు= పరాశరుడి కొడుకు వ్యాసుడు; సందియంబు= సందేహం; అది+ఏల?= ఎందుకు? కపిలన్= పుల్లావును; పూజించినన్= పూజించినా; ప్రీతిన్= ప్రేమతో; ఇచ్చినను= దానమిచ్చినా; చెడని+అఘములు= నాశనం కాని పాపాలు; కల్గునే?= ఉంటాయా?; అనియెన్= అన్నాడు; ఆ+వాక్యంబున్= ఆ మాటను; విని; తదీయ తనయుండు= ఆవ్యాస మునీంద్రుని పుత్రుడైన శుకుడు; కపిలకున్= కపిల గోవునకు; అంతటి పెంపు= అంతటి గొప్పతనం; రాన్= రావటానికి; కతంబు= కారణం; ఏమి?= ఏమిటి?; నావుడున్= అనగా; ఆ+ముని+ ఈశ్వరుండు= మునులలో శ్రేష్ఠుడైన ఆ వ్యాసుడు; వినుము; అని; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; పావకుఁడు= అగ్నిదేవుడు; ఒక కారణమునన్= ఒక కారణంగా; అనిమిష సంఘంబున్= దేవతల సంఘాన్ని; మొఱఁగి= కనుగప్పి; అరిగి= వెడలి; తనదుగుప్తి= తన్ను దాచటాన్ని; అర్థించి=కోరి; గోవులన్=ఆవులను; ఆశ్రయించెన్= చేరుకొన్నాడు; అవియున్= ఆ ఆవులున్నూ; అగ్నిన్= అగ్నిని; గోపనంబు+చేసెన్= దాచాయి; సురలు= దేవతలు; ఎల్లచోటున్= అన్ని తావులందునూ; అరసి= వెదకి; శిఖి= అగ్ని; ఆ+విధంబునన్= ఆ విధంగా; ఉన్కి= ఉండటం; ఎఱింగిరి= తెలిసికొన్నారు.

**తాత్పర్యం:** కుమారు డిట్లా పలుకగా వ్యాసుడు 'నాయనా! నీకు సందేహ మెందుకు? కపిలను పూజించినా దానమిచ్చినా పోనిపాపాలు ఉంటాయా?' అన్నాడు. అప్పుడు శుకుడు తండ్రి మాటలు విని పుల్లావుకు అంతటి మహిమ రావటానికి కారణం ఏమిటి?' అని అడిగాడు. అప్పు డా మునిశ్రేష్ఠుడు వినుము. పూర్వం అగ్నిదేవు డొక కారణంగా దేవతల కన్నుగప్పి తనను దాచుమని గోవుల నాశ్రయించాడు. అవి దాచాయి. దేవతలు అన్నితావులూ వెదకి అగ్ని ఆ విధంగా ఉన్న సంగతి తెలిసికొన్నారు.

**విశేషం:** శిఖి - శిఖలంటే జ్వాలలు, అవి కలవాడు అగ్ని. నిమిషం అంటే రెప్పపాటు. అది లేనివారు అనిమిషులు= దేవతలు.

**వ. ఎఱింగి కూడుకొని గోవులకడకు వచ్చి వానితో 'నగ్ని దాఁచుట యఖిలజగజ్జనంబులకు నహితంబు సేయుట గాదె! చూపకుండుట దగ' దని పలుకుటయుఁ, బుయిలోడి గోవు లప్పావకుం జూపిన, నాసుపర్వులు సంతోషించి వానికి వరం బీవలయునని యవ్వాయు సఖుం బ్రార్థించిన నతండు నగ్గోవుల యందు డాఁగి యుండ నవి కపిలచ్ఛాయం బ్రాపించి యునికిం గనుంగొని గోవుల కెల్లను కపిల యెక్కుడగుటయుం, దదీయారాధనంబునుం దద్దానంబునుం బుణ్యతమంబులై దురితంబుల దమియించి యుత్తమలోకంబుల నిచ్చుటయు వరంబులుగా నిచ్చెనని చెప్పి వెండియు. 102**

**ప్రతిపదార్థం:** ఎఱింగి= తెలిసికొని; కూడుకొని= గుంపులుగా అయి; గోవులకడకున్= ఆవుల దగ్గరకు; వచ్చి; వానితోన్= ఆ ఆవులతో; అగ్నిన్= అగ్నిని; దాఁచుట= కనపడకుండా ఉంచటం; అఖిల జగత్+జనంబులకున్= సమస్తమైన లోకపుజనాలకు; అహితంబు= కీడు; చేయుట+కాదె!= చేయటం కదా!; చూపక+ఉండుట= కనిపింపచేయకుండటం; తగదు= కూడదు; అని; పలుకుటయున్= పలుకగా; గోవులు= ఆవులు; పుయిలోడి= సంకోచించి; ఆ+పావకున్= ఆ అగ్నిదేవుడిని; చూపినన్= చూపగా; ఆ సుపర్వులు= ఆ దేవతలు; సంతోషించి= ఆనందించి; వానికిన్= ఆవులకు; వరంబు= వరం; ఈవలయును= ఇవ్వాలి; అని; ఆ+వాయుసఖున్= వాయువునకు చెలి అయిన అగ్నిదేవుడిని; ప్రార్థించినన్= వేడుకొనగా; అతండు= ఆ అగ్ని; తాను; ఆ+గోవులయందున్= గోవులమధ్య; డాఁగి= దాగి; ఉండన్=ఉండగా; అవి= ఆ ఆవులు; కపిల+ఛాయన్= గోరోచనపు రంగును; ప్రాపించి= పొంది; ఉనికిన్= ఉండటాన్ని; కనుంగొని= చూచి; గోవులకున్+ఎల్లను= అన్నిగోవులకంటె; కపిల= పుల్లావు; ఎక్కుడు= మిన్న; అగుటయున్= కావటాన్నీ; తదీయ+ఆరాధనంబునున్= అట్టి ఆవును పూజించటమూ; తత్+ దానంబున్= దానిని దానమివ్వటమూ; పుణ్యతమంబులు+ఐ= గొప్ప పుణ్యాలై; దురితంబులన్= పాపాలను; దమియించి=

అణగగొట్టి; ఉత్తమ లోకంబులన్= పుణ్యలోకాలను; ఇచ్చుటయున్= ఇవ్వటమూ; వరంబులుగాన్=వరాలుగా; ఇచ్చెన్= ఇచ్చాడు; అని; చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** దేవతలు తెలిసికొని గోవుల దగ్గరకు వచ్చి వాటితో 'అగ్నిని దాచటం వలన అన్ని లోకాల జనానికీ కీడు చేయటం కదా! చూపకుండటం తగదు' అని అంటే గోవులు చిన్నబుచ్చుకొని అగ్నిని చూపాయి. దేవతలు సంతోషించి ఆవులకు వరమివ్వాలని అగ్నిని ప్రార్థించగా అతడు ఆ గోవులలో దాగి ఉన్నప్పుడు అవి కపిలవర్ణం పొందటం చూచి 'గోవులన్నింటిలో కపిల మిన్న' అనీ, 'దానిని పూజించటం, దానమివ్వటం గొప్ప పుణ్యకార్యాలై పాపాలను అణగగొట్టి ఉత్తమలోకాలను పొందజేస్తా'యనీ వరాలుగా ఇచ్చాడు అని చెప్పి; ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'పుయిలోడటం' అంటే చేసిన తప్పు గురించి సిగ్గుపడటం అని ఇచ్చట అర్థం.

ఈ సందర్భంలో అగ్ని అనటానికి శిఖి పావకుడు వాయుసఖుడు అనే పదాలు వాడటం గమనించాలి. ఇవన్నీ పవిత్రార్థకాలు. కాబట్టే అగ్ని వరమివ్వగలిగాడని కవి హృదయం.

**తే. కపిల యిచ్చిన వానిన కాదు నిజమ । కొన్నవానిని బుణ్యాత్మకుఁడుగఁ జేయు;**

**నీవుఁ గపిలా సమర్చనా నిరత మాన । సుండ వగు టెంతయును మేలు సువ్రతాత్మ!' 103**

**ప్రతిపదార్థం:** కపిల= పుల్లావు; ఇచ్చినవానిన్+అ= ఇచ్చినవాడినే; కాదు; నిజము+అ= సందియంలేని నిజం; కొన్నవానిని= దానం పుచ్చుకొన్నవాడిని కూడా; పుణ్య+ఆత్మకుఁడుగన్+చేయున్= పుణ్యంగల హృదయం కలవాడిని చేస్తుంది; సువ్రత+ఆత్మ!= మంచి నిష్ఠగల హృదయంగలవాడా!; నీవున్= నీవు కూడా; కపిలా సమర్చనా నిరత మానసుండవు= పుల్లావు పూజలోమిక్కిలి ఆసక్తిగల మనస్సు కల వాడవు; అగుట= కావటం; ఎంతయున్= ఎంతైనా; మేలు= మంచిది.

**తాత్పర్యం:** కపిలగోవు దానమిచ్చిన వాడినే కాదు. పుచ్చుకొన్నవాడిని కూడా పుణ్యాత్ముడిని చేస్తుంది. మంచి నియమ నిష్ఠలుగల కుమారా! నీవు కూడా కపిల గోవులను ఆసక్తితో పూజించే హృదయం కలవాడవు కావటం మేలు.'

**విశేషం:** కొన్ని దానాలు పుచ్చుకొన్నవాడు ఇచ్చినవారి పాపాలను కూడా గ్రహించవలసి వస్తుంది. అందుకే తిలదానం మొదలైనవి కొందరు స్వీకరింపరు. ఇక్కడ అటువంటిది లేకపోగా కపిలగోవును పుచ్చుకొన్నవాడు కూడా పుణ్యాత్మకుడు కావటంవలన దాని మహిమ మరింత గొప్పదిగా నిరూపణకు వచ్చింది.

**వ. అని చెప్పుటయు నప్పరమమునీశ్వరుతో నమ్ముని కుమార వరుండు 'కపిలా లక్షణం బెఱింగింపవే' యనిన నతం డతని కిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** అని= అట్లు; చెప్పుటయున్= చెప్పగా; ఆ+పరమ ముని+ఈశ్వరుతోన్= ఆ మహర్షి శ్రేష్ఠుడితో; ఆ+ ముని కుమార వరుండు= ముని కుమారులలో మిన్న అయిన శుకుడు; కపిలా లక్షణంబు= కపిల తీరును; ఎఱింగింపవే= తెలియజేయుమా!; అనినన్= అంటే; అతండు= ఆ వ్యాసుడు; అతనికిన్= ఆ శుకునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసు డిట్లా చెప్పితే; ఆ మునిశ్రేష్ఠుడితో ఆ కుమారశ్రేష్ఠుడు 'నాయనా! కపిల లక్షణం నాకు దయతో తెలియజెప్పుము' అని అడిగాడు. అప్పు డత డతడితో ఇట్లా అన్నాడు.

**తే. కర్ణ శృంగాక్షి ఖుర నాసికా పుటములు । గపిలములు, గుత్తుకయును ముష్కములు గవిల**
**పట్టు లొందు నెందే నొకపట్టు కపిల । మైనఁ గపిలాత్వ గుణమున కదియ చాలు. 105**

**ప్రతిపదార్థం:** కర్ణ= చెవులు; శృంగ= కొమ్ములు; అక్షి= కన్నులు; ఖుర= గిట్టలు; నాసికాపుటములు= ముక్కుల లోపలిభాగాలు; కపిలములు= గోరోచనం రంగు కలవి; కుత్తుకయును= మెడా; ముష్కములు= అండాలు; కవిలపట్టులు= కపిలవర్ణం స్థానాలు; ఒందును= ఒప్పుతాయి; ఎందేన్= ఎక్కడైనా; ఒకపట్టు= ఒక్కచోటు; కపిలము= గోరోచనం రంగు; ఐనన్= అయినా; కపిలాత్వ గుణమునకున్= కపిల అయ్యే స్థితికి; అది+అ= అదే; చాలున్= చాలును.

**తాత్పర్యం:** చెవులు, కొమ్ములు, కన్నులు, గిట్టలు, ముక్కులు, మెడ, అండాలు కపిలవర్ణంలో ఉండాలి. వీటిలో ఏ ఒక్కచోటున ఆ రంగు ఉన్నా 'కపిల' అవటానికి అదే చాలు.

**విశేషం:** ముష్క శబ్దం చేత ఇక్కడ కపిలవర్ణం గల ఎద్దును సంభావించటం సముచితం.

**క. మేనెల్లఁ గపిల మైనను । దానిం జెప్పంగ నేల? తగదు కపిలలన్**
**మానితగుణ! పిదికి కుడువఁ । గా నే బలికైనఁ గాక కట్టఁ బెటికకున్. 106**

**ప్రతిపదార్థం:** మేను= దేహం; ఎల్లన్= అంతా; కపిలము= గోరోచనం రంగు; ఐనను= అయితే; చెప్పంగన్+ఏల?=(దాని గొప్పను గూర్చి) చెప్పనేల?; మానితగుణ!= మన్నన పొందిన గుణాలు కలవాడా!; కపిలలన్= పుల్లావులను; పిదికి= పాలు పిండి; కుడువఁగాన్= త్రాగటం; తగదు= కూడదు; ఏ బలికిన్= ఏ విధమైన బలికి; ఐనన్= అయినా; తగదు= కూడదు; కాక= మరియును; పెటికకున్= బరువునకు; కట్టన్= కట్టటం; తగదు= కూడదు.

**తాత్పర్యం:** ఇక ఒడలంతా కపిలవర్ణమే అయితే దాని మహిమను గూర్చి చెప్పటమెందుకు? గుణవంతుడా? కపిలలను పాలుపిండి త్రావరాదు. ఏ బలికీ ఉపయోగించరాదు. బరువులు వానిమీద వేసి కట్టరాదు.

**విశేషం:** పెటిక అంటే ఎద్దుల నడ్డిమీద అటూ ఇటూ బరువుతో నింపిన గోనె మూట. కపిల పూజించదగినది కనుక పాలుతీయటం వంటి సాధారణ కార్యాలు చేస్తే దాని నవమానించటం అవుతుందని తాత్పర్యం.

**ఆ. కాలఁ గేలఁ గోలఁ గపిల దండించిన । నరకవాసమునకు నరుగవలయుఁ,**
**బూరి నీరు లెస్స యారసి యగ్గోవు । సత్కరింప సుగతి సంభవించు. 107**

**ప్రతిపదార్థం:** కాలన్= కాలితో; కేలన్= చేతితో; కోలన్= కర్రతో; కపిలన్= పుల్లావును; దండించినన్= కొడితే; నరకవాసమునకున్= నరకలోకంలో ఉండటానికి; అరుగన్+వలయున్= వెళ్ళవలసి వస్తుంది; పూరి= గడ్డి; నీరు= నీళ్ళు; లెస్స= బాగుగా; ఆరసి= చూచుకొని; ఆ+గోవున్= ఆ ఆవును; సత్కరింపన్= మన్నిస్తే; సుగతి= మంచిగతి; సంభవించున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** కపిలగోవును కాలితో చేతితో కర్రతో కొడితే నరకానికి వెళ్ళవలసి వస్తుంది. మంచిమేతా, నీరూ తగిన సమయాలలో చూచుకొంటూ మన్ననతో కాపాడితే స్వర్గం లభిస్తుంది.

**క. అనఘ! కపిలా ప్రదానం । బునకు ఫలం బిట్టి దనఁగబోలునె! కమలా**
**సనుఁడు మహానంద ప్రదమని వెఱచుచుఁ జెప్పె, దాని నట యే మందున్?' 108**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; కపిలా ప్రదానంబునకున్= కపిలను గొప్పగా దానమివ్వటానికి; ఫలంబు= ఫలం; ఇట్టిది= ఇంత మాత్రమైనది; అనఁగన్ పోలునె?= అనవచ్చునా?; కమల+ఆసనుఁడు= పద్మం కూర్చునే చోటుగా ఉన్న బ్రహ్మదేవుడు; దానిన్= ఆ దానాన్ని; మహా+ఆనంద ప్రదము+అని= పరమానందాన్ని ఇచ్చేదని; వెఱచుచున్= భయపడుతూ; చెప్పెన్= చెప్పాడు; అట= ఆ విషయంలో; ఏమి+అందున్?= ఇక ఏమి చెప్పగలను?

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! కపిలలను దానం చేయటంవలన కలిగే ఫలం ఇంతమాత్రంగా ఉంటుందని చెప్పరాదు. బ్రహ్మదేవుడు కూడా భయపడుతూ అది మహానందాన్ని కలిగించేది అని చెప్పాడు. ఇంక నే నేమి చెప్పగలను?

**విశేషం:** 'ప్రదానం' అత్యంతభక్తి శ్రద్ధలతో చేయవలెనని సూచన. వెఱచుచున్= సరిగా చెప్పగలుగుతున్నానా? అని భయం. అంటే నిజానికి మహానందంకంటె గొప్ప ఫలం సిద్ధిస్తుందని భావం. బ్రహ్మదేవుడు కూడా ఆ ఫలాన్ని నిష్కర్షచేసి చెప్పలేడని తాత్పర్యం.

**వ. అని వెండియు. 109**

**తాత్పర్యం:** వ్యాసు డిట్లా చెప్పి ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. 'వసుధామర గాయత్త్రీ । వసంతములు సత్య గోసువర్ణంబులు నే**
**కసముద్భవంబు లని తా । పస వర్యులచేత విందుఁ బావనచరితా! 110**

**ప్రతిపదార్థం:** పావనచరితా!= పవిత్రమైన నడవడి కలవాడా!; వసుధా+అమర గాయత్రీ వసంతములు= బ్రాహ్మణులు గాయత్రీ వసంతర్తువు; సత్య గో సువర్ణంబులు= సత్యం ఆవులు బంగారం; ఏక సముద్భవంబులు= ఒక్కదాని నుండే పుట్టాయి; అని; తాపసవర్యులచేతన్= గొప్ప తపస్సంపద కలవారినుండి; విందున్= వింటూ ఉంటాను.

**తాత్పర్యం:** మంచి నడవడి కల ఓ శుకా! బ్రాహ్మణులు, గాయత్రి, వసంత కాలం, సత్యం, గోవులు, బంగారం, అనేవి ఒకదాని నుండియే పుట్టాయని గొప్ప భావనాపటిమ గలవారు చెప్పగా వింటూ ఉంటాను.

**విశేషం:** బ్రాహ్మణులు మొదలైనవి ఒకచోట పుట్టటంవలన ఆ అన్నింటికీ మహిమ సమానం అని చెప్పినట్లయింది. తాపసవర్యులచేత అనటంవలన ఈ మాటను ప్రమాణంగా స్వీకరించాలి అనే అర్థం స్ఫురిస్తుంది. 'ల చేత' అనే బహువచన ప్రయోగం ఈ భావాన్ని మరింత గట్టి చేస్తుంది. 'విందును' అనే తద్ధర్మార్థక క్రియవలన ఆ మాట 'ఎప్పటిదో' అని త్రోసివేయరాదన్న సూచన తెలియవస్తుంది. పావన చరితా! అన్న సంబోధన ఇట్టి మహా విషయాలు పావన చరితులకే వినవస్తాయి అన్న అర్థాన్ని స్ఫురింపజేస్తుంది.

ఈ పద్యంలో 'వసంతములు' అనుదానికి 'వసుమతులు' అనే పాఠాంతరం ఉన్నది. వసుమతి అంటే భూమి.

**క. కావున భూమియుఁ గనకము । గోవును దానార్హవస్తు కోటికి నెల్లన్**
**ధీవినుతా! యెక్కు డగుట । నీ విమలోదాత్త బుద్ధి నెలవు కొలుపుమీ!' 111**

**ప్రతిపదార్థం:** ధీవినుతా!= బుద్ధిచేత కొనియాడదగినవాడా!; కావునన్= కాబట్టి; భూమియున్= భూమీ, కనకమున్= బంగారమూ, గోవును= ఆవూ; దాన+అర్హ వస్తుకోటికిన్= దానమివ్వదగిన వస్తువుల సముదాయానికి; ఎల్లన్= అన్నింటికీ; ఎక్కుడు+అగుట= గొప్పది కావటం; నీ విమల+ఉదాత్త బుద్ధిన్= నీదైన స్వచ్ఛమూ, ఉన్నతమూ అయిన బుద్ధిలో; నెలవు కొలుపుమీ= నిలిపి ఉంచుకొనుము.

**తాత్పర్యం:** కాబట్టి భూమీ, బంగారమూ, ఆవూ దానమివ్వదగిన వస్తువులన్నింటికంటె గొప్పవి అని నీ దొడ్డబుద్ధిలో చెదరకుండా నిలుపుకొనుము.'

**విశేషం:** ధీవినుతా, విమలోదాత్తబుద్ధిన్ - అన్న పదాలచేత ఈ విషయంలో మరొక భావన రావటం బుద్ధి ఔన్నత్యాన్ని చెడగొట్టుతుంది అన్న స్ఫూర్తి కలుగుతుంది.

ఇందులో భూమియు అన్న పదం ఉండటం చేత వెనుకటి పద్యంలో 'వసుమతులు' సరియైన పాఠంగా నిర్ణయించవచ్చు.

**క. అని మునిపతి సెప్పినఁ ద । త్తనయుఁడు ప్రియమందె' ననుడు ధర్మసుతుం డే**
**వినియుండుదు సిరి గోమయ । మున నుండుట; దాని కెద్ది మూల మగునొకో? 112**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; మునిపతి= ముని శ్రేష్ఠుడు (వ్యాసుడు); చెప్పినన్= చెప్పగా; తత్ తనయుఁడు= అతడి కుమారుడు (శుకుడు); ప్రియము+అందెన్= తృప్తి చెందాడు; అనుడున్= అనగా; ధర్మసుతుండు= ధర్మరాజు; ఏన్= నేను; సిరి= లక్ష్మి; గోమయమునన్= ఆవుపేడయందు; ఉండుటన్= ఉండటాన్ని; విని ఉండుదున్= విని ఉన్నాను; దానికిన్= అట్లా ఉండటానికి; మూలము= మొదటి కారణం; ఎద్ది= ఏది; అగునొకో!= అయి ఉంటుందో కదా!

**తాత్పర్యం:** వ్యాసుడు ఇట్లా చెప్పగా శుకుడు తృప్తి చెందాడు - అన్నమాట విని ధర్మరాజు 'ఆవుపేడలో లక్ష్మి ఉంటుందని నేను విన్నాను. దానికి కారణం ఏమిటో?' అని అడిగాడు.

## గో శ్రీ సంవాదము (సం.13-81-2)

**వ. అనుటయు గాంగేయుండు 'గో శ్రీ సంవాదం బను నితిహాసంబు విను; మయ్యర్థంబు దేటపడు' నని పలికి యిట్లనియె. 113**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; గాంగేయుండు= గంగ కొడుకు భీష్ముడు; గో శ్రీ సంవాదంబు= ఆవులకు, లక్ష్మికి అయిన సంభాషణ; అను ఇతిహాసంబు= అనే పూర్వగాథను; వినుము; ఆ+అర్థంబు= నీ వడిగిన ఆ విషయం; తేటపడును= స్పష్టం అవుతుంది; అని పలికి= అని చెప్పి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అడుగగా భీష్ముడు 'గో శ్రీ సంవాదం' అనే పూర్వగాథను వినుము. నీ వడిగిన విషయం చక్కగా తెలుస్తుంది' అని ఇట్లా చెప్పాడు.

**సీ. 'సిరి ధేనువులలోని కరిగిన 'నెవ్వత?' । వని యవి యడిగిన నమ్మహాత్మ**
**'శ్రీ నేను మీలో వసింపఁగా వచ్చితి' । ననవుడుఁ 'జంచల వైన నిన్ను**
**నొల్లము మాలోన నునుపఁగా ననియె న । గ్గోవులు' దాని కద్దేవి వగచి**
**'యేను బాసిన సర్వదానవకులముఁ గీ । డ్పడియెఁ' బొందిన సురల్ ప్రభుత నొంది;**

**తే. రేను వచ్చుట గోరి కాదే తపంబు । లాచరింతురు; నన్నిట్టు లభిభవించు**

**టుఱవె మీ?' కన్న 'నధ్రువ మొల్ల మనుట । యభిభవమె? నీకుఁ బోలిన యచటి కరుగు.' 114**

**ప్రతిపదార్థం:** సిరి= లక్ష్మి; ధేనువులలోనికిన్= ఆవుల లోనికి; అరిగినన్= పోగా; అవి= ఆ ఆవులు; ఎవ్వతవు?= నీవు ఎవ్వరవు?; అని; అడిగినన్= అడుగగా; ఆ+మహాత్మ= దొడ్డబుద్ధిగల ఆమె; ఏను= నేను; శ్రీన్= లక్ష్మిని; మీలోన్= మీలో; వసింపఁగాన్= ఉండుటకు; వచ్చితిన్= వచ్చాను; అనవుడున్= అన్న వెంటనే; ఆ+గోవులు= ఆ ఆవులు; చంచలవు+ఐన నిన్నున్= చపలస్వభావం కల నిన్ను; మాలోనన్ ఉనుపఁగాన్= మాలో ఉంచుకొనటానికి; ఒల్లము= ఇష్టపడము; అనియెన్= అన్నాయి; దానికిన్= ఆ విషయానికి; ఆ+దేవి= ఆ లక్ష్మీ దేవి; వగచి= దుఃఖపడి; ఏను= నేను; పాసినన్= వదలిపోగా; సర్వదానవ కులమున్= రాక్షసుల కులమంతా; కీడ్పడియెన్= చెడిపోయినది; పొందిన సురల్= నన్ను పొందిన దేవతలు; ప్రభుతన్= గొప్పతనాన్ని; ఒందిరి= పొందారు; ఏను= నేను; వచ్చుట= రావటాన్ని; కోరి కాదే= కోరియే కదా; తపంబులు= తపస్సులు; ఆచరింతురు= చేస్తారు; నన్నున్= అట్టి నన్ను; ఇట్టులు= ఈ విధంగా; అభిభవించుట= అవమానం చేయటం; మీకున్= మీకు; ఉఱవె?= తగునా?; అన్నన్= అనగా; అధ్రువము= చంచలమైన దానిని; ఒల్లము= ఇష్టపడటం; అనుట= అనటం; అభిభవమె?= అవమానమవుతుందా; నీకున్= నీకు; పోలిన అచటికిన్= ఇష్టమైన చోటికి; అరుగు= వెళ్ళుము.

**తాత్పర్యం:** ఒకప్పుడు లక్ష్మి గోవుల మందలోనికి వెళ్ళింది. ఆవులు 'నీ వెవరవు? అని అడిగాయి. ఆమె 'నేను లక్ష్మిని; మీతో కలిసి ఉందామని వచ్చాను' అన్నది. అప్పు డవి 'నీవు చంచలస్వభావం కలదానవు కనుక మాలో ఉంచుకొనటానికి ఇష్టపడం' అని చెప్పాయి. దానికి ఆమె దుఃఖపడి 'నేను వదలిపోతే రాక్షసులంతా చెడిపోయారు. నేను చేరటంవలన దేవతలు ప్రభుత్వం పొందారు. నా రాకను కోరేకదా మనుజులంతా తపస్సులు చేస్తారు. అట్టి న న్నిట్లా అవమానించటం తగునా? అని అడిగింది. అప్పుడవి 'స్థిరత్వం లేని దానిని మేమిష్టపడం అనటం అవమానమా? నీకు తోచిన చోటికి వెళ్ళుము' అన్నాయి.

**విశేషం:** లక్ష్మికి చంచల, చపల అనే పేర్లు ఉన్నాయి. **"సిరి దా వచ్చిన వచ్చును. సలలితముగ నారికేళ సలిలము భంగిన్; సిరి దాఁ బోయినఁ బోవును, గరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ."** అని సూక్తి.

**క. అని గోవులు పలికిన సిరి । విని 'మీచే నిట్లు పరిభవింపఁగఁబడి యేఁ**

**జనిన నను నెవ్వరును గై । కొనరు; శరణ మగుఁడు వేఁడికొనియెద మిమ్మున్. 115**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; గోవులు= ఆవులు; పలికినన్= పలుకగా; విని; సిరి= లక్ష్మి; మీచేన్= మీచేత; ఇట్లు= ఈ విధంగా; పరిభవింపఁగన్+పడి= అవమానం పొంది; ఏన్= నేను; చనినన్= పోతే; ననున్= నన్ను; ఎవ్వరును= ఎవరుకూడా; కైకొనరు= ఆదరించరు; మిమ్మున్= మిమ్ములను; వేఁడికొనియెదన్= ప్రార్థిస్తాను; శరణము+అగుఁడు= ఆశ్రయం ఇవ్వండి.

**తాత్పర్యం:** అని ఆవులంటే లక్ష్మీదేవి విని 'మీరిట్లా నన్ను అవమానిస్తే నేను ఎక్కడికి వెళ్ళినా నన్నెవరూ తీసికొనరు. మిమ్ములను వేడుకొంటున్నాను నాకు ఆశ్రయం ఇవ్వండి' అన్నది.

**తే. మీ సమీపంబునం దున్కి మేలు; దాని । నిండు నా 'కని యడిగిన నెంత యేని**

**నాదరంబున నగ్గోవు లంతవట్టుఁ గూడి యిట్లను లక్ష్మికిఁ గురువరేణ్య! 116**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురుశ్రేష్ఠుడా!; మీ సమీపంబునందున్= మీ దగ్గర; ఉన్కి= ఉండటం; మేలు= శుభం; దానిన్=అట్లా ఉండటాన్ని; నాకున్= నాకు; ఇందు= అనుగ్రహించండి; అని అడిగినన్= అని అడిగితే; ఎంతయేనిన్= ఎంతో; ఆదరంబునన్= ప్రీతితో; ఆ+గోవులు= ఆ ఆవులు; అంతుపట్టున్= అన్నీ; కూడి= కలిసి; లక్ష్మికిన్= లక్ష్మీదేవితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాయి.

**తాత్పర్యం:** మీదగ్గర ఉండటం మేలు. నాకది అనుగ్రహించండి' అని అడిగితే ఆ గోవులన్నీ ఒక్క అభిప్రాయంతో ఎంతో ఆదరంతో లక్ష్మీదేవితో ఇట్లా అన్నాయి.

**క. 'మా మూత్ర పురీషంబులు । భామా! వేదంబు లెఱుఁగుఁ బావనములు నీ**
**వీ మేలి వస్తువులఁ బ్రియ । ధామమ వై యుండు మింపు దలకొన మాకున్. 117**

**ప్రతిపదార్థం:** భామా!= ఓ ఇంతీ!; మా మూత్ర పురీషంబులు= మా మూత్రం, మలం అనేవి; పావనములు= పవిత్రమైనవి; వేదంబులు= వేదాలు; ఎఱుఁగున్= (ఈ సంగతిని) తెలిసికొన్నాయి; నీవు; ఈ మేలి వస్తువులన్= ఈ గొప్ప వస్తువులందు; ప్రియధామమవు+ఐ= ప్రియమైన నివాసం కలదానవై; మాకున్= మాకు; ఇంపు= ప్రీతి; తలకొనన్= కలిగే విధంగా; ఉండుము.

**తాత్పర్యం:** 'లక్ష్మి! మా మల మూత్రాలు పరమ పవిత్రాలని వేదాలకు తెలుసు. నీవు ఈ గొప్ప వస్తువులలో మాకు ప్రీతి కలిగే విధంగా మంచి నివాసం కలదానవై ఉండుము.'

**విశేషం:** 'మా మూత్ర పురీషములు పానవములు' అనే వాక్య గర్భంలో 'వేదంబు లెఱుఁగు' అనే వాక్యాంతరం ఉండటం ఒక విశేషం. అట్లాంటి వాక్యనిర్మాణంవలన చెప్పదలచిన అంశానికి ఒక దార్ఢ్యం ఏర్పడటం వ్యవహారంలో మనం చూస్తాం.

**తే. అనుటయును సిరి 'నాదు పుణ్యమునఁ జేసి । కంటిఁ బడయంగ మీ యనుగ్రహము' ననుచు**
**నట్లు వసియించె నిది గోమయ ప్రభావ । మూల మిట్టిది గోవు నమోఘ మహిమ. 118**

**ప్రతిపదార్థం:** అనుటయును= అని పలుకగా; సిరి= లక్ష్మి; నాదు పుణ్యమునన్ చేసి= నా పుణ్యంవలన; మీ అనుగ్రహమున్= మీ దయను; పడయంగన్= పొందగా; కంటిన్= కన్నాను; అనుచున్= అంటూ; అట్లు= ఆ విధంగా; వసియించెన్= ఉన్నది; ఇది; గోమయ ప్రభావ మూలము= ఆవుపేడ గొప్పతనానికి మొదటి కారణం; గోవు+అమోఘ మహిమ= ఆవుయొక్క చెడని మహిమ; ఇట్టి+అది= ఇటువంటిది.

**తాత్పర్యం:** ఆవులు ఆ విధంగా చెప్పగా లక్ష్మి 'నా పుణ్యంచేత మీదయ పొందగలిగాను' అంటూ వాటి మలమూత్రాదులయందు నివసించింది. ఇది ఆవుపేడ గొప్పతానికి మొదలు. ఆవుల చెడని మహిమ ఇటువంటిది.

**వ. మఱియు నొక్క విశేషంబు సెప్పెద నాకర్ణింపుము. 119**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఒక్క విశేషంబు= ఒక అసాధారణ విషయాన్ని; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= శ్రద్ధతో వినుము.

**తాత్పర్యం:** ఇంకా ఒక గొప్ప విషయం చెప్పుతాను వినుము.

**ఆ. సురభి తపము సేయ సరసిజాసనుఁడు ప్ర। త్యక్షమై 'మనోరథంబు సెప్పు**
**మిచ్చు కౌతుకమున వచ్చితి' ననవుడు। నిట్టు లనియె నది మహీశవర్య! 120**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశవర్య!= రాజవరేణ్యా!; సురభి= కామధేనువు; తపము+చేయన్= తపస్సు చేయగా; సరసిజ+ ఆసనుఁడు= పద్మం ఆసనంగా గల బ్రహ్మ; ప్రత్యక్షము+ఐ= కన్నుల కగపడి; మనస్+రథంబు= కోరిక; చెప్పుము= తెలియ జేయుము; ఇచ్చుకౌతుకమునన్= ఇచ్చే వేడుకతో; వచ్చితిన్= వచ్చాను; అనవుడున్= అనగా; అది= ఆ కామధేనువు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** రాజా! కామధేనువు తపస్సు చేస్తే బ్రహ్మ కానవచ్చి 'నీ కోరిక ఏమిటో చెప్పుము; ఇచ్చే వేడుకతో వచ్చాను' - అంటే అది ఇట్లా అన్నది.

**విశేషం:** 'ఇచ్చు కౌతుకమున' అనటం కామధేనువుకు వరమివ్వగలగటం బ్రహ్మదేవునంతటి వాడికి కూడా ప్రమోద కారణం అన్న సంగతిని సూచిస్తుంది.

**క. 'మీ రిట్లు ప్రసన్నమతిన్। గారవమున వచ్చినంతకంటెను మే లేఁ**
**గోరంగ వలయునట్టిది। కారుణిక ప్రథమగణ్య! కలదే నాకున్?' 121**

**ప్రతిపదార్థం:** కారుణిక ప్రథమగణ్య!= దయగల వారిలో మొదట ఎన్నదగిన మహాత్మా!; మీరు= తమరు; ఇట్లు= ఈ విధంగా; ప్రసన్నమతిన్=కలత లేని బుద్ధితో; గారవమునన్= నా మీది మన్ననతో; వచ్చిన+అంతకంటెను= వచ్చినదానికంటె; ఏన్= నేను; కోరంగన్ వలయు+అట్టి+అది= కోరదగినదైన; మేలు= శుభము; నాకున్= నాకు; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** గొప్పదయగల మహాత్మా! మీరు ఈ విధంగా స్వచ్ఛమైన బుద్ధితో మన్ననతో రావటం కంటె నేను కోరదగిన శుభం మరొకటి ఉన్నదా?

**విశేషం:** కారుణిక ప్రథమగణ్య! అన్న సంబోధన బ్రహ్మదేవుడి వాత్సల్యాతిశయాన్నీ, సురభి ఆనందాతిశయాన్నీ సూచిస్తుంది.

**వ. అనిన నత్యంత సంతుష్ట స్వాంతుండై సురజ్యేష్ఠుండు సురభిం జూచి 'సురలోకాది దివ్య లోకంబుల కెల్లను గోలోకంబు మీఁదుగా వరం బిత్తుంగాక' యని తలంచి యవ్విశేషంబు మున్న తనవలన సిద్ధంబగుట సంస్మృతి గోచరం బగుటయు. 122**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; సురజ్యేష్ఠుండు= దేవతలకెల్ల పెద్ద అయిన బ్రహ్మ; అత్యంత సంతుష్ట స్వాంతుండు+ఐ= మిక్కిలి తృప్తి పొందిన మనస్సు కలవాడై; సురభిన్= కామధేనువును; చూచి; సురలోక+ఆది దివ్యలోకంబులకున్= దేవతలలోకం మొదలైన దివ్యలోకాలకు; ఎల్లను= అన్నింటికంటె; గోలోకంబు= గోవుల లోకం; మీఁదు= పై నుండేది; కాన్= అయ్యేటట్లుగా; వరంబున్= వరాన్ని; ఇత్తున్ కాక= ఇస్తాను; అని; తలంచి= భావనచేసి; ఆ+విశేషంబు= ఆ గొప్పతనం; మున్ను+అ= ఇంతకు ముందే; తనవలనన్= తనచేత; సిద్ధంబు+అగుట= ఏర్పడింది కావటం; సంస్మృతి గోచరంబు= స్మరణకు తోచటం; అగుటయున్= కాగా.

**తాత్పర్యం:** ఆ మాటకు పరమానందం పొంది బ్రహ్మ సురభిని చూచి దేవలోకం మొదలైన ఊర్ధ్వలోకాల కన్నింటికీ గోలోకంపైన ఉండేదిగా వరమిస్తాను అనుకొని, ఆ విషయం ఇంతకుముందే తనచేత ఏర్పడి ఉండటం గుర్తుకు రాగా.

**విశేషం:** భూలోకము, భువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అనేవి ఊర్ధ్వలోకాలు. 'గోలోకం' ఈ అన్నింటికంటె పైగా నిలపటం బ్రహ్మసంకల్పం. దీనివలన గోవు సర్వలోక పూజ్య అన్న మర్యాద ఏర్పడుతుంది.

**తే. గోవులకు మేలు సేయంగ గోరు నాదు । చిత్తమున మద్వరంబున సిద్ధమైన**
**తెఱఁగ యొలసె దైవికమయి దీనిపెంప । యావహించెద నని యిచ్చె నవ్వరంబు. 123**

**ప్రతిపదార్థం:** గోవులకున్= ఆవులకు; మేలు= శుభం; చేయంగన్= చేయటానికి; కోరు= కోరుతున్న; నాదు చిత్తమునన్= నా మనస్సులో; మత్+వరంబునన్= నా భావనయందు; సిద్ధము= ఏర్పడి ఉన్నది; ఐన తెఱఁగు+అ=అయిన విధమే; దైవికము+అయి= పరమాత్మ కూర్పుగా; ఒలసెన్= కలిగింది; దీని పెంపు+అ= దీని గొప్పతనమే; ఆవహించెదన్= కలుగజేస్తాను; అని; ఆ+వరంబున్= ఆ వరాన్ని; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** గోవులకు శుభం కూర్చాలన్న కోరిక కల నా హృదయంలో నా వరానికి ఇంతకుముందే ఏర్పడి ఉన్న తీరు అనుకూలంగా అమరి ఉన్నది. ఈ మహిమనే కలుగజేస్తాను అని ఆ వరం ఇచ్చాడు.

**విశేషం:** 'దైవికము' లోకాలన్నింటినీ సృష్టిచేసే మహామహిమగల బ్రహ్మకూడా దైవికం అనుకొన్నాడంటే అతడికి కూడా ఒక నియామక శక్తి ఉన్నదన్న విషయం తెలియవస్తుంది. అదే పరమాత్మ. గోవులు సర్వలోకాలకు పూజ్యులు కావటం పరమాత్మ సంకల్పంగా ఈ పద్యం తెలియజేస్తున్నది.

**క. వనరుహ సంభవుఁ డత్తెఱఁ । గునఁ దనలోకంబు కంటె గోలోకము స**
**జ్జన వినుతచరిత! మీఁదై । యునికి వెలుఁగఁజేసి; నది మహోజ్జ్వల మయ్యెన్.' 124**

**ప్రతిపదార్థం:** సత్+జన వినుతచరిత!= మంచివారు కొనియాడదగిన నడవడి కల ఓ ధర్మరాజా!; వనరుహ సంభవుఁడు= పద్మంలో పుట్టినవాడగు బ్రహ్మ; ఆ+తెఱఁగునన్= ఆ విధంగా; గోలోకమున్= ఆవుల లోకాన్ని; తన లోకంబు కంటెన్= తనదైన సత్యలోకం కంటె; మీఁదు+ఐ= పైదై; ఉనికి= ఉండటం; వెలుఁగన్ చేసెన్= ప్రకాశింపజేశాడు; అది= ఆ గోలోకం; మహా+ఉజ్జ్వలము= గొప్ప తేజస్సు కలది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రహ్మ ఆ విధంగా గోలోకం తన సత్యలోకంకంటె పైన ఉండి ప్రకాశించేదిగా చేశాడు. ఆ గోలోకం దీనివలన ఎంతో గొప్పతనం పొందింది.'

**వ. అని చెప్పి. 125**

**తాత్పర్యం:** అట్లా చెప్పి.

**క. గోవిషయ వాక్యపఠన । శ్రావణ సంశ్రవణములు ధరావర యాయు**
**శ్శ్రీవిభవకీర్తి సుగతి స । మావహములు దత్పరుండ వగు మిక్కథలన్. 126**

**ప్రతిపదార్థం:** ధరావర!= రాజా!; గో విషయ వాక్య పఠన శ్రావణసంశ్రవణములు= ఆవులకు సంబంధించిన మాటలు చదవటం; వినిపించటం, చక్కగా వినటం అనేవి; ఆయుః శ్రీ విభవ కీర్తి సుగతి సమావహములు= ఆయువునూ, సంపదనూ, ప్రభుత్వాన్నీ, కీర్తినీ, సద్గతినీ కలిగించేవి; ఈ+కథలన్= ఈ కథలయందు; తత్పరుఁడవు+అగుము= శ్రద్ధకలవాడవగుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! గోవులకు సంబంధించిన వాక్యాలను చదవటం, వినిపించటం, వినటం అనేవి ఆయువునూ, సంపదనూ, అధికారాన్నీ, కీర్తినీ, మంచిగతినీ కలుగజేస్తాయి. కాబట్టి ఈ కథలందు శ్రద్ధను పెంపొందించుకొనుము.

**విశేషం:** తాను చదవాలి. తాను పొందే మహా ప్రయోజనాన్ని ఇతరులకు అందించటంకొరకు చదవలేని వారికి వినిపించాలి. (శ్రావణం) తనకంటె గొప్పవారు మరికొన్ని గొప్ప విషయాలు చెపితే ఆసక్తితో వినాలి (సంశ్రవణం) ఇది భారతీయుల "సర్వే జనాః సుఖినో భవన్తు'' అన్న భావానికి సంబంధించిన సంప్రదాయం.

**వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవుతో 'మహాత్మా! గోవుల మాహాత్మ్యంబు దేటపడం బెక్కు భంగులం జెప్పి నన్నుం గృతార్థుం జేసితి; సర్వయజ్ఞంబులందును దాతవ్యం బత్యంతంబు సువర్ణంబని విందు; వేదంబులు 'సువర్ణ దక్షిణేతి వై' యని చెప్పెడు; భూమియు గోవులుఁ గాంచనంబును నీ విషయంబులైన దానంబులు నుత్తమంబు అని వేదవ్యాసు వచనంబు కలిమి నీవ చెప్పితి; సువర్ణ విశేషంబు వినవలతుం జెప్పవే' యనుటయు నతం డతని కిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; కౌంతేయ+అగ్రజుండు= కుంతి కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు; మహాత్మా!= దొడ్డబుద్ధిగలవాడా!; గోవుల మాహాత్మ్యంబు= ఆవుల మహిమ; తేటపడన్= స్పష్టమయ్యే విధంగా; పెక్కు భంగులన్= పలువిధాలుగా; చెప్పి; నన్నున్= నన్ను; కృత+అర్థున్= నెరవేరిన ప్రయోజనం కలవాడినిగా; చేసితి= చేశావు; సర్వ యజ్ఞం బులందును= అన్ని యజ్ఞాలలో; దాతవ్యంబు= ఇవ్వదగినది; అత్యంతంబు= మిక్కిలి అయినది; సువర్ణంబు= బంగారం; అని; విందున్= వింటూ ఉంటాను; వేదంబులు= వేదాలు; సువర్ణ దక్షిణేతి వై = బంగారు కానుక కలదియే అని; చెప్పెడున్= చెపుతూ ఉంటాయి; భూమియున్= భూమీ; గోవులున్= ఆవులూ; కాంచనంబునున్= బంగారమూ; ఈ విషయంబులు+ఐన, దానంబులున్= వీటికి సంబంధించిన దానాలూ; ఉత్తమంబులు= మేలైనవి; అని; వేదవ్యాసు వచనంబు= వేదవ్యాసుడి పలుకు; కలిమి= ఉండటాన్ని; నీవు+అ= నీవే; చెప్పితి= చెప్పావు; సువర్ణ విశేషంబున్= బంగారం గొప్పతనాన్ని; వినవలతున్= వినగోరు తున్నాను; చెప్పవే= చెప్పుమా; అనుటయున్= అంటే; అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ముడిట్లా చెప్పగా విని ధర్మరాజు అతడితో 'మహాత్మా! ఆవుల మహిమ చక్కగా తెలియవచ్చే విధంగా ఎన్నో తీరులతో చెప్పి నన్ను ధన్యుడిని చేశావు. యజ్ఞాలన్నింటిలో మిక్కిలి శ్రేష్ఠంగా ఇవ్వదగినది బంగారం అని వింటూ ఉంటాను. వేదాలు కూడా సువర్ణ దక్షిణను కొనియాడుతూ ఉంటాయి. భూమి, ఆవులూ, బంగారమూ, వీటికి సంబంధించిన దానాలూ మిక్కిలి మేలైనవని వేదవ్యాసుడి మాట ఉన్నట్లుగా నీవే చెప్పావు. బంగారం గొప్పతనాన్ని వినాలని ఉన్నది. నాకు దయచేసి చెప్పుము. అంటే అతడి కతడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** కౌంతేయాగ్రజుండు - పెద్దకుమారుడికి తక్కిన వారికంటె ఎక్కువ బాధ్యత ఉంటుంది. శాస్త్రాలు మొదటి కొడుకును ధర్మసంతానం అనీ, తక్కిన వారిని కామసంతానం అనీ చెబుతున్నాయి. వేదాలూ, వేదవ్యాసుడు చెప్పినమాట పొల్లుపోవటానికి వీలులేదు. వాటిని అనాదరం చేయరాదు. కాబట్టి వినాలనే కోరిక ధర్మరాజుకు మిక్కుటంగా కలిగింది.

## భీష్ముఁడు ధర్మజునకు సువర్ణ దాన మహిమాతిశయంబు సెప్పుట (సం.13-83-6)

సీ. శంతను నృపతి లోకాంతరగతుఁడైన విను తదీయశ్రాద్ధ విధి యొనర్పఁ

బూని గంగాద్వారమున కేఁగి మా తల్లి । గంగ సాహాయ్యంబు గారవమున

నాచరింపంగఁ గ్రియాకలాపం బెల్ల । నడపఁ బిండ ప్రదానంబు సమయ

మగుటయు దర్భ విన్యాస మొనర్ప నం । దంగుళీయక కంకణాంగదములఁ

ఆ. గాంతమైన యొక్క కరము వొడమి యఱ । చేయి సాఁచుటయును జిత్త మద్భు

తంబుఁ బొంద దానిఁ దప్పక చూచి య । య్యధిపు బాహు వగుట యాత్మ నెఱిఁగి. 128

**ప్రతిపదార్థం:** శంతను నృపతి= శంతను మహారాజు; లోక+అంతర గతుఁడు+ఐనన్= మరొక లోకం పొందినవాడు కాగా; తదీయ శ్రాద్ధవిధి= ఆయన శ్రాద్ధం పని; ఒనర్పన్= చేయటానికి; పూని= సంకల్పించి; గంగా ద్వారమునకున్= గంగ ఒడ్డుకు; ఏఁగి= వెళ్ళి; మా తల్లి= మా అమ్మ; గంగ; సాహాయ్యంబున్= సాయాన్ని; గారవమునన్= ప్రేమతో; ఆచరింపంగన్= చేయగా; క్రియాకలాపంబు= శ్రాద్ధపు పనుల సముదాయము; ఎల్లన్= అంతటినీ; నడపన్= చేయగా; పిండ ప్రదానంబు సమయము= పిండాలిచ్చే వేళ; అగుటయున్= కాగా; దర్భవిన్యాసము= దర్భలను ఉంచటం; ఒనర్పన్= చేస్తే; అందున్= ఆ ప్రదేశంలో; అంగుళీయక కంకణ+అంగదములన్= ఉంగరాలు, చేతి వలయము, బాహుపురి అనే వాటితో; కాంతము= సుందరం; ఐన ఒక్క కరము= అయిన ఒక చేయి; పొడమి= కన్పట్టి; అఱచేయి= అరచేయి; చాఁచుటయును= చాపగా; చిత్తము= హృదయం; అద్భుతంబు+పొందన్= అబ్బురమందగా; దానిన్; తప్పక= కన్నార్పకుండా; చూచి= కనుగొని; ఆ+అధిపు బాహువు+అగుటన్= ఆ రాజు చేయి కావటాన్ని; ఆత్మన్= హృదయంలో; ఎఱిఁగి= తెలిసికొని.

**తాత్పర్యం:** మా తండ్రి శంతను మహారాజు చనిపోయినపుడు పరలోక క్రియలు చేయటానికి గంగ ఒడ్డుకు వెళ్ళి మా అమ్మ ప్రేమతో సాయం చేస్తూ ఉంటే ఆ క్రియాకలాపమంతా చేస్తున్నప్పుడు పిండాలు పెట్టే సమయంలో ఉంగరాలూ, కంకణమూ, అంగదమూ అనే ఆభరణాలతో మనోహరమైన ఒక హస్తం కన్పట్టి అరచేయి చాచింది. అది చూచి ఆశ్చర్యపడి దానిని రెప్పలార్చకుండా చూచి అది ఆ రాజు చేయియే అని తెలిసికొని. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** లోకాంతరగతుడు - మరొక లోకానికి వెళ్ళినవాడు. చనిపోవుట అనే మాటలో ఇక్కడ నుండి బయలుదేరి మరొక చోటికి పోయాడనే అర్థం. భారతీయుల విశ్వాసానికి సంబంధించినది. శ్రాద్ధవిధి - శ్రద్ధతో చేసేపని శ్రాద్ధం - ఈ పదం చనిపోయినవారి ఉత్తమ గతిని కోరి చేసే ప్రక్రియ అనే అర్థంలో రూఢి పొందింది. పిండ ప్రదానంబు - శ్రాద్ధంలో ఇది ఒక అంగం. చనిపోయిన వారిని మొదలు పెట్టి మూడు తరాల వరకు ఉన్న వారికి మూడు అన్నపుముద్దలు దర్భల మీద ఒక క్రమంతో ఉంచుతారు. - అంటే చనిపోయిన వ్యక్తికీ (చనిపోయి ఉంటే) అతడి తండ్రికీ, అట్లాగే అతడి తండ్రికీ - అన్నమాట. అట్లాగే తల్లి అయితే తల్లికీ, ఆమె అత్తగారికీ, ఆమె అత్తగారికీ - వీరిలో ఎవరైనా బ్రదికి ఉంటే వారికి పిండం పెట్టరాదు. వీరికి క్రమంగా వసు రుద్ర ఆదిత్య రూపాలని వ్యవహారం.

క. జనకుఁడు వేడుకఁ జే సాఁ । చిన యంతన సంతసిల్లి చేతం బిండం

బనుమానింపక యేఁ బె । ట్టిన శాస్త్రవిధాన గతి ఘటింపమి వచ్చున్. 129

**ప్రతిపదార్థం:** జనకుఁడు = తండ్రి; వేడుకన్= కోరికతో; చే= చేయి; చాఁచిన+అంతన= చాచినంతనే; సంతసిల్లి= మురిసిపోయి; ఏన్= నేను; చేతన్= చేతిలో; పిండంబు= పిండాన్ని; అనుమానింపక= అనుమానం పొందక; పెట్టినన్= పెట్టితే; శాస్త్రవిధాన గతి= శాస్త్రం విధించిన తీరు; ఘటింపమి= కుదరకపోవటం; వచ్చున్= వస్తుంది.

**తాత్పర్యం:** తండ్రి వేడుకపడి చేయి చాచాడు. నేను మురిసిపోయి అనుమానించకుండా చేతిలో పిండం పెట్టితే శాస్త్రం ఒప్పుకోని స్థితి కలుగుతుంది.

**విశేషం:** శ్రాద్ధం శాస్త్రాన్ననుసరించి పెట్టాలి. అనుమానాలతో శాస్త్ర ప్రమాణాన్ని పట్టించుకొనకుండా, శాస్త్ర పద్ధతికి విరుద్ధంగా చేస్తే వ్యర్థం అవుతుంది. అప్పుడది శ్రాద్ధమే కానిదవుతుంది.

**తే.** **పితృకరంబునఁ బిండంబు పెట్టు మనదు । శాస్త్ర మంచిత మగు కుశాస్తరణమునన**
**పెట్టఁ జెప్పు; నట్లగుట 'నేఁ బెట్టఁ జేత' । నని మనంబునఁ దలఁచి వచనము సేసి.** **130**

**ప్రతిపదార్థం:** శాస్త్రము; పిండంబు= పిండాన్ని; పితృకరంబునన్= తండ్రి చేతిలో; పెట్టుము= పెట్టు; అనదు= అని చెప్పలేదు; అంచితము+అగు= చక్కనిదైన; కుశ+ఆస్తరణమునన్+అ= దర్భల పరపుపైనే; పెట్టన్= పెట్టటాన్ని; చెప్పున్= విధించింది; అట్లు+ అగుటన్= కాబట్టి; నేన్= నేను; చేతన్= చేతిలో; పెట్టన్= పెట్టను; అని; మనంబునన్= హృదయంలో; తలఁచి= భావించి; వచనము+చేసి= ఆ మాటనే పలికి.

**తాత్పర్యం:** శాస్త్రం పిండాన్ని తండ్రిచేతిలో పెట్టుమని చెప్పదు. చక్కని దర్భలు పరచిన చోటనే ఉంచాలని చెప్పుతున్నది. కాబట్టి చేతిలో పెట్టను అని నిశ్చయించుకొని ఆ మాటనే పలికి. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** ఇక్కడ పితృ శబ్దానికి కేవలం తండ్రి అని అర్థం కాదు. ఎవరి నుద్దేశించి శ్రాద్ధం పెడుతున్నారో వారు అని అర్థం. వారిని పితృదేవతలు అంటారు. ఆస్తరణం పరచిన చోటు, వచనముచేసి సాధారణంగా వైదిక ప్రక్రియలో చేయబోయే పనిని మనసులో భావన చేయాలి. మాటతో చెప్పాలి. క్రియ చేయాలి. దానినే త్రికరణశుద్ధి అంటారు.

**క.** **అమలంబగు కుశసంస్తర । ణమునం బిండంబు వెట్టినం దోఁచిన హ**
**స్త మదృశ్యమయ్యెఁ; మత్పితృ । సమితి ముదము మోములం దెసఁగఁ బొడ సూపెన్.** **131**

**ప్రతిపదార్థం:** అమలంబు+అగు= పరిశుద్ధమైన; కుశసంస్తరణమునన్= దర్భలు పరచినచోట; పిండంబు= పిండాన్ని; పెట్టినన్= పెట్టగా; తోఁచిన హస్తము= కన్పట్టిన చేయి; అదృశ్యము+అయ్యెన్= కనపడకుండా పోయింది; ముదము= ఎక్కువ అయిన ఆనందం; మోములన్= మొగాలలో; ఎసఁగన్= వ్యాప్తిచెందగా; మత్ పితృ సమితి= నా పితృదేవతల సముదాయం; పొడ+చూపెన్= కన్పట్టింది.

**తాత్పర్యం:** పరిశుద్ధమైన దర్భలు పరచినచోటనే పిండం పెట్టాను. అప్పుడు కనపడిన చేయి అదృశ్యమైపోయింది. సంతోషంతో విప్పారిన ముఖాలతో మా పితృదేవతలు నా ముందు సాక్షాత్కరించారు.

**విశేషం:** ధర్మాత్ములు శాస్త్రమార్గాన్ని అవలంబించటమే ఇష్టపడతారు. చేయి చాచటం ఇక్కడ పరీక్షగా మనం భావించాలి. అందులో భీష్ముడు కృతార్థుడయ్యాడు. ఆనందం తొణికిసలాడుతున్న ముఖాలతో పితృసమితి ముఖ్యంగా తండ్రి, తాత, ముత్తాత కనిపించారు. అమలంబు ఏ దోషమూ లేనిదిగా దర్భాసనాన్నీ, తక్కిన వారినీ చూచుకొనటం 'శ్రాద్ధం'లో ఒక సూక్ష్మాంశం.

**క. పొడసూపి ధర్మమార్గం । బెడపక 'నీ విట్లు పిండ మిడుటకు హర్షం**

**బడరినఁ జనుదెంచితి మె । క్కుడు తృప్తిం బొందితిమి ప్రగుణ్యచరిత్రా!' 132**

**ప్రతిపదార్థం:** పొడ+చూపి= కనిపించి; ప్రగుణ్య చరిత్రా!= మిక్కిలిగా మన్నించదగిన నడవడి కలవాడా!; నీవు; ధర్మమార్గంబు= ధర్మపద్ధతిని; ఎడపక= చెడగొట్టక; ఇట్లు= ఈ విధంగా; పిండము= పిండాన్ని; ఇడుటకున్= ఇవ్వటంవలన; హర్షంబు= సంతోషం; అడరినన్= మిక్కుటంగా కలుగగా; చనుదెంచితిమి= వచ్చాము; ఎక్కుడు తృప్తిన్ = చాలా ఎక్కుడైన తృప్తిని; పొందితిమి= పొందాము.

**తాత్పర్యం:** అట్లా కనిపించి ఆ పితృదేవతలు ఇట్లా అన్నారు. 'ఎంతో మన్నింపదగిన ప్రవర్తనగల ఓ రాజా! నీవు ధర్మమార్గాన్ని చెరపకుండా పిండం పెట్టావు కనుక మాకు పరమానందం కలిగింది. వచ్చాము ఎక్కువ తృప్తిని పొందాము.'

**విశేషం:** 'ప్రగుణ్య చరిత్రా!' గుణింపదగినది గుణ్యము - గుణించటమంటే అధికం చేయటం. 'ఎక్కువగా మన్నించదగిన' అని తాత్పర్యం.

**వ. అని పలికి వెండియు. 133**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= మాటాడి; వెండియున్= మరలా.

**తాత్పర్యం:** వా రిట్లా పలికి ఇంకా (ఇట్లా అన్నారు.)

**క. 'భూమికి గోవులకునునై । హేమమిడుట యస్మదీయ హితమును దేవ**

**స్తోమ ప్రియముం బావన । తా మహనీయంబుఁ జుమ్ము ధర్మవిధిజ్ఞా! 134**

**ప్రతిపదార్థం:** ధర్మవిధిజ్ఞా!= ధర్మవిధులను చక్కగా తెలిసినవాడా!; భూమికిన్= భూమికొరకు; గోవులకునున్+ఐ= ఆవులకొరకూ; హేమము= బంగారాన్ని; ఇడుట= ఇవ్వటం; అస్మదీయ హితమును= మాకు మేలొనరించేదీ; దేవ స్తోమ ప్రియమున్= దేవతల సముదాయానికి ప్రియమైనదీ; పావనతా మహనీయంబున్= పవిత్రతతో గొప్పదైనదీ; చుమ్మ= సుమా!

**తాత్పర్యం:** 'ధర్మక్రియలు చక్కగా తెలిసిన ఓ భీష్మా! భూమికి గోవులకు బదులుగా నీవు సువర్ణమును ఇవ్వడం మాకెంతో మేలు కూర్చేదీ, దేవతలకు ప్రీతిని కూర్చేదీ, పవిత్రతతో గొప్పదైనదీ అయిన పని సుమా!

**విశేషం:** దానాలలో భూదానమూ, గోదానమూ మొదలైనవి ఎన్నో ఉన్నాయి. సాధారణంగా ఆయా సందర్భాలలో వాటినే దానం చేయాలి. గతి లేకపోతే ప్రత్యామ్నాయాలు - బదులుగా చేసేవి ఉంటాయి. కానీ సువర్ణదానం గతిలేనప్పుడు చేసేది కాదు. దాన మహిమను ఇనుమడింప జేసేది అని ఈ పద్యభావం. పితృదేవతలు, స్వర్గలోక వాసులైన దేవతలకంటె కొంచెం తక్కువ స్థాయివారు. వీరి నుద్దేశించి ఇచ్చే సువర్ణదానం పై స్థాయివారికి కూడా ప్రీతి కలిగించిందంటే దాని మహిమ ఎంతటిదో ఊహించాలి. భూమికిన్, గోవులకును ఇక్కడ షష్ఠి' దానికి బదులు అనే అర్థాన్నిస్తుంది.

**క. పావనము సువర్ణము వం । శావలికిం దనకు నిర్మలాత్మత నిచ్చున్;**

**నీ వది యెఱిఁగి సకలయ । జ్ఞావసరములను సువర్ణ యాజివ యగుమీ! 135**

**ప్రతిపదార్థం:** పావనము= పవిత్రమైన; సువర్ణము= బంగారం; వంశ+ఆవలికిన్= వంశాల వరుసకూ; తనకున్= తనకూ; నిర్మల+ఆత్మతన్= దోషం లేని బుద్ధిని; ఇచ్చున్= ఇస్తుంది; నీవు; అది= ఆ విషయాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; సకల యజ్ఞ+అవసరములన్= అన్ని యజ్ఞాల సమయాలలో; సువర్ణ యాజివి+అ= బంగారు దక్షిణలతో యజ్ఞం చేసేవాడవు; అగుమీ= కమ్ము.

**తాత్పర్యం:** సువర్ణం పరమ పవిత్రమైనది. అది ఇచ్చిన వాడినే కాదు తరతరాలుగా ఉన్న వంశంవారందరికీ కల్మషంలేని బుద్ధినిస్తుంది. నీ వది తెలిసికొని అన్ని యజ్ఞాలలో సువర్ణదానం చేస్తూ ఉండుము.

**విశేషం:** సువర్ణం సృష్టిలో అందరికీ అపేక్షించదగిన వస్తువు. అట్టిదానిని దానం చేయటమంటే మమకారదోషాన్ని చంపుకొనటమన్నమాట. అన్ని అనర్థాలకూ మూలకారణమైన మమకారాన్ని చంపుకొనటానికి అవకాశం ఇస్తున్నది. కాబట్టి దానివలన నిర్మలాత్మత సిద్ధిస్తుంది.

**క. అని చెప్పి చనిన నాదగు । మనము సువర్ణ ప్రదాన మహిమ కెలయఁ ద**
**ద్వినుతా నుష్ఠానపర । త్వ నిరూఢుఁడ నైతి నేను ధర్మతనూజా!' 136**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజా!= ధర్మనందనా!; అని చెప్పి= ఇట్లా చెప్పి (పితృదేవతలు) చనినన్= వెళ్ళగా; నాది+అగు మనము= నా హృదయం; సువర్ణ ప్రదాన మహిమకున్= బంగారం గొప్పగా దానం చేయటంలోని గొప్పతనానికి; ఎలయన్= ఆసక్తిపడగా; ఏను= నేను; తద్+వినుత+అనుష్ఠాన పరత్వ నిరూఢుఁడను= మేలైన ఆచరణలో శ్రద్ధ కలవానితనమునందు గట్టిగా నిలుకడ కలవాడిని; ఐతిన్= అయ్యాను.

**తాత్పర్యం:** ధర్మనందనా! నా పితృదేవతలు ఇట్లా బోధించి వెళ్ళిన తరువాత నా హృదయం సువర్ణదానం విషయంలో ఆరాటపడసాగింది. దానిని నిశ్చలబుద్ధితో చేసే దీక్ష కలవాడ నయ్యాను.'

**విశేషం:** పెద్దలు చెప్పిన గొప్ప విషయాన్ని ధర్మబుద్ధి కలవాడు శ్రద్ధాసక్తులతో ఆచరించాలి అనేది ఇందులో ధ్వని.

**వ. అని పలికి యా భూవల్లభునితో భీష్ముండు వెండియు నిట్లను 'నిది యేను గనినది సువర్ణదాన మహిమ; మఱియును వినినదియుం గల దాకర్ణింపుము. 137**

**ప్రతిపదార్థం:** అని; పలికి= మాటాడి; భీష్ముండు= భీష్ముడు; ఆ+భూవల్లభునితోన్= ఆ రాజుతో; వెండియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; ఇది= ఈ సంగతి; నేను= నేను; కనినది= చూచింది; సువర్ణ దానమహిమ= బంగారాన్ని దానం చేయటంలోని గొప్పతనం; మఱియును= ఇంకా; వినినదియున్= విన్నది కూడా; కలదు= ఉన్నది, ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి భీష్ము డా రాజుతో ఇంకా ఇట్లా అన్నాడు. 'ఇది నేను చూచిన విషయం. సువర్ణ దాన మహిమ ఇంకా విన్నది ఉన్నది. వినుము.

**సీ. పరశురాముఁడు గిన్క నిరువది యొక్క మా । ఱదయుఁడై రాజుల వెదకి వెదకి**
**వధియించి, కృపపుట్టి వాజిమేధంబు ప్రా । యశ్చిత్తముగఁ జేసి, యంతఁ దనివి**

సనక వసిష్ఠాది మునివరేణ్యులఁ గూర్చి । 'కల్మష పంకంబు గడిగి పురుషు
నత్యంత విమలుఁ జేయంగ నెయ్యది యోపు?' ననిన వసిష్ఠుఁ డిట్లనియె నతని

ఆ. 'కనఘ! విను సువర్ణ మగ్నిమయంబు దే । వతలు నగ్నిమయత నతిశయిల్లు
వారు గావునను సువర్ణదానంబు దే । వతల నీగి యట్ల శ్రుతులు సెప్పు. 138

**ప్రతిపదార్థం:** పరశురాముఁడు; కిన్కన్= కోపంతో; అదయుఁడు+ఐ= దయమాలినవాడై; రాజులన్= రాజులను; ఇరువది+ఒక్క మాఱు= ఇరవై ఒక్కమార్లు; వెదకి వెదకి= బాగా వెదకి; వధియించి= చంపి; కృప+పుట్టి= దయకలిగి; వాజిమేధంబు= అశ్వమేధ యాగాన్ని; ప్రాయశ్చిత్తముగన్= పాపం పోవటానికి చేసే కర్మ విశేషంగా; చేసి= ఆచరించి; అంతన్= ఆ మాత్రంతో; తనివి+ చనక= తృప్తి పొందక; వసిష్ఠ+అది మునివరేణ్యులన్= వసిష్ఠుడు మొదలైన మహర్షి శ్రేష్ఠులను; కూర్చి= సమావేశపరచి; కల్మష పంకంబున్= పాపమనే బురదను; కడిగి; పురుషున్= మానవుడిని; అత్యంత విమలున్= మిక్కిలి పరిశుద్ధుడినిగా, చేయంగన్= చేయటానికి; ఏ+అది= ఏది; ఓపున్= చాలును; అనినన్= అంటే; వసిష్ఠుఁడు= వసిష్ఠ మహర్షి; అతనికిన్= ఆ పరశురాముడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అనఘ!= పుణ్యాత్ముడా!; విను= వినుము; సువర్ణము= బంగారము; అగ్నిమయంబు= అగ్నితో నిండింది; దేవతలును= దేవతలు కూడా; అగ్నిమయతన్= అగ్నియే స్వరూపంగా ఉండటంతో; అతిశయిల్లువారు= గొప్పతనం పొంది ఉండేవారు; కావునన్= కనుక; సువర్ణదానంబు= బంగారం దానం చేయటం; దేవతలన్= దేవతలను; ఈగి= ఇవ్వటం; అట్లు+అ= ఆ విధంగానే; శ్రుతులు= వేదాలు; చెప్పున్= చెప్పుతాయి.

**తాత్పర్యం:** పరశురాముడు కోపంతో రాజులను ఇరువది ఒక్కసార్లు వెదకి వెదకి చంపాడు. చివరకు జాలి పుట్టింది. ప్రాయశ్చిత్తంగా అశ్వమేధయాగం చేశాడు. అయినా తృప్తి కలగలేదు. వసిష్ఠుడు మొదలైన మహర్షుల నందరినీ సమావేశపరచి 'అయ్యలారా! పాపపు బురదను కడిగివేసి పురుషుడిని మిక్కిలి పరిశుద్ధుడినిగా చేయగలది ఏది?' అని అడిగాడు. వసిష్ఠుడు - 'ఓ పుణ్యాత్ముడా! బంగారం అగ్నిమయం. దేవతలూ అగ్ని స్వరూపులే కనుక బంగారాన్ని దానమిస్తే దేవతల నిచ్చినట్లే. వేదాలు కూడా ఇట్లాగే చెప్పుతున్నాయి.

**విశేషం:** 'వెదకి వెదకి' ఎవ్వరినీ వదలరాదన్న కసితో కూడిన పట్టుదలను ఈ పదం వ్యక్తం చేస్తుంది. 'మునివరేణ్యులన్' తపశ్శక్తి చేత మహా విషయాలను దర్శించిన వారిని. అట్టివారే ఇటువంటి నిర్ణయాలు చేయగలరు. అగ్నిమయత నతిశయిల్లు - అగ్ని సర్వాన్ని కాల్చివేస్తుంది. కనుక పాపాలను కూడా నామరూపాలు లేకుండా చేస్తుందని భావం. 'దేవతలు' పుణ్యాపాపాల అంటు సొంటులు లేనివారు. కేవలం పుణ్యఫలం అనుభవించేవారు; శ్రుతులు సెప్పు - శబ్ద ప్రమాణం కనుక సందేహించరానిదని వ్యంగ్యం.

తే. కావున సువర్ణ మసదృశ । పావనతాస్పదము; దాని భక్తిమెయిన్ వి
ప్రావలి కిచ్చిన యతనికిఁ బావనతం గొఱఁత గలదె పావనమూర్తీ! 139

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; పావనమూర్తీ!= పవిత్ర స్వరూపం కలవాడా!; సువర్ణము= బంగారం; అసదృశ పావనతా+ ఆస్పదము= సాటిలేని పవిత్రతకు చోటు; దానిన్= ఆ సువర్ణాన్ని; భక్తిమెయిన్= భక్తితో; విప్ర+ఆవలికిన్= విప్రుల సముదాయానికి; ఇచ్చిన+అతనికిన్= ఇచ్చినవాడికి; పావనతన్= పవిత్రత విషయంలో; కొఱఁత= లోటు; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** ఓ పవిత్రమూర్తీ! బంగారం ఆ విధంగా పవిత్రతకు నిలయమైనది. దానిని భక్తితో వేదవిద్యలో ఆరితేరిన వారికి ఇచ్చేవాడికి పవిత్రత విషయంలో లోపం ఉంటుందా?

**విశేషం:** పద్యంలో పావనశబ్దం మూడు పర్యాయాలు ఆవృత్తమై కలిగే పవిత్రతయొక్క మహిమను నొక్కి చెప్తున్నది. ఇందులో విప్రశబ్దాన్ని వాడటం ప్రత్యేకంగా గుర్తించదగింది. "విద్యయా యాతి విప్రత్వమ్" విద్యచేత విప్రత్వాన్ని పొందుతాడని పెద్దలమాట. విద్య అంటే ముక్తి నిచ్చే జ్ఞాన విద్యయే.

క్రిందటి పద్యంలో అనఘ! అనే సంబోధనా, ఆ పద్యంలోని పావనమూర్తీ! అనే సంబోధనా గుర్తించదగినవి. నిజానికి నీ పాపం అశ్వమేధయాగంతోనే నశించింది. నీవు పుణ్యాత్ముడవే. పవిత్రుడవే. అయినా నీ బెంగ పోవటానికి ఉపాయం చెప్తున్నాం అనే తాత్పర్యాన్ని ఈ సంబోధనలు వ్యంజింపచేస్తాయి.

భక్తి మెయిన్ - అనేది శ్రద్ధా విషయకంగా తీసికొనదగిన జాగ్రత్తను గూర్చి హెచ్చరిస్తుంది.

## వసిష్ఠుఁడు పరశురామునకుఁ జెప్పిన సువర్ణ మహిమము (సం.13-83-40)

**వ. ఏను బ్రహ్మముఖంబున వినినది సువర్ణ విషయంబైన విశేషం బొక్కటి యెఱింగించెద; నవహితుండవై విను' మని పలికి యమ్మునిపతి యమ్మహాత్మున కిట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బ్రహ్మముఖంబునన్= బ్రహ్మదేవుడి ముఖం నుండి; వినినది= విన్నది; సువర్ణ విషయంబు+ఐన= సువర్ణ సంబంధమైన; విశేషంబు= విశేషం; ఒక్కటి; ఎఱింగించెదన్= తెలుపుతాను; అవహితుండవు+ఐ= పరాకుతనం లేనివాడవై; వినుము; అని పలికి; ఆ+మునిపతి= మునులలో శ్రేష్ఠుడైన ఆ వసిష్ఠుడు; ఆ+మహాత్మునకున్= దొడ్డబుద్ధిగల ఆ పరశురాముడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నేను బ్రహ్మనోటినుండి విన్న విషయం సువర్ణానికి సంబంధించినది ఒకటి నీకు తెలుపుతాను చెదరని మదితో వినుము. అని ఆ మునిశ్రేష్ఠుడు ఆ మహాత్ముడితో ఇట్లా చెప్పాడు.

**విశేషం:** 'బ్రహ్మముఖంబునన్' ఇది వేదవాక్యంవలె ఏ కొంచెమూ సందేహం లేకుండా నమ్మదగినదని భావం.

**క. గిరిజయు గిరీశుఁడును నొం । డొరువులకై తప మొనర్చి యొకళు లొకళ్లన్**
**బెరయం బడసి పరమసుఖ । భరితాత్మకు లైరి జగము ప్రమదం బందన్. 141**

**ప్రతిపదార్థం:** గిరిజయున్= పార్వతీదేవీ; గిరి+ఈశుఁడును= పరమేశ్వరుడున్నూ; ఒండొరువులకై= ఒకరికొకరకై; తపము+ఒనర్చి= తపస్సు చేసి; ఒకళులు= ఒకరు; ఒకళ్ళన్= ఒకరిని; బెరయన్+పడసి= పొంది; జగము= లోకము; ప్రమదంబు+అందన్= పరమ సంతోషం పొందునట్లుగా; పరమ సుఖ భరిత+ఆత్మకులు= మహాసుఖంతో నిండిన హృదయాలు కలవారు; ఐరి= అయ్యారు.

**తాత్పర్యం:** పార్వతీపరమేశ్వరులు ఒకరికొరకు ఒకరు తపస్సు చేసి ఒకరినొకరుగా పొందారు. లోకమంతా మహానందం పొందగా వారు పరమసుఖంతో నిండిన హృదయాలు కలవారయ్యారు.

**విశేషం:** పార్వతి తపం పంట పరమేశ్వరుడు. పరమేశ్వరుడి తపస్సు పంట పార్వతి. సృష్టిలో మరెక్కడా ఇట్టి స్థితి కానరాదు. ఇక్కడ పరమసుఖం అంటే దాంపత్యసుఖం. ఆ ఆదిమ దంపతుల కామసుఖం జగత్తు కంతటికీ ఆనందదాయకం కావటం కూడా గమనించదగింది. అంటే ఆ దంపతులు జగదానందానికే సమాగమం పొందుతారు తప్ప స్వసుఖాపేక్షతో కాదని భావం.

**వ. కొండొకకాలంబునకు నయ్యాదిమ గృహస్థుని తేజం బాపరమగృహిణి నిమిత్తంబుగా రేతో ధాతు రూపంబునం బ్రసన్నంబై యమ్మహేశ్వరు మానస వృత్తిం జేసి యగ్నియందు నిలిచియుండ, నత్తఱిం దారకుం డను నొక్క రక్కసుచేతం బెక్కు విధంబులం బాధలంబడి యనిమిషులును మునులును గమలయోనిం గానంజని యద్దానవుండు తముం బఱిచిన పాట్లెల్ల నెఱింగించిన, నద్దేవుండు వారితో 'దీని నెఱింగి యేను మున్న మీకు శోభనం బయ్యెడు తెఱంగు సమకట్టినవాఁడ; మీ రగ్ని నాశ్రయించి మాకు శుభంబు సేయవలయునని సంప్రార్థనంబు సేయునది; యతండు కర్తవ్యం బెఱుంగు; నరుగుం' డని నియోగించిన సంతోషించి' యట్లు చేసెద' మని యవ్విధాత వీడ్కొని వార లగ్నికడకుం బోవ నుత్సహించి. 142**

**ప్రతిపదార్థం:** కొండొక కాలంబునకున్= కొంత కాలానికి; ఆ+అదిమ గృహస్థుని తేజంబు= మొట్టమొదటి సంసారి అయిన ఆ ఈశ్వరుడి వీర్యం; ఆ పరమ గృహిణి నిమిత్తంబుగాన్= ఆ గొప్ప ఇల్లాలు కారణంగా; రేతస్ ధాతు రూపంబునన్= రేతస్సు అనే మూల పదార్థ రూపంతో; ప్రసన్నంబు+ఐ= జారినదై; ఆ+మహా+ఈశ్వరు మానస వృత్తిన్+చేసి= ఆ పరమేశ్వరుడి భావనచేత; అగ్నియందున్= అగ్నిదేవుడి యందు; నిలిచి+ఉండన్= నిలిచి ఉండగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; తారకుండు+ అను ఒక్కరక్కసు చేతన్= తారకుడనే ఒక రాక్షసుడిచేత; పెక్కు విధంబులన్= చాలా విధాలుగా; బాధలన్= బాధలను; పడి= పొంది; అనిమిషులును= దేవతలూ; మునులును= మనులున్నూ; కమలయోనిన్= కమలం జన్మస్థానంగా గల బ్రహ్మను; కానన్= చూడటానికి; చని=వెళ్ళి; ఆ+దానవుండు= ఆ రాక్షసుడు; తమున్= తమ్ము; పఱచిన+పాట్లుఎల్లన్= పెట్టిన కష్టాలన్నింటినీ; ఎఱింగించినన్= తెలుపుకొనగా; ఆ+దేవుండు= ఆ బ్రహ్మదేవుడు; వారితోన్= వారితో; దీనిన్= ఈ సంగతిని; ఎఱింగి= తెలిసి కొని; ఏను= నేను; మున్ను+అ= పూర్వమే; మీకున్= మీకు; శోభనంబు= మేలు; అయ్యెడు తెఱంగు= అయ్యే పద్ధతిని; సమకట్టిన వాఁడన్= ఏర్పాటు చేశాను; మీరు; అగ్నిన్= అగ్నిదేవుడిని; ఆశ్రయించి= చేరుకొని; మాకు; శుభంబు= మంచి; చేయవలయును= చేయాలి; అని; సంప్రార్థనంబు+ చేయునది= చక్కగా వేడుకొనండి; అతండు= ఆ అగ్నిదేవుడు; కర్తవ్యంబు= చేయదగినదానిని; ఎఱుంగున్= ఎరుగును; అరుగుండు= వెళ్ళండి; అని; నియోగించినన్= ఆజ్ఞాపించగా; సంతోషించి= ఆనందం పొంది; అట్లు+అ= ఆ విధంగానే; చేసెదము= చేస్తాము; అని; ఆ+విధాతన్= ఆ బ్రహ్మ దగ్గర; వీడ్కొని= సెలవు తీసికొని; అగ్నికడకున్= అగ్ని దగ్గరకు; పోవన్= వెళ్ళటానికి; ఉత్సహించి= వేడుకపడి.

**తాత్పర్యం:** కొంతకాలానికి ఆ మొదటి సంసారికి ఆ దొడ్డ ఇల్లాలు కారణంగా వీర్యం వెలువడింది. అతడు దానిని భావన శక్తిచేత అగ్నియందు నిలిపి ఉంచాడు. ఆ సమయంలో తారకాసురు డనే ఒక రాక్షసుడి వలన ఎన్నో బాధలు పడిన దేవతలు మునులు బ్రహ్మదగ్గరకు పోయి తాము పడిన బాధలన్నీ చెప్పుకొన్నారు. ఆ దేవుడు దీని సంగతి తెలిసికొని 'మీకు శుభమయ్యే పద్ధతి ముందే చేసి ఉంచాను. మీరు అగ్ని దగ్గరకు వెళ్ళి వేడుకొనండి. అతడికి ఏమి చేయాలో తెలుసు. వెళ్ళండి.' అని చెప్పగా వారెంతో సంతోషపడి అట్లాగే చేస్తాం అని బ్రహ్మదగ్గర సెలవు తీసికొని అగ్ని దగ్గరకు పోవటానికి ఉత్సాహపడ్డారు.

**విశేషం:** 'ఆదిమగృహస్థుడు' - పరమేశ్వరుడు జగత్తుకంతటికీ తండ్రి కనుక తొలి గృహస్థు. 'పరమగృహిణి' తన తపశ్శక్తిచేత పరమేశ్వరుడి దేహంలో సగభాగం పొందగలిగిన ఇల్లాలు. రేతస్సు శుక్లం, ధాతువు, మూలపదార్థం - ఇవి శరీర సంబంధంగా ఏడు. చర్మము, మాంసము, మజ్జ, అస్థి, వస, మేదస్సు, శుక్లము. బ్రహ్మదేవుడు భూతం, వర్తమానం, భవిష్యత్తు అనే మూడు కాలాలకు సంబంధించిన ఏర్పాట్లన్నీ ముందే చేసి ఉంచుతాడు. ప్రసన్నంబై - ప్రస్ఖలితంబై. పాఠాంతరము.

**సీ.** **ఆతని యున్నెడ యారసికొని చను। నప్పు డాతండు నిద్రాతిశయము**
**నూని ప్రచ్ఛన్నుఁడై యుండుట వారలు। గానక యున్నంతఁ, గప్ప యొకటి**
**యగ్ని పాతాళంబునం దున్కి యెఱిఁగింప। నప్పావకుఁడు డాఁగి పిప్పలమున**
**కేఁగెడు నెడ శాపమిచ్చె జిహ్వాస్ఫూర్తి। లేక రసాలి వివేక మెడలి**

**తే.** **యుండెడుమ కప్ప లని బొక్కలెండ నెండి। చచ్చియును నీరు వచ్చినఁ జావు బొంకు**
**సేసి యెలుఁగులు సెలఁగఁగఁ జెలఁగ వరము। వారు కప్పల కిచ్చి రవార్యతేజ!** **143**

**ప్రతిపదార్థం:** ఆతని ఉన్న+ఎడ= ఆ అగ్ని ఉన్నతావు; ఆరసికొని=వెదకికొని; చను+అప్పుడు= వెళ్ళే సమయంలో; ఆతండు= ఆ అగ్నిదేవుడు; నిద్రా+అతిశయమున్= నిద్దురముంపును; ఊని= పొంది; ప్రచ్ఛన్నుఁడు+ఐ= తెలియరానివాడై; ఉండుటన్= ఉన్నందు వలన; వారలు= ఆ దేవతలు, మునులు; కానక ఉన్నంతన్= గుర్తింపకున్నంతలో; కప్ప ఒకటి= ఒక కప్ప; అగ్ని= వహ్నిదేవుడు; పాతాళంబునందున్= పాతాళలోకంలో; ఉన్కి= ఉండటం; ఎఱిఁగింపన్= తెలుపగా; ఆ+పావకుఁడు= ఆ అగ్ని; డాఁగి= దాగుకొని; పిప్పలమునకున్= రావిచెట్టుకు; ఏగెడు+ఎడన్= వెళ్ళే సమయంలో; జిహ్వా స్ఫూర్తి= నాలుక కదలిక; లేక= లేకుండా; రస+ఆలి వివేకము= రుచుల సముదాయము ఏర్పాటు; ఎడలి= నశించి; కప్పలు= మండూకములు; ఉండెడుమ= ఉండుగాక; అని; శాపము+ఇచ్చెన్= శాపమిచ్చాడు; అవార్యతేజ= అడ్డుకొనరాని వర్చస్సు కలవాడా!; వారు = ఆ దేవతలు; మునులు; బొక్కలు= నేలలోని బొరియలు; ఎండన్= ఎండచేత; ఎండి= వేడెక్కి; (కప్పలు); చచ్చియును= చచ్చికూడా; నీరు= నీళ్ళు; వచ్చినన్= వస్తే; చావు=చావును; బొంకుచేసి= కల్లచేసి; ఎలుఁగులు= చప్పుళ్ళు; చెలఁగఁగన్= పిక్కటిల్లేటట్లుగా; చెలఁగన్= విజృంభించునట్లు; వరము= వరాన్ని; కప్పలకున్= కప్పలకు; ఇచ్చిరి= ఇచ్చారు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు ఉన్నచోటికి వారు వెదుక్కొంటూ వచ్చారు. అప్పు డతడు నిద్రముంచుకొనిరాగా ఎవ్వరికి కనపడకుండా ఉండటంవలన వారికి కనపడలేదు. ఒక కప్ప అగ్ని దేవుడు పాతాళంలో ఉన్న సంగతిని వారికి తెలియజేసింది. ఆ అగ్నిదేవుడు గుట్టుగా రావిచెట్టు దగ్గరకు పోతూ, 'కప్పలకు నాలుక కదలిక ఉండదు. రుచులు తెలియరావు' అని శాపమిచ్చాడు. దేవతలు, మునులు 'కప్పలు బొరియలలో ఎండలకు ఎండి చచ్చినా నీరు రాగానే చావును అబద్ధం చేసి బెకబెక చప్పుళ్ళతో విజృంభిస్తాయి' అని వరమిచ్చాడు.

**విశేషం:** జిహ్వాస్ఫూర్తి అంటే రుచి గ్రహించే శక్తి అని గ్రహించాలి.

**వ.** **ఇవ్విధంబున విబుధులు మునులు నమ్మండూకంబు మఱుకువ యుడిపి మఱియును.** **144**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; విబుధులు=దేవతలు; మునులు= మునులున్నూ; ఆ+మండూకంబు మఱుకువ= ఆ కప్ప దుఃఖాన్ని; ఉడిపి= తొలగించి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** ఇట్లా ఆ దేవతలు, మునులు ఆ కప్ప దుఃఖాన్ని పోగొట్టి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **అనలుని నన్వేషింపఁగ। వనగజ మొక్కండు రావివలను చతురతం**
**గనుగీఁటి చూపవార। వ్వనస్పతిం జేరఁజనఁగ వారని యలుకన్.** **145**

**ప్రతిపదార్థం:** అనలునిన్= అగ్నిని; అన్వేషింపఁగన్= వెదకగా; వనగజము= అడవి ఏనుగు; ఒక్కండు= ఒకటి; రావివలను= రావిచెట్టు వైపు; చతురతన్= నేర్పుతో; కనుగీటి= కన్ను కదలజేసి; చూపన్= చూపగా; వారు= ఆ దేవతలూ, మునులూ; ఆ వనస్పతిన్= ఆ చెట్టును; చేరన్+చనఁగన్= సమీపించగా; వారని అలుకన్= తగ్గని కోపంతో.

**తాత్పర్యం:** అగ్నిని వెదుకుతూ ఉంటే ఒక అడవి ఏనుగు ఒడుపుగా కనుసైగతో రావిచెట్టువైపు చూపింది. వారు ఆ చెట్టును సమీపించారు. (అగ్ని) పట్టరాని కోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** పువ్వులు లేకుండా కాయలు కాచే చెట్టును వనస్పతి అంటారు.

**వ. అయ్యగ్నిదేవుండు గజంబులకు జిహ్వ దిరుగం బడ శపించుచు శమీగర్భ నివాసి యయ్యె; నది మొదలుగా నగ్నికి శమీగర్భంబునం దుత్పత్తి కలిగె; నద్దివిజులును దాపసులును గజంబులు ప్రతీపజిహ్వంబు లయ్యును సర్వరసజ్ఞానంబు గలిగి మాననీయంబులగు వరంబులంజేసి రాజితంబు లగునట్లుగా ననుగ్రహించి యగ్గజంబు విషాదంబు మాన్చి; రంత నొక్క శుకం బెఱింగింప శమీగర్భంబున నగ్ని యునికి యెఱింగి యందఱుం గ్రందుకొనం గడువేగంబునం బొదివికొనిన, నిదుర సెడుటకుం గోపించి. 146**

**విశేషం:** ఆ+అగ్నిదేవుండు= ఆ అగ్నిదేవుడు; గజంబులకున్= ఏనుగులకు; జిహ్వ= నాలుక; తిరుగన్+పడన్= తిరుగబడే విధంగా; శపించుచున్= శాపమిస్తూ; శమీ గర్భ నివాసి= జమ్మికడుపులో ఉండేవాడు; అయ్యెన్= అయ్యాడు; అది మొదలుగాన్= అది మొదలుకొని; అగ్నికిన్=వహ్నికి; శమీగర్భంబునందున్= జమ్మికడుపులో; ఉత్పత్తి= పుట్టుక; కలిగెన్= ఏర్పడింది; ఆ దివిజులును= ఆ దేవతలున్నూ; తాపసులును= మునులూ; గజంబులు= ఏనుగులు; ప్రతీప జిహ్వంబులు= తిరుగబడిన నాలుక కలవి; అయ్యును= అయికూడా; సర్వ రసజ్ఞానంబు= అన్ని రుచుల తెలివి; కలిగి= ఉండి; మాననీయంబులు+అగు వరంబులన్+చేసి= మన్నింపదగిన వరముల వలన; రాజితంబులు= ఒప్పారేవి; అగు+అట్లుగాన్= అయ్యే విధంగా; అనుగ్రహించి= దయచూపి; ఆ+గజంబు విషాదంబున్= ఆ ఏనుగు దుఃఖాన్ని; మాన్చిరి= పోగొట్టారు; అంతన్= తరువాత; ఒక్క శుకంబు= ఒక చిలుక; ఎఱింగింపన్= తెలుపగా; శమీగర్భంబునన్= జమ్మి గర్భంలో; అగ్ని+ఉనికి= అగ్ని ఉండటం; ఎఱింగి= తెలిసికొని; అందఱున్= అందరూ; క్రందుకొనన్= సందడిహెచ్చగా; కడు వేగంబునన్= గొప్ప వేగంతో; పొదివికొనినన్= క్రమ్ముకొనగా; నిదుర= నిద్ర; చెడుటకున్= పాడైనదానికి; కోపించి= కోపం పొంది.

**తాత్పర్యం:** ఆ అగ్ని ఏనుగులకు నాలుక తిరగబడిపోయే విధంగా శపించాడు. జమ్మిగర్భంలో ప్రవేశించి నివసించాడు. దేవతలూ మునులూ ఏనుగులు తిరుగబడిన నాలుకలు కలవి అయినా అన్ని రుచులనూ చక్కగా గ్రహించగలిగి మంచి వరాలతో ఒప్పారే విధంగా వరమిచ్చి ఆ ఏనుగు చింత పోగొట్టారు. అప్పుడొక చిలుక తెలుపగా అగ్ని జమ్మికడుపులో ఉన్న సంగతి తెలిసికొని అందరూ ఒక్క పెట్టున చుట్టుముట్టారు. అగ్ని నిద్ర చెడినందుకు కోపం పొందింది.

**విశేషం:** "శమీగర్భంబునం దుత్పత్తి కలిగెన్" - జమ్మికొయ్యలను ఒరిపిడి చేస్తే నిప్పు త్వరగా పుట్టుతుంది.

**ఆ. జిహ్వ మరలఁ బడఁగఁ జిలుకల నగ్ని శ । పించె ; సురలు సెవుల కించునట్టి**
**పలుకు వాని కొసఁగి చిలుక నానందింపఁ । జేసి యా కృశానుఁ జేరఁ జనిన. 147**

**ప్రతిపదార్థం:** అగ్ని= అగ్నిదేవుడు; చిలుకలను; జిహ్వ= నాలుక; మరలఁబడఁగన్= తలక్రిందులయ్యేటట్లుగా; శపించెన్= తిట్టాడు; సురలు= దేవతలు; చెవులకున్= చెవులకు; ఇంచు+అట్టి= రుచించునట్టి; పలుకు= మాట; వానికిన్= ఆ చిలుకలకు; ఒసఁగి= ఇచ్చి; చిలుకన్= ఆ చిలుకను; ఆనందింపన్+చేసి= సంతోషపరచి; ఆ కృశానున్= ఆ అగ్నిదేవుడిని; చేరన్ చనినన్= సమీపించగా.

**తాత్పర్యం:** అగ్ని చిలుకలకు నాలుక తిరుగబడే విధంగా శపించాడు. దేవతలు చెవుల కింపైన పలుకు కలిగే విధంగా అనుగ్రహించి ఆ చిలుకల సంతాపాన్ని పోగొట్టారు. అగ్నిని చేరుకొన్నారు.

**వ. అతండు వారి నాలోకించి 'మీ వచ్చిన కార్యం బేమి?' యని యడిగిన వారుఁ దారక దైత్యు చేయు బాధ లెఱింగించి, వాఁ డేమి యుపాయంబునం దెగటాఱు నత్తెఱం గాపాదింపు' మని నిన్నుం బ్రార్థింప వచ్చితి మని పలికి వెండియు. 148**

**ప్రతిపదార్థం:** అతండు= అ అగ్ని; వారిన్= దేవతలను, మునులను; ఆలోకించి= చూచి; మీ వచ్చిన కార్యంబు= మీరు వచ్చిన పని; ఏమి; అని; అడిగినన్= అడుగగా; వారున్= వారును; తారక దైత్యు చేయు బాధలు= తారకు డనే రాక్షసుడు కల్గిస్తున్న బాధలను; ఎఱింగించి= తెలిపి; వాఁడు= ఆ రక్కసుడు; ఏమి ఉపాయంబునన్= ఏ ఉపాయంతో; తెగటాఱున్= చస్తాడో; ఆ+తెఱంగు= ఆ విధానాన్ని; ఆపాదింపుము= ఆచరించుము; అని; నిన్నున్= నిన్ను; ప్రార్థింపన్= వేడుకొనటానికి; వచ్చితిమి= వచ్చాం; అని; పలికి= చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** అగ్ని ఆ మునులనూ దేవతలనూ చూచి 'మీరు వచ్చిన పని ఏమిటి?' అని అడిగాడు. వారు తారకాసురుడు పెట్టుతున్న బాధలను తెలిపి, 'వా డే ఉపాయంతో చస్తాడో అది నీవు ఆచరించాలి - అని నిన్ను వేడుకొనటానికి వచ్చాం' అని పలికి ఇంకా.

**క. 'మాకుం గుశలము గోరుము; నీకును మే; లివ్విధంబు నీదు మహిమ యీ**
**లోకంబు లెల్ల మనములఁ। జేకొని కీర్తించునట్లు సేయుము కరుణన్.' 149**

**ప్రతిపదార్థం:** మాకున్= మాకు; కుశలము= క్షేమం; కోరుము= ఆకాంక్షించుము; ఈ+విధంబు= ఈ పద్ధతి; నీకును= నీకుకూడా; మేలు= మంచిది; నీదు మహిమ= నీ గొప్పతనం; ఈ లోకంబులు+ఎల్లన్= ఈ లోకాలన్నీ; మనములన్= మనస్సులలో; చేకొని= గ్రహించి; కీర్తించు+అట్లు= కొనియాడే విధంగా; కరుణన్= దయను; చేయుము.

**తాత్పర్యం:** 'మా క్షేమాన్ని నీవు కోరుము. ఇది నీకు కూడా మంచిదే. లోకాలన్నీ నీ మహిమను మనస్సులలో నిలుపుకొని కొనియాడే విధంగా దయచూపుము.'

**సీ. అనినఁ బ్రసన్నత 'నట్టులు చేసెద। నూఱడుం' డని వారి నూఱడించి**
**తనయందు వెలుఁగు శంభుని వీర్య మిడియె గం। గా గర్భరూపంబు గాఁగ నాతఁ;**
**డది యతి పరివృద్ధ మగుటయు ధరియింప। నోర్వక నిర్ఝర పర్వతంబు**
**తటమున శరవణస్థంబుగా గంగ యు। త్సృష్ట మొనర్ప నా శిఖరి సతరు**

**తే. వల్లరీగుల్మకముగ సువర్ణమయత । వెలుఁగ బాలుఁడై వెలిఁగె నవ్వీరగర్భ;**
**మచ్చటికి వచ్చి కృత్తిక లార్వురును మ । దీయ పుత్రకుఁ డనుచు నెత్తికొని రనఘ! 150**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముఁడా! అనినన్= అంటే; ఆతఁడు= ఆ వహ్ని; ప్రసన్నతన్= దయతో; అట్టులు= ఆ విధంగా; చేసెదన్= చేస్తాను; ఊఱడుండు= శాంతి పొందండి; అని; వారిన్= ఆ దేవతలను, మునులను; ఊఱడించి= శాంతపరచి; తనయందున్= తనలో; వెలుఁగు= ప్రకాశించే; శంభుని వీర్యము= శివుడి రేతస్సును; గంగా గర్భరూపంబు కాఁగన్= గంగకు పిండరూపంగా; ఇడియెన్= ఉంచాడు; అది= ఆ గర్భరూపం; అతిపరి వృద్ధము అగుటయున్= మిక్కిలి ఎక్కువగా పెరిగిపోయింది కావటంవలన; గంగ= గంగానది; ధరియింపన్+ఓర్వక= పట్టుకొనలేక; నిర్జర పర్వతంబు తటమునన్= దేవతలకొండ ఒడ్డున; శరవణస్థంబు= రెల్లుతోటలో నిలుచునది; కాన్= అయ్యేటట్లు; ఉత్సృష్టము ఒనర్పన్= జార్చివేయగా; ఆ శిఖరి= ఆ కొండ; సతరు వల్లరీ గుల్మకముగన్= చెట్లతో; తీవెలతో, పొదలతో పాటుగా; సువర్ణమయతన్= బంగారుతో నిండినదై; వెలుఁగన్= కాంతులు చిమ్మగా; ఆ+వీరగర్భము= వీరుడిదైన ఆ గర్భం; బాలుఁడు+ఐ= కుమారుడై; వెలిఁగెన్= ప్రకాశించింది; అచ్చటికిన్= ఆ తావునకు; వచ్చి= ఏ తెంచి; కృత్తికలు ఆర్వురును= కృత్తికలన్న పేరుగల ఆరుగురు స్త్రీలు; మదీయ పుత్రకుఁడు= నా కొడుకు; అనుచున్= అంటూ; ఎత్తికొనిరి= ఎత్తికొన్నారు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముఁడా! వా రట్లా అన్న వెంటనే అగ్ని అట్లాగే చేస్తాను. మీరు శాంతి పొందండి అని వారిని శాంత పరచి తనలో వెలుగుతున్న శివుడి రేతస్సును గంగలో గర్భరూపంగా వదిలాడు. అది చాలా పెద్దగా పెరిగిన కారణంగా గంగ దానిని మోయలేక మేరుపర్వతం ఒడ్డున ఉన్న ఒక రెల్లు తోటలో నిలిపింది. ఆ పర్వతం చెట్లతో, తీగలతో, పొదలతో బంగారు వన్నెతో మిలమిలలాడింది. ఆ వీరగర్భం ఒక బాలరూపంగా ప్రకాశించింది. అప్పు డక్కడకు వచ్చిన కృత్తిక లారుగురు నా కొడుకంటే నాకొడుకంటూ ముద్దుతో ఆ బాలుడిని ఎత్తుకొన్నారు.

**విశేషం:** 'నిర్జరపర్వతంబు' - మేరు పర్వతానికి 'సురాలయ' మని పేరు. కనుక అది దేవతల కొండ. శరముల వనము - శరవణము - రెల్లు తోట; వీర గర్భము - వీరుడైన శివుడి రేతస్సుతోనైన గర్భం లేక వీరరూపమైన గర్భం. కృత్తికలు - ఆరు నక్షత్ర రూపాల సముదాయం.

**వ. ఇత్తెఱంగున నొక్కట నెత్తికొనుటయు నక్కుమారుండును షణ్ముఖుండై యొక్క పెట్ట సకలకృత్తికా స్తన్యపానం బాచరించె; న ట్లగ్నిసంభవ గాంగేయ కార్తికేయత్వంబు లొందిన యయ్యిందుమౌళితేజంబు పదంపడి బ్రహ్మాది దేవతలు పూజింప దేవసేనాధిపతిత్వంబునం బేర్చి యర్చిర్మహిత యయిన మహాశక్తిం దారకుం బరిమార్చి బృందారక ముని బృందంబుల కానందం బొనర్చె' నని యిట్లప్పరమముని పరశురామునకుం జెప్పి పురహరుం డగు నప్పురుషుండు హిరణ్మయుం డగుటయు 'నద్దేవదేవుండు దాన తనూభవుండై తోఁచుటయుం దథావిధ రేతోధారణంబున వహ్ని హిరణ్యాత్మకరేతో మూర్తియై హిరణ్యరేతుం డనం జనుటయు, నతండు తద్రేతః కలనంబునం దన్మయుం డగుటంజేసి పురహరునకు వహ్నిరేతుం డను నభిధానంబు గలుగుటయుం దేటపఱచి యవ్విధంబున రూపవంతంబైనది కావున సువర్ణంబు జాతరూప నామకంబై పరఁగుటయు నెఱింగించె.151**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్=ఈ విధంగా; ఒక్కటన్= ఒక్క విధంగా; ఎత్తికొనుటయున్= ఎత్తుకొనగా; ఆ+కుమారుండును= ఆ బాలకుడునూ; షణ్ముఖుండు+ఐ= ఆరుమొగాలు కలవాడై; ఒక్కపెట్ట= ఒక్క మారే; సకల కృత్తికా స్తన్య పానంబు= కృత్తిక

లందరి చనుబాలు త్రాగటం; ఆచరించెన్= చేశాడు; అట్లు= అట్లా; అగ్ని సంభవ గాంగేయ కార్తికేయత్వంబులు= అగ్నిపుత్రుడు గంగ కొడుకు కృత్తికల తనయుడు కావటం; ఒందిన ఆ+ఇందుమౌళి తేజంబు= పొందిన ఆ చంద్రశేఖరుడి వీర్యం; పదం పడి= తరువాత; బ్రహ్మ+ఆది దేవతలు= బ్రహ్మ మొదలైన దేవతలు; పూజింపన్= కొలువగా; దేవసేనా+అధిపతిత్వంబునన్= దేవతలసేనకు నాయకుడవటం ద్వారా; పేర్చి= విజృంభించి; అర్చిర్ మహిత= జ్వాలలతో గొప్పగా వెలుగొందేది; అయిన మహాశక్తిన్= అయిన గొప్ప శక్తి అనే ఆయుధంతో; తారకున్= తారక రాక్షసుడిని; పరిమార్చి= చంపి; బృందారక ముని బృందంబులకున్= దేవతల, మునుల సముదాయాలకు; ఆనందంబు+ఒనర్చెన్= ఆనందాన్ని కలిగించింది; అని; ఇట్లు= ఈ తీరున; ఆ పరమముని= గొప్ప ముని అయిన ఆ వసిష్ఠుడు; పరశురామునకున్= పరశురాముడికి; చెప్పి= తెలియజేసి; పుర హరుండు= త్రిపురాసురులను రూపుమాపినవాడు; అగు= అయిన; ఆ+పురుషుండు= ఆ పరమేశ్వరుడు; హిరణ్మయుండు= బంగారమే స్వరూపమైనవాడు; అగుటయును= కావటమూ; ఆ+దేవదేవుండు= దేవులకు దేవుడైన ఆ శివుడు; తాను+అ= తానే; తనూభవుండు+ఐ= కుమారుడై; తోఁచుటయున్= కన్పట్టటమూ; తథావిధ రేతస్ ధారణంబునన్= ఆ విధమైన శుక్లాన్ని ధరించటంచేత; వహ్ని= అగ్ని; హిరణ్య+ఆత్మక రేతస్ మూర్తి+ఐ= స్వర్ణమయ మైన రేతస్సు ఆకారంగా గలవాడై; హిరణ్యరేతుండు= హిరణ్యరూపమైన రేతస్సు కలవాడు; అనన్+చనుటయున్= అనటానికి వీలైనవాడు కావటమూ; అతండు= ఆ అగ్ని; తద్ రేతస్+కలనంబునన్= ఆ రేతస్సు సంబంధంచేత; తద్+మయుండు= ఆ రేతస్సే స్వరూపమైనవాడు; అగుటన్+చేసి= కావటంవలన; పురహరునకున్= శివుడికి; వహ్నిరేతుండు+అను= అగ్ని రేతస్సుగా కలవాడనే; అభిధానంబు= పేరు; కలుగుటయున్= రావటమూ; తేట పఱచి= స్పష్టంచేసి; ఆ+విధంబునన్= ఆ తీరున; రూపవంతంబు= రూపం కలది; ఐనది= అయింది; కావునన్= కాబట్టి; సువర్ణంబు= బంగారం; జాతరూప నామకంబు= పుట్టిన రూపం కలది అన్న అర్థంతో 'జాతరూపం' అనే పేరుకలది; ఐ= అయి; పరఁగుటయును= ఒప్పారుటయూ; ఎఱింగించి= తెలిపి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఒకేమారు ఆ ఆరుగురూ ఎత్తుకొనటంవలన ఆ కుమారుడు ఆరుముఖాలు ధరించి ఒకేమారు ఆ ఆరుగురు కృత్తికల చనుబాలు త్రాగాడు. ఆ విధంగా అగ్నిపుత్రుడు, గంగాపుత్రుడు, కృత్తికాపుత్రుడు అనే పేర్లు పొందిన ఆ శివుడి తేజస్సు తరువాత బ్రహ్మ మొదలైన దేవతలు పూజింపగా దేవసేనకు నాయకుడై జ్వాలలతో వెలుగొందుతున్న మహాశక్తి అనే ఆయుధంతో తారకుడిని చంపివేశాడు. దేవతలకూ, మునులకూ ఆనందాన్ని కలిగించాడు' అని ఆ వసిష్ఠమహర్షి పరశురాముడికి చెప్పాడు. ఇంకా త్రిపురాసులను మట్టుపెట్టిన ఆ పరమపురుషుడు బంగారమే స్వరూపంగా గలవాడు కావటమూ, ఆ దేవదేవుడు తానే కుమారరూపంతో పుట్టటమూ, అట్టి శుక్లాన్ని ధరించటంచేత అగ్నిదేవుడు బంగారు రూపమైన రేతస్సు కలవాడై హిరణ్యరేతుడు కావటమూ, అట్టి రేతస్సే అతడి స్వరూపం కనుక ఆ అగ్ని శివుడి రేతోరూపుడు కనుక శివుడికి వహ్నిరేతుడనే పేరు కలగటమూ చక్కగా వివరించి స్పష్టం చేశాడు. బంగారానికి ఆ విధంగా రూపం ఏర్పడింది. కనుక దానికి జాతరూపమనే పేరు గలగటం కూడా చెప్పాడు.

**విశేషం:** నిజానికి సువర్ణ మహిమను వసిష్ఠుడు చెప్పినా ఇందులో కుమారస్వామి కథ రమణీయంగా ఇమిడి ఉన్నది. పరమేశ్వరుడే కుమారస్వామి. భారతీయులు పురుషుడే స్త్రీయందు పుత్రరూపంలో ఉదయిస్తాడని నమ్ముతారు. అగ్ని నుండి పుట్టటంవలన అగ్నిభవుడనీ, గంగయందు పుట్టటంవలన గంగాతనయు డనీ, కృత్తికల స్తన్యం క్రోలటంవలన వారికి పుత్రుడై కార్తికేయుడనీ, శరములవనంలో పుట్టటంవలన శరవణభవుడనీ, ఆరుముఖాలతో ఏకకాలంలో పాలు త్రాగటంవలన షణ్ముఖు డనీ ఎప్పుడూ కుమార స్వరూపంతో ఉండటంవలన 'కుమారస్వామి' అనీ అనేక పర్యాయాలు గర్భరూపంగా జారినవాడు కనుక స్కందుడనీ పేర్లు వచ్చాయి.

**క. మహితాత్మక! యేతాదృశ। మహిమంబు సువర్ణ మది సమంచిత తేజో**

**మహనీయము తద్దానము। మహత్త్వ మా శివుఁడ యెఱుఁగు మాకుం జూడన్. 152**

**ప్రతిపదార్థం:** మహిత+ఆత్మక!= దొడ్డది అయిన బుద్ధికలవాడా!; సువర్ణము= బంగారం; ఏతాదృశ మహిమంబు= ఇటువంటి గొప్పతనం కలది; అది; సమంచిత తేజస్+మహనీయము= చక్కగా ఒప్పారే కాంతితో మన్నన కెక్కింది; తద్+దానము మహత్త్వము= దానిని దానమివ్వటంలోని గొప్పతనాన్ని; మాకున్= మాకు; చూడన్= చూడగా; ఆ శివుఁడు+అ= ఆ సర్వము నెరిగిన శివుడే; ఎఱుఁగున్= తెలియును.

**తాత్పర్యం:** మహానుభావా! బంగారం మహిమ ఇటువంటిది. దాని కాంతి అపురూపమైనది. దాని దానంలోని గొప్పతనం సర్వజ్ఞుడైన శివుడికే తెలుసు నని మాభావం.

**విశేషం:** శివుడు అనటంవలన తక్కిన ఎవ్వరికీ పూర్తిగా తెలియదని భావన.

**వ. అవ్విశేషంబున నశేష కల్మషంబులం బాసి నరుండు విధూమత్వంబున వెలుంగు శుచియునుం బోలె శుచిత్వ సంపద సొంపారం బెంపారు నని యుపదేశించె నవ్వసిష్ఠ మునివరు వచనంబు లూఁది యమందాదర వర్ణనీయుండై సువర్ణదాన పరంపర లాచరించి. 153**

**ప్రతిపదార్థం:** ఆ+విశేషంబునన్= ఆ గొప్పతనంచేత; అశేష కల్మషంబులన్= అన్ని విధాలైన పాపాలనూ; పాసి= వదలి; నరుండు= మానవుడు; విధూమత్వంబునన్= పొగలేనితనంతో; వెలుంగు శుచియునున్+పోలెన్= ప్రకాశించే అగ్నివలె; శుచిత్వ సంపద= నిర్మలత్వం అనే సంపద; సొంపారన్= ఇంపులు నింపగా; పెంపారున్= గొప్పతనంతో వృద్ధి పొందుతాడు; అని; ఉపదేశించెన్= బోధించాడు; ఆ+వసిష్ఠమునివరు వచనంబులు= ఆ వసిష్ఠమహర్షి మాటలు; ఊఁది= గట్టిగా పట్టుకొని; అమంద+ఆదర వర్ణనీయుండు+ఐ= గొప్ప ఆదరంతో కొనియాడదగినవాడై; సువర్ణ దాన పరంపరలు= బంగారం దానాల వరుసలను; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ఆ దానమహిమవలన సర్వపాపాలను పోగొట్టుకొని నరుడు పొగలేని నిప్పువలె పరిశుద్ధ సంపదతో ఒప్పుతాడని బోధించాడు. పరశురాముడు 'ఆ వసిష్ఠమహర్షి మాటలను గట్టిగా హృదయంలో నిలుపుకొని ఎంతో ఆదరంతో సువర్ణదానాలు చేసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అగ్నికి శుచి అని ఒకపేరు. మాలిన్యం ఏ మాత్రమూ లేనివాడని భావం. అట్లాగే సువర్ణదానాలు చేసినవాడు పాపాలనే మలినాలు ఏ మాత్రమూ లేనివాడై స్వచ్ఛతతో ప్రకాశిస్తాడని తాత్పర్యం.

**క. ఆ రాముండు శుచిత్వ। శ్రీ రాజితుఁడయ్యెఁ నట్లు సేయుము నీవుం**

**గౌరవముఖ్యా! యది భవ। పారావారఘన యానపాత్రము సుమ్మీ!' 154**

**ప్రతిపదార్థం:** ఆ రాముఁడు= ఆ పరశురాముడు; శుచిత్వ శ్రీ రాజితుఁడు= పరిశుద్ధి అనే సంపదతో విరాజిల్లేవాడు; అయ్యెన్= అయ్యాడు; కౌరవముఖ్యా!= కురువంశం వారిలో శ్రేష్ఠుడా!; నీవున్= నీవుకూడా; అట్లు= ఆ విధంగా; చేయుము= ఆచరించుము; అది= ఆ పని; భవ పారావార ఘన యానపాత్రము= సంసారమనే సముద్రానికి గొప్ప నావ; చుమ్మీ!= సుమా!

**తాత్పర్యం:** పరశురాము డా విధంగా పాపాలులేనివాడై శుచిత్వ సంపదతో విరాజిల్లాడు. కురువరా! నీవు కూడా అట్లా ఆచరించుము. అది సంసారమనే సముద్రానికి పెద్దనావ సుమా!'

**విశేషం:** అలం: రూపకం. సంసారం అంటే పుట్టటం చావటం అనే రెండు చక్రాలలో తిరుగుతూ ఉండటం. అది అనంతంగా ఉంటుంది. కనుక సముద్రంతో పోలిక. ఘన యానపాత్రము అనటంవలన ప్రమాదంలేకుండా దాటిస్తుంది అన్న అర్థం వ్యక్తమౌతుంది.

**క. అని యనిమిష తటినీ ప్రియ। తనయుఁడు సెప్పుటయు ధర్మతనయుఁడు హృదయం**
**బునఁ బ్రమదము నిండార న। తనితో నతిభక్తి వినయ ధామం బగుచున్. 155**

**ప్రతిపదార్థం:** అని= అట్లా; అనిమిష తటినీ ప్రియ తనయుఁడు= దేవతల నది అయిన గంగ ముద్దుల కొడుకు; చెప్పుట యున్= చెప్పినంతనే; ధర్మతనయుఁడు= ధర్మరాజు; హృదయంబునన్= హృదయంలో; ప్రమదము= ఆనందం; నిండారన్= నిండి ఉండగా; అతనితోన్= ఆ భీష్ముడితో; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; వినయ ధామంబు= వినయానికి నెలవు; అగుచున్= అవుతూ.

**తాత్పర్యం:** భీష్మ డిట్లా చెప్పగా ధర్మరాజు హృదయంలో సంతోషం పొంగిపొరలింది. అతడు గొప్ప భక్తితో తన ఒడలెల్లా వినయమే కాగా.

**విశేషం:** ఏదైనా ఒక మహా విషయాన్ని తెలిసికొనగోరేవాడికి ఉండవలసిన లక్షణాలు భక్తి, వినయం, సంతోషం అనే వాటిని ఇక్కడ సూచిస్తున్నారు. 'అనిమిషతటినీ ప్రియతనయుడు' గంగవలె ఆశ్రయించినవారిని పవిత్రులను చేయగలవాడని భావం.

**వ. 'పితృ యజ్ఞ ప్రకారం బెఱింగింపవే' యనుటయు నక్కురువరుఁ డన్నరనాథున కిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** పితృ యజ్ఞ ప్రకారంబు= పితృదేవతల పూజా పద్ధతిని; ఎఱింగింపవే?= తెలుపుమా?; అనుటయున్= అన్నం తనే; ఆ+కురువరుఁడు= కౌరవులలో శ్రేష్ఠుడైన ఆ భీష్ముడు; ఆ+నరనాథునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఇట్లా; అనియెన్=అన్నాడు.

**తాత్పర్యం:** 'తాతా! దయచేసి పితృయజ్ఞం ఎట్లా చేయాలో చెప్పవూ?' అని అడుగగా భీష్ముడు ధర్మరాజునకు ఇట్లా చెప్పాడు.

**విశేషం:** బ్రహ్మయజ్ఞం, పితృయజ్ఞం; దేవయజ్ఞం, భూతయజ్ఞం; మనుష్యయజ్ఞం - అనే వాటిని పంచమహాయజ్ఞాలు అంటారు. మానవుడు వీటిని చేస్తూ ఉండాలి అని ధర్మశాస్త్రం శాసిస్తున్నది. అందులో పితృయజ్ఞం ఎట్లా చేయాలో ధర్మరాజు తెలిసికొనగోరు తున్నాడు.

**క. 'పితృపూజ సమగ్ర్యము దై। వత పూజనమునకు మనుజవల్లభ! పితృ దే**
**వతలఁ గొనియాడుదురు దే। వత లాదిగఁ గల్గు నెల్లవారును భక్తిన్. 157**

**ప్రతిపదార్థం:** మనుజవల్లభ!= రాజా!; దైవత పూజనమునకున్= దేవతల ఆరాధనకంటె; పితృపూజ= పితృదేవతలను పూజించటం; సమగ్ర్యము= మిన్న; దేవతలు+ఆదిగన్= దేవతలు మొదలుగా; కల్గు+ఎల్లవారును= ఉన్న అందరూ; భక్తిన్= భక్తితో; పితృదేవతలన్= పితృ రూపంలో ఉన్న దేవతలను; కొనియాడుదురు= ప్రశంసిస్తారు.

**తాత్పర్యం:** రాజా! పితృదేవతలను పూజించటం దేవతలను పూజించటం కన్నా మిన్న అయిన పని. ఎందుకంటే దేవతలు మొదలైనవారందరూ భక్తితో పితృదేవతలను స్తుతిస్తూ ఉంటారు.

**విశేషం:** తరచుగా 'మనుజవల్లభ!' వంటి సంబోధనలు కవి వాడుతూ ఉంటాడు. ఇందులో ఒక సూక్ష్మార్థం ఉన్నది. రాజు అన్నీ చక్కగా తెలిసికొని ఆచరిస్తే ప్రజలు అతడిని అనుసరించి మంచిమార్గంలో నడుస్తారు. "యథా రాజా తథా ప్రజాః " అని గదా సూక్తి.

**వ. విశేషించి మనుష్యులకుఁ బితృ సమారాధనంబు సర్వశుభ సాధనంబు. 158**

**ప్రతిపదార్థం:** విశేషించి= మిక్కిలిగా; మనుష్యులకున్= మానవులకు; పితృ సమారాధనంబు= పితృదేవతలను చక్కగా కొలవటం; సర్వ, శుభ సాధనంబు= అన్ని శుభాలకు సాధనం.

**తాత్పర్యం:** ప్రత్యేకించి మనుష్యులకు పితృపూజ అన్ని శుభాలకూ సాధనం.

**విశేషం:** ఈ ఘట్టంలో 'పితృ' శబ్దానికి మరణించిన తన వంశంవారని అర్థం.

## భీష్ముఁడు ధర్మజునకుఁ బితృపూజా విధానం బెఱింగించుట (సం.13-87-3)

**క. అమవస నమవసఁ బితృయ। జ్ఞము దగఁ బిండ ప్రదాన సహితముగా భ**
**క్తి మెయిం జేయు నతఁడు ని। త్యముఁ జేసిన వాఁడ యగు సమంచిత చరితా! 159**

**ప్రతిపదార్థం:** సమంచిత చరితా!= చక్కగా ఒప్పారు నడవడిగల ఓ ధర్మరాజా!; అమవసన్ అమవసన్= ప్రతి అమావాస్యనాడును; పిండ ప్రదాన సహితముగాన్= పిండములు పెట్టుటతోపాటుగా; తగన్= పద్ధతి ననుసరించి; భక్తిమెయిన్= భక్తితో; పితృయజ్ఞమున్= శ్రాద్ధమును; చేయు+అతఁడు= చేసేవాడు, నిత్యమున్= ప్రతిదినము; చేసినవాఁడు+అ= చేసినవాడే; అగున్= ఔతాడు.

**తాత్పర్యం:** చక్కని నడవడిగల ఓ ధర్మరాజా! ప్రతి అమావాస్యనాడూ భక్తితో పిండప్రదానంతో కూడా విధి ననుసరించి శ్రాద్ధం చేసేవాడు నిత్యమూ చేసినవాడే అవుతాడు.

**విశేషం:** అమావాస్య పితృప్రీతికరమైన దినం. పిండము అంటే మంత్రపూర్వకంగా ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున దర్భలపై ఉంచే అన్నపు ముద్దలు. నిజానికి పితృయజ్ఞము ప్రతిదినమూ చేయాలి. నెల కొక్కమారు వచ్చే అమావాస్యనాడు చేస్తే నిత్యమూ చేసినట్లే అని చెప్పటంవలన మానవులకు ఆ కార్యం మీద అనురక్తి కలుగుతుంది.

**వ. పితృయజ్ఞంబునకుఁ దిథి విశేషంబు సెప్పెద. 160**

**ప్రతిపదార్థం:** పితృయజ్ఞంబునకున్= శ్రాద్ధానికి; తిథి విశేషంబు= ప్రశస్తమైన తిథులను; చెప్పెదన్= చెప్తుతాను.

**తాత్పర్యం:** శ్రాద్ధానికి సంబంధించిన తిథుల విశేషాలను చెప్తుతాను.

**విశేషం:** 'తిథి' అంటే స్థూలంగా 'Date' అని అర్థం. ఇవి పదునైదు. మనం ఇప్పుడు అనుకునే తేదీవంటిదే. అయితే భారతీయుల తిథి సూర్యోదయంతో మొదలై సూర్యోదయం వరకు అనే లెక్కతో ఉండదు. మొత్తానికి రోజులో ఎక్కడో ప్రారంభమై 24 గంటలకు కొంచెం హెచ్చుతగ్గులుగా సాగుతూ ఉంటుంది.

సీ. పాడ్యమిఁ బితృయజ్ఞపరుఁడైనఁ జారుకాం । తాపతి; విదియఁ గాంతలకుఁ దండ్రి'
తదియను జవితిని దా వాజిధనికుండు । పశుభాగి పంచమి బహుసుతుండు,
షష్ఠి భానాత్ముండు, సప్తమిఁ గృషిభాగి, । యష్టమి వాణిజ్య పుష్టుఁడు, వసు
గజ ధర్మవిష్ణు చిత్తజ తిథులం । దేకశత జంతువులను గోచయముఁ గుప్య

తే. ములును దగ బ్రహ్మ వర్చస్వి పుత్రకులును । ధనము గలవాఁడు విను చతుర్దశి రణైక
భాగి పున్నమ నమవస భవ్య సర్వ । కామ్య ఫలభాగి యగుఁ జువ్వె కౌరవేంద్ర! **161**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర= ధర్మజా! పాడ్యమిన్= పాడ్యమి తిథినాడు; పితృ యజ్ఞపరుఁడు= శ్రాద్ధంపై ఆసక్తి కలవాడు; ఐనన్= అయితే; చారు కాంతాపతి= అందమైన భార్యకు భర్త (అవుతాడు); విదియన్= రెండవ తిథినాడు; కాంతలకున్= అందమైన స్త్రీలకు; తండ్రి= జనకుడు (అవుతాడు); తదియను= మూడవ తిథినాడునూ; చవితిని= నాలుగవ తిథియందూ; తాన్= తాను; వాజిధనికుండు= గుర్రాలు ధనంగా కలవాడు; పశుభాగి= పశుసంపద కలవాడు; పంచమిన్= అయిదవ తిథి; బహుసుతుండు= పెక్కండ్రు కొడుకులు కలవాడు; షష్ఠిన్= ఆరవ తిథియందు; భానాత్ముండు= ప్రకాశించే ఆత్మ కలవాడు; సప్తమిన్= ఏడవ తిథియందు; కృషిభాగి= వ్యవసాయం కలవాడు; అష్టమిన్= ఎనిమిదవ తిథియందు; వాణిజ్య పుష్టుఁడు= వర్తకపు పుష్టి కలవాడు; వసు గజ ధర్మ విష్ణు చిత్తజ తిథులందున్= నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి అనే పేర్లుగల తొమ్మిదవ, పదియవ, పదునొకండవ, పండ్రెండవ, పదుమూడవ తిథులందు; ఏక శతజంతువులను= ఒక వంద చొప్పున జంతువులను (ఏక శఫజంతువులను అని పాఠం - ఒంటి గిట్టగల జంతువులను అని అర్థం); గోచయమున్= ఆవుల మందలను; కుప్యములును= లోహ సంపదలను; తగన్= తగినంత; బ్రహ్మవర్చస్వి పుత్రకులును= బ్రహ్మతేజస్సు గల కొడుకులును; ధనము గలవాఁడు= సంపద కలవాడును, విను= వినుము; చతుర్దశిన్= చతుర్దశి అనే పదునాలుగవ తిథి యందు; రణ+ఏక భాగి= యుద్ధం మాత్రమే పొందేవాడు; పున్నమన్= పూర్ణిమయందు; అమవసన్= అమావాస్యయందు; భవ్య సర్వ కామ్య ఫలభాగి= శ్రేష్ఠములైన అన్ని కోర్కెల ఫలాన్ని పొందేవాడు; అగున్= అవుతాడు; చువ్వె= సుమా!

**తాత్పర్యం:** పాడ్యమినాడు శ్రాద్ధాన్ని ఆసక్తితో పెడితే అందమైన అతివకు భర్త అవుతాడు. విదియనాడు కన్యలకు తండ్రి అవుతాడు. తదియనాడు గుర్రాల ధనంకలవాడూ, చవితినాడు గోధనం కలవాడూ అవుతాడు. పంచమినాడు ఎక్కువమంది కొడుకులు కలవాడు, షష్ఠినాడు చక్కగా ప్రకాశించే బుద్ధికలవాడు, సప్తమినాడు వ్యవసాయ దారుడు, అష్టమినాడు వ్యాపారపుష్టి కలవాడూ అవుతాడు. నవమినాడు ఒంటిగిట్టలు గల పశువులు ధనంగా కలవాడూ, దశమినాడు ఆలమందలు కలవాడూ, ఏకాదశినాడు లోహసంపదలు కలవాడూ, ద్వాదశినాడు బ్రహ్మతేజస్సు గల పుత్రులు కలవాడూ, త్రయోదశినాడు భాగ్యవంతుడూ, చతుర్దశినాడు యుద్ధం మాత్రమే పొందేవాడూ, పూర్ణిమ, అమవస తిథులందు శ్రేష్ఠమైన కోర్కెలు అన్నీ తీరినవాడూ అవుతాడు.

**విశేషం:** ప్రతి తిథికి ఒక్కొక్క అధి దేవత ఉన్నది. నవమికి వసువులు, దశమికి - ఏనుగులు, ఏకాదశికి యముడు, ద్వాదశికి భృగువు, త్రయోదశికి - మన్మథుడు. ఈ పద్యంలో ఈ తిథులను అధిదేవతల పేర్లతో వ్యవహరించారు. కుప్యమంటే వెండి బంగారం కాక తక్కిన లోహం.

క. అపరంబగు పక్షంబును । నపరాహ్ణము మేలు పితృసమర్చనమున కా
ద్యపుఁ దిథి దశమి చతుర్దశి । నృపవర! యప్పక్షమునను నింద్యతఁ బొరయున్.' **162**

**ప్రతిపదార్థం:** నృపవర!= రాజోత్తమా! పితృసమర్చనమునకున్= పితృదేవతల పూజకు; అపరంబు అగు పక్షంబును= రెండవదైన కృష్ణ పక్షమూ; అపరాహ్ణము= పగటిని అయిదు భాగాలుగా చేస్తే అందులో నాలుగవ భాగమైన కాలమూ; మేలు= శ్రేష్ఠమైనవి; ఆ పక్షమునను= ఆ కృష్ణ పక్షంలో; ఆద్యము+తిథి= మొదటిదైన పాడ్యమి తిథీ; దశమి= పదో తిథీ; చతుర్దశి= పదునాలుగో తిథీ; నింద్యతన్= చెడ్డ స్థితిని; పొరయున్= పొందుతాయి.

**తాత్పర్యం:** రాజా! కృష్ణపక్షమూ, అపరాహ్ణమూ శ్రాద్ధానికి మంచి సమయాలు. కృష్ణపక్షంలో పాడ్యమి, దశమి, చతుర్దశి తిథులు మంచివి కావు.'

**విశేషం:** అపరాహ్ణము: అహస్సు అంటే పగటిభాగం. సుమారు పండ్రెండు గంటలనుకొని మూడు భాగాలు చేస్తే మూడవ భాగాన్ని అపరాహ్ణం అంటారు. అంటే సూర్యోదయం ఆరుగంటలకు అయితే మధ్యాహ్నం రెండుగంటల తరువాత కాలం. మరొక విధంగా పగటిని అయిదు భాగాలు చేస్తే ఒక్కొక్కభాగం సుమారు రెండు గంటల ముప్పైఆరు నిముషాలు అవుతుంది. ఈ భాగాలు మూడు గడువగా నాలుగవ భాగం అపరాహ్ణం అవుతుంది. ఈ లెక్క ప్రకారం కూడా మధ్యాహ్నం రెండు గంటల తరువాతి కాలమే అపరాహ్ణం. అపరపక్షమంటే కృష్ణపక్షం. పూర్ణిమ తరువాత పాడ్యమి మొదలుకొని అమావాస్యదాకా ఉండే పదునైదు రోజుల కాలం. ఇది నెలలో రెండవ భాగం కనుక 'అపరపక్షం' అంటారు.

**క. అనిన విని ధర్మసూనుం। 'డనఘా! యెద్దానఁ బితృసమర్చన మొనరిం**
**చిన నధిక ఫలంబగు న। వ్వినుత ద్రవ్యములఁ జెప్పవే తెలియంగన్.' 163**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= శ్రద్ధతో ఆలకించి; ధర్మసూనుండు= ధర్ముడి కొడుకు యుధిష్ఠిరుడు; అనఘా!= పుణ్యాత్ముడా!; ఏ+దానన్= దేనితో; పితృసమర్చనన్= పితృదేవతలపూజ; ఒనరించినన్= చేస్తే; అధిక ఫలంబు= ఎక్కువ ఫలం; అగున్= కలుగుతుందో; ఆ+వినుత ద్రవ్యంబులన్= మేలైన ఆ పదార్థాలను; తెలియంగన్= తెలిసే విధంగా; చెప్పవే= దయతో తెలియజేయుము.

**తాత్పర్యం:** భీష్ముడు చెప్పినది విని ధర్మరాజు 'పుణ్యాత్ముడా! శ్రాద్ధం ఏ వస్తువులతో చేస్తే ఎక్కువ ఫలం వస్తుందో ఆ మేలైన పదార్థాలను తెలియజెప్పుము' అన్నాడు.

**వ. అనుటయు దేవవ్రతుం డతని కిట్లనియె. 164**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అన్నంతనే; దేవవ్రతుండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా భీష్ముడు ధర్మరాజుకు ఈ విధంగా చెప్పాడు.

**క. 'తిలపాయస ఘృతములు పితృ। కలనములకు నుత్తమములు; గవ్యంబు మహా**
**ఫల; మెదియైనన్ మత్స్యం। బులు మాంసము విహితవిధిఁ బ్రభూత ఫలంబుల్. 165**

**ప్రతిపదార్థం:** తిల పాయస ఘృతములు= నువ్వులు, పరమాన్నము, నేయి; పితృ కలనములకున్= శ్రాద్ధములకు; ఉత్తమములు= శ్రేష్ఠములైనవి; గవ్యంబు= ఆవులనుండి ఏర్పడేది; ఎది+ఐనన్= ఏదైనా; మహాఫలము= గొప్ప ఫలం కలది అవుతుంది; మత్స్యంబులు= చేపలు, మాంసము= మాంసమున్నూ; విహిత విధిన్= శాస్త్రం ప్రకారం; ప్రభూత ఫలంబుల్= దొడ్డ ఫలం కలవి.

**తాత్పర్యం:** నువ్వులు, పాయసమూ, నేయి శ్రాద్ధాలకు మేలైన వస్తువులు. ఆవులనుండి ఏర్పడేది ఏదైనా గొప్ప ఫలాన్నిస్తుంది. చేపలు, మాంసమూ శాస్త్రం విధించిన తీరు ననుసరించి దొడ్డఫలా న్నిస్తాయి.

**విశేషం:** గవ్యము - గోవునుండి వచ్చేది; పాలు, పెరుగు, నేయి, పేడ, మూత్రం - వీటిని పంచ గవ్యాలంటారు. చేపలు, మాంసము - అవి ఆహారంగా ఉపయోగించేవారు మాత్రమే శ్రాద్ధములలో వాడాలి. అందరూ కాదు.

**తే. గొఱియనంజుడు ఖడ్గంబు నెఱచి గండ । మృగమునందలి పలలంబు మేఁకమాంస**

**మొక్కఁడొకటికి ఫలమున నెక్కు డండ్రు । పితృ సమర్చన విదులైన పెద్ద లధిప! 166**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; పితృ సమర్చన విదులు= పితృదేవతల పూజలను గూర్చి చక్కగా తెలిసినవారు; ఐన పెద్దలు= అయిన వృద్ధులు; గొఱియ నంజుడు= గొఱ్ఱె మాంసం; ఖడ్గంబు+ఎఱచి= ఖడ్గమృగం మాంసం; గండమృగము నందలి పలలంబు= గండభేరుండం అనే దాని అందలి మాంసం; మేఁక మాంసము= మేక మాంసమూ; ఒకటికిన్= ఒకదాని కంటె; ఒకఁడు= ఒకటి; ఫలమునన్= ఫలం విషయంలో; ఎక్కుడు= మిన్న; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** గొఱ్ఱె, ఖడ్గమృగం, గండ భేరుండం, మేక అనేవాటి మాంసం ఒకదానికంటె ఒకటి మేలైనదని శ్రాద్ధతత్త్వం తెలిసిన పెద్దలు చెప్తుతూ ఉంటారు.

**విశేషం:** గండ మృగం - నిఘంటువులో దీనికి ఖడ్గమృగం అని అర్థం చూపారు. పద్యంలో అది ముందే ఉన్నది. కనుక గండమృగం అంటే గండ భేరుండ పక్షిగా గ్రహించాలి. నిజానికి దీనిని పక్షి అంటున్నా అది మృగజాతికి చెందినదే అని శబ్దరత్నాకరం చెప్తుతున్నది. ఈ పద్యంలో మాంస పర్యాయ వాచకాలు నంజుడు, ఎఱచి, పలలము అనే వాటిని కవి ప్రయోగించటం విశేషం.

**వ. నక్షత్ర విశేషం బాకర్ణింపుము. 167**

**ప్రతిపదార్థం:** నక్షత్ర విశేషంబు= నక్షత్రాలకు సంబంధించిన ప్రత్యేకతను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** శ్రాద్ధం విషయంలో ఏ నక్షత్రం ప్రత్యేకత ఏమిటో చెప్తుతాను వినుము.

**సీ. కార్తెఁ బైతృక మగు కర్మ మొనర్ప ని । శ్శత్రుత, రోహిణిఁ, బుత్ర లబ్ధి,**

**శశితారకమున నోజః ప్రాప్తి యార్ద్రఁ గ్రూ । రపు వర్తనము, పునర్వసువు నందుఁ**

**గృషి ఫలోదయ, మనిమిష గురుతార సు । పుష్టి, యాశ్లేష నుత్కృష్ట వీర**

**తనుజ లాభము, మఖం దనకులమున పెంపు, । పుబ్బ సౌభాగ్య విస్ఫూర్తి సిద్ధి,**

**తే. యర్యమునితారఁ బెక్కపత్యములు పుట్టు, । హస్తమునఁ గర్మసఫలత, యవులతార**

**సుందరాకార యుతులగు సుతులఁ గనుట, । యనిలతార వాణిజ్య వర్ధనము గలుగు. 168**

**ప్రతిపదార్థం:** పైతృకము= పితృదేవతలకు సంబంధించినది; అగు కర్మము= అయిన పని (శ్రాద్ధం); కార్తెన్= కృత్తికా నక్షత్రమున్న రోజున; ఒనర్పన్= చేస్తే; నిశ్శత్రుత= పగవారు లేనిస్థితి (కలుగుతుంది); రోహిణిన్= రోహిణియందు; పుత్రలబ్ధి=

కొడుకులు కలగటం; శశితారకమునన్= మృగశిర నక్షత్రంలో; ఓజస్+ప్రాప్తి= బలం కలగటం; ఆర్ద్రన్= ఆర్ద్రలో; క్రూరము+వర్తనము= దయలేని నడవడి; పునర్వసువునందున్= పునర్వసు నక్షత్రంలో; కృషి ఫల+ఉదయము= సేద్యపు ఫలం పుట్టటం; అనిమిషగురుతారన్= దేవతలగురువు బృహస్పతి నక్షత్రం-పుష్యమిలో; సుపుష్టి= మంచి దేహబలం; ఆశ్లేషన్= ఆశ్లేష నక్షత్రంలో; ఉత్కృష్ట వీర తనుజలాభము= గొప్ప వీరులైన కొడుకులు కలగటం; మఖన్= మఖ అనే నక్షత్రంలో; తన కులమున పెంపు= తన కులంలో అభివృద్ధి; పుబ్బన్= పూర్వఫల్గుని నక్షత్రంలో; సౌభాగ్య విస్ఫూర్తి సిద్ధి= గొప్ప భాగ్యం పెరగటం అనే సిద్ధి; అర్యమునితారన్= సూర్యుడు దేవతగాగల ఉత్తర ఫల్గునీ నక్షత్రమునందు; పెక్కు= ఎక్కువ మంది; అపత్యములు= సంతానములు; పుట్టున్= కలుగును; హస్తమునన్= హస్త అనే నక్షత్రంలో; కర్మసఫలత= పనులు ఫలించటం; అవులతారన్= తరువాతిదైన చిత్త అనే నక్షత్రంలో; సుందర+ఆకార యుతులు= అందమైన రూపంతో కూడినవారు; అగు సుతులన్= అయిన కొడుకులను; కనుట= పొందటం; అనిలతారన్= వాయువు దేవతగాగల స్వాతియందు; వాణిజ్య వర్ధనము= వర్తకం పెంపొందటం; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** పితృకర్మ కృత్తికలో చేస్తే పగవారులేని స్థితి, రోహిణిలో కొడుకులు కలగటం, మృగశిరలో దేహబలం, ఆర్ద్రలో క్రూరత్వం, పునర్వసులో సేద్యపు ఫలం దక్కటం, పుష్యమిలో మంచి పుష్టి; ఆశ్లేషలో గొప్ప శక్తి కల కుమారులు కలగటం, మఖలో వంశాభివృద్ధి; పుబ్బలో సౌభాగ్యం పెరగటం, ఉత్తరలో సంతానం పెంపొందటం, హస్తలో కార్యసిద్ధి, చిత్తలో సుందర పుత్రులు కలగటం, స్వాతిలో వర్తకం అభివృద్ధి అనే ఫలాల నిస్తుంది.

**విశేషం:** ఒక్కొక్క నక్షత్రానికి ఒక్కొక్క అధిదేవత ఉంటుంది. ఈ పద్యంలో కొన్నింటిని ఆ అధిదేవతల పేర్లతో వ్యవహరించారు. మృగశిర - చంద్రుడు, పుష్యమి - బృహస్పతి; ఉత్తర - సూర్యుడు; స్వాతి- వాయువు, 'పూర్వఫల్గుని'లో మొదటి అక్షరాలను గ్రహించి 'పూఫ' అనటం అది క్రమంగా పుబ్బగా మారటం గుర్తించదగినది. (ఫల్గుని, ఫాల్గునము, ఫల్గునుండు అనే పదాలలో న కారమే కాని ణ కారం కాదన్నది బాగా గుర్తించాలి).

**సీ.** **వినుము విశాఖ సత్తనయ బహుత్వ మ । నూరాధ రాజాధికార, మైంద్ర**
**మునఁ బ్రభుత్వము పెంపు; మూలఁ బూర్వాషాఢ । నారోగ్యమును నుత్తమాతిశయము,**
**నుత్తరాషాఢ శోకోదయ రహితత్వ, । మభిజిత్తునందు విద్యాభియుక్తి,**
**శ్రవణ కాలమునఁ బరమ గతి సిద్ధి, ధ । నిష్ఠ రాజ్యము, జలనిధిపతార**

**తే.** **మొదలుగాఁ దారకంబులు మూఁట నఖిల । కార్యఫలములు, సదజావికములు గోవు,**
**లవుల మూఁటను గుప్య వృద్ధ్యశ్వకాయు । వులు శుచి శ్రాద్ధకర్తకుఁ గలుగు నధిప!'** 169

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వినుము= శ్రద్ధతో ఆలకించుము; విశాఖన్= విశాఖనక్షత్రంలో; సత్ తనయ బహుత్వము= మంచి కొడుకుల పెక్కువ; అనూరాధన్= అనూరాధయందు; రాజ+అధికారము= ప్రభుత్వం; ఐంద్రమునన్= ఇంద్రుడు దేవతగాగల జ్యేష్ఠయందు; ప్రభుత్వము పెంపు= అధికారం పెరగటం; మూలన్= మూలా నక్షత్రంలోను; పూర్వాషాఢన్= పూర్వాషాఢ అనే నక్షత్రంలోను (వరుసగా); ఆరోగ్యమును= రోగాలు లేనితనమూ; ఉత్తమ+అతిశయము= గొప్ప అభివృద్ధి; ఉత్తరాషాఢన్= ఉత్తరాషాఢ నక్షత్రంలో; శోక+ఉదయ రహితత్వము= దుఃఖం కలగటం అనేది లేకపోవటం; అభిజిత్తునందున్= అభిజిత్తులో; విద్యా+అభియుక్తి= మంచి విద్య అలవడటం; శ్రవణ కాలమునన్= శ్రవణ నక్షత్రం ఉన్న వేళయందు; పరమగతి సిద్ధి= మోక్షం సిద్ధించటం; ధనిష్ఠన్= ధనిష్ఠలో; రాజ్యము; జలనిధి ప తార= జలములకు రాజైన వరుణుడి నక్షత్రం శతభిషం; మొదలుగాన్ =మొదలుకొని; తారకంబులు= నక్షత్రములు; మూఁటన్= మూడింటియందు; అఖిల కార్య ఫలములు= అన్ని పనులు నెరవేరటం; సత్

అజ+అవికములు= మంచి మేకలు, గొర్రెలు (అనువాటి లాభం); గోవులు= ఆవులు (లభించటం); అవుల మూఁటను= తరువాతి మూడు నక్షత్రాలలో; కుప్యవృద్ధి+అశ్వక+ఆయువులు= లోహముల సంపద పెరగటం; గుర్రాలు లభించటం, ఆయువు పెరగటం; శుచిశ్రాద్ధ కర్తకున్= పరిశుద్ధుడైన శ్రాద్ధ కర్తకు; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** రాజా! వినుము. విశాఖయందు మంచి పుత్రులు కలగటం, అనూరాధయందు ప్రభుత్వం, జ్యేష్ఠలో అధికారం పెంపొందటం, మూలయందు ఆరోగ్యం, పూర్వాషాఢయందు గొప్ప అభివృద్ధి, ఉత్తరాషాఢయందు శోకం తొలగిపోవటం, అభిజిత్తునందు విద్యాభివృద్ధి, శ్రవణంలో మోక్షం, ధనిష్ఠయందు రాజ్యం, శతభిషంలో కార్యఫలం, పూర్వాభాద్రలో మేకలు గొర్రెలు వృద్ధి పొందటం, ఉత్తరాభాద్రలో గోసంపద వృద్ధి పొందటం, రేవతి యందు లోహసమృద్ధి, అశ్వినియందు గుర్రాల లాభం, భరణియందు ఆయువు అనే ఫలాలు నిర్మలుడైన శ్రాద్ధకర్తకు లభిస్తాయి.'

**విశేషం:** ఐంద్రము - ఇంద్రదేవతాకము - జ్యేష్ఠ; అభిజిత్తు - నక్షత్రాలు ఇరువదియేడు మాత్రమే. కాని కొందరు ఉత్తరాషాఢ, శ్రవణాలకు మధ్య 'అభిజిత్తు' అనే మరొక నక్షత్రాన్ని కూడా లెక్కిస్తారు. ఆ లెక్కన ఇరవై ఎనిమిది. జలనిధి - సముద్రము. దాని రాజు వరుణుడు. అతడు దేవత అయిన నక్షత్రం శతభిషం. అది మొదలుకొని మూడు అంటే శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర. తరువాతి మూడు తారలు రేవతి, అశ్విని, భరణి.

'నక్షత్రేష్టి' అని ఒక మంత్రభాగం ఉన్నది. అందులో నక్షత్రాల వరుస కృత్తికతో ప్రారంభమైనది. ప్రస్తుతం అశ్వినితో మొదలవుతున్న వ్యవహారం ఉన్నది. వైదిక సంప్రదాయా న్ననుసరించి ఈ సందర్భంలో కృత్తికతో ప్రారంభించినట్లు భావించాలి.

'కుప్యం' అంటే వెండి, బంగారు కాక తక్కిన లోహాలు. శుచిశ్రాద్ధకర్త - అనటంవలన శ్రాద్ధానికీ, పవిత్రతకూ గట్టి సంబంధం ఉన్నదని తెలియవస్తున్నది.

**వ. అనిన నప్పుడమితేఁ డప్పురుషవరునిం 'బితృ పూజనంబులకుఁ బాత్రంబు లెట్టివి గావలయు?' నని యడిగిన నయ్యమరనదీనందనుం డిట్లనియె. 170**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+పుడమితేఁడు= ఆ రాజు; ఆ+పురుషవరునిన్= పురుషులలో శ్రేష్ఠుడైన ఆ భీష్ముడిని; పితృపూజనంబులకున్= పితృదేవతల ఆరాధనలకు, పాత్రంబులు= యోగ్యతకలవి; ఎట్టి+అవి= ఏ విధమైనవి; కావలయును= కావాలి; అని; అడిగినన్= అడుగగా; ఆ+అమరనదీ నందనుండు= ఆ గంగకొడుకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఇట్లు చెప్పగా ధర్మరాజు భీష్ముడితో 'పితృదేవతల ఆరాధనకు యోగ్యులు ఎవరు?' అని అడిగితే భీష్మ్ము డిట్లా చెప్పాడు.

**క. దైవిక కృత్యంబులకును । భూవర! భూసురుల సూక్ష్మముగ శోధింపం**
**గా వలదు గాని పితృ పూ । జావిధికిఁ బరీక్ష వలయు సమ్యగ్భంగిన్. 171**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; దైవిక కృత్యంబులకును= దైవ సంబంధమైన కార్యాలకు; భూసురులన్= బ్రాహ్మణులను; సూక్ష్మముగన్=నిశితంగా; శోధింపంగాన్= పరీక్షించటం; వలదు= వద్దు; కాని; పితృ పూజా విధికిన్= శ్రాద్ధపు పనికి; సమ్యక్+భంగిన్= చక్కని తీరున; పరీక్ష= గుణ దోషాలను పట్టిచూడటం; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** రాజా! దేవతాసంబంధమైన పనులలో బ్రాహ్మణులను అణువణువునా పరీక్షించ నక్కరలేదు. కాని, శ్రాద్ధాలకు మాత్రం చాలా గట్టిగా పరీక్ష చేయాలి.

**విశేషం:** ఇచట భూసురులంటే ఆయా పనులలో మంత్ర తంత్రాలను ప్రయోగించేవారని భావం. బ్రాహ్మణుడిలోని ఏ చిన్న లోపమైనా శ్రాద్ధాన్ని నాశనం చేస్తుందని ధ్వని.

**వ. కావున నీ వడిగి మేలు చేసి తాకర్ణింపుము. 172**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నీవు; అడిగి= ప్రశ్నించి; మేలు చేసితి= మంచిపని చేశావు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** కనుక నీవు ఈ విషయం అడిగి మంచి చేశావు. వినుము.

**తే. కులవయో రూపశీల విద్యల నుదాత్తు। లనఁగఁ దగువారు పంక్తి పావనులు తద్గు**

**ణమ్ము లారయ లేని జనములు పంక్తి। దూషకులు పైతృకమునకు దోషదూర! 173**

**ప్రతిపదార్థం:** దోషదూర!= తప్పుడు గుణాలకు దూరమైన ఓ ధర్మరాజా!; పైతృకమునకున్= శ్రాద్ధానికి; కుల వయస్ రూప శీల విద్యలన్= కులం; వయస్సు, రూపం, మంచి స్వభావం; గొప్పచదువు అనువాటిచేత; ఉదాత్తులు= గొప్పవారు; అనఁ గన్+తగువారు= అనటానికి యోగ్యత కలవారు; పంక్తి పావనులు= భోజనంచేసేవారి వరుసను పవిత్రం చేయగలవారు; ఆరయన్= పరిశీలించి చూడగా; తత్+గుణమ్ములు= ఆ గుణాలు; లేనిజనములు= లేని మనుష్యులు; పంక్తి దూషకులు= బంతిని (వరుసను) చెడగొట్టువారు.

**తాత్పర్యం:** మంచికులం, ప్రాయం, అందచందాలు, స్వభావం, విద్య అనే వాటిచేత ఉన్నతులనదగినవారు శ్రాద్ధక్రియలో పంక్తిని పవిత్రం చేసేవారు. ఈ గుణాలు లేనివారు పంక్తిని పాడుచేసేవారు.

**విశేషం:** 'దోషదూర' అనే సంబోధనలో ఎన్నడూ దోషాలను దగ్గరకు రానివ్వకుము అన్న సూచన తోస్తున్నది. రూపం ఉన్నచోట మంచిగుణాలు ఉంటాయని ఒక భావన. "యత్రాకృతి స్తత్ర గుణాః" శీలం' అంటే అభ్యాసాదులవలన రావటం, పోవటం లేని స్వభావం. ఇచట 'సచ్ఛీలం' అనే అర్థాన్నే గ్రహించాలి. 'ఆరయన్' అనే పదం చేత ఆ గుణాలు లేనితనాన్ని జాగ్రత్తగా పరిశీలించి తెలిసికొనాలని భావం.

**వ. మఱియును బంక్తి దూషకులం జెప్పెద నాకర్ణింపుము. 174**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకా; పంక్తిదూషకులన్= వరుసను పాడుచేసేవారిని; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇంకా పంక్తిని పాడుచేసేవారిని తెలుపుతాను వినుము.

**విశేషం:** కలిసి మెలగనివారు - పంక్తిదూషకులు.

**సీ. జూదరి గరదుండు వేదంబు సదువని। వాఁడు వడ్డికి నిచ్చువాఁడు గాయ**

**కుండు గ్రామము పనిఁ గుడుచునాతఁడు గృహ। దాహి కుష్ఠము గల తనువు నాతఁ**

డఱుఁ దెవుల్ గొన్నాతఁ డఖిల వస్తువులును । నమ్మెడు నతఁడు సోమమ్ము విక్ర

యించిన యతఁ డబ్ధి సంచార లాభోప । జీవకుం డుర్వీశ సేవకుండు

తే. భార్యయును దాను బుత్రులఁ బంచికొన్న । వాఁడు పసులఁ బెక్కేలెడువాఁడు కపట

కృత్యముల ద్రుచ్చిమిని శిల్పకృతుల బ్రదుకు । వారు పంక్తిదూషకు లండ్రు పౌరవేంద్ర!' 175

**ప్రతిపదార్థం:** పౌరవేంద్ర!= పురువంశరాజా!; జూదరి= జూదగాడు; గరదుండు= విషం పెట్టేవాడు; వేదంబు+చదువనివాఁడు= వేదాధ్యయనం చేయనివాడు; వడ్డికిన్= ధనాన్ని వడ్డికి; ఇచ్చువాఁడు= ఇచ్చేవాడు; గాయకుండు= పాటలు పాడి పొట్టగడుపుకొనేవాడు; గ్రామము పనిన్= ఊరి పనితో; కుడుచు+అతఁడు= జీవనం చేసేవాడు; గృహదాహి= ఇళ్ళకు నిప్పు పెట్టేవాడు; కుష్ఠముగల తనువు+అతఁడు= కుష్ఠ రోగంగల శరీరం ఉన్నవాడు; అఱు+తెవుల్ కొన్న+అతఁడు= క్షయరోగం కలవాడు; అఖిల వస్తువులును= అన్ని దినుసులను; అమ్మెడు+అతఁడు= అమ్మేవాడు; సోమమ్ము= యజ్ఞంలో ఉపయోగించే సోమరసాన్ని; విక్రయించిన+అతఁడు= అమ్మినవాడు; అబ్ధి సంచార లాభ+ఉపజీవకుండు= సముద్ర ప్రయాణాలతో కలిగిన లాభంతో బ్రతికేవాడు; ఉర్వీ+ఈశసేవకుండు= రాజు కొలువులో ఉన్నవాడు; భార్యయును= పెండ్లామును; తాను; పుత్రులన్= బిడ్డలను; పంచికొన్నవాఁడు= పంచుకొన్నవాడు; పసులన్= పశువులను; పెక్కు= ఎక్కువగా; ఏలెడువాఁడు= పాలించేవాఁడు; కపట కృత్యములన్= వంచన పనులతో; ద్రుచ్చిమిని= దొంగతనంతోను; శిల్పకృతులన్= నేర్పుగల పనులతోను; బ్రదుకువారు= జీవించేవారు; పంక్తిదూషకులు= పంక్తిని చెరచేవారు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! జూదగాడు, విషం పెట్టేవాడు, వేదం చదవనివాడు, వడ్డీవ్యాపారి, గాయకుడు, కరణం, ఇళ్ళు కాల్చేవాడు, కుష్ఠరోగి, క్షయరోగి, అన్ని వస్తువులను అమ్మేవాడు, సోమం అమ్మేవాడు, సముద్రవ్యాపారి, రాజోద్యోగి, భార్యా తనూ కన్నకొడుకులను పంచుకొన్నవాడు, వ్యాపారంకొరకు పశువులను పెద్ద సంఖ్యలో పెంచేవాడు, మోసం పనులు, దొంగతనం, శిల్పపు పనులు - వీటితో బ్రదుకు సాగించేవారూ పంక్తి దూషకులు అంటారు.'

**విశేషం:** యజనం, యాజనం, అధ్యయనం, అధ్యాపనం, దానం, ప్రతిగ్రహం అని బ్రాహ్మణుడికి వేదం నిర్ణయించిన కర్మలు ఆరు. వీటికి విరుద్ధమైనవన్నీ అతడికి దుష్టగుణాలుగా లెక్క. గాయకుడు, శిల్పి ఎట్లా దుష్టులు? అనే అనుమానం కలుగవచ్చును. కేవలం ఆత్మానందంకొరకు, ఇతరుల ఆనందంకొరకు మాత్రమే అయితే అవి దోషాలు కావు. అవి బ్రతుకు తెరువులయితే వాటివలన విహిత కర్మలు చెడతాయి కనుక అవి దోషాలు. భార్యా, తనూ, కొడుకులను పంచుకొనటం అంటే నిత్యమైన దాంపత్య ధర్మాన్ని చెరచటం. అది దోషం.

వ. అని చెప్పి వెండియు. 176

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి ఇంకా అంటున్నాడు.

క. 'తలఁ జీరసుట్టియును జె । ప్పులు దొడిగియుఁ జేసినట్టి భోజనము ఫలం

బలఘుచరిత! పద్మజుఁ డసు । రల భాగం బని విధించెఁ బ్రకటఫణితులన్. 177

**ప్రతిపదార్థం:** అలఘు చరిత!= గొప్పదైన ప్రవర్తన కలవాడా!; పద్మజుఁడు= బ్రహ్మ; తలన్= నెత్తికి; చీర= వస్త్రము; చుట్టియును= చుట్టుకొని; చెప్పులు= పాదరక్షలు; తొడిగియును= ధరించీ; చేసిన+అట్టి భోజనము ఫలంబు= చేసిన భోజనం ఫలం; అసురల భాగంబు= రాక్షసులకు చెందేది; అని; ప్రకట ఫణితులన్= స్పష్టమైన తీరులతో; విధించెన్= ఏర్పాటు చేశాడు.

**తాత్పర్యం:** దొడ్డ నడవడికల రాజా! తలకు గుడ్డచుట్టి చెప్పులు వేసికొని చేసిన భోజనం ఫలం రాక్షసులకు చెందుతుందని బ్రహ్మ స్పష్టమైన పద్ధతులతో శాసించాడు.

**విశేషం:** ప్రధానంగా సందర్భాన్నిబట్టి పితృ కర్మలయందు అని సంభావించాలి. ఇతర సమయాలలో కూడా ఇది దోషమే.

**తే.** **పలుదెఱంగుల వంటకంబులఁ బ్రమాద । జాతమై యశుచిత్వంబు సంభవించి**
**నప్పు డసురులు గొండ్రు క్రియా ఫలంబుఁ; । దిలలు పైఁ జల్ల నశుచిత దొలఁగు నండ్రు.** **178**

**ప్రతిపదార్థం:** పలు+తెఱంగులన్= పెక్కు విధాలుగా; వంటకంబులన్= శ్రాద్ధంకొరకు ఉంచిన భోజన పదార్థాలమీద; ప్రమాద జాతము+ఐ= పారపాటువలన పుట్టినదై; అశుచిత్వంబు= మైల; సంభవించిన+అప్పుడు= కలిగినప్పుడు; క్రియా ఫలంబున్= అట్టి వంటకాలతో చేసిన శ్రాద్ధ కర్మల ఫలితాన్ని; అసురులు= రాక్షసులు; కొండ్రు= గ్రహిస్తారు; పైన్= మీద; తిలలు= నువ్వులు; చల్లన్= చల్లితే; అశుచిత= అశుభ్రత; తొలఁగును= పోతుంది; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** వంటకాలమీద ఎన్నో విధాలుగా మైల సోకవచ్చు. అట్టి వాటితో పితృకర్మంచేస్తే ఆ ఫలం రాక్షసులు దక్కించుకొంటారు. ఆ వంటకాలమీద నువ్వులు చల్లితే ఆ అశుచిత్వం పోతుం దంటారు.

**విశేషం:** మైలపడ్డ వంటకాలతో శ్రాద్ధం చేయటం వ్యర్థమే కాదు అనర్థదాయకం కూడా అవుతుందని భావం.

**క.** **శాంతుఁడు సువ్రతశీలుఁడు । దాంతుం డధ్యాపకుండు దయగలవాఁ డ**
**త్యంత ప్రబోధ సంప । ద్వంతుఁడు పావనులు భూపవర! పంక్తులకున్.** **179**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; శాంతుఁడు= మనస్సును నిలువరించినవాడు; సువ్రతశీలుఁడు= చక్కని వ్రతములు చేసే స్వభావం కలవాడు; దాంతుండు= ఇంద్రియాలపై అదుపు గలవాడు; అధ్యాపకుండు= వేదం చదివించేవాడు; దయగలవాఁడు= ప్రాణులయందు జాలిగలవాడు; అత్యంత ప్రబోధ, సంపద్వంతుఁడు= మిక్కిలి ఎక్కువ అయిన జ్ఞానమనే సంపదగలవాడు; పంక్తులకున్= శ్రాద్ధ భోజనపు వరుసలకు; పావనులు= పవిత్రులు.

**తాత్పర్యం:** రాజా! శాంతుడు, వ్రతశీలుడు, దాంతుడు, వేదం బోధించేవాడు, ప్రాణులయందు జాలిగలవాడు, పండిన జ్ఞానసంపద గలవాడూ శ్రాద్ధభోజన పంక్తులలో పవిత్రులు.

**విశేషం:** అంతరింద్రియ నిగ్రహం శాంతి, బహిరింద్రియ నిగ్రహం దాంతి; ప్రబోధం అంటే జ్ఞానం. మోక్ష విషయకమైన బుద్ధి.

**క.** **వ్యాకరణ ధర్మశాస్త్ర వి । వేకములఁ బురాణజాత వేదిత్వము బ్ర**
**హ్మైకత్వ బోధనము నధి । పా! కలిగినవారు పంక్తిపావనులు గడున్.** **180**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; వ్యాకరణ ధర్మశాస్త్ర వివేకములు= శబ్దశాస్త్రం, ధర్మశాస్త్రం అనే వాటిలో ప్రజ్ఞ; పురాణజాత వేదిత్వము= పురాణాల సముదాయం తత్త్వపూర్వకంగా తెలిసి ఉండటమూ; బ్రహ్మ+ఏకత్వ బోధనము= బ్రహ్మం ఒకటే అనే జ్ఞానమూ; కలిగినవారు= ఉన్నవారు; కడున్= ఎక్కువగా; పంక్తి పావనులు= పంక్తిని పవిత్రం చేసేవారు.

**తాత్పర్యం:** వ్యాకరణజ్ఞానమూ, ధర్మశాస్త్రజ్ఞానమూ, పురాణజ్ఞానమూ, పరమాత్మజ్ఞానమూ కలవారు మిక్కిలిగా పంక్తి పావనులు.

**విశేషం:** వ్యాకరణం శబ్ద బ్రహ్మమును గురించి చెప్పుతుంది. ధర్మశాస్త్రం చేయదగినవాటినీ, చేయరానివాటినీ తెలపటం ద్వారా ఉత్తమత్వాన్ని కలిగిస్తుంది. పురాణాలు వేదార్థాలను చక్కగా వివరిస్తాయి. ఇవి క్రమంగా ఒక దానిద్వారా మరొకటి పుష్టిని పొంది బ్రహ్మజ్ఞానానికి సహకరిస్తాయి. బ్రహ్మజ్ఞానం తుదిమెట్టు. తక్కినవి వరుసగా దానికి పూర్వంలో ఉండే సోపానాలు.

**తే. మేలి గుణములు గనియు నమిత్రజనము । శ్రాద్ధ పాత్రంబుఁ జేయంగఁ జన దమిత్ర**
**దత్తమైనది భస్మహుతంబుఁ జౌట । నిడిన విత్తును బోలెనై చెడు నృపాల! 181**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా!; మేలిగుణములు= ఉత్తమ గుణాలు; కనియును= చూచికూడా; అమిత్రజనమున్= మైత్రిలేని జనాన్ని; శ్రాద్ధ పాత్రంబున్= పితృకర్మలో తగినదిగా; చేయంగన్+చనదు= చేయరాదు; అమిత్రదత్తము= పగవారికి ఇచ్చింది; ఐన+అది= అయిన వస్తువు; భస్మహుతంబున్= బూడిదలో వేసిన హోమ ద్రవ్యమున్నూ; చౌటన్= చవిటినేలలో; ఇడిన విత్తును పోలెన్= పెట్టిన విత్తనంవలె; ఐ= అయి; చెడున్= చెడిపోతుంది.

**తాత్పర్యం:** రాజా! మంచిగుణాలు ఉన్నా పగవారిని శ్రాద్ధంలో పాత్రం చేయరాదు. పగవారికి ఇచ్చినది బూడిదలో వేసిన హోమద్రవ్యంవలె, చవిటినేలలో విత్తిన బీజంవలె చెడిపోతుంది.

**విశేషం:** అలం: ఉపమ. "ఏకక్రియం భవేన్మిత్రమ్" - ఒకే విధమైన పనులతో కలసిమెలసి ఉండేవారిని మిత్రము అంటారు. పనులలో విరుద్ధంగా నడచేవారు అమిత్రులు. వారు శ్రాద్ధంలో పంక్తికి పనికిరారు.

**క. మును ముట్ట నెఱిఁగి శ్రాద్ధం । బునకుం గైకొనుట మేలు భూసురునిం గై**
**కొని యరసి కాఁ డనిన నా । తని యుమ్మలికంబు సెఱుచు ధార్మికు నైనన్. 182**

**ప్రతిపదార్థం:** భూసురునిన్= బ్రాహ్మణుడిని; మును= ముందుగానే; ముట్టన్= పూర్తిగా; ఎఱిఁగి= తెలిసికొని; శ్రాద్ధంబునకున్= పితృయజ్ఞానికి; కైకొనుట= గ్రహించటం; మేలు= మంచిది; కైకొని= గ్రహించి; అరసి= తరువాత పరీక్షించి; కాఁడు= పనికిరాడు; అనినన్= అంటే; ఆతని+ఉమ్మలికంబు= ఆ బ్రాహ్మణుడి గుండెదిగులు; ధార్మికుని+ఐనన్= ధర్మం తప్పక నడచుకొనే వాడినైనా; చెఱుచున్= చెడగొట్టుతుంది.

**తాత్పర్యం:** యోగ్యతను ముందే కడదాకా పరీక్షించి బ్రాహ్మణుడిని నియోగించటం మంచిది. అట్లాకాక నియోగించిన తరువాత పరీక్షించి పనికిరాడంటే అతడి వేదన ఎంత ధర్మాత్ముడినైనా పాడుచేస్తుంది.

**విశేషం:** ఇది చాలా సుకుమారమైన విషయం. పిలిచి అవమానిస్తే ఆ దోషం తనకే త్రిప్పికొడుతుందని గుర్తించి జాగ్రత్త పడాలి.

**క. ఈ తెఱఁగు లెల్ల నెఱిఁగి సు । నీతంబుగ శ్రాద్ధ మధిక నియతి నడపు ని**
**ర్ధూత దురితుండు నడచుఁ బ్రి । యాతిశయం బెసఁగ దేవయానమున నృపా!' 183**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; ఈ తెఱఁగులు= ఈ పద్ధతులు; ఎల్లన్= అన్నింటినీ; ఎఱిఁగి= తెలిసికొని; శ్రాద్ధము= పితృయజ్ఞాన్ని; అధిక నియతిన్= ఎక్కువ నిష్ఠతో; సునీతంబుగన్= చక్కగా చేసిన దానినిగా; నడపు నిర్ధూత దురితుండు= నడపునట్టి పూర్తిగా తొలగిపోయిన పాపాలు కలవాడు; ప్రియ+అతిశయంబు= సంతోషం యొక్క ఎక్కువతనం; ఎసఁగన్= వృద్ధిపొందగా; దేవయానమునన్= దేవతల దారిలో; నడచున్= ప్రయాణిస్తాడు.

**తాత్పర్యం:** రాజా! ఈ పద్ధతులన్నీ చక్కగా తెలిసికొని గొప్ప నిష్ఠతో శ్రాద్ధం చక్కగా ఆచరించే పాపరహితుడు సంతోషం ఉప్పొంగుతుండగా దేవమార్గంలో ప్రయాణిస్తాడు.'

**విశేషం:** సునీతము. అధిక నియత అనే పదాలు శ్రద్ధ సడలనీయని లక్షణానికి వ్యంజకాలు.

**వ. అని చెప్పి శాంతనవుండు కౌంతేయాగ్రజునితో మఱియు నిట్లను 'బ్రహ్మమానస పుత్త్రుండగు నత్రిమునీంద్రు వంశంబునకుం దొడవగు దత్త్రాత్రేయ నందనుండు నిమినామధేయుండగు సంయమి కొడుకు శ్రీమంతుండను పేరివాఁడు మృతుం డగుటయు. 184**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; చెప్పి= తెలియజేసి; శాంతనవుండు=శంతనుడి కొడుకు భీష్ముడు; కౌంతేయ+అగ్రజునితోన్= కుంతి కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజుతో; మఱియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పుతున్నాడు; బ్రహ్మ మానస పుత్త్రుండు= బ్రహ్మమనస్సునుండి పుట్టిన కొడుకు; అగు అత్రి ముని+ఇంద్రు వంశంబునకున్= అయిన అత్రి మహర్షి వంశానికి; తొడవు+అగు= ఆభరణం అగు; దత్త్రాత్రేయ నందనుండు= అయిన దత్త్రాత్రేయుడి కొడుకు, నిమినామధేయుండు= నిమి అనే పేరుగలవాడు; అగు సంయమి కొడుకు= అయిన మహర్షి పుత్రుడు; శ్రీమంతుండు+అను పేరివాఁడు= శ్రీమంతుడనే పేరుగలవాడు; మృతుండు= చనిపోయినవాడు; అగుటయున్= కాగా.

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పి భీష్ముడు ధర్మరాజుతో ఇంకా ఇట్లా అన్నాడు. 'బ్రహ్మదేవుడి మానసపుత్రుడు అత్రిమహర్షి వంశానికి అలంకారం అనదగిన దత్త్రాత్రేయుడి కుమారుడు నిమి. అతడి కొడుకు శ్రీమంతు డనేవాడు చనిపోయాడు.

**విశేషం:** మానసపుత్రుడు - సంకల్పమాత్రంచేత పుట్టినవాడు. సనక సనందనాదులు కూడా ఇట్టివారే.

ఇతిహాసాలు ధర్మవిషయాలను సూటిగా చెప్పుతాయి. అవి హృదయంలో చక్కగా నాటుకొనటానికి కొన్ని కథలమీద సమన్వయించి చూపుతాయి. ఇది అట్టి కథలలో ఒకటి.

**క. నిమి యక్కుమారునకు శ్రా । ద్ధము సేయుచు నుండి భక్తిఁ దలఁచినఁ గృప న**
**త్రిమునీంద్రుఁడు వచ్చి క్రియా । సమీక్షణము సేసె మది నెసఁగు నర్మిలితోన్. 185**

**ప్రతిపదార్థం:** నిమి= నిమిమహర్షి; ఆ+కుమారునకున్= ఆ చనిపోయిన కొడుకునకు; శ్రాద్ధము= పితృయజ్ఞం; చేయుచున్= చేస్తూ; ఉండి; భక్తిన్= భక్తితో; తలఁచినన్= భావించగా; కృపన్= దయతో; అత్రి ముని+ఇంద్రుఁడు= అత్రి మహర్షి; వచ్చి= ఏతెంచి; మదిన్= హృదయంలో; ఎసఁగు= వృద్ధిపొందే; అర్మిలితోన్= ప్రేమతో; క్రియా సమీక్షణము= కర్మయొక్క బాగోగుల పరీక్షను; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** నిమి ఆ కొడుకుకు శ్రాద్ధం చేస్తూ భక్తితో తలచినంతనే అత్రి మహర్షి దయతో వచ్చి పెరుగుతున్న ప్రేమతో కార్యకలాపాన్ని చక్కగా పరికించాడు.

**వ. అట్లు పావక క్రియా కలాపం బనుసంధించి యా సంయమివరుండు. 186**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; పావక క్రియా కలాపంబు= పవిత్రం చేసే పనుల సముదాయాన్ని; అనుసంధించి= చక్కగా సమన్వయించి; ఆ సంయమి వరుండు= ఋషిశ్రేష్ఠుడైన ఆ అత్రి.

**తాత్పర్యం:** ఆ పవిత్ర క్రియా సముదాయాన్నంతా చక్కగా భావించి యా మహర్షి శ్రేష్ఠుడు.

### అత్రిమహాముని నిమి కెఱింగించిన శ్రాద్ధక్రియా విశేషము (సం.13-91-3)

**ఆ. 'పరిగృహీతు లైన బ్రాహ్మణుల్ పంక్తి పా । వన వరిష్ఠు లగుట, వారి కిడిన**
**దర్భ విష్టరములు దక్షిణావర్తంబు । లగుటఁ గ్రియలు దిలసమగ్ర లగుట. 187**

**ప్రతిపదార్థం:** పరిగృహీతులు= శ్రాద్ధమునకు ఎన్నుకొని తెచ్చినవారు; ఐన బ్రాహ్మణుల్= అయిన విప్రులు; పంక్తి పావన వరిష్ఠులు= వరుసను పవిత్రం చేసేవారిలో మిక్కిలి గొప్పవారు; అగుటన్= కావటాన్నీ, వారికిన్= వారికై; ఇడిన= పెట్టిన; దర్భ విష్టరములు= దర్భల ఆసనాలు; దక్షిణ+ఆవర్తంబులు= కుడివైపు మలగినవి; అగుటన్= కావటాన్ని; క్రియలు= ఆయా కర్మ విశేషాలు; తిల సమగ్రలు= నువ్వులు నిండుగా కలవి; అగుటన్= కావటాన్నీ.

**తాత్పర్యం:** ఎన్నుకొని తెచ్చిన బ్రాహ్మణులు పంక్తి పావనులలో మిక్కిలి శ్రేష్ఠులు కావటం, వారికై పెట్టిన దర్భ ఆసనాలు కుడివైపు మలగినవి కావటం, క్రియలన్నీ నువ్వులతో నిండుదనం కలవి కావటమూ (190వ పద్యంలోని 'ఉగ్గడించి సంభావించెన్' అనే దానితో అన్వయం).

**క. అమలినతర దర్భన్యా । సము లెందును దక్షిణంబు సాఁగ నిడిన య**
**గ్రములు గలిగి యుండుట మం । త్రము లయ్యె విధుల కంచితముగ నడచుటన్. 188**

**ప్రతిపదార్థం:** అమలిన తర దర్భ న్యాసములు= మిక్కిలి స్వచ్ఛములైన దర్భలు ఉంచుటలు; ఎందును= అన్ని చోట్ల; దక్షిణంబు= కుడివైపుగా; సాఁగన్= వ్యాపించేటట్లు; ఇడిన+అగ్రములు= ఉంచిన చివళ్ళు; కలిగి+ఉండుట= కలిగి ఉండటాన్ని; మంత్రములు= వేదమంత్రాలు; ఆ+ఆ విధులకున్= ఆయా శాస్త్ర విధానములకు; అంచితముగన్= చక్కగా కుదిరేటట్లుగా; నడచుటన్= వర్తించటాన్ని.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన దర్భలు ఉంచిన పద్ధతి కుడివైపు సాగిన చివళ్ళు కలిగి ఉండటాన్నీ, మంత్రాలు ఆయా పనులకు తగినట్లుగా నడవటాన్నీ.

**ఆ. మునగ యుల్లి యడవి మునగ దుర్మాంసము । లానుగమ్ము మలినమైన యుప్పు**
**కటియ జీలకఱ్ఱ కటివేము గురుజ యిం । గువ ప్రవర్జనీయ కోటి యగుట. 189**

**ప్రతిపదార్థం:** మునగ= మునగకూర; ఉల్లి= ఎర్రగడ్డలు, తెల్ల గడ్డలు; అడవి మునగ= అడవి మునగ అనే శాకము; దుర్మాంసములు= చెడిన మాంసములు; ఆనుగమ్ము= సొరకాయ; మలినము+ఐన ఉప్పు= చెడిన ఉప్పు; కటియ జీలకఱ్ఱ= నల్లని జీలకర్ర, కటివేము= కరివేపాకు; గురుజ= ఉత్తుండి అనే ఆకుకూర; ఇంగువ= ఇంగువ అనేవి; ప్రవర్జనీయ కోటి= బొత్తుగా విడువదగిన వస్తువుల సముదాయం; అగుటన్= కావటాన్ని.

**తాత్పర్యం:** ఆ శ్రాద్ధంలో మునగ, ఉల్లి, అడవి మునగ, చెడుమాంసాలు, సొరకాయ, మలినమైన ఉప్పు, నల్లజీలకర్ర, కరివేపాకు, గురజాకు, ఇంగువ అనే వస్తువులు పూర్తిగా విడచి వేసిన సంగతిని (సంభావించాడు).

**క. శునకంబు రజస్వల యగు । వనిత పతితుఁ డంత్యజాతి వాఁ డా క్రియ ప**
**ట్టున కెయిది తవులఁ జేరక । చనఁ జేయుట నుగ్గడించి సంభావించెన్. 190**

**ప్రతిపదార్థం:** శునకంబు= కుక్క; రజస్వల+అగు వనిత= ముట్టైన స్త్రీ; పతితుఁడు= చెడునడవడి కలవాడు; అంత్యజాతివాఁడు= శూద్రుడు; ఆ క్రియ పట్టునకున్= ఆ శ్రాద్ధకర్మ జరుగుతున్న చోటికి; ఎయిది= వెంటబడి; తవులన్+చేరక= సమీపించక; చనన్+చేయుటన్= పోయేటట్లు చేయటాన్నీ; ఉగ్గడించి= వివరించి చెప్పి; సంభావించెన్= కొనియాడాడు.

**తాత్పర్యం:** కుక్క, ముట్టుత, భ్రష్టుడు, శూద్రుడు, ఆ శ్రాద్ధం జరిగే తావులో తిరుగకుండా చూచుకొనటాన్ని వివరించి చెప్పి కొనియాడాడు.

**విశేషం:** ఇవన్నీ అక్కడ ఉన్నవి ఉండవలసిన తీరులో ఉండటం, ఉండరానివి ఉండకపోవటం అనే విషయాలను మనం ఉపదేశాలుగా గ్రహించాలి. (187-190)

**క. కావున శ్రాద్ధక్రియలకు । భూ వల్లభ! యట్టి భంగి పూజ్యత నిచ్చుం**
**దా వినిపించెం బితృదే । వావలి నత్రి నిజవంశుఁ డగు నిమికిఁ దగన్. 191**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; భూవల్లభ!= రాజా!; శ్రాద్ధ క్రియలకున్= పితృదేవతల అర్చన పనులకు; అట్టి భంగి= ఆ పద్ధతి; పూజ్యతన్= మన్ననను; ఇచ్చున్= ఇస్తుంది; అత్రి= అత్రి మహర్షి; తాన్= తాను; నిజవంశుఁడు= తనవంశంలోనివాడు; అగు నిమికిన్= అయిన నిమికి; తగన్= చక్కగా; పితృదేవ+ఆవలిన్= పితృదేవతల వరుసను గూర్చి; వినిపించెన్= వినిపించాడు.

**తాత్పర్యం:** కాబట్టి భూపాలా! శ్రాద్ధక్రియలకు ఇట్టి విధానం ఎంతో మన్నన నిస్తుంది. అత్రి మహర్షి తనవంశం వాడైన నిమికి పితృదేవత లెవరెవరో చక్కగా తెలియజేశాడు.

**వ. అత్తెఱం గెఱింగించెద నత్రి నిమితో నిట్లను శ్రాద్ధంబున నర్యమవరుణ సోమాగ్నులకు భాగంబులు బ్రహ్మ కల్పించె; విశ్వలగు దేవతలు పితృదేవతలతోఁ గూడం దత్క్రియోప యోగ్యతం దోఁతురు వారలకును భాగకల్పనం బొనరించె; దేవతలయందుఁ గొందఱ నూష్మపులయిన మహాభాగులం బితృత్వ నిర్దేశంబున నేర్పరించె; నవ్విరించి వివరించిన నామంబులు సెప్పెద వినుము; బలుండు ధృతి విపాప్ముండు పుణ్యకృత్తు పావనుండు పార్ష్ణిక్షేముండు సమూహుండు దివ్యసానువు వివస్వంతుండు వీర్యవంతుండు హ్రీమంతుండు కీర్తిమంతుండు, కృతుండు విద్యుద్వర్చసుండు సోమవర్చసుండు, సూర్యశ్రీ సోమపుండు సూర్యసావిత్రుండు దత్తాత్ముండు పుండరీయకుం డుష్ణినాభుండు నభోదుండు విశ్వాయువు దీప్తి చమూహరుండు సురేశుండు వ్యోమారి శంకరుండు భవుం డీశుండు కర్తకృతి దక్షుండు భువనుండు దివ్యకర్మకృత్తు గణితుండు పంచవీర్యుం డాదిత్యుండు రశ్మిమంతుండు సప్తకృత్తు సోమపూర్వుండు విశ్వకృత్తు కవి యనుగోప్త సుగోప్త నప్త యీశ్వరుండు జితాత్ముండు మునివీర్యుండు దీప్తరోముండు భయంకరుం డను కర్ముండు ప్రతీతుండు ప్రదాత యంశుమంతుండు శైలాభుండు పరమక్రోధి ధీరోష్ణి భూపతి స్రజుండు వజ్రి వరి వీరలు భాగార్హులని చెప్పి వెండియు. 192**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు = ఆ పద్ధతి; ఎఱింగించెదన్= వివరిస్తాను; అత్రి= అత్రి మహర్షి; నిమితోన్= నిమితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; బ్రహ్మ= సృష్టికర్త; శ్రాద్ధంబునన్= శ్రాద్ధంలో; అర్యమ వరుణ సోమ+అగ్నులకున్= సూర్యుడు, వరుణుడు, చంద్రుడు, అగ్ని అనేవారికి; భాగంబులు= పాళ్ళు; కల్పించెన్= ఏర్పాటు చేశాడు; విశ్వలు= విశ్వలనే పేరుగల (విశ్వ శబ్దానికి సర్వులు అనే అర్థం కూడా ఉన్నది); అగు దేవతలు= దివిజులు; పితృదేవతలతోన్= పితృదేవతలతో; కూడన్= కలిసి; తత్+క్రియా+ఉపయోగ్యతన్= ఆ శ్రాద్ధపుపనిలో ఉపయోగింపబడటంతో; తోఁతురు= కానవస్తారు; వారలకును= ఆ విశ్వదేవులనే వారికి కూడా; భాగకల్పనంబు= పాళ్ళ ఏర్పాటు; ఒనరించెన్= చేశాడు; దేవతలయందున్= దేవతలతోను, ఊష్మపులు= వేడిని పీల్చేవారు; అయిన మహాభాగులన్= అయిన గొప్పవారిని; కొందఱన్= కొందరిని; పితృత్వ నిర్దేశంబునన్= పితృదేవతలనే పేరుతో; ఏర్పరించెన్= ఏర్పాటు చేశాడు; ఆ+విరించి= ఆ బ్రహ్మ; వివరించిన నామంబులు= తెలిపిన పేర్లు; చెప్పెదన్= చెప్పుతాను; వినుము; బలుడు, ధృతి, విపాప్ముడు, పుణ్యకృత్తు, పావనుడు, పార్ష్ణిక్షేముడు, సమూహుడు, దివ్యసానువు, వివస్వంతుడు, వీర్యవంతుడు, హ్రీమంతుడు, కీర్తిమంతుడు, కృతుడు, విద్యుద్వర్చసుడు, సోమవర్చసుడు, సూర్యశ్రీ, సోమపుడు, సూర్యసావిత్రుడు, దత్తాత్ముడు, పుండరీయకుడు, ఉష్ణినాభుడు, నభోదుడు, విశ్వాయువు, దీప్తిచమూహరుడు, సురేశుడు, వ్యోమారి, శంకరుడు, భవుడు, ఈశుడు, కర్తకృతి, దక్షుడు, భువనుడు, దివ్యకర్మకృత్తు, గణితుడు, పంచవీర్యుడు, ఆదిత్యుడు, రశ్మిమంతుడు, సప్తకృత్తు, సోమపూర్వుడు, విశ్వకృత్తు, కవి, అనుగోప్త, సుగోప్త, నప్త, ఈశ్వరుడు, జితాత్ముడు, మునివీర్యుడు, దీప్తరోముడు, భయంకరుడు, అనుకర్ముడు, ప్రతీతుడు, ప్రదాత, అంశుమంతుడు, శైలాభుడు, పరమక్రోధి, ధీరోష్ణి, భూపతి, స్రజుడు, వజ్రి, వరి - ఈ పేర్లున్న వీరలు= ఈ చెప్పినవారు; భాగ+అర్హులు= శ్రాద్ధఫలంలో భాగం పొందటానికి; అర్హత కలవారు; అని; చెప్పి= వివరించి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఆ విధానం చెప్పుతాను అని అత్రి నిమితో ఇట్లా అన్నాడు. 'బ్రహ్మ సూర్యుడికి, వరుణుడికి, చంద్రుడికి, అగ్నికి శ్రాద్ధఫలంలో భాగాలు ఏర్పరచాడు. విశ్వేదేవతలు, పితృదేవతలతో కలిసి ఆ పనిలో ఉపయోగ పడతారు. కనుక వారికి కూడా పాళ్ళు ఏర్పాటు చేశాడు. దేవతలలో కూడా ఊష్మపులనే దొడ్డవారున్నారు. వారిని కూడా పితృదేవతలుగా విభాగం చేశాడు. బ్రహ్మ వివరించిన ఆ పేర్లు చెప్పుతాను వినుము; బలుడు, ధృతి, విపాప్ముడు, పుణ్యకృత్తు, పావనుడు, పార్ష్ణిక్షేముడు, సమూహుడు, దివ్యసానువు, వివస్వంతుడు, వీర్యవంతుడు, హ్రీమంతుడు, కీర్తిమంతుడు, కృతుడు, విద్యుద్వర్చసుడు, సోమవర్చసుడు, సూర్యశ్రీ, సోమపుడు, సూర్యసావిత్రుడు, దత్తాత్ముడు, పుండరీయకుడు, ఉష్ణినాభుడు, నభోదుడు, విశ్వాయువు, దీప్తిచమూహరుడు, సురేశుడు, వ్యోమారి, శంకరుడు, భవుడు, ఈశుడు, కర్తకృతి, దక్షుడు, భువనుడు, దివ్యకర్మకృత్తు, గణితుడు, పంచవీర్యుడు, ఆదిత్యుడు, రశ్మిమంతుడు, సప్తకృత్తు, సోమపూర్వుడు, విశ్వకృత్తు, కవి, అనుగోప్త, సుగోప్త, నప్త, ఈశ్వరుడు, జితాత్ముడు, మునివీర్యుడు, దీప్తరోముడు, భయంకరుడు, అనుకర్ముడు, ప్రతీతుడు, ప్రదాత, అంశుమంతుడు, శైలాభుడు, పరమక్రోధి, ధీరోష్ణి, భూపతి, స్రజుడు, వజ్రి, వరి - వీరుకూడా పితృయజ్ఞ ఫలంలో భాగం పొందువారని చెప్పి ఇంకా ఈ విధంగా చెప్పాడు.

**క. గిరివన దుర్గము లందును । సరి దుత్తరణంబు నపుడు శ్రాద్ధ విధి సమా**
**చరణ సమయమున వీరిం । బరికీర్తించిన యతండు వడయు శుభంబుల్. 193**

**ప్రతిపదార్థం:** గిరి వన దుర్గము లందును= కొండలలో, అడవులలో, పోరానితావులలో, సరిత్+ ఉత్తరణంబు+అపుడు= నదులు దాటే వేళలలో, శ్రాద్ధవిధి సమాచరణ సమయమునన్= పితృయజ్ఞం చేసేవేళలలో; వీరిన్= ఈ ఊష్మపులనే దేవతలను; పరికీర్తించిన+ అతండు= చక్కగా స్తుతించినవాడు; శుభంబుల్= శుభాలను; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కొండలలో అడవులలో పోవశక్యంగాని తావులలో నదులు దాటే వేళలలో శ్రాద్ధసమయాలలో వీరిని స్తుతించిన నరుడు శుభాలను పొందుతాడు.

**విశేషం:** వీరి అనుగ్రహంవలన ప్రమాదాలు రాకుంటాయి అని భావం.

**ఆ. పూరిపంట ప్రాలు నారుగబియ్యంబు । జంబువున ఫలంబు శ్రాద్ధ కృతికిఁ**
**గావు తుమ్మ నేడ్వఁగాదు శ్రాద్ధ క్రియా । చరణ సమయములఁ బ్రశాంతివలయు.' 194**

**ప్రతిపదార్థం:** పూరిపంట ప్రాలు= పూరిపంట బియ్యం; ఆరుగ బియ్యంబు= ఆరుగల బియ్యం; జంబువున ఫలంబు= నేరేడు పండు; శ్రాద్ధకృతికిన్= శ్రాద్ధం పనికి; కావు= పనికి రావు; శ్రాద్ధ క్రియా+ఆచరణ సమయములన్= శ్రాద్ధకర్మ చేసే సమయాలలో; తుమ్మన్= తుమ్మటం; ఏడ్వన్= ఏడవటం; కాదు= కూడదు; ప్రశాంతి= చక్కని శాంతి; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** గడ్డిపంటల ధాన్యాలు, ఆరుగలు, నేరేడు పండు శ్రాద్ధానికి పనికిరావు. శ్రాద్ధసమయంలో తుమ్మటం, ఏడవటం కూడదు. ప్రశాంతి కావాలి.

**విశేషం:** 'తుమ్మటం' అప్రయత్నంగా వస్తుంది. దానిపై అదుపు ఉండకపోవచ్చు. అట్టి సందర్భంలో శ్రాద్ధ స్థానం నుండి దూరంగా వెళ్ళి ఆ పని చేసి మరల రావలసి ఉంటుంది. ప్రశాంతి ఉద్వేగం, ఆరాటం మొదలైన లక్షణాలు లేకుండా ఉండటం. కోపతాపాలను రాకుండా చూచుకొనటం మొదలగునవి.

**వ. అనియునుం జెప్పె నని చెప్పి, సరిత్సూనుండు ధర్మజుతో మఱియు నిట్లనియె. 195**

**ప్రతిపదార్థం:** అనియునున్= అనికూడా; చెప్పెన్= (అత్రి నిమితో) చెప్పాడు; అని; చెప్పి= తెలియజేసి; సరిత్+సూనుండు= నది కొడుకు భీష్ముడు; ధర్మజుతోన్= ధర్మరాజుతో; మఱియున్; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అత్రి ఈ విషయాలు కూడా చెప్పాడని భీష్ముడు ధర్మరాజుతో ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'ఒకతతి మునివర్యు లొక్కటఁ బెక్కండ్రు । శ్రాద్ధముల్ సేయ భోజ్యములు పెక్కు**
**లనుభవించుటఁ దమ కఱుగమి పుట్టుట । యును, బితృదేవతల్ సనిరి సోము**
**కడ, కట్లు సని తమ కాఱియ సెప్పిన । నతఁడు 'పద్మజుపాలి కరుగుఁ' డనియె;**
**వా రట్ల కా కని బోరన నరిగి ప । ద్మజునిఁ గాంచి యజీర్ణ దశ యెఱుంగ**

**తే. విన్నవించినఁ, దనయొద్ద వెలుఁగుచున్న । యగ్నిఁ జూపి 'యిక్కీ డితం డపహరించు'**
**ననిన నగ్ని 'మత్సహితులై కొనిన నఱుగఁ । జేయువాఁడ నాహారముల్ సిద్ధ మదియు. 196**

**ప్రతిపదార్థం:** ఒకతఱిన్= ఒకప్పుడు; మునివర్యులు= మునిశ్రేష్ఠులు; పెక్కండ్రు= చాలామంది; ఒక్కటన్= ఒకేసారి; శ్రాద్ధముల్= పితృయజ్ఞాలు; చేయన్= చేయగా; భోజ్యములు= ఆహారపదార్థాలు; పెక్కులు= చాలా; అనుభవించుటన్= తినగా; తమకున్= తమకు; అఱుగమి= అరగకపోవటం; పుట్టుటయును= పుట్టగా; పితృదేవతల్= పితృదేవతలు; సోము కడకున్= చంద్రుడి దగ్గరకు; చనిరి= వెళ్ళారు; అట్లు= ఆ విధంగా; చని= వెళ్ళి; తమ కాఱియ= తమ వేదనను; చెప్పినన్= చెప్పగా; అతఁడు= ఆ చంద్రుడు; పద్మజు పాలికిన్= బ్రహ్మదగ్గరకు; అరుగుఁడు= వెళ్ళండి; అనియెన్= అన్నాడు; వారు= ఆ

పితృదేవతలు; అట్లు+అ= అట్లే; కాక= అగుగాక; అని; బోరనన్= గబగబా; అరిగి= వెళ్ళి; పద్మజునిన్= బ్రహ్మను; కాంచి= చూచి; అజీర్ణదశ= అరుగని స్థితిని; ఎఱుంగన్= తెలిసే విధంగా; విన్నవించినన్= మనవిచేయగా; తన+ఒద్దన్=తనకడ; వెలుంగుచున్న+అగ్నిన్= ప్రకాశిస్తున్న అగ్ని దేవుడిని; చూపి= చూపించి; ఈ+కీడు= ఈ ఆపదను; ఇతండు= ఈ అగ్ని; అపహరించున్= తొలగిస్తాడు; అనినన్= అంటే; అగ్ని= అగ్నిదేవుడు; మత్+సహితులు+ఐ= నాతో కలిసి ఉన్నవారై; కొనినన్= ఆహారం తీసికొన్నట్లయితే; ఆహారముల్= భోజనాలను; అఱుగన్+ చేయువాఁడన్= జీర్ణంచేస్తాను; అదియున్= అది; సిద్ధము= ఏర్పాటు.

**తాత్పర్యం:** ఒకసారి చాలమంది మునులు ఒకే సమయంలో శ్రాద్ధాలు చేశారు. భోజన పదార్థాలు ఎక్కువగా తినటంవలన పితృదేవతలకు అగ్నిమాంద్యం (అజీర్ణం అనే జబ్బు) కలిగింది. వారంతా చంద్రుడి దగ్గరకు పోయి తమగోడు విన్నవించుకొన్నారు. చంద్రుడు 'మీరు బ్రహ్మ దగ్గరకు పొండి' అన్నాడు. వా రట్లాగే అని వడివడిగా వెళ్ళి బ్రహ్మను చూచి తమ అజీర్తి విషయం చెప్పారు. ఆయన తన దగ్గర నున్న అగ్నిని చూపి 'ఈ ఆపదను ఇతడు తొలగిస్తాడు' అన్నాడు. అగ్ని 'ఇకపైన మీరు ఆహారాలను నాతో కలిసి తీసికొంటే నేను వాటిని అరిగిస్తాను. ఇది సిద్ధమైన మాట' అన్నాడు.

**విశేషం:** చంద్రుడికి ఓషధీశుడని పేరు. ఓషధులు రోగాలను తొలగిస్తాయి. అందుకని ముందు పితృదేవతలు అతడి దగ్గరకు వెళ్ళారు. చంద్రుడు బహుశః శాశ్వతమైన ఏర్పాటు కొరకు బ్రహ్మ దగ్గరకు పంపిఉంటాడు.

**క. అని పలికినఁ బితృదేవత । లనలుఁడు ముఖ్యుఁడుగ నెపుడు నాహారంబుల్**
**గొని సుఖ జీర్ణానందం । బు నొందుదురు సూవె భరతభూపవరేణ్యా! 197**

**ప్రతిపదార్థం:** భరత భూపవరేణ్యా!= భరతవంశ రాజులలో ఎన్నదగినవాడా!; అని; పలికినన్= అనగా; పితృదేవతలు; అనలుఁడు= అగ్ని; ముఖ్యుఁడుగన్= ప్రధానుడుగా; ఎపుడున్= ఎల్లవేళలా; ఆహారంబుల్= భోజనాలను; కొని= గ్రహించి; సుఖ జీర్ణ+ఆనందంబున్= సుఖంగా అరగటంవలన కలిగే ఆనందాన్ని; ఒందుదురు= పొందుతున్నారు; చూవె!= సుమా!

**తాత్పర్యం:** రాజా! అగ్ని ఇట్లా అంటే పితృదేవతలు అగ్నిని ముందుంచుకొని భోజనాలు చేసి సుఖంగా జీర్ణించుకొని ఆనందం పొందుతున్నారు.

**విశేషం: "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్".**

అని గీత - పరమాత్ముడే సర్వప్రాణులలో వైశ్వానరాగ్ని రూపంలో ఉండి నాలుగు విధాలైన పదార్థాలను జీర్ణం చేస్తున్నాడన్న భావాన్ని ఇక్కడ అనుసంధించుకొనవచ్చును. అనలుడు అంటే అలమ్ చాలు అననివాడు. ఎంత పదార్థాన్నైనా కాల్చి వేయగలవాడని ఇక్కడ ఈ శబ్దాన్ని సాభిప్రాయంగా వాడారు.

**క. కావున సాగ్నికుఁడయి తగ । నే వాఁడొనరించు శ్రాద్ధ మీడ్యం బది; సం**
**భావింతురు పెద్దయుఁ బితృ । దేవత లసురులకు రాదు తేఱియుఁ జూడన్. 198**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; ఏవాఁడు= ఎవ్వడు; స+అగ్నికుఁడు+అయి= అగ్ని కలవాడై; శ్రాద్ధము= పితృయజ్ఞం; ఒనరించున్= చేస్తాడో; అది= అట్లా చేసిన ఆ పని; ఈడ్యంబు= కొనియాడదగింది; పితృదేవతలు; పెద్దయున్= మిక్కిలిగా; సంభావింతురు= మన్నన చేస్తారు; అసురులకున్= రక్కసులకు; తేఱియున్= నెమ్మదితో; చూడన్+రాదు= చూడ వీలుకాదు.

**తాత్పర్యం:** కనుక శ్రాద్ధం అగ్ని పూజలతో కలిపి చేస్తే అది ఎంతో ప్రశస్తమవుతుంది. పితృదేవతలు పరమానందం పొందుతారు. రాక్షసులు అటువైపు కన్నెత్తి చూడనుకూడా రారు.

**విశేషం:** తద్దినాలలో ముందుగా విచ్ఛిన్నాగ్నిని పునస్సంధానించి ఉపాసిస్తారు.

**ఆ. అనఘ! పితృపితామహ ప్రపితామహ । పూజనములు శిష్ట పూర్వకముగఁ**
**జేయవలయు నియతి దాయ దొడ్గిన జన్ని । దంబుతోడ భక్తిధామ మగుచు. 199**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యవంతుడా!; పితృ పితామహ ప్రపితామహ పూజనములు= తండ్రి, తాత, ముత్తాతల పూజలు; శిష్టపూర్వకముగన్= సదాచారం ముందు ఉండే విధంగా; నియతిన్= నిష్ఠతో, దాయ తొడ్గిన జన్నిదంబుతోడన్= తిరుగబడేటట్లు ధరించిన జందెంతో; భక్తిధామము= భక్తికి నెలవు; అగుచున్= అవుతూ; చేయవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** చక్కని ఆచారంతో, నిష్ఠతో, కుడిభుజానికి మార్చుకొన్న జందెంతో భక్తికి నివాసమా అన్నట్లున్నవాడై తండ్రి, తాత ముత్తాతలకు పూజలు చేయాలి.

**విశేషం:** జందెం సంధ్యావందనం, యజ్ఞం మొదలైన పనులప్పుడు ఎడమభుజం మీదుగా ధరించాలి. దీనిని 'ఉపవీత స్థితి' అంటారు. పితృక్రియలలో కుడిభుజానికి మార్చుకొనాలి. దీనిని 'ప్రాచీనావీత స్థితి' అంటారు. దేహధర్మాలైన మలమూత్ర విసర్జనాది క్రియల సమయంలో దండలా వేసికొనాలి. దీనిని 'నివీతస్థితి' అంటారు. ఇక్కడ దాయ దొడ్గిన జన్నిదంబుతోడ అంటే 'ప్రాచీనావీత స్థితి' అని భావం. 'పితృ పితామహ ప్రపితామహులు' మరణించినవారికే శ్రాద్ధ క్రియ.

**తే. పిండ సంబంధమునఁ బాయుఁ బ్రేతభావ । మది సుగతి నిచ్చు; గయఁ బిండ మట్లు గాన**
**నరుగునో గయ కొకఁ డైన నని కదా య । నేక పుత్త్రులఁ గోరుదు రిద్ధచరిత! 200**

**ప్రతిపదార్థం:** ఇద్ధ చరిత!= పరిశుద్ధమగు నడవడి కలవాడా!; ప్రేత భావము= ప్రాణుల చావు తరువాత స్థితి; పిండ సంబంధమునన్= పిండం పెట్టిన కారణంగా; పాయున్= పోతుంది; గయన్= గయా క్షేత్రంలో; పిండము= పెట్టిన పిండము; అది; సుగతిన్= మంచి గతిని; ఇచ్చున్= ఇస్తుంది; అట్లు కానన్= ఆ కారణంగా; గయకున్= గయకు; ఒకఁడు+ఐనన్= ఒక్కడైనా; అరుగునో= వెళ్ళునేమో; అని కదా!= అన్న భావంతో కదా!; అనేక పుత్త్రులన్= ఎక్కువ మంది కొడుకులను; కోరుదురు= పొందగోరుతారు.

**తాత్పర్యం:** మాన్యచరిత్రుడా! చనిపోయిన జీవికి ప్రేతభావం పిండ సంబంధంవలన నశిస్తుంది. గయలో పెట్టిన పిండం ప్రేతభావాన్ని పోగొట్టటమే కాదు పుణ్యగతిని కూడా ఇస్తుంది. అందుకనే ఒక్క కొడుకైనా గయకు వెళ్ళి పిండం పెడతాడన్న ఆశతో మానవులు ఎక్కువమంది కొడుకులను కోరుకొంటారు.

**విశేషం:** 'గయకు నరుగునో' అంటే పిండ ప్రదానంకొరకు అనే అర్థాన్ని సంభావించాలి. మరణించిన జీవి ప్రేత రూపంలో నరకం అనుభవిస్తాడని మనవారి నమ్మకం. ఆ నరకం నుండి విముక్తి పిండ ప్రదానం ద్వారా కలుగుతుంది. గయలో పిండం పెట్టితే పుణ్యలోకాలు కూడా లభిస్తాయి అని కూడా విశ్వాసం.

**క. గౌరి యగు కన్య వరదా । నా రూఢం జేత; నీలమైన వృషభమున్**
**గారవమున విడుపు ముదం । బారంగాఁ జేయుఁ బితృచయము చిత్తములన్. 201**

**ప్రతిపదార్థం:** గౌరి+అగు కన్యన్= రజస్వల కాని కన్యను; వరదాన+ఆరూఢన్= వరుడికి ఇచ్చుటలో లక్ష్యమైనదానినిగా; చేఁత= చేయటం; నీలము= నల్లని వన్నెకలది; ఐన వృషభమున్= అయిన ఎద్దును; గారవమునన్= దొడ్డబుద్ధితో; విడుపు= వదలుట; పితృచయము చిత్తములన్= పితృదేవతల హృదయాలను; ముదంబు= సంతోషం; ఆరంగాన్= అధికమయ్యేటట్లు; చేయున్= చేస్తాయి.

**తాత్పర్యం:** రజస్వల కాని కన్యను వరుడికి భార్యగా ఇవ్వటం, నల్లని యెద్దును ఆబోతుగా వదలటమూ అనేవి పితృదేవతలకు ఎంతో ఆనందం కలిగిస్తాయి.

**క. శ్రాద్ధంబు ప్రకారంబును । వృద్ధా చార్యోక్తభంగి వివరించితి; నీ**
**బుద్ధిం దోఁచినదాని స । మిద్ధ గుణోదార! యడుగు మెయ్యది యైనన్.' 202**

**ప్రతిపదార్థం:** సమిద్ధగుణ+ఉదార!= చక్కగా ప్రకాశించు గుణములతో గొప్పవాడా!; వృద్ధ+ఆచార్య+ఉక్త భంగిన్= వృద్ధులైన ఆచార్యులు చెప్పిన తీరున; శ్రాద్ధంబు ప్రకారంబును= శ్రాద్ధం చేయవలసిన విధానాన్ని; వివరించితిన్= తెలిసే విధంగా చెప్పాను; నీ బుద్ధిన్= నీ బుద్ధిలో; తోఁచిన దానిన్= తట్టిన దానిని; ఏ+అది+ఐనన్= దేనికైనా; అడుగుము.

**తాత్పర్యం:** మేలిగుణాలతో గొప్పవాడవైన రాజా! పెద్దలైన ఆచార్యులమాటల ననుసరించి శ్రాద్ధవిధానాన్ని నీకు వివరించాను. నీ బుద్ధికి తోచిన ఏ విషయమైనా అడుగుము చెప్పుతాను'.

**విశేషం:** వృద్ధా చార్యోక్తభంగిన్ - వృద్ధులంటే అనుభవంతో ఔగాములను నిర్ణయించుకొనగలవారు: ఆచార్యులు - శాస్త్రవిషయాలను చక్కగా గ్రహించి శిష్యులతో ఆచరింపజేస్తూ తాము ఆచరించేవారు. ఈ సందర్భంలో 'అత్రి' వంటివారు. కనుక ఈ విషయంలో సందేహించరాదని భావం.

**క. అని నిర్జరాపగానం । దనుండు పలుకుటయుఁ, బ్రియము దళుకొత్తఁగఁ బాం**
**డు నృపాలు నగ్రనందనుఁ । డనూన వినయమున నమ్మహామతి తోడన్. 203**

**ప్రతిపదార్థం:** అని; నిర్జర+ఆపగా నందనుండు= దేవతల నదికొడుకు భీష్ముడు; పలుకుటయున్=పలికినంతనే; పాండు నృపాలు+అగ్రనందనుఁడు=పాండురాజు పెద్దకొడుకు; ప్రియము= ప్రీతి; తళుకొత్తఁగన్= అధికం కాగా; అనూన వినయమునన్= ఎక్కువ వినయంతో; ఆ+మహామతితోడన్= దొడ్డబుద్ధిగల ఆ భీష్ముడితో.

**తాత్పర్యం:** భీష్ము డిట్లా అన్నంతనే ధర్మరాజు ప్రీతి రెట్టింపు కాగా అధికమైన వినయంతో ఆ మహాజ్ఞానితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** నిర్జరాపగానందనుఁడు - పవిత్రత, జ్ఞానం మొదలైన ఉదాత్త లక్షణాలను ఈ పదం స్ఫురింపజేస్తుంది. 'ప్రియము తళుకొత్తంగన్' - ధర్మరాజుకు ఎన్నో విషయాలు తెలిసికొనాలని పట్టరాని ఉత్కంఠ. అయినా పెద్దవాడు, తా నతడితో యుద్ధంచేసి నొప్పించాడు మొదలైన సంకోచా లెన్నో మదిలో ఉన్నాయి. ఈ దశలో ఆ మహానుభావుడే ఏది అయినా అడుగుము - అని ప్రచోదన చేస్తున్నాడు. కనుక ప్రీతి అతిశయించింది. మహామతి - ఏది అడిగినా చెప్పగల సామర్థ్యాన్ని ఇది అభివ్యక్తం చేస్తుంది.

**క. 'తప మని యార్యులు సెప్పుదు । రుపవాసవ్రతము; నదియె; యొండు గలదొ సా**
**రపుఁ దపము తెలుఁగు నాకుం । గృప నెఱిఁగింపుము విధూతకిల్బిష!' యనుడున్. 204**

**ప్రతిపదార్థం:** ఆర్యులు= పూజ్యులు; ఉపవాస వ్రతమున్= ఉపవాసమనే నియమాన్ని; తపము= తపస్సు; అని; చెప్పుదురు= తెలుపుతారు; అదియె?= అదేనా?; ఒండు= మరొకటి; కలదొ?= ఉన్నదా?; సారము+తపము తెఱఁగు= చేవగల తపస్సు తీరు; విధూత కిల్బిష!= చక్కగా తొలగించుకొన్న పాపాలు కలవాడా!; నాకున్= నాకు; కృపన్= దయతో; ఎఱిఁగింపుము= తెలుపుము; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** 'పాపాలను పటాపంచలు చేసికొన్న మహానుభావా! ఉపవాస నియమాన్నే తపస్సు అని ఆర్యులు అంటూ ఉంటారు. నిజానికి అదేనా, మరేదైనా ఉన్నదా? చేవగల తపస్సు పద్ధతిని నాకు దయతో తెలుపుము' అంటే.

**విశేషం:** ఆర్యులు - తమ సత్ప్రవర్తనతో ఇతరులకు మన్నించదగినవారు. 'నాకు' - తెలిసికొనాలనే ఉత్కంఠ అధికంగా ఉన్న నాకు - అని ఇది అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని. కృప, నాకు, విధూతకిల్బిష అనే పదాలు గీత చెప్పిన 'పరిప్రశ్న'ను అభివ్యక్తం చేస్తాయి.

**క. అమ్మహాత్ముఁ డిట్టు లనుఁ 'బెక్కు దివసంబు । లుపవసించి యునికి తపము చొప్పె**
**దాన విను తపస్వి గానేరఁ డది యాత్మ । ఘాత మగుట నరుఁడు గౌరవేంద్ర! 205**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్ముండు= దొడ్డబుద్ధిగల ఆ భీష్ముడు; ఇట్టు= ఇట్లా; అనున్= అన్నాడు; కౌరవ+ఇంద్ర!= కురువంశంవారిలో గొప్పవాడా!; పెక్కు దివసంబులు= ఎక్కువ దినములు; ఉపవసించి ఉనికి= పస్తులు ఉండటం; తపము చొప్పు+ఎ?= తపస్సు పద్ధతియా?; విను= శ్రద్ధగా ఆలకించుము; దానన్= దానిచేత; నరుఁడు= మానవుడు; అది= అట్లా ఉండటం; ఆత్మ ఘాతము= ఆత్మను హింసించటం; అగుటన్= కావటంవలన; తపస్వి= తపస్సు కలవాడు; కానేరఁడు= కాజాలడు.

**తాత్పర్యం:** అప్పుడు మహానుభావుడైన భీష్మ డిట్లా చెప్పాడు. 'కురువరా! ఎన్నో రోజులు పస్తులుండటం తపస్సు కానే కాదు. అది ఆత్మను హింసించటం. కనుక దానివలన నరుడు తపస్వి కాజాలడు.

**విశేషం:** పాండురాజు కొడుకులు, ధృతరాష్ట్రుడి కొడుకులు అందరూ కురువంశంలోనివారే కనుక కౌరవులే. కానీ ఈ పదం ధృతరాష్ట్రుల కుమారులకు విడిగా రూఢమైనది. తపము చొప్పె? అన్న ప్రశ్న వ్యతిరేకార్థాన్ని తెలుపుతుంది. కానేకాదని భావం. 'ఆత్మఘాతం కనుక' అని కారణం కూడా చెప్పాడు. ఇక్కడ ఆత్మ అంటే ధర్మసాధనమైన దేహం అనే అర్థాన్ని గ్రహించాలి. 'విను' అనే మాట శ్రద్ధను ద్యోతకం చేస్తున్నది.

**క. సత్యంబు బ్రహ్మచర్యము । నిత్యశుచిత మౌన మతుల నియమము దయ శు**
**ద్ధ త్యాగంబుఁ దపస్సం । పత్త్యాకృతు లండ్రు బుధులు పౌరవముఖ్యా!' 206**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశంవారిలో గొప్పవాడా!; బుధులు= తత్త్వమెరిగినవారు; సత్యంబు= సత్యం; బ్రహ్మచర్యము= బ్రహ్మమునందు ప్రవర్తించటం; నిత్య శుచిత= ఎడతెగని పరిశుద్ధత; మౌనము= మాటలయందు నిగ్రహం; అతుల నియమము= సాటిలేని నిష్ఠ; దయ= భూతములయందు జాలి; శుద్ధ త్యాగంబున్= దోషం లేని దానగుణం; తపస్+సంపత్తి+ఆకృతులు= తపస్సనే మహాభాగ్యపు రూపాలు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** సత్యం, బ్రహ్మచర్యం, ఎడతెగని పరిశుద్ధత, మౌనం, సాటిలేని నిష్ఠ, భూతదయ, మచ్చలేని త్యాగం అనేవి తపస్సంపదయొక్క ఆకారా లని తత్త్వమెరిగినవారు చెప్పుతారు.'

**విశేషం:** సత్యము - పరతత్త్వానికి విరుద్ధం కానిది; బ్రహ్మచర్యము - బ్రహ్మమంటే వేదం, తత్త్వం - వానియందు ప్రవర్తించటం; శుచిత - బాహ్యశుద్ధి; అంతశ్శుద్ధి; మౌనము - కేవలం వాక్కుని నిలిపివేయటం అని అర్థం కాదు. ముని ధర్మాన్ని - పరమాత్మ చింతనం చేస్తూ దానికి విరుద్ధమైనది పలుక కుండటం; శుద్ధ త్యాగము - వదలివేసిన దానియందు ఏ మాత్రమూ మమకారభావన లేకుండా ఉండటం. సత్యం పలకటం, బ్రహ్మచర్యం పాటించటం ఇత్యాదిగా ఆచరణ సంబంధమైన పదాలను ఇక్కడ కలుపుకొనాలి.

**వ. అనిన విని కురుపతి కురుపితామహునితో 'మహాత్మా! దానశీలుని యప్రతిగ్రాహకుని విశేషం బెట్టిది? యెఱింగింపు' మనవుడు నా దేవవ్రతుం 'డీ విషయంబునకు సప్తర్షి వృషాదర్భి సంవాదం బను నితిహాసంబు గల' దని చెప్పి యమ్మనుజపతి కిట్లనియె. 207**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; కురుపతి= కురురాజు; కురుపితామహునితోన్= కౌరవుల తాత అయిన భీష్ముడితో; మహాత్మా!; దానశీలుని= ఇవ్వటమే శీలంగా కలవాడియొక్క; అప్రతిగ్రాహకుని= ఇతరులనుండి దేనినీ దానరూపంగా పుచ్చుకొననివాడియొక్క; విశేషంబు= ప్రత్యేకత; ఎట్టి+అది?= ఏ విధమైనది?; ఎఱింగింపుము= తెలుపుము; అనవుడున్= అనగా; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; ఈ విషయంబునకున్= ఈ సంగతికి; సప్తర్షి వృషాదర్భి సంవాదము= సప్తఋషులకు, వృషాదర్భి అనే వాడికిని అయిన సంభాషణ; అను+ఇతిహాసంబు= అనే పూర్వపు గాథ; కలదు= ఉన్నది; అని; చెప్పి; ఆ+మనుజ పతికిన్= ఆ రాజునకు,ధర్మజునకు; ఇట్లు= ఇట్లా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ము డట్లా చెప్పగా వినిన ధర్మరాజు తాతతో 'మహానుభావా! దానశీలుడి విశేషమూ, దానం పుచ్చుకొననివాడి ప్రత్యేకతా ఎట్టిదో నాకు తెలుపుము' అన్నాడు. అప్పుడు భీష్ముడు 'ఈ విషయానికి సప్తర్షి వృషాదర్భి సంవాదం అనే పూర్వపు గాథ ఒకటి ఉన్నది' అని ఇట్లా చెప్పాడు.

**విశేషం:** ప్రతిగ్రాహకుండు - దానం పుచ్చుకొనేవాడు. కొందరు ఆ పనిచేయరు. వారు అప్రతిగ్రాహకులు; దేవవ్రతుడు భీష్ముడి వ్యవహారనామం. ఇతిహాసం - 'ఇది ఇట్లా ఉండటం' అని ఈ శబ్దానికి అర్థం. పూర్వకాలంలో జరిగిన వృత్తాంతం. కొన్ని ధర్మాలను కథా రూపంతో బోధించటం పురాణేతిహాసాలలో ఒక పద్ధతి. దానిని ఇక్కడ అవలంబిస్తున్నాడు.

## సప్తర్షి వృషాదర్భి సంవాదం బను నితిహాసంబు ప్రకారము (సం.13-94-4)

**తే. 'కశ్యపాత్రి విశ్వామిత్ర గౌతములును । విను భరద్వాజ జమదగ్నులును వసిష్ఠు**
**డును జగంబుల నెల్లఁ బేర్కొనిన ఋషులు । వారి సప్తర్షిగణ మండ్రు కౌరవేంద్ర! 208**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కురువంశవరేణ్యా!; కశ్యప+అత్రి విశ్వామిత్ర గౌతములును= కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు అనువారూ; విను= వినుము; భరద్వాజ జమదగ్నులును= భరద్వాజుడూ, జమదగ్నీ; వసిష్ఠుఁడును= వసిష్ఠుడూ, జగంబులన్= లోకములందు; ఎల్లన్= అంతటా; పేర్కొనిన ఋషులు= ప్రసిద్ధి పొందిన మునులు; వారిన్= వారిని; సప్త+ఋషి గణము= సప్తర్షుల సముదాయం; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** 'రాజా! కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, భరద్వాజుడు, జమదగ్ని, వసిష్ఠుడు అని అన్ని లోకాలలో ప్రసిద్ధి పొందిన ఏడుగురు ఋషులు ఉన్నారు. వారిని సప్తర్షిగణం అంటారు.

**వ. వసిష్ఠుని దేవి యగు నరుంధతి యెందును నతనితోడన తిరుగు; నయ్యందఱకుం బరిచారికయై గండ యను చేడియ వర్తించుఁ; దద్వల్లభుండగు పశుసఖుండును వారలకుం బరిచారకత్వం బాచరించు; నప్పదుండ్రును దపశ్చరణ పరులై ధరణిం జరించుచుండ నత్యంతఘోర యగు ననావృష్టి దోఁచి జీవసాధనంబు లగు పదార్థంబులు దుర్లభంబులై జనంబులకుఁ బ్రాణంబులు రక్షించుకొనుట దుష్కరంబై చెల్లెం; గశ్యపాదులు నతి క్షుధార్తులై యాహారం బన్వేషించు నెడ శిబిసూనుం డైన యాజ్య నామధేయుండు తొల్లి యజ్ఞదక్షిణార్థం బుగాఁ దన కొడుకు నీలుండను వాని ఋత్విగ్జనంబుల కిచ్చినం దద్వశగతి నుండి కాలం బగుటయు మృతి నొందినం దదీయ శవంబు. 209**

**ప్రతిపదార్థం:** వసిష్ఠునిదేవి= వసిష్ఠుడి పత్ని; అగు అరుంధతి= అయిన అరుంధతి, ఎందును= ఎప్పుడు; అన్ని తావులను; అతని తోడన్+అ= అతడితోనే; తిరుగున్= సంచరిస్తుంది; ఆ+అందఱకున్= వారందరికీ; పరిచారిక+ఐ= సేవకురాలై; గండ అను చేడియ= గండ అనే వనిత; వర్తించున్= తిరుగుతుంది; తద్+వల్లభుండు= ఆమె భర్త; అగు పశుసఖుండును= అయిన పశుసఖు డనేవాడు; వారలకున్= ఆ ఋషులకు; పరిచారకత్వంబు= సేవ; ఆచరించున్= చేస్తూ ఉండేవాడు; ఆ+పదుండ్రును= ఆ పదిమంది; తపస్+చరణపరులు+ఐ= తపస్సు చేయటంలో ఆసక్తికలవారై; ధరణిన్= భూమియందు; చరించుచున్+ఉండన్= తిరుగుతుండగా; అత్యంతఘోర= మిక్కిలి భయం గొలిపేది; అగు+అనావృష్టి= అయిన వానలు లేనిదశ; తోఁచి= ఏర్పడి; జీవ సాధనంబులు= బ్రదకటానికి కావలసినవి; అగు పదార్థంబులు= అయిన వస్తువులు; దుర్లభంబులు+ఐ= ఎంత కష్టపడ్డా దొరకనివై; జనంబులకున్= మనుష్యులకు; ప్రాణంబులు= ప్రాణాలు; రక్షించుకొనుట= కాపాడుకొనటం; దుష్కరంబు+ఐ= సాధ్యంకానిదై; చెల్లెన్= సాగింది; కశ్యప+ఆదులు= కశ్యపుడు మొదలైనవారు; అతి క్షుధా+ఆర్తులు+ఐ= మిక్కిలి ఆకలితో పీడనొందినవారై; ఆహారంబు= అన్నం; అన్వేషించు+ఎడన్= వెదకే సందర్భంలో; శిబి సూనుండు= శిబి కొడుకు; ఐన యాజ్యనామధేయుండు= అయిన యాజ్యుడనే పేరివాడు; తొల్లి= మునుపు; యజ్ఞదక్షిణ+అర్థంబుగాన్= యజ్ఞంలో కానుకగా నొసగుటకై; తనకొడుకు= తన కుమారుడైన; నీలుండు అనువానిన్= నీలు డనే వాడిని; ఋత్విక్+జనంబులకున్= యజ్ఞం చేయించే బ్రాహ్మణులకు; ఇచ్చినన్= ఇవ్వగా; తద్+వశగతిన్= వారి ఆధీనంలో; ఉండి; కాలంబు+అగుటయున్= ఆయువు చెల్లగా; మృతిన్= చావును; ఒందినన్= పొందగా; తదీయశవంబు= వాడి మృతదేహం.

**తాత్పర్యం:** వసిష్ఠుడి ధర్మపత్ని అరుంధతి అన్నివేళలా అతడితోడనే తిరుగుతుంది. 'గండ' అనే ఆమె, ఆమె భర్త పశుసఖుడనే వాడూ ఆ ఋషులందరికీ సేవచేస్తుండేవారు. ఆ పదిమందీ తపస్సు చేస్తూ ఉంటారు. ఈ విధంగా ఆ పదిమందీ తపస్సు చేసికొంటూ భూమిమీద తిరుగుతూ ఉండగా మహాభయంకరమైన అనావృష్టి ఏర్పడింది. బ్రతకటానికి తగిన పదార్థాలు దొరకక ప్రజలకు ప్రాణాలు రక్షించుకొనటం కూడా అసాధ్యమై పోయింది. కశ్యపుడు మొదలైనవారు ఆకలి పీడించగా అన్నంకొరకు వెదకుతున్నారు. శిబికొడుకు యాజ్యు డనేవాడు మునుపు యజ్ఞ దక్షిణగా తన కొడుకు నీలు డనే వాడిని ఋత్విక్కులకు ఇచ్చాడు. వాడు వారి అధీనంలో ఉండి కాలం కావటంవలన మరణించాడు. వాడి శవం. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సోదపై నుండఁగ వారలు । పదుండ్రునుం జూచి దాని భక్షింపంగా**
**మదిఁ గోరి చేరి చుట్టుం । బొదివిన సమయమునఁ గాటి పొంత తెరువునన్. 210**

**ప్రతిపదార్థం:** సొదపైన్= కాల్చటానికి పేర్చిన కట్టెలమీద; ఉండఁగన్= ఉండగా; వారలు= ఆ కశ్యపుడు మొదలైనవారు; పదుండ్రునున్= పదిమందీ; చూచి= కనుగొని; దానిన్= ఆ శవాన్ని; భక్షింపంగాన్= తినటానికి; మదిన్= మనస్సులో; కోరి= వాంఛించి; చేరి= దరి కరిగి; చుట్టున్= అన్ని వైపులా; పొదివిన సమయమునన్= మూగిన సమయంలో; కాటి పొంత తెరువునన్= వల్లకాటి దగ్గరి దారిలో.

**తాత్పర్యం:** ఆ శవం కట్టెల మీద ఉండగా ఆ పదిమందీ దానిని చూచి తినటానికై దానిచుట్టూ మూగి ఉన్న సమయంలో వల్లకాటి దగ్గరి దారిలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. వేఁట వోయి మరలి విభుఁ డొక్కరుఁడు వృషా । దర్భినాముఁ డతుల దానపరుఁడు**

**పోయి పోయి కాంచి, పోవక నిలిచి, య । మ్మునులతోడ నధిక వినయ మెసఁగ. 211**

**ప్రతిపదార్థం:** వేట= వేటకై; పోయి= వెళ్ళి; మరలి= తిరిగి; విభుఁడు= రాజు; ఒక్కరుఁడు= ఒకడు; వృషాదర్భి నాముఁడు= వృషాదర్భి అనే పేరుగలవాడు; అతుల దాన పరుఁడు= సాటిలేని దానాలయందు ప్రీతికలవాడు; పోయి పోయి= చాలా దూరంపోయి; కాంచి= చూచి; పోవక నిలిచి= పోకుండ ఆగి; అధిక వినయము= ఎక్కువ వినయం; ఎసఁగన్= ఒప్పగా; ఆ+మునులతోడన్= ఆ మునులతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** వేఁటకు వెళ్ళి తిరిగి వస్తున్న వృషాదర్భి అనే రాజు - గొప్ప దానాలు ప్రీతిగా చేసేవాడు - వారిని చూచి ముందుకు పోవక ఆగి మిక్కిలి వినయంతో ఆ మునులతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'అతులదాన పరుఁడు' - ఇది ముందు కథకు సూచన. అధిక వినయము - ఇది అతని గుర్తింపును సూచిస్తుంది. వారు మహానుభావులన్న విషయం దర్శనంచేతనే తెలిసికొన్నాడని భావం.

**క. 'మీ రాఁకలి పెల్లున నా । హారంబుగ శవముఁ గొనుట కడరితి; రిట్లే**

**లా? రం డిచ్చెద మీ కా । హారంబులు వలసినట్టి' వని తా మఱియున్. 212**

**ప్రతిపదార్థం:** మీరు; ఆఁకలిపెల్లునన్= ఆకలి ఎక్కువకు; ఆహారంబుగన్= భోజన పదార్థంగా; శవమున్= ప్రాణంలేని దేహాన్ని; పీనుగను; కొనుటకున్= తినటానికి; అడరితిరి= సిద్ధపడ్డారు; ఇట్లు= ఈ విధంగా; ఏలా?= ఎందుకు; రండు= నాతో రండి; మీకున్= మీకు; వలసిన+అట్టి+అవి= కావలసినవైన; ఆహారంబులు= భోజనాలు; ఇచ్చెదన్= ఇస్తాను; అని= అని పలికి; తాన్= తాను; మఱియున్= ఇంకా.

**తాత్పర్యం:** 'మీరు ఆకలి ఎక్కువ కావటంవలన శవాన్ని తినటానికి సిద్ధపడ్డారు. మీకు కోరిన భోజనాలు ఇస్తాను రండి' అని ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** మీరు - అర్థాంతర సంక్రమితవాచ్యధ్వని - మహర్షులూ తపస్సు చేస్తున్నవారూ అయిన మీరు అని భావం.

**క. బహువిధముల ధాన్యములును । బహు రసవర్గములు మీకు భక్తి నొసఁగెదన్**

**బహుతురగ శకట గోగణ । బహుళ బహుగ్రామములును బహుమతి నిత్తున్.' 213**

**ప్రతిపదార్థం:** మీకున్= మీకు; బహువిధముల ధాన్యములును= పెక్కు విధాలైన తిండిగింజలు; బహురసవర్గములున్= పెక్కు రుచుల పదార్థాల సముదాయాలను; భక్తిన్= భక్తితో; ఒసఁగెదన్= ఇస్తాను; బహు తురగ శకట గోగణ బహుళ బహు

గ్రామములును= పెక్కు గుర్రాలు, బండ్లు, ఆలమందలు చాలా ఎక్కువగా ఉన్న పెక్కు ఊళ్ళను; బహుమతిన్= మన్ననతో; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** ఎన్నో ధాన్యాలు, రుచిగల పదార్థాలు, గుర్రాలు, బండ్లు, ఆవులు అధికంగా ఉన్న పెక్కు ఊళ్ళు మీకు భక్తితో మన్ననతో ఇస్తాను.'

**విశేషం:** పద్యంలో 'బహు' శబ్దం అనేక పర్యాయాలు వాడటం రాజు దానంలోని ఉత్సాహాతిశయాన్ని సూచిస్తుంది. జీవితకాలంలో మీరు ఇట్టి శవభోజనం గురించి ఆలోచనకూడా చేయనక్కరలేని స్థితి కల్పిస్తాననే అతని హృదయం ఇక్కడ వ్యక్తమవుతున్నది. భక్తిన్ బహుమతిన్ అన్న మాటలు, అతని మంచితనానికి నిదర్శనంగా నిలుస్తాయి.

**వ. అనిన వార లతని కిట్లనిరి. 214**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; వారలు= ఆ ఋషులు; అతనికిన్= ఆ వృషాదర్భికి; ఇట్లు= ఈ విధంగా; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** అని చెప్పగా ఆ ఋషులు అతడితో ఇట్లా అన్నారు.

**తే. 'రాజవర! రాజుదెసఁ బ్రతిగ్రహము విషముఁ । గల్లుఁగాఁ జూతు మిట్టులు గాంచి యున్న**
**యట్టి మాకు నీవిచ్చెదనుట మా వి । ధం బెఱుంగమి యింతియ; తప్పు గాదు.' 215**

**ప్రతిపదార్థం:** రాజవర!= రాజశ్రేష్ఠా!; రాజుదెసన్= రాజువైపునుండి; ప్రతిగ్రహమున్= పుచ్చుకొనుటను; విషమున్= విషమును; కల్లుఁగాన్= కల్లుగానూ; చూతుము= భావిస్తాము; ఇట్టులు= ఈ విధంగా; కాంచి ఉన్న అట్టి మాకున్= భావించి ఉన్న మాకు; నీవు; ఇచ్చెదన్= ఇస్తాను; అనుట= అనటం; మా విధంబు= మా పద్ధతి; ఎఱుంగమి= తెలియకపోవటం; ఇంతియ= ఇంతే; తప్పు= దోషం; కాదు.

**తాత్పర్యం:** 'రాజా! రాజునుండి పుచ్చుకొనటం విషంగానూ; కల్లుగానూ భావిస్తాం. ఇట్టి భావన కల మాకు నీవు ఏదో ఇస్తాననటం మా సంగతి తెలియకపోవటం మాత్రమే. మీ తప్పు కాదులే.'

**విశేషం:** విషంతో కల్లుతో సమానంగా రాజు ఇచ్చిన దానిని భావిస్తాం. అంటే ప్రతిగ్రహం ప్రాణాలు తీసేదిగా, ఒకవేళ ప్రాణాలున్నా వివేకాన్ని హరించివేసేదిగా మా భావన అని భావం.

**క. అనుడు విషాదము తోడం । జని కృత్రిమ వన ఫలములు సమకట్టి తగన్**
**జనపతి మంత్రుల ఋషులకుఁ । గొనిపొండని పంప వా రంకురిత భక్తిన్. 216**

**ప్రతిపదార్థం:** అనుడున్= అన్నంతనే; జనపతి= రాజు; విషాదము తోడన్= దుఃఖంతో; చని= వెళ్ళి; కృత్రిమ వన ఫలములు= మాయతో ఏర్పడిన అడవి పండ్లు; సమకట్టి= సిద్ధంచేసి; తగన్= తగు విధంగా; మంత్రులన్= మంత్రులను; ఋషులకున్= ఆ పదిమంది ఋషులకొరకు; కొనిపొండు= తీసికొని వెళ్ళండి; అని; పంపన్= పంపగా; వారు = ఆ మంత్రులు; అకుంఠిత భక్తిన్= మొక్కవోని భక్తితో.

**తాత్పర్యం:** ఋషు లట్లా అనగా రాజు విచారంతో వెళ్ళిపోయి కృత్రిమమైన అడవి పండ్లను చక్కగా సిద్ధంచేసి మంత్రులను 'వీటిని ఆ ఋషులకొరకు తీసికొని వెళ్ళుం'డని పంపాడు. వారు చక్కని భక్తితో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. వానిం దెచ్చి యమ్మహాత్ములకు సమర్పించిన. 217**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ పండ్లను; తెచ్చి; ఆ+మహాత్ములకున్= దొడ్డబుద్ధిగల ఆ మహర్షులకు; సమర్పించినన్= ఇవ్వగా.

**తాత్పర్యం:** ఆ పండ్లు తెచ్చి ఆ మహానుభావులకు సమర్పించగా.

**ఆ. వారు పట్టి చూచి వానివ్రేఁగున హేమ । గర్భకంబు లగుట గాంచి నవ్వి**
**పుచ్చుకొనక యున్నఁ బోయి భూపతికి న । త్తెఱఁ గమాత్యకోటి యెఱుఁగఁ జెప్పె. 218**

**ప్రతిపదార్థం:** వారు= ఆ ఋషులు; పట్టి చూచి= పరీక్షించి; వాని వ్రేఁగునన్= వాటి బరువునుబట్టి; హేమ గర్భకంబులు= బంగారం కడుపులో ఉన్నవి; అగుటన్= అవటం; కాంచి= తెలిసికొని; నవ్వి; పుచ్చుకొనక+ఉన్నన్= గ్రహించకుంటే; అమాత్యకోటి= మంత్రుల సముదాయం; పోయి= వెళ్ళి; భూపతికిన్= రాజుకు; ఆ తెఱఁగు=ఆ విషయం; ఎఱుఁగన్ చెప్పెన్= తెలియ జెప్పింది.

**తాత్పర్యం:** ఆ ఋషులు ఆ పండ్లను పట్టుకొని చూచి వాటి బరువునుబట్టి వాటి కడుపులో బంగారం ఉండటం తెలిసికొని నవ్వి పుచ్చుకొనలేదు. మంత్రులు వెళ్ళి రాజుకు ఈ విషయం తెలియజెప్పారు.

**విశేషం:** నవ్వి - రాజు ఎత్తును గ్రహించగలిగినందుకు, రాజు ఔదార్యం గుర్తించినందుకు, తమ నిష్ఠ చెడనందుకు కలిగిన ఆనందం.

**క. విని యతఁడు రాజసంబున । గనలు వొడమి కృత్తి వేల్వఁగాఁ దగువారిం**
**బనిచిన నప్పుడు హోమం । బున రాక్షసి యోర్తు పుట్టె భూపవరేణ్యా! 219**

**ప్రతిపదార్థం:** భూపవరేణ్యా!= రాజశ్రేష్ఠా!; విని= ఆ సంగతి ఆలకించి; అతఁడు= ఆ వృషాదర్భి; రాజసంబునన్= రజోగుణ ప్రభావంవలన; కనలు+పొడమి= కోపంపుట్టి; కృత్తిన్= కృత్తి అనే రాక్షసిని; వేల్వఁగాన్= హోమంద్వారా తెప్పించటానికి; తగువారిన్= తగిన వారిని; పనిచినన్= ఆజ్ఞాపించగా; అప్పుడు= ఆ సమయంలో; హోమంబునన్= హోమంలో; రాక్షసి= రక్కసి; ఓర్తు= ఒకతె; పుట్టెన్= జనించింది.

**తాత్పర్యం:** రాజా! ఆ సంగతి తెలిసికొన్న వృషాదర్భికి రాజసంవలన కోపం వచ్చింది. 'కృత్తి'ని హోమం ద్వారా తెప్పించగలవారిని నియోగించాడు. అప్పుడు హోమంలో ఒక రక్కసి పుట్టుకొని వచ్చింది.

**విశేషం:** రాజసం - రజోగుణ విలక్షణం. ఇది నిష్కారణమైన కోపతాపాలను పుట్టించి చివరకు ఆత్మ వినాశానికి కారణం అవుతుంది. కృత్తి వేల్వన్ - ఇది ఒక క్షుద్ర విద్య. తాంత్రిక ప్రయోగం.

**వ. పుట్టియప్పుడమితేని ముందట నిలిచి 'పనియేమి పనుపు' మనిన నతండు ప్రీతుండై 'కశ్యపాదులం గనుపుగొట్టు' మని పనిచిన, నది వార లున్నెడ రోసిపోయె, నంతకు మున్న వారు వనంబున మూలంబులు ఫలంబులు వెదకి తిరుగుచుండ శునస్సఖుండను పరివ్రాజకుండు వచ్చి వారిం గని వందనంబు సేసిన వారలభినందించి; రతండు నమ్మునులం గలిసి యేకార్థుండై సంచరించె; నట్లు చరించు నమ్మహాత్ము లతిక్షుధాన్వితులై తామరతూండ్లు పుచ్చికొని నమలుటకై యొక్క నలినాకరంబునకు సత్వరగతి నరుగుచు నున్న నా రక్కసి యక్కొలని కడ్డంబుగాఁ బోయి పొడసూపి నిలిచిన. 220**

**ప్రతిపదార్థం:** పుట్టి= జన్మించి; ఆ+పుడమితేని ముందటన్= ఆ రాజుముందర; నిలిచి= నిలబడి; పని= కార్యం; ఏమి; పనుపుము= ఆనతివ్వుము; అనినన్= అనగా; అతండు= ఆ రాజు; ప్రీతుండు+ఐ= ప్రీతిపొందినవాడై; కశ్యప+ఆదులన్= కశ్యపుడు మొదలైనవారిని; కనుపు+కొట్టుము= ముక్కలుగా నరుకుము; అని; పనిచినన్= పంపగా; అది= ఆ కృత్తి; వారలు+ఉన్న+ఎడన్= వారున్నచోటును; రోసి పోయెన్= వెదకుతూ పోయింది; అంతకు మున్ను+అ= అంతకుముందే; వారు= ఆ మహర్షులు; వనంబునన్= అడవిలో; మూలంబులు= దుంపలు; ఫలంబులు= పండ్లు; వెదకి= అన్వేషించి; తిరుగుచున్+ఉండన్= తిరుగుతూ ఉండగా; శునస్సఖుండు అను పరివ్రాజకుండు= శునస్సఖుడనే సన్న్యాసి; వచ్చి; వారిన్= వారిని; కని= చూచి; వందనంబు+చేసినన్= నమస్కరించగా; వారలు= వారు; అభినందించిరి= ప్రీతితో మంచిమాటలు పలికారు; అతండును= ఆయనకూడా; ఆ+మునులన్= ఆ మునులతో; కలసి= కూడుకొని; ఏక+అర్థుండు+ఐ= ఒకే ప్రయోజనం కలవాడై; సంచరించెన్= తిరుగాడాడు; అట్లు= ఆ విధంగా; చరించు+ఆ+మహాత్ములు= తిరుగుతున్న ఆ గొప్ప వ్యక్తులు; అతిక్షుధా+అన్వితులు+ఐ= పిక్కటిల్లిన ఆకలితో కూడిన వారై; తామరతూండ్లు= తామర కాడలలోపలి మెత్తని పదార్థాలను; పుచ్చికొని= తీసికొని; నమలుటకున్+ఐ= నమలటానికై; ఒక్క నలిన+ఆకరంబునకున్= ఒక తామరకొలనికి; సత్వరగతిన్= వేగంగల నడకతో; అరుగుచున్+ఉన్నన్= పోతూ ఉండగా; ఆ రక్కసి= కృత్తిఅనేఆ రాక్షసి; ఆ+కొలనికిన్= ఆ చెఱువుకు; అడ్డంబుగాన్= అడ్డంగా; పోయి= వెళ్ళి; పొడ+చూపి= వారికి కనబడి; నిలిచినన్= నిలువగా.

**తాత్పర్యం:** కృత్తి పుట్టి ఆ రాజు ముందర నిలిచి 'పని ఏమిటో సెలవివ్వుము' అన్నది. అతడు ప్రీతి పొంది 'కశ్యపాదులను ముక్కలు ముక్కలుగా నరుకుము' అని పంపాడు. అంతకు ముందే మునులు అడవిలో దుంపలూ, పండ్లు వెతుక్కుంటూ తిరుగుతూ ఉండగా శునస్సఖుడనే సన్న్యాసి వారిని చూచి వందనం చేశాడు. వారు అతడిని మంచిమాటలతో ఆదరించారు. అతడు కూడా ఆ మునులతో తిరుగుతున్నాడు. అట్లా తిరుగుతున్న ఆ మహాత్ములు కడుపు కాల్చివేసే ఆకలితో తామరతూండ్లు అయినా నమలుదామని ఒక సరస్సు దగ్గరికి వడివడిగా వస్తున్నారు. అప్పు డా కృత్తి వారి కడ్డంగా వచ్చి నిలిచింది.

**విశేషం:** కనుపుగొట్టు అనేమాట 'కసి' ని వ్యక్తంచేస్తుంది. ప్రేగులు కాల్చివేసే ఆకలిలో కూడా వారు ఒక నియమానికి కట్టుబడి ఉండటం వారి మహాత్మత్వాన్ని నిరూపిస్తుంది.

**క. ఈ కమలవనము చేరువ । నే కార్యము సేయఁ జూచె? దీ వెవ్వత?' వం**
**చా కొలను సొరఁగ నమ్ముని । లోకము సేరుటయు నచ్చెలువ యెలుఁ గెసఁగన్. 221**

**ప్రతిపదార్థం:** ఆ మునిలోకము= ఆ మునుల సముదాయము; ఈ కమల వనము చేరువన్= ఈ తామర కొలను దగ్గర; ఏ కార్యము= ఏ పని; చేయన్+చూచెదు?= చేస్తావు?; ఈవు= నీవు; ఎవ్వతవు= ఎవతెవు; అంచున్= అంటూ; ఆ కొలను= ఆ చెరువును; చొరఁగన్= ప్రవేశించటానికి; చేరుటయున్= రాగా; ఆ+చెలువ= ఆ యింతి; ఎలుఁగు+ఎసఁగన్= పెద్ద గొంతుతో.

**తాత్పర్యం:** ఆ మహర్షులు 'ఈ తామరకొలను దగ్గర ఏమి చేస్తున్నావు?' అంటూ చెరువులో ప్రవేశించబోగా ఆమె పెద్ద గొంతుతో (ఇట్లా అన్నది).

**విశేషం:** 'ఏం పని' అంటూ కొలనిలోనికి దిగబోయారు - అంటే ఆమె సమాధానం మీద వారికి పెద్ద ఆసక్తి లేదు.

## వృషాదర్భి పుత్తెంచిన కృత్తి శునస్సఖునిచే మృతిఁ బొందుట (సం.13-95-48)

**వ. ‘ ఏ నెవ్వత నైతి నేమి? యిక్కొలని కావలియున్న దాన’ ననుటయు నమ్మునులు వెల్లనై’ యాఁకట నలందురి యుపజీవింప నొండేమియు లేమింజేసి యీ సరోవరంబున బిసంబులు వెతికికొని భక్షించు వారమై వచ్చితి’ మనిన నవ్వనిత ‘మీ మీ పేళ్ళు సెప్పిమఱి పద్మవనంబు ప్రవేశించువా’ రని పలికిన నప్పరమమును లన్నాతి యాతుధాని యగుటయుం గృత్తియగుటయు వధింప వచ్చినది యగుటయు నెఱింగి కశ్యపాదులగు పదుండ్రును దానికి దుర్బోధత్వంబు దోఁచునట్లుగా నిర్వచన సహితంబుగాఁ దమనామంబులు సెప్పి; రప్పాపవర్తన వెఱఁగు పడియుండ శునస్సఖుండు దన యభిధానం బభివ్యక్తంబుగా నుగ్గడించినం గృత్తి ‘నీ పేరు దెలియం జెప్ప విదియేమి?’ యనవుడు నతండు ‘తేటపడం జెప్పియుండం జెప్పవనియెద; విట్లంట తప్పుగాదె? యిట్టి యుద్దండవు మంత్ర దండంబు పాలు వడు’ మని బ్రహ్మదండ నిభంబగు నిజహస్తగత దండంబున దాని శిరంబు బెట్టు వ్రేయుచుఁ ‘బాపకర్మురాలా! పడు ము భస్మంబ వగు మని నిష్ఠురాక్షరంబుగా నిర్దేశించిన దుర్దశ యగుచుంబడి యా రక్కసి భస్మీభూతయయ్యెఁ; నప్పు డప్పదునొకండ్రునుం బ్రమోదంబునం బయోజషండంబు సొచ్చి. 222**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఎవ్వతను= ఎవర్తిని; ఐతిని= అయితే; ఏమి?; ఈ+కొలనికావలి+ఉన్నదానన్= ఈ సరస్సుకు కావలిగా ఉన్నదానను; అనుటయున్= అనునంతనే; ఆ+మునులు= ఆ మహర్షులు; పెల్లనై= తెల్లబారి; ఆఁకటన్= ఆకలిచేత; అలందురి= కటకటపడి; ఉపజీవింపన్= బ్రతుకుటకు; ఒండు= మరొకటి; ఏమియున్= ఏదియును; లేమిన్+చేసి= లేకపోవటంవలన; ఈ సరోవరంబునన్= ఈ చెరువులో; బిసంబులు= తామరతూండ్లు; పెతికికొని= త్రుంచుకొని; భక్షించువారము+ఐ= తినేవాళ్ళమై; వచ్చితిమి= వచ్చాము; అనినన్= అనగా; ఆ+వనిత= ఆ ఆడది; మీ మీ పేళ్ళు= మీ మీ పేరులు; చెప్పి; మఱి= తరువాత; పద్మవనంబు= తామరలున్న చోటును; ప్రవేశించువారు= చొరగలరు; అని; పలికినన్= పలుకగా; ఆ+పరమ మునులు= ఆ మహర్షులు; ఆ+నాతి= ఆ స్త్రీ; యాతుధాని= రక్కసి; అగుటయున్= కావటమూ; కృత్తి అగుటయున్= కృత్తి అనే మృత్యుదేవత కావటమూ; వధింపన్ వచ్చినది= చంపటానికి వచ్చింది; అగుటయున్= కావటమూ; ఎఱింగి= తెలిసికొని; కశ్యప+ఆదులు+అగు= కశ్యపుడు మొదలగు; పదుండ్రును= పదిమందీ; దానికిన్ = ఆ రక్కసికి; దుర్బోధత్వంబు= అర్థంకాక పోవటం; తోఁచునట్లుగాన్= వ్యక్తమయ్యే తీరున; నిర్వచన సహితంబుగాన్= అర్థ వివరణతోపాటుగా; తమ నామంబులు= తమ పేర్లు; చెప్పిరి= చెప్పారు; ఆ+పాపవర్తన= పాపపు నడవడిగల ఆ ఇంతి; వెఱఁగుపడి+ఉండన్= ఆశ్చర్యపడి ఉండగా; శునస్సఖుండు= శునస్సఖుడనే సన్న్యాసి; తన అభిధానంబు= తన పేరు; అభివ్యక్తంబుగాన్= చక్కగా తెలిసే విధంగా; ఉగ్గడించినన్= చెప్పగా; కృత్తి; నీ పేరు= నీ నామం; తెలియన్= చక్కగా తెలిసే విధంగా; చెప్పవు= చెప్పలేదు; ఇది; ఏమి?= ఎందుకు; అనవుడున్= అన్నంతనే; అతండు= ఆ ముని; తేటపడన్= స్పష్టమయ్యే విధంగా; చెప్పి ఉండన్= చెప్పి ఉండగా; చెప్పవు= చెప్పలేదు; అనియెదవు= అంటావు; ఇట్లు= ఈ విధంగా; అంట= అనటం; తప్పు కాదె!= దోషం కదా!; ఇట్టి ఉద్దండవు= ఇట్టి పొగరుబోతువు; మంత్ర దండంబు= మంత్రశక్తిగల కర్రకు; పాలు పడుము= వశం కమ్ము; అని; బ్రహ్మదండ నిభంబు= బ్రహ్మ దండంవంటిది; అగు నిజహస్తగత దండంబునన్= అయిన తన చేతిలో ఉన్న కర్రతో; దాని శిరంబు= ఆ కృత్తి తలను; బెట్టు= గట్టిగా; వ్రేయుచున్= కొడుతూ; పాపకర్మురాలా!= పాపపు పనులు చేసేదానా!; పడుము= పడిపో; భస్మంబవు= బూడిదవు; అగుము= అయిపొమ్ము; అని; నిష్ఠుర+అక్షరంబుగాన్= పరుషమైన అక్కరాలు ఉండేవిధంగా; నిర్దేశించినన్= పలుకగా; దుర్దశ+అగుచున్= చెడ్డ స్థితికలది ఔతూ; పడి= క్రిందకు దొరలి; ఆ+రక్కసి= ఆ రాక్షసి; భస్మీభూత= బూడిద అయినది; అయ్యెన్= అయింది; అప్పుడు= ఆ సమయంలో; ఆ పదునొకండ్రునున్= ఆ పదునొకండుమందీ; ప్రమోదంబునన్= మిగుల ఆనందంతో; పయోజషండంబు= తామర వనంలోకి; చొచ్చి= ప్రవేశించి.

**తాత్పర్యం:** 'నే నెవరైతే నేమి? ఈ కొలనుకు కావలిదాన్ని' అనగా ఆ మునులు 'మిక్కిలి ఆకలితో కష్టపడి తినటానికి మరేమీ లేకపోవటంవలన ఈ తామరతూండ్లు తీసికొని తినగోరినవారమై వచ్చాం' అన్నారు. అప్పు డా ఇంతి 'మీ మీ పేర్లు చెప్పిన తరువాతనే కొలనులోకి ప్రవేశించాలి' అంటే ఆ మహర్షులు ఆమె రాక్షసి అనీ, కృత్తి అనీ, తమను చంపటానికి వచ్చిందనీ తెలిసికొని కశ్యపుడు మొదలైన పదిమంది తమ పేర్లు దానికి తెలియరాకుండేటట్లుగా నిర్వచనాలతో కూడ కలిపి చెప్పారు. ఆమె అది తెలిసికొనలేక నిశ్చేష్టురాలైంది. శునస్సఖుడు మాత్రం తన పేరు సూటిగా చెప్పాడు. కృత్తి 'నీ పేరు తెలిసే విధంగా చెప్పవేం?' అన్నది. అప్పు డతడు నేను చక్కగా తెలిసే విధంగా చెప్తే చెప్పవు అంటావు. ఇది తప్పు కదా! నీవు చెడిపెవు. ఇదిగో మంత్రదండానికి వశం కమ్ము!' అని బ్రహ్మదండం వంటి తన చేతి కర్రతో దాని నెత్తిమీద గట్టిగా కొట్టుతూ. 'పాపాత్మురాలా! బూడిదైపో' అని పరుషంగా పలికాడు. దానితో అది భస్మమై కూలి పోయింది. అప్పు డా పదునొక్కంద్రు ఆనందంతో తామరల కొలనులోనికి ప్రవేశించారు.

**విశేషం:** నిర్వచనం అంటే ఆ అర్థం ఏ ధాతువుమూలంగా వచ్చిందో వివరించటం. ఉదాహరణకు కశ్యపుడు అంటే పశ్యకుడు అన్నింటినీ సూక్ష్మదృష్టితో చూచేవాడు అని అర్థం. ఇది ఒక మహా శాస్త్రం చెప్పిన విద్య కనుక ఆ రక్కసికి అర్థం కాలేదు. శునస్సఖుడు సూటిగా తన పేరు చెప్పగా ఇతరుల ధోరణికంటె భిన్నంగా ఉన్నందువలన నిర్వచనం లేకపోవటం కారణంగా అర్థం కాలేదు. శ్రేయస్కాముడు తన పేరు చెప్పరాదని శాస్త్రం **"ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ శ్రేయస్కామో న గృహ్ణీయాత్ జ్యేష్ఠాపత్య కళత్రయోః"** అని అనుశాసనం. కనుక కృత్తి వారు పేర్లు చెబితే దోషాన్ని నిరూపించి చంపాలనుకొన్నది. అది బెడిసికొట్టటం కొరకు అసలు పేర్లు చెప్పక నిర్వచన సహితంగా చెప్పారు.

**తే.** **బిసము లాదట నందఱుఁ బెఱికి రొంపి । వోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి**
**తీరమునఁ బెట్టి నియమముల్ దీర్పఁజొచ్చి । తీర్చి యాఁకలి దముఁ గోసి తినఁగఁ గూడి.** **223**

**ప్రతిపదార్థం:** అందఱున్= వారంతా; ఆదటన్= ప్రీతితో; బిసములు= తామరతూండ్లను; పెఱికి= త్రుంచి; రొంపి= బురద; పోవన్= పోయే విధంగా; నీటన్= నీటిలో; తెమల్చి= జాడించి; మోపుగన్= కట్టగ; అమర్చి= ఏర్పరచి; తీరమునన్= ఒడ్డున; పెట్టి= ఉంచి; నియమముల్= సంధ్యాపూజ మొదలైన విధులను; తీర్పన్+చొచ్చి= చేయబూని; తీర్చి= ఆచరించి; ఆఁకలి= క్షుధ; తమున్= తమను; కోసి తినఁగన్= కోసికొని తింటూ ఉండగా; కూడి= కలిసి.

**తాత్పర్యం:** అందరూ ప్రీతితో ఆ తామరతూడులను పెకలించి బురద పోయేవిధంగా నీటిలో జాడించి మోపుగా కట్టి ఒడ్డునబెట్టి విధులు తీర్చుకొని ఆకలి తమను తినివేస్తుంటే అందరూ కలిసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆకలి వారిని తినివేస్తున్నది - అంటే ఆకలితో ప్రేగులు కాలిపోతున్నాయన్నమాట. ఇక్కడ విశేషం ఏమంటే అంత ఆకలితో ఉన్నా నియమాలు తీర్చుకొన్న తరువాతనే తినబోయారు. ఇది వారి ధర్మనిష్ఠను నిరూపిస్తుంది.

**క.** **కొలను వెడలి బిసము లిడిన । నెలవునకుం బోయి యచట నిగిడించిన చూ**
**డ్కుల కవి దోఁపక యున్నను । గలయం బరికించి యెట్లుఁ గానక తమలోన్.** **224**

**ప్రతిపదార్థం:** కొలను= సరస్సునుండి; వెడలి= వెలుపలికి వచ్చి; బిసములు+ఇడిన నెలవునకున్= తామరతూండ్లు పెట్టిన చోటికి; పోయి= వెళ్ళి; అచటన్= అందు; నిగిడించిన చూడ్కులకున్= పరగించిన చూపులకు; అవి= ఆ తూండ్లు; తోఁ

పక+ఉన్నను= కనపడకపోగా; కలయన్= అన్నివైపుల; పరికించి= జాగ్రత్తగా చూచి; ఎట్లున్= ఏ విధంగానూ; కానక= చూడక; తమలోన్= తమలో.

**తాత్పర్యం:** వారంతా కొలనునుండి బయటకు వచ్చి తూడులమోపు పెట్టినచోట దృష్టి సారించారు. అవి కనపడకపోగా అన్నివైపులా జాగ్రత్తగా చూచారు. అయినా కనపడలేదు. అప్పుడు వారు తమలో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఒండొరుల శంకించి శపథంబులు పలుకుదుము గాక యని నిశ్చయించి శునస్సఖుని వినువానింగాఁ జేసికొని; రప్పు డత్రి యిట్లనియె. 225**

**ప్రతిపదార్థం:** ఒండొరులన్= ఒకరినొకరు; శంకించి= అనుమానించి; శపథంబులు= ఒట్టులు; పలుకుదుము కాక= పలుకుదాం; అని; నిశ్చయించి= తీర్మానించి; శునస్సఖునిన్= శునస్సఖుడిని; వినువానిన్+కాన్= వినేవాడినిగా; చేసికొనిరి= చేసికొన్నారు; అప్పుడు= ఆ సమయంలో; అత్రి= అత్రి మహర్షి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వారు ఒకరినొకరు అనుమానించారు. ఒట్టుపెట్టుకొని తమ తప్పులేనితనం నిరూపించుకొందామని నిర్ణయించుకొన్నారు. శునస్సఖుడిని మధ్యవర్తిగా వినటానికి ప్రార్థించారు. అప్పుడు అత్రి మహర్షి ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇట్లా ఒట్టు పెట్టుకొనే పద్ధతి అన్నిదేశాలలో అన్ని కాలాలలో ఉన్నట్లు తెలియవస్తున్నది. పాపభీతి ఉన్నవారు తప్పుచేసి ఒట్టుపెట్టుకొనరు.

**తే. 'మొదవుఁ దన్నుట, రవియభిముఖత దనకుఁ । గలుగు మూత్ర పురీష మోక్షణము సేఁత,**
**యధ్యయన మనధ్యయనమునందు నడపు । టగు బిసంబులు మ్రుచ్చిలి నట్టు లైన.' 226**

**ప్రతిపదార్థం:** (నేను) బిసంబులు= తూడులు; మ్రుచ్చిలిన+అట్టులు+ఐనన్= దొంగిలించినట్లైతే; మొదవున్= ఆవును; తన్నుట= తన్నటం; తనకున్= తనకు; రవి+అభిముఖత= సూర్యు డెదురుగా ఉండటం; కలుగన్= కలుగగా; మూత్ర పురీష మోక్షణము= మూత్రమును, మలమును వదలటం అనే పని; చేఁత= చేయటం; అనధ్యయనము నందున్= వేదం చదువరాని దినాన; అధ్యయనము= చదవటం; నడపుట= సాగించటం; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** నేను తామరతూండ్లు దొంగిలిస్తే ఆవును తన్నిన పాపం, సూర్యుడి కెదురుగా మలమూత్రాలను విడచిన పాపం, అనధ్యయన దినం నాడు వేదాలు చదివిన పాపమూ నాకు కలుగుతాయి.

**విశేషం:** ఇవన్నీ మహాపాపాలు. పాడ్యమి, అష్టమి, పూర్ణిమ, అమావాస్య అనే తిథులు అనధ్యయన దినాలు. అట్లాగే పూజ్యులెవరైనా గురుకులానికి వస్తే ఆ దినాన్ని శిష్టానధ్యయనంగా పరిగణిస్తారు.

**వ. అనుటయు వసిష్ఠుండు. 227**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అన్నంతనే; వసిష్ఠుండు= వసిష్ఠ మహర్షి.

**తాత్పర్యం:** అప్పుడు వసిష్ఠు డిట్లా అన్నాడు.

**క. శ్రుతి సదువమి; సన్న్యాస । స్థితిఁ గాముకుఁ డగుట; గుక్కఁ జేకొని తిరుగన్**
**మతి రోయమి నయ్యెడు దు । ర్గతి తూఁడులు మ్రుచ్చిలించు కష్టునకు నగున్.' 228**

**ప్రతిపదార్థం:** తూఁడులు= తామరకాడలు; మ్రుచ్చిలించు కష్టునకున్= దొంగిలించిన నీచుడికి; శ్రుతి= వేదం; చదువమి= చదవకపోవటం; సన్న్యాస స్థితిన్= సన్న్యసించిన దశలో; కాముకుఁడు= స్త్రీ మోహం కలవాడు; అగుట= కావటం; కుక్కన్= కుక్కను; చేకొని= పట్టుకొని; తిరుగన్= తిరుగగా; మతిన్= బుద్ధిలో; రోయమిన్= ఏవగించుకొనకపోవటంవలన; అయ్యెడు దుర్గతి= కలిగే నీచదశ; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** తామరతూడులు దొంగిలించిన నీచుడికి వేదం చదవకపోయిన పాపం, సన్న్యసించి కామభావన పొందినవాడి పాపం, కుక్కను పట్టుకొని తిరుగుతూ అసహ్యించుకొననివాడికయ్యే దుర్గతీ కలుగుతాయి.'

**విశేషం:** బ్రాహ్మణుడు నిష్కారణంగా ఆరు అంగాలతోకూడిన వేదం చదవాలని స్మృతి చెప్పింది. కనుక చదవకపోవటం పాపం, 'సన్న్యాసం' అంటే కామక్రోధాది భావాలను పూర్తిగా అవతల ఉంచటం. ఆ స్థితి పొంది కామభావనకు లోబడితే అది రెండింటికీ చెడిన స్థితి అవుతుంది.

**వ. అని వెండియు. 229**

**తాత్పర్యం:** అని పలికి వసిష్ఠుడు ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. 'సుత నమ్మికొనుట, శరణా । గతుఁ జేకొనకునికి నిచ్చు కారుణికు దరి**
**ద్రతఁ జూచియు వేఁడుట నగు । గతి బిసములు దాఁచికొనుట గల్గినఁ గల్గున్.' 230**

**ప్రతిపదార్థం:** సుతన్= బిడ్డను; అమ్మికొనుట= అమ్ముకొనటం; శరణ+ఆగతున్= రక్షణ కోరి వచ్చినవాడిని; చేకొనక+ఉనికిన్= కైకొనకుండటం; ఇచ్చు కారుణికు దరిద్రతన్= ఇచ్చే దయగలవాడిలేమిని; చూచియున్= చూచికూడా; వేఁడుటన్= యాచించటంవలన; అగుగతి= అయ్యే దశ; బిసములు= తామరతూండ్లు; దాఁచికొనుట= దాచుకొనటం; కల్గినన్= కలిగితే; కల్గున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** 'కన్న కూతురిని అమ్ముకొనటం, శరణుకోరి వచ్చినవాడిని రక్షించకపోవటం, దాత దరిద్రుడు కావటం చూచికూడా అడుగుకొనటం అనే పాపాలు తూడులు దాచిన వాడికి కలుగుతాయి.'

**వ. అనియెఁ; దదనంతరంబ. 231**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; తత్+అనంతరంబు+అ= వెంటనే.

**తాత్పర్యం:** వసిష్ఠు డిట్లా అన్నాడు. ఆ తరువాత.

**చ. 'పలలవృథోపభుక్తి, సభఁ బక్షముఁ బల్కుట, దుష్టదాన, ము**
**గ్మలి దివసంబునం గవయు కష్టత, విప్రజనంబు లుబ్ధతా**
**కులితముఁ జేత, యెల్లసరకుం గొని యమ్ముట కాదె తూఁడు తీఁ**
**గలపొది మ్రుచ్చిలించు' టని కశ్యపసంయమి వల్కె భూవరా! 232**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; కశ్యపసంయమి= కశ్యపుడనే మహర్షి; పలల వృథా+ఉపభుక్తి= మాంసం వ్యర్థంగా తినటం; సభన్= న్యాయస్థానంలో; పక్షమున్= ఒకడివైపు; పల్కుట= మాటాడటం; దుష్టదానము= చెడుదానం; ఉగ్మలిన్= స్త్రీని (భార్యను); దివసంబునన్= పగటియందు; కవయు కష్టత= సంగమించే నీచత్వం; విప్రజనంబున్= చక్కని విద్యగలవారిని; లుబ్ధతా+ఆకులితము= లోభగుణంతో కలత పొందిన వారినిగా; చేఁత= చేయటం; ఎల్లసరకున్= సరుకునంతా; కొని; అమ్మట= అమ్మటం; కాదె= కదా; తూఁడుతీఁగల పొదిన్= తామరతూడు తీగల మోపును; ముచ్చిలించుట= దొంగిలించటం; అని; పల్కెన్= పలికాడు.

**తాత్పర్యం:** కశ్యపమహర్షి ఇట్లా అన్నాడు. 'మాంసం వ్యర్థంగా తినటం, న్యాయస్థానంలో అన్యాయంగా ఒకడివైపు సాక్ష్యం పలకటం, చెడుదానం, స్త్రీని పగటిపూట కలిసే నీచత, విద్యగల బ్రాహ్మణులను లోభగుణంచేత ఏడిపించటం, సరుకునంతా నిలువచేసి ఎక్కువ లాభాలకు అమ్ముకొనటం ఈ తామరతూడుల మోపు దొంగిలించటం అవుతుంది.

**విశేషం:** "విద్యయా యాతి విప్రత్వమ్" మోక్షవిద్యవలననే బ్రాహ్మణుడు విప్రుడవుతాడు. ఆ పాపాలు చేసినవాడి కేగతి కలుగుతుందో ఈ దొంగతనం చేసినవాడి కదేగతి అని తాత్పర్యం.

**వ. పదంపడి. 233**

**తాత్పర్యం:** తరువాత.

**క. జ్ఞాతులయెడ గోవులయెడ । గోతులయెడ ధర్మ మెడలి క్రూరుఁ డగుట కా**
**ర్యాతుర విప్రోపేక్షా । నీతి బిసము లపహరించు నిపుణత యరయన్. 234**

**ప్రతిపదార్థం:** బిసములు= తామరతూండ్లు; అపహరించు నిపుణత= దొంగిలించే నేర్పు; అరయన్= పరిశీలించగా; జ్ఞాతులయెడన్= బంధువుల విషయంలో; గోవులయెడన్= ఆవుల విషయంలో; గోతులయెడన్= స్త్రీల విషయంలో; ధర్మము= ధర్మాన్ని; ఎడలి= వీడి; క్రూరుఁడు= దయలేనివాడు; అగుట= కావటం; కార్య+ఆతుర విప్ర+ఉపేక్షా నీతి= పని తొందరతో దిగులుగల విద్యావంతులగు బ్రాహ్మణులయెడ ఉదాసీనత పాటించటం అనే నీతి.

**తాత్పర్యం:** ఈ తామరతూడులను దొంగిలించే నేర్పు ఎటువంటిదంటే బంధువుల విషయంలో, ఆవుల విషయంలో, స్త్రీల విషయంలో ధర్మం తప్పి దయలేనివాడు కావటం, పనిపడి దిగులుగా ఉన్న విప్రులను గూర్చి పట్టించుకొనని నీతివంటిది.'

**విశేషం:** జ్ఞాతులు, గోవులు, స్త్రీలు, విప్రులు - వీరి యందు చిన్నపాటి దోషాలున్నా పట్టించుకొనకూడదని విదురనీతిలో చెప్పారు. (సం.5.36. 62. తెలుగు. ఉ.2.68)

**క. అని పలికి భరద్వాజుం । డను మఱియు 'హవిస్సు గ్రంప నగ్ని నిడుట, యొ**
**జ్జ నధఃకరించి చదువుట । యను నివి సరియౌ బిసాపహరణంబునకున్.' 235**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; పలికి= మాట్లాడి; భరద్వాజుండు= భరద్వాజ మహర్షి; మఱియున్= ఇంకా; అనున్= అన్నాడు; హవిస్సు= వేల్చే పదార్థాన్ని; క్రంపన్= కంపయందలి; అగ్నిన్= నిప్పునందు; ఇడుట= ఉంచటం; ఒజ్జన్= గురువును; అధః

కరించి= క్రిందుచేసి; చదువుట= చదవటం; అను+ఇవి= అనే ఈ పనులు; బిస+అపహరణంబునకున్= తామరతూండ్లు దొంగిలించటానికి; సరి= సాటి; ఔన్= అవుతాయి.

**తాత్పర్యం:** ఇట్లా పలికి భరద్వాజ మహర్షి ఇంకా ఇట్లా అన్నాడు. 'మంత్రంతో పవిత్రమైన పదార్థాన్ని కంపలోని అగ్నిలో పోయటం, గురువును తక్కువచేసి విద్యను నేర్వటం అనే పనులు తామరతూండ్ల దొంగతనానికి సాటి అవుతాయి.'

**విశేషం:** హవిస్సును ప్రత్యేకంగా ఏర్పరచిన ధార్యాగ్నిలోనే ఉంచాలి. లేకపోతే అది పనికిమాలిన దవుతుంది.

**వ. అని పలుకుటయు. 236**

**తాత్పర్యం:** అత డట్లా పలికిన తరువాత.

**తే. "ముట్టునను భార్యఁ గవయుట, మూత్రమును బు। రీషమును నీర విడుపు, విద్వేషయుక్తి**
**యోషి దుపజీవనము మృణాళోత్కరంబు। ర్ముచ్చిలుటఁ బోలు కల్మషములె తలంప.' 237**

**ప్రతిపదార్థం:** ముట్టునను= చెరగుమాసినపుడు; భార్యన్= పెండ్లమును; కవయుట= కలియటం; మూత్రమును= మూత్రాన్నీ; పురీషమును= మలాన్ని; నీరన్= నీటిలో; విడుపు= విడవటం; విద్వేషయుక్తి= పగతోకూడి ఉండటం; యోషిత్+ఉపజీవనము= ఆడదానిపై ఆధారపడి బ్రతకటం; తలంపన్= ఆలోచిస్తే; మృణాళ+ఉత్కరంబు ముచ్చిలుటన్= తామరతూడుల మోపును దొంగిలించటాన్ని; పోలు కల్మషములు+ఎ?= పోలిన పాపాలా?

**తాత్పర్యం:** 'ముట్టైన భార్యను కలవటం, మలమూత్రాలను నీటిలో వదలటం, పగగొని ఉండటం, స్త్రీపై ఆధారపడి బ్రతకటం ఈ తామరతూడుల దొంగతనానికి సాటియైన పాపాలా!'

**విశేషం:** ఆ పాపాలకన్నా ఇది మిక్కిలి ఘోరమైన దని భావం.

**క. అని జమదగ్ని మఱియు ని। ట్లను 'నన్యోన్యాతిథిత్వ మసహాయపువై**
**రనిరూఢి, పాఁడి మొదవుం। గనలి యడుచు టీడె బిసనికర చోరతకున్. 238**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; జమదగ్ని= జమదగ్ని మహర్షి; మఱియున్= ఇంకా; ఇట్లు= ఇట్లా; అనున్= అన్నాడు; అన్యోన్య+అతిథిత్వము= ఒకడి కొకడు అతిథి కావటమూ, అసహాయము+వైర నిరూఢి= తోడులేని పగను గట్టిగా నిలుపుకొనటమూ; పాఁడిమొదవున్= పాడి ఆవును; కనలి= కోపగించి; అడుచుట= కొట్టటం; బిస నికర చోరతకున్= తామరతూండ్ల మోపు దొంగిలింతకు; ఈడు+ఎ?= సాటియా?

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి జమదగ్ని ఇంకా ఇట్లా అన్నాడు. 'ఒకరి కొకరు అతిథులు కావటం, సాయంలేని పగను నిలుపుకొనటం, పాడి ఆవును కోపించి కొట్టటం అనే పాపాలు ఈ తామరతూండ్ల దొంగతనానికి సాటి అవుతాయా?'

**విశేషం:** ఆ పాపాలన్నింటిని మించిన పాపం ఇది అని భావం.

**వ. అనవుడు గౌతముండు. 239**

**తాత్పర్యం:** అన్న తరువాత గౌతము డిట్లా పలికాడు.

**క. 'ధృతవేద త్యజనానల। వితతి వృథాత్యాగ సోమ విక్రయ వృషలీ**
**పతితా దుర్గ్రామాజీ। వితలు బిసస్తేయ కష్టవృత్తికి నెనయే? 240**

**ప్రతిపదార్థం:** ధృత= చేపట్టిన; వేద= వేదాలను; త్యజన= వదలటం; అనల= అగ్నుల; వితతి= సముదాయాన్ని; వృథా= వ్యర్థంగా; త్యాగ= వదలివేయటం; సోమ విక్రయ= సోమరసాన్ని అమ్మటం; వృషలీపతితా= శూద్ర స్త్రీకి మగడు కావటం; దుర్గ్రామ+ఆజీవితలు= చెడ్డ ఊరిలో బ్రతుకుతూ ఉండటం అనే పాపాలు; బిసస్తేయ కష్ట వృత్తికిన్= తూండ్ల దొంగతనమనే నీచపు నడవడికి; ఎన+ఏ?= సాటియా.

**తాత్పర్యం:** 'చేపట్టిన వేదవిద్యను వదలివేయటం, అగ్నిహోత్రపూజను నిష్కారణంగా మానటం, సోమం అమ్మటం, శూద్రస్త్రీకి మగడు కావటం, చెడ్డ ఊరిలో జీవించటం అనే పాపాలు తామరతూండ్ల దొంగతనానికి సాటి అవుతాయా?'కావని భావం.

**వ. అని నిర్దేశించిన విశ్వామిత్రుం డిట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా అని; నిర్దేశించినన్= పలుకగా; విశ్వామిత్రుండు= విశ్వామిత్ర మహర్షి; ఇట్లు= ఇట్లా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని పలుకగా విశ్వామిత్రు డిట్లా అన్నాడు.

**క. 'తగు భృత్యులఁ బ్రోవకునికి। దగని భటులఁ బ్రోపు కపటధార్మికవృత్తిన్**
**జగతీపతిఁ గొల్చుట లె। స్సగఁ బోలఁగ నేర్చునే బిసస్తైన్యంబున్?' 242**

**ప్రతిపదార్థం:** తగు భృత్యులన్= యోగ్యతకల బంటులను; ప్రోవక+ఉనికి= కాపాడకుండటమూ; తగని భటులన్= పనికిరాని బంటులను; ప్రోపు= రక్షించటం; కపట ధార్మిక వృత్తిన్= మోసపు ధర్మానికి సంబంధించిన నడవడికతో; జగతీపతిన్= రాజును; కొల్చుట= సేవించటం; బిసస్తైన్యంబున్= తామరతూడుల దొంగతనాన్ని; లెస్సగన్= బాగుగా; పోలఁగన్+నేర్చునే?= సాటిరాగలదా?

**తాత్పర్యం:** పనికి వచ్చే సేవకులను రక్షించక పోవటమూ, పనికిరాని సేవకులను కాపాడటమూ, కపటధర్మపు నడవడితో రాజును సేవించటం అనేవి తామరతూడుల దొంగతనానికి సాటి రాగలవా?

**విశేషం:** విశ్వామిత్రుడు ఒకప్పుడు రాజర్షి. కనుక భట సంరక్షణ విషయకంగా పలకటం సముచితంగా ఉన్నది.

**వ. నావుడు నరుంధతి యల్ల నవ్వుచు. 243**

**ప్రతిపదార్థం:** నావుడున్= అని పలికిన తరువాత; అరుంధతి= వసిష్ఠుడి ధర్మపత్ని అయిన అరుంధతి; అల్లన్= మెల్లగా; నవ్వుచున్= నవ్వుతూ.

**తాత్పర్యం:** అప్పుడు అరుంధతి మెల్లగా నవ్వుతూ (ఇట్లా అన్నది).

**విశేషం:** ఇక్కడ నవ్వు హృదయంలోని నిర్మలత్వానికి గుర్తు.

**క. 'సతతంబు నత్త దూఱుటఁ, బతియెడ దుశ్చిత్త యగుటఁ, బరమాన్నము నొ**
**క్కత సేవించుట నగు దు। ర్గతి బిసములు డాఁచికొన్న కష్టకుఁ గలుగున్.' 244**

**ప్రతిపదార్థం:** సతతంబున్= ఎల్లవేళలా; అత్తన్= అత్తను; దూఱుటన్= తిట్టటంవలన; పతి ఎడన్= మగని విషయంలో; దుశ్చిత్త= చెడు భావాలు గలది; అగుటన్= కావటంవలనా; పరమ+అన్నమున్= శ్రేష్ఠమైన అన్నం; ఒక్కత= ఒకతే; సేవించుటన్= తినటంవలన; అగు దుర్గతి= అయ్యే పాడుగతి; బిసములు= తామరతూడులు; దాచికొన్న కష్టకున్= దాచుకొన్న నీచురాలికి; కలుగున్= వస్తుంది.

**తాత్పర్యం:** 'ఎప్పుడూ అత్తను తిట్టటంవలనా, భర్తవిషయంలో చెడు భావాలు గలది కావటంవలనా, మంచిభోజనం ఒక్కతే తినటం వలనా కలిగే పాడుగతి తామరతూడులు దాచుకొన్న నీచురాలికి వస్తుంది.'

**విశేషం:** 'అత్త' ఇక్కడ ఉపలక్షణం. మగని బంధువులందరినీ గ్రహించాలి. స్త్రీ పుట్టిల్లు విడిచి మెట్టినిల్లు చేరిన పిదప అక్కడివారి నందరినీ ఆత్మీయులుగా భావించి ప్రేమించకపోతే ఆ ఇల్లు నరకప్రాయం అవుతుందని భావం. 'పతియెడ' భార్యాభర్తలు ఒకరి విషయంలో ఒకరు త్రికరణ శుద్ధిగా మంచి భావనతో ఉండాలి. లేకపోతే అది సంసారాన్ని నరకకూపం చేస్తుంది. 'పరమాన్నము' స్త్రీ మాతృ స్వరూపిణి. ఆమె ఆహారాన్ని తనవారికందరికీ పెట్టిన తరువాతనే భుజిస్తుంది. అంతేకాదు **"ఏకః స్వాదు న భుఞ్జీత"** అన్న సూక్తి కూడా రుచిగల పదార్థాన్ని ఒక్కడే తినకూడదని చెప్తున్నది. ఒక్కతే తినటం మాతృధర్మానికి విరుద్ధం. అందుకే ఆమె కష్ట - నీచురాలు.

అరుంధతి స్త్రీ ధర్మసంబంధమైన పలుకులు పలకటం ఉచితం.

**సీ. అనుడు 'వంటకము సేసిన యింతి తా మున్ను। గుడుచుట, పనియెడఁ గుటిల యగుట,**
**బొంకులు పలుకుట, పుత్త్రిక వెలగొని। యిచ్చుట, సుజనుల కెగ్గు సేఁత,**
**యెట్టి దుర్గతిఁ దెచ్చు నట్టిద కల్గు బి। సావలి మ్రుచ్చిలి నట్టులైన;**
**నిట్లు గాకయుఁ బుట్టువెల్ల దాస్యంబు నీఁ। గకపోవు నక్కీడు గల నికృష్ట'**

**తే. యనియె గండ; 'యసంతానుఁ డగుట, గర్భ దాసుఁ డగుట దరిద్రత్వ తప్తుఁ డగుట**
**చెందుఁ దూఁడులకట్ట మ్రుచ్చిలిన కష్ట। నరుని' కని పల్కెఁ బశుసఖనాముఁ డధిప! 245**

**ప్రతిపదార్థం:** అనుడున్= అన్నంతనే; గండ= గండ అనే సేవకురాలు; బిస+ఆవలిన్= తూడుల కట్టను; మ్రుచ్చిలిన+ అట్టులు+ఐనన్= దొంగిలిస్తే; వంటకము చేసిన ఇంతి= పాకంచేసిన ఆడది; తాన్= తాను; మున్ను= ముందుగా; కుడుచుట= తినటమూ; పనియెడన్= చేసే పనివిషయంలో; కుటిల= చిత్తశుద్ధిలేనిది; అగుట= కావటమూ; బొంకులు= కల్లపలుకులు; పలుకుట= పలకటమూ; పుత్త్రికన్= కన్నబిడ్డను; వెల+కొని= మూల్యం తీసికొని; ఇచ్చుట= ఇవ్వటమూ; సుజనులకున్= మంచివారికి; ఎగ్గు= కీడు; చేఁత= చేయటమూ; ఎట్టి దుర్గతిన్= ఎటువంటి పాడుగతిని; తెచ్చున్= తెస్తాయో; అట్టి+అది+అ= అట్టి పాడు గతియే; కల్గున్= కలుగుతుంది; ఇట్లు+ కాకయున్= ఇంతే కాక; ఆ+కీడు కల నికృష్ట= ఆ దోషం ఉన్న నీచురాలు; పుట్టువు+ఎల్లన్= బ్రతుకంతా; దాస్యంబున్= బానిస తనాన్ని; ఈఁగకపోవున్= తొలగించుకొనలేక పోతుంది; అనియెన్= అన్నది; అధిప!= రాజా!; పశుసఖనాముఁడు= పశుసఖుడనే పేరుగలవాడు; తూడులకట్టన్= తూఁడుల మోపును; మ్రుచ్చిలిన కష్ట నరునికిన్= దొంగిలించిన నీచ మానవుడికి; అసంతానుఁడు= బిడ్డలు లేనివాడు; అగుట= కావటమూ;

గర్భదాసుఁడు= తల్లి గర్భంలో ఉండినప్పటినుండీ బానిస; అగుట= కావటమూ; దరిద్రత్వ తప్తుఁడు= లేమితో కాలిపోయినవాడు; అగుట= కావటమూ; చెందున్= పొందుతాడు; అని; పల్కెన్= పలికాడు.

**తాత్పర్యం:** గండ అనే సేవకురాలు 'తామరతూడులు దొంగిలించిన నీచురాలికి వంటచేసి ముందుగా తినటం, పనులలో వంచనచేయటం, అబద్ధాలు పలకటం, పుత్రికను సొమ్ముకు అమ్ముకొనటం, మంచివారికి కీడు చేయటం అనే పాపాలు తెచ్చే దుర్గతిని తెస్తుంది. ఇంతే కాక బ్రతుకంతా దాస్యం వదలని స్థితి ఆ నీచురాలికి కలుగుతుంది' అని పలికింది. పశుసఖుడు తామరతూడులు దొంగిలించినవాడు, సంతానం లేనివాడు, గర్భదాసుడు, కూడుగుడ్డలకు చెడినవాడూ అవుతా' డని పలికాడు.

**విశేషం:** ఇక్కడ సేవకవృత్తిలో ఉన్న ఈ దంపతులు తదనుగుణంగా పలకటం గమనించదగింది. ఋషి ఈ నెపంతో ఆయా వ్యక్తుల ధర్మాలను వ్యంగ్యమార్గంలో సూచించారు.

**వ. అని యిట్లందఱుం దన కభిముఖులై పలికిరి; వారితో శునస్సఖుం డిట్లనియె. 246**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా అందఱున్= వారందరూ; తనకున్= తనకు; అభిముఖులు= ఎదురుమొగం కలవారు; ఐ= అయి; పలికిరి= పలికారు; వారితోన్= వారితో; శునస్సఖుండు= శునస్సఖుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా వారందరూ తనవైపు మొగం పెట్టి పలికారు. అప్పుడు శునస్సఖుడు వారితో ఇట్లా అన్నాడు.

**క. 'ఛందోజ్ఞున కైనను, దన। నందన నధ్వర ధురీణునకు నైనను నా**
**నందముగ నిచ్చుటం బో। లుం దూఁడులకట్ట మ్రుచ్చిలుట దలపోయన్.' 247**

**ప్రతిపదార్థం:** తలపోయన్= ఆలోచింపగా; తూఁడులకట్టన్= తామరతూడుల మోపును; మ్రుచ్చిలుట= దొంగలించటం; తననందనన్= తన బిడ్డను; ఛందోజ్ఞునకున్+ఐనన్= వేదా లెరిగిన వాడికిగానీ; అధ్వర ధురీణునకున్= యజ్ఞాలలో ఎక్కువభారం వహించేవాడికి; ఐననున్= కానీ; ఆనందముగన్= సంతోషంగా; ఇచ్చుటన్= దానంచేయటంతో; పోలున్= సాటి అవుతుంది.

**తాత్పర్యం:** 'బాగా ఆలోచిస్తే తామరతూడుల మోపును దొంగిలించటం తన కూతురిని మంచి వేదవేత్తకో, యజ్ఞభారాలు వహించేవాడికో ఇవ్వటంతో సమానం అవుతుంది.'

**విశేషం:** ఛందోజ్ఞుడు - ఛందస్సు అంటే వేదం. ఇష్టప్రాప్తికీ, అనిష్ట పరిహారానికీ అలౌకికమైన ఉపాయం చెప్పే మహావాఙ్మయం. దానిని తత్త్వ పూర్వకంగా తెలిసికొనటం చాలా గొప్ప విషయం. అట్టివాడు కోటికొకడు ఉండవచ్చును. అతడికి కన్యను ఇవ్వటమంటే అది అనంత పుణ్యఫలాన్నిస్తుంది.

యజ్ఞ ధురీణుడు - యజ్ఞం చేయాలంటే అంగబలం, అర్థబలం, బుద్ధిబలం, మంత్రాలబలం మొదలైనవి ఎన్నో పుష్కలంగా ఉండాలి. భారతంలో సభాపర్వంలో రాజసూయయాగం ధర్మరాజు చేసిన ధోరణిని చక్కగా వివరించారు. దానిని అనుశీలిస్తే దీని సంగతి తెలుస్తుంది. యజ్ఞం సక్రమంగా నిర్వహిస్తే మహాఫలా న్నిస్తుంది. నిర్వహించలేకపోతే మహాప్రమాదం ముంచుకొని వస్తుంది. కాబట్టి 'ధురీణుడు' - ప్రమాదంలేకుండా గట్టెక్కించగలవాడు - దుర్లభుడు. అట్టివాడికి కన్య నివ్వటం మహాపుణ్యా ఫలాన్నిస్తుంది. శునస్సఖుడు ఇప్పటి దొంగతనాన్ని దానితో పోలుస్తున్నాడు!

**తే.** **అనిన నయ్యందఱును 'బుణ్యమైన కర్మ । మనఘ! శపథంబునకు విషయముగ నీవు**
**పలికి; తటుగాన బిసలతా ప్రతతి సపహ । రించినాఁడవు; మమ్ముఁ గారింప కిమ్ము. 248**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+అందఱును= వారందరూ; అనఘ!= పుణ్యాత్ముడా!; నీవు; పుణ్యకర్మము= పుణ్యమైన పనిని; శపథంబునకున్= ఒట్టునకు; విషయముగన్= విషయంగా; పలికితి= పలికావు; అటు+కానన్= కాబట్టి; బిసలతా ప్రతతిన్= తామరతూడుల కట్టను; అపహరించినాఁడవు= దొంగలించినవాడవు; మమ్మున్= మమ్ములను; కారింపక= బాధింపక; ఇమ్ము= ఇచ్చివేయుము.

**తాత్పర్యం:** అత డట్లా అంటే వారంతా 'అయ్యా! నీవు పుణ్యకార్యాన్ని ఒట్టుకు సంగతిగా చేసి మాటాడుతున్నావు. అంటే తామరతూడులు దొంగిలించా వన్నమాట. మమ్ములను బాధించక వాటిని మాకిచ్చివేయుము' అన్నారు.

**విశేషం:** ఆ ఋషులూ, సేవక దంపతులు పాపాలమీద ఒట్టుపెట్టుకొన్నారు. శునస్సఖుడు పుణ్యంతో పోల్చాడు. అంటే అతడే దొంగిలించాడని నిర్ణయం చేయటానికి అవకాశం కల్పించాడు.

**సీ.** **అనిన 'నిక్కం బిది యందఱు నొండొరు । నేమనియెదరొ? వీ రీబిసముల**
**పొది యేను దాఁచి చూచెద నని దాఁచితి; । నిదె కొనుఁ' డని దాని నిచ్చి, మీకు**
**నలిగి వధించుటకై హోమవహ్నిఁ బు । ట్టించి వృషాదర్భి పంచెఁ గృత్తి;**
**నది మున్న కాంచి రక్షార్థినై వచ్చి యా । రక్కసిఁ జంపితి; నిక్కమునకు**

**ఆ.** **వాసవుండ; లోభవర్జనముఖ భవ । త్స ద్గుణములఁ జేసి శాశ్వతంపు**
**నెలవు గలిగె; రండు నెగయుండు పుణ్యలో । కముల' కని సమాదరమునఁ బలికె. 249**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వారు పలుకగా; ఇది= ఈ విషయం; నిక్కంబు= నిజం; వీరు= ఈ ఋషులు; అందఱున్= అందరూ; ఒండొరున్= ఒకరినొకరు; ఏమి; అనియెదరొ= భావిస్తారో; ఈ బిసముల పొది= ఈ తూడుల మోపును; ఏను= నేను; దాఁచి= దాచి; చూచెదన్= చూస్తాను; అని; దాఁచితిన్= దాచాను; ఇదె= ఇదిగో; కొనుఁడు= తీసికొనండి; అని; దానిన్= ఆ మోపును; ఇచ్చి; మీకున్= మీ మీద; అలిగి= కోపించి; వధించుటకున్+ఐ= చంపటానికి; వృషాదర్భి= వృషాదర్భి అనే రాజు; కృత్తిన్= కృత్య అనే రక్కసిని; హోమవహ్నిన్= హోమపు అగ్నిలో; పుట్టించి; పంచెన్= పంపాడు; అది= ఆ విషయం; మున్ను+అ= ముందే; కాంచి= తెలిసికొని; రక్షా+అర్థిని+ఐ= రక్షచేయగోరినవాడినై; వచ్చి= అరుదెంచి; ఆ రక్కసిన్= ఆ రక్కసిని; చంపితిన్= చంపివేశాను; నిక్కమునకున్= నిజానికి; వాసవుండన్= దేవేంద్రుడను; లోభ వర్జన ముఖ భవత్ సద్గుణములన్+చేసి= దురాశవదలటం మొదలైన మీ మంచి గుణాలవలన; శాశ్వతము+నెలవు= ఎన్నటికీ చెడని చోటు; కలిగెన్= సిద్ధించింది; రండు= రండి; పుణ్యలోకములకున్= పుణ్యలోకాలకు; నెగయుండు= పైకి లేవండి; అని; సమాదరమునన్= మిక్కిలి ఆదరంతో; పలికెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ ఋషులు ఆ విధంగా పలుకగా అతడు 'నిజమే ఈ తూడుల విషయంలో మీలో మీరు ఎట్లా సంభావిస్తారో చూడాలని వాటిని నేనే దొంగిలించాను. ఇవిగో తీసికొనండి' అని వాటిని వారి కిచ్చి 'వృషాదర్భి మీమీద కోపంతో మిమ్ములను చంపటానికి హోమాగ్నిలో కృత్యను పుట్టించి పంపాడు. దానిని ముందే తెలిసికొని మిమ్ములను కాపాడటానికి వచ్చి యా రక్కసిని చంపాను. నేను నిజానికి దేవేంద్రుడను. లోభం వదలటం మొదలైన మీ

మంచిగుణాలవలన మీకు శాశ్వతలోకాలు సిద్ధించాయి. రండి ఆ పుణ్యలోకాలను అధిరోహించండి’ అని ప్రీతితో పలికాడు.

**విశేషం:** ‘ఏమి+అనియెదరో!’ - సాధారణంగా ఇటువంటి సందర్భాలలో ఒకరినొకరు శంకిస్తారు. సత్యం తెలిసికొనలేక ఇతరులయందు ద్వేషం పెంచుకొంటారు. అది మానవనైజం. దేవేంద్రుడు దానిని పరీక్షించాడు. “లోభవర్జనముఖ’ - లోభం మహాపాపగుణం. అది వదలితే ఫలం శాశ్వత లోకప్రాప్తి. మనుజుడు దీనిని గుర్తించాలి. అల్పవస్తువులమీది లోభంవలన శాశ్వతంగా పాపలోకాలలో నివసించాలి. ఆ కాస్త దుర్గుణాన్ని ప్రయత్నంతో వదలగలిగితే అక్షయపుణ్య లోకాలు లభిస్తాయి. ఇది ఈ కథలోని ఉపదేశం.

**వ. అట్లు పలుకుటయు. 250**

**తాత్పర్యం:** అత డట్లు పలికినంతనే.

**చ. అనయముఁ బ్రీతిఁబొంది ముని ‘లట్టుల చేసెద మంచు నింద్రు ప**
**జ్జన తగ నేఁగి దేవపరిషత్పరిపూజ్యపదస్థులై వెలిం**
**గి నిఖిలలోక నిత్యపరికీర్తితమూర్తుల నొప్పి; రింతయు**
**న్విను మపరిగ్రహంబు మహనీయత నైనది సూవె భూవరా! 251**

**ప్రతిపదార్థం:** మునులు= ఆ మహర్షులు; అనయమున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రీతిని; పొంది; అట్టులు+అ= అట్లే; చేసెదము= చేస్తాం; అంచున్= అంటూ; ఇంద్రు పజ్జన్+అ= ఇంద్రుడి ప్రక్కనే; తగన్= చక్కగా; ఏఁగి= వెళ్ళి; దేవ పరిషత్ పరి పూజ్య పదస్థులు= దేవతల సభలో మిక్కిలి పూజించదగిన స్థానంలో ఉన్నవారు; ఐ= అయి; వెలింగి= ప్రకాశించి; నిఖిలలోక నిత్య పరికీర్తిత మూర్తులన్= అన్ని లోకాలలో ఎప్పుడూ కొనియాడబడే ఆకారాలతో; ఒప్పిరి= ఒప్పారారు; భూవరా!= రాజా!; వినుము= శ్రద్ధగా ఆలకించుము; ఇంతయున్= ఇదంతా; అపరిగ్రహంబు మహనీయతన్= ఇతరుల సొమ్మును దానరూపంలో కూడా గ్రహించని గొప్పతనంవలన; ఐనది= అయింది; సూవె!= సుమా!

**తాత్పర్యం:** ఆ మునులందరూ ఎంతో ప్రీతి పొంది అట్లాగే చేస్తామని పలికి దేవేంద్రుడి ప్రక్కనే చక్కగా అరిగి దేవలోకంలో పూజించదగిన స్థానాలలో ప్రకాశిస్తూ లోకాలన్నీ మన్నించి కొనియాడే రూపాలతో మెరిసిపోయారు. రాజా! వినుము. ఇదంతా పుచ్చుకొనకపోవటం అనే గుణపు గొప్పతనంవలన కలిగింది సుమా!

**విశేషం:** దేవపరి.....పదస్థులై; నిఖిల... మూర్తులన్ - అనే దీర్ఘ సమాసాలు వారి గొప్పతనపు ఆధిక్యాన్ని సూచిస్తున్నాయి.

సాధారణంగా ఒకడు దానాదులను తన పాపాలను పోగొట్టుకొనటానికి చేస్తాడు. అంటే అవి పుచ్చుకొనే వాడికి సంక్రమించే ప్రమాదం ఉన్నది. తన పాపాలే తనను పట్టి పల్లారుస్తూ ఉండగా ఇతరుల పాపాలు చుట్టుకొంటే కలిగే నరకయాతన ఎట్టిదో మనం ఊహించవచ్చును. కనుక ‘అపరిగ్రహం’ మహాపుణ్యంగా చెప్పారు.

**క. కావున లోభము విడుచుట । కేవియు సరిగావు గుణము; లీగుణము మహీ**
**దేవునకు వలయుఁ బెద్దయు । నీ విధమున కమరసంఘ మెంతయు మెచ్చున్.’ 252**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; గుణములు= ఇతర గుణాలు; ఏవియున్= ఏవి కూడా; లోభము విడుచుటకున్= లోభాన్ని విడవటానికి; సరి కావు= సాటికావు; ఈ గుణము= ఈ లోభం వదలట మనే గుణం; మహీదేవునకున్= బ్రాహ్మణుడికి; పెద్దయున్= చాలా ఎక్కువగా; కావలయున్= కావాలి; ఈ విధమునకున్= ఈ పద్ధతికి; అమరసంఘము= దేవతల సముదాయం; ఎంతయున్= ఎంతో; మెచ్చున్= మెచ్చుతుంది.

**తాత్పర్యం:** కాబట్టి లోభాన్ని విడవటానికి మ రేగుణాలూ సాటి రావు. అందునా బ్రాహ్మణుడు దీనిని మరింత శ్రద్ధతో పాటించాలి. దీనిని దేవతలెంతో గొప్పగా భావిస్తారు.'

**విశేషం:** బ్రాహ్మణుడి బ్రతుకు తక్కిన వర్ణాలవారికంటె ఎంతో కఠోరనియమాలతో కూడింది. తక్కిన వారికి అల్పప్రయత్నంతో కలిగే ఉత్తమ ఫలాలు అతడికి మహా ప్రయత్నంతో గానీ సిద్ధించవు.

**వ. అని చెప్పి భీష్ముండు వెండియు. 253**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= వివరించి; భీష్ముండు= భీష్ముడు; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** భీష్మ డిట్లా చెప్పి ఇంకా (వివరిస్తున్నాడు).

**ఉ. 'ఈ యితిహాస మార్యసభ నెవ్వఁడు సమ్మతిఁ జెప్పువాఁడు దీ**
**ర్ఘాయువు శ్రీయు ధర్మము సమంచితకీర్తియు వృద్ధిఁ బొంద సౌ**
**ఖ్యాయతనాత్ముఁడై మను; సురావలియుం బితృకోటియుం బ్రియ**
**శ్రీ యలరారఁ గీ డతనిఁ జెందక యుండఁగఁ జేయు నెయ్యెడన్.' 254**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఏ నరుడు; ఈ ఇతిహాసము= ఈ మునుపటి కథను; ఆర్యసభన్= మంచినడవడిగల వారి సభలో; సమ్మతిన్= మంచిబుద్ధితో; చెప్పున్= చెప్పుతాడో; వాఁడు= అట్టివాడు; దీర్ఘ+ఆయువున్= ఎక్కువ ఆయుర్దాయమూ; శ్రీయున్= సంపదా; ధర్మము= ధర్మమూ; సమంచిత కీర్తియున్= మంచి కొనియాడదగిన కీర్తి; వృద్ధిన్+పొందన్= పెంపొందగా; సౌఖ్య+ఆయతన+ఆత్ముఁడు+ఐ= సౌఖ్యానికి నెలవైన హృదయం కలవాడై; మనున్= బ్రతుకుతాడు; సుర+ఆవలియున్= దేవతల సముదాయమూ; పితృకోటియున్= పితృదేవతల సమూదాయమూ; ప్రియశ్రీ= ప్రీతి సంపద; అలరారన్= చక్కగా కలిగేటట్లుగా; ఏ+ఎడన్= ఎక్కడనూ; కీడు= ఆపద; అతనిన్= అట్టివాడిని; చెందక ఉండఁగన్+చేయున్= రాకుండా చేస్తుంది.

**తాత్పర్యం:** 'ఈ పాతకథను ఆర్యుల సభలో ప్రవచించేవాడు దీర్ఘమైన ఆయువూ, సంపదా, ధర్మమూ, దొడ్డ కీర్తి పెంపొందగా సౌఖ్యానికి నెలవైన బుద్ధిగలవాడై జీవిస్తాడు. దేవతలూ, పితృదేవతలూ ఎంతో ప్రీతితో అతడి కే ఆపదా ఎటువైపునుండీ రాకుండా చేస్తారు.'

**విశేషం:** ఇది ఈ కథకు ఫలశ్రుతి. ప్రతికార్యానికి ఒక ఫలం ఉంటుంది. ఫలాన్ని అపేక్షించి పనికి నరుడు ఉపక్రమిస్తాడు. కనుక ఋషులు ఫలాన్ని గూర్చి చెప్పుతూ ఉంటారు. ఆ ఫలం ఉదాత్త మనుష్యులను మరింతగా ఆకర్షిస్తుంది. ఈ కథ చాలా గొప్పది. అప్రతిగ్రహం, లోభం లేకపోవటం అనే మహాగుణాల మహిమను ఇది వక్కాణించింది. విన్నవారు ఆ గుణాలను అలవరచుకొంటారు. ఇక చెప్పినవారి సంగతి చెప్పనక్కర లేదు గదా!

ఇందులో ఇంచుమించు సగానికి పైభాగంలో సుఖలాభాన్ని గురించీ, మిగిలిన దానిలో దుఃఖనాశాన్ని గురించీ చెప్పారు. కేవలం సుఖం లభిస్తే చాలదు. అది లభించిన తృప్తిని చెడగొట్టే కీడుకూడా నశించాలి. అప్పుడే పూర్ణఫలం దక్కినట్లవుతుంది.

## ఉపానద్దాన విషయక సూర్య జమదగ్ని సంవాదము (సం.13-97-3)

**వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్రుతోఁ బితృ కార్యాదులయందు గొడుగులుఁ జెప్పులు నిడుట యుత్తమ ప్రకారం బని చెప్పుదురు; వాని విశేషంబు తెలం గెఱింగింపవే!' యనుటయు నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను; 'సూర్యజమదగ్ని సంవాదంబను నితిహాసంబు వినుము; దాన నీయడిగినయది తేటపడు, జమదగ్ని మహాముని క్రీడార్థియై శరాసనంబు ధరించి రేణుకాదేవి బాణంబులకట్టఁ గొని తనతోడం జనుదేర నివాసంబు వెడలి యొక్కబయల నయ్యంపపొది నిలువ వైపించికొని దూరాపాతనం బాచరింప నిక్కుసుమకోమలి సని యమ్ము లేఱికొని వచ్చి యిచ్చుచుండు. 255**

**ప్రతిపదార్థం:** అనినన్= అన్న తరువాత; విని; అజాతశత్రుండు= ధర్మరాజు; శంతను పుత్రుతోన్= శంతనుడి కొడుకు భీష్మడితో; పితృకార్య+ఆదులయందున్= శ్రాద్ధం మొదలైన పనులయందు; గొడుగులు= గొడుగులున్నూ; చెప్పులున్= చెప్పులూ; ఇడుట= దానంచేయటం; ఉత్తమ ప్రకారంబు= మంచిపద్ధతి; అని; చెప్పుదురు= చెప్పుతారు; వాని విశేషంబు తెలంగు= ఆ గొడుగు చెప్పుల మహిమ పద్ధతిని; ఎఱింగింపవే= చెప్పవా; అనుటయున్= అనగానే; ఆ+మహాత్ముండు= ఆ మహాబుద్ధిశాలి; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; సూర్య జమదగ్ని సంవాదంబు= సూర్యుడికి జమదగ్ని మహర్షికి అయిన సంభాషణ; అను ఇతిహాసంబు= అనే ప్రాతకాలపు కథను; వినుము; దానన్= దానివలన; నీ+అడిగిన+అది= నీ వడిగింది; తేటపడున్= స్పష్టమవుతుంది; జమదగ్ని మహాముని= జమదగ్ని అనే ఒక గొప్ప ముని; క్రీడా+అర్థి+ఐ= వినోదించగోరినవాడై; శర+ఆసనంబున్= వింటిని; ధరించి=పట్టుకొని; రేణుకాదేవి= భార్యఅయిన రేణుకాదేవి; బాణంబులకట్టన్= బాణాల పొదిని; కొని= పట్టుకొని; తనతోడన్= తనతోపాటు; చనుదేరన్= రాగా; నివాసంబున్= ఇంటినుండి; వెడలి= వెలుపలికి వచ్చి; ఒక్కబయలన్= ఒక బయలు ప్రదేశంలో; ఆ+అమ్ము+పొదిన్= ఆ అమ్ములకట్టను; నిలువన్= ఉండేటట్లుగా; వైపించుకొని= దూర+ఆపాతనంబు= దూరంగా పడవేయటం; ఆచరింపన్= చేయగా; ఆ+కుసుమకోమలి= పూవులవలె సుకుమారి అయిన ఆమె; చని= వెళ్ళి; అమ్ములు= బాణాలు; ఏఱికొని= ఏరుకొని; వచ్చి= అతడి దగ్గరకు వచ్చి; ఇచ్చుచున్+ఉండున్= ఇస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** తరువాత ధర్మరాజు భీష్మడిని 'తాతా! శ్రాద్ధాదులలో గొడుగులు, చెప్పులు దానం చేయటం చాలా మంచి పనిగా చెప్పుతారు. వాటి సంగతి చెప్పుము' అని ప్రార్థించాడు. అప్పు డా దొడ్డబుద్ధిగల భీష్మడు ఆ రాజుతో ఇట్లా అన్నాడు. 'సూర్యజమదగ్ని సంవాదం అనే పురాతన కథ వింటేనే నీ వడిగిన విషయం చక్కగా తెలుస్తుంది వినుము. జమదగ్ని ఒకనాడు వినోదంకొరకు విల్లు పుచ్చుకొని బాణాల పొది తీసికొని భార్య రేణుక వెంటరాగా ఇల్లు వెడలి ఒక బయలులోనికి వచ్చి ఆ కట్టను ఒకచోట నిలువజేసి, దూరంగా బాణాలు పడవేస్తూ ఉన్నాడు. ఆమె ఆ బాణాలు ఏరి తెచ్చి మరల అతడికి అందిస్తూ ఉన్నది.

**విశేషం:** క్రీడార్థి - హింసకొరకు కాదని సూచన. కుసుమ కోమలి - ఇది రాబోయే కథాంశాన్ని సూచించే విశేషగుణం, బయలు విశాలమైన ప్రదేశం - పొరపాటున ఎవ్వరికీ బాణాలు తగిలే అవకాశం లేదనటాన్ని సూచిస్తుంది.

**తే. ఇవ్విధమున వినోదింప నినుఁడు గగన । మధ్యగతుఁ డయ్యె నప్పు డమ్మగువ యమ్ము**

**లేటి తేరంగఁబోయి యొక్కింత దడసి । యరుగుదెంచిన నాతఁ డయ్యబలతోడ. 256**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ విధంగా; వినోదింపన్= క్రీడిస్తూ ఉండగా; ఇనుఁడు= సూర్యుడు; గగన మధ్య గతుఁడు= నడిమింటికి వచ్చినవాడు; అయ్యెన్= అయ్యాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+మగువ= ఆ కాంత; అమ్ములు= బాణాలు; ఏఱి= ఏరుకొని; తేరంగన్= తేవటానికి; పోయి= వెళ్ళి; ఒక్క+ఇంత= కొంచెం సేపు; తడసి= ఆలస్యం చేసి; అరుగుదెంచినన్= వస్తే; ఆతఁడు= ఆ జమదగ్ని; ఆ+అబలతోడన్= ఆ ఇంతితో.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆడుకొంటూ ఉండగా సూర్యుడు నడిమింటికి వచ్చాడు. అప్పుడు ఆ రేణుక బాణాలు ఏరి తేవటానికి పోయి కొంచెం జాగుచేసి వస్తే అతడు ఆమెతో (ఇట్లా అన్నాడు).

**విశేషం:** అబల - ఇది సాభిప్రాయ విశేషణం. మధ్యాహ్న సూర్యుడి వేడిమికి తట్టుకొనలేకపోయిం దన్న భావాన్ని సూచిస్తుంది.

**క. 'లోలాక్షి! యచట నిమ్మరి । యేల తడసి?' తనుడుఁ బేర్చు నినతేజమునన్**

**నేలకు వేఁడిమి దనికినఁ । జాలన వెసఁ ద్రొక్కఁ దలయుఁజాలఁ దపించెన్. 257**

**ప్రతిపదార్థం:** లోల+అక్షి!= త్రిప్పు కనులదానా!; అచటన్= అక్కడ; ఈ+మరి= ఇంతసేపు; ఏల?=ఎందుకు?; తడసితి= జాగు చేశావు; అనుడున్= అనగానే; పేర్చు+ఇన తేజమునన్= ఎక్కువ అయిన సూర్యుడి వేడిమికి; నేలకున్= భూమికి; వేఁడిమి= వేడి; తనికినన్= సోకగా; వెసన్= వేగంగా; త్రొక్కన్= త్రొక్కుటకు; చాలను+అ= చాలలేక పోయాను; తలయున్= నెత్తికూడా; చాలన్= ఎక్కువగా; తపించెన్= కాలింది.

**తాత్పర్యం:** 'లోలాక్షీ! అక్కడ ఇంత జాగుచేశావేమి?' అని అంటే 'సూర్యుడి తేజస్సు తీవ్రమైన కారణంగా నేల వేడెక్కింది. వడివడిగా కాళ్ళాన్చి నడవలేకపోయాను. తలకూడా వేడి ఎక్కింది.

**విశేషం:** లోలాక్షి! - ఏకాంతంలో భార్యను భర్త సరసంగా పిలిచిన పిలుపు. అంతేకాదు ఆమె పొందిన శ్రమవలన కన్నులు నిశ్చలతను కోల్పోయిన అంశంకూడా ఇక్కడ ఈ పదంచేత తెలియవస్తుంది. క్రింద కాళ్ళు, పైన తలా రెండు వేడివలన వివశం అయ్యాయి అని భావం.

**క. ఇమ్మెయి నలంగి యొక వృ । క్షమ్మున క్రీనీడ నిలిచి చనుదెంచుట నా**

**కిమ్మరి దడయ వలసె' నని । యమ్ముద్దియ సెప్పెఁ జెమట యడరఁగ మేనన్. 258**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; నలంగి= అలసిపోయి; ఒక వృక్షమ్మున క్రీనీడన్= ఒక చెట్టు క్రింద నీడలో; నిలిచి= నిలుచుండి, చనుదెంచుటన్= రాగా; నాకున్= నాకు; ఈ+మరి= ఇంతసేపు; తడయన్ వలసెన్= జాగుచేయవలసి వచ్చింది; అని; ఆ+ముద్దియ= ఆ ముద్దరాలు; మేనన్= ఒడలిపై; చెమట= స్వేదం; అడరఁగన్= వ్యాప్తి పొందగా; చెప్పెన్= చెప్పింది.

**తాత్పర్యం:** ఈ విధంగా ఒక చెట్టు క్రింది నీడలో కొంతసేపు నిలిచి రావటంవలన నా కింతసేపు జాగు చేయవలసి వచ్చింది' అని చెమట ఓడుతున్న దేహం గల ఆ ముద్దరాలు చెప్పింది.

**విశేషం:** ముద్దియ - ముద్దరాలు, కష్టాన్ని తట్టుకొనలేనితనం దీనివలన వ్యక్తమవుతుంది. చెమట దీనికి సాక్ష్యం.

**క. విని 'యే మేమీ! నొంచెనె । యినుఁడు నినుం; దత్ఫలంబు నిప్పుడ కుడువం**

**గనియెడుఁ గా కస్త్రానల । మునఁ బొదివెద నతని' ననియె ముని కోపమునన్. 259**

**ప్రతిపదార్థం:** విని= ఆ మాట విని; ముని= ఆ జమదగ్ని మహర్షి; కోపమునన్= కోపంతో; ఏమి+ఏమీ= ఏమిటేమిటీ; ఇనుఁడు= సూర్యుడు; నినున్= నిన్ను; నొంచెనె?= కష్టపెట్టాడా?; తత్+ఫలంబు= దానిఫలం; ఇప్పుడు+అ= ఇప్పుడే; కుడువన్+కనియెడున్+కాక= అనుభవిస్తాడు కాక!; అతనిన్= వాడిని; అస్త్ర+అనలమునన్= అస్త్రాల అగ్నిలో; పొదివెదను= ముంచి వేస్తాను; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని ముని కోపంతో 'ఏమేమీ సూర్యుడు నిన్ను బాధించాడా? ఆ ఫలం ఇప్పుడే అనుభవిస్తాడు. నా అస్త్రాలమంటలో క్రమ్మివేస్తాను' అన్నాడు.

**విశేషం:** ఏమేమీ - అనేచోట సంరంభం; ఇప్పుడు - అన్నచోట ఆలస్యం చేయరాదన్న తీవ్రతా మొదలైన భావాలు స్ఫురిస్తూ క్రోధమనే భావాన్ని చక్కగా రూపుకట్టిస్తున్నది ఈ రచన. ఆ మహర్షి తపశ్శక్తి సూర్యుడిని కూడా నిర్ధూమధామం చేయగలదిగా దీనిని బట్టి తెలియవస్తున్నది.

**ఉ. దాని నెఱింగి భూసురతఁ దాల్చి వెసం జనుదెంచి యర్కుఁ డ**

**మ్మానిత సంయమిం గని యమత్సరభావము దోఁప 'రోషమున్**

**మానుము' నావుడుం 'బలుకు మానుము; నీవటు వాయు; మేసెదన్**

**భానుని నేలఁ గూల' నని పల్కె మునీంద్రుఁడు శోణితాక్షుఁడై. 260**

**ప్రతిపదార్థం:** అర్కుఁడు= సూర్యుడు; దానిన్= ఆ సంగతి; ఎఱింగి= తెలిసికొని; భూసురతన్= బ్రాహ్మణత్వాన్ని; తాల్చి= ధరించి; వెసన్=వేగంగా; చనుదెంచి= వచ్చి; ఆ+మానిత సంయమిన్= మన్నించదగిన ఆ మహర్షిని; కని= చూచి; అమత్సరభావము= ప్రశాంత లక్షణం; తోఁపన్= కనపడే విధంగా; రోషమున్= క్రోధాన్ని; మానుము= వదలుము; అనుడున్= అనగానే; పలుకు= మాట; మానుము= చాలించుము; నీవు; అటు= అవతలకు; పాయుము= తొలగుము; నేలన్= నేలమీద; కూలన్= కూలేటట్లుగా; భానునిన్= రవిని; ఏసెదన్= కొట్టుతాను; అని; ముని+ఇంద్రుఁడు= మహర్షి శ్రేష్ఠుడు; శోణిత+అక్షుఁడు+ఐ= ఎరుపెక్కిన కనులు కలవాడై; పల్కెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ సంగతి తెలిసికొని సూర్యుడు బ్రాహ్మణ వేషం ధరించి వచ్చి మన్నించదగిన ఆ సంయమిని చూచి శాంతస్వభావం కనపడే విధంగా 'క్రోధం చాలించుము' అన్నాడు. అప్పుడు మునివర్యుడు కెంపెక్కిన కనులతో 'చాలించు నీ మాటలు; ప్రక్కకు తొలగుము; ఆ సూర్యుడిని నేలపై కూల నేస్తాను' అన్నాడు.

**విశేషం:** అమత్సరభావము - వచ్చినది సూర్యుడు. మహర్షి నిష్కారణంగా తనమీద కోపం ప్రదర్శిస్తున్నాడు. అయినా తాను కోపం పొందలేదు. అంటే అతడు సూర్యచంద్రాది దేవతలకు కూడా మన్నింపదగిన మహాత్ముడని భావం. దానినే 'మానితసంయమి' అనే పదంచేత కవి స్పష్టం చేస్తున్నాడు. శోణితాక్షుఁడు - కన్నులెరుపెక్కినాయి. ఇది సాత్త్వికభావం. రౌద్రరస స్ఫూర్తి కిది దోహదం చేస్తుంది.

చ. పలికిన బ్రాహ్మణుం డొదుగఁబాఱక నిల్చి 'మునీంద్ర! యిట్టు లి
ట్టల మగు క్రూరవృత్తికిఁ గడంగుదురే? సవిత్రుండు రశ్ములన్
జల మొసఁగంగ నోషధుల సంపద హవ్యమహత్త్వ మొంది వే
ల్పులకు బలంబు నిచ్చునది లుప్తము గాదె యతండు నొచ్చినన్.' 261

**ప్రతిపదార్థం:** పలికినన్= అట్లు పలుకగా; బ్రాహ్మణుండు= బ్రాహ్మణవేషధారి అయిన సూర్యుడు; ఒదుగన్+పాఱక= ప్రక్కకు తప్పుకొని పరుగెత్తక; నిల్చి= అక్కడనే ఉండి; ముని+ఇంద్ర!= మునిశ్రేష్ఠా!; ఇట్టులు= ఈ విధంగా; ఇట్టలము= ఎక్కువ; అగు= అయిన; క్రూరవృత్తికిన్= దయలేని నడవడికి; కడంగుదురే?= పూనుకొంటారా?; సవిత్రుండు= సూర్యుడు; రశ్మలన్= కిరణాలతో; జలము= నీటిని; ఒసఁగంగన్= ఇవ్వగా; ఓషధుల సంపద= ధాన్యాల సంపద; హవ్య మహత్త్వము= హోమపదార్థపు మహిమను; ఒంది= పొంది; వేల్పులకున్= దేవతలకు; బలంబున్= సత్తువను; ఇచ్చున్= ఇస్తుంది; అతండు= సూర్యుడు; నొచ్చినన్= బాధపడితే; అది= ఆ పని; లుప్తము= నశించేది; కాదె!= కాదా!

**తాత్పర్యం:** జమదగ్ని ఇట్లా అంటే ఆ బ్రాహ్మణుడు ప్రక్కకు తప్పుకొని వెళ్ళిపోక నిలిచి 'మునీంద్రా! ఇంత అధికమైన క్రూరపు నడవడికి (మీ వంటివారు) పూనుకొంటారా? సూర్యుడు నీరు ఇస్తే ఓషధులసంపద హవ్యపదార్థపు మహిమను పొంది దేవతలకు బలాన్నిస్తుంది. అట్టి సూర్యుడు బాధపడితే ఆ బలం లోపిస్తుంది కదా!'

**విశేషం:** వేసవికాలంలో ఎండతీవ్రత లోకం మేలుకొరకే. ఆ తీవ్రతవలననే మేఘాలు ఏర్పడతాయి. వర్షాలు కురుస్తాయి. పంటలు పండుతాయి. తిండి కలిగి మనుష్యులు కండగలవారవుతారు. ఇక్కడ వేల్పులబలం భూమి మీద ప్రాణికోటి బలానికి మూలకారణమని మనం గుర్తించాలి. వేల్పులంటే గాలి, నింగి, నిప్పు, నీరు, నేల అనే పంచభూతాలే అని కూడా గుర్తించాలి. అవి సమస్థితిలో ఉంటే అన్నీ సమస్థితిలోనే ఉంటాయనేది శాస్త్రీయ నిరూపణకు సంబంధించిన విషయం.

చ. అనినను శాంతిలేమికి భయం బెదఁ గూరఁగ మ్రొక్కి యాతఁ 'డే
నినుఁడ సహింపు నావలన నెగ్గులు గల్గినయేని; నీకు నె
మ్మనము దయామయం బని సమస్త జగంబులు సంస్తుతింపఁగా
విని ముదమందుదున్; శరణు వేఁడెదఁ గావుము న న్మునీశ్వరా!' 262

**ప్రతిపదార్థం:** అనినను= ఇట్లా చెప్పినా; శాంతి లేమికిన్= శాంతి కలగకపోవటానికి; భయంబు= భయం; ఎదన్= హృదయంలో; కూరఁగన్= ఏర్పడగా; ఆతఁడు= ఆ బ్రాహ్మణుడు; మ్రొక్కి= మోకరిల్లి; ఏన్= నేను; ఇనుఁడన్= సూర్యుడను; నావలనన్= నానుండి; ఎగ్గులు= కీడులు; కల్గిన ఏని= కలిగితే; సహింపు= సైపుము; నీకున్= నీకు; నెఱ+మనము= నిండు మనస్సు; దయామయంబు= దయతో నిండింది; అని; సమస్తజగంబులు= అన్ని లోకాలు; సంస్తుతింపఁగాన్= చక్కగా కొనియాడుతుండగా; విని= ఆలకించి; ముదము= సంతసం; అందుదున్= పొందుతూ ఉంటాను; ముని+ఈశ్వరా!= మహర్షి శ్రేష్ఠుడా!; శరణు= రక్షణం; వేఁడెదన్= కోరుతాను; నన్= నన్ను; కావుము= కాపాడుము.

**తాత్పర్యం:** ఇంత చెప్పినా జమదగ్ని శాంతి పొందలేదు. సూర్యుడు హృదయంలో భయపడి 'మునీశ్వరా! నేను సూర్యుడను. నా వలన నీకు ఏ కీడులు కలిగినా సహించుము. నీ హృదయం దయతో నిండిన దని అన్ని లోకాలు కొనియాడగా విని సంతోషం పొందుతూ ఉంటాను. నిన్ను శరణు కోరుతున్నాను. నన్ను రక్షించుము' (అన్నాడు).

**విశేషం:** కల్గినయేని - కలిగి ఉంటే, నిజానికి నేను ఏ దోషమూ చేయలేదని ధ్వని. మరి భయ మెందుకు అంటే మహర్షుల మహిమ అటువంటిది. వారు సకారణంగానైనా అకారణంగానైనా కోపగిస్తే ప్రళయభీకరు లవుతారు - అనే విషయం ఇక్కడ ఉపదేశం.

**చ. అనినఁ బ్రశాంతుఁడై తపను నా భృగుముఖ్యుఁడు ప్రీతి గారవిం**
**చినఁ బ్రమదంబునన్ గొడుగుఁ జెప్పులు మానసవృత్తిఁ దెచ్చి య**
**మ్ముని కడఁ బెట్టి, యత్తరణి ము న్నివి లేవని పల్కి దీన మైఁ**
**దనుకదు, వీనఁ బాదములఁ దాఁకదు నాదగు వేఁడి యేమియున్. 263**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; ఆ భృగుముఖ్యుఁడు= భృగువంశంలో శ్రేష్ఠుడైన ఆ జమదగ్ని; ప్రశాంతుఁడు+ఐ= కోపం మొదలైన వికారాలు లేనివాడై; తపనున్= సూర్యుడిని; ప్రీతిన్= ప్రీతితో; గారవించినన్= మన్నింపగా; ఆ+తరణి= ఆ సూర్యుడు; ప్రమదంబునన్= ఆనందంతో; మానసవృత్తిన్= సంకల్ప మాత్రంచేత; గొడుగున్= ఛత్రమునూ; చెప్పులు= చెప్పులనూ; తెచ్చి; ఆ+మునికడన్= ఆ మహర్షి దగ్గర; పెట్టి= ఉంచి; మున్ను= ఇంతకు పూర్వం; ఇవి= ఈ గొడుగూ, చెప్పులూ; లేవు; అని; పల్కి= పలికి; నా దగు వేఁడి= నాదైన వేడి; ఏమియున్= ఏ మాత్రమూ; దీనన్= ఈ గొడుగువలన; మైన్= ఒడలి యందు; తనుకదు= కలుగదు; వీనన్= ఈ చెప్పులవలన; పాదములన్= కాళ్ళను; తాఁకదు= అంటదు.

**తాత్పర్యం:** సూర్యు డిట్లా అనగా ఆ జమదగ్ని శాంతించాడు. అతడిని మన్నించాడు. అప్పుడు సూర్యుడు సంకల్పమాత్రంచేత గొడుగూ చెప్పులూ సృష్టించి తెచ్చి ఆతడి దగ్గర ఉంచి "ఇవి పూర్వం లేవు. ఈ గొడుగువలన నా వేడి ఏ మాత్రమూ శరీరానికి తాకదు. ఈ చెప్పుల వలన కాళ్ళకు తాకదు'' (అన్నాడు).

**విశేషం:** సూర్యుడి మన్నన ఋషి కోపాన్ని పోగొట్టింది. అతి ప్రశాంతతత సూర్యుడికి సంతోషం కలిగించింది. అందుకే అడగకపోయినా గొడుగూ, చెప్పులూ సృష్టించి ఇచ్చాడు. వాటి ప్రయోజనాలను వివరించాడు.

**మ. నయ మిట్లారఁగ నాతపత్రము నుపానద్ద్వంద్వముం జూపి చె**
**ప్పి యపూర్వంబగు సృష్టిఖేలనమునం బెంపారు నవ్వస్తువుల్**
**దయ సద్విప్రున కీఁగి యైహిక సుఖౌదాత్త్వంబు నాముష్మిక**
**ప్రియమున్ దాతకు సుస్థిరంబులుగఁ గల్పించున్ మునీంద్రోత్తమా! 264**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నయము= నేర్పు; ఆరఁగన్= కలుగునట్లుగా; ఆతపత్రమున్= ఎండనుండి రక్షించే గొడుగునూ; ఉపానత్+ద్వంద్వమున్= చెప్పుల జతనూ; చూపి= కనబరచి; చెప్పి= వాటిని గూర్చి వివరించి; ముని+ఇంద్ర+ఉత్తమా!= మునివర్యులలో శ్రేష్ఠుడా!; అపూర్వంబు+అగు= మునుపులేని; సృష్టిఖేలనమునన్= సృజన విలాసంతో; పెంపు+ఆరు= మహిమతో విరాజిల్లు, ఆ+వస్తువుల్= ఆ గొడుగూ, చెప్పులూ అనే వస్తువులను (ఈ వస్తువుల్= అన్న పాఠం మేలైనది); దయన్= దయతో; సత్+విప్రునకున్= దోషంలేని విద్యావంతుడికి; ఈఁగి= ఇవ్వటం; ఐహిక సుఖ+ఔదాత్త్వంబున్= ఈ లోకసంబంధమైన సుఖపు గొప్పతనాన్నీ; ఆముష్మిక ప్రియమున్= పరలోకంలో ఇష్టమైన సుఖాన్నీ; దాతకున్= ఇచ్చేవాడికి; సుస్థిరంబులుగన్= చెడక నిలిచేవాటినిగా; కల్పించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఇట్లా నేర్పు మీరగా గొడుగునూ చెప్పుల జతనూ చూపి వాటి విశేషాన్ని వక్కాణించి, మహర్షివరేణ్యా! అపూర్వమైన సృష్టివిలాసంతో ఏర్పడి వెలుగొందుతున్న ఈ వస్తువులను దయతో మంచి విద్యావేత్తకు దానం చేయటం దాతకు ఇహలోకపు సుఖాధిక్యాన్నీ, పరలోకంలో ప్రియమైన సుఖాన్నీ సుస్థిరంగా చేస్తుంది(అని చెప్పాడు).

**విశేషం:** ఆతపత్రం - ఎండనుండి రక్షించేది; ఉపానత్- పాదములయందు బంధింపబడేవి, విప్రుడు - 'విద్యయా యాతి విప్రత్వమ్' - విద్యచేత విప్రత్వాన్ని పొందుతాడు. విద్యావంతుడిని లోకం రక్షించుకొంటే అతడు లోకరక్షణకు మార్గం కనుగొని చెప్పుతాడు. కనుక విప్రున కివ్వాలనటం. అందునా సద్విప్రునకు - లోకహితైక కాంక్ష కలవాడే సద్విప్రుడు. సుస్థిరంబులుగన్ - దాత లోకరక్షకుడిని రక్షించే పనిచేశాడు కనుక అతడికి ఇహపరసుఖాలు శాశ్వతంగా ఉంటాయి.

**మ. అనినన్ మో మలరన్ దినేశ్వరునిఁ దా నామంత్రితుంజేసి య**
**మ్మునిశార్దూలుఁడు వల్లభాసహితుఁడై మోదంబునం దేలుచుం**
**జనియెన్ నాఁడు జనంబు లెల్లను బ్రహర్షం బందుచున్ వానిఁ గై**
**కొని రవ్వస్తువు లిట్టి వేర్పడఁగ నీకుం జెప్పితిన్ భూవరా! 265**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; అనినన్= అని పలుకగానే; ఆ+ముని శార్దూలుఁడు= మునులలో గొప్పవాడగు ఆ జమదగ్ని; మోము= మొగం; అలరన్= ప్రకాశించగా; దిన+ఈశ్వరునిన్= సూర్యుడిని; తాను= తాను; ఆమంత్రితున్+చేసి= మర్యాదతో మంచిమాటలతో పంపి; వల్లభా సహితుఁడు+ఐ= ప్రియురాలితో కూడినవాడై; మోదంబునన్= సంతోషంతో; తేలుచున్= తేలిపోతూ; చనియెన్= వెళ్ళాడు; జనంబులు+ఎల్లను= ప్రజలందరూ; నాఁడు= అప్పుడు; ప్రహర్షంబు+అందుచున్= పరమానందం పొందుతూ; వానిన్= ఆ గొడుగు, చెప్పులు అనేవాటిని; కైకొనిరి= తీసికొన్నారు; ఆ+వస్తువులు= ఆ వస్తువులు; ఇట్టివి= ఈవిధమైనవి; నీకున్= నీకు; ఏర్పడఁగన్= చక్కగా తెలిసే విధంగా; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** ఓ రాజా! సూర్యు డట్లా చెప్పగా ఆ మహర్షిశ్రేష్ఠుడు మొగం వికసించగా సూర్యుడిని మంచిమాటలతో సాగనంపి, భార్యతోపాటు పరమానందంతో తన తావున కరిగాడు. అది మొదలు జనులంతా ఆ వస్తువులను గొప్ప సంతోషంతో కైకొన్నారు. ఈ వస్తువుల సంగతి నీకు స్పష్టంగా తెలిసే విధంగా చెప్పాను.

**విశేషం:** మోమలరన్- కృతజ్ఞతను ప్రకటించటం ఆ కాలంలో అంతమాత్రమే. నిజానికి కృతజ్ఞత బయటకు చెప్పదగినది కాదు. గుండెలో పదిలపరచుకొనదగినది. ఈ విషయాన్ని ఈ పదబంధం సూచిస్తుంది. సూర్యుడంతటివాడు ప్రత్యక్షదైవంగా భావనకు వచ్చేవాడు ఎందుకు భయపడ్డాడో 'మునిశార్దూలుడు' అనే పదం వ్యక్తం చేస్తుంది. అట్టి వారి నిగ్రహానుగ్రహాలమీద లోకవృత్తి సాగుతుందని భావం.

**చ. దినకరచిత్తసృష్టములు దివ్యమునీశ్వరులాలితంబు లీ**
**వినుత పదార్థముల్ గరుణ విప్రునకున్ యతి సాధువృద్ధ స**
**జ్జనులకు నిమ్ము నీ; వది సుసారపు ధర్మము సూవె! దానఁ గ**
**ల్గును విను! గోకులాకలితలోకము లోనగు పుణ్యలోకముల్. 266**

**ప్రతిపదార్థం:** దినకరచిత్త సృష్టములు= సూర్యుడి మనసుతో సృజింపబడినవి; దివ్య ముని+ఈశ్వర లాలితంబులు= గొప్ప మహర్షిచేత మన్నింపబడినవి (అయిన); ఈ వినుత పదార్థముల్= ఈ కొనియాడదగిన వస్తువులను; కరుణన్= దయతో;

విప్రునకున్= గొప్ప విద్యావంతుడికి; యతి సాధు వృద్ధ సత్+జనులకున్= యతులకు, సాధువులకు, ముదుసలులకు, మంచివారికి; నీవు; ఇమ్ము= దానము చేయుము; అది= ఆ దానం; సుసారము+ధర్మము= గొప్ప సారంగల ధర్మం; చూవె= సుమా!; దానన్= దానిచేత; విను= వినుము; గోకుల+ఆకలిత లోకము= ఆవులమందలతో కూడిన లోకం; లోనగు= మొదలైన; పుణ్యలోకముల్= పుణ్యంగల లోకాలు; కల్గును= లభిస్తాయి.

**తాత్పర్యం:** రాజా! సూర్యుడు మనస్సుతో సృష్టించినవీ, మహర్షి మన్నించినవీ అయిన ఈ మంచి వస్తువులను విద్యావంతుడికి, యతులకూ, సాధువులకు, పెద్దవయస్సువారికీ, మంచి మానవులకు దానం చేయుము. అది మిక్కిలి సారంగల ధర్మం సుమా! దానితో గోలోకం మొదలైన పుణ్యలోకాలు లభిస్తాయి.

**విశేషం:** సృష్టించినది లోకబాంధవుడు సూర్యుడు. అదికూడా కేవలం సంకల్పమాత్రంచేత. మొదట గ్రహించి ప్రేమతో ఉపయోగించినది ఒక మహర్షివరేణ్యుడు. తమంత తాము ప్రయోజనాన్నిబట్టి కొనియాడదగినవి. కనుక అనంతపుణ్యాన్ని దాతకు ఇస్తాయి - అని భావం. యతులు - పరమాత్మానుభవంకొరకు యత్నంచేసేవారు; సాధువులు - పరుల మేలును సాధించటానికి ప్రయత్నించేవారు; వృద్ధులు - అశక్తులు, అందుకనే ఇతరులకు ఏ అపకారమూ చేయనివారు. సత్+జనులు- మంచివారు. ఇట్లా వీరిని పేర్కొనటంవలన దానం పాత్రత ఎరిగి చేయాలి - అనే విషయం ప్రతీయమానం అవుతుంది. అపాత్రదానం దాతకు పాతకాన్ని కలిగిస్తుంది. 'చూవె' ఇది నిశ్చయార్థకం. సందేహించవద్దని హెచ్చరిక చేస్తుంది. విను - తాను చెప్తున్న విషయం శ్రద్ధాసక్తులతో వినదగిన దన్న భావాన్ని సూచిస్తుంది.

**క. దాన ప్రవణ! యుపాన । ద్దానంబును నాతపత్ర దానము సురస**
**మ్మాననభాజనములగుట । నానాబుధజనులచే వినంబడు నెపుడున్. 267**

**ప్రతిపదార్థం:** దానప్రవణ!= దానమునందు నిష్ఠకలవాడా!; ఉపాసత్+దానంబును= చెప్పులను ఇవ్వటమూ; ఆతపత్రదానము= గొడుగు నివ్వటమూ; సుర సమ్మానన భాజనములు= దేవతల మన్ననకు పాత్రములు; అగుట= కావటం; నానా బుధ జనులచేన్= ఎందరో పండిత జనులవలన; ఎపుడున్= ఎల్లవేళల, వినన్+పడున్= వినబడుతున్నది.

**తాత్పర్యం:** దాననిష్ఠగల ఓ రాజా! చెప్పులను, గొడుగును దానమివ్వటం దేవతల మన్ననకు యోగ్యమైనదని ఎందరో పండితవరేణ్యులు చెప్పగా ఎప్పుడూ వింటూ ఉంటాము.

**విశేషం:** దాన ప్రవణ! - సంబోధన సాభిప్రాయం. 'ఇచ్చే స్వభావం ఉన్నవాడవు కనుక దేవతలు కూడా మన్నించే దానం చేయుము' అని ఇక్కడ అభిప్రాయం. నానాబుధ - ఎవరో ఒకరు చెపితే ప్రమాణం కాకపోవచ్చును. అనేకులు - అందులోను బుధులు, జ్ఞానసంపన్నులు చెప్తున్నారు. వినంబడున్- తద్ధర్మార్థకక్రియ సార్వకాలికత్వాన్ని సూచిస్తున్నది. 'ఎపుడున్' అనేది దానిని మరింత దృఢపరుస్తున్నది.

**క. అనిన విని పాండుభూవర తనయోత్తముఁ డిట్టు లనియెఁ దాతకు శూద్రుం**
**డనఘా! యెమ్మెయిచరితం । బున నిహపర పరమసౌఖ్యములఁ జెందఁగనున్? 268**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పాండుభూవర తనయ+ఉత్తముఁడు= పాండురాజు కొడుకులలో శ్రేష్ఠుడగు ధర్మరాజు; విని= ఆలకించి; తాతకున్= తాత అయిన భీష్ముడికి; ఇట్టులు= ఇట్లా; అనియెన్= అన్నాడు; అనఘా!= పుణ్యాత్ముడా!; శూద్రుండు= నాలుగవ జాతివాడు; ఏ+మెయి చరితంబునన్= ఏ విధమైన నడవడితో; ఇహ పర పరమ సౌఖ్యములన్= ఈ లోకపు, పరలోకపు పరమసుఖాన్నీ; చెందన్+కనున్?= పొందగలుగుతాడు?

**తాత్పర్యం:** భీష్ము డిట్లా చెప్పిన తరువాత ధర్మరాజు తాతను ఇట్లా అడిగాడు. 'పుణ్యాత్మా! శూద్రు డెటువంటి నడవడితో ఈ లోకపు, పరలోకపు సుఖాలను పరమసుఖాన్నీ పొందుతాడు?'

**విశేషం:** 'పాండుభూవర తనయోత్తముఁడు' - భీముడు మొదలైన తక్కిన నలువురకు మహాధర్మాలు తెలిసికొనాలన్న గాఢవాంఛ గానీ, ఏ ప్రశ్న, ఏ సమయంలో, ఏ మహానుభావుడిని ఎట్లా, ఎందుకు అడగాలన్న వివేకంగానీ ఉన్నట్లు దాఖలాలు లేవు. ధర్మరాజు ఆ అయిదుగురిలో ఇట్టి జిజ్ఞాసావివేకాలు సమృద్ధిగా ఉన్న కారణంచేత ఉత్తము డవుతున్నాడు. ధర్మరాజు ప్రశ్నలో ఒక తపన కనిపిస్తుంది. నాలుగవ జాతివాడు ఈ లోకంలో సుఖం పొందాలి. పరలోకంలో సుఖం పొందాలి. పరమసుఖం - అంటే మోక్షసుఖం పొందాలి. దానికి దారిఏదో చెప్పుము - అని తాతను అడుగుతున్నాడు. చివరి జాతివాడికి ఇహపర పరమసౌఖ్యాలను అతడు అపేక్షిస్తున్నాడంటే సర్వమానవ సుఖాపేక్ష అతడికి హృదయంలో నిగూఢవాంఛగా మనం గుర్తించాలి. ప్రశ్నలో ఇంత లోతైన భావం ఉన్నది కనుకనే ముందుగా కవి అతడి ఉత్తమత్వాన్ని పేర్కొని ప్రశంసించాడని మనం గుర్తించాలి.

**వ. అనుటయు నతం డతని కిట్లనియె. 269**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనునంతనే; అతండు= భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని తాత ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

### శూద్రున కవశ్యానుష్ఠేయంబైన ధర్మంబు నిరూపించుట (సం.13-164-4)

**క. లోక హితార్థంబుగ ముని । లోకోత్తముఁ డాత్మ శిష్యలోకమునకు సు**
**శ్లోకుఁడు పరాశరుఁడు ధ । ర్మాకారము లెఱుఁగ జెప్పె నంచితచరితా! 270**

**ప్రతిపదార్థం:** అంచితచరితా!= కొనియాడదగిన నడవడి కలవాడా!; ముని లోక+ఉత్తముఁడు= మునుల సముదాయంలో శ్రేష్ఠుడు; సుశ్లోకుఁడు= మంచికీర్తి కలవాడు; అగు; పరాశరుఁడు= పరాశరమహర్షి; లోకహిత+అర్థంబుగన్= సర్వజనుల మేలే ప్రయోజనంగా; ఆత్మ శిష్య లోకమునకున్= తన శిష్యుల సముదాయానికి; ధర్మ+ఆకారములు= ధర్మస్వరూపాలను; ఎఱుఁగన్= తెలిసే విధంగా; చెప్పెన్= ఉపదేశించాడు.

**తాత్పర్యం:** సాధువర్తనా! మహర్షిశ్రేష్ఠుడు, మంచి కీర్తిగలవాడూ అయిన పరాశరుడు లోకపు మేలే ప్రయోజనంగా తన శిష్యసముదాయానికి ధర్మస్వరూపాలను తెలియజెప్పాడు.

**విశేషం:** ఇందులో చెప్పగల అర్హత 'ముని లోకోత్తముఁడు, సుశ్లోకుఁడు' అనే విశేషణాలచేత తెలియవస్తున్నది. ఈ చెప్పటంలో వంచనగానీ, స్వార్థంగానీ లేదనే అంశం "లోకహితార్థంబుగ" అనే పదంచేత వ్యక్తమవుతున్నది. 'ఆత్మ శిష్యలోకమునకు' - అనే పదంచేత విద్యాసంప్రదాయం చెప్పినట్లయింది. 'ఎఱుఁగన్' అనే పదంవలన బోధకుడి ప్రజ్ఞ తెలియవస్తున్నది. ఇట్లా విద్యాసమగ్రత, స్వార్థం లేకపోవటం, బోధకతాసామర్థ్యం, సంప్రదాయపరిజ్ఞానం అనే నాలుగు అంశాలు విద్య ఏ స్థాయిలో ఉండాలో ఈ పద్యం ప్రతిపాదిస్తున్నది.

**వ. అవ్వాక్యంబులు సెప్పెద నందు భవత్ప్రశ్నవిషయంబయిన యర్థంబు నవగతంబగు నాకర్ణింపుము. 271**

**ప్రతిపదార్థం:** ఆ+వాక్యంబులు= ఆ మాటలు; చెప్పెదన్= చెప్తుతాను; అందున్= వాటిలో; భవత్+ప్రశ్న విషయంబు= నీవు అడిగిన విషయం; అయిన అర్థంబును= అయిన అంశం కూడా; అవగతంబు= తెలియవచ్చేది; అగున్= అవుతుంది; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ మాటలు చెప్తుతాను. అందులో నీ ప్రశ్న విషయం అర్థం కూడా తెలియవస్తుంది, వినుము.

**సీ. కరుణాఢ్యుఁడగు పరాశరమునివరుఁడు శి । ష్యులకు నిట్లను నింద్రియోత్కరంబు**
**గెలిచి యంతశ్శత్రుకులమైన కామాది । వర్గంబు నోర్చి గర్వంబు వదలి**
**త్రైవర్ణికులయెడ భావంబు భక్తిమ । యంబుగా శుశ్రూష యాచరించి**
**శూద్రుఁ డైహిక సుఖసుగతులఁ బడయు వే । దాధీతితపముల నాచరించె**

**ఆ. నేని నుభయలోక హీనాత్ముఁడగు భూమి । సురనృపాల వైశ్య శూద్రులకును**
**నధ్యయనము, బలసమగ్రత, వాణిజ్య । మనుచరత్వ మధిక ధనము లరయ. 272**

**ప్రతిపదార్థం:** కరుణా+ఆఢ్యుఁడు= దయచేత గొప్పవాడు; అగు= అయిన; పరాశరమునివరుఁడు= పరాశరుడనే మునిశ్రేష్ఠుడు; శిష్యులకున్= తనవద్ద అధ్యయనం చేసేవారికి; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; శూద్రుఁడు= నాలుగవజాతి వర్ణంవాడు; ఇంద్రియ+ఉత్కరంబున్= ఇంద్రియాల గుంపును; గెలిచి= అదుపులో ఉంచుకొని; అంతః+శత్రు కులము= లోపలి శత్రువుల సముదాయం; ఐన= అయిన; కామ+ఆది వర్గంబున్= కామం మొదలైన వాటి సముదాయాన్ని; ఓర్చి= ఓడించి; గర్వంబున్= గర్వాన్ని; వదలి= వదలిపెట్టి; త్రైవర్ణికుల ఎడన్= మూడు వర్ణాలవారి విషయంలో, భావంబు= హృదయం; భక్తిమయంబు= భక్తితో నిండినది; కాన్= అయ్యేవిధంగా; శుశ్రూష= సేవ; ఆచరించి= చేసి; ఐహికసుఖ సుగతులన్= ఈ లోకపు సుఖాన్ని, ఉత్తమ గతినీ; పడయున్= పొందుతాడు; వేద+అధీతి తపములన్= వేదం చదవటం, తపస్సు అనేవాటిని; ఆచరించెను+ఏని= చేస్తే; ఉభయలోకహీన+ఆత్ముఁడు= రెండు లోకములు పోయిన ఆత్మ కలవాడు; అగున్= అవుతాడు; భూమిసుర నృపాల వైశ్య శూద్రులకును= బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు అనే వారికి; అరయన్= చూడగా; అధ్యయనము= వేదం చదవటం; బలసమగ్రత= బలం నిండుగా ఉండటం; వాణిజ్యము= వ్యాపారము; అనుచరత్వము= సేవకత్వం; అధిక ధనములు= గొప్పధనాలు.

**తాత్పర్యం:** దయతో గొప్పవాడైన పరాశరముని శిష్యులకు ఇట్లా చెప్పాడు: 'శూద్రుడు ఇంద్రియములపై పట్టు గలిగి, లోపలి శత్రువులైన కామం మొదలైనవాటిని గెలిచి, గర్వం వదలి తక్కిన మూడు వర్గాలవారిపట్ల హృదయం భక్తిమయం చేసికొని సేవ చేసినట్లయితే ఈ లోకపు సుఖాన్నీ, ఉత్తమ గతినీ పొందుతాడు. వేదం చదవటం గానీ తపస్సు గానీ చేస్తే రెండు లోకాలనూ కోల్పోతాడు. బ్రాహ్మణుడికి అధ్యయనము, రాజునకు బలము నిండుగా ఉండటమూ, వైశ్యునకు వాణిజ్యమూ, శూద్రునకు సేవకత్వమూ గొప్పధనాలు.

**విశేషం:** అంతశ్శత్రువులు - కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము. త్రైవర్ణికులు - బ్రాహ్మణ వైశ్య, శూద్రులు; ఈ పద్యంలో 'సేవ' అంటే ఆంగ్లంలో 'Service' వృత్తులు అని అర్థం. వృత్తిధర్మాలు అయిన కమ్మరం, కుమ్మరిపని మొదలైనవాటితో వ్యవసాయాదులకు కావలసిన వస్తుసముదాయాన్ని సమాజానికి అందించటమే సేవ.

సుగతి అనేచోట స్వర్గసుఖము, మోక్షసుఖము - రెంటినీ గ్రహించాలి.

**క. ఇవి శాస్త్రదృష్టమార్గము । లవనిసురప్రభృతు లీ సదాచారంబుల్**
**సువిహితములుగా నడపిన । భువనద్వయమునను బడయఁ బోలుం బెంపుల్. 273**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ ధర్మాలు; శాస్త్ర దృష్ట మార్గములు= శాస్త్రం చూపిన పద్ధతులు; అవనిసుర ప్రభృతులు= బ్రాహ్మణులు మొదలైనవారు; ఈ సత్+ఆచారంబుల్= ఈ మంచి ఆచారాలను; సువిహితములుగాన్= చక్కగా అనుష్ఠింపబడినవిగా; నడపినన్= సాగజేస్తే; భువనద్వయమునను= రెండు లోకాలలోను, పెంపుల్= మహిమలను; పడయన్+ పోలున్= పొందవచ్చును.

**తాత్పర్యం:** ఇవి శాస్త్రం చూపిన మార్గాలు. బ్రాహ్మణులు మొదలైనవారు ఈ సదాచారాలను చక్కగా పాటిస్తే రెండులోకాలలోను గొప్పతనం పొందవచ్చును.

**విశేషం:** శాస్త్రం - ఏది కార్యము, ఏదికాదు అనే నిర్ణయానికి శాస్త్రమే ప్రమాణమని గీత చెప్పింది.

**తే. ఇట్లు గా కాత్మధర్మంబు లెడల విడిచి । వర్ణములు నాలుగింట నెవ్వారలైన**
**దొలఁగ ద్రొక్కినఁ బాటిల్లు దుష్టగతులు । మన్నకాలంబు పదపడి చన్నయపుడు. 274**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కాక= కాకుండా; వర్ణములు= వర్ణాలు; నాలుగింటన్= నాలుగింటిలో; ఏ+వారలు+ఐనన్= ఎవరైనా; ఆత్మధర్మంబులు= తమ ధర్మాలను; ఎడలన్+విడిచి= తప్పునట్లుగా వదలి; తొలఁగన్+త్రొక్కినన్= తొలగునట్లు నడిస్తే; మన్నకాలంబున్= బ్రతికినంత కాలమునూ; పదపడి= తరువాత; చన్నయపుడున్= మరణించినపుడూ; దుష్టగతులు= చెడుగతులు; పాటిల్లున్= వస్తాయి.

**తాత్పర్యం:** ఇట్లా కాక నాలుగు వర్ణాలలో ఎవరైనా వారి స్వధర్మాలను విడిచిపోతే బ్రతికినప్పుడు, చచ్చిన తరువాత వారికి చెడుగతులు కలుగుతాయి.

**విశేషం:** బ్రతికినపుడు చెడుగతి అంటే - సమాజం మన్నింపకపోవటం మొదలైనది. దానివలన పాపకార్యాలు చేయవలసివస్తే నరకం కలగటం మొదలైనవి పరత్ర చెడుగతులు.

**వ. అని పలికి శౌచవిధి యెఱిఁగింపం దలంచి యిట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** అని; పలికి= చెప్పి; శౌచవిధి= శుచిత్వం ఏర్పడే విధానం; ఎఱిఁగింపన్= తెలపటానికి; తలంచి= తలపోసి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ఇట్లా చెప్పి, శుచిత్వపు విధానం చెప్పగోరి ఇట్లా అన్నాడు.

**విశేషం:** శౌచం అంటే - దేహంలోపలా, వెలుపలా కలిగే మాలిన్యం పోవటం. 'శుచి' అంటే పరిశుద్ధుడు, పరిశుద్ధము అని అర్థం. అట్టివాని / దాని భావం శౌచం. అది ఎట్లా ఏర్పడుతుందో ఆ పద్ధతిని 'శౌచవిధి' అంటారు. మానవజాతి సర్వకాల సర్వావస్థలలో శౌచాన్ని అపేక్షిస్తుంది.

**క. మూత్ర పురీషోత్సృష్టికి । రాత్రి పగలు దక్షిణోత్తర దిశాముఖతా**
**సూత్రణము వలయునది సం । ధ్యా త్రయమును నుత్తరంబ యగు నప్పనికిన్. 276**

**ప్రతిపదార్థం:** మూత్ర పురీష+ఉత్సృష్టికిన్= మూత్రము, మలము అనువాటిని విసర్జించటానికి; రాత్రి= రాత్రి సమయమున; పగలు= పగటి సమయమున; దక్షిణ+ఉత్తర దిశా ముఖతా+ఆసూత్రణము= దక్షిణం, ఉత్తరం దిక్కులవైపు ముఖం ఉంచటం అనే విధానం; వలయునది= ఆచరించాలి; సంధ్యాత్రయమును= సంధ్యలు మూడింటియందునూ; ఆ+పనికిన్= ఆ పనికి; ఉత్తరంబు+అ= ఉత్తర దిక్కే; అగున్= కావాలి.

**తాత్పర్యం:** మానవుడు మలమూత్రాలు వదిలేటప్పుడు రాత్రివేళ దక్షిణదిక్కుగా, పగటివేళ ఉత్తరదిక్కుగా ముఖం ఉంచి చేయాలి. మూడు సంధ్యలలో ఉత్తరంవైపే ముఖం ఉంచటం ఆ పనికి తగినది.

**విశేషం:** ప్రకృతిలో కొన్ని సమయాలలో కొన్ని ప్రదేశాలలో విశేషశక్తులు ఉండటం మనం గమనిస్తున్నాం. గాలి సాధారణంగా ఒక వైపునుండి వీచటం, సూర్యచంద్రులు ఒకవైపున కొన్ని సమయాలలో కనబడటం మొదలైనవి ప్రత్యక్షవిషయాలు. ఈ వాయువు, సూర్యచంద్రులు మొదలైనవి మనకు ఎన్నో ప్రయోజనాలు - మరెక్కడా లభించనివాటిని ఇస్తున్నాయి. కనుక వాటిని దేవతలుగా భారతీయులు భావిస్తున్నారు. అందువలన వాటివైపు తిరిగి మలమూత్రాదులు విడవటం దేహానికి ప్రమాదం కలిగిస్తుంది కాబట్టి ఈ పనికి దిక్కులు నిర్దేశించారు.

సంధ్యాత్రయము - 'సంధ్య' అంటే రెండు కాలాల కలయిక. రాత్రినీ, పగటినీ కలిపేది ప్రాతస్సంధ్య, పగటినీ, రాత్రినీ కలిపేది సాయంసంధ్య, పగలు పూర్వాహ్ణాన్నీ, అపరాహ్ణాన్నీ కలిపేది మధ్యాహ్నసంధ్య.

**క. పలుకవలదు శౌచక్రియ । సలుపక మును, సలుపునపుడు జలములు దొడలం**
**జిలుకుట యొప్పదు మృత్తిక । వలయు నపానంబునం ద్రివారంబు లిడన్. 277**

**ప్రతిపదార్థం:** శౌచక్రియ = శుచిత్వపు పని; చలుపక మును= చేయకముందు; పలుకవలదు= మాటాడరాదు; చలుపు+అపుడు= ఆ పనిచేసే సమయంలో; తొడలన్= తొడలమీద; జలములు= నీళ్ళు; చిలుకుట= కొంచెంగా చల్లటం; ఒప్పదు= తగదు; అపానంబునన్= పృష్ఠభాగంలో; మృత్తికన్= మట్టిని; త్రివారంబులు= మూడుసార్లు; ఇడన్+వలయున్= ఉంచాలి.

**తాత్పర్యం:** మలమూత్రాలు వదలిన తరువాత శుద్ధిచేసుకొనకుండా మాటాడరాదు. శుద్ధికొరకు తొడలమీద నీళ్ళు చిలకటం పనికిరాదు. ముడ్డిని మూడుసార్లు మట్టితో తోమాలి.

**విశేషం:** 'అపానంబునన్' - అనటంవలన ఇది మలవిసర్జనకు సంబంధించినదిగా గుర్తించాలి. ఊరక నీళ్ళు చల్లితే 'అశుద్ధం' కణాలు అక్కడే ఉండి పోతాయి. అది తనకూ, తన సమీపంలో ఉన్నవారికీ జుగుప్సను కలిగిస్తుంది. అందుకని మట్టితో మూడుసార్లు శుద్ధి చేసుకొనాలి.

**క. గుదతలము నొవ్వఁ దోమినఁ । గదురును రోగంబు లేపగంధాపగమ**
**ప్రదమగు కొలఁదిన శౌచము । సదురుగ నా చెప్పినట్ల సలుపఁగ వలయున్. 278**

**ప్రతిపదార్థం:** గుదతలము= ముడ్డిపైభాగం; నొవ్వన్= నొప్పిపుట్టే విధంగా; తోమినన్= తోమితే; రోగంబు= జబ్బు; కదురును= కలుగుతుంది; లేప, గంధ, అపగమ ప్రదము= అంటిన చెడువాసన తొలగటాన్ని కలిగించునది; అగుకొలఁ

దిన= అయినంత మాత్రమే; శౌచము= శుభ్రం చేయటం, చదురుగన్= చక్కగా; నా చెప్పిన+అట్లు+అ= నేను చెప్పినట్లే, చలుపఁగవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** ముడ్డిని నొప్పిపుట్టే విధంగా తోమరాదు. అలాచేస్తే రోగం కలుగుతుంది. అంటిన చెడువాసన తొలగటాన్ని కూర్చే అంత మాత్రం తోమటం సుకుమారంగా నేను చెప్పినట్లు చేయాలి.

**విశేషం:** మట్టితో తోమే సమయంలో తీసికొనవలసిన జాగ్రత్తలు చెప్తున్నారు. పుండయ్యే - విధంగా తోమరాదు అని భావం.

**తే. అంబరంబున శౌచజలంబు వడుట । చెట్ట; శౌచ మల్లల్లన చేఁత మేలు;**

**వామకరశుద్ధి దొల్తఁ ద్రివార మృత్తి । కా కలనమునఁ దద్ద సేయంగ వలయు. 279**

**ప్రతిపదార్థం:** శౌచజలంబు= శుద్ధికొరకు వాడిన నీరు; అంబరంబునన్= ఆకాశంలో (కట్టిన బట్టమీద); పడుట= పడటం; చెట్ట= చెడ్డది; శౌచము= శుద్ధి; అల్లన్+అల్లన్+అ= మెల్లమెల్లగానే; చేఁత= చేయటం; మేలు= మంచిది; తొల్తన్= మొదట; వామకరశుద్ధి= ఎడమచేతిని కడుగుకొనటం; త్రివార మృత్తికా+ఆకలనమునన్= మూడుసార్లు మట్టిని పట్టించటంచేత; తద్దన్= అత్యంతమూ; చేయంగన్+వలయున్= చేయాలి.

**తాత్పర్యం:** పృష్ఠం కడిగే నీళ్ళు చిందరవందరగా పడటం మంచిది కాదు. కడుగుకొనటం మెల్లమెల్లగా చేయటం మంచిది. ఆ తర్వాత ముందు ఎడమచేతిని మూడుసార్లు మట్టితో తోమి చక్కగా కడుగుకొనాలి.

**విశేషం:** ముడ్డికడిగిన నీళ్ళు మలంతో నిండి ఉంటాయి కదా! అవి అన్నివేపులా చిందే విధంగా చేస్తే ఆ మల అణువులు పరిసరాలలో వ్యాపించి కాలుష్యాన్ని కలిగిస్తాయి. ఈనాడు మనం ఎక్కువగా అనుకొంటున్న వాతావరణకాలుష్యనివారణకు ఇతిహాసకర్త మార్గాలు సూచిస్తున్నారు. పృష్ఠశుద్ధి అయిన తరువాత, ముందు ఎడమచేతిని మూడుసార్లు మట్టితో తోమాలి. మలం పోవటం, మలకణాలు పోవటం, దుర్వాసన పోవటం అనేవాటికై కావచ్చును - మూడు పర్యాయాలు తోమటం. అంబురంబున అంటే కట్టిన బట్టమీద అనికూడా చెప్పవచ్చు.

**క. కుడిచేతఁ బిదప డా చేఁ । గడిగి పొరిన్ సప్తమృత్తికా కలనమునఁ**

**గడుగునది కరయుగము; మఱి । కడుగవలయు గుహ్య మల్పక మృదాకలనమునన్. 280**

**ప్రతిపదార్థం:** పిదపన్= పిమ్మట; కుడిచేతన్= కుడిచేతితో; డాచేన్= ఎడమచేతిని; కడిగి= శుద్ధిచేసి; పొరిన్= మరల, సప్తమృత్తికా కలనమునన్= ఏడు మట్టిముద్దలను ఉపయోగించటం ద్వారా; కరయుగమున్= రెండు చేతులను; కడుగునది= కడగాలి; మఱి= తరువాత; అల్పకమృత్+ఆకలనమునన్= కొంచెపు పాటి మట్టిని ఉపయోగించటంతో; గుహ్యమున్= అపానస్థలాన్ని; కడుగవలయున్= కడగాలి.

**తాత్పర్యం:** తరువాత కుడిచేతితో ఎడమచేతిని కడగాలి. తరువాత ఏడు మట్టిముద్దలను ఉపయోగించి రెండుచేతులను శుద్ధి చేసికొనాలి. తరువాత మళ్ళీ అపానస్థలాన్ని కొంచెం మట్టితో కడగాలి.

**క. ఇమ్మెయి గుహ్యతలము శు । ద్ధమ్ముగ నొనరించి కేల్ పదంపడి జలధౌ**

**తమ్ముగఁ జేసి సముత్థా । నమ్ము పిదపఁ బాదశోధనము సేయఁదగున్. 281**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; గుహ్యతలమున్= గుదం పై భాగాన్ని; శుద్ధమ్ముగన్+ఒనరించి= శుభ్రంచేసి; పదంపడి= తరువాత; కేల్= చేతిని; జలధౌతమ్ముగన్= నీటితో కడుగబడిన దానిని; చేసి; సముత్థానము పిదపన్= లేచిన తరువాత; పాదశోధనము= కాళ్ళు కడుగుకొనటం; చేయన్+దగున్= చేయాలి.

**తాత్పర్యం:** ఇట్లా గుదతలం శుభ్రం చేసికొన్న తరువాత చేతులు నీటితో చక్కగా కడుగుకొని, లేచి నిలబడి, పాదాలు శుభ్రంగా కడుగుకొనాలి.

**విశేషం:** మలవిసర్జన చేసిన ప్రాంతమంతా అశుద్ధంగా ఉంటుంది. కనుక ఆ సూక్ష్మక్రిములు పాదాలనుండి దేహంలోకి ప్రవేశించకుండా పాదాలు కడుగుకొనటాన్ని ఇక్కడ ఆదేశించారు.

**క. జనములు సూచుచునుండఁగ । జనదు మలము మూత్రమును విసర్జింపఁగ, న**
**ప్పనులకు శౌచాచరణం । బునకు నవశ్యంబు నోలములు గావలయున్. 282**

**ప్రతిపదార్థం:** జనములు= జనాలు; చూచుచున్+ఉండఁగన్= చూస్తూ ఉండగా; మలమున్= మలాన్ని; మూత్రమును= మూత్రాన్నీ; విసర్జింపఁగన్= వదలటం; చనదు= కూడదు; ఆ పనులకున్= ఆ రెండు పనులకున్నూ; శౌచ+ఆచరణంబునకున్= శుద్ధి పనికీ; అవశ్యంబున్= తప్పనిసరిగా; ఓలములు= మరుగు తావులు; కావలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** బహిరంగ స్థలాలలో మలమూత్రాదులు వదలరాదు. ఆ పనులకూ, వాటి శుద్ధి పనికీ చెట్లు మొదలైనవి గల మరుగుతావులు ఉండాలి.

**విశేషం:** స్త్రీ పురుషుల లింగాలకు 'గుహ్యం' అని ఒక వ్యవహారం. అంటే గుట్టుగా ఉంచవలసినది అని అర్థం. మలమూత్ర విసర్జనాలు జనాలు చూస్తుండగా చేస్తే అది చూచేవారికి జుగుప్స పుట్టిస్తుంది. శుచికర్మకూడా మరింత ఏవగింపు కలిగిస్తుంది. కనుక మరుగుచోట్లను నిర్దేశించారు. చెట్లనడుమ తావులైతే వాతావరణకాలుష్యం తగ్గిపోయే అవకాశం ఉంటుంది.

**క. ఆపత్సమయంబున శౌ । చాపాదన మిట్టి భంగి నబ్బమి మలసం**
**లేపన గంధము వోపఁ గ్రి । యాపరుఁడై చేయునది మృదాకలనంబున్. 283**

**ప్రతిపదార్థం:** ఆపత్సమయంబునన్= ఆపదవేళలో; శౌచ+ఆపాదనము= శుద్ధిని కలిగించటం; ఇట్టి భంగిన్= ఈ విధంగా; అబ్బమిన్= కుదరకపోవటంచేత; మల సంలేపన గంధము= మలం అంటటంవలన అయిన వాసన; పోవన్= పోయే విధంగా; మృత్+ఆకలనంబున్= మట్టిని అంటించటంచేత; క్రియాపరుఁడు+ఐ= పనియందు శ్రద్ధ కలవాడై; చేయునది= చేయాలి.

**తాత్పర్యం:** ఆపదవేళలో ఇంతగా శుద్ధి కుదరకపోతే మలం అంటిన వాసన పోయే విధంగా శ్రద్ధతో మట్టితో కడుగుకొనాలి.

**విశేషం:** ప్రాచీన ఋషులు ధర్మాలు బండగా నిర్దయతో చెప్పరు. పరిస్థితులు అన్నీ అనువుగా ఉంటే ధర్మలోపం చేయరాదు. అనుకూలించని వేళలో ధర్మం పేరుతో శరీరాన్నీ, మనస్సునూ హింసించకూడదు. ఇది ఋషిమార్గం. ఆపదసమయం అంటే చెప్పిన విధంగా శుద్ధక్రియ చేయటానికి అనువుకాని వేళ అని భావం. క్రియాపరుడు= పనిలో శ్రద్ధలోపించనివాడు.

**సీ. బుద్బుద విరహితంబుగ వారిఁ గరమున । గొనకొని పొరి డెందమునకుఁ జేరు**
**నట్లుగ నిశ్శబ్దమై యుండ ముమ్మాఱు । ద్రావి యిన్మాఱు తిర్యగ్విధమున**

**నాస్యంబు దొడసి నీ రంఘ్రుల శిరమునఁ । బ్రోక్షించి యోష్ఠ సంపుటము ముట్టి**

**నాసికాపుటములు నయనముల్ సెవులు మూఁ । పులు హృదయము నాభితలము మౌళి**

**ఆ. ముట్టవలయు హస్తములు పాదయుగమధ్య । గతములుగ నుద జ్ముఖత్వ మొండెఁ**

**బ్రాఙ్ముఖత్వ మొండెఁ బ్రాపించి యిమ్మెయి । నాచమనము సేయు టార్యమతము. 284**

**ప్రతిపదార్థం:** బుద్బుద విరహితంబుగన్= బుడగలు లేకుండునట్లుగా; వారిన్= నీటిని; కరమునన్= చేతితో; గొనకొని= ప్రయత్నించి; పోరిన్= క్రమంగా; డెందమునకున్= గుండెకు; చేరు+అట్లు+కన్= చేరే విధంగా; నిశ్శబ్దము+ఐ= చప్పుడు లేనిదై; ఉండన్= ఉండగా; మూడు+మాఱు= మూడు సారులు; త్రావి= త్రాగి; ఇన్+మాఱు= రెండుమార్లు; తిర్యక్+విధమునన్= అడ్డంగా; ఆస్యంబున్= మొగమును; తొడసి= తుడిచి; నీరు= నీళ్ళు; అంఘ్రులన్= కాళ్ళమీదా; శిరమునన్= తలపైనా; ప్రోక్షించి= చిలుకరించి; ఓష్ఠ సంపుటమున్= పెదవుల మొగ్గవంటి స్థితిని; ముట్టి= తాకి; నాసికాపుటములు= ముక్కురంధ్రములు; నయనముల్= కన్నులు; చెవులు; మూఁపులు= భుజాలు; హృదయము= వక్షస్సు; నాభితలము= బొడ్డు; మౌళి= తల; ముట్టవలయున్= తాకాలి; హస్తములు= చేతులు; పాదయుగమధ్యగతములుగన్= కాళ్ళజంటనడుమ ఉన్నవిగా; ఉదక్+ముఖత్వము= ఉత్తరపు మోము అగుట; ఒండెన్= కానీ; ప్రాక్+ముఖత్వము= తూర్పు మొగం కావటం; ఒండెన్= కానీ, ప్రాపించి= పొంది; ఈ+మెయిన్= ఈ విధంగా; ఆచమనము= ఆచమనం అనే క్రియను; చేయుట= చేయటం; ఆర్యమతము= ఆర్యులకు సమ్మతమైనది.

**తాత్పర్యం:** బుడగలులేని నీరు చేతిలో చక్కగా గ్రహించి మెల్లగా గుండె దగ్గరకు చేరేవిధంగా చప్పుడు లేకుండా మూడుమారులు గ్రహించాలి. రెండుసార్లు అడ్డంగా నోటిని తుడుచుకొనాలి. నీళ్ళు కాళ్ళమీద, తలమీద చిలుకరించుకొనాలి. నోటిని చేతితో తాకాలి. ముక్కు, కన్నులు, చెవులు, భుజాలు, హృదయం, బొడ్డు శిరస్సు- వీటిని తాకాలి. చేతులు రెండు కాళ్ళకు మధ్య ఉంచుకొని, ఉత్తరపు మొగంగా గానీ తూర్పు మొగంగాగానీ కూర్చుండి ఈ విధంగా ఆచమనం చేయాలి. ఇది ఆర్యులు సమ్మతించిన పద్ధతి.

**విశేషం:** ఇంతవరకు బాహ్యాశౌచం చెప్పారు. ఇప్పుడు అంతరశౌచం చెప్పుతున్నారు. అందులో మొదటిది ఆచమనక్రియ. ఇది మూడు విధాలు. శ్రౌతం, స్మార్తం, పౌరాణం అని వాటి పేర్లు. మూడు విధానాలలో ప్రక్రియ ఇంచుమించుగా ఒక్కటే. ఉచ్చరించే మంత్రాదులలోనే మార్పులు.

తిర్యగ్విధమునన్ - పెదవులపై ఒక అంచునుండి మరొక అంచువరకు అడ్డంగా తుడవటం. ఆచమనం చేసేటప్పుడు ఉత్తరదిక్కుగా గానీ, తూర్పుదిక్కుగా గానీ మొగంపెట్టి కూర్చోవాలి.

ఈ ప్రక్రియవలన ఫలాలు తరువాతి పద్యంలో చెప్పుతున్నారు.

**సీ. ముమ్మాటి జలపానమున నోలి ఋగ్యజు । స్సామవేదంబులు సంతసిల్లుఁ**

**దొలితొలి వక్త్రంబు దొడయ నధర్వ హ । ర్షంబును రెండవసారె ధర్మ**

**శాస్త్ర తోషేతిహాస ప్రమోద పురాణ । సంప్రీతులును గల్గుఁ జరణయుగముఁ**

**బ్రోక్షింపఁ బుండరీకాక్షుండు ప్రియమందు । నయనంబు లంటిన నలినహితుఁడు**

**తే. సమ్మదంబునఁ దేలు నాచమన సంప్ర। యోగ మిట్టిది వస్త్రయజ్ఞోపవీత**
**ధరణముల నన్నపానతంత్రముల మున్ను। సేసి పిదపను నిది యనుష్ఠింపవలయు. 285**

**ప్రతిపదార్థం:** ముమ్మాటి జలపానమునన్= మూడుమారులు నీరు త్రావటంచేత; ఓలిన్= వరుసగా; ఋక్+యజుస్+ సామవేదంబులు= ఋక్కు, యజుస్సు, సామము అనే వేదాలు; సంతసిల్లున్= సంతోషిస్తాయి; తొలితొలిన్= మొదటిసారిగా; వక్త్రంబు= నోటిని; తొడయన్= తుడువగా; అథర్వ హర్షంబునున్= అథర్వవేదం ఆనందించటమూ; రెండవుసారెన్= రెండోమారు; తొడయన్= తుడువగా; ధర్మశాస్త్ర తోష ఇతిహాస ప్రమోద పురాణ సంప్రీతులును= ధర్మశాస్త్రం సంతోషించటం, ఇతిహాసం ఆనందించటం, పురాణం ప్రీతి పొందటం; కల్గున్= కలుగుతాయి; చరణయుగమున్= కాలిజంటను (పై); ప్రోక్షింపన్= నీటిని చిలుకరింపగా; పుండరీక+అక్షుండు= పద్మములవంటి కన్నులుగల శ్రీమహావిష్ణువు; ప్రియము+అందున్= ప్రీతి పొందుతాడు; నయనంబులు= కనులు; అంటినన్= తాకితే; నలినహితుఁడు= పద్మముల బంధువు-సూర్యుడు; సమ్మదంబునన్= పరమా నందంతో; తేలున్= తేలిపోతాడు; ఆచమన సంప్రయోగము= ఆచమనపు చక్కని విధానం; ఇట్టిది= ఇటువంటిది; వస్త్ర యజ్ఞో పవీత ధరణములన్= బట్టలు, జందెము తాల్చుటను; అన్నపాన తంత్రములన్= భోజనము, నీరు పుచ్చుకొనటం మొదలైన పనులను; మున్ను= ముందు; చేసి; పిదపను= తరువాత, ఇది= ఈ ఆచమన కార్యం; అనుష్ఠింపవలయున్= ఆచరించాలి.

**తాత్పర్యం:** మూడు మారులు నీరు పుచ్చుకొనటంవలన క్రమంగా ఋక్కు, యజుస్సు, సామం అనే వేదాలు సంతసిస్తాయి. మొదటిసారి నోరు తుడవటంవలన అథర్వవేదం హర్షం పొందుతుంది. రెండవసారి తుడవటం వలన ధర్మశాస్త్రం, ఇతిహాసం, పురాణం అనేవి పరమానందం పొందుతాయి. కాళ్ళపై నీళ్ళు చిలుకరించటం వలన విష్ణువు, కనులను తాకటంవలన సూర్యుడు ఆనందిస్తాడు. ఆచమన విధానం ఇటువంటిది. వస్త్రాలు, జందెము తాల్చినప్పుడు, అన్నపానాల వేళలలోను ముందు ఆచమనం చేసి తరువాత కూడ ఈ ఆచమన కార్యం చేయాలి.

**విశేషం:** ఆచమనం నాలుగు వేదాలకు, ధర్మశాస్త్రాలకు, విష్ణుసూర్యులకు ఆనందం కలిగిస్తుందని ఈ పద్యం చెప్పుతున్నది. ఇట్లా చెప్పటంవలన ఆ పనియందు ఆదరం కలుగుతుంది. ఆచమనప్రక్రియ శ్రమలేకుండా ఒకటి రెండు నిముసాలలో చేయవచ్చును. ఫలితం అనంతంగా ఉంటుందని ఈ పద్యం ప్రతిపాదిస్తున్నది. సాధారణంగా సూక్ష్మక్రిముల వ్యాప్తిని నిరోధించే ఒక ప్రక్రియగా, అంతశ్శుద్ధికొరకు దీనిని ఆచరించవచ్చును.

**తే. ఆస్యశుద్ధి యొనర్చిన యపుడు వోక। భక్ష్యభోజ్య లవంబులు పండ్ల నడుమ**
**నిలిచి పదపడి పోవుట గలిగెనేని। నాచమన మాక్షణంబ చేయంగవలయు. 286**

**ప్రతిపదార్థం:** ఆస్యశుద్ధి = నోటి శుభ్రత; ఒనర్చిన అపుడు= చేసినప్పుడు; పోక= పోక; భక్ష్య భోజ్య లవంబులు= కొరికి నమలి తిన్న పదార్థాల కణాలు; పండ్ల నడుమన్= పండ్ల మధ్య; నిలిచి= ఉండి, పదంపడి= తరువాత; పోవుట= వెడలిపోవటం; కలిగెన్+ఏని= కలిగితే; ఆ క్షణంబు+అ= అప్పటికప్పుడు; ఆచమనము= ఆచమనం అనే పనిని; చేయంగవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** నోటిని శుభ్రం చేసికొన్నప్పుడు అంతకుముందు తినిన పదార్థాలు పండ్లమధ్య నిలిచిపోయి తరువాత బయటకు వస్తే ఆ క్షణంలోనే ఈ ఆచమనకార్యాన్ని చేయాలి.

**వ. శౌచవిధి సమస్త వర్ణసామాన్య ధర్మంబు, శూద్రునకు నాచమనం బోష్ఠపుటం బొకమరి ప్రోక్షించుకొనుటయు, దానిం గరంబున నడ్డం బొకమరి దొడయుటయు నింతియ. 287**

**ప్రతిపదార్థం:** శౌచవిధి= శుచిత్వపు పని; సమస్త వర్ణ సామాన్య ధర్మంబు= అన్ని వర్ణాలకు సమానంగా ఉండే ధర్మం; శూద్రునకున్= శూద్రవర్గం వాడికి; ఆచమనంబు= ఆచమనపు పని; ఓష్ఠపుటంబు= పెదవుల దొప్పను; ఒకమరి= ఒకమారు; ప్రోక్షించుకొనుటయున్= నీరు చల్లుకొనటం; దానిన్= నోటిని; కరంబునన్= చేతితో; ఒకమరి= ఒకమారు; అడ్డంబు= అడ్డంగా; తొడయుటయున్= తుడవటం; ఇంతియ= ఇంతే.

**తాత్పర్యం:** పైన తెలిపిన శౌచకార్యం అన్ని వర్గాలవారు సాధారణంగా ఆచరించవలసిన ధర్మం. శూద్రునకు ఆచమనం అంటే పెదవులమీద నీరు ఒకమారు చిలుకరించుకొనటమూ, నోటిని అడ్డంగా చేతితో ఒకమారు తుడుచుకొనటమూ - ఇంతే.

**క. తాను శుచిత్వం బేమిట। నైనను నేమఱక నియతి నతులితశుశ్రూ**
**షానిరతుండై శూద్రుఁడు। మానిత విప్రులకు నోడి మనఁగా వలయున్. 288**

**ప్రతిపదార్థం:** శూద్రుఁడు= నాలుగవ వర్గపు వ్యక్తి; ఏమిటన్+ఐనన్= ఏ విధంగానైనా; తాను; శుచిత్వంబు= శౌచాన్ని; ఏమఱక= ఉపేక్షించక; నియతిన్= నిష్ఠతో; అతులిత= శుశ్రూషా నిరతుండు+ఐ= సాటిలేని సేవాభావంలో శ్రద్ధ కలవాడై; మానిత విప్రులకున్= మాన్యతగల విద్యావంతులకు; ఓడి= వినయం కలిగి; మనఁగావలయున్= జీవించాలి.

**తాత్పర్యం:** శూద్రుడు ఏ విధంగానైనా శుచిత్వాన్ని నిష్ఠతో సాధించి సాటిలేని సేవాభావంతో గొప్పవిద్యావంతులయెడ వినయం కలిగి జీవిస్తూ ఉండాలి.

**విశేషం:** "విద్యయా యాతి విప్రత్వం" - విప్రుడంటే గొప్ప విద్యలను శ్రద్ధతో ఆర్జించి బుద్ధితో జగత్ క్షేమానికై వినియోగించేవాడు. సంఘంలో తక్కిన వ్యక్తులు అట్టివారికి తోడ్పడటంవలన మేలు జరుగుతుంది. ఇక్కడ 'శుశ్రూషా' శబ్దాన్ని ఆ విధంగా సమన్వయం చేసికొనాలి. జాతిమాత్రంచేత ఆరాధించనక్కరలేదనే విషయాన్ని 'విప్ర' శబ్దం సూచిస్తున్నది. అందులోని విశేషార్థాన్ని సంభావించాలి. అంతేకాదు. శుశ్రూష అంటే సేవ. అంటే వృత్తి ధర్మాలు; కమ్మరి, కుమ్మరి, వడ్రంగం మొదలైనవి అనికూడా గ్రహించాలి. ఓడి అంటే అహంకార లక్షణం లేకుండా భావం.

**సీ. అవనీసురుఁడు జపయజ్ఞుఁ డధ్యయనోప। జీవి తపశ్శోభి; భూవరుండు**
**ప్రారంభయజ్ఞుండు పరమదండోప జీ। వకుఁడు పాలనశోభి; వైశ్యుఁడమల**
**హవ్యయజ్ఞుఁడు విక్రయాజీవి యాతిథ్య। పరిశోభి, శూద్రుండు పరిచరత్వ**
**యజ్ఞుండు శుశ్రూషణాజీవి దక్షత్వ। శోభి; యట్టులు గాని చొప్ప లఖిల**

**ఆ. వర్ణజాతులకు నవశ్యంబు; నాలవ। వాని కెమ్మెయిం ద్రివర్ణభక్తి**
**వలయు నడప యతులవలన విశేషించి। నిత్యభజనపరత కృత్య మరయ. 289**

**ప్రతిపదార్థం:** అవనీసురుఁడు= బ్రాహ్మణుడు, జపయజ్ఞుఁడు= జపరూపమైన యజ్ఞం కలవాడు; అధ్యయన+ఉపజీవి= వేదాలను అర్థంతోపాటు గ్రహించటమే బ్రదుకుతెరువుగా గలవాడు; తపస్+శోభి= తపస్సుతో ప్రకాశించేవాడు; భూవరుండు= రాజు; ప్రారంభయజ్ఞుండు= పూనికయే యజ్ఞంగా గలవాడు; పరమదండ+ఉపజీవకుఁడు= శ్రేష్ఠమైన దండనీతియే బ్రతుకు తెరువైనవాడు; పాలనశోభి= ఏలటంతో రాణించేవాడు; వైశ్యుఁడు= మూడవ వర్ణంవాడు; అమల హవ్యయజ్ఞుఁడు= దోషంలేని హోమద్రవ్యం యజ్ఞంగా గలవాడు; విక్రయ+ఆజీవి= అమ్మకం బ్రదుకుతెరువైనవాడు; అతిథ్య పరిశోభి= అతిథుల పూజతో ప్రకాశించేవాడు; శూద్రుండు= నాలుగవ వర్ణంవాడు; పరిచరత్వ యజ్ఞుండు= సేవకభావం యజ్ఞంగా గలవాడు; శుశ్రూషణ+ఆజీవి= సేవయే బ్రదుకుతెరువుగా గలవాడు; దక్షత్వశోభి= సమర్థతతో విరాజిల్లేవాడు; అట్టులు= ఆ విధము; కాని చొప్పులు= కాని విధానాలు; అఖిల వర్ణ జాతులకున్= అన్ని వర్ణాలలో పుట్టినవారికి; అవశ్యంబు= వశముకానివి; నాలవవానికిన్= నాలుగవ వర్ణంలో పుట్టిన వ్యక్తికి; అరయన్= భావిస్తే; ఏ+మెయిన్= ఎట్లాగయినా, త్రివర్ణభక్తి= మూడు వర్ణాలవారియందు అనురాగం; నడపన్= సాగించటం; వలయున్= కావాలి; విశేషించి= మీదు మిక్కిలి; యతులవలనన్= పరమార్థం కొరకు యత్నం చేసే వారియెడల; నిత్య భజన పరత= ఎల్లప్పుడు సేవచేసే ఆసక్తి; కృత్యము= చేయదగిన పని.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడికి జపమే యజ్ఞం. అధ్యయనమే బ్రదుకుతెరువు. తపస్సు శోభ తెస్తుంది. క్షత్రియుడికి ప్రయత్నం యజ్ఞం, దండనీతి బ్రదుకుతెరువు. పాలనం శోభ తెస్తుంది. వైశ్యుడికి హవ్యం యజ్ఞం. అమ్మకం బ్రదుకుతెరువు. ఆతిథ్యం శోభ తెస్తుంది. శూద్రుడికి సేవలందించటం యజ్ఞం. సేవలే అతడి బ్రతుకుతెరువు. పనిలో సామర్థ్యం వన్నె తెస్తుంది. వీటికంటె వేరైన విధానాలు ఆయావర్ణాలవారికి వశంకానివి. నాలుగవవర్ణం వాడు తక్కిన మూడు వర్ణాలవారియందు అనురాగం కలిగి నడుచుకొనాలి. ప్రత్యేకించి యతుల విషయంలో ఎల్లప్పుడు అనురాగం కలిగి ఉండటం అతడి కర్తవ్యం.

**విశేషం:** జపయజ్ఞుడు - మంత్రాన్ని పలుమారులు నిష్ఠతో హృదయంలో ఆవృత్తి చేయటం జపం. యజ్ఞమంటే పరమశ్రద్ధతో చేసే పవిత్ర కార్యం. జపయజ్ఞం; ఇది పరమార్థ సాధనకు ఉపకరిస్తుంది. దీనికి అధ్యయనమూ తపస్సూ విశిష్టతను చేకూరుస్తాయి. కాబట్టి బ్రాహ్మణుడు ఐహికసుఖాపేక్ష లేనివాడై తనకు, తన పరిధిలో ఉన్నవారికి పరమసుఖం కలిగే సుకృత్యాలు - జప అధ్యయన తపస్సులు చేస్తూ ఉండాలి.

రాజ, వైశ్య, శూద్రులు తమ నియతధర్మాలద్వారా ఐహికసుఖం అందరికీ సాధించాలి. ఈ విధంగా నాలుగు వర్ణాలవారు అన్యోన్యభావనతో ఇహపరాలను సాధించటం ఆర్షధర్మం కాంక్షించిన విజయం.

హవ్యయజ్ఞుడు - అంటే హోమద్రవ్యాలను యజ్ఞాలను చేసేవారికి అందించటమే యజ్ఞంగా కలవాడని భావన చేయవచ్చును.

పరిచరత్వం, శుశ్రూషణ - ఇవి వృత్తిధర్మాలు. చాకలి, మంగలి, కమ్మరి మొదలైనవారి పనులు.

యతులు - యత్నశీలం కలవారు. లౌకికమైన ప్రవృత్తి లేక పరమార్థమందే ప్రయత్నం కలవారు. వారి విషయంలో సర్వవర్ణాలవారు భక్తికలిగి ఉండాలి.

**క. యతి సర్వాశ్రమ చరణ। స్థితులకు నుత్కృష్టుఁ డతని తెరవూఁదిన శ**
**క్తత కలిగినవారు శ్రుతి। స్మృతి విహితాచారులగుట మే లరయంగన్. 290**

**ప్రతిపదార్థం:** అరయంగన్= పరికింపగా; యతి= సన్న్యాసి; సర్వ+ఆశ్రమ చరణ స్థితులకున్= అన్ని ఆశ్రమాల పనుల దశలకంటె; ఉత్కృష్టుఁడు= అధికమైన స్థితికలవాడు; అతని తెరువు= అతడి మార్గం; ఊఁదిన శక్తత కలిగినవారు= అవలంబించిన శక్తికలవారు; శ్రుతి స్మృతి విహిత+ఆచారులు= వేదాలు, ధర్మశాస్త్రాలు బోధించిన ఆచారాలు కలవారు; అగుట= కావటం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** యతి అన్ని ఆశ్రమాలవారికంటె మిన్న అయినవాడు. ఆ మార్గం అవలంబించి సమర్థతతో నిర్వహింపదలచినవారు వేదాలు, ధర్మశాస్త్రాలు చెప్పిన ఆచారాలను పాటించటం మేలు.

**విశేషం:** యతిధర్మాలు చాలా క్లిష్టమైనవి. అవి పాటించకపోతే ఆ ఆశ్రమం స్వీకరించటం మంచిది కాదని హెచ్చరిక.

**సీ. ప్రియవాదితయును శాంతియును దాంతియు ననా । లస్యంబు నతుల శీలంబు గలిగి**
**నా కిది వలయు దీన సుదుస్తరంబును । ఘోరంబు నైన సంసారజలధిఁ**
**గడతు నేనని భిక్షుకజనంబులకు నెవ్వి । హితము లప్పనులు సంతతముఁ జేయు**
**చడుగులొత్తుచు నిష్ఠ మడుగుచు నీచత । ననుచరించుచు ధర్మమున నుపార్జి**

**ఆ. తంబులైన యట్టి ద్రవ్యసంచయములఁ । దృప్తి సేసి దేహగుప్తి నడపి**
**పగలు రేయు నాక పరిచర్య నొనరించి । శూద్రుఁడిహపరముల సుఖము వడయు. 291**

**ప్రతిపదార్థం:** ప్రియవాదితయునున్= ప్రియంగా పలకటమూ; శాంతియునున్= కామక్రోధాదులు లేకుండటమూ; దాంతియున్= ఇంద్రియముల అదుపు కలిగి ఉండటం; అనాలస్యంబున్= సోమరితనం లేకుండా ఉండటం; అతుల శీలంబున్= సాటిలేని మంచి నడవడి; కలిగి; నాకున్= నాకు; ఇది= ఈ లక్షణం; వలయున్= ఆవశ్యకము; దీనన్= దీనిచేత; సుదుస్తరంబును= మిక్కిలిగా దాట శక్యం కానిదీ; ఘోరంబున్= భయంకరమైనదీ; ఐన= అయినట్టి; సంసారజలధిన్= సంసారమనే సముద్రాన్ని; నేను; కడతున్= దాటుతాను; అని; భిక్షుక జనంబులకున్= బిచ్చమెత్తుకొని జీవించే జనులకు; ఎవ్వి= ఏవి; హితములు= మేలయినవో; ఆ+పనులు= ఆ కార్యాలు; సంతతమున్= ఎల్లప్పుడు; చేయుచున్= చేస్తూ; అడుగులు+ఒత్తుచున్= మహాత్ముల పాదసేవ చేస్తూ; నిష్ఠన్= నిష్ఠతో; మడుగుచున్= శుద్ధుడవుతూ; నీచతన్= తక్కువతనంతో; అనుచరించుచున్= మెలగుతూ; అనుసరిస్తూ; ధర్మమునన్= ధర్మమార్గంతో; ఉపార్జితంబులు= సంపాదించినవి; ఐన అట్టి ద్రవ్య సంచయములన్= అయిన వస్తువుల సముదాయాలతో; తృప్తిచేసి= తృప్తిపడి; దేహగుప్తిన్= దేహరక్షణను; నడపి= ప్రవర్తింపజేసి; పగలు రేయున్= ఇది పగలు, ఇది రాత్రి; నాక= అనక; పరిచర్యన్= సేవను; ఒనరించి= చేసి; శూద్రుఁడు= నాలుగవ వర్ణం వ్యక్తి; ఇహపరములన్= ఈ లోకంలోనూ, పరలోకంలోనూ; సుఖము= సుఖాన్ని; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ప్రియమైన మాటా, శాంతీ, ఇంద్రియనిగ్రహమూ, సోమరితనం లేకపోవటం, మంచి శీలమూ కలిగి ఉండటం ఆవశ్యకం. ఈ లక్షణం చేత ఈ దాట శక్యంకాని, భయంకరమైన సంసారం దాటుతానన్న భావంతో భిక్షుకజనాలకు ఏవి కర్తవ్యాలో అవి నిరంతరం చేస్తూ మహాత్ములకు పాదసేవ చేస్తూ నిష్ఠతో శుద్ధుడై, అహంకారంలేనివాడై ధర్మంతో సాధించిన వస్తువులతో దేహపోషణ చేసికొంటూ, పగలనక, రాత్రి అనక పరిచర్య చేస్తూ శూద్రుడు ఇహపర సుఖాలను పొందుతాడు.

**విశేషం:** అనాలస్యంబు - అలసభావం లేకపోవటం. అలసుడంటే పనుల విషయంలో శ్రద్ధ లేనివాడు, మమకారాన్ని నీచత - ఇది అహంకారాన్ని చంపే పద్ధతి, నీచత అంటే తన్ను గురించి గొప్పగా భావించకుండటం. పగలు, రేయు నాక - సర్వ కాలాలలో అవసరాన్నిబట్టి, ఆయా పనులకు సిద్ధంగా ఉండాలని తాత్పర్యం.

**క. దానోపవాసముల స । న్మానితగతి లేదు శూద్రునకు యతి దెస స**
**మ్మాననమునఁ దత్పూజా । ధీనరతిం గాని యెన్ని తెరువులఁ జూడన్. 292**

**ప్రతిపదార్థం:** శూద్రునకున్= శూద్రుడికి; ఎన్ని తెరువులన్= ఎన్ని మార్గాలతో; చూడన్= చూచినా; యతిదెసన్= యతిపట్ల; సమ్మాననమునన్= మన్ననతోనూ; తత్+పూజా+అధీనరతిన్= అతడిని పూజించటానికి వశమవటంలోని ప్రీతితోను; కాని= కాక; దాన+ఉపవాసములన్= దానమూ, ఉపవాసమూ అనే వాటితో; సత్+మానిత గతి= చక్కని మన్నింపబడిన గతి; లేదు.

**తాత్పర్యం:** శూద్రుడికి యతిపట్ల గౌరవమూ, అతడి పూజకు వశమైన ప్రీతి అనే వాటితోనే కానీ ఎన్నివిధాలుగా చూచినా దానమూ, ఉపవాసమూ అనే వాటితో మంచి మన్నన పొందే అవకాశం లేదు.

**విశేషం:** యతికి సమ్మానమూ, పూజ అంటే పరమార్థానికి, పరమాత్మకూ సేవ చేయటం అని భావం.

**తే. తెరువుఁ దప్పి తూఁగాడుచు నరుగుదెంచు । యతిఁ గనుంగొని మనమున నడరు పొడమ**
**నెదురుకొని డప్పి తీర్చి సమ్మదముసేఁత । శూద్రునకు ధర్మవిధి యని శ్రుతులు చెప్పు. 293**

**ప్రతిపదార్థం:** తెరువున్= దారిని; తప్పి; తూఁగాడుచున్= అలసతతో తూగిపోతూ; అరుగుదెంచు యతిన్= వచ్చే సన్యాసిని; కనుంగొని= చూచి; మనమునన్= హృదయంలో; అడరు= తొందర; పొడమన్= కలుగగా; ఎదురుకొని= ఎదురువెళ్ళి; డప్పి తీర్చి= దాహంతీర్చి; సమ్మదము చేఁత= ఆనందం కలిగించటం; శూద్రునకున్= శూద్రుడికి; ధర్మవిధి= ధర్మంతో కూడిన కర్తవ్యం; అని; శ్రుతులు= వేదాలు; చెప్పున్= చెప్పుతున్నాయి.

**తాత్పర్యం:** దారితప్పి అలసతతో తూగిపోతూ వస్తున్న అతడిని చూచి హృదయంలో తొందర పుట్టగా ఎదురేగి, అతడి శ్రమను పోగొట్టి సంతోషపెట్టటం శూద్రునకు ధర్మపు కర్తవ్యం అని వేదాలు చెప్పుతున్నాయి.

**విశేషం:** అడరు పొడమన్ - ఆలస్యంచేస్తే ఏమై పోతాడో అనే భీతితో కూడిన తొందరతో ఆదరించాలి అని భావం. డప్పి - దాహం, శ్రమ; తెరువు తప్పాడు కనుక దేహశ్రమ, మనఃక్లేశం రెండూ ఉంటాయి. ఆదరణవలన అమితానందం కలుగుతుంది.

**చ. యతి రుజఁ బొందినం దొఱఁగ । నౌషధ కృత్యముఁ బథ్యమై సమం**
**చితమగు నట్టి భోజనము సేర్చుటయున్ మలమూత్రముల్ జుగు**
**ప్సితములు గాని భంగిగల చిత్తముతో జలకార్య మోపి వ**
**ర్ణితముగఁ జేఁతయుం గల చరిత్రము శూద్రున కిచ్చు సద్గతిన్. 294**

**ప్రతిపదార్థం:** యతి= సన్న్యాసి; రుజన్= జబ్బును; పొందినన్= పొందితే; తొఱఁగన్= పోవటానికి; ఔషధ కృత్యమున్= మందు ఇవ్వటమూ; పథ్యము+ఐ= దేహానికి హితం చేసేదై; సమంచితము= మంచిదీ; అగు+అట్టి భోజనము= అయినట్టి ఆహారము; చేర్చుటయున్= అందివ్వటమూ; మలమూత్రముల్= మలము, మూత్రము; జుగుప్సితములు= ఏవగింపు కలిగించేవి;

కాని భంగికల చిత్తముతోన్= కాని తీరు అయిన హృదయంతో; జలకార్యము= నీటిపని (శుద్ధిచేయటం); ఓపి= సహించి; వర్ణితముగన్= జనాలు కొనియాడే విధంగా; చేఁతయున్= చేయటమూ; కలచరిత్రము= కలనడవడి; శూద్రునకున్= శూద్రుడికి; సద్గతిన్= మంచిగతిని; ఇచ్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** యతికి జబ్బుచేస్తే మందు ఇవ్వటం, హితమైన మంచి భోజనం పెట్టటం; మలమూత్రాలను ఏవగించు కొనకుండా ఎత్తిపారవైచినీటితో శుద్ధిచేయటం జనాలు కొనియాడే విధంగా చేయగల నడవడి శూద్రుడికి సద్గతిని సమకూరుస్తుంది.

**విశేషం:** 'చిత్తముతో, ఓపి, వర్ణితములుగా' అనే పదాలు సేవలోని త్రికరణశుద్ధిని అభివ్యక్తం చేస్తున్నాయి. కేవలం మెప్పుకొరకు చేయరాదనే హెచ్చరికను కూడా ప్రతీయమానం చేస్తున్నాయి.

సర్వసంగపరిత్యాగం చేసిన యతికి అవశదశలో సేవకు మరొక దిక్కు ఉండదు కనుక దీనిని ఇంత నొక్కి చెప్పుతున్నారు. నరసేవ నారాయణసేవగా భారతీయ ఋషులు భావించారనటానికి ఇది నిదర్శనం.

**క. ఏ విధమున నోపిన యతి । భావము దుఃఖంబు వాపుపని సాదర చే**
**తోవృత్తిఁ బూని చేయం । గావలయును శూద్రుఁడది సుగతి నొందించున్. 295**

**ప్రతిపదార్థం:** శూద్రుఁడు= శూద్రుడు; ఏ విధమునన్= ఏ విధంగా; ఓపినన్= శక్తి ఉంటే (ఆ విధంగా); యతి భావము దుఃఖంబు= యతి యొక్క హృదయంలోని దుఃఖాన్ని; వాపు పని= పోగొట్టే పనిని; సాదరచేతస్+వృత్తిన్= ఆదరంతో కూడిన మనస్సు ప్రవర్తనతో; పూని= యత్నపడి; చేయన్+కాన్+వలయును= చేయాలి; అది= అట్లా చేయటం; సుగతిన్= మంచిగతిని; ఒందించున్= పొందిస్తుంది.

**తాత్పర్యం:** శూద్రుడు శక్తి ఉన్న విధంగా యతి హృదయంలోని దుఃఖాన్ని పోగొట్టే పనిని ఆదరంగల బుద్ధితో చేయాలి. అది సుగతిని కలిగిస్తుంది.

## సర్వవర్ణ సామాన్యధర్మ నిరూపణ ప్రకారము (సం.13-152-1 (కుంభ))

**వ. అని చెప్పి సర్వజాతి సామాన్యంబులగు ధర్మంబు లెఱింగించు నాదరంబున నమ్మునివరుం డిట్లనియె. 296**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= తెలియజేసి; ఆ+మునివరుఁడు= ఆ మునిశ్రేష్ఠుడు (పరాశరుడు); సర్వజాతి సామాన్యంబులు= అన్ని జాతులకు సమానంగా ఉండేవి; అగు ధర్మంబులు= అయిన ధర్మాలు; ఎఱింగించు+ఆదరంబునన్= తెలిపే కుతూహలంతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్ = పలికాడు.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి, అన్ని జాతులవారికి సమానంగా ఉండే ధర్మాలు చెప్పాలనే వేడుకతో ఆ మునిశ్రేష్ఠుడు పరాశరు డిట్లా చెప్పాడు.

**సీ. పరధనంబుల కాసపడక యొడ్లను । దనయట్ల కాఁజూచుచు నఖిల వస్తు**
**వులుఁ దోఁచు నడఁగు వీచుల చందమున మెఱుం । గులభంగి నని కనుఁగొనుచు నెందు**

నాసక్తిలేక భూతాలిపై దయ కల్గి । నడచుట హితము తోనడచుఁ జేసి
నది మేల చేయుట చదురు కీ డవశతఁ । దొడరఁ బ్రాయశ్చిత్త దోహలమున

తే. వేగ తొలఁగించు టొప్పెడు వెరవ యెమ్ము । లేని జంతువుఁ జంపి త్రిస్నానములను
ద్వాదశ ప్రాణసంయమ నాదరమున । నొక్క యుపవాసమునఁ బాపయుక్తి వాయు. **297**

**ప్రతిపదార్థం:** పరధనములకున్= ఇతరుల సొమ్ములకు; ఆసపడక= ఆశపొందక; ఒడ్లను= ఇతరులను; తనఅట్లు+అ+కాన్= తనవలెనే; చూచుచున్= భావిస్తూ; అఖిలవస్తువులున్= సమస్తమైన వస్తువులూ; తోఁచు అడఁగు వీచుల చందమునన్= పైకి కనిపిస్తూ అడగిపోయే తరంగాల విధంగా; మెఱుంగులభంగిన్= మెరుపులలాగా; అని కనుఁగొనుచున్= పరికిస్తూ; ఎందున్= దేనిమీదా; ఆసక్తి= తగులుపాటు; లేక; భూత+ఆలిపైన్= ప్రాణుల సముదాయంమీద; దయ కల్గి= దయపెట్టుకొని; నడచుట= ప్రవర్తించటం; హితము= మేలు; తోన్= తనతోపాటు; నడచున్= వస్తుంది; చేసిన+అది= చేసే పని; మేలు+అ= ఇతరులకు శుభమైనదే; చేయుట= చేయటం; చదురు= సరియైనది; అవశతన్= తన వశం తప్పటంవలన; కీడు= తప్పు పని; తొడరన్= కలిగితే; ప్రాయశ్చిత్త దోహలమునన్= ప్రాయశ్చిత్తం మీది ఉత్సాహంతో; వేగ= వెనువెంటనే; తొలఁగించుట= పోగొట్టుకొనటం; ఒప్పెడు వెరవు+అ= ఒప్పునట్టి కార్యము; ఎమ్ములేని జంతువున్= ఎముకలేని జంతువును; చంపి= చంపిన కారణంగా; త్రిస్నానములను= మూడు స్నానాలచేత; ద్వాదశ ప్రాణ సంయమన+ఆదరమునన్= పండ్రెండు మార్లు ప్రాణాయామం చేసే ఆదరంచేత; ఒక్క ఉపవాసమునన్= ఒక రోజు భోజనం మానివేయటంచేత; పాపయుక్తి= పాపపు తగులును; పాయున్= తొలగించుకొంటాడు.

**తాత్పర్యం:** ఇతరుల సొమ్ముల కాసపడరాదు. ఇతరులను తనతో సమానంగా భావించాలి. కనపడే వస్తువులన్నీ వచ్చిపోయే తరంగాలవంటివి - అని భావించి వాటిపై మమకారం వదలాలి. ప్రాణులన్నిటిమీదా దయకలిగి ఉండాలి. చేసిన మేలే మనతో వస్తుంది. చేసే పని ఇతరులకు మేలైన దైతేనే చేయాలి. పొరపాటున చెడుపని చేస్తే వెనువెంటనే ప్రాయశ్చిత్తం చేసికొని తొలగించుకొనాలి. ఎముకలులేని జంతువును చంపితే మూడుస్నానాలూ, పండ్రెండు ప్రాణాయామాలూ, ఒక ఉపవాసమూ చేస్తే ఆ పాపం పోతుంది.

**విశేషం:** తరంగం, మెరుపు క్షణంలో పుట్టి క్షణంలో నశిస్తాయి. సృష్టిలో సర్వవుస్తువులూ అటువంటివే. కాబట్టి అనిత్యాలైన వాటిమీద ఆసక్తి తొలగించుకొని నిత్యమైన పరతత్త్వంమీద దృష్టి నిలపాలనే ఉపదేశం ఇక్కడ తోస్తుంది.

కీడు అవశతన్ తొడరన్ - దీనివలన బుద్ధిపూర్వకంగా చేసే పాపాలకు ప్రాయశ్చిత్తం లేదని చెప్పినట్లయింది. స్నానం బాహ్యశుద్ధినీ, ప్రాణాయామాలు నాడీమండలశుద్ధినీ, ఉపవాసం - అంతశ్శుద్ధినీ కలిగిస్తాయని భావం.

ఆ. అస్థి కలిగి హీనమగుజంతు వైనఁ ద । ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు
వునకు నలుమడించుకొనునది నరమాత్ర । హింస యష్టగుణ కృతీహఁ బాయు. **298**

**ప్రతిపదార్థం:** అస్థి= ఎముక; కలిగి= ఉండి; హీనము= తక్కువది; అగు జంతువు= అయిన జంతువు; ఐనన్= అయితే; తత్+ద్విగుణవృత్తి= దానికి రెట్టింపు పని; వలయున్= కావాలి; ప్రగుణజంతువునకున్= ఇంకా ఎక్కువ గుణంగల జంతువు విషయంలో; నలుమడించుకొనునది= నాలుగు రెట్లు చేసికొనాలి; నరమాత్రహింస= సాధారణ మానవుడి హింస; అష్టగుణ కృతి+ఈహన్= ఎనిమిదిరెట్ల ప్రాయశ్చిత్తపు పని యందలి కోరికతో; పాయున్= పోతుంది.

**తాత్పర్యం:** ఎముక ఉండిన తక్కువ జాతి జంతువును చంపితే ప్రాయశ్చిత్తం రెండు రెట్లు చేసికొనాలి. పెద్ద జంతువైతే నాలుగు రెట్లు, మానవమాత్రుడిని హింసిస్తే ఎనిమిది రెట్లు ప్రాయశ్చిత్తంతో ఆ పాపం పోతుంది.

**విశేషం:** ఎముకలేని జంతువు విషయం మొదటి పద్యంలో చెప్పారు. ఎముక ఉన్న జంతువును చంపితే దానికి ప్రాయశ్చిత్తం రెండు స్నానాలు, 24 ప్రాణాయామాలు, రెండు ఉపవాసాలు.

పెద్ద జంతువైతే నాలుగు స్నానాలు, నలభై ఎనిమిది ప్రాణాయామాలు, నాలుగు ఉపవాసాలు; మానవహింసచేస్తే ఎనిమిది స్నానాలు, తొంభై ఆరు ప్రాణాయామాలు, ఎనిమిది ఉపవాసాలు ప్రాయశ్చిత్తం.

అయితే ఇవన్నీ పొరపాటున జరిగిన పాపానికి మాత్రమే. బుద్ధిపూర్వకమైన హింసకు మహానరకయాతన అనుభవించవలసినదే.

**క. హీననరునట్లు గుఱ్ఱము । నేనుఁగును మనుష్యవధ మనేకాబ్దికభి**
**క్షానిరతి ప్రభృతి సుక । ర్మానుష్ఠానములఁ గాని యఱుగ దలఁతులన్. 299**

**ప్రతిపదార్థం:** గుఱ్ఱమును= గుఱ్ఱమూ; ఏనుఁగును= ఏనుగునూ; హీననరు+అట్లు+అ= సాధారణ మానవుడివలెనే; మనుష్య వధము= గొప్ప మనుష్యుడిని చంపటం, అనేక+అబ్దిక భిక్షా నిరతి ప్రభృతి సుకర్మ+అనుష్ఠానములన్= పెక్కు ఏండ్లకు సంబంధించిన, బిచ్చమెత్తుకొనుట మొదలైన మంచి పనులను చేయటంవలన; కాని; అలఁతులన్= తక్కువ వాటిచేత; అఱుగదు= నశించదు.

**తాత్పర్యం:** గుఱ్ఱాన్నీ ఏనుగునూ చంపిన పాపానికి ప్రాయశ్చిత్తం సాధారణ జనుడిని చంపిన దానికి వలెనే చేసికొనాలి. విశిష్టులైన మనుజులను చంపితే కలిగే పాపం ఎన్నో ఏండ్లు బిచ్చమెత్తటం మొదలైన సత్కర్మలవలననే కానీ తక్కువ రకపు ప్రాయశ్చిత్తాలతో పోదు.

**విశేషం:** ఆబ్దిక - అబ్ద సంబంధమైన, ఏండ్లకు సంబంధించిన అని భావం. బిచ్చమెత్తుకొని దేహాన్ని పోషించుకొనటం ఒక విధమైన ప్రాయశ్చిత్తం. బిచ్చమెత్తుకొనటమంటే మానాభిమానాలను సర్వదా సర్వథా వదలివేసికొనటమన్నమాట. అది మనిషి హృదయంలో గొప్ప సంస్కారాన్ని సమకూరుస్తుంది.

**తే. కల్లు ద్రావుట గురుతల్పగమన మధిక । పాతకము లివి ప్రాణముల్ వాయఁబెట్టి**
**చేయు ప్రతికారములఁ గాని చెడవు గోధ । రాద్యధిక దానములనైన నఱుగ వండ్రు. 300**

**ప్రతిపదార్థం:** కల్లు= మద్యము; త్రావుట= త్రాగటము; గురుతల్ప గమనము= గురువు భార్యను పొందటం; అధిక పాతకములు= మిక్కిలి దొడ్డ పాపాలు; ఇవి; ప్రాణముల్= ప్రాణాలను, పాయన్+పెట్టి= పోవటానికైనా సిద్ధంచేసి; చేయు ప్రతికారములన్= చేసే ప్రాయశ్చిత్తాలతో; కాని; చెడవు= నశింపవు; గో ధరా+ఆది+అధిక దానములన్+ఐనన్= గోవులను, భూమిని, ఇంకా గొప్ప వస్తువులను మొదలైన వాటిని దానంచేయటంవలన కూడా; అఱుగవు= నశింపవు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** మద్యపానమూ, గురుభార్యను కలియటం అనేవి మహాఘోరపాపాలు. ప్రాణాలైనా బలిపెట్టి చేసే ప్రాయశ్చిత్తాలతోగానీ అవి నశింపవు. గోదాన భూదానాదులతో కూడా అవి నశింపవంటారు.

**విశేషం:** మద్యపానంవలన మనిషిలో యుక్తాయుక్తవివేకజ్ఞానం అంతరిస్తుంది. దానివలన అతడు ఎంత పాడుపనిచేయటానికైనా సంకోచించడు. గురుపత్ని తల్లికంటె మన్నింపదగినది. ఆమెతో రమించటమంటే తల్లి భావనయే హృదయంనుండి తొలగించివేయటం. కనుక ఇవి మహాపాతకాలు. ప్రాయశ్చిత్తవిధిలో ప్రాణాలు పోయే స్థితి ఉన్నా సంకోచపడక చేసికొంటేనే ఈ పాపాలు పోతాయి. ఆ ప్రయత్నం లేకపోతే మానవత్వమే లేనివాడని భావం.

**క. ఇవి యెఱిఁగి యెపుడు పరలో । కవిభీతి మనంబునందుఁ గల్గి సకలభూ**
**తవిషయదయ నూనిన య । ట్టి వాఁడు కీడెల్లఁ బోనడిచి మేలొందున్. 301**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ విషయాలు; ఎఱిఁగి= తెలిసికొని; ఎపుడున్= సర్వకాలాలలో; పరలోక విభీతి= పరలోక సంబంధమైన పెనుభయం; మనంబునందున్= హృదయంలో; కల్గి= ఉంచుకొని; సకల భూత విషయ దయన్= అన్ని ప్రాణుల యెడలను దయను; ఊనిన అట్టివాఁడు= గట్టిగా పదిలపరచుకొన్నవాడు; కీడు+ఎల్లన్= పాపమంతటినీ; పోన్= పోవునట్లు; అడిచి= అణగగొట్టి; మేలు= శుభాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ విషయాలు తెలిసికొని, హృదయంలో పరలోక సంబంధమైన భయాన్ని నిలుపుకొని, ఎల్లవేళలా అన్ని ప్రాణుల యెడల దయ కలిగి ఉండేవాడు పాపాల నన్నింటినీ పోగొట్టుకొని శుభం పొందుతాడు.

**విశేషం:** పరలోకం ప్రత్యక్షం కాదు కనుక చాలామందికి అది లేదని వెర్రి భావన. కాని కొంచెం ఆలోచిస్తే ఇందులోని భ్రమ తొలగి పోతుంది. భవిష్యత్తు అంతా అప్రత్యక్షమే కదా! కాని దానికొరకు లక్షలు, కోట్లు సంపాదిస్తాడు మానవుడు. అట్లాగే ప్రత్యక్షం కాకపోయినా పుణ్యఫలాలను, పాపఫలాలను అనుభవించవలసిన పరలోకం ఉందని నమ్మినవాడు. 'వి' భీతితో ఉంటాడు. ఇది విశేషభయం. ఎందుకంటే ఫలితం ప్రతీకారం లేనిదై ఉంటుంది. కనుక ముందే జాగ్రత్త పడాలి అని 'వి' అనే ఉపసర్గ ఉపదేశిస్తుంది.

"సకల భూత......'' పాపాలన్నీ స్వార్థం కారణంగా ఏర్పడతాయి. భూతదయ స్వార్థాన్ని రూపుమాపుతుంది. కనుక అది పాపాలు చేయకుండా ఉండటానికి గొప్ప సాధనం.

'ఎపుడు' - జీవితకాలమంతా పుణ్యం చేసినా ఒక్క క్షణంలో చేసిన పాపం కుండెడు పాలలో చిన్న విషపు బొట్టువలె సర్వనాశనం చేస్తుంది. కనుక 'చిన్న' పాపమే కదా! క్షణకాలమే కదా!' అనే ఊరట పాపం విషయంలో పనికిరాదని హెచ్చరిక.

**క. ఈ నెఱిఁ గైకొని శూద్రుం । డైనను గ్రమవృత్తి నవ్యయంబగు పదముం**
**గానం బడయుట గల్గును । వానికి నియమముల త్రోవ వలవక యునికిన్. 302**

**ప్రతిపదార్థం:** వానికిన్= అతడికి; నియమముల త్రోవ= నియమాల మార్గం; వలవక ఉనికిన్= ఏర్పడని కారణంగా; ఈ నెఱిన్= ఈ ధర్మసూక్ష్మాన్ని; కైకొని= చేపట్టి; శూద్రుండు+ఐనన్= శూద్రుడైనా; క్రమవృత్తిన్= క్రమప్రవర్తనతో; అవ్యయంబు= నాశనము కానిది; అగు= అయిన; పదమున్= స్థానాన్ని; కానన్+పడయుట= పొందగలుగుట; కల్గును= కలుగుతుంది.

**తాత్పర్యం:** శూద్రుడికి అతి కఠోరమైన నియమనిష్ఠలు విధించని కారణంగా ఈ చెప్పిన ధర్మసూక్ష్మాన్ని అతడు ఆచరించి, క్రమపద్ధతిలో శాశ్వతమైన పదాన్ని పొందే అవకాశం ఉంది.

**విశేషం:** పూర్వం చెప్పిన ధర్మాలను జాగ్రత్తగా పాటించిన శూద్రుడు క్రమంగా పై వర్ణాలలో పుట్టి తుదకు పరమపదాన్ని

పొందగలుగుతాడని పద్యభావం. అంటే పై వర్ణాలవారు ఎంతో ప్రయాసతో అధిక నియమనిష్ఠలతో పొందే మహాప్రయోజనాన్ని శూద్రుడు ఈ ఆచార్యనిష్ఠచేత పొందగలుగుతాడని అభిప్రాయం.

**వ. అని నిర్దేశించి యరిష్టంబు లెఱిఁగింప ననుకంప పుట్టుటయు. 303**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; నిర్దేశించి= చక్కగా తెలియజేసి; అరిష్టంబులు= కీడులు; ఎఱిఁగింపన్= తెలుపటానికి; అనుకంప= దయ; పుట్టుటయున్= కలుగగా.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి, ఆ పరాశరుడు కీడులను గూర్చి చెప్పాలని దయపుట్టి (ఇట్లా చెప్పాడు)

**విశేషం:** అరిష్టాలంటే ఇక్కడ రాబోయే అశుభాలను సూచించే శకునాలవంటివి.

**సీ. పురుషు హిరణ్మయు నరుఁడెవ్వఁ డుత్తర । మునఁ గాంచు దక్షిణముఖత నుండ**
**నతనికి వర్షత్రయమున మృత్యువు వచ్చు; । రవి మండలంబు నిష్ప్రభము గాఁగఁ**
**గనిన రెండేఁడులఁ; గౌముదిఁ దననీడఁ । దూఁటు చూచిన నొక్క యేఁట; నది వి**
**మౌళియై యున్న షణ్మాసమాత్రంబునఁ; । గర్ణముల్ గరములఁ గదియ మూసి**

**ఆ. కొనిన యపుడు ఘ్రోత వినకున్న నెలనాళ్ళఁ; । గర్ణములును నాసికయును బట్టు**
**కదల వికృత వర్ణకత పండ్లఁ గన్నులఁ । గలుగ నాఁడ మరణ మొలయునండ్రు. 304**

**ప్రతిపదార్థం:** నరుఁడు= మనిషి; ఎవ్వఁడు= ఎవడు; హిరణ్మయున్= బంగారం రూపంగల; పురుషున్= పురుషుని; దక్షిణముఖతన్= దక్షిణమువైపు మొగం ఉంచినవాడై; ఉండన్= ఉండగా; ఉత్తరమునన్= ఉత్తరదిక్కున; కాంచున్= చూస్తాడో; అతనికిన్= అట్టి మనిషికి; వర్షత్రయమునన్= మూడేండ్లలో; మృత్యువు= చావు; వచ్చున్= వస్తుంది; రవిమండలంబు= సూర్యబింబం; నిష్ప్రభము కాఁగన్= వన్నెలేనిదై యుండగా; కనినన్= చూస్తే; రేండేఁడులన్= రెండు సంవత్సరాలలో( మృత్యువు వస్తుంది); కౌముదిన్= వెన్నెలలో; తననీడన్= తన నీడలో; తూఁటు= రంధ్రాన్ని; చూచినన్= చూస్తే; ఒక్క+ఏఁటన్= ఒక్క సంవత్సర కాలంలో (మృత్యువు వస్తుంది); అది= తననీడ; విమౌళి+ఐ ఉన్నన్= తలలేనిదై ఉంటే; షట్+మాస మాత్రంబునన్= ఆరు నెలల కాలంలోనే (మృత్యువు వస్తుంది); కర్ణముల్= చెవులు; కరములన్= చేతులతో; కదియన్= బిగించినట్లు; మూసికొనిన+అపుడు= మూసుకొన్నప్పుడు; ఘ్రోఁత= ఒక విధమైన నాదం; వినక+ఉన్నన్= వినకుంటే; నెలనాళ్ళన్= నెలరోజులలో (మృత్యువు వస్తుంది); కర్ణములును= చెవులునూ; నాసికయును= ముక్కున్నూ; పట్టు= బిగింపు, కదలన్= కదిలితే; పండ్లన్= దంతాలలో; కన్నులన్= కన్నులలో; వికృత వర్ణకత= వికారపు రంగు కలగటం; కలుగన్= ఏర్పడితే; నాఁడు+అ= ఆ రోజుననే; మరణము= చావు; ఒలయును= కలుగును; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** నరుడు హిరణ్మయపురుషుడు దక్షిణంవైపు మొగం పెట్టి ఉత్తరందిక్కున ఉండటం చూస్తే మూడేండ్లలో మరణిస్తాడు. సూర్యబింబం కాంతి తప్పి ఉండటం చూస్తే రెండేళ్ళలో మృతి పొందుతాడు. వెన్నెలలో తన నీడలో రంధ్రాన్ని చూస్తే ఒక సంవత్సరకాలంలో ఆయువు తీరినవాడవుతాడు. తననీడ తలలేనిదై కనపడితే ఆరు నెలలలో వెళ్ళిపోతాడు. చెవులను చేతులతో గట్టిగా మూసుకొన్నప్పుడు నాదం వినకపోతే నెలనాళ్ళలో చావు పొందుతాడు. చెవులు, ముక్కు పట్టు సడలి, పండ్లలో, కన్నులలో వికారపు వర్ణం కానవస్తే ఆ రోజే మరణిస్తాడు అంటారు.

**విశేషం:** హిరణ్మయపురుషుడంటే సూర్యబింబంలో ఉండే శ్రీమన్నారాయణుడు. సూర్యుడు ఉత్తరాన ఉదయించటం అనర్థదాయకం కదా!

**వ. అట్లు వర్తిల్లు నరిష్టంబులం దెయ్యవి దోఁచినం గలంకం బొరయని యంతరంగంబుతోడఁ దృష్ణాకలితంబైన సంసారంబునందలి వ్యాసంగంబు వదలి హృదయం బేకాగ్రంబు గావించి మునీంద్ర నిర్దిష్ట నిర్మలధ్యాన కర్మంబులం దగిలి యుండె నేనిం గాలాంతకప్రసాదంబు పడయుం దెలివికొఱంతం గాలగోచరత్వంబు నొంది వైశ్య రాజన్య విప్రకులంబులం దత్తద్విధ సంపత్సమృద్ధంబులుఁ బ్రబుద్ధంబులు నగు వంశంబులం గ్రమంబున జనించి. 305**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; వర్తిల్లు+అరిష్టంబులందున్= ప్రవర్తించే అరిష్టాలలో; ఏని+అవి= ఏవి; తోఁచినన్= కన పడినా; కలంకన్= కలత; పొరయని అంతరంగంబుతోడన్= పొందని హృదయంతో; తృష్ణాకలితంబు= ఆశలతో కూడినది; ఐన= అయినట్టి; సంసారంబునందలి వ్యాసంగంబు= సంసారంలోని తగులాన్ని; వదలి= విడిచి; హృదయంబు= మనస్సును; ఏక+అగ్రంబు= చెదరని దానిని; కావించి= చేసి; ముని+ఇంద్ర నిర్దిష్ట నిర్మల ధ్యాస కర్మంబులన్= మునిశ్రేష్ఠులు తెలియజెప్పిన మచ్చలేని ధ్యానపు కార్యములలో; తగిలి ఉండెన్+ఏనిన్= ఆసక్తుడై ఉంటే; కాల+అంతక ప్రసాదంబు= కాలాన్ని అంతంచేసే దైవంయొక్క అనుగ్రహాన్ని; పడయున్= పొందుతాడు; తెలివి కొఱంతన్= తెలివితక్కువచేత; కాల గోచరత్వంబున్= కాలుడికి కనపడటం (మరణించటం); ఒంది= పొంది; వైశ్య, రాజన్య విప్రకులంబులన్= కోమటుల, క్షత్రియుల, విప్రుల కులాలలో; తత్+తత్+విధ సంపత్+ సమృద్ధంబులున్= ఆయా విధాల సంపదలతో నిండుతనం కలవీ; ప్రబుద్ధంబులున్= జ్ఞానసంపద కలవీ; అగు వంశంబులన్= అయిన వంశాలలో; క్రమంబునన్= వరుసగా; జనించి= పుట్టి.

**తాత్పర్యం:** ఆ విధంగా ఉండే అరిష్టాలలో ఏవి తోచినా మనుజుడు కలత పొందని హృదయంతో ఆశల దాహం కలదైన సంసారంమీది లంపటాన్ని వదలివైచి మనస్సును కుదుటపరచుకొని మునివర్యులు చెప్పిన నిర్మలధ్యాన కార్యాలలో ఆసక్తి కలిగి ఉంటే కాలరూప పరమాత్ముడి అనుగ్రహం పొందుతాడు. ఒకవేళ దానికి వలసిన తెలివి చాలకపోతే మరణించి వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ కులాలలో ఆయా విధాల సంపదల నిండుతనమూ, జ్ఞానసంపదా కల వంశాలలో క్రమంగా పుట్టి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అంతకాలంలో చేసిన ధ్యానఫలంగా ఉత్తమవంశాలలో ఉన్నత సంపదలు కలచోట జన్మిస్తాడు. **"శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోఽభిజాయతే"** అనే భగద్వాక్యాన్ని ఇక్కడ సమన్వయం చేసికొనాలి.

**క. అయ్యై కర్మంబుల దెస । నెయ్యం బెసలారఁ గలిగి నియమ నిరూఢుం**
**డియ్యన యన సుకృతంబుల । నయ్యెడు సౌఖ్యంబు నిహమునందుఁ బరమునన్. 306**

**ప్రతిపదార్థం:** ఈ+అన= ఈతడు; ఆ+ఆ+కర్మంబుల దెసన్= ఆయా పనులయెడ; నెయ్యంబు= ప్రేమ; ఎసలారన్= అతిశయించగా; కలిగి= ఏర్పడి; నియమ నిరూఢుండు= నియమములతో చెక్కు చెదరనివాడు; అనన్= అనునట్లుగా; సుకృతంబులన్= పుణ్యములతో; అయ్యెడు సౌఖ్యంబున్= అయ్యే సుఖాన్ని; ఇహమునందున్= ఈ జన్మలోను; పరమునన్= పరంలోను.

**తాత్పర్యం:** ఆయా కార్యవిశేషాలలో ప్రేమ అతిశయించగా ఏర్పడి అతడు నియమాలయందు దృఢమైన ఆదరం కలవాడన్న ప్రతిష్ఠ పొంది, పుణ్యకార్యాలవలన ఏర్పడే సుఖాన్ని ఇహపరలోకాలలో (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అనుభవించుచు గమనంబు నాగమనము । నాచరించుచు బ్రహ్మసభాంతమైన**
**పుణ్యలోక నికాయంబుఁ బొంది యెల్ల । నెఱిఁగి యూహించి యిట్లని యెడఁ దలంచు. 307**

**ప్రతిపదార్థం:** అనుభవించుచున్= అనుభవిస్తూ; గమనంబున్= పోవటమూ; ఆగమనమున్= రావటము; ఆచరించుచున్= చేస్తూ; బ్రహ్మసభా+అంతము= బ్రహ్మయొక్క సభ తుదిగా; ఐన= అయిన; పుణ్యలోక నికాయంబున్= పుణ్యలోకాల సముదాయాన్ని; పొంది= చేరుకొని; ఎల్లన్= అంతటినీ; ఎఱిఁగి= తెలిసికొని; ఊహించి= భావించి; ఇట్లు+అని= ఈ విధంగా; ఎడన్= హృదయంలో; తలంచున్= భావిస్తాడు.

**తాత్పర్యం:** (ఇహపరసుఖాలను) అనుభవిస్తూ బ్రహ్మసభ చివరగా ఉన్న పుణ్యలోకాల కన్నింటికీ రాకపోకలు గావిస్తూ నిండైన జ్ఞానం పొంది తన భావనతో ఈ విధంగా హృదయంలో తలపోస్తాడు.

**క. 'ఇవి యెల్ల నశాశ్వతములు । భవమరణాకలితములును; బటుసంసారో**
**ద్భవదుఃఖయుక్తములు; సుఖ । లవయుతములు వీని యందు లౌల్యంబేలా?' 308**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ లోకాలు; ఎల్లన్= అన్నీ; అశాశ్వతములు= నిత్యములు కానివి; భవ మరణ+ఆకలితములును= పుట్టుక; చావులతో కూడినవి; పటు సంసార+ఉద్భవ దుఃఖ యుక్తములు= గట్టిదైన అజ్ఞానంవలన పుట్టిన దుఃఖంతో కూడినవి; సుఖ లవ యుతములు= సుఖంయొక్క లేశంతో కూడినవి; వీనియందున్= ఇట్టి వీటిమీద; లౌల్యంబు= ఆశ; ఏలా?= ఎందుకు?

**తాత్పర్యం:** 'ఇవన్నీ ఎప్పటికైనా నశించేవి. పుట్టుక చావు అనే వాటితో కూడినవి. గట్టిదైన అజ్ఞానంతో ఏర్పడే దుఃఖాన్ని అంటిపెట్టుకొని ఉండేవి. కొంచెపాటి సుఖం మాత్రం కలవి. వీటిమీద మమకారం ఎందుకు?'

**విశేషం:** ఇక్కడ నాలుగు దోషాలను పేర్కొన్నారు. 1. అనిత్యత; 2.చావుపుట్టుకలుండటం; 3.దుఃఖ బహుళత; 4. సుఖస్వల్పత్వం. వివేకం కలవాడు ఈ దోషాలలో ఏ ఒక్కటి ఉన్నా అపేక్షించడు. అన్నీ కలిసి ఉంటే ఇక చెప్పనేల?

**"ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున"** అని భగవద్వాక్యం. 'అర్జునా! బ్రహ్మలోకం వరకు సర్వలోకాలు మరల తిరిగి రావలసినవే' దీనిని ఇక్కడ అనుసంధించికొనాలి. వివేకధనుడు అపేక్షించేది పునరావృత్తిరహిత శాశ్వత ఆనందైకధామం.

**వ. అని తలంచి యపునర్భవకారియు ననధికంబును నచలంబును నగు ధర్మంబు కోరుచుండు నకృతకర్మఫలంబు నొందను గృతకర్మ ఫలంబు తొలఁగను నెవ్వరికి వశంబు కామి ధ్రువం బగుటం జేసి కృతకర్మవిశేషంబున నతండు వాసవాది వరిష్ఠసహవాసంబున వర్తించి. 309**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; తలంచి= భావించి; అపునర్+భవ కారియున్= తిరిగి పుట్టటం కలిగించనిదిన్నీ; అనధికంబును= తనకంటె మిన్న అయినది లేనిదీ; అచలంబును= ఊగిసలాట లేనిదియు; అగు= అయిన; ధర్మంబు= ధర్మాన్నీ; కోరుచుండున్= కోరుతూ ఉంటాడు; అకృత కర్మఫలంబున్= చేయని పని ఫలాన్ని; ఒందను= పొందటానికీ; కృతకర్మఫలంబు= చేసిన పనుల

ఫలాన్ని; తొఱంగను= వదలటానికీ; ఎవ్వరికిన్= ఎట్టివారికినీ; వశంబు కామి= సాధ్యం కాకపోవటం; ధ్రువంబు= నిశ్చయం; అగుటన్+చేసి= కావటంవలన; కృతకర్మ విశేషంబునన్= చేసిన పుణ్యకర్మలవలన; అతండు= అట్టి జనుడు; వాసవ+ఆది వరిష్ఠ సహవాసంబునన్= దేవేంద్రుడు మొదలైన మహాత్ములతో కలిసి ఉండటంతో; వర్తించి= మెలగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఇట్లు తలపోసి మరల పుట్టుక కలిగించునదీ, తన కంటె మిన్న అయినది లేనిదీ, మిక్కిలి స్థిరమైనదీ అయిన ధర్మాన్ని కోరుతూ ఉంటాడు. చేయని పనికి ఫలం పొందటంగానీ, చేసిన కర్మఫలం పొందకపోవటానికి గానీ ఎవరికీ సాధ్యం కాదనేది నిశ్చయం కనుక, చేసిన పుణ్యకర్మంవలన అతడు దేవేంద్రుడు మొదలైన మహాత్ముల సహవాసంతో కొంతకాలం ఉంటాడు.

**తే. పుణ్యఫలకాలమున యంతమున నితాంత । సంప్రబుద్ధ జనంబు వంశమునఁ బుట్టి**

**బ్రహ్మసంస్కారముల నెల్లఁ బడసి యతిథి । దేవ పితృకోటులకుఁ బరితృప్తి చేసి. 310**

**ప్రతిపదార్థం:** పుణ్యఫలకాలమున అంతమునన్= పుణ్యముల ఫలం అనుభవించే కాలం చివర; నితాంత సంప్రబుద్ధ జనంబు వంశమునన్= చాలా అధికమైన జ్ఞానం గల జనాల వంశంలో; పుట్టి= జన్మించి; బ్రహ్మ సంస్కారములన్= బ్రాహ్మణ సంస్కారములను; ఎల్లన్= అన్నింటినీ; పడసి= పొంది; అతిథి దేవ పితృ కోటులకున్= అతిథులు, దేవతలు, పితృదేవతలు అను వారి సముదాయములకు; పరితృప్తిచేసి= మిక్కిలి తృప్తి గావించి.

**తాత్పర్యం:** పుణ్యఫలం ముగిసే సమయంలో గొప్ప జ్ఞానసంపద గలవారి వంశంలో పుట్టి, బ్రహ్మవేత్తలు పొందే సంస్కారాలన్నీ పొంది, అతిథులకు, దేవతలకు, పితృదేవతలకు మిక్కిలి తృప్తి కలిగించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇందులో విప్రుడు ఆచరించవలసిన పంచమహాయజ్ఞాలను సూచించారు. 'బ్రహ్మసంస్కారములు' అనటంవలన (1)బ్రహ్మయజ్ఞం (2) భూతయజ్ఞం అనేవి; అతిథి తృప్తివలన (3) మనుష్య యజ్ఞం దేవతల తృప్తివలన (4) దేవయజ్ఞం, పితృతృప్తివలన; (5) పితృయజ్ఞం అనేవి సిద్ధిస్తున్నాయి. భారతీయులు తల్లి గర్భంలో బీజం పడకముందు నుండి శరీరం బూడిదయ్యేవరకు చేసుకొనే సంస్కారాలు అనేకం ఉన్నాయి. గర్భాదానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ నామకరణము, చూడాకర్మ, కేశఖండనము, ఉపనయనము, వివాహము మొదలైనవి.

**తే. భార్య పుత్రు లాదిగఁ గల పాశసంచ । యంబు నిరసించి యతిధర్మ మాచరించి**

**యిలు వెడలి గురుశుశ్రూష నలఘు సాంఖ్య । యోగ శాస్త్ర రహస్యైకయోగ మొంది. 311**

**ప్రతిపదార్థం:** భార్య= పెండ్లము; పుత్రులు= సంతానం; ఆదిగన్= మొదలుగా; కల= ఉన్న; పాశసంచయంబు= పాశాల సముదాయాన్ని; నిరసించి= త్రోసివేసి; యతి ధర్మము= సన్న్యాసి ధర్మాన్ని; ఆచరించి= చక్కగా నిర్వహించి; ఇలు= ఇంటినుండి; వెడలి= బయటకు వచ్చి; గురు శుశ్రూషన్= గురువుల సేవతో; అలఘు సాంఖ్య యోగ శాస్త్ర రహస్య+ఏక యోగము= గొప్పవైన సాంఖ్యము, యోగము అనే శాస్త్రాల గుట్టులను ఒక్కటిగా కలిపి అనుభవించటాన్ని; ఒంది= సాధించి.

**తాత్పర్యం:** భార్యాపుత్రులు మొదలైన బంధాల నన్నింటిని తెగగోసి వేసికొని, సన్న్యాసి ధర్మాన్ని చక్కగా పాటించి, ఇంటినుండి బయటపడి, గురువుల సేవతో గొప్పవైన సాంఖ్యయోగశాస్త్రాల రహస్యాలను ఒక్కటిగా చేసికొని అనుభవించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** భార్య మొదలైనవారు పాశాలు - కట్టి పడవేసే త్రాళ్ళవంటివారు. ఎందుకంటే వారి రక్షణ, పోషణ భారంతోనే కాలమంతా గడచిపోతుంది. ఆ పనులతోనే పుణ్యపాపాల బంధాలు పెరిగిపోతాయి. పరమార్థచింతనకు అవకాశం ఉండదు.

యతిధర్మం - సంగం త్యజించటం. సమ్+న్యాసం= చక్కగా తీసి అవతల ఉంచటం. దేనిని అంటే సంగాన్ని. అదే సర్వానర్థ మూలకారణం. 'సతిన్యాసః' అని కూడా మరొక అర్థం చెప్పుతాను. సత్స్వరూపుడైన భగవంతుడియందు అన్నింటినీ - తను, మనో, ధన, ప్రాణాదులను చక్కగా అర్పణ చేయటం అని దానికర్థం.

శుశ్రూష - శ్రవణం మీది ఇచ్ఛ. పరమార్థం వినాలనే కోరిక - క్రమంగా ఆ కోరికతో చేసేసేవ శుశ్రూష అయింది.

సాంఖ్యం - సంఖ్యా సంబంధమైనది. తత్త్వాలలెక్క అని స్థూలంగా అర్థం. పంచభూతాలు, పంచ ఇంద్రియాలు, పంచ తన్మాత్రలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారం అనే ఇరవైనాలుగు తత్త్వాల చక్కని జ్ఞానం సాంఖ్యం.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనే ఎనిమిది అంగాలతో కూడిన చిత్తవృత్తి నిరోధరూపమైన విద్య యోగం.

ఈ రెంటి సమన్వయం ఏకయోగం - దీనివలన నరుడు జననమరణరూప సంసారచక్రం నుండి ముక్తి పొందుతాడు. ఇది భారతీయుల తత్త్వవిద్య. అయితే ఈ సాధన శరీరం రాలిపోయేవరకు సాగాలి.

**సీ.** **పుణ్యంబులైన యరణ్యంబులను శూన్య । గృహముల దేవతాగృహములందు**
**గుహలను నిలుచుచుఁ గుడుపు భిక్ష నొనర్చి । యొకచోట మరగక యొల్లమియును**
**వలపును నెడలి నిర్ద్వంద్వత పాటించి । మమత యహంకృతి మాని నిత్య**
**తృప్తాత్ముఁడును జనాధీనత్వరహితుండు ।నై గమ్యదిశ యొక్కఁ డనఁగ లేక**

**ఆ.** **మెలఁగుచుండి పక్వఫలము తొడిమఁ బాయు । పగిది గుణచయంబుఁ బాసి యక్ష**
**యంబు నచలమును నిరామయంబును నగు । పదముఁ జెందు శుద్ధభావ మెసఁగ.** **312**

**ప్రతిపదార్థం:** పుణ్యంబులు= పవిత్రములు; ఐన= అయినట్టి; అరణ్యంబులను= అడవులయందు; శూన్య గృహములన్= జనాలు లేని పాడుబడ్డ కొంపలందు; దేవతాగృహములందున్= దేవాలయాలయందు; గుహలను= కొండగుహలలోను; నిలుచుచున్= ఉంటూ; కుడుపు= తిండిని; భిక్షన్= బిచ్చంతో; ఒనర్చి= చేసి; ఒక చోటన్= ఒక తావున; మరగక= అలవాటు పడక; ఒల్లమియును= ఇష్టపడకపోవటాన్ని; వలపును= ఇష్టపడటాన్ని; ఎడలి= వదలివేసి; నిర్ద్వంద్వత= ఇష్టానిష్టాలు, రాగద్వేషాలు మొదలైన జంటలు లేనితనాన్ని; పాటించి= ఆచరించి; మమత= మమకారాన్ని (వస్తువులు మొదలగువాటియందు నాది అనే భావాన్ని); అహంకృతి= అహంకారాన్ని (నేను - అనే భావాన్నీ); మాని= వదలి; నిత్య తృప్త+ఆత్ముఁడును= ఎల్లవేళల తృప్తి

పొందిన హృదయం కలవాడును; జన+అధీనత్వ రహితుండును=జనులకు వశం కావటంలేనివాడును; ఐ= అయి; గమ్యదిశ= వెళ్ళదగిన దిక్కు; ఒక్కఁడు= ఇది; అనఁగన్= అనటానికి; లేక= లేకుండా; మెలఁగుచుండి= తిరుగుతూ; పక్వఫలము= బాగా పండిన పండు; తొడిమన్= తొడిమను; పాయు పగిదిన్= వదలి రాలిపోయే విధంగా; గుణచయంబున్= గుణముల సముదాయాన్ని; పాసి= వదలి; అక్షయంబున్= నాశనంకానిదీ; అచలమును= కదలికలేనిదీ; నిరామయంబును= ఏ రోగమూ లేనిదీ; అగు= అయిన; పదమున్= స్థానాన్ని; శుద్ధభావము= నిర్మలత్వం; ఎసఁగన్= అతిశయింపగా; చెందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పవిత్రాలైన అడవులలో, జనాలులేని ఇండ్లలో, దేవాలయాలలో, కొండ గుహలలో ఉంటూ భిక్షమెత్తిన తిండి తింటూ ఒకచోటికి అలవాటుపడక రాగద్వేషాలు వదలివేసి ద్వంద్వాలను తొలగించుకొని, అహంకార మమకారాలను రూపుమాపి, నిత్యతృప్తిగల హృదయంతో జనులకు వశంకాని స్థితితో ఒక గమ్యం అనేది లేకుండా తిరుగుతూ బాగా పండిన పండు తొడిమనుండి రాలిపోయిన విధంగా సత్త్వరజస్తమోగుణాల నెలవైన దేహాన్ని వదలివేసి, శుద్ధభావంతో నాశనంకానిదీ, స్థిరమైనదీ, ఏ తెగులూ లేనిదీ అయిన శాశ్వతపదాన్ని పొందుతాడు.

**విశేషం:** సన్న్యాసి ధర్మాన్ని ఇందులో వివరించి చెప్పారు. నెలవుమీద, తిండిమీద, మనోభావాలమీద ఏ విధమైన ప్రవృత్తి ఉండాలో వివరించారు. 'ఒకచోట మరగక' - ఒక స్థానాన్ని ఎన్నుకుంటే ఒక సంసారం ప్రారంభమవుతుంది. గమ్యం కూడదు. ఇది గమ్యం అనుకొంటే ఏదో ఫలాభిలాష ఉంటుందన్న మాట. 'గుణచయంబున్ పాసి'' గుణాతీత స్థితిని పొంది, గుణాలు బంధకారణాలు. కాబట్టి వాటికి లోబడకుంటేనే ముక్తి. అక్షయశబ్దాన్ని సత్తుకు 'అచల' శబ్దాన్ని చిత్తుకూ, నిరామయశబ్దాన్ని ఆనందానికీ సూచకాలుగా భావించి సచ్చిదానందాత్మక శాశ్వత పదం పొందుతాడనే అర్థాన్ని ఇక్కడ గ్రహించాలి. అది పరమాత్మ సాయుజ్యరూపమైనది.

**వ. అని చెప్పి. 313**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; చెప్పి= బోధించి.

**తాత్పర్యం:** అని బోధించి (తరువాతి పద్యంతో అన్వయం)

**క. భిక్షుకుఁ డిమ్మెయి నీడముఁ । బక్షి విడుచునట్లు మాయఁబాసి యభేద్యం**
**బక్షర మను తత్త్వంబును । సాక్షాత్కృతిఁ గూర్చి నిలుచు శాశ్వత పదవిన్. 314**

**ప్రతిపదార్థం:** భిక్షుకుఁడు= సన్న్యాసి; ఈ+మెయిన్= ఈ విధంగా; పక్షి; నీడమున్= గూడును; విడుచు+అట్లు= విడిచే విధంగా; మాయన్= మాయను; పాసి= వదలి; అభేద్యంబు= భేదింపరానిది; అక్షరము= నాశనము కానిదను అర్థముగల అక్షరము; అను= అనే; తత్త్వంబును= తత్త్వాన్ని; సాక్షాత్కృతిన్= ప్రత్యక్షం కావటాన్ని; కూర్చి= ఏర్పరచుకొని; శాశ్వతపదవిన్= నిత్యమైన స్థానంలో; నిలుచున్= ఉంటాడు.

**తాత్పర్యం:** సన్న్యాసి ఈ విధంగా గూడు వదలిన పక్షివలె మాయను వదలివైచి, భేదింపరాని అక్షరం అనే తత్త్వాన్ని ప్రత్యక్షం చేసికొని, శాశ్వతపదవిలో నిలుస్తాడు.

**విశేషం:** మాయ - ప్రకృతి అనే తత్త్వాన్ని మాయ అని వ్యవహరిస్తారు. అక్షరము అను తత్త్వంబును - పరమాత్మతో అభిన్నంగా అయిన స్థితిని. దీనినే ముక్తి అంటారు.

**వ. అమ్మహానుభావుండు సంసార సాగరంబు గడచుటయ కాదాశ్రితులనుం గడపం జాలియుండు. 315**

**ప్రతిపదార్థం:** ఆ+మహానుభావుండు= అట్టి గొప్ప అనుభావంకల వ్యక్తి; సంసారసాగరంబు = సంసారమనే మహాసముద్రాన్ని; కడచుట+అ= దాటడమే; కాదు; ఆశ్రితులనున్= తన్ను చేరినవారిని; కడపన్= దాటించుటకు; చాలి ఉండున్= సమర్థుడై ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ మహాత్ముడు సంసారసముద్రాన్ని దాటటమే కాదు, తన్నాశ్రయించిన వారిని కూడా దాటించగలుగుతాడు.

**విశేషం:** సంసారము - జననమరణ రూపమైన తిరుగుడు వ్యవహారం. ఇది మహా దుస్తరం కనుక సముద్రంతో పోలుస్తారు. "స్వయం తీర్త్వా పరాంస్తారయతి" అని శాస్త్రవాక్యం. తాను దాటి ఇతరులను దాటిస్తాడు - దీనిని ఇక్కడ సమన్వయించుకోవాలి. నిజానికి సంసారసాగరం నుండి దాటింపజేయగలవాడు పరమాత్మ ఒక్కడే. మళ్ళీ ఆ సామర్థ్యం సంపూర్ణ జ్ఞానసంపదగల గురువునకు మాత్రమే ఉంటుంది. "గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః" గురుః సాక్షాత్ పర బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః" అని భారతీయులు విశ్వసించి గురుని స్తుతిస్తారు.

**ఉ. కావున భిక్షుఁ జెంది ప్రియకారిత శూద్రుఁడు గొల్చునేని సం**
**భావితుఁ డైన యాతని కృపారసమాని తదీయ సంగ వి**
**ద్రావిత కల్మషుండయి చిరక్రమవృత్తిత నూయి గ్రొచ్చి నీ**
**ర్వావిరి గన్నయట్టులు శివంబగు తత్త్వము గాంచు నెమ్మెయిన్. 316**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; శూద్రుఁడు= నాలుగవజాతివాడు; ప్రియకారితన్= ప్రియములు చేసే ప్రవృత్తితో; భిక్షున్= సన్న్యాసిని; చెంది= ఆశ్రయించి; కొల్చున్+ఏని= సేవిస్తే; సంభావితుఁడు= మన్నింపబడినవాడు; ఐన= అయిన; ఆతని= ఆ సన్న్యాసియొక్క; కృపారసము=దయ అనే రసాన్ని; ఆని= పుచ్చుకొని; తదీయ సంగ విద్రావిత కల్మషుండు= అతనిదైన సంబంధంచేత దూరంగా తరిమివేయబడిన పాపాలు కలవాడు; అయి= అయి; చిరక్రమ వృత్తితన్= బహుకాలం క్రమమైన ప్రవర్తనతో; నూయి= బావి; గ్రొచ్చి= త్రవ్వి; నీర్= నీటిని; వావిరి= సమృద్ధిగా; కన్న+అట్టులు= పొందే విధంగా; ఏ+మెయిన్= ఎట్లాగైనా (తప్పక); శివంబు= మంగళప్రదము; అగు= అయిన; తత్త్వమున్= తత్త్వమును; కాంచున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కనుక శూద్రుడు ప్రియములుచేస్తూ సన్న్యాసిని సేవిస్తే గొప్ప మన్ననగల అతని దయారసం ఆస్వాదించి అతడి సంగంవలన పాపాలన్నీ పటాపంచలు కాగా ఎంతో కాలం కష్టపడి నూయి త్రవ్వి నీరు సమృద్ధిగా పొందిన విధంగా శివతత్త్వాన్ని (శాశ్వతపదవిని) పొందుతాడు.

**విశేషం:** ఇది పరమసులభమైన మార్గం. సన్న్యాసి అష్టకష్టాలు పడి పొందిన మహాఫలాన్ని శూద్రుడు తత్సేవవలన పొందుతున్నాడు. శివంబగు తత్త్వము - అక్షయశాశ్వతమోక్ష సామ్రాజ్యం. చిరక్రమవృత్తితన్ - క్రమంగా వైశ్యాది జన్మలు అనే సోపానాలను విజయవంతంగా కడచి - అని భావం.

**తే. అఖిల జనులకుఁ బరమ పదాభిలాష । వృత్తి సామాన్య; యది యొండు వెంట శూద్ర**
**జనములకు నెట్లు వొరలిన సఫల గాదు । దాని భిక్షుకసేవ సత్ఫలతఁ గూర్చు. 317**

**ప్రతిపదార్థం:** అఖిల జనులకున్= అన్ని వర్ణాల వారికీ; పద+అభిలాష వృత్తి= శాశ్వతమైన మోక్ష స్థానం కోరిక ఉండటం; సామాన్య= సాధారణమైనది; ఎట్లు= ఏ విధంగా; పొరలినన్= తిరుగుళ్ళు పడినా; ఒండు వెంటన్= మరొక విధంగా; అది= ఆ పరమ పదంపైన కోరిక; శూద్రజనులకున్= శూద్రవర్ణంవారికి; సఫల= ఫలంతో కూడినది; కాదు; భిక్షుకసేవ= సన్న్యాసులను సేవించటం; దానిన్= ఆ కోరికను; సత్ఫలతన్= మంచిఫలం పొందటాన్ని; కూర్చున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** పరమపదంమీద వాంఛతో ఉండటం జనులందరికీ సమానవిషయమే. ఎంత కష్టపడినా శూద్రులకు అది మరొక మార్గంలో సఫలం కాదు. సన్న్యాసిసేవ దానిని సఫలం చేస్తుంది.

## పరాశరమునిప్రణీత ధర్మవిశేషంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట (సం.13-153-1 (కుంభ))

**తే. వర్ణములకెల్ల నింద్రియ వ్యాప్తి నిగ్ర । హంబు వలయు నియ్యది గన్నయంతఁ దృప్తిఁ**
**బొంది యొండాసపడకున్న నొందు సాధు । జనులు వెదకు ననామయ సత్పదంబు. 318**

**ప్రతిపదార్థం:** వర్ణములకున్= జాతులకు; ఎల్లన్= అన్నింటికీ; ఇంద్రియ వ్యాప్తి నిగ్రహంబు= ఇంద్రియముల వ్యాప్తిని అరికట్టటం; వలయున్= కావాలి; ఈ+అది= ఇది; కన్న+అంతన్= పొందినంతనే; తృప్తిన్= తనివిని; పొంది; ఒండు= మరియొకటి; ఆసపడక= ఆశింపక; ఉన్నన్= ఉంటే; సాధుజనులు= సన్న్యాసులు; వెదకు అనామయ సత్ పదంబు= వెదకే ఏ జాడ్యమూ లేని బ్రహ్మపదం; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** అన్ని వర్ణాలవారికీ ఇంద్రియాలు వ్యాపించటాన్ని అరికట్టటం కర్తవ్యం. దానిని సాధించి మరొకటి కోరకుండేవాడు సాధుజనులు వెదకే తెవులులేని బ్రహ్మపదాన్ని పొందుతాడు.

**విశేషం:** ఇంద్రియాలు - చర్మము, కన్నులు, చెవులు, ముక్కు, నాలుక - ఇవి క్రమంగా స్పర్శ; రూపం, శబ్దం, గంధం, రసం - అనే వాటి కొరకు వెంపరలాడుతూ ఉంటాయి. అవి సక్రమంగా లభించకపోతే అక్రమంగానైనా సాధించటానికి ప్రయత్నిస్తాయి. ఆ విధంగా ఇంద్రియాలు విషయాలపై ప్రసరించటం బంధకారణం అవుతుంది. వాటిని సాగకుండా నిలుపటం బ్రహ్మప్రాప్తి కారణం అవుతుంది.

అనామయసత్పదంబు - బ్రహ్మపదం - పరమాత్మలో ఐక్యం కావటం. ఇవికాక తక్కిన బ్రహ్మలోకాదులన్నీ రాకపోకలతో అనిత్యాలు కావటంవలన దోషం కలవి. వివేకవంతుడు వాటికొరకు వెదకడు.

**తే. పరమమైన యీ ధర్మంబు వట్టి పాప । యోనులగు కామినులును వైశ్యులును శూద్రు**
**లును సుగతి గాంతు రనిన సజ్జనతఁ బరఁగు । బ్రాహ్మణులకు రాజులకును బ్రాఁతె సుగతి? 319**

**ప్రతిపదార్థం:** పరమము= మిక్కిలి గొప్పది; ఐన ఈ ధర్మంబు= అయిన ఈ ధర్మాన్ని; పట్టి= ఆధారంగా గ్రహించి; పాప యోనులు= పాపపు జన్మకారణం కలవారు; అగు= అయిన; కామినులును= స్త్రీలు; వైశ్యులును= మూడవ వర్ణంవారు; శూద్రులును= నాలుగవ వర్ణం వారును; సుగతి= మంచిగతిని; కాంతురు= పొందుతారు; అనినన్= అంటే; సత్+జనతన్=

మంచి జనుడి భావంతో; పరఁగు= ఒప్పే; బ్రాహ్మణులకున్= బ్రాహ్మణులకూ, రాజులకున్= క్షత్రియులకున్నూ; సుగతి= మంచిగతి; బ్రాఁతి+ఎ= దుర్లభమా? కాదని భావం.

**తాత్పర్యం:** ఎంతో శ్రేష్ఠమైన ఈ ధర్మాన్ని అవలంబించి పాపపు జన్మకారణాలుగల స్త్రీలు, వైశ్యులు, శూద్రులు కూడా సుగతి పొందుతారంటే సజ్జనులైన బ్రాహ్మణులకు, క్షత్రియులకు సుగతి దుర్లభమా?

**విశేషం:** స్త్రీలు, వైశ్యులు, శూద్రులు - పూర్వజన్మంలోని పాపకర్మవలన ఆ స్థితిని పొందారని కర్మసిద్ధాంత భావన. అట్లాగే మునుపటి జన్మలందలి పుణ్యకర్మఫలంగా మొదటి రెండు వర్ణాలలో జన్మిస్తారని భావన. ఈ విధంగా ఈ పాపపుణ్యాలు జన్మకు యోనులు కారణాలు. అంతేకానీ ఇప్పుడు వారు పాపాత్ములు, వీరు పుణ్యాత్ములు అని విభాగం చేయటం సరికాదు.

**వ. అని చెప్పి వెండియు. 320**

**తాత్పర్యం:** పరాశరు డిట్లా చెప్పి, ఇంకా విశేషించి బోధిస్తున్నాడు.

**సీ. బోధ మక్షీణపాపునకుఁ గల్గదు సద్గు । రుండు సెప్పంగ సంశ్రుతములైన**
**పనులఁ బాపంబులు వాసిన నిర్మల । జ్ఞానోదయం బగు దాన గర్వ**
**ముదయింప వచ్చిన నుడుపంగవలయు గ । ర్వంబున గురుసమారాధనంబు**
**వదలిన నా బోధవైభవ మెడలిన । యంతటఁ బోక కీ డావహిల్లుఁ**

**ఆ. బరమబోధమునకు ఫల ముపశాంతిగా । నెఱిఁగి యెంతబోధ మెక్కు డయ్యె**
**నంతశాంతుఁ డగుచు ననవరతంబును । గురునిఁ గొలిచి మేలు పురుషుఁ డొందు. 321**

**ప్రతిపదార్థం:** అక్షీణ పాపునకున్= నశించని పాపాలు కలవాడికి; బోధము= జ్ఞానం; కల్గదు= ఏర్పడదు; సత్+గురుండు= ఉత్తముడైన గురువు; చెప్పంగన్= బోధింపగా; సంశ్రుతములు= చక్కగా వినవచ్చినవి; ఐన పనులన్= అయిన కార్యములతో; పాపంబులు= పాపాలు; పాసినన్= నశిస్తే; నిర్మల జ్ఞాన+ఉదయంబు= స్వచ్ఛమైన జ్ఞానం పుట్టటం; అగున్= అవుతుంది; దానన్= దానిచేత; గర్వము= పొగరు; ఉదయింప వచ్చినన్= పుట్టబోతే; ఉడుపంగవలయున్= మాన్పాలి; గర్వంబునన్= పొగరుతో; గురు సమారాధనంబు= గురువుల చక్కని పూజ; వదలినన్= మానివేస్తే; ఆ బోధ వైభవము= ఆ జ్ఞానపు మహిమ; ఎడలిన అంతటన్= పోయినంతటితో; పోక= పోవక; కీడు= ఆపద; ఆవహిల్లున్= కలుగుతుంది; పరమబోధమునకున్= గొప్పదియైన జ్ఞానానికి; ఫలము= ప్రయోజనం; ఉపశాంతి= మిడిసిపాటు లేకపోవటం; కాన్= కావటం; ఎఱిఁగి= తెలిసికొని; బోధము= జ్ఞానము; ఎంత= ఎంతగా; ఎక్కుడు= అధికం; అయ్యెన్= అవుతుందో; అంత= అంతగా; శాంతుఁడు= ఓర్పుగలవాడు; అగుచున్= అవుతూ; అనవరతంబును= ఎల్లప్పుడు; గురునిన్= జ్ఞానబోధ చేసిన వ్యక్తిని; కొలిచి= సేవించి; పురుషుఁడు= మనుజుడు; మేలు= శుభాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పాపం తరుగనివాడికి జ్ఞానం కలుగదు. సద్గురువు బోధించిన పనులు చక్కగా ఆచరిస్తే పాపాలు పోతాయి. అప్పుడు నిర్మలమైన జ్ఞానం కలుగుతుంది. అయితే దానివలన గర్వం ఏర్పడితే దానిని రూపుమాపాలి. గర్వంతో గురుపూజ మానితే జ్ఞానం నశించటమే కాదు, ఆపద కూడా కలుగుతుంది. గొప్పజ్ఞానానికి ఫలం మిడిసిపడకుండటం అని తెలిసికొని, జ్ఞానం ఎంతగా పెరుగుతుందో శాంతి నంతగా పెంచుకొనాలి. కనుక ఎల్లప్పుడు గురుసేవ చేస్తూ నరుడు మేలు పొందుతాడు.

**విశేషం:** తెలివివలన గర్వం పొందటం మానవుడి పెద్ద బలహీనత. దాని దుష్ఫలితాన్ని ఈ పద్యంలో చక్కగా తెలియజేశారు. భారతీయ సంప్రదాయంలో గురువు తెప్పవంటివాడు. గురువు సాక్షాత్తు పరబ్రహ్మ. అతడిని పట్టుకొనటం, వదలిపెట్టటం అనేవి ఉండవు. ఈ రహస్యాన్ని ఇందులో మనం చక్కగా గ్రహించాలి.

**సీ. రక్షించునది యుదరంబు శిశ్నము ధృతిఁ। బాణిపాదములు దృక్పాటవములు**
**వినుఁ డింద్రియంబుల మనమును మనమున। బుద్ధి నిట్లైనఁ బ్రబోధవికచ**
**హృదయస్థుఁడై ధూమ మెడలిన శిఖివోలె। వెలుఁగు దేవునిఁ జూచు వెరవు గలుగు**
**యుక్తుండు గాకేల యొదవు మహేశ్వరుఁ। గనుట? యుక్తాత్ముండు గనును భక్తి**

**తే. నట్టి భంగికిఁ జాలిన యట్టిఁడైన। వికృతిషోడశకంబును ప్రకృతి సప్త**
**కంబు మూలప్రకృతిఁ జిత్తకలన నరయ। వికృతియును బ్రకృతియుఁ గాని విభునిఁ గాంచు. 322**

**ప్రతిపదార్థం:** ఉదరంబు= పొట్టను; శిశ్నమున్= గుహ్యమును; ధృతిన్= బుద్ధిశక్తితో; రక్షించునది= కాపాడాలి; పాణిపాదములు= చేతులు, కాళ్ళు; దృక్+పాటవములు= చూపునందలి పటుత్వాలను; రక్షించునది= కాపాడాలి; వినుఁడు= ఆలకించండి; ఇంద్రియంబులన్= ఇంద్రియాలతో; మనమును= మనస్సును; మనమునన్= మనస్సుతో; బుద్ధిని; రక్షించునది= చెడకుండ చూచుకొనాలి; ఇట్లు= ఈ విధంగా; ఐనన్= అయితే; ప్రబోధ వికచ హృదయస్థుఁడు= గొప్ప ఉపదేశంతో వికసించిన హృదయంలో ఉన్నవాడు; ఐ= అయి; ధూమము= పొగ; ఎడలిన= పోయిన; శిఖిపోలెన్= అగ్నివలె; వెలుఁగు దేవునిన్= ప్రకాశించే పరమాత్మను; చూచు వెరవు= చూచే అవకాశం; కలుగున్= కలుగుతుంది; యుక్తుండు= యోగముకలవాడు; కాక= కాకుండా; మహేశ్వరున్= పరమాత్మను; కనుట= పొందటం; ఏల= ఎందుకు; ఒదవున్?= కలుగుతుంది?; యుక్త+ఆత్ముండు= యోగం సిద్ధించిన హృదయం కలవాడు; భక్తిన్= భక్తిని; కనును= పొందుతాడు; అట్టి భంగికిన్= అట్టి పద్ధతికి; చాలిన అట్టిఁడు= సమర్థుడు; ఐనన్= అయితే; వికృతిషోడశకంబును= వికారముల పదునారింటిని; ప్రకృతి సప్తకంబున్= ప్రకృతుల ఏడింటిని; మూలప్రకృతిన్= మూలమైన ప్రకృతిని; చిత్తకలనన్= చిత్తపు కూడిక చేత; అరయన్= పరీక్షింపగా; వికృతియును= వికృతిస్వరూపుడు; ప్రకృతియున్= ప్రకృతి స్వరూపుడును; కాని= కానట్టి; విభునిన్= పరమాత్మను; కాంచున్= దర్శిస్తాడు.

**తాత్పర్యం:** వినండి. మానవుడు కడుపును, లింగాన్నీ, కాళ్ళు చేతులను, దృష్టిశక్తులనూ కాపాడుకొనాలి. ఇంద్రియాలతో మనస్సును, మనస్సుతో బుద్ధిని రక్షించుకొనాలి. ఇట్లా అయితే సుజ్ఞానంతో వికసించిన అతడి హృదయంలో నెలకొని ఉన్నవాడు, పొగలేని అగ్నివలె వెలుగొందుతున్నవాడు అయిన పరమాత్మను దర్శించే అవకాశం కలుగుతుంది. యోగసిద్ధి పొందనివాడికి మహేశ్వరుడిని కనుగొనటం ఎట్లా సాధ్యమవుతుంది? యోగసిద్ధి పొందిన వాడికి భక్తి ఏర్పడుతుంది. ఆ విధానానికి సమర్థుడైన వాడు పదహారు వికారాలను, ఏడు ప్రకృతులను మూలప్రకృతినీ చిత్తంలో చక్కగా కూర్చుకొని, వికృతి కానివాడు, ప్రకృతి కానివాడు అయిన పరమాత్మను సందర్శిస్తాడు.

**విశేషం:** ఇది ఆధ్యాత్మికవిద్య. కడుపు, శిశ్నము, మొదలైన వాటిని రక్షించుకొనటమంటే భుక్తి విషయంలో, రక్తి విషయంలో లౌల్యం లేకుండా ఉండటం. అట్లాగే అకృత్యాలు చేయకుండటం, అగమ్యస్థలాలకు పోకపోవటం, పాణిపాదాలను రక్షించుకొనటం. ఇంద్రియాలను విచ్చలవిడిగా ప్రవర్తించనీయకపోతే మనస్సు అదుపులోనికి వస్తుంది. అంటే సంకల్పవికల్పాలు నశిస్తాయి. మనస్సు అదుపులోనికి వస్తే బుద్ధి తన అధీనంలో ఉంటుంది. అంటే పరమార్థ సంబంధమైన నిర్ణయాలే చేస్తుంది. కానీ

ఇహసుఖసంబంధ నిర్ణయాలు చేయదు. ప్రబోధం అంటే గురువు ఉపదేశించిన జ్ఞానం. దానిచేత అంతవరకు హృదయంలో ఉన్నా, ఉన్నట్లు తెలియరాని పరమాత్మ ఉనికి తెలుస్తుంది. దానికి ఉపమానం పొగపోయిన శిఖి. పొగ దట్టంగా క్రమ్మితే అగ్ని సరిగా కనబడదు కదా! ఇక్కడ జ్ఞానాగ్ని అటువంటిది. వికృతి షోడశకంబు - అంటే పంచ ఇంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచతన్మాత్రలు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. మనస్సు ఈ పదునారింటి సముదాయం. ప్రకృతి సప్తకం అంటే పంచభూతాలు - పృథివి, నీరు, నిప్పు, గాలి, నింగి, మహత్తు, అహంకారం అనేవి మూలప్రకృతి - ఈ అన్నింటికీ మూలకారణమైన హిరణ్యగర్భుడు. ఈ మొత్తం ఇరవైనాలుగు తత్త్వాలు భక్తితో వికసించిన హృదయం కలవాడికి చిత్తంలో విస్పష్టంగా భాసిస్తాయి. 16+8గా అయిన వికృతి ప్రకృతులకు అతీతంగా ఉన్న పరమాత్మ దర్శనం అప్పుడు సిద్ధిస్తుంది.

**క. ఇది సాంఖ్యానము దీనిని । మది కలవడఁ జేసికొనుచు మఱవక గురు ని**
**ర్మదుఁడై కొలువఁగఁ గేవల । పదము నతని కరుణ పెంపు ప్రకటము సేయున్. 323**

**ప్రతిపదార్థం:** ఇది; సాంఖ్యానము= జ్ఞానము; దీనిని= ఈ జ్ఞానాన్ని; మదికిన్= మనస్సునకు; అలవడన్+చేసికొనుచున్= అభ్యాసం ద్వారా గట్టి చేసికొంటూ; గురున్= గురువును; మఱవక= మరచిపోక; నిర్మదుఁడు+ఐ= పొగరులేనివాడై; కొలువఁగన్= సేవింపగా; అతని కరుణ పెంపు= అతడి దయయొక్క ఎక్కువతనం; కేవల పదమున్= కైవల్యం అనే స్థానాన్ని; ప్రకటము+చేయున్= వెల్లడి చేస్తుంది.

**తాత్పర్యం:** ఇది జ్ఞానమార్గం. దీనిని హృదయంలో పదిలపరచుకొంటూ గురువును మరచిపోక, పొగరులేనివాడై సేవిస్తూ ఉంటే అతడి దయ కైవల్యాన్ని చక్కగా తెలుపుతుంది.

**విశేషం:** సాంఖ్యానము -సమ్యక్ఖ్యానం చక్కని తెలివి అని అర్థం. అంతేకాక సంఖ్యాసంబంధమైనది. తత్త్వముల సంఖ్యను వివరించటం ద్వారా తెలివిని ప్రసాదిస్తుంది కనుక సాంఖ్యం. కేవలుడు అంటే ఏ విధమైన అంటుసొంటులు, ద్వంద్వాలు లేకుండా తనకు తానే స్వతంత్రుడు, శుద్ధుడు, బుద్ధుడు, ఆనందస్వరూపుడు అయిన పరమాత్మ. అతడి పదం కేవలపదం. అంటే జీవ బ్రహ్మైక్యరూపమైన పరమగతి - అని తాత్పర్యం. గురువు అనుగ్రహం లేకపోతే అది తెలియరాదు. గురువే సాక్షాత్తు పరబ్రహ్మము. కనుక గురువును మరవరాదు. గురువు విషయంలో గర్వాదులను పొందరాదు - అని ఈ పద్యంలో హెచ్చరిక చేస్తున్నారు.

**తే. భిక్షుభావంబుఁ బొంది యీ శిక్ష యూఁది । మెలఁగు నర్హత త్రైవర్ణికులకుఁ గలదు**
**శూద్రునకు భిక్షుసంసర్గ సులభ మమల । పదము వానికి భిక్షుతఁ బరఁగఁ జనదు. 324**

**ప్రతిపదార్థం:** భిక్షు భావంబున్= సన్న్యాసితనాన్ని; పొంది= అవలంబించి; ఈ శిక్ష= ఈ అభ్యాసం; ఊఁది= గట్టిగా పట్టుకొని; మెలఁగు+అర్హత= ప్రవర్తించే యోగ్యత; త్రైవర్ణికులకున్= మొదటిమూడు వర్ణాలవారికి; కలదు= ఉన్నది; శూద్రునకున్= నాలుగవ వర్ణంవాడికి; అమల పదము= స్వచ్ఛమైన కైవల్యపదం, భిక్షు సంసర్గ సులభము= సన్న్యాసుల సహవాసంచేత తేలికగా లభించునది; వానికిన్= ఆ శూద్రుడికి; భిక్షుతన్= సన్న్యాసి ధర్మంతో; పరఁగన్= ప్రవర్తించటం; చనదు= కూడదు.

**తాత్పర్యం:** సన్న్యాసిభావాన్ని పొంది ఈ అభ్యాసాన్ని గట్టిగా పట్టుకొని ప్రవర్తించే అర్హత మూడు వర్ణాలవారికి ఉన్నది. శూద్రుడికి ఆ కైవల్యపదం సన్న్యాసినంటిపెట్టుకొని ఉండటం వలననే తేలికగా లభిస్తుంది. అతడు సన్న్యాసి ధర్మాన్ని స్వీకరించకూడదు.

**క. పరమజ్ఞానుల యొద్దను । బరఁగిన నజ్ఞుఁడును బోధభరితుఁడగు నిరం**
**తర మేరుసమీపస్థితి । హిరణ్యరుచిఁ గాక మెసకమెసఁగిన పగిదిన్. 325**

**ప్రతిపదార్థం:** నిరంతర మేరు సమీప స్థితిన్= ఎల్లవేళల మేరుపర్వతం దగ్గర ఉండటం చేత; కాకము= కాకి; హిరణ్యరుచిన్= బంగారు వన్నెతో; ఎసకము= అతిశయము; ఎసఁగిన పగిదిన్= పెంపొందిన విధంగా; పరమ జ్ఞానుల+ఒద్దను= గొప్ప జ్ఞానం కలవారికడ; పరఁగినన్= మెలగితే; అజ్ఞుఁడును= ఏమియు తెలియనివాడు కూడా; బోధభరితుఁడు= జ్ఞానంతో నిండినవాడు; అగున్= అగును.

**తాత్పర్యం:** ఎల్లవేళలా బంగారు కొండ దగ్గర ఉండటంచేత కాకి కూడా బంగారు వన్నెతో మిలమిలలాడిన విధంగా గొప్ప జ్ఞానం కలవారిదగ్గర మెలగిన తెలియనివాడు కూడా జ్ఞానపూర్ణు డవుతాడు.

**విశేషం:** ఇది భ్రమరకీటకన్యాయం వంటిది. పరుసవేది ఇనుమును బంగారు చేయటం వంటిది. ఆరు నెలలు కలిసి ఉంటే వారు వీరవుతారనే తెలుగు సామెత కూడా దీనిని నిరూపిస్తుంది.

**క. గురు శుశ్రూషా మహిమం । గరుణఁ జతుర్వర్ణ హితముగా నిమ్మాడ్కిం**
**బరివర్ణితంబు సేసెం । బరాశర మునీశ్వరుండు పౌరవముఖ్యా! 326**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశ శ్రేష్ఠుడా!; పరాశర ముని+ఈశ్వరుండు= పరాశరుడనే మునిశ్రేష్ఠుడు; ఈ+మాడ్కిన్= ఈ విధంగా; కరుణన్= దయతో; చతుర్+వర్ణ హితముగాన్= నాలుగు వర్ణాలవారికి మేలు కలిగే తీరున; గురు శుశ్రూషా మహిమన్= గురువులను సేవించటంవలన కలిగే గొప్ప స్థితిని; పరివర్ణితంబు= నిండుగా చెప్పబడిన దానినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పరాశరమహర్షి ఈ విధంగా కరుణతో నాలుగు వర్ణాల వారికి మేలు కలిగే విధంగా గురుసేవ గొప్పతనాన్ని వివరించి చెప్పాడు.

**విశేషం:** మునీశ్వరుడు అనటంచేత అతడి మాట ప్రమాణంగా తీసికొనదగినదని సూచన. 'కరుణన్' అనటంవలన ఇట్లా చెప్పటంలో స్వార్థచింతన లేదనటం తెలియవస్తుంది. 'హితము' అనటంవలన ఒకవేళ పైకి ఇది కటువుగా ఉన్నా, ఔషధంవలె ఆచరిస్తే మేలు చేసేది - అన్న స్ఫూర్తి కలుగుతుంది. పరివర్ణితంబు అన్నచోట ఉపసర్గ 'పరి' అనేది - 'ఇది తుదిమాట. దీనికి వికల్పాలు లేవు' అనటాన్ని స్ఫురింపజేస్తుంది. ఇట్లా ఈ చిన్న పద్యం వ్యంగార్థపుష్టమై కావ్యధర్మశోభితమై అలరారుతున్నది.

**వ. అని సకల ధర్మోపదేశధుర్యుండైన భీష్ముండు పరాశర మునివర్యు వాక్యసంచయంబు సెప్పినం బరితుష్టుండయి పరమ వినయంబునం బాండవాగ్రజుం డక్కురుకులాగ్రగణ్యుతో 'నరులు సురలకు వంద్యులగు వారును గలరని విందు వారల వర్తనంబెట్టి దెఱింగింపు' మనిన నతం డతని కిట్లనియె. 327**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; సకల ధర్మ+ఉపదేశధుర్యుండు=అన్ని ధర్మాలను ఉపదేశించటంలో సమర్థుడు; ఐన భీష్ముండు= అయిన భీష్ముడు; పరాశర మునివర్యు వాక్య సంచయంబు= పరాశరమహర్షి యొక్క వాక్యాల సముదాయాన్ని; చెప్పినన్= చెప్పగా; పరితుష్టుండు+అయి= మిక్కిలి ఆనందించినవాడు అయి; పాండవ+అగ్రజుండు= పాండుకుమారులలో పెద్దవాడు

అయిన ధర్మరాజు; పరమ వినయంబునన్= మిక్కిలి వినయంతో; ఆ+కురు కుల+అగ్రగణ్యుతోన్= కురువంశంలో మొదట లెక్కింపదగిన ఆ భీష్ముడితో; సురలకున్= దేవతలకు కూడా; వంద్యులు= మన్నింపదగినవారు; నరులు= మానవులు; కలరు= ఉన్నారు; అని; విందున్= వింటున్నాను; వారల వర్తనంబు= అట్టివారి నడవడి; ఎట్టిది?= ఏ విధమైనది?; ఎఱింగింపుము= తెలియజేయుము; అనినన్= అంటే; అతండు= ఆ భీష్ముడు; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు= ఇట్లా; అనియెన్ = అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మాలన్నింటిని చక్కగా తెలియజెప్పటంలో నేర్పుగల ఆ భీష్ముడు ఈ విధంగా పరాశరమునీంద్రుడి వాక్యాలను తెలుపగా పరమానందం పొంది ధర్మరాజు మహా వినయంతో భీష్ముడితో 'ఆర్యా! దేవతలు కూడా మ్రొక్కదగిన నరులుంటారని విన్నాను. అట్టివారి నడవడి యెటువంటిదో తెలియజెప్పుము.' అంటే భీష్ము డతనితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సురలు నరులకు వంద్యులు. ఇది సహజవ్యవహారం.కాని, సురలకు కూడా వంద్యులయిన నరులున్నారట. ఇది విశేష వ్యవహారం. ధర్మరాజుకు అట్టివారి నడవడిని గురించి తెలిసికొనాలనిపించింది.

**సీ. 'ఇట్లు మాతలి యమరేంద్రుని నడిగిన । ధర్మార్థ కామముల్ ధర్మచరిత**
**వర్తనఁ జెల్లించువారు, వామాక్షులు । గోరఁగాఁ దగు రూపగుణ సమృద్ధి**
**గలిగియు వర్జితకాము లయ్యెడు వారు । విద్యాధనైశ్వర్యవిషయ గర్వ**
**విరహితులగువారు విజితేంద్రియులు నిజ । దారతృప్తులుఁ దపోధనము గాఢ**

**తే. తత్పరతఁ గూర్చు ఘనులు సత్యవ్రతులును । బరమశౌచులు బహుకార్యపరత లేని**
**గూఢధర్ములు సన్న్యాస కోవిదులును । దనకు నభివంద్యు లగుట యతండు సెప్పె. 328**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇదే విధంగా; మాతలి= ఇంద్రుడి సారథి అయిన మాతలి; అమర+ఇంద్రునిన్= దేవేంద్రుడిని; అడిగినన్= అడిగితే; అతండు= ఆ ఇంద్రుడు; ధర్మ+అర్థ కామముల్= ధర్మము, అర్థము, కామము అనే పురుషార్థాలను; ధర్మచరిత వర్తనన్= ధర్మమును నడిపే ప్రవర్తనతో; చెల్లించువారు= సాగింపజేసేవారు; వామ+అక్షులు= చక్కని కనులుగల ఆడువారు; కోరఁగాన్= వాంఛింపగా; తగు రూప గుణ సమృద్ధి= తగిన అందమూ, సద్గుణ సంపదా; కలిగియున్= ఉండి కూడా; వర్జిత కాములు= వదలిన కామం కలవారు; అయ్యెడువారు= అయ్యేవారు; విద్యా ధన+ఐశ్వర్య విషయ గర్వ విరహితులు= చదువు, సంపద, ప్రభుత్వము అనే విషయాలవలన ఏర్పడే గర్వంలేనివారు; అగువారు= అయినవారు; విజిత+ఇంద్రియులు= గెలువబడిన ఇంద్రియములు గలవారు; నిజ దార తృప్తులు= తమ భార్యలతో తృప్తి చెందేవారు; గాఢ తత్పరతన్= చెదరని పట్టుదలతో; తపోధనమున్= తపస్సు అనే ధనాన్ని; కూర్చు ఘనులు= కూడబెట్టే గొప్పవారు; సత్యవ్రతులును= సత్యమునందు నిష్ఠ కలవారు; పరమశౌచులు= గొప్ప పరిశుద్ధత కలవారు; బహు కార్యపరత= పెక్కు కార్యాలలో ఆసక్తి; లేని గూఢ ధర్ములు= లేకుండా గుట్టుగా ధర్మం ఆచరించేవారు; సన్న్యాస కోవిదులును= సన్న్యాస ధర్మంలో సర్వమూ తెలిసి ఆచరించేవారు; తనకున్= తనకు; అభివంద్యులు= నమస్కరింపదగినవారు; అగుటన్= కావటం; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఇదే విధంగా మాతలి దేవేంద్రుడిని అడిగాడు. అతడు ఇట్లా చెప్పాడు. ధర్మ, అర్థ, కామ పురుషార్థాలను ధర్మం తప్పని నడవడితో ఆచరించేవారు, సుందరాంగులు స్వయంగా కోరినా, తమకు తగిన రూపము, శక్తి

సంపదలు ఉన్నా కామాన్ని వదలి మెలగేవారూ, విద్యాగర్వం, ధనగర్వం, ప్రభుత్వగర్వం మొదలైనవి లేనివారు, ఇంద్రియములపై గట్టి అదుపు కలవారు, తమ భార్యలతో తృప్తిపొందేవారు, దృఢమైన పట్టుదలతో తపస్సు అనే ధనాన్ని కూడబెట్టే మహాత్ములు, సత్యనిష్ఠ కలవారు, వెలుపలిలోపలి పరిశుద్ధతను సాధించేవారు, అనేక కార్యాల తగులం లేక గుట్టుగా ధర్మం ఆచరించేవారూ, నిజమైన సన్న్యాసధర్మాలను నేర్పుతో పాటించేవారు తనకు మ్రొక్కదగినవారు.

**విశేషం:** వీటికి క్రమంగా రఘువంశరాజులు, అర్జునుడు లేక ప్రవరుడు, జనకుడు, హరిశ్చంద్రుడు, శిబిచక్రవర్తి, శ్రీరామచంద్రుడు మొదలగువారు ఉదాహరణ ప్రాయులు.

**వ. అనిన విని ధర్మతనయుండు 'తటాక నిర్మాణ రూపంబగు ధర్మంబు విశేషంబు వినవలతుం జెప్పవే' యనుటయు ననిమిషనదీనందనుం డాదరభరితుండై. 329**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని= ఆలకించి; ధర్మతనయుండు= ధర్ముని కుమారుడు; తటాక నిర్మాణ రూప ధర్మంబు విశేషంబు= చెరువును నిర్మించటం అనే ధర్మంలోని గొప్పతనం; వినవలతున్= వినటానికి ఇష్టపడుతున్నాను; చెప్పవే= దయతో వివరించుము; అనుటయున్= అంటే; అనిమిష నదీనందనుండు= దేవతల నది అయిన గంగ కొడుకు; ఆదర భరితుండు+ఐ= ఆదరంతో నిండినవాడై.

**తాత్పర్యం:** తరువాత ధర్మరాజు 'చెరువు త్రవ్వించటం అనే ధర్మంలోని గొప్పతనం తెలిసికొనాలని ఉన్నది తాతా! చెప్పుతావా?' అంటే భీష్ముడు నిండైన ఆదరంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తటాకం - నీటికి సంబంధించినది. భీష్ముడు నదీనందనుడు. నది నీటికి నెలవు కదా! అందుకని ఆయనకు ఈ ప్రశ్న మరింత ఆనందాన్ని కలిగించింది.

### భీష్ముఁడు ధర్మజునకుఁ దటాక నిర్మాణ ఫలవిశేషంబు సెప్పుట (సం.13-92-1)

**సీ. దేవ తిర్యఙ్నరస్థావరాశ్రయము త । టాకంబు వినుము మట్లుఁ గాక యందు**
**గోకులంబులు నీరు గొని దాని కర్తకు । లము నెల్లఁ బుణ్యలోకమున కనుచు**
**నీ లోకమున శ్రీయు నెక్కుడు కీర్తియు । నతనికిఁ జేయు వర్షాగమమున**
**సీతున వేసవిఁ జెఱువులో నీరున్న । నగ్నిహోత్రాదిమయజ్ఞ వాజ**

**ఆ. పేయఫలములోలి నాయన కగుఁ గట్టఁ । దగిన తరువు లిడిన సుగతి గలుగు**
**నిహసుఖంబుఁ బొందు విహగాది బహుభూత । వాససౌఖ్య మతఁడు సేసెఁ గాన. 330**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; తటాకంబు= జలాశ్రయం (చెరువు); దేవ తిర్యక్+నర స్థావర+ఆశ్రయము= దేవతలకు, పశువులకు, పక్షులకు, నరులకు, కదలికలేని వస్తువులకు ఆశ్రయము; అట్లున్+కాక= అంతేకాక; అందున్= దానిలో; గోకులంబులు= ఆవుల మందలు; నీరు= నీటిని; కొని= త్రావి; దాని కర్త కులమున్= ఆ చెరువు త్రవ్వించినవాడి కులమును; ఎల్లన్=అంతటినీ; పుణ్యలోకమునకున్= పుణ్యలోకానికి; అనుచున్= పంపుతాయి; ఈ లోకమునన్= ఈ

లోకంలో; శ్రీయున్= సంపదను; ఎక్కుడు కీర్తియున్= అధికమైన కీర్తిని; అతనికిన్= ఆ కర్తకు; చేయున్= కలిగిస్తాయి; వర్షా+ఆగమమునన్= వానకాలము రాకయందూ; సీతునన్= చలికాలంలోనూ; వేసవిన్= వేసవికాలంలోనూ; చెఱువులోన్= తటాకంలో; నీరు= జలం; ఉన్నన్= ఉంటే; ఆయనకున్= త్రవ్వించిన ఆ వ్యక్తికి; అగ్నిహోత్ర+ఆదిమ+యజ్ఞ వాజపేయ ఫలములు= అగ్ని హోత్రం మొదలుగాగల యజ్ఞాలూ, వాజపేయ యాగం మొదలైన వాని ఫలాలు; ఓలిన్= వరుసగా; అగున్= సిద్ధిస్తాయి; కట్టన్= కట్ట మీద; తగిన తరువులు= యోగ్యమైన చెట్లు; ఇడినన్= నాటితే; అతఁడు= ఆ కర్త; విహగ+ఆది బహు భూత వాస సౌఖ్యము= పక్షులు మొదలైన పెక్కు ప్రాణుల నివాసం అనే సుఖాన్ని; చేసెన్= చేశాడు; కానన్= కనుక (అతడికి); సుగతి= పరంలో మంచిగతి; కలుగున్= కలుగుతుంది; ఇహసుఖంబున్= ఈ లోకపు సుఖాన్ని కూడా (అతడు); పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** వినుము. చెరువు దేవతలకు, పశువులకు, పక్షులకు, రాయి రప్పవంటి స్థావరాలకు నెలవైనది. అంతేకాదు. అందులో నీరు త్రావి ఆవులమందలు దాని కర్త కులాన్నంతటినీ పుణ్యలోకాలకు పంపుతాయి. ఈ లోకంలో గొప్ప సంపదనూ, చెడని కీర్తినీ కలిగిస్తాయి. వానకాలంలో, చలికాలంలో, ఎండకాలంలో చెరువులో నీళ్ళుంటే మహాయజ్ఞాలు చేసిన ఫలం ఆ కర్తకు లభిస్తుంది. కట్టమీద తగిన చెట్లు నాటితే పక్షులు మొదలైన ప్రాణికోటికి నిలువనీడనిచ్చి సుఖం కూర్చినవాడు ఔతాడు కనుక అతడికి ఇహపర సుఖాలు కలుగుతాయి.

**విశేషం:** ఈనాడు మనం ఎక్కువగా అనుకొంటున్న పర్యావరణ సమతౌల్యభావన ఇందు చూడవచ్చును.

**క.** **సలిలాశయములు చేసిన । నలఘుప్రియ మందుఁ బితృచయము లూర్ధ్వగతుల్**
**గలుగును దానం దమ కను । తలఁపున నది గోరుచుండు ధర్మతనూజా! 331**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజా!= ధర్మనందనా!; పితృచయములు= పితృదేవతలు; సలిల+ఆశయములు= నీటి కొలకులు; చేసినన్= నిర్మిస్తే; అలఘు ప్రియము= మిక్కిలి ప్రియమును; అందున్= పొందుతారు; దానన్= దానివలన; తమకున్= తమకు; ఊర్ధ్వగతుల్= పైలోకపు గమనములు; కలుగును= సిద్ధిస్తాయి; అను తలఁపునన్= అనే భావంతో; అది= తటాక నిర్మాణాన్ని; కోరుచుండున్= కోరుతూ ఉంటారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పితృదేవతలు తమ వంశంవారు చెరువులు త్రవ్విస్తే పరమానందం పొందుతారు. దానివలన తమకు ఉత్తమ లోకాలకు పోయే వీలు కలుగుతుందని దాని నెప్పుడూ కోరుతూ ఉంటారు.

**తే.** **ఛాయ నతిథి వర్గంబుఁ బుష్పముల సురగ । ణంబుఁ బండులఁ బితృనివహంబుఁ బ్రమద**
**మందఁ జేయు వృక్షంబు లట్లగుట వృక్ష । రోపణ క్రియ మేటి ధర్మువు కుమార! 332**

**ప్రతిపదార్థం:** కుమార!= నాయనా!; వృక్షములు= చెట్లు; ఛాయన్= తమ నీడతో; అతిథివర్గంబున్= అతిథుల సముదాయాన్ని; పుష్పములన్= పూవులతో; సురగణంబున్= దేవతల సముదాయాన్నీ; పండులన్= పండ్లతో; పితృ నివహంబున్= పితృదేవతల గణాన్నీ; ప్రమదము= అధికానందం, అందన్+చేయున్= కలిగిస్తాయి; అట్లు= ఆ విధం; అగుటన్= కావటంవలన; వృక్షరోపణ క్రియ= చెట్లు నాటటం అనే పని; మేటి ధర్మువు= గొప్ప ధర్మం.

**తాత్పర్యం:** నాయనా! చెట్లు తమనీడతో అతిధులకూ, పువ్వులతో దేవతలకు, పండ్లతో పితృదేవలకూ పరమానందం కలిగిస్తాయి. కనుక చెట్లు నాటటమనే పని గొప్ప ధర్మం.

**విశేషం:** ఒక చెట్టు నాటితే మూడు లోకాలవారు తృప్తి పొందటాన్ని ఋషులు భావించిన సంగతిని మనం అనుక్షణం స్మరించాలి. ఈనాటి వృక్షరక్షణతత్పరతతో పోల్చి చూడవచ్చును.

**క. అనిన విని ప్రీతుఁడై య। జ్జన విభుఁడు గృహస్థధర్మ సాకల్యజ్ఞా**
**న నిరూఢి నాదు చిత్తం। బున నొలయింపు భవదీయ పుణ్యఫణితులన్. 333**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ప్రీతుఁడు+ఐ= ఆనందించినవాడై; ఆ+జనవిభుఁడు= ఆ రాజు, ధర్మజుడు; గృహస్థ ధర్మ సాకల్య జ్ఞాన నిరూఢిన్= గృహస్థుడి ధర్మపు సమగ్రమైన జ్ఞానంయొక్క ప్రసిద్ధిని; భవదీయ పుణ్యఫణితులన్= నీవైన పవిత్ర వాక్కులతో; నాదు చిత్తంబునన్= నా హృదయంలో; ఒలయింపు= ప్రవేశపెట్టుము.

**తాత్పర్యం:** ఆ మాటలు విని ఆనందించిన ధర్మరాజు 'గృహస్థ ధర్మానికి సంబంధించిన నిండైన ప్రసిద్ధిని నీ పుణ్యవాక్యాలతో నా హృదయంలో ప్రవేశపెట్టుము' అని అడిగాడు.

**క. అనవుడుఁ దాత యలరి య। మ్మనుమనితో నిట్టు లనియె మహియును విష్ణం**
**డును జేసిన సంవాదము। విను మది నీ కోర్కిఁ దీర్చు విశ్రుత కీర్తీ! 334**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; తాత; అలరి= సంతోషపడి; ఆ+మనుమనితోన్= మనుమడైన ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; విశ్రుతకీర్తీ!= ప్రసిద్ధికెక్కిన కీర్తిగలవాడా!; మహియును= భూదేవియు; విష్ణుండును= విష్ణువును; చేసిన సంవాదము= చేసిన సంభాషణము; వినుము; అది= ఆ ప్రసంగం; నీ కోర్కిన్= నీ కోరికను; తీర్చున్= నెరవేరుస్తుంది.

**తాత్పర్యం:** అన్నంతనే తాత ఆ మనుమడితో ఇట్లా అన్నాడు. 'ప్రసిద్ధమైన కీర్తిగల ధర్మరాజా! మునుపు భూదేవికి విష్ణువుకు అయిన సంవాదం వినుము. అది నీ కోరికను తీరుస్తుంది.

**విశేషం:** భూవిష్ణు సంవాదరూప ఇతిహాసప్రకటన ఆదరాతిశయంకొరకని గుర్తించాలి.

**తే. నన్ను నీ వడిగిన యట్లు వెన్నుఁ డర్థి। బుజ్జవంబులు మున్నుగ భూమిదేవి**
**నడిగె; దానికిఁ బ్రియమంది యమ్మహాను। భావ యిట్లని చెప్పెఁ దద్భావ మలర. 335**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; నీవు; అడిగిన+అట్లు= అడిగిన విధంగా; వెన్నుఁడు= కృష్ణుడు; అర్థిన్= కోరికతో; బుజ్జవంబులు= లాలనలు; మున్నుగన్= ముందు కలుగునట్లుగా; భూమిదేవిన్= భూదేవిని; అడిగెన్= అడిగినాడు; దానికిన్= ఆ అడగటానికి; ప్రియము+అంది= సంతోషపడి; ఆ+మహానుభావ= గొప్ప ప్రభావంగల ఆ భూమి; తత్+భావము= ఆ విష్ణుడి హృదయం; అలరన్= ప్రీతి పొందగా; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పినది.

**తాత్పర్యం:** నన్ను నీవడిగినట్లుగా కృష్ణుడు ముందు ప్రేమవాక్యాలతో బుజ్జగించి భూదేవిని అడిగాడు. దానికి ప్రీతిచెంది, ఆ మహానుభావునికి, అతడి హృదయం ప్రీతిపొందే విధంగా ఇట్లా చెప్పింది.

**విశేషం:** బుజ్జవంబులు - విష్ణువు సర్వమూ తెలిసినవాడు. ప్రేమతో భూదేవితో చెప్పించాలని అతడికి కోరిక కలిగింది. అందుకని లాలన మాటలు చాలా పలికాడు.

**క. 'దేవా ! హుతవహపరిచ । ర్యావిధి యొనరించి బలిసమాచరణము భ**
**క్త్యావేశంబునఁ జేయఁగ । దైవతసంఘంబు సమ్మదంబునఁ దేలున్. 336**

**ప్రతిపదార్థం:** దేవా!= ప్రభూ!; హుతవహ పరిచర్యా విధి= అగ్నిసేవ అనే కార్యం; ఒనరించి= చేసి; బలిసమాచరణము= బలివేయటం అనే మంచి పనిని; భక్తి+ఆవేశంబునన్= భక్తి ఒడలంతయు నిండునట్లుగా; చేయఁగన్= చేస్తే; దైవత సంఘంబు= దేవతల సముదాయం; సమ్మదంబునన్= మిక్కిలి ఆనందంతో; తేలున్= తేలుతుంది.

**తాత్పర్యం:** 'ప్రభూ! గృహస్థుడు అగ్ని ఆరాధన చేయాలి. భూతాలకు బలిని ఒడలంతా నిండిన భక్తితో చేయాలి. దానివలన దేవతల సముదాయం పరమానందంలో తేలుతుంది.

**విశేషం:** అగ్ని అర్చన శాస్త్రీయమైన ప్రక్రియ. అగ్నిలో హుతమైన మంచి పదార్థాల శక్తి వాతావరణంలో లీనమై పరిసరాలను కాలుష్యం నుండి రక్షిస్తుంది. ఆ వాసన పీల్చిన ప్రాణులన్నింటికీ ఆ శక్తి సంక్రమిస్తుంది.

భారతీయులు 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అనే భావం కలవారు కారు. అందరికీ అన్నీ సుఖంగా ఉంటేనే తమకు సుఖం అనే భావన వారిది. ఆ దృష్టితో చీమలు మొదలుకొని వీలైనంత ఎక్కువ పరిధిలో ప్రాణులకు ఆహారం అందించి తాము తింటారు. దీనికే 'భూతదయ' అని పేరు. "నితాంతాపారభూతదయ" ప్రసాదించుమని భాగవతప్రార్థన. అన్నింటిలో పరమాత్మను చూసే లక్షణం కూడా ఇందులో గోచరిస్తుంది. పైగా ఇచట పలుకుతున్నది భూమాత - అన్ని జీవుల ఆకలి తీర్చటమే ఆమె ప్రగాఢ వాంఛ.

**తే. అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూల । కోటి నైనను దనుపారు నీటనైన**
**నిత్యమును జేయునది పితృకృత్య మోపి । వైశ్వదేవ మవశ్య నిర్వాహ్య మనఘ! 337**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; అన్నమునన్= అన్నంతో గానీ; దుగ్ధమునన్= పాలతో గానీ; పండ్లన్+ఐనన్= ఫలాలతో గానీ; మూలకోటిన్= దుంపల సముదాయంతో; ఐననున్= కానీ; తనుపారు నీటన్= మంచి చల్లని నీటితో; ఐనన్= కానీ; ఓపి= సహించి; పితృకృత్యము= పితృదేవతల పని అయిన తర్పణం; నిత్యమును= ప్రతిదినమూ; చేయునది= చేయాలి; వైశ్వదేవము= వైశ్వదేవమనే కర్మ; అవశ్య నిర్వాహ్యము= తప్పని సరిగా చేయవలసినది.

**తాత్పర్యం:** అన్నం, పాలు, పండ్లు, దుంపలు, చల్లని నీరు - అనే వీటిలో దేనితోనైనా ప్రతిదినము పితృదేవతలకు తర్పణం చేయాలి. 'వైశ్వదేవం' అనే కర్మ తప్పని సరిగా ఆచరించాలి.

**విశేషం:** పితృకృత్యము - పితృయజ్ఞం. ఇది ప్రతిదినం చేయవలసిన అయిదు యజ్ఞాలలో ఒకటి. 'వైశ్వదేవం' - విశ్వదేవులనే వారికి ప్రీతి కలిగించే ఒక వైదికకార్యం. ఇది దేవయజ్ఞంలో భాగం.

ఈ యజ్ఞాలన్నీ ఆధునికదృష్టితో శాస్త్రీయ ప్రయోజనాలను కలిగించటం పరిశీలించవచ్చును. వాతావరణ సమతౌల్య సాధనకు, త్యాగబుద్ధిని పెంపొందించటానికి ఇవి నిమిత్తాలుగా మనం సంభావించాలి.

**క. ఆ చేఁత పిదప దానం । బాచరణీయంబు శక్తి కనుగుణముగ భి**
**క్షాచర్య సేయు విప్రుల । వేచి యిడఁగవలయు నెపుడు వేగమ భిక్షల్. 338**

**ప్రతిపదార్థం:** ఆ చేఁత పిదపన్= ఆ పని తరువాత; శక్తికిన్= తన ఓపికకు; అనుగుణముగన్= తగినట్లుగా; దానంబు= ఈవి; ఆచరణీయంబు= చేయదగినది; ఎపుడున్= ఎల్లవేళల; భిక్షాచర్య= బిచ్చమెత్తుకొనటం; చేయు విప్రులన్= చేసే విద్యావంతులను; వేచి= కనిపెట్టుకొని ఉండి; వేగము+అ= ఆలస్యం చేయకుండా; భిక్షల్= భిక్షలను; ఇడఁగవలయున్= ఇవ్వాలి.

**తాత్పర్యం:** వైశ్వదేవం తరువాత తన శక్తి మేరకు దానాలు చేయాలి. బిచ్చమెత్తుకొనే విద్యావంతులైన బ్రాహ్మణులను ఎదురుచూచి వేగంగా భిక్షలివ్వాలి.

**విశేషం:** దీనిని మనుష్యయజ్ఞం అంటారు. ఇది ఒక విధమైన "సోషలిజం". 'అందరూ సుఖపడాలి' అనే తత్త్వం ఇందులో మనకు గోచరిస్తుంది. ఇతరులకు పెట్టకుండా తినే తిండి అతి నికృష్టమైనదిగా భారతీయ ఋషులు భావించటంలోని సామాజికదృష్టిని మనం గుర్తించి "అతిసంచయేచ్ఛ" వదలుకొనటం కర్తవ్యమని ఇటువంటి అంశాలవలన తెలిసివస్తుంది.

"దానే నారాతీనపానుదన్త" అని మహానారాయణోపనిషత్తు చెప్తుతున్నది. దానంతో శత్రువులు తొలగిపోతారట.

**తే. అప్పటికి వారు లేకున్న నగ్రమగ్ని । ముఖమునందైన నిడునది సఖుల బంధు**
**జనుల నతిథుల గురుల భోజనవిధాన । తృప్తులుగఁ జేసి బలివిధిఁ దీర్పవలయు. 339**

**ప్రతిపదార్థం:** అప్పటికిన్= ఆ సమయానికి; వారు= యాచకులైన ఆ విప్రులు; లేక+ఉన్నన్= లేకపోతే; అగ్రము= అన్నంలో మొదటి భాగాన్ని; అగ్నిముఖమునందున్= హోమంలో; ఐనన్= అయినా; ఇడునది= ఉంచాలి; సఖులన్= మిత్రములను; బంధు జనులన్= చుట్టాలను; అతిథులన్= భోజనం వేళకు వచ్చిన అన్నార్థులను; గురులన్= గురువులను; భోజన విధాన తృప్తులుగన్= అన్నం పెట్టటంచేత తృప్తిపడిన వారినిగా; చేసి= కావించి; బలివిధిన్= బలికార్యాన్ని; తీర్పవలయున్= తీర్చాలి.

**తాత్పర్యం:** భోజనసమయానికి విద్యావంతులైన బ్రాహ్మణోత్తములు రాకపోతే వండిన పదార్థాలలో ముందు భాగాన్ని హోమకుండంలోనైనా వేయాలి. తరువాత మిత్రులను, చుట్టాలను, అతిథులను, గురువులను అన్నంపెట్టి తృప్తిపరచాలి. పిదప బలికార్యం చేయాలి.

**విశేషం:** బలికార్యం అంటే పక్షులకు, పశువులకు అన్నంలో కొంతభాగం ఇవ్వాలని భావన. దీనిని తరువాత వివరిస్తున్నారు.

**వ. బలు లుభయ ప్రకారంబులు; వానియందు ధర్మాధర్మౌషధి వనరక్షోజనాది విషయంబైన శ్రౌతబలి యేను మున్ను నిర్దేశించినది; యిప్పుడు చెప్పినయది పశుపక్షి చండాల ప్రభృతి గోచరంబగు స్మార్తబలి' యని నిర్దేశించి వెండియు. 340**

**ప్రతిపదార్థం:** బలులు= 'బలి' అనేది; ఉభయ ప్రకారంబులు= రెండు విధాలైనవి; వానియందున్= వానిలో; ధర్మ+అధర్మ+ఓషధి వన, రక్షస్, జన+ఆది విషయంబు= ధర్మానికి అధర్మానికి; ఓషధులు, అడవులు, రక్షస్సులనే జనాలు మొదలైనవాటికి సంబంధించినది; ఐన= అయిన; శ్రౌతబలి= శ్రుతి - వేదం చెప్పిన బలి; ఏను= నేను; మున్ను= ముందు; నిర్దేశించినది=

చెప్పినది; ఇప్పుడు; చెప్పినయది= చెప్పినది; పశు పక్షి చండాల ప్రభృతి గోచరంబు= జంతువులు, పక్షులు, చండాలురు మొదలైనవారికి సంబంధించినది; అగు= అయిన; స్మార్తబలి= స్మృతి, ధర్మశాస్త్రం చెప్పిన బలి; అని, నిర్దేశించి= చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** బలులు రెండు రకాలు. వాటిలో ఇదివరకు నేను చెప్పిన శ్రౌతబలి. అది ధర్మానికి, అధర్మానికి ఓషధులకు, అడవులకు, రక్షస్సులకు మొదలైన వాటికి సంబంధించినది. ఇప్పుడు చెప్పినది స్మార్తబలి. ఇది పశువులకు, పక్షులకు, చండాలురు మొదలైన వారికి సంబంధించినది - అని వివరించి ఇంకా ఇట్లా చెప్పింది.

**విశేషం:** వైశ్వదేవానికి పూర్వం ఒక బలి తరువాత ఒక బలి అని చెప్పారు. వాటి విభాగం విషయాన్ని ఇక్కడ చక్కగా వివరించారు.

**ఆ. వినుగృహస్థధర్మవిధ మిది యీ భంగి । నడపి పిదప భోజనంబు సేయ**
**వలయు విప్రుఁ డిట్టి వాఁడొందు నిహపర । సౌఖ్యసంపదలఁ బ్రశస్తచరిత!' 341**

**ప్రతిపదార్థం:** ప్రశస్తచరిత!= కొనియాడబడిన ప్రవర్తన కలవాడా!; విను= వినుము; గృహస్థ ధర్మ విధము= గేస్తుని ధర్మపు పద్ధతి; ఇది; ఈ భంగిన్= ఈ పద్ధతిని; నడపి= సాగించి; పిదపన్= పిమ్మట; విప్రుఁడు= విద్యావంతుడు; భోజనంబు+ చేయవలయున్= భోజనం చేయాలి; ఇట్టివాఁడు= ఇటువంటివాడు; ఇహ పర సౌఖ్య సంపదలన్= ఈ లోకపు పరలోకపు సుఖాల సంపదలను; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** సత్ప్రవర్తన కల ఓ కృష్ణా! ఇది గృహస్థధర్మం. ఈ పద్ధతిని సాగించి విప్రుడు భోజనం చేయాలి. ఇట్టివాడు ఇహపరసుఖాలను పొందుతాడు.'

**విశేషం:** ఇది భూదేవి కృష్ణుడికి చెప్పినమాట. తరువాతి పద్యంలో కృష్ణు డట్లా చేశాడని చెప్తున్నారు. కాబట్టి ఇక్కడ విప్రశబ్దం విశేషార్థంలో - 'ఉత్తమ జ్ఞానవృద్ధుడు' - అనే అర్థంలో వాడినట్లు గుర్తించాలి.

**క. అని చెప్పినఁ గృష్ణుఁడు నె । మ్మన మలర గృహస్థవిధి సమాచరణము ని**
**ష్ఠ నడపెఁ గర్మ శ్రద్ధా । ఘన! నీవును నట్ల నడపు గార్హస్థ్యంబున్. 342**

**ప్రతిపదార్థం:** అని; చెప్పినన్= చెప్పగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; నెఱ+మనము= నిండు హృదయం; అలరన్= సంతోషింపగా; గృహస్థ విధి సమాచరణము= యజమానధర్మపు ఆచారాలను; నిష్ఠన్= పట్టుదలతో; నడపెన్= నడిపాడు; కర్మ శ్రద్ధాఘన!= కర్మములయందు శ్రద్ధచేత గొప్పవాడా!; నీవును= నీవు కూడా; అట్లు+అ= అట్లాగే; గార్హస్థ్యంబున్= గృహస్థధర్మాన్ని; నడపు= సాగించుము.

**తాత్పర్యం:** అని చెప్పగా కృష్ణుడు హృదయంలో ఎంతో సంతోషించి గృహస్థధర్మ ఆచారాలను నిష్ఠతో నిర్వహించాడు. ధర్మరాజా! నీవు కూడా కర్మశ్రద్ధ అధికంగా కలవాడవు కనుక గృహస్థధర్మాన్ని చక్కగా నిర్వహించుము.

**విశేషం:** నిజానికి కృష్ణుడికి ఈ లౌకికధర్మాలతో పని లేదు. కాని లోకసంగ్రహంకొరకు, లోకులకు ప్రమాణబుద్ధి ఏర్పడటం కొరకు ఆచరించినట్లు చెప్పినారని మనం గ్రహించాలి. "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః" అనే గీతావాక్యం ఇట స్ఫురించాలి.

**క. అది దురితనిరాసము న । భ్యుదయానందంబు జేయుఁ బుణ్యయశస్సం**
**పద నిచ్చు నూర్ధ్వలోక । ప్రదమగు దానిఁ గొనియాడు భరతవరేణ్యా!' 343**

**ప్రతిపదార్థం:** భరతవరేణ్యా!= భరతవంశంలో శ్రేష్ఠుడా!; అది= ఆ గృహస్థధర్మం; దురిత నివాసము= పాపాలను పోగొట్టేది; అభ్యుదయ+ఆనందంబున్= శుభంతో కూడిన ఆనందాన్ని; చేయున్= కలిగిస్తుంది; పుణ్య యశస్+సంపదన్= పుణ్యమైన కీర్తి అనే సంపదను; ఇచ్చున్= ఇస్తుంది; ఊర్ధ్వ లోక ప్రదము= పై లోకాలను భద్రంగా ఇచ్చేది; అగున్= అవుతుంది; దానిన్= అట్టి గృహస్థ ధర్మాన్ని; కొనియాడు= మనస్సులో ప్రశంసించుము.

**తాత్పర్యం:** ధర్మజా! గృహస్థధర్మం పాపాలను పటాపంచలు చేస్తుంది. ఈ లోకంలో శుభాలన్నీ కూర్చి ఆనందం కలిగిస్తుంది. పవిత్రమైన కీర్తి అనే సంపదను ప్రసాదిస్తుంది. పుణ్యలోకాలను చక్కగా కూరుస్తుంది. కనుక దానిని గొప్పగా భావించుము'.

**విశేషం:** నాలుగు ప్రయోజనాలను ఇక్కడ చెప్తుతున్నారు. 1.పాపాలు పోవటం; 2. ఐహిక ఆనందం కలగటం; 3.పుణ్యకీర్తి లభించటం; 4. ఉత్తమలోకాలు సిద్ధించటం. ఇవి ఒక దానికొకటి కారణకార్యసంబంధం కలవి. కొనియాడటమంటే దాని మహిమను ఎల్లప్పుడు భావిస్తూ ఆచరిస్తూ ఉండటం అనే అర్థాన్ని భావించాలి.

**వ. అని యిట్లు భీష్ముండు భీమాగ్రజునకు గృహస్థ ధర్మప్రకారం బెఱింగించెనని చెప్పుటయు నప్పౌరవకులోత్తముల సంప్రశ్నోత్తరంబులు మఱి యెత్తెఱంగునం జెల్లెం? జెప్పవే యనుటయు. 344**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; భీష్ముండు= భీష్ముడు; భీమ+అగ్రజునకున్= భీముడి అన్న అయిన ధర్మరాజునకు; గృహస్థధర్మ ప్రకారంబు= గృహస్థుడి ధర్మపు విధానం; ఎఱింగించెన్= తెలిపాడు; అని; చెప్పుటయున్= చెప్పగా; ఆ+పౌరవ కుల+ ఉత్తముల సంప్రశ్న+ఉత్తరంబులు= పూరువంశంలో అతిశ్రేష్ఠులగు ఆ ధర్మరాజ శాంతనవుల మంచి ప్రశ్నలు, సమాధానములు; మఱి= ఇంకా; ఏ+తెఱంగున్= ఏ విధంగా; చెల్లెన్= సాగెను; చెప్పవే= దయచేసి తెల్పుము; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** అని ఈ విధంగా భీష్ముడు ధర్మరాజునకు గృహస్థాశ్రమ ధర్మవిధానం చెప్పాడని చెప్పగా జనమేజయుడు ఇంకా ఆ పూరువంశ శ్రేష్ఠుల ప్రశ్నసమాధానములు ఏ విధంగా సాగాయో తెల్పుమని కోరాడు.

**విశేషం:** అది పౌరవకులం - పూరు చక్రవర్తి చాలా గొప్ప వ్యక్తి. అతని కులం, అందులో ఉత్తములు - అనటంచేత పాఠకుడు ఎంత అవధానబుద్ధితో వినాలో హెచ్చరిక చేసినట్లయినది. అవి వట్టి ప్రశ్నలు కావు. 'సు' ప్రశ్నలు - మానవ సమాజం చక్కగా భావించదగిన ప్రశ్నలు. 'చెప్పవే' అనేది పరిప్రశ్నరూప ప్రార్థన.

## ఆశ్వాసాంతము

**చ. అపగత కామరోష హృదయాంతర ఖేలన కల్య! నిర్జపా**
**జప మహిత ప్రతైక పర సంగధురాధిక లౌల్య! చంద్రమ**

**స్తపనమయాక్ష! కౌస్తుభనితాంతరుచి స్ఫురితాస్థిదామ దీ**
**ప్తి పటల చారువక్ష! మునిధీస్ఫుట భావిత! దేవ సేవితా! 345**

**ప్రతిపదార్థం:** అపగత కామరోష హృదయ+అంతర ఖేలన కల్య!= తుడిచి పెట్టుకొనిపోయిన కామం, క్రోధం గల హృదయం లోపల ఆడుకొనటంలో నేర్పరీ!; నిర్జపా జప మహిత వ్రత+ఏక పర సంగ ధురా+అధిక లౌల్య!= 'అజపా' మంత్రం జపం చేయటమనే గొప్ప దీక్షలో గొప్ప ఆసక్తికలవారికి సంబంధించిన భారం విషయంలో గొప్ప ఆసక్తి కలవాడా!; చంద్రమస్+తపన మయ+అక్ష= చంద్రుడు, సూర్యుడు అనే రూపాల కన్నులు కలవాడా!; కౌస్తుభ నితాంతరుచి స్ఫురిత అస్థిదామ దీప్తి పటల చారువక్ష!= కౌస్తుభమణి యొక్క గొప్ప కాంతితో విరాజిల్లే ఎముకలదండ దీప్తుల సముదాయంతో అందమైన ఎదురురొమ్ము కలవాడా!; ముని ధీ స్ఫుట భావిత!= మహర్షుల బుద్ధిచేత స్పష్టంగా భావింపబడే దేవా!; దేవ సేవితా!= దేవతలచేత సేవింపబడే ప్రభూ!

**తాత్పర్యం:** స్వామీ! కామక్రోధాదులు లేని హృదయాలలో క్రీడించటంలో నీవు నేర్పరివి. అజపా గాయత్రీమంత్రం జపించటమే గొప్ప వ్రతంగా గలవారి సర్వభారాలు వహించటంలో ఆసక్తి కలవాడవు. చంద్రుడు, సూర్యుడు నీ కన్నులు. కౌస్తుభమహాకాంతులతో తళతళలాడే అస్థిమాలా కాంతులతో అందమైన వక్షస్థలం నీది. మహర్షుల బుద్ధులు నిన్ను చక్కగా భావిస్తాయి. దేవతలందరు నిన్ను సేవిస్తూ ఉంటారు.

**విశేషం:** ఈ విశేషణాలు హరికీ, హరుడికీ సమంగా సరిపోతాయి. కౌస్తుభమణి హరిది, అస్థిమాల హరుడిది. తత్త్వదృష్టితో రెండూ ఒకటే.

'అజపా' గాయత్రీ అని ఒక మంత్రం. అది పరమాత్మను వర్ణిస్తుంది. ఆ జపం చేసేవారి సర్వభారాలను - యోగక్షేమాలను భగవంతుడు ఆసక్తితో వహిస్తాడు.

మునులంటే కేవలం భావనామయంగా భగవంతుడిని దర్శించేవారు. వాక్కులు, మనస్సు అతడిని అందజాలవని శ్రుతి చెప్పుతున్నది కదా!

**క. సత్త్వాధిష్ఠాన కృత శు । భత్త్వ ప్రకటాభిధాన! భక్తాధీనా!**
**తత్త్వం పదార్థరూపా! తత్త్వ సదనదీప! ధూత దైత్యాటోపా! 346**

**ప్రతిపదార్థం:** సత్త్వ= సత్త్వగుణానికి; అధిష్ఠాన= ఆధారం కాబట్టి; కృత= చేయబడిన; శుభత్వ= మంగళాన్ని; ప్రకట= తెలియజేసే; అభిదాన!= పేరుగలవాడా!; భక్త+అధీనా!= భక్తులకు వశమైనవాడా!; తత్+త్వం పదార్థరూపా!= అది నీవు అనే పదాల అర్థమైనవాడా!; తత్త్వసదనదీప!= బ్రహ్మ భావమనే మహాగృహానికి దీపమైనవాడా!; ధూత దైత్య+ఆటోపా!= ఎగురగొట్టబడిన దైత్యుల గర్వం కలవాడా!

**తాత్పర్యం:** స్వామీ! నీ పేర్లు సత్త్వగుణానికి ఆధారాలు. వాటివలన మానవులకు కలిగే శుభాలను స్పష్టం చేస్తూ ఉంటాయి. నీవు భక్తులకు వశం అయినవాడవు. 'తత్' "త్వం" అనే పదాలకు అర్థమైనవాడవు నీవు. బ్రహ్మభావ భవనానికి నీ వొక మహాదీపం. దైత్యుల మిడిసిపాటును తుక్కుదూగరగా కొట్టివేస్తావు.

**విశేషం:** భగవంతుడి పేర్లన్నీ - శివనామాలుగానీ, విష్ణునామాలుగానీ సత్త్వగుణంతో నిండారి, శుభాన్ని కలిగిస్తూ ఉంటాయి. అందుకే ఆ నామాలను పారాయణ చేస్తూ ఉంటారు.

అటువంటి భక్తులకు భగవంతుడు వశమై పోతాడు. నిజానికి భగవంతుడు మహావిషయం. భక్తుడు అల్పవిషయం. అయినా భగవంతుడు భక్తుడి వశంలో ఉండటానికి ఇష్టపడతాడు. వాత్సల్యపూర్ణుడైన తండ్రి సర్వసమర్థుడై ఉండి కూడా కుమారుడిని వీపుమీద ఎక్కించుకొని మోసినట్లు ఈ అంశాన్ని సంభావించాలి. తత్ - ఆ పరమాత్మ; త్వమ్ - నీవు - జీవుడు, ఈ రెండూ జ్ఞానానికి ఒకటే. నీవే బ్రహ్మవు అని వేదాలు ఘోషిస్తూ ఉన్నాయి.

'తత్' అంటే బ్రహ్మపదార్థం - 'తత్త్వం- అంటే బ్రహ్మపదార్థ భావన. దానికి పరమాత్మ దీపం - అంటే బ్రహ్మము సంగతి నరుడికి తెలియజేప్పే జ్ఞానం కలవాడని భావం.

దైత్యులు - అంటే అఖండ చైతన్యాన్ని గుర్తించలేక ఖండబుద్ధితో అల్పాత్ములైనవారు. వారి గర్వాన్ని నాశనంచేయటమంటే అల్పజ్ఞానాన్ని ముక్కలుగా చేసి వేయటం.

**మాలిని :**

**జగదవన వినోదా! సత్యజాత ప్రమోదా!**
**సగుణ విగుణ భంగీ! సంయమారామ సంగీ!**
**విగత వికృత మూర్తీ! విశ్వభూత ప్రవర్తీ!**
**సుగమగహన భూమా! సోమపింఛాభిరామా!** **347**

**ప్రతిపదార్థం:** జగత్+అవన వినోదా!= లోకాల రక్షణం చేయటమే వినోదం అయినవాడా!; సత్య జాత ప్రమోదా!= సత్యం నుండి పుట్టిన పరమానందం కలవాడా!; సగుణ విగుణ భంగీ!= సగుణం, విగుణం అనే రెండు పద్ధతులు కలవాడా!; సంయమ+ఆరామ సంగీ!= ఇంద్రియ నిగ్రహం అనే ఉద్యానవనంతో (సంగం) సంబంధం కలవాడా!; విగత వికృత మూర్తీ!= పోయిన వికారాలుగల స్వరూపం కలవాడా!; విశ్వ భూత ప్రవర్తీ!= సమస్త భూతములను ప్రవర్తింపజేయువాడా! సుగమగహన భూమా!= తేలికగా పొందదగినదీ, పొందరానిదీ, అయిన మహిమ కలవాడా!, సోమ ఫింఛ+అభిరామా!= చంద్రుడు, నెమలి పింఛములతో అందమైనవాడా!

**తాత్పర్యం:** దేవా! నీకు లోకాలను రక్షించటమే వినోదం. సత్యగుణం నుండి పుట్టిన ఆనందం నీ స్వరూపం. సగుణం, విగుణం అనే రెండు పద్ధతులు నీకు ఉన్నాయి. ఇంద్రియాలపై నిగ్రహం అనే పూలతోట నీ నెలవు. నీకు ఏ వికారాలూ లేవు. సర్వప్రాణులు, స్థావరాలు నీవలననే ప్రవర్తిస్తున్నాయి. నీ మహిమ కొందరకు సులభం, కొందరకు దుర్లభం. నీవు చంద్రుడిని, నెమలి పింఛాన్ని ధరించి సౌందర్యంతో విరాజిల్లుతున్నావు.

**విశేషం:** అవనం - రక్షణ. ఇందులో సృష్టి, పోషణ, వినాశం అన్నీ ఉన్నాయి. సృష్ట్యాదులు పరమాత్మకు వినోదాలు.

సత్యజాత ప్రమోదా! - వస్తూ పోతూఉండే ఆనందం అసత్యజ్ఞానంవలన కలుగుతుంది. అది అనిత్యం కనుక ఆపేక్షణీయం కాదు. ఇక పరమాత్మవలన కలిగే జ్ఞానం సత్యంనుండి ఏర్పడుతుంది. 'సత్యం- అంటే సర్వకాల సర్వావస్థలలో సర్వులకూ ఏకాకారంగా ఉండేది.

సుగుణవిగుణ భంగీ! - పరమాత్మ నిజానికి నామరూపాదులు లేనివాడు. నామరూపాదులే గుణాలు. అవి లేని భంగి నిర్గుణం. కాని లీలామాత్రంగా అవతారాలు ధరించి నామరూపాదులతో వ్యవహారం చేస్తాడు. అది సగుణభంగి.

ఇంద్రియాలు ఐహిక విషయాలనే అందిస్తాయి. అది సుఖదుఃఖాత్మకం. ఇక్కడి సుఖం కూడా కేవలం తాత్కాలికం. కాబట్టి నిత్యానందం కావాలంటే ఇంద్రియాలను విషయాలపై ప్రసరింపనివ్వకూడదు. అటువంటి నిగ్రహం కలవారి హృదయమే భగవదారామం. పుట్టటం, పెరగటం, మార్పులు పొందటం, పరిక్షయం పొందటం, నశించటం మొదలైన వికారాలన్నీ జీవలక్షణాలు. దేవుడి కవేవీ ఉండవు. అవి ఉండటం దుఃఖలక్షణం. లేకపోవటం ఆనందలక్షణం.

సుగమగహన భూమా! - పరమేశ్వరుడి మహిమ జ్ఞానం కలవారికి సులభం. అది లేనివారికి దుర్లభం.

స్వామి హరిహరరూపుడు - హరియై నెమలి పింఛాన్ని శిరస్సు మీద అలంకారంగా ధరిస్తాడు. హరుడై చంద్రకళను ధరిస్తాడు. నెమలి పింఛంలో ఎన్నో రంగులు, మురిపించే ఆకారాది విశేషాలు ఉన్నాయి. కనుక అది సృష్టిలో ఉండే సౌందర్యానికి ప్రతీక. అట్లాగే చంద్రరేఖ. అట్టి మహాసౌందర్య ప్రతీకను పరమాత్మ అనంతమైన తన దేహంలో ఒక్క చిన్న ప్రదేశంలో ధరిస్తాడు. అంటే విశ్వసౌందర్యమంతా ఆయనకు ఒక చిన్న ఆభరణంవంటిదని భావం. ఆ ఆభరణంతో ఆ పరమాత్మ సమస్త ప్రాణికోటికి ఆనంద ప్రదాత అవుతాడు.

**గద్యము**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున నానుశాసనిక పర్వంబునందు దృతీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైనది. ఉభయ కవిమిత్రుడని ప్రశస్తిని పొందిన కొమ్మనామాత్యపుత్రుడూ, పండితులను సేవించటం వలన ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలో ఆనుశాసనిక పర్వంలో మూడవ ఆశ్వాసం.

ఆనుశాసనిక పర్వంలోని మూడవ ఆశ్వాసం సమాప్తం.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - చతుర్థాశ్వాసము

**శ్రీ పరమ మహిమనిశ్చల । తాపాదనకేళి కౌతు కాతిశయ మనో**

**వ్యాపారనిరూఢ స్తు । త్యాపాంగవిలాస లలిత! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= లక్ష్మి, విషం అనే వాని; పరమ= గొప్పదైన; మహిమ= అతిశయం చేత; కలిగిన; నిశ్చలతా= కదలిక లేనితనాన్ని; ఆపాదన= కలిగించునట్టి; కేళి= ఆటయందు; కౌతుక= వేడుకయొక్క; అతిశయ= ఎక్కువతనం గల; మనస్, వ్యాపార= భావన అనే పనిచేత; నిరూఢ= సుస్థిరమైన; స్తుత్య= కొనియాడదగిన; అపాంగ= కడగంటి చూపుయొక్క; విలాస= లీలచేత; లలిత= మనోహరమైన వాడా!; హరిహరనాథా!= హరిహరనాథదేవా!

**తాత్పర్యం:** స్వామీ! లక్ష్మిని, విషాన్ని ధరించి నీవు మోహం (నిశ్చలత) పొందావు. అది నీకొక క్రీడ. దానివలన నీ మనోవ్యాపారం ఏ కొంచెమూ చలనం లేనిదయింది. దానితో నీ కడగంటి చూపులలో ఏదో వర్ణింపరాని సౌందర్య విలాసం తాండవిస్తున్నది.

**విశేషం:** అలం: శ్లేష. సగం మూసిన పరమాత్మ కన్నులు పరమ మనోహరంగా ఉన్నాయి. ఆ మనోహరతకు కారణం అయనకు కలిగిన స్తబ్ధతగా కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు. ఆ స్తబ్ధత హరి లక్ష్మిని, హరుడు కాలకూటాన్ని ధరించిన కారణంగా ఏర్పడినట్లు కూడా ఊహిస్తున్నాడు. అయితే ఇది భగవంతుడికి ప్రమోదం. అదే సాధారణ మానవుడికైతే ప్రమాదం.

### ధూపదీపనైవేద్యంబుల ఫలవిశేషము భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట (సం.13-155-1(కుంభ))

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ప్రభూ!; వైశంపాయనుండు= వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయ మహారాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ప్రభూ! వైశంపాయన మహర్షి జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**తే. అట్లు గృహమేధి ధర్మతత్త్వావగమము । దనకుఁ గలుగంగఁ జేసిన తాత కెఱఁగి**

**మనుమఁ డూర్జితభక్తియు వినయగౌర । వంబు సమధికతావైభవంబుఁ బొంద. 3**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తనకున్= తనకు; గృహమేధి; ధర్మ, తత్త్వ+అవగమము= గృహస్థుడి ధర్మాల తత్త్వం చక్కగా తెలియటం; కలుగంగన్+చేసిన తాతకున్= కలుగజేసిన తాత భీష్ముడికి; ఎఱఁగి= మ్రొక్కి; మనుమఁడు= మనుమడైన

ధర్మరాజు; ఊర్జిత భక్తియున్= గొప్పదైనభక్తీ; వినయ గౌరవంబున్= వినయంతో కూడిన గౌరవమూ; సమధికతా వైభవంబున్= మిక్కిలి ఎక్కువ కావటంలోని గొప్పతనాన్నీ; పొందన్= పొందగా.

**తాత్పర్యం:** ఆ విధంగా తనకు గృహస్థధర్మంయొక్క నిజస్వరూపం చక్కగా తెలియజేసిన తాతకు (మ్రొక్కి మనుమడు ధర్మరాజు మహాభక్తీ, వినయగౌరవమూ చాలా ఎక్కువ కాగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఎఱఁగి - ప్రణిపాతం శాస్త్రం విధించిన మర్యాద, జ్ఞానదాతలకు సమయానుగుణంగా మ్రొక్కటం కర్తవ్యం. 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' - 'జ్ఞానాన్ని ప్రణిపాతంచేతా, పరిప్రశ్నచేతా, సేవచేతా తెలిసికొమ్ము' అంటుంది గీత.

**వ. 'మహాత్మా! సుమనోధూపదీప నైవేద్యంబు లుత్తమం బులగు పూజాసాధనంబు లని వానింగొని దేవతలం బూజింతురు; తద్విశేషం బెఱింగింపవే' యని యడుగుటయు నం డాదరభరితుం డయి 'దీని శుక్రుండు బలి దానవేంద్రునకు బలి మనువునకు, మనువు సువర్ణుండను తపోధనునకు సువర్ణుండు నారదునకుం జెప్పి, రప్పరమముని నాకుం జెప్పె నత్తెఱంగు సెప్పెద నాకర్ణింపు' మని పలికి యప్పుడమితేని కిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** మహాత్మా!= గొప్ప బుద్ధి విశేషం గల మహానుభావా! సుమనస్+ధూప, దీప, నైవేద్యంబులు= పూలు, పొగ వేయటమూ, దీపమూ, ఆహారం సమర్పించటమూ; ఉత్తమంబులు= మేలయినవి; అగు పూజాసాధనంబులు= అయిన పూజా వస్తువులు; అని; వానిన్= వానిని; కొని= గ్రహించి; దేవతలన్= దేవతలను; పూజింతురు= పూజ చేస్తారు; తత్+విశేషంబు= వాని మహిమను; ఎఱింగింపవే= దయతో చెప్పుము; అని; అడుగుటయున్= అడుగగా; అతండు= ఆ భీష్ముడు; ఆదరభరితుండు= ఆదరంతో నిండినవాడు; అయి; దీనిన్= ఈ విషయాన్ని; శుక్రుండు= రాక్షసగురువైన శుక్రాచార్యుడు; బలి, దానవ+ఇంద్రునకున్= బలి అనే రాక్షసరాజుకూ; బలి= ఆ బలి చక్రవర్తి; మనువునకున్= మనువునకూ; మనువు= ఆ మనువు; సువర్ణుండు= సువర్ణుడు; అను= అనే; తపస్+ధనునకున్= తపస్సు ధనంగా గల ఒక ఋషికీ; సువర్ణుండు= సువర్ణుడు; నారదునకున్= నారదమహర్షికీ; చెప్పిరి= ఉపదేశించారు; ఆ+పరమముని=ఆ మహర్షి; నాకు; చెప్పెన్= బోధించాడు; ఆ+తెఱంగు= ఆ విధానాన్ని; చెప్పెదను= చెబుతాను; ఆకర్ణింపుము= శ్రద్ధగా చెవులొగ్గి వినుము; అని; పలికి= మాట్లాడి; ఆ+పుడమి ఱేనికిన్= ఆ రాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'మహాత్మా! పూలు, ధూపమూ, దీపమూ, నైవేద్యమూ మేలైన పూజా సాధనాలని వానితో దేవతలను పూజిస్తారు. వాటి విశేషం చెప్పవా?' అని ధర్మరాజు అడిగితే భీష్ముడు ఆదరంతో నిండినవాడై 'ఈ విషయాన్ని శుక్రుడు బలికీ, అతడు మనువునకూ, అతడు సువర్ణుడనే తాపసికీ, అతడు నారదుడికీ చెప్పారు. ఆ మహర్షి నాకు చెప్పాడు. అది నీకు చెప్పుతాను. శ్రద్ధగా వినుము' అని ఆ రాజునకు ఇలా చెప్పాడు.

**విశేషం:** ఈ విషయాన్ని ఎవరు ఎవరికి చెప్పారో ఇక్కడ చెబుతున్నారు. దీనినే సంప్రదాయం అంటారు. ఇందులో బలి - రాక్షసుడు, మనువు- మానవమూల పురుషుడు, సువర్ణుడు తపోధనుడు అంటే మానవులలో అతిశ్రేష్ఠుడు. నారదుడు దేవర్షి - అంటే ఇది అన్ని జాతులవారికి, అన్ని లోకాలవారికీ మానవులలో సామాన్యులకూ, సర్వశ్రేష్ఠులకూ సంబంధించిన మహావిషయం - అనే హెచ్చరిక తెలియవస్తున్నది.

**సీ. 'ఓషధు లమృత మయ్యుత్తమ వస్తు సం । తతిలోనఁ బుష్పవంతములు మేలు;**

**పుష్పముల్ గొని సురపూజ లొనర్చిన । మానవులకు మంచి మనసు గలుగు;**

**నట్లు గావున సుమనోఽభిధానము పుష్ప । ములకయ్యెఁ దద్ద్రవ్యపూజ లిచ్చు**

**నరుల కోర్కులు సుమనస్కతఁ దీర్చుట । నమరులు సుమనస్కు లనఁగఁ జనిరి;**

**ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక । భూరుహాదులందుఁ బుట్టినట్టి**

**పుష్పములఁ బ్రియంబుఁ బొంది కైకొంద్రు, ని । ర్జరులు పూజనములఁ గురువరేణ్య! 5**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశంలో ఎన్నదగినవాడా!; ఓషధులు= ఒకజాతి చెట్లు; అమృతము= అమృతం వంటివి; ఆ+ఉత్తమ వస్తు సంతతిలోనన్= ఆ మేలైన వస్తు సముదాయంలో; పుష్పవంతములు= పూలు కలవి; మేలు= గొప్పవి; పుష్పముల్= పూవులను; కొని= గ్రహించి; సురపూజలు= దేవతల పూజలు; ఒనర్చినన్= చేస్తే; మానవులకున్= మనుష్యులకు; మంచి మనసు= మంచిదైన హృదయం; కలుగున్= కలుగుతుంది; అట్లు= ఆ విధం; కావునన్= అవటంచేత; పుష్పములకున్= పూవులకు; సుమనస్+అభిధానము= 'సుమనస్సు' అనే పేరు; అయ్యెన్= ఏర్పడింది; తత్+ద్రవ్య, పూజలు= ఆ వస్తువులతో పూజలు; ఇచ్చు, నరుల కోర్కులు= ఇచ్చే మానవుల కోరికలను; సుమనస్కతన్= మంచి మనస్సు ఉండటంతో; తీర్చుటన్= తీర్చటంచేత; అమరులు= దేవతలు; సుమనస్కులు= మంచి మనస్సు కలవారు అనే అర్థంగల సుమనస్కులు; అనఁ గన్+చనిరి= అన్న పేరు కలవారయ్యారు; కంపు= మంచి వాసనా; రూపున్= చక్కని అందమూ; తెలుపున్= తెల్లదనమూ; కలిగి= కలిగి; అకంటక, భూరుహ+ఆదులందున్= ముళ్ళులేని చెట్లు మొదలగు వానియందు; పుట్టిన+అట్టి, పుష్పములన్= పుట్టిన పూవులతో; ప్రియంబున్= ప్రేమను; పొంది; నిర్జరులు= దేవతలు; పూజనములన్= పూజలను; కైకొంద్రు= గ్రహిస్తారు.

**తాత్పర్యం:** 'కురువరా! ఓషధులు అమృతం వంటివి. ఆ మేలిజాతి వస్తువులలో పూలు పూచే చెట్లు మరింత మేలైనవి. పూలతో దేవతలను పూజించే నరులకు మంచి మనస్సు కలుగుతుంది. కనుకనే పూలకు 'సుమనస్సులు' అనే పేరు కలిగింది. ఆ వస్తువులతో పూజించే మానవుల కోర్కెలను మంచి బుద్ధితో తీరుస్తారు కనుక దేవతలకు కూడ 'సుమనస్కులు' అనే పేరు కలిగింది. మంచి వాసనా, మంచి రూపమూ, తెల్లదనమూ కలిగి ముళ్ళు లేని చెట్లనుండీ, తీగెలనుండీ పువ్వులను గ్రహించి పూజ చేస్తే దేవతలు ప్రియమంది ఆ పూజలను గ్రహిస్తారు.

**విశేషం:** ఓషధులు అంటే మందుచెట్లు. పువ్వులలో ఔషధగుణాలు చాలా ఉంటాయి. అందుకనే ఫ్లోరల్ మెడిసిన్స్ వ్యాప్తిలోకి వచ్చాయి. ప్రాచీనులు పూలలోని ఔషధీయ గుణాలను కనిపెట్టి, మనుష్యులకు వాటితో ఎక్కువ సాంగత్యం కలగటం కోసం పూజాద్రవ్యాలుగా నిర్ణయించారు. పుష్పంలో వికసించే గుణాన్నీ, వాసననూ, అందాన్ని చూస్తూ ఉండే మనిషి ఎల్లప్పుడూ వాటినే భావించటం చేత మంచి గుణాలు కలవాడవటం సహజం. ఆ దృష్టితో పూలను 'సుమనస్సులు' అనటం చాలా గొప్ప విషయం. 'కంపు' అనే పదాన్ని ప్రాచీన కాలంలో 'సువాసన' అనే అర్థంలో వాడారు. ఇప్పుడు అది దుర్వాసనకు పర్యాయపదం అయింది. భూరుహ ఆదులలో తీగలు, చిన్నచెట్లు ఉంటాయి. సాధారణంగా శరీరం లోపలికి వెళ్ళకుండా ఆరోగ్యాన్నీ, తుష్టినీ, పుష్టినీ కలిగించే పూలు గొప్పవనటంలో ఆశ్చర్యం లేదుకదా!

**క. నలినంబులు జాజులునుం । దులసీదళములుఁ బ్రభూతతోషము గీర్వా**

**ణులకుం జేయును, యక్షా । దులకు జలోద్భవము లెల్లఁ దుష్టి యొనర్చున్. 6**

**ప్రతిపదార్థం:** నలినంబులు= తామరపూలూ; జాజులునున్= జాజిపూలూ; తులసీదళములున్= తులసీదళాలు; గీర్వాణులకున్= దేవతలకు; ప్రభూత తోషమున్= మిక్కిలి ఎక్కువ ఆనందాన్ని; చేయును= కలిగిస్తాయి; యక్ష+ఆదులకున్= యక్షులు మొదలైనవారికి; జల+ఉద్భవములు= నీటిలో పుట్టిన పూలు; ఎల్లన్= అన్నీ; తుష్టి= ఆనందాన్ని; ఒనర్చున్= చేస్తాయి.

**తాత్పర్యం:** తామరలూ, జాజులూ, తులసీదళాలు దేవతలకు పరమానందం కలిగిస్తాయి. నీటిపూలు యక్షులు మొదలగు వారికి సంతోషం కూరుస్తాయి.

**విశేషం:** తులసీదళములు - సాధారణంగా మూడు ఆకుల సముదాయంగా ఉన్నవానిని 'దళాలు' అంటారు. జలోద్భవములు- నీటిపూలు - పైన తామరలను చెప్పారు కనుక తక్కిన నీటి పూలను ఈ పదంచేత గ్రహించాలి. యక్ష+ఆదులు= యక్షులు, కిన్నరులు, కింపురుషులు, రక్షస్సులు, భూతములు, విద్యాధరులు, అప్సరసలు, గంధర్వులు మొదలైనవారిని దేవయోనులు అంటారు. Semi Gods అని వీరికి వ్యవహారం. మనుజులకంటె కొంచెం పై స్థాయికి, దేవతలకంటె క్రింది స్థాయికి చెందిన వారు.

**క. అరుణంబులును సకంటక । తరుభవములుఁ గటుకగంధధామములు నొన**

**ర్తురు శాత్రవాభిచారిక । కరణమున నథర్వమాంత్రికతఁ గుసుమంబుల్. 7**

**ప్రతిపదార్థం:** అరుణంబులును= ఎఱ్ఱనివీ; సకంటక, తరు, భవములున్= ముళ్ళుగల చెట్లనుండి పుట్టినవీ, కటుకగంధ ధామములు= ఘాటైన వాసనలకు తావు అయినవీ; అయిన; కుసుమంబుల్= పూవులను; అథర్వమాంత్రికతన్= అథర్వవేదపు మంత్రాల సంబంధంతో; శాత్రవ+ఆభిచారిక, కరణమునన్= పగవారిని పరిమార్చు ప్రయోగాలలో; ఒనర్తురు= ఉపయోగిస్తారు.

**తాత్పర్యం:** ఎఱ్ఱనివీ, ముళ్ళచెట్లనుండి పుట్టినవీ, ఘాటైన వాసన కలవీ అయిన పువ్వులను క్షుద్రప్రయోగాలలో అథర్వమంత్రాల కూర్పుతో ఉపయోగిస్తారు.

**విశేషం:** అభిచారిక కరణము - చేతబడి మొదలైన క్షుద్రప్రయోగాలు. పగవారిని రూపుమాపే క్షుద్రమంత్రాలు అథర్వవేదంలో ఉన్నాయని చెప్తుతారు. క్షుద్రప్రయోగాలలో ఉపయోగించేవాటిని దేవతాపూజలకు వినియోగించరాదని ఇక్కడ సూచన.

**తే. భూతరక్షోగణములకు భూపవర్య! తీక్ష్ణగంధపుష్పంబులు తృప్తిఁజేయు**

**నలుపుఁదెలుపుఁ గలిగి పరిమళసుకాంతి । భరితములు నగు పువ్వులు నరుల మెచ్చు. 8**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజా!; తీక్ష్ణ, గంధ పుష్పంబులు= ఘాటైన వాసన గల పూలు, భూత, రక్షస్+గణములకున్= భూతముల, రక్షస్సుల గణాలకు, తృప్తిన్ చేయున్= తృప్తిని కలిగిస్తాయి; నలుపున్= నల్లదనమూ; తెలుపున్= తెల్లదనమూ; కలిగి= ఉండి; పరిమళ, సుకాంతి, భరితములు= మంచివాసనా, చక్కని కాంతీ అనే వాటితో నిండినవి; అగు పువ్వులు= అయిన పూలు; నరులమెచ్చు= నరులకు ఇష్టమైనవి.

**తాత్పర్యం:** రాజా! ఘాటైన వాసనగల పూలు భూతాలకు, రక్షస్సులకూ ప్రీతిగొలుపుతాయి. నలుపు, తెలుపూ గలిగి మంచి వాసనా, కాంతి ఉన్న పూలు మనుష్యులకు ఇష్టం అయినవి.

**విశేషం:** పూవులయందలి ఇష్టానిష్టాన్ని బట్టి మనుష్యులలోనే ఎవరు ఏ వర్గానికి చెందిన వారో నిర్ణయింపవచ్చును.

**క. విను దేవాలయమునఁ బిత్రు । వనమునఁ బుట్టు కుసుమములు వలదు వివాహం**

**బునకు శాంతికపౌష్టిక । వనితాజనరంజనాది వర్తనములకున్. 9**

**ప్రతిపదార్థం:** విను= వినుము; దేవ+ఆలయమునన్= గుడియందూ; పితృవనమునన్= వల్లకాటియందూ; పుట్టు కుసుమములు= పుట్టే పువ్వులు; వివాహంబునకున్= పెండ్లికీ; శాంతిక, పౌష్టిక, వనితా, జన, రంజన+ఆది, వర్తనములకున్= శాంతికర్మలకు; పుష్టికర్మలకూ; స్త్రీలను ఆనందపరచటం మొదలైన పనులకూ; వలదు= వద్దు.

**తాత్పర్యం:** రాజా! వినుము. దేవాలయంలో, వల్లకాటిలో పుట్టిన పూలను పెండ్లిండ్లకూ, శాంతికర్మలకు, పుష్టికర్మలకూ, స్త్రీలను ఆనందపరచే పనులకూ ఉపయోగించవద్దు.

**విశేషం:** దేవాలయంలో పువ్వులు దేవతల సొమ్ము. అవి మనం తెచ్చుకుంటే దైవద్రోహం చేసినట్లు. శ్మశానం సర్వాసహ్యానిధానం. అందుకోసం అక్కడి పూలు మనస్సునకు ఉద్వేగం పుట్టిస్తాయి. దేవతలకు, గ్రహాదులకు కోపతాపాలు రాకుండా చేసేవి శాంతిక కర్మలు. ఆయువు, ధనము, ఆరోగ్యమూ మొదలైన వాటి పుష్టికోసం చేసే కర్మలు పౌష్టికాలు.

**తే. కుసుమముల గంధమున దేవకోటి, వాని । దర్శనంబున యక్షులు; దదుపభోగ**
**మున భుజంగప్రతాన మీమూఁడు దెఱఁగు । లను మనుష్యులు ప్రియమందు టనఘ! కలుగు. 10**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; కుసుమముల గంధమునన్= పూలవాసనతో; దేవకోటి= దేవతల సముదాయమూ; వాని, దర్శనంబునన్= వానిని చూడటంచేత; యక్షులు= యక్షులనే దేవజాతివారూ; తత్+ఉపభోగమునన్= వాని అనుభవంచేత; భుజంగ, ప్రతానము= నాగులనే వారి సముదాయమూ; ఈ మూఁడు తెఱఁగులను= ఈ మూడు పద్ధతులద్వారా; మనుష్యులు= మానవులూ; ప్రియము+అందుట= ప్రీతి పొందటం; కలుగున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** అనఘా! పూలవాసనలతో దేవతలు, వాటి దర్శనంతో యక్షులూ, వాటి అనుభవంతో సర్పములూ, ఈ మూడు పద్ధతులతో మానవులు ప్రీతి పొందుతారు.

**విశేషం:** పువ్వులు సర్వజాతులనూ ఏదో ఒక రూపంతో సంతృప్తి పరుస్తాయని భావం. క్రూరతలో పేరుగొన్న పాములు కూడా పూవులవలన ప్రీతి పొందుతాయంటే తక్కిన వాటి సంగతి చెప్పనేల? ఈ విధంగా అర్థాపత్తి అలంకార ధ్వని ఇక్కడ ఉన్నది.

**క. దేవత లర్హ్య కుసుమ పూ । జావిధిఁ బ్రియ మంది యపుడ జనులయెడల సం**
**భావించి వారి కోర్కులు । గావింతురు సఫలములుగఁ గౌరవనాథా! 11**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కౌరవుల రాజా!; దేవతలు= స్వర్గంలో ఉన్నవారు; అర్హ్య, కుసుమ, పూజా, విధిన్= తగిన పూల పూజ అనే పనితో; ప్రియము+అంది= ప్రీతి చెంది; అపుడు+అ= అప్పుడే; జనుల ఎడలన్= జనుల విషయంలో; సంభావించి= మంచి తలపులు ఏర్పరచుకొని; వారి కోర్కులు= వారి కోరికలను; సఫలములుగన్= ఫలవంతాలుగా; కావింతురు= చేస్తారు.

**తాత్పర్యం:** రాజా! దేవతలు తగిన పూలతో చేసిన పూజలతో ప్రీతిచెంది, అప్పటికప్పుడు ఆ జనుల విషయంలో మంచిమనసు కలవారై, వారి కోరికలను ఫలవంతాలుగా చేస్తారు.

**విశేషం:** అపుడ, సంభావించి -। అనే పదాలను జాగ్రత్తగా గమనించాలి. పూలపూజ సద్యఃఫలదాయకం అని భావన.

**తే. సల్లకీజాత నిర్యాస మెల్ల దేవ । తలకు మే లంతకంటె గుగ్గిలము లెస్స**
**యగరు గంధర్వ యక్షోరగాదులకుఁ బ్రి । యంబు ధూపదానము నెడ నధిపవర్య! 12**

**ప్రతిపదార్థం:** అధిపవర్య!= రాజవరేణ్యా!; ధూపదానము+ఎడన్= పొగవేయటం విషయంలో; ఎల్ల దేవతలకున్= దేవతలందరికీ; సల్లకీ, జాత, నిర్యాసము= అందుగు చెట్టునుండి తీసిన పొడి; మేలు= మంచిది; అంతకంటెన్= దానికంటె; గుగ్గిలము= గుగ్గిలం అనే ధూపం పొడి; లెస్స= మేలైనది; అగరు= అగరు; గంధర్వ, యక్ష+ఉరగ+ఆదులకున్= గంధర్వులు, యక్షులు, నాగులు మొదలగువారికి; ప్రియంబు= ప్రీతికరం.

**తాత్పర్యం:** రాజా! ధూపం ఇచ్చే విషయంలో అందుగు చెట్టు నుండి తీసిన పొడి దేవతలందరికీ మేలైనది. దానికంటె గుగ్గిలం మరింత మంచిది. అగరు గంధర్వులకు, యక్షులకు, నాగులకు ప్రీతికరమైనది.

**వ. ధూపదానంబులయందు నధికతరంబు కర్పూరధూపం' బని చెప్పి మఱియును. 13**

**ప్రతిపదార్థం:** ధూపదానంబులయందున్= పొగవేయటంలో; అధికతరంబు= మిక్కిలి ఎక్కువ అయినది; కర్పూరధూపంబు= కప్పురపు పొడి పొగ వేయటం; అని, చెప్పి= తెలిపి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** పొగవేసే విషయంలో అన్నింటికంటె మిన్న అయినది కర్పూరధూపం' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. సమధురమును గటువును దీ । క్ష్ణమునగు గంధముల ధూపకలన వరుస హృ**
**ద్యములు సురయక్ష రక్ష । స్సమితులకును దత్ప్రకారజాతులకు నృపా! 14**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!;సమధురమును= తీయదనం కలదీ; కటువును= కారం కలదీ; తీక్ష్ణమున్= చాలా ఘాటైనదీ; అగు గంధముల, ధూపకలన= అయిన వాసనల పొగ పొడి సంబంధం; వరుసన్= వరుసగా; సుర, యక్ష, రక్షస్+సమితులకును= దేవతలయ, యక్షుల, రక్షస్సుల సముదాయాలకు; తత్, ప్రకార, జాతులకున్= అటువంటి జాతుల వారికీ; హృద్యములు= మనోహరం అయినవి.

**తాత్పర్యం:** రాజా! తీపి, కారం, ఘాటు అయిన ధూపాలు వరుసగా దేవతలకు, యక్షులకు, రక్షస్సులకు అటువంటి జాతులవారికి ప్రీతికరమైనవి.

**తే. తగినయట్టి ధూపము దేవతలకు నిచ్చి । పరమపుష్టియు నాయువుఁ బడయుఁ గర్త**
**యక్ష గంధర్వపన్నగ రాక్షసులును । ధూపమున మెచ్చి కోర్కు లిత్తురు కుమార! 15**

**ప్రతిపదార్థం:** కుమార!= నాయనా!; కర్త - ఆయా పూజలు చేసే వ్యక్తి; దేవతలకున్= దేవతలకు; తగిన+అట్టి, ధూపము= వారివారికి తగిన ధూపం; ఇచ్చి= సమర్పించి; పరమ పుష్టియున్= గొప్ప దేహపాటవాన్నీ; ఆయువున్= ఆయువునూ; పడయున్= పొందుతాడు; యక్ష, గంధర్వ, పన్నగ, రాక్షసులును= యక్షులు, గంధర్వులు, నాగులు, రాక్షసులూ; ధూపమునన్= వారివారికి నిర్దేశించిన ధూపంచేత; మెచ్చి= సంతోషించి; కోర్కులు= కోరికలను; ఇత్తురు= ఇస్తారు.

**తాత్పర్యం:** నాయనా! తగిన ధూపం దేవతలకు వేసి కర్త మిక్కిలి పుష్టినీ, ఆయువునూ పొందుతాడు. యక్షులు, గంధర్వులు, నాగులూ, రక్షస్సులూ ధూపంవలన మెచ్చి, కోర్కెలను సఫలం చేస్తారు.

**విశేషం:** ధూపద్రవ్యాలలో ఉండే విశిష్టమైన ఔషధగుణం వేసినవాడికీ, పరిసరాలలో ఉన్నవారికీ సంక్రమించి వారిలో రోగనిరోధక శక్తిని పెంచటం మొదలైన వానిచేత పుష్టినీ, ఆయువునూ పెంపొందిస్తుందని శాస్త్రీయంగా భావన చేయవచ్చును.

**క. మలయజము నగరు మఱియుం । గలుగు సురభివస్తువులు నికామప్రియదం**

**బులు వైహారికధూపం । బులయెడ మానవులచిత్తములకు నరేంద్రా! 16**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= మానవాధీశా!; వైహారిక ధూపంబుల యెడన్= వేడుకగా వేసుకొనే ధూపాల విషయంలో; మలయజమున్= మంచిగంధమూ; అగరు= అగరు; మఱియున్= ఇంకా; కలుగు వస్తువులు= ఆ విధంగా ఉండే వస్తువులు; మానవచిత్తములకున్= మనుష్యుల హృదయాలకు; నికామ, ప్రియదంబులు= మిక్కిలి ప్రీతిని కలిగించేవి.

**తాత్పర్యం:** రాజా! గంధపుపొడి, అగరు, సాంబ్రాణి వంటి వస్తువులు వేడుకకోసం ధూపం వేసుకొనేవారి హృదయాలకు ఎంతో ప్రీతిని కలిగిస్తాయి.

**విశేషం:** ధర్మం అతిక్రమించని భోగదృష్టి ప్రాచీనుల అభిప్రాయంతో త్యజింపదగినది కాదని దీనివలన గుర్తించవచ్చును.

**ఆ. దైవతార్చ లపుడు తామసభూత ర । క్షోముఖంబు లైన కుత్సితంపు**

**జాతులెల్ల దీపసన్నిధి నడఁగు న । ట్లగుట దీపదాన మధికఫలము. 17**

**ప్రతిపదార్థం:** దైవత+అర్చల+అపుడు= దేవతలను పూజించే సమయాలలో; తామస, భూత, రక్షస్+ముఖంబులు= తమోగుణం కల భూతాలు, రక్షస్సులు మొదలయినవి; ఐన= అయిన; కుత్సితము+జాతులు= చెడు బుద్ధులుగల జాతులు; ఎల్లన్=అన్నీ; దీపసన్నిధిన్= దీపం దగ్గర; అడఁగున్= నశించిపోతాయి; అట్లు= ఆ విధం; అగుటన్= కావటం వలన; దీపదానము= దీపం దేవుడికి ఇవ్వటం; అధికఫలము= ఎక్కువ ఫలం (ఇచ్చేది).

**తాత్పర్యం:** దేవతల పూజలు చేసే సమయాలలో తమోగుణం గల భూతాలు మొదలైన చెడు బుద్ధులతో ఉండే జాతులన్నీ దీపం దగ్గర నశించిపోతాయి. కాబట్టి దీపదానం ఎంతో ఎక్కువ ఫలం కలది అవుతుంది.

**విశేషం:** దేవతలు సత్త్వగుణ ప్రధానులు. రజస్తమోగుణాల విజృంభణగల రక్షఃపిశాచాదులు వారికి ద్రోహం చేయటానికి సిద్ధపడుతూ ఉంటాయి. అవి వినాశనం పొందటానికి దీపం వెలిగిస్తాం. దీపం జ్ఞానానికి ప్రతీక. చీకటి అజ్ఞానానికి ప్రతీక.

**క. ఆలోకదాన మన భూ । పాల! పరఁగు దీప మీగి భావము సద్ధ**

**ర్మాలోకనశీలంబగు । నా లెస్స యొనర్చినట్టి యతనికి నధిపా! 18**

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; దీపము= దీపాన్ని; ఈగి= ఇవ్వటం; ఆలోకదానము= వెలుగును ప్రసాదించటం; అనన్= అనగా; పరఁగున్= ఒప్పుతుంది; అధిపా!=రాజా!; ఆ, లెస్స= ఆ మంచిపని; ఒనర్చిన+అట్టి+అతనికిన్= చేసిన వ్యక్తికి; భావము= హృదయం; సత్+ధర్మ+ఆలోకన, శీలంబు= మంచిధర్మాలను చేసే స్వభావం కలది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** రాజా! దీపం ఇవ్వటమంటే వెలుగును ప్రసాదించటం అన్నమాట. ఆ మంచిపని చేసిన వ్యక్తికి హృదయం గొప్పవైన పరమాత్మధర్మాలను చూచే స్వభావం కల దవుతుంది.

**విశేషం:** 'సత్' పరమాత్మ లక్షణం. దానికి సంబంధించిన ధర్మాలను చూడటమే శీలంగా గల దవుతుంది.

**తే. ఘృతము సాలమి వర్తి నికృష్ట యగుట । దగ సమర్పించి పెంచుట ధరణినాథ!**

**కాని యవి దీపదాన విధానమునఁ బ్ర । కాశవస్తువు దృఢదీప్తికముగ వలయు.' 19**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; ఘృతము= నెయ్యి; చాలమి= చాలకపోవటం; వర్తి= వత్తి; నికృష్ట= హీనమైనది; అగుట= కావటం; దగ= తాపము; సమర్పించి= ఏర్పరచి; పెంచుట= పెంచటమూ; దీపదానవిధానమునన్= దీపం ఇచ్చే విధానంలో; కాని+అవి= కూడని పనులు; ప్రకాశవస్తువు= వెలుగు అనే వస్తువు; దృఢ, దీప్తికముగన్= గట్టి జ్వాల కలదిగా; వలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** రాజా! నేయి తక్కువగా ఉంచటం, వత్తి బలంలేనిదికావటం, కొంచెం వెలిగించి పెట్టటం - దీపం పెట్టటంలో కూడని పనులు. వెలుగు గట్టి జ్వాల కలదై ఉండాలి.

**వ., అని వెండియు. 20**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** అని భీష్మ డింకా ఇట్లా చెప్పాడు.

**క. 'ఒరు లిచ్చినదీపం బప । హరించి తత్పాతకమున నంధుండగు భూ**

**వర! రథ్యాసభ గుడిపై । గిరి దీపంబిడి విభూతికిం బాత్రమగున్. 21**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; ఒరులు= ఇతరులు; ఇచ్చిన దీపంబు= దేవుడికి సమర్పించిన దీపాన్ని; అపహరించి= దొంగిలించి; తత్+పాతకమునన్= ఆ పాపంచేత; (ఆ పని చేసినవాడు); అంధుండు+అగున్= గ్రుడ్డివాడవుతాడు; రథ్యాసభన్= బాటలోని చావడిలో; గుడిపైన్= గుడిపైన; గిరిన్= కొండమీద; దీపంబు+ఇడి= దీపాన్ని ఉంచి; విభూతికిన్= ఐశ్వర్యానికి; పాత్రము+అగున్= యోగ్యుడౌతాడు.

**తాత్పర్యం:** రాజా! ఇతరులు దేవుడి కిచ్చిన దీపం దొంగిలించితే ఆ పాతకంవలన నరుడు గ్రుడ్డివాడవుతాడు. బాటలోని చావడిలో, దేవాలయంమీదా, కొండమీదా దీపం పెట్టిన వ్యక్తి ఐశ్వర్యానికి పాత్రుడౌతాడు.

**విశేషం:** దీపం హరించట మంటే దొంగిలించటం, ఆర్పివేయటం - అని రెండర్థాలు గ్రహించవచ్చును. వెలుగును తిరస్కరిస్తున్నా డన్నమాట. అది గ్రుడ్డివాని చేష్ట. కాబట్టి అంధుడవుతాడని భావం. చావడి మొదలైన చోట్ల పెట్టిన దీపం ఎక్కువమందికి ఉపయోగపడుతుంది

**తే. ఆలనేయి ముఖ్యము; మహిషాదిమేష । జనిత ఘృతములుఁ దైలంబు మనుజనాథ!**

**మధ్యమము లగు; మేదోఽస్థి మాంసరసము । లరయ నింద్యముల్ దీపసమర్పణమున. 22**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; దీపసమర్పణమునన్= దీపం పెట్టటంలో; ఆలనేయి= ఆవులనెయ్యి; ముఖ్యము= అతిశ్రేష్ఠము; మహిష+ఆది, మేష, జనిత ఘృతములు= గేదె మొదలయినవానినుండి, గొర్రెనుండి పుట్టిన నేతులు; తైలంబు= నువ్వులనూనె; మధ్యమములు= మధ్యరకానివి; అగున్= అవుతాయి; మేదస్+అస్థి, మాంస, రసములు= మేదస్సు; ఎముకలు, మాంసము అనువాని రసములు; అరయన్= పరిశీలించగా, నింద్యముల్= తుచ్ఛములు.

**తాత్పర్యం:** రాజా! దీపం పెట్టటానికి ఆవునెయ్యి చాలా మంచిది. గేదె, మేక, గొర్రె మొదలగువాటి నేతులు, నువ్వుల నూనె రెండవపద్ధతివి. క్రొవ్వు మొదలైన రసాలు పనికిమాలినవి.

**విశేషం:** క్రొవ్వొత్తులు దేవతార్చనలో వాడరాదని ఇది చెబుతున్నది.

**క. జ్యోతి స్సాలోక్య కులో । ద్ద్యోతన మహిత ప్రకాశయోగంబులు, పు**
**త్రా! తెచ్చు దీపదానము । దాత కొసఁగు నమరపూజిత సుఖత్వంబున్. 23**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; జ్యోతిస్+సాలోక్య= జ్యోతిర్లోకాలతో సమానలోకాలను పొందటం; కుల+ఉద్ద్యోతన= కులాన్ని వెలుగొందజేయటం; మహిత, ప్రకాశ, యోగంబులు= గొప్ప వెలుగు - జ్ఞానం పొందే యోగం కలగటం అనే వాటిని; దీపదానము= దీపం పెట్టటం; తెచ్చున్= తెస్తుంది; దాతకున్= దీపం ఇచ్చినవానికి; అమరపూజిత సుఖత్వంబున్= దేవతలచేత పూజింపబడే మహాసుఖాన్ని; ఒసఁగున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** నాయనా! దీపదానం జ్యోతిర్లోకాల సమానస్థితిని, కులం వెలుగొందటాన్నీ, మహాజ్ఞానాన్నీ ప్రసాదిస్తుంది. దీపదానం చేసినవాడికి దేవతలు పూజించటం అనే సుఖం కలుగుతుంది.

**క. దేవతలకు నగ్రపుసం । భావన నుపహార మిచ్చి పదపడి కుడువం**
**గా వలయు నట్టు సేయని । ధీవిరహితుఁ డసుర యగుట దెల్లం బధిపా! 24**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; దేవతలకున్= దేవతలకు; అగ్రము+సంభావనన్=మొట్టమొదటి మర్యాదతో; ఉపహారము= నైవేద్యము; ఇచ్చి; పదపడి= తరువాత; కుడువన్+కాన్+వలయున్= తాను భుజించాలి; అట్టు= ఆ విధంగా; చేయని ధీ విరహితుఁడు= చేయని బుద్ధి లేనివాడు; అసుర= రక్కసుడు; అగుట= కావటం; తెల్లంబు= స్పష్టం.

**తాత్పర్యం:** రాజా! దేవతలకు మొదట గౌరవంతో నైవేద్యం ఇచ్చి, తరువాత తాను అన్నం భుజించాలి. అట్లా చేయని బుద్ధిహీనుడు రాక్షసు డవటం తథ్యం.

**విశేషం:** 'తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః' - 'వారిచ్చినవి వారికి పెట్టకుండా తినేవాడు దొంగయే' అని గీత చెప్పుతున్నది. మానవుడు తినే, అనుభవించే సర్వపదార్థాలు దేవతల వలన వచ్చినవే. ఆ కృతజ్ఞతను నివేదించుకోవటమే నివేదనలోని ఆంతర్యం.

**వ. కావున. 25**

**తాత్పర్యం:** కనుక.

**క. తనయింటఁ గలుగు నన్నము । ముసు దేవతలకు నివేద్యముగఁ జేసి ప్రణా**
**మనియమసహిత సమర్పణ । మునఁ గృతకృత్యుఁడుగ వలయుఁ బురుషుం డనఘా! 26**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; పురుషుండు= మానవుడు; తనయింటన్= తన గృహంలో; కలుగు+అన్నమున్= ఉన్న అన్నాన్ని, మును= ముందుగా; దేవతలకున్= దేవతలకు; నివేద్యముగన్= సమర్పించబడినదానినిగా; చేసి= ఒనర్చి;

ప్రణామ నియమ సహిత సమర్పణమునన్= మ్రొక్కటం అనే నియమంతో కూడిన చక్కని అర్పణతో; కృతకృత్యుఁడు= నెరవేరిన పని కలవాడు; కన్+వలయున్= కావాలి.

**తాత్పర్యం:** రాజా! నరుడు తన యింటిలో చేసికొన్న అన్నాన్ని ముందు దేవతలకు నమస్కారపూర్వకంగా సమర్పించి కృతకృత్యుడు కావాలి.

**విశేషం:** ప్రణామనియమం భక్తిపూర్వక సమర్పణను తెలియజేస్తుంది.

**వ. పూజకుండు శక్తి సంపన్నుం డయి యొనర్చిన. 27**

**ప్రతిపదార్థం:** పూజకుండు= అర్చన చేసేవాడు; శక్తి సంపన్నుండు= శక్తి అనే సంపద నిండుగా కలవాడు; అయి; ఒనర్చిన= చేసినట్టి.

**తాత్పర్యం:** అర్చన చేసే వ్యక్తి శక్తి నిండుగా వినియోగించి చేసినట్టి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. తిలపిష్టము దధిదుగ్ధం । బులు మఱియును ధూపములును బుణ్యపరిమళం**

**బులునగు పదార్థములు విబు । ధులకుం బ్రియ మొసఁగు బలివిధులఁ గురుముఖ్యా! 28**

**ప్రతిపదార్థం:** కురుముఖ్యా!= కౌరవవంశంలో శ్రేష్ఠుడా!; బలివిదులన్= నైవేద్యం పనులలో; తిలపిష్టము= తెలకపిండి; దధి, దుగ్ధంబులు= పెరుగు, పాలు; మఱియును= ఇంకా; ధూపములును= ధూపాలు; పుణ్య, పరిమళంబులును= పవిత్రమైన సువాసనలు కలవీ; అగు పదార్థములు= అయిన వస్తువులు; విబుధులకున్= దేవతలకు; ప్రియము= ప్రీతిని; ఒసఁగున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** కురువరా! నివేదనక్రియలలో నువ్వులపిండి, పెరుగు, పాలు, ఇంకా మంచి సువాసనలు గల వస్తువులు దేవతలకు ప్రీతిని కలిగిస్తాయి.

**క. ఉపహారసమర్చకుఁడగు । సుపురుషు గృహదైవతములు శుభములఁ గూర్చున్**

**నృపవర! తత్కర్మరహితుఁ । గృపలేక నితాంతవిఫలకృత్యుం జేయున్. 29**

**ప్రతిపదార్థం:** నృపవర!= రాజశ్రేష్ఠా!; ఉపహార సమర్చకుఁడు= నైవేద్యంతో చక్కగ పూజ చేసేవాడు; అగు సుపురుషున్= అయిన మంచి మనిషిని; గృహదైవతములు= ఇలవేల్పులు; శుభములన్= శుభములతో; కూర్చున్= కూడినవాడినిగా చేస్తారు; తత్+కర్మ రహితున్= ఆ పని లేనివానిని; కృప= దయ; లేక= లేకుండా; నితాంత విఫల కృత్యున్= ఎల్లవేళల చెడిన పనులు గలవానినిగా; చేయున్= చేస్తారు.

**తాత్పర్యం:** రాజా! నివేదనతో అర్చించే వ్యక్తికి ఇంటి దేవతలు సకలశుభాలు కలిగిస్తారు. ఆ పని చేయనివాడిని దయమాలి ఎల్లవేళలా చెడిన పనులు కలవాడినిగా చేస్తారు.

**విశేషం:** 'దేవతలు ఇంత రాగద్వేషాలతో ఉంటారా?' అని మనం శంకించనక్కరలేదు. నిజానికి శుభములు కలగటం, పనులు చెడటం అనేది మన మనశ్శక్తి మీద ఆధారపడి ఉంటుంది. భక్తిపూర్వక దేవతార్చన ఆ మనశ్శక్తికి పుష్టినిస్తుంది.

**ఆ. రక్తమాంస సహిత భక్త పిండముల ను । ల్లసితలోహితాక్త లాజములను**

**సురను బలియొనర్ప నురగయక్షాసుర । ప్రముఖ భూతములు శుభంబు లొసఁగు. 30**

**ప్రతిపదార్థం:** రక్త, మాంస, సహిత, భక్త, పిండములన్= నెత్తుటితో మాంసంతో కూడిన అన్నపుముద్దలను; ఉల్లసిత, లోహిత+అక్త, లాజములను= చక్కగా ప్రకాశించేవి, ఎరుపుతో కూడినవి అయిన పేలాలను; సురను= కల్లును; బలి+ ఒనర్పన్= నివేదన చేస్తే; ఉరగ, యక్ష, అసుర, ప్రముఖ, భూతములు= పాములు, యక్షులు, రక్షస్సులు మొదలైన భూతాలు, శుభంబులు= మేళ్ళను; ఒసఁగున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** రక్తం, మాంసం అనే వాటితో కూడిన అన్నపుముద్దలను, బాగా మెరిసిపోతున్న ఎఱ్ఱదనంతో కూడిన పేలాలను, కల్లును ఉపహారంగా ఇస్తే నాగులు, యక్షులు, రాక్షసులు మొదలైన భూతాలు మేలు నిస్తాయి.

**విశేషం:** ఈ విధమైన బలులు నింద్యాలు. అయినా లోకుల మనస్తత్వాని కనుగుణంగా ఇక్కడ చెప్పినట్లు భావించాలి.

**క. సౌమ్యాసౌమ్యబలులు విను । సౌమ్యాసౌమ్య ప్రకార జనకృత్యంబుల్**

**సౌమ్యనృపోత్తమ । యయ్యై । కామ్యముఁ దత్తత్ప్రపూజ్య కరణిం జేయున్. 31**

**ప్రతిపదార్థం:** సౌమ్య నృప+ఉత్తమ!= మంచి హృదయం గల రాజవరేణ్యా!; విను= ఆలకించుము; సౌమ్య+అసౌమ్యబలులు= మంచివి, చెడ్డవి అయిన నివేదనలు; సౌమ్య+అసౌమ్య ప్రకార జన కృత్యంబుల్= మంచివారు, చెడ్డవారు అయిన జనులు చేసే పనులు, తత్+తత్+ప్రపూజ్య కరణిన్= ఆయా పూజలందుకొనేవారి విధంగానే, ఆ+ఆ+కామ్యమున్= ఆయా కోరికను; చేయున్= సిద్ధింపజేస్తాయి.

**తాత్పర్యం:** ఉత్తమనృపా! మంచి ప్రవృత్తికలవారు మంచి బలులను, దుష్టప్రవృత్తి కలవారు ఉగ్రమైన బలులను ఆయా దేవతల ధోరణిలోనే చేస్తూ ఉంటారు. దానికి అనుగుణంగానే ఫలితాలను పొందుతారు.

**విశేషం:** పైన చెప్పిన తిలపిష్టము మొదలైనవి సౌమ్యబలి. రక్తమాంస సహితమైనది అసౌమ్యబలి. సత్త్వగుణసంపన్నులు మొదటిదానిని, అది లేనివారు రెండవరకపు బలిని వారివారి దేవతల స్వభావాలకు అనుగుణంగా ఇస్తారు. ఆయా దేవతాదులు తదనుగుణంగానే ఫలితాలను ప్రసాదిస్తారు. అంటే సౌమ్యబలినే మానవుడు ఆదరించాలి అని సూచన.

**క. అగ్రప్రదాయి వర్ణస । మగ్రుఁడు బలయుతుఁడు బుద్ధిమంతుఁడు లోకా**

**నుగ్రహ పాత్రము శాత్రవ । నిగ్రహశక్తుండుఁ దత్త్వనిష్ఠుండు నగున్.' 32**

**ప్రతిపదార్థం:** అగ్రప్రదాయి= మొదటిదైన సౌమ్యబలిని దేవతలకు సమర్పించేవాడు; వర్ణసమగ్రుఁడు= చక్కని వన్నె నిండుగా గలవాడు; బలయుతుఁడు= గొప్పబలంతో కూడినవాడు; బుద్ధిమంతుఁడు= శ్రేష్ఠమైన బుద్ధి కలవాడు; లోక+అనుగ్రహ, పాత్రము= లోకుల దయకు పట్టయినవాడు; శాత్రవ నిగ్రహ శక్తుండున్= పగవారిని నిలువరించటంలో సమర్థుడూ; తత్త్వనిష్ఠుండున్= పరమాత్మ తత్త్వంలో నిష్ఠ కలవాడూ, అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** సౌమ్యబలిని ఇచ్చేవాడు మంచి వన్నె కలవాడూ, బలం కలవాడూ, బుద్ధి కలవాడూ, లోకానుగ్రహానికి పాత్రమయిన వాడూ, పగవారిని అణచివేసే సమర్థత కలవాడూ, పరతత్త్వంలో నిష్ఠ కలవాడూ అవుతాడు.'

**విశేషం:** సౌమ్యబలి ఫలితాలను వర్ణించారు. అంటే మనుజులు దానియందే ఆదరం కలవారు కావాలని హెచ్చరిక. అసౌమ్యబలి ఈ ఫలితాలకంటె వేరైన దుష్టఫలితాల నిస్తాయని కూడా సూచన. కనుక జంతుబలి భారతధర్మం కాదని మనం గుర్తించాలి.

**వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్రుతో 'సుమనోధూపదీపబలిప్రదానంబుల ఫలవిశేషంబు లింకను వినవలతుం జెప్పవే' యనుటయు నప్పురుషవరుండా కురువంశవరున కిట్లను 'నహుషవృత్తాంతంబున నది విస్పష్టంబగు వినుము చెప్పెద. 33**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; అజాతశత్రుండు= పుట్టనిశత్రువులు కల ధర్మరాజు; గంగాపుత్త్రుతోన్= గంగకొడుకైన భీష్ముడితో; సుమనస్+ధూప, దీప, బలి ప్రదానంబుల, ఫల విశేషంబులు= పూలు, ధూపము, దీపము, నైవేద్యమివ్వటం అనే వాటి ఫలాల మహిమలను; ఇంకను= ఇంకా ; వినవలతున్= వినటానికి కోరుతున్నాను; చెప్పవే= చెప్పవా; అనుటయున్= అన్నంతనే; ఆ+పురుషవరుండు= పురుషులలో శ్రేష్ఠుడైన ఆ భీష్ముడు; ఆ కురువంశవరునకున్= కురువంశంలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; నహుషవృత్తాంతంబునన్= నహుషుడి కథలో; అది= ఆ విషయం; విస్పష్టంబు= తేటతెల్లం; అగున్= అవుతుంది; వినుము= శ్రద్ధతో వినుము; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో 'పూలూ, ధూపమూ, దీపమూ, నివేదనా అనేవాటి మహాఫలితాలను ఇంకా వినాలని ఉంది. తాతా! చెప్పవా' అని అడిగితే ఆ మహాపురుషుడు ఆ కురువంశశ్రేష్ఠుడితో ఇట్లా అన్నాడు 'నహుషుడి కథలో ఆ విషయం తేటతెల్లం అవుతుంది. వినుము చెప్పుతాను.

**విశేషం:** అడిగేవాడు అజాతశత్రుడు. చెప్పేవాడు గంగాపుత్రుడు. విషయం ఎంత ప్రమాణభూతమయినదో పరిశీలించండి అని పాఠకుడికి ఒక హెచ్చరిక. వినుము అనే మాటలో అవధానబుద్ధితో అనే ధ్వని ఉంటుంది.

### భీష్ముఁడు ధర్మజునకు నహుషుని ధూపదీపదానవిశేషంబు చెప్పుట (సం.13-156-1 (కుంభ))

**సీ. నహుషుఁడు భూపాలనము సేయుచుండి రా। జస మించుకయు లేక సత్త్వనిష్ఠఁ**
**బుష్పంబులను ధూపముల దీపముల నివే। ద్యంబుల నమరుల కర్చ లిచ్చుఁ**
**బితృసంతతికి దీనఁ బ్రీతి యొనర్చు రా। క్షస యక్షభూతభుజంగమాది**
**తర్పణంబులు నర్హతానిరూఢములు గా। నివి గొని యొనరించు నిట్లు నిత్య**

**తే. నిరతిఁ జెల్లించి తత్ఫలపరిణతి ప్ర। దీప్త తేజోవిశేష సంప్రాప్తదేవ**
**రాజ్యుఁడై సురమునిగణ పూజ్యభావ। మహిమఁ బొందియు దీనిఁదా మఱవఁ డధిప! 34**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నహుషుఁడు= నహుషచక్రవర్తి; భూపాలనము= భూమిని పాలించుటను; చేయుచున్+ఉండి= చేస్తూ ఉండి; రాజసము= పొగరు; ఇంచుకయున్= కొంచెమైనా; లేక; సత్త్వనిష్ఠన్= సత్త్వగుణంలో చెదరుపాటు లేనితనంతో; పుష్పంబులను= పూలతో; ధూపములన్= ధూపములతో; దీపములన్= దీపాలతో; నివేద్యంబులన్= నైవేద్యాలతో; అమరులకున్= దేవతలకు; అర్చలు= పూజలు; ఇచ్చున్= ఇచ్చేవాడు; దీనన్= దీనితో; పితృసంతతికిన్= పితృదేవతలకు; ప్రీతి+ఒనర్చున్= ప్రీతి

చేసేవాడు; రాక్షస, యక్ష, భూత, భుజంగమ+ఆది తర్పణంబులు= రక్షస్సులు, యక్షులు, భూతములు, నాగదేవతలు మొదలగు వాని తర్పణాలను (తృప్తి కలిగించే క్రియలను); అర్హతా నిరూఢములు కాన్= యోగ్యతకు చక్కగా సరిపడేవిగా; ఇవి= పూలు మొదలైన వానిని; కొని= తీసికొని; ఒనరించున్= చేస్తూ ఉండేవాడు; ఇట్లు= ఈ విధంగా; నిత్యనిరతిన్= ప్రతిదినపు నిష్ఠతో; చెల్లించి= ఆచరించి; తత్ ఫల పరిణతి ప్రదీప్త, తేజస్+ విశేష సంప్రాప్త దేవ రాజ్యుఁడు= దాని ఫలపు పాకం చేత మిక్కిలి వెలుగొందే తేజస్సుయొక్క మహిమచేత పొందబడిన దేవతల రాజ్యం గలవాడు; ఐ= అయి; సురముని గణ పూజ్య భావ మహిమన్= దేవతలు, మునులు - అనువారి సముదాయాలకు గౌరవించబడే భావపు మహిమను; పొందియున్= పొంది కూడా; దీనిన్= ఈ పూజావిధానాన్ని; తాన్= తాను; మఱవఁడు= మరచిపోలేదు.

**తాత్పర్యం:** రాజా! నహుషుడు భూమినేలుతూ పొగ రేమాత్రమూ లేకుండా సత్యనిష్ఠతో పూలు, ధూపమూ, దీపములూ, నైవేద్యాలు అనేవాటితో దేవతలకు పూజలు చేస్తూ ఉండేవాడు. అట్లాగే పితృదేవతలకు, రాక్షసులకు, యక్షులకు, భూతాలకు, సర్పాలు మొదలైనవాటికి తర్పణాలు, యోగ్యత ననుసరించి పూలు మొదలైనవాటితో చేస్తూ ఉండేవాడు. ఇది ఏనాడూ మానకుండా చేసి, దాని ఫలంగా పాకానికి వచ్చిన గొప్ప తేజస్సుతో దేవరాజ్యాన్ని పొందగలిగాడు. దేవతలు, మునులు అతడిని పూజించే మహిమను పొంది కూడా అతడు దీనిని మరువలేదు.

**విశేషం:** నిత్యనిరతి - మనం ఆహారం ఏ విధంగా ప్రతిదినమూ తీసుకుంటామో ఆ విధంగానే దేవతలకు అందించాలని భావన. తాను తింటూ దేవతలను పస్తుంచరాదని హెచ్చరిక. పొందియున్- సాధారణంగా సిద్ధిపొందినవాడు సాధన చేయనక్కరలేదు. లేదా సిద్ధిపొందిన తరువాత గర్వం తలకెక్కుతుంది. ఈ రెండు కారణాలుగా మరచే అవకాశం ఉన్నా మరవలేదని భావన.

**క. సురలఁ బితృదేవతలఁ ద । త్పరతను మున్నెట్టు లట్ల పన్నుగ సమ్య**
**క్పరితృప్తులఁగా జేయుం । బరమకుసుమధూపదీప బలిదానములన్. 35**

**ప్రతిపదార్థం:** సురలన్= దేవతలను; పితృదేవతలన్= పితరులు అనే దేవతలను; తత్పరతను= వారియందే భావం నిలిచే విధంగా (శ్రద్ధతో); మున్ను= ముందు; ఎట్టులు= ఎట్లో; అట్లు+అ= అట్లే; పన్నుగన్= చక్కగా; పరమ కుసుమ, ధూప, దీప, బలి దానములన్= శ్రేష్ఠమైన పూలు, ధూపములూ, దీపములూ, నైవేద్యములు అనే వాటి దానాలతో; సమ్యక్, పరితృప్తులన్ కాన్= చక్కగా, నిండుగా తృప్తి పొందినవారినిగా; చేయున్= చేస్తూ ఉండేవాడు.

**తాత్పర్యం:** దేవతలను, పితరులను శ్రద్ధతో దేవరాజ్యం పొందక ముందు చేసినట్లుగానే మంచిపూలు, ధూపాలు, దీపాలు, నైవేద్యాలు అనేవాటితో చక్కగా నిండుగా తృప్తి పరచేవాడు.

**తే. దానఁజేసి తదీయ మహానుభావ । మంత కంతకు నగ్గల మగుటకతనఁ**
**దగియె మునివరవాహనత్వంబు నమ్మ । హాద్యుతికి వేయునేల యవద్యరహిత! 36**

**ప్రతిపదార్థం:** అవద్యరహిత!= దోషాలు లేనివాడా!; దానన్+చేసి= దానివలన; తదీయ, మహా+అనుభావము= అతడి గొప్పమహిమ; అంతకున్+అంతకున్= ఇంకా ఇంకా; అగ్గలము= అధికం; అగుట కతనన్= అయిన కారణంగా; ఆ+మహాద్యుతికిన్= ఆ గొప్ప తేజశ్శాలికి; మునివరవాహనత్వంబు= మునిశ్రేష్ఠుల వాహనం కలగటం; తగియెన్= ఏర్పడినది; వేయున్= వేయి మాటలు; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** నిర్మలచిత్తుడా! దానిచేత ఆతడి గొప్ప మహిమ అంతకంతకూ పెరిగిపోయింది. ఆ కారణంగా ఆ మహాతేజశ్శాలి మునులు మోసే వాహనం కలవా డవటం సమకూడింది. వేయి మాటలేల?

**విశేషం:** అవద్యం - పలుకరానిది - దోషం - అది లేనివాడు అవద్యరహితుడు. 'మునివరవాహనత్వంబు' అన్నచోట 'వర' శబ్దం మరింత ప్రకృతార్థాన్ని పుష్టం చేస్తున్నది.

**క. విను మనుజేంద్రుల కెవ్వరి । కిని లేని విశేష మతనికిం గలుగుట గ**
**ర్వనిరూఢి నొంది దుర్వ । ర్తనపరుఁడై యాతఁ డజగరత్వముఁ బొందెన్. 37**

**ప్రతిపదార్థం:** విను= వినుము; మనుజ+ఇంద్రులకున్= రాజులకు; ఎవ్వరికిని= ఎవ్వరికీ; లేని విశేషము= లేని మహిమ; అతనికిన్= ఆ నహుషునకు; కలుగుటన్= కలగటంచేత; గర్వ నిరూఢిన్= పొగరు సడలని స్థితిని; ఒంది= పొంది; ఆతఁడు= ఆ నహుషుడు; దుర్వర్తనపరుఁడు= చెడు నడవడియందు పట్టుదలకలవాడు; ఐ= అయి; అజగరత్వమున్= పెనుబాము అవటం; పొందెన్=పొందాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. ఏ రాజుకూ లేని గొప్పతనం అతడికి కలిగిన కారణంగా చెదరని గర్వం పొంది ఆతడు తప్పుదారిని బట్టి పెనుబామై పోయాడు.

**విశేషం:** దుర్వర్తన - ఇంద్రుడి భార్య శచిని కోరటం అనేది; పరుఁడు= బృహస్పతి వంటి మహానుభావులు ఎంత బోధించినా తలకెక్కని మొండి పట్టుదల గలవాడు.

**వ. అట్టియెడఁ బూర్వంబునం జేసిన పుష్పాదిదాన పుణ్యవిశేషంబుల మహానుభావంబువలన నవ్వసుమతీశ్వరు శపించిన మునీశ్వరుండు సదయుండయి శాపమోక్షంబు నిర్దేశించెఁ 'దత్ఫలవిశేషంబునన యశేషదోష నిరసననిపుణుండ వగు నీవప్పుణ్యానుష్ఠానంబున కొదవి' తని చెప్పి వెండియు. 38**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= అట్టి సందర్భంలో; పూర్వంబునన్= మునుపు; చేసిన= చేసినట్టి; పుష్ప+ఆది, దాన పుణ్యవిశేషంబుల= పూవులు మొదలగు వాటి దానంవలన అయిన పుణ్యమహిమల; మహా+అనుభావంబువలనన్= గొప్ప శక్తివలన; ఆ+వసుమతీ+ఈశ్వరున్= ఆ భూప్రభువును; శపించిన; ముని+ఈశ్వరుండు= శపించిన మునిశ్రేష్ఠుడు; సదయుండు+అయి= దయతో కూడినవాడై; శాపమోక్షంబున్= శాపం విడుదలను; నిర్దేశించెన్= చెప్పాడు; తత్+ఫల విశేషంబునన్+అ= ఆ ఫలం యొక్క విశేషం చేతనే; అశేష దోష నిరసన నిపుణుండవు= సమస్తమైన దోషాలను త్రోసివేయటంలో నేర్పుగలవాడవు; అగు నీవు= అయిన నీవు; ఆ+పుణ్య+ అనుష్ఠానంబునకున్= ఆ పుణ్యకార్యం ఆచరణకు; ఒదవితి(వి) = సిద్ధపడ్డావు; అని; చెప్పి= తెలియజేసి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఆ పరిస్థితిలో అంతకుమునుపు చేసిన పూలు మొదలైన దానాల పుణ్యమహిమల గొప్పశక్తిచేత ఆ రాజును శపించిన మహర్షి దయగలవాడై శాపం తీరే విధానాన్ని సూచించాడు. 'ఆ ఫలవిశేషంచేతనే సమస్త పాపాలను దూరంచేసే నేర్పుగల నీవు ఆ పుణ్యకార్యం ఆచరించటానికి పూనుకున్నావు' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** శాపమోక్ష ప్రదానం చేయటానికి వీలులేనంత మహాపాపం చేసినా చేసినా, పుణ్యవిశేషం వలన అది ప్రయోజనం కలిగించిందనీ చెప్పటం వలన పుష్పాదిదానాల మహిమకు సాటిలేనితనం చెప్పినట్లయింది.

**తే. పాండవాగ్రజ! నహుషుండు బ్రహ్మసభకు । నాత్మగృహమున కరిగినయట్ల యరిగె;**

**నట్టి పెంపును జనవిభుం డవ్విశిష్ట । దానఫలమునఁ జూవె పొందంగఁ బడసె. 39**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజ!= పాండుకుమారులలో పెద్దవాడా!; నహుషుండు= నహుషచక్రవర్తి; బ్రహ్మసభకున్= బ్రహ్మదేవుడి సభకు; ఆత్మగృహమునకున్= తనయింటికి; అరిగిన+అట్లు+అ= వెళ్ళినట్లే; అరిగెన్= వెళ్ళాడు; జనవిభుండు= ఆ రాజు; అట్టి పెంపును= అట్టి గొప్పతనాన్ని; ఆ+విశిష్ట దాన ఫలమునన్= ఆ గొప్పదాన ఫలంచేతనే; పొందంగన్ పడసెన్= పొందగలిగాడు; చూవె= సుమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! నహుషుడు బ్రహ్మసభకు సొంత ఇంటికి వెళ్ళినట్లుగా వెళ్ళాడు. ఆ రాజు మహిమను ఆ మహా దాన ఫలంచేతనే కదా పొందగలిగాడు!'

**విశేషం:** బ్రహ్మసభకు వెళ్ళటమంటే భూలోకం మొదలైన ఆరు లోకాలు దాటి ఏడవదైన సత్యలోకానికి వెళ్ళటం. అంటే స్వర్గం పొందటానికి చేసిన పుణ్యానికి సుమారు ఆరురెట్ల పుణ్యం చేస్తే అది లభిస్తుంది. అందులోను బెరుకుతో, జంకుతో కాకుండా సొంత ఇంటికి వెళ్ళినట్లు అంటే ఆ పుణ్యం ఇంకా ఎంత గొప్పది కావాలో ఆలోచించదగిన విషయం. అంత పుణ్యాన్ని దేవతలకు పుష్పాదిదానంచేత మానవుడు సంపాదిస్తాడని కథాతాత్పర్యం.

**క. అని పలికి భీష్ముఁడిట్లను । 'విను మెందును దీపదానవిధి మే లనిశం**

**బును జేయ నూర్ధ్వలోకం । బును గర్తకుఁ బరమదివ్య బోధము నిచ్చున్. 40**

**ప్రతిపదార్థం:** అని; పలికి; భీష్ముఁడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; వినుము= ఆలకించుము; ఎందును= అన్నింటిలో; దీపదాన విధి= దీపం ఇవ్వటం అనే పని; మేలు= శ్రేష్ఠమైనది; అనిశంబును= ఎల్లవేళల; చేయన్= చేయగా; కర్తకున్= చేసినవాడికి; ఊర్ధ్వలోకంబును= పై లోకాన్నీ; పరమ దివ్య బోధమున్= మిక్కిలి గొప్పదైన జ్ఞానాన్నీ; ఇచ్చున్= ఇస్తుంది.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి భీష్మ డింకా ఇట్లా అన్నాడు. 'అన్ని విషయాలలో దీపదానం చాలా శ్రేష్ఠమైనది. అది చేసినవాడికి పై లోకాలను, గొప్పది, మహిమగలదీ అయిన జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

**విశేషం:** ఊర్ధ్వలోకం పుణ్యానుభవానికి సంకేతం. జ్ఞానం కైవల్యాన్ని ప్రసాదిస్తుంది. దీపం ఇచ్చే వెలుగు భగవత్తత్త్వాన్ని ప్రస్ఫుటం చేస్తుందని తాత్పర్యం. అంతేకాక 'తమసోమా జ్యోతిర్గమయ' అన్న ఉపనిషద్వాక్యం కూడా ఇక్కడ సమన్వయిస్తుంది.

**క. ఎన్ని నిమిషములు దైవత । సన్నిధి వెలుఁ గంగఁ జేయు జనుఁడు ప్రదీపం**

**బన్ని సురవత్సరములు సు । ఖోన్నతి సన్నుతుల నాతఁ డొప్పు దివమునన్. 41**

**ప్రతిపదార్థం:** జనుఁడు= మనిషి; ప్రదీపంబు= పెద్దదీపాన్ని; దైవతసన్నిధిన్= దేవత సమీపంలో; ఎన్ని నిమిషములు= ఎన్ని నిముషములకాలం; వెలుఁగంగన్+చేయున్= వెలుగునట్లు చేస్తాడో; అన్ని సుర వత్సరములు= అన్ని దేవతల ఏండ్లు; ఆతఁడు= ఆ మనిషి; సుఖ+ఉన్నతిన్= సుఖంయొక్క పెక్కువతో; సన్నుతులన్= మంచి ప్రశంసలతో; దివమునన్= స్వర్గంలో; ఒప్పున్= వెలుగొందుతాడు.

**తాత్పర్యం:** మనిషి దేవుడిదగ్గర ఎన్ని నిముసాలు పెద్దదీపం వెలిగించి ఉంచుతాడో అన్ని దేవసంవత్సరాల కాలం స్వర్గంలో అధికసుఖంతో చక్కని ప్రశంసలతో ప్రకాశిస్తాడు.

**విశేషం:** మనుజుల సంవత్సరం దేవతల కొకరోజు. అంటే మనుషుల మూడువందల అరవై ఏండ్లు దేవతలకొక సంవత్సరం అన్నమాట.

**క. అనిన విని ధర్మజుఁడు శం । తనుతనయుని తోడ విప్రధనము హరిం**
**చిన యాతఁ డేగతిం జను? । ననుటయు నతఁ డిట్టు లనియె నన్నరపతికిన్. 42**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధర్మజుఁడు= ధర్మరాజు; శంతనుతనయునితోడన్= శంతనుడి కొడుకైన భీష్ముడితో; విప్రధనము= మహావిద్యావంతుడి సొమ్ము; హరించిన+ఆతఁడు= దొంగిలించిన వ్యక్తి; ఏ గతిన్= ఏ దారిలో; చనున్?= పోతాడు?; అనుటయున్= అన్నంతనే; ఆతఁడు= ఆ భీష్ముడు; ఆ+నరపతికిన్= ఆ రాజునకు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ మాట విన్న తరువాత భీష్ముడితో ఇట్లా అన్నాడు 'విప్రుడి సొమ్ము దొంగిలించినవాడి గతి ఏమిటి?' అంటే భీష్ము డా రాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'విద్యయా యాతి విప్రత్వమ్' అన్న వాక్యాన్ని బట్టి పరమార్థజ్ఞానం పుష్కలంగా కలవాడే విప్రుడు.

**క. దురితము లనేకములు గల । వరయఁగ లోకమున వాని యన్నిటికంటెన్**
**ధరణిసురధనము పాపపుఁ । దెరువునఁ గొనుటధిక మండ్రు ధీరవిచారా! 43**

**ప్రతిపదార్థం:** ధీరవిచారా!= బుద్ధి విశేషంతో కూడిన వివేకం కలవాడా!; అరయఁగన్= పరిశీలించి చూడగా; లోకమునన్= లోకంలో; దురితములు= పాపాలు; అనేకములు= పెక్కులు; కలవు= ఉన్నాయి; వాని; అన్నిటికంటెన్= ఆ అన్నింటికంటె; ధరణిసుర ధనము= బ్రాహ్మణుడి సొమ్ము; పాపము+తెరువునన్= పాపపుపద్ధతిలో; కొనుట= గ్రహించుట; అధికము= పెద్దది; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** వివేకంతో కూడిన విచారం కల ఓ ధర్మరాజా! పరిశీలిస్తే లోకంలో పాపాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఆ అన్నింటిలో బ్రహ్మజ్ఞానసంపన్నుడి సొమ్ము పాపపు పద్ధతిలో దొంగిలించటం చాలా పెద్దది అంటారు.

**విశేషం:** 'ధీరవిచారా!' అనే సంబోధనలో 'ఇది చాలా సూక్ష్మబుద్ధితో విచారించి నిర్ణయించవలసిన అంశం' అనే సూచన వ్యక్తం అవుతుంది.

**క. భూసుర ధనాపహరణము । చేసినఁ గులనాశమగుట సిద్ధము; దానం**
**జేసి యగును జండాల । త్వాసంగము నపరభవము నందు నరేంద్రా! 44**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; భూసుర, ధన+అపహరణము= బ్రాహ్మణుడి సొమ్ము దొంగిలించటం; చేసినన్= చేస్తే; కులనాశము= కులమంతా నశించటం; అగుట= కావటం; సిద్ధము= తప్పక జరుగుతుంది; దానన్+చేసి= దానివలన; అపర భవమునందున్= మరు పుట్టుకలో; చండాలత్వ+ఆసంగము= చండాలుడగుటతోడి దృఢమైన సంబంధం; అగును= అవుతుంది.

**తాత్పర్యం:** రాజా! బ్రహ్మజ్ఞానం కలవాడి సంపదను దొంగిలిస్తే కులనాశనం తప్పక జరుగుతుంది. అంతేకాదు- మరు పుట్టుకలో తప్పనిసరిగా చండాలు డయ్యే స్థితి కలుగుతుంది.

**విశేషం:** తన పాపం తనతో ఆగదు. తనతో చుట్టరికం గల వారినందరినీ అంత మొందిస్తుంది. అంటే అది ఎంత ఘోరకృత్యమో సంభావించాలి.

**వ. ఒక్క యితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 45**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఇతిహాసంబు= ఒక పురాతన కథను; చెప్పెదను= చెబుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** దీనికి సంబంధించిన ఒక ప్రాతకాలపు వృత్తాంతాన్ని వివరిస్తాను వినుము.

**ఆ. క్షత్ర బంధుఁ డనఁగఁ గలఁ డొక్క నరపతి । యతఁడు మాలవాని నధికదుఃఖ**
**భాగిఁ గాంచె గాలిఁ బఱచు విప్రక్షేత్ర । తలము రేణువునకుఁ దలఁగి చనఁగ. 46**

**ప్రతిపదార్థం:** క్షత్రబంధుఁడు+అనఁగన్= క్షత్రబంధు డనే పేరుగల; ఒక్క, నరపతి= ఒకరాజు; కలఁడు= ఉన్నాడు; అతఁడు= ఆ రాజు; అధిక దుఃఖభాగిన్= మిక్కిలి దుఃఖం అనుభవిస్తున్న; మాలవానిన్= చండాలుని; గాలిన్= గాలిచేత; పఱచు విప్రక్షేత్రతలము రేణువునకున్= ఎగిరి వచ్చుచున్న బ్రాహ్మణుడి పొలంలోని దుమ్ము కణానికి; తలఁగి= తప్పుకొని; చనఁగన్= పోతూ ఉండగా; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** క్షత్రబంధుడనే రాజొకడు ఉన్నాడు. ఒకనా డతడు బ్రాహ్మణుడి పొలంనుండి గాలికి ఎగిరి వస్తున్న రేణువుని తప్పుకొని వెళుతున్నవాడు, మహాదుఃఖంతో ఉన్నవాడు అయిన ఒక మాలవాడిని చూచాడు.

**క. కని యీ ధూళికిఁ గడు రో । సిన కారణమేమి? యనుడుఁ జెప్పె నతనికి**
**ట్లని యమ్మాలఁడు 'తొలుబా । మున నేనొక విప్రుకొడుక మునులు నుతింపన్. 47**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఈ ధూళికిన్= ఈ దుమ్మునకు; కడున్= ఎక్కువగా; రోసిన కారణము= రోతపడిన హేతువు; ఏమి?= ఏమిటి?; అనుడున్= అనగా; ఆ+మాలఁడు= ఆ మాలవాడు; అతనికిన్= ఆ క్షత్రబంధునకు; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పాడు; తొలుబామునన్= పూర్వజన్మలో; నేను; ఒక, విప్రుకొడుకన్= ఒక బ్రాహ్మణుడి కుమారుడిని; మునులు= మహర్షులు; నుతింపన్= కొనియాడునట్లుగా.

**తాత్పర్యం:** చూచి, ఆ రాజు 'ఆ ధూళికి అంతగా రోతపడుతున్నావు కారణమేమి' టని అడిగాడు. అప్పుడతడు ఇట్లా చెప్పాడు 'నేను పూర్వజన్మలో ఒక బ్రాహ్మణుడి కుమారుడిని. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. పరమనిష్ఠతోడ బ్రహ్మచర్యవ్రత । మాచరింతు; భిక్షితాన్న మొక్క**
**నాఁడు వేడ్కఁ బుణ్యనది తీరమున భుజిం । పంగఁ దలఁచి చనఁగఁ బాప మడరి. 48**

**ప్రతిపదార్థం:** పరమనిష్ఠతోడన్= గొప్ప నిలుకడతో; బ్రహ్మచర్య వ్రతము= బ్రహ్మమునందు ప్రవర్తించటం అనే వ్రతాన్ని; ఆచరింతున్= చేస్తూ ఉన్నాను; ఒక్కనాఁడు= ఒకరోజున; పుణ్యానది తీరమునన్= పుణ్యమైన నది ఒడ్డున; భిక్షిత+అన్నమున్= బిచ్చమెత్తిన అన్నాన్ని; భుజింపంగన్= తినటానికి; తలఁచి= సంకల్పించి; చనఁగన్= వెళ్ళగా; పాపము= పాపం; అడరి= పండి.

**తాత్పర్యం:** (మునులు కొనియాడే విధంగా) బ్రహ్మచర్యవ్రతం ఆచరిస్తున్నాను. ఒకరోజున పుణ్యమైన నది ఒడ్డున బిచ్చమెత్తిన అన్నం తినటానికి సంకల్పించి వెళ్ళాను. ఇంతలో నా పాపం పండింది.

**విశేషం:** వెనుకటి పద్యంలోని 'మునులునుతింపన్' అనేది ఈ పద్యంలోని 'బ్రహ్మచర్యవ్రతం' - బ్రహ్మమంటే వేదం. దాని అధ్యయనంలో ప్రవర్తించటం. అందులో అనేక నియమాలు ఉన్నాయి. భిక్షమెత్తిన అన్నం భుజించటం అందులో ఒక నియమం.

**క. ధరణీదేవక్షేత్రము । పరాగపటలంబు బహుళ పవనంబుగతిం**

**బరఁగి నరనాథ! నాదగు । కరంబు నన్నమునఁ బట్టె గడుసాంద్రముగన్. 49**

**ప్రతిపదార్థం:** నరనాథ!=రాజా!; ధరణీ దేవ క్షేత్రము, పరాగ, పటలంబు= బ్రాహ్మణుడి పొలంలోని ధూళి సముదాయం; బహుళ పవనంబుగతిన్= ఎక్కువ అయిన గాలివాటంచేత; పరఁగి= వ్యాపించి; నాది+అగు= నాదైన; కరంబు+అన్నమునన్= చేతిలోని అన్నంమీద; కడుసాంద్రముగన్= చాలా దట్టంగా; పట్టెన్= పట్టింది.

**తాత్పర్యం:** రాజా! నా పాపం పండి బ్రాహ్మణుడి భూమిలోని ధూళి గాలివాటానికి ఎగిరివచ్చి, నాచేతిలో ఉన్న అన్నంమీద మిక్కిలి దట్టంగా పట్టింది.

**విశేషం:** కరంబు నన్నమున - చేతినే పాత్రగా ఉపయోగించటం కూడా ఒక విధమైన బ్రహ్మచర్య వ్రత నియమం. ఈ సందర్భంలో కరపాత్ర స్వాములవారిని స్మరించవచ్చును.

**క. ఆ ధూళితోడఁ గుడిచిన । నీ దుర్జన్మంబు వచ్చె: నిది యెఱిఁగెడు సం**

**వేదనము పూర్వపుణ్య ఫ । లోదయమునఁ గలిగె; నిన్న యొక కలగంటిన్. 50**

**ప్రతిపదార్థం:** ఆ ధూళితోడన్= ఆ దుమ్ముతోపాటు; కుడిచినన్= తినగా; ఈ దుర్జన్మంబు= ఈ పాడు పుట్టుక; వచ్చెన్= వచ్చినది; ఇది=దీనిని; ఎఱిఁగెడు సంవేదనము= తెలిసికొనే జ్ఞానము; పూర్వ పుణ్య ఫల+ఉదయమునన్= తొలి పుట్టువులోని పుణ్యఫలం పుట్టుకవలన; కలిగెన్= ఏర్పడింది; నిన్న= నిన్నటిరోజున; ఒక కలన్= ఒక స్వప్నమును; కంటిన్= కన్నాను.

**తాత్పర్యం:** ఆ ధూళితోపాటు అన్నం తినగా ఈ పాడు పుట్టుక నాకు కలిగింది. ఇది తెలిసికొనే జ్ఞానం మునుపటి జన్మలోని పుణ్యం పండిన కారణంగా కలిగింది. నిన్న నాకొక కల వచ్చింది.

**విశేషం:** సాధారణంగా పూర్వజన్మ జ్ఞానం ఉండటం అరుదు. అందునా పాపఫలానుభవంలో ఉన్న వాడికి కలగటం మరీ వింత. అందుకే మునులు మెచ్చే విధంగా బ్రహ్మచర్యవ్రతం నడపిన విషయాన్ని ముందు ప్రస్తావించారు. ఆ అంశాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలని సూచించారు.

**వ. దానిం జెప్పెద నవధరింపుము. 51**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ కలను; చెప్పెదను= చెబుతాను; అవధరింపుము= దయతో వినుము.

**తాత్పర్యం:** ఆ కలను గురించి వివరిస్తాను. దయతో వినుము.

**క. ఒక విప్రవరుఁడు ననుఁగని । 'యకటకటా! యనుచు నిలిచి యడలకు మీ దుః**

**ఖకలాప మెల్లి వాయును । సకలంబును క్షత్రబంధుసంవాదమునన్.' 52**

**ప్రతిపదార్థం:** ఒక విప్రవరుఁడు= ఒక బ్రాహ్మణశ్రేష్ఠుడు; ననున్= నన్ను; కని= చూచి; అకటా+అకటా!= అయ్యయ్యో!; అనుచున్= అంటూ; నిలిచి; అడలకుము= కుమిలిపోకుము; ఈ దుఃఖకలాపము= ఈ ఏడ్పుల సముదాయం; సకలంబును= అంతా; ఎల్లి= రేపు; క్షత్రబంధు సంవాదమునన్= క్షత్రబంధుడితో చేసే ప్రసంగం చేత; పాయును= తొలగి పోతుంది.

**తాత్పర్యం:** ఒక బ్రాహ్మణశ్రేష్ఠుడు నన్ను చూచి 'అయ్యయ్యో! దుఃఖపడకుము. ఈ దుఃఖమంతా రేపు క్షత్రబంధు సంవాదంతో నశించిపోతుంది.'

**క. అనియె ననిచెప్పి వీడ్కొని । చని మృతుఁడై తొంటి బహుళసత్కర్మంబుల్**
**దను నుత్తమ పదమునకుం । గొనిపోయిన నిత్యసౌఖ్యకుండై యుండెన్. 53**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అని; చెప్పి; వీడ్కొని= సెలవు తీసికొని; చని= వెళ్ళి; మృతుఁడు+ఐ= చనిపోయినవాడై; తొంటి బహుళ సత్+కర్మంబుల్= పూర్వజన్మలోని పెక్కు పుణ్యకార్యాలు; తనున్= తనను; ఉత్తమపదమునకున్= ఉత్తమస్థానానికి; కొనిపోయినన్= తీసికొనిపోగా; నిత్య, సౌఖ్యకుండు+ఐ= శాశ్వతమైన సౌఖ్యం కలవాడై; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పాడు' అని పలికి అతడి దగ్గర సెలవు తీసికొని వెళ్ళి మరణించి, పూర్వపు పుణ్యకర్మలు తనను ఉత్తమపదానికి కొనిపోగా శాశ్వతసుఖం కలవాడై ఉన్నాడు.

**విశేషం:** నిత్యసౌఖ్యం - పునరావృత్తిలేని మోక్షసుఖం.

**వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రుతో 'నాకలోకం బేకప్రకార మనోహారియై యుండునో? బహుప్రకార ప్రమోదియై వెలుంగునో? యెఱింగింపవే!' యనుటయు నతండు 'పుణ్యకర్మంబు లనేకవిధంబులు గావే? కావునం దత్త దనురూపానేకస్థానంబై నాకంబు నిశ్శోకంబును నస్తోకసుఖకరంబును నై కరం బొప్పుచుండు గౌతమ శతక్రతుసంవాదం బను నితిహాసంబు విను మది భవదీయ ప్రశ్నంబునకుఁ బ్రాదేశవిశదీకరణం బగు నుత్తరంబై యుండెడు; గౌతముండను మహాద్విజుండు వనంబునం దపంబు సేయుచుండి శుండాల శిశువుం దల్లిలేనిదాని నొక్కెడం గని కారుణ్యంబు వొడమి పుత్త్రునింబోలెఁ బెనిచె; నయ్యేనిక కొదమ కాలక్రమంబున మేటి యేనుంగయి మెలంగుచుండె; నక్కాలంబున భూపాలనంబు సేయు ధృతరాష్ట్రుండను రాజు నాకారంబు దాల్చి నాకపతి యయ్యెడకు వచ్చి యవ్వారణపతిం బట్టి తనకుం గొనిపోవువాఁడై దీని నాకిమ్మని యమ్మునిపతి నడుగుటయు నతండు. 54**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని; అజాతశత్రుండు= ధర్మరాజు; గంగాపుత్రుతోన్= భీష్ముడితో; నాకలోకంబు= స్వర్గలోకం; ఏక ప్రకార మనస్+హారి= ఒకే విధంగా మనస్సును ఆకర్షించేది; ఐ= అయి; ఉండునో?= ఉంటుందా?; బహుప్రకార; ప్రమోది పెక్కు తీరుల ఆనందం కలిగించేది; ఐ= అయి; వెలుంగునో?= ప్రకాశిస్తుందో?; ఎఱింగింపవే!= తెలుపుమా!; అనుటయున్= అంటే; అతండు= ఆ భీష్ముడు; పుణ్యకర్మంబులు= పుణ్యఫలాన్నిచ్చే పనులు; అనేకవిధంబులు= పెక్కుతీరులైనవి; కావే?= కావా?; కావునన్= కాబట్టి; తత్, తత్, అనురూప+అనేక స్థానంబు= వాని వానికి తగిన పెక్కు తావులు కలది; ఐ= అయి; నాకంబు= స్వర్గం; నిస్+శోకంబును= శోకంలేనిదీ; అస్తోకసుఖ కరంబును= మిక్కిలి అధికమైన సుఖాన్ని కలిగించేదీ; ఐ= అయి; కరంబు= మిక్కిలిగా; ఒప్పుచున్+ఉండున్= ఒప్పుతూ ఉంటుంది; గౌతమ శతక్రతు, సంవాదంబు= గౌతముడికి,

దేవేంద్రుడికి అయిన సంభాషణం; అను+ఇతిహాసంబు= అనే పురాతన కథ; వినుము; అది; భవదీయ ప్రశ్నంబునకున్= నీదైన ప్రశ్నకు; ప్రాదేశ విశదీకరణంబు= కొంతభాగం స్పష్టం చేసేది; అగు+ఉత్తరంబు= అయిన సమాధానం; ఐ= అయి; ఉండెడున్= ఉంటుంది; గౌతముండు+అను, మహా ద్విజుండు= గౌతముడనే గొప్ప బ్రహ్మవేత్త; వనంబునన్= అడవిలో; తపంబు= తపస్సు; చేయుచున్+ ఉండి= చేస్తూ ఉండి; శుండాల శిశువున్= ఏనుగుపిల్లను; తల్లి లేనిదానిని; ఒక్క+ఎడన్= ఒకచోట; కని= చూచి; కారుణ్యంబు= జాలి; ఒడమి= పుట్టి; పుత్త్రునిన్+పోలెన్= కొడుకొనువలె; పెనిచెన్= పెంచాడు; ఆ+ఏనిక కొదమ= ఆ గున్న ఏనుగు; కాలక్రమంబునన్= కాలం గడుస్తూ ఉండగా; మేటి ఏనుంగు= పెద్ద ఏనుగు; అయి; మెలంగుచున్+ఉండెన్= తిరుగుతూ ఉంది; ఆ+కాలంబునన్= ఆ కాలంలో; భూపాలనంబు= భూమినేలటం; చేయు ధృత రాష్ట్రుండు= చేసే ధృతరాష్ట్రుడు; అనురాజు+ఆకారంబు= అనే రాజు ఆకారం; తాల్చి= ధరించి; నాకపతి= స్వర్గపు ఏలిక-ఇంద్రుడు; ఆ+ఎడకున్= ఆ చోటికి; వచ్చి= ఏతెంచి; ఆ+వారణపతిన్= ఆ ఏనుగురాజును; పట్టి= పట్టుకొని; తనకున్= తనకోసం; కొనిపోవువాఁడు= తీసికొని పోయేవాడు; ఐ= అయి; దీనిన్= దీనిని; నాకున్= నాకు; ఇమ్ము= ఇవ్వు; అని; ఆ+మునిపతిన్= ఆ మునిశ్రేష్ఠుడిని; అడుగుటయును= అడుగగా; అతండు= ఆ గౌతముడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు భీష్ముడితో 'స్వర్గము ఒకే విధమైన ఆనందం కలదియా? పెక్కుతీరుల ఆనందం కలిగించేదై ప్రకాశిస్తుందా?' అని అంటే భీష్ముడు 'పుణ్యకర్మలు పెక్కుతీరులైనవి కదా! కనుక ఆయా కర్మలకు తగిన పెక్కుతావులు కలదై స్వర్గం దుఃఖం లేనిదీ, అమితమైన సుఖాన్ని కలిగించేదీ అయి ఎంతో ఒప్పుతూ ఉంటుంది. గౌతమదేవేంద్ర సంవాదం అనే ఒక ఇతిహాసం చెప్పుతాను వినుము. అది నీ ప్రశ్నకు కొంతవరకు విశదపరిచే సమాధానం అవుతుంది. గౌతముడనే ఉత్తమబ్రాహ్మణుడు అరణ్యంలో తపస్సు చేస్తూ ఉన్నాడు. ఆయనకు ఒకనాడు తల్లిలేని ఏనుగు పిల్ల ఒకటి కానవచ్చింది. దానిమీద జాలిపుట్టి దానిని తన కొడుకువలె పెంచాడు. ఆ ఏనుగుగున్న కాలక్రమాన శ్రేష్ఠమైన ఏనుగై తిరుగుతూ ఉంది. ఆ కాలంలో భూమి నేలుతున్న ధృతరాష్ట్ర డనే రాజు రూపం ధరించి దేవేంద్రుడు ఆ చోటికి వచ్చి ఏనుగును పట్టి తనకొరకు తీసికొని పోయే తలపుతో 'దీనిని నా కి 'మ్మని మునివరుడిని అడిగాడు. అప్పుడతడు.

**విశేషం:** ప్రాదేశము - చూపుడు వ్రేలిని, బొటన వ్రేలిని చాచి పట్టిన కొలత. జాన వంటిది. ఇక్కడ కొంతభాగానికి సంబంధించిన అని అర్థం. స్వర్గం - శోకం లేనిది - అంతమాత్రమే కాదు. గొప్ప సుఖాన్ని కూర్చేది.

**తే. 'ఇధ్మములు దెచ్చి యిచ్చు నే నిచట లేని । సమయమునఁ గాఁచు నీ పర్ణశాల మర్త్య**
**బుద్ధియుత మిది యీ దంతిఁ బుత్త్రుఁబోలెఁ । బెనిచినాఁడ నీకీఁజాల మనుజనాథ! 55**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; ఇది= ఈ ఏనుగు; ఇధ్మములు= అగ్నిహోత్రపు పుడకలను; తెచ్చి ఇచ్చున్= తెచ్చి ఇస్తుంది; నేను; ఇచటన్= ఇక్కడ; లేని సమయమునన్= లేని వేళలో; ఈ పర్ణశాలన్= ఈ గుడిసెను; కాఁచున్= రక్షిస్తుంది; మర్త్య, బుద్ధి, యుతము= మనిషిబుద్ధి వంటి బుద్ధితో కూడినది; ఈ దంతిన్= ఈ ఏనుగును; పుత్త్రున్ పోలెన్= కన్న కొడుకును వలె; పెనిచినాఁడన్= పెంచినవాడను; నీకున్= నీకు; ఈన్+చాలన్= ఇవ్వలేను.

**తాత్పర్యం:** రాజా! ఈ ఏనుగు నాకు అగ్నిహోత్రం చిదుగులను తెచ్చి ఇస్తుంది. నేనిక్కడ లేని వేళలలో ఈ పర్ణశాలను కాపాడుతూ ఉంటుంది. దీని బుద్ధి మనుష్యుల బుద్ధి వంటిది. దీనిని నా కన్నకొడుకువలె పెంచాను. నీ కివ్వలేను.

**విశేషం:** మనుజనాథ! అనే సంబోధనలో రెండు భావాలు స్ఫురిస్తాయి. నీవు మహారాజువై యుండి నా సొమ్ముకు ఆశపడరాదు అని ఒక భావం. 'రత్నహారీ తు పార్థివః' - అని ఉన్నా దయచేసి నన్ను నిర్బంధించకుము. దానిపై నా మమకారం అటువంటిది - అని రెండవ భావం.

## ఇంద్రునకు గౌతమునితో నైన సంవాదము (సం.13-159-11 (కుంభ))

**వ. అనుటయు నా కృత్రిమజనవిభుండు. 56**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అన్నంతనే; ఆ కృత్రిమ జనవిభుండు= మారురూపం గల ఆ రాజు.

**తాత్పర్యం:** అన్నంతనే మారురూపం గల ఆ రాజు.

**చ. 'మునులకు నేనుఁ గేటికి? నమూల్యపుగోవులఁ బుచ్చికొమ్ము వే**
**యనఘ! పసిండి నీ వలసినంతయు నిచ్చెద' నన్న 'శైశవం**
**బున నిది తల్లి లేకునికిఁ బుట్టిన యక్కటికంబు పెంపునం**
**బెనుచుటఁ జేసి దీనిపయిఁ బ్రేమము నామదిఁగల్గు భూవరా! 57**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; మునులకున్= వైరాగ్యంతో ఉండవలసిన మునులకు; ఏనుఁగు=ఏనుగు; ఏటికిన్?= ఎందుకు?; అమూల్యము+గోవులన్= వెలకట్టరాని; ఆవులను; వేయి= వేయింటిని; పుచ్చికొమ్ము= తీసికొమ్ము; పసిండిన్= బంగారమును; నీవలసిన+అంతయున్= నీవు ఇష్టపడినంత; ఇచ్చెదన్= ఇస్తాను; అన్నన్= అంటే; భూవరా!= రాజా!; శైశవంబునన్= పసితనంలో; ఇది= ఈ ఏనుగు; తల్లి లేక+ఉనికిన్= తల్లిలేకుండటం వలన; పుట్టిన+అక్కటికంబు పెంపునన్= పుట్టిన జాలియొక్క ఎక్కువతనంతో; పెనుచుటన్+ చేసి= పెంచటంవలన; దీనిపయిన్= దీనిమీద; ప్రేమము= వాత్సల్యము; నామదిన్= నా హృదయంలో; కల్గున్= ఉన్నది.

**తాత్పర్యం:** 'పుణ్యవంతుడా! మునులకు ఏనుగెందుకు? వెలకట్టలేని ఆవులను వేయినిస్తాను. నీవు కావలసినంత బంగారం ఇస్తాను. తీసికొమ్ము' అనగా 'రాజా! పసితనంలో ఇది తల్లిలేకుండటంవలన కలిగిన జాలితో దీనిని పెంచిన కారణంగా దీనిమీద వాత్సల్యం నా హృదయంలో కలిగింది.

**విశేషం:** మునులకు ఏనుఁగేటికి - అంటే ఏనుగులు రాజైన నావంటివానికి ఉండాలి అని భావం. ముని అంటే మోక్షపరాయణుడు. ఏనుగు దానికి విఘ్నకారి కావచ్చును. అయితే గోవులు, బంగారం కావా? అంటే అవి ఆశ్రమ నిర్వహణకు ఏనుగుకంటె మిన్నగా ఉపకరిస్తాయనే భావంతో పలుకుతున్నాడు.

**క. కావున నొల్లను బదివే। ల్గోవుల నిచ్చినను నిష్కకోటి యొసఁగినం**
**బోవయ్య యేను మొఱయిడఁ। గా వావిరిఁ గొనఁగఁ దగునె కరిపతి నీకున్?' 58**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; పదివేల్= పదివేల; గోవులన్= ఆవులను; ఇచ్చినను= ఇచ్చినా; నిష్కకోటి= కోటిబంగారు నాణాలు; ఒసఁగినన్= ఇచ్చినా; ఒల్లను= ఇష్టపడను; పోవయ్య; ఏను= నేను; మొఱ ఇడగాన్= మొత్తుకుంటూ ఉంటే; వావిరిన్= ఒత్తిడి చేసి; నీకున్= నీకు; కరిపతిన్= ఏనుగును; కొనఁగన్+తగునె?= గ్రహింపదగునా? తగదని భావం.

**తాత్పర్యం:** పదివేల ఆవులనిచ్చినా, కోటి బంగారు నాణాల నిచ్చినా నేనిష్టపడను. వెళ్ళుము. నేను మొత్తుకొంటుంటే నీవు ఒత్తిడి చేసి ఏనుగును తీసికొని పోవటం తగునా?'

**క. అని మునిపతి పలికిన న । జ్జనపతి 'వాహనము గాఁగ సామజముం గై**
**కొనఁదగదె రాజునకు ని । ట్లనఁదగునే నీకు? విడువు హస్తిం బ్రియమునన్.' 59**

**ప్రతిపదార్థం:** అని; మునిపతి= మునివర్యుడు; పలికినన్= పలికితే; ఆ+జనపతి= ఆ రాజు; వాహనము= ఎక్కిరింత; కాఁగన్= కావటానికి; సామజమున్= ఏనుగును; కైకొనన్= గ్రహించటం; రాజునకున్= రాజునకు; తగదె?= కూడదా?; రాజునకున్= రాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనన్= పలకటం; నీకున్= నీకు; తగునే?= యుక్తమా?; హస్తిన్= ఏనుగును; ప్రియమునన్= ఇష్టపూర్వకంగా; విడుము= వదలుము.

**తాత్పర్యం:** అని ముని అంటే రాజు 'వాహనంగా ఏనుగును గ్రహించటం రాజుకు తగని పనియా? రాజుతో ఇట్లా అనటం నీకు తగునా? ఇష్టంతో ఏనుగును వదలిపెట్టుము' అన్నాడు.

**విశేషం:** 'రత్నహారీ తు పార్థివః' అని న్యాయం. శ్రేష్ఠమైన వస్తువులను రాజు గ్రహించవచ్చునని దీని తాత్పర్యం. ఈ న్యాయాన్ని హృదయంలో భావిస్తూ 'రాజునకు కైకొన తగదా? రాజుతో ఇట్లా పలుకవచ్చునా?' అని అంటున్నాడు. 'నా విష్ణుః పృథీవీపతిః' - విష్ణ్వంశలేనివాడు రాజు కాజాలడు' - అన్న న్యాయాన్ని ఇక్కడ కూడ అనుసంధించుకోవాలి. ప్రియమునన్ - ఇష్టంతో - ఇష్టపడి ఇవ్వకపోతే బలాత్కరించవలసి వస్తుందన్న సూచన ఇక్కడ వ్యంగ్యం. తరువాతి పద్యంలో దీనిని కవి మరింత స్పష్టం చేస్తున్నాడు.

**వ. అని రాజసంబు దోఁపం బలుకుటయు నప్పరమద్విజుండు పుయిలోట దక్కి యిట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** అని; రాజసంబు= పొగరు; తోఁపన్= తెలియనట్లుగా; పలుకుటయున్= పలికితే; ఆ+పరమద్విజుండు= ఆ ఉత్తమ బ్రాహ్మణుడు; పుయిలోట= సంకోచం; తక్కి= వదలి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని పొగరు తెలిసే విధంగా పలికితే ఆ ఉత్తమ బ్రాహ్మణుడు సంకోచం వదలి ఇట్లా అన్నాడు.

**విశేషం:** రాజసం - రజోగుణంవలన ఏర్పడినది. సందర్భాన్ని బట్టి 'పొగరు'. దీనివలననే వెనుకటి పద్యంలో 'బెదరింపు' ను ఊహించాము.

**తే. 'పుణ్యకర్ములు హర్షంబుఁ బొందఁగనుట । పాపకర్ములు శోకార్తి పాలుపడుట**
**యెచటఁ గల్గు నజ్జముసభ కేఁగుదెమ్ము । దంతి నచ్చట నిచ్చెద ధరణినాథ!' 61**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; ఎచటన్= ఎక్కడ; పుణ్యకర్ములు= పుణ్యమైన కర్మలు గలవారు; హర్షంబున్= సంతోషమును; పొందన్+కనుట= పొందగలుగుట; పాపకర్ములు= పాపపు పనులు చేసేవారు; శోక+ఆర్తి పాలుపడుట= దుఃఖపు పీడకు పాలుకావటమూ; కల్గున్= అవుతుందో; ఆ+జము సభకున్= అట్టి యుముడి లోకానికి; ఏఁగుదెమ్ము= రమ్ము; అచ్చటన్= ఆ తావున; దంతిన్= ఏనుగును; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** 'పుణ్యకర్మలు చేసేవారు ప్రమోదాన్నీ, పాపపుపనులు చేసేవారు పరమదుఃఖాన్నీ పొందే చోటు యమలోకం ఉన్నదే - అక్కడకు రమ్ము నీ కీ ఏనుగు నిస్తాను.'

**విశేషం:** యముడు మానవుల పాపపుణ్యాలను నిర్ణయించి శోకాన్నీ సంతోషాన్నీ తగిన ప్రమాణంలో ప్రసాదిస్తూ ఉంటాడు. అక్కడ 'నీ, నా' పుణ్యాపాపాలు తేలుతాయని తాత్పర్యం.

**వ. అనుటయు నతండు. 62**

**తాత్పర్యం:** అనగా ఆ ఇంద్రుడు.

**సీ. వినుము నాస్తికు లగు జనులుఁ బాపాత్మకు । లునుగాక యేను వత్తునె మునీంద్ర!**
**యచటికి?' నన్న 'నయ్యముఁడు పుణ్యుఁడు తదీ । యాదరం బొప్పదే?' యనియె విప్రుఁ**
**డమ్మాట కవ్విభుం 'డప్పఁ బ్రోచునతండుఁ । దల్లికిఁ దండ్రి కత్యంతభక్తి**
**గలవాఁడు నమ్మేలు గనునందు రా నొల్ల' । నని పల్కెఁ బల్కిన నత్తపస్వి**

**తే. 'రమ్ము మందాకినికిఁ దత్తటమ్ము పొంత । హస్తి విడిచెద' ననుమాట యాడ నాతఁ**
**'డతిథిశిష్టాన్నభోజులు న ప్రతిగ్ర । హులును గం ద్రది సరకు సేయుదునె యచటు?' 63**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్ర!= మునివరా!; వినుము; నాస్తికులు= పరలోకము లేదనువారు; అగు జనులున్= అయిన జనులూ; పాప+ఆత్మకులును= పాపపు హృదయం కలవారూ; కాక =తక్క; ఏను= నేను; అచటికిన్= ఆ తావునకు; వత్తునె?= వస్తానా?; అన్నన్= అంటే; విప్రుఁడు= జ్ఞానవంతుడైన ఆ ముని; ఆ+యముఁడు= ఆ యమధర్మరాజు; పుణ్యుఁడు= పుణ్యం కలవాడు; తదీయ+ఆదరంబు= అతడిదైన ఆదరం; ఒప్పదే?= చెల్లదా?; అనియెన్= అన్నాడు; ఆ+మాటకున్= ఆ పల్కునకు; ఆ+ విభుండు= ఆ రాజు; అతండు= ఆ యముడు; అప్పన్= అక్కను; ప్రోచున్= రక్షిస్తాడు; తల్లికిన్= అమ్మకు; తండ్రికిన్= తండ్రికీ; అత్యంతభక్తి= మిక్కిలి ఎక్కువ భక్తి; కలవాఁడు= ఉన్నవాడు; ఆ+మేలు= దానివలన అయ్యే మంచిని; కనున్= పొందుతాడు; అందున్= అచటికి; రాన్= రావటానికి; ఒల్లను= ఇష్టపడను; అని; పల్కెన్= పలికాడు; పల్కినన్=పలుకగా; ఆ+తపస్వి= ఆ తాపసుడు; మందాకినికిన్= ఆకాశగంగ దగ్గరకు; రమ్ము= రా; తత్+తటమ్ముపొంతన్= దాని ఒడ్డు దాపున; హస్తిన్= ఏనుగును; విడిచెదన్= వదలుతాను; అనుమాట= అన్న పలుకు; ఆడన్= పలుకగా; ఆతఁడు= ఆ రాజు; అది= ఆ గంగ ఒడ్డును; అతిథి శిష్ట అన్న భోజులు= అతిథులు తినగా మిగిలిన అన్నాన్ని తినేవారు; అప్రతిగ్రహులును= దానం సొమ్ము పుచ్చుకోనివారున్నూ; కంద్రు= పొందుతారు; అచటు= ఆ తావు; సరకు+చేయుదునె?= లెక్క చేస్తానా?

**తాత్పర్యం:** మునీంద్రా! వినుము. నాస్తికులు, పాపాత్ములు అక్కడకు పోతారుగానీ నేను వస్తానా?' అన్నాడు. అప్పుడు ఋషి 'ఆ యముడు పుణ్యాత్ముడు గదయ్యా! అతడిని ఆదరింపవద్దా? అంటే ఆ మాట విని రాజు ఆ యముడు అక్కను కాపాడుతూ ఉంటాడు. తల్లిదండ్రులంటే ఎంతో భక్తి కలవాడు. ఆ పుణ్యం పొందుతాడు. కనుక అతడి దగ్గరకు రా' నన్నాడు. అప్పుడు ఆ తాపసి 'పోనీ గంగ ఒడ్డుకు రమ్ము! అక్కడ ఏనుగును నీకు వదలుతాను' అంటే 'అతిథులు తినగా మిగిలిన భోజనం తినేవారు. దానాలు ముట్టనివారూ అక్కడకు పోతారు. నేను దానిని లెక్క చేస్తానా?' అన్నాడు.

**విశేషం:** యముడి విషయంలో పాపపుణ్యాలు రెండూ చెప్పారు. యముడి అక్క కాళింది. తల్లిదండ్రులు ఛాయాసూర్యులు. తల్లివంటి అక్కను, తల్లిదండ్రులను భక్తితో సేవించటం అనే మహాపుణ్యం వలన అతడికి యమత్వం సిద్ధించిందని సూచన. అతిథులు తినగా మిగిలిన అన్నాన్ని 'విఘసం' అంటారు. దానిని భుజించటం మహాపుణ్యంగా పరిగణించారు.

**క. అనినను ముని 'మేరు వనం । బున నీ కొప్పింతు గజముఁ బోద' మనుడు న**
**జ్జననాథవరేణ్యుండా । తని మోమునఁ జూడ్కి నిగుడ దరహాసముతోన్. 64**

**ప్రతిపదార్థం:** అనినను= అంటే; ముని= ఆ మహర్షి; మేరువనంబునన్= మేరుపర్వతపు తోటలో; నీకున్= నీకు; గజమున్= ఏనుగును; ఒప్పింతున్= అప్పగిస్తాను; పోదము= పోదాము; అనుడున్= అనగా; ఆ+జననాథ, వరేణ్యుండు= ఆ రాజశ్రేష్ఠుడు; అతని మోమునన్= అతడి మొహం మీద; చూడ్కి= చూపు; నిగుడన్= నిలుచునట్లుగా; దరహాసముతోన్= చిరునవ్వుతో.

**తాత్పర్యం:** అప్పుడు ఆ గౌతమముని 'మేరుపర్వతం తోటలో నీకు ఏనుగు నిస్తాను పోదాము' అంటే ఆ రాజు అతడి మోముపై చూపు నిలిపి, చిరునవ్వుతో ఇట్లా అన్నాడు.

**క. 'మృదువులు సత్యోపేతులు । సదయులు భూతహితు లందుఁ జనుజనములు నా**
**కది యేల వేడ్కనిదె వ । చ్చెద నొండొకమంచి చోటు సెప్పు' మనవుడున్. 65**

**ప్రతిపదార్థం:** అందున్= అచ్చటికి; చను జనములు= వెళ్ళే జనులు; మృదువులు= మెత్తని మనస్సు కలవారు; సత్య+ఉపేతులు= సత్యవ్రతంతో కూడినవారూ; సదయులు= దయతో కూడినవారు; భూతహితులు= ప్రాణులకు మేలు చేసేవారు; నాకున్= నాకు; అది= ఆ చోటు; ఏల?= ఎందుకు? ఒండొక మంచిచోటు= మరొక్క ఉత్తమస్థలాన్ని; చెప్పుము= పేర్కొనుము; వచ్చెదన్= వస్తాను; అనవుడున్= అన్నంతనే.

**తాత్పర్యం:** అక్కడికి వెళ్ళే జనాలు మెత్తటి హృదయం, సత్యవ్రతం, దయ, ప్రాణులయందు హితబుద్ధీ కలవారు. అది నాకెందుకు? ఇంకేదైనా మంచిచోటు చెప్పుము. వస్తాను. అనగా (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** నాకు ఇది వ్యంగ్యంగా 'అది చాలా తక్కువ పుణ్యం. నేను దానికంటె మహోన్నత పుణ్యం చేసినవాడను' అనే భావాన్ని తెలుపుతున్నది.

**క. 'నారదమునినాయకుని వి । హారస్థలమైన వనమునం దిచ్చెద నీ**
**వారణము నచట కిన్నర । ధీరమ్యం బప్సరో మతి ప్రియ మనఘా!' 66**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; నారదముని నాయకుని= నారదుడనే మునిశ్రేష్ఠుడి యొక్క; విహారస్థలము= తిరుగాడేచోటు; ఐన వనమునందున్= అయిన ఉద్యానంలో; ఈ వారణమున్= ఈ ఏనుగును; ఇచ్చెదన్= ఇస్తాను; అచటు= ఆ తావు; కిన్నర ధీ రమ్యంబు= కిన్నరుల బుద్ధితో మనోహరమైనది; అప్సరస్ మతి ప్రియము= అప్సరసల హృదయానికి ఇష్టమైనది.

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! నారదుడు విలాసంగా తిరిగే పూదోటలో ఈ ఏనుగు నిస్తాను. అది కిన్నరుల బుద్ధికి రమణీయమైనది. అప్సరసల హృదయానికి ప్రియమైనది.'

**సీ. అనిన గౌతము పల్కు విని 'గీతనృత్యాది । చతురులై దేవతా సన్మునీంద్ర**
**హర్షంబు గావించునట్టి వారచ్చటి । కరుగుదు రేనొల్ల నచ్చ' టనియె**

**నరపతి; 'యుత్తరకురుభూము లనిమిష । కమనీయములు సర్వకామ్యవర్షి**
**యగునందు వాసవుఁ డట వచ్చి కరినొప్పఁ । గొను' మని పలికె నమ్మునివరుండు**

**తే. 'కామహింసా రహితులకుఁ గాక నాకుఁ దరమె తత్ప్ర దేశం?' బని దర్పఫణితి**
**నాడెఁ బతి; దాని కాభూసురాగ్రగణ్యుఁ । 'డిందుగృహమున నిత్తు రమ్మిభము' ననుడు. 67**

**ప్రతిపదార్థం:** అనిన గౌతము పల్కున్= ఇట్లా అనిన గౌతముడి మాటను; విని= ఆలకించి; నరపతి= రాజు, గీత నృత్య+ఆది చతురులు= పాట, ఆట మొదలైనవాటిలో నేర్పు కలవారు; ఐ= అయి; దేవతా సత్+ముని+ఇంద్ర హర్షంబున్= దేవతలకు, మంచి మునులకు ఆనందాన్ని; కావించు+అట్టివారు= కలిగించేవారు; అచ్చటికిన్= ఆ ప్రదేశానికి; అరుగుదురు= వెళ్తారు; ఏను= నేను; అచ్చటు= ఆ చోటు; ఒల్లను= ఇష్టపడను; అనియెన్= అన్నాడు; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; ఉత్తర కురుభూములు= ఉత్తరదిక్కుగా ఉన్న కురుదేశాలు; అనిమిష, కమనీయములు= దేవతలు కూడ కోరునట్టివి; అందున్= ఆ చోట; వాసవుఁడు= ఇంద్రుడు; సర్వ కామ్య వర్షి= అన్ని కోరికలను వర్షించేవాడు; అగున్= అవుతాడు; అటన్= అక్కడకు; వచ్చి= ఏతెంచి; కరిన్= ఏనుగును; ఒప్పన్= ఒప్పునట్లుగా; కొనుము= స్వీకరించుము; అని; పలికెన్= చెప్పాడు; పతి= రాజు; తత్+ప్రదేశంబు= ఆ తావు; కామ హింసా రహితులకున్= కామము, హింస లేనివారికి; కాక= తక్క; నాకున్= నాకు; తరమె?= యోగ్యమా?; అని; దర్పఫణితిన్= గర్వపు ధోరణిలో; ఆడెన్= పలికాడు; దానికిన్= దానికి; ఆ భూసుర+అగ్రగణ్యుఁడు= ఆ బ్రాహ్మణవరేణ్యుడు; ఇందుగృహమునన్= చంద్రుడి ఇంటిలో; ఇభమున్= ఏనుగును; ఇత్తున్= ఇస్తాను; రమ్ము= రా; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** అనిన గౌతముడి పలుకు విని రాజు 'ఆటపాటలలో నేర్పుకలిగి దేవతలకు, గొప్ప మునులకు ఆనందం కలిగించే వారు అచ్చటికి వెళ్తారు. ఆ చోటు నేనిష్టపడను' అన్నాడు. అప్పుడు ముని 'ఉత్తరకురుభూములు దేవతలకు కూడా ఇష్టమైనవి. దేవేంద్రుడు అక్కడ అందరి కోరికలను తనివితీరా తీరుస్తాడు. అచటికి వచ్చి ఏనుగును తీసికొమ్ము' అన్నాడు. రాజు 'అది కామము, హింస లేనివారికే కానీ నాకు కాదు' అని గర్వపు ధోరణిలో పలికాడు. అప్పుడు గౌతముడు 'పోనీ, చంద్రుడి ఇంటిదగ్గర ఏనుగునిస్తాను రమ్ము' అన్నాడు.

**విశేషం:** దర్పఫణితి అనేమాటచేత ముని పేర్కొంటున్న పుణ్యలోకాలన్నీ తన పుణ్యానికి లొచ్చు అన్నభావం స్ఫురిస్తుంది.

**క. 'దానరతులు సక్షము లా । దానవిముఖు లందుఁ బోవు తరము జనులు నా**
**కానెలవు నెలవు కా' దని । మానవపతి పలుక ముని సమధురవచనుఁడై. 68**

**ప్రతిపదార్థం:** దానరతులు= దానంపై మిక్కిలి ప్రీతి కలవారు; సక్షములు= సహనం కలవారు; ఆదానవిముఖులు= దానం పుచ్చుకొనటం ఇష్టంలేనివారు; అందున్= అచటికి; పోవు తరము జనులు= పోయే అర్హతగల జనాలు; నాకున్= నాకు; ఆ నెలవు= ఆ చోటు; నెలవుకాదు= నివాసయోగ్యం కాదు; అని; మానవపతి= రాజు, పలుకన్= పలుకగా; ముని= మహర్షి; సమధుర వచనుఁడు= తీయని మాటలు కలవాడు; ఐ= అయి.

**తాత్పర్యం:** 'దానం మీద ప్రీతి, గొప్ప ఓర్పుకలవారు, దానం పుచ్చుకొనటంమీద అనిష్టం కలవారు అనగా అపరిగ్రహులు అందు పోయే అర్హత కలవారు. నా కా చోటితో పనిలేదు' అని పలుకగా; ముని తీయని మాటలతో.

**వ. అన్నరునాథుతోడ. 69**

**తాత్పర్యం:** ఆ ముని ఆ రాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'రవిపాల నిచ్చెద రమ్ము కుంజరముఁ జే। కొనుటకు' ననిన నజ్జనవిభుండు**
**'నుతతపస్స్వాధ్యాయరతులకు గంతవ్య। మచ్చోటు నాకేల?' యనుడు 'వరుణు**
**పురిఁ గుంభిఁ గైకొను పొద' మన్న మునిఁ జూచి। 'యగ్నిహోత్రము నిష్టియజనములును**
**గలవా రరుగుదురు గాక యన్నెలవొల్ల'। ననియాడె; భూపతి యతని కాతఁ**

**తే. 'డింద్రుకడ మర్త్య కోటికి నిష్ట మచట। గౌరు నీకిత్తు నని' చెప్పె 'శూరయాజి**
**వేదిశతవర్షపురుషులు వోదురందు। దాని నేఁగోర' నని పల్కెఁ ధరణివిభుఁడు. 70**

**ప్రతిపదార్థం:** రవిపాలన్= సూర్యుడివద్ద; ఇచ్చెదన్= ఇస్తాను; కుంజరమున్= ఏనుగును; చేకొనుటకున్= తీసికొనటానికి; రమ్ము; అనినన్= అనగా; ఆ+జనవిభుండు= ఆ రాజు; ఆ+చోటు= ఆ స్థలము; నుత తపస్+స్వాధ్యాయ రతులకున్= మెచ్చదగిన తపస్సు, వేదములను పఠించుట అను వాటియందు ప్రీతి కలవారికి; గంతవ్యము= పోదగినది; నాకున్= నాకు; ఏల?= ఎందుకు?; అనుడున్= అన్నంతనే; వరుణుపురిన్= వరుణుడి పట్టణంలో; కుంభిన్= ఏనుగును; గైకొను= గ్రహించుము; పొదము= పద; అన్నన్= అంటే; మునిన్= మునిని; చూచి; అగ్నిహోత్రమును= అగ్నిచేత ఆరాధనము; ఇష్టియజనములును= యజ్ఞయాగాదులు; కలవారు= ఉన్నవారు; అరుగుదురు కాక= వెళ్తారుగానీ; ఆ+నెలవు= ఆచోటు; ఒల్లను= ఇష్టపడను; అని; భూపతి=రాజు; ఆడెన్= పలికాడు; అతనికిన్= ఆ రాజునకు; ఆతఁడు= ఆ ముని; ఇంద్రుకడన్= దేవేంద్రుడియొద్ద; మర్త్యకోటికిన్= మానవుల సముదాయానికి; ఇష్టము= ప్రీతి; అచటన్= అక్కడ; గౌరున్= ఏనుగును; నీకున్= నీకు; ఇత్తున్= ఇస్తాను; అని; చెప్పెన్= చెప్పాడు; ధరణి విభుఁడు= రాజు; అందున్= అచటికి; శూర, యాజి, వేది, శతవర్షపురుషులు= శూరులు; యజ్ఞాలు చేసేవారు, వేదములను అధ్యయనం చేసినవారు, నూరేండ్లు జీవించిన జనులు; పోదురు= వెళ్తారు; దానిన్= దానికి; నేన్= నేను; కోరను= ఇష్టపడను; అని; పల్కెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ మునిరాజుతో రావయ్యా! సూర్యుడి దగ్గర నీకు ఏనుగునిస్తాను. తీసికొమ్ము' అంటే రాజు 'మెచ్చదగిన తపస్సు, వేదాధ్యయనము ప్రీతిగా చేసేవారికి అది వెళ్ళదగినచోటు. అది నాకెందుకు?' అన్నాడు. 'పోనీ వరుణుడి నగరంలో ఏనుగును తీసికొమ్ము' అంటే 'అగ్నిహోత్రము, యజ్ఞాలు కలవారు అక్కడకు పోతారు. ఆ చోటు నా కిష్టం లే'దన్నాడు. 'అయితే ఇంద్రుడి నెలవు మనుష్యుల కందరికీ ఇష్టం. అచట ఏనుగునిస్తాను' అని ముని అంటే శూరులు, యాజులు, వేదాధ్యయనపరులు, నూరేండ్లు జీవించినవారు అక్కడకు పోతారు. అది నేను కాంక్షించను' అన్నాడు రాజు.

**విశేషం:** వేది - వేదము కలవాడు.

**వ. అని పలికిన నప్పరమతపోధనుండు. 71**

**ప్రతిపదార్థం:** అని; పలికినన్= పలుకగా; ఆ+పరమతపస్+ధనుండు= మహాతపస్సే ధనంగా గల ఆ గౌతముడు.

**తాత్పర్యం:** అని పలుకగా ఆ మహర్షి.

**క. 'రదిఁగొను మచ్చోటను వే । పొద ప్రాజాపత్యలోకమున' కనవుడు 'నా**
**కది యేల? యశ్వమేధుల । పద' మనియెం బతి తపస్విపతి యాతనితోన్. 72**

**ప్రతిపదార్థం:** రదిన్= ఏనుగును; ఆ+చోటను= ఆ ప్రదేశంలో; కొనుము= గ్రహించుము; ప్రాజాపత్యలోకమునకున్= ప్రజాపతి (బ్రహ్మ) దైనలోకానికి; వే= శీఘ్రముగా; పొద= పద; అనవుడున్= అంటే; అన్నంతనే; పతి= రాజు; అది= ఆ లోకము; అశ్వమేధుల పదము= అశ్వమేధాలు చేసేవారి స్థానం; నాకున్= నాకు; ఏల?= ఎందుకు?; అనియెన్= అన్నాడు; తపస్విపతి= మునివరుడు; అతనితోన్= అతడితో.

**తాత్పర్యం:** 'పోనీ బ్రహ్మలోకానికి శీఘ్రమే పద, ఏనుగును తీసికొమ్ము' అన్నాడు. 'అది అశ్వమేధాలు చేసేవారికి నెలవయ్యా! నాకెందుకు?' అన్నాడు రాజు.

**చ. 'అపగత మోహశోక మగునట్టిది గోగణలోక మిత్తు మ**
**ద్విపవరు నందు నీ 'కనినఁ 'దీర్థనిషేవులు గోప్రదానపు**
**ణ్యపరులు బ్రహ్మచర్యనియమాఢ్యులు నచ్చటి కేఁగువారు దా**
**ని పయిఁ బ్రియంబు నాదు మది నెక్కొన దక్కడ కేల వచ్చెదన్? 73**

**ప్రతిపదార్థం:** అపగతమోహ శోకము= పోయిన అజ్ఞానము దుఃఖము కలది; అగు+అట్టి+అది= అయినట్టి; గోగణ లోకము= గోవుల సముదాయం ఉండే లోకం; అందున్= అక్కడ; మత్ ద్విపవరున్= నా ఏనుగును; నీకున్= నీకు; ఇత్తున్= ఇస్తాను; అనినన్= అంటే; అచ్చటికిన్= అక్కడకు; ఏఁగువారు= వెళ్ళేవారు; తీర్థ, నిషేవులు= పుణ్యస్థలాలను శ్రద్ధతో సేవించేవారు; గో ప్రదాన పుణ్యపరులు= ఆవులను గొప్పగా దానం ఇచ్చే పుణ్యంమీద ఆసక్తి కలవారు; బ్రహ్మచర్యనియమ+ఆఢ్యులు= బ్రహ్మచర్యం నియమాలు పాటించి ఘనత కెక్కినవారు; దానిపయిన్= దానిమీద; నాదు మది= నా మనస్సు; నెక్కొనదు= తగులదు; అక్కడకున్= ఆచోటికి; ఏల= ఎందుకు; వచ్చెదన్?= వస్తాను?

**తాత్పర్యం:** ఆ ముని, రాజుతో 'అయ్యా! శోకంగాని మోహంగానీ ఇసుమంత కూడా లేని గోలోకంలో నీకు నా యేనుగు నిస్తాను రమ్ము' అన్నాడు. రాజు 'తీర్థాలు సేవించేవారు, గోదానపుణ్యం మీద గొప్ప ఆసక్తి కలవారు, బ్రహ్మచర్యవ్రతం నియమంతో నుతికెక్కినవారూ అక్కడకు పోయేవారు. దానిమీద నా మనస్సు ప్రీతి పడదు. అక్కడి కెందుకు వస్తాను?' అన్నాడు.

**సీ. అని ధృతరాష్ట్రుఁ డాడిన ముని 'శీతోష్ణ । సుఖదుఃఖ మిత్రారి ముఖములైన**
**బహువిధద్వంద్వముల్ పరఁగవు బ్రహ్మలో । కమున నయ్యెడ సామజము హరింతు**
**గాని 'ర మ్మనుడు నమ్మానవపతి 'యసం । గులుఁ గృతాత్ములు వ్రతాచలితమతులు**
**నధ్యాత్మనిరతులు నందుఁ బోదురుగాక । యచ్చటు గాన శక్యంబె నాకు**

**తే. నవని సురవర్య!' యన రాజు నతఁడు సూచి । ముని మహత్తరుఁడే' నిన్ను ననిమిషేంద్రుఁ**
**గా నెఱింగితి నెల్లలోకములఁ దిరుగు । దెచటనైనఁ బొందదు గదా యెగ్గు నిన్ను'. 74**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; ఆడినన్= పలుకగా; ముని= మహర్షి; బ్రహ్మలోకమునన్= బ్రహ్మదేవుడి లోకంలో; శీత+ఉష్ణ సుఖదుఃఖ మిత్త్ర+అరిముఖములు= చలి, వేడి, సుఖం- దుఃఖం, చెలి-పగవాడు మొదలైనవి; ఐన, బహువిధ ద్వంద్వముల్= అయిన పెక్కు తీరుల జంటలు; పరఁగవు= కలుగవు; ఆ+ఎడన్= ఆ తావున; సామజమున్= ఏనుగును; హరింతు కాని= తీసికొందువుగాని; రమ్ము; అనుడున్= అంటే; ఆ+మానవపతి= ఆ రాజు; అసంగులు= సంగము లేనివారు; కృత+ఆత్ములు= ఆత్మను సాధించినవారు; వ్రత+అచలిత మతులు= వ్రతములయందు ఏ కొంచెం కదలని బుద్ధి కలవారు; అధ్యాత్మ నిరతులు= పరమార్థ విద్యయందు నిష్ఠకలవారు; అందున్= అచటికి; పోదురుకాక= పోతారు; అచ్చటు= ఆ తావు; కానన్=చూడటానికి; నాకున్= నాకు; శక్యంబు+ఎ?= సాధ్యమా?; అవనిసురవర్య!= బ్రాహ్మణోత్తమా!; అనన్= అనగా; రాజున్= రాజును; మునిమహత్తరుఁడు= మునులలో మిక్కిలి గొప్పవాడయిన; అతఁడు= ఆ గౌతముడు; చూచి; నిన్నున్= నిన్ను; అనిమిష+ఇంద్రున్కాన్= దేవతల ప్రభువుగా; ఏన్= నేను; ఎఱింగితిన్= గుర్తించాను; ఎల్లలోకములన్= అన్ని లోకాలలో; తిరుగుదు=సంచరిస్తూ ఉంటావు; ఎచటన్ ఐనన్= ఎక్కడైనా; నిన్నున్; ఎగ్గు= కీడు; పొందదు కదా= చేరదు కదా!

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్ర డనగా ముని 'శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మిత్రశత్రువులు అని ఈ తీరైన పెక్కు జంటభావాలు లేని తావు బ్రహ్మలోకం. అక్కడ ఏనుగును తీసికొమ్ము రమ్మ' అన్నాడు. అప్పుడు రాజు 'సంగం లేనివారు, ఇంద్రియనిగ్రహం కలవారు, వ్రతాలయందు నిష్ఠ కలవారు, అధ్యాత్మవిద్యయందు పరమాసక్తి కలవారు అచటి కరుగువారు. అది చూడటం నాకు సాధ్యమా?' అన్నాడు. అంత రాజును ముని పరిశీలించి చూచి 'నిన్ను దేవేంద్రుడిగా గుర్తించాను. నీ వన్ని లోకాలు తిరుగుతూ ఉంటావు. ని న్నే కీడూ పొందదు గదా!' అన్నాడు.

**విశేషం:** అసంగులు - సంగం అంటే వస్తువులు మొదలైనవాటి యందు ప్రీతి. లంపటం. ఇది మమకారాన్ని కలిగించి సర్వానర్థాలకు మూలకారణం అవుతుంది. సంగం వలన కామం, దానివలన క్రోధం, దానివలన సమ్మోహం, దానివలన స్మృతి నశించటం, బుద్ధినాశనం కలుగుతాయని భగవద్గీత చెప్తున్నది. అట్టి పరమనీచమైన 'సంగం' లేనివారు అసంగులు. కృతాత్ములు - ఆత్మను సాధించినవారు. ఇంద్రియాలను, మనస్సును స్వాధీనపరచుకొని పరమాత్మజ్ఞానం చక్కగా పొందినవారు. ద్వంద్వములు - విరుద్ధ భావాల జంటలు - వీటిలో ఒకటి కలిగినపుడు శోకాన్నీ, మరొకటి కలిగినప్పుడు ఆనందాన్నీ మానవుడు పొందుతూ ఉంటాడు. ఈ రెండూ లేని స్థితి పరమోత్తమమైనది. అట్టి ద్వంద్వాలు బ్రహ్మలోకంలో ఉండవు.

**చ. అనవుడు మ్రొక్కి యింద్రుఁడు 'మహాత్మ! మతంగజ హేతు వాదవ**
**ర్తను ననుఁ బంపు నీ పనుపు దక్కొని చేసెద' నన్నఁ 'బుత్త్రుఁ డీ**
**వనకరి నాకు సాధుజనవత్సల! యిమ్ము కరంబు నెమ్మి దీ**
**ని' ననియె సాంత్వనంబుగ మునిప్రవరుండు గులప్రదీపకా! 75**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; ఇంద్రుఁడు= దేవరాజు; మ్రొక్కి= నమస్కరించి; మహా+ఆత్మ!= దొడ్డబుద్ధి కలవాడా!; మతంగజ, హేతు, వాద, వర్తనున్= ఏనుగు నిమిత్తంగా వాదాన్ని నడపిన; ననున్= నన్ను; పంపు= ఆజ్ఞాపించుము; నీ పనుపున్= నీ ఆదేశాన్ని; తక్కొని= ప్రయత్నపడి; చేసెదన్= చేస్తాను; అన్నన్= అంటే; మునిప్రవరుండు= మునివర్యుడు; సాధుజనవత్సల!= మంచివారియందు పుత్రప్రేమ కలవాడా!; ఈ వనకరి= ఈ అడవి ఏనుగు; నాకున్= నాకు; పుత్రుఁడు=కొడుకు; కరంబు నెమ్మిన్= మిక్కిలి ప్రేమతో; దీనిన్= దీనిని; ఇమ్ము; అని; సాంత్వనంబుగన్= బతిమాలుతూ; కులప్రదీపకా!= కులాలను చక్కగా ప్రకాశింప చేసేవాడా!; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ముని అట్లా అన్నంతనే దేవేంద్రుడు 'మహాత్మా! ఏనుగు నెపంగా వాదాన్ని ప్రవర్తింపజేసిన నన్ను ఆజ్ఞాపించుము. నీ ఆజ్ఞను దలదాల్చి నిర్వహిస్తాను' అంటే 'సాధుజనవత్సలా! దేవేంద్రా! ఈ అడవి ఏనుగు నా బిడ్డ. దీనిని మిక్కిలి ప్రేమతో నాకిమ్ము' అని బతిమాలుతూ మునివరేణ్యుడు అన్నాడు కులప్రదీపకుడవైన ధర్మరాజా!

**వ. అనిన విని యింద్రుం డిట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఇంద్రుండు= దేవేంద్రుడు; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ఇంద్రు డిట్లా అన్నాడు.

**తే. 'కరి చెలంగి నీమీఁదఁ బుష్కరము సాఁచి । మూరుకొనియెడు నడుగుల మ్రోల నిల్చి**
**ముద్దు గురియుచుఁ బలుమఱు మ్రొక్కు నిట్టి । దాని నిన్నేల పాపుదు మాననీయ! 77**

**ప్రతిపదార్థం:** మాననీయ!= మన్నించదగినవాడా!; కరి= ఏనుగు; చెలంగి= పొంగిపోయి; నీ మీఁదన్= నీపై; పుష్కరము= తొండాన్ని; చాఁచి= ప్రసరింపచేసి; మూరుకొనియెడున్= తలను వాసన చూస్తున్నది; అడుగుల మ్రోలన్= పాదాల దగ్గర; నిల్చి= నిలబడి; ముద్దు కురియుచున్= ప్రేమను ఒలకపోస్తూ; పలుమఱున్= పెక్కుమారులు; మ్రొక్కున్= మ్రొక్కుతున్నది; ఇట్టిదానిన్= ఇట్టిదానిని; నిన్నున్= నిన్ను; ఏల= ఎందుకు; పాపుదున్= విడదీస్తాను?

**తాత్పర్యం:** 'మాననీయా! ఈ ఏనుగు ఆనందంతో పొంగిపోతూ నీమీద తొండం చాచి మూర్ధాఘ్రాణం చేస్తున్నది. పాదాలదగ్గర నిలిచి ప్రేమను ఒలకబోస్తూ నీకు పెక్కుసార్లు మ్రొక్కుతున్నది. ఇట్టి దీనినీ, నిన్నూ నేను ఎందుకు విడదీస్తానయ్యా?

**మ. ననునే డాఁచెద నన్న నేబుధులుఁ గానంజాల రక్షీణబో**
**ధన సంపత్తి నెఱింగి తేర్పడ మునీంద్రా! రండు నీవున్ భవ**
**త్తనయుండీ కరియున్ నితాంతసుఖ నిత్యంబైన నాకంబునం**
**దనపాయస్థితి మత్సఖత్వమునఁ బెంపారం బ్రవర్తింపఁగన్.' 78**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠుడా!; ననున్= నన్ను; నేన్= నేను; డాఁచెదను= గుప్తపరచుకుంటాను; అన్నన్= అంటే; ఏ బుధులు= ఏ దేవతలు; కానన్, చాలరు= తెలిసికొనలేరు; అక్షీణ బోధన సంపత్తిన్= తరుగని జ్ఞానం అనే సంపదతో; ఏర్పడన్= స్పష్టంగా; ఎఱింగితి(వి)= తెలిసికొన్నావు; నీవున్= నీవూ; భవత్ తనయుండు= నీ కొడుకు; ఈ కరియున్= ఈ ఏనుగున్నూ; నితాంతసుఖ నిత్యంబు= చెడని సుఖంతో శాశ్వతం; ఐన నాకంబు+నందున్= అయిన స్వర్గంలో; అనపాయ స్థితిన్= అపాయము (ఎడబాటు) లేని స్థితితో; మత్ సఖత్వమునన్= నా చెలిమితో; పెంపు+ఆరన్= మన్నన కలుగునట్లుగా; ప్రవర్తింపఁగన్= ఉండటానికి; రండు= రండి.

**తాత్పర్యం:** మునివర్యా! నన్ను నేను గోప్యం చేసికొనదలచితే ఏ దేవతలు కనుగొనలేరు. కాని నీవు తరగని జ్ఞాన సంపదతో నన్ను గుర్తుపట్టావు. నీవూ నీ కొడుకైన ఈ ఏనుగు స్వర్గంలో మరల తిరిగి రానక్కరలేని స్థితితో నా చెలిమితో మన్ననగా ప్రవర్తించటానికి రండి.'

**విశేషం:** నితాంతసుఖ నిత్యము - దుఃఖం మందుకైనా ఉండదని భావం. అనపాయస్థితిన్ 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' - పుణ్యం క్షీణిస్తే జనులు మరల భూలోకానికి వస్తారు - అని గీత. 'మీకు అట్టి స్వర్గపు ఎడబాటు ఉండదు' అని తాత్పర్యం. మత్, సఖత్వమునన్ - స్వర్గంలో తక్కినవారివలె నిన్నొక సామాన్య వ్యక్తిగా చూడను. నాకు సమప్రాణుడిగా చూస్తాను అని వక్కణ. 'సమప్రాణః సఖా మతః' - తన ప్రాణంతో సమానంగా ఎవరిని పరిగణించి వ్యవహరిస్తాడో అతడే సఖుడు.

**ఆ. అనుడు సంతసిల్లి యట్ల కాకనిన న। మ్ముని వరుండుఁ గరియు మున్ను గాఁగ**
**నేఁగె దివమునకు మహేంద్రుండు సమ్మోద। భరితుఁడగుచుఁ గురునృపాల వర్య! 79**

**ప్రతిపదార్థం:** కురునృపాలవర్య= కురు రాజోత్తమా!; అనుడున్= అన్నంతనే; సంతసిల్లి= ఆనందించి; అట్లు+అ= అట్లే; కాక= అగుగాక!; అనినన్= అనగా; మహేంద్రుండు= దేవరాజ్యాధిపతి; ఆ+మునివరుండున్= ఆ మునిశ్రేష్ఠుడునూ; కరియున్= ఏనుగునూ; మున్ను= ముందు; కాఁగన్= అగునట్లుగా; దివమునకున్= స్వర్గానికి; సమ్మోద భరితుఁడు= పరమానందంతో నిండినవాడూ; అగుచున్= అవుతూ; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అప్పుడా ముని అట్లాగే అనగా దేవేంద్రుడు, ఆ మహర్షినీ, ఏనుగునూ ముందు పెట్టుకొని పరమానందం నిండినవాడై స్వర్గానికి వెళ్ళాడు.

**విశేషం:** మున్ను కాగన్ - ఇది అత్యంత గౌరవాన్ని ప్రస్ఫుటీకరిస్తుంది. సమ్మోదభరితుడు - నిజంగా పరమానందం పొందవలసినవారు మునీ, ఏనుగూ. ఎందుకంటే వారి పుణ్యం పండి శాశ్వతసుఖ లోకాలకు పయనిస్తున్నారు. కాని తీసికొని వెళుతున్న సర్వసుఖదాత ఇంద్రుడు పరమానందం పొందుతున్నాడంటే మహాపుణ్యాత్ముల రాకవల్లనే దేవలోకం సుస్థిరమవుతుంది. తన పదవి భద్రంగా ఉంటుంది - అన్న భావం అతడికి కలిగించిందనే అర్థం ఇక్కడ వ్యక్తమవుతున్నది.

**క. అనిన విని భీష్మతో న। జ్జనపతి యిట్లనియెఁ 'దపము సారపు ధర్మం**
**బని యూఁది మీరు సెప్పుదు। రనఘా! లేకుండునే తదధికం బొకఁడున్?' 80**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ఆ+జనపతి= ఆ ధర్మరాజు; భీష్మతోన్= భీష్మునితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అనఘా!= పుణ్యాత్మా!; తపము= తపస్సు; సారము+ధర్మంబు= అన్ని ధర్మాల సారం వంటిది; అని; మీరు= తమరు; ఊఁది= నొక్కి; చెప్పుదురు= చెపుతూ ఉంటారు; తత్+అధికంబు= దానికంటె ఎక్కువ అయినది; ఒకఁడున్= ఒక్కటి కూడా; లేక+ఉండునే= లేకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** అని చెపితే విని ధర్మరాజు భీష్మడితో ఇట్లా అన్నాడు. 'మహాత్మా! మీరు తపస్సును సారమైన ధర్మంగా నొక్కి చెప్తుతూ ఉంటారు. దానిని మించిన ధర్మం మరొకటి లేదా?'

**వ. అనుటయు నా దేవవ్రతుం డానరదేవోత్తము నర్మిలి నాలోకించి. 81**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; ఆ నరదేవ+ఉత్తమున్= రాజులలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజును; అర్మిలిన్= ప్రేమతో; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అనగా ఆ దేవవ్రతుడు ఆ రాజశ్రేష్ఠుడిని ప్రేమతో చూచి (ఇట్లా చెప్పాడు)

**విశేషం:** దేవవ్రతుడు భీష్ముడి పుట్టుపేరు; అర్మిలిన్-ఉత్తమప్రశ్న అడిగినందుకు కలిగిన ఆనందాన్ని ఇది అభివ్యక్తం చేస్తుంది.

### భగీరథునకు బ్రహ్మతో నైన సంవాదప్రకారము (సం.13-160-1 (కుంభ))

**సీ. వినుము ధర్మము లెల్ల వినుతకృత్యంబుల । తప మెన్ని యెన్నఁగా ధర్మ మెందుఁ**
**గలదు?; తపం బనఁగా నియతాశన । త్వము; భగీరథుఁడు పద్మజుని సభకు**
**నరిగిన నతనితో నద్దేవుఁ డిందుల । కతుల నిర్మలతపమాచరింప**
**కరుగుదేరంగ నెవ్వరికిని రాదెట్లు । వచ్చితో? యనిన నవ్వసుమతీశుఁ**

**తే. దేను గోదానములును భూదానములును । గన్యకాదానములుఁ దీర్థకలనములును**
**రాజసూయాశ్వమేధాధ్వరములుఁ బెక్కు । సేసినాఁడ వచ్చుట దానఁజేసి కాదు. 82**

**ప్రతిపదార్థం:** వినుము; ధర్మములు= ధర్మాలు; ఎల్లన్= అన్నీ; వినుత కృత్యంబులు+అ= కొనియాడదగిన పనులే; తపము= తపస్సును; ఎన్ని= పరిగణించి; ఎన్నఁగాన్= లెక్కించుటకు; ధర్మము= ధర్మం; ఎందున్= ఎక్కడ; కలదు?= ఉంది?; తపంబు= తపస్సు; అనఁగాన్= అంటే; నియత+అశనత్వము= నియమంతో కూడిన భోజనం తీసికోవటం; భగీరథుఁడు= భగీరథుడనే రాజు; పద్మజుని సభకున్= బ్రహ్మసభకు; అరిగినన్= పోగా; అతనితోన్= అతడితో; ఆ+దేవుఁడు= ఆ బ్రహ్మదేవుడు; ఇందులకున్= ఇక్కడికి; అతుల నిర్మల తపము= సాటిలేని దోషములేని తపస్సు; ఆచరింపక= చేయక; అరుగుదేరంగన్= రావటానికి; ఎవ్వరికిని= ఎట్టివారికైనా; రాదు= కాదు; ఎట్లు= ఏ విధంగా; వచ్చితి+ఓ?= వచ్చావో?; అనినన్= అంటే; ఆ+ వసుమతీ+ఈశుఁడు= ఆ రాజు; ఏను= నేను; గోదానములును= గోవుల దానాలూ; భూదానములును= భూముల దానాలూ; కన్యాదానములున్= కన్యకల దానాలూ; తీర్థ కలనములును= తీర్థాలకు పోవటం అనే పనులూ; రాజసూయ+ అశ్వమేధ+అధ్వరములున్= రాజసూయము, అశ్వమేధము అనే యజ్ఞాలూ; పెక్కు= ఎక్కువ; చేసినాఁడన్= చేసినవాడిని; వచ్చుట= ఇక్కడికి రావటం; దానన్ చేసి= దానివలన; కాదు.

**తాత్పర్యం:** వినుము. ధర్మాలన్నీ కొనియాడదగిన కార్యాలే. తపస్సును చెప్పి చెప్పగల ధర్మం ఎక్కడ ఉన్నది? తపస్సు అంటే నియమంతో భోజనం గ్రహించటం. భగీరథుడనే రాజు బ్రహ్మసభకు పోతే ఆ బ్రహ్మదేవుడు 'ఇక్కడకు సాటిలేనిదీ, స్వచ్ఛమైనదీ అయిన తపస్సు చేయకుండా రావటం ఎవ్వరికీ సాధ్యంకాదు. నీవు ఎట్లు వచ్చావో?' అన్నాడు. అపు డా రాజు 'నేను గోదానాలూ, భూదానాలూ, కన్యాదానాలూ, తీర్థయాత్రలూ, రాజసూయయాగాలూ, అశ్వమేధపుయజ్ఞాలూ ఎన్నో చేశాను. కాని ఇక్కడకు రావటం వాటివలన కాదు.

**మ. అవనీదేవత లొక్కెడం గ్రతువిధి వ్యాసక్తు లై యుండఁ ద**
**త్ప్రవిఘాతంబులు దోఁచె నేను రణసంరంభంబునన్ వారి కు**
**త్సవ మొందించితి వానిఁబాపి ముదమొందన్ వారు నన్ బ్రహ్మపా**
**ల వరిష్ఠావ్యయ సౌఖ్య మొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్. 83**

**ప్రతిపదార్థం:** అవనీదేవతలు= బ్రాహ్మణులు; ఒక్క+ఎడన్= ఒకచోట; క్రతు విధి వ్యాసక్తులు= యజ్ఞం పనిలో మిక్కిలి ఆసక్తి కలవారు; ఐ= అయి; ఉండన్= ఉండగా; తత్ ప్రవిఘాతంబులు= దానికి మహావిఘ్నాలు; తోఁచెన్= కన్పట్టాయి; నేను;

రణసంరంభంబునన్= యుద్ధపు ఆర్భాటంతో; వానిన్= ఆ విఘ్నాలను; పాపి= తొలగించి; వారికిన్= ఆ బ్రాహ్మణులకు; ఉత్సవము= ఆనందము; ఒందించితిన్= కలిగించాను; వారు= ఆ బ్రాహ్మణులు; ముదము+ఒందన్= సంతోషం కలుగగా; నన్= నన్ను; బ్రహ్మపాలన్= బ్రహ్మదేవుడి దగ్గర; వరిష్ఠ+అవ్యయ సౌఖ్యము= మిక్కిలి శ్రేష్ఠమైన నాశనములేని సుఖాన్ని; ఒందుము= పొందుము; అని; లీలన్= విలాసంగా; చెప్పినన్= చెప్పితే; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** బ్రాహ్మణులంతా ఒకచోట యజ్ఞకార్యంలో నిమగ్నులై ఉన్నారు. అప్పుడు ఆ పనికి ఎన్నో అవరోధాలు కలిగాయి. నేను యుద్ధం ఉద్ధృతంగా చేసి, ఆ ఆటంకాలను తొలగించి, వారి కానందం కలిగించాను. వారు నన్ను బ్రహ్మదగ్గర మిక్కిలి ఉత్తమం అయినదీ, ఎన్నటికీ తరిగిపోనిదీ అయిన ఆనందం పూర్ణసౌఖ్యంతో పొందవలసిందిగా లీలతో చెప్పారు, వచ్చాను.

**విశేషం:** లీలన్= బ్రహ్మదగ్గర సుఖం పొందుమని వారు విలాసంగా చెప్పారు. అనగా వారు బ్రహ్మను కూడా శాసింపగల మహిమగల వారని భావం.

**తే. ఆఁకలియు నీరువట్టును నాదరింప । కేను విప్రులపని సేసి యిట్టిమహిమఁ**
**గంటి నియతాశనత్వమ కాక తప మ । నంగ వేఱొండె? ధర్మాభినంద్యహృదయ!' 84**

**ప్రతిపదార్థం:** ధర్మ+అభినంద్య హృదయ!= ధర్మంచేత కొనియాడబడిన హృదయం కల మహానుభావా!; ఆఁకలియున్= ఆకలినీ; నీరువట్టును= దప్పికనూ; ఆదరింపక= లెక్కచేయక; ఏను= నేను; విప్రుల పని= బ్రాహ్మణోత్తముల పనిని; చేసి; ఇట్టి మహిమన్= ఇటువంటి గొప్పతనాన్ని; కంటిన్= పొందాను; నియత+అశనత్వము+అ= నిగ్రహించబడిన భోజనం కలతనమే; కాక; తపము= తపస్సు; అనంగన్= అనగా; వేఱు= ఇతరము; ఒండు+ఎ?= ఒకటి కలదా?

**తాత్పర్యం:** మహానుభావా! ఆకలినీ, దప్పినీ లెక్కచేయక విప్రవర్యుల కార్యాన్ని నిర్వహించి ఇట్టి మహిమ పొందగలిగాను. తపస్సు అంటే ఆహారంలోని నియమం కాక మరొకటి ఉన్నదా? నీ హృదయాన్ని ధర్మాలన్నీ కొనియాడుతాయి కదా!'

**చ. అనుటయు బ్రహ్మ యవ్విభున కర్చన లిచ్చి తగంగ గారవిం**
**చె నధిప! నీవు విప్రుల భజింపుము సంయమితాశనుండవై**
**యని దివిజాపగాసుతుఁడు సాదరభాషణ వృత్తిఁ జెప్పిన**
**న్విని ముదమంది ధర్మజుఁడు నెమ్మి దలిర్పఁగ నమ్మహాత్ముతోన్. 85**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అనుటయున్= అని చెప్పగా; బ్రహ్మ; ఆ+విభునకున్= ఆ రాజునకు; అర్చనలు= పూజనలు (మన్ననలు); ఇచ్చి= ఒసగి; తగంగన్= తగు తీరున; గారవించెన్= మర్యాద చేశాడు; నీవును= నీవుకూడా; సంయమిత+ అశనుండవు= నిండుగా అదుపుగల భోజనం కలవాడవు; ఐ= అయి; విప్రులన్= ఉత్తమ విద్యావంతులగు బ్రాహ్మణులను; భజింపుము= సేవించుము; అని; దివిజ+ఆపగాసుతుఁడు= దేవలోకంలో పుట్టిన నదియొక్క కొడుకు; సాదర భాషణ వృత్తిన్= ప్రీతితో కూడిన మాటల ప్రవర్తనతో; చెప్పినన్= ఉపదేశించగా; ధర్మజుఁడు= ధర్మరాజు; విని, ముదము= సంతోషము; అంది= పొంది; నెమ్మి= ప్రేమ; తలిర్పఁగన్= పుట్టగా; ఆ+మహాత్ముతోన్= మహాత్ముడైన ఆ భీష్ముడితో.

**తాత్పర్యం:** భగీరథు డట్లా చెప్పగా బ్రహ్మ ఆ రాజును గొప్పగా మన్నించి తగు విధంగా గౌరవించాడు. రాజా! నీవు కూడా భోజనవిషయంలో చెడని నిష్ఠ కలవాడవై విప్రులను సేవించుము' అని భీష్ముడు ఆదరపూర్వకంగా చెప్పితే, విని, పరమానందం పొంది, ధర్మరాజు ప్రేమ చిగురించగా ఆ మహాత్ముడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** దివిజాపగాసుతుడు - అతడు చెప్పే విషయాలన్నీ అతడి తల్లి అమృతహృదయంవలె అమృతాయమానంగా ఉన్నాయని స్ఫురించే అర్థం. సాదరభాషణవృత్తిన్ - భీష్ముడి మాటలలో అనాదరభావం వెదకిచూచినా లేదు. అందుకనే ఇంకా ఇంకా ధర్మరాజు అడుగగలుగుతున్నాడు.

**క. 'పురుషుఁడు శతాయు వనుశ్రుతి । పురుషవరా! బాలురైనఁ బొందుదురు మృతిం**
**జిరమగు నేమిట నాయు వ । చిరమగు నెద్దానఁ? దెలియఁజెప్పుము కరుణన్.' 86**

**ప్రతిపదార్థం:** పురుషవరా!= పురుషశ్రేష్ఠా!; శ్రుతి= వేదం; పురుషుఁడు= మానవుడు; శత+ఆయువు= నూరేండ్ల ఆయువు కలవాడు; అనున్= అంటున్నది; బాలురు= చిన్నవయస్సువారు; ఐనన్= కూడా; మృతిన్= చావును; పొందుదురు= పొందుతూ ఉంటారు; ఏమిటన్= దేనిచేత; ఆయువు= జీవితకాలం; చిరము= ఎక్కువకాలం కలది; అగున్= అవుతుంది?; ఏ+దానన్=దేని చేత; అచిరము= తక్కువకాలం కలది; అగున్= అవుతుంది; కరుణన్= దయతో; తెలియన్= నాకు తెలిసేటట్లుగా, చెప్పుము.

**తాత్పర్యం:** 'మహాత్మా! వేదం పురుషుడు నూరేండ్ల బ్రదుకు కలవాడని అంటున్నది. కానీ చిన్నతనంలోనే కొందరు మరణిస్తున్నారు. దేనిచేత ఆయువు వృద్ధి పొందుతుంది? దేనిచేత తరిగిపోతుంది? దయతో నాకు తెలియజెప్పుము.'

**వ. అనుటయు నయ్యఖిలధర్మవేది యవ్విభున కిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+అఖిలధర్మవేది= సమస్త ధర్మాలు తెలిసిన ఆ దేవవ్రతుడు; ఆ+విభునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అడిగితే సర్వధర్మాలు తెలిసిన ఆ శంతనుకుమారుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తే. 'అనఘ! ఆచార మాయువుఁ బెనుచు నదియ । కాదు శ్రీయును గీర్తియుం గలుగఁ జేయు**
**విను దురాచారుఁ డాయువు పెనుపుఁ బొందఁ । డతని సర్వభూతంబులు నభిభవించు.' 88**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; ఆచారము= సత్ప్రవర్తనము; ఆయువున్= జీవితకాలాన్ని; పెనుచున్= పెంచుతుంది; అది+అ+కాదు= అంతేకాదు; కాదు; శ్రీయును= సంపదను; కీర్తియున్= కీర్తినీ; కలుగన్+చేయున్= కలిగేటట్లు చేస్తుంది; విను= వినుము; దురాచారుఁడు= చెడు నడవడి కలవాడు; ఆయువు పెనుపున్= ఆయువు యొక్క వృద్ధిని; పొందఁడు= చెందడు; అతనిన్= అట్టివాడిని; సర్వభూతంబులు= అన్ని భూతాలు; అభిభవించున్= ఛీ కొట్టుతాయి.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడా! ఆచారం ఆయువును పెంచుతుంది. అంతేకాదు - సంపదను, కీర్తినీ కలిగిస్తుంది. ఇక దురాచారుడు ఆయుర్వృద్ధిని పొందలేడు. సర్వభూతాలూ వాడిని తిరస్కరిస్తాయి.

**విశేషం:** ఆచారమంటే శాస్త్రం చెప్పిన విధంగా నడచుకొనటం, సర్వభూతాలు - భూమి మొదలైన పంచభూతాలు లేక సర్వప్రాణులు, పదార్థాలు. అభిభవించు - అవి తిరస్కరిస్తే బ్రదుకు లేదని భావం.

క. కావున నాచారపరత ।భూవర! మేల్ సాధుజనులు వోవు తెరువు సం
భావించుట యాచారము । దా వర్ణాశ్రమ సమర్థతం బరఁగు నృపా! 89

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; కావునన్= కాబట్టి; ఆచారపరత= ఆచారంలో నిష్ఠ; మేల్= మంచిది; సాధుజనులు= ఉత్తములైన మనుష్యులు; పోవు తెరువు= నడచే దారిని; సంభావించుట= చక్కగా తెలిసికొని ప్రవర్తించటం; ఆచారము= ఆచారం; నృపా!= రాజా!; తాన్= అది; వర్ణ+ఆశ్రమ సమర్థతన్= వర్ణములు, ఆశ్రమములు అనువాని కనుగుణ మైనదై; పరఁగున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** రాజా! కనుక ఆచారం గట్టిగా పాటించటం మంచిది. ఉత్తమపురుషులు పోయే మార్గాన్ని చక్కగా తెలిసికొని నడచుకొనటమే ఆచారం. అది వర్ణధర్మాలకు, ఆశ్రమధర్మాలకు అనుగుణమై ఉంటుంది.

**విశేషం:** ధర్మాలన్నీ స్వయంగా తెలిసికొనటం తేలికకాదు. అందుకని పురాణేతిహాసాలలో మహానుభావులైన వారు ఆయా సందర్భాలలో ఎలా ప్రవర్తించారో చక్కగా తెలిసికొని ఆ విధంగా ఆచరించాలని ఇక్కడ సూచన. వేదం 'అథ యది తే కర్మ విచికిత్సా, వృత్తి విచికిత్సా స్యాత్' - నీకు కర్మములో గానీ, నడవడిలో గానీ సందేహము కలిగితే - ఇత్యాదివాక్యాలలో ఈ అంశాన్ని చక్కగా నిరూపించింది.

ఆ. గురునిమాట సరకు గొనమి దుశ్శీలత । పిట్ట పుడుక గోరు పిసుకఁ ద్రుంపఁ
గఱవ మరుగు టుదయకాలాస్తమయ సమ । యముల భానుఁ జూచు టాయు వడఁచు. 90

**ప్రతిపదార్థం:** గురునిమాట= గురువు వాక్యాన్ని; సరకు+కొనమి= లెక్కచేయకపోవటం; దుస్+శీలత= చెడు నడవడి కలిగి ఉండటం; పిట్ట= పక్షిని; పుడుక= పుడకనూ; గోరున్= గోటినీ; పిసుకన్= పిసుకగా; త్రుంపన్= త్రుంచగా; కఱవన్= కొరకగా; మరుగుట= అలవాటుపడుతూ; ఉదయకాల+అస్తమయ సమయములన్= సూర్యుడు ఉదయించే కాలంలోనూ; అస్తమించే కాలంలోనూ, భానున్= సూర్యుడిని; చూచుట= చూడటమూ; ఆయువు= జీవితకాలాన్ని; అడఁచున్= అణచివేస్తుంది.

**తాత్పర్యం:** గురువులమాటను లెక్కచేయకపోవటం, చెడు నడవడితో మెలగటం, పిట్టను పిసకటానికీ, పుడకను త్రుంచటానికీ, గోళ్ళను కొరకటానికి అలవాటు పడటం; ఉదయ అస్తమయ కాలాలలో సూర్యుడిని చూడటం ఆయువును హరించివేస్తాయి.

**విశేషం:** పిట్ట.... ఇక్కడ క్రమాన్వయం. పిట్ట, పిసుకన్, పుడుక... ద్రుంపన్, గోరు - కఱవన్ - మరుగుట అని అన్వయం.

క. విను క్రోధంబును హింసయు । నన్నృతంబును లేమి సంధ్య లైనం దదుపా
సనము సురపూజనము రే - పొనరించుట చిరతరాయు వొనరించు నృపా! 91

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; విను= జాగ్రత్తగా ఆలకించుము; క్రోధంబును= తీవ్రమైన కోపమూ; హింసయున్= ఇతరులను పీడించటం; అనృతంబును= అసత్యమూ; లేమి= లేకపోవటం ; సంధ్యలు=సంధ్యాకాలాలు; ఐనన్= కలిగినప్పుడు; తత్+ ఉపాసనము= ఆ సంధ్యాదేవిని పూజించటము; రేపు= ప్రతి ఉదయకాలమునందు; సురపూజనము= దేవతలను అర్చించటము; చిరతర+ఆయువు= మిక్కిలి ఎక్కువ ఆయువును; ఒనరించున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** రాజా! జాగ్రత్తగా వినుము. క్రోధం, హింస, అసత్యం అనే వాటిని లేకుండా చూచుకొనాలి. సంధ్యాకాలం వచ్చినప్పుడు ఉపాసించాలి. ప్రతి ఉదయం దేవతలను అర్చించాలి. ఈ పనులు ఆయువును పెంపొందిస్తాయి.

**క. పరదారగమన మొప్పదు, । పురుషున కది యెల్ల పాపములకంటె నరే**
**శ్వరవర! యాయుస్సంక్షయ । కరంబు దద్వర్జనంబు గడు మే లరయన్. 92**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర వర!= రాజవరేణ్యా!; పురుషునకున్= మానవుడికి; పరదార గమనము= ఇతరుల భార్యలను పొందటం; ఒప్పదు= తగదు; అది= పరదారగమనం; ఎల్ల పాపముల కంటెన్= అన్ని పాపాలకంటె; ఆయుస్+సంక్షయ కరంబు= ఆయువును మిక్కిలిగా నాశనం చేసేది; తత్+వర్జనంబు= దానిని వదలటం; అరయన్= పరికించితే; కడున్= మిక్కిలి; మేలు= శ్రేష్ఠము.

**తాత్పర్యం:** రాజా! ఇతరుల భార్యలను పొందటం కూడదు. అది అన్ని పాపాలకంటే ఎక్కువగా ఆయువును కుదించి వేస్తుంది. దానిని వదలటం ఎంతో మంచిది.

**విశేషం:** పురుషపరంగా పరదారగమనం గురించి చెప్పారు. అట్లాగే స్త్రీపరంగా పరపురుషగమనం కూడా ఉపలక్షణంగా ఇక్కడ గ్రహించవచ్చును.

**క. పరదారలయందును సఖి । గురువృద్ధ నృపాలబాలకుల బాంధవభూ**
**సుర వైద్య భృత్య బుధ నా । గరికుల సతు లాయువునకుఁ గడుఁ జే టనఘా! 93**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; పరదారలయందును= ఇతరుల సతుల విషయంలో కూడా; సఖి= మిత్రుడు; గురు= గురువు; వృద్ధ= పెద్దవాడు; నృపాల= రాజు; బాలకుల= పిన్నవారి యొక్క; బాంధవ= చుట్టాలు; భూసుర= బ్రాహ్మణులు; వైద్య= వైద్యులు; భృత్య= సేవకులు; బుధ= పండితులు, నాగరికుల= నగరాధికారులు (నగరంలో ఉండేవారు) అనే ఇట్టివారియొక్క; సతులు= భార్యలు; ఆయువునకున్= బ్రదుకునకు; కడున్= మిక్కిలిగా; చేటు= కీడు.

**తాత్పర్యం:** పరభార్యలలో కూడా మిత్రుడు, గురువు, పెద్దవాడు, రాజు, బాలుడు, చుట్టము, బ్రాహ్మణుడు, వైద్యుడు, సేవకుడు, పండితుడు, నాగరికుడు అనువారి భార్యలు మరింత ఎక్కువగా ఆయువునకు కీడు చేస్తారు.

**విశేషం:** ఇది ఊరకే హెచ్చరికకొరకు చెప్పినమాట. ఎవరి సంపర్కమైనా అట్టిదే.

**వ. అని చెప్పి. 94**

**తాత్పర్యం:** ఇట్లా వివరించి.

**క. మేలివి గీడివి యని భూ । పాలక! యేఁ జెప్పినట్టి పను లెఱుఁగుము నీ**
**పోలిన యాయువు పెనుపం । జాలు ననియు నపహరింప శక్తము లనియున్. 95**

**ప్రతిపదార్థం:** భూపాలక!= రాజా!; ఇవి; మేలు= శ్రేష్ఠములు; ఇవి; కీడు= చెడ్డవి; అని; ఏన్= నేను; చెప్పిన+అట్టి, పనులు= చెప్పిన కార్యములు; నీ పోలిన ఆయువున్= నీవు భావించిన ఆయువును; పెనుపన్= పెంచుటకు; చాలున్= చాలును;

అనియున్= అనీ; అపహరింపన్= తగ్గించివేయుటకు; శక్తములు= సమర్థములు; అనియున్= అనీ; ఎఱుఁగుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** రాజా! నేను చెప్పినట్టి పనులలో మంచివి ఆయువును పెంచేవి అనీ, కీడైనవి ఆయువును త్రుంచేవి అనీ తెలిసికొనుము.

**తే. తగనియది యెద్దియైన వ్రతంబు పూని । మాన నోచిన నాయువు మాల్పకుండు**

**నంతటన పోవ దాయు వత్యంతవృద్ధిఁ । జేయుఁ దగినది సేసినఁ జెప్పనేల? 96**

**ప్రతిపదార్థం:** తగని+అది= కూడనిది; ఎద్ది= ఏది; ఐనన్= అయినా; వ్రతంబు= వ్రతము; పూని=సంకల్పించి; మానన్= మానినా; నోచినన్= నోచినా; ఆయువున్= ఆయువును; మాల్పక= చెడగొట్టక; ఉండున్= ఉంటుంది; అంతటన్+అ= అంత మాత్రాన; పోవదు= పోదు; ఆయువు= బ్రదుకును; అత్యంత వృద్ధిన్= మిక్కిలి పెరిగినదానిని; చేయున్= చేస్తుంది; తగిన+అది= తగినది; చేసినన్= చేస్తే; చెప్పన్ ఏల?= చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** తనకు కూడనిదైనా ఒక వ్రతాన్ని సంకల్పించి మానినా, నోచినా ఆయువును చెడకుండా చూస్తుంది. అంతేకాదు, ఆయువును ఎక్కువగా పెంపొందిస్తుంది. అంటే ఇక తగిన వ్రతం చేస్తే కలిగే ఫలం ఏమిటో చెప్పనేల?

**వ. అని పరిభాషించి. 97**

**తాత్పర్యం:** అని పలికి.

**క. దేవగృహము కడ వీథిని । గోవాటమునందు రచ్చకొట్టము పొంతన్**

**భూవర! సస్యములను వి । ష్ఠావిసృజన మొప్పదండ్రు చారిత్రవిదుల్. 98**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; చారిత్రవిదుల్= నడవడిని గూర్చి ఎరిగినవారు; దేవగృహము కడన్= దేవాలయం దగ్గర; వీథిని= నలుగురు నడిచే బాటలో; గోవాటమునందున్= గోవుల శాల సమీపంలో; రచ్చకొట్టము పొంతన్= రచ్చ సావడి దరిని; సస్యములను= పంటలదగ్గరా; విష్ఠావిసృజనము= మలం వదలటం; ఒప్పదు= కూడదు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఆచారం తెలిసినవారు దేవాలయం దగ్గరా, వీథిలోను, గోశాల దగ్గరా, రచ్చసావడి దరినీ, పంటలమీదా మలవిసర్జనం చేయరాదని చెప్తుతారు.

**ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్రపాదుండు నై భోజ । నంబు సేఁత మే లనంగ విందు**

**నిలిచియుండి కుడుపు నింద్య మమ్మెయి మూత్ర । సర్జనంబుఁ బాపసరణి యండ్రు. 99**

**ప్రతిపదార్థం:** ప్రాక్+ముఖుండున్= తూర్పుదిక్కు మొగమైనవాడు; ఆర్ద్రపాదుండున్= తడికాళ్ళు కలవాడును; ఐ= అయి; భోజనంబు+చేఁత= అన్నం తినటం; మేలు=శ్రేష్ఠము; అనంగన్= అని చెప్పగా; విందున్= వింటూ ఉన్నాను; నిలిచి ఉండి= నిలబడి; కుడుపు= తినటం; నింద్యము= దోషము; ఆ+మెయిన్= అదే విధంగా; మూత్ర సర్జనంబున్= మూత్రం వదలటం కూడా; పాపసరణి= పాపపు పద్ధతి; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** తూర్పుమొగం అయినవాడు, కడుగుకొన్న కాళ్ళు కలవాడునై భోజనం చేయటం చాలా మంచిదని విన్నాను. నిలిచియుండి భోజనం చేయటం తప్పు. అట్లాగే నిలిచి మూత్రం వదలటం కూడా పాపపు పద్ధతి అని చెప్తుతారు.

**విశేషం:** ఆర్ద్రపాదుడు - తడికాళ్ళు కలవాడు - అంటే భోజనానికి ముందు కాళ్ళు కడుగుకొనాలని అర్థం.

**క. అనలము గోవును బ్రాహ్మణుఁ జన దెంగిలితోడ ముట్టఁ జంద్రార్కులఁ జూ**
**డను నమ్మెయిఁ దగ దాసన । మును గాంస్యము ననఘ! భిన్నములు వర్జ్యంబుల్. 100**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; అనలమున్= అగ్నిని; గోవును= ఆవును; బ్రాహ్మణున్= బ్రహ్మజ్ఞానము కలవాడిని; ఎంగిలితోడన్= ఎంగిలితో; ముట్టన్= తాకుట; చనదు= కూడదు; ఆ+మెయిన్= అదే విధంగా; చంద్ర+అర్కులన్= చంద్రుడినీ, సూర్యుడినీ; చూడను= చూడటం కూడా; తగదు= పనికిరాదు; ఆసనమును= పీటా; కాంస్యము= కంచుపాత్రా; భిన్నములు= పగిలిపోయినవి; వర్జ్యంబుల్= విడువదగినవి.

**తాత్పర్యం:** అగ్నిని, ఆవును, బ్రాహ్మణుడిని ఎంగిలితో ముట్టరాదు. అట్లాగే ఎంగిలితో చంద్రుడిని, సూర్యుడిని చూడరాదు. పగిలిపోయిన ఆసనాన్నీ, కంచుపాత్రను విడిచివేయాలి.

**ఆ. వృద్ధు వచ్చునపుడు విను బాలు ప్రాణంబు । లెగయఁజూచి యతని కెదురు లేచి**
**ప్రణతిఁ జేసెనేనిఁ బాదునఁబడి యవి । దొంటి యట్ల నిలుచు దురితదూర! 101**

**ప్రతిపదార్థం:** దురితదూర!= పాపాలకు దూరమైనవాడా!; విను= వినుము, వృద్ధు= పెద్దవాడు; వచ్చు+అపుడు= వచ్చే సమయంలో; బాలు ప్రాణంబులు= చిన్నవాని ప్రాణాలు; ఎగయున్= పైకి లేచుటకు; చూచి; అతనికిన్= ఆ పెద్దవానికి; ఎదురు=ఎదురుగా; లేచి; ప్రణతిన్= నమస్కారమును; చేసెన్, ఏనిన్= చేసినట్లైతే; పాదునన్= మూలస్థానంలో; పడి; తొంటి+అట్లు+అ= ముందటి విధంగానే; నిలుచున్= నిలుస్తాయి.

**తాత్పర్యం:** దురితదూరా! పెద్దవాడు ఎదురుగా వస్తున్నప్పుడు చిన్నవాడి ప్రాణాలు పైకి లేచిపోవటానికి చూచి, అతడికి ఎదురుగా లేచి నమస్కారం చేస్తే మళ్ళీ అవి తమ కుదుళ్ళలో మునుపటివలె చేరుకొని నిలిచి ఉంటాయి.

**విశేషం:** దీనినే ప్రత్యుత్థానం అంటారు. పెద్దవారికి లేచి ఎదురువెళ్ళటం, అభివాదనం కూడా ఇటువంటిదే. నామగోత్రాలు చెప్పి పెద్దవారికి నమస్కరించటం.

**తే. అధ్యయనమున మస్తకం బంటుటయును । నిద్రయును నశుచితతోడ నింద్యకోటి**
**శిరము గోకంగఁ దగ దిరుచేత మస్త । కంబు తైలంబుఁ బూయఁగాఁ గాదు మేన. 102**

**ప్రతిపదార్థం:** అధ్యయనమునన్= వేదాలు చదివే సమయంలో; మస్తకంబు= తలను; అంటుటయును= తాకుట; అశుచితతోడన్= శౌచము లేకుండా; నిద్రయును= నిద్రించటమూ; నింద్యకోటి= దోషసముదాయంలోనివి; ఇరుచేతన్= రెండు చేతులతో; శిరమున్= తలను; గోకంగన్= గీరటం; తగదు= కూడదు; మస్తకంబు తైలంబు= తలమీది నూనెను; మేనన్= ఒంటిమీద; పూయఁగాన్= పూయటం; కాదు= కూడదు.

**తాత్పర్యం:** వేదం చదువుతూ తలను తాకరాదు. పరిశుభ్రత లేకుండా నిద్రపోరాదు. ఇవి దోషాల వరుసలోనివి. రెండు చేతులతో తల గోకరాదు. తలమీది నూనెను ఒంటికి పూసుకోరాదు.

**సీ. వైరనిర్బంధంబు వలవదు గురునితో । నతఁడు కోపించిన ననుసరించి**
**తేర్చుట మేలు నిందించుట గురునెడ । నన్నృతమాడుట మాయు వపహరించు**

**విప్రగోక్షత్రియ వృద్ధ దుర్బల భార । వహ గర్భిణులకు నీవలయుఁ దెరువు**

**మాన్యభూదేవుని మంగళంబుల వన । స్పతులను వలగొని చనఁగవలయుఁ**

**తే. బంచదశిని జతుర్దశిఁ బద్మమిత్ర । వసుతిథుల జన్మతిథులందు వలయు బ్రహ్మ**

**చర్య మడుగు లొండొంటితోఁ జనదు తోమ । దోషములు గొండియముఁ గ్రూరభాషణంబు. 103**

**ప్రతిపదార్థం:** గురునితోన్= గురువుతో; వైరనిర్బంధంబు= పగతోడి పట్టుదల; వలవదు= వద్దు; అతఁడు= గురువు; కోపించినన్= కోపం చెందినా; అనుసరించి= వెంటపడి; తేర్చుట= ప్రసన్నుడిని చేయటం; మేలు= మంచిది; నిందించుట= తిట్టటం; గురు+ఎడన్= గురువు విషయంలో; అనృతము= అబద్ధం; ఆడుట= పలకటం; ఆయువున్= జీవితకాలాన్ని; అపహరించున్= తొలగిస్తుంది; విప్ర= బ్రాహ్మణులకు; గో= ఆవులకు; క్షత్రియ= దేశాలనేలే రాజులకు; వృద్ధ= పెద్దవారికి; దుర్బల= ఒడలియందు సత్తువలేని వారికీ; భారవహ= బరువులు మోస్తున్నవారికి; గర్భిణులకున్= గర్భవతులైన స్త్రీలకు; తెరువున్= దారిని; ఈన్+వలయున్= ఇవ్వాలి; మాన్యభూదేవునిన్= పూజింపదగిన బ్రాహ్మణుడిని; మంగళంబులన్= మంగళం కలిగించే గోవు మున్నగువానిని; వనస్పతులను= మంచి చెట్లను; వలగొని= ప్రదక్షిణం చేసి; చనఁగన్ వలయున్= వెళ్ళాలి; పంచదశిని= పూర్ణిమ అమావాస్య దినాలలో; చతుర్దశిన్= చతుర్దశి తిథియందు (పక్షంలో పదునాలుగవ దినం); పద్మమిత్ర వసు తిథులన్= ద్వాదశి; అష్టమి తిథులందు, జన్మతిథులందున్= పుట్టిననాటి తిథులందు; బ్రహ్మచర్యము= భార్యాసంగమం చేయకుండటం మొదలైన బ్రహ్మచర్యధర్మం; వలయున్= పాటించాలి; అడుగులు= పాదాలను; ఒండొంటితోన్= ఒకదానితో మరొకదానిని; తోమన్= తోముట; చనదు= కూడదు; కొండియమున్= చాడీ, పితూరీలు చెప్పటం; క్రూరభాషణంబు= పరుషంగా పలకటం; దోషములు= తప్పుడు పనులు.

**తాత్పర్యం:** గురువుతో వదలని శత్రుభావం కూడదు. అతడు కోపించినా అనుసరించి ప్రసన్నుడిని చేసికొనటం మంచిది. గురువును నిందించటం, అతడి విషయాలలో అబద్ధాలు చెప్పటం ఆయువును బాగా తగ్గించి వేస్తాయి. దారిలో నడుస్తున్నప్పుడు ఎదురుగా ఉత్తమబ్రాహ్మణులు, ఆవులు, క్షత్రియులు, ముసలివారు, బలహీనులు, బరువు మోసేవారు, గర్భవతులు వస్తుంటే తాను తప్పుకొని వారికి దారి ఇవ్వాలి. పూజింపదగిన బ్రాహ్మణుడు, మంగళవస్తువులు, చెట్లు కనబడితే వాటికి ప్రదక్షిణం చేసి వెళ్ళాలి. పూర్ణిమ అమావాస్యలలో, చతుర్దశినాడు, ద్వాదశి, అష్టమి తిథులలో, జన్మతిథినాడూ బ్రహ్మచర్యం పాటించాలి. కాళ్ళు ఒకదానితో ఒకటి తోమరాదు. చాడీలు చెప్పటం, పరుషంగా పలకటం దోషాలు.

**విశేషం:** పద్మమిత్రుడంటే సూర్యుడు - ద్వాదశాదిత్యులు కనుక పద్మమిత్రతిథి అంటే ద్వాదశిః వసువు లెనమండుగురు. కనుక అష్టమి.

**తే. అంగహీను దరిద్రు విద్యావిహీను । రూపహీనునిఁ దెగడుట పాప మండ్రు**

**వేద దేవతానిందలు వేతనార్థ । కముగ జోస్యంబు నడపుట కల్మషములు. 104**

**ప్రతిపదార్థం:** అంగహీనున్= అవయవాలు పోయినవాడిని; దరిద్రున్= బీదవాడిని; విద్యావిహీనున్= చదువులేనివాడిని; రూపహీనునిన్= అందచందాలు లేనివాడిని; తెగడుట= నిందించటం; పాపము= పాపం; అండ్రు =అంటారు; వేద దేవతానిందలు= వేదాలను, దేవతలను నిందించటం, వేతన+అర్థకముగన్= బత్తెం కోసం; జోస్యంబు= జ్యోతిషమును; నడపుట= సాగించటం; కల్మషములు= పాపాలు.

**తాత్పర్యం:** అవయవాలు లోపించినవాడినీ, లేమితో బాధపడేవాడినీ, చదువురానివాడినీ, అందచందాలు లేనివాడినీ నిందించటం పాపం. వేదాలను, దేవతలను తూలనాడటం, బత్తెంకోసం జోస్యం చెప్పటం పాపాలు.

**విశేషం:** 'అంగహీనున్' ఇత్యాది-సాధారణంగా 'ఆ కుంటివాడు, ఈ గ్రుడ్డివాడు, దరిద్రుడు, చదువూ సంధ్యాలేని మూర్ఖుడు' ఇత్యాదిగా మాటలు వింటూ ఉంటాం. ఈ వైఖరి పాపంగా భారతం చెబుతున్నది. నిజానికి ఈ అవలక్షణాలు వారు స్వయంగా అప్పుడు చేసుకున్న తప్పులు కావు. పూర్వజన్మపు పాపఫలాలు. అట్టివాడిని నిందిస్తే అట్టి తప్పే తానూ చేసినట్లు అవుతుంది. అట్టి ఫలాలనే అనుభవించ వలసి వస్తుంది.

**సీ. దంతధావనము మూత్రపురీష సర్జనం । బులు మౌనియై చేయవలయు; నుభయ**
**సంధ్యల నిద్రింపఁ జనదు; తండ్రికి రేపు । మ్రొక్కి యాచార్యవిప్రులకు వరుస**
**మఱి మ్రొక్కునది; వీరి కెఱఁగుట దక్కదే । వార్చనంబునకు మున్నన్యుకడకుఁ**
**జనఁగాదు; గర్భిణీసంయోగ । మొప్పదు । పరిణయంబునకు మున్ సురతసుఖము**
**తే. ననుభవించిన నవకీర్ణ యందు రట్టి । యఘము వోవుఁ బ్రాయశ్చిత్త మాచరింప**
**నుత్తరము పడమర దలయుఁగ శయింపఁ । దగదు శీర్ణతల్పంబు నిద్రయును గీడు. 105**

**ప్రతిపదార్థం:** దంతధావనము= పండ్లు తోముట; మూత్రపురీష సర్జనంబులు= మూత్రం, మలం వదలటాలు; మౌని= మౌనం కలవాడు; ఐ= అయి; చేయువలయున్= చేయాలి; ఉభయ సంధ్యలన్= రెండు సంధ్యవేళలలోను; నిద్రింపన్+చనదు= నిద్రపోరాదు; రేపు= ఉదయకాలంలో; తండ్రికిన్= తండ్రికి; మ్రొక్కి= నమస్కరించి; ఆచార్య విప్రులకున్= వేదవిద్యలు నేర్పే గురువునకు, ఉత్తమ విద్యగల బ్రాహ్మణుడికి; వరుసన్= క్రమంగా; మఱి= తరువాత; మ్రొక్కునది= నమస్కరించాలి; వీరికిన్= వీరికి; ఎఱఁగుట= నమస్కరించటం; తక్క= తప్ప; దేవ+అర్చనంబునకున్= దేవతల పూజకు; మున్ను= ముందు; అన్యుకడకున్= ఇతరుల యొద్దకు; చనన్+కాదు= పోరాదు; గర్భిణీ సంయోగము= గర్భవతియైన భార్యను కలవటం; ఒప్పదు= కూడదు; పరిణయంబునకున్= పెండ్లికి; మున్= మునుపు; సురతసుఖమున్= రతిసుఖాన్ని; అనుభవించినన్= అనుభవిస్తే; 'అవకీర్ణ' అందురు= 'అవకీర్ణ' అని పిలుస్తారు; అట్టి అఘము= అటువంటి పాపం; ప్రాయశ్చిత్తము+ఆచరింపన్= ప్రాయశ్చిత్తం చేసుకుంటే; పోవున్= పోతుంది; ఉత్తరము= ఉత్తరం వైపు; పడమర= పడమటి దిక్కుగాను; తలయున్+కన్=తల ఉండే విధంగా; శయింపన్ తగదు= పడుకొనరాదు; శీర్ణతల్పంబు, నిద్రయును= శిథిలమైన ప్రక్కగల నిద్రకూడా; కీడు= చెడ్డది.

**తాత్పర్యం:** పండ్లు తోముట, మూలమూత్రాలను వదలటం మౌనంతో చేయాలి. రెండు సంధ్యలలో నిద్రపోరాదు. ప్రతిదినం ఉదయకాలంలో తండ్రికి, ఆచార్యుడికీ, ఉత్తమ బ్రాహ్మణుడికి నమస్కరించాలి. ఇట్లా నమస్కరించటం తప్ప దేవతార్చనకు ముందు ఎవరి దగ్గరకూ వెళ్ళరాదు. గర్భవతియైన భార్యతో సంగమం పొందరాదు. పెండ్లికి ముందు స్త్రీ సుఖం పొందితే అట్టి వ్యక్తిని అవకీర్ణ అంటారు. ఆ పాపానికి ప్రాయశ్చిత్తం చేసికొనాలి. ఉత్తరంవైపు పడమటివైపు తలపెట్టి పడుకొనరాదు. కుక్కి మంచంమీద నిద్రపోవటం చేటు.

**విశేషం:** తండ్రికి - దీనిని ఉపలక్షణంగా తీసికొని 'తల్లికి' కూడా నమస్కరించటం విధి అని గ్రహించాలి. అవకీర్ణ - ఇది స్త్రీ పురుషు లిద్దరికీ వర్తిస్తుందని గ్రహించాలి.

**క. సిత పీతంబులు ధార్యము । లతులమతీ! కుసుమకోటియందుఁ గృతస్నా**

**నత రే పాపము శుచితా । చ్యుతుఁడగు సుస్నాతుఁడేని నొడలు దొడసినన్. 106**

**ప్రతిపదార్థం:** అతులమతీ!= సాటిలేని బుద్ధి విశేషం కల ఓ ధర్మరాజా!; కుసుమకోటియందున్= పూలసముదాయంలో; సిత, పీతంబులు= తెల్లనివి, పసుపు వన్నె కలవీ; ధార్యములు= ధరింపదగినవి; రే= రాత్రియందు; కృతస్నానత= స్నానం చేసినవాడు కావటం; పాపము= పాపం; సుస్నాతుఁడు ఏనిన్= చక్కగా స్నానం చేసినవాడైనా; ఒడలు= దేహాన్ని; తొడసినన్= నీటితో తుడిచినా; శుచితాచ్యుతుఁడు= పరిశుద్ధతనుండి జారినవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** పువ్వులలో తెల్లనివీ, పచ్చని వన్నె కలవీ ధరింపదగినవి. రాత్రివేళ స్నానం పాపం. రాత్రివేళ స్నానం చేసినా, ఒళ్ళు నీటితో తుడిచినా శుచిత్వం నుండి జారినవాడవుతాడు.

**తే. నీళ్ళ నాడక మును పూఁత నిందితంబు । సీర తడితో విదిర్చుట సెట్ట; యొరులు**

**గట్టి విడిచిన వస్త్రంబు గట్టఁ గాదు । మడత మార్చు టొప్పదు కడుమాపు డైన. 107**

**ప్రతిపదార్థం:** నీళ్ళన్+ఆడక మును= స్నానం చేయకముందు; పూఁత (మేనికి సుగంధ ద్రవ్యాలు) పూసుకొనటం; నిందితంబు= దోషం, చీర= వస్త్రాన్ని; తడితోన్= తడితో; విదిర్చుట= విదిలించటం; చెట్ట= చెడుపని; ఒరులు= ఇతరులు; కట్టి= ధరించి; విడిచిన వస్త్రంబున్= విడిచిన బట్టను; కట్టన్= కట్టటం; కాదు= కూడదు; కడు మాపుడు+ఐనన్= బాగా మాసిపోయినదైనా; మడతన్= మడిబట్టను; మార్చుట= మార్చటం; ఒప్పదు= పనికిరాదు.

**తాత్పర్యం:** స్నానం చేయకుండా మైపూతలు వాడటం దోషం. బట్టను తడితో విదిలించటం చెడ్డపని. ఇతరులు కట్టినబట్టను కట్టరాదు. బాగా మాసినా మడిబట్టలను మార్చరాదు.

**విశేషం:** మడత - ఇత్యాది. ప్రత్యేకించి దేవతాపూజ మొదలైన పనులకొరకు తడిపి ఆరేసిన వస్త్రాలను మడతలు అంటారు. అవి మాసినాయని వాటిని తీసివేసి మామూలు వస్త్రాలు ధరించి పూజాదికాన్ని చేయరాదని భావం.

**క. వలవదు వటపిప్పలముల । ఫలములు నమలంగ మేడిపండ్లును దగ; దా**

**వుల మేకల నెమిళుల యెఱ । చులుఁ గానివి యవిహితంపుఁ జోటుల నధిపా! 108**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; వట పిప్పలముల ఫలములు= మర్రి, పిప్పలి పండ్లు; నమలంగన్= నమలటం; వలవదు= కూడదు; మేడిపండ్లును= మేడిచెట్టు పండ్లు కూడా; తగదు= తినరాదు; ఆవుల, మేఁకల, నెమిళుల+ఎఱచులున్= ఆవుల, మేకల, నెమళ్ళ మాంసాలు; అవిహితము+చోటులన్= పగ ఉన్న తావులలో; కానివి= చేయరానివి.

**తాత్పర్యం:** రాజా! మర్రిపండ్లు, పిప్పళ్ళు, మేడిపండ్లు తినరాదు. శత్రుస్థానాలలో ఆవుల, మేకల, నెమళ్ళ మాంసాలు పనికి రానివి.

**క. విను మొరు మూ చూ । చిన భోజ్యము నింద్య; మన్యచిత్తము తోడం**

**గొనఁదగ దాహారము; పా । త్తునఁ గుడుచుట యఘము గూడు దూషించుటయున్. 109**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఒరు మూ చూచిన భోజ్యము= ఇతరుడు వాసన చూచిన ఆహారపదార్థము; నింద్యము= చెడినది (గా భావింపదగినది); ఆహారము= భోజనం; అన్యచిత్తముతోడన్= పరధ్యానంతో; కొనన్= తీసికొనటం (తినటం); తగదు= కూడదు; పొత్తునన్= ఒక్కకంచంలో; కుడుచుట= తినటము; కూడున్= తినే పదార్థాన్ని; దూషించుటయున్= నిందించటమూ; అఘము= పాపం.

**తాత్పర్యం:** "ఇతరులు వాసన చూచిన భోజనం నిందించదగినది. పరధ్యానంతో ఆహారము తీసికొనదగదు. ఒకేపాత్రలో ఇతరులతో కలిసి (పొత్తున) భుజించడం కూటిని దూషించడం పాపాలు"

**విశేషం:** మూ చూచిన ఇట్టి పదార్థాన్ని ఉచ్ఛిష్టం అంటారు. పరుడు వాసన చూచిన అన్నంలో వాడి అంతర్గత శరీరదోషాలు దానితో సంక్రమించే అవకాశం ఉంటుంది. అన్యచిత్తము - అన్నం మనస్సును, దేహాన్నీ చక్కగా పెంచుతుంది. పరధ్యానంతో ఉంటే ఆ ప్రయోజనాలు చెడిపోతాయి. ఒకే కంచంలో భుజించడం. ఇది ఆరోగ్యానికి మంచిదికాదు.

**క. చేతఁగొని యుప్పు నమలుట, రాతిపయిని నుప్పు గొనుట, రాత్రి దధిమధూ**
**పేతంబుగఁ గుడుచుట, ధ । ర్మేతరములు; రేయి సక్తు వెగ్గు నరేంద్రా! 110**

**ప్రతిపదార్థం:** నరేంద్రా! = రాజా!; ఉప్పున్= లవణాన్ని; చేతన్= చేతిలో; కొని= తీసికొని; నమలుట= నమలటం; రాతిపయినిన్ ఉప్పున్= రాతిమీద ఉన్న ఉప్పును; కొనుట= తినటం; రాత్రి= రేయి వేళ; దధి, మధు+ఉపేతంబుగన్= పెరుగు, తేనెలతో కలసి ఉండునట్లుగా; కుడుచుట= తినటం; ధర్మ+ఇతరములు= అధర్మాలు; రేయి= రాత్రిపూట; సక్తువు= పేలపిండి; ఎగ్గు= కీడు చేస్తుంది.

**తాత్పర్యం:** చేతితో ఉప్పును గ్రహించి నమలటమూ, రాతిమీద ఉన్న ఉప్పును తినటమూ, రాత్రిపూట పెరుగు, తేనెలతో భుజించటమూ దుష్టకార్యాలు. రాత్రివేళ పేలపిండి కీడు చేస్తుంది.

**విశేషం:** ఉప్పు చాలా శీఘ్రముగా రోగక్రిములను ఆకర్షిస్తుంది. కనుక ఇతరుల చేతినుండి, బాగా సూక్ష్మక్రిములు వ్యాపించే రాయి మొదలైనవాటినుండి తీసికొనవద్దని నిషేధించి ఉంటారు. పెరుగు, తేనెలు తేలికగా జీర్ణం కాని పదార్థాలు కాబట్టి వాటిని రాత్రివేళ తింటే అజీర్ణరోగం రావచ్చును.

**క. ఒకళులు సూచినయది వా । రికిఁ బెట్టక నమలుటయును బ్రీతిం దన పం**
**క్తికిఁ దెచ్చిన చుట్టలు వే । ఱొక భంగిం గుడువఁ గుడుపు నుఱు విషభుక్తిన్. 111**

**ప్రతిపదార్థం:** ఒకళులు= ఇతరులు; చూచిన+అది= చూచిన ఆహారపదార్థాన్ని; వారికిన్= వారికి; పెట్టక= పెట్టకుండా; నమలుటయున్= తినటమూ; ప్రీతిన్= ప్రేమతో; తన పంక్తికిన్= తన వరుసకు; తెచ్చిన చుట్టలు= తెచ్చిన చుట్టాలు; వేఱు+ఒక భంగిన్= మరొక పద్ధతిలో; కుడువన్= తింటూ ఉంటే; కుడుపున్= తాను తినటమూ; విషభుక్తిన్= విషం తినటాన్ని; ఉఱున్= పోలుతుంది.

**తాత్పర్యం:** ఇతరులు చూచిన పదార్థాన్ని వారికి పెట్టకుండా తానొక్కడే తినటమూ, ప్రేమతో తన పంక్తికి వచ్చిన చుట్టాలు హీనమైన పదార్థాలు తింటూ ఉండగా తాను మేలి పదార్థాలు తినటమూ విషం తినటంతో సమానం అవుతాయి.

**విశేషం:** ఈ భారతధర్మం చాలా సూక్ష్మంగా ఆలోచింపదగినది. 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అన్న భావాన్ని భారతధర్మం ఎన్నటికీ అంగీకరించదు. 'అందరి సుఖమే ఆత్మసుఖం' అనే ధోరణి భారతీయులది.

**క. నేయి మధువు సక్తువు దధి । పాయసము జలంబు భుక్తపరిశిష్టము భూ**
**నాయక! యేరికి నిడఁ దగ । దాయువు పెంపారఁ గోరు టాత్మఁ గలిగినన్. 112**

**ప్రతిపదార్థం:** భూనాయకా!= రాజా!; ఆయువు= బ్రదుకు కాలం; పెంపారన్= అభివృద్ధి చెందటం; కోరుట= కోరటం; ఆత్మన్= బుద్ధిలో; కలిగినన్= కలిగితే; నేయున్= నేతిని; మధువున్= తేనెనూ; సక్తువున్= పేలపిండినీ; దధి= పెరుగునూ; పాయసమున్= పరమాన్నాన్నీ; జలంబు= నీటినీ; భుక్తపరిశిష్టమున్= తినగా మిగిలిన వీటిని; ఏరికిన్= ఎవరికీ; ఇడన్ తగదు= పెట్టరాదు.

**తాత్పర్యం:** రాజా! ఆయువును పెంచుకొనే కోరిక ఆత్మలో ఉంటే, నేయి, పేలపిండి, పెరుగు, పాయసం, నీరు - అనే వస్తువులలో తినగా మిగిలినవాటిని ఎవరికీ పెట్టరాదు.

**విశేషం:** తాను తినగా మిగిలినదానిని 'ఉచ్ఛిష్టం' అంటారు. ఎంగిలి అని కూడా దానికి వ్యవహారం. దానిలో తన శరీరరోగ దోషాలు సంక్రమిస్తాయి. పైన పేర్కొన్న పదార్థాలతో ఆ దోషం మరింత ఎక్కువగా ఉండే లక్షణాన్ని సంభావించి ఈ నిషేధం చెప్పి ఉంటారు.

**తే. అంగుళాగ్రముల్ చిటికెనలందు మొదళు । లనఘ! దేవర్షి తీర్థము లనఁగఁ బరఁగు**
**వరుస వలకేలి యుప్పలవాయి పైతృ । కంపుఁదీర్థంబు తర్పణకార్యమునకు. 113**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; తర్పణ కార్యమునకున్= తర్పణం అనే పనికి; అంగుళ+అగ్రముల్= వ్రేళ్ళకొనలు; చిటికెనలందున్= చిటికెన వ్రేళ్ళయందు; మొదళులు= మొదటి భాగాలు; వరుసన్= వరుసగా; దేవ+ఋషి తీర్థములు= దేవతీర్థములు; ఋషి తీర్థములు; అనఁగన్+పరఁగున్= అన్న పేరుతో ఒప్పుతాయి; వలకేలి= కుడిచేతి; ఉప్పలవాయి= చూపుడు వ్రేలికి బొటనవ్రేలికి మధ్యనున్న భాగం; పైతృకము+తీర్థంబు= పితృదేవతల తీర్థం.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! తర్పణకార్యాలలో వ్రేళ్ల తుదలను దేవతీర్థం అంటారు. చిటికెనవ్రేళ్ళ మొదటి భాగాలను ఋషితీర్థాలంటారు. కుడిచేతిలో చూపుడు, బొటన వ్రేళ్ళ మధ్యభాగాన్ని పితృతీర్థం అంటారు.

**విశేషం:** దేవతలకు తర్పణం చేసేటప్పుడు వ్రేళ్ళ చివళ్ళమీదుగా నీళ్ళు వదలాలి. ఋషులకు తర్పణం చేసే సమయంలో చిటికెన వ్రేళ్ల మొదటి కణుపుల మీదుగా నీళ్ళు వదలాలి. పితృదేవతల తర్పణంలో బొటనవ్రేలికి చూపుడు వ్రేలికి నడుమ ప్రదేశంనుండీ నీళ్ళు వదలాలి అని పద్యం తాత్పర్యం. తీర్థం అంటే పవిత్రస్థలం.

**క. ఆచమనపూర్వకంబుగ । నాచరణీయంబు సర్వ మగుతర్పణమున్**
**వాచః పరుషత క్రోధం । బాచార విధిజ్ఞు లఘము లండ్రు కుమారా! 114**

**ప్రతిపదార్థం:** కుమారా!= నాయనా!; సర్వము= అన్నివిధములది; అగు తర్పణమున్= అయిన తర్పణమూ; ఆచమన పూర్వకంబుగన్= 'ఆచమనం' అనే కార్యం ముందు కలిగేటట్లుగా; ఆచరణీయంబు= చేయదగింది; ఆచార విధిజ్ఞులు= ఆచారం విధానాలను చక్కగా తెలిసినవారు; వాచఃపరుషత= మాటలలో పరుషత్వమూ; క్రోధంబు= కోపము; అఘములు= పాపాలు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** అన్ని విధములైన తర్పణాలనూ ఆచమనం చేసిన తరువాతనే చేయాలి. ఆచారాల విధానాలు ఎరిగినవారు మాటలలో కటువుతనమూ, కోపమూ పాపాలని అంటారు.

**విశేషం:** ఆచమనం - కేశవాది నామాలు ఉచ్చరిస్తూ మూడు మారులు చిన్న ప్రమాణంలో నీరు పుచ్చుకోవటం. ఆచమనం చేసిన తరువాతనే తర్పణం చెయ్యాలి - అని తాత్పర్యం. పరుషంగా పలకటం, క్రోధం తాల్చటం ఎప్పుడూ పాపాలే కానీ సందర్భాన్ని బట్టి తర్పణాది కార్యాల సమయంలో వాటిని ఏ మాత్రమూ దరిచేరనీయరాదన్న సూచన తెలియవస్తున్నది.

**క. దినమున సురతం బెయ్యెడఁ । జనదు; చెడిపఁ గన్యఁ గవయఁ జనదు; పతిత నం**
**టని దాని నగ్నఁ జూడం । జన దుమిసిన వార్పకునికి సక్షుతుఁడైనన్. 115**

**ప్రతిపదార్థం:** దినమునన్= పగటివేళ; సురతంబు= భార్యను కలియుట; ఏ+ఎడన్= ఎన్నటికినీ; చనదు= కూడదు; చెడిపన్= చెడిపోయినదానిని; కన్యన్= వివాహము కానిదానినీ; కవయున్= కూడటం; చనదు= పనికిరాదు; పతితన్= శీలం చెడిన కాంతను; అంటనిదానిన్= ముట్టయినదానిని; నగ్నన్= బట్టలు లేనిదానిని; చూడన్+చనదు= చూడరాదు; ఉమిసినన్= ఉమ్మి వేసినా;సక్షుతుఁడు= తుమ్ము కలవాడు; ఐనన్= అయినా; వార్పక+ఉనికి= ఆచమనం చేయకపోవటం; చనదు= కూడదు.

**తాత్పర్యం:** పగటివేళ భార్యను కలియరాదు. శీలం చెడిన స్త్రీని, కన్యను కూడరాదు. పతితను, రజస్వలను, నగ్నంగా ఉన్న స్త్రీని చూడరాదు. ఉమ్మినప్పుడు, తుమ్మినప్పుడు ఆచమనం చేయకపోవటం తప్పు.

**ఆ. అట్టియెడలఁ దనకు నాచమనము దొర । కొనకయున్న సూర్యుఁ గనుచుఁ బ్రణవ**
**కలనతోడఁ గూడ వలచెవి ముట్టుట । శుచిత నిచ్చు నండ్రు సూరిజనులు. 116**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడలన్= అటువంటి సందర్భాలలో; తనకున్= తనకు; ఆచమనము= ఆచమనం చేయటం; దొరకొనక+ ఉన్నన్= కుదరకపోతే; సూర్యున్= సూర్యుడిని; కనుచున్= చూస్తూ; ప్రణవకలనతోడన్= ఓంకారం పలకటంతో; కూడన్= కూడగా; వలచెవి= కుడిచెవి; ముట్టుట= తాకటం; శుచితన్= పవిత్రతను; ఇచ్చున్= ఇస్తుంది; అని; సూరిజనులు= పండితులు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** అటువంటి సందర్భాలలో ఆచమనం చేయటం సాధ్యం కాకపోతే సూర్యుడిని చూస్తూ, ఓంకారాన్ని పలుకుతూ, కుడిచెవిని తాకటం పవిత్రతను కలిగిస్తుందని పండితులు చెప్తుతారు.

**ఆ. భగిని గురుని మిత్త్రుఁ బండితు వంశజుఁ । బేదపడినఁ దెచ్చి ప్రియముతోడఁ**
**దనగృహమున కల్మి కనురూపముగఁ బ్రోపు । పెనుపు సేయు నాయువునకు సిరికి. 117**

**ప్రతిపదార్థం:** భగినిన్= సోదరిని; గురునిన్= గురువునూ; మిత్త్రున్= చెలికానినీ; పండితున్= పాండిత్యము కలవాడినీ; వంశజున్= తన వంశంలో పుట్టినవాడినీ, పేదపడినన్= పేదతనం పొందితే; ప్రియముతోడన్= ప్రీతితో; తెచ్చి= తీసికొని వచ్చి; తన గృహమున కల్మికిన్= తన ఇంటిలోని సంపదకు; అనురూపముగన్= తగినవిధంగా; ప్రోపు= పోషించటం; ఆయువునకున్= ఆయుస్సునకూ; సిరికిన్= సంపదకూ; పెనుపు= వృద్ధిని; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** సోదరి, గురువు, చెలికాడు, పండితుడు, జ్ఞాతి - అనేవారు దిక్కులేనివారయితే వారిని తీసికొని వచ్చి ప్రేమతో తన సంపద కనురూపంగా పోషించటం ఆయువునూ, సంపదనూ వృద్ధి చేస్తుంది.

**విశేషం:** ఈ పనివలన ఆయువే కాదు. సంపద కూడా వృద్ధి పొందటం విశేషం. చాలామంది మరొకరిని పోషించవలసి వస్తే సంపద తరిగిపోతుందనుకుంటారు. కానీ అది నిజం కాదు. సౌజన్యసంపదవలన ఆర్థిక సంపద కూడా అభివృద్ధి అయ్యే అవకాశాలు ఎన్నో ఉంటాయి.

**క. పారావతములు శుకములు । శారికలును బుష్పలతలు జనవర! పసిఁడిం**
**దారమున నైన ముట్టులు । నారయ గృహమంగళంబు లాదర్శములున్. 118**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా! పారావతములు=పావురాలు; శుకములు= చిలుకలు; శారికలును= గోరువంకలు; పుష్పలతలు= పూలతీగలు; పసిఁడిన్ దారమునన్= బంగారు తీగతో; ఐన ముట్టులు= ఏర్పడిన వస్తువులు; ఆదర్శములున్= అద్దాలు; అరయన్= పరిశీలించగా; గృహమంగళంబులు= ఇంటికి శుభం కలిగించే వస్తువులు.

**తాత్పర్యం:** రాజా! పావురాలు, చిలుకలు, గోరువంకలు, పూలతీగెలు, బంగారు తీగల వస్తువులు, అద్దాలు ఇంటిలో మంగళవస్తువులు.

**తే. గ్రువ్వ గ్రద్ద దివ్వారుపుఁ బ్రువ్వు గూబ । యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయుఁ**
**జదువుఁ గుడుపును సందెలఁ జనదు రాత్రి । యైనఁ బితృకార్యములు సేయు టఘముఁ జేయు. 119**

**ప్రతిపదార్థం:** గ్రువ్వ= అడవి పావురము; గ్రద్ద= గ్రద్ద; దివ్వారుపు+ప్రువ్వు= దీపం ఆర్పే పురుగు; గూబ= గుడ్లగూబ; ఇల్లు= ఇంటిలోనికి; చొచ్చినన్= ప్రవేశిస్తే; శాంతి= మంత్రపూర్వకమైన కీడు తొలగే క్రియను; చేయింపన్ వలయున్= చేయించాలి; చదువున్= పఠనమును; కుడుపును= భోజనము; సందెలన్= సంధ్యాసమయాలలో; చనదు= చేయరాదు; రాత్రి; ఐనన్= అయితే; పితృకార్యములు - శ్రాద్ధములు; చేయుట= చేయటం; అఘమున్= పాపాన్ని; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** గువ్వ, గ్రద్ద, దీపం ఆర్పే పురుగు, గూబ ఇంటిలో ప్రవేశిస్తే శాంతి చేయించాలి. సంధ్యలలో చదవటం, తినటం పనికిరాదు. రాత్రివేళ శ్రాద్ధాలు చేయటం పాపం కలిగిస్తుంది.

**క. కులమును రూపము శీలముఁ । గల కన్య వరించి యందుఁ గనిన యపత్యం**
**బులకుఁ దగ నడపునది మం । గళములు గృతదైవపైతృక క్రియుఁ డగుచున్. 120**

**ప్రతిపదార్థం:** కులమును= మంచి వంశము; రూపమున్= చక్కని అందచందాలు; శీలమున్= ఉత్తమమైన నడవడీ; కల కన్యన్= ఉన్న కన్నెను; వరించి= ఎన్నుకొని వివాహం ఆడి; అందున్= ఆమెయందు; కనిన+అపత్యంబులకున్= కన్న సంతానానికి; కృత, దైవ, పైతృక క్రియుఁడు= దైవకార్యాలు, పితృకార్యాలూ నిర్వహించినవాడు; అగుచున్= అవుతూ; మంగళములు= శుభకార్యములు; తగన్= తగువిధంగా; నడపునది= చేయాలి.

**తాత్పర్యం:** మంచి కులమూ, రూపమూ, శీలమూ గల కన్యను వరించి ఆమెయందు పొందిన సంతానానికి, ముందు దైవకార్యాలు, పితృకార్యాలు ఆచరించినవాడై శుభకార్యాలు నిర్వహించాలి.

**విశేషం:** మంగళములు - వివాహం మొదలైనవి, అపత్యం - 'న పతన్తి అనేన పితరః నరకే' అని ఈ శబ్దానికి వ్యుత్పత్తి. పితరులు దీనిచేత నరకంలో పడరు.

**తే. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వముల నొకటి। తారకంబులుఁ దిథులును వారములును**

**జోస్యు లెఱిఁగించినవి మేలు సువ్రతైక। లోల! మంగలి పనికిని దైలమునకు. 121**

**ప్రతిపదార్థం:** సువ్రత+ఏకలోల!= శ్రేష్ఠములైన వ్రతములయందు మాత్రమే ఆసక్తి కల ఓ ధర్మరాజా!; మంగలిపనికిని= క్షౌరమునకు; తైలమునకున్= తలంటుపనికిని; ప్రాక్+ముఖ, ఉదక్+ముఖత్వములన్= తూర్పుమొగం, ఉత్తరపుమొగం కావటములలో; ఒకటి= ఒక్కటి; వలయున్= ఉండాలి; తారకంబులున్= నక్షత్రాలు; తిథులును= తిథులును; వారములును= వారాలూ; జోస్యులు= జ్యోతిశ్శాస్త్ర వేత్తలు; ఎఱిఁగించినవి= తెలిపినవి; మేలు= మంచివి.

**తాత్పర్యం:** రాజా! నీవు మంచివ్రతములయందు మాత్రమే మిక్కిలి ఆసక్తి కలవాడవు. కనుక వినుము. క్షురకర్మ, అభ్యంగస్నానం అనే పనులకు తూర్పునకు గానీ, ఉత్తరానికి గానీ మొగంపెట్టి కూర్చొనాలి. ఏ నక్షత్రాలు, తిథులు, వారాలు మేలైనవో జ్యోతిష్కులు చెప్పిన వాటిని తెలిసికొని పాటించాలి.

**క. వినుము సపిండీకరణ। మ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వ**

**ర్జన మొప్పు; నామతింపక। చన దామెతఁ గుడువఁ బోవ సజ్జనవినుతా! 122**

**ప్రతిపదార్థం:** సజ్జన వినుతా!= సజ్జనుల మంచి నుతికల ఓ ధర్మరాజా!; వినుము= విను; సపిండీకరణమ్మునన్= సపిండీకరణం అనే క్రియ జరిగిన రోజున; ఏక+ఉద్దిష్టమునను= ఏకోద్దిష్టశ్రాద్ధం చేసిన రోజున; భోజనవిధి వర్జనము= భోజనం పనిని మానటం; ఒప్పున్= మేలవుతుంది; ఆమతింపక= పిలువకుండా; ఆమెతన్= విందును; కుడువన్= తినటానికి; పోవన్= పోవటం; చనదు= కూడదు.

**తాత్పర్యం:** రాజా! వినుము. సపిండీకరణం, ఏకోద్దిష్టశ్రాద్ధం చేసిన రోజులలో భోజనం మానటం మంచిది. పిలువకుండా విందుభోజనాలకు పోరాదు.

**విశేషం:** సపిండీకరణం - క్రొత్తగా చనిపోయినవారికి పెట్టిన పార్వణపు పిండాన్ని (అన్నపుముద్దను) వారి పూర్వులు, చనిపోయినవారు ఆయన తండ్రి, తాతలకు ఉద్దేశించిన పిండాలతో కలపటం అనే శ్రాద్ధక్రియ. వారిని క్రమంగా వసు, రుద్ర, ఆదిత్యరూపాలు అంటారు. ఏక+ఉద్దిష్టశ్రాద్ధం అంటే ఒక వ్యక్తి మరణించిన పదవరోజున అతడిని మాత్రం ఉద్దేశించి చేసే శ్రాద్ధం. సాధారణంగా ఇతర శ్రాద్ధాలలో వర్గానికి శ్రాద్ధం పెట్టుతారు. వర్గం అంటే పితృ, పితామహ, ప్రపితామహులు ఇత్యాది.

**క. తల్లికిఁ దండ్రికి సుతులకు। నెల్ల విధంబులను వలయు హితములు సెప్పన్**

**మల్లకుఁడు గాక కర్జము। సల్లభ్యము గాఁగఁ జూచి సౌజన్యనిధీ! 123**

**ప్రతిపదార్థం:** సౌజన్యనిధీ!= మంచితనపు గనియైన ఓ ధర్మరాజా!; మల్లకుఁడు= కఠినచిత్తం కలవాడు; కాక= కాకుండా; కర్జము= కార్యము; సత్+లభ్యము= చక్కగా పొందదగినది; కాఁగన్= అయ్యేటట్లు; చూచి= పరీక్షించి; తల్లికిన్= అమ్మకు; తండ్రికిన్= తండ్రికి; సుతులకున్= కొడుకులకు; ఎల్లవిధంబులను= అన్ని తీరులలో; హితములు= మంచిమాటలు; చెప్పన్ వలయున్= తెలుపదగును.

**తాత్పర్యం:** కఠినహృదయుడు కాకుండా, కార్యాన్ని చక్కగా సాధించే తలపుతో, తల్లికైనా, తండ్రికైనా, కొడుకులకైనా

మేలైన ఉపదేశాలు చేయవచ్చు.

**విశేషం:** సుతులకు అన్నదానిలో అవసరాన్ని బట్టి సుతలను కూడా కలుపుకొనాలి.

**సీ. క్షత్రియుం డశ్వంబు గజమును రథమును । నెక్కు నేర్పులు గనుఁ బెక్కు గఱచి**
**నానాయుధాభ్యాస నైపుణంబునఁ బొల్చి । యుద్ధతంత్రములకు నోహటింప**
**కుండెడు మదిఁ బేర్చి దండనీతికి బోధ । కంబగు నట్టి శాస్త్రంబు మొదలు**
**గాఁగ గాంధర్వంబు గామమంత్రంబు లో । నుగ శాస్త్రముల నెల్లఁ దగిన భంగి**

**ఆ. నలవరించి మున్న యధ్యయనంబునఁ । జౌరవ గలిగి ధర్మచరణవేది**
**యై ప్రజాభిరక్ష యధ్వరకరణంబు । వలను మెఱసి నడవవలయు నధిప! 124**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; క్షత్రియుండు= క్షత్రజాతివాడు; అశ్వంబున్= గుర్రాన్నీ; గజమును= ఏనుగును; రథమును= రథాన్నీ; ఎక్కు నేర్పులు= ఎక్కేనేర్పులను; కనున్= పొందుతాడు; పెక్కు= అనేకములను; కఱచి= నేర్చుకొని; నానా+ఆయుధ+ అభ్యాస నైపుణంబునన్= పెక్కైన ఆయుధాల ప్రయోగాల యందలి పాండిత్యంతో; పొల్చి= రాణించి; యుద్ధతంత్రములకున్= పోరులలోని మెలకువ పనులకు; ఓహటింపక= వెనుదీయక; ఉండెడు మదిన్= ఉండే బుద్ధితో; పేర్చి= అతిశయించి; దండనీతికిన్= రాజనీతికి (శిక్షాస్మృతికి); బోధకంబు= ఉపదేశం చేసేది; అగు+అట్టి శాస్త్రంబు= మొదలుకాఁగన్= మొదటిది అయ్యేటట్లుగా; గాంధర్వంబు= సంగీతాన్ని; కామతంత్రంబు= కామశాస్త్రము, లోనుగన్= మొదలుగా; శాస్త్రములన్, ఎల్లన్= సకల శాస్త్రాలను; తగిన భంగిన్= ఉచితమైన పద్ధతిలో; అలవరించి=పట్టుకొని; మున్ను+అ= ముందే; అధ్యయనంబునన్= వేదం నేర్వటంలో; చౌరవ= మంచి ప్రవేశం; కలిగి= పొంది; ధర్మ చరణ వేది= ధర్మపు ప్రవర్తనను చక్కగా తెలిసినవాడు; ఐ= అయి; ప్రజా+అభిరక్ష= ప్రజలను నిండుగా కాపాడుట; అధ్వకరణంబు= యజ్ఞాలు చేయటం అనువాటిలో; వలను= నేర్పు; మెఱసి= అతిశయించి; నడవవలయున్= నడవాలి.

**తాత్పర్యం:** రాజా! క్షత్రియుడు గుర్రాన్నీ, ఏనుగునూ, రథాన్నీ ఎక్కే నేర్పులను సాధించాలి. ఎన్నో విద్యలు నేర్చి సర్వాయుధాల ప్రయోగంలోని ప్రావీణ్యంతో ప్రకాశించాలి. శత్రువుల యుద్ధతంత్రాలకు బెదరిపోకుండా గుండెను దిటవు చేసికొనాలి. దండనీతికి మొదలైన అర్థశాస్త్రం వంటి శాస్త్రాలను, సంగీతవిద్యను, కామశాస్త్రాన్నీ ఇంకా తక్కిన సర్వశాస్త్రాలనూ తగిన విధంగా అభ్యాసం చేయాలి. వేదం చదవటంలో చక్కని నిపుణతను సాధించి, ధర్మప్రవృత్తిని బాగుగా ఎరిగినవాడై, ప్రజలను చక్కగా ఏలటం, యజ్ఞకార్యాలను మెలకువతో చేయటం అనే పనులలో ప్రావీణ్యం గడించాలి.

**విశేషం:** ఒక్క మాటలో క్షత్రియుడు సర్వవిషయాలలో అందరికంటె మిన్న అయిన పాండిత్యం గడించాలని భావం. అప్పుడు అతడు ఇతరులపై ఆధారపడవలసిన అవసరం ఉండదు. ఇతరుల వంచనకు లోబడని స్థితీ, దానివలన స్థిరత్వమూ సిద్ధిస్తాయి.

**క. విను వర్ణాచారంబుల । ననఘ! యుచటఁ దెలుపఁ దొడఁగ నైనను మును లీ**
**పను లాయుర్వృద్ధికరము । లనుట కతన వలసె నీకునై చెప్పంగన్. 125**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విను= ఆలకించుము; ఇచటన్= ఇక్కడ; వర్ణ+ఆచారంబులన్= వర్ణముల ఆచారాలను; తెలుపన్= తెలుపటానికి; తొడఁగను= సిద్ధపడను; ఐనను= అయినా; మునులు= మహర్షులు; ఈ పనులు= పైన చెప్పిన పనులు; ఆయుర్ వృద్ధికరములు= ఆయువును పెంపొందించునవి; అనుట కతనన్= అనటం కారణంగా; నీకున్+ఐ= నీకోసం; చెప్పంగన్ వలసెన్= చెప్పవలసి వచ్చింది.

**తాత్పర్యం:** రాజా! ఇక్కడ వర్ణాచారాలను చెప్పటం నా తలపు కాదు. అయినా మునులు పై చెప్పిన క్షత్రియ ధర్మాలు ఆయువును వృద్ధి పరచేవి అని చెప్పటంవలన వీటిని నీకోసం చెప్పవలసి వచ్చింది.

**సీ. అధిప! రజస్వల నంటుట కల్మష । మాచరితస్నాన యైన సతిఁ జ**
**తుర్థదినంబున దోషాసమయమునఁ । జెందంగఁ దగు నండ్రు గొంద ఱార్యు**
**లేనవునాఁ డొంద నింతియు షష్ఠాహ । మునఁ బొంద మగవాఁడు బుట్టు వినుము**
**మఱియును సమవిషమములగు దివసంబు । లందోలిఁ బురుషుండు నంగనయును**

**తే. సంభవింతు రిట్టులు షోడశంబు దాఁక । నెల్లనాఁడును ఋతుశక్తి యెడలకుండ**
**నెట్టి కార్యము గల్గిన ఋతుమతీస । మాగమము దప్పనీకున్న నాయు వెక్కు. 126**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; రజస్వలన్= ముట్టయిన స్త్రీని (భార్యను); అంటుట= తాకుట; కల్మషము= పాపము; కొందఱు= కొందరు; ఆర్యులు= పూజ్యులు; ఆచరితస్నాన= చేసిన స్నానం కలది; ఐన సతిన్= అయిన భార్యను; చతుర్థదినంబునన్= నాలుగవరోజున, దోషా సమయమునన్= రాత్రివేళ; చెందంగన్= పొందటం; తగును= కూడును; అండ్రు= అంటారు; ఏనవునాఁడు= ఐదవరోజున; ఒందన్= కలసినట్లయితే; ఇంతియున్= స్త్రీ శిశువు; షష్ఠ+అహమునన్= ఆరవరోజున; పొందన్= పొందితే; మగవాఁడున్= మగశిశువూ; పుట్టున్= పుట్టుతారు; వినుము= ఆలకించుము; మఱియును= ఇంకనూ; సమవిషమములు= సరి, బేసి సంఖ్యలు; అగు దివసంబులందున్= అయిన రోజులలో; ఓలిన్= క్రమంగా; పురుషుండున్= మగవాడు; అంగనయును= స్త్రీయు; సంభవింతురు= పుట్టుతారు; ఇట్టులు= ఈ విధంగా; షోడశంబుదాఁకన్= పదునారవ రోజువరకు; ఎల్లనాఁడును= ప్రతిదినమూ; ఋతుశక్తి= రజస్సుయొక్క శక్తి; ఎడలక+ఉండన్= పోకుండా; ఎట్టి కార్యము= ఎటువంటి పని; కల్గినన్= కలిగినా; ఋతుమతీ సమాగమము= ఋతువుగల భార్యతోడి కలయికను; తప్పనీక+ఉన్నన్= తప్పిపోకుండా ఉంటే; ఆయువు= జీవితకాలం; ఎక్కున్= వృద్ధి పొందుతుంది.

**తాత్పర్యం:** రజస్వల నంటటం పాపం. స్నానం చేసిన భార్యను నాల్గవదినాన రాత్రివేళ పొందాలి అని కొందరు పూజ్యులు అంటారు. అయిదవనాడు సమాగమం పొందితే స్త్రీ శిశువూ, ఆరవనాడు పొందితే మగశిశువు కలుగుతారు. ఇంకా వినుము. సరిరోజులలో భార్యను కలిసినట్లైతే మగపిల్లవాడూ, బేసి రోజులలో స్త్రీ శిశువూ కలుగుతారు. ఈ విధంగా పదహారవ రోజు వరకు స్త్రీ ఋతువు వ్యర్థం కాకుండా, ఎన్ని పనులున్నా పురుషుడు ఋతువుగల భార్యను పొందుతూఉంటే ఆయువు పెరుగుతుంది.

**క. విను మాచార మవశ్యం । బును నడపఁగ వలయు ధర్మమున కది మూలం**
**బనఘా! ధర్మం బాయువుఁ । బెనుచును లక్ష్మిని యశంబుఁ బెంపొందించున్. 127**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; వినుము= ఆలకించుము; ఆచారము= చక్కని; క్రమబద్ధమైన నడవడిని; అవశ్యంబును= తప్పనిసరిగా; నడపఁగన్ వలయున్= ప్రవర్తింపజేయాలి; అది= ఆ ఆచారం; ధర్మమునకున్= ధర్మానికి; మూలంబు=

కుదురు; ధర్మంబు= ధర్మము; ఆయువున్= బ్రతికే కాలాన్ని; పెనుచును= వృద్ధి చేస్తుంది; లక్ష్మిని= సంపదను, యశంబున్=కీర్తిని; పెంపొందించున్= పెరిగేటట్లు చేస్తుంది.

**తాత్పర్యం:** అనఘా! వినుము. ఆచారాన్ని తప్పనిసరిగా నడిపించాలి. అది ధర్మానికి కుదురు. ధర్మం ఆయువును పెంచుతుంది. సంపదను, కీర్తిని వృద్ధి చేస్తుంది.

**తే. ఇన్ని యాచారములలోన నెక్కు డండ్రు । సకలభూతంబు లందును సదయుఁ డగుట**
**యాదిమును లట్లు గావున నఖిలవర్ణ । ములకు దయకల్మి పెద్దయు వలయుగుణము. 128**

**ప్రతిపదార్థం:** ఆదిమునులు= మొట్టమొదటి జ్ఞానసంపన్నులు; ఇన్ని+ఆచారములలోనన్= ఆ అన్ని ఆచారాలలో; సకలభూతంబు లందును= సమస్త ప్రాణులయందు; సదయుఁడు= దయతో కూడినవాడు; అగుట= కావటం; ఎక్కుడు= మిన్న; అండ్రు= అంటారు; కావునన్= కనుక; అఖిలవర్ణములకున్= అన్నివర్ణాలవారికి, అన్ని వర్ణాలవారి విషయంలో; దయకల్మి= దయకలిగి ఉండటం; పెద్దయున్= మిక్కిలి పెద్దదైన; వలయు గుణము= ఉండవలసిన గుణం.

**తాత్పర్యం:** ఆదిమునులు ఆచారాలన్నింటిలో సర్వభూతాలపై దయ మిన్న అయిన దంటారు. కాబట్టి అన్ని వర్ణాల వారికీ అన్ని వర్ణాలవారి విషయంలో దయ కలిగి ఉండటం పెద్దగా ఉండవలసిన గుణం.

**క. ఈ యాచారాధ్యాయం । బాయుశ్శ్రీకీర్తికారి యగుఁ బాపంబుల్**
**వాయం జేయును బృథివీ । నాయక! సద్భక్తిఁ జదివినను దగ వినినన్. 129**

**ప్రతిపదార్థం:** పృథివీనాయక!= రాజా!; ఈ ఆచార+అధ్యాయంబు= ఈ ఆచారసంబంధమైన గ్రంథవిభాగం; సత్+భక్తిన్= మంచి భక్తితో; చదివినను= చదివినా; తగన్= బాగుగా; వినినన్= విన్నా; ఆయుస్, శ్రీ, కీర్తి కారి= ఆయువును; సంపదను, కీర్తిని కలిగించేది; అగున్= అవుతుంది; పాపంబుల్= పాపాలను; పాయన్ చేయున్= పోగొట్టుతుంది.

**తాత్పర్యం:** రాజా! ఈ ఆచారాధ్యాయమును మంచి భక్తితో చదివినా, తగువిధంగా విన్నా ఆయువు, సంపద, కీర్తి కలుగుతాయి. పాపాలను పోగొట్టుతుంది.

**తే. అనిన బ్రీతుఁడై పాండునృపాగ్రతనయుఁ । డమరతటినీతనూజుతో నన్నదమ్ము**
**లేమివిధమునఁ దమలోన నెనసి నడచు । వార? లెఱిఁగింపు' మనుటయు గారవమున. 130**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పాండు నృప+అగ్రతనయుఁడు= పాండురాజు పెద్దకొడుకు; ప్రీతుఁడు= ప్రీతి పొందినవాడు; ఐ= అయి; అమరతటినీ తనూజుతోన్= దేవనది కుమారుడగు భీష్మునితో; అన్నదమ్ములు= సోదరులు; ఏమి విధమునన్= ఏ తీరున; తమలోనన్= తమలో; ఎనసి= పొందిక కలిగి; నడచువారలు?= ప్రవర్తిస్తారు?; ఎఱిఁగింపుము= తెలుపుము; అనుటయున్= అంటే; గారవమునన్= ప్రీతితో.

**తాత్పర్యం:** అని చెప్పగా ధర్మరాజు ప్రీతిపొంది, భీష్మునితో 'అన్నదమ్ము లేవిధంగా తమలో తాము పొందిక కలిగి ప్రవర్తించవలెనో తెలుపుమా!' అనగా భీష్ముడు ప్రేమతో.

**వ. అతం డతని కిట్లనియె. 131**

**ప్రతిపదార్థం:** అతండు= భీష్ముడు; అతనికిన్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. 'విను భక్తియు వెఱపుఁ గలిగి । యనుజన్ములు పెద్దవాని నారాధింపన్**
**జనవర! యతండుఁ దమ్ములఁ । గొనియాడన్ సిరికిఁ బ ట్టగుదు రుజ్జ్వలులై. 132**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; విను= ఆలకించుము; అనుజన్ములు= తమ్ములు; భక్తియున్= గౌరవభావము; వెఱపున్=భయము; కలిగి; పెద్దవానిన్= అన్నను; ఆరాధింపన్= కొలువగా; అతండున్= అన్న కూడా; తమ్ములన్= తమ్ములను; కొనియాడన్= మన్నించగా; ఉజ్జ్వలులు= చక్కని ప్రకాశము కలవారు; ఐ= అయి; సిరికిన్= సంపదకు; పట్టు= స్థానం; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. తమ్ములు అన్నయెడ భయభక్తులు కలిగి ఆరాధించాలి. అన్న తమ్ములను మన్నిస్తూ ఉండాలి. ఇట్లా అయితే ఆ అన్నదమ్ములు లోకంలో ప్రకాశిస్తూ సంపదకు స్థానం అవుతారు.

**విశేషం:** భక్తి, వెఱపు - 'పితృసమో జ్యేష్ఠః' - పెద్దవాడు తండ్రితో సమానుడు - కనుక తండ్రియందువలె భక్తి, ఏ తప్పుచేస్తే, ఏ విధమైన కోపం వస్తుందో అన్న భయమూ, అన్నయెడల కలిగి ఉండాలని తాత్పర్యం.

**క. అనుజుఁ డొకఁడు వెంగలియై । నను దప్పెడుఁ గాని పెద్దనకుఁ గార్యజ్ఞా**
**ననిరూఢి లేక తక్కిన । ననుజన్ములు సిక్కువడుదు రవనీనాథా! 133**

**ప్రతిపదార్థం:** అవనీనాథా!= రాజా!; అనుజుఁడు= తమ్ముడు; ఒకఁడు= ఒక్కడు; వెంగలి= బుద్ధిలేనివాడు; ఐనను= అయినా; తప్పెడున్= తప్పిపోతుంది; కాని= కానీ; పెద్ద+అనకు= జ్యేష్ఠుడికి; కార్య , జ్ఞాన నిరూఢి= పనులకు సంబంధించిన చక్కని తెలివి స్థిరంగా ఉండటం; తక్కినన్= చెడితే; అనుజన్ములు= తమ్ములు; చిక్కు+పడుదురు= ఇబ్బందుల పాలవుతారు.

**తాత్పర్యం:** రాజా! తమ్ము డొకడు బుద్ధిహీనుడైనా పెద్ద ప్రమాదం లేదు. కానీ అన్న కార్యజ్ఞానం దృఢంగా లేనివాడైతే తమ్ముళ్ళు ఇబ్బందుల పాలవుతారు.

**విశేషం:** అన్న నాయకుడు - నడపువాడు, తమ్ముళ్ళు - నేయులు నడపబడేవారు. నాయకుడు బుద్ధిహీను డయితే నడపబడే వారికి నాశనమే గతి - అని తాత్పర్యం.

**చ. జనవర! యన్నదమ్ములు ప్రసన్నమతిం గలకల్మి పంచి కు**
**డ్చిన వినుతించు లోకములు; శ్రీయుఁ బోరింబోరిఁ బెంపు నొందు; లో**
**భనిరతిఁ బెద్ద కాసపడి పాడి దొఱంగినఁ బ్రాణగొడ్డపుం**
**బనులగు నవ్విధంబు మనపడ్డది కాదె జగం బెఱుంగఁగన్! 134**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా! అన్న+తమ్ముడు= అన్నయును, తమ్ముడును; ప్రసన్నమతిన్= దుష్టభావాలు లేని బుద్ధితో; కల కల్మిన్= ఉన్న సంపదను; పంచి= చక్కగా విభాగించుకొని; కుడ్చినన్= అనుభవిస్తే; లోకములు= లోకాలు (జనులు); వినుతించున్= కొనియాడుతాయి; పొరిన్ పొరిన్= క్రమంగా; శ్రీయున్= సంపద కూడా; పెంపున్=వృద్ధిని; ఒందున్=పొందుతుంది; లోభనిరతిన్= పిసినిగొట్టుతనపు పట్టుదలతో; పెద్దకున్= అధికభాగానికి; ఆసపడి= కోరిక పొంది; పాడి= న్యాయం; తొఱంగిన్=

వదలివేస్తే; ప్రాణగొడ్డము+పనులు= ప్రాణానికి ముప్పుతెచ్చే పనులు; అగున్= అవుతాయి; ఆ+విధంబు= ఆ తీరు; జగంబు= లోకము; ఎఱుంగన్= తెలియునట్లుగా; మన పడ్డ+అది, కాదె!= మనం అనుభవించినదే కదా!

**తాత్పర్యం:** రాజా! అన్నదమ్ములు కలతలు లేని బుద్ధితో ఉన్న సంపదను చక్కగా పంచుకొని అనుభవించాలి. అప్పుడు లోకులు మెచ్చుతారు. సంపద కూడా క్రమంగా వృద్ధి పొందుతుంది. అట్లాకాక ఒకడు అత్యాశతో ఎక్కువ భాగాన్ని ఆపేక్షిస్తే ప్రాణాంతకపు పనులు ఏర్పడుతాయి. లోకమంతా ఎరిగినవిధంగా అది మనం అనుభవించిందే కదా!

**విశేషం:** ఇక్కడ వ్యంగ్యంగా భీష్ముడు ధృతరాష్ట్రుడి తప్పిదాన్ని సూచిస్తున్నాడు. ప్రసన్నమతి - ఉన్న సంపదలో ఒకడు నిష్కారణంగా ఎక్కువభాగాన్ని అపేక్షించటం కుళ్ళుబుద్ధి. నాకెంత అధికారం ఉన్నదో వాడికి కూడా అంతే ఉంది అనుకోవటం సమబుద్ధి.

**తే.** **తండ్రి పిమ్మట నన్నయ తండ్రి పిన్న। వారలకు నెల్ల నాతనివనిత తల్లి**
**తల్లికడచన్న నని చెప్పి తాత మఱియు। మనుమనికి నిట్టులను నభిమన్యుపౌత్ర!** **135**

**ప్రతిపదార్థం:** తండ్రి పిమ్మటన్= తండ్రి తరువాత; అన్న+అ= అన్నయే; పిన్నవారలకున్= తమ్ములకు; ఎల్లన్= అందరికీ; తండ్రి= నాయన; తల్లి కడచన్నన్= అమ్మ చనిపోతే; ఆతని వనిత= అన్న భార్య; తల్లి= అమ్మ; అని; చెప్పి= బోధించి; అభిమన్యుపౌత్ర!= అభిమన్యుడి మనుమడవగు ఓ జనమేయా! తాత= తాత అయిన భీష్ముడు; మఱియున్= ఇంకా; మనుమనికిన్= మనుమడైన ధర్మరాజునకు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= చెబుతున్నాడు.

**తాత్పర్యం:** జనమేజయా! తండ్రి తరువాత అన్నయే తమ్ము లందరికీ తండ్రి. తల్లి చనిపోయిన పిమ్మట అన్న భార్యయే వారికి తల్లి అని చెప్పి, జనమేజయా! తాతయైన భీష్ముడు ఆ మనుమడికి ఇంకా ఇట్లా బోధించాడు.

**విశేషం:** 'అభిమన్యు పౌత్ర!' ఇది జనమేజయుడికి వైశంపాయనుడు చేసిన సంబోధన. అభిమన్యుడు లోకోత్తరవీరుడు. అతడి పౌత్రుడిగా తనను పిలిస్తే జనమేజయుడికి పరమానందం.

**క.** **మానవనాయక! యగ్రజుఁ డైనను ననుజన్ముఁ డేని నన్యాయంబుం**
**బూని సహోదరులకుఁ గీ। డైన నతఁడు దండ్యుఁ డందు రవనీపతికిన్.** **136**

**ప్రతిపదార్థం:** మానవనాయక!= జననాయకా!; రాజా!; అగ్రజుఁడు= అన్న; ఐనను= అయినా; అనుజన్ముఁడు= తమ్ముడు; ఏనిన్= అయినా; అన్యాయంబున్= న్యాయవిరుద్ధం అయినదానిని; పూని= పట్టుకొని; సహ+ఉదరులకున్= అన్నదమ్ములకు; కీడు= ప్రమాదం చేసేవాడు; ఐనన్= అయితే; అవనీపతికిన్= రాజునకు; దండ్యుఁడు= దండింప బడదగినవాడు; అందురు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! అన్నగానీ తమ్ముడు గానీ న్యాయం తప్పి అన్నదమ్ములకు కీడుచేస్తే వాడు రాజునకు శిక్షార్హుడవుతాడు.

**విశేషం:** 'మానవనాయక!' అన్న సంబోధనవల్ల ఇది చక్కగా గుర్తించి నీ ఏలుబడిలో ఇట్టి వాటిని పరిశీలించాలి అని సూచన.

**వ. అని సహోదరప్రకారంబు సెప్పి వెండియు. 137**

**ప్రతిపదార్థం:** అని; సహోదర ప్రకారంబు= అన్నదమ్ముల తీరు; చెప్పి= తెలిపి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** అని అన్నదమ్ములు వ్యవహరించవలసిన విధానాన్ని బోధించి, ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. విను మప్పఁ దల్లియట్లుగఁ; గొని నడపఁగ వలయుఁ జన్ను గుడిపి పెనిచె నె**

**వ్వనిత యదియు నాతనికిని । జననీసమ యండ్రు బుధులు సౌజన్యనిధీ! 138**

**ప్రతిపదార్థం:** సౌజన్యనిధీ!= మంచితనపు గనియైన వాడా!; వినుము= ఆలకించుము; అప్పన్= అక్కను; తల్లి+అట్లుగన్= తల్లివలెనే; కొని= భావించి; నడపఁగన్+వలయున్= చెల్లించాలి; ఏ+వనిత+= ఏ స్త్రీ; చన్ను కుడిపి= చనుపాలుత్రావించి, పెనిచెన్= పెంచినదో; అదియున్= ఆ స్త్రీ కూడా; అతనికిన్= ఆ పాలు త్రావినవాడికి; జననీసమ= తల్లితో సమానురాలు; అని; బుధులు= జ్ఞానము కలవారు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** సుజనుడా! అక్కను తల్లివలె భావించి మన్నించాలి. అట్లాగే పసితనంలో చన్నిచ్చి పెంచిన స్త్రీ కూడా తల్లితో సమానురాలే అని పండితులు చెప్తుతారు.

**విశేషం:** స్థూలంగా ధర్మరాజు అన్నదమ్ముల సంగతి అడిగినా ఆ వరుసలోని వారినిగూర్చి కూడా భీష్ముడు చెప్పటం భావగ్రాహి లక్షణం.

**క. జనకుం డధికుఁ డుపాధ్యా । యునకుఁ బదిమడుంగు లెక్కు డుర్వీనాథా!**

**జనకునకు దశ గుణంబులు । జనని గురుత్వమున నిది ప్రశస్తము శ్రుతులన్. 139**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా!; జనకుండు= కన్నవాడు; ఉపాధ్యాయునకున్= చదువుచెప్పువాడికంటె; పది మడుంగులు= పదిరెట్లు; అధికుఁడు= ఎక్కువవాడు; జనని= తల్లి; జనకునకున్= తండ్రికంటె; గురుత్వమునన్= గొప్పతనంలో; దశగుణంబులు= పదిరెట్లు; ఎక్కుడు= మిన్న అయినది; ఇది= ఈ సంగతి; శ్రుతులన్= వేదాలలో; ప్రశస్తము= ప్రశంసకు వచ్చింది.

**తాత్పర్యం:** రాజా! ఉపాధ్యాయుడికంటె తండ్రి పదిరెట్లు ఎక్కువ మాన్యుడు. తండ్రికంటె తల్లి పదిరెట్లు గౌరవంలో మిన్న అయినది. వేదాలు ఈ విషయాన్ని ప్రశంసించాయి.

**క. జననీజనకులచే నగు । జననం బాగమము దను విషయ మని చెప్పున్**

**విను మాచార్యు వలన నొం । దిన పు ట్టజరామరంబు దివ్యంబునగున్. 140**

**ప్రతిపదార్థం:** ఆగమము= వేదము; జననీజనకులచేన్= తల్లిదండ్రులచేత; అగు జననంబు= అయిన పుట్టుక; తను విషయము= దేహమునకు సంబంధించినది; అని; చెప్పున్= చెప్తుతున్నది; వినుము= ఆలకించుము; ఆచార్యునివలనన్= గురువువలన; ఒందిన పుట్టు= కలిగిన జన్మ; అజరామరంబు= ముదిమి, చావు లేనిది; దివ్యంబున్= దేవలోక సంబంధం కలది; అగున్= అగును.

**తాత్పర్యం:** రాజా! తల్లిదండ్రులవలననైన జన్మ దేహసంబంధి అని వేదం చెప్తుతున్నది. ఆచార్యుడివలన నైన పుట్టుక ముసలితనమూ, చావులేనిది, దివ్యమైనది.

**విశేషం:** ఆచార్యుడు - శాస్త్రార్థాల నన్నింటినీ తనలో నింపుకొని వాటిని శిష్యుడితో ఆచరింపజేస్తూ స్వయంగా ఆచరించేవాడు ఆచార్యుడు.

**'ఆచినోతి హి శాస్త్రాణి ఆచారే స్థాపయత్యపి,**
**స్వయ మాచరతే యస్తు స ఆచార్య ఇతి స్మృతః'**

**ఆచార్యవాన్ పురుషోవేద'** అని శ్రుతి. ఆచార్యుడు గల పురుషుడే తత్త్వాన్ని తెలిసికొనగలడు. తల్లిదండ్రులు బంధహేతువైన దేహాన్నిస్తున్నారు. ఆచార్యుడు ఆ దేహసంబంధం లేని స్థితిని - మోక్షాన్ని ప్రసాదిస్తున్నాడు. కనుక ఆ పుట్టుక అజరామరమూ దివ్యమూ అవుతున్నది.

**వ. కావున గౌరవంబున నాచార్యుండు సర్వాధికుండు. 141**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; గౌరవంబునన్= మాన్యతలో; ఆచార్యుండు= గురువు; సర్వ+అధికుండు= అందరికంటె ఎక్కువ అయినవాడు.

**తాత్పర్యం:** కనుక గౌరవంలో ఆచార్యుడు అందరికంటె మిన్న.

**విశేషం:** 139వ పద్యంలో చెప్పిన ఉపాధ్యాయుడు, 140వ పద్యంలో చెప్పిన ఆచార్యుడు ఒకరే అనుకోరాదు. ఉపాధ్యాయుడంటే లోకపు చదువులను చెప్పేవాడనీ, ఆచార్యుడు పరమార్థాన్ని బోధిస్తాడని తెలిసికోవాలి. లేకపోతే 'జనకుడు ఉపాధ్యాయునకు పది మడుంగులు' అన్న వాక్యానికీ 'గారవంబున ఆచార్యుండు సర్వాధికుండు' అన్న మాటకూ పరస్పరవైరుద్ధ్యం సిద్ధిస్తుంది.

**క. అని యిట్లు సుప్రసంగం । బున గురుజన తారతమ్యములు సెప్పినఁ దా**
**విని శంతనుతనయున కి । ట్లనుఁ బాండు నృపాగ్రతనయుఁ డతులిత భక్తిన్. 142**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; సుప్రసంగంబునన్= మంచి ప్రసంగాన్ని బట్టి; గురుజన తారతమ్యంబులు= మన్నించ దగిన జనములలోని ఎక్కువతక్కువలను; చెప్పినన్= చెప్పగా; తాన్= తాను; విని= ఆలకించి; పాండు, నృప+అగ్ర తనయుఁడు= పాండురాజు పెద్దకొడుకు ధర్మజుడు; శంతనుతనయునకున్= శంతనుడి కుమారుడైన భీష్మడితో; అతులితభక్తిన్= సాటిలేని భక్తితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** అని మంచి ప్రసంగంలో గురుజనుల ఎక్కువతక్కువలను గూర్చి చెప్పగా ధర్మరాజు సాటిలేని భక్తితో భీష్మడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అతులిత భక్తిన్ - సర్వాధికుడైన ఆచార్యుడి స్థానంలో భీష్మడిని ధర్మరాజు సంభావించిన తీరు దీనివలన తెలియ వస్తున్నది.

**క. 'భూసురులకు నృపులకు నుప । వాసము దగుఁ గాని యన్యవర్ణులకుఁ దదీ**
**యాసక్తి కలిమి పెద్దయు । దోసంబని విందు ధర్మధుర్యస్వాంతా! 143**

**ప్రతిపదార్థం:** ధర్మ ధుర్య స్వాంతా!= ధర్మమును భరించు హృదయంకల ఓ తాతా!; భూసురులకున్= బ్రాహ్మణులకు; నృపులకున్= రాజులకు; ఉపవాసము= పస్తు ఉండటం; తగున్= చెల్లుతుంది; కాని; అన్యవర్ణులకున్= వేరు వర్ణాల వారికి;

తదీయ+ఆసక్తి కలిమి= దానిదైన తగులం ఉండటం; పెద్దయున్= అధికమైన; దోసంబు= తప్పు; అని; విందున్= వింటూ; ఉంటాను.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణులకు, క్షత్రియులకు ఉపవాసము మంచిది. తక్కిన వర్ణాల వారికి కాదు. ఉపవాసాలమీద ఆసక్తి ఉండటం పెద్దదోషం అని నేను వింటూ ఉంటాను.

**విశేషం:** కృషి గోరక్ష, వాణిజ్యమూ, వృత్తులూ చేసికొనే జాతులవారు ఉపవాసాదుల జోలికిపోతే అది వృత్తి ధర్మానికి అడ్డుగా నిలుస్తుందని భావం.

### భీష్ముఁడు ధర్మరాజున కుపవాసవిధివిశేషంబు సెప్పుట (స.13-163-3 (కుంభ))

**వ. ఉపవాసవిధియోగ్యతయును దత్ఫల విశేషంబును వినవలతుం జెప్పవే యనుటయు నప్పురుషవరుం డప్పుడమి ఱేనితో, 'దీని నీవు నన్నడిగినట్ల యే నంగిరసు నడిగిన నమ్మునిపతి నాకుం జెప్పె నత్తెఱంగుఁ జెప్పెద నాకర్ణింపు' మని పలికి యిట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** ఉపవాసవిధి యోగ్యతయును= ఉపవాస నియమానికి తగినతనాన్ని; తద్ఫల విశేషంబును= దాని ఫలంయొక్క గొప్పతనాన్నీ; విన వలతున్= వినగోరుతున్నాను; చెప్పవే= దయతో చెప్పుము; అనుటయున్= అనగా; ఆ+పురుషవరుండు= ఆ మనుజశ్రేష్ఠుడు; ఆ+పుడమిఱేనితోన్= ఆ రాజుతో; దీనిన్= దీనిని; నీవు; నన్నున్; అడిగిన+అట్లు+అ= అడిగిన విధంగానే; ఏను= నేను; అంగిరసున్= అంగిరసుడనే మహర్షిని; అడిగినన్= అడిగితే; ఆ+మునిపతి= ఆ మహర్షి; నాకున్= నాకు; చెప్పెన్= బోధించాడు; ఆ+తెఱంగున్= ఆ పద్ధతిని; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= చెవు లొగ్గి వినుము; అని; పలికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఉపవాస విధికి యోగ్యత, దాని గొప్పఫలము అనే వాటిని గూర్చి వినగోరుతున్నాను. చెప్పవూ!' అని అడిగితే భీష్ము డా రాజుతో ఇట్లా అన్నాడు. ఈ విషయం గురించి నీ వడిగినట్లే నేను అంగిరసు డనే మహర్షి నడిగాను. ఆయన నాకు చెప్పిన సంగతి నీకు వినిపిస్తాను. వినుము' అని ఇట్లా అన్నాడు.

**క. రాత్రిత్రయంబు బ్రహ్మ । క్షత్రియులకు నుపవసింపఁ జనుఁ దదధికమున్**
**గాత్రస్థితిఁ దప్పింపని । మాత్ర నయిన మేలు కురుసమాజవరేణ్యా! 145**

**ప్రతిపదార్థం:** కురుసమాజ వరేణ్యా!= కురువంశంలో గొప్పవాడా!; బ్రహ్మక్షత్రియులకున్= బ్రాహ్మణులకు, రాజులకు; రాత్రిత్రయంబు= మూడు రాత్రులు; ఉపవసింపన్= పస్తు ఉండటం; చనున్= తగును; తద్+అధికమున్= అంత కెక్కువ కూడా; గాత్ర స్థితిన్= దేహము స్థితిని; తప్పింపని మాత్రన్= చెడగొట్టని ప్రమాణం; అయినన్= అయితే; మేలు= మంచిది.

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రాహ్మణులు, క్షత్రియులు మూడు రాత్రులు ఉపవాసం చేయదగును. శరీరస్థితి చెడకుండా ఉంటే అంతకంటె ఎక్కువ చేసినా మంచిదే.

**విశేషం:** రాత్రిత్రయంబు అంటే మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ అని భావం. గాత్రస్థితి - 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' 'శరీరం మొదటి ధర్మసాధనం కదా!' అన్నారు. కనుక ఏ మాత్రమూ శరీరాన్ని భంగించేది కారాదు.

**క. విను వైశ్యులకును శూద్రుల । కును నాలుగు కుడుపు లుడుగు కొలఁదికి మిగులం**
**జన దుపవసింప నుపవా । సనిరూఢత పెంపు కల్మషము వారలకున్. 146**

**ప్రతిపదార్థం:** విను= వినుము; వైశ్యులకున్= కోమటివారికిని; శూద్రులకున్= శూద్రులకునూ; నాలుగు కుడుపులు= నాలుగు భోజనాలు; ఉడుగు కొలఁదికిన్= వదలే లెక్కకు; మిగులన్= మించేటట్లుగా; ఉపవసింపన్ చనదు= ఉపవాసం ఉండ రాదు; ఉపవాస, నిరూఢత పెంపు= ఉపవాసమునందలి పట్టుదలను పెంచుకొనటం; వారలకున్= ఆ రెండువర్ణాల వారికి; కల్మషము= పాపం.

**తాత్పర్యం:** వైశ్యులు, శూద్రులు నాలుగు భోజనాలు వరకు మానవచ్చును. అంతకుమించి ఉపవాసపు పట్టుదలను పెంచుకొనటం వారికి పాపం.

**విశేషం:** నాలుగు కుడుపులు ఉడుగుట అంటే రెండు పగళ్ళూ, రెండు రాత్రిళ్ళు ఉపవాసం ఉండవచ్చునని భావం.

**ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమీ చతు । ర్దశుల నుభయపక్ష వశత వచ్చు**
**షష్ఠిఁ బంచమిని సునిష్ఠమై నుపవాస । మున్న వివిధశుభము లొలయు నండ్రు. 147**

**ప్రతిపదార్థం:** పౌర్ణమాసిన్= పూర్ణిమనాడు; పూర్వపక్ష+అష్టమీ, చతుర్దశులన్= శుక్లపక్షంలోని అష్టమినాడు, చతుర్దశినాడూ; ఉభయపక్షవశతన్= రెండుపక్షాలకు వశమై; వచ్చు షష్ఠిన్= వచ్చే షష్ఠినాడు; పంచమిని= పంచమితిథియందు; సునిష్ఠమైన్= దృఢమైన నిష్ఠతో; ఉపవాసము= పస్తు; ఉన్నన్= ఉంటే; వివిధశుభములు= పెక్కు రకాల మేళ్ళు; ఒలయును= కలుగును; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** పూర్ణిమనాడు, శుక్లపక్ష అష్టమి, చతుర్దశి తిథులయందు, శుక్లకృష్ణ పక్షాలలో షష్ఠి, పంచమి తిథులయందూ, చెదరని నియమంతో ఉపవాసం ఉంటే ఎన్నోవిధాల శుభాలు కలుగుతాయని అంటారు.

**విశేషం:** 'సునిష్ఠమైన్= ఉపవాసం విషయంలో చాలామంది సర్దుబాటు ధోరణిలో ఉంటారు. దంభంకొరకు ఉపవాసాలు చేస్తారు. అవి పనికి మాలినవని ఈ పద్యం హెచ్చరిస్తున్నది.

**సీ. ఏకభుక్తవ్రత మెంతయు నిష్ఠ మా । సం బెల్ల నడపిన సద్విజుండు**
**సుభగాకృతియు రూపశోభితాంగనయు స । త్సుతులును ధనధాన్యతతులు భోగ**
**ములు సద్గుణంబులు భూరియశంబును । మొదలైన బహుశుభంబులకుఁ బాత్ర**
**మగు నేఁడుకాల మయ్యతులవ్రతము సల్పి । యఖిల భూలోకసౌఖ్యములుఁ ద్రిదివ**

**తే. మోదమును గండ్రు రెండును మూఁడు నాల్గు । నీ క్రమంబున నోపిన ట్లెక్కినట్టి**
**దినము లెడ పెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు । నడపువారల తెఱఁగు లేర్పడఁగ వినుము. 148**

**ప్రతిపదార్థం:** ఏకభుక్త వ్రతము= ఒక పూట భోజనం చేసే వ్రతాన్ని; ఎంతయున్= మిక్కిలి; నిష్ఠన్= నియమంతో; మాసంబు=నెల; ఎల్లన్= అంతా; నడపిన సత్ ద్విజుండు= చేసిన ఉత్తమబ్రాహ్మణుడు; సుభగ+ఆకృతియున్= అందమైన ఆకారం; రూప శోభిత+ అంగనయున్= గొప్ప సౌందర్యంతో విరాజిల్లే భార్య; సత్సుతులును= మంచి పుత్రులు; ధన ధాన్య

తతులు= ధనములు; ధాన్యాలు అనే వాటి రాశులు; భోగములు=సుఖాలు; సత్+గుణంబులు= మంచి గుణాలు; భూరి యశంబును= అధికమైన కీర్తి; మొదలు+ఐన= మొదలైన; బహుశుభంబులకున్= పెక్కు మంగళములకు; పాత్రము= యోగ్యతకలవాడు; అగున్= అగును; ఏఁడుకాలము= ఒక్క సంవత్సరకాలం; ఆ+అతుల వ్రతం= సాటిలేని ఆ వ్రతాన్ని; సల్పి= ఆచరించి; అఖిల భూలోక సౌఖ్యములు= సమస్తములైన భూలోకమందలి సుఖాలనూ; త్రిదివ మోదమును= స్వర్గంలోని ఆనందాన్నీ; కంద్రు= పొందుతారు, రెండును= రెండు రోజులు; మూఁడును= మూడు రోజులు; నాల్గిన్= నాలుగు దినములు; ఈ క్రమంబునన్= ఈ వరుసలో; ఓపిన+అట్లు= శక్తి ఉన్న విధంగా; ఎక్కిన+అట్టి దినములు= పెరిగిన రోజులు; ఎడ పెట్టి= వ్యవధానం ఉంచి; కుడుచుచున్= తింటూ; ధృతిన్= ధైర్యగుణంతో; ఒక+ఏఁడు= ఒక్క ఏడాదికాలం; నడపువారల తెఱఁగులు= జరిపేవారి విధానాలు; ఏర్పడఁగన్= స్పష్టమయ్యే విధంగా; వినుము= వినుము.

**తాత్పర్యం:** రోజుకు ఒకమారు మాత్రమే భుజించటం అనే వ్రతాన్ని ఎంతో నిష్ఠతో ఒక నెలరోజులు చేసిన ఉత్తమ బ్రాహ్మణుడు మంచిరూపమూ; అందచందాలు గల భార్య; గుణవంతులైన కొడుకులూ; ధనధాన్యాలూ; సుఖాలూ, మంచిగుణాలూ; గొప్ప కీర్తి మొదలైన పెక్కు శుభాలకు పాత్ర మవుతాడు. ఈ సాటిలేని వ్రతాన్ని ఒక్క సంవత్సరకాలం చేసిన భూలోక సుఖాలన్నింటినీ, స్వర్గసుఖాలనూ పొందుతారు. అట్లాగే రెండురోజులు, మూడురోజులు, నాలుగురోజులు, ఈవిధంగా శక్తిమేరకు ఎక్కువ రోజులు వ్యవధానం ఉంచి తింటూ ధైర్యంతో ఒక సంవత్సరం వ్రతం చేసేవాళ్ళ పద్ధతులు వివరిస్తాను వినుము.

**విశేషం:** రూపశోభిత+అంగన= ఆవేధ్యము, ఆరోప్యము, విక్షేప్యము, బంధనీయము - అని నాలుగు విధాలైన ఆభరణాలు ధరించకపోయినా, ధరించినట్లు ప్రకాశించే అందాన్ని రూపం అంటారు. (ఆవేధ్యారోప్యనిక్షేప్య బంధనీయై రభూషితం, యేన భూషితవద్భాతి తద్రూపమితి కథ్యతే) అంగన - అన్న శబ్దంకూడా శ్రేష్ఠమైన అంగములు కలది అనే అర్థాన్నిస్తుంది.

**క. ఎక్కుడు దినముల శుభములు । నెక్కు నఖిలవైభవములు నెక్కు దినమునం**
**దక్కక యుండెడు కాలము । నెక్కు మహాత్మతయు నెక్కు నిభపురనాథా! 149**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= హస్తిపురప్రభూ!; ఎక్కుడు దినములన్= అధికమైన దినములతో; శుభములున్= మంగళములునూ; ఎక్కున్= అధికం అవుతాయి; అఖిల వైభవములున్= సమస్తమైన భోగభాగ్యాలు కూడా; ఎక్కున్= మెండవుతాయి; దినమునన్= రోజులో; తక్కక+ఉండెడు కాలమున్= వ్యర్థమై పోకుండే కాలం; ఎక్కున్= పెరుగుతుంది; మహాత్మతయున్= గొప్ప ఆత్మ కలిగే తనంకూడా; ఎక్కున్= వృద్ధి అవుతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఉపవాసదినాలు పెరిగిన కొలదీ శుభములు పెరుగుతాయి. సమస్తవైభవాలు అధికమవుతాయి. దినములో వ్యర్థం కాకుండా పోయేకాలం వృద్ధి అవుతుంది. మహాత్మత కూడా అతిశయం అవుతుంది.

**విశేషం:** తక్కక ఉండెడు కాలము - తక్కుట - తప్పిపోవటం - అంటే వ్యర్థం కావటం - అట్లా కాకుండా ఉండేకాలం పెరుగుతుంది.

**తే. వత్సరం బెల్లఁ బక్షోపవాసనియతిఁ । గడపు నతనికిఁ బుణ్యలోకంబు లెల్ల**
**వాసభూములు మాసోపవాసవృత్తి । యైన బ్రహ్మలోకంబు సౌఖ్యంబు గలుగు. 150**

**ప్రతిపదార్థం:** వత్సరంబు= ఒక ఏడు; ఎల్లన్= అంతా; పక్ష+ఉపవాస నియతిన్= పదునైదు రోజులకాలం ఉపవాసనియమంతో; కడపు+అతనికిన్= సాగించేవాడికి; పుణ్యలోకంబులు= ఉత్తమలోకాలు; ఎల్లన్= అన్నీ; వాసభూములు= నివాసం ఉండే తావులు; మాస+ఉపవాస వృత్తి= నెలరోజులు ఉపవాసం చేసేవాడు; ఐనన్= అయితే; బ్రహ్మలోకంబు సౌఖ్యంబు= బ్రహ్మలోకంలో ఉండే పరమసుఖం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఒక ఏడాదిపక్షం రోజుల చొప్పున ఉపవాస నిష్ఠతో గడిపేవాడికి పుణ్యలోకాలన్నీ నివాసభూములవుతాయి. నెలరోజులు చొప్పున ఉపవాసం చేసేవాడికి బ్రహ్మలోకపు సుఖం లభిస్తుంది.

**విశేషం:** పక్షోపవాసం అంటే నెలలో ఒక పదునైదురోజులు ఉపవసించటం. పదునైదురోజులు భోజనం చేయటం అన్న వరుస అనీ, మాసోపవాసం అంటే ఒక నెల ఉపవాసం ఉండి తరువాతి నెల భుజించటం అనే క్రమాన్ని పాటించటం అనీ భావించాలి. మొదటిదానిలో 12 పక్షాలు ఉపవాసం 12 పక్షాలు భోజనం, రెండవదానిలో 6 మాసాలు ఉపవాసం 6 మాసాలు భోజనం అని తాత్పర్యం.

**ఆ. ఎంత నిష్ఠ గలిగె నేనియు మాసంబు । లోనియంద యెక్కుడైన దినము**
**లధిప! యుపవసింపనగుఁ గాని మాసాధి । కోపవాసవృత్తి పాపమండ్రు. 151**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! ఎంతనిష్ఠ= ఎంతటి నిలుకడ (పట్టుదల); కలిగెన్+ఏనియున్= కలిగినప్పటికీ; మాసంబులోని+అందు+అ= మాసంలోపలనే; ఎక్కుడు+ఐన దినములు= ఎక్కువ రోజులు; ఉపవసింపన్= భోజనం మాని ఉండటం; అగున్ కాని= తగునుకానీ; మాస+అధిక+ఉపవాస వృత్తి= నెలకుమించి ఉపవాసం ఉండటం; పాపము= పాపం; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఎంత కఠిననిష్ఠ ఉన్నా నెలకులోబడిన కాలంలోనే ఎక్కువ రోజులు ఉపవసించాలి. నెలకు మించిన రోజులు ఉపవాసం ఉండటం పాపం అంటారు.

**వ. యుగసామర్థ్యంబుననుం బురుషమహానుభావవిశేషంబుననుంజేసి యుపవాసవ్రతంబు మహాధికకాలకృతం బయినను గీడుం జేయక యత్యంతఫలప్రదంబై యుండు. 152**

**ప్రతిపదార్థం:** యుగ సామర్థ్యంబుననున్= కృతం మొదలైన యుగాల శక్తివలనా; పురుష మహా+అనుభావవిశేషంబుననున్+చేసి= వ్యక్తియొక్క గొప్ప ప్రభావపు మహిమవలనా; ఉపవాసవ్రతంబు= ఉపవాసం అనే వ్రతం; మహా+అధిక కాల కృతంబు= చాలా ఎక్కువ కాలం చేయబడినది; అయినను= అయినా; కీడున్= ఆపద; చేయక= చేయక; అత్యంత ఫల ప్రదంబు= చాలా ఎక్కువ ఫలాన్ని ఇచ్చేది; ఐ= అయి; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** యుగాలశక్తినిబట్టి, మనిషి సామర్థ్యంలోని విశేషాన్నిబట్టీ ఉపవాసవ్రతం చాలా ఎక్కువకాలం చేసేది అయినా ప్రమాదం చేయక అత్యధికఫలాన్ని ఇచ్చేదై ఉంటుంది.

**విశేషం:** యుగాలకు సంబంధించిన కాలప్రమాణము, శక్తిప్రమాణమూ, ఆయుఃప్రమాణమూ వేర్వేరుగా ఉంటాయి. ధర్మరాజాదులు 125 సంవత్సరములు బ్రదికినట్లుగా భారతంలో ప్రమాణాలు ఉన్నాయి. అది ద్వాపరయుగం.

**తే. మాతకును వేదమునకు ధర్మంబునకును । బరములగు గురుశాస్త్ర లాభములు లేవు;**
**తపము లే దుపవాసవ్రతంబుకంటె । నధిక మైనది యండ్రు మహాత్ము లనఘ! 153**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; మహాత్ములు= దొడ్డబుద్ధికలవారు; మాతకును= తల్లికీ; వేదమునకున్= శ్రుతికీ; ధర్మంబునకును= ధర్మానికీ; పరములు= మించినవి; అగు= అయిన; గురు శాస్త్ర లాభములు= గురువు, శాస్త్రము, లాభము అనేవి; లేవు; ఉపవాసవ్రతంబు కంటెన్= ఉపవాసం అనే నియమం పాటించటం కంటె; అధికము= గొప్పది; ఐనది= అయినట్టిది; తపము= తపస్సు; లేదు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! మహాత్ములు తల్లిని మించిన గురువూ, వేదాన్ని మించిన శాస్త్రమూ, ధర్మాన్ని మించిన లాభమూ అట్లాగే ఉపవాసవ్రతాన్ని మించిన తపస్సూ లేదని చెప్పుతారు.

**విశేషం:** తల్లి మున్నగు వారి వరుసలో చెప్పటం వలన ఉపవాసవ్రతం తల్లినీ, వేదాన్నీ, ధర్మాన్నీ గౌరవించిన స్థాయిలో గౌరవించ దగినదనే అర్థం స్ఫురిస్తుంది. తుల్యయోగితాలంకారాన్ని భావించాలి.

**తే. పావనంబులలో నెల్ల బ్రాహ్మణుండు । పరమపావన మను శ్రుతి పౌరవేంద్ర!**

**యట్లు గావున భూదేవతార్చనంబు । భక్తి సంభృతముగ నడపంగ వలయు. 154**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర!= పురువంశమువారిలో గొప్పవాడా!; పావనములలోన్= పవిత్రమైన వాటిలో; ఎల్లన్= అన్నింటికంటె; బ్రాహ్మణుండు= బ్రహ్మజ్ఞానం చక్కగా కల వ్యక్తి; పరమపావనము= మిక్కిలి పవిత్రమైన విషయము; అని; శ్రుతి= వేదం; అనున్= చెప్పుతుంది; అట్లు= ఆ విధం; కావునన్= కావటంచేత; భూదేవతా+అర్చనంబు= బ్రహ్మజ్ఞానసంపద కలవాడిని పూజించటం; భక్తి సంభృతముగన్= భక్తితో నిండిన తీరులో; నడపంగన్ వలయున్= చేయాలి.

**తాత్పర్యం:** రాజా! పవిత్రములైన అన్నింటిలో బ్రాహ్మణుడు పరమపవిత్రం అని వేదం చెప్పుతున్నది. కనుక అట్టి బ్రాహ్మణుడిని మన్నించటం నిండైన భక్తిభావంతో చేయాలి.

**విశేషం:** ఇట్టి పట్టులలో కేవల జన్మభావంచేతనే కలుగుతుందని అనుకోరాదు. బ్రాహ్మణ, విప్ర, శ్రోత్రియ మున్నగు శబ్దాలకుండే విశిష్టార్థాన్ని భావించి ఆ లక్షణాలున్న వ్యక్తినే గ్రహించాలి.

**వ. అప్రసక్తం బైనను నీయర్థంబు వినవలయు నట్టిది గావునం జెప్పితి' నని పలికి వెండియు. 155**

**ప్రతిపదార్థం:** అప్రసక్తంబు= ప్రసంగానికి సంబంధించినదికానిది; ఐనను= అయినప్పటికి; ఈ+అర్థంబు= ఈ విషయం; వినవలయు+అట్టి+ఇది= వినవలసింది; కావునన్= కనుక; చెప్పితిన్= నీకు చెప్పాను; అని; పలికి= చెప్పి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఇది సందర్భానికి తగినమాట కాదు అయినా వినదగినది కనుక నీకు తెలిపాను' అని ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది వక్త జాగరూకతను పట్టి ఇచ్చే వైఖరి. ఇక్కడ సందర్భం ఉపవాసవ్రత విషయం. కనుక ఇది అప్రస్తుతప్రసంగం. అయినా వెనుకటి పద్యంలో తల్లి, వేదం, ధర్మం, ఉపవాసం - అనే వాటిని మహావిషయాలుగా చెప్పిన కారణంగా ఆ వరుసలో పరమపవిత్రుడు బ్రాహ్మణుడు అని చెప్పవలసి వచ్చింది.

**చ. 'అనశననిష్ఠఁజేసి సుర లాదిమునుల్ మహితానుభావులై**

**రనఘ! సహస్రవర్ష సమనంతర కల్పితమైన యేకభు**

**క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వముం**

**గనియె మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భూవరా! 156**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఉత్తముడా!; సురలు= దేవతలు; ఆదిమునులు= ఆదికాలపు మహర్షులు; అనశననిష్ఠన్‌చేసి= ఆహారం తీసికొనకపోవటం (ఉపవాసం) అనే నిష్ఠతో; మహిత+అనుభావులు= మిక్కిలి గొప్ప ప్రభావం కలవారు; ఐరి= అయ్యారు; గాధి తనూజుఁడు= గాధి కొడుకైన విశ్వామిత్రుడు; సహస్ర వర్ష సమనంతర కల్పితము= వేయి ఏండ్లు అడ్డు లేనిదిగా చేసికొనబడినది; ఐన ఏక భుక్త నియమ తంత్రమున్= అయిన ఒక పూట భోజనం అనే నియమంతో కూడిన విధానాన్ని; నడపి= సాగించి; బ్రాహ్మణత్వమున్= బ్రాహ్మణుడు కావటాన్ని; కనియెన్= పొందాడు; భూవర!= రాజా!; మహా+ఉపవాసములన్= గొప్ప ఉపవాసాలతో; కాని ఫలంబులు= సిద్ధింపని ప్రయోజనాలు; లేవు= లేవు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! దేవతలు, ఆదిమునులు, ఉపవాసనియమంచేతనే గొప్ప ప్రభావం కలవా రయ్యారు. విశ్వామిత్రుడు వేయి ఏండ్లు ఒక్కరోజు కూడా విఘాతం లేకుండా ఒక పూట భోజనం అనే నియమవిధిని నిర్వహించి బ్రాహ్మణత్వాన్ని పొందగలిగాడు. కనుక, రాజా! గొప్ప నిష్ఠతో కూడిన ఉపవాసాలవలన పొందరాని ప్రయోజనాలు లేవు.

**విశేషం:** సాధారణంగా మానవుడు ధర్మసూత్రాలకు దృష్టాంతాలను దర్శింపగోరుతాడు. ఆ మనస్తత్వాన్ని గుర్తించిన వ్యాసభగవానులు ఉపవాసనిష్ఠకు విశ్వామిత్రుడి దృష్టాంతాన్ని అనుసంధించారు.

**క. కావున నుపవాసవ్రత । సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం**

**బావన మైహిక మహిమయు । దేవనిలయ సుఖము నివ్విధిన్ సమకూరున్. 157**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; ఉపవాస వ్రత సేవనము= ఉపవాసం అనే వ్రతాన్ని సేవించటం; శరీరమునకున్= దేహానికీ; చిత్తమునకున్=మనస్సుకూ; పావనము= పవిత్రతను కలిగించేది; ఈ+విధిన్= ఈ పనివలన; ఐహిక మహిమయున్= ఈ లోకపు గొప్పతనమూ; దేవ నిలయ సుఖమున్= దేవలోకపు సుఖమున్నూ; సమకూరున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** కనుక ఉపవాసవ్రతాన్ని ఆచరించటం శరీరానికీ, మనస్సుకూ పవిత్రతను చేకూరుస్తుంది. దీనివలన ఈ లోకంలో గొప్పతనమూ, దేవలోకపు సుఖమూ అబ్బుతాయి.

**విశేషం:** ఇది శాస్త్రీయంగా నిరూపణ పొందిన విషయం. ఈనాడు యోగ అభ్యాసం చేసి ఆరోగ్య పరిరక్షణ చేసికొనగోరే వారంతా వారానికి ఒకరోజు ఉపవాసం ఉంటున్నారు. దానివలన శరీరం తేలిక కావటం, హృదయంలో మంచి భావాలు కలగటం అనుభవంలో ఉన్నట్లు వ్యక్తం చేస్తున్నారు. మంచి భావాలు కలగటమే సౌమనస్యం - దేవత్వం.

**క. పరమగు నీవ్రతమున కం । గిరసుఁడు దర్శకుఁడు దత్సుగీత విధమునన్**

**నరు లెవ్వరు దర్శకులగు । దురు వారిం బొరయ వేమి దుఃఖములు నృపా! 158**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; పరము= మిక్కిలి గొప్పది; అగు+ఈ వ్రతమునకున్= అయిన ఈ ఉపవాస వ్రతానికి; అంగిరసుఁడు= అంగిరసుడనే మహాముని; దర్శకుఁడు= ద్రష్ట (మొదట భావించి లోకానికి తెలియజెప్పినవాడు); తద్+సుగీత

విధమునన్= అతడు చక్కగా తెలియజెప్పిన తీరున; నరులు= మానవులు; ఎవ్వరు= ఎవ్వరైతే; దర్శకులు= ప్రవర్తకులు; అగుదురు= అవుతారో; ఏమి దుఃఖములు=ఎటువంటి దుఃఖాలు; వారిన్= వారిని; పొరయవు= అంటవు.

**తాత్పర్యం:** రాజా! మిక్కిలి శ్రేష్ఠమైన ఈ ఉపవాసవ్రతానికి అంగిరసుడు ద్రష్ట. అతడు చక్కగా వివరించిన తీరున దీనిని ప్రవర్తింపజేసే వారిని ఏ దుఃఖాలూ అంటవు.

**విశేషం:** దర్శకుడు - ఋషి అని భావించాలి. 'ఋషిశ్చ కిల దర్శనాత్' - ఒక మహా విషయాన్ని కనిపెట్టి ప్రచారంలోనికి తెచ్చే వ్యక్తిని దర్శకుడు, ద్రష్ట, ఋషి అంటారు.

**క. ఈ తంత్రంబు పఠించినఁ । బ్రీతి వినినఁ బాయు బహుదురితములు దిర్య**
**గ్జాతుల భాష లెఱింగెడు । నాతెలి వగు నపరభవమునందు నరులకున్. 159**

**ప్రతిపదార్థం:** ఈ తంత్రము= ఈ కార్యవిధానము; పఠించినన్= చదివినా; ప్రీతిన్= ప్రీతితో; వినినన్= విన్నా; బహుదురితములు= పెక్కు పాపములు; పాయున్= పోతాయి; నరులకున్= మానవులకు; అపరభవమునందున్= మరుజన్మలో; తిర్యక్+జాతుల భాషలు= పశువుల, పక్షుల జాతులభాషలు; ఎఱింగెడు+ఆ తెలివి= తెలిసికొనే జ్ఞానం; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఈ కార్యవిధానం చదివినా విన్నా అన్ని పాపాలు నశిస్తాయి. మానవులకు మరుజన్మలో పశువుల, పక్షుల భాషలు తెలిసికొనే తెలివి అబ్బుతుంది.

**విశేషం:** దీనిని ఫలశ్రుతి అంటారు. ఇది ప్రాచీన పురాణాదులలో ఒక్కొక్క ఘట్టం ముగిసిన తరువాత సాధారణంగా అనుసంధిస్తూ ఉంటారు. దీనివలన పాఠకుడిలో తెలిసికొనాలనే కుతూహలం పెరుగుతుంది. ఆచరణకు దోహదం కలుగుతుంది. పశుపక్ష్యాదుల భాషలలో కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. భవిష్యత్తు, నష్టవస్తుప్రశ్న మొదలైనవాటికి శకునాలను చూడటం అనాదిగా అన్ని దేశాలలోనూ ఉన్నది.

**వ. అనిన విని ధర్మజుండు సర్వధర్మజ్ఞానమాననీయునితో 'యజ్ఞకర్త యగుట మేలని మీరు పెక్కెడలం జెప్పితిరి; యజ్ఞంబు ధనధాన్యవిభవ సహాయసంపన్నులకుం దక్కం దక్కటివారలకుం జేయ శక్యంబు గామి దెల్లం బెల్లవారికి ననుష్ఠింపనయ్యెడు నట్టి పుణ్యకర్మం బెయ్యది యుపదేశింపవే' యనుటయు నమ్మహీపతికి నమ్మహితాత్ముం డిట్లనియె. 160**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధర్మజుండు= ధర్ముడి కొడుకు యుధిష్ఠిరుడు; సర్వ ధర్మ జ్ఞాన మాననీయునితోన్= అన్ని ధర్మాల తెలివిచేత గౌరవం పొందదగిన భీష్ముడితో; యజ్ఞకర్త= యజ్ఞాలు చేసేవాడు; అగుట= కావటం; మేలు= మంచిది; అని; మీరు= తమరు; పెక్కు+ఎడలన్= చాలా తావులలో; చెప్పితిరి= చెప్పి ఉన్నారు; యజ్ఞంబు= యజ్ఞం అనేది; ధన ధాన్య విభవ సహాయ సంపన్నులకున్= ధనము, ధాన్యము, వస్తువులు పుష్కలంగా ఉండటం, తోడుపడేవారు అనే సంపదలు కలవారికి; తక్కన్= కాక; తక్కటివారలకున్= మిగిలినవారికి; చేయన్= ఆచరించటం; శక్యంబు+కామి= సాధ్యం కాకపోవటం; తెల్లంబు= స్పష్టము; ఎల్లవారికిన్= అందరికీ; అనుష్ఠింపన్+అయ్యెడు+అట్టి పుణ్యకర్మంబు= ఆచరించదగిన పుణ్యకార్యం; ఏ+అది= ఏదో; (దానిని); ఉపదేశింపవే= తెలుపుమా; అనుటయున్= అన్నంతనే; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు; ఆ÷మహిత+ఆత్ముండు= దొడ్డబుద్ధిగల ఆ భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు 'సర్వధర్మాల జ్ఞానంతో మన్నించ దగినవాడైన భీష్ముడితో ఇట్లా అన్నాడు. యజ్ఞకర్త కావటం ఉత్తమం అని మీరు పెక్కుచోట్ల చెప్పారు. యజ్ఞం ధనము, ధాన్యమూ, ఐశ్వర్యమూ, సహాయులు అత్యధికంగా ఉన్నవారికి తప్ప తక్కినవారికి చేయటం సాధ్యం కాదనే విషయం అందరకూ తెలిసినదే. మరి అందరూ చేయదగిన పుణ్యకర్మం ఏదో నాకు బోధింపరూ!' అనగా ఆ రాజునకు ఆ మహాత్ము డిట్లా చెప్పాడు.

**విశేషం:** దీనివలన ధర్మరాజు హృదయౌన్నత్యం తెలియవస్తున్నది. సర్వమానవ ఉద్ధరణతాత్పర్యం అతడికి కలదని తెలియవస్తున్నది. ఇది ఒక విధంగా భారతకర్త హృదయతాత్పర్యం. ఆ పుణ్యాకార్యం యజ్ఞం ఇచ్చే ఉత్కృష్టఫలం వంటి ఫలాన్ని ఇవ్వాలని కూడా సందర్భాన్ని బట్టి అడిగేవాడి తాత్పర్యం.

**క. 'నరవర! యర్థంబులునుం । బరివారము లేకయును శుభస్థితిఁ జేయన్**
**దొరకొని యుండుట గని యం । గిరసుం డుపవాసముం బ్రకీర్తించెఁ దగన్. 161**

**ప్రతిపదార్థం:** నరవర!=రాజా!; అర్థంబులునున్= ధనాలు, వస్తువులూ; పరివారము= సేవకుల సముదాయము; లేకయును= లేకున్నా; శుభస్థితిన్= శుభమైన స్థితిలో; చేయన్= ఆచరించటానికి; దొరకొని+ఉండుట= అనువై ఉండటం; కని= భావించి; అంగిరసుండు= అంగిరసుడనే మహాముని; ఉపవాసమున్= ఉపవాసాన్ని; తగన్= చక్కగా; ప్రకీర్తించెన్= బాగా కొనియాడాడు.

**తాత్పర్యం:** 'రాజా! అర్థబలమూ, అంగబలమూ లేకున్నా ఏ లోపమూ లేకుండా చేయటానికి కుదురుతుందని గమనించి, అంగిరసుడు ఉపవాసాన్ని మిక్కిలిగా కొనియాడాడు.

**విశేషం:** ఉపవాసం అతి సులభంగా చేయదగినదీ, యజ్ఞఫలంవంటి ఫలాన్నిచ్చేదీ అని ఫలితార్థం.

**క. ఉపవాసాయాసంబును । నృపముఖ్యా! దుస్సహముగ నీవు దలఁచి య**
**జ్ఞపరత్వము దుర్ఘట మను । నెపమిడి యి ట్లడిగి తని మనీషం గంటిన్. 162**

**ప్రతిపదార్థం:** నృపముఖ్యా!= రాజోత్తమా!; ఉపవాస+ఆయాసంబును= పస్తు ఉండటంలోని శ్రమను; దుస్సహముగన్= ఓర్వశక్యం కాని దానినిగా; నీవు; తలఁచి= భావించి; యజ్ఞపరత్వము = యజ్ఞాలపై శ్రద్ధ కలిగి ఉండటం; దుర్ ఘటము= కూర్పరానిది; అను నెపము= అను మిషను; ఇడి= పెట్టి; ఇట్లు= ఈ విధంగా; అడిగితి(వి)= అడిగినావు; అని; మనీషన్= భావనాబలంతో; కంటిన్= గుర్తించాను.

**తాత్పర్యం:** పస్తు ఉండటంలోని శ్రమ సహింపరానిది కదా! అని - యజ్ఞం చేయటం ఎంతో కష్టంతో సాధ్యమయ్యే పని అనే నెపం పెట్టి ఇట్లా అడిగావని నేను భావనతో తెలిసికొన్నాను.

**విశేషం:** ప్రశ్నించేవారి హృదయగతం తెలిసికొనటం వక్త యొక్క మహాగుణం. అట్టివారినే ఇంగితజ్ఞుడు అంటారు. భీష్ముడు పరమవివేకం కలవాడు కనుక ధర్మరాజు ఇంగితాన్ని పట్టుకొనటమే కాదు బట్టబయలు కూడా చేశాడు.

**వ. అనశనవ్రతంబు లందును జులుకని తెఱం గెఱింగించెద. 163**

**ప్రతిపదార్థం:** అనశన= ఆహారం మానటం; వ్రతంబులందును= వ్రతాలలో కూడా; చులుకని= తేలిక; తెఱంగు= పద్ధతి; ఎఱింగించెదన్= తెలుపుతాను.

**తాత్పర్యం:** ఉపవాసవ్రతంలో కూడా తేలిక పద్ధతిని తెలుపుతాను.

**విశేషం:** ఇది శ్రీవ్యాసుల అపారకరుణకు మచ్చు తునక.

**చ. పగలును రేయుఁ గుడ్చి జలపానము లోనుగఁ గుడ్చునప్డు తు**
**ష్టిగ నొనరించి మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మఱి యెప్డు నంటకే**
**మిగతిని బాపముం బొరయమిం దలకొల్పుచు హోమకార్యముం**
**దగుమెయిఁ జేయుచున్న విను తంగెటిజున్నగు నూర్ధ్వలోకముల్. 164**

**ప్రతిపదార్థం:** మర్త్యుండు= మానవుడు; పగలును= పగటి భాగంలోను; రేయిన్=రాత్రియందు; కుడ్చి= భుజించి; జలపానము లోనుగన్= నీరు త్రావుట మొదలుగ; కుడ్చు+అప్డు= తినే సమయంలో; తుష్టిగన్= తృప్తిగ; ఒనరించి= చేసి; నడుమన్= ఆ రెండు భోజనాలకు మధ్య; ఒకటిన్= ఏ ఒక్కదానినీ; మఱి= ఇక; ఎప్డున్= ఎప్పుడూ; అంటక= ముట్టక; ఏమి గతినిన్= ఏ విధంగానూ; పాపమున్= పాపమును; పొరయమిన్= పొందకపోవటాన్ని; తలకొల్పుచున్= చేస్తూ; హోమకార్యమున్= అగ్నిహోత్రపు అర్చనను; తగు మెయిన్= తగు విధంగా; చేయుచున్= చేస్తూ; ఉన్నన్= ఉంటే; విను= ఆలకించుము; ఊర్ధ్వలోకముల్= పై లోకాలు; తంగెటి జున్ను= తంగెటి జున్నువంటివి; అగున్= అవుతాయి.

**తాత్పర్యం:** పగలు ఒకమారు, రాత్రి ఒకమారు నీటితోపాటు తృప్తిగా భుజిస్తూ మధ్యలో మరి ఏమీ ముట్టుకొనకుండా ఏ విధమైన పాపం అంటకుండా చూచుకొంటూ హోమకార్యం తగిన విధంగా చేస్తూ ఉంటే పుణ్యలోకాలు తంగెటిజున్నువలె అందుతాయి.

**విశేషం:** తంగేటి చెట్టుమీది తేనె పెర ఎంత తేలికగా అందుబాటులో ఉంటుందో అంత సులభంగా పుణ్యలోకాలు అందుతాయని తాత్పర్యం. దినానికి నియతసమయాలలో రెండు భోజనాలు చేయటం, మధ్య నీటితో సహా ఏమీ ముట్టకపోవటం, పాపపు పనులు చేయకపోవటం, అగ్నిహోత్రాన్ని అర్చించటం - అనే ప్రవర్తన కూడా ఉపవాసం వంటిదే అవుతుందని భావం.

**వ. ఇది మేలితెఱంగు గొందఱు దుష్కరంబుగాఁ దలంతు రట్టివారలు దమయోపినభంగుల నంగిరసుం డుపదేశించిన యుపవాస వ్రతవిశేషంబు లనుష్ఠించు వా రని చెప్పిన నప్పౌరవోత్తముం డయ్యుత్తమ బోధనిధికి నమస్కరించి యధ్యాత్మక విద్యాబోధక ప్రకారంబులగు వాక్యసంచయంబులు పెక్కెడలం గృష్ణద్వైపాయనాది మునీంద్రులును గృష్ణుండును నాకర్ణింప నుపన్యసించితిరి కృష్ణశ్రోతృత్వంబు మహార్ఘతమంబు గృష్ణుని యున్న రూ పెఱుంగుటయు నత్యంతసంభావనీయంబు. 165**

**ప్రతిపదార్థం:** ఇది= ఇప్పుడు చెప్పినది; మేలితెఱంగు= ఉత్తమపద్ధతి; కొందఱు=కొందరు; దుష్కరంబుగాన్= చేయశక్యంబు కానిదిగా; తలంతురు= అనుకొంటారు; అట్టివారలు= ఆ విధమైన మనుష్యులు; తమ ఓపిన భంగులన్= తమకు చేతనైన పద్ధతులతో; అంగిరసుండు= అంగిరసుడనే ముని; ఉపదేశించిన ఉపవాస వ్రత విశేషంబులు= ఉపవాసం అనే వ్రతంలోని ఇతర పద్ధతులను; అనుష్ఠించువారు= ఆచరించవలసిన వారు; అని; చెప్పినన్= చెప్పగా; ఆ+పౌరవ+ఉత్తముండు= పురువంశంలో శ్రేష్ఠుడైన ధర్మరాజు; ఆ+ఉత్తమబోధ నిధికిన్= మిక్కిలి మేలైన జ్ఞానపురాశి అయిన భీష్మునికి; నమస్కరించి= ప్రణామం చేసి; అధ్యాత్మక విద్యా బోధక ప్రకారంబులు= తత్త్వసంబంధమైన విద్యను తెలియపరచే విధానాలు కలవి; అగు వాక్య

సంచయంబులు= అయిన మాటల సముదాయాలను; పెక్కు+ఎడలన్= పలుతావులలో; కృష్ణ ద్వైపాయన+ఆది ముని+ ఇంద్రులును= శ్రీ వేదవ్యాసుడు మొదలగు మునిశ్రేష్ఠులూ; కృష్ణుండును= వాసుదేవుడునూ; ఆకర్ణింపన్= వింటూ ఉండగా; ఉపన్యసించితిరి= వివరించి చెప్పారు; కృష్ణశ్రోతృత్వంబు= కృష్ణుడు వినేవాడు కావటం; మహా+అర్హతమంబు= మిక్కిలి యోగ్యమైన విషయం; కృష్ణుని ఉన్నరూపు= శ్రీకృష్ణుడి యథార్థతత్త్వం; ఎఱుంగుటయున్= తెలిసికొనటం కూడా; అత్యంత సంభావనీయంబు= మిక్కిలి చక్కగా భావించదగింది.

**తాత్పర్యం:** ఇది ఉత్తమపద్ధతి. కొందరు దీనిని కూడా కష్టమైనదిగా భావిస్తారు. అట్టివారు తమ శక్తి ననుసరించి అంగిరసుడు చెప్పిన ఉపవాసవ్రత పద్ధతులను ఆచరించాలి అని చెప్పగా ఆ ధర్మరాజు ఉత్తమజ్ఞానఖని అయిన భీష్ముడికి నమస్కరించి 'తత్త్వవిద్యను చక్కగా తెలిపే వాక్యాలను పెక్కుతావులలో వేదవ్యాసుడు మొదలైన మహామునులు, శ్రీకృష్ణుడు వింటూ ఉండగా వివరించారు. శ్రీకృష్ణుడు శ్రోత కావటం మిక్కిలి యోగ్యమైన విషయం. కృష్ణుడి నిజతత్త్వం తెలిసికొనటం కూడా మిక్కిలి భావించదగిన విషయం.

**ఆ. ఎవ్వఁ డెఱుఁగఁబడిన నెఱుఁగంగఁ బాలివి । యైన యెల్ల యవియు నవగతంబు**
**లగుట యీ పరాశరాత్మజుఁ డాశ్రిత । కోటి కర్థిఁ గృష్ణు గుఱిచి చెప్పె. 166**

**ప్రతిపదార్థం:** ఈ పరాశర+ఆత్మజుఁడు= పరాశరుడికి కుమారుడైన వేదవ్యాసుడు; ఎవ్వఁడు= ఎవరైతే; ఎఱుఁగఁబడినన్= తెలియబడితే; ఎఱుఁగంగన్= తెలియటానికి; పాలివి= లక్ష్యమైనవి; ఐన ఎల్ల+అవియున్= అయినవన్నీ; అవగతంబులు= తెలియబడినవి; అగుట= కావటం; ఆశ్రితకోటికిన్= తనను ఆశ్రయించినవారి సమూహాలకు; అర్థిన్= కోరికతో; కృష్ణున్+గుఱిచి= కృష్ణుడి గూర్చి; చెప్పెన్= బోధించాడు.

**తాత్పర్యం:** ఈ వేదవ్యాసుడు 'ఎవరిని తెలిసికొంటే సృష్టిలోని తెలియదగిన విషయాలన్నీ తెలుస్తాయో అట్టివాడు శ్రీకృష్ణుడు' అని ఆశ్రయించిన వారి కందరికీ తెలియచెప్పాడు.

**విశేషం:** 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్' అని ఉపనిషత్తు. ఒకదాని ఎఱుకచేత అన్నింటి జ్ఞానం కలుగుతుంది. ఆ ఒకటి పరమాత్మ తత్త్వం. అది కృష్ణరూపంలో ఉన్నదని వ్యాసతాత్పర్యం.

**క. కావున నధ్యాత్మక వా । క్యావలికిం జేరుగడ మహామహిమపదం**
**బై విలసిల్లెడుఁ గృష్ణుఁడ । యే వినఁగా వలతు నమ్మహితవాక్యంబుల్.' 167**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; కృష్ణుఁడు+అ= కృష్ణుడే; అధ్యాత్మక వాక్య ఆవలికిన్= తత్త్వం తెలిపే వాక్యాల పంక్తులకు; చేరుగడ= చివరిలక్ష్యమూ; మహామహిమపదంబు= గొప్ప ప్రభావంతో కూడిన స్థానమూ; ఐ= అయి; విలసిల్లెడున్= ప్రకాశిస్తున్నాడు; ఆ+మహిత వాక్యంబుల్= అట్టి పూజ్యతగల వాక్యాలను; ఏన్= నేను; వినఁగాన్ వలతున్= వినగోరుతున్నాను.

**తాత్పర్యం:** కాబట్టి కృష్ణుడే జ్ఞానం బోధించే వాక్యాలకు చివరి లక్ష్యం. అతడే గొప్ప మహిమకు స్థానం అయి విరాజిల్లుతున్నాడు. అట్టి తత్త్వజ్ఞాన వాక్యాలను నేను వినగోరుతున్నాను.'

**విశేషం:** ఆత్మ అంటే శరీరం - అధ్యాత్మ అంటే శరీరంలో ఉన్న తత్త్వం. అతడినే 'దేహి' అంటారు. పరమాత్మ - దానికి సంబంధించినది అధ్యాత్మకం.

**వ. అని పలికి యింకను నధ్యాత్మవిద్యావివరణంబు లగు వాక్యంబు లనుగ్రహింపవలయు నని సంప్రార్థనంబు సేసిన నప్పార్థివాగ్రగణ్యుతో నక్కురువరేణ్యుండు హరసనత్కుమార సంవాదంబు సెప్పెద నది యధ్యాత్మ విద్యోపకార ప్రకారంబు లైన యుపన్యాసంబుల నొప్పియుండు విను మని యిట్లనియె. 168**

**ప్రతిపదార్థం:** అని; పలికి= మాట్లాడి; ఇంకనున్= ఇంకా; అధ్యాత్మవిద్యా వివరణంబులు= పరమార్థవిద్యను స్పష్టం చేసేవి; అగు వాక్యంబులు= అయిన వచనాలను; అనుగ్రహింపవలయును= నాకు దయతో బోధించాలి; అని; సంప్రార్థనంబు+చేసినన్= వినయంతో అడుగగా; ఆ+పార్థివ+అగ్రగణ్యుతోన్= రాజశ్రేష్ఠుడగు ఆ ధర్మజుడితో; ఆ+కురువరేణ్యుండు= కురువంశంలో ఉత్తముడైన ఆ భీష్ముడు; హరసనత్కుమార సంవాదంబు= శివుడికి; సనత్కుమారుడికి అయిన సంభాషణాన్ని; చెప్పెదన్= చెప్తుతాను; అది= ఆ ఘట్టం; అధ్యాత్మ విద్యా+ఉపకార ప్రకారంబులు= పరమార్థాన్ని తెలిపేవిద్యకు పనికివచ్చే తీరులుగలవి; ఐన ఉపన్యాసంబులన్= అయిన ప్రసంగాలతో; ఒప్పి= అలరారి; ఉండున్= ఉంటుంది; వినుము= ఆలకించుము; అని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ఇంకా పరమార్థాన్ని వివరించే వాక్యాలను నాకు దయచేయుము - అని చక్కగా ప్రార్థిస్తే ఆ రాజుతో ఆ భీష్ముడు 'హరసనత్కుమార సంవాదం అనే విషయం వివరిస్తాను. అది పరమార్థవిద్యకు ఉపకరించే తీరులు గల ప్రసంగాలతో అలరారి ఉంటుంది. వినుము.' అని ఇట్లా చెప్పాడు.

**విశేషం:** భీష్ముడు పరమార్థాన్ని గురించి తనకు తోచిన దానిని చెప్పటానికి పూనుకొనలేదు. హరసనత్కుమార సంవాదం చెప్తుతానన్నాడు. అంటే మహావిషయాలు పరమప్రామాణికుల వాక్యాలుగా ఉంటే తప్ప గ్రాహ్యాలు కావని తాత్పర్యం. దీనినే శబ్దప్రమాణం అంటారు.

### హరసనత్కుమారసంవాదప్రకారము (సం.13-165-5 (కుంభ))

**చ. హరుఁడు సనత్కుమారుకడ కర్థిమెయిం జనుదేర నమ్మునీ**
**శ్వరుఁ డుచితాసనాదు లుపచారవిధిజ్ఞతఁ దా నొనర్చి యా**
**దరభరితాత్ముఁడై 'యభిమతం బగు కార్య మనుగ్రహింపు త**
**త్పరమతి నిర్వహింతుఁ దగ దానిఁ ద్రిలోచన! మృత్యుమోచనా! 169**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; సనత్కుమారు కడకున్= సనత్కుమారుడనే ముని దగ్గరకు; అర్థిమెయిన్= కోరికతో; చనుదేరన్= రాగా; ఆ+ముని+ఈశ్వరుఁడు= ఆ మునిశ్రేష్ఠుడు; ఉపచార విధిజ్ఞతన్= సేవలవిధానం చక్కగా తెలిసిన భావంతో; ఉచిత+ఆసన+ ఆదులు= తగిన ఆసనం మొదలైన వాటిని; తాన్= తాను; ఒనర్చి= చేసి; ఆదరభరిత+ఆత్ముఁడు+ఐ= ఆదరంతో నిండిన హృదయం కలవాడై; త్రిలోచన!= ముక్కంటీ!; మృత్యు మోచనా!= మృత్యువునుండి విడిపింప జేయువాడా!; అభిమతంబు= ఇష్టము; అగు కార్యము= అయినపని; అనుగ్రహింపుము= దయతో చెప్పుము; తత్పరమతిన్= అదే పరమలక్ష్యం అన్న బుద్ధితో; తగన్= తగినవిధంగా; దానిన్= దానిని; నిర్వహింతున్= చేస్తాను.

**తాత్పర్యం:** శివుడు సనత్కుమారుడి దగ్గరకు రాగా ఆ మహర్షి అతిథిమర్యాదలు చక్కగా తెలిసినవాడు కనుక తగు విధమైన ఆసనాదులను కూర్చి ఆదరంతో నిండిన బుద్ధితో 'త్రిలోచనా! మృత్యుమోచనా! నీకేది ఇష్టమో దానిని దయతో చెప్పుము. దానియందు పరమశ్రద్ధగల బుద్ధితో చక్కగా చేస్తాను' అన్నాడు.

**విశేషం:** హరుడు త్రిలోచనుడు - సూర్యచంద్రాగ్ని రూపనేత్రాలు కలవాడు. అంటే సర్వకాలాలలో సర్వవిషయకదర్శనజ్ఞానం కలవాడు. మృత్యుమోచనుడు - మృత్యువంటే అధ్యాత్మపరిభాషలో అజ్ఞానం. దానిని విడిపించేవాడు. అంటే అన్నింటిని దర్శిస్తూ అన్నింటి జ్ఞానం సమగ్రంగా కలిగినవాడని భావం. సనత్కుమారుడు తత్త్వజ్ఞాని కనుక అర్థాలు స్ఫురించే విధంగా సంబోధించాడు.

**తే. అనిన 'నీతోడ గోష్ఠికి నర్థిపుట్టి । యరుగుదెంచితిఁ దమ్ముఁడ!' యని ప్రమోద**
**మెసఁగఁ బల్కి యప్పరమేశుఁ డిట్టు లనియె । నఖిలలోకార్చితుం డగు నతనితోడ. 170**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; ఆ+పరమ+ఈశుఁడు= ఆ మహేశ్వరుడు; తమ్ముఁడ!= ఓయి తమ్ముడా!; నీతోడన్= నీతో; గోష్ఠికిన్= మంచిమాటలు మాట్లాడుకొనటానికి; అర్థి= కోరిక; పుట్టి= కలిగి; అరుగుదెంచితిన్= వచ్చాను; అని; ప్రమోదము= పరమానందం; ఎసఁగన్= అతిశయించే విధంగా; పల్కి= పలికి; అఖిలలోక+అర్చితుండు= సమస్తలోకాల మన్ననగొన్నవాడు; అగు+అతనితోడన్= అయిన ఆ సనత్కుమారుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ముని పలికితే పరమేశ్వరుడు 'తమ్ముడా! నీతో ప్రసంగం చేయాలనే కోరిక పుట్టి వచ్చాను' అని పరమానందం అతిశయించే విధంగా పలికి, సర్వలోకాలు పూజించే ఆ సనత్కుమారుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తమ్ముడ!- మహేశ్వరుడికి రుద్రుడనే పేరు ఉన్నది. ఆ దశలో అతడు బ్రహ్మ సృష్టించిన బాలుడు. సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనే పలువురు బ్రహ్మమానసపుత్రులు - కనుక సోదరసంబంధం. అఖిలలోకార్చితుడు - తనకు తమ్ముడైనా జ్ఞానవిశేషాన్ని బట్టి సర్వలోకాలూ అర్చించే మహిమ కలవాడు కనుక సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు కూడా స్వయంగా వచ్చాడని హేతుదర్శనం.

**క. 'ధ్యానమున దర్శనీయం । బైనది యే వస్తు? వెన్ని యనఘచరిత! స**
**మ్మానితతత్త్వంబులు? సం । ఖ్యానము యోగంబు నెట్టి గతులం జెల్లున్?' 171**

**విశేషం:** అనఘచరిత!= పుణ్యప్రవర్తన కల ఓ మునీ!; ధ్యానమునన్= ధ్యానంలో; దర్శనీయంబు= చూడదగినది; ఐనది= అయినది; ఏ వస్తువు?; సమ్మానిత తత్త్వంబులు= చక్కగా భావించదగిన తత్త్వాలు; ఎన్ని?; సంఖ్యానము= జ్ఞానము; యోగంబు= యోగమూ; ఎట్టి గతులన్= ఏ పద్ధతులతో; చెల్లున్= ప్రవర్తిస్తాయి?

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! ధ్యానంలో చూడదగిన వస్తు వేది? చక్కగా భావించదగిన తత్త్వాలు ఎన్ని? జ్ఞానమూ, యోగమూ ఏ విధంగా ప్రవర్తిస్తాయి?

**వ. చెప్పుము. మఱియు నధ్యాత్మవిషయంబులగు విశేషంబులును వివరింపు మనుటయు నయ్యంభోజసంభవుం డయ్యభవున కిట్లనియె. 172**

**ప్రతిపదార్థం:** చెప్పుము= తెలియచెప్పుము; మఱియున్= ఇంకా; అధ్యాత్మవిషయంబులు= తత్త్వానికి సంబంధించినవి; అగు విశేషంబులు= అయిన ప్రత్యేకించి తెలిసికొనదగిన విషయాలు; వివరింపుము= తెలియజెప్పుము; అనుటయున్= అన్నంతనే; ఆ+అంభోజ సంభవుండు= పద్మంలో పుట్టినబ్రహ్మ (కుమారుడగు సనత్కుమారుడు); ఆ+అభవునకున్= ఆ రుద్రుడికి; ఇట్లు+ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** చెప్పుము. ఇంకా తత్త్వవిషయాలు తెలియచెప్పుము' అనగా సనత్కుమారుడు శివుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అధ్యాత్మం - ఆత్మ అంటే ఇక్కడ దేహం. దేహంలో ఉన్నతత్త్వం అధ్యాత్మం. వక్త్ర అంభోజ సంభవుండు - అనగా బ్రహ్మ - అతడి మానసపుత్రుడైన సనత్కుమారుడు 'ఆత్మా వై పుత్రనామాసి' అనే న్యాయంచేత అతడే అవుతున్నాడు. శ్రోత అభవుడు - పుట్టుకలేనివాడు - వారి వాక్యాలు పరమాదరంతో గ్రహించదగిన వని సూచన. ప్రమాణబుద్ధిని కలిగించటం కోసం ఇటువంటి పదాలను ప్రయోగించారు.

**క. అరయఁగఁ దత్త్వము లనునవి । యిరువది నాల్గండ్రు గొంద ఱిభదనుజహరా!**

**యిరువది మూఁ డనుటయుఁ గల । దిరువది యేనండ్రు వానినే యెట్లనినన్. 173**

**ప్రతిపదార్థం:** ఇభదనుజహరా!= ఏనుగు రక్కసుడి రూపుమాపిన ఓ శివా!; కొందఱు= కొంతమంది; తత్త్వములు= భావములు; అనునవి= అనేవి; ఇరువదినాల్గు= ఇరవై నాలుగు; అండ్రు= అంటారు; ఇరువదిమూఁడు= ఇరవైమూడు; అనుటయున్= అనటం కూడా; కలదు= ఉన్నది; వానిన్+ఏ= ఆ తత్త్వాలనే; ఇరువదియేను= ఇరవై అయిదు; అండ్రు= అంటారు; ఎట్లు= ఏ విధంగా; అనినన్= అనగా.

**తాత్పర్యం:** శివా! తత్త్వాలు ఇరవై నాలుగని కొందరూ, ఇరవై మూడని కొందరూ, ఇరవై అయిదని కొందరూ అంటారు. ఎట్లాగంటే.

**విశేషం:** దీనిని సాంఖ్యం అంటారు. ఇందులో లెక్క ఉంటుంది కనుక. తత్త్వం అంటే 'దానితనం' అని శబ్దార్థం. అయితే ఇక్కడ ఇది ఒక పరిభాష. ఆ శబ్దంతోనే దానిని వ్యవహరించటం మంచిది.

**క. ఇరువది మూఁ డనువార । ల్గిరిజేశ్వర! ప్రాకృతుల్ మలీమసవిధ మ**

**త్తెరువు మనోబుద్ధులు వా । రరయఁగ నొక్కండ యండు రది యట్లుండెన్. 174**

**ప్రతిపదార్థం:** గిరిజా+ఈశ్వర!= గిరిజానాథా!; ఇరువదిమూఁడు= ఇరవైమూడు; అనువారల్= అనేవారు; ప్రాకృతుల్= నిండు జ్ఞానం లేని పామరులు; ఆ+తెరువు= ఆ పద్ధతి; మలీమసవిధము= మలినమైనదారి; వారు= ఆ మార్గంవారు; అరయఁగన్= పరికింపగా; మనస్+బుద్ధులు= మనస్సు, బుద్ధి అనేవి; ఒక్కండు+అ= ఒక్కటే; అందురు= అంటారు; అది; అట్లు= ఆ విధంగా; ఉండెన్= ఉన్నది.

**తాత్పర్యం:** శివా! తత్త్వాలు ఇరవైమూడు అనేవారు పామరులు. అది మలినమైన పద్ధతి. వారు మనస్సు, బుద్ధి ఒక్కటే అంటారు. అది అట్లా ఉండనిమ్ము.

**విశేషం:** మనస్సు - సంకల్పవికల్పాల రూపమైన బుద్ధి - నిశ్చయాత్మకమైనది. ఇట్లా చక్కగా రెండింటిస్థితి తెలుస్తూ ఉంటే ఒక్కటే అనటం సరికాదు. అందుకనే అది మలినమైన మార్గం. పామరమార్గం.

**క. ఇరువది నాల్గనువారలు । నరసి మనశ్శుద్ధి బుద్ధి యను కాన్పున న**

**ప్పరుసునఁ బలికెద రేఁ గను । తెరువున విను తత్త్వవిధము దేవస్తుత్యా! 175**

**ప్రతిపదార్థం:** దేవస్తుత్యా!= దేవతలచేత కొనియాడబడే పరమేశ్వరా!; ఇరువదినాల్గు+అనువారలు= తత్త్వాలు ఇరవై నాలుగు అనేవారు; మనస్+శుద్ధి= మనస్సు నిర్మలంగా ఉండటం; బుద్ధి; అను కాన్పునన్= అనే దృష్టితో; ఆ+పరుసునన్= ఆ విధంగా

పలికెదరు= చెప్పుతారు; ఏన్= నేను; కను తెరువునన్= చూచేదారిలో; తత్త్వవిధము= తత్త్వాలస్థితిని గూర్చి; విను= ఆలకించుము.

**తాత్పర్యం:** పరమేశ్వరా! ఇరవై నాలుగు అనేవారు మనస్సుయొక్క పరిశుద్ధతయే బుద్ధి అనే దృష్టితో అట్లా అంటారు. నేను చూచే మార్గంలో తత్త్వాల సంగతిని వివరిస్తాను. వినుము.

**విశేషం:** మనస్సు నిరంతరం చలనశీలం అయింది. అది ఒకటి. అది నిశ్చయాన్ని పొందినప్పుడు చలనరూపమైన దోషం ఉండదు. కనుక అప్పుడు దానికి 'బుద్ధి' అనే మరొక స్థితి ఏర్పడుతుంది. ఈ విధంగా మనస్సు వేరు, బుద్ధి వేరు అని పరిగణించేవారు తత్త్వాలు ఇరవై నాలుగంటారు అని పద్యతాత్పర్యం.

**తే. పంచవింశ మధిష్ఠానభావ మొంది । విలసనము నిచ్చుఁ దగఁ జతుర్వింశతికిని;**
**దన్నకని తనయంద డిందఁగఁ జేయు । దాన నప్పిండు గలయది లేనియదియు. 176**

**ప్రతిపదార్థం:** పంచవింశము= ఇరవై అయిదోతత్త్వము; అధిష్ఠాన భావము= అన్నింటికీ ఆధారం అయ్యే భావాన్ని; ఒంది= పొంది; తగన్= తగువిధంగా; చతుర్+వింశతికిని= ఇరువది నాల్గింటి సముదాయానికి; విలసనమున్= ప్రకాశాన్ని; ఇచ్చున్= ఇస్తుంది; తన్నున్+అ= తననే; కని= చూచి; తనయందున్+అ= తనయందే; డిందఁగన్= లీనమైపోయే విధంగా; చేయున్= చేస్తుంది; దానన్=ఆ కారణంగా; ఆ+పిండు= ఆ ఇరవై నాల్గింటి సముదాయం; కల+అది= ఉన్నదీ; లేని+అదియున్= లేనిదీ (అవుతుంది)

**తాత్పర్యం:** 'అధిష్ఠానం' అనే రూపంలో ఇరవై అయిదవ తత్త్వం ఉన్నది. అది తక్కిన ఇరవైనాల్గింటికీ ఒక స్థితిని కల్పిస్తుంది. ఆ ఇరవై నాలుగూ దానిని చూచి దానియందే లీనమై పోయేటట్లుగా అది చేస్తుంది. కనుక అవి ఉండటమూ, లేకపోవటమూ రెండూ సంభవమే.

**విశేషం:** అధిష్ఠానం అంటే ఆధారం. ఇరవై నాలుగింటినీ పట్టి నిలిపేది అని భావం. కనుకనే ఆ తక్కిన ఇరవైనాలిగింటికీ అది 'ఉనికి - లేక ప్రకాశం' అనే స్థితిని కల్పిస్తుంది. అయితే ఈ ఇరవైనాలుగూ దానిని చూచి దానిలో 'లీనం' అయిపోతాయి. లీనం అయిపోవటమంటే నామరూపాలు లేకుండా పోవటం. ఒక నది సముద్రంలో కలవటానికి ముందువరకు నది. సముద్రంలో కలిసిన తరువాత ఆ పేరుగాని, దాని గుణాలుగానీ ఏమీ మిగలవు. ఆ స్థితికి లీనం అవటం అని వ్యవహారం. ప్రస్తుతం ఇరవైనాలుగు తత్త్వాలు విడిగా ఉన్నంతవరకూ అవి 'ఉన్నట్లు'; ఇరవై అయిదవ తత్త్వంలో 'లీన' మయినప్పుడు అవి లేనట్లు. ఈ ఇరవై అయిదవ తత్త్వాన్నే 'పరమాత్మ' అంటారు.

**వ. చతుర్వింశతి తత్త్వంబులు వివరించెద. 177**

**ప్రతిపదార్థం:** చతుర్+వింశతితత్త్వంబులు= ఇరవై నాలుగు తత్త్వాలను; వివరించెదన్= తెలియచెప్పుతాను.

**తాత్పర్యం:** ఇరవై నాలుగు తత్త్వాలను వివరిస్తాను.

**తే. అవధరింపుము భూతంబు లయిదుఁ దద్గు । ణములుఁ బది యింద్రియములు మనంబు బుద్ధి**
**యును మహేశ! యహంకారమును బ్రకృతియు । నాఁగఁ దత్త్వంబు లిరువది నాల్గు వొలుచు. 178**

**ప్రతిపదార్థం:** మహా+ఈశ!= పరమేశా!; అవధరింపుము= దయతో వినుము; భూతంబులు= భూతము అనే పేరుగలవీ; తత్+గుణాలు= వాటి గుణాలు; అయిదున్= అయిదూ; ఇంద్రియములు= ఇంద్రియాలు అనే పేరు గలవి; పది= పదీ;

మనంబు= మనస్సు; బుద్ధియును= బుద్ధీ; అహంకారమును= అహంకారమూ; ప్రకృతియున్= ప్రకృతీ; నాఁగన్= అనగా; తత్త్వంబులు= తత్త్వాలు; ఇరువదినాల్గు= ఇరవై నాల్గు; పొలుచున్= ఒప్పుతూ ఉంటాయి.

**తాత్పర్యం:** పరమేశ్వరా! అయిదు భూతాలు, అయిదైన వాటి గుణాలు, పది ఇంద్రియాలూ, మనస్సు, బుద్ధి, అహంకారమూ, ప్రకృతీ ఇవి ఇరవై నాలుగు తత్త్వాలు.

**విశేషం:** 1.నేల, 2.నీరు, 3.నిప్పు, 4.గాలి, 5.నింగి ఇవి అయిదు భూతాలు - భూతం అంటే ఉన్నది. అనాదిగా ఉన్నది అని స్థూలంగా అర్థం.

వాటి గుణాలు :1.గంధం (నేల), 2.రసం (నీరు), 3.రూపం (నిప్పు), 4. స్పర్శ (గాలి), 5. శబ్దం (నింగి)

**పది ఇంద్రియాలు:** అయిదు కర్మేంద్రియాలు + అయిదు జ్ఞానేంద్రియాలు.

1. వాక్కు, 2. చేతులు, 3.కాళ్ళు, 4. మలం విసర్జించే అవయవం, 4. జననేంద్రియం. ఇవి ఆయా పనులను చేస్తూ ఉంటాయి. కనుక కర్మేంద్రియాలు అంటారు.

1. చర్మము, 2. కన్ను, 3. చెవి, 4.నాలుక, 5. ముక్కు ఇవి వెలుపలి పదార్థాదుల స్పర్శాది లక్షణాలను జీవికి తెలియజేస్తాయి. కనుక జ్ఞానేంద్రియాలు.

5+5+5+5=20. ఇవిగాక 1.మనస్సు, 2.బుద్ధి, 3.అహంకారము, 4.ప్రకృతి - అనేవి నాలుగు (20+4=24) కలిపితే ఇరవైనాలుగు.

అయి దయిదుగా ఉన్న వాటికి క్రమసంబంధం చూచుకోవాలి. అంటే ఒక భూతం, ఒక గుణం, ఒక జ్ఞానేంద్రియం పరస్పర సంబంధం కలిగి ఉంటాయి. అది ఈ క్రింది విధంగా అనుసంధించుకొనాలి.

| | **భూతం** | **గుణం** | **జ్ఞానేంద్రియం** |
|---|---|---|---|
| 1. | నేల | గంధం | ముక్కు |
| 2. | నీరు | రసం | నాలుక |
| 3. | నిప్పు | రూపం | కన్ను |
| 4. | గాలి | స్పర్శ | చర్మం |
| 5. | నింగి | శబ్దం | చెవి |

కర్మేంద్రియాలు ఈ అన్నింటికీ తగిన విధంగా సహకరిస్తూ తమ పనులు చేసికొంటాయి.

(21) మనస్సు: వచ్చే భావాలు, పోయే భావాలు అనేవాటి సముదాయరూపమైనది.

(22) బుద్ధి : నిశ్చయాత్మక - అంటే ఒక పనికి నిర్ణయం కుదిరిన దశలో దానిని బుద్ధి అంటారు.

(23) అహంకారం : 'నేను' అనే భావం. నేను చేస్తున్నాను, నేను చూస్తున్నాను - అనే భావం దేనివలన ఏర్పడుతున్నదో

దానిని 'అహంకారం' అంటారు.

(24) ప్రకృతి : పై అన్నింటికీ మూలకారణమైన తత్త్వం. దీనినే 'మాయ' అని కూడా అంటారు.

**వ. ఆ చతుర్వింశతి తత్త్వంబుల నధిష్ఠించి యుండు తత్త్వంబు నిర్దేశించెద. 179**

**తాత్పర్యం:** ఆ ఇరువది నాలుగు తత్త్వాలకూ ఆధారరూపంగా ఉండే తత్త్వాన్ని చెప్పుతాను.

**క. దేహం బనియెడ నెరవున । నూహించును బుధుఁడు దాననుండుం గాష్ఠ**

**స్వాహాప్రియు క్రియఁ బురుషుఁడు । సోऽహ మనిన కాన్పు రుద్ర! యతనిఁ గను టగున్. 180**

**ప్రతిపదార్థం:** బుధుఁడు = జ్ఞానం కల పండితుడు; దేహంబు= శరీరం; అని; ఎడన్= ఒక తావును; నెరవునన్= సముదాయ రూపంలో; ఊహించును= భావిస్తాడు; దానన్= ఆ దేహంలో; కాష్ఠ స్వాహాప్రియు క్రియన్= కట్టెలోని అగ్నివలె; పురుషుఁడు= పురుషు డనబడే ఇరవై అయిదవ తత్త్వం; ఉండున్= ఉంటుంది; రుద్ర!= ఓ పరమేశ్వరా!; సః+అహమ్= అతడే నేను; అనిన కాన్పు= అనే దృష్టి; అతనిన్= ఆ పురుషుడిని; కనుట= దర్శించటం; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** రుద్రా! జ్ఞాని పై ఇరువదినాల్గింటి సముదాయాన్ని దేహం అని భావిస్తాడు. అందులో 'పురుషుడు' కట్టెలో నిప్పు ఉన్నట్లు ఉంటాడు. అతడే 'నేను' అనే జ్ఞానం పొందటమే ఆ పురుషుడిని దర్శించే విధానం.

**విశేషం:** శ్రీ శంకరులు నిరూపించిన అద్వైతసిద్ధాంత రహస్యమంతా ఈ పద్యంలో మనకు స్పష్టం అవుతుంది. పైన చెప్పిన ఇరవైనాలుగు తత్త్వాల సముదాయాన్ని దేహం అంటారు. 'పురుషుడు' అనబడే ఇరవై అయిదవ తత్త్వం అందులోనే ఉంటుంది. ఆత్మని+అధి= 'దేహమును ఆధారంగా చేసికొని ఉండేది - అధ్యాత్మమ్ అని అధ్యాత్మ శబ్దాని కర్థం. దేహంలో పురుషుడు ఉండే స్థితిని చక్కగా తెలియటం కోసం ఒక ఉపమానం ద్వారా తెలియజేస్తున్నాను. దేహం కట్టెవంటిది. అందులో ఉండే పురుషుడు అగ్నివంటివాడు. అగ్నికి రెండుదశలు. 1. వ్యక్తదశ. కట్టె కాలుతున్నప్పుడు అగ్ని కంటికి తెలియవస్తుంది. 2. అవ్యక్త దశ. కట్టెలో గూఢంగా అగ్ని ఉండే దశ. కనుకనే ఒక కట్టెను మరొక కట్టెతో మథిస్తే అగ్ని పుట్టుతున్నది. ఈ విధంగా పైకి కనపడకుండా ఉన్నట్లు తెలియవచ్చే దశను అవ్యక్తదశ అంటారు. పురుషుడు దేహంలో ఈ రెండు స్థితులలో దేహానికి ఆధారమై ఉంటాడు. అనగా ఆ 'పురుషతత్త్వం' ఉన్నది కనుకనే ప్రకృతి మొదలైన ఇరవైనాలుగు తత్త్వాల సముదాయం ఉన్నది. అది లేకపోతే ఇది లేదు - అన్న స్థితిలో ఉన్నాడు. జీవుడు ఆ పురుషుడిని సంసారబంధం లేకపోవటం అనే పరమప్రయోజనాన్ని అపేక్షించి తెలిసికొనాలి. దానికి మార్గాన్ని ఇక్కడ సులభపద్ధతిలో చెప్పుతున్నారు. 'అహమ్' అంటే నేను - అంటే ఇరవైనాలుగు తత్త్వాల సముదాయరూపమైన జీవుడు. 'సః' - అంటే ఇరువది యైదవ తత్త్వంగా ఉండే పరమాత్మ. అది నేనే, నేనే అది - అన్న వివేకం పొందటమే పరమాత్మను చూడటం. దానివలన జీవుడికి పరమాత్మతతో ఒక్కటి అయ్యే స్థితి కలుగుతున్నది. దానినే మోక్షం అంటారు. అద్వైతసిద్ధి అంటే ఇదే. ద్వి - రెండు, 'ద్వితా' - రెండు ఉండటం. దాని భావం - ద్వైతం అది లేని స్థితి - అద్వైతం - ఇక్కడ రెండు అంటే (1) .జీవుడు, (2) పరమాత్మ.

**క. ఈ నెఱి నిలుచుట గలుగదు । మానేర్ష్యావంతు లైన మానవులకు ని**

**ష్ఠానూన తపోవర్తకు । లైనను గార్హస్థ్యబహుముఖాత్మకు లగుటన్. 181**

**ప్రతిపదార్థం:** నిష్ఠా+అనూన తపస్+వర్తకులు= ఏ కొంచెం చెదరని తక్కువకాని తపస్సును ప్రవర్తింపజేసేవారు; ఐనను= అయినా; గార్హస్థ్యబహుముఖ+ఆత్మకులు= గృహస్థధర్మంలో పెక్కురీతులైన భావాలు కలవారు; అగుటన్= కావటంవలన; మాన+ఈర్ష్యావంతులు= అభిమానమూ, ఈర్ష్య అనే భావాలు కలవారు; ఐన మానవులకున్= అయిన మనుష్యులకు; ఈ నెఱి= ఈ వివేకం; నిలుచుట= స్థిరంగా ఉండటం; కలుగదు= కలగదు.

**తాత్పర్యం:** గృహస్థులు పెక్కుభావాలు కలవారు కావటంవలన చెడని దీక్షగల తపస్సులో ప్రవర్తిస్తున్నవారైనా ఈర్ష్య, దురభిమానం గల మానవులకు ఈ వివేకం ఎక్కువకాలం నిలవదు.

**విశేషం:** 'అతడే నేను' అనుకొన్నాం కదా! మరి మనకు మోక్షం సిద్ధించటం లేదేమి? - అనే ప్రశ్నను సంభావించి సమాధానం చెప్తున్నారు. మోక్షం ఈ వివేకం స్థిరంగా సర్వకాల సర్వావస్థలలో చెడకుండా ఉన్నవారికి మాత్రమే సిద్ధిస్తుంది. దీనికి 'విక్షేపాలు- భంగం కలిగించేవి - పెక్కులు. 1.గార్హస్థ్యబహుముఖాత్మకత - గృహస్థధర్మంలో ఉండటంవలన అనేకభావాలను చూడవలసి రావటం. 2. మానం - అంటే అహంకారం. దురభిమానం. నేనే సర్వానికీ కర్తను - అనే దుష్టమైన ఆలోచన, 3. ఈర్ష్య -ఇతరుల విశిష్టతను చూచి సహింపలేకపోవటం మొదలగునవి. ఇవన్నీ తనను తాను లయం చేసికొని పరమాత్మలో కలిసిపోవటానికి అడ్డుపడే లక్షణాలు. ఇవి తొలగాలంటే 'నిష్ఠానూన తపస్సు' కావాలి. కానీ సాధన ఉన్నా ప్రతిబంధకాలైన ఈర్ష్యాదులను తొలగించుకొనకపోతే సాధన బూడిదలో పోసిన పన్నీరువంటి దవుతుంది. ఎందుకంటే 'సోహ౾మ్' అనే వివేకం 'నిలుచుట కలుగదు' కనుక.

**వ. శ్రుతి పురుషు నమృతార్థ తత్త్వంబనియు బ్రహ్మం బనియు నిర్దేశించు. 182**

**ప్రతిపదార్థం:** శ్రుతి= వేదం; పురుషున్= పురుషు డనే తత్త్వాన్ని; అమృత+అర్థ తత్త్వంబు= అమృతం అనే అర్థంగల తత్త్వం; అనియున్= అనీ; బ్రహ్మంబు= బ్రహ్మము; అనియున్= అనీ; నిర్దేశించున్= తెలియచేస్తున్నది.

**తాత్పర్యం:** వేదం 'పురుష' తత్త్వాన్ని అమృతార్థతత్త్వమనీ బ్రహ్మమనీ తెలియజేస్తున్నది.

**విశేషం:** 'అమృతం' అంటే చావు లేనిది. ఆ అర్థంగల తత్త్వం అమృతార్థతత్త్వం - 'అవినాశి తు తద్విద్ధి' అని భగవద్గీత. బ్రహ్మము అనగా పెద్దది అని శబ్దార్థం. దీనికంటె మించినది, పెద్దది వ్యాపించినదీ మరొకటి లేదు కనుక 'బ్రహ్మము' అనే పదం సార్థకమైనది. శ్రుతి అనగా శబ్దప్రమాణం. అనగా ఇతర ప్రమాణాల ద్వారా తెలియరాని అంశాలను తెలియజెప్పేది. అది తిరుగులేని ప్రమాణం.

**తే. అన్ని తత్త్వంబులకు నమృతార్థతత్త్వ। మెక్కు డది ఈశ్వరంబు ననీశ్వరంబు**
**సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ। గనిన మృత్యుజాలము చిక్కు గడవవచ్చు. 183**

**ప్రతిపదార్థం:** అమృత+అర్థతత్త్వము= అమృతం అనే అర్థం గల తత్త్వం; అన్ని తత్త్వంబులకున్= ముందు చెప్పిన ఇరవై నాలుగు తత్త్వాలకంటె; ఎక్కుడు= గొప్పది; అది= ఆ తత్త్వం; ఈశ్వరంబు= అన్నింటికీ ప్రభువు; అనీశ్వరంబు= మరియొక ప్రభువు లేనిది; సత్యపాకంబు= సత్యం పండిన రూపం; అతి రహస్యంబు= మిక్కిలి గోప్యమైనది; దానిన్= ఆ తత్త్వాన్ని; కనినన్= కనుగొంటే; మృత్యుజాలము చిక్కు= మరణం అనే వలలో చిక్కటం; కడవన్ వచ్చున్= దాటవచ్చును.

**తాత్పర్యం:** ఈ అమృతార్థతత్త్వం అన్ని తత్త్వాలకు మించినది. అది అన్నింటినీ శాసించేది. దానికి మరొక శాసకుడు లేడు. సత్యం పండిన స్వరూపం. మిక్కిలి రహస్యమైనది. దానిని తెలిసికొంటే మృత్యువు వలనుండి దాటవచ్చును.

**విశేషం:** ఈశ్వరము - తక్కిన ఇరవై నాలుగు తత్త్వాలు దీని అధీనంలో ప్రభువువద్ద సేవకుడివలె ప్రవర్తిస్తాయి అని భావం. అనీశ్వరంబు - దీనిని శాసించే మిన్న అయిన తత్త్వం మరొకటి లేదని భావం. సత్యపాకంబు - పరమసత్యం అని భావం. అంటే మూడుకాలాలలో, సర్వదేశాలలో ఏ యితర ప్రమాణం చేతనూ త్రోసివేయరానిది అని భావం. అతి రహస్యం - దీని గుట్టు తెలిసికొనటం ఎంతవారికీ సాధ్యం కాదని భావం. ఇక్కడ మృత్యువంటే అజ్ఞానము, సంసారము అనే పేర్లతో వ్యవహరించబడే దశ. దాని తగులం దీనివలన రూపుమాసిపోతుందని భావం.

**క. అనఘ! యనులోమమునఁ దోఁ। పును బ్రతిలోమమున లయము వొందుటయును గ**
**ల్గును సర్వతత్త్వముల కవి। యెనయిక బ్రహ్మమును గలయు టేకత్వ మగున్. 184**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; సర్వతత్త్వములకున్= తత్త్వాలన్నింటికీ; అనులోమమునన్= పైనుండి క్రిందికి అనే విధానంచేత; తోఁపును= కన్పడటం అనే స్థితీ ( సృష్టి); ప్రతిలోమమునన్= క్రిందినుండి పైకి పోవుట అనే విధానం చేత; లయము= ఒకదానిలో ఒకటి కలిసిపోవటం; పొందుటయును= పొందటమూ; కల్గును= ఏర్పడుతున్నది; అవి= ఆ తత్త్వాలు; ఎనయిక= ఒక్కటి కావటం; బ్రహ్మమును= 'బ్రహ్మము' అనే ఇరవై అయిదవ తత్త్వాన్ని; కలియుట= కలసిపోవటం; ఏకత్వము= ఒక్కటి కావటం; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** అనఘా! తత్త్వాలన్నీ పైనుండి క్రిందికి అనే తీరులో ఏర్పడితే 'సృష్టి' అంటారు. క్రిందినుండి పైకి అనే పద్ధతిలో కలసిపోతే 'లయం' అంటారు. అవి అన్నీ కలిపి బ్రహ్మమును చేరుకొనటమే 'ఏకత్వం' అవుతుంది.

**విశేషం:** అనులోమం - అంటే - బ్రహ్మము - ప్రకృతి - అహంకారము - బుద్ధి - మనస్సు - పంచభూతాలు -పంచగుణాలు - పంచేంద్రియాలు - అనే వరుసలో ఏర్పడటం. దీనిని సృష్టి అంటారు. ఇంద్రియాలు గుణాలలో, అవి భూతాలలో, అవి మనస్సులో, అవి బుద్ధిలో, అది అహంకారంలో, అది ప్రకృతిలో, అది బ్రహ్మలో క్రమంగా లీనం కావటటం ప్రతిలోమ విధానం. దీనిని 'లయప్రక్రియ' అంటారు. ఇట్లా చివరకు బ్రహ్మము ఒక్కటే ఉండే స్థితిని 'ఏకత్వం' అని వ్యవహరిస్తారు. దీనిని సాధకుడు అంతరంగంలో సాధించి చెదరకుండా నిలుపుకొనటం మోక్షం.

**తే. ఉత్తమశ్రద్ధ లేకున్నఁ జిత్త మేక। ముఖము గాకున్న నింద్రియముల జయింప**
**కున్న వేదంబు చదువకయున్న నతని। కీ పరిజ్ఞాన మీఁ దగ దిద్ధచరిత! 185**

**ప్రతిపదార్థం:** ఇద్ధచరిత!= చక్కగా ప్రకాశిస్తున్న నడవడికలవాడా!; ఉత్తమశ్రద్ధ= శ్రేష్ఠమైన హృదయసమర్పణ; లేక+ఉన్నన్= లేకుంటే; చిత్తము= మనస్సు; ఏకముఖము= ఆ ఒక వస్తువునందు లగ్నం అయినది; కాకున్నన్= కాకపోతే; ఇంద్రియములన్= ఇంద్రియాలను; జయింపక+ఉన్నన్= గెలువకపోతే; వేదంబు= శ్రుతిని; చదువక+ఉన్నన్= చదువకపోతే; అతనికిన్= అట్టివాడికి; ఈ పరిజ్ఞానమున్= ఈ సమగ్రమైన జ్ఞానాన్ని; ఈన్ తగదు= ఇవ్వరాదు.

**తాత్పర్యం:** పరమేశ్వరా! శ్రేష్ఠమైన శ్రద్ధలేనివాడికీ, చిత్తాన్ని ఏకాగ్రంగా నిలుపలేనివాడికీ, ఇంద్రియాలను గెలువని వాడికీ, వేదం చదువనివాడికీ ఈ మహాజ్ఞానాన్ని ఇవ్వరాదు.

**విశేషం:** 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, తత్పరః సంయతేన్ద్రియః' అని భగవదనుశాసనం. శ్రద్ధకలవాడూ, తత్పరుడు, ఇంద్రియ నిగ్రహం కలవాడూ జ్ఞానం పొందుతాడు. ఈ పద్యంలో ఈ అంశాలను క్రమంగా పేర్కొన్నారు. తత్పరత్వమే ఏకాగ్రత. శ్రద్ధ అంటే హృదయాన్ని లక్ష్యంమీదనే ఉంచటం. ఈ మహాజ్ఞానాన్ని ఇవ్వరాదు అనటంలో జ్ఞానం విలువ తెలియచెప్పటం ప్రధానలక్ష్యం.

**వ. అని చెప్పి తదనంతరంబ యధ్యాత్మంబుల నధిభూతంబుల నధిదైవంబుల నుపన్యసించె నా సనత్కుమారుండు దత్ప్రపంచంబు నారదునకుం జెప్పుట యేను నీకెఱింగించి యప్పరిపాటి నిన్ను మున్న వినిపించితి ధర్మనందనా! యమ్మునిపతి మఱియు నప్పశుపతితో నిట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= తెలిపి; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మట; అధ్యాత్మంబులన్= దేహాన్ని ఆశ్రయించిన వాటిని గూర్చి; అధిభూతంబులన్= ప్రాణులనాశ్రయించి ఉన్నవాటిని; అధిదైవంబులన్= దేవతల నాశ్రయించి ఉన్నవాటిని; ఉపన్యసించెన్= చక్కగా వివరించాడు; ఆ సనత్కుమారుండు= ఆ సనత్కుమారుడు; తద్+ప్రపంచంబున్= విషయాల విస్తరాన్ని; నారదునకున్= నారదమహర్షికి; చెప్పుట; ఏను= నేను; నీకున్= నీకు; ఎఱింగించి= తెలిపి; ఆ+పరిపాటిన్= ఆ క్రమాన్ని; నిన్నున్= నీకు; మున్ను+అ= ఇంతకుముందే; వినిపించితిన్= తెలియజెప్పాను; ధర్మనందనా!= ధర్మరాజా!; ఆ+మునిపతి= మునులలో ఉత్తముడైన ఆ సనత్కుమారుడు; మఱియున్= ఇంకా; ఆ+పశుపతితోన్= ఆ పరమేశ్వరుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్=అన్నాడు.

**తాత్పర్యం:** తరువాత సనత్కుమారుడు ఆధ్యాత్మములనూ, అధిభూతాలను, అధిదైవాలను గురించి వివరించి చెప్పాడు. ధర్మరాజా! ఆ సనత్కుమారుడు ఆ వివరాలనన్నింటినీ నారదుడికి తెలియజెప్పా డని ఆ క్రమమంతా ఇంతకుముందే నీకు చెప్పాను. తరువాత ఆ మునిశ్రేష్ఠుడు పరమేశ్వరుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. సకల జంతువులకు సామాన్య మధ్యాత్మ । మాదిగాఁగఁ గల్గు నంతవట్టు**
**నిట్లు గాఁగ నెఱుఁగు టెఱుఁగుట యొండుమైఁ । గనుట యెఱుక గాదు కామదమన! 187**

**ప్రతిపదార్థం:** కామదమన!= కాముడిని అణచిన ఓ శంకరా!; సకలజంతువులకున్= అన్ని ప్రాణులకు; అధ్యాత్మము+ ఆదిగాఁగన్= అధ్యాత్మము మొదలుగా; కల్గు+అంతవట్టున్= ఉన్న అది అంతా; సామాన్యము= సమానంగా ఉండేదే; ఇట్లు= ఈ విధంగా; కాఁగన్= అవటం; ఎఱుఁగుట= తెలిసికొనటం; ఎఱుఁగుట= నిజమైన తెలివి; ఒండుమైన్= మరొకవిధంగా; కనుట= చూడటం; ఎఱుక= జ్ఞానము; కాదు.

**తాత్పర్యం:** శంకరా! అధ్యాత్మం మొదలైనది సర్వప్రాణులకు సమానంగా ఉండేది. ఇట్లా తెలిసికొనటమే నిజమైన జ్ఞానం. మరొకవిధమైనది జ్ఞానం కాదు.

**విశేషం:** ఇంతవరకు చెప్పిన అధ్యాత్మజ్ఞానం ఎవరికో ఒకరికి సంబంధించినది కాదు. సమస్తప్రాణికోటికీ సంబంధించినది - అని తెలిసికొనటమే నిజమైన జ్ఞానం. దీనివలన సర్వప్రాణికోటియందూ ఆత్మతత్త్వం నిండి ఉన్నది అనే మహావిషయం స్పష్టం చేసినట్లయింది.

**క. విను మధ్యాత్మప్రభృతులు । గనిరే? మున్నమరదనుజ గంధర్వులునుం**
**గనుటయుఁ గల్గునె? బ్రహ్మం । బున నున్న నిజంబు తత్ప్రబోధం బసదే? 188**

**ప్రతిపదార్థం:** వినుము; అమర దనుజ గంధర్వులున్= దేవతలు, రాక్షసులు, గంధర్వులు; మున్ను= పూర్వం; అధ్యాత్మ ప్రభృతులు= అధ్యాత్మం మొదలైన విషయాలను; కనిరే?= తెలిసికొన్నారా? బ్రహ్మంబునన్+ఉన్న నిజంబు= బ్రహ్మములో ఉన్న సత్యాన్ని; కనుటయున్= ఇకముందు తెలిసికొనటమూ; కల్గునె?= కలుగుతుందా?; తద్+ప్రబోధంబు= దానిని తెలియజెప్పటం; అసదు+ఏ?= తక్కువదియా?

**తాత్పర్యం:** ఓయి సర్వజ్ఞా! దేవతలుగానీ, రాక్షసులుగానీ, గంధర్వులు గానీ మునుపు ఈ అధ్యాత్మం మొదలైన విషయాలు తెలిసికొనగలిగారా? బ్రహ్మముయొక్క నిజతత్త్వం తెలిసికొనటం సాధ్యమా? దానిని తెలియజెప్పటం తేలిక పనియా?

**విశేషం:** బ్రహ్మజ్ఞానం అనంతమైనది. దేవతాదులకు కూడా తెలియదగినది కాదు. తెలిసికొనటం, తెలియజెప్పటం రెండూ దుష్కరాలే అని తాత్పర్యం. దేవతలు సత్త్వగుణానికీ, రాక్షసులు తమోగుణానికీ, గంధర్వులు రజోగుణానికీ ప్రతీకలుగా భావిస్తే పరమాత్మతత్త్వం గుణాతీతమైనది అనే భావన సిద్ధిస్తుంది.

**క. ఓం కారవాచ్య మది యన । హంకార నిరూఢ భావనారాధ్యము ని**

**ష్పంక మశీత మనుష్ణము । శంకర మఖిలంబునకుఁ దృషాహరము శివా! 189**

**ప్రతిపదార్థం:** శివా= శంకరా!; అది= ఆ బ్రహ్మము-తత్త్వం; ఓంకారవాచ్యము= 'ఓమ్' అనే ప్రణవముచేత చెప్పదగినది; అనహంకార నిరూఢ భావనా+ఆరాధ్యము= అహంకారం పూర్తిగా నశించిన భావనకు ఆరాధించదగినది; నిష్పంకము= ఎట్టి మాలిన్యము లేనిది; అశీతము= చల్లదనము లేనిది; అనుష్ణము = వేడి లేనిది; అఖిలంబునకున్= సృష్టిలో సమస్తమైన దానికి; శంకరము= శుభాన్ని కలిగించేది; తృషాహరము= దాహాన్ని తొలగించి వేసేది.

**తాత్పర్యం:** శివా! ఆ బ్రహ్మతత్త్వం ఓంకారంచేత మాత్రమే చెప్పదగినది. అహంకారం బొత్తిగా లేని వారి భావనచేత మాత్రమే ఆరాధించబడేది. ఏ మాలిన్యమూ లేనిది. ద్వంద్వాలకు అతీతమైనది. సర్వమునకు శుభాన్ని కలిగించేది. అందరి దాహాలు తీర్చునట్టిది.

**విశేషం:** 'ఓంకారం' దీనిని ప్రణవం అంటారు. ఇది పరబ్రహ్మమునకు వాచకం. ఆకార ఉకార మకారాల సముదాయం ఓంకారం. దీని పరిపూర్ణమైన అర్థాన్ని మాండూక్యోపనిషత్తు వివరిస్తున్నది. అహంకారం ఉన్నవాడికి తానూ, ప్రపంచమూ మాత్రమే కనిపిస్తాయి. పరమాత్మ ఉనికినే అతడు పసికట్టలేడు. సృష్టిలోని సర్వపదార్థాలలో ఏదో దోషం ఉండనే ఉంటుంది. చివరకు హరిహరబ్రహ్మలు కూడా పరమాత్మ తంత్రానికి లోబడినవారే కావటం గుర్తిస్తే వారిలో అస్వతంత్రత అనే దోషం ఉన్నది. ఇక తక్కిన జీవకోటి సంగతి చెప్పనేల? కానీ పరమాత్మకు అట్టిదోషమేమీ లేదని 'నిష్పంకము' అనే శబ్దం తెలియచేస్తున్నది.

అశీతము, అనుష్ణము - అనే పదాలలోని శీతత్వ ఉష్ణత్వాలు ద్వంద్వాలకు సంకేతాలు. సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, లాభనష్టాలు మొదలయినవి ద్వంద్వాలు. అవి సుఖంతోపాటు దుఃఖానికి కూడా కారణాలవుతాయి. పరమాత్మ ద్వంద్వాతీతుడు కనుక ఆనందైక ఘనుడని ఉపనిషత్తులు చెప్పుతున్నాయి.

శంకరము - సమస్తప్రాణికోటికీ శుభాన్ని కూర్చేది - ఇక్కడ 'శమ్' అంటే దేశకాల పాత్రములకు అతీతమైన పరమానందం అనే అర్థం గ్రహించాలి.

తృషాహరము - జ్ఞానలాభం పొందిన సాధకుడు మరి దేనినీ అపేక్షించడు. అపేక్ష దుఃఖానికి కారణం. అనపేక్షత పరమ సుఖదాయకం. ఇట్లా ఈ పద్యంలో పరమాత్మ లక్షణాలను ప్రపంచించారు.

**తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది । విరహితంబు నితాంతంబు విమల మవ్య**

**యంబు పుండరీకాక్ష మనక్షవిషయ । మచ్యుతము సదసత్పరమైక్యభాసి. 190**

**ప్రతిపదార్థం:** అప్రమేయము=ఊహకందనిది; అవిజ్ఞేయము= తెలియశక్యముకానిది; అచలము= కదలికలేనిది; ఆది విరహితంబు= మొదలులేనిది; నితాంతంబు= అన్నింటికంటె మిన్న అయినది; విమలము= దోషములు లేనిది; అవ్యయంబు= ఎట్టిమార్పులు లేనిదీ; పుండరీక+అక్షము= పద్మములవంటి కన్నులు కలది; అనక్షవిషయము= ఇంద్రియములకు విషయముకానిది; అచ్యుతము= జారుపాటు లేనిది; సత్+అసత్ పరమ+ఐక్య భాసి= ఉన్నది లేనిది అనువాటి గొప్ప ఏకత్వముచేత ప్రకాశించేది.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మము ఊహ కందనిది. తెలియ శక్యము కానిది, కదలిక లేనిది, మొదలు లేనిది, అన్నింటి కంటె మిన్న అయినది, దోషములు లేనిది, ఎట్టిమార్పులు లేనిది, పద్మములవంటి కన్నులు కలది, ఇంద్రియములకు తెలియరానిది, చ్యుతి లేనిది. సదసత్తుల గొప్ప కలయికలో భాసించేది.

**విశేషం:** అప్రమేయము - మేయము అనగా కొలవదగినది, ప్రమేయము - గొప్పగా కొలవదగినది - అది కానిది అప్రమేయం. పొడవు, ఎత్తు, వెడల్పు మొదలైన ప్రమాణాలు చెప్పరానిది అని భావం.

అవిజ్ఞేయము : ఇతరమైన అనుమానాది ప్రమాణాల ద్వారా తెలిసికొన జాలనిది.

అచలము : స్థిరమైనది. చలనం ఉంటే ఉన్నచోటు, పోయే చోటు మొదలైనవి భావాలు ఉంటాయి. ఉంటే కొలతలు మొదలైనవి ఏర్పడుతాయి. అవి లేవు కనుక అచలము.

ఆదివిరహితంబు : ఆదిశబ్దం మధ్య, అంతశబ్దాలను కూడా సూచిస్తున్నది. ఆది, మధ్య, అంతం అనే దేశకాలభేదాలు లేనిది.

నితాంతంబు : అన్నింటికంటె అధికమైనది. అందుకనే దానిని 'బ్రహ్మము' అంటారు.

విమలము : స్వచ్ఛమైనది. మలం (దోషం) లేనిది. ఉత్పత్తి, స్థితి, వినాశనం మొదలైన వికారాలే మలాలు. అవి లేనిది.

అవ్యయంబు : వ్యయం అనగా తరుగుదల. ఏదో ఒక కారణంగా స్థితిలో వచ్చే క్షీణత - అది లేనిది, పుండరీక+అక్షము= పుండరీకం అనగా హృదయం అనే పద్మం. అందులోనికి వ్యాపించి ఉండేది. వేదమంత్రం హృదయకుహరంలోని సన్ననిరంధ్రంలోని అతిసూక్ష్మమైన అగ్నిజ్వాల నడిమి ప్రదేశం పరమాత్మ స్థానమని అభివర్ణించింది.

అనక్షవిషయము : ఇంద్రియాలకు విషయం కానిది అంటే ఇంద్రియాలచేత తెలియరానిది. ఇంద్రియాలంటే కన్ను, ముక్కు మొదలైనవి రూపగంధాదులను గ్రహిస్తాయి. ఆ అన్నింటికీ అతీతమైనది కనుక ఆత్మతత్త్వం ఇంద్రియాతీతమైనది.

అచ్యుతము : చ్యుతి అంటే జారుపాటు మార్పు అట్టిదేమీ లేనిది.

సత్+అసత్+పరమ+ఐక్యభాసి : సత్ ఉన్నది, అసత్ అంటే లేనిది. ఉన్నది పరమాత్మతత్త్వం, లేనిది జగత్తత్త్వం. ఈ రెంటియొక్క పరమమైన - అత్యుత్కృష్టమైన ఐక్యం - ఏకత్వం - ఒక్కదానితనం - దానితో ప్రకాశించేవాడు. జీవాత్మ పరమాత్మల ఏకత్వం పరిపూర్ణంగా సిద్ధించినపుడు కొంతకాలం ఆ ఏకత్వం లేకుండా దానికోసం సాధనచేసిన వ్యక్తికి ప్రకాశరూపంలో తెలియవచ్చేది.

ఈ పద్యం ఉపనిషదాదులు అనేకయుక్తులతో నిరూపించటానికి ప్రయత్నించే పరమాత్మతత్త్వాన్ని అక్షరరూపంలో వ్యక్తం చేస్తున్నది.

**క. అది నారాయణుఁ డొకనికి । విదిత మతనివలన సురలు వివిధమునులు ని**
**ర్మదసిద్ధసాధ్యగణములు । మొదలగు నర్హుల సుబోధముల పొలమయ్యెన్. 191**

**ప్రతిపదార్థం:** అది= ఆ పరతత్త్వం; నారాయణుఁడు= శ్రీమన్నారాయణుడు; ఒకనికిన్= ఒక్కడికి; విదితము= తెలిసినది; అతనివలనన్= ఆ నారాయణుడివలన; సురలు= దేవతలు; వివిధ మునులు= వేరువేరు విధాలకు చెందిన మునులు; నిర్మద సిద్ధ సాధ్య గణములు= మదంలేని సిద్ధులు సాధ్యులు అనేవారి సముదాయాలు; మొదలగు+అర్హుల సుబోధముల పొలము= మొదలైన యోగ్యత గల జ్ఞానములకు సంబంధించిన క్షేత్రం; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** ఆ పరతత్త్వం నారాయణుడి కొక్కడికే మొదట తెలిసింది. అతడివలన దేవతలు, మునులు, సిద్ధులు, సాధ్యులు మొదలగు యోగ్యతగలవారి జ్ఞానపు పొలం అయింది.

**విశేషం:** నారాయణుడు - పరమాత్మ స్వరూపంయొక్క సగుణరూపం మొదటి వెలుగు నారాయణుడు. అంటే పరమాత్మ నిర్గుణబ్రహ్మం. నారాయణుడు సగుణబ్రహ్మం అని భావం. 'సగుణం' అనగా సాధకుల తెలివికొరకు నామరూపాదులు పొందిన తత్త్వం. సురలు అనగా బ్రహ్మాదులు వివిధమునులు - బ్రహ్మాది లోకాలకు సంబంధించిన సనత్కుమారుడు, నారదుడు మొదలైనవారు.

నిర్మద, అర్హులు అనే మాటలవలన కేవలం సిద్ధాది పరిగణనకు వచ్చినవారందరికీ ఆ తత్త్వం తెలియవచ్చేది కాదన్న అర్థం తెలియవస్తున్నది.

దీనినే సంప్రదాయం లేదా గురుపరంపర అంటారు. ఈ రెండూ లేని విద్యలు అనాదివిద్యలు కావు. ఆత్మతత్త్వం అనాది విద్య. అనంతవిద్యలు కావు. ఆత్మతత్త్వం అనాదివిద్య. అనంతవిద్య అని నిరూపించటానికి ఈ పరంపరను చెప్పటం పరిపాటి.

**వ. అట్లయిన నా తత్త్వంబు దృశ్యత్వంబు నిరూఢంబుగా దెట్లనిన వినుము బంద విముక్తుండు కదా కనువాఁడు. 192**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; అయినను= అయినా; ఆ తత్త్వంబు; దృశ్యత్వంబు= ఆ పరమాత్మ తత్త్వం కనపడేతనం; నిరూఢంబు= స్పష్టంగా తెలియవచ్చేది; కాదు; ఎట్లు= ఏ విధంగా; అనినన్= అనగా; వినుము= వినుము; బంధవిముక్తుండు= బంధంనుండి విడివడినవాడు; కదా; కనువాఁడు= చూచేవాడు.

**తాత్పర్యం:** అట్లా అయినా ఆ తత్త్వం కనపడేది కావటం జరుగదు. వినుము. ఎందుకంటే, బంధంనుండి విముక్తి పొందినవాడే కదా చూచేవాడు.

**విశేషం:** నారాయణుడు మొదలుకొని మహాజ్ఞానసంపన్నుల చక్కని తెలివికి పొలమైనా ఆ పరతత్త్వం కంటికి కనబడదు. ఎందుకంటే అది శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం వంటి విషయం కాదు. ఇంద్రియాలు వాటిని వాటి వికారాలను మాత్రమే చూస్తాయి. ఇక్కడ 'చూచువాడు' అనగా పరతత్త్వదర్శనం చేయగలవాడు అని అర్థం. పైన చెప్పిన ఇరవైనాలుగు తత్త్వాలలో చిక్కటమే బంధం. దానినుండి బయటపడటమే విముక్తి. ఇరవైనాలుగు తత్త్వాలలో చిక్కుకొన్నవాడికి అవే కనిపిస్తాయి. కాని వాటి కతీతంగా 'పెంజీకటి కవ్వల నెవ్వం డేకాకృతియై' అన్నట్లు ఉన్నది కనిపించదు. దానికి బంధవిముక్తి సాధనం - అని భావం. ఈ భావాన్ని మరింత స్పష్టంగా చెప్పుతున్నారు.

**చ. స్మరహర! పొందు నింద్రియసమాజయుగంబు మనంబు బుద్ధియుం**
**బరువడిమై నహంకరణబంధము వాసిన జీవుఁ దత్సము**
**త్కరసహితంబుగా నతఁడు దాఁ బరతత్త్వమునందు లీనతం**
**బొరయును, దాని నెవ్వరు ప్రబోధముగాఁ గనువారు? సెప్పుమా! 193**

**ప్రతిపదార్థం:** స్మరహర!= మన్మథుడిని హరించిన ఓ శంకరా!; పరువడిమైన్= మిక్కిలి వేగంతో; అహంకరణ బంధము= అహంకారం అనే బంధం; పాసిన జీవున్:= వదలిన జీవుడిని; ఇంద్రియసమాజయుగంబు= ఇంద్రియాల సముదాయపు జంట; మనంబు= మనస్సు; బుద్ధియున్= బుద్ధీ; పొందున్= పొందుతాయి (జీవుడిలో చేరుకొంటాయి); అతఁడు= ఆ జీవుడు;

తద్+సముత్కర సహితంబుగాన్= ఆ సముదాయంతో పాటు; పరతత్త్వమునందున్= అన్నింటికంటె వేరుగా మిన్నగా ఉండే పరమాత్మ తత్త్వంలో; లీనతన్= కలిసిపోవటాన్ని; పొరయును= పొందుతాడు; దానిన్= అట్టి పరతత్త్వాన్ని; ఎవ్వరు= ఎవరు; ప్రబోధముగాన్= చక్కగా తెలియవచ్చే విధంగా; కనువారు?= చూచేవారు? చెప్పుమా?= చెప్పుము.

**తాత్పర్యం:** శివా! అహంకారాన్ని వదలిన జీవుడిలో రెండు విధాలైన ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ లీనమైపోతాయి. అట్లా లీనమైన ఆ అన్నింటితోపాటు జీవుడు పరతత్త్వంలో లీనమైపోతాడు. ఇక పరతత్త్వాన్ని చూచేదెవరో చెప్పుము.

**విశేషం:** 'చూడటం' అంటే చూచేవాడు (ద్రష్ట) చూడబడేది (దృశ్యం) కన్ను ప్రసరించటం (దర్శనం) అనే మూడు ఉండాలి. పరతత్త్వం విషయంలో ఈ మూడు ఉండే అవకాశం లేదని ఈ పద్యం చెప్తుతున్నది. ఎట్లాగంటే పరతత్త్వ విషయంలో మొదట 'నేను' అనే భావం (అహంకారం) జారిపోతున్నది. దానితో జీవుడియందున్న రెండు విధాలైన ఇంద్రియాల గుంపులు, మనస్సు, బుద్ధీ అనే పండ్రెండు తత్త్వాలు తమ ఉనికిని కోల్పోతాయి. అనగా నీళ్ళల్లోవేసిన ఉప్పురాయివలె కలిసిపోతాయి. అహంకారం+పది ఇంద్రియాలు+మనస్సు+బుద్ధి అనే పదమూడు కలిసిపోయిన ఆ జీవుడు. సముద్రంలో చేరిన నదివలె ప్రత్యేకస్థితి లేకుండా పరతత్త్వంలో కలిసిపోతాడు. అనగా అక్కడ నిశ్చలంగా, నిలకడగా, నిర్వికారంగా, నిరంజనంగా ఉండేది పరతత్త్వం ఒక్కటే. అప్పుడు చూచేవాడూ, చూడబడేది, చూడటమూ అంతా ఆ పరతత్త్వమే. కాగా దానికంటె ఇతరుడు చూచేవాడు ఉండటం ఎట్లా సాధ్యం? అని పద్యతాత్పర్యం.

ఇంద్రియ సమాజయుగంబు - అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు. ఇంద్రియాల లయం చెప్పటవలన ఇంద్రియగుణాలు, వాటి కాధారభూతాలైన పంచభూతాలు అనేవాటి లయం కూడా చెప్పినట్లే అయింది.

**క. భూతము లన్నియు నడఁగిన। యాతతిఁ దనుఁ దాన కనుచు నంజనరహిత**
**త్వాతిశయ మెసఁగ వెలిఁగెడు। నాతెలి వాతత్త్వమునకు నమరు మహేశా! 194**

**ప్రతిపదార్థం:** మహా+ఈశా!= పరమేశ్వరా!; భూతములు= నేల మొదలైన భూతములు; అన్నియున్= అన్నీ; అడఁగిన+ఆ తతిన్= లీనమై పోయిన ఆ సమయంలో, తనున్= తనను; తాను+అ= తానే; కనుచున్= చూస్తూ; అంజన రహితత్వ+అతిశయము= అంటులేనితనంవలన అయ్యే మహిమ; ఎసఁగన్= ఒప్పగా; వెలిఁగెడు+ఆ తెలివి= ప్రకాశించే ఆ జ్ఞానం; ఆ తత్త్వమునకున్= ఆ విధంగా లీనమైన జీవుడనే తత్త్వానికి; అమరున్= ఏర్పడుతున్నది.

**తాత్పర్యం:** పరమేశ్వరా! ఈ విధంగా పంచభూతాలు మొదలుకొని మనస్సు, బుద్ధి మొదలైనవన్నీ స్వరూపం కోల్పోయిన తరువాత జీవుడు తనను తానే చూస్తూ ఏ విధమైన అంటూ లేకుండా పరతత్త్వమే అటు వెలిగే స్థితిని పొందుతాడు.

**విశేషం:** ఈ స్థితినే 'అద్వైతం' అంటారు. అనగా రెండూలేని స్థితి జీవదేవభేదం లేని స్థితి. దానినే 'సోహ౨మ్' అదే నేను అనే భావనతో వ్యవహరిస్తారు. 'తత్త్వమసి' 'అయమాత్మా బ్రహ్మ,' 'ప్రజ్ఞానం బ్రహ్మ' మొదలైన మహావాక్యాల తాత్పర్య స్థితిలో ఉండటం.

**ఆ. అని సనత్కుమారుఁ డభవుతో మఱియు ని। ట్లనియె దేహవర్తులైన దైవ**
**తముల నెల్ల నాదరమున నాకర్ణింపు। మేర్పరింతు యోగహితము గోరి. 195**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు చెప్పి; సనత్కుమారుఁడు= సనత్కుమార మహర్షి; మఱియున్=ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అభవుతోన్= శివుడితో; అనియెన్= అన్నాడు; యోగహితమున్= యోగపు మేలును; కోరి= వాంఛించి; దేహవర్తులు= దేహంలో తిరిగేవి; ఐన దైవతములన్= అయిన దేవతా స్వరూపాలను; ఎల్లన్= అన్నింటినీ; ఏర్పరింతున్= విడివిడిగా వివరిస్తాను; ఆదరమునన్= శ్రద్ధతో; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని చెప్పి, సనత్కుమారుడు శివుడితో ఇంకా ఇట్లా అంటున్నాడు. 'శివా! యోగం చక్కగా తెలియటం కొరకు దేహంలో ఉండే దైవతాల నన్నింటినీ వివరిస్తాను. ప్రీతితో వినుము.

**విశేషం:** దైవతం అనగా ఏదో ఒక విశిష్టలక్షణంతో వెలుగొందే తత్త్వం. ఉదాహరణకు కన్ను, ముక్కు, చెవి మొదలైనవి. ఎందుకంటే కంటికుండే దర్శనసామర్థ్యం మరి దేనికీ, ఎక్కడా ఎప్పుడూ ఉండదు. అట్లాగే తక్కినవి కూడా. ఈ దృష్టితో భారతీయులు చెప్పుకొనే ముక్కోటి దేవతలను మనదేహంలోనే వివేకంతో దర్శించవచ్చును. అట్లా దర్శించటంవలన యోగం పరిపాకదశకు వస్తుంది. యోగం అనే మాటకు కలయిక అని ఒక అర్థం - జీవబ్రహ్మముల ఏకత్వమే ఇక్కడ సందర్భాన్ని బట్టి యోగం. దానికి హితం అంటే ఆ భావన అభ్యాసపాటవంచేత గట్టిపడటం.

### సనత్కుమారుఁడు శివునకు దేహాంతర్గతదైవతములం దెలుపుట (సం.13-167-1(కుంభ))

**సీ. జిహ్వ సోముఁడు వాణి శిఖి ప్రాణమున గాడ్పు। దానంబునందు శతహ్రదాలి**
**వ్యానస్తనాంతరవర్తులై పర్జన్య। గగనముల్ బలమునఁ గౌశికుండు**
**మతి నపానమున సమానంబునందు నీ। శాన మిత్రాప్సరస్సమితు లక్షు**
**లందు సూర్యుఁడు మేన నంఘ్రులఁ జెవి భూమి। ధరణిధరుండు దిక్తతి యుపస్థ**

**తే. మునఁ బ్రజాపతి బుద్ధి యం దనఘ! బ్రహ్మ। యుండు నింతకు బుధ్యమానుం డనంగ**
**వెలుఁగు నాత్మ యధిష్ఠాత విను ప్రబుద్ధుఁ। డన నబుద్ధుండు నా నొప్పు నతఁడు మఱియు. 196**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా! జిహ్వన్= నాలుకయందు; సోముఁడు= చంద్రుడు; వాణి= వాగ్దేవత; శిఖి= అగ్ని; ప్రాణమునన్= ప్రాణం అనే వాయువునందు; గాడ్పు= వాయుదేవుడు; ఉదానంబునందున్= ఉదానం అనే వాయువులో; శతహ్రద+ఆలి= మెరుపుల వరుస; వ్యాన స్తన+అంతర వర్తులు= వ్యానం అనే వాయువులోను; రొమ్ముినడిమి భాగంలోను తిరుగువారు; ఐ= అయి; పర్జన్య గగనముల్= ఇంద్రుడు ఆకాశమూ అనేవి; బలమునన్= బలంలో; కౌశికుండు= ఇంద్రుడు; మతిన్=బుద్ధియందు; అపానమునన్= అపానమనే వాయువునందు; సమానంబునందున్= సమానం అనే వాయువులోను; ఈశాన మిత్ర అప్సరస్+ సమితులు= ఈశానుడు, సూర్యులు, అప్సరసల సముదాయము; అక్షులందున్= కన్నులలో; సూర్యుఁడు; మేనన్= ఒడలియందు; అంఘ్రులన్= కాళ్ళలో; చెవిన్= చెవియందు; భూమి; ధరణిధరుండు= విష్ణువు; దిక్తతి= దిక్కుల సముదాయము; ఉపస్థమునన్= జననేంద్రియములో; ప్రజాపతి= బ్రహ్మ; బుద్ధిఅందున్= బుద్ధిలో; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఉండున్= ఉంటారు; ఇంతకున్= దీని కంతటికి; అధిష్ఠాత= ఆక్రమించి సర్వాధికారి అయి ఉండేవాడు; బుధ్యమానుండు= తెలియబడేవాడు; అనంగన్= అనగా; వెలుఁగు+ఆత్మ= వెలుగునట్టి పరమాత్మ; మఱియున్= ఇంకా; విను= వినుము; అతఁడు= ఆ పరమాత్మ; ప్రబుద్ధుఁడు= సర్వము చక్కగా ఎరిగియున్నవాడు; అనన్= అనగాను; అబుద్ధుండు= ఏమియు తెలియనివాడు; నాన్= అనగాను; ఒప్పున్= ఒప్పుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** శివా! వినుము. నాలుకయందు చంద్రుడు, వాక్కు, అగ్ని ఉంటాయి. ప్రాణవాయువులో వాయువు, ఉదానవాయువులో మెరపులు, వ్యానంలో వర్షాదేవత, రొమ్మునందు ఆకాశం, బలంలో ఇంద్రుడు, బుద్ధిలో ఈశానుడు, అపానం అనే వాయువులో ద్వాదశాదిత్యులు, సమానం అనే వాయువులో అప్సరసలు, కన్నులలో సూర్యుడు, దేహం మొత్తం భూమి, పాదాలలో విష్ణువు, చెవిలో దిక్కుల సముదాయము, జననేంద్రియంలో ప్రజాపతి, బుద్ధియందు బ్రహ్మ ఉంటారు. ఈ అన్నింటికీ తెలియబడే ఆత్మ అధిష్ఠాత (సర్వశక్తిమంతుడైన అధికారి). అతడు ప్రబుద్ధుడు, అబుద్ధుడు అని రెండు విధాలుగా ఉంటాడు.

**విశేషం:** ఇక్కడ విశేషంగా తెలిసికొనదగిన విషయాలు కొన్ని ఉన్నాయి. దేహంలో అయిదు విధములైన వాయువులున్నాయి. వాటికి నిర్దిష్టమైన స్థానాలున్నాయి. పట్టిక ద్వారా వాటిని తెలుసుకొందాం.

| | **వాయువులు** | **స్థానాలు** |
|---|---|---|
| 1. | ప్రాణము | హృదయం |
| 2. | అపానము | గుదము |
| 3. | వ్యానము | సర్వశరీరము |
| 4. | ఉదానము | కంఠము |
| 5. | సమానము | నాభి |

ప్రజాపతి - అంటే స్థూలంగా బ్రహ్మ అనే అర్థం. కాని దక్షుడు, కశ్యపుడు మొదలైన ఆది సృష్టికర్తలను ఇక్కడ ప్రజాపతి శబ్దంచేత గ్రహించాలి. బ్రహ్మ అనగా వారికి కూడ పుట్టుక నిచ్చిన చతుర్ముఖుడు. బుధ్యమానుఁడు - తెలియబడుచున్నవాడు; ప్రబుద్ధుడు - మేలుకొన్నవాడు. అంటే వ్యక్తస్వరూపం. అబుద్ధుడు - మేలుకొననివాడు - అవ్యక్తస్వరూపం. అనగా ఆత్మ వ్యక్తమనీ అవ్యక్తమనీ రెండు దశలతో ఒక్కటియే అయి ఉంటుందని భావం.

**క. ఈ దైవతముల నన్నిటి । నాదరమునఁ గనుచు యోగి యచలితనిష్ఠన్**
**వేదమయా! మూర్ధగతుం । డై దక్షతపేర్మి నిలుపుఁ బ్రాణము లచటన్. 197**

**ప్రతిపదార్థం:** వేదమయా!= వేదమే స్వరూపమైన పరమేశ్వరా!; యోగి= యోగం కలవాడు; ఈ దైవతములన్= ఈ దేవతా స్వరూపాలను; అన్నిటిన్= అన్నింటినీ; ఆదరమునన్= ప్రీతితో; కనుచున్= చూస్తూ; అచలిత నిష్ఠన్= ఏ కొంచెమూ కదలికలేని నిష్ఠతో; మూర్ధగతుండు= తలలోనికి ప్రవేశించినవాడు; ఐ= అయి; దక్షత పేర్మిన్= సామర్థ్యపు మహిమతో; అచటన్= శిరస్సునందు; ప్రాణములు= ప్రాణాలను; నిలుపున్= నిలుపుతాడు.

**తాత్పర్యం:** వేదమయుడవైన పరమేశ్వరా! యోగి ఈ దేవతలందరినీ ఆదరంతో చూస్తూ ఏ కొంచెమూ చెదరని నిష్ఠతో శిరస్సులోనికి ప్రవేశించి, తన సమర్థతను పండించుకొని, ప్రాణాలను శిరస్సునందు నిలుపుతాడు.

**విశేషం:** ఇందులో యోగసిద్ధికి సంబంధించిన మూడు ప్రధానాంశాలను చెప్పుతున్నారు. 1. దైవతస్వరూపాలను చూడటం, 2. అట్లా చూస్తూ తాను సూక్ష్మశరీరంతో శిరస్సులోనికి చేరుకొనటం, 3. దేహంలో అక్కడక్కడ నిలిచి ఉన్న ప్రాణాలను శిరస్సులోనికి తెచ్చి నిలపటం. యోగపరంగా ఇక్కడ శిరస్సు అంటే 'సహస్రారకమలం' అని భావించాలి. అది పరమాత్మ స్థానం. పరమాత్మ

తక్కిన సర్వదేవతాస్వరూపాలకంటె విశిష్టమైనది. నిత్యము, సత్యము, ఆనందము మొదలైన సంజ్ఞలు కలది. అనగా తక్కిన దైవతములకు ఆ స్థితి లేదు. కనుక వాటిని 'చూడటం' అంటే వాటి తక్కువ స్థితిని నిర్ణయించుకొని, వాటిని అపేక్షించకుండా ఉండటం. వాటిని అపేక్షిస్తే యోగి ఆయా స్థానాలలోనే నిలిచిపోతాడు. వాటి గతే అతడిదీ అవుతుంది. ప్రాణాలను అక్కడ నిలపటం అంటే అనిత్యదశలో ఉన్నవాటికి నిత్యదశను కూర్చటం. దానివలన యోగి సర్వాన్నీ పరమాత్మలో లయం చేసి, తానూ లయమై పరమాత్మ తానయ్యే స్థితిని పొందుతాడని తాత్పర్యం. దీనికి 'దక్షతపేర్మి' కావాలి. ఎందుకంటే యోగం అభ్యసించేవాడికి ఏవో చిన్నచిన్న శక్తులు ఏర్పడుతాయి. వాటికి ప్రలోభపడితే వాడు పొందేది సర్వనాశనమే. అనగా మూర్ధగతుడయ్యే స్థితికానీ, ప్రాణాలను అక్కడ నిలిపే స్థితిగానీ సిద్ధించదు.

**తే.** **అపుడు బుధ్యమానునిఁగను నవ్వరిష్ఠ । తత్త్వ మవ్యక్త మండ్రు తద్దర్శియగుఁ బ్ర**

**బుద్ధుఁ డాతని నతని నబుద్ధుఁ డెఱుఁగు । చుండు నివి యాత్మదశ లతఁ డొకఁడ యనఘ! 198**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యామూర్తీ!; అపుడు= ఆ సమయంలో; బుధ్యమానునిన్= తెలియబడేవాడిని; కనున్= చూస్తాడు; ఆ+వరిష్ఠ తత్త్వము= మిక్కిలి గొప్పదైన ఆ తత్త్వాన్ని; అవ్యక్తము= తెలియబడనిది; అనే అర్థంగల 'అవ్యక్తం' అని; అండ్రు= అంటారు; ప్రబుద్ధుఁడు= ప్రబుద్ధుడనే ఆత్మస్వరూపుడు; తద్+దర్శి= అతడిని చూచేవాడు; అగున్= అవుతాడు; ఆతనిన్= ఆ తెలియబడే వాడిని; అతనిన్= ఆ తెలిసికొన్నవాడిని; అబుద్ధుఁడు= అబుద్ధుడనే ఆత్మతత్త్వం; ఎఱుఁగుచుండున్= తెలిసికొంటాడు; ఇవి= ఈ చెప్పినవి; ఆత్మదశలు= ఆత్మలోని వేరువేరు అవస్థలు; అతఁడు= ఆ పరమాత్మ; ఒకఁడు+అ= ఒక్కడే.

**తాత్పర్యం:** యోగి అపుడు తెలియబడేవాడిని - అంటే 'వ్యక్త' బ్రహ్మమును చూస్తాడు. అట్లా చూచిన విశేషస్థితిని 'అవ్యక్తం' ప్రబుద్ధుడు దానిని దర్శిస్తాడు. ఆ వ్యక్త, అవ్యక్త స్వరూపాలను రెండింటినీ అబుద్ధుడు తెలిసికొంటాడు. నిజానికి బుధ్యమానుడు, ప్రబుద్ధుడు, అబుద్ధుడు అనేవి దశలలో భేదాలే తప్ప ఆత్మ ఒక్కటే సుమా!

**విశేషం:** బ్రహ్మతత్త్వం అనుభూతికి వచ్చినపుడు తెలిసేది, తెలిసేవాడూ, తెలియటం అనే దశాభేదాలు ఉండవని భావం.

**క.** **ఇవ్విధము గాంచు యోగికి । నెవ్వరు సరిగారు యతు లనేకు లచలులై**

**యవ్వస్తువు గోరుదు రది । దవ్వొరులకు యోగితతికిఁ దక్క మహేశా! 199**

**ప్రతిపదార్థం:** మహేశా!= పరమేశ్వరా!; ఈ విధమున్= ఈ పద్ధతిని; కాంచు యోగికిన్= దర్శించే యోగికి; ఎవ్వరున్= ఎవ్వరునూ; సరికారు= సాటికారు; యతులు= యత్నం శీలంగా గలవారు; అనేకులు= ఎంతోమంది; అచలులు= నిష్ఠ చెదరనివారు; ఐ= అయి; ఆ+వస్తువున్= ఆ పరతత్త్వమనే వస్తువును; కోరుదురు= కోరుతూ ఉంటారు; అది= ఆ తత్త్వం; యోగితతికిన్= యోగుల సముదాయానికి; తక్కన్= కాక; ఒరులకున్= ఇతరులకు; దవ్వు= దూరమైనది.

**తాత్పర్యం:** పరమేశ్వరా! ఈ విధానాన్ని చూచే యోగికి సాటి వచ్చేవారు ఉండరు. ఎందరో పరమనిష్ఠతో దానికొరకు ప్రయత్నిస్తూ ఉంటారు. కానీ అది యోగులకు తప్ప మరెవ్వరికీ అందుబాటులో ఉండదు.

**విశేషం:** 'ఎవ్వరు సరికారు' అంటే అతడు బ్రహ్మవేత్త కనుక బ్రహ్మమే అయి, అసదృశస్థితిని పొందుతాడని భావం.

**ఆ.** **క్షరుఁడు నక్షరుండుఁ బరుఁడును నందు ర । వ్వినుతదశలఁ బంచవింశకుఁడు ప్ర**

**బుద్ధనాముఁ డతఁ డబుద్ధునిఁ గనుఁ బురు । ష విధముగను బ్రకృతిసంగ మెఱుఁగు. 200**

**ప్రతిపదార్థం:** ఆ+వినుతదశలన్= కొనియాడదగిన ఆ దశలయందు; క్షరుఁడున్= క్షరుడన్నపేరుగలవాడు; అక్షరుండున్= అక్షరుడన్న పేరు గలవాడు; పరుఁడును= పరుడన్న పేరుగలవాడు; అందురు= అంటారు; పంచవింశకుండు= ఇరువది యైదవవాడు; ప్రబుద్ధనాముండు= ప్రబుద్ధుడనే పేరుగలవాడు; అతఁడు= ఆ ప్రబుద్ధుడు; అబుద్ధునిన్= అబుద్ధుడనే వాడిని; పురుషవిధముగను= పురుషుడి తీరున; కనున్= చూస్తాడు; ప్రకృతిసంగము= ప్రకృతి అనే తత్త్వంతోడి కలయికను; ఎఱుఁగున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఆత్మతత్త్వం క్షర, అక్షర, పర అనే పేర్లతో వేరువేరు దశలలో ఉంటుంది. ఇరువదియైదవ తత్త్వమైన వాడికి పేరు ప్రబుద్ధుడు. అతడు అబుద్ధుడిని పురుషుడి తీరున చూస్తాడు. ప్రకృతితో కలయికను పొందుతాడు.

**విశేషం:** గీతావాక్యాన్ననుసరించి క్షరమంటే సర్వభూతాలు. అక్షరమంటే ఈ అన్నింటికీ మూలమైన కూటస్థతత్త్వం. పరమంటే ఈ రెంటికీ అతీతమైన పురుషోత్తమతత్త్వం. గీతలో పదునైదవ అధ్యాయం పురుషోత్తమ ప్రాప్తియోగం. 16,17,18 శ్లోకాలలో ఈ అంశాల వివరణ ఉన్నది. ఇక్కడ పురుషుడంటే పరమాత్మ అనియే అర్థం. ప్రకృతి అంటే మాయ. దానితో సంగం ఉంటే పరమేశ్వరుడని పురుషుడికి పేరు. లేకుంటే సదాశివుడని పేరు.

**క. విను షడ్వింశుఁ డబుద్ధుం । డనఁ జను వాఙ్మనసములకు నందక యునికిం**
**దనుఁగా నాతత్త్వంబుం । గనిన ప్రబుద్ధుండ యతఁడు కామధ్వంసీ! 201**

**ప్రతిపదార్థం:** కామధ్వంసీ!= కాముడి రూపుమాపిన ఓ శివా!; విను= ఆలకించుము; షడ్వింశుఁడు= ఇరవై ఆరవ తత్త్వంగా లెక్కించబడు ఆ పరమాత్మ; వాక్+మనసములకున్= మాటకు, మనస్సుకు; అందక= దొరకక; ఉనికిన్= ఉండటంవలన; అబుద్ధుండు= అబుద్ధుడు; అనన్= అనగా; చనున్= ఒప్పుతాడు; ఆ తత్త్వంబున్= ఆ ఇరవై ఆరవ తత్త్వాన్ని; తనుఁగాన్= తానేగా; కనిన ప్రబుద్ధుండు+అ= చూచిన ప్రబుద్ధుడనే ఇరవై అయిదవ తత్త్వమే; అతఁడు= ఆ ఇరవై ఆరవ తత్త్వం రూపమైనవాడు.

**తాత్పర్యం:** శివా! ఇరవై ఆరవతత్త్వానికి అబుద్ధుడని వ్యవహారం. ఎందుకనగా అది మాటకూ, మనస్సుకూ అందదు. ఇరవై అయిదవ ప్రబుద్ధ తత్త్వం. అది - అనగా ఆ ఇరవై ఆరవ తత్త్వం అయిన అబుద్ధుడు తానే అని గుర్తిస్తే అవి రెండూ ఒకటి అవుతాయి.

**విశేషం:** స్థూలంగా ఇరవై అయిదవ తత్త్వం అనగా జ్ఞానం పొందిన జీవాత్మ అనీ, ఇరవై ఆరవతత్త్వం పరమాత్మఅనీ, 'అది నేనే' అనుకొన్నప్పుడు ఆ రెండూ ఒకటే అవుతాయనీ, అదే కైవల్యమనీ అద్వైతమనీ మనం గుర్తించవచ్చును.

**క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ । జూఱ విడిచినట్ల తనదు సుజ్ఞానము న**
**క్కాఱు విడిచి తనకంటెను । మీఱ నొకటి లేమి గాన్పు మెయికొనవలయున్. 202**

**ప్రతిపదార్థం:** వేఱుగన్= అబుద్ధుడు తన కంటె భిన్నమైనదిగా; కనినన్= చూస్తే; తనదు సుజ్ఞానము= తనదైన మంచి జ్ఞానాన్ని; ప్రకృతిన్= 'మాయ' అనే పేరుగల ప్రకృతికి; చూఱ విడిచిన+అట్లు+అ= ధారపోసినట్లే; ఆ+కాఱు= ఆ అజ్ఞానాన్ని; విడిచి= వదలి; తనకంటెను= తనకంటె; మీఱన్= మించిపోయిదిగా; ఒకటి= వేరొకటి; లేమి= లేకుండుటను; కాన్పు= పొందటం; మెయికొనవలయున్= అంగీకరించాలి.

**తాత్పర్యం:** ప్రబుద్ధుడు అబుద్ధుడిని తనకంటె వేరుగా చూస్తే తాను పొందిన ఉత్తమజ్ఞానమంతా ప్రకృతికి ధారపోసినట్లే అవుతుంది. అట్లాకాక, ఆ అజ్ఞానాన్ని తొలగించుకొని తనకంటె మించినది మరొకటి లేదు అనే జ్ఞానాన్ని సమ్మతించాలి.

**విశేషం:** అద్వైతస్థితిని ఇందులో చక్కగా విశదీకరించారు. జీవాత్మ పరమాత్మలు వేరు అనుకొనటమే అజ్ఞానం. వేరుకాదు అనుకొనటమే సుజ్ఞానం. అజ్ఞానం బంధానికీ, సుజ్ఞానం మోక్షానికీ హేతువులు.

**వ. అని చెప్పి. 203**

**తాత్పర్యం:** అని బోధించి.

**తే. తత్త్వమునఁగల్గు మూఁ డవస్థలను దెల్ల । ముగ భవద్భవ్యసన్నిధి నిగదనమునఁ**
**గూర్చు టఖిలేశ! నీ వెఱుంగుటయు నాకు । నెల్ల యోగిజనంబులు నెఱుఁగు టయ్యె.' 204**

**ప్రతిపదార్థం:** అఖిల+ఈశ!= సర్వమునకు ప్రభువైన ఓ శంకరా!; తత్త్వమునన్= తత్త్వంలో; కల్గు మూఁడు+అవస్థలను= ఉండే మూడు దశలను; భవత్ భవ్య సన్నిధిన్= నీదైన పరమోత్తమ సన్నిధానంలో; తెల్లముగన్= స్పష్ట మయ్యేవిధంగా; నిగదనమునన్= పలుకునందు; కూర్చుట= కూర్చటమూ; నీవు, ఎఱుంగుటయున్= తెలిసికొనటమూ; నాకున్= నాకు; ఎల్ల యోగి జనంబులు= యోగం పండిన జనాలందరూ; ఎఱుఁగుట= తెలిసికొనటంగా; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** సర్వేశా! తత్త్వంలో ఉండే మూడు దశలను నేను నీ దివ్యసన్నిధానంలో స్పష్టంగా చెప్పటం, నీవు వినటం అనేవి నాకు యోగిజనాలందరూ తెలిసికొన్నట్లయింది.'

**విశేషం:** నిజానికి పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సనత్కుమారుడి వలన అతడు క్రొత్తగా తెలిసికొనవలసింది ఏమీ లేదు. కాగా లోకానుగ్రహబుద్ధితో అతడు అడగటం, ఇతడు చెప్పటం జరిగింది. కనుక యోగిజనాలందరూ తెలిసికొన్నట్లయింది అంటున్నాడు.

**వ. అని పలికి 'మునిజనకృత్యంబులు వివరించెద నవధరింపు' మనుమాటయు సువ్యక్తంబుగా నాడి యాక్రీడా తపస్వికి నప్పరమయశస్వి యిట్లనియె. 205**

**ప్రతిపదార్థం:** అని; పలికి= మాట్లాడి; మునిజనకృత్యంబులు= మునులైన జనులు చేయవలసిన పనులు; వివరించెదన్= చక్కగా తెలియజేస్తాను; అవధరింపుము= శ్రద్ధతో వినుము, అను మాటయున్= అనే మాటను; సువ్యక్తంబుగాన్= చాలా స్పష్టమైన తీరులో; ఆడి= పలికి; ఆ క్రీడాతపస్వికిన్= విలాసంగా తపస్సు చేసికొనే ఆ పరమేశ్వరుడికి; ఆ+పరమయశస్వి=గొప్ప కీర్తిగల ఆ సనత్కుమారుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి 'మునిజనుల పనులు వివరిస్తాను. దయతో వినుము' అనే మాటను చక్కగా తెలియునట్లుగా పలికి, క్రీడాతపస్వి అయిన శివుడితో మహాకీర్తిగల ఆ సనత్కుమారుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇక్కడ ఒక ధర్మరహస్యం ఉన్నది. మునిజనకృత్యాలు శివుడు అడుగలేదు. అడుగని విషయం అడగనివాడికి చెప్పరాదని ధర్మశాస్త్రం. మరి సనత్కుమారు డీ ప్రసంగం ఎట్లా తెచ్చాడు? అన్న శంకకు సమాధానప్రాయంగా 'అనుమాటయు

సువ్యక్తంబుగా నాడి', 'క్రీడాతపస్వి', 'పరమయశస్వి' అనే పదబంధాలను కవి కూర్చాడు. ఆ ధర్మం కేవలం సాధారణ మానవులకు సంబంధించినది. గురుశిష్యభావం ఉన్నచోట మాత్రమే పాటించవలసినది. ఇక్కడ అటువంటిది లేదు - అని చెప్పటం పై మాటల తాత్పర్యం.

**క. ముని వనమున శూన్యాలయ । మున నైన గుహానికేతమున నేనిని నా**

**సనబంధధీరుఁడై మన । మునఁ గొని యింద్రియము విషయమునఁ బెడఁబాపున్. 206**

**ప్రతిపదార్థం:** ముని= ముని అయినవాడు; వనమునన్= అడవియందో; శూన్య+ఆలయమునన్+ఐనన్= జనంలేని ఇంటియందో, గుహానికేతమునన్+ఏనినిన్= కొండగుహ అనే నివాసంలోనో; ఆసన బంధ ధీరుఁడు= కూర్చుండే తీరునందు చెదరని స్థితి కలవాడు; ఐ= అయి; ఇంద్రియమున్= ఇంద్రియాన్ని; మనమునన్= మనస్సులోనికి; కొని= గ్రహించి; విషయమునన్= విషయంనుండి; పెడన్ పాపున్= దూరం చేస్తాడు.

**తాత్పర్యం:** ముని అడవియందో, జనసంచారం లేని పాడుకొంపలోనో, కొండగుహలోనో ఏ మాత్రమూ పట్టు తప్పని ఆసనస్థితి కలవాడై, ఇంద్రియాన్ని మనస్సులో లయింపజేసి, విషయంనుండి దూరం చేస్తాడు.

**విశేషం:** ఉన్న స్థానం యోగప్రతిబంధకం కాకూడదు. అందుకని అడవి మొదలైనవి. ఆసనం అంటే కూర్చుండే తీరు. శరీరాన్ని నిశ్చలం చేయకపోతే మనస్సు అతిచంచలం అవుతూ ఉంటుంది. అందుకని ఆసనబంధధీరత్వం. ఇంద్రియం జాత్యేకవచనం. ఇంద్రియాలు అయిదింటినీ గ్రహించాలి. అట్లాగే శబ్దస్పర్శరూప రసగంధాలు అయిదు. విషయాలవైపు ప్రసరించే యింద్రియాలను మనస్సులో త్రొక్కిపెట్టాలి. అప్పుడే యోగం కుదురుతుంది.

**క. గురు నుపదేశము నడపుం । బురహర! విణ్మూత్ర వేగముల నాఁకలితోఁ**

**బొరయం డయ్యభ్యసనము । గురువుగ నాహార మెపుడుఁ గొనఁ డే చవులన్. 207**

**ప్రతిపదార్థం:** పురహర!= శివా!; గురు+ఉపదేశము= గురువు చెప్పిన బోధ; నడపున్= సాగిస్తాడు; విట్+మూత్ర వేగములన్= మలము, మూత్రము అనేవాటి తొందరలను; ఆఁకలితోన్= ఆకలితో పాటు; పొరయఁడు= పొందడు; ఆ+అభ్యసనము= ఆ అభ్యాసం; గురువుగన్= పెద్దది అయ్యేటట్లుగా; ఏ చవులన్= ఎట్టి రుచులతోను; ఆహారమున్= ఆహారాన్ని; ఎపుడున్= ఎప్పుడూ; కొనఁడు= గ్రహించడు.

**తాత్పర్యం:** గురువు బోధించిన పద్ధతిని పాటిస్తాడు. మలమూత్రముల వేగాన్నీ, ఆకలినీ పొందడు. దానికి అనుగుణంగా రుచి పాకాలను మరచి, ఎప్పుడూ ఆహారం గ్రహించని అభ్యాసం చేస్తాడు.

**విశేషం:** ఆసనబంధ ధీరతకు ఆటంకమైన మలమూత్ర విసర్జన అవసరం లేని స్థితిని ఉపవాసాదులద్వారా అభ్యసించి నిశ్చలంగా ఉండగలుగుతాడని తాత్పర్యం.

**క. కుడిచిన యప్పుడ యోగము । దొడఁగుటయును వలదు; మనసు దూలకయుండన్**

**మృడ! వినుము బుద్ధిగొని యె । క్కుడు నిష్ఠను వలయు దానిఁ గుదియింపంగన్. 208**

**ప్రతిపదార్థం:** మృడ!= ఓ శివా!; వినుము; కుడిచిన+అప్పుడు+అ= భోజనం చేసిన వెంటనే; యోగము= యోగాన్ని; తొడఁగుటయును= మొదలుపెట్టటం; వలదు= వద్దు; బుద్ధిన్= బుద్ధిని; కొని= పట్టుకొని; ఎక్కుడు నిష్ఠను= అధికమైన

చెదరని తనంతో; మనసు; తూలక+ఉండన్= తూలిపోకుండా; దానిన్= దానిని; కుదియింపంగన్= నొక్కి పెట్టటం; వలయున్= చేయాలి.

**తాత్పర్యం:** శివా! తిన్న వెంటనే యోగాభ్యాసాన్ని మొదలు పెట్టరాదు. బుద్ధితో మనసు చెదరకుండా ఎక్కువ నిష్ఠతో దానిని అణచిపెట్టాలి.

**విశేషం:** మనస్సు అంటే సంకల్ప వికల్పాలు, బుద్ధి అనగా నిశ్చయాత్మకమైన దశ. యోగం అంటేనే చిత్తవృత్తులను అరికట్టటం. కనుక మనస్సును అణచివేయటం అంటే అమనస్కదశ. ఇది యోగంలో ఒక స్థాయి.

**క. అది గుదిసిన విజ్ఞానము । గదలక నిర్వాత దీపకాంతియుఁ బోలెం**
**బొదలును జిత్తంబును నుప । లదశాసంప్రాప్తి నిశ్చలం బగు దానన్. 209**

**ప్రతిపదార్థం:** అది= ఆ మనస్సు; కుదిపినన్= అణగిపోతే; విజ్ఞానము= విశేషమైన జ్ఞానం; కదలక= చలనంలేక; నిర్వాత దీప కాంతియున్ పోలెన్= గాలి లేనిచోట వెలుగు వలె; పొదలును= ఉంటుంది; దానన్= దానిచేత; చిత్తంబును= మనస్సు కూడా; ఉపల దశా సంప్రాప్తి= రాతివంటి స్థితిని పొందటం చేత; నిశ్చలంబు= చలనంలేనిది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** మనస్సు అణగితే విజ్ఞానం గాలిలేనిచోట దీపంవలె కదలకుండా ఉంటుంది. దానివలన చిత్తము కూడా రాతివలె నిశ్చలంగా ఏర్పడుతుంది.

**విశేషం:** చిత్తచలనం అనగా లక్ష్యంమీదినుండి ఇతర విషయాలకు జరగటం. కదిలే సూదిలో దారం ఎక్కించటంవలె అటువంటి చిత్తంలో యోగాన్ని పొందటం అసాధ్యం. కనుక యోగాభ్యాసం చేసేవాడు చిత్తాన్ని స్థాణువుగా మలచుకోవటం అవసరమని పద్య తాత్పర్యం.

**తే. అనఘ! నిర్జన నిశ్శబ్దమైన యట్టి । చోటు హృదయస్థుఁ డగు దేవుఁ జూచుపనికి**
**వలయు; లేకున్న శబ్దసంకలిత మేని । సజ్జనాన్విత స్థల మార్యసమ్మతంబు. 210**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; నిర్జన నిశ్శబ్దము= జనులు లేనిది, సవ్వడిలేనిది; ఐన అట్టి చోటు= అయిన తావు; హృదయస్థుడు= హృదయంలో ఉన్నవాడు; అగు దేవున్= అయిన దేవుడిని; చూచు పనికిన్= చూచేపనికి; వలయున్= కావాలి; లేక+ఉన్నన్= అట్టిది లేకపోతే; శబ్దసంకలితము+ఏని= సవ్వడితో కూడినది అయితే; సత్+జన+అన్విత స్థలము= మంచి జనులతో కూడిన తావు; ఆర్య సమ్మతంబు= ఆర్యులకు ఇష్టమైనది.

**తాత్పర్యం:** శివా! హృదయంలో ఉన్న దేవుడిని చూచే పనికి జనాలు, సవ్వడులు లేని తావు కావాలి. ఒకవేళ అట్టితావు లభించక సవ్వడి ఉన్న తావు అయితే మంచివారు ఉన్నది మేలని ఆర్యులు చెప్తుతారు.

**విశేషం:** జనసంచారం, వివిధాలైన సవ్వడులు విషయాలవైపు ఇంద్రియాలను, మనస్సునూ లాగివేస్తాయి. యోగం భంగపడుతుంది. కనుక నిర్జన, నిశ్శబ్ద స్థానాన్ని నిర్దేశిస్తున్నారు. అయితే అట్టిది దుర్లభం. కనుక సత్+జనులు= సత్ అంటే పరమాత్మయొక్క ఒక లక్షణమైన అస్తిత్వం. దానియందు ఉండే జనులు సజ్జనులు. వారున్న తావు శబ్దసంకలితమైనా అది పరమాత్మపరమే అవుతుంది కనుక యోగం భంగం కాదు. ఆర్యులు అనగా ఒక ప్రత్యేకమైన జీవనవిధానం కలవారు. ఇది జాతి కాదు. స్వభావం. హృదయస్థుడు 'ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' అని గీత. పద్మకోశంవలె ఉండే హృదయంలో నీవారపు ముల్లువలె ఉండే సన్నని రంధ్రంలోని అగ్నిజ్వాలలో చివరిభాగంలో సదాశివుడు ఉంటాడని వేదమంత్రం చెప్తుతున్నది.

**క. విను తమము నిస్తమముఁ జే। తనారహిత చేతనా సుధామయతా స్థా**

**ననిరూఢము నగు తత్త్వము। గను నిన్నియుఁ గలుగు యోగి కరుణామూర్తీ! 211**

**ప్రతిపదార్థం:** కరుణామూర్తీ!= దయామూర్తీ! విను= వినుము; తమము= అజ్ఞానరూపమైన చీకటి; నిస్తమమున్= చీకటిలేని స్థితి; చేతనారహిత చేతనాసుధామయతా స్థాన నిరూఢము= చైతన్యములేనిది, చైతన్యము అనే అమృతముతో నిండినది అయిన చోటుగా దృఢపడినది; అగు తత్త్వమున్= అయిన పరమాత్మ తత్త్వాన్ని; ఇన్నియున్= పై చెప్పిన లక్షణాలన్నీ; కలుగు యోగి= కల యోగి; కనును= దర్శిస్తాడు.

**తాత్పర్యం:** కరుణామూర్తీ! వినుము. చీకటి, చీకటిలేనిది, చైతన్యము లేనిది, చైతన్యమే అమృతస్వరూపం అయినది అయిన తత్త్వాన్ని పై లక్షణాలన్నీ ఉన్న యోగి దర్శిస్తాడు.

**విశేషం:** ఇందులో తమము - నిస్తమము; చేతనారహితము - చేతనాసహితము - అని తత్త్వానికి రెండేసి విరుద్ధధర్మాలు చెప్పారు. దీనిని సరిగా సమన్వయించుకొనాలి. తమము అనగా అజ్ఞానులకు అది ఒక భయంకరమైన చీకటి. అనగా దానిని గురించి వారేమాత్రము తెలిసికొనలేరు. నిస్తమము అనగా జ్ఞానవంతులకు అదే ఒక మహాజ్యోతి. అందులో వారు సర్వాన్నీ దర్శిస్తారు. అట్లాగే పరతత్త్వం సృష్టిలోని ఇతర పదార్థాల వంటి చైతన్యం - చేతనధర్మం - కదలిక మొదలైన లక్షణాలు లేనిది కనుక చేతనారహితం. సృష్టిలోని బ్రహ్మ మొదలు అతినీచమైన పదార్థం వరకు ఉండే సర్వానికి చైతన్యాన్ని ప్రసాదించేది కనుక చైతన్యరూపమైన అమృతస్థితియే స్వభావమైన తావు. పై లక్షణాలు (206-210 పద్యాలలో చెప్పినవి) కల యోగికి ఆ పరతత్త్వం గోచరిస్తుంది.

**క. మదనహరా! యోగనిరతు। లది గని దుఃఖముల దొఱఁగి యజరామరతా**

**స్పదమగు నెలవుల నిలుతురు। పొదలుదు రణిమాదిచయ విభూతిపదమునన్. 212**

**ప్రతిపదార్థం:** మదనహరా!= మన్మథుడిని హరించిన ఓ పరమేశ్వరా!; యోగనిరతులు= యోగమునందు నిష్ఠకలవారు; అది=దానిని; కని=చూచి; దుఃఖములన్= దుఃఖాలను; తొఱఁగి= తొలగించుకొని; అజర+అమరతా+ఆస్పదము= ముదిమి, చావు లేనితనానికి వీలుకలవి, అగు నెలవులన్= అయిన తావులలో; నిలుతురు= శాశ్వతంగా ఉంటారు; అణిమ+ఆది చయ విభూతి పదమునన్= అణిమ మొదలైన అష్టసిద్ధుల సముదాయపు ఐశ్వర్యం ఉన్న తావునందు; పొదలుదురు= తిరుగుతూ ఉంటారు.

**తాత్పర్యం:** శంకరా! యోగనిష్ఠ కలవారు ఆ తత్త్వాన్ని అందుకొని, దుఃఖాలన్నింటినీ తొలగించుకొని, చావు, ముదిమి లేని తావులలో శాశ్వతంగా ఉంటారు. అణిమ మొదలైన సిద్ధుల సంపదలతో విహరిస్తూ ఉంటారు.

**విశేషం:** దుఃఖాలు - జన్మదుఃఖం, జరాదుఃఖం, మృత్యుదుఃఖం మొదలైనవి, ఎక్కడ ఇంద్రియాలు సుస్థితి లేకుండా కష్టపడుతూ ఉంటాయో అది 'దుఃఖం' - దుర్గతి పొందిన ఇంద్రియస్థితి కలది అని దీనికి అర్థాన్ని సంభావించాలి. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం - అనేవి అష్టసిద్ధులు. ఇవి యోగికి సిద్ధిస్తాయి. అయితే ఐహికసుఖాపేక్షతో గానీ, ప్రదర్శనకు గానీ వీటిని వినియోగిస్తే వాడు తత్క్షణమే యోగభ్రష్టుడవుతాడు. వీటిద్వారా పరమాత్మ దర్శనాన్ని సుదృఢం చేసికొనటమే ఉత్తమలక్ష్యం.

**వ. అని మఱియును. 213**

**తాత్పర్యం:** సనత్కుమారుడు ఈ విధంగా చెప్పి ఇంకా ఇట్లా అంటున్నాడు.

**తే. యక్షగంధర్వసిద్ధ సాధ్యాది భూత । కోటికంటెను మిగిలి యోగులు నిజేచ్ఛఁ**
**బరఁగుదురు భవ్యయోగతత్పరుల మేము । నిట్టు లగుట యోగీశ! నీ యెఱుఁగు పనియ. 214**

**ప్రతిపదార్థం:** యోగి+ఈశ!= యోగులకుప్రభువైన ఓ పరమాత్మా!; యోగులు= యోగసిద్ధి పొందినవారు; యక్ష గంధర్వ సిద్ధ సాధ్య+ఆది భూతకోటికంటెను= యక్షులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు మొదలైన ప్రాణుల సముదాయంకంటె కూడా; మిగిలి= అతిశయించి; నిజ+ఇచ్ఛన్= తమ ఇష్టాన్నిబట్టి; పరఁగుదురు= ప్రవర్తిస్తూ ఉంటారు; భవ్య యోగ తత్పరులము= మిక్కిలి శ్రేష్ఠమైన యోగమునందు మాత్రమే బుద్ధిగలవారము; ఏమును= అయిన మేము కూడ; ఇట్టులు= ఈ విధంగా; అగుట= కావటం; నీ+ఎఱుఁగు పని+÷అ= నీవెరిగిన కార్యమే.

**తాత్పర్యం:** యోగినాథా! యోగులు సిద్ధులు మొదలైన దేవజాతులకంటె మించిపోయి తమ ఇష్టాన్ని బట్టి ప్రవర్తిస్తూ ఉంటారు. భవ్యమైన యోగమునందు చెడని నిష్ఠ గల మేము కూడా అట్లా కావటం నీకు తెలిసిన విషయమే కదా!

**విశేషం:** విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రక్షస్సులు, గంధర్వులు, కిన్నరులు, పిశాచులు, గుహ్యకులు, సిద్ధులు, సాధ్యులు వీరిని దేవయోనులు అంటారు. వీరు దేవతలకు మానవులకు మధ్యవారు. ఆంగ్లంలో వీరిని semi gods అంటారు. మేము అటువంటివారమే అని చెప్పటం నిదర్శనంకొరకే కానీ అహంకారదృష్టితో కాదు. ఇది ఫలశ్రుతివలె రుచి పుట్టించటానికి చేసిన ప్రసంగం. 'మేము' అనే బహువచనం కూడా అటువంటిదే. దానిని క్రింది భాగంలో వివరిస్తున్నారు.

**వ అని సహజన్ము లయిన సనక సనందన సనత్సుజాతులం దలఁపించిన వాఁడయి వెండియు. 215**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా చెప్పి; సహజన్ములు= కలిసిన పుట్టుక కలవారు; అయిన సనక సనందన, సనత్సుజాతులన్= సనకుడు, సనందనుడు, సనత్సుజాతుడు అనేవారిని; తలఁపించినవాఁడు= స్మరింపచేసినవాడు; అయి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి, తన తోబుట్టువు అయిన సనకుడు, సనందనుడు, సనత్సుజాతుడు అనేవారిని తలపింప చేసి ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. యోగధర్మంబు కంటెను నుత్తమంబు । గలుగ నేరదు ధర్మ మొక్కటియు నపున**
**రాగమం బగు పదమున కరయ నిదియ । మేటి నిచ్చెన సంయమికోటి కెల్ల. 216**

**ప్రతిపదార్థం:** యోగధర్మంబుకంటెను= యోగం అనే ధర్మంకంటె; ఉత్తమంబు= గొప్పది (అగు); ధర్మము= ధర్మం; ఒక్కటియున్= ఒక్కటికూడా; కలుగన్‌నేరదు= ఉండజాలదు; ఇది+అ= ఇదే; అరయన్= పరిశీలించగా; సంయమకోటికిన్+ఎల్లన్= ఇంద్రియ నిగ్రహాదులు కలవారందరికీ; అపునర్+ఆగమంబు+అగు= తిరిగివచ్చుటలేనిదైన; పదమునకున్= స్థానానికి; మేటినిచ్చెన= గొప్ప నిచ్చెన.

**తాత్పర్యం:** యోగధర్మంకంటె ఉత్తమమైన ధర్మం ఒక్కటి కూడా లేదు. మునుల సముదాయం తిరిగిరాక లేని స్థానాన్ని చేరుకొనటానికి ఇదే మేటినిచ్చెన.

**విశేషం:** 'సంయమికోటి' అనటంవలన ఆ స్థాయికి ఎదగలేనివారికి కర్మభక్తిజ్ఞాన మార్గాలు ఉన్నాయి అని సూచించినట్లయినది.

**క. యోగంబుతెఱఁగు సెప్పితి । భోగివరాభరణ! సాంఖ్యమును జెప్పెదఁ ద**

**ద్భాగులగు నైష్ఠికులు భవ । సాగరముం గడతు రైక్యసంబోధమునన్. 217**

**ప్రతిపదార్థం:** భోగివర+ఆభరణ!= శ్రేష్ఠమైన సర్పాలు భూషణాలుగా గల ఓ శివా!; యోగంబు తెఱఁగు= యోగం విధానాన్ని; చెప్పితిన్= చెప్పాను; సాంఖ్యమునున్= జ్ఞానమార్గాన్ని; చెప్పెదన్= చెప్పుతాను; తద్+భాగులు= దానిని భజించేవారు; అగు నైష్ఠికులు= అయిన నిష్ఠకలవారు; ఐక్య సంబోధమునన్= ఆ రెంటి కలయికను చక్కగా తెలియటంవలన; భవసాగరమున్= సంసారమనే సముద్రాన్ని; కడతురు= దాటుతారు.

**తాత్పర్యం:** శివా! ఇంతవరకు యోగమార్గాన్ని వివరించాను. ఇంక సాంఖ్యాన్ని చెప్పుతాను. దానిని సేవించే నిష్ఠ కలవారు యోగమూ, సాంఖ్యమూ ఒక్కటే అనే భావంతో సంసారసముద్రాన్ని దాటుతారు.

**విశేషం:** పైన యోగమే తప్ప అపునరాగమనస్థితికి మరొక ధర్మం లేదన్నారు. ఇంక సాంఖ్యం చెప్పట మెందుకు? అనే శంక కలుగుతుంది. దానిని తొలగించటానికి యోగము - సాంఖ్యము ఒక్కటే అనే భావాన్ని ఇందులో ముందుగా ప్రస్ఫుటం చేస్తున్నారు. 'ఏకం యోగం చ సాంఖ్యం చ యః పశ్యతి స పశ్యతి' (5-5) అని గీతావాక్యం. యోగమూ, సాంఖ్యమూ ఒక్కటే అని ఎవడు భావిస్తాడో వాడే సరియైన భావుకుడు - అని అర్థం.

## సనత్కుమారుఁడు రుద్రునకు సాంఖ్యయోగంబు తెఱంగెఱింగించుట (సం.13-168-1(కుంభ))

**వ. కావున నత్యాదరంబున నాకర్ణింపు' మని పలికి యిట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అత్యాదరంబునన్= మిక్కిలి ఆదరంతో; ఆకర్ణింపుము= వినుము; అని; పలికి= చెప్పి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కాబట్టి మిక్కిలి శ్రద్ధతో వినుము' అని ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇక్కడ అత్యాదరం శ్రోతకు శివుడికి కాదు. అత్యాదరంతో వినటం ఏల? - అనగా యోగం పరమోత్తమధర్మం అన్నారు. దాని తరువాతిదిగా చెప్పేదానిని ఎందుకు పట్టించుకోవాలి అనే శంకను విడనాడాలి. ఎందుకంటే యోగమూ, సాంఖ్యమూ ఒక్కటిగానే దర్శించాలి కనుక.

**ఆ. 'ఇంద్రియములకంటె నీశాన! మన మహం । కారతత్త్వ మంతకంటె, దాని**

**కంటె బుద్ధి, బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు । డిన్నిటికిని బురుషుఁ డెక్కు డరయ. 219**

**ప్రతిపదార్థం:** ఈశాన!= ఈశ్వరా!; ఇంద్రియములకంటెన్= చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు - అనేవాటికంటె; మనము= మనస్సు; అంతకంటెన్= దానికంటె; అహంకారతత్త్వము= 'నేను' అనే భావన పుట్టే తత్త్వమూ; దానికంటెన్= దానికంటె; బుద్ధి= నిశ్చయాత్మకమైన బుద్ధి అనే తత్త్వమూ; బుద్ధికంటెన్= బుద్ధికంటె; ప్రకృతి= ప్రకృతి అనే తత్త్వమూ; ఎక్కుడు= మిన్న అయినవి; అరయన్= పరిశీలించి చూడగా; పురుషుఁడు= పురుషుడు అనే తత్త్వం; ఇన్నిటికిన్= ఈ అన్నింటికీ; ఎక్కుడు= అధికమైనది.

**తాత్పర్యం:** 'ఈశ్వరా! ఇంద్రియాలకంటె మనస్సు, దాని కంటె అహంకారతత్త్వం, దానికంటె బుద్ధి, దానికంటె ప్రకృతి ఎక్కువ. వీటన్నిటికంటె పురుషుడు మిన్న.

**విశేషం:** శబ్ద స్పర్శ రూపరస గంధాలను గ్రహించి మనస్సు కందించేవి ఇంద్రియాలు. సంకల్పవికల్పాల పుట్ట మనస్సు. నేను చూస్తున్నాను, నేను వింటున్నాను - అన్నతీరుగా వ్యవహరించే తత్త్వం 'అహంకారం'. మనస్సు, అహంకారమూ అందించే విషయాలను తెలిసికొని, నిశ్చయాలను కలిగించేది బుద్ధి. దానికి పై మెట్టున ఈ అన్నింటికీ మూలకారణమై ఉండే మాయను 'ప్రకృతి' అంటారు. ఈ అన్నింటికి పై స్థాయిలో 'పురం' అనే వ్యవహారం గల దేహంలో సాక్షి మాత్రంగా శయనించి ఉండే తత్త్వం పురుషుడు. ఇంద్రియాదులు క్రమంగా మెట్లు. 'పురుషుడు' ఇన్నిటిని ఎక్కాడు అని విడిగా చెప్పటం వలన ఇది 'గమ్యం' - అందవలసిన చోటు అని చెప్పినట్లయింది.

**తే. అంబరాది భూతములు శబ్దాది గుణము । లింద్రియము లిరుదెఱఁగు బాలేందుమౌళి!**

**మన మహంకారబుద్ధు లిట్లొనరి ప్రకృతిఁ । గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు. 220**

**ప్రతిపదార్థం:** బాల+ఇందుమౌళి!= బాలచంద్రుడు శిరోభూషణంగా ఉన్న ఓ పరమేశ్వరా!; అంబర+ఆది భూతములు= ఆకాశం మొదలైన భూతాలు (5); శబ్ద+ఆది గుణములు= శబ్దం మొదలైన గుణాలు (5); ఇరు+తెఱఁగు= రెండు విధాలయిన; ఇంద్రియములు= ఇంద్రియాలు (10); మనము= మనస్సు (1); అహంకారబుద్ధులు= అహంకారం అనే తత్త్వమూ; బుద్ధి అనే తత్త్వమూ (2); ఇట్లు= ఈ విధంగా; ఒనరి= కూడి; ప్రకృతిన్= ప్రకృతి అనే తత్త్వంలో; కలయన్= కలియగా; తత్త్వచతుర్+ వింశకత్వంబు= తత్త్వాల ఇరువది నాల్గింటితనము; ఒందున్= ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** శివా! ఆకాశం మొదలైన భూతాలు ఐదు. వాటి గుణాలైన శబ్దం మొదలైనవి అయిదు. రెండు విధాల ఇంద్రియాలు పదీ, మనస్సు, అహంకారం, బుద్ధి అనే మూడూ, ప్రకృతి అనే ఒక తత్త్వమూ కలిసి మొత్తం ఇరువది నాలుగు తత్త్వాలు అవుతాయి.

**విశేషం:** 1. భూతాలు : ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి.

2. గుణాలు : శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము.

3. ఇంద్రియాలు : (1) కర్మేంద్రియాలు: 1. వాక్కు, 2. చేయి, 3. కాలు, 4.విసర్జనేంద్రియము, 5.జననేంద్రియము,
(2) జ్ఞానేంద్రియాలు: 1.చర్మము, 2. కన్ను, 3. చెవి, 4. నాలుక, 5.ముక్కు.

**క. చేతనుఁ డగు పురుషుని ని । శ్చేతనయగు ప్రకృతి వొంది చేతనతాప్ర**

**స్ఫీత యగుం బెఱతత్త్వము । లాతత్త్వం బను మహాబ్ధియందలి తరఁగల్. 221**

**ప్రతిపదార్థం:** చేతనుఁడు= ప్రాణశక్తి కలవాడు; అగు పురుషునిన్= అయిన పురుషుడనే తత్త్వాన్ని; నిశ్చేతన= ప్రాణశక్తి లేనిది; అగు ప్రకృతి= అయిన ప్రకృతి; పొంది= చేరుకొని; చేతనతా ప్రస్ఫీత= ప్రాణశక్తితో మిక్కిలి శక్తి గలది; అగున్= అవుతుంది; పెఱతత్త్వములు= మిగిలిన ఇరవై మూడు తత్త్వాలు; ఆ తత్త్వంబు= ఆ ఇరవై నాలుగవదైన ప్రకృతి; అను మహా+అబ్ధియందలి తరఁగల్= అనే మహాసముద్రంలోని తరంగాలు.

**తాత్పర్యం:** చైతన్యం గల 'పురుషుడు' అనే తత్త్వాన్ని ఆశ్రయించి, చైతన్యం లేని ప్రకృతి చైతన్యం పుష్టిగా కలది అవుతుంది. తక్కిన తత్త్వాలు ఆ తత్త్వం అనే మహాసముద్రంలోని తరంగాలు.

**విశేషం:** ప్రకృతి మొదలూ పంచభూతాలవరకు ఉండే ఇరవైనాలుగు తత్త్వాలు సహజసిద్ధంగా చైతన్యం లేనివి. సహజసిద్ధము, నిత్యమూ అయిన చేతనధర్మం - ఇరవై అయిదవదైన పురుషతత్త్వానికి మాత్రమే ఉన్నది. చైతన్యం లేని ప్రకృతి, చైతన్యం గల పురుషుడిని పొంది అయస్కాంతాన్ని పొందిన ఇనుము అయస్కాంత ధర్మాన్ని పొందినట్లుగా చైతన్యం కలది అవుతుంది. ప్రకృతి ఒక మహాసముద్రంవంటి దయితే తక్కిన బుద్ధి మొదలైనవి అందలి తరంగాలు. అనగా ప్రకృతికి సంక్రమించిన చేతనధర్మం వాటికి కూడా ఏర్పడుతుంది. ఏర్పడుతుంది అనగా పోయే అవకాశం కూడా ఉన్నదని అర్థం. ప్రకృతి మొదలైనవాటి చైతన్యం నిత్యం కాదని తాత్పర్యం.

**క. గుణములఁ బొందఁడు పురుషుఁడు । గుణమహితా! ప్రకృతి యిచ్చు గుణముల కేమే**
**గుణములు దానను గుణులై । గుణిత్వ మా నిర్గుణాత్మకున కొలయించున్. 222**

**ప్రతిపదార్థం:** గుణమహితా!= గుణాలచేత గొప్పతనం పొందినవాడా!; పురుషుఁడు= పురుషుడనే తత్త్వం; గుణములన్= గుణాలను; పొందఁడు= పొందడు; ప్రకృతి= ప్రకృతి అనే తత్త్వం; గుణములకున్= గుణాలకు; ఏమి+ఏన్= ఏవైనా; గుణములు= గుణాలను; ఇచ్చున్= ఇస్తుంది; దానను= దానిచేత; గుణులు+ఐ= గుణాలు కలవియై; ఆ నిర్గుణ+ఆత్మకునకున్= గుణాలు లేని స్వభావం కల ఆ పురుషుడికి; గుణిత్వము= గుణములు కలవా డగుటను; ఒలయించున్= కలిగిస్తాయి.

**తాత్పర్యం:** శివా! పురుషుడికి ఏ గుణాలూ లేవు. ప్రకృతియే గుణాలకు ఏవైనా గుణాలను ఇస్తుంది. దానిచేత తక్కిన తత్త్వాలు గుణాలు కలవియై గుణాలు లేని పరమాత్మకు గుణాలు కలిగిన స్థితిని కలిగిస్తాయి.

**విశేషం:** గుణాలంటే సత్త్వము, రజస్సు, తమస్సు - అనేవి. ఇవి ప్రకృతికి సంబంధించినవి. ఇవి తక్కిన భూతాదులకు రుచి, రంగు, వాసన మొదలైన గుణాలను కల్పిస్తాయి. ఆ విధంగా అన్నీ గుణాలు కలవి అవుతాయి. ఈ గుణాలుగల ఇరవైనాలుగు తత్త్వాలు గుణాలు లేని పురుషుడిని చేరటంవలన అతడు కూడా 'గుణి' - గుణాలు కలవాడు అవుతున్నాడు. గాజుపాత్రలో రంగునీరు పోస్తే గాజుపాత్ర రంగు కలదిగా కనిపిస్తుంది. నీరు తీసివేస్తే రంగులేనితనం తెలియవస్తుంది. ఇట్టిది పరమాత్మ తత్త్వం. నీటికి ఆధానం చేసిన రంగుమాత్రం సాధారణంగా నీటిని వదలిపోదు. కనుక ప్రకృతి మొదలైనవాటి గుణిత్వము అటువంటిది.

**తే. వీని నెల్ల నసత్కోటిగా నెఱింగి । కొనుచుఁ బ్రకృతి నుపేక్షించి తనకుఁ దాన**
**కాని యొండెద్దియును లేమి గాంచినపుడు । పురుషుఁ డపగత ధూమాగ్నిఁ బోలి వెలుఁగు. 223**

**ప్రతిపదార్థం:** వీనిన్ ఎల్లన్= వీటి నన్నింటిని; అసత్ కోటిగాన్= సత్యము కాని వాటి సముదాయంగా; ఎఱింగికొనుచున్= తెలిసికొంటూ; ప్రకృతిన్= ప్రకృతిని; ఉపేక్షించి= పట్టించుకొనకుండా; తనకున్= తనకు; తాను+అ= తానే; కాని; ఒండు= మరియొకటి; ఎద్దియును= ఏదీ కూడా; లేమి= లేకపోవటాన్ని; కాంచిన+అపుడు= గుర్తించినపుడు; పురుషుఁడు= మానవుడు; అపగత ధూమ+అగ్నిన్= తొలగిన పొగగల నిప్పును; పోలి; వెలుఁగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** ఈ అన్నింటిని సత్పదార్థానికి వేరైనవిగా తెలిసికొంటూ ప్రకృతిని పట్టించుకొనకుండా తనకు తానే కానీ మరొకటి ఏమీ లేదు అని గుర్తించినపుడు సాధకుడైన పురుషుడు పొగలేని నిప్పువలె ప్రకాశిస్తాడు.

**విశేషం:** ఇక్కడ పురుషుడు ఇరవై అయిదవ తత్త్వమైన పరమాత్మ కాదు. సాధకుడైన పురుషుడు. కానీ ఆ స్థితిలో ఆ పురుషుడితో ఈ పురుషుడు అభిన్నుడు.

**తే.** **అట్లు గాక యహంకార మావహిల్లి। ప్రకృతి దానని సృష్టికిఁ బ్రలయమునకుఁ**
**గర్త యైన వికారాత్మకత్వ మొందుఁ। బ్రకృతివికృతులు గాని యా ప్రభువు నపుడు.** **224**

**ప్రతిపదార్థం:** అట్లు+కాక= ఆ విధంగా కాక; అహంకారము= 'నేను' అనేభావం; ఆవహిల్లి= కలిగి, ప్రకృతి; తాను= తానే; అని; సృష్టికిన్= ఉత్పత్తికి; ప్రళయమునకున్= వినాశానికి; కర్త= చేయువాడు; ఐనన్= అయితే; అపుడ= ఆ సమయంలో; ప్రకృతి వికృతులు= ప్రకృతిగాని, వికృతిగాని, కాని= కానట్టి; ఆ ప్రభువును= ఆ ఆత్మరూపుడైన ప్రభువును; వికార+ఆత్మకత్వము= వికారం స్వభావంగా ఉండే లక్షణం; ఒందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** అట్లా కాక, సాధకుడైన పురుషుడు అహంకారం కలగటంవలన ప్రకృతియే తానని భావించి, సృష్టికీ ప్రళయానికీ కర్త అయితే ప్రకృతిగానీ వికృతిగానీ కాని ఆ ప్రభువును వికారస్థితి పొందుతుంది.

**విశేషం:** వేదాంత పరిభాషలో 'జీవుడు' ఇక్కడ ఇరవై అయిదవతత్త్వంగా పరిగణింపబడే పురుషుడు. అతడికి పైవైపు ఇరవై ఆరవ తత్త్వం 'పరమాత్మ' ఉన్నది. క్రిందివైపు ఇరవైనాలుగవ తత్త్వం ప్రకృతి ఉన్నది. ప్రకృతితోపాటు తక్కిన ఇరవైమూడు తత్త్వాలూ ఉన్నాయి. ఇప్పుడు ఈ జీవుడు పైవైపు చూచి ప్రకృత్యాదులతో తనకు సంబంధం లేదనుకొంటే అతడు ఇరవై ఆరవ తత్త్వం లక్షణాలు పొంది ఏకాత్మ్కుడై వెలుగుతాడు. దీనిని 223వ పద్యంలో చెప్పారు. అట్లాకాక క్రిందివైపు ఒరిగి, ప్రకృతితో తాదాత్మ్యం పొందితే 'సంసారం' అనే జగత్తుకు కర్త అవుతాడు. (224వ పద్యం). ఇది బంధహేతువు. అది మోక్షహేతువు. దీనినే మరింత స్పష్టంగా తరువాతి పద్యంలో చెప్తున్నారు.

**క.** **ధృతి పూనమిఁ బ్రకృతికి వశ। గతుఁ డగుచు దమోమయత్వకలితం బగు న**
**వ్వితతాసుఖితత్వము సుఖ। మతిఁ బురుషుం డనుభవించు మదనధ్వంసీ।** **225**

**ప్రతిపదార్థం:** మదనధ్వంసీ!= మన్మథుడిని సంహరించినవాడా! శివా!; ధృతి= ధైర్యాన్ని; పూనమిన్= అవలంబింపక పోవటం చేత; పురుషుండు= జీవుడు; ప్రకృతికిన్= ప్రకృతికి; వశగతుఁడు+అగుచున్= లొంగిపోతూ; తమో మయత్వకలితంబు+అగు= తమోగుణంతో కూడుకొనినదైన; ఆ+వితత+అసుఖితత్వము=ఎడతెగని ఆ దుఃఖం కలవాని స్వభావాన్ని; సుఖమతిన్= సుఖం అనుకొనే భావనతో; అనుభవించున్= అనుభవిస్తాడు.

**తాత్పర్యం:** ఓ శివా! ధైర్యాన్ని అవలంబింపక పోవటం వలన జీవుడు ప్రకృతికి లొంగిపోతూ తమోగుణంతో కూడుకొన్న దుఃఖమయమైన సంసారస్థితిని సుఖమనే భావనతో అనుభవిస్తూ ఉంటాడు.

**క.** **నేరిమి దాని నుపేక్షం। జేరుప షడ్వింశభావసిద్ధిఁ బొరయు గౌ**
**రీరమణ! పంచవింశుఁడు। సారామల నిపుణమతిఁ బ్రసన్నాత్మకుఁడై.** **226**

**ప్రతిపదార్థం:** గౌరీరమణ!= పార్వతీహృదయేశా!; పంచవింశుఁడు= ఇరవైఅయిదవ తత్త్వం వాడైన పురుషుడు (జీవుడు); సార+అమల నిపుణమతిన్= సారమైనదీ, మలినం లేనిదీ, నేర్పుగలదీ అయిన బుద్ధితో; ప్రసన్న+ ఆత్మకుఁడు= ఏ మాలిన్యమూ లేని ఆత్మకుడు; ఐ=అయి; నేరిమిన్= నేర్పుతో; దానిన్= ఆ ప్రకృతిని; ఉపేక్షన్= ఒప్పరికించటంలో; చేరుపన్= చేరిస్తే; షట్+వింశ భావ సిద్ధిన్= ఇరవై ఆరవభావం ఏర్పడటాన్ని; పొరయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పార్వతీపతీ! ఇరవై అయిదవ తత్త్వం వాడైన జీవుడు సారమైనదీ, మలినం లేనిదీ, నేర్పు గలదీ అయిన బుద్ధితో ప్రసన్నమైన ఆత్మ కలవాడై నేర్పుతో ఆ ప్రకృతిని పట్టించుకొనక ఉంటే ఇరవై ఆరవ తత్త్వపు సిద్ధిని పొందుతాడు.

**విశేషం:** ఇది బహుక్లిష్టమైన సాధన. దీనికి బుద్ధి ఎట్లా ఉండాలో చాలా జాగ్రత్తగా పరిశీలించవలసిందిగా కవి హెచ్చరిస్తున్నాడు. అది సారం కలది కావాలి. అనగా సర్వభావాలను కాచి వడబోసి నిగ్గు తేల్చుకున్న స్థితి బుద్ధిలో ఏర్పడాలి. ఒక్కసారి ఏర్పడితే చాలదు. దానిలో ప్రకృతివైపు మొగ్గజేసే మలినలక్షణాలు రాకుండా చూచుకోవాలని 'అమల' శబ్దం దీనిని సూచిస్తుంది. అయినా ప్రయోజనం సిద్ధించకపోవచ్చును - నేర్పు లేదు కనుక. 'నేర్పు' అనగా నిరంతర సాధనతో వచ్చే క్రియాపాటవం. ఇవన్నీ ఉన్నా మరే కారణం చేతనైనా ప్రసన్నత లోపిస్తే సిద్ధి దూరమవుతుంది. ఈ విధంగా సాధన విషయంలో ఎంత జాగరూకత ఉండాలో ఈ పద్యం వివరిస్తున్నది.

**క. సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు । దత్త్వాశ్రయముననను సత్త్వతత్త్వముల వివే**
**కిత్వాలేపత్వములన । విత్త్వముఁ జిత్త్వంబు నొందు విశ్వాధారా! 227**

**ప్రతిపదార్థం:** విశ్వ+ఆధారా!= విశ్వానికంతటికి పట్టుగొమ్మ అయిన ఓ విశ్వరూపా!; పురుషుడు= పురుషనాముడైన ఇరవై అయిదవతత్త్వం వాడు; సత్త్వ+ఆశ్రయమునన్= సత్త్వగుణాన్ని అవలంబించినందువలనను; తత్త్వ+ఆశ్రయమునను= తత్త్వాన్ని ఆశ్రయించినందువలనను, సత్త్వ తత్త్వముల వివేకిత్వ+అలేపత్వములన్+అ= సత్త్వము, తత్త్వము అనేవాటి స్పష్టమైన జ్ఞానం పొందటం, వాటి అంటు లేకుండటం అనేవాటి వలన; విత్త్వము= జ్ఞానమును; చిత్త్వంబున్= 'చిత్' స్వరూపం కలిగి ఉండటాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** సర్వాధారా! పురుషుడు సత్త్వాన్ని ఆశ్రయించి, తత్త్వాన్ని ఆశ్రయించి, ఆ రెండింటిని చక్కగా తెలిసికొనటం, వాటి అంటు లేకుండా చూచుకొనటం అనే పనులవలన తెలిసినవాడు, చైతన్యవంతుడూ అవుతాడు.

**విశేషం:** సత్త్వం అనగా ఉండటం - అస్తిత్వం. తత్త్వం అనగా జ్ఞానం. ఈ రెండింటిని చక్కగా పరిశీలించి చూచుకొంటే మొదటి దానివలన వివేకిత్వం - అనగా నిత్యం, అనిత్యం అనేవాటి చక్కని జ్ఞానం, రెండవదానివలన, అలేపత్వం - అనగా అంటులేనితనం కలుగుతుంది. విత్+త్వ, చిత్+త్వములు రెండూ పరమాత్మ రెండు లక్షణాలు.

**క. నానా త్వైకత్వము ల । జ్ఞానజ్ఞానజము లనపజయ! కండ్రు బుధుల్**
**వాని నవిద్యయు విద్యయుఁ గా నివి విను పంచవింశకస్థావస్థల్. 228**

**ప్రతిపదార్థం:** అనపజయ!= ఓటమి ఎరుగని ఓ దేవా!; నానాత్వ+ఏకత్వములు= పెక్కులగుట, ఒక్కటియగుట అనేవి; అజ్ఞాన జ్ఞానజములు= అజ్ఞానం వలనా, జ్ఞానం వలనా పుట్టేవి; బుధుల్= జ్ఞానవంతులు; వానిన్= ఆ రెండింటిని; అవిద్యయున్= అవిద్యగాను (అజ్ఞానంగానూ); విద్యయున్+కాన్= విద్యగానూ (జ్ఞానంగానూ); కండ్రు= చూస్తారు; విను= వినుము; ఇవి= ఈ రెండు; పంచవింశకస్థ+ అవస్థల్= ఇరువదియైదవ తత్త్వంలో ఉన్నవాడి దశలు.

**తాత్పర్యం:** మహేశా! పెక్కు లగుట అజ్ఞానం వలన కలిగిన స్థితి. ఒక్కటి కావటం జ్ఞానంవలన కలిగే స్థితి. పండితులు దీనినే అవిద్య, విద్య అంటారు. ఈ రెండూ ఇరవై అయిదవతత్త్వం వాడైన జీవుడి దశలు.

**విశేషం:** జీవుడు ప్రకృతితో తాదాత్మ్యం పొందితే విశ్వమంతా అనేక వస్త్వాదులతో ఉన్నట్లు భాసిస్తుంది. ఇరవై ఆరవ తత్త్వంతో తాదాత్మ్యం పొందితే 'ఏకత్వం' సిద్ధిస్తుంది. మొదటిది అజ్ఞానంవలనా, రెండవది జ్ఞానంవలనా సిద్ధిస్తాయి. వీటికే అవిద్య, విద్య అని కూడా పేర్లు. ఇరవై అయిదవ తత్త్వంవాడైన జీవుడికి, ఈ రెండు దశలూ కలిగే అవకాశం ఉన్నది. అవిద్య బంధానికి కారణం. విద్య మోక్షానికి కారణం.

**క. విద్యామయషడ్వింశుఁడు । విద్యావిద్యావిభేదవిరహితుఁ డజరుం**

**డాద్యుఁ డనంతుం డచ్యుతుఁ । డద్యతనుఁ డనాది కేవలాత్మకుఁ డరయన్.' 229**

**ప్రతిపదార్థం:** అరయన్= పరీక్షించగా; విద్యామయ షడ్వింశుఁడు= విద్యయే స్వరూపంగా గల ఇరవై ఆరవ తత్త్వం వాడు; విద్యా+ అవిద్యా, విభేదరహితుఁడు= విద్య, అవిద్య అనే వేర్వేరు భేదాలు లేనివాడు; అజరుండు= ముదిమి లేనివాడు; ఆద్యుఁడు= మొట్ట మొదటివాడు; అనంతుండు= అంతంలేనివాడు; అచ్యుతుఁడు= ఏ విధమైన జారుపాటు లేనివాడు; అద్యతనుఁడు= ఇప్పటివాడు; అనాది= తనకొక మొదలు లేనివాడు; కేవల+ఆత్మకుఁడు= తనకు తానే అయినవాడు.

**తాత్పర్యం:** పరికించగా విద్యయే స్వరూపంగా గల ఇరవై ఆరవతత్త్వంవాడు విద్య, అవిద్య అనే దశలు లేనివాడు, ముసలితనం లేనివాడు, మొట్టమొదటివాడు, అంతంలేనివాడు, ఏ విధమైన మార్పు లేనివాడు. ఇప్పటివాడు, మొదలు లేనివాడు, తనకు తానే అయినవాడు'.

**విశేషం:** ఇరవై ఆరవతత్త్వంవాడి తత్త్వాన్ని ఇక్కడ వక్కాణిస్తున్నారు. 'ఏకత్వం' విద్య అని పైన చెప్పారు. ఆ ఏకత్వస్వరూపుడే అతడు. ఇరవై అయిదవ తత్త్వం వాడికి రెండు దశలు - అవిద్య, విద్య అని ఉన్నాయని వెనుకటి పద్యంలో చెప్పారు. ఆ దశలు ఇతడికి లేవు. ఆ దశలు ఉన్నవానికి సృష్టిలో సర్వపదార్థాలవలె చివికి జీర్ణించిపోయే స్థితి ఉంటుంది. ఇతడికి అట్టి స్థితి లేదు కనుక అజరుడు. 'జర' - ముదిమి ఉంటే తరువాతి స్థితి చావు. అది రెండు దశలున్న వాడికి ఉంటుంది. ఇతడికి ఉండదు. కనుక అనంతుడు. 'చ్యుతి' అంటే మార్పు. మార్పు అంటే సృష్టికి పూర్వం నుండీ ఉన్నవాడు అద్యతనుఁడు - అనగా అప్పుడు ఎట్లా ఉన్నాడో ఇప్పుడు ఇట్లాగే ఉన్నవాడు. దీనినిబట్టి ఎప్పుడూ ఏకస్వరూపంతో ఉండేవాడు అన్న అర్థం సిద్ధిస్తుంది. 'అనాది' - ఆది అంటే ఇక్కడ పుట్టుక. అది లేనివాడు - అది లేకపోతే స్థితి, చావు అనీ మరో రెండు దశలు ఉండవు. కేవలాత్మకుఁడు-తనకు తానే అయినవాడు. అనగా తన స్థితికి ఆధారం, కారణం మొదలైనవిగా మరొకటి లేనివాడు. ఏకస్వరూపుడు అని అర్థం.

**ఆ. అని యుపన్యసించి యమ్మునిపతి యను । శంభుతోడ మఱియు 'సాంఖ్యయోగ**

**శిష్టమానసుల కరిష్టపరిజ్ఞాన । వైభవాతిశయము వలసియుండు. 230**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; ఉపన్యసించి= తెలిసేటట్లుగా చెప్పి; ఆ+మునిపతి= మునులలో గొప్పవాడగు ఆ సనత్కుమారుడు; శంభుతోడన్= శివుడితో; మఱియున్= ఇంకా; అనున్= అంటున్నాడు; సాంఖ్య, యోగ, శిష్ట, మానసులకున్= సాంఖ్యమనే యోగంలో శిక్షణ పొందిన మనస్సు కలవారికి; అరిష్ట, పరిజ్ఞాన వైభవ+అతిశయము= కీడుల చక్కని జ్ఞానపు సంపదయొక్క ఎక్కువతనం; వలసియుండున్= కావాలి.

**తాత్పర్యం:** ఇట్లా చక్కగా తెలియజెప్పి, సనత్కుమారుడు శివుడితో ఇట్లా అంటున్నాడు. 'సాంఖ్యయోగంలో శిక్షణ పొందిన మనస్సు కలవారు కీడులను గురించి చక్కని జ్ఞానం పొంది ఉండాలి.

**విశేషం:** అరిష్టాలంటే యోగాన్ని పాడు చేసే విషయాలు. అవి తెలిసికొనకపోతే యోగం చెడి, సాధకుడు భ్రష్టుడవుతాడు.

**వ. ఎట్లనిన దృష్టారిష్టవికృతులయి యా సుకృతుల విచ్ఛిన్నాత్మాను సంధానంబునం దదీయ దురవస్థం ద్రోవంజాలుదు రరిష్టంబు లవధరింపు' మను పలుకు పలికి 'వాని నెల్లను వివరించెద'; నని పరాశర**

**సంయమీశ్వరుండు శిష్యుల కుపదేశించిన విధంబులైయుండు నంతవట్టును మును నీ వాకర్ణించి తని యమ్మునివరుండు మఱియు నమ్మహాదేవుతో 'నరిష్టంబులం గాంచి యోగిజనంబులు సర్వాంగధారణ సహితంబును బరమహితంబును నగు ననేకత్వాకలన కృత్యంబున మృత్యువు జయింతు' రని నిర్దేశించి.231**

**ప్రతిపదార్థం:** ఎట్లు= ఏ విధంగా; అనినన్= అంటే; దృష్ట+అరిష్ట వికృతులు= చూడబడిన అరిష్టాలు, వికారాలు కలవారు; అయి; ఆ+సుకృతులు= ఆ పుణ్యాత్ములు; అవిచ్ఛిన్న+ఆత్మ+అనుసంధానంబునన్= ఎడతెగకుండా ఆత్మను కూర్చుకొనటం చేత; తదీయ దురవస్థన్= ఆ అరిష్టాలవలన ఏర్పడే పాడుదశను; త్రోవన్= త్రోసివేయటానికి; చాలుదురు= సమర్థులవుతారు; అరిష్టంబులు= కీడులు; అవధరింపుము= దయతో వినుము; అను పలుకు= అనే మాట; పలికి; వానిన్= వాటిని; ఎల్లను= అన్నింటిని; వివరించెదను= తెలియచెప్పుతాను; అని; పరాశర సంయమి+ఈశ్వరుండు= పరాశరుడనే మహర్షిశ్రేష్ఠుడు; శిష్యులకున్= తనకడ అధ్యయనం చేసేవారికి; ఉపదేశించిన విధంబులు= బోధించిన పద్ధతులు; ఐ+ఉండు+అంతవట్టును= అయి ఉండే అంతవరకు; మును= తొల్లి; నీవు; ఆకర్ణించితి(ని)= విన్నావు; అని; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; మఱియున్= ఇంకా; ఆ+మహాదేవుతోన్= ఆ మహాదేవుడు శంకరుడితో; అరిష్టంబులన్= కీడులను; కాంచి; యోగిజనంబులు= యోగం అభ్యసించే మనుజులు; సర్వ+అంగ ధారణ సహితంబునున్= అన్ని అంగాలను పట్టి నిలపటంతో కూడినదీ; పరమ హితంబును= మిక్కిలి మేలు చేసేదీ; అగు= అయిన; అనేకత్వ+ఆకలన కృత్యంబునన్= పెక్కు లగుటను ఒక్కటిగా చేయటం అనే పనితో; మృత్యువున్= చావును; జయింతురు= గెలుస్తారు; అని; నిర్దేశించి= తెలియచెప్పి.

**తాత్పర్యం:** ఏ విధంగా అనగా అరిష్టాలను, వికారాలు తెలిసికొని పుణ్యాత్ములు ఎడతెగకుండా ఆత్మను కూర్చుకొనటం ద్వారా వాటివలన కలిగే చెడుదశను త్రోసి వేయగలుగుతారు. కనుక కీడును తెలిసికొనాలి.' అని పలికి, 'వాటిని వివరిస్తాను' అని 'మునుపు పరాశరమహర్షి శిష్యులకు చెప్పిన విషయాలుగా ఉన్నాయి. అంతవరకు నీవు విని ఉన్నావు' అని సనత్కుమారుడు ఇంకా మహాదేవుడితో ఇట్లా అన్నాడు. 'అరిష్టాలను తెలిసికొని యోగిజనాలు అన్ని అంశాలను పట్టి నిలపటం అనే పనితో కూడినదీ, మిక్కిలి మేలైనదీ అయిన అనేకము లవటం అనేదానిని ఏకస్వరూపంలోనికి తేవటం అనే క్రియద్వారా మృత్యువును గెలుస్తారు' అని చెప్పి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆత్మను అనుసంధించటం అనే పని అవిచ్ఛిన్నంగా జరగాలి. లేకపోతే భ్రష్టత కలుగుతుంది. అనేకత్వ+ఆకలన, కృత్యంబుగనన్= అనేకాలంటే 24 తత్త్వాలు. వాటి 'ఆకలనం' అనగా కలపటం - ఒక్కటి చేయటం. అనేకత్వం అవిద్య అని పైన తెలిపారు. కనుక ఆ స్వరూపాన్ని చక్కగా తెలిసికొనటం అని కూడా ఇక్కడ అర్థంగా భావించవచ్చును. అవిద్య కూడా తెలియదగినదే. దానివలన మృత్యువును తరించాలి అని వేదానుశాసనం. 'అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృతమశ్నుతే' అని ఉపనిషద్వాక్యం. ఈ దృష్టితో ఈ పద్యంలో ఈ వాక్యపూర్వార్థాన్ని సమన్వయించినట్లుగా భావించాలి.

**క. జలమున మీను నుదుంబర। ఫలమున మశకములుఁ బోలెఁ బ్రకృతిం దా ని**
**మ్ముల నునికి తెలిసి వేర్పా।టలవఱిచిన పురుషుఁ డవ్యయత్వము పొందున్. 232**

**ప్రతిపదార్థం:** జలమునన్= నీటిలో; మీనున్= చేపయూ; ఉదుంబర ఫలమునన్= మేడిపండులో; మశకములున్= పురుగులు; పోలెన్= వలె; ప్రకృతిన్= ప్రకృతిలో; తాను= జీవుడు; ఇమ్ములన్= చక్కగా; ఉనికి= ఉండటం; తెలిసి= ఎరిగి; వేర్పాటు= వేరు కావటం, అలవఱిచిన పురుషుఁడు= అభ్యాసం చేసిన జీవుడు; అవ్యయత్వము= అవ్యయుడైన పరమాత్మ స్థితిని; పొందున్=

పొందుతాడు.

**తాత్పర్యం:** నీటిలో చేపా, మేడిపండులో పురుగులూ ఉన్నట్లుగా తాను ప్రకృతిలో ఉన్నానని తెలిసికొని, దానినుండి వేరుకావటం అభ్యాసం చేసి, సిద్ధిపొందిన పురుషుడు అమృతత్వస్థితి పొందుతాడు.

**విశేషం:** నీటిలో చేప ఉన్నది కాని నీరే చేపకాదు. మేడిపండులో పురుగులు ఉన్నాయి. కానీ పండే పురుగులు కాదు. తనను ఆవరించిన నీరు, పండువంటి ప్రకృతిధర్మాలు తనకంటె వేరైనవి అని గుర్తించటం, తన నిజస్థితి ఏమో పరికించి అది తానే అనే భావాన్ని అనుసంధించుకొనటం సాధకుడి కృత్యాలు. సాధన సిద్ధిదశకు వస్తే కలిగే ఫలం అవ్యయత్వం. అవ్యయుడు ఇంతవరకు చెప్పిన ఇరవై ఆరవతత్త్వం వాడు - పరమాత్మ. అది కావటం అవ్యయత్వం. దీనికే కైవల్యం, మోక్షం మొదలైన వ్యవహారాలు ఉన్నాయి. ఇందులో 'విద్యయా అమృత మశ్నుతే' అనే రెండవవాక్య భాగార్థాన్ని సమన్వయించి చూపారు. ఇక్కడ 'వేర్పాటే' విద్య.

**తే. కమలదళమున నున్న జలము విధమునఁ । బ్రకృతినుండి తదీయసంబంధవికృతి**
**లేని తనుఁ గని వెలుఁగు నిర్లేపనిశ్చ । లాజరామరపదవి జీవాహ్వయుండు. 233**

**ప్రతిపదార్థం:** జీవ+ఆహ్వయుండు= జీవుడనే పేరుగలవాడు; కమలదళమునన్= తామరాకుమీద; ఉన్న జలము విధమునన్= ఉన్న నీటివలె; ప్రకృతిన్= ప్రకృతియందు; ఉండి; తదీయసంబంధ వికృతి= దానికి సంబంధించిన వికారము; లేని= లేనట్టి; తనున్= తనను; కని= కాంచి; నిర్లేప నిశ్చల+అజర+అమర పదవిన్= అంటులేనిది, కదలికలేనిది, ముదిమిలేనిది, చావులేనిది అగు స్థానమునందు; వెలుఁగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** జీవుడు తామరాకుమీద నున్న నీటివలె ప్రకృతియందు ఉండి దానికి సంబంధించిన వికారాలు లేకుండా ఉన్న తనను చూచుకొని అంటు, కదలిక, ముదిమి, చావు లేని స్థానంలో వెలుగొందుతాడు.

**విశేషం:** నీటిలో చేప ఉండటం, తామరాకు మీద నీరుండటం అనే రెండు దృష్టాంతాలు బంధానికీ మోక్షానికీ ప్రతీకలు. నీటిలోని చేపకు (232వ పద్యంలో చెప్పిన సంగతి) నీటి సంపర్కం - అంటు ఉంటుంది. ప్రకృతిలోని జీవుడికి అటువంటి సంబంధం ఉంటే అంటు - దానివలన చలనమూ, దానివలన జర, దానివలన మరణమూ అనే వికారాలు సిద్ధిస్తాయి. ఇక తామరాకుమీద నీరు, తామరాకు సంపర్కం లేకుండా ఉంటుంది. అనగా 'నిర్లేప' స్థితి దానికి ఉంటుంది. దానివలన చలనాది వికారాలు కలుగవు. అదే అవ్యయత్వం.

**ఆ. ప్రకృతి నిట్లు వాసి పంచవింశుండు ష । డ్వింశభావమొంది విమలశివ ని**
**రంజన స్వరూపుఁడై వెలుఁగొందు న । త్తెఱఁగు ముక్తియండ్రు దేవదేవ! 234**

**ప్రతిపదార్థం:** దేవదేవ!= దేవులకు దేవుడవైన ఓ మహాదేవా!; పంచవింశుండు= ఇరవై అయిదవవాడు అయిన జీవుడు; ఇట్లు= ఈ విధంగా; ప్రకృతిన్= ఇరవైనాలుగవ తత్త్వం అయిన ప్రకృతిని; పాసి= వదలి; షడ్వింశభావము= ఇరవైఆరవ తత్త్వం అయిన పరమాత్మ భావాన్ని; ఒంది= పొంది; విమల శివ నిరంజన స్వరూపుఁడు+ఐ= నిర్మలము, మంగళము, ఇతరముల అంటు లేనిది అయిన స్వరూపం కలవాడై; వెలుఁగు+ఒందున్= ప్రకాశిస్తాడు; ఆ+తెఱఁగు= ఆ తీరును; ముక్తి= మోక్షం; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** జీవుడు ఈ విధంగా ప్రకృతిని వదలివేసి పరమాత్మతనాన్ని పొంది, విమలము, శుభము, అంటులేని స్వరూపం కలవాడై ప్రకాశిస్తాడు. దేవదేవా! ఈ స్థితినే ముక్తి అంటారు.

**విశేషం:** ప్రకృతిని పాసి - అనగా ప్రకృతితోపాటు వెనుక ఉన్న ఇరవైమూడు తత్త్వాలను వదలి అనే అర్థం భావించాలి. షడ్వింశుడు - ఈ ఇరవై అయిదు తత్త్వాలకు అతీతంగా ఉండే పరమాత్మ. ప్రకృతి సంపర్కం వదలితే జీవాత్మ పరమాత్మే అవుతాడు. ఇదే అద్వైతం. పరమాత్మ లక్షణాలు మూడింటిని ఇక్కడ చెప్పారు. 1.విమలత్వం - మలం అంటే జీవపరంగా అజ్ఞానదోషం. అది లేనితనం. 2.శివత్వం - అనగా మంగళస్వరూపం. కేవలం జీవుడు పెరగటం. తరగటం మొదలైన స్థితులతో కూడినవాడు కనుక అక్కడ కేవల శుభత్వం ఉండదు. పరమాత్మకు అట్టిదిలేదు. 3.నిరంజనత్వం - ప్రకృతితో కలిసి గుణాదుల సోకు పొందటం జీవలక్షణం. అది దోషం. తామరాకుమీద నీటి బొట్టువలె అంటకుండా ఉండటం నిరంజనత్వం.

**క. ఈ పరిబోధం బభవా! కాపిల మస్మద్గురుండు గపిలుఁ డతని శి**
**క్షాపరిణతి బహుశిష్యులు । దీపితవిజ్ఞానులైరి దృఢనిశ్చయతన్. 235**

**ప్రతిపదార్థం:** అభవా!= జన్మమే లేని ఓ శివా! ఈ పరిబోధంబు= ఈ సమగ్రమైన జ్ఞానం; కాపిలము= కపిలమహర్షి ప్రసాదించినది; అస్మత్ గురుండు= నా గురువు; కపిలుఁడు= కపిలమహర్షి; అతని శిక్షా పరిణతిన్= అతడి బోధన పాకంచేత; బహుశిష్యులు= పెక్కుమంది శిష్యులు; దృఢనిశ్చయతన్= చెదరని నిశ్చయబుద్ధి కలగటం చేత; దీపితవిజ్ఞానులు= వెలుగొందే విజ్ఞానం కలవారు; ఐరి= అయ్యారు.

**తాత్పర్యం:** శివా! ఈ చక్కని జ్ఞానాన్ని కపిలమహర్షి లోకానికి అనుగ్రహించాడు. అతడు నా గురువు. అతడి బోధన పాకంచేత పెక్కుమంది శిష్యులు చెదరని నిశ్చయబుద్ధి కలవారై ప్రకాశించే విజ్ఞానం కలవారయ్యారు.

**విశేషం:** గురువు విశిష్టత ఇక్కడ తెలియవస్తున్నది.

**క. ఏనును శిష్యుల కీ వి । జ్ఞానము పెక్కండ్రకుం బ్రసన్నమతిని గా**
**ఢానూనంబుగఁ దెలిపితి । మానిత మది దివ్యమునిసమాజముచేతన్. 236**

**ప్రతిపదార్థం:** ఏనును= నేను కూడా; శిష్యులకున్= అధ్యయనం చేసేవారికి; పెక్కండ్రకున్= చాలామందికి; ప్రసన్నమతిని= ప్రసన్నమైన బుద్ధితో; ఈ విజ్ఞానమున్= ఈ సాంఖ్యరూప విశేషజ్ఞానాన్ని; గాఢ+అనూనంబుగన్= గట్టిగా తక్కువతనం లేని విధంగా; తెలిపితిన్= బోధించాను; అది= ఆ విజ్ఞానం; దివ్యముని సమాజముచేతన్= దేవతలమునుల సముదాయంచేత; మానితము= మన్నన కెక్కింది.

**తాత్పర్యం:** దేవా! నేను కూడా ఈ విజ్ఞానాన్ని పెక్కుమంది శిష్యులకు ప్రసన్నమైన బుద్ధితో దృఢంగా, తక్కువతనం లేకుండా బోధించాను. దివ్యమును లెందరో దీనిని మన్నించారు.

**విశేషం:** విద్యకు అధీతి, బోధ, ఆచరణ, ప్రచారణ - అని నాలుగు దశలు. క్రిందటి పద్యంలో నా గురువు కపిలుడు, ఆతని శిష్యులు దీపిత విజ్ఞానులైరి అనేమాటలచేత అధ్యయనం, ఆచరణం అనే దశలు తెలియవచ్చాయి. ఈ పద్యంలో 'నేను చెప్పాను' అన్నదానిచేత బోధ, ప్రచారణ అనే దశలు ప్రసక్తాలయ్యాయి. ఇట్లా సంప్రదాయం తెలుపటానికే ఈ ప్రసంగం

కాని ఆత్మోత్కర్షను చాటుకొనటానికి కాదు. 'గాఢ అనూనంబుగన్' అనటం కూడ ఉపదేశం ఎట్లా ఉండాలో తెలియచేయటాని కని గుర్తించాలి.

**వ. గార్గ్య గౌతమ కాత్యాయనాదులు దీనన చేసి దీప్తబోధులయి వీతాతంకులును విజ్వరులును నిర్లేపులును నిర్భరానందులు నైరని చెప్పి వెండియు నిట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** గార్గ్య, గౌతమ, కాత్యాయన+ఆదులు= గార్గ్యుడు, గౌతముడు, కాత్యాయనుడు మొదలైనవారు; దీనన్+అ చేసి= ఈ జ్ఞానంచేతనే; దీప్తబోధులు= ప్రకాశించే జ్ఞానం కలవారు; అయి; వీత+అతంకులును= పోయిన అవరోధాలు కలవారు; విజ్వరులును= నశించిన మనస్సంబంధి రోగాలు కలవారు; నిర్లేపులును= తొలగిన ప్రకృతిసంపర్కం కలవారున్నూ; నిర్భర+ ఆనందులును= పరిపూర్ణమైన ఆనందం కలవారున్నూ; ఐరి= అయ్యారు; అని; చెప్పి; వెండియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నారు.

**తాత్పర్యం:** గార్గ్యుడు, గౌతముడు, కాత్యాయనుడు మొదలైనవారు ఈ జ్ఞానంచేతనే చక్కగా వెలుగొందే జ్ఞానం కలవారై, ఆతంకాలు పోయినవారు, మనస్సులోని శంకలు నశించినవారు, ప్రకృతి సంపర్కం వదలినవారు, నిండైన ఆనందం పొందినవారు అయ్యారు.' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇందులో జ్ఞానలబ్ధి ఫలితాలను సోపానక్రమంలో చెప్పారు. మొదటిదశ గురువువలన వినటం, తరువాత మననం నిదిధ్యాస చేయటం - దీప్తబోధులు అన్నంతవరకు ఈ మూడు మెట్లు ఉన్నట్లు భావించాలి. మధ్యలో అరిష్టాలు వస్తాయని ఇంతకుముందు చెప్పారు. వాటిని తొలగించుకొనటం నాలుగవ మెట్టు. బయటినుండి కలిగేవి కాక, లోపల కలిగే వికారాలే జ్వరాలు, వాటిని తొలగించుకొనటం విజ్వరత్వం - అయిదవమెట్టు, ఆరవమెట్టు సిద్ధి - ప్రకృతితో లేపం లేకుండా ఉండటం - నిర్లేపత్వం. చివరిది ఫలరూపం. అదే నిర్భరానందం. ఇట్లా వారయ్యారని చెప్పటం సాధకుడు ఇట్లా కావాలి - అని చెప్పటానికి ఉపలక్షణం. ఈ విధంగా మహావిద్యయొక్క దశాభేదాలను ఈ వచనం పరమరమణీయంగా తెలుపుతున్నది.

**క. సంగము బంధ మఖిల ని । స్సంగత మోక్షంబు బహువిచారము లేలా?**
**పింగజటాజూట కలిత! గంగాబాలేందు మహిత! గౌరీసహితా!' 238**

**ప్రతిపదార్థం:** పింగ జటాజూట కలిత!= పచ్చని జడల ముడులతో కూడినవాడా!; గంగా బాల+ఇందు మహిత!= గంగానదితో, లేతచందురుడితో విరాజిల్లువాడా!; గౌరీసహితా!= పార్వతి సగభాగంగా గల పరమశివా!; బహువిచారములు= పెక్కు ఆలోచనలు; ఏలా?= ఎందుకు?; సంగము= ప్రకృతితో కలయిక; బంధము= కట్టు; నిస్+సంగత= సంగం లేకుండటం; మోక్షంబు= విడుదల.

**తాత్పర్యం:** శివా! పెక్కు విచారాలు ఏల? జీవుడు ప్రకృతితో అంటిపెట్టుకొని ఉండటమే బంధం. ఆ విధమైన సంపర్కం లేకుండటమే మోక్షం.'

**విశేషం:** పద్యంలో శివుడికి చేసిన మూడు సంబోధనలు పైకి పద్యపూరణం కోసంగా కనిపిస్తాయి. కానీ పరిశీలించి చూస్తే తత్త్వస్ఫోరకాలు. శివుడి జటాజూటం 'వ్యోమం' - అనగా ఆకాశం. గంగానది జలదేవత, చంద్రుడు - జ్యోతి స్స్వరూపం, పార్వతి- భూతత్త్వం. ఈ విధంగా శివుడి విశ్వవ్యాపకత అనే ధర్మాన్ని కవి తెలుపుతున్నాడు. అంతేకాదు ఇరవై ఆరవతత్త్వం అయిన పరమాత్మవు నీవు. లోకానుగ్రహం కొరకు నా చేత ఈ యోగసాంఖ్యమార్గాలను చెప్పించినావు అనే స్ఫూర్తికి ఈ సంబోధనలు సహకరిస్తాయి.

పరమాత్మ - జీవుడు - ప్రకృతి. క్రిందివైపు ప్రసరించటం సంగం. అదే బంధం. పైవైపు ప్రసరించటం నిస్సంగత - అదే మోక్షం. ఇది ఈ విద్యకు ఉపసంహారవాక్యం.

**క. అని యిట్లు శివునకును న । మ్ముని విజ్ఞాపించి గగనమున కెగసి వెసం**
**జనియె శివుండును నిజది । వ్య నిరర్గళ చిత్తపథ విహారుం డయ్యెన్. 239**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; ఆ+ముని= ఆ సనత్కుమార మహర్షి; శివునకును= పరమేశ్వరుడికి; విజ్ఞాపించి= విన్నవించి; గగనమునకున్= ఆకాశానికి; ఎగసి= ఎగిరి; వెసన్= వేగంగా; చనియెన్= వెళ్ళాడు; శివుండును= శంకరుడు కూడా; నిజ దివ్య నిరర్గళ చిత్త పథ విహారుండు= తనదైన దివ్యము, అడ్డులేనిదీ అయిన మనస్సునకు సంబంధించిన మార్గంలో విహరించేవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** అని ఈ విధంగా ఆ మహర్షి శివుడికి యోగసాంఖ్యాలను విన్నవించి, ఆకాశాని కెగిరి వేగంగా వెళ్ళిపోయాడు. శివుడు కూడా తన దివ్యమూ, అడ్డులేనిదీ అయిన చిత్తపథంలో విహారం కలవా డయ్యాడు.

**విశేషం:** చిత్తపథం - హృదయపుండరీకం అనేస్థానం అని సంభావించాలి. 'సనత్కుమారుడు ఆకాశాని కెగిరాడు. శివుడు చిత్తపథంలో విహరించాడు' అన్న ఈ మాటలలో వారిద్దరి ఏకత్వాన్ని గుర్తించాలి. ఆకాశం అంటే 'దహరాకాశం' హృదయంలో సదాశివస్థానమైన చోటు. శివుడిదీ అదే. ఈ విధంగా ఇద్దరూ వెళ్ళినచోటు ఒక్కటే. అనగా ఇద్దరూ ఒక్కటే అని తాత్పర్యం.

**క. అని చెప్పిన భీష్మున కి । ట్లను ధర్మతనూజుఁ డెక్కుడైన శుచిత్వం**
**బొనరింపఁ జాలు తీర్థం । బనఘా! యెఱిఁగింపవే దయం దెల్లముగన్. 240**

**ప్రతిపదార్థం:** అని; చెప్పినన్= చెప్పగా; ధర్మతనూజుఁడు= ధర్ముడి కుమారుడైన యుధిష్ఠిరుడు; భీష్మునకున్= భీష్ముడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; అనఘా!= పుణ్యాత్మా!; ఎక్కుడు= ఎక్కువ; ఐన శుచిత్వంబు= అయిన పవిత్రతను; ఒనరింపన్ చాలు తీర్థంబు= చేయగల పుణ్యస్థానం ఏదో; దయన్= దయతో; తెల్లముగన్= స్పష్టమయ్యే విధంగా; ఎఱిఁగింపవే!= తెలుపుమా!

**తాత్పర్యం:** ఈ విధంగా చెప్పిన భీష్ముడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు. 'అనఘా! మిక్కిలి ఎక్కువ పవిత్రతను కలిగించ గల తీర్థం ఏదో దయతో స్పష్టంగా తెలుపవూ!'

**సీ. అనవుడు నాతఁ డమ్మనుజవల్లభుతోడ । 'వినుము తీర్థము లెల్లవియును మేల;**
**సత్యాభిధానమై శౌచాతిశయముఁజే । యఁగఁ జాలు మానసంబైన తీర్థ**
**మది ధృతి యనుమహాహ్రదమున శోభిల్లుఁ । దమము రజస్సును దఱియఁ ద్రోచి**
**కొనుచు సత్యము నూఁతగొని చొచ్చి యాచరి । తస్నానుఁడై శుచిత్వమున వెలుఁగు**

**ఆ. నరుఁడు వీతరాగ పరిహృతేంద్రియ దృఢ । వ్రతలసద్వివేకు లతిశయిల్లు**
**విమలతీర్థములు సవినయత వారలఁ । జెందుటయును దీర్థసిద్ధి యధిప! 241**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; ఆతఁడు= ఆ భీష్ముడు; ఆ+మనుజవల్లభుతోడన్= ఆ రాజుతో; అధిప!= రాజా!; వినుము= ఆలకించుము; తీర్థములు= పవిత్రస్థలములు; ఎల్ల+అవియును= అన్నీ; మేలు+అ= మేలైనవే; మానసంబు= మనస్సునకు సంబంధించినది; ఐన తీర్థము= అయిన తీర్థం; సత్య+అభిధానము= 'సత్యం' అనే పేరుగలది; ఐ= అయి; శౌచ+అతిశయమున్= పవిత్రతయొక్క ఎక్కువతనాన్ని; చేయఁగన్+చాలున్= చేయగలుగుతుంది; అది= ఆ తీర్థం; ధృతి= ధీరత; అను మహాహ్రదమునన్= అనే పెద్దజలాశయంలో; శోభిల్లున్= ప్రకాశిస్తుంది; తమమున్= తమస్సు అనే గుణాన్నీ; రజస్సు= రజస్సు అనే గుణాన్నీ; తఱియన్= దూరమైపోయే విధంగా; త్రోచికొనుచున్= నెట్టివేసికొంటూ; నరుఁడు= మానవుడు; సత్యమున్= సత్యగుణాన్ని, ఊఁత= ఆధారంగా; కొని= గ్రహించి; చొచ్చి= ప్రవేశించి; ఆచరిత స్నానుఁడు= చేయబడిన స్నానం గలవాడు; ఐ= అయి; శుచిత్వమునన్= పరిశుద్ధతతో; వెలుఁగున్= ప్రకాశిస్తాడు; వీత రాగ పరిహృత+ఇంద్రియ దృఢ వ్రత లసత్ వివేకులు= వదలిన విషయప్రీతి, తొలగించబడిన ఇంద్రియాలూ, చెదరని నియమనిష్ఠలూ గల వివేకవంతులు; అతిశయిల్లు విమల తీర్థములు= మిక్కిలిగా వెలుగొందే స్వచ్ఛమైన పవిత్రస్థానాలు; సవినయతన్= వినయంతోపాటు; వారలన్= అట్టివారిని; చెందుటయును= ఆశ్రయించటం కూడా; తీర్థసిద్ధి= తీర్థంవలన కలిగే సిద్ధియే.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా అడిగినంతనే భీష్ముడతడికి ఇట్లా చెప్పాడు. 'రాజా! తీర్థాలన్నీ మేలైనవే. మానసతీర్థం ఒకటి ఉన్నది. దాని పేరు 'సత్యం'. అది మిక్కిలి పవిత్రతను కలిగిస్తుంది. 'ధృతి' అనే మహా జలాశయంలో అది విరాజిల్లుతూ ఉంటుంది. తమస్సు, రజస్సు అనే రెండు గుణాలను దూరంగా తొలగించుకొంటూ, సత్యాన్ని ఊతకఱ్ఱగా తీసికొని దానిలోనికి ప్రవేశించి స్నానం చేసినవాడు పరిశుద్ధతతో ప్రకాశిస్తాడు. రాగద్వేషాలు వదలి, ఇంద్రియాల వికారాలను తొలగించుకొని, ఏమాత్రమూ సడలని వ్రతం పాటిస్తూ వివేకం కలిగిన మహాత్ములు కూడా గొప్ప నిర్మలతీర్థాలే. వారిని వినయపూర్వకంగా ఆశ్రయించటం కూడా తీర్థాలవలనకలిగే సిద్ధిని కలిగిస్తుంది.

**విశేషం:** మనస్సులో పుట్టే వికారాలు తమస్సు, రజస్సు అనే గుణాల వలన కలుగుతాయి. తమస్సు ఆవరణశక్తి. అనగా దేనినీ చూడనీయదు. రజస్సు విక్షేపశక్తి. ఎక్కడా నిలువనీయదు. ఈ రెండింటినీ దూరంగా తోసివేస్తే తప్ప మనస్సు తీర్థం కాదు. దానికి సముద్రమంత ధైర్యం కావాలి. తీర్థమంటే తరింపచేసేది. నీటిలోనికి దిగేవాడికి లోతు తెలియటం మొదలైన ప్రయోజనాల కొరకు ఒక ఊత - ఆధారదండం ఉండాలి. ఇక్కడ అదే సత్యం, లేదా సత్త్వగుణం. దీనివలన నరుడు లోపలా, వెలుపలా, నిండైన పరిశుద్ధత కలవాడవుతాడు. మరొకరకపు తీర్థాలు కూడా ఉన్నాయి. అవి కదలేవి, ప్రాణవంతమైనవి. వారు 'వివేకులు' - రాగద్వేషాలను తొలగించుకొన్నవారు. ఇంద్రియవికారాలకు లోబడనివారు, చెదరని నియమ నిష్ఠలుకలవారు, సత్యమేదో, అసత్యమేదో విడమరచి చూడగలవారు అయిన మహాపురుషులు ఆ తీర్థాలు. వారలను ఆశ్రయించటంవలన కూడా తీర్థఫలం సిద్ధిస్తుంది. ఇందులో మొదటిది కొంచెం క్లిష్టమైన పద్ధతి. రెండవది కొంచెం సులభపద్ధతి. దయతో వ్యాసభగవానుడు మధ్యమాధికారుల కొరకు ఈ రెండవ తీర్థాన్ని కూడా ఇక్కడ అనుగ్రహిస్తున్నారు. ఇంతకు మునుపు చెప్పిన యోగమూ, సాంఖ్యమూ ఎంతో శక్తిసంపన్నత కలవారికి తప్ప సాధ్యంకానివి. అంత స్థాయికి ఎదగలేనివారి గతి ఏమిటి? అన్న ప్రశ్నకు ఈ పద్యం సమాధానరూపంగా దారి చూపుతుంది. అందుకొరకే దాని కనుబంధంగా ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది.

**క. దమమును దపము నహింసయు । శమమును దీర్థముల వాన శౌచాతిశయం**
**బమలగుణ! కలుగు రిత్తజ । లములం దోఁగిన శుచిత్వలాభము గలదే?' 242**

**ప్రతిపదార్థం:** అమలగుణ!= స్వచ్ఛమైన గుణములు గల ఓ ధర్మరాజా!; దమమును= ఇంద్రియనిగ్రహమూ; తపమున్= తపస్సూ; అహింసయున్= ఇతరులను పీడించకుండటమూ; శమమును= శాంతి (మనస్సు ఉద్వేగపడకుండటమూ);

తీర్థములు+అ= తీర్థములే; వానన్= వాటిచేత; శౌచ+అతిశయంబు= పరిశుద్ధత యొక్క ఎక్కువతనము; కలుగున్= కలుగుతుంది; రిత్తన్= ఊరకయే (వ్యర్థంగా); జలములన్= నీటిలో; తోఁగినన్= మునిగితే; శుచిత్వలాభము= పరిశుద్ధత అనే లాభం; కలదు+ఏ?= ఉంటుందా?

**తాత్పర్యం:** ధర్మరాజా! ఇంద్రియాలను అదుపుచేసికొనటం, దేహాన్నీ, మనస్సునూ నియమనిష్ఠలద్వారా ఎండగట్టటం, ఇతరప్రాణాలను హింసించకుండటం, మనస్సులో ఉద్వేగం రాకుండా చూచుకొనటం అనేవి కూడా తీర్థాలే. వాటిచేత ఎక్కువ శుద్ధత కలుగుతుంది. ఊరకే నీటిలో మునిగితే పరిశుద్ధత కలుగుతుందా?'

**విశేషం:** దేహపు పై భాగం శుద్ధం అయినంత మాత్రాన చాలదు. అంతశ్శుద్ధి కావాలి. అది జలాదులతో ఏర్పడదు.

**వ. అని వెండియు. 243**

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి ఇంకా ఇట్లా అంటున్నాడు.

**క. 'దొరకొననివానిఁ గోరక । దొరకొనినందును మమత్వతుష్టహృదయతం**
**బొరయక విగతస్పృహులగు । పురుషులు శుచు లేల తీర్థములు వారలకున్?' 244**

**ప్రతిపదార్థం:** దొరకొననివానిన్= అందనివానిని; కోరక= అపేక్షింపక; దొరకొనిన+అందును= అందినవాటియందును; మమత్వతుష్ట హృదయతన్= నాది అనే భావమూ, ఆనందపు పొంగు కలిగిన హృదయం కలవాడు కావటాన్ని; పొరయక= పొందక; విగత స్పృహులు= నశించిన వాంఛకలవారు; అగు పురుషులు= అయిన నరులు; శుచులు= పరిశుద్ధులు; వారలకున్= అట్టివారికి; తీర్థములు= తరింపచేసే పుణ్యజలాలు; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** 'దొరకని వాటిని కోరక, దొరికిన వాటియందు మమకారము, తుష్టి అనే లక్షణాలను పొందక, ఆశను విడనాడి బ్రదికే నరులు పవిత్రులు. వారికి వేరైన తీర్థాలెందుకు?'

**విశేషం:** మమత్వం - అనగా నాది అనే భావన. తుష్టి - అనగా పొంగిపోవటం - ఈ రెండింటినీ వదలాలి. ఎందుకనగా మమత్వ మేర్పడితే - రక్షణయందు, నాశమునందు దుఃఖం కలుగుతుంది. వస్తుగతతుష్టి వస్తునాశంతో దుఃఖంగా మారుతుంది.

**క. అనినఁ బ్రియమంది తాతకు । మనుమఁడు ప్రణమిల్లి 'బోధమహితా! యేవ**
**ర్తనమున నుత్తమపదముం । గను నం; ద్రది యెఱుఁగఁ జెప్పు కరుణ దలిర్పన్. 245**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ప్రియము+అంది= తృప్తిపడి; మనుమఁడు= మనుమడైన ధర్మరాజు; తాతకున్= తాతకు; ప్రణమిల్లి= దండ నమస్కారం చేసి; బోధమహితా!= జ్ఞానంచేత గొప్పవాడా!; ఏ వర్తనమునన్= ఎట్టి నడవడితో; ఉత్తమపదమున్= మేలైన స్థానాన్ని (మనుష్యుడు); కనున్= పొందుతాడు; అంద్రు= అంటారో; అది= దానిని; కరుణ= దయ; తలిర్పన్= చిగురించగా; ఎఱుఁగన్= తెలిసేటట్లుగా; చెప్పు= బోధించుము.

**తాత్పర్యం:** అనగా సంతృప్తి చెంది మనుమడు ప్రణామం చేసి, తాతతో ఇట్లా అన్నాడు. 'జ్ఞానమహితా! ఎట్టి ప్రవర్తనతో మనుష్యుడు ఉత్తమపదం చేరుకొంటా డంటారో దానిని నాకు దయ చిగురించగా బోధించుము.

**విశేషం:** ప్రణమిల్లి - ఇది ప్రాతకాలపు కృతజ్ఞతాభివ్యక్తి ధోరణి. అంతేకాదు 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' అని గీత. ప్రణిపాతం అంటే కాళ్ళకు మ్రొక్కటం.

**వ. మృతుండు మేను విడిచి యెయ్యది సహాయంబుగాఁ జను నదియును వినవలతు' నని యడిగిన నమ్మహానుభావుం డా భూవల్లభున కిట్లనియె. 246**

**ప్రతిపదార్థం:** మృతుండు= మరణించినవాడు; మేను= దేహాన్ని; విడిచి= వదలివైచి; ఏ+అది= ఏది; సహాయంబుగాన్= ఊతగా; చనున్= వెళ్తాడో; అదియునున్= దానిని కూడా; వినవలతున్= వినగోరుతున్నాను; అని; అడిగినన్= అడిగితే; ఆ+మహానుభావుండు= గొప్ప సమర్థతగల ఆ భీష్ముడు; ఆ భూవల్లభునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మరణించినవాడు దేహాన్ని వదలి ఏ తోడుగా వెళ్ళుతాడు? ఆ విషయం కూడా వినగోరుతున్నాను.' అని అడుగగా ఆ మహానుభావుడు ఆ రాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది చాలా క్లిష్టమైన ప్రశ్న - ఎందుకనగా బ్రతికి ఉన్నవాడికి మరణం తరువాత ఏమి అవుతుందో తెలియదు. మరణించిన తరువాత జీవుడి అనుభవం ఎటువంటిదో చెప్పటానికి అవకాశం లేదు. కనుక భీష్ముడు దీనికి సూటిగా సమాధానం చెప్పటం లేదు.

**క. 'నీ యడిగిన గూఢములగు । నీ యర్థము లెఱుఁగఁ జెప్ప నింద్రగురుఁడు గా**
**కేయెడల నొరుఁడు గలఁడే. యాయన యిట వచ్చు నిపుడ యడుగుము ప్రీతిన్.' 247**

**ప్రతిపదార్థం:** నీ+అడిగిన గూఢములు+అగు+అర్థములు=నీవడిగిన మిక్కిలి రహస్యములైన ఈ విషయాలు; ఎఱుఁగన్= తెలిసే విధంగా; చెప్పన్= చెప్పటానికి; ఇంద్రగురుఁడు= దేవేంద్రుడి గురువైన బృహస్పతి; కాక= తప్ప; ఏ+ఎడలన్= ఏ తావులోనైనా; ఒరుఁడు= ఇతరుడు; కలఁడు+ఏ?= ఉంటాడా?; ఆయన= ఆ బృహస్పతి; ఇటన్= ఇక్కడకు; ఇపుడు+అ= ఇప్పుడే; వచ్చున్= వస్తాడు; ప్రీతిన్= ప్రీతితో; అడుగుము= అడుగు.

**తాత్పర్యం:** 'నీవడిగిన అర్థం చాలా గూఢమైనది. దీనిని తెలియచెప్పగలవాడు బృహస్పతి తప్ప మరొక డున్నాడా? ఆయన ఇప్పుడే ఇక్కడకు వస్తాడు. ప్రీతితో అడుగుము.'

**విశేషం:** ఇంద్రగురుడు - బృహస్పతి అనగా అతడికి తెలియని అర్థాలు లేవని భావం. సంకల్పమాత్రం చేత భీష్ముడు బృహస్పతితో సన్నిహితత్వం కల్పించుకొన్నాడు. అనగా జ్ఞానసంపన్నులకు బృహస్పతి మొదలైనవారు నిత్యసన్నిహితంగా ఉంటారని భావం. 'బుద్ధిలో బృహస్పతి' అని నానుడి. కనుక అతడు ఎంత నిగూఢమైన విషయమైనా చెప్పగలుగుతాడు.

**క. అను సమయంబున నయ్యెడ । కనిమిష గురుఁ డరుగుదెంచె నతనికిఁ గుంతీ**
**తనయాగ్రజుండుఁ దమ్ములు । జనపతులును గేశవుండు సద్భక్తిమెయిన్. 248**

**ప్రతిపదార్థం:** అను సమయంబునన్= అంటున్నవేళలో; ఆ+ఎడకున్= ఆ చోటికి; అనిమిషగురుఁడు= దేవతల గురువైన బృహస్పతి; అరుగుదెంచెన్= విచ్చేశాడు. అతనికిన్= అతడికి; కుంతీతనయ+అగ్రజుండున్= కుంతికొడుకులలో పెద్దవాడైన ధర్మరాజూ; తమ్ములున్= తమ్ము లయిన భీమాదులు; కేశవుండున్= శ్రీకృష్ణుడూ; సత్+భక్తిమెయిన్= మంచిభక్తితో.

**తాత్పర్యం:** అనే సమయంలో అక్కడకు బృహస్పతి విచ్చేశాడు. అతడికి ధర్మరాజు తమ్ములు, రాజులు, కృష్ణుడూ సద్భక్తితో (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఎదుర్కొని ప్రణామపూర్వకంబుగా సముచితోపచారంబులం బ్రీతాత్మ్ముంజేసి యాసీనుండై యున్నెడం గురుపతి యగ్గురునిం గురుపితామహు నడిగినయట్ల యడిగిన నతం డతని కిట్లనియె. 249**

**ప్రతిపదార్థం:** ఎదుర్కొని= ఎదురేగి; ప్రణామ పూర్వకంబుగాన్= నమస్కారం మొదటి ఉపచారంగా; సముచిత+ఉపచారంబులన్= చక్కగా తగిన సేవలతో; ప్రీత+ఆత్మున్= ప్రీతి పొందిన హృదయం కలవాడినిగా; చేసి; ఆసీనుండు= కూర్చున్నవాడు; ఐ= అయి; ఉన్న+ఎడన్= ఉన్నసమయంలో; కురుపతి= ధర్మరాజు; ఆ+గురునిన్= దేవగురువైన ఆ బృహస్పతిని; కురు పితామహున్= కౌరవులకు తాత అయిన భీష్ముడిని; అడిగిన+అట్లు+అ= అడిగినట్లే; అడిగినన్= అడుగగా; అతండు= ఆ బృహస్పతి; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఎదురేగి నమస్కరించి తగిన అర్ఘ్యపాద్యాదు లర్పించటం అనే సేవలు చేసి తృప్తిపరచి అతడు కూర్చున్న తరువాత ధర్మరాజు ఆ దేవగురువును తన తాత నడిగినట్లే అడుగగా అత డతడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'తనకుఁ దాన కలఁడు జననంబు నప్పుడు । మరణమునను సుగతి నరకములను**
**దల్లి దండ్రి దక్కు నెల్లబంధులు శరీ । రంబు ననుగమించి క్రమ్మఱుదురు. 250**

**ప్రతిపదార్థం:** జననంబు+అప్పుడు= పుట్టుక సమయంలో; మరణమునను= చావునందూ; సుగతి నరకములను= పుణ్యగతి, నరకం అనేవాటియందూ; తనకున్= తనకు (జీవుడికి)÷; తాను+అ= తానే; కలఁడు= ఉన్నాడు; తల్లి= అమ్మ; తండ్రి= నాయన; తక్కున్; ఎల్లబంధులు= మిగిలిన చుట్టాలందరు; శరీరంబున్= శరీరాన్ని; అనుగమించి= వెంటనంటి వెళ్ళి; క్రమ్మఱుదురు= మరలి వస్తారు.

**తాత్పర్యం:** 'పుట్టినప్పుడు, గిట్టినప్పుడు పుణ్యాపాపాల ఫలాల భూము లయిన స్వర్గం, నరకం అనే వాటియందు తనకు తానే ఉంటాడు. తల్లి, తండ్రి, మిగిలిన బంధువులు శరీరాన్ని వెంటనంటి తిరిగి వెళ్ళిపోతారు.

**విశేషం:** శరీరం అనగా ఇక్కడ ప్రాణం లేని కళేబరం. దానిని కాల్చటమో, పూడ్చటమో చేసిన తరువాత వారు వెంటనంటి పోయేది ఏమీ ఉండదు. కనుక బంధువులు వెనుకకు తిరిగి వెళ్ళిపోతారు.

**క. ఉత్తమపథంబు ధర్మా । యత్తము, ధర్మంబు మృతుల కధిప! సహాయం**
**బెత్తెఱఁగున ధర్మక్రియఁ । జిత్తంబునఁ జేర్పవలయు జీవించుతఱిన్. 251**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఉత్తమపథంబు= మేలైన త్రోవ; ధర్మ+ఆయత్తము= ధర్మానికి వశమైనది; మృతులకున్= మరణించిన వారికి; ధర్మంబు= ధర్మము; సహాయంబు= తోడు; ఏ+తెఱఁగునన్= ఏ విధంగానైనా; జీవించు తఱిన్= బ్రతికి ఉన్నప్పుడే; ధర్మక్రియన్= ధర్మమనే క్రియను; చిత్తంబునన్= హృదయంలో; చేర్పవలయున్= చేర్చాలి.

**తాత్పర్యం:** రాజా! మేలుత్రోవ ధర్మంమీద ఆధారపడి ఉంటుంది. చచ్చినవారికి ధర్మమే తోడుగా వస్తుంది. కనుక బ్రతికి ఉన్నప్పుడే ధర్మకార్యాలను హృదయంలో పదిలపరచుకొనాలి.

**విశేషం:** జీవించుతఱిన్= చనిపోయి సాధించేదేమీ లేదు. ధర్మక్రియను చిత్తంలో చేర్చటమంటే సంకల్పరూపంలో ఉంచుకొనాలి. తదనుగుణంగా ఆచరించాలి - అని భావం.

**క. అది లేనివాఁడు నరకా। స్పదుఁ డగు నటుగాన ధర్మపరుఁ డగుటయ యొ**
**ప్పిదము మనుజునకు నేఁ జె। ప్పెద మఱియును వలయువానిఁ బ్రీతి నడుగుమీ'. 252**

**ప్రతిపదార్థం:** అది= ఆ ధర్మం; లేనివాఁడు= లేని వ్యక్తి; నరక+ఆస్పదుఁడు= నరకమనే తావు కలవాడు; అగున్= అవుతాడు; అటు= ఆ విధం; కాన= కనుక; మనుజునకున్= మనిషికి; ధర్మపరుఁడు= ధర్మమునందు మిక్కిలి శ్రద్ధ కలవాడు; అగుట+అ= కావటం; ఒప్పిదము= తగినది; మఱియున్= ఇంకా; వలయువానిన్= కావలసిన వాటిని; ప్రీతిన్= ప్రీతితో; అడుగుమీ= అడుగుము; నేన్= నేను; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** ధర్మం లేనివాడు నరకానికి పోతాడు. కనుక ధర్మపరుడు కావటమే మనిషికి మంచిది. ఇంకా నీకు కావలసిన వాటిని ప్రీతితో నడుగుము. నేను చెప్పుతాను'.

**వ. అనిన నజ్జనపతి 'శరీరంబు విడిచి చనియెడు జీవుని ధర్మం బె ట్లనుగమించు?' ననుటయు నయ్యాం గిరసుండు. 253**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+జనపతి= ఆ రాజు; శరీరంబు= దేహం; విడిచి= వదలి; చనియెడు జీవునిన్= వెళ్ళే జీవుడిని; ధర్మంబు= ధర్మం; ఎట్లు= ఏ విధంగా; అనుగమించున్?= వెంటనంటి పోతుంది? అనుటయున్= అనగా;; ఆ+అంగిరసుండు= ఆ బృహస్పతి.

**తాత్పర్యం:** అని చెప్పిన తరువాత ఆ ధర్మరాజు 'దేహం విడిచి వెళ్ళే జీవుడిని ధర్మం ఎట్లా అంటి వెళ్తుంది? అని అడిగాడు. అప్పుడు ఆ బృహస్పతి ఇట్లా చెప్పాడు.

**తే. 'భూత పంచక శక్తులు బుద్ధియును స। ధర్మకంబుగ జీవుతోఁ దగిలి యరుగు'**
**ననుడు 'రేతఃప్రకార మె?' ట్లనియె నృపతి;। యతని కిట్లని చెప్పె నయ్యమరమంత్రి. 254**

**ప్రతిపదార్థం:** భూతపంచక శక్తులు= భూతాల అయిదింటి శక్తులు; బుద్ధియును= బుద్ధీ; సధర్మకంబుగన్= ధర్మంతోపాటుగా; జీవుతోన్= జీవుడితో; తగిలి= వెంటబడి; అరుగున్= పోతాయి; అనుడున్= అన్నంతనే; నృపతి= రాజు; రేతస్+ప్రకారము= వీర్యం యొక్క పద్ధతి; ఎట్లు= ఏ విధము?; అనియెన్= అన్నాడు; ఆ+అమరమంత్రి= దేవతల మంత్రి అయిన ఆ బృహస్పతి; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'అయిదు భూతాల శక్తులు అయిన శబ్దస్పర్శ రూపరస గంధాలు, బుద్ధి, ధర్మం అనేవి కలిసి జీవుడిని అనుసరించి వెళ్తాయి' అనగా ధర్మరాజు రేతస్సు పద్ధతి ఏమిటి?' అని అడిగాడు. అప్పుడు బృహస్పతి అతడి కిట్లా చెప్పాడు.

**తే. దేహగత భూప్రభృతి పంచదేవతలును। మనసు నన్నసంతృప్తిఁ బొందిన నృపాల!**
**కల్గు రేతస్సు పురుషుండుఁ గామినియును। బొందఁగా నది గర్భత్వ మొందుఁ జువ్వె. 255**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా!; దేహగత భూ ప్రభృతి, పంచ దేవతలును= దేహంలో ఉన్న భూమి మొదలైన అయిదు దేవతలు; మనసున్= మనస్సూ; అన్న సంతృప్తిన్= అన్నంతో మిక్కిలి సంతృప్తిని; పొందినన్= పొందితే; రేతస్సు= 'వీర్యం' అనే పదార్థం; కల్గున్= ఏర్పడుతుంది; పురుషుండున్= మగవాడూ; కామినియును= స్త్రీయు; పొందఁగాన్= కలియగా; అది= ఆ రేతస్సు; గర్భత్వము= పిండం కావటం; ఒందున్= పొందుతుంది; చువ్వె= సుమా!

**తాత్పర్యం:** దేహంలో ఉన్న భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే అయిదు భూతాలూ, మనస్సు అనేవి అన్నంతో - నిండైన తృప్తిని పొందితే 'రేతస్సు' అనే పదార్థం కలుగుతున్నది. స్త్రీపురుషుల కలయికవలన అది గర్భంగా ఏర్పడుతుంది.

**విశేషం:** స్త్రీ అయినంత మాత్రాన గర్భం ఏర్పడదనీ ఆమె కామభావం కలిగి గర్భం ధరించే సామర్థ్యం కలిగినదై ఉండాలి అనే సూచన 'కామిని' అనే శబ్దంలో ఉన్నది. దీనిని బట్టి పురుషుడు కూడా 'కాముకుడు' అయి ఉండాలనే అర్థం సిద్ధిస్తున్నది.

**వ. అని చెప్పి మఱియును. 256**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి బృహస్పతి ఇంకా ఇట్లా అంటున్నాడు

**తే. 'పుణ్యపాపానుగుణభంగిఁ బుట్టి సౌఖ్య । దుఃఖమయ సంసరణమునఁ దొడరు నరుఁడు**
**వినుము కేవల ధర్మవర్తనసుఖైక । భాజనత నొందు ధర్మైకపరత మేలు. 257**

**ప్రతిపదార్థం:** నరుఁడు= జనుడు; పుణ్యాపాప+అనుగుణభంగిన్= పుణ్యమునకు, పాపమునకు తగిన విధంగా; పుట్టి= జనించి; సౌఖ్య, దుఃఖమయ సంసరణమునన్= సుఖంతో, దుఃఖంతో నిండిన సంసారంలో; తొడరున్= ప్రవేశిస్తాడు; వినుము; కేవల ధర్మవర్తనన్= అధర్మపు వాసనకూడా లేని ధర్మపు నడవడితో; సుఖ+ఏక, భాజనతన్= సుఖానికి మాత్రమే పాత్ర మవటాన్ని; ఒందున్= పొందుతాడు; ధర్మ+ఏక పరత= ధర్మమునందు మాత్రమే శ్రద్ధ కలిగి ఉండటం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** 'నరుడు పుణ్యానికి తగిన విధంగా సుఖమయ సంసారంలో ప్రవేశిస్తాడు. పాపాల కనుగుణంగా దుఃఖమయసంసారంలో ప్రవేశిస్తాడు. అట్లాకాక ధర్మప్రవర్తన మాత్రమే అవలంబిస్తే సుఖానికి మాత్రమే పాత్రమవుతాడు. కనుక ధర్మమునందు మాత్రమే శ్రద్ధ కలిగి ఉండటం మేలైన పని.

**విశేషం:** సృష్టిలో మానవప్రవృత్తిలో ఒక విచిత్రమైన స్థితి ఉంటుంది. పుణ్యఫలం కోరుకొంటాడు. పుణ్యం చేయటానికి ఇష్టపడడు. పాపఫలం వద్దంటాడు. పాపాలు మాత్రం చేస్తూ ఉంటాడు. అయితే ఇష్టానిష్టాలతో సంబంధం లేకుండా కర్మల కనుగుణంగా సుఖదుఃఖమయ సంసారం పొందక తప్పదు. సుఖదుఃఖాలు రెండూ అనిత్యాలే. నిత్యసుఖంకోసం ధర్మం మాత్రమే ఉన్న ప్రవృత్తిని పొందా లంటున్నారు శ్రీవ్యాసులు.

**క. జనవర! కృమిగర్దభముఖ । జననంబులఁ బొంది నరకసంవాసముఁ జెం**
**దు నధికపాపాత్ముండగు । మనుజుఁడు కర్మ సవిశేషమహిమఁ దెలిపెదన్. 258**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా! అధిక పాప+ఆత్ముండు= ఎక్కువ పాపాలలో నిండినవాడు; అగు మనుజుఁడు= అయిన నరుడు; కృమి, గర్ధభ, ముఖ, జననంబులన్= పురుగు, గాడిద మొదలైన పుట్టుకలను; పొంది; నరక సంవాసమున్= నరకంలో

నివసించటాన్ని; చెందును= చెందుతాడు; కర్మ సవిశేష మహిమన్= ఆయాకర్మల విశేషంతో కూడిన ఎక్కువతనాన్ని; తెలిపెదన్= తెలుపుతాను.

**తాత్పర్యం:** రాజా! ఎక్కువ పాపం హృదయంలో నిండినవాడు పురుగు, గాడిద మొదలైన పుట్టుకలతో నరకంలో నివాసం చేస్తాడు. కర్మల విశేషమహిమను తెలుపుతాను. వినుము.

**క. జననీజనక గురులయెడ । నొనరించిన మేలుఁ గీడు నొదవించు సుఖం**
**బునకును దుఃఖమునకు నిం । తని కొలఁది యిడన్ వశంబె యజునకు నైనన్? 259**

**ప్రతిపదార్థం:** జననీ జనక గురుల యెడన్= తల్లి, తండ్రి, గురువు - వీరి విషయంలో; ఒనరించిన మేలున్= చేసిన మంచిపనీ; కీడున్= అపచారమూ; ఒదవించు సుఖంబునకున్= కలిగించే సుఖానికీ; దుఃఖమునకున్= దుఃఖానికీ; కొలఁది= ప్రమాణము; ఇంత= ఈ మాత్రము; అని; ఇడన్= పెట్టటం; అజునకున్= బ్రహ్మకు; ఐనన్= అయినా; వశంబు+ఎ?= సాధ్యమా?

**తాత్పర్యం:** తల్లిదండ్రుల విషయంలో గురువు విషయంలో చేసిన మేలు కూర్చే సుఖానికీ, కీడు కూర్చే దుఃఖానికి కొలత ఇంత అని చెప్పటం బ్రహ్మకైనా సాధ్యమా?

**క. మాతృపితృగురులు దక్కఁగ । నే తెరువునః బాప మొలసె నేనియు దానిం**
**బాతురు ప్రాయశ్చిత్త । స్ఫీతులు దద్విషయమైనఁ జెడ దల్పములన్. 260**

**ప్రతిపదార్థం:** మాతృపితృ గురులు= తల్లీ, తండ్రీ, గురువూ; తక్కఁగన్= కాక; ఏ తెరువునన్= ఏ దారిలోనైనా; పాపము= పాపం; ఒలసెన్ ఏనియున్= కలిగినట్లయితే; దానిన్= దానిని; ప్రాయశ్చిత్త స్ఫీతులు= ప్రాయశ్చిత్తం చేత పుష్టి పొందినవారు; పాతురు= తొలగించుకొంటారు; తద్+విషయము= తల్లి, తండ్రి, గురువు అనేవారి సంబంధం కలది; ఐనన్= అయితే; అల్పములన్= తక్కువవాటిచేత; చెడదు= నశింపదు.

**తాత్పర్యం:** తల్లి, తండ్రి, గురువు అనేవారుకాక తక్కిన ఏ విషయంలోనైనా పాపం కలిగితే తగిన విధమైన ప్రాయశ్చిత్తం చేసికొని పోగొట్టుకొంటారు. వారి విషయంలో మాత్రం పాపం సులభంగా పోదు.

**విశేషం:** ప్రాయశ్చిత్తం - తెలియక చేసిన తప్పును పరిహరించుకొనే వ్రతమూ, దానమూ మొదలైనవి.

**క. కొలు చపహరించు నన్నరుఁ । డెలుకయుఁ బందియును నైన యీ దుర్జననం**
**బులఁ బొందు నంతఁ బాపము । వొలియక యాతనికిఁ గుక్కపుట్టువుఁ గల్గున్. 261**

**ప్రతిపదార్థం:** కొలుచు= ధాన్యము; అపహరించు+ఆ+నరుఁడు= దొంగిలించే ఆ మనిషి; ఎలుకయున్= ఎలుకా; పందియునున్= పందీ; ఐన ఈ దుర్జననంబులన్= అయిన ఈ పాడు పుట్టుకలను; పొందున్= పొందుతాడు; అంతన్= దానితో; పాపము= పాపం; పొలియక= నశించక; అతనికిన్= వాడికి; కుక్కపుట్టువున్= కుక్కపుట్టుకకూడా; కల్గున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ధాన్యం దొంగిలించిన మనిషి ఎలుక, పంది మొదలైన పుట్టుకలు పొందుతాడు. దానితో పాపం పోక, అతడికి కుక్క పుట్టుక కలుగుతుంది.

**క. పరదారగమన దోషము । వరుసన వృకకంక గృధ్ర వలిముఖ శవభు**
**క్తిరతంబులైన భవములఁ । బొరయించుం గృమియుఁగాఁగఁ బుట్టించుఁ దుదిన్. 262**

**ప్రతిపదార్థం:** పరదార గమన దోషము= ఇతరుల ధర్మపత్నులను పొందటం అనే పాపం; వరుసన్+అ= క్రమంగా; వృక= తోడేలు; కంక= రాబందులు; గ్రద్ధ= గ్రద్దలు; వలిముఖ= కోతుల; శవభుక్తి= శవాలను తినటంలో; రతములు= ప్రీతి కలవి; ఐన భవములన్= అయిన పుట్టుకలను; పొరయించున్= కలిగిస్తుంది; తుదిన్= కడకు; కృమియున్= బురదలో తిరుగు పురుగు; కాఁగన్= అయ్యేటట్లుగా; పుట్టించున్= పుట్టిస్తుంది.

**తాత్పర్యం:** పరులభార్యలను పొందటం అనే పాపం తోడేలు, రాబందు, గ్రద్ద, కోతి, శవాల తిండి యందు ప్రీతిగల జంతువు పుట్టుకలను కలిగిస్తుంది. చివరకు పురుగు పుట్టుక కూడా పొందిస్తుంది.

**సీ. తనయ నొక్కని కిచ్చి మనసు మరలఁబడి । యన్యున కిచ్చిన యట్టివాఁడు**
**కృమియగు; దేవకార్యము సేసి మఱి పైతృ । కంబు సేయక భోజనంబు సేయు**
**నతఁడు కాకం బగు; నన్నఁ దిట్టినఁ గ్రౌంచ । మై పుట్టు; బ్రహ్మకులాభిజాతఁ**
**గవసి శూద్రుఁడు నరకపుగుంట పుర్వగు । నంతకు కింకరు లంటఁ బట్టి**

**తే. కట్టికొనిపోయి కోసియుఁ గాల్చియును గృ తఘ్ను నుగ్రకంటక సముదయము మీఁదఁ**
**క్రంద నదిమియు మఱియు దుఃఖములఁ బెట్టు । తెఱఁగు లెన్ని యన్నింటను బఱతు రధిప! 263**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; తనయన్= కూతురిని; ఒక్కనికిన్= ఒకవ్యక్తికి; ఇచ్చి= దానం చేసి (కన్యాదానం చేసి); మనసు= మనస్సు; మరలఁబడి= తిరుగబడి; అన్యునకున్= మరియొకనికి; ఇచ్చిన+అట్టివాఁడు= ఇచ్చిన వ్యక్తి; కృమి= పురుగు; అగున్= అవుతాడు; దేవకార్యము= దేవతల ఆరాధనము; చేసి= ఆచరించి; మఱి= అటుపైన; పైతృకంబు= పితృకార్యం; చేయక= కావించక; భోజనంబు+చేయు+అతఁడు= భోజనం చేసేవాడు; కాకంబు= కాకి; అగున్= అవుతాడు; అన్నన్= అన్నను; తిట్టినన్= నిందిస్తే; క్రౌంచము= క్రౌంచమనే పక్షి; ఐ= అయి; పుట్టున్= జన్మిస్తాడు; బ్రహ్మ కుల+అభిజాతన్= బ్రాహ్మణకులంలో చక్కగా పుట్టిన స్త్రీని; కవసి= కూడి; శూద్రుఁడు= నాల్గవ కులంవాడు; నరకము+గుంటపుర్వు= నరకం అనే గుంటలోని క్రిమి; అగున్= అవుతాడు; కృతఘ్నున్= చేసిన మేలును మరచేవాడిని; అంతకు కింకరులు= యముడి భటులు; అంటన్ పట్టి= గట్టిగా పట్టుకొని; కట్టికొనిపోయి= కట్టివైచి తీసికొనిపోయి; కోసియున్= ముక్కలుగా చేసి; కాల్చియును= మంటలలో మాడ్చివైచి; ఉగ్ర కంటక సముదయముమీఁదన్= భయంకరమైన ముండ్ల మొత్తాల మీద; క్రందన్= కందిపోయే విధంగా; అదిమియున్= నొక్కిపెట్టి; మఱియున్= ఇంకా; దుఃఖములన్= కష్టాలను; పెట్టు; తెఱఁగులు= పెట్టే పద్ధతులు; ఎన్ని= ఎన్నికలవో; అన్నింటను= అన్నింటిచేతను; పఱతురు= బాధిస్తారు.

**తాత్పర్యం:** రాజా! ముందు ఒకడికి బిడ్డను కన్యాదానం చేసి, మనస్సు త్రిప్పుకొని మరొకడికి ఇచ్చేవాడు పురుగు అవుతాడు. దేవతారాధన చేసి పితృకార్యం చేయకుండా భోజనం చేసేవాడు కాకిగా పుట్టుతాడు. అన్నను నిందిస్తే క్రౌంచపక్షి అవుతాడు. బ్రాహ్మణస్త్రీని పొందిన శూద్రుడు నరకమనే గుంటలో పురు గవుతాడు. కృతఘ్నుడిని యమకింకరులు గట్టిగా పట్టి కట్టి కోసి కాల్చి, ఘోరమైన ముండ్లకంపలమీద వేసి నొక్కి ఇంకా బాధలు పెట్టే తీరు లెన్నో అన్నింటిచేతా పీడిస్తారు.

**క. ధనవాంఛ నిరాయుధుఁ జం । పిన గాడిద మొదలు గాఁగఁ బెక్కులు తిర్య**

**గ్జననంబులఁ బొందును శ । స్త్ర నిహతిఁ దోడ్తోడ మరణదశ వాటిల్లున్. 264**

**ప్రతిపదార్థం:** ధనవాంఛన్= ధనంమీద కోరికతో; నిరాయుధున్= ఆయుధం లేనివాడిని; చంపినన్= చంపితే; గాడిద మొదలు కాఁగన్= గాడిద మొదలైన; పెక్కులు= ఎక్కువ సంఖ్యగల; తిర్యక్+జననంబులన్= పశువులు, పక్షులు మొదలైన పుట్టుకలను; పొందును= పొందుతాడు; శస్త్రనిహతిన్= ఆయుధాల దెబ్బచేత; తోడు+తోడన్= మీదమీద; మరణదశ= చావు; పాటిల్లున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ధనం మీద ఆశతో ఆయుధం లేనివాడిని చంపితే గాడిద మొదలయిన నీచజంతువుల, పక్షుల పుట్టుకలు ఎన్నో వస్తాయి. మాటిమాటికి ఆయుధపు దెబ్బతో చావు కలుగుతూ ఉంటుంది.

**ఆ. ఆఁడుదానిఁ జంపినతఁ డేక వింశతి । దూష్య నరకవాసదుఃఖ మొందు**

**నన్నదధిపయోఘృతాపూపహరణముల్ । మక్షికాదికీటమయత సేర్చు. 265**

**ప్రతిపదార్థం:** ఆఁడుదానిన్= అబలను; చంపిన+అతఁడు= చంపినవాడు; ఏకవింశతి దూష్య నరక వాస దుఃఖము= ఇరవైయొక్క సంఖ్య గల నీచమైన నరకాలలో ఉండటం అనే దుఃఖాన్ని; ఒందున్= పొందుతాడు; అన్న= అన్నము; దధి= పెరుగు; పయస్= పాలు; ఘృత= నేయి; అపూప= భక్ష్యాలు అనేవాటి; హరణముల్= దొంగిలింతలు; మక్షికా+ఆది కీటమయతన్= ఈఁగ మొదలైన నీచపు పురుగులయ్యే దశలోనికి; చేర్చున్= చేరుస్తాయి.

**తాత్పర్యం:** స్త్రీని చంపితే ఇరవై ఒక్క విధాల నరకాలలో ఉండే దుఃఖం కలుగుతుంది. అన్నము, పెరుగు, పాలు, నెయ్యి, తినుబండారాలు అనే వాటి దొంగతనాలు ఈఁగ మొదలైన పురుగుల పుట్టుకలలో చేరుస్తాయి.

**విశేషం:** ఏకవింశతి నరకాలు - తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రవనము, తాపనము.

**ఆ. ఫలము నినుము వెండిఁ బసిఁడి మ్రుచ్చిలికొన్నఁ । గ్రోఁతి వాయసంబు గ్రువ్వ నీచ**

**కృమియు నగు సదంబరము హరించిన శశ । జనన మొందు నరుఁడు మనుజనాథ! 266**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; నరుఁడు= మానవుడు; ఫలమున్= పండును; ఇనుమున్= ఇనుమును; వెండిన్= వెండిని; పసిఁడిన్= బంగారాన్ని; మ్రుచ్చిలికొన్నన్= దొంగిలిస్తే; క్రోఁతి= కోతి; వాయసంబు= కాకి; గ్రువ్వ= పావురము; నీచ కృమియున్= తక్కువజాతి పురుగూ; అగున్= అవుతాడు; సత్+అంబరమున్= మంచి వస్త్రమును; హరించినన్= ఎత్తుకొనిపోతే; శశజననము= కుందేటి పుట్టువును; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజా! నరుడు పండు, ఇనుము, వెండి, బంగారం అనే వాటిని దొంగిలిస్తే వరుసగా కోతి, కాకి, గువ్వ, పురుగు అనే జన్మలు పొందుతాడు. ఇతరుల బట్టలను అపహరిస్తే కుందేలుగా పుట్టుతాడు.

**విశేషం:** 'సదంబరము' - చినిగిన పాతలు బయట పారవేస్తే అవసరానికి వాటిని వాడుకొనటం తప్పుకాదని భావం.

**తే. నమ్మి యిల్లడవెట్టిన సొమ్ముఁ గొనిన । మీను లోనగు నీచపు యోనులందుఁ**

**బుట్టు; గంధవస్తువులు గొన్నట్టివాఁడు । వినుము మఱు పుట్టువునఁ జుంచుతనము నొందు. 267**

**ప్రతిపదార్థం:** నమ్మి= విశ్వాసం ఉంచి; ఇల్లడ+పెట్టిన సొమ్మున్= తనవద్ద దాచి ఉంచిన సొమ్మును; కొనినన్= తనది చేసికొంటే; మీను= చేప; లోనగు+నీచము+యోనులందున్= మొదలైన నీచపు కడుపులలో; పుట్టున్= పుట్టుతాడు; వినుము; గంధవస్తువులు= సుగంధ ద్రవ్యాలను; కొన్న+అట్టివాఁడు= దొంగిలించేవాడు; మఱుపుట్టువునన్= మరుసటి జన్మలో; చుంచుతనము= చుంచు కావటాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** తనయందు నమ్మకం ఉంచి ఇతరులు దాచుకొన్న సొమ్మును అపహరిస్తే చేప మొదలైన నీచజన్మలు కలుగుతాయి. పరిమళద్రవ్యాలను దొంగిలిస్తే కంపెలుక అవుతాడు.

**తే. వనిత లీపాపములు సేసి వానివాని । పత్నులై జనియింతురు; పాపభీతిఁ**

**దెరువు తప్పక నడచిన నరులు సౌఖ్య । మందుదురు రెండు లోకంబు లందు నధిప!' 268**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వనితలు= స్త్రీలు; ఈ పాపములు= పైన చెప్పిన పాపాలను; చేసి= చేసిన కారణంగా; వానివాని పత్నులు= పైన చెప్పిన నీచజన్మలు కలవారి భార్యలు; ఐ= అయి; జనియింతురు= పుట్టుతారు; పాపభీతిన్= పాపంవలన భయంతో; తెరువు= మంచిమార్గం; తప్పక= తప్పకుండా; నడచిన నరులు= ప్రవర్తించిన మనుష్యులు; రెండు లోకంబులందున్= ఈ లోకము, పరలోకము అనే రెండు లోకాలలో; సౌఖ్యము= సుఖాన్ని; అందుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** స్త్రీలు పైన పేర్కొన్న పాపాలను చేస్తే పురుషులు చేసిన పాపాల ఫలితాలుగా చెప్పిన నీచజన్మల వారి భార్యలై పుట్టుతారు. పాపం కలుగుతుందన్న భయంతో ధర్మమార్గం తప్పకుండా నడచుకొన్నవారు ఇహపరలోకాలలో సుఖాన్ని అనుభవిస్తారు.'

**విశేషం:** ఇక్కడ తెరువు అనగా ధర్మశాస్త్రం నిర్ణయించిన పద్ధతి.

**వ. అని చెప్పి యిట్లనియె; 'నేనుం గొన్ని తెఱఁగు లెఱింగించితి మఱియు ననేక పదార్థాపహరణంబులకు బహువిధంబులగు ఫలంబులు వాటిల్లు వాని నెల్లను శాస్త్రాంతరశ్రవణంబున నెఱింగెదు గాక' యనిన విని యక్కురుపతి బృహస్పతితోఁ 'బాపంబులం బాపికొనుతెఱం గెఱింగింపవే' యనుటయు నతం డతని కిట్లనియె. 269**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= తెలిపి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; నేనున్= నేను; కొన్ని తెఱఁగులు= కొన్ని పద్ధతులను; ఎఱింగించితిన్= తెలిపాను; మఱియున్= ఇంకా; అనేక పదార్థ+అపహరణంబులకున్= పెక్కు వస్తువుల దొంగతనాలకు; బహువిధంబులు= పెక్కుతీరులు; అగు= అయిన; ఫలంబులు= శిక్షలుగా అయ్యే ఫలాలు; వాటిల్లున్= కలుగుతాయి; వానిన్= వానిని; ఎల్లను= అన్నింటినీ; శాస్త్ర+అంతర శ్రవణంబునన్= వేరుశాస్త్రాల వినికిడిచేత; ఎఱింగెదు కాక= తెలిసికొంటావు; అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+కురుపతి= ఆ కురురాజు యుధిష్ఠిరుడు; బృహస్పతితోన్= దేవమంత్రి అయిన బృహస్పతితో; పాపంబులన్= ఈ దోషాలను; పాపికొనుతెఱంగు= పోగొట్టుకొనే దారి; ఎఱింగింపవే= దయచేసి తెలుపుమా!; అనుటయున్= అన్నంతనే; అతండు= ఆ బృహస్పతి; అతనికిన్= ఆ ధర్మరాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** బృహస్పతి ఇట్లా చెప్పి ఇంకా ఈ విధంగా అన్నాడు. 'నేను కొన్ని తీరులను తెలిపాను. ఇంకా అనేక వస్తువుల దొంగతనాలకు కలిగే ఫలాలు పెక్కుతీరులలో ఉన్నాయి. వాటి నన్నింటినీ ఇతర శాస్త్రాలను వినటం ద్వారా నీవు తెలిసికొందువుగాక!' అనగా విని ధర్మరాజు బృహస్పతితో 'ఈ పాపాలను పోగొట్టుకొనే విధం తెలుపవూ!' అని అడిగితే అత డతడితో ఇట్లా అన్నాడు.

**క. విను దానంబులఁ బాపము । లనఘా! చెడు దానములకు నన్నిటికిని స**

**జ్జన సేవ్య! యన్నదానము । ముును లధికం బండ్రు పాపములఁ బాపునెడన్. 270**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; విను= ఆలకించుము; పాపములు= చెడుపనుల దోషాలు; దానంబులన్= దానాలతో; చెడున్= నశిస్తాయి; సత్+జన సేవ్య= ఉత్తమ జనులచేత సేవించబడేవాడా!; మునులు= జ్ఞానసంపన్నులు; పాపములన్= పాపాలను; పాపు+ఎడన్= పోగొట్టే విషయంలో; అన్నదానము= అన్నం పెట్టటం; దానములకున్= దానాలకు; అన్నిటికిన్= అన్నింటికీ; అధికంబు= మిన్న అయినది; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా!; పాపాలు దానాలతో నశిస్తాయి. పాపాలను పోగొట్టే విషయంలో అన్ని దానాలకంటె అన్నదానం గొప్పదని ముును లంటారు.

**విశేషం:** ధర్మరాజు హృదయంలో 'నేను యుద్ధంలో ఎందరిచావుకో కారణమయ్యాను. ఆ పాపాల చెడు ఫలితాలు నాకు కలుగుతాయా' అన్న శంక ప్రశ్నలో అభివ్యక్తం అవుతున్నది. దానిని తొలగించటం కొరకు 'అనఘా! సజ్జనసేవ్య!' అనే రెండు సంబోధనలను చిన్న పద్యంలో తిక్కన నిక్షేపించాడు.

అన్నదానం గొప్పది. దీనికి రెండు కారణాలను మనం భావించవచ్చును. 1. ఏ ఇతర దానంలోనూ 'చాలు' అనే మాట ఉండదు. అన్నదానం ఒక్కటే 'చాలు' అనిపించే దానం. 2. అన్నం శరీరాన్ని పోషిస్తుంది. శరీరం మొదటి ధర్మసాధనం. ('శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అంటాడు కాళిదాసు). దానాలు పాపాలను ఎట్లా పోగొట్టగలవు? - అని కొందరు శంకిస్తారు. పాపం స్వార్థపు ముద్దుబిడ్డగదా! దానం స్వార్థాన్ని రూపుమాపుతుంది కదా! ఆ విధంగా దానం పాపనాశకం అవుతుంది.

**క. న్యాయార్జిత మగు నన్నము । వేయింటికిఁ బెట్టవలయు విప్రజనము హ**

**ర్షాయత్తంబుగ దానం । బాయని పాపములు గలవె? పౌరవముఖ్యా! 271**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశం వారిలో ఉత్తముడా!; న్యాయ+ఆర్జితము= ధర్మమార్గంతో సంపాదించినది; అగు+ అన్నమున్= అయిన అన్నాన్ని; వేయింటికిన్= వేయి సంఖ్యగల వారికి; విప్రజనము= వేదవిద్యలు నిండుగా గల జనం; హర్ష+ ఆయత్తంబుగన్= ఆనందానికి వశమయ్యే విధంగా; పెట్టవలయున్= పెట్టాలి; దానన్= దానిచేత; పాయనిపాపములు= నశించని పాపాలు; కలవె?= ఉన్నాయా?

**తాత్పర్యం:** ధర్మరాజా! ధర్మమార్గంలో సంపాదించిన అన్నాన్ని వేయిమంది విద్వజ్జనులు పరమానందం పొందే విధంగా పెట్టాలి. దానితో పోని పాపాలు ఉంటాయా?

**విశేషం:** తాను కష్టపడి ధర్మమార్గంలో సంపాదించిన అన్నమే సత్పాత్రమందు చేరినదై సత్ఫలితాన్నిస్తుందనే హెచ్చరిక న్యాయార్జితము, విప్రజనము మొదలైన పదాలలో గుట్టుగా ఉన్నది.

**తే.** **తిరిసి యేనియు నన్నంబు దెచ్చి శిథిలు । లైన విప్రుల యాఁకలి నపహరించు**
**పురుషుఁ డూర్ధ్వలోకంబుల పురుషవరుల । కర్చనీయుఁడై వెలుఁగుచు నంద యుండు. 272**

**ప్రతిపదార్థం:** తిరిసి, ఏనియున్= బిచ్చమెత్తి అయినా; అన్నంబు= అన్నాన్ని; తెచ్చి= సాధించి; శిథిలులు= బక్కచిక్కినవారు; ఐన విప్రుల ఆఁకలిన్= అయిన విద్వాంసుల ఆకలిని; అపహరించు పురుషుఁడు= తీర్చే మనుష్యుడు; ఊర్ధ్వలోకంబుల పురుష వరులకున్= పైనున్న పుణ్యలోకాలయందలి జనులకు; అర్చనీయుఁడు= పూజించదగినవాడు; ఐ= అయి; వెలుఁగుచున్= ప్రకాశిస్తూ; అందున్+అ= అక్కడనే; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** బిచ్చ మెత్తి అయినా అన్నం సంపాదించి, బ్రదుకుచెడిన విద్యావంతులైన వారి ఆకలి తీర్చేవాడు పైన ఉత్తమలోకాలలో ఉన్న పురుషశ్రేష్ఠులకు మన్నించదగినవాడై అక్కడనే శాశ్వతంగా ఉంటాడు.

**విశేషం:** శిథిలులు - శరీరసౌష్ఠవమూ, సంపద సౌష్ఠవమూ రెండూ చెడినవారు, విప్రులు - విద్యయా యాతి విప్రత్వం. జ్ఞానదాయకమైన విద్యనేర్చి, ఇతరులకు అందించే పుణ్యాత్ములు విప్రులు. అంద - అందే అవధారణార్థకంచేత శాశ్వతంగా అనే అర్థం సిద్ధిస్తుంది.

**క.** **వేదాధ్యయనార్థ ప్రతి । పాదనమున విప్రవరుఁడు బ్రహ్మ విషయ స**
**ద్భూదానంబుల నరపతి । యే దురితము లైనఁ గౌరవేశ్వర! పాచున్. 273**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వర!= కురువంశ ప్రభూ!; విప్రవరుఁడు= విప్రులలో శ్రేష్ఠుడైనవాడు; వేద+అధ్యయన అర్థ ప్రతిపాదనమునన్= వేదం పఠించటం, అర్థాన్ని ఇతరులకు తెలపటం అనే క్రియతోను; నరపతి= రాజు; బ్రహ్మ విషయ సత్+భూదానంబులన్= బ్రాహ్మణుడి విషయంలో చక్కని భూమిని దానంచేసే పనులచేత; ఏ దురితములు= ఎట్టి పాపాలను; ఐనన్= అయినా; పాచున్= పోగొట్టుకొంటారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! బ్రాహ్మణుడు వేదం అధ్యయనం చేయటం, అర్థజ్ఞానాన్ని లోకానికి సమర్పించటం అనే పనిచేతా, రాజు అటువంటి విద్యావంతులకు మంచి భూమిని ఇవ్వటంఅనేపనిచేతా ఎటువంటి పాపాలనైనా పోగొట్టు కొంటారు.

**విశేషం:** భారతీయ ఋషిధర్మంలో బ్రహ్మక్షత్రియ వర్ణాల బాధ్యత ఎంతో బరువైనది. వారు సుస్థితిలో ఉంటే తక్కిన జనాలందరినీ పరిరక్షించగల వారవుతారు. "లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు" అనే ఆశంసలోని తాత్పర్యం ఇదే.

**తే.** **నేర్చి యలజడిఁ బడిన వాణిజ్య విధులఁ బడసి వైశ్యుఁ డన్నంబిడి పడయు సుగతి**
**చచ్చునంతలు వడి సిరి దెచ్చికొని చ । తుర్థులన్నంబు వెట్టి కాంతురు దివంబు. 274**

**ప్రతిపదార్థం:** వైశ్యుండు= కోమటి; నేర్చి= చక్కని నేర్పు కలిగి; అలజడిన్= ఆపదలో; పడిన వాణిజ్యవిధులన్= పడినట్టి వర్తకపు పనులయందు; పడసి= సంపాదించి; అన్నంబు= భోజనంబు; ఇడి= పెట్టి; సుగతిన్= మంచి గతిని; పడయున్= పొందుతాడు; చచ్చు+అంతలు= ప్రాణం పోయే అంతలుగా; పడి= పాట్లుపడి; సిరిన్= సంపదను; తెచ్చికొని= సంపాదించి; చతుర్థులు= నాలుగవ జాతివారు; అన్నంబు+పెట్టి= అన్నం పెట్టి; దివంబున్= స్వర్గాన్ని; కాంతురు= పొందుతారు.

**తాత్పర్యం:** వైశ్యుడు చక్కని నేర్పుతో ఆపదలందు చిక్కుకొన్న వర్తకపు పనులతో సంపాదించి అన్నంపెట్టి సుగతికి చేరుతాడు. ప్రాణాంతకమైన పాట్లుపడి ధనం సంపాదించి శూద్రులు అన్నదానం చేసి స్వర్గం చేరుకొంటారు.

**విశేషం:** అలజడిఁబడిన వాణిజ్యవిధులు - వర్తకం చాలా గందరగోళమైన వృత్తి. ఏ క్షణంలో నష్టం వచ్చి ఉన్నదంతా ఊడ్చుకొని పోతుందో ఎవరూ చెప్పలేరు. ఆ విధంగా మనస్తాపం కలిగించే వృత్తిలో సంపాదించి కూడా అన్నదానం చేయాలని భావన. అట్లాగే శూద్రుడు శుశ్రూషాపరుడై ఒక్కొక్క సమయంలో ప్రాణాలకు కూడా తెగించి పనులు చేయవలసి వస్తుంది. అయినా అన్నదానం చేయాలి - అని బోధ.

**తే. దివము వంధ్యంబు గాకుండఁ దివిరి యన్న। పానదానంబు లొదవిన భంగిఁ జేసి**

**మఱి భుజించుటఁ బోలెడు మహితధర్మ। కార్య మొండొకఁ డెందును గలదె యరయ.' 275**

**ప్రతిపదార్థం:** దివము= స్వర్గం; వంధ్యంబు= వట్టిపోయినది; కాక+ఉండన్= కాకుండా; తివిరి= ప్రయత్నించి; అన్నపాన దానంబులు= అన్నం, నీరు అనే దానాలు; ఒదవిన భంగిన్= సాధ్యమైన తీరులో; చేసి; మఱి= ఆ పిమ్మట; భుజించుటన్= తినటాన్ని; పోలెడు మహిత ధర్మ కార్యము= పోలే గొప్ప ధర్మమైన పని; ఒండు+ఒకఁడు= మరొకటి; ఎందును= ఎక్కడైనా; అరయన్= పరికింపగా; కలదు+ఎ?= ఉన్నదా?

**తాత్పర్యం:** స్వర్గం వట్టిపోకుండా గట్టి ప్రయత్నంచేసి, తన కున్నంతలో అన్నపానాలు దానంచేసి తినటం అనే దానితో సాటికి వచ్చే సమున్నత ధర్మకార్యం మరొకటి ఎంత వెదకినా ఉంటుందా?

**విశేషం:** స్వర్గం వట్టిపోవటమంటే అక్కడకు వెళ్ళే పుణ్యాత్ములు లేకపోవటం. అన్నదానం మెండుగా చేసినవారు స్వర్గాన్ని వట్టిపోకుండా చేస్తారని భావం.

**తే. అన్నదానంబు ధర్మంబు లన్నిటికిని। ముఖ్య మింత యెఱుఁగు కురుముఖ్య!' యనుడు**

**ననిమిషాధిప మంత్రికి నమ్మహీశుఁ। డిట్లనియె భక్తి వినయంబు లెసక మెసఁగ. 276**

**ప్రతిపదార్థం:** కురుముఖ్య!= కౌరవశ్రేష్ఠా!; అన్నదానంబు= అన్నం పెట్టటం; ధర్మంబులు= ధర్మాలు; అన్నిటికిని= అన్నింటికీ; ముఖ్యము= ప్రధానము; ఇంత= ఈ మాత్రం; ఎఱుఁగు= తెలిసికొనుము; అనుడున్= అనినంతనే; అనిమిష+అధిప మంత్రికిన్= దేవతల రాజు అయిన దేవేంద్రుడి మంత్రి బృహస్పతికి; ఆ+మహీ+ఈశుఁడు= ఆ రాజు; భక్తి వినయంబులు= భక్తి, వినయము అనేవి; ఎసక మెసఁగన్= ఎక్కువ కాగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కురువరా! అన్నదానం ధర్మాలన్నింటికీ ముఖ్యమైనది. ఈ మాత్రం తెలిసికొనుము' అనగా ధర్మరాజు భక్తివినయాలు పెంపొందుతూ ఉండగా బృహస్పతితో ఇట్లా అన్నాడు.

**క. 'ధ్యానం బింద్రియవృత్తుల। మానించు టహింస గురుసమర్చన విధి ని**

**త్యానుష్ఠానము దప మను। వీనఁ బరమసేవ్య మెద్ది వినఁగా వలతున్. 277**

**ప్రతిపదార్థం:** ధ్యానంబు= మనస్సును ఏకాగ్రం చెయ్యటం; ఇంద్రియవృత్తులన్= ఇంద్రియాల తిరుగుళ్ళను; మానించుట= నిలవరించటం; అహింస= ఇతర జీవులను పీడించకుండటం; గురు సమర్చన విధి= గురువులను పూజించటమనే పని;

నిత్య+అనుష్ఠానము= ప్రతిదినము దేవతార్చనాదులను శ్రద్ధతో చేయటం; తపము= తపస్సు; అను వీనన్= అనే వీనియందు; పరమ సేవ్యము= మిక్కిలి గొప్పగా సేవింపదగినది; ఎద్ది= ఏది?; వినఁగాన్+వలతున్= వినగోరుతున్నాను.

**తాత్పర్యం:** 'ధ్యానం, ఇంద్రియ నిగ్రహం, అహింస, గురువులను ఆరాధించటం, నిత్యకర్మములను శ్రద్ధతో ఆచరించటం, తపస్సు - అనే వీటిలో మిక్కిలి గొప్పగా సేవింపదగిన దేదో వినగోరుతున్నాను.

**వ. వినిపింపు' మనిన నమ్మహాత్ముండు. 278**

**ప్రతిపదార్థం:** వినిపింపుము= చెప్పుము; అనినన్= అంటే; ఆ+మహాత్ముండు= దొడ్డబుద్ధి గల ఆ బృహస్పతి.

**తాత్పర్యం:** నాకు తెలియజెప్పుము' అనగా దొడ్డబుద్ధి గల ఆ బృహస్పతి (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఈ యాఱును మంచి తెరువు । లై యుండు నహింస యున్నయైదిటికిఁ బవి**
**త్రాయతన మట్లు గాకయు । నేయుత్తమధర్మములను నిది వెలిఁగించున్.' 279**

**ప్రతిపదార్థం:** ఈ+ఆఱును= ఈ ఆరూ కూడా; మంచి తెరువులు= మంచిదారులు; ఐ= అయి; ఉండున్= ఉంటాయి; అహింస= అన్యులను పీడించకుండా ఉండటం; ఉన్న ఐదిటికిన్= మిగిలిన అయిదింటికీ; పవిత్ర+ఆయతనము= పవిత్రమైన స్థానము; అట్లు కాకయున్= అంతేకాకుండా; ఏ+ఉత్తమధర్మములను= ఏ గొప్ప ధర్మాలనైనా, ఇది= ఈ అహింస; వెలిఁగించున్= ప్రకాశింపజేస్తుంది.

**తాత్పర్యం:** ఈ ఆరూ మంచి దారులే. అహింస తక్కిన అయిదింటికీ పవిత్రమైన స్థానం. అంతే కాదు. అహింస ఏ ఉత్తమధర్మాలనైనా ప్రకాశింపజేస్తుంది.

**విశేషం:** 'అహింసా పరమో ధర్మః' అని సూక్తి. మరొకదానిని హింసించటమంటే పరమాత్మను హింసించటమే. ఎందుకంటే పరమాత్మ అన్నింటియందు ఏకరూపంలో ఉన్నాడు కదా!

**వ. అని పలికి యామంత్రణంబు సేసి వాసవమంత్రి యమరనగరంబునకుం జనియెఁ; దదనంతరంబ. 280**

**ప్రతిపదార్థం:** అని; పలికి= మాట్లాడి; ఆమంత్రణంబు+చేసి= వెళ్ళి వస్తానని చెప్పి; వాసవమంత్రి= దేవేంద్రుడి మంత్రి= బృహస్పతి; అమరనగరంబునకున్= దేవతల నగరం అయిన అమరావతికి; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** బృహస్పతి ఇట్లా చెప్పి వీడ్కోలు మాటలు పలికి దేవతల నగరానికి వెళ్ళాడు. ఆ తరువాత.

**ఆ. ధర్మనందనుఁడు పితామహుతో 'సర్వ । దేవతలును భూమి దేవతలును**
**మునివరులు నహింస గొని యాడుదురు దాని । తెఱఁగు సెప్ప నాకుఁ దేటపడఁగ.' 281**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుఁడు= ధర్మునిపుత్రుడు - యుధిష్ఠిరుడు; పితామహుతోన్= తాతతో; సర్వదేవతలును= అందరు దేవతలునూ; భూమిదేవతలును= భూమియందు ఉన్న దేవతలైన బ్రహ్మజ్ఞానసంపన్నులూ; మునివరులున్= మునులలో శ్రేష్ఠులైనవారూ; అహింసన్= అహింసను; కొనియాడుదురు= గొప్పగా చెప్పుతారు; దాని తెఱఁగు= దాని పద్ధతి; నాకున్= నాకు; తేటపడఁగన్= తెల్లం అయ్యే విధంగా; చెప్పు= బోధించుము.

**తాత్పర్యం:** అప్పుడు ధర్మరాజు తాతతో ఇట్లా అన్నాడు. 'దేవతలు అందరూ, అట్లాగే భూమిలోని దేవతలైన బ్రాహ్మణులు, మునిశ్రేష్ఠులూ అహింసను ప్రశంస చేస్తూ ఉంటారు. దాని సంగతి నాకు స్పష్టమయ్యే విధంగా బోధించుము.'

**వ. అనుటయు నమ్మహనీయుం డమ్మనుజపతిం బరమాదరంబున నాలోకించి. 282**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఆ+మహనీయుండు= దొడ్డవ్యక్తి అయిన ఆ భీష్ముడు; ఆ+మనుజపతిన్= ఆ రాజును; పరమ+ఆదరంబునన్= మిక్కిలి ప్రీతితో; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అన్నంతనే ఆ మహానుభావుడు భీష్ముడు ఆ రాజును మిక్కిలి ప్రీతితో చూచి (తరువాతి పద్యంతో అన్వయం.

### భీష్ముఁడు ధర్మజునకు నహింసాస్వరూప నిరూపణంబు సేయుట (సం.13-176-6 (కుంభ))

**ఆ. 'దంతియడుగు లోనఁ దక్కిన జంతుచ। యంబు నడుగు లెల్ల నడఁగి యుండు**
**నట్ల ధర్మకోటు లన్నియు లోనగు। నిద్ధగుణ! యహింస కింత నిజము. 283**

**ప్రతిపదార్థం:** ఇద్ధగుణ!= మిక్కిలి ప్రకాశించు గుణములు గలవాడా!; దంతి అడుగులోనన్= ఏనుగు పాదంలో; తక్కిన జంతుచయంబు+ అడుగులు= మిగిలిన జంతువుల సముదాయం అడుగులు; ఎల్లన్= అన్నీ; అడఁగి= లోబడి; ఉండు+అట్లు+అ= ఉండే విధంగానే; ధర్మకోటులు= ధర్మాల సముదాయాలు; అన్నియున్= అన్నీ; అహింసకున్= అహింస అనే ధర్మానికి, లోన్ అగున్= లోబడి ఉంటాయి; ఇంత= ఇది అంతా, నిజము= సత్యము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఏనుగు అడుగులో అన్ని జంతువుల అడుగులు ఇమిడి ఉండే తీరున అహింస అనే ధర్మంలో సర్వధర్మాలు లోబడి ఉంటాయి. ఇది సత్యం.

**విశేషం:** ఇక్కడ అడుగు అంటే పాదపు గుర్తు. ఈ ఉపమానంవలన అహింసను పాటిస్తే అన్ని ధర్మాలను పాటించినట్లే అనే అర్థం వ్యక్తమవుతుంది.

**వ. అదియును. 284**

**తాత్పర్యం:** ఆ అహింస అనేది కూడా (తరువాతి పద్యంతో అన్వయం)

**క. అరయఁగ నాలుగు విధములఁ। బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగిన గోవున్**
**దొరయుచు నం దొకఁ డెడలిన। నరవర! సద్ధర్మవర్తనము గుంటువడున్. 285**

**ప్రతిపదార్థం:** నరవర!= మనుజశ్రేష్ఠా!; చతుస్+పాద వృత్తిన్= నాలుగు పాదాల వర్తనతో; పరఁగిన గోవున్= ఒప్పిన ఆవును; దొరయుచున్= పోలుతూ; అరయఁగన్= పరిశీలించగా; నాలుగు విధములన్= నాలుగు తీరులలో; పరఁగున్= ఉంటుంది; అందున్= వాటిలో; ఒకఁడు= ఒకటి; ఎడలినన్= తొలగినా; సత్+ధర్మవర్తనము= శ్రేష్ఠమైన ధర్మపు నడక; కుంటు+పడున్= కుంటు పడుతుంది.

**తాత్పర్యం:** రాజా! నాలుగుకాళ్ళ నడకగల ఆవువలె ఆ అహింస కూడా నాలుగు తీరులలో ఉంటుంది. అందులో ఏ ఒక్కటి లోపించినా శ్రేష్ఠమైన ధర్మపు సాగుదల కుంటుపడుతుంది.

**తే. మనసునను వాక్కునను గాయమునను హింస । నడపు మాంసంబు దినుటతో నాలుగయ్యెఁ**
**దెఱఁగు లవి సువ్వె హింస వర్తింపఁ జేయుఁ । గాన కడుఁ గీడు మాంసభక్షణము దలఁప. 286**

**ప్రతిపదార్థం:** మనసునను= మనస్సుచేత; వాక్కునను= మాటచేత; కాయమునను= దేహంచేత; హింస నడపు= హింస చేయటం; మాంసంబున్= మాంసాన్ని; తినుటతోన్= తినటంతో; అవి; తెఱఁగులు= పద్ధతులు; నాలుగు= నాల్గు; అయ్యెన్= అయినవి; సువ్వె= సుమా!; తలఁపన్= భావించగా; హింసన్= పీడను; వర్తింపన్+చేయున్= కలుగజేస్తుంది; కానన్= కనుక; మాంసభక్షణము= మాంసం తినటం; కడున్= మిక్కిలి; కీడు= దోషము.

**తాత్పర్యం:** మనసుచేత, మాటచేత, దేహంచేత హింసచేయటం, మాంసం తినటం అనేదానితో కలిపి ఆ పద్ధతులు నాలు గైనాయి. హింసను కలిగిస్తుంది కనుక మాంసభోజనం చాలా పెద్ద దోషం.

**విశేషం:** ఇతరులను గురించి చెడుగా భావించటం మనోహింస, దురుసుమాటలు పలకటం వాక్హింస, కొట్టటం మొదలైనది కాయహింస.

**క. ఈ నాలుగు దెఱఁగుల దగ । మానుట యేఁ జెప్పినట్టి మహితాహింసా**
**నూనచతుర్విధములు మాం । సానేకరుచి ప్రమగ్నుఁ డది యెట్లుడుగున్? 287**

**ప్రతిపదార్థం:** ఈ నాలుగు+తెఱఁగులన్= ఈ నాలుగు పద్ధతులను; తగన్= తగినట్లుగా; మానుట= మానటం; ఏన్=నేను; చెప్పిన+అట్టి= చెప్పిన; మహిత+అహింసా+అనూన చతుర్+విధములు= గొప్పది అయిన అహింసయొక్క తక్కువకాని నాల్గు పద్ధతులు; మాంస+అనేక రుచి ప్రమగ్నుఁడు= మాంసపు పెక్కు విధములైన రుచులలో బాగా మునిగినవాడు; అది= ఆ ఆహింసను; ఎట్లు= ఏ విధంగా; ఉడుగున్?= మానుతాడు?

**తాత్పర్యం:** ఈ నాలుగు విధాలైన హింసలను మానటమే నేను చెప్పిన అహింసలోని నాలుగు గొప్ప పద్ధతులు. మాంసపు రుచులను బాగా మరగినవాడు దాని నెట్లా వదలుతాడు?

**క. కావున మాంసముపైఁ దగు । లే విధమున నుడుగుటయ యహింసారూపం**
**బై వఱలుఁ జుమీ భూవర!' నావుడు నక్కురువిభుఁడు వినయమయుఁడగుచున్. 288**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; కావునన్= కనుక; ఏ విధమునన్= ఏ విధంగానైనా; మాంసముపైన్= నంజుడుమీద; తగులు= ప్రీతి; ఉడుగుట+అ= వదలటమే; అహింసారూపంబు= అహింస అనే తీరు గలది; ఐ= అయి; వఱలున్= ఒప్పుతుంది; చుమీ= సుమా!; నావుడున్= అన్నంతనే; ఆ+కురువిభుఁడు= ఆ కురువంశరాజు; వినయమయుఁడు= వినయంతో నిండినవాడు; అగుచున్= అవుతూ.

**తాత్పర్యం:** రాజా! కనుక ఏ విధంగా నైనా సరే మాంసంమీద ప్రీతి వదలుకొనటమే అహింసగా ఒప్పుతుంది సుమా!' అని అనగా ఆ కౌరవరాజు వినయం నిండిన వాడవుతూ (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. 'మాంసంబు పితృదేవతలకుం బ్రియంబు శ్రాద్ధంబు మాంసముఖ్యంబుగా నడపవలయునని చెప్పుదురు. వధింపక మాంసలాభం బెట్లు గలుగు?' ననుటయు ననిమిషనదీనందనుం డానరనాథున కిట్లనియె. 289**

**ప్రతిపదార్థం:** మాంసంబు= నంజుడు; పితృదేవతలకున్= పితరులు అనే దేవతలకు; ప్రియంబు= ఇష్టమైనది; శ్రాద్ధంబు= శ్రాద్ధం అనే పని; మాంసముఖ్యంబుగాన్= మాంస ప్రధానంగా; నడపవలయున్= సాగించాలి; అని; చెప్పుదురు= చెప్తూతూ ఉంటారు; వధింపక= చంపక; మాంసలాభంబు= మాంసం దొరకటం; ఎట్లు= ఏ విధంగా; కలుగున్?= కలుగుతుంది?; అనుటయున్= అని పలికితే; అనిమిష నదీనందనుండు= దేవతలనది అయిన గంగయొక్క కుమారుడు భీష్ముడు; ఆ నరనాథునకున్= ఆ రాజునకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** 'మాంసం పితృదేవతలకు చాలా ఇష్టమైనది. శ్రాద్ధాన్ని మాంసం ప్రధానద్రవ్యంగా సాగించాలి అంటారు. చంపకపోతే మాంసం దొరకటం ఎట్లాగు?' అంటే భీష్ముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది ధర్మానికి సంబంధించిన శంక. ఇట్టి శంకలను అడిగే సమయంలో సాధారణంగా చాలామంది పలుకులలో పొగరు పొడచూపుతుంది. అది వక్త కోపానికి కారణం అవుతుంది. అందుకనే వెనుకటి పద్యంలో ధర్మరాజులో అట్టి 'అవినయం' ఏ మాత్రం లేదు. కేవలం తెలిసికొనాలనే కోరిక మాత్రమే ఉందని చెప్పటానికై వినయమయుండగుటను చెప్పారు.

**తే. 'వాజిమేధంబుకంటెను బూజనీయ । కర్మ మందురు మాంస భక్షణము విడుపు**
**వినుము చంపుటయును జంపఁ బనుచుటయును । గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప! 290**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; మాంసభక్షణము విడుపు= మాంసాన్ని తినటం మానటం; వాజిమేధంబుకంటెను= అశ్వమేధయాగం కంటె; పూజనీయ కర్మము= మన్నింపదగిన పని; అందురు= అంటారు; వినుము; చంపుటయును= చంపటమూ; చంపన్= చంపటానికి; పనుచుటయును= పంపటమూ; కల్మషంబులకున్= పాపాలకు; ఎల్లన్= అన్నింటికీ; అగ్గలములు= అధికమైనవి.

**తాత్పర్యం:** 'రాజా! మాంసభోజనం వదలటం అశ్వమేధయాగంకంటే కూడా పూజింపదగిన పని అంటారు. వినుము. చంపటమూ, చంపించటమూ అనే పనులు పాపాలన్నింటికంటె అధికమైనవి.

**క. పితృకార్యయజ్ఞముఖముల । శ్రుతిచోదిత హింసఁ గీడు సొరనేరదు వి**
**శ్రుతగుణ మాంసము చవిగో । రి తినం బ్రాణిఁ దెగటార్చు క్రియఁ బాపమగున్. 291**

**ప్రతిపదార్థం:** విశ్రుతగుణ!= కొనియాడబడిన గుణములు కలవాడా!; పితృకార్య యజ్ఞముఖములన్= శ్రాద్ధము, యజ్ఞము మొదలైన వాటియందు; శ్రుతిచోదిత హింసన్= వేదం చెప్పిన హింసచేత; కీడు= దోషం; చొరన్+నేరదు= ప్రవేశింపజాలదు; మాంసము చవి= మాంసపు రుచి; కోరి= వాంఛించి; తినన్= తినటంకొరకు; ప్రాణిన్= ప్రాణంగల జంతువును; తెగటార్చు క్రియన్= చంపే పనిచేత; పాపము= దోషం; అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** రాజా! శ్రాద్ధాలలో, యజ్ఞాలలో వేదం తెలిపిన హింసచేత దోషం కలుగబోదు. మాంసపురుచి మరిగి తినటానికై ప్రాణిని చంపే పనివలన పాపం కలుగుతుంది.

**క. తను నమలిన వాని నమలు । నని మాంసము తెలుఁగు సెప్పు నాగమములు గా**
**వునఁ దద్భక్షణ ముడిగిన । ననఘ! తపంబునకుఁ జాలు నది యొక్కండున్. 292**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; ఆగమములు= శాస్త్రములు, వేదములు; తనున్= తన్ను; నమలినవానిన్= నమలినవాడిని; నమలును= నములుతుంది; అని; మాంసము తెఱఁగు= మాంసం తీరును; చెప్పున్= చెప్పుతూ ఉంటాయి; కావునన్= కనుక; తద్+భక్షణము= దానిని తినటం; ఉడిగినన్= మానితే; అది= ఆ మానటం; ఒక్కండును= ఒక్కటీ; తపంబునకున్= తపస్సునకు; చాలున్= చాలుతుంది.

**తాత్పర్యం:** మాంసం తన్నెవరు నములుతారో వారినే నములుతుంది - అని ఆగమాలు చెప్పుతున్నాయి. కనుక, రాజా! ఆ మాంసపు తిండి ఒక్కటీ మానితే అదే తపస్సునకు సరిపోతుంది.

**విశేషం:** మాంసభక్షణం అన్యహింసే కాదు, ఆత్మహింస కూడా అవుతుందని భావం.

**క.** **జనవర! మాంసముచవిఁ గడ । చిన చవు లరయంగ లేమిఁ జేసి చవి యెఱిం**
**గినవాఁ డది యుడిగిన నా । తని దేవసమానుఁ డండ్రు ధర్మవిధిజ్ఞుల్.** **293**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; మాంసము చవిన్= మాంసపు రుచిని; కడచిన చవులు= మీరిన రుచులు; అరయంగన్= పరిశీలించగా; లేమిన్+చేసి= లేకపోవటంవలన; చవి+ఎఱింగినవాఁడు= రుచి తెలిసినవాడు; అది= మాంసభోజనాన్ని; ఉండిగినన్= వదలివేస్తే; అతనిన్= అట్టివాడిని; ధర్మవిధిజ్ఞుల్= ధర్మం పద్ధతులు బాగా తెలిసినవారు; దేవసమానుఁడు= దేవతలతో సాటి అయినవాడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! మాంసం రుచిని మించిన రుచులు ఎంత వెదకినా లేని కారణంగా ఆ రుచి మరగినవాడు దానిని మానితే అట్టివాడిని ధర్మశాస్త్రాలు చక్కగా తెలిసినవారు దేవతలతో సమానుడు అంటారు.

**విశేషం:** రుచి తెలియనివాడు మాంసం జోలికి పోక పోవటం గొప్ప విషయం కాదు. రుచి తెలిసినవాడు మానటం ఎంతో గొప్ప విషయం - అని భావం.

**ఉ.** **మ్రానను ఱాతనుం గలదె మాంసము ప్రాణుల మేనఁగాక? య**
**మ్మేనుల నొంచునప్డు తమ మేనులు సోఁకినమాత్ర నెట్లగున్**
**దానిఁ దలంపఁగా వలదె? తానది మానిన హింసలన్నియున్**
**మానవె? యంచు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై.** **294**

**ప్రతిపదార్థం:** మాంసము= నంజుడు; ప్రాణులమేనన్= ప్రాణంగల జంతువుల దేహంలో; కాక= తప్ప; మ్రానను= చెట్టునందు; ఱాతనున్= రాతియందు; కలదె?= ఉన్నదా?; ఆ+మేనులన్= ఆ దేహాలను; నొంచు+అప్డు= పీడించే సమయంలో; తమ మేనులు= తమ దేహాలు; సోఁకిన మాత్రన్= తాకినంత మాత్రాన; ఎట్లు= ఏ విధంగా; అగున్= అవుతుందో; దానిన్= దానిని; తలంపన్+కాన్= తలపోయటం; వలదె?= వద్దా?; తాన్= తాను; అది= ఆ హింసను; మానినన్= మానితే; హింసలు= పీడలు; అన్నియున్= అన్నీ; మానవె?= మానవా?; అంచున్= అని భావిస్తూ; ఉత్తముఁడు= గొప్పవాడు; దయా+ఆర్ద్ర చిత్తుఁడు= దయతో మెత్తనైన మనస్సు కలవాడు; ఐ= అయి; మాంసమున్= మాంసాన్ని; మానున్= ఆపివేస్తాడు.

**తాత్పర్యం:** ప్రాణుల దేహంలోనే కానీ మాంసం మ్రానులోను, రాతిలోను లేదు కదా! ఆ దేహాలను పీడించే సమయంలో తమ దేహాలకు ఏదైనా తగిలితే తనకు నొప్పి కలుగుతున్నది కదా! కనీసం దానినైనా భావించాలి కదా!

కనుక మాంసంకొరకు హింస మానితే అన్ని హింసలూ మానినట్లే - అని ఉత్తముడు భావించి, దయ కలవాడై మాంసం తినటం మానుతాడు.

**ఆ. మాంస మానకునికి మనుజేశ! ప్రాణివ । ధాభిరతి దొఱంగు టగుటఁ జేసి**
**యట్టివాని కభయ మఖిలభూతంబుల । వలన నెపుడు నెందుఁ గలిమి నిజము. 295**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ!= రాజా!; మాంసము= ఎరచి; ఆనక= తినక; ఉనికి=ఉండటం; ప్రాణివధ+అభిరతిన్= ప్రాణంగల జంతువులను చంపటంమీద ప్రీతిని; తొఱంగుట= వదలివేయటం; అగుటన్+చేసి= కాబట్టి; అట్టి వానికిన్= ఆ విధంగా మాంసం మానిన వాడికి; అఖిల భూతంబులవలనన్= అన్ని భూతాలవలనను; ఎపుడున్= ఎల్లవేళలా; ఎందున్= అన్నిప్రదేశాలలో; అభయము= భయంలేని స్థితి; కలిమి= కలగటం; నిజము= సత్యం.

**తాత్పర్యం:** రాజా! మాంసం ముట్టకపోవటం అంటే ప్రాణులను వధించే ప్రీతిని వదలటమే. కనుక, అట్టివాడికి అన్నివేళలలో, అన్ని తావులలో, అన్ని భూతాలవలన అభయం కలగటం సత్యం.

**విశేషం:** భూతములు చరములు, అచరములు అనే వ్యవహారంగల సర్వపదార్థాలు. ఎందున్, ఎపుడు, అఖిలభూతంబుల వలన అవి ఈ మూడింటినీ చెప్పటం వలన దేశకాలపాత్రలవలన అట్టివారికి భయం కలుగదని భావం.

**క. స్వాయంభువుఁ డను మనువును । నీ యర్థము సెప్పె లోకహితముగ మార్కం**
**డేయాదులు మాంసముడుగు । టాయుశ్శ్రీ రూపకారి యగు నని రధిపా! 296**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; స్వాయంభువుఁడు= స్వాయంభువనామం కలవాడు; అను మనువును= అనే మనువు కూడా; ఈ+అర్థము= ఈ విషయాన్ని; లోకహితముగన్= లోకానికి మేలైన విధంగా; చెప్పెన్= బోధించాడు; మార్కండేయ+ఆదులు= మార్కండేయ మహర్షి మొదలైనవారు; మాంసము= మాంస భోజనం; ఉడుగుట= మానటం; ఆయుస్+శ్రీ రూపకారి= ఆయువును, సంపదను, సౌందర్యాన్నీ కలిగించేది; అగున్= అవుతుంది; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** స్వాయంభువుడనే మనువు కూడా ఈ విషయాన్నే లోకానికి మేలు కలిగే విధంగా చెప్పాడు. మార్కండేయుడు మొదలైన చిరంజీవులైన మహర్షులు కూడా మాంసపుతిండి మానటం ఆయువును, సంపదను, అందచందాలను పెంపొందిస్తుందని అన్నారు.

**విశేషం:** తాత్పర్యంగా మాంస భోజనం ఆయువు మొదలైన వాటిని హరిస్తుందనే అర్థం గ్రహించాలి. మనువు మానవజాతి మూల పురుషుడు, మార్కండేయాదులు చిరంజీవులు. అట్టివారి ఉపదేశం వదలరానిది అని భావం.

**క. విను మాంసము గోరు నరుఁడు । దనుజుఁడ చూవె! మును దేవతలు మాంసంబుం**
**దిను టుడిగి కాదె దానవ । జనితభయముఁ బోవఁ ద్రోవఁ జాలిరి వత్సా! 297**

**ప్రతిపదార్థం:** వత్సా!= కుమారా!; విను= శ్రద్ధగా ఆలకింపుము; మాంసమున్= మాంసాన్ని; కోరు నరుఁడు=కోరే మనుష్యుడు; దనునజుఁడు+అ= రాక్షసుడే; చూవె!= సుమా!; మును= పూర్వం; దేవతలు= దేవలోకంవారు; మాంసంబున్= మాంసాన్ని; తినుట= తినటం; ఉడిగి= మాని; కాదె?= కదా!; దానవజనిత భయమున్= దానవులవలన పుట్టిన భయాన్ని; పోవన్= పోయేవిధంగా; త్రోవన్= త్రోసివేయటానికి; చాలిరి= సమర్థులయ్యారు.

**తాత్పర్యం:** కుమారా! శ్రద్ధగా వినుము. మాంసం తినగోరే మనుష్యుడు రక్కసుడే సుమా! పూర్వం దేవతలు మాంసభోజనం విడిచియే కదా - రాక్షసులవలన కలిగిన భయాన్ని పోద్రోలగలిగారు!

**క. దానము ధర్మము దప మి । జ్యానిష్ఠ యనంగఁ గల్గు సత్క్రియ లెల్లన్**
**మానవనాథ! యహింసా । నూనాకృతు లండ్రు శ్రుతుల నూనిన పెద్దల్. 298**

**ప్రతిపదార్థం:** మానవనాథా!= రాజా!; శ్రుతులన్= వేదాలను; ఊనిన= పట్టుకొన్న; పెద్దల్= జ్ఞానం పండిన వృద్ధులు; దానము= ఇవ్వటం; ధర్మము= సత్కార్యములు చేయటం; తపము= శరీరాన్ని నియమనిష్ఠలతో శుష్కింపజేయటం; ఇజ్యానిష్ఠ= యజ్ఞాలయందు దృఢమైన దీక్ష కలిగి ఉండటం; అనంగన్= అనగా; కల్గు సత్+క్రియలు= ఉండే మంచి పనులు; ఎల్లన్= అన్నీ; అహింసా+అనూన+ ఆకృతులు= అహింసకంటె తక్కువ కాని కార్యాలు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! వేదార్థం చక్కగా తెలిసిన జ్ఞానసంపన్నులు దానము, ధర్మము, తపస్సు, యజ్ఞనిష్ఠ అనే ఉత్తమ క్రియలన్నీ అహింసకు తక్కువ కాని కార్యాలే అంటారు.

**క. శతవర్షదుష్కరతపః । కృతి నంజుడు దినమి నగు సుకృత మివి రెండున్**
**మతిఁ దలఁప నొక్కరూ పని । శ్రుతివేదులు సెప్పుదురు కురుక్షితినాథా! 299**

**ప్రతిపదార్థం:** కురుక్షితినాథా!= కురుదేశపు ప్రభూ!; శతవర్ష దుష్కరతపస్+కృతి= నూరేండ్లు చేయనలవికాని తపస్సు చేయటం; నంజుడు= మాంసం; తినమిన్= తినకపోవటంచేత; అగు సుకృతము= కలిగే పుణ్యమూ; ఇవి రెండున్= రెండూ; మతిన్= బుద్ధిలో; తలఁపన్= భావిస్తే; ఒక్క రూపు= ఒకే విధమైనవి; అని; శ్రుతివేదులు= వేదం తెలిసినవారు; చెప్పుదురు= వక్కాణిస్తారు.

**తాత్పర్యం:** నూరేండ్లు చేయనలవికాని తపస్సు చేయటమూ, మాంసం తినకపోవటంవలన కలిగే పుణ్యమూ- ఈ రెండూ ఒకే విధమైనవని వేదవేత్తలు చెప్పుతారు.

**విశేషం:** వేదానుశాసనం అంటే తిరుగులేనిమాట. మాంసం మానటం అనే ఒక్క సులభసాధ్యమైన పనితో నూరేండ్లు ఘోరమైన తపస్సు చేస్తే కలిగే పుణ్యం సాధించటం వివేకం గలవాడి పని కదా!

**క. తపముల దానంబుల బ్ర । హ్మపురి నివాసంబు దప్పదనరాదు, జనా**
**ధిప! మాంసము నమలని పు । ణ్యపురుషునకు సులభ మందు రా నెల వార్యుల్. 300**

**ప్రతిపదార్థం:** జన+అధిప!= రాజా!; తపములన్= తపస్సులచేతను; దానంబులన్= దానములచేత; బ్రహ్మపురి నివాసంబు= బ్రహ్మదేవుడి పట్టణంలో ఉండే మహాభాగ్యం; తప్పదు= తప్పక కలుగుతుంది; అనరాదు= అనటానికి వీలులేదు; ఆర్యుల్=ఉత్తమ పురుషులు; మాంసము= నంజుడు; నమలని పుణ్య పురుషునకున్= తినని పుణ్యంగల జనునకు; ఆ నెలవు= ఆ తావు; సులభము= తేలికగా దొరుకునది; అందురు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! తపములు, దానములు అనే వాటిచేత బ్రహ్మలోక నివాసం తప్పదు అనరాదు. కానీ ఆర్యులు మాంసం తినని పుణ్యపురుషుడికి ఆ నెలవు తేలికగా లభిస్తుందని చెప్పుతారు.

**విశేషం:** మాంసభోజనం చేయకపోవటం తపస్సులచేతను, దానాలచేతను పొందే పుణ్యావిశేషంకంటె గొప్పది అని తాత్పర్యం.

**తే. అధిప! యాషాఢముఖ్యంబు లైన నెలలు । నాలుగింటను మాంసంబు నమల కుడుగు**
**టాయురారోగ్య బలకీర్తు లను ఫలములు । నాలుగింటిని నిచ్చు నన్నరున కండ్రు. 301**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఆషాఢ ముఖ్యంబులు= ఆషాఢం మొదలుగా గలవి; ఐన నెలలు= అయిన నెలలు; నాలుగింటను= నాలిగింటిలోను; మాంసంబు= నంజుడును; నమలక= తినక; ఉడుగుట= మానటం; ఆయుస్+ఆరోగ్య బల కీర్తులు= ఆయువు, ఆరోగ్యం, బలం, కీర్తి; అను ఫలములు= అనే ఫలితాలను; నాలుగింటిని= నాలిగింటిని; ఆ+నరునకున్= ఆ మనిషికి; ఇచ్చున్= లభిస్తాయి; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** రాజా! ఆషాఢం మొదలైన నాలుగు నెలలలో మాంసం తినటం మానటం ఆయువు, ఆరోగ్యం, బలం, కీర్తి అనే నాలుగు ఫలాలు ఆ మనిషికి కలిగిస్తుందని చెప్పుతారు.

**విశేషం:** ఆషాఢముఖ్యం అయిన నెలలు - ఆషాఢం, శ్రావణం, భాద్రపదం, ఆశ్వయుజం. ఈ నాలుగూ సాధారణంగా వర్షం పడే సమయం. రోగాలు ప్రబలుతాయి. ఆ దృష్టితో కూడా మాంసం మానటం మంచిది.

ఋషులు దయామూర్తులు. ఇంతకు ముందు పూర్తిగా మాంసం మాను మన్నారు. అది బొత్తిగా సాధ్యం కాకపోతే కనీసం ఈ నాలుగు నెలలైనా మాను మంటున్నారు.

**ఆ. సగర నల దిలీప నృగ భగీరథ ముఖ్య ।నృపులు వార్షికంపు నెలలు నాల్గు**
**మాంసభక్షణంబు మానుట నుభయ లో । కంబులందుఁ బెంపుఁ గాంచి రండ్రు.' 302**

**ప్రతిపదార్థం:** సగర నల దిలీప నృగ భగీరథ ముఖ్య నృపులు= సగరుడు, నలుడు, దిలీపుడు, నృగుడు, భగీరథుడు మొదలైన రాజులు; వార్షికము+నెలలు= వర్షాకాలపు నెలలు; నాల్గున్= నాలుగునూ; మాంసభక్షణంబు= మాంసం తినటం; మానుటన్= మానటంవలన; ఉభయ లోకంబులందున్= రెండు లోకాలలోను; పెంపున్= గొప్పతనాన్ని; కాంచిరి= పొందారు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** సగరుడు, నలుడు, దిలీపుడు, నృగుడు, భగీరథుడు మొదలైన మహాచక్రవర్తులందరూ వర్షాకాలం నాలుగు నెలలు మాంసం తినటం మానివేసి, ఇహపరలోకాలలో గొప్పతనం పొందారని చెప్పుతారు.'

**వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో 'నిమ్మెయి మహనీయంబయిన మాంసవర్జనంబు పాటించి తక్కిన యపూపాదులు ఫలప్రభృతులు నగు భక్ష్యంబు లాచరించి యేల వర్తింప రెల్ల జనంబులు?' ననుటయు. 303**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; అజాత శత్రుండు= పుట్టని పగవారుగల ధర్మరాజు; శంతను పుత్త్రుతోన్= శంతనుడి కొడుకైన భీష్ముడితో; ఈ+మెయిన్= ఈ విధంగా; మహనీయంబు= గొప్పది; అయిన మాంసవర్జనంబు= అయిన మాంసం వదలటం; పాటించి= ఆచరించి; తక్కిన అపూప+ఆదులు= మిగిలిన పిండివంటలు మొదలైనవి; ఫలప్రభృతులు= పండ్లు మొదలైనవి; అగు భక్ష్యంబులు= అయిన తినుపదార్థాలను; ఆచరించి= తిని; ఎల్లజనంబులు= జనులందరు; ఏల= ఎందుకు; వర్తింపరు?= ప్రవర్తించరు; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు భీష్ముడితో 'ఈ విధంగా మిక్కిలి గొప్పదైన మాంసం విడనాడటం పాటించి తక్కిన పిండివంటలు, పండ్లు మొదలైన తినుపదార్థాలతో జనులంతా ఎందుకు ప్రవర్తించరు?' అనగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**మాంసభక్షణ మందలి రుచివిశేషంబు మానుట దుష్కరంబని చెప్పుట (సం.13-178-7 (కుంభ))**

**సీ. అతనికి నతఁ డిట్టులను మాంసముల చవి । మరగినవానికి మాన వశమె?**
**యట్లు గాకయు సురతాసక్తునకు బల । మొలయు నధ్వశ్రాంతుఁ డుల్లసిల్లు**
**క్షతము శీఘ్రమున లోపితమగుఁ గృశునకుఁ । బుష్టి వేగమ వచ్చు భూపవర్య!**
**విను మాంసభక్షణంబున నపూప ఫలాదు । లం దవ్విశేషంబు లరయఁగలవె?**

**తే. మాంస మానిన దోషంబు మహిత దాన । విధులఁ బాయు దివిజపితృవిధివిశిష్ట**
**మైన యెఱచి గీడొలయదు యజ్ఞములకుఁ । బశువిధానంబు వేదంబు పనుపు గాన. 304**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ ధర్మరాజునకు; అతఁడు= ఆ భీష్ముడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; మాంసముల చవి= నంజుడుల రుచి; మరగినవానికిన్= అలవాటు పడిన వ్యక్తికి; మానన్= మానటం; వశమె?= సాధ్యమా?; అట్లు+కాకయున్= అంతేకాక; భూపవర్య!= రాజోత్తమా!; మాంసభక్షణమునన్= మాంసం తినటంవలన; సురత+ఆసక్తునకున్= మిథునకర్మయందు తగులం కలవాడికి; బలము= సత్తువ; ఒలయున్= కలుగుతుంది; అధ్వశ్రాంతుఁడు= బాటయందు అలసినవాడు; ఉల్లసిల్లున్= ఉత్సాహం పొందుతాడు; క్షతము= గాయం; శీఘ్రమునన్= తొందరలో; లోపితము= పోయినది; అగున్= అవుతుంది; కృశునకున్= బక్కచిక్కినవాడికి; పుష్టి= శక్తి; వేగము+అ= వేగమే; వచ్చున్= వస్తుంది; విను= ఆలకించుము; అపూప ఫల+ఆదులందున్= పిండి వంటలు, పండ్లు మొదలగు వాటిలో; ఆ+విశేషంబులు= ఆ గొప్పతనాలు, అరయన్= పరిశీలింపగా; కలవె?= ఉన్నాయా?; మాంసము= ఎరచి; ఆనిన దోషంబు= తిన్న తప్పు; మహితదాన విధులన్= గొప్పవైన దానకార్యాలచేత; పాయున్= తొలగుతుంది; యజ్ఞములకున్= జన్నాలకు; పశువిధానంబు= పశువులను ఉపయోగించే పద్ధతి; వేదంబు పనుపు= వేదం చెప్పిన శాసనం; కానన్= కనుక; దివిజ పితృవిధి విశిష్టము= దేవతలకు, పితృదేవతలకు సంబంధించిన కార్యాలలో మన్నన గొప్పది; ఐన+ఎఱచిన్= అయిన మాంసంతో; కీడు= దోషం; ఒలయదు= కలుగదు.

**తాత్పర్యం:** ఆ ధర్మరాజుతో భీష్ము డిట్లా అన్నాడు. 'మాంసాల రుచి మరగినవారికి మానటం సాధ్యమా? అంతే కాదు. మాంసం తినటంవలన రతిమీద ప్రీతిగలవాడికి బలం కలుగుతుంది. ప్రయాణం చేసి అలసినవాడికి ఉత్సాహం కలుగుతుంది. గాయాలు తొందరగా మానుతాయి. చిక్కినవాడికి పుష్టివేగంగా కలుగుతుంది. పిండివంటలలో పండ్లలో ఈ విశేషాలు లేవు కదా! మాంసం తింటే కలిగే పాపం గొప్ప దానకార్యాలతో పోతుంది. యజ్ఞాలలో పశువును ఉపయోగించటం వేదం అనుశాసనం కనుక దైవపితృకార్యాలలో ఉపయోగించిన మాంసంవలన దోషం కలుగదు.

**వ. ఇట్లు గాన నంజుడు నమలుటయు నధికదోషంబులు గాని యెడలునుం గలిగియుండు; నగస్త్యుండు రాజులకు వేట విధించెం గావునం గుతూహలంబుఁ గోపంబు ననియెడు భావంబులం బొరయక లోకరక్షణార్థంబుగాఁ**

**గ్రూరమృగ వధంబును స్వహస్తవిక్రమార్జిత మాంసంబున దేవపితృప్రీణనం బొనర్చుటకుం గాఁ బక్షి మృగమారణంబును జేయు భూనాయకుండు దురితంబులం బొరయకుండు విశేషంబు వినుము. 305**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధం; కానన్= కావున; నంజుడు= మాంసం; నమలుటయున్= తినటంకూడా; అధిక దోషంబులు= ఎక్కువ తప్పులు; కాని+ఎడలునున్= కాని సందర్భాలు కూడా; కలిగి యుండున్= ఉన్నాయి; అగస్త్యుండు= అగస్త్య మహర్షి; రాజులకున్= ప్రజల నేలే వారికి; వేఁట= జంతువులను చంపటం; విధించెన్= శాసించాడు; కావునన్= కనుక; కుతూహలంబున్= వేడుక; కోపంబున్= కోపము; అనియెడు భావంబులన్= అనే భావాలను; పొరయక= పొందక; లోక రక్షణ+అర్థంబుగాన్= లోకాలను రక్షించటం ప్రయోజనంగా; క్రూర మృగ వధంబును= క్రూర జంతువులను చంపటమూ; స్వహస్త విక్రమ+ఆర్జిత మాంసంబునన్= తనచేతి పరాక్రమంతో సంపాదించిన మాంసంతో; దేవ పితృ ప్రీణనంబు= దేవతల, పితృదేవతల ప్రీతిని; ఒనర్చుటకున్+కాన్= చేయటానికిగాను; పక్షి మృగ మారణంబును= పక్షులను, మృగాలను చంపటాన్ని; చేయు భూనాయకుండు= చేసే రాజు; దురితంబులన్= పాపాలను; పొరయక+ఉండున్= పొందకుంటాడు; విశేషంబు= ప్రత్యేకమైన సంగతి; వినుము.

**తాత్పర్యం:** ఇట్లు గాన మాంసం తినటం పెద్ద తప్పు కాని సందర్భాలు కూడా ఉంటాయి. అగస్త్యుడు రాజులకు వేటను విధిగా చెప్పాడు. కాబట్టి వేడుక, కోపము అనే భావాలకు చిక్కకుండా లోకరక్షణకొరకు క్రూరమృగాలను చంపటం, తన చేతిబలంతో సంపాదించిన మాంసంతో దేవపితృదేవతలకు ప్రీతికావించుటకొరకు పక్షులను, పశువులను చంపే రాజు పాపాలలో పడడు. ఒక విశేషం వినుము.

**ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో । షింతు ననుటకంటెఁ జెట్టలేదు**
**మాంసభక్షణంబు మానుటకంటెను । మేలు లేదు కర్మజాలకమున. 306**

**ప్రతిపదార్థం:** అన్యమాంసమునన్= ఇతర ప్రాణి మాంసంతో; నిజ+అంగ మాంసంబున్= తన దేహంలోని మాంసాన్ని; పోషింతున్= పెంపొందిస్తాను; అనుటకంటెన్= అనటంకంటె; చెట్ట= పాపం; లేదు; మాంసభక్షణంబు= మాంసం తినటం; మానుటకంటెను= మానుటకంటె; కర్మజాలకమునన్= కర్మముల సముదాయంలో; మేలు= మంచిపని; లేదు.

**తాత్పర్యం:** ఇతరప్రాణి మాంసంతో తన దేహంలోని మాంసాన్ని పెంపొందిస్తాను - అనటంకంటె పాపం మరొకటి లేదు. మాంసం తినటం మానటంకంటె కర్మముల సముదాయంలో మేలైనది మరొకటి లేదు.

**తే. మాంసభక్షణ దోషంబు మాను దాన । మహిమ ననుటయు మాంసంబు మఱి భుజింప**
**కున్నఁ జూవె; ధర్మము లెవ్వియును దలంప । దయకు సదృశంబులే? కురుధరణినాథ! 307**

**ప్రతిపదార్థం:** కురుధరణినాథ!= కురుదేశ ప్రభూ!; మాంసభక్షణ దోషంబు= మాంసం తినటంవలన కలిగే పాపం; దానమహిమన్= దానపు గొప్పతనంచేత; మానున్= పోతుంది; అనుటయున్= అనటం కూడా; మఱి= పిదప; మాంసంబు= మాంసం; భుజింపక+ ఉన్నన్= తినకుంటేనే; చూవె!= సుమా!; తలంపన్= భావింపగా; ధర్మములు= ధర్మాలు; ఎవ్వియును= ఏవి అయినా; దయకున్= కరుణకు; సదృశంబులే?= సాటి అగునా?

**తాత్పర్యం:** రాజా! మాంసం తినటంవలన కలిగే పాపం దానాల మహిమవలన పోతుంది అనటంకూడా ఇక అటుపై మాంసం తినకుంటేనే సుమా! ధర్మా లేవైనా దయకు సాటి అవుతాయా?

**విశేషం:** ప్రాయశ్చిత్తాలు ఉన్నాయి కదా! అని పాపాలు చేయటంవలన దోషాలు ప్రాయశ్చిత్తాలవలన కూడా పోవు.

**తే. ఆత్మ సదృశత ప్రాణభయంబునందుఁ । బ్రాణులకు నెల్లఁ గని మాంసభక్షణంబు**
**మాను దయ నార్ద్రమానసుండైన పురుషుఁ । డాతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు. 308**

**ప్రతిపదార్థం:** దయన్= జాలితో; ఆర్ద్రమానసుండు= మెత్తని హృదయంగలవాడు; ఐన పురుషుఁడు= అయిన నరుడు; ప్రాణులకున్= ప్రాణంగలవాటికి; ఎల్లన్= అన్నింటికీ; ప్రాణభయంబునందున్= ప్రాణం విషయంలోని భయమునందు; ఆత్మసదృశతన్= తన పోలికను; కని= చూచి; మాంసభక్షణంబు= మాంసం తినటం; మానున్= మానివేస్తాడు; ఆతనికిన్= అట్టివాడికి; బ్రహ్మలోక+ఆదులు= బ్రహ్మలోకం మొదలైనవి; ఆటపట్టు= ఆడుకొనే చోటు.

**తాత్పర్యం:** దయతో మెత్తని హృదయంకల నరుడు ప్రాణులన్నింటికీ ప్రాణభయంలో తనవంటి స్థితినే చూచి మాంసం తినటం మానివేస్తాడు. అతడికి బ్రహ్మలోకం మొదలైనవి క్రీడారంగాలు.

**విశేషం:** ఆటపట్టులో స్వేచ్ఛగా ఆనందంతో తిరిగే విధంగా అట్టివాడు బ్రహ్మలోకాదులలో విహరిస్తాడని భావం.

**క. భూతముల కలుగు నతనికి । భూతము లఖిలములు నలుగు భూతహితార్థీ!**
**భూతముల కభయ మిచ్చిన । పూతాత్మున కభయ మిచ్చు భూతావలియున్. 309**

**ప్రతిపదార్థం:** భూతహిత+అర్థీ!= ప్రాణుల మేలు కోరేవాడా!; భూతములకున్= ప్రాణుల విషయంలో; అలుగు+అతనికిన్= పగపెట్టుకొనేవాడికి; భూతములు=ప్రాణులు; అఖిలములు= అన్నీ; అలుగున్= పగ కలిగి ఉంటాయి; భూతములకున్= ప్రాణులకు; అభయము= భయం లేని తనాన్ని; ఇచ్చిన పూత+ఆత్మునకున్= ఇచ్చిన పవిత్ర హృదయుడికి; భూత+ఆవలియున్= ప్రాణుల వరుసలు కూడా; అభయము= అభయాన్ని; ఇచ్చున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! ప్రాణుల విషయంలో పగ గలిగి ఉన్న వాడియెడల ప్రాణులు కూడా శత్రుభావంతోనే ఉంటాయి. ప్రాణులకు అభయం ఇచ్చే పవిత్రహృదయుడికి అవి కూడా అభయం ఇస్తాయి.

**ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు । శౌచ మంత్రతంత్ర సత్యములును**
**బుధు లహింస రూపములు గాఁగఁ జెప్పుట । నెల్లకల్మి సుమ్మహింస కలిమి. 310**

**ప్రతిపదార్థం:** బుధులు= వివేకంగలవారు; దానమును= ఈగిని; తపంబున్= తపస్సును; ధర్మంబున్= ధర్మమును; యజ్ఞంబున్= యజ్ఞాన్నీ; శౌచ మంత్ర తంత్ర సత్యములును= శుద్ధి మంత్రము, అనుష్ఠానము, సత్యము అనువాటిని; అహింసరూపములు= అహింస యొక్క మరొక రూపములు; కాఁగన్= అవటాన్ని; చెప్పుటన్= చెప్పటంచేత; అహింస కలిమి= అహింస ఉండటం; ఎల్లకల్మి= అన్నింటి సంపదయే; సుమ్మ!= సుమా!

**తాత్పర్యం:** వివేకవంతులు దానం, ధర్మం, తపస్సు, యజ్ఞం, పరిశుద్ధత, మంత్రం, అనుష్ఠానం, సత్యం - ఇవన్నీ అహింసరూపాలే అని చెప్పటంవలన అహింస అనే సంపద ఉంటే అన్ని సంపదలు ఉన్నట్లే.

**క. నరనాథ! యహింసా గుణ । పరిగణనము గొంత మాత్రఁ బలికితి ధర్మో**
**త్తర యగు నహింస మేలిమి । యరయం గడుఁ బెద్ద దాని నలవఱుపు మదిన్.' 311**

**ప్రతిపదార్థం:** నరనాథ!= ప్రజాపాలకా!; అహింసా గుణ పరిగణనము= అహింస అనే గుణాల లెక్క; కొంతమాత్రన్= కొంతమాత్రమే; పలికితిన్= చెప్పాను; ధర్మ+ఉత్తర= ధర్మం తుదిగా ఉన్నది; అగు+అహింస మేలిమి= అయిన అహింస యొక్క గొప్పతనం; అరయన్= పరికించగా; కడున్= మిక్కిలి; పెద్ద= ఎక్కువ అయినది; దానిన్= దానిని; మదిన్= హృదయంలో; అలవఱుపు= అభ్యాసం చేయుము.

**తాత్పర్యం:** రాజా! అహింసయొక్క మహిమను కొంతమాత్రమే చెప్పాను, అది ధర్మమే పర్యవసానంగా గలది. దాని మహిమ పరిశీలించి చూస్తే చాలా గొప్పది. కనుక దానిని హృదయంలో అభ్యాసం చేయాలి.'

**ఆ. అనిన సంతసిల్లి యమ్మహీపతి తాత । కధికభక్తి మ్రొక్కి 'యస్మదీయ**
**సంగరంబునందుఁ జచ్చినవారల । కేది గతియొ నాకు నెఱుఁగఁ జెప్పు. 312**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; సంతసిల్లి= ఆనందపడి; ఆ+మహీపతి= ఆ రాజు; తాతకున్= తాత అయిన భీష్ముడికి; అధికభక్తిన్= ఎక్కువ అయిన భక్తితో; మ్రొక్కి= పాదనమస్కారం చేసి; అస్మదీయ సంగరంబునందున్= మాదైన యుద్ధంలో; చచ్చినవారలకున్= మరణించినవారికి; ఏది; గతియొ=గతియో; నాకున్; ఎఱుఁగన్= తెలిసేవిధంగా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** అనగా సంతోషించి ధర్మరాజు మిక్కుటమైన భక్తితో తాతకు దండనమస్కారం చేసి 'మాదైన యుద్ధంలో చచ్చినవారు ఎక్కడికి పోతారో నాకు తెలియజెప్పుము. (అని అడిగాడు)

**క. బ్రదుకును జావును సుఖదుః । ఖదములుగా జంతుకోటి కరుణామూర్తీ!**
**మదిఁ దలఁచుఁ బ్రాణలాభము । వదలు టరిదిగాన నట్టివారి నడిగితిన్.' 313**

**ప్రతిపదార్థం:** కరుణామూర్తీ!= జాలియే రూపమైన ఓ తాతా!; జంతుకోటి= ప్రాణుల సముదాయం; బ్రదుకును= జీవించి ఉండటాన్నీ; చావును= మరణాన్నీ; సుఖదుఃఖదములుగాన్= సుఖాన్నీ, దుఃఖాన్నీ ఇచ్చేవిగా; మదిన్= హృదయంలో; తలఁచున్= భావిస్తుంది; ప్రాణలాభము= ప్రాణం పొందటం అనేదానిని; వదలుట= విడిచిపెట్టటం; అరిది= చాలా అపురూపమైన విషయం; కానన్= కనుక; అట్టివారిన్= ఆ విధంగా ప్రాణం వదలినవారిని గూర్చి; అడిగితిన్= అడిగాను.

**తాత్పర్యం:** దయామూర్తీ! ప్రాణులు బ్రదుకు సుఖమిచ్చేదనీ, చావు దుఃఖాన్నీ కలిగిస్తుందనీ మనస్సులో భావిస్తూ ఉంటారు. ఉన్న ప్రాణాన్ని వదలుకొనటం చాలా అరుదు. కనుక అట్టివారిని గూర్చి అడిగాను.

**విశేషం:** సర్వప్రాణకోటికీ మిక్కిలి ప్రియమైనది ప్రాణం. యుద్ధానికి రావటమంటే దానిని చేజేతులా వదలుకొనటానికి సిద్ధపడటమే కదా! ఇది చాలా అరుదైన విషయం. ప్రాణంకంటె మిన్నగా దేనిని ఆశించి జనులు యుద్ధాలలో మరణిస్తారు? అని ధర్మరాజు ఆంతర్యం. 'కరుణామూర్తీ!' అనే సంబోధన చాలా అర్థవంతం. 'యుద్ధంలో నిన్ను నేను రూపుమాపదలచాను. అట్టి నాయందు ఏ విధమైన ద్వేషం పూనక నేను అడిగిన ధర్మాలన్నీ ఆప్యాయంగా చెప్పుతున్నావు. ఇంతకంటె కరుణకు నిదర్శనం ఏమిటి?'అనిస్ఫూర్తి.

**క. అనుటయు 'లెస్సగఁ దలఁచితి । విను మొక కీటంబునకును వేదవ్యాసం**
**బున లోకహితమొనర్చిన । మునికి నయిన సత్కథనము మునినుతచరితా! 314**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; మునినుతచరితా!= మునులు కొనియాడే నడవడిగలవాడా!; లెస్సగన్= మేలుగా; తలఁచితి= భావించావు; ఒక కీటకంబునకును= ఒక పురుగునకూ; వేదవ్యాసంబునన్= వేదాలను విడమరచి చూపటంతో; లోకహితము= లోకం మేలు; ఒనర్చిన మునికిన్= చేసిన మహర్షికీ; అయిన సత్+కథనమున్= జరిగిన మంచి ప్రసంగాన్ని; విను= ఆలకించుము.

**తాత్పర్యం:** అని అంటే 'మంచివాడా! నీవు చాలా చక్కగా భావించావు. ఒక పురుగునకూ, వేదవ్యాసమహర్షికీ జరిగిన సంభాషణ చెప్పుతాను వినుము.

**విశేషం:** 'మునినుతచరితా!' అనే సంబోధనపై 'కరుణామూర్తీ' అనే సంబోధనకు సమాధానగర్భితమైనది. 'నీవు యుద్ధంచేయటం లోకసామాన్య విషయంకాదు. దానిని గూర్చి నీవు పశ్చాత్తాపం పొందటమే. నీ శీలం మునులకు కూడా ప్రశంసనీయం అని చెప్పుతున్నది' అనే స్ఫూర్తిని అందులో అందుకొనాలి. వేద... మునికిన్ అని సాగదీయటం గౌరవవిశేషాన్ని అభివ్యక్తం చేయటం కొరకు.

**వ. దాన నీ యడిగిన యర్థంబు తెల్లం బగు' నని పలికి భీష్ముం డిట్లనియె. 315**

**ప్రతిపదార్థం:** దానన్= ఆ సంభాషణచేత; నీ+అడిగిన అర్థంబు= నీవడిగిన విషయం; తెల్లంబు= స్పష్టం; అగున్= అవుతుంది; అని; పలికి= మాటాడి; భీష్ముండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సంభాషణచేత నీవడిగిన విషయం స్పష్టంగా తెలుస్తుంది' అని పలికి భీష్ము డిట్లా అన్నాడు.

**క. శకటపథంబునఁ గీటం । బొకటి వెసం బాఱఁ గాంచె యోగీంద్రుఁడు జం**
**తుకలాప మానసదశా । ప్రకార సంవేది బాదరాయణుఁ డధిపా! 316**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; యోగి+ఇంద్రుఁడు= యోగులలో శ్రేష్ఠుడు; జంతు కలాప మానస దశా ప్రకార సంవేది= జంతువుల సముదాయపు హృదయాలలోని దశల తీరులను చక్కగా తెలిసికొనేవాడు; బాదరాయణుఁడు= శ్రీ వేదవ్యాసుడు; శకటపథంబునన్= బండిదారిలో; కీటకంబు= పురుగు; ఒకటి= ఒకటి; వెసన్= వడిగా; పాఱన్= పరుగెత్తుతూ ఉండగా; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** యోగులలో శ్రేష్ఠుడు, జంతువుల హృదయాల తీరులను చక్కగా తెలిసికొనగలవాడు అయిన వేదవ్యాసుడు బండ్లు నడచేదారిలో ఒక పురుగు వేగంగా పరుగుతీస్తూ ఉండగా చూచాడు.

**విశేషం:** బాదరాయణుడు - బదరీవనం (రేగుతోట) స్థానంగా కలవాడు యోగీంద్రుడు కనుకనే జంతువుల హృదయభావాలను తెలిసికొనగలుగువాడని భావన.

**వ. కాంచి నిరూపించి యాకృష్ణద్వైపాయనుం డక్కీటకంబుతో 'నీవు భయంబున రయం బెసఁగం బాఱెదవు కారణం బేమి?' యని యడిగిన నది యమ్మునీంద్రున కిట్లనియె. 317**

**ప్రతిపదార్థం:** కాంచి= చూచి; నిరూపించి= తనవలన ప్రమాదం కలుగదని దానికి నమ్మకం కలిగించి; ఆ+కృష్ణద్వైపాయనుండు= ఆ వ్యాసమహర్షి; ఆ+కీటకంబుతోన్= ఆ పురుగుతో; నీవు; భయంబునన్= భీతితో; రయంబు= వేగం; ఎసఁగన్= ఎక్కువ

అయ్యే విధంగా; పాఱెదవు= పరుగెత్తుతున్నావు; కారణంబు= హేతువు; ఏమి?; అని అడిగినన్= అడిగితే; అది= ఆ పురుగు; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ మహర్షిశ్రేష్ఠుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** చూచి, దానిని ఆపి, ఆ వ్యాసభగవానుడు ఆ పురుగుతో 'నీవు భయంతో మిక్కిలి వేగంతో పారిపోతున్నావు. దీనికి కారణం ఏమిటి?' అని అడిగితే ఆ పురుగు ఆ మునిశ్రేష్ఠుడితో ఇట్లా అన్నది.

**విశేషం:** కృష్ణద్వైపాయనుడు - నల్లనివాడు, ద్వీపం స్థానంగా కలవాడు; యమునానది ద్వీపంలో సత్యవతీపరాశరులకు పుట్టి అక్కడ ఉంటూ ఉంటాడు. బదరికావనంలో కూడా ఉంటాడు.

**తే. 'తెప్పతెరలంగ బండు లేతెంచుచున్న । యవి మహాత్మ! తన్నేమిజాతారవములుఁ**
**గడఁక నెడ్లను దఱిమి రొప్పెడు నరాలి । యులివు విని యుల్లమునఁ గడునులుకు పుట్టి. 318**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= దొడ్డబుద్ధిగలవాడా!; తెప్పతెరలంగన్= మిక్కిలి వేగంగా; బండులు= బండ్లు; ఏతెంచుచున్న+అవి= వస్తున్నాయి; తత్+నేమి జాత+ఆరవములున్= వాటి చక్రపు పట్టాలనుండి పుట్టిన పెనురొదలు; కడఁకన్= మిక్కిలి పూనికతో; ఎడ్లను= ఎద్దులను; తఱిమి= వెంటబడి; రొప్పెడు నర+ఆలి ఉలివున్= తోలే జనసముదాయాల నాదాన్నీ; విని; ఉల్లమునన్= గుండెలో; కడున్= ఎక్కువ అయిన; ఉలుకు= గుబులు; పుట్టి= కలిగి.

**తాత్పర్యం:** 'మహాత్మా! మీద మీద వేగంగా బండ్లు వస్తున్నాయి. వాటి పట్టాల చప్పుళ్ళు, ఎడ్లను పూనికతో తోలే జనాల అరుపులు విని నా గుండెలో గుబులు పుట్టింది.

**వ. బ్రదుకును జావును బరమసుఖంబును నత్యంత దుఃఖంబునుం గాదె? కావున. 319**

**ప్రతిపదార్థం:** బ్రదుకును= జీవితమూ; చావును= మరణమూ; పరమసుఖంబునున్= మిక్కిలి సుఖమూ; అత్యంత దుఃఖంబునున్= మిక్కిలి ఎక్కువ దుఃఖమూ; కాదె?= కదా!; కావునన్= కనుక.

**తాత్పర్యం:** బ్రదుకు ఎంతో సుఖమైనది. చావు మిక్కిలి దుఃఖాన్ని కలిగించేది కదా! కనుక. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. క్రందున మేను సిదియు నను । కొందల పాటొంది ప్రాణగొడ్డమగుటఁ ద**
**ప్పం దొలఁగఁ బాఱెదను ముని । బృందారక! యసదె ప్రాణభీతి దలంపన్?' 320**

**ప్రతిపదార్థం:** క్రందునన్= ఒత్తిడిలో; మేను= దేహం; చిదియున్= నలిగిపోతుంది; అను కొందలపాటు= అనే కంగారు; ఒంది= పొంది; ప్రాణగొడ్డము= ప్రాణం పోయేపని; అగుటన్= కావటంవలన; తప్పన్= తప్పించుకొనటానికి; తొలఁగన్+పాఱెదను= తొలగిపోతున్నాను; ముని బృందారక!= మునివరా!; తలంపన్= ఆలోచిస్తే; ప్రాణభీతి= ప్రాణానికి సంబంధించిన భయం; అసదె?= తక్కువదా?

**తాత్పర్యం:** సందడిలో దేహం నలిగిపోతుందనే కంగారుతో ప్రాణంపోయే పని కనుక తప్పించుకొని తొలగి పోతున్నాను. భావిస్తే ప్రాణభీతి ప్రాణికి తక్కువది కాదు కదా!'

**చ. అన విని దాని కిట్టులను నమ్మహితాత్మకుఁ డెంతలెస్స? నీ**
**మనికి దలంప నింద్రియసమాజసుఖంబులఁ బొందఁ గీటము**
**ల్గను టదిలేదు దుఃఖబహుళం బిది యీ యొడ లేల? చావు నీ**
**కనయము సౌఖ్యకారియగు నత్తెఱఁ గీవు దలంచి చూడుమా!' 321**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; ఆ+మహిత+ఆత్మకుఁడు= మిక్కిలి గొప్ప ఆత్మకల ఆ వ్యాసుడు; దానికిన్= ఆ పురుగునకు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు; తలంపన్= భావింపగా; నీ మనికి= నీ బ్రదుకు; ఎంత= ఏ మాత్రం; లెస్స?= మేలైనది? కీటముల్= పురుగులు; ఇంద్రియ సమాజ సుఖంబులన్= ఇంద్రియాల సముదాయంవలన కలిగే సుఖాలను; పొందన్+కనుట= పొందగలగటం; అది= అనేది; లేదు; ఇది+ఈ+ఒడలు= ఈ దేహం; దుఃఖబహుళంబు= దుఃఖాలు పెల్లుగా గలది; ఏల?= ఇట్టిది నీ కెందుకు?; నీకున్= నీకు; చావు= మరణం; అనయము= ఎల్లప్పుడు; సౌఖ్యకారి= సుఖాన్ని కలిగించేది; అగున్= అవుతుంది; ఈవు= నీవు; ఆ+తెఱఁగు= ఆ పద్ధతిని; తలంచి= భావించి; చూడుమా!= చూడుము.

**తాత్పర్యం:** అన్నమాట విని ఆ మహానుభావుడు దానితో ఇట్లా అన్నాడు. నీ బ్రదుకు ఎంత మేలైనది? పురుగులు ఇంద్రియసుఖాలు పొందే వీలు అంతగా లేదు కదా! పెక్కు దుఃఖాలకు తావైన ఈ దేహం ఎందుకు? నీకు చావే సుఖం కలిగిస్తుంది. ఆ పద్ధతి ఆలోచించి చూడుము.'

**విశేషం:** తత్త్వం గ్రహించటానికే ఈ ధోరణి కాని నిజంగా దాని చావు వ్యాసుడు కోరుతున్నాడని అర్థం గ్రహించరాదనటం కొరకు "మహితాత్మకుఁడు'' అనే పదాన్ని కవి ప్రయోగించాడు.

**వ. అనుటయు నక్కీటంబు. 322**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; ఆ+కీటంబు= ఆ పురుగు.

**తాత్పర్యం:** అని అనగా ఆ పురుగు ఇట్లా అంటున్నది.

**తే. 'అనఘ! కీటంబులకు విషయజములైన । సౌఖ్యములఁ బొంద లే దను చదువు గలదె?**
**వినుము తమతమ తెరువుల ననుభవింపఁ । గలదు చావును భీతికిఁ గారణంబు. 323**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; కీటంబులకున్= పురుగులకు; విషయజములు= శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనే విషయాలవలన పుట్టేవి; ఐన సౌఖ్యములన్= అయిన సౌఖ్యాలను; పొందన్= పొందుటకు; లేదు= అవకాశం లేదు; అను చదువు= అనే విద్య; కలదె?= ఉన్నదా?; వినుము; తమతమతెరువులన్= తమ తమదారులలో; అనుభవింపన్= అనుభవించటానికి; కలదు= వీలు ఉన్నది; చావును= చావు కూడా; భీతికిన్= భయానికి; కారణంబు= హేతువు.

**తాత్పర్యం:** 'మహాత్మా! పురుగులకు విషయసుఖాలు పొందే వీలులేదనే విద్య ఉన్నదా? అవి కూడా తమతమ దారులలో సుఖాల ననుభవిస్తాయి. అట్లాగే చావు భయానికి కారణం అవుతుంది.

**వ. నీవు నా మనం బరసి; తింతియ కాక యింత యెఱుంగవే? యది యట్లుండె నా తెఱం గవధరింపు; మేను దొలుమేన నొక్క శూద్రుండ ధనవంతుండ. 324**

**ప్రతిపదార్థం:** నీవు; నా మనంబు= నా హృదయాన్ని; అరసితి(వి)= పరీక్షించావు; ఇంతియ= ఇంతే; కాక; ఇంత= ఈ మాత్రం; ఎఱుంగవే?= తెలియవా? అది= ఆ విషయం; అట్లు= ఆ విధంగా; ఉండెన్= ఉన్నది; నా తెఱంగు= నా తీరు; అవధరింపుము= చక్కగా వినుము; ఏను= నేను; తొలుమేనన్= పూర్వదేహంలో; ఒక్కశూద్రుండన్= ఒక నాల్గవజాతివాణ్ణి; ధనవంతుండన్= శ్రీమంతుణ్ణి;

**తాత్పర్యం:** నీవు నా మనస్సును పరీక్షించావు కాని ఈ చిన్న విషయం నీకు తెలియనిదా? అది అట్లా ఉండనిమ్ము. నా సంగతి వినుము. నేను వెనుకటి జన్మలో ఒక శూద్రుడను. గొప్ప ధనం కలవాడను. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ఆచారహీనత యతిలోభ మన్యధ । నాపేక్ష క్రూరత యవినయంబు**
**మొదలైన దుర్గుణంబులకు నెల్లను నెల । వైయుండి మాతకు నధికభక్తిఁ**
**బ్రీతి యెప్పడు నొనరింతు; బ్రాహ్మణమాత్రుఁ । డతిథి యొక్కరుఁ డొక యప్ప డరుగు**
**దెంచిన నతనిఁ బూజించితి నది కార । ణముగ జాతిస్మరణంబు గలిగె**

**తే. మంచికర్మము సుఖము నొందించు టిపుడు । గాన వచ్చె మునీశ్వర! కరుణ నాకు**
**నత్తెఱం గెఱింగింపవే!' యతివిశదము । గాఁగ ననవుడు నాతండు గారవమున. 325**

**ప్రతిపదార్థం:** ఆచారహీనత= మంచి నడవడి లేకపోవటం; అతిలోభము= మిక్కిలి పిసినిగొట్టుతనం; అన్య ధన+అపేక్ష= ఇతరుల సొమ్ముపై కోరిక, క్రూరత= దయలేనితనం; అవినయంబు=పెద్దలయెడల నమ్రత లేకపోవటం; మొదలు+ఐన దుర్గుణంబులకున్= మొదలైన చెడు గుణాలకు; ఎల్లను= అన్నింటికీ; నెలవు= నివాసపుచోటు; ఐ; ఉండి= (కూడ); మాతకున్= తల్లికి; అధికభక్తిన్= మిక్కిలి భక్తితో; ఎప్పుడున్= ఎల్లవేళలా; ప్రీతిన్= ప్రియాన్ని; ఒనరింతున్= చేసేవాడిని; ఒక+ అప్పుడు= ఒక సమయంలో; బ్రాహ్మణమాత్రుఁడు= కేవలం పుట్టుకచేత బ్రాహ్మణుడైనవాడు; అతిథి= తిథి నియమంలేకుండా వచ్చినవాడు; ఒక్కరుఁడు= ఒకడు; అరుగుదెంచినన్= రాగా; అతనిన్= అతడిని; పూజించితిన్= గౌరవించాను; అది= ఆ పూజ; కారణముగన్= కారణంగా; జాతి స్మరణంబు= పూర్వజన్మజ్ఞానం తలపగలగటం; కలిగెన్= కలిగింది; ముని+ఈశ్వర!= మునిశ్రేష్ఠా; మంచి కర్మము= మంచిపని; సుఖమున్= సుఖాన్ని; ఒందించుట= కలిగించటం; ఇపుడు= ఇప్పుడు; కానవచ్చెన్= తెలియవచ్చింది; ఆ+తెఱంగు= ఆ పద్ధతి; నాకున్= నాకు; కరుణన్= జాలితో; అతి విశదము= తేటతెల్లం; కాఁగన్= అయ్యేవిధంగా; ఎఱింగింపవే!= తెలుపుమా!; అనవుడున్= అని అంటే; ఆతండు= ఆ వేదవ్యాసుడు; గారవమునన్= ప్రీతితో.

**తాత్పర్యం:** ఆచారం లేకపోవటం, అత్యాశ, ఇతరుల ధనాన్ని కోరటం, క్రౌర్యం, వినయం పాటించకపోవటం మొదలైన చెడు లక్షణాలకు నివాసభూమిగా ఉన్నాను. అయినా తల్లికి ఎక్కువ భక్తితో ఎప్పుడూ ప్రీతి కలిగించాను. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు అతిథిగా వస్తే అతడిని గౌరవించాను. దానివలన పూర్వజన్మస్మరణ కలిగింది. మంచి కర్మం సుఖం కలిగిస్తుంది - అనే సంగతి ఇప్పుడు నాకు తెలిసింది. మునీశ్వరా! దయతో నాకా విషయం తేటతెల్లంగా చెప్పుము' అంటే అతడు బుజ్జగింపుతో. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** ఎన్ని దుర్గుణాలున్నా మంచిపని వ్యర్థం కాదని ఈ పద్యం చెప్పుతున్నది.

**వ. ఆ జంతువుం గనుంగొని 'నీవు సెప్పనేల? దుష్కర్మకోటివలనం గీటంబ వగు టెఱింగితి భవదాచరితంబు లైన సత్కర్మంబులుం గాంచితి నమ్మేలునకు సంతోషించి కాదె నీతో సంభాషించితి! మదీయ తపోవిశేషంబున నీదయిన కీటత్వం బపనయించెద విషాదం బపనయింపుము; తపోబలంబును గడచినబలంబులుం గలవే? మనుష్యజన్మంబు నొంది మేలొనర్చెద ననుకోర్కి నీకుం బుట్టుట మేలు; మానవులకుం గర్మభూమికృతంబులైన సదసత్కర్మంబులం జూవె దేవతలును గీటంబులు నగుట వాటిల్లెడు' నని పలికి వెండియు. 326**

**ప్రతిపదార్థం:** ఆ+జంతువున్= ఆ ప్రాణిని; కనుంగొని= చూచి; నీవు; చెప్పన్+ఏల?= చెప్పటం ఎందుకు? దుష్కర్మ కోటివలనన్= పాపపు పనుల ఎక్కువతనంవలన; కీటంబవు= పురుగువు; అగుట= కావటం; ఎఱింగితిన్= తెలిసికొన్నాను; భవత్+ఆచరితంబులు= నీవు చేసినట్టివి; ఐన సత్+కర్మంబులున్= అయిన పుణ్యకార్యాలు కూడా; కాంచితిన్= పరికించాను; ఆ+మేలునకున్= ఆ మంచిపనికి; సంతోషించి= ఆనందించి; కాదె!= కదా!; నీతోన్= నీతో; సంభాషించితిన్= ప్రసంగం చేశాను; మదీయ తపస్+ విశేషంబునన్= నాదైన గొప్పదగు తపస్సుచేత; నీ+అది= నీకు సంబంధించినది; అయిన కీటత్వంబు= అయిన పురుగుతనం; అపనయించెదన్= పోగొట్టుతాను; విషాదంబు= దుఃఖం; అపనయింపుము= తొలగించుకొనుము; తపస్+బలంబును= తపస్సు శక్తిని; కడచిన బలంబులున్= మించిన బలాలు; కలవే?= ఉన్నవా?; మనుష్య జన్మంబున్= మానవుడి పుట్టుకను; ఒంది= పొంది; మేలు= మంచిపని; ఒనర్చెదన్= చేస్తాను; అను కోర్కి= అనే కోరిక; నీకున్= నీకు; పుట్టుట= కలగటం; మేలు= మంచిది; మానవులకున్= మనుష్యులకు; కర్మభూమి కృతంబులు= కర్మలకు సంబంధించిన భూమియందు చేసినట్టివి; ఐన సత్+అసత్+ కర్మంబులన్= మంచి చెడు పనులచేత; చూవె!= సుమా!; దేవతలును= దేవలోకంవారు; కీటంబులును= పురుగులు మొదలగు జంతువులును; అగుట= కావటం; పాటిల్లెడున్= సంభవిస్తుంది; అని; పలికి= మాట్లాడి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** ఆ జంతువు చూచి, 'నీవు చెప్పటం ఎందుకు? పాపాల సముదాయంవలన నీవు పురుగు అయిన సంగతి నాకు తెలుసు. నీవు చేసిన పుణ్యకార్యాలు కూడా నేను గుర్తించాను. ఆ మంచిపనికి సంతోషించి కదా - నీతో సంభాషణ చేశాను! నాదైన గొప్ప తపస్సు చేత నీ పురుగుతనాన్ని పోగొడతాను. నీవు విచారం మానుము. తపశ్శక్తిని మించిన శక్తులు లేవు. మనుష్యజన్మం పొంది మంచి పనులు చేస్తాననే కోరిక నీకు కలగటం కూడా మంచిదే. ఇది కర్మభూమి. మనుష్యులు ఇక్కడ చేసిన మంచిపనులవలన దేవతలవుతారు. పాపకార్యాలవలన పురుగులుగా పుట్టుతారు అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. సుకృతము లమ్మెయిఁ గల్గుట । నకట! జనిస్మృతియుఁ గల్గె నస్మత్సంద**
**ర్శకతయు నీకు నొదవె నో । డకు మున్నతపదము నిచ్చుటకు మెయికొంటిన్. 327**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; సుకృతములు= మంచి పనులు; కల్గుటన్= కలిగిన కారణంగా; అకట!= అయ్యో!; జనిస్మృతియున్= పూర్వపు పుట్టుక గుర్తు రావటం; కల్గెన్= కలిగింది; అస్మత్+సందర్శకతయున్= నన్ను చక్కగా చూడగలగటం కూడా; నీకున్= నీకు; ఒదవెన్= కలిగింది; ఓడకుము= భయపడకుము; ఉన్నతపదమున్= గొప్ప స్థానం; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; మెయికొంటిన్= అంగీకరించాను.

**తాత్పర్యం:** ఆ పుణ్యాలు కలగటంవలననే నీకు పూర్వజన్మ గుర్తుకు రావటం, నన్ను చూడగలగటం కలిగాయి. సంకోచపడకుము. నీకు ఉన్నత స్థానం ఇవ్వటానికి అంగీకరించాను.

**వ. అత్తెఱం గాకర్ణింపుము. 328**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు= ఆ పద్ధతి; ఆకర్ణింపుము= చక్కగా చెవులబెట్టు.

**తాత్పర్యం:** ఆ తీరు వినుము.

**వేదవ్యాసుఁడు గీటంబునకు నుత్తమజన్మంబులు గలుగ ననుగ్రహించుట (సం.13-180-1(కుంభ))**

**ఆ. నీచ శూద్రవైశ్య నృపజన్మములఁ గ్రమ । వృత్తి నొందు మెపుడుఁ జిత్తమునకుఁ**
**బు ట్టెఱుంగునట్టి పోఁడిమి నొసఁగితి । ధర్మపరుఁడు వగుదు దానఁ జేసి.' 329**

**ప్రతిపదార్థం:** నీచ శూద్ర వైశ్య నృప జన్మములన్= మనుష్యజన్మకంటె క్రిందివైన గోజన్మ మొదలైనది, శూద్రజన్మ, వైశ్యజన్మ, క్షత్రియుడి పుట్టుక అనే వాటిని; క్రమవృత్తిన్= క్రమమైన తీరుతో; ఒందుము= పొందుము; ఎపుడున్= అన్ని జన్మల సమయాలలోను; చిత్తమునకున్= హృదయానికి; పుట్టు= పుట్టుక; ఎఱుంగు+అట్టి పోఁడిమిన్= తెలిసికొనగల సమర్థతను; ఒసఁగితిన్= ఇచ్చాను; దానన్+చేసి= దానివలన; ధర్మపరుఁడవు= ధర్మమునందు మిక్కిలి ఆసక్తికలవాడవు; అగుదు(వు)= ఔతావు.

**తాత్పర్యం:** జంతుజన్మలు, శూద్ర, వైశ్య, క్షత్రియ జన్మలు క్రమంగా పొందుము. ఆ అన్ని జన్మలలో నీ హృదయానికి పూర్వజన్మజ్ఞానం కలిగే శక్తి ఇచ్చాను. దాని వలన ధర్మశ్రద్ధకలవాడవు కమ్ము.'

**విశేషం:** పుట్టెఱుంగుట అంటే ఈ పుట్టుకకు కారణం ఏమిటో తెలియటం. అది తెలిస్తే పాపాచరణకు జీవుడు సిద్ధపడడు.

**క. అని సాత్యవతేయుఁడు గృప । నెనసి సుధాధారఁ బోలు నీక్షణముం ద**
**త్తనువున నిగిడించిన న । మ్మునిపతిఁ గీర్తించె భూతములు ప్రీతములై. 330**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు పలికి; సాత్యవతేయుఁడు= సత్యవతి కుమారుడగు వ్యాసుడు; కృపన్= దయను; ఎనసి= పొంది; సుధాధారన్= అమృతధారను; పోలు+ఈక్షణమున్= పోలునట్టి చూపును; తద్+తనువునన్= అతడి దేహంమీద; నిగిడించినన్= పరపగా; ఆ+మునిపతిన్= మహర్షులలో శ్రేష్ఠుడైన ఆతడిని; భూతములు= ప్రాణులు; ప్రీతములు= ప్రేమకలవి; ఐ; కీర్తించెన్= కొనియాడినవి.

**తాత్పర్యం:** ఇట్లా పలికి, వ్యాసుడు దయ పూని అమృతధారవంటి చూపును ఆ పురుగు దేహంమీద సారించాడు. అప్పుడు సర్వభూతాలు ప్రీతిపొంది, ఆ మహర్షిని కొనియాడాయి.

**క. అక్కీటంబును భక్తిన్ । మ్రొక్కి శిరం బతని పాదముల మోపి మనం**
**బెక్కుడు ప్రమోదమునఁ గడుఁ । జొక్కఁగఁ దదనంతరమ యసువులం దొఱఁగెన్. 331**

**ప్రతిపదార్థం:** ఆ+కీటంబును= ఆ పురుగు కూడా; భక్తిన్= భక్తితో; మ్రొక్కి= చాగిలపడి; శిరంబు= తల; అతని పాదములన్= అతడి పాదాలమీద; మోపి= ఆనించి; మనంబు= మనస్సు; ఎక్కుడు ప్రమోదమునన్= ఎక్కువ అయిన గొప్ప ఆనందంతో; కడున్= మిక్కిలిగా; చొక్కఁగన్= పరవశించగా; తద్+అనంతరము+అ= ఆ వెనువెంటనే; అసువులన్= ప్రాణాలను; తొఱఁగెన్= వదలినది.

**తాత్పర్యం:** ఆ పురుగు భక్తితో చాగిలపడి, తల నతడి పాదాల దగ్గర ఆన్చి, హృదయం ఆనందంతో ఎంతో పరవశించిపోతూ ఉండగా వెనువెంటనే ప్రాణాలు వదలింది.

**వ. కారుణికత్వధుర్యుం డగు నప్పారాశర్యుం డట్లవలీల మేలొనర్చి కీటంబుం గృతార్థంబుంజేసి నిజేచ్ఛం జనియె నదియు నమ్మహానుభావు నిర్దేశించిన తెఱంగున జనియించుచు ననేకపుణ్యంబు లాచరించుచు నృపజన్మంబునం బూజ్యంబైన రాజ్యంబు నొంది. 332**

**ప్రతిపదార్థం:** కారుణికత్వ ధుర్యుండు= దయకలిగి ఉండటంలో మిక్కిలి గొప్పవాడు; అగు+ఆ+పారాశర్యుండు= అయిన ఆ పరాశరమహర్షి కుమారుడగు వ్యాసుడు; అట్లు= ఆ విధంగా; అవలీలన్= మిక్కిలి తేలికగా; మేలు= శుభం; ఒనర్చి= కలిగించి; కీటంబున్= పురుగును; కృత+అర్థంబున్= నెరవేరిన ప్రయోజనంకల దానిని; చేసి; నిజ+ఇచ్ఛన్= తన ఇష్టమును అనుసరించి; చనియెన్= వెళ్ళాడు; అదియున్= ఆ పురుగున్నూ; ఆ+మహా+అనుభావు నిర్దేశించిన; తెఱంగునన్= ఆ మహాత్ముడు తెలియజెప్పిన తీరున; జనియించుచున్= పుట్టుతూ; అనేక పుణ్యంబులు= పెక్కు పుణ్యాలు; ఆచరించుచున్= చేస్తూ; నృపజన్మంబునన్= క్షత్రియ జన్మంలో; పూజ్యంబు= ఎక్కువ మన్నించదగినది; ఐన రాజ్యంబున్= అయిన రాజ్యాన్ని; ఒంది= పొంది.

**తాత్పర్యం:** దయాశాలి అయిన వ్యాసుడు ఆ విధంగా మిక్కిలి సులభంగా మేలుచేసి, ఆ పురుగును కృతార్థం చేసి తన ఇచ్చచొప్పున వెళ్ళాడు. అది కూడా ఆ మహాత్ముడు చెప్పిన తీరున పుట్టుతూ; ఎన్నో పుణ్యాలు చేస్తూ రాజజన్మంలో మహనీయమైన రాజ్యం పొంది. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ । రాఁ దురంగంబుల రమణ యొప్ప**
**గొడుగులుం బడగలు ముడివడ గాయక । వందిపాఠకుల రవంబు లెసఁగ**
**భూషణంబుల రత్నపుంజంబు దీప్తులు । దిక్కుల నెల్లను దీఁటుకొనఁగ**
**సామంతకవిజన సీమంతినీముఖ । పరివారవైభవస్ఫురణ మలర**

**తే. దేవపతి వోలె సాత్యవతేయు నాశ్ర । మమున కేతెంచి తత్పాదకమల మాత్మ**
**ముకుట సంగతముగఁ జాఁగి మ్రొక్క గరుణ । నాతఁ డెత్తి తన్మస్తక మక్కుసేర్చె. 333**

**ప్రతిపదార్థం:** ఏనుంగున్= ఏనుగును; ఎక్కి; పెక్కు= చాలా; ఏనుంగులు= ఏనుగులు; ఇరుగడన్= రెండువైపులా; రాన్= రాగా; తురంగంబుల రమణ= గుర్రాల సొంపు; ఒప్పన్= అందగించగా; గొడుగులున్= తెల్లని గొడుగులు; పడగలున్= జెండా గుర్తులు; ముడివడన్= చిక్కుపడుచుండగా; గాయక వంది పాఠకుల రవంబులు= పాటగాండ్రయొక్క, స్తోత్రపాఠకులయొక్క నాదాలు; ఎసఁగన్= అతిశయించగా; భూషణంబుల రత్నపుంజంబు దీప్తులు= ఆభరణాలయందలి రత్నాలరాసుల కాంతులు; దిక్కులన్= దిక్కులందు; ఎల్లను= అంతటా; దీఁటుకొనఁగన్= నిండుకొనగా; సామంత= సామంతరాజులు; కవిజన= కవిజనులు; సీమంతినీ= సుందరాంగులు; ముఖ= మొదలైన; పరివార= వెంటనంటి యుండేవారి; వైభవ స్ఫురణము= విభవపు స్ఫూర్తి; అలరన్= ఒప్పారగా; దేవపతి పోలెన్= దేవేంద్రుడివలె; సాత్యవతేయు+ఆశ్రమమునకున్= వ్యాసుడి ఆశ్రమానికి; ఏతెంచి= వచ్చి; తద్+పాదకమలము= అతడి పాదం అనే పద్మాన్ని; ఆత్మ ముకుట సంగతముగన్= తన కిరీటంతో తాకినదిగా; చాఁగి= సాష్టాంగపడి; మ్రొక్కన్= నమస్కరించగా; ఆతఁడు= ఆ వేదవ్యాసుడు; కరుణన్= దయతో; ఎత్తి= లేవదీసి; తద్+మస్తకము= అతడి తలను; అక్కు= రొమ్మున; చేర్చెన్= చేర్చాడు.

**తాత్పర్యం:** పెద్ద ఏనుగు నెక్కి, రెండువైపుల ఎన్నో ఏనుగులు రాగా, గుర్రాల సొంపులు ఒప్పుతుండగా, గొడుగులు, జెండాలు ముడివడుతుండగా, గాయకులు, స్తోత్రాలవాళ్ళు చేసే ధ్వనులు మిన్నుముట్టుతుండగా, ఆభరణాల రత్న సముదాయాల కాంతులు దిక్కులందు వ్యాపించగా, సామంతులు, కవులు, పుణ్యస్త్రీలు మొదలైన పరివారపు వైభవం ఒప్పుతుండగా దేవేంద్రుడివలె వ్యాసుడి ఆశ్రమానికి వచ్చి, అతడి పాదపద్మాలకు తన కిరీటం తాకే విధంగా సాష్టాంగ దండప్రణామం చేయగా దయతో ఆతడు అతడిని పైకి లేవదీసి, ఆతడి తలను తన రొమ్ముున హత్తు కొన్నాడు.

**విశేషం:** ఒక చిన్న మంచిపనివలన ఎంత మహాఫలం పొందవచ్చునో చెప్పటానికి సుదీర్ఘమైన ఈ పద్యాన్ని కవి ప్రయోగించారు. ఇది ఇతరుల స్ఫూర్తికి దోహదం చేస్తుంది.

**వ. ఇ ట్లత్యాదరంబున సంభావించి శిష్యజనంబు నియోగించి. 334**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అత్యాదరంబునన్= మిక్కిలి ప్రేమతో; సంభావించి= మన్నించి; శిష్యజనంబున్= శిష్యులైన వారిని; నియోగించి= ఆదేశించి.

**తాత్పర్యం:** ఇట్లు మిక్కిలి ప్రేమతో మన్నించి, శిష్యులను ఏర్పాటు చేసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. రాజన్య సముచితంబగు । పూజావిధి యాచరించి పురుషోత్తమ! నీ**
**వీజన్మంబున సన్ముని । రాజికి వెఱఁ గగు తపశ్చరణ మొందవనా! 335**

**ప్రతిపదార్థం:** రాజన్య సముచితంబు= రాచబిడ్డకు తగినది; అగు పూజావిధి= అయిన మన్నన కార్యం; ఆచరించి= చేసి; పురుష+ఉత్తమ!= పురుషులలో శ్రేష్ఠుడా!; నీవు; ఈ జన్మంబునన్= ఈ పుట్టుకలో; సత్+మునిరాజికిన్= ఉత్తములైన మునుల వరుసకు; వెఱఁగు= ఆశ్చర్యం కలిగించేది; అగు తపస్+చరణము= అయిన తపస్సును చేయటం; ఒందవనా!= పొందు మయ్యా!

**తాత్పర్యం:** రాజకుమారుడికి తగిన మర్యాదలు చేసి 'ఉత్తమపురుషుడా! నీవు ఈ జన్మంలో ఉత్తమ మునులకు కూడా ఆశ్చర్యం గొలిపే తపస్సు చేయవయ్యా!

**క. గోవులకై యొండెను వి । ప్రావలికై యొండె నిర్భరాహవకేలీ**
**ప్రావీణ్యము మెఱసి విడువు । నీ వసువులు దాన నధిక నిర్మలత యగున్. 336**

**ప్రతిపదార్థం:** గోవులకున్+ఐ= ఆవులకొరకు; ఒండెను= కాని; విప్ర+ఆవలికిన్+ఐ=విద్వజ్జనులైన బ్రాహ్మణులకొరకు; ఒండెను= కానీ; నిర్భర+ఆహవ కేలీ ప్రావీణ్యము= నిండైన యుద్ధపు ఆటలో మిక్కిలి నేర్పు; మెఱసి= ప్రకాశింపజేసి; నీవు; అసువులు= ప్రాణాలు; విడువు= వదలుము; దానన్= దానిచేత; అధిక నిర్మలత= ఎక్కువ దోషంలేని స్థితి; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఆవులకొరకు గానీ, విప్రులకొరకుగానీ గొప్ప యుద్ధనైపుణ్యం వెలువడజేసి, నీవు ప్రాణాలు వదలుము. దానితో నీకు మిక్కిలి నిర్మలత్వం కలుగుతుంది.

**విశేషం:** గోవులు దేహపుష్టికీ, విప్రులు బుద్ధిపుష్టికీ తగిన వస్తుభావాలను ప్రజలకు అందిస్తూ ఉంటారు. కనుక వారికొరకు ప్రాణత్యాగం చేయటం పవిత్రకర్తవ్యంగా ప్రాచీనులు భావించారు. పైగా విప్రు డంటే అధ్యాత్మవిద్యాసంపన్నుడు.

**వ. ఇట్లు నిష్కల్మషత్వంబు సిద్ధించిన. 337**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నిస్+కల్మషత్వంబు= పాపంలేనితనం; సిద్ధించినన్= ఏర్పడితే.

**తాత్పర్యం:** ఈ విధంగా దోషంలేనితనం సిద్ధిస్తే. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ధరణీసురజనన మహిమ । దొరకొను నీ 'కని విధించి దుర్దాంతరిపు**
**స్ఫురణహరణపరిణతు న । న్నరపతి వీడ్కొల్పె మునిజనంబులు వొగడన్. 338**

**ప్రతిపదార్థం:** ధరణీసుర జనన మహిమ= బ్రాహ్మణ జన్మ అనే గొప్ప స్థితి; నీకున్= నీకు; దొరకొనున్= లభిస్తుంది; అని; విధించి= ఆజ్ఞాపించి; దుర్దాంతరిపు స్ఫురణ హరణ పరిణతున్= అణపశక్యం కాని శత్రువుల విజృంభణను పోగొట్టటంలో పాండిత్యంగల; ఆ+నరపతిన్= ఆ రాజును; మునిజనంబులు= మునులు; పొగడన్= కొనియాడగా; వీడ్కొల్పెన్= పంపించాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణజన్మ అనే మహనీయస్థితి నీకు కలుగుతుంది' అని చెప్పి అణపశక్యం కాని శత్రువులను రూపుమాపే ప్రజ్ఞగల ఆ రాజును మునులు కొనియాడుతూ ఉండగా పంపాడు.

**విశేషం:** దుర్దాంతరిపులు - అంతరంగశత్రువులు కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలు. ఈ శత్రువులను రూపుమాపే ప్రజ్ఞకలవాడే బ్రహ్మణశబ్దం పొందుతాడని స్ఫురించే అర్థం.

**తే. అతఁడు నానంద సంభరితాంతరంగుఁ । డగుచు దండప్రణామంబు లాచరించి**
**యరిగి యమ్ముని చెప్పిన యట్ల చేసి । భూమిసురజన్మలాభంబుఁ బొందె నధిప! 339**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అతఁడును= ఆ రాజు కూడా; ఆనంద సంభరిత+అంతరంగుఁడు= ఆనందంతో బాగా నిండిన హృదయం కలవాడు; అగుచున్= అవుతూ; దండ ప్రణామంబులు= సాష్టాంగనమస్కారాలు; ఆచరించి= చేసి; అరిగి= వెళ్ళి; ఆ+ముని= ఆ మహర్షి; చెప్పిన+అట్లు+అ= చెప్పినట్లే; చేసి= ఆచరించి; భూమిసుర జన్మ లాభంబున్= బ్రాహ్మణజన్మమనే ప్రయోజనాన్ని; పొందెన్= పొందాడు.

**తాత్పర్యం:** రాజా! అతడున్నూ ఆనందంతో నిండిన అంతరంగం కలవాడై సాష్టాంగనమస్కారాలు చేసి వెళ్ళి ఆ ముని చెప్పినట్లే ఆచరించి, బ్రాహ్మణజన్మ పొందాడు.

**విశేషం:** దండప్రణామం - దండం అంటే కర్ర. దానివలె నేలకు దేహాన్ని ఆన్చి చేసే నమస్కారం. దీనివలన 'నేను సర్వావయవాలతో నీకు విధేయుడనై ఉంటా' నని చెప్పినట్లవుతుంది.

**వ. ఇవ్విధంబున సద్ద్విజుండై. 340**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ తీరున; సత్+ద్విజుండు= ఉత్తమ బ్రాహ్మణుడు; ఐ= అయి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉత్తమబ్రాహ్మణుడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ద్విజుడంటే రెండు జన్మలు గలవాడు. మాతృగర్భం నుండి పుట్టట ఒక జన్మ. ఉపనయనాది సంస్కారాలతో రెండవ జన్మ. "సంస్కారా ద్విజ ఉచ్యతే" - సంస్కారంవలన ద్విజుడు అనబడతాడు.

**క. పుణ్య స్థలముల నెల్ల న । గణ్యము లగు యూపములు ప్రకాశములుగఁ గ**
**ర్మణ్యతయు వివిధ రత్న హి । రణ్యాదిక దానములును బ్రస్తుతి కెక్కన్. 341**

**ప్రతిపదార్థం:** పుణ్యస్థలములన్= పవిత్రమైన క్షేత్రాలలో; ఎల్లన్= అన్ని చోటులందు; అగణ్యములు= లెక్క పెట్ట శక్యము కానివి; అగు యూపములు= అయిన కట్టుకొయ్యలు (యజ్ఞపశువును కట్టివేసే స్తంభాలు); ప్రకాశములుగన్= అందరకు తెలిసే విధంగా; కర్మణ్యతయున్= కర్మమందు నిష్ఠయు; వివిధ రత్న హిరణ్య+ఆది దానములు= అనేకములైన రత్నాలు, సువర్ణాలు మొదలైన దానములతో; ప్రస్తుతికిన్= గొప్ప ప్రశంసకు; ఎక్కన్= ఎక్కునట్లుగా.

**తాత్పర్యం:** పుణ్యక్షేత్రాలన్నింటిలో లెక్కలేనన్ని యూపస్తంభాలు, అందరకూ కనపడే విధంగా కర్మమందు నిష్ఠ, అనేక రత్నాలు, సువర్ణాలు మొదలైన దానాలతో ప్రశంస కెక్కగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అధ్వరంబు లనేకంబు లాచరించి । యతఁడు మఱియును బాదరాయణునిఁ గాంచె**
**సదయచిత్తత నప్పరాశరసుతుండు । వీడుకొలుపంగఁ జని యశోవిభవ మెసఁగ. 342**

**ప్రతిపదార్థం:** అధ్వరంబులు= యజ్ఞాలు; అనేకంబులు= పెక్కులు; ఆచరించి= చేసి; అతఁడు= ఆ వ్యక్తి; మఱియును= మరొక మారు; బాదరాయణునిన్= వేదవ్యాసుడిని; కాంచెన్= సందర్శించాడు; ఆ+పరాశరసుతుండు= పరాశరుడి కుమారుడు వ్యాసుడు; సదయచిత్తతన్= దయతో కూడిన హృదయం కలవాడితనంతో; వీడుకొలుపంగన్= సెల వొసంగి పంపగా; చని= వెళ్ళి; యశోవిభవము= కీర్తియొక్క వైభవం; ఎసఁగన్= వృద్ధి పొందగా.

**తాత్పర్యం:** యజ్ఞా లెన్నో చేసి, అతడు మరొక మారు శ్రీ వేదవ్యాసులను సందర్శించాడు. ఆ మహర్షి మిక్కిలి దయగల హృదయంతో పంపగా వెళ్ళి, కీర్తిధనం వృద్ధిపొందగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వ్రతశీలతఁ బరఁగి తుదిన్ । శతమఖునకు నగ్గలంపు సఖుఁడై యమరా**
**ర్చిత సంస్తుతభవ్యపద । స్థితి నవ్యయ పరమసౌఖ్య సిద్ధిం దనరెన్. 343**

**ప్రతిపదార్థం:** వ్రతశీలతన్= వ్రతములయందు శీలం కల తనంతో; పరఁగి= ఒప్పారి; తుదిన్= కడకు; శతమఖునకున్= దేవేంద్రుడికి; అగ్గలము+సఖుఁడు= గొప్పమిత్రుడు; ఐ= అయి; అమర+అర్చిత సంస్తుత భవ్య పద స్థితిన్= దేవతలచేత పూజింపబడి కొనియాడదగిన, శ్రేష్ఠమైన స్థానంలోని ఉనికిచేత; అవ్యయ పరమ సౌఖ్య సిద్ధిన్= ఎన్నటికి తరుగువోని అత్యుత్తమ సుఖం కలగటంతో; తనరెన్= ఒప్పారాడు.

**తాత్పర్యం:** వ్రతం శీలంగా గలవాడై, చివరకు దేవేంద్రుడికి గొప్ప మిత్రం అయి, దేవతలు పూజించే కొనియాడదగిన శ్రేష్ఠమగు స్థానంలో ఉండి, తరుగువోని పరమసుఖం సిద్ధించినవాడై ప్రకాశించాడు.

**విశేషం:** 'శీలం' అంటే స్వభావం. వ్రతాలు చేయటం అతడికి స్వభావంగా అయిందని భావం. శతమఖ శబ్దం సార్థకం. ఈతడు పెక్కు యజ్ఞాలు చేశాడు. నూరు యజ్ఞాలు చేసినవాడు దేవేంద్రు డవుతాడు. కనుక ఇతడు అతడికి సఖుడైనాడు. అంతేకాదు, ఇన్ని యజ్ఞాలు చేసికూడా మంచితనంచేత దేవేంద్రుడికి అసూయాస్థానం కాలేదు. సఖు డంటే సమప్రాణుడు.

**వ. అని చెప్పి భీష్ముండు. 344**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; భీష్ముండు= భీష్ముడు.

**తాత్పర్యం:** అని చెప్పి భీష్ముడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మనుజేంద్ర! కురుక్షేత్రం । బున నద్భుతఘోరసమరమున నమ్మాడ్కిం**
**దనువులు దొఱఁగిన నృపులకు । ననంత సుఖగతులు గల్గు టనుమానంబే? 345**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= రాజా!; కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రంలో; అద్భుత, ఘోర సమరమునన్= అద్భుతం, భయంకరం అయిన యుద్ధంలో; ఆ+మాడ్కిన్= ఆ విధంగా; తనువులు= దేహాలు; తొఱఁగిన నృపులకున్= వదలిన రాజులకు; అనంతసుఖగతులు= అంతంలేని సుఖ స్థితులు; కల్గుట= కలగటం; అనుమానంబే?= సందేహమా?

**తాత్పర్యం:** రాజా! కురుక్షేత్రంలో అద్భుతభయంకర యుద్ధంలో దేహాలు వదలిన రాజులకు అనంత సుఖాలుగల గతులు కలగటంలో అనుమానం ఏమీ లేదు.

**వ. భవదీయబంధు లందఱు నూర్ధ్వలోక ప్రాప్తుల; నీ వేమియు ననుమానింపకు' మని పలికినం బాండవాగ్రజుండు పరమసంతోషభరితాంతఃకరణుండై సురసరిత్సూనుతో 'విద్యా తపోదానంబులలో నెయ్యది విశేషం బెఱింగింపవే!' యనుటయు నమ్మహీపతి నమ్మహామతి గౌరవంబునం గనుంగొని. 346**

**ప్రతిపదార్థం:** భవదీయబంధులు= నీ చుట్టాలు; అందఱున్= అందరూ; ఊర్ధ్వలోక ప్రాప్తులు+అ= పై పుణ్యలోకాలను పొందినవారే; నీవు; ఏమియున్= ఏమీ; అనుమానింపకుము= సందేహించవద్దు; అని; పలికినన్= పలికితే; పాండవ+అగ్రజుండు= పాండుడి కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు; పరమ సంతోష భరిత+అంతఃకరణుండు+ఐ= గొప్ప సంతోషంతో నిండిన హృదయం కలవాడై; సురసరిత్+సూనుతోన్ దేవతలనది గంగ కొడుకు భీష్ముడితో; విద్యా తపస్+దానంబులలోన్= విద్య, తపస్సు, దానం - అనే వాటిలో; ఏ+అది= ఏది; విశేషంబు?= గొప్పది; ఎఱింగింపవే?= దయతో చెప్పుము!; అనుటయున్= అనగా; ఆ+మహీపతిన్= ఆ రాజును; ఆ+మహామతి= గొప్పబుద్ధిశాలి అయిన భీష్ముడు; గౌరవంబునన్= దొడ్డబుద్ధితో; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** నీ చుట్టాలందరూ పైనున్న ఉత్తమలోకాలను పొందినవారే. నీ వేమీ అనుమానపడకుము అని చెప్పగా ధర్మరాజు పరమసంతోషంతో నిండిన హృదయం కలవాడై భీష్ముడితో 'విద్య, తపస్సు, దానం అనే వాటిలో ఏది గొప్పది? దయ చేసి తెలుపుము' అనగా ఆ రాజును ఆ బుద్ధిశాలి మన్ననతో చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** గౌరవం - అంటే గురుభావం. ఇక్కడ ఆ అర్థాన్ని గ్రహింపరాదు. అడిగినది గొప్ప విషయం కనుక అడిగిన వాడియందు గొప్పవాడు అనే భావన కలిగిందనే అర్థం గ్రహించాలి.

**తే. 'వ్యాసమైత్రేయ పుణ్యసంవాద మనఘ! వినిన నీ ప్రశ్నమున కది విశదమైన**
**యుత్తరంబగు నేకాగ్రచిత్తవృత్తి । వగుమ! నీ 'వని పల్కి యిట్లనియె నధిప! 347**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; వ్యాస మైత్రేయ పుణ్యసంవాదము= వ్యాసుడు, మైత్రేయుడు అనేవారి పవిత్రమైన సంభాషణం; వినినన్= వింటే; అది; నీ ప్రశ్నమునకున్= నీ ప్రశ్నకు; విశదము= స్పష్టము; ఐన+ఉత్తరంబు= అయిన సమాధానం; అగున్= అవుతుంది; నీవు; ఏక+అగ్ర చిత్తవృత్తివి= చెదరని మనస్సుతీరు కలవాడవు; అగుము!= కమ్ము!; అని; పల్కి= పలికి; అధిప= రాజా!; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! వ్యాసమైత్రేయ సంవాదం వింటే అది నీ ప్రశ్నకు స్పష్టమైన సమాధానం అవుతుంది. మనస్సును చెదరనీయకుము' అని భీష్ముడు పలికి ఇట్లా అన్నాడు జనమేజయమహారాజా!

**విశేషం:** ఇక్కడ అధిప! అనే సంబోధన జనమేజయుడికి సంబంధించినది, అనఘ- ధర్మరాజుకు సంబోధన వక్తలు క్రమంగా వైశంపాయనుడు, భీష్ముడు.

## వ్యాసమైత్రేయ సంవాదము భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పుట (సం.13-182-1(కుంభ))

**సీ. 'వ్యాసమునీంద్రుండు వారాణసీపురి । కరిగి మున్ మైత్రేయుఁ డచట నునికి**
**నాతని యున్నెడ కప్రకాశతఁ జన్న । నెఱిఁగి యమ్మహితాత్ముఁ డెఱఁగి భక్తిఁ**
**బూజించి యుత్కృష్టభోజనంబునఁ దృప్తి । సేసిన నధికవికాసరుచిర**
**ముఖుఁడైన యమ్మహామునిఁ జూచి 'మోదమ । గ్గలమయి మీయందుఁ గానఁబడియెఁ**

**తే. గారణంబేమొకో?' యని గారవమున । నాతఁ డడిగిన నతఁ డధికాదరమునఁ**
**'దపము శ్రుత మాదిగాఁ గల ధర్మకోటి । లోన నెల్లను నధికంబు దాన' మనియె. 348**

**ప్రతిపదార్థం:** వ్యాసముని+ఇంద్రుండు= వ్యాసమహర్షి; వారాణసీ పురికిన్= కాశీపట్టణానికి; అరిగి= వెళ్ళి, మున్= ముందుగా; మైత్రేయుఁడు= మైత్రేయుడనే ముని; అచటన్= ఆ తావున; ఉనికిన్= ఉండటంవలన; ఆతని+ఉన్న+ఎడకున్= ఆతడున్నచోటునకు; అప్రకాశతన్= గూఢంగా; చన్నన్= పోగా; ఆ+మహిత+ఆత్ముఁడు= దొడ్డ ఆత్మశక్తిగల ఆ ముని; ఎఱిఁగి= తెలిసికొని; భక్తిన్= భక్తితో; ఎఱఁగి= దండ ప్రణామం చేసి; పూజించి= పూజ గావించి; ఉత్కృష్ట భోజనంబునన్= మేలైన ఆహారంతో; తృప్తి+చేసినన్= తృప్తి కలిగించగా; అధిక వికాస రుచిర ముఖుఁడు= ఎక్కువగా వికసించిన అందమైన ముఖం కలవాడు; ఐన ఆ+మహామునిన్= అయిన ఆ గొప్ప మునిని; చూచి; మీయందున్= మీయందు; మోదము= ఆనందము; అగ్గలము+అయి= ఎక్కువ అయి; కానన్+ పడియెన్= కనపడుతున్నది; కారణంబు= హేతువు; ఏమి+ఒకో!= ఏదో కదా!; అని; గారవమునన్= గౌరవంతో; ఆతఁడు= ఆ మైత్రేయుడు; అడిగినన్= అడిగితే; అతఁడు= ఆ వ్యాసుడు; అధిక+ఆదరమునన్= మిక్కిలి ప్రీతితో; తపము= తపస్సు; శ్రుతము= విద్య; ఆదిగాన్= మొదలుగా; కల ధర్మకోటి లోనన్= కల ధర్మాల సముదాయంలో; ఎల్లను= అన్నింటియందు; దానము= త్యాగం, ఇవ్వటం అనేది; అధికంబు= గొప్పది; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి కాశీనగరానికి వెళ్ళాడు. అక్కడ అంతకుముందే ఉన్న మైత్రేయమహర్షి దగ్గరకు గుట్టుగా వెళ్ళాడు. ఆ మహానుభావుడు గుర్తుపట్టాడు. పరమభక్తితో చాగిలపడి నమస్కరించి పూజించి, శ్రేష్ఠమైన భోజనం

పెట్టి, తృప్తిపరచాడు. దానితో వ్యాసుడి ముఖం ఎంతో విప్పారి ఆనందంతో సుందరమయింది. అది చూచి మైత్రేయుడు 'మీయందు ఆనందం అత్యధికంగా కానవస్తున్నది. కారణం ఏమిటో?' అని మర్యాద ఉట్టిపడుతూ ఉండగా అడిగాడు. అప్పుడు వ్యాసుడు మరింత ఆదరంతో 'తపస్సు విద్య మొదలైన ధర్మాలన్నింటిలో దానం గొప్పది' అన్నాడు.

**విశేషం:** అప్రకాశతన్ - తానెవరో తెలియనీయకుండా వ్యాసుడు వెళ్ళాడు. మహానుభావులను ఎట్లాగైనా మన్నిస్తారు. సాధారణ వ్యక్తిగా వెళ్ళినప్పుడు చేసే మర్యాద తీరునుబట్టి మనిషి హృదయౌన్నత్యం తెలుస్తుంది.

**వ. అని మఱియును. 349**

**తాత్పర్యం:** అని ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'దానార్హవస్తువులలో । మానిత మన్నంబ యన్నమయము లసువులున్**
**మేనుఁ దదీయబలంబును । గాన బుధులు దానిఁ దద్ద గైకొంద్రు మదిన్. 350**

**ప్రతిపదార్థం:** దాన+అర్హవస్తువులలోన్= దానానికి తగిన పదార్థాలలో; అన్నంబు+అ= అన్నమే; మానితము= ఎక్కువ మన్నింపబడినది (గొప్పది); అసువులున్= ప్రాణాలు; మేనున్= దేహమూ; తదీయబలంబును= ఆ దేహానికి చెందిన శక్తీ; అన్నమయములు= అన్నం యొక్క స్వరూపాలే; కానన్= కనుక; బుధులు= వివేకంగలవారు; దానిన్= ఆ అన్నాన్ని; మదిన్= హృదయంలో; తద్దన్= ఎక్కువగా (గొప్పది అనే భావంతో); కైకొంద్రు= గ్రహిస్తారు.

**తాత్పర్యం:** 'దానం ఇవ్వదగిన వస్తువులలో అన్నమే గొప్పది. ప్రాణాలూ, దేహమూ, దాని బలమూ అన్నం స్వరూపాలే. కనుక పండితులు దానిని మనస్సులో గొప్పదిగా భావిస్తారు.

**విశేషం:** "అన్నమయం హి సౌమ్య మనః" - సౌమ్యుడా 'మనస్సు అన్నమయం కదా!' అని ఉపనిషద్వాక్యం. అన్నం రక్తం, మాంసం మొదలైన ధాతువులుగా మారు ప్రక్రియను ఆధునికవిజ్ఞానశాస్త్రంతోపాటు ప్రాచీన ఋషులు కూడా సందర్శించారనటానికి ఈ పద్యం నిదర్శనం.

**క. తప ముల్లము కల్మషముల । నపగతములఁ జేయు విద్య కాస్పదమగు నా**
**తపసి మహితదానంబున । నుపచితమగు విద్య దపము నుత్కర్షించున్. 351**

**ప్రతిపదార్థం:** తపము= తపస్సు; ఉల్లము కల్మషములన్= మనస్సులోని మాలిన్యాలను; అపగతములన్= తొలగిపోయే వాటినిగా; చేయున్= చేస్తుంది; విద్యకున్= మోక్షసంబంధమైన జ్ఞానానికి; ఆస్పదము= తావు; అగున్= అవుతుంది; ఆ తపసి మహితదానంబునన్= ఆ తాపసుడు చేసిన గొప్ప దానంవలన; విద్య; ఉపచితము= చక్కగా పెంపొందినది; అగున్= అవుతుంది; తపమున్= తపస్సును; ఉత్కర్షించున్= గొప్పదానినిగా చేస్తుంది.

**తాత్పర్యం:** తపస్సు మనస్సులోని మాలిన్యాల నన్నింటిని తొలగించి వేస్తుంది. విద్యకు అవకాశం కల్పిస్తుంది. ఆ తపసి చేసిన గొప్ప దానంవలన విద్య పెంపొందుతుంది. ఆ విద్య తపస్సును వృద్ధిచేస్తుంది.

**విశేషం:** తపస్సు అంటే కఠోరములైన నియమాలచేత శరీరాన్ని శుష్కింపజేయటం. దీనివలన మనస్సు వికారాలు నశిస్తాయి. "సరసాహారము రాగహేతువు" అని కదా కవివాక్కు. కనుక ఆహార నియమంవలన మనస్సు అదుపులోనికి వస్తుంది. దుష్ట భావాలు జారిపోతాయి. విద్య అంటే అధ్యాత్మవిద్యయే. మాలిన్యాలు జారిపోయిన మనస్సులోనే అధ్యాత్మవిద్య నిలుస్తుంది. దానం అంటే వస్తుత్యాగం. అది మమకారదోషాన్ని తొలగించి వేస్తుంది. మమకారం బంధానికి కారణం. కనుక తపస్సు చేసి హృదయంలో విద్యను పదిలపరచుకొన్నవాడు దానం చేస్తే అది 'మహితం' - గొప్పది అవుతుంది. దానివలన విద్య మరింత పెరుగుతుంది. అది లోక లోకేశ్వరతత్త్వాలను చక్కగా నిరూపిస్తూ మరల తపస్సును చక్కగా పోషిస్తుంది. ఇట్లా ఇది ఒక మహనీయచక్రం.

**క. కాన తపంబును విద్యయు । దానౌదాత్త్య ప్రవర్ధితంబులు విద్యా**
**నూనత్వం బచ్యుతు గను । దానికి దీపంబు సద్వ్రతప్రవణులకున్. 352**

**ప్రతిపదార్థం:** కాన= కాబట్టి; తపంబును= తపస్సును; విద్యయున్= అధ్యాత్మ జ్ఞానమూ; దాన+ఔదాత్త్య ప్రవర్ధితంబులు= దానపు గొప్పతనంచేత పెంపొందింపబడినవి; సద్వ్రతప్రవణులకున్= మంచి వ్రతాలయందు నిష్ఠ కలవారికి; విద్యా+అనూనత్వంబు= విద్యయొక్క తక్కువకానితనం; అచ్యుతున్= పరమాత్మను; కనుదానికిన్= చూచేదానికి; దీపంబు= చక్కని జ్యోతి.

**తాత్పర్యం:** కనుక తపస్సూ, విద్యా దానం మహిమచేత పెంపొందుతాయి. విద్యలో లోపం లేకపోవటం చక్కని వ్రతనిష్ఠకలవారికి పరమాత్మను చూపించే దీపం అవుతుంది.

**ఉ. కావున నన్నదానమునఁ గా కెటలుండు మహాప్రమోద? మ**
**త్యావిలచిత్తుఁ డైనను మహత్తరదానమునన్ విశుద్ధ స**
**ద్భావత నొందు నిక్క' మని పల్కె నరేంద్ర! తపంబు విద్యయున్**
**దైవత పూజనీయములు దానము వానికిఁ బోషకంబగున్.' 353**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అన్నదానమునన్= అన్నదాన విషయంలో; మహాప్రమోదము= పరమానందం; కాక= కలుగకుండా; ఎటులు= ఏ విధంగా; ఉండున్?= ఉంటుంది?; అతి+ఆవిల చిత్తుఁడు= మిక్కిలి మలినమైన చిత్తం కలవాడు; ఐనను= అయినా; మహత్తర దానమునన్= మిక్కిలి గొప్పదైన (అన్న) దానంచేత; విశుద్ధ సత్+భావతన్= నిర్మలమైన మంచిభావం కల తనాన్ని; ఒందున్= పొందుతాడు; నిక్కము=సత్యము; అని; నరేంద్ర!= రాజా!; పల్కెన్= (వ్యాసుడు) పలికాడు; తపంబున్= తపస్సు; విద్యయున్= విద్య; దైవత పూజనీయములు= దేవతలకు(కూడా) పూజింపదగినవి; దానము= దానం; వానికిన్= ఆ రెండింటికీ; పోషకంబు= పుష్టి కలిగించేది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** కాబట్టి అన్నదానంచేత పరమానందం తప్పక కలుగుతుంది. పరమదుష్టభావాలు కలవాడైనా గొప్పదైన ఈ దానంచేత నిర్మలమూ, మంచిదీ అయిన భావం కలవాడవుతాడు. ఇది సత్యం' అని వ్యాసుడు చెప్పాడు. రాజా! తపస్సు, విద్య దేవతలు కూడా మన్నించే విషయాలు. దానం వాటిని చక్కగా పెంచుతుంది.

**విశేషం:** వేదం "తస్మా దన్నం దదన్సర్వాణ్యేతాని దదాతి" అంటున్నది. అన్నదానం చేస్తే అన్ని దానాలూ చేసినట్లే.

**క. అని శాంతనవుఁడు సెప్పిన । విని కౌంతేయాగ్రజుండు 'విమలమతీ! యం**
**గనల సమాచారంబులు । వినంగ నే వలతుఁ జెప్పవే తెలియంగన్?' 354**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; శాంతనవుఁడు= శంతనుడి కుమారుడు భీష్ముడు; చెప్పినన్= చెప్పగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతికొడుకులలో పెద్దవాడు యుధిష్ఠిరుడు; విని= ఆలకించి; విమలమతీ!= స్వచ్ఛమైన బుద్ధిగల ఓ తాతా!; అంగనల సమాచారంబులు= స్త్రీలకు సంబంధించిన చక్కని ఆచారాలు; నేన్= నేను; వినంగన్= వినటానికి; వలతున్= ఇష్టపడుతున్నాను; తెలియంగన్= తెలిసే తీరున; చెప్పవే!= చెప్పుమా!

**తాత్పర్యం:** ఇట్లా భీష్ముడు చెప్పగా విని ధర్మరాజు 'విమలమతీ! స్త్రీల సమాచారాలు వినగోరుతున్నాను. చక్కగా తెలిసే విధంగా నాకు చెప్పుమా! (అన్నాడు)

**వ. అనిన నతండు 'కైకేయీ శాండిలీ సంవాదంబున నిది దెల్లంబగుఁ జెప్పెద విను' మని యిట్లనియె. 355**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అతండు= ఆ భీష్ముడు; కైకేయీ శాండిలీ సంవాదంబునన్= కైకేయి, శాండిలి అనే వారి సంభాషణలో; ఇది= నీ వడిగిన విషయం; తెల్లంబు= చక్కగా తెలిపేది; అగున్= అవుతుంది; చెప్పెదన్= చెప్పుతాను; వినుము; అని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అంటే భీష్ముడు 'కైకేయీ శాండిలీ సంవాదంలో నీ వడిగిన విషయం స్పష్టమవుతున్నది. చెప్పుతాను వినుము' అని ఇట్లా చెప్పాడు.

**తే. సుమన యనియెడు కైకేయి యమరపురము । నందు శాండిలిఁ గని 'భవ్యమైన దివ్య**
**పదవి యే వర్తనమునఁ జొప్పడియె నీకు? । నతివ! చెప్పుము నా కని యడిగె నధిప! 356**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; సుమన; అనియెడు కైకేయి= అనే పేరుగల కేకయ రాజపుత్రి; అమరపురమునందున్= దేవతల పట్టణం అయిన అమరావతిలో; శాండిలిన్= శాండిలి అనే ఇంతిని; కని= చూచి; అతివ!= కాంతా!; భవ్యము= మిక్కిలి గొప్పది ఐన దివ్యపదవి= అయిన దేవలోకపు స్థానం; నీకున్= నీకు; ఏ వర్తనమునన్= ఎట్టి నడవడివలన; చొప్పడియెన్?= కలిగింది?; నాకున్= నాకు; చెప్పుము= తెలుపుము; అని; అడిగెన్= అడిగింది.

**తాత్పర్యం:** కేకయరాజపుత్రి సుమన అమరావతిలో శాండిలిని చూచి 'కాంతా! ఇంత శ్రేష్ఠమైన దేవలోక నివాసం నీకు ఏ నడవడితో కలిగిందో నాకు చెప్పుము' అని అడిగింది.

**వ. అని యడిగిన యాయమ కయ్యంగన యిట్లనియె. 357**

**ప్రతిపదార్థం:** అని; అడిగిన+ఆ+అమకున్= అడిగిన ఆ ఇంతికి; ఆ+అంగన= ఆ స్త్రీ - శాండిలి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పింది.

**తాత్పర్యం:** అని అడిగిన సుమనకు శాండిలి ఇట్లా చెప్పింది.

**సీ. 'మామకు నత్తకు మార్పల్క దేవ పి । త్రతిథిపూజనములయందు సొలయ,**
**నిలువడిఁ దలవాకి లెప్పుడు నెఱుఁగక । పెలుచ నవ్వక శుద్ధి వెలయ విప్ర**
**భిక్ష యోపిక కల్గి పెట్టుచు వర్తింతు । వలయు కార్యములకు వెలఁది! మగుడఁ**
**బతివచ్చునప్పుడు భక్తియు వేడ్కయుఁ । బొదల నాసనపాద్యములను సుముఖ**

ఆ. భావమునను సేవ వాటింతు, బిడ్డల । శిక్ష వదలఁ, దిట్టఁ జెట్టఁ గనియు,

నాకు వేఱ ప్రియ మనఁగ లేదు; పతిమెచ్చు । వంటకములు చవిగ వండి యిడుదు. 358

**ప్రతిపదార్థం:** మామకున్= భర్తతండ్రికి; అత్తకున్= మగని తల్లికి; మారు+పల్కన్= ఎదురుమాట చెప్పను; దేవ పితృ+అతిథి పూజనములయందున్= దేవతల, పితృదేవతల, అతిథుల పూజలలో; సొలయన్= విముఖురాలను కాను; ఇలువడిన్= మంచినడతతో; తలవాకిలి= వీథివాకిలి; ఎప్పుడున్= ఎప్పుడూ; ఎఱుఁగక= తెలియక; పెలుచన్= పెద్దగా; నవ్వక; శుద్ధి= పరిశుద్ధత; వెలయన్= చక్కగా కలుగగా; విప్రభిక్ష= మంచి విద్య కలవారికి భిక్షను; ఓపిక= సహనం; కలిగి; పెట్టుచున్= పెట్టుతూ; వెలఁది!= ఓ ఇంతీ!; వలయు కార్యములకున్= చేయవలసిన పనులకు; మగుడన్= తిరిగి; వర్తింతున్= నడచుకొంటాను; పతి= మగడు; వచ్చు+ అప్పుడు= ఇంటికి వచ్చే సమయంలో; భక్తియున్= నిండైన గౌరవమూ; వేడ్కయున్= ఉత్సాహభావం; పొదలన్= కలుగగా; ఆసన పాద్యములను= ఆసనమును, కాళ్ళు కడుగుకొనటానికి నీటిని; సుముఖ భావమునను= అనుకూలభావంతో; సేవ= పరిచర్య; పాటింతున్= కూర్చుతాను; బిడ్డలశిక్షన్= బిడ్డలను తీర్చిదిద్దటాన్ని; వదలన్= విడువను; చెట్టన్= చెడును; కనియున్= చూచి; కూడా; తిట్టన్= నిందించను; నాకున్= నాకు; వేఱు+అ= మరొకటి అయిన; ప్రియము= ఇష్టము; అనఁగన్= అనటానికి; లేదు; పతి మెచ్చు వంటకములు= భర్త మెచ్చే పాకాలు; చవిగన్= రుచిగా; వండి; ఇడుదున్= పెట్టుతాను.

**తాత్పర్యం:** అత్తమామలకు ఎదురు చెప్పను. దేవపూజలు, శ్రాద్ధములు, అతిథి సపర్యలు అనే పనులలో ఎడమొగం పెట్టను. మంచి నడవడికతో ఉంటాను. వీథివాకిలి తెలియకుండా ఉంటాను. పకపకా నవ్వను. పరిశుద్ధ బుద్ధితో విద్యగలవారికి భిక్షపెట్టుతూ తక్కిన పనులు చూచుకొంటాను. భర్త ఇంటికి వచ్చినప్పుడు పీట వెయ్యటం, కాళ్ళకు నీళ్ళు ఇవ్వటం - మొదలైన పనులు నేనే అనుకూలభావంతో చేస్తాను. బిడ్డలను తీర్చిదిద్దటం అనే పనిని వదలను. ఎక్కడైనా చెడ్డతనం కనిపించినా తిట్టను. నాకు ప్రియమైన దంటూ వేరే ఏమీ లేదు. భర్త ఇష్టపడే వంటలు చేసి పెట్టుతూ ఉంటాను.

**విశేషం:** 'తలవాకిలి ఎఱుఁగను' అంటే 'వికారభావంతో వీథిజనాలను చూడను' అని భావం. పగలబడి నవ్వటం కొన్ని సందర్భాలలో అవతలి వారికి ఉద్వేగం పుట్టించవచ్చు. శుద్ధి వెలయన్ - ఇక్కడ శుద్ధి బాహ్యాభ్యంతరాలకు సంబంధించినది. స్నానాదులవలన బాహ్యశుద్ధీ, కోపతాపాలు లేనితనంతో ఆంతరశుద్ధీ ఏర్పడుతాయి. 'సుముఖభావం' - భార్యాభర్తల అనురాగం త్రికరణశుద్ధితో కూడినది కావాలి - అని సూచన. చెట్టఁ గనియుఁ దిట్టన్ - ఇది హృదయపు సమస్థితిని, సృష్టిలోని తీరు తెన్నులను నిర్వికారంగా చూడగల హృదయౌన్నత్యాన్నీ సూచిస్తుంది. భారతీయదాంపత్యం మహిమను ఈ పద్యం తెలుపుతుంది. ఇందులోని పవిత్రప్రవర్తన పురుషుడికి కూడా అన్వయించుకొనాలి.

చ. వరుఁ డొక వెంట నెన్నఁడు ప్రవాసగతుం డగు నాఁటఁ గోలె న

ప్పురుషుఁడు వచ్చునంతకును బూవులు పూఁతలు మేలిచీర లా

భరణము లెక్కుడుం జవులపాకవిశేషము లాదరింప నె

ప్పరుసునఁ గొల్చుఁ గూడురువ బంధులకున్ దగ నెమ్మి సల్పుదున్. 359

**ప్రతిపదార్థం:** వరుఁడు= మగడు; ఒక వెంటన్= ఒక పనిమీద; ఎన్నఁడు= ఏనాడు; ప్రవాసగతుండు= పరదేశం పోయినవాడు; అగున్= అవుతాడో; నాఁటన్+కోలెన్= ఆ దినం మొదలుకొని; ఆ+పురుషుఁడు= ఆ మగవాడు (భర్త); వచ్చు+అంతకును=

వచ్చేవరకు; పూవులు= పూలు; పూఁతలు= సుగంధ ద్రవ్యాల పూతలు; మేలిచీరలు= మేలైన వస్త్రాలు; ఆభరణములు= నగలు; ఎక్కుఁడున్= ఎక్కువ అయిన; చవుల పాక విశేషములు= రుచిగల వంటలు; ఆదరింపన్= ఇష్టపడను; ఏ+పరుసునన్= ఏ విధంగాను; కొల్చున్= ధాన్యాన్ని; కూడు= అన్నాన్ని; ఉరువన్= పారవేయను (వ్యర్థంచేయను); బంధువులకున్= చుట్టాలకు; తగన్= తగు విధంగా; నెమ్మి= ప్రీతిని; సల్పుదున్= చేస్తాను.

**తాత్పర్యం:** భర్త ఏ పనిమీదనైన పొరుగూళ్ళకు పోతే, ఆనాటినుండి తిరిగి వచ్చేవరకు పూవులు, మైపూతలు, మంచి చీరలు, నగలు, రుచి పాకాల భోజనపదార్థాలు ఆదరింపను. ఏ విధంగానూ ధాన్యపు గింజలను, అన్నాన్నీ వ్యర్థపరచను. బంధువులకు తగు విధంగా ప్రీతి కలిగిస్తాను.

**విశేషం:** కామభావాన్ని అదుపులో ఉంచుకొనే ప్రయత్నం ఇందులో ప్రస్తావనకు వచ్చింది. 'తగన్' నెమ్మిసల్పుదున్ - అనే చోట 'తగన్' అనే పదం చాలా జాగ్రత్తగా చూడదగినది. ధర్మేతరమైన ప్రీతి బంధువులు కోరితే - అనే శంకను ఈ మాట పరిహరిస్తుంది.

**క. గోవులు మొదలగు తిర్య । గ్జీవుల సుఖవృత్తు లరసి చెల్లింతు గృహ**
**శ్రీ వర్తనంబునకుఁ బతి । భావము సంకటపడంగఁ బలుక నొకటియున్. 360**

**ప్రతిపదార్థం:** గోవులు= ఆవులు; మొదలు+అగు తిర్యక్+జీవుల సుఖ వృత్తులు= మొదలైన పశువులు, పక్షులు అనే ప్రాణుల సుఖమైన బ్రదుకులను; అరసి= చక్కగా తెలిసికొని; చెల్లింతున్= నడిపిస్తాను; గృహశ్రీ వర్తనంబునకున్= ఇంటి సంపద సాగుదలకు; పతి భావము= భర్త మనస్సు; సంకట పడంగన్= చికాకుపడే విధంగా; ఒకటియున్= ఒక్కమాట కూడా; పలుకన్= మాటాడను.

**తాత్పర్యం:** ఆవులు మొదలైన ప్రాణుల సుఖజీవనాన్ని పరీక్షించి సాగిస్తాను. ఇంటి సంపద సాగుబడి విషయంలో భర్త హృదయం కలతపడే విధంగా ఒక్కమాట కూడా పలుకను.

**విశేషం:** 'గృహిణీ గృహముచ్యతే' - 'ఇల్లాలే ఇల్లు' అని దాని భావం. దాని కనుగుణంగా ఈ పద్యం బాధ్యతను స్మరింపజేస్తుంది.

**తే. అగ్ని యోపి రక్షింతు రహస్యమైన । దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చియున్న**
**యపుడు వాచవు లెల్లను నవులఁ బెట్టి । దాని కెయ్యవి పథ్యముల్ వానిఁ గొందు'. 361**

**ప్రతిపదార్థం:** అగ్ని= అగ్నిహోత్రాన్ని; ఓపి= సహనం దాల్చి; రక్షింతున్= కాపాడుతాను; రహస్యము= ఇతరులకు తెలియరానిది; ఐనదానిన్= అయిన దానిని; వెలిపుచ్చన్= బయటపెట్టను; గర్భంబు= కడుపు; తాల్చి ఉన్న+అపుడు= ధరించి ఉన్న సమయంలో; వాచవులు= నోటి రుచులు; ఎల్లను= అన్నింటినీ; అవులన్= అవతల (దూరంగా); పెట్టి= ఉంచి, దానికిన్= గర్భానికి (కడుపులో ఉన్న బిడ్డకు); ఏ+అవి= ఏయే పదార్థాలు; పథ్యముల్= హితం కలిగించేవో; వానిన్= వాటిని; కొందున్= తీసికొంటాను.

**తాత్పర్యం:** భర్త నిత్యాగ్నిహోత్రి కనుక ఆ అగ్నిని ఓపికతో కాపాడుతూ ఉంటాను. రహస్యాన్ని బయటపెట్టను. కడుపుతో ఉన్నపుడు నోటి రుచుల నన్నింటినీ దూరంగా ఉంచి, బిడ్డ కేవి మేలు చేస్తాయో వాటినే భుజిస్తాను.

**క. అని చెప్పి యట్టి చందం । బున నడచిన సతికి లోకములు రెండును సౌ**

**ఖ్యనిరూఢి యొసఁగు; బొగ డొం । దు నరుంధతి వోలె నవ్వధూటి నరేంద్రా! 362**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి= బోధించి; నర+ఇంద్రా!= రాజా!; అట్టి చందంబునన్= ఆ తీరున; నడచిన సతికిన్= ప్రవర్తించిన పతివ్రతకు; లోకములు= లోకాలు; రెండును= రెండుకూడా; సౌఖ్యనిరూఢి= సుఖపు గట్టి స్థితిని; ఒసఁగున్= ఇస్తాయి; ఆ+వధూటి= అట్టి స్త్రీ; అరుంధతి పోలెన్= వసిష్ఠుడి ధర్మపత్ని అరుంధతివలె; పొగడు= ప్రశంస; ఒందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** అని చెప్పింది. రాజా! ఆ విధంగా ప్రవర్తించిన ఉత్తమవనిత ఇహపరలోకాలలో రెండింటిలో శాశ్వత సుఖం పొందుతుంది. ఆ ఇల్లాలు అరుంధతివలె ప్రశంస కెక్కుతుంది.

**విశేషం:** ఇక్కడ సుమన వాక్యం పూర్తిచేయటం కనపడుటలేదు. కనుక "అని చెప్పె నట్టి" అనే పాఠం గ్రహించటం మేలు. తరువాతి దంతా అప్పుడు భీష్ముడి వాక్యం అవుతుంది.

**క. 'నృప! యీ యాఖ్యానము ప । ర్వపు దినమున భక్తిఁ జదువువారలు విను పు**

**ణ్య పురుషులును నాయుశ్శ్రీ । లపరిమితము లొంది యమరు లగుదురు పిదపన్**

**ప్రతిపదార్థం:** నృప= రాజా!; ఈ+ఆఖ్యానము= ఈ కథ; పర్వము+దినమునన్= పండుగనాడు; భక్తిన్= భక్తితో; చదువువారలు= చదివేవారు; విను= ఆలకించు; పుణ్య పురుషులును= పుణ్యంగల మనుష్యులు (అవుతారు); ఆయుస్+శ్రీలు= ఆయువు, సంపద; అపరిమితములు= మేర లేనంతటివి; ఒంది= పొంది; పిదపన్= మరణం తరువాత;అమరులు= దేవతలు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** 'రాజా! ఈ కథను పర్వపురోజులలో భక్తితో చదివేవారు పుణ్యపురుషులౌతారు. మేరలేని ఆయువును సంపదను పొందుతారు. కడకు దేవత లవుతారు.'

**వ. అనిన విని ధర్మనందనుండు 'సర్వశాస్త్రసారంబై శ్రేష్ఠంబగు ననుష్ఠేయం బెయ్యది? పితామహా! యనుగ్రహింపు'మని యభ్యర్థించిన నాపగేయుండు కృపావిధేయుండై 'నారదపుండరీక సంవాదం బాకర్ణింపుము దాన నీయడిగిన యర్థంబు తెలియును దీర్థపరుండును జపతత్పరుండును బుండరీకాభిధానుండును నైన మహాద్విజుం డొక్కయెడ నారదమహామునిం గని భక్తింబ్రణతుండై యిత్తెఱంగునన యడుగ నతం డతని కిట్లనియె. 364**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని; ధర్మనందనుండు= ధర్మపుత్రుడు; సర్వశాస్త్ర సారంబు+ఐ= అన్ని శాస్త్రాల సారమై; శ్రేష్ఠంబు+అగు= మిక్కిలి గొప్పదైన; అనుష్ఠేయంబు= చేయవలసిన కార్యం; ఏ+అది?= ఏది?; పితామహా= తాతా!; అనుగ్రహింపుము= ప్రసాదించుము; అని; అభ్యర్థించినన్= వినయంతో కోరగా; ఆపగేయుండు= నదికొడుకు భీష్ముడు; కృపా విధేయుండు+ఐ= దయకు లోబడినవాడై; నారద పుండరీక సంవాదము= నారదుడు, పుండరీకుడు అనేవారి సంభాషణ; ఆకర్ణింపుము= వినుము; దానన్= దానియందు; దానిచేత; నీ+అడిగిన అర్థంబు= నీవు అడిగిన విషయం; తెలియును= తెలుస్తుంది; తీర్థపరుండును= పుణ్యస్థలాలయందు పరమాదరం కలవాడు; జపతత్పరుండును= జపంమీద మిక్కిలి శ్రద్ధకలవాడూ; పుండరీక+అభిధానుండును= పుండరీకుడు అనే పేరుగలవాడు; ఐన మహాద్విజుండు= అయిన గొప్ప బ్రాహ్మణుడు; ఒక్క+ఎడన్= ఒకచోట; నారద మహామునిన్= నారద మహర్షిని; కని= చూచి; భక్తిన్= భక్తితో; ప్రణతుండు+ఐ= చాగి మ్రొక్కినవాడై;

ఈ+తెఱంగునన్+అ= నీవు అడిగిన ఈ తీరుననే; అడుగన్= అడిగితే; అతండు= ఆ నారదుడు; అతనికిన్= ఆ పుండరీకుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అన్నమాట విని ధర్మరాజు 'అన్ని శాస్త్రాల సారము, మిక్కిలి గొప్పదీ అయిన ఆచరణ ఏమిటి? తాతా! దయచేసి చెప్పుము.' అని కోరాడు. భీష్ముడు మిక్కిలి దయకు లోబడినవాడై 'నారదపుండరీక సంవాదం వినుము. దానివలన నీవడిగిన విషయం తెల్లమవుతుంది. తీర్థాలు సేవించటం, జపంచేసికొనటం శీలంగాగల పుండరీకుడనే మహర్షి ఒక చోట నారదుడిని చూచి భక్తితో మ్రొక్కి నీ వడిగినట్లే అడిగాడు. అపుడు నారదు డిట్లా చెప్పాడు.

**విశేషం:** మీద మీద ప్రశ్నలడుగుతున్నా భీష్ముడు సంతోషంతో ఓపికతో సమాధానాలు చెపుతూనే ఉన్నాడు. విసుగు చెందటంలేదు. అదే అతడి "కృపావిధేయత''

## నారదపుండరీక సంవాదం బను పరమేతిహాసప్రకారము (సం.13-186-1 (కుంభ))

**సీ.** **'పరమేష్ఠి చెప్పిన పరమధర్మం బల్ప । ఫణితి మహార్థంబు భవ్యమతికి**
**శ్రోతవ్యమును బరిజ్ఞాతవ్యమును దాని । విను ప్రకృతికిఁ బర మనఁగఁ బడిన**
**యిరువ దేనగుతత్త్వ మరయంగ జీవాత్ముఁ । డాతండ సర్వభూతాత్మకుండు**
**నరుఁడన వెలుఁగు నప్పురుషుని వలనన । కలిగి నారములన వెలసినట్టి**

**తే.** **యన్యతత్త్వంబు లతనికి నయన మగుట । నతఁడు నారాయణుం డన నతిశయిల్లు**
**విశ్వమును దనయంద యావిర్భవింప । విలయ మొంద నద్దేవుండు విభుతఁ బొల్చు.** **365**

**ప్రతిపదార్థం:** పరమేష్ఠి= బ్రహ్మ; అల్పఫణితిన్= సులభమైన తీరున; చెప్పిన పరమధర్మంబు= చెప్పిన మిక్కిలి శ్రేష్ఠమైన ధర్మం; మహత్+అర్థంబు= గొప్ప అర్థం కలది; భవ్యమతికిన్= ఉత్తమ బుద్ధికలవాడికి; శ్రోతవ్యమును= వినదగినది; పరిజ్ఞాతవ్యమును= నిండుగా తెలియదగినది; దానిన్= దానిని; విను(ము)= ఆలకించుము; ప్రకృతికిన్= ప్రకృతి అనే తత్త్వానికి; పరము= తరువాతిది; అనఁగన్+పడిన= అనబడిన; ఇరువది+ఏను+అగుతత్త్వము= ఇరవై అయిదవ తత్త్వం; అరయంగన్= పరిశీలించగా; జీవ+ ఆత్ముఁడు= జీవుడనే ఆత్మ; ఆతండు+అ= అతడే, సర్వభూత+ఆత్మకుండు= అన్ని భూతాల స్వరూపం అయినవాడు; నరుఁడు= మానవుడు; అనన్= అనే పేరుతో; వెలుఁగన్= ప్రకాశిస్తాడు; ఆ+పురుషుని వలనన్+అ= అట్టి నరుడనే పురుషుడివలననే; కలిగి= ఏర్పడి; నారములు= నరసంబంధమైనవి అనే అర్థంతో 'నారములు' అనన్= అనగా; వెలసిన+అట్టి అన్యతత్త్వంబులు= రూపు గొన్నట్టి ఇతర తత్త్వాలు; అతనికిన్= ఆ పురుషుడికి; అయనము= స్థానము; అగుటన్= కావటంవలన; అతఁడు= ఆ పురుషుడు; నారాయణుండు= నారాయణుడు; అనన్= అనగా; అతిశయిల్లున్= ఒప్పుతాడు; ఆ+దేవుండు= ఆ దేవుడు; విశ్వమును= ఈ సమస్తమైన ప్రపంచాల సముదాయాన్ని; తనయందున్+అ= తన యందే; ఆవిర్భవింపన్= పుట్టగా; విలయము= కలిసిపోవటం; ఒందన్= పొందగా; విభుతన్= విభుడు అనే భావంతో; పొల్చున్= విరాజిల్లుతాడు.

**తాత్పర్యం:** 'బ్రహ్మ సులభమైనతీరులో గొప్ప అర్థంతో చెప్పిన పరమధర్మం ఒకటి ఉన్నది. అది పుణ్యబుద్ధి కలవాడు వినదగినది. పరిపూర్ణంగా తెలియదగినది. దానిని వినుము. ప్రకృతి అనే ఇరవైనాలుగవ తత్త్వం ఒకటి ఉన్నది. దానికి తరువాతి తత్త్వం జీవాత్మ. అతడు సర్వభూతాల స్వరూపం అయినవాడు. 'నరుడు' అతడి

వ్యవహారనామం. అతడివలన ఏర్పడిన తక్కిన తత్త్వాలన్నీ నారములు. అతడు నారములు స్థానంగా గలవాడు. కనుక, నారాయణుడు (నార+అయన). ఆ ప్రభువు విశ్వమంతటినీ పుట్టిస్తూ మరల తనలో లీనం చేస్తూ 'విభుడు' అవుతున్నాడు.

**విశేషం:** పూర్వం యోగసాంఖ్యాల సందర్భంగల హరసనత్కుమార సంవాదంలో ఇరవై అయిదు తత్త్వాలు ప్రస్తావనకు వచ్చాయి. పంచభూతాలు మొదలుకొని ప్రకృతివరకు ఉండే ఇరవై నాలుగు తత్త్వాలు ఇరవై అయిదవది అయిన 'నర' (జీవాత్మ) తత్త్వం వలన ఏర్పడటంవలన నారములు. జీవాత్మ వీటికి (అయనం) స్థానమైనవాడు కనుక నారాయణుడు. సృష్టి ఏర్పడటమూ, లీనమైపోవటమూ అతడియందే జరుగుతాయి. దృష్టాంతంగా నీటిని గ్రహించవచ్చును ఉన్నదంతా జలము కాగా సుడి, బుడగ, తరంగం మొదలైన పేర్లు నీటిలోని స్థితిభేదాలను బట్టి ఏర్పడుతున్నాయి. కాని నీటినుండి బుడగను, సుడినీ, తరంగాన్నీ వేరుచేయలేం. ఎందుకంటే అది నీరే తప్ప మరొకటి కాదు కనుక. ఈ పద్యంలోని ఈ రహస్యాన్ని ఈ దృష్టాంతం ద్వారా చక్కగా పట్టుకొనవచ్చును.

ఈ జీవాత్మ స్వరూపాన్ని వ్యష్టిగా, సమష్టిగా దర్శించాలి. ఒక్కొక్క వ్యక్తిలో చూస్తే వ్యష్టి దర్శనం. విశ్వమంతా ఒక్కటిగా భావించి చూస్తే సమష్టి దర్శనం.

**క. పరమ బ్రహ్మం బనఁగాఁ । బరతత్త్వం బనఁగఁ బరమపద మనఁగా నీ**
**శ్వరుఁ డన విష్ణుఁ డన జగ । ద్భరితత నారాయణుండు దా వెలుఁగొందున్. 366**

**ప్రతిపదార్థం:** నారాయణుండు= ఆ నారాయణుడు; పరమ బ్రహ్మంబు= అంతకంటె మరొక దశలేని బ్రహ్మము; అనన్+కాన్= అనగా; పరతత్త్వంబు= దానికి మించిన తత్త్వం లేదనే పరతత్త్వం; అనన్+గన్= అనగా; పరమపదము= దానిని మించిన ఉన్నత స్థానం లేదనే అర్థంగల పరమపదం; అనఁగాన్= అనగా; ఈశ్వరుఁడు= అన్నింటికీ ప్రభువు అనే అర్థంగల ఈశ్వరుడు; అనన్= అనగా; విష్ణుఁడు= అంతటా వ్యాపించినవాడు అనే అర్థంగల విష్ణుడు; అనన్= అనగా; జగత్+భరితతన్= విశ్వమంతా నిండిన తనంతో; తాన్= తాను; వెలుఁగు+ఒందున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** ఆ నారాయణుడు పరమబ్రహ్మము. పరతత్త్వము, పరమపదము, ఈశ్వరుడు, విష్ణువు - అనే పేర్లతో విశ్వమంతా నిండి వెలుగుతూ ఉంటాడు.

**విశేషం:** 'బ్రహ్మం' అంటే బృహత్తు - పెద్దది అని అర్థం. 'పరబ్రహ్మం' అంటే దానికంటె పెద్దది మరొకటి ఉండదని భావం. 'తత్త్వం' అంటే స్థూలంగా పదార్థం. పరతత్త్వం అన్నింటికి మించిన దశలో ఉండే భావం.

**ఆ. అతఁడు వాసుదేవుఁ డన నాత్మ యనఁగ వే । దాంతవాక్యబోధ్యుఁడై వెలుంగు**
**నరుల కప్పదములు నామాంతరంబు ల । ర్థాంతరంబు లేని యట్టి వనఘ! 367**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; అతఁడు= ఆ నారాయణుడు; వాసుదేవుఁడు= వాసుదేవుడు; అనన్= అనగా; ఆత్మ; అనఁగన్= అనగా; వేదాంతవాక్య బోధ్యుఁడు+ఐ= ఉపనిషత్తుల వాక్యములతో తెలియవచ్చేవాడై; వెలుంగున్= ప్రకాశిస్తాడు; నరులకున్= 'నరులు' అనబడేవారికి; ఆ+పదములు= ఆ మాటలు; నామ+అంతరంబులు= మరియొక పేర్లు; అర్థ+అంతరంబు= వేరొక అర్థం; లేని+అట్టి+అవి= లేనట్టివి.

**తాత్పర్యం:** ఆ నారాయణుడే వాసుదేవుడు, ఆత్మ అనే పేర్లతో ఉపనిషత్తుల మాటలచేత తెలియవస్తూ ఉంటాడు. నరుడికి కూడా అవి వేరు పేర్లు. కాని అర్థంలో మాత్రం భేదం లేనివి.

**విశేషం:** వాసుదేవుడు - వస్= ఉండటం; దివ్= ప్రకాశించటం - అనే రెండు ధాతువులనుండి ఏర్పడిన వాసు, దేవ అనే రెండు పేర్ల సముదాయవాచకం. "ఎల్లయందును దా వసియించు టెల్లయును తనయందు వసియించు టంద్రు వాసుదేవు డని పేరి కర్థంబు'' అని భారతంలో మరొక సందర్భంలో చెప్పారు. అన్నియెడలా, అన్ని వేళలా ఉంటూ ప్రకాశించే తత్త్వాన్ని వాసుదేవు డంటారు. "అత'' అని ధాతువు. సంతతగమనం కలది అని దాని కర్థం. దాని నుండి ఏర్పడిన శబ్దం 'ఆత్మ'. అంతటా వ్యాపించి ఉండేది - అని దానికి అర్థం. ఈ విధంగా నరనారాయణులకు నామభేదమే కాని అర్థభేదం లేదని తాత్పర్యం. అమ్మ, తల్లి, మాత అనీ శబ్దాలు వేరయినా అవి చెప్పే అర్థం ఒక్కటే కదా!

**ఆ. సర్వశాస్త్రవాక్యసమితి నాలోకించి । మఱియు దృఢవిచారమహిమఁ దెలిసి**
**నిశ్చయింపఁబడియె నిష్ఠ నారాయణు । నెపుడుఁ దలఁపవలయు నిది యొకండ. 368**

**ప్రతిపదార్థం:** సర్వశాస్త్రవాక్యసమితిన్= అన్ని శాస్త్రాల వాక్యాల సముదాయాన్ని; ఆలోకించి= చూచి; మఱియున్= ఆపైన; దృఢ విచారమహిమన్= గట్టిదైన ఆలోచన యొక్క గొప్పతనంతో; తెలిసి= తెలిసికొని; ఇది; ఒకండు+అ= ఒక్కటే; నిశ్చయింపన్+పడియెన్= నిర్ణయింపబడింది. ఎపుడున్= ఎల్లవేళలా; నిష్ఠన్= గురితప్పకుండా; నారాయణున్= నారాయణ తత్త్వాన్ని; తలఁప వలయున్= భావిస్తూ ఉండాలి.

**తాత్పర్యం:** సర్వశాస్త్రాల వాక్యాలను పరిశీలించి, గట్టి వివేకంతో దానిని చక్కగా తెలిసికొని ఇది ఒక్కటే నిర్ణయించబడింది. ఎల్లవేళలా నిష్ఠతో నారాయణుడిని స్మరిస్తూ ఉండాలి.

**విశేషం:** సర్వశాస్త్రసమితి నాలోకించటం - శ్రవణం, దృఢవిచార మహిమను తెలిసికొనటం - మననం; నిశ్చయించటం - నిదిధ్యాసనం. జ్ఞానానికి ఈ మూడు క్రమదశలు. జ్ఞానం ఎప్పుడూ అందరికీ ఏకాకారంగా ఉంటుంది. దానినే 'ఒకండ' అనే పదంతో చెప్పారు. ఇదే అద్భుతమైన మహార్థాన్ని అల్పఫణితితో చెప్పే తీరు. (365వ పద్యం చూడండి)

**వ. కావున. 369**

**తాత్పర్యం:** కనుక.

**క. పరమానుష్ఠేయం బిది । నరోత్తమా! నీవు నెపుడు నారాయణుఁ ద**
**త్పరతఁ దలఁపు చొరకు సవి । స్తర శాస్త్రార్థముల క్రందుఁ దలపోఁతలకున్. 370**

**ప్రతిపదార్థం:** నర+ఉత్తమా!= మానవశ్రేష్ఠుడా!; ఇది= నేను చెప్పినది; పరమ+అనుష్ఠేయంబు= అన్నింటిని మించి ఆచరించదగినది; నీవున్= నీవు కూడా; తత్+పరతన్= అదే లక్ష్యంగా; ఎపుడున్= ఎల్లవేళలా; నారాయణున్= నారాయణుడిని; తలఁపు= భావించుము; సవిస్తర శాస్త్ర అర్థముల క్రందున్= చాలా వ్యాపించిన శాస్త్ర చర్చల గందరగోళంలో; తలపోఁతలకున్= ఊహలకు; చొరకు= ప్రవేశింపకుము.

**తాత్పర్యం:** మనుజవరా! ఇదే అనుష్ఠింపవలసిన వాటిలో అన్నింటికంటె ఉత్తమమైనది. కనుక నీవు కూడా నారాయణుడిని పరమశ్రద్ధతో భావించుము. విస్తృతంగా ఉన్న శాస్త్రచర్చల గందరగోళంలోని ఊహలు చేయటానికి ప్రవేశించకుము.

**విశేషం:** ఏది తెలిసికొంటే సర్వమూ తెలుస్తుందో అది తెలిసికొన్న తరువాత శాస్త్రచర్చలు ప్రారంభించటం వ్యర్థమే కాదు అనర్థం కూడా. క్రొత్తది రాదు. ఉన్నది పోతుంది. అని ఈ పద్యంలో ద్వితీయార్థం హెచ్చరిస్తున్నది.

**క. విను మొక యించుక సేపై । నను నారాయణునిఁ దలఁచినను సుగతిఁ గనున్**

**మనుజుఁ డనిన మదినెప్పుడు । నునిచిన యాతనికి బ్రాతె? యుత్తమధిషణా! 371**

**ప్రతిపదార్థం:** ఉత్తమధిషణా!= గొప్ప మేధకలవాడా!; వినుము; ఒక+ఇంచుకసేపు+ఐనను= చాలా కొంచెం కాలం అయినా; నారాయణునిన్= నారాయణుడిని; తలఁచినను= భావించినా; మనుజుఁడు= నరుడు; సుగతిన్= మంచిగతిని; కనున్= పొందుతాడు; అనినన్= అనగా; మదిన్= హృదయంలో; ఎప్పుడున్= ఎల్ల వేళలా; ఉనిచిన అతనికిన్= నిక్షేపించుకొన్నవాడికి; బ్రాతె?= తక్కువ అవుతుందా?

**తాత్పర్యం:** మహా మేధావీ! కొంచెం సేపైనా నారాయణుడిని తలపోస్తే మనుజుడికి సుగతి కలుగుతుంది - అంటే ఎల్లవేళలా హృదయంలో నారాయణుడిని నిక్షేపించుకొన్నవాడికి సుగతి తక్కువ అవుతుందా?

**విశేషం:** అమృతం ఏ కొంచెం భుజించినా అమరత్వం సిద్ధిస్తుంది. అట్లాగే నారాయణస్మరణ ఫలాన్ని కూడా భావించవచ్చును.

**క. ప్రణుత యగు 'నమోనారా । యణాయ' యను నక్షరాలి నంతప్రాప్తి**

**క్షణమున జిహ్వకుఁ దెచ్చినఁ । బ్రణవార్థం బైన పదముఁ బడయుదురు నరుల్. 372**

**ప్రతిపదార్థం:** ప్రణుత= మిక్కిలి ప్రశస్తమైనది; అగు= అయిన; 'నమోనారాయణాయ= నారాయణ దేవునకు నమస్సు' అనే అర్థంగల నమోనారాయణాయ; అను అక్షర+ఆలిన్=అనే అక్షరాల వరుసను; మంత్రాన్ని; అంతప్రాప్తి క్షణమునన్= తుది గడియలు వచ్చిన వేళలలో; జిహ్వకున్= నాలుకకు; తెచ్చినన్= తెస్తే; నరుల్= మానవులు; ప్రణవ+అర్థంబు= ఓంకారానికి అర్థం; ఐన పదమున్= అయిన పరమస్థానాన్ని; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** మరణకాలంలో 'నమోనారాయణాయ' అనే మంత్రాన్ని పలికితే నరులు ప్రణవానికి అర్థమైన పరమపదాన్ని పొందుతారు.

**విశేషం:** "ఓమ్" అనేది ప్రణవం. ఓమ్ శబ్దానికి అర్థం పరమాత్మ. "అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్, యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః" అని గీత. 'మరణకాలంలో నన్నే స్మరిస్తూ దేహం వదలినవాడు నా భావాన్నే పొందుతాడు. ఇందు సందియంలేదు.' నా భావం అంటే పరమాత్మ భావం. ఆ శ్లోకభావాన్నే ఈ పద్యం చెప్పుతున్నది.

**క. నారాయణ పదవాచ్యం । బారయ బ్రహ్మంబు దాని ననిశము వినియున్**

**సారమతిం దలఁచియు నిం । పారఁగఁ బొగడియు రమించు టతులహిత మగున్. 373**

**ప్రతిపదార్థం:** ఆరయన్= చక్కగా విచారింపగా; నారాయణ పదవాచ్యంబు= నారాయణ అనే శబ్దం చేత చెప్పబడేది; బ్రహ్మంబు= బ్రహ్మమే; దానిన్= ఆ బ్రహ్మమును; అనిశము= ఎల్లవేళలా; వినియున్= విని; సారమతిన్= పదునైన బుద్ధితో; తలఁచియున్= భావించి; ఇంపారఁగన్= చక్కగా; పొగడియున్= కొనియాడి; రమించుట= ఆనందపడటం; అతుల హితము= సాటిలేని మేలు; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** 'నారాయణ' శబ్దం చెప్పేది బ్రహ్మమునే. దానిని ఎల్లవేళలా వింటూ, పదునైన బుద్ధితో భావిస్తూ చక్కగా కీర్తిస్తూ ఆనంద మందటం సాటిలేని మేలు అవుతుంది.

**విశేషం:** ఇక్కడ కూడా శ్రవణ, మనన, నిదిధ్యాసలను చెప్పారు. హృదయమందిరంలో ఆ భావం చక్కగా కుదురుకొనటమే నిదిధ్యాసనం. 'రమించటం' అనే శబ్దంలో ఆ భావాన్ని మనం గ్రహించాలి. లోకవిషయజ్ఞానానికి 'మతి' చాలును. పరతత్త్వ జ్ఞానానికి 'సారమతి' కావాలి. సారమతి అంటే ఏది నిత్యమో ఏది అనిత్యమో నిర్ణయించి నిష్కర్షగా చెప్పగల బుద్ధి.

**తే. విందు నారాయణ పరాయణుండు పాత । కముల గెలిచి వెలుంగుటె కాదు తన్ను**
**నాశ్రయించినవారికి నతులమైన । వెలుఁగు నొసఁగంగఁ జాలుట వేధచేఁత. 374**

**ప్రతిపదార్థం:** విందు= వినండి; నారాయణ పరాయణుండు= నారాయణుడే పరమగతి అనే నిర్ణయం కలవాడు; పాతకములన్= పాపాలను; గెలిచి= జయించి; వెలుంగుట+ఎ= ప్రకాశించటమే; కాదు; తన్నున్= తనను; ఆశ్రయించినవారికిన్= చేరుకొన్నవారికి; అతులము+ఐన= సాటిలేనిదైన; వెలుఁగున్= జ్ఞానం అనే వెలుగును; ఒసఁగంగన్= ఇవ్వటానికి; చాలుట= సమర్థుడు కావటం; వేధచేఁత= బ్రహ్మచేసిన పని.

**తాత్పర్యం:** వినండి, నారాయణుడే పరదైవంగా కలవాడు పాతకాలను కాలరాచి ప్రకాశించటమే కాదు, తన్ను చేరుకొన్నవారికి కూడా సాటిలేని ఆ జ్యోతిని ప్రసాదించగలగటం బ్రహ్మచేసిన ఏర్పాటు.

**విశేషం:** "స్వయం తీర్త్వా పరాం స్తారయతి" అని సూక్తి. తానుదాటి ఇతరులను దాటిస్తాడు. అంటే తనకు ఇతరులకు గురుశిష్య భావం ఉంటుంది. భారతీయతత్త్వంలో గురువు పరబ్రహ్మమే.

**క. చతురాశ్రమముల లోపల । నతులమతీ! యెందు నిలిచి నతనికి భక్తిన్**
**మతిఁ గేశవుఁ గూర్పక స । ద్గతి పెఱకర్మముల నేల కల్గఁగ నేర్చున్? 375**

**ప్రతిపదార్థం:** అతులమతీ!= సాటిలేని బుద్ధికలవాడా!; చతుర్+ఆశ్రమముల లోపలన్= నాలుగు ఆశ్రమాలలో; ఎందున్= దేనిలో; నిలిచిన+అతనికిన్= ఉన్నవాడికైనా; భక్తిన్= భక్తితో; మతిన్= బుద్ధియందు; కేశవున్= నారాయణుడిని; కూర్పక= నిలుపక; సత్+గతి= ఉత్తమ స్థితి; పెఱకర్మములన్= వేరు కర్మములతో; ఏల?= ఎట్లు?; కల్గఁగన్+నేర్చున్?= కలుగుతుంది?

**తాత్పర్యం:** మహాబుద్ధిశాలీ! నాలుగాశ్రమాలలో దేనియం దున్నవాడికైనా మదిలో కేశవుడిని నిలుపకపోతే ఇతర కర్మల ద్వారా ఉత్తమగతి ఎట్లా కలుగగలదు?

**విశేషం:** చతురాశ్రమములు: 1.బ్రహ్మచర్యం, 2.గార్హస్థ్యం, 2. వానప్రస్థం, 4.సన్న్యాసం. ఆశ్రమధర్మనిష్ఠ ఉండవలసినదే. నారాయణ స్మరణ లేకపోతే ఆ నిష్ఠ ఉత్తమగతి నీయజాలదని భావం.

**క. కను టరిది యొండుమెయి వి । ష్ణుని భక్తిం గనుము నీవు సువ్రత! యద్దే**
**వుని వినుము భక్త వత్సలుఁ । డను నామము గలిమి దృశ్యుఁ డగు భక్తులకున్.' 376**

**ప్రతిపదార్థం:** సువ్రత= చక్కని నియమ పాలనగల మనిషీ!; ఒండు మెయిన్= మరొక విధంగా; విష్ణునిన్= నారాయణుడిని; కనుట= చూడటం; అరిది= అసాధ్యం; నీవు; భక్తిన్= భక్తితో; కనుము= చూడుము; ఆ+దేవునిన్= ఆ దేవుడిని గూర్చి;

వినుము; భక్త వత్సలుఁడు= భక్తులయందు బిడ్డలయందలి భావం ఉన్నవాడు అని అర్థంగల భక్తవత్సలుడు; అను నామము= అనే పేరు; కలిమి= ఉండటంవలన; భక్తులకున్= భక్తులకు; దృశ్యుఁడు= చూడబడేవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** ఉత్తమవ్రతుడా!; మరొక విధంగా విష్ణువును చూడజాలము. భక్తితో దర్శించుము. ఆ దేవుడిని గూర్చి వినుము. 'భక్తవత్సలుడు' అనే నామం ఆయనకు ఉన్నందువలన అతడు భక్తులకు కానవస్తాడు'.

**విశేషం:** నిజానికి పరమాత్మను చర్మనేత్రాలతో చూడటం సాధ్యం కాదు. అయినా అతడి దయవలన కృష్ణాదిరూపంలో భక్తులు చూస్తూ ఉంటారు. 'వివేకచూడమణి' స్వస్వరూపానుసంధానమే భక్తి అంటున్నది. కనుక భక్తి అంటే తత్త్వజ్ఞానమే.

**క. అని నారదుఁ డుపదేశిం । చిన నానైష్ఠికుఁడు నియతచిత్తుండై వి**

**ష్ణుని నర్చించు సభక్తిక । మననవిశేషమున నెపుడు మనుజాధీశా! 377**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= రాజా!; అని= ఈ విధంగా; నారదుఁడు= నారదమహర్షి; ఉపదేశించినన్= బోధించగా; ఆ నైష్ఠికుఁడు= గొప్పనిష్ఠ కల ఆ పుండరీకుడు; నియత చిత్తుండు+ఐ= చెదరని హృదయం కలవాడై; సభక్తిక మనన విశేషమునన్= భక్తితో కూడిన నిరంతరభావన యొక్క అతిశయంతో; ఎపుడున్= ఎల్లవేళలా; విష్ణునిన్= నారాయణుడిని; అర్చించున్= పూజిస్తూ ఉండేవాడు.

**తాత్పర్యం:** రాజా! ఈ విధంగా ఈ నారదుడు బోధిస్తే ఆ నిష్ఠాపరుడు చెదరని చిత్తంతో భక్తిగల మననంతో ఎల్లవేళలా నారాయణుడిని అర్చిస్తూ ఉంటాడు.

**విశేషం:** 'అర్చించున్' అనేది తద్ధర్మక్రియ. అర్చించటం శీలంగా ఏర్పడాలని అది సూచిస్తుంది.

**తే. శంఖచక్రగదాధరు శార్ఙ్గిఁబుండ । రీకదళసన్నిభాక్షుఁ గిరీటకుండ**

**లాభిరాము శ్రీవత్ససంశోభివక్షుఁ । గౌస్తుభోజ్జ్వలుఁ గలలోనఁ గను నతండు. 378**

**ప్రతిపదార్థం:** శంఖచక్ర గదాధరున్= పాంచజన్యమనే శంఖాన్నీ, సుదర్శనం అనే చక్రాన్నీ, కౌమోదకి అనే గదను ధరించినవాడికి; శార్ఙ్గిన్= శార్ఙ్గం అనే విల్లు కలవాడిని; పుండరీక దళ సన్నిభ+అక్షున్= పద్మపు రేకులను పోలిన కన్ను లున్న వాడిని; కిరీట కుండల+అభిరామున్= కిరీటమూ, కుండలములు అనే వాటితో చూడముచ్చట అయిన వాడిని; శ్రీవత్స సంశోభివక్షున్= శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అందమైన రొమ్ము కలవాడిని; కౌస్తుభ+ఉజ్జ్వలున్= కౌస్తుభ మనే మణి కాంతులతో వెలిగిపోవుచున్నవాడిని; కలలోనన్= కలలో; కను+అతండు= చూచేవాడు.

**తాత్పర్యం:** శంఖము, చక్రము, గద, శార్ఙ్గము అనేవాటిని నాలుగు చేతులతో ధరించిన స్వామి, పద్మపత్రముల వలె విశాలమైన ఆర్ద్రమైన కన్నులతో విరాజిల్లువాడు, కిరీటకుండల కాంతులతో చూడముచ్చట అయినవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చతో విరాజిల్లు రొమ్ము కలవాడు, కౌస్తుభమణి కాంతులతో వెలిగిపోయేవాడు అయిన శ్రీమన్నారాయణుడిని కలలో చూచినవాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శంఖం నాదానికీ, చక్రం కాలానికీ, గద ఆనందం కలిగించటానికీ, (గదకు కౌమోదకి అని పేరు!) శార్ఙ్గం - ధనుస్సు, దుష్టశిక్షణ, శిష్టరక్షణకూ సంకేతాలు. పుండరీకం సర్వతోముఖప్రసరణశీలానికి సంకేతం. కిరీటం సార్వభౌమత్వానికి

సంకేతం, కుండలాలు - కర్ణాభరణాలుగా జ్ఞానానికి సంకేతం, శ్రీవత్సం - పుట్టుమచ్చ. ఇది సౌందర్యానికి ద్యోతకం. కౌస్తుభం - అనన్య సాధారణజ్ఞాన జ్యోతిస్సుకు సంకేతం. (ఇట్లా భావించవచ్చును.)

**క. చిరకాలంబున సాక్షా । త్కరణంబును గల్గు దానఁ గానని పదముం**
**బొరయని శుభముం గలవే? । కురువర! నీవు నతిభక్తిఁ గొలువుము విష్ణున్. 379**

**ప్రతిపదార్థం:** చిరకాలంబునన్= పెద్దకాలంలో; సాక్షాత్+కరణంబును= ప్రత్యక్షం కావటాన్ని; కల్గున్= పొందుతాడు; దానన్= దానిచేత; కానని పదమున్= కనపడని స్థానం; పొరయని శుభమున్= పొందని శుభమూ; కలవే?= ఉంటాయా? కురువర!= కురురాజా!; నీవును= నీవుకూడా; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; విష్ణున్= విష్ణువును; కొలువుము= సేవించుము.

**తాత్పర్యం:** బహుకాలం ఆ రూపం మనస్సులో నిలిచిపోయిన వాడవుతాడు. దానిచేత చూడని పదమూ, పొందని శుభమూ ఉండదు. రాజా! నీవుకూడా పరమభక్తితో విష్ణువును సేవించుము.

**క. అనిన విని హర్షపూరం । బునఁ జిత్తము దేల ధర్మపుత్త్రుం డా శం**
**తను సుతునకుఁ బ్రణమిల్లెం । దనువునఁ బులకాంకురప్రతతి జాదుకొనన్. 380**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; హర్షపూరంబునన్= ఆనందపు ప్రవాహంలో; చిత్తము= హృదయము; తేలన్= తేలిపోగా; ధర్మపుత్రుండు= ధర్మరాజు; తనువునన్= దేహంమీద; పులక+అంకుర ప్రతతి= పులకలమొలకల సముదాయం; జాదుకొనన్= వ్యాపించగా; శంతను సుతునకున్= శంతనుడి కుమారు డగు భీష్ముడికి; ప్రణమిల్లెన్= సాష్టాంగ నమస్కారంచేశాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ఆనందలహరిలో హృదయం తేలిపోతూ ఉండగా ధర్మరాజు ఒడలంతా పులకలు వ్యాపించగా భీష్ముడికి ప్రణామం చేశాడు.

**విశేషం:** పరమానందం మొదలైన భావాలు కలిగినపుడు శరీరంమీద రోమాలు నిక్కపొడుచుకొనే స్థితిని రోమాంచం అంటారు. దానినే పులకాంకురప్రతతిగా ఇక్కడ చెప్పారు.

**విశేషం:** పరమానందం మొదలైన భావాలు కలిగినపుడు శరీరంమీద రోమాలు నిక్కపొడుచుకొనే స్థితిని రోమాంచం అంటారు. దానినే పులకాంకురప్రతతిగా ఇక్కడ చెప్పారు.

**వ. ప్రణమిల్లి యతనితో 'దానప్రియవచనంబుల రెంటియందును నధికరంజనంబెయ్యది? చెప్పవే' యనుటయు నద్దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను 'రెండును మంచి తెఱంగుల యెదిరిచందం బెఱింగి నడపునది దానంబు రంజకం బగుటం దెలుపవలవదు సామవాదంబు గుణంబు దెల్లంబగునట్టి యితిహాసంబు వినుము చెప్పెద, బుద్ధి సంపన్నుండగు నొక్కబ్రాహ్మణుండు విజనంబగు వనంబునం గార్యవశంబున మెలంగఁ దన్మాంసం బాహారంబు గొనుటకయి దారుణుం డగు దానవుం డతనిం బట్టికొనిన సాంత్వనభాషణంబులు ప్రయోగించు వాఁ డయి యవ్విప్రుండు గలంకయుఁ గొందలంబును లేని డెందంబుతో నద్దానవు నాననంబు గనుంగొనిన నాధైర్యధుర్యుం గనుంగొని తదీయంబగు నుదాత్తత్వంబునం జిత్తంబు రంజిల్లి యద్దనుజుం డద్ధరాదివిజునితో**

**'మదీయంబగు ప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చితేని నిన్ను విడిచెద' నను పలుకు పలికి తన శరీరంబు డయ్యుటకు వెలుకం బాఱుటకుం గారణంబేమి? యని యడిగిన నమ్మహీసురవరుండు వేగిరపడక కొండొకసేపు విచారించి 'మహాపురుషా! నీ యట్టి కృపాపరుం డడుగం దోఁచిన తెఱంగునం జెప్పుట మేలు కాదె? యాకర్ణింపు' మని సౌముఖ్యంబు నొంది. 381**

**ప్రతిపదార్థం:** ప్రణమిల్లి= సాష్టాంగ నమస్కారంచేసి; అతనితోన్= ఆ భీష్ముడితో; దాన ప్రియవచనంబులన్= దానము, ప్రియంగా పలకటం అనే; రెంటియందును= రెండింటిలో; అధిక రంజనంబు= ఎక్కువ ప్రీతి కలిగించేది; ఏ+అది?= ఏది?; చెప్పవే!= దయతో చెప్పవూ!; అనుటయున్= అనగా; ఆ+దేవవ్రతుండు= ఆ భీష్ముడు; ఆ+నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజశ్రేష్ఠుడికి; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పుతున్నాడు; రెండును= నీవు చెప్పిన ఆ రెండూ; మంచి తెఱంగులు+అ= మంచి పద్ధతులే; ఎదిరి చందంబు= ఎదుటివాడి తీరు; ఎఱింగి= తెలిసికొని, నడపునది= చేయవలె; దానంబు= దానం; రంజకంబు= ప్రీతికలిగించేది; అగుటన్= కావటం; తెలుపన్+వలవదు=తెలుప నక్కరలేదు; సామవాదంబు గుణంబు= ప్రియమైన మాటల గుణం; తెల్లంబు= స్పష్టం; అగు+అట్టి ఇతిహాసంబు= అయిన ప్రాత కాలపు కథ; చెప్పెదన్= చెప్పుతాను; వినుము; బుద్ధి సంపన్నుండు= బుద్ధి సమృద్ధిగా కలవాడు; అగు+ఒక్క బ్రాహ్మణుండు= అయిన ఒక బ్రాహ్మణుడు; విజనంబు= జనం లేనిది; అగు వనంబునన్= అయిన అడవిలో; కార్యవశంబునన్= పనికి లోబడి; మెలంగన్= తిరుగుతూ ఉండగా; తద్+మాంసంబు= ఆతడి మాంసం; ఆహారంబు= భోజనం; కొనుటకున్+అయి= తీసికొనటానికి; దారుణుండు+అగు= కరకువాడు అయిన; దానవుండు= రాక్షసుడు; అతనిన్=అతడిని; పట్టికొనినన్= పట్టుకొనగా; సాంత్వన భాషణంబులు= మెత్తని మాటలు; ప్రయోగించువాఁడు+అయి= ఉపయోగించేవాడై; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; కలంకయున్= కలతపాటు; కొందలంబును= సంక్షోభం; లేని డెందంబుతోన్= లేని హృదయంతో; ఆ+దానవు+ఆననంబు= ఆ రక్కసుడి మొగం; కనుంగొనినన్= చూడగా; ఆ ధైర్యధుర్యున్= గుండె నిబ్బరంలో గట్టివాడైన ఆ బ్రాహ్మణుడిని; కనుంగొని= చూచి; తదీయంబు= అతడిది; అగు+ఉదాత్తత్వంబునన్= అయిన గొప్పతనంచేత; చిత్తంబు= హృదయం; రంజిల్లి= ప్రీతిచెంది; ఆ+దనుజుండు= ఆ రాక్షసుడు; ఆ+ధరాదివిజునితోన్= ఆ బ్రాహ్మణుడితో; మదీయంబు= నాదయినది; అగు ప్రశ్నంబునకున్= అయిన ప్రశ్నకు; సత్+ఉత్తరంబు= మంచి సమాధానం; ఇచ్చితి+ఏని= ఇస్తే; నిన్నున్=నిన్ను; విడిచెదన్=వదలుతాను; అనుపలుకు= అనే మాట; పలికి; తన శరీరంబు= తన ఒడలు; డయ్యుటకున్= కృశించిపోవటానికి; వెలుకన్+పాఱుటకున్= పాలిపోవటానికి; కారణంబు= హేతువు; ఏమి?= ఏది?; అని; అడిగినన్= ఆ+మహీసుర వరుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; వేగిరపడక= తొందరపడక; కొండొకసేపు= కొంతసేపు; విచారించి= ఆలోచించి; మహాపురుషా!= గొప్పవాడా!; నీ+అట్టి కృపాపరుండు= నీవంటి దయాశీలి; అడుగన్= అడుగగా; తోఁచిన తెఱంగునన్= ఊహకు వచ్చిన విధంగా; చెప్పుట= చెప్పటం; మేలు= మంచిది; కాదె!= కాదా!; ఆకర్ణింపుము= వినుము; అని; సౌముఖ్యంబు= అనుకూలభావాన్ని (మంచి మోము కలిగిన తనాన్ని); ఒంది= పొంది.

**తాత్పర్యం:** నమస్కరించి భీష్ముడితో 'దానము, ప్రియభాషణము అనే రెంటిలో ఏది ఎక్కువ ప్రీతి కలిగిస్తుంది? చెప్పవూ? అని అడిగితే భీష్ము డా రాజుతో ఇట్లా అన్నాడు. ఆ రెండూ మంచి పద్ధతులే. 'అవతలివాడి తీరెరిగి నడపాలి. 'దానం ప్రీతికరమైనది' అనేదానిని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. మంచిమాటల గుణాన్ని తెలిపే పురాతనకథ ఒకటి చెప్పుతాను వినుము. బుద్ధిశాలి అయిన ఒక బ్రాహ్మణుడు జన సంచారంలేని అడవికి పనిమీద వెళ్ళాడు. ఒక కరకురక్కసి అతడి మాంసం తినగోరి, అతడిని పట్టుకొన్నాడు. ఆ బ్రాహ్మణుడు మంచిమాటలు ప్రయోగించేవాడయి, ఏ విధమైన కలతపాటులేని గుండెతో ఆ రాక్షసుడి మొగం చూస్తున్నాడు. ఆ రక్కసుడు ఆ

ధైర్యశాలిని చూచి, అతడి గుండె నిబ్బరానికి హృదయంలో సంతోషించి, 'నా ప్రశ్నకు తగిన మంచి సమాధానం చెప్పితే నిన్ను వదలుతాను' అని 'నా శరీరం కృశించి పోవటానికి, పాలిపోవటానికి కారణం ఏమిటి?' అని అడిగాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు తొందరపడక కొంతసేపు విచారించి, 'మహాపురుషా! నీ వంటి దయాశాలి అడిగితే తోచిన విధానం చెప్పటం మేలు కదా! వినుము.' అని మంచి మొగంతో అనుకూల భావం పొంది (ఇట్లా అన్నాడు).

**సీ. 'చుట్టాల నీదగు చెట్టతనంబునఁ । బాసి పశ్చాత్తాపపరుఁడ వగుట,**
**లేమి గల్గిన దుర్లభామేయధనములు । గోరుట మొగమోటగూరి యొరుని**
**చేఁ బడ్డ నిన్ను గెల్చితి నని యాతఁ డు । బ్బుట కృప, నుపకారమునకుఁ బాత్ర**
**ముగ నీవు చేసిన పురుషుఁ డా మేల్ దన । యలఘుపౌరుషమునఁ గలిగె ననుట.**

**ఆ. కుమతిజనులు నీదు గుణములు గొనియాడ । సిగ్గుపడుచు బుధులచేతఁ బొగడు**
**గాన మరుగుచునికి, వీనిలో నొక్కట । గార్శ్య పాండురతలు గలుగు ననఘ!' 382**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; చుట్టాలన్= బంధువులను; నీ+అది= నీది; అగు చెట్టతనంబునన్= అయిన చెడ్డతనంతో; పాసి= వదలి; పశ్చాత్+తాపపరుఁడవు= వెనుక బాధపడినవాడవు; అగుట= కావటం; లేమి= దారిద్ర్యము; కల్గినన్= కలిగితే; దుర్లభ+అమేయ ధనంబులు= ఎంత కష్టపడినా దొరకని సొమ్ములను; కోరుట= కోరటం; మొగమోట= సంకోచం; కూరి= పొంది; ఒరునిచేన్= ఇతరునిచేత; పడ్డ= పాట్లుపడిన; నిన్ను; గెల్చితిని= జయించాను; అని; ఆతఁడు= ఆ ఇతరుడు; ఉబ్బుట= పొంగిపోవటం; కృపన్= జాలితో; ఉపకారమునకున్= మేలునకు; పాత్రముగన్= స్థానంగా; నీవు చేసిన పురుషుఁడు= నీవు చేసిన జనుడు; ఆ మేల్= ఆ మేలు; తన అలఘు పౌరుషమునన్= తనదైన గొప్ప మగతనంతో; కలిగెన్= కలిగింది; అనుట= అనటం; కుమతిజనులు= చెడుబుద్ధిగల మనుష్యులు; నీదు గుణములు= నీ మంచి లక్షణాలను; కొనియాడన్= ప్రశంసచేయగా; సిగ్గుపడుచున్= బిడియం పొందుతూ; బుధులచేతన్= విద్వాంసులవలన; పొగడు=పొగడ్త; కానన్= పొందటానికి; మరుగుచున్+ఉనికి= అలవాటు పడుతూ ఉండటం; వీనిలోన్= వీటిలో; ఒక్కటన్= ఒక్కదానిచేత; కార్శ్యపాండురతలు= క్షీణించటం, పాలిపోవటం అనే లక్షణాలు; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** 'బంధువులను నీ చెడు స్వభావంతో వదలి తరువాత బాధపడటం, దారిద్ర్యం కలిగినపుడు ఎన్నటికీ లభించని గొప్పధనాలు కోరటం, మొగమోటంవలన పరుడు పెట్టిన బాధలను నీ వనుభవించగా వాడు నేను జయించానని పొంగిపోవటం, జాలితలచి నీవు మేలు చేయగా ఆ మేలు పొందినవాడు అది తన పరాక్రమమే అని చెప్పటం, పాడుబుద్ధికలవారు నిన్ను పొగడుతూ ఉంటే సిగ్గుపడుతూ పండితుల మెప్పు కొరకు చూస్తూ ఉండటం - వీటిలో ఒకదానిచేత కృశించటం, పాలిపోవటం కలుగుతాయి.'

**వ. అని వెండియు. 383**

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి ఇంకా అంటున్నాడు.

**సీ. 'ఉచితంబుగా నెఱి నుగ్గడించిన మాట । సభ యియ్యకొనమి, వల్లభకు నీదు**
**తప్పు తెల్లంబయి తాపంబుఁ బొందంగఁ । దేర్పంగనేరక త్రిప్పికొనుట,**

**నీ సొమ్మునకు నొరుఁ డాసించుచుండంగ । దానికిఁ దగ రక్ష దలఁచుచునికి,**

**దులువ పిమ్మట నిన్ను దూషించు పలుకులు । కులజులు నిజముగాఁ గొనుట, నీవు**

**తే. మానుషంబుల నడపంగ మాయకానిఁ । గాఁగఁ జెలులు గాంచుట, వగ కలిమి పేర్మి**

**దాని వెలిపుచ్చ నోపమి, వీన నొకటఁ । గార్శ్య పాండురత్వంబులు గలుగు ననఘ! 384**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యపురుషుడా! ఉచితంబుగాన్= తగు విధంగా; నెఱిన్= చక్కగా; ఉగ్గడించిన మాట= పలికిన పలుకును; సభ= పెద్దలున్న తావు (న్యాయస్థానం); ఇయ్యకొనమి= ఒప్పుకొనకపోవటం; వల్లభకున్= భార్యకు (ప్రియురాలికి); నీదు తప్పు= నీ నేరం; తెల్లంబు= స్పష్టంగా తెలిసినది; అయి; తాపంబున్= దుఃఖం; పొందంగన్= పొందగా; తేర్పంగన్= సముదాయించటానికి; నేరక= సాధ్యపడక; త్రిప్పికొనుట= మరలిరావటం; నీ సొమ్మునకున్= నీ ధనానికి; ఒరుఁడు= వేరువాడు; ఆసించుచుండంగన్= కోరుతూ ఉండగా; దానికిన్= ఆ సొమ్మునకు; తగన్= తగు విధంగా; రక్ష= రక్షణ; తలఁచుచున్+ఉనికి= ఆలోచిస్తూ ఉండటం; తులువ= దుర్మార్గుడు; పిమ్మటన్= నీ వెనుక (చాటుగా); నిన్నున్= నిన్ను; దూషించు పలుకులు= నిందించే మాటలను; కులజులు= నీ బంధువులు; నిజముగాన్= సత్యంగా; కొనుట= గ్రహించటం; నీవు; మానుషంబులన్= పౌరుషపు పనులను; నడపంగన్= చేయగా; మాయకానిన్+కాఁగన్= మాయలు చేసేవాడినిగా; చెలులు= నీ మిత్రులు; కాంచుట= చూడటం; వగ కలిమి పేర్మిన్= పెను దుఃఖం కలగటంవలన; దానిన్= దానిని; వెలిపుచ్చన్+ఓపమి= బయటపెట్టుకొనలేకపోవటం; వీనన్= వీటిలో; ఒకటన్= ఒకదానిచేత; కార్శ్య పాండురతలు= చిక్కిపోవటం, వెలవెలబోవటం; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** 'నీవు తగు విధంగా పలికినదానిని సభ (పెద్దల సంఘం) ఒప్పుకొనకపోవటం, నీ తప్పు నీ భార్యకు తెలిసి ఆమె కుమిలిపోతూ ఉంటే నీవు సముదాయించలేకపోవటం, నీ సొమ్మును కొట్టివేయాలని ఇతరుడు కనిపెట్టుకొని ఉంటే దానికి ఏది దిక్కు? - అని నీవు ఆలోచిస్తూ ఉండటమూ, దుర్మార్గుడు చాటున నిన్ను గూర్చి చేసిన నిందలను నీ బంధువులు నిజాలని భావించటం, నీవు దొడ్డపనులు చేస్తూ ఉంటే నీ చెలికాండ్రు నిన్ను మాయలవాడినిగా భావించటం, నీ హృదయంలో ఉన్న పెనుదుఃఖాన్ని బయట పెట్టుకొనకపోవటం - వీటిలో ఒకటి క్షీణతకూ, పాలిపోవటానికీ కారణం.'

**తే. అని మఱియును. 385**

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి ఇంకా చెప్పుతున్నాడు.

**సీ. 'భార్య పుత్రకుఁ డల్లు డార్యవృత్తము లేమిఁ । గ్రుమ్మరించుట, జనకుండు దల్లి**

**సోదరుల్ నవయుట, యుర్వీసురుని గోవుఁ । దొలుమేనఁ జంపుట, దుష్టబుద్ధి**

**భూసురదేవార్థములు పుచ్చికొనుట, య । ర్థము గోలుపోక, బాంధవుల చావు,**

**బాలిశు మొగమోటఁ బనికొనఁగాఁ దన । యశమున కంతరాయంబు గలిమి,**

**తే. పెద్దకాలంబు యత్నసంపీడ నొంది । చెల్లఁ జేసిన పని యొక్క పొల్లపగతు**

**చే నసిద్ధతఁ బొందుట, వీన నొకటఁ । గార్శ్యపాండురత్వంబులు గలుగు ననఘ! 386**

**ప్రతిపదార్థం:** భార్య= పత్ని; పుత్రకుఁడు= కొడుకు; అల్లుఁడు= బిడ్డ మగడు; ఆర్యవృత్తము= మంచి నడవడి; లేమిన్= లేకపోవటంవలన; క్రుమ్మరించుట= తిప్పలు పెట్టటం; జనకుండు= తండ్రి; తల్లి= అమ్మ; సోదరుల్=అన్నదమ్ములు; నవయుట= రోగం మొదలైనవాటిచేత కృశించిపోవటం; తొలుమేనన్=పూర్వజన్మలో; ఉర్వీసురుని గోవున్= బ్రాహ్మణుడి ఆవును; చంపుట= చంపటం; దుష్టబుద్ధిన్= పాపపుబుద్ధితో; భూసుర దేవ+అర్థములు= బ్రాహ్మణుల, దేవతల సొమ్ములు; పుచ్చికొనుట= తీసికొనటం; అర్థము కొలుపోక= ధనం పోగొట్టుకొనటం; బాంధవుల చావు= చుట్టాల మరణం; మొగమాటన్= ఇతరుల ఒత్తిడికి లొంగిన కారణంగా; బాలిశున్= నీచుడిని; పనికొనఁగాన్= ఉద్యోగంలో నియమించగా; తన యశమునకున్=తన కీర్తికి; అంతరాయంబు+ కలిమి= ఆటంకం కలగటం; పెద్దకాలంబు= చాలాకాలం; యత్న సంపీడన్= ప్రయత్నంలో పడరాని పాటును; ఒంది= పొంది; చెల్లన్= నెరవేరునట్లుగా; చేసినపని; ఒక్క పొల్ల పగతుచేన్= ఒకే ఒక్క నీచుడైన పగవాడిచేత; అసిద్ధతన్= నెరవేరని స్థితిని; పొందుట= పొందటం; వీనన్= వీటిలో; ఒకటన్= ఒకదానిచేత; కార్శ్య పాండురత్వంబులు= క్షీణత ఒడలు కళ తప్పటం అనేవి; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** 'పెండ్లము, కొడుకు, అల్లుడు మంచి నడవడి లేనివారై త్రిప్పలు పెట్టటం, తండ్రి, తల్లి, అన్నదమ్ములు రోగాదులచే కృశించటం, పూర్వజన్మలో బ్రాహ్మణుడి ఆవును చంపటం, పాపభావంతో బ్రాహ్మణులసొమ్ము, దేవుడి సొమ్ము అపహరించటం, ధనం పోగొట్టుకొనటం, చుట్టాలు చావటం, పనికిమాలినవాడిని పనిలో పెట్టుకొని పేరు పాడుచేసికొనటం, ఎంతో కాలం ఎన్నో ప్రయత్నాలు చేసి ఒక కొలిక్కి తెచ్చిన పనిని నీచుడైన పగవాడు పాడుచేయటం, వీటిలో ఒకదానిచేత మనిషి కృశిస్తాడు, పాలిపోతాడు.'

**విశేషం:** తొలుమేనన్- చేసిన పాపం జన్మజన్మాలకు వెంటనంటి వస్తుంది. ఇట్టివాటిని మహానుభావులు జ్యోతిషం మొదలైనవాటి ద్వారా తెలిసికొని, తెలియజేస్తారు.

**క. అని యిట్లేర్పడఁ జెప్పిన । విని యద్దనుజపతి మెచ్చి విడిచెం గుంతీ**
**తనయాగ్రజ! భూసుర సాం । త్వన మిట్టిది; యడుగు మింక వలసినదానిన్.' 387**

**ప్రతిపదార్థం:** కుంతీ తనయ+అగ్రజ!= కుంతికొడుకులలో పెద్దవాడా!; అని; ఇట్లు= ఈ విధంగా; ఏర్పడన్= వివరించి; చెప్పినన్= చెప్పగా; విని=ఆలకించి; ఆ+దనుజపతి= ఆ రక్కసిరేడు; మెచ్చి= మెచ్చుకొని; విడిచెన్= (ఆ బ్రాహ్మణుడిని) విడిచిపెట్టాడు; భూసుర సాంత్వనము= బ్రాహ్మణుల ప్రియభాషణం; ఇట్టి+అది= ఇటువంటిది; ఇంకన్= ఇంకా; వలసినదానిన్= కోరిన దానిని; అడుగుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ విధంగా ఆ బ్రాహ్మణుడు స్పష్టంగా చెప్పాడు. అది విని ఆ రాక్షసుడు మెచ్చుకొని, అతడిని విడిచిపెట్టాడు. మంచిమాటల తీరు ఇటువంటిది. ఇంకేమి కావాలో అడుగుము.'

**విశేషం:** ప్రియభాషణం ప్రాణాలు దక్కించింది. ఇంతకంటె మరొక లాభం పెద్దది ఏముంటుంది? - అని భావం.

**వ. అనిన నజాతశత్రుండు గంగాపుత్త్రువదనంబునం జూడ్కి నిలిపి మోడ్చి కరంబులు శిరంబునం గదియించి.388**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అజాతశత్రుండు= ధర్మరాజు; గంగాపుత్త్రువదనంబునన్= భీష్ముడి మొగంవైపు; చూడ్కిన్= చూపును; నిలిపి; మోడ్చిన కరంబులు= జోడించిన చేతులు; శిరంబునన్= తన తలపైన; కదియించి= కూర్చి.

**తాత్పర్యం:** అనగా ధర్మరాజు భీష్ముడి ముఖంమీద చూపు నిలిపి, చేతులు మోడ్చి తలపై పెట్టుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇది పరమగౌరవాన్ని సూచిస్తుంది. భీష్ముడు, వృద్ధుడు, యుద్ధంలో అలసినవాడు, అంపశయ్యమీద ఉన్నవాడు, ఏ క్షణంలోనయినా ప్రాణత్యాగం చేయటానికి సిద్ధంగా ఉన్నవాడు. అయినా పరమవాత్సల్యంతో ఇంకా అడుగుము, ఇంకా అడుగుము-అంటున్నాడు. ఈ స్థితికి ధర్మరాజు హృదయం ఎంత ఆర్ద్రమై పోయిందో ఇటువంటి మాటలవలన తెలియవస్తుంది.

**తే. 'మమ్ము సంసారవార్ధి పారమ్ముఁ జేర్చు । యానపాత్రంబు నీ కరుణాతిశయమ**
**యఖిలకల్మషములఁ బాపునట్టి దాని । వినఁగఁ గోరెద నొక పురావృత్త మనఘ! 389**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; మమ్మున్= మమ్మలను; సంసారవార్ధి పారమ్మున్= సంసారం అనే మహాసముద్రపు ఒడ్డును; చేర్చు యానపాత్రము= చేర్చే ఓడ; నీ కరుణా+అతిశయము+అ= నీ దయయొక్క పెక్కువయే; అఖిల కల్మషములన్= అన్ని పాపాలను; పాపు+అట్టిదానిన్= పోగొట్టేదానిని; ఒక పురావృత్తము= ఒక ప్రాతకాలపు గాథను; వినఁగన్= వినటానికి; కోరెదన్= కోరుతున్నాను.

**తాత్పర్యం:** 'మహాత్మా! మమ్మలను సంసారం అనే మహాసముద్రం ఒడ్డుకు చేర్చే ఓడ నీ దయావిశేషమే! అన్ని పాపాలను హరించే ఒక ప్రాతకాలపు గాథను వినగోరుతున్నాను.

**విశేషం:** సంసారం అంటే పరమాత్మజ్ఞానం లేక చావుపుట్టుకల చక్రంలో ఎడతెగకుండా సంచరించటం.

**క. మునిమనుజపతుల సన్నిధి । నిను నీ కృష్ణుండు మాననీయచరిత! వే**
**డ్క నుపాసించుచు నున్నాఁ । డనుత్తమప్రీతి దాని నాకర్ణింపన్. 390**

**ప్రతిపదార్థం:** మాననీయ చరిత!= మన్నింపదగిన నడవడి కలవాడా!; ఈ కృష్ణుండు= ఈ వాసుదేవుడు; ముని మనుజపతుల సన్నిధిన్= మునులు; రాజులు మొదలగువారి సమీపంలో; అనుత్తమ ప్రీతిన్= మిక్కిలి గొప్పదైన ప్రేమతో; దానిన్= నేనడిగిన దానిని; ఆకర్ణింపన్= వినటానికి; నినున్= నిన్ను; వేడ్కన్= కుతూహలంతో; ఉపాసించుచున్= శ్రద్ధతో దగ్గరగా కూర్చున్నవాడు అవుతూ; ఉన్నాడు.

**తాత్పర్యం:** మాననీయచరితా! ఈ శ్రీకృష్ణుడు మునులయొక్క, రాజులయొక్క సమక్షంలో నీవు చెప్పేదానిని వినటానికై నిండైన ప్రీతితో వేడుకతో నిన్ను ఉపాసిస్తూ ఉన్నాడు.

**విశేషం:** ఉపాసన - అంటే దగ్గర కూర్చోవటం అని శబ్దార్థం. శ్రద్ధాసక్తులతో కొలవటం అని రూఢ్యర్థం.

**క. సమ్మోదమ్మున నేనుం । దమ్ములునుం దేల సత్కథాకథన పర**
**త్వ మ్మాదరింపు మునివ । ర్గమ్ము నృపచయమ్ము పులకరాజి వహింపన్.' 391**

**ప్రతిపదార్థం:** నేనున్= నేనూ; తమ్ములున్= మా తమ్ముళ్ళూ; సమ్మోదమ్మునన్= మిక్కిలి ఆనందంతో; తేలన్= తేలునట్లుగా; మునివర్గమ్ము= మునుల సముదాయమూ; నృపచయమ్ము= రాజుల సముదాయమూ; పులకరాజి= రోమాంచం; వహింపన్= ధరింపగా; సత్+కథా కథన పరత్వమ్ము= మంచి కథ చెప్పటంలోని ఆసక్తిని; ఆదరింపుము= ప్రీతితో గ్రహించుము.

**తాత్పర్యం:** నేనూ, మా తమ్ముళ్ళూ పరమానందంలో తేలిపోయే విధంగా మునులూ, రాజులూ పులకాంకురాలు పొందగా మంచికథ చెప్పటంలోని ఆసక్తిని ఆదరించుము.'

**వ. అనుటయు భీష్ముండు. 392**

**తాత్పర్యం:** అనగా భీష్ముడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పుణ్యం బగు నితిహాస మ। గణ్యగుణా! నీకుఁ జెప్పఁ గను సుకృతముఁ గా**
**రుణ్యనిధి సర్వలోక శ। రణ్యుఁడు గృష్ణుండు విను వరంబుఁ బడసితిన్. 393**

**ప్రతిపదార్థం:** అగణ్యగుణా!= లెక్కింపజాలనన్ని మంచి గుణాలు కలవాడా!; పుణ్యంబు= మేలైనది; అగు+ఇతిహాసము= అయిన పురాతన కథ; నీకున్= నీకు; చెప్పన్= చెప్పటానికి; కను సుకృతము= పొందే పుణ్యాన్నీ; కారుణ్యనిధి= దయకు గనీ; సర్వలోక శరణ్యుఁడు= అన్నిలోకాలకు రక్షకుడైనవాడూ అగు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; విను వరంబున్= వినే వరాన్నీ, పడసితిన్= పొందాను.

**తాత్పర్యం:** 'గుణనిధీ! పుణ్యమైన పురాతనచరిత్రను నీకు చెప్పే పుణ్యాన్నీ, దయాసముద్రుడూ, అన్ని లోకాలకు రక్షకుడూ అయిన శ్రీకృష్ణపరమాత్మ వినే వరాన్నీ పొందాను.

**విశేషం:** శ్రీకృష్ణుడు 'సర్వము తాను అయినవాడు'. అతడు నిలుకడగా ఉండి వినటం ఎంత భాగ్యం! ధర్మరాజు ఆ కృష్ణుడి అనుగ్రహం పరిపూర్ణంగా పొందినవాడు. అతడికి చెప్పటం ఎంత పుణ్యవిశేషం! భీష్ముడు దీనిని అభివ్యక్తం చేస్తున్నాడు.

**క. పారాశర్యాదిమునులు। నీ రాజన్యులును వినికి యెంతకు లేదీ**
**గారాము నాకుఁ బరమో। దారపదావాప్తి గాదె ధర్మతనూజా! 394**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజా!= యమధర్మరాజు ముద్దుబిడ్డా! పారాశర్య+ఆది మునులున్= వ్యాసుడు మొదలైన మహర్షులు; ఈ రాజన్యులును= ఈ రాజవంశాలవారు; వినికి= వినటం; నాకున్= నాకు; ఈ గారాము= ఈ గౌరవం; ఎంతకున్= ఎంతకు; లేదు; పరమ+ఉదార పద+అవాప్తి= అతిశ్రేష్ఠము, మహిమగలదీ అయిన పదం పొందటం; కాదె!= కదా!

**తాత్పర్యం:** ధర్మరాజా! శ్రీ వేదవ్యాసులు మొదలైన మహర్షులు, ఈ రాజవంశంవారూ వినటంవలన నా గౌరవం ఎంత ఉన్నతమైనదో చెప్పటానికి వీలులేనిది, పరమపదం పొందటమే కదా!

**విశేషం:** వేదవ్యాసుడు అష్టాదశ పురాణాదులకు కర్త. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అనదగినవాడు, తక్కినవారు కూడా ఇంచుమించు అంతటివారు. ఉత్తమజన్మతో యుద్ధాలలో సర్వమూ త్యాగం చేయటానికి సిద్ధపడిన మహోన్నతవ్యక్తిత్వం కలవారు రాజన్యులు. వీరంతా సావధానంగా వింటూ ఉంటే చెప్పే అదృష్టం ఎంతటిదో చెప్పగలమా! - అనే భావం "ఎంతకు లేదు"? అనే పదాలలో గోచరిస్తుంది.

**వ. నీ యడిగిన యట్టిదానికి నొక యితిహాసంబు గలదది యుమామహేశ్వర సంవాదం బనం బరఁగుఁ బౌరవోత్తమా! యప్పురావృత్తంబు ప్రవర్తించుటకుం గతంబైన కథ మున్ను సెప్పి, మఱి దానిం జెప్పిన నొప్పియుండుం గావున నప్పరిపాటిం జెప్పెద నవధానపరుండవయి యాకర్ణింపు'మని పలికి, హరికిం బరమభక్తిం బ్రణమిల్లి, యప్పాండవముఖ్యు ముఖచంద్రికం దనవిలోచనచకోరంబు లాన నమ్మానవపతికి నమ్మాననీయమతి యిట్లనియె. 395**

**ప్రతిపదార్థం:** నీ+అడిగిన+అట్టిదానకిన్= నీవడిగిన దానికి; ఒక ఇతిహాసంబు= ఒక పూర్వకథ; కలదు= ఉన్నది; అది; ఉమామహేశ్వర సంవాదంబు= ఉమ, మహేశ్వరుడు అనే వారి సంభాషణం; అనన్= అనగా; పరఁగున్= ఒప్పుతున్నది; పౌరవ+ ఉత్తమా!= పూరువంశం వారిలో శ్రేష్ఠుడా; ఆ+పురావృత్తంబు=ఆ మునుపటి కథ, ప్రవర్తించుటకున్= జరుగుటకు; కతంబు= కారణం; ఐన కథ= అయిన వృత్తాంతం; మున్ను= ముందుగా; చెప్పి; మఱి= తరువాత; దానిన్= దానిని; చెప్పినన్= చెప్పి నట్లయితే; ఒప్పి+ఉండున్= తగిన విధంగా ఉంటుంది; కావునన్=కనుక; ఆ+పరిపాటిన్= ఆ వరుసలో; చెప్పెదన్= చెప్తుతాను; అవధాన పరుండవు= ఏకాగ్రత కలవాడవు; అయి; ఆకర్ణింపుము= వినుము; అని; పలికి; హరికిన్= కృష్ణుడికి; పరమభక్తిన్= గొప్పభక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి; ఆ+పాండవముఖ్య ముఖ చంద్రికన్= పాండుకుమారులలో మొదటివాడైన ధర్మరాజు ముఖమనే వెన్నెలను; తన విలోచన చకోరంబులు= తన కనులు అనే చకోరపక్షులు; ఆనన్= ఆస్వాదిస్తూ ఉండగా; ఆ+మానవ పతికిన్= ఆ రాజునకు; ఆ+మాననీయమతి= మన్నించదగిన బుద్ధివిశేషంగల ఆ భీష్ముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నీ వడిగిన దానికొక కథ ఉన్నది. దానిని ఉమామహేశ్వర సంవాదం అంటారు. అది ఏర్పడటానికి కారణం ముందు చెప్పి, తరువాత దానిని చెప్పితే మేలుగా ఉంటుంది. ఆ వరుసలో చెప్పుతాను - శ్రద్ధగా వినుము.' అని మహాభక్తితో కృష్ణుడికి నమస్కరించి, ధర్మరాజు మోము వెన్నెలలను తన కన్నులనే చకోరాలు ఆస్వాదిస్తూ ఉండగా (ధర్మరాజు ముఖాన్ని మిక్కిలి ప్రీతితో చూస్తూ) భీష్ముడు ఆ రాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఒక మహాపుణ్యకథను ఒక మహాబుద్ధిశాలికి సాక్షాత్తు శ్రీకృష్ణుడి సన్నిధానంలో చెప్పుతున్నాను' అనే అనందం భీష్ముడిలో పట్టశక్యం కాని ప్రమాణంలో ఉన్నదని 'ముఖచంద్రిక' - విలోచనచకోర' రూపకాలు అభివ్యక్తం చేస్తున్నాయి.

## భీష్ముఁడు ధర్మజునకు శ్రీకృష్ణుని చరిత్రంబు చెప్పుట (సం.13-203-1 (కుంభ))

**క. తనయునిఁ బడయుటకై తప । మొనరింపఁగ రుక్మిణియు సముత్సుకవృత్తిం**
**దనతో రాఁ దుహినాద్రికిఁ । జనియెం గృష్ణుండు మునులు సంతస మందన్. 396**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తనయునిన్= కుమారుడిని; పడయుటకున్+ఐ= పొందటంకొరకు; తపము= తపస్సు; ఒనరింపఁగన్= చేయటానికి; రుక్మిణియున్= రుక్మిణీదేవి కూడా; సముత్సుక వృత్తిన్= మిక్కిలి వేడుక కల భావంతో; తనతోన్= తనతో; రాన్= రాగా; మునులు= మహర్షులు; సంతసము= సంతోషం; అందన్= పొందగా; తుహిన+అద్రికిన్= మంచుకొండకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు కుమారుడిని పొందగోరి, తపంచేయటంకొరకు రుక్మిణి కూడా వేడుకతో రాగా మునులు ఆనందపడగా హిమవత్పర్వతానికి వెళ్ళాడు.

**విశేషం:** కృష్ణుడికి ఇదొకలీల. లోకానికి బోధించే పద్ధతులలో తాను ఆచరించటం ఒక పద్ధతి.

**వ. ఇట్లు చని, ద్వాదశవార్షిక వ్రతక్లిష్టుండై యున్న కృష్ణుం గాన మునీంద్రులు నారదపర్వత వ్యాసవాల్మీకి దేవల కాశ్యప ప్రభృతులు శిష్యవర్గంబుతో వచ్చినవారలం బాద్యాసనాది సముచితార్చనంబుల సంభావించిన వార లద్దేవునిం బరివేష్టించి పుణ్యగోష్ఠి నడపుచున్న సమయంబున. 397**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చని= వెళ్ళి; ద్వాదశ వార్షిక వ్రత క్లిష్టుండు+ఐ= పండ్రెండు ఏండ్ల వ్రతంతో మిక్కిలి కష్టపడి ఉన్నవాడై; ఉన్న కృష్ణున్= ఉన్న శ్రీకృష్ణుడిని; కానన్= చూడటానికి; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; నారద పర్వత వ్యాస వాల్మీకి దేవల కాశ్యప ప్రభృతులు= నారదుడు; పర్వతుడు, వ్యాసుడు, వాల్మీకి, దేవలుడు, కాశ్యపుడు మొదలైనవారు; శిష్యవర్గంబుతోన్= శిష్యుల సముదాయంతో; వచ్చినన్= రాగా; వారలన్= వారిని; పాద్య+ఆసన+ఆది సముచిత+అర్చనంబులన్= కాళ్ళకు నీరు; కూర్చుండే పీట మొదలైన తగిన పూజలతో; సంభావించినన్= మర్యాద చేయగా; వారలు= ఆ మునులు; ఆ+దేవునిన్= ఆ దేవుడిని; పరివేష్టించి= చుట్టుకొని కూర్చుండి; పుణ్యాగోష్ఠి= పవిత్రమైన సంభాషణ; నడపుచున్= సాగిస్తూ; ఉన్న సమయంబునన్= ఉన్న వేళలో.

**తాత్పర్యం:** ఇట్లా వెళ్ళి, పండ్రెండు ఏండ్ల వ్రతంచేసి, బాగా నలిగి ఉన్న కృష్ణుడిని చూడటానికి నారదుడు, పర్వతుడు, వ్యాసుడు, వాల్మీకి, దేవలుడు, కాశ్యపుడు మొదలైన మునులు శిష్యులతోపాటు రాగా, వారికి తగిన ఉపచారాలు చేసిన తరువాత వారందరూ కృష్ణుడిని చుట్టుకొని సద్విషయాలు మాటాడుకొంటూ ఉన్న సమయంలో.

**తే.** **అతని ముఖమున వెడలి మహాగ్ని యమ్మ । హీధరము విపినంబుల నేర్చెఁ బక్షి**
**మృగయుతంబుగ సిద్ధసాధ్యగణములు స । మాకులత్వంబుఁ బొందఁ బెల్లడరి యధిప! 398**

**ప్రతిపదార్థం:** మహా+అగ్ని= గొప్ప అగ్ని; అతని ముఖమునన్= అతడి ముఖంనుండి; వెడలి= వెలువడి; ఆ+మహీధరము విపినంబులన్= ఆ కొండ అడవులను; పక్షి మృగ యుతంబుగన్= పక్షులు, జంతువులు అనే వాటితోపాటుగా; సిద్ధసాధ్యగణములు= సిద్ధులు, సాధ్యులు అనే దేవజాతివారి గుంపులు; సమాకులత్వంబున్= మిక్కిలి కలతపాటు; పొందన్= పొందగా; పెల్లు= పెద్దగా; అడరి= వ్యాపించి; ఏర్చెన్= కాల్చింది.

**తాత్పర్యం:** అతడి ముఖంనుండి గొప్ప అగ్ని వెలువడి మృగాలు, పక్షులు, సిద్ధులు, సాధ్యులు మొదలైన వారంతా గుండెలలో తీవ్రమైన ఆందోళన పొందుతూ ఉండగా పెద్దగా వ్యాపించి, ఆ కొండ అడవులను కాల్చివేసింది.

**విశేషం:** మృగాలు, పక్షులు అనే క్రింది జాతి ప్రాణులను, సిద్ధులు, సాధ్యులు అనే దేవజాతి వారినీ చెప్పటంచేత తక్కిన అన్ని విధాల ప్రాణుల సంగతీ చెప్పినట్లయింది.

**క.** **ఆ కృష్ణుఁడు నిజసౌమ్యా । లోకనమున నాశిఖిని మలుఁగఁ జేసెం బూ**
**ర్వాకారత నవ్వనము ని । రాకులతం బొల్చె నది మహాద్భుత మయ్యెన్. 399**

**ప్రతిపదార్థం:** ఆ కృష్ణుఁడు= ఆ కృష్ణభగవానుడు; నిజ సౌమ్య+ఆలోకనమునన్= తనదైన మంచి చూపుతో; ఆ శిఖినిన్= ఆ అగ్నిని; మలుఁగన్= ఆరిపోయే విధంగా; చేసెన్= చేశాడు; ఆ+వనము= ఆ అడవి; పూర్వ+ఆకారతన్= మునుపటి రూపంతోడనే; నిరాకులతన్= ఏ కలతపాటు లేని తనంతో; పొల్చెన్= ప్రకాశించింది; అది= ఆ సంగతి; మహా+అద్భుతము= గొప్ప ఆశ్చర్యం కలిగించేది; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** కృష్ణుడు తన శుభమైన చూపుతో ఆ మంటను మరలింపజేశాడు. ఆ అడవి మునుపటి విధంగానే ఏ వికారమూ లేని దయింది. అది అందరకూ ఎంతో అబ్బురం అయి కనిపించింది.

**విశేషం:** ఈ విషయం కృష్ణుడికి సర్వభూతాలపై ఉన్న అధికారాన్ని సూచిస్తుంది.

**తే. దాని కమ్మును లెల్లఁ జిత్తమున భయము । విస్మయంబును బెనఁగొన వెఱఁగుపాటు**

**గదిరి చిత్రరూపంబుల కరణి నుండ । వారిఁ గన్గొని రుక్మిణీవల్లభుండు. 400**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ సంఘటనకు; ఆ+మునులు= ఆ మహర్షులు; ఎల్లన్= అందరూ; చిత్తమునన్= హృదయంలో; భయము= భీతి; విస్మయంబును= ఆశ్చర్యం; పెనఁగొనన్= అల్లుకొని పోగా; వెఱఁగుపాటు= చేష్టలుడిగిన స్థితి; కదిరి= వ్యాపించి; చిత్రరూపంబుల కరణిన్= చిత్రపటంలోని ఆకారాల విధంగా; ఉండన్= ఉండగా; రుక్మిణీ వల్లభుండు= రుక్మిణి ప్రియుడు - కృష్ణుడు; వారిన్= వారిని; కన్గొని= చూచి.

**తాత్పర్యం:** ఆ సంఘటనకు గుండెలో గుబులూ, అచ్చెరువూ కలుగగా, ఆ మునులందరూ నిశ్చేష్టత పొంది బొమ్మలోని రూపాలవలె ఉండగా, కృష్ణుడు వారిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** చిత్రపటంలో ఒక భావం తోచే విధంగా గీసిన బొమ్మ ఏ మార్పూ లేక అట్లాగే ఉంటుంది. సాధారణదశలో ప్రాణులు అట్లా ఉండటం అసాధ్యం. తీవ్రమైన భయాదులవలన అట్టి స్థితి సహజంగా ఏర్పడుతుంది. దీనినే 'స్తంభం' అనే భావంగా అలంకార శాస్త్రం చెప్పుతున్నది.

**వ. 'మీరీ యనలంబు తెఱం గేమిగా నెఱింగితి? రున్న రూపెఱింగింపవలయు' ననుటయు వారలు సభక్తికంబులగు చిత్తంబులతోడ. 401**

**ప్రతిపదార్థం:** మీరు= మీరలు; ఈ+అనలంబు తెఱంగు= ఈ అగ్నితీరు; ఏమిగాన్= ఏ విధమైనదిగా; ఎఱింగితిరి?= తెలిసికొన్నారు; ఉన్నరూపు= ఉన్న విధం; ఎఱింగింపవలయున్= తెలుపవలె; అనుటయున్= అన్నంతనే; వారలు= ఆ మునులు; సభక్తికంబులు= భక్తితో కూడినవి; అగు చిత్తంబులతోడన్= అయిన హృదయాలతో.

**తాత్పర్యం:** 'మీరీ అగ్ని తీరు ఏమిగా తెలిసికొన్నారు? ఉన్నది ఉన్నట్లు చెప్పండి' అంటే వారు భక్తితో నిండైన హృదయాలతో (ఇట్లా అంటున్నారు).

**క. 'దేవా! విశ్వము గలుగుట । నీవలనన; యడఁగుటయును నీయందు భవ**

**ద్భావాధీనమ సకల । స్థావరజంగమ సమాహితత్వం బెల్లన్. 402**

**ప్రతిపదార్థం:** దేవా!= ప్రభూ!; విశ్వము= ఈ లోకాల సముదాయం; కలుగుట= ఏర్పడటం; నీవలనన్+అ= నీవలననే; అడఁగుటయును= లీనమై పోవటం; నీ అందున్+అ= నీయందే; సకల స్థావర జంగమ సమాహితత్వంబు= సమస్తమైన స్థిరంగా ఉండే భూతాలయొక్క, కదిలే ప్రాణులయొక్క స్థితి; ఎల్లన్= అంతా; భవత్+భావ+అధీనము+అ= నీ సంకల్పానికి వశమైనదియే.

**తాత్పర్యం:** ప్రభూ! ఈ విశ్వమంతా ఏర్పడటం నీవలననే; అణగిపోవటం నీయందే. కదలనివి, కదలేవి అయిన సమస్తభూతాల ప్రవృత్తి అంతా నీ సంకల్పానికి వశమైనదే.

**తే. నీవు మమ్ము బోధింపఁగా నేర్తుగాక । యిమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ**

**నేము నేర్తుమె? యేమియో యెఱుఁగ కునికిఁ । గాదె నివ్వెఱ పడితిమి? కమలనాభ!' 403**

**ప్రతిపదార్థం:** కమలనాభ!= కమలము బొడ్డునందు గల ఓ సర్వాధారా!; నీవు; మమ్మున్= మమ్ములను; బోధింపఁగాన్= తెలుపగా; నేర్తు(వు); కాక= నేర్చెదవు గానీ; ఈ+మహా+అనల స్ఫురణంబున్= ఈ గొప్ప అగ్ని వెలువడటం; ఇట్టి+అది= ఇటువంటిది; అనఁగన్= అనుటకు; ఏము= మేము; నేర్తుము+ఎ?= సమర్థుల మగుదుమా?; ఏమియో?= అది ఏమో?; ఎఱుఁగక+ఉనికిన్= తెలియకపోవటంవలన; కాదె!= కదా!; నివ్వెఱపడితిమి?= నిశ్చేష్టులం అయ్యాము?

**తాత్పర్యం:** నీవు మాకు తెలుపగలవు గానీ, ఈ అగ్ని వెలువడటం ఏమిటో మేము తెలిసికొనగలమా? అది ఏమో తెలియకనే కదా! మేము నిశ్చేష్టులం అయ్యాము!

**వ. అనుటయు భవదీయ చేతఃప్రసన్నతగాదె జగంబుల వర్తనంబునకు నాధారంబు. 404**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; భవదీయచేతస్+ప్రసన్నత= మీదైన హృదయాల నిర్మలత్వం; కాదె= కదా!; జగంబుల వర్తనంబునకున్= లోకాల సాగుదలకు; ఆధారంబు= ఆధారం.

**తాత్పర్యం:** అని ఆ మహర్షులు అనినంతనే కృష్ణుడు 'మీ హృదయాలు ప్రసన్నంగా ఉండటమే కదా లోకాల సాగుదలకు ఆధారం! (అన్నాడు).

**విశేషం:** "సంతో భూమిం తపసా ధారయంతి" అని సూక్తి. 'సజ్జనులు తమ తపస్సుచేత భూమిని పట్టి నిలుపుతారు.' శ్రీకృష్ణుడు ఇక్కడ ఈ వాక్యార్థాన్ని సమన్వయించాడు.

**క. కావున మీకుం బ్రియముగ । నీ వహ్ని తెఱంగు దెలియ నెఱిఁగించెదఁ జి**
**త్తావిలత విడువుఁ డని కమ । లావరుఁ డిట్లనియె వారలకుఁ గురువర్యా! 405**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; మీకున్= మీకు; ప్రియముగన్= ప్రీతి కలిగే విధంగా; ఈవహ్నితెఱంగు= ఈ అగ్ని తీరు; తెలియన్= తెలిసే విధంగా; ఎఱిఁగించెదన్= తెలుపుతాను; చిత్త+ఆవిలత= హృదయంలోని కలతపాటు; విడువుఁడు= వదలండి, అని; కురువర్యా= ధర్మరాజా!; కమలా వరుఁడు= లక్ష్మీవల్లభుడైన కృష్ణుడు; వారలకున్= వారికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** కనుక మీకు ప్రియంగా ఈ అగ్ని తీరు తెలియజెప్పుతాను. మీ హృదయాలలోని ఆవేగాన్ని తొలగించుకొనండి' అని కృష్ణుడు వారితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇప్పుడు వాసుదేవరూపంలో ఉన్నా ఆయన ఎప్పుడూ లక్ష్మీవల్లభుడే! రుక్మిణియే ఇప్పుడు లక్ష్మి.

**వ. ఒక దానవుఁడు జగన్నా । శకుఁ డిత్తఱిఁ గలఁడు వానిఁ జంపుట కేఁ బూ**
**నక యునికి గలిగె వాఁ డ । స్త్రకళావిదుఁ డగుట నా కతంబున నగుటన్. 406**

**ప్రతిపదార్థం:** ఈ+తఱిన్= ఈ సమయంలో; జగత్+నాశకుఁడు= జగత్తును నశింపజేసేవాడు; ఒక దానవుఁడు= ఒక రాక్షసుడు; కలఁడు= ఉన్నాడు; వాఁడు= అతడు; అస్త్ర కళా విదుఁడు= అస్త్రములను కళను చక్కగా ఎరిగినవాడు; అగుట= కావటం; నా కతంబునన్= నా కారణంగా; అగుటన్= కావటంవలన; ఏన్= నేను; వానిన్= వాడిని; చంపుటకున్= చంపటానికి; పూనక= సిద్ధపడక; ఉనికి= ఉండటం; కలిగెన్= కలిగింది.

**తాత్పర్యం:** ఈ సమయంలో లోకాలను నశింపజేసే రాక్షసుడు ఒకడున్నాడు. వాడు అస్త్రవిద్యలో నేర్పరి కావటం నావలననే అయిన కారణంగా వాడిని నేను చంపటానికి సిద్ధపడలేదు.

**విశేషం:** విద్యనేర్పినవాడు తండ్రి అవుతాడు. తండ్రి కొడుకును చంపటం సాధ్యం కాదు కదా! అంతేకాక విషవృక్షమైనా స్వయంగా పెంచి త్రుంచలేరని కాళిదాసోక్తి. "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్".

**క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము । నుడుకులఁ బెట్టంగ విసివి యుగ్రతపమునం**

**గొడుకుఁ బడసి యద్దనుజునిఁ । బొడవడఁగింపం దలంచి భూరివ్రతమున్. 407**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ రక్కసుడు; కడున్= మిక్కిలిగా; క్రొవ్వి= బలిసి; లోకమున్= జగత్తును; ఉడుకులన్= బాధలలో; పెట్టంగన్= పెట్టగా; విసివి= విసుగుచెంది; ఉగ్రతపమునన్= ఘోరమైన తపస్సుతో; కొడుకున్= కుమారుడిని; పడసి= పొంది; ఆ దనుజున్= ఆ రాక్షసుడిని; పొడవు+అడఁగింపన్= చంపటానికి; తలంచి= సంకల్పించి; భూరివ్రతమున్= గొప్ప వ్రతాన్ని.

**తాత్పర్యం:** కానీ ఆ రాక్షసుడు క్రొవ్వి, లోకాలను త్రిప్పులబెడుతున్నాడు. విసుగుపుట్టి, ఘోరమైన తపస్సుతో కొడుకును పొంది ఆ రాక్షసుడిని చంపటానికి సంకల్పించి మహావ్రతాన్ని. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. నడప మదాత్మ యగ్నియయి నా వదనంబున నిర్గమించె యె**

**క్కుడుపడి పద్మగర్భుకడకుం జనె నమ్మహితుండు మన్మథుం**

**గొడుకుగఁ బంచి వే తను మగుడ్పగ వచ్చెఁ గడంగి పోవున**

**ప్పుడు వనమేర్చె నేను గృపఁ బూర్వవిధం బొడఁగూడఁ జూచితిన్. 408**

**ప్రతిపదార్థం:** నడపన్= సాగింపగా; మత్+ఆత్మ= నా ఆత్మ; అగ్ని= వహ్ని; అయి; నా వదనంబునన్= నా నోటినుండి; నిర్గమించి= వెలువడి; ఎక్కుడు+పడి= పెద్దదై; పద్మగర్భుకడకున్= బ్రహ్మదగ్గరకు; చనెన్= వెళ్ళినది; ఆ+మహితుండు= ఆ గొప్పవాడు; మన్మథున్= మన్మథుడిని; కొడుకుగన్= నా కుమారుడిగా; పంచి= పంపి; వే= వడిగా; తనున్= తన్ను; మగుడ్పఁగన్= మరలింపగా; వచ్చెన్= వచ్చినది; కడంగి= ప్రయత్నపడి; పోవు+అప్పుడు= తిరిగి పోయే సమయంలో; వనము= అడవి; ఏర్చెన్= కాల్చివేసింది; నేను; కృపన్= జాలితో; పూర్వవిధంబు= తొల్లిటి తీరు; ఒడఁగూడన్= ఏర్పడునట్లుగా; చూచితిన్= చేశాను.

**తాత్పర్యం:** (గొప్పవ్రతం) సాగించగా నా ఆత్మ అగ్ని అయి నా ముఖం నుండి బయటకు వచ్చింది. అది క్రమంగా బాగా పెరిగి, బ్రహ్మదగ్గరకు వెళ్ళింది. ఆ మహానుభావుడు మన్మథుడిని నా కుమారుడిగా పంపి, దానిని మరలించాడు. అది తిరిగి పోతూ ఈ అడవిని కాల్చివేసింది. నేను జాలిపుట్టి, మరల దానికి మొదటిరూపు కల్పించాను.

**విశేషం:** సృష్టి వ్యవహారమంతా బ్రహ్మ పని. అందుకని అగ్ని అక్కడకు వెళ్ళింది. తిరిగిపోతూ కాల్చటం ఎందుకు? అంటే అది దాని స్వభావం.

**వ. ఇది యద్దహనంబు తెఱంగని చెప్పి యప్పరమపురుషుం డమ్మునివరులతో మఱియును. 409**

**ప్రతిపదార్థం:** ఇది; ఆ+దహనంబు తెఱంగు= ఆ అగ్ని తీరు; అని; చెప్పి; ఆ+పరమ పురుషుండు= ఆ పరమాత్మ; ఆ+ముని వరులతోన్= మహర్షిశ్రేష్ఠులగు నారదాదులతో; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** ఆ అగ్ని ఏర్పడిన విధం ఇది' అని చెప్పి ఆ పరమాత్మ ఆ మహర్షులతో ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఒక మహారాజు ప్రియమైన సేవకుడి పెండ్లిలో పల్లకీ ప్రక్కన నడుస్తాడు. అయినా అతడు మహారాజే. పరమాత్మ అవతారరూపంలో వేరు నామరూపాలు పొందినా పరమాత్మయే. ఈ దృష్టితో ఇక్కడ పరమపురుష శబ్దాన్ని తిక్కనగారు ప్రయోగించారు.

**సీ.** **'లోకత్రయంబున మీకు నవిదితంబు । లేదు త్రికాల సంవేదులార!**
**యుత్తమం బగు పురావృత్తంబు చెప్పి కృ । తార్థుఁ జేయుండు న న్ననిన వారు**
**సవినయంబుగఁ గృతాంజలు లయి 'మమ్మింత । పెద్ద సేయుదె? నీవు పెద్దలకును**
**బెద్ద వయత్నసంభృతజగత్త్రయుఁడవు । విశ్వప్రకారసంవిదుఁడ వేము**

**తే.** **నీ యెఱుంగని యితిహాస మేయుగమున । నెఱిఁగి చెప్పుదు? మనవుడుఁ జిఱుతనగవు**
**మోమునకుఁ జెన్ను సేయ నమ్మురహరుండు । వారలకు నిట్టులనుఁ గురువంశ వర్య! 410**

**ప్రతిపదార్థం:** త్రికాల సంవేదులార!= మూడుకాలాలను చక్కగా తెలిసిన విజ్ఞులారా!; లోకత్రయంబునన్= మూడు లోకాలలో; మీకున్= మీకు; అవిదితంబు= తెలియనది; లేదు; ఉత్తమంబు= శ్రేష్ఠమైనది; అగు పురావృత్తంబున్= అయిన ఇతిహాసాన్ని; చెప్పి; నన్నున్= నన్ను; కృతార్థున్= నెరవేరిన కోరిక కలవాడినిగా; చేయుండు= చేయండి; అనినన్= అనగా; వారు= ఆ మునులు; సవినయంబుగన్= వినయంతో; కృత+అంజలులు= పట్టిన దోసిలి కలవారు; అయి; మమ్మున్= మమ్ములను; ఇంత= ఇంతగా; పెద్ద+చేయుదె?= గొప్పవారిని చేస్తావా?; నీవు; పెద్దలకును= మహావృద్ధులకుకూడా; పెద్దవు= పెద్దవాడవు; అయత్న సంభృతజగత్+ త్రయుఁడవు= ఏ ప్రయత్నంలేకయే చక్కగా భరింపబడిన మూడు లోకాలు కలవాడవు; విశ్వ ప్రకార సంవిదుడవు= విశ్వపుతీరును చక్కగా తెలిసినవాడవు; ఏము= మేము; నీ ఎఱుంగని ఇతిహాసము= నీ వెరుగని కథను; ఏ యుగమునన్= ఏ యుగంలో; ఎఱిఁగి= తెలిసికొని; చెప్పుదుము?= చెప్పుతాము; అనవుడున్= అని పలుకగా; ఆ+మురహరుండు= మురాసురుని సంహారం చేసిన ఆ కృష్ణుడు; చిఱుతనగవున్= చిన్న నవ్వు; మోమునకున్= ముఖానికి; చెన్ను+చేయన్= సొంపు కూర్పగా; కురువంశవర్య!= కురువంశంలో ఉత్తముడా!; వారలకున్= ఆ మునులకు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు.

**తాత్పర్యం:** 'మీరు మూడు కాలాలు తెలిసినవారు. మూడు లోకాలలో మీకు తెలియనిది లేదు. నాకొక ఉత్తమ ఇతిహాసం చెప్పి నా కోరిక తీర్చండి' అనగా వారు వినయంతో చేతులు జోడించి, 'నీవు మమ్మ ఇంత గొప్ప చేస్తే ఎట్లాగు? నీవు పెద్దలకు పెద్దవు. లోకాల నన్నింటినీ అవలీలగా భరించగలవాడవు. విశ్వపు తీరుతెన్నులు చక్కగా తెలిసినవాడవు. నీకు తెలియని ఏ కథను మేము ఏ యుగంలో తెలిసి చెప్పగలవారము?' అన్నారు. అప్పుడు కృష్ణుడు చిరునగవు మొగానికి వింత శోభ కలిగిస్తూ ఉండగా వారితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** పెద్దలకు పెద్ద - పెద్దలు సృష్టి స్థితి లయ కర్తలు - బ్రహ్మ విష్ణు మహేశ్వరులు - వారికి పెద్ద పరమాత్మ అని తాత్పర్యం. కృష్ణుడు త్రికాలాలను, త్రిలోకాలను తెలిసినవారినిగా మునులను పేర్కొన్నాడు. వారు ప్రతిగా త్రిమూర్తులకు అతీతమైన పరమాత్మ స్వరూపుడిగా, త్రిలోకాలకంటె మించి ఉన్న విశ్వమయుడుగా పేర్కొన్నారు. 'చిరునగవు'లో తరువాత తాను చెప్పబోయే విషయం లీలామాత్ర మనే సూచన ఉన్నది.

**క. 'మానుషయోని జనించితిఁ। గాన మదీయ మగు బుద్ధిగౌరవము దదీ**
**యానుగుణత్వోపహితము। గా నెఱుఁగుఁడు మీరు సెప్పు కత విను టసదే?' 411**

**ప్రతిపదార్థం:** మానుషయోనిన్= మనుష్య గర్భంలో; జనించితిన్= పుట్టాను; కానన్= కనుక; మదీయము= నాది; అగు బుద్ధి గౌరవము= అయిన బుద్ధిగొప్పతనం; తదీయ+అనుగుణత్వ+ఉపహితము=దానికి తగిన విధంగా ఏర్పడినది; కాన్= అగుటను; ఎఱుఁగుఁడు= తెలిసికొనండి; మీరు; చెప్పు కత= చెప్పే కథ; వినుట= వినటం; అసదే?= చిన్న విషయమా?

**తాత్పర్యం:** మనుష్యగర్భంలో పుట్టాను. కనుక, నా బుద్ధిస్థితి దానికి తగిన విధంగానే ఉన్నది - అని తెలిసికొనండి. మీరు చెప్పేకథ నాకు చిన్నదెట్లా అవుతుంది?

**చ. అనుటయు వారలందఱుఁ బ్రియంబున దానికి నియ్యకొన్న నె**
**మ్మనములతోడ 'నీ పనికి మాన్యచరిత్రుఁడు నారదుండ త**
**క్కిన పెఱవారు చాలరు ప్రకీర్త్యవివేకుఁడు కృష్ణు డర్థితో**
**వినఁగఁ బురాతనంబయిన వృత్తము నమ్ముని చెప్పు టొప్పగున్. 412**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; వారలు= ఆ మునులు; అందఱున్= అందరూ; దానికిన్= దానికి; ఇయ్యకొన్న నెఱ+మనములతోడన్= ఒప్పుకొన్న నిండు హృదయాలతో; ఈ పనికిన్= ఈ కథ చెప్పటం అనే పనికి; మాన్యచరిత్రుఁడు= మన్నన కెక్కిన నడవడి కలవాడు; నారదుండు+అ= నారదుడే; తక్కిన పెఱవారు= మిగిలిన ఇతరులు; చాలరు= సమర్థులు కారు; ప్రకీర్త్యవివేకుఁడు= మిక్కిలి కొనియాడదగిన వివేకంగలవాడు; కృష్ణుఁడు; అర్థితోన్= కోరికతో; వినఁగన్= వింటూ ఉంటే; పురాతనంబు= ప్రాత కాలానిది; అయిన వృత్తమున్= అయిన సంగతిని; ఆ+ముని= ఆ నారద మహర్షి; చెప్పుట=చెప్పటం; ఒప్పు= మంచిది; అగున్= అవుతుంది.

**తాత్పర్యం:** కృష్ణు డట్లా అనగా వారందరూ అంగీకరించిన హృదయాలతో 'ఈ పనికి సమర్థుడు నారదుడే. అతడి నడవడి ఎంతో మన్నన కెక్కినది. తక్కినవారు దీనికి చాలరు. లోకమంతా పెద్ద ఎత్తున కొనియాడే వివేకంకల శ్రీకృష్ణుడు వింటూ ఉంటే పూర్వకథను ఆ ముని చెప్పటమే బాగుంటుంది.'

**చ. అని తగ నేక వాక్యతఁ బ్రియంబున నాతనితోడ నీవు మున్**
**కనినది విన్నయట్టిది ప్రకామకుతూహల చిత్తుఁ డైన కృ**
**ష్ణుని వినిపింపు నావుడు మనోజ్ఞ కథాకథనంబునందు వే**
**డ్క నిగుడ నమ్మునీంద్రుఁడు వికాసమునన్ మొగ ముల్లసిల్లఁగన్. 413**

**ప్రతిపదార్థం:** అని; తగన్= బాగుగా; ఏకవాక్యతన్= ఒక్కమాట అగునట్లుగా; ప్రియంబునన్= ప్రీతితో; ఆతనితోడన్= ఆ నారదుడితో; నీవు; మున్= మునుపు; కనినది= చూచినది; విన్న+అట్టి+అది= విన్నది; ప్రకామ కుతూహల చిత్తుఁడు= పెద్దకోరికతో వేడుక కల హృదయం కలవాడు; ఐన కృష్ణునిన్= అయిన కృష్ణుడిని(కి); వినిపింపు= చెప్పుము; నావుడున్= అని పలుకగా; ఆ+ముని+÷ఇంద్రుఁడు= ఆ మునిశ్రేష్ఠుడు; మనోజ్ఞ కథాకథనంబునందున్= హృదయాన్ని మురిపించే కథను చెప్పటంలో; వేడ్క= ఉత్కంఠ; నిగుడన్= వ్యాపించగా; మొగము= ముఖం; వికాసమునన్= విప్పారుటతో; ఉల్లసిల్లఁగన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** అని ఒక్కమాటగా నారదుడితో ఇట్లా అన్నారు. 'నీవు మునుపు చూచినది, లేక వినినది అయిన వృత్తాంతం ఎంతో కోరికతో ముచ్చట పడుతున్న కృష్ణుడికి చెప్పుము'. అప్పుడు నారదుడు వేడ్క పుట్టి, ముఖం వికాసంతో వెలుగొందుతూ ఉండగా (ఇట్లా అన్నాడు).

### ఉమామహేశ్వర సంవాదంబను నితిహాసంబు (సం.13-205-1 (కుంభ))

**క. నారాయణ సౌహార్ధో । దారత్వవిభూతి మున్న తనకుఁ గలిమి న**
**న్నారాయణుని మనోరథ । మారం బూరించె శంకరాంబికల కథన్. 414**

**ప్రతిపదార్థం:** నారాయణ సౌహార్ద+ఉదారత్వ విభూతిన్= నారాయణుని చెలిమిలోని గొప్పతనపు సంపద; మున్ను+అ= ముందే తనకున్= తనకు (నారదుడికి); కలిమిన్= ఉండటంవలన; ఆ+నారాయణుని మనస్+రథము= ఆ నారాయణుడి కోరికను; శంకర+అంబికల కథన్= పరమేశ్వరుడు, అంబిక అనే వారి కథతో; ఆరన్= తనివి తీరా, పూరించెన్= నింపాడు.

**తాత్పర్యం:** 'నారాయణుని చెలిమి' అనే మిక్కిలి గొప్ప సంపద తనకు పూర్వమే ఉండటంవలన ఉమామహేశ్వరుల కథలతో ఆ నారాయణుడి కోరికను తనివితీరా నారదుడు పూరించాడు.

**విశేషం:** లోకసామాన్యంగా 'సౌహార్ద' శబ్దానికి 'చెలిమి' అని అర్థం. ఇక్కడ విశేషంగా నారాయణుడి హృదయంలో పదిలపరచుకొన్న స్థితిచేత అనే అర్థం సంభావించాలి.

**వ. అత్తెఱంగు వివరించెద నట్లు సమస్త సంయమిసంఘంబును బ్రస్తుతి పూర్వకంబుగా నియోగింపం బ్రియంబునం బురాతన కథాకథనంబునకుం బూని యద్దేవముని యద్దేవకీనందనునకు వందనం బాచరించి తదభివందనంబు వడసి యవ్విభున కిట్లనియె. 415**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు= ఆ పద్ధతిని; వివరించెదన్= విశేషంగా తెలియజేస్తాను; అట్లు= ఆ విధంగా; సమస్త సంయమి సంఘంబును= మునుల సముదాయమంతా; ప్రస్తుతి పూర్వకంబుగాన్= ప్రశంస మొదలుగా; నియోగింపన్= నియమించగా; ఆ+దేవముని= దేవలోకపు మునియైన ఆ నారదుడు; పురాతన కథాకథనంబునకున్= పూర్వకాలపు కథను చెప్పటానికి; ప్రియంబునన్= ప్రీతితో; పూని= సంకల్పించి; ఆ+దేవకీనందనునకున్= దేవకి కొడుకైన శ్రీకృష్ణుడికి; వందనంబు= నమస్కారం; ఆచరించి= చేసి; తద్+అభివందనంబు= అతడి నమస్కారం; పడసి= గ్రహించి; ఆ+విభునకున్= ఆ దేవుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ తీరు వివరంగా చెప్తుతాను. ఆ విధంగా మునులందరూ ప్రశంసతోపాటు తనను నియమించగా నారదుడు సంతోషంతో ఇతిహాసం చెప్పటానికి పూనుకొని, ముందు శ్రీకృష్ణుడికి నమస్కారం చేసి, అతడి ప్రతినమస్కారం గ్రహించి, అతడితో ఇట్లా అన్నాడు.

**తే. తీర్థభజనంబునకు నెందుఁ దిరుగుచుండి । యిత్తుషారనగంబున కేను వచ్చి**
**కంటి రమణీయ మగు కేలికావనంబు । సకలతరువల్లరీగుల్మచారుతలము. 416**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; తీర్థ భజనంబునకున్= పుణ్యస్థలాలను సేవించటానికి; ఎందున్= అన్ని చోటులందు; తిరుగుచున్+ఉండి= తిరుగుతూ; ఈ+తుషార నగంబునకున్= ఈ మంచుకొండకు; వచ్చి= ఏతెంచి; సకల తరు వల్లరీ

గుల్మ చారు తలము= అన్ని విధములైన చెట్లు, తీగెలు, పొదలు అనేవాటితో అందమైన చోటు; రమణీయము= మనోజ్ఞమైనది; అగు కేలికావనంబున్= అయిన ఉద్యానవనాన్ని; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** నేను పుణ్యస్థలాలు సేవిస్తూ, అన్ని స్థలాలు తిరుగుతూ, ఈ హిమవత్పర్వతానికి వచ్చి, చూడముచ్చట అయినది. అన్ని రకాల చెట్లు, తీగెలు, పొదలు అనే వాటితో సుందరంగా ఉన్నదీ అయిన ఒక ఉద్యానవనాన్ని చూచాను.

**విశేషం:** "భజ సేవాయామ్" అని ధాతువు కనుక భజనం అంటే సేవించటం.

**క. కోకిలకుల గంధర్వా । నీకధ్వను లెనసి బెరసి నిగుడఁగ నమరీ**

**లోకభ్రమరీమండలి । కా కలకలనాదములును గలిసి చెలంగన్. 417**

**ప్రతిపదార్థం:** కోకిల కుల గంధర్వ+అనీక ధ్వనులు= కోకిలలగుంపుల యొక్క, గంధర్వుల సముదాయాలయొక్క నాదాలు; ఎనసి= విజృంభించి; బెరసి= కలిసిపోయి; నిగుడఁగన్= వ్యాపించగా; అమరీ= దేవతాస్త్రీ; లోక= సముదాయంయొక్క; భ్రమరీ= ఆడు తుమ్మెదల; మండలికా= గుంపులయొక్క; కలకలనాదములును= అవ్యక్తమధుర నాదములు; కలిసి= ఒకదానితో ఒకటి కలిసి; చెలంగన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** కోకిలల నాదాలు, గంధర్వుల గానాలు, దేవకాంతల రాగాలు, ఆడు తుమ్మెదల అవ్యక్తమధుర గీతాలు కలిసి విజృంభించగా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఒప్పు నవ్వనంబునం గనక స్థలంబున శార్దూల చర్మవసన భుజగాభరణ భసితాంగరాగ విరచితాలంకార చారు దివ్యదేహుం డగు మహాదేవుండు సుర సిద్ధసాధ్య విద్యాధర మునిపుంగవ భూతగణ పరివృతుం డయి యున్న నప్పేరోలగంబున నేనును సముచితప్రకారంబున నయ్యనిరూపణీయప్రకారుం గొల్చి యుండితి నట్టి సమయంబున. 418**

**ప్రతిపదార్థం:** ఒప్పు+ఆ+వనంబునన్= ఒప్పారే ఆ పూదోటలో; కనక స్థలంబునన్= బంగారు తాపడం గల తావున; శార్దూల= పులియొక్క; చర్మ= తోలు అనే; వసన= వస్త్రం; భుజగ= పాములనే; ఆభరణ= నగలు; భసిత= విభూతి అనే; అంగరాగ= మైపూతలతో; విరచిత= చేయబడిన; అలంకార= శృంగారం గల; చారు= మనోహరమైన; దివ్య= మిక్కిలి ఉత్తమమైన; దేహుండు+అగు= దేహం కలవాడైన; మహాదేవుండు= పరమేశ్వరుడు; సుర= దేవతల; సిద్ధ=సిద్ధుల; సాధ్య= సాధ్యుల; విద్యాధర= విద్యాధరుల; మునిపుంగవ= మహర్షివరేణ్యుల; భూత= భూతముల; గణ= గుంపులచేత; పరివృతుండు+అయి= చుట్టబడినవాడై; ఉన్నన్= ఉండగా; ఆ+పేరు+ఓలగంబునన్= ఆ పెద్ద సభలో; నేనును= నేను కూడా; సముచిత ప్రకారంబునన్= తగిన తీరున; ఆ+అనిరూపణీయ ప్రకారున్= ఇట్టివాడని భావించరాని ధోరణిలో గల ఆ సదాశివుడిని; కొల్చి= సేవించి; ఉండితిన్= ఉన్నాను; అట్టి సమయంబునన్ = ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ విధంగా ఒప్పారే ఆ ఉద్యానంలో బంగారు తాపిన ప్రదేశంలో పులితోలు అనే వస్త్రం, సర్పాల ఆభరణాలు, విభూతి మైపూతలతో అలంకరించుకొనిన అతిశ్రేష్ఠమైన దేహంగల ఆ మహాదేవుడు దేవతలు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, మునివరులు, భూతములు అనే వారి గుంపులు చుట్టి రాగా కొలువున్న ఆ పెద్ద సభలో నేను కూడా తగు తీరున నిరూపించరాని తీరుతెన్నులుగల ఆ స్వామిని కొల్చి ఉన్నాను. ఆ సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సాధ్యులు మొదలయినవారు దేవయోనులనే జాతులవారు. "అనిరూపణీయ ప్రకారుఁడు" ఇది పరమాత్మ లక్షణం. మాట, మనసు, చేష్ట అనేవి ఏ విధంగా, ఎందుకు, ఎప్పుడు ఉంటాయో ఎవ్వరికీ తెలియరానివాడు.

**సీ.** **పుణ్యాంగనాకారములు దాల్చి పుణ్య న । దీ నివహంబులు దిశలు గొల్చి**
**చనుదేర శంకరసదృశ పరిష్కార । కల్యాణతను వైన గౌరి వచ్చి**
**వెనుక దిక్కున మెలుపునఁ జేరి మోమున । కలఁతిన వ్వినుమడి చెలువు నొసఁగఁ**
**దమ్మితేకుల నుల్లసమ్మాడు తన మృదు । కర యుగ్మమునను శంకరుని నేత్ర**

**తే.** **యుగ్మ మల్ల మూసి యున్నంత లోక మ । నర్క చంద్రతారకాగ్నియై మ**
**హాంధకారమగ్న మగుటయు సంక్షోభ । మందె భూతసముదయంబు లెల్ల.** **419**

**ప్రతిపదార్థం:** పుణ్యనదీ నివహంబులు= పుణ్యాలైన నదుల సముదాయములు; దిశలు= దిక్కులు; పుణ్య+అంగనా+ఆకారములు= పుణ్యస్త్రీల ఆకారాలు; తాల్చి= ధరించి; కొల్చి= సేవించి; చనుదేరన్= రాగా; శంకర సదృశ పరిష్కార కల్యాణ తనువు= శంకరుడి అలంకారములను పోలిన అలంకారములతో శుభమైన మేను గలది; ఐన గౌరి= అయిన పార్వతీదేవి; వచ్చి= ఏతెంచి; వెనుక దిక్కునన్= వెనుక వైపు; మెలుపునన్= నేర్పుతో; చేరి= సమీపించి; మోమునకున్= మొగానికి; అలఁతి నవ్వు= చిన్న నగవు; ఇనుమడి చెలువున్= రెట్టింపు శోభను; ఒసఁగన్= ఇవ్వగా; తమ్మితేకులన్= పద్మపత్రాలను; ఉల్లసమ్ము+ఆడు= ఎకసెక్కం చేసే; తన మృదు కరయుగ్మమునను= తన మెత్తని చేతుల జంటచేత; శంకరుని నేత్ర యుగ్మము= శివుడి కన్నుల జంటను; అల్లన్= మెల్లగా; మూసి; ఉన్న+అంతన్= ఉన్నంతలో; లోకము= జగము; అనర్క చంద్ర తారక+అగ్ని+ఐ= సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు అగ్ని లేనిదై; మహా+అంధకార మగ్నము= పెనుచీకటిలో మునిగినది; అగుటయున్= కాగా; భూతసముదయంబులు= ప్రాణుల గుంపులు; ఎల్లన్= అన్నీ; సంక్షోభము= కలతపాటును; ఒందెన్= పొందాయి.

**తాత్పర్యం:** పుణ్యనదులు, దిక్కులు స్త్రీరూపాలు ధరించి సేవించిరాగా, శివుడి అలంకారంవంటి అలంకారంతో శుభమైన దేహంగల పార్వతి మెల్లగా వెనుకవైపునుండి సమీపించి చిరునవ్వు ముఖానికి రెట్టింపు సౌందర్యాన్ని కలిగిస్తూ ఉండగా, తమ్మిరేకులను పరిహాసం చేసే తనచేతుల జంటతో శివుడి కనుల జంటను మెల్లగా మూయగా, జగమంతా సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అగ్నిలేనిదై పెనుచీకటిలో మునిగిపోయింది. అప్పుడు ప్రాణికోటులన్నీ కళవళపడ్డాయి.

**విశేషం:** ఇందరి ముందర ఈ పరిహాసధోరణి సముచితమా? అని కొందరికి శంక కలుగవచ్చును. పార్వతీపరమేశ్వరులు జగత్పితరులు. పిల్లలముందు తల్లిదండ్రులు పిల్లల వినోదంకొరకు ఇట్లా ప్రవర్తించటం సహజమే. అంతేకాదు. శంకరుడి నేత్రాలు సర్వలోకాలకు వెలుగునిచ్చే దివ్యజ్యోతులని నిరూపించటం కూడా లోకమాత ఉద్దేశం కావచ్చును.

**ఉ.** **అప్పుడు ఫాలలోచనము నప్పరమేశుఁడు విచ్చె విచ్చినం**
**గప్పెఁ దదగ్నిజిహ్వలు నగం బఖిలంబును గౌరిదేవి య**
**ట్లొప్పమి తండ్రి కైనఁ గని యుల్లము బెగ్గిల నీశునంఘ్రులం**
**గప్పఁగ మౌళిభూషణము కాంతి ప్రణామముఁ జేసెఁ జేసినన్.** **420**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆ+పరమ+ఈశుఁడు= ఆ మహేశ్వరుడు; ఫాలలోచనమున్= నొసటి కన్నును; విచ్చెన్= తెరిచాడు; విచ్చినన్= తెరువగా; తద్+అగ్ని జిహ్వలు= దాని అగ్ని జ్వాలలు; నగంబు= కొండను; అఖిలంబును= మొత్తాన్ని; కప్పెన్= కప్పివేసినాయి; అట్లు= ఆ విధంగా; ఒప్పమి= కీడు; తండ్రికిన్= తన తండ్రి అయిన హిమవంతుడికి; ఐనన్= కాగా; కని= చూచి; గౌరిదేవి= పార్వతీదేవి; ఉల్లము= హృదయం; బెగ్గిలన్= దిగు లొందగా; మౌళి భూషణము కాంతి= శిరస్సునందలి ఆభరణం కాంతి; ఈశు+అంఘ్రులన్= ఈశ్వరుడి పాదాలను; కప్పఁగన్= కప్పివేయగా; ప్రణామమున్= నమస్కారము; చేసెన్= చేసినది; చేసినన్= చేస్తే.

**తాత్పర్యం:** అప్పుడు పరమేశ్వరుడు నొసటి కంటిని తెరిచాడు. దానితో ఆ కంటిమంటలు కొండనంతటినీ పొదివివేశాయి. ఆ విధంగా తండ్రికి ఆపద సంభవించగా పార్వతి గుండెలో దిగులుపడి, తన శిరస్సునందలి అలంకారపు కాంతి శివుడి పాదాలను కప్పగా చాగిలబడి నమస్కరించింది. అట్లా నమస్కరించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** శిరోభూషణం చంద్రరేఖ కావచ్చును.

**ఆ.** **హరుఁడు కరుణఁ జూడ నా హిమవన్నగ । దాహ ముడిగి శోభితత్వ మొలసె**
**నార్య పరమవిస్మయముఁ బొంది యాసర్వ । భువనకర్తతోడ సవినయముగ.** **421**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; కరుణన్= దయతో; చూడన్= చూడగా; ఆ+హిమవత్+నగ దాహము= ఆ మంచుకొండ మంట; ఉడిగి= పోయి; శోభితత్వము= శోభగలదానితనం; ఒలసెన్= కలిగింది; ఆర్య= పార్వతి; పరమ విస్మయమున్= గొప్ప ఆశ్చర్యం; పొంది; ఆ+సర్వ భువన కర్తతోడన్= అన్ని లోకాలకు కర్త అయిన ఆ శివుడితో; సవినయముగన్= వినయంతో పాటుగా.

**తాత్పర్యం:** శివుడు దయతో చూడగా ఆ మంచుకొండ మంట చల్లారి, మరల శోభతో అలరారినది. పార్వతి పరమాశ్చర్యం పొంది, సర్వలోకాలకు నిర్మాత అయిన ఆ శివుడితో వినయంతో. (ఇట్లా అన్నది)

**సీ.** **నిటలంబుకను దెఱచుటకుఁ గారణమేమి । సర్వేశ! యిది రహస్యంబు గాక**
**యున్నేనిఁ జెప్పవే!' యన్న నద్దేవుండు । 'కాంత! నీ కెఱిఁగింపఁగాని యట్టి**
**పని యెందుఁ గల్గునే? వినుము లోకాత్మక । త్వము నాకుఁ గల్గుట వలనఁ జేసి**
**నన్నేది వొందిన నన్నిలోకంబుల । నది వొందుఁ గాన నాయంబకములు**

**తే.** **నీవు మూయంగఁ దిమిరంబు నిఖిలలోక । చయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె**
**నీ కరంబులు ద్రోవక చీఁకటియును । జెఱుచుటకు ఫాలనేత్రంబు దెఱవవలసె.'** **422**

**ప్రతిపదార్థం:** సర్వ+ఈశ!= సర్వమునకు ప్రభువైన ఓ మహేశా! నిటలంబు కను= నొసటికన్ను; తెఱచుటకున్= తెరవటానికి; కారణము= హేతువు; ఏమి?; ఇది= ఈ విషయం; రహస్యంబు= గుట్టయినది; కాక+ఉన్నన్+ఏనిన్= కాకపోతే; చెప్పవే!= దయతో చెప్పుము!; అన్నన్= అనగా; ఆ+దేవుండు= ఆ దేవుడు; కాంత!= ఓ ప్రియురాలా!; నీకున్= నీకు; ఎఱిఁగింపన్= తెలుపుటకు; కాని+అట్టిపని= కూడనిపని; ఎందున్= ఎక్కడైనా; కల్గునే?= ఉంటుందా?; వినుము= ఆలకించుము; నాకున్= నాకు;

లోక+ఆత్మకత్వము= లోకములన్నీ నేనే అయిన భావం; కల్గుటవలనన్+చేసి= కలగటంవలన; నన్నున్= నన్ను; ఏది= ఏమి; పొందినన్= పొందినా; అన్ని లోకంబులన్= లోకాలన్నింటినీ; అది; పొందున్= పొందుతుంది; కానన్+కనుక; నా+అంబకములు= నా కన్నులు; నీవు; మూయంగన్= కప్పగా; తిమిరంబు= చీకటి; నిఖిల లోకచయమున్= అన్ని లోకాల సముదాయాన్ని; కప్పినన్= ఆవరించగా; భూతముల్= ప్రాణులు; భయమున్= భయాన్ని; పొందెన్= పొందాయి; నీ కరంబులు= నీ చేతులను; త్రోవక= తొలగించక; చీకటియును= చీకటిని; చెఱచుటకున్= పోగొట్టటానికి; ఫాలనేత్రంబు= నొసటి కంటిని; తెఱవన్+వలసెన్= తెరువవలసి వచ్చింది.

**తాత్పర్యం:** 'సర్వేశా! నొసటికన్ను తెరవటానికి కారణం ఏమిటి? ఇది రహస్యం కాకపోతే చెప్పుము' అని గౌరి అడుగగా కాంతా! నీకు తెలుపరానిపని ఎక్కడైనా ఉంటుందా? వినుము. ఈ లోకాలన్నీ నా స్వరూపాలే కనుక నా కేది కలిగితే లోకాలన్నింటికీ అదే కలుగుతుంది. నీవు నా కన్నులు మూయగా చీకటి అన్ని లోకాలను ఆవరించింది. భూతాలు భయం పొందాయి. నీ చేతులు తొలగించకుండా చీకటిని పోగొట్టటం కొరకు నా నుదుటికంటిని తెరవవలసి వచ్చింది.

**విశేషం:** చేతులు తొలగించకుండటం ముచ్చట తీర్చటంకొరకు. చేతులు తోసివేస్తే పార్వతి మనస్సు కష్టపడుతుంది. లోకాల భయం తొలగించటం తత్క్షణకర్తవ్యం. అందు కని మూడవ కన్ను తెరవటం.

**వ. అనిన విని యంబిక తనకు నడుగవలయునట్టివి యడుగుటకు నది యవసరంబుగాఁ గనికొని యక్కపర్ది కిట్లనియె. 423**

**ప్రతిపదార్థం:** అనినన్= అంటే; విని; అంబిక= పార్వతి; తనకున్= తనకు; అడుగవలయు+అట్టి+అవి= అడుగవలసినవి; అడుగుటకున్= అడగటానికి; అది; అవసరంబుగాన్= తగిన సమయంగా; కనికొని= భావించి; ఆ+కపర్దికిన్= ఆ శివుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** అని చెప్పగా విని పార్వతి తా నడుగవలసినవి అడగటానికి అది తగిన సమయంగా భావించి, శివుడితో ఇట్లా అన్నది.

**విశేషం:** అంబిక - అన్ని లోకాలకు తల్లి. కపర్ది - శివుడి జటల సముదాయిన్ని కపర్దం అంటారు. అది కలవాడు కపర్ది. ఆకాశమంతా ఆయన జడల సముదాయం. అందుకనే ఆయనను వ్యోమకేశు డనికూడా అంటారు.

**క. 'నాలుగు ముఖములు నీకు । న్ఫాలనయన! కలుగఁ గారణం బేమి? మధు**
**శ్రీలాలిత్యాస్పద వా । క్యాలీకలనమున నాకు నానతి యీవే!' 424**

**ప్రతిపదార్థం:** ఫాలనయన!= నొసటిపై కన్నుగల ఓ శివా!; నాలుగు ముఖములు= నాలుగు మోములు; నీకున్= నీకు; కలుగన్= ఉండటానికి; కారణంబు= కారణం; ఏమి; మధు= తేనెయొక్క; శ్రీ= సంపదయొక్క; లాలిత్య= ఇంపునకు;ఆస్పద= తావు అయిన; వాక్య= మాటల; ఆలీ= వరుసయొక్క; కలనమునన్= కూర్పుతో; నాకున్= నాకు; ఆనతి+ఈవే= చెప్పవూ!

**తాత్పర్యం:** 'నిటలాక్షా! నీకు నాలుగు మొగాలు ఎందుకు ఉన్నాయో తేనెవంటి మాటల కూర్పుతో సెలవివ్వవూ!'

**విశేషం:** నిజానికి శివుడికి అయిదు ముఖాలు. ఇక్కడ సాధారణంగా ఉండే ముఖం కాక తక్కిన నాలుగు ముఖాల సంగతి అడుగుతున్నట్లు భావించాలి. సద్యోజాతం, వామదేవం, అఘోరం, తత్పురుషం, ఈశానం అనేవి ఆ అయిదు ముఖాలకుపేర్లు.

**వ. అనిన విని యమ్మహాదేవికి నద్దేవుం డిట్లను 'దైత్యులు సుందోపసుందులన నిర్వురు గలరు. వార లవార్య భుజవీర్య శౌర్యసంపన్నులు నస్త్రశస్త్రావధ్యులునై యుండుదురు. వారల వినాశంబునకై మయుండు లోకంబులం గల ఒప్పులం దెల్ల నుత్తమసారంబులు దిలప్రమాణంబు లాహరించి యొక్క కామినిం గావించి తిలోత్తమ యను పేరిడి నాకడకుం దెచ్చిన నచ్చెలువ నాకుం బ్రదక్షిణంబుగా వచ్చునెడ నేనిది దేవకార్యంబు సేయ నోపుఁ బొమ్మను తలంపుతో నత్తరుణి తిరిగిన దిక్కుదిక్కున కొక్కొక్క మొగంబు దాల్చి దానిం బరీక్షించితి; నాటంగోలెఁ జతుర్ముఖుండనై యుండుదు.' 425**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఆ+మహాదేవికిన్= ఆ పార్వతికి; ఆ+దేవుండు= ఆ పరమేశ్వరుడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; దైత్యులు= దితి కొడుకులైన రక్కసులు; సుంద+ఉపసుందులు= సుందుడు, ఉపసుందుడు; అనన్= అనగా; ఇర్వురు= ఇద్దరు; కలరు= ఉండేవారు; వారలు= వారు; అవార్య= నిలువరింపరాని; భుజ= చేతుల; వీర్య= సత్తువయొక్క; శౌర్య= పరాక్రమంయొక్క; సంపన్నులును= సంపద కలవారు; అస్త్ర శస్త్ర+అవధ్యులును= అస్త్రాలకు, ఆయుధాలకు చంపరానివారు; ఐ= అయి; ఉండుదురు= ఉండేవారు; వారల వినాశంబునకై= వారల చావుకొరకు; మయుండు= విశ్వకర్మ; లోకంబులన్= లోకాలలో; కల ఒప్పులందున్= ఉన్న అందాలలో; ఎల్లన్= అన్నింటిలో; ఉత్తమ సారంబు= మేలైన స్థిరభాగాలను; తిలప్రమాణంబులు= నూవుగింజలంత కొలత కలవాటిని; ఆహరించి= తెచ్చి; ఒక్క కామినిన్= ఒక కాంతను; కావించి= చేసి; తిలోత్తమ; అను పేరు= అనే పేరు; ఇడి= పెట్టి; నా కడకున్= నా వద్దకు; తెచ్చినన్= తేగా; ఆ+చెలువ= ఆ ఇంతి; నాకున్= నాకు; ప్రదక్షిణంబుగాన్= వలగొనునట్లుగా; వచ్చు+ఎడన్= వచ్చే సమయంలో; నేను; ఇది= ఈమె; దేవకార్యంబు= దేవతలపనిని; చేయన్+ఓపున్= చేయగలదు; పొమ్ము; అను తలంపుతోన్= అనే భావనతో; ఆ+తరుణి= ఆ యువతి; తిరిగిన దిక్కు దిక్కునకున్= తిరిగిన ప్రతి దిక్కునకు; ఒక్క+ఒక్క మొగంబు= ఒక్కొక్క మొగం; తాల్చి= ధరించి; దానిన్= ఆమెను; పరీక్షించితిన్= చూచాను; నాటన్+కోలెన్= ఆ దినం మొదలుగా; చతుర్+ముఖుండను+ఐ= నాలుగు ముఖాలు కలవాడనై; ఉండుదున్= ఉంటున్నాను.

**తాత్పర్యం:** అంటే విని పరమేశ్వరుడు పార్వతికి ఇట్లా చెప్పాడు. 'సుందుడు', 'ఉపసుందుడు' అనే రక్కసులిరువురు ఉండేవారు. వారి భుజశక్తీ, శౌర్యమూ తిరుగులేనివి. అస్త్రాలకు, శస్త్రాలకు చంపరానివారుగా ఉండేవారు; వారిని చంపటంకొరకు విశ్వకర్మ అన్ని లోకాలలో ఉన్న అంద చందాల నన్నింటినీ నూవుగింజ అంత లెక్కలో తెచ్చి, ఒక కామినిగా చేసి, తిలోత్తమ అని పేరు పెట్టి, నా వద్దకు తెచ్చాడు. ఆమె నా చుట్టు ప్రదక్షిణంగా తిరిగింది. నే నాకాంత దేవకార్యం చేస్తుందిలెమ్ము - అని ఆమె తిరిగిన ప్రతిదిక్కుకు ఒక్కొక్క మొగం పెట్టి చూచాను. ఆనాటినుండి నాలుగు మోములవాడనై ఉన్నాను.'

**విశేషం:** అస్త్రం అంటే మంత్ర ప్రయోగంగల ఆయుధం. శస్త్రం అంటే సాధారణమైన ఆయుధం. వీర్యం అంటే దేహశక్తి. శౌర్యం మనశ్శక్తి. ప్రదక్షిణం అంటే పూజ్యవ్యక్తులను, వస్తువులను తనకు కుడిచేతివైపుగా ఉంచుకొని తిరిగిరావటం. దీనివలన సర్వస్వరూపభావన కలుగుతుంది. 'కామం కలది, కామం కలిగించేది' అని 'కామిని' శబ్దానికి రెండర్థాలను ఇక్కడ భావించవచ్చును. శివుడు దిక్కు కొక మొగం పెట్టుకొని చూడటం వ్యామోహంతో కాదు. ఆమె సామర్థ్యాన్ని పరీక్షించటంకొరకు.

**చ. అన విని గౌరి 'నీకు భువనాధిప! కంఠమునందుఁ గప్పు గ
ల్గిన కత మేమి? నాకు నెఱిఁ గింపుము' నావుడు దేవదైత్యు లం**

**బునిధి సుధార్థమై తరువఁ బుట్టి విషంబు త్రిలోకభీకరం**
**బనితరసాధ్యమై యొదవె; నత్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్. 426**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; గౌరి= పార్వతి; భువన+అధిప!= సర్వలోక ప్రభూ!; నీకున్= నీకు; కంఠమునందున్= మెడయందు; కప్పు= నలుపు; కల్గిన కతము= కలిగిన కారణం; ఏమి?; నాకున్= నాకు; ఎఱిఁగింపుము= తెలుపుము; నావుడున్= అన్నంతనే; దేవదైత్యులు= దేవతలు, రాక్షసులు; సుధా+అర్థము+ఐ= అమృతంకొరకు; అంబునిధిన్= సముద్రాన్ని; తరువన్= చిలుకగా; విషంబు= విషం; పుట్టి; త్రిలోకభీకరంబు= మూడు లోకాలకు భయం పుట్టించేది; అనితరసాధ్యము+ఐ= ఇతరులకు లొంగనిదై; ఒదవెన్= కలిగింది; ఆ+తఱిన్= ఆ సమయంలో; దానిన్= ఆ విషాన్ని; కుత్తుకన్= కంఠంలో; తాల్చితిన్= పెట్టుకొన్నాను.

**తాత్పర్యం:** అప్పుడు పార్వతి జగదీశా! నీకు కంఠంలో నలుపెందుకు కలిగింది?' అని అడిగితే శివుడు 'దేవతలు రక్కసులు అమృతం కొరకు సముద్రాన్ని చిలికారు. అప్పుడు ముల్లోకాలకు భయం కలిగిస్తూ ఎవ్వరికీ అణపరానిదై విషం పుట్టింది. నేను దానిని కంఠంలో పెట్టుకొన్నాను.

**విశేషం:** నిజానికి ఈ విషయం పార్వతికి తెలియనిది కాదు. 'మ్రింగుమనె సర్వమంగళ' అని భాగవతం. ఈ ప్రశ్నలన్నీ అడగటం లోకానుగ్రహంకొరకు మాత్రమే అని మనం గుర్తించాలి.

**తే. అట్లు కంఠంబునందు మహావిషంబు । దాల్చి నీలత గల్గిన దానఁ జేసి**
**కమలజాది సురులు నీలకంఠుఁ డంచు । నన్నుఁ గొనియాడి రప్పుడు నలినవదన!' 427**

**ప్రతిపదార్థం:** నలినవదన!= పద్మంవంటి మోముగల ఓ భవానీ!; అట్లు= ఆ విధంగా; కంఠంబునందున్= గొంతుకలో; మహావిషంబు= ఘోరమైన విషం; తాల్చి= ధరించి; నీలత= నలుపు; కల్గినదానన్+చేసి= కలిగిన కారణంగా; కమలజ+ఆది సురులు= బ్రహ్మ మొదలైన దేవతలు; నీలకంఠుఁడు= నీలకంఠుడు; అంచున్= అంటూ; అప్పుడు= ఆ సమయంలో; నన్నున్= నన్ను; కొనియాడిరి= ప్రశంసించారు.

**తాత్పర్యం:** పార్వతీ! ఆ విధంగా గొంతుకలో భయంకరమైన విషం ధరించిన కారణంగా నలుపు ఏర్పడింది. బ్రహ్మమొదలైన దేవతలు నీలకంఠుడని నన్ను కొనియాడారు.'

**విశేషం:** నల్లని మచ్చ నిజానికి ప్రశంసకు పట్టుకాదు. కానీ లోకరక్షణకు గుర్తుగా నిలిచిన కారణంగా ప్రశంస కలిగింది.

**వ. అని చెప్పి శంకరుం 'డింక నేమి యడుగవల?' తడుగు మనుటయుఁ 'బినాకం బెల్ల యాయుధంబులకంటె మెచ్చి పట్టుదు దీనికిం గతంబెయ్యది?' యని యడిగిన నా మృడుం డామృడాని కిట్లనియె. 428**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; శంకరుండు= శివుడు; ఇంకన్= ఇంకా; ఏమి= ఏది; అడుగన్+వలతు= అడుగగోరుతున్నావో; (దానిని); అడుగుము; అనుటయున్= అనినంతనే; పినాకంబు= పినాకం అనే ధనుస్సును; ఎల్ల+ఆయుధంబులకంటెన్= ఆయుధాల న్నింటికంటె; మెచ్చి; పట్టుదు= తాల్చుతూ ఉంటావు; దీనికిన్= దీనికి; కతంబు= కారణం; ఏ+అది= ఏది; అని; అడిగినన్= అడిగితే; ఆ మృడుండు= ఆ శివుడు; ఆ మృడానికిన్= ఆ పార్వతికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి శంకరుడు 'ఇంకా ఏమి అడుగగోరావో అడుగుము' అంటే పార్వతి 'నీవు పినాకాన్ని అన్ని ఆయుధాలకంటె ఎక్కువ ఇష్టంతో పట్టుకొని ఉంటావు. దీనికి కారణం ఏమిటి? అని అడిగితే శివుడు భవానికి ఇట్లా అన్నాడు.

**సీ. ఆదియుగంబున నబల! కణ్వుం డను । సంయమి తపము నిష్ఠానిరూఢి**
**మెయిఁ జేయఁ బెరిఁ గె వల్మీకంబు దనువు ము । నుంగ నప్పుట్ట వేణువును బుట్టె**
**విను లోకసామాన్యఘనత గాకుండ మ । హాద్భుతాయామంబు నధికమైన**
**పరిణాహమును గల్గె బ్రహ్మ యమ్మునికిఁ బ్ర । త్యక్షమై వరమిచ్చె నతనిమీఁదఁ**

**ఆ. బెరిఁగియున్న వెదురు గరమర్థిఁ దాఁ బుచ్చి । కొని జగద్ధితంబు గోరి చేసె**
**నాకు విష్ణునకుఁ బినాకశార్ఙ్గము లగ్ర । ఖండమున నొనర్చె గాండివంబు. 429**

**ప్రతిపదార్థం:** అబల!= ఓ ఇంతీ!; ఆదియుగంబునన్= మొదటి యుగంలో; కణ్వుండు అను సంయమి= కణ్వుడనే గొప్ప నిగ్రహం కల ముని; నిష్ఠానిరూఢి మెయిన్= నిష్ఠ చెదరని స్థితితో; తపము= తనస్సు; చేయన్= చేయగా; తనువు= ఒడలు; మునుంగన్= మునుగునట్లుగా; వల్మీకంబు= పుట్ట; పెరిఁగెన్= పెరిగింది; ఆ+పుట్టన్= ఆ పుట్టనుండి; వేణువును= వెదురును; పుట్టెన్= పుట్టింది; విను= వినుము; లోకసామాన్యఘనత= లోకంలో సాధారణమైన గొప్పతనం; కాక+ఉండన్= కాకుండా; మహా+అద్భుత+ఆయామంబున్= చాలా ఆశ్చర్యకరమైన పొడవూ; అధికము= ఎక్కువది; ఐన పరిణాహమును= అయిన వెడల్పు; కల్గెన్= కలిగినవి; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఆ+మునికిన్= ఆ మునికి; ప్రత్యక్షము+ఐ= సాక్షాత్కరించి; వరము= కోరిన దానిని; ఇచ్చెన్= అనుగ్రహించాడు; అతనిమీఁదన్= అతడిపై; పెరిఁగి+ఉన్న వెదురు= పెరిగి ఉన్న వెదురు; కరము= మిక్కిలి; అర్థిన్= కోరికతో; తాన్= తాను; పుచ్చికొని= తీసికొని; జగత్+హితంబు= లోకాలకు మేలు; కోరి= కాంక్షించి; నాకున్= నాకు; విష్ణునకున్= విష్ణుడికి; పినాక శార్ఙ్గములు= పినాకం అనే వింటినీ, శార్ఙ్గం అనే వింటినీ; అగ్రఖండమునన్= పై ముక్కతో; గాండీవంబున్= గాండీవమనే ధనుస్సునూ; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** మొదటిదైన కృతయుగంలో కణ్వుడు అనే మహర్షి మహానిష్ఠతో తపస్సు చేశాడు. అతడి ఒడలు మునిగిపోయే విధంగా పెద్ద పుట్ట పెరిగింది. దానిమీద ఒక వెదురు కూడా పుట్టింది. ఏదో లోకసాధారణమైన గొప్పదనంతో కాకుండా మహాశ్చర్యం కలిగించే పొడవూ, మిక్కిలి వెడల్పూ దానికి కలిగాయి. బ్రహ్మ ఆ మహర్షికి ప్రత్యక్షమై వరమిచ్చాడు. ఆ వెదురు తాను తీసికొని, లోకాల మేలు కాంక్షించి నాకు పినాకాన్నీ, విష్ణువుకు శార్ఙ్గం అనే వింటినీ, చివరి తునుకతో గాండీవాన్నీ చేశాడు.

**వ. ఇవ్విధంబున విండ్లు మూఁడు గావించి లోకహితం బాచరించి యవ్విరించి యమ్మూఁడవ విల్లు దాఁ గైకొని తనలోకంబునకుం జనియె నిది పినాకంబు సంభావనీయంబైన తెఱం' గని చెప్పిన. 430**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; విండ్లు= ధనుస్సులు; మూఁడు= మూడింటిని; కావించి= నిర్మించి; లోకహితంబు= లోకపు మేలు; ఆచరించి= చేసి; ఆ+విరించి= ఆ బ్రహ్మ; ఆ+మూఁడవ విల్లు= ఆ మూడవదైన గాండివం అనే వింటిని; తాన్= తాను; కైకొని= గ్రహించి; తనలోకంబునకున్= తనదైన సత్యలోకానికి; చనియెన్= వెళ్ళాడు; ఇది; పినాకంబు=పినాకమనే ధనుస్సు; సంభావనీయంబు= మన్ననగొన్నది; ఐన తెఱంగు= అయిన తీరు; అని; చెప్పినన్= చెప్పగా.

**తాత్పర్యం:** ఈ విధంగా మూడు విండ్లు చేసి లోకాలకు మేలు కావించి, ఆ బ్రహ్మ ఆ మూడవ వింటిని తాను గ్రహించి, తన లోకానికి వెళ్ళాడు. పినాకాన్ని ఎక్కువగా మన్నించటానికి గల కారణం ఇది అని చెప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విని గిరితనూజ 'పెఱ వా। హనముల నొల్లక వృషంబు నఖిలేశ్వర! నె**
**మ్మనమునఁ గైకొని యెక్కుదు। వినఁగా నే వలతుఁ జెప్పవే కారణమున్?' 431**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; గిరితనూజ= కొండబిడ్డ పార్వతి; అఖిల+ఈశ్వర!= సర్వేశ్వరా!; పెఱ వాహనములన్= ఇతరములగు ఎక్కిరింతలను; ఒల్లక= ఇష్టపడక; వృషంబున్= ఎద్దును; నెఱ+మనమునన్= నిండు హృదయంతో; కైకొని= ఆదరించి; ఎక్కుదు(వు)= ఎక్కుతావు; కారణమున్= కారణాన్ని; వినఁగాన్= వినటానికి; ఏన్= నేను; వలతున్= కోరుతున్నాను; చెప్పవే= చెప్పుము.

**తాత్పర్యం:** అంటే విని పార్వతి 'సర్వేశ్వరా! ఇతరవాహనాలను ఇష్టపడక నిండు మనస్సుతో ఆదరించి ఎద్దును ఎక్కుతూ ఉంటావు. కారణం వినాలనే కోరికతో ఉన్నాను. దయతో చెప్పుము' అన్నది.

**వ. అనిన నద్దేవుఁ డమ్మహాదేవి కిట్లనియె. 432**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+దేవుఁడు=ఆ దేవుడు; ఆ+మహాదేవికిన్= ఆ మహాదేవి పార్వతికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా శివుడు పార్వతితో ఇట్లా అన్నాడు.

**సీ. హిమవన్నగంబునం దేను లోకహితార్థ। మైన మహాతప మాచరింప**
**గోవులు చుట్టుఁ దేఁకువ సెడి తిరిగి నన్। సంకట పెట్టినఁ బంకజాక్షి!**
**కోపించిచూడ సంతాపాకులత్వంబుఁ। బొందె గోకుల మరవిందభవుఁడు**
**నమరులుఁ జనుదెంచి ప్రార్థించి వృషముఁ గా। నిక యిచ్చి కరుణ జనింపఁ బలికి**

**తే. నాకు గోపతి యనియెడు నామ మిచ్చి। రపుడు గోబాధ మాన్చి రయ్యమలవృషము**
**వాహనముఁ గేతువునుగా శివప్రచార। మాచరింతు నెల్లెడ నది యాది గాఁగ.' 433**

**ప్రతిపదార్థం:** పంకజాక్షి!= తామరవంటి కనులుగల ఓ భవానీ!; హిమవత్+నగంబునందున్= మంచుకొండమీద; ఏను= నేను; లోకహిత+అర్థము= లోకముమేలు ప్రయోజనంగా గలది; ఐన మహా తపము= అయిన గొప్ప తపస్సు; ఆచరింపన్= చేస్తూ ఉండగా; గోవులు= ఆవులు; చుట్టున్= అన్నివైపుల; తేఁకువ+చెడి= భయంపోయి; తిరిగి= సంచరించి; నన్= నన్ను; సంకట పెట్టినన్= కష్టపెట్టితే; కోపించి= కోపం పొంది; చూడన్= చూడగా; గోకులము= ఆవులమంద; సంతాప+ఆకులత్వంబున్= దుఃఖంచేత కలతపడిన తనాన్ని; పొందెన్= పొందినది; అరవిందభవుఁడును= బ్రహ్మయు; అమరులున్= దేవతలు; చనుదెంచి= వచ్చి; ప్రార్థించి= ప్రార్థనచేసి; వృషమున్= ఎద్దును; కానిక= కానుకగా; ఇచ్చి= ఒసగి; కరుణ= దయ; జనింపన్= కలుగునట్లుగా; పలికి= మాటాడి; నాకున్= నాకు; గోపతి; అనియెడు నామము= అనే పేరు; ఇచ్చిరి= ఇచ్చారు; అపుడు= ఆ సమయంలో;

గోబాధ= ఆవుల బాధను; మాన్చిరి= పోగొట్టారు; ఆ+అమలవృషము= దోషంలేని ఆ ఎద్దు; వాహనమున్= వాహనం; కేతువును= ధ్వజమునూ; కాన్= కాగా; అది= ఆ సమయం; ఆది కాఁగన్= మొదలుగా; ఎల్ల+ఎడన్= అన్ని తావులందు; శివ ప్రచారము= మంగళమైన సంచారం; ఆచరింతున్= చేస్తూ ఉంటాను.

**తాత్పర్యం:** నేను లోకాల మేలుకొరకు మంచుకొండమీద గొప్ప తపస్సు చేస్తూ ఉండగా చుట్టూ ఆవులు చేరి, భయం తీరి తిరుగుతూ నన్ను కష్టపెట్టాయి. అప్పుడు నేను కోపించి చూడగా అవి బాధపడ్డాయి. బ్రహ్మ, దేవతలు వచ్చి నన్ను ప్రార్థించి, దయపుట్టే మాటలు పలికి, నాకొక ఎద్దును కానుకగా ఇచ్చి, 'గోపతి' అనే పేరు పెట్టి గోవుల బాధ తీర్చారు. అది మొదలు నేనా ఎద్దును వాహనంగా, ధ్వజంగా చేసికొని శుభమైన సంచారం అన్ని తావులలో చేస్తూ ఉన్నాను.'

**విశేషం:** శివుడికి ఏ కోరికాలేదు. మరి తపస్సు ఎందుకంటే లోకం మేలుకొరకే.

**వ. అనుటయు నంబిక యప్పరమేశుతో 'నీవు పరమ శుచులును రమణీయంబులు నగు నివాసంబుల వసియింపక యశుచియుఁ గేశాస్థికపాల దుర్గంధదుర్దర్శంబునైన శ్మశానంబున నునికికిఁ గతంబేమి?' యనిన నతం డిట్లనియె. 434**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; అంబిక= పార్వతి; ఆ+పరమ+ఈశుతోన్= ఆ మహేశ్వరుడితో; నీవు; పరమ శుచులును= మిక్కిలి పరిశుభ్రంగా ఉండేవీ; రమణీయంబులును= అందంగా ఉండేవీ; అగు నివాసంబులన్= అయిన నెలవులందు; వసియింపక= ఉండక; అశుచియున్= శుభ్రతలేనిదీ; కేశ= వెంట్రుకలు; అస్థి= ఎముకలు; కపాల= పుర్రెలు; దుర్గంధ= పాడుకంపు అనే వాటితో; దుర్దర్శంబున్= చూడరానిదీ; ఐన శ్మశానంబునన్= అయిన వల్లకాటిలో; ఉనికికిన్= ఉండటానికి; కతంబు= కారణం; ఏమి; అనినన్= అనగా; అతండు= ఆ శివుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా పార్వతి పరమేశ్వరుడితో 'గొప్ప శుచి కలవీ, మనోహరమైనవీ అయిన నెలవులలో ఉండక శుభ్రతలేనిదీ, జుట్టు, ఎముకలు, పుర్రెలు, కంపు అనువాటితో చూడరాని వల్లకాటిలో నీవు ఉండటానికి కారణం ఏమిటి? అని అడిగింది. అప్పుడు శివు డిట్లా అన్నాడు.

### శివుఁడు పార్వతికిఁ దనశ్మశానవాసతకుఁ గారణంబు చెప్పుట (సం13-207-1(కుంభ))

**ఉ. 'క్రూరపు భూతముల్ జనుల ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్**
**మారణ మాచరింపఁగ సమస్తజనంబులు నాశ మొందఁగా**
**వారిజసంభవుం డెఱిఁగి వచ్చి ననుం దగఁ గాంచి తత్ప్రతీ**
**కారము సేఁతకై వినయగౌరవ మొప్పఁగ వేఁడె; వేఁడినన్. 435**

**ప్రతిపదార్థం:** క్రూరము+భూతముల్= క్రూరమైన ప్రాణులు; జనులన్= జనులను; ఘోరవిధంబులన్= భయంకరమగు తీరులతో; ముట్టి= తాకి; ఎప్పుడున్= ఎల్లవేళలా; మారణము= వధ; ఆచరింపఁగన్= చేయగా; సమస్తజనంబులు= అందరు జనులు; నాశము+ఒందఁగాన్= నాశం పొందగా; వారిజ సంభవుండు= పద్మమునపుట్టిన బ్రహ్మ; ఎఱిఁగి= తెలిసికొని; వచ్చి= ఏతెంచి; ననున్= నన్ను; తగన్= తగు విధంగా; కాంచి= చూచి; తద్+ప్రతీకారము+చేఁతకున్+ఐ= దానికి ప్రతిక్రియచేయటం కొరకు; వినయగౌరవము= వినయంతో కూడిన గౌరవము; ఒప్పఁగన్= ఒప్పుగా; వేఁడెన్= ప్రార్థించాడు; వేఁడినన్= ప్రార్థించగా.

**తాత్పర్యం:** క్రూరభూతాలు జనులను ఘోరంగా తాకి, వధ చేశాయి. సమస్తజనాలు నశిస్తున్నారు. బ్రహ్మ అది తెలిసికొని నా కడకు వచ్చి, నన్ను తగు విధంగా చూచి, దానికి మారుచేత చేయవలసిందిగా నన్ను వేడుకొన్నాడు. అట్లా ప్రార్థిస్తే. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** తగన్ - సముచితమర్యాదతో, అభివాదనం మొదలైన పనులుచేసి అని భావం.

**వ. నిశ్చితంబుగా నొక్కెడనుండి లోకంబులు రక్షింపవలయు నని తలంచితి నట్టియెడ. 436**

**ప్రతిపదార్థం:** నిశ్చితంబుగాన్= నిర్ణయింపబడినదిగా; ఒక్క+ఎడన్= ఒక్కచోట; ఉండి= నిలిచి; లోకంబులు= లోకాలను; రక్షింపవలయున్= కాపాడాలి; అని; తలంచితిన్= తలపోశాను; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** నిర్ణయించుకొనిన ఒక ప్రదేశంలో ఉండి లోకాలను కాపాడాలని భావించాను. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస । సేయుదురు విజనత్వవిశేష మెఱిఁగి**
**కాన యింపై శ్మశానంబు మానసమున । నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె. 437**

**ప్రతిపదార్థం:** మోక్షపరులు= మోక్షమునందు ఆసక్తికలవారు; శుచిస్థానముగన్= పవిత్రమైన స్థానంగా; విజనత్వ విశేషము= జనాలు లేని ప్రత్యేకస్థితిని; ఎఱిఁగి= తెలిసికొని; ప్రశంస+చేయుదురు= గొప్పగా చెప్పుతారు; కాన= కనుకనే; ఇంపు+ఐ= ఇష్టమైనదై; శ్మశానంబు= వల్లకాడు; మానసమునన్= మనస్సులో; ఒలసెన్= మెదలినది; కావునన్= కనుక; ఆ+ఎడన్= ఆ తావున; ఉనికి= ఉండటం; కలిగెన్= కలిగింది.

**తాత్పర్యం:** మోక్ష మందు ఆసక్తికలవారు జనాలులేని కారణంగా పవిత్రస్థానం అని శ్మశానాన్ని పొగడుతారు. కనుక నాకు వల్లకాటిమీద మనస్సు కలిగింది. అక్కడ ఉండటం అందువలన కలిగింది.

**విశేషం:** కేశాదులు శుచిత్వానికి భంగాలు కావు. జనసంచారంవలననే దుష్టభావాలు వ్యాపించి, శుచిత్వం నశిస్తుంది. వస్తుశౌచం కాదు. భావశౌచం ముఖ్యం అని ఈ పద్యం ప్రతిపాదిస్తున్నది.

**చ. అచటన యుండి లోకముల నన్నిటి నాత్మఁ దలంచి రక్ష సే**
**యుచు విహరింతు, భూతచయ మొక్కటఁ గూడి చరించుచున్కికిం**
**బ్రచురకుతూహలుండ నయి రాగముఁ బొందుదు నట్లుగాన నా**
**కచటు నివాసమయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే?' 438**

**ప్రతిపదార్థం:** అచటన్+అ= అక్కడనే; ఉండి= నెలకొని; లోకములన్= లోకాలను; అన్నిటిన్= అన్నింటినీ; ఆత్మన్= ఆత్మలో; తలంచి= భావించి; రక్ష= రక్షణ; చేయుచున్= చేస్తూ; విహరింతున్= తిరుగుతూ ఉంటాను; భూతచయము= ప్రాణుల సముదాయం; ఒక్కటన్= ఒక్కచోట; కూడి= కలిసి; చరించుచున్+ఉన్కికిన్= తిరుగుతూ ఉండటానికి; ప్రచుర కుతూహలుండను= మిక్కిలి వేడుక కలవాడను; అయి; రాగమున్= ప్రీతిని; పొందుదున్= పొందుతూ ఉంటాను; అట్లు+కానన్= అట్లు కనుక; నాకున్= నాకు; అచటు= ఆ తావు; నివాసము=ఉండే నెలవు; అయ్యెన్= అయినది; వినుము; అన్యతలంబులు= వేరుచోట్లు; దానిన్= ఆ శ్మశానాన్ని; పోలునే= పోలునా?

**తాత్పర్యం:** అక్కడనే ఉండి లోకాలను మనస్సులో భావించి, రక్షణ చేస్తూ ఉంటాను. సర్వభూతాలు ఒక్కచోట ఉండి కలిసి తిరుగుతూ ఉంటాయి కనుక మిక్కిలి వేడుకతో ప్రీతి పొందుతూ ఉంటాను. కనుక నా కది నివాసమైనది. పెరతావులు దానిని పోలవు గదా!'

**విశేషం:** సర్వప్రాణులూ మరణం తరువాత ఉచ్చనీచ భేదాలు లేకుండా తిరగేతావు కనుక శ్మశానం శివుడికి ప్రీతిపాత్రమైనదని భావం.

**తే. అనిన భసితాంగరాగంబు నస్థి ఫణధ । రాభరణములుఁ బరశుశూలాయుధములు**
**నై మహోగ్రతభీకరమైన రూప । మభవ! యేల కైకొంటి వీ?' వనియె గిరిజ. 439**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శివుడు చెప్పగా; గిరిజ= పార్వతి; అభవ!= శివా!; భసిత+అంగరాగంబు= బూడిద అనే మైపూతా; అస్థి ఫణధర+ఆభరణములు= ఎముకలు, పాములు అనే ఆభరణాలూ; పరశు శూల+ఆయుధములు= గండ్రగొడ్డలి, శూలము అనే ఆయుధాలున్నూ; ఐ= అయి; మహా+ఉగ్రతన్= మిక్కిలి తీవ్రతగల; భీకరము= వెరపు పుట్టించేది; ఐన రూపము= అయిన రూపాన్ని; ఈవు= నీవు; ఏల?= ఎందుకు?; కైకొంటివి= గ్రహించావు?; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** అని శివుడు పలుకగా పార్వతి 'బూదిపూత, ఎముకల, పాముల ఆభరణాలు, గొడ్డలి, శూలం అనే ఆయుధాలు అనేవాటితో మిక్కిలి తీవ్రతగల భయంకరమైనరూపం ఎందుకు ధరించావు? అని అడిగింది.

**విశేషం:** అభవుఁడు - పుట్టుకలేనివాడు అంటే తక్కిన వికారాలు కూడా లేనివాడని భావం.

**వ. అనుటయు నమ్మహేశ్వరుం డాపరమేశ్వరితోడ. 440**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; ఆ+మహా+ఈశ్వరుండు= ఈ పరమేశ్వరుడు; ఆ పరమ+ఈశ్వరితోడన్= లోకాలన్నీ ఏలే ఆ పార్వతితో.

**తాత్పర్యం:** అప్పుడు శివుడు పార్వతితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఈ ఘట్టంలో పార్వతికి 'పరమేశ్వరి' వంటి పేర్లు వాడటంలో ఒక రహస్యం ఉన్నది. ఆమె ప్రశ్నలన్నీ స్వజ్ఞానం కొరకు కాదు. లోకాలకు తెలిపే మార్గం మాత్రమే ఇది. ఇది గుర్తించవలసిన విషయం.

**సీ. 'లోకస్వరూపంబు లోలాక్షి! రెండు వి । ధమ్ములు శీత ముష్ణమ్ము నాఁగఁ**
**జనునివి రెంటను సకలంబు గ్రథితమై । యుండు సౌమ్యాగ్నేయయోగకలిత**
**మఖిలజగంబు సౌమ్యము విష్ణుఁ డాగ్నేయ । మేను వహింతు మయ్యిరుదెఱంగు**
**లెనయుటఁ గొని భరియింతు నీ విశ్వంబుఁ । గావున నాగ్నేయ భావరూఢ**

**తే. యైన యాకృతి లోకహితార్థముగ వ । హించినాఁడ నింకెయ్యది యీవు నన్ను**
**నడిగె దడుగుము' నావుడు నార్య 'సోముఁ । దలఁ బ్రియంబున నేటికిఁ దాల్చి? తనియె. 441**

**ప్రతిపదార్థం:** లోల+అక్షి!= విలాసపు చూపులు కల ఓ కాంతా!; లోక స్వరూపంబు= లోకం తీరు; రెండు విధమ్ములు= రెండు రకాలు; శీతము= చల్లనిది; ఉష్ణము= వేడిది; నాఁగన్= అనగా; చను+ఇవి= సాగే ఇవి; రెంటన్= రెంటియందు; సకలంబు= అంతా; గ్రథితము= కూర్చబడినది; ఐ= అయి; ఉండున్= ఉంటుంది; అఖిలజగంబు= సమస్త లోకమూ; సౌమ్య+ఆగ్నేయ యోగ కలితము= చంద్రుడి భావం; అగ్నిభావం అనే వాటి కలయికతో కూడినది; సౌమ్యము= సోమలక్షణం గలదానిని; విష్ణుఁడు= విష్ణువు; ఆగ్నేయము= అగ్ని సంబంధం అయిన దానిని; ఏను= నేను; వహింతుము= పట్టుకొని ఉంటాము; ఆ+ఇరు తెఱంగులు= ఆ రెండు తీరులు; ఎనయుటన్= కలిసి ఉండటాన్ని; కొని= గ్రహించి; ఈ విశ్వంబున్= ఈ సమస్త లోకాల సముదాయాన్ని; భరియింతున్= భరిస్తూ ఉంటాను; కావునన్= కనుక; ఆగ్నేయ భావ రూఢ= అగ్ని సంబంధంగల భావంతో గట్టిగా నిలిచి ఉన్నది; ఐన+ఆకృతి= అయిన ఆకారాన్ని; లోకహిత+అర్థముగన్= లోకం మేలు ప్రయోజనంగా; వహించినాఁడన్=భరించాను; ఈవు=నీవు; ఇంకన్= ఇంకా; ఏ+అది= ఏది; నన్నున్= నన్ను; అడిగెదు= అడుగుతావో; అడుగుము; నావుడున్= అని పలుకగా; ఆర్య= పార్వతి; సోమున్= చంద్రుడిని; తలన్= తలమీద; ప్రియంబునన్= ఇష్టంతో; ఏటికిన్= ఎందుకు; తాల్చితి?= పెట్టుకొన్నావు?; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** 'వనితా! లోకస్వరూపం రెండు రకాలు. చల్లదనం, వెచ్చదనం అనే ఈ రెండు విధాలతో సకలమూ కూర్చబడి ఉంటుంది. ఈ జగత్తంతా సౌమ్యము, ఆగ్నేయము అనే రెంటి కలయికతో కూడి ఉన్నది. సౌమ్యమైన దానిని విష్ణువూ, ఆగ్నేయమైన దానిని నేను భరిస్తూ ఉంటాము. ఆ రెంటినీ కలిపి ఈ విశ్వాన్ని నేను వహిస్తూ ఉంటాను. కనుక అగ్నిసంబంధమైనభావంలో పాతుకొనిపోయిన ఆకారం లోకంమేలుకొరకు తాల్చాను. ఇంకా ఏమి అడగాలో అడుగుము.' అంటే పార్వతి 'నీవు చంద్రుడిని ప్రేమతో తలపై ధరించటానికి కారణం ఏమిటి? అని అడిగింది.

**విశేషం:** సౌమ్యం - సోముడితనం, చల్లదనం, ఆహ్లాదకత మొదలైనవి. ఆగ్నేయం - అగ్ని సంబంధమైనది. వెచ్చదనం, భీకరత్వం మొదలైనది. ఇక్కడ ఇద్దరిని చెప్పినా నిజానికి తత్త్వం ఒక్కటే. సౌమ్యం ఉన్నచోటు విష్ణువనీ, ఆగ్నేయం ఉన్నచోటు శివుడనీ వ్యవహార భేదమే కానీ వస్తుభేదం లేదని గుర్తించాలి. దానికి "అయ్యిరు తెఱంగు లెనయుటఁ గొని భరియింతు నీ విశ్వంబు" అనే వాక్యం ప్రమాణం.

**చ. అనవుడు దక్షుయజ్ఞమున కల్గిననాఁడు సురాలి కేను బీ**
**డన మొనరించుచోట వికటంబుగ సోముని మేను ద్రొక్కఁగా**
**నను శరణంబు వేఁడిన మనంబున నక్కటికంబు పుట్టి చే**
**సిన దురితంబు సోమునిట సేయకపోదని మౌళిఁ దాల్చితిన్.' 442**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; దక్షుయజ్ఞమునకున్= దక్షుడు చేసిన యజ్ఞానికి; అల్గిననాఁడు= కోపగించినప్పుడు; సుర+ఆలికిన్= దేవతల గుంపునకు; ఏను= నేను; పీడనము= బాధ; ఒనరించుచోటన్= చేసే తావున; సోమునిమేను= చంద్రుడి దేహాన్ని; వికటంబుగన్= అడ్డదిడ్డంగా; త్రొక్కగాన్= త్రొక్కివేయగా; ననున్= నన్ను; శరణంబు= రక్షణ; వేఁడినన్= ప్రార్థించగా; మనంబునన్= హృదయంలో; అక్కటికంబు= జాలి; పుట్టి= కలిగి; చేసిన దురితంబు= చేసిన కీడు; సోమున్= చంద్రుడిని; ఇటు= ఈ విధంగా; చేయక= చేయకుండా; పోదు= నశించదు; అని; మౌళిన్= తలమీద; తాల్చితిన్=ధరించాను.

**తాత్పర్యం:** పార్వతి అట్లా అడుగగా శివుడు చెప్తున్నాడు. 'దక్షయజ్ఞంలో నేను కోపగించినపుడు దేవతల నందరినీ హింసించాను. ఆ సందర్భంలో చంద్రుడి దేహాన్ని అడ్డదిడ్డంగా త్రొక్కివేశాను. అతడు నన్ను శరణు

కోరాడు. మనస్సులో జాలి కలిగి చంద్రుడికి చేసిన కీడు ఇట్లా చేస్తే కానీ పోదని భావించి తలపై ధరించాను.'

**చ. అన విని కొల్చి యున్న మునులందఱు నీశుదయావిశేషము**
**న్మనముల మెచ్చి పొంగి యభినందనపూర్వము గాఁగ భక్తియున్**
**వినయము నుల్లసిల్లఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించి ర**
**య్యనుపమధాము గౌరి సమయం బిది నా కని మోడ్పుఁ గేలితోన్. 443**

**ప్రతిపదార్థం:** అనన్= అని చెప్పగా; విని= ఆలకించి; కొల్చి ఉన్న మునులు= సేవించి ఉన్న మునులు; అందఱున్= అందరూ; ఈశు దయా విశేషమున్= ఈశ్వరుడి దయయందలి మహిమను; మనములన్= హృదయాలలో, మెచ్చి= గొప్పగా భావించి; పొంగి= ఆనందపు ఉబ్బు పొంది; అభినందనపూర్వము గాఁగన్= మంచిమాటలు ముందు ఉండునట్లుగా; భక్తియున్= భక్తీ; వినయమున్= అణకువా; ఉల్లసిల్లన్= ప్రకాశిస్తూ ఉండగా; పదివేల విధంబులన్= పదివేల తీరులతో; ప్రస్తుతించిరి= కొనియాడారు; గౌరి= పార్వతి; ఆ+అనుపమధామున్= సాటిలేని నెలవుగల ఆ శివుడిని; ఇది; నాకున్= నాకు; సమయము= తగువేళ; అని; మోడ్పు+ కేలితోన్= మోడ్చిన చేతితో.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పగా విని మునులందరూ ఈశ్వరుడి దయను, దొడ్డతనాన్ని హృదయాలలో మెచ్చుకొని పొంగి మంచిమాటలతో, భక్తివినయాలతో, పదివేల పద్ధతులతో ప్రశంస చేశారు. గౌరి శివుడితో 'ఇది నాకు సమయం' అని చేతులు జోడించి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇది ఘట్టానికి ఉపసంహారవాక్యం. శివుడి పనులన్నీ పరమదయకు ప్రతీకాలే. అందులో అపకారం చేసిన చంద్రుడిని రక్షణ కోరినంతమాత్రాన నెత్తిన పెట్టుకొనటం దయకు పరాకాష్ఠ. దీనినే మునులు సంభావించారు.

**తే. లోలలోచన దీప్తులు బాలచంద్ర। భూషణుని వదనంబునఁ బొలయ మునుల**
**మానసంబులు సంప్రీతి నూన సాంత్వ। నస్వరంబుగ నిట్లను నలిననాభ! 444**

**ప్రతిపదార్థం:** నలిననాభ!= పద్మము బొడ్డునందుగల దేవా!; లోలలోచన దీప్తులు= విలాసంగా కదలాడే కన్నుల కాంతులు; బాలచంద్ర భూషణుని వదనంబునన్= శివుడి ముఖాన; పొలయన్= వ్యాపించగా; మునుల మానసంబులు= మునుల హృదయాలు; సంప్రీతిన్= నిండైన తృప్తిని; ఊనన్= తాల్చగా; సాంత్వన స్వరంబునన్= మెత్తని కంఠనాదంతో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నది.

**తాత్పర్యం:** కృష్ణా! విలాసంగా కదిలే కన్నుల కాంతులు శివుడి ముఖంమీద తిరుగుతుండగా; మునుల హృదయాలు నిండు తృప్తిని తాల్పగా మెత్తని స్వరంతో ఇట్లా అన్నది.

**విశేషం:** ఇక్కడ కవి పూర్వ సంభావితార్థాన్ని కొంత స్పష్టం చేస్తున్నారు. "మునుల మానసంబులు సంప్రీతిమానన్" అంటే ఉమ ప్రశ్నలు వారి సంతృప్తి కొరకే అని భావం.

**క. 'వర్ణాశ్రమ ధర్మము లభి। వర్ణింపుము వేదనిరతవత్సల! యవి నా**
**కర్ణములతో నఖిలజన। కర్ణంబులఁ బొంది పుణ్యకర్తృత యొసఁగున్.' 445**

**ప్రతిపదార్థం:** వేదనిరతవత్సల!= వేదములయందు చెడని పుత్రప్రేమగల ఓ శంకరా!; వర్ణ+ఆశ్రమ ధర్మములు= వర్ణములు, ఆశ్రమములు అనేవాటి ధర్మాలు; అభివర్ణింపుము= చక్కగా తెలుపుము; అవి; నా కర్ణములతోన్= నా చెవులతో పాటు; అఖిల జనకర్ణంబులన్= జనులందరి చెవులను; పొంది= చేరి; పుణ్యకర్తృత= పుణ్యానికి కర్తలయ్యే స్థితిని; ఒసఁగున్= ఇస్తాయి.

**తాత్పర్యం:** శివా! వర్ణముల, ఆశ్రమముల ధర్మాలను చక్కగా తెలియజెప్పుము. అవి నా చెవులతోపాటు మానవులందరి చెవులలో ప్రవేశించి వారికి పుణ్యం చేసిన తనాన్ని ఇస్తాయి.'

**విశేషం:** వర్ణములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులు; ఆశ్రమాలు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములు.

**వ. అనియెననియిట్లు గౌరి లోక హితార్థంబుగా వర్ణాశ్రమధర్మంబులు పరమేశ్వరు నడుగుటయు నారదముని కృష్ణునకుం జెప్పిన తెఱంగు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట యుపన్యసించిన నాకర్ణించి. 446**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని పలికినది; అని; ఇట్లు= ఈ విధంగా; గౌరి= పార్వతి; లోకహిత+అర్థంబుగాన్= లోకం మేలుకొరకని; వర్ణ+ఆశ్రమ ధర్మంబులు= వర్ణాలు, ఆశ్రమాలు అనేవాటి ధర్మాలను; పరమేశ్వరున్=శివుడిని; అడుగుటయున్= అడగటాన్ని; నారదముని= నారదమహర్షి; కృష్ణునకున్=కృష్ణుడికి; చెప్పిన తెఱంగు= చెప్పినతీరు; భీష్ముండు= భీష్ముడు; ధర్మజునకున్= ధర్మరాజునకు; చెప్పుట= చెప్పటం; ఉపన్యసించినన్= తెలుపగా; ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** అని పలికింది. అని ఈ విధంగా పార్వతి లోకం మేలుకొరకు వర్ణాశ్రమ ధర్మాలను పరమేశ్వరుడిని అడగటాన్ని నారదమహర్షి కృష్ణుడికి చెప్పినతీరు భీష్ముడు ధర్మరాజునకు వివరించటాన్ని చక్కగా తెలిపితే విని. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇక్కడ తెలిపినవాడు వైశంపాయనుడు. విన్నవాడు జనమేజయుడు. ఇక్కడ వక్తృశ్రోతల జంటలు నాలుగు ఉన్నాయి.

వైశంపాయనుడు - జనమేజయుడు;
భీష్ముడు - ధర్మరాజు;
నారదుడు - కృష్ణుడు;
శివుడు - పార్వతి.

పార్వతికి చెప్పినాడని నారదుడు కృష్ణుడికి తెలిపిన విషయాన్ని భీష్ముడు ధర్మరాజునకు వివరించాడని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు. నిజానికి మరొక జంట కూడా ఉన్నది. సూతుడు - శౌనకాది మునులు. ఇది సమన్వయం.

**క. మునివర! నాదగు చిత్తం । బునఁ గౌతూహలము చాల మొలతెంచి తలి**
**ర్పున నెలరారెడు నేర్పడ । వినిపింపుము మీది కథ సవిస్తారముగన్. 447**

**ప్రతిపదార్థం:** మునివర!= ఓ వైశంపాయనా!; నాది+అగు= నాయొక్క; చిత్తంబునన్= హృదయంలో; కౌతూహలము= వేడుక; చాలన్= ఎక్కువగా; మొలతెంచి= పుట్టి; తలిర్పునన్= చిగురు తొడగటంతో; ఎలరారెడున్= వికాసం పొందుతున్నది. మీఁది కథ= తరువాతి వృత్తాంతం; సవిస్తారముగన్= పెంపొందించిన రూపం కలుగునట్లుగా; ఏర్పడన్= తెలిసేవిధంగా; వినిపింపుము= వినిపించుము.

**తాత్పర్యం:** మునివరా! నా హృదయంలో వేడుక మొలకెత్తి చిగురుతొడిగి పెంపుతో ఉన్నది. తరువాతి కథ విస్తారంగా తెలిసేవిధంగా వినిపించుము.

**వ. అని యడుగుటయు. 448**

**తాత్పర్యం:** అని అడుగగా.

**ఆశ్వాసాంతము**

**మ. స్ఫుటతత్త్వోదయ సంభృతైకమధురా! భూతైకరక్షాధురా!**
**తటినీ పింఛమనోజ్ఞమౌళిలలితా! దాంతాత్మసంకీలతా!**
**త్రుటితాపత్వ సమున్నతాశ్రితజనా! దూరాంజనా! సువ్రతో**
**త్కటశీలావనలోల! దివ్యహృదయా! ధర్మప్రసన్నోదయా! 449**

**ప్రతిపదార్థం:** స్ఫుట= స్పష్టంగా తెలిసిన; తత్త్వ= జ్ఞానం యొక్క; ఉదయ= పుట్టుకచేత; సంభృత= చక్కగా పొందబడిన; ఏక= ఒకటే అయిన; మధురా!= ఆనందపు తీపి కలవాడా!; భూత+ఏక రక్షాధురా!= ప్రాణులను కేవలభావంతో రక్షించే బరువు కలవాడా!; తటినీ= నది; పింఛ= నెమలిపురి అనే వాటితో; మనోజ్ఞ= సుందరమైన; మౌళి= శిరస్సుతో; లలితా!= సుకుమారమైనవాడా!; దాంత+ఆత్మ సంకీలతా!; ఇంద్రియ నిగ్రహంగల హృదయంగలవారిచేత కూర్చబడేవాడా!; త్రుటిత+ఆపత్వ సమున్నత+ ఆశ్రితజనా!= తొలగించబడిన, విపత్తులు గల్గి యుండటంచేత, గొప్పవారైన, ఆశ్రయించినజనులు గలవాడా! దూర+అంజనా!= దూరమైన అంటు (లంపటం) కలవాడా!; సువ్రత+ఉత్కటశీల+అవనలోల!= మంచి ఆచారాలతో కూడిన గొప్ప స్వభావంగలవారిని రక్షించటంలో ఆసక్తిగల దివ్యమైన హృదయం కలవాడా!; ధర్మప్రసన్న+ఉదయా!= ధర్మంచేత ప్రసన్నమయ్యే హృదయం కలవాడా!

**తాత్పర్యం:** స్వామీ! హరిహరనాథా! నీవు స్పష్టంగా తెలిసిన జ్ఞానంచేత బాగా నిండిన ఆనందం కలవాడవు, ప్రాణులను రక్షించే కేవలభావం కలవాడవు. గంగానది, నెమలిపింఛం అనేవాటితో సుందరమైన శిరస్సుతో సుకుమారమైనవాడవు. యోగులు అనుసంధించుకొనే దైవానివి. ఆపదలు తొలగి ఉదాత్తులయిన ఆశ్రితజనాలు కలవాడవు. సంసారాదుల లంపటాలు ఏమీ లేనివాడవు. చక్కని ఆచారనిష్ఠగల స్వభావం కలవారిని రక్షించటానికై వెంపరలాడే దివ్యహృదయం కలవాడవు. మనుష్యుల ధర్మాచరణంచేత ప్రసన్నమయ్యే హృదయం కలవాడవు.

**విశేషం:** 'తటినీ పింఛ' అనే చోటమాత్రమే హరుడు, హరి కానవస్తారు. తక్కిన సంబోధనలన్నీ ఉభయ సాధారణాలు.

భగవదానందం చక్కగా తెలిసినవారికి మాత్రమే కలుగుతుందని మొదటి సంబోధన తాత్పర్యం.

దాంతాత్ములంటే యోగులు. వారు ఎడతెగకుండా ధ్యానంలో పరమాత్మను అనుసంధించుకొంటూ ఉంటారు.

జన్మము, జర మొదలైన భయంకరమైన ఆపదలు తునుకలుగా చీలిపోయినపుడు వారు 'సమున్నతులు' - మిక్కిలి ఎత్తైనవారు. అంటే పరమాత్మస్వరూపులే అవుతారు. ఆ విధంగా ఆశ్రితులను చేసేవాడు స్వామి అని 'త్రుటిత' - ఇత్యాది సంబోధన తాత్పర్యం.

మానవుడు ధర్మం ఆచరిస్తే పరమాత్మ హృదయం ప్రసన్నమవుతుంది. కనుక ధర్మాచరణమే మానవకర్తవ్యం అనే బోధ చివరి సంబోధనలో తెలియవస్తుంది.

**క. దేహాభిమాన సంభృత । మోహతమోనిరసనాభిముఖ! భూరివివే**

**కాహీన మహాసత్త్వ స । మాహిత చిన్మాత్రరూప! మధురిమ సుభగా! 450**

**ప్రతిపదార్థం:** దేహ=శరీరమునందు; అభిమాన= నేను అనే అభిమానంతో; సంభృత= నిండిన; మోహ= అజ్ఞానం అనే; తమః = చీకటిని; నిరసన= పారద్రోలుటయందు; అభిముఖ!= అనుకూలత కలవాడా!; భూరి= గొప్ప; వివేక= జ్ఞానంతో కూడిన; అహీన= తక్కువతనంలేని; మహాసత్త్వ= గొప్ప సత్త్వగుణం కలవారియందు; సమాహిత= చక్కగా ఉంచబడిన; చిత్+మాత్ర రూప!= జ్ఞానం మాత్రమే అయిన రూపంగలవాడా!; మధురిమ సుభగా!= ఆనందమనే మాధుర్యంతో సుందరమైనవాడా!

**తాత్పర్యం:** స్వామీ! 'దేహమే నేను' అనే భావమే అజ్ఞానం. దానితో నిండి మోహమనే చీకటిని త్రోసివేయటంలో నీవు అనుకూలుడవు. గొప్ప జ్ఞానం కలిగిన మహానుభావులలో నెలకొని ఉన్న జ్ఞానాకారుడవు. ఆనందంతో సుందరుడవు.

**విశేషం:** 'దేహాభిమానం' అనగా 'నశించే దేహమే నేను' అనే భావన. దీనితో నిండిపోయి ఉంటుంది అజ్ఞానం. అది భయంకరమైన కారుచీకటివంటిది. అందులోపడి దిక్కుతోచనివారు భక్త్యాదులచేత సేవిస్తే, పరమాత్మ దానిని రూపుమాపటానికి సిద్ధంగా ఉంటాడు.

అజ్ఞానం నశించి తరువాత జ్ఞానాన్ని సాధించాలి. అది ఏదో కొంచెం పాటిదైతే లాభంలేదు. భూరివివేకం కావాలి. అది కలవారు "మహాసత్త్వులు'' అవుతారు. ఇందులో రెండర్థాలు భావించవచ్చును. గొప్ప సత్త్వగుణం కలవారు. గొప్ప గుండెబలం కలవారు అని ఆ రెండర్థాలు. గొప్ప సత్త్వమంటే శుద్ధతత్త్వం. గొప్ప హృదయబలం అంటే జగత్తును త్రోసివేయగల పరమాత్మను పట్టుకొనగల ధీమా! అది కలవారి హృదయంలో జ్ఞానైకస్వరూపంతో భగవంతుడు ఉంటాడు.

అజ్ఞానాన్ని రూపుమాపి, జ్ఞానాన్ని హృదయంలో పదిలపరచుకొంటే లభించే ఫలం పరమానందం. అది పరమాత్మ స్వరూపమే. దానితో అతడు సుందరుడు. ఇందులో ఈ విధంగా పరమాత్మ ధర్మాలు అయిన సత్, చిత్, ఆనందస్వరూపాలు మూడు రూపుదిద్దుకొన్నాయి.

**మాలిని :**

**త్వరిత విహిత గాఢధ్యాయి సంమోదవాదా!**

**స్ఫురదరి దృఢశూల స్ఫూర్తి సంశస్తహస్తా!**

**తరణి శశిమయత్వోదారతా చిత్రనేత్రా!**

**పరమ నియతనిష్ఠాభవ్యహృత్పద్మసద్మా! 451**

**ప్రతిపదార్థం:** త్వరిత= తొందరగా; విహిత= చేయబడిన; గాఢ= తీవ్రమైన; ధ్యాయి=ధ్యానంగలవారి; సంమోద=ఆనందంతో కూడిన; వాదా!=పలుకులు కలవాడా!; స్ఫురత్= తళతళలాడుచున్న; అరి=చక్రము; దృఢ= గట్టిదైన; శూల= శూలము అనే వాటి; స్ఫూర్తి= కదలికచేత; సంశస్త= మిక్కిలి కొనియాడదగిన; హస్తా!= చేతులు కలవాడా!; తరణి శశిమయత్వ= సూర్యచంద్ర

భావాల; ఉదారతా= గొప్పతనంతో; చిత్రనేత్రా!= విచిత్రములైన కనులు కలవాడా!; పరమ= మిక్కిలి శ్రేష్ఠమైన; నియత= పట్టుతప్పని; నిష్ఠా= నిష్ఠచేత; భవ్య= మిక్కిలి గొప్పదైన; హృత్+పద్మ సద్మా!= హృదయమనే పద్మం స్థానం అయినవాడా!

**తాత్పర్యం:** హరిహరదేవా! నీవు తొందరతో కూడి చేసిన తీవ్రధ్యానం కలవారి ఆనందవాక్కులే స్వరూపంగా కలవాడవు. తళతళలాడే చక్రమూ, గట్టిదైన త్రిశూలమూ అనే వాటి కదలికలతో ప్రశస్తమైన చేతులు కలవాడవు. సూర్యచంద్ర రూపాలయిన మహోదాత్త చిత్రనేత్రాలు కలవాడవు. మహానిష్ఠచేత భవ్యమైన హృదయపద్మం స్థానం అయినవాడవు.

**విశేషం:** పరమాత్మదర్శనం చేసినవారు సామగానాలు చేస్తూ పారవశ్యంతో ఉంటారని వేదం (తైత్తిరీయ ఉపనిషత్తు) వివరించింది. చక్రం విష్ణువుచేతిలో, శూలం శివుడిచేతిలో ఉండటం ప్రసిద్ధమే. ఏకత్వం కొరకు'చక్రమనే శూలం' వంటి అర్థాన్ని భావించవచ్చును. సూర్యుడు, చంద్రుడు కన్నులవటం ఉభయ సాధారణం. పట్టుతప్పని నిష్ఠగల భవ్యుల హృదయాలే పరమాత్మ గోచరించే తావులు. కనుక అటువంటి హృదయం సాధించండని కవి వ్యంగ్యోపదేశం.

**గద్యము :**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున నానుశాసనిక పర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది శ్రీమంతుడు, ఉభయకవిమిత్రుడు, కొమ్మనమంత్రి కుమారుడు, బుధులను సేవించటంచేత ప్రకాశించేవాడు అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలోని ఆనుశాసనికపర్వంలో నాలుగవ ఆశ్వాసం.

**ఆనుశాసనికపర్వంలో చతుర్థాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - పంచమాశ్వాసము

**శ్రీకాళీత్వాదరసు । శ్లోకాలోకన విలాస సుస్థిర భవనా!**
**శోకముదాద్యవధూతి । వ్యాకోశ వివేక భవన! హరిహరనాథా!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీకాళీత్వ = లక్ష్మీ పార్వతీ భావములందలి; ఆదర = మన్ననచే; సుశ్లోక = వాసిగాంచిన; ఆలోకనవిలాస = చూపుల యొక్క సొబగులకు; సుస్థిర భవనా! = శాశ్వత నివాసమైనవాడా!; శోక = దుఃఖం; ముత్+ఆది (ముదాది) సంతోషం మొదలైన జంటల యొక్క; అవధూతి = వినాశంతో, నిర్మూలనంతో; వ్యాకోశ = విప్పారిన; వివేక భవన! = విజ్ఞానమునకు నెలవైన వాడా!; హరిహరనాథా! = ఓ హరిహరనాథుడనే పరబ్రహ్మమా!

**తాత్పర్యం:** హరిహరనాథా! భక్తుల మీద ప్రసరించే నీ కటాక్ష వీక్షణాలు సకలైశ్వర్యాలకూ, సమస్త సన్మంగళాలకూ నిశ్చలాలైన నిలయాలు. సుఖ దుఃఖాదులైన ద్వంద్వాల యొక్క నిర్మూలనం వలన నీవు వికసించిన విజ్ఞానానికి నెలవై ఉన్నావు స్వామీ!

**విశేషం:** కవిబ్రహ్మ తిక్కన సోమయాజి హరిహరనాథాంకితంగా తాను రచించిన భారత సంహితలోని ప్రతి పర్వ ఆశ్వాసాద్యంత పద్యాలలో భేదం లేని భక్తితో శివకేశవులను స్తుతించాడు. మాకందం వంటి ఈ కందపద్యంలో శ్రీత్వ కాళీత్వములందు ఆదరమేదురములైన దృగ్విలాసాలు కలవాడుగా హరిహరనాథుడిని ఆ మహనీయుడు కీర్తించాడు.

శ్రీత్వ మనగా లక్ష్మీభావం. కాళీత్వ మనగా గౌరీ భావం. భావ మనగా ధర్మం. రమా గౌరీ భావము లేవనగా క్రమంగా సకలైశ్వర్య ప్రదాయకత్వం, సకల సన్మంగళ ప్రదత్వం. ఆ రెంటినీ హరిహరనాథుడు తన దృక్ప్రసారంతో భక్తులకు అనుగ్రహిస్తున్నాడని తాత్పర్యం.

అంతేకాదు. సుఖదుఃఖాది ద్వంద్వ నిరాకృతితో ఆ పరమేశ్వరుడు విస్తరిల్లిన విజ్ఞానమునకు ఉనికిపట్టైన వాడు గనుక ఆశ్రిత వర్గమునకు ముక్తిని ప్రసాదిస్తున్నాడని భావం. ఈ రీతిగా ఆయన భక్తులకు ఇహపరసౌఖ్యవిధాయకుడని చెప్పినట్లైనది.

**శివుఁడు పార్వతికి వర్ణాశ్రమాచారంబుల తెఱఁగెఱిఁగించుట. (సం.13-128-28(అను-1-15).**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.** **2**

**ప్రతిపదార్థం:** దేవా! = ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు = వేదవ్యాస మహర్షి శిష్యుడైన వైశంపాయనుడనే పేరుగల పౌరాణికుడు; జనమేజయునకున్ = పరీక్షిన్మహారాజపుత్రుడైన జనమేజయ మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వ్యాసభగవానుడి శిష్యుడైన వైశంపాయనుడనే పౌరాణికుడు పరీక్షిన్మహారాజు కుమారుడైన జనమేజయ మహారాజుతో ఈ విధంగా పలికాడు.

**తే. అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకు ( । జెప్పి యిట్లనుఁ 'గౌరవశ్రేష్ఠ! పద్మ**
**నాభుతో నవ్విధంబున నారదుండు । పార్వతీదేవి ప్రశ్న ముపన్యసించి. 3**

**ప్రతిపదార్థం:** అట్లు = ఆ ప్రకారంగా; గంగా+ఆత్మజుండు = గంగాదేవి తనయుడైన భీష్ముడు; ధర్మ+ఆత్మజునకున్ = యముడి కుమారుడైన యుధిష్ఠిరుడికి; చెప్పి = వచించి; ఇట్లు+అనున్ = ఈ విధంగా అన్నాడు; కౌరవ శ్రేష్ఠ! = కురువంశజులలో ఉత్తముడవైన ధర్మజా!; పద్మనాభుతోన్ = నళినము నాభియందుగల నారాయణుడితో- అనగా శ్రీకృష్ణుడితో; ఆ+విధంబునన్ = ఆ తీరున; నారదుండు = నారద మహర్షి; పార్వతీ దేవి ప్రశ్నము = గౌరీదేవి యొక్క ప్రశ్నను; ఉపన్యసించి = ఉగ్గడించి; (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** ఆ ప్రకారం గంగాపుత్రుడైన భీష్ముడు ధర్మనందనుడితో చెప్పి, ఇంకా ఇట్లన్నాడు. 'కురుకులోత్తమా! ధర్మజా! శ్రీకృష్ణుడితో నారదుడు ఆ విధంగా పార్వతీదేవి శివుడిని ఏమడిగిందో చెప్పి.

**వ. ఇట్లనియె నప్పర్వతరాజపుత్రి ప్రార్థించిన నప్పరమేశ్వరుండు పరమాదర భరితుండై. 4**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అనియెన్ = ఈ విధంగా అన్నాడు; ఆ+పర్వతరాజపుత్రి = ఆ నగాధిరాజైన హిమవంతుడి కూతురు గిరిజాదేవి; ప్రార్థించినన్ = వర్ణాశ్రమ ధర్మాలు చెప్పుమని మిక్కిలి వేడుకొనగా; ఆ+పరమ+ఈశ్వరుండు = ఆ దేవాధిదేవుడైన శంభుడు; పరమ+ఆదర+భరితుండు+ఐ = గొప్ప గౌరవబుద్ధితో నిండిన వాడై.

**తాత్పర్యం:** నారదమౌని శ్రీకృష్ణభగవానుడితో ఇట్లా అన్నాడు. 'ఆ విధంగా ఆ శైలరాజతనయ వర్ణాశ్రమధర్మాలు చెప్పుమని తనను మిక్కిలి వేడుకొనగా మహేశ్వరుడు పరమాదరంతో.

**సీ. అజుఁడు మున్ లోకహితార్థంబుగా బ్రాహ్మ । ణులను సృజించి రాజులను వైశ్యు**
**లను శూద్రులను గ్రమం బొనరంగఁ గల్పించె; । నాజాతులకు నోలి నతని ముఖము**
**బాహులు నూరులుఁ బదములు సంభవ । స్థానంబు లగుటయుఁ, దారతమ్య**
**భాగిను లగునని పార్వతి కాతండు । తత్తదాచరణీయ ధర్మములును**

**ఆ. వినుము విస్తరించె; విప్రులు లోకధా । రకులు; వారియెడఁ బరాభవంబు**
**సేఁత యెల్ల చేటుఁ జేయు; సమ్మాన దా । నములు సకల శోభనము నొనర్చు. 5**

**ప్రతిపదార్థం:** వినుము = దేవీ! నీవు నన్నడిగిన వర్ణాశ్రమాచార విధ మెట్లాంటిదో వివరిస్తాను ఆలకించుము; అజుఁడు = బ్రహ్మదేవుడు; మున్ = మునుపు; లోక హిత+అర్థంబుగాన్ = జగత్తుకు మేలు చేకూర్చటం కొరకు; బ్రాహ్మణులను = నాల్గు వర్ణాలలో మొదటివర్ణం వారైన విప్రులను; సృజించి = పుట్టించి; రాజులను = క్షత్రియులనే రెండవ వర్ణంవారిని; వైశ్యులను = కోమటులనే మూడవ వర్ణంవారినీ; శూద్రులను = శూద్రులనే చతుర్థజాతివారినీ; క్రమంబు+ఒనరంగన్ = వరుస తప్పకుండ; కల్పించెన్ = ఉద్భవింప జేశాడు; ఆ జాతులకున్ = ఆ బ్రాహ్మణాది వర్ణముల వారికి; ఓలిన్ = క్రమంగా; అతని ముఖము = ఆ పరమేష్ఠి వదనం; బాహులున్ = భుజములు; ఊరులున్ = తొడలు; పదములున్ = చరణాలు; సంభవస్థానంబులు+అగుటయున్ = జన్మ ప్రదేశాలు కావటం వలన; తారతమ్య భాగినులు+అగున్ = ఆ బ్రాహ్మణ ప్రముఖ జాతులు న్యూనాధిక్యములు, ఎక్కువ తక్కువ అనే తేడాలు కలవి అయినాయి; అని = అంటూ; పార్వతికిన్= శైలజకు;

ఆతండు= ఆ చంద్రశేఖరుడు; తత్+తత్= ఆయాజాతుల వారి యొక్క; ఆచరణీయ = ఆచరించదగిన; ధర్మములును = విధులు; విస్తరించెన్ = విపులంగా తెలిపాడు; విప్రులు= భూసురులు; లోక ధారకులు = లోకమును ధరించేవారు, సమాజానికి ఆధారభూతులు; వారి+ఎడన్ = అట్టి భూసురుల విషయమున; పరాభవంబు+చేత = సలిపే అవమానం; ఎల్ల చేటున్+చేయున్ = మిక్కిలి కీడు చేస్తుంది; సమ్మానదానములు = ఆ మహనీయులకు చేసే సత్కారాలు, ఇచ్చే దానాలు; సకల శోభనమున్+ఒనర్చున్ = అన్ని శుభాలను కలిగిస్తాయి.

**తాత్పర్యం:** అపర్ణా! ఆలకించు. పూర్వం బ్రహ్మదేవుడు లోకానికి మేలు చేయాలని నాల్గు వర్ణాలను సృజించాడు. తొలుత మహీసురులను, తరువాత క్షత్రియులను, పిదప వైశ్యులను, ఆవల శూద్రులను జన్మింప జేశాడు. విధాత ముఖం నుండి విప్రులు, బాహువులనుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, పాదాలనుండి శూద్రులు పుట్టారు. ఈ రీతిగా వారివారి సంభవస్థానాలు బ్రహ్మ యొక్క వేరువేరు శరీర భాగాలు కావడం వల్ల ఆ నాలుగు జాతులవారిలో ఎక్కువ తక్కువ తేడాలు ఏర్పడ్డాయి. అందుచేతనే బ్రాహ్మణాది జాతులవారు ఆచరించవలసిన ధర్మాలలో గూడా వ్యత్యాసాలున్నవి అంటూ హరుడు ఆయాజాతులవారి విధులను హైమవతికి వివరించాడు. గౌరీ! భూసురులు లోకమునకు ఆధారభూతులు. వారిని అవమానిస్తే కీడు మూడుతుంది. వారికి చేసే సత్కారాలు, సలిపే దానాలు సకల శుభాలు సమకూరుస్తాయి.

**చ. ప్రియ మఱి యజ్ఞునేనియు దరిద్రుని నేనియు విప్రుఁ గందఁ జే**
**త యుభయలోక సౌఖ్యములు దవ్వుగఁ జేయుఁ; దదీయమైన నిం**
**దయు నను బెట్టు దిట్టుట, యధర్మత నాతని సొమ్ము పుచ్చి కొం**
**టయును మదర్థముంగొనుట; డాఁపక చెప్పితి; నిక్క మింతయున్.' 6**

**ప్రతిపదార్థం:** ప్రియము+అఱి = ప్రేమ నశించి, పగగొని; అజ్ఞున్+ఏనియున్ = ఏమీ తెలియనివాడైనప్పటికినీ; దరిద్రునిన్+ఏనియున్ = పేదవాడైనప్పటికినీ; విప్రున్ = బ్రాహ్మణుడిని; కందన్+చేఁత = బాధించట మనేది; ఉభయలోక సౌఖ్యములు = ఇహపరాలకు సంబంధించిన సుఖాలను; దవ్వుగన్+చేయున్ = దూరం చేస్తుంది; తదీయము+ఐన = ఆ విప్రుడికి సంబంధించినట్టి; నిందయున్ = దూషణం కూడ; ననున్ = ఈశ్వరుడనైన నన్ను; బెట్టు = మిక్కిలి; తిట్టుట = నిందించటమే అవుతుంది; అధర్మతన్ = ధర్మ విరుద్ధంగా; ఆతని సొమ్ము = ఆ బ్రాహ్మణుడి ద్రవ్యం; పుచ్చికొంటయును = గ్రహించటం కూడ; మత్+అర్థమున్ = నా ధనమును; కొనుట = స్వీకరించటమే అవుతుంది; డాఁపక = ఈ విషయం రహస్యంగా ఉంచక; చెప్పితిన్ = నీకు తెలిపినాను; ఇంతయున్ = నేను చెప్పినదెల్ల; నిక్కము = నిజం.

**తాత్పర్యం:** ఉమా! పగవహించి ఏమియు తెలియని వాడైనప్పటికినీ, బీదవాడైనప్పటికినీ బ్రాహ్మణుడిని బాధించరాదు. అతడిని వేధించేవాళ్ళు ఇహపరలోక సౌఖ్యాలకు దూరమై పోతారు. బ్రాహ్మణుడిని దూషించటం నన్ను దూషించటమే సుమా! అన్యాయంగా అతడి సొమ్ము కాజేయడం నా ద్రవ్యాన్ని అపహరించటమే అవుతుంది. ఈ విషయాన్ని రహస్యంగా ఉంచక నీకు చెప్పినాను. నేను చెప్పినదంతా సత్యమే.'

**విశేషం:** "విప్రుసొమ్ము కంటె విషము మేలు" - ఇత్యాది సూక్తులు సంఘంలో బ్రాహ్మణుడి కున్న గౌరవాన్ని చాటుతాయి.

**వ. అని పలికి యిట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని వచించి; ఇట్లు+అనియెన్ = మరల పరమేశ్వరుడు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈశ్వరుడు మహేశ్వరితో అట్లు పలికి మళ్ళీ ఇట్లా అన్నాడు.

**సీ. 'అధ్యయనంబును యజనంబు దానంబు । నధ్యాపనంబును యాజనముఁ బ్ర**
**తిగ్రహంబును బ్రశాంతియుఁ దపస్సత్యశౌ । చంబులు విప్రధర్మంబు లాప**
**దలఁ దక్క నతనికి వలవదు వాణిజ్య; । మగ్నికార్యంబు, శూద్రాన్నవర్జ**
**నము, నిజదార సంగమ నియమంబును, । నిరుప్రొద్దు గుడుపును, హింస లేమి**

**ఆ. యును, నివాస శుద్ధియును, నతిథిప్రియ । త్వంబు బ్రాహ్మణులకు వలయుఁ; దపము**
**పేర్మి సాధనముగ ధర్మమూలముగ వా । రల సృజించెఁగాదె నలినభవుఁడు. 8**

**ప్రతిపదార్థం:** అధ్యయనంబును = వేదాలను గురుముఖంగా చదవటం; యజనంబున్ = యజ్ఞ యాగాది కర్మలు చేయటం; దానంబున్ = గోవు, భూమి మొదలైన వాటిని యోగ్యులైన వారి కివ్వటం; అధ్యాపనంబును = వేదాది విద్యలను అన్యులకు నేర్పడం; యాజనమున్ = యజ్ఞయాగాదులు తాను చేయించటం; ప్రతి గ్రహంబును = దానాదులు పుచ్చుకొనటం; ప్రశాంతియున్ = కామక్రోధాది విరహితమైన మనస్సుతో నిమ్మళంగా ఉండటం; తపః = శాస్త్రోక్తమైన కర్మలకు అర్హత; సత్య = నిజం పలికే నియమం; శౌచంబులు = శాస్త్రోక్త కర్మాచరణ యోగ్యత, పవిత్రతలు; విప్రధర్మంబులు = బ్రాహ్మణధర్మాలు; ఆపదలన్+తక్కన్ = కష్టాలలో దప్ప; అతనికిన్ = విప్రుడికి; వాణిజ్యము = వ్యాపారం, వర్తకం; వలవదు = తగదు; అగ్ని కార్యంబు = హోమ మొనర్చుట; శూద్ర+అన్న వర్జనము = శూద్రులొసగిన అన్నమును భుజించక వదలివేయటం; నిజదారసంగమ నియమంబును = తన పెండ్లముతోనే కూడునట్టి నియమం అనగా అన్యకాంతాసక్తి లేకుండటం; ఇరుప్రొద్దుకుడుపును = రెండు పూటల మాత్రమే భుజించటం; హింసలేమియును = ప్రాణులను హింసించకుండుట-అనగా అహింసావ్రతపాలనం; నివాస శుద్ధియును = గృహమును శుభ్రంగా ఉంచుకొనటం; అతిథి ప్రియత్వంబున్ = భోజన సమయాన ఇంటికి వచ్చిన వారిని ఆదరించటం; బ్రాహ్మణులకున్ = భూసురులకు; వలయున్ = తగును; తపము పేర్మి = తపస్సు యొక్క ఆధిక్యం; సాధనముగన్ = సర్వకార్యసాధనంగా; ధర్మమూలముగన్ = ధర్మమునకు ఆధారంగా; వారలన్ = భూదేవులను; నలిన భవుఁడు = పద్మమునుండి జనించిన బ్రహ్మ; సృజించెన్+కాదు+ఎ = సృష్టిచేశాడు గదా.

**తాత్పర్యం:** వేదాలను గురుముఖంగా నేర్చి వల్లించటం, యజ్ఞాలు చేయటం, పాత్రులైనవారికి దానాలివ్వటం, వేదాది విద్యలను ఇతరులకు బోధించటం, యజ్ఞయాగాది కర్మలు చేయించటం, యాగం చేసినట్టి యజమానులిచ్చే దానాలు పరిగ్రహించటం, ప్రశాంతచిత్తంతో ఉండటం, తపమాచరించటం, సత్యవాఙ్నియమం, మనోవాక్కాయము లందు పరిశుద్ధుడుగా ఉండటం విప్రులధర్మాలు. ఇడుమలలో తప్ప బ్రాహ్మణుడికి వర్తకం ఏమాత్రం తగదు. భూసురుడు నిత్యాగ్నిహోత్రిగా ఉండాలి. అంటే ప్రతినిత్యం హోమకార్యం నిర్వర్తించాలి. శూద్రులు పెట్టే తిండి తినగూడదు. తన భార్యతోనే కాపురం చెయ్యాలి కాని పరాంగనల పొందు పనికిరాదు. రెండు పూటల మాత్రమే భుజించాలి. ఇంటిని పరిశుద్ధంగా ఉంచుకొనాలి. భోజనవేళకు వచ్చిన అతిథి అభ్యాగతులను ప్రీతితో ఆదరించాలి.

ఇవి బ్రాహ్మణ ధర్మాలు. తపస్సమృద్ధియే సకల కార్యసాధనంగా, ధర్మమునకు ఆధారభూతులుగా బ్రాహ్మణుల్ని బ్రహ్మదేవుడు సృజించాడు.

**విశేషం:** "బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః." -- (భగ. 18-41)

ప్రాచీన కర్మలమూలంగా ఏర్పడే సత్త్వాది గుణాలను బట్టి ఆయా వర్ణాల వారు చేయదగిన కర్మలను శాస్త్రాలు విభజించి చెప్పాయి అంటూ ఉపక్రమించి వాసుదేవుడు అర్జునుడికి విప్రధర్మ మెట్లాంటిదో ఈ క్రింది విధంగా గీతలో ఉగ్గడించాడు.

"శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్." -- (భగ. 18-42)

"శమం, దమం, తపం, శౌచం, క్షాంతి, ఆర్జవం, జ్ఞానం, విజ్ఞానం, ఆస్తిక్యం అనేవి బ్రాహ్మణులకు సంబంధించిన సహజ కర్మలు, ధర్మాలు" -- అని.

**ఆ. క్షత్రియులకు విప్రసంరక్ష ముఖ్యధ । ర్మంబు; ధరణి వారి రక్షణమునఁ**
**గాని బ్రదుక; దమ్మహానుభావుల పాల । నంబు సేయ శోభనంబు నొందు. 9**

**ప్రతిపదార్థం:** క్షత్రియులకున్ = రెండవజాతి వారైన రాచవారికి; విప్రసంరక్ష = బ్రాహ్మణులను బాగా కాపాడటం; ముఖ్య ధర్మంబు= ప్రధానమైన ధర్మం; ధరణి = పుడమి; వారి రక్షణమునన్+కాని = ఆ క్షత్రియులు కాపాడటం వలననే తప్ప; బ్రదుకదు= జీవించదు; ఆ మహా+అనుభావులు+అ= ఆ గొప్ప సామర్థ్యం గల క్షత్రియులే; పాలనంబు+చేయన్= ఏలుబడి సాగించగా; శోభనంబున్+ఒందున్= శుభములు పొందుతుంది.

**తాత్పర్యం:** క్షత్రియులకు బ్రాహ్మణ సంరక్షణమే ప్రధాన ధర్మం. రాచవారి సంరక్షణలోనే ధరణికి సర్వతోముఖాభివృద్ధి సమకూడుతుంది. మిక్కిలి సామర్థ్యం గల క్షత్రియులు ఏలుబడి సాగించగా పుడమికి సకల శుభాలు సంప్రాప్త మవుతాయి.

**విశేషం:** "శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. " -- (భగ. 18-43)

శౌర్యం, తేజస్సు, ధృతి, దాక్ష్యం అనగా నేర్పు, యుద్ధమునందు అపలాయనం, దానం, ఈశ్వరభావం అంటే అన్యులను శాసించగల సామర్థ్యం - ఇవి క్షత్రియసాధారణ కర్మలుగా, ధర్మాలుగా భగవద్గీత ప్రబోధించింది.

నరులలో నేను నరాధిపుడిని అని భగవానుడు ఉగ్గడించడం చేత సాధు సంరక్షణమే భగవదవతార ప్రయోజనం గనుక సాధువులైన భూసురులను కాపాడటం రాజులకు ముఖ్యమైన ధర్మంగా, ప్రధాన కర్తవ్యంగా ఈ పంచమవేదం నిర్ణయించింది.

**క. రమణీ! యధ్యయనము యజ । నము దానము సాధుపోషణము దుర్జనులన్**
**దమియించుటయు సముత్సా । హము కల్మియు ధృతియు నృపుల కగు ధర్మంబుల్. 10**

**ప్రతిపదార్థం:** రమణీ! = ఓ కాత్యాయనీ!; అధ్యయనము = శస్త్రాస్త్రవిద్యలు అభ్యసించటం; యజనము = యాగాలు చేయించటం; దానము = తగినవారికి వస్తువుల నొసంగటం; సాధుపోషణము = సత్పురుషులను వృద్ధి పొందించటం; దుర్జనులన్ = దుర్మార్గులను; దమియించుటయున్ = అణచివేయటం; సముత్సాహము కల్మియున్ = మంచి ఉత్సాహం కలిగి ఉండటం; ధృతియున్ = ధైర్యం; నృపులకున్ = రాజులకు, క్షత్రియులకు; అగు = తగిన; ధర్మంబుల్ = ధర్మాలై ఉన్నవి - లేదా ధర్మంబులు+అగున్ = ధర్మములై ఉన్నవి అని కూడ అర్థం చెప్పవచ్చు.

**తాత్పర్యం:** దేవీ! వేదశాస్త్రాలు అనగా ధనుర్వేదం, నీతిశాస్త్రం మొదలైన విద్యలు అభ్యసించటం, యజ్ఞయాగాది క్రతువులు చేయించటం, అర్హులకు దానా లివ్వటం, సత్పురుషులను సాకటం, దుష్టులను అణచివేయటం, మిక్కిలి ఉత్సాహం కలిగి ఉండటం అనేవి రాజధర్మాలు.

**విశేషం:** రాజులకు ఉండవలసిన ప్రభు మంత్రోత్సాహ శక్తులలో ఉత్సాహ మొకటి.

**తే.** **శస్త్ర జీవికయును నరిషష్ఠ భాగ । మా హరించుటయును భృత్యు నరయుటయును**
**బ్రజ వివాదంబు వినుచోటఁ బక్షపాతి । గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి.** **11**

**ప్రతిపదార్థం:** శస్త్ర జీవికయునున్ = ఆయుధాలే జీవనోపాయంగా గలిగి ఉండటం, వేటాడటం, వైరులను సంహరించటం అనేవి రాజులకు శాస్త్ర విహితకృత్యాలు కనుక వారు శస్త్రజీవులు; అరి = కప్పముగా, పన్నుగా; షష్ఠ భాగము = ఆదాయంలో ఆరవపాలు; ఆహరించుటయునున్ = గ్రహించటం - శాత్రవులను జయించి వారి సంపదలో ఆరవభాగం కప్పంగా గైకొనటమేకాక, తన ఏల్బడిలోని ప్రజలరాబడిలోనుండి ఆరవపాలు పన్నుగా వసూలు చేయటం; భృత్యున్ = సేవకుడిని; అరయుటయును = పరిపోషించటం; ప్రజవివాదంబు = తన రాజ్యంలో ప్రజలనడుమ ఏర్పడిన తగవులు; వినుచోటన్ = ఆలకించేటప్పుడు; పక్షపాతి కామియును = ఒకవైపు మొగ్గకుండటం అనునవి; రాజులకున్ = దొరలకు; కృత్యకర్మకోటి = చేయదగిన పనుల యొక్క మొత్తమై ఉన్నది.

**తాత్పర్యం:** ఆయుధాలపై ఆధారపడి బ్రతుకుతెరువు సాగించటం, శత్రురాజులను ఓడించి వారి సంపదలో ఆరవభాగం కప్పంగా గైకొనటం, మరియు తమ రాజ్యంలోని ప్రజల ఆదాయంలో నుండి ఆరవపాలు పన్నుగా గ్రహించటం, తమను కొలిచియున్న సేవకులను పోషించటం, ప్రజల నడుమ ఏర్పడ్డ తగవులు తీర్చేటపుడు పక్షపాతం వహించకుండా న్యాయనిర్ణయం చేయడం రాజులకు శాస్త్రవిహిత కర్తవ్య కర్మలు.

**సీ.** **వణిజులు లోక ప్రవర్తనంబుల కెల్ల । నుపకారకులు; గృషియును ననేక**
**భంగి బేహారంబుఁ బసులఁ బెంచుటయుఁ గృ । త్యంబులు; వారల కధ్యయనము**
**యజనంబు దానంబు నర్హ్య కర్మంబులు; । త్రైవర్ణిక ద్విజత్వమ్ము కతన**
**నాతిథ్యములు విధేయములు; వారికిఁ దిల । గంధరసముల విక్రయము దగదు;**

**తే.** **మూఁడు జాతుల శుశ్రూషమూల కార్య । గతి తదుపయుక్తి శూద్రుల కలిమి నడచు;**
**వారు శుశ్రూషకులు; విప్రవందనంబు । వినయ మక్రూరు లగుట తద్విహిత కృతులు.** **12**

**ప్రతిపదార్థం:** వణిజులు = వ్యాపారం చేసే వైశ్యులు; లోక ప్రవర్తనంబులకున్+ఎల్లన్ = లోకవ్యవహారాలన్నింటికినీ; ఉపకారకులు = మేలు చేసేవారు; కృషియునున్ = సేద్యము; అనేక భంగి బేహారంబున్ = పలు తెరగులైన వ్యాపారాలూ, పసులన్ = పశువులను; పెంచుటయున్ = పోషించటమూ; కృత్యంబులు = వారు చేయదగిన పనులు; త్రైవర్ణిక ద్విజత్వమ్ము కతనన్ = మొదటి మూడు వర్ణములకు విహితమైన యజ్ఞోపవీత ధారణాది హేతువుచేత; వారలకున్ = ఆ వైశ్యులకు; అధ్యయనమున్ = గురుముఖమున వేదాలు పఠించటం; యజనంబున్ = యజ్ఞాలు చేయటం; దానంబున్ = గోభూదానాలు పాత్రుల కొసగటం; అర్హకర్మంబులు = తగిన కృత్యాలు; ఆతిథ్యములు = అతిథి సత్కారాలు; విధేయములు = వారు చేయదగినవి; వారికిన్ = ఆ వైశ్యులకు; తిలగంధరసముల = నువ్వులు, గంధములు, రసములు వీటియొక్క; విక్రయము = అమ్మకం; తగదు = కూడదు; మూఁడు జాతుల శుశ్రూషమూల కార్యగతి= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనెడి త్రైవర్ణికుల సేవా మూలకమైన పనుల చొప్పుతో; తత్+ ఉపయుక్తిన్= ఆ త్రైవర్ణికులకు ఉపయోగపడుటతో; శూద్రులకలిమి= శూద్రులయొక్క ఉనికి; నడచున్= సాగుతుంది; వారు = ఆ శూద్రులు; శుశ్రూషకులు= సేవించునట్టివారు; విప్రవందనంబు= బ్రాహ్మణులకు నమస్కరించటం; వినయము= అణకువ, విధేయత; అక్రూరులు+అగుట= కఠినులుగాక సౌమ్యులై ఉండటం; తత్ విహిత కృతులు= ఆ శూద్రులకు తగిన ధర్మములు, పనులు.

**తాత్పర్యం:** వైశ్యులు లోక వ్యవహారా లన్నింటికీ ఉపకరించేవారు. వ్యవసాయం, పలురకాలయిన వ్యాపారాలు, పశుపోషణ వీరికి విధి విహిత కృత్యాలు. బ్రాహ్మణ క్షత్రియులవలె వీరున్నూ మాతృగర్భం నుండి జన్మించటం, ఉపనయన సంస్కారం పొందటం అనే రెండు జన్మలు కలవారు కనుక ద్విజులు. ద్విజ ధర్మములైన వేద విద్యాభ్యాసం, యజ్ఞాలు చెయ్యటం, గో భూదానాలు ఇవ్వటం, అతిథులను సత్కరించటం ఈ మొదలైనవి వీరికి ఆచరణీయ కృత్యాలు. వైశ్యులు తిలగంధ రసాలు విక్రయించరాదు. శైలజా! మరి శూద్రుల ధర్మం బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సేవ చెయ్యటం. వారికి అన్నివిధాల ఉపకరించటం. బ్రాహ్మణులకు ప్రణమిల్లటం, వినయపరులై, సౌమ్యులై మెలగటం వారి ధర్మాలు.

**విశేషం:** మాతృ గర్భమున జన్మించటం, ఉపనయన సంస్కారమున పవిత్ర జన్మను పొందటం అనే రెండు జన్మలు కలవాడు ద్విజుడు. బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు ద్విజశబ్ద వాచ్యులు.

"కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాఽపి స్వభావజమ్." -- (భగ. 18-44)

వ్యవసాయం, పశుసంరక్షణ, వర్తకం వైశ్యులకు సహజ కర్మ. జీవనోపాయం కూడ. అట్లాగే త్రైవర్ణికులకు అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు పరిచర్య గావించడం శూద్రుడికి సహజ కర్మ. అది వాడి బ్రతుకు తెరువుగూడ - అని గీతోపనిషత్తు వర్ణధర్మాలు నిర్దేశించింది.

**క. తన తన వర్ణంబునకుఁ ద । గిన యాచారంబు నడపి కిల్బిష రహితుం**
**డనఁ బరఁగు నెల్లవారికి । విను మున్మును జన్మ సౌఖ్య విభవము గల్గున్. 13**

**ప్రతిపదార్థం:** విను = ఓ గౌరీ! ఆలకించుము; తన తన వర్ణంబునకున్ = తాను జన్మించిన కులానికి; తగిన = యుక్తమైన; ఆచారంబు = అనుష్ఠానం; నడపి = అనుష్ఠించి; కిల్బిష రహితుండు = పాపంలేనివాడు; అనన్ = అని లోకం మెచ్చగా; పరఁగు = ఒప్పునట్టి; ఎల్ల వారికిన్ = ప్రతివారికిన్నీ; మున్మును = ముందుముందు; జన్మ సౌఖ్య విభవము = ఎత్తిన జన్మల వలన పరమ సుఖం; కల్గున్ = లభిస్తుంది

**తాత్పర్యం:** గౌరీ! వినుము, తన తన కులానికి తగిన ఆచారం పాటించి పాపరహితుడైన ప్రతివాడు తనకు మున్ముందు కలుగబోయే జన్మలో పరమ సుఖాన్ని చూరగొంటాడు.

**విశేషం:** "స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." -- (భగ. 18-45)

మనుష్యులు తమ తమ వర్ణాలకు అనుగుణమైన ధర్మాలను ఆదరంతో ఆచరిస్తే పరమ పద ప్రాప్తిరూప ఫలసిద్ధిని పొందుతారు.

"యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః." -- (భగ. 18-46)

ప్రపంచ సృష్టి స్థితి లయాలకు మూలమై విశ్వమంతటా వ్యాపించియున్న పరమాత్మను స్వధర్మానుష్ఠానంతో ఆరాధిస్తే పరమ పద ప్రాప్తి కల్గుతుంది అంటూ గీతలో భగవంతుడు చాటిన సంగతే ఈ కందంలో పొందుపరచబడింది.

**వ. ఇవి వర్ణ ధర్మ ప్రకారంబు; లింక నాశ్రమ ధర్మంబులు వివరించెద నాకర్ణింపు' మని పలికి పార్వతికి పరమేశ్వరుం డిట్లనియె. 14**

**ప్రతిపదార్థం:** ఇవి వర్ణ+ధర్మ ప్రకారంబులు = ఇవి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలకు సంబంధించిన ధర్మ విధానాలు; ఇంకన్ = ఇక; ఆశ్రమధర్మంబులు = ఆశ్రమ ధర్మాలను; వివరించెదన్ = వక్కాణిస్తాను; ఆకర్ణింపుము = ఆలకించుము; అని పలికి = అని వచించి; పరమ+ఈశ్వరుండు= చంద్రశేఖరుడు; పార్వతికిన్= సర్వమంగళకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు;

**తాత్పర్యం:** పార్వతీ! వర్ణ ధర్మ రీతు లిట్లాంటివి. ఇక ఆశ్రమ ధర్మాలు విశదపరుస్తాను వినుము' అంటూ పరమేశ్వరుడు ఆమెకు చెప్పటానికి ఉపక్రమించాడు.

**విశేషం:** ఆశ్రమములు నాలుగు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము.

**సీ. బ్రహ్మ చర్య వ్రత పరమ నిష్ఠయు, గురు । నాశ్రయించుటయు, నధ్యయన కృతియు,
నగ్ని కార్యంబు, గుర్వర్థ సంచారంబు, । భైక్షచర్యయుఁ గమలాక్షి! బ్రహ్మ
చారి ధర్మంబు; లాశ్రమములకెల్ల నా । శ్రయణీయమై గృహస్థత్వ మొప్పు;
శౌచంబు, నిజదార సంతుష్టియును, బంచ । యజ్ఞంబులును, నిగమాభిరతియు,**

**తే. దాన హోమ దయాతిథి మాననములు । వలయు గృహమేధికిని; వనవాస వన్య
భోజన బ్రహ్మచర్య జటాజిన ప్ర । ధారణములు వానప్రస్థ ధర్మకోటి. 15**

**ప్రతిపదార్థం:** కమల+అక్షి! = తామర రేకుల వంటి కన్నులు గలదానా! గౌరీ!; బ్రహ్మచర్య వ్రత పరమనిష్ఠయున్ = బ్రహ్మ చర్యమనే నియమంలో మిక్కిలి శ్రద్ధ; గురున్ = ఆచార్యుడిని; ఆశ్రయించుటయున్ = విద్యకొరకు సేవించటం; అధ్యయన కృతియున్ = గురువుకడ విద్యాభ్యాసమనే పని; అగ్ని కార్యంబున్ = అగ్నిని ఉపాసించటం-హోమాదులు సల్పటం; గురు+అర్థ

సంచారంబు = గురువు పని నిర్వహించటానికై తిరగటం; భైక్ష చర్యయున్ = భిక్షాటనం-మధుకరవృత్తి నవలంబించటం; బ్రహ్మచారి ధర్మంబులు = బ్రహ్మచారి యొక్క విధులు; ఆశ్రమములకున్+ఎల్లన్ = అన్ని ఆశ్రమాలకు; ఆశ్రయణీయము+ఐ = ఆశ్రయించుటకు తగినదై; గృహస్థత్వము = గృహస్థుగా ఉండటం-గృహస్థాశ్రమం; ఒప్పున్ = విలసిల్లుతుంది; శౌచంబున్ = పరిశుద్ధత; నిజదార సంతుష్టియును = తన పత్నితోనే సంతృప్తి చెందడం; పంచ యజ్ఞంబులును = దేవయజ్ఞం, భూతయజ్ఞం, పితృ యజ్ఞం, బ్రహ్మ యజ్ఞం, మనుష్య యజ్ఞం అనే అయిదు మహా యజ్ఞాలు నిర్వహించటం; నిగమ+అభిరతియున్ = వేద విద్యాభ్యాసమందు మిక్కిలి ఆసక్తి; దాన = వలసిన వారికి గోవులు భూములు ఇవ్వటం; హోమ = అగ్నికార్యం; దయా = కృప; అతిథి మాననములు = ఇంటికి వచ్చిన అతిథి అభ్యాగతులను ఆదరించటం; గృహమేధికిని = గృహస్థాశ్రమం స్వీకరించిన వాడికి; వలయున్ = అనుసరించ దగిన ధర్మాలు; వనవాస = అరణ్యంలో నివసించటం; వన్య భోజన = ఆడవిలో లభించే కందమూలఫలాలను భుజించటం; బ్రహ్మచర్య = వనితాసంగమం వదలటం; జటా+అజిన ధారణములు = జడలు తాల్చటం, చర్మాలు ధరించటం; వాన ప్రస్థ ధర్మ కోటి = వానప్రస్థాశ్రమంలో ఉన్నవారు ఆచరించవలసిన ధర్మాల యొక్క సముదాయమై ఉన్నది.

**తాత్పర్యం:** బ్రహ్మచర్య వ్రతం అవలంబించటంలో గొప్ప నిలుకడ, గురుదేవుడిని ఆశ్రయించటం, వేదపాఠంలో ఆసక్తి గల్గి ఉండటం, హోమాలు సల్పటం, గురుని కార్యం నెరవేర్చుటకై సంచరించటం, భిక్షాన్నం భుజించటం అనేవి బ్రహ్మచారి యొక్క ధర్మాలు. దేవీ! అన్ని ఆశ్రమాలవారికి ఆధారభూతమై గృహస్థాశ్రమం ఒప్పారుతున్నది. పరిశుద్ధత పాటించటం, తన భార్యతోనే సంతృప్తి చెందటం, ప్రతినిత్యం దేవయజ్ఞం, భూతయజ్ఞం, పితృ యజ్ఞం, బ్రహ్మ యజ్ఞం, మనుష్యయజ్ఞం అనే పంచ యజ్ఞాలు నిర్వర్తించటం, వేదమునందు ఆసక్తి, దానం, హోమం, దయ, అతిథిపూజ గృహస్థుడికి ఆచరణీయాలైన ధర్మాలు. అడవిలో నివసించటం, అక్కడ లభించే కందమూలాదులు భక్షించటం, బ్రహ్మచర్య వ్రతపాలనలో నిష్ఠ అనగా స్త్రీ సంగమవివర్జనం, జడలు తాల్చటం, చర్మాలు ధరించటం వానప్రస్థాశ్రమంలో ఉన్నవారియొక్క ధర్మాలు.

**చ. కినియమి, సంగవర్జన, మకించన భావము, తాల్మి, విప్రవా**
**సనము, ప్రశాంతి, యార్జవము, శౌచము, సద్వ్రతనిష్ఠ, భైక్షభో**
**జన, మిల నిద్రసేఁత, కృప, సంతత తత్త్వ విచింతనంబు మా**
**నిని! యతి ధర్మముల్ శ్రుతి గణించిన భంగిన యేను జెప్పితిన్. 16**

**ప్రతిపదార్థం:** మానిని! = ఆత్మాభిమానం గల చెలీ!; కినియమి = కోపపడకుండటం; సంగవర్జనము = ఇంద్రియ విషయాల అణచివేత అంటే పరమాత్మ కన్నా భిన్నమైన వస్తువులతో సంబంధం లేకుండటం; అకించన భావము = ఏమియూ లేనివాఁడై ఉండటం (ధనాదులందు ప్రీతి మానటం); తాల్మి = ఓర్పు; విప్రవాసనము = దేశాంతరమున నివసించటం లేదా బ్రాహ్మణులతో కూడి నివసించటం; ప్రశాంతి = నిమ్మళంగా ఉండటం; ఆర్జవము = ఋజుప్రవర్తన, సరియగు నడత; శౌచము = పరిశుద్ధత; సద్వ్రత నిష్ఠ = మంచి వ్రతాలను ఆచరించటంలో నిలుకడ అనగా అహింస మొదలైన నియమాలలో శ్రద్ధ; భైక్ష భోజనము = భిక్షించి తెచ్చుకొన్న అన్నం ఆరగించటం; ఇలన్ = నేలమీద; నిద్రసేఁత = పరుండటం, నిదురించటం; కృప = కనికరం; సంతత తత్త్వ విచింతనంబు = ఎల్లప్పుడు తత్త్వవిచారం సల్పుతుండటం; యతిధర్మముల్ = సన్న్యాసికి తగిన ధర్మాలు; శ్రుతి = వేదం; గణించినభంగిన్+అ = చెప్పిన విధంగానే; ఏను = నేను; చెప్పితిన్ = నీకు తెలిపాను.

**తాత్పర్యం:** కోపపడకుండా ఉండటం, ఇంద్రియ విషయాలను అణచివేయటం అనగా పరమాత్మకంటె ఇతరములైన విషయాలతో సంబంధం వదలటం, ఇతర దేశాలలో వర్తించటం లేదా బ్రాహ్మణులతో కలసి నివసించటం, సహనం, చక్కని నడత, పరిశుద్ధత, ఉత్తమ వ్రతాలు ఆచరించటంలో ఆసక్తి, భిక్షాన్నంతో జీవించటం, భూమి మీద శయనించటం, కారుణ్యం, ఎల్లవేళల ఆత్మతత్త్వ విచారం అన్నవి సన్న్యాసి యొక్క ధర్మాలు. శైలజా! వేదాలలో చెప్పబడిన ఈ ధర్మాలను నీకు తెలిపాను.

**విశేషం:** సంగ వర్జన మనగా పరమాత్మ కంటె వేరైన వస్తువులతో సంబంధం లేకుండటంగా -

"మత్కర్మ కృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు యస్స మా మేతి పాండవ." - అని భగవద్గీత వెల్లడించింది.

"అకించనోఽ నన్యగతి శ్శరణ్య, త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" నిన్ను చేరడానికి వలసిన కర్మ భక్తి జ్ఞానాలలో ఏ ఒక్కటీ బొత్తిగా లేనివాడిని. నిన్నే శరణు వేడుతున్నాను. నన్ను కాపాడు మన్న యామునాచార్యుల వారి నైచ్యానుసంధాన ప్రదర్శకమైన ఈ శ్లోకం మనకు స్తోత్రరత్నంలో(22) కనిపిస్తుంది.

**వ.** **అని యిట్లాశ్రమ ధర్మంబులు సెప్పిన విని యప్పరమేశ్వరుతోఁ బార్వతి 'తపంబు తపంబనుచు మునిజనంబు లాచరింతురు; దాని తెఱం గెఱింగింపవే' యనిన నద్దేవుం డిట్లనియె. 17**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు = అంటూ ఈ ప్రకారంగా; ఆశ్రమ ధర్మంబులు = చతురాశ్రమాలకు సంబంధించిన ధర్మాలు; చెప్పినన్ = శంకరుడు తెల్పగా; విని = ఆలకించి; ఆ+పరమేశ్వరుతోన్ = ఆ పరమ శివుడితో; పార్వతి = హిమవంతుడి కూతురైన ఉమాదేవి; తపంబు తపంబు+అనుచున్ = తపస్సు తపస్సుఅంటూ; మునిజనంబులు = మౌనులు; ఆచరింతురు = చేస్తారు; దానితెఱంగున్ = ఆ తపస్స్వరూపమును; ఎఱింగింపవు+ఏ = తెల్పుమా; అనినన్ = అని పార్వతి ప్రశ్నించగా; ఆ దేవుండు = భగవంతుడైన శంభుడు; ఇట్లు+అనియెన్ = ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ముందు పేర్కొన్న విధంగా ఆశ్రమ ధర్మాలను తెల్పగా విని పార్వతి శివుడితో 'తపస్సు తపస్సు అంటూ ఆసక్తితో మునీశ్వరులు తపస్సు చేస్తారు. దాని స్వరూప మెట్లాంటిదో ఎరిగింపు మని వేడగా అత డిట్లా అన్నాడు.'

**శివుండు పార్వతికిఁ దపస్స్వరూపంబు చెప్పుట. (సం.13-580-15 (అను.1)).**

**సీ.** **భోగార్థులై తపంబునకుఁ జొత్తురు; తపం। బనఁగ వానప్రస్థు లాచరించు
ధర్మంబు; లింద్రియ కర్మ నిగ్రహముతో। నుభయకాలములను యోగసేవ
ఫలకాంక్షఁ జేత తపస్స్వరూపంబుగా। నడపి కాలం బైన నాకమునకు
నరిగి తద్భోగంబు లనుభవింతురు; పుణ్య। మవసిత మగుడు మర్త్యత్వ మొంద**

**తే.** **వత్తు; రధికనియతి నుపవాసములను। జపముఁ బంచాగ్ని మధ్య వాసంబు గలుగు
తపముఁ గల దప్సరః ప్రియత్వం బొనర్చుఁ। గర్త కది; వాఁడుఁ దుది వచ్చుఁగాని మరలి.' 18**

**ప్రతిపదార్థం:** భోగ+అర్థులు+ఐ = సుఖాలు అనుభవించవలెనన్న కోరిక గలవారై; తపంబునకున్+చొత్తురు = తపస్సు చేయటానికి పూనుకొంటారు; తపంబు+అనఁగన్ = తపస్సంటే; వానప్రస్థులు = వాన ప్రస్థమనే ఆశ్రమంలో ఉన్నవారు;

ఆచరించుధర్మంబులు = చేసేటటువంటి పుణ్యాలు; ఇంద్రియ కర్మ నిగ్రహముతోన్ = ఇంద్రియాలయొక్క వ్యాపారాలు అరికట్టుతూ; ఉభయ కాలములను = రెండు వేళలలో అనగా ఉదయసాయంకాలాలలో; యోగసేవ = యోగాభ్యాసం; ఫలకాంక్షన్+చేఁత = ప్రయోజనాపేక్షతో చేయటం; తపస్+స్వరూపంబుగాన్+నడపి = తపశ్చర్యగా కొనసాగించి; కాలంబు+ఐనన్ = కాలం కాగానే అనగా మరణం సంప్రాప్తించగా; నాకమునకున్ = స్వర్గలోకానికి; అరిగి = వెళ్ళి; తద్+భోగంబులు = ఆ స్వర్గలోకసౌఖ్యాలు; అనుభవింతురు = భుజిస్తారు; పుణ్యము = తాము చేసిన పుణ్యం; అవసితము+అగుడున్ = ముగియగానే; మర్త్యత్వము+ ఒందన్ = మానవులై జన్మించటానికి; వత్తురు = దివినుండి భువికి దిగి వస్తారు; అధిక నియతిన్ = మిక్కిలి నియమంతో; ఉపవాసములను = పస్తులుండటం; జపమున్ = మంత్రములను జపించటం; పంచ+అగ్ని మధ్యవాసంబున్ = ఐదగ్నుల నడుమ ఉండటం; కలుగుతపమున్ = కలిగినట్టి కఠోరతపస్సు; కలదు = ఉన్నది; అది = ఆ ఘోరతపస్సు; కర్తకున్ = చేసేవాడికి; అప్సరః ప్రియత్వంబు+ఒనర్చున్ = అప్సరసలకు (దేవతాస్త్రీలకు) వల్లభు డయ్యేటట్లు చేస్తుంది; వాఁడు = ఆ తపశ్శాలి; తుదిన్=చివరకు; మరలి వచ్చున్+కాని = తిరిగి భూతలానికి రాగలడే కాని స్వర్గంలో స్థిరంగా ఉండడు.

**తాత్పర్యం:** భోగాలను వాంఛించి తపస్సు చేయడానికి పూనుకొంటూ ఉంటారు. వానప్రస్థాశ్రమంలో ఉన్నవారు చేసే పుణ్యకర్మలే సుమా తపస్సు. ఇంద్రియ వ్యాపారాలను మాని ప్రాతస్సాయంకాలాలలో ఫలాపేక్షతో యోగాభ్యాసాన్ని తపస్సు మాదిరిగా నడిపి ఆయుస్సు చెల్లగా స్వర్గానికి పోయి అక్కడి సుఖాలు అనుభవిస్తారు. ఆర్జించిన పుణ్యం కాస్తా ముగియగానే మర్త్య లోకానికి తిరిగివస్తారే తప్ప అక్కడ శాశ్వతంగా ఉండరు. మిక్కిలి నియమంతో నిరాహారులై మంత్రజపంచేయటం, ఐదగ్నులమధ్య వేసవిలో ఉండటంవంటి ఘోరతపస్సులు కూడ ఉన్నాయి. అట్లాంటి తపస్సు కర్తకు దేవతాంగనలతో సంయోగం సమకూరుస్తుంది. అయినప్పటికి వాడు తపస్సుచేత ఆర్జించిన పుణ్యం కాస్తా ఫలభోగంతో నశించగానే తిరిగి భూలోనికి వస్తాడు.'

**విశేషం:** ఈ విషయాన్ని భగవద్గీత ఇట్లా చాటింది.

"త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్ర లోకం
అశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్." (భగ. 9-20)

"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి,
ఏవం త్రయీధర్మ మను ప్రపన్నా
గతాగతం కామ కామా లభంతే." (భగ. 9-21)

కేవలం కర్మనిష్ఠాపరులు ఇంద్రాది దేవతలను ఉద్దేశించి యజ్ఞయాగాలు సల్పి స్వర్గం చేరి అక్కడ ఇంద్రభోగాలు అనుభవిస్తారు. స్వర్గాది ఫలాలు అపేక్షించి కర్మలు చేసేవారు వాటిని అక్కడ అనుభవించి తమ పుణ్యం క్షీణించగానే భూలోకానికి తిరిగి వస్తారు. పంచాగ్నులు - నాల్గువైపుల గనగన మండే అగ్నిగుండాలు, నడినెత్తిన ప్రచండ సూర్యుడు - ఈమధ్య నిలిచి వేసవిలో సాగించే కాయక్లేశ యుతమైన కఠోర తపస్సు శీఘ్ర ఫలసిద్ధికి కారణం. శివుడిని గూర్చి పార్వతి సాగించిన తపస్సు ఇట్లాంటిదే.

**వ. అని చెప్పి మఱియు,** **19**

**తాత్పర్యం:** ఈ విధంగా పార్వతికి తెలిపి మరలా పరమేశ్వరు డిట్లా అన్నాడు.

**ఉ. 'దారయుతంబుగా నడచు తాపసముఖ్యు లహింస పేర్మికై**
**కారుణికత్వ మగ్గలము గల్గి తలంతురు సర్వజీవులుం**
**దారును నొక్కరూపుగఁ బదంపడి పుత్ర కళత్రయుక్తిఁ బెం**
**పారుదు రూర్ధ్వ లోకమున నజ్జనమున్ మఱివచ్చుఁ గ్రమ్మఱన్.' 20**

**ప్రతిపదార్థం:** దారయుతంబుగన్ = ధర్మపత్నితోపాటు; నడచు = తపశ్చర్యతో మెలగే; తాపసముఖ్యులు = మునులలో శ్రేష్ఠులు; అహింస పేర్మికై = అహింసయొక్క గొప్పతనముకై; కారుణికత్వము = దయాస్వభావం; అగ్గలము+కల్గి = మిక్కిలి కలిగి; సర్వజీవులున్ = సమస్త ప్రాణులున్నూ; తారును = తామున్నూ; ఒక్కరూపుగన్ = ఒకేవిధమని; తలంతురు = భావిస్తారు; పదంపడి = పిదప; పుత్రకళత్రయుక్తిన్ = కొడుకులతో, భార్యలతో కూడి; ఊర్ధ్వలోకమునన్ = పై లోకంలో-స్వర్గంలో; పెంపారుదురు = ఒప్పుతుంటారు; మఱి = పిదప; ఆ+జనమున్ = అట్టివారు కూడ, క్రమ్మఱన్ = తిరిగి; వచ్చున్ = భూలోకానికి పునర్జన్మమెత్తడానికి వస్తారు.

**తాత్పర్యం:** 'భార్యలతో మెలగే మునివర్యులు అహింసావ్రతం యొక్క గొప్పతనం గుర్తెరిగి మిక్కిలి దయాగుణం కలవారై, సమస్తప్రాణులు తమవంటివే యని భావిస్తారు. ఆయుష్కాలం తీరిన పిమ్మట వారు ఆలుబిడ్డలతో కూడి పుణ్యలోకాలకు వెళ్ళి అక్కడ పుణ్యఫలాలైన సౌఖ్యాలు అనుభవిస్తారు. తమ పుణ్యం క్షీణించగానే వారు అక్కడినుండి మరలి భూలోకానికి వచ్చి మనుష్యులుగా పుట్టుతారు.'

**వ. అనిన భవాని 'వనవాసవ్రతవిశేషంబులుం, దదీయఫల ప్రకారంబులు నేర్పడ నానతీయవే' యనుటయు నభవుండు భరితాదరుండై. 21**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని శివుడు పల్కగా; భవాని = పార్వతి; వనవాస వ్రతవిశేషంబులున్ = వనవాస నియమాలలోని ఘనతలనూ; తదీయఫల ప్రకారంబులు = ఆ వనవాస వ్రత ఫలముల యొక్క విధములనూ; ఏర్పడన్ = స్పష్టంగా; ఆనతీయవు+ఏ = సెలవిమ్మా; అనుటయున్ = అని అడుగగా; అభవుండు = పరమేశ్వరుడు; భరిత+ఆదరుండు+ఐ = నిండిన ఆదరంకలవాడై - భార్య పట్ల మిక్కిలి మన్నన కలవాడై (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** అని సాంబశివుడు పల్కగా ఉమాదేవి 'వనవాస వ్రతాచరణలోని ఘనతనూ, ఆ వ్రత ఫలాలనూ సెలవియ్యం' డని ప్రార్థించగా పరమేశ్వరుడు పత్నియందలి పరమాదరంతో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఉపవాసములు మౌన ముర్వీశయత్వ మా । సన మూర్ధ్వ బాహుక స్థాపనంబు**
**నియమితా హారత్వ నిష్ఠ క్రమంబున । శశి మరుద్వృక్ష వాసముల నిలుపు**
**గంధర్వ దేవ నాగస్థానముల నున్కి । యును బహుసౌఖ్య సంయుతము గాఁగ**
**నానా సహస్రాబ్ద మాననీయంబుగఁ । గావించు సంక్షేపగణనఁ గొన్ని**

**తే. మహితనియతులు సెప్పితి; మఱియు నేమి । వ్రతము సల్పినఁ బాప నిర్హరణ మగుటఁ**
**బుణ్యగతికల్మి దప్ప దరణ్యవాసి; కడుగు మింకను వలసిన యట్టి' వనుడు. 22**

**ప్రతిపదార్థం:** ఉపవాసములు = నిరాహారములు; మౌనము = మాట్లాడకుండటం, వాఙ్నియమం; ఉర్వీశయత్వము = నేలమీద పరుండటం; ఆసనము = యోగాసనాలలో కూర్చోవటం; ఊర్ధ్వబాహుక స్థాపనంబున్ = క్రిందికి దించకుండా చేతులు పైకెత్తి పట్టటం; నియమిత+ఆహారత్వ నిష్ఠ = నిర్ణయించిన వేళలోనే ఆహారం స్వీకరించే నియమం; క్రమంబునన్ = వరుసగా (వానప్రస్థుడిని), శశి, మరుత్, యక్ష వాసములన్ నిలుపున్ = చంద్రుడు, వాయువు, యక్షులు అనువారి లోకాలలో చేరుస్తుంది; గంధర్వ దేవ నాగస్థానములన్ = గంధర్వలోకం, దేవలోకం, పాతాళలోకం అనే లోకాలలో; బహుసౌఖ్యసంయుతము+కాఁగన్ = అనేక సుఖాలతో కూడునట్లు; నానా సహస్ర+అబ్ద+మాననీయంబుగన్ = పెక్కువేల సంవత్సరాలు ఆదరించబడేటట్లుగా; ఉన్కియును కావించున్ = ఉండునట్లు చేస్తుంది; సంక్షేపగణనన్ = క్లుప్తంగా లెక్కించి; కొన్ని మహిత నియతులు = గొప్పవైన కొన్ని వ్రతనియమాలు; చెప్పితిన్ = నీకు తెల్పినాను; మఱియున్ = ఇంకను; ఏమివ్రతము సల్పినన్ = ఎట్టి వ్రతం ఆచరించినా; పాపనిర్హరణము+అగుటన్ = పాపం నశించటం చేత; పుణ్యగతి కల్మి = పుణ్యస్థితి సమకూడటం; అరణ్యావాసికిన్ = వనంలో నివసించేవాడికి, వానప్రస్థుడికి; తప్పదు = కలుగక మానదు; ఇంకను= మరియును; వలసిన+అట్టివి = నీకు కావలసిన విషయాలు; అడుగుము = నన్ను ప్రశ్నించుము; అనుడున్ = అని శంభుడు వచించగా. (పార్వతి అడిగిందని తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** ఉపవాసాలు సల్పటం, మాట్లాడకుండా ఉండటం, నేల మీద పండుకొనటం, యోగాసనాలలో ఉండటం, చేతులు మీది కెత్తి పట్టటం, నియమిత వేళలలో ఆహారం మితంగా స్వీకరించటం అనే నియమాలకు ఫలంగా వరుసగా చంద్ర, వాయు, యక్ష, గంధర్వ, నాగ లోక నివాసాలు సంప్రాప్తిస్తాయి, ఆయా లోకాలలో అనేక సంవత్సరాలు బహువిధ సౌఖ్యాలు అనుభవించే భాగ్యం వానప్రస్థుడికి కలుగుతుంది. ఈ రీతిగా సంగ్రహంగా నీకు కొన్ని వ్రతానుష్ఠాన ఫలాలు తెలిపాను. ఎట్టి వ్రతాలు అనుష్ఠించినా వానప్రస్థుడికి పాపాలు తొలగి పుణ్యగతులు లభించడం తప్పదు. గిరిజా! ఇంకా నీవు అడుగ దలచిన విషయాలుంటే అడుగు'మంటూ పరమేశ్వరుడు పలికాడు.

**క. 'యాయావరుల నమరవం । ద్యా! యేర్పడఁ జెప్పు మనియె నంబిక; దేవుం**
**డాయమ కిట్లనుఁ' దీర్థప । రాయణు లుపవాసవిధి సమధికులు వారల్. 23**

**ప్రతిపదార్థం:** అంబిక = గౌరీదేవి; అమరవంద్యా! = దేవతలచే కొనియాడబడువాడా!; యాయావరులన్ = ఇల్లిల్లు తిరిగి, పొలాలలో సంచరించి ధాన్యం గడించి బ్రదికే విరాగులను గూర్చి; ఏర్పడన్ = స్పష్టంగా; చెప్పుము+అనియెన్ = తెల్పుమని ప్రశ్నించింది; దేవుండు = భగవంతుడైన శివుడు; ఆ+అమకున్ = ఆ తల్లికి, ఉమకు; ఇట్లు+అనున్ = ఈ విధంగా చెప్పాడు; వారల్ = యాయావరులు; తీర్థ పరాయణులు = తీర్థయాత్రలందు శ్రద్ధకలవారు; ఉపవాసవిధిసమధికులు = ఉపవాసాలుండటంలో కడు దొడ్డవారు.

**తాత్పర్యం:** గౌరీదేవి పరమేశ్వరుడిని చూచి 'దేవతలచే నమస్కరింపబడు ప్రాణేశ్వరా! ఇల్లిల్లుతిరిగి, చేలలో సంచరించి గడించిన ధాన్యంతో జీవించే విరాగులను గూర్చి తేటతెల్లంగా తెల్పండి' అని అడిగింది. అందుకు తేజస్స్వరూపుడైన ఈశానుడు 'హైమవతీ! నీ వడిగిన యాయావరులు దేశద్రిమ్మరులు. తీర్థయాత్రలు సల్పటంలో మిక్కిలి శ్రద్ధాసక్తులు కలవారు. ఉపవాస నియమాలలో కడు గొప్పవారు.

**వ. అది యెట్లంటేని. 24**

**తాత్పర్యం:** అ దెట్లంటావా? అయితే వినుము.

**క. నానాతీర్థ సతత సు । స్నానంబులఁ బల్లలైన జడలును భిక్షా**
**నూనోపవాస కృశమగు । మేనులునై వారితపము మిక్కిలి మెఱయున్. 25**

**ప్రతిపదార్థం:** నానాతీర్థ = అనేక పుణ్యతీర్థాలలో; సతత = ఎడతెగని; సుస్నానంబులన్ = పవిత్ర స్నానాల చేత; పల్లలు+ఐన = ఎరుపు మించిన తెలుపురంగు గల; జడలును = తైల సంస్కారం లేక మెలివడిన తల వెంట్రుకలునూ; భిక్షా = భిక్షాన్నం వలననూ; అనూన = అధికములైన; ఉపవాస = పస్తులుండటం చేతను; కృశము+అగు = శుష్కించిన; మేనులున్+ఐ = శరీరాలు గలిగినదై; వారితపము = యాయావరుల యొక్క తపస్సు; మిక్కిలి మెఱయున్ = ఎక్కువగా ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** యాయావరులు అనేక పుణ్యతీర్థాలలో నిరంతరం పవిత్ర స్నానాలు చేస్తూ ఉంటారు. అందువలన వారి తల వెంట్రుకలు జడలు గట్టి ఎరుపుమించిన తెలుపు రంగు కలిగి ఉంటాయి. భిక్షాన్నం తినటం వలననూ, మితిలేని ఉపవాసాలు చేయడం వల్లనూ వారి దేహాలు బక్కచిక్కి ఉంటాయి. కాని' వారి తపస్సు వెలుగులు విరజిమ్ముతూ ఉంటుంది.

**క. మాసోపవాస విధులం । జేసి తృణజ ధాన్యభుక్తి సెల్లింతురు వా**
**రేసురలకు లేని సుఖా । వాసమ్ములఁ జరితములను వఱలుదురు తుదిన్.' 26**

**ప్రతిపదార్థం:** మాస+ఉపవాస విధులన్+చేసి = నెలనెలా ఉపవాసం సల్పే నియమాలచేత; తృణధాన్యభుక్తి+చెల్లింతురు = నివ్వరివడ్ల బియ్యపన్నం భుజిస్తారు; ఏ సురలకున్+లేని = ఎట్టి దేవతలకూ లేనట్టి; సుఖ+ఆవాసమ్ములన్ = సౌఖ్యస్థానాలలో; చరితములన్ = సంచారముల చేత; తుదిన్ = కడపట; వఱలుదురు = వెలిగెదరు.

**తాత్పర్యం:** ఒక్కొక్క నెల రోజులపాటు ఉపవాసాలుండి ఆ పుణ్యపురుషులు నివ్వరివడ్ల దంపుడు బియ్యపన్నం భుజించి జీవితం సాగిస్తారు. కడపట ఏ దేవతలకు లభించని సుఖస్థానాలలో నడయాడుతూ వారు ప్రకాశిస్తారు.'

**వ. అనిన విని యవ్వనితారత్నంబు 'వైఖానసుల విధంబు వివరింపు' మనుటయు న వ్విరూపాక్షుండు. 27**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని పరమేశ్వరుడు చెప్పగా; విని = ఆలకించి; ఆ+వనితా రత్నంబు = స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఆ దుర్గాదేవి; వైఖానసుల విధంబున్ = వైఖానసులు అనే వారి యొక్క వైనం; వివరింపుము = తెలుపుము; అనుటయున్ = అని అడుగగా; ఆ+విరూప+అక్షుండు = త్రినేత్రుడైన ఆ శంకరుడు (ఇట్లా అనియెన్ - అని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** పరమేశ్వరుడు పలుకగా విని మహిళామణి అయిన పరమేశ్వరి 'నాథా! వైఖానసు లనగా ఎట్లాంటివారు? వారి స్వరూప మేమిటో చెప్పు'మని అడుగగా శివుడు.

**సీ. 'వైఖానసులు ఖరవ్రతు; లెట్టులంటేని । శిలఁ దృణధాన్యముల్ చిదుక నడచి**
**కొందఱు పండులఁ గొఱికి కొందఱు గన్న । గుఱుముల గువ్వల తెఱఁగు దోఁప**
**నప్పటి కప్పటి కాననంబున వైచి । కొని కొంద ఱాకు లెండినవి యేఱి**
**కొని కొంద ఱంబువుల్ గొని కొంద ఱనిలంబు । గొంద ఱాహారంబు గొందు; రట్లుఁ**

**తే.** **గాక యాహారపరులును గలరు; వార । లింద్రునకుఁ బూజనీయులై యెక్కుడైన**
**పదవిఁ జిరకాల బహుసౌఖ్యభాగు లగుదు' । రని మహేశ్వరుఁ డుమకు నిట్లనియె మఱియు. 28**

**ప్రతిపదార్థం:** వైఖానసులు = వైఖానసు లనేవారు; ఖర వ్రతులు = కఠిన నియమాలు కలవారు; ఎట్టులు+అంటేని = ఎట్లనగా; శిలన్ = రాతిమీద; తృణ ధాన్యముల్ = నివ్వరివడ్లు మొదలైన గడ్డి ధాన్యాలను; చిదుకన్+అడచి = పొట్టురాలేటట్లు కొట్టి; కొందఱు = కొంతమంది; పండులన్ = దంతములతో; కొఱికి = పదార్థాలను నమలి; కొందఱు = మరికొంతమంది; కన్నగుఱుములన్ = కనిపించిన గింజలను; గువ్వల తెఱఁగు+తోఁపన్ = పక్షులతీరు గోచరించగా; అప్పటికిన్+అప్పటికిన్ = ఆవేళ కావేళకు; ఆననంబునన్ వైచికొని = నోటిలో వేసికొని; కొందఱు = వేఱొక కొందరు; ఎండినవి ఆకులు = ఎండి నేల రాలిన ఆకులను; ఏఱికొని కొందఱు = ఎత్తుకొని కొందరు; అంబువుల్ = నీళ్ళు; కొని = గ్రహించి, త్రాగి; కొందఱు = కొంతమంది; అనిలంబున్ = గాలిని (పీల్చుకొని); కొందఱు = కొంతమంది; ఆహారంబు కొందురు= భుజిస్తారు; అట్లున్+కాక = ఆ మాదిరిగా కాక అనగా పవన పర్ణాంబు భక్షులే కాకుండా; ఆహార పరులును = అన్నం ఆరగించేవారు కూడ; కలరు = ఉన్నారు; వారలు = ఆ మహనీయులు; ఇంద్రునకున్ = దేవతా వల్లభుడికి; పూజనీయులు+ఐ = పూజించదగిన వారై; ఎక్కుడు+ఐన+పదవిన్ = ఉన్నతమైన స్థానంలో; చిరకాల = దీర్ఘ కాలం; బహుసౌఖ్యభాగులు+అగుదురు+అని = పెక్కు సుఖాలు అనుభవిస్తారని చెప్పి; మహేశ్వరుఁడు = పరమ శివుడు; ఉమకున్ = పార్వతికి; మఱియున్ = ఇంకనూ; ఇట్లు+అనియెన్ = ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** వైఖానసు లనేవారు కఠోరనియమాలు కలవారు. వారిలో కొందరు నివ్వరివడ్లు మొదలైన తృణధాన్యాలను తెచ్చి రాతిమీద నలగగొట్టి లేదా రోటిలో వేసి దంచుకొని తింటారు. కొందరు పండ్లు మొదలైన వాటిని పళ్ళతో కొరికి తింటారు. కొందరు కంటికి కనిపించిన గింజలను పక్షులమాదిరిగా అప్పటికప్పుడు నోటిలో వేసికొంటారు. కొందరు ఎండుటాకులను ఏరుకొని తింటారు. కొందరు నీళ్ళు త్రాగి బ్రతుకుతారు. గాలిని మాత్రమే పీల్చి కొందరు జీవిస్తారు. ఆహారం భుజించేవారు కూడ కొంద రున్నారు. వీరందరూ దేవేంద్రుడికి కూడా పూజించదగిన వారై చాలకాలం పలురకాల సౌఖ్యాలు అనుభవిస్తూ ఉన్నతపదవులలో విరాజిల్లుతుంటారు' అని మహాదేవుడు మహేశ్వరికి చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**వ.** **'ఇవి యెల్లను వానప్రస్థ నియమ నిష్ఠా భేదంబులు; తపంబు తపంబని మును లాచరింతురు దాని తెఱం గెఱింగింపు మని నీవు తొల్త నడిగిన విధంబునం దొడంగి నా చెప్పిన విధంబు లన్నియుం దపంబను శబ్దంబున కర్థంబులైయుండు'నని చెప్పి 'యంగుష్ఠ ప్రమాణదేహులు మృగాజిన వసనులు నిర్ద్వంద్వులు నై వాలఖిల్యు లను పేరం బ్రసిద్ధులగు మునులు దినకర దీప్తులతోడం గూడి వర్తించుచుండుదురు; వారల తపో వైభవంబునం గాదె జగంబులు సుస్థిరంబులై యున్నయవి; యొండుమెయి దుర్లభంబు లైనట్టివి తపంబున సులభంబులగుం; దపంబు గడచిన ధర్మంబుగలదే?'యని పలికి యాదరాతిశయంబున శివుండు శైలేంద్రతనయతో 'ధర్మంబులు మఱియు నెఱింగించెద; నవహితవై యాకర్ణింపు'మని యిట్లనియె. 29**

**ప్రతిపదార్థం:** ఇవి+ఎల్లను = ఈ చెప్పినవన్ని; వానప్రస్థ నియమనిష్ఠా భేదంబులు = వానప్రస్థాశ్రమాలలో ఉన్నవారియొక్క వ్రత నిష్ఠలలోని తేడాలు; తపంబు తపంబు+అని = తపస్సు తపస్సు అంటూ; మునులు; ఆచరింతురు = చేస్తారు; దాని తెఱంగు = ఆ తపోవిధానం ఎఱింగింపుము; అని; నీవు; తొల్తన్ = మొదట; అడిగిన విధంబునన్ = ప్రశ్నించిన ప్రకారం;

తొడంగి = పూనుకొని; నా చెప్పిన = నేను వచించిన; విధంబులు+అన్నియున్; తపంబు+అను = తపస్సు అనేటటువంటి; శబ్దంబు నకున్ = మాటకు; అర్థంబులు+ఐ+ఉండున్; అని చెప్పి = అని శివుడు వచించి; అంగుష్ఠ ప్రమాణ దేహులు = బొటన వ్రేలెడు పొడవున్న శరీరం కలవారు; మృగ+అజినవసనులు = జింకతోళ్ళు వస్త్రములుగా కలవారు, అనగా జింక చర్మాలు ధరించేవారు; నిర్ద్వంద్వులున్+ఐ = సుఖ దుఃఖములు అనే జంటలకు లోబడనివారై; వాలఖిల్యులు+అను పేరన్ = వాలఖిల్యులు అనే నామంతో; ప్రసిద్ధులు+అగు మునులు = ప్రఖ్యాతులైన మౌనులు; దినకర దీప్తుల తోడన్ కూడి = సూర్యకిరణ తేజంతో కూడినవారై; వర్తించుచున్+ఉండుదురు = లోకంలో మెలగుతుంటారు; వారల తపః+వైభవంబునన్+కాదు+ఎ = ఆ వాలఖిల్యుల తపస్సు యొక్క మహిమవలననేకదా; జగంబులు = లోకాలు; సుస్థిరంబులు+ఐ = గట్టి నిలుకడ గలవై; ఉన్న+అవి = ఉన్నాయి; ఒండు మెయిన్ = మరొక మార్గంలో; దుర్లభంబులు+ఐన+అట్టివి = పొందుటకు శక్యంకానివి; తపంబునన్; సులభంబులు+అగున్ = సులువుగా పొంద తగినవి అవుతాయి; తపంబుక+డచిన = తపస్సునకు మించిన; ధర్మంబు; కలదు+ఏ? = ఉన్నదా? (లేదని తాత్పర్యం); అని పలికి = అంటూ ఈశ్వరుడు వచించి; ఆదర+అతిశయంబునన్ = మిక్కిలి మన్ననతో; శివుండు; శైల+ఇంద్ర తనయతోన్= పర్వతరాజ పుత్రికతో; ధర్మంబులు; మఱియున్ = ఇంకనూ; ఎఱింగించెదన్; అవహితవు+ఐ= సావధానచిత్తవై; ఆకర్ణింపుము = వినుము; అని, ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'దేవీ! నే నింతవరకు చెప్పిన వన్నీ వానప్రస్థాశ్రమ నియమాలలోని విశేషాలు. తపస్సు తపస్సు అంటూ మునీశ్వరులు ఆసక్తితో ఆచరిస్తారే ఆ తప స్స్వరూప మెట్లాంటిదో వ్యాఖ్యానించు మని మునుపు నీ వడిగావు. కనుక నేను చెప్పినవన్నీ తపస్సు క్రిందికే వస్తాయి. మరి బొటనవ్రేలంత శరీరాలు గలిగిన వాలఖిల్యులనే మునీశ్వరు లున్నారు. వారు మిక్కిలి ప్రసిద్ధులు. జింక చర్మాలు వస్త్రాలుగా ధరిస్తారు. సుఖదుఃఖాదులైన ద్వంద్వాలకు వారు అతీతులు. సూర్య కిరణ కాంతులతో కూడి సన్మార్గము నాశ్రయించి ప్రవర్తిస్తుంటారు. వారి తపోమహిమ వలన లోకాలు నిశ్చలంగా నిలిచి ఉన్నాయి. ఇతర సాధనాలతో సమకూడని ప్రయోజనాలు తపస్సాధన వలన తేలికగా సిద్ధిస్తాయి. తపస్సును మించిన ధర్మం మరొకటి లే'దని తెల్పి పరమాదరంతో పరమేశ్వరుడు పార్వతితో, 'తరుణీ! మరి కొన్ని ధర్మాలు తెల్పుతాను సావధానచిత్తవై విను'మని ఇట్లా అన్నాడు.

**విశేషం:** శ్రీమన్నారాయణ స్వరూపుడైన సూర్యభగవానుడు చైత్రం మొదలు ఫాల్గున మాస పర్యంతం ఒక్కో నెలలో ఒక్కో పేరుతో ఆర్గురు అనుచరులతో కూడిన వాడై తనను ఉపాసించే వారి పాపాలు పోకారుస్తాడు. తనకు అభిముఖంగా అరవైవేలమంది వాలఖిల్య మహర్షులు స్తుతిస్తూ అరుగుతుండగా సంచరిస్తాడని భాగవతపురాణం చెప్పుతోంది. వాలఖిల్యులు వియన్మార్గంలో సూర్యకిరణాలతోపాటు సాగిపోతూ సంచరిస్తారని భావం.

**ఉ. అంబుజసూతి యేర్పడ గృహస్థ సమర్థముగాఁ బ్రవృత్తి ధ**
**ర్మంబు నొనర్చె; నార్యజన మాన్యము దాని తెఱంగు చాల సూ**
**క్ష్మం; బతి కాంక్షలేక తగుకాలమునన్ సమచిత్తవృత్తి ని**
**త్యంబును ధర్మముఖ్యముగ నర్థముఁ గామముఁ జల్పు టొప్పగున్. 30**

**ప్రతిపదార్థం:** అంబుజసూతి = పద్మమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు; ఏర్పడన్ = స్పష్టంగా; గృహస్థ సమర్థముగాన్ = గృహస్థుడికి తగినట్లుగా; ప్రవృత్తి ధర్మంబున్ = ఐహిక ఫలసాధనమైన ప్రవృత్తి రూపవైదిక ధర్మాన్ని; ఒనర్చెన్ = చేశాడు; దానితెఱంగు = ఆ ప్రవృత్తి ధర్మం యొక్క స్వరూపం; ఆర్యజనమాన్యము = పెద్దలచేత ఆదరించబడింది; చాల సూక్ష్మంబు

= ఆ ధర్మం దురవ గాహం, అగోచరం, మిక్కిలి సున్నితం; అతి కాంక్షలేక = మిక్కిలి ఆశలేక; సముచిత వృత్తిన్ = సరి అయిన మనో వర్తనతో; తగుకాలమునన్ = తగిన సమయంలో; నిత్యంబును = ప్రతిదినం; ధర్మ ముఖ్యముగన్ = ధర్మమే ప్రధానంగా, ధర్మానికి విరుద్ధం గాకుండా; అర్థమున్ = అర్థ పురుషార్థాన్ని, ద్రవ్యాన్ని; కామమున్ = కామ పురుషార్థాన్ని, సుఖానుభవాన్ని; చల్పుట = సాధించుట; ఒప్పు+అగున్ = తగును.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు గృహస్థుడికి తగినట్లు ప్రవృత్తి ధర్మాన్ని కల్పించాడు. అది పెద్దలందరిచేత ఆదరించబడింది. ఆ ప్రవృత్తి ధర్మం మిక్కిలి సూక్ష్మ మైనది. పేరాసలేక సమచిత్తంతో యుక్తకాలంలో ధర్మమే ప్రధానంగా భావించి ద్రవ్యార్జన చేయాలి. ఆర్జించిన ధనంతో ధర్మానికి అవిరుద్ధంగా భోగాలు అనుభవించాలి - అనగా కోరికలు తీర్చుకొనాలి. ఇట్లా అర్థకామపురుషార్థాలు గృహస్థు సాధించటం సమంజసం.

**చ. అతఁడు నివృత్తి ధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షణో**
**ద్యత మది తత్ప్రకారములు దాంతియు భూతచయంబుపై దయా**
**రతియును సత్యదృష్టియు విరాగత యింద్రియకోటికిన్ దృఢ**
**స్థితముగఁ జేసి యోగనిరతిం బరిశాంతి యొనర్చికొంటయున్. 31**

**ప్రతిపదార్థం:** అతఁడు = సృష్టికర్త అయిన బ్రహ్మ; నివృత్తి ధర్మము = మోక్షఫల సాధనమైన నివృత్తిరూప ధర్మాన్ని; ప్రయత్నమునన్ = పూనికతో; వివరించెన్ = వెల్లడించాడు; అది = ఆ నివృత్తి ధర్మం; మోక్షణ+ఉద్యతము = ముక్తి కొరకైన యత్నం; దాంతియున్ = బహిరింద్రియ నిగ్రహం; భూతచయంబు పైన్ = ప్రాణుల సమూహం మీద; దయారతియున్ = దయాగుణంలో పరమ ప్రీతియూ; సత్య దృష్టియున్ = సత్యమునందు చూపు; విరాగత = ఆత్మేతరములందు విరక్తి; దృఢస్థితముగన్+చేసి = ఏమాత్రం చలించకుండేటట్లు చేసి-గట్టి నిలుకడ కలిగించి; యోగనిరతిన్ = యోగమందు ఆసక్తిచేత; ఇంద్రియ కోటికిన్ = ఇంద్రియముల సమూహానికి; పరిశాంతి+ఒనర్చి కొంటయున్ = సంపూర్ణమైన ఉపశమనం కలిగించు కొనటం; తత్ప్రకారములు = ఆ నివృత్తి ధర్మస్వరూపాలు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు నివృత్తి ధర్మాన్ని పూనికతో వివరించాడు. ఆ నివృత్తి ధర్మం ముక్తి ఫలసాధనం. వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియాలను యోగ్య కర్మలలో ప్రవర్తింపజేయటం, జీవుల సముదాయంపై దయగలిగి ఉండటం, సత్యముపై దృష్టి ఉంచటం, ఆత్మకంటె ఇతరములైన వాటియందు విరక్తి, యోగకౌశలంవలన ఇంద్రియాలకు చలనం మాన్పి, గట్టి నిలుకడ కూర్చి వాటికి సంపూర్ణమైన శాంతి నొసంగటమే ఆ నివృత్తి ధర్మ ప్రకారమై ఉన్నది.

**వ. అని మఱియును. 32**

**తాత్పర్యం:** అని పలికి శంకరుడు మరల ఇట్లా అన్నాడు.

**తే. 'క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి । యతిథి వచ్చినఁ బ్రియమున నతని దప్పి**
**వోవునట్లుగ సముచితభోజనంబు । వెట్టు టెల్ల పుణ్యములకుఁ బెద్ద తలఁప. 33**

**ప్రతిపదార్థం:** క్షుత్ పిపాసలచేన్= ఆకలి దప్పులచేత; కడున్ = మిక్కిలి; కుందినట్టి = డస్సినటువంటి; అతిథి =

ఆగంతుకుడు; వచ్చినన్ = రాగా; ప్రియమునన్= ప్రేమతో; అతని డప్పి = అతని యొక్క శ్రమ; పోవునట్లుగన్ = తొలగేటట్లు; సముచిత భోజనంబు= మిక్కిలి తగిన భోజనం; పెట్టుట; ఎల్ల పుణ్యములకున్= అన్ని ధర్మాలలోనికి; తలం పన్= భావించగా; పెద్ద= దొడ్డది.

**తాత్పర్యం:** ఆకలి దప్పులతో నొచ్చి యింటికి వచ్చిన అతిథికి ఆదరంతో అన్నం పెట్టి అతడి బడలిక తీర్చడం పుణ్యాలన్నింటిలో గొప్ప పుణ్యం.

**విశేషం:** అతిథిః తిథులతో నిమిత్తం లేకుండ ఆకలి దప్పులు తీర్చుకొనటానికి వచ్చినవాడు, భోజన సమయానికి వచ్చినవాడు.

**క. దీనికి నఖిలాశ్రమ సువి । ధానంబులకును గృహస్థతయ నెల వగుటన్**
**దాని పదాఱవ పాలి స । మానముగా దరయ నాశ్రమం బెయ్యదియున్.' 34**

**ప్రతిపదార్థం:** దీనికిన్ = ఈ చెప్పిన అతిథి సుకృతానికి; అఖిల+ఆశ్రమ సువిధానంబులకున్ = బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములనే నాలుగు ఆశ్రమాల యొక్క మంచి పద్ధతులకును; గృహస్థతయ = గార్హస్థ్య ధర్మమే; నెలవు+అగుటన్ = ఉనికిపట్టు కావటంచేత; ఆశ్రమంబు+ఎయ్యదియున్ (ఏ+అది = ఏయది, ఎయ్యది) = ఏ యాశ్రమం కూడ; అరయన్ = పరికించగా; దాని పది+ఆఱవపాలి= ఆ గృహస్థాశ్రమ ధర్మము యొక్క షోడశాంశమునకు కూడ; సమానము+కాదు= సాటిరాదు.

**తాత్పర్యం:** సఖీ! ఈ చెప్పిన అతిథి సత్కారానికీ, తక్కిన ఆశ్రమాల మనుగడకూ (ఉనికికీ) గృహస్థాశ్రమమే ఆధారం కనుక ఏ ఆశ్రమం కూడ దీని పదారవభాగానికి గూడ సమానం కాదు. అనగా చతురాశ్రమాలలో గృహస్థాశ్రమమే కడుదొడ్డదని భావం.'

**క. అన విని 'గృహస్థునకు నే । పనిముఖ్యం?' బనియె గిరిజ; పశుపతి 'జననీ**
**జనకారాధన మతనికి । ననుపమ మగునట్టి ధర్మ' మని రూపించెన్. 35**

**ప్రతిపదార్థం:** అనన్+విని = అని చెప్పగా ఆలించి; గిరిజ = పార్వతి; గృహస్థునకున్ = సంసారికి; ఏ పని ముఖ్యంబు+ అనియెన్ = ఏ కార్యం ప్రధానమని అడిగింది. (అందుకు); పశుపతి= శివుడు; అతనికిన్ = గృహస్థునకు; జననీజనక+ ఆరాధనము = తలి దండ్రులను పూజించటం; అనుపమము+అగునట్టి = పోలిక లేనట్టి; ధర్మము+అని = పుణ్య కార్యమని; రూపించెన్ = నిర్ణయించాడు.

**తాత్పర్యం:** పరమశివుడి పలుకులు విని పార్వతి 'ప్రాణేశ్వరా! గృహస్థుడికి ఏ పని ముఖ్యం?' అని ప్రశ్నించింది. 'అతడికి తలిదండ్రులపూజ ముఖ్యమైన' దని శివుడు బదులు పలికాడు.

**వ. అ ద్దేవుండు వెండియు. 36**

**తాత్పర్యం:** భగవంతుడైన శివు డింకా (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'పతి భక్తి ముఖ్య ధర్మము । సతి' కనవుడు, దేవి 'నరుఁడు జననీ జనకుల్**
**మృతు లైనను, నాతి విగత । పతిత్వ మొందినను జేయు పను లెయ్యవియో?' 37**

**ప్రతిపదార్థం:** సతికిన్ = భార్యకు; పతి భక్తి = మగని యందు భక్తి; ముఖ్య ధర్మము = ప్రధానమైన ధర్మం; అనవుడున్ = అని శంభుడు చెప్పగా; దేవి = గౌరి; నరుఁడు = మనుష్యుడు; జననీ జనకుల్ = మాతా పితలు; మృతులు+ఐనన్ = చని పోయినను; నాతి = స్త్రీ; విగత పతిత్వము+ఒందినను = పెనిమిటిని కోల్పోయినను; చేయుపనులు = ఆచరించవలసిన కార్యాలు; ఏ+అవి+ఓ(ఎయ్యవియో)? = ఎట్టివో? (అని అడిగింది).

**తాత్పర్యం:** 'సతికి పతిసేవే ప్రధాన కర్తవ్య' మని పరమశివుడు పలుకగా భవాని 'నాథా! గృహస్థు తలిదండ్రులను, భార్య భర్తను కోల్పోయి నపుడు వారు చేయవలసిన పను లేమిటో సెలవిం' డని కోరింది.

**వ. అనుటయు నభవుండు 'వారి వర్తనంబు లెఱింగించెద విను' మని యిట్లనియె. 38**

**ప్రతిపదార్థం:** అనుటయున్ = అని కోరగా; అభవుండు = శంకరుడు; వారి వర్తనంబులు = వారు నిర్వహించవలసిన విధులు; ఎఱింగించెదన్; వినుము; అని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** పార్వతి ప్రశ్న విని శంకరుడు, 'ఉమా! నీవు అడిగిన వారి కర్తవ్య కర్మ లేమిటో తెలుపుతాను విను' మని ఇట్లా అన్నాడు.

**క. 'దేవాతిథి పితృ పూజలు । గావించుట భావశుద్ధి కలిమి నరునకున్**
**దేవీ! వలయును వారికి । నే విధమున బ్రహ్మచర్య మేమఱమి తగున్.' 39**

**ప్రతిపదార్థం:** దేవ+అతిథి+పితృపూజలు = దేవతల యొక్క, అతిథుల యొక్క, పితృ దేవతలయొక్క పూజలు; కావించుట = చేయుట; నరునకున్ = మనుజుడికి; భావ శుద్ధి కలిమి = భావంలో నిర్మలత్వం ఉండడం; వలయును= కావాలి; దేవీ!= ప్రియురాలా!; ఏ విధమునన్ = ఏ రీతిగానైనా; వారికిన్ = పతివిహీనలకు, విధవరాండ్రకు; బ్రహ్మచర్యము = బ్రహ్మచర్యవ్రతపాలనం; ఏమఱమి = మఱవకుండటం; తగున్ = ఒప్పును.

**తాత్పర్యం:** 'ప్రియురాలా! దేవతల, పితృదేవతల, అతిథుల పూజలు సక్రమంగా నడపటం చిత్తశుద్ధి కల్గి ఉండటం నరులకు ముఖ్యం. బ్రహ్మచర్య వ్రతాన్ని ఏ విధంగానైనా ఏమరకుండటం విధవలకు యుక్తం.

**వ. అని నిర్దేశించి మఱియును. 40**

**తాత్పర్యం:** అని నిర్ణయపూర్వకంగా చెప్పి పరమేశ్వరుడు ఇంకా (ఇట్లా అన్నాడు అని తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'పంచపర్వ సురత పరిహృతితో నిజ । దార తృప్తుఁ డగుచు ధాన్యకోటి**
**పక్షి యెలుక దినిన బ్రతుకుఁగాఁ గను గృహ । పతికి నశ్వమేధ ఫలము గలుగు.' 41**

**ప్రతిపదార్థం:** పంచపర్వ = అయిదు పర్వములందు అనగా అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సూర్యసంక్రాంతి దినములందు; సురత పరిహృతితోన్ = సంభోగం వర్జించటంతో పాటు; నిజదారతృప్తుఁడు+అగుచున్ = తన భార్యతో సంభోగించి సంతుష్టి చెందుతూ; ధాన్యకోటిన్ = తన యింటిలోని ధాన్య సమూహమును; పక్షి = పిట్ట; ఎలుక = మూషికం; తినినన్ = తింటే; బ్రతుకున్ +గాక = అవి తిని జీవించుగాక; అను = అని పల్కునట్టి; గృహపతికిన్ = ఇంటియజమానుడికి-గృహస్థుడికి; అశ్వమేధ ఫలము = అశ్వమేధ యాగం చేస్తే లభించే ఫలం; కలుగున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** 'నెలలో వచ్చే అష్టమి, చతుర్దశి, పున్నమ, అమావాస్య, రవి సంక్రాంతి తిథులందు సంగమం వదలి, కేవలం తన భార్య కలయికతోనే సంతృప్తి చెందుతూ, తన గృహంలోని ధాన్యరాశిని పక్షులు, ఎలుకలు తింటుంటే వాటిని హింసించకుండా, అవిగూడ తిని బ్రదుకు గాక అని భావించే గృహమేధి అశ్వమేధయాగం చేసినవారు పొందే ఫల మెంతటిదో, అంతటి ఫలాన్ని పొందుతాడు.'

**విశేషం:** పై పద్యంలోని మూడవ పాదం "పక్షి యెలుక దినిన బ్రతుకుఁగాఁగను గృహపతికి" అని ఉన్నప్పుడు ఆ పాఠానికి ధాన్యకోటిని పక్షులు, ఎలుకలు కేవలం జీవించడానికి మాత్రమే తిన్న చందంగా, కేవలం భోగకాంక్షతో గాకుండా బ్రతుకు వెళ్ళబుచ్చడానికే ఆహారం స్వీకరించే గేస్తు హయమేధయాగ ఫలాన్ని పొందుతాడని అర్థం చెప్పుకోవచ్చును.

**వ. అని చెప్పి. 42**

**తాత్పర్యం:** ఈ విధంగా పలికి.

**ఆ. 'ఎచట మెలఁగె నేమి యెట్లుండె నేమి దా । నేమి సేసె నేమి యెల్ల సంగ**
**ములును విడిచి కుడుపు వలన నియతి గల్గు । యతికి మోక్షవీథి యాటపట్టు'. 43**

**ప్రతిపదార్థం:** ఎచటన్ = ఎక్కడ; మెలఁగెన్+ఏమి = ఎట్లు ప్రవర్తించినా; ఎట్లు+ఉండెన్+ఏమి = ఎక్కడ నివసించినా; తాన్ = తాను; ఏమిచేసినన్+ఏమి = ఎట్టి పనులు చేసినా; ఎల్ల సంగములును విడిచి = సర్వ సంగపరిత్యాగ మొనర్చి; కుడుపు వలనన్ = ఆహార విషయంలో; నియతి+కల్గు = నియమమున్న; యతికిన్ = సన్న్యాసికి; మోక్షవీథి = ముక్తి పథం; ఆట పట్టు = క్రీడారంగం, విహార స్థలం, సులభసాధ్యం.

**తాత్పర్యం:** 'ఎక్కడ ఎట్లా ప్రవర్తించినా, ఎట్లా ఉన్నా, ఎట్టి పనులు చేసినా సర్వ సంగములనూ పరిత్యజించి, ఆహార విషయంలో నియమ మున్న యతీశ్వరుడికి ముక్తి కరతలామలకం.'

**వ. అనిన విని సంప్రీతయై శైలరాజపుత్రి పురహరునితో 'రాజనువానికి భూజనంబుల యట్ల శరీరంబును భోజనాదులును నట్లయుండియు నతం డెల్లవారలచే మ్రొక్కు గొనుటకు, నిగ్రహానుగ్రహం బులకుం జాలి సర్వాధికత్వంబున శోభిల్లు దానికిం గారణం బేమి ? యెఱింగింపవే' యనుటయు నీశానుం డిట్లనియె.44**

**ప్రతిపదార్థం:** అనినన్+విని = అని శంకరుడు చెప్పగా ఆలకించి; సంప్రీత+ఐ = సంతోషించినదై; శైలరాజపుత్రి = హిమవంతుడి కూతురైన సర్వమంగళ; పురహరునితోన్ = త్రిపుర ధ్వంసకుడైన రుద్రుడితో; రాజు+అనువానికిన్ = ప్రభువనే వాడికి; భూజనంబుల+అట్ల = పుడమిలోని జనుల వలెనే; శరీరంబును = దేహమూ; భోజన+ఆదులును = ఆహారం మొదలైనవి; అట్లు+అ+ఉండియున్ = భూమియందలి నరుల వలెనే ఉన్నప్పటికినీ; అతండు = రాజు; ఎల్లవారలచేన్ = మనుష్యులందరి చేత; మ్రొక్కు కొనుటకున్ = నమస్కారాలు స్వీకరించడానికినీ; నిగ్రహ+అనుగ్రహంబులకున్ = శిక్షించుటకునూ,

రక్షించుటకునూ; చాలి = సమర్థుడై; సర్వ+అధికత్వంబునన్ = అందరికంటె అధికుడై; శోభిలున్ = ప్రకాశిస్తాడు; దానికిన్ = అట్లా రాజు వెలుగొందటానికి; కారణంబు+ఏమి? = హేతువేమిటి?; ఎఱింగింపవు+ఏ = తెలుపుమా; అనుటయున్ = అని అంబిక అడుగగా; ఈశానుండు = శివుడు; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పరమశివుడు అట్లా పలుకగా సంతోషించి పార్వతీదేవి ఆయనతో 'సర్వజ్ఞా! రాజనేవాడికి లోకం లోని నరులకు వలెనే శరీరమున్నది. వారికి వలెనే భోజనమజ్జనాదులు కూడ సాగుతాయి. అయినప్పటికీ రాజు తక్కిన వారికంటె అధికుడై అందరి వందనాలు అందుకొంటాడు. ప్రజలను దండించటానికీ, పరిరక్షించటానికీ అతడు సామర్థ్యం కలిగి ఉంటాడు. ఇందుకు కారణమేమిటో వివరించండి-' అని వేడగా మహేశ్వరుడిట్లా అన్నాడు.

### శివుఁడు పార్వతికి రాజత్వ మహిమాతిశయంబు చెప్పుట. (సం.13-అను- 1-15-895)

**సీ.** **'అధికపుఁదపమున నైనది రాజత్వ; ၊ మట్లు గావునఁ బేర్మి నతిశయిల్లు;**
**జనములచే మ్రొక్కుగొనుటకు నిగ్రహం ၊ బునకు ననుగ్రహంబునకు శక్తుఁ**
**డై యుండు నతఁడు; తదీయ సునీతియ ၊ విను ముదమున రాజు వినయపరునిఁ**
**జేసి యెల్లజనంబు శిక్షించు, నింద్రియ ၊ జయమును నరివర్గజయముఁ బడయు,**

**తే.** **నెఱిఁగి యుపధా విశుద్ధుల నిడు నమాత్య ၊ పదవి, కనురక్త సారవద్బలముఁ బ్రోచు;**
**హితవరుల మిత్త్రులుగఁ గొను నిలకు మేలొ ၊ నర్చు, దుర్గంబు రక్షించుఁ, గూర్చు ధనము. 45**

**ప్రతిపదార్థం:** రాజత్వము = రాజగుట, రాచరికం; అధికము+తపమునన్ = మిక్కుటమైన తపస్సు చేత; ఐనది = లభిస్తుంది; అట్లు+కావునన్ = తపశ్చర్యయే దొరతనానికి హేతు వవటం చేత ; అతఁడు = ప్రభువు, పేర్మిన్ = గౌరవంతో; అతిశయిల్లున్ = పెంపొందుతాడు; జనములచేన్ = ప్రజలచేత; మ్రొక్కున్+కొనుటకున్ = వందనాలు స్వీకరించటానికి; నిగ్రహంబునకున్ = దండించటానికి; అనుగ్రహంబునకున్ = దయదలచి కాపాడటానికి; శక్తుఁడు+ఐ+ఉండున్ = చాలినవాడై, దక్షుడై ఉంటాడు; విను = గౌరీ! చెవి యొగ్గి ఆలకించుము; తదీయ సునీతి+అ = వాని యొక్క మంచినీతియే; ముదమునన్ = సంతోషంతో; రాజున్ = నృపాలుడిని; వినయపరునిన్+చేసి = అడకువ కలవాడినిగా ఒనర్చి; ఎల్ల జనంబున్ = సమస్త ప్రజలను; శిక్షించున్ = అణకువ గలవారినిగా చేస్తుంది; ఇంద్రియ జయమును = ఇంద్రియముల యొక్క గెలుపును; అరివర్గ జయమున్ = శాత్రవ సమూహము యొక్క గెలుచుటను; పడయున్ = పొందుతుంది; ఉపధా విశుద్ధులన్ = గుణశీల పరీక్షలో నెగ్గిన పవిత్రులైన వారిని; ఎఱిఁగి = తెలిసి; అమాత్యపదవికిన్+ఇడున్ = మంత్రి పదవులలో నిలుపుతుంది; అనురక్త = తనయందు అనురాగం గల; సారవత్ = చేవ గలిగిన; బలమున్ = సైన్యమును; ప్రోచున్ = కాపాడుతుంది; హితవరులన్ = తనకు మేలుచేయటంలో ఆసక్తి కలవారిని; మిత్రులుగన్ = స్నేహితులుగా; కొనున్ = స్వీకరిస్తుంది; ఇలకున్ = ధరణికి, జనులకు; మేలు+ఒనర్చున్ = క్షేమం కలిగిస్తుంది; దుర్గంబున్= కోటను, రక్షించున్ = కాపాడుతుంది; ధనమున్ = విత్తాన్ని; కూర్చున్ = సమకూరుస్తుంది, చేరుస్తుంది.

**తాత్పర్యం:** 'చేసిన తపస్సుకు ఫలంగా రాజుగా జన్మించడం జరుగుతుంది. కనుక రాజు గౌరవపాత్రుడై వెలుగొందుతాడు. భూపతి జనుల నమస్కారాలు గైకొనడానికి, వారిని దండించటానికి, దయతో కాపాడటానికి తగిన వాడై ఉంటాడు. అత డనుసరించే మంచినీతి అతడిని అణకువ కలవాడినిగా తీర్చిదిద్ది ప్రజలందరినీ

నీతిమార్గంలో నడిపిస్తుంది. ఆ నీతివలననే భూవల్లభుడు ఇంద్రియజయం, శాత్రవ జయం పొందుతాడు. చక్కగా యోచించి గుణశీలపరీక్షలో ఉత్తీర్ణులైన పవిత్రులను మాత్రమే మంత్రి పదవులలో నియమిస్తాడు. తనయందు ప్రేమ విశ్వాసాలున్న, చేవగలిగిన సేనలను దయతో పోషిస్తాడు, తనకు మేలుచేసే వారినే స్నేహితులుగా చెంతకు చేర్చు కొంటాడు. ఆత డనుసరించే నీతి జనులకు క్షేమం కలిగిస్తుంది. దుర్గాన్ని రక్షిస్తుంది. ధనాన్ని సమకూరుస్తుంది.

**విశేషం:** జ్ఞానేంద్రియాలు : కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక

కర్మేంద్రియాలు : వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ.

పాయువు అనగా మల ద్వారం; ఉపస్థ అనగా మూత్రద్వారం. ఇవి పది. మనస్సు ఒకటి మొత్తం ఇంద్రియాలు పదకొండు. వాటిని జయించట మంటే అవి అసన్మార్గంలో చరించకుండా సన్మార్గంలో వర్తించేటట్లు చూడటం.

**వ. ఇవ్విధంబున సప్తాంగ సంపన్నత్వంబు నొంది. 46**

ఇవ్విధంబునన్= పై పద్యంలో నిరూపించిన విధంగా.

**తాత్పర్యం:** రాజు ఈ విధంగా సప్తాంగ సంపత్తి పొందినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సప్త+అంగములు = సప్తాంగములు

1.రాజు, 2.అమాత్యుడు, 3.మిత్రుడు, 4.బొక్కసం, 5.రాజ్యం, 6.దుర్గం, 7. సైన్యం

"స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలాని చ" అని ఈ విషయాన్నే అమరకోశం వివరించింది.

**క. చేయఁ డపాత్రవ్యయములు । సేయుం బాత్రవ్యయంబు సేయున్ నిజ ర**
**క్షాయత్న మెల్లతెఱఁగులఁ । బాయక ధర్మంబు సేయుఁ బాపము దొఱఁగున్. 47**

**ప్రతిపదార్థం:** అపాత్రవ్యయములు చేయఁడు = అనర్హములైనవాటికి డబ్బు వెచ్చించడు; పాత్ర వ్యయంబు+చేయున్ = తగినవాటికే వెచ్చిస్తాడు; నిజరక్షాయత్నము = తనను కాపాడుకొనే ప్రయత్నం; ఎల్ల తెఱఁగులన్ = అన్నివిధాల; చేయున్ = చేస్తాడు; పాయక = ఉడుగక, మానక; ధర్మంబు+చేయున్ = పుణ్యకార్యాలు ఆచరిస్తాడు; పాపంబు+తొఱఁగున్ = పాప కృత్యాలు మానుతాడు.

**తాత్పర్యం:** ప్రభువైనవాడు చేయదగని వ్యయం చెయ్యడు. అర్హమైన వాటికి వెచ్చించడంలో వెనుకంజ వేయడు. తన్ను సకలవిధాల సంరక్షించుకొనటంలో ఏమరుపాటు వహించడు. పుణ్యకార్యాలు చేస్తాడు. పాపకార్యాలు మానుతాడు.

**ఆ. ఆచరించు దండ మక్రోధకాముఁడై । చారదృష్టిఁ జూచు శత్రు కృత్య**
**ములను, నాత్మదేశ పుర పరివారవి । ధముల సత్యభాషణముల నెగడు. 48**

**ప్రతిపదార్థం:** అక్రోధకాముఁడు+ఐ = కోపం, ప్రేమ లేనివాడై; దండము = శిక్ష; ఆచరించున్ = విధిస్తాడు; శత్రుకృత్యములను = విరోధులుచేసే పనులను; ఆత్మదేశ = తనదేశమందలి; పుర = పట్టణాలలోని; పరివార = బలగముయొక్క; విధములన్

= తీరు తెన్నులను, పోకడలను; చారదృష్టిన్ = వార్తలు తెచ్చే వేగుల వాంధ్రు అనే కళ్ళతో; చూచున్ = కనుగొంటాడు; సత్యభాషణములన్ = సత్యవాక్యము లాడుతూ; నెగడున్ = వెలుగొందుతాడు.

**తాత్పర్యం:** న్యాయవిచారణ సలిపి శిక్ష విధించేటప్పుడు పరాయివాడని ఒకడిపై కోపంగాని, తనవాడని మరొకడిపై ప్రేమగాని చూపడు. తనకు విరోధులైన ఇరుగు పొరుగు రాజ్యాలలోనివారు చేసే పనులనూ, తన రాజ్యమందలి జనులూ, పట్టణాలలోని ప్రజలూ, తన సేవకులూ తననుగూర్చి ఏమనుకొంటున్నారో వేగులవాంధ్రు అనే కన్నులతో చూచి తెలుసుకొంటాడు. సత్యవాక్పరిపాలకుడై విఖ్యాతి వహిస్తాడు.

**క. ఉద్యోగము ప్రియవాదిత ।విద్యాపరినిష్ఠ సంధి విగ్రహ విహతా**
**వద్యత దీనానాథ వి । పద్యాపన మాజ్ఞవెరవు పాటించుఁ దగన్. 49**

**ప్రతిపదార్థం:** ఉద్యోగము = ప్రయత్నం; ప్రియవాదిత = ప్రేమగా మాట్లాడటం; విద్యాపరినిష్ఠ = విద్యలయందు మిక్కిలి అక్కర; సంధి విగ్రహ విహత+అవద్యత = సంధి విగ్రహాలనే తంత్రాల చేత దోషాలు పోగొట్టుకొనటం; దీన+అనాథ+ విపద్+యాపనము = దీనుల యొక్క, దిక్కులేని వారి యొక్క ఆపదలను తొలగించటం; ఆజ్ఞ వెరవు = ఆజ్ఞ లివ్వటంలో నేర్పు; తగన్ = ఒప్పిదంగా, పాటించున్ = ప్రభువు అనుసరిస్తాడు.

**తాత్పర్యం:** రాజైనవాడు యత్న పరుడు కావాలి. ప్రియంగా సంభాషించాలి. విద్యలయందు శ్రద్ధాసక్తులు గలిగి ఉండాలి. సంధి విగ్రహం మొదలైన షట్తంత్ర ప్రయోగనైపుణివల్ల ఏర్పడ్డ చిక్కులు తొలగించుకొనాలి. దీనుల యొక్క, దిక్కుమాలినవారి యొక్క ఆపదలు తొలగించాలి; ఆజ్ఞలిడి పనులు చేయించటంలో చాతుర్యం ప్రదర్శించాలి. ఇవి రాజులు అనుసరించ వలసిన ధర్మాలు.

**ఆ. కయ్యమునకు నెపుడుఁ గాలు ద్రవ్వఁడు, తగ । వైన రణము శూరుఁడై యొనర్చు;**
**యజ్ఞ దాన విధి పరాయణుఁడై యుండు । నీ తెఱంగు వృత్త ముత్తమంబు. 50**

**ప్రతిపదార్థం:** కయ్యమునకున్ = యుద్ధమునకు; ఎపుడున్ = ఏ వేళనూ; కాలుద్రవ్వఁడు = సిద్ధపడడు; తగవు+ఐన+రణమున్ = న్యాయమైన సంగ్రామాన్ని; శూరుఁడు+ఐ = వీరుడై; ఒనర్చున్ = చేస్తాడు; యజ్ఞ దాన విధి పరాయణుఁడు+ఐ = యాగాలు, దానాలు చేయటంలో శ్రద్ధాసక్తులు కలవాడై ; ఉండున్ = ఉంటాడు; ఈ+తెఱంగు వృత్తము = ఈ విధమైన నడవడిక; ఉత్తమంబు = శ్రేష్ఠం.

**తాత్పర్యం:** ప్రభువైన వాడు తనకు తానుగా అకారణంగా జగడానికి ఎప్పుడూ సిద్ధ పడడు. ధర్మంగా యుద్ధం చేయవలసివచ్చినపుడు వెనుకడుగు వేయడు. యజ్ఞము లొనర్చటంలో, దానాలు చేయటంలో శ్రద్ధాసక్తులు కలిగి ఉంటాడు. రాజుకు ఇటువంటి ప్రవర్తనమే సముచితం.

**విశేషం:** 'కయ్యమునకు కాలుద్రవ్వు' వంటి జాతీయాలకు, నుడికారాలకు తిక్కన రచన కాణాచి.

**క. ఈ నీతులకు విరుద్ధము । లైన పనుల నరకములకు నరుగు నృపతి పా**
**పానీత దుఃఖ మొకతఱి । మాను నొరుల కతని కెపుడు మానక యుండున్. 51**

**ప్రతిపదార్థం:** నృపతి = రాజు; ఈ నీతులకున్ = ఈ న్యాయ కార్యాలకు; విరుద్ధములు+ఐన = వ్యతిరిక్తాలైన; పనులన్ = పనులు చేయటంవలన; నరకములకున్+అరుగున్ = దుర్గతుల పాలవుతాడు; పాప+ఆనీత దుఃఖము = పాపకార్యాలు చేయటం చేత కలిగిన దుఃఖం; ఒరులకున్ = ఇతరులకు; ఒకతఱిన్ = ఒకప్పుడు; మానున్ = తొలగిపోతుంది; అతనికిన్ = రాజుకు మాత్రం; ఎపుడున్ = ఎట్టి సమయమందునూ; మానక+ఉండున్ = విడువకుండా ఉంటుంది.

**తాత్పర్యం:** రాజైన వాడు పూర్వోక్తమైన న్యాయానికి విరుద్ధములైన పనులు చేస్తే నరకాల పాలవుతాడు. పాపం వల్ల కలిగే దుఃఖాలు ఒకప్పుడు ఇతరులను వదల వచ్చును గాని రాజును మాత్రం ఎన్నటికీ వదలవు.

**ఆ. భావశుద్ధి గలిగి యీ వినీతులఁ బూని । ప్రజల కెవ్వఁ డతుల రక్షణంబు**
**సేయు నట్టి విభుఁడు సిరియును గీర్తియుఁ । గాంచుఁ బుణ్యలోక గతియుఁ బడయు.' 52**

**ప్రతిపదార్థం:** భావశుద్ధి+కలిగి = నిర్మలమైన మనస్సు గలిగి; ఈ+వినీతులన్+పూని = ఈ చెప్పబడిన న్యాయపద్ధతుల ననుసరించి; ఎవ్వఁడు = ఏ రాజు; ప్రజలకున్ = జనులకు; అతుల రక్షణంబు = సాటిలేని సంరక్షణ; చేయున్ = కలిగిస్తాడో; అట్టి విభుఁడు = అటువంటి ప్రభువు; సిరియున్ = సంపదయు; కీర్తియున్ = యశస్సునూ; కాంచున్ = పొందుతాడు; పుణ్యలోక గతియున్ = ఉత్తమలోక నివాసం; పడయున్ = పొందుతాడు.

**తాత్పర్యం:** ఏ రాజు చిత్తశుద్ధితో ఈ చెప్పిన నీతుల్ని అనుసరించి ప్రజలను రక్షిస్తాడో ఆ రాజు ఐశ్వర్యమునూ, యశస్సునూ పొందగలడు. మరణానంతరం పుణ్యలోకాలకు వెళ్ళుతాడు.'

**క. అనుటయు 'ధర్మ రహస్యము । వినఁ గోరెద' ననిన శాంభవికి శంభుం డి**
**ట్లనియె 'నహింస రహస్యం । బనఁ బరఁగును ధర్మజాత మఖిలమునందున్.' 53**

**ప్రతిపదార్థం:** అనుటయున్ = అని శివుడు పలుకగా; ధర్మ రహస్యమున్ = ధర్మ మందలి మర్మమును, ధర్మ సూక్ష్మాన్ని; వినన్+కోరెదన్ = వినుటకు కుతూహల పడుతున్నాను; అనిన శాంభవికిన్ = అని అడిగిన అంబికకు; శంభుండు = పరమేశ్వరుడు; ఇట్లు+అనియెన్ = ఈ విధంగా చెప్పాడు; అహింస = ప్రాణులను బాధించకుండుట; ధర్మజాతము+ అఖిలము+అందున్ = సమస్తమైన ధర్మ సమూహంలో; రహస్యంబు+అనన్ = రహస్యమని చెప్పుటచేత; పరఁగును = ఒప్పును.

**తాత్పర్యం:** అని శివుడు వచింపగా పార్వతీదేవి 'నాథా! ధర్మ రహస్యం వినవలెనని కుతూహల పడుతున్నాను' అన్నది. అందుకు శంకరుడు 'దేవీ! సకల ధర్మ సమూహమునందు జీవులను హింసించకుండటమే పరమ ధర్మ'మని పలికాడు.

**వ. అనిన విని యా జగన్మాత యవ్విశ్వధాతతో 'హింసావర్జనం బే జనులకుం జెల్లదని చూచెద; నహింస తెఱం గెఱింగింపవే' యనిన నద్దేవుం 'డది నీ తలంచినట్లు; నేలం బిపీలికా ప్రముఖంబుల నాకసంబున మశకాదుల మఱియుం బేను నల్లి సీరపేను లోనైన జంతువులం జంపక యెవ్వరికి మానరా; దట్లు గావున.54**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని శంభుడు పల్కగా ఆకర్ణించి; ఆ జగత్+మాత = లోకాలకు తల్లిఅయిన పార్వతి; ఆ విశ్వధాతతోన్ = ప్రపంచాన్ని ధరించే (పోషించే) పరమేశ్వరుడితో; హింసా వర్జనంబు = హింసను మానటం; ఏ జనులకున్

= ఎవ్వరికినీ; చెల్లదు+అని = శక్యం కాదు అని; చూచెదన్ = భావిస్తాను; అహింస తెఱంగు = అహింసావిధానమును, స్వరూపాన్ని; ఎఱింగింపవు+ఏ = తెలుపుమా; అనినన్ = అని వేడగా; ఆ+దేవుండు= ఆ ధూర్జటి; అది = అహింస అనేది; నీ తలంచినట్లు+అ = నీవు భావించినట్లే దుస్సాధ్యం; నేలన్ = భూమిమీద ; పిపీలికా ప్రముఖంబులన్ = చీమలు మొదలైన వాటిని; ఆకసంబునన్ = అంబరంలో; మశక+ఆదులన్ = దోమలు మొదలైన వాటినీ; మఱియున్ = ఇంకనూ; నల్లి = మత్కుణం; సీరపేను = చీరపేను = బట్టను అంటుకొని ఉండే తెల్లని పేను; లోనైన = (లోను+ఐన) = మొదలైన; జంతువులన్ = ప్రాణులను, చంపక; ఎవ్వరికిన్ = ఎంతటి వారికినీ; మానన్ రాదు = విడిచి పెట్టుటకు వీలుకాదు; అట్లు+కావునన్ = అందుచేత; (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని ఈశ్వరు డనగా విని ఆ జగజ్జనని జగద్రక్షకుడైన సదాశివుడితో 'ప్రాణేశ్వరా! హింస చేయకుండటం ఎవ్వరికినీ శక్యం కాదని భావిస్తాను. అహింసా స్వరూపం ఎట్లాంటిదో తెలుపవలసింది' అని వేడగా శివుడు 'ప్రేయసీ! నీ వన్నట్లుగానే నేలమీద చీమలు మొదలైన వాటినీ, గగనంలో దోమలు మొదలైన వాటినీ, తల వెంట్రుకలలో పేలనూ, మంచముల నాశ్రయించుకొన్న నల్లులనూ, వస్త్రాలనంటి పెట్టుకొన్న చీర పేలూ మొదలైన కీటకాలను చంపకుండా ఉండటం ఎవ్వరికినీ సాధ్యం కాదు. అందుచేత

**చ.** **ఫలము దళంబునుం దొడిమఁ బాయుట, రాలిన వానిఁ గొంచు నా**
**కలి కెరవేసి గోరసము కార్యమునట్టుల నిర్వహించి బు**
**ద్ధులు వెలిలేక నిశ్చలతఁ దోయజపత్రనిభాక్షి! చిత్రరూ**
**పులొకొ యనంగ నుండు శమ పుణ్యులు సూవె యహింసనాత్మకుల్.** **55**

**ప్రతిపదార్థం:** తోయజ పత్రనిభ+అక్షి = కమల దళములతో సమానములైన కన్నులుగల గౌరీ!; ఫలము = పండూ; దళంబునున్ = ఆకూ; తొడిమన్+పాయుటన్ = వృంతమును వీడటం వల్ల, కాడను వదలడం చేత; రాలిన వానిన్ = చెట్టునుంచి క్రింద పడిన ఆ ఫలపర్ణాలను; కొంచున్ = గ్రహిస్తూ; ఆఁకలికిన్ = క్షుత్తునకు; ఎరవేసి = ఆహారమొనర్చి; గోరసము కార్యము = ఆవుపాలు లేక పెరుగు లేక మజ్జిగ అనువాటిని త్రాగడం అనే పనిని; అట్టులన్ = నేలరాలిన పండ్లను ఆకులను భక్షించినట్లే; నిర్వహించి = చేసి (ఆకలిని ఫలపర్ణాలతో, దప్పికను గోక్షీరాదులతో తీర్చుకొని); బుద్ధులు = తలంపులు; వెలిలేక = బహిర్విషయాల మీదికి వెళ్ళకుండా అనగా ఆత్మేతర విషయములందు ప్రవర్తించకుండా; నిశ్చలతన్ = చలనం లేక; చిత్ర రూపులు+ఒకొ+అనంగన్ = పటాలలోని బొమ్మలు కాబోలు అనునట్లు; ఉండు = ఉన్నట్టి; శమ పుణ్యులు = అంతరింద్రియనిగ్రహం గలిగిన పుణ్యాత్ములు; అహింసన+ఆత్మకుల్+చూవె = జీవహింస సల్పనట్టి స్వభావం కలవారు సుమా!

**తాత్పర్యం:** ఫలాలు, ఆకులు బాగుగా పండి చెట్ల తొడిమల నుండి తమంతట తామే నేలమీద రాలగా వాటిని తిని ఆకలి తీర్చుకొంటూ, ఆవుపాలో, పెరుగో, మజ్జిగో త్రాగి దప్పిక బాపుకొంటూ ఇతర విషయాల మీదికి బుద్ధులు పోనీయకుండా, చిత్తరువులలోని బొమ్మల మాదిరి చలనరహితులై, అంతరింద్రియాలను జయించిన మహనీయులే సుమా అహింసా స్వభావులు!

**విశేషం:** సూవె అనే పదం సహజ సరళానిది కాదు. చూవె, చూడవే, చూడవే, చూ అనేవి గసడదవాదేశ సంధివల్ల సూ గా మారుతాయి. చూవె-సూవె చుమా-సుమా, చుమీ, సుమ్మీ చూ- సూ- ఇవి నిశ్చయార్థకములైన అవ్యయాలు.

**తే.** **అదియ శ్రుతిచేత ధర్మ రహస్య మనఁగఁ। బడియె' నని చెప్పి మఱియును భవుఁడు దేవి**
**కిట్టులను 'నట్లుగాక యహింస తెఱఁగు। గలదు వినుము విశేషించి కమలనయన! 56**

**ప్రతిపదార్థం:** కమలనయన! = తామర రేకుల వంటి కన్నులు గల కాంతామణీ!; అదియ = హింస చేయకుండటమే; శ్రుతి చేతన్ = వేదం చేత; ధర్మ రహస్యము+అనఁగన్+పడియెన్ = ధర్మ రహస్యమని నుడువబడింది; అని చెప్పి = అని వచించి; మఱియును = ఇంకా; భవుఁడు = మహా దేవుఁడు; దేవికిన్ = భగవతిఅయిన కాత్యాయనికి; ఇట్టులు+అనున్ = ఈ విధంగా అన్నాడు; అట్లు+కాక = ఇంతకు ముందు చెప్పబడినట్లేగాక; విశేషించి = ప్రత్యేకించి; అహింస తెఱఁగు+కలదు = అహింసా విధాన మున్నది; వినుము = ఆలకించుము.

**తాత్పర్యం:** కాత్యాయనీ! ఈ అహింస అనేదే ధర్మ రహస్యమని వేదంలో చెప్పబడింది' అని పల్కి శివదేవుడు భవానితో ఇట్లన్నాడు. 'దేవీ! అహింస అనేది వేరే విధంగా కూడ ఉన్నది. చెపుతాను వినుము.

**తే.** **విధి వశంబున మృతిఁ బొందు వివిధ జంతు। నిచయమం దనహంకార నిష్ఠుఁడైనఁ**
**బురుషుఁ గల్మష మేమియుఁ బొందనేర;। దెట్టు లంటేని విను మది యేర్పరింతు. 57**

**ప్రతిపదార్థం:** విధివశంబునన్ = దైవాధీనంగా; మృతిన్+పొందు = మరణం చెందునట్టి; వివిధ జంతునిచయము+అందున్ = రకరకాల ప్రాణి సముదాయంలో; అనహంకార (న+అహంకార) నిష్ఠుఁడు+ఐన+పురుషున్ = నేను, నాది అని గర్వించకుండే వాడిని; కల్మషము = పాపం; ఏమియున్ = ఇసుమంతయు; పొందన్+ నేరదు = చెందజాలదు; ఎట్టులు+అంటేనిన్ = అదెట్లంటే; వినుము = ఆలకించుము; అది = ఆ విషయం; ఏర్పరింతున్ = వివరిస్తాను.

**తాత్పర్యం:** దైవాధీనంగా చనిపోతున్న ప్రాణి కోటిలో అహంకార రహితుడైన పురుషుడిని పాపం ఏమాత్రం అంటుకొనదు. అదెట్లంటే అహింసా స్వరూపాన్ని వివరిస్తాను పార్వతీ! వినుము.

**విశేషం:** అహంకారము - దేహమే ఆత్మ అనే అభిమానం. ఈ దేహానికి చెందిన ఆలుబిడ్డలు, మిత్రులు, గృహక్షేత్రాదులు తనవనే బుద్ధి. ఇదే అహంకారమంటే. ఇది లేకుండటం అనహంకారం. అందలి నిలుకడ అనహంకారనిష్ఠ. అది కలవాడు అనహంకారనిష్ఠుడు. అంతా విధి వశమై ప్రవర్తిస్తుంది. అన్నింటికి కర్త సర్వేశ్వరుడు. నేను నిమిత్త మాత్రుడిని అని భావించే వాడు అనహంకార నిష్ఠుడు. కర్మ ఫలమందు కర్తృత్వభోక్తృత్వబుద్ధి లేనివాడు హింస చేసినా అతడు చెయ్యనివాడే.

**సీ.** **దివియలోఁ బడుఁ బ్రువ్వు, దివియ యెత్తినవారిఁ। బాపంబు వొందునే, యోపి దున్న**
**నాఁగేటిమొనఁ జచ్చు నానావిధ ప్రాణు। లన్నరుఁ బొందునే యఘము? వారు**
**తమపనుల్ సేయ విధాతృవశమున నా। యువు దెగినట్టి జంతువులు సచ్చు;**
**నేము సంపితి మని యించుకేనియు నహం। కారంబు వారికిఁ గలుగ; దట్లు**

**తే.** **గానఁ జూవె వారిఁ గల్మష మొందదు;। పుణ్యపాపములకు బుద్ధి మూల'**
**మని శివుండు మఱియు నను 'హింసవోలెనై। యధిక ధర్మమైన విధము వినుము. 58**

**ప్రతిపదార్థం:** ప్రువ్వు = పురుగు; దివియలోన్ = దీపంలో; పడున్ = కాలి నశిస్తుంది; దివియ+ఎత్తిన వారిన్ = ఆ దీపం పెట్టినవారిని; పాపంబు = పాతకం; పొందున్+ఏ? = చెందుతుందా? లేదని భావం; ఓపి = నేర్పుకలిగి, సమర్థుడై; దున్నన్

= పొలం దున్నగా; నాఁగేటి మొనన్ = నాగలి యొక్క ఇనుప కర్రు మొన గ్రుచ్చుకొని; నానా విధ ప్రాణులు+చచ్చున్ = పలు రకాలైన జీవులు - లద్దె పురుగులు, వాన పాములు మొదలైన మట్టి పొరలలోని ప్రాణులు, కీటకాదులు చచ్చిపోతాయి; ఆ +నరున్ = అరక తోలుతున్న సేద్యగాడిని; అఘము = పాపం, కిల్బిషం; పొందును+ఏ? = పొందుతుందా? పొందదని తాత్పర్యం; వారు = మనుష్యులు; తమ పనుల్+చేయన్ = తమతమ కార్యాలు నిర్వహించే వేళలలో; విధాతృవశమునన్ = దైవవిధిచేత; ఆయువు తెగిన+అట్టి = ఆయుష్కాలం ముగిసినటువంటి; జంతువులు = ప్రాణులు; చచ్చున్ = చనిపోతూ ఉంటాయి; ఏము = మేము; చంపితిమి+అని = వధించామని; అహంకారంబు = కర్తృత్వం; వారికిన్ = ఆయా పనులు చేసికొంటున్న నరులకు; ఇంచుక+ఏనియున్ = కొంచెం కూడ; కలుగదు = జనించదు; అట్లు+కానన్ = అందుచేత; చూవె = సుమా!; వారిన్ = ఆ పని పాటులలో నిమగ్నులైన మనుజులను; కల్మషము = పాపం, దురితం, ఒందదు = చెందదు; పుణ్యాపాపములకున్ = సుకృత దుష్కృతాలకు; బుద్ధి = బుద్ధియే; మూలము+అని = హేతువంటూ, కారణమంటూ; శివుండు = పశుపతి; మఱియున్ = ఇంకనూ; అనున్ = చెప్పుతున్నాడు; హింస పోలెన్+ఐ = హింసవలె ఉండి కూడ; అధిక ధర్మము = అది పరమ ధర్మం; ఐన విధము = ఐనట్టి తీరు; వినుము = గౌరీ! నీవు వినుము.

**తాత్పర్యం:** దీపాలలో పడి పురుగు లనేకం చస్తుంటాయి. దీపం పెట్టిన వాడికి ఆ పాపం సంప్రాప్తించటం లేదు. సేద్యగాడు అరకతో పొలం దున్నేటపుడు నాగలి కర్రు తగిలి మట్టి పొరలలోని జీవులెన్నో చనిపోతున్నాయి. ఆ పాతకం హాలికుడికి సంభవించటం లేదు గదా! మనుష్యులు తమతమ పనులు చేసికొంటున్నప్పుడు వాటి వాటి ఆయువుతీరి ప్రాణులెన్నో చస్తుంటాయి. వాటి చావుకు తాము కారణమని ఆ జనులు తలపోయరు కనుకనే వారికి జీవహింసాదోషం కలగటం లేదు. సఖీ! పాపపుణ్యాలు కలగటానికి బుద్ధియే కారణం' అని ఈశ్వరుడు మహేశ్వరికి చెప్పి 'ఇది హింసాస్వరూపంతో ఉన్నప్పటికినీ అహింసా ధర్మమైన విధం ఎట్లో వివరిస్తాను వినవలసిం' దని ఇట్లా అన్నాడు.

**విశేషం:** పాపపుణ్యాలకు మూలం మనస్సే అనే ఉపనిషదర్థం ఈ పద్యంలో పేర్కొనబడింది.

**క. దైవగతిఁ జేసి తమకుం । జావవలసి గోవు లొండు చా వొల్లక స**
**ద్భావమున రంతిదేవుని । కావించు మఖమునఁ బశుతఁ గైకొని నెమ్మిన్. 59**

**ప్రతిపదార్థం:** గోవులు = ఆవులు; దైవగతిన్+చేసి = విధి విధానం అనుసరించి; తమకున్ = తమకు (ధేనువులకు) చావన్ వలసి = మృతి తప్పనందున; ఒండు చావు+ఒల్లక = మరొక విధమైన మరణాన్ని అంగీకరించక; సద్+భావమునన్ = మంచి మనసుతో; రంతిదేవుని కావించు = రంతిదేవు డనే రాజు చేయునట్టి; మఖమునన్ = యజ్ఞంలో; పశుతన్+కైకొని = పశుత్వము వరించి; నెమ్మిన్ = ప్రీతితో. (అతడి చెంతకు వచ్చాయని తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** విధివశాన తమకు చావు మూడినందున గోవులు మరొక విధంగా మరణించటానికి సమ్మతించక రంతిదేవు డనే రాజు చేస్తున్న యాగంలో బలిపశువులు కావటానికి ప్రీతి వహించి.

**వ. అనేక సహస్రంబు లరుదెంచి. 60**

**తాత్పర్యం:** పెక్కువేలు వచ్చి.

**క. తము విశసించుట కా భూ । రమణుని వేడంగ నతఁడు రాజీవాక్షీ!**
**క్రమమున విశసింపఁగఁ జ । ర్మములు దరులు గాఁగఁ బాఱె రక్తము నదియై. 61**

**ప్రతిపదార్థం:** రాజీవ+అక్షీ! = పద్మములవంటి నేత్రములుగలదానా!; తమున్ = తమ్ము; విశసించుటకున్ = యాగంలో చంపుటకు; ఆ భూరమణునిన్ = ఆ మహీపతిని; వేడంగన్ = ప్రార్థించగా; అతఁడు = ఆ రాజు; క్రమమునన్ = వరుసగా; విశసింపఁగన్ = వాటిని సంహరించగా; చర్మములు = ఆ ధేనువుల తోళ్ళు; దరులు+కాఁగన్ = గట్లుకాగా; రక్తము = నెత్తురు; నది+ఐ = ఏరై; పాఱెన్ = ప్రవహించింది.

**తాత్పర్యం:** తమ్ము యజ్ఞంలో విశసించుమని వేలకొలది ఆవులు వచ్చి రంతిదేవ మహారాజును వేడుకొన్నవి. రంతిదేవుడు ఆ ధేనువులు కోరినట్లు వాటిని యాగంలో విశసించాడు. ఆ గోవుల చర్మాలు గట్లు కాగా, వాటి నెత్తురు ఏరై పారింది.

**క. ఆచర్మణ్వతి యను నది । గోచరమే వర్ణనమునకుం బ్రియ మగు కం**
**పై చవిచేయం బొలిచి య । నీచమహిత సలిల మయ్యె నెత్తురు సుదతీ! 62**

**ప్రతిపదార్థం:** సుదతీ! = మంచి దంతములు గలదానా!; ఆచర్మణ్వతి+అను నది = చర్మణ్వతి అనేపేరు గల ఆ యేరు; వర్ణనమునకున్ = కొనియాడటానికి; గోచరమే = శక్యమా? కాదని భావం; నెత్తురు = ధేనురక్తము; ప్రియము+అగు = ఇష్టమైన; కంపు+ఐ = పరిమళం కలదై; చవి చేయన్ = రుచిగొల్పగా; పొలిచి = ఒప్పి; అనీచ = అల్పముగాని; మహిత = పూజ్యమైన; సలిలము+అయ్యెన్ = జల మైనది.

**తాత్పర్యం:** చక్కని పలువరుసగల శర్వాణీ! ఆ చర్మణ్వతీనదిని వర్ణించుటకు సాధ్యం గాదు. నదిలోని రక్తం పావన జలమై, రుచికరమై, కమ్మని పరిమళాలు వెదజల్లుతుంటుంది.

**క. స్నానమునఁ బానమున నా । కానందము సేయు నమ్మహానది; గోసం**
**తానము దివికి నరిగె; న । మ్మానవపతిఁ జెప్పనేల? మధురాలాపా! 63**

**ప్రతిపదార్థం:** మధుర+ఆలాపా! = ఇంపైన పలుకులు కలదానా!; ఆ+మహానది = గొప్పనదిఅయిన చర్మణ్వతి; స్నానమునన్ = తన జలాలలో స్నానమాడుటచేతను; పానమునన్ = తన నీరు త్రాగటం చేతను; నాకున్ = నాకు; ఆనందము+చేయున్; సంతోషం కలిగిస్తుంది; గోసంతానము = ధేనుసముదాయం; దివికిన్ = స్వర్గానికి; అరిగెన్ = వెళ్ళింది; ఆ+మానవపతిన్ = నరపాలకుడూ, యజ్ఞమునకు యజమానుడు అయిన ఆ రంతిదేవుడిని గూర్చి; చెప్పన్+ఏల? = చెప్పుటెందుకు?

**తాత్పర్యం:** ఇంపుగ మాటలాడే గౌరీ! చర్మణ్వతీ నదిలో స్నానమాడటం వలన, ఆ నదీజలములు త్రాగటం వలన నా కెంతో ఆనందం కలుగుతుంది. యజ్ఞంలో విశసించబడిన గోవులన్నీ స్వర్గం చేరాయి. మరి యాగ మొనర్చిన రంతిదేవ మహారాజు పుణ్యగతి ఇట్టిదని చెప్ప వలసిన అవసర మేమున్నది? (అత డుత్తమగతులు పొందాడని తాత్పర్యం.)

**క. పరబలముపై నడరి నె । త్తురు వఱ్ఱులు వాఱఁ జంపుదురు దురమున న**
**ప్పరుసదనంబును బుణ్యో । త్తర మని వేదములు సెప్పుఁ దనుతరమధ్యా! 64**

**ప్రతిపదార్థం:** తనుతరమధ్యా! = మిక్కిలి సన్నని నడుముగల దానా!; పరబలముపైన్ = శత్రుసైన్యం మీద; అడరి = విజృంభించి; నెత్తురు = రక్తం; వఱ్ఱులు+పాఱన్ = ప్రవాహా లయ్యేటట్లుగా; దురమునన్ = యుద్ధంలో; చంపుదురు = వధిస్తారు; ఆ+పరుసఁదనంబును = ఆ కాఠిన్యం కూడా, ఆ కర్కశత్వం కూడ; పుణ్య+ఉత్తరము+అని = పుణ్యాలలో మేలైనదని; వేదములు = శ్రుతులు; చెప్పున్ = వచిస్తున్నాయి.

**తాత్పర్యం:** మిక్కిలి సూక్ష్మమైన నడుము గల సుందరీ ! శత్రుసేనలపై విరుచుకపడి రక్తం వరదలై పారేటట్లుగా యుద్ధంలో సంహరిస్తారు. ఆ క్రూరకర్మ సైతం పుణ్యాలలో మేటిఅని వేదాలు వక్కాణిస్తున్నాయి.

**విశేషం:** "హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. (భగ. 2-37)
సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి.'' (భగ. 2-38)

శత్రువులచేతిలో నీవు చస్తే మోక్షాన్ని పొందుతావు. నీవు శాత్రవులను జయిస్తే రాజ్యాన్ని అనుభవిస్తావు. కనుక యుద్ధానికి సిద్ధపడుము. సుఖదుఃఖాలను, లాభ నష్టాలను, జయాపజయాలను సమానమైనవిగా భావించి కర్తవ్యబుద్ధితో యుద్ధం ఆరంభించుము. నీకు పాపం రాదు - అని గీత చాటుతున్నది. సంగ్రామంలో శాత్రవవధ, యజ్ఞంలో జంతుహింస పుణ్య హేతువు లని శ్రుతులు ఘోషిస్తున్నాయి.

**క. పోరుల యందలి మరణము । మారణముం బుణ్యలోక మహిత మహిమకుం**
**గారణ; మెఱుఁగు మహింసా । కారం బిట్టి దని నీవ కమలదళాక్షీ!' 65**

**ప్రతిపదార్థం:** కమల దళ+అక్షీ! = పద్మ పత్రములవంటి నయనములు కలదానా!; పోరుల+అందలి = యుద్ధాలలోని; మరణము = చావు; మారణమున్ = చంపటమూ; పుణ్యలోక మహిత మహిమకున్ = స్వర్గాది ఉత్తమ లోకాలలోని పూజ్యమైన గొప్పతనానికి (అనుభవించటానికి); కారణము = హేతువు; అహింసా+ఆకారంబు = అహింస యొక్క స్వరూపం; ఇట్టిది+అని = ఇట్లాంటిదని; నీవు+అ = నీవే; ఎఱుఁగుము = తెలిసికొనుము.

**తాత్పర్యం:** తామర రేకులవంటి కన్నులు గలదానా! యుద్ధాలలో చావటం గాని, చంపటంగాని స్వర్గాది పుణ్యలోకాలలో పూజ్యమైన మహిమను పొందటానికి కారణం. అహింసా స్వరూప మిటువంటిదని దేవీ! నీవు గ్రహించుము.'

**సీ. అని చెప్పి వెండియు హరుఁడు పార్వతితోడ । నిట్లను 'వేఁటకు నెలయు టఘము**
**కాదు; సస్యములు మృగములచేత నశించు; । జగమెల్ల నిర్మనుష్యంబు గాఁగఁ**
**గోరు మృగము; లది కారణంబుగ మృగ । హతి రాజులకు ధర్మమయ్యె; నట్లు**
**గాక మృగములకుఁ గలుగు సద్గతి రాజు । చే మృతిఁ బొందినఁ జెలువ! వినుము**

**తే. దండ్యు దండింపకుండు, ట దండ్యు దండ । నంబు గూర్చుట, విప్రుమనంబు నొచ్చు**
**నట్టి పనిసేఁతయును విను మనపరాధి । తనువు నొంచుట సూ హింస ధరణిపతికి'. 66**

**ప్రతిపదార్థం:** అనిచెప్పి = అని పల్కి; హరుఁడు = ఈశ్వరుఁడు; వెండియున్ = మరల; పార్వతి తోడన్ = గిరి పుత్రికతో; ఇట్లు+అనున్ = ఈ రీతిగా పలికాడు; వేఁటకున్ = జంతువుల వేటకు; ఎలయుట = ఉద్యమించటం, ఉన్ముఖుడు కావటం; అఘము కాదు = పాపం కాదు; సస్యములు = పైరులు; మృగములచేతన్ = జంతువుల చేత ; నశించున్ = నాశన మవుతాయి; మృగములు = జంతువులు; జగము+ఎల్లన్ = లోక మంతా; నిః+మనుష్యంబు+కాఁగన్+కోరున్ = మనుష్యులు లేకుండా ఉండాలని వాంఛిస్తాయి; అది కారణంబుగన్ = ఆ హేతువుచేత; మృగహతి = జంతువులను చంపటం; రాజులకున్ = దొరలకు; ధర్మము+అయ్యెన్ = న్యాయమయింది; అట్లు+కాక = అంతేగాక; రాజుచేన్ = నృపతిచేత; మృతిన్+పొందినన్ = మరణం చెందితే; మృగములకున్ = జంతువులకు; సత్+గతి+కలుగున్ = పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది; చెలువ! = ఓ సుందరీ! వినుము = ఆలకించుము; దండ్యున్ = దండింపదగినవాడిని; దండింపక+ఉండుట = శిక్షించక మానటం; అదండ్యున్ = దండింప తగని వాడిని; దండనంబు+కూర్చుట = శిక్ష విధించటం; విప్రుమనంబు = బ్రాహ్మణుడి హృదయం; నొచ్చునట్టి = బాధ చెందునట్టి; పని+చేఁతయున్ = పని చేయటం; అనపరాధి (న+అపరాధి) = తప్పుచేయని వాడి యొక్క; తనువున్ నొంచుట = శరీరాన్ని బాధించటం; ధరణి పతికిన్ = భూభర్తకు; హింస+సూ! = హింసను కావించుటయే సుమా!

**తాత్పర్యం:** అని చెప్పి శర్వుడు శర్వాణితో మళ్ళీ ఇట్లన్నాడు. 'దాక్షాయణీ! రాజులకు జంతువులను వేటాడటం వలన పాపం రాదు. మృగాలు పైర్లను నాశనం చెయ్యడమేగాక లోకంలో మానవు లెవ్వరూ ఉండగూడదని కోరుకుంటాయి. కాబట్టి వాటిని సంహరించటమే రాజులకు పుణ్యకార్యం. అంతే గాక రాజుల చేతిలో హతమయ్యే మృగాలకు పుణ్యగతులు కలుగుతాయి. దండింపదగిన వారిని దండించకున్నా, దండింప తగని వారిని దండించినా, బ్రాహ్మణుడి మనస్సు నొప్పించినా, తప్పు చేయని వాడి శరీరాన్ని బాధించినా రాజు హింస చేసిన వాడే అవుతున్నాడు సుమా!'

**వ. అని బోధించి. 67**

**తాత్పర్యం:** అని తెలియజెప్పి.

**క. 'భూసురుల కలుక వుట్టం । జేసి నహుష ముఖ్య నృపులు చెడుట ప్రసిద్ధం**
**బాసురపతి విప్రునలుకఁ । గాసిఁ బడఁడె? తెలచి పడసెఁ గాదె నయనముల్? 68**

**ప్రతిపదార్థం:** నహుష ముఖ్య నృపులు = నహుషుడు మొదలైన రాజులు; భూసురులకున్ = బ్రాహ్మణులకు; అలుక = కోపం; పుట్టన్+చేసి = జనింప జేసి; చెడుట = నశించటం; ప్రసిద్ధంబు = లోక మెరిగిన విషయమే; ఆ సురపతి = ఆ దేవేంద్రుడు; విప్రు+అలుకన్ = బ్రాహ్మణుడి ఆగ్రహంచేత; గాసిన్+పడఁడు+ఎ? = వ్యధ చెందలేదా?; తెలచి = ఆ దేవతావల్లభుడు వేడుకొని; నయనముల్ = నేత్రాలు; పడసెన్+కాదు+ఎ? = పొందలేదా? పొందినాడని భావం.

**తాత్పర్యం:** నహుషుడు మున్నగు నరపతులు పెక్కుమంది బ్రాహ్మణులకు కోపం కలిగించి చెడిపోవటం లోకాని కంతా తెలుసు. దేవేంద్రు నంతటి వాడు గౌతమ మహర్షి శాపం వలన వెతలపాలు కాలేదా? తన తప్పును క్షమింపవేడుకొని సురపతి ఆ మునీంద్రుడి కృపతో కన్నులను పొందలేదా?

**విశేషం:** నహుషుడు చెడిన వృత్తాంతం:

అధికార మదమత్తుడైన నహుష చక్రవర్తిని క్షణకాలంలో స్వర్గ పద భ్రష్టుడిని చేశాడు అగస్త్య మహర్షి. దేవేంద్రుడు

బ్రహ్మహత్యాపాతకం వలన స్వర్గ సింహాసనాధిపత్యం కోల్పోయి నిషధాచలంలో తలదాచుకొంటున్నాడు. సుర రాజ్యాన్ని ఏలదగ్గవాడు మానవపతి నహుషుడే అని మునీంద్రులు నిర్ణయించారు. యమ వరుణాది దేవతలు తమ శక్తి ప్రభావాలను అతడికి పంచియిచ్చి దేవరాజ్యానికి అధిపతిని చేశారు. అతడు దేవ భోగాలు అనుభవిస్తూ కొంతకాలానికి మదోన్మత్తుడై లావణ్యవతి శచీదేవిని చూచి ఆమె కొరకు చెప్పి పంపుతాడు. అతడి బారినుంచి తన్ను రక్షించుమని శచీదేవి బృహస్పతిని వేడుకొన్నది. బృహస్పతి ఆమెకు ఆశ్రయమిస్తాడు. ఇది తెలిసి నహుషుడు శచిని తన దగ్గరకు పంపుమని గురుడిని ఆదేశిస్తాడు. బృహస్పతి సూచన మేరకు శచీదేవి తనకు కొంచెం గడువు కావాలని, ఈ లోపల ఇంద్ర ప్రాభవానికి తగినట్లు సప్తర్షులు మోసే అందలంలో అతడు ఊరేగటం తనకు అభిలషణీయమని నహుషుడికి చెప్పి పంపుతుంది. ఆమె మీది వ్యామోహంతో నహుషుడు ఆ పని చేస్తాడు. తేజో హీనుడవుతాడు. పల్లకిమోస్తున్న సప్తర్షులు 'గోసంప్రోక్షణంలో చెప్పబడిన మంత్రాలు నీకు ప్రమాణ భూతములా' అని అడిగినప్పుడు 'ఏంతమాత్రం కావు' అని అతడు సమాధాన మిస్తాడు. అప్పుడు అగస్త్య మహర్షి 'పెద్దలు అభినందించిన మంత్రాలను నిందించటం అజ్ఞానం' అనగానే నహుషుడు కోపించి అతని తలను తన కాలితో తంతాడు. అగస్త్యుడు పట్టరాని ఆగ్రహంతో 'నహుషా! పూజనీయులైన మహర్షులచే నీ అందలం మోయించావు. వారు కొనియాడుతున్న మంత్రాలను దూషించావు. అంతేగాక నన్ను అవమానించావు. కనుక పదభ్రష్టుడవై బహు వత్సరాలు భూలోకంలో సర్పరూపంలో పడి ఉండు' మని శాపమిస్తాడు. నహుషుడు తనకు పూర్వస్మృతి చెడకుండా ఉండేటట్లున్నూ, శాపం తొలగేందుకు ఉపాయమున్నూ ప్రసాదించుమని అగస్త్యుణ్ణి వేడుకొంటాడు. 'నీ అడిగిన ప్రశ్నలకు ఏ ఉత్తముడు సరియైన సమాధానాలిస్తాడో అతడివలన నీకు శాపాంత మవుతుం' దని ఆ మునీంద్రుడు కరుణిస్తాడు.

నహుషుడు శాపఫలంగా వెంటనే హిమాలయప్రాంత భూతలంలో అజగరమై పడి ఉంటాడు. అరణ్యావాస కాలంలో భీముడు ఒంటరిగా వేటకని వెళ్ళి ఆ అజగరం చేత బంధితు డవుతాడు. తమ్ముడిని వెదకుతూ ధర్మరాజు అక్కడికి వచ్చి భీముడిని విడిచి పెట్టుమని ఆ మహాసర్పాన్ని కోరుతాడు. అజగర రూపుడైన నహుషుడు తన వృత్తాంతాన్ని వినిపించి 'తన ప్రశ్నలకు సమాధాన మిచ్చి శాపం బాపు'మని పల్కుతాడు. అతని ప్రశ్నలన్నింటికి ధర్మజుడు తగిన జవాబులిచ్చి అతనికి శాపవిముక్తి కలిగిస్తాడు. దివ్యరూపధరుడైన నహుషుడివలన అధ్యాత్మ రహస్యాలు గ్రహించి ధర్మతనయుడు తమ్ముడితో కలసి వెడలిపోతాడు. బ్రాహ్మణుడి ఆగ్రహంవలన నహుషుడికి పట్టిన దుర్గతీ, అతడి అనుగ్రహం వలన లభించిన శాపవిముక్తీ ఆరణ్యపర్వంలోని అజగరోపాఖ్యానంలో తెలుపబడ్డాయి.

**క. కావున విప్రారాధకుఁ । డై వెలయు విభుండు రాష్ట్ర మతనిధనము సై**
**న్యావలి బంధుల విప్రుల । దీవనలం బొదలు నింత తెల్లము దేవీ!' 69**

**ప్రతిపదార్థం:** దేవీ! = ప్రాణేశ్వరీ!; కావునన్ = కాబట్టి; విప్ర+ఆరాధకుఁడు+ఐ = బ్రాహ్మణులను పూజించేవాడై; విభుండు = = రాజు; వెలయున్ = వెలుగొందుతాడు; రాష్ట్రము = రాజ్యం; అతని ధనము = ఆ ప్రభువు యొక్క విత్తం; సైన్య+ఆవలి = సేనా సమూహం; బంధువుల = చుట్టాల యొక్క; విప్రుల = భూసురుల యొక్క; దీవనలన్ = ఆశీర్వాదములచే; పొదలున్ = వృద్ధి పొందుతుంది; ఇంత తెల్లము = ఈ విషయం విస్పష్టం.

**తాత్పర్యం:** ప్రియురాలా! కాబట్టి రాజు బ్రాహ్మణులను సేవించటం వలననే ప్రకాశిస్తాడు. అతడి రాజ్యం, ధనం, సైన్య సముదాయం, చుట్టాల యొక్క, విప్రులయొక్క ఆశీస్సుల వల్ల వృద్ధి చెందుతాయి. ఇది విస్పష్టమైన విషయం.'

**వ. అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు. 70**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించి = అంటూ నిర్ణయపూర్వకంగా చెప్పి; కపర్ది = శివుడు; గౌరితోన్; వెండియున్ = మరల.

**తాత్పర్యం:** అని నిర్ణయించి చెప్పి శంకరుడు గౌరితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

**ఆ. 'పరమ మంత్రవిధులఁ బశువులు యూపంబు । లందుఁ గట్టఁబడి మహాశుచిత్వ**
**విభవ మొందు విహిత విశసన క్రియ మేను । విడిచి దివ్యసుఖము వడయుఁ బొలఁతి! 71**

**ప్రతిపదార్థం:** పొలఁతి! = ఓ వనితా!; పశువులు = బలినొసగుటకు తీసుకు రాబడిన పశువులు; పరమ మంత్ర విధులన్ = శ్రేష్ఠములైన మంత్ర కలాపములతో; యూపంబులందున్ = యూపస్తంభాలయందు; కట్టన్+పడి = బంధించబడి; మహా శుచిత్వ విభవమున్ = పరమ పావనత్వమహిమను; ఒందున్ = పొందును; విహిత విశసన క్రియన్ = శాస్త్ర సమ్మతమైన సంహార క్రియచేత; మేనున్ = శరీరమును; విడిచి = వదలి; దివ్యసుఖమున్ = స్వర్లోకసౌఖ్యాన్ని; పడయున్ = పొందును.

**తాత్పర్యం:** 'అపర్ణా! ధేనువులు యాగశాలలో యూప స్తంభాలకు మంత్రాలతో బంధించబడి పరమ పవిత్రాలవుతున్నవి. శాస్త్ర సమ్మతంగా వధించబడి శరీరం విడిచి స్వర్గలోకంలో దివ్యసుఖాలు అనుభవిస్తాయి.

**విశేషం:** యూపము = యజ్ఞ పశువును కట్టుటకై పాతిన కొయ్య.

**క. హోమ విధులఁ దన్మాంసము । లామిషములు గాఁగ నొసఁగి యమరుల నగ్ని**
**ష్టోమాదులఁ బ్రోవఁగఁ బర । మామిత సౌఖ్యములు గల్గు యజమానులకున్. 72**

**ప్రతిపదార్థం:** హోమ విధులన్ = హోమ కార్యాలలో; తత్+మాంసము = యజ్ఞపశువుల మాంసము; ఆమిషములు కాఁగన్ = భోగ్యవస్తువులుగా; ఒసఁగి = సమర్పించి; అమరులన్ = దేవతలను; అగ్నిష్టోమ+ఆదులన్ = వసంతకాలంలో సల్పే అగ్నిష్టోమం మొదలైన యాగాలచే; ప్రోవఁగన్ = పోషించగా; యజమానులకున్ = యాగములు చేసేవారికి; పరమ+అమిత+సౌఖ్యములు = శ్రేష్ఠమైన మితిమీరిన సుఖాలు (మోక్షం); కల్గున్ = లభిస్తాయి.

**తాత్పర్యం:** అగ్నిష్టోమం మొదలైన యజ్ఞాలలో హోమాదుల ద్వారా దేవతలకు భోగ్యవస్తువుగా పశుమాంసం సమర్పించి తృప్తికలిగించటం వల్ల, యజ్ఞకర్తకు అమరులవల్ల అమితమైన ఉత్తమమైన సౌఖ్యాలు కలుగుతాయి.

**క. శ్రుతి విహితహింస హింసగ । మతిఁ దలఁపఁగ రాదు ముని సమాజం బిది దు**
**ష్కృత తతిఁ బాపెడు పరమ సు । కృతమని కొనియాడుఁ గాన గీర్వాణనుతా! 73**

**ప్రతిపదార్థం:** గీర్వాణనుతా! = దేవతలచే కొనియాడబడే గౌరీ!; శ్రుతి విహిత హింస = వేదంచేత విధించబడిన హింస; ఇది= ఇద్ది; దుష్కృత తతిన్ = పాపసమూహాన్ని; పాపెడు = తొలగించే; పరమసుకృతము+అని = మహా పుణ్య కర్మఅని; ముని సమాజంబు = మునుల సంఘం; కొనియాడున్+కాన = మెచ్చుతున్నారు గనుక; హింసగన్ = హింసాకార్యంగా; మతిన్ = మనస్సునందు; తలఁపఁగన్ +రాదు = భావించకూడదు.

**తాత్పర్యం:** గౌరీ! యజ్ఞాలలో చేసే పశుహింస హింసకాదని వేదాలు శాసిస్తున్నాయి. యాగాలలోని పశుహింస పాపాలను పటాపంచలు గావించే పుణ్యకార్యమని మునీశ్వరులు కొనియాడుతున్నారు. కనుక పశువధను హింసాకార్యంగా భావించరాదు.'

**ఆ. అని యహింస తెఱఁగు లన్నియు నెఱిఁగించి । 'యింక నేమి వినఁగ నిచ్చసేసె?'**
**దనిన రుద్రు నడిగె నద్రిజ 'జనుల జీ । వనము తెఱఁగు లెల్ల వనజనాభ!' 74**

**ప్రతిపదార్థం:** అని = అంటూ; అహింస తెఱఁగులు+అన్నియున్ = అహింస యొక్క స్వరూపాలు సమస్తం; ఎఱిఁగించి = పార్వతికి తెల్పి; ఇంకన్ = ఇటుపై; ఏమి వినఁగన్ = ఏమి ఆలకించవలెనని; ఇచ్చ+చేసెదు? = వాంఛిస్తున్నావు?; అనినన్ = అని శంభుడు పల్కగా; వనజనాభ! = కమలములవంటి కన్నులుగల శ్రీకృష్ణా!; అద్రిజ = కొండకూతురు ఉమాదేవి; జనుల = మానవుల యొక్క; జీవనము తెఱఁగులు+ఎల్లన్ = జీవన విధానము లన్నింటినీ, బ్రతుకు తెరువు లెల్ల; రుద్రున్ = శంకరుడిని; అడిగెన్ = ప్రశ్నించింది.

**తాత్పర్యం:** ఈశ్వరుడు అహింస యొక్క స్వరూప స్వభావా లన్నింటినీ తెలిపి, 'గౌరీ! నీ వింకా ఏమి వినాలని అభిలషిస్తున్నావు?' అని అడిగాడు. ఆమె 'నాథా! జగములోని జనుల జీవన విధానా లెట్టివో చెప్పు' మని రుద్రుడిని కోరింది శ్రీకృష్ణా! అని నారదుడు కృష్ణుడితో అన్నాడు.

**సీ. అడిగిన నద్దేవి కద్దేవుఁ డిట్లనుఁ । ' గాంత! మానుష్యంబు కర్మభూమి;**
**సుఖదుఖమూలముల్ సురతిర్యగాత్మక । త్వంబు; లట్లగుట విత్తంబు వలయు**
**మనుజుల; కెట్లన్న విను ధర్మకామముల్ । విత్తసాధ్యంబులు; విద్య వార్త**
**సేవ కార్షత యర్థసిద్ధికి మూలముల్; । విద్యవానికి ననవద్యతయును'**

**ఆ. గర్షకునకు నేల కాల మెఱుంగుట, । జట్టికాని కేది సంభవించె**
**నందు విలువ మొదలునగు లాభమును నెడ । వ్యయము గల్గుటయు శివ ప్రదములు. 75**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్ = అని అపర్ణ ప్రశ్నించగా; ఆ దేవికిన్ = ఆ స్వప్రకాశ స్వరూపిణికి; ఆ దేవుఁడు = సర్వజ్ఞుడైన త్రిలోచనుడు; ఇట్లు+అనున్ = ఈ రీతిగా వచించాడు; కాంత = ఓ రమణీ! మానుష్యంబు = మనుష్యత్వం, మనుజలోకం; కర్మభూమి = కర్మలాచరించే చోటు; సుర+తిర్యక్+ఆత్మకత్వంబులు = దేవతల యొక్క, పశు పక్ష్యాదుల యొక్క జన్మాలు; సుఖదుఃఖమూలముల్ = వరుసగా సుఖానికి, దుఃఖానికి కారణాలు (స్థానాలు); అట్లు+అగుటన్ = అందుచేత; మనుజులకున్ = నరులకు; విత్తంబు = ద్రవ్యం; వలయున్ = కావాలి, అవసరం; ఎట్లు+అన్నన్ = ఎందుకంటే; విను = ఆలకించుము; ధర్మ కామముల్ = ధర్మ కామ పురుషార్థాలు అనగా పుణ్యకార్యాలు చెయ్యటం, కోరికలు తీర్చుకోవటం అనేవి; విత్తసాధ్యంబులు = డబ్బు చేతనే పొందతగినవి; విద్య = చదువు; వార్త = వాణిజ్యం సల్పుట; సేవ = దాస్యం, పనులు చెయ్యటం; కార్షత = కృషీవలత్వం, వ్యవసాయంచెయ్యడం; అర్థ సిద్ధికిన్ = డబ్బు రాబడికి, ధనం లభించటానికి; మూలముల్ = హేతువులు; విద్య వానికిన్ = చదువుగలవాడికి, విద్యావంతుడికి; అనవద్యతయును = ఆచారాదులచేత నిందారాహిత్యం, మాట పడకుండటం; కర్షకునకున్ = సేద్యం చేసేవాడికి; నేల, కాలము+ఎఱుంగుట = భూసారం, విత్తుటకు తగిన ఋతువేదో తెలియటం; జట్టి కానికిన్ = వర్తకుడికి; ఏది = ఏ వస్తువు, ఏ సరకు; సంభవించెన్ = లభిస్తుందో; అందున్ = ఆ ప్రదేశంలో; విలువన్ = కొనుటకు; మొదలు = మూలధనం; అగులాభమును = సమకూడే ఆదాయం; ఎడవ్యయము = అందుకు అయ్యేఖర్చులు; కల్గుటయున్ = కలగటం; శివ ప్రదములు = శుభాన్నిస్తాయి.

**తాత్పర్యం:** పార్వతి ఆ విధంగా అడిగినప్పుడు శివుడిట్లా అంటున్నాడు. 'దేవీ! మానవలోకం కర్మ భూమి. దేవత్వం సుఖాలకూ, పశుపక్ష్యాదులుగా జన్మించటం దుఃఖా లనుభవించడానికీ కారణ మవుతున్నాయి. అందువల్ల మనుష్యులకు

ధనం కావాలి. ఎందుకంటే పుణ్యకార్యాలు ఆచరించవలెనన్నా, కోరికలు తీర్చుకొనాలన్నా ధనం అవసరం. విద్యగలవాడికి నిందా రాహిత్యం, సేద్యం చేసికొనే వాడికి పొలము యొక్కసారం, వితేసమయం అనగా ఋతుధర్మం తెలిసి ఉండటం, వర్తకుడికి ఆయాతావులలో దొరికే సరుకులను అక్కడ కొనుగోలు చెయ్యటానికి మూలధనం (పెట్టుబడి), పెట్టుబడితో వచ్చే లాభం, అందుకు అయ్యే వ్యయం తెలియడం శుభాన్ని కలిగిస్తాయి.

**విశేషం:** "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః"

సత్త్వరజస్తమోగుణాలు, వాటికి తగ్గ శమదమాది కర్మలూ విభాగించి నేనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను సృష్టించాను అని భగవానుడు గీతలో ఉగ్గడిస్తూ --

"శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్." (భగ. 18-42)

శమం (బాహ్యేంద్రియనిగ్రహం), దమం (మనోనిగ్రహం), తపస్సు, శౌచం, ఆర్జవం (త్రికరణశుద్ధి), జ్ఞానం, విజ్ఞానం, ఆస్తిక్యం - అనేవి బ్రాహ్మణుడికి స్వభావంతో పుట్టిన కర్మలుగా పేర్కొన్నాడు. ఆలాగే-

"కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్".

వ్యవసాయం, పశు సంరక్షణ, వర్తకం వైశ్యుడికి సహజలక్షణాలనీ, బ్రాహ్మణాది వర్గాలకు సేవచేయడమే శూద్రుడికి సహజ ధర్మమూ, జీవిక అనీ పరమాత్మ గీతలో చెప్పటం జరిగింది. 66వ పద్యంలో రాజధర్మాలు వివరించటం జరిగినందున ఈ పద్యంలో మళ్ళీ రాజకులోచిత ధర్మాలు, జీవనోపాయం చెప్పబడలేదు.

**క. పసులం బాలించునతఁడు । విసువక యేమఱక వాని విధము లెఱిఁగి ప్రో**
**చి సమర్థుం డగు; వెరవునఁ । బసిఁ గను సేవకుఁడు ధనముఁ బడయుఁ బొగడుతోన్. 76**

**ప్రతిపదార్థం:** పసులన్ = పశువులను; పాలించు+అతఁడు = కాచేవాడు; విసువక = శ్రమ అనుకోక; ఏమఱక = అలక్ష్యం చేయక, ఉపేక్షించక; వానివిధములు+ఎఱిఁగి = వాటి కష్టసుఖాలు తెలిసికొని; ప్రోచి = కాపాడి, సంరక్షించి; సమర్థుండు+అగున్= నేర్పుకాడవుతాడు; వెరవునన్ = ఉపాయంతో, మెలకువతో; పసిన్ = పసరాలను; కను = చూచుకొనే; సేవకుఁడు = పనివాడు; పొగడుతోన్ = ప్రశంసతో, కీర్తితో; ధనమున్ = డబ్బును; పడయున్ = పొందుతాడు;

**తాత్పర్యం:** పశువులను పాలించేవాడు విసుగు చెందక, ప్రాలుమాలక వాటి కష్టసుఖాలు గమనిస్తూ కాపాడి నేర్పుకా డనిపించుకొంటాడు. మెలకువతో పశువులను చూచుకునేవాడు కీర్తితోపాటు ధనం గడిస్తాడు.

**క. వంచనయును జాడ్యంబును । నించుకయును లేక ప్రభువు నిష్ట మెఱిఁగి తాఁ**
**బంచిన పని వెరవునఁ గా । వించిన కర్మకరుఁ డొందు విపుల ధనంబుల్.' 77**

**ప్రతిపదార్థం:** వంచనయున్ = మోసమునూ; జాడ్యంబును = అలసత్వమూ, సోమరితనమూ; ఇంచుకయును లేక = కొంచెమైనను కలుగక; ప్రభువు+ఇష్టము = యజమానుడి కోరిక; ఎఱిఁగి = తెలిసి; తాన్ = తాను (సేవకుడు); పంచిన పనిన్ = ఆజ్ఞాపించిన కార్యమును; వెరవునన్ = నేర్పుతో; కావించిన = చేసినట్టి; కర్మకరుఁడు = పని మనిషి, సేవకుడు, భృత్యుడు; విపుల ధనంబుల్ = విస్తారమైన విత్తమును, సిరిని; ఒందున్ = పొందుతాడు.

**తాత్పర్యం:** మోసం, సోమరితనం లేక తన యజమానుడి పనిని అతడి యిష్టప్రకారం నెరవేర్చే సేవకుడు విస్తారమైన ధనం పొందుతాడు.'

**వ. అని వెండియు. 78**

**తాత్పర్యం:** అని మరల. (శంకరుడు పార్వతితో అట్లని మరల ఇట్లంటున్నాడు అని తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'పరధన పరదారల నప । హరింపమియు, దేవపితృ సమారాధనముం**
**గరుణయు నతిథి సపర్యయు । గిరితనయా! యెల్లవారికిం గృత్యంబుల్.' 79**

**ప్రతిపదార్థం:** గిరితనయా! = పర్వతపుత్రీ!; హైమవతీ! పరధన = ఇతరుల విత్తమునూ; పరదారలన్ = ఇతరుల పత్నులనూ; అపహరింపమియున్ = దొంగిలించకుండటం, కాజేయకుండటం; దేవపితృసమారాధనమున్ = దేవతలయొక్క పితృదేవతల యొక్క పూజనమూ; కరుణయున్ = దయాగుణమున్నూ; అతిథిసపర్యయున్ = అతిథులకు సేవ చేయటమూ; ఎల్లవారికిన్ = అందరికీ; కృత్యంబుల్ = చేయదగిన పనులు.

**తాత్పర్యం:** 'పార్వతీ! పరులధనమునూ, పరుల పత్నినీ కోరకుండటం; దేవతలను, పితృదేవతలను ఆరాధించటం; కృపాగుణం కలిగిఉండటం; అతిథి సేవ చేయటం అందరూ ఆచరించవలసిన ధర్మాలు.'

### శివుఁడు పార్వతికి వర్ణకర్మ పరిపాకంబుల తెఱం గెఱింగించుట (సం.13 అను 1-15-1525)

**వ. అనిన విని యపర్ణాదేవి 'వర్ణంబుల కర్మంబులు పాకంబుఁ బొందు ప్రకారంబు చెప్పు' మని య**
**ప్పరమేశ్వరు నడిగిన నతం డిట్లనియె. 80**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని పరమశివుడు పల్కగా ఆలకించి; అపర్ణాదేవి = ఉమాదేవి; వర్ణంబుల కర్మంబులు = బ్రాహ్మణాది జాతులవారు చేయు పనులు; పాకంబున్+పొందు+ప్రకారము = పక్వమయ్యే తీరు; చెప్పుము+ అని; ఆ+పరమ+ ఈశ్వరున్+అడిగినన్; అతండు = ఆ శివుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని శివుడు చెప్పగా ఆలకించి 'కులముల యొక్క కర్మలు పరిపక్వమయ్యే విధమెట్టిదో తెల్పు'మని గౌరీదేవి కోరగా ఈశ్వరు డిట్లా అన్నాడు.

**విశేషం:** పరమేశ్వరుడిని పతిగా కోరి పార్వతి పర్ణములు = ఆకులు కూడ మెసవక ఘోర తపస్సు చేసింది గనుక ఆమెకు అపర్ణ అని పేరు వచ్చింది.

**చ. 'తమ తమ కర్మముల్ తెరువు దప్పక చేసినవారు దేవలో**
**కమున సుఖంబు పొందుదురు; క్రమ్మఱి వచ్చియుఁ బూర్వజాతి జ**
**న్మమున మహర్ధిఁ బొందుదురు; మానిని! యిమ్మెయిఁ దప్పి యెట్టి కృ**
**త్యములఁ జరించి రజ్జుల కట్టి కులంబునఁ బుట్టు వాటిలున్. 81**

**ప్రతిపదార్థం:** మానిని = అభిమానవతీ! గౌరీ!; తెరువు+తప్పక = దారి తప్పక; తమ తమ కర్మముల్ = తమ తమ కుల వృత్తులు; చేసినవారు = సల్పినట్టి వారు; దేవలోకమునన్ = స్వర్గభువనంలో; సుఖంబు+పొందుదురు = సౌఖ్యాలు అనుభవిస్తారు;

క్రమ్మఱి వచ్చియున్ = పుణ్యం క్షీణించగానే తిరిగి ధరణికి వచ్చి కూడా; పూర్వజాతిజన్మమునన్ = మునుపటి కులంలోని పుట్టుకతో; మహా+బుద్ధిన్ = మిక్కిలిపెంపును; పొందుదురు = చెందుతారు; ఈ+మెయిన్+తప్పి = ఈ విధానం విడిచి; ఎట్టి కృత్యములన్+చరించిరి = ఎట్టి పనులలో ప్రవర్తిస్తారో; ఆ+జనులకున్ = ఆ నరులకు; అట్టి కులంబునన్ = అట్టివర్ణంలోనే; పుట్టు = పుట్టుక; పాటిలున్ = కలుగుతుంది.

**తాత్పర్యం:** 'హైమవతీ! ఆయా కులాలకు విధింపబడిన కర్మలను శ్రద్ధతో చేసే వారు స్వర్గలోకంలో సుఖమనుభవిస్తారు. పుణ్యం క్షీణించగనే వారు అక్కడ నుండి వచ్చి మళ్ళీ భూతలంలో మునుపటి కులాలలోనే జన్మించి మిక్కిలి అభివృద్ధి పొందుతారు. అట్లా కాకుండ తమ తమ కుల ధర్మాలు వదలి ఏయేకర్మలు చేస్తారో, ఆయా కర్మలను బట్టి వారు ఆయాకులాలలో పుట్టుతారు.

**విశేషం:** "స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు." - (భగ. 18-45)

"యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః." - (భగ. 18-46)

అర్జునా! తమ తమ వర్ణ ధర్మాలను వదలక ఆదరంతో ఆచరించే వాడు పరమపదాన్ని పొందుతాడు. అదెట్లాగో చెప్పుతాను వినుము. సకలభూతముల వ్యాపారాలు ఆ పరమాత్మవలననే జరుగుతున్నాయి. చరాచరాత్మకమైన జగమంతటా అతడు నిండి ఉన్నాడు. అట్టి పరమాత్మను మానవుడు తనకు విధించబడిన కర్మతో ఆరాధించి సిద్ధిని పొందుతున్నాడు - అని అర్జునుడికి భగవంతుడి ఉపదేశం.

**క. ఎంతెంత మేలు చేసిన । నంతంతియ కులము నెక్కుడై సమకూరుం**
**గాంతా! విప్రుఁ డయిన న । త్యంతానంద మగులోక మతనికిఁ గలుగున్.' 82**

**ప్రతిపదార్థం:** కాంతా! = రమణీ!; ఎంత+ఎంత = ఏపాటి, ఏ కొలది; మేలు చేసినన్ = ఉపకారం చేస్తాడో; అంత+అంతియ = అంతకు తగినట్టి; కులము = జాతి; ఎక్కుడు+ఐ+సమకూడున్ = గొప్పగా లభిస్తుంది; విప్రుఁడు+అయినన్ = బ్రాహ్మణుడై జన్మిస్తే; అతి+ఆనందము+అగు లోకము = మిక్కిలి సంతోష భరితమైన లోకం; అతనికిన్ = ఆ భూసురుడికి; కలుగున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** ఎవడు ఏ పాటి పుణ్యం చేస్తాడో వాడికి ఆ పాటి ఉత్తమ కులం లభిస్తుంది. అధిక పుణ్య ఫలంగా నరుడు బ్రాహ్మణ జాతిలో జన్మిస్తే అతడికి నిత్యానందమయమైన ఉత్తమ లోక ప్రాప్తి కలుగుతుంది.'

**వ. అని చెప్పి మఱియును. 83**

**తాత్పర్యం:** శంభుడు గిరిజతో అట్లా చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఆపదఁ దూలపోక సిరి నంది మదింపక శౌర్యవృత్తిమైఁ**
**బాపుల గెల్చి యార్జవము బంధుజనాలికి నార్యకోటికిన్**

**జూపుచు దీనులం గరుణఁ జూచి తగం గలమాత్రఁ బ్రోచుచున్**
**గోపము లేక మన్కి గలుగున్ దివిజాంశమునన్ జనించినన్.'** **84**

**ప్రతిపదార్థం:** దివిజ+అంశమునన్ = దేవతల అంశంలో; జనించినన్ = పుడితే; ఆపదన్ = కష్టంవచ్చినప్పుడు, విపత్తులో; తూలపోక = చలించక, నొవ్వక, బాధపడక; సిరిన్ = సంపదను; అంది = పొంది; మదింపక = గర్వించక; శౌర్య వృత్తిమైన్ = శూరత్వంతో, పరాక్రమంతో; పాపులన్ గెల్చి = కలుషాత్ములను జయించి; ఆర్జవము = చక్కని నడవడిక, ఋజువర్తన; బంధుజన+ఆళికిన్ = చుట్టాల సమూహానికి; ఆర్యకోటికిన్ = పెద్దల సముదాయానికి; చూపుచున్ = కనబరచుతూ, దీనులన్ = నొచ్చినవారిని, దిక్కులేని వారిని; కరుణన్+చూచి = దయతో ఆదరించి; తగన్ = ఒప్పిదముగ; కలమాత్రన్ = తనశక్తికి తగినట్లు; ప్రోచుచున్ = కాపాడుతూ; కోపము లేక మన్కి = ఆగ్రహంలేని బ్రతుకు; కలుగున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** దేవతల అంశలో జన్మించిన వాడు ఆపదలయందు చలించడు. సంపదలయందు గర్వించడు. పరాక్రమంతో పాపులను జయిస్తాడు. బంధుజనముల యెడ, పెద్దల సమూహం పట్ల ఋజు ప్రవర్తనతో మెలగుతాడు. దీనుల యందు కనికరం కలిగి తన శక్తి మేరకు వారిని సంరక్షిస్తాడు. కోపతాపాలు లేని మనుగడతో విరాజిల్లుతాడు.'

**క. అనిన విని గౌరి 'కొందఱు । మనుజులు సంపద సుఖించి మనఁ గొందఱు లే**
**మి నలంగి దుఃఖ పడుదురు; । విన వలతుం గారణంబు; వినిపింపు శివా!'** **85**

**ప్రతిపదార్థం:** అనినన్+విని = పరమశివుడు అట్లా చెప్పగా ఆకర్ణించి; గౌరి = నగరాజకుమారి; శివా! = పరమేశ్వరా!; కొందఱు = కొంతమంది; మనుజులు = మానవులు; సంపదన్ = ఐశ్వర్యంతో; సుఖించి మనన్ = సౌఖ్యా లనుభవిస్తూ బ్రతుకగా; కొందఱు = కొంతమంది; లేమిన్ = లేమిడితో, పేదరికంతో, దారిద్ర్యంతో; నలంగి = బాధచెంది, నొచ్చి; దుఃఖము+పడుదురు = చింతిస్తుంటారు; కారణంబు = ఇందుకు హేతువు; వినన్ = వినుటకు; వలతున్ = వాంఛిస్తాను; వినిపింపు = చెప్పవలసినది.

**తాత్పర్యం:** అని మహాదేవుడు చెప్పగా విని భవాని 'హృదయేశ్వరా! పుడమిలో కొందరు సిరిసంపదలతో తులదూగుతూ సుఖా లనుభవిస్తుండగా మరి కొంతమంది పేదరికంతో అగచాట్లపాలై దుఃఖపడుతుంటారు. ఇందుకు కారణ మేమిటో వినగోరుతున్నాను. సెలవియ్యండి.'

**చ. అనుటయు శంభుఁ డిట్లను 'దయన్ బలి భిక్షము పెట్టలేమిఁ గుం**
**దిన చెలిఁ జుట్టముం బిలిచి దీనత వాపి యపాపవృత్తిఁ జె**
**ల్లిన తొలుబాము గల్గునరు లెస్సగ మంచు విధాత; నిష్కృపా**
**త్ముని నతిలోభ దూషితుని దుర్గతి దుఃఖితుఁ జేయుఁ బార్వతీ!'** **86**

**ప్రతిపదార్థం:** అనుటయున్ = అని సర్వమంగళ పలుకగా; శంభుఁడు = శంకరుడు; ఇట్లు +అనున్ = ఈలాగున పలికాడు; పార్వతీ = గిరిజా!; దయన్ = కారుణ్యంతో; బలి = భూతములకు (కాకులు మొదలైనవాటికి); బలి = ఆహారం (పిడికెడు మెతుకులు); భిక్షము = యాచకులకు చేరెడు బియ్యం; పెట్టన్+లేమిన్ = పెట్టుటకు లేనందున; కుందిన = చింతించిన, దుఃఖించిన; చెలిన్ = మిత్రుడిని; చుట్టమున్ = బంధువును; పిలిచి = ఆహ్వానించి, రమ్మని; దీనత+పాపి = దరిద్రతను

తొలగించి, వారి పేదరికాన్ని నిర్మూలించి; అపాపవృత్తిన్ = కలుషరహితమైన ప్రవర్తనతో, పుణ్య వర్తనతో; చెల్లిన = సాగిన, గడచిన; తొలుబాము+కల్గు+నరున్ = ముందటి జన్మముగల, పూర్వజన్మం కలిగిన మనుజుడిని; విధాత = బ్రహ్మదేవుడు; లెస్సగన్ = చక్కగా, బాగుగా; మన్పున్ = అన్న వస్త్రాదులిచ్చి పోషిస్తాడు, జీవింపజేస్తాడు; నిస్+కృపా+ఆత్మునిన్ = దయలేని మనసు గలవాడినీ, అతిలోభ దూషితున్ = పరమ దురాశాపరుడిని, పిసినారి తనం గలవాడిని; దుర్గతి దుఃఖితున్+చేయున్ = పేదరికంతో విలపించేవాడినిగా చేస్తాడు.

**తాత్పర్యం:** ఉమాదేవి అట్లా అడిగితే శివు డిట్లా అన్నాడు. 'గౌరీ! భూతములకు బలి సమర్పణ చెయ్యటానికి, యాచకులకు బిచ్చం వెయ్యటానికి ఏమీలేక ఎంతో బాధపడుతున్న తన మిత్రులను, చుట్టాలను రమ్మని చెంతకు చేరదీసి వారి పేదరికాన్ని తొలగించి పుణ్య ప్రవర్తనతో పూర్వజన్మం గడపిన పురుషుడికి బ్రహ్మదేవుడు అధికంగా సిరిసంపద లిచ్చి కాపాడుతాడు. అట్లా కాకుండా తొలి జన్మలో దయారహితుడై, పరమలుబ్ధుడై (పిసినిగొట్టై) జీవితం గడపిన వాడిని ఈ జన్మలో కష్టాలపాలు చేసి దుఃఖపడేటట్లు చేస్తాడు బ్రహ్మ.

**విశేషం:** భవమునకు వికృతి పదం బాము. తొలుబాము = పూర్వభవము = ముందటి జన్మము - జన్మాంతర సుకృతదుష్కృత ఫలానుభవం తప్పదని నిరూపణ చేస్తాయి.

**క. విను మలుకయుఁ గూర్మియు లే । వనవద్యా! యెజ్జనంబులందును విధికిన్**
**ముసు చేసిన కర్మము ఫల । మనుభవ గోచరము సేయు నంతియ తఱితోన్.' 87**

**ప్రతిపదార్థం:** అనవద్యా! = అనింద్యచరిత్రురాలా!; వినుము = ఆలకించుము; విధికిన్ = బ్రహ్మకు, పరమేష్ఠికి; ఏ+జనంబుల +అందున్ = ఏ మనుష్యుల యందూ; అలుకయున్ = కోపమూ, కినుక; కూర్మియున్ = ప్రేమయూ; లేవు = కలుగవు; ముసు చేసిన కర్మము ఫలము = వారు మునుపటి జన్మలలో చేసిన కర్మల యొక్క ఫలం; తఱితోన్ = సమయమునందు; అనుభవ గోచరము+చేయున్ = అనుభవానికి వచ్చేటట్లుచేస్తుంది; అంతియ = ఇంతేసుమా! ఇంతకన్న వేరేమీ లేదు.

**తాత్పర్యం:** ప్రాణేశ్వరీ! చెప్పుతాను వినుము. బ్రహ్మదేవుడికి ఏ జీవుల యందు కోపం గానీ, ప్రేమగానీ లేవు. కానీ ఆయా జనులు పూర్వజన్మలలో చేసికొన్న కర్మలఫలం అనుభవించవలసిన వేళరాగానే వారి అనుభవానికి వస్తుంది. ఇంతేగాని ఇందుకు వేరే కారణం లేదు.'

**విశేషం:** "సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యో భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." (భగ. 9-29)

నేను సర్వ ప్రాణులపట్ల సమానుడిని. నాకు ద్వేషించ తగిన వాడుగాని, ఇష్టుడుగాని లేడు అని గీతలో భగవానుడు చెప్పినట్లు జగత్సృష్టికర్తకు ఒకరిపట్ల కినుకగానీ, మరొకరిపట్ల ప్రేమగానీ లేవు. ఆయా జీవులు చేసికొన్న సుకృత దుష్కృతాలే వారి సుఖదుఃఖాలకు హేతువులు.

**వ. అని యెఱింగించి వెండియు. 88**

**తాత్పర్యం:** అని తెలిపి పరమేశ్వరుడు మళ్ళీ (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. 'ధనము గలిగియుండి ధవళాక్షి! కుడువక । కట్టకుండు పరమకష్టజనము**
**లొరువు లొత్తిచెప్పనుపకారులై తొలు । పుట్టునందు మనిన యట్టివారు. 89**

**ప్రతిపదార్థం:** ధవళ+అక్షి! = తెలి కన్నులదానా!; ధనము+కలిగి+ఉండి = చేతిలో దండిగా డబ్బుండి కూడా; కుడువక = తిండి తినక; కట్టక+ఉండు = దుస్తులు ధరించకుండే; కష్టజనులు = పరమనీచులు; ఒరువులు = ఇతరులు; ఒత్తి చెప్పన్ = నొక్కి చెప్పగా, గట్టిగా నిర్బంధించి చెప్పగా; ఉపకారులు+ఐ = పరులకు మేలొనర్చువారై; తొలు పుట్టు+అందున్ = పూర్వజన్మలో, మునుపటి పుట్టువులో; మనిన+అట్టివారు = జీవించినటువంటివారు సుమా!

**తాత్పర్యం:** 'దేవీ! విశాలాక్షీ! పూర్వజన్మలో ఇరుగు పొరుగువారు నొక్కి నొక్కి చెప్పగా, వారి నిర్బంధానికి తలయొగ్గి పరులకు ఉపకారం చేస్తూ ఆ బ్రతుకు అట్లా వెళ్లబుచ్చినవారు ఇప్పుడు సిరి సంపద లుండికూడా కమ్మగా భుజించక, మంచి ఉడుపులు ధరించక నీచంగా జీవిస్తున్న ఆ జనులే సుమా!

**ఆ. తమకు ధనము లేక తగు భోగముల కెవ్వ । రైన నడప మను సుఖాఢ్యజనులు**
**తొల్లి పేదవార లుల్ల మర్థుల కెప్డు । బెట్టఁగోరుచుండి నట్టివారు. 90**

**ప్రతిపదార్థం:** తమకున్ = తమకు; ధనము లేక = ద్రవ్యం లేకున్ననూ; తగు భోగములకున్ = కావలసిన సుఖానుభవాలకు; ఎవ్వరు+ఐనన్ = ఎవ్వరెవ్వరో; నడపన్ = జరుపుతుండగా, ఇస్తూఉంటే; మను = జీవించునట్టి; సుఖ+ఆఢ్య+జనులు = సుఖాలనుభవిస్తున్న పుణ్యాత్ములు; తొల్లి = పూర్వం, మునుపు ; పేదవారలు = దరిద్రులు, బీదవాళ్ళు; ఉల్లము = మనస్సు; అర్థులకున్ = అడుగుకునేవాళ్ళకు, యాచకులకు; ఎప్డు = ఎల్లప్పుడూ; పెట్టన్+కోరుచున్+ఉండిన+అట్టివారు = ఇవ్వవలెనని వాంఛించే వారేసుమా!

**తాత్పర్యం:** ఇపుడు తమకు విత్తం లేకపోయినప్పటికీ ఇతరుల సహాయ సహకారాలతో సుఖాలు అనుభవిస్తున్న జనులు వెనుకటి జన్మలో తాము పేదవారైనప్పటికీ తమ మనసులలో ఎల్లప్పుడు పేదసాదలకు పెట్టి పోషించవలెనని వాంఛించే ఉదారులే సుమా!

**విశేషం:** పెట్టే శక్తి తనకు లేకపోయినా పెట్టవలెననే సంకల్ప ముంటే చాలు. అదే తన భావి సుఖానికి మూల మవుతుంది. తను పెట్టకపోయినా పెట్టే ఇల్లు చూపటం తనకు ఎంతో మేలుచేకూరుస్తుంది అని చెప్పటానికి ఇటువంటి సూక్తులే మూలం.

**సీ. ఆయాసపడకుండ నర్థంబు చేరెడు । వారు పాత్రజనంబుఁ దార పిలిచి**
**తొలుమేనఁ బెట్టిన యలఘు దయాఢ్యులు; । ధనసిద్ధి బహులయత్నమునఁ గలుగు**
**మనుజులు పూర్వజన్మమున నర్థులు దమ్ము । నడుగ దాఁపక యిచ్చినట్టి వార;**
**లాయాసమునను విత్తాగమం బెడలెడు । జనులు ముందరి పుట్టువునఁ గృపా వి**

**తే. హీనులై యాచకుల నలయించి పిదప । నిడని లోభులు; ముదిసి ధనేశుఁడగు న**
**రుండు ప్రాయంబునాఁ డీక గం డడంగి । తొంటి భవమున నీగికిఁ దొడఁగి నతఁడు. 91**

**ప్రతిపదార్థం:** ఆయాసము+పడక+ఉండన్ = శ్రమ చెందకుండ; అర్థంబు = విత్తం; చేరెడు వారు = చెందుతున్నవారు; తొలుమేనన్ = ముందటి జన్మలో; పాత్రజనంబున్ = యోగ్యులైనవారిని, తగినవారిని, అర్హులను; తారు+అ = తామే; పిలిచి

= ఆహ్వానించి; పెట్టిన+అలఘు+దయా+ఆఢ్యులు = దానం చేసిన గొప్ప దయాగుణమున్నవారు; బహుల యత్నమునన్ = పలువిధములైన ప్రయత్నాలతో; ధనసిద్ధి కలుగుమనుజులు = ద్రవ్యలాభం పొందునట్టి మనుష్యులు; పూర్వజన్మమునన్ = తొలుతటి పుట్టువులో; అర్థులు = యాచకులు; తమ్మున్ = తమర్ని; అడుగన్ = కోరగా; డాఁపక = తన దగ్గరనే పదిలపరచుకోక; ఇచ్చిన+అట్టివారలు = ఒసగిన పుణ్యాపురుషులు సుమా!; ఆయాసమునను = శ్రమపడియూ; విత్త+ఆగమంబు = ధనము యొక్క లాభం, ప్రాప్తి; ఎడలిన జనులు = తొలగిన వారు; ముందరి పుట్టువునన్ = పూర్వజన్మలో; కృపావిహీనులు+ఐ = దయాశూన్యులై, కరుణమాలిన వార్తై; యాచకులన్ = అర్థులను; అలయించి = ఇంటికి త్రిప్పుకొని శ్రమ పెట్టి; పిదపన్ = తరువాత; ఇడని లోభులు = ఇయ్యని పిసినిగొట్టులు, లుబ్ధులు; ముదిసి = ముసలివాడై; ధన+ఈశుఁడు+అగు = ధనాధిపతిఅయిన, మహాధనికుడైన; నరుండు = మనుజుడు; తొంటి భవమునన్ = ముందటిజన్మలో; ప్రాయంబునాఁడు+ఈక = మంచి యౌవనదశలో ఉన్నప్పుడు దానంచెయ్యక; గండు+అడంగి = బలముడిగి, శక్తి చెడి, ముసలివాడై; ఈగికిన్ = దానము సల్పడానికి; తొడఁగిన+అతఁడు = పూనుకొన్నవాడు సుమీ!

**తాత్పర్యం:** ఈశ్వరీ! ఎక్కువ శ్రమపడకుండా డబ్బు ఎవరికి లభిస్తుందో వారు తొల్లిటి జన్మలో యోగ్యులైన వారిని తమంతట తామే రండని పిలిచి దానము చేసిన దయామయ హృదయులు సుమా! మిక్కిలి ప్రయత్నంతో ఇప్పుడు ధనం గడిస్తున్నవారు పూర్వ జన్మలో యాచకులు తమర్ని వేడినప్పుడు రేపురా, మాపురా, మళ్లీ రమ్మన కుండా, దాన మొనర్చిన పుణ్యాత్ములు సుమా! మిక్కిలి శ్రమపడికూడా విత్తం చేకూరక వేదన చెందుతున్నవారు మునుపటి పుట్టువున యాచకుల్ని కనికరం లేక పలుమారు తమ యింటికి తిప్పుకుని చివరికి ఏదీ యివ్వక పంపివేసిన లోభులు సుమా! ముసలితనంలో కుబేరులై ఉన్నవారు వెనుకటి జన్మలో తాము పడుచుదనంలో ఉన్నప్పుడు శక్తికొలది ఒకరికి ఉపయోగపడక వార్ధకంలో దానధర్మాలకు పూనుకొన్న వారే సుమీ!

**తే.** **కలిగియుండియుఁ దెవుళుల కతన భోగ । ములు భుజింపఁగలేని మర్త్యులు, గిరీంద్ర**
**తనయ! తొలుమేన రోగముల్ దనికి చచ్చు । నపుడు దానంబుసేసిన యట్టివారు.** **92**

**ప్రతిపదార్థం:** గిరి+ఇంద్రతనయ! = ఓ కొండలరాయని కూతురా!; కలిగి+ఉండియున్ = తనకు సంపద ఉండికూడా; తెవుళుల కతనన్ = రోగాల మూలంగా; భోగములు = సుఖాలు; భుజింపఁగన్+లేని = అనుభవించజాలని; మర్త్యులు = మనుష్యులు; తొలుమేనన్ = పూర్వజన్మాన; రోగముల్+తనికి = వ్యాధులు సంభవించి; చచ్చు+అపుడు = మరణించే వేళ; దానముల్ = దానాలు; చేసిన+అట్టివారు = ఇచ్చినవారు సుమా!

**తాత్పర్యం:** గిరిజాదేవీ! కలిమి కలిగి ఉండి కూడా వ్యాధిగ్రస్తులైన కారణాన బాధపడుతూ ఇపుడు భోగా లను భవించడానికి నోచుకొననివారు పూర్వజన్మంలో జబ్బులంటుకొని చనిపోయే సమయంలో దానం చేసిన వారే సుమా!

**తే.** **అధిక సౌందర్యములు గలయట్టి జనులు । తొల్లి మాంసభోజనములఁ దొఱఁగియున్న**
**వారు రూపవిహీనులు దారు రూపు । గలిగి తొలుమేనఁ గొనటులఁ బలికినారు.** **93**

**ప్రతిపదార్థం:** అధికసౌందర్యములు = ఎక్కువచక్కదనాలు, మిక్కిలి అందాలు; కల+అట్టి = కలిగినటువంటి; జనులు = మనుష్యులు; తొల్లి = పూర్వం; మాంసభోజనములన్ = మాంసాహారాన్ని; తొఱఁగి+ఉన్నవారు = మానివేసినవారు, విడిచినట్టివారు; రూపవిహీనులు = వికృతస్వరూపులు; తారు = తాము; తొలుమేనన్ = పూర్వజన్మలో; రూపు+కలిగి = అందంకలవారై; కొనటులన్ = కురూపులను; పలికినారు = ఎగతాళిచేసినవారు, పరిహసించినవారు సుమా!

**తాత్పర్యం:** ప్రేయసీ! చక్కందనం కలిగి ఉన్నవారు పూర్వజన్మలో మాంసం తినటం మానివేసినట్టివారే. నేడు వికృత స్వరూపులై ఉన్నవారు మునుపటి జన్మలో తాము సొగసుకాండ్రై ఉండి కురూపులను పరిహసించిన వాళ్లే సుమా!

**క. విను సౌభాగ్యసమేతుఁడు । మును నిజదారైకపరుఁడు; ముందటి జన్మం**
**బున భార్యకుఁ బ్రీతి యొన । ర్పని మనుజుఁడు సుభగతావిరహితతఁ బొందున్. 94**

**ప్రతిపదార్థం:** విను= గౌరీ! వినుము; సౌభాగ్యసమేతుఁడు= వైభవోపేతుడు; మును= పూర్వజన్మంలో; నిజదార+ఏకపరుఁడు= తన భార్యయందే మిక్కిలి ఆసక్తి కలవాడు; ముందటి జన్మంబునన్ = తొలుతటి పుట్టుకలో; భార్యకున్ = తన పత్నికి; ప్రీతి+ఒనర్పని = సంతోషం కల్గించని, తృప్తి చేకూర్చని; మనుజుఁడు = మనిషి; సుభగతావిరహితతన్ = సౌభాగ్యవిహీనత్వాన్ని; పొందున్ = పొందుతాడు అనగా అందచందాలు లేని ఆలిని పొందుతాడు.

**తాత్పర్యం:** ప్రియురాలా! పూర్వజన్మలో తన పత్నియందు పరమ ప్రీతిగల పురుషుడు, ఏకపత్నీవ్రత పరాయణుడు సౌందర్యవతిని ఇల్లాలుగా పొందుతాడు. ముందటి జన్మలో భార్యను ఉపేక్షించి యథేచ్ఛగా విహరించినవాడు సౌభాగ్యవిహీను డవుతాడు.

**క. అమితజ్ఞానము విజ్ఞా । నముఁ గలిగియుఁ బేదయైన నరుఁడు చనిన జ**
**న్మమున వినికి గలిగియు దా । నము తెరువునఁ బోనివాఁడు నళినదళాక్షీ! 95**

**ప్రతిపదార్థం:** నళినదళ+అక్షీ! = తామరరేకుల వంటి కన్నులు కలదానా!; అమితజ్ఞానమున్ = అధికమైన అధ్యాత్మజ్ఞానమును; విజ్ఞానమున్ = శాస్త్ర సంబంధమైన జ్ఞానమునూ, అనుభవపూర్వకమైన జ్ఞానమునూ; కలిగియున్ = లభించికూడా; పేద+ఐన+ నరుఁడు = దరిద్రుడైన మానవుడు; చనిన జన్మమునన్ = పోయిన పుట్టుకలో; వినికి+కలిగియున్ = ధర్మాలను గూర్చి వినికూడ; దానము తెరువునన్+పోనివాఁడు = దాన పథంలో వెళ్ళనివాడు సుమా!

**తాత్పర్యం:** తామరరేకులవంటి కన్నులుగల పార్వతీ! అధ్యాత్మ జ్ఞానమూ, శాస్త్రజ్ఞానమూ కలిగి ఉండి కూడా పేదరికంతో అలమటించేవాడు తొలి జన్మంలో ధర్మాలను తెలిసికూడా దానం చేయటానికి ఏమాత్రం పూననివాడే సుమా!

**క. తగుబుద్ధిలేక సంపద । మిగులఁ గలుగు నరుఁడు తొంటిమేనఁ గరుణమై**
**విగతప్రజ్ఞుం డయ్యును । దగ దీనులఁ బ్రోచినతఁడు దళితాబ్జముఖీ ! 96**

**ప్రతిపదార్థం:** దళిత+అబ్జముఖీ! = వికసించిన పద్మంవంటి ముఖంకలదానా!; తగు బుద్ధిలేక = తగిన తెలివిలేక; సంపద = ఐశ్వర్యం; మిగులన్ = మిక్కిలి; కలుగు నరుఁడు = కలిగినట్టివాడు; తొంటిమేనన్ = పూర్వజన్మలో; విగతప్రజ్ఞుండు+అయ్యునున్ = తెలివిలేనివాడు అయినప్పటికిన్నీ, వివేకవిహీను డైనప్పటికినీ; కరుణమైన్ = దయతో; తగన్ = చక్కగా; దీనులన్ = దరిద్రులను; ప్రోచిన+అతఁడు = రక్షించినవాడే సుమా!

**తాత్పర్యం:** వికసించిన కమలంవంటి మోముగలదానా! ఈ జన్మలో తగినంత తెలివితేటలు లేకపోయినప్పటికినీ మెండగు సంపద కలవాడు పూర్వజన్మలో వివేకహీనుడై ఉండి కూడా కనికరంతో దరిద్రులను రక్షించిన వాడే సుమా!

సీ. మేధావియై విన్కి మిగిలి విద్యలఁ బొల్చు । నరుఁడు దొల్బామున గురున కధిక
భక్తుఁడై తనదైన పాండిత్య మొరులకుఁ । గావించు వేడుక గలుగు సుజనుఁ;
డభ్యసింపంగ విద్యాయుక్తి లేకుండు । నాతఁడు తొల్లి విద్యాధికత్వ
మున గర్వియై శిష్టజనులకు సభ భంగ । మొనరించి కుందఁజేసిన యతండు;

తే. భార్యయును బిడ్డలును దాను బహుధనముల । భోగులై రోగములు లేక పొల్చువార
లమలినాచార పాత్రదానములు సత్య । కరుణలును దొంటి భవమునఁ గలిగినారు. 97

**ప్రతిపదార్థం:** మేధావి+ఐ = బుద్ధిమంతుడై, మంచితెలివి కలవాడై; విన్కిమిగిలి = శాస్త్రాదులను శ్రవణం చేసి, బహుశ్రుతుడై; పొల్చు = ఒప్పుతున్న, విలసిల్లునట్టి; నరుఁడు = మనుష్యుడు; తొల్+బాముననన్ = కడచిన జన్మలో; గురునకున్ = ఆచార్యుడికి; అధిక భక్తుఁడు+ఐ = గొప్ప భక్తుడై; తనది+ఐనపాండిత్యము = విద్యలయందు తనకున్న నేర్పును; ఒరులకున్ = అన్యులకు; కావించు = కలిగించునట్టి; వేడుక+కలుగు+సుజనుఁడు = అభిలాష కలిగిన సత్పురుషుడు సుమా!; అభ్యసింపఁగన్ = చదువుకొనుటకు; విద్యాయుక్తి లేక+ఉండు+ఆతఁడు = విద్యాయోగం లేనటువంటివాడు; తొల్లి = మునుపు; విద్యా+అధికత్వముననన్ = విద్యలయొక్క అతిశయంచేత; మెండుగ విద్యలు రావటం వలన; గర్వి+ఐ = పొగరుబోతై; శిష్టజనులకున్ = మంచినడవడిగల మహనీయులకు, ఆర్యులకు, పూజ్యులకు; సభన్ = సభయందు; భంగము+ఒనరించి = అవమానం కలిగించి; కుందన్+చేసిన+అతండు = బాధించినవాడే, నొప్పించినవాడే సుమా!; భార్యయును = పత్నియు; బిడ్డలు = పిల్లలు; తనున్ = తానూ; బహుధనములన్ = పెక్కు సిరిసంపదలతో; భోగులు+ఐ = సుఖాలనుభవిస్తున్నవారై; రోగములు లేక = వ్యాధిగ్రస్తులు కాకుండ; పొల్చువారలు = శోభిల్లుతున్న వాళ్ళు; అమలిన+ఆచార = నిర్మలమైన ఆచారములు, నడవళ్ళు; పాత్రదానములు = అర్హులైనవారికివ్వటం; సత్యకరుణలును = నిజంపలకటం, దయాస్వభావం; తొంటిభవముననన్ = వెనుకటిజన్మలో; కలిగినారు = కలిగినట్టివారు.

**తాత్పర్యం:** బుద్ధిమంతుడై శాస్త్రశ్రవణం చేసి అనగా బహుశ్రుతుడై విద్యలచేత విలసిల్లే మానవుడు గడచిన జన్మలో ఆచార్యుడిని పరమభక్తితో ఆరాధించిన వాడే సుమా! అంతేగాక తాను నేర్చిన విద్యలను ఇతరులకు నేర్పి వారిని పండితులను చేయవలెననే అభిలాష కలిగిన మహాశయుడు సుమా! ఈ జన్మలో నేర్చుకుందా మనుకొన్నా విద్యలబ్బని వాడు మునుపటి జన్మలో విద్యాతిశయంతో దర్పించి పెద్దలను సభలలో అవమానపరచి వారి హృదయాలను నొప్పించిన వాడే సుమా! తాను, తన ఆలుబిడ్డలు అనేక భోగభాగ్యాలు అనుభవిస్తూ రోగాలు లేక హాయిగా మనుగడ సాగిస్తున్న వాళ్ళు ముందటి జన్మలో నిర్మలమైన ఆచారం గలవారూ, అర్హులకు దానధర్మాలు చేసిన వారూ, సత్యవచనులూ, దయాపరులై ఉండినవాళ్ళే సుమా!

ఆ. ఆలుబిడ్డ లొఱటులై లేమిఁ గుందుచుఁ । దెవులుచేతఁ బడుచు నవయు జనులు
మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర । పీడనంబు చేసి పేర్చినారు. 98

**ప్రతిపదార్థం:** ఆలుబిడ్డలు = భార్యయూ, పిల్లలూ; ఒఱటులు+ఐ = మూర్ఖులై; లేమిన్ = దారిద్ర్యంతో; కుందుచున్ = నొగులుతూ; తెవులుచేతన్+పడుచున్ = రోగాల బారిపడుతూ; నవయుజనులు = కృశిస్తున్న, బాధ పడుతున్న మనుష్యులు;

మున్ను = పూర్వం; క్రోధలోభములన్ = కోపం చేతను, దురాశచేతనూ; నాస్తికతన్ = దేవుడు లేడని చెప్పటం చేతనూ; పరపీడనంబు+చేసి = ఇతరులను బాధించి; పేర్చినారు = చెలరేగిన వారే సుమా!

**తాత్పర్యం:** తమ ఆలుబిడ్డలు మూర్ఖులై ఒకవంక పేదరికంతో, మరొకవంక రోగాలతో అల్లాడుతుండగా కష్టా లనుభవిస్తున్న మనుష్యులు పూర్వజన్మంలో కోపం, దురాశ, దేవుడు లేడనటం మొదలైన చెడుగుణాలతో పరులను బాధిస్తూ విజృంభించినవారే సుమా!

**సీ.** **కాంత! జాత్యంధుండు గన్నులు చెడువాఁడు । తన యొప్పు మెఱయుచుఁ దగిలి యొరుని**
**వనితఁ దొల్మేనఁ జూచినవాఁడు, కర్ణరో । గార్తుండు కటుక వాక్యములఁ దొల్లి**
**శిష్టు నొప్పించిన కష్టుండు, కడుపునఁ । దెవులైనతఁడు పూర్వ భవమునందు**
**గరదుండు, గోశ మశ్మరిని శర్కరను బా । ధితుఁ డగు నరుఁ డన్యసతిని గన్య**

**ఆ.** **మహిషి గోవుఁ దురగి మదనాతురత మున్ను । గవిసినాఁడు, శోషి దివిరి యొరువు**
**లనుభవింపఁ దెచ్చుకొనిన మాంసము దొంటి । పుట్టువున హరించినట్టి నీచు.** **99**

**ప్రతిపదార్థం:** కాంత! = ఓ వెలదీ!; జాత్యంధుండు = పుట్టుకతోనే గ్రుడ్డివాడూ, జనుషాంధుడూ; కన్నులు చెడువాఁడు = పుట్టుకతోనేగాక తరువాత చూపు గోల్పోయిన వాడూ; తన+ఒప్పు+మెఱయుచున్ = తన సౌందర్యం ప్రదర్శిస్తూ; తగిలి = వెంటపడి, పూనుకొని; ఒరుని వనితన్ = పరకాంతను; తొలుమేనన్ = ముందటి జన్మలో; చూచినవాఁడు = వీక్షించినవాడు సుమా!; కర్ణరోగ+ఆర్తుండు = చెవికి వచ్చిన రోగంతో బాధపడేవాడు; కటుక వాక్యములన్ = గాటయిన మాటలతో, పరుష పదాలతో, నిష్ఠురవచనాలతో; శిష్టున్ = సదాచారసంపన్నుడిని, యోగ్యుడిని; నొప్పించిన కష్టుండు = బాధించిన దుష్టుడు; కడుపునన్ = పొట్టలో; తెవులు+ఐన+అతఁడు = రోగంతో అల్లాడేవాడు; పూర్వభవము+అందున్ = తొలుతటి జన్మలో; గరదుండు = విషం పెట్టినవాడు సుమా!; కోశము+అశ్మరిని = మూత్రకోశసంబంధియైన నీరుకట్టు జబ్బుతో, మూత్రకృఛ్రవ్యాధితోనూ; శర్కరను = మధుమేహవ్యాధితోనూ; బాధితుఁడు+అగునరుఁడు = పీడించబడుతున్నమనిషి; అన్యసతిని = మరొక్కడి భార్యనూ; కన్యన్ = పెళ్ళికాని పడుచునూ; మహిషిన్ = గేదెనూ; గోవున్ = ఆవునూ; తురగిన్ = ఆడు గుర్రాన్నీ; మదన+ఆతురతన్ = కామోద్రేకంతో; మున్ను = తొలుతటి జన్మలో; కలిసినాఁడు = కూడిన వాడేసుమా!; శోషి = శుష్కించినవాడు, క్షయరోగి; తివిరి = ఇష్టపడి; ఒరువులు = ఇతరులు; అనుభవింపన్ = భుజించటానికి, తెచ్చుకొనిన మాంసమున్ = తెచ్చుకొన్నట్టి ఎరచిని; తొంటి పుట్టువునన్=పూర్వభవంలో; హరించిన+అట్టి= కాజేసినటువంటి; నీచు= అల్పుడు, క్షుద్రుడు, తుచ్ఛుడు సుమా!

**తాత్పర్యం:** వనితామణీ! వినుము. పుట్టుకతోనే గ్రుడ్డిఅయినవాడూ, మరి కొన్నాళ్ళకు చూపు కోల్పోయిన వాడూ తొలిజన్మలో తన సొగసును కనబరుస్తూ పరుని భార్యను పనిగట్టుక చూచినవాడే సుమా! చెవిపోటుతో బాధపడేవాడు ముందటి జన్మలో కర్కశవాక్యాలతో యోగ్యపురుషులను నొప్పించిన వాడే సుమా! పొట్టలో ఏదో ఒక జబ్బుతో పీడించబడేవాడు వెనుకటి పుట్టువులో ఇతరులకు విషం పెట్టినవాడే సుమా! నీరు కట్టు రోగంవల్ల, మూత్రద్వారంలో రాళ్ళు ఏర్పడినవాడూ, మధుమేహవ్యాధితో తీపులు తీసుకొంటున్నవాడు పూర్వజన్మలో మన్మథోద్రేకంతో పరకాంతను, పెళ్ళికాని పడుచును కూడినవాడే సుమా! అంతేగాదు; ఆవును, బర్రెను, ఆడు గుర్రాన్ని దాటినవాడే సుమా! నేడు క్షయరోగంతో బాధపడుతున్నవాడు తొలుతటి జన్మలో ఎవరో తిందామని ఆశపడి తెచ్చి పెట్టుకొన్న మాంసాన్ని కాజేసి గుట్టుగ ఆరగించిన నీచుడు సుమా!

**ఆ. ఉలుముగొన్నవాఁడు తొలుమేన నాఘాత । బంధనముల నొరుల ప్రన్నఁదనము**
**చెఱచినాఁడు, పంగు వొఱవగఁ గాలుసే । విఱిచి సాధుజనులఁ బఱిచినాఁడు. 100**

**ప్రతిపదార్థం:** ఉలుము+కొన్నవాఁడు = కుష్ఠరోగం కలవాడు; తొలుమేనన్ = పూర్వదేహంలో; ఒరుల = ఇతరుల యొక్క; ప్రన్నఁదనమున్ = అందమును; ఆఘాతబంధనములన్ = కొట్టుట చేతనూ, కట్టుట చేతనూ; చెఱచినాఁడు = పాడుచేసినవాడే సుమా!; పంగువు = నేడు కుంటివాడుగా ఉన్నవాడు; ఒఱవగన్ = వక్రంగా, వికృతంగా; కాలు+చే+విఱిచి = కాళ్ళు చేతులు విరిచి; సాధుజనులన్ = సత్పురుషులను; పఱిచినాఁడు = బాధపెట్టినవాడే సుమా!

**తాత్పర్యం:** నేడు కుష్ఠరోగిగా ఉన్నవాడు పూర్వజన్మంలో కొట్టి, కట్టి పరుల చక్కందనాన్ని చెరచినవాడే సుమా! ఇపుడు కుంటివాడుగా ఉన్నవాడు తొలుతటి పుట్టువులో సుజనులను కాళ్ళుచేతులు వక్రంగా విరిచి బాధించిన వాడే సుమా!

**క. పిలకాదులఁ గంతులచే । నలమటఁ బడువారు బడియ నడిచియు ముష్టిం**
**జలమునఁ బొడిచియు సాధులఁ । దొలుబామున నొంచినట్టి దుష్టచరిత్రుల్. 101**

**ప్రతిపదార్థం:** పిలక+ఆదులన్ = చర్మవ్యాధులు మొదలైన వాటితోనూ; కంతులచేన్ = కణుతులచేతనూ (గడ్డలతోనూ); అలమటన్+పడువారు = బాధపడేవాళ్ళు; తొలుబామునన్ = పూర్వభవంలో, క్రిందటి జన్మలో; సాధులన్ = సజ్జనులను; బడియన్ = దుడ్డుకర్రతో; అడిచియున్ = కొట్టియూ; చలమునన్ = ఈర్ష్యతో; ముష్టిన్ = పిడికిలితో; పొడిచియున్ = క్రుమ్మియూ; నొంచినట్టి = నొప్పించినట్టి, బాధించినట్టి; దుష్టచరిత్రుల్ = చెడునడత కలవారే సుమీ!

**తాత్పర్యం:** చెలీ! చర్మరోగాలతో, కణుతులతో బాధపడేవారు పూర్వజన్మలో సజ్జనులను బడితెతో బాదీ, మచ్చరంతో పిడికిలితో పొడిచీ నొప్పించిన వారే సుమీ!

**విశేషం:** "గ్రంధిభిః పిలకై శ్చైవ క్లిశ్యన్తే భృశదుఃఖితాః" అనే శ్లోకం పై పద్యానికి మూలం.

**ఆ. పాదరోగు లశుచి పదముల దేవాల । యములు మెట్టుటయును నసదువారిఁ**
**దప్పులేక క్రొవ్వి తన్నుటయును దొలు । పుట్టునందుఁ గలిగినట్టివారు. 102**

**ప్రతిపదార్థం:** పాదరోగులు = కాళ్లయందు వ్యాధులు గలవారు; అశుచిపదములన్ = అపరిశుద్ధములైన అడుగులతో; దేవ+ఆలయములు = దేవుడిగుళ్లు; మెట్టుటయును = ప్రవేశించడం; అసదువారిన్ = బలహీనులను, దీనులను; తప్పులేక = వారియందు దోషాలు లేకున్నప్పటికీ; క్రొవ్వి = పొగరుపట్టి; తన్నుటయును = కాళ్లతో తాడించడం అనే చెడుగుణాలు; తొలు పుట్టు+అందున్ = ముందటి జన్మలో; కలిగినట్టివారు = ఉన్నట్టివారు.

**తాత్పర్యం:** నేడు కాలిజబ్బులతో అల్లాడుతున్నవారు పూర్వజన్మలో అపవిత్రములైన పాదాలతో దేవుడి గుళ్ళకు వెళ్ళిన వారే సుమా! గౌరీ! ఏ తప్పులేకుండానే దిక్కుమాలిన దీనులను పొగరుబట్టి తమ కాళ్ళతో తన్నినవాళ్ళే సుమా వీరు!

**చ. జ్వరమున గుల్మపీడ నతిసారములన్ బలుపుండులన్ మహో**
**దరమున వాతపిత్త కఫదారుణ రోగములన్ నిరంతరా**

**తురు లగువారు నిర్దయతఁ దొల్లి వినోదము గాఁగ జీవులం**
**దరమిడి చంపినారు గురుఁ దల్లడ పెట్టినవారు పార్వతీ! 103**

**ప్రతిపదార్థం:** పార్వతీ! = హైమవతీ!; జ్వరమునన్ = జ్వరంచేత; గుల్మపీడన్ = కడుపులో దుర్మాంసపు బిళ్ళవలన కలిగే బాధతో; అతిసారములన్ = విరేచనాలతో, భేదులతో; బలుపుండులన్ = మిక్కిలి కురుపులతో, వ్రణాలతో; మహా+ఉదరమునన్ = మహోదరమనే వ్యాధితో (పొట్ట పెరిగే రోగం); వాత పిత్త కఫ = వాతము, పిత్తము, కఫము అనే; దారుణ రోగములన్ = భయంకరాలైన జబ్బుల చేత; నిరంతర = ఎల్లప్పుడు; ఆతురులు+అగువారు = బాధపడేవారు; తొల్లి = పూర్వజన్మలో; నిర్దయతన్ = కరుణలేక; వినోదము+కాఁగన్ = వేడుకగా, క్రీడగా; జీవులన్ = ప్రాణులను; తరము+ఇడి = వరుసపెట్టి; చంపినారు = సంహరించినట్టి వారే సుమీ!; గురున్ = ఆచార్యుడిని; తల్లడము+పెట్టినవారు = బాధించినవారేసుమా!

**తాత్పర్యం:** జ్వరం, కడుపులో బల్ల, భేదులు, కురుపులు, మహోదరం అనే పొట్ట పెరిగే వ్యాధి, వాతం, పిత్తం, శ్లేష్మం అనే త్రిదోషాలవలన కలిగే జబ్బులు-వీటి వల్ల ఎల్లప్పుడూ తల్లడిల్లుతున్నవారు పూర్వజన్మలో జంతువులను వరుసపెట్టి చంపినవారే సుమా! గురువును దుఃఖపెట్టిన వారే సుమా!

**తే.** **గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జుఁ । గొలుచు లమ్ముచోఁ గ్రచ్చులు గలిపి సరకు**
**దూఁచిపెట్టెడు చోటులఁ దూన్కి దరపి । పూర్వ భవమున లాభంబుఁ బొందినారు. 104**

**ప్రతిపదార్థం:** గూనివాఁడును = ఎత్తైన వీపుకలవాడు; పిచ్చుక కుంటున్ = తొడలు లేనివాడు; గుజ్జున్ = పొట్టివాడును, కుబ్జుడు; కొలుచులు+అమ్ముచోన్ = ధాన్యం విక్రయించే సమయంలో; క్రచ్చులు+కలిపి = తాలు, తరకలు, రాళ్ళు కలిపియూ; సరకున్ = వస్తువును; తూఁచిపెట్టెడు చోటులన్ = తక్కెడలో ఉంచి తూనిక వేసేవేళ; తూన్కి = తూనిక; తరపి = తగ్గించి(తప్పు తూనిక తూచి); పూర్వభవమునన్ = ముందటి జన్మలో; లాభంబున్ = అన్యాయమైన లాభమును; పొందినారు = గడించినట్టివారే.

**తాత్పర్యం:** దేవీ! ఈ జన్మలో గూనివాడు, తొడలు లేనివాడు, మరుగుజ్జు క్రిందటి జన్మలో ధాన్యంలో తాలు తబక కలిపి విక్రయించిన వాళ్ళు. తప్పుడు తూనికలు తూచి వస్తువులు అమ్మి అక్రమ లాభాలు ఆర్జించిన వాళ్ళే.

**సీ.** **వెఱ్ఱులు తొలుమేన వెడ్డున సాధుజ । నము మోసపుచ్చి ధనంబు గొన్న**
**జను లనపత్యులు విను తొల్లి పితృకార్య । దూరులు బాలఘాతులును జువ్వె;**
**పొలఁతి! నపుంసకుల్ పూర్వభవంబున । నెద్దుఁ బట్టిన వారు నేమి తప్పుఁ**
**బొరయకుండఁగఁ గోపమునఁ ద్రికచ్ఛేదంబు । గావించినారును, గామ సుఖము**

**తే.** **విఘ్నపఱిచిన తులువలు, విధవ తొంటి । జన్మమునయందు భర్తృవంచన మొనర్చి**
**ధనము గూర్చిన యదియు మదంబు పేర్మి । నోర్తుమగని హరించిన యుగ్మలియును. 105**

**ప్రతిపదార్థం:** వెఱ్ఱులు = పిచ్చివాళ్ళు; తొలుమేనన్ = మునుపటి జన్మలో; వెడ్డునన్ = వంచనతో; సాధుజనమున్ = సత్పురుషులను; మోసము+పుచ్చి = దగాచేసి; ధనంబు+కొన్నజనులు = ద్రవ్యం గ్రహించిన మనుష్యులు; విను = పార్వతీ! ఆలకించుము; న+అపత్యులు(అనపత్యులు) = ఇప్పుడు బిడ్డలు లేకుండా ఉన్నవాళ్ళు; తొల్లి = మునుపటి జన్మలో; పితృకార్యదూరులు = తమ తల్లిదండ్రులకు శ్రాద్ధాది క్రియ నిర్వర్తించని వాళ్ళునూ; బాలఘాతులును+చువ్వె = బిడ్డలను

చంపిన వాళ్ళునూ సుమా!; పొలఁతి! = చెలియా!; నపుంసకుల్ = మగతనం లేని వాళ్ళు; పూర్వభవంబునన్ = ముందటి జన్మలో; ఎద్దున్+పట్టినవారు = ఎద్దుయొక్క విత్తులు నలగగొట్టినవాళ్ళే; ఏమితప్పున్ = ఎట్టి దోషమూ, అపరాధమూ; పొరయక+ఉండన్+కన్ = వాటివల్ల కలుగక పోయినా; కోపమునన్ = క్రోధంతో, కినుకతో; త్రిక+ఛేదంబు+కావించినారు = ముడ్డిపూస విరుగ గొట్టినవారున్నూ; కామ సుఖమున్ = రతిసౌఖ్యం, సురతసుఖం; విఘ్నపఱచిన = ఆటంకపరచిన; తులువలు = తుచ్ఛులు, దుష్టులు; విధవ = మగడులేనిది, భర్తృవిహీన; తొంటి జన్మము+అందున్ = మునుపటి పుట్టుకలో; భర్తృవంచనము+ఒనర్చి = మగడినిమోసపుచ్చి; ధనము+కూర్చిన+ఆదియున్ = ద్రవ్యం ఆర్జించినట్టిదేసుమా!; మదము+పేర్మిన్ = గర్వాతిరేకంతో; ఓర్తుమగనిన్ = మరొక్కదాని పెనిమిటిని; హరించిన = లోబరచుకొన్న; ఉగ్మలియును = మగువయు అగును.

**తాత్పర్యం:** ప్రేయసీ! వినుము. ఇప్పుడు పిచ్చివాళ్ళుగ ఉన్నవాళ్ళు ముందటి జన్మలో వంచనతో సజ్జనుల డబ్బు కాజేసిన వారే సుమా! ఇప్పుడు బిడ్డలు లేనివాళ్ళు తమ తల్లిదండ్రులకు శ్రాద్ధక్రియలు నిర్వర్తించని వాళ్ళూ, పిల్లల్ని చంపినవాళ్ళూ అయి ఉన్నారు. నపుంసకులుగా ఉన్నవాళ్ళు తొలిజన్మలో ఎద్దును కట్టిపడవైచి దాని వృషణాలు నలిచిన వాళ్ళూ, ముడ్డిపూస విరుగ బొడిచిన వాళ్ళూ, రతిసౌఖ్యాన్ని అనుభవించకుండా చేసినవాళ్ళూ అయి ఉన్నారు. నేడు విధవరాలుగా ఉన్న చిన్నది మునుపు పెనిమిటిని మోసం చేసి ధనం ఆర్జించినట్టిదీ, పొగరుపట్టి మరియొక దాని భర్తను తన వశం చేసికొన్న గడుసుదీ సుమా!

**తే.** **ప్రయతులై పుట్టి యేవంపుఁబనులఁ గడుపుఁ । బ్రోచికొనువా రహంకారమునను గర్వ**
**మాన మద దంభములఁ దొల్లి మాన్యజనులఁ । బరిభవించిన తుచ్ఛులు పద్మనయన!** **106**

**ప్రతిపదార్థం:** పద్మనయన! = కమలములవంటి కన్నులు గల చెలీ!; ప్రయతులు+ఐ+పుట్టి = పవిత్రులుగ జన్మించి; ఏవంపుఁబనులన్ (ఏవము+పనులన్) = రోత కలిగించే కృత్యములచేత, నీచకార్యాలతో, అసహ్యమైన పనులతో; కడుపున్+ప్రోచికొనువారు = పొట్టను పోషించుకొనేవారు; అహంకారమునను = నేనే అధికుడనన్న భావంతోను; గర్వమానమద దంభములన్ = పొగరుచేతను, చిత్త సమున్నతి చేతను, మదము చేతను, డంబము చేతను; తొల్లి = పూర్వజన్మలో; మాన్య జనులన్ = గౌరవించ దగిన వారిని, సజ్జనులను; పరిభవించిన = అవమానించిన; తుచ్ఛులు = అల్పులు, నీచులు సుమా!

**తాత్పర్యం:** కమలాక్షీ! పరిశుద్ధులై జన్మించినప్పటికినీ రోతపుట్టించే పనులు చేస్తూ, నేడు జీవిస్తున్నవాళ్ళు తొలిజన్మలో తాము గొప్పవాళ్ళమనే అహంకారంతో, పొగరుబోతుతనంతో, అభిమానంతో, మదంతో, డంబంతో విర్రవీగుతూ సత్పురుషులను అవమానపరచిన అల్పులు సుమా!

**విశేషం:** దంభం = ప్రసిద్ధి కోసం దానధర్మాలు సల్పటం; మానం = తన విద్యకూ, వంశానికీ తగని దురభిమానం.

**సీ.** **దాసత్వ మొంది యదల్పులఁ దిట్టుల । నాటులఁ బడుచుండునట్టి నీచు**
**లప్పాటఁ దొలుమేన నతి గర్వులై ప్రల్ల । దమ్మునఁ బెక్కండ్రఁ దప్పులేక**
**తిట్టియు నడిచియుఁ దిరిగినవార లా । పొలువలపైఁ గృపగలిమి మేలు**
**ధనిక గృహద్వారమునఁ బ్రతిహారి ద । మ్మాఁగంగ నుండి దైన్యమున దుఃఖ**

**తే.** **పడు జనంబులు భోగైకపరతఁ దొల్లి । మాననీయుల కవసర మీని వారు**
**రాజదండితుఁ డకృతాపరాధుఁ గ్రూర । దండ దూషితుఁ జేసినతండు సూవె!** **107**

**ప్రతిపదార్థం:** దాసత్వము+ఒంది = సేవకులై; అదల్పులన్ = తర్జనభర్జనలతో, బెదరింపులతో; తిట్టులన్ = దూషణలతో; ఆటులన్ = బాధలను; పడుచున్+ఉండు+అట్టి = అనుభవిస్తూన్న; నీచులు = దుష్టులు; ఆ+పాటన్ = ఆ విధంగా; తొలుమేనన్ = ముందటి జన్మలో; అతి గర్వులు+ఐ = మిక్కలి అహంకారులై; ప్రల్లదమ్మునన్ = వదరుబోతు తనంతో, దుర్భాషలతో; పెక్కండ్రన్ = పలువురను, అనేకులను; తప్పులేక = దోషం లేకపోయినా; తిట్టియున్ = దూషించి; అడిచియున్ = కొట్టి; తిరిగినవారలు = సంచరించినట్టి వారు; ఆ పొలువలపైన్ = ఆ దుష్టులమీద; కృప+కలిమిమేలు = దయకలిగి ఉండటం మంచిది; ధనిక గృహద్వారమునన్ = భాగ్యవంతుల యొక్క వాకిళ్ళ వద్ద; ప్రతిహారి = వాకిటి కావలివాడు, ద్వార పాలకుడు; తమ్మున్ = తమను; ఆగంగన్ = ఆపగా, నిలువరించగా; ఉండి = అక్కడే నిలబడి; దైన్యమునన్ = పేదతనంతో; దుఃఖపడు జనంబులు = చింతిస్తున్న మనుష్యులు; భోగ+ఏక+పరతన్ = సుఖములందలి పరమాసక్తితో; మాననీయులకున్ = గౌరవించదగినవారికి; అవసరము+ఈనివారు = అవకాశం కల్గించని వారే సుమా!; రాజదండితుఁడు = రాజుచే శిక్షించబడిన వాడు; అకృత+అపరాధున్ = తప్పు చెయ్యని వాడిని; క్రూరదండ దూషితున్= కఠినమైన శిక్షచే చెరచబడినవాడిగా; చేసిన+అతండు+చూవె = చేసినవాడే సుమా!

**తాత్పర్యం:** సేవకులై పరుల నాశ్రయించి వారి బెదిరింపులనూ, దూషణలనూ, పెట్టేబాధలనూ సహిస్తున్న అధములు ముందటి జన్మలో మిక్కిలి గర్వంతో, వదరుబోతులై వాగుతూ నిరపరాధులైన వారిని తమ ఇష్టానుసారం తిట్టుతూ కొట్టుతూ ప్రవర్తించిన వారే సుమా! దేవీ! అట్లాంటి వారి మీద దయచూపటం మంచిది. ధనవంతుల ఇండ్లకేగి అక్కడ ద్వారపాలకులచే అడ్డగించబడి దైన్యంతో దుఃఖించే జనులు ముందటి జన్మలో తమ దర్శనార్థమై పెద్దలు రాగా వారికి అవకాశమియ్యని దుర్మార్గులే సుమీ! ఈనాడు రాజదండనకు గురియైనవాడు పూర్వజన్మలో ఏ అపరాధం చెయ్యని వాడికి కఠినమైన శిక్షవిధించిన వాడే సుమా!

**తే.** **విను నష్టసకలధను లగు । జనములు నిక్షేప మిడిన సరకులు దొలుబా**
**మున మగుడ నీక నెపమిడి । కొనినట్టి యసత్య లోభ కుత్సితు లతివా!** **108**

**ప్రతిపదార్థం:** అతివా! = ఓ మగువా!; విను = శ్రద్ధగా ఆకర్ణించుము; నష్టసకల ధనులు+అగు+జనములు = పోగొట్టుకొన్న సమస్తమైన ధనములు గల నరులు; నిక్షేపము+ఇడిన = తమ దగ్గర దాచనిచ్చిన; సరకులు = వస్తువులు;మగుడన్ = మళ్ళీ; ఈక = ఇవ్వక; తొలు బామునన్ = ముందటి జన్మలో; నెపము+ఇడి = ఏదో ఒకసాకు పెట్టి; కొనిన+అట్టి = పుచ్చుకొన్న; అసత్య లోభకుత్సితులు = అసత్యవాదులు, లోభులు, కపటులు సుమా!

**తాత్పర్యం:** గౌరీ! సకలధనాలు కోల్పోయి అల్లాడుతున్నవారు పూర్వజన్మలో తమ దగ్గర దాచుటకై ఉంచిన వస్తువులను తిరిగి వాళ్ళకు ఇవ్వక ఏదో ఒకసాకు చూపి కాజేసిన అసత్యవాదులు, లోభులు, కపటులు సుమా!

**క.** **తమబంధులుఁ దారును నొ । క్కమరియ తెగటాఱువారు కరుణారహిత**
**త్వమునఁ దొలుమేన వెడపగ । నమేయ నరవధము సేసినట్టి దురాత్ముల్.'** **109**

**ప్రతిపదార్థం:** తమబంధులున్ = తమచుట్టాలూ; తారును = తామున్నూ; ఒక్కమరి+అ = ఒకేసారి, ఒకేతడవ; తెగటాఱువారు = నశించేవారు; కరుణారహితత్వమునన్ = దయాశూన్యులై; తొలుమేనన్ = మునుపటి జన్మలో; వెడపగన్ = నిష్కారణ విరోధంతో; అమేయ = మితిలేని; నరవధము = మనుజ సంహారం; చేసినట్టి = కావించిన; దుర్+ఆత్ముల్ = చెడుమనస్సు కలవారు సుమా!

**తాత్పర్యం:** తమ చుట్టములూ, తామూ ఒకేసారి మరణం పాలైనవారు పూర్వజన్మలో కృపలేనివారై నిర్హేతుకమైన ద్వేషంతో బహుజనాన్ని చంపిన పాపాత్ములు సుమా!'

**వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో నిట్లనియె. 110**

**తాత్పర్యం:** అని చెప్పి భవుడు మళ్ళీ భవానితో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఇంతి! నా చెప్పిన యిప్పాపకర్ములం । దఱకును నరకంబు దప్పు; దందుఁ**
**బడుపాటు లెల్లను బడివచ్చి నరులైన । యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు**
**లివి; యట్లు గాకయు నెక్కుడుగాని పా । పంబుల మానుషభవము గలుగు**
**నిట్లైన నమ్మేన నే కర్మమున ఫల । మైనను మానవు లనుభవింప;**

**ఆ. రోపి మునులు దేవయోనులు నత్తను । వునన తపము ఫలము లనుభవింతు'**
**రనిన దేవి 'యెఱుఁగ నయ్యె మీదయఁ బెక్కు । లర్థములు గృతార్థ నైతి' ననియె. 111**

**ప్రతిపదార్థం:** ఇంతి! = ఓ చెలువా!; నాచెప్పిన = నేను నుడివిన; ఈ+పాపకర్ములు = ఈ పాపకృత్యాలు చేసినవారు; అందఱకును = ఎల్లరకూ; నరకంబు తప్పదు = నరకబాధలు అనుభవించక తప్పదు; అందున్ = ఆ నరకలోకంలో; పడుపాటులు+ఎల్లనున్ = పొందవలసిన కష్టాలన్నీ; పడివచ్చి = అనుభవించివచ్చి; నరులు+ఐన+అప్పుడు = తిరిగి మానవులై పుట్టినప్పుడు; పాటిల్లు+అట్టి+తెఱఁగులు+ఇవి = సంభవించబోయే గతులివి; అట్లు+కాకయున్ = అట్లాకాకుండాను; ఎక్కుడు+కానిపాపంబులన్ = అధికములుగాని పాపాలచేత; మానుషభవము కలుగున్ = మనుష్యజన్మ లభిస్తుంది. ఇట్లు+ఐనన్ = ఈ విధంగా లభించినప్పుడు; ఆ+మేనన్ = ఆ శరీరమునందు; ఏకర్మమున ఫలము+ఐనను = ఎట్టి కర్మ ఫలితమైనా; మానవులు = నరులు; అనుభవింపరు = పొందరు; ఓపి = సమర్థులై; మునులు = మునీశ్వరులు; దేవయోనులున్ = దేవజాతుల వారునూ; ఆ+తనువునన = ఆ దేహమునందే; తపము ఫలములు = తపస్సుయొక్క ఫలాలు; అనుభవింతురు = అనుభవిస్తారు; అనినన్ = అని శంభుడు పల్కగా; దేవి = శాంభవి; మీదయన్ = నాథా! మీ యొక్క కృపచే; పెక్కులు+అర్థములు = పలువిషయాలు; ఎఱుఁగన్+అయ్యెన్ = తెలిసికొనగలిగాను; కృతార్థన్+ఐతిన్ = ధన్యురాల నయ్యాను; అనియెన్ = అని చెప్పింది.

**తాత్పర్యం:** 'కాత్యాయనీ! నే చెప్పిన ఈ పాపులందరికీ నరకం తప్పదు. పూర్వం తా మొనర్చిన దురితాలవలన నరకలోకంలో నానాబాధ లనుభవించి మళ్ళీ వీరు పుడమిలో నరులై జన్మించినపుడు వారికి ఈ చెప్పబడిన గతులు కలుగుతాయి. అధికములైన పాపకృత్యాలు సల్పనివారికి మనుష్య జన్మ కలుగుతుంది. అయితే ఆ శరీరమందే మనుషులు తాము చేసిన కర్మఫలాలు అనుభవించరు. కాని, మునీశ్వరులు, యక్షగరుడగంధర్వ కిన్నర కింపురుషాది దేవయోనులు మాత్రం తాము సల్పిన తపః ఫలాలను ఆ దేహములందే అనుభవిస్తారు' అని పరమేశ్వరుడు పల్కగా 'దేవా! మీ కృప వలన పెక్కు సంగతులు తెలిసికొని ధన్యురాలనయ్యాను' అని పార్వతి పలికింది.

**వ. అని వెండియు న ద్దేవునితో 'మనుజు లపరజన్మంబునంగాని కర్మఫలంబు లనుభవింప రంటిరి; తప్పు చేసిన నరుల నరపతు లిట్టి తప్పున కిట్టి దండంబను నిరూపణంబున దండించెద రని యక్కర్మంబు ఫలం బప్పుట్టువునన యనుభవించుట గాదె?' యనిన గౌరికి గంగాధరుం డిట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** అని వెండియున్ = అని మరలా; ఆ+దేవునితోన్ = ఆ శంకరుడితో; మనుజులు = నరులు; అపర జన్మంబునన్+కాని = తరువాతి జన్మలో తప్ప; కర్మఫలంబులు; అనుభవింపరు; అంటిరి = మీరన్నారు గదా!; తప్పు చేసిన, నరులన్, నరపతులు = రాజులు; ఇట్టి తప్పునకున్ = ఇటువంటి దోషానికి, ఇట్టిదండంబు = ఇటువంటి శిక్ష; అను నిరూపణంబునన్ = అనే నిర్ణయంతో; దండించెదరు; అని = అని గౌరి పలికి; ఆ+కర్మ ఫలంబు; ఆ+పుట్టువునన = ఆ జన్మలోనే; అనుభవించుట+కాదు+ఎ? = అనుభవించినట్లవుతున్నది కదా! అనినన్ = అని పలుకగా; గౌరికిన్; గంగాధరుండు = గంగను తలపై ధరించిన శివుడు; ఇట్లు+అనియెన్ = ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని వచించి మహేశ్వరి మళ్ళీ మహాదేవుడితో ఇట్లా అన్నది. నాథా! ఇపుడు మనుషులు చేసే కర్మలయొక్క ఫలాలు మున్ముందు కలుగబోయే జన్మలందే వారు అనుభవిస్తారు అని మీరన్నారుకదా! మరి తప్పొనర్చిన జనులను ఈ తప్పునకు ఇట్టి శిక్ష అని శాస్త్ర విధి ననుసరించి నిర్ణయించి రాజు దండిస్తున్నాడు కదా! అపుడు మనుషులు తమ కర్మఫలాలు ఈ లోకంలోనే ఈ దేహమందే అనుభవించినట్లవుతున్నది. మరి తమరు ఉత్తర జన్మలందే వారికి కర్మ ఫలానుభవం అని చెప్పటానికి హేతువేమిటి?' అని ప్రశ్నించింది. అందుకు ఈశ్వరు డిట్లా అన్నాడు.

**సీ. 'జనపతుల్ దమ రాజసంబున దండించి । నారుగా నొల్లక నరుల తప్పు**
**లకుఁ దగు దండంబు లన వారిఁ బఱతురు; । తక్కొరు లెవ్వరుఁ దప్పుసేయ**
**వెఱచుటకై యట్టి విధి మూఁడుటది పూర్వ । కర్మంబువలనన కాని, యపుడు**
**గలిగిన తప్పునఁ గా' దన్న నాదేవి । 'యవనీశ దండితుఁ డైన నరున**

**తే. కఘము వాయునొ? పాయదో?' యనిన నీశ్వ । రుండు 'నృపదండితుఁడు యమదండమునను**
**బడఁడు; లేని తప్పున నరుఁ బఱిచినతనిఁ । బఱుపకున్నాతనిని యమబాధ వొందు.' 113**

**ప్రతిపదార్థం:** జనపతుల్ = ప్రభువులు; తమరాజసంబునన్ = తమ యొక్క అధికారంతో (దుర్గర్వంతో); దండించినారు+కాన్ = శిక్షించిన వారుగా; ఒల్లక = అంగీకరించక; నరులతప్పులకున్ = మనుషులు చేసిన అపరాధాలకు; తగు = అర్హములైన; దండంబులన = శిక్షలచేతనే; వారిన్ = ఆ దోషులను; పఱతురు = బాధిస్తారు; తక్కు+ఒరులు+ఎవ్వరున్ = మిగిలినవారెవ్వరునూ; తప్పు+చేయన్+వెఱచుటకై = తప్పిదము లొనర్ప భయపడటానికై; అట్టివిధి = అట్టి కీడు; మూఁడుట+అది = సంభవించటమనేది; పూర్వ కర్మంబు వలనన కాని = ముందటి జన్మలో చేసిన కర్మవలననే తప్ప; అపుడు+కలిగిన = అప్పుడు చేసిన; తప్పునన్+కాదు = అపరాధంవలనకాదు; అన్నన్ = అని పరమశివుడు పల్కగా; ఆ+దేవి = ఆ పరమేశ్వరి; అవనీ+ఈశ+దండితుఁడు+ఐన = ధరణీ వల్లభుడి చేత శిక్షించబడినట్టి; నరునకున్ = మనిషికి; అఘము = పాపం; పాయును+ఒ? = తొలగుతుందా?; పాయదు+ఓ? = తొలగదా?; అనినన్ = అని ప్రశ్నించగా; ఈశ్వరుండు; నృపదండితుఁడు = రాజుచే శిక్షించబడ్డవాడు; యమదండమునమున్ = యముడి యొక్క శిక్షను; పడఁడు = అనుభవించడు; లేని తప్పునన్ = చెయ్యని దోషంచేత అనగా తప్పు చెయ్యకున్నా; నరున్ = మనిషిని; పఱిచిన+అతనిన్ = బాధించిన వాడిని; పఱుపక+ఉన్న+ఆతనినిన్ = తప్పు చేసినా దండించకున్నవాడిని; యమబాధ పొందున్ = యముడి వలన బాధ కలుగుతుంది.

**తాత్పర్యం:** రాజులు కేవలం తమకున్న అధికారదర్పంతో శిక్షిస్తున్నామని తలపోయక జనులు చేసే తప్పులకు తగిన దండన విధించి వారిని బాధిస్తారు. ఇతరులు అట్లాంటి తప్పులు చేయటానికి భయపడతారు అనే ఉద్దేశంతోనే వారట్లా చేస్తారు. రాజ దండనకు గురికావటం అన్నది పూర్వం తను చేసికొన్న కర్మ వలననే సంప్రాప్తిస్తుంది కాని ఇప్పుడు తను చేసిన తప్పువలన కాదు' అని శివదేవుడు వ్యాఖ్యానించగా గౌరీదేవి, 'దేవదేవా! రాజుచే దండించబడిన

వాడికి పాపం తొలగుతుందా? తొలగదా?' అని అడిగింది. 'పాలకుడిచేత దండింపబడినవాడు మఱి యమదండన పొందడు. తప్పు చెయ్యని వాడిని దండించినా, తప్పు చేసిన వాడిని దండించక విడిచిపెట్టినా తప్పక అతడు యమదండనకు గురి ఔతా'డని పార్వతికి పరమేశ్వరుడు ప్రతివచించాడు.

**వ. అని నిర్దేశించి వెండియు. 114**

**తాత్పర్యం:** అని ఈశ్వరుడు నిర్ణయపూర్వకంగా చెప్పి మరల (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'విను తమ చేసిన కర్మం । బున ఫల మెవ్వరికిఁ ద్రోచి పుచ్చఁగ రా; దె**
**ట్లును గుడువక పో' దది యన । విని పార్వతి యిట్టు లనియె విభునకుఁ గృష్ణా ! 115**

**ప్రతిపదార్థం:** విను = గౌరీ! వినుము; తమ చేసిన = తామొనర్చిన; కర్మంబునఫలము = పనుల వలని ఫలం; ఎవ్వరికిన్ = ఎట్టివారికిన్నీ; త్రోచిపుచ్చన్+ కన్+రాదు = తొలగద్రోయుటకు వీలుపడదు; అది = ఆ కర్మ ఫలం; ఎట్లును = ఏ విధంగానైన; కుడువక = అనుభవించక; పోదు = నశించదు; అనన్ = అని శంకరుడు చెప్పగా; విని = ఆలకించి; పార్వతి; విభునకున్ = తన భర్తకు; కృష్ణా! = శ్రీ కృష్ణా!; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నది అని నారదుడు దేవి పల్కిన మాటలను వాసుదేవుడికి తెలిపాడు.

**తాత్పర్యం:** 'పార్వతీ! వినుము. తాము చేసిన కర్మఫలాలను తొలగ త్రోసికొనడానికి ఎంతటి వారికిన్నీ శక్యంగాదు. ఆ కర్మలఫలం అనుభవించితీరవలసిందే' అని శంకరు డనగా పార్వతి మళ్ళీ శ్రీకృష్ణా! ఇట్లా అన్నది.

**తే. 'కర్మఫలములు గుడిచినఁ గాని పోవ । వంటి; వానిఁ బ్రాయశ్చిత్త మపహరించు**
**నందు; రశ్వమేధంబున నఖిల పాప । ములును జెడు ననఁగా విందు భూతనాథ!' 116**

**ప్రతిపదార్థం:** భూతనాథ! = భూతగణాలకు ప్రభుడవైన ప్రాణేశ్వరా!; కర్మఫలములు = చేసిన కర్మల యొక్క ఫలాలు; కుడిచినన్+కాని = అనుభవిస్తే కాని; పోవవు+అంటి = తొలగవు అని చెప్పినావు; వానిన్ = ఆ కర్మఫలాలను; ప్రాయశ్చిత్తము = పాపపరిహారార్థమైన క్రియ; అపహరించున్+అందురు = పోగొట్టుతుందని చెప్పుతారు; అశ్వమేధంబునన్ = అశ్వమేధయాగం వల్ల; అఖిల పాపములును = సమస్త దురితాలూ; చెడున్ = నశిస్తాయి; అనఁగాన్+విందున్=అని చెప్పగా వింటున్నాను.

**తాత్పర్యం:** 'జీవితేశ్వరా! కర్మఫలాలు అనుభవించక తీరదని తమరు వచిస్తున్నారు. ప్రాయశ్చిత్తాలవలన దోషాలు తొలగిపోతాయని అంటారు. అశ్వమేధయాగం చేస్తే సర్వపాపాలు పటాపంచలవుతాయనే మాటలు వింటున్నాను.'

**వ. అని పలికి 'యిది యెట్లొకో?' యనుటయు భవుండు. 117**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని వచించి; ఇది+ఎట్లు+ఒకో? = ఈ సంగతి ఏమిటో?; అనుటయున్ = అని గౌరి అడుగగా; భవుండు = శివుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** పార్వతీదేవి ఈ రీతిగా పలికి 'ఈ కర్మానుభవం విషయం ఎట్టిది?' అని అడుగగా శంభు'డిట్లా అన్నాడు.

**ఆ. 'అతివ! కామకృతములైన కర్మంబుల । ఫలము లనుభవింప వలయు; వినుమ**
**కామకృతము చెడుట గలుగుఁ బ్రాయశ్చిత్త । మాచరింప సంశయంబు వలదు. 118**

**ప్రతిపదార్థం:** అతివ! = ఓ తరుణీ!; కామ కృతములు+ఐన = కోరికతో చేసినట్టివగు; కర్మంబులఫలములు = కర్మల యొక్క ఫలాలు; అనుభవింపన్ వలయున్ = అనుభవించే తీరాలి; వినుము = పార్వతీ! శ్రద్ధగా ఆలకించుము; ప్రాయశ్చిత్తము+ ఆచరింపన్ = దోషపరిహారార్థం చేయునట్టిక్రియ వల్ల; అకామకృతము = ఏ సంకల్పం లేక చేయబడినట్టి కర్మయొక్క ఫలం; చెడుట+కలుగున్ = నశించిపోవటం జరుగుతుంది; సంశయంబు వలదు = సందేహించ నక్కరలేదు.

**తాత్పర్యం:** 'దేవీ! కోరి కోరి చేసిన కర్మల యొక్క ఫలాలు తాను అనుభవించక తీరదు. ఎట్టి సంకల్పం లేక, అజ్ఞానం వల్లనో, పరాకువల్లనో చేసిన కర్మల యొక్క ఫలం మాత్రం ప్రాయశ్చిత్తం వలన తప్పక నశిస్తుంది. ఈ విషయంలో సంశయం వద్దు.

**క. కావునఁ గుడువక పొలియదు । దేవాసురమునులకైన దేవీ! కర్మో**
**ద్భావితఫల మీయర్థము । నీవలవఱుపుము భవన్మనీషఁ దిరముగన్. 119**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి, కనుక; దేవీ! = ప్రేయసీ!; కర్మ+ఉద్భావితఫలము = కర్మల వలన ఉద్భవించిన (జనించిన) ఫలం; దేవ+అసుర+మునులకున్+ఐనన్ = వేల్పులకైనా, రాక్షసులకైనా, మునీశ్వరులకైనా; కుడువక = అనుభవించక; పొలియదు = నశించదు, సమసిపోదు; ఈ+అర్థమున్ = ఈ సంగతిని; నీవు = నీవు; భవత్+మనీషన్ = నీ బుద్ధియందు; తిరముగన్ = స్థిరంగా, గట్టిగా; అలవఱుపుము = అభ్యసించుము,(ధరించుము).

**తాత్పర్యం:** రమణీ! కనుక దేవతలకైనా, రక్కసులకైనా, మునులకైనా మరెవ్వరికైనా తాము చేసిన కర్మల ఫలం తామే అనుభవించక నశించదు. ఈ విషయాన్ని నీ బుద్ధిలో దృఢంగా పదిలపరచుకొమ్ము'!

**వ. అని చెప్పి య ప్పరమేశ్వరుండు వెండియు. 120**

**ప్రతిపదార్థం:** అని చెప్పి = అని పలికి; ఆ+పరమ+ఈశ్వరుండు = ఆ మహేశ్వరుడు; వెండియున్ = మరల. (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని నుడివి మహాదేవుడు మళ్ళీ అంబికతో ఇట్లా అన్నాడు.

**క. సుకృతముల నరుఁడు నాకము । నకుఁ జను; నవి గొంచెమైన నరుఁడ యగును; వా**
**నికి దివి కేఁగి డిగిన యత । నికి మానుష వైభవములు నెఱయం గల్గున్.' 121**

**ప్రతిపదార్థం:** నరుఁడు = మానవుడు; సుకృతములన్ = పుణ్యాలచేత; నాకమునకున్ = స్వర్గానికి; చనున్ = వెళతాడు; అవి = ఆ పుణ్యాలు; కొంచెము+ఐనన్ = స్వల్పమైతే; నరుఁడు+అ = నరుడే; అగున్ = అవుతాడు; వానికిన్ = ఆ మనుజుడికి; దివికిన్+ఏఁగి = స్వర్గలోకానికి వెళ్ళి; డిగిన+అతనికిన్ = అక్కడ నుండి భువికి వచ్చిన వాడికి; మానుష వైభవములు = మనుషులకు కలిగే శుభములు; నెఱయన్ = పూర్ణంగా; కల్గున్ = లభిస్తాయి.

**తాత్పర్యం:** మానవుడు పుణ్యాలొనర్చి స్వర్గలోకానికి వెళ్ళుతాడు. ఆ పుణ్యములు అల్పములైతే పుడమిలో మనుష్యుడై పుట్టుతాడు. ఇట్లా అల్పపుణ్యుడికీ, స్వర్గానికి వెళ్ళి మరలి వచ్చిన వాడికి మనుష్య భోగాలు పూర్ణంగానే లభిస్తాయి.'

**వ. అని నిర్దేశించి యుద్దేశ రూపంబునం గర్మంబుల తెఱం గెఱింగించి 'యింక నేమి యడుగవల తడుగు' మనిన నంబిక 'కర్మ కరణంబు జంతువశంబు గ్రహవశంబునా రెండు తెఱంగులం జెప్పుదు; రం దెయ్యది దృఢం?' బని యడుగుటయు మృడుం డిట్లనియె. 122**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించి = అని నిర్ణయించి; ఉద్దేశరూపంబునన్ = తలంచిన విధంగా; కర్మంబుల తెఱంగు = కర్మముల యొక్క స్వరూపం, విధానం; ఎఱింగించి = తెలిపి; ఇంకన్, ఏమి+అడుగన్+వలతు = ఏ విషయం అడుగదలచావో; అడుగుము; అనినన్ = అని శంభు డనగా; అంబిక = గౌరి; కర్మకరణంబు = కర్మలు చేయటం; జంతువశంబు = ప్రాణులకు అధీనం; గ్రహవశంబు = సూర్యాదిగ్రహాల యొక్క అధీనం; నాన్ = అని; రెండు తెఱంగులన్ = రెండు విధాలుగా; చెప్పుదురు; అందున్ = ఆ రెంటిలో; ఏ+అది(ఎయ్యది) = ఏది; దృఢంబు = బలీయం; అని+అడుగుటయున్ = అని ప్రశ్నించగా; మృడుండు = శంకరుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ ప్రకారం గిరీశుడు గిరిజకు తెల్పి 'ఉమా! నేను భావించిన చందంగా నీకు కర్మస్వరూపం వివరించాను. ఇంకా ఏమైనా అడుగదలంచితే అడుగు' మన్నాడు. పార్వతి, 'దేవా! కర్మాచరణం జీవుల వశమనీ, సూర్యాదిగ్రహాలకు అధీనమనీ రెండు విధాలుగా చెప్పుతుంటారు. ఇందులో ఏది బలీయమో సెలవియ్యండి' అని అడిగింది. అందుకు ఈశు డిట్లా అన్నాడు.

**తే. 'నాతి! విను గ్రహచారంబు హేతువులుగ । నశుభములు శుభములు నరుఁ డాచరించు;**
**గ్రహము చేయించునే? తాన కాక చేఁత । కొడయుఁ డటుగాన ఫలములు గుడువ వలయు.' 123**

**ప్రతిపదార్థం:** నాతి! = ఓ సుందరీ!; విను = వినుము; గ్రహచారంబు = గ్రహముల యొక్క సంచారం; హేతువులుగన్ = కారణంకాగా; నరుఁడు = మనిషి; అశుభములున్ = చెడుపనులనూ, పాపకార్యాలనూ; శుభములున్ = మంచిపనులనూ, పుణ్యకార్యాలనూ; ఆచరించున్ = చేస్తాడు; చేఁతకున్ = కర్మకు; ఒడయఁడు = అధికారి; తాను+అ+కాక = కేవలం తానే తప్ప; గ్రహము చేయించును+ఏ? = గ్రహం తన చేత ఆ పని చేయిస్తుందా? చేయించదనిభావం; అటు+కాన = అందుచేత; ఫలములు = కర్మలయొక్క ఫలాలు; కుడువన్+వలయున్ = తాను అనుభవించవలసిందే.

**తాత్పర్యం:** 'కాత్యాయనీ! గ్రహాల యొక్క సంచారం కారణంగా నరుడు శుభాశుభకర్మలు చేస్తాడు. ఆ కర్మ లన్నింటికీ తానే అధికారి. గ్రహాలు తన చేత ఆ పనులు చేయించటం లేదు కదా! కనుక ఆ కర్మఫలాలు తానే అనుభవించక తప్పదు.'

**విశేషం:** గ్రహాలు తొమ్మిది. 1)సూర్యుడు 2)చంద్రుడు 3)అంగారకుడు 4)బుధుడు 5)బృహస్పతి 6)శుక్రుడు 7)శని 8)రాహువు 9)కేతువు. అంగారకుడిని కుజుడంటారు. బృహస్పతికి గురుడని పేరు.

ద్రుతాంతమైన 'కావునన్' అనేదానిలో "వు" లోపించగా శేషించిన రూపం కానన్. అటుగానన్ అని ద్రుతాంతంగా దీనికి పూర్వకవి ప్రయోగాలు కోకొల్లలు. కాని, భారతంలో ఇది కళగానే కన్పిస్తుంది.

మ. 'ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము; గుంతీనందనుల్ సింహముల్;
మతి నూహింప నసింహమైన వనమున్ మర్దింతు; రెందున్ వనా
వృత వృత్తంబులుగాని సింహములకున్ వేగంబు చేటొందుఁ; గా
న తగం బొందుట కార్య మీయుభయమున్ సంతుష్టిమై నుక్కికిన్.' (ఉద్యో. 1-358)

'కానన్' అనేది ద్రుతప్రకృతిక మైనప్పటికీ తిక్కనగారు దీనిని కళగానే స్వీకరించారు. లేకపోతే ద్రుతసంధికార్యాలు ప్రవర్తించి 'కానఁదగన్' అను రూపం సిద్ధించి ప్రాసమైత్రికి భంగం కలిగి ఉండేది.

**వ. అనినఁ 'జా వనునది యేమి?' యని యుమ యడుగ నీశానుం డిట్లనియె. 124**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని శివుడు తెల్పగా; ఉమ = పార్వతి, చావు+అనునది = మరణమనేది; ఏమి = ఏమిటి?; అని, అడుగన్ = ప్రశ్నించగా; ఈశానుండు = ఈశ్వరుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని పార్వతి 'చావు అంటే ఏమిటి?' అని అడుగగా, శివుడు ఇట్లా అన్నాడు.

**తే. 'నిత్యుఁ డాత్ముండు; దేహ మనిత్య; మతఁడు । ముదిమిఁ దెవులున వికృతమై యది వికలతఁ**
**బొందుటయు, దానిఁ దొఱఁగి తాఁ బోవునట్టి । దశకు మరణ మ న్పేరయ్యెఁ దనులతాంగి! 125**

**ప్రతిపదార్థం:** తనులతా+అంగి! = సన్నని తీగవంటి శరీరంకలదానా!; ఆత్ముండు = జీవుడు; నిత్యుఁడు = నశించనివాడు, శాశ్వతుడు; దేహము = శరీరం; అనిత్యము = శాశ్వతం కానిది, నశించిపోయేది; ముదిమిన్ = ముసలితనం చేతనూ; తెవులునన్ = రోగాల చేతనూ; వికృతము+ఐ = పరిణామం పొందినదై, మార్పు చెందినదై; అది = ఆ మేను; వికలతన్+పొందుటయున్ = శక్తిని గోల్పోవగా; దానిన్ = తనువును; తొఱఁగి = విడిచి; తాన్ = జీవుడు; పోవునట్టి దశకున్ = వెళ్ళిపోయేస్థితికి; మరణము+అన్ = చావు అనే; పేరు+అయ్యెన్ = నామం ఏర్పడింది.

**తాత్పర్యం:** 'తీగవంటి సన్నని శరీరం గల చెలీ! జీవుడు శాశ్వతంగా ఉండేవాడు. దేహం అట్లాంటిది కాదు; నశించిపోయే స్వభావం కలది. దేహాత్మల కున్న తేడా ఇది. అయితే ముసలితనం చేత, రోగాల చేత మారిపోయి క్షీణించి శరీరం నశించే వేళ జీవుడు దానిని విడిచి వెళ్ళే స్థితికే మరణం అని పేరు.

**విశేషం:** భగవద్గీతోపనిషత్తులోని సాంఖ్యయోగం దేహాత్మ లక్షణాలను "న జాయతే మ్రియతే వా కదాచిత్"; "వేదాఽవినాశినం నిత్యం"; "వాసాంసి జీర్ణాని యథా విహాయ"; "దేహీ నిత్య మవధ్యోఽయం" ఇత్యాది శ్లోకాలలో విపులంగా చర్చించింది.

**క. జీవుఁడు జీర్ణ శరీరముఁ । బోవిడిచి నవంబుఁ బొందఁ బుట్టను పేరం**
**దా వెలయుం దద్దశ జీ । వావలి వర్తించు నిటు గతాగతపరయై.' 126**

**ప్రతిపదార్థం:** జీవుఁడు = ఆత్మ; జీర్ణ శరీరమున్ = శిథిలమైన శరీరాన్ని; పోన్ విడిచి = పరిత్యజించి; నవంబున్ = నూతనమైనదాన్ని, క్రొత్తదానిని; పొందన్ = గ్రహించటానికి; పుట్టు+అను పేరన్ = పుట్టుతున్నాడు అనే పేరుతో; తాన్ = తాను; వెలయున్ = వెలుగొందుతున్నాడు; తత్+దశన్ = ఆ స్థితియందు; జీవ+ఆవలి = ప్రాణిసమూహం; ఇటు = ఈ ప్రకారం; గత+ఆగత+పర+ఐ = పోవుట, వచ్చుట అనువాటికి అధీనమై - రాకపోకలకు అనగా చావు పుట్టువులకు లోబడి; వర్తించున్ = మెలగుతుంది;

**తాత్పర్యం:** జీవుడు శిథిలమైన శరీరాన్ని వదలి క్రొత్త దేహాన్ని చేకొనే దానికే పుట్టుక అని పేరు. ప్రాణులు ఈ విధంగా కర్మమూలకములైన దేహాలను ధరిస్తూ విడుస్తూ అంటే జనన మరణాలకు అధీనులై ప్రవర్తిస్తుంటారు.'

**విశేషం:** "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ." (భగ. 2-22)

మానవుడు శిథిలాలైన వస్త్రాలను వదలి నూతన వస్త్రాలను ఎట్లా ధరిస్తాడో, అట్లే జీవుడు కూడ శిథిలాలైన శరీరాలను విడిచి క్రొత్తవైన ఇతర శరీరాలను పొందుతున్నాడు.

ఇత్యాది గీతాశ్లోకాలు ఇక్కడ స్మర్తవ్యాలు.

**వ. అనిన విని పార్వతి శర్వునితో 'బాలురు చచ్చుటకును వృద్ధులు పెద్ద కాలంబు బ్రదుకుటకును గారణం బేమి?' యనుడు నతండు. 127**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; పార్వతి; శర్వునితోన్ = శంకరుడితో; బాలురు = పిల్లలు; చచ్చుటకును; వృద్ధులు = ముసలివారు; పెద్దకాలంబు = పెక్కు సంవత్సరాలు; బ్రదుకుటకును; కారణంబు+ఏమి; అనుడున్ = అని ప్రశ్నించగా; అతండు = శివుడు. (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** శంభుడు అట్లా చెప్పగా విన్న గౌరీదేవి అతడితో 'మహేశ్వరా! పిల్లలు చావటానికి, పెద్దలు చిరకాలం జీవించటానికి హేతు వేమిటి?' అని ప్రశ్నించగా శివు డిట్లా బదులు చెప్పాడు.

**తే. 'మేను జీర్ణముగాఁ జేయుఁ గాని మరణ। మొందఁ జేయదు విను కాల మెందు నరుని**
**పూర్వకర్మంబు లాయువుఁ బొదలఁ జేయ। సన్నముగఁ జేయ బ్రదుకును జావుఁ గలుగు.' 128**

**ప్రతిపదార్థం:** విను = గౌరీ వినుము; కాలము = కాలం అనేది; మేనున్ = శరీరమును; జీర్ణముగాన్+చేయున్+కాని = చివికిపోయేటట్లు చేస్తుంది తప్ప; మరణము+ఒందన్+చేయదు = చనిపోయేటట్లు చేయలేదు; ఎందున్ = ఎక్కడైనా; నరునిపూర్వకర్మంబులు = మానవుడు పూర్వజన్మలో చేసికొన్న కర్మలు; ఆయువున్ = ఆయుష్యాన్ని, జీవితకాలాన్ని; పొదలన్+చేయన్ = వృద్ధి పొందేటట్లు చేయగా; సన్నముగన్+చేయన్ = క్షీణించేటట్లు చేయగా; బ్రదుకును = జీవించటం; చావున్ = మరణించటం; కలుగున్ = సంభవిస్తాయి.

**తాత్పర్యం:** 'దేవీ! విను. కాలం శరీరాన్ని శుష్కింపజేస్తుంది గాని చంపలేదు, నరుడు చేసిన పూర్వకర్మలే అతడి జీవిత కాలాన్ని పెంచటం చేత, క్షీణింప జేయడం చేత బ్రతకటం, చావటం అనేవి సంభవిస్తాయి.'

**వ. అని చెప్పిన 'నాయు వేమిటం బెరుఁగు? నెద్దానం దఱుఁగు?' ననిన విని యుమకు నుమాపతి యిట్లనియె. 129**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్; ఆయువు = ఆయుస్సు; ఏమిటన్ = దేనిచేత; పెరుఁగున్? = వృద్ధి చెందుతుంది?; ఏ+దానన్ = దేనిచేత; తఱుఁగున్ = సన్నగిల్లుతుంది, క్షీణిస్తుంది?; అనినన్; విని; ఉమకున్; ఉమాపతి = శివుడు; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని శివుడు చెప్పగా ఆకర్ణించి పార్వతీదేవి 'జీవితేశ్వరా! ఆయుస్సు దేనిచే వృద్ధి పొందుతుంది? దేని చేత క్షీణిస్తుంది? చెప్పు' మని అడిగింది. అందుకు ఉమావల్లభుడు ఇట్లా సమాధాన మిచ్చాడు.

**శివుఁడు పార్వతికి ఆయుర్వృద్ధి క్షయంబులకుఁ గారణంబులు చెప్పుట. (సం.13 అను 01 15-2300).**

**తే.** **'క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల । వలని భక్తియు నాయువు పొలుపు నిచ్చు;**
**నలుక బొంకు క్రూరత శుచితాపగమము । గురువిరోధ మాయువుఁ గడుఁ గుందఁ జేయు. 130**

**ప్రతిపదార్థం:** క్షమయున్ = సహనం, ఓర్పు; సత్యంబున్ = నిజం చెప్పటం; కృపయున్ = దయ; శౌచమును = పరిశుద్ధత; గురులవలని భక్తియున్ = ఆచార్యుల యెడ భక్తి భావం, పెద్దల యందు భక్తి; ఆయువు పొలుపున్ = ఆయుర్దాయము యొక్క పెంపును; ఇచ్చున్ = కలుగ జేస్తాయి; అలుక = కోపం, బొంకు = అబద్ధమాడటం; క్రూరత = కనికరం లేకుండటం, కర్కశత్వం; శుచితా+అపగమము = పరిశుద్ధత నుండి తొలగటం, శౌచవిహీనత్వం; గురు విరోధము = ఆచార్యుడి పట్ల వైరం, దేశికులపై ద్వేషం; ఆయువున్ = ఆయుష్యాన్ని; కడున్ = మిక్కిలి; కుందన్+చేయున్ = తగ్గించి వేస్తాయి, క్షీణింపజేస్తాయి.

**తాత్పర్యం:** 'సహనం, సత్యం, దయ, పరిశుద్ధత, గురువులయందు భక్తి ఆయుస్సును వృద్ధిపరుస్తాయి. క్రోధం, అబద్ధం, క్రూరత్వం, అపరిశుద్ధత, గురుద్వేషం అనేవి ఆయుస్సును మిక్కిలి క్షీణింపజేస్తాయి గౌరీ!

**తే.** **తపమునను బ్రహ్మచర్యవ్రతమున హిత మి । తాశనమున రసాయనాభ్యాసమునను**
**బెరుఁగు నాయు; వాక్రియలపై నరుఁడు ప్రీతి । గలుగుటయుఁ బూర్వభవకృత కర్మ ఫలము. 131**

**ప్రతిపదార్థం:** తపమునను = తపస్సు చేతనూ; బ్రహ్మచర్యవ్రతమునన్ = బ్రహ్మచర్య నియమపాలనం చేతనూ; హిత+మిత+అశనమునన్ = తగినట్టి, మితమైన ఆహారం చేతనూ; రసాయన+అభ్యాసమునను = జీవనౌషధాలను సేవించటం చేతనూ; అనగా ముసలితనం, మృత్యువును పోగొట్టే రసాయనాలను వాడటం చేతనూ; ఆయువు = ఆయుస్సు; పెరుఁగున్ = వృద్ధి చెందుతుంది; నరుఁడు = మానవుడు; ఆక్రియలపైన్ = తపస్సు మున్నుగా కలిగిన ఆ చర్యల మీద; ప్రీతి+కలుగుటయున్ = ఇష్టపడటం కూడ, మక్కువ చెందటం సైతం; పూర్వభవ = ముందటి జన్మలో; కృత = చేయబడిన; కర్మఫలము = కర్మలయొక్క ఫలమే సుమా!

**తాత్పర్యం:** విష్ణుసహోదరీ! తపస్సు చేతనూ, బ్రహ్మచర్యవ్రతానుష్ఠానం చేతనూ, ప్రియమైన, మితమైన ఆహారం స్వీకరించటం చేతనూ, జరామృత్యుహరణమైన జీవనౌషధాలను సేవించటం చేతనూ ఆయుర్దాయం పెరుగుతుంది. పై నుడివిన క్రియలమీద ఆసక్తి కలగటం కూడ ఆ నరుడు తొలుతటి జన్మలో చేసిన సుకృత కర్మల ఫలమే సుమా!

**క.** **తన లావున కధిక మయిన । పనిసేయు టయుక్తమును నపథ్యము నగు భో**
**జనములు హరించు నాయువు; । వనిత! యవియుఁ బూర్వకర్మ వశతన కలుగున్. 132**

**ప్రతిపదార్థం:** వనిత! = ఓ వెలదీ!; తనలావునకున్ = తన శక్తికి, తన బలమునకు; అధికము+అయిన = మించిన, ఎక్కువైన; పనిచేయుట = పనులు సల్పటం; అయుక్తమును = తగనిదియు; అపథ్యమున్+అగు = హితం కానిదియు అగు; భోజనములు

= ఆహారాలు, తిండ్లు; ఆయువున్ = ఆయుస్సును; హరించున్ = నశింపజేస్తాయి; అవియున్ = పై జెప్పినవి; పూర్వకర్మ వశతన్+అ = మునుపటి జన్మలో చేసిన కర్మల ననుసరించే; కలుగున్ = సంభవిస్తాయి.

**తాత్పర్యం:** గిరిజా! తన శక్తికి మించిన పనులు చెయ్యటం, అయోగ్యమైన, హితకరం కాని తిండ్లు తినటం వలన ఆయువు హరించుక పోతుంది. ఇట్లాంటివి పూర్వజన్మలో చేసిన కర్మల వల్లనే సంభవిస్తాయి.

**వ. మఱియు నొక్క విశేషంబు సెప్పెద. 133**

**తాత్పర్యం:** ఇంకొక్క విశేషం చెప్పుతాను గౌరీ! వినుము.

**ఆ. సుకృతు లమరలోక సుచిరవాసులు నిట । దిగి చిరాయువులును నగుదు; రితరు**
**లతిచిరముగ నరకగతు లయి తుది నాయు । వల్ప మగు మనుష్యు లగుట గలుగు.' 134**

**ప్రతిపదార్థం:** సుకృతులు = పుణ్యాత్ములు; అమరలోక సుచిరవాసులు = స్వర్గలోకంలో బహు దీర్ఘకాలం నివసించేవారు అవుతారు; ఇట దిగి = ఇలకు దిగివచ్చి; చిర+ఆయువులును+అగుదురు = దీర్ఘాయుష్మంతు లవుతారు; ఇతరులు = తక్కిన వారు, పాపాత్ములు; అతి చిరముగన్ = మిక్కిలి పెద్దకాలం; నరక గతులు+అయి = నరకలోకమునకు వెళ్ళినవారై; తుదిన్ = చివరకు, కడపట; ఆయువు = జీవితకాలం; అల్పము+అగు = తక్కువైన; మనుష్యులు+అగుట = మానవులై పుట్టటం; కలుగున్ = సంభవిస్తుంది, జరుగుతుంది.

**తాత్పర్యం:** పుణ్యపురుషులు దేవలోకంలో సుఖా లనుభవిస్తూ బహుకాలం గడపి పుణ్యం క్షీణించగానే తిరిగి భూలోకంలో మానవులుగా పుట్టుతారు. అప్పుడు వారు పుడమిలో దీర్ఘకాలం జీవిస్తారు. పాపులు నరకలోకంలో యాతనలు అనుభవించి పిమ్మట భూమిలో నరులై జన్మిస్తారు. అపుడు వారు అల్పమయిన ఆయుస్సు కలిగి ఉంటారు.'

**విశేషం:** దీర్ఘకాలం మనటానికి, అల్పకాలం జీవించటానికి ఆయాజీవులు చేసిన పుణ్యపాపాలే హేతువులని చెప్పటం జరిగింది.

**క. నా విని భవాని 'పురుష । స్త్రీ విధములు రెండు గలవు త్రినయన! వానన్**
**జీవుఁడు వర్తించు తెఱఁగు । నీ వేర్పడఁ జెప్పవే!' యనియెఁ గంసారీ! 135**

**ప్రతిపదార్థం:** కంస+అరీ(కంసునికి విరోధి)! = కంసుడుని సంహరించిన శ్రీకృష్ణా!; నాన్ = అని పరమేశ్వరుడు చెప్పగా; విని = ఆకర్ణించి; భవాని = శివపత్ని అయిన పార్వతి; త్రినయన! = మూడు కన్నులు గల శివా!; పురుష స్త్రీ విధములు = మగవాడని, ఆడుది అనే రీతులు; రెండు+కలవు = రెండున్నవి; వానన్ = ఆ రెంటిలో; జీవుఁడు = ఆత్మ; వర్తించు తెఱఁగు = మెలగే విధం; నీవు = తమరు; ఏర్పడన్ = విశదంగా, స్పష్టంగా; చెప్పవు+ఏ! = సెలవియ్యవా!; అనియెన్ = అని అడిగింది.

**తాత్పర్యం:** కృష్ణా! (కృష్ణుడితో నారదు డంటున్నాడు) శివుడు చెప్పిన మాటలువిని భవాని మరల భవుడితో

'ప్రాణేశ్వరా! లోకంలో పురుషులనీ, స్త్రీ లనీ జీవులు రెండు రకాలుగా ఉన్నారు కదా! వారిలో జీవుడు ఎట్లా ప్రవర్తిస్తుంటాడో ఆ విషయం నాకు విస్పష్టంగా వివరించు' మని వేడుకొనింది.

**వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కిట్లనియె. 136**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; మహాదేవుండు = ఈశ్వరుడు; మహీధరతనయకున్ = కొండ కొమార్తెకు, పార్వతికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పార్వతి అడుగగా శంభుడు ఆమెతో ఇట్లా అన్నాడు.

**క. 'తాత్త్వికములైన పురుష । స్త్రీత్వంబులు లేవు పార్వతీ! జీవున; కా**
**తత్త్వమున కహంకృతిఁ గ । ర్మిత్వ మొలసి భావ్యవిధమ మెయికొను చుండున్.' 137**

**ప్రతిపదార్థం:** పార్వతీ! = గౌరీ!; జీవునకున్ = ఆత్మకు; తాత్త్వికములు+ఐన = శరీరారంభక ద్రవ్యాలైన భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే మహాభూతాలు, అహంకారతత్త్వం, మహత్తత్త్వం, మూలప్రకృతి అనే తత్త్వాల భేదం వలన కలిగిన, పురుషస్త్రీత్వంబులు లేవు = మగతనం ఆడుతనం అనేవి లేవు; ఆ తత్త్వమునకున్ = ఆ జీవభావానికి; అహంకృతిన్ = అహంకారం చేత; కర్మిత్వము+ఒలసి = కర్మసంబంధం లభించి; భావ్య విధము+అ = భావించినట్లుగానే స్త్రీ పురుషభేదం; మెయికొనుచున్+ఉండున్ = సంభవిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** 'గౌరీ! జీవుడికి మహదహంకారాదులైన తత్త్వాలలో భేదం వాటిల్లి మగవాడుగనో, ఆడుదిగనో జన్మించటం సంభవించదు. ఆత్మ స్త్రీ దేహం ధరించినా, పురుష శరీరం పొందినా ఆ ఇరవైనాలుగు తత్త్వాలు స్త్రీ పురుషులకు ఏకవిధంగానే ఉంటాయి. వాటిలో మార్పుండదు. అహంకారం వలన జీవుడికి కర్మ సంబంధం కలిగి ఆడుదిగనో, మగవాడుగనో రూపం ధరిస్తాడు.'

**విశేషం:** భూమి, జలం, వాయువు, తేజస్సు, ఆకాశం అనే పంచమహాభూతాలూ, అహంకారతత్త్వం, మహత్తత్త్వం, మూల ప్రకృతి అనే ఎనిమిది ద్రవ్యాలతో శరీరం రూపొందుతుంది. చర్మం, కన్ను, చెవి, నాలుక, ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియాలు, వాక్కు, చేయి, కాలు, మలవిసర్జనద్వారం, మూత్రవిసర్జన ద్వారం(పాయువు, ఉపస్థ) అనే అయిదు కర్మేంద్రియాలూ, మనస్సూ, జ్ఞానేంద్రియ పంచకం చేత గ్రహించబడే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే అయిదు విషయాలూ మొత్తం ఈ ఇరవై నాలుగు శరీరాన్ని ఆశ్రయించుకొని ఉండే తత్త్వాలు. ఈ తత్త్వాలు పురుషుడికిగాని, స్త్రీకి గాని ఏకవిధంగానే ఉంటాయి. అయితే ఆయాజీవులు చేసికొన్న పుణ్యాపాప కర్మ ఫలాలైన సుఖదుఃఖాలు అనుభవించటానికి శరీరాలు ఏర్పడుతాయి. నేనే ఈ పని చేస్తున్నాను అనే అహంకర్తృత్వ బుద్ధి వలన ఆ పుణ్యాపాప కర్మ సంబంధమైన సుఖదుఃఖానుభవం కొరకు జీవుడు శరీరం ధరిస్తాడు. అది పురుష దేహమైనా కావచ్చు; స్త్రీ దేహమైనా కావచ్చు. అంతేకాని అసలు ఆత్మకు స్త్రీత్వ పురుషత్వాలులేవు.

**వ. అని మఱియును. 138**

**తాత్పర్యం:** అని చెప్పి మహాదేవుడు మళ్ళీ (ఉమతో ఇట్లా అన్నాడు అని తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ.** **'కర్మములకుఁ గర్తగాఁ డాత్ముఁ; డతని స । త్త్వము రజస్సుఁ దమము వాత పిత్త**
**కఫము లెట్లు మర్త్యకాయ గతము లగు । నట్ల పొందుఁ గర్త లవియ చూవె. 139**

**ప్రతిపదార్థం:** ఆత్ముఁడు = జీవుడు; కర్మములకున్ = కర్మలకు; కర్తకాఁడు = చేసేవాడు కాడు; వాతపిత్త కఫములు = వాతం, పిత్తం, శ్లేష్మం అనేవి; ఎట్లు = ఏ విధంగా; మర్త్యకాయగతములు+అగున్ = మనిషి శరీరాన్ని పొందుతాయో; అట్లు+అ = ఆ రీతిగానే; అతనిన్ = జీవుడిని; సత్త్వము = సత్త్వగుణం; రజస్సు = రజోగుణం; తమము = తమోగుణం; పొందున్ = ఆశ్రయిస్తాయి, కూడుతాయి; కర్తలు = ఆ పనులు చేసేవి; అవి+అ+చూవె = ఆ సత్త్వ రజ స్తమో గుణాలే సుమా!

**తాత్పర్యం:** 'గౌరీ! ఆత్ముడు కర్మలకు కర్త కాడు. వాతం, పిత్తం, కఫం అనే త్రిదోషాలు శరీరాలను ఆశ్రయించుకొని ఉన్న చందంగా సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం జీవుడిని ఆశ్రయించి ఉంటాయి. ఈ మూడు గుణాలే కర్మలకు కర్తలు గాని జీవుడు మాత్రం కానేకాడు.

**విశేషం:** "సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః,
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్." (భగ. 14-5)

సత్త్వరజస్తమోగుణాలు ప్రకృతికి సహజమైన గుణాలు. అవి నాశరహితుడైన ఆత్మను దేవమనుష్యాది దేహాలలో బంధిస్తున్నాయి.

"ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే." (భగ. 3-27)

ప్రకృతికి చెందిన సత్త్వ రజస్తమోగుణాలచేత చేయించబడుతున్న కర్మలను ఆత్మయొక్క యథార్థస్వరూపం తెలియనివాడు దేహాత్మాభిమానం వలన ఆ పను లన్నిటినీ తానే చేస్తున్నట్లు తలపోస్తాడుకాని వాస్తవానికి గుణాలే కర్మలకు కర్తలు అని గీత చెప్పుతున్నది.

**తే.** **సత్య శౌచ దయాదులు సాత్త్వికములు, । రమణి! లోభ సంగాదులు రాజసంబు,**
**లన్నృత హింసాపరత్వ భయాలసత్వ । ధైర్యహాని నిద్రాదులు తామసములు. 140**

**ప్రతిపదార్థం:** రమణి! = సుందరీ!; సత్య శౌచదయా+ఆదులు = సత్యం, పరిశుద్ధత, కృప మొదలైన గుణాలు; సాత్త్వికములు .= సత్త్వగుణానికి సంబంధించినట్టివి; లోభసంగ+ఆదులు = దురాశ లేదా పిసినారితనం, సంసార విషయాసక్తి మొదలైనవి; రాజసంబులు = రజోగుణ సంబంధమైనవి; అనృత = అబద్ధాలాడటం; హింసాపరత్వ = జీవులను బాధించటంలో ఆసక్తి; భయ = భీతి చెందటం; అలసత్వ = సోమరితనం; ధైర్యహాని = ధైర్యంకోల్పోవటం; నిద్రా+ఆదులు = నిద్రించటం మొదలైనవి; తామసములు = తమోగుణానికి సంబంధించినవి.

**తాత్పర్యం:** సుందరీ! సత్యం, శుచిత్వం, కరుణ మొదలైనవి సత్త్వగుణానికి సంబంధించినటువంటివి. అత్యాశ (పిసినారితనం--అవసరమైనపుడు తన సొమ్ము ఖర్చుపెట్టకుండటం), భార్యాపుత్రమిత్రాదుల యందు మమత మొదలైనవి రజోగుణ సంబంధమైనవి. అబద్ధాలు చెప్పడం, జీవహింసయందు ఆసక్తి, భయపడటం, సోమరితనం, అధైర్యం, నిద్ర మొదలైనవి తమోగుణానికి చెందినట్టివి.

**క. ఇవి నానాముఖములఁ బురు । షు వికారముఁ బొందఁ జేయుచుం బరఁగును హై**
**మవతీ! కావున సర్వం । బు వినుము గుణకృత్య మిట్టి బోధం బొప్పన్ 141**

**ప్రతిపదార్థం:** ఇవి = ఈ త్రిగుణాలు; నానా ముఖములన్ = అనేకరీతుల; పురుషున్ = జీవుడిని, ఆత్ముడిని; వికారమున్+ పొందన్+చేయుచున్ = స్వభావంలో మార్పులు కలిగిస్తూ; పరఁగున్ = విలసిల్లుతున్నవి; కావునన్ = కాబట్టి; హైమవతీ! = హిమవంతుడి పుత్రివైన దేవీ!; ఇట్టి బోధంబు = ఇట్టి తెలివి; ఒప్పన్ = చెలువొందగా; వినుము = ఆలకించుము; సర్వంబు = సమస్తమూ; గుణకృత్యము = గుణాలు చేసే పనే.

**తాత్పర్యం:** గిరిజా! సత్త్వరజస్తమోగుణాలు మూడున్నూ పురుషుడిని నానావికారాల పాలు చేస్తున్నవి. కనుక సర్వకార్యాలూ ఈ గుణాల చేతనే చేయబడుతున్నవని తెలివితో తెలిసికొనుము.

**తే. తన్వి! సాత్త్విక రాజస తామసాత్ము । లైనవారలఁ బుణ్యలోకానుభవము**
**మనుజభావంబు నిరయపీడనముఁ బొందు । మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ ముసరు. 142**

**ప్రతిపదార్థం:** తన్వి! = ఓ చెలీ!; సాత్త్విక రాజస తామస+ఆత్ములు+ఐనవారలన్ = సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం కలిగినట్టి వారిని; పుణ్యలోక+అనుభవమున్ = పుణ్యలోక సుఖానుభవం; మనుజభావంబున్ = మనుష్యత్వం; నిరయపీడనమున్ = నరకలోక బాధయున్నూ; పొందున్ = వరుసగా చెందుతాయి; మోక్ష లక్ష్మి = ముక్తి సంపద; నిర్గుణునకున్ = త్రిగుణాతీతుడికి; మునుఁగన్ ముసరున్ = పరిపూర్ణంగా చేకూరుతుంది.

**తాత్పర్యం:** పార్వతీ! సత్త్వగుణప్రధానుడికి పుణ్యలోక సుఖాలు, రజోగుణప్రధానుడికి మనుష్యత్వమూ, తమోగుణప్రధానుడికి నరకలోక బాధ కలుగుతాయి. త్రిగుణాతీతుడైన వాడికి ముక్తి పరిపూర్ణంగా లభిస్తుంది.

**విశేషం:** ఈ యర్థాన్నే భగవద్గీత ఇట్లా వెల్లడించింది.

"ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణ వృత్తిస్థాః అధో గచ్ఛంతి తామసాః."

"నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి." (భగ. 14-18,19.)

**వ. అని వెండియు. 143**

**తాత్పర్యం:** అని పరమశివుడు పలికి ఇంకనూ (ఇట్లా అన్నాడని తరువాతి సీసపద్యంతో అన్వయం).

**సీ. 'ఎట్టివి కర్మంబు లట్టివ నరుల శు । భాశుభసంప్రాప్తు; లట్లు గాక**
**పర విప్రియమున మేల్ వడయుటయును గల్గుఁ । బతిభృత్యతతిఁ బటు భర్త్సనముల**
**నొజ్జ శిష్యులఁ దర్జనోక్తుల వెజ్జు రో । గార్తుల నానా విధౌషధముల**
**నలమటఁ బొందింతు రవ్విధంబుల చేత । లన్నియు సుకృతంబులై ఫలించు'**

**ఆ. నని మఱియును జెప్పు 'సఖిలేంద్రియో పేత । మగు జరాయుజంబు నండజంబు**
**నువిద! చోఁకు నెఱుఁగు నుద్భిజ్జములు స్వేద । జముల కదియుఁ జూపు సంభవించు. 144**

**ప్రతిపదార్థం:** కర్మంబులు = చేసే పనులు; ఎట్టివి = ఎట్లాంటివో; నరుల శుభ+అశుభ సంప్రాప్తులు = మనుష్యులు పొందేటటువంటి పుణ్యపాపాలరాకడలు కూడ; అట్టివి+అ = అటువంటివే అవుతాయి; అట్లు+కాక = పై జెప్పినవిధంగా కాకుండా; పరవిప్రియమునన్ = ఇతరులకు అనిష్టములైన వాటిని చెయ్యటం వలన కూడ; మేల్ = మంచిని; పడ యుటయును+ కల్గున్ = పొందడం కూడ జరుగుతుంది; పతి = యజమానుడు, అధికారి; భృత్యతతిన్ = సేవక గణాన్ని; పటు భర్త్సనములన్ = గట్టిగా బెదరించటం చేత, నిందించటం వలన; ఒజ్జ = గురువు, ఉపాధ్యాయుడు; శిష్యులన్ = ఛాత్రులను; తర్జన+ఉక్తులన్ = బెదరింపుమాటల చేత; వెజ్జు = వైద్యుడు; రోగ+ఆర్తులన్ = వ్యాధుల చేత బాధపడేవారిని; నానావిధ+ఔషధములన్ = పలురకాలైన మందుల చేతనూ; అలమటన్+పొందింతురు = శ్రమ పెట్టుతారు; ఆ+విధంబుల+చేఁతలు+అన్నియున్ = ఆ రీతివైన పనులన్నీ; సుకృతంబులు+ఐ = పుణ్యకార్యాలై; ఫలించున్ = పండుతాయి, ప్రయోజనాలు సిద్ధింపజేస్తాయి; అని = అంటూ; మఱియును = ఇంకా; చెప్పున్ = చెప్ప సాగినాడు; ఉవిద! = ఓ ప్రియా!; జరాయుజంబున్ = మావియందు పుట్టునదియూ; అండజంబున్ = గ్రుడ్డు నుండి పుట్టునదియూ; అఖిల+ఇంద్రియ+ఉపేతము+అగున్ = అన్ని ఇంద్రియాలతోనూ కూడిన దవుతుంది; ఉద్భిజ్జములు= చెట్లూ, పొదలూ; చోఁకున్+ఎఱుఁగున్ = స్పర్శజ్ఞానం కలిగి ఉంటాయి; స్వేదజములకున్ = చెమటవలన జన్మించిన జీవులకు; అదియున్+చూపు = స్పర్శజ్ఞానంతో పాటు దర్శన శక్తి కూడ; సంభవించున్ = కలుగుతుంది.

**తాత్పర్యం:** 'మనుషులు చేసేపనులను బట్టి వారికి మేలుగీళ్లు లభిస్తాయి. చెడ్డపని చేస్తే చెడు ఫలితం, మంచి పనులు చేస్తే మంచి ఫలితం కలుగుతాయన్న మాట. ఇందుకు భిన్నంగా కూడా జరగటం కద్దు. ఇతరులకు ఇష్టంగాని పనులు చేసే కర్తకు మేలు కలగటం కూడా సంభవిస్తుంది. అధికారి సేవకులను బెదరిస్తూ మాట్లాడటం, వైద్యుడు రోగాలతో అల్లాడే వారిని, చేదు, వగరు, కారం మందులు మింగించి శ్రమ పెట్టటం, గురువు విద్యార్థులను దండించటం ఇట్లాంటివే. ఈ పనుల వల్ల కర్తకు పుణ్యమేకాని పాపం రాదు'-- అని చెప్పి మహేశ్వరుడు మహాదేవితో మళ్ళీ అంటున్నాడు. 'దేవీ! మావియందు పుట్టిన ప్రాణీ, గ్రుడ్డునుండి జన్మించిన జీవీ సకలేంద్రియాలతో ఒప్పారుతుంది. చెట్లు చేమలు స్పర్శజ్ఞానం మాత్రమే కలిగి ఉంటాయి. చెమట వలన జన్మించిన జీవులస్థితి గతులు గూడ వృక్షాదుల స్థితిగతుల వంటివే. కాని, వీటికి దర్శనశక్తి గూడ ఉంటుంది.

**విశేషం:** జీవరాసులు నాలుగు విధాలు: 1)జరాయుజములు 2)అండజములు 3) ఉద్భిజ్జములు 4) స్వేదజములు అని.

అందు 1) జరాయుజములు అనగా మావి నుండి, గర్భాశయం నుంచి పుట్టినట్టివి--మనుష్యులు, పశువులు మొదలైన ప్రాణులు.

2) అండజములు = గ్రుడ్డువలన పుట్టినవి: పక్షులు, చేపలు, బల్లులు, పాములు.

3) ఉద్భిజ్జములు = భూమిని భేదించుకొని పుట్టినవి: వృక్షములు, లతలు (తీగలు) గుల్మములు (పొదలు)

4) స్వేదజములు = చెమటవలన పుట్టే క్రిమి విశేషాలు-- ఈగలు, దోమలు, చీమలు, మిడుతలు, నల్లులు, క్రిములు, కీటకాలు.

**క. నరుఁడు జరాయుజములలో । తరుణీ! విను ముత్తముఁడు; శ్రుతము లేకున్నన్**
**సరి నతఁడు పశువుఁ; గావున । వరిష్ఠ మగునట్టి వినికి వలయు నరునకున్. 145**

**ప్రతిపదార్థం:** తరుణీ! = ఓ లలనా!; వినుము = ఆలింపుము; నరుఁడు = మనుజుడు; జరాయుజములలోన్ = మావి నుండి పుట్టిన జీవులలో; ఉత్తముఁడు = శ్రేష్ఠుడు; శ్రుతము+లేక+ఉన్నన్ = పెద్దల వలన ధర్మాధర్మముల వినికిడి లేకపోయినచో;

అతఁడు = ఆ మనుజుడు; పశువున్+సరి = పశువుతో, జంతువుతో సమానుడే; కావునన్ = కాబట్టి; నరునకున్ = మానవుడికి; వరిష్ఠము+అగు = శ్రేష్ఠమైన; వినికి వలయున్ = బోధ, ఉపదేశం అవసరం.

**తాత్పర్యం:** కాంతా! మావినుండి ఉద్భవించిన ప్రాణులలో మానవుడు శ్రేష్ఠుడు. అతడు ధర్మాధర్మాల స్వరూప మెట్టిదో పెద్దల వలన వినాలి. అట్టి వినికి లేనిచో అతడు పశువుతో సమానుడే. కావున జనుడికి శ్రేష్ఠమైన వినికిడి అవసరం.

**క. ఇరుదెఱఁగు విను తమము శా । ర్వరమును దేహజము శార్వరము దేజస్సం**
**స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ । బరిహృతమగు దేహజంబు పర్వతపుత్రీ! 146**

**ప్రతిపదార్థం:** పర్వతపుత్రీ! = ఓ హైమవతీ!; విను = వినుము; తమము = చీకటి; ఇరు+తెఱఁగు = రెండు విధాలు; శార్వరమును = శర్వరీ సంబంధము అనగా రాత్రిసంబంధమైనదీ; దేహజమున్ = శరీర సంబంధమైనదియూ (అని); శార్వరము = రేయి వలన కలిగిన చీకటి; తేజస్+సంస్ఫురణమునన్ = వెలుగు గోచరించటంచేత, కాంతి ప్రసరించటం వలన; పాయున్ = తొలగుతుంది; దేహజంబు = శరీరం నుండి పుట్టినట్టిది; శ్రుతమునన్ = వినికిడి వలన (వేదశాస్త్ర శ్రవణం వలన); పరిహృతము+ అగున్ = తొలగింపబడుతుంది.

**తాత్పర్యం:** గౌరీ! వినుము; చీకటి రెండు విధాలు. ఒకటి రాత్రి వలన కలిగినట్టిది. రెండవది శరీరం వలన ఏర్పడినట్టిది. రాత్రి చీకటి కాంతి ప్రసరణం వలన నశిస్తుంది. దేహమున పుట్టిన చీకటి పెద్దలు చేసే శాస్త్ర చర్చ ఆలకించి గ్రహించటం వలన తొలగిపోతుంది.

**విశేషం:** దేహమున పుట్టిన చీకటి అంటే అజ్ఞానం.

**ఆ. బ్రహ్మ యా తమంబుఁ బాపుటకై తపో । వ్యాప్తిఁ బడసె శ్రుతులు నంగములును**
**గానఁ గార్యములు నకార్యంబులును వానఁ । దెలిసి కొనఁగ బుద్ధి కలఁక దీఱు. 147**

**ప్రతిపదార్థం:** బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఆ తమంబున్ = ఆ చీకటిని; పాపుటకై = తొలగించటానికి; తపః వ్యాప్తిన్ = తపస్సు యొక్క సమృద్ధి చేత, చిరకాల ఘోర తపస్సు చేత; శ్రుతులున్ = వేదాలనూ; అంగములునున్ = వేదాంగాలైన ఆరుశాస్త్రాలనూ; పడసెన్ = పొందినాడు; కానన్ = కనుక; కార్యములున్ = చేయదగిన పనులూ; అకార్యంబులునున్ = చేయ దగని పనులూ; వానన్ = ఆ వేద శాస్త్రాల చేత; తెలిసికొనఁగన్ = ఎఱిగినట్లయితే; బుద్ధి కలఁక తీఱున్ = బుద్ధిజాడ్యం, మాంద్యం నశిస్తుంది.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు శరీరంలోని చీకటిని తొలగించటానికి బహుకాలం గొప్ప తపస్సు చేసి ఆ తపఃఫలంగా వేదాలనూ, శాస్త్రాలనూ పొందగలిగాడు. కాబట్టి చేయదగిన పను లేవో, చేయరాని పనులేవో ఆ వేదశాస్త్రాల వలన తెలియవలె. అందువలన బుద్ధి జాడ్యం తొలగిపోతుంది.

**విశేషం:** శ్రుతులు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం. వేదాంగములు: శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం-- ఇవి ఆరు.

**తే. క్రోధకామాదులైన దుర్గుణము లెల్ల । వాయుహతి మేఘపటలంబు వాయు పగిది**
**శ్రుతముచేఁ బాయు; నరులలో సురల కరణి । శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి. 148**

**ప్రతిపదార్థం:** క్రోధకామ+ఆదులు+ఐన = కోపం, కామం మొదలైన; దుర్గుణములు+ఎల్లన్ = చెడుగుణాలన్నీ; వాయుహతిన్ = గాలిదెబ్బచే, తాకిడి చేత; మేఘ పటలంబు = మబ్బులగుంపు; పాయుపగిదిన్ = తొలగిపోయే విధంగా; శ్రుతము చేన్ = వేదశాస్త్రపురాణాల వినికి చేత; పాయున్ = తొలగిపోతాయి; నరులలోన్ = మనుషుల్లో; శ్రుతయుతులు = వేదశాస్త్రాదుల వినికిడితో కూడినవారు; సురల కరణిన్ = దేవతలమాదిరి; అతిశయిల్లి = మించి; తేజరిల్లుదురు = ప్రకాశిస్తారు, వెలుగొందుతారు.

**తాత్పర్యం:** కామక్రోధాది దుర్గుణా లన్నీ గాలి దెబ్బకు మబ్బులు చెదరిపోయేటట్లు వేదశాస్త్రాల వినికిడివలన నశిస్తాయి. మానవులలో బహుశ్రుతు లైన మహనీయులు వేల్పుల వలె హెచ్చుగా విరాజిల్లుతారు.

**విశేషం:** "కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.'' (గీత. 3అధ్యా 37శ్లో.)

రజోగుణం వలన కామం జనిస్తుంది. ఈ కామానికి ఎంత అనుభవించినా తృప్తి ఉండదు. ఇదే అడ్డగించబడి కోపంగా మారి ఘోరపాపాలు చేయిస్తుంది. ఇది జ్ఞానికి ప్రబలశత్రువు-అని గీత కామక్రోధాలు ఎట్లాంటివో వివరించింది.

వాయుహతిన్ మేఘపటలంబు వాయు పగిది, క్రోధ కామాది దుర్గుణములు శ్రుతముచే పాయున్ - అనుచోట ఉపమాలంకారం.

**తే.** **శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతునిఁ జేయు । వాని సుకృత మల్పమును ననూన ఫలము**
**నిచ్చు; నజ్ఞాని సత్కర్మ మెంతయైన । నఫల మగుఁగాన శ్రుతవంతుఁ డగుట వలయు.'** **149**

**ప్రతిపదార్థం:** శ్రుతము = శాస్త్రాదుల వినికి; నరునిన్ = మనుజుడిని; పరిజ్ఞానయుతునిన్+చేయున్ = పూర్ణజ్ఞానంతో కూడిన వాడినిగా చేస్తుంది; వాని సుకృతము = అతడు చేసిన పుణ్యం; అల్పమును = కొంచెమైననూ; అనూనఫలమున్+ఇచ్చున్ (న+ఊన = అనూన) = మిక్కుటమైన ఫలాన్ని ప్రసాదిస్తుంది. కొదువలేని ఫలాన్ని ఇస్తుంది; అజ్ఞాని సత్కర్మము = జ్ఞానం లేని వాడి యొక్క మంచిపని అనగా వాడు చేసిన పుణ్యకర్మ; ఎంత+ఐనన్ = ఎంత గొప్పదైనప్పటికినీ; అఫలము+అగున్ = వ్యర్థమవుతుంది; కానన్ = కాబట్టి; శ్రుతవంతుఁడు+అగుట+వలయున్ = శాస్త్రాదుల వలన ధర్మస్వరూపం ఎరిగిన వాడు కావడం అవసరం.

**తాత్పర్యం:** శాస్త్రాదుల వినికిడి మానవుడిని పరిపూర్ణ జ్ఞానవంతుడిని చేస్తుంది. అట్టి వివేకవంతుడు చేసే పుణ్యం కొంచెమైనా గొప్ప ఫలం వానికి ప్రసాదిస్తుంది. "అజ్ఞాని చేసిన మంచిపని ఎంత గొప్పదైనా అది వ్యర్థమవుతుంది. కాబట్టి మానవుడు శ్రుతవంతుడుకావడం ఎంతో అవసరం''

**వ.** **అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె.** **150**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించి = ఇట్లు నిర్ణయపూర్వకంగా తెల్పి; సర్వ+ఈశ్వరితోన్ = సమస్తమునకు నాయకురాలైన గౌరీదేవితో; సర్వజ్ఞుండు = సమస్తం తెలిసిన శంభుడు; ఇట్లు+అనియెన్ = ఇట్లా వచించాడు.

**తాత్పర్యం:** అని చెప్పి లోకేశ్వరి అయిన ఉమాదేవితో శివదేవుడు ఇట్లా చెప్పాడు.

**సీ.** **'మృతిఁ బొంది వేగ జన్మించినఁ బూర్వదై । హికము లన్నియు బుద్ధి నెలయువాఁడు**
**జాతిస్మరుం డనఁ జను; నయ్యెఱుక పెద్ద । వాఁడు గాఁగాఁ జెడు; వనిత! వినుము**
**పుట్టెఱుంగుట కల్మి బోధించుటకు నాస్తి । కులమును జన్మంబు గలుగు తెఱఁగుఁ;**
**జచ్చిపోయిన వారు వచ్చి యత్తను వొంది । మెలఁగు టొక్కొక చోటఁ గలిగియుండు;**

**తే.** **నట్టి తెఱఁగు వెంగలు లైన యమునిదూత । లొరులఁ జని కొనిపోయినఁ గరుణతోడ**
**న మ్మహాత్ముండు మగిడి పొమ్మన్న నరుగు । దెంచుటని నీ వెఱుంగు; సందియము లేదు.'** **151**

**ప్రతిపదార్థం:** వనిత! = ఓ వెలదీ!; వినుము = ఆలకించుము; మృతిన్+పొంది = మరణం చెంది; వేగ = శీఘ్రమే, వెను వెంటనే; జన్మించినన్ = పుట్టినచో; పూర్వదైహికములు+అన్నియున్ = మునుపటి జన్మ వృత్తాంతా లెల్ల; బుద్ధిన్ = మనస్సులో; ఎలయువాఁడు = నెలకొని ఉన్నవాడు; జాతిస్మరుండు = పూర్వజన్మ వృత్తాంతం ఎరిగినవాడు; అనన్+చనున్ = అని చెప్పుటకు తగి ఉంటాడు; ఆ+ఎఱుక = ఆ పూర్వజన్మస్మృతి; పెద్దవాఁడు+కాఁగాన్ = క్రమంగా వయసుముదిరిన వాడవుతుండగా; చెడున్ = నశిస్తుంది; పుట్టు+ఎఱుంగుట కల్మి = పూర్వజన్మము తెలియుటను కలిగి ఉండటం; జన్మంబు+ కలుగు+తెఱఁగున్ = జన్మవచ్చే విధానాన్ని; నాస్తి కులమును = ఈశ్వరుడు లేడనే జాతిని; బోధించుటకున్ = తెలియపఱచుటకు మేల్కొల్పుటకు ఉపకరిస్తుంది; చచ్చిపోయినవారు = మరణించినవారు; వచ్చి = యమలోకం నుంచి మరలి వచ్చి; ఆ+ తనువు+ఒంది = మృతదేహంలో ప్రవేశించి; మెలఁగుట = వ్యవహరించటం; ఒక్క+ఒకచోటన్ = ఒక్కొక్క తావులో; కలిగి+ ఉండున్ = జరుగుతుంటుంది; అట్టి తెఱఁగు = అట్లాంటి సంఘటన; వెంగలులు+ఐన = అవివేకులైన; యముని దూతలు = యమకింకరులు; ఒరులన్ = ఆయువు ముగియని వాళ్ళను; చని = వారి దగ్గరకు వచ్చి; కొని పోయినన్ = యమలోకానికి తీసికొని వెళ్ళగా; కరుణ తోడన్ = కనికరంతో; ఆ+మహా+ఆత్ముండు = ఆ దొడ్డ మనసు గల యమధర్మరాజు; మగిడి పొమ్ము+అన్నన్ = ఆ జీవుడిని తిరిగి వెళ్ళుమని చెప్పగా; అరుగుదెంచుట = చచ్చినవాడు తిరిగి కాయంలో ప్రవేశిం చటం అని; నీవు+ఎఱుఁగు = నీవు తెలియాలి; సందియము లేదు = ఈ విషయంలో అనుమానం వద్దు.

**తాత్పర్యం:** 'మరణించినతోనే మళ్ళీ జన్మిస్తే పూర్వజన్మ విషయాలన్నీ అతని బుద్ధిలో నెలకొని ఉంటాయి; జ్ఞప్తిలో ఉంటాయి. అట్లా పూర్వ జన్మవృత్తాంతం ఎరిగిన వాడిని జాతిస్మరు డంటారు. క్రమంగా వయసు పెరిగి పెద్దవాడవుతున్న కొద్దీ అతడు తొల్లింటి పుట్టుకకు సంబంధించిన ఎరుకను కోల్పోతాడు. కాత్యాయనీ! పూర్వజన్మకు సంబంధించిన ఎరుకను గలిగిఉండటం పునర్జన్మ ఉన్నదనే విషయాన్ని నిరీశ్వరవాదులకు తెలియజెప్పడానికి తోడ్పడుతుంది. చనిపోయిన వాడు తిరిగి ఒక్కొక్కప్పుడు బ్రతకడం కద్దు. అదెట్లంటే యమకింకరులు పొరపాటున ఒకడి ప్రాణాలకు బదులు మరొకడి ప్రాణాలు గైకొని వెళ్ళినపుడు ధర్మాత్ముడైన యముడు గమనించి ఆయుస్సు తీరని వాడిని కనికరించి బ్రతుకుమని తిరిగి పంపివేయటం సంభవిస్తుంటుంది. అప్పుడు మృతుడు మరల జీవితు డవుతాడు. ఇట్లాంటి విషయా లెన్నో ఉన్నవి. సందేహించ నక్కర లేదు.'

### శివుఁడు పార్వతికి స్వప్నాదుల తెఱం గెఱింగించుట (సం.13-అను -15-2457)

**వ.** **అని తెలిపిన గౌరి 'కల యనునది యేమి? యెఱింగింపవే' యనుటయును నతండు.** **152**

**ప్రతిపదార్థం:** అని తెలిపినన్ = అని శంభుడు చెప్పగా; గౌరి; కల+అనునది+ఏమి? = స్వప్న మనగా ఎటువంటిది?; ఎఱింగింపవు+ఏ = చెప్పుమా; అనుటయును = అని అడుగగా; అతండు = ఈశ్వరుడు (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని శంభుడు చెప్పగా గౌరీదేవి 'జీవితేశ్వరా! కల అంటే ఏమిటి? తెలుపు'మని వేడగా శివు డిట్లా అన్నాడు.

**ఆ. 'స్వప్న మనఁగ సుప్తజనము మనశ్చేష్ట । యదియుఁ గాంచు నొగి ననాగతములఁ**
**గానఁ గలలు సూచకము లగు భావి శు । భాశుభోదయముల కనుచుఁ జెప్పె. 153**

**ప్రతిపదార్థం:** స్వప్నము+అనఁగన్ = కల అంటే; సుప్తజనము మనః+చేష్ట = నిదురిస్తున్న జనుల యొక్క మనోవ్యాపారం; అదియున్ = ఆ మనసు; ఒగిన్ = క్రమంగా; అనాగతములన్ = రాబోయేవాటిని; కాంచున్ = దర్శిస్తుంది; కానన్ = కాబట్టి; కలలు; భావి = రానున్న; శుభ+అశుభ+ఉదయములకున్ = మేలు కీళ్ళ యొక్క పుట్టుకలకు; సూచకములు+అగున్ = ప్రకటన లవుతాయి, చూపుతాయి, వెల్లడిస్తాయి; అనుచున్; చెప్పెన్ = ఈశ్వరుడు తెలిపాడు.

**తాత్పర్యం:** 'స్వప్నమంటే నిదురిస్తున్న మనిషి యొక్క మనస్సు చేసే వ్యాపారం. ఆ మనస్సు రాబోయే విషయాలను ముందుగా కనుగొంటుంది. కనుక కలలు మునుముందు కలుగబోయే కష్టసుఖాలను వెల్లడిస్తాయి' అని పరమేశ్వరుడు పరమేశితో పలికాడు.

**వ. చెప్పిన విని భవాని భవునితోడ. 154**

**ప్రతిపదార్థం:** చెప్పినన్; విని; భవాని = గౌరీదేవి; భవునితోడన్ = ఈశ్వరుడితో (ఇట్లా అన్నది అని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఈశ్వరుడు పలికిన పలుకులు ఆలకించి గౌరి ఆయనతో ఇట్లా అన్నది.

**సీ. 'దైవంబొ? కర్మవర్తనము జనంబు ను । త్సాహంబొ?' యనిన ' నతండు దైవ**
**మోపి కర్మంబు సేయుట లేదు దైవసం । కలన ఫలం బిచ్చుఁ గాని వినుము**
**దేవి! పూర్వకృతంబు దైవనామకమునఁ । బరఁగు; నప్పటి చేఁత పౌరుషంబు**
**కృషివోలె నుండుఁ; బౌరుష గతి వర్ష స । ద్వాయువులట్ల దైవ ప్రకార**

**తే. మెఱుఁగు ఖనన మథనముల నెట్లు జలముఁ । జిచ్చుఁ బుట్టు నమ్మెయి నరుచేష్ట దైవ**
**యోగమున సిద్ధిఁ బొందు నుద్యోగ రహితుఁ । డెత్తెఱంగున దైవ సమృద్ధిఁ బడయు. 155**

**ప్రతిపదార్థం:** కర్మవర్తనము = కర్మలయందు ప్రవర్తింపచేయటం; దైవంబు+ఒ? = దైవమా? (లేక); జనంబు+ఉత్సాహంబు+ఒ? = జనుల యొక్క యత్నమా?; అనినన్ = అని శర్వాణి ప్రశ్నించగా; అతండు = చంద్రమౌళి; దైవము = దైవం; ఓపి = పూనుకొని; కర్మంబు+చేయుట లేదు = కర్మను సల్పడం లేదు; దైవసంకలన = దైవము యొక్క తోడ్పాటు, ఘటన; ఫలంబు+ఇచ్చున్+కాని = ప్రయోజనాన్ని సిద్ధింపజేస్తుంది; దేవి! = సాధ్వీ!; వినుము = ఆలకించవలసింది; పూర్వకృతంబు = నరుడు మునుపు చేసిన సుకృతం; దైవనామకమునన్ = దైవమనే పేరుతో; పరఁగున్ = విలసిల్లుతుంది; అప్పటి చేఁత = జనుడు అప్పుడు చేసిన కర్మ; పౌరుషంబు = పురుష సంబంధము; పౌరుషగతి = పురుష వ్యాపారం; కృషి+పోలెన్+ఉండున్ = సేద్యం వలె ఉంటుంది; దైవప్రకారము = విధి విధానం; వర్షసద్+వాయువులు+అట్లు+అ = వాన, మంచిగాలి వలె ఉంటుంది; కృషి ఫలించటానికి వర్షం, మంచిగాలి అవసరం గదా! అని; ఎఱుఁగు = తెలిసికొనవలసినది; ఖనన మథనములన్ = నేలను త్రవ్వుట వలన, అరణి కట్టెను చిలుకుట వలన; ఎట్లు = ఏ విధంగా; జలమున్ = నీరూ; చిచ్చున్ = అగ్నియూ; పుట్టున్ = జన్మిస్తాయో; ఆ+మెయిన్ = ఆ రీతిగానే; నరుచేష్ట = మనిషి యొక్క క్రియాచరణ; దైవయోగమునన్ = దైవం

యొక్క తోడ్పాటుతో; సిద్ధిన్+పొందున్ = ఫలిస్తుంది, ఫలకారి అవుతుంది; ఉద్యోగరహితుఁడు = యత్నం చెయ్యనివాడు; ఏ+తెఱంగునన్ = ఏ విధంగా; దైవసమృద్ధిన్ = భాగ్యము యొక్క పెంపును; పడయున్? = పొందగలడు? పొందలేడని భావం.

**తాత్పర్యం:** 'మానవుడిని కర్మలయందు ప్రవర్తింపజేస్తున్నది దైవమా? లేక అతడి ఉత్సాహమా? చెప్పవలసిన దని గౌరి ప్రశ్నిస్తే శంకరు డిట్లా బదులు పలికాడు. 'దేవీ! దైవం తానుగా ఏ పనీ చెయ్యడు కాని నరుడు చేసే పనులకు తోడ్పడి ఫలాన్నిస్తాడు. ముందటి జన్మలో జనుడు చేసిన కర్మమే దైవమని చెప్పబడుతుంది. ఇపుడు చేసే కర్మ పౌరుషమని పిలువబడుతుంది. మనిషి చేసే యత్నం వ్యవసాయంవంటిది. దైవసహాయ మంటేనో జలం వంటిది; గాలి వంటిది. ఇవి రెండూ కృషి ఫలించడానికి తోడ్పడుతాయి. నేలను త్రవ్వినపుడే నీరు పడుతుంది. అరణికట్టెను మథించినపుడే అగ్నిపుట్టుతుంది. అట్లాగే మానవయత్నం - దైవం సాయపడినపుడు ఫలిస్తుంది. అసలు యత్నపరుడు కానివాడికి దైవంతోడ్పాటు ఎట్లా లభిస్తుంది? (లభించనే లభించదని భావం.)

**క. కావున నుద్యోగంబును । దైవంబును గారణములు దామరసాక్షీ!**
**యే విధమునఁ గర్మముల ఫ । లావాప్తికి దీన సంశయము వలదు సుమీ!' 156**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి; తామరస+అక్షీ! = పద్మములవంటి నేత్రములు గలదానా!; ఏ విధమునన్ = ఏ రీతిగా చూచినప్పటికినీ; కర్మముల = కర్మముల యొక్క; ఫల+అవాప్తికిన్ = ఫలముల యొక్క సంప్రాప్తికి; ఉద్యోగంబును = మనుష్యయత్నమూ; దైవంబును = దైవబలమునూ; కారణములు = హేతువులు; దీనన్ = ఈ విషయంలో; సంశయము వలదు సుమీ! = సందేహం అక్కర లేదు సుమా!

**తాత్పర్యం:** కమలముల వంటి కన్నులు గల సఖీ! ఎట్లు పరికించినా కర్మఫలాలు లభించటానికి మానవ యత్నమూ; దైవానుకూల్యం కారణాలు. ఇందులో అనుమానించవలసిన అక్కర లేదు సుమా!'

**తే. అనిన నంబిక 'గర్భంబు నాత్ముఁ డెట్లు । చొచ్చు?' ననవుడు నభవుఁడు 'సురత బీజ**
**రక్త దైవముల్ సూవె కారణము లాత్మ । గర్భ సంవేశనమునకుఁ గమలనయన! 157**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని శంభుడు పలుకగా; అంబిక = పార్వతి; ఆత్ముఁడు = జీవుడు; గర్భంబున్ = ఉదరమును; ఎట్లు+చొచ్చున్? = ఎట్లా ప్రవేశిస్తాడు?; అనవుడున్ = అని అడుగగా; అభవుఁడు = శ్రీకంఠుడు; కమలనయన! = తామరల వంటి కన్నులు గలదానా!; ఆత్మ = జీవుడి యొక్క; గర్భసంవేశనమునకున్ = గర్భంలో ప్రవేశించటానికి; సురత = రతి క్రీడయూ; బీజ = పురుషుడి వీర్యమూ; రక్త = స్త్రీ యొక్క నెత్తురూ; దైవముల్ = దైవమూ అనే యీ నాలుగూ; కారణములు+చూవె! = హేతువులు సుమా!

**తాత్పర్యం:** శివుడు ఆ విధంగా చెప్పగా విన్నదై పార్వతి 'నాథా! జీవుడు గర్భంలో ప్రవేశించటానికి హేతువు లెట్టివి?' అని అడిగింది. అందుకు శంకరుడు 'పద్మాక్షీ! స్త్రీ పురుషుల యొక్క సంభోగం, పురుషుడి వీర్యమూ, స్త్రీ యొక్క శోణితమూ, దైవం యొక్క తోడ్పాటూ ఇందుకు కారణాలు' (అని చెప్పాడు).

**క. మాయారహితుఁ డహంకా । రాయత్తతఁ జూవె పుట్టువను చెఱఁబడి నా**
**నాయాసంబులఁ బడు నా । జ్ఞాయుతుఁడై యాత్ముఁ డింత చర్చింపు మదిన్.' 158**

**ప్రతిపదార్థం:** మాయారహితుఁడు = సహజంగా కూటయుక్తులు, కుయుక్తులు, కాపట్యం లేని; ఆత్ముఁడు = జీవుడు; ఆజ్ఞాయుతుఁడు+ఐ = దైవం యొక్క ఆజ్ఞతో కూడినవాడై; అహంకార+ఆయత్తతన్+చూవె! = అహంకారానికి అధీనుడగుట వల్లనే సుమా!; పుట్టువు+అను = జన్మమనే; చెఱన్+పడి = బంధనంలో చిక్కి; నానా+ఆయాసంబులన్+పడున్ = పలు విధములైన శ్రమల పాలవుతున్నాడు; ఇంత = ఈ విషయం; మదిన్ = నీ మనసులో; చర్చింపు = విచారించుము.

**తాత్పర్యం:** పార్వతీ! నిష్కల్మషుడైన జీవుడు అహంకారమునకు వశుడై దాని ఆజ్ఞచొప్పున జన్మమనే చెరలో చిక్కి బహుకష్టాలపాలవుతున్నాడు. ఇది నీ మనసులో చర్చించుము'.

**సీ.** **అని చెప్పి 'దైవరహస్యంబు వినిపింతు । విను' మని పలికి యిట్లనియె శివుఁడు**
**'తొల్లి మనుష్యులు తొలుమేని కర్మంబు । లెఱుఁగఁగాఁ జాలుట నెల్లవారు**
**మేలుసేయఁగ ననిమిషలోకమున నధి । కంబగు సందడి గాఁగ మనుజు**
**లమరులై పేర్చిన' నజుఁడు వేల్పుల సంక । టము వాయుటకు నుపాయము దలంచి**

**తే.** **మానవుల కయ్యెఱుకకల్మి మాన్చి కామ । రోషముల నొలయించిన దోషకృతుల**
**వారు నరకాది సమ్మర్దకారు లగుడు, । నదియుఁ గాదని చింతించి యనువు గాంచి. 159**

**ప్రతిపదార్థం:** అని చెప్పి = అని వచించి; దైవరహస్యంబున్ = దేవతలకు కూడా గోప్యమైన విషయం, వినిపింతున్ = చెప్పుతాను; వినుము+అని పలికి = వినవలసిందని చెప్పి; శివుఁడు = శంకరుడు; ఇట్లు+అనియెన్ = అంబికతో ఇట్లా అన్నాడు; తొల్లి = పూర్వం; మనుష్యులు = నరులు; తొలుమేని కర్మంబులు = పూర్వజన్మంలో చేసిన పనులు; ఎఱుఁగఁగాన్+చాలుటన్ = తెలియగలిగినవారు కావటం చేత; ఎల్లవారు = మనుష్యులందరు; మేలు+చేయన్+కన్ = సత్కార్యములు సల్పటం వలన; అనిమిషలోకమునన్ = దేవలోకంలో, స్వర్గంలో; అధికంబు+అగు = మిక్కుటమైన; సందడి కాఁగన్ = సమ్మర్దం కలుగగా, చోటు చాలక ఇరుకు ఏర్పడగా; మనుజులు = నరులు; అమరులు+ఐ = మృతిలేనివారై, వేల్పులై; పేర్చినన్ = అతిశయించగా; అజుఁడు = బ్రహ్మదేవుడు; వేల్పుల సంకటము = దేవతల యొక్క కష్టం, చిక్కు; పాయుటకున్ = తొలగుటకు; ఉపాయము+తలంచి = వెరవు పరికించి, ఉపాయం ఆలోచించి; మానవులకున్ = మనుష్యులకు; ఆ+ఎఱుక+కల్మి = ఆ పూర్వజన్మ జ్ఞాన సంపద, ఆ స్మృతి సమృద్ధిని; మాన్చి = తొలగించి; కామరోషములన్ = కామక్రోధాలను; ఒలయించినన్ = కలుగజేయగా; వారు = నరులు; దోషకృతులన్ = దుష్టకార్యాలచేత; నరక+ఆది సమ్మర్దకారులు+అగుడున్ = నరకలోకాదులయందును రాయిడి (ఒత్తిడి) కలిగించినవారు కాగా; అదియున్ కాదు+అని = అట్లు వారిని పాపకృత్యాలకు ప్రేరేపించి నరకలోక నివాసులను చేయటం కూడా తగదని; చింతించి = ఆలోచించి; అనువు+కాంచి = అందుకు ఉపాయం కనుగొని-(తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** పరమేశ్వరుడు శాంకరిని అవలోకించి 'సతీ! దేవతలకు కూడా ఎరుకపడని ఒక రహస్యం ఉన్నది చెప్పుతాను విను' మంటూ ఉపక్రమించాడు. 'పూర్వం మానవులందరికీ పూర్వ జన్మస్మృతి ఉండేది. అందువలన వారు ఎల్లప్పుడూ పుణ్యకార్యాలు చేస్తూ తత్ ఫలితంగా స్వర్గలోకానికి చేరేవారు. మితి మీరి అందరూ అక్కడికి వెళ్ళటం వలన స్వర్గధామంలో చోటు చాలక సమ్మర్దం ఏర్పడింది. వేల్పులకు సంకటస్థితి కలిగింది. దానిని నివారించుటకు బ్రహ్మదేవుడు ఉపాయం ఆలోచించి జనులు పుణ్యకార్యాలు సల్పకుండా వారికి ఇదివరకున్న

పూర్వజన్మజ్ఞానాన్ని తొలగించి, కామక్రోధాలను వారికి కల్పించాడు. ఆ చెడు గుణాల వలన వారు చెడుపనులు చేయటానికి పూనుకొని నరకలోక నివాసులు అవుతూండటం వలన అక్కడ కూడా మితిమీరిన త్రొక్కిడి ఏర్పడింది. ఇది కూడా బాగులేదని చతుర్ముఖుడు మరొక ఉపాయం ఆలోచించాడు. ఇది సమంజసమైనదని భావించాడు.

**క. సరిగా నా రెండెడలకు । నరులు సనుట గోరి మనమునం గానమియుం**
**బరలోక విధము శాస్త్రము । వెరవునఁ గనుటయు నొనర్చె విధి వారలకున్.' 160**

**ప్రతిపదార్థం:** ఆ రెండు+ఎడలకున్ = ఆ స్వర్గలోకానికి, నరక లోకానికి; సరిగాన్ = సమానంగా; నరులు = మనుష్యులు; చనుట+కోరి = వెళ్ళవలెనని వాంఛించి; మనమునన్ = మనసులో; పరలోక విధము = పరలోక విధానాన్ని; కానమియున్ = కనుగొనజాలకుండుటను; శాస్త్రము వెరవునన్ = శాస్త్రం యొక్క ఆధారంతో; కనుటయున్ = కనుగొనుటయును; వారలకున్ = ఆ నరులకు; విధి = బ్రహ్మ; ఒనర్చెన్ = చేశాడు.

**తాత్పర్యం:** అటు స్వర్గానికి, ఇటు నరకానికి మనుషులు మితిమీరి వెళ్ళి సమ్మర్దం కలిగించకుండా, ఆ రెండు చోట్లకు సమానంగా వెళ్ళేటట్లు చేయదలచి బ్రహ్మదేవుడు పరలోకస్థితి గతులు మనోదృష్టి చేత వారు ఎరుగకుండేటట్లుగాను, శాస్త్రం చేతనే తెలిసేటట్లు గాను చేశాడు.'

**వ. అనినం బార్వతి 'పునర్జన్మంబు గలదు లేదను సంశయంబుతోన పొట్టు పొరలగుదురు నరులు; దాని తెఱంగు నిశ్చయింపవే' యనుటయు నంధకారాతి యిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** అనినన్; పార్వతి; పునః+జన్మంబు = మరణించినవాడు తిరిగి పుట్టటం; ఉత్తర జన్మ; కలదు = ఉన్నది; లేదు; అను = అనునట్టి; సంశయంబుతోన్+అ = సందేహంతోనే; నరులు; పొట్టు పొరలు+అగుదురు = నలిగి నలిగి పోతున్నారు, సతమతమైపోతున్నారు; దాని తెఱంగున్ = ఆ పునర్జన్మ విషయం; నిశ్చయింపవు+ఏ = నిర్ణయింపుమా; అనుటయున్ = అని వేడగా; అంధక+అరాతి = అంధకుడనే రాక్షసుడికి శత్రువు = అనగా అంధకాసురుడిని గూల్చిన త్రిశూలపాణి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని భవుడు పలుకగా భవాని ' దేవా! పునర్జన్మ కలదని కొందరూ, లేదని కొందరూ వాదులాడుకొంటూ సతమత మవుతున్నారు. ఆ ఉత్తర జన్మం విషయ మెట్టిదో నిర్ణయించ వేడుతున్నాను' అని పల్కగా అంధకాసురుడిని హరించిన హరు డిట్లా అన్నాడు.

**క. 'కలదో లేదో యనియెడు । తలపోతయ కాని నిశ్చితము గాదు సురా**
**దులకుఁ; బునర్జన్మంబుల । కలిమియు లేమియును నరులు గానమి దప్పే? 162**

**ప్రతిపదార్థం:** సుర+ఆదులకున్ = దేవతలు మొదలైనవారికి కూడా; కలదు+ఓ = పునర్జన్మ ఉన్నదో; లేదు+ఓ = లేదో; అనియెడు = అనునట్టి; తలపోత+అ+కాని = ఊహయేకాని; పునఃజన్మంబుల = పునర్జన్మల యొక్క (తిరిగి జన్మించటం అనువాటి యొక్క); కలిమియున్ = ఉండటం; లేమియునున్ = లేకుండటం అనే విషయం; నిశ్చితము+కాదు = నిర్ణయించబడలేదు; నరులు= మానవులు; కానమి= చూడజాలకుండటం, ఎరుగకుండటం; తప్పు+ఏ? = దోషమా? కాదని భావం.

**తాత్పర్యం:** 'అసలు పునర్జన్మ ఉన్నదో లేదో అనే సంశయం దేవతలకు కూడా ఉన్నది. వారి కీ విషయంలో ఒక నిశ్చయజ్ఞానం లేదు. మరి మానవులకు అది తెలియకుండటంలో ఆశ్చర్య మేమున్నది?

**క. కల; దది యూరక కానఁగ । నలవియె? శ్రుతివాక్యసమితి యర్థంబులపై**
**నిలిచిన శ్రద్ధం గ్రమమున । దెలివొందినఁ గాక యెట్టి ధీమంతులకున్.' 163**

**ప్రతిపదార్థం:** అది = పునర్జన్మ; కలదు = ఉన్నది; శ్రుతివాక్యసమితి = వేదవాక్యముల సముదాయము యొక్క; అర్థంబులపైన్ = భావముల మీద; నిలిచిన = సక్తమైన; శ్రద్ధన్ = ఆసక్తితో; క్రమమునన్ = క్రమాన; తెలివి+ఒందినన్+కాక = జ్ఞానం పొందితే తప్ప, వివేక వంతుడైతే తప్ప; ఎట్టి ధీమంతులకున్ = ఎంతటి ప్రజ్ఞావంతులకు కూడా; ఊరక = తేలికగా, అలవోకగా; కానఁగన్ = తెలియుటకు; అలవి+ఎ? = శక్యమా, సాధ్యమా?

**తాత్పర్యం:** ప్రేయసీ! పునర్జన్మమనేది ఉన్నది. అది ఎంతటి బుద్ధిమంతులకైనా వేద వాక్యాలయొక్క అర్థం గ్రహించకుండా తెలిసికొనటానికి సాధ్యపడదు.'

**వ. అనిన విని గౌరి గంగాధరున కిట్లనియె. 164**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; గౌరి; గంగాధరునకున్ = గంగను శిరసున ధరించిన వాడికి - పరమేశ్వరుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శివుడి పలుకులు విని ఉమాదేవి మళ్ళీ ఆయనతో ఇట్లా అన్నది.

**క. 'మృతులైనవారలు నిరా । కృతులై యుండుదురు; వారిఁ గీనాశ భట**
**ప్రతతి కొని చనుట, యా పితృ । పతి శాసించు టవి యెట్టి భంగులు దేవా!' 165**

**ప్రతిపదార్థం:** దేవా! = స్వప్రకాశస్వరూపుడా!; మృతులు+ఐనవారలు = చనిపోయిన వాళ్ళు; నిర్+ఆకృతులు+ఐ = రూపరహితులై; ఉండుదురు = ఉంటారు; వారిన్ = ఆ మృతులను; కీనాశభటప్రతతి = యమకింకరుల గుంపు; కొనిచనుట = తీసికొని వెళ్ళటం; ఆ పితృపతి = ఆ యమధర్మరాజు; శాసించుట = వారిని దండించటం; అవి = అనునట్టివి; ఎట్టి భంగులు? = ఏ విధమైనవి?

**తాత్పర్యం:** 'ప్రభూ! చనిపోయిన వాళ్ళు ఆకారరహితులై ఉంటారు. యమకింకరులు రూపరహితులైన వారిని తమ వెంట ఎట్లా తీసికొనిపోతారు? యమధర్మరాజు వారిని ఎట్లా శిక్షిస్తాడు? ఈ సంగతులు నాకు విశదంగా చెప్పండి' అని గౌరి కోరింది.

**వ. అని యడిగిన న ద్దేవుం డిట్లనియె. 166**

**తాత్పర్యం:** అని ఉమాదేవి ప్రశ్నించగా ఆ భగవంతుడు ఇట్లా అన్నాడు.

**సీ. 'తతియైన మనుజులఁ దనువులు విడిపించి । మాయాశరీర సమన్వితులుగ**
**నొనరించి దూతలు గొనిపోదు; రందును । ధర్మవర్తుల సుగంధంబు మృదువు**
**నైన మార్గమున, మధ్యపువారి నిర్బాధ । సరణిఁ, బాపాత్ముల బరుసఁదనము**
**ముటికియుఁ గల పథంబున నడపింతు, రి । ప్పరుసునఁ జని పితృపతికిఁ జూప**

**ఆ. నతఁడు పుణ్యలోక గతియును మానవ । త్వంబు ఘోరనరక వాసమును వి**
**ధించి పుచ్చు వారిఁ దెలచి మన్నించి భ । ర్జించి వరుసతోడఁ జిగురుఁబోఁడి!' 167**

**ప్రతిపదార్థం:** చిగురుఁబోఁడి! = చిగురుటాకు వలె మెత్తని మేనుగలదానా!; దూతలు = యమభటులు; తఱి+ఐన = ఆయుస్సు దీరిన, కాలం చెల్లిన; మనుజులన్ = మనుష్యులను; తనువులు విడిపించి = దేహాలు వీడేటట్లు చేసి; మాయాశరీర సమన్వితులుగన్ = కృత్రిమమైన దేహాలతో కూడిన వారిని; ఒనరించి = చేసి; కొనిపోదురు = తీసికొని వెళ్ళుతారు; అందునున్ = అట్లా తమ వెంట కొనిపోయే వారిలో; ధర్మవర్తులన్ = ధర్మంగా నడుచుకొనేవారిని (ఉత్తములను); సుగంధంబు = సువాసన; మృదువు+ఐన = మెత్తనైన; మార్గమునన్ = దారిలోనూ; మధ్యము+వారిన్ (మధ్యపువారిని) = అంతగా ధర్మపరులు కానట్టివారిని (మధ్యములను); నిర్బాధసరణిన్ = అంతగా కష్టములు లేని తెరువులోనూ; పాప+ఆత్ములన్ = పాపహృదయులను (అధములను); పరుస+తనమున్ = కఠినత్వమూ; ముఱికియున్ = మాలిన్యమూ; కల = కలిగిన; పథంబునన్ = బాటలో; నడపింతురు = నడచేటట్లు చేస్తారు. ఆ+పరుసునన్ = ఆ తీరున; చని = వెళ్ళి; పితృపతికిన్ = యముడికి, సమవర్తికి; చూపన్ = దర్శింప జేయగా; అతఁడు = ఆ యమధర్మరాజు; వారిన్ = తనకడకు వచ్చిన ఉత్తమ, మధ్యమ, అధములను; వరుసతోడన్ = క్రమంగా; తెలచి = పొగడి, కొనియాడి; మన్నించి = ఆదరించి; భర్జించి = బెదరించి, పుణ్యలోక గతియునున్ = స్వర్గలోక గమనమును; మానవత్వంబున్ = మనుష్యత్వమును అనగా నరలోకగతియును; ఘోరనరకవాసమును = భయానకమైన నరకలోకమున పడియుండుటయు; విధించి = ఏర్పరచి; పుచ్చున్ = పంపి వేస్తాడు.

**తాత్పర్యం:** 'కోమలీ! యమభటులు ఆయువు ముగిసిన జనుల దగ్గరకు వచ్చి వారి ప్రాణాలను శరీరాల నుండి వెడలిస్తారు. పిదప ఒక మాయా దేహంలో వారి అసువులను ప్రవేశపెడతారు. ఆ కృత్రిమ దేహాలతో వారిలో ధర్మాత్ములైన వారిని పరిమళవంతమైన మృదుమార్గంలోనూ, మధ్యములైన వారిని అంతగా కష్టాలు లేని దారిలోనూ, పాపులను దుర్గంధభూయిష్ఠమైన, కఠినమైన త్రోవలోనూ, నడిపించుకొంటూ వెళ్ళి యముడికి చూపిస్తారు. యమధర్మరాజు పుణ్యపురుషులను కొనియాడి పుణ్యలోకాలకు పంపుతాడు. రెండవ తెగవారిని ఆదరించి నివసించుటకు మనుజ భువనానికి పొమ్మంటాడు. పాపులను బెదరించి నరకలోకానికి గెంటి వేస్తాడు.'

**వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్రశేఖరుని తోడ. 168**

**తాత్పర్యం:** అని పరమేశ్వరుడు చెప్పగా పర్వతరాజపుత్రి ఐన గౌరీదేవి చంద్రుడిని శిరసున ధరించిన శంకరుడితో. (ఇట్లా పలికెనని తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నరకం బెట్టిది? కల్మష । కరులన్ జముఁ డెట్టి భంగిఁ గాఱియఁ బెట్టున్?**
**వరదా! చెప్పు మనుడు న । ప్పురహరుఁ డిట్లనియె వృష్ణిపుంగవ! ప్రీతిన్. 169**

**ప్రతిపదార్థం:** నరకంబు+ఎట్టిది? = నరక మనగా ఎటువంటిది?; కల్మష కరులన్ = పాపం చేసే వారిని; జముఁడు = యమధర్మరాజు; ఎట్టిభంగిన్ = ఏ రీతిని; కాఱియన్+పెట్టున్? = బాధపెడతాడు?; వరదా! = కోరికలిచ్చువాఁడా!; చెప్పుము = తెల్పుము; అనుడున్ = అని పార్వతి పలుకగా; ఆ+పురహరుఁడు = ఆ త్రిపురాలను ధ్వంసం చేసిన రుద్రుడు; ప్రీతిన్ = సంతోషంతో; ఇట్లు+అనియెన్ = ఇట్లా వచించాడు; వృష్ణిపుంగవ! = వృష్ణివంశజులలో శ్రేష్ఠుడా, శ్రీకృష్ణా!

**తాత్పర్యం:** 'నరక మంటే ఎట్లాంటిది? పాపులను యముడు ఏ విధంగా బాధిస్తాడు? నాథా! నాకు చెప్పండి' అని అంబిక అడుగగా ఆ త్రిపురాసుర సంహారి సంతోషంతో ఇట్లా అన్నాడు శ్రీకృష్ణా! (అని నారద మహర్షి ఉమాశంకరుల సంవాదాన్ని వాసుదేవుడికి వినిపించాడు).

**సీ. 'రౌరవం బనఁగ ధరాస్థలిక్రింద మ । హారౌరవం బన నవుల దాని**
**కావల విను కంటకావనంబన నుండుఁ । గ్రమవృత్తిఁ బేర్చు దుఃఖములు గలిగి**
**యగ్నికుండంబునా నటఁ బంచకష్టంబు । నాఁగల విట్లున్న నరకతలము**
**లై దందుఁ బాపక్రియా తారతమ్యంబు । లూహించి యంతకుం డునుపఁ బనుచుఁ**

**తే. దగిన యెడలఁ బాపాత్ములఁ దద్భటాలి । దహన కర్తన బంధన తాడనములఁ**
**బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ' గ్రిములు । దొలుచు' గ్రద్దలు నొప్పించుఁ దుండనిహతి. 170**

**ప్రతిపదార్థం:** క్రమవృత్తిన్ = వరుస ప్రకారం; పేర్చు = అతిశయించే; దుఃఖములు+కలిగి = కష్టాలతో కూడినవై; రౌరవంబు+ అనఁగన్ = రౌరవము అనే పేరుతో; ధరాస్థలి క్రిందన్ = భూమికి అడుగు భాగంలోనూ; మహారౌరవంబు+ అనన్ = మహారౌరవం అనేనామంతో; అవులన్ = ఆ రౌరవానికి అవతల; దానికిన్+ఆవలన్ = ఆ మహారౌరవానికి తరువాత; కంటకావనంబు+అనన్ = ముళ్ళ అడవి అనే పేరుతోనూ; అగ్నికుండంబునాన్ = అగ్నికుండం అనే పేరుతో మరొకటి; అటన్ = అక్కడ; పంచకష్టంబునాన్+కలవి = పంచకష్టము అనే పేరు కలిగినవి; ఇట్లు+ఉన్న = ఈ రీతిగా ఉన్నట్టి; నరకతలములు = నరకప్రదేశాలు; ఐదు = అయిదు(ఉన్నవి); అందున్ = వాటిలో; అంతకుండు = యముడు; పాపక్రియా తారతమ్యంబులు+ఊహించి = ఆయాజీవు లొనర్చిన పాపకార్యాల యొక్క హెచ్చు తక్కువలు పరికించి; పాప+ఆత్ములన్ = కిల్బిష మొనర్చిన వాళ్ళను; తగిన+ఎడలన్ = ఉచితమైన తావులందు; ఉనుపన్ = ఉంచుటకు; పనుచున్ = ఆజ్ఞాపిస్తాడు; వారలన్ = ఆ పాపులను; తత్+భట+ఆలి = ఆ యముడి యొక్క భటుల సమూహం; దహన = కాల్చడం; కర్తన = చీల్చటం; బంధన = కట్టటం; తాడనములన్ = కొట్టటం అనేపనుల చేత; పఱుపన్ = బాధలపాలు చెయ్యగా; కుక్కలు = శునకాలు; కఱచున్ = ఆ దుర్మార్గులను కరుస్తాయి; క్రిములు = పురుగులు; తొలుచున్ = రంధ్రాలు ఏర్పడేటట్లు చేస్తాయి; గ్రద్దలు = గృధ్రాలు; తుండనిహతిన్ = ముక్కుల యొక్క పొడుపులతో; నొప్పించున్ = వారు అల్లాడేటట్లు చేస్తాయి.

**తాత్పర్యం:** 'గిరినందినీ! భూమికి అధోభాగంలో ఐదు నరక ప్రదేశా లున్నవి. అవి ఒకదానికంటె మరొకటి పరమబాధాకరాలు. అవేవంటే - రౌరవం, మహారౌరవం, కంటకారణ్యం, అగ్నికుండం, పంచకష్టం అనే పేరులు కలవి. అవి దుర్మార్గులు తాము చేసిన పాపఫలం అనుభవించే చోట్లు. యముడు ఆయాజీవుల పాపాల యొక్క తారతమ్యాలను అనుసరించి ఆయా నరకస్థానాలకు పంపుతాడు. అక్కడ యమభటులు వారిని కాలుస్తూ, నరుకుతూ, కాలుచేతులు కట్టిపడవేస్తూ, కొట్టుతూ నానావిధాల బాధిస్తారు. ఆ నరక వాసులను జాగిలాలు కరిచీ, పురుగులు తొలిచీ, గ్రద్దలు ముక్కులతో పొడిచీ నొప్పిస్తాయి.

**వ. మఱియును యమదూత వ్రాతంబు నానావిధ వేదనలం బెట్టి దండించుచుండు. 171**

**ప్రతిపదార్థం:** మఱియును = ఇంకా; యమదూత వ్రాతంబు = యమకింకరుల యొక్క సమూహం; నానా విధ = పలు రకాలైన; వేదనలన్+పెట్టి = బాధలకు గురిచేసి; దండించుచున్+ఉండున్ = శిక్షిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** అక్కడ యమదూతలు పాపులను నానాయాతనలకు గురి చేస్తూ బహుభంగుల శిక్షిస్తారు.

**ఉ. అమ్మెయిఁ బాపముల్ వొలియునంతకు దుఃఖము లంది కీటజ**
**న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వ మానుష**
**త్వమ్ముల నోలిఁ బొందుదురు వా రిను మెంతయుఁ గ్రాఁగి కల్మష**
**త్వమ్ము దొఱంగుమాడ్కి నవతామరస ప్రతిమాన లోచనా!' 172**

**ప్రతిపదార్థం:** నవ = నూత్నమైన, అప్పటికప్పుడు వికసించిన; తామరస = పద్మదళములకు; ప్రతిమాన = సాటివచ్చు; లోచనా = కన్నులు గలదానా!; ఆ+మెయిన్ = ఆ రకంగా; పాపముల్ = కిల్బిషాలు; పొలియు+అంతకున్ = నశించే వరకూ; దుః ఖములు+అంది = కష్టాలు అనుభవించి; వారు = ఆ జీవులు; ఇనుము = ఇనుము అనే లోహం; ఎంతయున్ = మిక్కిలి; క్రాఁగి = కొలిమిలో తప్తమై; కల్మషత్వమ్మున్ = మాలిన్యమును, తుప్పును; తొఱంగుమాడ్కిన్ = వదలినచందంగా; క్రమంబునన్ = వరుసగా; కీట జన్మమ్ములన్ = పురుగుల యొక్క పుట్టుకలనూ; పక్షియోనులన్ = పక్షుల జన్మాలనూ; పొంది = చెంది; ఓలిన్ = ఆ పిదప వరుసగా; మృగత్వ మానుషత్వమ్ములన్ = జంతువులవుటనూ, మనుజులవుటనూ; పొందుదురు = చెందుతారు.

**తాత్పర్యం:** కమల పత్రములతో సమానమైన కన్నులు గల కాత్యాయనీ! ముందు నుడివినట్లు పాపులు తమ పాపాలు నశించే వరకూ నరకలోకాలలో నానావిధ యాతనలు అనుభవించి కొలిమిలో కాగిన ఇనుము తుప్పును వీడిన విధంగా శుద్ధులై తొలుత పురుగులుగానూ, పిదప పక్షులుగానూ, ఆవల మృగాలుగానూ, అనంతరం మనుష్యులు గానూ జన్మ లెత్తుతారు.'

**విశేషం:** శంకరాచార్యులవారు చెప్పినట్లు "జంతూనాం నరజన్మదుర్లభతరం". జీవి తనదుష్కర్మల ఫలంగా నానా విధక్షుద్రయోనులలో పుట్టి పుట్టి, చచ్చి చచ్చి చివరి కెప్పుడో పాపాలు నశించి పరిశుద్ధుడై ఫలితంగా మానవజన్మను పొందుతున్నాడు. మానవుడై జన్మించినవాడు దైవీగుణసంపత్తిని అలవరచుకొనాలి. ఆసురీసంపదను అలవరచుకొనగూడదని భగవద్గీతలోని షోడశాధ్యాయం హితోపదేశం చేస్తుంది.

**వ. అనిన విని పార్వతి 'పాపంబు లనునవి యెట్టివి? యెఱింగింపవే' యనుటయు నీశానుం డిట్లనియె.173**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని శివుడు చెప్పగా విన్నదై; పార్వతి; పాపంబులు+అనునవి; ఎట్టివి?; ఎఱింగింపవు+ఏ = తెలియ జెప్పవా; అనుటయున్ = అని అడుగగా; ఈశానుండు = శివుడు, ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఈశాను డట్లా పలుకగా ఆలకించినదై ఉమాదేవి, 'దేవా! పాపాలంటే ఎట్లాంటివో తెలుపవా?' అని అడుగగా అత డిట్లా అన్నాడు.

శివుఁడు పార్వతికి మానస వాచిక కాయికములను త్రివిధ పాపములఁ దెల్పుట. (సం.13-అను-1.15-2792).

**సీ. 'మానిని! త్రివిధముల్ మానస వాచిక । కాయికంబులఁ బాతకంబు; లందుఁ**
**బరధనాపేక్షణ పాపానుమోద ధ । ర్మద్వేష ముఖములు మానసంబు;**

**లనృత దారుణ భాషణాదులు వాచిక । ములు; వధంబును బంధమును నభక్ష్య**
**భక్షణంబును నన్యభామారతము మద్య । పానంబు మొదలైన పాపకృతులు**

**తే. కాయికంబులు; విను మధికం బపేయ । పానమది దుష్కృతంబులలోన నెల్లఁ**
**బానమున నిందతో వచ్చుఁ బ్రాణగొడ్డ । ములును జేటులు నరకాబ్ధి మునుఁగుటలును. 174**

**ప్రతిపదార్థం:** మానిని! = ఆత్మాభిమానం గల ఓ వెలదీ!; పాతకంబులు = పాపాలు; మానస వాచిక కాయికంబులన్ = మనసు చేత, నోటిచేత, శరీరం చేత చేయబడేవి; త్రివిధముల్ = మూడు విధాలు, ముత్తెఱగులు; అందున్ = ఆ మూడు విధాలలో; మానసంబులు = మనస్సంబంధమైనవి; పరధన+అపేక్షణ = ఇతరుల సొమ్ము వాంఛించటం; పాప+అనుమోద = పాపకృత్యాలను సమ్మతించటం, చూచి సంతోషించటం; ధర్మద్వేషముఖములు = పుణ్యాలను ద్వేషించటం మొదలైనవి; అనృత = అసత్యాలు పలకటం, దారుణ భాషణ+ఆదులు = పరమ కర్కశంగా మాట్లాడటం మొదలైనవి; వాచికములు = వాక్కునకు చెందిన పాపాలు; వధంబును = ప్రాణులను చంపటం; బంధమును = కట్టివేయటం; అభక్ష్యభక్షణంబును = తినగూడని వాటిని తినటం; అన్యభామారతమున్ = పరుని భార్యతో కూడటం; మద్యపానంబున్ = కల్లు త్రాగటం; మొదలు+ఐన = మున్నగు; పాపకృతులు = కిల్బిషకృత్యాలు; కాయికంబులు = శరీర సంబంధమైనట్టివి; వినుము = ప్రేయసీ! శ్రద్ధగా ఆలకించుము; అపేయ పానము+అది = త్రాగరానిదైన సారాయి త్రాగటం అనేది; దుష్కృతంబులలోనన్+ఎల్లన్ = పాపాలన్నింటియందునూ; అధికంబు = కడుపెద్దది; పానమునన్ = త్రాగుడు వలన; ప్రాణగొడ్డములును = ప్రాణహానికరములు, ప్రాణోపద్రవాలు; చేటులున్ = కీళ్ళు; నరక+అబ్ధిమునుఁగుటలును = నరకమనే సముద్రంలో మునిగి పోవటాలు; నిందతోన్ = అపకీర్తితో; వచ్చున్ = సంభవిస్తాయి.

**తాత్పర్యం:** 'దేవీ! మనసుతో చేయబడేవి, నోటితో సల్పబడేవి, శరీరంతో కావింపబడేవి అని పాపాలు ముప్పిధాలు. ఇతరుల ద్రవ్యాన్ని వాంఛించటం, దుష్కృత్యాలు జరుగుతుంటే అంగీకరించటం లేదా చూచి సంతోషించటం, ధర్మకార్యాలను ద్వేషించటం మొదలైనవి మనస్సంబంధమైన పాపాలు. అబద్ధాలు చెప్పటం, కఠోరంగా మాట్లాడటం, వాక్సంబంధమైన దోషాలు, చంపటం, బంధించటం, తిన కూడని వాటిని తినటం, పరుని పత్నిని అనుభవించటం, కల్లు త్రాగటం మొదలైనవి శరీరసంబంధమైన పాతకాలు. పార్వతీ! వినుము. పాపా లన్నింటిలో దొడ్డపాపం కల్లు త్రాగటం. మద్యపానం వలన ప్రాణోపద్రవం కలుగుతుంది, చేటు వాటిల్లు తుంది, నరకసముద్రంలో కూలటం జరుగుతుంది.

**విశేషం:** బాలవ్యాకరణకర్త పరవస్తు చిన్నయసూరి లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు. అది గ్రంథరచనకు పనికిరాదని శాసించాడు. కాన కఱకంఠుడు, కపిల గడ్డము, కపిలజడల వంటి నన్నయ భారత ప్రయోగాలకు రక్షణ కల్పించడానికి ఆయన "పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యమైనను గ్రహింపదగును" అంటూ "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అని సూత్రం కల్పించాడు. అందుకు ఉదాహరణగా ఇచ్చిన పదాలలో తిక్కన గారి ఈ ప్రాణగొడ్డము ఒకటి. ఈనాడు అనేకమారులు, అల్పదండిత్యాదులు పేరున్న పెద్ద పెద్ద కవులే నిరంకుశంగా వాడుతున్నారు.

**క. లోకము నిర్మర్యాద । త్వాకులమై చెడదె సజ్జనావలి మధుపా**
**నాకాంక్ష దొఱఁగకున్న గు । ణా కల్పా! యేమిసేయ దక్కీడు నరున్? 175**

**ప్రతిపదార్థం:** గుణ+ఆకల్పా! = సద్గుణాలే నగలుగా గలదానా!; సత్+జన+ఆవలి = సత్పురుషుల యొక్క సంఘం; మధుపాన+ఆకాంక్ష = మద్యం త్రాగడంలోని ఆసక్తి; తొఱఁగక+ఉన్నన్ = వదలకుంటే, మానకుంటే; లోకము = ప్రపంచం; నిర్+మర్యాదత్వ+ఆకులమై = హద్దులేమిచే కలిగిన వ్యాకులపాటు చెందినదై; చెడదు+ఎ? = నశింపదా? ఆ+కీడు = ఆ మధుపానాసక్తి వలన కలిగే హాని; నరున్ = మనిషిని; ఏమి+చేయదు? = ఏమిచేయలేదు? అనగా అన్ని అనర్థాల పాలు కావిస్తుందని భావం.

**తాత్పర్యం:** గుణభూషితవైన పార్వతీ! సత్పురుషులు మద్యపానం మానకపోతే లోకం హద్దు లేనిదై సంక్షోభానికి గురై చెడిపోతుంది. మధుసేవ మనిషికి ఏ హాని కల్గించలేదు? అన్ని అనర్థాలనూ కల్గిస్తుందని తాత్పర్యం.

**క. కావున నే విధమున సుర । సేవింపక యుడుగుటొప్పుఁ జెలువ! సకల వ**
**ర్ణావలికి దానఁ గీర్తి । శ్రీవైభవ పుణ్యగతులు సేర్చికొన నగున్. 176**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి; చెలువ = ఓ లలనా; ఏ విధమునన్ = ఎట్లైనా; సురసేవింపక = మద్యం త్రాగక; ఉడుగుట = మానటం; ఒప్పున్ = తగును; దానన్ = అట్లా చేయడం వలన; సకల వర్ణ+ఆలికిన్ = అన్నికులాలవారికిన్నీ; కీర్తి శ్రీవైభవ పుణ్యగతులు = యశస్సు, సిరి, వైభవం, పుణ్యలోకాలు; చేర్చి కొనన్+అగున్ = పడయవచ్చును, పొందవచ్చును.

**తాత్పర్యం:** కాబట్టి కాంతామణీ! ఏ విధంగానైనా కల్లుమానటం అవశ్యకర్తవ్యం. అట్లా చెయ్యటం వలన పేరు ప్రఖ్యాతులూ, సిరిసంపదలూ, గొప్పతనం, సద్గతులూ సర్వజాతులవారూ సంపాదించుకొనవచ్చు.'

**క. అన విని యంబిక 'సుకృతము । లనునవి యెట్టి?' వని యడుగు నద్దేవికి ని**
**ట్లనియెం జంద్రార్ధధరుం । డనుమోదోల్లాసి యగుచు నంబుజనాభా! 177**

**ప్రతిపదార్థం:** అనన్; విని; అంబిక = దుర్గ; సుకృతములు+అనునవి = పుణ్యాలు అనేవి; ఎట్టివి? = ఎట్లాంటివి?; అని = అంటూ; అడుగు = ప్రశ్నించునట్టి; ఆ+దేవికిన్ = ఆ భగవతికి; చంద్ర+అర్ధ+ధరుఁడు = నెలవంకను తలదాల్చిన శివుడు; అనుమోద+ఉల్లాసి+అగుచున్ = సంతోషంతో ప్రకాశిస్తున్నవాడై; ఇట్లు+అనియెన్ = ఇట్లా చెప్పాడు; అంబుజనాభా! = పద్మమునాభియందుగలవాడా! శ్రీ కృష్ణా!

**తాత్పర్యం:** అని పరమేశ్వరుడు పలుకగా పార్వతీదేవి 'ప్రభూ! పుణ్యాలంటే ఎట్లాంటివి? అని ప్రశ్నించింది. అందుకు శశాంకశేఖరుడు సంతోషంతో విలసిల్లుతూ ఆమె కిట్లని చెప్పాడు శ్రీకృష్ణా! (అని నారదమహర్షి శౌరితో అన్నాడు).

**తే. 'ఔపరమికాభిధానంబు నంబుజాక్షి! । నిరుపకరణాఖ్యమును సోపకరణనామ**
**కంబు నయి లోకమున సుకృతంబు పరఁగుఁ । ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము. 178**

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్షి! = తామరరేకులవంటి నేత్రాలు గలగౌరీ!; ఔపరమిక+అభిధానంబున్ = ఔపరమికము అనే పేరుగలదియూ; నిరుపకరణ+ఆఖ్యమునున్ = నిరుపకరణము అనే పేరుగలదియూ; సోపకరణనామకంబున్ = సోపకరణము అనే పేరుగలదియూ; అయి = కలిగి; లోకమునన్ = జగములో; సుకృతంబు = పుణ్యం; త్రివిధములన్ = మూడురీతుల; పరఁగున్ = ఒప్పుతున్నది; వానిన్ = మూడు విధాల ఉన్న పుణ్యాలను; తగన్ = చక్కగా; వివరింతున్ = వెల్లడిస్తాను; వినుము = ఆలకించుము.

**తాత్పర్యం:** 'పద్మ దళముల వంటి నయనాలు గల గౌరీ! పుణ్యం ఔపరమికం అనీ, నిరుపకరణం అనీ, సోపకరణం అనీ మూడూ విధాలుగా ప్రపంచంలో వెలుగొందుతున్నది. విశదీకరిస్తాను. విను.

**సీ. ఔపరమిక మనునది పాపవర్జన; । మకట! కానఁగ నేర రజ్ఞజనులు;**
**యత్నంబు వలదు; వ్యయం బేమియును లేదు । పరలోకభీతిఁ బాపములఁ దొఱఁగి**
**నంతన సుగతి సౌఖ్యం బొడఁగూడెడు; । నదియు నాత్మాధీన; మట్టిదాని**
**సుకరత్వ మెఱుఁగక చొత్తురు నరకంబు; । వెరవరుల్ శ్రుతమున వృద్ధయోగ**

**తే. మునను ధృతికల్మి నింద్రియ వినియమమున । నది దమకుఁ గలిగింతురు; యమ మనంగఁ**
**బరఁగు నది దాన నాకంబుఁ బడయవచ్చు। ననినఁ జెప్పంగ నేల ధర్మాభియుక్తి. 179**

**ప్రతిపదార్థం:** ఔపరమికము+అనునది = ఔపరమికము అనేది; పాపవర్జనము = పాపకృత్యాలను వదలటమే; అకట! = అయ్యో!; అజ్ఞజనులు = మూర్ఖులు, మూఢులు; కానఁగన్+నేరరు = తెలిసికొనలేరు; యత్నంబు వలదు = ఇందుకు పెద్దగా ప్రయత్నించనక్కర లేదు; వ్యయంబు+ఏమియును+లేదు = ధనం కొంచెమైనా వెచ్చించవలసినపని లేదు; పరలోకభీతిన్ = పరలోకంలో ఎట్లాంటి బాధలు అనుభవించ వలసి వస్తుందో అనే భయంతో; పాపములన్ = దురితాలను; తొఱఁగిన+అంతన్+అ = విడిచి పెట్టిన మాత్రాననే; సుగతిసౌఖ్యంబు = సద్గతి వలని సుఖం, స్వర్గ సౌఖ్యం; ఒడన్+కూడెడున్ = లభిస్తుంది; అదియున్ = ఆ పాపవివర్జనం; ఆత్మ+అధీనము = తనకు వశమయ్యే ఉంటుంది; అట్టిదాని సుకరత్వమున్ = ఆ పాపవర్జనం వలన కలిగే సౌలభ్యం, మేలు; ఎఱుఁగక = తెలియక; నరకంబున్+చొత్తురు = నరకలోకంలో ప్రవేశిస్తారు; వెరవరుల్ = ఉపాయశాలురు; శ్రుతమునన్ = వేద శాస్త్రపురాణాదుల వినికి చేతనూ; వృద్ధయోగమునన్ = పెద్దలసాంగత్యం చేతనూ; ధృతికల్మిన్ = ధైర్యం కలిగి ఉండటం వలననూ; ఇంద్రియవినియమమునన్ = ఇంద్రియాలను నిగ్రహించటం చేతనూ, అది = ఆ పరలోకసుఖం, తమకున్ = తమకు; కలిగింతురు = లభించేటట్లు చేస్తారు, చేకూరుస్తారు; అది యమము+అనంగన్+పరఁగున్ = అది యమమనే పేరుతో విలసిల్లుతుంది; దానన్ = ఆ యమముచేత; నాకంబున్ = స్వర్గాన్ని; పడయన్+వచ్చున్ = పొందవచ్చును. అనినన్ = అని చెప్పునపుడు; ధర్మ+అభియుక్తిన్ = పుణ్యార్జనమును గూర్చి; చెప్పంగన్+ఏల? = చెప్పటమెందుకు?

**తాత్పర్యం:** ఔపరమిక మనగా పాపాలను విడిచిపెట్టడం. అయ్యో! ఇంత సులభమైన దానిని మూఢ మానవులు గ్రహించనేరకున్నారు. పాపవర్జనానికి ప్రయత్నం అక్కరలేదు. డబ్బును వెచ్చించ వలసిన అవసరంలేదు. పరలోకం ఉన్నది గదా అనే భయంతో పాపకృత్యాలు చేయటం మానితే చాలు. సద్గతి వలన కలిగే సౌఖ్యం తనంతట తానే లభిస్తుంది. దుష్కృత్యాలు మానటం అనేది తన చేతిలోని పనేకదా! ఇందువలన కలిగేమేలు గమనించక జనులు చెడుపనులు చేస్తూ నిరయం పాలవుతున్నారు. ఉపాయశాలురగు బుద్ధిమంతులు వేదశాస్త్ర పురాణాదులను వింటూ, పెద్దలను సేవిస్తూ, ధైర్య మవలంబించి, ఇంద్రియాలను నిగ్రహించి సద్గతుల వలన కలిగే సౌఖ్యమును పొందుతారు. యమం వల్లనే స్వర్గసుఖం లభిస్తుంది అని చెప్పేటప్పుడు మానవుడు కేవలపుణ్యాకర్మలే ఆచరి స్తున్నప్పుడు లభించే భాగ్యం ఇట్టిదని వర్ణించడానికి శక్యం కాదు.

**విశేషం:** యమము: ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకోవటం. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లనేవి యోగాంగాలు. ఇవి ఎనిమిది. వీటిలో మొదటిది యమము -- (ఇంద్రియ నిగ్రహం).

**ఆ. నిరుపకరణ మనఁగఁ బరఁగు శౌచంబు స । త్యంబు శాంతి దాంతి యార్జవంబు**
**వ్రతనిరూఢి సముపవాసంబు బ్రహ్మ చ । ర్యంబు కల్మి నియమ మండ్రు దాని. 180**

**ప్రతిపదార్థం:** శౌచంబు = శుచిత్వం, పరిశుద్ధత; సత్యంబున్ = నిజము; శాంతి = త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనే జ్ఞానేంద్రియాల నిగ్రహం, అంతరింద్రియాల నణచటం; దాంతి = వాక్, పాణి, పాద, పాయూ పస్థలనే కర్మేంద్రియాల యొక్క నిగ్రహం; అనగా బహిరింద్రియాల గెలుపు; ఆర్జవము = నిష్కాపట్యం, స్వచ్ఛమైన నడవడిక; వ్రతనిరూఢి = వ్రతాలయందు ప్రీతి; సముపవాసంబు = ఒక్కప్రొద్దు లుండటం; బ్రహ్మచర్యంబు కల్మి = బ్రహ్మచర్యం అవలంబించటం; నిరుపకరణము+ అనఁగన్ = నిరుపకరణం అనే పేరుతో; పరఁగున్ = ఒప్పుతుంది; దానిన్ = ఆ నిరుపకరణాన్నే; నియమము+అండ్రు = నియమ మని అంటారు.

**తాత్పర్యం:** పరిశుద్ధత, సత్యం, అంతరింద్రియ నిగ్రహం (శాంతి), బహిరింద్రియనిగ్రహం (దాంతి), ఋజుప్రవర్తన, వ్రతాలను ప్రీతితో అనుష్ఠించటం, ఒక్కప్రొద్దు లుండటం, బ్రహ్మచర్యవ్రతపాలన అనేవి నిరుపకరణం అనే పేరుతో చెలువొందుతున్నాయి. ఈ నిరుపకరణమునే నియమ మంటారు.

**సీ. ఆభ్యంతరంబు బాహ్యము ననఁగా శౌచ । మిరు దెఱఁగై యుండు హృదయసుకృత**
**మాభ్యంతరము విను మాహారశుద్ధియు । నంగశోధనము బాహ్యంబు సత్య**
**మన్నది గన్నది విన్నది యున్న రూ । పున నుక్త మగుట యంభోజవదన!**
**శాంతి బుద్ధీంద్రియ సన్నివారణ దాంతి । కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి;**

**తే. యార్జవము గుటిలుఁడు గామి యగు వ్రతంబు । మంచిపని పూని నడపుట యంచితోప**
**వాస మశననిగ్రహ మనవద్యమైన । బ్రహ్మచర్యంబు గామునిబారిఁ బడమి. 181**

**ప్రతిపదార్థం:** శౌచము = పరిశుద్ధత; ఆభ్యంతరంబున్ = లోపలిదీ; బాహ్యమున్ = వెలుపలిదీ; అనఁగాన్ = అనునట్లు; ఇరు+తెఱఁగు+ఐ = రెండు విధాలై; ఉండున్ = ఉంటుంది; హృదయసుకృతము = మనసు చేసిన పుణ్యం; ఆభ్యంతరము = లోపలిది; వినుము = గౌరీ! ఆలకించుము; ఆహారశుద్ధియున్ = భోజనం యొక్క పరిశుద్ధి; అంగశోధనమున్ = దేహమును శుద్ధపరచుట, (ఒడలు తోముకొనుట); బాహ్యంబు = వెలుపలిది; అంభోజవదన! = పద్మమువంటి ముఖముగలదానా!; అన్నది = నోటితో చెప్పినది; కన్నది = కంటితో చూచినదీ; విన్నది = చెవులతో ఆలకించినదీ; ఉన్నరూపునన్ = యథాతథంగా; ఉన్నది ఉన్నట్లుగా; ఉక్తము+అగుట = చెప్పబడుట; సత్యము = నిజం; బుద్ధి+ఇంద్రియ+సత్+నివారణ = మనస్సు మున్నగు ఇంద్రియాలను బాగా నిగ్రహించటం; శాంతి = శాంతి అనబడుతుంది; కర్మ+ఇంద్రియముల = వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియాల యొక్క; యోగ్యప్రవృత్తి = సక్రమమైన ప్రవర్తన; దాంతి = దాంతి అనబడుతుంది. కుటిలుఁడు+కామి = మోసగాడు కాకుండటం, కాపట్యం లేకుండటం; ఆర్జవము = ఆర్జవ మనబడుతుంది; మంచిపని = సత్కార్యం; పూని = యత్నించి; నడపుట = సాగించటం; వ్రతము+అగున్ = వ్రతమనిపించుకొంటుంది; అశన నిగ్రహము = ఆహారం మానివేయటం; అంచిత+ఉపవాసము = ఒప్పిదమైన ఉపవాస మవుతుంది; కామునిబారిన్+పడమి = మన్మథుడికి వశుడు కాకుండటం; బ్రహ్మచర్యము = బ్రహ్మచర్యమని చెప్పబడుతుంది.

**తాత్పర్యం:** శౌచమనేది ఆభ్యంతరమనీ, బాహ్యమనీ రెండురకాలు. అందు మనస్సు యొక్క పారిశుద్ధ్యం ఆభ్యంతర మవుతుంది. ఆహార శుద్ధి, దేహశుద్ధి బాహ్యమని చెప్పబడుతుంది. నోటితో చెప్పినదీ, కంటితో చూచినదీ, చెవులతో విన్నదీ ఉన్నదున్నట్లు చెప్పడమే నిజం. దేవీ! జ్ఞానేంద్రియపంచకాన్ని జయించటమే శాంతి. కర్మేంద్రియాలను సద్విషయాలలో ప్రవర్తింపజేయటమే దాంతి. నిష్కపటవర్తనమే ఆర్జవం. మంచిపనులు పూనికతో చేయటమే వ్రతం. భోజనం మానటమే ఉపవాసం. కామోద్రేకానికి గురికాకుండా ఉండటమే బ్రహ్మచర్యం.

**విశేషం:** 'నిరుపకరణ మనఁగ' అనే 180వ పద్యానికి ఈ పద్యం వివరణప్రాయం.

**ఆ. నాతి! తీర్థసేవనంబును నియమ వి । శేష మగుట దానిఁ జెప్పవలయు**
**సకలనదులఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి । కరుగునట్టి విచ్చు నధికఫలము. 182**

**ప్రతిపదార్థం:** నాతి! = ఓ మగువా!; తీర్థసేవనంబును = పుణ్యతీర్థాలను సేవించటం; నియమ విశేషము+అగుటన్ = నియమాలలో ఒకటికావటం వలన; దానిన్ = దానిని గూర్చి; చెప్పన్ వలయున్ = తప్పక చెప్పాలి; సకలనదులన్ = అన్ని నదుల విషయంలో; తీర్థసంజ్ఞలు= తీర్థాలనే పేర్లు కలవు; అబ్ధికిన్+అరుగు+అట్టివి = సముద్రమునకు పోయే నదులు; అధిక ఫలమున్+ఇచ్చున్ = మిక్కుటమైన పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాయి.

**తాత్పర్యం:** చెలీ! పుణ్యతీర్థాలలో మునగడం కూడ నియమ విశేషం గనుక తీర్థాలను గురించి చెప్పవలసి ఉన్నది. అన్ని నదులూ పుణ్యతీర్థాలే. వాటిలో సాగరానికి పోయేనదులు అధిక ఫలాన్ని ఇస్తాయి.

**తే. వానియందును మునిపద మాననీయ । దేశములు నబ్ధిసంయోగ దేశములును**
**దెలియు మన్యోన్యసంగమ దేశములును । బరమతీర్థంబు లగుఁ బద్మపత్రనయన! 183**

**ప్రతిపదార్థం:** పద్మపత్రనయన! = తామర రేకుల వంటి కన్నులు కలదానా! గౌరీ!; వానియందును = ఆ పుణ్య తీర్థాలలోనూ; మునిపదమాననీయ = మునీంద్రులు అడుగులు మోపటం చేత ఆదరించదగిన; దేశములున్ = చోటులూ; అబ్ధి సంయోగదేశములును = సముద్రంలో కలిసే చోట్లున్నూ; అన్యోన్య(అన్యః+అన్య) సంగమ దేశములును = ఒకదానితో ఒకటి చేరేచోట్లున్నూ; పరమ తీర్థంబులు+అగున్ = శ్రేష్ఠమైన తీర్థా లవుతాయి; తెలియుము = దేవీ! గ్రహించుము.

**తాత్పర్యం:** ఆ విధంగా సముద్రంలో కలియుటకు అరిగే నదులలో మునీశ్వరులు తమ పాదాలు మోపి పవిత్రీ కరించిన చోట్లూ, ఈ స్రవంతులు సాగరంలో కలిసే చోట్లూ, నదీనదాలు పరస్పరం కూడే చోట్లూ అనగా సంగమస్థానాలూ ఉత్తమతీర్థాలని దేవీ! గ్రహించుము.

**క. వనధి మహాతీర్థం బం । దును సంయమివరులచేతఁ దొల్లి ప్రియమునం**
**గొనియాడఁ బడిన చోటులు । విను ముత్తమ తీర్థములు వివేకాభరణా! 184**

**ప్రతిపదార్థం:** వివేక+ఆభరణా! = విజ్ఞానమే అలంకారంగా గల గౌరీ!; వినుము = ఆలకించుము; వనధి = సముద్రం; మహాతీర్థంబు = గొప్ప పుణ్యతీర్థం; అందును = మీదుమిక్కిలి; సంయమివరులచేతన్ = మునీంద్రుల చేత; తొల్లి =

పూర్వం; ప్రియమునన్ = ఇష్టంతో, ఆదరంతో; కొనియాడన్+పడిన = పొగడబడినట్టి; చోటులు = ప్రదేశాలు, తావులు; ఉత్తమతీర్థములు = శ్రేష్ఠములైన తీర్థాలు, పవిత్ర తీర్థాలు.

**తాత్పర్యం:** విజ్ఞానమే విభూషణంగా గల పార్వతీ! వినుము. సాగరం ఒక గొప్ప పుణ్యతీర్థం. మునుపు మునిశ్రేష్ఠులు ప్రియపడి శ్లాఘించిన సాగరసంగమ ప్రదేశాలన్నీ పరమ పవిత్రాలైన తీర్థాలు.

**క. వెలి శుచియై మఱి తీర్థం । బులు సొచ్చుట మేలు నియమములు దీర్చి తగన్**
**వెలలిన యెడ దేవార్చన । ములు విప్రార్చన లవశ్యమును గృత్యంబుల్. 185**

**ప్రతిపదార్థం:** వెలిన్ = వెలుపల, నదికి బయట; శుచి+ఐ = పరిశుద్ధుడై; మఱి = ఆవల; తీర్థంబులు+చొచ్చుట = నీళ్ళలో ప్రవేశించటం; మేలు = మంచిది; నియమములు+తీర్చి = స్నానాది విధులెల్ల ఆచరించి; తగన్ = యుక్తంగా; వెలలిన+ఎడన్ = నది నుండి తీరం చేరిన తరువాత; దేవ+అర్చనములు = దేవతాపూజలు; విప్ర+అర్చనలు = బ్రాహ్మణపూజలు; అవశ్యమును = తప్పక; కృత్యంబుల్ = చేయదగినట్టివి.

**తాత్పర్యం:** పుణ్యతీర్థాలలో మునగటానికి ముందు కాలకృత్యాలు తీర్చుకొని, స్నానమాడి పరిశుద్ధుడై ఆవల ఆ పవిత్రతీర్థాలలో ప్రవేశించాలి. ఆ విధంగా తీర్థాలలో ప్రవేశించి స్నానవిధులెల్ల చక్కగా ఆచరించి గట్టెక్కిన తరువాత దేవబ్రాహ్మణ పూజలు తప్పకుండా నిర్వర్తించాలి.

**క. చేరువ తీర్థము కంటెను । దూరపుఁదీర్థంబు మేలు తోయజవదనా!**
**శారీరాయాసము ద । త్కారణమై వేదవాక్యగతి యిట్లుండున్. 186**

**ప్రతిపదార్థం:** తోయజవదనా! = పద్మంవంటి మోము కలదానా!; చేరువ తీర్థము కంటెను = సమీపంలోని తీర్థం కన్నా; దూరము+ తీర్థంబు (దూరపు తీర్థంబు) దూరప్రదేశంలో ఉండే తీర్థం; మేలు = శ్రేష్ఠమైనది; (ఎందుకంటే) శారీర+ఆయాసము = దేహము యొక్క బడలికయే, శ్రమయే; తత్+కారణము+ఐ = అందుకు హేతువై; వేదవాక్యగతి = వేద వచనాల యొక్క పోకడ; ఇట్లు+ఉండున్ = ఈ రీతిగా ఉంటుంది.

**తాత్పర్యం:** ఓ పద్మముఖీ! దగ్గరలో ఉండే తీర్థాన్ని సేవించడం కంటె, దూరంలో ఉండే తీర్థాన్ని సేవించడమే మంచిది. ఎందుకంటే వేదవాక్యాల పోకడ ననుసరించి తీర్థయాత్రలో దేహం బడలిక చెందడం, శ్రమపొందడం మంచిది.

**క. విను సోపకరణ మనునది । ధనధాన్యాదిక సమగ్రతను గృహమేధుల్**
**గొనియాడుతెఱఁగు దానం । బున వైదిక పైతృకాది పుణ్యక్రియలన్. 187**

**ప్రతిపదార్థం:** విను = అపర్ణా! ఆలకించుము; సోపకరణము+అనునది = సోపకరణం అని చెప్పబడేది; ధన ధాన్య+ఆదిక = ధనం, ధాన్యం మొదలైనవాటి యొక్క; సమగ్రతను = పూర్ణత్వం చేత, మెండుగా కలిగి ఉండటం చేత; గృహమేధుల్ = గృహస్థులు, గేస్తులు, ఇంటి యజమానులు; దానంబునన్ = దానాల చేతను; వైదిక = వేదోక్తములైన, వేదవిహితాలైన; పైతృక+ఆది = పితృశ్రాద్ధం, తర్పణం మొదలైన; పుణ్యక్రియలన్ = పవిత్రకార్యాలను; కొనియాడు తెఱఁగు = ఆదరించే విధానమై ఉన్నది.

**తాత్పర్యం:** అపర్ణా! ఆలకించుము. సోపకరణ మనేది మెండుగా ధనధాన్యాలు గల గృహస్థులు దానము చేతను, పితృశ్రాద్ధాదులైన వైదిక కార్యాలచేతను ఆదరించే విధానమై ఒప్పుతున్నది.

**సీ. న్యాయార్జితంబైన యర్థంబు వేదవి । త్త్వము శాంతి మొదలగు వరగుణములు**
**గల విప్రునకుఁ బుణ్య కాలపావన దేశ । కలితంబుగా భక్తి గలిగి యీగి**
**మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ । దగుట దానికిఁ గడుఁ దగమి యుత్త**
**మము మధ్యమము నధమము నగు దాన వి । ధానంబు వినుమి ట్లు దైవికంబుఁ**

**తే. బైతృకంబును లోనైన పనులఁ దాను । వేడ్కసేయు వస్తువుఁ గొను విప్రకోర్కి**
**కనుగుణంబగు నదియును నర్థి నిచ్చు । టధికతరమైన ఫల మిచ్చు నంబుజాక్షి! 188**

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్షి! = నీరజములవంటి నేత్రాలు కలదానా!; న్యాయ+ఆర్జితంబు+ఐన = న్యాయం తప్పక సంపాదించినట్టి; అర్థంబున్ = విత్తాన్ని; వేదవిత్త్వమున్ = వేదమునెరుంగుట; శాంతి = ఇంద్రియనిగ్రహం; మొదలు+అగు = మున్నుగా కలిగిన; వరగుణములు = శ్రేష్ఠములైన గుణాలు; కల = కలిగిన; విప్రునకున్ = బ్రాహ్మణుడికి; పుణ్యకాల = పవిత్రమైన కాలంతో; పావనదేశ = పవిత్రమైన ప్రదేశంతో; కలితంబుగాన్ = కూడి ఉండేటట్లుగా; భక్తి+కలిగి = భక్తి భావం కలిగి; ఈగి = ఇచ్చుట; మేలిదానము = ఉత్తమ దానం; శక్తిన్ మిగులుట = తన శక్తికి మించటం; శక్తికిన్+ తగుట = తన శక్తికి తగినట్లుండటం; దానికిన్ = తనశక్తికి; కడున్ = మిక్కిలి; తగమి = తగినట్లు ఉండకుండటం అనేవి వరుసగా; ఉత్తమమున్ = శ్రేష్ఠమూ; మధ్యమమున్ = రెండవ రకం; అధమమున్ = హీనమూ; అగు = అయినట్టి; దానవిధానము = దానపద్ధతి అవుతుంది; వినుము = అంబికా! ఆలకించుము; ఇట్లు = ఈ రీతిగా; దైవికంబు = దైవసంబంధం; పైతృకంబు = పితృసంబంధమును; లోను+ఐన పనులన్ = మొదలగు కార్యములందు; కొను = స్వీకరించే; విప్రుకోర్కికిన్ = బ్రాహ్మడికాంక్షకు; అనుగుణంబు+అగు+అదియునున్ = తగినట్టి దానిని; అర్థిన్ = ప్రీతితో, భక్తితో; ఇచ్చుట = దానమివ్వటం; అధికతరము+ ఐన = ఎంతో ఎక్కువైన; ఫలము+ఇచ్చున్ = ఫలాన్నిస్తుంది;

**తాత్పర్యం:** న్యాయంగా సంపాదించిన సొమ్మును వేదం చదివిన, శాంతి మొదలైన సద్గుణాలు కలిగిన బ్రాహ్మణుడికి పుణ్యకాలమందు, పుణ్యక్షేత్రమందు భక్తితో దానం చేయటం ఎంతో ఉత్తమం. తన శక్తికి మించిన దానం పరమోత్తమం. తన శక్తికి తగినట్లివ్వడం మధ్యమం. తన శక్తికి ఏ మాత్రం తగనట్లు ఇవ్వడం అధమం. దేవీ! దానవిధాన మంటే ఇది. ఈ విధంగానే దేవ సంబంధమైన యజ్ఞయాగాదులలోనూ, పితృకార్యములైన శ్రాద్ధాదులలోనూ తన కిష్టమైన వస్తువునూ, దానగ్రహీత అయిన బ్రాహ్మణుడి కోరికకు తగిన వస్తువునూ శ్రద్ధా భక్తులతో సమర్పిస్తే ఆ దానం మిక్కుటమైన ఫలాన్ని ఇస్తుంది.

**తే. చేయు టెంతయు మేలైనఁ జేసి పిదప । వగచినట్టి దానము దనుఁ బొగడికొన్న**
**దానవిధి నిష్ఫలంబులు గాన రెండు । నుడుగుదాత మహాఫల మొందఁ గాంచు.' 189**

**ప్రతిపదార్థం:** చేయుట = దానం సల్పటం; ఎంతయున్ = మిక్కిలి; మేలు+ఐనన్ = శ్రేయస్కరమైనదైనను; చేసి = సలిపి; పిదపన్ = దానానంతరం; వగచినట్టి దానము = చింతించునట్టి దానమూ; తనున్ = తనను; పొగడికొన్నదానవిధి = మెచ్చుకొనే దాన పద్ధతి; నిస్+ఫలంబులు+కానన్ = ఫలరహితములు కాబట్టి, ప్రయోజన శూన్యాలు కనుక; రెండున్ = ఆ రెండు విధాలైన దానాలను; ఉడుగుదాత = వదలునట్టి ఈవికాడు; మహాఫలమున్ = గొప్ప ప్రయోజనాన్ని; ఒందన్+కాంచున్ = పొందగలడు.

**తాత్పర్యం:** "దానం చేయడం ఎంతోమేలే అయినప్పటికీ చేసిన తర్వాత దుఃఖపడినదానమూ, తానిచ్చినదాన్ని తానే పొగడుకొనే దానమూ నిష్ఫలాలు. కాబట్టి ఈ రెండూ మానుకొన్న దాత మహాఫలాన్ని పొందగలడు''.

**వ. అనుటయు దాక్షాయణి 'దాతవ్యంబు లెయ్యవి చెప్పు' మనిన భవుం డిట్లనియె. 190**

**ప్రతిపదార్థం:** అనుటయున్ = అని శివుడు చెప్పగా; దాక్షాయణి = దక్షప్రజాపతి కూతురైన సతీదేవి; దాతవ్యంబులు = దానం చెయ్యదగిన వస్తువులు; ఏ+అవి (ఎయ్యవి) = ఏవి; చెప్పుము; అనినన్ = అని అడుగగా; భవుండు = శంకరుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని శంభుడు తెలుపగా పార్వతీదేవి 'దానమీయ తగిన వస్తువు లేవో చెప్పు' మని అడుగగా ఈశ్వరు డిట్లా అన్నాడు.

### శివుఁడు పార్వతికి దాన ఫల విశేషంబుల నెఱింగించుట. (సం.13 అను 1.15-3205)

**సీ. 'అన్నంబుఁ దోయంబు నఖిలజంతువులకుఁ । బ్రాణముల్ గాన య ప్పరమవస్తు**
**వులు మేలు దాతవ్యములలోన నెల్లను; । నతిథుల కవి యిచ్చు టమరలోక**
**చిరమహాసౌఖ్యంబుఁ జేయుఁ; గాంచన మగ్ని । యగుటఁ దద్దాన మత్యంతపావ**
**నము సర్వకామప్రదము; గోవు సద్విప్రు । నకు నీగి తద్రోమ నికరసంఖ్య**

**ఆ. వరుస నాకలోక వాసంబు గావించు; । నందుఁ గపిల నిచ్చునాతఁ డిరువ**
**దొక్క తరము వారి నూర్ధ్వలోకమునకు । ననుపఁ జాలు వికచవనజవదన! 191**

**ప్రతిపదార్థం:** వికచవనజవదన! = వికసించిన పద్మంవంటి ముఖం కలదానా!; అన్నంబున్ = ఓగిరం, కూడు, ఆహారం; తోయంబున్ = నీళ్ళూ, జలమూ, ఉదకమూ; అఖిలజంతువులకున్ = సమస్త జీవులకూ, ప్రాణముల్+కానన్ = ప్రాణాధారాలు గనుక; ఆ+పరమ వస్తువులు = ఆ శ్రేష్ఠములైన పదార్థాలు, అన్నోదకాలు; దాతవ్యములలోనన్+ఎల్లన్ = దానమివ్వదగిన వస్తువులన్నింటిలోనూ; మేలు = ఉత్తమమైనవి, మంచివి; అతిథులకున్ = భోజనవేళకు వచ్చినవారికి; అవి = ఆహారపానీయాలు; ఇచ్చుట = ఇవ్వటం; అమరలోక = దేవలోకంలో; చిరమహాసౌఖ్యంబున్+చేయున్ = బహుకాలం గొప్ప సుఖాలను కలిగిస్తుంది; కాంచనము = బంగారం; అగ్ని+అగుటన్ = నిప్పుకావటం వలన; తత్+దానము = సువర్ణదానం; అత్యంత పావనము = మిక్కిలి పవిత్రమైనది, కల్మషహరం; సర్వకామప్రదము = అన్ని కోరికలను ఈడేరుస్తుంది; గోవున్ = ధేనువును; సత్+విప్రునకున్ = మంచి బ్రాహ్మణుడికి; ఈగి = దానమివ్వటం; తత్+రోమనికరసంఖ్య = ఆ ఆవు యొక్క శరీరమందలి వెంట్రుకల యొక్క లెక్క; వరుసన్ = క్రమంగా; నాకలోకవాసంబున్ = స్వర్గలోకనివాసాన్ని; కావించున్ = కలుగజేస్తుంది; అందున్ = ఆ ధేనువులలో

కూడ; కపిలన్ = గోరోచనా వర్ణం కల గోవును, పుల్లావును; ఇచ్చు+అతఁడు = దానం చేసేవాడు; ఇరువది+ఒక్కతరము వారిన్ = తన పూర్వులలో ఇరవై ఒక్కతరాల వాళ్ళను; ఊర్ధ్వలోకమునకున్ = పుణ్యలోకానికి, స్వర్గానికి; అనుపన్+చాలున్ = పంపగలడు.

**తాత్పర్యం:** ఓ పద్మముఖీ! గౌరీ! అన్నం, నీళ్ళూ సకల ప్రాణులకూ ప్రాణాధారాలు కనుక ఆ శ్రేష్ఠములైన పదార్థాలు దాన మివ్వదగిన వస్తువు లన్నింటిలో మిక్కిలి ఉత్తమపదార్థాలు. అతిథులకు చేసే అన్నదానం, జలదానం దాతకు స్వర్గలోకంలో బహుకాలం మహాభోగానుభవం సమకూరుస్తాయి. బంగారం నిప్పు. దానిని దానం చెయ్యడం పరమపవిత్రం. అది అన్ని కోరికలను ఈడేరుస్తుంది. గోవును సద్బ్రాహ్మణుడికి దానమిస్తే దాని శరీరంలో ఎన్ని వెంట్రుక లున్నవో అన్నియేండ్లు స్వర్గలోకనివాస సౌఖ్యం పొందవచ్చును. ఆ గోవులలోనూ కపిల గోవును దానమిచ్చేదాత తన పూర్వులు ఇరవై యొక్క తరాల వారిని స్వర్గానికి పంపగలడు.

**క. విను భూమిదాన కర్తకు । ననిమిషలోకమున నిలువనగు సౌఖ్యంబుల్**
**దనరుచు నుండఁగ నెఱ పెం । పున భూమి గలంత కాలమును గిరితనయా! 192**

**ప్రతిపదార్థం:** గిరితనయా! = ఓ శైలపుత్రీ!; విను = ఆలకించుము; భూమిదాన కర్తకున్ = భూదానం చేసిన వాడికి; భూమి+కల+అంత+కాలమున్ = భూమి ఉండేవరకూ; సౌఖ్యంబుల్ = సుఖాలు; తనరుచున్+ఉండన్+కన్ = వర్ధిల్లుతుండగా, శోభిల్లుతుండగా; నెఱపెంపునన్ = పూర్ణగౌరవంతో, నిండు గౌరవంతో; అనిమిషలోకమునన్ = దేవలోకంలో; నిలువన్+ అగున్ = ఉండవచ్చును.

**తాత్పర్యం:** పార్వతీ! వినుము. భూదానం చేసిన పుణ్యపురుషుడు ఆ భూమి ఉండేంత వరకూ పరిపూర్ణ సుఖాలు అనుభవిస్తూ, మిక్కిలి గౌరవంతో దేవలోకంలో నివసిస్తాడు.

**ఆ. భూమి నఖిల మగు విభూతి విశేషజా । తంబు గలుగుఁ గానఁ దత్ప్రదాన**
**మెల్ల వస్తువులును నిచ్చిన యట్లగు । దానఁ బోని పాపతమము లేదు. 193**

**ప్రతిపదార్థం:** భూమిన్ = నేలయందు; అఖిలము+అగు = సమస్తమైన; విభూతి విశేషజాతంబు = సంపద్విశేషముల యొక్క సమూహం అనగా మణులు, మాణిక్యాలు, వెండి, బంగారం మొదలైన అనర్ఘవస్తువులు; కలుగున్ = లభిస్తుంది; కానన్ = కాబట్టి; తత్+ప్రదానము = ఆ ధరణీదానం అనేది; ఎల్ల వస్తువులునున్+ఇచ్చిన+అట్లు+అగున్ = అన్ని వస్తువులనూ ఇచ్చినట్లే అవుతుంది; దానన్ = ఆ భూదానం వలన; పోని = నశించని; పాపతమము లేదు = పాతక మనే చీకటి లేదు.

**తాత్పర్యం:** భూమిలో సర్వవిధాలైన సంపద్విశేషాలు నెలకొని ఉంటాయి. కనుక భూదానం చేసినట్లయితే సకల వస్తు దానం చేసినట్లే అవుతుంది. ధరణిదానం వలన నశించని దురితమనే చీకటి ఉండనే ఉండదు.

**విశేషం:** అలం: పాపతమము అనే చోట రూపకం.

**క. అతివా! కన్నియ నిచ్చినఁ । బితృపతి ముదమందు, సురలుఁ బ్రీతు లగుదు; రం**
**చితగతి కర్తకు దొరకొను । నతి తేజశ్శ్రీయశస్కమగు నభ్యుదయమున్. 194**

**ప్రతిపదార్థం:** అతివా! = ఓ సఖీ!; కన్నియన్+ఇచ్చినన్ = పిల్లనిచ్చి పెళ్ళి చేస్తే, కన్యాదానం చేస్తే; పితృపతి = యమధర్మరాజు;

ముదము+అందున్ = సంతోషం పొందుతాడు; సురలు = దేవతలు; ప్రీతులు+అగుదురు = హర్షం చెందుతారు; కర్తకున్ = కన్యాదాన మొనర్చిన వాడికి; అంచిత గతి = పూజించదగిన, ఒప్పిదమైన సద్గతి; దొరకొనున్ = సమకూడుతుంది, లభిస్తుంది; ఆ భవమున్ = ఆతడి జన్మం కూడ; అతితేజస్ = మిక్కుటమైన కాంతి; శ్రీ = సంపద; యశస్కము+అగున్ = కీర్తిగలది అవుతుంది.

**తాత్పర్యం:** గిరిజా! కన్యాదానం చేసిన యెడల యముడు సంతోషిస్తాడు. వేల్పులు హర్షిస్తారు. కన్యాదాతకు సద్గతులు కలుగుతాయి. ఆతని జన్మం కాంతియుతమై, సంపద్యుక్తమై, కీర్తిమంతమై విరాజిల్లుతుంది.

**తే.** **విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన । నవ్యయానందపదముఁ జేయంగఁ జాలుఁ;**
**దగఁగ దక్షిణయిచ్చి పేదలకు విద్య । యీ నియోగించుటయుఁ దత్సమాన కృతియ.** **195**

**ప్రతిపదార్థం:** విద్య+ఇచ్చుట = విద్యాదానం చెయ్యటం, చదువు చెప్పటం; సత్పాత్ర విషయము+ఐనన్ = యోగ్యులకే చెందినది అయితే; అవ్యయ+ఆనందపదమున్ = శాశ్వతసుఖస్థానమును; చేయంగన్+చాలున్ = లభింపజేయగలదు; తగన్+కన్ = (తగఁగన్) తగినట్లుగా; దక్షిణ+ఇచ్చి = గురువులకు ధనమిచ్చి; పేదలకున్ = దరిద్రులకు; విద్య+ఈన్ = విద్యనిచ్చుటకు; నియోగించుటయున్ = నియమించటం కూడ; తత్+సమానకృతి+అ = తాను విద్య చెప్పటంతో సమానమైన కార్యమేఅవుతుంది.

**తాత్పర్యం:** యోగ్యులైన వారికి విద్యాదానం చేస్తే విద్యాదాతకు శాశ్వతమైన పరలోక సౌఖ్యం లభిస్తుంది. అట్లా తాను చదువు చెప్పేశక్తిలేని వాడైతే గురువులకు దక్షిణ లిచ్చి పేదలకు విద్య చెప్పిస్తే స్వయంగా విద్యచెప్పిన వాడికి లభించే శాశ్వతానంద పదవి ఇతనికి గూడ లభిస్తుంది.

**సీ.** **తిలరాశి యిచ్చినఁ గలుగు నగ్నిష్టోమ । ఫలము; వాసోదాన ఫలము చిరత**
**రాయువు; గొడు గీగి యఖిలపీడలఁ బాపు; । దాసదాసీజనదాన మహిమ**
**కర్మ విమోక్షంబు గలిగించు; దీపదా । నము ఫల మాత్మాతివిమలభావ;**
**మంబు ప్రవాహంబు నధిగమింపఁగఁ జేఁత । నిఖిల వ్యసనముల నిస్తరింపఁ**

**ఆ.** **జేయుఁ; దెరువు లెస్ససేయుట సంతాన । మిచ్చు; నౌషధంబు నిచ్చు టెల్ల**
**తెవులుఁ బాపు; సాదు దెరువరి కునికి ప । ట్టొసఁగు టొసఁగు దనుసుఖోదయములు.'** **196**

**ప్రతిపదార్థం:** తిలరాశి = నువ్వుల ప్రోగు; ఇచ్చినన్ = దానం చేస్తే; అగ్నిష్టోమ ఫలము = అగ్నిష్టోమమనే యజ్ఞం చేయటం వలన లభించే ప్రయోజనం; కలుగున్ = చేకూరుతుంది; వాసస్+దానఫలము = వస్త్రదానం చేస్తే లభించే మేలు; చిరతర+ఆయువు = దీర్ఘాయుష్యం; గొడుగు+ఈగి = ఛత్రదానం; అఖిలపీడలన్ = సమస్త బాధలనూ; పాపున్ = తొలగిస్తుంది; దాసదాసీజన దానమహిమ = సేవకులనూ, సేవికలనూ దానం చెయ్యటం వలన కలిగే ప్రభావం; కర్మ విమోక్షంబు+కలిగించున్ = కర్మ బంధం నుండి విముక్తి కలిగిస్తుంది; దీపదానము ఫలము = దీపదానం వలన లభించే ఫలం; ఆత్మ+అతి విమల భావము = ఆత్మకు మిక్కిలి నైర్మల్యం కలగటం; అంబు ప్రవాహంబున్ = నీటి వెల్లువను, జలప్రవాహాన్ని; అధిగమింపన్+ కన్+ చేఁత = పొందేటట్లు చేయడం; నిఖిల వ్యసనములన్ = ఎల్లదుఃఖాలనూ; నిస్తరింపన్+చేయున్ = దాటేటట్లు చేస్తుంది, తరింపజేస్తుంది; తెరువున్ = బాటను; లెస్స+చేయుట = బాగుపరచటం; సంతానము+ఇచ్చున్ = బిడ్డలను ప్రసాదిస్తుంది; ఔషధంబున్+ఇచ్చుట = మందునొసగటం; ఎల్ల+తెవులున్+పాపున్ = అన్ని రోగాలను మాన్పుతుంది; సాదు తెరువరికిన్ = సాధువైన బాటసారికి; ఉనికి పట్టు+ఒసఁగుట = నివాసస్థానమివ్వటం;

ఆశ్రయం కల్పించటం; తనుసుఖ+ ఉదయములు= దేహానికి సౌఖ్యవృద్ధి; ఒసఁగున్ = కలుగ జేస్తుంది, సమకూరుస్తుంది.

**తాత్పర్యం:** నువ్వులను దానమిస్తే అగ్నిష్టోమ యాగఫలం కర్తకు లభిస్తుంది. వస్త్రదానం వలన దీర్ఘాయుర్దాయం చేకూరుతుంది. ఛత్రదానం సర్వబాధానివారకం. దాసదాసీజన దాన ప్రభావం వలన కర్మబంధం నుండి విముక్తి సమకూడుతుంది. దీపాన్ని దానమిస్తే ఆత్మకు నైర్మల్యం సిద్ధిస్తుంది. జలప్రవాహాన్ని అందుబాటులోకి తెస్తే సకల దుఃఖనివృత్తి కలుగుతుంది. దారి డొంకలను బాగు పరిస్తే బిడ్డలు పుడతారు. మందులివ్వటం వలన రోగబాధలు తొలగిపోతాయి. సాధువైన బాటసారికి ఆశ్రయ మొసగితే తన శరీరానికి సౌఖ్యాభివృద్ధి సమకూడుతుంది.'

**వ. అనిన విని 'యజ్ఞంబు తెఱం గెఱింగింపవే' యని పార్వతి ప్రార్థించినం బరమేశ్వరుం డిట్లనియె. 197**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని శంకరుడు చెప్పగా ఆలించి; యజ్ఞంబు తెఱంగు = యాగము యొక్క స్వరూపం; ఎఱింగింపవు+ఏ = తెలుపవా; అని; పార్వతి; ప్రార్థించినన్ = వేడగా; పరమేశ్వరుండు; ఇట్లు+అనియెన్ = ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని శంకరుడు చెప్పగా ఆలకించి అంబిక 'యజ్ఞము యొక్క స్వరూప మెట్టిదో సెలవిం' డని వేడగా ఆయన ఇట్లా అన్నాడు.

**సీ. 'విను మింతి! వైదికంబును లౌకికంబును । నన రెండు దెఱఁగులు యజ్ఞవిధులు;**
**వర్ణయోగ్యార్జన వర్ధనాంచిత ధన । ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి**
**యగునట్లుగా ఋత్వి గర్చన మొప్పఁగాఁ । గావించునది వైదికంబు; దేవ**
**తలకు మహోత్సవంబులు సేయుటయు గీత । వాద్యనృత్యము లనవద్యములుగ**

**ఆ. సంఘటించుటయును సద్గంధమాల్య ధూ । ప ప్రదీప భోజ్యభక్ష్యములు స**
**మాదరంబుతో నివేదించుటయు లౌకి । కంబు; రెండు నమరగణహితములు. 198**

**ప్రతిపదార్థం:** ఇంతి! = కాంతా!; విను = వినుము; యజ్ఞ విధులు = యాగాచరణాలు, యజ్ఞవిధానాలు, యజ్ఞ ప్రకారాలు; వైదికంబును = వేదసంబంధమైనది; లౌకికంబును = లోకసంబంధమైనది; అనన్ = అనగా; రెండు తెఱఁగులు = రెండురీతులు; వర్ణయోగ్య = కులమునకు తగినట్లు; ఆర్జన = సంపాదనముచే; వర్ధన = పెంపుదల చేత; అంచిత = ఒప్పునట్టి; ధనధాన్యముల్ = విత్తం, ధాన్యం; కొని = గ్రహించి; దేవతలకున్ = ఇంద్రాదిదేవతలకు; తృప్తి+అగునట్లుగాన్ = సంతుష్టి కలిగేరీతిలో; ఋత్విక్+అర్చనము = వేదమంత్రాలను చెప్పునట్టి ఋత్విజులను పూజించటం; ఒప్పఁగాన్ = తగి ఉండగా; కావించు+అది = చేయునటువంటిది; వైదికంబు = వేదసంబంధమైన యజ్ఞం; దేవతలకున్ = సురలకు; మహా+ ఉత్సవంబులు = పెద్ద పెద్ద తిరునాళ్ళు; చేయుటయున్ = నిర్వహించటం; గీతవాద్యనృత్యములు = పాటలు, మేళాలు, నాట్యాలు; అనవద్యములుగన్ = అనింద్యములుగా, కొఱతలేకుండా; సంఘటించుటయున్ = సమకూర్చటమున్నూ; సద్+గంధ = మంచిగంధం; మాల్య = పూలదండలు; ధూప = సాంబ్రాణి మున్నగు పొగలు వేయటం; ప్రదీప = దీపాలు వెలిగించటం; భోజ్యములు = భుజింపదగినవి; అన్నం, పప్పు మొదలైనవి; భక్ష్యములు = వడలు, లడ్లు మొదలైన పిండివంటలు, తిను బండాలు; సమాదరంబుతోన్ = గౌరవబుద్ధితో; నివేదించుటయున్ = నైవేద్యమివ్వటం, ఆరగింపు చేయటం; లౌకికంబు = లోకసంబంధమైనది; రెండున్ = వైదికం, లౌకికం అనే ఈ రెండున్నూ; అమరగణహితములు = దేవతాసమూహానికిఇష్టమైనవి.

**తాత్పర్యం:** 'అపర్ణా! ఆలకించుము. యజ్ఞాలు వైదికములనీ, లౌకికములనీ రెండు విధాలు. బ్రాహ్మణాదిజాతుల వారు తమ కులధర్మాలను అనుసరించి సంపాదించి, వృద్ధిపరచిన ధనధాన్యాలను వెచ్చించి దేవతలకు సంతృప్తి కలిగేటట్లు వేదోక్తంగా ఋత్విక్కులకు సంభావన లిచ్చి నిర్వహించే యాగాలు వైదికాలు. వేల్పులకు బ్రహ్మోత్సవాలు అనగా తిరునాళ్ళు వైభవోపేతంగా జరిపించటం, ఆ దేవోత్సవాలలో పాటలు, మేళం వాయించటం, ఆటలు ఏర్పాటుచేయించటం, మంచి గంధం, పూలమాలలు, ధూపం, దీపం, భక్ష్యభోజ్యాలతో నైవేద్యం సమర్పించటం ఈ మొదలైన షోడశోపచారాలతో దేవుళ్ళను అర్చించటం లౌకికమని చెప్పబడుతున్నది. అటు వైదికం, ఇటు లౌకికం ఈ రెండు విధానాలూ దేవతలకు ఇష్టమైన ఆరాధనా పద్ధతులు.

**తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు । సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ**
**యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు । టతనిచేఁ గొను టధిక పుణ్యములు చెలువ! 199**

**ప్రతిపదార్థం:** చెలువ! = ఓ తరుణీ!; వినుము = ఆలకించుము; ధర్మములు = ధర్మాలు, పుణ్యాలు; దానములును = వితరణములు; సద్+వ్రతచయంబు = మంచి వ్రతాలు, నోములు; అరయన్ = పరికించగా, పరిశీలించగా, ఆలోచించగా; యజ్ఞమునకున్ = యాగమునకు, క్రతువునకు, సవనమునకు; సదృశములు+కావు = సమానం కావు; యజ్ఞకర్త = యాగం చేసేవాడు, యజమానుడు; లోక+ఉత్తరుఁడు = జనులలో శ్రేష్ఠుడు; అతనికిన్ = యజ్ఞం చేసేవాడికి; ఇచ్చుట = ఇవ్వటం; అతనిచేన్+కొనుట = అతనివలన స్వీకరించటం; అధికపుణ్యములు = మిక్కిలి పుణ్యాలు.

**తాత్పర్యం:** శ్రుతులకూ, స్మృతులకూ విహితమైన కర్మలు ధర్మాలు. అట్టి ధర్మాలు, దానాలు, మంచి వ్రతాలు ఇవేవీ యజ్ఞానికి సాటి రాలేవు. యజ్ఞం చేసినవాడు నరులలో ఉత్తముడు. అట్టి యాగకర్తకు ఇవ్వటంకాని, అతడి వలన పుచ్చుకొనటం గాని పరమ పుణ్యాలు.

**ఉ. మానస కృత్యముల్ సురసమాజ మెఱుంగఁగఁ జాలుఁ గావునన్**
**మానస మెక్కడేనిఁ జన మంచిగఁ జేసిరయేని యజ్ఞమున్**
**దానము నాదియైన సుకృతంబులు లగ్గ ఫలింప నీదు త**
**ద్ధ్యాన పరత్వ పూత సుకృతంబులకున్ ఫలమిచ్చు మెచ్చుచున్.' 200**

**ప్రతిపదార్థం:** సురసమాజము = దేవతాసంఘం; మానసకృత్యముల్ = మనస్సు చేసే పనులు, మనోవ్యాపారాలు; ఎఱుంగన్‌కన్+చాలున్ = తెలిసికొనగలదు; కావునన్ = కాబట్టి; మానసము = చిత్తం; ఎక్కడన్+ఏనిన్+చనన్ = ఎక్కడికో వెళ్ళిపోతే, ఎక్కడెక్కడనో సంచరిస్తుంటే; మంచిగన్ = ప్రశస్తంగా, ఘనంగా; చేసిర+ఏనిన్ = చేసినప్పటికిన్నీ; యజ్ఞమున్ = యాగమూ; దానమున్ = వితరణమూ; ఆది+ఐన = మొదలైన; సుకృతంబులు = పుణ్యకార్యాలు; లగ్గ ఫలింపన్+ఈదు = సురసమాజం లెస్సగా ఫలించేటట్లు చేయదు; తద్+ధ్యాన+పరత్వ = తదేకధ్యానమందు సక్తమగుటచే; పూత = పవిత్రమైన; సుకృతంబులకున్ = సత్కార్యాలకు, పుణ్యకార్యాలకు; మెచ్చుచున్ = కొనియాడుతూ; ఫలము+ఇచ్చున్ = ఆ దివిజసమూహం ఫలం ప్రసాదిస్తుంది.

**తాత్పర్యం:** దేవతాసమూహం మానవుల యొక్క మనోవృత్తులను తెలిసికొనగలదు. మన సెక్కడో మసలుతుంటే యజ్ఞం, దానం మున్నగు పుణ్యకార్యాలు ఎంతో ఘనంగా నిర్వర్తించినప్పటికిన్నీ దేవ సమాజం వాటికి ఫలాన్ని

ప్రసాదించదు. తదేక ధ్యానంతో పవిత్రమైన మనసును నిల్పి చేసే పుణ్యకార్యాలను మెచ్చుతూ దివిజబృందం ఫలాన్ని అనుగ్రహిస్తుంది.'

**క. అని చెప్పిన హిమవద్గిరి । తనయ త్రిపురవైరితోడ 'దైవికవిధు లే**
**వినఁ గని సంతోషించితి; । వినిపింపుము పైతృకంబు విధము వృషాంకా!' 201**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్ = అని శంకరుడు పలుకగా; హిమవత్ గిరితనయ = మంచు కొండకూతురైన పార్వతీదేవి; త్రిపురవైరితోడన్ = త్రిపురములను దహించిన పరమేశ్వరుడితో; దైవికవిధులు = దేవతలకు సంబంధించిన కర్మలు; ఏన్ = నేను; వినన్+కని = వినుటకు నోచి; సంతోషించితిన్ = ఆనందించాను; వృష+అంకా! = వృషభం ధ్వజంగా కల మహాదేవా!; పైతృకంబు విధము = పితృదేవతలకు చెందిన కర్మ విధానాన్ని; వినిపింపుము = తెలియజెప్పుము.

**తాత్పర్యం:** అని పరమేశ్వరుడు పలుకగా విని హిమాలయ నగాధిరాజు కూతురైన ఉమాదేవి త్రిపురా సురసంహారకుడైన ఈశ్వరుడితో 'నాథా! మీవలన దైవికములైన కార్యములను విననోచి ఆనందమందినాను. ఇక పితృదేవతలకు ప్రీతికరములైన కార్యములను గూర్చి తెలుప వేడుతున్నాను.'

**సీ. అనిన నా సర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను । 'గయ కురుక్షేత్రంబు గంగయాది**
**యగు పుణ్యదేశంబు లతిఫలదంబులు; । మాఘ భాద్రపదాఖ్య మాసములు బ**
**హుళపక్ష మపరాహ్ణ ముగ్మలి! యమవస । ద్వాదశి నవములు పరఁగు దుష్టిఁ**
**బితృ దేవతల కిచ్చుఁ; గుతప దౌహిత్ర తి । లలు నితాంత పవిత్రములు పితృక్రి**

**తే. యలకు; శౌచ మక్రోధ మవ్యగ్రభావ । మర్హములు శుక్లపక్ష పూర్వాహ్ణ యుగ్మ**
**దివస జన్మదినములు నిందితము లాజ్య । ముద్గ పాయసాపూపముల్ ముఖ్యకోటి. 202**

**ప్రతిపదార్థం:** అనినన్ = గౌరి అడుగగా; ఆ సర్వజ్ఞుఁడు = సమస్త మెరింగిన శివుడు; ఆ+దేవికిన్ = ఆ గిరిసుతకు; ఇట్లు+అనున్ = ఇట్లా వచించాడు; ఉగ్మలి = చెలీ!; గయ, కురుక్షేత్రంబున్, గంగ; ఆది+అగు = మొదలైన; పుణ్య దేశంబులు = పవిత్రప్రదేశాలు; అతి ఫలదంబులు = మిక్కిలి ఫలాన్నిచ్చే చోట్లు; మాఘ, భాద్రపద+ఆఖ్య+మాసములు = మాఘము, భాద్రపదము అనే పేర్లుగల నెలలూ; బహుళపక్షము = కృష్ణపక్షం (అమావాస్యకు ముందటి పాడ్యమి విదియ మొదలైన పదునాల్గు తిథులు - వెరసి పదిహేను రోజుల కాలం); అపర+అహణము = మధ్యాహ్నమునకు పైబడినకాలం; అమవస= అమావాస్య; ద్వాదశి నవములు = ద్వాదశి, నవమి అనే తిథులు; పరఁగు తుష్టిన్ = ఒప్పిదమైన సంతృప్తిని, మిక్కిలి సంతృప్తిని; పితృదేవతలకున్; ఇచ్చున్ = ఇస్తాయి; కుతప = కుతపకాలం అనగా పగలు పదునెన్మిది గడియలకు పైబడిన కాలం; దౌహిత్ర = కూతురు యొక్క కొడుకు; తిలలు = నువ్వులు; నితాంత పవిత్రములు = మిక్కిలి పవిత్రమైనట్టివి; పితృక్రియలకున్ = శ్రాద్ధాది పితృక్రియలకు; శౌచము = పరిశుద్ధత; అక్రోధము = కోపం లేకుండటం అనగా క్రోధరాహిత్యం; అవ్యగ్రభావము = కలత చెందని హృదయం, ఆందోళన చెందకుండుట; అర్హములు = యుక్తములు, తగినట్టివి; శుక్షపక్ష = శుక్లపక్షం; పూర్వ+అహ్న = మధ్యాహ్నమునకు ముందటికాలం; యుగ్మదివస = సరిదినాలు; జన్మదినములు = పుట్టినరోజులు; నిందితములు = తగని రోజులు; ఆజ్య = నేయి; ముద్గ = పెసలు; పాయస = పరమాన్నం; అపూపముల్ = పిండివంటలు; ముఖ్యకోటి = ప్రధానమైన పదార్థాల సమూహం.

**తాత్పర్యం:** అని అంబిక అడుగగా సర్వవిదుడైన శంభుడు ఆమెతో ఇట్లన్నాడు. సఖీ! గయ, కురుక్షేత్రం, గంగ మున్నగు పవిత్ర ప్రదేశాలు పితృకర్మలకు మిక్కిలి ఫలప్రదాలు. మాఘభాద్రపద మాసాలూ, బహుళపక్షం, అపరాహ్ణ సమయం, అమావాస్య, ద్వాదశి, నవమి అనే తిథులు పితృదేవతలకు మిక్కిలి సంతృప్తినిస్తాయి. కుతపకాలం, దౌహిత్రుడు, నువ్వులు పితృకర్మలకు మిక్కిలి అర్హములు. శ్రాద్ధాదులు జరుపునప్పుడు శుచిత్వం, కోపరాహిత్యం, వ్యాకులపాటు చెందకుండటం ఆవశ్యకాలు. శుక్లపక్షం (పూర్ణిమతో చేరిన పాడ్యమి, విదియ మొదలైన పదునైదు తిథుల కాలం), పూర్వాహ్ణం (మధ్యాహ్నమునకు ముందటి కాలం), సరిదినాలు, పుట్టిన రోజులు పితృకర్మలకు యోగ్యములు కావు. నెయ్యి, పెసరపప్పు, పరమాన్నం, పిండివంటలు (మినుప వడలు, అప్పాలు, నువ్వుల ఉండలు) శ్రాద్ధాదులలో ముఖ్యపదార్థాలు.

**విశేషం:** పక్షం = పదిహేను రోజుల కాలం. నెలకు రెండు పక్షాలు. మొదటిది శుక్లపక్షం. రెండవది బహుళ పక్షం లేక కృష్ణ పక్షం. పాడ్యమి విదియ తదియ మొదలైన పదునాల్గు తిథుల తర్వాత వచ్చేది పూర్ణిమ లేక పున్నమ. ఇది శుక్ల పక్షం, లేక సిత పక్షం, పాడ్యమి విదియ ఇత్యాది తిథుల తర్వాత వచ్చే అమావాస్యతో కలిపి పదిహేనురోజులు బహుళపక్షం లేక కృష్ణ పక్షం.

హిందూ కాలమాన ప్రకారం రోజుకు 60 గడియలు. గడియకు 60 విగడియలు; గడియ అనగా 24 నిమిషముల కాలం. విగడియ 24 సెకండ్ల సమయం.

కుతపము: పగటిప్రొద్దు పదిహేను భాగాలలో ఎనిమిదవ భాగం కుతపకాలం. ఉదయం 11గం.36 నిమిషాల తర్వాత 48 నిమిషాలు అనగా 12గం.24 నిమిషాల సమయం కుతపకాలం. ఈ కాలం పితరులకు ప్రశస్త పుణ్యకాలం. ఈ కుతపకాలానికి ముందు పితృదేవతలకు పిండ ప్రదానాదులు చేయరాదు.

**క. శ్రోత్రియు లరోగు లవికల । గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా**
**రిత్రత్వము ముఖ్యంబు స । గోత్రు మృతకళత్రు నన్యకులుఁ గొన రతివా! 203**

**ప్రతిపదార్థం:** అతివా! = రమణీ!; పైతృకములకున్ = శ్రాద్ధాదులకు, ఆబ్దికాలకు, తద్దినాలకు; శ్రోత్రియులు = వేదం చదివినవారూ; అరోగులు = రోగాలు లేని వాళ్ళూ; అవికలగాత్రులు = అంగవైక్యలం లేని వాళ్ళూ; పాత్రములు = అర్హులు, తగినవారు, యోగ్యులు; సత్+చారిత్రత్వము = మంచినడవడి; ముఖ్యంబు = ప్రధానం, ఆవశ్యకం; సగోత్రున్ = తన గోత్రం వాడినీ, మృతకళత్రున్ = భార్య చనిపోయిన వాడినీ; అన్యకులున్ = ఇతరకులస్థుడినీ; కొనరు = అంగీకరించరు, నిమంత్రించరు.

**తాత్పర్యం:** దేవీ! శ్రాద్ధాదులందు నిమంత్రించటానికి వేదం చదివినవారూ, రోగాలు లేనివారూ, అంగవైకల్యం కలుగని వారూ అర్హులు. వీరందరూ మంచి నడవడి గలవారై ఉండాలి. తన గోత్రం వాడూ, భార్య మరణించిన వాడూ, ఇతర కులస్థుడూ తద్దినాలలో నిమంత్రణకు పనికిరాడు.

**ఆ. గంధపుష్పమాలికా ధూపదీప వ । స్త్రముల నర్చ లిచ్చి తగఁగ భోజ**

**నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర । దానవిధి యొనర్చు టేను మెత్తు.' 204**

**ప్రతిపదార్థం:** గంధ = చందనం; పుష్పమాలికా = పూలదండలు; ధూప = సాంబ్రాణి పొగ; దీప = దీపం; వస్త్రములన్ = క్రొత్త బట్టలు మున్నగు వాటిచేత; అర్చలు+ఇచ్చి = పూజలు చేసి; తగన్+కన్ = చక్కగా, ఒప్పిదంగా; భోజనములు నిర్వహించి = అన్నపానీయాలిచ్చి; క్రమవృత్తిన్ = స్వాములు సంతృప్తిగ భుజించిన మీదట; పిండప్రదాన విధి = పితరులకు పిండాలు పెట్టేపని; ఏను = నేను; మెత్తున్ = శ్లాఘిస్తాను.

**తాత్పర్యం:** ఆబ్దికంలో నిమంత్రితులైన వారిని గంధం, పూలమాలలు, ధూపం, దీపం, వస్త్రాలు మొదలైన వాటితో పూజించి శ్రద్ధాభక్తులతో వారికి భోజనాలు పెట్టి సంతుష్టులను చెయ్యాలి. ఆ పిదప శాస్త్ర విధి ననుసరించి పితరులకు పిండ ప్రదాన మొసగటం కాత్యాయనీ! నేను ఎంతో మెచ్చుకుంటాను.'

**వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో నిట్లనియె. 205**

**ప్రతిపదార్థం:** అని; ఎఱింగించినన్ = శివుడు చెప్పగా; మేనకా+ఆత్మజ = హిమవంతుడి పత్ని అయిన మేనకాదేవి యొక్క కూతురైన అంబిక; మృడునితోన్ = శివుడితో; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** శివు డట్లా చెప్పగా విని మేనకాదేవి పుత్రి అయిన ఉమ శంభుడితో ఇట్లా అన్నది.

**క. 'మృతిఁ బొంది పునర్జన్మము । నతర్క్యగుణ జంతుకోటి యప్పుడ పొందుం**
**బితృపూజన మని యెవ్వరి । కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా!' 206**

**ప్రతిపదార్థం:** శివా! = ఈశ్వరా! అతర్క్యగుణ = ఊహించనలవిగాని గుణాలు కలిగిన; జంతుకోటి = ప్రాణిసమూహం; మృతిన్+పొంది = మరణించి; పునః+జన్మము = మరొకపుట్టుక; అప్పుడు+అ = వెంటనే; పొందున్ = పొందుతుంది; (అట్లాంటప్పుడు); పితృపూజనము+అని = పితరులకు పూజ అంటూ; ఎవ్వరికిన్ = మరెవ్వరికి; ఇతవుగన్ = ప్రీతిగా; చేయుదురు? = చేస్తారు?; దీనిన్ = ఈ విషయమును; ఎఱిఁగింపు = నాకు తెల్పవలసినది.

**తాత్పర్యం:** 'పరమేశ్వరా! ఊహించటానికి అలవిగాని గుణాలుగల ప్రాణికోట్లు తమతమ కర్మఫలాలు అనుభవించటానికి చచ్చి మరల వెంటనే జన్మిస్తున్నాయి. అట్లాంటప్పుడు ఎవరి ప్రీతి కొరకు జనులు పితృపూజ సల్పుతున్నారో అనగా శ్రాద్ధాది కర్మలు నిర్వహిస్తున్నారో నాకు తెల్పండి.'

**ఆ. అనుడు నచటనున్న మునిజను లెల్లను । నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ**
**డిచ్చు నుత్తరంబు నేర్పడ విను వేడ్క । గదురనుండి రపుడు కంసదమన! 207**

**ప్రతిపదార్థం:** అనుడున్ = అని గౌరి అడుగగా; అచటన్+ఉన్న = అక్కడ వేంచేసి ఉన్నట్టి; మునిజనులు+ఎల్లను = మునీశ్వరులందరూ; అగతనూజన్ = పర్వతపుత్రిని; (అగము, నగము = కొండ); పొగడి = కొనియాడి; అభవుఁడు = శంకరుడు; ఇచ్చు+ఉత్తరంబున్ = చెప్పునట్టి ప్రతివచనాన్ని; ఏర్పడన్ = విశదంగా; వినువేడ్క = ఆలకించవలెననే కోరిక; అపుడు = ఆ సమయాన; కదురన్ = కలుగగా; కంసదమన! = కంసు నణంచిన శ్రీకృష్ణా!; ఉండిరి = వేచి ఉన్నారు,

ఎదురుచూస్తున్నారు.'

**తాత్పర్యం:** అని గౌరీదేవి అడుగగా, అక్కడున్న మునీశ్వరులంతా గిరిపుత్రిని ప్రశంసించి 'శంకరుడు ఆమె మాటల కేమి బదులిస్తాడో వినవలెనన్న కుతూహలంతో ఉన్నారు శ్రీకృష్ణా! (అని నారదుడు వాసుదేవుడితో అన్నాడు).

**సీ.** **అంబిక కిట్లను హరుఁడు 'సందేహింపఁ। దగునది యిది గుహ్యతమము వినుము**
**దివిజు లట్టుల పితృదేవతలును; దేవ। బృంద ముత్తరదిశఁ బితృచయంబు**
**దక్షిణ దిశ నుండుఁ; దత్పూజనంబులు। వరుసన హవ్యకవ్యంబు లండ్రు;**
**చచ్చినవారికి శ్రాద్ధంబు సేయఁగా। నా పితృ సంఘంబు హర్ష మొంది**

**తే.** **యాయువును శ్రీయుఁ గీర్తియు నాదియైన। యైహికంబులు సుగతియు నాదరమునఁ**
**గర్త కొసఁగు సురాసుర గరుడ యక్ష। తతులకును బూజనీయంబు పితృగణంబు.'** **208**

**ప్రతిపదార్థం:** హరుఁడు = శంభుడు; అంబికకున్ = ఆ మహాదేవికి; ఇట్లు+అనున్ = ఇట్లన్నాడు; ఇది = ఇపుడు నీవు నన్నడిగిన విషయం; సందేహింపన్+తగునది = సంశయింపదగినదే. ఇది = ఈ సంగతి; గుహ్యతమము = పరమ రహస్యమైనది. వినుము = చెప్పుతాను ఆలకించుము; పితృదేవతలును = పితృదేవతలు కూడ; దివిజుల+అట్టులు+అ = దేవతల వంటివారే; దేవబృందము = వేల్పులసమూహం; ఉత్తరదిశన్ = ఉత్తరపుదిక్కులో; పితృచయంబు = పితృదేవతలగుంపు; దక్షిణదిశన్+ఉండున్ = దక్షిణపుదిక్కులో ఉంటుంది; తత్+పూజనంబులు = దేవతలయొక్క, పితృదేవతల యొక్క అర్చనలు; వరుసన్+అ = వరుసగా; హవ్యకవ్యంబులు+అండ్రు = హవ్యము, కవ్యము అని అంటారు; చచ్చినవారికిన్ = మరణించిన వారికి; శ్రాద్ధంబు చేయన్+కాన్ = తద్దినం పెడితే; ఆ పితృసంఘంబు = ఆ పితృదేవతల యొక్క సమాజం; హర్షము+ఒంది = సంతోషం పొంది; ఆయువును = ఆయుష్యమూ; శ్రీయున్ = సంపదనూ; కీర్తియున్+ఆది+ఐన = యశస్సూ మొదలైన; ఐహికంబులు = ఇహలోక సుఖాలు; సుగతియున్ = సద్గతినీ, పరలోకమునూ; ఆదరమునన్ = అభిలాషతో, ప్రీతితో; కర్తకున్ = యజమానుడికి; ఒసఁగున్ = అనుగ్రహిస్తారు; పితృగణంబు = పితృదేవతల యొక్క సముదాయం; సుర+అసుర = దేవదానవుల యొక్క; గరుడ = గరుడుల యొక్క, యక్ష = యక్షులయొక్క; తతులకునున్ = సమూహాలకునూ; పూజనీయంబు = పూజించదగినది.

**తాత్పర్యం:** పరమేశ్వరుడు పార్వతితో ఇట్లా అన్నాడు. 'సతీ! నీ వడిగిన విషయం నిజంగా సందేహాస్పదమైనదే. ఇది అతిరహస్య విషయం. చెప్పుతాను వినుము. పితృదేవతలు కూడ దేవతలవంటి వారే. దేవతలు ఉత్తరపు దిక్కులో ఉంటారు. పితృదేవతలు దక్షిణ దిశలో ఉంటారు. దేవతా పూజనానికి హవ్యమని, పితృదేవతా పూజకు కవ్యమని పేళ్ళు. చనిపోయిన వారికి శ్రాద్ధం పెట్టినట్లయితే పితృదేవతా సమాజాలు సంతోషపడి ఆ యజమానుడికి చిరాయుష్యం, ఐశ్వర్యం, యశస్సు మొదలైన ఇహలోక సుఖాలు ప్రసాదిస్తారు. ఆదరంతో సద్గతులు కూడా కలిగిస్తారు. పితృదేవతా సమూహం దేవ దానవ గరుడ యక్ష సమూహానికి గూడ పూజింప దగినవారే సుమా!'

**వ.** **అని నిర్దేశించి వెండియు.** **209**

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ (ఇట్లా అన్నాడు)

క. **'తమ తమ సారములకుఁ దగఁ । గమలాక్షీ! చేయుదాన కల్పనల విశే**
**షము లొక్క రూపయగుఁ ద । త్ప్రమాణ రూపణము చేసి పలికెదఁ దెలియన్. 210**

**ప్రతిపదార్థం:** కమల+అక్షీ! = పద్మాలవంటి లోచనములు కలదానా!; తమ తమ సారములకున్ = తమ తమ శక్తులకు, యోగ్యతలకు; తగన్ = అర్హమైనట్లు, తగినట్లు; చేయు = సల్పునట్టి; దాన కల్పనల విశేషములు = దాన రచనయందలి విశేషాలు; ఒక్క రూపు+అ+అగున్ = ఫలప్రదాన విషయంలో సమానములై ఉన్నవి; తత్+ప్రమాణ రూపణముచేసి = ఆయాదానముల యొక్క పరిమితులను బట్టి యథార్థస్థితి ఎట్లాంటిదో నిర్వచించి; తెలియన్+పలికెదన్ = నీకు తెలిసేటట్లు చెప్పుతాను.

**తాత్పర్యం:** "తామరరేకులవంటి నేత్రములుగల పార్వతీ! తమతమ శక్తికి తగినట్లు చేసే దానవిశేషాలన్నీ సమానంగానే ఉంటాయి. ఆయాదానాల, వాటి ఫలితాల ప్రమాణాలను నిర్వచించి తెలిసేట్లు చెప్తాను."

క. **విను మొక కుంచెడు ధాన్యము । తన కాయతి గల్గు నతఁడు దాని నొసఁగినన్**
**ధనకోటి గల్గువాఁ డ । ద్ధన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. 211**

**ప్రతిపదార్థం:** వినుము = పార్వతీ! ఆలకించుము; తనకున్ = తనకు; ఒక కుంచెడు ధాన్యము = నాలుగుమానికలు లేదా నాలుగు ముంతల గింజలు; ఆయతి = ఆదాయం, రాబడి; కల్గు+అతఁడు = కలిగినట్టి వాడు; దానిన్ = ఆ నాలుగు ముంతల గింజలను; ఒసఁగినన్ = ఒకడికి దానం చేసినా; ధనకోటి = కోటి రొక్కం, కోటిరూపాయలు; కల్గువాఁడు = ఉన్నవాడు; ఆ+ధనము = ఆ ద్రవ్యమంతా; ఒసఁగినన్ = సమర్పణ చేసినా; తత్+తత్+ఫలముల్ = ఆ నాల్గుముంతలు గింజ లిచ్చిన వాడికీ, ఈ కోటిరూపాయల విత్తం ఇచ్చిన వాడికీ లభించే ఫలాలు; ఒక్క రూపు+అ = సరి సమానాలే సుమా!

**తాత్పర్యం:**. గౌరీ! వినుము. కుంచెడు ధాన్యం రాబడి గలవాడు ఆ కుంచెడు గింజలు దానమొనర్చినా, కోటికి పడగెత్తినవాడు ఆ కోటి రూపాయలు దానమిచ్చినా కలిగే ఫలం మాత్రం సమానమే. దాన పరిమాణమును బట్టి ఫలపరిమాణ ముండదు. శక్తి ననుసరించి చేసే దానాలు దాతకు సమాన ఫలితాలిస్తాయని తాత్పర్యం.

క. **పరుషత్వము లే కంతః । కరణంబున శుద్ధి చాలఁ గలిగి ప్రియము పొం**
**పిరివోవఁ జేత దానము । పరమోత్కృష్టంబు పద్మపత్రనిభాక్షీ!' 212**

**ప్రతిపదార్థం:** పద్మపత్రనిభ+అక్షీ! = తామరరేకులతో సమానములైన కన్నులు కలదానా!; పరుషత్వము లేక = కాఠిన్యం లేక; అంతఃకరణంబున శుద్ధి = మనస్సునందు పరిశుద్ధత, నైర్మల్యం; చాలన్ = మిక్కిలి; కలిగి = ఉండి; ప్రియము = ఇష్టం, సంతోషం; పొంపిరి+పోవన్ = అతిశయించగా; దానము చేఁత = దాన మొనర్చుట; పరమ+ఉత్కృష్టము = మిక్కిలి ఉత్తమం.

**తాత్పర్యం:** కమల పత్రాలవంటి కన్నులు కలదానా! కాఠిన్యం లేకుండా మిక్కిలి చిత్తశుద్ధితో సంతోష పూర్వకంగా చేసే దానం అత్యుత్తమం.'

క. **అని చెప్పి 'కొన్ని ధర్మము । లనఘా! యెఱిఁగింతు నీకు నవధానముతో**
**విను' మని పలికి శివుం డి । ట్లను విశదము గాఁగఁ గూర్చి యంబుజనాభా! 213**

**ప్రతిపదార్థం:** అని చెప్పి = అని వచించి; శివుండు = పరమేశ్వరుడు; అనఘా! = ఓ దోషరహితురాలా, పుణ్యాత్మురాలా, గౌరీ!; కొన్ని ధర్మములు = మరికొన్ని ధార్మిక విషయాలు; నీకున్ = నీకు; ఎఱిఁగింతున్ = తెలుపుతాను; అవధానముతోన్ = ఏకాగ్రతతో, శ్రద్ధతో; వినుము; అని పలికి; విశదము కాఁగన్ = తేటతెల్లమయ్యేటట్లు, స్పష్టమయ్యేటట్లు; కూర్చి = ఆ ధర్మముల నుద్దేశించి, గురించి; ఇట్లు+అనున్ = ఇట్లా అన్నాడు; కమలనాభా! = పద్మము నాభియందుగల శ్రీకృష్ణా!

**తాత్పర్యం:** అని వచించి పరమేశ్వరుడు శాంభవితో 'ఓ పుణ్యురాలా! నీకు మరికొన్ని ధర్మాలు తెలియజెప్పుతాను. ఏకాగ్రచిత్తంతో ఆలకించు'మంటూ విస్పష్టంగా చెప్పినాడు శ్రీకృష్ణా! ( అని నారదుడు శ్రీకృష్ణుడిని సంబోధించి ఈశ్వరుడు గౌరికి చెప్పిన ధర్మాలు తెలిపాడు).

**చ. 'తెవుళులు గొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి, దుర్గతుల్**
**దవులు జనాలిఁ బ్రోపు, సుపథంబుగఁ దైర్థిక కోటిఁ దన్పు, బాం**
**ధవ రహితత్వ దీనశవ దాహము, దుఃఖితులైన వారిఁ దే**
**ర్ప వెరవు, నోర్పుఁ గల్మియును బ్రస్తుతి కెక్కిన మేటి ధర్మముల్.' 214**

**ప్రతిపదార్థం:** తెవుళులు+కొన్నవారికిన్ = జబ్బుపడినవాళ్ళకు; అవి+తీఱుటకున్ = ఆ రోగాలు కుదరటానికి, మానడానికి; ఔషధము+ఈగి = మందునివ్వటం; దుర్గతుల్+తవులు = దుఃస్థితిలో ఉన్న, కష్టాల పాలైన, కడగండ్లలో చిక్కిన; జన+ఆలిన్ = జనుల యొక్క సమూహాన్ని; ప్రోపు = కాపాడటం, సంరక్షించటం; సుపథంబుగన్ = మంచిదారిగా; తైర్థిక కోటిన్ = తీర్థయాత్రా పరుల బృందాన్ని; తన్పు = తృప్తి నొందించటం; బాంధవరహితత్వ = చుట్టాలు లేనందున; దీన = దిక్కుమాలినట్టి, అనాథగానున్న; శవదాహమున్ = పీనుగును కాల్చటం; దుఃఖితులు+ఐనవారిన్ = దుఃఖము పొందుతున్నవాళ్ళను; తేర్పన్ = ఓదార్చుటకు; వెరవున్ = ఉపాయం; ఓర్పు+కల్మియున్ = సహనం కలిగి ఉండటం; ప్రస్తుతికిన్+ఎక్కిన = పొగడ్తగాంచిన; మేటిధర్మముల్ = గొప్పధర్మాలు, ఉత్తమధర్మాలు.

**తాత్పర్యం:** 'వ్యాధులతో బాధపడేవారికి ఆ రోగాలు మానటానికి మందులివ్వటం, దుఃస్థితిలో ఉన్నవాళ్ళను ఆదుకొనటం, తీర్థయాత్రాపరులను మంచిమార్గంలో సంతృప్తి పరచటం (అన్నపానములిచ్చి, ఆశ్రయం సమకూర్చి), చుట్టపక్కాలు లేనట్టి అనాథప్రేతకు దహనక్రియ జరపటం, దుఃఖాలపాలైన వారిని ఆ దుఃఖాల నుండి ఉద్ధరించే ఉపాయం ఆలోచించటం, ఓర్పు కలిగి ఉండటం గణన కెక్కిన ఉత్తమ ధర్మాలు.'

**వ. అని పలికినఁ బార్వతీదేవి పరమప్రియంబు నొంది. 215**

**తాత్పర్యం:** అని శివుడు చెప్పగా ఉమాదేవి మిక్కిలి సంతోషపడి.

శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబుల తెఱం గెఱింగించుట. (సం.13. అను 1-16-3630).

**సీ. 'ధర్మంబు నానావిధంబులఁ బరఁగు నం; । ద్రవి యెఱిఁగింపవే' యనుడు హరుఁడు**
**'వితతంబులగు శ్రుతి స్మృతులచేఁ జెప్పఁగాఁ । బడిన తెఱంగులు పడఁతి! వినుము**

**జాతి ధర్మములు, దేశజ ధర్మములుఁ, గుల । ధర్మంబులును, గణ ధర్మములును,**
**గాయంబు వికృతులఁ గాలపర్యయముల । వచ్చు నాపద్ధర్మ వర్తనములు**

**ఆ. గాఁగ నిట్లు ధర్మగతు లైదు గల వని । చెప్పుటయును గౌరి శివునితోడఁ**
**'బుణ్యలోక కలిత భోగంబు లెట్లుండు?' । ననిన నిట్టు లనియె హరుఁడు గృష్ణ! 216**

**ప్రతిపదార్థం:** ధర్మంబు = ఇహపర సుఖాలు కలిగించటానికి కారణమైన ధర్మం; నానా విధంబులన్ = అనేకరీతుల; పరఁగున్+అండ్రు = ఒప్పుతుందని చెప్తుతారు; అవి = ఆ ధర్మాలను; ఎఱిఁగింపవు+ఏ = తెలుపుమా; అనుడున్ = అని గిరిజ వేడగా; హరుఁడు = శంకరుడు; వితతంబులు+అగు = విస్తారములైన, విరివి అయిన; శ్రుతి స్మృతులచేన్ = వేదాల చేతనూ, ధర్మశాస్త్రాలచేతనూ; చెప్పన్+కాన్+పడిన = చెప్పబడినట్టి; తెఱంగులు = విధములు; పడఁతి! = ఓ ప్రాణేశ్వరీ, ఓ తరుణీ!; వినుము = ఆలించుము; జాతిధర్మములున్ = బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే జాతుల యొక్క ఆచారాలు; దేశజ ధర్మములున్ = ఆయాదేశములందు కలిగిన, పాటించునట్టి ధర్మాలు; కులధర్మంబులును = ఆయాఇండ్లవారికి తండ్రి తాత ముత్తాతల నుండి వాడుక పడిన ధర్మాలు; గణధర్మములును = జనసముదాయం అనుసరించే సామాన్యధర్మాలు; కాయంబు వికృతులన్ = శరీరము యొక్క మార్పులచేతను (బాల్య యౌవన కౌమార వార్ధక్య లక్షణాల చేత); కాలపర్యయములన్ = కాలము యొక్క మార్పులచేతను; వచ్చు = సంభవించు, కలుగునట్టి; ఆపత్+ ధర్మవర్తనములు = విపత్కాలంలో అనుసరణీయాలైన ధర్మాలు; కాఁగన్ = అనగా; ఇట్లు = ఈ ప్రకారం; ధర్మగతులు = ధర్మము యొక్క తీరులు; ఐదు కలవు = ఐదున్నవి; అని, చెప్పుటయును = పరమశివుడు నుడువగా; గౌరి; శివునితోడన్ = శంకరుడితో; పుణ్యలోకకలితభోగంబులు = ఉత్తమ లోకాలందలి సుఖాలు; ఎట్లు+ఉండున్+అనినన్ = ఎట్లా ఉంటాయని అడుగగా; హరుఁడు = ఈశ్వరుడు; ఇట్టులు+అనియెన్+కృష్ణ! = శ్రీకృష్ణా! ఇట్లా అన్నాడు. (అని నారదుడు దేవకీనందనుడితో నుడివాడు).

**తాత్పర్యం:** 'ప్రాణేశ్వరా! ధర్మం పలువిధాలుగా ఉంటుందని అంటారు. ఆ ధర్మస్వరూపం ఎట్లాంటిదో నాకు వివరిస్తారా' అని పార్వతి వేడగా పరమేశ్వరుడు 'దేవీ! విరివిగా ఉన్న వేదాలలో, ధర్మశాస్త్రాలలో ధర్మస్వరూపం వ్యాఖ్యానించబడింది. విశదీకరిస్తాను. వినుము. బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులనే నాలుగు వర్ణాలవారు అనుసరించే ధర్మమూ, ఆయాదేశాలలో పాటించబడే ధర్మమూ, ఒకే జాతివారైనా వేర్వేరు ఇండ్లవారు తమ తండ్రి తాత ముత్తాతల నుంచి వాడుక చొప్పున అనుష్ఠించే ధర్మమూ (కులధర్మం), మంది అనుసరించే సామాన్య ధర్మమూ, శరీరస్థితిని బట్టి, కాలము యొక్క మార్పులను బట్టి అవలంబించే ఆపద్ధర్మమూ అని ధర్మం ఐదు విధాలు అని పినాకపాణి వచించాడు. ఆ మాటలు విని శర్వాణి శర్వుడితో 'ప్రభూ! పుణ్యజగాలలో సుఖానుభవాలు ఎట్లా ఉంటాయి?' అని అడిగింది. అందుకు అభవుడు ఇట్లా అంటున్నాడు కృష్ణా! (అని నారద మహర్షి మహేశ్వరుడు గౌరితో అన్నమాటలు వినిపించాడు).

**సీ. 'ఎల్లపుష్పంబులు నెక్కాలమును దద్ద । విలసిల్లుఁ; గల్పక వృక్షజనిత**
**మనులేప; మాహార మమృత; మంబరములు । నిత్యామలినములు; నిరుపమాన**
**భంగి దీప్తంబు లాభరణముల్; వాన ర । మించుచు నన్యోన్యమిత్రభావ**
**మొప్పంగ మేనుల యొప్పును మనముల । మార్దవంబును గుణమాన్యతలును**

**తే. గలిగి పురుషులుఁ గాంతలుఁ గామహర్ష । లీల లెసఁగఁ గ్రోధాదులు లేక రుజయు**
**జరయు నెఱుఁగక నలిఁ జరింతురు దివంబు । నందు సంతత నిర్భరానంద మొంద.' 217**

**ప్రతిపదార్థం:** ఎల్లపుష్పంబులున్ = సమస్తములైన పువ్వులు; ఏ+కాలమును = అన్ని కాలములందును, పన్నెండు మాసాలలోనూ, ఆరు ఋతువులలోనూ; తద్ద = మిక్కిలి; విలసిల్లున్ = ప్రకాశిస్తాయి; కల్పకవృక్షజనితము = కల్పతరువుల నుండి కలిగినట్టిది (నిర్యాసం, జిగురు, బంక); అనులేపము = (మైపూత) ఒడలికి పూసికొనే పరిమళ ద్రవ్యం; ఆహారము = తినేతిండి; అమృతము = సుధ; అంబరములు = కట్టుకునే బట్టలు; నిత్య+అమలినములు = ఎల్లప్పుడూ మురికి లేనటువంటివి; ఆభరణముల్ = ధరించే నగలు, సొమ్ములు, రవణములు; నిర్+ఉపమానభంగిన్ = పోలికలేని విధంగా, సాటిలేనట్లుగా; దీప్తంబులు = ప్రకాశించునట్టివి; వానన్ = మీద నుడివిన వాటితో; రమించుచున్ = ఆనందిస్తూ; అన్యోన్యమిత్రభావము = పరస్పరస్నేహం; ఒప్పంగన్ = విలసిల్లగా; మేనుల = శరీరాల యొక్క; ఒప్పును = చక్కదనమూ, సౌందర్యమూ; మనముల మార్దవంబును = హృదయాల యొక్క మెత్తదనమూ; గుణమాన్యతలును = సద్గుణాలయొక్క యోగ్యతలూ; కలిగి = లభించిన వారై; పురుషులున్ = మగవారూ; కాంతలున్ = ఆడువారు; కామహర్షలీలలు+ఎసఁగన్ = కోర్కెలు తీరినందున ఆనంద విలాసాలొప్పగా; క్రోధ+ఆదులు లేక = కోపం మొదలైన దుర్గుణాలు కలుగక; రుజయున్ = రోగమూ; జరయున్ = ముసలితనమూ; ఎఱుఁగక = తెలియక; నలిన్ = ప్రేమతో, అనురాగంతో; దివంబు+అందున్ = స్వర్గంలో; సంతత = ఎడతెగని; నిర్భర+ఆనందము+ఒందన్ = అపరిమితమైన హర్షం కలుగగా; చరింతురు = వర్తిస్తారు, సంచరిస్తారు.

**తాత్పర్యం:** 'స్వర్గలోకంలో అన్నిరకాల పువ్వులు అన్ని కాలాలలో ప్రకాశిస్తుంటాయి. అక్కడ మగవారూ, ఆడువారూ కల్పతరువుల నుండి లభించే పరిమళద్రవ్యం తమశరీరాలకు పూసికొంటారు. అమృతమే వారికి ఆహారం. ఎప్పుడూ మాయని ఉడుపులు తాలుస్తారు. సాటిలేక వెలుగొందే సొమ్ములు ధరిస్తారు. పరస్పర మైత్రితో, మేని అందచందాలతో, మనసుల మెత్తందనాలతో, సద్గుణాలయోగ్యతలతో వారు ఒప్పారుతుంటారు. యథేచ్ఛగా సుఖాలలో తేలుతుంటారు. వారికి క్రోధాది దుర్గుణాలు లేవు. రోగాలు లేవు; ముసలితనం లేదు. వారు నిత్యయౌవనమూర్తులు. ఎల్లప్పుడు పట్టరానంత ఆనంద పారవశ్యంతో వారు స్వర్గంలో హాయిగా విహరిస్తుంటారు.'

**వ. అనిన విని హైమవతి 'సుగతి దుర్గతులకుఁ జనం గలవారిం జూచి వీ రిట్టివారని నిశ్చయింపవచ్చుట రామి యెఱింగింపు' మనవుడు మృడుండు విను మని యిట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని శంభుడు చెప్పగా ఆలకించి; హైమవతి = హిమవంతుడి పుత్రిక పార్వతి; సుగతి దుర్గతులకున్ = స్వర్గనరకాలకు; చనన్+కలవారిన్ = పోదగిన వాళ్ళను, చూచి = కనుగొని; వీరు+ఇట్టివారు+అని = వీళ్ళు ఇట్లాంటి వాళ్ళని; నిశ్చయింపన్ = నిర్ణయించుటకు; వచ్చుట; రామి = సాధ్యాసాధ్యములు, శక్యాశక్యములు; ఎఱింగింపుము = తెల్పుము; అనవుడున్ = అని అడుగగా; మృడుండు = ఈశ్వరుడు; వినుము; అని ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని శివుడు చెప్పగా పార్వతి 'స్వర్గనరకాలకు పొయ్యేవాళ్ళు వీళ్ళని జనాలను చూచి నిర్ణయించటం శక్యమగునా? కాదా? చెప్పు' మని అడిగింది. అందుకు ఆయన ఇట్లా అన్నాడు.

చ. 'జనులకుఁ గీడు రోయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జన గురు పూజనంబులును సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరిదయార్ద్రతయుం గలట్టి వా
రనిమిషలోకగాములని యాత్మ నెఱుంగుము మేనకాత్మజా! **219**

**ప్రతిపదార్థం:** మేనకా+ఆత్మజా! = మేనకాదేవి కుమారీ!; జనులకున్ = నరులకు; కీడు+రోయక = హాని తలపెట్టక, అపకృతిగావించక; అజస్రము = ఎల్లప్పుడు; ధర్మరతిన్ = ధర్మమందలి ఆసక్తితో, ప్రీతితో; చరించి = మెలగి; సత్+జన = సత్పురుషుల యొక్క; గురు = ఒజ్జల యొక్క; పూజనంబులును = పూజించుటలు; సత్యహిత+ఉక్తులు = యథార్థమైనవీ, మేలుగలిగించేవి అయినట్టి మాటలు; దీనపోషణంబును = దరిద్రులను వృద్ధికి తెచ్చుట; అతిథి ప్రియత్వమును = అతిథుల యందు ఆదరణము; భూరిదయా+ఆర్ద్రతయున్ = మిక్కుటమైన దయారసం చేత తడియుటయు; కల+అట్టివారు = కలిగినటువంటి జనులు; అనిమిషలోకగాములు+అని = స్వర్గలోకానికి వెళ్ళేవారని; ఆత్మన్ = మదిలో; ఎఱుంగుము = తెలియుము.

**తాత్పర్యం:** 'ఓ మేనకాదేవి తనయా! మనుష్యులకు అపకారం తలపెట్టని వారూ, ఎల్లవేళల ధర్మమందే ఆసక్తిగలవారూ, సత్పురుషులనూ గురువులనూ పూజించే వారూ, సత్యముగనూ, హితముగనూ మాట్లాడేవారూ, పేదలను పోషించేవారూ, అతిథులను ఆదరించేవారూ, అధిక కరుణా రసముచే చెమ్మగిల్లిన హృదయం కలవారూ అయిన నరులు స్వర్గలోకానికి వెళ్ళేవారని గ్రహించుము.

చ. పరుసని పల్కు బొంకులగు పల్కులు నన్యధనాభిలాషముం
బరవనితా విలోలతయు బాంధవ సజ్జన విప్రియంబు దు
శ్చరితులతోడిమైత్రియును సంతత ధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన! ఘోరనరకంబున కేఁగెడి వారి చిహ్నముల్.' **220**

**ప్రతిపదార్థం:** కరినిభయాన! = ఏనుగు నడకతో సమానమైన నడక గలదానా!; పరుసనిపల్కు = కఠినపు వాక్కు; బొంకులు+అగుపల్కులు = అబద్ధపు మాటలు; అన్యధన+అభిలాషమున్ = ఇతరుల విత్తమునందు కోరిక; పరవనితా విలోలతయున్ = పరాయిస్త్రీ యందు మిక్కిలి ఆశ; బాంధవ = చుట్టాలయందు; సత్+జన = సత్పురుషుల యందు; విప్రియంబు = ఇష్టం లేకుండటం; దుస్+చరితుల తోడి మైత్రియును = చెడు నడవడి గలవారితో చెలిమి; సంతత ధర్మరత = ఎల్లప్పుడు ధర్మమునందు ఆసక్తి గలవారియందు; అభ్యసూయయున్ = మిక్కిలి దోషారోపణబుద్ధి లేదా కోపం, (అనేవి); ఘోర = భయంకరమైన; నరకంబునకున్ = నరకలోకానికి; ఏఁగెడి వారిచిహ్నముల్ = వెళ్ళేవారి యొక్క గుర్తులు, లక్షణాలు.

**తాత్పర్యం:** గజగమనంవంటి గమనం గల శైలజా! కఠినంగా మాట్లాడటం, అబద్ధాలు చెప్పటం, పరులధనాన్ని అపేక్షించటం, పరస్త్రీలను వాంఛించటం, బంధువులయందు, సత్పురుషులయందు ద్వేషం వహించటం, చెడునడవడిగల వారితో స్నేహం చెయ్యటం, ధర్మమందు శ్రద్ధగలవారియెడల అసూయవహించటం అనేవి భయంకర నరకం పాలయ్యే వారి లక్షణాలు, గుర్తులు.'

**క. అని చెప్పిన విని హిమగిరి । తనయ వృషధ్వజుని తోడ 'ధర్మంబులు పె**
**క్కనుపమమూర్తీ! పరమం । బనఁ జాలెడు ధర్మ మెద్ది యన్నిటిలోనన్. 221**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్ = అని శివుడు నుడువగా; విని; హిమగిరితనయ = హిమవత్పర్వత పుత్రిక; వృషధ్వజుని తోడన్ = శివుడితో; అనుపమమూర్తీ! = సాటిలేని స్వరూపము గలవాడా!; ధర్మంబులు = ధర్మాలు; పెక్కు = అనేకం; పరమంబు+అనన్ +చాలెడు = శ్రేష్ఠము అని చెప్పడానికి తగిన; ధర్మము = అభ్యుదయ శ్రేయస్సాధనమైన కృత్యం; అన్నిటిలోనన్ = అన్నింటిలో; ఎద్ది? = ఏది?

**తాత్పర్యం:** అని పరమశివుడు పలుకగా విని పరమేశ్వరి ఆ వృషభకేతనుడితో 'సాటిలేని స్వరూపంగల స్వామీ! ధర్మాలు ఎన్నో ఉన్నాయి. అన్నింటిలో ఉత్తమోత్తమమైన ధర్మం ఏది?

**వ. చెప్పు మనిన న ప్పరమేశ్వరుం డిట్లనియె. 222**

**తాత్పర్యం:** తెలుపుమని అడుగగా సర్వేశ్వరు డిట్లా అన్నాడు.

**క. 'రమణీ! వర్గత్రయ ధ । ర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్**
**గమనాగమకరములు ని । త్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223**

**ప్రతిపదార్థం:** రమణీ! = సుందరీ!; వర్గత్రయధర్మములు = ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాల వలన లభించే పుణ్యాలు; ఇచ్చు సుఖములు = ఇచ్చునట్టి సౌఖ్యాలు; దుఃఖమయములు = దుఃఖరూపాలు; అచిరముల్ = శాశ్వతములు కానివి; గమన+ఆగమ+కరములు = రాకపోకలను కలుగజేసేవి; మోక్షధర్మంబు = చతుర్విధ పురుషార్థాలలో నాల్గవదైన మోక్షధర్మం; నిత్యమహా సౌఖ్యంబున్ = శాశ్వతమైన గొప్ప సుఖాన్ని; ఇచ్చున్ = ప్రసాదిస్తుంది.

**తాత్పర్యం:** 'గౌరీ! ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలవలన లభించే సుఖాలు చివరకు దుఃఖమయాలు, అశాశ్వతాలు. వస్తూ పోతూ ఉంటాయే కాని నిలుకడగా ఉండేవి కావు. నాల్గవపురుషార్థమైన మోక్షధర్మం మాత్రం శాశ్వతమైన మహానందాన్ని ప్రసాదిస్తుంది.

**విశేషం:** వర్గత్రయం-త్రివర్గం. అనగా ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలు. మోక్షం నాల్గవ పురుషార్థం. సాధించదగినది అదే. శబ్దస్పర్శరూపరసగంధాలనే విషయాలతో త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనే జ్ఞానేంద్రియ పంచకానికి కల సంబంధములే మాత్రా స్పర్శలు. ఇవి సుఖదుఃఖాది ద్వంద్వాలను కలుగజేస్తాయి. సుఖదుఃఖాదు లన్నీ వస్తూ పోతూ ఉండేవే తప్ప శాశ్వతంగా ఉండేవి కావు. అట్టి ద్వంద్వాలను సహించుమని శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించాడు.

"మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత." (భగ. 2-14) అని.

**సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు । దలపోయ మోక్షంబు; దానిఁ బడయు**
**తెఱఁ గెఱింగించెదఁ దెఱవ! గృహస్థ ధ । ర్మంబున నిల్చి ఋణంబు లెల్లఁ**

**బాచి వనమునకుఁ బరమశాంతత నేఁగి । సద్గురుముఖమున సాంఖ్యయోగ**
**విదుఁ డగునది; పంచవింశతి జ్ఞానంబు । సాంఖ్యంబు, ధర్మనిశ్చలత యోగ;**

**తే.** **మాసమాచారయుగళ మేకాధి కరణ । మస్ఖలితముగ మది నది యలవరించి**
**ధ్యానపరుఁ డయి శీతోష్ణ హర్ష శోక । ముఖములగు వివిధ ద్వంద్వములఁ దొఱంగి. 224**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి; త్రివర్గంబుకంటెను = ధర్మార్థకామముల కంటె; తలపోయన్ = ఆలోచించగా; మోక్షంబు = నాల్గవ పురుషార్థమైన ముక్తి; మేలు = ఉత్తమం; దానిన్ = ఆ మోక్షాన్ని; పడయు తెఱఁగు = పొందేవిధం; ఎఱింగించెదన్ = తెలుపుతాను; తెఱవ! = ఓ కాంతా!; విను = ఆకర్ణించుము; గృహస్థధర్మంబునన్+నిల్చి = గృహస్థాశ్రమ ధర్మం అవలంబించి; ఋణంబులు+ఎల్లన్ = దేవ ఋణము, పితృ ఋణము, ఋషి ఋణము అనే మూడింటితో పాటు నాల్గవదైన మనుష్య ఋణమును; పాచి = తొలగించి; వనమునకున్ = అడవికి; పరమశాంతతన్ = మిక్కిలి నెమ్మదితో; ఏఁగి = వెళ్ళి; సద్+గురుముఖమునన్ = మంచి ఆచార్యుడి వలన; సాంఖ్యయోగ విదుఁడు = సాంఖ్యయోగం ఎరిగినవాడు; అగునది = కావాలి; పంచవింశతి జ్ఞానంబు = ఇరువదైదుతత్త్వాల యెఱుక; సాంఖ్యంబు = సాంఖ్యమని చెప్పబడుతున్నది; ధర్మనిశ్చలత = ధర్మమందు చలించకుండుట లేదా నిలుకడ; యోగము = యోగమని పిలువబడుతున్నది; ఆ సమాచారయుగళము = సాంఖ్యయోగము, కర్మయోగము అనేవి రెండు; ఏక+అధికరణము = ఒకే ఆధారముగా గలవి; అది = దానిని, మదిన్ = మనస్సులో; అలవరించి = అభ్యసించి, సమకూర్చి; ధ్యానపరుఁడు+అయి = ధ్యానమందు ఆసక్తి కలవాడై; శీత+ఉష్ణ, హర్షశోకముఖములు+అగు = శీతోష్ణములు, సుఖదుఃఖాలు మున్నగు; వివిధ ద్వంద్వములన్ = పలురకాలైన ద్వంద్వాలను, తొఱంగి = వీడి, విడిచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** గౌరీ! ధర్మార్థకామములనే మూడు పురుషార్థముల కంటె ఆలోచించగా నాల్గవ పురుషార్థమైన మోక్షమే శ్రేష్ఠమైనది. దానిని పొందే విధం వివరిస్తాను వినుము. మానవుడు గార్హస్థ్యం స్వీకరించి దేవఋణాన్ని యజ్ఞయాగాదుల చేతనూ, ఋషిఋణాన్ని వేదపాఠం చేతనూ, పితృఋణాన్ని శ్రాద్ధతర్పణాదుల చేతనూ, మనుష్యఋణాన్ని ఆతిథ్యం చేతనూ తీర్చి, పరమశాంతుడై అరణ్యాలకు వెళ్ళవలె. యోగ్యుడగు గురువువలన సాంఖ్యయోగాన్ని గురించి తెలిసికొనవలె. సాంఖ్యయోగమంటే ఇరువదైదుతత్త్వముల ఎరుకయే. ధర్మమందు చలించక నిలవడమే యోగమని చెప్పబడుతుంది. సాంఖ్యమూ, యోగమూ ఇవి రెండున్నూ ఏకాశ్రయాలే. మనసులో ఈ రెంటినీ జారుపాటు లేకుండా నిలుపుకొని ధ్యానపరుడయి శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వాల నుండి విముక్తుడు కావాలి. అనగా ద్వంద్వాలను జయించాలి.

**విశేషం:** సంఖ్య అంటే జ్ఞానం. జ్ఞానం వలన నిశ్చయించబడే ఆత్మతత్త్వానికే సాంఖ్యమని పేరు.
సంఖ్యకు సంబంధించినది కావడం వలన కూడా సాంఖ్య యోగం.

"భూతాని చ కవర్గేణ చవర్గేణేంద్రియాణి చ
టవర్గేణ తవర్గేణ జ్ఞానగంధాదయ స్తథా
మనః పకారేణైవోక్తం ఫకారేణ త్వహంకృతిః
బకారేణ భకారేణ మహాన్ ప్రకృతి రుచ్యతే
ఆత్మా తు స మకారోఽయం పంచవింశః ప్రకీర్తితః."

కఖగఘఙ - అను కవర్గం చేత - పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు;

చఛజఝఞ - అను చవర్గం చేత - వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే పంచకర్మేంద్రియాలు;
టఠడఢణ - అనే టవర్గం చేత - త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణములనే పంచజ్ఞానేంద్రియాలు;
తథదధన - అనే తవర్గం చేత - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే పంచతన్మాత్రలు;

పకారము చేత మనస్సు, ఫకారము చేత అహంకారం, బకారము చేత మహత్తు, భకారము చేత ప్రకృతి, మకారము చేత ఇరువదైదవతత్త్వమైన జీవాత్మ గ్రహించబడుతుంది - ఇది పంచవింశతితత్త్వాత్మకమైన సృష్టి వ్యవస్థ.

"సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యాస్థితస్సమ్యక్ ఉభయో ర్విందతే ఫలమ్." (భగ. 5-4)

కర్మయోగ జ్ఞానయోగాలు పరస్పరం భిన్నములని అల్పజ్ఞులు భావిస్తారు. కాని, వీటిల్లో ఏది అనుష్ఠించినా ఆత్మదర్శన ప్రాప్తి అవుతుంది.

"య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి." (భగ. 5-5)

ఆత్మదర్శనానికి సాధనభూతములైన జ్ఞాన కర్మయోగాలకు భేదం లేదని గుర్తించిన వారే పండితులు- అని భారతంలో మరోచోట దీనికి ఉపోద్బలకంగా చెప్పబడింది.

**ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వశనంబునై యిళం**
**జూచుచు నంతరాత్ము నెడసొచ్చిన విఘ్నవిశేషమున్ ధృతిం**
**ద్రోచుచు భక్తియుక్తికి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద**
**ద్గోచరతం జరింపఁగ నకుంఠిత మోక్షసుఖంబు చొప్పడున్. 225**

**ప్రతిపదార్థం:** శౌచమున్ = శుచిత్వమూ, పరిశుద్ధత; బ్రహ్మచర్యమును = బ్రహ్మచర్యమనేవ్రతమూ; శాంతియున్ = అంతరింద్రియనిగ్రహం, మనో నిగ్రహం; లఘు+అశనంబున్+ఐ = మితాహారస్వీకారం కలిగి; ఇళన్ = ఇళ అనేనాడి ద్వారా; అంతరాత్మున్ = జీవుడిని; చూచుచున్ = కనుగొంటూ; ఎడ+చొచ్చిన = నడుమ ప్రవేశించిన; విఘ్నవిశేషమున్ = అంతరాయ పరంపరను, ఆటంకాలను; ధృతిన్ = ధైర్యంతో; త్రోచుచున్ = నెట్టివేస్తూ, తొలగించుకొంటూ; భక్తియుక్తికిన్ = తాను భక్తి భావంతో కూడి ఉండటానికి; గురుండు = తన ఆచార్యుడు; ప్రమోదమయుండు+కాఁగన్ = సంతోషభరితుడు కాగా; తద్+గోచరతన్ = ఆ గురుడి దృష్టికి గోచరమయ్యేటట్లు; చరింపఁగన్ = మెలగితే; అకుంఠిత = మొక్కవోవని; మోక్షసుఖంబు = మోక్షానందం; చొప్పడున్ (చొప్పు+పడున్) = లభిస్తుంది, సమకూడుతుంది.

**తాత్పర్యం:** పరిశుద్ధత, బ్రహ్మచర్యవ్రతం, అంతరింద్రియ నిగ్రహం, మితమైన ఆహారస్వీకారం కలిగి ఇళానాడి ద్వారా ఆత్మను అవలోకిస్తూ నడుమ నడుమ సంభవించే విఘ్నపరంపరను ధైర్యంతో తొలగదోస్తూ, తన భక్తి భావనకు గురుడు సంతసించగా, అతడి పర్యవేక్షణలో మెలగటం వలన మొక్కవోని మోక్షానందం లభిస్తుంది.

**తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మ । లంబు నవ్యయమును నచలంబు ఘనము**
**నై జరావ్యాధి మరణ జన్మాది దుఃఖ । బహుళ సంసార చక్రంబుఁ బాపనేర్చు.' 226**

**ప్రతిపదార్థం:** అది = ఆ మోక్షధర్మం; సదా+అభ్యాస కలనన్ = నిరంతరం అభ్యాసం చేయటం వలన; అతి+అంత+నిర్మలమున్ = మిక్కిలి స్వచ్ఛమైనదీ; అవ్యయమునున్ = తరుగనిదీ; అచలంబున్ = చలింపనిదీ; ఘనమున్ = దొడ్డదీ; ఐ = అయి; జరా = ముసలితనం, వార్ధక్యం; వ్యాధి = రోగం, మరణ = చావు, మృతి; జన్మ = పుట్టుక, జననం; ఆది = మొదలైన; దుఃఖబహుళ = దుఃఖాలచేత నిబిడమైన, సాంద్రమైన, దట్టమైన; సంసార చక్రంబున్ = పరిభ్రమణశీలమైన సంసారమండలం నుండి; పాపన్+నేర్చున్ = తొలగించగలదు.

**తాత్పర్యం:** అంబికా! మోక్షధర్మం నిరంతరాభ్యాసంవలన మిక్కిలి నిర్మలమైనది. తరుగనిది, చలించనిది; దొడ్డది. అది ముసలితనం, రోగం, జననం, మరణం మొదలైన దుఃఖాలతో నిండిన సంసారచక్రంలో జీవి చిక్కకుండ చేయగలదు.

**వ. అని యుపదేశించి వెండియు. 227**

**తాత్పర్యం:** అని పరమశివుడు గౌరికి బోధించి మరలా ఇట్లా అన్నాడు.

**క. 'విను సంసారమునకు విసు । వని మర్త్యుఁడు శోకమోహ వశగతుఁడై మో**
**క్షనిరూఢిఁ బడయ నేరఁడు । మనము విరక్తముగ విసివి మఱి ముక్తి గనున్. 228**

**ప్రతిపదార్థం:** విను = గౌరీ! ఆలకించుము; సంసారమునకున్ = జనన మరణరూపమైన సంసారానికి; విసువని = విసుగుచెందని; ఛీయని రోయని; మర్త్యుఁడు = మనుజుడు; శోకమోహవశగతుఁడు+ఐ = శోకమునకూ, వ్యామోహమునకూ అధీనుడై; మోక్షనిరూఢిన్ = ముక్తి వలన ప్రసిద్ధిని, మోక్షసంపదను; పడయన్+నేరఁడు= పొందలేడు; మనము = తన మనస్సు; విరక్తముగన్ = ప్రాపంచిక విషయములందు అపేక్షలేనిదౌతూ; విసివి = వేసట చెంది, నిర్వేదము పొంది; మఱి = ఆవల; ముక్తిన్+కనున్ = మోక్షాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** 'దేవీ! సంసారమందు విరక్తి చెందని మనిషి శోకమోహాలకు అధీనుడై ముక్తిని పొందలేడు. తన మనసు ప్రాపంచిక విషయా లనుభవించి, అనుభవించి విసిగి వేసారి విరక్తి పొందినపుడే మోక్షాన్ని పొందగలడు.

**వ. అట్టిదశ చింతా వివర్జనంబునను, భూతాస్థిరత్వ జ్ఞానంబునను, దృష్ణారాహిత్యంబునను గాని కలుగదు గావున వాని భంగులు ప్రకటించెద. 229**

**ప్రతిపదార్థం:** అట్టిదశ = వైరాగ్యం; చింతా వివర్జనంబుననున్ = చింతను వదలుట చేతనూ, భూత+అస్థిరత్వ జ్ఞానంబుననున్ = ప్రాణికోట్లు శాశ్వతంగా ఉండవనే వివేకం వలననూ; తృష్ణారాహిత్యంబుననున్ = ఆశను వీడుట చేతనూ; కాని = తప్ప; కలుగదు = సంభవించదు; కావునన్ = కనుక; వాని భంగులు = వాటి తీరులు; ప్రకటించెదన్ = వెల్లడిస్తాను, చాటుతాను.

**తాత్పర్యం:** గిరిజా! సంసార వైరాగ్యం అనేది చింతను మానడం వలన, భూతములు శాశ్వతములు కావు అనే వివేకం వలన, ఆశను వీడటం వలనగాని కలుగదు. కనుక ఆ మూటి స్వరూప మెట్లాంటిదో వివరిస్తాను. సావధానచిత్తవై ఆకర్ణించుము.

**సీ. ధనములు చెడిన బాంధవులు సచ్చినఁ దదీ । యములగు గుణముల యందు మనసు**
**వెట్టక యున్నది యెట్టన్న వగచినఁ । దాపంబు వొందుట దక్క నొండు**

**గలుగునే సుఖము దుఃఖంబును దోడివ । యవి మార్చి వచ్చుచు నరుగుచుండుఁ**
**గేవల సుఖము లే దా వాసవునకైనఁ । జేటు దృశ్యములకు సిద్ధ మగుట**

**తే. మున్న కనియున్న వగ చిత్తమున జనింప । దరయఁ గీడు పరిగ్రహ మది సమగ్ర**
**మైనతఁడు పొత్తినూలి ప్రువ్వట్ల తాన । తనకు బంధంబు గావించికొను లతాంగి! 230**

**ప్రతిపదార్థం:** లతా+అంగి! = తీగవంటి మేను గలదానా!; ధనములు చెడినన్ = విత్తం నశించినా; బాంధవులు = చుట్టాలు; చచ్చినన్ = మరణించినా; తదీయములు+అగు = ఆ బాంధవులకు సంబంధించిన; గుణములయందున్ = సత్స్వభావములందు; మనసు = చిత్తమును; పెట్టక+ఉన్న+అది = నిలుపకుండా ఉండాలి (పోయిన చుట్టాలను స్మరిస్తూ ఉండకూడదు); ఎట్టు+ అన్నన్ = ఎందుకంటే; వగచినన్ = వారికై దుఃఖిస్తే; తాపంబు+పొందుట+తక్కన్ = వేదన చెందటమే తప్ప, బాధ పడటమే తప్ప; ఒండు+కలుగును+ఏ = మరొక్క ప్రయోజనమున్నదా?; సుఖము = సౌఖ్యమూ; దుఃఖంబును = శోకమూ; తోడివి+ అ = వెంటనుండేవే; అవి = ఆ హర్షశోకాలు, మోదఖేదాలు; మార్చి = ఒకదాని తర్వాత మరొక్కటిగా, వచ్చుచున్+అరుగుచున్+ ఉండున్ = వస్తూ పోతూ ఉంటాయి; ఆ వాసవునకున్+ఐనన్ = ఆ దేవేంద్రుడికైనా; కేవల సుఖములేదు = అచ్చంగా సుఖమే కలగటం లేదు; దృశ్యములకున్ = కంటికి కనపడేవాటికెల్ల; చేటు = వినాశం; సిద్ధము+అగుట = నిర్ణయించబడి ఉండటం; మున్న = ముందే; కని+ఉన్నన్ = తెలిసి ఉంటే; చిత్తమునన్ = మనసులో; వగ = దుఃఖం; జనింపదు = పుట్టదు; అరయన్ = ఆలోచిస్తే; పరిగ్రహము = ఇతరులనుండి స్వీకరించటం; కీడు = హాని; అది సమగ్రము+ఐనన్= అది పూర్ణమైతే; అతఁడు = దానం గైకొన్నవాడు; పొత్తినూలిప్రువ్వు+అట్లు+అ = పట్టుకాయలోని పురుగుమాదిరి; తనకున్+తాను+అ = తనకు తానే; బంధంబు+కావించికొనున్ = కట్టిపడవేసికొంటాడు.

**తాత్పర్యం:** మహాదేవీ! ధనం పోయినా, చుట్టాలు చనిపోయినా, వారి గుణాలు తలచుకొని మనసున చింతించకుండటం మంచిది. ఎందుకనగా అట్లా దుఃఖించడం వలన తన శరీరానికి బాధతప్ప మరో ప్రయోజనం లేదు. సుఖదుఃఖాలు జంట బాయనివి. అవి ఒక దాని తర్వాత మరొకటిగా వస్తూ పోతూ ఉంటాయి. దేవేంద్రునంతటి వాడుకూడా సుఖం మాత్రమే పొందటం లేదు. దుఃఖం గూడ అనుభవిస్తున్నాడు. దృగ్గోచరములైన పదార్థము లన్నింటికీ వినాశం తప్పదు అన్న విషయం తెలిస్తే మనసులో దుఃఖం కలుగదు. పరులవలన వస్తువులు స్వీకరించటం హానికరం. పరిగ్రహమే వృత్తిగా పెట్టుకొన్నవాడు పట్టుకాయలోని పురుగు తన దారాలతో తన్ను బంధించుకొని చెడునట్లు చెడిపోతాడు.

**విశేషం:** అలం: పొత్తినూలి ప్రువ్వట్లు అనుచోట ఉపమాలంకారం.

**ఆ. విను ధనార్జనంబు ధనరక్షణంబు ధ । నవ్యయంబు ధనవినాశనముఁ బ్ర**
**గాఢ దుఃఖదములు గావున దుఃఖభా । జనము ధనము గాల్చు మనఁగ వలయు. 231**

**ప్రతిపదార్థం:** విను = ఆలకించుము; ధన+ఆర్జనంబు = ద్రవ్యం సంపాదించటం; ధనరక్షణంబు = ఆర్జించిన విత్తాన్ని కాపాడటం; ధనవ్యయంబున్ = డబ్బును వెచ్చించటం; ధనవినాశనమున్ = సొమ్ముపోవటం; ప్రగాఢ దుఃఖదములు = అత్యంత దుఃఖాన్ని కలిగిస్తాయి. కావునన్ = కాబట్టి; ధనము = సొత్తు; దుఃఖభాజనము = దుఃఖానికి పాత్రం; కాల్చుము+అనఁగన్+వలయున్ = అట్టి డబ్బును తగులబెట్టుమని చెప్పవలె.

**తాత్పర్యం:** దేవీ! శ్రద్ధగా వినుము. ధనం సంపాదించటం, కాపాడటం, వ్యయపరచటం, నాశనం కావటం అన్నవి తీవ్రదుఃఖాన్ని కలిగిస్తాయి. కనుక ఇన్ని దుఃఖాలకు మూలమైన డబ్బును తగులబెట్టుమని చెప్పటం యుక్తం.

**క. రమణీ! తృష్ణాసమ దుః । ఖమును బరిత్యాగ సమ సుఖముఁ గలవే? కా**
**యము ముదిసిన ముదియదు ప్రా । ణము గొని పోఁజాలు తెవులనం జనుఁ దృష్ణన్. 232**

**ప్రతిపదార్థం:** రమణీ! = ఓ అంగనామణీ!; తృష్ణా సమదుఃఖమును = ఆశతో సమానమైన దుఃఖం; పరిత్యాగ సమసుఖమున్ = ఆశను వీడటంతో సమానమైన సుఖం; కలవు+ఏ? = ఉన్నవా? లేవని భావం; కాయము = శరీరం, ముదిసినన్ = ముసలితనం పొందినా; ముదియదు = ఆశ మాత్రం ముసలితనం పొందదు; తృష్ణన్ = ఆశను; ప్రాణము = ఊపిరిని; కొనిపోవన్+చాలు = తీసికొని వెళ్ళేశక్తి కలిగిన; తెవులు = వ్యాధి; అనన్+చనున్ = అని చెప్పవచ్చు.

**తాత్పర్యం:** శైలజా! అశతో సమానమైన దుఃఖం, ఆశను వదలటంతో సమానమైన సుఖం లేనే లేవు. ఆశ అనేది మనుష్యుడి శరీరం ముదిమిని పొందినా తాను మాత్రం ముదిమిని పొందదు. ఆశను ప్రాణాలు తీయగల ఘోరరోగం అని చెప్పవచ్చును.

**క. కామములు భోగములఁ దెగు । నే? మెలఁతుక! నేత నాఱునే చిచ్చు ధృతిం**
**గామములఁ దొఱఁగు సౌఖ్యము । నేమెయి సౌఖ్యములుఁ బోలునే యరయంగన్. 233**

**ప్రతిపదార్థం:** మెలఁతుక! = ఓ వనితారత్నమా!; కామములు = కోరికలు, విషయతృష్ణలు; భోగములన్ = అనుభవించటం వలన; తెగును+ఏ? = నశించునా? నశించవని భావం; చిచ్చు = అగ్ని; నేతన్ = నేతితో, ఆజ్యంతో; ఆఱును+ఏ? = చల్లారునా? అరయంగన్ = పరికించగా, భావించగా, ఆలోచించగా; ధృతిన్ = ధైర్యంతో; కామములన్ = వాంఛలను; తొఱఁగు సౌఖ్యమున్ = వీడుటవలన లభించే సుఖాన్ని; ఏ+మెయిన్ = ఏ విధంగానూ; సౌఖ్యములు = సుఖాలు; పోలును+ఏ? = సరిపోలగలవా? సాటి కాజాలవని తాత్పర్యం.

**తాత్పర్యం:** ఉమా! కోరిక లెప్పుడూ అనుభవించటం చేత తీరనే తీరవు. ఆజ్యధారలవలన అగ్ని చల్లారదు. చల్లారకపోగా అంతకంతకూ హెచ్చుతుంది. ధైర్యంతో ఆశలు త్యజించటం వలన లభించే సౌఖ్యానికి ఏ విధంగాను సుఖాలు దీటుకాలేవు.

**విశేషం:** "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే." (శ్రీమద్భాగవతమ్. 9-19-14.)

అనుభవిస్తూ ఉంటే కామం ఎన్నటికీ శమించదు. అగ్నిలో నెయ్యి వేసిన చందంగా అది వృద్ధి చెందుతూనే ఉంటుంది.

**క. విచ్చలవిడి నింద్రియముల । నెచ్చటికైనను జనంగనిచ్చిన నరకం**
**బచ్చువఱుచుఁ; గుదియించినఁ । దెచ్చు సుగతి నరున కది సతీమౌళిమణీ! 234**

**ప్రతిపదార్థం:** సతీమౌళిమణీ! = ఓ పతివ్రతా శిరోరత్నమా!; ఇంద్రియములన్ = కన్ను ముక్కు చెవి మొదలుగా గల ఇంద్రియాలను; విచ్చల విడిన్ = స్వేచ్ఛగా, నిరాటంకంగా; ఎచ్చటికిన్+ఐననున్ = వాటి ఇష్టం వచ్చిన తావుకు; చనన్+కన్+ఇచ్చినన్ = పోనిస్తే; నరకంబున్ = పాపమును; అచ్చు+పఱుచున్ = కలిగిస్తాయి; కుదియించినన్ = అణచివేస్తే, వశపరచుకుంటే; అది = ఆ యింద్రియ నిగ్రహం; నరునకున్ = మానవుడికి; సుగతిన్ = ఉత్తమగతిని, పుణ్యస్థితిని; తెచ్చున్ = కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** ఓ సాధ్వీశిరోమణీ! ఇంద్రియాలను వాటి ఇష్టప్రకారం ఎచటికైనా పోనిస్తే అవి నరకాన్ని సమకూరుస్తాయి. అట్లా వాటిని స్వేచ్ఛా సంచారానికి అనుమతించక అణచివేస్తే (నిరోధిస్తే) అవి జనుడికి సద్గతి లభింపజేస్తాయి.

**తే. కామరసమున నతితృష్ణుఁడై మనుష్యుఁ । డర్థతృష్ణా పరీతాంతరంగుఁ డైన**
**గొఱియ నడవిలో నెత్తెడు కోలుపులియుఁ । బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి!' 235**

**ప్రతిపదార్థం:** దేవి = ప్రియురాలా!; మనుష్యుఁడు = మానవుడు; కామరసమునన్ = కామమనెడు రుచిగల పదార్థమందు; అతితృష్ణుఁడు+ఐ = మిక్కిలి ఆశకలవాడై; అర్థతృష్ణాపరీత = ధనమందలి అశతో ఆవరించబడిన, ఆక్రమించబడిన; అంతరంగుఁడు+ఐనన్ = మనసుగల వాడైతే; అడవిలోన్ = అరణ్యంలో; గొఱియన్ = గొర్రెను; ఎత్తెడు = హరించునట్టి; కోలుపులియున్+ పోలెన్ = పెద్దపులిమాదిరి, బెబ్బులి వలె; మృత్యువు = మిత్తి; అతనిన్ = కామదాహం, ధనదాహం గలనరుడిని; కొనిపోవున్ = తీసికొని వెళ్ళుతుంది.

**తాత్పర్యం:** విషయాభిలాషతో, ధనాశతో నిండిన మనసుగల మానవుడిని అడవిలో గొర్రెను అపహరించే బెబ్బులి మాదిరి మృత్యువు తన వెంట కొనిపోతుంది.'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని పలికి 'జరామృత్యువులఁ ద్రోవం జాలు మేలెయ్యది యంటేనిఁ జెప్పెద నాకర్ణింపు' మనుపలుకు పలికి యిట్లనియె. 236**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని చెప్పి; జరామృత్యువులన్ = ముసలితనమును, మరణమును; త్రోవన్+చాలు = తరుమ గొట్టగల; మేలు = వరము, మంచి పని; ఏ+అది(ఎయ్యది) = ఏది; అంటి+ఏనిన్ = అన్నచో; చెప్పెదన్ = వచిస్తాను; ఆకర్ణింపుము = వినుము; అనుపలుకు = ఆనుమాట పలికి, ఇట్లు+అనియెన్ = శివుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పరమేశ్వరుడు పార్వతి కట్లు వచించి 'ముసలితనమునూ, మరణాన్ని తరుమగొట్టగల క్షేమంకరమైన మంచిపని ఏది అని అడిగినచో చెప్పుతాను విను' మని ఇట్లా అన్నాడు.

**తే. 'ధనములును దానములుఁ దపోధనము వాజి । పేయ రాజసూయంబులు వేయు నోపి**
**చేయుటలు గావు మోక్షదర్శిత్వ మొకఁడ । మందు జరకు మృత్యువునకు నిందువదన! 237**

**ప్రతిపదార్థం:** ఇందువదన! = జాబిలివంటి మోము గలదానా!; ధనములును = విత్తములు; దానములున్ = వితరణములు, ఈవులు; తపోధనమున్ = తపస్సనెడు ధనం, తపశ్చర్య; వాజిపేయ రాజ సూయంబులున్ = అశ్వమేధ రాజసూయాది యాగాలు; వేయున్ = వెయ్యి; ఓపి+చేయుటలు = సమర్థతతో సల్పుటలు; జరకున్ = ముదిమికీ; మృత్యువునకున్ = మిత్తికీ; మందు = నివారకమైన ఔషధం; కావు = కాజాలవు; మోక్షదర్శిత్వము+ఒకఁడు+అ = మోక్షమును దర్శించటమన్నది ఒక్కటే; మందు = జరామరణాలను మాన్పే ఔషధం.

**తాత్పర్యం:** 'చంద్రముఖీ! ధనాలు, దానాలు, తపస్సులు, అశ్వమేధ రాజసూయయాగాలు ఇవేవీ జరామరణాలను కలుగకుండా చేయలేవు. ముక్తి ఒక్కటే ముసలితనాన్నీ మరణాన్నీ మాన్పుటకు తగినమందని గ్రహించుము.

**తే. జాములును దివసములు మాసములు నేండ్లు । నైన కాల మాయువుగొని యరుగుచుండు;**
**నెల్లి చేయుపనులు నేఁడ యింతి! మా పొ । నర్చుపని రేప చేయుట నామతంబు. 238**

**ప్రతిపదార్థం:** ఇంతి! = ఓ పడతీ!; జాములును = యామములు; దివసములున్ = దినములు; మాసములున్ = నెలలు; ఏండ్లున్ = సంవత్సరాలు; ఐనకాలము = ఈ రీతిగా ఉన్న కాలం; ఆయువున్ = ఆయుస్సును; కొని = గ్రహించి; అరుగుచున్+ఉండున్ = పోతూ ఉంటుంది; ఎల్లి చేయుపనులు = రేపు చేసే కార్యాలు; నేఁడు+అ = ఈనాడే; మాపు+ఒనర్చుపని = సాయంకాలం చేసేపని; రేపు+అ = ఉదయమే; చేయుట = సల్పటం; నామతంబు = నా ఆశయం, నాపద్ధతి, నా కిష్టం.

**తాత్పర్యం:** తరుణీ! జాములు, దినములు, నెలలు, సంవత్సరాలు ఈ రూపంతో ఉన్నకాలం జీవుల ఆయుస్సును హరించుకొని ముందుకు సాగిపోతూ ఉంటుంది. రేపు చేసేపని ఈ రోజు, సాయంకాలం చేయవలసిన పని ఉదయమే చేయటం నాకిష్టం.

**విశేషం:** జాము అనగా యామం. ఏడున్నర గడియలకాలం ఒక జాము. జామునకు 3 గంటలు. పగలు నాల్గుజాములు, రేయి నాల్గుజాములు చేరితే ఒక రోజు. ఇరవైనాలుగు గంటలు.

**తే. మేలు గడువేగ చేయరు కాలపాశ । బద్ధులై యేమఱుటఁజేసి పడఁతి! మనుజు**
**లింత యెఱుఁగుట సంసార మెడలఁద్రోచు । నట్టి విసువుటఁ బుట్టించునది హితంబు. 239**

**ప్రతిపదార్థం:** పడఁతి! = ఓ చెలువా!; మనుజులు = నరులు; కాలపాశబద్ధులు+ఐ = కాలమనే త్రాటిచేత బంధించబడిన వారై; ఏమఱుటన్+చేసి = పరాకు వహించటం వలన, జాగరూకులు కానందున, కాలప్రభావ మెట్టిదో మఱచినందున; మేలు = మంచిపని; కడువేగ = మిక్కిలి తొందరగా; చేయరు = ఆచరించరు; ఇంత+ ఎఱుఁగుట = కాలం ఆయుస్సును హరిస్తుందన్న విషయం గ్రహించటం; సంసారము = సంసారాన్ని; ఎడలన్+త్రోచునట్టి = తొలగించేటటువంటి; విసువుటన్ = విరక్తిని; పుట్టించున్ = జనింపచేస్తుంది; అది హితంబు = ఆ వైరాగ్యమే మేలు సమకూరుస్తుంది.

**తాత్పర్యం:** మనుష్యులు కాలాధీనులై ఏమరుపాటు వహించి మంచి పనులు మిక్కిలి తొందరగా చెయ్యరు. కాలం ఆయుస్సును హరిస్తుందన్న విషయం తెలిసికొనటంచేత సంసారమందు వైరాగ్యం కలుగుతుంది. ఆ విరక్తియే ముక్తికి సాధనమై మేలు చేకూరుస్తుంది.

**విశేషం:** "అమానిత్వమదంభిత్వం అహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః " (భగ. 13-8)

"ఇంద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్.'' (భగ. 13-9)

"అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు.'' (భగ. 13-10)

ఇట్లా అమానిత్వాది గుణసంపత్తి మోక్షసాధనంగా గీత నుడివింది. ఆ యీ విషయాలే ఇక్కడ ప్రశంసించబడ్డాయి.

**వ. ఇవ్విధంబున. 240**

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఈ తెరువు లాదరింపఁగఁ । జేతోగతికిని విమర్శసిద్ధి యొదవుఁ ద**
**జ్జాత విరక్తియు ముక్తికి । నా తెరువ సమీపవర్తి యచలేంద్రసుతా! 241**

**ప్రతిపదార్థం:** అచల+ఇంద్రసుతా! = శైలరాజపుత్రీ!; ఈ తెరువులు = ఈ మార్గాలు; ఆదరింపన్+కన్ = అంగీరించటం వలన, పాటించటం వలన; చేతోగతికిన్ = మనఃప్రవృత్తికి; విమర్శసిద్ధి = పరిశీలన శక్తి; ఒదవున్ = లభిస్తుంది; తత్+జాత = యుక్తాయుక్తపరిశీలనాశక్తివలన కలిగిన; విరక్తియున్ = వైరాగ్యం; ముక్తికిన్ = మోక్షానికి; ఆతెరువు+అ = ఆ దారియే; సమీపవర్తి = చేరువలో ఉన్నట్టిది.

**తాత్పర్యం:** పై నుడివిన మార్గా లనుసరిస్తే మనసునకు విమర్శనా పరిజ్ఞాన మేర్పడుతుంది. దాని వలన వైరాగ్యం సిద్ధిస్తుంది. ఆ విరక్తి మార్గమే ముక్తికి చేరువైన దారి.

**క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ । గారణము; ప్రశాంతి ముక్తిఁ గను; మోక్షానం**
**దారాము జరామృత్యువు । లేరూపునఁ జేర నేర విద్ధచరిత్రా!.' 242**

**ప్రతిపదార్థం:** ఇద్ధ చరిత్రా! = ప్రకాశమానమైన నడవడికలదానా!; వైరాగ్యంబు = విషయవాంఛారాహిత్యం; ప్రశాంతికిన్ = మనోజయానికి; కారణము = హేతువు; ప్రశాంతి; ముక్తిన్ = మోక్షమును; కనున్ = దర్శిస్తుంది; మోక్ష+ఆనంద+ఆ రామున్ = మోక్షానందమందు క్రీడించే వాడిని; జరామృత్యువులు = వార్ధకం, మరణం; ఏరూపునన్ = ఏ విధంగానైనా; చేరన్ నేరవు = సమీపించలేవు.

**తాత్పర్యం:** ఓ పవిత్ర చరిత్రురాలా! ప్రాపంచిక వస్తు వ్యామోహం లేనివాడికి మనోజయం సిద్ధిస్తుంది. దాని వలన ముక్తి లభిస్తుంది. జరామరణాలు మోక్షానందంలో తేలియాడే వాడి చెంతకు చేరలేవు.'

**క. అని చెప్పి మఱియు శివుఁ డి । ట్లను హిమగిరిసుతకు 'సాంఖ్య మమలినహృదయా!**
**విను వివరించెద; సంసృతి । యను రోగంబునకు వైద్య మది యరయంగన్. 243**

**ప్రతిపదార్థం:** అని చెప్పి = అని పలికి; మఱియున్ = ఇంకనూ; శివుఁడు; హిమగిరి సుతకున్ = మంచుకొండ కొమార్తె అయిన అంబికకు; ఇట్లు+అనున్ = ఇట్లా అన్నాడు; అమలిన హృదయా! = నిర్మలమైన మనస్సుగల దేవీ!; సాంఖ్యమున్ = సాంఖ్యయోగాన్ని; వివరించెదన్ = వ్యాఖ్యానిస్తాను; విను = ఆకర్ణించుము; సంసృతి+అను = సంసారమనే; రోగంబునకున్ = వ్యాధికి; అది = సాంఖ్యము; వైద్యము = మందు, చికిత్స.

**తాత్పర్యం:** అని పలికి పరమేశ్వరుడు పార్వతితో మళ్ళీ ఇట్లా అన్నాడు. 'స్వచ్ఛమైన హృదయం గల గౌరీ! సాంఖ్యమును గూర్చి చెప్పుతాను వినుము. అది సంసారమనే రోగానికి తగిన మందు.

**శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట. (సం.13 అను 1-15-4096).**

**ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు పడయుదు । రరసిచూడఁగా నిరర్థకంబు**
**ఘోరతరము నండ్రు శారీరమైన త । పంబుఁ బంచ వింశ భజన మూఁది. 244**

**ప్రతిపదార్థం:** సాంఖ్యులు = జ్ఞానమార్గం అనుసరించేవారు; జ్ఞానమునన్ = అధ్యాత్మ జ్ఞానంచేత; విముక్తిన్ = మోక్షాన్ని; పడయుదురు = పొందుతారు; పంచవింశభజనంబు+ఊఁది = ఇరువదైదవదైన ఆత్మ యొక్క సేవను ఎగురగొట్టి, మాని; శారీరము+ఐన+తపంబు = దేహసంబంధమైన తపస్సు; అరసిచూడఁగాన్ = పరామర్శిస్తే, పరిశీలిస్తే; నిర్+అర్థకమున్ = ప్రయోజన శూన్యం; ఘోరతరమున్ = మిక్కిలి దారుణం; అం(డు = అని చెప్పుతారు.

**తాత్పర్యం:** సాంఖ్యమతావలంబులు జ్ఞానంవలన మోక్షం పొందుతారు. పరామర్శిస్తే ఆత్మను సేవించటం మాని శారీరకమైన తపస్సు చేయటంవలన ప్రయోజనం ఉండదు. అది పరమప్రయాసకరం కూడ అని చెప్పుతారు.

**సీ. ప్రకృతి కవ్యక్తనామకమును గల; దందు । మహదహంకార తన్మాత్రలును మ**
**నము నింద్రియములు భూతములు జన్యములుగా । నోలిన యిరువది నాలు గయ్యెఁ;**
**బంచవింశక తత్త్వభావితక్షేత్ర మా । తత్త్వ సంతానంబు సత్త్వమును ర**
**జస్సుఁ దమస్సు నాఁ జను నిజగుణములఁ । బ్రకృతిదాఁ గరణ రూపములు గాఁగఁ**

**ఆ. గొని సృజించు లోకకోటి నయ్యవ్యక్త । మణువు నిత్య మేక మక్రియం బ**
**హైతుకంబు చక్షురాదుల కగ్రాహ్య । మది ప్రధాన మనఁగ నతిశయిల్లు. 245**

**ప్రతిపదార్థం:** ప్రకృతికిన్ = ప్రకృతికి; అవ్యక్తనామకమును+కలదు = అవ్యక్త మనే పేరున్నూ ఉన్నది; అందున్ = ఆ అవ్యక్తమందుండి; మహత్ = మహత్తు; అహంకార = అహంకారం; తన్మాత్రలును = శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనేవి; మనమున్ = మనస్సు; ఇంద్రియములు = జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు మొత్తం పది; భూతములున్ = పంచభూతాలు అనగా పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము; జన్యములు+కాన్ = జనించగా; ఓలిన్ = క్రమంగా; ఇరువదినాలుగు+అయ్యెన్ = చతుర్వింశతి సంఖ్యగలవి అయ్యాయి; పంచవింశకతత్త్వ = ఇరువదైదవతత్త్వమైన ఆత్మచేత; భావిత = ఆదరించబడిన; క్షేత్రంబు = ప్రకృతి; ఆతత్త్వసంతానంబున్ = ఆ

యిరువది నాల్గుతత్త్వాల సముదాయాన్ని; సత్త్వమును = సత్త్వగుణమూ; రజస్సున్ = రజోగుణమూ; తమస్సున్ = తమోగుణమూ; నాన్ = అనగా; చను = ఒప్పునట్టి; నిజగుణములన్ = తన గుణాలతో; ప్రకృతి తాన్ = ఆ ప్రకృతి; కరణరూపములు కాఁగన్+కొని = కార్యసాధనములు కాగా గైకొని; లోకకోటిన్ = జీవరాసులను, భూతజాలమును; సృజించున్ = జనింపజేస్తుంది; ఆ+అవ్యక్తము = ఆ ప్రకృతి అనేది; అణువు = సూక్ష్మమైనది; నిత్యము = శాశ్వతము; ఏకము = ఒక్కటే, అద్వితీయం; అక్రియంబు = కార్యరూపం కానట్టిది; అహైతుకంబు = కారణం కానట్టిది; (ఆ ప్రకృతి కార్యకారణములకు అతీతమైనది); చక్షుః+ఆదులకున్ = కన్ను మొదలైన ఇంద్రియాలకు; అగ్రాహ్యము = గ్రహింపరానిది, గోచరము కానట్టిది; అది = ఆ ప్రకృతి; ప్రధానము+అనఁగన్ = ప్రధానమనే పేరుతో; అతిశయిల్లున్ = ఒప్పారుతుంది. (ప్రకృతికే అవ్యక్తమనీ, ప్రధానమనీ పేర్లు).

**తాత్పర్యం:** ప్రకృతికి అవ్యక్తమనే పేరు కూడా ఉన్నది. అందుండి మహత్తూ, అహంకారం, శబ్దాదులైదూ, మనస్సూ, జ్ఞానేంద్రియాలు ఐదూ, కర్మేంద్రియాలు ఐదూ, పంచభూతాలు జన్మించగా మొత్తం ఇరువది నాల్గుతత్త్వాలైనాయి. ఇరువదైదవతత్త్వం ఆత్మ. ఇట్టి ఆత్మకు స్థానమై ప్రకృతి నిజగుణాలైన సత్త్వరజస్తమస్సులను సాధనాలుగా గ్రహించి లోకాలను సృష్టిస్తుంది. అవ్యక్త మనేది ఎట్టిదనగా అది పరమాణువు. శాశ్వతం. ఏకం, కార్యరూపం కాదు; కారణరహితమైనట్టిది. అది ఇంద్రియాలకు గోచరించదు. ప్రధానమనే పేరుతో అది విలసిల్లుతుంది.

**తే.** **సౌఖ్యతుష్టిప్రకాశముల్ సాత్త్వికములు । మోద ఖేదాదిక ద్వంద్వములు లతాంగి!**
**రాజసము లప్రకాశ సంత్రాస మోహ । ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు.** **246**

**ప్రతిపదార్థం:** లతా+అంగి! = తీగవంటి శరీరముగల దేవీ!; సౌఖ్యతుష్టి ప్రకాశముల్ = సుఖం, సంతృప్తి, పదార్థవిజ్ఞానం అనే గుణాలు; సాత్త్వికములు = సత్త్వమునకు సంబంధించినట్టివి; మోదఖేద = సంతోషం, దుఃఖం; ఆదిక = మొదలైన; ద్వంద్వములు = జంటలు; రాజసములు = రజోగుణ సంబంధులు; అప్రకాశ = జ్ఞానరాహిత్యం; సంత్రాస = భయం; మోహములు = విపరీతజ్ఞానం; తంద్రయున్ = సోమరితనం; తామసములుగన్ = తమోగుణప్రధానాలుగా; ఎఱుఁగు = తెలియుము.

**తాత్పర్యం:** సౌఖ్యం,సంతృప్తి,వివేకం సత్త్వగుణానికి సంబంధించిన లక్షణాలు. సంతోషం,దుఃఖం మొదలైన ద్వంద్వాలు రజోగుణ ప్రధానాలు; జ్ఞానరాహిత్యం, భీతి, విపరీతజ్ఞానం, సోమరితనం అనేవి తమోగుణ ప్రధానాలని గ్రహించుము.

**విశేషం:** "సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః,
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్.'' (భగ. 14-5)

సత్త్వరజస్తమోగుణాలు ప్రకృతికి సహజమైనగుణాలు. ప్రకృతి పరిణామమే శరీరం. కనుక ఆ మూడు గుణాలు దేహాన్ని ఎప్పుడూ వదలవు. అవి నాశరహితుడైన జీవుడిని దేవమనుష్యాది శరీరాలలో బంధిస్తున్నాయి.

"తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్,
సుఖ సంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ.'' (భగ. 14-6)

సత్త్వమనే గుణం నిర్మలమైనది; జ్ఞాన ప్రకాశకం. అది జీవుడికి జ్ఞానమందు, సుఖమునందు ఆసక్తిని రేకెత్తిస్తుంది. అందు చేత పురుషుడు వైదిక కర్మలలో ప్రవర్తించి ఆ కర్మఫలాలు అనుభవించడానికి జన్మలెత్తుతాడు. ఈ రీతిగా సత్త్వగుణం కూడా సంసారబంధ కారణమే.

"రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్." (భగ. 14-7)

రజోగుణం స్త్రీపురుషుల ప్రేమకు కారణం. అది ఇంద్రియార్థములందూ, దారపుత్రమిత్రాదులందు ఆసక్తిని కలిగిస్తుంది. అందుచేత పురుషుడు కర్మ లాచరిస్తాడు. ఫలానుభవానికై జన్మిస్తుంటాడు. ఇట్లా రజోగుణం కూడా బంధకమే అవుతున్నది.

"తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత." (భగ. 14-8)

తమోగుణం విపరీత జ్ఞానం వలన పుట్టి విపరీత జ్ఞానాన్ని కల్గిస్తుంది. ఇది జీవికి ఏమరుపాటునూ, సోమరితనాన్నీ, నిద్రనూ కలిగిస్తూ సంసార బంధహేతు వవుతున్నది.

"సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత." (భగ. 14-9)

సత్త్వగుణం సుఖాసక్తిని, రజోగుణం కర్మాసక్తినీ, తమోగుణం విరుద్ధ కార్యప్రవృత్తిని కల్గిస్తున్నాయి.

"రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా." (భగ. 14-10)

ఈ త్రిగుణాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క సమయాన మిగిలిన రెండు గుణాలను మించిపోయి తన పనిని తాను సాధిస్తుంది - అన్న భగవద్గీతార్థములే ఇక్కడ చెప్పబడ్డాయి.

**క. ధృతి విజ్ఞాన శ్రద్ధలు । నతివ! యసమ్మోహమును దయయు హర్షము నం**
**చిత సత్త్వ వృద్ధిఁ బరి వ । ర్ధితంబులగు సత్త్వ మరుగఁ దెరలుం దారున్. 247**

**ప్రతిపదార్థం:** అతివ! = ఓ చెలువా!; ధృతి = ధైర్యం; విజ్ఞాన శ్రద్ధలు = శాస్త్రజ్ఞానం, ధర్మకార్యాసక్తి; అసమ్మోహమును = భ్రాంతి లేకుండటం; దయయున్ = కరుణ; హర్షమున్ = సంతోషమూ; అంచిత సత్త్వవృద్ధిన్ = ఒప్పిదమైన సత్త్వగుణం ఉద్రేకించి నప్పుడు; పరివర్ధితంబులు+అగున్ = మిక్కిలి వృద్ధి పొందుతాయి; సత్త్వము = ఆ సత్త్వగుణం; అరుగన్ = అణగి పోగానే; తారున్ = ఆ గుణాలు కూడా; తెరలున్ = తొలగిపోతాయి.

**తాత్పర్యం:** ధైర్యమూ, అనుభవసహితమైన జ్ఞానమూ, శ్రద్ధ, భ్రాంతిరాహిత్యమూ, కరుణ, సంతోషం అనే గుణాలు సత్త్వగుణం ఉద్రేకించి నపుడు మిక్కిలి వృద్ధి చెందుతాయి. ఆ సత్త్వ గుణం అణగినప్పుడు అవి కూడ అణగిపోతాయి.

**క. క్రోధ లోభ కామానృత ద్రోహచింత । తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ**
**జేయు వానికి నెల్ల సంక్షీణ భావ । మావహిల్లు రజఃక్షయ మావహిల్ల. 248**

**ప్రతిపదార్థం:** క్రోధ = కోపం; లోభ = దురాశ, పిసినారితనం; కామ = కామం (రాగం); అనృత = అసత్యం; ద్రోహచింత = పరులకు కీడు తలపెట్టటం; తాపములకున్ = దుఃఖాలు అనే వాటికి; రజః+అభివర్ధనము = రజోగుణముయొక్క

పెరుగుదల; వృద్ధిచేయున్ = వృద్ధిని కల్గిస్తుంది; రజఃక్షయము = రజోగుణవినాశం; ఆవహిల్లన్ = కలుగగా; వానికిన్+ఎల్లన్ = మీద చెప్పబడిన క్రోధాది గుణాలన్నింటికీ; సంక్షీణభావము = తరుగుదల, హీనస్థితి; ఆవహిల్లున్ = కలుగుతుంది.

**తాత్పర్యం:** కోపం, లోభం, కామం, అసత్యం, పరులకు కీడు చేసే తలంపు, దుఃఖం మొదలైనవి కలగటానికి రజోగుణవృద్ధియే కారణం. ఆ రజోగుణం క్షీణిస్తే ఇవన్నీ క్షీణిస్తాయి.

**తే.** **సంశయంబు విషాదంబు జడత నిద్ర । విను తమస్సు వర్ధింపఁగాఁ బెనుపు నొందు**
**నది విహీనతఁ బొందిన నవియు హీన । భావ మొందు వికస్వర పద్మనయన!** **249**

**ప్రతిపదార్థం:** వికస్వర పద్మనయన! = వికసించిన కమలాలవంటి కన్నులు గల శైలజా!; విను = వినుము; సంశయంబు = సందేహం; విషాదంబు = దుఃఖం; జడత = మాంద్యం; నిద్ర = నిదుర; తమస్సు = తమోగుణం; వర్ధింపన్+కాన్ = వృద్ధి నొందించగా; పెనుపున్+ఒందున్ = అవి వృద్ధి చెందుతాయి; అది = తమోగుణం; విహీనతన్+పొందినన్ = క్షీణస్థితిని చెందితే; అవియున్ = ఆ సంశయాది గుణాలన్నీ; హీనభావము+ఒందున్ = క్షీణిస్తాయి.

**తాత్పర్యం:** ఓ పద్మపత్రాక్షీ! సందేహం, దుఃఖం, మాంద్యం, నిద్ర అనేవి తమోగుణంవలన వృద్ధిపొందుతాయి. ఆ తమోగుణం క్షీణిస్తే ఇవీ క్షీణిస్తాయి.

**సీ.** **ఒక్కఁ డొక్కనిచేత నెక్కుచుఁ దఱుగుచుఁ । ద్రిగుణంబులును బ్రవర్తించు; వీన**
**జనితంబులగు ప్రీతి సంతాప మోహాదు । లొదవినఁ దత్తద్గుణోదయములఁ**
**గని యుపేక్షించుచు మనము నూనఁగ నీమి । కార్యంబు ధర్మార్థకామములకు**
**నమర మనుష్య తిర్యగ్జననములకు । మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు**

**తే.** **బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ; । మది వివేక విజ్ఞాన చిహ్నంబు; భూత**
**జని యహంకారమునకు లక్షణ; మహంక । రణము దొఱఁగుట మోక్షకారణము దేవి!** **250**

**ప్రతిపదార్థం:** దేవి! = దాక్షాయణీ!; ఒక్కఁడు = ఒక్కగుణం; ఒక్కని చేతన్ = మరొక్క గుణం చేత; ఎక్కుచున్ = వృద్ధి గాంచుచు; తఱుఁగుచున్ = క్షీణిస్తూ; త్రిగుణంబులును = సత్త్వరజస్తమోగుణాలు మూడున్నూ; ప్రవర్తించున్ = సాగుతుంటాయి; నడుస్తుంటాయి; వీనన్ = ఈ గుణాలవలన; ప్రీతి = సంతోషం, సంతాప = దుఃఖం; మోహ+ఆదులు = భ్రాంతి మొదలైనవి; జనితంబులు+అగున్ = సంభవిస్తాయి; ఒదవినన్ = అట్లా కలుగగా; తత్+తత్+గుణ+ఉదయములన్ = ఆయా గుణముల యొక్క పుట్టుకలను; కని = చూచి; ఉపేక్షించుచున్ = ఉదాసీనభావం వహిస్తూ, ఒప్పరికిస్తూ; మనమున్ = తన మనస్సును; ఊనగనీమి = ఆ గుణకార్యములందు లగ్నం కాకుండా చేయటం; కార్యంబు = కర్తవ్యం; ధర్మ+అర్థ+ కామంబులకున్ = ధర్మ మొనర్చుటకు, సొమ్ము గడించుటకు, కోరిక లనుభవించుటకు; అమర మనుష్య తిర్యక్+జననములకున్ = దేవతలుగా, మానవులుగా, పశుపక్ష్యాదులుగా జన్మించుటకునూ; సత్త్వ+ఆదులు = సత్త్వరజస్తమోగుణాలు; ఓలిన్ = వరుసగా; మూలముల్ = కారణాలు; ఎఱుఁగు = దేవీ! గ్రహించుము; బుద్ధి+అనఁగన్ = బుద్ధి అనేది; మహత్+తత్త్వమునకున్ = మహత్తునకు; నామము = పేరు; అది = అది; వివేక విజ్ఞాన చిహ్నంబు = వివేకమునకు, విజ్ఞానమునకు గుర్తు - అనగా విచారణ సల్పేశక్తికి, శాస్త్రజ్ఞానమునకు గుర్తు; భూతజని = భూతముల యొక్క ఉత్పత్తి; అహంకారమునకున్+లక్షణము = అహంకారమునకు ఆనవాలు, చిహ్నం; అహంకరణము = నేను అనే

అభిమానం; తొఱఁగుట = వదలటం; మోక్షకారణము = ముక్తికి హేతువు.

**తాత్పర్యం:** సత్త్వరజస్తమోగుణాలలో ఒక్కొక్కగుణం ఒక్కొక్కవేళ ఉద్రేకించి తక్కిన రెండు గుణాలను అణచివైచి ప్రవర్తిస్తుంటుంది. ఇట్లా ఆ మూడు గుణాల వృద్ధి క్షయాలు సాగుతూ ఉంటాయి. సత్త్వగుణం విజృంభించినపుడు ఆ గుణ కార్యమైన సంతోషం, రజోగుణాభివృద్ధివలన దుఃఖం, తమోగుణం చెలరేగినపుడు మోహం కలుగుతుంటాయి. ఇట్లా ఆయా గుణవర్ధనంవలన ఆయాగుణాలు సంభవిస్తున్నవనీ, ఇవన్నీ ఆ గుణకార్యాలే అనీ, వాటితో నాకు నిమిత్తం లేదనీ తెలిసి నరుడు ఆ గుణకార్యాలపట్ల ఉదాసీనుడై ఉండాలి. తన మనస్సు ఆయా సుఖ దుఃఖాల యందు నిమగ్నం కాకుండా ఉండేటట్లు జాగ్రత్త వహించటమే అతడి కర్తవ్యం. ఈ గుణత్రయమే ధర్మార్థకామ సంగ్రహణానికీ, దేవమనుష్య పశుపక్ష్యాది జాతులలో జన్మించడానికీ హేతువవుతున్నది. బుద్ధి అనగా మహత్తత్త్వానికి మరొక నామధేయం. అది వివేక విజ్ఞానాలకు గుర్తు. అహంకారం భూతోత్పత్తికి మూలం. అహంకార పరిత్యాగంవలననే ముక్తి లభిస్తుంది.

**ఆ. అన్నియింద్రియముల నడరింప మగుడఁ జే । యంగ మనసు చాలు; నవియు నదియు**
**భూత తద్వికారములును దేహము తద । న్యుండు దానఁ బరఁగి యుండు దేహి. 251**

**ప్రతిపదార్థం:** అన్నిఇంద్రియములన్ = దశేంద్రియాలను, ఇంద్రియాలన్నింటినీ; అడరింపన్ = విషయములందు ప్రవర్తింపచేయుటకూ; మగుడన్+చేయన్+కన్ = నివర్తింపజేయుటకూ, మరలించుటకూ; మనసు = చిత్తం; చాలున్ = సమర్థమై ఉంటుంది; అవియున్ = ఆ యింద్రియాలూ; అదియున్ = ఆ చిత్తమూ; భూత = పృథివ్యప్తేజో వాయ్వాకాశములనే (నేల, నీరు, నిప్పు, గాలి, నింగిఅనే) పంచభూతాలూ; తద్+వికారములును = ఆ పంచభూతగుణములైన శబ్దస్పర్శరూప రసగంధాలున్నూ; దేహము = శరీరమై ఉన్నది; తద్+అన్యుండు = ఆ దేహం కంటె భిన్నుడైన; దేహి = ఆత్ముడు, జీవుడు; దానన్ = ఆ శరీరమందు; పరఁగి ఉండున్ = ఒప్పారుతుంటాడు.

**తాత్పర్యం:** ఇంద్రియాలు విషయాలపై ప్రవర్తిల్లుటకునూ, విషయముల నుండి ఇంద్రియాలను మరల్చుటకునూ మనస్సు సమర్థమై ఉన్నది. ఆ ఇంద్రియాలు, మనస్సు, పృథి వ్యాదిభూత పంచకం, భూతగుణాలైన శబ్దస్పర్శాదులు శరీరం. ఇది జీవుడికంటె భిన్నమైనది. జీవుడు ఈ దేహమనే ఆలయంలో నెలకొని ఉన్నాడని గ్రహించుము.

**క. విను దేహియు దేహము వే । అను నిశ్చయదృష్టి గల్గునాతఁడు చాలున్**
**మనసు మగిడింప నది ని । ర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్. 252**

**ప్రతిపదార్థం:** విను = వినుము; దేహియున్ = జీవుడు; దేహమున్ = శరీరం; వేఱు+అను = ఒక్కటికావు అనే; నిశ్చయదృష్టి = నిర్ణయమునందు చూపు; కల్గు+ఆతఁడు = కలిగినవాడు; మనసున్ = తన మనస్సును; మగిడింపన్+చాలున్ = ఇంద్రియార్థముల నుండి త్రిప్పుటకు సమర్థు డగును-అనగా విషయముల మీదికి పోకుండ చేయగలడు; అది = అట్లామనసును మరలించటం; నిర్మనస్కతన్+పొనర్చి = సంకల్ప వికల్పములు కలుగకుండా చేసి; మోక్షమార్గమున్+చూపున్ = ముక్తి మార్గాన్ని కనబరుస్తుంది.

**తాత్పర్యం:** దేవీ! దేహం, ఆత్మ ఒక్కటికావు-వేరు వేరైనవి అనే నిర్ణయాత్మకమైన దృష్టికలవాడు తన మనస్సును

ఇంద్రియార్థాలనుండి మరలించటానికి శక్తి గలిగి ఉంటాడు. విషయాలనుండి నివృత్తమైన మనస్సు సంకల్పరహితమై ముక్తి మార్గాన్ని కనపరుస్తుంది.

**వ. అప్పుడు ప్రకృతిం దొఱంగి పంచవింశకుండు వెలుంగు; నాతత్త్వంబు పరమ హంసుండనం బరఁగుఁ దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమశాంతి ప్రదంబునై యుండు. 253**

**ప్రతిపదార్థం:** అపుడు = ఆ వేళ, ఆ మోక్షస్థితిలో; ప్రకృతిన్+తొఱంగి = దేహమే నేను అనే అభిమానం వదలి; పంచ వింశకుండు = ఇరువదైదవతత్త్వమైన ఆత్ముడు; వెలుంగున్ = ప్రకాశిస్తాడు; ఆ తత్త్వంబు = ఆ తత్త్వం; పరమహంసుండు+ అనన్+పరఁగున్ = పరమహంసుడనే నామధేయంతో ఒప్పారుతుంది; తద్+విజ్ఞానంబు = ఆ పరమహంస తత్త్వము యొక్క ఎఱుక; శాంతిసాధ్యంబును = మనోనిగ్రహం చేతనే సంపాదించతగినదియూ; పరమశాంతి ప్రదంబున్+ఐ = పరిపూర్ణమైన శాంతినిచ్చేది గానూ; ఉండున్ = ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ ముక్తిదశయందు దేహమే నేననే అభిమానం వదలి ఆత్ముడు ప్రకాశిస్తాడు. ఆ తత్త్వమే పరమహంసు డని చెప్పబడే తత్త్వం. ఆత్మతత్త్వం ఇట్టిదనే యెఱుక మనోజయం వలననే సమకూడుతుంది. అది పరమశాంతిని ప్రసాదిస్తుంది.

**మ. రసగంధాది గుణాలి లేమి నవికారత్వంబునన్ సర్వ సం**
**వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ జక్షుః ప్రభృ**
**త్యసమాలంబితఁ దేజరిల్లు పరమాత్మాఖ్యంబు షడ్వింశకం**
**బు సమత్వంబునఁ జూచు శాంతుఁ డతివా! పొందున్ విమోక్షస్థితిన్.**
**254**

**ప్రతిపదార్థం:** అతివా! = ఓ భామా!; రసగంధ+ఆది = రసం, గంధం మొదలైన; గుణ+ఆలిలేమిన్ = గుణసముదాయం లేనందుననూ; అవికారత్వంబునన్ = పరిణామంలేనందు చేతనూ; సత్వసంవసన వ్యాప్తిన్ = అన్నింటియందునివసించటం, వ్యాపించి ఉండుట చేతనూ; అణుత్వభంగిన్ = సూక్ష్మపరిమాణంలో ఉన్నందుననూ; మహత్వ స్ఫూర్తిన్ = గొప్ప పరిమాణంలోఉన్నందుననూ; చక్షుః ప్రభృతి = కన్ను మొదలైన ఇంద్రియాలచేత; అసమాలంబితన్ = గ్రహించబడకుండుట చేతనూ; తేజరిల్లు = ఒప్పారుతున్న; షడ్వింశకంబున్ = ఇరువది ఆరవతత్త్వమైన; పరమాత్మ+ఆఖ్యంబున్ = పరమాత్మ అనే పేరుగల వాడిని; సమత్వంబునన్ = భేదరహితబుద్ధితో; చూచు = దర్శించునట్టి; శాంతుఁడు = మనస్సును జయించినవాడు; విమోక్షస్థితిన్ = మోక్షపదవిని; పొందున్ = చెందగలడు.

**తాత్పర్యం:** దేవి! రసగంధాది గుణాలు లేనిదై, పరిణామ శూన్యమై, అన్నిటియందు వసించుచు, అన్నిటియందు వ్యాపించి ఉన్నదై, అతిసూక్ష్మరూపమై, బృహత్పరిమాణమునూ గలదై, కన్ను మొదలగు ఇంద్రియాలకు అగోచరమై ఇరువది ఆరవ తత్త్వమొకటి విరాజిల్లుతున్నది. అదే పరమాత్మ. సమబుద్ధితో దానిని దర్శించే శాంతస్వరూపుడు మోక్షపదమును పొందగలడు.

**వ. ఇది కపిలాది పరమర్షిసేవితంబైన సాంఖ్యధర్మంబు; యోగ ప్రకారంబు వివరించెద. 255**

ప్రతిపదార్థం: ఇది = ఈ చెప్పినది; కపిల+ఆది = కపిలుడు మొదలగు; పరమ+ఋషి = గొప్ప ఋషులచే; సేవితంబు+ఐన = అనుసరించబడిన, అనుష్ఠించబడిన; సాంఖ్యధర్మంబు = సాంఖ్యమనే పేరుగల జ్ఞాన విధం; యోగప్రకారంబున్ = యోగము యొక్క విధమును; వివరించెదన్ = వ్యాఖ్యానిస్తాను.

**తాత్పర్యం:** గౌరీ! ఇవుడు నేను నుడివింది కపిలుడు మున్నగు గొప్ప మునీంద్రులు అనుసరించిన జ్ఞానమార్గం. ఇక యోగమార్గం ఎట్లాంటిదో ఇప్పుడు వివరిస్తాను. వినవలసింది.

**సీ.** **విను మింద్రియంబులు మనసును బుద్ధియు । నాత్మండు నొక్కటి యగుటఁ గాన్పు**
**యోగ పరిజ్ఞాన ముగ్మలి యగ్ని స । మా రాధనంబును నధిక వాగ్వి**
**వర్జనంబును సత్త్వవత్త్వంబు దానాధ్య । యనములు శౌచ సత్యములుఁ బాప**
**ములఁ బాపుఁ బాపనిర్ముక్తుఁడై మఱియోగ । మాచరింపఁగ యోగ్యుఁ డగు నరుండు**

**తే.** **మనసు పట్టుట ముఖ్యపుటనువు దాని । కామిషము గాలగాని కెట్లట్ల శుచియు**
**నజనమును నగుచోట మృద్వాసనమునఁ । గాయమున కార్జవము భంగి గలుగనుండి. 256**

**ప్రతిపదార్థం:** ఉగ్మలి! = ఓ పడతీ!; వినుము = ఆలింపుము; ఇంద్రియంబులు = కన్నుమొదలైన ఇంద్రియాలూ; మనసును = మనస్సూ; బుద్ధియున్ = బుద్ధీ; ఆత్ముండున్ = ఆత్మయూ; ఒక్కటి అగుటన్ = ఏకమై ఉండుటను; కాన్పు = దర్శించటం; యోగపరిజ్ఞానము = యోగమునకు చెందిన పూర్ణజ్ఞానం; అగ్నిసమారాధనంబును = అగ్నిహోత్రుడి యొక్క ఉపాసన, పూజించటం; అధికవాక్+వివర్జనంబును = ఎక్కువగా మాట్లాడటం మానటం, మౌన వ్రతావలంబనం; సత్త్వవత్త్వంబు = సత్త్వగుణం కలిగి ఉండటం; దాన+అధ్యయనములున్ = పాత్రులకు దానమివ్వటం, వేదమును పఠించటం; శౌచసత్యములున్ = పరిశుద్ధుడై ఉండటం, అబద్ధమాడ కుండటం; పాపములన్ = పాతకాలను; పాపున్ = తొలగిస్తాయి; పాపనిర్ముక్తుఁడు+ఐ = దురితముల నుండి తొలగినవాడై, విడువబడ్డవాడై; మఱిన్ = ఇంకనూ; యోగము+ఆచరింపన్+కన్ = యోగ మనుష్ఠించటానికి; నరుండు = మనుజుడు; యోగ్యుఁడు+అగున్ = అర్హుడవుతాడు; దానికిన్ = యోగానుష్ఠానానికి; మనసున్ = మనస్సును; పట్టుట = విషయాల మీదికి వెళ్ళకుండా నిలువరించటం; ముఖ్యము+అనువు = (ముఖ్యపు+అనువు = ముఖ్యపు+టు+అనువు = ముఖ్యపు టనువు) ప్రధానమైన ఉపాయం; గాలగానికిన్ (గాలము+కాఁడు = గాలగాఁడు) = గాలం వేసి చేపలు పట్టే చెంబడివాడికి, బెస్తకు; ఆమిషము+ఎట్లు = మాంస మెట్లో; అట్లు+అ = ఆ విధంగానే; శుచియున్ = శౌచము, పరిశుద్ధత; అజనమును+అగుచోటన్ = మనుష్యులు లేని తావునందు, ఏకాంత ప్రదేశంలో; మృదు+ఆసనమునన్ = మెత్తనిపీఠం మీద; కాయమునకున్ = శరీరమునకు; ఆర్జవము+భంగి = ఋజువుగా ఉండే తీరు, వక్రత లేని విధం; కలుగన్ = ఏర్పడగా; ఉండి = కూర్చుండి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఉమాదేవీ! ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ, ఆత్మా ఒక్కటే అగునట్లు దర్శించటం పరిపూర్ణమైన యోగజ్ఞానం. అగ్నిహోత్రుడిని ఉపాసించటం అనగా హోమాదులు నిర్వర్తించటం, మిక్కిలిగ మాట్లాడకుండటం - అనగా మౌనవ్రతావలంబనం, సత్త్వగుణం కలిగి ఉండటం, పాత్రులకు దానం సల్పటం, వేదాలు చదవటం, శుచిగా ఉండటం, సత్యం పల్కటం, పాతకాలను తొలగిస్తాయి. అట్లా పాపాల నుండి నిర్ముక్తుడైన మనుజుడు యోగానుష్ఠానానికి అర్హుడవుతాడు. మనసును అటునిటు విషయాలమీదికి వెళ్ళనీక నిలువరించటమే ఇందుకు ముఖ్యమైన ఉపాయం. చేపలు పట్టే జాలరికి మాంసమెట్లు ముఖ్యమో అట్లాగే యోగ మనుష్ఠించేవాడికి పరిశుద్ధమూ, జనశూన్యమూ అయిన

ప్రదేశం ముఖ్యం. అట్టి ఏకాంత ప్రదేశంలో మృదువైన పీఠం మీద శరీరంలో వంపులేకుండా, నడుం వంగకుండా కూర్చొనాలి.

**విశేషం:** యోగానుష్ఠాన పద్ధతి గురించి భగవద్గీత ఆరవ ఆధ్యాయం ఆత్మసంయమ యోగం విపులంగా వివరించింది. అందులోని విషయాలే ఈ 256వ పద్యం మొదలు 263వ పద్యం వరకు -- ఎనిమిది గద్య పద్యాలలో సంగ్రహ ఫక్కిలో చెప్పబడ్డాయి.

"యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః." (భగ. 6-10)

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్." (భగ. 6-11)

"తత్రై కాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగమాత్మ విశుద్ధయే." (భగ. 6-12)

"సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్." (భగ. 6-13)

"ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః." (భగ. 6-14)

"యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి." (భగ. 6-15)

యోగనిష్ఠుడు యోగాభ్యాసకాలంలో జితేంద్రియుడై దేనియందూ మమకారం లేకుండా మనుష్యులు లేని ప్రదేశంలో ఒంటరిగా కూర్చొని ఆత్మను ధ్యానించాలి.

ధ్యానానికి పూనుకునేటప్పుడు తనకు అనుకూలమైన పీట మీద మనశ్శుద్ధికై దర్భలను పరవాలి. ఆ పీట అటు ఇటూ బెసకనిదిగా ఉండాలి. అది అంతహెచ్చు, అంత లొచ్చు కానిదిగా ఉండాలి. తాను కూర్చొని ధ్యానం చేసే చోటు పవిత్రంగా ఉండాలి. అనగా ఆ ప్రదేశం క్రిమికీటకాదులు లేనిదిగా దుర్గంధభూయిష్ఠం కానిదిగా ఉండాలి. అట్టి చోట సుఖకరమైన స్థిరాసనం మీద కూర్చొని మనసును ఆత్మయందే నిల్పి ఇంద్రియాలను, వాటి వ్యాపారాలను అరికట్టి ఆత్మధ్యానం చెయ్యాలి. అదే సంసారవిముక్తికి దారి.

యోగానికి ఉపక్రమించేవాడు తన శరీరం(నడుము), మెడ, తలను సమంగా, వంకరలేకుండా, చలించకుండా నిలిపి దిక్కులను చూడకుండా దృష్టిని ముక్కుకొనపై నిలపాలి.

ఎటువంటి భయం లేక ప్రసన్న హృదయుడై బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించాలి. ఇక్కడ బ్రహ్మచర్యవ్రతమనగా గృహస్థుడికి నిషిద్ధదేశకాలములందు స్త్రీ సంగమం లేకుండటం. పెళ్ళికానివాడికి ఎప్పుడూ స్త్రీ సంగమం లేకుండటం.

ఇట్లా బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించి మనస్సును విషయాలమీదికి వెళ్ళకుండా నిగ్రహించి నన్నే పొందవలెననే వాంఛతో దానిని నామీదనే నిల్పి ధ్యానించాలి.

ఈ విధంగా నిశ్చలమైన చిత్తంతో నన్నే ధ్యానించేవాడు సుఖానికి పరమావధి అయిన ముక్తిని పొందుతాడు.

**క. మనమున నైదింద్రియములు । నునిచి మనం బాత్మ నల్ల నొదిఁగింపఁగ నె**
**క్కొని ప్రాణంబు నపానం । బును వశ్యత నిలుచు యోగమున సిద్ధికినై. 257**

**ప్రతిపదార్థం:** మనమునన్ = మనస్సులో; ఐదు+ఇంద్రియములు = పంచేంద్రియాలను; ఉనిచి = ఉంచి; మనంబున్ = ఆ మనస్సును; ఆత్మన్ = ఆత్మయందు; అల్లన్ = మెల్లగా; ఒదిఁగింపఁగన్ = లీనమయ్యేటట్లు చేయగా; నెక్కొని = సమకూడి; ప్రాణంబున్ = ప్రాణవాయువున్నూ; అపానంబునున్ = అపానమనేవాయువున్నూ అనగా ఉచ్ఛ్వాసనిశ్వాసములు రెండూ; యోగమున సిద్ధికిన్+ఐ = యోగం ఫలించుటకై; వశ్యతన్ = అధీనములై; నిలుచున్ = నిలబడుతాయి.

**తాత్పర్యం:** మనస్సున ఐదింద్రియాలనూ, మనస్సునూ ఆత్మయందు లీన మొనర్చగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు రెండున్నూ యోగం సిద్ధించటానికి అధీనములై ఉంటాయి.

**తే. అవహితుం డయి తద్దశ యనుభవింపఁ । గా నపానమిశ్ర ప్రాణ గతికి మూర్ధ**
**మతివ! యమ్మెయి నెలవగు; నతఁడ చూవె । జీవుఁ డనఁ బరమాత్ముండు నా వెలుంగు.' 258**

**ప్రతిపదార్థం:** అతివ! = ఓ కాంతా! అవహితుండు+అయి = మనుజుడు సావధానుడై; తత్+దశ+అనుభవింపఁగన్ = ఆ స్థితిని అనుభవిస్తుండగా; అపానమిశ్ర ప్రాణగతికిన్ = అపానవాయువుతో గూడిన ప్రాణవాయువు యొక్క గమనానికి; మూర్ధము = శిరస్సు; ఆ+మెయిన్ = ఆ రీతిగా; నెలవు+అగున్ = స్థానమవుతుంది; అతఁడు+అ = ఆస్థానమయిన వాడే; జీవుఁడు+అనన్ = జీవుడనగా; పరమాత్ముండు నాన్ = పరమాత్ముడనగా; వెలుంగున్+చూవె! = విరాజిల్లుతాడు సుమా!

**తాత్పర్యం:** మనుజుడు ఏకాగ్రచిత్తుడై మీద చెప్పిన స్థితియందుండగా అపానవాయువుతో కూడిన ప్రాణవాయువు యొక్క గమనమునకు శిరస్సు నిలయమవుతుంది. నిలయమైన అతడే జీవుడని, పరమాత్మ అని చెప్పబడుతూ ప్రకాశిస్తున్నాడు.'

**వ. అని వెండియు. 259**

**తాత్పర్యం:** అని చెప్పి మరల శివుడు (భవానితో ఇట్లా అంటున్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. ప్రాణు నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి ని**
**ర్వాణముఁ గోరి చిత్తము తిరంబుగఁ బట్టఁగఁ బ్రాణసంయమా**
**క్షీణత దేహమధ్యశిఖిఁ జిమ్మఁగఁ దత్త్రయ మొంది మూర్ధపా**
**రీణతఁ గొర్కి సల్పు నపరిచ్యుతిఁ దద్గతుఁడైన యోగికిన్. 260**

**ప్రతిపదార్థం:** ప్రాణున్ = ప్రాణవాయువును; అపాను+అందున్ = అపానవాయువునందును; అపానునిన్ = అపానమును; ప్రాణుని+అందున్ = ప్రాణమునందును; నిల్పి = స్థాపించి, ఉంచి; నిర్వాణమున్+కోరి = మోక్షము నపేక్షించి; చిత్తము = మనస్సు; తిరంబుగన్ = స్థిరముగా, దృఢముగా, నిశ్చలముగా; పట్టఁగన్ = స్వాధీనపరచుకొనగా; నిగ్రహించగా; తత్+గతుఁడు+ఐన+యోగికిన్ = అట్టి యోగవిధానమందు నెలకొన్న యోగికి; ప్రాణసంయమ+అక్షీణత = ప్రాణనిరోధము యొక్క

ఆధిక్యము; దేహమధ్యశిఖిన్ = శరీరము యొక్క నడుమనున్న అగ్నిని- ఊష్మమును; చిమ్మన్+కన్ = వ్యాప్తం చేయగా, విసరగా, ఎగమీటగా; తత్+త్రయము = ప్రాణము, అపానము, దేహమధ్యాగ్ని అను మూడున్నూ; ఒంది = చేరుకొని; అపరిచ్యుతిన్ = జారుపాటులేనితనంతో; తొలగిపోకుండా; మూర్ధపారీణతన్ = శిరస్థానమును భేదించుకొని పోవుటయందు; కోర్కి సల్పున్ = అభిలాష వహిస్తాయి.

**తాత్పర్యం:** ప్రాణమును అపానములో, అపానమును ప్రాణములో స్థాపించి ముక్తిని వాంఛించి మనస్సును గట్టిగా నిరోధించగా ఆ యోగ మార్గము నందు నిరతుడైన యోగికి ప్రాణనిరోధ సంపన్నత్వం శరీరమందలి ఊష్మమును పైకి ఎగజిమ్మగా ఆ ప్రాణాపాన దేహాగ్నులు మూడును చేరి ఏ మాత్రము జారుపాటు లేకుండ మూర్ధ స్థానమును భేదించుకొని పోవుటలో అభిలాష వహిస్తాయి.

**విశేషం:** తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. (భగ. 6-46)

"అర్జునా! యోగి కృచ్ఛ్ర చాంద్రాయణాది రూపమైన తపస్సులు చేసే వారికంటె, శాస్త్ర జన్యజ్ఞానం గల వారి కంటె, ఇష్టాపూర్తాది కర్మలు ఆచరించేవారి కంటె శ్రేష్ఠుడు. కనుక నీవు యోగివి కమ్ము" అని యోగం యొక్క గొప్పతనం చెప్పి దాని తీరుతెన్నులు ఆత్మసంయమయోగంలో శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి వివరిస్తాడు.

**వ. అని చెప్పి వెండియు. 261**

**తాత్పర్యం:** అని పరమేశ్వరుడు గౌరితో చెప్పి మరల (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అలసతయున్ విచిత్తతయు నత్యశనాదరణంబు రోగముం**
**గలయును లోభమున్ భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో**
**ధులు విను యోగసేవకు; నదుష్టతఁ బేర్చిన యోగ మిచ్చు సి**
**ద్ధు లెనిమిదింట నప్రతిహతుం డయి యోగి చరించు నెల్లెడన్. 262**

**ప్రతిపదార్థం:** అలసతయున్ = సోమరితనమూ, జడత, మాంద్యమూ; విచిత్తతయున్ = పరధ్యానంలో ఉండటం, పరాకు; అతి+అశన+ఆదరణంబున్ = మిక్కుటంగా తినడంలో అపేక్ష; రోగమున్ = వ్యాధియూ; కలయును = స్వప్నమూ, నిదుర; లోభమున్ = దురాశ, పిసినిగొట్టుతనం; భయమున్ = భీతియూ; కామమున్ = స్త్రీ వాంఛ, కోరిక; క్రోధమున్ = కోపం; లౌల్యమున్ = విషయాసక్తి, భోగేచ్ఛ, చాపల్యం; యోగసేవకున్ = యోగాభ్యాసానికి; విరోధులు = శత్రువులు; విను = వినుము; అదుష్టతన్ = దోషరహితత్వంతో; పేర్చిన యోగము = అతిశయించిన యోగం; ఇచ్చు = ప్రసాదించునట్టి; సిద్ధులు+ఎనిమిదింటన్ = అష్టసిద్ధులతో; అప్రతిహతుండు+అయి = అడ్డులేని వాడై, ఎదురులేని వాడై, ఆటంకంలేనివాడై; యోగి = యోగీశ్వరుడు; ఎల్ల+ఎడన్ = అన్నిచోట్ల, అంతటా; చరించున్ = తిరుగ గలడు.

**తాత్పర్యం:** సోమరితనం, పరధ్యానంలో ఉండటం, విపరీతంగా తిండితినటం, రోగం, నిదుర, పిసినిగొట్టు తనం, భీతి, స్త్రీవాంఛ (కోరిక), కోపం, విషయాసక్తి లేదా భోగేచ్ఛ అనేవి యోగానుష్ఠానానికి ప్రబలశత్రువులు. దోషరహితమై ఒప్పారునట్టి యోగం ప్రసాదించే అష్టసిద్ధులతో యోగి అడ్డమాపులేక అంతటా యథేచ్ఛగా విహరించగలడు.

**విశేషం:** అష్టసిద్ధులు: అణిమా మహిమాచైవ గరిమా లఘిమా తథా, ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టసిద్ధయః.

1) అణిమ = అణుస్వభావం. దీనివలన సూక్ష్మాకారం ధరించి సర్వత్ర వెళ్ళటానికి శక్తి సమకూడుతుంది.

2) మహిమ = గొప్పతనం; ఇందువలన బృహత్స్వరూపం ధరించుటకు వీలవుతుంది.

3) లఘిమ = తేలికగా ఉండటం: దీని వలన తన కిష్టం వచ్చినపుడు చులకనగా ఉండ గలశక్తి లభిస్తుంది.

4) గరిమ = భారమగుట: తన్నెంత బలవంతులైననూ పైకెత్త లేనంత బరువుగా తానుండ గల శక్తి ఈ ఐశ్వర్యం వలన సమకూడుతుంది.

5) ప్రాప్తి = పొందటం: దీని వలన వాంఛితార్థం వెంటనే పొందబడుతుంది.

6) ప్రాకామ్యం = తన కోరికకు అడ్డులేకుండటం.

7) ఈశత్వం = ప్రాభవం కలిగి ఉండటం.

8) వశిత్వం = లోబరుచుకొనటం.

**ఆ. నిద్రపెంపు నిద్ర నిగ్రహించుటయును । గొలఁది మీఱు కుడుపుఁ గుడువమియును**
**యోగి కొప్ప; వతఁడు యుక్త వర్తనుఁడైన । నువిద! దుఃఖహారి యోగ మొందు. 263**

**ప్రతిపదార్థం:** ఉవిద! = ఓ చెలీ!; నిద్రపెంపు = నిద్ర యొక్క ఆధిక్యం, ఎక్కువగా నిద్రించటం; నిద్ర నిగ్రహించుటయును = నిద్రను మానటం; కొలఁది మీఱు కుడుపున్ = మితిమీరి భుజించటం; కుడువమియును = అసలే భుజించకుండటం; యోగికిన్ = యోగానుష్ఠాన పరుడికి; ఒప్పవు = తగవు; అతఁడు = యోగి; యుక్త వర్తనుఁడు+ఐనన్ = తగిన తీరున యోగం అనుష్ఠిస్తే; దుఃఖహారి = దుఃఖాన్ని తొలగించునట్టి; యోగము = యోగమును; ఒందున్ = పొందగలడు.

**తాత్పర్యం:** ఎక్కువగా నిద్రపోవటం, బొత్తిగా నిద్రపోకుండా ఉండటం, మితిమీరి భుజించటం, మొదలే భుజించకుండా ఉండటం యోగికి తగవు. గౌరీ! యోగి తగిన తీరున మెలగితే దుఃఖాన్ని హరించే యోగం సిద్ధిస్తుంది.

**విశేషం:** "నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః,
న చాతి స్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున!" (భగ. 6-16)

అపరిమితంగా తినే వాడికి, అసలే తినని వాడికి, ఎక్కువగా నిద్రించే వాడికి, ఎప్పుడూ మేల్కొని ఉండేవాడికి ఈ యోగం సిద్ధించదు.

"యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు,
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా." (భగ. 6-17)

మితాహార విహారాలు, తన శక్తికి లోబడి మితంగా కార్యకలాపాలయందు ప్రవర్తించటం, మితంగా నిద్రపోవటం, మితమైన మెలకువ గలిగిన వాడికి కర్మబంధ విమోచనం కలిగించే యోగం సిద్ధిస్తుంది.

**వ. ఇట్టిది యోగధర్మం' బనిన నంబిక 'సాంఖ్యయోగ శ్రవణంబునఁ బరిజ్ఞాత పరమార్థ నైతి; భవదీయ సాయుజ్యంబుభక్తు లెట్టి పరిచర్యం బడయుదు? రెఱింగింపవే' యని యడిగిన మృడుండు మృడాని కిట్లనియె. 264**

**ప్రతిపదార్థం:** యోగధర్మంబు; ఇట్టిది = ఇట్లాంటిది; అనినన్; అంబిక = పార్వతి; సాంఖ్యయోగ శ్రవణంబునన్ = సాంఖ్య యోగములు వినటం చేత; పరిజ్ఞాత = చక్కగ తెలియబడిన; పరమార్థన్+ఐతిన్ = పరమార్థం కలదాననైనాను; మోక్షధర్మం తెలిసికొనగలిగాను; భవదీయసాయుజ్యంబున్ = నీలో ఐక్యమొందటాన్ని; భక్తులు; ఎట్టి పరిచర్యన్ = ఏ విధమైన సేవచేత; పడయుదురు = పొందగలరో; ఎఱింగింపవు+ఏ = తెలుపవా; అని; అడిగినన్; మృడుండు = శంకరుడు; మృడానికిన్ = శాంకరికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దేవీ! యోగ స్వరూప మిట్టి' దని శంకరుడు శర్వాణికి చెప్పగా ఆమె- 'దేవా! సాంఖ్యమును, యోగమును తమవలన విని పరమార్థ మెట్టిదో గ్రహించాను. మరి భక్తులు ఎట్టిసేవ చేసి నీలో ఐక్యమంద గలరో తెల్పుమని వేడుతున్నాను' అని పలుకగా ఈశ్వరుడు ఈశ్వరితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సాయుజ్యం చతుర్విధ ముక్తులలో ఒకటి.

1) సాయుజ్యం అనగా ఐక్యం, లయం. తాను కొలిచే దేవతలో లయం కావటం.
2) సారూప్యం = ఆ రూపంవంటి రూపం పొందటం అనగా సమానరూపత్వమును వహించటం.
3) సాలోక్యం = తన ఇష్టదేవత ఉన్న లోకంలో తానూ ఉండటం.
4) సామీప్యం = సాన్నిధ్యం, లేక సమానత్వం చెందటం'.

**శివుండు పార్వతికి నాత్మసాయుజ్య ప్రాప్తిసాధనంబులు దెలుపుట. (సం.13- అను 1-4336).**

**క. 'విను మవిచింత్యుఁడ సురలకు । మునులకు నేనియును యోగమును సాంఖ్యము నా**
**యొనరించినయవి యీశుఁడ । సనాతనుఁడ నవ్యయుండ సత్యాత్ముండన్. 265**

**ప్రతిపదార్థం:** వినుము = పార్వతీ! వినుము; సురలకున్ = దేవతలకు; మునులకున్+ఏనియున్ = మునీంద్రులకైననూ; అవిచింత్యుఁడన్ = ఊహించనలవిగాని వాడిని; యోగమును = యోగవిద్యయూ; సాంఖ్యమును = సాంఖ్యశాస్త్రమునూ; నా+ఒనరించిన+అవి = నేను రచించినట్టివి; ఈశుఁడన్ = సమస్తమునకు నేను ప్రభుడను; సనాతనుఁడన్ = శాశ్వతమైన వాడిని, ప్రాచీనుడిని, ఎప్పటినుండో ఉన్నవాడిని; అవ్యయుండన్ = నాశరహితుడిని; సత్య+ఆత్ముండన్ = సత్యస్వరూపుడిని.

**తాత్పర్యం:** ప్రేయసీ! వినుము. వేల్పులకునూ, మునులకునూ నే నిట్టివాడనని ఉహింపనలవిగాని వాడిని. సాంఖ్యయోగ శాస్త్రములు రెంటికినీ నేనే కర్తను, నేనే సర్వమునకు అధిపతిని. పురాణపురుషుడను నేనే. నేనే నాశరహితుడిని, నేనే సత్యస్వరూపుడిని.

**క. ఏను బ్రసన్నుఁడనైనం । గానిది లే దర్చకులకుఁ గావున మంత్ర**
**ధ్యానస్తుతి వందన ముఖ । నానాభజనముల వలయు నైష్ఠికత శివా! 266**

**ప్రతిపదార్థం:** శివా! = దుర్గా!; ఏను = నేను; ప్రసన్నుఁడన్+ఐనన్ = అనుగ్రహిస్తే; అర్చకులకున్ = నన్ను కొలిచే వారికి, కానిదిలేదు = దుర్లభమైనది ఏదీ లేదు; కావునన్ = కనుక; మంత్ర = మంత్రం; ధ్యాన = చింతనమూ; స్తుతి = స్తోత్రమూ; వందనముఖ = నమస్కారం మొదలైన; నానాభజనములన్ = పలువిధాలైన సేవలందు; నైష్ఠికత = ఆసక్తి, నిలుకడ, దీక్ష; వలయున్ = ఉండవలె.

**తాత్పర్యం:** దుర్గా! నేను దయదలిస్తే నన్ను కొలుచునట్టివారికి సకలప్రయోజనాలు సమకూడుతాయి. కనుక మంత్ర జపం, చింతనం, స్తోత్రం, నమస్కారం మొదలైన సకల విధాలైన నా సేవలందు భక్తుడు నిష్ఠాపరుడై ఉండటం ముఖ్యం.

**ఆ. నాలుగాశ్రమముల నలువురు విప్రుల । కతివ! పాశుపతమహావ్రతంబు**
**తెఱఁగు లేను దొల్లి దెలిపితి; శిష్య ప్ర । శిష్య సరణి నది ప్రసిద్ధ మయ్యె. 267**

**ప్రతిపదార్థం:** అతివ! = రమణీ! నాలుగు+ఆశ్రమములన్ = బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే నాలుగు ఆశ్రమాలలోని; నలువురు విప్రులకున్ = నలుగురు బ్రాహ్మణులకు; పాశుపత మహావ్రతంబు తెఱఁగులు = పాశుపతమనే గొప్పవ్రతము యొక్క విధానాలు; ఏను = నేను; తొల్లి = మునుపు; తెలిపితిన్ = బోధించాను, చెప్పినాను; అది = ఆ వ్రత విధానం; శిష్య ప్రశిష్యసరణిన్ = శిష్యులు, ఆ శిష్యులకు శిష్యులు అనేవారి ద్వారా; ప్రసిద్ధము+అయ్యెన్ = లోక విఖ్యాతి గాంచింది;

**తాత్పర్యం:** దేవీ! పూర్వం నేను బ్రహ్మచర్యం మొదలగు నాలుగు ఆశ్రమాల లోని నలుగురు బ్రాహ్మణులకు పాశుపత మహావ్రత విధానాన్ని బోధించాను. అది ఆ నలుగురు బ్రాహ్మణులవలన, వారి శిష్యులవలన, ప్రశిష్యులవలన జగత్ప్రఖ్యాతి చెందింది.

**క. మంగళ రక్షా శుచితా । లింగార్చన యోగ్యతలు ఫలించుటకై భూ**
**తిం గావించితిఁ; దల్లి । ప్తాంగులును గపాలధరులునై శాంతిమెయిన్. 268**

**ప్రతిపదార్థం:** మంగళ రక్షా = శుభముల యొక్క రక్షణ; శుచితా = పావనత్వం; లింగ+అర్చనయోగ్యతలు = లింగమును పూజించుటకు అర్హతలు; ఫలించుటకై = నెరవేరుటకై, సిద్ధించుటకై; భూతిన్ = విభూతిని; కావించితిని = రూపొందించాను; తత్+లిప్త+అంగులును = ఆ భస్మమును దేహము నందు ధరించిన వారునూ; కపాలధరులును = భిక్షాపాత్రను ధరించిన వారును, ఐ = అయి; శాంతిమెయిన్ = మనోనిగ్రహంతో, శాంతిస్వభావంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** దేవీ! మంగళ రక్షణ కొరకు, పవిత్రత సమకూడటం కొరకు, లింగము నర్చించే యోగ్యత సిద్ధించటం కొరకు నేను విభూతిని రూపొందించాను. ఆ విభూతిని శరీరమందు అలదుకొని, భిక్షాపాత్రను చేబూని మనో నిగ్రహంతో.

**తే. బ్రహ్మచర్య భిక్షాశన పరత గలిగి । జటిత యొండె ముండిత యొండె సంభరించి**
**మనసు నాయంద తిరముగా నునిచి యొండు । వస్తువుల దెస నొల్లమి వర్తిలంగ. 269**

**ప్రతిపదార్థం:** బ్రహ్మచర్య = బ్రహ్మచర్యవ్రతం; భిక్షా+అశనపరతకలిగి = భిక్షాన్నం భుజించటం అనువాటియందు ఆసక్తి కలిగి; జటిత+ఒండెన్ = జడలు దాల్చటం గాని; ముండిత+ఒండెన్ = తల బోడి చేయించుకొనటంగాని; సంభరించి = స్వీకరించి; మనసున్ = చిత్తాన్ని; నాయందు+అ = నా మీదనే; తిరముగాన్+ఉనిచి = నిశ్చలంగా నిలిపి, దృఢంగా, గట్టిగా నిలిపి; ఒండు వస్తువులదెసన్ = ఇతరములైన ప్రాపంచిక వస్తువుల విషయంలో; ఒల్లమి = అనాదరం; వర్తిలంగన్ = సాగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** బ్రహ్మచర్యవ్రతం అవలంబించి, భిక్షాన్నం భుజిస్తూ, జుట్టు పెంచుకొని గాని, తలగొరిగించుకొనిగాని

ఉంటూ, నాయందు గట్టిగా మనసుంచి, ఇతర వస్తువుల పట్ల అనాదరం గలిగిన వారై.

**క. చరియించు భక్తజనులకుఁ । బరమానందైకతానుభవ మొసఁగుదు; న**
**వ్వెరవున మత్సాయుజ్యము । దొరకును వారలకు వికచతోయజవదనా! 270**

**ప్రతిపదార్థం:** చరియించు = ప్రవర్తించే; భక్త జనులకున్ = నా భక్తులైన వారికి; పరమ+ఆనంద+ఏకతా+అనుభవము = శ్రేష్ఠమైన ఆనందము యొక్క ముఖ్యానుభవం, మహానందము యొక్క పరమానుభూతిని; ఒసఁగుదున్ = అనుగ్రహిస్తాను; వికచతోయజవదనా! = వికసించిన పద్మం వంటి ముఖం కలదానా!; ఆ+వెరవునన్ = చిత్తం నాయందే దృఢముగ లగ్నమొనర్చి, నాకంటె అన్యములైన వస్తువులను అనాదరించటం అనే ఉపాయంచేత; వారలకున్ = నా భక్తులకు; మత్+సాయుజ్యము = నన్ను పొందటం, నాలో ఐక్యంకావటం అనేది; దొరకును = లభిస్తుంది.

**తాత్పర్యం:** పూచిన కమలం వంటి ముఖము గల కాత్యాయనీ దేవీ! మనసు నాయందే నిశ్చలంగా నిల్పి ప్రవర్తించే భక్తజనావళికి బ్రహ్మానందము యొక్క పరమానుభూతిని ప్రసాదిస్తాను. ఆ ఉపాయంతోనే భక్తులు నా సాయుజ్యమును పడయగలరు.

**వ. ఇది సాయుజ్యావాప్తి ప్రకారం' బని చెప్పి వెండియు. 271**

**ప్రతిపదార్థం:** ఇది = ఇపుడు నేను నుడివింది; సాయుజ్య+అవాప్తి ప్రకారంబు = సాయుజ్యమనే మోక్షం పొందునట్టి విధానం; అని చెప్పి; వెండియున్ = మళ్ళీ, (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఇది సాయుజ్యమనే ముక్తిని పొందే విధమని గౌరికి చెప్పి శంకరుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. శివలింగ స్థాపనముఁ ద్రి । భువనములం బరమహితము పొంటెం గరుణన్**
**ధవళాక్షి! చేసితిం ద । త్ప్ర విమల లింగమున నన్ను భావించు టుఱున్. 272**

**ప్రతిపదార్థం:** ధవళ+అక్షి! = ఓ తెలికన్నుల చెలీ!; పరమహితము పొంటెన్ = మిక్కిలిమేలు కలిగించేటందుకు; కరుణన్= కృపతో; త్రిభువనములన్ = ముల్లోకాలలో; శివలింగస్థాపనమున్+చేసితిన్ = శివలింగాలను ప్రతిష్ఠించాను; తత్ = ఆ యొక్క ప్రవిమల లింగమునన్ = నిర్మలమైన లింగంలో; నన్నున్ = నన్ను; భావించుట= తలంచటం, స్మరించటం; ఉఱున్= తగును.

**తాత్పర్యం:** శైలకుమారీ! ముజ్జగాలకు మేలు చేయదలచి దయతో నేనే శివలింగాలను స్థాపించాను. ఆ పవిత్రమైన లింగాలను నాస్వరూపంగా ఎంచి పూజించటం సముచితం.

**చ. కలమెయిఁ బాల నేత నుదకంబులనేని వరాభిషేక మం**
**గళము నొనర్చి భక్తి రతి గంధము మాల్యము ధూప దీప సం**
**కలనములన్ నివేద్యమును గాఢ సమర్పణ మొందఁ జేసి లిం**
**గలసితమూర్తియందు ననుఁ గాంచి భజించిన ముక్తి చేకుఱున్.' 273**

**ప్రతిపదార్థం:** కలమెయిన్ = ఉన్నంతలో, తన శక్తికి తగినట్లు; పాలన్ = క్షీరంతో; నేతన్ = నేయితో; ఉదకంబులన్+ఏనిన్

= నీళ్ళతో నైనా; వర+అభిషేకమంగళము = శ్రేష్ఠమైన మజ్జనమనెడు శుభమును; ఒనర్చి = చేసి; భక్తిరతిన్ = భక్తితత్పరతతో; గంధమున్ = చందనం; మాల్యమున్ = పూలదండలు; ధూపదీప సంకలనములన్ = సాంబ్రాణి పొగవేయటం, దీపమును వెలిగించి చూపటం అనే ఉపచారాల యొక్క కూడికతో; నివేద్యమును = నైవేద్యాన్ని; గాఢసమర్పణము+ఒందన్+చేసి = అధికపూజ్యభావంతో సమర్పణ కావించి; లింగలసిత మూర్తి+అందున్ = శివలింగము యొక్క ఒప్పిదమైన స్వరూపమందు; ననున్ = నన్ను; కాంచి = దర్శించి; భజించినన్ = కొలిస్తే; ముక్తి = మోక్షం; చేకుఱున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** పార్వతీ! తన శక్తికి తగినట్లు క్షీరంతోనూ, ఘృతంతోనూ, లేదా జలంతోనైనా లింగమునకు అభిషేకం సల్పి భక్తితో గంధపుష్ప ధూపదీప నైవేద్యములు సమర్పించి ఆ శివలింగమునందు పరమేశ్వరుడనైన నన్ను దర్శించి భజించే భక్తులకు ముక్తి లభిస్తుంది.'

**క.** **అని పలికి 'నీవు దేవాం । గన లాదిగఁ గల త్రిలోక కాంతలకును మ్రొ**
**క్కనకుం బాత్రం బగు పద । వనజంబులు గల్గి యొప్పు వరసతి వతివా!. 274**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని ఈశ్వరుడు వచించి; అతివా! = ఓ భామినీ!; నీవు; దేవ+అంగనలు = దేవతాస్త్రీలు, వేల్పు బోటులు; ఆదిగన్+కల = మొదలుగా గల; త్రిలోక కాంతలకును = ముల్లోకాల లోని ముగుదలందరికినీ; మ్రొక్కనకున్ = వారు నమస్కరించుటకు; పాత్రంబు+అగు = అర్హమైన; పదవనజంబులు = పద్మముల వంటి పాదాలు; కల్గి = కలిగిన దానవై; ఒప్పు = ప్రకాశించే; వర సతివి = ఉత్తమ పతివ్రతవు కదా!

**తాత్పర్యం:** ఆ విధంగా గిరిజతో పలికి శంకరుడు ఆమెను చూచి 'ప్రాణేశ్వరీ! నీవు దేవతా స్త్రీలు మొదలుగా ముజ్జగాలలోని వెలదులందరి మ్రొక్కులు స్వీకరించ దగిన పాదపద్మాలు గల పతివ్రతాశిరోమణివి సుమా!'

**క.** **చతురవు వివేక విభవో । న్నత చిత్తవు వ్రతవిధాన నైష్ఠికతా సం**
**యుత మతివి లౌకిక జ్ఞా । నితా మహిమ సహజమతి వనిందిత వరయన్. 275**

**ప్రతిపదార్థం:** చతురవు = నేర్పుగల దానవు, చుఱుకైన దానవు; వివేక విభవ+ఉన్నత చిత్తవు = యథార్థ జ్ఞానం యొక్క ఆధిక్యంతో కూడిన పెద్ద మనసు కలదానవు; వ్రత విధాననైష్ఠికతా సంయుత మతివి = నోములు నోమటంలో ఆసక్తితో కూడిన మనసు కల దానవు; లౌకిక జ్ఞానితా మహిమ సహజమతివి = లోకసంబంధమైన జ్ఞానం యొక్క గొప్పతనం పుట్టుకతోనే వచ్చిన చిత్తం కలదానవు; అరయన్ = పరిశీలించగా; అనిందితవు = మాటపడని దానవు, దూరులేని దానవు.

**తాత్పర్యం:** గౌరీ! నీవు నేర్పు కలిగిన దానవు, యథార్థజ్ఞాన వైభవంతో కూడిన దొడ్డమనసు కలదానవు, వ్రత విధానములందు నిష్ఠతో కూడిన చిత్తం కలదానవు, సహజంగా వచ్చిన లోకజ్ఞానంతో కూడిన హృదయం కల దానవు. నీవు మాటపడని దానవు.

**క.** **కావునఁ గాంతా ధర్మము । నీ వలనం దెలియువేడ్క నెమ్మనమున నా**
**కావిర్భవించెఁ; జెప్పం । గా వలయును దాని వికచకమలదళాక్షీ!.' 276**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి; వికచకమల దళ+అక్షీ! = వికసించిన తామర రేకుల వంటి నేత్రములు కలదానా!; కాంతా ధర్మమున్ = స్త్రీ ధర్మాన్ని; నీవలనన్ = నీ మూలంగా; తెలియు వేడ్క = తెలిసికొనవలెననే ఇచ్ఛ, కుతూహలం; నెమ్మనమునన్ (నెఱ+మనమునన్) నా నిండు మనసులో; ఆవిర్భవించెన్ = జనించింది; దానిన్ = మహిళా ధర్మాన్ని; చెప్పన్+కాన్+వలయున్ = నీవు చెప్పాలి.

**తాత్పర్యం:** ప్రాణేశ్వరీ! వనితా ధర్మం ఎట్లాంటిదో నీ వలన తెలియవలెననే కుతూహలం నా హృదయంలో కలిగింది. కనుక స్త్రీ ధర్మం ఎట్టిదో నీవు చెప్పాలి.'

**ఆ. అనిన సిగ్గుతోడి యలఁతి న వ్వొలసిన । చెన్ను మొగము వింత చెలువుఁ దాల్ప**
**వాంచి యెత్తి గౌరి వరునితో నిట్లను । 'నేను మీకుఁ దెల్ప నెంతదాన?. 277**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని శివుడు తన్నడుగగా; సిగ్గుతోడి = లజ్జతో కూడిన; అలఁతినవ్వు = చిరునగవు, చిన్నినవ్వు, పిన్న నవ్వు; ఒలసిన = వ్యాపించిన; చెన్ను మొగము = సుందరమైన వదనం; వింత చెలువున్+తాల్పన్ = కొత్త అందాన్ని పొందగా; వాంచి = సిగ్గు బరువున ముందు తలను వంచు కొన్నదై; ఎత్తి = భర్తకు బదులాడ వలసి ఉన్నందున వంచిన మొగం పైకెత్తి; గౌరి = గిరిసుత అయిన పరమేశ్వరి; వరునితోన్ = పెనిమిటి అయిన శంభుడితో; ఇట్లు+అనున్ = ఈ రీతిగా పలికింది; నేను = నేను; మీకున్ = సర్వజ్ఞులైన తమకు; తెల్పన్ = స్త్రీ ధర్మాన్ని మనవి చేయటానికి; ఎంత దానన్? = ఏ పాటిదాన్ని?

**తాత్పర్యం:** శివుడు స్త్రీధర్మం వివరించుమని అడిగినపుడు గౌరీదేవి సిగ్గుతో కూడిన చిన్నినవ్వు ఎగ్రాకి తన అందమైన మోమునకు అపూర్వమైన సొబగును సమకూర్చగా వంచిన వదనాన్ని కొంచెం పైకెత్తి మగడితో ఇట్లా అన్నది. 'నాథా! తరుణీ ధర్మం ఎట్లాంటిదో తమకు నివేదించటానికి నే నేపాటిదాన్ని?

**విశేషం:** పాత్రల యొక్క స్వరూప రూప చిత్రణకౌశలం కవిబ్రహ్మ తిక్కన గారికి అలవడినట్లు సారస్వతరంగంలో మరేకవికి అలవడలేదన్న మాట పాతమాట. ఈ చిరుపద్యంలో పార్వతీ దేవిని పాఠకుల కట్టెదుట నిల్పినాడు బుధజన విరాజి తిక్కన సోమయాజి.

**క. ఐనను మీరడిగిన మ । న్మానస బోధంబు కొలఁది మగువల తెఱఁగుల్**
**పూని వినిపింప కుండుట । దాన తగదు గాన చెప్పెదను సర్వజ్ఞా!' 278**

**ప్రతిపదార్థం:** ఐనను = మీకు తెలుపునంతటిదాన్ని కాకున్నా; మీరు = తమరు; అడిగినన్ = తెలుపుమన్నప్పుడు; మగువల తెఱఁగుల్ = ఆడువారి తీరులు; మత్+మానస+బోధంబు కొలఁదిన్ = నాచిత్త మందలి తెలివి కొద్దీ; పూని = యత్నించి; వినిపింపక+ఉండుట = తెలియజేయకుండటం; తాన = అనునది; తగదు+కానన్ = యుక్తం కాదు కనుక; సర్వజ్ఞా! = సమస్త మెరింగిన స్వామీ!; చెప్పెదను = వచిస్తాను, మనవి చేస్తాను.

**తాత్పర్యం:** సర్వజ్ఞుడవైన స్వామీ! మీరు స్త్రీ ధర్మ మెట్టిదో తెలుపుమని అడిగినప్పుడు నాకు తెలిసినంతవరకు చెప్పకుండటం మంచిది కాదు కనుక మనవి చేస్తాను.'

**క. అని పలికి మఱియు నిట్లను । 'నను నెప్పుడుఁ బాయకుండు నదు లెల్లను; న**
**వ్వనితలతోడ సమాలో । చన మొనరించి మఱి చెప్పఁ జను నిత్తెఱఁగున్.' 279**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని గౌరి వచించి; మఱియున్ = ఇంకా; ఇట్లు+అనున్ = ఈ లాగున చెప్పింది; ననున్ = నన్ను; ఎప్పుడున్ = అన్ని వేళల; నదులు+ఎల్లను = నదులన్నియూ; పాయక+ఉండున్ = విడిచి పెట్టక నాతోనే ఉంటాయి;

ఆ+వనితల తోడన్ = ఆ మగువలతో, ఆ నదీమతల్లులతో; సమాలోచనము+ఒనరించి = యోచించి, సంప్రదించి; మఱి = పిదప, పిమ్మట, తరువాత; ఈ+తెఱఁగున్ = మీ రడిగిన తరుణీ ధర్మాలను; చెప్పన్+అగున్ = చెప్పదగును, చెప్పుతాను.

**తాత్పర్యం:** గౌరి మహేశ్వరుడితో అట్లా పలికి మళ్ళీ ఇట్లా అన్నది. 'దేవా! నదులెల్లను ఎల్లవేళల నన్ను విడువకుండా ఉంటాయి. ఆ నదీమతల్లులతో సంప్రదించిన తరువాత తా మడిగిన స్త్రీ ధర్మాలు ఎట్టివో మనవిచేస్తాను.'

**వ.** **అని విన్నవించి గంగ యమున గోదావరి కౌశికి కావేరి కృష్ణవేణి పెన్న నర్మద బాహుద రేవ తమస మొదలైన నదులు మున్న తనతోడన వచ్చి యున్న నన్నాతుల గుఱించి 'యీశానుం డిట్లడిగెడు నెట్లు చెప్పద?' మనిన గంగాదేవి 'నీకంటె నే మెఱుంగుదుమే? నీ వెఱింగిన తెఱంగున నంగనాధర్మం బెఱింగించి పతిం బ్రీతునిం జేయు; మేము భవదీయ వాగమృతంబు వీనుల నినిచెద' మనుటయుఁ బార్వతి ప్రసన్నచిత్తయై వల్లభు వదనంబునం జూడ్కి నిలిపి.** **280**

**ప్రతిపదార్థం:** అని, విన్నవించి = మనవి చేసికొని; గంగ = భాగీరథి; యమున = కాళింది; గోదావరి = గౌతమి; కౌశికి, కావేరి, కృష్ణవేణి, పెన్న = పినాకిని; నర్మద, బాహుద, రేవ, తమస, మొదలు+ఐన = మున్నుగా కలిగిన; నదులు; మున్ను+అ = ముందుగానే; తన తోడను+అ; వచ్చి+ఉన్నన్ = వచ్చిఉండగా; ఆ+నాతులన్ గుఱించి = ఆ మగువల (నదుల) నుద్దేశించి, ఆ నదులతో; ఈశానుండు = ఈశ్వరుడు; ఇట్లు; అడిగెడున్ = అడుగుతున్నాడు; ఎట్లు; చెప్పుదము = సమాధానమిస్తాము; అనినన్; గంగాదేవి; నీ కంటెన్; ఏము = మేము; ఎఱుంగుదుము+ఏ; నీవు; ఎఱింగిన; తెఱంగునన్ = విధమున; అంగనా ధర్మంబు = స్త్రీ ధర్మం; ఎఱింగించి; పతిన్ = భర్తను; ప్రీతునిన్+చేయుము = సంతోషించిన వానిగా సల్పుము; ఏము = మేము, భవదీయ = నీ యొక్క; వాక్+అమృతంబు = వచనములనెడు సుధారసం; వీనులన్ = చెవులలో; నినిచెదము = నిండించెదము; అనుటయున్ = అని చెప్పగా; పార్వతి; ప్రసన్నచిత్త+ఐ = సంతుష్టాంతరంగఅయి, అనుగ్రహ యుక్తమగు మనస్సు గలదై; వల్లభు వదనంబునన్ = పెనిమిటి యొక్క ముఖమునందు; చూడ్కి నిలిపి = చూపులు ప్రసరింపజేసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అంబికాదేవి అట్లా పలికి గంగ, యమున, గోదావరి, కావేరి, కృష్ణవేణి, పెన్న, బాహుద, రేవ, తమస మున్నగు వాహినులు మునుపే తనతో అక్కడికి వచ్చి ఉన్నందున వాటిని చూచి 'ఓ చెలులారా! శివదేవుడు స్త్రీ ధర్మ మెఱింగింపుమని కోరినాడు. మన మేమి చెప్పవలెనో చెప్పండి' అని అడిగింది. అందుకు గంగాదేవి ఆమెతో 'అమ్మా! నీకంటె స్త్రీ ధర్మాలు మా కేమి తెలుసు? నీకు తెలిసిన విధంగా నీవే అతివల ధర్మాలు అభవున కెరిగించి సంతోషపెట్టుము. మేము నీ వాక్యామృతాన్ని వీనుల విందుగా ఆస్వాదించి హర్షిస్తాము' అని పలికింది. అప్పుడు ఉమాదేవి ప్రసన్నురాలై పతిముఖారవిందం మీద చూపు నిలిపి (ఇట్లా చెప్పింది).

**క.** **'దేవా! నీదు ప్రసాద । శ్రీ వచ్చిన యెఱుక సుందరీవిధము భవ**
**ద్భావంబునకుఁ బ్రియంబుగ । సేవాధర్మంబుఁ దెలియఁ జెప్పెద' ననియెన్.** **281**

**ప్రతిపదార్థం:** దేవా! = ప్రభూ!; నీదు ప్రసాదశ్రీన్ = నీ అనుగ్రహసంపత్తిచే; వచ్చిన = లభించిన; ఎఱుకన్ = తెలివితో, జ్ఞానంతో; సుందరీ విధము = స్త్రీల యొక్క తీరు, స్వభావమును; భవత్+భావంబునకున్ = నీ యొక్క చిత్తమునకు; ప్రియంబుగన్ = ఇంపుగా, ఇష్టంగా; సేవాధర్మంబున్ = ఉపచారధర్మాన్ని; తెలియన్+చెప్పెదన్ = నీ వెరుంగునట్లు వచిస్తాను; అనియెన్ = అని చెప్పింది.

**తాత్పర్యం:** 'ప్రభూ! మీ పరమానుగ్రహంవలన లభించిన తెలివితో స్త్రీల స్వభావాన్ని, వారిసేవాధర్మాన్ని మీ మనస్సునకు ఇంపుగ తెలియ జెప్పుతాను' అని పలికింది.

**తే. అనిన విని సురమునులు ప్రియంబుఁ బొంది । రమర గంధర్వ సిద్ధ సాధ్యాంగనా జ**
**నంబు వినువేడ్క వచ్చి య న్నలినవదన । వెనుక దెసనుండె దేవకీతనయ! యపుడు. 282**

**ప్రతిపదార్థం:** అనినన్ = గౌరి అట్లావచింపగా; సురమునులు = దేవతలు, ఋషులు; విని = ఆలించి; ప్రియంబున్+పొందిరి = సంతోషం చెందారు; దేవకీతనయ = శ్రీకృష్ణా!; అమర = వేల్పులు; గంధర్వ = గంధర్వులు; సిద్ధ = సిద్ధులు; సాధ్య = సాధ్యులు అనే వారి యొక్క; అంగనాజనంబు = స్త్రీ సమూహం; విను వేడ్కన్ = ఉమాదేవి మాటలు వినవలె నన్న కుతూహలంతో; వచ్చి = ఏతెంచి; ఆ+నలిన వదన వెనుక దెసన్ = ఆ పద్మముఖి యొక్క వెనుక వైపు; అపుడు = ఆ సమయాన; ఉండెన్ = ఉన్నది.

**తాత్పర్యం:** శైలజ మాటలు విని దేవతలు, మునులు హర్షించారు. సురలు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు అనే దేవజాతుల యొక్క వనిత లందరూ ఆమె పలుకులు వినే కుతూహలంతో వచ్చి ఆమె వెనుక వైపు కూర్చొని ఉన్నారు కృష్ణా!

**వ. అని చెప్పి య ప్పురుషోత్తము వీనులు వికసిల్లుచుండ నారదుం డిట్లనియె. 283**

**ప్రతిపదార్థం:** అని చెప్పి, ఆ+పురుష+ఉత్తము = ఆ శ్రీకృష్ణ భగవానుడి యొక్క; వీనులు = చెవులు, వికసిల్లుచున్+ఉండన్ = విప్పారగా; వినవలెనని కుతూహల పడుచుండగా; నారదుండు, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** గౌరీదేవి మాటలు వినవలెనని కుతూహలంతో శ్రీకృష్ణుని కర్ణములు విప్పారగా నారదమహర్షి ఇట్లా అన్నాడు.

**పార్వతి శివునకుఁ బతివ్రతా ధర్మంబుల తెఱఁ గెఱింగించుట.**

**క. వనితలుఁ బురుషులుఁ బ్రియమున । దను వినుతింపంగ శైలతనయ సమాక**
**ర్ణనకౌతుకి యగు నీశా । నునితో మృదురీతి నిట్లనుం గమలేశా! 284**

**ప్రతిపదార్థం:** కమలా+ఈశా = లక్ష్మీ వల్లభా! కృష్ణా!; వనితలున్ = ఆడువారు; పురుషులున్ = మగవారు; ప్రియమునన్ = ఇష్టంగా; తనున్ = తనను; వినుతింపంగన్ = కొనియాడగా, స్తోత్రం చేయగా; శైలతనయ = హిమవంతుడి కూతురైన ఉమాదేవి; సమాకర్ణన కౌతుకి = వినుటయందు కుతూహలం కలవాడైన; ఈశానునితోన్ = శంభుడితో; మృదురీతిన్ = కోమల ఫణితితో; ఇట్లు+అనున్ = ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** స్త్రీలు, పురుషులు ప్రీతితో తనను స్తుతిస్తూ ఉండగా పర్వత రాజపుత్రిక తన పలుకులు వినుటకు కుతూహలపడుతున్న పరమేశ్వరుడితో కోమల కంఠస్వరాన ఇట్లా అన్నది.

**సీ. 'ఋతుమతి గాక శుద్ధతయుఁ గల్గినయింతి । కన్య తత్పరిణయ కరణమునకు**
**నొడయులు విను తల్లియును దండ్రియును దండ్రి । తోఁ బుట్టినతఁడు మాతులుఁడు సోద**
**రుండును యోగ్యవరునిఁ జూచి వారిలో । నెవ్వరైనను బ్రీతి నిచ్చువారు;**
**పతి యంతనుండియుఁ బ్రభువు దానికి; నట్లు । గావున నాతండ దైవ మనుచు**

**తే. నతని మత మూఁది దేవతా పితృ సమర్చ। నములు నతిథి పూజనము సన్మతి సమాచ**
**రించుచును బతిహితము వాటించి నడపు। సతి పతివ్రత యిహపరసౌఖ్యమహిత. 285**

**ప్రతిపదార్థం:** ఋతుమతి+కాక = పుష్పవతి కాక, సమర్తాడక; శుద్ధతయున్ = పరిశుద్ధత్వం; కల్గిన+ఇంతి = కలిగినటువంటి పిన్నది; కన్య = బాల అని చెప్పబడుతుంది; తత్+పరిణయ కరణమునకున్ = ఆ చిన్నదానికి పెళ్ళి చెయ్యడానికి; తల్లియును = జనని; తండ్రియును = జనకుడున్నూ; తండ్రితోఁ బుట్టిన+అతఁడున్ = తండ్రి యొక్క తోడబుట్టువు అనగా పినతండ్రి, చిన్నాయన, బాబాయి; మాతులుఁడున్ = మేనమామ అనగా తల్లి తోడబుట్టువు; సోదరుండును = ఆ బాలిక యొక్క తోడబుట్టిన వాడు; ఒడయులు = అధికారులు, కర్తలు; యోగ్యవరునిన్ = తగిన మగడిని; చూచి = కనుగొని; వారిలోన్ = పైనుడివిన వారిలో; ఎవ్వరు+ఐననున్ = ఎవ్వరో ఒక్కరు; ప్రీతిన్ = సంతోషంతో; ఇచ్చువారు = వరుడికిచ్చి పెళ్ళి చెయ్యటానికి అర్హులు; దానికిన్ = ఆ కన్నియకు; అంతన్+ఉండియున్ = పెళ్ళి అయినప్పటి నుండి; పతి = భర్తయే; ప్రభువు = నాయకుడు, పాలకుడు; అట్లు+కావునన్ = అందుచేత; ఆతండు+అ = ఆ పెనిమిటియే; దైవము+అనుచున్ = దేవుడంటూ; అతనిమతము+ఊఁది = అతడి ఇష్టము ననుసరించి, అతడి అభిప్రాయం ప్రకారం; దేవతా పితృసమర్చనములు = దేవతల యొక్క పితృదేవతల యొక్క పూజలు; అతిథి పూజనము = అతిథులను ఆదరించుటయు; సన్మతిన్ = మంచి మనస్సుతో; సమాచరించుచును = నిర్వర్తిస్తూ; పతిహితమున్+పాటించి = మగని యొక్క మేలు కోరి; నడపు = సంసార యాత్ర సాగించే; సతి = వనితయే; పతివ్రత = సాధ్వి; ఇహపర సౌఖ్యమహిత = ఆమెయే ఇహపర సుఖాలు పొందటంలోదొడ్డది.

**తాత్పర్యం:** పుష్పవతి గాక పరిశుద్ధురాలుగా ఉండే పిన్నదాన్ని కన్య అంటారు. ఆ చిన్నదానికి పెళ్ళి చేసే విషయంలో కర్తలు తల్లి, తండ్రి, పినతండ్రి, మేనమామ, అన్నదమ్ములు. వీరిలో ఎవ్వరైనా ఆ బాలికను తగిన పురుషుడి కిచ్చి సంతోషంతో వివాహం జరిపించాలి. పరిణయం జరిగింది మొదలుకొని ఆమెకు పెనిమిటియే సర్వాధికారి. పతినే దైవంగా భావించి అతడి ఇష్టానుసారం ఆమె దేవతల, పితృదేవతల పూజలు, అతిథి పూజలు సద్బుద్ధితో సలుపుతూ మగనిమేలు కోరుతూ సంసారయాత్ర సాగించాలి. అట్లాంటి పడతియే పతివ్రత. అట్టి ఇల్లాలు ఇహపరలోక సుఖాలు చూరగొంటుంది.

**వ. ఏతద్విషయం బయిన యొక్క నిదర్శనం బవధరింపుము. 286**

**ప్రతిపదార్థం:** ఏతద్+విషయంబు+అయిన = ఈ స్త్రీ ధర్మమునకు సంబంధించిన; ఒక్కనిదర్శనంబు = ఒక దృష్టాంతం; అవధరింపుము = చిత్తగించవలసింది;

**తాత్పర్యం:** దేవా! ఈ స్త్రీ ధర్మ విషయకమైన దృష్టాంతం ఒకటున్నది. విన్నవిస్తాను. చిత్తగించ ప్రార్థన.

**సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్య లిద్దఱు గల;। రందొక భామిని యతని హితము**
**నడపెడు నవధాన మెడలి యాతఁడు పంప। కయుఁ దాన సురపితృకార్యపరత**
**నడచుఁ; దక్కటియింతి నాథుఁ బాటించుచుఁ। దన్మతంబునఁ జేయు ధర్మవిధులు;**
**వారు ముప్పురు విధివశమున నొక్కట। మృతిఁ బొంది; రా పతివ్రత వరుండు**

**తే. చనిన సుగతికిఁ జనెఁ; బెఱవనిత జముఁడు । 'నీకుఁ బోలదు మరలుము నీశరీర**
**మునక' యని యాఁగె; నది శోకమున సబాష్ప । యైనఁ గన్గొని యతఁడు దయార్ద్రుఁ డగుచు. 287**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణుఁడు+ఒకనికిన్ = ఒక విప్రుడికి; భార్యలు+ఇద్దఱు = ఇరువురు పత్నులు; కలరు = ఉన్నారు; అందున్ = వారిలో; ఒక భామిని = ఒక చెలువ; అతని హితమున్ = అతడి కిష్టమైన దానిని; నడపెడున్ = సలుపుతుంది; ఆతఁడు = ఆమె భర్త; అవధానము+ఎడలి = ఏకాగ్రత చెడి, జ్ఞప్తి లేక, ఎఱుకమాలి; పంపకయున్ = ఆజ్ఞాపించకున్ననూ, తనను ఆ పనిచేయుమని నియమించకున్ననూ; తాను+అ = తానే, స్వయంగా; సురపితృకార్యపరతన్ = దేవ, పితృదేవతా పూజాదికములైన పనులయందు ఆసక్తితో; నడచున్ = ప్రవర్తిస్తూంటుంది, మెలగుతుంటుంది; తక్కటి+ఇంతి = రెండవపత్ని; నాథున్+పాటించుచున్ = భర్తమాట, భర్త అనుమతి ఆదరిస్తూ, లక్ష్యపెడుతూ; తత్+మతంబునన్ = అతడి ఇష్టానుసారం; ధర్మవిధులు = పుణ్యకార్యాలు; చేయున్ = సల్పుతుంది; వారు మువ్వురున్ = భర్త, భార్యలిద్దరూ; విధివశమునన్ = దైవాజ్ఞకులోనై; ఒక్కట = ఏకకాలమందు; మృతిన్+పొందిరి = మరణించారు; ఆ పతివ్రత = ఆసాధ్వి అనగా రెండవ యిల్లాలు; వరుండు = మగడు; చనినసుగతికిన్ = వెళ్ళిన పుణ్యలోకానికి, స్వర్గానికి; చనెన్ = వెళ్ళింది; పెఱవనితన్ = తక్కిన వెలదిని- అనగా మొదటి భార్యను; జముఁడు = యమధర్మరాజు; నీకున్ = నీకు; పోలదు = తగదు; నీ శరీరమునకు+అ = నీ దేహమునకే; మరలుము = తిరిగిపొమ్ము; అని = అని పలుకుతూ; ఆఁగెన్ = నిలిపినాడు; అది = ఆ మొదటి పెండ్లం; శోకమునన్ = ఏడుపుతో; సబాష్ప+ఐనన్ = కన్నీటి బొట్లతో కూడినది కాగా; కన్గొని = చూచి, అతఁడు = యముడు; దయా+ఆర్ద్రుఁడు+అగుచున్ = కృపారసముతో తడిసిన వాఁడై, దయతో చెమ్మగిల్లిన మనసుకలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** ఒకానొక బ్రాహ్మణుడికి ఇద్దరు భార్యలు. వారిలో ఒకతె (తొలిది) మగని కుశలం కోరి, తనను ఈ పనిచేయుమని అతడు నియోగించక పోయినా దేవతలకు, పితృదేవతలకు పూజాదికం నిర్వహించేది. మరి యొకతె (మలిది) పతి మాట జవదాటక అతడి ఆజ్ఞ పడసి పుణ్యకార్యాలు సలిపేది. వారు ముప్పురూ విధివశాత్తు ఏకకాలంలోనే చనిపోయారు. అందులో పెనిమిటి అనుమతితో ధర్మకార్యాలు సలుపుతున్న మలిఇల్లాలు అతడి వెంట పుణ్యలోకానికి వెళ్ళింది. భర్త అనుమతి లేకుండా దేవ పితృపూజలు నిర్వహిస్తున్న తొలి పెళ్ళాన్ని పెనిమిటితో స్వర్గానికి పోకుండా యముడు అడ్డగించి 'నీ శరీరానికి తిరిగి మరలు' మని ఆదేశించాడు. అందుకు ఆమె కన్నీరు మున్నీరుగా విలపించింది. యముడి హృదయం కరుణారసంతో కరిగి పోయింది.

**క. 'పతిమతము గొనక ధర్మము । నతివ నడపు టొప్ప; దింకనైనను బతికిన్**
**హితము లగువానిఁ జేసిన । నతనిఁ గలయు' దనినఁ జనియె నదియును మరలన్. 288**

**ప్రతిపదార్థం:** పతిమతము+కొనక = భర్త యొక్క అంగీకారం పొందక; ధర్మమున్ = పుణ్యమును; అతివ = పత్ని; నడపుట = చేయుటం; ఒప్పదు = తగదు; ఇంకన్+ఐననున్ = ఇక మీదటనైనా; పతికిన్ = భర్తకు; హితములు+అగువానిన్ = ఇష్టములైనవాటిని; చేసినన్ = చేసినట్లయితే; అతనిన్ = యజమానుడిని; కలయుదు = కలిసికొంటావు; అనినన్ = అని యముడు చెప్పగా; అదియును = ఆ తొలిపత్ని; మరలన్ = మళ్ళీ, తిరిగి; చనియెన్ = వెళ్ళింది.

**తాత్పర్యం:** పెనిమిటి యొక్క అనుమతిలేక పుణ్యకార్యాలు చేయటం భార్యకు తగదు. ఇకనైనా నీ పతి కిష్టములైన కార్యాలను నీవు చేస్తున్నట్లయితే అతడిని కలిసికొనగలవు' అని యమధర్మరాజు చెప్పాడు. ఆయన మాటలు విని ఆమె దేహంతో మరలిపోయింది.

**వ. కావునం బతికి ననువ్రత యగుట గృహిణికి ధర్మం' బని పలికి వెండియు. 289**

**ప్రతిపదార్థం:** కావునన్ = కాబట్టి, పతికిన్ = భర్తకు, అనువ్రత+అగుట = అనుకూలంగా మెలగటం; గృహిణికిన్ = ఇల్లాలికి; ధర్మంబు = న్యాయం; అని పలికి; వెండియున్ = మరల (పార్వతి శివుడితో ఇట్లా అన్నది అని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** కాబట్టి భర్తకు అనుకూలంగా మెలగటం ఇల్లాలికి ధర్మమని చెప్పి పార్వతి మళ్ళీ.

**క. 'లలన యిలువాడి నాథుఁడు । వలచిన చవి వంటకములు వండి యిడి తనుం**
**గలయఁ దలంచిన మెయికొని । యెలమిం గైసేసి హృదయ మీ వలయు శివా! 290**

**ప్రతిపదార్థం:** శివా! = మహేశ్వరా!; లలన = కాంత; ఇలువాడిన్ = ఇంటి వాడుక చొప్పున; నాథుఁడు = తనపతి; వలచిన = కోరినట్టి; చవివంటకములు = రుచిగల పదార్థాలు; వండి+ఇడి = వండి తినబెట్టి; తన్నున్ = తనను; కలయన్+తలంచినన్ = పొందగోరినచో; మెయికొని = అందుకు అంగీకరించి, ఇష్టపడి; ఎలమిన్ = సంతోషంతో; కైసేసి = అలంకరించుకొని; హృదయము = తన మనస్సు; ఈవలయున్ = సమర్పించవలెను.

**తాత్పర్యం:** ఇంటి వాడుక ననుసరించి భర్త తన కిష్టములైన వంటకములు వాంఛించినపుడు గృహిణి వండి పెట్టాలి. అతడు తన పొందు కోరినపుడు సంతోషంతో తన సమ్మతి తెలిపి శృంగారించుకొని తన హృదయం ఆతడికి సమర్పించాలి.

**తే. పనుల యెడ మాఱుపలుకక యనవధానుఁ । డైన పతిఁ దలఁపించి ధర్మార్థ కలిత**
**కృతులు నడపుచు, సవతి గల్గినను బోరి । తంబు లే కొక్కటై యున్కి తగవు సతికి. 291**

**ప్రతిపదార్థం:** పనులయెడన్ = కార్యాలపట్ల; మాఱుపలుకక = అడ్డు చెప్పక, ప్రతికూలంగా మాట్లాడక; అనవధానుఁడు +ఐన+పతిన్ = ఏమరిపాటు చెందిన భర్తను; తలఁపించి = కర్తవ్యాన్ని జ్ఞప్తి పరచి; ధర్మ+అర్థ+కలితకృతులు = ధర్మార్థములతో కూడినపనులు అనగా ధర్మమును అర్థమును ఆర్జించుటకు తోడ్పడే పనులు; నడపుచున్ = కొనసాగిస్తూ; సవతి+కల్గినను = సపత్ని ఉన్నను; పోరితంబు లేక = కలహం లేకుండా; ఒక్కటి+ఐ+ఉన్కి = ఆమెతో కలసి మెలసి ఉండటం; సతికిన్ = సాధ్వికి; తగవు = న్యాయం.

**తాత్పర్యం:** గృహిణి తన భర్త కావించే పనులకు అడ్డుపడరాదు. ఆతడు ఏమరిపాటున కర్తవ్యం మరచి ఉన్నప్పుడు ఆ విషయమును జ్ఞప్తికి తేవాలి. ధర్మార్థసాధకాలైన పనులు కొనసాగేటట్లు చేయాలి. తనకు సవతాలు ఉన్నప్పుడు కలహించక ఆమెతో కలసిమెలసి ఉండాలి. ఇది సతీ ధర్మం.

**క. సవతాలికిఁ బతి వలచిన । నవుఁగాకని యతని యిచ్చ కనురూపముగాఁ**
**దివిరి నడచు సతి దైవము; । శివ! యది తగు నెల్ల జనముచే మ్రొక్కుగొనన్. 292**

**ప్రతిపదార్థం:** శివ! = పరమేశ్వరా!; పతి = భర్త; సవతి+ఆలికిన్ = తన సపత్నికి; వలచినన్ = మోహపడితే; అవున్+కాక+అని = అది మంచిదే అని; అతని+ఇచ్చకున్ = మగని కోరికకు; అనురూపముగాన్ = తగినట్లుగా, అనుకూలంగా; తివిరి = పూను కొని; నడచు సతి = మెలగే వనిత; దైవము = దేవతయే సుమా! అది = ఆ ఇల్లాలు; ఎల్ల జనముచేన్ = సమస్త ప్రజల చేత; మ్రొక్కు+కొనన్+తగున్ = నమస్కారా లందుకొనడానికి యోగ్యురాలు.

**తాత్పర్యం:** నాథా! తన మగడు తనను విడిచి తన సవతాలి పొందు కాంక్షించినపుడు చింతించక అది మంచిదే అని అతడి అభిలాషకు అనుకూలంగా మెలగే సతీమణి నిజంగా దేవతయే. ఆమె ప్రజలందరి వందనా లందుకొనటానికి అర్హురాలు.

**క. తన చేతికి నిచ్చిన వ । స్తునికాయము నిల్లురువున చొప్పున మగుడం**
**గొనివచ్చి భార్య పతి దె । మ్మని నప్పుడ యిచ్చుటొప్పు నకపటవృత్తిన్. 293**

**ప్రతిపదార్థం:** తన చేతికిన్, ఇచ్చిన, వస్తునికాయమున్ = వస్తువుల సమూహాన్ని; ఇల్లురువున చొప్పునన్ = ఇల్లడ ధనం మాదిరిగా, కుదువ బెట్టిన వస్తువులరీతిగా, న్యాసధనం పోలికగా; మగుడన్ = తిరిగి; కొని వచ్చి = తీసుక వచ్చి; భార్య = పత్ని; పతి = తన పెనిమిటి; తెమ్ము+అనిన+అప్పుడు+అ = తీసుక రమ్మని చెప్పిన వెనువెంటనే; అకపట వృత్తిన్ = మోసగించక, వంచించక, నిష్కపటమైన బుద్ధితో; ఇచ్చుట = పెనిమిటి కొప్పగించుట; ఒప్పున్ = తగును.

**తాత్పర్యం:** మగడు తన చేతి కిచ్చిన వస్తువులను అతడు తెమ్మని అడిగిన వెను వెంటనే కుదువ బెట్టిన సొమ్ము మాదిరిగా భద్రంగా వంచనారహితమైన వర్తనతో అతడికి అప్పగించటం భార్యయొక్క ధర్మం.

**క. పతి తనకు నేమి యిచ్చిన । నతిముదమునఁ బొందవలయు; నాత్మజుఁ డైనన్**
**మతిఁ గొంకక యేకాంత । స్థితి నేకాసనత నున్కి సెట్ట ప్రమదకున్. 294**

**ప్రతిపదార్థం:** పతి = భర్త; తనకున్, ఏమి, ఇచ్చినన్; అతివ = స్త్రీ; ముదమునన్+పొందన్+వలయున్ = సంతోషపడవలసి ఉంటుంది; ఆత్మజుఁడు+ఐనన్ = కన్నకుమారుడైనా; మతిన్ = మనస్సులో; కొంకక = సంకోచించక, భయపడక; ఏకాంతస్థితిన్ = ఒంటరిగా ఉన్నప్పుడు, రహస్యంగా ఉన్న చోట; ప్రమదకున్ = స్త్రీకి; ఏక+ఆసన+స్థితి = ఒకే పీఠమందుండటం; చెట్ట = కీడు, హానికరం.

**తాత్పర్యం:** భర్త తన కేమి ఇచ్చినా భార్య సంతోషంతో స్వీకరించాలి. కడకు కన్నకుమారుడితోనైనా స్త్రీ ఒంటరిగా ఉన్నప్పుడు ఒకే పీఠం మీద జంకు గొంకులు లేకుండా కూర్చొనటం హానికరం.

**క. ధని యధనుఁడు రూపసి యొ । ప్పనివాఁడు వివేకి మూఢభావుఁ డరోగుం**
**డనుగత రోగుఁ డనక యం । గన పతిఁ బాటింపవలయుఁ గామధ్వంసీ! 295**

**ప్రతిపదార్థం:** కామధ్వంసీ! = మన్మథుడిని కాల్చిన వాడా!; ధని = ధనం కలవాడు; అధనుఁడు = ధనంలేని వాడు, దరిద్రుడు; రూపసి = అందగాడు; ఒప్పనివాఁడు = అందం లేనివాడు, కురూపి; వివేకి = తెలివికలవాడు; మూఢభావుఁడు = తెలివిమాలినవాడు; అరోగుండు = రోగం లేనివాఁడు, ఆరోగ్యవంతుడు; అనుగత రోగుఁడు = వెంబడించే రోగాలు కలవాడు, అనారోగ్యవంతుడు; అనక = అని భావించక; అంగన = ఆడుది; పతిన్ = భర్తను; పాటింపన్+వలయున్ = ఆదరించవలెను.

**తాత్పర్యం:** కాముని సంహరించిన కైలాసవాసా! ధనవంతుడు దరిద్రుడు; రూపవంతుడు రూపహీనుడు; తెలివిగలవాడు తెలివిమాలినవాడు; ఆరోగ్యవంతుడు అనారోగ్యం కలవాడు అని తలంపక ఆడుది తన పెనిమిటిని ఆదరించాలి.

**క. బలిభిక్షము గడప కిడ । న్వలయును దేవపితృ పూజనంబుల కాలం**
**బులఁ బతి శుభమందుటఁ ద । త్ఫలంబుగాఁ గోరు టొప్పిదము సతికి శివా! 296**

**ప్రతిపదార్థం:** శివా! = పరమేశ్వరా!; బలి = భూతముల (జంతువుల) కొరకు బలియు; భిక్షమున్ = యాచకులకు బిచ్చమూ; కడపక = లేదు పొమ్మనక; ఇడన్ వలయున్ = ఒసగవలెను; దేవ = దైవతములయొక్క; పితృ = పితృదైవతముల యొక్క; పూజనంబుల కాలంబులన్ = అర్చించే సమయములందు; పతి = తన విభుడు; శుభము+అందుటన్ = మంగళములు పొందటం; తత్+ఫలంబుగాన్ = ఆ దేవ పితృపూజల ఫలంగా; కోరుట = అభిలషించటం; సతికిన్ = పత్నికి; ఒప్పిదము = యుక్తము, యోగ్యము, తగినట్టిది.

**తాత్పర్యం:** భూతములకు (పశు పక్ష్యాదులకు) ప్రీతిగ బలి సమర్పణ కావించటం, యాచకులకు బిచ్చం పెట్టటం, దేవతలను, పితృదేవతలను పూజించే వేళలందు ఆ పూజాఫలమెల్ల తన భర్తకు శుభములు చేకూర్చటానికి ఉపయుక్తం కావాలని కోరుకొనటం ఇల్లాలి యొక్క ధర్మం.

**క. గతి పతియ చువ్వె భార్యకు; । నతనిఁ గడచినట్టి సత్పరాయణము కృపా**
**యుత! కలదే? కావునఁ దా । నతనికి భక్తయగు టిచ్చు నఖిల శుభంబుల్.' 297**

**ప్రతిపదార్థం:** కృపాయుత! = దయతో కూడిన వాడా!; భార్యకున్ = పత్నికి; గతి = దిక్కు; పతియ చువ్వె! = భర్తయే సుమా!; అతనిన్ = మగడిని; కడచిన+అట్టి = మించినట్టి; సత్+పరాయణము = ఉత్తమమైన ఆశ్రయం, పరమప్రాప్యమైన వస్తువు; కలదు+ఏ? = ఉన్నదా? లేదని భావం; కావునన్ = కాబట్టి; తాన్ = తాను; అతనికిన్ = పెనిమిటికి; భక్త+అగుట = భక్తురాలు కావటం, సేవలొనర్చటం; అఖిలశుభంబుల్ = సమస్త మంగళములను; ఇచ్చున్ = లభింపజేస్తుంది.

**తాత్పర్యం:** దయామయా! భార్యకు భర్తయే దిక్కు. అతడిని మించిన ఉత్తమమైన ఆశ్రయం ఆమెకు మరొక్కటి లేదు. కావున అతడికి సేవకురాలు కావటంవలన సతికి సర్వశుభాలు సమకూడుతాయి.'

**వ. అని చెప్పి య ప్పరమేశ్వరునకుం బార్వతి భార్యల యధర్మంబులు వివరించునదియై యిట్లనియె. 298**

**తాత్పర్యం:** పార్వతి ఆ విధంగా పలికి శివుడికి భార్యల యొక్క అధర్మాలెట్టివో తెలుపదలచి మళ్ళీ ఇట్లా అన్నది.

పార్వతి శివునకుఁ బతివ్రత కనర్హంబులగు ధర్మంబులఁ దెలుపుట. (సం.13. అను 1.15-4609).

**సీ.** **'పరమేశ! యాసురి పైశాచి రాక్షసి । యను పేళ్ళు గల వధర్మాంగనలకు;**
**వ్యభిచారతత్పరత్వంబు వారికి నెల్లఁ । గల; దసురాంశజ క్రౌర్యనిరత,**
**తనయిచ్చఁ బొలియించు ధనధాన్యములు, చల । హృదయ, భోగపరాత్మ, యీర్ష్య గలదు;**
**పైశాచి క్రోధన, భర్తృపుత్రులయందు । నిఃస్నేహ, గృహకార్యనిపుణ గాదు,**

**తే.** **కలహశీల; రాక్షసి సయికంబు లేదు, । బొంకువల్కు, నెప్పడు నిద్రవోవు, వీత**
**లజ్జ; యిందఱు నాథుకులంబువారి । దురిత మొందించి పోదురు నరకమునకు. 299**

**ప్రతిపదార్థం:** పరమేశ! = శంకరా!; అధర్మ+అంగనలకున్ = ధర్మవిరుద్ధములైన పనులు చేసే ఆడువారికి; ఆసురి, పైశాచి, రాక్షసి; అను పేళ్ళు గలవు = అనే పేర్లు ఉన్నాయి; వారికిన్+ఎల్లన్ = పైనుడివిన వారికందరికీ; వ్యభిచారతత్పరత్వంబు = పరపురుషుడితో సంగమించటంలో ఆసక్తి; కలదు = ఉన్నది; అసుర+అంశజ = అసురాంశలో జన్మించిన ఆసురి అనే పేరుగల మగువ; క్రౌర్యనిరత = క్రూరకృత్యాలలో అభిలాష కలిగి ఉంటుంది; ధనధాన్యములు = ధనమూ, ధాన్యమూ; తన+ఇచ్చన్ = తన యిష్ట ప్రకారం; పొలియించున్ = నాశనం చేస్తుంది; చలహృదయ = అతి చంచల స్వభావురాలు, నిలుకడ లేని మనస్సు కలది; భోగపర+ఆత్మ = సుఖాలకు వశమైన చిత్తం కలిగినట్టిది, భోగాలు మరిగినటువంటిది; ఈర్ష్యకలదు = అసూయకలిగినట్టిది; పైశాచి = ఇక పైశాచి అనే పేరుగల అంగన; క్రోధన = కోపస్వభావం కలది; భర్తృ పుత్రుల+అందున్ = తన మగడియందునూ, తన బిడ్డలయందునూ; నిఃస్నేహ = ప్రేమలేనిది; గృహకార్యనిపుణ+కాదు = ఇంటిపనులయందు నేర్పుకలది కాదు; రాక్షసి = రాక్షసి అనే నామధేయం గల పడతి; కలహశీల = తగవులమారి, జగడగొండి; సయికంబు లేదు = అది సూక్ష్మదృష్టిలేనట్టిది; బొంకు = అబద్ధం; పల్కున్ = మాట్లాడుతుంది; ఎప్పుడున్ = అన్ని వేళలందు; నిద్రపోవున్ = నిద్రిస్తుంది; వీతలజ్జ = అది సిగ్గుమాలినది; ఇందఱున్ = ఈ చెప్పిన వారంతా; నాథుకులంబు+వారిన్ = భర్త యొక్క వంశం వారిని; దురితము+ఒందించి = పాపాల పాలు చేసి; నరకమునకున్+పోదురు = నరక లోకానికి వెళ్ళుతారు.

**తాత్పర్యం:** 'పరమశివా! అధర్మ మార్గంలో చరించే ఆడవాళ్ళు ఆసురి, పైశాచి, రాక్షసి అనే పేర్లు కలిగి ఉన్నారు. వీరంతా పరపురుషుల పొందు వాంఛిస్తుంటారు. వీరు రంకుటాళ్లు. ఆసురి అనే ఆడుది అసురాంశలో జన్మించినట్టిది. అది క్రూరకృత్యాలలో అపేక్ష కలిగి ఉంటుంది. తన ఇష్ట ప్రకారం ధనధాన్యాలను నాశనం చేస్తుంది. దాని మనసు నిలుకడ కలిగి ఉండదు. భోగా లనుభవించటంలో అభిలాష కలిగి ఉంటుంది. అది అసూయాపరురాలు. పైశాచి అనే పేరు వహించి ఉన్న పొలతి కోపిష్ఠిది. పెనిమిటియందు, బిడ్డల యందు దానికి ప్రేముడి లేదు. ఇంటి పనులలో దానికి నేర్పులేదు. రాక్షసి అనే పేరు ధరించిన స్త్రీ కయ్యానికి కాలుద్రవ్వుతుంది; గయ్యాళి; దానికి సూక్ష్మదృష్టిలేదు. అబద్ధాలు చెప్పుతుంది. ఎప్పుడూ నిద్రపోతుంటుంది. అది సిగ్గు విడిచిన చేడె. వీరందరూ భర్త యొక్క వంశంవారినంతా పాపాలకు గురిచేసి తాము నరకం పాలవుతారు.

**ఆ.** **ఎఱుక గలిగి పిదప నేనియుఁ బతిభక్తి । గలిగి ధర్మ మోపి సలిపి శాంతి**
**గలిగియున్న మున్ను గల పాపములు వాసి । పురుషుతోడ దివికిఁ బోవఁ గంద్రు. 300**

**ప్రతిపదార్థం:** ఎఱుక+కలిగి = జ్ఞానం లభించి, తెలివి గలిగి; పిదపన్+ఏనియున్ = ఆ తరువాతనైనా; పతిభక్తి+కలిగి = భర్తయందు భక్తి జనించి; ఓపి = సమర్థతతో; ధర్మము = పుణ్యమును; సలిపి = ఆచరించి; శాంతి+కలిగి+ఉన్నన్ = శాంత

గుణం కలిగి ఉంటే, అనగా మనసును పరిపరివిధాల పోనీకుండా ఉంటే; మున్ను+కల = పూర్వం సంపాదించినట్టి; పాపములు = దురితాలు; పాసి = తొలగి; పురుషుతోడన్ = మగడితో; దివికిన్ = స్వర్గానికి, పోవన్+కంద్రు = వెళ్ళగలుగుతారు.

**తాత్పర్యం:** ప్రాణేశ్వరా! అట్టి స్త్రీలు తెలివి గలిగిన తరువాత నయినా పతియందు భక్తి గలిగి పుణ్యకార్యాలు సమర్థతతో సలుపుతూ, మనసును పరిపరి విధాల పోనీక నిగ్రహించి ఉన్నచో మునుపు తాము చేసిన పాపాలన్నీ తొలగి తమ పురుషుడితో స్వర్గానికి వెళ్ళగలరు.

**ఆ. అట్లుగాక పతుల యంతిమ సమయంబు । నందుఁ జింతఁ దక్కి యనుమరణము**
**చేసిరేని సుగతి సిద్ధించుఁ బతి సమే । తంబుగాఁగ నన్నితంబినులకు. 301**

**ప్రతిపదార్థం:** అట్లు+కాక = పైనుడివిన విధంగా కాక; పతుల = భర్తల యొక్క; అంతిమ సమయంబు+అందున్ = మరణకాలంలో; చింతన్ = విచారమును, దుఃఖమును; తక్కి = విడిచి పెట్టి; అనుమరణము+చేసిరి+ఏనిన్ = సహగమనం చేసినట్లయితే- భర్త చితిమంటలలో ప్రవేశించి తామూ బూది అయితే; ఆ+నితంబినులకున్ = ఆ సతీమణులకు; పతి సమేతంబు+ కాఁగన్ = మగలతో కూడ; సుగతి+సిద్ధించున్ = సద్గతి కలుగుతుంది - స్వర్గలోకం లభిస్తుంది.

**తాత్పర్యం:** మనోహరా! పై చెప్పిన విధంగా పుణ్యకార్యాచరణ చెయ్యలేని స్త్రీలు పతి చనిపోయినపుడు శోకం వదలి సహగమనం చేస్తే - అతడితో చితిమంటలలో ప్రవేశించి శరీరం విడిచిపెడితే - అట్టి సతులకు వారి మగలతో పాటు స్వర్గం సంప్రాప్తిస్తుంది.

**క. ద్విజభామినికి నధర్మము । ప్రజఁ గాంచిన పిదప నయ్యపత్యము శోకో**
**ద్విజితయుఁ బతిభక్తయునై । త్యజించి యనుమరణ నియత యగుట మహేశా!' 302**

**ప్రతిపదార్థం:** మహేశా! = పరమేశ్వరా!; ద్విజభామినికిన్ = బ్రాహ్మణస్త్రీకి; ప్రజన్ = బిడ్డలను; కాంచినపిదపన్ = కనినమీదట; శోక+ఉద్విజితయున్ = దుఃఖంచేత కలత చెందినదియూ, శోక వ్యాకులచిత్తయూ; పతిభక్తయున్+ఐ = భర్తయందు భక్తిగలదై; ఆ+అపత్యమున్ = ఆ బిడ్డను; త్యజించి = వదలి; అనుమరణ నియత+అగుట = భర్తతో సహగమనం చేయటానికి నిర్ణయించుకొన్నది కావటం; అధర్మము = అన్యాయం.

**తాత్పర్యం:** బ్రాహ్మణ స్త్రీ తనకు సంతానం కలిగిన తరువాత, దుఃఖవ్యాకుల చిత్తంతో, భర్తయందు భక్తి గలదై బిడ్డను వదలి పతితో సహగమనం చేయటం అన్యాయం.'

**క. అని చెప్పి గౌరి పతి కి । ట్లను 'నాదగు చాపలమున నఖిలేశ్వర! నిన్**
**వినిపించితి నేఁ గొన్నివ । చనముల; నీతప్పు నాకు సైఁపుము కరుణన్.' 303**

**ప్రతిపదార్థం:** అని చెప్పి, గౌరి, పతికిన్; ఇట్లు+అనున్ = ఈ లాగున చెప్పింది; అఖిల+ఈశ్వర! = సమస్తమునకూ ప్రభువైన వాడా!; నాదగు చాపలమునన్ (నాది+అగు = నాదగు); నా యొక్క బుద్ధి చాంచల్యం చేత; నేన్ = నేను; కొన్ని వచనములన్ = కొన్ని మాటలను; నిన్+వినిపించితిన్ = నీకు చెప్పాను; ఈ తప్పున్ = ఈ దోషాన్ని; కరుణన్ = కృపతో, నాకున్+సైఁపుము = నా విషయమై సహించుము, మన్నించుము.

**తాత్పర్యం:** ఉమాదేవి ఆ ప్రకారం పతికి స్త్రీ స్వభావాన్ని గురించి తెలిపి మళ్ళీ ఇట్లా అన్నది. 'జగత్ప్రభూ! నా చాపల్యం కొద్ది నేను కొన్ని మాటలు తమకు విన్నవించాను. దయతో ఈ తప్పును మన్నించ వేడుతున్నాను.'

**క. అని సిగ్గున చెన్నగు నా । నన మించుక వాంచి యెత్తు నగతనయ శివుం**
**డును మునులును మునిపత్నులు । వినుతించిరి మధురవాక్య విభవం బెసఁగన్. 304**

**ప్రతిపదార్థం:** అని = అట్లు పలికి; సిగ్గునన్ = లజ్జచేత; చెన్ను+అగు = అందగించిన; ఆననమున్ = మొగమును; ఇంచుక వాంచి = కొంచెం క్రిందికి వంచి, (పిదప); ఎత్తు = మీదికెత్తిన; నగతనయన్ = పర్వత పుత్రిని; మధురవాక్య విభవంబు+ఎసఁగన్ = మనోహరమైన మాటల పెంపు సొంపారగా; శివుండు = శంభుడు; మునులును = ఋషులు; ముని పత్నులున్ = ఋషుల భార్యలు; వినుతించిరి = కొనియాడారు;

**తాత్పర్యం:** ఆ విధంగా పలికి సిగ్గుతో చెలువారిన మోమును కొంచెం వంచి పైకెత్తిన నగరాజపుత్రికను మృత్యుంజయుడు, మునులు, మునుల భార్యలు ప్రస్తుతించారు.

**క. సురగంధర్వఖచర కి । న్నర కింపురు షోరగాది నారీజనముల్**
**పరమప్రీతిని బొగడిరి । పరమేశ్వరి నెలుఁగు లడరఁ బంకజనాభా!' 305**

**ప్రతిపదార్థం:** పంకజనాభా! = పద్మము బొడ్డున గల నారాయణా!; సుర = వేల్పులు; గంధర్వ = గంధర్వులు; ఖచర = ఖేచరులు; కిన్నర = కిన్నరులు; కింపురుష = కింపురుషులు; ఉరగ+ఆది = నాగులు మున్నగు జాతుల యొక్క; నారీజనముల్ = స్త్రీ సమూహాలు; పరమేశ్వరిన్ = గౌరీదేవిని; ఎలుఁగులు+అడరన్ = కంఠధ్వనులు చెలరేగగా; పరమ ప్రీతిన్ = మిక్కుటమైన ఆనందంతో; పొగడిరి = శ్లాఘించారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! దేవతలు, గంధర్వులు, ఖేచరులు, కిన్నరులు, కింపురుషులు, నాగులు మున్నగు దేవతా జాతుల వనితా జనాలు మిక్కిలి సంతోషంతో గొంతులెత్తి గిరిజాదేవిని కొనియాడారు.'

**క. అని చెప్పి నారదుం డి । ట్లను న గ్గోవిందుతోడ నప్పుడు ప్రియ మా**
**ననమునఁ బొదలఁగఁ బార్వతిఁ । గనుఁగొని సర్వేశ్వరుండు గారవ మొప్పన్. 306**

**ప్రతిపదార్థం:** అని చెప్పి = అని వచించి; నారదుండు = నారద మహర్షి; ఆ+గోవిందునితోడన్ = ఆ గోపాలకృష్ణుడితో; ఇట్లు+అనున్ = ఈ విధంగా చెప్పాడు; అప్పుడు = ఆ వేళ; ప్రియము = ప్రేమ; ఆననమునన్ = ముఖమునందు; పొదలఁగన్ = వర్ధిల్లగా; సర్వేశ్వరుండు = శివుడు; పార్వతిన్ = గిరిజను; కనుఁగొని = వీక్షించి; గారవము+ఒప్పన్ = గౌరవభావం హెచ్చుగా.

**తాత్పర్యం:** అని పలికి నారద మహర్షి వాసుదేవుడితో ఇట్లా అన్నాడు. 'శ్రీకృష్ణా! శివు డప్పుడు ముఖమున సంతోషం దీపించగా ఆదరంతో గౌరీదేవిని వీక్షించి.

**క. 'నానీ సంవాదము శుచి । యై నైష్ఠికజనుల కెవ్వఁ డాదర మెసఁగం**
**గా నలినాక్షీ! చెప్పును । వానికి నిత్యామరత్వ వైభవ మొదవున్. 307**

**ప్రతిపదార్థం:** నలిన+అక్షీ! = పద్మములవంటి నేత్రములు గల గౌరీ!; నానీ సంవాదము = మనఇరువురి యొక్క సంభాషణ; ఎవ్వఁడు = ఎవడు; శుచి+ఐ = పరిశుద్ధుడై; నైష్ఠిక జనులకున్ = నిష్ఠగల మనుజులకు; ఆదరము+ఎసఁగన్+కాన్ = గౌరవం అతిశయించగా; చెప్పును = చెప్పుతాడో; వానికిన్ = అట్టివాడికి; నిత్య+అమరత్వ+వైభవము = శాశ్వతమైన దివ్యత్వ సంపద; ఒదవున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** 'కమల పత్రాలవంటి కన్నులు గల దేవీ! మనఇద్దరి సంభాషణం ఎవడు పరిశుద్ధుడై గౌరవ బుద్ధితో శ్రద్ధాభక్తులు గల జనులకు చెప్పుతాడో అతడికి శాశ్వతమైన దేవతాత్వ వైభవం లభిస్తుంది.

**క. మన సంవాదం బెవ్వరు । వినిరి నియతి నజ్జనులకు విభవముఁ దేజం**
**బును గీర్తియు నాయువు శ్రీ । యును నారోగ్యంబుఁ గల్గు నుత్పలనయనా!' 308**

**ప్రతిపదార్థం:** ఉత్పలనయనా! = కలువ రేకులవంటి కన్నులుగల దానా! ఓ కలువకంటీ!; మనసంవాదంబు = మన ఇద్దరి సంభాషణ; ఎవ్వరు = ఎవరు; నియతిన్ = భాగ్యవశాన; వినిరి = విన్నారో; ఆ+జనులకున్ = ఆ నరులకు; విభవమున్ = ఉన్నత స్థితి; తేజంబున్ = శక్తి, ప్రకాశం; కీర్తియున్ = యశస్సు; ఆయువున్ = ఆయుష్యమూ; శ్రీయును = సంపత్తి; ఆరోగ్యంబున్ = అనామయమూ; కల్గున్ = సమకూడుతాయి.

**తాత్పర్యం:** కలువ రేకులవంటి కన్నులదానా! మన సంవాదం ఎవరు పూర్వజన్మకృత పుణ్యవశాన ఆలకిస్తారో, అటువంటి మనుజులకు ఉన్నతస్థితి; తేజస్సు, యశస్సు, ఆయుస్సు, ఐశ్వర్యమూ, ఆరోగ్యమూ సమకూడుతాయి.'

**క. 'అని నిర్దేశించి శివుఁడు । చనియె; శివయుఁ గొలువుతోన చనె; నిద్దెసకుం**
**జని రన వశమే? యద్భుత । మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీ రమణా! 309**

**ప్రతిపదార్థం:** శ్రీరమణా! = ఇందిరావల్లభా! శ్రీకృష్ణా!; అని నిర్దేశించి = అని ఉపదేశించి; శివుఁడు = శంభుడు; చనియెన్ = కొలువు చాలించి వెళ్ళాడు; శివయున్ = శాంభవి కూడ; కొలువు తోన = కొలువుతోడనే; చనెన్ = వెళ్లిపోయింది; ఈ+దెసకున్ = ఈ దిక్కునకు; చనిరి+అనన్ = వారు వెళ్ళారు అని చెప్పుటకు; వశమే? = శక్యమా? కాదని భావం; అది = ఆ పార్వతీ పరమేశ్వరులు ఎచ్చటి కేగినారన్నది; అద్భుతము = ఆశ్చర్యజనకం; అనిరూప్యంబు = నిర్ణయించుటకు వీలుకానిది; అప్రతర్క్యము = ఊహించటానికి సాధ్యపడనిది.

**తాత్పర్యం:** 'కృష్ణా! ఆ విధంగా ఉపదేశవాక్యాలు చెప్పి పరమేశ్వరుడు వెళ్ళాడు. కొలువు విరియగానే పరమేశ్వరి కూడ వెళ్ళిపోయింది. వారు ఏ దిక్కునకు వెళ్ళారో చెప్పటానికి ఎవరితరమూ కాదు. అది ఆశ్చర్యజనకం. నిర్ణయించుటకూ, ఊహించుటకూ సాధ్యపడని విషయం.'

**క. అని పలికి నారదుఁడు 'నా । వినిన కనిన యద్భుతంబు వినిపించితి నీ'**
**కనియెం గృష్ణుని సభ్యుల । మనంబు లానంద పూర మగ్నము లయ్యెన్. 310**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని వచించి; నారదుఁడు = నారద మహర్షి; కృష్ణునిన్ = కృష్ణునుద్దేశించి; నా వినిన = నేను విన్నట్టి; కనిన = చూచినట్టి; అద్భుతంబున్ = వింతను; నీకున్ = నీకు; వినిపించితిన్ = తెల్పినాను; అనియెన్ = అని పలికాడు; సభ్యులమనంబులు = సభలో ఉన్న వారి యొక్క చిత్తములు; ఆనంద పూరమగ్నములు+అయ్యెన్ = సంతోషమనెడు వెల్లువలో మునిగి పోయాయి.

**తాత్పర్యం:** అట్లా వచించి నారదమహర్షి శ్రీ కృష్ణభగవాను నుద్దేశించి 'నేను విన్నట్టి, చూచినట్టి వింతను నీకు వినిపించాను స్వామీ!' అని పలికాడు. సభలో ఉన్న జనుల మనసులు ఆనంద మనెడు రసప్రవాహంలో మునుకలు వేశాయి.'

**వ. అని యిట్లు భీష్ముం డుమామహేశ్వర సంవాదం బనుపుణ్యకథ చెప్పిన ధర్మతనయుండు సోదర సహితంబుగాఁ బ్రమోదరసభరితుండై. 311**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు = అని ఈ ప్రకారం; భీష్ముడు = గాంగేయుడు, ఉమామహేశ్వర సంవాదంబు = పార్వతీ పరమేశ్వరుల పరస్పర సంభాషణ; అను పుణ్యకథ = అనే పవిత్రమైన గాథ; చెప్పినన్ = తెలుపగా; ధర్మతనయుండు = యముని కుమారుడైన యుధిష్ఠిరుడు; సోదర సహితంబుగాన్ = తమ్ములతో కూడ; ప్రమోదరసభరితుండు+ఐ = ఆనందరసంతో నిండిన వాడై.

**తాత్పర్యం:** అని భీష్ముడు పార్వతీ పరమేశ్వరుల సంవాదమనే పవిత్రగాథను ధర్మనందనుడికి తెలుపగా విని అతడు తనతమ్ములతో పాటు సంతోష రసభరిత హృదయుడయ్యాడు.

**భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తి హేతుభూతం బగు జప విశేషంబు దెలుపుట. (సం.13 అను 17-5).**

**సీ. అతనికిఁ బ్రణమిల్లి 'యనఘ! పరప్రాప్తి । యెద్దాన సమకూరు? నెఱుఁగఁ జెప్పు'**
**మనిన నతండు 'నారాయణధ్యాన పూ । జాస్తుతి తత్కథా శ్రవణనిరతి**
**యమ్మేలు గావించు; నధిప! విద్వజ్జన । సంరక్షణము కల్మషములఁ బాపు;**
**వేశ్య యొక్కత తొల్లి విద్వాంసు నొకరిని । ముచ్చని తలవరుల్ మోఁదఁ జూచి**

**తే. 'యితఁడు మావాఁడు మీ రిది యేటి కాగ । డంబు చేసెద?' రని మోక్షణంబు చేసి**
**యాసుకృతమున బ్రాహ్మణియై జనించెఁ; । దగఁగ నర్చింపు మీవు విద్వజ్జనముల.' 312**

**ప్రతిపదార్థం:** అతనికిన్ = కురుపితామహుడైన భీష్ముడికి; ప్రణమిల్లి = నమస్కరించి; అనఘ! = దోషరహితుడా! ఓ పుణ్యపురుషా!; పరప్రాప్తి = మోక్షం లభించటం; ఏ+దానన్ = ఏ విధంగా; సమకూడున్ = కలుగుతుందో; ఎఱుఁగన్+చెప్పుము = నాకు తెలిసేటట్లు చెప్పుము; అనినన్ = అని ధర్మజుడు ప్రశ్నించగా; అతండు = భీష్ముడు; అధిప! = ఓ ధర్మరాజా!; నారాయణధ్యాన పూజాస్తుతి = శ్రీ మన్నారాయణుడిని ధ్యానించటం, పూజించటం, స్తోత్రం చెయ్యటం; తత్+కథాశ్రవణనిరతి = ఆ మహానుభావుడి చరిత్రలు వినటంలో ఆసక్తి; ఆ+మేలు = ఆ శ్రేయస్సును; కావించున్ = కలిగిస్తుంది; విద్వత్+జన+సంరక్షణము = పండితులైన వాళ్ళను చక్కగ కాపాడటం అనేది; కల్మషములన్ = పాపాలను; పాపున్ = తొలగిస్తుంది; తొల్లి = మునుపు; వేశ్య ఒక్కత = ఒక బోగముది, పడుపుకత్తె; విద్వాంసున్+ఒకరిని = ఒక ప్రాజ్ఞుడిని; తల వరుల్ = తలారులు, కావలికాండ్రు (గ్రామాలలో, పట్టణాలలో రాత్రులందు దొంగలు పడకుండ గస్తు తిరిగేవాళ్ళు) ముచ్చు+అని = చోరుడని, దొంగ అని; మోఁదన్ = కొట్టగా; చూచి = కనుగొని; ఇతఁడు మావాఁడు; మీరు; ఏటికిన్ = ఎందుకు, ఇది; ఆగడంబు చేసెదరు = చెడ్డపనిచేస్తున్నారు; అని = అని పల్కి; మోక్షణంబు చేసి = ఆ పండితునికి తలారుల నుంచి విముక్తి గలిగించి; ఆ సుకృతమునన్ = ఆ పుణ్యంచేత; బ్రాహ్మణి+ఐ = బ్రాహ్మణ స్త్రీగా; జనించెన్ = పుట్టింది; ఈవు = నీవు; తగఁగన్ = ఒప్పిదంగా; విద్వత్+జనములన్ = పండిత సమూహమును; అర్చింపుము = పూజించుము.

**తాత్పర్యం:** ధర్మజుడు భీష్ముడికి నమస్కరించి 'పుణ్యపురుషా! పరమపదం ఏ విధంగా లభిస్తుందో సెలవియ్యం' డని వేడుకొన్నాడు. అందుకు గాంగేయుడు 'కుంతీనందనా! పరమపదం శ్రీమన్నారాయణుడిని ధ్యానించటం, పూజించటం, స్తుతించటం, ఆయన పుణ్యకథలు ఆసక్తితో ఆకర్ణించటం వలన ప్రాప్తిస్తుంది. మోక్షానికి ప్రతి

బంధకమైన దురితాలన్నీ పండితులను సంరక్షించటం వలన తొలగి పోతాయి. పూర్వం ఒక పడుపుకత్తె తలారులు ఒక విద్వాంసుడిని చోరుడని భావించి చావ మోదుతుంటే చూచింది. 'మీరు నిరపరాధిని బాధిస్తున్నారు. ఇతడు మావాడు' అని చెప్పి వారి బారినుంచి ఆ విద్వాంసుడికి విముక్తి కల్గించింది. ఆ పుణ్యఫలంగా ఆమె మరుజన్మలో భూసురకాంతగా పుట్టింది. కనుక నీవు పండితులను సమాదరించుము'.

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'దారిద్ర్య వ్యాధి శోకంబులకు శాంతి సంపాదింపంజాలు జపం బెయ్యది? చెప్పవే యనుటయు ననిమిషనదీ నందనుండు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, వినాయక, విశాఖ, వహ్ని, వాయు, చంద్రాదిత్యులను, శక్ర, వరుణ, యమ, కుబేరులను, సురభిని, సముద్రంబులను, గంగాది మహానదులను, మరు దశ్వివసురుద్రాది దేవతలను, బితృదేవతలను, వాలఖిల్యాది సిద్ధులను, వేదవ్యాస వాల్మీకి నారదాగస్త్య గౌతమ కశ్యపాత్రికణ్వాది మహామునులను, రంభాద్యప్సరః స్త్రీలను, ధర్మతపస్సత్యములను, నహో రాత్రంబులను, దారాగ్రహంబులను, నశ్విన్యాది తారకంబులను, మాసర్తు వత్సరంబులను, వైనతేయ కాద్రవేయులను, గాశీక్షేత్ర కురుక్షేత్రాది పుణ్య క్షేత్రంబులను, నైమిశారణ్య దండకారణ్యాది పుణ్యారణ్యంబులను, మేరు హిమవత్కైలాసాది ప్రభూత శైలంబులను, దిబ్బభోభూములను, బుణ్యభూరుహంబులను, భూసురులను, జక్రవర్తులను, రాజులను, బరమభక్తిం దలంచి, కీర్తించి, నమస్కరించి 'యీ సమూహం బంతయు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి పరమానందంబు లభినందనపూర్వకంబుగా నిచ్చుఁ గావుత మని యిచ్చఁ గోరి 'యో న్నమో భగవతే వాసుదేవాయ, నమః పురుషోత్తమాయ, నమస్సర్వలోక గురవే, నమస్సర్వలోక పిత్రే, నమ స్సర్వలోక పితామహాయ, నమస్సర్వలోక ప్రపితామహాయ, నమ స్సర్వలోక ప్రధానాయ, నమ స్సర్వలోకేశ్వరాయ, నమ స్సర్వలోక విశిష్టాయ, నమ స్సర్వలోక సుఖప్రదాయ, నమ స్సర్వలోకకర్త్రే, నమ స్సర్వలోకభర్త్రే, నమ స్సర్వలోకహర్త్రే, నమ స్సర్వలోక నిధయే, నమ స్సర్వలోక నిధానాయ, నమ స్సర్వలోకోద్భవకరాయ, నమో విష్ణవే, ప్రభవిష్ణవే' యని పఠించుట మహాజపంబు. 313**

**ప్రతిపదార్థం:** అనినన్ విని = అని భీష్ముడు చెప్పగా ఆలకించి; యుధిష్ఠిరుండు = ధర్మజుడు; దారిద్ర్య వ్యాధి శోకంబులకున్ = పేదరికానికి, రోగాలకు, దుఃఖాలకు; శాంతిన్ = ఉపశమనమును; సంపాదింపన్+చాలు = సమకూర్చగలుగునట్టి; జపము = మంత్రజపం; ఏ+అది = (ఎయ్యది) ఏది; చెప్పవు+ఏ = చెప్పవా; అనుటయున్ = అని అడుగగా; అనిమిషనదీనందనుండు = దేవతలనది మందాకిని యొక్క కుమారుడు భీష్ముడు; బ్రహ్మవిష్ణు మహేశ్వరులను = త్రిమూర్తులను; వినాయక = గణపతి; విశాఖ = కుమారస్వామి; వహ్ని = అగ్నిదేవుడు; వాయు = వాయుదేవుడు; చంద్ర+ఆదిత్యులను = చంద్రుడు, సూర్యుడు అనువారిని; శక్ర = ఇంద్రుడు; వరుణ = వరుణుడు; యమ = యముడు; కుబేరులను = ధనాధిపతి కుబేరుడు అనువారలను; సురభిని = కామధేనువును; సముద్రంబులను = సప్తసాగరాలను; గంగా+ఆదిమహానదులను = గంగమొదలైన గొప్పనదులనూ; మరుత్ = సప్తమారుతాలను; అశ్వి = అశ్వినీ పుత్రులు దేవవైద్యులిద్దరినీ; వసు = అష్టవసువులు; రుద్ర = ఏకాదశ రుద్రులు, ఆది = మొదలైన; దేవతలను = వేల్పులను, సురలను; పితృదేవతలను = అర్యముడు మున్నగు పితృదేవతలను; వాలఖిల్య+ఆది+సిద్ధులను = వాలఖిల్యులు మొదలైన ఋషులను; వేదవ్యాస, వాల్మీకి, నారద, అగస్త్య, గౌతమ, కశ్యప, అత్రి; కణ్వ+ఆది = కణ్వుడు మొదలుగాగల; మహామునులను; రంభా+ఆది = రంభ మొదలైన; అప్సరః స్త్రీలను = అప్సరసలను; ధర్మ తపః సత్యములను = ధర్మమును, తపస్సును, సత్యమును; అహః+రాత్రంబులను =

పగళ్ళను, రాత్రులను; తారా గ్రహంబులను = తారలను, నవగ్రహాలను; అశ్వినీ+ఆది తారకంబులను = అశ్విని, భరణి మొదలైన ఇరువదేడు నక్షత్రాలను; మాస+ఋతు(మాసర్తు); చైత్రము, వైశాఖం మున్నగు పన్నెండు నెలలు, వసంతం, గ్రీష్మం మొదలైన ఆరు ఋతువులను; వత్సరంబులను = ప్రభవ, విభవ మొదలైన అరవై సంవత్సరాలను; వైనతేయ = వినతాపుత్రుడైన గరుత్మంతుడు మొదలగు పక్షీంద్రులను; కాద్రవేయులను = కద్రువకొడుకులు వాసుకి, అనంతుడు మున్నగు సర్పరాజులను; కాశీక్షేత్ర; కురుక్షేత్ర; ఆది = మొదలైన, పుణ్యక్షేత్రంబులను = పవిత్ర ప్రదేశాలను; నైమిశ+అరణ్య; దండకా+అరణ్య; ఆది = మొదలైన, పుణ్య+ అరణ్యములను = పావనములైన తపోవనాలను; మేరు = మేరువు; హిమవత్ = హిమవంతం; కైలాస = కైలాసం; ఆది = మున్నగు, ప్రభూతశైలంబులను = ఎత్తైన కొండలను, గొప్ప పర్వతాలను; దిక్+నభస్+భూములను = దిక్కులు, ఆకాశం, భూమి అనువాటిని; పుణ్యభూరుహంబులను = పవిత్రములైన కల్పవృక్షం మొదలైన వృక్షరాజములను; భూసురులను = బ్రాహ్మణులను; చక్రవర్తులను = సార్వభౌములను; రాజులను = నరేశ్వరులనూ; పరమభక్తిన్ = మిక్కిలిభక్తితో; తలంచి = స్మరించి; కీర్తించి = కొనియాడి, పొగడి; నమస్కరించి = మ్రొక్కి; ఈ సమూహంబు+అంతయున్ = పైనుడివిన మొత్తము; నన్నున్ రక్షించి = నన్ను కాపాడి; నాకున్, ఆయుః+ఆరోగ్య+ఐశ్వర్య+అభివృద్ధి పరమ+ఆనందంబులు = ఆయుష్యం, ఆరోగ్యం, సంపదల యొక్క పెంపు, మిక్కుటమైన సంతోషం అనువాటిని; అభినందనపూర్వకంబుగాన్ = సంతోషపురస్సరంగా, ప్రశంసా పూర్వకంగా; ఇచ్చున్+కావుతన్+అని = (ఇచ్చుఁగావుతమని) = ప్రసాదించుగాక అని; ఇచ్చన్ = మనస్సులో; కోరి = కాంక్షించి; ఓమ్+భగవతే వాసుదేవాయ నమః = భగవంతుడైన వాసుదేవుడి కొరకు నమస్కారం; పురుషోత్తమాయ నమః = పురుషోత్తముడికి వందనం; సర్వలోక గురవే నమః = సమస్తలోకములకు గురుడైన వాడికి నమోవాకం; సర్వలోకపిత్రే నమః = ఎల్ల జగములకు తండ్రి అయిన వాడికి ప్రణామం; సర్వలోక పితామహాయ నమః = సకల జగత్తులకు తాత అయినవాడికి అంజలి; సర్వలోక ప్రపితామహాయ నమః = ఎల్లలోకాల తాతకు తండ్రియైనవాడికి (ముత్తాతకు) కేలు మోడ్పు; సర్వలోక ప్రధానాయ నమః = అఖిలలోకాలకు ప్రకృతి అయిన వాడికి ప్రణతి; సర్వలోక+ఈశ్వరాయ నమః = సమస్తలోకాలకు నాథుడయిన వాడికి నమస్సు; సర్వలోక విశిష్టాయ నమః = సమస్త భువనాలతో కూడిన వాడికి మ్రొక్కులు; సర్వలోక సుఖప్రదాయ నమః = అన్ని లోకాలకు సౌఖ్యమొసగువాడికి నమస్కృతి; సర్వలోక కర్త్రే నమః = సమస్త జగములకు కర్త ఎవడో వాడికి జోహారు; సర్వలోకభర్త్రే నమః = అన్ని లోకాలను కాపాడేవాడికి, భరించే వాడికి జోతలు; సర్వలోక హర్త్రే నమః = సమస్త భువనాలను హరించేవాడికి జేజేలు; సర్వలోక నిధయే నమః = సకలలోకాలకు ఆధారమైన వాడికి ప్రణిపాతం; సర్వలోక నిధానాయ నమః = జగములన్నిటికి గుప్తనిధిగా ఉన్న వాడికి అభివాదం; సర్వలోక హితాయ నమః = సమస్త లోకాలకు మిత్రుడైన వాడికి ధన్యవాదం; సర్వలోక హితకరాయ నమః = అన్ని లోకాలకు మేలు చేసేవాడికి కై మోడ్పు; సర్వలోక+ఉద్భవాయ నమః = సమస్త లోకాలకు ఉత్పత్తి స్థానమైన వాడికి చేమోడ్పు; సర్వలోక+ఉద్భవ కరాయ నమః = సమస్తలోకాలను పుట్టించేవాడికి నతి; విష్ణవే, ప్రభ విష్ణవే నమః = వ్యాపనశీలుడికి, సామర్థ్యము, మహిమ కలవాడికి దోసిలొగ్గుతున్నాను; అని = అంటూ; పఠించుట = చదవటం; మహా జపంబు = గొప్పజపం.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగా విని ధర్మరాజు 'తాతా! పేదరికం తొలగటానికి, రోగాలు మానటానికి, దుఃఖాలు తీరటానికి తగిన జప మేదో సెలవియ్యం'డని అర్థించాడు. అపుడు గంగాతనయుడు 'కుంతీ నందనా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులనూ, గణపతినీ, కుమారస్వామినీ, అగ్ని వాయుదేవుళ్ళనూ, చంద్రసూర్యులనూ, ఇంద్రవరుణయమ కుబేరులనూ, కామధేనువునూ, సప్తసముద్రాలనూ, గంగ మొదలైన పవిత్ర తీర్థాలనూ, సప్తమరుత్తులనూ (వాయువులనూ), అశ్వినీ దేవతలనూ, అష్టవసువులనూ, ఏకాదశరుద్రులనూ, అర్యముడు మున్నగు

పితృ దేవతలనూ, వాలఖిల్యాది మహర్షులనూ, వ్యాసుడు, వాల్మీకి, నారదుడు, అగస్త్యుడు, గౌతముడు, కశ్యపుడు, అత్రి, కణ్వుడు మున్నగు మౌనీంద్రులనూ, రంభ మొదలైన అచ్చర బోటులనూ, ధర్మము, తపము, సత్యము అనువాటినీ, రాత్రులను, పవళ్లను, తారలను, నవ గ్రహాలను, అశ్విని మొదలైన ఇరువది యేడు నక్షత్రాలనూ, నెలలు, ఋతువులు, సంవత్సరాలుగా ఉన్న కాలమునూ, గరుత్మంతుడు మున్నుగాగల వినతాపుత్రులు పక్షీంద్రులనూ, ఆదిశేషుడు మొదలుగా గాల కద్రువ కొడుకులు సర్పరాజులనూ, కాశీ క్షేత్రం, కురుక్షేత్రం మున్నగు పవిత్ర స్థలాలనూ, నైమిశారణ్యం, దండకారణ్యం మొదలైన పవిత్ర వనభూములనూ, మేరు శైలం, హిమగిరి, కైలాస పర్వతం మొదలైన గొప్పకొండలను, దిక్కులను, ఆకాశాన్ని, ధరణిని, పావనములైన కల్పవృక్షం మున్నగు వనస్పతులనూ, బ్రాహ్మణులనూ, చక్రవర్తులను, రాజులను, మిక్కిలి భక్తితో స్మరించి, స్తుతించి, నమస్కరించి వీరంతా నన్ను కాపాడుదురుగాక! వీరంతా నాకు దీర్ఘాయుష్యం, ఆరోగ్యం, ఐశ్వర్యం, మిక్కుటమైన సంతోషం మెచ్చుతూ ఇత్తురుగాక!' అని మదిలో ఆకాంక్షించాలి. ఆవల 'వాసుదేవా! పురుషోత్తమా! సమస్త జగద్గురూ! సమస్త లోకాలకు తండ్రి అయిన వాడా! సమస్త లోకాలకు తాత అయినవాడా! సమస్త లోకాలకు ముత్తాత అయినవాడా! సమస్త లోకాలకు ప్రధానమైన వాడా! సమస్త లోకాలకు ప్రభువైనవాడా! సమస్త లోకాలతో కూడినవాడా! సమస్త లోకాలకు సౌఖ్యం ప్రసాదించేవాడా! సమస్త లోకాలకు కర్త అయిన వాడా! సమస్త లోకాలకు భర్త అయిన వాడా! సమస్త లోకాలను హరించేవాడా! సమస్త లోకాలకు ఆధారభూతుడా! సకల లోకాలకు దాపుడుధనంగా ఉన్నవాడా! సకల లోకాలకు చెలికాడా! సకల లోకాలకు మేలు కూర్చేవాడా! సర్వ లోకాలకు ఉత్పత్తిస్థానమైన వాడా! సర్వ లోకాలను జన్మింపజేసేవాడా! అంతటా వ్యాపించువాడా! ప్రభావం కలవాడా! నీకు వందనం, అభివందన' మంటూ ఈ మంత్రమును పఠించటం మహాజపం.

**విశేషం:** సర్వదారిద్ర్యాలనూ, సర్వదుఃఖాలనూ పోగొట్టి మోక్షం ప్రసాదించే మంత్రం చెప్పుమని ధర్మరాజు అడిగినప్పుడు భీష్ముడు విష్ణుమంత్రోపదేశం చేశాడు. భగవన్మంత్రా లనేకం. వాటిల్లో వ్యాపకమంత్రాలు శ్రేష్ఠాలు. భగవంతుడి స్వరూప గుణ చేష్టితాలను సంపూర్ణంగా తెలిపేవి వ్యాపకమంత్రాలు. "నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్" అని విష్ణు గాయత్రిలో తెల్పబడిన ఆ మూడు మంత్రాలు మాత్రమే శ్రేష్ఠమైనవి.

"యథా సర్వేషు వేదేషు నాస్తి నారాయణా త్పరః,
తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పరః."

సకలవేదాలలో నారాయణుడిని మించిన వేల్పులేనట్లే అన్ని మంత్రాలలో అష్టాక్షరిని మించిన మంత్రం లేదు. అనగా 'ఓం నమో భగవతే వాసుదేవాయ, ఓం నమో విష్ణవే', అనే రెంటికన్నా "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీ మహామంత్రం పరమోత్తమం.

మంత్రంలో మొదటిపదం ఓంకారం. అదే ప్రణవం. దీనిలో అ,ఉ,మ అనే మూడక్షరా లున్నాయి. ఈ మూడక్షరాలు మూడు కుండలలో ఉన్న దధిని మథించి వెన్నను తీసినట్లుగా ఋగ్యజుస్సామములనే మూడు వేదాలనుండి తీయబడ్డాయి. కనుక ఓంకారం వేదసారం. ఇందులోని అకారం "అవ రక్షణే" అను ధాతువు నుంచి ఏర్పడింది. అది సకల జగత్కారణుడూ, సర్వరక్షకుడూ అయిన లక్ష్మీ వల్లభుడికి వాచక మవుతున్నది. అందుచే అకారమునకు నారాయణుడు అని అర్థం. "అక్షరాణాం అకారోఽస్మి"-- అక్షరాలలో అకారాన్ని నేను అని గీతలో భగవానుడు నుడివాడు. అతడు తన్ను స్మరించే జీవులకు అనర్థాలను తొలగించి అపేక్షితాలను అనుగ్రహిస్తాడు. ప్రణవంలో మొదటి అక్షరం తరువాత రెండవ అక్షరం ఉకారం.

ఉకారం ఏవకారార్థం అనగా అతనికే అంటే అకారవాచ్యుడైన నారాయణుడికే, మరెవ్వరికినీ కాదు, అని అర్థం. మూడవ పదం మకారం. మకారం జీవవాచకం. అనగా జీవుడు మకారశబ్దవాచ్యుడు. అతడు కేవలం నారాయణుడికే చెందినవాడు తప్ప తనకుగాని, మరెవ్వరికిగానీ చెందిన వాడు, సంబంధపడినవాడు కాడని భావం. సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు పరమాత్మకు కైంకర్యం, సేవ, దాస్యం, చేస్తూ ఉండదగినవాడు జీవుడు అనే అర్థం ప్రణవం వలన గోచరిస్తుంది. ఇక్కడ మరో విషయం గమనించాలి. రక్షకుడు అకారశబ్దవాచ్యుడైన నారాయణు డైనప్పటికినీ, రక్షించబడేటప్పుడు మాతృసంబంధం అనగా లక్ష్మి సంబంధం జీవుడికి అనుసంధేయం. ఆమె విష్ణువక్షః స్థలాన్ని వీడినప్పుడే అకారమనే అక్షరాన్ని ఎడబాయటం సంభవిస్తుంది. కనుక అకారం నారాయణుడితో పాటు లక్ష్మికి గూడ వాచకమే అవుతుంది.

" అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా''

సూర్యుడిని ప్రభవలె, కాంతి వలె శ్రీరాముడిని వదలి ఉండలేను అని సీతాదేవి -

" అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా''

రవిని వదలి ప్రభవలె జానకిని వదలి నే నుండలేను అని శ్రీరాముడు పలికి ఉన్నారు (శ్రీమద్రామాయణం)

" రాఘవత్వేఽ భవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని,
అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ.''

" దేవత్వే దేవ దేహేఽ యం మానుషత్వే చ మానుషీ,
విష్ణో ర్దేహానురూపాం వై కరోత్యేషాఽ ఽ త్మన స్తనుమ్.''

ఇత్యాది స్తుతులు లక్ష్మీనారాయణులకు ఎడబాటెప్పుడూ లేదని చాటుతున్నాయి. కనుక అకారమునకు విష్ణుసంబంధం చేత లక్ష్మి అనే అర్థం సిద్ధిస్తుంది అని ప్రత్యేకించి చెప్పపనిలేదు. ఉకారమునకు లక్ష్మి అనే అర్థం చెప్పడానికి అవధారణార్థమే యుక్తమని పెద్దల నిర్వచనం. అందువలన జీవుడు లక్ష్మీనారాయణు లిద్దరికీ దాస్యవృత్తి నెరపుతూ ఉండవలసిన వాడని తెల్లమవుతుంది.

"ఓం నమో భగవతే వాసుదేవాయ'' అనే ద్వాదశాక్షరీమంత్రంలో ఓం తరువాత ప్రయుక్తమైన శబ్దం నమః. దీనిలో న, మః అని రెండు పదాలున్నాయి. అవి నే నున్నది (ఆత్మ, జీవుడు) నాసేవ కొరకు గాదు; పరులసేవ కొరకు గాదు; భగవంతుడి సేవకొరకే - అనే అర్థాన్ని వెల్లడిస్తాయి. నేను నాకు గాని, ఇతరులకు గాని, సంబంధపడిన వాడిని కాను; ఆ పరమాత్మకే సంబంధించిన వాడిని - అని భావిస్తూ జీవుడు తాను సల్పే కైంకర్య రూపమైన కర్మయందు కర్తృత్వ భోక్తృత్వబుద్ధి మాని, పరమాత్ముడే తన పరికరమైన నాచేత తన కైంకర్యమును తానే చేయించుకొంటున్నాడు. తానే దాని ఫల మనుభవిస్తున్నాడు. ఇందులో నాప్రసక్తి ఏమీ లేదు అని భావిస్తూ పరమాత్ముడికి దాస్యం సల్పాలి అని నమశ్శబ్దము యొక్క అర్థతాత్పర్యాలు.

భగవంతుడు, వాసుదేవుడు అను రెండు పదాలు చతుర్థీ విభక్త్యంతాలుగా మారినపుడు భగవతే వాసుదేవాయ అనే విశేషణ విశిష్టమైన భగవన్మంత్రాన్ని ఋషులచే పరికీర్తితమైనదాన్ని కురుపితామహుడు, మహామహుడు భీష్ముడు ధర్మపుత్రుడికి ఉపదేశించాడు. భగవంతుడైన వాసుదేవుడికే తప్ప నాసేవ నా కొరకు గాదు; అన్యులకొరకూ కాదు అని ఆ మంత్రానికి భావం ఏర్పడుతుంది. భగవంతు డనగా జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సులు అనే షాడ్గుణ్యసంపత్తి కలవాడు. వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడనిగాని, తనయందు సమస్తం వసించగా తాను అన్నిటి యందు నివసించేవాడు అనిగాని వాసుదేవుడనే మాటకు అర్థం.

క. **పాపంబులును భయంబులు । నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా**
**త్రీపాలోత్తమ! శుభములు । ప్రాపించును ధర్మతత్పరత సిద్ధించున్.' 314**

**ప్రతిపదార్థం:** ధాత్రీపాల+ఉత్తమ = రాజులలో శ్రేష్ఠుడా! ఈ+మహాజపమునన్ = ఈ గొప్ప మంత్రము యొక్క ఆవృత్తి చేత; పాపంబులును = పాతకాలు; భయంబులున్ = భయాలు; ఆపదలున్ = విపత్తులు, కడగండ్లు; పాయున్ = తొలగుతాయి; శుభములు = మంగళములు, ఇహపరసౌఖ్యాలు; ప్రాపించును = సమకూడుతాయి; ధర్మతత్పరత = ధర్మమందు ఆసక్తి; సిద్ధించున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడవైన ధర్మజా! ఈ విష్ణుమంత్ర జపంచేత పాతకాలు, భయాలు, కష్టాలు తీరుతాయి. శుభాలు, ఇహపర సౌఖ్యాలు లభిస్తాయి. ధర్మమందు ఆసక్తి కలుగుతుంది.'

వ. **అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయిన యిమ్మహాజపం బుపదేశించెనని చెప్పి తదనంతర సత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 315**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; గంగా పుత్త్రుండు = గంగాదేవి కుమారుడు భీష్ముడు; అజాతశత్రునకున్ = విరోధులు లేని ధర్మజుడికి; సర్వసిద్ధికరంబు = అన్ని శుభాలు ఇచ్చునట్టి; ఈ+మహా జపంబున్ = ఈ గొప్ప మంత్ర జపాన్ని; ఉపదేశించెన్= బోధించాడు; అని చెప్పి; తత్+అనంతర+సత్కథలు = ఆ పిదప జరిగిన మంచి వృత్తాంతాలు; ఆకర్ణింపుము = ఆలకించుము, వినుము; అని పలికి; జనమేజయునకున్ = శ్రోత అయిన జనమేజయమహారాజునకు; వైశంపాయనుండు= కథకుడైన వ్యాసమహర్షి శిష్యుడు వైశంపాయనుడనే పేరుగల మహర్షి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విధంగా భీష్ముడు ధర్మరాజుకు అన్ని శుభాలూ, భోగమోక్షాలూ ప్రసాదించే విష్ణుమంత్రం ఉపదేశించాడు-అని చెప్పి అవతలి కథ వినుమని జనమేజయ మహారాజుతో వైశంపాయన మహర్షి ఇట్లా అన్నాడు.

తే. **'మనుజనాథ! యశేషధర్మములు సర్వ । పావనములు శాంతనవుఁడు బహువిధములఁ**
**జెప్ప నిమ్మెయి విని యుధిష్ఠిరుఁడు భక్తి । న మ్మహాత్ముని నిట్లని యడిగె మఱియు. 316**

**ప్రతిపదార్థం:** మనుజనాథ = జనమేజయమహారాజా!; సర్వపావనములు = అన్ని విధముల పవిత్రము చేయునట్టి; అశేష ధర్మములు = ఎల్లధర్మాలు; శాంతనవుఁడు = శంతను మహారాజు పుత్రుడైన భీష్ముడు; బహువిధములన్ = పలురీతుల; చెప్పన్ = తెల్పగా; ఈ+మెయిన్ = ఈ విధంగా; విని; యుధిష్ఠిరుఁడు = ధర్మజుడు; భక్తిన్ = భక్తితో; ఆ+మహా+ఆత్మునిన్ = ఆ దొడ్డమనసుగల భీష్ముడిని; మఱియున్ = ఇంకనూ; ఇట్లు+అని+అడిగెన్ = ఈ విధంగా ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! పాపా లన్నిటిని పోకార్చి పవిత్రమొనర్చు సకలధర్మాలు శంతను పుత్త్రుడైన భీష్ముడు పెక్కు రీతుల చెప్పగా విని మళ్ళీ ధర్మజుడు మహానుభావుడైన గాంగేయుడిని ఇట్లా ప్రశ్నించాడు.

చ. **'అతఁ డొకరుండ లోకముల కన్నిటికిన్ మహనీయమైన దై**
**వతముఁ బరాయణంబు నను వైభవ మెవ్వని కొప్పు? నర్చన**
**స్తుతి రతి నెవ్వనిం గొలిచి శోభన మొందు జనంబు? మేలు నా**
**నతిశయ మొంది నీకు మతమై చను నెయ్యది ధర్మకోటిలోన్? 317**

**ప్రతిపదార్థం:** అతఁడు+ఒకరుండు+అ = ఆతడొక్కడే; లోకములకున్+అన్నిటికిన్ = సమస్తలోకాలకు; మహనీయము+ఐన = పరమోత్తమమైన; దైవతము = దైవము; పర+అయనంబున్+అను = పొందదగిన వాడనునట్టి; వైభవము = గొప్పతనము; ఎవ్వనికిన్+ఒప్పున్ = ఎవ్వడికి తగి ఉన్నదో; అర్చన స్తుతిరతిన్ = భక్తితో పూజించటం, గుణములను కీర్తించటం అనే సేవలందు గల ప్రీతితో, ఆసక్తితో; జనంబు = ప్రజ; ఎవ్వనిన్ = ఏ పురుషోత్తముడిని; కొలిచి = భజించి; శోభనము+ఒందున్ = శుభమును పొందునో అనగా భోగమోక్షములు చెందునో; ధర్మకోటిలోన్ = పుణ్యాలన్నింటిలో; ఏ+అది = (ఎయ్యది) ఏది; మేలునాన్ = మంచిదిగా, శ్రేష్ఠమైనదిగా; అతిశయము+ఒంది = ఆధిక్యం చెంది; నీకున్ = నీకు; మతము+ఐ = ఇష్టమై; చనున్? = ఒప్పుతున్నది?

**తాత్పర్యం:** "పితామహా! లోకము (శాస్త్రాలు) లన్నింటిలో గొప్పదైవం ఎవరు? ఎవడు ఆశ్రయించదగిన మహిమతో విరాజిల్లుతున్నాడు? ఎవడిని భక్తితో పూజించి, ఎవడి గుణాలను కీర్తించి మానవులు శుభములు పొందుతున్నారు? ధర్మా లన్నింటిలో అతిశయించినదై, నీకు సమ్మతమైనదై, మేలు చేకూర్చే ధర్మమేది?

**తే.** **జపములం దెల్ల నుత్తమ జపము నాఁగ । నంచితంబయి తన్ను జపించు జంతు**
**వునకు జన్మసంసార బంధనము లోపి । పాపు నెయ్యది? యెఱిఁగింపు పరమబోధ!' 318**

**ప్రతిపదార్థం:** పరమబోధ! = ఉత్తమ జ్ఞానం కలవాడా!; జపములందున్+ఎల్లన్ = అన్ని జపాలలో; ఉత్తమ జపమునాఁగన్= శ్రేష్ఠమైన జపమని; అంచితంబు+అయి = ఒప్పిదమై, పూజితమై; తన్నున్ = తనను; జపించు = ఆవృత్తి సల్పునట్టి; జంతువునకున్ = జీవుడికి; జన్మసంసారబంధనములు = జనన మరణరూపమైన సంసారమనే కట్లు; ఓపి = సామర్థ్యం కలిగి; ఏ+అది(ఎయ్యది) = ఏది; పాపున్ = తొలగిస్తుందో; ఎఱిఁగింపు = నాకు తెల్పుము.

**తాత్పర్యం:** పరమజ్ఞాన సంపన్నుడైన మహాత్మా! జపా లన్నింటిలో శ్రేష్ఠమై, తనను జపించే వారికి జనన మరణ రూప సంసార బంధాలనుండి విముక్తి కలిగించే జపమేదో నాకు తెల్పుము.'

**వ.** **అని యడిగిన నాభూపతికి భీష్ముం డిట్లనియె. 319**

**తాత్పర్యం:** అని ప్రశ్నించిన ప్రభువైన ధర్మరాజుతో భీష్ము డిట్లా అన్నాడు.

**భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్ర ధ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట. (సం.13-135-4).**

**సీ.** **'అఖిలజగత్ప్రభు వగు దేవదేవు న । నంతునిఁ బురుషోత్తమాభిధాను**
**నంచితనామ సహస్రకంబున సంస్తు । తించుచు సంతతోత్థిత మనస్కుఁ**
**డై యజమానుఁ డవ్యయుఁడైన యాతని । నర్చించుచును దృఢ ధ్యాన నిరతుఁ**
**డగుచు నమస్కృతి యాచరించుచు ననా । ద్యంతు న వ్విష్ణు నధ్యక్షు నెల్ల**

**తే.** **లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోక కీర్తి । వర్ధనుని సర్వధర్మజ్ఞు వరదు లోక**
**నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ । గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁ ద్రోచు. 320**

**ప్రతిపదార్థం:** అఖిలజగత్ ప్రభువు+అగు = సమస్తలోకాలకు నాథుడైన; దేవదేవున్ = బ్రహ్మాది దేవత లందరికీ దేవుడైన; అనంతునిన్ = అంతం లేని వైభవం కలవాడిని, దేశకాల వస్తు పరిచ్ఛేదం లేని వాడిని; పురుష+ఉత్తమ+అభిధానున్ =

పురుషోత్తముడనే పేరుగల వాడిని, పరమోదారుడిని; అంచిత = ఒప్పిదమైన; నామ సహస్రకంబునన్ = వేయినామాలతో; సంస్తుతించుచున్ = లెస్సగా కీర్తిస్తూ; సంతత+ఉత్థిత+మనస్కు(డు+ఐ = ఎల్లప్పుడు పూనికతో కూడిన చిత్తం కలవాడై; యజమానుడు = పూజకుడు, పూజించేవాడు; అవ్యయు(డు+ఐన = నాశనంగాని, మార్పుగాని లేనివాడైన; ఆతనిన్ = ఆ పరమాత్ముడిని; అర్చించుచును = పూజిస్తూ; దృఢధ్యాన నిరతు(డు+అగుచున్ = నిశ్చలమైన ధ్యానంలో ఆసక్తి కలవాడై; నమస్కృతి = వందనం; ఆచరించుచున్ = చేస్తూ; అనాద్యంతున్(న+ఆది+అంతున్) = ఆద్యంత శూన్యుడిని, మొదలు తుదిలేని వాడిని; ఆ+విష్ణున్ = సర్వత్రవ్యాపించిన వాడిని; ఎల్లలోకములకున్ = సమస్త భువనములకు; అధ్యక్షున్ = ప్రభువైనవాడిని; సమస్తలోకాలను ప్రత్యక్షంగా తిలకించే వాడిని; బ్రహ్మణ్యున్ = బ్రహ్మకుగాని, బ్రాహ్మణుడికిగాని, తపస్సుకుగాని, వేదానికి గాని హితుడైన వాడిని; త్రిలోక కీర్తి వర్ధనునిన్ = ముల్లోకాలకు కీర్తిని వృద్ధిపొందించేవాడిని; సర్వధర్మజ్ఞున్ = సకలధర్మా లెరిగిన వాడిని; వరదున్ = భక్తులకు వరాలిచ్చేవాడిని; లోకనాథున్ = లోకస్వామిని; భూతభవ+ఉద్భవున్ = జీవులయొక్క సంసారానికి లేదా ఉనికికి కారణమైన వాడిని; నమ్మి = విశ్వసించి; భక్తిన్= భక్తితో; కొలిచి = సేవించి; సర్వదుఃఖంబులన్ = అన్ని చింతలను; తొల(గన్+త్రోచున్ = దూరంగా గెంటి వేస్తాడు.

**తాత్పర్యం:** సమస్తలోకాలకు అధిపతియూ, బ్రహ్మాది దేవతలకు దేవుడూ, అంతంలేని వైభవం కలవాడూ, పురుషోత్తముడని ఖ్యాతి వహించినవాడూ అయిన పరమాత్మను వెయ్యి నామాలతో స్తుతిస్తూ ఎల్లప్పుడు పూనిక వహించిన చిత్తంతో గృహస్థుడు ఆద్యంత రహితుడైన ఆ పరమపురుషుడిని పూజిస్తూ, ధ్యానిస్తూ, నమస్కరిస్తూ అంతటా వ్యాపించినవాడున్నూ, భువనా లన్నింటికీ అధ్యక్షుడూ, బ్రహ్మణ్యుడూ, ముల్లోకాలకు కీర్తి పెంచేవాడూ, సకల ధర్మములు ఎరిగినవాడూ, భక్తులకు వరాలిచ్చేవాడూ, జగన్నాథుడూ, జీవుల యొక్క సత్తకు కారణమైనవాడూ అయిన మహాస్వామిని భక్తితో భజించి సకల దుఃఖాలను దూరంగా గెంటి వేయగలడు.

**తే.** **ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ । దగిలి యర్చించుటయ నామతంబు; సర్వ**
**ధర్మములకును సమధికతమము నైన । ధర్మ మింత యెఱుంగుము ధర్మతనయ!** **321**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ = ధర్మనందనా!; ప్రస్తుతులన్ = స్తోత్రాలతో; పుండరీక+అక్షున్ = తెల్లదామరలవంటి కన్నులుగల వాసుదేవుడిని; పరమభక్తిన్ = మిక్కిలి భక్తితో; తగిలి = ప్రియపడి, ఇష్టపడి; అర్చించుటయ = పూజించటమే; నామతంబు = నా కిష్టం; సర్వధర్మములకును = అన్నిధర్మాలలో; సమధిక తమము+ఐనధర్మము = మిక్కిలి అధికమైన ధర్మం అది; ఇంత+ఎఱుంగుము = ఇది నిజ మని గ్రహించుము.

**తాత్పర్యం:** ధర్మనందనా! పుండరీక నయనుడైన వాసుదేవుడిని పరమభక్తితో పూజించటమే ధర్మాలన్నిటిలో ఉత్తమమైన ధర్మం. హరిని పూజించటమే నామత మని గ్రహించుము.

**సీ.** **పరమతేజంబును బరమ పదంబును । బరమైన బ్రహ్మంబుఁ బరపరాయ**
**ణముఁ బవిత్రంబులు నాఁ దగువానికి । నెల్లఁ బవిత్రంబు, నెల్ల మంగ**
**ళంబులకును మంగళంబును, నెల్ల దే । వతలకుఁ బరమదైవతము, భూత**
**సమితికి నవ్యయజనకుండు నగునట్టి । వాఁ డెవ్వఁ; డెవ్వాని వలనఁ దోఁచు**

**తే.** **నాదియుగము నాగమమున; నంత్యవేళ । నడఁగు నెవ్వానియందుఁ జరాచరములు,**
**విశ్వలోక ప్రధానుఁ డవ్విష్ణు వేయు । భవ్యనామంబులును బాపభయహరములు.** **322**

**ప్రతిపదార్థం:** పరమతేజంబును = శ్రేష్ఠమైన తేజస్సును, సమానాధికరహితమైన గొప్పవెలుగు; పరమపదంబును = ఉన్నతమైన స్థానమును; పరము+ఐన బ్రహ్మంబున్ = గొప్పదగు దైవతమును; పరపరాయణమున్ = ముఖ్యమైన ప్రాప్యము, పొందదగిన శ్రేష్ఠమైన వస్తువు; పవిత్రంబులు = పరిశుద్ధికరములు; నాన్+తగు = అనదగిన; వానికిన్+ఎల్లన్ = పదార్థములన్నింటిలో; పవిత్రంబున్ = పరిశుద్ధికరమైనదియు; ఎల్లమంగళంబులకును = సమస్తములైన శుభములకును; మంగళంబును = శుభమును గల్గించునది; ఎల్లదేవతలకున్ = సకల దేవతలకునూ; పరమదైవతమున్ = శ్రేష్ఠమైనదైవమునూ; భూతసమితికిన్ = జీవుల యొక్క సమూహమునకు, ప్రాణికోటికి; అవ్యయజనకుండున్ = శాశ్వతుడైన తండ్రి; అగు+అట్టివాఁడు = ఐనట్టి మహాత్ముడు; ఎవ్వఁడు = ఎవడో; ఏ+ వాని వలనన్ = ఏ మహనీయుడివలన; చర+అచరములు = జంగమములు, స్థావరాలు, చేతనములు, అచేతనములు; ఆది యుగము+ఆగమమునన్ = సృష్టి వేళలో; తోఁచున్ = గోచరించునో, ఉత్పన్నమగునో; అంత్యవేళన్ = ప్రళయకాలంలో; ఎవ్వని+అందున్ = ఏ స్వామిలోపల; అడఁగున్ = లీనమగునో, లయించునో; విశ్వలోక ప్రధానుఁడు = సకల ప్రపంచమందు ముఖ్యమైన వాడెవ్వడో; ఆ+విష్ణు = ఆ విష్ణుదేవుడి యొక్క; వేయు = వెయ్యి; సహస్ర సంఖ్యాకమైన; భవ్యనామంబులును= శుభనామములు, మంగళకరములైన పేర్లు; పాపభయహరములు = దురితమును, భయమును తొలగించేవి.

**తాత్పర్యం:** పరంజ్యోతి స్వరూపుడు; పరమపదాధినాథుడు, పరబ్రహ్మము, మిక్కిలి ఆశ్రయించదగినవాడు, పవిత్రములను పవిత్రీకరించేవాడు, శుభములకెల్ల శుభసంధాయకుడు, సకలదైవతములకు దైవతమయినవాడు, ప్రాణికోటికి వినాశరహితుడైన జనకుడు ఎవడో, ఎవడు చరాచరముల నెల్ల సృష్టిస్తున్నాడో, ప్రళయకాలమందు ఈ భూతజాలమంతా ఎవడిలోపల అణగి ఉంటుందో- సకలజగత్తులలో ప్రధానపురుషుడైన ఆ విష్ణుదేవుడి మంగళకరములైన సహస్రనామాలు జీవుల పాపాలను, భయాలను పటాపంచలు కావిస్తాయి.

**తే. భూరిగుణయోగ విఖ్యాతములును ఋషి స । మాజ పరిగీతములును నై మహిమఁ దనరు**
**నమ్మహాత్ముని నామంబు లధికతర వి । భూతికై చెప్పెదను విను భూపవర్య!' 323**

**ప్రతిపదార్థం:** భూపవర్య! = రాజులలో శ్రేష్ఠుడా!; భూరిగుణయోగ విఖ్యాతములునున్ = గొప్ప సద్గుణముల యొక్క కలయికచే ప్రసిద్ధికాంచినవియూ; ఋషిసమాజ = మంత్రవేత్తలైన ముని సంఘం చేత; పరిగీతములునున్+ఐ = లెస్సగా కీర్తించబడినట్టివై; మహిమన్ = ప్రభావం చేత; తనరు = ఒప్పునట్టి; ఆ+మహా+ఆత్ముని నామంబులు = ఆ పురుషోత్తముడి యొక్క పేరులు; అధికతర విభూతికై = మిక్కుటమగు ఐశ్వర్య మొదవుటకై; చతుర్విధ పురుషార్థ సిద్ధికై, ఆత్మోజ్జీవనమునకై; చెప్పెదను = తెల్పుతాను; విను = ఆలకించుము.

**తాత్పర్యం:** రాజ వల్లభా! ఉదాత్తగుణముల యొక్క సంబంధముచేత ప్రసిద్ధికెక్కినవీ, మునిసంఘంచేత అత్యాదరంతో కొనియాడబడేవీ, ప్రభావంతో ప్రకాశించునట్టివీ అయిన ఆ మహనీయుడినామాలు మిక్కుటమైన విభూతి సమకూడటం కొరకు నీకు చెప్పుతాను వినుము.

**వ. అని పలికి 'విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు' వను నివి మొదలైన 'రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం' డనియెడునివి తుదిగాఁ గల సహస్ర నామంబు లుపన్యసించి. 324**

**ప్రతిపదార్థం:** అని పలికి = అని భీష్ముడు వచించి; విశ్వంబు = స్వరూపరూప గుణ విభవైశ్వర్యాదులచే పూర్ణుడు, ప్రపంచస్వరూపుడు;

విష్ణుండు = సమస్తమునందు వ్యాపించిఉండేవాడు, దేశకాలవస్తుపరిచ్ఛేదం లేక అంతట నిండి ఉండేవాడు; వషట్కారుండు = సమస్త లోకాలను తన వశం చేసికొన్నవాడు, యజ్ఞాలలో హోమానికి ఉద్దేశ్యమైనవాడు; భూతభవ్యభవత్ప్రభువు = భూతభవిష్యద్వర్తమాన కాలములనే త్రికాలములలోని సకల పదార్థాలకు ప్రభువైనవాడు; అను+ఇవి = అనునట్టి ఈ నామాలు; మొదలు+ఐన = మొదలుగా కలిగిన; రథాంగపాణి = చక్రము చేతియందు కలవాడు, సుదర్శన చక్రం హస్తమందుకలవాడు; అక్షోభ్యుఁడు = కలత నొందించుటకు సాధ్యపడనివాడు, ఎట్టికలతలు లేనివాడు; సర్వప్రహరణాయుధుండు = భక్త రక్షణకై పంచాయుధాలతో పాటు సకల విధములైన అస్త్రాలు ఆయుధాలుగా కలవాడు, ఆయుధాలనే ప్రశస్తి లేని గోళ్ళుకూడా ఆయుధాలుగా కలిగినవాడు; అనియెడు+ఇవి = అనునట్టి ఈ నామాలు; తుదిగాన్+కల = కడపట కలిగిన; సహస్రనామంబులు = వెయ్యిపేర్లు; ఉపన్యసించి = వక్కాణించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** నారాయణుడి సహస్రనామాలు చెప్పుతాను శ్రద్ధగా ఆకర్ణించు మని పలికి భీష్ముడు విశ్వము, విష్ణుడు, వషట్కారుడు, భూతభవ్య భవత్ప్రభువు అనే నామాలతో ప్రారంభమై రథాంగపాణి, అక్షోభ్యుడు, సర్వప్రహరణాయుధుడు అనే నామాలతో అవసితమయ్యే శ్రీవిష్ణు సహస్రనామాలు ఉగ్గడించాడు.

**ఆ. కీర్తనీయుఁడైన కేశవు దివ్యనా । మంబు లివి భవద్ధితంబుఁ గోరి**
**తరతరంబ కీర్తితంబు లయ్యె నశేష । భంగి వేయుఁ గురునృపాలవర్య! 325**

**ప్రతిపదార్థం:** కురునృపాలవర్య! = కురువంశ ప్రభువులలో శ్రేష్ఠుడా!; కీర్తనీయుఁడు+ఐన = కొనియాడదగినట్టి; కేశవు = శ్రీమన్నారాయణుడి యొక్క; దివ్యనామంబులు+ఇవి = అప్రాకృతములైన నామాలు ఇవియే; భవత్+హితంబున్+కోరి = నీ మేలు నాకాంక్షించి; వేయున్ = వెయ్యింటిని; అశేషభంగిన్ = అన్యూనాతిరిక్తంగా, ఒక్కటి వదలకుండా, పూర్తిగా; తరతరంబు+అ = క్రమక్రమంగా; కీర్తితంబులు+అయ్యెన్ = కొనియాడబడ్డాయి.

**తాత్పర్యం:** కురువంశరాజులలో ఉత్తముడవైన ధర్మజా! స్తుతికి పాత్రుడైన కేశవుడి యొక్క అప్రాకృతాలైన వెయ్యినామాలివి. వీటిని నీ శ్రేయస్సును కోరి పరిపూర్ణంగా క్రమక్రమంగా నీకు వినిపించాను.

**భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామ ప్రభావంబుఁ దెలుపుట. (సం.13-135-121).**

**సీ. విష్ణునామంబులు వేయును నిత్యంబు । వినినఁ బఠించిన మనుజుఁ డిహము**
**నందుఁ బరమ్మున నశుభంబు నొందక । యత్యంత శుభముల ననుభవించు;**
**విప్రుండు వేదాంతవిదుఁ డగు, రాజు వి । జయ మొందు, వైశ్యుఁ డక్షయ ధనంబుఁ**
**బడయు, శూద్రుఁడు సుఖభాగిత వెలయు, ధ । ర్మార్థకామ ప్రజాభ్యర్థి జనులు**

**తే. గాంతు రయ్యె తెఱంగు; లేకాంత భక్తి । శౌచియై విని కీర్తించి సారయశము**
**నచల లక్ష్మియు వంశ వర్యతయు మేలి । పెంపుసొంపును గలిగి శోభిల్లు నరుఁడు. 326**

**ప్రతిపదార్థం:** విష్ణునామంబులు వేయును = విష్ణుదేవుడి యొక్క సహస్రనామాలు; నిత్యంబున్ = ప్రతిదినము; వినినన్ = ఇతరులు చదువగా ఆలకించిననూ; పఠించినన్ = తాను చదివిననూ; మనుజుఁడు = నరుడు; ఇహమునందున్ = ఈ లోకంలో; పరమ్మునన్ = పై లోకంలో; అశుభంబున్+ఒందక = అమంగళము, కీడు పొందక; అత్యంత శుభములన్ = కడలేని సౌఖ్యాలను; అనుభవించున్ = అనుభవిస్తాడు; విప్రుండు = భూసురుడు; వేద+అంత+విదుఁడు+అగున్ =

ఉపనిషద్రహస్యాలు తెలిసినవా డవుతాడు; రాజు = క్షత్రియుడు; విజయము+ఒందున్ = జయమును పొందుతాడు; వైశ్యుఁడు = వణిజుడు, వైశ్యకులస్థుడు; అక్షయధనంబున్ = తరుగని సిరిని; పడయున్ = పొందుతాడు; శూద్రుఁడు = శూద్రవర్ణస్థుడు; సుఖభాగితన్ = సౌఖ్యభాజనుడై; సుఖములందు పాలుపంచుకొన్నవాడై; వెలయున్ = విలసిల్లుతాడు; ధర్మ+అర్థ+కామ = ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గమునూ; ప్రజా+అభి+అర్థి = సంతానమును అభిలషించేటటువంటి; జనులు = ప్రజలు, ఏకాంత భక్తిన్ = అధికమైన భక్తితో; అయ్యైతెఱంగులు = ఆయా అభిలషితార్థములు; కాంతురు = పొందుతారు; శౌచి+ఐ = పరిశుద్ధుఁడై; విని = శ్రీవిష్ణుసహస్రనామములను ఆలకించి; కీర్తించి = తాను కొనియాడి, పఠించి; సారయశమున్ = స్థిరమైన కీర్తిని; అచల లక్ష్మియున్ = నిలుకడ కలిగిన సంపత్తిని; వంశ వర్యతయున్ = తనకులమందు ప్రాధాన్యమును; మేలి = ఉన్నతమైన; పెంపుసొంపును = గౌరవాతిశయాన్ని; కలిగి = లభించినవాడై; నరుఁడు = మనుజుడు; శోభిల్లున్ = వెలుగొందుతాడు.

**తాత్పర్యం:** శ్రీ విష్ణు సహస్రనామాలు అనుదినం వినేవాడు, పఠించేవాడు ఈ లోకంలో, పైలోకంలో అశుభాల పాలుగాక అపరిమిత శుభాలు అనుభవిస్తాడు. బ్రాహ్మణుడు నామసహస్రపఠనం చేత వేదాంతవేత్త అవుతాడు. క్షత్రియుడు శాత్రవ జయం పొందుతాడు. వైశ్యుడు ధనసమృద్ధి గలవాడవుతాడు. శూద్రుడు శ్రవణమాత్రంతోనే సుఖాలను పొందుతాడు. ధర్మమును వాంఛించేవాడు ధర్మాన్ని, అర్థమును అభిలషించేవాడు అర్థాన్ని, కామమును కోరేవాడు కామములను, సంతానం కాంక్షించేవాడు సంతతిని అత్యంత భక్తితో విష్ణుసహస్రనామాలను విని, పఠించి పొందగలడు. పరిశుద్ధుడై ఏ నరుడు సహస్రనామాలను శ్రవణం చేస్తాడో, పారాయణం చేస్తాడో ఆతడు స్థిరమైన కీర్తిని, తరుగని సిరిని, కులమందు ప్రాధాన్యమును పడయగలుగుతాడు. ఉన్నత గౌరవాతిశయంతో ఒప్పుతాడు.

**సీ. పురుషోత్తముని నామములు వేయుఁ గీర్తించు । నాతఁ డొక్కెడను భయంబుఁ బొందఁ,**
**డమిత వీర్యమునఁ దేజమునఁ గాంతిని బల । రూపగుణంబుల రూఢికెక్కు ,**
**రోగబంధాపదార్తులకుఁ బఠనమాత్ర । నయ్యయి దురితము లడఁగు, వాసు**
**దేవాశ్రయుఁడు వాసుదేవ పరాయణుఁ । డును నగుమర్త్యుఁ డవ్వినుతనామ**

**ఆ. కము లుపన్యసించి కల్మషంబుల నెల్ల । దొఱఁగి దుర్గతులకుఁ దొలఁగి జన్మ**
**మరణములకు రోగ జరలకు నందని । పరమమైన బ్రహ్మపదము నొందు. 327**

**ప్రతిపదార్థం:** పురుషోత్తముని = శ్రీమన్నారాయణుడి యొక్క; నామములు వేయున్ = వెయ్యినామధేయాలను; కీర్తించు+అతఁడు = కొనియాడునట్టి వాఁడు, పొగడేవాడు, శ్లాఘించేవాడు; ఒక్క+ఎడను = ఏ తావునందు గూడ; భయంబున్ = వెరపును, భీతిని; పొందఁడు = చెందడు; అమిత వీర్యమునన్ = మిక్కిలి పరాక్రమంతోనూ; తేజమునన్ = ప్రతాపంతోనూ; కాంతిన్ = శోభతో, దీప్తితో; బలరూపగుణంబులన్ = శక్తి, సౌందర్యం, సద్గుణములు అనువాటితో; రూఢికిన్+ఎక్కున్ = ప్రసిద్ధిగాంచుతాడు; రోగ+బంధ+ఆపత్+ఆర్తులకున్ = వ్యాధులు, బంధనం, కష్టాలు అనువాటితో బాధపడేవారికి; పఠనమాత్రన్ = సహస్రనామ పారాయణం చేయగానే; అయ్యయి దురితములు = ఆయాపాపాలు; అడఁగున్ = నశిస్తాయి, నిర్మూలమవుతాయి; వాసుదేవ+ఆశ్రయుఁడున్ = వాసుదేవుడిని ఆశ్రయించుకొన్నవాడున్నూ; వాసుదేవ పరాయణుఁడునున్ = వాసుదేవుడిని పరమ గతిగా ఎంచుకొన్నవాడూ, విశ్వసించినవాడూ; అగుమర్త్యుఁడు = అయిన మానవుడు; ఆ+వినుత నామకములు = ఆ మెచ్చదగిన వెయ్యిపేర్లు; ఉపన్యసించి = ఉగ్గడించి, పేర్కొని; కల్మషంబులన్+ఎల్లన్ = అన్ని దురితాలను, పాతకాలను; తొఱఁ

గి = వీడి; దుర్గతులకున్+ తొలఁగి = దుఃస్థితులకు దూరమై, విపత్తులనుండి విడివడి, ఇడుములు బాసి; జన్మమరణములకున్ = చావు పుట్టుకలకు; రోగజరలకున్ = వ్యాధులకూ, ముసలితనానికీ; అందని = చిక్కని, దొరకని, లోనుగాని; పరమము+ఐన = ఉత్తమమైన; బ్రహ్మపదమున్+ఒందున్ = మోక్షాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** విష్ణుమూర్తి వెయ్యినామాలను నిత్యం పారాయణ మొనర్చేవాడు ఎక్కడా భయాన్ని పొందడు. మిక్కుటమైన శౌర్యం, ప్రతాపం, శోభ, శక్తి, సౌందర్యం, సద్గుణాలు అనే వాటితో ప్రసిద్ధి చెందుతాడు. శ్రీ విష్ణునామ పఠనంతో రోగాలు వదలుతాయి. చెరనుండి విముక్తి లభిస్తుంది. ఇడుములు తీరుతాయి. నామ పారాయణంవలన ఈ పాతకాలన్నీ నశిస్తాయి. వాసుదేవుడిని ఆశ్రయించుకొన్నవాడు, వాసుదేవుడిని దిక్కుగా ఎంచుకొన్నవాడూ, శ్లాఘింపదగిన ఈ భగవన్నామాలను పఠించి దురితవిహీనుడై, దుఃస్థితులకు దూరమవుతాడు. జననమరణాలకూ, జరావ్యాధులకూ లోనుగాక పరమోత్తమమైన మోక్షపదవిని అందుకొంటాడు.

**క. స్మృతి సౌఖ్య క్షాంతి శ్రీ। ధృతి కీర్తులు గలుగు దుర్మతియుఁ గ్రోధము లు**
**బ్ధతయును మాత్సర్యము లే। వతి పుణ్యత విష్ణుభక్తులైన జనులకున్. 328**

**ప్రతిపదార్థం:** అతిపుణ్యతన్ = అధికమైన పుణ్యం సల్పడంచేత; విష్ణు భక్తులు+ఐన = నారాయణ ప్రేమికులైన; జనులకున్ = నరులకు; స్మృతి = జ్ఞప్తి, ఒరులు చేసిన మేలు మరువకుండటం; సౌఖ్య = సుఖం; క్షాంతి = సహనం, ఓర్పు; శ్రీ = కలిమి; ధృతి = ధైర్యం; కీర్తులు = యశస్సు అనునవి; కలుగున్ = లభిస్తాయి; దుర్మతియున్ = చెడుబుద్ధి; క్రోధము = కినుక, కోపం, ఆగ్రహం; లుబ్ధతయును = పేరాస; మాత్సర్యము = ఓర్వలేనితనం, అసూయ; లేవు = కలుగవు.

**తాత్పర్యం:** పుణ్యాత్ములైన విష్ణుభక్తులకు ఇతరు లొనర్చిన మేలు మరువకుండటం, సుఖం, సహనం, సంపత్తి, ధైర్యం, యశస్సు అనేవి లభిస్తాయి. చెడుబుద్ధి, కోపం, పేరాస, ఓర్వలేనితనం అనే దుర్గుణాలు ఉండవు.

**సీ. చంద్రార్క నక్షత్ర సహిత మైన నభంబు, । సచరాచరోర్వియు, జలనిధులును,**
**సురదైత్య గంధర్వ గరుడ యక్షోరగ । వ్రజములు హరివశవర్తనములు;**
**బుద్ధియు నింద్రియములును మనంబు స । త్త్వంబును బలము దేజంబు ధృతియు**
**క్షేత్రంబుఁ దద్గత క్షేత్రజ వస్తువు । లరయఁగా వాసుదేవాత్మకంబు;**

**తే. లాగమోదితాచారమయంబు ధర్మ । మచ్యుతుండు తత్ప్రభువు; సాంఖ్యమును యోగ**
**తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మ । ములు జనార్దనువలన సముద్భవించె. 329**

**ప్రతిపదార్థం:** చంద్ర+అర్క,నక్షత్ర సహితము+ఐన = సోముడితో, సూర్యుడితో, చుక్కలతో కూడినట్టి; నభంబున్ = ఆకాశం; సచర+అచర+ఉర్వియున్ = చేతనాలతో, అచేతనాలతో కూడిన ధరణీతలం; జలనిధులును = సముద్రాలు; సుర = దేవతలు; దైత్య = రాక్షసులు; గంధర్వ = గంధర్వులు; గరుడ = గరుడులు; యక్ష = యక్షులు; ఉరగ వ్రజములు = సర్పములు అనువాటి యొక్క సమూహాలు; హరివశవర్తనములు = విష్ణున కధీనములైన ప్రవర్తన గలవి; శ్రీహరికి లోబడి మెలగుతుంటాయి; బుద్ధియున్ = బుద్ధి; ఇంద్రియములున్ = జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు; మనంబున్ = మనస్సు; సత్త్వంబును = సత్త్వము; బలమున్ = శక్తి; తేజంబున్ = తేజస్సు; ధృతియున్ = ధైర్యం; క్షేత్రమున్ = శరీరం; తద్గత = దేహంలో ఉన్న; క్షేత్రజవస్తువులు = ఆత్మద్రవ్యములు; అరయన్+కాన్ = ఆలోచించగా; వాసుదేవ+ఆత్మకములు =

నారాయణ స్వరూపాలు; ధర్మము = ధర్మమనే ప్రథమ పురుషార్థం; ఆగమ+ఉదిత = వేదాలలో, ధర్మశాస్త్రాలలో చెప్పబడిన; ఆచారమయంబు = అనుష్ఠానముతో కూడినది; తత్+ప్రభువు = ఆ ధర్మానికి అధీశ్వరుడు; అచ్యుతుడు = నారాయణుడు; సాంఖ్యమును = సాంఖ్యశాస్త్రమును; యోగతంత్రమును = యోగసిద్ధాంతము; శిల్ప వేద శాస్త్రములు = శిల్పము, వేదములు, ఇతిహాసపురాణాలు; కర్మములున్ = కర్మలు; జనార్దనువలనన్ = నారాయణుడివలన; సముద్భవించెన్ = కలిగాయి.

**తాత్పర్యం:** సూర్యచంద్ర నక్షత్రాలతో గూడిన ఆకాశం, స్థావరాలతో, జంగమాలతో చేరిన భూతలం, సముద్రాలు, దేవతలు, దానవులు, గంధర్వులు, గరుడులు, యక్షులు, సర్పములు మున్నుగా గల్గిన భూతజాలం, విష్ణుదేవుడికి అధీనాలై మెలగుతున్నాయి. బుద్ధి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, సత్త్వం, శక్తి, తేజస్సు, ధైర్యం, శరీరం, శరీరగతుడైన ఆత్మ-ఈ పదార్థజాతమంతా ఆలోచిస్తే వాసుదేవమయాలే. వేదాలలో, ధర్మశాస్త్రాలలో చెప్పబడిన సదాచారమే, సంప్రదాయమే ధర్మం. ఈ ధర్మానికి ప్రభువు శ్రీమన్నారాయణుడు. సాంఖ్య యోగ సిద్ధాంతాలు, శిల్పం, వేదాలు, ఇతిహాసపురాణాలు, కర్మములు సమస్తమూ జనార్దనుడివలననే సంభవించాయి.

**ఆ. విష్ణుఁ డొక్కరుండ విను మహాభూతంబు; । దక్కు భూత తతులు పెక్కు గలవు;**
**సరిఁ ద్రిలోకములను బరఁగి విశ్వంబు భూ । తాత్ముఁ డమ్మహాత్ముఁ డనుభవించు. 330**

**ప్రతిపదార్థం:** విను = ధర్మజా! సావధానుడవై ఆలకించుము; విష్ణుఁడు+ఒక్కరుండు+అ = సర్వజీవాంతర్యామి యైన విష్ణుదేవుడొక్కడే; మహాభూతంబు = గొప్పభూతం; తక్కు = ఇతరములైన, తదన్యములైన; భూత తతులు = భూతముల యొక్క సమూహాలు, జీవజాలాలు; పెక్కు కలవు = అనేకం ఉన్నాయి; సరిన్ = సమానంగా, భేదరహితంగా; త్రిలోకములను = ముజ్జగాలలో; పరఁగి = వ్యాపించి; భూత+ఆత్ముఁడు = భూతస్వరూపుడైనట్టి, భూతములకెల్ల ఆత్మగాఉన్నట్టి; ఆ+మహా+ఆత్ముఁడు = ఆ మహనీయుడైన విష్ణుదేవుడు; విశ్వంబున్+అనుభవించున్ = ప్రపంచమును అనుభవిస్తున్నాడు.

**తాత్పర్యం:** ధర్మజా! శ్రద్ధాసక్తులతో ఆలకించుము. విష్ణు వొక్కడే మహాభూతం. తక్కినవన్నీ చిన్న చిన్న భూతాలు-లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. భూతాత్ముడు, మహాత్ముడు అయిన మహావిష్ణువు ముల్లోకములందు వ్యాపించి లీలా రసాన్ని అనుభవిస్తున్నాడు.

**ఆ. వ్యాస సంప్రణీతమైన యీ విష్ణు స్త । వంబు సకలశోభనంబులును సు**
**ఖములుఁ గోరు పురుషుఁ డమలినబుద్ధిఁ బ । ఠింపవలయు భక్తి పెంపుతోడ. 331**

**ప్రతిపదార్థం:** సకలశోభనంబులును = సమస్తములైన శుభాలను, మంగళములను, సౌభాగ్యాలను; సుఖములున్ = సౌఖ్యాలు; కోరు = వాంఛించే; పురుషుఁడు = నరుడు; అమలిన బుద్ధిన్ = నిర్మలమైన చిత్తంతో; భక్తిపెంపుతోడన్ = అధికమైన భక్తిభావంతో; వ్యాససంప్రణీతము+ఐన = వేదవ్యాసమహర్షిచేత రచించబడిన; ఈవిష్ణుస్తవంబున్ = ఈ శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రాన్ని; పఠింపన్+వలయున్ = తప్పక చదవాలి.

**తాత్పర్యం:** సమస్త సన్మంగళాలను, సుఖాలను కోరుకునే మానవుడు నిర్మలమైన అంతఃకరణంతో, అధికమైన భక్తి భావంతో శ్రీవేదవ్యాస మహర్షి కృతమైన శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రాన్ని తప్పక చదవాలి.

**క. అజు విశ్వాధీశ్వరు స । ర్వజగత్ప్రభవాప్యయ ప్రవర్తనకరు నం**
**బుజలోచను నెవ్వారలు । భజింతురు పరాభవమునఁ బడ రప్పుణ్యుల్. 332**

**ప్రతిపదార్థం:** అజున్ = పుట్టుకలేని వాడూ, జన్మరహితుడూ; విశ్వ+అధి+ఈశ్వరున్ = ప్రపంచానికి అధిపతియూ; సర్వజగత్ = సమస్త లోకాల యొక్క; ప్రభవ = పుట్టుకను; అవ్యయ ప్రవర్తన = నాశముగాని, శాశ్వతమైన నిర్వహణమును; కరున్ = చేసేవాడునూ అయిన; అంబుజలోచనున్ = పద్మములవంటి నేత్రములుగల మహావిష్ణువును; ఏ+వారలు = ఏ జనులు; భజింతురు = కొలుతురో, సేవింతురో; ఆ+పుణ్యుల్ = ఆ పుణ్యాత్ములు; పరాభవమునన్+పడరు = అవమానం పాలుగారు.

**తాత్పర్యం:** పుట్టుకలేని వాడున్నూ, ప్రపంచేశ్వరుడున్నూ, సకలభువనాలను సృష్టించేవాడున్నూ, కమలదళముల వంటి కన్నులు గల శ్రీమహావిష్ణువును ఎవరు సేవిస్తారో, అట్టి పుణ్యపురుషులు పరాభవముల పాలుగారు.

**క. కావున విష్ణుని పేళ్ళగు । నీ వేయుఁ బఠింపు నీకు నెప్పుడు నాయు**
**శ్రీవిభవారోగ్యంబులు । భూవర! సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్.' 333**

**ప్రతిపదార్థం:** భూవర! = రాజా!; కావునన్ = కనుక; విష్ణుని పేళ్ళు+అగు = శ్రీహరినామధేయాలైన; ఈవేయున్ = ఈ వెయ్యింటిని; పఠింపు = చదువుము; నీకున్ = నీకు; ఎప్పుడున్ = ఎల్లప్పుడు, సంతతము; ఆయుః = ఆయుష్యము; శ్రీ = సంపద, కలిమి, సిరి; విభవ = వైభవం, గొప్పతనం; ఆరోగ్యములు = అనామయం, వ్యాధిరాహిత్యం; సిద్ధించున్ = లభిస్తాయి; పరమబోధమున్ = ఉత్తమజ్ఞానం; కలుగున్ = సమకూడుతుంది, చేకూరుతుంది.

**తాత్పర్యం:** ధర్మజా! విష్ణుదేవుడి వెయ్యినామాలను ఎల్లప్పుడూ పఠించుము. పఠిస్తే నీకు దీర్ఘాయుష్యము, ఐశ్వర్యమూ, వైభవమూ, ఆరోగ్యమూ, ఉత్తమ జ్ఞానమూ లభిస్తాయి.'

**క. అని యిట్లుపదేశించిన । విని మోదము నెమ్మనమున వెల్లిగొనఁగ బాం**
**డుని యగ్రసుతుఁడు గాంగే । యున కభివందన మొనర్చి యుచితవినయుఁ డై. 334**

**ప్రతిపదార్థం:** అని, ఇట్లు = అంటూ ఈ ప్రకారం; ఉపదేశించినన్ = భీష్ముడు బోధించగా; విని = ఆలకించి; మోదము = సంతోషం; నెఱ+మనమునన్ = తన నిండు మనస్సులో; వెల్లి+కొనఁగన్ = ప్రవహించగా; పాండుని+అగ్రసుతుఁడు = పాండు మహారాజు యొక్క పెద్దకుమారుడు అయిన ధర్మరాజు; గాంగేయునికిన్ = గంగాపుత్రుడైన దేవవ్రతుడికి, భీష్ముడికి; అభివందనము+ ఒనర్చి = ప్రణామం చేసి, దణ్ణం పెట్టి; ఉచిత వినయుఁడు+ఐ = తగిన అణకువ కలవాడై (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** ఈ రీతిగా భీష్ముడు ధర్మజునకు శ్రీవిష్ణుసహస్రనామాలు ఉపదేశించగా ఆలకించి ఆనందం తనమదిలో నిండి ప్రవహించగా పాండుమహారాజుయొక్క జ్యేష్ఠ పుత్రుడైన యుధిష్ఠిరుడు ఆయనకు సాష్టాంగదండప్రణామం చేసి, తగిన వినయంతో.

**వ. 'పూజానమస్కారంబులకు నెవ్వరు భాజనంబు? లెవ్వరికిఁ జెట్ట సేసినం జేటు వాటిల్లు? నెవ్వారలు సంతోషించిన శుభంబులు చొప్పడుం? జెప్పవే' యనిన నతం డతని కిట్లనియె. 335**

**ప్రతిపదార్థం:** పూజా నమస్కారంబులకున్ = అర్చించటానికీ, మ్రొక్కటానికీ; ఎవ్వరు; భాజనంబులు = అర్హులు, పాత్రులు, యోగ్యులు, తగినవారు; ఎవ్వరికిన్; చెట్ట+చేసినన్ = కీడు కావిస్తే; చేటు+పాటిల్లున్ = కీడు మూడుతుందో; ఏ+వారలు = ఎవ్వారు; సంతోషించినన్; శుభంబులు; చొప్పడున్ = కలుగునో; చెప్పవు+ఏ? = తెలుపవా?; అనినన్ = అని ధర్మరా జనగా; అతండు = భీష్ముడు; అతనికిన్ = ధర్మజునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పూజించటానికి, నమస్కరించటానికి ఎవరు తగినవారు? ఎవరికి కీడు చేస్తే మనకు కీడు మూడుతుందో, ఎవరిని సంతోషపరిస్తే మనకు శుభాలు సంప్రాప్తిస్తాయో చెప్పవలసింది' అని వేడుకొనగా గాంగేయుడు ధర్మనందనుడికి ఇట్లా బదులు చెప్పాడు.

బ్రాహ్మణ పూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట. (సం.13-136-1).

**సీ.** **'పూజానమస్కారములకుఁ బాత్రములు బ్రా । హ్మణులు; వారలకుఁ గీ డాచరించి**
**వాసవుండును జెడు; వారి సంతసమున । నఖిల శుభంబులు నావహిల్లు;**
**ధర్మసేతువు లోకధారకం బఖిలశా । స్త్ర ప్రవర్తకము విప్రవ్రజంబు;**
**తపమును వాక్కును ధనము విప్రుల కొక్క । కుడుపు మాత్రన పాపకోటిఁ బాతు;**

**తే.** **రమ్మహాత్ములు చొప్పరు లఖిలమార్గ । ములకు; విను దేవతలు దేవతలకు బాలుఁ**
**డజ్ఞుఁ డన లేదు పూజకు నర్హు లనిన । నధిప! వృద్ధులఁ బ్రాజ్ఞుల నడుగనేల?'** **336**

**ప్రతిపదార్థం:** అధిప = రాజా!; బ్రాహ్మణులు = భూసురులు; పూజానమస్కారములకున్ = పూజించటానికీ, నమస్కరించటానికీ; పాత్రములు = తగినవారు, అర్హులు; వారలకున్ = విప్రులకు; కీడు+ఆచరించి = హాని సల్పి; వాసవుండును = దేవేంద్రుడైననూ; చెడున్ = నశిస్తాడు, పాడైపోతాడు; వారి సంతసమునన్ = ఆ బ్రాహ్మణులు ఆనందపడితే; అఖిలశుభంబులున్ = సమస్తమంగళములు; ఆవహిల్లున్ = కలుగుతాయి; విప్రవ్రజంబు = బ్రాహ్మణ సమాజం; ధర్మసేతువు = ధర్మరక్షకం; లోకధారకంబు = లోకమును ధరించునట్టిది, లోకులకు ఆధారమైనట్టిది; అఖిలశాస్త్రప్రవర్తకము = భగవదాజ్ఞలైన వేదశాస్త్ర పురాణాదులను ప్రవర్తింపజేస్తుంది, జనులు అనుసరించేటట్లు చేస్తుంది; విప్రులకున్ = ద్విజులకు; తపమును = తపస్సు; వాక్కును = మాటయు; ధనము = విత్తము; ఒక్కకుడుపుమాత్రన = ఒక పూట వారికి భోజనం పెట్టితే (అన్నదాత యొక్క); పాపకోటిన్ = పాతకాల సమూహాన్ని; పాతురు = తొలగిస్తారు; అఖిలమార్గములకున్ = అన్నిదారులకు; ఆ+మహా+ఆత్ములు = ఆ దొడ్డమనసుగల విప్రులే; చొప్పరులు = దారిచూపేవారు; విను = ధర్మజా! శ్రద్ధగా ఆలకించుము; దేవతలకున్ = వేల్పులకు; దేవతలు = వారే వేల్పులు; బాలుఁడు = పిల్లవాడు; అజ్ఞుఁడు = మూఢుడు; అనన్ లేదు = విప్రుల విషయంలో ఆ ఎన్నిక తగదు; పూజకున్ = ఆరాధనకు; అర్హులు = వారు యోగ్యులు; అనినన్ = అని చెప్పేటపుడు; వృద్ధులన్ = వారిలో పెద్దలను గూర్చి; ప్రాజ్ఞులన్ = పండితులగూర్చి; అడుగన్+ఏల = పూజార్హులని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు పూజించటానికి, నమస్కరించటానికి యోగ్యులు. వారికి కీడుచేసినచో దేవేంద్రుడయినా చెడకమానడు. వారిని సంతోషపెడితే సకల శుభాలు సమకూడుతాయి. ధర్మ రక్షకులు, లోకోద్ధారకులు, శాస్త్రప్రవర్తకులు వారే సుమా! విప్రులకు వారి తపస్సే, వచనమే ధనం. వారి కొక్కపూట తిండి పెట్టినవారి పాతకరాసు లన్నింటినీ వారు పటాపంచలు కావించగలరు. అన్ని మార్గా లెరిగినవారు కనుక జనులకు మంచిదారి చూపగలవారు వారే. ధర్మపుత్రా! వినుము. దేవతలకు దేవతలు వారే. ద్విజుడు బాలుడైనా, మూఢుడైనా పూజార్హుడే. అటువంటప్పుడు వారిలో పెద్దలయినవారూ, పండితులయినవారూ పూజార్హులని వేరుగా చెప్పవలసిన అక్కర లేదుగదా!'

**వ. అనిన విని యజాతశత్రుండు 'బ్రాహ్మణులఁ బూజించుటవలన విశిష్టంబయిన శుభం బెయ్యది దృష్టం బయ్యు వారలయందు వర్ణనీయం బగు వర్తనం బేమి గానంబడియె నీవిట్లు వారలం గొనియాడె? దెఱింగింపవే' యనుటయు నాపగాపుత్రుండు 'పవనార్జున సంవాదం బను నితిహాసంబు విను; మది భవత్ప్రశ్నంబునకు సదుత్తరంబై యుండు' నని పల్కి య జ్జనపతి కిట్లనియె. 337**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అజాత శత్రుండు = ధర్మరాజు; బ్రాహ్మణులన్; పూజించుట వలనన్; విశిష్టంబు+అయిన = శ్రేష్ఠమైన, ప్రత్యేకమైన; శుభంబు; ఏ+అది (ఎయ్యది) = ఎట్టిది; దృష్టంబు+అయ్యున్ = నీచేచూడబడినదూ, నీకు గోచరించినా; వారలయందున్ = ఆ బ్రాహ్మణులందు; వర్ణనీయంబు+అగు = స్తుతించదగిన, మెచ్చదగిన; వర్తనంబు = నడవడి, ప్రవర్తన; ఏమి+కానంబడియెన్ = ఏమి కనిపించింది?; నీవు; ఇట్లు; వారలన్ = ఆ ద్విజులను; కొనియాడెదు? = మెచ్చుకొంటావు? ఎఱింగింపవు+ఏ = తెల్పుమా; అనుటయున్ = అని ధర్మరాజడుగగా; ఆపగాపుత్త్రుండు = నదీసుతుడు-భీష్ముడు; పవన+అర్జున సంవాదంబు = వాయుదేవునకు, కార్తవీర్యార్జుననకు జరిగిన సంభాషణం; అను = అనునట్టి; ఇతిహాసంబున్ = పూర్వ చరిత్రను; వినుము; అది = ఆ కథ; భవత్+ప్రశ్నంబునకున్ = నీ వడిగిన దానికి; సత్+ఉత్తరంబు+ఐ = మంచిసమాధానమై; ఉండున్ = ఉంటుంది; అని పల్కి; ఆ+జనపతికిన్ = రాజైన ధర్మజునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్మ డట్లా పల్కగా విని పాండునందనుడు 'పితామహా! బ్రాహ్మణులను పూజించటంవలన ప్రత్యేకమైన శుభం నీ కేమి గోచరించినప్పటికినీ, వారియందు ఇంతగా కొనియాడదగిన నడవడి(చరిత్ర) నీ కేమి కన్పించింది? వారిని నీవు ఇట్లా ఎందుకు మెచ్చుతున్నావో తెల్పు' మని అడిగాడు. అందుకు గంగానందనుడు 'ధర్మజా! పవనార్జున సంవాదమనే ఒక పూర్వగాథ ఉన్నది. అది నీ వడిగిన ప్రశ్నకు సరి అయిన సమాధానం అవుతుంది. వినిపిస్తాను, విను' మని భీష్ముడు ఇట్లా అన్నాడు.

పవన కార్తవీర్యార్జున సంవాదంబు భీష్ముండు ధర్మరాజునకుం జెప్పుట. (సం.13-137-2).

**సీ. 'అధిప! సహస్రబాహార్జునుఁ డేడుదీ । వులు నేలి యద్భుతబలపరాక్ర**
**మములఁ దనర్చి 'మత్సము లెవ్వరును నెందు । లేరని యత్యవలేపయుక్తి**
**నాడిన నొకభూత మాకాశముననుండి । 'యెఱుఁగక పలికెద; వెల్లవారి**
**కధికులుగారె ధరామరు' లనవుడు । నతఁడు 'వారలు రాజు నాశ్రయించి**

**తే. నడపి కొందురు మనుగడ; పుడమిఱేని । కంటె నె ట్లెక్కుడై? రట్లుఁ గాక యేను**
**మనుతుఁ గూర్చినఁ, జెఱుతు నల్గిన సమస్త । భూతముల' నన్న వెఱచి యా భూత మరిగె. 338**

**ప్రతిపదార్థం:** అధిప! = రాజా! సహస్రబాహ్+అర్జునుఁడు = వేయిచేతులు గల కార్తవీర్యార్జునుడు; ఏడు దీవులున్+ఏలి = సప్తద్వీపాలను పాలించి; అద్భుతబలపరాక్రమములన్ = ఆశ్చర్యం కల్గించే శక్తితో, శౌర్యంతో; తనర్చి = ఒప్పి; మత్+సములు = నాకు సమానులు; ఎవ్వరును; ఎందున్; లేరు; అని; అతి+అవలేపయుక్తిన్ = మిక్కుటమైనగర్వంతో కూడినవాడై; ఆడినన్ = పలుకగా; ఒక భూతము = ఒకప్రాణి; ఆకాశమునన్+ఉండి = గగనతలం నుండి; ఎఱుఁగక పలికెదవు = తెలియకుండా మాట్లాడుతున్నావు; ఎల్లవారికిన్ = అందరికి; ధరా+అమరులు = భూసురులు; అధికులుకారు+ఎ = గొప్పవారుగదా!; అనవుడున్ = అని ఆ భూతం పలుకగా; అతఁడు = కార్తవీర్యుడు; వారలు = బ్రాహ్మణులు; రాజున్; ఆశ్రయించి = కనిపెట్టుకొని; మనుగడ = తమజీవనము, బ్రతుకు తెరువు; నడపి కొందురు = సాగించుకొంటారు; పుడమి ఱేనికంటెన్

= భూపతికంటెను; ఎట్లు = ఏ విధంగా; ఎక్కుడు+ఐరి? = అధికులైనారు?; అట్లున్+కాక = అంతేగాక; ఏను = నేను; కూర్చినన్ = ఇష్టపడితే, ప్రియపడితే; సమస్తభూతములన్ = ఎల్లజీవులను; మనుతున్ = రక్షిస్తాను, కాపాడ గలను; అల్గినన్ = కోపం వహిస్తే; చెఱుతున్ = నాశనం చేస్తాను, శిక్షించగలను; అన్నన్ = అని చెప్పగా; వెఱచి = భయపడి; ఆ భూతము; అరిగెన్ = వెళ్ళిపోయింది.

**తాత్పర్యం:** 'ధర్మనందనా! వేయి చేతులు గల కార్తవీర్యార్జునుడు అనే రాజు సప్తద్వీపాలను పరిపాలించాడు. వింత గొలుపు బలపరాక్రమాలతో వెలుగొందుతూ అతడు ఎందునూ నాకు సమానులు ఎవ్వరూ లేరని మిక్కిలి గర్వంతో పలికాడు. ఆ మాటలు విని ఆకాశంనుండి ఒక భూతం 'నీవు తెలియక మాట్లాడుతున్నావు. అందరికంటె బ్రాహ్మణులు అధికులు కదా!' అని పలికింది. అందు కతడు 'బ్రాహ్మణులు రాజు నాశ్రయించి బ్రతుకుతారు. అట్టివారు రాజుకంటె ఎట్లా అధికులౌతారు? ఆ విషయ మట్లుంచు. నేను ఇష్టపడితే సకల జీవులను సంరక్షించగలను. ఆగ్రహిస్తే అందరినీ అంతం చేయగలను' అన్నాడు. ఆ మాటలకు భయపడి ఆ భూతం అదృశ్యమయింది.

**విశేషం:** ద్వీపం అనగా నాలుగు దిక్కుల నీళ్ళు గల భూభాగం. ద్వీపాలు ఏడు.
1)జంబూద్వీపం 2)ప్లక్షము 3)కుశము 4)క్రౌంచము 5)శాకము 6)శాల్మలము 7)పుష్కరము.

**వ. అట్టియెడం బవనుండు గగనంబున నుండి త న్నెఱింగించికొని యన్నరపతి తోడ. 339**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్ = ఆ భూతం అదృశ్యమైన తర్వాత; పవనుండు = వాయుదేవుడు; గగనంబునన్+ఉండి = ఆకాశస్థలం నుండి; తన్నున్+ఎఱింగించికొని = నేను వాయువును అని పరిచయం చేసికొని; ఆ+నరపతితోడన్ = ఆ రాజుతో, కార్తవీర్యుడితో.

**తాత్పర్యం:** ఆ భూతం అంతర్ధానమైన పిదప అంబరతలం నుండి అనిలుడు కార్తవీర్యార్జునుడితో (ఇట్లా అన్నాడని తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'భూదేవశక్తిన కాదె రాజులు ప్రజా । రక్ష యొనర్చుట; బ్రాహ్మణులకు**
**నధికులు గలరె? యహల్యకై యింద్రుండు । గౌతముఁ దలిగిన గాసిఁ బడఁడె?**
**కుంభసంభవుచేత నంభోధి యడఁగదె? । యనలుండు భృగుశాపహతుఁడు గాఁడె?'**
**యన విని మఱుమాట యాడక యున్న య । ర్జుననకుఁ బవనుఁ డిట్లనియె మఱియు**

**తే. 'నాంగిరసవంశ సంభవుం డగు నుచథ్యుఁ । గోరి నిజపుత్రి సోముఁడు గారవమున**
**నిచ్చె; నా దంపతులు దమయిచ్చ వనము । నందు వసియించి ముని హృదయంబు లలర. 340**

**ప్రతిపదార్థం:** రాజులు = క్షత్రియులు; ప్రజారక్ష+ఒనర్చుట = జనులను పాలించటం, కాపాడటం; భూదేవశక్తిన్+అ+కాదు+ఎ = భూసురుల యొక్క బలం చేతనే కదా! బ్రాహ్మణులకున్ = విప్రులకంటె; అధికులు+కలరు+ఎ? = మించినవా రున్నారా?; అహల్యకై = అహల్య కొరకు; ఇంద్రుఁడు = దేవేంద్రుడు; గౌతముఁడు+అలిగినన్ = గౌతమమహర్షి కినియగా; గాసిన్+పడఁడు+ఎ? = కష్ట మనుభవించలేదా?; కుంభసంభవుచేతన్ = కలశం నుండి జన్మించిన అగస్త్యమహర్షి చేత; అంభోధి = సముద్రం; అడఁగదు+ఎ? = అడుగంటలేదా?, నిర్జలము కాలేదా?; అనలుఁడు = అగ్నిదేవుడు; భృగుశాపహతుఁడు+కాఁ

డు+ఎ? = భృగుమౌని శాపం చేత దెబ్బతినలేదా?; అనన్ విని = అని పవనుడు పల్కగా ఆలకించి; మఱుమాట = ప్రతివచనం; ఆడక+ఉన్న = చెప్పకున్నట్టి; అర్జుననకున్; పవనుఁడు = వాయువు; మఱియున్ = ఇంకనూ; ఇట్లు+అనియెన్; ఆంగిరసవంశసంభవుండు+అగు = అంగిరసమహాముని వంశమునందు జన్మించినవాడైన; ఉచథ్యున్ = ఉచథ్యుడనే పేరుగల విప్రుడిని; కోరి = ఇష్టపడి; సోముఁడు = చంద్రుడు; నిజపుత్రిన్ = తన కొమార్తెను; గారవమునన్ = ఆదరంతో, మన్ననతో; ఇచ్చెన్ = ఇచ్చి పెళ్ళిచేశాడు; ఆ దంపతులు = ఆ భార్యాభర్తలు; తమ+ఇచ్చన్ = తమ ఇష్టప్రకారం; వనము+అందున్ = అరణ్యంలో; వసియించి = నివసించి; మునిహృదయంబులు+అలరన్ = మునీశ్వరుల యొక్క మనసులు ఆనందించే టట్లు. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** 'రాజులు ప్రజలను సంరక్షించటం బ్రాహ్మణుల శక్తి వలననేకదా! బ్రాహ్మణులకంటె గొప్పవారెవ్వరున్నారు? ఇంద్రు డహల్యను కోరి గౌతమ మహర్షి శాపానికి గురియై బాధ లనుభవించలేదా? కలశసంభవుడైన అగస్త్య మహర్షి సముద్ర జలాలు ఇంకిపోయేటట్లు చేయలేదా? అగ్నిదేవుడు భృగుమహర్షి శాపహతుడు కాలేదా?' అని పల్కగా విని బదులాడక మౌనముద్ర వహించిన కార్తవీర్యుడితో మళ్ళీ అనిలదేవు డిట్లా అన్నాడు. అర్జునా! అంగిరసుడనే మునివంశంలో జన్మించిన ఉచథ్యుడనే వాడికి చంద్రుడు తన పుత్రికనిచ్చి మన్ననతో వివాహమంగళం జరిపించాడు. ఆ భార్యాభర్తలు స్వేచ్ఛగా వనంలో నివసిస్తూ అక్కడి మునీంద్రుల మనస్సులు ఆనందించే టట్లు.

**వ. వర్తించునెడ నొక్కనాఁ డమ్ముని యమునానదీస్నానంబునకుం జనుటయు మున్న యవ్వనితం గామించి వేచి తిరుగు వరుణుండు. 341**

**ప్రతిపదార్థం:** వర్తించు+ఎడన్ = వారు వనంలో మెలగుతుండగా; ఒక్కనాఁడు; ఆ+ముని; యమునానదీ స్నానంబునకున్; చనుటయున్ = వెళ్ళగా; మున్ను+అ = అంతకుపూర్వమే; ఆ+వనితన్ = ఆ యువతిని; కామించి = మోహించి, అభిలషించి; వేచి = ఆమె కొరకు కనిపెట్టుకొని; తిరుగు వరుణుండు = సంచరిస్తున్న వరుణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఉచథ్యుడు, అతని పత్ని వనంలో హాయిగ నివసిస్తున్నారు. ఒకనాడు ఉచథ్యుడు యమునలో స్నానమాడటానికి వెళ్ళాడు. అంతకు మునుపే అతని పత్నిని కామించి సమయం కొరకు నిరీక్షిస్తూ తిరుగుతున్న దిక్పతి వరుణుడు.

**క. ఎత్తి కొనిపోయి తనపురి । నత్తామరసాక్షి నునిచె; నమ్ముని కడకున్**
**మెత్తన చని నారదముని । యత్తెఱఁ గెఱిఁగింప నాతఁ డాతనితోడన్. 342**

**ప్రతిపదార్థం:** ఎత్తికొనిపోయి = అపహరించుక వెళ్ళి; తనపురిన్ = తన పట్టణంలో; ఆ తామరస+అక్షిన్ = కమలములవంటి కన్నులు గల ఆ కలికిని; ఉనిచెన్ = ఉంచాడు; ఆ మునికడకున్ = ఆ ఉచథ్యుని దగ్గరకు; నారదముని = నారదయతీంద్రుడు; మెత్తన చని = మెల్లగా వెళ్ళి; ఆ+తెఱఁగు = వరుణుడు అతని చెలినపహరించిన విధం; ఎఱిఁగింపన్ = చెప్పగా; ఆతఁడు = ఉచథ్యుడు; ఆతనితోడన్ = ఆ నారదుడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** వరుణుడు ఉచథ్యుని యొక్క ఉవిదను అపహరించుకొని వెళ్ళి తనపురంలో ఉంచాడు. నారదమహర్షి ఉచథ్యుని చెంత కేగి ఈ విషయం మెల్లగా అతడి చెవిలో వేశాడు. అప్పు డతడు నారదుడితో.

**తే. 'తాన దిక్పతి; దన కిట్లు దగునె యొరుని । భార్యఁ గొని పోవ? నీ వేఁగి పలుకు మిట్లు'**
**యనినఁ జని నారదుండు సెప్పినను విడువఁ । డయ్యెఁ గామాంధుఁడై సతి నబ్ధివిభుఁడు. 343**

**ప్రతిపదార్థం:** తాను+అ = ఆ వరుణుడు; దిక్+పతి = పశ్చిమదిశకు పాలకుడు; ఒరుని భార్యన్ = ఇతరుడి ఇల్లాలిని; ఇట్లు = ఈ ప్రకారం; కొనిపోవన్ = తీసికొని వెళ్ళటం; తనకున్+తగునె? = తనవంటి వానికి అర్హమా?, న్యాయమా?; నీవు+ఏగి = నీవు వెళ్ళి; ఇట్లు+అ = ఇపుడు నీతో నేనన్న విధంగా; పలుకుము = చెప్పుము; అనినన్ = అని ఉచథ్యుడు తెల్పగా; నారదుండు; చని; చెప్పినను; కామ+అంధుఁడు+ఐ = కామం చేత కన్నుకాననివాడై, గ్రుడ్డి వాడై; అబ్ధివిభుఁడు = సాగరాలకు అధిపతి అయిన వరుణుడు; సతిన్ = ఆ చెలువను; విడువఁడు+అయ్యెన్ = వదలలేదు.

**తాత్పర్యం:** 'ఆ వరుణుడు దిక్పాలకుడు. పరుని ఇల్లాలిని ఇట్లా అపహరించుక వెళ్ళటం న్యాయం కాదు అని నీవతని చెంతకు వెళ్ళి చెప్పుము' అని ఉచథ్యుడు కోరగా నారదు డరిగి ఉచథ్యుడి మాటలు వరుణుడికి చెప్పాడు. కాని కామం చేత కన్నుగానని వరుణుడు మునిపత్నిని విడువలేదు.

**వ. విడువకున్న నమ్ముని యుచథ్యుకడకు మగిడి వచ్చి. 344**

**ప్రతిపదార్థం:** విడువక+ఉన్నన్; ఆ+ముని = నారదమహర్షి; ఉచథ్యుకడకున్ = ఉచథ్యుని దగ్గరకు, మగిడివచ్చి = తిరిగి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** నారదుడు చెప్పినప్పటికినీ వరుణుడు ఆ పడతిని విడువలేదు. అంతట ఆ ముని మరలి ఉచథ్యుని దగ్గరకు వచ్చి (ఇట్లా అన్నాడు).

**సీ. 'ఇంతిఁ దా విడువనియంతియ కాదు, నన్ । బెడతల వట్టి త్రోపించె వరుణుఁ'**
**డని చెప్పటయు నల్గి యతఁడు సర్వజలంబు । ద్రావిన వరుణపురంబు ధూళి**
**మయమైన భయమంది మానినిఁ గొనివచ్చి । యొప్పించి ప్రణమిల్లి తప్పు వాపి**
**కొని మునికృపఁ గాంచి చనియె నాదిక్పతి; । ధరణీశ! రాజులొ ధరణిసురులొ**

**ఆ. యెక్కు?' డనిన వినియు నక్కిక్కు వడియున్న । యతనితోడ ననిలుఁ డమరు లసుర**
**సమితికోడి వచ్చి శరణుసొచ్చిన నగ । స్త్యుండు విజయలక్ష్మి నొసఁగుటయును. 345**

**ప్రతిపదార్థం:** ఇంతిన్ = మీ కాంతను; తాన్ = తాను, వరుణుడు; విడువని+అంతియ+కాదు = విడిచిపెట్టకుండటం మాత్రమే కాదు; నన్ = నన్ను; పెడతల పట్టి = తలవెనుక పట్టుకొని; త్రోపించెన్ = నెట్టించాడు; అని చెప్పుటయున్ = అని నారదుడు తెల్పగానే; అల్గి = కోపించి; అతఁడు = ఉచథ్యుడు; సర్వజలంబులు+త్రావినన్ = సముద్రంలోని నీరంతా త్రావగా; వరుణపురంబు = సాగరంలో ఉన్న వరుణుడి పట్టణం; ధూళిమయంబు+ఐనన్ = దుమ్ముతో నిండగా, దుమ్ముతో ఆవరింపబడగా, దుమ్ముక్రమ్ముకోగా; భయము+అంది = భీతి చెంది, వెరచి; మానినిన్ = ఉచథ్యుని భార్యను; కొనివచ్చి = తీసికొనివచ్చి; ఒప్పించి = ఆ మునికి అప్పగించి; ప్రణమిల్లి = నమస్కరించి; తప్పు+పాపికొని = తన దోషం తొలగించుకొని; మునికృపన్+కాంచి = ఆ మునీంద్రుడి దయపడసి; ఆ దిక్పతి = దిక్పాలకుడైన వరుణుడు; చనియెన్ = వెళ్ళాడు; ధరణీ+ఈశ! = ఓ భూవల్లభా! కార్తవీర్యార్జునా!; రాజులు+ఒ = భూపతులా?; ధరణీసురులు+ఒ = భూసురులా?; ఎక్కుడు = అధికులు;

అనినన్= అని వాయుదేవుడు ప్రశ్నించగా; వినియున్ = ఆలకించి కూడా; నక్కిళ్ళు పడి+ఉన్న = నిరుత్తరుడై ఉన్న; నోటి నుండి మాట రాకున్న; అతనితోడన్ = కార్తవీర్యుడితో; అనిలుఁడు = వాయువు; అమరులు = వేల్పులు, అనిమిషులు, సురులు; అసురసమితికిన్= రక్కసుల గుంపుకు; ఓడివచ్చి = అపజయంపాలై వచ్చి; శరణు+చొచ్చినన్ = ఆశ్రయించగా, కాపాడుమని వేడగా; అగస్త్యుఁడు = అగస్త్యమహర్షి; విజయలక్ష్మిన్ = జయశ్రీని; ఒసఁగుటయున్ = ఆ దేవతలకు లభింపజేయుటయు. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** 'వరుణుడు నీ పత్నిని విడిచిపెట్టకుండటమేకాదు, ఇక్కడి నుంచి వెళ్ళిపొమ్మని నన్ను మెడబట్టి ముందుకు నెట్టించాడు' అని నారదుడు పలికేసరికి ఉచథ్యుడు ఆగ్రహోదగ్రు డయ్యాడు. సాగరజలా లన్నిటినీ పీల్చివేశాడు. సముద్రగర్భంలో ఉన్న తన పట్టణం బయటపడి దుమ్ముతో ఆవరింపబడగా అతడు భయపడ్డాడు. మునిపత్నిని వెంటబెట్టుకొనివచ్చి సమర్పించి, నమస్కరించి తన తప్పు మన్నించుమని వేడుకొన్నాడు. ఆయన కనికరించగా వరుణుడు సెలవుగైకొని వెళ్ళిపోయాడు. రాజా! రాజులు గొప్పవారా? లేక బ్రాహ్మణులు గొప్పవారా? చెప్పు మని మరుద్దేవుడు మహీపతిని ప్రశ్నించాడు. ఆ మాటలన్నీ కార్తవీర్యుడు వింటూనే ఉన్నాడు. అతడికి నక్కిళ్ళు పడిపోయాయి. మౌనంగా ఉన్నాడు. అనిలుడు మళ్ళీ మాటలకు ఉపక్రమించాడు. అర్జునా! అమరులు అసురుల చేతిలో ఓడిపోయి అగస్త్యమహర్షిని శరణు జొచ్చారు. ఆ మహనీయుడు వేల్పులకు విజయలక్ష్మిని అనుగ్రహించాడు.

**వ. గంగా తీరంబునం గ్రతువు లొనరించు గీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన, వసిష్ఠుని కడకు వారలు వలియుం బాఱుదేరం గోపించిన యత్తాపసోత్తముని రోషానల జ్వాలలు సాకారంబులయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి, యక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠులగుట రాజుల కొడఁ బాటు గాదోకదే యని ననుం బలుక కున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు నిట్లనియె.346**

**ప్రతిపదార్థం:** గంగాతీరంబునన్ = గంగానది ఒడ్డున; క్రతువులు = యాగాలు, యజ్ఞాలు; ఒనరించు = సల్పుతున్న; గీర్వాణులన్ = దేవతలను; పూర్వగీర్వాణులు = రాక్షసులు; గాసిచేసినన్ = బాధించగా; వారలు = వేల్పులు; వసిష్ఠుని కడకున్ = వసిష్ఠమహర్షి దగ్గరకు; వలియన్ = శ్రమతో; పాఱుదేరన్ = పరుగెత్తిరాగా; కోపించిన = రక్కసులపై కినిసిన, ఆగ్రహించిన; ఆ+తాపస+ఉత్తముని = మునులలో శ్రేష్ఠుడైన వసిష్ఠుడి యొక్క; రోష+అనలజ్వాలలు = కోపమనే నిప్పుమంటలు; స+ఆకారంబులు+అయి = రూపుదాల్చినవై; ఆ దైత్యలోకంబున్ = ఆ రాక్షస జనాలను; ఏర్చుటయున్ = దహించుట అనే విషయాన్ని; చెప్పి = నుడివి; ఆ+కుంభసంభవుండును = ఆ అగస్త్యమౌనీంద్రుడూ; వసిష్ఠుండును = వసిష్ఠ మహర్షియూ; శ్రేష్ఠులు+అగుట = ఉత్తములగుట; రాజులకున్ = భూపతులకు; ఒడఁబాటు కాదో కదే = సమ్మతం కాదు కాబోలు; అనినమున్ = అని పల్కిననూ; పలుకక+ఉన్న = బదులు చెప్పకున్న, ప్రత్యుత్తర మీయకున్న; ఆ+నరపతి తోడన్ = ఆ మనుజేంద్రుడితో, రాజుతో; పవమానుండు = వాయువు; మఱియున్ = ఇంకా; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'గంగానది గట్టున యజ్ఞాలు చేస్తున్న దేవతలను రాక్షసులు పీడించగా వారు నొచ్చి వసిష్ఠ మహర్షి దగ్గరకు వలిపడి పరుగెత్తుకొనివచ్చారు. వేల్పుల దురవస్థకు కారణమైన రక్కసులపై ఆ ముని పుంగవునకు కోపం వచ్చింది. ఆయన క్రోధాగ్నిజ్వాలలు ఆ దానవసమూహాన్ని దహించి వేశాయి' అని వాయుదేవుడు వచించి 'కార్తవీర్యా! అగస్త్య వసిష్ఠ మౌనీశ్వరులు తమకంటె శ్రేష్ఠు లగుట రాజులకు సమ్మతం కాదు కాబోలు' అని చెప్పినప్పటికినీ మారుమాటాడకున్న ఆ మహీపతితో మళ్ళీ వాయుదేవు డిట్లా అన్నాడు.

పవనుఁడు కార్తవీర్యార్జునునకు నత్రి ప్రభృతుల మహిమ చెప్పుట. (సం.13-141-1).

**సీ. 'ఒకతఱి దేవతలకు దైత్యులకు మహా । రణమయ్యెః నప్పోర రాహునస్త్ర**
**సమితిచే నర్కుండుఁ జంద్రుండు సొలసిన । వెలుఁ గడంగుడుఁ దమ మొలసి వెగడు**
**పడిన య ద్దివిజుల వడి నంటఁ దాఁకి య । య్యసురలు నొప్పింప నత్రికడకుఁ**
**బాఱి 'మమ్ముం గావు పరమదయాత్మక!' । యనుడు నతండు చంద్రార్కతనువు**

**ఆ. లక్షతములు సేసి యసురసైన్యము రూపు । మాపె నిజకటాక్షమాత్రముననః**
**యతని నృపులకంటె నధికుఁ డందమొ హీనుఁ । డందమో నిజంబ యధిప! చెపుమ.' 347**

**ప్రతిపదార్థం:** ఒకతఱిన్ = ఒకప్పుడు; దేవతలకున్; దైత్యులకున్ = రాక్షసులకు; మహారణము+అయ్యెన్ = గొప్పయుద్ధం జరిగింది; ఆ+పోరన్ = ఆ సంగ్రామంలో; రాహు+అస్త్రసమితిచేన్ = రాహువు యొక్క బాణాలసమూహం చేత; అర్కుండున్ = సూర్యుడును; చంద్రుండున్ = సోముడునూ; సొలసినన్ = మూర్ఛిల్లగా; వెలుఁగు = కాంతి; అడంగుడున్ = అణగిపోగా, మాయగా; తమము = చీకటి; ఒలసి = వ్యాపించి; వెగడు పడిన = భయపడిన, తల్లడపడిన, చలించిపోయిన; ఆ+దివిజులన్ = ఆ దేవతలను; వడిన్ = వేగంగా; అంటన్+తాకి = వెంట నంటి ఎదుర్కొని, వెంబడించి; మార్కొని; ఆ+అసురలు = ఆ రక్కసులు; నొప్పింపన్ = బాధించగా; అత్రికడకున్ = అత్రిమహర్షి దగ్గరకు; పాఱి = పరుగెత్తిపోయి; పరమ+దయా+ఆత్మక = మిక్కిలి దయతో కూడిన వాడా!; మమ్మున్; కావు = కాపాడుము; అనుడున్ = అని వేల్పులనగా; అతండు = అత్రిముని; చంద్ర+ అర్కతనువులు = చంద్ర సూర్యుల దేహాలు; అక్షతములు చేసి = గాయాలు లేనివాటిగా చేసి, గాయాలు మాన్పి; నిజకటాక్షమాత్రముననన = తన చూపులను ప్రసరింపజేయటంచేత; అసుర సైన్యమున్ = రక్కసుల సేనను; రూపుమాపెన్ = నిర్మూలించాడు; అధిప! = ఓ రాజా!; అతనిన్ = అత్రిమహర్షిని; నృపులకంటెన్ = రాజులకంటె; అధికుఁడు+అందము+ఒ? = ఎక్కువవా డందామా? (లేక) హీనుఁడు+అందము+ఓ? = తక్కువవా డందామా?; నిజంబు+అ = సత్యం; చెపుము+అ = తెల్పుమా.

**తాత్పర్యం:** 'ఒకప్పుడు దేవదానవులకు ఘోరయుద్ధం జరిగింది. ఆ సంగ్రామంలో రాహువు యొక్క బాణాల వలన సూర్యచంద్రులు గాయపడి మూర్ఛపోయారు. వారు మూర్ఛిల్లగా వెలుతురు మాసిపోయి చీకట్లు క్రమ్ముకొన్నాయి. భీతిల్లిన వేల్పులను వెంటనంటి రక్కసులు నొప్పించారు. అంతట దేవతలు అత్రిమహర్షి దగ్గరకు పరుగెత్తిపోయి 'పరమదయామయా! మమ్ము రక్షించు' మని వేడుకొన్నారు. ఆ ముని పుంగవుడు సూర్యచంద్రుల శరీరాల గాయాలు మాన్పి తన దృక్ప్రసారంతో రాక్షససైన్యాన్ని నిర్మూలించాడు. రాజా! అటువంటి అత్రి మహామునిని రాజులందరికంటె ఎక్కువ వాడనవలెనో, తక్కువవా డనవలెనో నీవే నిజం చెప్పుము.'

**సీ. అనిన నూరకయున్న యర్జునుతోడ స । దాగతి యిట్లను 'ధరణినాథ!**
**సురపతి యాశ్వినుల్ సోమపానంబున । కర్హులు గారన్న నాశ్రయంబు**
**పాటించి వారికై భార్గవచ్యవనుండు । దనమంత్రముల బల్మి ననిమిషులకు**
**నెగ్గుసేయంగ న య్యింద్రుండు పోటున । వ్రేటున నాతని గీటడంచు**

**తే. బుద్ధి నొకశైలమును వజ్రమును రయమున । గొని మహోగ్రతఁ గవియ, న మ్మునివరుండు**
**జలము చల్లిన శైలవజ్రములు దాను । ముడుగఁ బడి య బ్బలారాతి మూర్ఛవోయి. 348**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని ప్రభంజనుడు (గాలి) పలుకగా విని; ఊరక+ఉన్న = మాట్లాడకుండ ఉన్నట్టి; అర్జునుతోడన్ = కార్తవీర్యునితో; సదాగతి = వాయువు; ఇట్లు+అనున్ = ఇట్లా అన్నాడు; ధరణినాథ = భూపాలా!; సురపతి = అమరవల్లభుడు; ఆశ్వినుల్ = అశ్వినీ దేవతలు, దేవవైద్యులు; సోమపానంబునకున్ = యజ్ఞాలలో సోమరసం ఆస్వాదించటానికి; అర్హులు+కారు = తగరు; అన్నన్ = అని నుడువగా; ఆశ్రయంబుపాటించి = తనను వారాశ్రయించుటను ఆదరించి; వారికై = ఆ దేవవైద్యులకొరకు; భార్గవచ్యవనుండు = భృగువంశమువాడైన చ్యవనమహర్షి; తనమంత్రముల బల్మిన్ = తన యొక్క మంత్రశక్తితో; అనిమిషులకున్ = దివిజులకు; ఎగ్గు+చేయంగన్ = కీడు సల్పగా; ఆ+ఇంద్రుండు = ఆ సురపతి; పోటునన్ = పొడుచుటచేత; వ్రేటునన్ = నరుకుట చేత; ఆతనిన్ = ఆ చ్యవనుడిని; గీటు+అడంచుబుద్ధిన్ = నిర్మూలించే తలంపుతో; ఒకశైలమును = ఒకగిరినీ; వజ్రమును = వజ్రాయుధాన్ని; రయమునన్+కొని = శీఘ్రంగా గ్రహించి; మహా+ఉగ్రతన్ = మిక్కిలి రౌద్రంగా; కవియన్ = సమీపించగా, మీదికి రాగా; ఆ+ముని వరుండు = ఆ ఋషిశ్రేష్ఠుడు; జలము చల్లినన్ = నీళ్ళు చిలుకగా; శైల వజ్రములున్ = కొండయూ, వజ్రాయుధమూ; తానున్ = తానున్నూ; ముడుగన్+పడి = చేష్టలుడిగి, శక్తి చెడి; ఆ+బల+అరాతి = బలుడనే రాక్షసుడికి శత్రువైన దేవేంద్రుడు; మూర్ఛపోయి = సొమ్మసిల్లి. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** తన మాటలకు బదులాడని కార్తవీర్యుడితో సమీరణుడు మళ్ళీ 'నరేంద్రా! దేవేంద్రుడు అశ్వినీ దేవతలు యజ్ఞాలలో సోమపానానికి అనర్హులు' అని అన్నాడు. తనను ఆశ్రయించిన ఆ దేవ వైద్యులకు సాయపడదలచి భృగువంశంలో జన్మించిన చ్యవనమహర్షి తన మంత్రబలంతో దేవతలకు కీడు చేయగా ఇంద్రుడికి కోపం వచ్చింది. చ్యవనుడిని పొడిచిగాని, నరికిగాని చంపదలచి మహేంద్రుడు ఒక పర్వతాన్ని, వజ్రాయుధాన్ని గ్రహించి భయంకరంగా మహర్షి మీదికి ఉరికాడు. ఆ మునీంద్రుడు మంత్రజలం చల్లగా ఆ శైలవజ్రాయుధాలతో పాటు ఇంద్రుడు శక్తి చెడి మూర్ఛిల్లాడు.

**వ. ఒక్కింత సేపునకుం దెలిసె; నంతకు నమ్మునివరుండు మదుండను వాని శతయోజన దీర్ఘసహస్రదంతుని సృజించి పంపిన. 349**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఇంతసేపునకున్ = కొంచెం సేపటికి; తెలిసెన్ = ఒడలు తెలిసింది; అంతకున్ = అతడు మూర్ఛ నుంచి తేరుకొనే లోపలనే; శతయోజన దీర్ఘ సహస్రదంతునిన్ = నూరామడల పొడవైన వేయి దంతాలు గలవాడిని; మదుండు+ అనువానిన్ = మదుడనే పేరుగల వాడిని; సృజించి పంపినన్ = సృష్టించి ఇంద్రునిపైకి పంపగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** మూర్ఛిల్లిన దేవేంద్రుడు కొంచెంసేపటికి తేరుకొన్నాడు. ఆ లోపలనే చ్యవనమహర్షి నూరామడల పొడవైన వెయ్యి పళ్ళుగల మదుడనే వాడిని ఒకడిని సృష్టించి ఇంద్రుడిపైకి పంపాడు.

**ఆ. వాఁడు సురగణంబు వాసవుఁ గబళింప । వారు 'శరణుశరణు వరమునీంద్ర!'**
**యనిన, వారిఁ గాచె న మ్ముని; వారిచ్చి । రపుడు సోమపాన మాశ్వినులకు. 350**

**ప్రతిపదార్థం:** వాఁడు = మదుడనేవాడు; సురగణంబున్ = దివిజ సమూహాన్ని; వాసవున్ = ఇంద్రుడిని; కబళింపన్ =

మ్రింగగా; వారు = ఆ సురలు, దేవేంద్రుడు; వరమునీంద్ర! = ఓ శ్రేష్ఠుడవైన మునీంద్రా!; శరణు శరణు = రక్షించు, రక్షించు; అనినన్ = అని పలుకగా; వారిన్ = వారలను; ఆ+ముని; కాచెన్ = కాపాడినాడు; వారు = ఆ దేవతలు; అపుడు = ఆ వేళ; ఆశ్వినులకున్ = అశ్వినిదేవతలకు; సోమపానము = సోమరసం యజ్ఞాలలో త్రాగే అర్హత; ఇచ్చిరి = కల్పించారు.

**తాత్పర్యం:** చ్యవన మహర్షిచేత సృజించబడ్డ మదుడు దేవతలను, దేవేంద్రుడిని మ్రింగగా వారు 'మహామునీ! మమ్మ రక్షించు రక్షించు' మని చ్యవన మునిని ప్రార్థించారు. ఆయన కరుణించి వారిని మదుడిబారి నుండి రక్షించాడు. దేవతలు అపుడు యజ్ఞాలలో సోమరసపానార్హత అశ్వినీ దేవతలకు కలిగించారు.

**క. నీ వా చ్యవనుండును ధా । త్రీవరు సరిగామి యెట్లుఁ దెలుప కుడుగుదే?'**
**నా వినియు నొక్కమాటయు । నా విభుఁ డాడండ దాని కలయక మఱియున్. 351**

**ప్రతిపదార్థం:** ఆ చ్యవనుండును = ఆ చ్యవనమహర్షి కూడ; ధాత్రీవరు సరి+కామి = రాజుతో సమానుడు కాకుండటం; ఎట్లున్ = ఏ విధమో; నీవు = నీవు; తెలుపక = చెప్పక; ఉడుగుదు+ఏ? = మానెదవా? నాన్ = అని, గాలిదేవుడు పలుకగా; వినియున్ = విని కూడ; ఆ విభుఁడు = ఆ కార్తవీర్యప్రభువు; ఒక్కమాటయున్ = ఒక్క పలుకు కూడ; ఆడండు+అ = పలుకడు; దానికిన్ = అట్లా బదులు పలుకనందుకు; అలయక = విసుగు చెందక; మఱియున్ = ఇంకనూ. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** అంతటి చ్యవన మహర్షి కూడ రాజుతో సమానుడు కాకపోవటం ఎట్లో చెప్పకుండా మానుతావా?' అని గాలిదేవుడు కార్తవీర్యుడిని ప్రశ్నించాడు. వింటూ కూడ అతడు అందుకు బదులాడ లేదు. వాయుదేవుడు విసుగు చెందక మళ్ళీ మొదలుపెట్టాడు.

**వ. వాయుదేవుం డన్నరదేవు వలని కరుణంజేసి యితని చేటోర్వని వాఁడై. 352**

**ప్రతిపదార్థం:** వాయుదేవుండు, ఆ+నరదేవు వలని = ఆ రాజుపైన గల, కరుణన్+చేసి = దయవలన; ఇతని చేటు = ఇతనికి కలిగే కీడు; ఓర్వని వాడు+ఐ = సహించని వాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** వాయుదేవుడు కార్తవీర్యార్జునుడి మీద తనకున్న కృపవలన ఆతడికి కీడు మూడటం సహించలేని వాడై.

**సీ. 'అకట! దత్తాత్రేయునకు భక్తి శుశ్రూష । చేసి కాదే యి వ్విశిష్టబల ప**
**రాక్రమంబుల నొంది రాజుల కెల్లను । నెక్కుడై తా కృత మేల మఱవ?**
**విను మీ వొకండవే యనిమిషాది సమస్త । భూతంబులును వృద్ధిఁ బొందు టవని**
**దివిజులకృపన యీ తెఱఁ గెల్లజనములు । నెఱిఁగిన పని శాంతిఁ గొఱలి విప్ర**

**తే. కులము దైవస్వరూపం బగుట మనంబు । నందు దృఢముగ నిల్పి తదాశ్రయమున**
**వెలయువాఁడ; వైనను మేలు వినుము నాదు । బుద్ధి' యనవుడు నతఁడు ప్రబోధ మొలసి 353**

**ప్రతిపదార్థం:** అకట! = అయ్యో!; దత్తాత్రేయునకున్ = దత్తాత్రేయుడికి; భక్తిన్ = భక్తితో; శుశ్రూష = సేవ, సపర్య, పరిచర్య; చేసికాదు+ఏ = సల్పినందువల్లనే గదా; ఈ విశిష్టబలపరాక్రమంబులన్ = ఈ ఉత్తమమైన శక్తిని, శౌర్యమును; ఒంది = పొంది; రాజులకున్+ఎల్లను = భూపతులందరి కంటె; ఎక్కుడు+ఐతి = అధికుడవైనావు; ఆకృతము = గురుసేవాఫలమైన నీ ఉన్నత స్థితిని; మఱవన్+ఏల? = ఎందుకు విస్మరించటం?; వినుము = అర్జునా! వినుము;

ఈవు+ఒకండవు+ఏ? = నీవొక్కడివేనా? కాదు; అనిమిష+ఆది = దేవతలుమున్నుగా కల; సమస్త భూతంబులును = సకల ప్రాణులునూ; వృద్ధిన్+పొందుట = పెంపు వహించుట; అవని దివిజుల కృపన్+అ = భూసురుల యొక్క కారుణ్యం వలననే సుమా! ఈ తెఱఁగు = ఈ విషయం; ఎల్ల జనములున్ = సమస్త ప్రజలు; ఎఱిఁగినపని = తెలిసిన కార్యమే; శాంతిన్+కొఁలిలి = మనోనిగ్రహంతో ఒప్పారుతూ; విప్రకులము = బ్రాహ్మణవర్ణం; దైవస్వరూపంబు+అగుట = సాక్షాత్ భగవత్స్వరూపం కావటం; మనంబు+అందున్ = హృదయంలో; దృఢముగన్+నిల్పి = గట్టిగా నిలుపుకొని; తత్+ఆశ్రయమునన్ = ఆ భూసురుల యొక్క అండదండలతో; వెలయువాఁడవు+ఐననున్+మేలు = విరాజిల్లువాడ వగుట శ్రేయస్కరం; నాదుబుద్ధి వినుము = నా హితం ఆలకించుము; అనవుడున్ = అని అనిలుడు చెప్పగా; అతఁడు= కార్తవీర్యార్జునుడు; ప్రబోధము+ఒలసి = తెలివినొంది, జ్ఞానం కలిగి; (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** 'అయ్యో! దత్తాత్రేయులవారిని అఖండ భక్తితో శుశ్రూషించి కదా ఇంతటి మేటి బలపరాక్రమాలు పడసి రాజులందరిలో అధికుడవై అలరారుతున్నావు. నీ ఈ ఉన్నతస్థితికి గురు సేవయే మూలకారణం అనే మాట మరువరాదు. నీవొక్కడివే కాదు దేవతలు మొదలుగాగల సకల జీవరాసులూ వృద్ధిపొందటం బ్రాహ్మణుల కృపవలననే కదా! ఈ విషయం లోకు లందరికీ విదితమే. మనసును స్వాధీనంలో ఉంచుకొని ధరణీసురులు దైవస్వరూపులన్న దృఢభావనతో వారి నాశ్రయించుకొని వర్తించటం నీకు శ్రేయస్కరం. నా హితోపదేశం విను' మని వాయుదేవుడు చెప్పగా కార్తవీర్యుడు తెలివి తెచ్చుకొన్నాడు.

**క. 'నీ పనుపు చేసి బ్రదికెద; । నేపు నహంకృతియు విడిచి యెల్లవలన మే**
**లాపాదించుచు విప్రుల । శ్రీపాదము లాశ్రయించి చెందెద శాంతిన్.' 354**

**ప్రతిపదార్థం:** నీ పనుపు చేసి = నీ ఆజ్ఞను శిరసావహించి; బ్రదికెదన్ = జీవిస్తాను; ఏపున్ = ఆటోపం; అహంకృతియున్ = దురభిమానం, దుర్గర్వం; విడిచి = వదలి; ఎల్లవలనన్ = అందరికినీ అన్ని విధాల; మేలు+ఆపాదించుచున్ = క్షేమం కలిగిస్తూ; విప్రుల = బ్రాహ్మణుల యొక్క; శ్రీపాదములు+ఆశ్రయించి = మంగళకరములైన చరణములను నమ్ముకొని; శాంతిన్+ చెందెదన్ = శాంతిని వహిస్తాను.

**తాత్పర్యం:** 'నీ ఆజ్ఞను తలదాల్చి, నీవు చెప్పినట్లే మంచిబుద్ధి కలిగి మనుగడ సాగిస్తాను. ఆటోపం, స్వాభిమానం వదలి అందరికి మేలు కలిగిస్తూ బ్రాహ్మణుల శ్రీచరణాలే శరణా లని విశ్వసించి స్వస్థచిత్తంతో మెలగుతాను.'

**ఆ. అనిన సంతసిల్లి యనిలుఁ డానృపు 'బుద్ధి । గలిగి బ్రదుకు' మనుచు గారవించి**
**వీడుకొల్పి చనియె; విప్రులపెం పిట్టి । దని యెఱుంగు కురుకులాగ్రగణ్య! 355**

**ప్రతిపదార్థం:** అనినన్ = అని కార్తవీర్యుడు చెప్పగా; సంతసిల్లి = సంతోషపడి; అనిలుఁడు = వాయుదేవుడు; ఆనృపున్ = ఆ రాజును; బుద్ధి+కలిగి = తెలివి తెచ్చుకొని; బ్రదుకుము = జీవించుము; అనుచున్ = అని పలుకుతూ; గారవించి = ఆదరించి; వీడుకొల్పి = పోయిరమ్మని చెప్పి; చనియెన్ = వాయువు వెళ్ళిపోయాడు; కురుకుల+అగ్రగణ్య! = కౌరవవంశంలో తొలుత పేర్కొనదగినవాడా! ధర్మజా!; విప్రులపెంపు = బ్రాహ్మణుల ఆధిక్యం, గొప్పతనం; ఇట్టిది = ఇటువంటిది; అని+ఎఱుంగు = అని తెలిసికొమ్ము.

**తాత్పర్యం:** కార్తవీర్యార్జునుడి మాటలకు ఆనందించి అనిలదేవుడు ఆ రాజుతో 'నీవు సద్బుద్ధి గలిగి సుఖంగా జీవించు' మని ఆదరవచనములాడి వెళ్ళుటకు సెలవొసంగి తనదారిని తాను వెళ్ళాడు. 'కురుకులోత్తమా! ధర్మజా!

బ్రాహ్మణుల గొప్పతనం ఇట్టిదని గ్రహించు' మని భీష్ముడన్నాడు.

**భీష్ముండు ధర్మజునకుఁ గృష్ణుని ప్రభావం బుపన్యసించుట. (సం.13-143-3).**

**వ. అనుటయు నవ్విభుండు 'బ్రాహ్మణ మహానుభావం బింకను విన వలతుం జెప్పవే' యనుటయు నప్పుడమిఱేనికి భీష్ముండు తనకు నింద్రియంబులును వాఙ్మనసంబులు నపుడు దుర్బలంబు లగుట యెఱింగించి 'యినుండు దక్షిణాయనంబు తుది చేరుచు వచ్చె; దేహన్యాసంబు తడవులేమి దోఁచుచున్నది కృష్ణుండు నీకు విప్రజన విశేషంబు వివరించువాఁ' డని పలికి యిట్లనియె. 356**

**ప్రతిపదార్థం:** అనుటయున్ = అని భీష్ముడు పలుకగా; ఆ+విభుండు = ప్రభువైన ధర్మజుడు; బ్రాహ్మణ మహా+అనుభావంబు = విప్రుల యొక్క ప్రభావం, గొప్పతనం; ఇంకను; వినన్; వలతున్ = కోరుతున్నాను; చెప్పవు+ఏ = తెల్పుమా; అనుటయున్ = అని అడుగగా; ఆ+పుడమిఱేనికిన్ = ఆ భూవల్లభుడికి; భీష్ముండు; తనకున్; ఇంద్రియంబులును = నేత్రాదులైన ఇంద్రియాలు; వాక్+మనసంబులు = వాక్కు, మనస్సు; అపుడు; దుర్బలంబులు = బలహీనములు; అగుట = కావటం, ఎఱింగించి; ఇనుండు = రవి; దక్షిణ+అయనంబు = దక్షిణాయనం యొక్క; తుది = చివర; చేరుచున్+వచ్చెన్ = చేరబోవుతున్నాడు, సమీపిస్తున్నాడు; దేహన్యాసంబు = శరీరం నిల్పుటకు; తడవు లేమి = అలస్యం లేదని; తోఁచుచున్+ఉన్నది = స్ఫురిస్తున్నది; కృష్ణుండు; నీకున్; విప్రజన విశేషంబు = బ్రాహ్మణుల యొక్క ఘనత; వివరించువాఁడు = వక్కాణిస్తాడు, స్పష్టపరుస్తాడు; అని పలికి, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగా ధర్మజుడు 'బ్రాహ్మణుల గొప్పతనం ఇంకా వినాలని కోరిక కలుగుతున్నది చెప్పవా' అని అడిగాడు. భీష్ముడు తనకు ఇంద్రియాలు, వాక్కూ, మనసూ, బలహీనా లైనవని పలికి 'రాజా! సూర్యుడు దక్షిణాయనం చివరకు చేరబోతున్నాడు. ఇక దేహం నిలవటానికి సమయం లేదని తోస్తున్నది. బ్రాహ్మణ మహిమ నీకు శ్రీకృష్ణ భగవానుడు విశదపరుస్తా' డని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. 'ఏను గృష్ణు నెఱుంగుదు మానవేంద్ర! । యెత్తెఁ గ్రీడావరాహమై యిద్ధరిత్రి;**
**నిది యొకండును జెప్పఁగా నేల? కృష్ణు । లీలఁ గాదె భూమ్యాది భూతాలి గలిగె. 357**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర! = నరేశ్వరా!; ఏను = నేను; కృష్ణున్; ఎఱుంగుదున్; క్రీడావరాహము+ఐ = ఆటకొఱకు, వినోదం కొరకు సూకర రూపం ధరించిన వాడై; ఈ+ధరిత్రిన్ = ఈ పుడమిని; ఎత్తెన్ = సాగరగర్భం నుండి ఉద్ధరించాడు, తన కోరతో మీది కెత్తాడు; ఇది+ఒకండును = ఇదొక్కటే అని; చెప్పన్+కాన్+ఏల = చెప్పటమెందుకు?; భూమి+ఆది+భూత+ఆలి = ధరణి మొదలైన భూతముల యొక్క సమూహం; కృష్ణులీలన్ = శ్రీకృష్ణ పరమాత్మ యొక్క విలాసం చేతనే; కలిగెన్ = జన్మించింది.

**తాత్పర్యం:** 'రాజా! శ్రీకృష్ణు డెవరో నాకు బాగా తెలుసు. ఆయన వినోదం కొరకై అలవోకగా సూకరరూపం ధరించి సాగరలీన అయిన ధరను తన దంష్ట్రాగ్రం చేత మీదికెత్తాడు. ఇది ఒక్కటే కాదు; ఇట్లాంటి అద్భుత చర్య లెన్నింటినో ఆ మహానుభావుడు చేశాడు. భూమి మొదలైన భూతజాలం ఈ పురాణపురుషుడి విలాసం వలననే జనించాయి.

**వ. కృష్ణుండు. 358**

**తాత్పర్యం:** ఈ వాసుదేవుడు.

**తే. బొడ్డుతామరయం దొక్క పురుషుఁ డుద్భ । వించునట్లుగఁ జేసి తద్విరచనా ని**
**భమున నఖిలచరాచర ప్రభవ మయ్యెఁ । నరయ సామాన్యమే కృష్ణు పరమలీల? 359**

**ప్రతిపదార్థం:** బొడ్డుతామర+అందున్ = తన నాభికమలం నుండి; ఒక్కపురుషుఁడు = బ్రహ్మదేవుడు; ఉద్భవించు+అట్లుగన్+ చేసి = జన్మించేటట్లుగా చేసి; తత్+విరచనానిభమునన్ = ఆ బ్రహ్మసృష్టి అనే నెపంతో; అఖిల = సమస్తమైన; చర+ అచర+ప్రభవము+అయ్యెన్ = చేతనాచేతనముల యొక్క ఉత్పత్తి (పుట్టుక) జరిగింది; అరయన్ = ఆలోచించగా; కృష్ణు పరమలీల = శ్రీకృష్ణ పరమాత్మ యొక్క అద్భుతమైన విలాసం; సామాన్యము+ఏ? = సాధారణమైనదా? కాదని భావం.

**తాత్పర్యం:** ధర్మజా! తన నాభికమలం నుండి వాసుదేవుడే చతుర్ముఖుడిని పుట్టించాడు. బ్రహ్మసృష్టి అనే మిషతో స్థావరజంగమముల యొక్క పుట్టుక ఏర్పడింది. పరిశీలిస్తే ఇంతకూ మూలమైన శ్రీకృష్ణ లీల సామాన్యమైనది కాదు గదా!

**క. విను మెత్తఱి ధర్మంబులు । దనుజులచే బాధఁ బొందుఁ దత్సమయమునన్**
**జనియించి య ద్దురాత్ములఁ । దునుముం గృష్ణుండు ధర్మధుర్యులఁ గాచున్. 360**

**ప్రతిపదార్థం:** వినుము = రాజా! ఆలకించుము; ఏ+తఱి = ఎప్పుడు; ధర్మంబులు = ధర్మాలు; దనుజులచేన్ = రాక్షసులచేత, దుర్మార్గులచేత; బాధన్+పొందున్ = గ్లానిని పొందుతాయో; తత్+సమయమునన్ = అట్టివేళలో; జనియించి = అవతరించి; కృష్ణుండు = శ్రీకృష్ణ పరమాత్మ; ఆ+దుర్+ఆత్ములన్ = ఆ చెడు మనస్సుగలవారిని; తునుమున్ = ఖండిస్తాడు, సంహరిస్తాడు; ధర్మధుర్యులన్ = ధర్మాత్ములను; కాచున్ = రక్షిస్తాడు.

**తాత్పర్యం:** రాజా! శ్రద్ధగా వినుము. ఎప్పు డెప్పుడు ధర్మానికి గ్లాని కలుగుతుందో అప్పుడు దుర్మార్గులను నిర్మూలించటానికి శ్రీకృష్ణుడు అవతరించి ధర్మాత్ములను కాపాడుతాడు.

**విశేషం:** "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్." (భగ. 4-7)

ఎప్పుడు ధర్మానికి హాని, అధర్మానికి అభివృద్ధి కలుగుతాయో అప్పుడు నేను అవతరిస్తాను-

అనే గీతా శ్లోకానికి తిక్కన గారి అనువాదం ఎంత సుమనోమనోహరమో పాఠకులు అవలీలగా గుర్తించగలరు.

**క. శూలియునుం దాన దిశా । పాలురునుం దాన విశ్వపతియును గురుభూ**
**పాలవర! తాన కృష్ణుఁడు । కాలము దిక్కులును దాన కలఁ డఖిలములన్. 361**

**ప్రతిపదార్థం:** కురుభూపాలవర! = కురువంశ రాజులలో శ్రేష్ఠుడా!; శూలియును = శూలధరుడైన శివుడును; తాను+అ = తానే; దిశాపాలురునున్ = దిక్పాలకులునూ; తాను+అ = తానే; విశ్వపతియునున్ = జగన్నాయకుడునూ; తాను+అ = తానే; కాలమున్ = భూతభవిష్యద్వర్తమాన కాలములునూ; దిక్కులునున్ = దశ దిశలునూ; తాను+అ = తానే; అఖిలములన్ =

సమస్తవస్తువులలో; కలఁడు = ఉన్నాడు.

**తాత్పర్యం:** కురువంశరాజోత్తమా! శ్రీకృష్ణభగవానుడే పరమేశ్వరుడు. అతడే దిక్పాలక స్వరూపుడు. అతడే సర్వజగన్నాథుడు. త్రికాలములునూ, దశదిశలునూ ఆతడే. సమస్తమందును అతడే ఉన్నాడు.

**ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ; డఖిలాగ । మోక్తమంత్రతంత్ర యుక్తి నతనిఁ**
**బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర । కర్తలైన జనులు కౌరవేంద్ర! 362**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర! = కురుసార్వభౌమా!; అరయన్ = పరికించగా; కృష్ణుఁడు = శ్రీకృష్ణుడు; అధ్వర+ఆత్మకుఁడు = యజ్ఞస్వరూపుడు; అఖిల+ఆగమ+ఉక్త = సమస్త వేదాలలో చెప్పబడిన; మంత్ర తంత్ర యుక్తిన్ = మంత్ర తంత్రాలతో; అతనిన్ = ఆ సర్వేశ్వరుడిని; ప్రస్తుతించి = కొనియాడి; అధ్వరకర్తలు+ఐన జనులు = యాగాలు సల్పునట్టివారు; మేలు+పడయుదురు = శుభాలు పొందుతారు.

**తాత్పర్యం:** కురురాజా! వాసుదేవుడు యజ్ఞస్వరూపుడు. ఆ మహనీయుడిని వేదాలలో చెప్పబడిన మంత్ర తంత్రాలతో స్తుతించి యాగనిర్వాహకులు శుభాలు పొందుతారు.

**క. చయనంబుల ఋగ్వేదం । బయ మహిత సువర్ణనాముఁ డగు కృష్ణు గుణో**
**దయము వినుతించు యజ్ఞ । క్రియా నిరతులైన సురలు ప్రీతిం బొందన్. 363**

**ప్రతిపదార్థం:** యజ్ఞ క్రియా నిరతులు+ఐన = యాగకర్మలందు ఆసక్తి గలిగిన; సురలు = అమరులు; ప్రీతిన్+పొందన్ = సంతోషం చెందగా; అయమహిత సువర్ణనాముఁడు+అగు = శుభము లిడుటలో గొప్పవగు మంచి అక్షరాలతో కూడిన పేరుగల (సువర్ణుఁడు); కృష్ణ+గుణ+ఉదయమున్ = శ్రీకృష్ణుడి సద్గుణాల యొక్క అతిశయమును; ఋగ్వేదము; చయనంబులన్ = యాగవిశేషము లందు; వినుతించున్ = స్తుతిస్తుంది.

**తాత్పర్యం:** యాగకర్మలందు ఆసక్తిగల దేవతలు హర్షించగా, శుభము లిడుటలో దొడ్డదగు బంగారు నామధేయం గల శ్రీకృష్ణుడి గుణాతిశయాన్ని ఋగ్వేదం యాగవిశేషములందు కొనియాడుతుంది.

**క. విను ఋగ్వేదము కృష్ణుని । వినుతించుట యరుదె? యఖిలవేదంబులుఁ ద**
**జ్జనిత విలాసంబులు వే । దనిరూపిత వస్తువుననఁ దాన కుమారా! 364**

**ప్రతిపదార్థం:** కుమారా! = వత్సా!; విను = వినుము; ఋగ్వేదము; కృష్ణునిన్; వినుతించుట = కొనియాడటం; అరుదు+ఎ? = ఆశ్చర్యమా? కాదని భావం; అఖిలవేదంబులున్ = అన్ని వేదాలు; తత్+జనిత+విలాసంబులు = ఆ మహాత్ముడి నుండి పుట్టిన లీలలు కలవి; వేదనిరూపిత వస్తువున్+అనన్ = ఆగమములచే నిశ్చయించబడిన పదార్థమనగా; తాను+అ = తానే, ఆ శ్రీకృష్ణుడే.

**తాత్పర్యం:** వత్సా! వినుము. ఋగ్వేదం శ్రీకృష్ణుడిని శ్లాఘించటం వింత గాదు; సకల వేదాలు అతడి లీలలను వర్ణించేవే. వేదములచే నిశ్చయించబడిన పరబ్రహ్మవస్తువు ఆ శ్రీకృష్ణుడే.

**తే. అగ్నులును యజమానుఁడు నాహుతులును । యాగఫలరూపమును గృష్ణుఁ డని యెఱుంగు;**
**మిన శశాంకతారకముల నెసఁగు తేజ । ములును గృష్ణమయంబుల భూపవర్య! 365**

**ప్రతిపదార్థం:** అగ్నులును = ఆహవనీయం మున్నగు అగ్నులు; యజమానుఁడున్ = యాగం చేసేవాడు; ఆహుతులునున్ = హోమద్రవ్యాలు, హవిస్సులు; యాగఫలరూపమును = యజ్ఞఫల స్వరూపమునూ; కృష్ణుఁడు+అని; ఎఱుంగుము = గ్రహించుము; ఇన+శశ+అంక+తారకములన్ = సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అనువాటియందు; ఎసఁగు = ఒప్పునట్టి; తేజములును = కాంతులు కూడ; కృష్ణమయంబులు+అ = కృష్ణస్వరూపాలే.

**తాత్పర్యం:** రాజోత్తమా! యాగాగ్నులు, యాగకర్త, హవిస్సులు, యాగ ఫలస్వరూపమైన వాడూ శ్రీకృష్ణుడే అని గ్రహించుము. సూర్యచంద్ర నక్షత్రములందు ఒప్పుతున్న కాంతులు కృష్ణమయములే సుమా!

**క. పరమజ్యోతి యనఁగ ని । ర్జరామర పదం బనంగ సత్యం బన భూ**
**వర! యమృత మనఁగ దేవకి । వరసుతుఁడు వెలుంగు వేదవర్గము తుదలన్.' 366**

**ప్రతిపదార్థం:** భూవర! = రాజా!; పరమజ్యోతి+అనఁగన్ = పరంజ్యోతి అనగా; నిర్జర+అమర+పదంబు+అనంగన్ = అజరము, అమరము అయినస్థానము, ముసలితనం, చావు అనునవి లేని చోటు అనగా; సత్యంబు+అనన్ = సత్యమనగా; అమృతము+ అనఁగన్ = ముక్తి పథం, మోక్షస్థానం అనగా; దేవకి వరసుతుఁడు = దేవకీ దేవి యొక్క ఉత్తమపుత్రుడు; వేద వర్గముతుదలన్ = వేదాల కొసలైన ఉపనిషత్తులయందు; వెలుంగున్ = ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** పరంజ్యోతి అని, అజరము, అమరము అయిన స్థానమని, సత్యమని, మోక్షమని కొనియాడబడే దేవకీ నందనుడైన శ్రీకృష్ణ భగవానుడు వేదశిఖలైన ఉపనిషత్తులలో దీపిస్తున్నాడు.'

**క. అని యి ట్లుపదేశించిన । విని మోదము నొంది పాండువిభునగ్రసుతుం**
**డనిమిషతటినీ సుతునకు । వినతుండై నెమ్మనమున వేడ్క దలిర్పన్. 367**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; ఉపదేశించినన్ = శ్రీకృష్ణుడి ప్రభావం గూర్చి బోధించగా; విని; మోదమున్+ఒంది = సంతోషం చెంది; పాండు విభు+అగ్రసుతుండు = పాండుమహారాజుయొక్క పెద్దకొడుకైన ధర్మరాజు; అనిమిషతటినీ సుతునకున్ = దేవనది యొక్క కుమారుడైన భీష్మడికి; వినతుండు+ఐ = నమస్కరించిన వాడై; నెమ్మనమునన్ (నెఱ+మనమునన్) = నిండుమదిలో; వేడ్క = సంబరం, కుతూహలం; తలిర్పన్ = చిగురించగా. (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** అని భీష్మడు శ్రీకృష్ణుడి ప్రభావం గూర్చి బోధించగా ఆలకించి ధర్మజుడు సంతోషించి గంగానందనుడు భీష్మడికి నమస్కరించి తన మనస్సులో కుతూహలం రేకెత్తగా.

కృష్ణుడు ధర్మరాజునకు బ్రాహ్మణ ప్రభావంబు చెప్పుట. (సం.13-144-1).

**వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి 'దేవా! భూదేవ మాహాత్మ్యంబు వినవలతు నానతీయవే' యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివుని మీఁదఁ గరుణామృతమయంబగు నాలోకనం బొలయ నద్దేవుం డాదరభరితుండై యిట్లనియె. 368**

**ప్రతిపదార్థం:** కృష్ణునకున్ = వాసుదేవుడికి; ప్రణమిల్లి = నమస్కరించి; దేవా! = ప్రభూ!; భూదేవ మాహాత్మ్యంబున్ = బ్రాహ్మణుల యొక్క ప్రభావం; వినన్+వలతున్ = వినుటకు ఇష్టపడుతున్నాను; ఆనతి+ఈయవు+ఏ? = సెలవియ్యవా?; అని; వినయ సంభృతుండు+అగుచున్ = వినయముతో నిండినవాడై, వినయపూర్ణుడై; ప్రార్థించినన్ = వేడగా; ఆ+పార్థివుని మీఁదన్ = రాజగు ధర్మజునిపై; కరుణా+అమృతమయంబు+అగు = దయ అనెడు సుధారసంతో నిండిన; ఆలోకనంబు = దృష్టి,చూపు; ఒలయన్ = వ్యాపించగా, ప్రసరించగా; ఆ+దేవుండు = ఆ భగవంతుడు; ఆదరభరితుండు+ఐ = ఆదరంతో నిండినవాడై; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధర్మజుడు శ్రీకృష్ణుడికి మ్రొక్కి 'స్వామీ! బ్రాహ్మణుల గొప్పతనం వినవలెనని కుతూహలపడుతున్నాను. సెలవియ్యవలసిం' దని వినయంతో వేడుకొన్నాడు. వాసుదేవుడు ఆ రాజచంద్రుడిపై కరుణామృతంతో నిండిన చూపులు ప్రసరింప జేసి ఆదరంతో ఇట్లా అన్నాడు.

**క.** **'ననుఁ బ్రద్యుమ్నుం డివ్విధ । మున నడిగిన వాని కేను ముద మందుచు నా**
**తని హితము గోరి కుంతీ । తనయాగ్రజ! యున్నరూప తగ నిట్లంటిన్. 369**

**ప్రతిపదార్థం:** కుంతీ తనయ+అగ్రజ! = కుంతీదేవి యొక్క జ్యేష్ఠకుమారుడా!; ననున్ = నన్ను; ప్రద్యుమ్నుండు = ప్రద్యుమ్నుడు; ఈ+విధమునన్ = ఇపుడు నీ వడిగిన చందంగానే; అడిగినన్ = అడుగగా; వానికిన్ = అతడికి; ఏను = నేను; ముదము+అందుచున్ = సంతోషం చెందుతూ; ఆతనిహితము+కోరి = అతడి యొక్క మేలును ఆశించి; ఉన్న రూపు+అ = ఉన్నది ఉన్నట్లుగా; తగన్ = ఒప్పిదంగా; ఇట్లు+అంటిన్ = ఇట్లా చెప్పాను.

**తాత్పర్యం:** కౌంతేయాగ్రజా! ఇపుడు నీవడిగినట్లే ఇంతకుపూర్వం నాకుమారుడు ప్రద్యుమ్నుడు నన్ను అడిగాడు. అందుకు సంతోషిస్తూ వాని మేలు కోరి ఉన్న దున్నట్లుగా ఇట్లా చెప్పాను.

**సీ.** **వర్గత్రయము నపవర్గంబు సాధింప । నమర పితృ ప్రీతు లాచరింప**
**నైహికసుఖము లుపార్జింపవలసిన । వారికి విప్రుల చేరుగడలు;**
**దివిజులకైన నాయువు శ్రీయుఁ గీర్తియుఁ । దనరుట తత్ప్రసాదమునఁ జూవె!**
**యలిగి భస్మము సేయ వలచి పెం పొసఁగంగ । నవనీసురులు శక్తు; లట్టు లగుట**

**తే.** **వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి । యంబు సేయుచు వారు ప్రహర్ష మొందఁ**
**దనకుఁ గలభంగి నిచ్చు నతండు రెండు । భువనములయందుఁ బెంపును బొగడుఁ బడయు. 370**

**ప్రతిపదార్థం:** వర్గత్రయమున్ = ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలనూ; అపవర్గంబున్ = మోక్షమనే నాల్గవ పురుషార్థాన్నీ; సాధింపన్ = సాధించటానికి, సంపాదించటానికి; అమర = దేవతలకు; పితృ = పితృదేవతలకు; ప్రీతులు+ఆచరింపన్ = సంతోషాలు కల్గించుటకు; ఐహిక సుఖములు = ఈ లోకమందలి సుఖాలు; ఉపార్జింప = పొందుటకు; వలసిన వారికిన్ = అక్కరగల మానవులకు; విప్రులు+అ = బ్రాహ్మణులే; చేరుగడలు = ఆధారభూతులు; దివిజులకున్+ఐనన్ = వేల్పులకైననూ; ఆయువున్ = ఆయుష్యమూ; శ్రీయున్ = కలిమి, సంపదయూ; తనరుట = అతిశయించటం, లభించటం; తత్+ప్రసాదమునన్+చూవె! = బ్రాహ్మణుల అనుగ్రహం చేతనే సుమా!; అవనీసురులు = బ్రాహ్మణులు; అలిగి = కోపించి; భస్మము+చేయన్ = బూది కావించటానికి, నాశనం చెయ్యటానికి; వలచి = ఇష్టపడి; పెంపు+ఒసఁగంగన్ = వృద్ధికావించటానికి; శక్తులు = సమర్థులు, దక్షులు; అట్టులు+అగుటన్ = అందువలన; వారిన్ = బ్రాహ్మణులను; కోపింపన్+చేయక = అలుగునట్లు చెయ్యక; వారలకున్ = విప్రులకు; ప్రియంబు+చేయుచున్ = హితం సల్పుతూ, మేలు చేకూరుస్తూ; వారు = బ్రాహ్మణులు;

ప్రహర్షము+ఒందన్ = మిక్కిలి సంతోషం పొందేటట్లు; తనకున్ = తనకు; కలభంగిన్ = ఉన్నంతలో; ఇచ్చు+అతండు = దానమొనర్చేవాడు; రెండు భువనముల+అందున్ = ఉభయలోకాలలో, ఇహపరాలలో; పెంపును = అభివృద్ధిని; పొగడున్ = పొగడ్తనూ; పడయున్ = పొందుతాడు.

**తాత్పర్యం:** ధర్మార్థకామమోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలు సంపాదించటానికి, దేవతలను, పితృదేవతలను సంతృప్తులను చెయ్యటానికి, ఇహలోకసుఖాలు పొందటానికి బ్రాహ్మణులే ఆధారభూతులు. దేవతలకైనా ఆయుస్సు, యశస్సూ, సంపత్తీ వారి అనుగ్రహం వలననే కలుగుతాయి. వారు ఆగ్రహిస్తే ఎంతటివారినైనా బూడిద చెయ్యగలరు. అనుగ్రహిస్తే అభివృద్ధి కలిగించగలుగుతారు. కనుక వారికి కోపం తెప్పించక ప్రియం సల్పుతూ వారు హర్షించేటట్లు ఎవడు తన శక్తి కొలది దాన మిస్తాడో అతడు ఇహపరలోకాలలో అభివృద్ధిని, పేరు ప్రఖ్యాతులను పొందుతాడు.

దుర్వాసుఁడు కృష్ణుని మనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించిన ప్రకారము. (సం.13-144-14).

**వ. నా కనిన యాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము. స్వతంత్ర ప్రవర్తనుండగు దుర్వాసుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ, గోపించుచు, సుముఖుం డగుచు, విముఖత్వంబు నొందుచుఁ, గుడువనొల్ల ననుచుఁ, బెక్కండ్రకుం గావించిన కూడు గూర దా నొక్కరుండు భుజించుచు, సెజ్జ నిద్రించుచు' భూమి శయనించుచు, నెందేనిం బోవుచు, మరలి వచ్చుచుఁ బ్రవర్తించుచుండి యొక్కనాఁడు 'కృష్ణా! నాకుం బాయసంబు మీఁద వేడుక పుట్టెడుఁ బెట్టింపవే' యనఁ దత్క్షణంబ కావించినం గొంత కుడిచి, కొంత తన యొడలం బూయు మనినం బూసితి; నచ్చేరువ నున్న రుక్మిణిం జూచి కొంత య క్కాంతమేనం దాన పూసి రథ్యరూపంబుగా రథంబున న ప్పొలఁతిం బూన్చి రథారోహణంబు చేసి, వీథికి వెడలి, యమ్ముద్దియను ములుకోలం బొడుచుచు రథంబు నడిపింప, నాకుం గోపంబు నీర్ష్యయు నించుకయు జనింపకుండె; నేనుం జూచుచుం దోడన నడచితి; నప్పుడు యాదవు లాశ్చర్య కోపభయాయత్త చిత్తులై యనేక ప్రకారంబులం దమలోఁ బలుకుచుం జేయునది లేక కెలంకుల వచ్చుచుండ. 371**

**ప్రతిపదార్థం:** నా+కనిన = నేను చూచిన; ఆశ్చర్యంబు+చెప్పెదన్ = వింత విషయాన్ని చెప్పుతాను; ఆకర్ణింపుము = వినుము; స్వతంత్రప్రవర్తనుండు+అగు = స్వేచ్ఛగా మెలగువాడైన; దుర్వాసుండు; మనమందిరమునకున్ = మనభవనానికి; వచ్చి; మందహాసంబు చేయుచున్ = చిరునవ్వునవ్వుతూ; కోపించుచున్ = కోపపడుతూ; సుముఖుండు+అగుచున్ = అనుకూలుడుగా ఉంటూ, ప్రసన్నుడుగా ఉంటూ; విముఖత్వంబున్+ఒందుచున్ = ప్రతికూలుడుగా మారుతూ; కుడువన్+ఒల్లన్+అనుచున్= భుజించనని చెపుతూ; పెక్కండ్రకున్ = అనేకులకు, పలువురికి; కావించిన = వండిన, సిద్ధపరచిన; కూడు; కూర; తాన్ = తను; ఒక్కరుండు+అ = ఒక్కడే; భుజించుచున్; సెజ్జన్ = శయ్యపై, పడుకపై, పరుపుపై; నిద్రించుచున్; భూమిన్ = కటికనేలమీద; శయనించుచున్ = పండుకొంటూ; ఎందున్+ఏనిన్ = ఎక్కడికైననూ; పోవుచున్, మరలివచ్చుచున్; ప్రవర్తించుచున్+ ఉండి = ఈ ప్రకారం మెలగుతూ ఉన్నవాడై; ఒక్కనాడు; కృష్ణా; నాకున్; పాయసంబుమీఁదన్ = పరమాన్నం మీద; వేడుక పుట్టెడున్ = ఆసక్తి గలిగింది, అభిలాష జనించింది; పెట్టింపవు+ఏ? = తినబెట్టవా?; అనన్; తత్+క్షణంబు+అ = ఆ వెంటనే; కావించినన్ = పాయసాన్ని వండించగా; కొంత; కుడిచి = తిని, ఆరగించి; కొంత; తన+ఒడలన్ = తన శరీరం మీద, తనమేనికి; పూయుము+అనినన్ = రాయుమని చెప్పగా; పూసితిన్ = రాచినాను; ఆ+చేరువన్ = ఆ సమీపమందు; ఉన్న; రుక్మిణిన్; చూచి; కొంత; ఆ+కాంతమేనన్ = ఆమెశరీర మందు; తాను+అ = తానే (దుర్వాసుడే); పూసి = రాచి; రథ్య రూపంబుగాన్ = వాహనంగా, గుర్రంగా; రథంబునన్, ఆ+పొలఁతిన్+పూన్చి = ఆ వనితను కట్టివేసి; రథ+ఆరోహణంబు+చేసి

= తాను రథమెక్కి; వీథికిన్ = వీథులలోనికి; వెడలి = బయలుదేరి; ఆ+ముద్దియను = ఆ మెలతను, ఆ రమణిని, రుక్మిణిని; ములుకోలన్ = ములుగర్రతో; పొడుచుచున్ = పొడుస్తూ; రథంబున్, నడపింపన్ = లాగేటట్లు చేయగా; నాకున్; కోపంబున్, ఈర్ష్యయున్ = అసూయ, ద్వేషమూ; ఇంచుకయున్ = కొంచెం కూడ; జనింపక+ఉండెన్ = కలుగలేదు; నేనున్; చూచుచున్; తోడన = ఆ రథము వెంబడి; నడచితిన్ = వెళ్ళాను; అప్పుడు; యాదవులు; ఆశ్చర్యకోప+భయ+ఆయత్తచిత్తులు+ఐ = అద్భుతం, క్రోధం, భీతి, అను గుణాలకు అధీనమైన మనస్సు కలవారై; అనేక ప్రకారంబులన్ = పలు విధాల; తమలోన్ = తమ మనస్సులలో; పలుకుచున్ = దుర్వాసుడిని గురించి మాట్లాడుతూ; చేయు+అది+లేక = చేసేదేమీ లేక; కెలంకులన్ = ఆ రథానికి ఇరుప్రక్కల; వచ్చుచున్+ఉండన్ = ఆ యాదవులు వస్తూండగా.

**తాత్పర్యం:** ధర్మజా! నేను చూచిన ఒక అద్భుత విషయాన్ని చెప్పుతాను, వినుము. తన ఇష్టప్రకారం ప్రవర్తించే దుర్వాస మహర్షి ఒకసారి మన యింటికి వచ్చాడు. ఆయన ఒక సమయంలో చిరునవ్వు నవ్వుతూ ఉండేవాడు; మరొకప్పుడు కినుక వహించేవాడు. ఒకప్పుడు అనుకూలుడుగా, ఇంకొకప్పుడు ప్రతికూలుడుగా ఉండేవాడు. ఒక తడవ నేను తిండి తినను అనేవాడు. మరొకప్పుడు పలువురకు వండిన ఆహారమంతా తా నొక్కడే ఆరగించేవాడు. ఒకప్పుడు పరుపులమీద శయనించేవాడు, మరొకప్పుడు కటికనేలమీద పరుండేవాడు. చెప్పకుండ ఎక్కడికో వెళ్ళేవాడు. తిరిగి తనకు తానే వచ్చేవాడు. ఇట్లా ప్రవర్తిస్తూ ఒకరోజు ఆ మహర్షి 'కృష్ణా! నాకు పరమాన్నం మీద మనసుపడింది; పెట్టించవా' అని అడిగాడు. వెంటనే నేను పాయసం వండించాను. ఆయన అందులో కొంచెం తిని, కొంత తన ఒడలికి నన్ను పూయమన్నాడు. నేను పూశాను. ఆ చెంతనే నిలిచి ఉన్న రుక్మిణిని చూచి మహర్షి ఆమె దేహానికి తానే పాయసం పూశాడు. ఆమెను రథానికి గుర్రం మాదిరి కట్టివేసి తాను రథంలో కూర్చొని లాగుమన్నాడు. వీథులలో విహారానికి బయలుదేరాడు. రుక్మిణి రథాన్ని ఈడుస్తూ ఉంటే ములుగర్రతో చోచో అని ఆమెను పొడుస్తూ తేరిని నడిపించాడు. ఆయన ఇంత చేస్తున్నా, నేను ఇదంతా చూస్తున్నా, నాకు మౌని మీద కోపంగాని, ద్వేషంకాని కలుగలేదు. సాక్షిమాత్రుడిగా వీక్షిస్తూ రథంతో నేను నడిచాను. ఈ దృశ్యాన్ని అవలోకిస్తున్న యాదవులకు ఆశ్చర్యమూ, కోపమూ, భయమూ జనించింది. వారు తమలో తాము మహర్షిని గురించి ఏమేమో అనుకొంటూ చేసేది లేక మౌనంగా రథానికి ఇరుప్రక్కల నడిచారు.

**ఆ. రథముఁ దివిచి డస్సి రమణి మేదిని మీఁద । మ్రొగ్గ తిలఁగఁ బడిన డిగ్గ నుఱికి**
**దానిమీఁద ధూళి దాఁ జల్లి వెసఁ బాఱె । నమ్మునీశ్వరుండు యామ్యదిశకు. 372**

**ప్రతిపదార్థం:** రథమున్ = అరదమును, తేరును; తివిచి = లాగి, ఈడ్చి; డస్సి = అలసిపోయి; రమణి = రుక్మిణి; మేదిని మీఁదన్ = నేలపై; మ్రొగ్గతిలఁగన్ = ముందునకు వ్రాలి; పడఁగన్ = ధరపై కూలగా; ఆ+ముని+ఈశ్వరుండు = ఆ దుర్వాసముని శ్రేష్ఠుడు; డిగ్గన్+ఉఱికి = రథమునుండి క్రిందికి దుమికి; దాని మీఁదన్ = రుక్మిణి మీద; తాన్ = తాను; ధూళిన్+చల్లి = దుమ్ముకొట్టి; యామ్యదిశకున్ = దక్షిణ దిక్కునకు; వెసన్ = శీఘ్రంగా; పాఱెన్ = పరుగెత్తి పోయాడు.

**తాత్పర్యం:** రుక్మిణీదేవి దుర్వాసు డెక్కిన రథాన్ని ఈడ్చి అలసిపోయి ముందుకు వ్రాలి నేలమీద కూలబడింది. అపుడు మునీంద్రుడు స్యందనంనుంచి క్రిందికి దుమికి ధరణిమీద చతికిలబడి ఉన్న రుక్మిణి మీద దుమ్ము చల్లి శీఘ్రంగా దక్షిణదిశకు పరుగెత్తి వెళ్ళాడు.

**క. పాఱిన నాతని వెనుకన । పాఱితి; సంప్రార్థనా ప్రభాషణములతోఁ**
**దేఱి మరలి యమ్ముని 'మిముఁ । గాఱియ వెట్టితిఁ గదే యకట!' యనుచు దయన్. 373**

**ప్రతిపదార్థం:** పాఱినన్ = దుర్వాసు డట్లా పరుగెత్తి వెళ్ళగా; ఆతని వెనుకన = ఆ ముని యొక్క వెంబడినే; పాఱితిన్= నేనూ పరుగెత్తి వెళ్ళాను; సంప్రార్థనా ప్రభాషణములతోన్ = నా యొక్క ప్రార్థనా వాక్యాలతో, నావేడుకునే మాటలతో; తేఱి= ప్రసన్నుడై; మరలి = వెనుకకు మళ్ళి; ఆ+ముని = దుర్వాసుడు; అకట! = అయ్యో!; మిమున్ = మిమ్మల్ని; కాఱియ+పెట్టితిన్+కదే! = కష్టపెట్టానుసుమా!; అనుచున్ = అని పలుకుతూ; దయన్ = కరుణతో. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** దుర్వాసుడు ఆ విధంగా దక్షిణ దిశకు పరుగెత్తి పోగా నేను ప్రార్థనా వాక్యాలతో ఆయన వెంట పరుగెత్తి వెళ్ళాను. నేను తప్పు మన్నించుమని వేడుకొంటూ పల్కిన పల్కులకు ఆయన ప్రసన్నుడై వెనుదిరిగి 'అయ్యో! మిమ్ము బాధించాను గదా!' అని కృపతో.

**వ. నన్నుం గనుంగొని 'నీవు కోపంబు జయించితివి. నీకు వరం బిచ్చెదఁ గైకొనుము. 374**

**ప్రతిపదార్థం:** నన్నున్; కనుంగొని = చూచి; నీవు; కోపంబున్; జయించితివి = గెలిచావు; నీకున్; వరంబు; ఇచ్చెదన్; కైకొనుము = గ్రహింపుము, స్వీకరించుము.

**తాత్పర్యం:** దుర్వాసమహర్షి నన్ను చూచి 'కృష్ణా! నీవు కోపాన్ని జయించావు. నీకు వరమిస్తాను గ్రహించుము'.

**ఆ. 'ఎల్లవారుఁ దమకు నెంత గూర్తురు నీకు । నంత గూర్చి నిన్ను ననుసరించు**
**వారు గాత; లోక వంద్యుండవై యెందు । మాఱులేక యతుల మహిమ మనుము.' 375**

**ప్రతిపదార్థం:** ఎల్లవారున్ = అందరు; తమకున్ = తమకు తామంటే; ఎంత కూర్తురు = ఎంతగా ఇష్టపడతారో, తమ యందు ఎంత ప్రేమ కలిగి ఉంటారో; నీకున్ = నీకును; అంతకూర్చి = అంతగా ఇష్టపడి; నిన్నున్ = నిన్ను; అనుసరించువారు+కాతన్ = అనుసరించేవారు ఔతారు గాక!; లోకవంద్యుండవు+ఐ = లోకుల యొక్క నమస్కారాలు గైకొంటూ; ఎందున్ = ఎచ్చటను; మారులేక = అడ్డులేక, ప్రతిలేక; అతులమహిమన్ = సాటిలేని ప్రభావంతో; మనుము = జీవించుము, వర్ధిల్లుము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! సమస్త జనులు తమయందు తాము ఎంత ప్రేమ కలిగి ఉంటారో, అనగా తమకు తామంటే ఎంత ప్రియమో, అంత ప్రేమ నీ యందు కలిగి ఉండి నిన్ను అనుసరిస్తారు. నీవు జనుల యొక్క మ్రొక్కులు గైకొంటూ ఎందును ఎదురే లేక సాటిలేని మహిమతో వర్ధిల్లుదువుగాక!'

**వ. అని నిర్దేశించి మఱియు నిట్లనియె. 376**

**ప్రతిపదార్థం:** అని; నిర్దేశించి = నిర్ణయించి, నిర్ధారణ చేసి చెప్పి; మఱియున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దుర్వాస మహర్షి నిర్ణయపూర్వకంగా వచించి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'నాయంగంబుల నెల్లం । బాయస మతిభక్తిఁ బూసి పాదతలమునం**
**బూయవు గావునఁ గలుగు న । పాయం బఱకాల నీకు నవిలంఘ్యంబై. 377**

**ప్రతిపదార్థం:** నా అంగంబులన్+ఎల్లన్ = నా అన్ని అవయవములందు; అతిభక్తిన్ = మిక్కిలి భక్తితో, గాఢ ప్రేమతో; పాయసము = పరమాన్నం; పూసి = రాసి, ప్రామి, అలది; పాదతలమునన్ = అరికాలిలో, పాదము యొక్క క్రింది భాగంలో; పూయవు = నీవు పూయలేదు; కావునన్ = కాబట్టి; నీకున్ = నీకు; అజకాలన్ = పాదతలంలో; అవిలంఘ్యంబు+ఐ = దాటరానిదై; తప్పించుకొన వీలుగానిదై; అపాయంబు = కీడు, చేటు, హాని; కలుగున్ = సంభవిస్తుంది.

**తాత్పర్యం:** 'నా శరీరమం దంతట పరమభక్తితో పరమాన్నం ప్రామినావు. కాని అరికాలిలో మాత్రం పూయలేదు. కాబట్టి నీకు పాదతలంలో తప్పించుకొన శక్యంగాని హాని కలుగుతుంది.

**క. విను పరమపదప్రాప్తికి । ననుగుణమైయుండుఁ గాన యదియును నశుభం**
**బనరాదు; నీవు బ్రాహ్మణ । జనముల యెడ నడపు మిట్టి చందమ యెపుడున్.' 378**

**ప్రతిపదార్థం:** విను = శ్రీ కృష్ణా! ఆలకించుము; అదియును = నీకు పాదతలంలో కలుగబోయే కీడు; పరమ పదప్రాప్తికిన్ = నీవు శ్రీవైకుంఠం చెందటానికి, అనుగుణము+ఐ = అనుకూలమై, తగినదై; ఉండున్ = ఉంటుంది; కాన = కనుక; అశుభంబు+అనన్+రాదు = అమంగళం అని భావించకూడదు; నీవు; బ్రాహ్మణ జనముల+ఎడన్ = విప్రుల విషయంలో; ఎపుడున్ = ఎల్లప్పుడూ; ఇట్టి చందము+అ = ఈ విధంగానే; నడపుము = ప్రవర్తించవలసినది.

**తాత్పర్యం:** కృష్ణా! నా పలుకులు వినుము. పాదతలంలో నీకు కలుగనున్న ఆపద నీ వైకుంఠప్రాప్తికి అనుకూలంగానే ఉంటుంది. కనుక ఆ చేటును అమంగళమని భావించకూడదు. నీవు బ్రాహ్మణుల విషయంలో ఈ రీతిగానే భయభక్తులతో ప్రవర్తించుము.'

**వ. అని పలికి రథవహన పరిశ్రాంతయగు మీతల్లిం జూచి 'నీవు సౌందర్య సౌభాగ్యంబుల నప్రతిమానవై మాననీయత్వంబునం గృష్ణుని షోడశ సహస్రాంతఃపుర కాంతలకంటె నెక్కుడగు' మని దీవనయిచ్చి యమ్ముని యంతర్హితుం డయ్యె. 379**

**ప్రతిపదార్థం:** అని; పలికి; రథవహన పరిశ్రాంత+అగు = రథం లాగటంవలన బడలిక పొందినట్టి; మీతల్లిన్ = నీ జననిఅగు రుక్మిణిని; చూచి = కనుగొని; నీవు; సౌందర్య సౌభాగ్యంబులన్ = చక్కదనంలో, వైభవంలో; అప్రతిమానవు+ఐ = సాటిలేని దానవై; మాననీయత్వంబునన్ = గౌరవార్హతలో; కృష్ణుని = శ్రీకృష్ణుడి యొక్క; షోడశ సహస్ర+అంతఃపురకాంతలకంటెన్ = పదహారువేలమంది రాణివాసపు రమణుల కంటె; ఎక్కుడు+అగుము = అధికురాలవు కమ్ము; అని; దీవన = ఆశీర్వాదం; ఇచ్చి; ఆ+ముని; అంతర్హితుండు+అయ్యెన్ = అంతర్ధానం చెందాడు.

**తాత్పర్యం:** అని దుర్వాసుడు పలికి రథాన్ని ఈడ్చి ఈడ్చి అలసిపోయిన మీ అమ్మను జూచి 'నీవు సౌందర్యమునందు, సౌభాగ్యమునందు సాటిలేని దానవై గౌరవార్హతలో శ్రీకృష్ణుడి పదహారువేలమంది రాణులలో అగ్రేసరవై విలసిల్లు' మని ఆశీర్వదించి ఆ మునీంద్రుడు అదృశ్యుడయ్యాడు.

**ఆ. రుక్మిణియును నేను రుచిరసంపద నప్పు । డతిశయిల్లు నస్మ దంగకములఁ**
**జూచి కొనుచు మిగులఁ జోద్య మందుచుఁ బ్రియ । మెడఁద నెలకొనంగ నింటి కరిగి. 380**

**ప్రతిపదార్థం:** రుక్మిణియునున్; నేనున్; రుచిరసంపదన్ = సౌందర్య సంపత్తిచే; అప్పుడు = ఆ వేళ; అతిశయిల్లు =

ఏపారుతున్న; అస్మత్+అంగకములన్ = మా యొక్క దేహాలను; చూచి కొనుచున్ = దర్శించుకొంటూ; మిగులన్ = మిక్కిలి; చోద్యము +అందుచున్ = ఆశ్చర్యపడుతూ; ప్రియము = ప్రేమ; ఎడఁదన్ = హృదయములందు; నెలకొనంగన్ = కుదురుకొనగా, కలుగగా; ఇంటికిన్+అరిగి = గృహమునకు వెళ్ళి (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** రుక్మిణీ, నేనూ మహర్షి దీవన వలన సౌందర్య సమృద్ధితో విలసిల్లుతున్న మా శరీరాలను వీక్షించుకొంటూ, మిక్కిలి ఆశ్చర్యపడుతూ, సంతోషం హృదయములందు నిండగా ఇంటికి వెళ్ళాము.

**ఆ. అందు వస్తుచయము ముందటికంటెను । బహులమును మనోజ్ఞ భంగికంబు**
**నగుటఁ జూచి యద్భుతాయత్తచిత్తుల । మైతి; మిట్టివార లవనిసురులు. 381**

**ప్రతిపదార్థం:** అందున్ = ఇంటిలో; వస్తుచయము = వస్తువుల యొక్క సమూహం; ముందటి కంటెను = మునుపున్న వాటి కంటె; బహులమును = అధికంగానూ; మనోజ్ఞ భంగికంబున్ = మనస్సునకు ఇంపు గూర్చునట్టిదిగాను; అగుటన్+చూచి = ఉండటం కనుగొని; అద్భుత+ఆయత్త చిత్తులము+ఐతిమి = ఆశ్చర్యానికి అధీనమైన మనస్సులు కలవారమయ్యాము; అవనిసురులు = పుడమియందలి దేవతలు-బ్రాహ్మణులు; ఇట్టివారలు = ఇటువంటి మహిమకలిగిన వాళ్ళు.

**తాత్పర్యం:** ప్రద్యుమ్నా! ఇంటిలోని వస్తుసముదాయం మునుపటికంటె ఇనుమిక్కిలిగా ఉండి ఎంతో రమ్యమై కనువిందు చేసింది. వాటిని చూచి మేము ఆశ్చర్య నిమగ్న మానసులమయ్యాము.

**క. కావున వారికి భక్తుఁడ । వై వెలయు కుమార!' యనిన నతఁ డట్టిఁడయై**
**తా వెలసె; నీవు నట్టిఁడ । వై వెలయఁగ వలయుఁ గౌరవాన్వయముఖ్యా!' 382**

**ప్రతిపదార్థం:** కుమార = తనయా! ప్రద్యుమ్నా! ; కావునన్ = కనుక; వారికిన్ = భూసురులకు; భక్తుఁడవు+ఐ = భక్తుండవై; వెలయు = ప్రకాశించుము; అనినన్ = అని నేను చెప్పగా; అతఁడు = మా కుమారుడైన మన్మథుడు; అట్టిఁడు+అ+ఐ = (అట్టిఁడయై) = అట్టివాడే అయి, బ్రాహ్మణభక్తుడై; తాన్ = తాను; వెలసెన్ = వెలుగొందాడు; కౌరవ+అన్వయముఖ్యా! = కురువంశజులలో ప్రధానుడవైనవాడా! ధర్మజా! ; నీవున్ = నీవు కూడ; అట్టిడవు+ఐ = మా కుమారుడు ప్రద్యుమ్నుడి మాదిరి విప్రభక్తుడవై; వెలయఁగన్+వలయున్ = విరాజిల్లవలె సుమా!

**తాత్పర్యం:** కాబట్టి కుమారా! నీవు బ్రాహ్మణులకు భక్తుడవై ప్రకాశించాలి' అని నేను చెప్పాను. ప్రద్యుమ్నుడు నామాట చొప్పున బ్రాహ్మణులయందు భక్తి గలిగి విరాజిల్లాడు. ధర్మజా! నీవు గూడ మా కుమారుడి వలె విప్రభక్తుడవై వెలుగొందాలి.'

**వ. అని చెప్పినం బ్రముదితమానసుం డగుచు నమ్మానవనాథుండు మాధవుతో 'దుర్వాసుండు శర్వాంశ సంభవుం డని విందు; శర్వుని మహిమ విన వలతుం జెప్పవే' యనిన నప్పురుషోత్తముండు భరితాదరుండై. 383**

**ప్రతిపదార్థం:** అని; చెప్పినన్; ఆ+మానవ నాథుండు = ఆ నరేశ్వరుడు (ధర్మరాజు); ప్రముదిత మానసుండు+అగుచున్ = సంతోషించిన మనస్సు కలవాడవుతూ; మాధవుతోన్ = లక్ష్మీ వల్లభుడైన శ్రీకృష్ణుడితో; దుర్వాసుండు; శర్వ+అంశ సంభవుండు = ఈశ్వరాంశలో జన్మించినవాడు; అని; విందున్ = పెద్దలు చెప్పగా వింటున్నాను; శర్వుని మహిమన్ = పరమేశ్వరుడి ప్రభావం; వినన్+వలతున్ = వినవలెనని కోరుతున్నాను; చెప్పవు+ఏ? = ఎరిగించవా? వచింపవా?; అనినన్;

ఆ+పురుష+ఉత్తముండు = పురుషులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణదేవుడు; భరిత+ఆదరుండు = పూర్ణమైన ఆదరం కలవాడై. (ఆదరము = గౌరవము).

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు చెప్పగా నరేశ్వరుడైన ధర్మజుడు మనస్సులో ఎంతో సంతసించి శ్రీకృష్ణుడితో 'దేవా! దుర్వాసుడు ఈశ్వరాంశలో జన్మించాడని పెద్దలు చెప్పగా వింటున్నాను. పరమశివుడి మహిమలను గూర్చి వినవలెనని కుతూహలపడుతున్నాను. సెలవీయవా' అని అడిగాడు. అందుకు శ్రీకృష్ణుడు ఎంతో ఆదరబుద్ధితో. (తరువాతి పద్యంతో అన్వయం).

కృష్ణుఁడు ధర్మజునకు శివుని మహిమ చెప్పుట. (సం.13-145-3).

**ఆ. 'అడుగ వలయుదాని నడిగితి నీవు న । న్నధిప! నామనము ప్రియంబుఁ బొందె;**
**శివునిఁ దలఁచి మ్రొక్కి శివు దివ్యమహిమ సె । ప్పెద నితాంత విమల హృదయ కమల! 384**

**ప్రతిపదార్థం:** అధిప = రాజా!; అడుగన్ వలయు దానిన్ = అడుగుటకు అర్హమైన విషయమునే; నీవు; నన్నున్; అడిగితి = అడిగావు; నా మనము = నా హృదయం; ప్రియంబున్+పొందెన్ = ప్రీతి వహించింది, సంతోషం చెందింది; నితాంత= మిక్కిలి; విమల= స్వచ్ఛమైన, హృదయ కమల= హృదయమనే పద్మం కలవాడా!; శివునిన్ = మహాదేవుడిని; తలఁచి = స్మరించి; మ్రొక్కి = నమస్కరించి; శివు దివ్యమహిమన్ = పరమేశ్వరుడి యొక్క అప్రాకృతమైన ప్రభావాన్ని; చెప్పెదన్ = తెలుపుతాను.

**తాత్పర్యం:** 'ధర్మజా! నీవు నన్ను అడుగదగిన విషయమే అడిగావు. ఇందుకు నా మన సెంతో ఆనందించింది. ఆ మహాదేవుడిని ధ్యానించి నమస్కరించి ఆయన దివ్యములైన మహిమలను తెలుపుతాను. నీవు మిక్కిలి పరిశుద్ధమైన అంతఃకరణం కలవాడివి సుమా!

**వ. ఏకాగ్రచిత్తుండవై యాకర్ణింపు' మని ధర్మజున కిట్లనియె. 385**

**ప్రతిపదార్థం:** ఏక+అగ్రచిత్తుండవు+ఐ = నిశ్చలమైన మనస్సుకలవాడవై; ఆకర్ణింపుము = వినుము; అని; ధర్మజునకున్; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** ధర్మజా! నిశ్చల బుద్ధితో నే చెప్పునది విను' మని శ్రీకృష్ణుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**క. 'శతరుద్రీయము నే నరుఁ । డతిభక్తిని శివుని మనమునందు నిలిపి యం**
**చితముగఁ బఠించు సులభం । బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా!' 386**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా! = మనుజవల్లభా!; ఏ నరుఁడు = ఏ మనుజుడు; శతరుద్రీయమున్ = యజుర్వేదాంతర్గతమైన నమకం అనే మంత్రభాగాన్ని; అతిభక్తిని = మిక్కిలి భక్తితో; శివునిన్ = శంకరుడిని; మనము+అందున్ = హృదయంలో; నిలిపి = నిలుపుకొని, నెలకొల్పి; అంచితముగన్ = ఒప్పిదంగా, యోగ్యంగా; పఠించున్ = చదువునో; అతనికిన్ = ఆ శత రుద్రీయపఠితకు; ఇందున్ = ఈ లోకంలో; అందున్ = పరలోకంలో; సర్వంబున్ = సమస్తమూ; సులభంబు = తేలిక (తేలికగా లభిస్తుంది).

**తాత్పర్యం:** 'ధర్మజా! ఏ మానవుడు పరమభక్తితో పరమేశ్వరుడిని హృదయంలో నిలుపుకొని శతరుద్రీయాన్ని

(నమకాన్ని) ఒప్పిదంగా పఠిస్తాడో ఆ మనుజుడికి ఇహలోకంలో, పరలోకంలో సమస్త సుఖాలు సులభంగా లభిస్తాయి.'

**వ. అని వెండియు. 387**

**తాత్పర్యం:** అని మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'అమరు మహాదేవుఁడను పేరు శివునకు; । నప్పరమునకు మీఁ దరయ లేదు**
**తత్కోపదృక్కీల ధర్మవిరుద్ధపు । జాతుల నెల్లను సమయఁ జేయు**
**దేవతల్ మునులు నతి ప్రయత్నంబునఁ । గావించు దక్షయాగమున శివుని**
**మఱచిన నయ్యజ్ఞ మఱవఱలై పోదె? । భగనేత్రనాశ మాదిగ ననేక**

**తే. భంగములు రావె? వారి కా ప్రభువు చేత; । శరణు వేఁడిన గావఁడే? కరుణ నట్టి**
**వారి; నీశు పెం పేమన వచ్చు! మఱియు । వినుము తద్దివ్యలీలలు మనుజనాథ! 388**

**ప్రతిపదార్థం:** మనుజనాథ! = భూపతీ!; శివునకున్ = ఈశ్వరుడికి; మహాదేవుఁడు+అను = మహాదేవుడనే; పేరు = నామం; అమరున్ = ఒప్పుతుంది; తగి ఉన్నది; ఆ+పరమునకున్ = ఆ శ్రేష్ఠుడికంటె; మీఁదు = మించిన వస్తువు; అరయన్ = విచారించగా; లేదు = కలుగదు; తత్+కోపదృక్+కీల = ఆ రుద్రుడి యొక్క కోపపు చూపులనే నిప్పుమంట; ధర్మవిరుద్ధము+ జాతులన్+ఎల్లనున్ = ధర్మమునకు వ్యతిరేకమైన తెగలనన్నింటినీ, వేద విహితమైన ఆచారానికి వ్యతిరిక్తములైన అన్ని జాతులనూ; సమయన్+చేయున్ = నాశనం చేస్తుంది; దేవతల్; మునులు; అతిప్రయత్నంబునన్ = మిక్కిలిపూనికతో; కావించు = సలుపుతున్న; దక్షయాగమునన్ = దక్షప్రజాపతి యొక్క యజ్ఞంలో; శివునిన్ = శంకరుడిని; మఱచినన్ = విస్మరించగా, ఆహ్వానించనందున; ఆ+యజ్ఞము = ఆ క్రతువు, అధ్వరము; అఱవఱలు+ఐ+పోదు+ఎ? = భగ్నంకాలేదా? విధ్వంసమై పోయింది గదా!; వారికిన్ = దక్షయజ్ఞంలో పాల్గొన్న వారికి; ఆ ప్రభువుచేతన్ = ఆ జగత్పతి మూలాన; భగనేత్రనాశము = సూర్యుడి కన్ను పోవటం; ఆదిగన్ = మొదలుగా; అనేక భంగములు రావె? = పలువిధములైన అవమానాలు, భయాలు కలుగవా? కలిగినవని తాత్పర్యం; శరణు వేఁడినన్ = కాపాడుమని అర్థించగా; అట్టివారిన్ = అట్లా శరణు జొచ్చినవారిని; కరుణన్ = దయతో; కావఁడు+ఏ? = రక్షించలేదా? రక్షించాడని భావం; ఈశుపెంపు = పరమేశ్వరుని ప్రాభవం, ఆధిక్యం, గొప్పతనం; ఏమి+అనన్+వచ్చున్? = ఎంతని పొగడ గలం?; మఱియున్ = ఇంకను; తత్+దివ్యలీలలు = ఆ మహాదేవుడి యొక్క పరమాద్భుత చర్యలు; వినుము = ఆకర్ణించుము.

**తాత్పర్యం:** 'కుంతీనందనా! శివుడికి మహాదేవుడనే పేరు ఎంతో తగి ఉన్నది. ఆయనకు పై వాడెవ్వడూ లేడు. అత డనీశుడు. ఆ రుద్రుడి యొక్క కినుక గదిరిన చూపు మంటలతో వేద ధర్మానికి విరుద్ధ ప్రవర్తన గల జాతులన్నీ దగ్ధమయిపోతాయి. ఈశ్వర విరహితంగా దేవతలు, మునులు మిక్కిలి పూనికతో నిర్వర్తించే దక్షుడి యజ్ఞం ధ్వంసం కాలేదా? ఈశ్వరుడు ఆగ్రహించటంవలననే సూర్యుడికి కనులు పోవుట మున్నగు అనర్థాలు ఆ క్రతువులో పాల్గొన్నవారికి కలుగలేదా? ప్రభూ! మమ్ము రక్షించుమని శరణు వేడిన వారిని ఆయన కరుణతో కాపాడలేదా? అట్టి పరమేశ్వరుడి మహిమ వర్ణించటానికి శక్యం కాదు. ఆ మహా దేవుడి దివ్య లీలలు ఇంకా వినుము.

**సీ.** **ప్రబలదైత్యులు పురత్రయనాయకులు జగ । త్త్రయము నప్రతిమ ప్రతాప లీల**
**బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి । 'కావుము కృప దేవదేవ! మమ్ముఁ**
**బశువుల మగు వారిఁ బశుపతి వైన నీ' । వనుచు మహాక్రోశ మాచరింప**
**నప్పురంబులు మూఁటి నస్త్ర మొక్కటన భ । స్మము గాఁగఁ జేసి యమ్మార్గణంబు**

**తే.** **నంకమున నిడ నది బాలుఁ డైన 'నీతఁ । డెవ్వఁ?' డని చూచి వెఱఁగంది యెల్లసురలు**
**వినుతిసేయ బ్రాహ్మణమూర్తి వెలుఁగు నతని । కిడియె దుర్వాసుఁ డనునామ మీశ్వరుండు.** **389**

**ప్రతిపదార్థం:** ప్రబలదైత్యులు = మిక్కిలి బలవంతులైన రక్కసులు; పురత్రయనాయకులు = ఇనుము, వెండి, బంగారం అనే లోహాలతో నిర్మించబడిన మూడు పట్టణాలకు అధిపతులు అయినట్టివారు; జగత్+త్రయమున్ = స్వర్గ మర్త్య పాతాళలోకాలను; అప్రతిమ = సాటిలేని; ప్రతాపలీలన్ = శౌర్యము యొక్క విలాసంతో; బాధింపన్ = పీడించగా; దివిజులు = దేవతలు; ఫాలలోచనున్ = నుదుట కన్ను గల శంకరుడిని; కాంచి = దర్శించి; దేవదేవ! = దేవతలకు అధీశ్వరుడవైన మహేశా!; పశువులము+అగు వారిన్+మమ్మున్ = పశువులుగా ఉన్నట్టి మమ్ములను; పశుపతివి+ఐన+నీవు = పశువులకు పాలకుడవుగా ఉన్న నీవు; కృపన్ = కారుణ్యంతో; కావుము = కాపాడుము; అనుచున్ = అని; మహా+ఆక్రోశము+ఆచరింపన్ = మిక్కిలి వాపోవగా; ఆ+పురంబులు మూఁటిన్ = ఆ త్రిపురాలను; అస్త్రము+ఒక్కటన = ఒక్కమంత్రపూతమైన సాయకంతో; భస్మము+ కాఁగన్+చేసి = బూడిద అగునట్లొనరించి; ఆ+మార్గణంబున్ = ఆ బాణమును; అంకమునన్+ఇడన్ = తన తొడమీద ఉంచుకొనగా; అది = ఆ శరము; బాలుఁడు+ఐనన్ = బాలుడు కాగా; ఈతఁడు+ఎవ్వఁడు+అని = ఈ పసివా డెవడని; చూచి = కనుగొని; వెఱఁగు+అంది = విస్మయపడి; ఎల్లసురలు = అమరులందరూ; వినుతి+చేయన్ = స్తుతించగా, పొగడగా; బ్రాహ్మణమూర్తిన్ = విప్రస్వరూపంతో; వెలుఁగు = ప్రకాశిస్తున్న; అతనికిన్ = ఆ బాలకుడికి; ఈశ్వరుండు = ఉమాపతి; దుర్వాసుఁడు+అనునామము = దుర్వాసుడనే పేరు; ఇడియెన్ = ఒసగినాడు.

**తాత్పర్యం:** మిక్కిలి బలవంతులైన త్రిపురాసురులు తమ సాటిలేని బలపరాక్రమాలతో ముల్లోకాలను బాధించసాగారు. అప్పుడు వేల్పులు ముక్కంటిని దర్శించి 'దేవాదిదేవా! మేము పశువులము. మమ్మ పాలించేవాడవు గనుక నీవు పశుపతివి. కనుక కరుణతో మమ్మ కాపాడు' మని బిగ్గరగా మొరపెట్టుకొన్నారు. అంతట మహేశుడు ఆ త్రిపురములను ఒక్క అస్త్రప్రయోగంతో భస్మం చేసి ఆ బాణాన్ని తన తొడపై నిడు కొన్నాడు. ఆ బాణం ఒక బాలుడు కాగా ఇత డెవ్వడని చూచి ఆశ్చర్యచకితులై వేల్పులు వినుతించారు. విప్రరూపంతో వెలుగొందే ఆ బాలుడికి అపుడు శివుడు దుర్వాసుడని నామకరణం చేశాడు.

**తే.** **అతఁడు సూవె మాయింటికి నరుగుదెంచి । యంత సేసినాఁ' డనవుడు నచ్చెరువును**
**భక్తియును మదిఁ బిరిగొనఁ బాండు నగ్ర । సుతుఁడు నిభృతిమై దేవకిసుతునితోడ.** **390**

**ప్రతిపదార్థం:** అతఁడు+చూవె = ఆ దుర్వాసుడేసుమా; మా+ఇంటికిన్ = మా గృహానికి; అరుగుదెంచి = వచ్చి; అంత+ చేసినాఁడు = కొనియాడ తరముగాని మహాద్భుతములు సలిపాడు; అనవుడున్ = అని మాధవుడు పల్కగా; అచ్చెరువును = ఆశ్చర్యమూ; భక్తియును = భక్తియూ; మదిన్ = హృదయంలో; పిరిగొనన్ = అతిశయించగా; పాండు+అగ్రసుతుఁడు = పాండుమహారాజు పెద్దకొడుకు; నిభృతిమైన్ = అణకువతో, వినయంతో; దేవకిసుతుని తోడన్ = దేవకీదేవి నందనుడైన కేశవుడితో (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఆ దుర్వాసుడే మా గృహానికి వచ్చి అన్ని అద్భుత చేష్టితములు కావించాడు' అని వాసుదేవు డన్నాడు. ధర్మజుడు ఆశ్చర్య మొకవంక, భక్తి మరొకవంక తన మనసులో మల్లడి గొనగా వినయంతో దేవకీ తనయుడితో.

**క. 'శివముఖ్యనామములు ప్ర । స్తవనకృతిన్ భోగమోక్షదము లగు నని విం**
**దు విమలబోధ! యెఱింగిం । పవె వాని నిరుక్తి' ననినఁ బరమప్రీతిన్. 391**

**ప్రతిపదార్థం:** విమలబోధ! = నిర్మలమైన జ్ఞానం కలవాడా!; శివముఖ్యనామములు = శివుని యొక్క ప్రసిద్ధములైన పేళ్ళు; ప్రస్తవనకృతిన్ = స్తోత్ర మొనర్చుటచేత; భోగ మోక్షదములు+అగునని = సౌఖ్యమును, ముక్తిని ప్రసాదిస్తాయని; విందున్ = పెద్దలు చెప్పగా వింటున్నాను; వాని నిరుక్తిన్ = ఆ నామముల యొక్క అర్థాన్ని; ఎఱింగింపవు+ఎ? = తెలుపవా?; అనినన్ = అని యుధిష్ఠిరుడు వేడగా; పరమప్రీతిన్ = మిక్కిలి హర్షంతో (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** 'పరమేశ్వరుడి ప్రసిద్ధనామాలు స్తోత్రం చేస్తే ఇహపరసుఖాలు కలుగుతాయని విన్నాను. విమలవిజ్ఞాన స్వరూపుడవైన నీవు ఆ పరమశివుడి నామాలను అర్థసహితంగా నా కెరిగింపు' మని ధర్మజుడు వేడగా మిక్కిలి సంతోషించి.

**వ. అతం డిట్లనియె. 392**

**తాత్పర్యం:** నారాయణుడు ఈ విధంగా పలికాడు.

**క. 'శివదేవు ముట్టఁ గొల్వఁగ । నవనీశ్వర! యతని పేళ్ళ యర్థ మెఱిఁగి సం**
**స్తవనకృతిఁ గూర్ప నాకై । న విధాతకు నైన నరిది నామదిఁ జూడన్. 393**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ్వర! = భూపాలా!; శివదేవున్ = భగవంతుడైన శివుడిని; ముట్టఁగొల్వఁగన్ = సంపూర్ణంగా సేవించటానికి; అతని పేళ్ళ+అర్థము = ఆ శివనామముల యొక్క అర్థం; ఎఱిఁగి = తెలిసి; సంస్తవన కృతిన్+కూర్పన్ = స్తోత్రకార్యం కావించటం; నామదిన్+చూడన్ = నామనసులో తలపోయగా; నాకున్+ఐనన్ = నాకు గాని; విధాతకున్+ఐనన్ = బ్రహ్మకుగాని; అరిది = అశక్యం.

**తాత్పర్యం:** 'ధర్మజా! పరమేశ్వరుడిని పరిపూర్ణంగా భజించటం, ఆయన నామాలకు అర్థ మెఱిగి స్తోత్రం సల్పటం పరికించగా నాకు గాని, బ్రహ్మకు గాని శక్యం కాదు.

**వ. అయినను. 394**

**తాత్పర్యం:** శక్యం కానప్పటికినీ.

**క. నీవిట్లు నన్ను నడిగితి । గావున నా యెఱిఁగి నట్టి గతిఁ జెప్పెద న**
**ద్దేవాది దేవు వర నా । మావలి విను మచలమైన యవధానముతోన్. 395**

**ప్రతిపదార్థం:** నీవు; ఇట్లు; నన్నున్; అడిగితి = చెప్పుమని అడిగావు; కావునన్; నా+ఎఱిఁగిన+అట్టి+గతిన్ = నేను తెలిసికొన్న విధంగా; ఆ దేవ+ఆదిదేవు = దేవతలకే మొదటి దేవుడైన శంభుడి యొక్క; వర = శ్రేష్ఠములైన; నామ+ఆవలిన్ = పేళ్ళ యొక్క సమూహమును; అచలము+ఐన = చలించనట్టి, స్థిరమైన; అవధానముతోన్ = ఏకాగ్రచిత్తంతో; వినుము = ఆలకించుము.

**తాత్పర్యం:** నరేశ్వరా! నీవు శంభుడి నామాలు, వాటి అర్థాలు తెల్పుమని నన్ను కోరితివి కనుక నా తెలిసినంతలో ఆ దేవదేవుడి యొక్క ఉత్తమనామావళి వినిపిస్తాను. స్థిరమైన చిత్తంతో శ్రద్ధగా ఆలకించుము.

ఆ. **అగ్ని వాయు వాస వాదిత్య వసు మరు । దాదిదేవతా మయాత్ముఁ డైన**
**శివుని మహిమఁ బ్రీతిఁ జెప్పుట వినుట స । ర్వార్థసాధకంబు లగు నృపాల!** **396**

**ప్రతిపదార్థం:** అగ్ని = అగ్నిదేవుఁడు; వాయు = వాయుదేవుడు; వాసవ = దేవేంద్రుడు; ఆదిత్య = ద్వాదశాదిత్యులు; వసు = అష్టవసువులు; మరుత్ = సప్తమారుతములు; ఆది = మొదలుగాగల; దేవమయ+ఆత్ముఁడు+ఐన = దేవతాస్వరూపి అయిన; శివుని మహిమన్ = పరమేశ్వరుడి ప్రభావమును, విభూతులను; ప్రీతిన్ = సంతోషంతో; చెప్పుట = నుడువటం; వినుట = ఆకర్ణించటం; సర్వ+అర్థసాధకంబులు+అగున్ = సమస్తప్రయోజనాలను సమకూర్చునట్టివి కాగలవు.

**తాత్పర్యం:** ధర్మజా! అనలుడు, అనిలుడు, ఇంద్రుడు, ఆదిత్యులు, వసువులు, మరుత్తులు మున్నుగా గల సర్వదేవతా స్వరూపుడైన శివదేవుడి మాహాత్మ్యమును ప్రీతితో చెప్పుట గాని, వినుట గాని సకలాభీష్టములను సిద్ధింప జేస్తుంది.

కృష్ణుఁడు ధర్మజునకు శివనామ నిర్వచనంబు చెప్పుట. (సం.13-266-1 (కుంభ)).

క. **వినుము నరేంద్ర! మహత్త్వం । బున నుండను నీశ్వరత్వమున నఖిల మహా**
**ముని జనములును మహేశ్వరుఁ । డని కొనియాడ హరుఁ డొప్పు నప్రతిముండై.** **397**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర! = రాజా!; వినుము; మహత్త్వంబునన్ = గొప్పతనంతో; ఈశ్వరత్వమునన్ = ఐశ్వర్యంతో; ఉండను = ఉండటంచేత; అఖిల = సమస్తమైన; మహాముని జనములును = గొప్పమునీశ్వరులు; మహా+ఈశ్వరుఁడు+అని = మహేశ్వరు డంటూ; కొనియాడన్ = వినుతించగా, పొగడగా; అప్రతిముండు+ఐ = తన కెందును సాటిలేనివాడై; హరుఁడు = శివుడు; ఒప్పున్ = విలసిల్లుతున్నాడు.

**తాత్పర్యం:** రాజేంద్రా! వినుము. గొప్పతనంతో, ఐశ్వర్యంతో విరాజిల్లేవాడు కనుక సకల మునీంద్రులు ఆయనను మహేశ్వరుడని కొనియాడుతుండగా సాటిలేనివాడై సాంబశివుడు ప్రకాశిస్తున్నాడు.

సీ. **ఉగ్రత్వమునఁ బ్రతాపోన్నతి రుద్రనా । మము దాల్చె; దేవసంఘమున కెల్ల**
**మహతినాఁ బొలుపారు మహనీయ దేవత । గావున విను మహాదేవుఁ డయ్యె;**
**నఖిలసత్కర్మ ఫలాకారశుభములు । సేయు వేడుక కల్మి శివుఁ డనంగఁ**
**జనియె; సుస్థిరతేజమున వెలుఁ గొందుట । నంచిత స్థాణు సమాఖ్యఁ బరఁగె;**

తే. **జంగమస్థావరాత్మక సకలభూత । రూపబహుత నొందుట బహురూపనామ**
**ధేయుఁడై యొప్పె; ధూమ్రపుఁజాయ జటల । వలన ధూర్జటి యనుపేర వఱలె హరుఁడు.** **398**

**ప్రతిపదార్థం:** విను = ధర్మజా! వినుము; హరుఁడు = శంభుడు; ఉగ్రత్వమునన్ = భయంకరత్వం చేతనూ; ప్రతాప+ఉన్నతిన్ = పరాక్రమౌన్నత్యం చేతనూ; రుద్రనామమున్+తాల్చెన్ = రుద్రుడను పేరు వహించాడు; దేవసంఘమునకున్+ఎల్లన్ =

దేవతాసమాజాని కంతటికీ; మహతినాన్ = మహతి అనేపేరుతో (దొడ్డవాడనగా); పొలుపు+ఆరు = ప్రకాశించే, ఒప్పారే; మహనీయ దేవతకావునన్ = గొప్ప వేల్పుగనుక; మహాదేవుఁడు+అయ్యెన్ = మహాదేవుడు అనే పేరు ధరించాడు; అఖిలసత్కర్మఫల+ఆకార = అన్ని మంచిపనులకు ఫలస్వరూపములైన; శుభములు = మంగళములు; చేయువేడుక కల్మిన్ = ఒనర్చునట్టి ఉబలాటం కలవాడు గనుక; శివుఁడు+అనఁగన్+చనియెన్ = శివుడనే పేరుతో ఒప్పుతున్నాడు; సుస్థిరతేజమునన్ = మిక్కిలి శాశ్వతమైన కాంతితో; వెలుఁగు+ఒందుటన్ = ప్రకాశిస్తూండటంచేత; అంచితస్థాణుసమాఖ్యన్ = ఒప్పిదమైన స్థాణుడనే నామధేయంతో; పరఁగెన్ = విలసిల్లినాడు; జంగమస్థావర+ఆత్మక = చరాచరాత్మకమైన, చేతనములు, అచేతనములు అనునట్టి; సకల భూత = సమస్త ప్రాణులయొక్క; రూపబహుతన్ = ఆకారబాహుళ్యమును, అనేక రూపాలను; ఒందుటన్ = పొందుటచే; బహురూపనామధేయుఁడు+ఐ = బహురూపుడు అనే పేరు గలిగిన వాడై; ఒప్పెన్ = విరాజితుడైనాడు; ధూమ్రపుఁజాయజటల వలనన్ (ధూమ్రము+చాయ = ధూమ్రపున్+చాయ = ధూమ్రపుఁజాయ) = నలుపుకలిసిన ఎరుపు వన్నె జడలు ధరించిన వాడగుట వలన; ధూర్జటి+అనుపేరన్ = ధూర్జటి అనే ఆహ్వాయంతో; వఱలెన్ = ఒప్పినాడు.

**తాత్పర్యం:** భీకరత్వం చేతను, పరాక్రమం చేతనూ హరునకు రుద్రుడనే పేరు వచ్చింది. దేవ సమాజమందు దొడ్డవేల్పు కనుక మహాదేవు డయినాడు. సమస్త సత్కర్మములకు ఫలరూపములైన శుభాలను ప్రసాదించే కుతూహలం కలవాడు కనుక శివుడనే పేరు ధరించాడు. సుస్థిర మైన కాంతితో దీపిస్తున్నాడు కనుక ఈయనకు స్థాణుడనే నామం ఏర్పడింది. కదిలేవి, కదలనివి అయిన సకలప్రాణుల యొక్క స్వరూపములు తాల్చుటచే బహురూపుడనే పేరుతో పెంపొరుతున్నాడు. పొగవన్నె జటాజూటం ధరించిన వాడు గనుక ధూర్జటి అనే నామంతో విరాజిల్లుతున్నాడు.

**ఆ. వినుము విశ్వు లనఁగఁ జను దేవతలు దన । యంద పొడమి; రట్టు లగుట విశ్వ**
**రూపనామకమున దీపితుం డయ్యె నా । త్రిపురమర్దనుండు నృపవరేణ్య! 399**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్యా = రాజోత్తమా!; వినుము = ఆకర్ణించుము; ఆ త్రిపురమర్దనుండు = త్రిపురాసురులను సంహరించిన పరమేశ్వరుడు; విశ్వులు+అనఁగన్+చను = విశ్వులు అనే పేరుతో ఒప్పుతున్న; దేవతలు = వేల్పులు; తనయందున్+అ = తనయందే; పొడమిరి = జన్మించారు; అట్టులు+అగుటన్ = అందువలన; విశ్వరూప నామకమునన్ = విశ్వరూపుడు అనే నామధేయంతో; దీపితుండు+అయ్యెన్ = ప్రకాశించాడు.

**తాత్పర్యం:** త్రిపురాసురులను సంహరించిన ఆ గౌరీపతి యొక్క దేహం నుంచి విశ్వు లనే దేవతలు జన్మించారు కనుక ఆయన విశ్వరూపుడు అనే పేరుతో విలసిల్లుతున్నాడు.

**సీ. బహునేత్రములు మేనఁ బ్రజ్వరిల్లుట సర్వ । తశ్చక్షు రాహ్వయోదాత్త కీర్తిఁ**
**బరఁగు; భూతము లెల్లఁ బశువులు దాఁ బతి । గావునఁ బశుపతి నా వెలుంగు;**
**వృషభస్థుఁడై యున్కి వృషవాహనుఁడు; మృత్యు । వనఁ జనుఁ బ్రాణ పాలాఖ్య సమత**
**నొంది; వహించు వేదోక్తాభిధానముల్ । మఱియుఁ బెక్కులు; వాని మహిమ వేద**

**ఆ. వేత్త లైనవారు వివరించి యన్యోన్య । బోధకత్వమునఁ బ్రభూత సౌఖ్య**
**లగుచు సంతతము శివారామతా నిరూ । ఢాత్ములై చరింతు రధిపముఖ్య! 400**

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య! = రాజులలో ఉత్తముడా!; బహునేత్రములు = అనేక నయనాలు, పెక్కు కన్నులు; మేనన్ = శరీరమందు; ప్రజ్వరిల్లుటన్ = వెలుగొందటం చేత; సర్వతః+చక్షుః+ఆహ్వాయ+ఉదాత్తకీర్తిన్ = అంతటా కన్నులు గలవాడు అనే గొప్పయశస్సుతో; పరఁగున్ = ఒప్పుతున్నాడు; భూతములు+ఎల్లన్ = జీవులందరూ; పశువులు = జంతువులు, మృగాలు; తాన్ = అతడు; పతి+కావునన్ = ఆ జీవు లందరికి నాథుడు గనుక; పశుపతి నాన్ = పశుపతి అనే ఆహ్వాయంతో; వెలుంగున్ = ప్రకాశిస్తున్నాడు; వృషభస్థుఁడు+ఐ+ఉన్కిన్ = ఎద్దు మీద ఉండటం చేత; వృషవాహనుఁడు = నందివాహనుడు అని శంభునకు మరొక్క పేరు; మృత్యువు+అనన్+చనున్ = అతడు ప్రాణిదేహాలలో విషమస్థుడైనప్పుడు జీవులపాలిటికి మృత్యువు అని చెప్పదగి ఉన్నాడు; సమతన్+ఒంది = సమస్థితిని పొంది; ప్రాణపాల+ఆఖ్యన్+వహించున్ = ప్రాణపాలుడు (ప్రాణాలను కాపాడేవాడు) అనే నామం ధరిస్తున్నాడు. మఱియున్ = ఇంకనూ; వేద+ఉక్త+అభిధానముల్ = శ్రుతులందు చెప్పబడిన పేళ్ళు; పెక్కులు = అనేకములు ఆయనకు ఉన్నాయి; వాని మహిమన్ = ఆ నామముల యొక్క మాహాత్మ్యమును (ఆ చంద్రశేఖరుడి ప్రభావాన్ని); వేద వేత్తలు+ఐనవారు = వేదార్థము లెరింగినవారు; వివరించి = తేటపరచి; అన్యః+అన్య+బోధకత్వమునన్ = ఒకరి కొకరు ఉపదేశించుకొంటూ, తెలియ జెప్పుకొనుచూ; ప్రభూత సౌఖ్యులు+అగుచున్ = అధికమైన సుఖం కలవా రవుతూ, మిక్కిలి సుఖవంతు లవుతూ; సంతతము = ఎల్లప్పుడు; శివ+ఆరామతా+నిరూఢ+ఆత్ములు+ఐ = శివుడి యందు క్రీడించుటచే ఎన్నెకెక్కిన మనసు గలవా రవుతూ; చరింతురు = మెలగుతుంటారు, వర్తిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** ధర్మజా! అనేక నయనాలు తన దేహంలో కలిగి వెలుగొందటం చేత పరమేశ్వరుడికి 'సర్వతశ్చక్షువు' అనే నామధేయం ఏర్పడింది. జీవు లెల్లరూ పశువులు. తాను ఆ పశువులకు పాలకుడు. కనుక ఆయనకు పశుపతి అనే నామం కలిగింది. నందినెక్కి సంచరించటం చేత అతడు వృషభవాహనుడు అనే పేరు పొందాడు. జీవుల ప్రాణాలు హరించేవాడూ, వారి ప్రాణాలను కాపాడేవాడూ అతడే. ఆగమాలలో ఆ మహనీయుడికి అనేక నామా లున్నవి. వాటి మహిమ వేదవేత్తలైన మహానుభావులు వివరంగా పరస్పరం బోధించుకొంటూ, పరమానందభరితు లవుతూ నిరంతరం శివుడియందే లగ్నమైన పావన మనస్సులతో సంచరిస్తూ ఉంటారు.

**విశేషం:** భగవద్భక్తు లెట్లా మనుగడ సాగిస్తారో శ్రీమద్భగవద్గీత వెల్లడిస్తుంది.

> "మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయన్తః పరస్పరమ్,
> కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ." (భగ. 10-9)

నా భక్తులు నాయందే తమ మనసులను లగ్నం చేసి నన్ను వదలి బ్రతుకలేని వారై తాము అనుభవించిన నా కల్యాణగుణాలను, నా అవతార దివ్య చేష్టితాలను నిత్యం ఒకరి కొకరు బోధించుకొంటూ ఆనందిస్తుంటారు- అని.

**క. ఈ నామనిర్వచనములు । మానవుఁడు పఠించినను సమాహితమతియై**
**వీనుల నించిన సౌఖ్యము । నానందము నిందు నందు నతనికిఁ గల్గున్.' 401**

**ప్రతిపదార్థం:** ఈ నామనిర్వచనములు = ఈ శివనామముల యొక్క అర్థవివరణాలు; మానవుఁడు = నరుఁడు; పఠించినను = చదివినా; సమాహితమతి+ఐ = ఏకాగ్రచిత్తుడై, నిశ్చలమైన మనస్సు గలవాడై; వీనులన్ = చెవులలో; నించినన్ = నిండించినా, ప్రవేశింపజేసినా; సౌఖ్యమున్ = సుఖమునూ; ఆనందమున్ = సంతోషమునూ; ఇందున్ = ఈ లోకంలో; అందున్ = పరలోకంలో అనగా ఇక్కడా అక్కడా; అతనికిన్ = ఆ నరుడికి; కల్గున్ = లభిస్తుంది.

**తాత్పర్యం:** అర్థమననంతో పరమేశ్వరుడి నామాలు పఠించినా, ఏకాగ్రచిత్తంతో ఆకర్ణించినా ఆ మానవుడికి

ఇహపరలోకాలలో సుఖం, సంతోషం సమకూరుతాయి.

**వ. అని చెప్పి మఱియును. 402**

**తాత్పర్యం:** అని పలికి మరల (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'వ్యాసమహాముని లోక హి । తాసక్తిని శివుని విషయమై పఠ్యముగాఁ**
**జేసె నుపస్థాన మొకటి । యా సమధిక పుణ్యవాక్చయము విను మధిపా! 403**

**ప్రతిపదార్థం:** అధిపా! = రాజా!; వ్యాస మహాముని = శ్రీ వేద వ్యాసమహర్షి; లోకహిత+ఆసక్తిని = జగములకు మేలు చేయవలెనన్న అభిలాషతో; శివుని విషయము+ఐ = ఈశ్వరుడికి సంబంధించి; పఠ్యముగాన్ = పఠించ దగినదిగా; ఉపస్థానము +ఒకటి+చేసెన్ = దరిజేర్చుస్తోత్ర మొకటి కావించాడు; ఆ సమధిక పుణ్యవాక్చయము = ఆ గొప్ప పవిత్ర వాక్కుల సముదాయం; వినుము = ఆలకించుము.

**తాత్పర్యం:** శ్రీ వేద వ్యాస మహర్షి లోకానికి మేలు గావించవలె నన్న ఆకాంక్షతో పరమ శివునకు సంబంధించి పఠించ దగిన ఒక గొప్ప స్తోత్రం రచించాడు. మిక్కిలి గొప్పవైన ఆ పవిత్ర వచనాలు వినిపిస్తాను. శ్రద్ధగా వినుము.

**సీ. సర్వజగన్నిత్యసాక్షి లోకైక శు । భావహమూర్తి నిరామయుండు**
**ప్రథమ భూతములకుఁ బ్రథమతమంబు ను । దాత్తంబు నయిన భూతంబు శివుఁడు;**
**దన ముఖంబున నగ్ని జనియించెఁ, దను సభ । క్తిక సమారాధన కృతుల నియతిఁ**
**బాటించువారికి భవమోక్షణంబు గా । వించు, వేడుక మది నించువాఁడు**

**తే. వితత చతురాత్మకత్వ విశ్రుతి వహించి । కరుణఁ దత్తత్పదస్థిరా కలన కల్యు**
**లగు సపర్యారతులకు నయ్యై విధంబు । నీడ్య పదవుల నొసఁగు మహేశ్వరుండు. 404**

**ప్రతిపదార్థం:** సర్వజగత్+నిత్య+సాక్షి = సకల లోకాలకు శాశ్వతుడైన సాక్షియు; లోక+ఏక+శుభ+ఆవహ మూర్తి = జగములకు ముఖ్యంగా శుభాలు కలిగించే స్వరూపం కలవాడూ; నిర్+ఆమయుండు (నిరామయుండు) = రోగ విహీనుడూ; ప్రథమభూతములకున్ = పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే తొట్టతొలుతటి భూతములకు; ప్రథమ తమంబు = మొట్టమొదటిదీ; ఉదాత్తంబు+అయిన = దొడ్డదయిన; భూతంబు = ప్రాణి; శివుఁడు = పరమేశ్వరుడే; తన ముఖంబునన్ = తన యొక్క వదనమునందు; అగ్ని = అనలం; జనియించెన్ = పుట్టింది; తనున్ = గౌరీ వల్లభుడిని; సభక్తిక సమారాధన కృతులన్ = భక్తితో గూడిన పూజాకార్యములను; నియతిన్ = నియమంతో; పాటించువారికిన్ = కావించేవారికి; భవమోక్షణంబు = సంసారంనుండి విముక్తి, జన్మరాహిత్యము; కావించు వేడుకన్ = కలిగించే కుతూహలం; మదిన్ = మనస్సులో; నించువాఁడు = నిండించుకొనేవాడు అతడే; వితత = ఎక్కుడైన; చతుః+ఆత్మకత్వ+విశ్రుతిన్+వహించి = సదాశివాదికమైన నాలుగు స్వరూపాలతో ప్రఖ్యాతిగాంచి; మహేశ్వరుండు = భర్గుడు; కరుణన్ = దయతో; తత్+తత్+పద+ స్థిర+ఆకలన కల్యులు+అగు = ఆయాస్థానాలలో సుస్థిరముగనున్న శుభమూర్తులైన; సపర్యారతులకున్ = తన పూజలందు ఆసక్తి గలవారికి; అయ్యైవిధంబు = ఆయావిధాలైన; ఈడ్యపదవులన్ = పొగడదగిన అధికార స్థానాలను; ఒసఁగున్ = ఇస్తాడు.

**తాత్పర్యం:** సకల జగత్తులకు నిత్యసాక్షిగా ఉన్నవాడు, సర్వలోకాలకు శుభాలు కలిగించే స్వరూపం కలవాడూ, రోగ రహితుడు, ప్రథమభూతము లని చెప్పబడే భూమి మొదలైన పంచ మహాభూతాలకంటె ముందున్న దొడ్డ భూతం

శ్రీకంఠుడు. తనను నియమం వీడక భక్తితో ఆరాధించే వారికి సంసారవిముక్తి కలిగించవలెననే అభిలాష తన మనసులో నింపుకొని ఉంటాడు నీలగళుడు. సదాశివాది రూప చతుష్టయంతో విఖ్యాతుడైన ఆ మహేశ్వరుడు తనను పూజించటంలో ఆసక్తి గల సుస్థిరపదస్థులైన మంగళమూర్తులకు ఆయావిధాలైన కొనియాడదగిన ఉన్నత పదవులు అనుగ్రహిస్తాడు.

**తే. ఈ యుపస్థాన మచలిత హృదయవృత్తి। నరుఁడు శివలింగ సన్నిధానమున వాఙ్ని**
**రూఢముగఁ జేసి యాయురారోగ్యసకల। కామ్యవైభవైశ్వర్యముల్ గలిగి నెగడు.' 405**

**ప్రతిపదార్థం:** ఈ+ఉపస్థానము = ఈ దరిజేర్చుస్తోత్రమును; అచలిత హృదయవృత్తిన్ = చలించని మనఃప్రవృత్తితో; నరుఁడు = మనుజుడు; శివలింగ సన్నిధానమునన్ = శివలింగము యొక్క సమక్షంలో; వాక్+నిరూఢముగన్+చేసి = వాక్రుసిద్ధముగ పఠించి; ఆయుః+ఆరోగ్య = ఆయుస్సు, ఆరోగ్యం; కామ్య = కోరదగిన; వైభవ+ఐశ్వర్యముల్ = గొప్పతనమూ, సంపద; కలిగి = పొంది; నెగడున్ = వర్ధిల్లగలడు.

**తాత్పర్యం:** ఈ స్తోత్రమును చలించని మనస్సుతో ఏ మానవుడు శివలింగ సన్నిధిలో వాగ్విధేయ మొనర్చునో ఆతడు ఆయుష్యం, ఆరోగ్యం, ప్రాభవం, సంపద కలిగి వర్ధిల్లగలడు.'

**భీష్ముఁడు ధర్మజునకు ధర్మసూక్ష్మ ప్రకారంబు చెప్పుట. (సం.13-147-10).**

**వ. అనిన విని యత్యంత సంతోషంబు నొంది కుంతీతనయాగ్రజుండు శాంతనవుతో 'ధర్మంబులు బహుప్రకారంబులు గలవు; పరమానుష్ఠేయంబగు ప్రకారం బెయ్యది? దాని నెఱింగింపవే' యనుటయు నజ్జనపతికి జాహ్నవీనందనుం డిట్లనియె. 406**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అత్యంత సంతోషంబున్+ఒంది = మిక్కిలి హర్షమును పొంది; కుంతీతనయ+అగ్రజుండు = కుంతీదేవి కుమారులలో తొలుతపుట్టిన వాడైన ధర్మరాజు; శాంతనవుతోన్ = శంతనుమహారాజు కుమారుడైన భీష్ముడితో; ధర్మంబులు; బహుప్రకారంబులు = పలువిధాలు; కలవు; పరమ+అనుష్ఠేయంబు+అగు = ముఖ్యంగా ఆచరించదగిన; ప్రకారంబు = విధం; ఏ+అది(ఎయ్యది)? = ఏది?; దానిన్; ఎఱింగింపవు+ఏ? = తెలుపవా?; అనుటయున్ = అని అడుగగా; ఆ+జనపతికిన్ = ఆ నరనాథునకు-ధర్మజునకు; జాహ్నవీనందనుండు = జహ్నుమహర్షి కూతురైన గంగాదేవి యొక్క కొడుకు (భీష్ముడు); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని కృష్ణుడు చెప్పగా మిక్కిలి సంతసించి ధర్మజుడు భీష్ముడితో 'ధర్మాలు పలువిధాలుగా ఉన్నాయి. వాటిలో ముఖ్యంగా అనుష్ఠించదగిన ధర్మ మేదో తెల్పు' మని అడుగగా గంగానందనుడు ఆ నరపతితో ఇట్లా అన్నాడు.

**ఆ. ధర్మములకు సంజ్ఞ తద్వేదులగు మహా। త్ములు తగంగఁ జెప్పుదురు నరేంద్ర!**
**వినుము కాలపాకమున నది యన్యథా। త్వంబు గలిగి యవిశదత్వ మొందు. 407**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర! = రాజా!; ధర్మములకున్ = ధర్మాలకు; సంజ్ఞ = గురుతు; తత్+వేదులు+అగు = ఆ ధర్మం తెలిసిన వారైన; మహా+ఆత్ములు = మహనీయులు; తగంగన్ = యుక్తంగా, ఒప్పిదంగా; చెప్పుదురు = వచిస్తారు; వినుము = ఆలకించుము; కాలపాకమునన్ = కాలం యొక్క మార్పుచేత, కాలం గడువగా గడువగా; అది = ఆ ధర్మం;

అన్యథాత్వంబు+కలిగి = వేరొక తీరును పొంది; అవిశదత్వము+ఒందున్ = అస్పష్టతను చెందుతుంది.

**తాత్పర్యం:** 'ధర్మజా! ధర్మం ఇట్లాంటి దని ఆ ధర్మస్వరూపం తెలిసిన మహనీయులు మాత్రమే యుక్తంగా చెప్పగలరు. కాల పరిణామం వలన ధర్మం అందుకు భిన్నంగా గోచరిస్తుంది. స్పష్టతను కోల్పోయి మరుగున పడుతుంది.

**వ. ఎ ట్లంటేని. 408**

**తాత్పర్యం:** అదెట్లంటివా.

**క. అనఘ! యధర్మము ధర్మం । బను మతిఁ బుట్టించుఁ దృణ సమావృతమై ప్ర**
**న్నని తలము చందమునఁ దోఁ । చిన నూయింబోలె సూక్ష్మచిత్తత లేమిన్. 409**

**ప్రతిపదార్థం:** అనఘ! = పాపరహితుడా!; సూక్ష్మచిత్తత లేమిన్ = పరిశీలనాత్మకమైన సూక్ష్మబుద్ధి లేనందువలన; తృణసమావృతము+ఐ = గడ్డితో కప్పబడినదై; ప్రన్నని తలము చందమునన్ = మిట్టపల్లాలు లేని చక్కని సమప్రదేశంగా; తోఁచిన = స్ఫురించిన; నూయిన్+పోలెన్ = బావివలె, కూపం మాదిరిగా; అధర్మము = అన్యాయం; ధర్మంబు+అనుమతిన్ = న్యాయం అనే తలంపును; పుట్టించున్ = కలిగిస్తుంది.

**తాత్పర్యం:** పుణ్యపురుషా! పరిశీలనాత్మకమైన సూక్ష్మబుద్ధి లేనందున గడ్డితో కప్పబడిన బావి మిట్టపల్లాలు లేని చక్కని సమప్రదేశంగా తోచేటట్లు ఒక్కొకప్పుడు అధర్మం ధర్మమనే తలంపును కలిగిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. తప్పక కాన్పఁగ లేమిం । జెప్పెడు వారలును దద్విశేషము దప్పం**
**జెప్పఁగ ధర్మంబు తెరువు । దప్పు నది క్రియాపరులకు దైన్యము దెచ్చున్. 410**

**ప్రతిపదార్థం:** తప్పక = మానక; కాన్పన్+కన్+లేమిన్ = ఇది ధర్మం, ఇది అధర్మం అని చూపలేక పోవటంవలన, గోచరించక పోవటం వలన; చెప్పెడు వారలును = ధర్మం బోధించేవారు కూడ; తత్+విశేషము = ఆ ధర్మం యొక్క ఘనత, ప్రత్యేకత, విలక్షణత్వం; తప్పన్ = తొలగేటట్లు; చెప్పన్+కన్ = తెలుపగా; ధర్మంబుతెరువు = ధర్మము యొక్క పద్ధతి; తప్పున్ = తప్పిపోతుంది; అది = ధర్మసూక్ష్మ మెరుంగని వారి బోధ; క్రియాపరులకున్ = కార్యాలు సల్పేవారికి; దైన్యమున్ = దుఃఖాన్ని; తెచ్చున్ = కలిగిస్తుంది.

**తాత్పర్యం:** ఇది ధర్మం ఇది అధర్మం అని సరిగా చూపలేక పోవటం వలన, ధర్మబోధ చేసేవారు ఆ ధర్మం యొక్క విలక్షణత్వం తొలగేటట్లు తెలపటం చేత ధర్మం దారితప్పుతుంది. ధర్మసూక్ష్మ మెరుంగని వారి బోధ విని కార్యాచరణకు పూనుకొనే వారికి కడకు దుఃఖమే సంభవిస్తుంది.

**వ. కావున ధర్మంబు సూక్ష్మ ప్రకారంబు. 411**

**తాత్పర్యం:** కనుక ధర్మం మిక్కిలి సూక్ష్మమైనది.

**క. శ్రుతముఁ బరిత్యాగముఁ గల । మతిమంతుల నడుగు లోభమదమోహసమా**
**వృత బుద్ధులు గాని సమం । చిత చరితులవలనఁ దెలియు శీలనిరూఢా! 412**

**ప్రతిపదార్థం:** శీలనిరూఢా! = సత్ప్రవర్తనచేత ప్రసిద్ధిగాంచిన ధర్మజా!; శ్రుతమున్ = పెద్దలవలన శాస్త్రముల వినికిడియూ; పరిత్యాగమున్ = వితరణమూ, ఈవీ; కల = కలిగినట్టి; మతిమంతులన్ = బుద్ధిమంతులను; అడుగు = ధర్మ మనగా ఎట్టిదో ప్రశ్నించుము; లోభ = దురాశ, పిసినిగొట్టుతనమూ; మద = గర్వమూ; మోహ = అజ్ఞానమూ, ధర్మ సమ్మూఢత్వమూ అనువానిచే; సమావృతబుద్ధులు = ఆవరించబడిన చిత్తం కలవారు; కాని = కానట్టి; సమంచితచరితుల వలనన్ = పూజించదగిన నడవడిగల మహనీయులవలన; తెలియు = గ్రహించుము.

**తాత్పర్యం:** మంచి స్వభావం గల ధర్మపుత్రా! పెద్దలవల్ల శాస్త్రముల వినికిడి, వితరణగుణము గల్గిన బుద్ధిమంతుల నడిగి ధర్మస్వరూప మెట్టిదో తెలిసికొమ్ము. దురాశ, దుర్గర్వం, మోహం అనే దుర్గుణాలతో ఆవరించబడిన మనసులుగల వారివలన కాకుండా పవిత్రచరిత్రుల వలననే ధర్మం ఎరుగవలసినది.

**క.** **కామార్థంబులు మోహో । ద్దామత కృత్యంబు లని యెదం గని ధర్మ**
**స్తోమమునఁ దగులు జనముల । చే మేలుగ నెఱిఁగి కొనుము సిద్ధవివేకా!** **413**

**ప్రతిపదార్థం:** సిద్ధవివేకా! = ప్రసిద్ధమైన జ్ఞానం కలవాడా!; కామ+అర్థంబులు = పురుషార్థములలో కామం, అర్థం అనేవి; మోహ+ఉద్దామత+కృత్యంబులు+అని = అజ్ఞానం యొక్క స్వతంత్రకార్యాలని; ఎదన్ = హృదయంలో; కని = ఎరిగి; ధర్మస్తోమమునన్ = ధర్మముల యొక్క సమూహమందు; తగులు = సక్తులైన; జనములచేన్ = జనులచేత; మేలుగన్ = హితవుగా; ఎఱిఁగికొనుము = తెలిసికొమ్ము!

**తాత్పర్యం:** ప్రశస్తమైన జ్ఞానం గల ధర్మజా! కామము, అర్థమూ అనేవి మోహాతిరేకం వలన జరిగే కార్యాలని మదిలో నెరిగి, ధర్మమం దాసక్తిగల జనుల వలన హితవుగా ధర్మస్వరూపం గ్రహించుము.

**తే.** **అనఘ! యంచిత స్వాధ్యాయమునను యజ్ఞ । మున సమాచారమున నిష్ఠ పొనుఁగుపడక**
**యుండు నెవ్వారలకు వార లోపి నడపు । నదియ కనుము ధర్మము సూక్ష్మపదము గాఁగ.'** **414**

**ప్రతిపదార్థం:** అనఘ! = పుణ్యుడా!; అంచిత = ఒప్పిదమైన; స్వాధ్యాయమునను = వేదాధ్యయనమునందునూ; యజ్ఞమునన్ = యజ్ఞము లొనర్చుట యందును; సమాచారమునన్ = అనుష్ఠానమునందును, ప్రవర్తన అందునూ; నిష్ఠ = శ్రద్ధ, నమ్మిక, నిలుకడ; ఏ+వారలకున్ = ఎవ్వరికి; పొనుఁగు+పడక+ఉండున్ = క్షీణించక, మరుగుపడక ఉంటుందో; వారలు = అట్టివారు; ఓపి = నేర్పుతో, సమర్థులై; నడపు+అదియ = సాగించునట్టిదే; ధర్మము సూక్ష్మపదముగాఁగన్ = ధర్మము యొక్క సూక్ష్మంగా; కనుము = తెలియుము.

**తాత్పర్యం:** దోషరహితుడా! వేదాధ్యయనంలోనూ, యజ్ఞాలను నిర్వహించటంలోనూ, ఆచారంలోనూ శ్రద్ధ ఎవరికి నశించకుండా ఉంటుందో అట్టివారి ఆచరణ ధర్మ సూక్ష్మ మెరిగి చేసేదిగా గ్రహించుము.'

**క.** **అన విని యుధిష్ఠిరుఁడు 'నా । మన మిప్పుడు మీరు సెప్పుమాటల సందే**
**హ నిరూఢ మయ్యె ధర్మము । గనుఁ గొన వలయుటకు బహుముఖత్వము కల్మిన్.** **415**

**ప్రతిపదార్థం:** అనన్; విని; యుధిష్ఠిరుఁడు = ధర్మజుడు; ధర్మము = ధర్మమును; కనుఁగొనవలయుటకున్ = తెలిసికొనటానికి; బహుముఖత్వము కల్మిన్ = అనేక మార్గాలుండటం చేత; నామనము = నా హృదయం; ఇప్పుడు, మీరు; చెప్పుమాటలన్ = వచించే వాక్యాలచేత, నుడివే నుడుగులచేత; సందేహ+నిరూఢము+అయ్యెన్ = సంశయాన్ని మొలకెత్తిస్తున్నది.

**తాత్పర్యం:** అని భీష్ముడు చెప్పగా ధర్మరాజు 'పితామహా! మీరు చెప్పే మాటలచేత ధర్మాన్ని తెలిసికొనటానికి మార్గా లనేకం ఉండటం చేత నామనస్సులో ధర్మవిషయమై సందేహపరంపరలు ఉదయిస్తున్నాయి.

**క.** **పారంబు లేని ధర్మా । చారంబున మునుఁగు మాదృశ క్షుద్రులకుం**
**దీరం బిట్టిది యని తెలి । వార భవాదృశుల తగుదు రర్మిలిఁ జెప్పన్. 416**

**ప్రతిపదార్థం:** పారంబు లేని = ఒడ్డులేని, దరిలేని; ధర్మ+ఆచారంబునన్ = ధర్మానుష్ఠానంలో; మునుఁగు = నిమగ్నులమైన; మాదృశ క్షుద్రులకున్ = మావంటి అల్పులకు; తీరంబు = గట్టు; ఇట్టిది+అని = ఇది అని; తెలివి+ఆరన్ = జ్ఞానముదయించేటట్లు; అర్మిలిన్ = ప్రేమతో, ప్రీతితో; చెప్పన్ = తెలపటానికి; భవాదృశులు+అ = తమవంటివారే; తగుదురు = యోగ్యులు.

**తాత్పర్యం:** దరిలేని ధర్మానుష్ఠాన సముద్రంలో మునిగి దరి గానక అల్లాడుతున్న మావంటి అల్పులకు ఈ ధర్మసాగరానికి తీర మిది యని సంతోషంతో తెలియ జెప్పడానికి మీవంటి మహాత్ములే తగిఉన్నారు.

**తే.** **ఆగమోక్త విధంబుఁ బ్రత్యక్షమును స । మాచరణముఁ బృథగ్విధ వ్యాకులములు**
**ధర్మసూక్ష్మత యి మ్మూటఁ దథ్య మిట్టి । దనఁగ రాని యట్లున్నది యనఘచరిత! 417**

**ప్రతిపదార్థం:** అనఘచరిత! = పుణ్యావర్తనుడవైన పితామహా!; ఆగమ+ఉక్త విధంబున్ = వేదమునందు చెప్పబడిన విధమును; ప్రత్యక్షమును = కంటికి కనిపిస్తున్నది, ఎదుటనున్నది, లోకానుభవం; ఆచరణమున్ = పెద్దలనుంచి పరంపరగా వస్తున్నవాడుక; పృథక్+విధ+వ్యాకులములు = వేర్వేరు తీరులతో కలగుండు పడుతున్నవి; ధర్మసూక్ష్మత = ధర్మస్వరూపం; ఈ+మూటన్ = ఆగమోక్తవిధం, ప్రత్యక్షం, ఆచరణం అనే మూటిలో; ఇట్టిది = ఇటువంటిది; తథ్యము = వాస్తవం, సత్యం; అనఁగన్+ రాని+అట్లు+ఉన్నది = అని చెప్పటానికి శక్యం కాకుండా ఉన్నది.

**తాత్పర్యం:** తాతా! ఆగమోక్తవిధం, ప్రత్యక్షం, ఆచరణ - అని ధర్మం భిన్న భిన్న రీతులతో కలగుండు పడుతున్నది. ఈ మూటిలో ధర్మసూక్ష్మత ఇద మిత్థ మని చెప్పటానికి వీలుకాకుండా ఉన్నది. పుణ్యావర్తనుడవైన నీవు ధర్మసూక్ష్మ మంటే ఎటువంటిదో నాకు తెలుప వలసినది-

**వ.** **అనిన నాపగేయుండు కౌంతేయాగ్రజుతో ని ట్లనియె. 418**

**ప్రతిపదార్థం:** అనినన్; ఆపగేయుండు = నదీనందనుడు-భీష్ముడు; కౌంతేయ+అగ్రజుతోన్= కుంతి కుమారులలో జ్యేష్ఠుడైన ధర్మజుడితో; ఇట్లు+అనియెన్ = ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజుడి పలుకులు విని మందాకినీనందనుడైన భీష్ముడు కుంతీజ్యేష్ఠనందనుడైన ధర్మజుడితో ఈ ప్రకారం చెప్పాడు.

**క.** **'ఇవి మూఁడు దెఱంగులు ధ । ర్మువు సూక్ష్మత నిశ్చయింప ముఖ్యపదంబుల్**
**దివిరికొని యివియ చూచుట । యవనీశ్వర! పూర్వమునులయందుఁ గలుగుటన్. 419**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ్వర! = భూనాథా!; ధర్మువు సూక్ష్మతన్ = ధర్మము యొక్క సూక్ష్మతను; నిశ్చయింపన్ = నిర్ణయించటానికి; తివిరికొని = పూనుకొని; ఇవియ = ఆగమోక్త విధానం, ప్రత్యక్షం, ఆచరణం అనే వాటినే; చూచుటన్ = దర్శించటం వలననూ; పూర్వమునుల అందున్ = మునుపటి మునీశ్వరుల అందునూ; కలుగుటన్ = ఈ పద్ధతుల అనుసరణం ఉండటం వలననూ; ఇవి మూఁడు తెఱంగులున్ = ఈ మూఁడు విధానాలే; ముఖ్యపదంబుల్ = ధర్మసూక్ష్మ నిర్ణయానికి ప్రధానమైన గుర్తులు.

**తాత్పర్యం:** 'ధర్మపుత్రా! ధర్మసూక్ష్మ నిర్ణయానికి ఆగమోక్తవిధం, ప్రత్యక్షం, సమాచరణం అనే ఈ మూడు విధానాలే తప్ప మరోదారి ఏదీ లేదు. పూర్వమునీంద్రులు సైతం ధర్మసూక్ష్మ నిర్ణయానికి ఆధారంగా వీటినే గై కొన్నారు.

**క. అనుమానింపకు మంధుం । డును నిశ్శంకాత్ముఁడును జడుండును బోలన్**
**జననాథ! యేను బల్కెద । విని దృఢముగ నూఁదు మింక వేయును నేలా? 420**

**ప్రతిపదార్థం:** జననాథ! = నరవరా!; ఏను పల్కెదన్ = నేను చెప్పుతాను; అంధుండును = గ్రుడ్డివాడును; నిస్+శంకా+ఆత్ముండును = పరమసంశయాత్ముడును; జడుండును = మందబుద్ధిగలవాడు, మూఢుడును; పోలన్ = వీరికి సరిపోలేటట్లు; అనుమానింపకుము = సందేహించవద్దు; విని = నా పలుకు లాలించి; దృఢముగన్ = గట్టిగా; ఊఁదుము = ప్రమాణంగా స్వీకరించుము, అవలంబించు; ఇంకన్ = ఇక; వేయును+ఏలా? = పలుమాట లెందుకు?

**తాత్పర్యం:** రాజా! గ్రుడ్డివాడు, సంశయాత్ముడు, మూఢుడు- వీరి వలె నీవు సందేహించవద్దు. ఈ ధర్మజిజ్ఞాస మాని నేను చెప్పేమాటలు విని, నా మాటలనే ప్రమాణాలుగా స్వీకరించి, వాటినే గట్టిగా అనుసరించుము. ఇక పలుమాటలతో నీకు పని లేదు సుమా!

**క. విమలాత్మ! యహింసయు దా । నము సత్యముఁ గ్రోధవర్జనంబును విను ము**
**త్తమ ధర్మరాశి యిది ధ । ర్మమునకుఁ బరసీమ దీని మరుపుము మదికిన్. 421**

**ప్రతిపదార్థం:** విమల+ఆత్మ! = ఓ నిర్మలచిత్తుడా!; వినుము = ఆలకించుము; అహింసయున్ = ప్రాణులను బాధించకుండటం; దానము = దానం చేయటం; సత్యమున్ = నిజం పలకటం; క్రోధవర్జనంబును = కోపం వదలటం; ఉత్తమ ధర్మరాశి = మేలైన ధర్మముల యొక్క ప్రోగు; ఇది = ఈ అహింసాదిక సద్గుణ సముదాయం; ధర్మమునకున్ = ధర్మానికి; పరసీమ = తుదిహద్దు; మదికిన్ = నీ మనస్సునకు; దీనిన్ = ఈ గుణరాశిని; మరుపుము = మరుగునట్లు చేయుము; అలవడేటట్లు చేయుము, వశపరచుము.

**తాత్పర్యం:** పరిశుద్ధమైన మనస్సుగల యుధిష్ఠిరా! అహింస, దానం, సత్యం, కోపరాహిత్యం అనేవి ఉత్తమ ధర్మాలు. ఈ గుణాలు ధర్మానికి పరమావధులు. కనుక నీ మనసు ఈ గుణాలను అనుసరించేటట్లు చేయవలసింది.

**తే. బ్రాహ్మణారాధనమునఁ దత్పరుఁడ వగుము; । దక్కు మొండు విచారముల్ ధర్మపుత్త్ర!'**
**యనిన మానస మానంద మంద నాతఁ । డతని కతిభక్తి వందనం బాచరించి. 422**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్ర! = యముడి కుమారుడా! బ్రాహ్మణ+ఆరాధనమునన్ = విప్రులను పూజించటంలో; తత్పరుఁడవు+అగుము = ఆసక్తి కలవాడవు కమ్ము; ఒండు విచారముల్ = ఇతరచింతలు, ఆలోచనలు; తక్కుము = విడువుము, మానుము; అనినన్ = అని దేవవ్రతుడు (భీష్ముడు) చెప్పగా; అతఁడు = యుధిష్ఠిరుడు; మానసము = హృదయం; ఆనందము+అందన్ = సంతసం పొందగా; అతనికిన్ = భీష్ముడికి; అతి భక్తిన్ = మిక్కిలి భక్తితో; వందనంబు = నమస్కారం; ఆచరించి = చేసి. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** ధర్మపుత్త్రా! విప్రులను ఆరాధించటంలో ఆసక్తి వహించుము. అన్యచింతలు వదలిపెట్టుము'- అని భీష్ముడు పలికాడు. ధర్మజుడు మనసులో సంతోషించి ఆయనకు మిక్కిలి భక్తితో నమస్కరించాడు.

**వ. 'ఎవ్వరు ధర్మంబునెడ నసూయ సేయుదు? రెవ్వరు దాని నుపాసింతు? రెఱింగింపుము. వారి వారి పొందుగతులును విన వలతుం జెప్పు' మనిన నప్పౌరవోత్తమునకు న ప్పురుషసత్తముం డిట్లనియె. 423**

**ప్రతిపదార్థం:** ఎవ్వరు = ఏ మనుజులు; ధర్మంబు+ఎడన్ = ధర్మం పట్ల; అసూయ+చేయుదురు = దోషారోపణం చేస్తారో, ద్వేషిస్తారో; ఎవరు = ఏ నరులు; దానిన్ = ఆ ధర్మమును; ఉపాసింతురు = సేవిస్తారో, ఆచరిస్తారో; ఎఱింగింపుము = తెలుపుము; వారి వారి పొందు గతులును = ధర్మాన్ని నిరసించేవారు, దానిని సేవించేవారు పొందే స్థితి గతులను, పుణ్యా పాపాలను; వినన్ వలతున్ = వినవలెనని కోరుతున్నాను; చెప్పుము; అనినన్; ఆ+పౌరవ+ఉత్తమునకున్ = పురువంశంలో పుట్టిన వారిలో శ్రేష్ఠుడైన ఆ ధర్మపుత్త్రుడికి; ఆ+పురుష+సత్తముండు = ఆ మానవోత్తముడైన భీష్ముడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఏవరు ధర్మాలపట్ల అసూయ వహిస్తారో, ఎవ్వరు వాటిని నమ్మి సేవిస్తారో ఆ ఇరుతెగల వారిని గూర్చి, వారికి కలిగే స్థితిగతులను గురించి తెల్పు' మని వేడగా ధర్మజునకు మహామానవుడు భీష్ముడిట్లా అన్నాడు.

**సీ. 'వినుము రజస్తమో వికృతులఁ దగిలిన । మానసంబులు గల మానవులకుఁ**
**గలుగు ధర్మద్వేషకలనంబు; వారలు । నరకవాసార్హులు ధరణినాథ!**
**సత్య పరాత్ములు సతతంబు ధర్మ ము । పాసింతు; రూర్ధ్వ లోకాధివాస**
**మునకు వా రుక్తులు; మునుమును పుట్టిన । సుతుఁడు ధర్మము పద్మజునకు దాని**

**తే. పాక సంపద సుమతు లుపార్జితగ ను । పాసనము సేయుదురు తియ్యపంటి పరువ**
**మాదరించి తదుపచార మాచరించు । వెరవుగల యట్టి జనముల విధము దోఁప.' 424**

**ప్రతిపదార్థం:** ధరణినాథ! = భూవల్లభా!; వినుము; రజః+తమః+వికృతులన్(రజస్తమోవికృతులన్) = రజోగుణము యొక్క, తమో గుణము యొక్క వికారములను; తగిలిన = పొందిన; మానసంబులు+కల = మనస్సులు కలిగిన; మానవులకున్ = నరులకు; ధర్మద్వేషకలనంబు = ధర్మమునందు విరోధమనే దోషం; కలుగున్ = సంభవిస్తుంది; వారలు = ఆ ధర్మ విరోధులు; నరకవాస+అర్హులు = నరకలోకంలో నివసించటానికి తగిన వారు; సత్యపర+ఆత్ములు = సత్యమందు ఆసక్తి గల మనసులు కలవారు; సతతంబున్ = ఎల్లప్పుడు; ధర్మమున్ = ధర్మాన్ని; ఉపాసింతురు = సేవిస్తారు; వారు = అట్లాంటి సత్యపరులు; ఊర్ధ్వలోక+అధివాసమునకున్ = స్వర్గభువనంలో నివాసంచెయ్యటానికి; ఉక్తులు = యోగ్యులు; పద్మజునకున్

= కమలము నుండి జన్మించిన బ్రహ్మదేవుడికి; మునుమును పుట్టిన = తొట్టతొలుత జనియించిన; సుతుఁడు = కుమారుడు; ధర్మము = ధర్మం; తియ్యపంటిపరువము = మధురమైన పండు యొక్క పక్వదశను; ఆదరించి = పాటించి, గమనించి; తత్+ఉపచారము+ఆచరించు = దానిని వాడుకొనే పద్ధతులనుసరించే; వెరవు+కల+అట్టి = ఉపాయమెరిగినట్టి; జనులవిధము+ తోఁపన్ = జనులతీరు గోచరించేటట్లు; సుమతులు = సుబుద్ధులు; దాని పాకసంపద = ధర్మము యొక్క పక్వస్థితి; ఉప+ఆర్జిత+కన్ = సంపాదిత అయ్యేటట్లు; ఉపాసనము+చేయుదురు = ఆ ధర్మాన్ని సేవిస్తారు.

**తాత్పర్యం:** 'ధర్మజా! శ్రద్ధగా వినుము. రజస్తమోగుణవికారం పొందిన మనసులుగల మనుష్యులు ధర్మం మీద పగబూనుతారు. అట్టివారికి నరక లోక నివాసమే గతి. సత్య వ్రతపరాయణులు నిరంతరం ధర్మమునే సేవిస్తారు. వారు స్వర్గలోకనివాససౌఖ్యానికి అర్హులు. ధర్మం బ్రహ్మదేవుడి ప్రథమపుత్రుడు. మధురఫలాలను భుజించటానికి ఉబలాటపడేజనులు దాని పరిపక్వస్థితిని ఎట్లా శ్రద్ధాసక్తులతో, ఆదర బుద్ధితో గమనిస్తూ ఎట్లా ఉపచారాలు చేస్తుంటారో ఆ విధంగానే మంచిబుద్ధికలవారు ధర్మాన్నే ఆశ్రయించి సేవిస్తుంటారు.'

**వ. అనినం గౌంతేయాగ్రజుండు శాంతనవుతోడ 'సాధులు నసాధులు నన నెట్టివారు? చెప్పు' మనుటయు నమ్మహాత్ముం డి ట్లనియె. 425**

**ప్రతిపదార్థం:** అనినన్; కౌంతేయ+అగ్రజుండు = కుంతీపుత్రులలో పెద్దవాడు, ధర్మజుడు; శాంతనవుతోడన్ = శంతను పుత్రుడైన భీష్ముడితో; సాధులు = సత్పురుషులు; అసాధులు = దుర్జనులు; అనన్; ఎట్టివారు; చెప్పుము; అనుటయున్ = అని ప్రశ్నించగా; ఆ+మహా+ఆత్ముండు = ఆ దొడ్డబుద్ధిగలవాడు- భీష్ముడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్ముడి పల్కులు విని ధర్మజుడు ఆ మహనీయుడితో 'సాధువు లనగా ఎటువంటివారు? అసాధువు లనగా ఎటువంటివారు? చెప్పు' మని అడుగగా భీష్ము డిట్లా చెప్పాడు.

భీష్ముఁడు ధర్మజునకు సాధ్వసాధుజనుల నిరూపించి చెప్పుట. (సం.13-148-8).

**సీ. 'తమయంత నెఱుఁగరు ధర్మంబు సదుపదే । శమునను గాన రసాధుజనులు;**
**ధర్మబోధం బివ్విధంబులు రెంటను । గలిగెడువారు సాధులు; తదీయ**
**చరితంబు విను; విడువరు మలమూత్రంబు । లర్హంబు గానిచో నధిప! యతిథి**
**భోజనశిష్టాన్న భోజులు, దెరు విచ్చి । తగినవారలకుఁ బ్రదక్షిణముగ**

**తే. నరుగుదురు, నడపుదురు సత్యార్జవములు, । శరణు సొచ్చినఁ గాతురు, సురతగుప్తి**
**పరులు, నిజదారతృప్తులు, గురువినీతు, । లమలహృదయులు, సంతోష మారఁ గలరు.' 426**

**ప్రతిపదార్థం:** అసాధుజనులు = సత్పురుషులు కానివారు, దుర్జనులు; ధర్మంబున్ = ధర్మమును; తమ+అంతన్ = తమకు తామే; ఎఱుఁగరు = తెలియలేరు; సత్+ఉపదేశమునను = పెద్దల యొక్క ఉపదేశం వలన కూడ; కానరు = తెలిసికొనరు, గ్రహించరు; ధర్మబోధంబు = ధర్మోపదేశం; ఈ+విధంబులు రెంటను = తమకు తాముగా గాని, పెద్దలవలనగాని; కలిగెడు వారు = పొందువారు; సాధులు = సజ్జనులు, సత్పురుషులు; తదీయచరితంబున్ = ఆ సత్పురుషుల యొక్క నడవడిని, ప్రవర్తనను; అధిప! = రాజా!; విను = వినుము; అర్హంబు+కానిచోన్ = యోగ్యంగాని తావులో; మలమూత్రంబులు; విడువరు; అతిథి భోజనశిష్ట = అతిథులు భుజించగా మిగిలిన; అన్న భోజులు = అన్నమును భుజించేవారు-సాధుజనులు; తగినవారలకున్

= అర్హులైనవారికి; తెరువు+ఇచ్చి = దారి వదలి; ప్రదక్షిణముగన్ = కుడివైపునకు తిరిగి; అరుగుదురు = వెళ్ళుతారు; సత్య+ఆర్జవములు = సత్యం, ఋజుత్వం (నిష్కాపట్యం); నడపుదురు = కొనసాగిస్తారు; శరణు+చొచ్చినన్ = కాపాడుమని ఆశ్రయిస్తే; కాతురు = రక్షిస్తారు; సురతగుప్తి పరులు = వారు రతి క్రీడ రహస్యంగా సల్పుతారు; నిజదారతృప్తులు = తమ భార్యలయందే సంతృప్తి చెందుతారు; గురువినీతులు = వారు తమగురువులకు విధేయులు; అమల హృదయులు = నిర్మల మనస్కులు; సంతోషము+ఆరన్+కలరు = ఎల్లప్పుడు సంతోషంతో హాయిగా ఉంటారు.

**తాత్పర్యం:** 'సాధువులు కానివారు ధర్మం తమంతట తాముగాగాని, పెద్దలవలనగాని తెలిసికొనరు. సత్పురుషులు ధార్మికజ్ఞానాన్ని తమంతట తాము గాను, గురువుల వలననూ ఆర్జిస్తారు. ధర్మజా! సత్పురుషుల చరిత్ర ఎటువంటిదో తెలుపుతాను శ్రద్ధతో వినుము. వారు మలమూత్రములను యోగ్యములైన ప్రదేశాలలో విడువరు. అతిథులు భుజించిన పిదప శేషించిన ఆహారాన్ని భుజిస్తారు. అర్హులైనవారికి దారి వదలి ప్రదక్షిణ మొనర్చి వెళ్ళుతారు. సత్యంగా, నిష్కపటంగా ప్రవర్తిస్తారు. శరణు జొచ్చినవారిని సంరక్షిస్తారు. స్త్రీ సంగమం బయటికి పొక్కనీయరు. రహస్యంగా ఉంచుతారు. తమ భార్యలతోనే సంతృప్తి చెందుతారు. గురువుల పట్ల అణకువ కలిగి ఉంటారు. వారు నిర్మల హృదయులు; నిత్యసంతోషులు.'

**విశేషం:** ధర్మిష్ఠులు (సత్పురుషులు) రాజమార్గాలలో, ఆవులనడుమ, ధాన్యం మధ్య మలమూత్ర విసర్జనం చెయ్యరు. అగ్నిని, వృషభమును, దేవుడిని, గోశాలను, బ్రాహ్మడిని, ధార్మికుడిని, ముసలివాడిని చూచినపుడు వారికి ప్రదక్షిణం చేస్తారు. ఇంకా వృద్ధులకు, భారవాహులకు, ఆడువారికి, బాలురకు, ఆతురులకు, బ్రాహ్మణులకు, గోవులకు, రాజులకు దారి వదులుతారు.

**వ. అని వెండియు. 427**

**తాత్పర్యం:** అని మరల.

**తే. 'సాధు లింద్రియ విభ్రాంతి సంహరింతు, । రఘముఁ దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు,**
**రప్రకాశంబుగా ధర్మ మాచరింతు, । రఖిలభూతదయాళుత్వమారఁ గలరు.' 428**

**ప్రతిపదార్థం:** సాధులు = సజ్జనులు; ఇంద్రియ విభ్రాంతిన్ = ఇంద్రియముల యొక్క తొట్రుపాటును, ఇంద్రియవ్యామోహమును; సంహరింతురు = నిర్మూలిస్తారు; అఘమున్ = పాపమును; తెలిసి = ఎరిగి; ప్రాయశ్చిత్తము+ఆచరింతురు = పాపమును పరిహరించే కర్మను కావిస్తారు; అప్రకాశంబుగాన్ = గుట్టుగా, రహస్యంగా, చాటుకొనకుండా; ధర్మము+ఆచరింతురు = ధర్మం సలుపుతారు; అఖిలభూత దయాళుత్వము+ఆరన్+కలరు = సమస్త ప్రాణుల మీద సంపూర్ణంగా కృపచూపుతారు.

**తాత్పర్యం:** 'సత్పురుషులు ఇంద్రియభ్రాంతిని నిర్మూలిస్తారు. చేసిన పాప మెరిగి ప్రాయశ్చిత్తం చేసికొంటారు. తమ పేరు ప్రకటించుకొనకుండా రహస్యంగా ధర్మం చేస్తారు. సమస్తభూతముల మీద దయా సంపూర్ణులై వెలుగొందుతారు.'

**వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు; ధర్మపరులును నీతివిదులును నైన బలవంతులు బహుమార్గంబులగు సదుపాయంబుల నర్థంబు లాకాంక్షింప సిద్ధింపకుండెడుఁ; గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగ్యంబులు గాకుండు; శిక్షలు పెద్ద లేకయుం గొన్ని చిత్తంబులందు విద్య లలవడు; శిక్షితులయ్యును నిర్విద్యు లగుటయుం గలుగుఁ; దెవుళ్ళ**

**నోసియుం బోట్లం బడియును గొందఱు చావరు; పూరి పుడుక దాఁకి బలాధికులు చచ్చుట చూచెద మిట్లు**
**గాఁ గతం బేమి? యెఱింగింపవే యనుటయు న మ్మహీపతి కమ్మహాత్ముం డి ట్లనియె. 429**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అజాత శత్రుండు = ధర్మజుడు; శంతను పుత్త్రుతోన్ = భీష్ముడితో; అప్రయత్నులకున్ = ఎట్టిప్రయత్నం లేని వారికి; అర్థంబు = ధనం; సిద్ధించుట+కలుగున్ = లభించటం సంభవిస్తుంది; ధర్మపరులును = ధర్మమునందు ఆసక్తి కలవారును; నీతివిదులును = నీతి నెరింగినవారును; ఐన బలవంతులు; బహుమార్గంబులు+అగు = పెక్కుదారులు గలిగిన; సత్+ఉపాయంబులన్ = మంచి ఉపాయాలచేత; అర్థంబులు = ధనములు; ఆకాంక్షింపన్ = కోరుతున్నా; సిద్ధింపక+ఉండెడున్ = లభించకుండా ఉంటాయి; కొందఱకున్ = కొంతమందికి; సిద్ధించియున్ = సమకూడికూడా, అవి = ఆ ధనములు; భోగంబులకున్; ఉపయోగ్యంబులు కాక+ఉండున్ = ఉపయోగపడకుండా పోతాయి; శిక్షలు = బోధలు; పెద్దలేకయున్ = ఎక్కువగా ఉండనప్పటికినీ; కొన్ని చిత్తములందున్ = కొందరి మనస్సులలో; విద్యలు = చదువులు; అలవడున్ = అబ్బుతాయి, సిద్ధిస్తాయి; శిక్షితులు+అయ్యును = బోధించబడిన వారైనప్పటికినీ; నిర్విద్యులు+అగుటయున్ = చదువురానివారు కావటం కూడ; కలుగున్ = జరుగుతుంది; తెవుళ్ళన్ = రోగాల వలన; నోసియున్ = నొచ్చియూ, బాధచెందికూడా; పోట్లన్ = దెబ్బలచేత, పొడుపులచేత; పడియును = నొచ్చికూడ; కొందరు; చావరు; పూరిపుడుక = గడ్డిపరక, గడ్డిపోచ; తాఁకి = గ్రుచ్చుకొని; బల+అధికులు = శక్తిసంపన్నులు; చచ్చుట = చావటం; చూచెదము = చూస్తున్నాము; ఇట్లుకాన్ = ఇట్లా జరగటానికి; కతంబు+ఏమి? = కారణమేమిటి?; ఎఱింగింపవు+ఏ = తెలుపవా?; అనుటయున్ = అని ధర్మరా జడుగగా; ఆ+మహీపతికిన్ = ఆ భూభర్తకు (ధర్మజునకు); ఆ+మహా+ఆత్ముండు = ఆ దొడ్డ మనసు గల భీష్ముడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్ముడి పలుకులు విని ధర్మజుడు, 'తాతా! ఎట్టి ప్రయత్నం లేకుండానే కొందరికి డబ్బు వస్తుంది. ధర్మాత్ములు, నీతిమంతులు అయిన శక్తి సంపన్నులు ఎన్నో మార్గాలలో, ఎన్నో ఉపాయాలతో ధనం సంపాదించటానికి సర్వయత్నాలు చేసినప్పటికినీ వారి కది లభించదు. మరి కొంతమందికి సిరి సమకూడినా సుఖ మనుభవించటానికి ఉపయోగపడదు. గురుబోధ అంతగా లేకపోయినప్పటికీ కొందరికి సులువుగా చదువులు అబ్బుతాయి. కొందరికి అధ్యాపకులు ఎంత బోధించినా ఏ మాత్రం విద్యలు పట్టువడవు. రోగాలతో నొచ్చికూడ, కత్తిపోట్లకు, కర్రదెబ్బలకు గురి అయికూడ కొందరు చావరు. మరి కొంతమంది బలవంతులు గడ్డిపోచ గ్రుచ్చుకోగా కాలం చేస్తారు. ఇట్టివెన్నో వైపరీత్యాలను చూస్తున్నాము. ఇందుకు కారణ మేమిటో తెలుపవలసింది' అని అడిగిన అజాతశత్రువుకు ఆ భీష్ముడు ఇట్లా అన్నాడు.

**శుభాశుభంబులు పూర్వ జన్మ కృత పుణ్యాపాపంబులచేఁ గల్గునని చెప్పుట. (సం.13-149-10).**

**క. 'మొలవం బెట్టని యట్టిది । మొలచునె? తొలుమేని దానముల నానార్థం**
**బులు సిద్ధించుఁ బ్రయత్నం । బులు లేకయు; నింత నిజము భూపవరేణ్యా! 430**

**ప్రతిపదార్థం:** భూపవరేణ్యా! రాజులలో ఉత్తముడా!; మొలవన్ = మొలచుటకు, చెట్టు చేమలు మొలకెత్తటానికి; పెట్టని+అట్టిది = నేలలో నాటని బీజం; మొలచును+ఎ? = పుట్టుతుందా? పుట్టదని భావం; తొలుమేని దానములన్ = పూర్వజన్మలో చేసిన దానాలచేత; నానా+అర్థంబులు = అనేక ప్రయోజనాలు; ప్రయత్నంబులు లేకయున్ = ఎట్టియత్నాలు చెయ్యకుండానే; సిద్ధించున్ = నెరవేరుతాయి; ఇంత నిజము = ఇది వాస్తవం.

**తాత్పర్యం:** 'రాజేంద్రా! నేలలో బీజం నాటకుండా మొక్క మొలుస్తుందా? మొలవనే మొలవదు. అట్లే ముందటి జన్మలో చేసిన దానాల వలననే ఎట్టి ప్రయత్నాలు లేకుండానే అన్ని ప్రయోజనాలు నెరవేరుతాయి. ఈ మాట నిజం.

**తే. అలఘు తపములు దొలుమేనఁ గలిగెనేని । వెదకి కొనివచ్చు న న్నరు విపులభోగ**
**ములు పురాకృత వృద్ధసేవల ఫలించు । బుద్ధికలిమియు విద్యలఁ బొలుచుటయును. 431**

**ప్రతిపదార్థం:** అలఘుతపములు = గొప్పతపస్సులు; తొలుమేనన్ = మునుపటి జన్మలో; కలిగెన్+ఏనిన్ = చేసి ఉన్నట్లయితే; ఆ+నరున్ = ఆ మానవుడిని; విపులభోగములు = విస్తారమైన సుఖాలు; వెదకి కొని వచ్చున్ = తాముగా వచ్చి ఆశ్రయిస్తాయి; పురాకృతవృద్ధసేవలన్ = మునుపు చేయబడిన పెద్దల శుశ్రూషవలన; బుద్ధికలిమియున్ = తెలివి కలగటం; విద్యలన్ = చదువులలో; పొలుచుటయున్ = ప్రకాశించటమూ; ఫలించున్ = సిద్ధిస్తాయి.

**తాత్పర్యం:** ముందటి జన్మలో ఘనతపస్సులు చేసి ఉన్నట్లయితే ఆ మనిషిని విస్తారమైన సుఖాలు వచ్చి వరిస్తాయి. పూర్వం చేసిన పెద్దల సేవ వలననే నరులకు తెలివితేటలు కలుగుతాయి. వారు చదువులలో రాణిస్తారు.

**క. తొలుమేన నహింసారుచి । గలిగిన దీర్ఘాయు వొందుఁ గారణభూతం**
**బులు భూవర! యివి యీ గుణ । ములు లేమియ కీడులకును మూలం బరయన్. 432**

**ప్రతిపదార్థం:** భూవర! = రాజా!; తొలుమేనన్ = మునుపటిపుట్టువులో; అహింసారుచి = అహింసయందు ప్రీతి; కలిగినన్ = ఉన్నట్లయితే; అతడు; దీర్ఘ+ఆయువున్+ఒందున్ = దీర్ఘాయుష్యమును పొందుతాడు; ఇవి = ఈ అహింసాదులు; కారణభూతంబులు = ఇందుకు హేతువులు; ఈ గుణములు లేమియ = ఈ సద్గుణాలు లేకుండటమే; అరయన్ = ఆలోచించగా; కీడులకున్ = ఆపదలకు, అనర్థాలకు; మూలంబు = హేతువు.

**తాత్పర్యం:** వెనుకటి జన్మలో అహింసయందు ఆసక్తి కలిగి ఉంటే అతడు ఈ జన్మలో దీర్ఘాయుష్మంతుడవుతాడు. యుధిష్ఠిరా! ఈ సద్గుణాలే ఇందుకు హేతువులు. ఇవి లేకుండటమే అన్ని అనర్థాలకు మూలం.

**వ. కావున. 433**

**తాత్పర్యం:** ధర్మజా! కనుక.

**తే. వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ । నము నహింసయు నియత కృత్యములు సర్వ**
**జనుల కి మ్మహాగుణములు మనమునందు । దృఢముగా నిల్పి నడపుము ధీరవర్య!' 434**

**ప్రతిపదార్థం:** ధీరవర్య! = ధైర్యం కలవారిలో శ్రేష్ఠుడా!; వినుము = ఆలకించుము; దానంబున్ = వితరణ గుణం; తపమును = తపశ్చర్య; వృద్ధసేవనము = పెద్దలకు శుశ్రూష చేయటం; అహింసయున్ = ప్రాణులను బాధించకుండటం; సర్వజనులకున్ = సమస్తప్రజలకు; నియతకృత్యములు = విధిగా ఆచరించదగిన కార్యములు; ఈ+మహాగుణములు = ఈ గొప్పగుణాలను; దృఢముగాన్ = గట్టిగా; మనమునందున్ = మనస్సులో; నిల్పి = నిలుపుకొని; నడపుము = పనులు సాగించుము.

**తాత్పర్యం:** ధీరోత్తమా! వినుము. దానం, తపస్సు, పెద్దలను సేవించటం, ప్రాణులను హింసించకుండటం, అనేవి సమస్త జనులు విధిగా ఆచరించదగిన కార్యాలు. ఈ దొడ్డ గుణాలను గట్టిగా మనసులో నిలుపుకొని అనుష్ఠించవలసినది.'

**వ. అని యుపదేశించి యాపగానందనుండు వెండియుఁ బాండవాగ్రజున కిట్లనియె. 435**

**తాత్పర్యం:** అని బోధించి గంగానదీ పుత్రుడైన భీష్ముడు మళ్ళీ పాండు మహారాజు కుమారులలో జ్యేష్ఠుడైన ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఎప్పుడు ధర్మంబునెడ నాదరము గల । వానికిఁ గాలంబు దాన యిచ్చు**
**ధర్మతత్త్వ ప్రబోధముఁ బరిస్ఫుటముగాఁ । గావున సుస్థిరభావశుద్ధి**
**సహిత తప శ్శ్రుత స్నాన దాన జపంబు । లను దేవతా పూజలను నమోఘ**
**కాలుఁడై వర్తింపఁగా ధర్మయోగంబు । సమకూరు; ధర్మంబు సాధనత్వ**

**తే. మొంది చేయించికొని చెప్పఁ బొందు నిర్మ । లాత్మకుండు సంసార పారాత్మకంబు**
**సత్య మజరామరము బోధ నిత్య మచ్యు । తము పరానంద మగు నప్పదంబు ననఘ!' 436**

**ప్రతిపదార్థం:** అనఘ! = పుణ్యుడా!; ఎప్పుడున్ = నిరంతరం, అనవరతం; ధర్మంబు+ఎడన్ = ధర్మం పట్ల; ఆదరము+కలవానికిన్ = గౌరవమున్న మనిషికి, అభిలాషగలవాడికి; కాలంబు = కాలమే; ధర్మతత్త్వబోధము = ధర్మస్వరూపజ్ఞానం, ధర్మమిట్లాంటిదనే ఎరుక; పరిస్ఫుటముగాన్ = తేటతెల్లంగా, మిక్కిలి స్పష్టంగా, విశదంగా; తాను+అ = ఆ ధర్మమే; ఇచ్చున్ = కలుగజేస్తుంది, ప్రసాదిస్తుంది; కావునన్ = కనుక; సుస్థిర = నిశ్చలమైన; భావశుద్ధి సహిత = చిత్తశుద్ధితో కూడిన, హృదయనైర్మల్యంతో కూడిన; తపః = తపస్సుచేత; శ్రుత = ధర్మశాస్త్రాల వినికిడిచేత; స్నాన, దాన, జపంబులను = స్నానం, దానం, మంత్ర జపం అనువాటి చేత; దేవతా పూజలను = దైవములను ఆరాధించటంచేత; అమోఘకాలుండు+ఐ = వ్యర్థంగాని కాలం కలవాడై; సమయాన్ని వ్యర్థపరచక; వర్తింపఁగాన్ = ప్రవర్తిస్తే; ధర్మయోగంబు సమకూడున్ = అతడికి ధర్మంతో చేరిక కలుగుతుంది, ధర్మం సంప్రాప్తిస్తుంది; ధర్మంబు = ధర్మం; సాధనత్వము+ఒంది = ఉపకరణమై; చేయించుకొని = తన ప్రచారం చేయించుకొని; చెప్పన్ = స్వరూప జ్ఞానబోధ గావించగా; నిర్మల+ఆత్మకుండు = ఆ కల్మషరహితమైన మనస్సు కలవాడు, ఆపరిశుద్ధ హృదయుడు; సంసారపార+ ఆత్మకంబున్ = భవసాగరానికి ఆవలితీరమైనదీ; సత్యము = సత్యమైనది; అజర+అమరము = ముదిమి, వినాశం లేనిదీ; బోధనిత్యంబు = జ్ఞానంచేత శాశ్వతమైనదీ; అచ్యుతము = జారుపాటులేనిదీ, నాశంలేనిదీ; పర+ఆనందము = పరమానందరూపమైనదీ; అగు = అయినట్టి; ఆపదంబున్ = ఆ స్థానమును, ముక్తిని; పొందున్ = పొందగలడు.

**తాత్పర్యం:** 'ఎల్లప్పుడూ ధర్మమందు ఆసక్తిగల జనుడికి కాలమే ధర్మతత్త్వ స్వరూప జ్ఞానం స్పష్టంగా కలిగిస్తుంది. కనుక నిశ్చలమైన చిత్తశుద్ధితో తపస్సు, ధర్మశాస్త్రాలశ్రవణం, స్నానం, దానం, మంత్రజపం, దైవారాధనం కాలాన్ని వ్యర్థపుచ్చకుండా యథావిధిగా ఆచరిస్తుంటే అట్టివాడికి ధర్మం సంప్రాప్తిస్తుంది. ఆ ధర్మాన్నే తరణోపాయంగా గైకొని తాను ఆచరిస్తూ, ఇతరులచేత ఆచరింపజేస్తూ, బోధిస్తూ ఉంటే ఆ నిర్మల హృదయుడు సంసారమునకు

ఆవలి గట్టుగ ఉన్నట్టిది, సత్యమైనది, జరామరణాలకు దవ్వైనది, జ్ఞానపూర్ణమూ, వినాశరహితమూ పరమానందరూపమూ అయిన ముక్తిపదాన్ని పొందుతాడు.'

**వ. అని నిర్దేశించి మఱియును. 437**

**తాత్పర్యం:** అని నిర్ణయించి చెప్పి ఇంకను. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. 'కను వెలుంగు వేద వ్యాస మునివరుండు । నధిప! కృష్ణుండు నీకుఁ బరాయణంబు**
**చింత దిగఁ ద్రావి పాలింపు శాంతవృత్తిఁ । బ్రజల; సర్వంబునందును విజయి వగుము.' 438**

**ప్రతిపదార్థం:** అధిప! = రాజా!; నీకున్ = నీకు; వేదవ్యాసమునివరుండు = మునిశ్రేష్ఠుడైన శ్రీవేదవ్యాసుడు; కనువెలుంగు = కంటికి వెలుతురు వంటివాడు, మార్గదర్శకుడు; కృష్ణుండు = శ్రీకృష్ణభగవానుడు; పరాయణంబు = అత్యంత ప్రియమైన ఆశ్రయస్థానం, నీకు దిక్కైన దేవుడు; చింత = విచారమును; దిగన్+త్రావి = వదలిపెట్టి; ప్రజలన్ = జనులను; శాంతవృత్తిన్ = మనోనిగ్రహంతో, మిక్కిలి చల్లగా; పాలింపు = ఏలుము; సర్వంబు+అందును = అన్ని విషయాలలో; విజయివి+అగుము = విజయం పొందుము.

**తాత్పర్యం:** 'ధర్మజా! నీకు వేదవ్యాసమహర్షి కంటికి వెలుగువంటివాడు. వాసుదేవుడు నీకు ఆరాధ్యదైవం. ఇక చింత వదలి ప్రజలను చల్లగా పరిపాలించుము, కార్యరంగములందు విజయం పొందుము.'

**క. అని యిట్లుపదేశించిన । యనిమిషతటినీ తనూజు నతుల వచనమున్**
**విని మో మలరఁగఁ బులకలు । దనువున జాదుకొన నొప్పె ధర్మజుఁ డధిపా! 439**

**ప్రతిపదార్థం:** అధిపా! = ఓ జనమేజయమహారాజా!; అని = అంటూ; ఇట్లు = ఈ ప్రకారం; ఉపదేశించిన = బోధించినట్టి; అనిమిషతటినీ తనూజు = దేవనదీపుత్రుడైన భీష్ముని యొక్క; అతులవచనముల్ = సాటిలేని మాటలు; విని = ఆలకించి; మోము = ముఖం; అలరఁగన్ = వికాసం చెందగా; పులకలు = గగుర్పాటు; తనువునన్ = శరీరమందు; జాదుకొనన్ = కలుగగా; ధర్మజుఁడు = ధర్మరాజు; ఒప్పెన్ = ప్రకాశించాడు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! ఈ విధంగా బోధించిన దివిజగంగా పుత్రుడైన భీష్ముడి సాటి లేని మాటలు ఆలకించగానే ధర్మపుత్రుడి ముఖం వికసించింది. గగుర్పాటు పొందిన శరీరంతో అతడు ప్రకాశించాడు.

**సీ. అపుడు వీక్షించి సత్యవతీ సుతుండు శం । తనునందనునితోడ 'ధర్మజుండు**
**దెలివొందె భవదుప దేశామృతంబున; । ననుజులుఁ గృష్ణుండు నాప్తసకల**
**రాజన్యులును ధృతరాష్ట్రుండుఁ దానును । దగ ని న్నుపాసించి దయకుఁ బాత్ర**
**మయ్యెః వీడ్కొలుపు మియ్యవనీశుఁ; దఱితోడఁ । గ్రమ్మఱ నితఁడు నీ కడకు వచ్చు**

**ఆ. వాఁడుగాక!' యనిన వాత్సల్యమున నార్ద్ర । మైన చూడ్కి న మ్మహాత్ముఁ డతనిఁ**
**జూచి 'పురికిఁ జనుము; శుభపరంపరలకు । భాజనంబ వగుము రాజముఖ్య!' 440**

**ప్రతిపదార్థం:** అపుడు = ఆ వేళ; సత్యవతీసుతుండు = సత్యవతి కుమారుడైన వ్యాసమహర్షి; వీక్షించి = చూచి; శంతనునందనునితోడన్ = శంతను మహారాజు పుత్రుడైన భీష్ముడితో; భవత్+ఉపదేశ+అమృతంబునన్ = నీ బోధఅనెడు సుధారసంచేత; ధర్మజుండు; తెలివి+ఒందెన్ = జ్ఞానం పొందినాడు; అనుజులున్ = తోబుట్టువులును; కృష్ణుండున్; ఆప్త సకలరాజన్యులును = హితులైన సమస్తరాజులును, ధృతరాష్ట్రుండున్; తానును = తాను కూడ (ధర్మజుడు); తగన్ = చక్కగా; నిన్నున్; ఉపాసించి = కొలిచి; దయకున్ = నీకృపకు; పాత్రము+అయ్యెన్ = అర్హుడైనాడు; ఈ+అవనీ+ఈశున్ = ఈ భూపతిని; వీడ్కోలుపుము = సెలవిచ్చి పంపుము; తఱితోడన్ = సమయం రాగానే; క్రమ్మఱన్ = మరల; ఇతఁడు = ఈ ధర్మపుత్రుడు; నీ కడకున్ = నీ చెంతకు; వచ్చువాఁడుగాక = రాగలడు; అనినన్ = అని వ్యాసమహర్షి పలుకగా; ఆ+మహా+ఆత్ముఁడు = ఆ భీష్ముడు; వాత్సల్యమునన్ = వాత్యల్యరసంచేత; ఆర్ద్రము+ఐన+చూడ్కిన్ = తడిసిన చూపుచేత; అతనిన్ = ధర్మరాజును; చూచి; రాజముఖ్య= రాజులలో శ్రేష్ఠుడా; పురికిన్ = హస్తినకు; చనుము = వెళ్ళుము; శుభపరంపరలకున్ = శుభములయొక్క వరుసకు, సమూహమునకు; భాజనంబవు+అగుము = పాత్రుడవు కమ్ము.

**తాత్పర్యం:** అపుడు వ్యాసమహర్షి భీష్ముడిని చూచి, 'ధర్మజుడు నీ ఉపదేశసుధారసం తనివార గ్రోలి జ్ఞానఘనుడైనాడు. సోదరులు, వాసుదేవుడు, మిత్రులైన సమస్తరాజులు, ధృతరాష్ట్రుడు, తానూ చక్కగా నిన్ను సేవించి నీ కృపకు పాత్రమైనాడు. ఇక ఈతనికి సెలవిచ్చి హస్తినకు పంపుము. సమయానికి తిరిగి నీ దగ్గరకు రాగలడు' అని చెప్పాడు. భీష్ముడు వాత్సల్య రసంచేత తడిసిన చూపులతో ధర్మజుడిని వీక్షించి ఓ రాజశ్రేష్ఠుడా! నీవు పురమునకు వెళ్లుము. శుభ పరంపరలు పొందుము'.

**భీష్ముఁడు ధర్మజు నూఱడించి కరిపురంబునకుఁ బంపుట. (సం.13-152-5).**

**వ.** **అని యనుజ్ఞ చేసి వెండియు.** **441**

**తాత్పర్యం:** అని సెల వొసంగి మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **'నీ బుద్ధి ధర్మైకనిష్ఠ గావుతను; స । మగ్ర దక్షిణ బహుయజ్ఞములు య**
**యాతి చందమున శ్రద్ధాన్వితంబుగఁ జేయు; । రాజ ధర్మంబునఁ బ్రకృతి రంజ**
**నము నాచరింపు; చుట్టములును జెలులును । బండిన వృక్షంబుఁ బక్షి కులము**
**లెట్లట్ల నిన్నాశ్రయించి సుఖించువా; । రర్కుని యుత్తరాయణము వచ్చు**

**తే.** **టరసికొనియుండి నాకడ కరుగుదెమ్ము । పొమ్ము; తల్లియుఁ దమ్ములు భూవరుండు**
**నీవు సుఖులరై యుండుఁడు నృపవరేణ్య!' । యనుడు నానంద మొంది ధర్మాత్మజుండు.** **442**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్యా! = రాజులలో శ్రేష్ఠుడా!; నీ బుద్ధి = నీ మనస్సు; ధర్మ+ఏకనిష్ఠ+కావుతను = ధర్మమందు ముఖ్యంగా నిలుకడ కలది అగుగాక, కుదురుకొను గాక!; సమగ్ర దక్షిణ = అధిక దక్షిణలుగల; బహుయజ్ఞములు = అనేక యాగాలు; యయాతి చందమునన్ = యయాతి మహారాజువలె; శ్రద్ధా+అన్వితంబుగన్ = విశ్వాససహితంగా; చేయు = సల్పుము; రాజధర్మంబునన్ = రాజు అనుసరించవలసిన ధర్మంతో; ప్రకృతిరంజనము = ప్రజలను సంతోషపెట్టటం, అలరించటం; ఆచరింపుము = కావింపుము, చుట్టములును = బంధువులు; చెలులును = మిత్రులు; పండిన వృక్షంబున్ = ఫలించిన చెట్టును, పండ్ల చెట్టును; పక్షికులములు = పక్షులగుంపులు; ఎట్లు = ఏ విధంగా ఆశ్రయించుకొని ఉంటాయో; అట్లు+అ = ఆ రీతిగానే;

నిన్నున్ = నిన్ను; ఆశ్రయించి = ఆధారం చేసికొని; సుఖించువారు = సుఖంగా ఉంటారుగాక!; అర్కుని = సూర్యుడి యొక్క; ఉత్తర+అయనము+వచ్చుట = మకరరాశిలో ప్రవేశం జరగటం; అరసికొని+ఉండి = కనిపెట్టుకొని ఉండి; నాకడకున్ = నాదగ్గరకు; అరుగుదెమ్ము = రావలసినది; పొమ్ము = ఇపుడు పట్టణానికి వెళ్ళుము; తల్లియున్ = మీ జనని; తమ్ములున్ = నీ సోదరులు; భూవరుండున్ = రాజగు ధృతరాష్ట్రుడును; నీవున్ = నీవు; సుఖులరు+ఐ+ఉండుఁడు = సుఖంగా ఉండండి; అనుడున్ = అని భీష్ముడు చెప్పగా; ధర్మ+ఆత్మజుండు = ధర్మరాజు; ఆనందము+ఒంది = హర్షించి. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** 'నరనాథోత్తమా! నీబుద్ధి ధర్మమందే నిశ్చలంగా నిలుచుగాక! యయాతిమహారాజు వలె భూరిదక్షిణ లిచ్చి అనేక యాగాలు శ్రద్ధావంతుడవై చేయవలసింది. రాజ ధర్మాన్ననుసరించి రాష్ట్రంలోని ప్రజలను సంతోషపెట్టుము. పండ్ల చెట్టును పక్షిసమూహం వలె నిన్నాశ్రయించుకొని ఉన్న నీ చుట్టాలు, నీ మిత్రులు సుఖింతురుగాక! సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన శుభకాలం కనిపెట్టుకొని ఉండి నా దగ్గరకు రావలసింది. ఇపుడు హస్తినాపురికి వెళ్ళుము. నీ తల్లీ, నీ తమ్ముళ్ళూ, నీ తండ్రి ధృతరాష్ట్రుడూ, నీవూ సుఖంగా ఉండండి' అని గాంగేయు డనగానే ధర్మజుడు ఆనందించి-

**విశేషం:** అలం: ఉపమ.

**వ. 'అట్ల చేయువాఁడ' నని సవినయంబుగాఁ బలికి దేవవ్రతునకు దండప్రణామం బాచరించి యిట్లు వీడుకొని. 443**

**ప్రతిపదార్థం:** అట్లు+అ = నీవు చెప్పిన విధంగానే; చేయువాఁడన్ = చేయగలను; అని; సవినయంబుగాన్ = అణకువతో కూడేటట్లు; పలికి; దేవవ్రతునకున్ = భీష్మునికి; దండప్రణామంబు+ఆచరించి = కర్రవలె నేల వ్రాలి నమస్కరించి; ఇట్లు వీడుకొని = ఈ విధంగా భీష్ముడిని వదలి, పోయివచ్చెదనని విన్నవించి బయలుదేరి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** 'తమరు చెప్పినట్లుగానే నడుచుకొంటా' నని వినయంతో విన్నవించి భీష్మునికి సాష్టాంగదండప్రణామం చేసి, 'వెళ్ళి వస్తా' నని చెప్పి సెలవు గైకొన్నాడు ధర్మరాజు.

**క. మును లనుపఁగఁ గృష్ణాదులుఁ । జనుదేరఁగ నాత్మపురికిఁ జనియె ముదితులై**
**జను లెదురు కొనఁగఁ బుణ్యాం । గనలును విప్రులును వచ్చి కని దీవనతోన్. 444**

**ప్రతిపదార్థం:** మునులు = మునీశ్వరులు; అనుపఁగన్ = పోయిరమ్మని పంపగా; కృష్ణ+ఆదులు = ముకుందుడు మున్నగువారు; చనుదేరఁగన్ = వెంటరాగా; ఆత్మపురికిన్ = తననగరానికి; చనియెన్ = ధర్మజుడు వెళ్ళాడు; ముదితులు+ఐ = సంతసించినవారై; జనులు = పురంలోని ప్రజలు; ఎదురుకొనఁగన్ = తనకు ఎదురుగా రాగా, ప్రత్యుత్థానం సల్పగా; పుణ్య+అంగనలును = ముత్తైదువలునూ; విప్రులును = భూసురులును; వచ్చి = చనుదెంచి, అరుదెంచి, తోతెంచి; కని = తనను వీక్షించి; దీవనతోన్ = ఆశీర్వాదంతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** ధర్మజుడు మునీశ్వరులు తనను పోయి రమ్మని పంపగా వాసుదేవుడు మున్నగువారు వెంటరాగా తన నగరానికి వెళ్ళాడు. సంతోషంతో పురప్రజలు ఎదురుగా వచ్చారు. ముత్తైదువలు, బ్రాహ్మణులు వచ్చి తనను దర్శించి దీవనలతో.

**క. సేసలు చల్లఁగ మహిమో । ద్భాసితుఁడై యిట్లు వోయి ధర్మజుఁడు నిజా**
**వాసంబు సొచ్చి గాంధా । రీసంభావన మొనర్చి ప్రియము దలిర్పన్. 445**

**ప్రతిపదార్థం:** సేసలు చల్లఁగన్ = మంగళాక్షతలు తన శిరంపై చల్లగా; ధర్మజుడు; మహిమ+ఉద్భాసితుఁడు+ఐ = గొప్ప తనంతో, ప్రాభవంతో ప్రకాశిస్తున్నవాడై; ఇట్లుపోయి = ఈ ప్రకారంగా వెడలినవాడై; నిజ+ఆవాసంబు+చొచ్చి = తన ఇంటిలో, ప్రాసాదంలో, మందిరంలో, భవనంలో ప్రవేశించి; గాంధారీ సంభావనము+ఒనర్చి = గాంధారీదేవిని ఆదరించి, ఓదార్చి; ప్రియము+తలిర్పన్ = ప్రేమ చిగురింపగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** మంగళాక్షతలు తన శిరంపై చల్లుతుండగా ధర్మజుడు ప్రాభవంతో దీపిస్తూ బయలుదేరి పురికి విచ్చేసి తన భవనంలో ప్రవేశించాడు. ప్రవేశించగానే తొలుత గాంధారీదేవిని దర్శించి, ఆమె నూరడించాడు. ఆ తరువాత ప్రేమ చిగురింపగా.

**ఆ. తల్లి కెఱఁగి ముదము ద్రౌపది కొనరించి । సకలపౌరజనుల జానపదుల**
**నెలమి యొలయ వీడుకొలిపి భూసురులకు । దానవిధుల సమ్మదం బొనర్చి. 446**

**ప్రతిపదార్థం:** తల్లికిన్ = జనని అయిన కుంతీమహాదేవికి; ఎఱఁగి = నమస్కరించి; ద్రౌపదికిన్ = పాంచాలికి; ముదము = సంతోషం; ఒనరించి = కలిగించి; సకలపౌరజనులన్ = సమస్త పట్టణప్రజలను; జానపదులన్ = గ్రామవాసులను, పల్లెలలో నివసించే జనులనూ; ఎలమి = ప్రీతి; ఒలయన్ = జనింపగా, అతిశయించగా; వీడుకొలిపి = తనను దర్శింపవచ్చిన ఈ జనులందరిని పోయిరండని సాగనంపి; భూసురులకున్ = విప్రులకు; దానవిధులన్ = దానంచేయటం చేత; సమ్మదంబు+ఒనర్చి = సంతోషం సమకూర్చి. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** ధర్మజుడు తన తల్లి అయిన కుంతీ మహాదేవికి నమస్కరించాడు. ద్రౌపదీదేవికి సంతసం కలిగించాడు. తనను దర్శించవచ్చిన నగరవాసులను, పల్లీ వాసులను ఆనందంతో వెళ్ళిరండని సాగనంపి బ్రాహ్మణులను దాన, ధర్మాది విధులచే సంతోషపరిచాడు.

**వ. విపతులైన సతులకు సమగ్రధనంబు లొసంగి, ధృతరాష్ట్రునిం బ్రభూత పూజా కరణంబునం బరితుష్టునిం జేసి. 447**

**ప్రతిపదార్థం:** విపతులు+ఐన = భర్తలను కోల్పోయిన; సతులకున్ = స్త్రీలకు; సమగ్రధనంబులు+ఒసంగి = దండిగా విత్తమిచ్చి; ధృతరాష్ట్రునిన్; ప్రభూతపూజాకరణంబునన్ = అధికంగా పూజించటంచేత; సంతుష్టునిన్+చేసి = తృప్తిపరచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ధర్మజుడు మగలను పోగొట్టుకున్న మగువలకు అధికంగా ధనము లిచ్చాడు. ధృతరాష్ట్రుడిని మిక్కుటమైన పూజలచేత సంతృప్తిపరిచాడు.

**తే. తమ్ములును గృష్ణుఁడును బ్రమోదమునఁ దేల । నమ్మహీశ్వరుఁ డపుడు రాజ్యాభిషేక**
**మంగళము నొందినట్లు నెమ్మదిఁ దలంచి । గట్టియైన యూఱట పెంపుఁ గాంచి పొలిచె. 448**

**ప్రతిపదార్థం:** తమ్ములును = తోబుట్టువులైన భీమాదులు; కృష్ణుఁడును = మాధవుడునూ; ప్రమోదమునన్+తేలన్ = ఆనందంలో తేలియాడగా; ఆ+మహీ+ఈశ్వరుండు = ఆ భూవల్లభుడు - ధర్మరాజు; అపుడు = ఆ వేళ; రాజ్య+ అభిషేక+ మంగళమున్ = రాజ్యాభిషేక మనే శుభప్రయోజనాన్ని; ఒందిన+అట్లు = పొందినరీతిగా; నెమ్మదిన్+తలంచి = తన నిండు మదిలో భావించి; గట్టి+ఐన+ఊఱట+పెంపున్ = దృఢమైన విశ్రాంతి యొక్క ఆధిక్యమును; కాంచి = పొంది; పొలిచెన్ = స్వస్థచిత్తుడై శోభిల్లాడు.

**తాత్పర్యం:** తన తోబుట్టువులూ, గోవిందుడూ పరమానందభరితు లౌతూ ఉండగా ధర్మజుడు అపుడు రాజ్యాభిషేక శుభమును పొందిన వాడి వలె తన నిండు మదిలో భావించి మిక్కిలి విశ్రాంతి వహించి విరాజిల్లాడు.

**వ. అట్లు శోభిల్లి వారల నుచిత ప్రకార సమాచరణంబులకుం జన నియోగించి యభ్యంతర మందిరంబున కరిగె; న ట్లజాతశత్రుండు సమ్యగంగీకృత సామ్రాజ్యుం డయి జన సంపూజ్యం బగు చరితంబున సంప్రవర్తిలు చుండఁ బంచాశ ద్వాసరానంతరంబ వాసరపతి యుత్తరాయణగతుం డగుటయు. 449**

**ప్రతిపదార్థం:** అట్లు; శోభిల్లి = ప్రకాశించి; వారలన్ = తన తమ్ముళ్ళను; ఉచితప్రకార సమాచరణంబులకున్ = తగు విధములైన కార్యాచరణములకు; చనన్ = వెళ్లుటకు; నియోగించి = నియమించి; అభ్యంతరమందిరంబునకున్ = లోపలి సౌధంలోనికి; అరిగెన్ = వెళ్ళాడు; అట్లు = ఆ విధంగా; అజాతశత్రుండు = ధర్మజుడు; సమ్యక్+అంగీకృత సామ్రాజ్యుండు+అయి = చక్కగా సమ్మతించబడిన (స్వీకరించబడిన) సామ్రాజ్యం కలవాడై; జనసంపూజ్యంబు+అగు = ప్రజలచే పూజింపదగిన, గౌరవించదగిన; చరితంబునన్ = ప్రవర్తనతో; సంప్రవర్తిలుచున్+ఉండన్ = మెలగుతుండగా; పంచాశత్+వాసర+అనంతరంబు+అ = యాభైరోజుల తర్వాత; వాసరపతి = దినాధిపతి అయిన సూర్యుడు; ఉత్తర+అయన+గతుండు+అగుటయున్ = ఉత్తరాయణంలో ప్రవేశించినవాడుకాగా;

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు ప్రకాశిస్తూ తన తమ్ముళ్ళను తత్తత్ కాలోచితములైన పనుల నిర్వహణానికి నియమించి తాను లోపలి సౌధం లోనికి వెళ్ళాడు. ఆయన చక్కగా రాజ్య పరిపాలన బాధ్యతలు స్వీకరించి జనాదరణీయమైన ప్రవర్తనతో మెలగుతుండగా యాభై దినముల పిదప సూర్యభగవానుడు ఉత్తరాయణంలో ప్రవేశించాడు.

ధర్మజుఁడు కృష్ణాదులఁ దోడ్కొని భీష్ముని యొద్దకుం బోవుట. (సం.13-153-6).

**సీ. అ క్కౌరవేశ్వరుం డప్పుడు కదలి గాం । ధారిని ధృతరాష్ట్ర ధరణి విభుని**
**గొంతిని మున్నిడుకొని కృష్ణుఁ దమ్మునిఁ । దన తమ్ములను విదురుని యుయుత్సు**
**సంజయులను గృపాచార్యధౌమ్యుల మంత్ర । కోవిదులగు యాజకులను దోడఁ**
**గొని వస్త్ర చందనాగురు పుష్ప ఫలఘృత । కుండముల్ వట్టించుకొని యనేక**

**తే. రత్నములుఁ గాంచనంబుఁ దో రాఁగ నగ్ని । యంచితంబుగఁ దా సంఘటించి యోగ్య**
**జన సమానీతముగఁ జేసి సకల పరిజ । నంబుఁ గొల్వ మహావిభవంబు మెఱయ. 450**

**ప్రతిపదార్థం:** ఆ+కౌరవ+ఈశ్వరుండు = ఆ కురువంశ ప్రభువు - ధర్మజుడు; అప్పుడు = అపుడే; కదలి = బయలుదేరి; గాంధారినిన్; ధృతరాష్ట్ర ధరణివిభునిన్ = ధృతరాష్ట్ర మహీపతిని; గొంతినిన్ = కుంతీదేవిని; మున్ను+ఇడుకొని = ముందుంచుకొని; కృష్ణున్ = యదువల్లభుడిని; తమ్మునిన్ = ఆయన అనుజుడైన సాత్యకిని; తన తమ్ములను = తన తోబుట్టువులైన

భీమాదులను; విదురునిన్; యుయుత్సుసంజయులనున్ = ధృతరాష్ట్రుడి కుమారులలో బ్రతికిఉన్న యుయుత్సుడిని, సంజయుడిని; కృప+ఆచార్య ధౌమ్యులన్ = గురువైన కృపాచార్యుడిని, పురోహితుడైన ధౌమ్యుడిని; మంత్రకోవిదులు+అగు = మంత్రవిద్యలందు నిపుణులైన; యాజకులను = యజ్ఞములు చేయించగల ఋత్విక్కులను; తోడన్+కొని = తన వెంట బెట్టుకొని; వస్త్ర = నూతనములైన వస్త్రాలు; చందన = శ్రీగంధం, మంచిగంధపు కొయ్యలు; అగురు = అగురు అనే పరిమళద్రవ్యం, అగురు చెక్కలు; పుష్ప = పూలు; ఫల = పండ్లు; ఘృతకుండముల్ = నేతికడవలు; పట్టించుకొని = మోయించుకొని; అనేక రత్నములున్ = పెక్కు రత్నాలు, మాణిక్యాలు; కాంచనంబున్ = బంగారం; తోన్+రాఁగన్ = తన వెంబడి వస్తుండగా; అగ్ని = నిప్పు; అంచితంబుగన్ = ఒప్పిదంగా, పూజ్యంగా; తాన్ = తాను; సంఘటించి = సమకూర్చి; యోగ్యజన సమానీతముగన్+చేసి = అర్హులైన జనులచే చక్కగా కొనిరాబడుతున్నదిగా ఒనర్చి; సకలపరిజనంబున్ = సమస్త సేవక బృందం; కొల్వన్ = తనను సేవిస్తూ ఉండగా; మహావిభవంబు మెఱయన్ = గొప్ప వైభవం దీపించగా. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** కురువంశరాజులలో మేటి అయిన ధర్మజుడు గాంధారీధృతరాష్ట్రులను, కుంతీదేవిని ముందుంచుకొని శ్రీకృష్ణుడిని, ఆయన తమ్ముడు సాత్యకినీ, తన తమ్ములైన భీమాదులనూ, విదుర సంజయులనూ, ధృతరాష్ట్రుడి పుత్రులలో బ్రతికిఉన్న యుయుత్సుడిని, కృపాచార్యధౌమ్యులనూ, మంత్రవేత్తలైన ఋత్విక్కులనూ వెంటబెట్టుకొని బయలుదేరాడు. నూతన వస్త్రాలు, చందన కాష్ఠములు, అగరు చెక్కలు, పూలు, పండ్లు, నేతికుండలు మోసికొంటూ పరిజనులు వెంటనడిచారు. అనేక మణులు మాణిక్యాలు బంగారం ఆయన వెంట కదలి వచ్చాయి. పవిత్రాగ్నిని యోగ్యజనులు జాగరూకులై తీసికొని వస్తుండగా యుధిష్ఠిరుడు సేవక గణం తనను సేవిస్తుండగా మహా వైభవంతో విరాజిల్లుతూ.

**వ. చని భీష్ముని వీరశయనస్థానంబున కనతి దూరంబునం దేరు డిగ్గినం గృష్ణాదులును రథావతరణంబులు చేసిరి; తానును వారును బారాశర్య నారద దేవల ప్రభృతి పరమసంయమి సముపాస్యమానుం డగు న మ్మాననీయుం జేర నరిగి ముని జనంబులకు వినతుం డయి తదభినందితుం డగుచు నా ధర్మనందనుం డయ్యమరనదీనందనునకు నభివందనం బాచరించి సమీచీనధ్యానతత్పరుండైన య ద్దేవవ్రతు నుద్దేశించి. 451**

**ప్రతిపదార్థం:** చని = వెళ్ళి; భీష్ముని వీరశయన స్థానంబునకున్ = వీరుడైన గాంగేయుడి పడుక ఉన్నచోటికి; అనతి దూరంబునన్ = చేరువలోనే; తేరు+డిగ్గినన్ = స్యందనం నుండి దిగిన వెంటనే; కృష్ణ+ఆదులును = శౌరి మొదలైనవారు; రథ+అవతరణంబులు చేసిరి = తమ తమ తేరుల నుంచి దిగారు; తానును = ధర్మజుడును; వారును = కృష్ణాదులును; పారాశర్య = పరాశర మునీంద్ర పుత్రుడైన వ్యాసుడు; నారద, దేవల ప్రభృతి = నారదుడు, దేవలుడు మొదలగు; పరమ సంయమి = మహామునులచే; సముపాస్యమానుండు+అగు= లెస్సగా సేవించబడుతున్న; ఆ+మాననీయున్ = ఆ గౌరవించదగిన భీష్ముడిని; ఆ ధర్మనందనుండు = ఆ ధర్మరాజు; చేరన్+అరిగి = చెంతకు వెళ్ళి; మునిజనంబులకున్ = యోగులకు; వినతుండు+అయి = నమస్కరించి; తత్+అభినందితుఁడు+అగుచున్ = వారిచే కొనియాడబడుతూ, సంతోషపరచబడినవాడై; ఆ+అమరనదీ నందనునకున్ = ఆ దేవనదీకుమారుడైన భీష్ముడికి; అభివందనంబు+ఆచరించి = ప్రణామం సమర్పించి; సమీచీన ధ్యాన తత్పరుండు+ఐన = ఉచితమైన ధ్యానంలో నిమగ్నుడైన; ఆ+దేవవ్రతున్+ఉద్దేశించి = ఆ భీష్ముడిని గురించి; ఆయన వైపు చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ధర్మరాజు మహావీరుడైన భీష్ముడు పరుండి ఉన్న ప్రదేశానికి సమీపంలో రథం దిగాడు. శ్రీకృష్ణుడు మొదలైన వారంతా తమతమ తేరులనుండి దిగారు. అజాతశత్రుడు వారితో కలసి వ్యాసుడు, నారదుడు, దేవలుడు మున్నగు మహర్షులచే సేవించబడుచున్న పూజార్హుడైన శాంతనవుడి చెంతకరిగి ముందు అక్కడి మునులకు నమస్కరించాడు. ఆ మౌనిపుంగవు లందరూ తనను కొనియాడగా పాండవాగ్రణి గంగాపుత్రుడికి ప్రణమిల్లి ధ్యాననిమగ్నుడైన ఆ మహామహు నుద్దేశించి.

**తే.** **'అనఘ! వచ్చితి ధర్మనందనుఁడఁ; బ్రణతి । యాచరించెద; నాపలు కవధరింప**
**నవసరంబేని విను సమయంబు వార్చి । యగ్ని మొదలుగఁ దేఁ దగు నట్టివాని. 452**

**ప్రతిపదార్థం:** అనఘ! = పుణ్యుడా!; ధర్మనందనుఁడన్ = నేను ధర్మపుత్రుడిని; వచ్చితిన్ = వచ్చాను; ప్రణతి+ఆచరించెదన్ = నమస్కారం చేస్తున్నాను; నా పలుకు = నా మాట; అవధరింపన్ = చిత్తగించటానికి; అవసరంబు+ఏని = అవసరమైతే, సమయం కుదిరితే; విను= ఆలకించవలసినది; సమయంబు వార్చి = ఉత్తరాయణ వేళ కొరకు నిరీక్షించి; అగ్ని మొదలుగన్ = దహనసంస్కారానికి కావలసిన అనలం మొదలుకొని; తేన్+తగు+అట్టివానిన్ = తీసికొనిరాదగినట్టి వస్తువులనెల్ల (తీసుక వచ్చానని తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** 'పుణ్యపురుషా! నేను ధర్మజుడిని; వచ్చాను. నీకు నమస్కరిస్తున్నాను. అవసరమైతే నా మాటలు చిత్తగించ వలెనని వేడుతున్నాను. ఉత్తరాయణం రాగానే అగ్ని మొదలుగా తీసికొని రాదగిన వస్తువుల నెల్ల (తీసికొని వచ్చాను).

**సీ.** **తెచ్చితి, ఋత్విజుల్ వచ్చిరి, హరియు నీ । తనయుఁడు ధృతరాష్ట్రుఁడును, సమస్త**
**బంధులుఁ గల మహీపతులు విప్రులుఁ బౌర । జనులు నేతెంచిరి సదయహృదయ!**
**వీరిఁ జూడుము కను విచ్చి' నావుడు నమ్మ । హాత్ముఁ డందఱఁ జూచి యా నృపాలు**
**కేలు దెమల్చుచు 'మేలు చేసితి దైవ । యోగంబు గాదె నీ వొదవు టరయ**

**ఆ.** **మనుజనాథ! మాఘమాసంబు శుక్ల ప । క్షంబు నామనమున సంప్రమోద**
**మావహిల్లఁ జేసె' నని యభినందించి । యతని కధిక హర్ష మావహించె. 453**

**ప్రతిపదార్థం:** తెచ్చితిన్ = తీసికొని వచ్చాను; ఋత్విజుల్ = పురోహితులు; వచ్చిరి = వచ్చారు; హరియున్ = నారాయణుడును; నీ తనయుఁడు = నీ కుమారుడైన; ధృతరాష్ట్రుఁడును = ధృతరాష్ట్ర మహారాజును; సమస్త బంధులున్ = చుట్టాలందరును, కలమహీపతులున్ = ఉన్న రాజులు; విప్రులున్ = భూసురులు; పౌరజనులున్ = పురవాసులును; ఏతెంచిరి = వచ్చి ఉన్నారు; సదయహృదయ! = దయతో కూడిన మనసుగల పితామహా!; కనువిచ్చి = కన్నులు దెరచి; వీరిన్ = ఈ వచ్చినవారిని; చూడుము = కనుగొనుము; నావుడున్ = అని ధర్మజుడు వచింపగా; ఆ+మహా+ఆత్ముఁడు = ఆ గొప్ప మనసు గల భీష్ముడు; అందఱన్+చూచి = ఎల్లరినీ విలోకించి; ఆ నృపాలుకేలు = రాజైన ధర్మజుడి హస్తం; తెమల్చుచున్ = తన చేతితో పట్టుకొని కదలిస్తూ; మేలు చేసితి = ఉపకార మొనర్చావు; నీవు = నీవు; ఒదవుట = నాకు లభించటం; అరయన్ = ఆలోచించగా; దైవ యోగంబు+అ+కాదు+ఎ? = దైవము యొక్క తోడ్పాటు కాదా?; మనుజనాథ! = ధర్మజా!; మాఘమాసంబు+శుక్లపక్షంబు = మాఘమాసంలోని సితపక్షం; నామనమునన్ = నా హృదయంలో; సంప్రమోదము = మిక్కిలి ఆనందం; ఆవహిల్లన్+చేసెన్ = కలిగించింది; అని; అభినందించి = కొనియాడి; అతనికిన్ = ధర్మరాజుకు; అధికహర్షము = మిక్కుటమైన సంతోషం; ఆవహించెన్ = కలిగించాడు.

**తాత్పర్యం:** తాతా! తీసికొనిరాదగిన వస్తువు లన్నిటినీ తీసికొని వచ్చాను. మంత్రవేత్తలైన పురోహితులు వచ్చారు. శ్రీకృష్ణుడు, నీ కుమారుడైన ధృతరాష్ట్ర మహారాజు, చుట్టాలు. ఉన్న రాజులూ, బ్రాహ్మణులూ, పౌరులూ వచ్చి ఉన్నారు. ఓ కరుణామయహృదయుడా! వీరినందరినీ కనువిచ్చి చూడు' మని ధర్మజుడు వేడుకొన్నాడు. మహాత్ముడైన గాంగేయుడు వారి నందరిని కలయజూచి, ధర్మతనయుడి కరము తన కరముతో పెనవేసి కదలిస్తూ 'నరేశ్వరా! ఎంతో ఉపకారం చేశావు. నీవు నాకు దైవానుగ్రహం వలననే లభించావు. ఈ మాఘమాస శుక్ల పక్షం నామది కెంతో హర్షం సమకూర్చింది' అని ధర్మజుని కొనియాడి అతడికి అధికానందం చేకూర్చాడు.

**వ. తదనంతరంబ ధృతరాష్ట్రునితో నిట్లనియె. 454**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ = ఆ తరువాత; ధృతరాష్ట్రునితోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ పిదప ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'వేదశాస్త్ర పరిజ్ఞాన వృద్ధసేవ । నములు గలిగి యశేషధర్మములు నెఱిఁగి**
**వ్యాసమునిపతి దేవరహస్య మర్థిఁ । జెప్ప విని నిష్కళంకత నొప్పి తనఘ! 455**

**ప్రతిపదార్థం:** అనఘ! = పుణ్యుఁడా!; వేదశాస్త్రపరిజ్ఞాన = వేదములందలి, శాస్త్రములందలి విశేషజ్ఞానం; వృద్ధసేవనములు = పెద్దల యొక్క శుశ్రూష; కలిగి = లభించి; అశేషధర్మములున్ = సమస్త ధర్మాలు; ఎఱిఁగి = తెలిసి; వ్యాసమునిపతి = మునీంద్రుడైన వ్యాసులవారు; దేవరహస్యము = దేవతలకు మాత్రమే తెలిసిన రహస్యాన్ని; అర్థిన్ = ప్రీతితో; చెప్పన్ = తెలుపగా; విని = ఆకర్ణించి; నిస్+కళంకతన్ = దోషరాహిత్యంతో, ఎట్టి దోషం లేక; ఒప్పితి = ప్రకాశించావు.

**తాత్పర్యం:** 'పుణ్యపురుషా! నీవు వేదశాస్త్ర విజ్ఞానం, పెద్దలసేవ కలిగిన వాడివి. అన్ని ధర్మాలు ఎరిగిన వాడివి; వేదవ్యాసమహర్షి ప్రీతితో దేవతలకు మాత్రమే ఎరుగదగిన రహస్యం ఎరిగించగా విని దోషరహితుడవై వెలుగొందుతున్నావు.

**క. కావున భవితవ్యములకు । నీ వడలఁగ వలదు; పాండునృపపుత్త్రులు స**
**ద్భావమునఁ జూడ నేర్చిన । భూవర! తగ నీవు గన్న పుత్త్రులుగారే.! 456**

**ప్రతిపదార్థం:** కావునన్ = కనుక; భవితవ్యములకున్ = జరుగనున్నవాటికై; నీవు; అడలఁగన్+వలదు = భయపడవద్దు; పాండు నృపపుత్త్రులు = పాండురాజు కొడుకులు; సద్+భావమునన్ = మంచితలంపుతో; చూడన్+నేర్చినన్ = నీవు చూడగలిగితే; భూవర! = ఓ రాజా!; తగన్ = యోగ్యంగా; నీవు = నీవు; కన్నపుత్రులు+కారు+ఏ = కనినట్టిబిడ్డలు కారా? కన్న కుమారులే అని భావం.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజా! జరుగనున్న వాటిని గూర్చి నీవు భయపడనక్కరలేదు. మంచితలంపుతో నీవు చూడ గలిగితే నీ తమ్ముడైన పాండురాజు కుమారులు నిజంగా నీకడుపున పుట్టిన బిడ్డలవంటి వారే కదా!

**క. వీరిం బరిపాలింపుము; । వీరలశుశ్రూషఁ జిత్త వృత్తి ముదమునం**
**గూరఁగ ధర్మసుతునిపైఁ । గారుణ్యము గలిగి పనులు గఱపుము నెమ్మిన్. 457**

**ప్రతిపదార్థం:** వీరిన్ = పాండునందనులను; పరిపాలింపుము = కాపాడుము; వీరలశుశ్రూషన్ = వీరిసేవవలన; చిత్తవృత్తి = మనోవ్యాపారం; ముదమునన్ = సంతోషంతో; కూరఁగన్ = నిండగా; ధర్మసుతునిపైన్ = ధర్మపుత్రుడి మీద; కారుణ్యము = కృప; కలిగి = కల్గినవాడవై; నెమ్మిన్ = ప్రీతితో; పనులు+కఱపుము = కర్తవ్యములు బోధింపుము, రాచకార్యముల నెరిగింపుము-

**తాత్పర్యం:** రాజా! పాండవులను పరిపాలించుము. వీరి సేవలవలన నీ హృదయం ఆహ్లాదంతో నిండగా, ధర్మజుడిపై కృప చూపుము. ప్రీతితో ఇతడికి కర్తవ్యబోధ కావింపుము.

**తే. ఏ నెఱుంగుదు నితఁడు నీయెడఁ బ్రియంబు । భక్తియును గల్గి యక్రూరభావుఁ డగుట**
**నీవు వత్సలత్వమున నీ నృపతిఁ బంచి । పనులు గొనుము కౌరవకుల భారధుర్య! 458**

**ప్రతిపదార్థం:** కౌరవకుల భారధుర్య! = కౌరవవంశ భారమును మోసేవాడా!; ఇతఁడు = ధర్మరాజు; నీ+ఎడన్ = నీ విషయంలో; ప్రియంబు = ప్రేమ; భక్తియును+కల్గి = భక్తియును కలిగి; అ(క్రూరభావుఁడు+అగుటన్ = క్రూరస్వభావం, కఠినస్వభావం లేనివాడు కావటం; ఏను = నేను; ఎఱుంగుదున్ = తెలియుదును; నీవు = నీవు; వత్సలత్వమునన్ = వాత్సల్యంతో; ఈ నృపతిన్ = ఈ రాజును; పంచి = ఆజ్ఞాపించి; పనులు+కొనుము = సేవలు చేయించుకొమ్ము.

**తాత్పర్యం:** కురువంశ భారమును వహించే ధృతరాష్ట్రా! ధర్మజుడు నీయెడ ప్రేమ, భక్తి కలవాడని నాకు తెలుసు. ఇతడు కఠిన స్వభావం కలవాడు కాడు. నీవు వాత్సల్యంతో ఈ నృపతిని చూచుకొమ్ము. ఆజ్ఞాపించి ఇతడిచేత సేవలు చేయించుకొమ్ము!

**క. విను నీతనయులు దుర్యో । ధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు క్రో**
**ధను లతిలుబ్ధులు వారల । మనమున నిడి వగవ వలదు మనుజాధీశా!' 459**

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా! = నరేశ్వరా!; విను = నా పలుకు లాలకించుము; నీ తనయులు = నీ కుమారులైన; దుర్యోధన+ ఆదులు = దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైనవారు; అవినీతిపరులు = నీతి మాలినవారు; అధర్మజ్ఞులు = ధర్మమెరుంగనివారు; క్రోధనులు = కోప స్వభావులు; అతిలుబ్ధులు = మిక్కిలి దురాశాపరులు; వారలన్ = ఇట్టి వారిని; మనమునన్+ఇడి = మనసులో నిలుపుకొని; వగవన్+వలదు = దుఃఖించవద్దు.

**తాత్పర్యం:** రాజా! నీ కుమారులు దుర్యోధనుడు మున్నగువారు నీతిమాలిన వాళ్ళు. ధర్మవిహీనులు, కోప స్వభావులు, పరమ దురాశాపరులు; ఇట్లాంటివాళ్ళను మనస్సులో నిలుపుకొని దుఃఖించవద్దు.'

**వ. అని పలికి కృష్ణు నాలోకించి. 460**

**తాత్పర్యం:** అని వచించి శ్రీకృష్ణుడిని వీక్షించి. (తరువాతి పద్యంతో అన్వయం)

భీష్ముఁడు శరీరంబు విడుచుటకు శ్రీకృష్ణు ననుజ్ఞఁ గొనుట. (సం.13-153-36).

**తే.** **'దేవదేవ! జీవాత్మక! దేవవంద్య! । శంఖ చక్ర గదా పద్మ చారుహస్త!**
**వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమ । పురుష! ప్రణతి యొనర్చెదఁ గరుణఁ జూడు.'** **461**

**ప్రతిపదార్థం:** దేవదేవ! = దేవతలకు పతియైనవాడా!; దేవనాయకా! జీవ+ఆత్మక! = జీవస్వరూపుడా, జీవులలో అంతర్యామిగా ఉన్న వాడా!; దేవవంద్య = వేల్పులచేత నమస్కరించబడేవాడా, కొనియాడబడేవాడా!; శంఖచక్రగదాపద్మచారుహస్త = పాంచజన్యమనే శంఖం, సుదర్శన మనే చక్రం, కౌమోదకి అనే గద, పద్మం- అనేవాటిచే సుందరమైన చేతులు కలవాడా!; వాసుదేవ = వసుదేవుడి కుమారుడా!; త్రివిక్రమ = బలిని దానమడిగి ముజ్జగాలు ఆక్రమించినవాడా!; వరద! = భక్తులకు వరములిచ్చేవాడా!; పరమ పురుష! = పురుషులలో ఉత్తమపురుషుడా! పురుషోత్తమా!; ప్రణతి+ఒనర్చెదన్ = నిన్ను స్తోత్రం చేస్తాను; కరుణన్ = కృపతో; చూడు = కనుగొనుము.

**తాత్పర్యం:** 'దేవదేవా! జీవాత్మకా! వేల్పులచేత నమస్కరించబడేవాడా! శంఖం, చక్రం, గద, పద్మం అనునవి హస్తములందు ధరించినవాడా! వసుదేవనందనా! త్రివిక్రమావతార! పురుషోత్తమా! నిన్ను స్తోత్రం చేస్తున్నాను. నన్ను దయతో చూడుము.'

**వ.** **అనుచు నమస్కరించి.** **462**

**తాత్పర్యం:** అని పలుకుతూ నమస్కారం చేసి.

**ఆ.** **'బలము నీవ నాకు, భక్తుండ నీయెడ, । నాలుబిడ్డ లేని యట్టివాఁడఁ,**
**గావు నన్ను నధిక కారుణ్యమున నిమ్ము । నుజ్ఞఁ గమలదళమనోజ్ఞనయన!'** **463**

**ప్రతిపదార్థం:** కమలదళ మనోజ్ఞనయన! = తామర రేకులవలె అందమైన కన్నులుకలవాడా!; నాకున్ = నాకు; బలము = శక్తి; నీవు+అ = నీవే; నీ+ఎడన్ = నీ విషయంలో; భక్తుండన్ = భక్తుడిని; ఆలు = భార్య; బిడ్డ = చూలు; లేని+అట్టి వాఁడన్ = లేనటు వంటి వాడిని; అధిక కారుణ్యమునన్ = మిక్కిలిదయతో; నన్నున్ = నన్ను; కావు = రక్షించుము; అనుజ్ఞన్+ఇమ్ము = నేను వెళ్ళటానికి ఉత్తరువు ఒసంగుము.

**తాత్పర్యం:** 'పద్మపత్రాల వంటి సుందరనేత్రాలు కలవాడా! నాకు నీవే బలం. నేను నీ భక్తుడిని. ఆలూ, చూలూ లేనివాడిని. నన్ను పరమకృపతో పరిరక్షించుము. శరీరయాత్ర ముగించటానికి సెలవియ్యవలసింది.'

**వ.** **అని వెండియు.** **464**

**తాత్పర్యం:** అని మరల. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **'మాధవ! పాండుకుమార వర్గమునకు । గతి నీవ; రక్షింపు కరుణ మెఱయ;**
**దుర్బుద్ధియైన యా దుర్యోధనుని తోడఁ । గృష్ణుఁ డెక్కడ నుండు గెలుపు గలుగు**

**నక్కడి కంటి నేఁ బెక్కుమాఱులు; నట్లు । చెప్పఁగా నా పంపు సేయ కతఁడు**

**దమవారి నెల్లను సమయించి తానును । సమసె; ని న్నెఱుఁగుదు; నమిత మహిమ**

**తే. నరుఁడు నారాయణుఁడు నను పరమమునులు । జగము రక్షించుటకుఁ గేలి జన్మ మొంది**

**సంచరించెద రని పరాశరసుతుండు । నారదుండును జెప్పిరి నాకుఁ దొల్లి.' 465**

**ప్రతిపదార్థం:** మాధవ! = లక్ష్మీనాయకా!; పాండు కుమార వర్గమునకున్ = పాండురాజు యొక్క సుతసమూహానికి; గతి = దిక్కు; నీవు+అ = నీవేనయ్యా!; కరుణమెఱయన్ = కృప వెలయగా; రక్షింపు = వారిని కాపాడుము; దుర్బుద్ధి+ఐన = చెడుబుద్ధి గలవాడైన; ఆ+దుర్యోధనుని తోడన్ = ఆ సుయోధనుడితో; నేన్ = నేను; పెక్కుమాఱులు = పలుసారులు; కృష్ణుఁడు+ఎక్కడన్+ ఉండున్ = శ్రీకృష్ణుడు ఏ పక్షంలో ఉంటాడో; అక్కడికిన్ = ఆ పక్షానికి; గెలుపు+కలుగున్+అంటిన్ = విజయం లభిస్తుందని చెప్పాను; అట్లు చెప్పఁగాన్ = అట్లా చెప్పినప్పటికినీ; నా పంపు+చేయక = నా ఆజ్ఞ ననుసరించక; అతఁడు = ఆ సుయోధనుడు; తమవారిన్; ఎల్లనున్ = అందరినీ; సమయించి = చంపి; తానును+సమసెన్ = తాను కూడ మరణించాడు; నిన్నున్+ఎఱుఁగుదున్ = నీ వెవరో తెలిసికొన్నాను; అమిత మహిమన్ = మిక్కిలి ప్రభావంతో; నరుఁడు = నరుడు; నారాయణుఁడు = నారాయణుడు; అను = అనే పేరులు గల; పరమమునులు = గొప్ప మునీశ్వరులు; జగము రక్షించుటకున్ = లోకాన్ని కాపాడటానికే; కేలిజన్మము+ఒంది = వినోదించుటకు జన్మము లెత్తి, లీలామానుష విగ్రహులై; సంచరించెదరు+అని = విహరిస్తున్నారు, మెలగుతున్నారు అని; పరాశరసుతుండు = పరాశరమహర్షి తనయుడైన, శ్రీ వేదవ్యాసమహర్షి; నారదుండును = బ్రహ్మమానసపుత్రుడైన నారదమహర్షియు; నాకున్ = నాకు; తొల్లి = మునుపు, పూర్వం; చెప్పిరి = తెలిపి ఉన్నారు.

**తాత్పర్యం:** 'రమావల్లభా! పాండునందనులకు నీవే దిక్కు. వారిని కరుణతో కాపాడుము. దుష్టబుద్ధి అయిన దుర్యోధనుడితో 'కృష్ణుడు ఏ పక్షంలో ఉంటాడో ఆ పక్షమునకు విజయం తథ్య' మని పలుమారు నేను చెప్పాను. పాండవులతో కలసి మెలసి ఉండుమని నేను చెప్పిన మాటలు అతడు వినక యుద్ధ మొనర్చి తమవారినందరిని మరణం పాలుచేసి తుదకు తానుగూడ మరణించాడు. కేశవా! నిన్ను నే నెరుగుదును. మహా మహిమతో నరుడు, నారాయణుడు అనే పరమఋషులు లోక సంరక్షణార్థం లీలామానుష వేషధారులై శ్రీకృష్ణార్జునులుగా చరిస్తున్నారని పరాశరమహర్షి నందనుడైన వ్యాసులవారూ, బ్రహ్మమానసపుత్రుడైన నారదులవారూ నాకు మునుపే చెప్పి ఉన్నారు.'

**వ. అనిన విని వాసుదేవుండు దేవవ్రతు వదనం బత్యాదరంబున నాలోకించి. 466**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; వాసుదేవుండు; దేవవ్రతువదనంబు = భీష్ముడి ముఖం; అతి+ఆదరంబునన్ = మిక్కిలి మన్ననతో; ఆలోకించి = చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** భీష్ముడి పలుకులు విని శ్రీకృష్ణుడు మిక్కిలి ఆదరంతో ఆయన ముఖం చూచి (ఇట్లా అన్నాడు)

**ఆ. 'కీ డొకప్డు లేదు, కృతపుణ్యుఁ డవు, తండ్రి । వలని భక్తి పెంపు గలవు; దానఁ**
**గాదె బంటుఁ బోలె గాంగేయ! మృత్యువు । నీవశమున నిలిచె నిర్భరముగ. 467**

**ప్రతిపదార్థం:** గాంగేయ! = గంగానందనా!; ఒకప్డు = ఏనాడున్నూ; కీడు = నీ వలన దోషం; లేదు = లేదు; కృతపుణ్యుఁడవు = పుణ్యములు సల్పినట్టివాడివి; తండ్రి వలని = నీ జనకుడియందు; భక్తి పెంపు+కలవు = అమితభక్తి కలిగినట్టివాడవు. దానన్+కాదు+ఎ = ఆ కారణం చేతనే కదా!; బంటున్+పోలెన్ = సేవకుడి వలె; మృత్యువు = మిత్తి; నీ వశమునన్ = నీ అధీనంలో; నిర్భరముగన్+నిలిచెన్ = పూర్తిగా నిలిచింది.

**తాత్పర్యం:** 'గంగాపుత్రా! నీ వలన ఏనాడూ దోషం లేదు. నీవు పరమ పుణ్యాత్ముడివి. తండ్రియందు మిక్కిలి భక్తి గలవాడివి. కనుకనే బంటువలె అడుగులకు మడుగు లొత్తుతూ మృత్యువు నీ అధీనంలో నిలిచింది.

భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట. (సం.13-153-46).

**వ. నీకు నే ననుజ్ఞ యిచ్చితి వసువులం బొందు' మనినం బరమానందంబునం బొంది పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటి వారలనుం గనుంగొని 'మీచేత ననుజ్ఞాతుండన కదా' యని పలికి, యందఱం గౌఁగిలించుకొని 'యానృశంస్యంబును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుం' డని చెప్పి, తాను దొల్లి రాజుల గెల్చి తెచ్చిన ధనంబులు విప్రజనంబుల కిచ్చి, ధర్మతనయుం జూచి 'యెల్ల బ్రాహ్మణులునుం బూజనీయులు; ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింప వలయువా' రని నిర్దేశించి యూరకుండి, ధారణానుక్రమంబున సమాహితాత్ముం డయి వాయువుల సన్నిరుద్ధంబు చేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె; నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వాపికొనుచు వచ్చునయ్యై చోట్లు శల్యరహితంబు లగుచుండె; నట్లగుటం గాంచి కృష్ణాదులగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించి; రా సంయమచతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంతద వ్వరిగి యంత నంతర్హితం బయ్యె; నప్పుడు పుష్పవృష్టి గురిసె, దేవ దుందుభులు మొరసె, నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొంది; రిట్లు దేవవ్రతుండు దివంబునకుం జనుటయు. 468**

**ప్రతిపదార్థం:** నీకున్; నేను; అనుజ్ఞ = అనుమతి, సెలవు; ఇచ్చితిన్; వసువులన్ = వసువులనెడు దేవగణమును; పొందుము = చేరుము, కలియుము; అనినన్; పరమ+ఆనందంబునన్+పొంది = మిక్కిలి సంతోషం చెంది; పాండునందనులను = పాండురాజు కుమారులను; ధృతరాష్ట్రునిన్; తక్కటి వారలనున్ = మిగిలిన వారిని; కనుంగొని = చూచి; మీ చేతన్; అనుజ్ఞాతుండను+అ+కదా? = అనుమతించబడినవాడనే గదా?; అని; పలికి; అందఱన్ = ఎల్లరను; కౌఁగిలించుకొని; ఆనృశంస్యంబును = క్రూరత్వం లేకుండుటనూ, అహింసనూ; సత్యంబును = సత్యం పలుకుటనూ; నిత్యంబులుగాన్ = శాశ్వతములుగా; పాటించి = అనుసరించి; బ్రదుకుండు = జీవించండి; అని చెప్పి; తాను; తొల్లి = పూర్వం; రాజులన్; గెల్చి; తెచ్చిన ధనంబులు; విప్రజనంబులకున్ = బ్రాహ్మణసమూహానికి; ఇచ్చి; ధర్మతనయున్+చూచి; ఎల్లబ్రాహ్మణులునున్ =

విప్రులందరూ; పూజనీయులు = పూజించదగినవారు; ఋత్విజులు = యజ్ఞం చేయించే బ్రాహ్మణులు; ఆచార్యులు = గురువులు; వృద్ధులు = ముసలివారు; విశేషించి = ముఖ్యంగా; పూజింపన్ వలయువారు = పూజించదగినవారు; అని; నిర్దేశించి = నిర్ణయంగా చెప్పి; ఊరకుండి = మాట లుడిగి, మాటలు మాని, మిన్నకుండి; ధారణా+అనుక్రమంబునన్ = యోగధారణచేత; సమాహిత+ఆత్ముండు+అయి = నిశ్చలమైన మనస్సు కలవాడయి; వాయువులన్ = ప్రాణాపానాది వాయువులను; సన్నిరుద్ధంబు చేసినన్ = చక్కగా అడ్డగించగా; అవి = ఆ ప్రాణాపానాదివాయువులు; ఊర్ధ్వగతిన్+కైకొనియెన్ = ఊర్ధ్వగమనాన్ని పొందాయి; ఆ+మహా+ఆత్ముండు = ఆ దొడ్డ మనస్సు గల భీష్ముడు; అవయవంబులన్ = శరీరావయవములందు; ప్రాణంబులు = ప్రాణాలను; పాపి కొనుచున్ = తొలగించుకొంటూ; వచ్చు+అయ్యైచోట్లు = వచ్చునట్టి ఆయా ప్రదేశాలు; శల్యరహితంబులు+ అగుచున్ = శల్యములు లేని వవుతూ; ఉండెన్ = ఉండినవి; అట్లు+అగుటన్ = అట్లాకావటం; కాంచి = చూచి; కృష్ణ+ఆదులు+అగు = శ్రీకృష్ణుడు మొదలైన; అఖిలజనంబులు = ప్రజలందరూ; ఆశ్చర్యభరిత+అంతఃకరణులు+అగుచున్ = అద్భుతరసంతో నిండిన మనస్సులు కలవా రవుతూ; కీర్తించిరి = మెచ్చారు; ఆ+సంయమచతురునిచేన్ = ఇంద్రియనిగ్రహమందు నేర్పరి అయిన భీష్ముడిచే; సర్వ+ఆయతన సన్నిరుద్ధంబు+ఐ = అన్ని అవయవ ద్వారముల యందునూ అడ్డగించబడినదై; ఆత్మ = జీవుడు; మూర్ధంబు = శీర్షం, తల, కపాలం; భేదించి = చీల్చుకొని; మహా+ఉల్కా+ఆకారంబునన్ = గొప్ప అగ్ని కణము యొక్క రూపంతో, గొప్పదివిటీ రూపంతో; ఆకసంబునకున్ = నింగికి; ఎగసి; కొంతదవ్వు = కొంతదూరం; అరిగి = వెళ్ళి; అంతన్ = ఆ పిదప; అంతర్హితంబు+అయ్యెన్ = మాయమయింది; అప్పుడు = ఆ సమయాన; పుష్పవృష్టి = పూలవాన; కురిసెన్; దేవదుందుభులు = వేల్పుల నగారాలు; మొరసెన్ = మ్రోగినవి; అంబరంబునన్ = గగనంలో; సిద్ధులున్, సాధ్యులున్ = ఆ పేరుగల దేవజాతివారు; పొగడుచున్ = భీష్ముడిని శ్లాఘిస్తూ; ప్రమోదంబున్+ఒందిరి = సంతోషించారు; దేవవ్రతుఁడు = భీష్ముడు; దివంబునకున్ = స్వర్గానికి; చనుటయున్ = వెళ్ళగా.

**తాత్పర్యం:** 'గంగానందనా! వెళ్ళుటకు నిన్ను అనుమతిస్తున్నాను. నీ తోటివారైన వసువులను నీవు కలిసికొమ్ము' అని వాసుదేవుడు పలుకగా భీష్ముడు పరమానందభరితుడయ్యాడు. పాండవులను, ధృతరాష్ట్రుడిని, తక్కిన వారిని చూచి 'మీచేత అనుమతించబడ్డానుగదా!' అని పలికి వారందరినీ కౌగిలించుకొన్నాడు. 'అక్రూరులై, సత్య వచనులై మీరు జీవితం గడపండి' అని వచించి ఆ మహాపురుషుడు పూర్వం తాను రాజులను జయించి తెచ్చిన ధనరాసులను బ్రాహ్మణుల కిచ్చి ధర్మరాజును జూచి 'వత్సా! బ్రాహ్మణు లందరూ పూజ్యులు. వారిలోనూ ముఖ్యంగా ఋత్విక్కులు, గురువులు, వృద్ధులు ఆరాధించదగినవారు' అని గట్టిగా నుడివి మౌనం వహించాడు. యోగధారణచే చిత్తమును నిగ్రహించి ప్రాణాపానాదివాయువుల సంచారాన్ని అడ్డగించగా అవి ఊర్ధ్వముఖంగా పయనించి మూర్ధమును చేరాయి. అపు డా మహనీయుడు ఒక్కొక్క అవయవమునుండి ప్రాణములను తొలగించుకొంటూ రాగా రాగా ఆ స్థానములన్నీ శల్యరహితా లయినాయి. ఇట్లా జరగటం చూచి మధుసూదనుడు మున్నగు సకల జనుల హృదయాలు పరమాశ్చర్యభరితా లయ్యాయి. వారందరూ భీష్ముడిని మిక్కిలి కొనియాడారు. ఇంద్రియాలను అరికట్టటంలో మిగుల సమర్థుడైన భీష్ముడిచే అన్ని అవయవద్వారాల నుండి అడ్డగించబడిన అతడి ఆత్మ శిరస్సు భేదించుకొని గొప్ప అగ్నికణం వలె కనిపిస్తూ మింటికెగసి కొంతదూరం వెళ్ళి ఆ తరువాత అంతర్ధాన మయింది. అపుడు దేవతలు పూలవాన కురిపించారు, నగారాలు మ్రోగించారు. సిద్ధులు, సాధ్యులు అనే దేవజాతివారు భీష్ముడిని శ్లాఘిస్తూ హర్షించారు. ఆ విధంగా ఆ మహనీయుడు శరీరం విడిచి స్వర్గం చేరిపోయాడు.

పరలోకగతుండైన భీష్మునకు నగ్నిసంస్కారంబు చేయుట. (సం.13-154-8.)

**సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదుర యు । యుత్సులు నగరు కాష్ఠోత్కరంబుఁ**
**జందన దారు సంచయమును గొని సమ । స్థలి సమంచిత చితి యలఘు భంగి**
**విరచించి; రయ్యుధిష్ఠిరుఁడును ధృతరాష్ట్రుఁ । డును న మ్మరున్నదీ తనయు పుణ్య**
**గాత్రంబు సుస్నాన కలితంబు విహితాను । లేపంబుఁ బుష్పదామోపశోభి**

**తే. తంబు నుత్తమ క్షౌమావృతంబు నుజ్జ్వ । లాభరణ భూషితంబుఁగా నధికభక్తిఁ**
**జేసి; రప్పుడు సామంబు సెలఁగ హోమ । మాచరించిరి యాజకు లగ్ని యలర. 469**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్రుండును; తమ్ములున్; విదుర యుయుత్సులున్ = విదురుడును, యుయుత్సుడును; అగరుకాష్ఠ+ఉత్కరంబున్ = అగరు చెక్కల యొక్క మొత్తమును; చందనదారు సంచయమును = చందనపు కొయ్యల యొక్క మొత్తమును; కొని = తీసికొని; సమస్థలిన్ = మిట్ట పల్లాలు లేని చదునైన తావులో; సమంచితచితి = ఒప్పిదమైన సొద; అలఘుభంగిన్ = ఘనమైన రీతిలో; విరచించిరి = పేర్చిపెట్టారు; ఆ+యుధిష్ఠిరుఁడును = ఆ ధర్మజుడు; ధృతరాష్ట్రుడును; ఆ+మరుత్+నదీతనయు = ఆ దేవనదీ పుత్త్రుడైన భీష్ముడి యొక్క; పుణ్యగాత్రంబున్ = పావనశరీరాన్ని; సుస్నానకలితంబున్ = మంత్రయుక్తమైన చక్కని స్నానంతో కూడినదిగాను; విహిత+అనులేపంబున్ = తగిన మైపూతలు గలదిగానూ; పుష్పదామ = పూలదండలచే; ఉపశోభితంబున్ = శోభింపజేయబడినదిగానూ; ఉత్తమక్షౌమ+ఆవృతంబున్ = మేలైన పట్టు వస్త్రములచే ఆవరించబడినదిగానూ; ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న; ఆభరణ+భూషితంబున్+కాన్ = సొమ్ములచే అలంకరించ బడినదిగానూ; అధికభక్తిన్ = మిక్కిలి భక్తితో; చేసిరి = ఒనర్చిరి; అప్పుడు = ఆ సమయమందు; సామంబు+చెలఁగన్ = సామవేద మంత్రపఠనం అతిశయించగా; యాజకులు = ఋత్విక్కులు; అగ్ని+అలరన్ = అగ్నిహోత్రుడు ఆనందించగా; హోమము+ఆచరించిరి = హోమం చేశారు.

**తాత్పర్యం:** ధర్మరాజు, అయన తమ్ములు, విదురుడు, యుయుత్సుడు అగరు చందన కాష్ఠాలతో చదునైన ప్రదేశంలో చితిని కడుగొప్పగా పేర్చారు. మిక్కిలి భక్తితో ధర్మజుడు ధృతరాష్ట్రుడు గంగానదీ నందనుడి పవిత్రగాత్రాన్ని స్నానం చేయించారు. ఒడలికి చందనం పూశారు. మేలైన పట్టువస్త్రం చుట్టి పూలదండలతో, మెరిసే ఆభరణాలతో అలంకరించారు. అపుడు సామవేద పఠనం జరిగింది. పురోహితులు అగ్నిదేవుడు హర్షించే టట్లు హోమం చేశారు.

**క. కనకములు మణులు భూసుర । జనసం ఘంబున కజాతశత్రుఁడు శ్రద్ధా**
**వినయప్రీతి యుతంబుగ । ననేకములు వేడ్క నొసఁగె నవహిత మతియై. 470**

**ప్రతిపదార్థం:** అజాతశత్రుఁడు = ధర్మరాజు; అవహితమతి+ఐ = సావధానచిత్తుడై; కనకములు = బంగారం; మణులు = రత్నాలు, మాణిక్యాలు; భూసురజనసంఘంబునకున్ = బ్రాహ్మణసమాజానికి; శ్రద్ధావినయప్రీతియుతంబుగన్ = విశ్వాసమూ, అణకువ, సంతోషం అనే గుణాలతో కూడిన వాడై; అనేకములు = పెక్కులు; వేడ్కన్+ఒసఁగెన్ = ప్రీతితో ఇచ్చాడు.

**తాత్పర్యం:** అజాతశత్రుడు; సావధానమనస్కుడై శ్రద్ధ, వినయం, సంతోషం అనేగుణాలు ముప్పిరిగొనగా పెక్కుమణులు, బంగారం బ్రాహ్మణ సమూహానికి వేడుకతో ఇచ్చాడు.

**వ. తదనంతరంబ. 471**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**క. తలదిక్కు గవలుఁ బాదం । బుల దెస ధృతరాష్ట్ర పాండు భూపాగ్రతనూ**
**జులుఁ బట్టి యధిక విభవో । జ్జ్వల మగు పాడె పయి నిడిరి శవరత్నంబున్. 472**

**ప్రతిపదార్థం:** తలదిక్కు = తలవైపు; కవలు = నకుల సహదేవులు; పాదంబులదెసన్ = కాళ్ళవైపు; ధృతరాష్ట్రపాండు భూప+అగ్రతనూజులున్ = ధృతరాష్ట్రుడు, పాండురాజు యొక్క పెద్దకొడుకు-ధర్మజుడు; పట్టి = పట్టుకొని; అధిక విభవ+ఉజ్జ్వలము+అగు = మిక్కిలి వైభవంతో ప్రకాశిస్తున్న; పాడెపయిన్ = శవవాహనం మీద; శవరత్నంబున్ = శ్రేష్ఠమైన భీష్ముడి శవాన్ని; ఇడిరి = ఉంచారు.

**తాత్పర్యం:** భీష్ముడి శవాన్ని తల తట్టు నకుల సహదేవులు, కాళ్ళతట్టు ధృతరాష్ట్ర ధర్మజులు పట్టుకొని మిక్కిలి వైభవంతో ఒప్పారుచున్న శవవాహనం మీద ఉంచారు.

**వ. అమ్మెయి నన్నలువురును వహించిరి; భీమసేనార్జునులు ధవళచామరంబు లిడిరి; యుయుత్సుం డుత్తమచ్ఛత్రంబు వట్టె; వృద్ధలగు కౌరవ స్త్రీ లాలవట్టంబులు వట్టిరి; ధౌమ్యుండు క్రియా కలాపంబు నడపె; నట్లు సాదసేర్చి దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతి చేసి బహుకుండంబు లెత్తి ఘృతంబు ప్రయోగించి ప్రజ్వలింపఁ జేసి; రివ్విధంబునం బితృమేధంబు విభవమహితంబును, విధివిహితంబు నుంగా ననుష్ఠించి య క్కొరవు లపసవ్యంబుగాఁ దిరిగి కృష్ణద్వైపాయన నారద దేవల ప్రభృతు లనుగమింప భాగీరథికిం జని సర్వభరతభార్యా సమేతంబుగా న గ్గాంగేయునకుఁ దిలోదక ప్రదానంబు లాచరించి; రట్టి సమయంబున. 473**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్ = ఆ విధంగా; ఆ+నలువురును = నకులసహదేవులు; ధృతరాష్ట్రుడు, ధర్మరాజు; వహించిరి = పాడెను బుజాల కెత్తుకున్నారు; భీమసేన+అర్జునులు = భీముడు, అర్జునుడు; ధవళచామరంబులు+ఇడిరి = తెల్లని చామరాలతో విసిరారు; యుయుత్సుఁడు; ఉత్తమ+ఛత్రంబు+పట్టెన్ = గొప్పగొడుగును ధరించాడు; వృద్ధలు+అగు = ముదుసళ్ళయిన; కౌరవస్త్రీలు = కురువంశమునకు చెందిన ఆడువారు; ఆలవట్టంబులు+పట్టిరి = గుడ్డతో తయారు చేసిన గుండ్రని విసనకర్రలతో విసిరారు; ధౌమ్యుండు = ధౌమ్యులవారు; క్రియాకలాపంబునడపెన్ = మంత్రతంత్రయుక్తమైన కర్మకాండ జరిపాడు; అట్లు = ఆ విధంగా; దేవవ్రతుని దేహంబున్ = భీష్ముడి యొక్క శరీరాన్ని; సాద+చేర్చి = చితిపై పరుండబెట్టి; శ్రౌత+అగ్నికిన్ = వేదవిహితమైన అనలానికి; ఆహుతి చేసి = హోమద్రవ్యంగా సమర్పించి; మంత్రపూర్వకంగా వేల్చి; బహుకుండంబులు+ఎత్తి = పెక్కు కుంభము లెత్తి, పలుకడవలు ఎత్తి; ఘృతంబు = నెయ్యి; ప్రయోగించి = చితాగ్నిలో క్రుమ్మరించి; ప్రజ్వలింపన్+చేసిరి = గనగన మండేటట్లు కావించారు; ఈ+విధంబునన్ = ఈ రీతిగా; పితృమేధంబు = ప్రేతకార్యం; విభవమహితంబునున్ = వైభవంతో ఒప్పినదిగానూ; విధివిహితంబునున్+కాన్ = శాస్త్ర సమ్మతమైనదిగానూ;

అనుష్ఠించి = ఆచరించి; ఆ+కౌరవులు = ఆ కురువంశ్యులు; అపసవ్యంబుగాన్ = అప్రదక్షిణంగా; తిరిగి = మరలి; కృష్ణద్వైపాయన, నారద, దేవల, ప్రభృతులు = వ్యాసుడు, నారదుడు, దేవలుడు మొదలైనవారు; అనుగమింపన్ = తమ వెంటరాగా; భాగీరథికిన్ = గంగానదికి; చని = వెళ్ళి; సర్వభరత భార్యా సమేతంబుగాన్ = భరతవంశస్థులైన సమస్త కౌరవుల భార్యలతో కూడ; ఆ+గాంగేయునకున్ = గంగాపుత్త్రుడైన భీష్ముడికి; తిల+ఉదకప్రదానంబులు = నువ్వులు నీళ్ళు వదలటం; ఆచరించిరి = చేశారు; అట్టి సమయంబునన్ = ఆ వేళలో.

**తాత్పర్యం:** ఆ విధంగా తలవైపు నకులసహదేవులు, కాళ్ళవైపు ధర్మజ ధృతరాష్ట్రులు పాడెను తమ బుజాలపై నిడుకొని మోశారు. భీమార్జునులు వింజామరలతో విసిరారు. యుయుత్సుడు గొప్పగొడుగును పట్టాడు. కౌరవ స్త్రీలలో ముసలివాళ్ళు ఆలవట్టములు ధరించారు. ధౌమ్యుడు కర్మకాండ జరిపాడు. భీష్ముడి శరీరాన్ని చితిపై నుంచి వేదవిహితమైన అగ్నికి ఆహుతి చేశారు. లెక్కలేనన్ని నేతికుండలు చితాగ్ని గనగనమండగా క్రుమ్మరించారు. ఈ రీతిగా శవదహనకార్యం శాస్త్రసమ్మతంగా వైభవోపేతంగా ఆచరించి ఆ కౌరవు లందరూ అప్రదక్షిణంగా మరలి స్నానాలకై గంగకు వెళ్ళారు. వారి వెంట వ్యాసుడు, నారదుడు, దేవలుడు మున్నగు మునిపుంగవులు బయలుదేరారు. కౌరవు లందరూ పత్నీసహితంగా గంగలో మునిగి భీష్ములవారికి నువ్వులు నీళ్ళు వదిలారు. ఆ సమయంలో.

పుత్త్రశోకాతుర యైన గంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట. (సం.13-154-18.)

**సీ.** **ఉదకంబులందుండి యుత్థితయై శోక । విహ్వలత్వంబున వికల గమన**
**యగుచు నెమ్మోముపై నశ్రులు గ్రమ్మగాఁ । జనుదెంచి కౌరవసమితి యెదుర**
**నిలిచి భాగీరథి 'యలఘుండు తన కొడు । కిలఁ బరికింపఁగా నెట్టిభంగి**
**వాఁడయ్యెఁ? జరితంబుపోఁడిమి మీరెల్ల । నెఱుఁగుదు; రైనను నేను గొంత**

**తే.** **సెప్ప వినుఁడు! దృఢ వ్రతశీలుఁ, డమల । బుద్ధి రాజవృత్తాఢ్యుఁడు, భూరికృపుఁడు,**
**కార్యసంవేది, పితృభక్తి ధుర్యుఁ, డార్య । సమ్మతుండు, విద్యా పరిశ్రమ ఘనుండు.** **474**

**ప్రతిపదార్థం:** భాగీరథి = గంగాదేవి; ఉదకంబులందున్+ఉండి = నీళ్ళలో నుండి; ఉత్థిత+ఐ = లేచినదై; శోకవిహ్వలత్వంబునన్ = దుఃఖం చేత అవయవాలు స్వాధీనం తప్పగా; వికలగమన+అగుచున్ = తడబడే నడక గలది అవుతూ; నెమ్మోముపైన్ (నెఱ+మోము) = అందమైన మొగం మీద; అశ్రులు క్రమ్మన్+కాన్ = కన్నీటి బిందువులు ఆవరించగా; చనుదెంచి = వచ్చి; కౌరవసమితి+ఎదురన్+నిలిచి = కౌరవుల సమూహం యొక్క ముందు నిలబడి; తన కొడుకు = తన పుత్త్రుడైన భీష్ముడు; అలఘుండు = గొప్పవాడు; ఇలన్ = ధరణియందు; పరికింపన్+కాన్ = పరిశీలించగా, తలపోయగా, ఆలోచించగా; ఎట్టిభంగి వాఁడు+అయ్యెన్ = ఎంతగొప్పతీరు తెన్నులు కలవాడయ్యాడు; చరితంబు పోఁడిమిన్ = అతడి ప్రవర్తన యొక్క గొప్పతనం; మీరు+ఎల్లన్ = మీరందరూ; ఎఱుంగుదురు = తెలిసిఉన్నారు; ఐనను = కాని; నేను; కొంత = కొంచెం; చెప్పన్ = తెలుపగా; వినుఁడు = ఆలకించండి; దృఢవ్రతశీలుఁడు = గట్టి పట్టుదల కలవాడు; అమలబుద్ధి = నిర్మలమైన బుద్ధికలవాడు; రాజవృత్త+ఆఢ్యుఁడు = క్షత్రియ ధర్మవర్తనమందు విఖ్యాతుడు; భూరికృపుఁడు = గొప్పదయకలవాడు; కార్యసంవేది = చేయదగిన పను లెరింగిన వాడు; పితృభక్తి ధుర్యుఁడు = పితృభక్తియందు అగ్రేసరుడు; (పితృభక్తి = జనకునియందు గాఢమైన ప్రేమ); ఆర్యసమ్మతుండు = పెద్దలకు ఇష్టుడు, ప్రియమైనవాడు; విద్యా పరిశ్రమ ఘనుఁడు = చదువులందలి

పరిశ్రమచేత దొడ్డవాడు; కష్టపడి విద్యలు నేర్చిన దొడ్డ మనిషి.

**తాత్పర్యం:** గంగాదేవి జలముల నుండి పైకిలేచి దుఃఖంతో విలవిల్లాడుతూ, తడబడేనడకతో ముఖం నిండా కన్నీళ్ళు నిండగా వచ్చి కౌరవులముందు నిలిచింది. నా తనయుడైన భీష్ముడు గొప్పవాడు. 'ధరణిలో తనంతటివాడు మరొకడు లేడనిపించుకొన్నాడు. ఆతడి నడవడి ఎంత గొప్పదో మీకందరికీ తెలుసు. అయినా, నేను కొంచెం చెప్పుతాను. వినండి; నా కుమారుడు గట్టి పట్టుదల గలవాడు. నిర్మలమైన బుద్ధిగలవాడు. క్షత్రియధర్మశీలి. పరమదయాస్వభావుడు. చేయదగిన పను లెరిగినవాడు. పితృభక్తి యందు అగ్రేసరుడు. పెద్దలందరికీ ప్రియమైనవాడు. అధికంగా విద్యాపరిశ్రమ సల్పినవాడు.

**తే.** **కాశిరాజ కన్యకలకుఁగాఁ బెనంగి । వానిచే గాసియైరి భూవరులు పలువు**
**రంబకై పూని వానిమహాబలంబు । జామదగ్న్యుండుఁ దెరలుపఁ జాల కరిగె.'** **475**

**ప్రతిపదార్థం:** కాశిరాజ కన్యకలకున్+కాన్ = కాశీరాజు కొమార్తెలకై; పెనంగి = పోరాడి; వానిచేన్ = నా కుమారుడు భీష్ముడిచేత; పలువురు భూవరులు = పెక్కుమంది రాజులు; గాసి+ఐరి = కష్టాలపాలయ్యారు; అంబకై = కాశీరాజు కూతురు అంబకొరకు; పూని = యత్నించి; వానిమహాబలంబు = అతడి యొక్క గొప్పశక్తిని; జామదగ్న్యుండు = జమదగ్ని కొడుకైన పరశురాముడు; తెరలుపన్+చాలక = కదిలించలేక; అరిగెన్ = ఓడి వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** నా కుమారుడు తన తమ్ములకొరకై కాశీరాజ పుత్రికలను అంబ, అంబిక, అంబాలికలను తీసికొని వచ్చేటప్పుడు రాజులు అతడితో పోరాడి వెతలపాలయ్యారు. అంబ యొక్క పక్షం వహించి ఎదుర్కొన్న పరశురాముడు నా కుమారుడి బలాన్ని కదిలించలేక భంగపడి తొలగిపొయ్యాడు.'

**వ.** **అని విలాపంబు చేసి వెండియు.** **476**

**తాత్పర్యం:** అని రోదించి మరల (ఇట్లా అన్నది అని తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **'అంతవాఁడు శిఖండిచే నట్టు లగుట । గనియుఁ బెక్కులు పఱియలు గాక యునికి**
**కతనఁ జేసి వజ్రమయంబు గాఁగ నోపు । నని తలంచెద నాడెంద మన్నలార!'** **477**

**ప్రతిపదార్థం:** అన్నలార! = భ్రాతలారా!; అంతవాఁడు = అంతటిశక్తి సంపన్నుడు; శిఖండిచేన్ = శిఖండి అనే ఒక సామాన్యుడి చేత; అట్టులు+అగుట = యుద్ధంలో కూలి శరతల్పగతుడుకావటం; కనియున్ = చూచి కూడ; నా డెందము = నా గుండె; పెక్కులు+పఱియలు కాక = బ్రద్దలు బ్రద్దలుగా పగిలిపోక; ఉనికి కతనన్+చేసి = ఎప్పటి వలె ఉన్నట్టి హేతువును బట్టి; వజ్రమయంబు+కాఁగన్+ఓపున్ = వజ్రంతో తయారు చేసిన దేమో అని; తలంచెదన్ = భావిస్తాను.

**తాత్పర్యం:** 'అన్నలారా! అంతటి శక్తి సంపన్నుడు సామాన్యుడైన శిఖండిచే కదనమున కూలి శరతల్ప గతుడవటం కంటితో చూచి కూడ నా గుండె బ్రద్దలు కాకుండా ఎప్పటివలె ఉన్నదంటే అందుకు కారణం అది వజ్రంతో నిర్మించబడినదేమో అని భావిస్తాను.'

**వ. అని వగచిన గంగాదేవికి దేవకీనందనుం డిట్లనియె. 478**

**ప్రతిపదార్థం:** అని; వగచిన = శోకించిన; గంగాదేవికిన్; దేవకీనందనుండు = శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని దుఃఖిస్తున్న గంగాదేవితో శ్రీకృష్ణు డిట్లా అన్నాడు.

**పుత్త్రమరణ దుఃఖితయగు గంగను కృష్ణద్వైపాయను లూఱడించుట. (సం.13-154-26).**

**తే. 'నీవు శోకంబు దక్కుము; నీ సుతుండు । పరమగతి నొందె; శాప సంప్రాప్తిఁ జేసి**
**వసువు మర్త్యుఁడై వర్తించె; నసదృశప్ర । భావుఁ డాతఁడు; వగపేల దేవి! నీకు? 479**

**ప్రతిపదార్థం:** దేవి! = అమ్మా!; నీవు; శోకంబు+తక్కుము = దుఃఖం విడువుము; నీ సుతుండు = నీ కుమారుడు; పరమగతిన్+ఒందెన్ = ఉత్తమ లోకం చేరాడు; శాపసంప్రాప్తిన్+చేసి = శాపం పొందినందువలన; వసువు = అష్ట వసువులలో ఒకడు; మర్త్యుఁడు+ఐ = మానవుడై; వర్తించెన్ = ఈ లోకంలో చరించాడు, మెలగాడు; ఆతఁడు = భీష్ముడు; అసదృశ ప్రభావుఁడు = సాటిలేని మహిమ కలవాడు; నీకున్ = నీకు; వగపు+ఏల? = దుఃఖ మెందుకు?

**తాత్పర్యం:** 'తల్లీ! గంగాభవానీ! నీవు చింతించవద్దు. నీ కుమారుడు వసువులలో చేరిపోయాడు. శాపం పొందిన కారణాన వసువు భీష్ముడనే పేర నరుడై నీ కడుపున జన్మించాడు. ఈ లోకంలో ఇంతకాలం వర్తించాడు. ఇతడు సాటిలేని మహిమ గలవాడు. ఇతడిని గూర్చి శోకించవద్దు.

**చ. అతని శిఖండి యేల? యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే**
**యతఁడు నిజేచ్ఛఁ జేసి నరు నంచిత దివ్య శరంబు లంగసం**
**గతములు చేసి పాన్పుగ సుఖస్థితి మృత్యువు మాన్చియుండి కీ**
**ర్త్యతిశయ మొంది తా వలచినప్పుడు వోయె విషాద మేటికిన్?' 480**

**ప్రతిపదార్థం:** అతనిన్ = భీష్ముడిని; శిఖండి+ఏల? = శిఖండి మాత్రమే కాదు; అమర+అధిపుఁడున్ = దేవేంద్రుడయినా; సమయింపన్+చాలును+ఏ? = సంహరించగలడా? చంపలేడని భావం; అతఁడు = నీ పుత్రుడైన భీష్ముడు; నిజ+ఇచ్ఛన్+చేసి = తన కోరిక ప్రకారం; నరు+అంచిత+దివ్యశరంబులు = అర్జునుడి యొక్క ఒప్పిదమైన దివ్యబాణాలు; అంగసంగతములు+చేసి = తన శరీరమును పొందేటట్లు కావించి; పాన్పుగన్ = ఆ దివ్య శరములే శయ్యగా; సుఖస్థితిన్ = సుఖమునం దునికితో, హాయిగా; మృత్యువున్+మాన్చి = మరణం తొలగించుకొని; ఉండి = ప్రాణాలతో ఉన్నవాడై, జీవించి; కీర్తి+అతిశయము+ఒంది = పేరు పెంపులు వడసి, అధికమైన యశస్సు పొంది; తాన్ = తాను; వలచిన+అప్పుడు = కోరుకొన్నప్పుడే; పోయెన్ = దేహం విడిచాడు; విషాదము+ఏటికిన్? = చింత ఎందుకు?

**తాత్పర్యం:** 'అమ్మా! గంగాదేవీ! ఒక్క శిఖండి మాత్రమే అనట మెందుకు? ఆ దేవేంద్రు డయినా నీ కుమారుడిని సంహరించగలడా? భీష్ముడు తన ఇష్టప్రకారం అర్జునుడి దివ్యశరాలను తనువు నందు నాటించుకొని, ఆ ఫల్గునుడి దివ్యబాణాలే తనకు పాన్పుగా సుఖంగా పవళించినవాడై మృత్యువును దూరంగా ఉంచి, ధర్మజుడికి సమస్త ధర్మము

లుపదేశించి, పేరు పెంపులు గడించి తాను కోరుకొన్నప్పుడే శరీరాన్ని వదలివేశాడు. తల్లీ! అట్టి ధర్మాత్ముడి కొరకు నీవు శోకించవద్దు.'

**వ. అని యూఱడిలం బలికెఁ; గృష్ణద్వైపాయన మునివరుండును బరమాదరణీయతత్పర వచనంబుల నజ్జాహ్నవీదేవికి నానందం బాపాదించెఁ; దదనంతరంబ యాత్మీయ సలిల సాంగత్యంబు నొందు నమ్మందాకినిచేతం గృష్ణాదులు నందఱు జనపతులును ననుజ్ఞాతులు నాశీర్వాద ప్రీతులునై మునులునుం దోడ నడవ నది వెడలి, రని యిట్లు భీష్ముని వృత్తాంతంబు వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పిన నప్పుడమిఱేఁ 'డిత్తెఱంగున న త్తాతకు వలయు విధానం బాచరించి చరితార్థుండైన యప్పార్థివ ముఖ్యుండు మఱి యెట్టి చందంబునం బ్రవర్తించె? మునీంద్రా! యెఱింగింపవే' యని యడుగుటయు. 481**

**ప్రతిపదార్థం:** అని = అంటూ శ్రీకృష్ణుడు; ఊఱడిలన్ = గంగాదేవి ఉపశాంతి పొందేటట్లు, స్వస్థచిత్త అయ్యేటట్లు; పలికెన్ = వచించాడు; కృష్ణద్వైపాయనమునివరుండును = కృష్ణద్వైపాయనుడు అనే పేరుగల మునిశ్రేష్ఠుడైన వేదవ్యాసుడును; పరమ+ఆదరణీయతత్పరవచనంబులన్ = మిక్కిలి గౌరవించదగిన భీష్ముడికి సంబంధించిన మాటలచే; ఆ+జాహ్నవీ దేవికిన్ = ఆ గంగాదేవికి; ఆనందంబు = హర్షం; ఆపాదించెన్ = సమకూర్చాడు, కలిగించాడు; తత్+అనంతరంబు+అ = అటు పిమ్మట; ఆత్మీయసలిల సాంగత్యంబున్+ఒందు = తన నీటితో కలయికను పొందునట్టి, తన నీళ్ళలో కలసిపోవుచున్న, లీనమౌతున్న; ఆ+మందాకినిచేతన్ = ఆ భాగీరథిచేత; కృష్ణ+ఆదులు = శ్రీకృష్ణుడు మున్నగువారు; అందఱు జనపతులును = రాజు లెల్లరును; అనుజ్ఞాతులు = వెళ్ళుటకు అనుమతించబడినవారును; ఆశీర్వాద ప్రీతులును+ఐ = ఆమె దీవనల చేత సంతోషించినవారును అయి; మునులునున్ = ఋషులూ; తోడన్ నడవన్ = తమ వెంబడిరాగా; నదిన్+వెడలిరి = నదినుండి బయలుదేరారు; అని; ఇట్లు = ఈ రీతిగా; భీష్ముని; వృత్తాంతంబు = విషయమును; వైశంపాయనుండు = వ్యాసమహర్షి శిష్యుడైన పౌరాణికుడు; జనమేజయునకున్ = పరీక్షిన్మహారాజుపుత్రుడు జనమేజయ మహారాజునకు; చెప్పినన్ = చెప్పగా; ఆ+పుడమిఱేఁడు = ఆ భూపాలుడు-జనమేజయుడు; ఈ+తెఱంగునన్ = ఈ విధంగా; ఆ+తాతకున్ = పితామహుడైన భీష్ముడికి; వలయు విధానంబు+ఆచరించి = చేయదగినపనులన్నీ చేసి; చరితార్థుండు+ఐన = కృతకృత్యుడైన, ధన్యుడైన; ఆ+పార్థివముఖ్యుండు = ఆ రాజోత్తముడు-యుధిష్ఠిరుడు; మఱి+ఎట్టిచందంబునన్ = ఇంకే తీరున; ప్రవర్తించెన్? = మెలగినాడు?; ముని+ఇంద్రా! = ఓ వైశంపాయన మహర్షీ; ఎఱింగింపవు+ఏ = తెల్పుమా; అని; అడుగుటయున్ =అడుగగా.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు వచించి గంగాదేవిని ఊరడించాడు. వ్యాసమహర్షి దుఃఖోపశమన వాక్యాలు పలికి ఆమెకు ఆనందం కలిగించాడు. తరువాత తన జలాలలో విలీనురాలవుతున్న భాగీరథి చేత శ్రీకృష్ణుడు, తక్కిన రాజులు పోయి వచ్చుటకు ఆమె అనుమతి పడసినవారూ, ఆమె దీవనలచే సంతోషపడినవారూ అయి మునులు తమ వెంట నడువగా నది నుంచి నిర్గమించారు' అని భీష్ముడి వృత్తాంతం జనమేజయుడికి వైశంపాయన మహర్షి చెప్పాడు. అప్పుడు జనమేజయుడు వైశంపాయనుడిని చూచి 'మునీశ్వరా! తన పితామహుడైన గాంగేయుడికి జరుపవలసిన ఉత్తర క్రియలు జరిపి కృతకృత్యుడైన ధర్మరాజు తరువాత ఎట్లా ప్రవర్తించాడో తెలుప వేడుతున్నాను' అని ఆయనను అర్థించాడు.

## అశ్వాసాంతము

చ. **సకరుణ దివ్యచిత్త! పరిశాంత మహత్త్వ విధానవిత్త! ని**
**ర్వికృత విలాస హృద్య! శ్రుతి విస్తర విస్ఫురణైక వేద్య! పా**
**వక బహుభవ్యనామ! పరివర్ధన సంక్షయ దూరధామ! వి**
**శ్వకలిత తోషణా! సుభగ సాత్యవతేయవచో విభూషణా!** **482**

**ప్రతిపదార్థం:** సకరుణ = కృపతో కూడిన; దివ్య చిత్త! = అప్రాకృతమైన మనస్సుకలవాడా!; పరిశాంత మహత్త్వ విధానవిత్త! = లోకాలకు ప్రళయాధిక్యం కలిగించే విధానం చేత ప్రసిద్ధుడా!; నిర్వికృత విలాసహృద్య! = వికారరహితములైన లీలలచే మనోహరమైన వాడా!; (షడ్విధపరిణామములు-అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతి, అపక్షీయతే, నశ్యతి- ఉండుట, పుట్టుట, పెరుగుట, మారుట, క్షీణించుట, నశించుట అనే మార్పులు లేని విలాసములచే మనోహరమైనవాడా); శ్రుతివిస్తర విస్ఫురణ+ఏక+వేద్య!= వేద బాహుళ్యం యొక్క విజ్ఞానంచేతనే తెలియదగిన వాడా!; పావకబహుభవ్యనామ! = పవిత్రములు గావించునట్టి అనేకములైన మంగళనామములు కలవాడా!; పరివర్ధన సంక్షయ దూరధామ! = వృద్ధిక్షయాలకు దవ్వైన నిలయాలు కలవాడా!; విశ్వకలితతోషణా!= లోకంలో తెలియబడే సంతోషం కలవాడా!; సుభగసాత్యవతేయ వచో విభూషణా! = మధురములైన, (రమణీయములైన) వ్యాసమహర్షి యొక్క వాక్కులకు ఆభరణమైనవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీ హృదయం కృపా భరితం. నీవు జగత్తులకు ప్రళయం కల్పించే ప్రభావంతో ప్రసిద్ధుడివి. షడ్భావ వికారశూన్యుడ వగుటవలన నీ విలాసాలు మనస్సులకు ఇంపు కలిగిస్తాయి. వేద బాహుళ్యము యొక్కవిజ్ఞానంతోనే తెలియదగిన వాడవు నీవు. పావనములైన అనేక నామములు కలవాడివి నీవు. వృద్ధిక్షయాలకు దవ్వైన నిలయాలు కలవాడవు నీవు. అనగా నీ నిలయములైన శ్రీవైకుంఠకైలాసములు వృద్ధిక్షయాలకు దూరములు అని భావం. ప్రపంచమందున్న ఆనందమంతా నీదే. వేదవ్యాస మహర్షి రమణీయ వచనాలకు అలంకారమైన వాడవు నీవే స్వామీ!

క. **సత్సేవ్యచరణ! శమవ । ద్వాత్సల్యాభరణ! ధర్మతత్త్వోద్ధరణా!**
**హృత్సంగతభక్తిక దురి । తోత్సారణధుర్య దృఙ్మయూఖ విసరణా!** **483**

**ప్రతిపదార్థం:** సత్+సేవ్య+చరణ! = సజ్జనులచే సేవించబడిన పాదములు కలవాడా!; శమవత్ = శాంతితో కూడిన; వాత్సల్య+ఆభరణ = వాత్సల్యమనే గుణమే భూషణంగా కలవాడా!; ధర్మతత్త్వ+ఉద్ధరణా! = ధర్మతత్త్వమును ఉద్ధరించేవాడా! (కాపాడేవాడా!); హృత్+సంగత+భక్తిక = హృదయమందు పాదుకొన్న భక్తి గలవారల యొక్క; దురిత = పాపాలను; ఉత్సారణ = తొలగద్రోయటం అనే; ధుర్య = భారం వహించే; దృక్+మయూఖ+విసరణా! = చూపులనెడి కిరణముల యొక్క ప్రసారం కలవాడా!

**తాత్పర్యం:** స్వామీ హరిహరనాథా! సత్పురుషులు నీ పాదపద్మాలను భజిస్తారు. నీవు శాంతియుతమైన వాత్సల్యగుణంచేత (దోషమును భోగ్యముగా స్వీకరించే గుణం) విలసిల్లుతుంటావు. నీ అవతార ప్రయోజనం ధర్మాన్ని ఉద్ధరించటమే. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాప నార్థాయ సంభవామి

యుగే యుగే" అని గీతలో చెప్పినట్లు ధర్మాన్ని కాపాడటమే. భక్తి భరిత హృదయులైన వారి పాపాలను నీ చూపులనెడి కిరణముల యొక్క ప్రసారంతో రూపుమాపుతావు.

**మాలిని :** **స్మయ విరహిత పూజ్యా! మంత్రగీతాధిరాజ్యా!**
**నయన హిమగు సూర్యా! నైష్ఠిక క్షేమధుర్యా!**
**దయిత భువనరక్షా! దాంతి సంపద్యతాక్షా!**
**నియమ నికటవర్తీ! నిష్కళానంద మూర్తీ!** **484**

**ప్రతిపదార్థం:** స్మయవిరహితపూజ్యా! = అహంకార రహితులచే పూజింపదగినవాడా! (స్మయము = మదం, అహంకారం, అవలేపం, దర్పం); మంత్రగీత+అధిరాజ్యా! = వేదమంత్రాలచేత గానం చేయబడిన గొప్ప రాజ్యం కలవాడా! అనగా సకలవేదాలు హరిహరనాథుడి రాజ్యాధిపత్యమునే కీర్తిస్తాయని భావం; నయనహిమగు+సూర్యా = నేత్రములుగాఉన్న చంద్రుడు సూర్యుడు కలవాడా! అనగా సూర్యచంద్రులు కుడికన్ను ఎడమకన్నులుగా కలవాడా! (హిమగు = హిమగువు = చంద్రుడు); నైష్ఠిక క్షేమధుర్యా! = వేద ధర్మాన్ని ఆచరించటంలో శ్రద్ధగలవారి యొక్క క్షేమభారమును వహించేవాడా! "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అని గీతలో చెప్పే ఉన్నాడు; దయితభువనరక్షా! = ప్రియమైన లోకరక్షణం కలవాడా! అనగా లోకాలను కాపాడుట యందు ప్రీతికలవాడా!; దాంతిసంపత్+యత+అక్షా! దాంతిసంపత్ = క్లేశములను, కష్టాలను సహించడం అనే సంపదచేత; యత+అక్షా! = నియమించబడిన, లోబరచుకొనబడిన ఇంద్రియాలు (కర్మేంద్రియాలు) గలవాడా!; నియమనికటవర్తీ! = నియమాలకు సమీపమందు మెలగువాడా! అనగా యోగవిద్యాభ్యాసమునకు చేరువలో ఉండే వాడా!, నియమవ్రతశీలురకు సమీపమందే ప్రవర్తించేవాడా!; నిష్కలానందమూర్తీ = పూర్ణానందస్వరూపుడా! (నిస్+కళ = అంశ లేనట్టి)

**తాత్పర్యం:** దేవా! హరిహరనాథా! అహంకార రహితులు నిన్ను పూజిస్తారు. నీ సామ్రాజ్యాధిపత్య ప్రభావాన్ని వేదాలు కొనియాడుతున్నాయి. చంద్ర సూర్యులు నీ యెడమ కుడి కన్నులు. వైదికాచారపరుల యొక్క యోగక్షేమాల భారం నీవే వహిస్తున్నావు. జగద్రక్షణమందు ఆసక్తి గలవాడవు నీవు. శాంతి దాంతులు కలవాడవు నీవు. నియమ వ్రత శీలుర యొక్క చెంతనే నీవు మెలగుతుంటావు. ప్రభూ! నీవు అఖండానంద స్వరూపుడవు.

**విశేషం:** మాలిని అనే పేరుగల ఈ వృత్తానికి నాలుగుపాదాలు. ప్రతిపాదంలో వరుసగా "న,న,మ,య,య" అనే గణాలు ఉంటాయి. ప్రతి చరణం యొక్క ఆద్యక్షరంతో ఆచరణంలోని తొమ్మిదో అక్షరానికి యతిమైత్రి చెల్లుతుంది. ఈ వృత్తానికి ప్రాసనియమం ఉన్నది.

**గద్యము : ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున నానుశాసనిక పర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.**

**శ్రీమదాంధ్ర మహాభారతమునందలి యానుశాసనిక పర్వము సమాప్తము.**

**ప్రతిపదార్థం:** ఇది = ఇయ్యది; శ్రీమత్+ఉభయకవిమిత్త్ర = సంపద్యుక్తుడైన ఉభయకవిమిత్త్రుడును (సంస్కృతాంధ్రకవులకు చెలికాడనే బిరుదం వహించినవాడు); కొమ్మన+అమాత్య+పుత్త్ర = కొమ్మన అనే పేరుగల మంత్రి యొక్క కుమారుడు; బుధ+ఆరాధన+విరాజి = పండితులయొక్క పూజలచేత ప్రకాశించేవాడు, పండితులను పూజించటం చేత ప్రకాశించేవాడు

అయిన; తిక్కన సోమయాజి ప్రణీతంబు+అయిన = తిక్కన సోమయాజిచేత రచించబడిన, శ్రీమహాభారతంబునన్ = శుభకరమైన మహాభారతంలోని; ఆనుశాసనిక పర్వంబు+అందున్ = ఆనుశాసనికపర్వంలోని; సర్వంబును = సమస్తమూ; పంచమ+ఆశ్వాసము = ఐదవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది ఉభయకవిమిత్ర బిరుద భాసురుడూ, కొమ్మనమంత్రి కుమారుడూ పండితులయొక్క పూజలచేత ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన ఆనుశాసనిక పర్వంలోని సమస్తమూ పంచమాశ్వాసం.

**ఆనుశాసనిక పర్వంలోని పంచమాశ్వాసం సమాప్తం.**

**ఆంధ్రమహాభారతంలోని ఆనుశాసనికపర్వం ముగిసింది.**

- - -

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

**సంపుటము - 15**

**అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు**


కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద

శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు

డా॥ అంబటిపూడి నాగభూషణం

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

# KAVITRAYA VIRACHITA
# SRIMADANDHRA MAHABHARATAM

With Commentary
Aswamedha, Asramavasa, Mousala, Mahaprasthanika
and Swargarohana parvams of Tikkana Somayaji
Vol. XV.

Commentary by
**Dr. H.S.Brahmananda - Aswamedha, 1,2 Cantos** Mousala, Mahaprasthanika and Swargarohana
**Dr. Nagalla Guruprasada Rao - Aswamedha 3,4 Cantos**
**Dr. Ambatipudi Nagabushanam - Asramavasa 1,2 Cantos**

Chief Editor
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious publications Series No.614
First Edition : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by

**Sri. M.G. Gopal, I.A.S.**

Executive Officer,

T.T.Devasthanams,

Tirupati - 517 507

D.T.P. Type Setting

**Editor-In-Chief Office**

T.T.D. Tirupati.

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నందూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్-ఇన్-చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

**నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్**

మహాభారత యుద్ధానంతరం ద్వాపరాంతం వరకు జరిగిన సంఘటనలను సౌప్తిక, స్త్రీ పర్వాల తరువాతి పర్వాలు చిత్రీకరిస్తాయి. వీటిలో శాంతి, ఆనుశాసనిక పర్వాలు ధర్మవివేచన చేస్తూ ముందుకు వెళతాయి. తరువాతి ఐదు పర్వాలలో వివిధ ఘటనలు ఒకదాని వెంట ఒకటి జరిగి స్వర్గారోహణానికి త్వరితగతిన పయనిస్తున్నట్లు కనిపిస్తుంది. ధర్మరాజు భీష్మునితో ధర్మసూక్ష్మాలను తెలుసుకున్నప్పటికి, భీష్మాదుల మరణానికి బాధపడుతూ వైరాగ్యంతో అశ్వమేధాన్ని నిర్వహించాడు. అశ్వమేధయాగానంతరం ధృతరాష్ట్రుడు వానప్రస్థానికి వెళతారు. ఆ తరువాత ముసలం వల్ల యాదవులు అందరూ నాశనం చెందుతారు. యాదవ కౌరవుల లేమితో పాండవులు రాజ్యాన్ని పాలించలేక వైరాగ్యంతో మహాప్రస్థానానికి బయలుదేరి స్వర్గారోహణ చేస్తారు. ఈ స్వర్గారోహణంతో భారతకథ పరిసమాప్తమౌతుంది. ఈ ఐదుపర్వాల వ్యాఖ్యాన గ్రంథంతో తెలుగు భారత వ్యాఖ్యాన ప్రణాళిక పరిసమాప్తమౌతుంది. ఐదుపర్వాల వ్యాఖ్యానకర్తలు డా॥ హెచ్.ఎస్.బ్రహ్మానంద, డా॥ నాగళ్ల గురుప్రసాదరావు, డా॥ ఎ. నాగభూషణం గారలు. వీరు అత్యంత ఓర్మితో, అనుభవంతో వ్యాఖ్యానం చేశారు. వీరికి దేవస్థానం తరపున అభినందనలు తెలుపుతున్నాను.

ఈ ఐదు ఆశ్వాసాలకు పీఠిక, కథాసారము శైలిలో, ఏకరూపతనిచ్చి సంపాదకత్వం వహించిన వారు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు. వీరికి శుభాభినందనలు.

18 పర్వాల తెలుగు భారతాన్ని వ్రాసినవారు ముగ్గురయితే దాన్ని వ్యాఖ్యానించిన వారు ముప్పైమంది. అయినా దాన్ని చూపి సరిదిద్దిన ఎడిటోరియల్ సభ్యులు, ప్రధాన సంపాదకులు, సంపాదకమండలి, సంపాదకమండలి సలహా సభ్యులు, చుట్టూ అధికారులగణం, కార్యకర్తల దళం, అందరినీమించి ఈ కార్యక్రమాన్ని పూర్తిగా ఆశీర్వదించిన పాలకమండలి అధ్యక్షులు, సభ్యులు – అందరూ తమవంతు పాత్రను నిర్వహించి ఈ బృహత్ ప్రణాళికలో వేంకటేశ్వరస్వామి ఆశీర్వచనాన్ని పొందటానికి అర్హమైన పని చేసి కృతకృత్యులైనారు. అందరికి పేరుపేరునా అభినందనలను సూచిస్తూ, వారికై స్వామి అనుగ్రహాన్ని కోరుతాను.

ఆంధ్రమహాభారతాన్ని వ్యాఖ్యాన సహితంగా తీర్చిదిద్దిన ఈ పుస్తక సంపుటాలను పాఠకులు చదివి ఆనందించగలరని భావిస్తున్నాను.

**కార్యనిర్వహణాధికారి,**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యానుగ్రహంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతీ సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

## పూర్వరంగం:

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమస్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

## నన్నయ భారత ప్రాజెక్టు :

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 - 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' - అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జూలై 11వ తేదీన హైదరాబాదు బాలాజీభవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం :**

“ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్యపర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అరసున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో

ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసియున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను.''

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్వురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ'' కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగా పర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జూలై 3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన :**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డిగారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక''ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం :**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥ కె. సర్వోత్తమరావు** | **శ్రీ డి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటి దొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥ రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీ కాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం :**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిన అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్పా, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైనచోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జూలై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీ డి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :**

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్నభిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీ స్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం :**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక

వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పండ్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి".

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాస్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదకమండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

**సంపాదకమండలి సభ్యులు**

| | |
|---|---|
| డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు | శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు |
| డా॥ ఎస్.బి. రఘునాథాచార్య | డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య |
| డా॥ కె.జె. కృష్ణమూర్తి | డా॥ కె. సర్వోత్తమరావు |

**సలహామండలి సభ్యులు**

| | |
|---|---|
| పౌరసంబంధాధికారి, తి.తి.దే. | డా॥ బిరుదురాజు రామరాజు |
| అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్, తి.తి.దే. | డా॥ ఎం. కులశేఖరరావు |
| ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే. | డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు |
| | డా॥ ఎం. బుద్ధన్న |

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలులలోని సభ్యులయొక్క సంయుక్త సమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటాలన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్తపాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ప్రథమ సంపుటం- ఆదిపర్వం (రెండు భాగాలు), ద్వితీయ సంపుటం - సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి.సుబ్బారావుగారి తరువాత కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్., గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణను గూర్చి ఆసక్తితో గమనించి అన్నివిధాల సహకరించి ఆది, సభాపర్వాల విడుదలకు ఏర్పాటు చేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ ప్రణాళిక వ్యాఖ్యా సహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. అప్పట్లో తీవ్రతరం అయిన ప్రయత్నంతో గోదావరి పుష్కరాల సమయానికి ఆరణ్యపర్వం (2 భాగాలు), విరాటపర్వం విడుదల అయ్యాయి. తర్వాత శ్రీ అజేయ కల్లంగారు కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన వెనువెంటనే ఈ మహాభారత వ్యాఖ్యాన సహిత ప్రచురణ ప్రణాళికను మరింత వేగిరపరచి కృష్ణాపుష్కరాల లోపల యుద్ధపంచకాన్ని విడుదల చేయాలనీ, 2004 సంవత్సరం చివరకు మిగిలిన పర్వాష్టకము వెలుగుచూడాలనీ నిర్ణయించడం జరిగింది. 2004 కృష్ణాపుష్కరాల సమయంలో ఉద్యోగ, భీష్మ, ద్రోణపర్వాలు వెలువడ్డాయి. తరువాత కర్ణపర్వం ఒక సంపుటంగాను, తరువాతి పర్వాలైన శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు మూడింటిని కలిపి ఒకే సంపుటంగాను, శాంతిపర్వాన్ని రెండు సంపుటాలుగాను ముద్రించాము. ఇవి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్.రాజశేఖరరెడ్డిగారి చేతులమీదుగా విడుదల అయ్యాయి. ఆ తరువాత అనుశాసనికపర్వం (ఐదు ఆశ్వాసాలు) ఒక సంపుటంగాను మిగిలిన ఐదుపర్వాలను (అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వాలు) ఒక సంపుటంగాను ప్రచురించాలని

నిర్ధారణచేసి త్వరితగతిన ఉపక్రమించినప్పటికి అనుకోని ఆటంకాలు ఏర్పడి జాప్యం జరిగిన సంగతి నిజం. అపుడు మనలను ఆదుకున్నవారు ఎడిటోరియల్‌సెల్‌లో సభ్యులైన శ్రీ ముదివర్తి కొండమాచార్యులువారు. ఆయన కష్టపడి కునుకువేయక తుదిమెరుగుల వరకు పనిచేసి ఇస్తేకాని గట్టు ఎక్కలేకపోయాయి.

ఈ మధ్యకాలంలో అంటే మహాభారత వ్యాఖ్యాన ప్రచురణ యజ్ఞం చివరిదశలో ఉండగా సంచాలకులైన సప్తగిరి సంపాదకులు డా॥ యన్.ఎస్.రామమూర్తిగారు పదవీ విరమణ చేయడం జరిగింది. 1994 సం॥లో సప్తగిరి సంపాదకుడిగా పదవి స్వీకరించిన వెనువెంటనే మహాభారత వ్యాఖ్యాన ప్రచురణ భారాన్ని భుజానవేసుకొని సమర్థంగా అన్ని ఆటంకాలను అధిరోహించి ఆంధ్రదేశం గర్వించతగ్గ ఒక మహా గ్రంథాన్ని వెలుగులోకి తీసుకురావడానికి ఆయన చేసిన కృషి అభినందనీయము.

ఈ మహాభారత వ్యాఖ్యాన ప్రచురణ యజ్ఞంలో పాలుపంచుకొంటూనే పరమపదించినవారు కొందరు మహనీయులు. 2006 సం॥ జనవరి 25న కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన, సంపాదకమండలి సమావేశం జరిగింది. ఆంధ్రదేశంలో ప్రాతఃస్మరణీయులైన డా॥ దివాకర్ల వేంకటావధాని, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు, నాగసిద్ధారెడ్డి, ఆచార్య తూమాటి దొణప్ప, ములుకుట్ల రామకృష్ణశాస్త్రి, డా॥ ఎస్.బి.రఘునాథాచార్య, డా॥ మరుపూరి కోదండరామిరెడ్డి, ఏలూరిపాటి అనంతరామయ్య, డా॥ మేడవరం వెంకటనారాయణశర్మ, డా॥ కె.రామగోపాల కృష్ణమూర్తి వారలకు శ్రద్ధాంజలి ఘటించింది.

వ్యాఖ్యానంతో కవిత్రయ భారతాన్ని సంపూర్ణంగా ప్రచురించడం అనేది ఒక హిమాలయ సదృశ కార్యక్రమం. ఈ పద్దెనిమిది పర్వాల వ్యాఖ్యానాన్ని 15 పుస్తకాలుగా చేసి ప్రకటించడంలో సహాయ సహకారాలు అందించినవారు అనేకులు. గ్రంథసంపాదనక్షేత్రంలో పలువ్యాఖ్యాతల వ్యాఖ్యానాన్ని సంపాదకులు ఒక్కరే ఒక్కతాటిపై ఏకధాటిగా విషయాన్ని నడిపించడం గ్రంథ సంపాదన క్షేత్రంలో అసామాన్యం. ప్రధాన సంపాదకుల వారికి వ్యాఖ్యాతలకు మధ్య 'ఎడిటోరియల్‌సెల్' అనే ప్రక్రియ భారతీయ భాషలలోనే అరుదు. ఇటువంటి కార్యక్రమానికి పూనుకొని ఏకనిష్ఠగా వర్క్‌షాపువలె చివరివరకు పనిచేసిన చాల సందర్భాలు అరుదు. అటువంటి విద్వాంసుల త్రిసభ్య సెల్ పరిశీలనతో మహాభారత వ్యాఖ్యానం పూర్తి అయింది. ఈ సెల్‌లోని సభ్యులు

1. **ఆచార్య సముద్రాల లక్ష్మణయ్య**
2. **డా॥ కె.సర్వోత్తమరావు**
3. **శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు-**

తమ అనుభవ విద్వత్ ప్రతిభలను ధారపోసినారు. వీరికి సంపాదకమండలి సమావేశం ధన్యవాదాలను తెలిపింది.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. లోగడ తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా వున్న శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహానికి కృతజ్ఞతాభివందనాలు. ఈ మహాగ్రంథం

పూర్తిగా వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. తి.తి.దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి సాహిత్య ప్రియులూ ఐన శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్., గారు మరింత ప్రోత్సాహం ఇచ్చి ప్రాజెక్టు పనిని వేగవంతం చేశారు. దీనికోసం ప్రతిరోజు నిరంతరాయంగ పని జరిగేటట్లు చూడడమే కాకుండ వారానికొక 'నివేదిక'ను అడిగి తగు మార్గదర్శనాన్ని చేసినవారు ఆయన. వారికి గౌరవాదరాలతో కృతజ్ఞతలు తెలుపటానికి సంతోషిస్తున్నాము.

సంబంధిత విభాగాధిపతిగా, సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన శ్రీ కె.రాంపుల్లారెడ్డి, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి- వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయ సహకారాలందించిన తదితర అధికారిగణానికి నమస్సులు. ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధాన పాత్ర వహించిన- వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదకమండలి, సలహామండలి) విద్యావేత్తలకు, ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారికి- నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥ కోరాడ రామకృష్ణ, తెలుగు ఉప-సంపాదకులు డాక్టర్ కె.రాధారమణ, డాక్టర్ అల్లాడి సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ ఉప-సంపాదకులు శ్రీ బి.ఎన్.శ్రీనివాసన్ గారలకు, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది పాఠకులకు తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయాధికారి శ్రీ జి.వెంకటేశ్వరరావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూఉన్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారత' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

డా॥ ఎన్. ఎస్.రామమూర్తిగారు ఈ వ్యాఖ్యాన యజ్ఞాన్ని పూర్తిగావించినప్పటికీ పుస్తకాలను చదువరులచేతిలో పెట్టేపనిని భవదీయుడికి వదలినారు. అందరికి పేరుపేరున కృతజ్ఞతలను చెపుతూ, పుస్తకాలను శ్రీ వేంకటేశ్వరుని పాదాలకు పుష్పాలుగా అర్పిస్తున్నాను.

**సి.శైలకుమార్**
కన్వీనర్
సంపాదకుడు - సప్తగిరి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

### కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదక మండలి

**అధ్యక్షులు**

**శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ ఐ.ఏ.ఎస్.,**

**కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి.**

**ప్రధాన సంపాదకుడు: ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం,**

**సంపాదక మండలి సభ్యులు**

శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఆచార్య కె. సర్వోత్తమరావు

**సలహా మండలి సభ్యులు**

డా॥ బిరుదురాజు రామరాజు

ఆచార్య ఎం. కులశేఖరరావు

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

ఆచార్య ఎం. బుద్ధన్న

శ్రీ కె. రామపుల్లారెడ్డి, (పౌరసంబంధాధికారి)
(ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ మేడసాని మోహన్, డైరెక్టర్
అన్నమాచార్య ప్రాజెక్టు, (ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య, కార్యదర్శి
ధర్మప్రచార పరిషత్తు (ఎక్స్ అఫిషియో సభ్యులు)

**కన్వీనర్**

**సి. శైలకుమార్**

"సప్తగిరి" సంపాదకులు, తి.తి.దేవస్థానములు, తిరుపతి.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| | వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|---|
| 1. | డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. | డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా.1 |
| 3. | డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా 1,2 |
| 4. | డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ ఆశ్వా. 1,2 |
| 5. | డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా 1 |
| 6. | డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. | శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా.2 |
| 8. | డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా.4 |
| 9. | డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా.5 |
| 10. | డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. | శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. | శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. | డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. | డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. | డాక్టర్ కె. రాజన్న శాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. | శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. | డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. | డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. | డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. | డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. | డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. | డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. | డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. | శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. | డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. | డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | అను. ఆశ్వా. 1,2 |
| 27. | డాక్టర్ శలాక రఘునాథశర్మ | అను. ఆశ్వా. 3,4 |
| 28. | డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | అను. ఆశ్వా. 5 |
| 29. | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. | డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| ఆను. | – | ఆనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |

| | | |
|---|---|---|
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభవిక్రీడితం |
| శా. | – | శార్దూలవిక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆశ్రమవాస పర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీసంబంధాయుర్గురు। తా సిద్ధిద చరణపద్మ! దాంత్యున్మీల**

**ద్ధీసద్మ శాంతిసేవ్యా। వ్యాసాది మునీంద్రభావ్య హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= ఐశ్వర్యానికి; సంబంధ= సంబంధించినటువంటివాటియొక్క, (ధన కనకాది సంపదలు); ఆయుస్(ః)= జీవితకాలంయొక్క; గురుతా= ఆధిక్యాన్ని; సిద్ధిద= కలుగజేసేటటువంటి; చరణ పద్మ!= తామరవంటి పాదాలు కలవాడా!; దాంతి= బహిరింద్రియ నిగ్రహంచేత; ఉన్మీలత్= వికసించేటటువంటి; ధీ= బుద్ధి; సద్మ!= నివాసంగా కలవాడా!; శాంతి= అంతరింద్రియ నిగ్రహంచేత; సేవ్యా!= సేవించదగినవాడా!; వ్యాస= వ్యాసుడు; ఆది= మొదలుగా కలిగిన; ముని+ఇంద్ర= మునిశ్రేష్ఠులచేత; భావ్య= భావించబడేవాడా!; హరిహరనాథా!= ఓ హరిహరనాథ స్వామీ!

**తాత్పర్యం:** ధనకనకాది సంపదలూ, ఆయువులూ అత్యధికంగా సిద్ధింపజేసేటటువంటి పద్మములవంటి పాదాలు కలవాడా! బాహ్యేంద్రియాలను నిగ్రహించగలిగినవారి బుద్ధిలో నివసించేవాడా! అంతరింద్రియాలను నిగ్రహించుకొనటం చేత సేవించదగినవాడా! వ్యాసుడు మొదలైన మహామునులచేత భావించబడేవాడా! హరిహరనాథస్వామీ!

**విశేషం:** శ్రీయొక్క సంబంధం కలిగిన ఆయుర్గురుత అంటే సంపదలతో కూడిన జీవిత కాలాధిక్యము. జీవితకాలం అధికంగానూ, అంతకాలమూ సంపదలు గలిగే విధంగానూ, శ్రీసంబంధం కలిగినవాడు శ్రీపతి హరి. హరి శ్రీసంబంధిగురుత్వం ఇచ్చేవాడు. మృత్యుంజయుడైన శివుడు లయకారి, కాబట్టి ఆయుర్గురుత, హరుడిస్తాడు. ఇంద్రియ లోలుడుగా బాహ్యదృష్టికి గోచరిస్తూ ఆంతరదృష్టికి ఇంద్రియజేతయై దాంతి గలవాడు హరి. తపోమగ్నుడై అంతర్ముఖత్వంతో శాంతుడైన వాడు హరుడు. ఇటువంటి ఉభయవిధమైన ఏకతత్త్వాన్నే వ్యాసాదిమునీంద్రులు భావించారు. అదే 'హరిహరనాథ' తత్త్వం. 'శాంతి బుద్ధీంద్రియ సన్నివారణ, దాంతి కర్మేంద్రియాల యోగ్య ప్రవృత్తి, అని భార. ఆను.5181.కర్మేంద్రియాలను యోగ్య విషయాలలో ప్రవర్తింపజేయటం 'దాంతి' ఇతర విషయాలలో నివర్తింపజేయటం (బహిరింద్రియ) నిగ్రహం దాంతి.

**ధృతరాష్ట్రుని పాలికి నారదుండు మునులతో వచ్చి యత్తపోవనమహిమ చెప్పుట (సం.15-26-1)**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు వైచిత్రవీర్యుండు పరమతపోధుర్యుం డయి యుండె; నంత నొక్కనాఁడు నారద పర్వత దేవల మౌంజాయను లమ్మహీనాయకుం జూచువేడ్క నయ్యా శ్రమంబునకుం జనుదెంచిన. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయ మహారాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; వైచిత్రవీర్యుండు= (విచిత్రవీర్యుడి కొడుకు) ధృతరాష్ట్రుడు; పరమ+తపస్+ధుర్యుండు+అయి ఉండెన్= గొప్ప తపస్సును తీవ్రంగా ఆచరిస్తూ ఉన్నాడు (శతయూపుడి ఆశ్రమ సమీపంలో) తన ఆశ్రమంలో ఉన్నాడు); అంతన్= ఆ సమయంలో; ఆ+మహీనాయకున్= ఆ ధృతరాష్ట్ర మహారాజును; చూచు+వేడ్కన్=

చూడాలనే కోర్కెతో; ఆ+ఆశ్రమంబునకున్= ధృతరాష్ట్రుడు ఉంటున్న ఆశ్రమానికి; నారద పర్వత దేవల మౌంజాయనులు= నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, మౌంజాయనుడు అనే మునులు; చనుదెంచినన్= రాగా.

**తాత్పర్యం:** హరిహరనాథా! జనమేజయుడితో వైశంపాయన ముని ఈ విధంగా చెప్పాడు. ధృతరాష్ట్రుడు ఆ ప్రకారంగా తీవ్రమైన తపస్సును ఏకాగ్రతతో ఆచరిస్తూ ఉండగా, ఒకరోజు ఆ ధృతరాష్ట్రుడిని చూడటానికి నారదుడు, పర్వతుడు, దేవలుడు, మౌంజాయనుడు అనే మహర్షులు అతడి ఆశ్రమానికి వచ్చారు.

**క. శతయూపుఁడు నయ్యెడకుం । గుతుకంబున వచ్చె; వారిఁ గుంతి వినయ సం**
**భృతయై యందఱను సమ । ర్చితులుగఁ జేసినఁ బ్రహృష్టచేతసు లగుచున్. 3**

**ప్రతిపదార్థం:** శతయూపుఁడున్= శతయూపుడు కూడా; కుతుకంబునన్= కుతూహలంతో; ఆ+ఎడకున్= ధృతరాష్ట్రుడి వద్దకు; వచ్చెన్= వచ్చాడు; వారిన్= ఆ నారదాదులను; అందఱను= అందరినీ; వినయ సంభృత+ఐ= అణకువతో నిండినదై; కుంతి= కుంతీదేవి; సమ్+అర్చితులుగన్= బాగా పూజించబడినవారినిగా; చేసినన్= చేయగా (నారదాదులనందరినీ అణకువతో పూజించగా); ప్రహృష్ట+చేతసులు= (ఆ నారదాదులు) సంతోషించిన మనస్సు కలవారు; అగుచున్= అవుతూ.

**తాత్పర్యం:** శతయూపుడు కూడా కుతూహలంతో ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చాడు. అపుడు కుంతి వాళ్ళనందరినీ సవినయంగా పూజించగా, వాళ్ళు సంతోషించారు.

**వ. ధృతరాష్ట్రుకడకుం బోయిన నతండు వినయ సంభ్రమంబులతో వినతుం డైన దీవన లిచ్చి యతని పెట్టించిన దర్భాసనంబుల నాసీనులై యుచిత సల్లాపంబులు సేయుసమయంబున నారదుం డన్నర నాథుతో శతయూప నామధేయుం డయిన ధరాధిపు పితామహుం డగు సహస్రచిత్యుం డను మహారాజు తన పెద్దకొడుకైన శతచిత్యునందు రాజ్యభారం బిడి యియ్యాశ్రమంబునకు వచ్చి తపశ్చరణంబున దుశ్చ్యవన సఖిత్వంబు వడసె; మఱియును బృషధ్రుండును, శైలాలయుండును, బురుకుత్సుండును నిందుఁ దపంబు చేసి యింద్రలోకంబు వడసి రా రాజర్షిసత్తముల నెల్లను నే నీలోకంబున మెలంగుచుండి యియ్యెడం గంటి నయ్యెడం జూచితి; నిది యితరదుష్ప్రాప్యంబయిన పుణ్యప్రదేశంబు; నీకుం గృష్ణద్వైపాయను ప్రసాదంబున నిచ్చట వసియింప సంభవించె' నని పలికి వెండియు. 4**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుకడకున్= ధృతరాష్ట్రుడి వద్దకు; పోయినన్= వెళ్ళగా; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; వినయ సంభ్రమంబులతోన్= అణకువతోనూ, సంరంభముతోనూ; వినతుండు= నమస్కరించినవాడు; ఐనన్= కాగా; (నారదాదులు) దీవనలు+ఇచ్చి= ఆశీర్వదించి; అతని పెట్టించిన= ఆ ధృతరాష్ట్రుడు ఏర్పాటు చేయించిన; దర్భాసనంబులన్= దర్భలచేత తయారుచేయబడ్డ ఆసనాలపై; ఆసీనులు+ఐ= కూర్చున్నవారై; ఉచిత సల్లాపంబులు= తగిన సంభాషణలు; చేయు సమయంబునన్= చేసేటప్పుడు (కుశలాదికమైన మాటలు మాటాడుతుండగా); నారదుండు= నారదమహర్షి; ఆ+నరనాథుతోన్= ఆ ధృతరాష్ట్రుడితో (ఇట్లా అన్నాడు); శతయూప నామధేయుండు+ఐన= శతయూపుడు అనే పేరు కలిగిన; ధరా+అధిపు= రాజుకు; పితామహుండు= తాత; అగు= అయిన; సహస్ర చిత్యుండు= సహస్రచిత్యుడు; అను మహారాజు= అనే పేరుకలిగిన రాజు; తన పెద్దకొడుకు= తన కుమారులలో పెద్దవాడు; ఐన= అయినటువంటి; శతచిత్యునందున్= శతచిత్యుడు అనే వాడిమీద; రాజ్యభారంబు= రాజ్యపాలన బాధ్యతను; ఇడి= ఉంచి; ఈ+ఆశ్రమంబునకున్= ఇపుడు నీవు (ధృతరాష్ట్రుడు) ఉంటున్న ఆశ్రమానికి; వచ్చి= చేరి (ఇక్కడ ఉండి); తపస్+చరణంబునన్= తపస్సు చేయటంవలన; దుశ్చ్యవన= ఇంద్రుడియొక్క; సఖిత్వంబు= మైత్రిని; పడసెన్= పొందాడు;

మఱియును= ఇంకా; వృషద్రుండును= వృషద్రుడు అనే పేరుగలవాడు; శైలాలయుండును= శైలాలయుడనే రాజు; పురుకుత్సుండును= పురుకుత్సుడనే అతడు; ఇందున్= ఈ ఆశ్రమంలోనే; తపంబు= తపస్సు; చేసి= ఆచరించి; ఇంద్రలోకంబు= ఇంద్రుడుండే లోకం (స్వర్గం); పడసిరి= పొందారు; ఆ రాజర్షి సత్తములన్= రాజ ఋషులలో ఉత్తములైన వారిని; ఎల్లను= అందరినీ; నేను= నేను (నారదుడు); ఈ లోకంబునన్= భూలోకంలో; మెలంగుచున్+ఉండి= సంచరిస్తూ ఉండి; ఈ+ఎడన్= ఇక్కడ; కంటిన్= చూచాను; ఆ+ఎడన్= ఇంద్రలోకంలోనూ; చూచితిన్= చూచాను; ఇది= నీవు ఉంటున్న ఈ ఆశ్రమం; ఇతర+దుస్+ప్రాప్యంబు= ఇతరుల (సామాన్యుల) చేత పొందరానిది; అయిన= అయినటువంటి; పుణ్యప్రదేశంబు= పవిత్ర స్థలం; ఇచ్చటన్= ఈ ఆశ్రమంలో; వసియింపన్= ఉండే అవకాశం; నీకున్= నీకుకూడా; కృష్ణద్వైపాయను= వ్యాసమహర్షియొక్క; ప్రసాదంబునన్= కరుణవలన; సంభవించెన్= కలిగింది; అని= అనే విధంగా; పలికి= చెప్పి; వెండియున్= తిరిగి (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** నారదాదులందరూ (కుంతిచేసిన అతిథి పూజలకు సంతోషించి) ధృతరాష్ట్రుడి వద్దకు చేరారు. అపుడు ఆ ధృతరాష్ట్రుడు వినయంతోనూ, గౌరవంతోనూ వారికి వంగి నమస్కరించాడు. వారు ధృతరాష్ట్రుడిని ఆశీర్వదించారు. ధృతరాష్ట్రుడు ఏర్పాటు చేయించిన దర్భాసనాలమీద కూర్చున్నారు. కుశలాదికం సంభాషిస్తున్నారందరూ. ఆ సమయంలో నారదుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'పూర్వం శతయూప మహారాజుకు తాత అయిన సహస్రచిత్యుడు అనే (కేకయదేవ) రాజు తన పెద్దకొడుకైన శతచిత్యుడికి రాజ్యభారం అప్పగించి ఈ ఆశ్రమానికి వచ్చి తపస్సుచేసి ఇంద్రుడి మైత్రిని పొందాడు. ఆ తరువాత వృషద్రథుడూ, శైలాలయుడూ (భగదత్తుడి తాత), పురుకుత్సుడూ (మాంధాత కొడుకు) ఈ ఆశ్రమంలోనే తపస్సు చేసి ఇంద్రలోకం పొందారు. నేను భూలోకంలో సంచరించేటప్పుడు ఇక్కడ (ఈ ఆశ్రమంలో వారు తపస్సు చేసికొనటం, అంతకుపూర్వం రాజులుగా పాలనచేయటం) తరువాత ఇంద్రలోకంలోనూ ఆ ఉత్తమ రాజర్షులను ఎరుగుదును. ఈ ఆశ్రమానికి రావటం సామాన్యులకు సాధ్యం కాదు. నీకు కూడా ఈ ఆశ్రమంలో నివసించే అవకాశం వ్యాసుడిదయవలన కలిగింది' అని చెప్పి నారదుడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**సీ.** **'ధరణీశ! యిచ్చటి తపమున నీవు నా। నృపుల యట్టుల విశిష్టపుఁ బదంబుఁ**
**గందు; నీ తోడన గాంధారియును వచ్చు;। మీకు శుశ్రూష యమేయ భక్తిఁ**
**జేసి కుంతియుఁ బతిఁ జేరంగ నరుగు; న। ప్పాండుభూపతి సురపతి సమీప**
**ముననుండి యెప్పుడు నినుఁ దలంచు, నతండు। పోఁడిమి సేయఁగలాఁడు నీకు**

**ఆ.** **ధర్మమూర్తి యైన ధర్మసూనుఁడు దన। యాత్మ గాన విదురుఁ డన్నరేంద్రు**
**వినుతతనువుఁ దగఁ బ్రవేశించు సంజయుఁ। డతుల నాకలోకగతి వెలుంగు. 5**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇచ్చటి= అటువంటి మహత్తు కలిగిన ఈ ఆశ్రమంలో ఆచరించిన; తపమునన్= తపస్సువలన; నీవున్= నీవుకూడా; ఆ నృపుల+అట్టుల= సహస్రచిత్యుడు మొదలైన రాజులవలెనే; విశిష్టము+పదంబు= గొప్ప స్థానాన్ని (సద్గతి); కందు(వు)= పొందుతావు; గాంధారియును= గాంధారికూడా; నీతోడన్+అ= నీతోపాటే; వచ్చున్= ఆ ఉత్తమ గతికి (నిన్ను) అనుసరించి వస్తుంది; కుంతియున్= కుంతీదేవికూడా; అమేయభక్తిన్= మిక్కిలి భక్తితో; మీకున్= మీకు (గాంధారీ ధృతరాష్ట్రులకు); శుశ్రూష= సేవ; చేసి= ఆచరించి; పతిన్= భర్త అయిన పాండురాజును; చేరంగన్= పొందటానికి; అరుగున్= వెళ్ళుతుంది; ఆ+పాండుభూపతి= ఆ పాండురాజు; సురపతి= దేవేంద్రుడి యొక్క; సమీపమునన్+ఉండి= చెంత ఉండి; ఎప్పుడున్= నిరంతరమూ; నినున్= నిన్ను; తలంచున్= తలచుకొంటూ ఉంటాడు; అతండు= ఆ పాండురాజు; నీకున్=

నీకు (గాంధారికీ); పోఁడిమి= మేలు; చేయన్+కలాఁడు= కలిగేటట్లు చేస్తాడు; ధర్మమూర్తి= ధర్మమే ఆకారంగా కలవాడు; ఐన= అయినటువంటి; ధర్మసూనుఁడు= ధర్మరాజు; తన+ఆత్మ= తన(విదురుడి) యొక్క యథార్థ రూపం; కానన్= కాబట్టి; విదురుఁడు; ఆ+వర+ఇంద్రు= ఆ ధర్మరాజు యొక్క; వినుత+తనువున్= ప్రశస్తమైన శరీరంలో; తగన్= తగువిధంగా (యోగమార్గంలో); ప్రవేశించున్= ప్రవేశిస్తాడు; సంజయుఁడు; అతుల నాకలోక గతిన్= సాటిలేని స్వర్గలోకానికి వెళ్ళటంచేత; వెలుంగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అటువంటి ఈ ఆశ్రమంలో తపస్సు చేయటంవలన సహస్రచిత్యుడు మొదలైన పూర్వపు రాజులవలె నీవూ ఉత్తమమైన గతిని పొందుతావు. గాంధారికూడా నిన్ను అనుసరించి వస్తుంది. మీకు అత్యంత భక్తితో సేవలు చేయటంవలన కుంతికూడా చివరకు తన భర్త పాండురాజు వద్దకు వెళ్ళుతుంది. ఇంద్రుడి వద్ద ఉండి ఎప్పుడూ నిన్నే తలచుకొనే పాండురాజు నీకు మేలు చేయగలడు. ధర్మ స్వరూపమైన ధర్మరాజు తన ఆత్మ కాబట్టి విదురుడు ధర్మరాజు శరీరంలో తగువిధంగా ప్రవేశిస్తాడు. సంజయుడు స్వర్గలోకానికి వెళ్ళి ప్రకాశిస్తాడు.'

**వ. అనిన విని యాంబికేయుండు గాంధారీకుంతీ సమేతంబుగా సంతోషంబు నొందె; నచ్చటియందఱును బ్రీతాత్ములై; రప్పుడు. 6**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నారదుడు చెప్పగా; విని= విన్నవాడై; ఆంబికేయుండు= (అంబిక కొడుకు) ధృతరాష్ట్రుడు; గాంధారీ కుంతీ సమేతంబుగాన్= గాంధారితోనూ, కుంతితోనూ కలిసి; సంతోషంబున్= ఆనందాన్ని; ఒందెన్= పొందాడు; అచ్చటి అందఱును= ఇంకా అక్కడ ఉన్న వారందరూ; ప్రీత+ఆత్ములు= సంతోషించిన మనసుగలవారు; ఐరి= అయ్యారు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** నారదు డట్లా చెప్పగా విన్న ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతులతో సహా సంతోషించాడు. ఇంకా అక్కడ ఉన్నవారందరూ కూడా సంతోషించారు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శతయూపుఁడు నారదుతో। 'నతుల జ్ఞానాభిరామ' యడిగెద నిన్నుం**
**గుతుకంబున నొక్కటి; నీ। వితతకృపం దెలియఁ జెప్పవే నా' కనుడున్. 7**

**ప్రతిపదార్థం:** శతయూపుఁడు= శతయూపుడనే రాజర్షి; నారదుతోన్= నారదమహర్షితో (ఇట్లా అన్నాడు); అతులజ్ఞాన+అభిరామ!= సాటిలేని జ్ఞానంతో మనోహరమైనవాడా!; నిన్నున్= నిన్ను; కుతుకంబునన్= కుతూహలం కొద్దీ; ఒక్కటి= ఒకానొక విషయం; అడిగెదన్= అడుగుతాను; నాకున్= నాకు; నీ+వితత+కృపన్= అత్యధికమైన నీదయతో; నీవు; తెలియన్+చెప్పవే= తెలుపవలసింది; అనుడున్= అని శతయూపుడు అనగా.

**తాత్పర్యం:** శతయూపుడు నారదుడితో 'అన్నీ అందరికంటె ఎక్కువగా తెలిసినవాడా! కుతూహలంకొద్ది నిన్నొక విషయం అడుగదలచాను దయతో నాకు చెప్పవలసింది' అని పలుకగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. ఆ దేవముని 'నీ యడుగఁ దలంచినది యెయ్యది? యడుగు' మనిన నతం 'డిక్కురుపతి సుగతి గను' నని నిర్దేశించితి; తద్విశేషంబు వినవలతు; వివరింపు' మనుటయు. 8**

**ప్రతిపదార్థం:** ఆ దేవముని= ఆ దేవతా ఋషి; నీ+అడుగన్+తలంచినది= నీవు నన్ను అడగాలి అనుకొన్నది; ఏ+అది?= ఏది?, ఏమిటి?; అడుగుము= అడుగుము; అనినన్= అని నారదు డనగా; అతండు= ఆ శతయూపుడు; ఈ+కురుపతి= ఈ ధృతరాష్ట్రుడు;

సుగతి= శ్రేష్ఠమైన స్థానాన్ని; కనున్= పొందుతాడు; అని= అనే విధంగా; నిర్దేశించితి(వి)= చెప్పావు; తద్+విశేషంబు= సుగతి పొందటానికి సంబంధించిన ఆ విషయం; వినన్+వలతు(న్)= వినగోరుతున్నాను; వివరింపుము= విస్తరించి చెప్పవలసింది; అనుటయున్= అని శతయూపుడు అనగా.

**తాత్పర్యం:** ఆ దేవర్షి నారదుడు 'నీవు నన్ను ఏమి అడగా లనుకొంటున్నావు? అడుగుము' అన్నాడు. అపుడు శతయూపుడు 'ఈ కురురాజుకు ఉత్తమగతి కలుగుతుందని చెప్పావు. అందుకు సంబంధించిన విశేషాలు వివరించు.' మని అడుగగా (తరువాతి పద్యంతో అన్వయం)

నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిఁ బొందెడు తెఱంగు చెప్పుట (సం.15-27-8)

**సీ.** **ఆ సంయమీశ్వరుం డాతని కిట్లను। 'నిచ్చమై నేను మహేంద్రు కడకు**
**నరిగి సంభాషణ మాచరించుచు నుండ। నా సభ నిక్కౌరవాధినాథు**
**వలనివార్తలు పుట్టి యలఘు తపోవృత్తి। నిష్ఠాతిశయము వర్ణించి' రప్పు**
**డవ్వాసవుఁడు చెప్పె ననఘ! నాతో ముని। జాతుఁడు ధృతరాష్ట్ర జనవిభుండు**

**తే.** **తపము మూఁడేఁడు లొనరించి తాను సతియు। దేహము ల్విడ్చి చని ధనాధీశు చెలిమి**
**నతిశయిల్లు దివ్యాభరణాభిరాముఁ। డై విమానవిహార హృష్టాత్ముఁ డగుచు.** 9

**ప్రతిపదార్థం:** సంయమి+ఈశ్వరుండు= (యతులలో శ్రేష్ఠుడైన) ఆ నారదుడు; అతనికిన్= శతయూపుడితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనున్= అన్నాడు; అనఘ!= పాప మెరుగనివాడా!; నేను= నేను (నారదుడు); ఇచ్చమైన్= కోరికతో; మహేంద్రు కడకున్= దేవేంద్రుడి వద్దకు; అరిగి= వెళ్ళి; సంభాషణము+ఆచరించుచున్+ఉండన్= మాటలాడుతుండగా; ఆ సభన్= ఆ ఇంద్రసభలో; ఈ+కౌరవ+అధినాథు వలని వార్తలు= ఈ ధృతరాష్ట్రుడికి సంబంధించిన సమాచారం; పుట్టి= ప్రస్తావనకు వచ్చి; అలఘు తపస్+వృత్తి నిష్ఠా+అతిశయము= ధృతరాష్ట్రుడి గొప్ప అయిన తపస్సునందు వర్తిస్తున్న శ్రద్ధయొక్క ఆధిక్యం; వర్ణించిరి= ప్రశంసించారు; అప్పుడు= ఆ సందర్భంలో; ఆ+వాసవుఁడు= ఆ ఇంద్రుడు; నాతోన్= నాతో; చెప్పెన్= ఈ విధంగా అన్నాడు; మునిజాతుఁడు= మునివలన జన్మించిన; ధృతరాష్ట్ర జన విభుండు= ధృతరాష్ట్ర మహారాజు; మూఁడు+ఏఁడులు= మూడు సంవత్సరాల పాటు; తపము= తపస్సు; ఒనరించి= చేసి; తానున్= తానూ; సతియున్= అతడి భార్యా; దేహముల్= శరీరాలు; విడ్చి= త్యజించి; చని= వెళ్ళి; ధన+అధి+ఈశు= ధనాధిపతి అయిన కుబేరుడియొక్క; చెలిమిన్= స్నేహంతో; దివ్య+ఆభరణ+అభిరాముఁడు+ఐ= గొప్ప ఆభరణాలతో మనోహరుడై; విమాన+విహార+హృష్ట+ఆత్ముఁడు= విమానంలో విహరించటంవలన సంతోషించే మనస్సు కలవాడు; అగుచున్= అవుతూ; అతిశయిల్లున్= వెలుగుతాడు.

**తాత్పర్యం:** శతయూపుడితో నారదమహాముని ఇట్లా అన్నాడు. 'ఓ పుణ్యాత్మా! ఒకసారి నేను దేవేంద్రుడివద్దకు వెళ్ళి మాటాడుతుండగా ఆ సభలో ఈ ధృతరాష్ట్రుడి వృత్తాంతం ప్రస్తావనకు వచ్చి, ఇతడి తీవ్రతపోనిష్ఠను అందరూ ప్రశంసించారు. ఆ సందర్భంలో దేవేంద్రుడు నాతో ఇట్లా అన్నాడు. 'ముని శ్రేష్ఠుడైన ధృతరాష్ట్రుడు తపస్సు మూడు సంవత్సరాలు చేస్తాడు. ఆ తరువాత తానూ గాంధారీ తమ శరీరాలు విడిచిపెట్టి, కుబేరుడితో మైత్రి పొంది దివ్యమైన ఆభరణాలు ధరించి, పుష్పకవిమానంలో విహరిస్తూ సంతోషంగా వెలుగుతారు.

**క.** **అని పాండుని మది ప్రమదం। బునఁ దేలఁగఁ జెప్పె 'ననుడు మోదము ధృతరా**
**ష్ట్రుని నెమ్మనమున నిండా। రె; నఖిల జనచిత్తములను బ్రియము దలిర్చెన్.** 10

**ప్రతిపదార్థం:** పాండునిమది= పాండురాజు హృదయం; ప్రమదంబునన్= సంతోషంతో; తేలఁగన్= తేలిపోయేటట్లుగా; అని= ఆ ప్రకారంగా; చెప్పెన్= ఇంద్రుడు నారదుడితో చెప్పాడు; అనుడున్= అని నారదుడు చెప్పగానే; ధృతరాష్ట్రుని= ధృతరాష్ట్రుడియొక్క; నెమ్మనమునన్= నిండైన హృదయంలో; మోదము= సంతోషం; నిండారెన్= నిండింది; అఖిలజన చిత్తములను= అక్కడ ఉన్న వారందరి మనస్సులోనూ; ప్రియము= ఆమోదం; తలిర్చెన్= చివురించింది.

**తాత్పర్యం:** పాండురాజు హృదయం సంతోషంతో తేలేవిధంగా ఇంద్రుడు నాతో ఆ విధంగా చెప్పాడు' అని నారదు డనగానే ధృతరాష్ట్రుడి మనస్సు నిండా ఆనందం పొందింది. అక్కడున్న వారందరి మనస్సుల్లోనూ ప్రీతి పల్లవించింది.

**విశేషం:** ధృతరాష్ట్రుడికి కుబేరలోకం సిద్ధిస్తుందనీ సుఖిస్తాడనీ విని పాండురాజు సంతోషించాడు. అంటే పాండురాజుకు ధృతరాష్ట్రుడిపై గల గౌరవాదరాలు ధ్వనిస్తున్నాయి.

**వ. ఇట్లు సద్గోష్ఠి నడపి యత్తాపసోత్తము లక్కురుపతిసత్తము నభినందించి యామంత్రణంబు సేసి నిజనివాసంబులకుం జని; రక్కాలంబున. 11**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సత్+గోష్ఠి= సాధుజనులతో సమావేశాన్ని; నడపి= జరిపి; ఆ+తాపస+ఉత్తములు= నారదుడు మొదలైన ఆ మునిశ్రేష్ఠులు; ఆ+కురుపతి సత్తమున్= కురువంశపు రాజులలో ఉత్తముడైన ఆ ధృతరాష్ట్రుడిని; అభినందించి= ప్రశంసించి; ఆమంత్రణంబు+చేసి= వీడుకోలు చెప్పి; నిజ నివాసంబులకున్= తమ తమ స్థానాలకు; చనిరి= వెళ్ళిపోయారు; ఆ+కాలంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా సాధుజనులంతా కలిసి మంచి మాటలతో సమావేశం జరిపి, నారదుడు మొదలైన మునివరులందరూ ఆ ధృతరాష్ట్రుడు ఉత్తమ గతులు పొందుతున్నందుకు తత్సాధకంగా తీవ్ర తపస్సు చేస్తున్నందుకూ ప్రశంసలు చేసి వీడ్కోలు చెప్పి తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు. ఆ సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. పాండుపుత్త్రులు తల్లిఁ బలుమఱుఁ దలఁతురు । వగతురు, ధృతరాష్ట్రువలన సుబల**
**నందన దెసను మనంబిడి; చింతింతు । రట్ల పౌరులు వంత నారఁ గూరి**
**'వృద్ధుండు ధృతరాష్ట్రవిభుఁడు సుఖార్హుఁడు । విగతజనం బైన విపినభూమి**
**నెత్తెఱంగున వసియించు? గాంధారియుఁ । గుంతియు నత్యంత కోమలాంగు**

**తే. లడవి నుండంగ నెట్లోర్తు రకట! యిట్టి కొడుకులను రాజ్యసౌఖ్యంబు విడిచి యట్లు**
**సనునె యక్కుంతిభోజుని తనయ? జనని । దొఱఁగిపోవుట కెంత గుండుదురొ వీరు! 12**

**ప్రతిపదార్థం:** పాండు పుత్త్రులు= పాండురాజు కొడుకులు; తల్లిన్= కుంతిని; పలుమఱున్= అనేక పర్యాయాలు; తలఁతురు= తలచుకొంటూ ఉంటారు; ధృతరాష్ట్రువలనన్= ధృతరాష్ట్రుడిపైనా; సుబలనందన+దెసను= (గాంధార రాజయిన) సుబలుడి కూతురి (గాంధారి) పైనా; మనంబు+ఇడి= తమ మనసులు ఉంచి; వగతురు= (పాండవులు) దుఃఖిస్తూ ఉంటారు; పౌరులును= ప్రజలు సైతం; అట్లు+అ= ఆ విధంగానే; వంతన్= దుఃఖంలో; ఆరన్+కూరి= నిండా మునిగిపోయి; చింతింతురు= విచారిస్తూ ఉంటారు; వృద్ధుండు= ముసలివాడైన; ధృతరాష్ట్ర విభుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; సుఖ+అర్హుఁడు= సుఖింపదగినవాడు;

విగతజనంబు= మనుష్యులు లేనిది; ఐన= అయినటువంటి; విపినభూమిన్= అడవులలో; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; వసియించున్?= ఉంటాడు?; గాంధారియున్= గాంధారీ; కుంతియున్= కుంతీ; అత్యంత కోమల+అంగులు= మిక్కిలి సుకుమారమైన మేనులు కలవారు; అడవిన్= అడవిలో; ఉండంగన్= ఉండటానికి; ఎట్లు= ఏ విధంగా; ఓర్తురు?= సహించగలరు?; అకట!= అయ్యో!; ఆ+కుంతిభోజతనయ= (కుంతిభోజుడి కూతురు) కుంతి; ఇట్టి= ఇటువంటి; కొడుకులను= పుత్రులను; రాజ్యసౌఖ్యంబున్= రాజ్యాధిపత్యంవలన కలిగే సుఖమూ; విడిచి= వదలిపెట్టి; అట్లు= ఆ విధంగా (అడవులకు); చనునె?= వెళ్లునా? జనని= తమ తల్లి కుంతి; తొఱఁగి= తమను విడిచి; పోవుటకున్= అడవులకు వెళ్ళినందుకు; వీరు= ఈ పాండవులు; ఎంత= ఎంతగా; కుందుదురు+ఒ?= విచారిస్తున్నారో కదా!

**తాత్పర్యం:** అక్కడ హస్తినాపురంలో పాండవులు తల్లిని చాలాసార్లు తలుచుకొంటూ ఉన్నారు. గాంధారీ ధృతరాష్ట్రులను తలుచుకొని దుఃఖిస్తున్నారు. జనులు కూడా మిక్కిలిగా దుఃఖించేవారు. వారు 'ముసలివాడైన ధృతరాష్ట్రుడు ఇప్పుడు సుఖపడవలసినటువంటివాడు. మనుషులే ఉండని అడవులలో ఏ విధంగా ఉండగలడు? గాంధారీ, కుంతీ చాలా సుకుమారలు. అడవులలో ఉండటం ఎట్లా ఓర్చుకొంటారు? ఇటువంటి ఉత్తములైన కొడుకులను, రాజ్యసుఖాలను విడిచిపెట్టి ఆ కుంతి అడవులకు ఎట్లా వెళ్ళిందో! తల్లి తమను విడిచిపోయినందుకు ఈ పాండవులు ఎంతగా విచారిస్తున్నారో!

**క. ఆయాసంబున విదురుని । కాయము, సంజయుని మేనుఁ గందక యున్నే?**
**పోయిరి ధృతరాష్ట్ర మహీ । నాయకుపై భక్తిఁ గాననమున వసింపన్.' 13**

**ప్రతిపదార్థం:** విదురుని కాయము(న్)= విదురుడి శరీరమూ; సంజయుని మేను= సంజయుడి శరీరమూ; ఆయాసంబునన్= (అడవులలో) శ్రమవలన; కందక+ఉన్నే?= నొవ్వకుండా ఉంటాయా?; ధృతరాష్ట్ర మహీనాయకుపైన్= ధృతరాష్ట్ర మహారాజుమీద; భక్తిన్= సేవా భావంతో; కాననమునన్= అడవిలో; వసింపన్= ఉండటానికి; పోయిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడిని సేవించుకొనాలనే ఉద్దేశంతో అరణ్యాలలో ఉండటానికి వెళ్ళారు గానీ, ఆ విదురుడికీ, సంజయుడికీ అడవులలో శ్రమవలన ఒళ్ళు కందిపోకుండా ఉంటుందా?

**క. అని యొండొరువులతోడ । న్వనట యెసఁగఁ బలుకుదురు మనంబులఁ గుంతీ**
**తనయులు మాతృవియుక్తత । కనయము నడలుదురు కౌరవాన్వయముఖ్యా! 14**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; వనట= దుఃఖం; ఎసఁగన్= అతిశయిస్తుండగా; ఒండొరువులతోడన్= ఒకరితో ఒకరు (పరస్పరం); పలుకుదురు= అంటూ ఉంటారు; కౌరవ+అన్వయముఖ్య!= కౌరవవంశంలో పేరుగాంచినవాడా జనమేజయా!; కుంతీ తనయులు= పాండవులు; మాతృ వియుక్తతకున్= తల్లితో కలిగిన ఎడబాటుకు; మనంబులన్= మనస్సులలో; అనయము= అత్యధికంగా; అడలుదురు= అల్లాడిపోతూ ఉంటారు.

**తాత్పర్యం:** ఈ విధంగా పౌరులు తమలో తాము దుఃఖంతో మాటాడుతారు. ఓ జనమేజయ మహారాజా! పాండవులు తల్లితో ఎడబాటుకు చాలా అల్లాడిపోతున్నారు. (అన్నాడు వైశంపాయనుడు).

**సీ. ధర్మపుత్త్రాదులందఱు నొక్కచో నుండి । ధృతరాష్ట్రు నాతని దేవిఁ బేరు**
**కొని వారి కొడుకు లెల్లను ద్రుంగి రని, వార । లతి వృద్ధు లెమ్మెయి నడవిఁ గలిసి**

**యున్నా రనియు, నింక నెన్నాళ్ళు లుండెడి। గొంతి వనంబునఁ గూరఁ దినుచు?.**

**ననియును, బంధుల నదయతఁ దునిమితి। మలుక ధైర్యంబున నడఁప మైతి**

**తే.** **మనియు, నభిమన్యు వీరుని నతని తమ్ముఁ। గుఱ్ఱలను గర్ణునాఅడిఁ గోలుపోయి**

**యొంటి పడితి మనియుఁ, గడు నుమ్మలంపు। మాట లాడుదు ర్పరిజనుల్ మఱుఁగుచుండ. 15**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్ర+ఆదులు= ధర్మరాజు మొదలైన వారు; అందఱున్= అందరూ; ఒక్కచోన్= ఒక చోట; ఉండి; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడినీ; ఆతని, దేవిన్= అతడి భార్యఅయిన గాంధారినీ; పేరుకొని= పేర్కొని; వారి, కొడుకులు+ఎల్లను= వారి కుమారులైన దుర్యోధనాదులందరూ; త్రుంగిరి= మరణించారు; అని; వారలు= ఆ గాంధారీ ధృతరాష్ట్రులు; అతి వృద్ధులు= బాగా ముసలివాళ్ళు; ఏ+మెయిన్= ఏ విధంగా; అడవిన్= అడవిలో; కలిసి= కలిసిపోయి; ఉన్నారు= జీవిస్తూ ఉన్నారు; అనియున్= అనుచూ; గొంతి= (తమ తల్లి) కుంతి; కూరన్= కంద మూలాలు; తినుచున్= ఆహారంగా తీసికొంటూ; వనంబునన్= అడవిలో; ఇంకన్= ఇంకా; ఎన్నాళ్ళు= ఎంతకాలం; ఉండెడిన్= ఉంటుంది; అనియును= అంటూ; బంధులన్= చుట్టాలను; అదయతన్= జాలిలేకుండా; తునిమితిమి= చంపేశాం; అలుకన్= కోపాన్ని; ధైర్యంబునన్= నిర్వికారచిత్తంతో; అడఁపము+ఐతిమి= అణచివేయలేకపోయాము; అనియున్= అనీ; వీరునిన్= వీరుడైన; అభిమన్యున్= అభిమన్యుడిని; అతని తమ్ముఁ గుఱ్ఱలను= అభిమన్యుడికి తమ్ముళ్ళయిన ద్రౌపది కొడుకులు ఉపపాండవులను; ఆఱడిన్= అపకీర్తి కరంగా; కర్ణున్= కర్ణుడిని; కోలుపోయి= పోగొట్టుకొని; ఒంటి+పడితిమి= ఏకాకులం అయినాం; అనియున్= అంటూ; కడున్= మిక్కిలి; ఉమ్మలము+మాటలు= దుఃఖపు మాటలు; పరిజనుల్= సేవకులు; మఱుఁగుచున్+ఉండన్= దుఃఖిస్తూ ఉండగా; ఆడుదుర్= అంటూ ఉంటారు.

**తాత్పర్యం:** ధర్మరాజు మొదలైన వారినందరినీ ఒకచోటికి చేర్చి అక్కడి పరిజనులంతా దుఃఖిస్తుండగా ధృతరాష్ట్రుడినీ, గాంధారినీ, తలచుకొని ఇట్లా శోకాలాపాలు చేసేవారు. గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకులు అందరూ మరణించారు. ఈ పండు ముసలి ప్రాయంలో అడవి పాలయ్యారు. కుంతీదేవి కూరలు తిని కడుపు నింపుకొంటూ అడవులలో ఇంకా ఎన్నాళ్ళు ఉంటుందో-నిర్దాక్షిణ్యంగా బంధువులను చంపివేశాం. కౌరవులమీది కోపాన్ని ధైర్యంతో అణచుకోలేకపోయాము. అపకీర్తికరంగా పరాక్రమవంతుడైన అభిమన్యుడినీ, అతడి సోదరులనూ, కర్ణుడినీ పోగొట్టుకొని ఏకాకులమైనాం.

**విశేషం:** 'పరిజనులు మఱుఁగుచుండ' పాండవులు అనుకొంటున్న మాటలు వాటివెనక విచారం చూసేవారికి కూడా దుఃఖం కలిగించేంతటి విస్తారంగా ఉన్నదని భావం.

**వ.** **ఇ ట్లనుదినంబును ఘన చింతాక్రాంతులై యలంత నొందుదురు. 16**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అనుదినంబును= ప్రతిరోజూ; ఘన= చింతా; ఆక్రాంతులు= అత్యధికమైన విచారానికి లోబడినవారు; ఐ= అయి; అలంతన్= అలసటను; ఒందుదురు= పొందుతున్నారు.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రతిరోజూ పాండవులు అత్యంతదుఃఖంవలన బడలిపోతూ ఉన్నారు.

**చ.** **విదురుని సంజయుం దలఁచి వేదనఁ బొందుదు; రట్లు నెవ్వగల్**

**హృదయముఁ గుందఁజేయఁ జెలువేది మనోజ్ఞము లైన భోగముల్**

**వదలి వినోదముల్ సలుపు లాలసతం బెడఁబాసి రాజ్యసం**

**పద నరయం దలం పెడలి పాడఱి యుండుదు, రేమి సెప్పుదున్! 17**

**ప్రతిపదార్థం:** విదురునిన్= విదురుడిని; సంజయునిన్= సంజయుడినీ; తలఁచి= తలచుకొని; వేదనన్= విచారాన్ని; పొందుదురు= పొందుతుంటారు; అట్లు= ఆ విధంగా; నెవ్వగల్= సంపూర్ణ (నెఱ)మైన విచారాలు; హృదయమున్= తమ తమ మనసులను; కుందన్+చేయన్= క్రుంగిపోయేటట్లు చేస్తుండగా; చెలువు+ఏది= తేజస్సు నశించి; మనోజ్ఞములు+ఐ= తమ మనసులకు ఇష్టమైనటువంటి; భోగముల్= అనుభవాలను; వదలి= విడిచిపెట్టి; వినోదముల్= ఆనందం కలుగజేసే పనులు; చలుపు= చేయాలి అనే; లాలసతన్= కోర్కెను; పెడన్+పాపి= పూర్తిగా వదలిపెట్టి; రాజ్య సంపదన్= సామ్రాజ్యపు సిరులను; అరయన్= చూసే; తలంపు= ఆలోచన; ఎడలి= తొలగి; పాడఱి= తమకు యోగ్యమైన స్థితి నశించి; ఉండుదురు= ఉంటారు; ఏమి= (జనమేజయా!) వారి స్థితిని గురించి= ఏమని; చెప్పుదున్!= చెప్పగలను!

**తాత్పర్యం:** విదురుడిని, సంజయుడిని తలచుకొని పాండుకుమారులు విచారించేవాళ్ళు. ఆ విధంగా సంపూర్ణంగా దుఃఖాలు మనసును క్రుంగదీస్తుంటే తేజోహీనులైనారు. తమకు ఇష్టమైన సుఖాలు విడిచిపెట్టారు. వేడుకలపై కోరికనే వదలివేశారు. రాజ్యం మీద ఆలోచన కూడా తొలగిపోయింది. తమకు అర్హమైన స్థితిని పోగొట్టుకొని ఉన్నారు. ఆ దుస్థితిని ఏమని చెప్పేది జనమేజయా!

**విశేషం:** వగలలో నెఱతనంవలన పాండవులలో 'రాజతేజం' పోయింది. హృదయం కూడా వ్యథ (మానసిక) ఆంతరంగికం కాగా చెలువేదటం - కాంతిహీనులు కావటం శారీరకం బాహిరమైనది. రాజభోగాలు తమ మనసుకు నచ్చినవికూడా విడిచిపెట్టారు. 'న రాజ్యే న చ నారీషు' అని మూలంలో కొంతవాచ్యంగా ఉన్న స్త్రీ సుఖం ఇక్కడ మనోజ్ఞాలైన భోగాలలో చేరి గూఢంగా వ్యక్తం చేయబడటం మనోజ్ఞం. నిద్రాది సుఖాలు (27.14) త్యజించారు. రాజ్య సంపదనరయం దలంపెడలి' యుద్ధంచేసి రాజ్యం సంపాదించుకొన్నారు కాని (తామెంతో ఆశపడిన తల్లి రాజ్యసుఖాలకు దూరం కావటంవలన) రాజ్యంపై పాండవులకు మక్కువ పోయింది. తన వారికి ఉపయోగించని రాజ్యం తమకూ అనవసరం అన్నట్లుగా అయింది. 'న వేదాధ్యయన 'సంప్రీతిః) అనే మూలం ఇట పరిహరించటం విశేషం. రాజ్యసుఖాదులలో తృప్తి లేదన్న మూలం కంటె ఆ భోగాలే త్యజించారన్న తెలుగులో ప్రత్యే కత ఉన్నది. రాజ్యంపై కూడా తలపు లేకుండా అన్ని సుఖాలూ వదలివేయటంవలన (దుఃఖంచేత కాంతివిహీనులు కావటంవలన పాండవులు రాజులుగా కనబడలేదు. రాజకార్యాలు చూడటం లేదు (29,2,3) 'పాడఱి (నష్టసంజ్ఞాః) యుండుదురు. మొత్తమ్మీద ఉన్నారు. అర్హస్థితి మాత్రం కాదు (29.4) ఏమి చెప్పుదున్ అనే మాట పాండవుల విచారం మాటలలో చెప్పటానికి వీలులేనంత అధికం అని కథకుడి (వైశంపాయనుడి) తాత్పర్యం. దానితో ముగింపు ఇంక నేను చెప్పలేను అనే అంశం నిరూపిస్తున్నట్లుగా ఉండటం విశేషం.

**క. ద్రౌపదియు సుభద్రయు సం। తాపం బందుదురు; పాండుతనయులు దలరన్**

**భూపాల భవజ్జనకుని। చూ పందఱ మానసముల శోకము నదుమున్. 18**

**ప్రతిపదార్థం:** పాండుతనయుల్= పాండురాజు కొడుకులు; తలరన్= దుఃఖిస్తుంటే; ద్రౌపదియున్= ద్రౌపదీ; సుభద్రయున్= సుభద్రా; సంతాపంబు= విచారం; అందుదురు= పొందుతుంటారు; భూపాల!= జనమేజయ రాజా!; భవత్! జనకుని= నీకు తండ్రి అయిన పరీక్షిత్తుడిని; చూపు= చూసికొనటం అనేది; అందఱ= పాండవులూ, ద్రౌపదీ, సుభద్రా మొదలైనవారందరి యొక్క; మానసముల= మనసులలో ఉన్నటువంటి; శోకము= విచారాన్ని; అదుమున్= అణచిపెట్టుతుంది.

**తాత్పర్యం:** పాండవుల విచారం ఇంకా అధికమయ్యేటట్లుగా ద్రౌపదీ, సుభద్రా బాధపడేవారు. ఓ జనమేజయ మహారాజా! నీ తండ్రి అయిన పరీక్షిత్తును చూచికొంటూ అందరూ మనసులో బాధ అణచుకొనేవారు.

**విశేషం:** (అభిమన్యు) అతని తమ్ముగుజ్జులను (15.వ) తలచుకొనటంవలనను ద్రౌపదీ, సుభద్రలు (హతపుత్రులు) కుంతీ ప్రభృతులను గురించి విచారిస్తుంటే - అది పాండవులను ఇంకా బాధించేది. పరీక్షిత్తు వంశాంకురం. పాండవ వంశం నిలబడవలసింది పరీక్షిత్తు ఒక్కడివలననే. పరీక్షిత్తును అందరూ ప్రేమగా చూసేవారు. ఇంతవిచారం ఉన్నా వాళ్ళందరూ ఇంకా రాజ్యాన్ని అంటిపెట్టుకొని ఉండటానికి కారణం పరీక్షిత్తే. అందువలననే క్రమంగా ఇపుడు జనమేజయుడు 'భూపాలుడైనాడు. శోకము నదుమున్' మనవడిపై ప్రేమ కూడా (ఇంతమందికి) శోకాన్ని అణచిపెట్టబడ్డ శోకం (కుంతీ ప్రభృతులు స్మరణకు వచ్చిన సమయాలలో) ఉబికి అధికమవుతుందని 'అదుము' శబ్దం వ్యక్తం చేస్తుంది.

**ఆ. పరమధీరు లైన పాండుతనూభవు। లిట్లు ధైర్యసార మెడలి వికల**
**బుద్ధు లగుచు నుండి పోవం గడంగి ర। య్యంధనృపతిఁ జూడ నధిపముఖ్య! 19**

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య!= రాజులలో శ్రేష్ఠుడా జనమేజయ మహారాజా!; పరమ ధీరులు+ఐ= ఉత్కృష్టమైన ధైర్యం కలిగినవారై; పాండుతనూభవులు= పాండురాజు కొడుకులు; ఇట్లు= ఈ ప్రకారంగా; ధైర్యసారము= ధైర్యంయొక్క గొప్పతనాన్ని; ఎడలి= (తొలగి) కోలుపోయి; వికల బుద్ధులు= కలతచెందిన బుద్ధి కలిగినవారు; అగుచున్+ఉండి= అయి; ఆ+అంధనృపతిన్= ఆ ధృతరాష్ట్రుడిని; చూడన్= చూడటానికి; పోవన్= పోయేటందుకు; కడంగిరి= పూనుకొన్నారు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! అత్యధిక ధైర్యం కలిగిన పాండవులు ఈ విధంగా ఉత్తమ ధైర్యం కోల్పోయి సరిగా లేని మనసులతో ఉండి, గ్రుడ్డివాడైన ఆ ధృతరాష్ట్రుడిని చూచేందుకు వెళ్ళటానికి పూనుకొన్నాడు.

**విశేషం:** 'పరమధీరులకు కూడా ధైర్య సారం పోవటం అనేది వారికి ధృతరాష్ట్రాదులపై ఉన్న ఆత్మీయతను వ్యక్తంచేస్తుంది. ధృతరాష్ట్రుడు 'అంధనృపతి' చూపులేనివాడు కాబట్టి ఆయనను చూడన్ బయలుదేరారు. ఆ నృపతి అంధుడు కాబట్టి తమ తల్లికంటె ధృతరాష్ట్రుడిని చూడటంలో ప్రాధాన్యం. గాంధారీ ప్రభృతులకూ (అంధ) నృపతి ఉపలక్షకం.

**వ. అట్టియెడ సహదేవుండు పాండవాగ్రజునకుం బ్రణమిల్లి భరితవినయుం డై. 20**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; సహదేవుండు= సహదేవుడు; పాండవ+అగ్రజునకున్= ధర్మరాజుకు; ప్రణమిల్లి= నమస్కారం చేసి; భరిత వినయుండు+ఐ= నిండా అణకువ కలవాడై (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం:** ఆ సమయంలో సహదేవుడు ధర్మరాజుకు ప్రణామంచేసి వినయంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏను మును చెప్ప వెఱచితిఁ। గాని యధిప! గొంతిఁ జూడఁగా జను టర్హం**
**బైన పని; యింత కేదెస। దా నొందునొ విపినవాస దౌస్థిత్యమునన్? 21**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఏను= నేను; మును= ముందుగా; చెప్పన్= చెప్పటానికి; వెఱచితిన్+కాని= సంకోచించాను కాని; గొంతిన్= కుంతిని; చూడఁగాన్: చూడటంకొరకు; చనుట= అడవులకు వెళ్ళటం; అర్హంబు+ఐన పని= తగిన కార్యం; ఇంతకున్=ఇప్పటికే; విపిన+వాస దౌస్థిత్యమునన్= అరణ్యాలలో నివసించటంవలన కలిగిన దురవస్థల మూలంగా; తాను= ఆ కుంతి; ఏదెసన్= ఎటువంటి స్థితి; ఒందునొ?= పొందిందో?

**తాత్పర్యం:** ధర్మరాజా! నేను ముందే చెప్పటానికి సంకోచించాను గానీ కుంతిని చూడటానికి మనం అడవులకు వెళ్ళటం ఉచితమైన కర్తవ్యం. అరణ్యావాసపు శ్రమవలన కుంతి ఇప్పటికే ఏ స్థితిలో ఉన్నదో. (దుష్స్థితి యొక్క భావార్థక రూపం దౌస్స్థిత్యము)

**తే.** **గొంతి ప్రాణంబుతో నుండఁ గురువరేణ్య! । యచ్చటికిఁ జని యొకమరి యమ్మహాను**
**భావ దర్శింప వలవదె? బావ నప్ప । ననుసరించుచు నెట్లున్న యదియొ సాధ్వి!** **22**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశంలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; గొంతి= కుంతి; ప్రాణంబుతోన్+ఉండన్= బ్రతికి ఉన్నప్పుడే; ఒకమరి= ఒక పర్యాయం; అచ్చటికిన్= అడవికి; చని= వెళ్ళి; ఆ+మహానుభావన్= ఆ ఉత్తమురాలిని; దర్శింపన్= చూడటం; వలవదె?= తగదా?; సాధ్వి!= మంచి నడవడికల స్త్రీ (కుంతి); బావన్= బావగారి (ధృతరాష్ట్రుడినీ; అప్పన్= అక్కగారి (గాంధారి)నీ; అనుసరించుచున్= వెంట ఉండి; ఎట్లు= ఏ విధంగా; ఉన్న+అదియొ!= ఉన్నదో!

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా! కుంతి ప్రాణాలతో ఉన్నప్పుడే ఒకసారి అడవికి వెళ్ళి ఆ మహాత్మురాలిని చూడటం ధర్మం. సాధువర్తనం కలిగిన కుంతి అక్క బావలను అనుసరిస్తూ నడుచుకొంటూ ఇప్పుడు ఎట్లా ఉన్నదో?

**క.** **ధృతరాష్ట్రుఁడు గాంధారియు । నతిమృదులాంగకులు వల్కలాజినధరులై**
**వ్రతచర్యల వన్యాహా । రత నలఁగుచు నున్నవారు రాజవరేణ్యా!** **23**

**ప్రతిపదార్థం:** రాజవరేణ్యా!= రాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; ధృతరాష్ట్రుఁడున్= ధృతరాష్ట్రుడూ; గాంధారియున్= గాంధారీ; అతి మృదుల+అంగకులు= మిక్కిలి సుకుమారం అయిన శరీరం కలవారు; వల్కల+అజినధరులు+ఐ= నారబట్టలు, మృగచర్మాలు ధరించినవారై; వ్రతచర్యలన్= వ్రతాలను ఆచరించటంచేత; వన్య+ఆహారతన్= అడవులలో లభించే కాయలు దుంపలు మొదలైనవి ఆహారంగా తీసికొనటంచేత; నలఁగుచున్= బాధపడుతూ; ఉన్నవారు= ఉన్నారు.

**తాత్పర్యం:** రాజా! ధృతరాష్ట్రుడూ, గాంధారీ చాలా సుకుమారులు. నారబట్టలు, మృగచర్మాలూ ధరించి, వివిధ వ్రతాలు ఆచరిస్తూ, కాయలు దుంపలు తీసికొంటూ చాలా నలిగిపోయి ఉన్నారు.

**ఉ.** **వారలఁ జూడఁ బోఁ దగు నవశ్యము దుర్దశ పుట్టకుండ మున్**
**మీ'రని చెప్ప నప్పుడు సమీపమునం జెవి దార్చి నెవ్వగం**
**గూరుచు నున్న ద్రౌపది యగుం గరణీయము బంధు దుఃఖ సం**
**తారక! మీకు నీతఁ డుచితంబుగఁ జెప్పిన కార్య మెమ్మెయిన్.** **24**

**ప్రతిపదార్థం:** దుర్దశ= కష్టమైన స్థితి; పుట్టక+ఉండన్= కలగకుండా; మున్= ముందుగానే; వారలన్= ఆ గాంధారీ ధృతరాష్ట్రులను, కుంతిని; చూడన్= చూడటానికి; మీరు; అవశ్యము= తప్పకుండా; పోన్= అడవికి వెళ్ళటం; తగున్= మంచిది; అని= అనే విధంగా; చెప్పన్= సహదేవుడు ధర్మరాజుతో చెప్పగా; సమీపమునన్= అక్కడికి దగ్గర్లో; చెవి తార్చి= చెవి ఉంచి; నెవ్వగన్= సంపూర్ణమైన శోకంతో; కూరుచున్= మునుగుతూ; ఉన్న= ఉన్నటువంటి; ద్రౌపది; అప్పుడు= ఆ సమయంలో (ఇట్లా అన్నది); బంధు దుఃఖ సంతారక!= బంధువులను విచారంనుండి దాటించేవాడా! ధర్మరాజా!; ఉచితంబుగన్= తగు విధంగా; ఈతఁడు= ఈ సహదేవుడు; మీకున్= తమతో; చెప్పిన కార్యము= చెప్పినటువంటి పని; ఏ+మెయిన్= ఏ విధంగా నైనా; కరణీయము= చేయదగినది; అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** ఆ గాంధారీ ధృతరాష్ట్రులకు ఇంకా కష్టదశ రాకుండా ముందుగానే వారిని చూడటానికి మీరు తప్పకుండా అడవికి వెళ్ళటం మంచిది' అని సహదేవుడు ధర్మరాజుతో చెప్పగా, దుఃఖంలో మునిగి అటువైపొక చెవి వేసి ఉంచిన ద్రౌపది అప్పుడు ధర్మరాజుతో ఇట్లా అన్నది; 'బంధువుల దుఃఖాన్ని నిర్మూలించేవాడా! సహదేవుడు మీకు చెప్పింది యుక్తం. ఏ విధంగానైనా తప్పకుండా ఇతడు చెప్పినట్లు చేయటం యుక్తం.

**తే.** **గొంతి కోడండ్రు రెల్లను గురువరేణ్య! । యెత్తినడుగుల నున్నవా రత్తపస్వి**
**నీ వరిష్ఠ దర్శింపంగఁ బోవఁ గోరి । యనియె నట్టు లయ్యిరువురు నాడుటయును.** **25**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశ శ్రేష్ఠుడా ధర్మరాజా!; గొంతి కోడండ్రురు= కుంతీదేవి కోడళ్ళు (ద్రౌపది, సుభద్ర మొదలైనవారు); ఎల్లను= అందరూ; ఆ+తపస్వినీ వరిష్ఠన్= తాపసులలో శ్రేష్ఠురాలైన ఆ కుంతీదేవిని; దర్శింపంగన్= చూడటానికి; పోవన్= అరణ్యాలకు వెళ్ళటం; కోరి= అభిలషించి; ఎత్తిన+అడుగులన్= ప్రయాణానికి సిద్ధమై; ఉన్నవారు= ఉన్నారు; అనియెన్= అన్నది ద్రౌపది; ఆ+ఇరువురు= సహదేవుడు, ద్రౌపదీ; అట్టులు= ఆ విధంగా; ఆడుటయును= పలికిన వెంటనే.

**తాత్పర్యం:** కురుశ్రేష్ఠుడా! తాపసులలో ఉత్తమురాలైన ఆ కుంతిని చూడటానికి పోవాలనే కోరికతో ఆవిడ కోడళ్ళం అందరమూ, ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాం' అన్నది ద్రౌపది. సహదేవుడూ, ద్రౌపదీ ఇద్దరూ కూడా ఆ విధంగా చెప్పటంతో వెంటనే. (తరువాతి వచనంతో అన్వయం).

### పాండవులు బంధుసహితంబుగా ధృతరాష్ట్రుఁ జూడఁబోవుట (సం. 15-29-18)

**వ.** **అమ్మానవనాథుండు కాననగమనంబు నిశ్చయించి పడవాళ్ళం బలిపించి 'ధృతరాష్ట్రు దర్శింపఁ బోద; మనతి బహుళంబును బ్రధాన చతురంగ సముదీర్ణ భంగికంబునుం గా బలంబుల సమకట్టుం; డందలంబులునుం బాటబండ్లునుం గాఁ బెక్కాయితంబులు సేయుం; డనేక శకటంబులుం, బటకుటీరప్రకరంబును, నానావిధ భక్ష్య భోజ్యంబులునుం గొనివచ్చునట్లుగా నిపుణ పరిచారకుల నియమింపుండు; పౌర జనంబు లారాజుం జూచువేడ్కనెవ్వరు వచ్చినను వారల యోగక్షేమంబు లరసి సురక్షితంబుగా నడపింపం దగువారి నియోగింపుం; డెల్లి పయనం బని చాటింపుం' డని పనిచిన వార లట్లు చేయ మఱునాఁడు యుయుత్సునిం గృపాచార్యుని ధౌమ్యుని రావించి 'మీరు పురరక్షణంబునకు నిలువుం' డని యత్యాదరంబునం జెప్పి,** **26**

**ప్రతిపదార్థం:** ఆ+మానవనాథుండు= ఆ ధర్మరాజు; కాననగమనంబు= అడవులకు ప్రయాణం; నిశ్చయించి= నిర్ణయం చేసి; పడవాళ్ళన్= వివిధ సేనాపతులను; పిలిపించి= కబురుచేసి రప్పించి; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; దర్శింపన్= చూడటంకొరకు; పోదము; అనతి బహుళంబును= మరీ ఎక్కువ గాకుండా; ప్రధాన చతురంగ సముదీర్ణ భంగికంబునున్= ప్రశస్తమైన రథ, గజ, తురగ, పదాతి రూపమైన నాలుగంగాల గొప్ప విన్యాసం; కాన్= అయ్యేవిధంగా; బలంబులన్= సైన్యాలను; సమకట్టుండు= సిద్ధం చేయండి; అందలంబులునున్= పల్లకీలు; బాటబండ్లును= ఎడ్లబండ్లూ; కాన్= అయ్యే విధంగా; పెక్కు= వివిధాలైన వాహనాలు; అయితంబులు= సిద్ధం; చేయుండు= చేయండి; అనేక శకటంబులున్= అధికంగా (సరుకుల) బండ్లు; పటకుటీర ప్రకరంబులును= గుడారాల సమూహాలు; నానావిధ భక్ష్య భోజ్యంబులును= పలురకాలైన పిండివంటలు, ఇంకా తినే పదార్థాలును; కొనివచ్చునట్లునున్= తీసికొనివచ్చేవిధంగా; నిపుణ పరిచారకులన్= నేర్పుకలిగిన సేవకులను; నియమింపుండు= ఏర్పాటు చేయండి; ఆ రాజున్= ఆ ధృతరాష్ట్ర మహారాజును; చూడన్= చూడాలనే; వేడ్కన్= కోరికతో; పౌరులు= పురజనులు; ఎవ్వరు= ఎవ్వరైనా; వచ్చినను= వస్తే;

వారల= ఆ పౌరులయొక్క; యోగక్షేమంబులు= ఉన్నత స్థితినీ దాని రక్షణాన్నీ; అరసి= జాగ్రత్తగా చూస్తూ; సురక్షితంబుగాన్= ప్రమాదం లేకుండా; నడపింపన్= తీసికొని వెళ్ళటానికి; తగువారిన్= సమర్థులైనవారిని; నియోగింపుండు= ఏర్పాటు చేయండి; పయనంబు= ప్రయాణం; ఎల్లి= రేపే; అని= అనేవిధంగా; చాటింపుండు= (ప్రజలకు) తెలియజేయండి; అని= అని చెప్పి; పనిచినన్= ఆజ్ఞాపించగా; వారలు= ఆ సేనాపతులు; అట్లు= ధర్మరాజు చెప్పిన ప్రకారంగా; చేయన్= చేయగా; మఱునాఁడు= మరుసటిరోజు; యుయుత్సునిన్= ధృతరాష్ట్రుడి (వైశ్యకు) కొడుకు యుయుత్సుడిని; కృపాచార్యునిన్= కృపుడిని; ధౌమ్యునిన్= తమ పురోహితుడైన ధౌమ్యుడిని; రావించి= పిలిపించి; మీరు= మీరందరూ; పురరక్షణంబునకున్= రాజధానిని కాపాడటానికి; నిలువుండు= ఇక్కడే ఉండండి; అని; అతి+ఆదరంబునన్= మిక్కిలి ప్రేమతో; చెప్పి= వారితో చెప్పి.

**తాత్పర్యం:** ధర్మరాజు అడవికి వెళ్ళటానికి నిర్ణయించి సేనాపతులను పిలిపించి 'మనం ధృతరాష్ట్రుడిని చూడటానికి పోదాం. మీరు మరీ ఎక్కువ కాకుండా రథ గజ తురగ పదాతి దళాలను సిద్ధం చేయండి. పల్లకీలు, ఎడ్లబండ్లు అధికంగా ఏర్పాటు చేయండి. ఇంకా ఇతర వాహనాలు పెక్కు గుడారాలూ, రకరకాల పిండివంటలు, ఇతరమైన తిండ్లు తీసికొనిరావటానికి నేర్పుకలిగిన సేవకులను నియమించండి. ధృతరాష్ట్రుడిని చూడాలనే కోర్కెతో పురజనులు ఎవరు వచ్చినా వారికి ఏ విధమైన ఇబ్బంది లేకుండా సౌకర్యాలను జాగ్రత్తగా చూచి నడిపించగలిగినవారిని ఏర్పాటు చేయండి. 'రేపే ప్రయాణం అని చాటించండి' అని ధర్మరాజు ఆజ్ఞాపించగా ఆ సేనాపతులు ఆ ప్రకారమే అన్ని ఏర్పాట్లు చేశారు. ధర్మరాజు ఆ మరునాడు యుయుత్సుడిని, కృపాచార్యుడిని, తమపురోహితుడు ధౌమ్యుడిని పిలిపించి మిక్కిలి ప్రేమతో తాములేని సమయంలో నగరం రక్షించటంకొరకు ఇక్కడే ఉండండి అని వారికి చెప్పి (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **ఏనికగములతో నేతెమ్ము నీ వని। బాహుదర్పోజ్జ్వలుఁ బవనతనయుఁ**
**దేరులగమి చెలువారు నీచే నని। దేవసమాను గాండీవధరుని,**
**గుఱ్ఱపు దళముల కొమరు వీ కలవడు। నని చారుతను మనోహారు నకులుఁ**
**గాల్బల మమరు నీ కలిసి వచ్చుట నని। సన్నుతచేష్టితుఁ బిన్నతమ్ముఁ**

**తే.** **బనిచె; వార లమ్మెయిఁ దూర్య నినద మెసఁగ। నాతపత్రావళి ధ్వజవ్రాత కలిత**
**రత్నరోచులు రోదోంతరంబు నిండ। నరుగుదెంచిరి వైభవ మతిశయిల్ల.** **27**

**ప్రతిపదార్థం:** బాహు దర్ప+ఉజ్జ్వలున్= భుజాల నిరంకుశ బలంతో ప్రకాశించే; పవన తనయున్= భీముడిని; నీవు; ఏనిక గములతోన్= ఏనుగుల బలంతో; ఏ+తెమ్ము= రావలసింది; అని= అని చెప్పి; పనిచెన్= నియోగించాడు; దేవసమానున్= దేవతలతో సమానుడైన; గాండీవధరునిన్= అర్జునుడిని; నీచేన్= నీవలన; తేరులగమి= రథ సమూహం; చెలువారు= శోభిస్తుంది; అని; చారుతను మనోహారున్= అందమైన శరీరంచేత మనసులను హరించేవాడు అయిన; నకులున్= నకులుడిని; నీకున్= నీకు; గుఱ్ఱపు దళముల= తురంగబలంయొక్క; కొమరు= పద్ధతి; అలవడున్= సాధ్యమౌతుంది; అని; సత్+మత చేష్టితున్= సాధుజనంచేత ప్రశంసించబడే; పిన్న తమ్మున్= చిన్న తమ్ముడు సహదేవుడిని; నీ కలసి వచ్చుటన్= నీతో కలిసి రావటంవలన; కాల్బలము= పదాతి దళం; అమరున్= ఒప్పుతుంది; అని; పనిచెన్= నియోగించాడు; వారలు= భీమ, అర్జున, నకుల, సహదేవులు; ఆ+మెయిన్= ధర్మరాజు నియమించిన ప్రకారంగా; తూర్య నినదము= ఢక్క మొదలైన వాద్యాల ధ్వనులు; ఎసఁగన్= అతిశయించగా; ఆతపత్ర= గొడుగుల; ఆవళి= వరుసతోను; ధ్వజ= పతాకల; వ్రాత= సమూహంతోను, కలిత= కూర్చబడి ఉన్న; రత్న= రత్నాల; రోచులు= కాంతులు; రోదస్+అంతరంబు= భూమి ఆకాశాల నడిమి ప్రదేశం అంతా; నిండన్= నిండగా; వైభవము= రాచరికం; అతిశయిల్లన్= ప్రకాశిస్తుండగా; అరుగుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** ధర్మరాజు బాహుబలంచేత ప్రశస్తి పొందిన భీముడిని గజబలంతో కలిసి రమ్మన్నాడు. దేవతలతో సమానమైన అర్జునుడి వలన రథబలం శోభిస్తుందన్నాడు. అందమైన నకులుడిని 'అశ్వబలం నడిపించటం నీకు అభ్యస్తమై ఉన్న' దన్నాడు. సాధుజన ప్రశంసలు పొందే చిన్నతమ్ముడు సహదేవుడిని నీతో కలిసి రావటంవలన కాల్బలం ప్రకాశిస్తుందన్నాడు. ఆ భీమార్జున నకుల సహదేవులు అన్నగారు ఆజ్ఞాపించిన పద్ధతిలో గజ రథ తురగ పదాతి బలాలతో, వాద్యాల ధ్వనులు రేగుతుండగా, గొడుగులలో, జెండాలలో కూర్చిన రత్నాల కాంతులు భూమ్యాకాశాల నడుమ నిండిపోగా వైభవంగా బయలుదేరారు.

**వ. ద్రౌపదీ ప్రముఖ వధూజనంబులనుం దక్కనుం గల భరత భార్యల నందలంబులను గనకంపు బండ్లను నిడికొని రండని యంతఃపురాధికారుల నబ్బూరమణుండు నియమించిన, వార లట్ల చేసిరి; తానును మణిభా సమానంబును నీలవాలశోభిత షోడశ శ్వేతాశ్వ వ్యూఢంబును నైన రథం బెక్కి మౌక్తిక ప్రాలంబ మాలి కాద్యోతితంబు లగు నాతపత్రంబు లుల్లసిల్ల. 28**

**ప్రతిపదార్థం:** ద్రౌపదీప్రముఖ వధూజనంబులనున్= ద్రౌపది మొదలైన పాండవ స్త్రీలను; తక్కనున్+కల= మిగిలిన; భరత భార్యలన్= భరతవంశపు వీరుల భార్యలను; అందలంబులనున్= పల్లకీలలోను; కనకంపు బండ్లను= బంగారపు బండ్లలోను; ఇడికొని= ఎక్కించుకొని; రండు+అని= తీసికొనిరండి; అని= అనిచెప్పి; ఆ+భూరమణుండు= ఆ ధర్మరాజు; అంతఃపుర+ అధికారులన్= అంతఃపుర రక్షణ బాధ్యతలను చూచే అధికారులను; నియమించినన్= పంపగా; వారలు= ఆ అంతఃపురాధికారులు; అట్లు+అ= ధర్మరాజు ఆజ్ఞాపించిన విధంగానే; చేసిరి= చేశారు; తానును= తాను స్వయంగా; మణిభాసమానంబును= మణులతో ప్రకాశించేది; నీల= నల్లనైన; వాల= తోకలచేత; శోభిత= వెలుగుతున్న; షోడశ= పదహారు; శ్వేత= తెల్లని; అశ్వ= గుర్రాలతో; వ్యూఢంబును= కూర్పబడినది; ఐన= అయినటువంటి; రథంబు= రథాన్ని; ఎక్కి= అధిరోహించి; మౌక్తిక= ముత్యాలతో చేసిన; ప్రాలంబ= వేలాడే; మాలికా= దండలతో; ద్యోతితంబులు= ప్రకాశించేవి; అగు= అయినటువంటి; ఆతపత్రంబులు= గొడుగులు; ఉల్లసిల్లన్= ఒప్పుతుండగా.

**తాత్పర్యం:** ద్రౌపది మొదలైన పాండవులకు సంబంధించిన స్త్రీలనూ, ఇంకా మిగిలిన భరతవంశపు వారి భార్యలనూ, పల్లకీలలోను, బంగారపు బళ్ళలోనూ ఎక్కించుకొని తీసికొనిరండని ధర్మరాజు అంతఃపుర అధికారులను ఆదేశించాడు. వారు అట్లాగే చేశారు. ధర్మరాజు తానుకూడా వివిధ మణులతో ప్రకాశించేది, నల్లని తోకలు కలిగిన తెల్లటి గుర్రాలు పదహారింటిచేత కూర్చబడినది అయిన రథం ఎక్కి వ్రేలాడుతూ ఉన్న ముత్యాల మాలలు కలిగిన గొడుగులు ఒప్పుతుండగా. (తరువాతిపద్యంతో అన్వయం)

**తే. వేణువీణారవంబులు వివిధ గాన। నాదములుఁ బాఠకారావ మేదురంబు**
**లగుచు వంది బృందముల వాక్యాలి బెరసి। దిశలు దీటుకొనంగఁ బ్రదీప్తలీల. 29**

**ప్రతిపదార్థం:** వేణు వీణా రవంబులున్= పిల్లన గ్రోవులయొక్కయు, వీణలయొక్కయు ధ్వనులు; వివిధ గాన నాదములు= పలువిధాలైన పాటల ధ్వనులునూ; పాఠక+ఆరావ మేదురంబులు= (వేద) అధ్యాపకుల ధ్వనులతో సాంద్రములు; అగుచున్= అవుతూ; వంది బృందముల= బట్టుల (స్తోత్రపాఠకుల) గుంపుల; వాక్య+ఆలిన్= స్తుతి వాక్యాల సముదాయంతో; బెరసి= కూడుకొని; ప్రదీప్తలీలన్= మిక్కిలి ప్రకాశించేవిధంగా; దిశలు= దిక్కులలో; దీటుకొనంగన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** వేణువుల, వీణల ధ్వనులూ, రకరకాల పాటల ధ్వనులూ, వేద అధ్యాపకుల కంఠ ధ్వనులతో అధికమై, స్తోత్రపాఠకుల స్తుతివాక్యాలతో కలిసి అత్యధికంగా ప్రకాశించే విధంగా దిక్కులనిండా వ్యాపించగా, (తరువాతి వచనంతో అన్వయం).

**వ. వెడలెఁ వివిధ వాహనారూఢు లయి పౌరు లప్పూరువంశవరు ననుగమించిరిత్తెఱంగున మెఱయు మహిమ నుజ్జ్వలుం డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్రంబు ప్రవేశించి చనుచుండ.30**

**ప్రతిపదార్థం:** వెడలెన్= బయలుదేరాడు; పౌరులు= పురజనులు; వివిధ వాహన+ఆరూఢులు+అయి= పలురకాలయిన వాహనాలను ఎక్కినవారై; ఆ+పూరువంశవరున్= పూరుమహారాజు వంశంలో శ్రేష్ఠుడైన ధర్మరాజును; అనుగమించిరి= వెన్వెంటి వచ్చారు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; మెఱయు= మెరుస్తున్న; మహిమన్= గొప్పతనంచేత; ఉజ్జ్వలుండు= ప్రకాశిస్తున్నవాడు; అగుచున్= అవుతూ; పాండవ+ఉత్తముండు= పాండవులలో ఉత్తముడైన ధర్మరాజు; చని= ముందుకు వెళ్ళి; భాగీరథి= గంగానదిని; ఉత్తరించి= దాటి; కురుక్షేత్రంబు= కురుక్షేత్రంలో; ప్రవేశించి= చొచ్చి; చనుచున్+ఉండన్= ముందుకు వెళ్ళుతూ ఉండగా.

**తాత్పర్యం:** ధర్మరాజు అడవికి ప్రయాణమయ్యాడు. పౌరులు రకరకాల వాహనా లెక్కి, ఆ ధర్మరాజు వెంట వచ్చారు. ఈ విధంగా ప్రాభవం వెలయగా ధర్మరాజు వెళ్ళి గంగానదిని దాటి కురుక్షేత్రంలో ప్రవేశించి (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. సంయమివరుఁ డైన శతయూప మునిపతి। యాశ్రమంబునఁ దదుపాంత భాగ**
**మునఁ గదలీశోభియును మృగాకీర్ణంబు। నగు ధృతరాష్ట్రుని యాశ్రమంబు**
**నెఱిఁగిన వా రదె యిదె యంచుఁ బేర్కొని। చూపి చెప్పిన ధర్మసుతుఁడు దేరు**
**డిగిన భీమాదులు డిగ్గిరి; వాహనం। బులు సర్వజనులు నప్పురుష వరుల**

**ఆ. ననుసరించి; రజ్జనాధిపుఁ డయ్యాంబి। కేయు నాశ్రమంబు డాయఁ జనుచు**
**నచటిజనుల నడిగె 'నయ్య వేఁడీ?' యని। గద్గదిక నెలుంగు గడలుకొనఁగ. 31**

**ప్రతిపదార్థం:** సంయమివరుఁడు= యతులలో శ్రేష్ఠుడు; ఐన= అయినటువంటి; శతయూప మునిపతి= శతయూపుడనే పేరు కలిగిన ఆ మునినాథుడియొక్క; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; తద్+ఉప+అంత భాగమునన్= దానికి దగ్గరలో; కదలీ శోభియును= అరటి చెట్లతో అందంగా ఉన్నది; మృగ+ఆకీర్ణంబున్= వివిధ మృగాలతో నిండినది; అగు= అయినటువంటి; ధృతరాష్ట్రుని ఆశ్రమంబున్= ధృతరాష్ట్రుడియొక్క ఆశ్రమాన్ని; ఎఱిఁగినవారు= తెలిసిన జనులు; అదె= అదిగో; ఇదె= ఇదిగో; అంచున్= అంటూ; పేర్కొని= పేరు చెప్పి; చూపి= చూపించి; చెప్పినన్= చెప్పగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; తేరు= రథం; డిగినన్= దిగగా; భీమ+ఆదులున్= భీముడు మొదలైన తమ్ములు నలుగురూ కూడా; వాహనంబులు= తమ తమ వాహనాలను; డిగ్గిరి= దిగారు; సర్వజనులున్= ద్రౌపదీ ప్రముఖ కాంతలూ, పౌరులూ అందరు; ఆ+పురుషవరులన్= పురుషశ్రేష్ఠులగు ఆ పాండవులను; అనుసరించిరి= వారి వెంట నడిచారు; ఆ+జన+అధిపుఁడు= ఆ ధర్మరాజు; ఆ+ఆంబికేయున్+ఆశ్రమంబు= ఆ ధృతరాష్ట్రుడి ఆశ్రమాన్ని; డాయన్+చనుచున్= సమీపించి వెళ్ళుతూ; అచటి జనులన్= అక్కడ ఉన్న వారిని; ఎలుంగు= కంఠస్వరాన్ని; గద్గదికన్= డగ్గుత్తికతో; కడలుకొనఁగాన్= నిండగా (వ్యాపించగా); అయ్య= మా తండ్రి; వేఁడీ?= ఎక్కడ ఉన్నాడు?; అని= అనే విధంగా; అడిగెన్= ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** అక్కడ యతిశ్రేష్ఠుడైన శతయూపుడి ఆశ్రమ సమీపంలో అరటి తోపులతో మనోజ్ఞమైనదీ, వివిధ మృగాలతో నిండినదీ అయి ఉన్న ధృతరాష్ట్రుడి ఆశ్రమం తెలిసినవారు 'అదిగో ఇదె' అని పేర్కొని ప్రశంసిస్తూ నిర్దేశించి చెప్పారు. ధర్మరాజు రథం దిగాడు. వెంటనే అతడి తమ్ముళ్ళు భీమాదులు వాహనాలు దిగారు. మిగిలిన స్త్రీలూ పౌరజనం అందరూ కూడా తమ తమ వాహనాలు దిగారు. అందరూ ధర్మరాజు వెంట నడుస్తున్నారు. ధర్మరాజు ధృతరాష్ట్రుడి ఆశ్రమం సమీపించి అక్కడ ఉన్న వారితో గొంతు బొంగురు వోవగా 'మా తండ్రి ఎక్కడ? అని అడిగాడు.

**వ. అనిన వార లప్పుడమిఱేనితోడ. 32**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మరాజు అడుగగా; వారలు= అచ్చటి జనులు; ఆ+పుడమిఱేనితోడన్= ఆ రాజుతో.

**తాత్పర్యం:** తమ తండ్రి ఎక్కడ అని అడిగిన ధర్మరాజుతో ధృతరాష్ట్రుడి ఆశ్రమంలో ఉన్నవారు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'యమునా స్నానంబునకును। సుమతోయాహరణమునకు సువ్రతుఁ డా సం**
**యమి చనియె' ననుచుఁ దన్మా। ర్గము సెప్పిరి నెమ్మిఁ దెలియఁ గౌరవముఖ్యా! 33**

**ప్రతిపదార్థం:** సువ్రతుఁడు= ఉత్తమమైన వ్రతాలను ఆచరించే వాడు అయిన; ఆ సంయమి= ఆ ధృతరాష్ట్ర యతి; యమునా స్నానంబునకును= యమునానదిలో స్నానం చేయటానికి; సుమ తోయ ఆహరణమునకున్= పూవులూ, నీళ్ళూ, తీసికొని రావటంకొరకు; చనియెన్= వెళ్ళాడు; అనుచున్= అని; కౌరవముఖ్యా!= కురువంశంలో ప్రధానుడా! జనమేజయ మహారాజా!; తద్+మార్గము= యమునానదికి పోయే త్రోవ; నెమ్మిన్= ప్రేమతో; తెలియన్= వివరంగా; చెప్పిరి= చెప్పారు.

**తాత్పర్యం:** 'మంచి వ్రతాలను ఆచరిస్తూండేటటువంటి ఆ ధృతరాష్ట్ర యతి యమునలో స్నానంచేయటానికి పూలు, నీళ్ళూ తెచ్చుకొనటానికి వెళ్ళాడు' అని చెప్పి ఓ జనమేజయ మహారాజా! ఆ ఆశ్రమం వద్ద ఉన్న జనులు యమునకు వెళ్ళే మార్గం ధర్మరాజుకు వివరించి చెప్పారు.

**పాండవులు కురుక్షేత్రంబున నున్న ధృతరాష్ట్ర గాంధారీ కుంతుల దర్శించుట (సం.15-31-6)**

**సీ. చెప్పినఁ బాండవు లప్పథంబున భక్తి। నరుగుచు నెదురుగ నరుగుదెంచు**
**నంబికానందనుఁ డాదిగాఁ గలవారిఁ। గని రప్పు డన్నలఁ గడచి శీఘ్ర**
**గామియై చని తల్లి కాళ్ళపైఁ బడి యేడ్చె। సహదేవుఁ; డధిక బాష్పప్లుతాస్య**
**యగుచు నబ్భామిని వగచుచు నాతని। నెత్తి తాఁ గౌఁగిట నిఱియఁ జేర్చి**

**తే. పేరుకొని చెప్పె నతని గాంధారి కంతఁ। గూడి యతఁడును దారు నక్కురుకుమారు**
**లక్కురూద్వహు నన్నియతాత్ము దేవిఁ। గాంచి రనుజీవు లెఱిఁగింపఁ గౌరవేంద్ర! 34**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= చెప్పగా; పాండవులు= పాండురాజు కొడుకులు; ఆ+పథంబునన్= వారు చెప్పిన మార్గంలో; భక్తిన్= పూజ్యభావంతో; అరుగుచున్= యమునా నదివైపుగా వెళ్ళుతూ; ఎదురుగన్= తమకు ఎదురుగా; అరుగుదెంచు= వస్తూ ఉన్న; అంబికా నందనుఁడు= ధృతరాష్ట్రుడు; ఆదిగాన్= మొదలుగా; కలవారిన్= ఉన్న గాంధారీ, కుంతీ ప్రభృతులను; కనిరి= చూచారు;

అప్పుడు= ఆ సమయంలో; సహదేవుఁడు= సహదేవుడు; అన్నలన్= తనకు ముందు నడుస్తున్న నలుగురు అన్నలను; కడచి= దాటి; శీఘ్రగామి+ఐ= తొందరగా వెళ్ళేవాడై; చని= ముందుకు పోయి; తల్లి కాళ్ళపైన్= కుంతి పాదాలమీద; పడి= పడిపోయి; ఏడ్చెన్= శోకించాడు; ఆ+భామిని= ఆ కుంతిదేవి; అధిక= మిక్కుటమైన; బాష్ప= కన్నీటి; ప్లుత= ప్రవాహంగల; ఆస్య= ముఖం కలిగినది; అగుచున్= అవుతూ; వగచుచున్= దుఃఖిస్తూ; ఆతనిన్= తన పాదాలపై పడ్డ సహదేవుడిని, తాను= తను; ఎత్తి= లేవదీసి; కౌఁగిటన్= తన కౌగిలిలో; ఇఱియన్+చేర్చి= గట్టిగా పొదుపుకొని; గాంధారికిన్= గాంధారితో; అతనిన్= సహదేవుడిని; పేరుకొని= పేరు ప్రస్తావిస్తూ; చెప్పెన్= చెప్పింది; కౌరవ+ఇంద్ర!= కురువంశశ్రేష్ఠుడా! జనమేజయ మహారాజా!; అంతన్= అటు పిమ్మట; అతండును= ఆ సహదేవుడును; ఆ+కురుకుమారులు= ధర్మజుడు మిగిలిన పాండుకుమారులు; తారును= వారూ; కూడి= కలిసి; ఆ+కురు+ఉద్వహున్= కురువంశ ఉద్ధారకుడైన ఆ ధృతరాష్ట్రుడినీ; ఆ+నియత+ఆత్మదేవిన్= ఇంద్రియాలను అణచిన ఆ ధృతరాష్ట్రుడి భార్య గాంధారినీ; అనుజీవులు= పరిచారకులు; ఎఱిఁగింపన్= తెలియజెప్పగా; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడి ఆశ్రమంవద్ద ఉన్నవారు ధృతరాష్ట్రుడు స్నానాదులకై వెళ్ళిన యమునానది మార్గం చెప్పగా, పాండవులు అదే మార్గంలో వెళ్ళుతున్నారు. అట్లా వెళ్ళుతూ ఎదురుగా వస్తూ ఉన్న ధృతరాష్ట్రుడిని, గాంధారిని, కుంతిని వారు చూచారు. అప్పుడు సహదేవుడు తనకు ముందున్న అన్నలను దాటి తొందరగా వెళ్ళి తల్లి కుంతీదేవి కాళ్ళపైబడి ఏడిచాడు. కుంతికూడా దుఃఖంతో కన్నీళ్ళు నిండిన ముఖంతో, సహదేవుడిని లేవదీసి గట్టిగా పొదువుకొని గాంధారికి సహదేవుడు వచ్చాడని చెప్పింది. ఓ జనమేజయ మహారాజా! పిమ్మట ధర్మరాజాదులు కూడా వచ్చి సహదేవుడితో కలిసి, తమ రాకను అనుచరులు తెలియజేస్తుండగా, గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించుకొన్నారు.

**చ. కని మఱి తల్లి పాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు; ల**
**వ్వనితయు నందఱం బొదివి వత్సలతన్ మన మార్ద్రభావ మొం**
**ద నురలు నశ్రుబిందువుల దందడిఁ జిక్కఁగఁ గౌఁగిలించి వా**
**రి నయనవారి చేఁ దుడిచి ప్రీతిగ దీవెన లిచ్చె భూవరా! 35**

**ప్రతిపదార్థం:** కని= గాంధారీ ధృతరాష్ట్రులను చూచి; మఱి= అటు తరువాత; తల్లి పాదములన్= కుంతి కాళ్ళమీద; మస్తకంబులన్= తమ తమ తలలను; క్రందుగన్= ఒక్కసారిగా; చేర్చిరి= ఉంచారు; భూవరా!= ఓ జనమేజయ రాజా!; ఆ+వనితయున్= ఆ కుంతి కూడా; అందఱన్= కొడుకుల నందరినీ; పొదివి= దగ్గరకు తీసికొని; మనము= హృదయం; వత్సలతన్= పుత్రప్రేమతో; ఆర్ద్ర భావము= తడిసిపోవటాన్ని; ఒందన్= పొందగా; ఉరలు= దొర్లిపడుతున్న; అశ్రు బిందువులు= కన్నీటి చుక్కలు; దందడిన్= ఆధిక్యంతో; చిక్కఁగన్= గట్టిగా; కౌఁగిలించి= (కొడుకులను) కౌగిలించుకొని; వారి= కొడుకులయొక్క; నయనవారిన్= కన్నీటిని; చేన్= తన చేతితో; తుడిచి= తొలగించి; ప్రీతిగన్= ప్రేమతో; దీవెనలు= ఆశీస్సులను; ఇచ్చెన్= ఇచ్చింది.

**తాత్పర్యం:** ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు ఆ విధంగా గాంధారీ ధృతరాష్ట్రులను చూచి, ఒక్కసారిగా తల్లి కుంతి పాదాలపై తలలుంచి నమస్కరించారు. జనమేజయ మహారాజా! అపుడు కుంతీదేవి ఆ కొడుకులు అందరినీ పొదివిపట్టుకొని మనసు వాత్సల్యంతో నిండి, కన్నీటి బిందువులు జారిపడుతుండగా, పుత్రులను గట్టిగా కౌగిలించుకొని వాళ్ళ కన్నీళ్ళు చేతితో తుడిచి ప్రేమతో ఆశీర్వదించింది.

**తే. అట్టియెడఁ బాండవాగ్రజ నధిక వినయ। భరితుఁడై కాంచి భీమునిఁ బార్థుఁ గవలఁ**
**గనియె సంజయుఁ డెంతయు గారవమున। నాదరించి రయ్యేవురు నతనిఁ బ్రీతి. 36**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సందర్భంలో; సంజయుఁడు= సంజయుడు; పాండవ+అగ్రజున్= ధర్మరాజును; అధిక వినయ భరితుఁడు+ఐ= మిక్కిలి అణకువతో నిండినవాడై; కాంచి= చూచి; భీమునిన్= భీముడిని; పార్థున్= అర్జునుడిని; కవలన్= నకుల సహదేవులను; ఎంతయున్= ఎంతో; గారవమునన్= ప్రేమతో; కనియెన్= చూచాడు; ఆ+ఏవురున్= ఆ అయిదుగురు పాండవులును; ప్రీతిన్= ఇష్టంతో; అతనిన్= ఆ సంజయుడిని; ఆదరించిరి= సమ్మానించారు.

**తాత్పర్యం:** ఆ సమయంలో సంజయుడు ధర్మరాజును మిక్కిలి వినయంతో భీమార్జున నకుల సహదేవులను అత్యంత వాత్సల్యంతో చూచాడు. పాండవులు సంజయుడిని ప్రేమతో సమ్మానించారు.

**సీ.** **ద్రోవదిఁ దొట్టి వధూజనంబులుఁ దక్కుఁ। గలయట్టి భరత భార్యలుఁ గ్రమమునఁ**
**గాంచిరి కురువృద్ధు గాంధారి గొంతిని;। వారలు గొనివచ్చు వారి కలశ**
**ములు పాండురాజ పుత్త్రులు పుచ్చికొని భరి। యించిరి; పురజను లెల్ల నధిక**
**వినయత నమ్ముప్వురను గని; రవ్వేళ। నందఱు ముదమంది; రట్లు దగిన**

**ఆ.** **వారు బలసి యునికి వారణపురమున। నున్నయట్ల కాఁగఁ దన్నుఁ దలఁచె**
**మదిఁ గురూద్వహుండు తదనంతరంబ ని। జాశ్రమమున కెలమి నరుగుదెంచి.** **37**

**ప్రతిపదార్థం:** ద్రోవదిన్+తొట్టి= ద్రౌపదిని మొదలు పెట్టి; వధూ జనంబులును= పాండవ స్త్రీలు; తక్కున్‌కల+అట్టి= మిగిలి ఉన్నటువంటి; భరత భార్యలు= భరతవంశపు స్త్రీలు; క్రమమునన్= వరసగా; కురువృద్ధున్= ధృతరాష్ట్రుడిని; గాంధారిన్= గాంధారిని; గొంతిని= కుంతిని; కాంచిరి= చూచారు; వారలు= వారు; కొనివచ్చు= తీసికొనివస్తున్న; వారి కలశములు= నీటి పాత్రలు; పుచ్చికొని= తాము అందుకొని; పాండురాజ పుత్త్రులు= పాండవులు; భరియించిరి= మోశారు; పురజనులు= పౌరులు; ఎల్లన్= అందరూ; అధిక వినయతన్= మిక్కిలి అణకువతో; ఆ+ముప్వురను= ఆ ముగ్గురిని; కనిరి= చూచారు; ఆ+వేళన్= అటువంటి సమయంలో; అందఱున్= అక్కడి వారందరూ; ముదము= సంతోషం; అందిరి= పొందారు; అట్లు= ఆ విధంగా; తగినవారు= అర్హులైనవారు; బలసి= కూడుకొని; ఉనికిన్= ఉండటంతో; కురు+ఉద్వహుండు= ధృతరాష్ట్రుడు; తన్నున్= తనను గురించి; మదిన్= మనసులో; వారణపురమునన్= హస్తినలోనే; ఉన్న+అట్లు= ఉన్నాననే విధంగా; కాఁగన్= అయినట్లుగా; తలఁచెన్= అనుకొన్నాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ఎలమిన్= ఉత్సాహంతో; నిజ+ఆశ్రమంబునకున్= తన తపోవనానికి; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ద్రౌపది మొదలైన పాండవ స్త్రీలు, ఇంకా మిగిలిన భరతవంశపు రాజుల భార్యలు, క్రమంగా, ధృతరాష్ట్రుడి తరువాత గాంధారిని, ఆ తరువాత కుంతిని చూచారు. ఆ ముగ్గురు పట్టుకొని వస్తున్న నీటి పాత్రలను పాండుకుమారులు అందుకొని తీసికొనివచ్చారు. ధృతరాష్ట్రుడిని చూడటానికి వచ్చిన పౌరులు అందరూ ఆ ముగ్గురిని మిక్కిలి వినయంతో చూచారు. అటువంటి సమయంలో అందరూ సంతోషంగా ఉన్నారు. తనవారంతా తన చుట్టూ ఉండటంతో ధృతరాష్ట్రుడు మనసులో తాను హస్తినాపురంలోనే ఉన్నట్లుగా భావించాడు. తరువాత ఉత్సాహంగా తన ఆశ్రమానికి వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ.** **తారక శోభితాంబర విధంబునఁ బొల్పెసఁగంగ నాశ్రమో**
**దారతలంబు బంధుజనతాకలనంబునఁ దాను జంద్రు నొ**

**ప్వార వహించి విస్ఫురితుఁ డై తనరెం గురుభర్త వచ్చి ర**
**చ్చేరువఁ గల్గు తాపసులు చెచ్చెరఁ బార్థులఁ జూచు వేడుకన్. 38**

**ప్రతిపదార్థం:** బంధుజనతా కలనంబునన్= చుట్టాలతో నిండి ఉండటంచేత; ఆశ్రమ+ఉదార తలంబు= ధృతరాష్ట్రుడియొక్క గొప్ప ఆశ్రమ ప్రదేశం; తారక శోభిత+అంబర విధంబునన్= నక్షత్రాలతో ప్రకాశించే ఆకాశంవలె; పొల్పు= అందం; ఎసఁగంగన్= అతిశయించగా; కురుభర్త= ఆ ధృతరాష్ట్రుడు; తాను= స్వయంగా; చంద్రు+ఒప్పు+ఆరన్= చంద్రుడియొక్క సౌందర్యం అధికంగా; వహించి= ధరించి; విస్ఫురితుఁడు+ఐ= ప్రకాశించేవాడై; తనరెన్= ఒప్పుతున్నాడు; ఆ+చేరువన్= ఆ సమీపంలో; కల్గు= ఉన్న; తాపసులు= మునులు; పార్థులన్= పాండవులను; చూచువేడుకన్= చూడాలనే కుతూహలంతో; చెచ్చెరన్= వేగంగా; వచ్చిరి= అక్కడికి వచ్చారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి బంధువులు మొదలైన జనాలలో నిండి ఉండటంవలన ఆశ్రమ ప్రదేశం నక్షత్రాలతో ప్రకాశిస్తున్న ఆకాశంవలె ఉండి అందులో ధృతరాష్ట్రుడు స్వయంగా చంద్రుడివలె ప్రకాశిస్తున్నాడు. ఆ సమయంలో కుంతి కొడుకులను చూడాలనే కోరికతో ఆ సమీపంలో ఉండే తాపసులు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి వచ్చారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. వచ్చినం గని వారల నెల్లను సవినయ ప్రణామంబులం బ్రీతులం జేసి పాండవు లలరు మొగంబులతో ధృతరాష్ట్రుంబరివేష్టించి యుండిరి; వనితాజనంబులు నొక్కవలన నిలిచి; రుచితాసనంబులనున్న యమ్మునులు సంజయు నాలోకించి 'ధృతరాష్ట్ర బంధు జనంబుల నందఱం బేరువేర నేర్పడ మా కెఱింగింపవే' యని యడిగిన నతండు వారల కి ట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** వచ్చినన్= రాగా; పాండవులు= పాండురాజు కొడుకులు; కని= చూచి; సవినయ ప్రణామంబులన్= అణకువతో కూడిన పాదాభివందనాలతో; వారలన్= ఆ తాపసులను; ఎల్లను= అందరినీ; ప్రీతులన్+చేసి= సంతోషించినవారుగా చేసి; అలరు మొగంబులతోన్= వికసించిన ముఖాలతో; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; పరివేష్టించి+ఉండిరి= చుట్టుకొని ఉన్నారు; వనితాజనంబులున్= ద్రౌపది మొదలైన స్త్రీలు అందరూ; ఒక్కవలనన్= ఒక ప్రక్కగా; నిలిచిరి= నిలుచుని ఉన్నారు; ఉచిత+ఆసనంబులన్= తమకు తగిన ఆసనాలమీద; ఉన్న= కూర్చున్న; ఆ+మునులు= పాండవులను చూడవచ్చిన మునులు; సంజయున్= సంజయుడిని; ఆలోకించి= చూచి; ధృతరాష్ట్ర బంధుజనంబులన్= ధృతరాష్ట్రుడి చుట్టాలను; అందఱన్= అందరినీ; పేరు పేరన్= ప్రత్యేకంగా ఒక్కొక్కరిని; ఏర్పడన్= స్పష్టంగా; మాకున్= మాకు; ఎఱింగింపవే= తెలుపవలసింది; అని; అడిగినన్= అడుగగా; అతండు= సంజయుడు; వారలకున్= ఆ తపసులతో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి వచ్చిన మునులపాదాలకు పాండవులు వినయంగా నమస్కారాలు చేసి వారిని సంతోషపెట్టారు. ఆనందంతో విచ్చుకొన్న ముఖాలతో ఆ పాండవులు ధృతరాష్ట్రుడి చుట్టూ కూర్చున్నారు. ద్రౌపది మొదలైన స్త్రీలు అంతా ఒక ప్రక్కగా నిలబడ్డారు. తమకు తగిన ఆసనాలమీద కూర్చున్న ఆ మునులు సంజయుడిని చూచి ధృతరాష్ట్రముని యొక్క చుట్టాలందరిని పేరు పేరునా మాకు తెలియజెప్పు'మని అడిగారు. అప్పుడు వారితో సంజయుడు ఇట్లా చెప్పాడు.

**సీ.** **'జాంబూనదచ్ఛాయ చందంబు వర్ణంబు। గలిగిన పలుచని గనప మేను,**
**నుచిత దీర్ఘత్వ సమున్నత ఘ్రాణంబు। నిడుదలైన విశాల నేత్రములును,**
**గంఠీరవంబు రేఖయు నొప్పఁ జూడ్కికి। నెంతయు వ్రేఁగైన యితఁడు ధర్మ**
**తనయుఁ; డెట్టఁదనంబుఁ దనరిన మూఁపులు। నాయత స్ఫీతంబు లైన బాహు**

**తే.** **వులును వెడందయురంబు నై పొలుచు నితఁడు। భీముఁ; డుజ్జ్వల సుందర శ్యామ తనువు**
**వారణేంద్రు కైవడియును, వారిజముల। యట్టి కనుదోయిఁ గల యితం డర్జునుండు.** **40**

**ప్రతిపదార్థం:** జాంబూనదచ్ఛాయ= మేలిమి బంగారు కాంతియొక్క; చందంబు= విధం; వర్ణంబు= రంగు; కలిగిన= కలిగి ఉన్నటువంటి; పలుచని= సన్ననైన; గనపమేనున్= ఉన్నతమైన శరీరము; ఉచిత= తగినంత; దీర్ఘత్వ= పొడుగుతో; సమ్+ఉన్నత= ఎత్తుగా ఉన్న; ఘ్రాణంబున్= ముక్కు; నిడుదలు+ఐన= దీర్ఘములు అయినటువంటి; విశాల నేత్రములును= పెద్ద కన్నులు; కంఠీరవంబు= సింహంయొక్క; రేఖయున్= తీరూ; ఒప్పన్= ప్రకాశిస్తుండగా; చూడ్కికిన్= చూపునకు; ఎంతయున్= ఎంతో; వ్రేఁగు+ఐ= సహించరానివాడైన; ఇతఁడు= ఈ వ్యక్తి; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ఎఱ్ఱఁదనంబును= (మేని) ఎరుపురంగు; తనరిన మూఁపులున్= ఎత్తయిన భుజ అగ్రభాగాలు; ఆయత స్ఫీతంబులు+ఐన= మిక్కిలి పొడుగై విస్తరించినవైన; బాహువులును= భుజాలు; వెడఁద+ఉరంబును= విశాలమైన వక్షస్థలము; ఐ= కలిగి; పొలుచు ఇతఁడు= ప్రకాశిస్తున్న ఈ వ్యక్తి; భీముఁడు= భీమసేనుడు; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; సుందర= అందమైన; శ్యామ= నల్లని రంగు కలిగిన; తనువున్= శరీరమూ; వారిజముల+అట్టి= పద్మాలవంటి; కనుదోయిన్= కన్నుగవయూ; వారణ+ఇంద్రు+కైవడియును= ఉత్తమమైన ఏనుగువంటి తీరు; కల+ఇతండు= కలిగిన ఈ వ్యక్తి; అర్జునుండు= అర్జునుడు.

**తాత్పర్యం:** మేలిమి బంగారుకు ప్రతిబింబమైన పసిమిరంగు కలిగిన సన్నని శరీరం, తగినంత పొడుగు, ఎత్తూ కలిగిన ముక్కు, పొడుగ్గా ఉన్న పెద్ద పెద్ద కన్నులు, సింహం తీరు కలిగి చూపునకు అధికమైన ఇతడు ధర్మరాజు, ఎరుపురంగు శరీరం, ఎత్తైన భుజాలు పొడుగ్గా విస్తరించి ఉన్న భుజాలూ, విశాలమైన వక్షస్స్థలము కలిగి ఉన్న ఈ వ్యక్తి భీముడు, బాగా ప్రకాశిస్తున్న అందమైన నల్లటి శరీరం, తామరలవంటి కన్నులు, గజేంద్రుడి వంటి తీరూ కలిగిన ఇతడు అర్జునుడు.

**తే.** **సుందరాకారమునఁ దమ కెందు సదృశు। లొరులు లేమి తెల్లం బగుచుండ గొంతి**
**యుభయ పార్శ్వంబు లందుఁ గూర్చున్న విష్ణు। శతమఖోపముల్ వినయభూషితులు కవలు.** **41**

**ప్రతిపదార్థం:** సుందర+ఆకారమునన్= అందమైన రూపం విషయంలో; తమకున్= తమతో (నకుల సహదేవులతో); సదృశులు= సమానమైనవారు; ఒరులు= ఇతరులు; ఎందున్= ఎక్కడ కూడా; లేమి= లేకపోవటం; తెల్లంబు= స్పష్టం; అగుచున్+ఉండన్= అవుతుండగా; గొంతి= కుంతియొక్క; ఉభయ పార్శ్వంబులందున్= రెండుప్రక్కలా; కూర్చున్న= ఆసీనులై ఉన్న; విష్ణు శతమఖ ఉపముల్= విష్ణువుతోను, ఇంద్రుడితోను, పోలిక కలిగినవారు; వినయ భూషితులు= అణకువే అలంకారంగా కలవారు అయినవారు; కవలు= నకుల సహదేవులు.

**తాత్పర్యం:** అందమైన రూపంలో తమకు సాటివచ్చేవారు ఎక్కడా లేరనే విషయం స్పష్టమవుతుండగా కుంతికి రెండు ప్రక్కలా కూర్చున్న విష్ణుని ఇంద్రుని పోలినవారు, అణకువే అలంకారంగా ఉన్నవారు అయిన ఈ ఇద్దరు నకుల సహదేవులు.

**సీ.** **నీలోత్పల చ్ఛాయఁ బోలు మై చాయయు, । నవపద్మదళములఁ దెవడు మెఱుఁగుఁ**
**గనుదోయి, మధ్యాత్వమునకుఁ బ్రవేశించు । ప్రాయంబు, నత్యభిరామ మూర్తి**
**యలవడఁ గైకొన్న యతులిత సంపద । చందంబు దోఁపించు చారుగౌర**
**వంబును గలుగు నివ్వనిత పాంచాలి; యి । య్యింతి పార్శ్వమునఁ గట్టెఱ్ఱ మేను**

**తే.** **వనజ సన్నిభ ముఖమునై యినుని మహిమ । యుజ్జ్వలాకృతి దాల్చినట్లున్న యీ ల**
**తాంగి నారాయణుని చెలియలు సుభద్ర। నరుని వల్లభ సంయమినాథులార!** **42**

**ప్రతిపదార్థం:** సంయమినాథులార!= శ్రేష్ఠులైన మునులారా!; నీల+ఉత్పలచ్ఛాయ= నల్ల కలువలయొక్క రంగును; పోలు= పోలిన; మై చాయయున్= శరీరపు రంగు; నవ పద్మ దళములన్= క్రొత్తగా (వికసించిన) తామరపువ్వుయొక్క రేకులను; తెవడు= నిందించేటటువంటి; మెఱుఁగున్+కనుదోయి= కాంతిమంతములైన కనులజంటా; మధ్యాత్వమునకున్= మధ్య అనే నాయిక యొక్క, లక్షణంలో; ప్రవేశించు= ప్రవేశిస్తున్న; ప్రాయంబున్= వయసు; అతి+అభిరామమూర్తి= మిక్కిలి మనోజ్ఞమైన రూపం; అలవడన్= సిద్ధించేటట్లుగా; కైకొన్న= స్వీకరించిన; అతులిత సంపద= సాటిలేని సమృద్ధియొక్క; చందంబు= విధం; తోఁపించు= స్ఫురింపజేసేటటువంటి; చారు గౌరవంబును= గొప్పమన్ననా; కలుగు ఈ+వనిత= కలిగి ఉన్న ఈ స్త్రీ; పాంచాలి= ద్రౌపది; ఈ+ఇంతి= ఈ ద్రౌపదియొక్క; పార్శ్వమునన్= ప్రక్కన; కడు+ఎఱ్ఱ మేను= మిక్కిలి ఎర్రనైన శరీరం; వనజ సన్నిభ ముఖమును= పద్మంతో సమానమైన ముఖము; ఐ= కలిగి; ఇనుని మహిమ= సూర్యుడియొక్క గొప్పతనం; ఉజ్జ్వల+ఆకృతి= ప్రకాశించే రూపం; తాల్చిన+అట్లు= ధరించిన విధంగా; ఉన్న= ఉన్నటువంటి; ఈ లతాంగి= ఈ తీగబోడి; నారాయణుని చెలియలు= శ్రీకృష్ణుడి చెల్లెలు; నరుని వల్లభ= అర్జునుడి భార్య- సుభద్ర.

**తాత్పర్యం:** నల్లకలువలవంటి శరీరపు రంగు, అపుడే వికసించిన తామరపూవు రేకులను పరిహసించి ప్రకాశిస్తున్న కళ్ళూ, అపుడే మధ్యా దశలో ప్రవేశిస్తున్న వయసు కలిగి మనోహరమైన ఆకారాన్ని ధరించిన సాటిలేని సంపదల తీరు స్ఫురింపజేసే గొప్ప మన్నన కలిగిన ఈమె ద్రౌపది. ద్రౌపదికి ప్రక్కన బాగా ఎర్రనైన శరీరం పద్మంవంటి ముఖం కలిగి, సూర్యతేజస్సు రూపు ధరించినట్లుగా ఉన్న ఈమె శ్రీకృష్ణుడి చెల్లెలు, అర్జునుడి భార్య సుభద్ర.

**ఆ.** **వీరి కెలనఁ గనక గౌర మధూకాభ । తనువు లొప్పుచున్న వనిత లురగ**
**పాండ్య సుతలు, నరుని భార్య; లులూపి చి । త్రాంగద యనఁ బరఁగ నాహ్వయములు.** **43**

**ప్రతిపదార్థం:** వీరికెలనన్= ఈ ద్రౌపదీ సుభద్రల ప్రక్కన; కనక= బంగారంవలె; గౌర= పసుపు పచ్చని; మధూక+ఆభ= ఇప్పపూవుతో సమానంగా ఎర్రని; తనువులు= శరీరాలు; ఒప్పుచున్న= ప్రకాశిస్తున్న; వనితలు= ఆ స్త్రీలు; ఉరగ పాండ్య సుతలు= నాగ, కన్యపాండురాజు కూతురు అయినవారు; నరుని భార్యలు= అర్జునుడి సతులు; ఆహ్వాయములు= ఆ ఇద్దరి పేర్లు; ఉలూపి= (ఉరగవనిత) ఉలూపి; చిత్రాంగద= (పాండ్యసుత) చిత్రాంగద; అనన్= అనే విధంగా; పరఁగున్= ఒప్పుతున్నాయి.

**తాత్పర్యం:** ఈ ద్రౌపదీ సుభద్రల ప్రక్కన తమ మేనులు బంగారంవలె పసుపూ, మధూకంవలె ఎరుపు రంగుతో ప్రకాశిస్తూ ఉన్నవారు-ఒకరు నాగకన్య, ఇంకొకరు పాండ్యరాజు కూతురు. వీరు అర్జునుడి భార్యలు, ఉలూపి చిత్రాంగద అని వీరి పేర్లు.

**సీ.** **ఇందీవరచ్ఛాయ కెనయైన చాయ నొ। ప్పిన మేను గలుగు నీ భీతహరిణ**
**నయన భీముని భార్య; నవ్యచంపక దామ। గౌరాంగి యైన యిక్కమలవదన**
**సహదేవు గృహిణి; మేచకనవకువలయ। వర్ణంబునకు సరివచ్చు కాంతిఁ**
**జెలు వైన తనువునఁ బొలుచు నిన్నలినాయ। తాక్షి మాద్రీదేవి యగ్రతనయు**

**తే.** **పత్ని; వీరల కెలనఁ బాపటలు లేక। ధౌతసిత వస్త్ర పరిధానలై తనువుల**
**నిభృతి దోఁపఁగ నున్న యిన్నెలఁత లాంబి। కేయు కోడండ్రు కరుణావిధేయులార! 44**

**ప్రతిపదార్థం:** కరుణా విధేయులార!= దయకు లోబడిన తాపసులారా!; ఇందీవరచ్ఛాయకున్= నల్ల కలువల కాంతికి; ఎన= సాటి; ఐన= అయినటువంటి; చాయన్= రంగుతో; ఒప్పిన మేను= ప్రకాశిస్తున్న శరీరం; కలుగు= కలిగి ఉన్న; ఈ భీతహరిణనయన= ఈ భయపడ్డ లేడి కన్నులవంటి కన్నులు గల స్త్రీ, భీముని పెండ్లాము; నవ్యచంపకదామ గౌర+అంగి= నూతనములైన సంపెంగ పూలదండవలె పసుపురంగు శరీరం కలిగినది; ఐన= అయినటువంటి; ఈ+కమలనయన= ఈ తామరవంటి కన్నులు గల స్త్రీ; సహదేవు గృహిణి= సహదేవుడి భార్య; మేచక నవ కువలయ వర్ణంబునకున్= నల్లనైన క్రొత్త కలువపూవు రంగుతో; సరివచ్చు కాంతిన్= సాటివచ్చే ప్రకాశంతో; చెలువు+ఐన= అందమైనటువంటి; తనువునన్= శరీరంతో; పొలుచు= ఒప్పుతున్న; ఈ+నలిన+ఆయత+అక్షి= తామరరేకులవలె విశాలమైన కన్నులుగల ఈ స్త్రీ; మాద్రీదేవి= మాద్రియొక్క; అగ్రతనయు పత్ని= పెద్ద కొడుకు నకులుడి భార్య; వీరల కెలనన్= ఈ కుంతి కోడళ్ళ ప్రక్కన; పాపటలు= ముత్తయిదువ లక్షణమైన సీమంతాలు; లేక= లేకుండా; ధౌత సిత వస్త్ర పరిధానలు= శుభ్రంచేయబడ్డ తెల్లటి వస్త్రాలు ధరించినవారు; ఐ= అయి; తనువుల నిభృతి= శరీరాల గోపనం; తోఁపఁగన్= తోచే విధంగా; ఉన్న= ఉన్నటువంటి; ఈ+నెలఁతలు= ఈ స్త్రీలు; ఆంబికేయు కోడండ్రు= ధృతరాష్ట్రుడి కోడళ్ళు.

**తాత్పర్యం:** కరుణకు లోబడిన తాపసులారా! నల్లకలువల కాంతికి సాటివచ్చే రంగుతో ఉన్న శరీరంగల ఈమె భీముడి భార్య (శ్రీకృష్ణుడితో ఎప్పుడు విరోధించే రాజచమూపతి సోదరి), క్రొత్త సంపంగిపూల దండవలె గౌరవర్ణంతో ఉన్న శరీరం కలిగిన ఈ పద్మాక్షి సహదేవుడి భార్య (జరాసంధుడి కూతురు). అప్పుడే విచ్చుకొన్న నల్లకలువలతో సమానమైన రంగుగల శరీరంతో ప్రకాశిస్తున్న ఈ పద్మదళనేత్ర (మాద్రి పెద్దకొడుకు) నకులుడి భార్య. వీరికి ప్రక్కగా పాపటలు లేకుండా ఉతికిన తెల్లని చీరలు ధరించి శరీరం దాచుకొంటూ ఉన్న ఈ స్త్రీలు ధృతరాష్ట్రుడి కోడళ్ళు (భరత భార్యలు).

**తే.** **వీరి చందంబ యై కడు గారవమునఁ। దను సుభద్ర వొదువ నున్న తరుణి ద్రోణ**
**కర్ణముఖ యోధవీరులఁ గలఁచి తెగిన। యట్టి యభిమన్యు ప్రియ యుత్తరాభిధాన. 45**

**ప్రతిపదార్థం:** వీరి చందంబు+అ= ధృతరాష్ట్రుడి కోడళ్ళ విధమే; ఐ= అయి; సుభద్ర= అత్త అయిన సుభద్ర; తనున్= తనను; కడున్= మిక్కిలి; గారవమునన్= ప్రేమతో; పొదువన్= దగ్గరకు తీసికొనగా; ఉన్న= ఉన్నటువంటి; తరుణి= స్త్రీ; ద్రోణ కర్ణ ముఖ యోధ వీరులన్= ద్రోణుడు, కర్ణుడు మొదలైన యుద్ధ నిపుణులైన పరాక్రమవంతులను; కలఁచి= కలతపెట్టి; తెగిన+అట్టి= మరణించినటువంటి; అభిమన్యు ప్రియ= అభిమన్యుడి భార్య; ఉత్తరా+అభిధాన= ఉత్తర అనే పేరు కలిగినది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి కోడళ్ళవలె భర్త లేని లక్షణాలతో ఉండి, సుభద్ర ఎంతో ప్రేమతో దగ్గరకు తీసికొన్న స్త్రీ, ద్రోణుడు కర్ణుడు మొదలైన మహావీరులనే యుద్ధంలో కష్టపెట్టి మరణించిన అభిమన్యుడి భార్య; పేరు ఉత్తర.

**వ. అని చూపి చెప్పె, నప్పు డాంబికేయుండు కౌంతేయాగ్రజున కిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; చూపి= చూపించి; చెప్పెన్= చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; కౌంతేయ+అగ్రజునకున్= ధర్మరాజుతో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని సంజయుడు ధృతరాష్ట్రుడి బంధువులందరిని చూపించి ఆ తాపసులకు వివరించి చెప్పాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'కుశలివై యుండుదే కురువంశ సత్తమ! । పౌరజనులు జానపదులుఁ దెఱఁగు**
**తో నిన్ను ననుసరింతురె? తమ్ము లందఱు । సుఖ ముందురే? నీదు సఖులు సుఖులె**
**బంధులు సంతోషభరితులే? యిష్ట భృ । త్యులు తగవైన కోర్కులు ఫలింపఁ**
**గ్రాలుదురే? హర్షలీలలఁ బూర్వ రా । జన్యుల నడవడి సలుపఁబడునె?**

**ఆ. నయముతోడి యప్పనముల భండారంబుఁ । బెనుతె? యగ్రహార జనులమీఁద**
**గాలి యైన సుడియఁగా నీక యరయుదే? । యనఘ! పుణ్యకీర్తు లతిశయిల్ల. 47**

**ప్రతిపదార్థం:** కురువంశ సత్తమ!= కురుమహారాజు వంశంలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; కుశలివి= క్షేమం కలిగినవాడివి; ఐ= అయి; ఉండుదు+ఏ?= ఉన్నావా?; పౌరజనులు= ప్రజలు; జానపదులు= పల్లెల్లో ఉండే ప్రజలందరూ; తెఱఁగుతోన్= పద్ధతి ప్రకారం; నిన్నున్= నిన్ను; అనుసరింతురు+ఎ?= అనుసరించుకొని ఉన్నారా?; తమ్ములు= ఏ అనుజులు; అందఱున్= అంతా; సుఖముందురు+ఏ?= సుఖంగా ఉన్నారా?; నీదు సఖులు= నీ మిత్రులు; సుఖులు+ఎ?= సుఖంగా ఉన్నారా?; బంధులు= చుట్టాలు; సంతోష+భరితులు+ఏ?= ఆనందంతో నిండి ఉన్నారా?; ఇష్ట భృత్యులు= నీకు ప్రియమైన సేవకులు; తగవు= సముచితాలు; ఐన= అయినటువంటి; కోర్కులు= కోరికలు; ఫలింపన్= సిద్ధించటంతో; హర్షలీలలన్= సంతోషంగా; క్రాలుదురు+ఏ?= ఒప్పుతూ ఉన్నారా?; పూర్వ రాజన్యుల= నీకు పూర్వులైన ఉత్తమరాజులు అనుసరించిన; నడవడి= ధర్మమార్గం; చలుపఁ బడును+ఎ?= నీ చేతకూడా ఆచరింపబడుతున్నది కదా?; నయముతోడి= న్యాయమైన పద్ధతిలో; అప్పనములన్= పన్నులతో; భండారంబున్= కోశాన్ని; పెనుతు+ఎ?= పెంచుతున్నావా?; అనఘ!= పాపరహితుడా! ధర్మరాజా!; పుణ్యకీర్తులు= పుణ్యం కీర్తీ; అతిశయిల్లన్= పెంపొందే విధంగా; అగ్రహార జనుల మీఁదన్= సమ్మానంతో ఇచ్చిన అగ్రహారాలలోని ప్రజలమీద; గాలి+ఐనన్= గాలికూడా; సుడియఁగాన్+ఈక= సోకకుండా; అరయుదు+ఏ?= కాపాడుతున్నావా?

**తాత్పర్యం:** కురువంశంలో శ్రేష్ఠుడా! నీవు క్షేమంగా ఉన్నావు కదా! పల్లె పట్టణ ప్రజలంతా పద్ధతి ప్రకారం నిన్ను అనుసరిస్తూనే ఉంటున్నారా? నీ తమ్ముళ్ళు అందరూ సుఖంగా ఉన్నారా? నీ మిత్రులు సుఖంగా ఉన్నారా? చుట్టాలు పూర్తిగా సంతోషంగా ఉన్నారా? నీ కిష్టమైన సేవకులు సముచితమైన కోర్కెలు తీరటంతో సంతోషంగా ఉన్నారా? నీకు పూర్వులైన రాజులు నడచిన ధర్మమార్గాన్నే నీవూ అనుసరిస్తున్నావు కదా! న్యాయంగా తీసికొనే పన్నులతో కోశాగారాన్ని పెంచుతున్నావా? పాపరహితుడా! ధర్మరాజా! పుణ్యమూ, కీర్తీ పెరిగే విధంగా దేవబ్రాహ్మణుల కిచ్చిన అగ్రహారాలపై గాలికూడా వీచకుండా జాగ్రత్తగా కాపాడుతున్నావా?

**క. మిత్ర నరపతుల శాత్రవ । ధాత్రీశుల నెమ్మిఁ బరుసఁ దనమున వశతా**
**పాత్రములుగఁ జేయుదె? సుచ । రిత్ర! యుదాసీన నృప పరీక్ష నడచునే? 48**

**ప్రతిపదార్థం:** సుచరిత్ర!= మంచి నడవడికలవాడా! ధర్మరాజా!; మిత్ర నరపతులన్= నీకు మిత్రులైన; రాజులనూ; శాత్రవ ధాత్రీ+ఈశులన్= శత్రువులైన రాజులనూ; నెమ్మిన్= ప్రేమతో; పరుసఁదనమునన్= కాఠిన్యంతో; వశతా పాత్రములుగన్= నీకు వశమయ్యే వారినిగా; చేయుదు+ఎ?= చేస్తున్నావా?; ఉదాసీన నృప పరీక్ష= తటస్థులైన రాజులను గూర్చిన పరీక్ష; నడచున్+ఏ?= కొనసాగుతుందా?

**తాత్పర్యం:** ఉత్తమమైన నడవడి కలిగిన ధర్మరాజా! మిత్రులైన రాజులను ప్రేమతో, శత్రువులైన రాజులను కాఠిన్యంతో, నీకు వశంలో ఉండేటట్లుగా చేసికొంటున్నావు కదా! మిత్రులూ, శత్రువులూ కాకుండా తటస్థంగా ఉండే రాజులను గూర్చి జాగ్రత్తగా పరీక్ష జరుపుతున్నావు కదా!

**క. దేవతల కతిథులకుఁ బిత్ళ । దేవతలకుఁ బూజనములఁ దృప్తి యొనర్తే?**
**యీ వసుధఁ జతుర్వర్ణ జ । నావళులు నిజోచితక్రియలఁ దగ మనునే? 49**

**ప్రతిపదార్థం:** పూజనములన్= తగిన అర్చనలతో; దేవతలకున్= దైవాలకు; అతిథులకున్= ఆకలి దప్పి మొదలగు వాటితో వచ్చినవారికి; పిత్ళదేవతలకున్= దేవతలైన తన వంశంలో పూర్వ వ్యక్తులకు; తృప్తి= సంతోషాన్ని; ఒనర్తు+ఏ?= కలిగిస్తున్నావా?; ఈ వసుధన్= ఈ భూమిమీద; చతుర్+వర్ణ ఆవళులు= బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుగా నాలుగు వర్ణాలకు సంబంధించిన ప్రజాళి; నిజ+ఉచిత క్రియలన్= తమకు తమకు తగిన పనులతో; తగన్= ధర్మయుక్తంగా; మనున్+ఏ?= జీవిస్తున్నది కదా?

**తాత్పర్యం:** దేవతలను, అతిథులను, పిత్ళదేవతలను పూజలతో తృప్తి పరుస్తున్నావు కదా! ఈ భూమిపై నున్న నాలుగు వర్ణాల ప్రజలు తమ తమ వృత్తులలో ధర్మబద్ధంగా జీవిస్తున్నారా?

**తే. బాలురకును దుర్బలులకు భామినులకు । వృద్ధులకును మనంబుల వెఱపు లేని**
**యట్టి మెలఁకువ గలిగెడునట్లు గాఁగ । నడచునే యాజ్ఞ పురమునఁ బుడమియందు.' 50**

**ప్రతిపదార్థం:** బాలురకున్= పిల్లలకు; దుర్బలులకున్= బలహీనులకు; భామినులకున్= స్త్రీలకు; వృద్ధులకున్= ముసలివారికి; మనంబులన్= మనసులలో; వెఱవు= భయం; లేని+అట్టి= లేనటువంటి; మెలఁకువ= జాగరూకత; కలిగెడు+అట్లు+కాఁగన్= సంభవించే విధంగా; ఆజ్ఞ= నీ ఆదేశం; పురమునన్= రాజధానిలోను; పుడమియందున్= రాజ్యంలోనూ; నడచున్+ఏ?= సాగుతున్నదా?

**తాత్పర్యం:** పిల్లలు, బలహీనులు, స్త్రీలు, వృద్ధులు, మనసులో భయంలేకుండా జీవించే విధంగా నీ ఆజ్ఞలు నగరంలోను, రాజ్యంలోను చెల్లుతున్నాయి కదా?

**క. అనిన విని యా నృపతి య । జ్జనపతితో నిట్టు లనియె 'జగదీశ్వర! నీ**
**వినుతోపదేశమున భవ । దనుయుక్తము లెల్ల నడచు నవికలభంగిన్.' 51**

**ప్రతిపదార్థం:** అనినన్= ధృతరాష్ట్రుడు ఆ విధంగా పలుకగా; ఆ నృపతి= ఆ ధర్మరాజు; విని= ఆలకించి; ఆ+జనపతితోన్= ఆ ధృతరాష్ట్ర నరనాథుడితో; ఇట్టులు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు; జగత్+ఈశ్వర!= మహారాజా!; నీ వినుత ఉపదేశమునన్= నీవు చేసిన గొప్ప రాజధర్మ ఉపదేశంవలన; భవత్+అనుయుక్తములు= నీవు ప్రశ్నించినవి; ఎల్లన్= అన్నీ; అవికలభంగిన్= లోటు లేని విధంగా; నడచున్= జరుగుతున్నాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఆ విధంగా ప్రశ్నించగా విని ధర్మరాజు అతడితో ఇట్లా అన్నాడు; 'మహారాజా! ఇపుడు నీవు ప్రశ్నించిన విషయాలు అన్నీ నాకు నీవు చేసిన రాజనీతి ఉపదేశం మూలంగా ఏ లోటు లేకుండా సాగుతున్నాయి.'

**వ. అని పలికి యిట్లనియె. 52**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పలికి= చెప్పి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి ప్రశ్నలకు ఆ విధంగా సమాధానం చెప్పిన ధర్మరాజు ధృతరాష్ట్రుడితో మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. 'ఆయాసము సైరింపని। మీ యొడలు తపఃక్రియలకు మెయికొనియెనె? భూ**
**నాయక! శుశ్రూష దగం। జేయునొకో గొంతి డప్పిఁ జెందక మీకున్. 53**

**ప్రతిపదార్థం:** భూనాయక!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆయాసము= శ్రమను; సైరింపని= ఓర్వలేని; మీ+ఒడలు= తమ శరీరం; తపస్+క్రియలకున్= తపశ్చర్యలకు; మెయికొనియెన్+ఎ!= పూనుకొన్నది కదా!; గొంతి= కుంతీదేవి; డప్పిన్= అలసట; చెందక= లేకుండా; మీకున్= తమకు; తగన్= తగు విధంగా; శుశ్రూష= సేవ; చేయున్+ఒకో?= చేస్తున్నది కదా?

**తాత్పర్యం:** 'రాజా! కష్టాలను తట్టుకోలేని మీ శరీరం శరీర క్లేశ కారణమైన ఉపవాసాది వ్రతనియమాలకు పూనుకొన్నది కదా! కుంతి అలసట లేకుండా మీకు అర్హమైన విధంగా సేవలు చేస్తున్నది కదా!

**క. మా పెద్దతల్లి యలజడి। కోపి తపోవృత్తి గడపుచున్నదియె? సుత**
**వ్యాపాదనకారుల మముఁ। బాపాత్ముల్ఁ దలఁచి యెట్లు పలుకునొ మీతోన్? 54**

**ప్రతిపదార్థం:** మా పెద్దతల్లి= మా జ్యేష్ఠమాత; అలజడికిన్= శ్రమకు; ఓపి= ఓర్చుకొని; తపోవృత్తిన్= నియమవంతమైన ప్రవర్తనం; కడపుచున్నది+ఎ?= గడుపుతున్నదా?; సుతవ్యాపాదన కారులన్= కొడుకులను మరణంపాలు చేసిన; పాప+ఆత్ములన్= దురాత్ములైన; మమ్మున్= మమ్ములను; తలఁచి= స్మరించి; మీతోన్= తమతో; ఎట్లు= ఏ విధంగా; పలుకున్+ఒ!= మాటాడుతుందో!

**తాత్పర్యం:** మా పెద్దమ్మ గాంధారి బాధల కోర్చుకొని తపస్సు ఆచరిస్తున్నదా? తన కొడుకులను చంపిన దుర్మార్గులుగా మమ్ములను తలచుకొని మీతో ఏమంటున్నదో.

**ఆ. సంజయుండు తపము జాలికిఁ జాలి వ। ర్తిల్లుచున్నవాఁడె? ధీరచిత్తుఁ**
**డిచట లేఁడు విదురుఁ డెచటి కేఁగినవాఁడొ?। యతనిఁ జూడ వలయు నధిప! నాకు.' 55**

**ప్రతిపదార్థం:** సంజయుడు= సంజయుడు; తపము జాలికిన్= తపస్సువలన కలిగే శ్రమకు; చాలి= ఓర్చుకొని; వర్తిల్లుచున్+ఉన్నవాఁడె?= తపస్సు చేస్తూ ఉన్నాడా?; అధిప!= రాజా!; ధీరచిత్తుఁడు= నిర్వికారమైన మనస్సు కలిగినవాడు; విదురుఁడు= విదురుడు; ఇచటన్+లేఁడు= ఇక్కడ మీతోపాటు కనిపించటం లేదు; ఎచటికిన్= ఎక్కడికి; ఏఁగినవాఁడు+ఒ?= వెళ్ళాడో?; నాకున్= నాకు; అతనిన్= ఆ విదురుడిని; చూడన్ వలయున్= చూడాలి.

**తాత్పర్యం:** సంజయుడు తపస్సువలన శ్రమకు ఓర్చుకొంటున్నాడా! రాజా! దృఢమైన చిత్తం కలిగిన విదురుడు ఇక్కడ లేడు; ఎక్కడికి వెళ్ళాడు? నేను అతడిని చూడాలి.'

**వ. అనుటయు ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ. 56**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధర్మరాజు పలుకగా; ధృతరాష్ట్రుఁడు; ధర్మతనయుతోడన్= ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా అనగానే ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో, ఇట్లా అన్నాడు (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. 'ఏఁ దపంబున కోర్తు నెంతయు; శుశ్రూష । యలయక గొంతి మా కాచరించు;**
**వినుము! గాంధారియు ననఘచరిత్ర త । పోనిష్ఠ కోర్చు; నిమ్మానసీయ**
**మిముఁ దలంచిన యప్డు మెచ్చి దీవించు; సం । జయుఁడు ప్రాజ్ఞుఁడు; తపశ్చరణమునకు**
**విసువఁడు; మముఁ బాసి విదురుఁ డెచ్చట నేనిఁ । జరియించు మునిజనాశ్చర్యకారి**

**ఆ. యగుచు; జలము లనిల మాహారముగఁ గొను; । నవియు నదియుఁ గొనక యయిన నుండు;**
**శూన్య విపినమున విదైన్య స్వతంత్ర సం । చారియై వసించుఁ గౌరవేంద్ర! 57**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కురువంశ శ్రేష్ఠుడా! ధర్మరాజా!; ఏను= నేను; తపంబునకున్= తపస్సుకు; ఓర్తున్= సహిస్తాను; గొంతి= కుంతీదేవి; మాకున్= మాకు; శుశ్రూష= సేవ; అలయక= అలసటలేకుండా; ఆచరించున్= చేస్తుంది; వినుము= వినుము; ఎంతయున్= చాలాబాగా; ఆచరించున్= చేస్తున్నది; అనఘ చరిత్ర!= పాపం లేని నడవడి కలవాడా! ధర్మరాజా!, వినుము= (ఈ అంశం శ్రద్ధగా విను; ఈ+మానసీయ= గౌరవింపదగిన; గాంధారియున్= గాంధారికూడా!; తపోనిష్ఠన్= శ్రద్ధగా తపసు చేయడంతో; ఓర్చున్= సమర్థురాలై ఉన్నది; మిమున్= మిమ్మల్ని (పాండవులను); తలంచిన అప్డు= స్మరించిన సందర్భంలో; మెచ్చి= మిమ్మల్ని ప్రశంసచేసి; దీవించున్= మేలు కలిగేటట్లుగా ఆశీర్వదిస్తుంటుంది; సంజయుండు= సంజయుడు; ప్రాజ్ఞుఁడు= అన్నీతెలిసినవాడు; (కాబట్టి) తపస్ చరణమునకున్= తపస్సు ఆచరించటంలో; విసువండు= విసుగుపడడు; విదురుండు= విదురుడు; మమున్= మమ్మల్ని; (ధృతరాష్ట్రాదులను) విడిచి= వదలిపెట్టి; ఎచ్చటికిన్+ఏని(న్)= ఎక్కడెక్కడో; చరియించున్= తిరుగుతుంటాడు; ముని-జన-ఆశ్చర్య-కారి+అగుచున్= తాపసులకు సైతం ఆశ్చర్యం కలిగిస్తూ ఉన్నవాడై; జలములు= నీళ్ళు; అనిలమున్= గాలీ; ఆహారముగన్= భోజనంగా; కొనున్= స్వీకరిస్తుంటాడు; అవియున్= ఆ నీళ్ళు; అదియున్= ఆ గాలీ కూడా; కొనక= స్వీకరించకుండా కూడా; ఉండున్= ఉంటాడు; శూన్య-విపినమునన్= నిర్మానుష్యమైన, అడవిలో; వి-దైన్య= స్వతంత్ర; సంచారి= విచారం లేకుండా, స్వేచ్ఛగా తిరిగేవాడు; ఐ= అయి; వసించున్= ఉంటాడు;

**తాత్పర్యం:** ధర్మరాజా! నేను తపస్సు ఆచరించటానికి సమర్థుడనై ఉన్నాను. మాకు కుంతి అలుపు లేకుండా, ఎంతో చక్కగా సేవలు చేస్తున్నది పాపం (దోషం) లేని వర్తనం కలవాడా (జాగ్రత్తగా వినుము) (మీకు) పూజ్యురాలయిన

గాంధారి కూడా తపస్సు శ్రద్ధగా చేసికొనే సామర్థ్యం కలిగి ఉన్నది. మీరు గుర్తుకు వచ్చినప్పుడు ఈమె మిమ్మల్ని పొగడుతూ మీకు మేలు కలగాలని ఆశీర్వదిస్తుంటుంది. సంజయుడు బుద్ధిమంతుడు. తపస్సు ఆచరించటంలో ఏ మాత్రమూ వెనుదీయడు. ఇంక విదురుడు మమ్మల్ని విడిచిపెట్టి ఎక్కడెక్కడో తిరుగుతుంటాడు. మునులకు సైతం వింత అనిపించే విధంగా, నీళ్ళూ, గాలీ మాత్రమే ఆహారంగా తీసికొంటాడు. ఒక్కొక్కసారి అది కూడా తీసికొనకుండానే ఉంటాడు. మనుష్యులు తిరగని అడవిలో నిర్విచారంగా స్వేచ్ఛగా (తిరుగుతూ) ఉంటాడు.

**క. ఒక్కొకమరి డబ్బాటీ। చక్కటిఁ గాన నగు ననియె జనవర తోఁచెన్**
**గ్రక్కున నప్పుడ విదురుం। డక్కౌంతేయాగ్రజున కనతిదూరమునన్. 58**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఒకమరి= ఒక్కొక్క పర్యాయం; డబ్బాటు= ఆకస్మికంగా; ఈ చక్కటిన్= ఈ ప్రదేశంలో; కానన్-అగున్= (ఆ విదురుడు) కనబడతాడు; అనియెన్= అని (ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో) అన్నాడు; జనవర!= ఓ జనమేజయ మహారాజా!; అప్పుడు+అ= (ధృతరాష్ట్రుడు చెప్పిన) ఆ సమయంలోనే; ఆ+కౌంతేయ+అగ్రజునకున్= కుంతి కొడుకులలో పెద్దవాడైన ఆ ధర్మరాజుకు; అనతిదూరమునన్= (మరీ దూరంగా కాకుండా) కొంచెం దూరంలో; గ్రక్కునన్= ఆకస్మికంగా; విదురుండు= విదురుడు; తోఁచెన్= కనపడ్డాడు;

**తాత్పర్యం:** ఒక్కొక్కసారి (గుబాలున) అప్రయత్నంగా ఈ ప్రదేశంలో కూడా కనబడుతాడు విదురుడు' అని ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో అన్నాడు. అదే సమయంలో కొంచెం దూరంలో ఆ విదురుడు హఠాత్తుగా ధర్మరాజుకు కనపడ్డాడు.

**వ. కాంతారధూళి మలినాంగుండును జటీభూతకేశపాశుండును దిగంబరుండును నగు విదురుం డట్లు దోఁచి యయ్యాశ్రమంబున నున్న జనంబులం గని మగుడి పోవంజూచె; ధర్మతనయుండు తన యనుచరుల నిలువుం డనుచుఁదా నొక్కరుండును సత్వరంబుగా నవ్వినుత ప్రభావుని వెనుకం జనియె; నతండు గుల్మాంత రితుం డగుచుం దోఁచుచుఁ బోవం బోవ నప్పాండ వాగ్రజుం డెలుంగెత్తి 'యో విదుర! నిలునిలు; మేను యుధిష్ఠిరుండ; నిన్నుఁ గాన వచ్చితి 'నని పలుకుచుం బాటిన నమ్మహాత్ముండు మరలి కనుంగొని వివిక్త ప్రదేశంబున నొక్క పాదపంబు చేరి నిలిచిన. 59**

**ప్రతిపదార్థం:** కాంతార= అడవిలోని; ధూళి= దుమ్ముచేత; మలిన= మట్టిగొట్టుకొన్న; అంగుండును= (శరీర) అవయవాలు కలవాడూ; జటీ భూత= జడలుగా ఏర్పడిన (జడలు గట్టిన); కేశ= తలవెంట్రుకల యొక్క; పాశుండును= సమూహం కలవాడూ; దిగంబరుండును= ఒంటిమీద గుడ్డలు లేనివాడూ; అగు= అయినటువంటి; విదురుండు= విదురుడు; అట్లు= ఆ ప్రకారంగా ఆకస్మికంగా; తోఁచి= (ధృతరాష్ట్రాశ్రమంలోని జనులకు) కనబడి; ఆ+ఆశ్రమంబునన్= ఆ ధృతరాష్ట్రుడి తపోవనంలో; ఉన్న= (క్రొత్తగా చేరి) ఉన్నటువంటి; జనంబులన్= (చాలా మంది) మనుష్యుల్ని; కని= చూచి; మగిడి= వెనక్కు తిరిగి; పోవన్ చూచెన్= (పోదామనుకొన్నాడు) పోతున్నాడు; ధర్మతనయుండు= ధర్మరాజు; తన-అనుచరులన్= తనను వెన్నంటి ఉండే జనాన్ని; నిలువుండు= (నా వెంట రావద్దు) ఇక్కడ నిలిచి ఉండండి; అనుచున్= అని చెప్తూ; తాను-ఒక్కరుండును= తాను (ధర్మరాజు) ఒక్కడు మాత్రమే; సత్వరంబుగాన్= వేగంగా; ఆ+వినుతప్రభావుని= ప్రశంసించబడే గొప్పతనం కలిగిన ఆ విదురుడి యొక్క; వెనుకన్= వెనకే; చనియెన్= వెళ్ళాడు; అతండు= ఆ విదురుడు; గుల్మ-అంతరితుండు= తీగ పొదలలో కనబడకుండా ఉన్నవాడు;

అగుచున్= అవుతూ; తోఁచుచున్= నడుమనడుమ కనబడుతూ; పోవన్-పోవన్= ఇంకా ఇంకా ముందుకి వెళ్ళుతూ ఉంటే; ఆ+పాండవ అగ్రజుండు= ఆ ధర్మరాజు; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి (గట్టిగా); ఓవిదురా!= ఓవిదురా!; నిలు-నిలుము= నిలబడుము నిలబడుము; ఏను= నేను; యుధిష్ఠిరుండన్= ధర్మరాజును; నిన్నున్= నిన్ను; కానన్= చూడటానికి; వచ్చితిన్= వచ్చాను; అని పలుకుచున్= అని అంటూ; పాటినన్= విదురుడి వెంట పరుగెత్తుతుంటే; ఆ+మహాత్ముండు= గొప్పవాడైన ఆ విదురుడు; మరలి= వెనక్కు (ధర్మరాజు) వైపు తిరిగి; కనుంగొని= (ధర్మరాజును) చూచి; వివిక్త ప్రదేశంబునన్= జనా లెవ్వరూ లేని చోట; ఒక్క పాదపంబు= ఒకానొక చెట్టు వద్దకు; చేరి= చేరుకొని; నిలిచినన్= ఆగి ఉండగా.

**తాత్పర్యం:** అడవిలోని దుమ్ముతో, ఒళ్ళంతా మట్టి గొట్టుకొని పోయి, జడలు గట్టిన జుట్టుతో దిగంబరంగా ఉన్న విదురుడు ఆ విధంగా అకస్మాత్తుగా కనబడి ఆ ఆశ్రమంలో (కొత్త) జనాలను చూచి వెనుకకు తిరిగి వెళ్ళిపోసాగాడు. అప్పుడు ధర్మరాజు తన అనుచరులను వెంటరాకుండా అక్కడే నిలిచి ఉండండని చెప్పుతూ ఒక్కడే ఆ విదురుడి వెంట వెళ్ళాడు. ఆ విదురుడు పొదలలో దూరి నడుమ నడుమ కనబడుతూ, ముందు ముందుకు వేగంగా వెళ్ళుతున్నాడు. అప్పుడు ధర్మరాజు గొంతెత్తి పెద్దగా 'ఓ విదురా! ఓ విదురా! ఆగుము ఆగుము నేను ధర్మరాజును. నిన్ను చూద్దామని వచ్చాను' అని అరుస్తూ విదురుడి వెంట పరుగెత్తుతున్నాడు. అప్పుడు విదురుడు వెనుకకు తిరిగి ధర్మరాజును చూచి ఏకాంతంగా ఉండే చోట ఒకానొక చెట్టు దగ్గరకు వెళ్ళి ఆగి నిలుచున్నాడు.

విదురుఁడు యోగమార్గంబున ధర్మరాజునందుఁ గలియుట (సం.15-33-22)

**సీ.** **ధర్మతనూజుండు తత్సమీపంబున । కేఁగి యయ్యోగి కట్టెదుర నిలిచి**
**యాతండు నయనంబు లర్ధమీలితములై । యుండంగ నూరక యున్నఁ గాంచి**
**'నిర్మలాత్మక ! యేను ధర్మసూనుఁడ; నన్నుఁ । గనువిచ్చి చూడవే!' యనుడు నతఁడు**
**ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ । దప్పక చూచి యుదాత్త యోగ**

**తే.** **బలము గైకొని యింద్రియములను బ్రాణ । ములను నింద్రియములుఁ బ్రాణములను గలిపి**
**నిజశరీరంబు విడిచి యా నృపతి తనువు । సొచ్చెఁ దేజోమయత్వవిస్ఫూర్తి మెఱయ.** 60

**ప్రతిపదార్థం:** ధర్మతనూజుండు= ధర్మరాజు; తద్-సమీపంబునకున్= ఆ విదురుడి దగ్గరకు; ఏఁగి= వెళ్ళి; ఆ+యోగి= ధ్యానంలో నిమగ్నుడైన ఆ విదురుడి యొక్క; కడు+ఎదురన్= ఎట్ట ఎదురుగా; నిలిచి= నిలువబడి; అతండు= ఆ యోగి (విదురుడు); నయనంబులు= కళ్ళు; అర్ధ-మీలితంబులు= సగం మూయబడినవి; ఐ-ఉండంగన్= అయిఉండగా; ఊరక-ఉన్నన్= నిర్వికారంగా ఉండగా; కాంచి= (ధర్మరాజు) చూచి; నిర్మల+ఆత్మక= స్వచ్ఛమైన మనసు కలవాడా! (విదురా); ఏను= నేను; ధర్మసూనుండన్= ధర్మరాజును; నన్నున్= నన్ను; కనువిచ్చి= కళ్ళు తెరిచి; చూడవే= చూడవలసింది; అనుడున్= అని ధర్మరాజును; పల్కఁగా= (వేడుకొనగా); అతఁడు= విదురుడు; ఱెప్పలన్= కనురెప్పల్ని; ఎగయించి= ఎత్తి; ఆ+పాండవ+ఉత్తమున్= ఆ ధర్మరాజును; తప్పక= నిశితంగా (దీర్ఘంగా); చూచి= చూచి; ఉదాత్త-యోగ-బలము= గొప్పదయిన యోగశక్తిని; కైకొని= ఆశ్రయించి; ఇంద్రియములను= ధర్మరాజుయొక్క బాహ్యాంతరింద్రియాలలో; ప్రాణములను= ధర్మరాజు ప్రాణాలతో; ఇంద్రియములన్= తన (విదురుడి) ఇంద్రియాలూ; ప్రాణములున్= తన (విదురుడి) ప్రాణాలూ; కలిపి= సంయోగం చెందేటట్లు చేసి; నిజశరీరంబు= తన (విదురుడి) శరీరాన్ని; విడిచి= వదలి పెట్టి; తేజస్+మయత్వ-విస్ఫూర్తి= తేజస్సుతోనిండినట్లు తళుకులు; మెఱయన్= ప్రకాశించగా; ఆ నృపతి తనువున్= ఆ ధర్మరాజుయొక్క శరీరాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు;

**తాత్పర్యం:** ధర్మరాజు విదురుడి దగ్గరకు వెళ్ళి అతడికి ఎదురుగా నిలబడ్డాడు. యోగి అయిన ఆ విదురుడు అరమూసిన కన్నులతో మాటాడకుండా నిశ్చలంగా ఉండిపోయాడు. అది చూచి ధర్మరాజు-'స్వచ్ఛమైన హృదయం కలవాడా! నేను ధర్మరాజును. కనులు తెరిచి నన్ను చూడు' అని ప్రార్థించాడు. అపుడు విదురుడు మెల్లగా కనురెప్పలెత్తి ధర్మరాజును తదేకంగా చూస్తూ యోగశక్తితో తన ఇంద్రియాలను ధర్మరాజు ఇంద్రియాలలోనూ, తన ప్రాణాలను ధర్మరాజు ప్రాణాలలోనూ కలిపి, తన శరీరం విడిచిపెట్టి, కాంతిమయమైన రూపంతో ఆ ధర్మరాజు శరీరంలో ప్రవేశించాడు.

**ఆ. వినుము ధర్మపుత్త్రు తనువునఁ గాంతియు। లావు నప్పు డగ్గలంబు లయ్యెఁ,**
**నొలసె బుద్ధి యధిక బల; మట్టు లగు టతఁ। డెఱిఁగి చోద్యమంది యెలమి నొందె. 61**

**ప్రతిపదార్థం:** వినుము= జనమేజయమహారాజా! వినుము; అప్పుడు= విదురుడు ధర్మరాజు శరీరంలో ప్రవేశించినపుడు; ధర్మపుత్త్రు= ధర్మరాజు యొక్క; తనువునన్= శరీరంలో; కాంతియున్= తేజస్సు; లావును= శక్తీ; అగ్గలంబులు= అధికములు; అయ్యెన్= అయ్యాయి; బుద్ధి= ప్రతిభ; అధిక బలము= అధికమైన పటుత్వాన్ని; ఒలసెన్= పొందింది; అట్టులు అగుట= తాను అధిక శక్తి మంతుడు కావటం; అతఁడు= ఆ ధర్మరాజు; ఎఱిఁగి= గ్రహించి; చోద్యము= ఆశ్చర్యం; అంది= పొంది; ఎలమిన్= సంతోషాన్ని; ఒందెన్= పొందాడు.

**తాత్పర్యం:** విదురుడు ధర్మరాజులో కలిసిన తర్వాత ధర్మరాజు శరీరానికి కాంతీ, శక్తీ అధికమయ్యాయి. బుద్ధి ఇంకా బలవంతమయింది. అట్లా కావటం గ్రహించి ధర్మరాజు ఆశ్చర్యంతో సంతోషించాడు.

**క. తదనంతరంబ యప్పతి। విదురశవము ప్రాను సెంది వికృతరహితమై**
**నిదురమెయి నొఱగియున్న ప। గిది నుండం జూచి యగ్నికృత్యము నడపన్. 62**

**ప్రతిపదార్థం:** తద్-అనంతరంబు+అ= ఆ తర్వాత; ఆ+పతి= ఆ ధర్మరాజు; విదురశవము= విదురుడి (ప్రాణంలేని) శరీరం; ప్రాను చెంది= చలనరహితమై; వికృత-రహితము-ఐ= మార్పు చెందినది కానిదై (మార్పులేకుండా; నిదురమెయిన్= నిద్రతో; ఒఱగి ఉన్నపగిదిన్= వాలిపోయిన విధంగా; ఉండన్= ఉండగా; చూచి= చూచి; అగ్నికృత్యము= అగ్నికార్యం (దహనం); నడపన్= ఆచరించటానికి ఊహచేశాడని (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఆ తరువాత విదురుడి శవం చలించకుండా, ఏ మార్పూ చెందకుండా (ప్రాణం ఉన్నప్పటి వలెనే) నిద్రతో వాలిపోయిన విధంగా ఉండటం చూచి ధర్మరాజు ఆ విదురుడి శరీరానికి అగ్నికార్యం (దహనం) చేయదలచాడు.

**చ. తలఁచిన మింట నొక్కెలుఁగు 'ధర్మతనూజ! యతిత్వ గౌరవో**
**జ్జ్వలుని కళేబరంబునకు వహ్నివిధాన మొనర్చు టర్హమే?**
**వల'దని మ్రోసె; నమ్మనుజవల్లభుఁ డప్పని దక్కి పోయి బ్రా**
**తలకును దండ్రికిన్ సువిదితంబుగ నంతయునుం గ్రమంబునన్. 63**

**ప్రతిపదార్థం:** తలఁచినన్= అనుకోగా; మింటన్= ఆకాశంలో; ఒక్క+ఎలుఁగు= ఒకానొక స్వరం (ఇట్లా వినబడ్డది); ధర్మతనూజ!= ధర్మరాజా!; యతిత్వ-గౌరవ+ఉజ్జ్వలుని= యతి లక్షణాల ఆధిక్యం చేత ప్రకాశించే విదురుడియొక్క; కళేబరంబునకున్=

శరీరానికి; వహ్ని-విధానము= అగ్నికార్యం; ఒనర్చుట= చేయుటం; అర్హము+ఏ?= తగునా?; వలదు= ఆవిధంగా (దహనం) చేయవద్దు; అని= అనే విధంగా; మ్రోసెన్= ధ్వనించింది; ఆ+మనుజవల్లభుండు= ఆ (ధర్మ)రాజు; ఆ+పని= విదురుడి శరీరాన్ని దహనం చేసే పని; తక్కి= మానుకొని; పోయి= తిరిగి (ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి) వెళ్ళి; భ్రాతలకున్= భీముడు మొదలైన సోదరులకూ; తండ్రికిన్= పెదతండ్రి అయిన ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి)వెళ్ళి; భ్రాతలకున్= భీముడు మొదలైన సోదరులకూ; తండ్రికిన్= పెదతండ్రి అయిన ధృతరాష్ట్రుడికీ; సువిదితంబుగన్= స్పష్టంగా; అంతయునున్= విదురుడి సమక్షంలో జరిగిన వృత్తాంతం అంతా; క్రమంబునన్= మొదటినుండి ఒక వరుసలో, (తరువాతి వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** విదురుడి శరీరానికి అగ్ని సంస్కారం చేయాలని ధర్మరాజు అనుకొనగా, అప్పుడు ఆకాశంలోనుండి ఒకానొక స్వరం 'ధర్మరాజా! యతిధర్మపు గొప్పదనంతో ప్రకాశించే విదురుడి దేహాన్ని దహనం చేయటం తగునా? ఆ విధంగా చేయవద్దు' అని ధ్వనించింది. అప్పుడు ధర్మరాజు ఆపని మానుకొని తిరిగి (ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి) వెళ్ళి అక్కడ ఉన్న తమ్ముళ్లతోనూ, తండ్రితోనూ జరిగిన సంఘటన అంతా క్రమంగా చెప్పాడు'.

**వ.** **ఎల్లవారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుత రసంబున మునింగిరి; పదంపడి ధృతరాష్ట్రుం డామంత్ర ణంబు సేయ మునిజనులు నిజనివాసంబులకుం జనిరి; తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనుని తోడ.** **64**

**ప్రతిపదార్థం:** ఎల్లవారును= ద్రౌపదీ ప్రభృతులైన స్త్రీ జనమూ, పాండవులను చూడవచ్చిన తాపసులూ అందరూ; వినుచుండన్= వింటుండగా; చెప్పినన్= విదురుడి వృత్తాంతాన్ని ధర్మరాజు చెప్పగా; అందఱున్= అక్కడివారందరూ; అద్భుతరసంబునన్= అద్భుతం అనే రసంలో; మునింగిరి= మునిగిపోయారు; పదంపడి= తర్వాత; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఆమంత్రణంబు-చేయన్= వీడ్కోలు చెప్పగా; మునిజనులు= పాండవులను చూడవచ్చిన తాపసులు; నిజవాసంబులకున్= తమ తమ నివాసస్థలాలకు; చనిరి= వెళ్ళారు; తద్+అనంతరంబు+అ= ఆతర్వాత; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; ధర్మనందనుని తోడన్= ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ద్రౌపది మొదలైన స్త్రీ జనమూ పాండవులను చూడవచ్చిన తాపసులు అందరూ వింటుండగా, తమ్ములతోనూ, ధృతరాష్ట్రుడితోనూ ధర్మరాజు విదురుడి వృత్తాంతం అంతా క్రమంగా చెప్పాడు. అది విని వారంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. తరువాత ధృతరాష్ట్రుడు వీడ్కోలు చెప్పగా (పాండవులను చూడటానికి వచ్చిన) తాపసులు తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు. అటు పిమ్మట ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ.** **'భరతకులోత్తమ! ఫలమూలముల నుప । యోగింపు మొసఁగెద నొదవి తనకు**
**నెయ్యది యాహారమయ్యె నాతిథ్యంబు । దానిన నడపుట ధర్మసరణి'**
**యనవుడు 'నట్ల కా' కని ఫలంబులు మూల । ములు నుపయోగించె మోదభరితుఁ**
**డగుచు నప్పాండుసుతాగ్రణి యబ్భంగి । నఖిలజనములు నాహారకలన**

**తే.** **మాచరించి రయ్యందఱు నవని శయన । మొంది యారాత్రి నిద్రించి రుదితసూర్య ।**
**కాలమగుటయు, సముచిత కర్మకరణ । మనుజులును దాను నడపె నమ్మనుజవిభుఁడు.** **65**

**ప్రతిపదార్థం:** భరత కుల+ఉత్తమ!= భరతవంశంలో శ్రేష్ఠుడా, ధర్మరాజా!; ఫల-మూలములన్= పండ్లనూ, దుంపలనూ; ఒసఁగెదన్= ఇస్తాను; ఉపయోగింపుము= ఆహారంగా తీసికొమ్ము; ఏ+అది= ఏది; తనకున్= తనకు; ఒదవి= లభించిన; ఆహారము; అయ్యెన్= అవుతుందో; దానన్+అ= ఆ పదార్థంతోనే; ఆతిథ్యంబు= అతిథి భోజనాన్ని; నడపుట= ఉపయోగించటం; ధర్మసరణి= ధర్మబద్ధమైన మార్గం; అనవుడున్= అని ధృతరాష్ట్రుడు పల్కఁగా; ఆ+పాండు-సుత+అగ్రణి= పాండురాజు కొడుకులలో పెద్దవాడైన ఆ ధర్మరాజు; అట్లు+అ కాక= అట్లే అగుగాక అని; మోద-భరితుఁడు= సంతోషంతో నిండినవాడు; అగుచున్= అవుతూ; ఫలంబులు(న్)= పండ్లూ; మూలములున్= దుంపలూ; ఉపయోగించెన్= ఆహారంగా తీసుకున్నాడు; అఖిల జనములున్= భీమాదులైన (మిగిలిన) జనమంతా; ఆ+భంగిన్= అదేవిధంగా (సంతోషభరితులై ఫలమూలాలు); ఆహారకలనము= ఆహారం తీసికొనే పని; ఆచరించిరి= చేశారు; ఆ+అందఱున్= ధర్మరాజు మొదలైన (ధృతరాష్ట్రాదులను చూడవచ్చిన) వారు అందరూ; ఆ రాత్రి= ఆరోజు రాత్రి; అవనిశయనము= నేలమీద పడకను; ఒంది= పొంది; నిద్రించిరి= నిద్రపోయారు; ఉదిత-సూర్యకాలము= సూర్యుడు ఉదయించే సమయం; అగుటయున్= అయినవెంటనే (ప్రాతఃకాలంలో); ఆ+మనుజవిభుఁడు= ఆ ధర్మరాజు; తాను(న్)= తానూ; అనుజులును= భీమాదులైన తమ్ముళ్ళూ; సముచిత-కర్మ-కరణము= ఆ కాలానికి తగిన సంధ్యావందనాది కర్మలను చేయటం; నడపెన్= పూర్తి చేశాడు.

**తాత్పర్యం:** భరతవంశశ్రేష్ఠుడా! పండ్లూ, దుంపలూ, ఇస్తాను. ఆహారంగా గ్రహించుము. తమకున్నదీ తాను తినేదీ ఏదో అదే అతిథులకూ పెట్టటమే ధర్మం అన్నాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు ధర్మరాజు సరేలెమ్మని సంతోషంతో ఆ పండ్లూ మూలాలూ భుజించాడు. భీమాది బంధువులూ, పౌరులూ అందరూ కూడా అదే విధంగా సంతోషంతో ఫలమూలాలు తిన్నారు. ఆరోజు రాత్రి అందరూ నేలమీద పడుకొని నిద్రపోయారు. సూర్యు డుదయించటంతో ధర్మరాజు తనూ, తమ్ములూ ప్రాతఃకాలంలో ఆచరించవలసిన సంధ్యావందనాది క్రియలు ఆచరించారు.

**వ.** **అట్లు కాలోచితకృత్యంబులు నడపి సహోదరసహితుండును దారోపేతుండును నర్హపరివారానుగతుండును నై యాశ్రమపథంబు గలయ మెలంగి, పావనస్నాన పావకార్చన జపధ్యానాది తాపసధర్మచర్యా విధంబులు, నానామృగ నిర్భయ సంచార ప్రకారంబులు వివిధపక్షికుల నిశ్శంక కేళీవిభవంబులు నాలోకించి, కృత ప్రాతస్సవనకరణీయుం డై యున్న కురువృద్ధు కడకు వచ్చి వందనాభినందన వచనంబుల నతని యుల్లంబు పల్లవింపంజేసి యతఁడు వనుపఁ బవిత్రాసనోపవిష్టుం డై.** **66**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆప్రకారంగా; కాల+ఉచిత-కృత్యంబులు= సూర్యోదయ (ప్రాతః) కాలంలో చేయవలసిన పనులను; నడపి= పూర్తిచేసి; సహోదరసహితుండును= భీముడు మొదలైన తమ్ములతో కూడిన వాడూ; దార+ఉపేతుండును= భార్య తోడుగా ఉన్నవాడూ; అర్హ-పరివార-అనుగతుండును= తగినంత సేవకజనం చేత అనుసరించబడే వాడూ; ఐ= అయి; (ధర్మరాజు) ఆశ్రమపథంబు= ఆ ధృతరాష్ట్రుడి ఆశ్రమ ప్రదేశం అంతా; కలయన్-మెలంగి= కలియ (సంపూర్ణంగా) తిరిగి; పావన= పవిత్రమైన; స్నాన= స్నానమూ; పావక= అగ్నియొక్క; అర్చన= పూజలు; జప= జపమూ; (మంత్రాదులను ఆవృత్తి చేయటం); ధ్యాన= ధ్యానమూ (తత్త్వాన్ని మనసులో భావన చేయటం); ఆది= మొదలైన; తాపస= మునులయొక్క; ధర్మ= కర్తవ్యాలను; చర్యా= ఆచరించే; విధంబులు(న్)= తీరులూ; నానా= రకరకాల; మృగ= జంతువుల వలని; నిర్భయ= భయంలేని, స్వేచ్ఛతో కూడిన; సంచార= తిరగటాల; ప్రకారంబులు(న్)= పద్ధతులూ; వివిధవిభవంబులు= అనేక విధాలయిన; పక్షి= పక్షుల; కుల= గుంపుల; నిశ్శంక= సంకోచంలేని; కేళీ= విహారాల; విభవంబులున్= గొప్పతనాలూ; ఆలోకించి= చూచి; కృత= చేయబడిన; ప్రాతర్= ఉదయకాలపు; సవన= (సోమ) యజ్ఞానికి సంబంధించిన; కరణీయుండు= క్రియలు కలిగిన వాడు; ఐ= అయి; ఉన్న= ఉన్నటువంటి;

కురువృద్ధు కడకున్= ధృతరాష్ట్రుడి వద్దకు; వచ్చి= చేరుకొని; వందన-అభినందన-వచనములన్= నమస్కారాలూ, సంతోషం కలిగించేవీ అయిన మాటలతో; అతని-ఉల్లంబు= ఆ ధృతరాష్ట్రుడి మనస్సు; పల్లవింపంగన్+చేసి= సంతోషించేటట్లుచేసి; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; పనుపన్= అనుమతించగా; పవిత్ర-ఆసన- ఉపవిష్టుండు= పావనమైన ఆసనం మీద కూర్చున్నవాడు; ఐ= అయి.

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు సూర్యోదయం అయిన సమయంలో అపుడు చేయవలసిన పనులు చేసి, తమ్ములతోనూ, భార్యతోనూ, కలిసి తగిన పరివారం వెంటరాగా ఆ ఆశ్రమ ప్రాంతం అంతా తిరిగి, అక్కడ పవిత్రమైన స్నానం, అగ్నిపూజనం, జపం, ధ్యానం, మొదలైన మునులు చేసే పనులు ఆచరింపబడుతూ ఉండటమూ, రకరకాల జంతువులు భయంలేకుండా స్వేచ్ఛగా తిరుగుతుండటమూ, వివిధ పక్షులు గుంపులై నిస్సంకోచంగా విహరిస్తూ ఉన్నప్పటి వైభవమూ చూచాడు. ఆ తరువాత ప్రాతఃకాలంలో చేయవలసిన (సోమ) యజ్ఞానికి సంబంధించిన కర్తవ్యాలను ఆచరించి కూర్చున్నటువంటి ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి అతడికి నమస్కారాలు, ప్రశంసలూ, పలికి, ఆ ధృతరాష్ట్రుడి ఆజ్ఞమీద ఒక పరిశుద్ధమైన ఆసనంమీద కూర్చున్నాడు ధర్మరాజు.

**చ.** **అనుజులుఁ దాను భక్తి మెయి నమ్మహనీయునిఁ గొల్చియుండ న**
**య్యునికిఁ గనుంగొనంగఁ గరముత్సుకతన్ శతయూపుఁ డాదిగా**
**మునివరు లేఁగుదెంచినఁ బ్రమోదమునం గుశపీఠరాజిపై**
**నునుపఁగఁ బంచె గాఢవినయోక్తుల నా ధృతరాష్ట్రుఁ డందఱన్.** **67**

**ప్రతిపదార్థం:** అనుజులున్= తమ్ముళ్ళూ, భీమాదులు; తాను(న్)= తానూ (ధర్మరాజు); ఆ+మహనీయునిన్= ఆ పూజ్యుని ధృతరాష్ట్రుడిని, భక్తి మెయిన్= సేవా భావంతో; కొల్చి= సేవించి; ఉండన్= (అక్కడే) ఉండగా; ఆ+ఉనికిన్= ఆస్థితిని; కనుంగొనంగన్= చూడటంకొరకు; శతయూపుఁడు= శతయూపుడనే వాడు; ఆదిగన్= మొదలుగా, మునివరులు= శ్రేష్ఠులైన (పరిసరాల్లోని) మునులు; కరము= మిక్కిలి; ఉత్సుకతన్= కుతూహలంతో; తాపసులు ఏఁగుదెంచినన్= (ధృతరాష్ట్రుడి వద్దకు) రాగా; ఆ ధృతరాష్ట్రుఁడు; అందఱన్= ఆ తపసులందరినీ; కుశపీఠరాజిపైన్= దర్భాసన సమూహంపై; ఉనుపఁగన్= కూర్చుండేవిధంగా (కూర్చోబెట్టండని); ప్రమోదమునన్= సంతోషంతో; గాఢ-వినయ-ఉక్తులన్= మిక్కిలి అణకువ కలిగిన మాటలతో; పంచెన్= నియోగించాడు.

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు తమ్ముళ్ళతో కలిసి (తాను) ఆ ధృతరాష్ట్రుడిని భక్తితో సేవిస్తూ అక్కడ ఉన్నాడు. అటువంటి వాళ్ళను చూడటానికి శతయూపుడు మొదలైన మునులు మిక్కిలి ఉత్సాహంతో అక్కడికి వచ్చారు. వాళ్ళందరినీ దర్భాసనాలపై ఆసీనులు కండి అని ధృతరాష్ట్రుడు మిక్కిలి సంతోషంగా అణకువ మాటలతో చెప్పాడు.

**వ.** **అట్లున్న యమ్మునిజనంబులును బాండు పుత్త్రులునుం బరమధర్మమయ సంభాషణంబులు సేయుచుండ నినుండు నభోమధ్యగతుం డయ్యెఁ; నప్పు డాంబికేయుండు సవినయంబుగా నత్తాపసోత్తములతో 'మీకు మధ్యందిన కృత్యంబు లాచరింపవలయు; విజయం చేయుం'డనిన వారలు నిజనివాసంబులకుం జనిరి; తదనంతరంబ కౌంతేయుల మాధ్యాహ్నిక కరణీయంబులు నిర్వర్తించుట కరుగుం డని పనిచె; నని చెప్పినవిని జనమేజయుం డప్పాండవేయు లవ్విధంబున వనంబున నెన్ని దినంబులు వసియించి?' రని యడిగిన వైశం పాయనుం డిట్లనియె.** **68**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారంగా; ఉన్న= ఉన్నటువంటి; ఆ+మునిజనంబులును= శతయూపుడు మొదలైన తాపసులూ; పాండుపుత్త్రులునున్= పాండవులూ; పరమ-ధర్మమయ సంభాషణంబులు= ఉత్తమమైన ధర్మంతో నిండిన మాటలు; చేయుచుండన్= ఆడుతుండగా; ఇనుండు= సూర్యుడు; నభస్+మధ్యగతుండు= ఆకాశంలో నడిమి భాగానికి వచ్చినవాడు; అయ్యెన్= అయ్యాడు; అప్పుడు= ఆసమయంలో; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సవినయంబుగాన్= అణకువతో; ఆ+తాపస+ఉత్తములతోన్= ఆ మునివరులతో; మీకున్= మీకు; మధ్యందిన కృత్యంబులు= మాధ్యాహ్నిక కార్యాలు; ఆచరింప వలయున్= నిర్వర్తించవలసిఉన్నది కాబట్టి విజయం చేయుండు, మీ నివాసాలకు వెళ్ళండి; అనినన్= అని పల్కగా; వారలు= ఆ మునిశ్రేష్ఠులు; నిజ నివాసంబులకున్= తమ నెలవులకు; చనిరి= వెళ్ళారు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; మాధ్యాహ్నిక-కరణీయంబులు= మధ్యాహ్నవేళ ఆచరింపవలసిన పనులు; నిర్వర్తించుటకున్= పూర్తిచేయటానికి; అరుగుండు= వెళ్ళండి; అని= అని చెప్పి; కౌంతేయులన్= పాండవులను; పనిచెన్= పంపించాడు (ధృతరాష్ట్రుడు); అని= ఆ ప్రకారంగా; చెప్పినన్= వైశంపాయనుడు చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు= జనమేజయమహారాజు; ఆ+పాండవేయులు= ఆ పాండవులు, ఆ+విధంబునన్= ఆ తీరుగా; ఎన్ని దినంబులు= ఎన్నాళ్ళు; వనంబునన్= అరణ్యంలో; వసియించిరి?= ఉన్నారు?; అని= అని; అడిగినన్= ప్రశ్నించగా; అతనికిన్= ఆ జనమేజయుడితో ; వైశంపాయనుండు= వైశంపాయనముని; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా ధృతరాష్ట్రుడితో పాండవులూ, శతయూపుడూ మొదలైన మునులూ కలిసి ఉత్తమమైన ధర్మంతో నిండిన ఆలాపాలు చేస్తుండగా సూర్యుడు ఆకాశమధ్యానికి వచ్చాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు ఆ మునులను 'మీకు మధ్యాహ్నం చేయవలసిన పనులు నడపవలసి ఉన్నది కాబట్టి మీ స్థానాలకు వెళ్ళండి' అని వినయంగా చెప్పాడు. ఆ మునులు తమ తమ నెలవులకు వెళ్ళిపోయారు. తరువాత మాధ్యాహ్నికాలైన పనులు ఆచరించండని ధృతరాష్ట్రుడు పాండవులను కూడా పంపాడు-అని వైశంపాయనుడు చెప్పగా జనమేజయుడు విని 'పాండవులు ఆ విధంగా అరణ్యంలో ఎన్నాళ్ళున్నారు?' అని అడిగాడు. అప్పుడు వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**సీ.** **'ధరణీశ! పాండునందను లట్లు సాంతఃపు। రంబును సపరివారంబుఁగాఁగ**
**నడవికి నేఁగి యయ్యంబికానందనుఁ। గాంచిన దినమునఁ గరము నియతి**
**ఫలమూలసమితి నాఁకలి వుచ్చి భూమిశ। యనమున నిద్రించి రాగరిష్ఠుఁ**
**డమ్మహితాత్ముల కర్థితో మఱునాఁ। డనుజ్ఞ యిచ్చిన, సుమనోజ్ఞములును**

**ఆ.** **సన్నుతములు నైన యన్నపానాదుల। ననుభవించి మృదులహారి తల్ప**
**ముల శయించి; రట్లు నెలనాళు లయ్యెడ। నతనిఁ గొల్చియుండి రధిపముఖ్య!** **69**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= (జనమేజయ)రాజా!; పాండునందనులు= పాండవులు; స-అంతపురంబును= ద్రౌపదీ ప్రభృతులైన అంతఃపుర స్త్రీలతోనూ; సపరివారంబున్= భృత్యులతోనూ కూడినవారు; కాఁగన్= అయి; అట్లు= ఆ ప్రకారంగా; ధృతరాష్ట్రాదులను చూచే నిమిత్తం; అడవికిన్ ఏఁగి= అడవికి వెళ్ళి; ఆ+అంబికానందనున్= ఆ ధృతరాష్ట్రుడిని; కాంచిన దినమునన్= చూచిన రోజు; కరము= మిక్కిలి; నియతిన్= నియమంగా; ఫలమూల-సమితిన్= పండ్లూ, వేళ్ళ సముదాయంతో; ఆఁకలిపుచ్చి= ఆకలి తీర్చుకొని; భూమిశయనమునన్= నేల పక్క (పరవు)గా; నిద్రించిరి= నిద్ర చేశారు; మఱునాఁడు= తరువాతిరోజు; ఆ గరిష్ఠుఁడు= దొడ్డవాడైన ఆ ధృతరాష్ట్రుడు; ఆ+మహిత+ఆత్ములకున్= దొడ్డ బుద్ధులైన ఆ పాండవులకు; అర్థితోన్= ప్రేమతో; అనుజ్ఞ= అనుమతి; ఇచ్చినన్= ఇవ్వగా; సుమనోజ్ఞములును= మనస్సు కింపు కలిగించేవి; సన్నుతములు= ప్రశస్తాలూ; ఐన= అయినటువంటి;

అన్న-పాన+ఆదులన్= భోజనమూ, పానీయమూ మొదలైన వాటిని; అనుభవించి= ఆస్వాదించి; మృదుల-హారి-తల్పములన్= కోమలములూ మనోహరములూ అయిన శయ్యలమీద; శయించిరి= నిద్రించారు; అధిపముఖ్య!= రాజులలో శ్రేష్ఠుడా! జనమేజయా!; అట్లు= ఆవిధంగా (పాండవులు); ఆ+ఎడన్= వనంలో; నెలనాళులు= నెలరోజులు; అతనిన్= ధృతరాష్ట్రుడిని; కొల్చి= సేవిస్తూ; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! అంతఃపుర కాంతలతోనూ, తగిన పరివారంతోనూ కలిసి (ధృతరాష్ట్రాదులను చూడటానికి) పాండవేయులు అడవికి వెళ్ళిన ఆ రోజు నియమంగా ధృతరాష్ట్రు డిచ్చిన ఫలమూలాదులతో ఆకలి తీర్చుకొని నేలమీద నిద్రించారు. ఆ మరునాడు ధృతరాష్ట్రుడు ప్రేమతో అనుమతించగా మనసుకు ఇష్టమైనవీ, ప్రశస్తమైనవీ అయిన భోజనాలూ, పానీయాలూ ఆస్వాదించి, కోమలంగానూ మనోహరంగానూ ఉన్న శయ్యలమీద నిద్రించారు. జనమేజయ మహారాజా! పాండవేయు లావిధంగా ధృతరాష్ట్రుడి ఆశ్రమవనంలో ఆ ధృతరాష్ట్రుడిని సేవించుకొంటూ నెలనాళ్ళున్నారు.

**వ. పదంపడి యొక్కనాఁ డెప్పటియట్ల పాండుపుత్త్రులు గాంధారీ కుంతీసముపాసితుండయియున్న విచిత్రవీర్యపుత్త్రుంబరివేష్టించియుండ నవ్విశిష్ట గోష్ఠికై శతయూపప్రభృతి మునివరులు చనుదెంచిన నక్కురువృద్ధుఁడర్ఘ్యంబు లగునాసనంబులు వెట్టించి సంభావించిన. 70**

**ప్రతిపదార్థం:** పదంపడి= తరువాత; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; ఎప్పటిఅట్లు+అ= ఎప్పటివలెనే; పాండుపుత్త్రులు= పాండవులు; గాంధారీ-కుంతీ-సముపాసితుండు+అయి= గాంధారి చేత, కుంతి చేత సేవించబడుతూ; ఉన్న= ఉన్నటువంటి; విచిత్ర వీర్యపుత్త్రున్= ధృతరాష్ట్రుడిని; పరివేష్టించి-ఉండన్= చుట్టుకొనిఉండగా; ఆ+విశిష్ట-గోష్ఠికై= అసాధారణమైన ఆ సమావేశానికి; శతయూప-ప్రభృతి-మునివరులు= శతయూపుడు మొదలైన మునిశ్రేష్ఠులు; చనుదెంచినన్= రాగా; ఆ+కురువృద్ధుండు= ఆ ధృతరాష్ట్రుడు; అర్ఘ్యంబులు= (ఆ మునులకు) తగినవి; అగు-ఆసనంబులు= అయినటువంటి ఆసనాలను; పెట్టించి= ఏర్పాటు చేయించి; సంభావించినన్= గౌరవించగా.

**తాత్పర్యం:** తరువాత ఒకానొకరోజు పాండవులు ఎప్పటివలెనే, గాంధారిచేత, కుంతిచేత పూజించబడుతున్న ధృతరాష్ట్రుడి చుట్టూ కూర్చుని ఉన్నారు. అసామాన్యమైన ఆ సమావేశానికి శతయూపుడు మొదలైన మునులు వచ్చారు. ధృతరాష్ట్రుడు వారికి తగిన ఆసనాలు ఏర్పాటు చేయించి గౌరవించగా.(తరువాతి పద్యంతో అన్వయం)

వేదవ్యాసుఁడు పాండవసహితుండైన ధృతరాష్ట్రునాశ్రమంబునకు వచ్చుట (సం.15-34-21)

**సీ. సముచితంబులు సధర్మములును నైన స। ల్లాపముల్ సెల్ల నుల్లంబు లలర**
**వార లున్నెడ సత్యవతికొడు కందుల। కేతేర నందఱు నెదురువోయి**
**వినతులై భక్తిఁ దోడ్కొనివచ్చి యతులకృ। ష్ణాజిన దర్భోత్తరాసనమున**
**నునిచి యమ్మునివరుననుమతిఁ దమతమ। యాసనంబుల నుండి; రమ్మహాత్ము**

**ఆ. నర్చితునిగఁ జేసె నాంబికేయుఁడు దద। నంతరంబ సమధికాదరమున**
**నతఁడు మధుర మృదు విధాక్షరంబుగ నమ్మ। హీశముఖ్యుతోడ నిట్టు లనియె. 71**

**ప్రతిపదార్థం:** సముచితంబులు(ను)= మిక్కిలి యుక్తములైనవీ; సధర్మములను= వేద శాస్త్రాదులలో చెప్పబడిన అంశాలతో కూడినవీ; ఐన= అయినటువంటి; సల్లాపముల్= మంచి మాటలు; చెల్లన్= సాగుతుండగా; వారలు= పాండవాదులు; ఉల్లంబులు= మనసులు; అలరన్= సంతోషిస్తూ; ఉన్న+ఎడన్= ఉన్నటువంటి సమయంలో; అందులకున్= ఆచోటికి; సత్యవతి కొడుకు= వేదవ్యాసమూర్తి; ఏతేరన్= రాగా; అందఱున్= పాండవాదులు అందరూ; ఎదురు-పోయి= వ్యాసుడికి ఎదురువెళ్ళి; వినతులు+ఐ= వంగి నమస్కరించిన వారై; భక్తిన్= సేవా ధర్మంతో; తోడ్కొని వచ్చి= వ్యాసుడిని ఆశ్రమంలోనికి తీసికొనివచ్చి; అతుల= సాటిలేని; కృష్ణ-అజిన= కృష్ణమృగ చర్మం; దర్భ+ఉత్తర= దర్భలతో చేయబడిన; ఆసనంబునన్= ఆసనం మీద (దర్భాసనం మీద కృష్ణమృగ చర్మం కప్పబడింది); ఉనిచి= కూర్చుండజేసి; ఆ+మునివరు+అనుమతిన్= ఆ వ్యాసమహర్షి అనుజ్ఞతో; తమ తమ-ఆసనంబులన్= (వ్యాసుడికి స్వాగతం చెప్పడానికి ఎదురుగా వెళ్ళిన) అందరూ తమ తమ ఆసనాలమీద; ఉండిరి= కూర్చున్నారు; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; ఆ+మహాత్మున్= గొప్పవాడైన ఆ వేదవ్యాసుడిని; అర్చితునిగన్+చేసెన్= పూజించాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; అతఁడు= ఆ వ్యాసుడు; సమ్-అధిక-ఆదరమునన్= మిక్కిలి వాత్సల్యంతో; మధుర-మృదు-విధా-అక్షరంబుగన్= తీయనైన (ఇంపైన) మెత్తదనం కలిగిన మాటలతో; ఆ+మహీ+ఈశ-ముఖ్యు తోడన్= ఆ (ధృతరాష్ట్ర) మహారాజుతో; ఇట్టులు= ఈ ప్రకారంగా; అనియె(న్)= అన్నాడు.

**తాత్పర్యం:** (ధృతరాష్ట్రుడి చుట్టూ కూర్చున్న పాండవులూ, ఆ సమావేశానికి వచ్చిన శతయూపాది మునులు అందరూ) మిక్కిలి యుక్తమయినవీ, ధర్మంతో కూడినవీ, అయిన మంచిమాటలు సాగుతుంటే మనసులు సంతోషిస్తూ ఉన్న సమయంలో అక్కడికి వేదవ్యాసమహర్షి వచ్చాడు. అందరూ వ్యాసుడికి భక్తితో ఎదురువెళ్ళి పాదాభివందనం చేసి, వెంటఉండి ఆశ్రమానికి తీసికొనివచ్చారు. సాటిలేనటువంటి కృష్ణమృగచర్మం కప్పిన దర్భాసనం మీద ఆ వ్యాసమహర్షిని కూర్చుండబెట్టారు. వ్యాసుడి అనుమతితో, అందరూ తమ తమ ఆసనాల మీద కూర్చున్నారు. అపుడు ధృతరాష్ట్రుడు వ్యాసమహర్షిని పూజింపచేశాడు. తర్వాత ఆ వ్యాసుడు ధృతరాష్ట్రుడితో తియ్యని మెత్తని పలుకులతో ఇట్లా అన్నాడు.

**సీ.** **'వనవాసమున నీకు మన మలవడియెనే? । నియతిమైఁ దాపసక్రియల కోర్చి**
**నడపెదవే పుత్త్రనాశజమైనశో । కము భవదంతరంగంబునందు**
**లేదు గదా? ధర్మవేదిని గాంధారి । యుమ్మలికంబు లే కున్న యదియె?**
**నీకుఁ బరిజ్ఞాననిష్ఠ గల్గెనె? గొంతి । శుశ్రూష మీ కొనర్చునె తగంగ?**

**తే.** **రాజ్య మొల్లక వచ్చె నరణ్యవాస । మునకు నీయమ; మీరు రాఁ దనకు నింట**
**నిలువఁ దగ దని యిమ్మేలు నీదు బుద్ధి । నొలసి యుండునె కౌరవకులపవిత్ర!** **72**

**ప్రతిపదార్థం:** కౌరవ-కుల-పవిత్ర!= కురువంశంలో నిర్మలమైనవాడా!; నీకున్= నీకు; మనము= మనస్సు; వనవాసమునన్= అరణ్యాలలో నివసించటంలో; అలవడియెన్+ఏ?= అలవాటు పడిందా?; తాపస-క్రియలకున్= మునిధర్మాన్ని నిర్వర్తించటంలో; ఓర్చి= ఓర్పు కలిగి; నియతిమైన్= నియమబద్ధంగా; నడపెదవు+ఏ?= జరుపుతున్నావా?; భవత్-అంతరంగమునందున్= నీ మనసులో; పుత్త్ర-నాశజము= కొడుకులు మరణించటం వలన కలిగినది; ఐన= ఐనటువంటి; శోకము= దుఃఖం; లేదు కదా= ఇపుడు ఉండలేదు గదా; ధర్మవేదిని= ధర్మం తెలిపిన; గాంధారి= గాంధారి; ఉమ్మలికంబు= విచారం; లేక-ఉన్న-అది-ఎ?; లేకుండా ఉన్నదిగదా; నీకున్= నీకు; పరిజ్ఞాన నిష్ఠ= పరిపూర్ణమైన జ్ఞానం యొక్క స్థిరత్వం; కల్గెనె?= సంభవించిందా?; గొంతి= కుంతీదేవి; మీకున్= మీకు; తగంగన్= తగువిధంగా; శుశ్రూష= సేవ; ఒనర్చున్+ఎ?= చేస్తున్నదా?; మీరు= మీరు (గాంధారీ, ధృతరాష్ట్రులు) రాన్= (ఆశ్రమవాసానికి) అడవులకు రాగా; తనకున్= తనకు (కుంతి); ఇంటన్= ఇంట్లో (రాజధానిలో); నిలువన్=

ఉండిపోవటం; తగదు= యుక్తం కాదు; అని= అనిచెప్పి; ఈఅమ= ఈ కుంతి; రాజ్యము= కొడుకుల రాజ్యం; ఒల్లక= అంగీకరించకుండా; అరణ్యావాసమునకున్= మీతో అరణ్యాలలో ఉండడానికి; వచ్చెన్= వచ్చింది; మేలు= కుంతి శుశ్రూషార్థం మీతో అరణ్యాలకు రావడం అనే మంచిపని; నీదు బుద్ధిన్= నీమనసులో; ఒలసి ఉండునె?= మరపురాక నిలిచి ఉంటుందా?

**తాత్పర్యం:** 'కురువంశంలో పుణ్యాత్ముడా, ధృతరాష్ట్రా! నీ మనసు వనవాసానికి అలవాటు పడిందా? ముని ధర్మాలను ఓర్పుతో నియమంగా ఆచరిస్తున్నావా? కొడుకులు నశించిపోయారనే దుఃఖం నీ మనసులో లేదుగదా! ధర్మం తెలిసిన గాంధారి దుఃఖించడం లేదు కదా! నీకు సంపూర్ణమైన జ్ఞానం స్థిరంగా ఏర్పడిఉన్నదా గదా! కుంతి మీకు తగువిధంగా సేవలు చేస్తున్నదా? మీరు అరణ్యావాసానికి వస్తుంటే తాను ఇంట్లో ఉండటం యుక్తం కాదని (కొడుకుల) రాజ్యం కూడా విడిచిపెట్టుకొని మీ సేవకొరకు మీ వెంట అరణ్యాలకు వచ్చింది ఈమె. ఆ విధంగా కుంతి చేసిన మేలుపని నీ మనసులో మరపురాకుండా నిలిచిఉన్నదా?

**చ.** **అనఘ! యజాతశత్రునెడ నాదరణాతిశయాన్వితంబె నీ**
**మనము? వృకోదరున్ నరుని మాద్రితనూజుల సత్క్రియాభినం**
**దనముల గారవింతె? వినుతస్థితిఁ దద్దయు నిర్మలత్వ మొం**
**దెనె భవదీయచిత్తమున ధీమహితా! దృఢశాంతిమూలమై.'** **73**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా (ధృతరాష్ట్రా)!; నీ మనము= నీ మనస్సు; అజాతశత్రు-ఎడన్= ధర్మరాజు విషయంలో; ఆదరణ+అతిశయ-అన్వితంబు+ఎ?= మిక్కిలి ప్రేమతో కూడి ఉన్నదా?; వృక+ఉదరున్= భీముడిని; నరునిన్= అర్జునుడినీ; మాద్రి తనూజులన్= మాద్రికొడుకులు-నకుల సహదేవులనూ; సత్క్రియా+అభినందనములన్= ఆదరణంతోనూ, ప్రశంసలతోనూ; గారవింతు+ఎ?= లాలన చేస్తున్నావా?; ధీ మహితా!= బుద్ధిచేత గొప్పవాడా! (ధృతరాష్ట్రా)!; భవదీయ-చిత్తమునన్= నీమనస్సులో; వినుత-స్థితిన్= ప్రశంసింపదగిన ఉనికితో; ధృఢ-శాంతి-మూలము= స్థిరమైన (అంతర్) ఇంద్రియాలశాంతికి ఆధారం; ఐ= అయి; నిర్మలత్వము= స్వచ్ఛత; తద్దయున్= అధికంగా; ఒందెన్+ఎ?= కలిగిందా?

**తాత్పర్యం:** పాపంలేనివాడా! ధృతరాష్ట్రుడా! నీ మనసు ధర్మరాజుపై మిక్కిలి ప్రేమతో ఉన్నదా? భీమ, అర్జున, నకుల, సహదేవులను మంచితనంతోనూ, ప్రశంసలతోనూ ఆదరిస్తున్నావా? దొడ్డబుద్ధికలవాడా!, నీ మనసులో స్థిరమైన శాంతికి ఆధారంగా, ప్రశంసార్హంగా, నిర్మలభావం ప్రాప్తించిందా?'

**వ.** **అని యంత నిలువక.** **74**

**ప్రతిపదార్థం:** అని= వ్యాసుడు ఆ విధంగా పలికి; అంతన్= అంతటితో; నిలువక= ఆగకుండా (ఇంకా ఈ విధంగా అన్నాడు).

**తాత్పర్యం:** అని అడిగిన వ్యాసుడు అంతటితో ఆగకుండా (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ.** **'వినుము! దీర్ఘవైర వృత్తియు' ద్రోహచిం । తనము లేక వాక్కు మనము నొక్క**
**చంద మగుట సకలజనములకును బంధు । సంపదాప్తి పరమసాధనంబు.'** **75**

**ప్రతిపదార్థం:** వినుము= ధృతరాష్ట్రా వినుము; దీర్ఘ-వైర-వృత్తియున్= చాలాకాలం శత్రుభావంతో ఉండటమూ; ద్రోహ చింతనము(ను)= (దీర్ఘకాలం) అపకారపు ఆలోచనమూ; లేక= లేకుండా; వాక్కు(ను)= మాటా; మనమున్= మనస్సూ; ఒక్క చందము= ఒకేవిధం; అగుట= కావటం; సకల జనములకున్= అందరికీ; బంధు= చుట్టాల (మిత్రుల); సంపద్= సంపదను (ఆధిక్యాన్ని); ఆప్తి= పొందటానికి; పరమ= ఉత్తమమైన; సాధనంబు= ఉపకరణం.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రా! వినుము. ఎవరితోనైనా చాలకాలంగా విరోధంతో నడుచుకొనటమూ, అపకారం చేయాలనుకొనటమూ లేకుండా, మాటా, మనసూ ఒకే విధంగా ఉండటమే అందరికీ బంధు సంపద సిద్ధింపజేసే మార్గం'.

**వ. అని చెప్పి వెండియు. 76**

**ప్రతిపదార్థం:** అని= పైవిధంగా; చెప్పి= (ధృతరాష్ట్రుడితో) పలికి; వెండియు(న్)= తిరిగి (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** పై విధంగా చెప్పి తర్వాత మళ్ళీ వ్యాసుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'విదురుండు దేహంబు విడిచిన తెఱఁగెల్ల । నెఱిఁగితె? మాండవ్యుఁ డిచ్చినట్టి**
**పటుశాపమున శూద్ర భావంబు నొందిన । ధర్మదేవత బోధనిర్మలాత్ముఁ**
**డైన యమ్మహనీయుఁ డట్లగుటంబుజా । సనుని యాజ్ఞాపనమున విచిత్ర**
**వీర్యనృపాధీన విశ్రుతక్షేత్రంబు । నం దేఁ బ్రవర్తింప నధిప! కలిగె**

**తే. ధర్మదేవత మాఱట తనువు సూవె । యీ యుధిష్ఠిరు నుజ్జ్వలకాయ; మింత**
**యెఱిఁగి కాదె యమ్మహిత యోగీశ్వరుఁడు స । మీడ్య యోగబలంబున నితనిఁ గలసె. 77**

**ప్రతిపదార్థం:** అధిప!= (ధృతరాష్ట్ర) రాజా!; విదురుండు= విదురుడు; దేహంబు= శరీరం; విడిచిన తెఱఁగు= త్యజించిన విధం; ఎల్లన్= సమస్తం; ఎఱిఁగితి+ఎ= తెలిసికొన్నావా; బోధ నిర్మల-ఆత్ముఁడు= వివేకంతో దోషంలేని బుద్ధిగలవాడు; ఐన=అయినటువంటి; ఆ+మహనీఁయుడు= ఆ మహాత్ముడు (విదురుడు); మాండవ్యుఁడు= మాండవ్యుడనే మహర్షి; ఇచ్చిన+అట్టి= ఇచ్చినటువంటి; పటుశాపమునన్= ఘోరమైన శాపంవలన; శూద్రభావంబున్= శూద్రత్వాన్ని; ఒందిన= పొందినట్టి; ధర్మదేవత= యమధర్మరాజు; అంబుజ+ఆసనుని= బ్రహ్మ; (పద్మం ఆసనంగా కలవాడు); ఆజ్ఞాపనమునన్= ఆదేశం చేత; విచిత్రవీర్య= విచిత్రవీర్యుడనే; నృప= రాజుయొక్క (నీ తండ్రియొక్క); అధీన= అధీనమందున్న; విశ్రుత= ప్రసిద్ధమైన; క్షేత్రంబునందున్= భార్య అయిన అంబికయొక్క దాసియందు; ఏను= నేను (వ్యాసుడు); ప్రవర్తింపన్= వ్యవహరించగా (బోధ నిర్మల-ఆత్ముఁడు)= వివేకంచేత దోషంలేని బుద్ధికలవాడు; ఐన= అయినటువంటి; ఆ+ మహనీయుఁడు=మహాత్ముడైన ఆ విదురుడు; అట్లు= ఆ ప్రకారంగా (మాండవ్య శాపం వలన యముడే శూద్రుడుగా, విదురుడుగా); అగుట= కావటం; కలిగెన్= సంభవించింది; ఈ యుధిష్ఠిరుని= ఈ ధర్మరాజుయొక్క; ఉజ్జ్వల కాయము= కాంతిమంతమైన శరీరం; ధర్మదేవత= ధర్ముడి; మాఱట తనువు= రూపాంతరమే; చూవె!= సుమా!; ఇంత= ఇది అంతా; ఎఱిఁగి= తెలిసిఉండటం వలననే; కాదె= కదా; ఆ+మహిత యోగి+ఈశ్వరుఁడు= మహాత్ముడు, యోగులలో శ్రేష్ఠుడూ ఐన ఆ విదురుడు; సమ్+ఈడ్య-బలంబునన్= మిక్కిలి ప్రశంసించదగిన యోగశక్తిచేత; ఇతనిన్= ఈ ధర్మరాజు (శరీరంలో); కలసెన్= కలిసిపోయాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! విదురుడు శరీరం త్యజించిన తీరు తెలుసా? పూర్వం మాండవ్య మహర్షి ఇచ్చిన ఘోరమైన శాపం వలన శూద్రుడుగా పుట్టిన యమధర్మరాజే జ్ఞానం వలన నిర్మలబుద్ధీ, మహాత్ముడూ అయిన ఆ విదురుడు బ్రహ్మదేవుడి ఆజ్ఞప్రకారం నేను విచిత్ర వీర్యమహారాజు అధీనంలో ఉన్న అంబికా దాసి యందు వర్తించడం వలన యముడు విదురుడై శూద్రుడుగా పుట్టటం సంభవించింది. ఈ ధర్మరాజుయొక్క శరీరం ఆ యమధర్మరాజుయొక్క రూపాంతరమే. అది తెలిసినవాడు గాబట్టే గొప్ప యోగి అయిన విదురుడు తన యోగబలంతో ధర్మరాజులో కలిసిపోయాడు.

**ఆ. అట్లు దేవతామయాత్మకుఁ డైన యి। వ్విభుఁడు నిన్నుఁ బ్రేష్యవృత్తి నిట్లు**
**గొలిచి యునికి బుద్ధిఁ దలపోసి సంతస। మంది యుండుదే కులాగ్రగణ్య!' 78**

**ప్రతిపదార్థం:** కుల+అగ్రగణ్య!= కౌరవవంశంలో ప్రథమంగా పరిగణించదగిన వాడా!; శ్రేష్ఠుడా, ధృతరాష్ట్రా!; అట్లు= ఆవిధంగా మారుతనువు పొందిన ధర్మదేవతగా; దేవతామయ+ఆత్మకుఁడు= దేవతాలక్షణాలు నిండిన అంత స్వరూపం గలవాడు; ఐన= అయినటువంటి; ఈ+విభుఁడు= ఈ ధర్మరాజు; నిన్నున్= నిన్ను; ఇట్లు= ఈవిధంగా; ప్రేష్యవృత్తిన్= భృత్యుడి పద్ధతిలో; కొలిచి-ఉనికి= సేవిస్తూ ఉండటం; బుద్ధిన్= నీ మనసులో; తలపోసి= స్మరించి; సంతసము= సంతోషం; అంది= పొంది; ఉండుదు+ఏ?= ఉన్నారా?

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా!, ఆవిధంగా రూపాంతరం పొందిన ధర్మదేవతకాబట్టి దేవతాస్వరూపుడైన ఈ ధర్మరాజు ఈ విధంగా భృత్యుడివలె నిన్ను సేవిస్తూ ఉండటం నీమనసులో స్మరించి ఆనందిస్తున్నావా?'.

**వ. అనిన విని వైచిత్రవీర్యుం డప్పారాశర్యునకుఁ బరమవినయంబున నిట్లనియె, 79**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వ్యాసుడు చెప్పగా; విని= ఆలకించి; వైచిత్ర వీర్యుండు= ధృతరాష్ట్రుడు; ఆ+పారాశర్యునకున్= ఆ వ్యాసమహర్షితో; ఇట్లు= ఈ విధంగా; అనియె (న్)= అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసు డట్లా అనగా విని ధృతరాష్ట్రుడు, అణకువతో వ్యాసుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'వనవాస మించుకయును నాకు దుఃఖంబు। సేయదు; దేహంబుఁ జిత్తమును ద**
**పఃక్రియలకుఁ బనుపడి యున్నయవి నన్ను। గాంధారిఁ బుత్త్రశోకం బొకింత**
**యేనియుఁ బొందంగ నీఁడు సభక్తిక। మైన వృత్తమున ధర్మాత్మజుండు**
**మునివర! యితనిపై ననుజుల మీఁద వ। త్సలము నా హృదయ మిద్ధరణివిభుఁడు**

**ఆ. దేవతాత్ముఁ డగుట దెల్ల మై యునికి మ। ద్వచనవర్తనములవలన నితఁడ**
**యెఱిఁగి యుండుఁ గొంతి తెఱఁగు శుశ్రూషయు। నద్భుతంబు ముదము నావహించు. 80**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు (ధృతరాష్ట్రుడికి); వనవాసము= అరణ్యంలో నివసించటం; ఇంచుకయును= కొంచెం కూడా; దుఃఖంబు= కష్టం; చేయదు= కలిగించలేదు; తపఃక్రియలకున్= మునులు ఆచరించవలసిన ధర్మాలు నిర్వహించటంలో; దేహంబున్= (నా) శరీరమూ; చిత్తమును= (నా) మనస్సు; పనుపడి-ఉన్నవి= తగి (అలవాటుపడి) ఉన్నాయి; వృత్తమున(న్)=

సభక్తికము ఐన భక్తితో కూడిన నడవడితో; ధర్మజుండు= ధర్మరాజు; నన్ను(న్)= నన్నూ; గాంధారిన్= గాంధారినీ; పుత్త్రశోకంబు= కొడుకుల (మరణం వలని) దుఃఖం; ఒక+ఇంత+ఏనియున్= కొంచెం కూడా; పొందంగన్-ఈఁడు= పొందనివ్వటం లేదు; మునివర!= మునిశ్రేష్ఠుడా!; నా హృదయము= నా మనస్సు; ఇతనిపైన్= ఈ ధర్మరాజుమీదా; అనుజులమీఁదన్= (ఈ ధర్మరాజు) తమ్ముళ్ళపైనా; వత్సలము= ప్రేమ కలిగిఉన్నది; ఈ+ధరణివిభుఁడు= ఈ (ధర్మ) రాజు; దేవతా-ఆత్ముఁడు= దైవ స్వరూపుడు; అగుట= కావటం; తెల్లము+ఐ= నాకు తెలిసినదై; ఉనికి= ఉండటం; మత్-వచన-వర్తనముల వలనన్= నా మాటలవలన, చేతలవలన; ఇతఁడు+అ= ఈ ధర్మరాజే; ఎఱిఁగి-ఉండున్= తెలిసికొని ఉంటాడు; గొంతి తెఱఁగు= కుంతీదేవి పద్ధతీ; శుశ్రూషయున్= ఆమె మాకు చేసే సేవ; అద్భుతంబు(న్)= (మాకు) ఆశ్చర్యాన్నీ; ముదమున్= సంతోషాన్నీ; ఆవహించున్= నింపుతున్నాయి.

**తాత్పర్యం:** 'మహర్షీ! అరణ్య నివాసం నాకు కొంచెం కూడా కష్టం కలిగించలేదు. తాపస ధర్మాలను ఆచరించటంలో నా శరీరమూ, మనస్సూ రెండూ సమర్థమై (అలవాటుపడి) ఉన్నాయి. భక్తితో కూడిన నడవడితో ధర్మరాజు నాకూ గాంధారికీ, పుత్ర వినాశం వలని దుఃఖం లేకుండా చేశాడు. ధర్మరాజుమీదా అతడి తమ్ముళ్ళమీదా నా మనస్సు ప్రేమతో నిండిఉన్నది. ఈ ధర్మరాజు దైవస్వరూపుడు అనే విషయం నాకు తెలుసు. అది నా మాటలవలన, చేతల వలన ధర్మరాజుకూ వ్యక్తమయ్యే ఉంటుంది. ఇంక కుంతి రాజ్యం విడిచి మా సేవకై అరణ్యాలకు వచ్చిన విధమూ, ఆమె మాకు చేస్తున్న సేవా, ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగిస్తున్నాయి.

**వ. నాకుం బరిజ్ఞానంబును మానస నిర్మలత్వంబును భవత్ ప్రసాదంబునం గలిగెడుఁగాక' యనియె; నా సమ యంబున ద్రౌపదీసుభద్రలును దక్కునుంగల్గు నంగనాజనంబులును బారాశర్య సందర్శన ప్రవణత్వంబునం జనుదెంచి సభక్తి ప్రణామంబు లాచరించి యంతంత నిలిచి; రయ్యలఘుజ్ఞాన మాననీయుండు ధృతరాష్ట్రు తోడ. 81**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; పరిజ్ఞానంబున్= తత్త్వమును గూర్చిన సంపూర్ణమైన వివేకమూ; మానస-నిర్మలత్వంబును= మనస్సు దోషరహితం కావటమూ; భవత్-ప్రసాదంబునన్= మీదయచేత; కలిగెడున్-కాక= సిద్ధించాలి; అనియెన్= అన్నాడు (ధృతరాష్ట్రుడు); ఆ సమయంబునన్= అప్పుడు; ద్రౌపదీసుభద్రలును= ద్రౌపదీ, సుభద్రా; తక్కునున్+కల్గు= మిగిలిఉన్న; అంగనాజనంబులును= స్త్రీలూ; పారాశర్య-సందర్శన ప్రవణత్వంబునన్= వ్యాసుడిని చూడాలనే ఆసక్తితో; చనుదెంచి= అక్కడికి వచ్చి; సభక్తి ప్రణామంబులు= (వ్యాసుడికి) అణకువతో, పాదాభివందనాలు; ఆచరించి= చేసి; అంత+అంత= ఇంచుకదూరంలో అక్కడక్కడా; నిలిచిరి= నిలబడి ఉన్నారు; ఆ+అలఘు+జ్ఞాన-మాననీయుండు= సమగ్రమైన జ్ఞానంచేత పూజించదగిన ఆ వ్యాసమహర్షి; ధృతరాష్ట్రుతోడ(న్)= ధృతరాష్ట్రుడితో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** నాకు సంపూర్ణమైన జ్ఞానమూ, మనసు దోషరహితం కావటమూ, నీ దయవలన సంభవించుగాక! అన్నాడు ధృతరాష్ట్రుడు. ఆ సమయంలో ద్రౌపది, సుభద్ర ఇంకా మిగిలిన స్త్రీ జనమూ వ్యాసమహర్షిని చూడాలనే ఉత్కంఠతో, అక్కడికి వచ్చి వ్యాసుడికి వినయంగా పాదాభివందనం చేసి కొంచెం దూరంగా నిలుచున్నారు. అప్పుడు వ్యాసమహర్షి ధృతరాష్ట్రుడితో. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఉ. మీయెడ చింత వాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి యే**
**నీ యెడ కిప్డు వచ్చితి నభీష్టము వేఁడుము శంక దక్కి భూ**

**నాయక! యెల్లభంగిని మనః ప్రియముం దగ నిత్తు' నన్నఁ గౌం**

**తేయు లెలర్చి; రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్.** **82**

**ప్రతిపదార్థం:** భూనాయక!= ధృతరాష్ట్ర మహారాజా!; మీయెడ చింత= మీకు మానసికమైన విచారం; పాయఁగన్= తొలగిపోయేటట్లు; సమీహిత-బుద్ధి= కోరుకొన్న జ్ఞానం; ఒనర్పన్+కోరి= సిద్ధింపజేయదలచి; ఈ+ఎడకున్= ఈచోటికి; ఇప్డు= ఈ సమయంలో; ఏను= నేను; వచ్చితిన్= వచ్చాను; శంక= సందేహం; తక్కి= విడిచిపెట్టి; అభీష్టము= నీకు(బాగా) కావలసింది; వేఁడుము= కోరుకొమ్ము; మనస్+ప్రియమున్= నీ మనసునకు ఇష్టమైనదానిని; ఎల్లభంగిన్= ఏ విధంగానైనా సరే; తగన్= సముచితంగా; ఇత్తున్= నెరవేరుస్తాను; అన్నన్= అని వ్యాసుడు పల్కగా; కౌంతేయులు= పాండవులు; ఎలర్చిరి= సంతోషించారు; ఆ+ వసుమతీ-పతి= ఆ ధృతరాష్ట్ర భూమి నాయకుడు; ఎంతయున్= ఎంతో; మోదమున్= ఆనందం; ఒందెన్= పొందాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మీ మనసులోని చింతలన్నీ తొలగించి ఉత్తమమై, మీరు కొరుకొంటున్న జ్ఞానాన్ని మీకు కలగజేయటం కొరకే నేను ఇక్కడికి, ఈ సమయంలో వచ్చాను. సందేహపడకుండా నీ కిష్టమైనది అడుగుము. ఏవిధంగానైనా సరే మీ కోర్కె నెరవేరుస్తాను, అని వ్యాసుడు అనడంతో పాండవులు సంతోషించారు. ధృతరాష్ట్రుడుకూడా ఎంతో ఆనందించాడు.

**వ. వ్యాసుండు వెండియు.** **83**

**తాత్పర్యం:** వ్యాసుడు తిరిగి, (ఇట్లా అంటున్నాడు. తరువాతి పద్యంతో అన్వయం)

**చ. 'అనఘ! యమానుషం బయినయట్టిద యైనను నా తపంబుపెం**

**పునకు మునీంద్రు లద్భుతముఁ బొందఁగ మీ కవలీల నిత్తు నే'**

**ననుటయు నా కురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వ**

**చ్చిన కరుణామయాదర విశేషముకంటెను మేలు గల్గునే?** **84**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!; అమానుషంబు= (నీ అభీష్టం) మనుష్యులకు సాధ్యంకానిది అయిన; అట్టిది+అ= అయినటువంటిదే; ఐనను= అయినటప్పటికీ; నాతపంబు-పెంపునకున్= నా తపస్సు యొక్క మహిమకు; ముని+ఇంద్రులు= (ఈ) మునిశ్రేష్ఠులు; అద్భుతమున్= ఆశ్చర్యం; పొందఁగన్= పొందుతుండగా; నేను= నేను; మీకున్= మీకు; అవలీలన్= సులువుగా; ఇత్తున్= (మీ కోరిక) తీరుస్తాను; అనుటయున్= అని వ్యాసుడు (మళ్ళీ) చెప్పగానే; ఆ-కురు-క్షితిపుఁడు= కురువంశపు రాజయిన ఆ ధృతరాష్ట్రుడు; మీరు= మీరు (వ్యాసుడు); అదటన్= (మాపై) ప్రేమతో; ఇందున్= ఇచ్చటికి (మావద్దకు); వచ్చిన= వచ్చినటువంటి; కరుణా-మయ-ఆదర-విశేషముకంటెను= దయతో నిండిన వాత్సల్యం కంటె; మేలు= ఎక్కువైనటువంటి శుభం; కోరఁగన్= మేం కోరుకొనటానికి ఇంకొకటి; కల్గునే?= ఉంటుందా?

**తాత్పర్యం:** నా తపస్సుకు మునిశ్రేష్ఠులంతా ఆశ్చర్యపడేటట్లుగా, 'నీ కోరిక మానవమాత్రులకు సాధ్యం కానటువంటిదైనా సరే, తేలికగా ఇస్తాను'. అని వ్యాసుడు అనటంతో ఆ ధృతరాష్ట్రుడు 'మీరు మా వద్దకు రావటంలో దయతో నిండిన వాత్సల్యంకంటె మేం కోరుకొనదగిన మేలు మరొకటి ఏమున్నది?' అన్నాడు.

**క. మానుష మైన నమానుష। మైనను బ్రార్థనకు విషయమైనది భవదీ**

**యానూనకృపకు నెక్కుడు। గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్యనిధీ!** **85**

**ప్రతిపదార్థం:** కారుణ్య-నిధీ!= దయకు గని వంటివాడా!, (వ్యాసమహర్షీ)!; ప్రార్థనకున్= వేడుకొనటానికి; విషయము= లక్ష్యం; ఐనది= అయినటువంటిది; భవదీయ-అనూన-కృపకున్= అత్యంతమైన మీ దయకంటె; ఎక్కుడుగాన్= ఎక్కువగా; మానుషము= మనుష్యులకు సాధ్యమైనది; ఐనన్= అయినా; అమానుషము= మనుష్యులకు సాధ్యంగానిది; ఐనను= అయినా; ఒక్కఁడున్= ఒకదానినికూడా; నేను= నేను; కాన(ను)= తలపను.

**తాత్పర్యం:** దయకు నిధివంటివాడా!, (వ్యాసమహర్షీ) గాఢమైన మీ దయకంటె అధికంగా కోరుకొనదగిన వస్తువు, ఇంకొకటి మానుషం గానీ, అమానుషం గానీ నాకు ఏమీ కనబడలేదు.

**ఆ. సంయమీంద్ర! నాదుజన్మంబు సఫలతఁ । బొందె మీరు విమలబుద్ధి నింత**
**యాదరించినపుడ; లే దింకఁ బరలోక । భీతి ధన్యతముఁడ నైతి నేను. 86**

**ప్రతిపదార్థం:** సంయమి+ఇంద్ర!= మునులలో శ్రేష్ఠుడా!; (వ్యాసమహర్షీ); మీరు= తమరు (వ్యాసుడు); విమలబుద్ధిన్= స్వచ్ఛమైన మనస్సుతో; ఇంత= ఇంత (అత్యధికం)గా దర్శనమిచ్చి, కోర్కె ఇస్తాననె); ఆదరించినపుడు+అ= వాత్సల్యం చూపినపుడే; నాదుజన్మంబు= నా పుట్టుక; సఫలతన్= సార్థక్యాన్ని; పొందెన్= పొందింది; ఇంకన్= ఇకపైన; పరలోక-భీతి= ఉత్తమ లోకాలను గూర్చి అవి కలుగుతాయో లేదో అనే భయం; లేదు= పోయింది; నేను= నేను; ధన్యతముఁడన్= ఉత్తమ పుణ్యవంతుడిని; ఐతిన్= అయ్యాను.

**తాత్పర్యం:** (వ్యాస) మునివరా! మీరు స్వచ్ఛమైన మనసుతో నాపై వాత్సల్యం చూపిన సమయంలోనే నా జన్మ సార్థకమైంది. ఉత్తమలోకాలను గూర్చిన దిగులు పోయింది. నేను అందరికంటె పుణ్యం చేసికొన్నాను.

**వ. అట్లయినను మీ రొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయది యెఱింగింపవలసె; విన్నవించెద.87**

**ప్రతిపదార్థం:** అట్లు-అయినను= అంతే అయినా; మీరు= తమరు; ఒక్కటి= ఏదైనా ఒక్కటి; కోరుము= అడుగుము; అనినన్= అన్నందువలన; నా మనంబునన్= నామనస్సులో; ఎప్పుడున్= నిరంతరంగా, (రాత్రింబగళ్ళు); కల+అది= ఉన్నటువంటిది; ఎఱింగింపన్-వలసెన్= మీకు తెలుపవలసి వచ్చింది; విన్నవించెద (న్)= అది తమకు మనవి చేసికొంటాను.

**తాత్పర్యం:** అయినప్పటికీ ఏదో ఒకటి కోరుకొమ్మని తమరు అన్నందుచేత, ఎంతో కాలంగా నా మనసులో ఉన్న ఒకవిషయం మీకు చెప్పవలసివచ్చింది. అది మనవి చేసికొంటాను.

**సీ. దుష్టచిత్తుం డగు దుర్యోధనుండు ని । ష్పాపస్వభావులఁ బాండుసుతులఁ**
**బరిభవించి సమస్తనరనాథు లనిఁ గరి । తురగయుతంబుగాఁ ద్రుంగఁజేసి**
**ధరణి రాజ్యముఁ గోరి గురుభీష్మకర్ణాది । సత్పురుషుల నెల్లఁ జంపికొనియె;**
**నన్నీచునకుఁగా 'మహారాజు లాంధ్రను । బిడ్డల విడిచి యభేద్య ధైర్య,**

**తే. వృత్తి రణమృతిఁ బొంది; రవ్విభుల కేది । గతియొ? యిమ్మెయి మూఢులై కలనఁ బడిన**
**కురుకుమారకు లెట్లైరో పరమబోధ । మహిత! యెఱుఁగని వగ పెద్ద మాన్పు మనియె. 88**

**ప్రతిపదార్థం:** దుష్టచిత్తుఁడు= చెడ్డబుద్ధి కలవాడు; అగు= అయినటువంటి; దుర్యోధనుండు= దుర్యోధనుడు; నిస్+పాప-స్వభావులన్= దోషం లేని నడవడి కలిగిన (వారిని); పాండుసుతులన్= పాండవులను; పరిభవించి= అవమానపెట్టి; ధరణి రాజ్యము= ఈ భూమిపై ఆధిపత్యాన్ని; కోరి= అభిలషించి; కరి-తురగ-యుతంబుగాన్= ఏనుగుల బలం గుర్రాల బలంతో గూడ; సమస్త నర-నాథులు= రాజులు అందరూ; అనిన్= యుద్ధంలో; త్రుంగన్= నశించే విధంగా; చేసి= యుద్ధం చేసి; గురు-భీష్మ-కర్ణ-ఆది- సత్పురుషులన్= ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు మొదలైన గొప్ప వ్యక్తులను; ఎల్లన్= అందరినీ; చంపికొనియెన్= (చేతులార) నిర్మూలించుకొన్నాడు; ఆ+నీచునకున్+కాన్= అటువంటి అధముడి కొరకు; మహారాజులు= గొప్ప గొప్ప రాజులు; ఆండ్రను= తమ భార్యలనూ; బిడ్డల(న్)= పిల్లలనూ; విడిచి= వదలిపెట్టి; అభేద్య ధైర్య వృత్తి(న్)= చెదరని గుండె దిటవు కలిగిన నడవడితో; రణమృతిన్= యుద్ధంలో చావు; పొందిరి= పొందారు; ఆ+విభులకున్= అటువంటి వీర (యుద్ధ) మరణం పొందిన మహారాజులకు; ఏది గతియొ= (మరణానంతరం) ఎటువంటి గతి కలిగినదో ఈ+మెయి= ఈ విధంగా; మూఢులై= మూర్ఖులై; కలనన్+పడిన= యుద్ధంలో మరణించిన; కురుకుమారకులు= కౌరవులు; ఎట్లు+ఐరి+ఒ= అయినారో; ఎఱుఁగని= తెలియ లేదనే; వగ= బాధ; పెద్ద= నాకు చాల ఎక్కువగా ఉన్నది; పరమబోధ-మహిత!= ఉత్తమమైన జ్ఞానం చేత గొప్పవాడా!; మాన్పుము= (నా చింతను) పోగొట్టవలసింది; అనియెన్= అన్నాడు (ధృతరాష్ట్రుడు).

**తాత్పర్యం:** చెడుబుద్ధి కలిగిన దుర్యోధనుడు పుణ్యాత్ములైన పాండవులను అవమానపెట్టి, నేల (రాజ్యం) కొరకు, గజాశ్వబలంతో సహా నేలమీది రాజులందరూ యుద్ధంలో నశించిపోయేటట్లు చేశాడు. ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు మొదలైన గొప్పవారిని చేతులార చంపుకొన్నాడు. ఆ అధముడి (దుర్యోధనుడి) కొరకు మహారాజులంతా పెండ్లాలను పిల్లలను వదలుకొని చెదరని గుండె ధైర్యంతో యుద్ధంచేసి ఆ యుద్ధంలో మరణించిన ఆ మహాపురుషులకు తరువాత ఎటువంటి లోకాలు సిద్ధించాయి? మూర్ఖంగా యుద్ధానికి దిగి అందులో మరణించిన కౌరవవంశవీరులు మరణానంతరం ఏమైపోయారు? అనేది తెలియకపోవటం అనే దుఃఖం నాకు చాలా ఎక్కువగా ఉన్నది. ఉత్తమజ్ఞానం వలన గొప్పవాడా! (వ్యాసమహర్షీ) ఆ నా బాధను పోగొట్టవలసింది' అన్నాడు ధృతరాష్ట్రుడు.

**వ. అనుటయు న ప్ప్రేముడి పలుకులు విని గాంధారికిం గుంతికిం బాంచాలికి సుభద్రకు మఱియునుం గలయంగనలకుం జిత్తంబుల నెవ్వగలు గ్రొత్తలయ్యెఁ నప్పు డాసుబలనందన పట్టావృతలోచనత్వంబునన చూచి దయాధామం బై యున్న యా మామ నుద్దేశించి మోడ్చిన చేతు లద్దెసకు నిగిడ్చి యిట్లనియె. 89**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధృతరాష్ట్రుడు ఆ విధంగా అనటంతో; ఆ+ప్రేముడిపలుకులు= స్నేహంనిండిన (ధృతరాష్ట్రుడి) ఆ మాటలు; విని= ఆలకించి; గాంధారికిన్= గాంధారికీ; పాంచాలికిన్= ద్రౌపదికీ; సుభద్రకున్= సుభద్రకూ; మఱియునున్= ఇంకా; కల-అంగనలకున్= అక్కడ ఉన్న మిగిలిన కౌరవ స్త్రీలకూ; చిత్తంబులన్= మనసులలో; నెవ్వగలు= పరిపూర్ణమైన దుఃఖాలు; క్రొత్తలు-అయ్యెన్= అప్పుడే అపూర్వంగా ఏర్పడినట్లు అయ్యాయి; అప్పుడు= ఆ సమయంలో; సుబలనందన= గాంధారి; పట్ట-ఆవృత-లోచనత్వంబునన్+అ= పట్టంచేత ఆవరించబడిన (మూయబడ్డ) కన్నులు గలిగినది అయి; చూచి= వ్యాసుడిని చూచి; దయాధామంబు= దయకు నిలయం; అయి= ఐ; ఉన్న ఆ మామన్= ఉన్నటువంటి మామ అయిన వ్యాసుడిని; ఉద్దేశించి= లక్ష్యంగా చేసికొని; మోడ్చిన చేతులు= జోడించిన చేతులను; ఆ+దెసకున్= వ్యాసుడివైపు; నిగిడ్చి= ఉంచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఆ విధంగా మాటాడగానే, స్నేహపూరితాలయిన ఆ మాటలు విని, గాంధారికీ, కుంతికీ, ద్రౌపదికీ, సుభద్రకూ, ఇంకా ఇతర (కౌరవ) స్త్రీలకూ, (స్వజన వియోగం వలన) మనసులో నిండి ఉన్న బాధలు అపుడే

క్రొత్తగా కల్గినట్లయింది. అపుడు గాంధారి పట్టంతో కప్పబడిఉన్న కళ్లతోటే వ్యాసుడిని చూచి, దయకు నిలయం అయిన తన మామ (ధృతరాష్ట్రుడి తండ్రి) అయిన వ్యాసుడిని గూర్చి, చేతులు జోడించి నమస్కరిస్తూ ఇట్లా అన్నది.

**సీ.** **'మునినాథ యీ రాజు తనయు లందఱును గ। య్యంబునఁ దెగినదియాదిగాఁ బ**
**దాఱేండ్లు వగలపా లగుచుఁ దత్సన్నిధి। గల్గుటఁ గోరు;లోకంబు లెన్ని**
**యన్నియుఁ జూపంగనైనను జాలుదు। నిర్మలతపమున పేర్మి నీవు**
**పుత్త్రసాన్నిధ్య మీ భూపతి కొనరించు। టెంతటిపని? నీకు గొంతి ద్రుపద**

**తే.** **రాజపుత్త్రి సుభద్ర కౌరవ కుమార। శతము భార్యలు నూర్వురు సౌమదత్తి**
**పత్ని, యత్తన్వియత్త యప్పడఁతి యత్త। గోరుదురు యుద్ధమృతబంధుకోటిఁ జూడ.** **90**

**ప్రతిపదార్థం:** మునినాథ!= మునులలో శ్రేష్ఠుడా!; తనయులు= దుర్యోధనాదులైన కొడుకులు; అందఱును= మొత్తం; కయ్యంబునన్= యుద్ధంలో; తెగినది= నశించిపోవటం; ఆదిగాన్= మొదలుగా; ఈ రాజు= ఈ ధృతరాష్ట్రుడు; పది-ఆఱు+ఏండ్లు= పదహారు సంవత్సరాలు; వగలఃపాలు= దుఃఖాలకు లోను; అగుచున్= అవుతూ; తద్-సన్నిధి= ఆ కొడుకులను కలిసికొనాలని; కోరున్= కోరుతూ ఉంటాడు; నీవు= నీవు (వ్యాసుడు); నిర్మల తపము పేర్మి(న్)= శుద్ధమైన తపస్సుయొక్క ఆధిక్యంతో; ఎన్ని లోకంబులు= ఈ సృష్టిలో మొత్తంగా ఎన్నిలోకాలు ఉన్నాయో; అన్నియున్= అవి అన్నీ కూడా; చూపంగన్-చూపించటానికి; చాలుదు(వు)= సమర్థుడివి; ఈ భూపతికిన్= ఈ ధృతరాష్ట్ర మహారాజుకు; పుత్రసాన్నిధ్యము= ఒక్కసారి కొడుకుల దగ్గర ఉండే అవకాశం; ఒనరించుట= కలిగించటం; నీకున్= నీకు; ఎంత పని?= ఎంతటి పని?; గొంతి= కుంతి; ద్రుపద రాజ-పుత్రి= ఆమె కోడలు (ద్రుపదమహారాజు కూతురు) ద్రౌపది; సుభద్ర= ఆమె కోడలు సుభద్ర; కౌరవ కుమారశతము= దుర్యోధనాదులయిన కౌరవవీరులు వందమందియొక్క; భార్యలు= పెండ్లాలు; నూర్వురు(న్)= వంద మందీ; సౌమదత్తి పత్ని= సోమదత్తుడి కొడుకైన భూరిశ్రవుడి భార్యా; ఆ+తన్వి= ఆ భూరిశ్రవుడి భార్యకు; అత్త= (భూరిశ్రవుడి తల్లి) సోమదత్తుడి భార్యా; ఆ+పడఁతి= ఆ సోమదత్తుడి భార్యయొక్క; అత్త= అత్తగారూ; (సోమదత్తుడి భార్యయొక్క; అత్త; అత్తగారూ; సోమదత్తుడి తల్లి..అంటే బాహ్లీకుడి భార్యా) యుద్ధ మృత బంధు కోటిన్= యుద్ధంలో మరణించిన తమ తమ బంధువుల సమూహాన్ని; చూడన్= చూడాలని; కోరుదురు= కోరుతూ ఉంటారు.

**తాత్పర్యం:** (వ్యాస) మునిశ్రేష్ఠుడా! యుద్ధంలో కొడుకులందరూ మరణించింది మొదలుగా ఇప్పటికి పదహారేళ్ళ నుండి ఈ ధృతరాష్ట్ర మహారాజు (పుత్ర) శోకంతో ఉండి తన పుత్రుల సమీపం చేరుకొనాలని కోరుకొంటూ ఉన్నాడు. అత్యంతమైన నీ తపశ్శక్తితో ఈ సృష్టిలోనే మొత్తం ఎన్ని లోకాలు ఉన్నాయో ఆ వాటినన్నింటినీ చూపించగలిగిన నీకు ఈ ధృతరాష్ట్రుడికి పుత్రుల లోకాలు చూపించటం ఎంత పని? కుంతి, ద్రౌపది, సుభద్ర, (నూరుమంది) కౌరవుల భార్యలు నూరుమందీ, భూరిశ్రవుడి భార్యా, సోమదత్తుడి భార్యా, బాహ్లీకుడి భార్యా, యుద్ధంలో మరణించిన తమ తమ బంధువులను చూడాలని కోరుతున్నారు.

**వ.** **అంతయును భవదీయ దివ్యబోధంబు గనుచుండు.** **91**

**ప్రతిపదార్థం:** అంతయును= ఈ విషయం అంతా; భవదీయ-దివ్య-బోధంబు= నీ గొప్పదయిన నీ జ్ఞానం; కనుచున్+ఉండున్= చూస్తూనే (తెలిసే) ఉంటుంది.

**తాత్పర్యం:** ఇది అంతా గొప్పదైన నీ జ్ఞానానికి అందే ఉంటుంది.

**క. పరమమునీంద్ర! సమరమృత । కురువీరుల మా మనముల గో దుడుగ భవ**
**త్కరుణ వెలయ లోకం బ । చ్చెరువందఁగఁ జూపవే విచిత్రపుమహిమన్. 92**

**ప్రతిపదార్థం:** పరమ-ముని+ఇంద్ర!= మునిశ్రేష్ఠులలో ఉత్కృష్టుడా!, (వ్యాసమహర్షీ); మా మనముల గోదు= ధృతరాష్ట్రాదులమైన మా (భరతవంశ్యుల) మనస్సులలో నిండిన బాధ; ఉడుగన్= తొలగేటట్లుగా; భవత్-కరుణ= నీ దయ; వెలయన్= ప్రకటితం కావటం చేత; లోకంబు= లోకంలోని జనమంతా; అచ్చెరువు= ఆశ్చర్యం; అందఁగన్= పొందేవిధంగా; విచిత్రపు మహిమన్= వింతగొలిపే గొప్పతనంతో; సమర-మృత-కురువీరులన్= యుద్ధంలో మరణించిన కౌరవవీరులను; చూపవే= మాకు కనబరచవా?

**తాత్పర్యం:** ముని శ్రేష్ఠులలో ఉత్తముడా!; వ్యాసమహర్షీ!, మా అందరి మనసులోని చింత తొలగిపోయేటట్లు, నీ దయ ప్రకటింపబడటంతో లోకమంతా ఆశ్చర్యపడేటట్లు, ఆశ్చర్యకరమైన నీ గొప్పతనంతో, యుద్ధంలో మరణించిన కురువంశపువారిని మాకు చూపించవలసింది'.

**చ. అనునెడ గొంతి వాడువదనాబ్జముతోడ మదిం దలంచెఁ గ**
**ర్ణుని; నది యత్తపోధనవరుం డెదఁ గాంచి దయానురక్తి న**
**వ్వనిత గుఱించి యిట్లను 'భవన్మతి నొందిన కోర్కి సెప్పు మే**
**ననఘచరిత్ర! దాని ఫల మందఁగఁజేసి యలంతఁ బాపెదన్' 93**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= గాంధారి ఆవిధంగా అంటున్న సమయంలో; గొంతి= కుంతీదేవి; వాడు-వదన-అబ్జము-తోడన్= వాడిపోయిన పద్మం అనే ముఖంతో; మదిన్= మనస్సులో; కర్ణునిన్= కర్ణుడిని; తలంచెన్= స్మరించింది; ఆ+తపస్+ధనవరుండు= తపస్సంపద గలిగిన ఆ వ్యాసుడు; అది= కుంతి మనసులోని విషయం; ఎదన్= తన మనసులో; కాంచి= గ్రహించి; దయా+అనురక్తిన్= దయతో కూడిన వాత్సల్యంతో; ఆ+వనిత-గుఱించి= ఆ కుంతిని ఉద్దేశించి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనున్= అన్నాడు; అనఘ చరిత్ర!= దోషం లేని నడవడిగలదానా!; భవత్-మతిన్= నీ మనస్సును; ఒందిన= ప్రవేశించిన; కోర్కి= వాంఛితం; చెప్పుము= చెప్పుము; ఏను= నేను; దాని ఫలము= దానికి ప్రయోజనాన్ని; అందఁగన్+చేసి= (నీకు) కలుగ జేసి; అలంతన్= నీ విచారం; పాపెదన్= పోగొట్టుతాను.

**తాత్పర్యం:** గాంధారి ఆ విధంగా అనటంతో కుంతి వాడిపోయిన ముఖ కమలంతో మనసులో కర్ణుడిని స్మరించింది. తపస్సంపన్నుడైన వ్యాసు డది గ్రహించి వాత్సల్యంగా కుంతితో ఇట్లా అన్నాడు. 'పవిత్రమైన నడవడికలదానా! నీ మనసులో కలిగిన కోర్కె ఏమిటో చెప్పుము. దాని ప్రయోజనం అందించి, నీ విచారం పోగొట్టుతాను'.

**వ. అనిన విని యయ్యింతి సంతసిల్లి యా సంయమివల్లభునకు దండప్రణామంబు చేసి చేతులు మోడ్చి లజ్జా సహితం బగు నంతరంగంబుతో వినయనమ్ర యగుచు నిట్లనియె. 94**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వేదవ్యాసుడు పలుకగా; విని= ఆలకించి; ఆ+ఇంతి= కుంతి; సంతసిల్లి= ఆనందించి; ఆసంయమి వల్లభునకున్= మునిశ్రేష్ఠుడైన ఆ వ్యాసుడికి; దండ-ప్రణామంబు= సాష్టాంగంగా నమస్కారం; చేసి= ఆచరించి; చేతులు మోడ్చి=

చేతులు జోడించి; లజ్జాసహితంబు= సిగ్గుతో కూడినది; అగు= అయిన; అంతరంగంబుతోన్= మనస్సుతో; వినయ-నమ్ర= అణకువతో వంగినది; అగుచున్= అవుతూ; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** వ్యాసుడు అట్లా అనటంతో కుంతి సంతోషించి ఆ మునిశ్రేష్ఠుడికి సాష్టాంగపడి, నమస్కరించి, చేతులు జోడించి, సిగ్గుపడుతున్న మనసుతో, అణకువతో వంగి వ్యాసుడితో ఇట్లా అన్నది.

**కుంతి వేదవ్యాసునితోఁ గర్ణుఁడు దనకు జన్మించిన తెఱంగెఱింగించుట (సం.15.38.1)**

**సీ.** **'దేవతలకు నీవ దేవత; విట్టి ని । న్మామగాఁ బడసితి మహితకరుణ**
**ననుఁ జూచి నాదువిన్నప మాదరింపు మేఁ । గన్యాత్వదశ నుండఁగా మదీయ**
**జనకుని కడకుఁ గోపనుఁ డైన దుర్వాసుఁ । డన్మహాముని వచ్చె; నతని సవిన**
**యార్చన కలనాసమారాధితుండుగాఁ । జేసితిఁ బ్రీతుఁడై 'చెలువ! నీకు**

**ఆ.** **నిత్తు వరము; వేఁడు మెయ్యది కోరికి?' । యనియె; నతఁడు 'మీ ప్రియంబుకంటె**
**ననఘ! మిగులు కోర్కియును గలదే? నాకు । నంటిఁ; గాని యొకఁడు నడుగ నైతి.** **95**

**ప్రతిపదార్థం:** దేవతలకున్= దేవతలకు గూడా; నీవు+అ= నీవే; దేవతవు= దేవుడివి; ఇట్టి= ఇటువంటి (దైవాలకు దైవమైనటువంటి); నిన్= నిన్ను; మామగాన్= మామ (భర్త తండ్రి)గా, (సమీప బంధువుగా); పడసితిన్= నేను పొందగలిగాను; ననున్= నన్ను; మహిత కరుణన్= అత్యంతమైన దయతో; చూచి= అనుగ్రహించి; నాదు విన్నపము= నా వేడుకోలును (నేను చెప్పే మాటలు); ఆదరింపుము= వాత్సల్యంతో వినవలసింది; ఏను= నేను; కన్యాత్వదశన్= కన్నెప్రాయంలో ఉండగా; మదీయ-జనకుని-కడకున్= నా తండ్రి వద్దకు; కోపనుఁడు= కోపస్వభావుడు; ఐన= అయినటువంటి; దుర్వాసుండు= దుర్వాసుడు; అన్-మహాముని= అనే పేరుగలిగిన గొప్ప ముని; వచ్చెన్= వచ్చాడు; అతనిన్= ఆ మహామునిని; స-వినయ-అర్చన-కలనా-సమ్- ఆరాధితుండు= అణకువతో కూడిన పూజలను సమకూర్చటంచేత చక్కగా సేవించబడినవాడు; కాన్= అయ్యేవిధంగా; చేసితిన్= (నేను) చేశాను; అతఁడు= అందుకు ఆ దుర్వాసుడు; ప్రీతుఁడు= సంతోషించినవాడు; ఐ= అయి; చెలువా!= అమ్మాయీ! (కుంతీ); నీకున్= నీకు; వరము= వరాన్ని; ఇత్తున్= ఇస్తాను; వేఁడుము= అడుగుము; కోరిక= నీ కోరిక; ఏ+అది!= ఏమిటి?; అనియెన్= అన్నాడు; అనఘ!= పుణ్యాత్మా!; మీ ప్రియంబుకంటెన్= మీరు సంతోషించటం కంటె; మిగులు= అధికమైన; కోర్కియును= కోర్కెగూడా; నాకున్= నాకు; కలదు+ఏ?= ఉంటుందా?; అంటిన్= అన్నాను; కాని= అంతేతప్ప; ఒకఁడున్= ఏదీకూడా; అడుగన్+ఐతి(న్)= కోరలేదు.

**తాత్పర్యం:** దైవాలందరకు నువ్వే దేవుడివి. అటువంటి నిన్ను మామగా పొందగలిగాను. నాపై దయఉంచి నా మనవిని ప్రేమతో వినవలసింది. నేను కన్యాప్రాయంలో ఉండగా కోపస్వభావుడైన దుర్వాసుడు మానాన్న (పెంచిన తండ్రి కుంతిభోజుడి) దగ్గరకు వచ్చాడు. నేను ఆ మహామునిని అణకువతో పూజించి సేవించాను. అతడు సంతోషించి, అమ్మాయీ 'నీకు వర మిస్తాను. కోరుకొమ్ము ఏం కావాలి?' అన్నాడు. అప్పుడు నేను 'పుణ్యాత్మా! మీరు సంతోషించటం కంటె ఎక్కువైన కోరిక నాకేముంటుంది?' అన్నాను తప్ప ఏ ఒక్కటీ వేడుకొనలేదు.

**వ.** **అమ్మాట తనమనంబునకు రానిచందంబు మొగంబునం దోఁప నత్తాపసవరుండు 'వరం బెల్లభంగి నొసంగక పోవ; నడుగు' మనుటయు, వెఱచియు నాదువేడ్కతెఱం గట్ల యగుటను 'బుత్త్రుంగోరితిఁ గోరిన నమ్ముని**

**పతి యొక్క మంత్రం బనుగ్రహించి 'దీన నీ వావహించిన దేవతలు భవద్వశగతులై సుతజన్మంబు గలిగింతురు;**
**విశేషించి ధర్మువునకుఁ దల్లివి గాఁగలదాన' వని పలికి యంతర్ధానంబు చేసిన. 96**

**ప్రతిపదార్థం:** ఆ+మాట= నేను అన్న ఆ మాట; తన మనంబునకున్= తన (దుర్వాసుడి) మనస్సునకు; రాని చందంబు= నచ్చని విధం; మొగంబునన్= అతడి (దుర్వాసుడి) ముఖంమీద; తోఁపన్= కనబడుతుండగా; ఆ+తాపసవరుండు= మునిశ్రేష్ఠుడైన ఆ దుర్వాసుడు; ఎల్లభంగిన్= ఏ విధంగానైనా; వరంబున్= మేలును; ఒసంగక= ఇవ్వకుండా; పోవన్= వెళ్ళను; అడుగుము= కోరుకొమ్ము; అనుటయున్= అని దుర్వాసోమహర్షి అనటం వలన; వెఱచియున్= భయపడీ; నాదువేడ్క తెఱంగు= నా కోరికతీరు; అట్లు+అ= అదే ప్రకారం; అగుటను= కావటంచేతా; పుత్త్రున్= కొడుకును; కోరితిన్= అడిగాను; కోరినన్= నేను ఆ విధంగా కోరటంతో; ఆ+మునిపతి= మునులలో శ్రేష్ఠుడైన ఆ దుర్వాసుడు; ఒక్క మంత్రంబు= ఒకానొక మంత్రాన్ని; అనుగ్రహించి= (నాకు) ఉపదేశించి; నీవు= నీవు; దీనన్= ఈ మంత్రంతో; ఆవహించిన-దేవతలు= రప్పించినటువంటి దేవతలు; భవత్-వశ-గతులు= నీకులోబడిన వారు (నీవు చెప్పిన విధంగా నడుచుకొనేవారు); ఐ= అయి; సుతజన్మంబు= నీకు కొడుకు పుట్టటాన్ని; కలిగింతురు= కలగజేస్తారు; విశేషించి= అందులో ప్రత్యేకంగా; ధర్మువునకున్= ధర్మదేవత (యమధర్మరాజు)కు; తల్లివి= (నీవు) జన్మనిచ్చేదానివి; కాన్+కలదానవు= అవుతావు అని; పలికి= చెప్పి; అంతర్ధానంబు చేసినన్= (ఆ దుర్వాసుడు) మాయమయిపోవటంతో, (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** (మీరు సంతోషించటంకంటె మించిన కోర్కె నాకు ఏముంటుంది? అని) నేను (కుంతి) అన్నమాట తన మనసుకు నచ్చకపోవటం ముఖంలో కనబడుతుండగా మునిశ్రేష్ఠుడైన ఆ దుర్వాసుడు 'ఏమైనాసరే నీకు వరం ఇవ్వకుండా ఇక్కడినుండి వెళ్ళను అడుగు' మన్నాడు. ఆ మాటలకు భయంతోనూ, 'నా కోరిక కూడా ఆ విధంగానే ఉండటం వలననూ నేను కొడుకు నిమ్మని అడిగాను. దానితో దుర్వాసోమహర్షి నాకు ఒక మంత్రాన్ని ఉపదేశించి. 'ఈ మంత్రంతో నీవు ఏ దేవతలను రప్పిస్తావో ఆ దేవతలు నీకు వశమై కొడుకులను గలుగజేస్తారు. ప్రత్యేకించి నీవు యమధర్మరాజుకు తల్లివి అవుతావు' అని చెప్పి మాయమైపోయాడు.

**ఆ. అద్భుతమునఁ బొంది యమ్మంత్రరూప ము। ల్లమున నెప్పుడును దలంతు; నొక్క**
**నాఁడు మేడమీఁదఁ బోఁడిమి నే నుండి। కంటిఁ బొడుచుచున్న కమలమిత్త్రు. 97**

**ప్రతిపదార్థం:** అద్భుతమునన్-పొంది= ఆశ్చర్యపడి; ఉల్లమునన్= మనసులో; ఎప్పుడును= నిరంతరమూ; ఆ+మంత్రరూపము= దుర్వాసుడు ఉపదేశించిన మంత్రాన్ని; తలంతున్= స్మరిస్తూఉండే దాన్ని; ఒక్కనాఁడు= ఒకరోజు; నేను= నేను; మేడమీఁదన్= మేడపైన; పోఁడిమిన్= సుఖంగా; ఉండి= ఉన్నదానినై; పొడుచుచున్న-కమలమిత్రున్= ఉదయించే సూర్యుడిని; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** (మంత్రం ఉపదేశించి దుర్వాసుడు అదృశ్యం అయిపోవటంతో) చాలా ఆశ్చర్యపడి నా మనసులో ఆ మంత్రాన్నే నిరంతరమూ స్మరిస్తూ ఉండేదాన్ని. ఒకరోజు నేను మేడమీద హాయిగా ఉండి ఉదయించే సూర్యుడిని చూచాను.

**క. కని యిది కన్యకు దోషం। బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానము వే**
**డ్కనొనర్ప నావహించితి। ముని మంత్ర బలమున సూర్యు మునినాథవరా! 98**

**ప్రతిపదార్థం:** మునినాథవరా!= మునిశ్రేష్ఠులలో శ్రేష్ఠుడా!, వ్యాసమహర్షీ; కని= ఆ సూర్యుడిని చూచి; ఇది= తాను కోరుకొనబోతున్నది (పుత్రుడిని పొందటం); కన్యకున్= వివాహం కాని స్త్రీకి; దోషంబు= తప్పు; అని తలఁపక= అనుకొనకుండా; బాల్య-సంభృత-అజ్ఞానము= పిన్నతనం వలన పరిపూర్ణమైన తెలివి లేకపోవటం; వేడ్కన్= వినోదాన్ని; ఒనర్పన్= కలిగించగా, మునిమంత్రబలమునన్= ఆ దుర్వాసుడిచ్చిన మంత్రశక్తితో; సూర్యున్= ఆ సూర్యుడిని; ఆవహించితిన్= రప్పించాను.

**తాత్పర్యం:** ఋషి శ్రేష్ఠుడా! ఆ ఉదయించే సూర్యుడిని చూచి దుర్వాసుడిచ్చిన మంత్రశక్తితో పెళ్ళికాని పిల్లకు ఇది (పుత్రులు పొందటం) తప్పు అని ఎంచకుండా, చిన్నతనం వలన కలిగిన అజ్ఞానంతో, వినోదంగా సూర్యుడిని రప్పించాను.

**తే.** **ఆవహించిన నద్దేవుఁ డాకసమున । నాత్మమూర్తి వర్తింప మూర్త్యంతరంబు**
**దాల్చి నాకడ కేతెంచెఁ దత్క్షణంబ । నాదుచిత్త మాశ్చర్యమగ్నంబు గాఁగ.** **99**

**ప్రతిపదార్థం:** ఆవహించినన్= (ఆ విధంగా మంత్రములతో) రప్పించగా; ఆ+దేవుఁడు= ఆ సూర్యభగవానుడు; ఆత్మమూర్తి= తన చండస్వరూపం; ఆకసమునన్= ఆకాశంలో (యథాపూర్వంగా) వర్తింపన్= ప్రకాశిస్తూ ఉండగా; మూర్తి+అంతరంబు= వేరొక; ఆకారాన్ని; తాల్చి= ధరించి; నాదుచిత్తము= నామనస్సు; ఆశ్చర్యమగ్నంబు= ఆశ్చర్యంలో మునిగినది; కాఁగన్= కాగా; తద్+క్షణంబు+అ= వెంటనే; నాకడకున్= నావద్దకు; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దుర్వాసుడిచ్చిన మంత్రాన్ని స్మరించటంతో ఆ మంత్రబలం వలన సూర్యభగవానుడు ఆకాశంలో తన రూపం అలాగే ఉండగా ఆక్షణంలోనే ఇంకొక రూపం ధరించి నా మనసు ఆశ్చర్యంలో మునిగిపోతుండగా నావద్దకు వచ్చాడు.

**వ.** **ఇట్లు చనుదెంచి.** **100**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈఆప్రకారంగా; చనుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** సూర్యుడు ఈ విధంగా (తన సహజరూపం ఆకాశంలో ఉంచి మరొక రూపంతో కుంతివద్దకు) వచ్చి (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **'అడుగు మిచ్చెద వరం' బనిన వడంకుచుఁ । గేలు మొగిడ్చి 'పొం దేల యిచట'**
**ననిన 'వృథాహ్వాన మాచరించుట తప్పు । నిన్నును నెవ్వఁడు నీకు మంత్ర**
**మిచ్చె నాతని శపియింతుఁ జుమ్మీ!'యని । పలికె నయ్యర్కుఁ; డే నలికి గురుని**
**నిరపరాధుని శాపనిహతుఁగాఁ జేయుట । కోర్వక పుత్త్రకు నొసఁగు దేవ**

**తే.** **కృప భవత్సము' ననిన నయ్యపరిమేయ । తేజుఁ డాత్మతేజమున నా దృఙ్ముఖేంద్రి**
**యములు మనసును సమ్మోహితములు సేసి । యపుడు తనయుండు పుట్టెడు' ననియెఁ బిదప.** **101**

**ప్రతిపదార్థం:** అడుగుము= ఏమి కావాలో కోరుకొమ్ము; వరంబు= నీకోరిక; ఇచ్చెదన్= ఇస్తాను; అనినన్= అని సూర్యుడు పలుకగా; వడంకుచున్= వణకిపోతూ; కేలు= చేతులు; మొగిడ్చి= జోడించి; పొండు= వెళ్ళిపొండి; ఇచటన్= ఇక్కడికి; ఏల=

(రావటం) ఎందుకు?; అనినన్= అని నేను (కుంతి) పల్కగా; వృథా-ఆహ్వానము= వ్యర్థం అయిన పిలుపు; ఆచరించుట= చేయటం; తప్పు= దోషం; నిన్నును= నిన్నూ (కుంతినీ)?; నీకున్= నీకు; మంత్రము= (దేవతలనాహ్వానింపజేసే) ఈ మంత్రాన్ని; ఎవ్వఁడు ఇచ్చెన్= ఎవడు ఇచ్చాడో; అతనిన్= వాడినీ; శపియింతున్+చుమ్మీ= శపిస్తాను సుమా; అని= అనే విధంగా; ఆ+అర్కుఁడు= ఆ సూర్యుడు; పలికెన్= అన్నాడు; ఏను= నేను; అలికి= భయపడి; గురునిన్= మంత్రం ఉపదేశించిన ఆ ఆచార్యుడు దుర్వాసుడిని; నిర్+అపరాధునిన్= ఏ తప్పూ చేయనివాడిని; శాప-నిహతున్= సూర్యుడిశాపంతో దెబ్బతిన్నవాడు; కాన్= అయ్యేటట్లు; చేయుటకున్= చేయటానికి; ఓర్వక= తట్టుకొనలేక; దేవ!= (సూర్య) భగవానుడా!; కృపన్= దయతో; భవత్-సమున్= నీకు సాటివచ్చేటటువంటి; పుత్త్రకున్= కొడుకును; ఒసఁగు(ము)= ఇమ్ము; అనినన్= అని నేను (కుంతి) పల్కగా; ఆ అపరిమేయతేజుఁడు= మేరలేని కాంతి కలిగిన ఆ సూర్యుడు; అపుడు= ఆ సమయంలో; ఆత్మతేజమునన్= తన కాంతితో; నా-దృక్-ముఖ-ఇంద్రియములు(ను)= (నా) కనులు మొదలైన ఇంద్రియాలను; మనసును= హృదయాన్ని; సమ్మోహితములు చేసి= ఆకర్షించబడ్డవాటినిగా చేసి; పిదపన్= తర్వాత; తనయుండున్= (నీకు) కొడుకు; పుట్టెడున్= పుట్టుతాడు; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'కోరుకొమ్ము వరమిస్తా' నన్నాడు సూర్యుడు. నేను వణకిపోతూ చేతులు జోడించి వెళ్ళండి ఎందుకిక్కడ' అన్నాను. 'వ్యర్థంగా ఆహ్వానించటం తప్పు. నిన్నూ, నీకు ఈ మంత్రం ఉపదేశించినవాడినీ ఇద్దర్నీ శపిస్తాను' అన్నాడు సూర్యుడు. నేను భయపడి ఏ తప్పూ ఎరుగనివాడు మంత్రం ఉపదేశించిన ఆచార్యుడు దుర్వాసుడు శాపం పాలుకావడానికి అంగీకరించలేక, 'దేవా! దయతో నీ వంటి కొడుకు నిమ్మని సూర్యుడిని అడిగాను. అత్యంత తేజస్సు కలిగిన ఆ సూర్యుడు తన తేజస్సుతో కన్నులు మొదలైన నా యింద్రియాలనన్నింటినీ, మనసునూ ఆకర్షించి 'నీకు కొడుకు పుట్టుతాడు' అని చెప్పాడు.

**వ. అని నిర్దేశించి. 102**

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా; నిర్దేశించి= నిర్ణయించి చెప్పి.

**తాత్పర్యం:** నీకు కొడుకు పుట్టుతాడని సూర్యుడు కుంతికి నిర్ణయం చేసి చెప్పి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. 'నీకుఁ గన్యాత్వ వికలత గాక యుండ। వరము నిచ్చితి' ననుచు దివమున కరిగె;**
**జనకముఖబంధుచిత్తవంచనము నడపి। గూఢ మందిరాంతరమునఁ గొడుకుఁ గంటి. 103**

**ప్రతిపదార్థం:** కన్యాత్వ వికలత= కన్యయొక్క ధర్మం చెడిపోయినది; కాక+ఉండన్= కాకుండే విధంగా; నీకున్= నీకు; వరమున్= వరాన్ని; ఇచ్చితిన్= ఇచ్చాను; అనుచున్= అంటూ సూర్యుడు; దివమునకున్= ఆకాశానికి; అరిగెన్= వెళ్ళాడు; జనక= తండ్రి; ముఖ= మొదలైన; బంధు= చుట్టాల; చిత్త= బుద్ధియొక్క; వంచనము(నే)= మోసం; నడిపి= చేసి; గూఢ-మందిర-అంతరమునన్= రహస్యపు గృహంలో; కొడుకున్= కొడుకును; కంటిన్= కన్నాను.

**తాత్పర్యం:** 'వివాహం కాకుండానే కొడుకును కనటం వలన నీ కన్యాత్వం చెడిపోకుండా నీకు వరమిస్తున్నాను' అని చెప్పి సూర్యుడు ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. నేను (కుంతి) కూడా తండ్రి మొదలైన నా వాళ్ళందరి కన్నుగప్పి రహస్య మందిరంలో కొడుకును కన్నాను.

**క. కని యేటిలో నిడితిఁ గలఁ। గని నట్లయి యుండెఁ దత్ప్రకారం; బిది మీ**
**కనినయది దివ్య బోధంబున నత్తెఱఁ గంతరంగమునఁ గొని కాలున్. 104**

**ప్రతిపదార్థం:** కని= (ఆవిధంగా రహస్యంగా కొడుకును) ప్రసవించి, (ఆకొడుకును); ఏటిలోన్= గంగానదిలో; ఇడితిన్= పడేశాను; తద్+ప్రకారంబు= ఆ విధంగా కొడుకును కనటమూ, గంగలో విడవటమూ అనే మొత్తం వృత్తాంతమూ; కలన్= కలలో; కనిన-అటు= చూచిన విధంగా అయి; ఉండెన్= జరిగినట్లున్నది; ఇది= ఈ విషయం అంతా; దివ్య-బోధంబునన్= అలౌకికమైన జ్ఞానంవలన; మీ-కనిన-అది= తమకు (వ్యాసుడికి) తెలిసినదే; ఆ+తెఱఁగు= ఆ కర్ణుడి జన్మవృత్తాంతం; అంతరంగమునన్= నా మనసులో; కొని= నిలిచి; కాలున్= మండుతున్నది.

**తాత్పర్యం:** (రహస్యంగా కొడుకును) కని ఆ కొడుకును నదిలో వదలివేశాను. ఆ సంఘటన అంతా కలలో జరిగినట్లుగా ఉన్నది. జ్ఞానవిశేషం వలన ఇది అంతా మీకు (వ్యాసుడికి) తెలిసినదే. ఆ పుత్రుడి విధానం నా మనసులో నిలిచి దహిస్తున్నది. (మండుతుంది.)

**తే. పాప మయ్యెఁ గా కుండె నప్పనిఁ దలంచి। యళుకుచుండుదు; మద్భయ మపనయింపుఁ**
**డతులకరుణ నిక్కురువృద్ధునభిమతమును। సఫలముగఁ జేయుఁ డివి నాకు సద్వరములు. 105**

**ప్రతిపదార్థం:** పాపము-అయ్యెన్= పాపమే అవుతుందో; కాక+ఉండెన్= కాదో; ఆ+పనిన్= కన్న బిడ్డను నీటిలో వదలివేయటం అనే ఆ పనిని; తలంచి= తలచుకొని; అళుకుచున్+ఉండుదున్= భయపడుతూ ఉంటాను; అతుల కరుణన్= సాటిలేని దయతో; మత్+భయము= నా భయాన్ని; అపనయింపుఁడు= పోగొట్టండి; ఈ+కురువృద్ధ-అభిమతమును= ఈధృతరాష్ట్రుడి (పుత్రాదుల మరణానంతర గతులను తెలిసికొనాలనే) కోరికను; సఫలముగన్= సిద్ధించేటట్లు; చేయుఁడు= చేయండి; ఇవి= ఈరెండే; నాకున్= నాకు; సత్-వరములు= గొప్ప అభీష్టాలు.

**తాత్పర్యం:** పాపమో కాదో కాని కన్న కొడుకును నీటిలో విడిచిన ఆ పనిని తలచుకొని ఎప్పుడూ భయపడుతుంటాను. దయచేసి నా భయాన్ని పోగొట్టండి; మరణానంతరం పుత్త్రాదుల గతులు తెలిసికొనాలనే ఈ ధృతరాష్ట్రుడి కోర్కెను సిద్ధింపజేయండి. ఇవే నాకు అభీష్టాలు.

**వ. అనిన విని యమ్మునీంద్రుం డమ్మానిని కిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కుంతి పల్కగా; విని= ఆలకించి; ఆ+ముని+ఇంద్రుండు= మునులలో శ్రేష్ఠుడైన ఆ వ్యాసుడు; ఆ+మానినికిన్; ఆమె (కుంతి)తో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కుంతి ఆవిధంగా చెప్పగా విని వ్యాసమహర్షి ఆమెతో ఇట్లా అన్నాడు.

**సీ. 'నీ చెప్పినది యెల్ల నిక్కంబు కోడల!। యెగ్గు నీ యందు లేదు; దేల వెఱవ?**
**సుర లద్భుతాపాదిచరితులు; కర్ణున। కట్లుగా నున్నది యగుటఁ జేసి**
**యేటిలో నాతని నిడి తీవు; కన్యాత్వ। హాని లే కున్కిఁ గులాగ్రగణ్య**
**వైతి; భవద్వృత్త మమలిన మగుటకు। ననుమాన మించుక యైన వలవ'**

ఆ. దనుచు నాదరార్ద్రుఁడయి పల్కి గాంధారి। తోడ 'నీవు సుతులఁ దోడఁబుట్టు
వులను గాంతు, నీదు చెలియలు గొంతియుఁ। గర్ణుఁ జూడఁ గాంచు గణ్యచరిత! 107

**ప్రతిపదార్థం:** కోడల!= కోడలా, కుంతీ!; నీ చెప్పినది= నీవు చెప్పినటువంటిది; ఎల్లన్= మొత్తం; నిక్కంబు= నిజం; నీయందున్= నీలో; ఎగ్గు= దోషం; లేదు= లేదు; వెఱవన్= భయపడటం; ఏల?= ఎందుకు?; సురలు= దేవతలు; అద్భుత+ఆపాది-చరితులు= వింతలు పుట్టించే నడవడి కలవారు; కర్ణునకున్= కర్ణుడివిషయంలో; అట్లు= ఆవిధంగా; కాన్+ఉన్నది= జరగవలసి ఉన్నది; అగుటన్-చేసి= కాబట్టి; అతనిన్= కర్ణుడిని; ఏటిలోన్= గంగలో; ఇడితి(వి)= వదిలేశావు; కన్యాత్వ-హాని= నీలో కన్యాభావానికి హాని; లేక-ఉన్కిన్= లేకపోవటం చేత; ఈవు= నీవు; కుల-అగ్రగణ్యవు= ఈ వంశంలో శ్రేష్ఠురాలివి; ఐతి(వి)= అయినావు; భవత్-వృత్తము= నీ చరిత్ర; అమలినము= నిష్కళంకం; అగుటకున్= కావటంలో; ఇంచుక-ఐనన్= కొంచెం కూడా; అనుమానము= సందేహం; వలవదు= తగదు; అనుచున్= అంటూ; ఆదర+ఆర్ద్రుఁడు= వాత్సల్యంతో నిండి (తడిసి)నవాడు; అయి= ఐ; పల్కి= చెప్పి; గాంధారితోడన్= గాంధారితో; గణ్యచరిత!= ప్రశంసించదగిన నడవడి కలదానా!; నీవు= నీవు; సుతులన్= దుర్యోధనాదులైన కొడుకులనూ; తోడబుట్టువులను= శకుని మున్నగు సోదరులనూ; కాంతు(వు)= చూస్తావు; నీదు చెలియలు= నీకు చెల్లెలయిన; గొంతియున్= కుంతికూడా; కర్ణున్= (కొడుకైన) కర్ణుడిని; చూడన్-కాంచున్= చూడగలుగుతుంది.

**తాత్పర్యం:** 'కోడలా!, కుంతీ!. నీవు చెప్పినదంతా యథార్థం. నీలో ఏదోషమూ లేదు. భయ మెందుకు? దేవతలు వింతలు కల్పిస్తుంటారు. కర్ణుడికి ఆ విధంగా జరగవలసి ఉన్నది కాబట్టి అతడిని గంగలో విడిచావు. నీ కన్యాత్వానికి భంగం లేదు కాబట్టి ఈ వంశంలో నీవు శ్రేష్ఠురాలి వైనావు. నీ చరిత్ర నిష్కళంకం అనటంలో ఏ మాత్రమూ సందేహం లేదు'. అని వాత్సల్యాతిశయంతో పలికాడు వ్యాసమహర్షి. ఆ తరువాత గాంధారితో 'మంచి నడవడి కలదానా!, నీవు దుర్యోధనాదులైన కొడుకులనూ, శకుని ప్రభృతులైన సోదరులనూ చూస్తా విప్పుడు. నీ చెల్లెలు కుంతి కూడా కర్ణుడిని చూడగలుగుతుంది.

ఉ. ద్రౌపదియున్ సుభద్రయును దక్కటి కాంతలు భ్రాతృపుత్త్ర పౌ
త్త్రోపవిలోక నోత్సవము నొందుదు రిచ్చటి కిప్డు వచ్చు టే
నీ పని యాచరించుటకు; నిమ్మనుజేంద్రుఁడు నీవు గొంతి చిం
తాపరితాపనోదన విధంబుగఁ గోరితి రట్లు చేసెదన్. 108

**ప్రతిపదార్థం:** ద్రౌపదియున్= ద్రౌపదీ; సుభద్రయును= సుభద్రా; తక్కటి-కాంతలు(న్)= మిగిలిన భరతవంశపు స్త్రీలూ; భ్రాతృ= సోదరులనూ; పుత్త్ర= కొడుకులనూ; పౌత్త్ర= మనుమలనూ; ఉపవిలోకన= చూడటం అనే; ఉత్సవమున్= సంతోషాన్ని; ఒందుదురు= పొందుతారు; ఏను= నేను; ఇచ్చటికిన్= ఈ చోటికి; ఇప్డు= ఈ సమయంలో; వచ్చుట= రావడం; ఈపని= మీరు కోరిన ఈపని; ఆచరించుటకున్= చేయటానికే; ఈ+మనుజ+ఇంద్రుఁడు= ఈ (ధృతరాష్ట్ర) మహారాజు; నీవు= నీవు (గాంధారి); గొంతి= కుంతీ; చింతా-పరితాపనోదన-విధంబుగన్= (పుత్రాదులను) గురించిన ఆలోచనలూ, దుఃఖమూ తొలగిపోయేటట్లుగా; కోరితిరి= అడిగారు; అట్లు= మీరు కోరుకొన్నవిధంగా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ద్రౌపదీ, సుభద్రా, ఇతర భరతస్త్రీలూ, తమ తమ సోదరులనూ, కొడుకులనూ, మనుమలనూ చూచే ఆనందకర స్థితిని పొందుతారు. నేను ఇక్కడికి ఇప్పుడు వచ్చింది ఆపని చేయటానికే. ఈ ధృతరాష్ట్రుడూ, నీవూ (గాంధారి) కుంతీ, దుఃఖం తొలగించుమని కోరారు. ఆ విధంగా చేస్తాను.

**క. నీ కొడుకులకు మనుమలకు । శోకింపఁగ వలదు; వారు శూరత వెలయం**
**జే కొనిరి రణమరణమున । నాక భువనసుఖము సద్గుణస్తవనీయా! 109**

**ప్రతిపదార్థం:** సత్+గుణ స్తవనీయా!= మంచి గుణాల చేత ప్రశంసించ దగిన దానా! (గాంధారీ); నీ కొడుకులకున్= దుర్యోధనాదు లయిన నీ పుత్రులను గూర్చి; మనుమలకున్= లక్ష్మణకుమారాదులైన మనవళ్ళను గురించీ; శోకింపఁగన్= దుఃఖించటం; వలదు= వద్దు; వారు= నీకొడుకులూ, మనుమలూ; శూరత= తమ పరాక్రమం; వెలయన్= వెల్లడి కాగా; రణ-మరణమునన్= యుద్ధంలో సంభవించిన మరణంతో; నాక-భువన-సుఖము= స్వర్గలోక సౌఖ్యాన్ని; చేకొనిరి= పొందారు.

**తాత్పర్యం:** మంచి గుణాల చేత స్తుతింపదగిన దానా! గాంధారీ! కొడుకులను గురించీ, మనుమలను గురించీ నీవు విచారించవద్దు. వాళ్ళు తమ పరాక్రమం వెల్లడి అయ్యేవిధంగా యుద్ధంలో మరణించటం వలన స్వర్గలోక సౌఖ్యాలను పొందారు.

**ఆ. భామ! విను మవశ్య భవితవ్య మైన భా । రతరణంబు పొంటె నతుల మహిమ**
**మాననీయ దేవయోనులు జననంబు । నొంది రిందు మనుజయోనులందు. 110**

**ప్రతిపదార్థం:** భామ!= వనితా! (గాంధారీ); వినుము= వినుము; అవశ్య-భవితవ్యము= తప్పక జరుగవలసినది; ఐన= అయినటువంటి; భారతరణంబుపొంటెన్= భారతయుద్ధం కొరకుగా; అతుల మహిమన్= సాటిలేని గొప్పతనం చేత; మాననీయ దేవయోనులు= గౌరవించదగిన దేవతలు మొ॥; ఇందున్= ఈ భూమిపై; మనుజయోనులందు(న్)= మానవజాతిలో; జననంబున్= పుట్టుకను; ఒందిరి= పొందారు.

**తాత్పర్యం:** గాంధారీ! తప్పకుండా జరిగి తీరవలసిన భారతయుద్ధం కొరకుగా, సాటిలేని మహత్తు గలిగిన దేవతలు మొదలైన అమానుషపు పుట్టుక గలవాళ్ళూ, ఈ భూమిమీద మానవజాతిలో పుట్టారు.

**సీ. ధృతరాష్ట్రుఁ డనఁగ వర్తిల్లెడు మేటి గం । ధర్వుఁడీ ధృతరాష్ట్రధరణివిభుఁడు**
**తన్వి! పాండుఁడు మరుద్గణ మయజని; ధర్మ । దేవత సూవె యుధిష్ఠిరుండు;**
**పవనుండు భీముఁడై ప్రభవించె; నరుఁ డను । ముని యర్జునుం డయి జనన మొందె.**
**నారాయణుఁడు కృష్ణనాముఁడై జనియించెఁ; । గనుఁగొను కవల నాశ్వినులు గాఁగ;**

**తే. ద్వాపరంబుగ నెఱుఁగు గాంధార రాజు; । గలి సుయోధనుఁ డయ్యె; రాక్షసులు పుట్టి**
**రతని యనుజులై; కర్ణుని నరుణకిరణుఁ । గాఁగ; నభిమన్యుఁ జంద్రునిఁ గాఁగఁ గనుము. 111**

**ప్రతిపదార్థం:** ఈ-ధృతరాష్ట్రవిభుఁడు= (నీ యెదుట ఉన్న) ఈ ధృతరాష్ట్రుడు అనే పేరుతో; వర్తిల్లెడు= ఉన్న; మేటి-గంధర్వుఁడు= గంధర్వనాయకుడు (రాజు); పాండుఁడు= పాండురాజు; మరుద్గణ-మయ-జని= మరుత్తుల అంశతో కూడిన పుట్టుక కలవాడు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ధర్మదేవత= యమధర్మరాజు; చూవె= సుమా; భీముఁడు+ఐ= భీమసేనుడుగా; పవనుండు= వాయుదేవుడు; ప్రభవించెన్= పుట్టాడు; అర్జునుఁడు-అయి= అర్జునుడుగా; నరుఁడు అనుముని= నరుడు అనేపేరు గలిగిన ముని; జనియించెను= పుట్టాడు; కృష్ణనాముఁడు+ఐ= కృష్ణుడు అనే పేరు గలిగిన వాడుగా; నారాయణుఁడు= నారాయణుడనే ముని; జననము-ఒందెన్= పుట్టాడు; కవలన్= నకుల, సహదేవులను; ఆశ్వినులు= అశ్వినిదేవతలు; కాఁగన్= అయిఉన్నట్లు;

కనుఁగొను(ము)= గ్రహించుము; గాంధార రాజు= గాంధార రాజు (శకుని); ద్వాపరంబుగన్= ద్వాపరుడు అని; ఎఱుఁగు(ము)= తెలుసుకొమ్ము; కలి= కలిపురుషుడే; సుయోధనుఁడు= దుర్యోధనుడు; అయ్యెన్= అయిఉన్నాడు; అతని-అనుజులు-ఐ= ఆ దుర్యోధనుడి తమ్ములు, దుశ్శాసనాదులుగా; రాక్షసులు= రాక్షసులు; పుట్టిరి= జన్మించారు; కర్ణునిన్= కర్ణుడిని, అరుణ కిరణున్-కాఁగన్= సూర్యుడిగానూ; అభిమన్యున్= అభిమన్యుడిని; చంద్రునిన్-కాఁగన్= చంద్రుడిగానూ; కనుము= గ్రహించుము.

**తాత్పర్యం:** (గాంధారీ!) ఈ ధృతరాష్ట్ర మహారాజు ధృతరాష్ట్రుడనే గంధర్వరాజు, మరుత్తులనే దేవతల అంశతో పుట్టినవాడు పాండురాజు, ధర్మరాజు (యమ) ధర్మరాజే సుమా! వాయుదేవుడు భీముడుగా పుట్టాడు. నరుడు అనే పేరుగల ముని అర్జునుడుగాను, నారాయణుడు కృష్ణుడుగానూ పుట్టారు. నకుల సహదేవులుగా అశ్వినీ దేవతలు పుట్టారు. ద్వాపరం శకునిగానూ, కలిపురుషుడు దుర్యోధనుడు గానూ, రాక్షసులు దుశ్శాసనాదులైన దుర్యోధనుడి తమ్ములుగానూ పుట్టారు. కర్ణుడు సూర్యుడనీ, అభిమన్యుడు చంద్రుడనీ గ్రహించుము.

**క. అనలుఁడు ధృష్టద్యుమ్నుం । డన ద్రౌపదితోడఁబుట్టె; ననిలుని యంశం**
**బున జనియించె శిఖండియు; । ననిమిషగురుఁ డుద్భవించె నస్త్రగురుండై. 112**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; అనన్= అనే పేరుతో; ద్రౌపదితోడన్= ద్రౌపదితో; అనలుఁడు= అగ్నిదేవుడు; పుట్టెన్= పుట్టాడు; శిఖండియున్=(ఇంక) శిఖండి; అనిలుని-అంశంబునన్= వాయుదేవుడి అంశతో; జనియించెన్= పుట్టాడు; అస్త్రగురుండు అయి= (కురుకుమారులకు అస్త్రవిద్యను నేర్పే ఆచార్యుడు) ద్రోణుడుగా; అనిమిష-గురుఁడు= దేవతలకు గురువైన బృహస్పతి; జనియించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు ద్రౌపదికి తోబుట్టువుగా ధృష్టద్యుమ్నుడనే పేరుతో పుట్టాడు. వాయుదేవుడి అంశతో శిఖండి పుట్టాడు. బృహస్పతి ద్రోణాచార్యుడుగా జన్మించాడు.

**తే. వినుము వసుశక్తి గాంగేయుఁ డనఁగ జనన । మొందె; రుద్రాంశమున ద్రౌణి యుదయ మయ్యెఁ**
**దెలియఁ జెప్పితిఁ గొందఱు కలరు మఱియు । నిర్జరాసురాంశముల జన్మించినారు.' 113**

**ప్రతిపదార్థం:** వినుము= గాంధారీ! వినుము; గాంగేయుఁడు= గంగ కొడుకు (భీష్ముడు); అనఁగన్= అనే విధంగా; వసుశక్తిన్= అష్టవసువులలో (అష్టమ) చివరివాడు; జననము-ఒందెన్= పుట్టాడు; ద్రౌణి= ద్రోణపుత్రుడైన అశ్వత్థామ; రుద్ర-అంశమునన్= రుద్రుడి అంశతో; ఉదయము-అయ్యెన్= జన్మించాడు; తెలియన్-చెప్పితిన్= ఈ విషయాలు (ఇన్ని) నీకు తెలియజేశాను; నిర్జర+ అసుర-అంశములన్= దేవతల, రాక్షసుల అంశలతో; జన్మించినవారు= పుట్టినటువంటి వారు; మఱియున్= ఇంకా; కొందఱు= కొంతమంది; కలరు= ఉన్నారు.

**తాత్పర్యం:** గాంధారీ! వినుము (అష్టమ) వసువే గంగకు కొడుకుగా భీష్ముడి అంశతో జన్మించాడు. అశ్వత్థామ రుద్రాంశభవుడు. ఈ విధంగా కొందరి విషయం నీకు తెలియజేశాను. దేవరాక్షసఅంశలతో పుట్టినవారు ఇంకా కొంతమంది ఉన్నారు'.

**క. అని పలికి 'మీ మనంబుల । వనట సమస్తంబుఁ బుచ్చి వైచెద నాతోఁ**
**జనుదెండు మీరు గంగకుఁ । గనియెద రనిఁ దెగిన బంధుగణముల నచటన్.' 114**

**ప్రతిపదార్థం:** అని= అనేవిధంగా; పలికి= చెప్పి; మీ మనంబులన్= మీమీ హృదయాలలో ఉన్న; వనట= దుఃఖం; సమస్తంబున్= మొత్తమూ; పుచ్చివైచెదన్= తొలగిస్తాను; నాతోన్= నాతో (వ్యాసుడితో కలిసి; మీరు= మీరందరూ; గంగకున్= గంగానది వద్దకు; చనుదెండు= రండి; అనిన్= యుద్ధంలో; తెగిన= మరణించిన; బంధుగణములన్= మీ మీ చుట్టాలను; అచటన్= ఆ గంగవద్ద; కనియెదరు= చూస్తారు.

**తాత్పర్యం:** అనిచెప్పి వ్యాసుడు, 'మీ మనసులలో ఉన్న దుఃఖం మొత్తం పూర్తిగా పోగొట్టుతాను. నాతో గంగానది వద్దకు రండి. యుద్ధంలో మరణించిన మీమీ బంధువులను ఆ గంగానది వద్ద చూస్తారు.'

**తే.** **అనుచు నుత్థితుఁ డగుటయు నార్పులెలుఁగు। లాకసం బంద ధృతరాష్ట్రుఁ డాది గాఁగఁ**
**గలుగు నా సర్వజనులు నొక్కటఁ గడంగి। యరిగి రమ్మునినాథుతోఁ గురువరేణ్య!** **115**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= ఓ జనమేజయ మహారాజా!; అనుచున్= ఆ విధంగా చెప్పుతూనే; ఉత్థితుండు+అగుటయున్= (వ్యాసమహర్షి ఆసనంనుండి) లేచినవాడు కాగా; ఆర్పు+ఎలుఁగులు= ఆనందం నిండిన అరుపులు (కంఠ ధ్వనులు); ఆకసంబు-అందన్= నింగిని తాకుతుండగా; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడు; ఆది-కాఁగన్= మొదలుగా; కలుగు= అక్కడ ఉన్న; సర్వజనులున్= జనం అంతా; ఒక్కటన్= ఒక్కసారిగా; కడంగి= పూని; ఆ మునినాథుతోన్= ఆ వ్యాసమహర్షితో కలిసి; అరిగిరి= (గంగానదికి) వెళ్ళారు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! వ్యాసమహర్షి అట్లా అంటూనే ప్రయాణానికి సిద్ధమై ఆసనం నుండి లేచి నిలబడగా, ఆనందంతో నిండిన అరుపులు ఆకాశం అంటుతుండగా, ధృతరాష్ట్రుడు మొదలైన అక్కడి జనమంతా ఒక్కసారిగా లేచి ఆ వ్యాసమహర్షితో కలిసి గంగానదికి వెళ్లారు.

**క.** **అరుగఁగ మునిజనములు న। చ్చెరు వందుచు నమ్మునీంద్రు సేవించి మరు**
**త్సరిదుపకంఠ తలమునకు। నరిగిరి కౌతుకము మనములందు నెలకొనన్.** **116**

**ప్రతిపదార్థం:** అరుగఁగన్= ధృతరాష్ట్రాదులు ఆ విధంగా గంగకు బయలుదేరి వెళ్ళగా; మునిజనములున్= శతయూపుడు మొదలైన తాపసులు కూడా; అచ్చెరువు= ఆశ్చర్యం; అందుచున్= పొందుతూ; ఆ+ముని+ఇంద్రున్= మునులలో శ్రేష్ఠుడయిన ఆ వ్యాసుడిని; సేవించి= అర్చించి; మనములందున్= తమతమ మనసులలో; కౌతుకము= కుతూహలం; నెలకొనన్= చోటు చేసికొనగా; మరుత్= దేవతల; సరిత్= నది (గంగ) యొక్క; ఉపకంఠతలమునకున్= సమీపప్రాంతానికి; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** వ్యాసుడితో ధృతరాష్ట్రాది కురువంశ్యులు బయలుదేరి వెళ్ళుతుంటే, అక్కడే ఉన్న శతయూపుడు మొదలైన ఇతర మునులు గూడా వ్యాసవచనాలకు ఆశ్చర్యపడుతూ ఆయనను పూజించి మనసులలో (మృత వీరులను చూచే) కుతూహలం నిండగా, గంగాసమీపానికి వెళ్ళారు.

**వ.** **అట్లు పౌరజానపదసహితు లై సకలజనంబులుం జని సాత్యవతేయుండు వనుప భాగీరథీతీరంబున విడిసి; ర వ్విచిత్రచరిత్రుండు దన చేయంబూనిన పని మఱునాఁడు రేపకడ సేయువాఁడుగాఁ బలికిన నయ్యందఱు నద్దినశేషంబు నా యామినియును శతసంవత్సరంబులుంబోలె నుండ సూర్యోదయసమయం బగుటయుఁ**

**గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండును బాండుతనయులుం దపోధనులు నప్పారాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి; గాంధారీప్రముఖభామినులు నేతెంచి యొక్కవలన నతనిం గొలిచి యుండిరి; సర్వజనులు నఱ్ఱు లెత్తికొని యంతంత నిలిచిరి; తదనంతరంబ. 117**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారంగా; పౌర-జానపద-సహితులు+ఐ= నాగరులూ, పల్లీయులూ అయిన జనంతో కూడినవారయి; సకల జనంబులున్= అక్కడి వారందరూ; చని= గంగాతీరానికి పోయి; సాత్యవతేయుండు= (సత్యవతి కొడుకు) వ్యాసుడు; పనుపన్= అనుమతించగా; భాగీరథీతీరంబునన్= గంగానది ఒడ్డున; విడిసిరి= బసచేశారు; ఆ+విచిత్ర చరిత్రుండు= వింత నడవడి కలిగిన ఆ వ్యాసమహర్షి; తనచేయన్+పూనిన-పని= తాను చేస్తానన్న (మృతవీరులను చూపటం అనే) పనిని; మఱునాఁడు= తరువాతి రోజు; రేపకడ= ఉదయంపూట; చేయువాఁడుగాన్= చేస్తానని; పలికినన్= చెప్పగా; ఆ+అందఱున్= అది చూడ వచ్చిన వారు అందరూ; ఆ+దినశేషంబు= ఆరోజు పగలులో మిగిలిన భాగమూ; ఆ+యామినియున్= ఆ రాత్రీ; శతసంవత్సరంబులున్+పోలెన్= నూరేండ్లంతగా; ఉండన్= దీర్ఘమై ఉండగా; సూర్య-ఉదయంబు= ప్రొద్దుపొడవటం; అగుటయున్= కావటంతో; కాల+ఉచిత కృత్యంబులు= ప్రాతఃకాలంలో ఆచరించవలసిన పనులూ; ఆచరించి= చేసి; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడూ; పాండుతనయులున్= పాండవులూ; తపోధనులు= (శతయూపాది) మునులూ; ఆ+పారాశర్యుపాలికిన్= (పరాశరుడి కొడుకు అయిన) ఆ వ్యాసమహర్షి వద్దకు; అరిగి= పోయి; ఆ+మునివరున్= ఆ వ్యాసమహర్షిని; పరివేష్టించిరి= చుట్టుకొన్నారు; గాంధారీ-ప్రముఖ-భామినులున్= గాంధారి మొదలైన స్త్రీలు కూడా; ఏతెంచి= వ్యాసుడి వద్దకు వచ్చి; అతనిన్= ఆ వ్యాసుడిని; కొలిచి= సేవించి; ఒక్కవలనన్= ఒకవైపుగా; ఉండిరి; సర్వజనులున్= మిగిలిన ముని, పౌర, జానపద జనులందరూ; అఱ్ఱులు= మెడలు; ఎత్తుకొని= పైకి చాచికొని; (వ్యాసుడిని చూస్తూ); అంత+అంత= అక్కడక్కడ; నిలిచిరి= నిలువబడ్డారు; తదనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** ఆ విధంగా నగరవాసులూ, పల్లెవాసులతో సహా వ్యాస ధృతరాష్ట్రాదులందరూ కదలి గంగ వద్దకు వెళ్లారు. వ్యాసుడి ఆజ్ఞతో, గంగ ఒడ్డున ధృతరాష్ట్రాదులు బస చేశారు. అపుడు వింతపోకడలు గలిగిన ఆ వ్యాసుడు తాను చేయవలసిన మృతకురువీరులను చూపించేపని మరునాడు ఉదయం చేస్తా ననటంతో, మిగిలిన ఆ పగలూ, ఆరోజు రాత్రీ వందసంవత్సరాలవలె గడిపారు. అంతా సూర్యుడు ఉదయించిన వెంటనే ప్రాతఃకాలంలో చేయవలసిన పనులన్నీ పూర్తి చేసికొని ధృతరాష్ట్రుడూ, పాండవులూ, మునులూ వ్యాసుడి వద్దకు వెళ్ళి ఆయనచుట్టూ చేరారు. గాంధారి మొదలైన స్త్రీలు కూడా వచ్చి వ్యాసుడిని సేవించి ఒక ప్రక్కగా నిలుచున్నారు. ఇంక మిగిలిన జనమంతా వచ్చి వ్యాసుడివైపు మెడలు చాచి చూస్తూ అక్కడక్కడా నిలబడి ఉన్నారు. తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం)

వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణ మృతుల రావించి చూపుట (సం॥ 15-40-4)

**సీ.** **సాత్యవతేయుండు జాహ్నవీసలిలావ । గాహన మొనరించి గారవమున**
**నింపారు నెలుఁగున 'నిందు రం' డనవుడు । నీ కేమి సెప్పదు? నీటియందు**
**రవ మగ్గలముగ రారాజుఁ దమ్ములుఁ దత్కు । మారవర్గము నభిమన్యుఁ డాది**
**యగు పాండుపౌత్రులు నర్కజుండును బాహ్లి । కప్రముఖాఖిల కౌరవులును**

**తే.** **ద్రుపదమాత్స్యులు వారి బంధులును శకుని । యును దదీయానుజులును నాతని తనూజ**
**రాజియును భీష్మగురులఁ బురస్కరించి । కొనుచుఁ దమదివ్యదేహముల్ కొమరు మిగుల. 118**

**ప్రతిపదార్థం:** సాత్యవతేయుండు= (సత్యవతి కొడుకు) వ్యాసుడు; జహ్నవీ-సలిల-అవగాహనము= గంగనీటిలో మునుక; ఒనరించి= చేసి; గారవమునన్= వాత్సల్యంతో; ఇంపు+ఆరు+ఎలుఁగునన్= మాధుర్యం నిండిన (కంఠస్వరం) గొంతుతో; ఇందున్= ఇచ్చటికి; రండు= (మృత వీరులూ!) రండి; అనవుడున్= అనగానే; నీకున్= నీకు (జనమేజయుడితో); ఏమి చెప్పుదున్?= (నేను, వైశంపాయనుడు) ఏమి చెప్పేది?; నీటియందున్= ఆ గంగనీటిలో; రవము= శబ్దం; అగ్గలముగన్= అధికంగా; రారాజున్= దుర్యోధనుడూ; తమ్ములున్= దుశ్శాసనాదులయిన దుర్యోధనుడి తమ్ముళ్ళూ; తద్-కుమార వర్గమున్= లక్ష్మణాదులయిన ఆ ధార్తరాష్ట్రుల కుమార సమూహము; అభిమన్యుఁడు= అభిమన్యుడు; ఆది= మొదలు; అగు-పాండుపౌత్రులున్= అయినటువంటి పాండురాజు మనుమళ్ళూ; అర్కజుండును= (సూర్యుడివలన పుట్టిన) కర్ణుడూ; బాహ్లిక= బాహ్లికుడు; ప్రముఖ= మొదలుగా; అఖిల= సమస్తమైన; కౌరవులును= కురువంశ్యులూ; ద్రుపద-మాత్స్యులు= ద్రుపదుడూ (మత్స్యదేశం రాజైన) విరాటుడూ; వారి బంధులును= ధృష్టద్యుమ్నాదులైన ద్రుపద విరాటుల (పుత్రాది) బంధువులూ; శకునియును= శకునీ; తదీయ-అనుజులును= ఆ శకుని సోదరులూ; అతని తనూజ-రాజియును= వారి కుమారవర్గమూ; భీష్మ-గురులన్= భీష్ముడినీ, ద్రోణుడినీ; పురస్కరించుకొనుచున్= ముందుగా ఉంచుకొని; తమ-దివ్య దేహముల్= తమ తమయొక్క ప్రకాశించేటటువంటి అలౌకిక శరీరాలు; కొమరు= సౌకుమార్యం; మిగులన్= అతిశయించగా.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి గంగాజలంలో మునుకవేసి ప్రేమతో తియ్యనైన గొంతుతో ఇక్కడికి (భారతయుద్ధంలో మరణించిన వారిని) రండి అన్నాడు. జనమేజయ మహారాజా! నీ కేమని చెప్పేది? అపుడు ఆ నీళ్ళలోనుండి పెద్దగా చప్పుడు ఆరంభమైంది. దానితోటే, దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ, ఆ ధార్తరాష్ట్రుల కొడుకులూ మొదలైన ధృతరాష్ట్రుడి కుటంబం వారూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ మొదలైన పాండురాజు కుటుంబం వారూ, కర్ణుడూ, ఇంకా బాహ్లికుడు (సోమదత్తుడు) మొదలైన కురువీరులందరూ, ద్రుపదుడూ, విరాటుడూ (ధృష్టద్యుమ్నుడూ, ఉత్తరుడూ మొదలైన) వాళ్ళ చుట్టాలూ, శకునీ, అతడి సోదరులూ, కొడుకులూ భీష్ముడూ, ద్రోణుడూ మొదలుగా గల వాళ్ళు తమ దివ్యశరీరాలు ప్రకాశిస్తుండగా కనబడ్డారు.

**ఆ. దివ్య మాల్యములును దివ్యాంబరంబులు। దివ్య భూషణములు దివ్యలేప**
**నములుఁ జెన్నుఁ జేయఁ దమ మిత్ర సుభటసం। దోహములును దారుఁ దోఁచి రధిప! 119**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ జనమేజయ మహారాజా!; దివ్య-మాల్యములును= స్వర్గ (ఊర్ధ్వ) లోకానికి సంబంధించినటువంటి పూమాలలూ; దివ్య+అంబరంబులు(న్)= దివ్యములైనటువంటి వస్త్రాలూ; దివ్య-భూషణములు= దివ్యములైన ఆభరణాలూ; దివ్య-లేపనములు(న్)= దివ్యములయిన మైపూతలూ; చెన్నున్+చేయన్= అందాన్ని కలిగిస్తుండగా; తమ-మిత్ర-సుభట-సందోహములును= తమకు మిత్రుల బంటుల సమూహాలూ; తారున్= తామూ (దుర్యోధనాదులూ); తోఁచిరి= కనబడ్డారు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఆ దుర్యోధనాదులు మానవలోకానికి అతీతమయిన లోకాలకు సంబంధించిన పూలమాలలూ, అటువంటి దివ్యమయిన వస్త్రాలూ, దివ్యమైన అలంకారాలూ, దివ్యమైన మైపూతలూ అందగిస్తుండగా, తమతమ మిత్రుల, బంట్ల సముదాయాలూ తామూ కనబడ్డారు.

**వ. అట్టియెడ. 120**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో..

**తాత్పర్యం:** (దుర్యోధనాదులైన భారతయుద్ధంలో మరణించిన వారు అందరూ గంగలో తోచిన) ఆ సమయాన.(తరువాతి పద్యంతో అన్వయం)

**క. తగ నా కురువృద్ధునకు నొ। సఁగె నాఁటికి నెల్లదృష్టి సాత్యవతేయుం**
**డగణితతపఃప్రభావం। బు గని యధిక విస్మయంబుఁ బొందఁగ జనముల్. 121**

**ప్రతిపదార్థం:** అగణిత-తపస్+ప్రభావంబు= గణించడానికి సాధ్యంగాని (వ్యాసుడి) తపఃశక్తి; కని= చూచి; జనముల్= అక్కడివారు అందరూ; విస్మయంబున్= ఆశ్చర్యాన్ని; పొందఁగన్= పొందుతుండగా; సాత్యవతేయుండు= వ్యాసుడు; ఆ కురు వృద్ధునకున్= ఆ ధృతరాష్ట్రుడికి; నాఁటికిన్= అప్పటికి; తగన్= తగినట్లుగా; ఎల్లదృష్టిన్= పూర్తిగా చూపును; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** తన తపః ప్రభావాన్ని చూచి జనమంతా ఆశ్చర్యపడేవిధంగా వ్యాసుడు ఆ ధృతరాష్ట్రుడికి అప్పటికి తగినట్లుగా సంపూర్ణదృష్టిని ఇచ్చాడు.

**వ. అవ్విశేషంబు విని యద్భుత ప్రమద భరితయై నిజనయనంబుల బంధించిన పట్టం బపనయించి గాంధారి యును గనుంగొనుచుండ. 122**

**ప్రతిపదార్థం:** గాంధారియును= గాంధారి కూడా; ఆ+విశేషంబు= ధృతరాష్ట్రుడికి దృష్టి రావటం అనే విశేషం; విని= ఆలించి; అద్భుత-ప్రమద-భరిత+ఐ= ఆశ్చర్యంతోనూ, సంతోషంతోనూ నిండినది అయి; నిజ-నయనంబులన్= తన కళ్ళకు; బంధించిన-పట్టంబు= కట్టిన వస్త్రాన్ని; అపనయించి= తొలగించి; కనుంగొనుచున్-ఉండన్= చూస్తూ ఉండగా.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడికి చూపురావటం అనే విశేషం విని ఆశ్చర్యానందాలతో గాంధారి కూడా తన కళ్ళకు కట్టిన వస్త్రాన్ని తొలగించి (దుర్యోధనాదులను) చూస్తుండగా, (తరువాతి పద్యంతో అన్వయం)

**క. అవ్విధమునఁ దోఁచిన మఱి। నవ్వుచుఁ దెగడుచును బెరసి నరవర! పగ లే**
**కవ్వీరవరులు నెయ్యము। నివ్వటిలఁగ విలసనములు నెఱయ మెఱయఁగన్. 123**

**ప్రతిపదార్థం:** నరవర!= ఓ జనమేజయ మహారాజా!; ఆ+విధమునన్= ఆ తీరుగా; తోఁచినన్= యుద్ధ మృతవీరులు కనబడగా; మఱి= అపుడు; ఆ+వీరవరులు= ఆ దుర్యోధనాదులు; నవ్వుచున్= నవ్వుతూ; తెగడుచున్= పరిహాసాలు ఆడుకొంటూ; బెరసి= సంఘీభావంతో కలిసి; పగ= విరోధం; లేక= లేకుండా; నెయ్యము= స్నేహం; నివ్వటిలఁగన్= అతిశయించగా; విలసనములు= కాంతులు; నెఱయన్= సంపూర్ణంగా; మెఱయఁగన్= మెరుస్తూ ఉండగా.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! ఆ విధంగా (గాంధారీధృతరాష్ట్రులతో కూడా అందరూ చూస్తూ ఉండగా) కనబడిన దుర్యోధనాదులైన వీరశ్రేష్ఠులు, నవ్వుతూ, పరిహాసాలాడుకొంటూ, కలిసి మెలిసి శత్రుత్వం లేకుండా, స్నేహం వర్ధిల్లుతుండగా, కాంతులు బాగా ప్రకాశిస్తూ ఉండగా (ఉన్నారు.)

**తే. చతురగంధర్వు లప్సరోజనులు గాన। ములఁ బ్రమోద మొనర్పంగఁ బొగడ వంది**
**సమితి నిరహంకృతులు హృదయముల గౌర। వములు తెల్లంబు సేయంగ వచ్చి రొప్పి. 124**

**ప్రతిపదార్థం:** చతుర-గంధర్వులు= నేర్పరులయిన గంధర్వులు; అప్సరస్+జనులు= అప్సరసలు; గానములన్= వివిధములైన పాటలతో; ప్రమోదము= (తమకు) సంతోషం; ఒనర్పంగన్= కలిగిస్తుండగా; వంది-సమితి= భట్రాజుల బృందం; పొగడన్= (తమను) స్తుతిస్తుండగా; హృదయముల గౌరవములు= సంకుచితపు ఆలోచనలు లేని ఉదారబుద్ధిని; తెల్లంబు= స్పష్టం; చేయంగన్= చేస్తుండగా; నిర్+అహంకృతులు= అహంకారం లేనటువంటి వారుగా (దుర్యోధనాదులు); ఒప్పి= ప్రకాశిస్తూ; వచ్చిరి= ధృతరాష్ట్రాదులవద్దకు వచ్చారు.

**తాత్పర్యం:** నిపుణులైన గంధర్వులూ, అప్సరసలూ వివిధగానాలతో సంతోషపెట్టుతుండగా, స్తోత్రపాఠకుల సమూహం స్తుతిస్తుండగా, అహంకారం లేనటువంటి ఆ దుర్యోధనాదులు తమ ఉదారబుద్ధిని ప్రకటిస్తూ, ధృతరాష్ట్రాదుల సమీపానికి వచ్చారు.

**వ.** **ఇట్లు వచ్చి సకలబంధుజనంబులకుం బరమప్రమోదం బావహిల్లం గలిపి సముచితాచారంబులు నడపి; రా రెండు దెఱంగులవారలు నర్హ ప్రకారంబులఁ బితామహాచార్య శిష్య మాతృ మాతామహ పితృపితామహ భ్రాతృ జామాతృ పుత్రపుత్రీభగినీ పౌత్ర దౌహిత్ర శ్వశుర శ్వశ్రూస్నుషా మాతుల స్యాలక ప్రియ ప్రియా మిత్ర సమాగమసుఖంబు లనుభవించుచు.** **125**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా (అత్యంత వైభవంతో దుర్యోధనాదులు); వచ్చి= (ధృతరాష్ట్రాదుల వద్దకు) వచ్చి; సకలబంధు జనంబులకున్= అక్కడ ఉన్న బంధువులకు అందరికీ; పరమ-ప్రమోదంబు= ఉత్తమమైన సంతోషం; ఆవహిల్లన్= కలుగగా; కలిసి= కూడుకొని; సముచిత-ఆచారంబులు= తగువిధంగా (పెద్దలకు ప్రణామాలూ, పిన్నలకు ఆశీస్సులూ ఇత్యాదిగా) చేయవలసిన పనులు; నడపిరి= ఆచరించారు; ఆ రెండు దెఱంగులవారలు= ఆ రెండు విధాలయిన వారు (దివ్య దేహాలతో ఉన్న దుర్యోధనాదులూ, మానవులైన ధృతరాష్ట్రాదులూ); అర్హప్రకారంబులన్= తగువిధంగా; పితామహ= భీష్ముడితో; ఆచార్య= ద్రోణుడితో; శిష్య= శిష్యులతో; మాతృ= తల్లులతో; మాతామహ= తల్లులయొక్క తండ్రులతో; పితృ= తండ్రులతో; పితామహ= తండ్రులయొక్క తండ్రులతో; భ్రాతృ= సోదరులతో; జామాతృ= అల్లుళ్ళతో; పుత్ర= కొడుకులతో; పుత్రీ= కూతుళ్ళతో; భగినీ= అక్కా, చెల్లెళ్ళతో; పౌత్ర= (కొడుకు కొడుకు) మనవళ్ళతో; దౌహిత్ర= కూతురు కొడుకులతో; శ్వశుర= మామలతో; శ్వశ్రూ= అత్తలతో; స్నుషా= కోడళ్ళతో; మాతుల= మేనమామలతో; స్యాలక= బావమరదులతో; ప్రియ= (భర్త) ప్రియులతో; ప్రియా= ప్రియురాండ్ర (భార్యల)తో; మిత్ర= స్నేహితులతో; సమాగమ-సుఖంబు= కలియటంలోని ఆనందం; అనుభవించుచు(న్)= పొందుతూ.

**తాత్పర్యం:** ఈ విధంగా వైభవంతో వచ్చి దుర్యోధనాదులు అక్కడ ఉన్న తమ చుట్టాలందరికీ అత్యుత్తమమైన ఆనందం కలిగించి, చేయవలసిన సత్కారాది ఆచారాలు చేశారు. అపుడు ఆ రెండు విధములైన వారూ (దుర్యోధనాది దివ్యశరీరులూ, ధృతరాష్ట్రాది మానవ శరీరులూ) తగువిధంగా పరస్పరం-భీష్మ ద్రోణులూ (గురువులూ), శిష్యులూ, తల్లులూ, వారి (తల్లుల) తండ్రులూ, తండ్రులూ, వారి (తండ్రుల) తండ్రులూ, సోదరులూ, అల్లుళ్ళూ, కొడుకులూ, కూతుళ్ళూ, అక్క చెల్లెళ్ళూ, కొడుకు కొడుకులూ, కూతురు కొడుకులూ, మామలూ, అత్తలూ, కోడళ్ళూ, మేనమామలూ, బావమరదులూ, భర్తలూ, స్నేహితులూ కలిసికొనటంలోని ఆనందం అనుభవిస్తూ, (తరువాతి పద్యంతో అన్వయం)

**తే.** **అనఁగి పెనఁగి నాఁడెల్ల నిచ్ఛానురూప। వృత్తి వర్తిల్లుచుండి; రవ్విధము సకల**
**జనుల నద్భుతరసమున మునుఁగఁ జేసె;। నే మనఁగ వచ్చు నా సంయమీంద్రు మహిమ.** **126**

**ప్రతిపదార్థం:** నాఁడు= ఆరోజు; ఎల్లన్= మొత్తమూ; ఇచ్ఛా+అనురూప-వృత్తిన్= తమ తమ ఇష్టానికి సరి అయిన ప్రవర్తనతో; అనఁగి-పెనఁగి= (అందరూ) కలిసి, మెలిసి; వర్తిల్లుచుండిరి= ఉన్నారు; ఆ+విధము= ఆ తీరు; సకల-జనులన్= అక్కడి వారందరినీ; అద్భుత-రసమునన్= ఆశ్చర్యం అనే రసం (ప్రవాహం)లో; ముసుఁగన్-చేసెన్= ముంచింది; ఆ-సంయమి+ఇంద్రు-మహిమ= మునిశ్రేష్ఠుడయిన ఆ వ్యాసుడి మాహాత్మ్యం, (జనమేజయా); ఏమి-అనఁగన్-వచ్చున్?= ఏతీరుగా చెప్పటానికి సాధ్యం అవుతుంది?

**తాత్పర్యం:** ఆరోజంతా వాళ్ళు అందరూ తమ ఇష్టం వచ్చినట్లుగా, కలిసి మెలిసి వ్యవహరించారు. ఆ విధంగా (దివ్యులు మానవులతో స్వస్వరూపంతో వచ్చి కలిపి ఉండటం) అందరినీ ఆశ్చర్య ప్రవాహంలో ముంచింది. (జనమేజయా!) మునిశ్రేష్ఠుడైన ఆ వ్యాసుడి మహిమ ఏమని చెప్పటానికి సాధ్యం అవుతుంది?

**వ. మఱునాఁడు రేపకడ యప్పారాశర్యుండు ననుప నయ్యిరు దెఱంగులవారలుం బరస్పరామంత్రణంబు సేసి; రాశూరజనంబులు తమతమలోకంబులకుం జనువారై జాహ్నవీజలంబులం బ్రవేశింప, నన్నిలింపవందనీయుండు దానును జొచ్చి యచ్చటినుండి 'పతుల ననుగమింప వలసిన యంగనలు గంగాతోయంబులంగ్రుంకుటకు రం 'డనిన విని విధవలగు వీరభార్య లెల్లను ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ ధర్మనందనుల యనుజ్ఞల గొని రయంబునం జని భాగీరథీ సలిలమగ్నలై మానుష దేహంబులు విడిచి దేవతనువులు దాల్చి దివ్యాలంకార సమలంకృతమూర్తులై మగలం గలసి; రవ్విశేషంబు చూచి సర్వజనులు నత్యంతాశ్చర్యసంతోషాధీన మానసులై రని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** మఱునాఁడు= తరువాతిరోజు; రేపకడ= ఉదయానే; ఆ+పారాశర్యుండు= (పరాశరమహర్షి కొడుకైన) ఆ వ్యాసుడు; పనుపన్= పంపగా; ఆ+ఇరుదెఱంగులవారలున్= దేవ-మానుషదేహులైన ఆ రెండు విధాలవారూ; పరస్పర+ఆమంత్రణంబు; ఒకరినొకరు వీడుకోలును; చేసిరి= చెప్పుకొన్నారు; ఆ శూరజనంబులు= (యుద్ధంలో మరణించిన) ఆ (దుర్యోధనాది) వీరులు; తమతమ లోకంబులకున్= (రణ మరణానంతరం) ఎవరికి కలిగిన లోకాలకు వారు; చనువారు+ఐ= వెళ్ళేవారు అయి-(వెళ్ళుతూ) జాహ్నవీ- జలంబులన్= గంగ నీటిలోకి; ప్రవేశింపన్= చొరబడగా; ఆ+నిలింపవందనీయుండు= దేవతలచే నమస్కరింపదగిన వ్యాసుడు; తానును= తానుకూడా; చొచ్చి= గంగాజలంలో ప్రవేశించి; అచ్చటన్= అక్కడే; ఉండి= నిలిచి (ఇట్లా అన్నాడు); పతులన్= తమ తమ భర్తలను; అనుగమింప(న్) వలసిన-అంగనలు= అనుసరించి వెళ్ళవలసిఉన్న స్త్రీలు; గంగా తోయంబులన్= గంగానదీ జలంలో; క్రుంకుటకు(న్)= మునగడానికి; రండు= రండి; అనినన్= అని (వ్యాసుడు) పల్కగా; విని= ఆలకించి; విధవలు= భర్తను కోల్పోయిన వారు; అగు-వీర- భార్యలు= అయినటువంటి వీరుల భార్యలు; ఎల్లను= అందరూ; ధృతరాష్ట్ర-గాంధారీ-కుంతీ-ధర్మనందనుల-అనుజ్ఞలు= ధృతరాష్ట్రుడియొక్క, గాంధారియొక్క, కుంతియొక్క, ధర్మరాజు యొక్క అనుమతులు; కొని= స్వీకరించి; రయంబునన్= వేగంగా; చని= వెళ్ళి; భాగీరథీ-సలిల-మగ్నలు= గంగానదీ జలంతో మునిగినవారు; ఐ= అయి; మానుషదేహంబులు= మనుష్యులకు సంబంధించిన శరీరాలను; విడిచి= వదలి; దివ్య తనువులు= దివ్యమైన శరీరాలు; తాల్చి= ధరించి; దివ్య-అలంకార- సమలంకృత- మూర్తులు= దివ్యమయిన ఆభరణాదులతో అలంకరించబడిన రూపం కలవారు; ఐ= అయి; మగలన్= తమ తమ భర్తలను; కలిసిరి= కూడుకొన్నారు; ఆ+విశేషంబు= ఆ సంఘటనను; చూచి= చూచి; సర్వజనులున్= అక్కడివారు అందరూ; అత్యంత-ఆశ్చర్య-సంతోష-అధీన-మానసులు= మిక్కిలి ఎక్కువైన ఆశ్చర్యానికీ, ఆనందానికీ, లోబడిన మనసులు కలవారు; ఐరి= అయ్యారు; అని= అనే ప్రకారంగా; చెప్పి= పలికి; వైశంపాయనుఁడు= వైశంపాయనముని; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మర్నాడు ఉదయాన్నే వ్యాసుడి నియోగం మీద రెండు విధాలైన వారూ (దివ్య-దుర్యోధనాది, మానుష ధృతరాష్ట్రాది) దేహులూ, పరస్పరం వీడ్కోలు తీసికొన్నారు. దివ్యదేహులయిన ఆ వీరులు (రణ మరణానంతరం సంభవించిన) ఎవరిలోకాలకు వారు వెళ్ళటం కొరకు గంగ నీళ్ళలోకి దిగారు. దేవతలచేత సైతం అర్చింపదగిన ఆ వ్యాసుడు తాను గూడా గంగలో దిగి అక్కడే ఉండి-'భర్తలను అనుసరించి వెళ్ళవలసిన స్త్రీలు ఈ గంగలో మునగ డానికి రండి' అన్నాడు. విధవలైన (ఆవీరుల) స్త్రీలు అందరూ, ధృతరాష్ట్ర గాంధారి, కుంతి, ధర్మరాజుల అనుమతి తీసికొని తొందరగా వెళ్ళి గంగలో మునిగి, మనుష్య శరీరాలు విడిచిపెట్టి దివ్యదేహాలు ధరించి, దివ్యాలంకారాలతో తమ తమ భర్తలను కలుసుకొన్నారు. ఆ సంఘటనను చూచి అక్కడి వారందరి మనసులూ ఆశ్చర్యంతో, సంతోషంతో నిండిపోయాయి' అని చెప్పి వైశంపాయనముని జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**సీ.** **'జననాథ! యీ ప్రియసంగమోత్సవ కథ। వినినఁ బఠించిన వేవిధములఁ**
**బరమప్రియము లిందుఁ బరలోకమున సంభ। వించు మనమ్మున కించు భంగి**
**బాంధవయోగశోభనము వర్తిల్లు; న। నాయాసమున నామయాపగమము**
**గలుగు; భూదేవనికాయంబునకు దీనిఁ। దగ వినిపించిన ధార్మికులకు**

**తే.** **నవ్యయానంద సంప్రాప్తి యావహిల్లుఁ;। దత్పరతఁ గొనియాడిన దైవతములు**
**నీచదశఁ బొందకుండంగఁ గాచి తిరిగి। మే లొనర్తురు భరతభూపాలవర్య!'** **128**

**ప్రతిపదార్థం:** జననాథ!= (జనమేజయ మహా) రాజా!; ఈ ప్రియసంగమ+ఉత్సవ-కథ= ఇష్టులైన వారు కలసికొన్న ఆనందదాయకమైన ఈ వృత్తాంతం; వినినన్= వినగా; పఠించినన్= చదివినా; వే విధములన్= అనేక ప్రకారాలుగా; ఇందున్= ఈ లోకంలోనూ; పరలోకమునన్= ఊర్ధ్వలోకాలలోనూ; పరమ-ప్రియములు= ఉత్తమములయిన అభీష్టాలు; సంభవించున్= నెరవేరుతాయి; మనమ్మునకున్= హృదయానికి; ఇంచు భంగిన్= ఇష్టం కలిగించే విధంగా; బాంధవ-యోగ-శోభనము= బంధువులను కలిసికొనే మేలు; వర్తిల్లున్= కలుగుతుంది; అనాయాసమునన్= సులువుగా; ఆమయ-అపగమము= రోగాలు తొలగిపోవటం; కలుగున్= సంభవిస్తుంది; దీనిన్= ఈ కథను; తగన్= సముచితంగా; ధార్మికులకున్= సత్యశౌచాది ధర్మ ఆచరణ శీలురకు; వినిపించినన్= చదివి వినిపిస్తే (అటువంటి); భూదేవనికాయమునకున్= బ్రాహ్మణుల సముదాయానికి; అవ్యయ+ఆనంద-సంప్రాప్తి= తరగని సంతోషం చేకూరటం; ఆవహిల్లున్= సంభవిస్తుంది; భరతభూపాల వర్య!= భరతవంశ రాజులలో శ్రేష్ఠుడా; జనమేజయా!; తత్పరతన్= ఈ కథపై తాత్పర్య (విశ్వాస) బుద్ధితో; కొనియాడినన్= ప్రశంసిస్తే; వారికి; దైవతములు= దేవతలు; నీచదశన్= తక్కువస్థితిని; పొందక+ఉండంగన్= పొందకుండా; కాచి= కాపాడి; తిరిగి= ఇంకా; మేలు= శుభం; ఒనర్తురు= కలుగజేస్తారు.

**తాత్పర్యం:** జనమేజయ రాజా! ఇష్టులైన వారు కలిసికొన్న ఈ వృత్తాంతాన్ని విన్నా, చదివినా, ఆ జనులకు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ అనేక విధాలుగా అత్యుత్తమాలు అయిన కోరికలు నెరవేరుతాయి. మనసారా సంతోషం కలిగేటట్లు తమతమ బంధువులను కలిసికొనే ఆనందకరమైన స్థితిని వారు పొందుతారు. ఏమాత్రం కష్టం లేకుండా వారి రోగాలు తొలగిపోతాయి. ఈ కథను సముచితంగా ధర్మబుద్ధులకు చదివి వినిపించిన బ్రాహ్మణులకు తిరుగులేని ఆనందం కలుగుతుంది. పూర్తి నమ్మకంతో దీనిని ప్రశంసిస్తే వారికి, దేవతలు ఏ విధమైన కష్టమూ కలుగకుండా; ఇంకా అధికంగా శుభం కలుగజేస్తారు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో 'ధృతరాష్ట్రుం డట్లు కృష్ణద్వైపాయన ప్రసాదలబ్ధం బైన తత్కాల కలితదృష్టి విశేషంబున బంధులోకంబు నాలోకించి మఱియేమి వర్తనంబున నుండెఁ? బాండవు లెట్లు వర్తించి? రెఱింగింపవే' యనుటయు నతనికి నతం డిట్లనియె. 129**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వైశంపాయనుడు చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు= జనమేజయుడు; వైశంపాయనుతోన్= వైశంపాయనమునితో (ఇట్లా అన్నాడు); ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; అట్లు= ఆ విధంగా; కృష్ణద్వైపాయన-ప్రసాద-లబ్ధము= వ్యాసమహర్షి యొక్క దయచేత పొందబడినది; ఐన= అయినటువంటి; తద్-కాల-కలిత-దృష్టి-విశేషంబునన్= ఆ సమయానికి మాత్రం కలిగిన ప్రత్యేకమైన చూపుతో; బంధులోకంబున్= భీష్మాది బంధు సమూహాన్ని; ఆలోకించి= చూచి; మఱి= ఆతరువాత; ఏమి= ఎటువంటి; వర్తనంబునన్= నడవడితో; ఉండెన్= ఉన్నాడు; పాండవులు= పాండురాజు కొడుకులు; ఎట్లు= ఏ విధంగా; వర్తించిరి?= ఉన్నారు?; ఎఱింగింపవే= తెలుపవలసింది; అనుటయున్= అనగా; అతనికిన్= ఆ జనమేజయుడితో; అతండు= వైశంపాయనుడు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయను డావిధంగా చెప్పగా విని జనమేజయుడు (వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు) 'ధృతరాష్ట్రుడు ఆ తీరుగా వ్యాసమహర్షి కరుణవలన పొందిన ఆనాటి చూపుతో, తన బంధువులను చూచి, ఆ తరువాత ఏ ప్రకారంగా నడచుకొన్నాడు? పాండవులు ఎట్లా ఉన్నారు? తెలియజేయవలసింది' అని ప్రార్థించగా అపుడు వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

ధృతరాష్ట్రుఁడు భాగీరథీ తీరంబుననుండి నిజాశ్రమంబు ప్రవేశించుట (సం.15-44-2)

**సీ. అ య్యద్భుతపువృత్త మమ్మెయిఁ జెల్లిన। ధృతరాష్ట్రమేదినీపతి తపస్వి**
**గణము సవినయంబుగా నిజస్థానయా। నమునకు నామంత్రితముగఁ జేసి**
**యాశ్రమభూమికి నరిగెఁ దోడన పాండు। రాజనందనులును రా నుదాత్త**
**తేజు సత్యవతీ తనూజు మున్నిడికొని। యప్పు డమ్మునిపతి యతనితోడ**

**తే. 'నీవు వేదశా స్త్రార్థముల్ భావితాత్ము। లగు మునీంద్రులచేఁ జెవులార వింటి,**
**కంటి తనయుల నీ కన్న కంటె నొప్పి। యుండుదురు వారు దివిసౌఖ్యయోగ మెసఁగ. 130**

**ప్రతిపదార్థం:** ఆ+అద్భుతపు వృత్తము= ఆశ్చర్యకరమైన ఆ (ప్రియ సమాగమ) సన్నివేశం; ఆ-మెయిన్= ఆ విధంగా; చెల్లినన్= పూర్తికాగా; ధృతరాష్ట్రమేదినీపతి= ధృతరాష్ట్ర మహారాజు; సవినయంబుగాన్= నమ్రతతో; తపస్విగణమున్= (శతయూపాది) మునుల సముదాయాన్ని; నిజ-స్థాన-యానమునకున్= తమ, తమచోట్లకు వెళ్ళటానికి; ఆమంత్రితముగన్= వీడ్కోలు చెప్పి; పాండురాజ-నందనులు= పాండవులు; తోడన= తనతో (వెంట); రాన్= వస్తూండగా; ఉదాత్త-తేజున్= మిక్కిలి ప్రకాశవంతుడైన; సత్యవతీ-తనూజున్= (సత్యవతి కొడుకు) వ్యాసుడిని; మున్ను-ఇడికొని= ముందు ఉంచుకొని; ఆశ్రమభూమికిన్= తన ఆశ్రమ ప్రదేశానికి; అరిగెన్= వెళ్ళాడు; అప్పుడు= ధృతరాష్ట్రుడు ఆశ్రమానికి వెళ్ళిన తరువాత; ఆ+మునిపతి= మునిశ్రేష్ఠుడైన ఆ వ్యాసుడు; అతని తోడన్= ఆ ధృతరాష్ట్రుడితో (ఇట్లా అన్నాడు); నీవు= నీవు; భావిత-ఆత్ములు= ఆత్మజ్ఞానులయిన; మునీంద్రులచేన్= మునిశ్రేష్ఠులవలన; వేద-శాస్త్ర-అర్థముల్= వేదాలయొక్క, ధర్మశాస్త్రాలయొక్క అంశాలను; చెవులు-ఆరన్= సమగ్రంగా; వింటి(వి)= విన్నావు; తనయుల(న్)= (మృతులయిన) కొడుకులను; కంటి(వి)= ఇపుడు చూచావు; వారు= ఆ కొడుకులు; దివి(న్)= స్వర్గంలో; సౌఖ్య-యోగము= ఆనందంతోడి సంబంధం; ఎసఁగన్= అతిశయించగా; నీ కన్న కంటెన్= ఇపుడు నీవు చూచిన దాని కంటె గూడా; ఒప్పి ఉండుదురు= సుఖంగా ఉంటారు.

**తాత్పర్యం:** ఆశ్చర్యకరమైన ఆ సంఘటన ఆ విధంగా పూర్తి కావటంతో; ధృతరాష్ట్రుడు వినయంతో వీడ్కోలు చెప్పగా (శతయూపాది) మునులు తమతమ నెలవులకు వెళ్ళిపోయారు. పాండవులు తనవెంట వస్తుండగా వ్యాసమహర్షిని ముందుంచుకొని ధృతరాష్ట్రుడు కూడా తన ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ వ్యాసుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు 'ఆత్మజ్ఞానులైన మునిశ్రేష్ఠుల వలన వేద శాస్త్రవిషయాలు సంపూర్ణంగా విన్నావు. యుద్ధంలో మరణించిన నీ కొడుకులను చూచావు. నీ కొడుకులు స్వర్గసుఖాలతో నీవు చూచినదానికంటె అధికంగా ఆనందంగా ఉన్నారు.

**ఉ. కావున నింక వారికయి కౌరవసత్తమ! యుమ్మలింప కా**
**త్మావిల భావముం దపము నగ్గలికం బెడఁబాపు నిన్ను సం**
**భావనఁ గొల్చి యొక్కనెల పాండవముఖ్యుఁడు నిల్చె నిష్ఠమై**
**నీ వనభూమి; నీ వసుమతీశ్వరుఁ బొమ్మనఁ గాదె వీటికిన్?' 131**

**ప్రతిపదార్థం:** కౌరవ సత్తమ!= కురువంశపు వారిలో శ్రేష్ఠుడా! ధృతరాష్ట్రా!; కావునన్= (నీ కొడుకులు సుఖంగా ఉన్నారు. నీవు చూచావు) కాబట్టి; ఇంకన్= ఇకపైన; వారికయి= కొడుకులను గూర్చి; ఉమ్మలింపక= కుమిలిపోక; ఆత్మ+ఆవిల-భావమున్= మనసులోని కలతనూ; తపము+అగ్గలికన్= తపస్సు యొక్క తీవ్రతను; పెడఁబాపు(ము)= విడిచిపెట్టుము, పాండవ ముఖ్యుఁడు= ధర్మరాజు; సంభావనన్= సగౌరవంగా; నిష్ఠమైన్= శ్రద్ధతో; నిన్నున్= నిన్ను; కొల్చి= సేవించి (సేవిస్తూ); ఈ వనభూమిన్= ఈ అరణ్యం (ఆశ్రమం)లో; ఒక్కనెల= ఒక మాసం పాటు; నిల్చెన్= ఉండిపోయాడు; ఈ వసుమతీ-ఈశ్వరున్= ఈ (ధర్మ) రాజును; వీటికిన్= (హస్తి) నగరానికి; పొమ్ము+అనన్+కాదె!= పొమ్మని చెప్పవచ్చుగదా!

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా! ధృతరాష్ట్రా! నీ కొడుకులను చూచావు. వాళ్ళు ఎంతో సుఖంగా ఉన్నారు కాబట్టి ఇకనైనా వాళ్ళను గూర్చి కుమిలిపోకుండా, మనసులో కలతనూ, తపసులో తీవ్రతనూ విడిచిపెట్టు! ధర్మరాజు పూజ్యభావంతో శ్రద్ధగా నిన్ను సేవిస్తూ అరణ్యంలో ఒక నెల రోజులు ఉన్నాడు. ఇంక ఈ (ధర్మ) రాజును రాజధానికి వెళ్ళుమని చెప్పవచ్చునుగదా!

**వ. అని చెప్పిన నప్పౌరవోత్తముం 'డట్ల చేసెద' నని పలికి యమ్మునిసత్తమునకుం బ్రణమిల్లి 'భవదీయకృపా విశేషం బునం గృతార్థుండనైతి' నని యతని నామంత్రితుం జేసినం, బాండవులుం దగ నప్పరమముని వీడ్కొని; రయ్యం దఱను దీవించి యమ్మహాత్ముం డంతర్హితుం డయ్యెఁ; దదనంతరంబ. 132**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; చెప్పినన్= వ్యాసమహర్షి చెప్పగా; ఆ+పౌరవ+ఉత్తముండు= పురువంశ శ్రేష్ఠుడైన ఆ ధృతరాష్ట్రుడు; అట్లు+అ= ఆ (వ్యాసుడు చెప్పిన) విధంగానే; చేసెదన్= చేస్తాను; అని-పలికి= అని చెప్పి; ఆ+ముని సత్తమునకున్= మునులలో శ్రేష్ఠుడయిన ఆ వ్యాసమహర్షికి; ప్రణమిల్లి= ప్రణామం చేసి; భవదీయ-కృపా-విశేషంబునన్= మీయొక్క, దయ పెంపుతో; కృతార్థుండన్= కోరికలు తీరిన వాడిని; ఐతిన్= అయ్యాను; అని= అనిచెప్పి; అతనిన్= ఆ వ్యాసుడిని; ఆ మంత్రితున్-చేసినన్= వీడుకోలు చెప్పగా; పాండవులున్= పాండవులు గూడా; ఆ+పరమమునిన్= ఆ ఉత్తమ ఋషిని; తగన్= సముచితంగా; వీడ్కొనిరి= వీడుకోలు చెప్పారు; ఆ+మహాత్ముండు= ఆ వ్యాసమహర్షి; ఆ+అందఱను= ధృతరాష్ట్రుడు మొదలైన అక్కడి వారిని అందరినీ; దీవించి= ఆశీర్వదించి; అంతర్హితుండు-అయ్యెన్= అదృశ్యం అయ్యాడు; తద్-అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** వ్యాసుడు ఆ విధంగా చెప్పగా ధృతరాష్ట్రుడు అట్లాగే చేస్తానని చెప్పి ఆ మహర్షికి ప్రణామం చేసి మీ దయవలన కృతార్థుడినయ్యాను అని చెప్పి వ్యాసుడికి వీడ్కోలు పలికాడు. అప్పుడు పాండవులుకూడా తగువిధంగా ఆ మహర్షికి వీడ్కోలు చెప్పారు. వ్యాసుడు వాళ్ళందరినీ ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు. ఆ తరువాత.

**సీ.** **ఆంబికేయుండు ధర్మాత్మజుఁ జిత్తసం। ప్రీతి మోమునఁ దోఁపఁ బేరఁ బిలిచి**
**'వసుమతీకార్య నిర్వహణంబు పెద్దకొ। ల్వున నుండి నీ వనుదినము నడప**
**కునికి కర్తవ్యమే? వినుకులు భీష్మాది। మహితులచేత సమగ్రభావ**
**మొందినయవి యింక నుపదేశ మేమియు। వలవదు; రంధ్ర మొవ్వని జనంబు**

**తే.** **వేచు; ననుజానుగతుఁడవై వేగపొమ్ము। దారయుతముగఁ బురికి నుదారచరిత!**
**నీ కతమ్మున మున్న నా శోక మెల్లఁ। బాసెఁ, దేజంబు సౌఖ్యానుభవముఁ గంటి.** **133**

**ప్రతిపదార్థం:** ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; మోమునన్= ముఖంమీద; చిత్తసంప్రీతి= మనసులోని సంతుష్టి; తోఁపన్= కనబడుతుండగా; ధర్మాత్మజున్= ధర్మరాజును; పేరన్= పేరుతో (ప్రేమగా); పిలిచి= దగ్గరకు పిలిచి; ఉదారచరిత!= ఉత్తమమైన నడవడి కలవాడా!; వసుమతీ-కార్య-నిర్వహణము= రాజ్యానికి సంబంధించిన (పాలన) పనులు నడపటం; పెద్ద= ప్రధానమైన అంశం; నీవు= నీవు; అనుదినము= ప్రతిరోజు; కొల్వునన్= కొలువులో; ఉండి= ఉనికిగలిగి; నడపక-ఉనికి= నిర్వహించకుండా ఉండటం; కర్తవ్యము+ఏ?= (నీకు) చేయదగినదేనా?; భీష్మ+ఆది-మహితుల చేతన్= భీష్ముడు మొదలైన గొప్పవారి వలన; వినుకులు= నీవు విని తెలిసికొన్న రాజనీతి విషయాలు; సమగ్ర-భావము= సంపూర్ణత్వాన్ని; ఒందినయవి= పొందాయి; ఇంకన్= ఇంక కొత్తగా; ఉపదేశము= చెప్పవలసినది; ఏమియున్= ఏమీ; వలవదు= లేదు; ఒవ్వనిజనంబు= గిట్టనివారు; రంధ్రము= (నీ) పొరపాటును గూర్చి; వేచున్= ఎదురుచుస్తూ ఉంటారు (అందుచేత); అనుజ-అనుగతుఁడవు+ఐ= తమ్ములచేత అనుసరించబడే వాడివి అయి; దార-యుతముగన్= భార్యలతో; వేగ= త్వరగా; పురికిన్= (హస్తి) నగరానికి; పొమ్ము= వెళ్ళుము; నీకతమునన్= నీకారణంగా; నా శోకము= (పుత్ర) దుఃఖం; ఎల్లన్= సమస్తం; మున్ను+అ= ఇంతకు మునుపే; (దుర్యోధనాదులను ఇట్లా చూడకముందే); పాసెన్= తొలగిపోయింది; తేజంబు(న్)= ఉత్సాహం; సౌఖ్య-అనుభవమున్= ఆనంద అనుభూతినీ; కంటి(న్)= పొందాను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు మనసులోని సంతోషం ముఖంపై వ్యక్తం అవుతుండగా ధర్మరాజును దగ్గరకు పిలిచి (ఇట్లా అన్నాడు). ఉత్తమమైన నడవడి కలవాడా! ధర్మరాజా! రాజ్యకార్యనిర్వహణం ప్రముఖమైన విషయం (కష్టంతో కూడినది). కొలువులో ఉండి నీవు స్వయంగా ప్రతిరోజూ రాజకార్యాలు నడపకుండా ఉండటం తగునా? భీష్ముడు మొదలైన మహాత్ముల వలన రాజనీతులు సమగ్రంగా తెలిసికొని ఉన్నావు. క్రొత్తగా చెప్పవలసిం దేమీ లేదు. గిట్టనిజనం నీ ప్రమాదం కొరకు వెదకుతూ ఉంటారు. అందుచేత నీవు వెంటనే తమ్ముళ్ళను వెంటబెట్టుకొని భార్యలతో హస్తినగరానికి వెళ్ళుము. నీ వల్ల నా (పుత్ర) శోకం పూర్తిగా ఇంతకు మునుపే పోయింది. ఉత్సాహమూ, సుఖానుభూతీ కలిగాయి.

**చ.** **'తపమునెడన్ మదీయమతి తత్పర గావున దాని కోర్తు నీ**
**వపగతఖేదమానసుఁడ వై నను నిం దతినిష్ఠ నొందఁ బం**
**చి పురజనంబు సమ్మదముఁ జెందఁగ సైనికు లుల్లసిల్లఁగా**
**నృపవర! యేఁగి రాజ్య భరనిర్వహణం బొనరింపు', నావుడున్.** **134**

**ప్రతిపదార్థం:** నృపవర!= (ధర్మ) రాజా!; మదీయ-మతి= నా మనస్సు; తపము-ఎడన్= తపస్సు విషయంలో; తత్పర= లగ్నమై ఉన్నది; కావునన్= అందుచేత; దానికిన్= తపస్సు; ఓర్తున్= సహించగలను (అందుచేత); నీవు= నువ్వు; అపగత-ఖేద-మానసుఁడవు= పోయిన విచారం కలిగిన మనస్సు గలవాడవు (మనసులో విచారం విడిచిపెట్టి); ఐ= అయి; ననున్= నన్ను; అతినిష్ఠన్= మిక్కిలి శ్రద్ధతో; ఇందున్= ఈ అరణ్యంలో; ఒందన్= (తపస్సు చేస్తూ) ఉండటానికి; ఎంచి= ఏర్పరచి; (నన్నిక్కడే వదలి) పురజనంబు= పౌరులు; సమ్మదమున్= సంతోషం; చెందఁగన్= పొందేటట్లు; సైనికులు= బంటులు; ఉల్లసిల్లఁగాన్= ఉత్సాహం పొందేటట్లుగా; ఏఁగి= (హస్తినగరానికి) వెళ్ళి; రాజ్య-భర-నిర్వహణంబు= సామ్రాజ్యపు-కార్యభారాన్ని వహించటం; ఒనరింపు(ము)= చేయుము; నావుడున్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడా ధర్మరాజా! నామనస్సు తపస్సు మీద లగ్నమై ఉన్నది. కాబట్టి తపస్సును నేను సులువుగా ఆచరించగలను.అందుచేత నీవు నిర్విచారంగా నన్ను ఈ అరణ్యంలో విడిచి, తపస్సు చేసికొననిచ్చి పౌరులు (రాజ్య ప్రజలు) సంతోషించేటట్లుగా, సైన్యం ఉత్సాహం చెందే విధంగానూ, హస్తినగరానికి వెళ్ళి రాజకార్యాలను నిర్వహించుము. అని ధృతరాష్ట్రుడు చెప్పగా (ధర్మరాజు ఇట్లా అన్నాడు.)

**సీ. ధర్మతనూజుఁ డాతని తోడ నిట్లను । 'నధిప! భీమాదుల నరుగఁ బనుపు**
**పుడమి రక్షింప; నీ యడుగులకడ నేను । నిలిచి మా తల్లుల నిన్నుఁ గొలిచి**
**యంచితతపమున కనుగుణం బైనట్టి । శుశ్రూషణము సేయుచును దపోని**
**యతితోడ నుండెద; ననవుడు గాంధారి । యి ట్లనఁ దగు 'నన్న 'యీవ కావె**

**తే. కురుకులమునకు సంరక్షకుఁడవు; నీవు । తండ్రులకుఁ బిండ మొసఁగఁ గర్తవు; భవజ్జ**
**నకునిపంపు చేయుము; భూజనము దలంక । కుండఁ బొ; మ్మది ప్రియము మా యుల్లములకు.' 135**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజుఁడు= ధర్మరాజు; అతని తోడన్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు= ఈవిధంగా; అనున్= అన్నాడు; అధిప!= (ధృతరాష్ట్ర) రాజా! పుడమి(న్)= రాజ్యాన్ని; రక్షింపన్= కాపాడటం కొరకు; అరుగన్= (రాజ్యానికి తిరిగి) వెళ్ళటానికి; భీమాదులన్= భీముడు మొదలైనవారిని; పనుపు(ము)= పంపించుము; నేను= నేను మాత్రం; నీ-అడుగుల-కడ(న్)= మీ పాదాల చెంతనే (ఇక్కడే, మీతో); నిలిచి= ఉండి; మా తల్లులన్= మా తల్లులు అయిన గాంధారినీ, కుంతినీ; నిన్నున్= నిన్నూ (ధృతరాష్ట్రుడిని); కొలిచి= సేవించి; అంచిత-తపమునకున్= మీ గొప్ప తపస్సుకు; అనుగుణంబు= తగినది; ఐన-అట్టి-శుశ్రూషణము= అయినటువంటి సేవ; చేయుచున్= చేస్తూ; తపస్-నియతి తోడన్= తపస్సుపై శ్రద్ధతో; ఉండెదన్= (ఇక్కడే) ఉంటాను; అనవుడు(న్)= అని ధర్మరాజు పలుకగా; గాంధారి= గాంధారి (ఇట్లా అన్నది); ఇట్లు= ఈవిధంగా; అనఁదగున్+అన్న!= అనటం ఉచితమేనా నాయనా?; కురుకులమునకున్= కురువంశానికి; సంరక్షకుఁడవు= కాపాడవలసినవాడివి; ఈవు+అ= నీవే; కావే!= కావా!; తండ్రులకున్= (పాండురాజు, మొ॥) వంశంలోని పెద్దలకు; పిండము= పిండాన్ని (శ్రాద్ధక్రియలలో); ఒసఁగన్= ఇవ్వటం; కర్తవు= చేయవలసిన వాడివి; నీవు= నీవే; భవత్-జనకుని-పంపు= నీ తండ్రి (ధృతరాష్ట్రుడు) చెప్పినది; చేయుము= ఆచరించుము; భూజనము= రాజ్యంలోని ప్రజలు; తలంకక-ఉండన్= కంగారు పడకుండా; పొమ్ము= (వెంటనే) రాజధానికి వెళ్ళుము; మా-ఉల్లములకున్= మా అందరి మనస్సులకూ; అది= నీవు రాజధానికి వెళ్ళటమే; ప్రియము= ఇష్టం.

**తాత్పర్యం:** ధర్మరాజు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'రాజా! రాజ్యాన్ని రక్షించడానికి (రాజధానికి) భీముడు మొదలైన వారిని పంపించుము. నేను ఇక్కడే మీ పాదాల వద్ద ఉండి, గాంధారినీ, కుంతినీ సేవించుకొంటూ, మీ తపస్సుకు తగినట్లుగా మీకు సేవ చేసికొంటూ తపోదీక్షలో ఉంటాను', ఆ మాటలకు గాంధారి ఇట్లా అన్నది. 'నాయనా! నీవు ఈ

విధంగా మాటాడవచ్చునా! కురువంశాన్ని రక్షించవలసిన వాడివి నీవే కదా! పాండుప్రభృతులైన తండ్రులకు శ్రాద్ధకర్మలు నిర్వహించటానికి నీవే కర్తవు. అందుచేత నీ తండ్రి (ధృతరాష్ట్రుడు) చెప్పినట్లు చేయుము. ప్రజలు కలత చెందకుండా వెంటనే రాజ్యానికి తిరిగి వెళ్ళు. అదే మా మనస్సులకు ఇష్టమైనది'.

**వ. అని పలికిన, నప్పాండవాగ్రజుండు పాండురాజాగ్రమహిషితో నిట్లనియె. 136**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పలికినన్= (గాంధారి) అనగా; ఆ+పాండవ+అగ్రజుండు= పాండురాజు కొడుకులలో పెద్దవాడైన ఆ ధర్మరాజు; పాండురాజ-అగ్ర-మహిషితోన్= పాండురాజు యొక్క పెద్ద భార్యతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** గాంధారి ఆ విధంగా అనటంతో ధర్మరాజు కుంతితో ఈ ప్రకారంగా అన్నాడు.

**ఆ. 'ఇట్లు మీరు నన్ను నెంతయుఁ దఱిమిన। విపినభూమి మిమ్ము విడిచి పోవ**
**నియ్యకొనదు నాదుహృదయంబు; మునువోలెఁ। గలుగ దిపుడు రాజ్యకాంక్ష నాకు. 137**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మీరు= మీరందరూ (గాంధారీ ధృతరాష్ట్రులూ, కుంతీ); తఱిమినన్= ఇక్కడినుంచి వెంటబడి వెళ్ళగొట్టినప్పటికీ; మిమ్మున్= మీ అందరినీ; విపినభూమిన్= అరణ్యదేశంలో; విడిచి= వదలిపెట్టి; పోవన్= రాజ్యానికి తిరిగి వెళ్లటానికి; నాదుహృదయంబు= నా మనస్సు; మును+పోలెన్= ఇదివరకటివలె; ఇయ్యకొనదు= అంగీకరించటం లేదు; నాకున్= నాకు; ఇపుడు= ఇప్పుడు; రాజ్యకాంక్ష= రాజ్యంమీద కోరిక; కలుగదు= లేదు.

**తాత్పర్యం:** ఈ విధంగా మీరందరూ నన్ను ఎంతగా వెంటబడి తరిమినెట్టినా మిమ్మల్ని ఈ అడవిలో విడిచి వెళ్ళటానికి ఇదివరకటివలె నా మనసు అంగీకరించటంలేదు. మునుపు ఉన్నట్లు ఇపుడు నాకు రాజ్యంమీద కోరిక లేదు.

**క. విను పాంచాలురు మాత్స్యులు। వనితా జనశేషులైరి; వారలు లేమిన్**
**జననీ! శూన్యంబై తోఁ। చినయది రాజ్యంబు నాదు చిత్తంబునకున్. 138**

**ప్రతిపదార్థం:** జననీ!= అమ్మా!; విను= వినుము; పాంచాలురు(న్)= పాంచాల (ద్రుపద) వంశపు వారూ; మాత్స్యులు= విరాటనగరస్థులూ; వనితా-జన-శేషులు= ఆడవాళ్ళు మాత్రమే మిగిలిన వాళ్ళు; ఐరి= అయ్యారు; వారలు= ఆ పాంచాల, మాత్స్యులు; లేమిన్= లేనందువలన; రాజ్యంబు= ఆ రాజ్యం; నాదు చిత్తంబునకున్= నా మనసుకు; శూన్యంబు+ఐ= నిర్జనం (సారం లేనిది)గా; తోఁచినయది= కనిపించింది.

**తాత్పర్యం:** అమ్మా! వినుము, పాంచాల వంశంలోనూ, మాత్స్యవంశంలోనూ (పురుషులంతా యుద్ధంలో మరణించటంతో) ఆడవాళ్లు మాత్రమే మిగిలారు. వాళ్ళు ఎవరూ లేకపోవటం చేత ఆ రాజ్యం నా బుద్ధికి శూన్యంగా కనబడుతున్నది.

**వ. అట్లుంగాక. 139**

**తాత్పర్యం:** అంతే కాకుండా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సమరము దీఱినకోలెను। శమనిరతా! నా మనంబు సారతపమునన్**
**రమియింపఁ గోరు యుష్మ। త్సమధిక తపమునకు నేను సందడి సేయన్.' 140**

**ప్రతిపదార్థం:** శమనిరతా!= స్థిరమైన అంతరింద్రియ నిగ్రహంకలదానా!. తల్లీ!; సమరము= కురుక్షేత్ర యుద్ధం; తీఱినకోలెను= పూర్తి అయినప్పటినుండి కూడా; నామనంబు= నా మనసు; సార-తపమునన్= పరమార్థమైన తపస్సులో; రమియింపన్= ఆసక్తం కావటాన్ని; కోరున్= వాంఛిస్తున్నది; నేను= (అటువంటి) నేను; యుష్మద్-సమధిక-తపమునకున్= తీవ్రమయిన మీ అందరి తపస్సుకు; సందడి= విఘ్నం; చేయన్= (నేను) కలిగించను.

**తాత్పర్యం:** అంతరింద్రియ నిగ్రహగుణంలో స్థిరమయిన తల్లీ! భారతయుద్ధం ముగిసినప్పటి నుండి నా మనస్సు తపస్సునందే ఆసక్తమై ఉన్నది. నేను మీ తీవ్రమైన తపస్సుకు ఏ విధంగానూ ఆటంకం కలిగించను.

**సీ.** **అన విని సహదేవుఁ డతనితో 'నేఁ దప। మాచరించెద; వీర లందఱకును**
**శుశ్రూష సేయు చియ్యాశ్రమంబున' నన్న। నక్కుమారునిఁ గుంతి యక్కుఁ జేర్చి**
**'వలవదు మీరు రా వలఁతులై మామీఁది। భక్తి నింపెసఁగ నీ పలుకు నెట్లు**
**పలుక మీ యునికి తపమునకు విఘ్నంబ। కాక యెఱిఁగి మీర లెల్లభంగి**

**ఆ.** **మాకు నియమవిధి సమాచరణములపై?। నింత యెఱిఁగి మీర లెల్లభంగి**
**నరుగు టొప్పుఁ గాని కురుకులోద్వహు మాట। గొనక యునికి చనదు తనయులార!** **141**

**ప్రతిపదార్థం:** అనన్= అని ధర్మరాజు పలుకగా; విని= ఆలకించి; సహదేవుఁడు= సహదేవుడు; అతనితోన్= ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు); ఈ+ఆశ్రమంబునన్= ఈ (ధృతరాష్ట్రుడి) ఆశ్రమంలోనే ఉండి; వీరలు-అందఱకున్= కుంతి మొదలైన వీరికందరికి; శుశ్రూష= సేవ; చేయుచున్= చేస్తూ; తపము= తపస్సు; నే(ను)= నేను; ఆచరించెదన్= చేస్తాను; అన్నన్= అనగా; కుంతి= కుంతీదేవి; ఆ+కుమారునిన్= చిన్నకొడుకైన ఆ సహదేవుడిని; అక్కున్+చేర్చి= తన గుండెలకు హత్తుకొని. (ఇట్లా అన్నది); తనయులార!= కొడుకులారా!; మీరు= మీరు (ధర్మరాజాదులు); రా-వలఁతులు= రాజధర్మంలో సమర్థులు; ఐ= అయిఉండి; మామీఁది భక్తిన్= తల్లిదండ్రులపైన పూజ్య (సేవా) భావంతో; ఇంపు= ఇష్టం; ఎసఁగన్= అతిశయించే విధంగా; ఈ పలుకులు= ఈ రాజ్యం వద్దు. తపస్సు చేస్తాం అనే మాటలు; ఇట్లు= ఈ విధంగా (నేనంటే నేనని పోటీపడి); పలుకన్= అనటం; వలవదు= తగదు; మీ+ఉనికి= ఇక్కడ మీ స్థితి (మీరు ఇక్కడ ఉండటం); తపమునకున్= (మా) తపస్సుకు; విఘ్నంబు+అ= అవరోధమే; కాక= అట్లా కాక; మాకున్= మాకు; నియమ-విధి-సమాచరణములపైన్= తాపసుల నియమాలూ, విధులూ ఆచరించటం విషయంలో; ఏక+అగ్రత= నిశ్చలబుద్ధి; ఎట్లు= ఏ విధంగా; కలుగున్?= సంభవిస్తుంది?; మీరు= మీరు; ఇంత= ఇది అంతా; ఎఱిఁగి= గ్రహించి; ఎల్లభంగిన్= అన్ని విధాలుగానూ; అరుగుట= (రాజ్యానికి తిరిగి) వెళ్ళటం; ఒప్పున్= మంచిది (కర్తవ్యం); కాని= అంతే తప్ప; కురుకుల-ఉద్వహు-మాట= కురువంశాన్ని ఉద్ధరించేవాడయిన ఈ ధృతరాష్ట్రుడి మాటను; కొనక= అనుసరించక; ఉనికి= ఇక్కడే ఉండటం; చనదు= తగినది కాదు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా పల్కటం విని సహదేవుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. (కుంతీ ప్రభృతులైన) వాళ్ళందరికీ సేవలు చేస్తూ ఈ ఆశ్రమంలో ఉండి తపస్సు నేను చేస్తాను. ఆ చిన్నవాడి (కొడుకు) మాటలకు కుంతి సహదేవుడిని, గుండెలకు హత్తుకొని ఇట్లా అన్నది. 'కొడుకులారా! మీరు రాజధర్మంలో సమర్థులయిఉండీ మా (తల్లిదండ్రుల) మీద సేవాదృష్టితో, ఈ మాటలు ఇట్లా అనటం తగదు. మీరు ఇక్కడ ఉండటం మా తపస్సుకు ఆటంకమే అవుతుంది తప్ప తాపసధర్మ ఆచరణంలో మాకు నిబ్బరమైన బుద్ధి ఎట్లా కలుగుతుంది? మీరు ఇది

మొత్తం గ్రహించి రాజ్యానికి తిరిగి వెళ్ళటమే అన్ని విధాలుగానూ ఉచితం. కురువంశ-ఉద్ధారకుడైన ఈ ధృతరాష్ట్రుడి మాట వినకుండా మీరు ఈ ఆశ్రమంలో ఉండిపోవటం ఉచితం కాదు'.

**వ. 'మీకు సర్వకార్యంబుల యెడను శుభంబులయ్యెడును; బోయి రం' డనిన నజాతశత్రుండు మఱియొండు వలుకం బుయిలోడి ధృతరాష్ట్రునితోడం' దపోమహనీయులైన మిమ్ముం గొలిచి గత కల్మషుండ నైతి మీ యాజ్ఞాపనంబు దలనిడికొని పురంబునకుం బోయి వచ్చెద' ననుటయు నక్కురువృద్ధుం డతని దీవించుచు నాలింగనంబు చేసి, భీమసేను సాంత్వన వచనంబులం బ్రీతుం గావించి కౌఁగిలించుకొని, గాండీవిం గొనియాడి సంశ్లేషం బాచరించి, కవల సంభావించి పరిరంభణంబు నిర్వర్తించిన, నయ్యేవురు నతని పాదంబులకుఁ బ్రణమిల్లి యాశీర్వాదంబులు వడసి. 142**

**ప్రతిపదార్థం:** మీకున్= మీకు (పాండవులకు); సర్వకార్యంబుల-ఎడమ= అన్ని పనులలోనూ; శుభంబులు= మేళ్ళు; అయ్యెడును= అగుగాక; పోయిరండు= వెళ్ళిరండి; అనినన్= అని కుంతి పలుకగా; అజాతశత్రుండు= ధర్మరాజు; మఱి-ఒండు= మరొక మాట; పలుకన్= చెప్పటానికి; పుయిలోడి= జంకి; ధృతరాష్ట్రునితోడన్= ధృతరాష్ట్రుడితో; తపోమహనీయులు= తపశ్శక్తిచేత గొప్పవారయిన; మిమ్మున్= మిమ్మల్ని; కొలిచి= సేవించి; గతకల్మషుండన్= పాపాలు తొలగిపోయిన వాడిని; ఐతిన్= అయినాను; మీ-ఆజ్ఞాపనంబు= (రాజధానికి తిరిగివెళ్ళుచున్న) మీయొక్క ఆనతిని; తలన్-ఇడికొని= శిరసా వహించి (తలదాల్చి); పురంబునకున్= హస్తినగరానికి; పోయి వచ్చెదన్= వెళ్ళివస్తాను; అనుటయున్= అని ధర్మరాజు పలుకగా; ఆ+కురువృద్ధుండు= ఆ ధృతరాష్ట్రుడు; అతనిన్= ధర్మరాజును; దీవించుచున్= ఆశీర్వదిస్తూ; ఆలింగనంబు-చేసి= కౌగిలించుకొని; భీమసేనున్= భీముడిని; సాంత్వన-వచనంబులన్= సముదాయింపు మాటలతో; ప్రీతున్= సంతోషించిన వాడిని; కావించి= చేసి; కౌఁగిలించుకొని= దగ్గరకు తీసికొని; గాండీవిన్= అర్జునుడిని; కొనియాడి= పొగడి; సంశ్లేషంబు= కౌగిలింతను; ఆచరించి= చేసి; కవలన్= నకులసహదేవులను; సంభావించి= మన్నింపు మాటలతో ఆదరించి; పరిరంభణము= కౌగిలి; నిర్వర్తించినన్= నడపగా; ఆ+ఏవురు= ఆ పాండవులైదుగురు; అతని పాదంబులకున్= ధృతరాష్ట్రుడి కాళ్ళకు; ప్రణమిల్లి= నమస్కారం చేసి; ఆశీర్వాదంబులు= ధృతరాష్ట్రుడి ఆశీస్సులు; పడసి= పొంది.

**తాత్పర్యం:** మీకు అన్ని పనుల్లోనూ మేలు కలుగుతుంది. ఇక వెళ్ళిరండి అన్నది కుంతి. ధర్మరాజు కుంతితో ఇంకొక మాట అనటానికి సంకోచించాడు. ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. తపశ్శక్తిచేత మహిమగల మిమ్మల్ని సేవించి నేను నా పాపాలన్నీ పోగొట్టుకొన్నాను. మీ ఆజ్ఞ తలదాల్చి హస్తినగరానికి వెళ్లి వస్తాను' అన్నాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఆశీర్వదిస్తూ, గుండెలకు హత్తుకొన్నాడు. భీముడిని సముదాయింపుమాటలతో సంతృప్తిపరిచి, కౌగిలించుకొన్నాడు. అర్జునుడిని పొగడి ఆలింగనం చేసికొన్నాడు. నకులసహదేవులను మన్నించి కౌగిలించుకొన్నాడు. అపు డా పాండవులు అయిదుగురూ ధృతరాష్ట్రుడి పాదాలకు ప్రణామం చేసి, ధృతరాష్ట్రుడి ఆశీస్సులు పొందారు.

**సీ. అతిభక్తి గాంధారి యడుగుల కెఱఁగిన । నద్దేవి వారల నక్కుఁ జేర్చి**
**దీవించె; వారుఁ గుంతీ చరణంబులు । ఫాలముల్ వొందఁగఁ బ్రణతు లైనఁ**
**దప్పక గ్రుచ్చి యందఱ నొక్క కౌఁగిటఁ । బొదివి యాశీర్వాదములు గ్రమమున**
**నర్మిలిపెంపున నలరుమనంబుతో । వేర్వేఱ యిచ్చె నా వీరజనని**

**తే.** **ద్రుపద పుత్త్రికా ప్రభృతి వధూజనములు। తగు తెఱంగుల మామ నత్తలను వీడు**
**కొనిరి వారును వారు నగ్గురు జనముల। నల్ల వలగొని చనిరి నృపాగ్రగణ్య!** **143**

**ప్రతిపదార్థం:** నృప+అగ్ర-గణ్య!= రాజులలో ప్రథముడా! జనమేజయ మహారాజా!; అతిభక్తిన్= మిక్కిలి పూజ్యభావంతో; గాంధారి+అడుగులకున్= గాంధారి పాదాలకు; ఎఱఁగినన్= (పాండవులు) వంగి నమస్కారం చేయగా; ఆ+దేవి= ఆ గాంధారి; వారలన్= ఆ పాండవులను; అక్కున్+చేర్చి= గుండెకు హత్తుకొని; దీవించెన్= ఆశీర్వదించింది; వారున్= ఆ పాండవులు కూడా; ఫాలముల్= తమ నుదుటి ప్రదేశాలు (శిరస్సులు); కుంతీచరణంబులు= కుంతీదేవి పాదాలను; పొందఁగన్= తాకగా; ప్రణతులు= ప్రణామంచేసినవారు; ఐనన్= కాగా; ఆ-వీర-జనని= పాండవ వీరులను కన్న ఆ కుంతి; తప్పక= గట్టిగా; గ్రుచ్చి= పట్టుకొని; అందఱన్= పాండవులు అయిదుగురినీ; ఒక్క కౌఁగిటన్= ఒకే (సారి) కౌగిలిలో; పొదివి= దగ్గరకు తీసికొని; అర్మిలి పెంపునన్= అధికమైన వాత్సల్యంతో; అలరు-మనంబుతోన్= సంతృప్తి నిండిన మనస్సుతో; వేర్వేఱ= ఎవరికి వారికిగా; క్రమమునన్= (ధర్మరాజాదులకు) వరుసగా; ఆశీర్వాదములు= దీవెనలు; ఇచ్చెన్= ఇచ్చింది; ద్రుపద పుత్త్రికా= ద్రౌపది; ప్రభృతి= మొదలైన; వధూ-జనములు= స్త్రీలు; మామన్= మామ అయిన ధృతరాష్ట్రుడినీ; అత్తలను= అత్తలయిన గాంధారినీ, కుంతినీ; తగుతెఱంగులన్= తగిన పద్ధతులలో; వీడుకొనిరి= వీడ్కోలు తీసికొన్నారు; వారును= పాండవులూ; వారు= ద్రౌపది మొదలయిన స్త్రీలు; ఆ+గురుజనములన్= ధృతరాష్ట్రాదులైన పెద్దలను; అల్ల(న్)= మెల్లగా; వలగొని-చనిరి= (చుట్టుగా తిరిగారు) ప్రదక్షిణం చేసి వెళ్లారు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! తరువాత పాండవులు గాంధారి పాదాలకు నమస్కరించారు. ఆమె వాళ్ళను కౌగిలించుకొని దీవించింది. ఆ తర్వాత పాండవులు కుంతీదేవి పాదాలపై శిరసులుంచి నమస్కరించారు. వీరమాత అయిన కుంతి వారిని గట్టిగా పట్టుకొని అందరినీ ఒకేసారి కౌగిలిలోనికి తీసికొని వాత్సల్యం నిండిన మనసుతో, వరుసగా అందరికీ వేరు వేరుగా ఆశీస్సు లిచ్చింది. అటుపిమ్మట ద్రౌపది మొదలయిన స్త్రీ జనంగూడా తగు విధంగా ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీదేవులనుంచి వీడుకోలు తీసికొన్నారు. ఆ పాండవులు, ద్రౌపదీ ప్రభృతులైన స్త్రీలు అందరూ ధృతరాష్ట్రాదులకు మెల్లగా ప్రదక్షిణం చేశారు.

**క.** **చని పరిజనములుఁబౌరులు। ననుమోదము తోడఁ గొలువ నరిగిరి నగరం**
**బునకున్ గన్నుల పండువు। జనపదముజనం బొనర్ప జనసంస్తుత్యా!** **144**

**ప్రతిపదార్థం:** జన సంస్తుత్యా!= ప్రజలచేత పొగడబడే వాడా! (జనమేజయా!); చని= ప్రదక్షిణం చేసి; (పాండవులు-ద్రౌపద్యాది స్త్రీలూ, ధృతరాష్ట్రాదులకు-వలగొని) అనుమోదముతోడన్= సంతోషంతో; పరిజనములున్= సేవకులూ; పౌరులున్= ప్రజలూ; కొలువన్= సేవిస్తుండగా; జనపదము-జనంబు= (దారిలో) పల్లె ప్రజలు; కన్నుల పండువు= (నేత్రపర్వం= కంటికి ఇంపు) సంతోషం; ఒనర్పన్= కల్గించగా; నగరంబునకున్= హస్తినగరానికి; అరిగిరి= వెళ్ళారు.)

**తాత్పర్యం:** ప్రజల ప్రశంసలు పొందిన వాడా! (జనమేజయ మహారాజా!) ఆ విధంగా పాండవులూ, ద్రౌపదీ ప్రభృతి స్త్రీలూ, ధృతరాష్ట్రాదులకు ప్రదక్షిణంచేసి-తమసేవకులూ, (తమతో వచ్చిన) ప్రజలూ సంతోషంగా తమను సేవిస్తుండగా, (ప్రయాణంలో దారిలో) పల్లె ప్రజలు కనువిందు చేయగా హస్తినగరానికి వెళ్ళారు.

**వ.** **అరిగి సముచిత వర్తనంబుల నుండిరి; కొంతకాలంబు చనిన నొక్కనాఁడు నారదమునీంద్రుం డనుజనహితుం**
**డై యున్న ధర్మతనయుకడకుఁ జనుదెంచిన, నజ్జననాథుండు దమ్ములుం దానును నమ్మహాత్మునకు భక్తిం**

**బ్రణమిల్లి యాసనార్ఘ్య పాద్యాదిసత్కారంబు లొనర్చి తదీయ సమీపంబున నాసీనులై; రతని వదనంబు విలోకించి వినయం బెసంగ నమ్మహీపతి 'మహా భాగ! యెందుండి రాక! యేదేశంబులఁ జరించితిరి? నేను మీకు నేమిపని సేయుదుఁ జెప్పుం 'డనిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితోడ. 145**

**ప్రతిపదార్థం:** అరిగి= (పాండవులు హస్తినగరానికి) వెళ్ళి; సముచితవర్తనంబులన్= అర్హమైన నడవడులతో; ఉండిరి= ఉన్నారు; కొంతకాలంబు= ఈ విధంగా కొంతకాలం; చనినన్= కడచిపోగా; అనుజ-సహితుండు= తమ్ములతో కూడినవాడు; ఐ= ఉన్న; ధర్మతనయుకడకున్= ధర్మరాజు వద్దకు; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; నారదమునీంద్రుండు= ముని శ్రేష్ఠుడైన నారదుడు; చనుదెంచినన్= రాగా; ఆ+మహాత్మునకున్= మహానుభావుడయిన ఆ నారదమునికి; ఆ+జననాథుండు= ఆ (ధర్మ) రాజు; తమ్ములున్= భీముడు మొదలైన తమ్ముళ్ళూ; తానును= తానూ; భక్తిన్= భక్తితో; ప్రణమిల్లి= పాదాభివందనం చేసి; ఆసన+అర్ఘ్య+పాద్య- ఆది-సత్కారంబులు= కూర్చుండటానికి ఆసనం చూపటం అర్చనకూ, పాదప్రక్షాళనకూ నీళ్ళు ఇవ్వటం, మొదలైన గౌరవాన్ని తెలిపే పనులు; ఒనర్చి= చేసి; తదీయ-సమీపంబునన్= ఆ నారదమునికి దగ్గరగా; ఆసీనులు+ఐరి= (పాండవులు) కూర్చున్నారు; ఆ+మహీపతి= ఆ (ధర్మ) రాజు; అతనివదనంబు= నారదుడి ముఖాన్ని; విలోకించి= చూచి; వినయంబు= నమ్రభావం; ఎసంగన్= అతిశయించగా; మహాభాగ!= మహాత్మా!; రాక= తమరు ఇక్కడికి రావటం; ఎందున్+ఉండి?= ఎక్కడినుంచి?; ఏదేశంబులన్= ఏయే చోట్ల; చరించితిరి?= తిరిగారు?; మీకున్= మీకొరకుగా; నేను= నేను (ధర్మరాజు); ఏమిపని= ఏపని; చేయుదున్= చేయగలను; చెప్పుండు= తెలియజేయండి; అనినన్= అని ధర్మరాజు పలుకగా; ఆ+పరమ-సంయమి= ఆ మునిశ్రేష్ఠుడయిన ఆ నారదుడు; ఆ+పుడమిఱేనితోడన్= ఆ(ధర్మ)రాజుతో, (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ విధంగా హస్తినగరానికి వెళ్ళిన పాండవులు అర్హమైన ప్రవర్తనతో ఉంటున్నారు. ఇట్లా కొన్నాళ్ళు గడచిన తరువాత ఒకరోజు ధర్మరాజు తమ్ముళ్ళతో కలిసి కూర్చుని ఉన్నసమయంలో నారదుడు వచ్చాడు. అపుడు తమ్ముళ్ళూ, తానూ నారదుడికి ప్రణామం చేసి, ఆసనం చూపి, అర్ఘ్యం, పాద్యం మొదలైన మర్యాదలు చేసి ఆ నారదుడి వద్దనే కూర్చున్నాడు. అపుడా ధర్మరాజు నారదుడి ముఖం చూస్తూ-వినయం అధికం కాగా (ఇట్లా అన్నాడు) 'మహాత్మా! తమరు ఎక్కడినుండి వస్తున్నారు? ఎక్కడెక్కడ సంచరించారు? మీ కొరకు నేను చేయగలిగిన పని ఏమిటి? తెలియజేయండి' అన్నాడు. అప్పుడు నారదమహర్షి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణంబు చెప్పుట. (సం.15-45-1)

సీ. **'భూపవరేణ్య! తపోవనంబుననుండి। వచ్చితిఁ దీర్థసేవా పరత్వ**
**మున నేను బహుదేశములఁ జరించితి; నినుఁ। గని పెద్దకాలంబు గానఁ జూడఁ**
**దివిరి యిందులకు నేతెంచితి; ధృతరాష్ట్ర। చరితంబు జాహ్నవీపరిసరంబు**
**జనములచే వింటి' ననిన నజ్జనపతి। 'యా రాజవరుఁడు గాంధారి గొంతి**

తే. **సంజయుండు సమాధాన సహితులై శ। రీరముల వింత పుట్టకున్నారె?' యనియె;**
**ననుడు నద్దేవముని 'వారి యఖిల వర్త। నంబు వినుము సుస్థిర హృదయంబుతోడ.' 146**

**ప్రతిపదార్థం:** భూపవరేణ్య!= (భూమిని పాలించే వారిలో) శ్రేష్ఠుడా! ధర్మరాజా!; నేను= నేను (నారదుడు); తపోవనంబున-నుండి= ముని ఆశ్రమమునుండి; వచ్చితిన్= వచ్చాను; తీర్థసేవా-పరత్వమునన్= పుణ్య తీర్థాలను సేవించటంలో లగ్నమయిన బుద్ధితో; బహు దేశములన్= అనేకములైన దేశాలలో; చరించితిన్= తిరిగాను; నినున్= నిన్ను (ధర్మరాజును); కని= చూచి; పెద్ద-కాలంబు=చాలా కాలమైనది; కానన్= కాబట్టి; చూడన్= నిన్ను చూడాలని; తివిరి= (కుతూహలంగలిగి సప్రయత్నంగా) ఇందులకున్= హస్తినగరానికి; ఏతెంచితిన్= వచ్చాను; ధృతరాష్ట్ర చరితంబు= ధృతరాష్ట్రుడియొక్క వృత్తాంతాన్ని; జాహ్నవీ-పరిసరంబు-జనములచేన్= గంగానదికి చుట్టుప్రక్కల ఉన్న జనాలవలన; వింటిన్= విన్నాను; అనినన్= అని నారదుడు పల్కగా; ఆ+జనపతి= ఆ (ధర్మ) రాజు; ఆ రాజవరుఁడు= రాజులలో శ్రేష్ఠుడైన ఆ ధృతరాష్ట్రుడూ; గాంధారి= గాంధారీ; గొంతి= కుంతీదేవీ; సంజయుండున్= సంజయుడూ; సమాధాన- సహితులు-ఐ= స్థిరమైన తపస్సమాధితో కూడిన వారు అయి; శరీరములన్= తమ దేహాలలో; వింత= వైపరీత్యం; పుట్టక= ఏర్పడకుండా; ఉన్నారె?= సుఖంగా ఉన్నారా?; అనియెన్= అన్నాడు; అనుడున్= ధర్మరాజు ఆ విధంగా ప్రశ్నింపగా; ఆ+దేవముని= ఆ నారదమహర్షి (ఇట్లా అన్నాడు); వారి-అఖిల-వర్తనంబు= ధృతరాష్ట్రాదుల వృత్తాంతం మొత్తమూ; సుస్థిర-హృదయంబుతోడన్= సావధానమతితో; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'రాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా! ఆశ్రమం నుండి వస్తున్నాను. పుణ్య తీర్థాలను సేవించాలనే కోరికతో చాలా దేశాలు తిరిగాను. నిన్ను చూచి చాల కాలమైనది కాబట్టి ఒకసారి చూచిపోదామని ఇక్కడికి వచ్చాను. గంగానది చుట్టుపక్కల జనంవలన ధృతరాష్ట్రాదుల వృత్తాంతం విన్నాను.' అనిన నారదుడి మాటలు విని ఆ ధర్మరాజు' ఆ ధృతరాష్ట్ర మహారాజు, గాంధారీ, కుంతీ, సంజయుడూ, నిశ్చలతపోదీక్షతో, శరీరాలకు ఏ విధమైన వైపరీత్యమూ కలగకుండా సుఖంగా ఉన్నారా?' అని అడిగాడు. అందుకు నారదుడు వారి సంగతులన్నీ (చెప్పుతాను) సావధానబుద్ధితో వినుము'. (అన్నాడు).

**వ. అని పలికి యిట్లను 'మీరు పోయి కాంతారంబున నక్కురువృద్ధుం గొలిచియుండి, యతం డనుమతి సేయ నిట వచ్చితిరి; మఱి కొన్ని దినంబులకు. 147**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; ఇట్లు= (నారదుడు) ఈ విధంగా; అనున్= అన్నాడు; మీరు= పాండవులు; పోయి= (ధృతరాష్ట్రాదులను చూడటానికి) వెళ్ళి; కాంతారంబునన్= అడవిలో; ఆ+కురువృద్ధున్ః ఆ ధృతరాష్ట్రుడిని; కొలిచి+ఉండి= సేవిస్తూ ఉండి; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; అనుమతి చేయన్= పంపగా; ఇటన్= రాజ్యానికి; వచ్చితిరి= వచ్చారు; మఱి= తరువాత; కొన్నిదినంబులకున్= కొన్ని రోజులకు.

**తాత్పర్యం:** నారదుడు ఆ విధంగా పలికి మళ్ళీ ఇట్లా అన్నాడు. 'మీరు (పాండవులు) ధృతరాష్ట్రాదులను చూడడానికి వెళ్ళి అరణ్యంలో ఆ ధృతరాష్ట్రుడిని సేవించి-అతడు పంపించగా రాజ్యానికి తిరిగి వచ్చారు. ఆ తరువాత కొన్నినాళ్ళకు (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. ఆ రాజు నియతి గాంధారియు గొంతియు। సంజయుండును దోన చనఁగ నగ్ని**
**హోత్రంబు గొని యాజకోత్కరం బగ్రేస। రంబయి పో నిజాశ్రమము విడిచి**
**యరిగె గంగాద్వార పరిసరారణ్య భా। గమునకు; నందు దుష్కరతపంబు**
**వాయుభక్షతఁ బూని చేయఁ దొడంగె; గాం। ధారియు నీళ్ళ నాహారకలన**

**తే.** **మోపి యొనరించె; గొంతి మాసోపవాస। నియమ మూఁది వర్తించె; సంజయుఁడు సప్త**
**భోజనాంతరితం బగు భోజనంబు। వ్రతము గాఁగఁ జరించెఁ గౌరవ్యముఖ్య! 148**

**ప్రతిపదార్థం:** కౌరవ్య-ముఖ్య!= కురువంశ్యులలో ఎన్నదగిన ధర్మరాజా!; నియతిన్= నియమంతో; గాంధారియున్= గాంధారీ; గొంతియున్= కుంతీ; సంజయుండును= సంజయుడూ; తోన్+అ= వెంటనే; చనఁగన్= రాగా; యాజక+ఉత్కరంబు= ఋత్విక్కుల సమూహం; అగ్నిహోత్రంబు= అగ్నిని; కొని= తీసికొని; అగ్రేసరంబు= (ధృతరాష్ట్రుడికి) ముందుగా; పోన్= పోతూఉండగా; ఆ రాజు= ఆ ధృతరాష్ట్రుడు; నిజ+ఆశ్రమము= (శతయూపాశ్రమ సమీపంలో ఏర్పరచుకొన్న) తన తపోవనాన్ని; విడిచి= వదలిపెట్టి; గంగా-ద్వార-పరిసర-అరణ్య-భాగమునకున్= గంగ పుట్టిన చోటికి (గురుద్వారం) సమీపంలో ఉన్న అడవి ప్రదేశానికి; అరిగెన్= వెళ్ళాడు; అందున్= ఆ అరణ్యంలో; వాయుభక్షతన్= కేవలం గాలి మాత్రమే ఆహారంగా తీసికొనటం అనే నియమం; పూని= అనుసరించి; దుస్-కర తపంబు= అసాధ్యమైన తపస్సు; చేయన్-తొడంగెన్= చేయటం ప్రారంభించాడు; గాంధారియున్= గాంధారి కూడా; నీళ్ళన్= నీటిని; ఆహార-కలనము= ఆహారంగా స్వీకరించే నియమాన్ని; ఓపి= అనుసరించి; ఒనరించెన్= తపస్సు చేసింది; గొంతి= కుంతి; మాస-ఉపవాస-నియమము= నెలరోజులు ఉపవాసం చేసేటటువంటి (నెలకొక్కసారి ఆహారం తీసికొనే) కట్టుబాటును; ఊఁది= ఆశ్రయించి; వర్తించెన్= తపస్సు చేస్తూ ఉన్నది; సంజయుఁడు(న్)= సంజయుడు కూడా; సప్తభోజన+అంతరితంబు= ఏడు భోజనాల వ్యవధానంతో (ఏడుపూటల కొకసారి); భోజనంబు= భోజనం తీసికొనటం; వ్రతము+కాఁగన్= నియమంగా; చరించెన్= ఆ అరణ్యంలో తపస్సు ఆచరించాడు.

**తాత్పర్యం:** కురుశ్రేష్ఠుడా! ధర్మరాజా! నియమవంతంగా, గాంధారీ, కుంతీ, సంజయుడూ తనను వెన్నంటి వస్తుండగా, ఋత్విక్కులు అగ్నులు తీసికొని తనకు ముందుగా నడుస్తుండగా, ఆ ధృతరాష్ట్రుడు తన ఆశ్రమాన్ని విడిచిపెట్టి గంగా ముఖం పరిసరాలలో ఉన్న అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ కేవలం గాలి ఆహారంగా ఇతరులకు అసాధ్యతపస్సు ప్రారంభించాడు. గాంధారి నీళ్ళు మాత్రం ఆహారంగా తీసికొంటూ తపస్సు ఆచరించింది. మాసోపవాసంతో నెలకొక సారి భోజనం తీసికొంటూ కుంతీ, ఏడుపూటల కొక పర్యాయం భోజనం తీసికొంటూ సంజయుడూ అక్కడ తపస్సు చేశారు.

**తే.** **యాజకులు దార యక్కురురాజు భక్తి। యుక్తి నొద్దనుండఁగ నగ్నిహోత్ర హోమ**
**మాచరింతు రొక్కొకమరి యతఁడు పర్ణ। శాల వెడలి శూన్యాటవి సంచరించు. 149**

**ప్రతిపదార్థం:** ఆ+కురురాజు= ఆ ధృతరాష్ట్రుడు; భక్తియుక్తిన్= పూజ్యభావంతో కూడి; ఒద్దన్= సమీపంలో; ఉండఁగన్= ఉండగా; యాజకులు= ఋత్విక్కులు; అగ్నిహోత్ర-హోమము= అగ్నులలో విధ్యుక్తంగా, హోమాన్ని; ఆచరింతురు= చేస్తుంటారు; ఒక్క+ఒక్కమరి= ఒక్కొక్కసారి; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; పర్ణశాల(న్)= ఆశ్రమాన్ని; వెడలి= విడిచిపెట్టి; శూన్య-అటవిన్= నిర్జనమైన అరణ్యాలలో; సంచరించున్= తిరుగుతుంటాడు.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడు భక్తి భావంతో, సమీపంలో ఉండగా ఋత్విక్కులు హోమంచేసేవారు. ఒక్కొక్కసారి ఆశ్రమం విడిచి నిర్జనమైన అరణ్యాలలో తిరుగుతుంటాడు ఆ ధృతరాష్ట్రుడు.

**వ.** **విషమ ప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును। గాంధారికిఁ గుంతియుఁ గన్నై మెలంగుదు; రొక్కనాఁడు**
**వారలందఱు గంగాద్వారంబునం గృతస్నానులై యాశ్రమంబునకు వచ్చుచుండ మహావాతోద్ధూతంబై.150**

**ప్రతిపదార్థం:** విషమ-ప్రదేశంబులన్= సమంగాలేని చోట్ల; ఆ+విభునకున్= ఆ ధృతరాష్ట్రుడికి; సంజయుండును= సంజయుడూ; గాంధారికిన్= గాంధారికి; కుంతియున్= కుంతీ; కన్ను+అయి= నేత్రంగా; మెలంగుదురు= మసలుకొంటారు; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; వారలు+అందఱున్= ధృతరాష్ట్రుడు మొదలైన వారంతా; గంగాద్వారంబునన్= గంగాముఖంలో; కృతస్నానులు-ఐ= స్నానం చేసిన వారయి; ఆశ్రమంబునకున్= తమ తపోవనానికి; వచ్చుచున్+ఉండన్= వస్తూండగా; మహా-వాత-ఉద్ధూతంబు+ఐ= పెద్ద సుడిగాలిచేత-ఎగసిపడుతూ.

**తాత్పర్యం:** సమంగాని కష్టమైన స్థలాలలో ధృతరాష్ట్రుడికి సంజయుడూ, గాంధారి, కుంతీ కన్నులవలె మసలుకొనేవారు. ఒకరోజు వాళ్ళందరూ గంగాద్వారంలో స్నానం చేసి తిరిగి ఆశ్రమానికి వస్తూ ఉండగా పెద్ద సుడిగాలిలో ఎగసి పడుతూ-(దావానలం వ్యాపించిందని తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. పటుతరం బగు ఛటచ్ఛటరవ మెసఁగంగ । మ్రాఁకులుఁ బొదలును గాఁచికొనుచుఁ**
**గమరును నార్తనాదంబును బెల్లుగ । నఖిలమృగంబుల నాఁచికొనుచు**
**లాఁగలఁ బుట్టల లోఁగిన శిఖల భు । జంగమ కులముల మ్రింగికొనుచు**
**వెగడొంది యఱచుచు నెగయు బల్పులుఁ గులఁ । బొగ నూర్ధ్వకీలలఁ బొదివి కొనుచు**

**తే. దెసల నన్నిటఁ దన సముదీర్ణగతులు । దారుణ స్ఫురణమున విస్తార మొంద**
**ఖేచరులకును భయముగ నేచి పరఁగె । నద్భుతోద్భవం బైన మహానలంబు. 151**

**ప్రతిపదార్థం:** పటుతరంబు= మిక్కిలి దృఢం; అగు= అయినటువంటి; ఛట చ్ఛటరవము= ఛట, ఛట, అనే విధమైన మోత; ఎసఁగన్= అతిశయిస్తుండగా, మ్రాఁకులున్= పెద్ద పెద్ద చెట్లనూ; పొదలున్= పొదరులనూ; కాఁచికొనుచున్= కాల్చుకొంటూ; కమరును= కాల్పులూ (చర్మం కాలిన వాసనా); ఆర్తనాదములును= బాధతో చేసిన అరపులూ; పెల్లుగన్= అధికం కాగా; అఖిల మృగంబులన్= సమస్తమైన జంతువులనూ; ఆఁగి కొనుచున్= ఆక్రమించుకొంటూ; లాఁగలన్= బొరియలలోనూ; పుట్టలన్= (పాము) పుట్టలలోనూ; లోఁగినన్= (లోపలకు) చొచ్చుకుపోయినా; శిఖలన్= మంటలతో; భుజంగమ-కులములన్= పాముల సముదాయాలను; మ్రింగికొనుచున్= మింగివేస్తూ (దగ్ధం చేస్తూ); వెగడు= భయం; ఒంది= పొంది; అఱచుచున్= అరుస్తూ; ఎగయు= ఆకాశంలోకి ఎగిరిపోతున్న; బల్-పులుఁగులన్= అధికమైన పక్షులనూ; పొగన్= పొగతోను; ఊర్ధ్వ కీలలన్= ఎత్తైన జ్వాలలతోనూ; పొదివికొనుచున్= తనలోపలికి లాక్కుంటూ; దెసలన్-అన్నిటన్= దిక్కులన్నింటినిండా; తన-సముదీర్ణ-గతులు= తన (దావాగ్ని) యొక్క-హెచ్చిన-పోకడలు; దారుణ-స్ఫురణమునన్= భయం కలిగిస్తూ; విస్తారము+ఒందన్= విరివికాగా; అద్భుత+ఉద్భవంబు= ఆశ్చర్యంగా పుట్టినది; ఐన= అయినటువంటి; మహా+అనలంబు= గొప్ప అగ్ని; ఖేచరులకును= ఆకాశంలో సంచరించే దేవాదులకు సైతం; భయముగన్= భయం పుట్టిస్తూ; ఏచి= పెరిగి; పరఁగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** ధృడమైన-ఛట,ఛటా అనే ధ్వనులు హెచ్చుతుండగా పెద్ద పెద్ద మాకులనూ, పొదలనూ కాలుస్తూ, కాలుస్తూ బాధతోడి అరుపులూ అధికం అవుతుండగా, సమస్తమైన జంతువులను ఆక్రమించుకొంటూ కన్నాలలోనూ, పుట్టలలోనూ ప్రవేశించినా (తన) మంటలతో పాములను మింగుతూ, భయంతో అరుస్తూ ఆకాశంలోకి ఎగిరిపోతున్న పక్షులను పొగతోనూ, జ్వాలలతోనూ, తనలోపలికి లాక్కుంటూ, అన్ని దిక్కులలోనూ అడ్డు లేకుండా ఉన్న తన పోకడలు భయం కలిగిస్తుండగా ఆశ్చర్యంగా ఏర్పడిన మహాగ్ని దేవగంధర్వాది ఆకాశ గాములకు సైతం భయం పుట్టిస్తూ పెరిగి వ్యాపించింది.

**వ. ఇట్లెరగలి చిచ్చు గవిసి చుట్టు ముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులు నిరాహారులై యునికిం జేసి యొక్క చోటఁ దటియ నుటికి తొలంగిపోవ లావులేరై; రట్టియెడ నా రాజర్షిసత్తముండు సంజయుతోడ. 152**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఎరగలి-చిచ్చు= దావాగ్ని; కవిసి= వ్యాపించి; చుట్టు-ముట్టినన్= చుట్టూనిండగా; ఆ+మనుజ నాథుండును= ఆ ధృతరాష్ట్ర మహారాజు; ఆ+నాతులు(న్)= ఆ స్త్రీలు గాంధారీ, కుంతీ; నిరాహారులు= ఆహారం తీసికొనని వారు; ఐ= అయి; ఉనికిన్-చేసి= ఉండటం వలన; ఒక్కచోటన్= వేరొక చోటికి; తటియన్= చేరుకొనటానికి; ఉటికి= పరుగెత్తి; తొలఁగిపోవన్= ఆ ప్రదేశంనుంచి వదలి వెళ్ళిపోవటానికి; లావు= శక్తి; లేరు+ఐరి= లేనివారు అయినారు; అట్టిఎడన్= ఆ పరిస్థితిలో; ఆ రాజర్షి సత్తముండు= రాజ ఋషులలో ఉత్తముడైన ఆ ధృతరాష్ట్రుడు; సంజయుతోడన్= సంజయుడితో (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఆవిధంగా అడవినిప్పు విస్తరించి తమను ముట్టడించగా ఆ ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ నిరాహారంగా ఉండటం వలన ఆచోటు వదలి వేరొకచోటికి వెళ్ళటానికి శక్తిలేని వారయినారు. అటువంటి స్థితిలో ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఒక్కింత దెఱపి నీ వెక్కడ నైనను। గనుఁగొని పా మ్మగ్ని దనుకకుండ'**
**నని చెప్పి తలఁగిపోఁ దనకు గాంధారికిఁ। గుంతిభోజాత్మజకును నశక్య**
**మగుటయుఁ జెప్పిన నడలొంది యా సూత। సుతుఁడు 'మీరును నొకచోట వెడలి**
**పోవుట గలిగినఁ బోదు గా కే దవా। గ్నికి మిమ్ము నెర చేసి యకట పోదు**

**ఆ. నే మహాత్మయనుడు 'నిలువాసి యిట్లున్న। జనుల కివ్విధమున సమయు టెగ్గు**
**గాదు; నీకుఁ బోవఁగా వచ్చి యుండంగఁ। బోవ కునికి పాపమునకుఁ బట్టు.' 153**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ఎక్కడన్+ఐనను= ఏ చోట అయినా; ఒక్క+ఇంత= కొంచెం; తెఱపి= దావాగ్ని లేనిది; కనుఁగొని= చూచికొని; అగ్ని= దావాగ్ని; తనుకక-ఉండన్= సోకకుండా; పొమ్ము= వెళ్ళిపొమ్ము; అని చెప్పి= సంజయుడికి చెప్పి, తనకున్= తనకూ (ధృతరాష్ట్రుడికీ); గాంధారికిన్= గాంధారికీ; కుంతిభోజ-ఆత్మజకున్= (కుంతిభోజుడి కూతురు) కుంతికీ; తలఁగి= అగ్నిని తప్పుకొని; పోన్= వెళ్ళిపోవటానికి; అశక్యము= సాధ్యంకానిది; అగుటయున్= కావటమూ; చెప్పినన్= చెప్పగా; ఆ సూతసుతుఁడు= (సూతుడి కొడుకు) సంజయుడు; అడలు+ఒంది= భయపడి; మీరును= మీరందరూ; ఒకచోటన్= వేరొక (నిప్పులేని) చోటికి; వెడలి-పోవుట= ఈ (అగ్నినిండిన) చోటు విడిచి వెళ్ళటం; కలిగినన్= జరిగితే; ఏన్+పోదున్= నేనూ వెళ్లుతాను; కాక= అలా కాకుండా; అకట!= అయ్యో!; మహాత్మ!= దేవా!; మిమ్మున్= మిమ్మల్ని; దవ+అగ్నికిన్= అడవి అగ్గికి; ఎర-చేసి= ఆహుతిగా చేసి; పోదునే?= (నేను) పోగలనా?; అనుడున్= అని సంజయుడు చెప్పగా; ఇలు-పాసి= ఇల్లు విడిచిపెట్టి; ఇట్లు= ఈప్రకారంగా రక్షించుకోవడం అసాధ్యమై; (తాపసులై); ఉన్న జనులకున్= ఉన్నటువంటివారికి; ఈ-విధమునన్= ఈప్రకారంగా (అగ్నిపాలయి); సమయుట= మరణించటం; ఎగ్గు= కీడు (తప్పు); కాదు= కానేరదు; నీకున్= నీకు (సంజయుడికి); పోవఁగాన్= తప్పించుకొని పోవటానికి; వచ్చి-ఉండంగన్= సాధ్యమై ఉండగా; పోవక= (తప్పించుకొని) పోకుండా; ఉనికి= (ఇక్కడే) ఉండటం; పాపమునకున్= పాపానికి; పట్టు= స్థానం.

**తాత్పర్యం:** 'ఎక్కడైనా దావాగ్ని లేని కొంచెం చోటు చూచుకొని ఈ నిప్పు సోకకుండా నీవు వెళ్ళిపొమ్ము'- అనిచెప్పి ధృతరాష్ట్రుడు తనకూ, గాంధారికీ, కుంతికీ, అట్లా తప్పించుకొనిపోవటం సాధ్యంకాక పోవటాన్ని కూడా తెలియజేశాడు (సంజయుడికి), అపుడు సంజయుడు భయపడి 'మహానుభావా! మీరుకూడా ఈ చోటు విడిచి వేరొక చోటికి వెళ్ళితే

నేనూ వెళ్ళుతా గాని అయ్యో! మిమ్మల్ని ఈ దావాగ్నికి ఆహుతి చేసి నేనొక్కడిని వెళ్ళగలనా?' అన్నాడు. అపుడు ధృతరాష్ట్రుడు 'ఇల్లు వదలి ఈ విధంగా (తప్పించుకొనటానికి సాధ్యంగాని స్థితిలో) ఉన్నవారు ఈ ప్రకారంగా (అప్రయత్నంగా, బలవంతంగా) మరణించటం తప్పు (పాపం) కాదు, తప్పుకొని రక్షించుకొనే అవకాశం ఉన్న నీవు తప్పుకొనకుండా ఇక్కడే ఉండటం పాపహేతువు'.

**వ. అని పలికి యతనిం బోవ నొడంబఱిచి యప్పౌరవ సత్తముండు సమాహితచిత్తుండై ప్రాఙ్ముఖాసీనుం డయ్యెఁ; గాంధారియుం గుంతియు నవ్విధంబునం గూర్చుండి; రప్పుడు సంజయుండు ధృతరాష్ట్రుతో 'యోగయుక్తుం డవు గ' మ్మనియె; నతండు నట్లు సేసెఁ; దదనంతరంబ. 154**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; అతనిన్= సంజయుడిని; పోవన్= తమను (అగ్నిని) విడిచి వెళ్ళటానికి; ఒడంబఱిచి= అంగీకరింపజేసి; ఆ+పౌరవసత్తముండు= పురువంశంలో పుట్టిన శ్రేష్ఠుడు-ధృతరాష్ట్రుడు; సమాహితచిత్తుండు= నిశ్చలమైన మనస్సు కలిగినవాడు; ఐ= అయి; ప్రాక్+ముఖ+ఆసీనుండు= తూర్పుముఖంగా కూర్చున్నవాడు; అయ్యెన్= అయ్యాడు; గాంధారియున్= గాంధారీ; కుంతియున్= కుంతికూడా; ఆ+విధంబునన్= ఏకాగ్రమైన మనస్సుతో తూర్పు ముఖంగా; కూర్చుండిరి= కూర్చున్నారు; అప్పుడు= ఆసమయంలో; సంజయుండు= సంజయుడు; ధృతరాష్ట్రుతోన్= ధృతరాష్ట్రుడితో; యోగ-యుక్తుండవు= మనస్సుయొక్క వ్యాపారాలను నిరోధించి (జీవాత్మను పరమాత్మయందు కలవటం కలిగి)న వాడివి; కమ్ము= అగుము; అనియెన్= అన్నాడు; అతండున్= ఆ ధృతరాష్ట్రుడుకూడా; అట్లు= సంజయుడు చెప్పినవిధంగా; చేసెన్= చేశాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** అని చెప్పి సంజయుడిని, తమను వదలి వెళ్ళిపోవటానికి ఒప్పించి, ఆ ధృతరాష్ట్రుడు మనసును నిశ్చలంగా చేసికొని తూర్పుముఖంగా కూర్చున్నాడు. గాంధారీ, కుంతీ కూడా ఆవిధంగానే కూర్చున్నారు. అపుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో- 'చిత్తవ్యాపారాలను నిరోధించు- (జీవాత్మను పరమాత్మతో కలిసిఉంచు)' మని చెప్పాడు. ధృతరాష్ట్రుడు అట్లాగే చేశాడు. ఆ తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ఒక్కతెఱపి సంజయుఁడు సని హిమశైల। మెక్కెఁనంత వారి నెల్ల నగ్ని**
**వొదివికొనియె; నిట్లు వోయి రమ్ముువ్వురుఁ। బుణ్యలోకమునకు భూపవర్య! 155**

**ప్రతిపదార్థం:** భూవర్య!= రాజశ్రేష్ఠుడా! ధర్మరాజా!; సంజయుండు= సంజయుడు; ఒక్కతెఱపిన్= కొంచెం సందు చూచుకొని; చని= వెళ్ళిపోయి; హిమశైలము= హిమాలయం; ఎక్కెన్= చేరుకొన్నాడు; అంతన్= ఆ తరువాత; వారిన్ ఎల్లన్= వారిని అందరినీ (కుంతీ, గాంధారీ ధృతరాష్ట్రులను); అగ్ని= దావాగ్ని; పొదివికొనియెన్= తనలో ఇముడ్చుకొన్నది; ఆ+మువ్వురు= ఆ ముగ్గురూ (ధృతరాష్ట్రుడు-గాంధారి-కుంతి); ఇట్లు= ఈ విధంగా; పుణ్యలోకమునకున్= పుణ్యవంతుల లోకానికి, సద్గతికి; పోయిరి= వెళ్ళిపోయారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! సంజయుడు ఆ దావాగ్నిలో కొద్దిగా సందు చూచుకొని దాటిపోయి హిమాలయానికి వెళ్ళిపోయాడు. తరువాత ఆ దావాగ్ని వాళ్ళందరినీ తనలో కలుపుకొన్నది. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి ఆ ముగ్గురూ ఈ విధంగా (తమ తనువులు చాలించి) ఉత్తమలోకాలకు చేరుకొన్నారు.

**సీ. పదపడి నృప! యేను భాగీరథీతీర । మున వచ్చుచుండి యవ్వనము దివ్య**
**మునులచే మీ రటు సని క్రమ్మఱంగ వ । చ్చినది యాదిగ నయ్యశేష వృత్త**
**మును నేర్పడఁగ వింటి, మూఁడు కళేబర । ములుఁ గంటి; నక్కురుపుంగవుండు**
**భార్యయుఁ బాండుని పత్నియు సద్గతి । నొందిరి; నీ వింక నుమ్మలింప**

**ఆ. కుండు' మనిన శోక మొదవి యాతఁడు బాహు । లెత్తి యెలుఁగు సెలఁగ నేడ్వఁ దమ్ము**
**లడలు గదిరి యేడ్చి; రవ్వార్త నంతఃపు । రమున రోదనార్తరవము లెసఁగ! 156**

**ప్రతిపదార్థం:** నృప!= (ధర్మ) రాజా!; పదపడి= ఆ తర్వాత; ఏను= నేను (నారదుడు); భాగీరథీ తీరమునన్= గంగఒడ్డు మీదుగా; వచ్చుచున్+ఉండి= వస్తూ; ఆ+వనము-దివ్య-మునులచేన్= ఆ గంగాపరిసరారణ్యవాసులైన మునివరులవలన; మీరు= మీరు (పాండవులు); అటన్= ఆ ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి; చని= వెళ్ళి; క్రమ్మఱంగన్= తిరిగి; వచ్చినది= హస్తినకు రావటం; ఆదిగన్= మొదలుగా; ఆ+అశేషవృత్తమును= జరిగిన వృత్తాంతం యావత్తూ; ఏర్పడఁగన్= వివరంగా; వింటిన్= విన్నాను; మూఁడు కళేబరములున్= ముగ్గురి (ధృతరాష్ట్రుడు, గాంధారి-కుంతి) శరీరాలనూ; కంటిన్= చూచాను; ఆ+కురుపుంగవుండు(న్)= ఆ ధృతరాష్ట్రుడూ; భార్యయున్= అతని భార్య గాంధారీ; పాండుని పత్నియున్= పాండురాజు భార్య-కుంతీ; సద్గతిన్= ఉత్తమలోకాలను; ఒందిరి= పొందారు; ఇంకన్= అందుచేత ఇంక; నీవు= నీవు; ఉమ్మలింపక+ఉండుము= దుఃఖించకుండా ప్రశాంతంగా ఉండు; అనినన్= నారదుడు చెప్పగా; శోకము= దుఃఖం; ఒదవి= పుట్టి; అతఁడు= ధర్మరాజు; బాహులు= చేతులు; ఎత్తి= పైకెత్తి; ఎలుంగు= గొంతు (కంఠస్వరం); చెలఁగన్= ధ్వనించగా; (పెద్దగా); ఏడ్వన్= ఏడుస్తుంటే; తమ్ములు= (ఆ ధర్మరాజు తమ్ములు) భీమ, అర్జున, నకుల, సహదేవులు; అడలు= దుఃఖం; కదిరి= అతిశయించి; ఏడ్చిరి= ఏడ్చారు; ఆ+వార్తన్= ధృతరాష్ట్రాదుల మరణవార్తవలన; అంతఃపురమునన్= ఆ రాణి వాసాలలో; రోదన+ఆర్త-రవములు= ఏడుపులతో, బాధనిండిన ధ్వనులు; ఎసఁగన్= అధికం కాగా.

**తాత్పర్యం:** ధర్మరాజా! తర్వాత నేను గంగాతీరం మీదుగా వస్తూ-మీరు ధృతరాష్ట్రాదులను చూడటానికి ఆయన ఆశ్రమానికి రావటం, తరువాత రాజ్యానికి తిరిగి రావటం మొదలుగా ఈ వృత్తాంతం మొత్తం ఆ గంగా తీరారణ్యవాసులయిన మునులవలన విన్నాను. ఆ ముగ్గురి (దగ్ధ) శరీరాలనూ చూచాను. ఆ ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి, ఉత్తమలోకాలకు వెళ్ళిపోయారు. కాబట్టి నీవింక ఏమీ దుఃఖపడకు' మని నారదుడు చెప్పగా దుఃఖం కలిగి, ధర్మరాజు చేతులు పైకెత్తి, బిగ్గరగా ఏడ్వసాగాడు. భీమాదులూ దుఃఖంతో ఏడ్చారు. ఆ వార్తచేత అంతఃపురంలోను ఏడుపుల ధ్వనులు అతిశయించాయి.

**వ. అవ్విశేషంబు. 157**

**తాత్పర్యం:** ధృతరాష్ట్రాదుల ఆ మరణవార్త (క్రమంగా పౌరులకు తెలిసింది. తరువాతి పద్యంతో అన్వయం.)

**క. విని పౌరజనసమూహము । లనయంబును వనట మునిఁగి హాహారవముల్**
**వినువీథి ముట్ట రోదన । మొనరిచె నవ్వేళఁ గరుణ ముత్కట మయ్యెన్. 158**

**ప్రతిపదార్థం:** విని= (ధృతరాష్ట్రాదుల మరణవార్త) విని; పౌర-జన-సమూహములు= ఆ నగరపు ప్రజల గుంపులు; అనయంబును= నిరంతరమైన; వనటన్= శోకంలో; మునిఁగి= నిండి; హాహా-రవముల్= హా,హా అనే ధ్వనులు; వినువీథిన్= ఆకాశాన్ని; ముట్టన్=అంటగా; రోదనము= ఏడుపు; ఒనరిచెన్= చేశాయి; ఆ+వేళన్= ఆ సమయంలో; కరుణము= కారుణ్యం; ఉత్కటము= భరింపరానంతటిది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రాదుల మరణవార్తను తెలిసికొని, పురప్రజలు గుంపులు గుంపులుగా చేరి, నిరంతరమైన శోకంతో చేసిన హా, (మహారాజా)హా-అనే ఏడుపు ధ్వనులు ఆకాశం అంటాయి. ఆ సమయంలో ఆ రాజ్య దైన్యం మేరలేనిదయింది.

**క. నారదుఁ డుపశమ ఫణితులఁ। గౌరవసత్తమునిఁ దేర్పఁ గ్రమమున నాక్రం**
**దారవము లుడిగె బంధుజ। నారబ్ధము లైన యనునయాలాపములన్. 159**

**ప్రతిపదార్థం:** నారదుఁడు= నారదమహర్షి; కౌరవసత్తమునిన్= కురువంశశ్రేష్ఠుడైన ధర్మరాజును; ఉపశమ-ఫణితులన్= ఊరడింపు మాటలతో; తేర్పన్= దుఃఖంనుండి తేరుకొనేటట్లు చేయగా; బంధు-జన+ఆరబ్ధములు= బంధువులు ప్రారంభించినవి; ఐన= అయిన; అనునయ+ఆలాపములన్= ఊరడింపు మాటలతో; ఆక్రంద-ఆరవములు= ఏడుపుల ధ్వనులు; క్రమమునన్= మెల్లగా; ఉడిగెన్= ఆగిపోయాయి.

**తాత్పర్యం:** నారదుడు సాంత్వన వచనాలతో ధర్మరాజు దుఃఖంనుండి తేరుకొనేటట్లు చేయగా బంధువుల అనునయపు మాటలతో, ఏడుపుల ధ్వనులు క్రమంగా ఆగిపోయాయి.

ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులు మృతు లగుటకు శోకించుట(సం.15-16-1)

**వ. అట్లు సమస్త జనంబులును విగతరోదను లై రప్పు డక్కౌరవనాథుండు నారదముని యాననం బాలోకించి యిట్లనియె. 160**

**ప్రతిపదార్థం:** సమస్త జనంబులును= ధర్మరాజాదులు అందరూ; అట్లు= ఆ ప్రకారంగా (బంధువుల అనునయాలతో); విగతరోదనులు= ఏడుపు పోయిన వారలు; ఐరి= అయ్యారు (ఏడ్పుమానారు); అప్పుడు= ఆ సమయంలో; ఆ+కౌరవ-నాథుండు= కురువంశ్యులకు దిక్కయిన ఆ ధర్మరాజు; నారదముని-ఆననంబు= నారదమహర్షి ముఖాన్ని; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ప్రభృతులయిన జనులందరూ ఆ విధంగా ఏడుపులు మానారు. అపుడు ధర్మరాజు నారదుడిని చూస్తూ ఇట్లా అన్నాడు.

**సీ. 'ఎఱుఁగఁగ వచ్చునే యెవ్వరి కెత్తటి। నేదెస యగునొ మునీంద్ర! యేము**
**గలుగంగ దెస లేని పులుమానిసికిఁ బోలె। నక్కురువృద్ధున కట్టిచావు**
**పాటిల్లె; సుముదీర్ణ బాహుదర్పోజ్జ్వలు। లైన పుత్త్రులు నూర్వు రట్లు గలిగి**
**బలము నాగాయుతప్రాణసమం బగు। నమ్మహారా జట్టి యడవిచిచ్చు**

**తే.** **వలనఁ దెగటాఱె; నే మనఁ గలదు కమల । ముఖుల తాలవృంతానిలముల సుఖించు**
**ప్రభువె కంక గృధ్రావలీపక్షవాయు । వడర నిలఁబడియున్నవాఁ డక్కటకట! 161**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్ర!= (నారద) మహర్షీ; ఎవ్వరికిన్= ఎటువంటివారికైనా; ఏ+తఱిన్= ఏసమయంలో; ఏదెస= ఏ విధంగా; అగునో= అవుతుందో; ఎఱుఁగంగన్= తెలియటం; వచ్చునే?= సాధ్యమా? ఏము= (రాజులమైన కొడుకులు) పాండవులు; కలుగంగన్= ఉండగా; ఆ+కురువృద్ధునకున్= కురువంశంలో పెద్దవాడైన ఆ ధృతరాష్ట్రుడికి; దెస-లేని-పులు-మానిసికిన్-పోలెన్= దిక్కులేని హీన మనుష్యుడికి వలె; అట్టి-చావు= ఆవిధమైన (రక్షించేవాడు లేని) మరణం; పాటిల్లెన్= సంభవించింది; సముదీర్ణ-బాహు-దర్ప-ఉజ్జ్వలులు= విస్తారమైన భుజ బలగర్వం చేత ప్రకాశించేవారు; ఐన-పుత్రులు= అయినటువంటి కొడుకులు; నూర్వురు= వందమంది; అట్లు= ఆ విధంగా (కడుపు పంటగా) కలిగి= పుట్టి; నాగ+అయుత-ప్రాణ-సమంబు= పదివేల యేనుగుల బలంతో సమానమైన; బలము= శక్తి (స్వయంగానూ) కలిగిన; ఆ+మహారాజు= ఆ ధృతరాష్ట్ర చక్రవర్తి; అడవిచిచ్చువలనన్= దావాగ్నిచేత; తెగటాఱెన్+ఏ= కూలిపోయినాడట; ఏమి-అనన్+కలదు?= ఇంక చెప్పగలిగింది ఏమున్నది?; కమలముఖుల= తామరపూలవంటి ముఖాలు గలిగిన-కోమలులైన స్త్రీలయొక్క; తాల-వృంత= విసనకర్రలనుండి వెలువడే; అనిలములన్= మెల్లనైన గాలులచేత; సుఖించు ప్రభువు+ఎ= సుఖపడే ఆ మహారాజే; అక్కట+అక్కట= అయ్యయ్యో; కంక= రాబందులయొక్క; గ్రద్ద= గ్రద్దలయొక్క; ఆవలీ= పంక్తుల యొక్క; పక్ష= రెక్కలనుండి వచ్చే; వాయువు= గాలి; అడరన్= అతిశయించగా; ఇలన్= నేలపైన; పడి-ఉన్నవాఁడు= పడిపోయి ఉన్నాడు.

**తాత్పర్యం:** 'నారదమునీంద్రా! ఎవ్వరికి, ఎప్పుడు, ఏమి జరుగుతుందో తెలియటం సాధ్యం కాదు. మేమింతమంది ఉండగా దిక్కులేని హీనమానవుడివలె, ఆ కురువంశవృద్ధుడికి ఆ విధమైన మరణం సంభవించింది. విస్తారమైన భుజబలాధిక్యం చేత గొప్పవారైన కొడుకులు, వందమందిని ఆ విధంగా పొంది, స్వయంగా పదివేల యేనుగుల బలం కలిగి ఉన్న మహారాజు, అడవిలో పుట్టిన అగ్నివలన కూలిపోయినాడంటే చెప్పే దేముంది? సుకుమారలైన కాంతలచేత తాలవృంతాలనుండి వెలువడే మెల్లనైన గాలితో సుఖించే మహారాజే-అయ్యో! రాబందుల, గ్రద్దల, రెక్కల నుండి వీస్తున్న గాలి అతిశయిస్తుండగా నేడు నేలమీద పడిపోయి ఉన్నాడు.

**క.** **కల మృదుమాగధ గానం । బుల మేల్కనురాజు గృధ్రములునుం గాకం**
**బులు నఱవఁగ నిడుద నిదుర । నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గదే! 162**

**ప్రతిపదార్థం:** కల= మధురమైన; మృదు= చెవికింపయిన; మాగధ= స్తోత్రపాఠకుల; గానంబులన్= స్తోత్ర గానాలతో; మేల్కనురాజు= నిదురనుండి మేలుకొనే ధృతరాష్ట్ర మహారాజు; గృధ్రములునున్= గ్రద్దలూ; కాకంబులున్= కాకులూ; అఱవఁగన్= అరుస్తూ ఉంటే; నిడుదనిదుర= దీర్ఘనిద్ర- (లేవలేని నిద్రలో); ఒలసి= పడి; తెలుపన్= తెలియజేయటానికి ఎవరూ లేక; దిక్కుమాలి= దిక్కులేకుండా; ఉన్నాఁడుగదే!= ఉన్నాడు గదా!

**తాత్పర్యం:** మాగధులు చేసే అవ్యక్తమధురమూ, సుకుమారమూ అయిన స్తోత్రగానంతో నిద్రలేచే మహారాజు ధృతరాష్ట్రుడు, ఈ రోజు గద్దలూ, కాకులూ చుట్టూ చేరి అరుస్తూ ఉంటే లేవలేని పెద్ద నిద్దురలో పడి మేల్కొలిపే వాడే లేక దిక్కులేకుండా పడిపోయి ఉన్నాడు గదా.

**సీ.** **వల్లభుం డొక్క సద్వ్రతముఁ బూనినఁ దానుఁ । దద్వ్రత మూని గాంధారి యతని**
**పోయినగతిఁ బోయె; నాయమకై యంత । వగవఁ; బుత్త్రుల రాజ్యవైభవంబు**

**విడిచి మే యోమక యడవికి బోయిన । తల్లికి వగచెద; ధర్మసుతుఁడు**

**భీమసేనుండును, బీభత్సుఁడును దన । కడుపునఁ బుట్టిన కొడుకు; లట్టి**

**తే. యెగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె । నటె యనాథయై దీనికి నంతరంగ**

**మలఁదురక తల్లడిల్లక యారటమున । నుడుక కలమటఁ బడక యెట్లుండుఁ జెపుమ! 163**

**ప్రతిపదార్థం:** వల్లభుండు= భర్త (ధృతరాష్ట్రుడు) ఒక్క= ఒకానొక; సత్-వ్రతము= ఉత్తమమైన దీక్షను; పూనినన్= ఆచరిస్తుంటే; తానున్= (పతివ్రత అయిన భార్యగా) తానుకూడా; తద్-వ్రతమున్= భర్తయొక్క దీక్షనే; పూని= అనుసరించి; పొంది; అతని-పోయినగతిన్= ఆ భర్త (ధృతరాష్ట్రుడు) పోయిన మార్గంలోనే; గాంధారి= గాంధారి; పోయెన్= వెళ్ళింది; ఆయమకై= అటువంటి ఆమె కోసం; అంత= పెద్దగా; వగవన్= బాధపడను; కానీ, పుత్రుల= పాండవుల; రాజ్య-వైభవము= సామ్రాజ్య-అధికారాన్ని-(సుఖాలనూ); విడిచి= వదలుకొని; మేఁ= ఒడలు; ఓమక= కాపాడుకొనకుండా; అడవికిన్= అరణ్యానికి (గాంధారీ ధృతరాష్ట్రులతో); పోయిన= వెళ్లిన; తల్లికిన్= కుంతిని గురించి; వగచెదన్= దుఃఖిస్తున్నాను; ధర్మసుతుఁడు= ధర్మరాజు (తానూ); భీమసేనుండును= భీముడూ; బీభత్సుఁడును= అర్జునుడూ; తన కడుపునన్= తన (స్వ) గర్భం నుండి; పుట్టిన= జన్మించిన; కొడుకుల+అట్టి= పుత్రులు-అయిఉండగా; తాను= ఆ కుంతి; అనాథ= దిక్కులేనిది; ఐ= అయి; ఎగ్గతంబునన్= (కాపాడే) జనం లేని చోట; కారు+అగ్గిన్= దావాగ్నిలో; కాలెన్= కాలిపోయింది; దీనికిన్= ఇటువంటి కుంతీమరణానికి; అంతరంగము= మనస్సు; అలఁదురక= కలత పోకుండా; తల్లడిల్లక= (బాధతో) కంపం పొందకుండా; ఆరటమునన్= ఉద్వేగం (కుదురు లేకుండటం)తో; ఉడుకక= తపించి పోకుండా; అలమటన్= దురవస్థలో; పడన్= మునిగిపోకుండా; ఎట్లు= ఏప్రకారంగా; ఉండున్?= ఉంటుంది?; చెపుమ= (నారదమునీంద్రా!) నీవే చెప్పుము.

**తాత్పర్యం:** తన భర్త ఒకానొక మంచి వ్రతం ఆచరిస్తున్నాడు కాబట్టి (పతివ్రత అయిన భార్యగా) తాను కూడా అదేవ్రతాన్ని ఆచరిస్తూ భర్త పోయిన మార్గంలో గాంధారికూడా వెళ్ళిపోయింది. కాబట్టి ఆమెను గూర్చి నేను ఎక్కువగా బాధపడను. కానీ, కొడుకుల రాజ్యంతో ప్రాభవం వదలుకొని ఒడలు ఓముకొనకుండా అడవికి వెళ్ళిన తల్లి కుంతిని గూర్చి విచారిస్తున్నాను. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, తన కడుపున పుట్టిన బిడ్డలై ఉండగా దిక్కులేనిదై, (రక్షించే) జనం లేని చోట, దావాగ్నిలో కాలిపోయింది. దానికి మనస్సు కలతపడకుండా, దుఃఖంతో కంపించకుండా కుదురులేని తనంతో తపించిపోకుండా, కష్టంలో మునిగిపోకుండా ఎలా ఉంటుంది నారదా! నీవే చెప్పుము.

**క. విను ఖాండవ దహనంబునఁ । దనకుఁ బ్రమోదంబు శక్రతనయుఁ డొసఁగె; నా**

**తని తల్లిఁ గాల్పఁ దగునే । యనలునకుం; గడుఁగృతఘ్నుఁ డయ్యె మునీంద్రా! 164**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= నారదమహర్షీ!; విను= వినుము; ఖాండవదహనంబునన్= ఖాండవవనాన్ని దహించే పనిలో; శక్రతనయుండు= (ఇంద్రుడికొడుకు) అర్జునుడు; తనకున్= తనకు (అగ్నికి); ప్రమోదంబు= ఆనందం (అభీష్టం); ఒసఁగెన్= ఇచ్చాడు; అతనితల్లిన్= తనకు మేలుచేసినవాడి తల్లిని; కాల్పన్= దహించటం; అనలునకున్= అగ్నికి; తగున్+ఏ?= యుక్తమా?; కడున్= మిక్కిలి; కృతఘ్నుఁడు= (అగ్నిదేవుడు) చేసిన మేలు మరచేవాడు; అయ్యెన్= (ఇందువలన) అయినాడు.

**తాత్పర్యం:** మహర్షీ! ఇంకా వినండి. ఖాండవవనాన్ని దహించే పనిలో అర్జునుడు తనకు ఆనందాన్ని కలిగించాడే! అట్లా మేలు చేసిన వాడి తల్లిని దహించడం ఆ అగ్నికి తగినదేనా? అగ్ని చాలా కృతఘ్నుడయ్యాడు గదా!

సీ. మఱియొక్క నెవ్వగ మనమున జనియించె; । నాంబికేయుండు కారగ్గి నెరసె
దానికి నెయ్యది యేను జేయుదు నొక్కొ?' । యనవుడు నారదుం డానృపాలు
తోడ నబ్భరతవృద్ధుఁడు శాంతి యెక్కుడై । సవిశేషమైన పూజా విధాన
మున నుపాసించి తగిన యిష్టి సేసి య । గ్నులఁ దొలునాఁడ వీడ్కొనియె; ననియు

తే. నపుడు యాజకజనము లయ్యగ్ని చయము । నడవిలోన నుద్వాసించి యరిగె; ననియుఁ
బేర్చి యది యవ్వనం బెల్ల నేర్చె ననియు । వింటి నాత్మాగ్నిఁ గాలె నా విభుఁడు వత్స!' 165

**ప్రతిపదార్థం:** మనమునన్= నా మనసులో; మఱి= పైగా; ఒక్క= ఇంకొక; నెఱ+వగ= సంపూర్ణమయిన దుఃఖం; జనియించెన్= కలిగింది; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; కారు+అగ్గి= దావాగ్ని; నెరసెన్= చుట్టుముట్టుకొన్నది; దానికిన్= ఆస్థితికి; నేను= నేను (ధర్మరాజు); ఏ+అది= ఏ క్రియ; చేయుదున్+ఒక్కొ?= చేయవలసిఉన్నది?; అనవుడున్= అని ధర్మరాజు పల్కగా; ఆ-నృపాలుతోడన్= ఆ ధర్మరాజుతో; నారదుండు= నారదమహర్షి (ఇట్లా అన్నాడు); వత్స!= నాయనా! ధర్మరాజా!; ఆ+భరత వృద్ధుఁడు= భరతవంశంలో పెద్ద అయిన ఆ ధృతరాష్ట్రుడు; శాంతి= (ఇంద్రియాలను అణచి) సంపూర్ణమైన విరక్తి; ఎక్కుడు+ఐ= అధికమై; తొలినాఁడు+అ= మరణించటానికి ముందురోజే; అగ్నులన్= తన అగ్నిహోత్రాలను; సవిశేషము= ప్రత్యేకం; ఐన= అయినటువంటి; పూజా-విధానమునన్= అర్చనా పద్ధతిలో; ఉపాసించి= సేవించి; తగిన-ఇష్టి= అర్హమైన యజ్ఞం; చేసి= నిర్వహించి; వీడ్కొనియెన్= (అగ్నులను) విడిచిపెట్టాడు; అనియున్= అనీ; అపుడు= ఆ సమయంలో; ఆ+అగ్ని-చయమున్= ధృతరాష్ట్రుడు వీడుకొలిపిన అగ్నుల సముదాయాన్ని; యాజక-జనములు= (ధృతరాష్ట్రుడిని అనుసరించి వచ్చిన) ఋత్విక్కులు; అడవిలోనన్= ఆ అడవిలోనే; ఉద్వాసించి= విడిచి; అరిగెన్= వెళ్ళారు; అనియున్= అనీ; అది= అట్లా విడిచిపెట్టబడిన (ధృతరాష్ట్రుడి) అగ్నియే= అంటుకొని, పెరిగి; ఆ+వనంబు= ఆ అరణ్యం; ఎల్లన్= మొత్తం; ఏర్చెన్= తగులబెట్టింది; అనియెన్= అనీ; వింటిన్= విన్నాను (కాబట్టి); ఆ+విభుఁడు= ఆ ధృతరాష్ట్రుడు; ఆత్మ+అగ్నిన్= తన అగ్నిహోత్రంవలననే; కాలెన్= దగ్ధమయ్యాడు.

**తాత్పర్యం:** (మునీంద్రా) మనసులో మరో బాధ కలుగుతున్నది. ధృతరాష్ట్రుడు దావాగ్నిలో మరణించాడు గదా! ఆవిధంగా సంభవించిన మృతికి సంబంధించి నేను చేయవలసిన (ఉత్తర) క్రియలు ఏమిటి? ధర్మరాజు అట్లా అనగానే నారదుడు (ఇట్లా అన్నాడు) 'నాయనా! ఆ ధృతరాష్ట్రుడు సంపూర్ణమైన విరక్తి ఇంకా అధికమై ముందటిరోజే తన అగ్నులకు ప్రత్యేకపూజలు చేసి, అవసరమైన ఇష్టిని నిర్వహించి, ఆ అగ్నులనుండి సెలవు తీసికొన్నాడు. అపు డాతడితో ఉన్న ఋత్విక్కులు ఆ ఆగ్నులను అడవిలోనే ఉద్వాసన చేసి వెళ్ళిపోయారు. అట్లా వారు విడిచిపెట్టిన (ధృతరాష్ట్రుడి) అగ్నులే అంటుకొని పెరిగి ఆ అడవిని అంతా కాల్చేశాయి- అని కూడా విన్నాను. అందుచేత ధృతరాష్ట్రుడు కేవలం అడవిచిచ్చువలన కాకుండా స్వీయాగ్నులలోనే మృతిపొందాడు.

ఉ. కావున నెవ్వగం బొరయఁగాఁ బనిలేదు నరేంద్ర! గొంతియుం
బావకు నప్పకుం గరము భక్తి దగం బరిచర్య సేసి దే
వావలి ప్రస్తుతింపఁగ నిరామయలోకము నొందె; వారికిన్
నీ వుదకంబు లీవలయు నిష్ఠమెయిం దిలసంయుతంబుగాన్. 166

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= (ధర్మ) రాజా!; కావునన్= అందుచేత; (ధృతరాష్ట్రుడు ఆత్మాగ్నితో మృతి చెందాడు కాబట్టి); నెఱ+వగన్= అధికమయిన దుఃఖం; పొరయఁగాన్= పొందవలసిన; పని= అవసరం; లేదు= లేనే లేదు; గొంతియున్= కుంతికూడా; బావకున్= బావగారైన ధృతరాష్ట్రుడికీ; అప్పకున్= అక్క-గాంధారికీ; కరము= మిక్కిలి; భక్తి(న్)= సేవాభావంతో; తగన్= తగువిధంగా; పరిచర్య= శుశ్రూష; చేసి= ఆచరించి; దేవ+ఆవలి= దేవతల సముదాయం; ప్రస్తుతింపఁగన్= మెచ్చుకొనేటట్లుగా; నిరామయలోకమున్= మంచి (ఇంద్ర) లోకాన్ని; ఒందెన్= చేరుకొన్నది; నీవు= నీవు; వారికిన్= కుంతీ, గాంధారీ, ధృతరాష్ట్రులకు; నిష్ఠమెయిన్= శ్రద్ధతో; తిలసంయుతంబుగన్= నువ్వులతో గూడ; ఉదకంబులు= నీళ్ళు; ఈన్+వలయున్= ఇవ్వ(విడువ)వలసింది.

**తాత్పర్యం:** కాబట్టి ధర్మరాజు మిక్కిలి దుఃఖాన్ని పొందవలసిన అవసరం లేదు. కుంతి కూడా బావకు అక్కకూ మిక్కిలి భక్తితో తగిన విధంగా సేవచేసి దేవతలు ప్రస్తుతించే విధంగా మంచిలోకాన్ని పొందింది. వారికి నీవు నిష్ఠతో నువ్వులూ నీళ్ళూ విడువవలసియున్నది.

**యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదక ప్రదానంబు చేయుట (సం.15-47-10)**

**క. అనుజన్ములు నంతఃపుర । వనితాజనములును నీవు వసుధేశ్వర ! వే**
**చని నడపుఁ డుదకవిధి నీ । జనకునకును జననులకును జాహ్నవిలోనన్.' 167**

**ప్రతిపదార్థం:** వసుధా+ఈశ్వర!= (ధర్మ) రాజా!; అనుజన్ములు= తమ్ముళ్ళూ; అంతఃపుర-వనితా-జనములును= అంతఃపుర స్త్రీలూ; నీవు(న్)= నీవూ; వే= త్వరగా; చని= వెళ్ళి; జాహ్నవిలోనన్= గంగలో; నీ జనకునకును= నీ తండ్రి అయిన ధృతరాష్ట్రుడికీ;జననులకును= తల్లులకు; (కుంతీ,గాంధారులకు); ఉదకవిధి= తిలోదకాలిచ్చే పని; నడపుఁడు= ఆచరించండి.

**తాత్పర్యం:** ధర్మరాజా! భీమసేనాదులైన తమ్ముళ్ళూ, ద్రౌపదీ ప్రభృతులైన అంతఃపురకాంతలూ, నీవూ వెంటనే వెళ్ళి, గంగలో, ధృతరాష్ట్రుడికీ, కుంతీ, గాంధారులకూ; తిలోదకప్రదానం చేయండి.'

**ఆ. అనిన లెస్స గాక! యని ధర్మసుతుఁ డేక । వస్త్ర ధరణనియతి వఱల నెల్ల**
**వారు నట్ల యేఁగుదేరఁగఁ బౌరులు । బలసి చనఁగఁ జనియెఁ బౌరవేంద్ర! 168**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర!= జనమేజయరాజా; అనినన్= అని నారదుడు చెప్పగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; లెస్స కాక= మంచిది అట్లాగే; అని= అనిచెప్పి; ఏక-వస్త్ర-ధరణనియతి= ఒకే వస్త్రం ధరించటం అనే నియమం; వఱలన్= ఒప్పుతుండగా (నియమబద్ధంగా ఏకవస్త్రం ధరించి); ఎల్లవారున్= తమ్ములు మొదలైనవారు అందరూ; అట్లు+అ= ఆవిధంగా ఏకవస్త్రధారులై; ఏఁగుదేరఁగన్= వెంటరాగా; పౌరులు(న్)= పురప్రజలుకూడా; బలసి= అధికసంఖ్యలో; చనఁగన్= వెళ్ళగా; చనియెన్= (గంగకు) వెళ్ళాడు.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా! జనమేజయా! నారదు డావిధంగా చెప్పగా మంచిది అట్లాగే చేద్దామని ధర్మరాజు నియమానుగుణంగా, ఏకవస్త్రం ధరించగా, తమ్ములు మొదలైన వాళ్ళు గూడా అలాగే ఏకవస్త్రం ధరించి వెంటరాగా, పురప్రజలూ గుంపులుగా రాగా, గంగకు వెళ్ళాడు.

**వ. ఇట్లు చని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు సర్వజనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదకప్రదానంబులు నిర్వర్తించి, నివృత్తులై యశుచిత్వం బపనయించుటకుం బుర బహిరంగణంబునఁ బటకుటీర ప్రకరంబుల వసియించి; రట్టియెడ. 169**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా (అనుజాదులతో-కలిసి); చని= (గంగకు) వెళ్ళి; గంగాస్నానంబు= గంగలో స్నానం; ఆచరించి= చేసి; ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; మొదలు+అగు-అర్హజనంబులు= మొదలైన యోగ్యులయిన వారు; ధృతరాష్ట్రునకు(న్)= ధృతరాష్ట్రుడికీ; గాంధారికిన్= గాంధారికీ; కుంతికిన్= కుంతికీ; తిల+ఉదక-ప్రదానంబులు= నువ్వులూ, నీళ్ళూ ఇవ్వటం; నిర్వర్తించి= పూర్తిచేసి; నివృత్తులు+ఐ= (గంగనుండి రాజధానికి) తిరిగిపోతూ; అశుచిత్వంబు= ధృతరాష్ట్రాదుల మరణం వలన కలిగిన అశౌచాన్ని; అపనయించుటకున్= తొలగించుకొనటానికి; (ఆ రోజులు గడిపేయటానికి); పుర-బహిస్-అంగణంబునన్= హస్తినాపురానికి వెలుపలి ప్రాంతంలో; పట-కుటీర-ప్రకరంబుల్= వస్త్రాలతో గూర్చిన ఆవాసాలలో (డేరాలలో); వసియించిరి= నివాసం ఏర్పాటు చేసికొన్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా (అనుజాది సహితుడై) ఏకవస్త్రధారణం మున్నగు లక్షణాలతో వెళ్ళి గంగలో స్నానం చేసి, ధర్మరాజు మొదలైన అవసరమైనవారు ధృతరాష్ట్రుడికీ, కుంతికీ తిలోదకాలిచ్చి వెనుకకువచ్చి మృతాశౌచం తొలగే వరకు హస్తిపురం వెలుపల గుడారాలలో నివాసం చేస్తున్నారు. ఆ సమయంలో...

**సీ.** **ఆంబికేయాదుల యస్థిపుంజముల గం। గాద్వార సలిల సంగమ విశిష్ట**
**సంస్కారమునఁ గూర్పఁ జాలెడు సంశుద్ధ। జనముల రావించి సబహుమాన**
**ఫణితుల వారి కప్పని యేర్పడఁగఁ జెప్పి। పనిచె నక్కౌరవ జనవిభుండు;**
**శ్రాద్ధార్హదినమున వృద్ధానుమతి నతం। డక్కురువృద్ధున కతని సతికి**

**తే.** **గొంతికిని రత్నకాంచన గోతురంగ। హస్తి కన్యా ధరిత్రీ గృహాది దాన**
**విధుల సర్వజనంబులు విస్మితులుగ। నియతిమెయిఁ బారలౌకిక క్రియ లొనర్చె.** **170**

**ప్రతిపదార్థం:** ఆ+కౌరవ-జన-విభుండు= కురువంశంవారికి నాథుడైన ఆ ధర్మరాజు; ఆంబికేయ-ఆదుల= ధృతరాష్ట్రుడూ మొదలైన (గాంధారీ, కుంతీ); అస్థిపుంజములన్= అస్థి సముదాయాలను; గంగాద్వార= గంగాద్వారంలోని; సలిల= (గంగా) జలంతో; సంగమ= కలపటం అనే; విశిష్ట= ప్రత్యేకమైన, సంస్కారమునన్= పవిత్రంగా; కూర్చన్= కలపటానికి; చాలెడు= సమర్థులయిన; సంశుద్ధ-జనములన్= పవిత్రులయిన (తెలిసినవారూ, ఆప్తులూ అయిన) మనుష్యులను; రావించి= పిలిపించి; వారికిన్= ఆ జనానికి; సబహుమాన-ఫణితులన్= మన్ననలతో గూడిన మాటలతో; ఆ+పని= ధృతరాష్ట్రాదుల అస్థులను గంగాజలంలో కలిపే పనిని; ఏర్పడఁగన్= వివరంగా; చెప్పి= తెలియజేసి; పనిచెన్= (ధృతరాష్ట్రాదులు దగ్ధమయిన చోటికి) పంపాడు; శ్రాద్ధ+అర్హ-దినమునన్= శ్రాద్ధం చేయవలసిన (అశౌచం తొలగినటువంటి-పంద్రెండవ) రోజున; అతండు= ఆ ధర్మరాజు; వృద్ధ-అనుమతిన్= పెద్దల ఆమోదంతో; ఆ+కురువృద్ధునకున్= ఆ ధృతరాష్ట్రుడికీ; అతని సతికిన్= ధృతరాష్ట్రుడి భార్య గాంధారికీ; గొంతికిని= కుంతీదేవికీ; రత్న= రత్నాలూ; కాంచన= బంగారమూ; గో= ఆవులూ; తురంగ= గుర్రాలూ; హస్తి= ఏనుగులూ; కన్యా= కన్నెపిల్లలూ; ధరిత్రీ= నేలా; గృహ= ఇళ్ళూ; ఆది= మొదలైన దాన-విధులన్= దానకర్మలచేత; సర్వజనంబులు= అందరూ; విస్మితులుగన్= ఆశ్చర్యపడేవిధంగా; పారలౌకిక క్రియలు= ధృతరాష్ట్రాదులకు ఊర్ధ్వలోకాన్ని సాధించే కర్మలను; నియతి మెయిన్= శ్రద్ధతో; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రాదుల అస్థికలను గంగాద్వారంలోని జలంలో నిమజ్జనం చేసే పనిని నిర్వహించటానికి ధర్మరాజు సమర్థులైన ఉత్తమ వ్యక్తులను పిలిపించి వాళ్ళకు ఆపనిని మన్ననలతో వివరించి చెప్పి, (ధృతరాష్ట్రాదులు దగ్ధమైన చోటకు పంపాడు; మృత-అశౌచం తొలగినటువంటి పంద్రెండవ రోజు-శ్రాద్ధం చేయవలసిన నాడు.) పెద్దల ఆమోదంతో

ధృతరాష్ట్రుడినీ గాంధారినీ కుంతినీ, ఉద్దేశించి అందరూ ఆశ్చర్యపడేటట్లుగా రత్నాలూ, బంగారమూ, ఆవులూ, గుర్రాలూ, ఏనుగులూ, కన్నెలూ, భూమీ, ఇళ్ళూ, మొదలైన దానాలతో పరలోక సాధకాలైన ఉత్తర క్రియలను శ్రద్ధగా ఆచరించాడు ధర్మరాజు.

**ఆ. మునిజనములు వచ్చి యనుమోద మందంగ। సకల బంధుజనులు సంతసిల్ల**
**నన్న పర్వతముల నాజ్యనదులఁ బితృ। మేధ ముల్లసిల్లె మేదినీశ! 171**

**ప్రతిపదార్థం:** మేదినీ+ఈశ!= (జనమేజయ) మహారాజా!; ముని జనములు= తాపసులు; వచ్చి= (ధృతరాష్ట్రాదుల శ్రాద్ధకర్మలను) చూడ వచ్చి; అనుమోదము= సంతోషం; అందంగన్= పొందగా; సకల-బంధు-జనులు= చుట్టాలు అందరూ; సంతసిల్లన్= ఆనందించగా; పితృమేధము= శ్రాద్ధకర్మ; అన్న-పర్వతములన్= కొండలంతలై ఉన్న అన్నం రాసులతోనూ; ఆజ్యనదులన్= నదులవలె ప్రవహిస్తున్న నేయితోనూ; ఉల్లసిల్లెన్= వర్ధిల్లింది;

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ధృతరాష్ట్ర ప్రభృతుల శ్రాద్ధం రోజు (శతయూపాది) మునులు వచ్చారు. ఆ మునులూ, చుట్టాలూ అందరూ సంతోషించే విధంగా కొండలంతటి అన్నరాసులతో, నదులవలె సాగుతున్న నేతి ప్రవాహాలతో ఆ పితృమేధం ప్రకాశించింది.

**క. ద్వాదశ దినములు నారదుఁ। డాదరమున నొద్ద నుండి యంతయుఁ గని స**
**మ్మోదంబుతోడ నాశీ। ర్వాదం బొనరించెఁ బాండవ ప్రవరునకున్. 172**

**ప్రతిపదార్థం:** నారదుండు= నారదమహర్షి; ద్వాదశదినములు(న్)= ఆ పండ్రెండు రోజులూ; ఆదరమునన్= వాత్సల్యంతో; ఒద్దన్= ధర్మరాజు తోనే; ఉండి= నిలిచి; అంతయున్= ధర్మరాజు చేసిన పారలౌకిక క్రియలు అన్నీ; కని= చూచి; సమ్మోదంబు తోడన్= సంతృప్తితో; పాండవప్రవరునకున్= పాండురాజు కొడుకులలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజుకు; ఆశీర్వాదంబు= ఆశీస్సు; ఒనరించెన్= కలుగజేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ధృతరాష్ట్రాదులకు పారలౌకిక క్రియలు నిర్వహించిన ఆ పండ్రెండు రోజులు కూడా నారద మహర్షి అక్కడే ఉండి; అంతా చూచి, ఆనందించి, ఆ ధర్మరాజును ఆశీర్వదించాడు.

**వ. అమ్మునీంద్రునిఁ దక్కనుం గలుగుతపస్విసత్తముల సమర్చితులం గావించి యుధిష్ఠిరుం డామంత్రితులం జేసిన నాసంయమివరులు నిజనివాసంబులకుం జని; రాన్నృపకుంజరుండు బంధుమిత్రసహితుండై కుంజర పురంబు ప్రవేశించె; నిత్తెఱంగున నాంబికేయునకు భారతరణంబు పిదప దానాది పుణ్య క్రియాకలాపకరణంబులం బురంబునం బదియేనును, దపోనియమంబున వనంబున మూఁడునుంగాఁ బదునెనిమిది సంవత్సరంబులు చనియె; నివ్విధంబున వైచిత్రవీర్యుని సంసేవన సమస్తప్రకారంబుల సంఘటించి కృతార్థతానందంబునొంది ధర్మ నందనుండు జనంబు లభినందించుచందంబున సామ్రాజ్యంబుఁ బాలించె నని యిట్లు ధృతరాష్ట్రుని యాశ్ర మ వాసంబు విషయంబైన వర్తనంబు వైశంపాయనుండు చెప్పిన విని జనమేజయుండు 'మహాత్మా యిట్లు కృతకృత్యతం బొందిన పాండవాగ్రజుండు భూభారంబు నిర్వహించుచుండం బదంపడి పుట్టిన విశేషంబు లెఱింగింపవే! యనుటయు. 173**

**ప్రతిపదార్థం:** యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఆ+మునీంద్రునిన్= ఆ నారదమహర్షినీ; తక్కు-నున్+కలుగు= మిగిలి ఉన్న; తపస్వి-సత్తములన్= మునివరులను; సమర్చితులన్= పూజించబడిన వారినిగా; కావించి= చేసి; ఆమంత్రితులన్-చేసినన్= వీడుకోలు ఇవ్వగా; ఆ సంయమివరులు= (నారదాదులైన) ఆ మునిశ్రేష్ఠులు; నిజనివాసంబులకున్= తమతమ నెలవులకు; చనిరి= వెళ్ళారు; ఆ నృప కుంజరుండు= రాజ శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజు; బంధు-మిత్ర-సహితుండు+ఐ= తనతో వచ్చిన చుట్టాలతో, స్నేహితులతో కలిసినవాడై; కుంజరపురంబు= హస్తినాపురం; ప్రవేశించెన్= ప్రవేశించాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఆంబికేయునకున్= ధృతరాష్ట్రుడికి; భారత రణంబు పిదపన్= కురుక్షేత్రయుద్ధం తరువాత; దాన+ఆది-పుణ్య-క్రియా- కలాప-కరణంబులన్= గ్రామాది దానాలు మొదలైన మంచి పనులను చేయటంతో; పురంబునన్= హస్తినాపురంలో; పది+ఏనును= పదిహేను సంవత్సరాలూ; తపస్+నియమంబునన్= తపస్సుకు సంబంధించిన నియమాలతో; వనంబునన్= అడవిలో; మూఁడునున్= మూడునూ; కాన్= అయ్యేవిధంగా (మొత్తం); పదునెనిమిది సంవత్సరంబులు= పద్దెనిమిది సంవత్సరాలు; చనియెన్= గడచాయి; ధర్మనందనుండు= ధర్మరాజు; ఈ-విధంబునన్= ఈ తీరుగా; వైచిత్రవీర్యుని= (విచిత్రవీర్యుడి కొడుకు) ధృతరాష్ట్రుడి యొక్క; సంసేవన= శుశ్రూష; సమస్త ప్రకారంబులన్= అన్నివిధాలుగానూ; సంఘటించి= చేసి; కృతార్థతా+ఆనందంబున్= సాఫల్యంతోడి సంతోషాన్ని; ఒంది= పొంది; జనంబులు= ప్రజలు; అభినందించు-చందంబునన్= మెచ్చుకొనే విధంగా; సామ్రాజ్యంబున్= రాజ్యాన్ని; పాలించెన్= పరిపాలించాడు; అని; ఇట్లు= ఈ విధంగా; ధృతరాష్ట్రుని= ధృతరాష్ట్రుడియొక్క; ఆశ్రమవాసంబు= తపోవన నివాసానికి; విషయంబు+ఐన= సంబంధించిన; వర్తనంబు= వృత్తాంతం; వైశంపాయనుండు= వైశంపాయనముని; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు= జనమేజయమహారాజు (వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు); మహాత్మా!= మహానుభావా!; ఇట్లు= మీరు చెప్పిన యీ ప్రకారంగా; కృతకృత్యతన్= కర్తవ్యం నిర్వహించి సాఫల్యాన్ని; పొందిన= పొందినటువంటి; పాండవ-అగ్రజుండు= ధర్మరాజు; భూభారంబు= రాజ్య నిర్వహణ బాధ్యతను; నిర్వహించుచుండన్= నడపుతూ ఉండగా; పదంపడి= ఆ తరువాత; పుట్టిన= కలిగిన; విశేషంబులు= ప్రత్యేక సంఘటనలు; ఎఱింగింపవే= తెలియ జెప్పవలసింది; అనుటయున్= అని అడుగగా- (జనమేజయుడితో వైశంపాయను డిట్లా చెప్పాడని తరువాతి మౌసలపర్వంతో అన్వయం)

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ నారదమహర్షినీ; మిగిలిన (అక్కడికి చూడవచ్చిన) మునులనూ, పూజించి వీడుకోలు చెప్పగా వాళ్లందరూ తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. తరువాత ఆ ధర్మరాజు కూడా తనతో వచ్చి ఉన్న చుట్టాలతోనూ, మిత్రులతోనూ కలిసి హస్తినాపురం ప్రవేశించాడు. ఈవిధంగా ధృతరాష్ట్రుడికి భారతయుద్ధం పూర్తయిన తర్వాత దానాలు మొదలైన పుణ్యకార్యాలు చేయడంతో హస్తినాపురంలో పదిహేనేండ్లూ, తపోనియమాలతో, అరణ్యంలో మూడేళ్ళూ, మొత్తం పద్దెనిమిది సంవత్సరాలు గడచాయి. ధృతరాష్ట్రుడిని అన్ని విధాలుగానూ సేవిస్తూ కృతార్థతతో ఆనందించిన ధర్మరాజు ప్రజలు ప్రశంసించే విధంగా రాజ్యాన్ని పరిపాలించాడు-అని వైశంపాయనుడు ఈ విధంగా ధృతరాష్ట్రుడి యొక్క ఆశ్రమవాసానికి సంబంధించిన వృత్తాంతం చెప్పగా విని జనమేజయుడు (వైశంపాయనుడితో) 'మహాత్మా! కృతకృత్యుడైన ధర్మరాజు రాజ్యాన్ని పరిపాలిస్తుండగా తరువాత జరిగిన విశేషాలు ఏమిటో తెలియజెప్ప వలసింది' అన్నాడు. (అప్పుడు వైశంపాయనుడిట్లా-మౌసలపర్వంలో చెప్పుతున్నాడు)

ఆశ్వాసాంతము

**శా.** **కారుణ్యాత్మక దృక్ప్రచార! గతసంకల్పాంతరంగస్థితి**
**స్మేరాకార! పతంగమధ్యమ మరీచివ్యాప్తి మూర్ఛత్సుధా**

**ధారారూపవిహార! నిర్మిత జగత్సంసార! నానాగమ**

**క్షీరోద్యన్నవనీతతాలసిత! నిశ్చిత్తత్త్వ సంభావితా!** **174**

**ప్రతిపదార్థం:** కారుణ్య-ఆత్మక-దృక్-ప్రచార= దయయే రూపంగా కలిగిన చూపులయొక్క కదలిక కలవాడా!; గత= తొలగిపోయినటువంటి; సంకల్ప= కోరికలు (రాగద్వేషాలకు సంబంధించిన తలపులు) కల్గిన; అంతరంగ= మనస్సులో; స్థితి= ఉండటంతో; స్మేర= వికాసం పొందిన; ఆకార!= స్వరూపం కలిగినవాడా!; పతంగ= సూర్యుడియొక్క; మధ్యమ= నడుమనున్నదైన; మరీచి= కిరణం; వ్యాప్తి= ప్రసారం చేత; మూర్ఛత్= వృద్ధిపొందుతున్న; సుధా= అమృతం యొక్క; ధారా= ప్రవాహం; రూప= ఆకారంగా; విహార!= విహరించేవాడా!; నిర్మిత= (నీచేత) కల్పించబడిన; జగత్= లోకాలయొక్క; సంసార!= జీవధర్మం గలవాడా!; నానా= అనేకములైన; ఆగమ= శాస్త్రాలు అనేటటువంటి; క్షీర= పాలనుండి; ఉద్యత్= పైకి తేలినటువంటి; నవనీతతా= వెన్నయొక్క ధర్మంతో; లసిత= ప్రకాశించేవాడా; నిస్-చిత్-తత్త్వ= సమగ్రమైన చైతన్యంతోను, బ్రహ్మభావంతోనూ; సంభావితా!= తెలిసికొనబడేవాడా!

**తాత్పర్యం:** కరుణయే ఆకారంగా ఉన్న చూపుల కదలికలు కలవాడా! ఏవిధమైన తలపులూ లేని వాళ్ళ మనసులలో వికాసరూపంతో ఉండేవాడా! సూర్యుడిలోని మధ్య కిరణం వ్యాపించడం చేత వర్ధిల్లుతున్నటువంటి అమృత ప్రవాహరూపమైన విహారం కలవాడా! విశ్వసంసారాన్ని కల్పించినవాడా! అనేక (విధ)ములైన శాస్త్రాలు అనే పాలనుండి ఉద్భవించిన వెన్నవంటి ధర్మంతో ప్రకాశించే వాడా! సంపూర్ణమైన చైతన్యమూ, బ్రహ్మముగా, (జ్ఞానులచేత) తెలియబడేవాడా!-హరిహరనాథా!.

**క. నిర్మలసంవిదుపాస్యా! । ధర్మకరణ! దుర్వికాస్య దైత్యశ్రేణీ**

**నిర్మథన కేళీ! నిర్జర । శర్మకృతి విహారశీల! సంయమిలోలా!** **175**

**ప్రతిపదార్థం:** నిర్మల-సంవిత్-ఉపాస్యా!= మలినం లేని జ్ఞానం చేత ధ్యానించదగినవాడా!; ధర్మ-కరణ!= ధర్మక్రియకు సాధనమైనవాడా!; దుస్-వికాస్య= దుష్టమూ; కుటిలమూ అయిన నడవడి కలిగిన; దైత్య= రాక్షసుల; శ్రేణీ= సమూహాలను; నిర్మథన= నాశనం చేయటం; కేళి!= ఆటగా కలిగినవాడా!; నిర్జర= దేవతలకు; శర్మ= మేలునూ; కృతి= చేయటం అనే; విహార= వేడుక; శీల!= స్వభావంగా కలిగినవాడా!; సంయమి-లోలా!= ఇంద్రియాలను అణచుకొన్న-మునులయందు అధికాసక్తి కలవాడా!; హరిహరనాథా!.

**తాత్పర్యం:** నిర్మలమైన (సంకల్పాలను త్యజించిన) జ్ఞానం చేత ఉపాసింపదగినవాడా! ధర్మానికి మూలమైనవాడా! దుష్కర్మలు చేసేటటువంటి రాక్షస సమూహాలను నిర్మూలించటం క్రీడగా కలిగినవాడా! దేవతలకు మేలు చేయటమే వేడుక కావటం స్వభావంగా కలవాడా! యతులపై ఆసక్తి కలిగినవాడా!- హరిహరనాథుడా!.

**మాలిని.**

**సమదవిమద దూరా సన్న రక్షా! ప్రసన్నా!**

**శమశుభమయమూర్తి! స్ఫారదుర్లక్ష సారా!**

**దమవిభవసముద్యద్ధామ! నిస్సీమభూమా!**

**సమహృదయలసత్సంసర్గ! సానందవర్గా!** **176**

**ప్రతిపదార్థం:** సమద= మదించిన వారికీ (అహంకారులకు); విమద= మదం లేని వారికీ (నిరహంకారులకు) దూర= దూరంగానూ; ఆసన్న!= దగ్గరగానూ ఉండేవాడా!; రక్షా-ప్రసన్నా!= రక్షించటం కొరకు దయ కలిగిన (చూపే)వాడా!; శమ= శాంతీ; శుభమయ= కళ్యాణమూ నిండిన; మూర్తి!= స్వరూపం కలవాడా!; స్ఫార= విస్తారమైనటువంటిదీ; దుర్‌లక్ష= సామాన్య ఇంద్రియాలకు తెలియనిదీ అయిన; సారా!= శక్తి గలవాడా!; దమ= ఇంద్రియాలు (మనస్సు) నిగ్రహం యొక్క; విభవ= ఆధిక్యం చేత; సముద్యత్= తోచేటటువంటి; ధామ!= ఉనికి కలవాడా!; నిస్సీమ-భూమా!= హద్దులేని సమృద్ధి కలిగిన వాడా!; సమ= సర్వమునందు, ఒకే సమయమున; హృదయ= మనసు గలిగిన వారియందు; లసత్= ప్రకాశించే; సంసర్గ!= సంబంధం (కూడుట) కలవాడా!; స-ఆనంద-వర్గా!= ఆనందంతో కూడిన (భక్తుల) సమూహం కలవాడా!-హరిహరనాథా!.

**తాత్పర్యం:** మదం గలిగిన వారికి దూరంగానూ, మదం (విడిచిన- లేని) వారికి దగ్గరగానూ ఉండేవాడా!. ఆశ్రితులను కాపాడటానికి ప్రసన్నుడివై ఉండేవాడా!. శాంతీ, శుభమూ నిండిన రూపం కలిగిన వాడా!; విస్తారమూ, సామాన్యులకు గోచరంగానిదీ అయిన శక్తి కలవాడా!; ఇంద్రియనిగ్రహం అధికంగా గలిగినవారిచేత మాత్రమే తెలియదగిన ఉనికి గలవాడా!. మేరలేని బాహుళ్యం (సమృద్ధి) కలిగినవాడా!. సర్వసమబుద్ధులతో ఒప్పుతున్న సంబంధం (సాన్నిహిత్యం) కలవాడా! ఆనందంతో కూడిన హృదయం కలిగిన భక్తసమూహం కలవాడా!-హరిహరనాథా!.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నాశ్రమవాసపర్వంబునందు సర్వంబు ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది ఉభయకవి మిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్త్రుడూ, పండితుల చేత ఆరాధించబడి రాణించేవాడూ అయిన తిక్కన సోమయాజి శుభప్రదంగా రచించిన శ్రీ మహాభారతంలోని ఆశ్రమవాసపర్వంలో చివరిది రెండవ ఆశ్వాసం.

ఆశ్రమవాసపర్వంలో రెండవ ఆశ్వాసం సమాప్తం,

శ్రీమదాంధ్రమహాభారతంలో ఆశ్రమవాసపర్వం సర్వం ముగిసింది.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## మౌసల పర్వము - ఏకాశ్వాసము

**శ్రీ ధర్మకామ హృదయ స । మాధానాధాన కారకాంఘ్రిసరోజా!**

**బోధఘనవ్యాస పరస । మాధి సమాలీఢ తేజ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సిరిని; ధర్మ= ధర్మాన్ని; కామ= కామాన్ని (కోరేటటువంటి); హృదయ= మనస్సులకు; సమాధాన= నెమ్మదిని; ఆధానకారక= కల్గించే; అంఘ్రి సరోజా!= పాదపద్మాలు కలవాడా!; బోధఘన= విజ్ఞానంచే గొప్పవాడైన; వ్యాస= వ్యాసమహర్షియొక్క; పరసమాధి= నిర్వికల్ప సమాధిలో; సమాలీఢ= ఆస్వాదించబడిన; తేజ!= తేజస్సు కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! సిరిని, ధర్మాన్ని, కామాన్ని కోరే మనసులకు నీ పాదపద్మాలు నెమ్మది కలిగిస్తాయి. నీవు వ్యాసాది మహర్షుల పరసమాధిలో ఆస్వాదించబడిన తేజస్సు కలిగినవాడవు. నీకు నమస్కారం.

**విశేషం:** ధర్మార్థ కామాలను కోరి చేసే సమాధి సవికల్ప సమాధి. లోకంలో చాలామంది అట్లాంటివారే. కాని, ఋషుల సమాధి విశిష్టమైనది. దానిని నిర్వికల్ప సమాధి అంటారు. ఈ రెండూ హరిహరతత్త్వాలకు సూచకాలని గ్రహించాలి.

ధర్మరాజు రాజ్యంబున నుత్పాతంబులు దోఁచుట (సం.16-1-1)

క. **దేవా! జనమేజయ ధా । త్రీ వల్లభునకు నుదాత్త తేజోదీప్తుం**

**డా వైశంపాయనుఁడు ప్రి । యావేశస్మేరచిత్తుఁడై యి ట్లనియెన్. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; జనమేజయ ధాత్రీవల్లభునకున్= జనమేజయ మహారాజునకు; ఉదాత్త= గొప్పదైన; తేజోదీప్తుండు= కాంతిచేత ప్రకాశించే వాడయిన; ఆ వైశంపాయనుఁడు= ఆ వైశంపాయన మహర్షి; ప్రియావేశ= ప్రేమతో కూడిన ధార్మికమైన ఆవేశంతోడి; స్మేరచిత్తుఁడు+ఐ= ప్రసన్నమైన మనసు కలవాడై; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజుతో వైశంపాయనుడు ప్రేమతో పుట్టిన ధార్మికావేశం కలిగినవాడై ఇట్లా చెప్పాడు.

**విశేషం:** వ్యాసుడు భవ్య కవితావేశం కలిగినవాడు (చూ.విరాట.1-3) అదే ఆవేశం వైశంపాయన మహర్షిలో కూడా ఉన్నది. 'లోకహితనిష్ఠ'లో పుట్టిన ధార్మికావేశ మిది. అదే ఋషులకు లోకం మీద ఉన్న ప్రేమ. జనన మరణాలకు చలించని ఋషి చిత్తం ఎప్పుడూ ప్రసన్నంగా ఉంటుంది.

సీ. **భారత సంగ్రామపారీణుఁడై జయ । రమ యుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ**

**బాండవముఖ్యునిఁ బట్టంబు గట్టిన । యది యాది గాఁగ ముప్పదియునైదు**

**సంవత్సరంబులు సన ననంతర వత్స । రంబునఁ బ్రజకు భయం బొనర్చు**

**నుత్పాతములు పుట్టె నుర్వీశ! విను మహా । వాయువు శర్కరావర్షి యగుచు**

**ఆ. వీచు, నర్కునుదయవేళల బింబంబు। బలసి తోఁచు, ఘనకబంధసమితి**
**నీరదములు లేక నిర్ఘాతపాతముల్। గలుగు నుల్క లెల్లకడల డుల్లు.' 3**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ!= ఓ జనమేజయరాజా!; విను= ఈ కథను వినుము; భారతసంగ్రామ పారీణుఁడై= భారత యుద్ధం నిర్వహించటంలో సమర్థత కలిగి; జయరమ= విజయశ్రీ (గెలుపు); ఉల్లసిల్లన్= అతిశయించగా (పొంది); సామ్రాజ్యమునకున్= భారత సామ్రాజ్యానికి; పాండవముఖ్యునిన్= పాండు కుమారులలో శ్రేష్ఠుడిని-ధర్మరాజును; పట్టంబు= పట్టాభిషేకం; కట్టిన అది= జరిపినది; ఆదిగాఁగన్= మొదలుకొని; ముప్పదియునైదు సంవత్సరంబులు= ముప్పై ఐదు సంవత్సరాలు; చనన్= కడచిన తరువాత; అనంతర వత్సరంబునన్= ఆ పై సంవత్సరం (ముప్పై ఆరవ సంవత్సరంలో); ప్రజకున్; భయంబున్+ఒనర్చు= భయాన్ని కలిగించే; ఉత్పాతములు+పుట్టెన్= ఉపద్రవసూచకాలైన ప్రకృతి వికారాలు కలిగాయి; మహావాయువు= పెనుగాలి; శర్కరావర్షి+అగుచున్= ఇసుకను వర్షిస్తూ; వీచున్= వీచింది; అర్కు= సూర్యుడి యొక్క; ఉదయవేళలన్= ఉదయసమయాలలో; ఘనకబంధసమితి= పెద్దపెద్ద మొండెముల సముదాయాలు; బింబంబు బలసి= అర్కబింబాన్ని చుట్టుకొని; తోఁచున్= కనిపించటం మొదలుపెట్టాయి; నీరదములు లేక= మేఘాలు లేకుండానే; నిర్ఘాతపాతముల్= పిడుగుపాట్లు; కలుగున్= కలిగాయి; ఉల్కలు= ఉల్కలు; ఎల్లకడలన్= అన్ని దిక్కులలోనూ; డుల్లున్= రాలాయి.

**తాత్పర్యం:** రాజా! వినుము. ధర్మరాజుకు పట్టాభిషేకం జరిగిన ముప్పదైదు సంవత్సరాలు గడవగా ఆ ముప్పదిఆరవ సంవత్సరంలో భయంకరమైన ప్రకృతివైపరీత్యాలు కలిగాయి. ఉదయకాలంలో పెద్దగాలులతో ఇసుకవర్షం పడింది. ఉదయ సమయాలలో సూర్యబింబాన్ని పరివేష్టించి మొండాలు గోచరించాయి. మేఘాలు లేకుండానే పిడుగులు పడ్డాయి. అన్ని దిక్కులలోనూ ఉల్కలు రాలాయి.

**విశేషం:** 1.గాంధారి శపించింది యాదవనాశం 36వ సంవత్సరంలో జరగబోతుందని - కాబట్టి సంవత్సరాన్ని ఇంతగా నొక్కి చెప్పటం. 2. ప్రకృతి వైపరీత్యాలు మూడు రకాలు: 1. దివ్యమైనవి - సూర్యచంద్రాది గ్రహణాలు. 2. అంతరిక్ష సంబంధమైనవి-ఉల్కాపాతం మొదలైనవి. 3. భూ సంబంధమైనవి - భూకంపం మొదలైనవి.

**క. పరివేషము లినరజనీ। కరులకు నతిరూక్ష రుచులు గలిగి కలుగు నం**
**బరమెల్లఁ గప్పి వేసవిఁ। బరఁగుం బెనుమూడ మంచు పౌరవముఖ్యా! 4**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశశ్రేష్ఠా!; ఇనరజనీకరులకున్= సూర్యచంద్రులకు; పరివేషములు= గాలిసుడులు (కాంతి వలయాలు); అతిరూక్ష రుచులు కలిగి= అతిభయంకరమైన కాంతులు కలిగి; కలుగున్= ఏర్పడతాయి; అంబరము+ఎల్లన్= ఆకాశమంతటా; వేసవిన్= మండువేసవిలో (ఎండకాలంలో); కప్పి= బాగా పరచుకొని; పెనుమూడ మంచు= పెద్దపొగమంచు; పరఁగున్= వ్యాపించినది (విస్తరించింది).

**తాత్పర్యం:** సూర్యచంద్రులకు చుట్టూ అతిభయంకరమైన కాంతులలో గాలిగుడులు కట్టాయి. మండు వేసవిలో దట్టమైన పొగమంచు ఆకాశమంతటా విస్తరించింది.

**సీ. ఇట్లనుదినమును నెన్నియేనియును మహో। త్పాతములు పుట్టుచుండఁ గొంత**
**కాలంబువోవఁగఁ గౌంతేయముఖ్యుండు। వినియె నొండొరులతోఁ బెనఁగి సర్వ**

యాదవులును దెగి రంబుజనాభుండు । హలధరుండును దక్క నని నరేంద్ర!
విని భీమసేనుని విచ్చు నకులుని । సహదేవు రావించి సంభృతార్తి

తే. యగుచు నవ్వార్త యెఱిఁగించె నందఱకును; । వార లేవురు నెవ్వగల్ గూరు మాన
సములు గలఁగ నత్యంత విషణ్ణులైరి । సకలజనకోటులును శోకజలధి మునుఁగ. 5

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ఓ రాజా!; ఇట్లు= ఈ విధంగా; అనుదినమును= ప్రతిరోజూ; ఎన్నియేనియునున్= ఎన్నో; మహా+ ఉత్పాతములు= పెద్ద ఉపద్రవాలు; పుట్టుచున్+ఉండన్= కలుగుతుండగా; కొంతకాలంబు పోవంగన్= కొంతకాలం గడిచాక; కౌంతేయముఖ్యుండు= ధర్మరాజు; అంబుజనాభుండు= శ్రీకృష్ణుడు; హలధరుండును= బలరాముడు; తక్కన్= తప్ప (తక్కిన); సర్వయాదవులును= యాదవులందరూ; ఒండొరులతోన్= ఒకరితో ఒకరు; పెనంగి= పోట్లాడి; తెగిరి+అని= మరణించారని; విని= విన్నవాడై; భీమసేనునిన్= భీముడిని; విచ్చునిన్= అర్జునుడిని; నకులునిన్= నకులుడిని; సహదేవున్= సహదేవుడిని; రావించి= పిలిపించుకొని; సంభృత+ఆర్తి+అగుచున్= మిక్కిలి బాధకలవాడై; ఆ+వార్త= యాదవులమృతిని; అందఱకును= ఎల్లరికి; ఎఱిఁగించెన్= తెలియజేశాడు; వారలు+ఏవురు= ఆ పాండవులైదుగురూ; నెఱ+వగల్= సంపూర్ణమైన బాధలు; కూరు= నిండిన; మానసములు కలఁగన్= మనస్సులు వికలం కాగా; సకలజనకోటులునున్= హస్తినాపురవాసులంతా; శోకజలధిమునుఁగన్= శోకసముద్రంలో మునుగగా; అత్యంత= మిక్కిలి; విషణ్ణులు+ఐరి= విషాదాన్ని పొందారు.

**తాత్పర్యం:** ఇట్లా ప్రతిరోజూ ఏదో ఒక వైపరీత్యం జరుగుతూ ఉంటే కొంతకాలం గడిచాక ధర్మరాజు శ్రీకృష్ణ బలరాములు తప్ప తక్కిన యాదవులంతా ఒకరితో ఒకరు పోట్లాడి చనిపోయారన్న వార్త విన్నాడు. తన సోదరులను పిలిపించి ఈ వార్త తెలియజేశాడు. హస్తినాపురవాసులంతా ఈ వార్త విని శోకంలో మునిగారు. పాండవుల వ్యథ వర్ణనాతీతమైనది.

**విశేషం:** శోకజలధి-శోక మనెడి జలధి-రూపకాలంకారం.

తే. అనిన విని యమ్మహీపతి యాదవులకుఁ । బోరు దమలోనఁ గలిగిన కారణంబు
వారి వృత్తాంతములు వినవలతుఁ జెప్పు । మనుడు నమ్ముని యిట్లను నతనితోడ. 6

**ప్రతిపదార్థం:** అనినన్= ఈ విధంగా వైశంపాయనుడు చెప్పగా; విని; ఆ+మహీపతి= జనమేజయుడు; యాదవులకున్= యాదవ వంశీయులకు; తమలోనన్= తమలోతమకే; పోరు= యుద్ధం; కలిగిన కారణంబు= ఏ కారణంవలన కలిగిందో; వారి వృత్తాంతములు= ఆ కథలను; వినవలతున్= వినగోరుతాను; చెప్పుము; అనుడున్= అని చెప్పగా; ఆ ముని= వైశంపాయనుడు; అతనితోడన్= జనమేజయుడితో; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** 'యాదవులు తమలో తాము ఎందుకు పోరాడి మరణించారో తెలిసికొనగోరుతున్నాను' అని జనమేజయుడు అడిగాడు. అప్పుడు వైశంపాయనుడు ఇట్లా చెప్పటం మొదలుపెట్టాడు.

**విశేషం:** యాదవులలో చాలా తెగలున్నాయి. వృష్ణి, భోజ, అంధక, కుకుర-ఇత్యాదులు, అందువలననే 'తమలో తాము ఎందుకు ఘర్షణపడ్డారు?' అని రాజు అడిగాడు.

క. 'ద్వారవతికిఁ గణ్వుండును । నారదమునివరుఁడు గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి । నారాయణుఁ జూచువేడ్క నరవరముఖ్యా! 7

**ప్రతిపదార్థం:** నరవరముఖ్యా!= శ్రేష్ఠుడైన రాజా!; తొల్లి= చాలాకాలం క్రిందట; కణ్వుండును= కణ్వమహర్షి; నారదమునివరుండున్= నారదమహర్షి; గాధి నందనుండును= విశ్వామిత్రమహర్షి; నారాయణున్= శ్రీకృష్ణుడిని; చూచువేడ్కన్= దర్శించాలన్న కోరికతో; పెంపు+ఆరంగన్= (శిష్యప్రశిష్యులతో కలిసి) వైభవంగా; ద్వారవతికిన్= ద్వారకానగరానికి; వచ్చిరి= వచ్చారు.

**తాత్పర్యం:** చాలాకాలం క్రిందట కణ్వుడు, నారదుడు, విశ్వామిత్రుడు తమ శిష్యులతో కలిసి శ్రీకృష్ణుడిని చూడాలన్న కోరికతో ద్వారకకు వచ్చారు.

**విశేషం:** యాదవుల మరణానికి కారణమైన ఈ ఋషుల ఆగమనం కూడా శ్రీకృష్ణుడి సంకల్పమే - అని ఈ పద్యం తెలుపుతుంది. అందుకే ఋషులకు శ్రీకృష్ణుడిని చూడాలన్న కోరిక కలిగింది.

**సీ.** **చనుదెంచి పురవీథిఁ జనునవసరమున । వృష్ణి కుమారులు విధివశమున**
**మనముల నవినీతి జనియింప సాంబున । కంగనాలంకార మమరఁజేసి**
**కొనివచ్చి యమ్మహామునివర్గమునకు మి । థ్యావినయమున వందన మొనర్చి**
**నిభృతులై కారుణ్యనియతాత్ములార! యీ । భామిని బభ్రునిభార్య ప్రజలఁ**

**తే.** **గనునె యిది? యని యడిగిన కౌరవేంద్ర! । యత్తపోధనవర్యు లయ్యాగడమున**
**కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ । నెలయ నక్కుమారులతోడ నిట్టు లనిరి.** **8**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర= ఓ జనమేజయమహారాజా! (వినుము); చనుదెంచి= ఆ ఋషులు అట్లావచ్చి; పురవీథిన్= ద్వారకానగర వీథులలో; చను+అవసరమునన్= వెళ్ళుతున్న సమయంలో; విధివశమునన్= విధిచేత ప్రేరేపించబడి; వృష్ణికుమారులు= వృష్ణి సంతతికి చెందిన యువకులు (కొందరు); మనములన్= మనస్సులలో; అవినీతి జనియింపన్= అవిధేయత కలుగగా; సాంబునకున్= సాంబుడనే పేరుగల కృష్ణుడి కుమారుడికి; అమరన్= తగినట్టుగా; అంగనా+అలంకారము+చేసి= ఆడదాని వేషంవేసి, కొనివచ్చి= తీసికొని వచ్చి; ఆ మహాముని వర్గమునకున్= ఆ గొప్పమునుల సముదాయమునకు; మిథ్యావినయమునన్= లేని వినయంతో; వందనము+ఒనర్చి= నమస్కారాలు చేసి; నిభృతులై= మాయావంతులై; కారుణ్య నియతాత్ములార!= కరుణామయమైన చిత్తాలు కలిగిన ఓ ఋషులారా!; ఈ భామిని= ఈ స్త్రీ; బభ్రుని భార్య= బభ్రుడనేవాడి పెండ్లాము; ఇది= ఈమె; ప్రజలన్+కనునే?= పిల్లలను కంటుందా?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ఆ+తపోధనవర్యులు= ఆ ఋషులు; ఆ+ఆగడమునకున్= ఆ వంచనకు; ఆత్మలందున్= మనసులలో; క్రోధ+అగ్ని= కోపమనే అగ్ని; అగ్గలముగన్= అధికంగా; ఎలయన్= రగులుకొనగా; ఆ కుమారులతోడన్= ఆ యువకులతో; ఇట్టులు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** ఇట్లా ద్వారకావీథులలో ఆ ఋషులు వెళ్ళుతున్న సమయంలో విధిచేత ప్రేరేపించబడి, వృష్ణివంశానికి చెందిన కొందరు యువకులు సాంబుడనే వాడికి ఆడదానివేషం, కపటమైన వినయాన్ని ఒలకబోస్తూ నమస్కారాలు చేసి, 'అయ్యా! మీరు అన్నీ తెలిసినవారు. కరుణామూర్తులు. ఈ స్త్రీ బభ్రుడి పెండ్లాము. ఈమెకు సంతానం కలుగుతుందా? లేదా? చెప్పండి!' అని అడిగారు. ఆ ఋషులకు ఇది కపటవేషమని తెలిసి చాలా కోపం వచ్చి ఇట్లా అన్నారు:

**క.** **అంబుజనాభుని కొడు కీ । సాంబుఁడు గను యాదవక్షయాపాదన క**
**ల్యంబగు ముసలము; మావచ । నంబున కనృతంబు లేదు; నమ్ముఁడు మీరల్.** **9**

**ప్రతిపదార్థం:** అంబుజనాభుని కొడుకు= శ్రీకృష్ణునికుమారుడైన; ఈ సాంబుఁడు= సాంబుడు అనే ఇతడు; యాదవ= యాదవులకు; క్షయ+ఆపాదన+కల్యంబు+అగు= నాశనం కల్గించటానికి సమర్థమైన; ముసలమున్= రోకలిని; కనున్= కంటాడు; మా వచనంబునకున్= మా మాటకు; అన్యతంబు లేదు= తప్పిపోవటమంటూ లేదు; మీరల్= మీరు; నమ్ముఁడు= నమ్మండి.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడి కుమారుడైన ఈ సాంబుడు యాదవకులనాశన సమర్థమైన ఒక రోకలిని కంటాడు పొండి. ఈ విషయాన్నైనా నమ్మండి (మాతోనా మీ ఆటలు? అని అర్థం). మా మాటలు పొల్లుకావు.

**విశేషం:** వృష్ణికులంలో వాసుదేవుడుగా కృష్ణుడు పుట్టాడని భగవద్గీత చెప్తుతుంది. శ్రీకృష్ణుడి కుమారుడే సాంబుడు.

**సీ.** **దామోదరుఁడు హలధరుఁడును దక్కంగ । యాదవులెల్లరు నమ్ముసలము**
**నద్భుతశక్తి గీటడఁగుదు రబ్బల । దేవుండు దనదైన దేహ మధిక**
**నిష్ఠమై విడిచి వార్నిధిఁ బ్రవేశించు । భూశయ్య నుండంగ నాచక్రధరుని**
**జర యను రాక్షసి వెరవునఁ బట్టి క్ర। మించుఁ బొం' డని చెప్పి, మెచ్చు గాదు**

**ఆ.** **మనము కృష్ణు నింకఁ గను టనియెడుబుద్ధి । నమ్మహాముసీంద్రు లపుడు మరలి**
**యాత్మవాసములకు నరిగిరి; తదనంత । రంబ కృష్ణుఁ డవ్విధంబు వినియె.** **10**

**ప్రతిపదార్థం:** ఆ ముసలము= ఆ రోకలికున్న; అద్భుతశక్తిన్= విచిత్రమైన శక్తిచేత; దామోదరుఁడునున్= శ్రీకృష్ణుడును; హలధరుఁడును= బలరాముడును; తక్కంగన్= తప్ప (తక్కిన); యాదవులు+ఎల్లరున్= యాదవులందరూ; గీటు+అడఁగుదురు= నశిస్తారు; ఆ+బలదేవుండు= ఆ బలరాముడు; తనది+ఐన+దేహమున్= తన పార్థివశరీరాన్ని; అధికనిష్ఠమైన్= సమాధిలో నిష్ఠచేత; విడిచి= వదలిపెట్టి; వార్నిధిన్= సముద్రంలో; ప్రవేశించున్= ప్రవేశిస్తాడు; భూశయ్యన్+ఉండఁగన్= నేలమీద పడుకొని ఉండగా; ఆ+చక్రధరునిన్= ఆ శ్రీకృష్ణుడిని; జర+అనురాక్షసి= 'జర' అనే పేరున్న రాక్షసి; వెరవునన్= నేర్పుతో; పట్టి ఆక్రమించున్= పట్టి ఆక్రమిస్తుంది (చంపుతుంది); పొండు= (ఇక మీరు చేసింది చాలు) పొండి; అని చెప్పి= అని వారలను పంపివేసి; మనము= మనం; కృష్ణున్= శ్రీకృష్ణుడిని; ఇంకన్= ఇప్పుడింక; కనుట= చూడటం; మెచ్చు+కాదు= సమంజసం కాదు; అనియెడు బుద్ధిన్= అన్న ఆలోచనతో; ఆ+మహామునీంద్రులు= ఆ ఋషులు; ఆత్మవాసములకున్= తమ తమ నివాసాలకు; మరలి= తిరిగి; అరిగిరి= వెళ్ళారు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తదనంతరంబు+అ= ఆ తరువాత (వెంటనే); ఆ+విధంబు= ఆ విషయం; వినియెన్= విన్నాడు.

**తాత్పర్యం:** బలరామకృష్ణులు తప్ప తక్కిన యాదవులంతా ఆ రోకలికున్న విచిత్ర శక్తి చేత నశిస్తారు. బలరాముడు యోగనిష్ఠతో తన శరీరం వదలి సముద్రంలోకి ప్రవేశిస్తాడు. కృష్ణుడు నేలపై పడుకొని ఉండగా 'జర' అనే రాక్షసి ఆయనను ఆక్రమించి చంపుతుంది. (ఇక చాలు) వెళ్ళండి?' అని చెప్పి వారిని పంపివేసి, 'ఇప్పుడు మనం కృష్ణుడిని చూడటం సమంజసం కా' దని ఆలోచించినవారై ఆ ఋషులు తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. వెనువెంటనే కృష్ణుడి కీ వార్త తెలిసింది.

**క.** **విని కాలవేది యగు న । వ్వనజాక్షుఁడు నియతి యగు నవస్థకుఁ దలఁపం**
**జన దన్యథాత్వకరణం । బని యూహించుచు నుపేక్ష యాత్మ నొలయఁగన్.** **11**

**ప్రతిపదార్థం:** విని= ఇట్లా ఋషులు వెళ్ళిపోవటాన్ని గురించి విని; కాలవేదిఅగు= భూత భవిష్యద్వర్తమానాలను తెలిసినట్టి; ఆ+వనజాక్షుఁడు= కమలనేత్రుడైన ఆ కృష్ణుడు; నియతి+అగు+అవస్థకున్= కాలనిర్ణీతమైన పనికి; అన్యథాత్వకరణంబు= మరో విధంగా చేయటం; తలఁపన్+చనదు= ఆలోచించరాదు (అంటే అది అట్లాగే జరగాలని); అని ఊహించుచున్= అని తలుస్తూ; ఉపేక్ష= ఉదాసీన బుద్ధి; ఆత్మన్+ఒలయఁగన్= మనసులో ఏర్పడగా.

**తాత్పర్యం:** అట్లా ఋషులు మరలిపోవటాన్ని కృష్ణుడు విన్నాడు. భూతభవిష్యద్వర్తమానాలు తెలిసిన కృష్ణుడికి కాలవిధిని గతి మరల్చటం వీలులేని విషయమన్న భావం మనసులో కలుగగా ఉదాసీనుడయ్యాడు.

క. **తన చుట్లనున్న బంధులఁ। గనుఁగొని 'యిట్టిది విధాతృకరణీయం బి**
**ప్పని మనవారల యొప్పని। తనమున మూఁడెనని వంతఁ దలపోయకుఁడీ.'** 12

**ప్రతిపదార్థం:** తనచుట్లన్= తన చుట్టూ; ఉన్న బంధులన్+కనుఁగొని= ఉన్న బంధువులను చూచి; విధాతృకరణీయంబు= బ్రహ్మనియామకం; ఇట్టిది= ఇట్లాంటిది (అంతేగాని); ఈ+పని= ఈ కార్యం (ఋషులను అవమానించి శాపం పొందటం); మనవారల= మనయాదవకుమారుల; ఒప్పనితనమునన్= మూర్ఖత్వంచేత; మూఁడెన్+అని= దాపురించిందని; వంతన్= దుః ఖంలో; తలపోయకుఁడీ= ఆలోచించకండి.

**తాత్పర్యం:** తన సమీపంలోని బంధువులను చూచి శ్రీకృష్ణు డిట్లా అన్నాడు; 'ఇది విధి నియామకం. అంతే తప్ప మన యాదవకుమారుల మూర్ఖత్వం చేత దాపురించిందని మీరు మాత్రం దుఃఖించకండి.'

మునిశాపంబున సాంబుని కడుపున ముసలంబు పుట్టుట (సం. 16-2-15)

సీ. **అని పల్కి యభ్యంతరావాసమున కేఁగె; । మఱునాఁడు సాంబకుమారు కడుపు**
**లోనుండి జముదూతపోని భయంకర । నిష్ఠురముసలంబు నిర్గమించె;**
**దానికి నత్యద్భుతంబును భయమును । గదురంగ వసుదేవుకడకుఁ బాఱి**
**బంధు లయ్యాదవపతి కెఱిఁగించిన । నలఁదురి వెలువెల్లనగుచుఁ గొంత**

తే. **ప్రొద్దు నివ్వెఱఁగంది యా భూవరుండు । కడురయంబున రోఁకలి పొడిగఁజేసి**
**వనధిలోపలఁ జల్లంగ వారిఁ బనిచె; । వారలును నట్ల చేసిరి కౌరవేంద్ర!** 13

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ఓ రాజా! (వినుము); అని పల్కి= అని చెప్పినవాడై శ్రీకృష్ణుడు; అభ్యంతరావాసమునకున్+ఏఁగెన్= తన మందిరానికి వెళ్ళిపోయాడు; మఱునాఁడు= ఆ తరువాతి రోజు; సాంబకుమారు కడుపులోనుండి= సాంబుడి పొట్టలోనుంచి; జముదూత+పోని= యమదూతవంటి; భయంకర= భయాన్ని కలిగించే; నిష్ఠుర= కఠినమైన; ముసలంబు= రోకలి; నిర్గమించెన్= బయలుపడింది; దానికిన్= ఆ రోకలి బయలుపడటాన్ని చూచి; అతి+అద్భుతంబునున్= చాలా ఆశ్చర్యాన్ని; భయమునున్= భయమూ; కదురంగన్= కలుగగా (ఆ బంధువులు); వసుదేవుకడకున్+పాఱి= వసుదేవమహారాజుదగ్గరికి వెళ్ళి; ఆ యాదవపతికిన్= ఆ వసుదేవుడికి; ఎఱిఁగించినన్= ఈ వృత్తాంతాన్ని తెలపగా; అలఁదురి= భయపడి; వెలువెల్లనగుచున్= వెలవెలపోతూ; కొంతప్రొద్దు= కొంచెం సేపు; ఆ భూవరుండు= ఆ వసుదేవుడు; నిండు+వెఱఁగు+అంది= చాలా ఆశ్చర్యపడి; కడురయంబునన్= అతివేగంగా; రోఁకలిన్= ఆ రోకలిని; పొడిగన్+చేసి= నూరి పొడిచేసి; వనధిలోపలన్+చల్లంగన్= సముద్రంలో కలిపివేయటానికి; వారిన్+పనిచెన్= వారిని పంపాడు; వారలును= ఆ బంధువుల కుమారులు; అట్లు+అ+చేసిరి= అట్లాగే చేశారు.

**తాత్పర్యం:** అనిచెప్పి శ్రీకృష్ణుడు తన మందిరానికి వెళ్ళిపోయినాడు. జనమేజయా! ఆ మరుసటిరోజే సాంబుడి కడుపులో నుండి యముని దూతవంటి భయంకరమైన కఠినంగా ఉన్న ఒక రోకలి వెలువడింది. దానికి ఆశ్చర్యమూ భయమూ కలుగగా బంధువులు వసుదేవుడి దగ్గరకు పరుగెత్తి ఆయనకు తెలుపగా ఆయన భయపడి వెలవెలబోయి నిశ్చేష్టుడై కొంతసేపుండి చాల ఆశ్చర్యపడుతూ ఆ రోకలిని వెంటనే పొడిగా చేసి సముద్రంలో కలిపివేయుండని వారిని (ఆ చెప్పిన బంధువులను) ఆజ్ఞాపించినాడు. వారు కూడ అట్లాగే చేసినారు.

**విశేషం:** భారతంలో చాలా ప్రధానాంశం. విధి ఎంత ఉత్కృష్టమైనదో చెప్పటమే. విధి అసాధ్యాలను సాధ్యం చేస్తుంది. దానిని ఎవరూ ఎదిరించలేరు. కనుకే మగవాడి పొట్టలోనుండి రోకలి బయటపడింది. ఇది ఒక వింత. దానిని పొడిగా చేసి నీటిలో కలిపితే సమస్య పరిష్కారమౌతుందని భావించటం మానవప్రయత్నం . అది ఎట్లాంటి రూపాంతరాన్ని పొంది విధి నియామకాన్ని నిర్వర్తించిందో తరువాతి కథలో చూస్తాం.

**క. మునిశాపశక్తి మానుష। మునఁ ద్రోవఁగ రామి యుల్లములఁ దలఁపక య**
**జ్జనపతియు బాంధవులు న। ట్లొనర్చి యూఱడిలి యుండి రుర్వీనాథా! 14**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా!; మునిశాపశక్తిన్= మునుల శాపానికి ఉన్న శక్తిని; మానుషమునన్= మానవప్రయత్నంచేత; త్రోవఁగన్+రామి= తొలగించుకొనలేకపోవటాన్ని; ఉల్లములన్+తలఁపక= మనసులలో ఊహించకుండా; ఆ+జనపతియున్+బాంధవులున్= ఆ రాజు, అతడి బంధువులు; అట్లు+ఒనర్చి= ఆ విధంగా చేసి; ఊఱడిలి యుండిరి= ఊరటతో ఉన్నారు.

**తాత్పర్యం:** మనుష్యప్రయత్నంతో ఋషుల శాపశక్తిని తప్పించుకొనలేమన్న ఊహ కూడా వారికి రాలేదు. అట్లా రోకలిని పొడిచేసి సముద్రంలో కలపటంవలన తమ పని పూర్తయిందనుకొన్నారు. అట్లా చేసి కొంత ఓదార్పును పొందారు.

**విశేషం:** పురాణకథలన్నిటిలోనూ ఇట్లాంటి చర్యలు కనిపిస్తాయి. పరీక్షిత్తు ఒంటిస్తంభం మేడమీద ఉండి తక్షకుడి బారినుండి రక్షించుకొనాలని ప్రయత్నించటం ఇట్లాంటిదే. ఇక్కడ తక్షకుడు విధి చోదితుడు. అందుకే పండులో ప్రవేశించి పరీక్షిత్తునకు మరణం కలిగించాడు. ఇక్కడ కూడా అంతే. విధి ఎట్లా రూపాంతరం చెందగలుగుతుందో వసుదేవాదులు ఊహించలేకపోయారు.

**క. పదపడి ధృతరాష్ట్ర మహిషి। యదయహృదయయై సమస్తయాదవులకు బె**
**ట్టిదమగు శాపం బిచ్చుట। విదితమయిన నజ్జనములు వెఱచుచునుండన్. 15**

**ప్రతిపదార్థం:** పదపడి= పూనికతో (తనకు తానుగా); ధృతరాష్ట్ర మహిషి= ధృతరాష్ట్రుడి భార్య గాంధారి; అదయహృదయ+ఐ= కనికరం లేని హృదయం కలదై; సమస్తయాదవులకున్= యాదవులందరికీ; బెట్టిదమగు శాపంబు+ఇచ్చుట= క్రూరమైన శాపం ఇవ్వటం; విదితము+అయినన్= తెలియగా; ఆ+జనములు= ఆ జనులు; వెఱచుచునుండన్= భయపడుతుండగా.

**తాత్పర్యం:** తన సంతానం నశించటానికి శ్రీకృష్ణుడే కారణమని తలచి గాంధారి కనికరంలేని మనస్సుతో 'యాదవసంతానం కూడా నా సంతానంవలె నశిస్తుం'దని క్రూరంగా శపించింది. ఈ శాపవిషయం తెలిసిన వారు ఏమి కాబోతుందో అని భయపడుతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** పతివ్రత శాపం తప్పకుండా ఫలిస్తుందని మనవారి విశ్వాసం. భర్తకు కనులు లేవని తానుకూడా కళ్ళకు గంతలు కట్టుకొని, జీవితాంతమూ గుడ్డితనాన్ని తెచ్చుకొన్న పతివ్రత గాంధారి, అందుకే ఆమెకు శాపం ఇవ్వగల శక్తి అబ్బింది. ఆ శాపాన్ని శ్రీకృష్ణుడు కూడా తొలగించలేకపోయాడు. యాదవులందరు అనటంలో శ్రీకృష్ణుడు కూడా వారిలో ఉన్నాడు. అందుకే ఇది క్రూరమైన శాపం.

**క. కాలం బగుటయుఁ గురుభూ। పాలోత్తమ! యాదవేంద్రు పట్టణమున హృ**
**త్కాలుష్యసమాపాదన। శాలిమహోత్పాతముల్ ప్రజాతము లయ్యెన్. 16**

**ప్రతిపదార్థం:** కురుభూపాలోత్తమ!= కురువంశస్థులలో శ్రేష్ఠుడా! (వినుము); కాలంబు+అగుటయున్= యాదవ నాశనకాలం సమీపించటంచేత; యాదవ+ఇంద్రు పట్టణమునన్= ద్వారకానగరంలో; హృద్+కాలుష్యసమాపాదన శాలి= హృదయాలలో కాలుష్యాన్ని పుట్టించగల శక్తి ఉన్న; మహా+ఉత్పాతముల్= పెద్దపెద్దవైన ఉపద్రవాలు (ప్రకృతివికారాలు); ప్రజాతములు+అయ్యెన్= పుట్టాయి.

**తాత్పర్యం:** యాదవుల వినాశనకాలం ఎప్పుడు సమీపించిందో అప్పుడే ద్వారకానగరంలో చెప్పరాని ఉపద్రవాలు సంభవించటం మొదలుపెట్టాయి.

**విశేషం:** రాబోయే శుభాశుభ ఫలాలను ప్రకృతి సూచించగలదని మనవారి విశ్వాసం. ఈ ఉత్పాతాలన్నీ ప్రకృతి వైపరీత్యాలే. వీటిని మూడు విధాలుగా ప్రాచీనులు చెప్పారు. సూర్యచంద్రాది గ్రహణాలను దివ్యాలని, ఉల్కలు తెగిపడటాన్ని అంతరిక్షాలని, భూమి కంపించటాన్ని భౌమాలని-అంటారు. ఇవి సంభవించినపుడు జీవితంలో భయంకరమైన అపాయాలు కలుగుతాయని సూచన.

**తే. అరుణములు ఘూర్ణితంబులు నైన లోచ। నములు మెఱయ మహోగ్రదండము ధరించి**
**తిరుగు నొక్కొక్కచోటను దృశ్యుఁడగుచు। నంతకుం డిదె యదె తోఁచె ననఁగ నధిప! 17**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! (వినుము); అరుణములు= ఎర్రనివి; ఘూర్ణితంబులు+ఐన= గుండ్రంగా తిరిగేటటువంటి; లోచనములు మెఱయన్= కళ్ళు ప్రకాశిస్తుండగా; మహోగ్రదండము ధరించి= భయంకరమైన దండాయుధాన్ని ధరించి; అంతకుండు= యముడు; ఒక్కొక్కచోటను= అక్కడక్కడా; దృశ్యుఁడగుచున్= కనిపిస్తూ; ఇదె అదె తోఁచెన్+అనన్= ఇక్కడ కనిపించాడు, అక్కడ కనిపించాడు అని భ్రమించేటట్లు; తిరుగున్= తిరుగుతాడు.

**తాత్పర్యం:** ఎఱ్ఱని గుండ్రంగా తిరిగే కళ్ళు ప్రకాశిస్తుండగా మహా భయంకరమైన దండాన్ని ధరించి యముడు ఇదిగో ఇక్కడ అదిగో అక్కడ కనిపించినాడనేటట్లుగా ఒక్కొక్కచోట కనబడుతూ తిరుగుతూనే ఉన్నాడు.

**విశేషం:** అంతాన్ని సంఘటించే వాడు కాబట్టి యముడికి అంతకుడని పేరు. అతడి చేతనున్న దండము-కాలదండం, కాలపాశమనీ అంటారు.

ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట (సం.16-3-2)

**క. నీలపింగళ దేహమాభీల భంగి। కముగ నమ్మెయి వర్తించు జముఁడు సకల**
**వృష్ణి భోజాంధకోత్సాది విహరణమున। మునుల శాపంబు ప్రేరేఁప మనుజనాథ! 18**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; మునులశాపంబు ప్రేరేఁపన్= మునులశాపం ప్రేరేపించగా; వృష్ణిభోజ+అంధక+ఉత్సాది విహరణమునన్= యాదవులను నాశనం చెయ్యటం అనే క్రీడలో భాగంగా; జముఁడు= యముడు; నీలపింగళదేహము= నలుపు పసుపువన్నెలు గల శరీరం; ఆభీల భంగికముగన్= భయాన్ని సృష్టించే విధంగా; ఆ+మెయిన్= ఆ రీతిలో; వర్తించున్= తిరగటం మొదలుపెట్టాడు.

**తాత్పర్యం:** యాదవులను చంపటమనే ఆట మొదలుపెట్టాడా!-అన్నట్లుగా యముడు నలుపు, పసుపు వన్నెలు కలిసిన (గోరోచన వర్ణమని కూడా అంటారు) విచిత్ర దేహకాంతితో భయాన్ని కలిగించే రీతిలో అట్లా తిరగటం ప్రారంభించాడు.

**సీ.** **చిలుకలు గూబల యెలుఁగుల చందంబు। దోఁపంగ నఱచు రాత్రులను దినము**
**లందును నక్కల యట్లు మేఁకలు గూయు। మొదవు పిండునకు గాడిదలు పుట్టు;**
**ముంగుల కుదయించు మూషికంబులు గుక్క। లెల్లను బిల్లుల నీను; బలుఁడు**
**హరియును దక్కంగ యాదవ నివహంబు। బ్రాహ్మణప్రతతికి బాధసేయు**

**తే.** **గురుల కవమాన మొనరించుఁ దిరుగు లజ్జ। విడిచి యభిలాషముల వెంట విభుల పంపు**
**సేయ కున్మార్గములఁ దమ చిత్తములకు। వచ్చినట్ల వర్తింతురు వనిత; లధిప!** **19**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; రాత్రులనున్= రాత్రివేళలలో; చిలుకలు గూబల ఎలుగు చందంబుదోఁపంగన్= చిలుకలు గూబల అరుపులవలె; కూయున్= కూస్తుంటాయి; దినములందునున్= పగటివేళలలో; నక్కల+అట్లు మేఁకలు కూయన్= నక్కలవలె మేకలు అరుస్తుంటాయి; మొదవు పిండునకున్= ఆవుల సమూహానికి; గాడిదలు+పుట్టున్= గాడిదలు పుట్టుతున్నాయి; ముంగులకున్= ముంగిసలకు; మూషికంబులు+ఉదయించున్= ఎలుకలు పుట్టుతున్నాయి; కుక్కలెల్లను= కుక్కలన్నీ; పిల్లులన్+ఈనున్= పిల్లులను ఈనుతున్నాయి; బలుఁడు హరియున్ తక్కంగన్= బలరాముడు శ్రీకృష్ణుడు తప్ప; (తక్కిన) యాదవ నివహంబు= యాదవ సమూహం; బ్రాహ్మణప్రతతికిన్= బ్రాహ్మణుల సమూహానికి; బాధ+చేయున్= ఏదో ఒక బాధను కల్పిస్తోంది; గురులకున్= గురువులకు; అవమానము+ ఒనరించున్= అవమానం కలిగిస్తోంది; లజ్జవిడిచి తిరుగున్= సిగ్గు విడిచిపెట్టి తిరుగుతోంది; అభిలాషములవెంటన్= ఇచ్చవచ్చిన కోరికల వెంబడి; వనితలు= యాదవస్త్రీలు; విభులపంపు+చేయక= భర్తల ఆనను లెక్కచేయకుండా; ఉన్మార్గములన్= చెడునడతలతో; తమ చిత్తములకున్= తమ మనసులకు; వచ్చినట్లు+అ= ఇష్టమయిన రీతిలో; వర్తింతురు= తిరుగుతున్నారు.

**తాత్పర్యం:** రాత్రివేళలలో చిలుకలు గూబలవలె కూస్తున్నాయి. పగటివేళలలో మేకలు నక్కలవలె అరుస్తున్నాయి. ఆవులకు గాడిదలు పుట్టుతున్నాయి. ముంగిసలకు ఎలుకలు జన్మిస్తున్నాయి. కుక్కలు పిల్లులను ఈనుతున్నాయి. బలరాముడు కృష్ణుడు తప్ప తక్కిన యాదవులు పాపకార్యాలు చేయటం మొదలుపెట్టారు. బ్రాహ్మణులను బాధిస్తున్నారు, గురువులను అవమానిస్తున్నారు. సిగ్గువదలి కోరికల వెంబడి పరుగెత్తుతున్నారు. యాదవస్త్రీలు భర్తలను లెక్కచేయటం మాని, మదించి ఇష్టంవచ్చిన రీతిలో విచ్చలవిడిగా తిరుగుతున్నారు.

**విశేషం:** చిలుకలు గూబలవలె కూయటం, ఇత్యాదులు అసంభవాలు. ప్రకృతి గతి వికటించిందని అర్థం. గోబ్రాహ్మణులకు ఎక్కడ బాధ కలుగుతుందో అక్కడ అధర్మం పుట్టిందని వైదిక సంప్రదాయం చెప్తుతుంది. గురువులను అవమానించటంచేత యాదవులలో వివేకం పోయిందని అర్థం. స్త్రీలు శీలం కోల్పోయినందువలన వారిని కాపాడగల పాతివ్రత్యబలం కూడా నశించిందని అర్థం.

**క. అనలములు హోమకాలం। బున నానాభూతవర్ణములతోడ శిఖల్**
**మనుజేశ్వర! వామావ। ర్తన మొందఁగ నుగ్రగంధ రౌద్రంబు లగున్. 20**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= రాజా!; హోమకాలంబునన్= హోమంచేసే సమయంలో; అనలములు= అగ్నులు; నానాభూత వర్ణములతోడన్= చిత్రవిచిత్రమైన రంగులు కలవిగా; శిఖల్= జ్వాలలు; వామ+ఆవర్తనము+ఒందఁగన్= అప్రదక్షిణంగా తిరుగుతూ పైకి లేవగా; ఉగ్ర= భయంకరంగా; గంధ= వాసన కలిగి; రౌద్రంబులు+అగున్= భీతిని పుట్టిస్తున్నాయి.

**తాత్పర్యం:** హోమకాలంలో అగ్ని నానా వర్ణాలతో భీకరంగా ప్రకాశిస్తున్నది. జ్వాలలు అప్రదక్షిణమార్గంలో పైకి లేస్తూ దుర్వాసనతో భీతిని కలుగజేస్తున్నాయి.

**విశేషం:** శుభకార్యాలకు ప్రదక్షిణమార్గం (ఎడమవైపునుంచి కుడివైపు తిరగటం), అశుభకార్యాలలో అప్రదక్షిణం (దీనినే అపసవ్యమంటారు-కుడివైపు నుండి ఎడమవైపు తిరగటం) వైదిక సంప్రదాయంలో ఉన్నది. అగ్నిజ్వాల అపసవ్యం కావటం అమంగళాన్ని సూచిస్తుంది.

**క. విను కూడుగూరపాకము। గనుఁగొని ప్రాయివాపి డింపఁగా నప్పు డసం**
**జనితములై ప్రువ్వులు గల। గొన మిలమిల మెదలునందుఁ గురుకులముఖ్యా! 21**

**ప్రతిపదార్థం:** కురుకులముఖ్యా!= కురుకులంలోని రాజులలో శ్రేష్ఠుడా!; విను= ఇంకా ఏం జరిగిందో చెప్తాను వినుము; కూడుగూర= అన్నము, కూరలు; పాకము కనుఁగొని= ఉడికింది తెలిసికొని; ప్రాయి+పాపి= పొయ్యినుండి దూరంగా; డింపఁగాన్= క్రిందికి దించగా; అప్పుడు+అ= అప్పుడే; సంజనితములు+ఐ= పుట్టినవై; ప్రువ్వులు= పురుగులు; కలగొనన్= అంతటా; అందున్= ఆ ఆహారంలో; మిలమిల= మిలమిల లాడుతూ; మెదలున్= మెదలుతూ కనిపిస్తుంటాయి.

**తాత్పర్యం:** అన్నం, కూరలు ఉడికాక పొయ్యినుంచి ఒకవైపు దింపుతుంటే మరోవైపు అప్పటికప్పుడే అందులో పురుగులు పుట్టుతున్నాయి. ఆ ఆహారంలో అంతటా వ్యాపించి భీతి కలిగించేటట్లు మిలమిలలాడుతూ మెదలుతున్నాయి.

**సీ. అనుదినంబును నిట్టు లశుభసూచకములు। దోఁపంగ సర్వవిదుండు కృష్ణుఁ**
**డంతరంగమున సమాలోచనము చేసి। 'గాంధారి పుత్రశోకమునఁ జేసి**
**కోపంబు గదిరిన శాపంబు ముప్పది। యాఱవునేఁ డెల్ల యాదవులకు**
**నాశ మన్యోన్యహననమున నగుటకు। నిచ్చె నిష్ఠించి; యయ్యేఁడు వచ్చెఁ**

**తే. దప్ప దది ఫలించు; దానికి తీర్థ స। మీప భూమియైన మేలుగాదె!'**
**యని నరేంద్ర! యమ్మహాత్ముఁ డీ భంగి నూ। హించి తెఱఁగు నిశ్చయించెఁ దివిరి. 22**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ఓ రాజా!; ఇట్టులు= ఈ విధంగా; అనుదినంబునున్= ప్రతిరోజూ; అశుభ సూచకములు= అశుభాన్ని సూచించే సంఘటనలు; తోఁపంగన్= జరుగుతూ ఉండగా; సర్వవిదుండు కృష్ణుఁడు= అన్నీ తెలిసిన శ్రీకృష్ణుడు; అంతరంగమునన్= మనసులో; సమాలోచనము చేసి= బాగా ఆలోచించి; గాంధారి= గాంధారీదేవి; పుత్రశోకమునన్+చేసి= పుత్రశోకంచేత; కోపంబు

కదిరినన్= కోపం పుట్టగా; ముప్పదియాఱవు నేఁడు= ముప్పై ఆరవసంవత్సరంలో; ఎల్ల యాదవులకున్= యాదవులందరికీ; అన్యోన్య హననమునన్= ఒకరినొకరు చంపుకొనటంద్వారా; నాశము+అగుటకున్= నాశనమవటానికి; నిష్ఠించి= తన పాతివ్రత్యబల నిష్ఠతో; శాపంబున్+ఇచ్చెన్= శాపమిచ్చింది; ఆ+ఏఁడు వచ్చెన్= ఆ సంవత్సరం వచ్చింది; అది తప్పదు= ఆ శాపం తప్పిపోదు; ఫలించున్= ఫలించి తీరుతుంది; దానికిన్= అట్లా చావటానికైనా; తీర్థ సమీపభూమి ఐనన్= పుణ్యతీర్థ సమీప భూమి అయితే; మేలు కాదె!= మేలు కదా!; అని ఆ+మహాత్ముఁడు= అని ఆ శ్రీకృష్ణుడు; ఈ భంగిన్+ఊహించి= ఈ విధంగా ఆలోచించి; తివిరి= పూనికతో; తెఱంగున్= ఒక కర్తవ్యాన్ని; నిశ్చయించెన్= నిశ్చయించాడు.

**తాత్పర్యం:** ఇట్లా ప్రతిరోజూ ద్వారకలో ఏదో ఒక అశుభసూచకమైన సంఘటన జరుగుతూనే ఉన్నది. దానిని గమనించిన కృష్ణుడు పూర్వ పుత్రశోకంతో గాంధారికి కోపం కలుగగా ఇచ్చిన శాపాన్ని స్మరించాడు. 'ఇక ముప్పై ఆరు సంవత్సరాలకు యాదవులంతా ఒకరినొకరు చంపుకొని నాశనమౌతా'రని ఆ పతివ్రత శపించింది. ఆ సంవత్సరం రానే వచ్చింది. ఇక యాదవనాశం తప్పదు. అట్లా జరగటానికైనా ఒక పుణ్యక్షేత్ర సమీపభూమి అయితే మంచిదని ఒక నిశ్చయానికి వచ్చాడు.

**విశేషం:** భారతంలో కాలవేదులు శ్రీకృష్ణుడు, వేదవ్యాసుడు. వారికి భవిష్యత్తులో జరగబోయేది తెలుసును. శ్రీకృష్ణుడు విశేషించి సర్వవేత్త. భగవదవతారం కాబట్టి అన్నీ తెలిసినవాడయ్యాడు. పాండవకౌరవ యుద్ధానికి కూడా వ్యాసుడు ధర్మక్షేత్రాన్నే రంగంగా నిర్ణయించాడు. దుష్కృతకర్ములకు కూడా పరమగతిని ప్రసాదించే దివ్యక్షేత్రమట కురుక్షేత్రం. అట్లాగే కృష్ణు డిక్కడ సముద్రతీరాన్ని నిశ్చయించాడు.

**ఆ.** **అట్లు నిశ్చయించి, యాదవ నివహక్ష। యంబు దివ్యబుద్ధి నరసి యపర**
**దివసకలిత మగుటఁ దెల్లంబుగాఁ గని। కొని యతండు పెద్ద కొలువులోన.** **23**

**ప్రతిపదార్థం:** అట్లు నిశ్చయించి= ఆ విధంగా నిర్ణయించుకొని; యాదవనివహక్షయంబున్= యాదవసమూహనాశనాన్ని; దివ్యబుద్ధిన్+అరసి= దివ్యబుద్ధితో కనుగొని; అపరదివసకలితము+అగుటన్= మధ్యాహ్నకాలంతో కూడుకొనటాన్ని; తెల్లంబుగాన్ కనికొని= స్పష్టంగా గుర్తించి; అతండు= ఆ కృష్ణుడు; పెద్దకొలువులోనన్= పేరోలగంలో.

**తాత్పర్యం:** ఇట్లా నిర్ణయించుకొన్నవాడై శ్రీకృష్ణుడు తన దివ్యబుద్ధితో యాదవుల క్షయాన్ని గుర్తించాడు. మధ్యాహ్న సమయం కావటంతో రాజసభలో ఇట్లా ప్రకటించాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఉ.** **'జాతర సేయఁగా వలయు సర్వజనంబులు నంబురాశికిన్**
**బ్రాతిగ భక్తితోడ' నని బంధుల కెల్లను జెప్పి, వీట వి**
**ఖ్యాతిగ నప్డు సాటుటకు నర్హునిఁ బంచిన ఘంటికాస్వనో**
**పేతము గాఁగ వాఁ డెలమిఁ బెద్దయెలుంగునఁ జాటె నెల్లెడన్.** **24**

**ప్రతిపదార్థం:** సర్వజనంబులన్= జనులందరూ; బ్రాతిగన్= ఘనంగా; భక్తితోడన్= భక్తితో; జాతర చేయఁగాన్ వలయున్= జాతరచేయాలని; బంధులకెల్లనున్+చెప్పి= బంధువులందరికీ చెప్పినవాడై; అప్డు= ఆ సమయంలోనే; వీటన్= నగరంలో; విఖ్యాతిగన్= అందరికీ తెలిసేలా; చాటుటకున్= చాటింపు వేయటానికి; అర్హునిన్= తగినవాడిని; పంచినన్= పంపగా; వాఁడు= ఆ చాటింపు

వేసే మనిషి; ఘంటికాస్వన+ఉపేతము కాఁగన్= గంటవాయించుకొంటూ; పెద్ద ఎలుంగునన్= పెద్ద గొంతుతో (గట్టిగా అరుస్తూ); ఎల్ల+ఎడన్= అన్నిచోట్లా; చాటెన్= చాటింపు వేశాడు.

**తాత్పర్యం:** 'మన ద్వారకావాసులందరూ గొప్పగా, భక్తియుక్తులై జాతర చేయాల్సి ఉన్నది' అని సమీపంలోని బంధువులకు చెప్పి, ఆ వార్తను నగరంలో చాటింపు వేయటానికి తగినవాడిని పురమాయించాడు. వాడు గంటవాయించుకొంటూ పెద్దగొంతుతో నగరంలో అన్ని వీథులలోనూ ఈ వార్తను చాటాడు.

**విశేషం:** యాదవులకు గిరిమఖము (కొండపూజ) చాలా ప్రధానమని హరివంశం చెప్తున్నది. అట్లాగే సముద్రపూజ కూడా ప్రధానమని ఈ సందర్భంవలన తెలుస్తున్నది.

**సీ.** **ఆ రేయిఁ గల నెల్లవారును గోరదౌ । డలును నల్లని మేను గల నెలంత**
**యొక్కత యిలు సొచ్చి యువిదల నీడిచి । కొని పోవ శస్త్రాస్త్రకోటి కేతు**
**చయమును భూషణ సమితియు రాక్షసు । లపహరింపఁగఁ గని రపరదినము**
**నందగ్నిదత్తంబు నబ్జనాభంబును । నైన కృష్ణుని చక్ర మద్భుతముగ**

**ఆ.** **నెగసి యఖిలజనులు నీక్షింప దివమున । కరిగె; నమ్మహాత్ము గరుడకేత**
**నంబుఁ దోన చనియె నరవర! రోహిణీ । తనయు తాటిసిడము ననుసరించె.** 25

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; ఆ రేయిన్= ఆ రాత్రిలో; కలన్= స్వప్నంలో; ఎల్లవారును= అందరూ; కోరదౌడలునున్= భయంకరమైన దౌడలూ; నల్లనిమేనున్= నల్లటిదేహమూ; కల నెలంత+ఒక్కత= ఉన్న స్త్రీ ఒకతె; ఇలు+చొచ్చి= ఇంటిలోనికి ప్రవేశించి; ఉవిదలన్= స్త్రీలను; ఈడిచికొని పోవన్= లాగుకొనిపోవగా; రాక్షసులు; శస్త్రాస్త్ర కోటి కేతుచయమునున్= శస్త్రాస్త్ర సమూహాన్ని, టెక్కెముల సముదాయాన్ని; భూషణసమితియున్= ఆభరణాల మొత్తాన్ని; అపహరింపఁగన్= దొంగిలించుకొని పోవటాన్ని; కనిరి= చూచారు; అపరదినమునన్= మరుసటిరోజున; అగ్నిదత్తంబున్= అగ్నిదేవుడు ప్రసాదించిందీ; అబ్జనాభంబునున్+ఐన= పద్మనాభమయినదీ అయిన; కృష్ణుని చక్రము= శ్రీకృష్ణుడి చక్రం; అద్భుతముగన్+ఎగసి= అద్భుతంగా ఆకసంలోనికి ఎగిరి; అఖిలజనులున్+ఈక్షింపన్= జనులందరూ చూస్తుండగా; దివమునకున్+అరిగెన్= స్వర్గానికి వెళ్లిపోయింది; ఆ+మహాత్ము= ఆ మహాత్ముడైన శ్రీకృష్ణుడి యొక్క; గరుడకేతనంబును= గరుడధ్వజం కూడా; తోన్+అ+చనియెన్= దాని వెంబడే వెళ్ళిపోయింది; రోహిణీ తనయు+తాటిసిడమున్= బలరాముడి తాళధ్వజం కూడా; అనుసరించెన్= శ్రీకృష్ణుడి గరుడకేతనాన్ని వెంబడించి వెళ్ళింది.

**తాత్పర్యం:** ఆ రాత్రి కలలో అందరూ చూస్తూ ఉండగా భయంకరమైన దౌడలు, నల్లటి దేహంగల ఒక స్త్రీ ఇళ్ళలోకి చొరబడి స్త్రీలను లాగికొని పోయింది. రాక్షసులు యాదవుల శస్త్రాస్త్రాలను, జెండాలను, ఆభరణములను దొంగిలించుకొని పోయారు. ఆ మరుసటిరోజున శ్రీకృష్ణుడి చక్రం ఉన్నట్లుండి ఆకాశంలోనికి ఎగిరిపోయింది. వెంబడి స్వామియొక్క గరుడధ్వజం కూడా వెళ్ళిపోయింది. వాటివెంటనే బలరాముడి తాటిజెండా కూడా స్వర్గాన్ని చేరుకొన్నది.

**విశేషం:** ఇళ్ళలోకి ప్రవేశించిన స్త్రీ అమంగళస్వరూపయైన జ్యేష్ఠాదేవి. స్త్రీలు మాంగల్యస్వరూపలు కాబట్టి వాళ్ళను చెరబట్టింది. అంటే యాదవరాజ్యలక్ష్మి అపహరించబడిందని అర్థం. చక్రాద్యాయుధాలకు భూలోకంలో ఇక పనిలేదు కాబట్టి అవికూడా స్వర్గాన్ని చేరుకొన్నాయి.

**తే.** **వినుము సుగ్రీవమును శైబ్యమును వలాహ । కంబు మేఘపుష్పంబు నాఁ గలుగునట్టి**
**వాహనంబులతోఁ గూడ వాసుదేవు । తేరు తదవసరంబున దివికి నరిగె. 26**

**ప్రతిపదార్థం:** వినుము= ఇంకా ఏం జరిగిందో చెప్తాను వినుము; సుగ్రీవమును= సుగ్రీవం; శైబ్యమును= శైబ్యం; వలాహకంబున్= వలాహకం; మేఘపుష్పంబు= మేఘపుష్పం; నాన్ కలుగునట్టి= అనే పేర్లున్న; వాహనంబులతోన్+కూడన్= వాహనాలతో కూడ; వాసుదేవు తేరు= కృష్ణుడి రథం; తద్+అవసరంబునన్= ఆ సమయంలో; దివికిన్+అరిగెన్= స్వర్గానికి వెళ్ళిపోయింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో సుగ్రీవం, శైబ్యం, వలాహకం, మేఘపుష్పకం అనే నాలుగు గుర్రాలు కలిగిన శ్రీకృష్ణుడి రథం ఆకాశమార్గంలో స్వర్గానికి చేరిపోయింది.

**క.** **'వెడలుండు తీర్థయాత్రకుఁ । గడువేగం' బనిరి సురలు గగనంబున న**
**ప్పుడు సువ్యక్తముగా నె । క్కుడెలుంగులు సెలఁగ రాజకులమౌళిమణీ! 27**

**ప్రతిపదార్థం:** రాజకులమౌళిమణీ!= చంద్రవంశ శ్రేష్ఠుడా!; గగనంబునన్= ఆకాశంలో; అప్పుడు= ఆ సమయంలో; సురలు= దేవతలు; సువ్యక్తముగాన్= బాగా వినిపించేటట్లు; ఎక్కుడు+ఎలుంగులు= పెద్దశబ్దాలు; చెలంగన్= వ్యాపించగా; తీర్థయాత్రకున్= సముద్రయాత్రకై; కడువేగంబు= తొందరగా; వెడలుండు+అనిరి= బయలుదేరండి అన్నారు.

**తాత్పర్యం:** అప్పుడు ఆకాశంలో నిలబడి దేవతలు స్పష్టంగా వినిపించేటట్లు పెద్దశబ్దాలతో 'సముద్రయాత్రకు బయలుదేరండి' అని యాదవులను ప్రబోధించారు.

**క.** **అవి గనియు వినియు నులుకక । సవరణ లొప్పార నపు డసంభ్రములై యా**
**దవులు మనోజ్ఞములగు సీ । ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్. 28**

**ప్రతిపదార్థం:** అవి= ఆ అద్భుతదృశ్యాలను శబ్దాలను; కనియున్= చూచీ; వినియున్= వినీ (కూడా); ఉలుకక= బెదరక; అపుడు; యాదవులు= యాదవులందరూ; ఇంటింటన్= ప్రతి ఇంటిలోనూ; అసంభ్రములై= వేగిరపాటులేకుండా; మనోజ్ఞములు+అగు= ఇంపైన; సీధువులునున్= మద్యాలు; మాంసములున్= రకరకములైన మాంసాలు; సవరణలు+ఒప్పారన్= వాహనాద్యాభరణాలు అతిశయించగా,

**తాత్పర్యం:** అట్లా చక్రాద్యాయుధాలు మాయమవటాన్ని చూచినా, దివ్యశబ్దాలను విన్నా ఆ యాదవులలో ఏ కదలికా లేదు. ఏ తొందరపాటూ లేదు. ప్రతి ఇంటిలోనూ చాలా ఇంపైన మద్యాలు, మాంసాలు, వాహనాద్యాభరణాలు సమకూర్చుకొనే ప్రయత్నాలలో పడ్డారు.

యాదవు లందఱుఁ గృష్ణసహితులై సముద్రతీరమునకుఁ బోవుట (సం.16-4-6)

**సీ.** **సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు । నానావిధముల నొనర్చికొనుచు**
**క్షీరశర్కరలును ఘృతబహుభంగిక । వ్యంజనంబులు వివిధాన్నపాన**
**ములును నక్షత గంధములును బుష్పంబులు । గావించుకొని బలుగావళులును**
**దలమోపులును బండ్లుఁ దమతోడ నొప్పారి । చనుదేరఁ గరులు నశ్వములు నరద**

**తే. ములు నలంకార విరచనములు నుదాత్త। లలితరేఖంబు లగు మాల్యములును భూష**
**ణములు నాలేపనములు వస్త్రములు వింత। చెన్ను సేయఁ జేష్టలు విలసిల్లుచుండ. 29**

**ప్రతిపదార్థం:** సమకట్టికొనుచున్= సిద్ధం చేసికొంటూ; నానావిధములన్= చాలా రకాలుగా; భోజ్యములున్= ఆహారాలు; భక్ష్యములున్= పిండివంటులు; ఒనర్చి కొనుచున్= తయారు చేసికొంటూ; క్షీర= పాలు; శర్కరలును= చక్కెర; ఘృత= నెయ్యి; బహుభంగిక వ్యంజనంబులు= వివిధాలైన కూరలు; వివిధ+అన్నపానములునున్= రకరకాలైన అన్నాలు, పానీయాలు; అక్షత= అక్షతలు; గంధములునున్= చందనాదులను; పుష్పంబులున్= పూలు; కావించుకొని= తయారు చేసికొని; తమతోడన్= తమతో; పలుకావళులునున్= అనేకములైన కావళ్ళు; తలమోపులునున్= తలమీద మోసేవి; బండ్లున్; ఒప్పారి= వైభవోపేతంగా; చనుదేరన్= బయలుదేరగా; కరులున్= ఏనుగులూ; అశ్వములున్= గుఱ్ఱాలూ; అరదములున్= రథాలూ; అలంకార విరచనములున్= వివిధ రీతులలో చేసిన అలంకారాలు; ఉదాత్త= మనోజ్ఞంగా; లలిత= సుకుమారంగా; రేఖంబులు+అగు= వరుసలలో అలంకరించిన; మాల్యములునున్= పూలహారాలు; భూషణములున్= నగలు; ఆలేపనములున్= పూసుకొనటానికి పనికివచ్చే సుగంధద్రవ్యాలూ (చందన గంధాదిరూపంలో ఉన్నవి); వస్త్రములున్= బట్టలూ; వింతచెన్ను+చేయన్= వింతశోభను కూర్చగా; చేష్టలు= యాదవుల జానపదీయాలైన కార్యకలాపాలు; విలసిల్లుచున్+ఉండన్= విజృంభిస్తూ ఉండగా.

**తాత్పర్యం:** రకరకాలుగా అన్నాదులు వండారు; పిండివంటలు చేశారు. పాలు, చక్కెర, నెయ్యి, రకరకాలైన సాధకాలు, పానీయాలు సిద్ధం చేసికొన్నారు. అక్షతలు, గంధం, పూలు, ఇవన్నీ ఎత్తుకొన్నారు. వీటిని కావళ్ళుగా, తలమోపులుగా సిద్ధంచేసి వైభవోపేతంగా బయలుదేరారు. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు-వీటికి చేసిన వివిధాలైన అలంకారాలు, అత్యంత మనోహరంగా దిగవేసిన పూలహారాలు, వాళ్ళు పెట్టుకొన్న నగలు, పూసుకొన్న సుగంధలేపనాలు, ధరించిన రంగురంగుల బట్టలు ఒకవింత శోభను కూర్చాయి. యాదవులకు సహజమైన కార్యకలాపాలు విజృంభించాయి.

**క. తన రథము లేమి నొండొక। ఘనరథమును దారుకుండు గైకొని యెలమిన్**
**గొనిరా వెడవెడ గైసే। సిన కృష్ణుఁడు నిర్వికారచిత్తత వెడలెన్. 30**

**ప్రతిపదార్థం:** తన రథము లేమిన్= తన రథం (స్వర్గానికి వెళ్ళిపోయింది కాబట్టి ఇప్పుడది) లేకపోవటంచేత; దారుకుండు= శ్రీకృష్ణుడి సారథి; ఒండొక= మరొక; ఘనరథమును= పెద్దతేరును; కైకొని= తీసికొని; ఎలమిన్= ఉత్సాహంతో; కొనిరాన్= కొనిరాగా; వెడవెడ= అతిస్వల్పంగా; కైసేసినన్= అలంకరించగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; నిర్వికారచిత్తతన్= ఏ వికారమూలేని మనస్సుతో; వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి రథం అదృశ్యమైపోయినందువలన దారుకుడు మరో పెద్ద తేరును పట్టుకు వచ్చాడు. దానికి ఆదరబాదరగా చాలా స్వల్పంగా అలంకారం చేశాడు. రథం సిద్ధమయింది. కృష్ణుడు కూడా ఏ వికారంలేని మనస్సుతో బయలుదేరాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడు యోగేశ్వరుడు. అందువలననే ఆయనలో సంకల్పవికల్పాలతో కూడిన ఏ వికారాలూ లేవు. ఈ సమాధిస్థితిలో ఉండి నిర్వికారంగా కాగల వింతలు చూడటానికి బయలుదేరాడని అర్థం.

**ఆ. తొడవు చీర పూఁత తొంటియట్టులు గాఁగ। నేమి వాహనంబు నెక్క కించు**
**కేని వికృతి లేని హృదయంబు మిత్ర సం। భాషణంబుఁ గలిగి బలుఁడు వెడలె. 31**

**ప్రతిపదార్థం:** బలుఁడు= (ఇక) బలరాముడు; తొడవు= నగలు; చీర= బట్టలు; పూఁత= చందనాది లేపనాలు; తొంటి+అట్టులు+కాఁగన్= మునుపటివలెనే ఉండగా (అంటే కొత్తగా ఏ అలంకారమూ చేసికొనలేదని అర్థం); ఏమి వాహనంబున్+ఎక్కక= ఏ వాహనాన్ని అధిరోహించకుండానే; ఇంచుక+ఏని= కొంచెంకూడా; వికృతిలేని హృదయంబు= వికారంలేని మనసు; మిత్రసంభాషణంబున్+కలిగి= మిత్రులతో సంభాషణ కలిగి; వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** ఇక బలరాముడు కూడా అట్లాగే బయలుదేరాడు. ఏ నగలూ కొత్తగా పెట్టుకొనలేదు. ధరించిన వస్త్రాలు మార్చలేదు. కొత్తగా ఏ సుగంధాలూ రాసుకొనలేదు. ఏ వాహనాన్ని ఎక్కలేదు. పాదచారిగానే బయలుదేరాడు. ఏ వికారమూ లేని మనసుతో, మిత్రులతో మాటాడి, బయలుదేరాడు.

**విశేషం:** ఆదిశేషుడి అవతారం కాబట్టి రాముడివెంట లక్ష్మణుడివలె, కృష్ణుడివెంబడి బలరాముడూ కనిపిస్తాడు. అందుకే కృష్ణుడివలె ఈయనలోనూ హృదయవికారం లేదు.

**క. ఆందోళికాది వాహన। సందోహంబున నితాంత చారుత్వము చె**
**న్నొందఁగ సమలంకృతలగు। సుందరు లేతేర విభవశోభిత భంగిన్. 32**

**ప్రతిపదార్థం:** ఆందోళికా+ఆది= పల్లకీలు మొదలైన; వాహన= వాహనాల; సందోహంబునన్= సమూహంలో; నితాంత= అత్యంతమైన, అధికమైన; చారుత్వము= సౌందర్యం; చెన్ను+ఒందఁగన్= మిక్కిలిగా ప్రకాశించగా; సమలంకృతలు+అగు= బాగా అలంకరించుకొన్న; సుందరి+లు= స్త్రీలు; విభవశోభిత భంగిన్= వైభవం ప్రకాశించే రీతిలో; ఏతేరన్= బయలుదేరి రాగా.

**తాత్పర్యం:** ఆ యాదవస్త్రీలు పల్లకీలలో బయలుదేరారు. వారు బాగా అలంకరించుకొన్నారు. ఈ స్త్రీల గుంపు బయలుదేరటంతో ఒక కొత్తశోభ ప్రకాశించింది. యాదవుల యాత్ర అట్లా శోభాయమానమైనదని అర్థం. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. వెలువడి లీల నేఁగి మును వేడ్క నొనర్చిన మేటి చప్పరం**
**బుల నెలమిన్ మహార్ణవము పొంత వసించిన నుద్ధవుండు దా**
**నలఘుతపం బొనర్చుటకునై విపినంబున కేఁగువాఁడుగాఁ**
**బలికిన దాని కొండొకఁడు వల్కడ కృష్ణుఁడు కాలవేదితన్. 33**

**ప్రతిపదార్థం:** వెలువడి= అట్లా ద్వారకనుండి బయలుదేరి; లీలన్= వైభవంతో; ఏఁగి= ప్రయాణంచేసి; మహార్ణవము పొంతన్= సముద్ర సమీపంలో; మును= ముందుగానే; వేడ్కన్= ఉత్సాహంతో; ఒనర్చిన= ఏర్పాటుచేసిన; మేటి= గొప్పవైన; చప్పరంబులన్= పందిళ్ళలో; ఎలమిన్= సంతోషంతో; వసించినన్= ఉండగా; ఉద్ధవుండు= శ్రీకృష్ణుడి మంత్రీ, పురోహితుడూ ఐన ఉద్ధవుడు; తాను; అలఘుతపంబు= గొప్ప తపస్సు; ఒనర్చుటకున్+ఐ= చేయటం కోసమై; విపినంబునకున్= అడవికి; ఏఁగువాఁడుగాన్= వెళ్ళుతున్నట్టుగా; పలికినన్= చెప్పగా; కృష్ణుఁడు; కాలవేదితన్= ముందుజరగబోయేది తెలిసినవాడు కావటంవలన; ఒండొకఁడు పల్కఁడు+అ= ఏమీ మాటాడలేదు.

**తాత్పర్యం:** అట్లా ద్వారకనుండి బయలుదేరి యాదవులు మహావైభవంతో ప్రయాణం చేసి సముద్రతీరం చేరారు. అంతకుమునుపే అక్కడ వేసికొన్న పందిళ్ళ క్రింద అందరూ చేరారు. అపుడు శ్రీకృష్ణుడి మంత్రి, పురోహితుడు,

మహాజ్ఞాని అయిన ఉద్ధవుడు తాను తపస్సు చేసికొనటానికి అడవికి వెళ్తానన్నాడు. ముందు జరుగబోయేది తెలిసినవాడు కాబట్టి కృష్ణుడు ఏమీ పలుకలేదు.

**వ. అంత బలుండునుం బోవ నిశ్చయించి చెప్పిన. 34**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; బలుండునున్= బలరాముడుకూడా; పోవన్= వెళ్ళటానికి; నిశ్చయించి చెప్పినన్= నిర్ణయించి, తెలుపగా.

**తాత్పర్యం:** అప్పుడు బలరాముడు తానుకూడా బయలుదేరుతానని తన నిర్ణయం చెప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. పలుకక మ్రొక్కి వీడుకొలుపంగ వనంబున కప్పురోహితుం**
**డలఘు వినిశ్చయంబు వగ పంతయు మాన్పఁగఁ బోయె నాతనిన్**
**హలధరుఁ డన్పఁ బోయి వినయంబున భక్తియుఁ దోఁప నయ్యనా**
**కులు నటఁబుచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయ శాంతచిత్తుఁడై. 35**

**ప్రతిపదార్థం:** పలుకక= (శ్రీకృష్ణుడు) ఏమీ మారు మాటాడకుండా; మ్రొక్కి= నమస్కరించి; వీడుకొలుపంగన్= వీడ్కోలు చెప్పగా; ఆ+పురోహితుండు= ఆ ఉద్ధవుడు; అలఘువినిశ్చయంబు= తన దృఢమైన నిర్ణయమే; వగపు+అంతయున్= దుఃఖాన్నంతటినీ; మాన్పఁగన్= పోగొట్టగా; వనమునకున్= అడవికి; పోయెన్= బయలుదేరాడు; అతనిన్= ఆ ఉద్ధవుడిని; హలధరుఁడు= బలరాముడు, హలమును (నాగలిని) ఆయుధంగా ధరించినవాడు. అన్పన్+పోయి= దిగబెట్టిరావటానికి బయలుదేరి; వినయంబునన్= వినయంతో; భక్తియున్+తోఁపన్= భక్తి కూడా ప్రకటితంకాగా; ఆ+అనాకులున్= ఏ వ్యాకులతలేని ఆ ఉద్ధవుడిని; అటన్+పుచ్చి= అడవిలో వదలి; ఒక్క+ఎడన్= ఒకచోట; అకుంఠిత= మొక్కపోని; నిర్ణయ= నిర్ణయంగల; శాంతచిత్తుఁడు+ఐ= శాంతమైన మనస్సు కలిగినవాడై.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఏమీ మాటాడకుండా వీడ్కోలు చెప్పాడు. ఉద్ధవుడికి ఏర్పడిన ఆ దృఢనిర్ణయంతో అతడిలోని దుఃఖమంతా పోయింది. తపస్సుకై బయలుదేరాడు. అతడిని దిగబెట్టి వస్తానని బలరాముడు బయలుదేరి వినయంతో, భక్తితో ఏ వ్యాకులతా లేని ఆ మహానుభావుడైన ఉద్ధవుడిని అడవిలో వదలి వచ్చి, మొక్కపోని శాంతమైన మనోభావంతో, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'విను మొక్కఁడు నొక భూరుహ । మున మూలంబున నిరస్తమోహాంధత్వం**
**బున వెలుఁగు బుద్ధి విజ్ఞే । య నిరూఢతఁ జేసి యుండె నాసీనుండై. 36**

**ప్రతిపదార్థం:** వినుము= రాజా వినుము!; ఒక్కఁడున్= ఒంటరిగా; ఒక భూరుహమున మూలంబునన్= ఒక చెట్టుయొక్క మొదట్లో; నిరస్త= పోయిన; మోహ+అంధత్వంబునన్= అజ్ఞానమనే చీకటితో (అజ్ఞానం నశించగా); వెలుఁగు= ప్రకాశిస్తున్న; బుద్ధి= బుద్ధిచేత; విజ్ఞేయ= తెలియదగిన తత్త్వమునందు; నిరూఢతన్+చేసి= నైపుణ్యం వలన; ఆసీనుండు+ఐ+ఉండెన్= కూర్చొని ఉన్నాడు.

**తాత్పర్యం:** అట్లాంటి శాంతచిత్తంతో బలరాముడు ఒంటరిగా ఒక చెట్టుకింద కూర్చున్నాడు. ఆయనలోని మోహమనే చీకటి నశించింది; జ్ఞానజ్యోతి ప్రకాశించింది. (అంటే 'నాది', 'నావారు' అన్న భావనలు నశించి 'అహంబ్రహ్మాస్మి'- అన్న మహావాక్యతత్త్వబోధ అయిందని అర్థం.)

**చ. భూమిసురావళీమహిత భోజనతంత్రముఁ దీర్పఁ బూని హృ**
**ద్యామలరాజితంబులగు నట్లొనరించిన కూడుగూర లా**
**కోమలు లాఁగఁగా గడఁగి క్రోఁతుల కన్నియుఁ బంచిపెట్టి రు**
**ద్దామవిహారలీల వసుధావర! యాదవు లేమి సెప్పుదున్? 37**

**ప్రతిపదార్థం:** వసుధావర!= ఓ భూపతీ; యాదవులు; భూమిసురావళీ= బ్రాహ్మణుల; మహితభోజన తంత్రమున్= గొప్పదైన భోజన కార్యాన్ని; తీర్పన్+పూని= నిర్వహించాలన్న కోరికతో; హృద్య+అమల+రాజితంబులగు+అట్లు= మదికింపై, నిర్మలములై, ఒప్పిదము లయ్యేటట్లు; ఒనరించిన= సమకూర్చిన; కూడుగూరలు= అన్నాలు, కూరలు; ఆ కోమలులు= ఆ స్త్రీలు; ఆఁగఁ గాన్= నిలుపగా; కడఁగి= ప్రయత్నించి; క్రోఁతులకున్= కోతులకు; అన్నియున్= అన్నింటినీ; ఉద్దామ విహారలీలన్= అణచరాని విహారవిలాసంతో విజృంభణగా; పంచిపెట్టిరి= పంచిపెట్టారు; ఏమి+చెప్పుదున్?= ఏమి చెప్పుదును?

**తాత్పర్యం:** బ్రాహ్మణ భోజనసంతర్పణకొరకని చాలా రుచికరంగా అతిపవిత్రంగా వండిన పదార్థాలను, ఆడవారు అడ్డుపడుతున్నా ఆగకుండా యాదవులు చెలరేగి కోతులకు పంచిపెట్టారు. ఇక చెప్పవలసినది ఏముంది?

**విశేషం:** ఇంతకాలమూ బ్రాహ్మణ సేవాతత్పరులుగా పుణ్యామార్జించిన యాదవులు తమ భార్యలు వారిస్తున్నా వినక బ్రాహ్మణులకు పెట్టవలసిన భోజనం కోతులకు పంచిపెట్టారు. అది తర్కానికి అందే విషయం కాదు. అందుకే భవిష్యత్తులో దొంగలబారిన పడ్డారు.

**చ. పదపడి గీత వాద్యగతిబంధురనృత్యము లుల్లసిల్లఁగా**
**నుదధికి నంచితాక్షత మహోత్తరగంధవిశిష్టపుష్ప సం**
**పదలు బహుప్రకారములఁ బ్రస్తుతి కెక్కఁగఁ బూజసేసి పెం**
**పొదవ నివేద్య మిచ్చిరి సముజ్జ్వలహృద్య పదార్థకోటులన్. 38**

**ప్రతిపదార్థం:** పదపడి= పిమ్మట; గీతవాద్యగతి= పాటలకు, వాద్యాలకు తగినగతి ననుసరించి; బంధుర= రమ్యమైన; నృత్యములు; ఉల్లసిల్లఁగాన్= ప్రకాశిస్తూ ఉండగా; అంచిత= సుందరమైన; అక్షత= అక్షతలతోనూ; మహోత్తర= శ్రేష్ఠమైన; గంధవిశిష్ట= సుగంధ పరిమళముతో కూడిన; పుష్పసంపదలు= పుష్పవైభవం; బహుప్రకారములన్= నానావిధాలుగా; ప్రస్తుతికెక్కఁగన్= పొగడ్తకెక్కునట్లుగా; ఉదధికిన్= సముద్రానికి; పూజచేసి; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశిస్తున్న; హృద్య= మనోజ్ఞాలైన; పదార్థకోటులన్= భక్ష్యభోజ్యాది పదార్థ సముదాయాన్ని; పెంపు+ఒదవన్= వైభవంతో; నివేద్యము+ఇచ్చిరి= నైవేద్యం చేశారు.

**తాత్పర్యం:** ఆ తరువాత రమ్యమైన గీతాలకు, వాద్యాలకు అనుగుణంగా మనోహరాలైన నృత్యాలు చేశారు. అందంగా అలంకరించిన అక్షతలతో, శ్రేష్ఠమైన పరిమళంతో కూడిన పుష్పాలు ఒక గొప్పవైభవాన్ని సంతరించగా సముద్రానికి పూజలు చేశారు. మనోజ్ఞాలైన భక్ష్య భోజ్యాది పదార్థాలను మిక్కిలి వేడుకగా నైవేద్యం పెట్టారు.

**చ. విను తదనంతరంబ మదవిహ్వలభావము చేయఁ జాలి యిం**
**పొనరిన యాసవంబులు సముత్సుకతం గనకంపుఁ గోరలం**

**గొని హరి సన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగ మో**

**దనకరణంబులైన యుపదంశములం గొనుచున్ మహీశ్వరా! 39**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశ్వరా!= భూపతీ! రాజా!; విను= వినుము; తదనంతరంబు+అ= ఆ తరువాత; యాదవులు; సముత్సుకతన్= మిక్కిలి ఆసక్తితో; మద= కైపుచేత; విహ్వలభావము= అవయవాలను స్వాధీనం నుండి తప్పించే గుణం; చేయన్+చాలి= కలిగించగలిగి; ఇంపు+ఒనరిన= రుచికలిగిన; ఆసవంబులు= చెరకు, ద్రాక్షలనుంచి తీసిన మత్తుపానీయాలు (కల్లు); కనకము+కోరలన్= బంగారుచషకాలలో; కొని= తీసికొని; అంతరంగ= మనసుకు; మోదనకరణంబులు+ఐన= సంతోషాన్ని కలిగించే; ఉపదంశములన్= నంజుళ్ళను; కొనుచున్= తింటూ; క్రోలిరి= త్రాగారు.

**తాత్పర్యం:** ఆ తరువాత యాదవులు మిక్కిలి తమకంతో మత్తును కలిగించి, అవయవాలను స్వాధీనంనుండి తప్పించే గుణమున్న, బహురుచి కలిగిన మత్తుపానీయాలను బంగారుపాత్రలలో పోసుకొంటూ, శ్రీకృష్ణుని సన్నిధానంలోనే ప్రీతిని కలిగించే నంజుళ్ళను తింటూ బాగా త్రాగారు.

**విశేషం:** కల్లుకున్న ఈ 'విహ్వల' భావంచేతనే తరువాత యాదవులు ఒకరిని ఒకరు తిట్టుకొన్నారు. కొట్టుకొన్నారు. చంపుకొన్నారు. అందుకే సురాపానాన్ని తమోగుణాన్ని కలిగించే పనిగా పూర్వికులు నిషేధించారు.

**తే.** **సాత్యకియుఁ గృతవర్మయుఁ జారుధేష్ణుఁ । డును గదుండును బ్రద్యుమ్నుఁడును మొదలుగఁ**

**గలుగు యాదవు లెల్లను గాంక్షఁ బాన । విధి యొనర్చిరి పెల్లున విధివశమున. 40**

**ప్రతిపదార్థం:** విధివశమునన్= విధికి వశులై; సాత్యకియున్, కృతవర్మయున్, చారుధేష్ణుఁడునున్, గదుండునున్, ప్రద్యుమ్నుఁడునున్= సుప్రసిద్ధులైన సాత్యకి, కృతవర్మ, చారుధేష్ణుడు, గదుడు, ప్రద్యుమ్నుడు; మొదలుగన్+కలుగు= మొదలుగా గల; యాదవులు+ఎల్లనున్= యాదవులంతా; కాంక్షన్= మిక్కిలి కోరికతో; పానవిధి= తాగటం; ఒనర్చిరి= చేశారు.

**తాత్పర్యం:** విధికివశులై సాత్యకి, కృతవర్మ, చారుధేష్ణుడు, గదుడు, ప్రద్యుమ్నుడు మొదలైన యాదవులంతా చేరి మిక్కిలి కోరికతో తాగారు.

**విశేషం:** విధివశమునన్ - అనే మాట చాలా ముఖ్యమైనది. సాత్యకి శ్రీకృష్ణుడికి తమ్ముడి వరుసలోనివాడు. ప్రద్యుమ్నుడు సాక్షాత్తు కుమారుడే. ఇట్లాగే ఇతరులూ మహావీరులు. ఉచితానుచితపరిజ్ఞానం కలిగినవారే. కాని విధి ప్రేరేపిస్తే ఎవరూ ఆగరని అర్థం.

**తే.** **వృష్ణి భోజాంధకులు కురువీర! యిట్లు । రేఁగి మద్యపానం బొనరించి మదముఁ**

**బొంది కేకిస లాడుచుఁ బొందుపడని । పలుకు లెసఁగంగఁ దిరిగి నవ్వులు సెలంగ. 41**

**ప్రతిపదార్థం:** కురువీర!= కురుశ్రేష్ఠుడా!; ఇట్లు= ఈ విధంగా; వృష్ణి, భోజ+అంధకులు= వృష్ణి, భోజ, అంధక వంశాలకు చెందిన యాదవ వీరులు; రేఁగి= విజృంభించి; మద్యపానంబు= మత్తుపానీయాలను త్రాగటం; ఒనరించి= చేసి; మదమున్+పొంది= మత్తులోనికి జారిపోయి; కేకిసలాడుచున్= పరిహాసాలాడుతూ, చప్పట్లు చరుస్తూ; పొందుపడని పలుకులు+ఎసఁగంగన్= పొందులేని మాటలు పుట్టగా; తిరిగి= మరల; నవ్వులు+చెలంగన్= నవ్వులు విజృంభించగా.

**తాత్పర్యం:** ఇట్లా వృష్ణి, భోజ, అంధక వంశాలకు చెందిన వీరులంతా విజృంభించి, మద్యాన్ని బాగా పట్టించి మత్తులోకి జారిపోయారు. పరిహాసాలాడుతూ, వెకిలిగా నవ్వుతూ, (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** మాటల పొందులేకపోవటం త్రాగినదాని ఫలితం. తరువాతి కథలో ఒకరినొకరు నిందించుకొనటంలో ఇది కనిపిస్తుంది. మద్యపాన దుష్ఫలితాలు ఇట్లాంటిచోట్ల మనం బాగా గమనించవచ్చును.

సాత్యకి కృతవర్ములకు రోషజనకంబుగాఁ గలిగిన సంవాదము (సం.16-4-16)

**సీ.** **ఉన్మార్గ వర్తులై యుండిరి వినుమట్టి । యవసరంబున ఘూర్ణితారుణంబు**
**లయిన నేత్రముల సాత్యకి కృతవర్మని । వదనంబు గనుఁగొని మద మెలర్ప**
**నొద్ద నిల్చున్న ప్రద్యుమ్ను చే సఱచుచు । నవమాన మేర్పడునట్టి భంగిఁ**
**బెలుచ నవ్వి ' యరాతిబృందంబు నిద్రావ । శత్వంబుఁ బొందుటఁ జావువోని**

**తే.** **దుష్టదశ నొంది యుండఁగఁ దుచ్ఛుఁడేని । నడరి వధియింపఁగాఁ జొరఁ డనిన రాజ**
**తనయుఁ డంత పాపంబు సేయునె యితండు । పొడిచెనటె యిస్సిరో యిట్టి పోటుఁ బోటె.'** 42

**ప్రతిపదార్థం:** వినుము= తరువాత జరిగినది చెప్పుతాను వినుము; ఉన్మార్గవర్తులు+ఐ ఉండిరి= ఇట్లా యాదవులంతా చెడుత్రోవ పట్టిన వారయ్యారు; అట్టి+అవసరంబునన్= ఆ సమయంలో; ఘూర్ణిత+అరుణంబులు+అయిన నేత్రములన్= గుండ్రంగా తిరుగుతున్న ఎర్రని కండ్లతో; సాత్యకి; కృతవర్మని; వదనంబున్ కనుంగొని= ముఖం చూసి; మదము+ఎలర్పన్= మదం అతిశయించగా; ప్రద్యుమ్ను= ప్రద్యుమ్నుడి; చే+చఱచుచున్= చేయి తట్టుతూ; అవమానము+ఏర్పడు+అట్టిభంగిన్= అవమానమయ్యేటట్లు; పెలుచన్+నవ్వి= బిగ్గరగా నవ్వి (ఇట్లా అన్నాడు); అరాతి బృందంబు= శత్రు సమూహం; నిద్ర+అవశత్వంబున్+పొందుటన్= నిద్రలో పూర్తిగా వివశులై మునిగిపోవటంవలన; చావు+పోని= చావువంటి; దుష్టదశన్+ఒంది+ఉండఁగన్= దుర్దశను కలిగి ఉండగా (అంటే నిద్రిస్తుంటే); తుచ్ఛుఁడు+ఏనిన్= ఎంతనీచుడైనా; అడరి= ప్రయత్నించి; వధియింపంగాన్+చొరఁడు= చంపటానికి పోడు; అనినన్= అనగా; రాజతనయుఁడు= రాజకుమారుడు (కృతవర్మ); ఇతండు; అంతపాపంబు+చేయునె?= అంతటి పాపం చేశాడా?; పొడిచెనటె?= పొడిచాడా? ఇస్సిరో= ఛీ ఛీ; ఇట్టి పోటుఁ పోటె?= ఇట్లా పొడవటం కూడా పొడవటమేనా?

**తాత్పర్యం:** ఇట్లా యాదవవులందరూ మత్తులో జోగుతుండగా, ఎర్రటి కళ్ళు గుండ్రంగా త్రిప్పుతూ సాత్యకి కృతవర్మను చూచి మదం అతిశయించగా ప్రద్యుమ్నుడి చేయి తట్టుతూ, అవమానం అయ్యేటట్లు బిగ్గరగా నవ్వి ఇట్లా అన్నాడు. 'శత్రువులు నిద్రలో ఉన్నప్పుడు నిజంగా వారు చచ్చినట్టే! అట్లాంటి స్థితిలో ఉన్నవారిని చంపటానికి ఏ నీచుడూ ముందు కురకడు. అట్లాంటప్పుడు రాజకుమారుడైన ఈ కృతవర్మ ఇంత పాపానికి ఎట్లా ఒడిగట్టాడు? ఇదీ ఒక శత్రు సంహారమా! ఛీ ఛీ! ఇట్లా చంపటం కూడా చంపటమేనా!'

**తే.** **అనినఁ బ్రద్యుమ్నుఁ 'డిది నీచు లయిన వారి । తెరువు వృష్ణివంశోత్తమ! దీని నిట్లు**
**నీవు వాక్రువ్వ నేటికిఁ? బోవ విడువు;। జను లితనిఁ బ్రువ్వఁ దిట్టుట చాలదెట్లు?** 43

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ప్రద్యుమ్నుఁడు; ఇది= ఈ విధంగా చంపటం; నీచులు+అయినవారి+తెరువు= నీచుల పద్ధతి; వృష్ణివంశోత్తమ!= వృష్ణివంశంలో పుట్టిన ఓ వీరుడా! (సాత్యకికి సంబోధన); దీనిన్+ఇట్లు= దీనిని ఇంతగా; నీవు+వాక్రువ్వన్+ఏటికిన్?=

నీవు చెప్పటం ఎందుకు?; పోవన్+విడువు(ము)= వదలిపెట్టుము; జనులు+ఇతనిన్= ప్రజలంతా ఇతడిని; ప్రువ్వన్+తిట్టుట= పుచ్చిపోయేలా తిట్టటం; చాలదెట్లు?= చాలదా ఏమి?

**తాత్పర్యం:** అట్లా అంటే ప్రద్యుమ్నుడు సాత్యకితో ఇట్లా అన్నాడు. 'పోనీలే బాబాయ్! ఇట్లా చంపటం నీచుల పద్ధతి. దీనిని నీవంటివాడు ఇంతగా చెప్పటం ఎందుకు?; వదిలిపెట్టుము. ప్రజలంతా ఇతడిని పుచ్చిపోయేటట్లు తిట్టుతూనే ఉన్నారు. అది చాలదా ఏమిటి?'

**విశేషం:** కృష్ణుడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు - ఒక ఇంటివారు. కృష్ణుడి తమ్ముడు కాబట్టి ప్రద్యుమ్నుడికి బాబాయి వరుస, మరో వంశంవాళ్ళను గురించి ఆయా ఇళ్ళలో ఉన్న గూఢభావనలు తాగినపుడు బైటపడ్డాయని అర్థం. తాగనప్పుడు ఒకరికొకరు చాలా గౌరవంగా ప్రవర్తిస్తారు. తాగినప్పుడు లోపల అణగారి ఉన్న ఉద్రేకాలు బయటికి వస్తాయి. ఇక్కడ అట్లాగే జరిగింది.

**చ.** **అన విని రోషచిహ్నవికృతాననుఁడై కృతవర్మ సాత్యకిం**
**గనుఁగొని 'సిగ్గులేక యొరుకయ్యము నీకిటు లుగ్గడింపఁగాఁ**
**జనునె? కిరీటి చే నఱక శాంతత నొందిన సోమదత్తనం**
**దను తల ద్రుంపవే మఱచితా యిసిరో యిది పోరిపాడియే?' 44**

**ప్రతిపదార్థం:** అనన్+విని= ఇట్లా ప్రద్యుమ్నుడంటే విని; రోష చిహ్న వికృత+ఆననుఁడు+ఐ= రోషాన్ని వ్యక్తీకరించే వికారమైన ముఖంతో; కృతవర్మ; సాత్యకిన్+కనుఁగొని= సాత్యకిని చూచి (ఇట్లా అన్నాడు); సిగ్గులేక= సిగ్గువదలి; ఒరు కయ్యము= ఇతరుల యుద్ధాన్ని; నీకున్+ఇటులు+ఉగ్గడింపఁగాన్= నీవు ఇట్లా చెప్పటం; చనునె?= సరిపోతుందా? (నీవు మాత్రం); కిరీటి= అర్జునుడు; చే+నఱకన్= చేయి నరికివేయగా; శాంతతన్+ఒందిన= శాంతంగా ఉన్న; సోమదత్తనందను తలన్= సోమదత్తుని కుమారుడి తలను; త్రుంపవే?= నరకలేదా?; మఱచితా?= మరచిపోయావా?; ఇసిరో!= ఛీ, ఛీ!; ఇది= ఇట్లా చేయటం; పోరిపాడియే?= యుద్ధనీతియేనా?

**తాత్పర్యం:** అపుడు సాత్యకిని చూచి కృతవర్మ రోషాన్ని ప్రకటించే వికారమైన ముఖంతో నిప్పులు చెరుగుతూ ఇట్లా అన్నాడు; 'సిగ్గులేకుండా ఇతరులు చేసిన యుద్ధాన్ని ఎందుకు ప్రస్తావిస్తావు? నీవు ఇట్లా అనటం భావ్యం కాదు. అర్జునుడు చేతిని నరకగా, శాంతంగా ఉన్న సోమదత్తుడి కొడుకు తలను నీవు నరకలేదా? మరచిపోయావా? ఇది మాత్రం యుద్ధన్యాయమేనా?'

**సీ.** **అనియె దానికి హరి యా భోజపతిమీఁదఁ। గడు నెట్టనైన క్రీఁగంటిచూడ్కి**
**నిగిడించి సక్రోధమగు మానసంబుతో। నఖిలభోజులఁ గలయంగఁ జూచె**
**నప్పుడు సాత్యకి హరితోడఁ 'గృతవర్ము। ననుజుండు శతధన్వుఁ డనుచితోద్య**
**మమున సత్రాజిత్తు మహితాత్ము మాననీ। యుని శమంతకమణికిని వధించెఁ**

**తే.** **గాదె?' యని వారి దెసఁ గీడు గానిపింపఁ। బలికె; నవ్వాదు విని సత్యభామ కోప**
**మడరి వనితాస్వభావోద్గతాశ్రుపూర। యగుచు హరి యగ్రతలమున కరుగుదెంచె. 45**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; (అప్పుడు) దానికిన్ హరి= ఆ మాటలకు శ్రీకృష్ణుడు; ఆ భోజపతిమీఁదన్= ఆ కృతవర్మమీద; కడున్= మిక్కిలి; ఎఱ్ఱనైన= ఎఱ్ఱని; క్రీఁగంటిచూడ్కి= కడకంటిచూపు; నిగిడించి= సారించి; సక్రోధము+అగు= కోపంతోకూడిన; మానసంబుతోన్= మనస్సుతో; అఖిలభోజులన్= భోజులందరినీ; కలయంగన్+చూచెన్= ఒకసారిగా చూచాడు; అప్పుడు; సాత్యకి; హరితోడన్= కృష్ణుడితో (ఇట్లా అన్నాడు); కృతవర్మ+అనుజుండు= కృతవర్మ తమ్ముడు; శతధన్వుఁడు= శతధన్వుడనువాడు; అనుచిత+ఉద్యమమునన్= అనుచితమైన పూనికతో; మహితాత్మున్= మహితాత్ముడైన; మాననీయున్= గౌరవింపదగిన; సత్రాజిత్తున్= సత్రాజిత్తును (సత్యభామ తండ్రిని); శమకంతకమణికిని= శమంతకమణికొరకు; వధించెన్+కాదె!= చంపాడు కదా!; అని; వారిదెసన్= వారివైపు; కీడు= తప్పు; కానిపింపన్= కనిపించేలా; పలికెన్= అన్నాడు; ఆ+వాదు విని= ఆ వాక్కలహాన్ని విని; సత్యభామ; కోపము+అడరి= కోపంవచ్చి; వనితా స్వభావ+ఉద్గత+అశ్రుపూర+అగుచున్= స్త్రీ స్వభావం చేత పుట్టిన కంటినీరు కలిగినది అవుతూ (ఏడుస్తూ); హరి= కృష్ణుడి యొక్క; అగ్రతలమునకున్= ఎదుటికి; అరుగుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** అని కృతవర్మ అన్నాడు. ఆ మాటలకు కృష్ణుడికి కోపం వచ్చింది. కృతవర్మ మీద మిక్కిలి ఎఱ్ఱనైన కడగంటి చూపు సారించి, కోపంతో కూడిన మనసుతో భోజులందరినీ ఒకసారి అట్లా చూచాడు. అప్పుడు సాత్యకి కృష్ణుడితో ఇట్లా అన్నాడు. 'కృతవర్మ తమ్ముడు శతధన్వుడు మాత్రం చాలా అనుచితమైన పద్ధతిలో మహితాత్ముడూ, గౌరవింపదగినవాడూ అయిన సత్రాజిత్తును శమంతకమణికొరకు చంపలేదా?' అంటూ వారివైపు దోషారోపణ చేశాడు. ఈ వాక్కలహం విన్న సత్యభామకు కోపం వచ్చింది. స్త్రీస్వభావంచేత కంటిలో నీళ్ళు తిరిగాయి. ఏడుస్తూ కృష్ణుడి సమీపానికి వచ్చింది.

**క. కనుఁగొని హరి కతిరోషము । జనియించెను; దానిఁ జూచి సాత్యకి యద్దే**
**వునకును దేవికినిం బ్రియ । మొనరించెద నని తలంచి యుద్వృత్తుండై. 46**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= ఇట్లా సత్య రావటాన్ని చూచి; హరికిన్+అతిరోషము= హరికి చాలా కోపం; జనియించెను= కలిగింది; దానిన్+చూచి= ఆ కోపాన్ని చూచి; సాత్యకి; ఆ+దేవునకునున్= కృష్ణుడికీ; దేవికినిన్= సత్యభామకూ; ప్రియము+ఒనరించెదన్+ అని+తలంచి= సంతోషం కలిగిస్తానని తలచి; ఉత్+వృత్తుండు+ఐ= పైకి గభాలున ఎగిరి.(తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** ఇట్లా సత్య ఏడుస్తూ రావటం చూచి కృష్ణుడికి కోపం వచ్చింది. ఆ కోపం చూచి సాత్యకి కృష్ణుడికీ సత్యభామకూ సంతోషం కలిగించదలచి పైకి గభాలున ఎగిరి. (తరువాతి పద్యంతో అన్వయం)

**మ. కృతవర్మం బటు దృష్టిఁ జూచి కినుకం గెంపారు వక్త్రంబుతో**
**'నితఁ డాచార్య సుతుండు దోడ్పడఁగ రేయెల్లన్ వడిం గిట్టి క**
**ష్టతరోత్సాహత ద్రౌపదేయులను ధృష్టద్యుమ్నుఁ దత్సోదర**
**ప్రతతిం జంపిన నీచు వారల గతింబ్రాపించు టర్హంబగున్.' 47**

**ప్రతిపదార్థం:** కృతవర్మన్= కృతవర్మను; పటుదృష్టిన్= తీక్ష్ణమైన చూపుతో; చూచి; కినుకన్= కోపంతో; కెంపారు వక్త్రంబుతోన్= ఎఱ్ఱనైనముఖంతో (ఇట్లా అన్నాడు); ఇతఁడు= ఈ కృతవర్మ; ఆచార్యసుతుండు= ద్రోణాచార్యుడి కొడుకు అశ్వత్థామ; తోడ్పడఁగన్= సహకరించగా; రేయి+ఎల్లన్= రాత్రంతా; వడిన్= అతివేగంగా; కిట్టి= సమీపించి; కష్టతర+ఉత్సాహతన్= అతి నీచమైన ఉత్సాహంతో; ద్రౌపదేయులనున్= ద్రౌపది కుమారులను (ఉపపాండవులను); ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; తత్సోదరప్రతతిన్=

అతడి సోదరసమూహాన్ని; చంపిన; నీచున్= నీచుడిని; వారలగతిన్= వాళ్ళు పోయిన దారిని; ప్రాపించుట= పొందేటట్లు చేయటం; అర్హంబు+అగున్= తగిన పని.

**తాత్పర్యం:** కృతవర్మను తీక్ష్ణంగా చూచి కోపంతో ఎర్రబడ్డ ముఖంతో ఇట్లా అన్నాడు: 'ఈ కృతవర్మ అశ్వత్థామ సహకరిస్తే రాత్రంతా అతివేగంతో సమీపించి అతినీచమైన ఉత్సాహంతో ఉపపాండవులను, ధృష్టద్యుమ్నుడిని, అతడి సోదరులను చంపాడు. ఇట్లాంటి నీచుడిని వాళ్ళు చచ్చినమార్గానికే పంపటం తగిన పని.'

మద్యపానమత్తుఁడైన సాత్యకి కృతవర్మతల నఱకుట (సం.16-4-27)

**మ.** **అనుచున్ సంయమి శాపజాత ముసలాత్యంతాద్భుత స్ఫీత శ**
**క్తినిరూఢంబుగ నూనినట్టి నిజ నిస్త్రింశంబు శీఘ్రంబునం**
**గొని తద్దీధితి రాజిచే నతని చూడ్కుల్ విహ్వలత్వంబు నొం**
**ద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తంబుల్ ప్రసారంబుగన్.** **48**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; సంయమి= ఋషుల; శాపజాత= శాపంవలన పుట్టిన; ముసల= రోకలియొక్క; అత్యంత= మిక్కిలి; అద్భుత= అద్భుతమైన; స్ఫీత= వ్యాపించిన; శక్తి= శక్తి; నిరూఢంబుగన్= ప్రసిద్ధికెక్కగా; ఊనిన+అట్టి= ధరించిన; నిజ= తన; నిస్త్రింశంబున్= కత్తిని; శీఘ్రంబునన్= వెంటనే; కొని= ఒరలోనుండి లాగి; తద్+దీధితి+రాజిచేన్= ఆ ఖడ్గకాంతి సమూహంచేత; అతని= ఆ కృతవర్మ యొక్క; చూడ్కుల్= చూపులు; విహ్వలత్వంబున్+ఒందన్= వివశాలు కాగా; ఉదగ్ర+ఉద్ధతిన్= మిక్కిలికోపం అతిశయించగా; రక్తంబుల్ ప్రసారంబుగన్= రక్తాలు నలుదిక్కులా ప్రసరించగా; తద్+గళమున్= అతడి గొంతును; త్రుంచెన్= నరికాడు.

**తాత్పర్యం:** ఇట్లా అంటూ, ఋషుల శాపంచేత పుట్టిన రోకలి కున్న అద్భుతమైన శక్తి వ్యాపించిన తన కత్తిని ఒరలోనుండి లాగాడు. ఆ ఖడ్గకాంతి సమూహంచేత కృతవర్మ చూపులు స్వాధీనాన్ని కోల్పోయాయి. సాత్యకికి కోపం అతిశయించింది. ఆ కత్తితో రక్తం నలుదిక్కులా చిమ్మగా కృతవర్మగొంతును నరికివేశాడు.

**విశేషం:** సాత్యకి చంపినది కత్తితో, కాని ఆ కత్తిలో ఉన్న శక్తి ముసలానికి ఋషులశాపం ప్రసాదించింది. ఋషుల ఆగ్రహానుగ్రహాలు ఎట్లా ఉంటాయో ఇట్లాంటి సందర్భాలవలన తెలుస్తాయి.

**తే.** **అట్లు కృతవర్మఁ దెగటార్చి యాతఁ డంత। నిలువ కుద్ధతుఁ డయి భోజకులముమీఁదఁ**
**గవిసె బాహావిలాసంబు ఖడ్గదీప్తి। చయము మెఱయంగ సంరంభసత్వరముగ.** **49**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కృతవర్మన్+తెగటార్చి= కృతవర్మను చంపి; అతఁడు= ఆ సాత్యకి; అంతన్ నిలువక= అంతటితో ఆగకుండా; ఉద్ధతుఁడు+అయి= గర్వించినవాడై; బాహావిలాసంబు= భుజదర్పాటోపం; ఖడ్గదీప్తిచయము= ఖడ్గకాంతి సమూహం; మెఱయంగన్= ప్రకాశించగా; సంరంభ= ఉద్రేకంతో కూడిన; సత్వరముగన్= వేగంతో; భోజకులముమీఁదన్= భోజులమీద; కవిసెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా కృతవర్మను చంపి సాత్కకి అంతటితో ఆగకుండా గర్వంతో బాహుబల సౌందర్యం, ఖడ్గకాంతి సమూహం ప్రకాశించగా ఉద్రేకంతో కూడిన వేగంతో భోజకులం మీద పడ్డాడు.

చ. కవిసినఁ జూచి యాఁగుటకుఁ గా నలినాక్షుఁడు వోవునంత నా
హవఖరులైన భోజులును నంధకవీరులు నొక్కఁడై దెసల్
సెవుడుపడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి; ర
ప్డు విమల బోధుఁ డాహరి కడుం గనలొందియుఁ గాలవేదితన్. 50

**ప్రతిపదార్థం:** కవిసినన్= ఆక్రమించగా; చూచి= గమనించి; ఆఁగుటకున్+కాన్= ఆపటానికై; నలిన+అక్షుఁడు= కమలనేత్రుడు (కృష్ణుడు); పోవునంతన్= వెళ్ళేంతలో; ఆహవఖరులు+ఐన= యుద్ధంలో మహాక్రూరులైన; భోజులునున్+అంధకవీరులున్= భోజులు, అంధకులు; ఒక్కఁడు+ఐ= ఒకటిగా కలిసి; దెసలు= దిక్కులు; చెవుడుపడంగన్= చెవుడయ్యేటట్లు; ఆర్చి= అరచి; అతిశీఘ్రతన్= అతివేగంగా; సాత్యకిన్= సాత్యకిని; చుట్టుముట్టిరి= ఆక్రమించారు; అప్డు= అప్పుడు; విమలబోధుఁడు= నిర్మలజ్ఞానం కలిగిన; ఆ హరి= ఆ కృష్ణుడు; కడున్= మిక్కిలిగా; కనలు+ఒందియున్= కోపపడి కూడా; కాలవేదితన్= కాలజ్ఞానం కలిగి.

**తాత్పర్యం:** ఇట్లా ఆక్రమించటానికి రావటం గమనించి ఆపటానికై కృష్ణుడు వెళ్లేటంతలో యుద్ధంలో వాడి వేడిమి ఉన్నవారూ, మహాక్రూరులూ అయిన భోజాంధకులు ఒక్కటిగా కలిసి, దిక్కులు చిల్లులు పడేటట్లు అరిచారు. అతివేగంతో సాత్యకిని చుట్టుముట్టారు. అప్పుడు నిర్మలజ్ఞానం కలిగిన శ్రీకృష్ణుడికి చాలా కోపం వచ్చింది. అయినా కాలజ్ఞానం కలిగినవాడు కాబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'విమలబోధుఁ' డనేమాట ఇక్కడ గమనించాలి. 'బోధ' అంటే జ్ఞానం. అది సాత్త్వికమయినప్పుడే 'విమల'మవుతుంది. 'కాలవేదిత' -సాత్యకి మృత్యువుకు సంబంధించిన జ్ఞానం. అది కలిగినవాడు కాబట్టి కృష్ణుడు తరువాతి కథలో ఊరుకొన్నాడు.

చ. తమ్మునిఁ గాచునట్టి సముదగ్రతఁ గైకొన నొల్లఁ డయ్యె వే
గమ్మున రుక్మిణీసుతుఁ డఖండపరాక్రమ మొప్పఁ గిట్టి శౌ
ర్యమ్ము భుజాబలమ్ము మెఱయం గని సాత్యకి సంతసిల్లి ద
ర్పమ్మునఁ బేర్చె మెచ్చొలసి ప్రస్తుతి సేసిరి చూచు ఖేచరుల్. 51

**ప్రతిపదార్థం:** తమ్మునిన్= తమ్ముడైన సాత్యకిని; కాచునట్టి= కాపాడే; సముదగ్రతన్= పూనికను; కైకొనన్= గ్రహించటానికి; ఒల్లఁడు+అయ్యెన్= ఇష్టపడలేదు; అపుడు; రుక్మిణీసుతుఁడు= ప్రద్యుమ్నుడు; వేగమ్మునన్= అతిశీఘ్రంగా; అఖండపరాక్రమము+ఒప్పన్= మొక్కపోని పరాక్రమంతో; కిట్టి= సమీపించి; శౌర్యమ్ము= పరాక్రమం; భుజాబలమ్ము= బాహుబలం; మెఱయన్+కని= ప్రకాశించటాన్ని చూచి; సాత్యకి; సంతసిల్లి= సంతోషపడి; దర్పమ్మునన్= గర్వంతో; పేర్చెన్= చెలరేగిపోయాడు; చూచు ఖేచరుల్= దీనిని చూస్తున్న ఆకాశసంచారులు (గంధర్వ విద్యాధరాదులు); మెచ్చు+ఒలసి= మెప్పు పుట్టి; ప్రస్తుతి+చేసిరి= ప్రస్తుతించారు.

**తాత్పర్యం:** కృష్ణుడు తమ్ముడైన సాత్యకిని కాపాడే ప్రయత్నం చెయ్యటానికి ఇష్టపడలేదు. అపుడు ప్రద్యుమ్నుడు అతి శీఘ్రంగా మొక్కపోని పరాక్రమంతో సమీపించి, తన విక్రమాన్ని, బాహుబలాన్ని ప్రకాశింప చేయటాన్ని చూచి సాత్యకి సంతోషపడి గర్వంతో మరింత చెలరేగిపోయాడు. దీనినంతా చూస్తున్న ఆకాశగమనులైన గంధర్వాదులు ప్రశంసాపూర్వకంగా ప్రస్తుతిచేశారు.

**చ. కనుఁగొని వృష్ణివీరులు నికామసముజ్జ్వల రోషవహ్ని నె**
**మ్మనమున నుత్థితంబుగ సమత్సర శౌర్యము విక్రమోద్ధతిం**
**బెనుపఁగ వార లిద్దఱకుఁ బ్రీతి యెలర్పఁగ సింహనాదముల్**
**ఘనపథమెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్. 52**

**ప్రతిపదార్థం:** వృష్ణివీరులు= వృష్ణివంశీయులైన ఇతర వీరులంతా; కనుఁగొని= దీనిని చూచి; నెమ్మనమునన్= మనస్సులలో; నికామ= అధికమైన; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశిస్తున్న; రోషవహ్ని= రోషమనే అగ్ని; ఉత్థితంబుగన్= పైకిలేవగా; సమత్సర శౌర్యము= మాత్సర్యంతో కూడిన శౌర్యం; విక్రమోద్ధతిన్= పరాక్రమాతిశయాన్ని; పెనుపఁగన్= పెంచగా; వారలు+ఇద్దఱకున్= సాత్యకి, ప్రద్యుమ్నులకు; ప్రీతి+ఎలర్పఁగన్= సంతోషాన్ని కల్గించటానికి; ఘనపథము+ఎల్లన్= ఆకాశం అంతటా; సింహనాదముల్= సింహ గర్జనలు; నిండఁగన్= నిండిపోగా; బలంబున్= బలమూ; చలమున్= పట్టుదలా; ఉల్లసిల్లఁగన్= వ్యక్తంకాగా.

**తాత్పర్యం:** అపుడు వృష్ణివంశీయులైన ఇతర వీరులంతా దీనిని చూచి, మనసులనిండా అధికమైన రోషాగ్ని పుట్టగా, మాత్సర్యంతో కూడిన పరాక్రమాతిశయంతో సాత్యకి, ప్రద్యుమ్నులకు సంతోషం కల్గించటానికై ఆకాశమార్గమంతటా సింహనాదాలు నిండిపోగా బలమూ, పట్టుదలా వ్యక్తం కాగా, (తరువాతి పద్యంతో అన్వయం)

**క. భోజాంధక సంగమన వి। రాజితమగు నబ్బలంబు రౌద్రోద్రేక**
**భ్రాజితు లయి తాఁకి పెనఁగి। రేజాలియు లేక కృష్ణుఁ డీక్షింపంగన్. 53**

**ప్రతిపదార్థం:** భోజ+అంధక+సంగమన= భోజుల, అంధకుల కూడికతో; విరాజితము+అగు+ఆ+బలంబు= పేరు పొందిన ఆ సైనికసమూహం; రౌద్ర+ఉద్రేక+భ్రాజితులు+అయి= రౌద్రంచేత పుట్టిన ఉద్రేకంతో ప్రకాశిస్తున్నవారై; ఏ జాలియున్+లేక= ఏ కనికరమూ లేకుండా; కృష్ణుడు+ఈక్షింపంగన్= శ్రీకృష్ణుడు చూస్తుండగానే; తాఁకి= ముట్టడించి; పెనఁగిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** భోజాంధకుల కూటమిగా పేరున్న ఆ సైనికబలం రౌద్రంచేత పుట్టిన ఉద్రేకంతో ప్రకాశిస్తున్నవారై శ్రీకృష్ణుడు చూస్తూ ఉండగానే ఏ జాలీ లేకుండా ఒకరినొకరు ముట్టడించి యుద్ధం చేశారు.

**క. అయ్యిరు దెఱఁగున కప్పుడు। కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్**
**ముయ్యంచు తుంగ యచ్చట;। దయ్యము నేర్పు విను సెప్పెదం గురునాథా! 54**

**ప్రతిపదార్థం:** కురునాథా!= కురుసార్వభౌమా!; ఆ+ఇరు+తెఱఁగునకున్= ఆ వృష్ణి, భోజాంధక వర్గాలు రెండింటికీ; అప్పుడు= ఆ సమయంలో; అచ్చటన్= అక్కడికక్కడే; ముయ్యంచు తుంగ= మూడు అంచులున్న తుంగ పరకలు; కయ్యమునకున్= యుద్ధానికి; పరమ= శ్రేష్ఠమైన; సాధకంబుగన్= ఆయుధాలుగా; కలిగెన్= దొరికాయి; దయ్యమునేర్పు= దైవనైపుణ్యం; చెప్పెదన్+విను= చెప్పుతాను వినుము.

**తాత్పర్యం:** ఆ ఇరువర్గాలవారికీ ఆ సమయంలో అక్కడికక్కడే మూడు అంచులున్న తుంగపరకలు యుద్ధానికి శ్రేష్ఠమైన ఆయుధాలవలె లభించాయి. దైవనైపుణ్యం ఎట్లాంటిదో చెప్పుతాను వినుము.

**విశేషం:** 'దయ్యము నేర్పు' అన్న మాట చాలా అర్థగర్భితమైనది. 'దైవ' శబ్ద వికృతి 'దయ్యం'. మానవుడికి ఎన్నటికీ అర్థంకాని నేర్పు ఒకటి దైవానికి ఉన్నది. అన్ని వరాలు కోరిన హిరణ్యకశిపుడిని నర+మృగవేషంలో రాత్రి+పగలు అయిన సమయంలో 'గోళ్ళ'ను ఆయుధంగా మలుచుకొని చంపటమే దైవనైపుణ్యం. ఇక్కడా ఇదే ప్రత్యేకత.

**చ. మునివరశాపసంభవదమోఘగతిన్ ముసలంబు సాద్భుతం**
**బును నతిదారుణంబు నగు భూరిసముద్భట శక్తిఖేలనం**
**బున ముసలత్వ విస్ఫురణముం గలిగించెఁ బ్రవేశలీలఁ గై**
**కొని సమరప్రవర్తనము ఘోరతరంబుగ నెల్లతుంగలన్. 55**

**ప్రతిపదార్థం:** మునివర= శ్రేష్ఠులైన మునుల యొక్క; శాప= శాపంచేత; సంభవత్= జనిస్తున్న; అమోఘగతిన్= గొప్ప గమనంతో; ముసలంబు= ముసలాయుధం; స+అద్భుతంబును= అద్భుతంతో కూడినదీ; అతిదారుణంబున్+అగు= అతి భయంకరమైన; భూరి= మిక్కిలి; సముద్భట= శ్రేష్ఠమైన; శక్తి= శక్తియొక్క; ఖేలనంబునన్= క్రీడలో; ఎల్ల తుంగలన్= తుంగలన్నింటిలోనూ; ప్రవేశలీలన్= ప్రవేశించటమనే లీలచేత; సమరప్రవర్తనమున్+కైకొని= యుద్ధ ప్రవృత్తిని కలిగిస్తూ; ఘోరతరంబుగన్= మిక్కిలి భయంకరంగా; ముసలత్వ విస్ఫురణమున్+కలిగించెన్= రోకలి అనే భావాన్ని (స్ఫురణము) కలిగించింది.

**తాత్పర్యం:** శ్రేష్ఠులైన మునుల శాపంచేత జనిస్తున్న మిక్కిలి గొప్ప గమనంతో, ముసలాయుధం అద్భుతమూ, భయంకరమూ అయిన శక్తియొక్క, క్రీడతో తుంగలన్నిటిలోనూ సునాయాసంగా ప్రవేశించి, యుద్ధ ప్రవృత్తిని కలిగిస్తూ, భీతిని సృష్టిస్తూ ఆ తుంగలన్నీ రోకళ్ళనే స్ఫురణను కల్గించింది.

**విశేషం:** 'అమోఘగతిన్' అనే మాట దివ్యశక్తిని సూచిస్తుంది. పరకాయప్రవేశంవలె రోకలి తుంగలో ప్రవేశించింది. దానికి పట్టిన కాలం, రోకలి అందులో ప్రవేశించిన తీరును 'అమోఘగతి' అని తిక్కన అన్నారు. 'సమరప్రవర్తనము' అనే మాట కూడా విచారించదగినదే. ఆ తుంగ పరకలను చూడగానే శత్రుపక్షం వారిని వాటితో మోదాలన్న బుద్ధి పుట్టిస్తున్నాయని అర్థం. మరి రోకలిని పొడి చేసి సముద్రంలో కలిపివేశారు కదా! అన్న ప్రశ్నకు సమాధానం చెప్పుతున్నాడు.

**క. పొడి గాఁగఁ జేసి యమ్మెయి। జడనిధిలో వృష్ణివరుఁడు చల్లించినను**
**జెడదయ్యె మునివరుల యె। క్కుడు శక్తిని ముసలశక్తి కురువంశవరా! 56**

**ప్రతిపదార్థం:** కురువంశవరా!= కురువంశ శ్రేష్ఠా!; వృష్ణివరుఁడు= వృష్ణివంశంలో శ్రేష్ఠుడైన వసుదేవుడు; పొడిగాఁగన్+చేసి= ఆ రోకలిని ఆనాడే పొడిపొడిగా చేసి; ఆ+మెయిన్= ఆ విధంగా; జడనిధిలోన్= సముద్రంలో; చల్లించినను= చల్లించినా; మునివరుల= శ్రేష్ఠులైన మునుల; ఎక్కుడుశక్తిన్= అధికమైన తపశ్శక్తిచేత; ముసలశక్తి= ఆ రోకలికున్న ప్రభావం; చెడదు+అయ్యెన్= చెడిపోలేదు (తగ్గలేదు).

**తాత్పర్యం:** రాజా! వసుదేవుడట్లా ఆ రోకలిని ఆనాడే పొడిపొడిగా చేసి ఆ విధంగా సముద్రంలో చల్లించినా శ్రేష్ఠులైన మునులయొక్క అధికమైన తపశ్శక్తిచేత ఆ రోకలికున్న ప్రభావం ఏమీ తగ్గలేదు.

**విశేషం:** మరింత అధికమూ అయింది. ఒక్క రోకలితో అందరూ మోదుకొని చావలేదు కదా! అందుకే రోకలిని పొడి చేసి సముద్రంలో చల్లటంచేత ప్రతి తుంగా రోకలిగా మారి వారికి మృత్యుహేతువయింది. ఋషుల శాపం - దానికున్న శక్తీ - అన్నీ దైవలీలలో భాగమని చెప్పటమే దీని పరమార్థం. అంటే దైవం నేర్పుముందు మానుషప్రయత్నం ఎన్నడూ జయింపజాలదన్న తాత్పర్యాన్ని ఈ సంఘటన నిరూపిస్తున్నది.

**సీ. యాదవవీరుల కా సమయంబున। మద్యపానోద్భూత మదము పేర్మి**
**మునివరామోఘవచన దివ్యశక్తినిఁ। జేసి కల్గద తుంగ వ్రేసినంత**

**టన ప్రతిభటునకుఁ దనుపీడ గలుగునే? । యను వివేకము దానిఁగొని విరోధి**

**నడచినయప్పుడు మిడుక లే కిలఁ బడఁ । గని యిది యెట్లొకో? యని తలంచు**

**తే. టయును గావున సమర మిట్టలపుభంగిఁ । జెల్లె గృత్రిమముసలచండోల్లసనము**

**లతిశయిల్లఁగ వారి కన్యోన్య వధ వి । హార దుర్వారసంచారఘోర మగుచు. 57**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సమయంలో (యుద్ధం చేస్తునప్పుడు); యాదవవీరులకున్= వీరులైన యాదవులకు; మద్యపాన+ఉద్భూత+మదముపేర్మిన్= మద్యపానం చేత పుట్టిన మత్తువలన; మునివర+అమోఘ వచన దివ్యశక్తినిన్+చేసి= మునిశ్రేష్ఠుల గొప్ప శాప వచనానికి ఉన్న దివ్యశక్తి వలన; తుంగవ్రేసినంతటన= తుంగపరకతో కొట్టినంత మాత్రాన వెంటనే; ప్రతి భటునకున్= ప్రతివీరుడికి; తనుపీడ= శరీరబాధ; కలుగునే?= కలుగుతుందా?; అనే; వివేకము= తెలివి; (అట్లాగే) దానిన్= ఆ తుంగను; కొని= తీసికొని; విరోధిని+అడిచిన+అప్పుడు= విరోధిని కొట్టినపుడు; మిడుకలేక= చలనమూ లేకుండా; ఇలన్+పడన్+కని= నేలమీద పడటాన్ని చూసి; ఇది+ఎట్లు+ఒకో+అని తలంచుటయునున్= ఇట్లా ఎలాగా! అన్న ఆలోచనా; కల్గదు+అ= కలుగనే లేదు; కావునన్= అందుచేత; కృత్రిమ= కపటమైన; ముసల= రోకళ్ళయొక్క (తుంగపరకల); చండ+ఉల్లసనములు= భయంకరమైన కాంతులు; అతిశయిల్లఁగన్= అధికం కాగా; వారికిన్= ఆ యదువీరులకు; అన్యోన్యవధ= ఒకరినొకరు చంపాలన్న; విహార= ఆటలో; దుర్వార= అడ్డులేని; సంచార ఘోరము+అగుచున్= సంచారంచేత దారుణమై; సమరము= యుద్ధము; ఇట్టలము+భంగిన్= అతిశయరీతిలో; చెల్లెన్= జరిగింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో యాదవవీరులకు మద్యపానం చేత పుట్టిన మత్తువలన, మునుల గొప్పశాపవచనానికి ఉన్న దివ్యశక్తివలన, తుంగపరకతో కొట్టినంత మాత్రాన వెంటనే ప్రతివీరుడికి శరీరబాధ ఎట్లా కలుగుతుందనే తెలివి కానీ, ఆ తుంగను తీసికొని విరోధిని అణచినపుడు ఏ చలనంలేకుండా నేలమీద పడటాన్ని చూచి 'ఇది ఎట్లా సంభవం? అన్న ఆలోచన కానీ కలుగలేదు. అందువలన కపటమైన ఆ రోకళ్ళు - ఆ తుంగపరకల - భయంకరమైన కాంతులు అతిశయించగా, ఆ యదువీరులకు ఒకరినొకరు చంపాలన్న ఆటలో అడ్డు లేకుండా ఆ తుంగలు ఉపకరించగా యుద్ధం చాలా అతిశయమైన రీతిలో జరిగింది.

**ఆ. తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక య । య్యిరు దెఱంగు వారు నేపు రేఁగి**

**మడియ మోఁద గాలిఁ బడు మ్రాఁకుగముల తె । ఱంగు దోఁచె నేమనంగఁ గలదు? 58**

**ప్రతిపదార్థం:** తండ్రి; పుత్త్రుఁడు; అన్న; తమ్ముఁడు; నాక= అనక; ఆ+ఇరు+తెఱంగువారు= ఆ రెండు వర్గాలవారు; ఏపు రేఁగి= చెలరేగి; మడియన్= చచ్చేట; మోఁదన్= మోదగా; గాలిన్= గాలి దెబ్బతో; పడు= కూలునట్టి; మ్రాఁకు గముల= వృక్షసమూహాల; తెఱంగు+తోఁచెన్= విధంగా కనిపించింది; ఏమి+అనంగన్+కలదు?= ఏమనవచ్చును?

**తాత్పర్యం:** తండ్రి, కొడుకు, అన్న, తమ్ముడు - అనే తేడా లేకుండా ఆ రెండువర్గాల వారు చెలరేగి చచ్చేటట్లు మోదుకొనగా గాలిదెబ్బకు పడిపోయేటటువంటి వృక్షసమూహాలవలె వారు కనిపించారు. కాలవైపరీత్యాన్ని ఏమనవచ్చును?

**తే. మునిశాపము వారలమది । ననయము నస మెక్కఁజేయ సం దొకఁడైనన్**

**విను మరలుట దెరలుటలే । కని బెట్టుగఁ జేసి రథిప! యార్పులు సెలఁగన్. 59**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; విను= ఇంకా వినుము; మునిశాపము= మునులిచ్చిన శాపం; వారలమదిన్= వారి మనస్సులలో; అనయము= నిరంతరము; అసము+ఎక్కన్+చేయన్= దర్పం అధికం అయ్యేటట్లు చేయగా; అందున్+ఒకఁడు+ఐనన్= వారిలో ఒక్కడుకూడా; మరలుట= యుద్ధంనుండి వెనుకకురావటం గాని; తెరలుట= కలత చెందటం కాని; లేక= లేకుండా; ఆర్పులు= అరుపులు; చెలంగన్= అతిశయించగా; అనిన్= యుద్ధాన్ని; బెట్టుగన్+చేసిరి= విజృంభించి చేశారు.

**తాత్పర్యం:** రాజా! ఇంకా చెప్పుతాను వినుము. మునులిచ్చిన శాపం వారి మనస్సులలో నిరంతరం దర్పాన్ని అధికమయ్యేటట్లు చేసింది. దానితో వారిలో ఒక్కడు కూడా వెనుకకు మరలటం కాని, కలతచెందటం గాని లేకుండా ఉన్నవారు ఉన్నచోటే విజృంభించి యుద్ధం చేశారు.

**తే.** **అట్టియెడ విను భోజులు నంధకులును। జాలఁ గలుగుటఁ బ్రబలుండు సాత్యకియు స**
**మగ్రశక్తి ప్రద్యుమ్నుఁడు నాదిగాఁగ। మడిసె వారిచే వృష్ణిసమాజమెల్ల.** **60**

**ప్రతిపదార్థం:** విను= ఏమయిందో చెప్పుతాను వినుము; అట్టి+ఎడన్= ఆ సమయంలో; భోజులున్= భోజులూ; అంధకులునున్= అంధకులూ; చాలన్+కలుగుటన్= చాలామంది ఉండటంవలన; ప్రబలుండు= మిక్కిలి బలవంతుడైన; సాత్యకియున్= సాత్యకీ; సమగ్రశక్తి= పరమశక్తిమంతుడు; ప్రద్యుమ్నుఁడున్= ప్రద్యుమ్నుడూ; ఆది+కాఁగన్= మొదలుగాగల; వృష్ణిసమాజమెల్లన్= వృష్ణి వంశమంతా; మడిసెన్= నశించింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఏమయిందో వినుము! భోజులు, అంధకులు సంఖ్యలో చాలా అధికంగా ఉండటం వలన మిక్కిలి బలవంతుడైన సాత్యకీ, పరమశక్తిమంతుడైన ప్రద్యుమ్నుడూ మొదలైన వారున్న వృష్ణివంశమంతా నశించింది.

**సీ.** **అనిరుద్ధుఁ బ్రద్యుమ్ను సాంబుని సాత్యకి। గదునిని మఱియును గలుగు వృష్ణి**
**వరుల నంధకభోజవర్గ పరాక్రమ। క్రీడల సమసి యా క్షితితలమునఁ**
**బడియుండఁ గనుఁగొని పరమమునీంద్ర శా। పంబు మహాశక్తిఁ బద్మనాభుఁ**
**డును దీవ్రకోపాగ్ని తనదుచిత్తమున ను। ద్ధురమై జనింపంగ దురములోనఁ**

**తే.** **బడక శేషించి మెఱసిన ప్రతిభటాళి। మీఁదఁ గవిసి తుంగలఁగొని మోఁది నిరవ**
**శేషముగఁ జేసె; నిట్టు లశేష యాద। వులును మౌసలవిస్ఫూర్తిఁ బొలిసి రధిప!** **61**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఆ క్షితితలమునన్= ఆ రణభూమిలో; అనిరుద్ధున్, ప్రద్యుమ్నున్, సాంబునిన్, సాత్యకిన్, గదునినిన్= అనిరుద్ధుడిని; ప్రద్యుమ్నుడిని, సాంబుడిని, సాత్యకిని, గదుడిని; మఱియును+కలుగు= ఇంకా తక్కిన; వృష్ణి వంశంలో పుట్టిన వీరులను; అంధక, భోజవర్గ పరాక్రమ క్రీడలన్= అంధక, భోజ వీరుల పరాక్రమ విలాసంచేత; సమసి= నశించి (చచ్చి); పడి+ఉండన్= పడిఉండగా; కనుఁగొని= చూచి; పద్మనాభుఁడునున్= కృష్ణుడుకూడా; పరమమునీంద్ర= గొప్ప మునీంద్రుల; శాపంబు= శాపానికున్న; మహాశక్తిన్= మహాశక్తిచేత; తీవ్రకోప+అగ్ని= తీవ్రమైన కోపమనే అగ్ని; తనదుచిత్తమునన్= తన మనస్సులో; ఉద్ధురము+ఐ= దట్టమై; జనింపంగన్= పుట్టగా; దురములోనన్= యుద్ధంలో; పడక= చావక; శేషించి= మిగిలి; మెఱసిన= అగుపించిన; ప్రతిభట+ఆళిమీఁదన్= శత్రువీరులమీద; కవిసి= ఉరికి; తుంగలన్+కొని= తుంగపరకలను తీసికొని; మోఁది= బాది; నిర్+ అవశేషముగన్+చేసెన్= ఒక్కరూ మిగలకుండా చేశాడు; ఇట్టులు= ఇట్లా; అశేషయాదవులునున్= యాదవులందరూ; మౌసల విస్ఫూర్తిన్= రోకటి విజృంభణ చేత; పొలిసిరి= చనిపోయారు.

**తాత్పర్యం:** ఆ రణభూమిలో అంధక, భోజవీరుల పరాక్రమ విలాసంచేత చచ్చిపడి ఉన్న అనిరుద్ధుడిని, ప్రద్యుమ్నుడిని, సాంబుడిని, సాత్యకిని, గదుడిని శ్రీకృష్ణుడు చూచాడు. మునీంద్రుల శాపంవలన కృష్ణుడికీ తీవ్రమైన కోపాగ్ని దట్టంగా పుట్టింది. అంతే! యుద్ధంలో చావక మిగిలి తనకు అగుపించిన శత్రువీరులమీద పడి, తుంగపరకలను తీసికొని చావగొట్టి ఒక్కరూ మిగలకుండా చేశాడు. ఇట్లా యాదవులందరూ రోకటి విజృంభణంచేత చనిపోయారు.

**విశేషం:** శ్రీకృష్ణుడిలో కూడా మానుషభావం అలముకొన్నది. అందుకే ఋషిశాపం ఆయనలోని 'యాదవు'నిపై పనిచేసింది. అందుకే తక్కిన యాదవవీరులను ఆయన చంపి ఋషుల శాపాన్ని ఫలింపజేశాడు. 'మౌసల విస్ఫూర్తి' అనే మాట చాలా గొప్పది. అక్కడ రోకలీ లేదు - దెబ్బాలేదు - ఉన్నదంతా ఋషి శాపవాక్కు - దాని కాంతే 'రోకలి' వలె కనిపించి మృత్యుకారకమయిందని తాత్పర్యం.

**క. నారాయణుఁ డప్పుడు గాం। ధారీ వాక్యంబు తెఱఁగు దలఁచి మనమునం**
**బారంబుఁ బొందెనే యిది। యా రూపున ననుచు సంగరావని నొకఁడున్. 62**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; నారాయణుఁడు= నారాయణ స్వరూపుడైన శ్రీకృష్ణుడు; మనంబునన్= మనస్సులో; గాంధారీ వాక్యంబు తెఱఁగు= గాంధారి చెప్పిన శాపవిధానం; తలఁచి= స్మరించుకొని; ఇది= ఈ శాపం; ఆ రూపునన్= ఆ విధంగా; పారంబున్+పొందెనే!= తీరం చేరిందా!; అనుచున్= అనుకొంటూ; సంగర+అవనిన్= యుద్ధభూమిలో; ఒకఁడున్= ఒంటరిగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో నారాయణస్వరూపుడైన శ్రీకృష్ణుడు మనసులో గాంధారి శాపమిచ్చిన విధాన్ని స్మరించుకొని ఆ శాపం ఇట్లా సార్థకమయిందా! అని అనుకొంటూ యుద్ధభూమిలో ఒంటరిగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నిలుచున్నఁ జూచి రణసం। కులతఁ బడకయున్న దారుకుఁడు బభ్రుఁడు న**
**జ్జలరుహనాభు సమీప। స్థలికిం జని యిట్టులని రతనితోడ నృపా! 63**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా! (ఏమి జరిగిందో వినుము); నిలుచున్+ఉన్నన్= నిలబడి ఉండగా; చూచి; రణసంకులతన్= ఆ దొమ్మియుద్ధంలో; పడకయున్న= చావకుండా మిగిలిన; దారుకుఁడు; బభ్రుఁడు; ఆ+జలరుహ+నాభు= ఆ పద్మనాభుడి (కృష్ణుడి); సమీపస్థలికిన్= దగ్గరికి; చని= వెళ్ళి; అతనితోడన్= కృష్ణుడితో; ఇట్టులు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** నిలబడి ఉండగా ఆ దొమ్మియుద్ధంలో చావకుండా మిగిలిన దారుకుడు, బభ్రుడు ఆ కృష్ణుడి దగ్గరకు వెళ్ళి, అతడితో ఇట్లా అన్నారు.

**తే. అఖిలజనమును సంహృతమయ్యె నిచట। నేల? బలభద్ర దేవుఁ డున్నెడ ముకుంద!**
**యరసికొని పోయి యాతని చరితమునకు। ననుగుణంబైన వర్తన మాచరింపు.' 64**

**ప్రతిపదార్థం:** ముకుంద!= కృష్ణా!; అఖిలజనమును= యాదవసమూహమంతా; సంహృతము+అయ్యెన్= చచ్చింది; ఇచటన్+ఏల?= ఇక్కడెందుకు?; బలభద్రదేవుఁడు= బలరాముడు; ఉన్న+ఎడ= ఉన్నచోటును; అరసికొని పోయి= తెలిసికొని పోయి; అతని చరితమునకున్= అతడి నడవడికి; అనుగుణంబు+ఐన= తగిన; వర్తనము= పని; ఆచరింపు(ము)= చేయుము.

**తాత్పర్యం:** 'కృష్ణా! యాదవ సమూహమంతా చచ్చింది. మరి ఇక్క డెందుకు! బలరాముడు ఎక్కడున్నాడో తెలిసికొనిపోయి, అత డెట్లా ఉన్నాడో అందుకు అనుగుణంగా ఆచరించటం మంచిది.

**ఉ.** **అనుటయు నట్ల కాక! యని యంబుజనాభుఁడు బభ్రుదారుకు**
**ల్మనములు దల్లడిల్లఁగ కెలంకుల రా బలభద్రదేవు పో**
**యిన దెస నాదరం బెసఁగ నేఁగి కురుక్షితిపాగ్రగణ్య! యా**
**ఘనతరమూర్తి నవ్వలనఁ గాంచె మహీజము పొంత నుండఁగన్.** **65**

**ప్రతిపదార్థం:** కురుక్షితిప+అగ్రగణ్య!= ఓ కురురాజ శ్రేష్ఠా! వినుము; అనుటయున్= దారుకుడు, బభ్రుడు అట్లా పలుకగా; అట్లకాక!+అని= అట్లాగే చేద్దామని; అంబుజనాభుఁడు= పద్మనాభుడు (శ్రీకృష్ణుడు); బభ్రుదారుకుల్+మనములు= బభ్రుడి, దారుకుడి మనస్సులు; తల్లడిల్లఁగన్= తల్లడిల్లిపోగా; కెలంకులన్‌రాన్= తనకు ఇరువైపులా రాగా; బలభద్రదేవు పోయిన దెసన్= బలరాముడు వెళ్ళిన దిక్కులో; ఆదరంబు+ఎసఁగన్+ఏఁగి= గౌరవభావంతో వెళ్ళి; ఆ+వలనన్= ఆ వైపున; మహీజముపొంతన్= చెట్టుదగ్గర; ఉండఁగన్= ఉండగా; ఆ ఘనతరమూర్తిన్= ఆ బలిష్ఠమైన బలరాముడి రూపాన్ని; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఓ రాజా వినుము! అట్లా వారు పలుకగా అట్లాగే చేద్దామంటూ, బభ్రుదారుకులు, మనసులు తల్లడిల్లిపోగా, ఇరువైపులా నడుస్తుండగా శ్రీకృష్ణుడు బలరాముడు వెళ్లిన దారిలోనే చాలా గౌరవభావంతో వెళ్ళాడు. ఆ వైపున ఒక చెట్టుక్రింద ఆ బలిష్ఠవిగ్రహుడైన బలరాముడిని చూచాడు.

యాదవులెల్ల మడిసిన పిదపఁ గృష్ణుఁ డర్జునుఁ దోడ్తేర దారుకుం బంపుట

**సీ.** **కాంచి దారుకు దెసఁ గనుగొని 'నీవు వే। పాండురాజ తనూజుల పాలి కరిగి**
**వారికి యాదవవర్గ సంక్షయవిధ। మెఱిఁగించి యర్జును నిందుఁ దెమ్ము'**
**నావుడు నతఁడు మహావేగవంతంబు। లగు రథ్యములఁ బట్టి యలఁతియరద**
**మునఁ బూన్చికొని రయంబున నేఁగె నప్పు డ। మ్మురవైరి బభ్రుని మోముఁ జూచి**

**ఆ.** **'అతివపిండుఁ గుంజరాదులఁ బురిఁ జేర్చి। యరుగుదెమ్ము వేగ' మనిన నాతఁ**
**డట్ల చేయు పనికి నయి చన నొకబోయ। త్రుంగఁ జేసె నతనిఁ దుంగ వ్రేసి.** **66**

**ప్రతిపదార్థం:** కాంచి= అట్లా బలరాముడిని చూచి; దారుకుదెసన్= దారుకుడివైపు; కనుఁగొని= చూచి; నీవు; వే= వేగంగా; పాండు తనూజుల పాలికిన్= పాండురాజు కుమారుల దగ్గరకు; అరిగి= వెళ్ళి; యాదవవర్గ సంక్షయ విధము= యాదవ వర్గమంతా నశించిన విధం; ఎఱిఁగించి= తెలిపి; అర్జునున్= అర్జునుడిని; ఇందున్= ఇక్కడికి; తెమ్ము= తీసికొనిరమ్ము!; నావుడున్= అనగా; అతఁడు= ఆ దారుకుడు; మహావేగవంతంబులు+అగు= చాలా వేగంగా పరుగెత్తే; రథ్యములను= గుర్రాలను; పట్టి= పట్టుకొనివచ్చి; అలఁతి= చిన్న; అరదమునన్= రథానికి; పూన్చికొని= పూన్చుకొని; రయంబునన్= వేగంగా; ఏఁగెన్= వెళ్ళిపోయాడు; అప్పుడు; ఆ+మురవైరి= ఆ మురాసురుడి శత్రువు - శ్రీకృష్ణుడు; బభ్రునిమోమున్+చూచి= బభ్రుని ముఖం చూచి; అతివ పిండున్= స్త్రీల సమూహాన్ని; కుంజర+ఆదులన్= ఏనుగులు మొదలైనవాటిని; పురిన్+చేర్చి= ద్వారకలో చేర్చి; వేగము= శీఘ్రంగా; అరుగుదెమ్ము= మరలిరమ్ము; అనినన్= అనగా; అతఁడు= ఆ బభ్రుడు; అట్లు+అ+చేయుపనికిన్+అయి= అట్లాగే చేయటానికి; చనన్= పోగా; ఒక బోయ= ఒక బోయవాడు; తుంగ= తుంగపరకను; వ్రేసి= అతడిపై వేసి; అతనిన్= ఆ బభ్రుడిని; త్రుంగన్+చేసెన్= చచ్చేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** అట్లా బలరాముడిని చూసి, దారుకుడి వైపు తిరిగి 'నీవు వేగంగా పాండుకుమారుల దగ్గరకు వెళ్ళి, యాదవవర్గమంతా నశించిన విధం తెలిపి, అర్జునుడిని ఇక్కడకు తీసికొనిరమ్ము' అన్నాడు. ఆ దారుకుడు బాగా వేగంగా పరుగెత్తే గుఱ్ఱాలను తీసికొనివచ్చి చిన్న రథానికి పూన్చుకొని వేగంగా వెళ్ళిపోయాడు. అప్పుడు కృష్ణుడు బభ్రుడివైపు చూచి 'నీవు స్త్రీలను, ఏనుగులు, గుఱ్ఱాలు మొదలైనవాటినీ ద్వారకలో చేర్చి తిరిగిరమ్ము' అన్నాడు. ఆ బభ్రుడు అట్లాగే చేయటానికి బయలుదేరాడు. అంతలో ఒక బోయవాడు ఒక తుంగపరకను వాడిపై వేసి, వాడిని చంపాడు.

**విశేషం:** బభ్రుడు యాదవుడు, ఆ ఒక్కడు కూడా మిగలలేదని చెప్పటం కోసం ఈ వర్ణన. ఇక ఆ బభ్రుడి పని కూడా శ్రీకృష్ణుడే చేయవలసి వచ్చింది. కాలం వికటించటమంటే అర్థం ఇదే.

**ఆ. హరికిఁ గానవచ్చునంత దవ్వుల నట్లు । పడియె బభ్రుఁ; డతని పాటుఁ జూచి**
**సంయమీంద్రశాపశక్తికి నద్భుత । మంది యమ్ముకుందుఁ డన్నతోడ. 67**

**ప్రతిపదార్థం:** హరికిన్= కృష్ణుడికి; కానవచ్చునంత దవ్వులన్= కనిపించేటంత దూరంలోనే; బభ్రుఁడు; అట్లు= ఆ విధంగా; పడియెన్= నేలకూలాడు; అతని= ఆ బభ్రుడిని; పాటున్ చూచి= పడిపోవటాన్ని చూచి; ఆ+ముకుందుఁడు= శ్రీకృష్ణుడు; సంయమి+ఇంద్ర= ఋషిశ్రేష్ఠుల; శాపశక్తికిన్= శాపానికున్న శక్తికి; అద్భుతము+అంది= ఆశ్చర్యపడి; అన్నతోడన్= బలరాముడితో.

**తాత్పర్యం:** కృష్ణుడికి కనిపించేటంత దూరంలోనే అట్లా బభ్రుడు నేలకొరిగాడు. ఆ బభ్రుడి పతనాన్ని చూచి కృష్ణుడు ఋషిశ్రేష్ఠుల శాపాని కున్న శక్తికి ఆశ్చర్యపడి బలరాముడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'సామజరథతురగములను । రామలఁ బురి సేర్చి యే మరలి వచ్చెద నీ**
**భూమిజము కడన నిలువు ద । యామయ! నా రాక వార్చి' యనియె నరేంద్రా! 68**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా (కృష్ణుడిట్లా అన్నాడు); సామజ= ఏనుగులనూ; రథ= రథాలను; తురగములనున్= గుఱ్ఱాలను; రామలన్= స్త్రీలను; పురి+చేర్చి= నగరానికి చేర్చి; ఏన్= నేను; మరలి వచ్చెదన్= తిరిగి వస్తాను; దయామయ!;= దయతోనిండినవాడా! (అన్నా); ఈ భూమిజము కడన్= ఈ చెట్టుదగ్గరే; నా రాక వార్చి= నా ఆగమనం నిరీక్షిస్తూ; నిలువు= ఉండుము.

**తాత్పర్యం:** కృష్ణుడు బలరాముడితో ఇట్లా అన్నాడు; 'అన్నయ్యా! ఏనుగులను, గుఱ్ఱాలను, రథాలను, స్త్రీలను ద్వారకలో వదలి నేను తిరిగి వస్తాను. అంతవరకు ఈ చెట్టుదగ్గరే ఉండుము'.

**సీ. అని గజాదుల నింతులను గొని పురి కేఁగి । వసుదేవుఁగాంచి యవ్వసుమతీశు**
**తోఁ దగ నిట్లను దొల్లి కౌరవకుల । క్షయము సూచితి; నేఁడు సకలయాద**
**వులనాశమును గంటి నలఘుతేజోధన! । యఖిలబాంధవహీనమయిన యిచటి**
**మనువున వర్తింప మనసు గొల్పదు మున్న । యన్న కాననమున కరిగినాఁడు**

**తే. భవ్యతపమున నా బలభద్రుఁ గూడి । యేను దపమాచరించెద; నింక మీర**
**లరసికొనుఁడు సర్వంబును; । నరుఁడు వచ్చు । నిందు మీ పంపు సేఁతకై యెల్లినేఁడు.' 69**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; గజ+ఆదులన్= ఏనుగులు మొదలైనవాటిని; ఇంతులనున్= స్త్రీలను; కొని= వెంటతీసికొని; పురికిన్+ఏఁగి= ద్వారకకు వెళ్ళి; ఆ+వసుమతీ+ఈశుతోన్= రాజయినవసుదేవుడితో; తగన్= అర్హమైన రీతిలో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అలఘుతేజోధన!= గొప్ప తేజస్సే ధనంగా కలిగినవాడా (తేజోమూర్తీ); తొల్లి= మునుపు; కౌరవకులక్షయము= కౌరవవంశ నాశం; చూచితిన్= చూశాను; నేఁడు= ఈ వేళ; సకలయాదవులనాశమునున్= యాదవులందరూ నశించటం; కంటిన్= చూచాను; అఖిలబాంధవ హీనము+అయిన= బంధువులెవ్వరూ లేని; ఇచటిమనువునన్= ఇక్కడి బ్రతుకులో; వర్తింపన్= ఉండటానికి; మనసు+కొల్పదు= మనసు రావటంలేదు; అన్న= బలరాముడు; మున్ను+అ= ముందుగానే; కాననమునకున్= అడవికి; అరిగినాఁడు= వెళ్ళాడు; భవ్యతపమునన్= శాంతమైన తపస్సుతో, ఆ బలభద్రున్+కూడి= బలరాముడితో కలిసి; ఏను= నేను (కూడా); తపము+ఆచరించెదన్= తపస్సు చేస్తాను; ఇంకన్= ఇకమీదట; సర్వంబును= అన్ని విషయాలనూ; మీరలు= మీరే; అరసికొనుఁడు= చూచికొనుడు; మీ పంపుసేఁతకై= మీ ఆజ్ఞను నిర్వర్తించి మీకు సహకరించటానికి; ఎల్లినేఁడు= రేపో ఈ రోజో; నరుఁడు= అర్జునుడు; ఇందున్= ఇక్కడికి; వచ్చున్= వస్తాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, ఏనుగులు మొదలైనవాటినీ, స్త్రీలనూ వెంటతీసికొని ద్వారకకు వెళ్ళి, వసుదేవుడితో తగినరీతిలో ఇట్లా అన్నాడు: 'తండ్రీ! మునుపు కౌరవులందరూ నాశనం కావటం చూచాను. ఈ వేళ యాదవులందరి చావునూ చూచాను. ఓ తేజోమూర్తీ! బంధువు లెవ్వరూ లేని ఇక్కడ జీవితం గడపటానికి మనస్సు రావటంలేదు. బలరాముడు ముందుగానే అడవికి వెళ్ళాడు. అన్నతో కలిసి నేను కూడా శాంతమైన తపస్సు చేస్తాను. ఇక అన్ని విషయాలూ మీరే చూచికొనుడు. మీ ఆజ్ఞ నిర్వర్తించి, మీకు సహకరించటానికి అర్జునుడు రేపో ఈనాడో ఇక్కడకు వస్తాడు.'

**క. అనుచు నతని పాదంబులు । తన ఫాలతలంబు సోఁకఁ దాత్పర్యమునన్**
**వినతి నడపె నంతకుమును । వినియె జనులచేత సమరవిధ మతఁ డధిపా! 70**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; అనుచున్= అంటూ; అతని పాదంబులు= వసుదేవుడి పాదాలు; తన ఫాలతలంబు సోఁకన్= తన నుదుటికి తాకేటట్లు; తాత్పర్యమునన్= గౌరవ ప్రపత్తులతో; వినతినడపెన్= నమస్కరించాడు; అతఁడు= ఆ వసుదేవుడు; అంతకుమును= అంతకుమునుపే; జనులచేతన్= ప్రజలచేత; సమరవిధము= యాదవుల యుద్ధ విషయం; వినియెన్= వినిఉన్నాడు.

**తాత్పర్యం:** అంటూ వసుదేవుడి పాదాలు తన నుదుటికి తగిలేటట్లు గౌరవప్రపత్తులతో కృష్ణుడు నమస్కరించాడు. ఆ వసుదేవుడు అంతకుమునుపే ప్రజలవలన యాదవులు తుంగపరకలతో చేసికొన్న యుద్ధాన్ని గురించి విని ఉన్నారు.

**చ. విని బలుజీవి వోయి మది విహ్వలమై మెయి మ్రానుపాటు నొం**
**ద నునికి మీఁదఁ గేశవుఁడు దానును రాముఁడు నిల్లువాసి కా**
**ననమున నుండువారమని నైష్ఠికతం బలుకంగ నున్నచే**
**తనయు నడంగఁ జేష్టితము దక్కి శవాకృతి నుండె నత్తఱిన్. 71**

**ప్రతిపదార్థం:** విని= ఆ మాటలు విని; బలుజీవి+పోయి= దృఢమైన చైతన్యాన్ని కోల్పోయి; మది= మనసు; విహ్వలము+ఐ= వివశమై (స్వాధీనం కోల్పోయి); మెయి= దేహము; మ్రానుపాటున్+ఒందన్= కొయ్యబారగా; ఉనికి= ఉండటంతో; మీఁదన్=

ఆపై; కేశవుఁడు= శ్రీకృష్ణుడు; తానును= తానూ; రాముఁడున్= బలరాముడూ; ఇల్లు+పాసి= ఇల్లు వదలి; కాననమునన్= అడవిలో; ఉండువారము+అని= ఉంటామని, నైష్ఠికతన్= నిష్ఠతో; పలుకంగన్= చెప్పగా; ఉన్న చేతనయున్= ఉన్న తెలివికూడా; అడంగన్= అణగిపోగా; చేష్టితము తక్కి= నిశ్చేష్టుడై; ఆ+తరిన్= ఆ సమయంలో; శవ+ఆకృతిన్= శవంవలె; ఉండెన్= ఉండిపోయాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని, దృఢమైన చైతన్యం పోయి, మనస్సు అస్వాధీనమై, దేహం కొయ్యబారి ఉండగా ఆపైన శ్రీకృష్ణుడు తానూ బలరాముడూ అడవిలో ఉంటామని అనటంతో ఉన్న తెలివికూడా పోయి వసుదేవుడు నిశ్చేష్టుడై శవప్రాయంగా అయ్యాడు.

**క. తన మాటలు నజ్జన నా। థు నవస్థయు వినియుఁ గనియు దురపిల్లి సతీ**
**జను లొక్కటఁ బె ల్లాక్రం। దన మొనరించిన మురారి దయ మది నొలయన్. 72**

**ప్రతిపదార్థం:** తన మాటలున్= తాను ఆడిన మాటలు (అడవిలో తపస్సు చేస్తామనటం); వినియున్= విని; ఆ+జననాథు+ అవస్థయున్= ఆ వసుదేవుడి స్థితి; కనియున్= చూచి; సతీజనులు= యాదవస్త్రీలు; దురపిల్లి= శోకించి; ఒక్కటన్= ఒక్కసారిగా; పెల్లు= మిక్కిలిగా; ఆక్రందనము+ఒనరించినన్= ఏడ్వగా; ముర+అరి= కృష్ణుడు; మదిన్= మనసులో; దయ= కరుణ; ఒలయన్= పుట్టగా.

**తాత్పర్యం:** తానాడిన మాటలు విని, వసుదేవుడి దురవస్థ చూచి, యాదవస్త్రీలు ఒక్కసారిగా హాహాకారాలు చేస్తూ పెద్దగా ఏడ్చారు. అప్పుడు కృష్ణుడు మనసులో కరుణ పుట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. అందఱ నూరార్చి 'యర్జునుం డిప్పుడ। వచ్చు నిచ్చటికి మీవంత లెల్లఁ**
**దీర్చు నక్కురు కులదీపకుం' డని యుప। శమవాక్యములఁ దేర్చి జనకుపాల**
**నాసీనుఁ డయి తదీయాంఘ్రిపద్మంబులు। తన చారుపాణిపద్మముల మెత్త**
**మెత్తన యొత్తుచు మెలుపొందఁ గర్జంపుఁ। బలుకులఁ జిత్తవిభ్రమము మాన్చి**

**తే. మఱియుఁ బార్థుని రాక పల్మఱును జెప్పి। యన్నయాఢ్యుఁడు పనిసేయ నున్నవారిఁ**
**'గరితురంగాదికముల మీ రరసికొనుఁడు;। వినుఁడు కర్తవ్యమిట్టిది వేయునేల?' 73**

**ప్రతిపదార్థం:** (శ్రీకృష్ణుడు) అందఱన్= అందరినీ; ఊరార్చి= ఓదార్చి; ఆ+కురుకులదీపకుండు= ఆ కురుకులంలో శ్రేష్ఠుడైన అర్జునుడు; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఇచ్చటికిన్= ఇక్కడికి; వచ్చున్= వస్తున్నాడు; మీవంతలు+ఎల్లన్= మీ దుఃఖాలన్నిటినీ; తీర్చున్= పోగొట్టుతాడు; అని; ఉపశమవాక్యములన్= ఓదార్పు మాటలతో; తేర్చి= వారు తేరుకొనేటట్లు చేసి; జనకు పాలన్= తండ్రిదగ్గర; ఆసీనుఁడు+అయి= కూర్చుని; తదీయ= అతడి; అంఘ్రిపద్మంబులు= తామరలవంటి పాదాలను; తన; చారు= అందమయిన; పాణిపద్మములన్= తామరలవంటి చేతులలో; మెత్తమెత్తన= నెమ్మదిగా; ఒత్తుచున్= ఒత్తుతూ; మెలువు+ఒందన్= సుకుమారంగా; కర్జము+పలుకులన్= చేయవలసిన పనిని గూర్చిన మాటలతో; చిత్రవిభ్రమమున్= మనసు చెదరటాన్ని; మాన్చి= మాన్పి; మఱియున్= మరల; పార్థుని రాక= అర్జునుడి రాకను గురించి; పల్మఱును చెప్పి= మాటిమాటికీ చెప్పి; ఆ+నయ+ఆఢ్యుఁడు= ఆ నీతికోవిదులలో శ్రేష్ఠుడు; పని+చేయన్+ఉన్నవారిన్= పనిచేయటానికి మిగిలిన సేవకులతో; మీరు; కరితురంగ+ఆదికములన్= గుర్రాలు, ఏనుగులు

మొదలైనవాటిని; అరసికొనుఁడు= చూచికొనండి; కర్తవ్యము= చేయదగిన పని; ఇట్టిది= ఇది; వేయున్+ఏల?= అధికంగా చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** కృష్ణుడు అందరినీ ఓదార్చి 'అర్జునుడు ఇప్పుడే ఇక్కడికి వస్తున్నాడు. కురువంశశ్రేష్ఠుడైన ఆ అర్జునుడు మీ దుఃఖాలన్నిటినీ పోగొట్టుతాడు' అని ఓదార్పు మాటలలో వారిని తేర్చి, తండ్రి దగ్గర కూర్చొని నెమ్మదిగా కాళ్లు పట్టుతూ, అతిసుకుమారంగా చేయదగిన పనులనుగురించిన మాటలతో అతడి మనసులోని విభ్రమాన్ని పోగొట్టాడు. అర్జునుడి రాకను గురించి మాటిమాటికీ చెప్పాడు. ఆ నీతికోవిదుడికి తెలియని దేమున్నది? మిగిలిన సేవకులతో 'గుర్రాలను ఏనుగులను మీరే చూచుకోండి. ఇక అధికంగా చెప్పటం ఎందుకు?' అని కర్తవ్యబోధ చేశాడు.

**తే.** **అని తెగఁ బలికి యతని వీ। డ్కొని రామునికడకుఁ జని యకుంఠితభక్తిన్**
**వినతుం డయి 'మన జనకుని। యనుమతి వచ్చితి మహాత్మ!' యనియె నరేంద్రా!** **74**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; అని= ఈ విధంగా; తెగన్+పలికి= నిష్కర్షగా పలికి; అతనిన్ వీడ్కొని= తండ్రికి వీడ్కోలు చెప్పి; రాముని కడకున్+చని= బలరాముడి దగ్గరకు వెళ్ళి; అకుంఠిత భక్తిన్= మొక్కపోని గాఢమైన భక్తితో; వినతుండు+అయి= నమస్కరించి; మహాత్మ!= గొప్ప మనసున్నవాడా!; మన జనకుని= మనతండ్రిగారి; అనుమతిన్+వచ్చితిన్= అనుమతితో వచ్చాను; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** రాజా! ఈ విధంగా నిష్కర్షగా పలికి, తండ్రికి వీడ్కోలు చెప్పి, బలరాముడి దగ్గరకు వెళ్ళి, మొక్కపోని గాఢమైన భక్తితో నమస్కరించి 'మహాత్మా! మన తండ్రిగారి అనుమతితో వచ్చాను' అన్నాడు.

బలరాముఁడు శరీరంబు విడిచి యనంతునియందుఁ గలయుట (సం.16-5-11)

**సీ.** **తదనంతరంబ యద్దామోదరుఁడు రాము। వదనసరోజంబువలన వెడలఁ**
**గనియె మహాభుజంగము నరుణచ్ఛాయ। యై పొల్చు వక్త్రసహస్రకంబు**
**మణుల వెలింగెడు ఫణములుఁ దెలుపారి। పర్వతాభోగ నిభంబు నైన**
**మేని పెంపును గలదాని నట్లు బల। భద్రుండు నిజయోగబలముపేర్మిఁ**

**ఆ.** **దనదుతనువు విడిచి చనియె వియద్వీథి। నంబునిధికి నమ్మహాత్ము నెదురు**
**కొనియె వరుణుఁ డధిక వినయంబుతో నాగ। కులము లెల్ల వచ్చి కొలిచె భక్తి.** **75**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ఆ+దామోదరుఁడు= ఆ పద్మనాభుడు (కృష్ణుడు); రామువదన సరోజంబువలనన్= బలరాముడి ముఖపద్మం నుండి; మహాభుజంగము= పెద్ద సర్పము; అరుణచ్ఛాయయై= ఎర్రటికాంతిగలదై; పొల్చు= ప్రకాశించెడి; వక్త్రసహస్రకంబు= వేయినోళ్ళు; మణుల వెలింగెడు ఫణములున్= మణులతో ప్రకాశించే పడగలు; తెలుపారి= తెల్లనై; పర్వత= కొండయొక్క; ఆభోగ= వైశాల్యంతో; నిభంబున్+ఐన= సదృశమైన; మేని పెంపును= పెద్ద ఆకారాన్ని; కలదానిన్= కలదానిని; వెడలన్= బయలు పడటాన్ని; కనియెన్= చూశాడు; అట్లు= ఆ విధంగా; ఆ బలభద్రుండు; నిజయోగబలము పేర్మిన్= తన యోగబలాధిక్యం వలన; తనదు తనువు విడిచి= తన దేహాన్ని వదలిపెట్టి; వియత్+వీథిన్= ఆకాశమార్గంలో; అంబునిధికిన్= సముద్రానికి; చనియెన్= వెళ్ళాడు; ఆ+మహాత్మున్= ఆ మహాత్ముడైన బలరాముడిని; వరుణుఁడు= జలాధిపతియైన

వరుణుడు; ఎదురుకొనియెన్= ఎదుర్కొని స్వాగతం చెప్పాడు; అధిక వినయంబుతోన్= అధికమైన వినయంతో; నాగకులము లెల్లన్= నాగకులాలన్నీ; భక్తిన్= భక్తితో; కొలిచెన్= పూజించాయి.

**తాత్పర్యం:** ఆ తరువాత కృష్ణుడు బలరాముడి ముఖంనుండి ఒక పెద్దసర్పం బయలుపడటాన్ని గమనించాడు. ఆ మహాసర్పం ఎఱ్ఱటి కాంతితో ప్రకాశించే వేయినోళ్ళు కలిగినది. మణులతో ప్రకాశించే పడగలు కలిగినది. పర్వతవైశాల్యానికి సదృశంగా ఉన్న పెద్ద ఆకారం కలిగినది. ఆ విధంగా బలరాముడు తన యోగబలంవలన తన దేహాన్ని వదలిపెట్టి, ఆకాశమార్గంలో సముద్రంలోనికి ప్రవేశించాడు. ఆదిశేషస్వరూపుడైన ఆ బలరాముడికి వరుణుడు స్వాగతం చెప్పాడు. నాగవర్గంవారంతా వచ్చి అధికవినయంతో పూజలు చేశారు.

**విశేషం:** ఆదిశేషుడు త్రేతాయుగంలో లక్ష్మణుడుగా, ద్వాపరయుగంలో బలరాముడిగా అవతరించాడు.

**ఆ.** **అహికులాగ్రగణ్యుఁడైన వాసుకియుఁ గ। ర్కోటకుండుఁ దక్షకుండు వారు**
**ణుండుఁ గుంజరుండునుం గుముదుండును। దుర్ముఖుండునుం బృథుశ్రవుండు.** **76**

**ప్రతిపదార్థం:** అహికుల= పాములవంశంలో; అగ్రగణ్యుఁడు+ఐన= మొదట లెక్కింపదగినవాడయిన; వాసుకియున్= వాసుకీ; (ఇంకా) కర్కోటకుండు; తక్షకుండు; వారుణుండు; కుంజరుండు; కుముదుండు; దుర్ముఖుండు; పృథుశ్రవుండు.

**తాత్పర్యం:** పాములకులంలో మొదటగా లెక్కింపదగిన వాడైన వాసుకి కర్కోటకుడూ, తక్షకుడూ, వారుణుడూ, కుంజరుడూ, కుముదుడూ, దుర్ముఖుడు, పృథుశ్రవుడూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **ప్రోదుఁడును వక్రదంతుండుఁ గ్రోధనామ। కుండు శంఖుండుఁ బుండరీకుండు మిశ్రి**
**యును నజేయుండు ధృతరాష్ట్రుఁడును మొదలుగ। నరుగుదెంచిరి యద్దేవునర్థిఁ గొలువ.** **77**

**ప్రతిపదార్థం:** ప్రోదుఁడునున్; వక్రదంతుండున్; క్రోధనామకుండున్= క్రోధుడనే పేరున్నవాడు; శంఖుండున్; పుండరీకుండున్; మిశ్రియునున్= మిశ్రి అనే వాడున్నూ; అజేయుండున్; ధృతరాష్ట్రుఁడునున్; మొదలుగన్= మొదలైనవారు; ఆ+దేవున్= ఆ దేవుడిని; అర్థిన్= కోరి; కొలువన్= సేవించటానికి; అరుగుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** ప్రోదుడు, వక్రదంతుడు, క్రోధుడనే పేరుగలవాడు, శంఖుడు, పుండరీకుడు, మిశ్రి, అజేయుడు, ధృతరాష్ట్రుడు మొదలైన నాగులు కూడా బలదేవుడిని భక్తితో పూజించటానికి వచ్చారు.

**తే.** **పరమకౌతుకంబు భవ్యభక్తియు నొల। యంగ వచ్చి కొలిచె నా ఫణీంద్రు**
**గంగ యాది గాఁగఁ గల మహానదులు స। ముజ్జ్వలాభిరామమూర్తు లొంది.** **78**

**ప్రతిపదార్థం:** పరమ= మిక్కిలి; కౌతుకంబు= ఆసక్తి; భవ్య= యోగ్యమైన; భక్తియున్= భక్తీ; ఒలయంగన్= ఒప్పగా; ఆ ఫణి+ఇంద్రున్= ఆ ఆదిశేషుడిని; గంగ+ఆది+కాఁగన్+కల= గంగ మొదలుగా ఉన్న; మహానదులు= పెద్దనదులన్నీ; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశిస్తున్న; అభిరామ= అందమైన; మూర్తులు+ఒంది= ఆకారాలు ధరించి; వచ్చి కొలిచెన్= వచ్చి పూజించాయి.

**తాత్పర్యం:** చాలా ఆసక్తితో, యోగ్యమైన భక్తితో ఆ ఆదిశేషుడిని, గంగ మొదలుగా ఉన్న పెద్ద నదులన్నీ మిక్కిలి ప్రకాశిస్తున్న అందమైన ఆకారాలు ధరించి వచ్చి పూజించాయి.

**క. అంతయును దివ్యదృష్టి। క్రాంతి యగు మురాంతకుండు గనుఁగొన నమ్మూ**
**ర్త్యంతరము గలపికొనియె న। నంతుఁడు దన పరమమూర్తి యందు నరేంద్రా! 79**

**ప్రతిపదార్థం:** అంతయునున్= అన్నిటినీ; దివ్యదృష్టి క్రాంతిఅగు= దివ్యదృష్టితో ఆక్రమించగల; ముర+అంతకుండు= మురారి (కృష్ణుడు); కనుఁగొనన్= చూస్తుండగా; అనంతుఁడు= పరబ్రహ్మస్వరూపుడైన శ్రీ మహావిష్ణువు; ఆ+మూర్తి+అంతరమున్= తనమూర్తి భేదమయిన ఆ ఆదిశేషుడిని; తన= తనదైన; పరమమూర్తియందున్= శ్రేష్ఠమైన మహారూపంలో; కలపికొనియెన్= కలుపుకొన్నాడు; నరేంద్రా!= రాజా! విన్నావా!

**తాత్పర్యం:** జనమేజయా? అన్నిటినీ ఆక్రమించగల (దర్శించగల) కృష్ణుడు చూస్తుండగనే అనంతుడు (ఆదిశేషుడు) తన మూర్తి భేదాన్ని (బలరామున్ని) తన శ్రేష్ఠమైన మహారూపంలో కలుపుకొన్నాడు.

**సీ. అ ట్లగ్రజుఁడు చన్న నచ్చటువాసి యం। తంతఁ గ్రుమ్మరుచు మురారి సకల**
**లోకపాలనకు భూలోకంబునందుఁ దాఁ। బుట్టంగ వలసిన యట్టి మేటి**
**పనులెల్లఁ దీఱుట మనమునఁ దలపోసి,। తనువిముక్తికి నిమిత్తంబుఁ దలఁచి,**
**మునులవాక్యము తెఱంగును దొల్లి దుర్వాసు। నవయవసమితిఁ బాయసము పూయు**

**తే. నప్పు డఱకాలఁ బూయమి నత్తపస్వి। యచట నవిలంఘ్యమై యపాయంబు గలుగు**
**ననిన మాటయుఁ జర్చించి, మనసు నింద్రి। యములు నడఁగించి గాఢసమాధి నొంది. 80**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; అగ్రజుఁడు= అన్న; చన్నన్= వెళ్ళిపోగా; అచ్చటు= ఆ చోటు; పాసి= వదలి; అంతంతన్= అక్కడక్కడా; క్రుమ్మరుచున్= తిరుగుతూ; మురారి= కృష్ణుడు; సకలలోకపాలనకున్= సకలలోకాలను పాలించటానికి; భూలోకంబునందున్= భూలోకంలో; తాన్+పుట్టంగ వలసిన అట్టి= తాను జన్మించవలసినట్టి; మేటి పనులు= గొప్పపనులు; ఎల్లన్= అన్నీ; తీఱుటన్= పూర్తికావటం; మనమునన్+తలపోసి= మనసులో ఆలోచించి; తను విముక్తికిన్= దేహం వదలిపెట్టటానికి; నిమిత్తంబున్+తలఁచి= కారణాన్ని ఆలోచించి; మునుల వాక్యంబు తెఱఁగునున్= మునులిచ్చిన శాపవాక్యాలు; తొల్లి= మునుపు; దుర్వాసున్+అవయవసమితిన్= దుర్వాసో మహాముని అవయవ సమూహానికి (దేహానికి); పాయసము పూయు+అప్పుడు= పాయసం పూస్తున్నప్పుడు; అఱకాలన్+పూయమిన్= అరకాలులో పూయకపోవటం చేత; ఆ+తపస్వి= ఆ ఋషి; అచటన్= ఆ అరకాలిలోనే; అపాయంబు= కీడు; అవిలంఘ్యము+ఐ= దాటటానికి వీలులేకుండా (తప్పకుండా); కలుగున్= కలుగుతుంది; అనిన మాటయున్= అన్న మాటను; చర్చించి= విచారించుకొని; మనసున్+ఇంద్రియములున్= మనసును, ఇంద్రియాలను; అడఁగించి= అణచి; గాఢ సమాధిన్+ఒంది= గాఢ సమాధిని పొంది.

**తాత్పర్యం:** అట్లా బలరాముడు అవతారం చాలించి వెళ్ళిపోగా, శ్రీకృష్ణుడు ఆ చోటు వదలిపెట్టి అక్కడక్కడా తిరిగాడు. లోకస్థితిపాలనకోసం తాను భూలోకంలో ఏ విశిష్టకార్యాలు చేయటంకొరకు పుట్టాడో అవి పూర్తికావటం మనసులో ఆలోచించాడు. తాను దేహాన్ని వదలిపెట్టటానికి ఒక హేతువును ఆలోచించుకొన్నాడు. మునులు ఇచ్చిన శాపవాక్యం గుర్తుకు వచ్చింది. ఒకప్పుడు దుర్వాసుని కోరికపై అతడి దేహమంతటా పాయసాన్ని కృష్ణుడు పూశాడు. కాని, అరకాలిలో మాత్రం పాయసం పూయటం మరచిపోయాడు. ఫలితంగా ఆ ఋషి 'ఆ అరకాలిలోనే నీకు ప్రాణాపాయం జరుగుతుందని, అది తప్ప' దని చెప్పిన విషయమూ గుర్తుకు వచ్చింది. దీనితో ప్రాణత్యాగం ఎట్లా చేయవచ్చునో

స్ఫురించింది. మనసును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను అణచిపెట్టి, గాఢమైన సమాధిని పొంది (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జలనిధిశయనుండు మహీ । స్థలశయనుం డయ్యెఁ; నట్టి సమయమునం దా**
**నలుకుచుఁ దత్కాంతార । స్థలి కల్లన నరుగుదెంచె జర కురుముఖ్యా! 81**

**ప్రతిపదార్థం:** కురుముఖ్యా!= కురుశ్రేష్ఠా (వినుము)! అప్పుడు; జలనిధి శయనుండు= సాగరంలో నిద్రించే విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణుడు; మహీతలశయనుండు+అయ్యెన్= నేలమీద పడుకున్నవాడయ్యాడు; అట్టి సమయమునన్= ఆ సమయంలో; తద్+కాంతార+స్థలిన్= ఆ అడవిలో; తాన్= తాను; అలుకుచున్= నేలను కాలితో రాస్తూ; జర= ముసలితన మనెడి దేవత; అల్లనన్= నెమ్మదిగా; అరుగుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** క్షీరసాగరంలో శయనించే విష్ణువు - అంటే కృష్ణుడు - నేలమీద పడుకొన్నాడు. ఆ సమయంలో 'జర' నేలను కాలితో రాస్తూ నెమ్మదిగా ఆ అడవిలో ప్రవేశించింది.

**విశేషం:** జరామరణాలు ఒకదానిని వదలి మరి ఒకటి ఉండవు. అందుకే సహజమరణానికి ముందు ఎవరిలోనైనా ముసలితనపు లక్షణాలు వస్తాయి. జర - ముసలితనానికి అధిష్ఠానదేవత; 'కాలకన్య' అని కూడా అంటారు. ఆమె ప్రవేశించిన తరువాతే మరణం ఆసన్న మవుతుంది. కాల మాసన్న మయిందని సూచించేది 'జర'

**ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగెడు నొక వేఁట । కానిఁ గాంచి వాఁడు కమలనాభు**
**నొడలు చూచి టెంకి నున్న యేణం బను । నట్లు సేసి మాయ యావహించె. 82**

**ప్రతిపదార్థం:** అరుగుదెంచి= 'అది' అట్లా వచ్చి; అచటన్= ఆ అడవిలో; తిరిగెడు= తిరుగుతున్న; ఒక వేఁటకానిన్+కాంచి= ఒక వేటగాడిని చూచి; వాఁడు= ఆ వేటగాడు; కమలనాభు(న్)+ఒడలు= పద్మనాభుడి (కృష్ణుడి) దేహం; చూచి= చూడగా; టెంకిన్= సమీపంలో ఉన్న; ఏణంబు+అనునట్లు+చేసి= జింక అని అనుకొనేటట్లు చేసి; మాయ= భ్రాంతి; ఆవహించెన్= కలుగచేసింది.

**తాత్పర్యం:** 'జర' అట్లా వచ్చి అడవిలో తిరుగుతున్న ఒక వేటగాడిని చూచి, అతడు కృష్ణుడి దేహాన్ని చూచి సమీపంలో ఉన్న జింక అని అనుకొనేటట్లు భ్రాంతిని ఆవహింపజేసింది.

**మ. ధరణీనాథ! యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యు**
**ద్ధురభంగిం దెగ నిండఁగాఁ దిగిచి యత్యుగ్రంబుగా నేసె; నా**
**హరి శ్రీపాదతలంబుఁ దూరఁగొని యయ్యస్త్రంబు మీఁగాల ని**
**ష్ఠుర వేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గైకొంటకున్. 83**

**ప్రతిపదార్థం:** ధరణీనాథ!= రాజా!; అతండు= ఆ వేటగాడు; శాతశరము= వాడియైన బాణం; ఉద్యత్+వృత్తిన్= పూనికతో; సంధించి= ఎక్కుపెట్టి; ఉద్ధుర= దృఢమైన; భంగిన్= రీతిలో; తెగన్= నారిని; నిండఁగాన్= నిండుగా; తిగిచి= లాగి; అతి+ఉగ్రంబుగాన్= మిక్కిలి భయంకరంగా; ఏసెన్= ప్రయోగించాడు; ఆ+అస్త్రంబు= ఆ బాణం; ఆ హరి= ఆ కృష్ణుడి; శ్రీపాదతలంబున్= గొప్పదైన పాదం అడుగుభాగంలో; తూరఁగొని= దూరి; మీఁగాలన్= పాదోపరిభాగంలో; నిష్ఠురవేగంబునన్=

అతిశీఘ్రంగా; ఉచ్చిపోయెన్= బయటికి పొడుచుకు వచ్చింది; వెసన్= వెంటనే; వాఁడున్= ఆ వేటగాడు; కై కొంటకున్= (ఆ జింకను) తీసికొనివెళ్ళటానికి; చేరెన్= అక్కడికి వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ వేటగాడు పూనికతో విల్లు ఎక్కుపెట్టి, దృఢమైన రీతిలో నారి సంధించి, నిండుగా లాగి, మిక్కిలి భయంకరంగా వదిలాడు. ఆ బాణం కృష్ణుడిపాదం అడుగుభాగంలో దూరి పాదోపరిభాగంలో అతి శీఘ్రంగా బయటికి పొడుచుకుని వచ్చింది. వెంటనే ఆ వేటగాడు (ఆ జింకను) తీసికొనివెళ్ళటానికి అక్కడికి వచ్చాడు.

**విశేషం:** కర్మఫలితాన్ని కృష్ణుడు కూడా తప్పించుకొనలేదు. బలరాముడు యోగమార్గంలో తనువును వదలిపెట్టాడు. కృష్ణుడు కూడా సమాధిలో ఉన్నాడు. కాని తనువును వదలటానికి ఋషిశాపం - దుర్వాసుడి వాక్యం ఒక మిషను చూపించింది. ఆ మిషే ఇట్లా వేటగాడు జింక అనుకొని బాణం వదలటం. పాదం అడుగున దూరి మీగాలుపైన పొడుచుకు రావటం - వేటగాడి ధనుర్విద్యా నైపుణ్యాన్ని సూచిస్తుంది.

**క. చేరి తెలియఁ గనుఁగొని పెం। పారు పురుషుఁ డగు టెఱింగి యత్యంతార్తిం**
**గూరి వడఁకి తచ్చరణాం। భోరుహములఁ దన శిరంబు వొందం బడియెన్. 84**

**ప్రతిపదార్థం:** చేరి= కృష్ణుడిని సమీపించి; తెలియన్+కనుఁగొని= బాగా పరికించి చూచి; పెంపు+ఆరు= బాగా గొప్పవాడైన; పురుషుఁడు+అగుట+ఎఱింగి= పురుషుడు కావటం గుర్తించి; అతి+అంత+ఆర్తిన్= చాలా ఆర్తిని; కూరి= పొంది; వడఁకి= గడగడలాడి; తద్+చరణ+అంభోరుహములన్= అతడి పాదపద్మాలవద్ద; తన శిరంబు+పొందన్= తన శిరస్సు తాకునట్లు; పడియెన్= క్రిందపడ్డాడు.

**తాత్పర్యం:** ఆ వేటగాడు కృష్ణుడిని సమీపించి, బాగా చూచి, ఎవరో మహాపురుషుడని గుర్తించి, చాలా ఆర్తినిపొంది, గడగడలాడి అతడి పాదపద్మాలవద్ద తన శిరస్సును పెట్టి క్రిందపడ్డాడు.

**తే. పడి యేడ్చినఁ గృష్ణుఁడు తగు। నొడువుల నూరార్చి తన మనోరథ మిమ్మై**
**నొడఁగూడిన మానుషమగు। నొడలు విడిచి నిజపదంబు నొందుట కరిగెన్. 85**

**ప్రతిపదార్థం:** పడి= క్రిందపడి; ఏడ్చినన్= ఏడవగా; కృష్ణుఁడు; తగు నొడువులన్= వాడికి ఉచితమైన పలుకులతో; ఊరార్చి= ఓదార్పు కలుగజేసి; తన మనోరథము= తన కోరిక; ఈ+మైన్= ఈ విధంగా; ఒడఁగూడినన్= సిద్ధించగా; మానుషము+అగు= మానవీయమైన; ఒడలు విడిచి= దేహాన్ని విడిచి; నిజపదంబున్+ఒందుటకున్= తన స్థానాన్ని పొందటానికి; అరిగెన్= వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** అట్లా వేటగాడు కిందపడి ఏడవగా కృష్ణుడు వాడికి ఉచితమైన పలుకులతో ఓదార్పు కలుగజేసి, తన కోరిక ఈ విధంగా తీరగా, మానవీయమైన దేహాన్ని విడిచి తన స్థానాన్ని పొందటానికి వెళ్ళిపోయాడు.

శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట (సం.16-5-22)

**సీ. ఊర్ధ్వలోకమునకు నూర్జిత తేజస్కుఁ। డగు కృష్ణుఁ డరిగిన నచటి దివ్య**
**మునివరులును సిద్ధులును రుద్రవసుమరు। దాదిత్య విశ్వముఖామరులును**
**సంక్రందనుండును సంభృతసంభ్రము। లగుచు భక్తియు వినయంబు నెఱయఁ**
**గా నెదుర్కొని చరణానతులై పర। మస్తుతి వాక్యముల్ విస్తరిల్ల**

**ఆ. బలసి; రందు దేవపతి యల్లఁ జేరి క। రములు మొగిచి 'ధర్మరక్షణమున**
**కై దయావిధేయమగు ఖేలనంబున। నవని నవతరించి తాది పురుష! 86**

**ప్రతిపదార్థం:** (ఆ విధంగా); ఊర్ధ్వలోకమునకున్= స్వర్గలోకానికి; ఊర్జితతేజస్కుఁడు+అగు= పెంపొందిన తేజస్సు కలవాడైన; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; అరిగినన్= వెళ్ళగా; అచటి= స్వర్గంలో ఉన్న; దివ్యమునివరులునున్= దివ్యులైన మునిశ్రేష్ఠులు; సిద్ధులునున్= సిద్ధులు; రుద్ర= రుద్రులు; వసు= వసువులును; మరుత్= మరుత్తులు; ఆదిత్య= ఆదిత్యులు; విశ్వముఖ+అమరులును= విశ్వముఖులు మొదలైన దేవతలు; సంక్రందనుండునున్= ఇంద్రుడు; సంభృత= పొందిన; సంభ్రములు+అగుచున్= వేగిరపాటు కలవారై; భక్తియున్= భక్తీ; వినయంబున్= వినయమూ; నెఱయఁగాన్= ప్రకటితాలు కాగా; ఎదుర్కొని= ఎదురువచ్చి; చరణ+ఆనతులు+ఐ= కాళ్ళకు మ్రొక్కినవారై; పరమ= శ్రేష్ఠమైన; స్తుతివాక్యముల్= ప్రశంసావాక్యాలు; విస్తరిల్లన్= వ్యాపించగా; బలసిరి= చుట్టుముట్టారు; అందున్= వారిలో; దేవపతి= దేవేంద్రుడు; అల్లన్= నెమ్మదిగా; చేరి= కృష్ణుడిని సమీపించి; కరములు మొగిచి= చేతులు జోడించి; (ఇట్లా అన్నాడు); ఆదిపురుష!= ఓ ఆదిపురుషుడా!; ధర్మరక్షణమునకై= ధర్మాన్ని రక్షించటానికై; దయావిధేయము+అగు= దయకు లొంగిన; ఖేలనమునన్= ఆటలో; అవనిన్= భూమిలో; అవతరించితి(తి)= అవతరించావు.

**తాత్పర్యం:** ఆ విధంగా స్వర్గలోకానికి పెంపొందిన తేజస్సు గలవాడైన కృష్ణుడు వెళ్ళగా స్వర్గంలో ఉన్న దివ్యులైన మునిశ్రేష్ఠులు, సిద్ధులు, రుద్రులు, వసువులు, మరుత్తులు, విశ్వముఖాది దేవతలు, దేవేంద్రుడు వేగిరపాటు చెంది ఎదురు వచ్చారు. కాళ్ళకు మొక్కారు. శ్రేష్ఠమైన స్తుతివాక్యాలు పలుకుతూ అందరూ కృష్ణుడి చుట్టూ చేరారు. వారిలో దేవేంద్రుడు నెమ్మదిగా శ్రీకృష్ణుడిని సమీపించి చేతులు జోడించి ఇట్లా అన్నాడు: 'ఆదిపురుషా! ధర్మాన్ని రక్షించటానికై దయాగుణంతో నీ వాడుతున్న ఆటలో భాగంగా భూమిలో పుట్టావు'.

**విశేషం:** 1. యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషాదులతోపాటు ఖేచరులుగా సిద్ధులను కూడా చెప్పుతారు. వీరు దేవతాగణం క్రింద వస్తారు. వీరితోపాటే అష్టవసువులు, సప్తమరుత్తులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు చెప్పబడ్డారు. శ్రీకృష్ణుడి విశ్వరూపసందర్శనంలో ఇంకా చాలామంది దేవయోనులు చెప్పబడ్డారు. వీరికి అధిపతి కాబట్టి దేవేంద్రు డని అంటారు.

2. విష్ణువు ధర్మాన్ని రక్షించటం కోసమే ప్రతియుగంలోనూ అవతరిస్తాడని పురాణాలు చెప్పుతున్నాయి. భగవద్గీతలో కూడా

**"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్."**

అని స్వామి స్వయంగా చెప్పాడు. ఆయనకు అవతరించటం ఒక లీల. ఆ లీలకు మూలం స్వామికి ఉన్న దయాగుణం. అపారకృపానిధి కాబట్టి భక్తుల మొరలు విని వారిని రక్షించటానికై అవతరిస్తాడు. ఇది భాగవతులు స్వామి అవతారాన్ని గుర్తించిన విధానం. అందుకే లీలావతారాలని కూడా అంటారు.

3, సర్వసమర్థుడైన స్వామికి దుష్టశిక్షణ, సాధుసంరక్షణ కష్టమైన పనులు కావు. ఒక ఆట ఆడినంత సులభం. అందుకే 'ఖేలనం' అనటం.

**ఆ. అవతరించి కంసుఁ డాదిగాఁ గల దేవ। శత్రుకోటి నెల్ల సమయఁ జేసి**
**భరతకులము కసటు వాపి సంశుద్ధప్ర। తిష్ఠఁ గూర్చి యరుగుదెంచి తీశ! 87**

**ప్రతిపదార్థం:** ఈశ!= ఓ ప్రభూ!; (అట్లా) అవతరించి= అవతారమెత్తి; కంసుఁడు+ఆదిగాన్+కల= కంసుడు మొదలైన; దేవశత్రుకోటిన్+ఎల్లన్= దేవతలకు శత్రువైన వారినందరినీ; సమయన్+చేసి= నశించేటట్లు చేసి (చంపేటట్లు చేసి); భరతకులము= భరతవంశానికి పట్టిన; కసటు= అపరిశుభ్రతను; పాపి= పోగొట్టి; సంశుద్ధ= పరిశుభ్రమైన; ప్రతిష్ఠన్+కూర్చి= గౌరవం ఏర్పరచి; అరుగుదెంచితి(వి)= ఇట్లా వచ్చావు.

**తాత్పర్యం:** అట్లా అవతారమెత్తి, కంసుడు మొదలైన దేవతాశత్రుసమూహాన్ని అంతటినీ నశింపజేసి, భరతవంశానికి పట్టిన అపరిశుభ్రతను పోగొట్టి, పరిశుభ్రతను మరలా ఏర్పరచి ఇట్లా వచ్చావు.

**విశేషం:** ఇక్కడ 'అపరిశుభ్రత' అంటే అధర్మమనే అర్థం. ధర్మానికి కలిగే గ్లాని పేరే అపరిశుభ్రత. అది అజ్ఞానకారకమవుతుంది. ఫలితంగా సాధుసత్పురుషులకు పీడ కలుగుతుంది. దానిని నివారించటానికే స్వామి అవతరిస్తాడు.

> **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,**
> **ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే".**

అని గీతలో స్వామి ఈ అవతారరహస్యాన్నే చెప్పాడు. ఇక్కడ 'భరత' కులము అనేమాట కేవలం పాండవకౌరవుల కథను మాత్రమే కాకుండా మొత్తం భారతదేశాన్ని స్పృశిస్తోంది. అందుకే కంసుడి ప్రసక్తి కూడా సార్థకం అవుతోంది.

**క.** **అమృతం బజరం బవ్యయ । మమలం బవితర్క్య మచల మాగమగమ్యం**
**బు మహాత్మ! భవత్పద మ । య్యమేయ తత్త్వంబుఁ బొందు మనిరూప్యగతిన్.** **88**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= ఓ మహాత్మా!; భవత్+పదము= నీ స్థానం; అమృతంబు= అమృతమైనది; అజరంబు= ముసలితనంలేనిది; అవ్యయము= తరగిపోనిది; అమలంబు= పరిశుద్ధమైనది; అవితర్క్యము= తర్కించటానికి వీలులేనది; అచలము= చలించనిది; ఆగమగమ్యంబు= వేదాల చేత తెలిసికొనదగినది; (అట్లాంటి) అమేయ తత్త్వంబున్= కొలవటానికి వీలులేని మహాతత్త్వాన్ని; అనిరూప్యగతిన్= నిరూపించటానికి వీలులేని విధంగా; పొందుము.

**తాత్పర్యం:** మహాత్మా! నీ స్థానం అమృతమైనది. దానికి ముసలితనం లేదు. అది ఎన్నటికీ తరగిపోదు. అది ఎప్పుడూ పరిశుద్ధమే. దాని స్వభావం తర్కంతో నిరూపించటానికి వీలులేదు. దానికెప్పుడూ చలనం లేదు.వేదాలు ఆ స్థానాన్ని గురించే చెప్తుతాయి. దానిని కొలవటానికి ఏ శాస్త్రప్రమాణాలూ లేవు. అట్లాంటి పరమపదాన్ని నిరూపించటానికి వీలులేని విధంగా నీవే పొందుము.

**విశేషం:** ఈ పద్యంలో ఆ పరమపదాన్ని అమృతము, అజరము ఇట్లా 'న' కారరూపాలలో సూచించారు. న+మృతము= ఇట్లా; నకారం తీసివేస్తే ఉన్నదంతా లోకం. మృతమయ్యేది. ముసలితనం పొందేది ఇట్లాగా. ఆ అతిలోకమైన తత్త్వాన్నే పరమపదమన్నారు. ఆ స్థానం ఎక్కడుంది? ఎట్లా ఉంటుంది? అన్న ప్రశ్నల ద్వారా సమాధానాన్ని పొందలేం. ఋషుల అనుభవమే దీనికి ప్రమాణం. దానిని స్వామి స్వయంగా పొందాలి. దానినుండి స్వామే స్వయంగా తాను ప్రభవించాలి. 'అందుకే ఆ తత్త్వాన్ని నీవే పొందుము' అన్నాడు ఇంద్రుడు. దీనికి నిరూపణం ఏమిటి? నిరూపణకు అసాధ్యమైన విషయ మనటం కోసమే 'అనిరూప్యగతి' అంటున్నారు. అందుకే శేషాంశను అనంతుడు కలుపుకొన్నాడు. ఆ అనంతాంశ అంశమాత్రంగా ఉన్న మహాతత్త్వం 'అమృత' స్థానమయిన పరమపదం. అందుకే స్వామి దానిని స్వయంగా పొందాలి. దానినే అక్షరపరబ్రహ్మమని గీత స్థాపించింది. అవతారరహస్యం ఎన్నటికీ ఏ శాస్త్రనిరూపణకూ లొంగే విషయం కాదని ఈ పద్యం ద్వారా మనం గుర్తించగలం. ఈ ఒక్క అంశలోనే జీవుడికన్నా దేవుడు ఎప్పుడూ ఒక మెట్టుపైనే ఉంటాడు. అదే భగవంతుడిలోని 'విశిష్ట' లక్షణం.

క. కృప నిట్ల యవతరింపుము। ప్రపన్నులగువారి యార్తిఁ బాపుటకై య
జ్ఞపురుష! యుగయుగమున న। తృపరిమిత గుణాఢ్యరూప మభినుతి నొందన్.' **89**

**ప్రతిపదార్థం:** యజ్ఞపురుష!= యజ్ఞరూపుడవైన పురుషోత్తముడా!; అతి+అపరిమిత= మిక్కిలిగా అపరిమితమైన; గుణ= గుణాలచేత; ఆఢ్య= సంపన్నమైన; రూపము= నీ అవతారము; అభినుతిన్+ఒందన్= ప్రశంసను పొందగా; కృపన్= కృపతో; ప్రపన్నుల= శరణు గోరివచ్చిన వారి; ఆర్తిన్= దుఃఖమును; పాపుటకై= పోగొట్టటానికై; యుగయుగమునన్= ప్రతియుగంలోనూ; ఇట్లు+అ= ఇదే విధంగా; అవతరింపుము= అవతరింతువుగాక!

**తాత్పర్యం:** యజ్ఞరూపుడవైన పురుషోత్తమా! అపరిమితమైన గుణాలచేత సంపన్నమైన నీ అవతారం ప్రశంసాపాత్రం కాగా, దయతో శరణుగోరినవారి దుఃఖాన్ని పోగొట్టటానికై ప్రతియుగంలోనూ ఇట్లాగే అవతరింతువుగాక!'

**విశేషం:** 1.విష్ణువు తాల్చిన ప్రతి అవతారానికి సాక్షి ఇంద్రుడు. అందుకే అవతారరహస్యాన్ని ఇంత విస్తృత పరిధిలో వర్ణిస్తున్నాడు. 2. యజ్ఞ పురుష - అన్నమాట పురుషసూక్తాన్ని తాకే మాట. ఈ రెండు యజ్ఞాలకు అధిష్ఠానపురుషుడు ఆ 'సహస్రాక్షుడు సహస్రపాదుడు' అయిన మహాపురుషుడు. అందుకే పురుషోత్తముడని కూడా అన్నారు. 3. భారత కథాపరంగా పాపపుణ్యాజీవులిరువురూ 'హుతు' లయ్యారు. కాలాగ్నిలో పడి అందరూ శలభాలవలె (మిడుతలవలె) మాడిపోయారు. ఇంత మహాయజ్ఞానికి అధిష్ఠానదేవత శ్రీకృష్ణుడే. అందుకే భారతాన్ని 'వాసుదేవ చరిత్ర' మని కూడా అన్నారు. కనుక యజ్ఞపురుషుడు. ఇట్లా పాపపుణ్యాకర్మల కతీతమైన సాక్షీభూతుడు కాబట్టి రామకృష్ణాదులను 'అవతారా' లని అంటాము. 4.'ప్రపన్న' లనే మాట చాలా ప్రధానమైనది. 'ప్రపత్తి' యోగాన్ని పరమశ్రేష్ఠయోగంగా నిరూపించిన ఘనత విశిష్టాద్వైతులదే. కాని ఇంద్రాదులందరూ విష్ణువు శరణుపొంది తమ ఆర్తిని పోగొట్టుకొన్నవారే. ఈ కథలకాధారంగానే 'భాగవతుల' సంప్రదాయం ఏర్పడింది. అవతారలీల ఎప్పుడూ ఆర్తులను కాపాడటం కోసమేనని అర్థం. అందుకే భారతకథలో శ్రీకృష్ణుడు పాండవపక్షంలోనే ఉన్నాడు.

క. అని నిభృతిఁ బలుక నా సువ। చనముల నత్యాదరం బెసఁగ వినిన ముకుం
దునిపైఁ బెల్లు గురిసె న। య్యనిమిషపతి పుష్పవర్ష మతులితభక్తిన్. **90**

**ప్రతిపదార్థం:** అని; నిభృతిన్= వినయంతో; పలుకన్= పలుకగా; ఆ సువచనములన్= ఆ మంచిమాటలను; అతి+ఆదరంబు+ఎసఁగన్= మిక్కిలి ఆదరం పుట్టగా; వినిన= విన్న; ముకుందునిపైన్= కృష్ణుడిపై; ఆ+అనిమిషపతి= ఆ ఇంద్రుడు; అతులిత= సాటిలేని; భక్తిన్= భక్తితో; పెల్లు= మిక్కుటంగా; పుష్పవర్షము= పూలవాన; కురిసెన్= కురిపించాడు.

**తాత్పర్యం:** ఇట్లా వినయంతో అన్న ఆ మంచి మాటలను మిక్కిలి ఆదరంతో శ్రీకృష్ణుడు విన్నాడు. అప్పుడు ఆ కృష్ణుడిపై ఇంద్రుడు సాటిలేని భక్తితో మిక్కుటంగా పూలవాన కురిపించాడు.

ఉ. అప్పుడు బ్రహ్మ వచ్చి హరియంఘ్రులకుం బ్రణమిల్లి భక్తిమైఁ
దప్పక చూచుచున్ మది ముదంబునఁ దేల సలక్షణస్వరం
బొప్పి చెలంగ నాగమిక సూక్తులఁ బ్రస్తుతి సేసెఁ బ్రీతుఁడై
యప్పురుషోత్తముండు కరుణార్ద్ర నిరీక్షణమున్ నిగుడ్పఁగన్. **91**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; వచ్చి= కృష్ణుడిని సమీపించి; హరి+అంఘ్రులకున్= హరి పాదాలకు; ప్రణమిల్లి= నమస్కరించి; భక్తిమైన్= భక్తితో; తప్పక+చూచుచున్= కన్నార్పకుండా చూస్తూ; మది= మనస్సు; ముదంబునన్= సంతోషంతో; తేలన్= తేలియాడగా; సలక్షణ= శాస్త్రవిహితమైన; స్వరంబు+ఒప్పి= ఉదాత్త, అనుదాత్త స్వరిత స్వరాలతో కూడి; చెలంగన్= అతిశయించగా; ఆ+పురుషోత్తముండు= ఆ పురుషోత్తముడైన కృష్ణుడు; ప్రీతుఁడు+ఐ= సంతసించినవాడై; కరుణ+ఆర్ద్ర= కరుణచే తడిసిన; నిరీక్షణమున్= చూపును; నిగుడ్పఁగన్= ప్రసరింపజేయగా; ఆగమిక సూక్తులన్= వేదమంత్రాలతో; ప్రస్తుతి+చేసెన్= ప్రస్తుతించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో బ్రహ్మదేవుడు వచ్చి కృష్ణుడి పాదాలకు నమస్కరించి, భక్తితో కన్నార్పకుండా చూస్తూ మనస్సు సంతోషంతో తేలియాడగా ఆ పురుషోత్తముడు సంతసించి కరుణతో తడిసిన తన చూపును ప్రసరింపజేయగా శాస్త్రవిహితమైన స్వరాలతో కూడిన వేదమంత్రాలతో శ్రీమహావిష్ణువును ప్రస్తుతించాడు.

**విశేషం:** వేదజ్ఞానానికి బ్రహ్మదేవుడు సంకేతం. అందుకే బ్రహ్మచేతిలో వేద సముచ్చయం ఉన్నట్టుగా మనకు చిత్రాలు కనిపిస్తాయి. వేదాలలో స్తుతిపరమైన మంత్రాలకు 'సూక్తా' లని పేరు. శ్రీసూక్త, పురుషసూక్త ఇత్యాదులు. 'స్వర' భేదం తెలిసే వేదమంత్రాలు చదవాలి. ఈ శాస్త్రరహస్యాలన్నీ ఈ పద్యంలో ఉన్నాయి.

**సీ. అప్పరమేశ్వరుం డయ్యందఱను జూచి । 'యనిరుద్ధ నామకంబైన యదియుఁ**
**బ్రద్యుమ్నతాప్రతిభాసమానమును సం । కర్షణభావ వికాసితంబు**
**వాసుదేవాత్మక వరరూపమున నేక । తా విభవత్సమాధానసిద్ధి**
**నొందించుకొంటి నానందబోధ నిరం జ । నామేయ మత్పదప్రాప్తి పరమ**

**ఆ. మంగళానుభూతి నంగీకరించెద । సుఖుల రగుఁడు మీరు సుకృతులార!'**
**యనిన వచనసమితి యతిమృదుమధురత । నింపు నొసఁగ నలరి రెల్లవారు. 92**

**ప్రతిపదార్థం:** ఆ+పరమేశ్వరుండు= శ్రీమన్నారాయణుడు; ఆ+అందఱనున్+చూచి= ఆ దేవతలందరినీ చూచి; అనిరుద్ధ నామకంబు+ఐన+అదియున్= అనిరుద్ధమనే పేరు కలిగిందీ; ప్రద్యుమ్నతా ప్రతిభాసమును= ప్రద్యుమ్నత్వమనే కాంతినీ; సంకర్షణ భావ వికాసితంబున్= సంకర్షణ మనే భావంచేత ప్రకాశించేదీ; వాసుదేవ+ఆత్మక= వాసుదేవుడనే పేరిట; వరరూపమునన్= అతిశ్రేష్ఠరూపంతో; ఏకతా= అద్వితీయంగా; విభవత్= పుట్టుతున్న; సమాధాన= సమాధియొక్క; సిద్ధిన్= సిద్ధిచేత; ఆనంద= ఆనందరూపమైన; బోధ= జ్ఞానంతోడి; నిరంజన= ఏ దోషమూ లేని (పరిశుద్ధమైన); అమేయ= కొలవటానికి వీలులేని; మత్= నాదైన; పదప్రాప్తిన్= స్థానం పొందటాన్ని; ఒందించుకొంటిన్= కల్గించుకొన్నాను; పరమ మంగళానుభూతిన్= సర్వశుభంకరమైన ఈ అనుభూతిని; అంగీకరించెదన్= స్వీకరిస్తున్నాను; సుకృతులార!= పుణ్యాత్ములారా!; మీరు= మీరందరూ; సుఖులరు+ అగుఁడు= సుఖంగా ఉండండి; అనిన వచనసమితి= అన్న శ్రీకృష్ణుడి వాక్యసమూహం; అతి మృదుమధురతన్= మిక్కిలి మృదు మధురంగా; ఇంపున్+ఒసఁగన్= తృప్తిని కలిగించగా; ఎల్లవారున్= దేవతలంతా; అలరిరి= సంతోషించారు.

**తాత్పర్యం:** శ్రీమన్నారాయణుడు దేవతలందరినీ చూచి ఇట్లా అన్నాడు: 'పుణ్యాత్ములారా! నేను అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవాత్మకమైన వ్యూహచతుష్టయంచేత అతిశ్రేష్ఠరూపంలో ఏకైకంగా పుట్టుతున్న సమాధిసిద్ధివలన ఆనందరూపమైన జ్ఞానంతో పరిశుద్ధమైనదీ, కొలవటానికి వీలులేనట్టిదీ అయిన నా స్థానప్రాప్తిని నేనే కల్గించుకొన్నాను. సర్వమంగళకరమైన ఈ అనుభూతిని స్వీకరిస్తున్నాను. మీరందరూ సుఖంగా ఉండండి.' ఇట్లా అన్న శ్రీనారాయణుడి మృదుమధుర వాక్యసమూహంచేత తృప్తులై దేవతలంతా సంతోషించారు.

**విశేషం:** శ్రీకృష్ణుడు పొందిన మహానారాయణత్వ సిద్ధిని వర్ణించే పద్యం కాబట్టి ఈ పద్యం చాలా విశిష్టమైనది. నిర్వికారమైన పరబ్రహ్మనుండి సవికారమైన సృష్టి నాలుగు అంచెలుగా ఏర్పడిందని భారతం శాంతిపర్వంలోని 139వ అధ్యాయంలో చెప్పబడింది. ఆ అధ్యాయాన్ని 'నారాయణీయ' మంటారు. ఈ నాలుగు అంచెలనే నారాయణవ్యూహ తత్త్వమంటారు. ఈ నాలుగు దశలు ఇవి. 1. సనాతన వాసుదేవ తత్త్వం: నిష్క్రియ, నిర్గుణ, నిష్కళ, నిర్ద్వంద్వమైన పురుషతత్త్వ మిది. దీనినే పరతత్త్వ మంటారు. ఇదే పంచభూతాలను శరీరంగా చేసికొని జీవుడై అవతరించింది. ఈ జీవుడు లేకుండా ఆ పరబ్రహ్మతత్త్వానికి చేష్ట ఉండదు. అంటే కదలిక ఉండదు. అందుకే భారతకథలో వసుదేవుడి కుమారుడుగా కృష్ణుడు చెప్పబడినాడు. 2. సంకర్షణ తత్త్వం: ఈ జీవుడిపేరే శేషుడు. లేదా సంకర్షణుడు. పరవాసుదేవ తత్త్వంవైపు పాంచభౌతిక శరీరాన్ని ఆకర్షించే వాడని అర్థం. 'కర్షతీతి'- అంటే ఆకర్షిస్తాడని అర్థం. కృష్ణశబ్దానికి కూడా అర్థం ఇదే - ఆకర్షించేవాడని, భారతంలో శ్రీకృష్ణుడిచేత ఆకర్షింపబడని పాత్ర లేదు. 3. ప్రద్యుమ్నతత్త్వం: సంకర్షణతత్త్వంనుండి పుట్టేది ప్రద్యుమ్నతత్త్వం. ఇది సనత్కుమారతత్త్వం, విశ్వమనస్స్వరూపం. సర్వభూతాతిరిక్తమైన మనస్తత్త్వమిది. పంచభూతాలు ప్రళయకాలంలో ఈ 'మహామనస్సు'లో లీనమవుతాయి. శ్రీకృష్ణుడి కుమారుడు 'ప్రద్యుమ్నుడు' అని చెప్పబడిన పురాణకథలకు మూలం ఈ వ్యూహనిర్మాణమే. 4.అనిరుద్ధతత్త్వం: ఆ ప్రద్యుమ్నతత్త్వం నుంచి పుట్టేది అనిరుద్ధతత్త్వం. కర్తృకారణస్వరూపుడై స్థావరజంగమాత్మక విశ్వరూపుడు - సమష్టి అహంకార స్వరూపుడు అనిరుద్ధుడు. పురాణాల ప్రకారం ప్రద్యుమ్నుడి కొడుకే అనిరుద్ధుడు. ఈ నాలుగుతత్త్వాలను కలిగి పరమేశ్వరుడుగా నారాయణుడు ఈ పద్యంలో వివరించబడుతున్నాడు. ఆ నారాయణతత్త్వం కేవలం ఆనందరూపమైన జ్ఞానం కావటం వల్లనే తిక్కనగారు ప్రతి ఆశ్వాసాంతంలోనూ 'ఆనంద' ముద్రతో పద్యం వ్రాసి హరిహరాత్మకరూపమైన అద్వైతబ్రహ్మార్పణంగా కావ్యాన్ని ముగించారు. ఆ నారాయణతత్త్వం అద్వైత. ద్వైత, విశిష్టాద్వైతులందరికీ ఉపాసనీయమే. ఇదే తిక్కనగారి ధర్మాద్వైతం కూడా. దీనిని 'పరమ మంగళానుభూతి' అంటున్నారు తిక్కనగారు. శాంతరసానుభవాన్నే ఇక్కడ మంగళానుభూతి అంటున్నది. అందుకే అనిరుద్ధ. ప్రద్యుమ్న, సంకర్షణ రూపుడైన వాసుదేవుడు ఆ 'మూల' స్థితిని చేరుకొన్నారని ఈ పద్యం వివరిస్తున్నది. భారతమహార్థమంతా ఈ పద్యంలో గర్భితంగా ఉంది. 'ఒందించుకొంటి'. 'అంగీకరించెద' అనే మాటలు ఆ మూలమహాతత్త్వానికి ఉన్న సర్వతంత్ర స్వతంత్రను నిరూపిస్తున్నాయి. అందుకే 'స్వయంభూ' తత్త్వమని ఆ మహాతత్త్వాన్ని పిలుస్తారు.

**క. ఆ దేవదేవుఁ డత్యం। తాదరసంభాషణంబు లమ్మెయి బ్రహ్మేం**
**ద్రాదులతోడ నొనర్చి య। నాది నిరవసాన నిజపదాస్థితుఁ డయ్యెన్. 93**

**ప్రతిపదార్థం:** ఆ దేవదేవుఁడు= దేవతలకు దైవమైన ఆ నారాయణుడు; అత్యంత+ఆదర= మిక్కిలి ఆదరంతో కూడిన; సంభాషణంబులు= పలుకులు; ఆ+మెయిన్= ఆ రీతిగా; బ్రహ్మ+ఇంద్ర+ఆదులతోడన్= బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలతో; ఒనర్చి= పలికి; అనాది= మొదలులేని; నిర్+అవసాన= తుదిలేని; నిజపద+ఆస్థితుఁడు= తన స్థానంలో కూర్చున్నవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నారాయణుడు బ్రహ్మాదిదేవతలతో ఆదరపూర్వకంగా సంభాషించి, అనాద్యంతమైన తన స్థానంలో కూర్చున్నవాడయ్యాడు.

**విశేషం:** 'ఆస్థిత' శబ్దం చాలా ముఖ్యమైనది. మూలవాసుదేవతత్త్వం కదలిక లేనిది. అంటే కూర్చున్నదని అర్థం. దానిలో కదలక కదిలితే సంకర్షణాది రూపమైన 'కదలిక' వస్తుంది. ఆ స్థితికి తుది లేదు. అట్లాగని మొదలు కూడా లేదు. దీనినే 'అమేయ' మని పూర్వ పద్యంలో అన్నది.

**తే. ఇంద్రియాగోచరుం డైన యీశు నపుడు। బుద్ధిఁ జూచుచు నిర్భరాద్భుతకరంబు**
**లగు తదీయగుణమ్ముల నభినుతించు। చరిగి రాత్మవాసముల కజాదులెల్ల. 94**

**ప్రతిపదార్థం:** అజ+ఆదులు+ఎల్లన్= బ్రహ్మాదులంతా; అపుడు= ఆ సమయంలో; ఇంద్రియ+అగోచరుఁడు= కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలకు కనిపించనివాడైన; ఈశున్= ఆ పరమేశ్వరుడిని (పూర్వం చెప్పిన ఆ ఆనందస్వరూపుడిని); బుద్ధిన్+చూచుచున్= మనస్సుకంటె అతీతమైన జ్ఞాననేత్రంతో (దానినే బుద్ధి అంటున్నది) చూస్తూ; నిర్భర+అద్భుతకరంబులు+అగు= మిక్కిలి అద్భుతాన్ని కలిగించే; తదీయ= ఆ మహాతత్త్వ; గుణమ్ములన్+అభినుతించుచున్= గుణాలను కీర్తిస్తూ; ఆత్మావాసములకున్= తమతమ నివాసాలకు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** కర్మేంద్రియాలకు గోచరించని ఆ ఆనందస్వరూపుడిని జ్ఞాననేత్రాలతో తిలకిస్తూ, అద్భుతములైన ఆ మహాతత్త్వగుణాలను పొగడుతూ వారందరూ తమ తమ స్థానాలకు తిరిగి వెళ్ళారు.

**విశేషం:** ఇక్కడ ' ఈశ' శబ్దం హరిహరరూపమైన మహాతత్త్వాన్నే సూచిస్తున్నది.

దారుకుఁడు పాండవులకు సకలయాదవ క్షయంబు చెప్పుట (సం.16-6-1)

**సీ.** **అవనీశ! వినుమంత నద్దారుకుఁడు సని । పాండవేయులఁగని పరమమునులు**
**యాదవకులముఁ బేరలుకమైఁ దొల్లి శ । పించుట మునుఁ దలఁపించి పిదప**
**జలధితీరముల నాసవపానమత్తులై । వృష్ణిభోజాంధకవీరు లెల్ల**
**మునివరనిర్దిష్ట ముసలాత్మకములైన । ముయ్యంచుతుంగల మోఁదులాటఁ**

**తే.** **బేర్చి యొండొరువులఁ బరిమార్చుటయును । రామకృష్ణుల యునికియు నా మురారి**
**తన్నుఁ బుత్తెంచుటయు సవిస్తారభంగిఁ । జెప్పె వారలు పెనువగఁ జేడ్పడంగ.** **95**

**ప్రతిపదార్థం:** అవనీశ!= రాజా!; వినుము; (అట్లా కృష్ణుడి ఆజ్ఞచేత బయలుదేరిన); ఆ+దారుకుఁడు= కృష్ణుడిసారథి దారుకుడు; చని= హస్తినాపురానికి వెళ్ళి; పాండవేయులన్+కని= పాండవులను చూచి; పరమమునులు= గొప్పవారైన మునులు; యాదవకులమున్= యాదవుల సమూహాన్ని; పేరు+అలుకమైన్= పెద్దకోపంతో; తొల్లి= మునుపు; శపించుట= శపించటాన్ని; మును= ముందుగా; తలఁపించి= జ్ఞాపకంచేసి; పిదపన్= ఆ తరువాత; జలధితీరములన్= సముద్రతీరాలలో; ఆసవ= మద్యం; పాన= తాగటంచేత; మత్తులై= మదించినవారై; వృష్ణిభోజాంధకవీరులు+ఎల్లన్= వృష్ణివంశీయులు, భోజాంధకులు అందరూ; మునివర= మునిశ్రేష్ఠులచేత; నిర్దిష్ట= సూచించబడిన; ముసల+ఆత్మకములైన= ముసలం రూపాంతరం పొందిన; మూఁడు+అంచుతుంగలన్= మూడంచుల తుంగపరకలతో; మోఁదులాటన్= మోదులాడుకోవటంలో; పేర్చి= విజృంభించి; ఒండు+ఒరువులన్= ఒకరి నొకరు; పరిమార్చుటయునున్= చంపటాన్ని; రామకృష్ణుల+ఉనికియున్= బలరామకృష్ణులు అడవిలో ఉన్న విషయమూ; ఆ మురారి= ఆ కృష్ణుడు; తన్నున్+పుత్తెంచుటయున్= తనను హస్తినకు పంపించటాన్నీ; వారలు= పాండవులు; పెను వగన్= పెద్ద దుఃఖంతో; చేడ్పడంగన్= దుఃఖపడగా; సవిస్తారభంగిన్= విస్తారంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అట్లా కృష్ణుడు పంపిన దారుకుడు హస్తినకు వెళ్ళి, పాండవులను చూచి, మహామునులు మునుపు యాదవులకు శాపమిచ్చిన విషయాన్ని తొలుత గుర్తు చేశాడు. పిదప సముద్రతీరంలో మద్యపానంచేత పుట్టినమత్తులో వృష్ణివంశీయులు, భోజాంధకులు మునివరులు సూచించిన ముసలం ఆత్మ ప్రవేశించిన తుంగపరకలతో ఒకరినొకరు మోదుకొని చావటాన్ని, బలరామకృష్ణులు అడవిలో ఉన్న విషయాన్ని, కృష్ణుడు తనను హస్తినకు పంపిన విషయాన్ని సవిస్తరంగా చెప్పాడు. దానిని విని పాండవేయులు దుఃఖంతో క్రుంగిపోయారు.

**తే.** **సర్వయాదవసంఘంబు చావు విన్న। ద్రౌపదీప్రముఖాఖిలాంతఃపురాంగ**
**నలును శోకించి యాక్రందనములు సేసి। రతికరుణముగఁ బురజను లార్తిఁబొంద. 96**

**ప్రతిపదార్థం:** సర్వయాదవసంఘంబు= సర్వయాదవ సమూహంయొక్క; చావు= మరణాన్ని; విన్న= విన్నటువంటి; ద్రౌపదీ ప్రముఖ= ద్రౌపది, సుభద్ర మొదలైన; అఖిల అంతఃపుర+అంగనలును= అంతఃపురంలోని స్త్రీలందరూ; అతికరుణముగన్= మిక్కిలి శోచనీయంగా; పురజనులు= హస్తినలోని జనులు; ఆర్తిన్+పొందన్= దుఃఖాన్ని పొందగా; శోకించి= దుఃఖించి; ఆక్రందనములు= హాహాకారాలు; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** యాదవులందరూ ఇట్లా చనిపోవటం విని ద్రౌపది, సుభద్ర మొదలైన అంతఃపురస్త్రీలంతా శోచనీయంగా, హస్తినలోని జనులంతా దుఃఖాన్ని పొందేటట్లు హాహాకారాలు చేస్తూ ఏడ్చారు.

**సీ.** **దారుకుం డత్యంతధర్మవినీతిమై। నర్జునుతో 'నన్ను నచ్యుతుండు**
**నినుఁ దోడి తెమ్మని పనిచిన వచ్చితి'। నని చెప్పెఁ జెప్పిన నతనిఁ జూచి**
**'యాదవకుల విషయం బైన యొప్పని। పలుకు నా వీనులఁ జిలుకునట్టె!**
**యచటికి వేగంబ యరుగక యిచటఁ గా। ల్దన్ని యుండెడు నట్టి ధైర్య మెందుఁ**

**ఆ.** **గలదు నాకు? నీవు పిలువ నే?' లని పల్కి। యన్నతోఁ దగంగ నాడి యాతఁ**
**డక్కులాగ్రగణ్యు ననుమతితో ద్వార। వతికి నరిగె శీఘ్రగతి నరేంద్ర! 97**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; దారుకుండు= శ్రీకృష్ణుడి సారథియైన దారుకుడు; అత్యంత= మిక్కిలి; ధర్మవినీతిమైన్= ధర్మంతో కూడిన అణకువతో; అర్జునుతోన్= అర్జునుడితో; (ఇట్లా అన్నాడు); అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; నినున్= నిన్ను; తోడి తెమ్మని= తీసుకురమ్మని; నన్నున్= నన్ను; పనిచినన్= పంపగా; వచ్చితిన్= వచ్చాను; అని చెప్పెన్= అని చెప్పాడు; అతఁడు= ఆ అర్జునుడు; అతనిన్+చూచి= దారుకుడిని చూచి (ఇట్లా అన్నాడు)? యాదవకుల= యాదవుల వంశం; విషయంబైన= సంబంధమైన; ఒప్పని పలుకు= కీడు మాట; నా వీనులన్= నా చెవులలో; చిలుకున్+అట్టె!= ప్రవేశించటమా! (పడటమా); అచటికిన్= ద్వారకకు; వేగంబ= వేగంగా; అరుగక= వెళ్ళకుండా; ఇచటన్= ఇక్కడ; కాల్దన్ని= నిలకడగా; ఉండెడు అట్టి= ఉండేటువంటి; ధైర్యము+ఎందుఁగలదు నాకున్?= ధైర్యం నాకెక్కడుంది?; నీవు పిలువన్+ఏల= నీ వేల పిలవటం?; అని పల్కి= అని చెప్పి; అన్నతోన్= ధర్మరాజుతో; తగంగన్= తగినట్లుగా; ఆడి= పల్కి; ఆ+కుల+అగ్రగణ్యు+అనుమతితోన్= పాండవకుల శ్రేష్ఠుడైన ధర్మరాజు అనుమతితో; శీఘ్రగతిన్= అతివేగంగా; ద్వారవతికిన్+అరిగెన్= ద్వారకకు చేరాడు.

**తాత్పర్యం:** దారుకుడు మిక్కిలి ధర్మంతో కూడిన అణకువతో అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'శ్రీకృష్ణుడు నిన్ను తీసికొనిరమ్మని పంపగా నేను వచ్చాను'. ఆ అర్జునుడు 'యాదవుల సంబంధమైన కీడుమాట నా చెవులలో పడటమా! ఇది విని కూడా ద్వారకకు వేగంగా వెళ్ళకుండా ఇక్కడ నిలకడగా ఉండే ధైర్యం నా కెక్కడున్నది? నీవు వేరే పిలవటం ఎందుకు?' అని అన్నాడు. ధర్మరాజుతో తగినట్లుగా సంభాషించి ఆ కులశ్రేష్ఠుడి అనుమతితో అతివేగంగా ద్వారకకు చేరాడు.

**విశేషం:** యాదవ పాండవుల నడిమి సంబంధగాఢత ఈ పద్యంలోని అర్జునుడి వాక్యాలద్వారా తెలుస్తుంది. బలరామకృష్ణులు ఇంకా బ్రతికే ఉన్నారనుకొని పాండవులు అనుకొంటున్నారు. అట్లా అనుకొనే అర్జునుడూ బయలుదేరుతున్నాడు. ఎంతో ఉత్కంఠ కలిగిన సన్నివేశ మిది.

**చ. అరిగి మగండు సచ్చిన కులాంగనయున్ శశి గ్రుంకినట్టి శ**
**ర్వరియునుఁ బోల్పఁ బట్టగుచు వారిజనాభుఁడు లేని దీనతం**
**బొరసి కృపైకభాజనతఁ బొందిన యప్పురిఁ జూచి మానసం**
**బెరియఁగఁ జొచ్చె నేటి కెదురీఁదిన చాడ్పున నేమి సెప్పుదున్? 98**

**ప్రతిపదార్థం:** అరిగి= చేరి; మగండు+చచ్చిన= భర్తచనిపోయిన; కులాంగనయున్= పుణ్యస్త్రీని; శశి= చంద్రుడు; క్రుంకినట్టి= అస్తమించినట్టి; శర్వరియునున్= రాత్రిని; పోల్పన్= పోల్చటానికి; పట్టు+అగుచున్= సందర్భం అవుతూ; వారిజనాభుఁడు= పద్మనాభుడు (కృష్ణుడు); లేని= లేనట్టి; దీనతన్= దైన్యం; పొరసి= పొంది; కృపా+ఏక= దైన్యానికి మాత్రమే; భాజనతన్= పాత్రతను; పొందిన= పొందినటువంటి; ఆ+పురిన్+చూచి= ఆ ద్వారకను చూచి; మానసంబు+ఎరియఁగన్= మనస్సు పరితపించగా; ఏటికిన్+ఎదురు+ఈఁదిన= ఏటికి ఎదురీదిన; చాడ్పునన్= విధంగా; చొచ్చెన్= నగరాన్ని ప్రవేశించాడు; ఏమి+చెప్పుదున్?= ఏమి చెప్పను?

**తాత్పర్యం:** అర్జునుడు ద్వారక చేరి; భర్త చనిపోయిన పుణ్యస్త్రీకి; చంద్రుడు అస్తమించిన రాత్రికి పోల్చదగినట్లున్న ద్వారకను చూచాడు. ఆ నగరంలో కృష్ణుడు లేడు. నగర మంతటా దైన్యంమాత్రమే ఉన్నది. అర్జునుడి మనస్సు పరితాపం పొందింది. ఒక్క అడుగు వెయ్యటానికి కూడా శక్తి లేకపోయింది. (ఏటి ప్రవాహానికి ఎదు రీదినట్లు కాళ్ళీడ్చుకొంటూ ద్వారకలోనికి అడుగుపెట్టా డని అర్థం).

**విశేషం:** అలం: మాలోపమ. శ్రీకృష్ణుడి అవతారం ముగియగానే అర్జునుడి బ్రదుకు ఏటి కెదురీదినట్లయిందని కూడా అర్థం నిక్షిప్తంగా ఉన్నది. ఈ ఏరు కాలప్రవాహం. కాలపురుషుడి సహాయం ఉండటంవలన ఏ ఈత సులభమయిందో అది ఇక గగనమై పోయిందని అర్థం.

**క. దారుకుఁడుఁ దోడఁ జనుదేరఁ। బౌర జనము లంతఁ దన్నుఁ బరమాశ్వాసం**
**బారెడు మనములతోడను। గారవమునఁ జూడఁగా నగరికిం జనియెన్. 99**

**ప్రతిపదార్థం:** దారుకుఁడు= శ్రీకృష్ణుడి సారథియైన దారుకుడు; తోడన్= వెంట; చనుదేరన్= రాగా; పౌరజనములు= ద్వారకాజనులు; అంతన్= ఆ సమయంలో; తన్నున్= తనను; పరమ= మిక్కిలి; ఆశ్వాసంబు= ఓదార్పు; ఆరెడు= నిండిన; మనముల తోడను= మనస్సులతో; గారవమునన్= గౌరవంతో; చూడఁగాన్= చూడగా; నగరికిన్= నగరుకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దారుకుడు వెంటరాగా, ద్వారకావాసులు తనను మిక్కిలి ఓదార్పు నిండిన మనస్సులలో గౌరవించగా అర్జునుడు రాజసౌధానికి వెళ్ళాడు.

**చ. చనుటయుఁ గ్రొత్త పేరడలు సైఁపఁగ లేక మురాంతక ప్రియాం**
**గనలు పదాఋవేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారి రో**
**దనరవముల్ చెలంగఁగఁ బదంబులు దొట్రుపడంగ దైన్యముల్**
**తనువులు దాల్చినట్లు దెరలం జనుదెంచిరి పార్థుపాలికిన్. 100**

**ప్రతిపదార్థం:** చనుటయున్= పోగా; క్రొత్త= అప్పుడే పుట్టిన; పేరు+అడలు= పెద్దదుఃఖం; సైపఁగన్+లేక= తాళలేక; ముర+అంతక= శ్రీకృష్ణుడి; ప్రియ+అంగనలు= ప్రియ భార్యలు; పదాఱువేలును= పదహారువేలమందీ; మొగంబులన్= ముఖాలను; బాష్పవారి= కంటినీరు; కప్పఁగన్= ఆక్రమించగా; రోదన రవముల్= ఏడ్పు శబ్దాలు; చెలంగఁగన్= అతిశయించగా; పదంబులు= కాళ్ళు; తొట్రుపడంగన్= తడబడగా; దైన్యముల్= దీనతలు; తనువులు+తాల్చిన+అట్టు= ఆకారాన్ని పొందినట్టు; తెరలన్= సంక్షోభిస్తూ; పార్థుపాలికిన్= అర్జునుడి వద్దకు; చనుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** అర్జునుడు అట్లా వెళ్ళగా, అప్పుడే పుట్టిన పెద్ద దుఃఖం తాళలేక శ్రీకృష్ణుడి ప్రియభార్యలు పదహారువేలమందీ, ముఖాలను కంటినీరు ఆక్రమించగా, ఏడుపు శబ్దాలు అతిశయించగా, కాళ్ళు తడబడగా, దీనతలు ఆకారాన్ని పొందినట్లుగా, సంక్షోభిస్తూ అర్జునుడి దగ్గరకు వచ్చారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**చ.** **వారలఁ గాంచి శోక మనివారణఁ జిత్తము పెల్లగింప న**
**క్కౌరవసత్తముం డెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్**
**దేరొక భంగి డిగ్గి యిలఁ ద్రెళ్ళిన యద్దురవస్థఁ జూచినన్**
**వైరులకైన డెందములు వ్రయ్యలుగా వగ దాఁకు భూవరా!** **101**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; వారలన్+కాంచి= వారిని చూచి; శోకము= దుఃఖం; అనివారణన్= ఆపుకొనలేకపోగా; చిత్తము= మనస్సు; పెల్లగింపన్= సంక్షోభించగా; ఆ+కౌరవసత్తముఁడు= ఆ కురువంశశ్రేష్ఠుడు; ఎలుఁగు= కంఠస్వరం; గద్గదికన్= డగ్గుత్తికను; తగులంగన్= పొందగా; ఏడ్చుచున్= ఏడుస్తూ; తేరు+ఒక భంగిన్+డిగ్గి= తేరు ఏదో ఒక విధంగా దిగి; ఇలన్= నేలమీద; త్రెళ్ళినన్= పడగా; ఆ+దురవస్థన్= ఆ దుఃస్థితిని; చూచినన్= చూస్తే; వైరులకున్+ఐనన్= శత్రువులకైనా; డెందములు= హృదయాలు; ప్రయ్యలుగాన్= ముక్కలయ్యేలా; వగ= దుఃఖం; తాఁకున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** రాజా! వారిని చూచి దుఃఖం ఆపుకొనలేకపోగా, మనస్సు సంక్షోభించగా, ఆ అర్జునుడు స్వరం డగ్గుత్తికను పొందగా ఏడుస్తూ, తేరు ఏదో ఒక రీతిగా దిగి నేలమీద పడిపోయాడు. ఆ దుఃస్థితిని చూస్తే శత్రువులకైనా గుండెలు ముక్కలయి దుఃఖం కలుగుతుంది.

**విశేషం:** 'ఒక భంగిన్ డిగ్గి' అంటే అతి కష్టంమీద రథంనుండి దిగాడని అర్థం. ముందున్న వైభవం లేని గమన మిది. నారాయణుడి తోడ్పాటు లేని నరుడి పాటు ఎట్లా ఉంటుందో ఈ మాట నిరూపిస్తుంది. (వైరులకైనన్-శత్రువులకైనా అనడం వల్ల ఇక మిత్రులమాట చెప్పనక్కఱలేదని-కావ్యార్థాపత్తి)

**తే.** **రోదన ధ్వను లెసఁగంగ రుక్మిణియును। సత్యభామయు నప్పు డా సవ్యసాచి**
**కడకు నేతెంచి పుడమిపైఁ బడిరి వనట। వెల్లి మునిఁగి యుల్లంబులు వెగడునొంద.** **102**

**ప్రతిపదార్థం:** రోదనధ్వనులు= ఏడ్పుధ్వనులు; ఎసఁగంగన్= అతిశయించగా; రుక్మిణియునున్= రుక్మిణీ; సత్యభామయున్= సత్యభామా; (ఇరువురూ); అప్పుడు= ఆ సమయంలో; ఆ సవ్యసాచికడకున్= అర్జునుడి దగ్గరకు; ఏతెంచి= వచ్చి; వనటవెల్లిన్=

దుఃఖసముద్రంలో; మునిఁగి= మునిగిపోయి; ఉల్లంబులు= మనస్సులు; వెగడు= తల్లడము; ఒందన్= పొందగా; పుడమిపైన్+పడిరి= నేలమీద పడ్డారు.

**తాత్పర్యం:** రుక్మిణీసత్యభామ లిరువురూ పెద్దగా ఏడుస్తూ అర్జునుడి దగ్గరికి వచ్చారు. దుఃఖసముద్రంలో మునిగిపోయారు. మనస్సులు తల్లడపాటు పొందగా నేలపై పడ్డారు.

**విశేషం:** (వనటవెల్లి-వనట అనే వెల్లి-రూపకం.)

**క. తక్కునుగల మహిషీజను । లక్కుంతీతనయుచుట్టు నవని నొఱగి లో**
**నెక్కొనిన వగలఁ బొగిలిరి । 'దిక్కెవ్వరు మాకు?' ననుచు దీనత దోఁపన్. 103**

**ప్రతిపదార్థం:** తక్కునున్+కల= మిగిలిఉన్న; మహిషీజనులు= కృష్ణుడి రాణులు; ఆ+కుంతీతనయు చుట్టున్= అర్జునుడి చుట్టూ; అవనిన్= నేలపై; ఒఱగి= పడి; లోన్= మనస్సులలో; నెక్కొనిన= అతిశయించిన; వగలన్= దుఃఖంతో; మాకున్= మాకు; దిక్కు+ఎవ్వరు+అనుచున్= దిక్కు ఎవరంటూ; దీనత= దైన్యం; తోఁపన్= కనిపించగా; పొగిలిరి= దుఃఖించారు (ఏడ్చారు).

**తాత్పర్యం:** మిగిలిఉన్న శ్రీకృష్ణుడి రాణులు అర్జునుడి చుట్టూ నేలపై పడి మనసులలో అతిశయించిన దుఃఖంతో 'మాకిక దిక్కెవ్వ?' రంటూ దైన్యంతో ఏడ్చారు.

**క. వినుము ధనంజయుఁ డప్పుడు । తనుఁ దాఁ దేర్చికొని యెల్లతరుణుల నూరా**
**ర్చె నతనిఁ దోడ్కొని హరి జన । కునికడకుం జనియె దారుకుం డట్టి యెడన్. 104**

**ప్రతిపదార్థం:** వినుము= రాజా! వినుము; ధనంజయుఁడు= అర్జునుడు; అప్పుడు= ఆ సమయంలో; తనున్= తనను; తాన్= తానే; తేర్చికొని= సమాధానపరచుకొని; ఎల్ల తరుణులన్= స్త్రీలనందరనూ; ఊరార్చెన్= ఓదార్చాడు; అట్టి+ఎడన్= అప్పుడు; దారుకుండు= దారుకుడు; అతనిన్= అర్జునుడిని; తోడ్కొని= వెంట తీసికొని; హరిజనకుని కడకున్= వసుదేవుడి వద్దకు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** వారి ఏడ్పులు చూచి, అర్జునుడు తనకు తానే సమాధానపరచుకొని ఆ స్త్రీలనందరనూ ఓదార్చాడు. ఆ తరువాత దారుకుడు అర్జునుడిని వెంట తీసికొని వసుదేవుడివద్దకు వెళ్ళాడు.

**సీ. 'యాదవుల్ సమసిన నయ్యేడు నడలు చం । దమ కాక యివ్వనితాజనంబు**
**నందు దైన్యముతోడి యత్యంత శోకస । మాకులత్వముఁ దోఁచె నస్మదీయ**
**మగు చిత్తమున వీరియాతురత్వము గన్న । యంతన కొందల మతిశయిల్లెఁ**
**గాని విశేషంబు గల్గదు కృష్ణుని దశ యెట్టిదో? యనుతల్లడంబు**

**ఆ. నెవ్వరొక్కొ దీని నెఱిఁగించువారను నెవ్వగయును గదిరెఁ గవ్వడికిని**
**నధిప! దారుకునకు నట్టయ్యు నా నృపు । కడ నెఱుంగు వారు గాఁగఁ దారు. 105**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! వినుము; యాదవుల్= యాదవులు; సమసినన్= చస్తే; అయ్యేడు+అడలు+చందము+అకాక= కల్గే దుఃఖంవలె కాకుండా; ఈ+వనితాజనంబునందునన్= ఈ స్త్రీలలో; దైన్యముతోడి= దైన్యంతో కూడిన; అతి+అంత= మిక్కిలి;

శోక సమాకులత్వము= దుఃఖంతో కూడిన వ్యథ; తోఁచెన్= కనిపించింది; అస్మదీయము+అగు= నాదయిన; చిత్తమునన్= మనస్సులో; వీరి+ఆతురత్వముకన్న+అంతన్+అ= వీరి బాధ చూస్తే; కొందలము= బాధ; అతిశయిల్లెన్= అధికమవుతోంది; కాని= అయినా; విశేషంబు+కల్గదు= విశేషంగా ఏమీ కనిపించటంలేదు; కృష్ణుని దశ= శ్రీకృష్ణుడి స్థితి; ఎట్టిదో?= ఎట్లాంటిదో?; అను తల్లడంబున్= అనే భయమూ; ఎవ్వరు+ఒక్కొ?= ఎవరు?; దీనిన్= దీనిని; ఎఱిఁగించువారు= తెలిపేవారు; అను= అనేటటువంటి; నెఱ+వగయును= పెద్ద దుఃఖంకూడా; కవ్వడికిని= అర్జునుడికీ; కదిరెన్= వచ్చింది; దారుకునకున్= దారుకుడికి కూడా; అట్లు+అయ్యున్= అట్లా కాగా; ఆ నృపుకడన్= వసుదేవుడివద్ద; ఎఱుంగువారు= తెలిసికొనేవారు; కాఁగన్= కావటంకోసం; తారు= వారిద్దరూ.

**తాత్పర్యం:** 'యాదవులు చనిపోతే కలిగే దుఃఖంవలె కాకుండా ఈ స్త్రీలలో దైన్యంతో కూడిన వ్యథ కనిపిస్తున్నది. నా మనస్సులో వీరి ఆతురత చూస్తుంటే బాధ అధికమౌతున్నది. అయినా ఏ విశేషమూ కనిపించటంలేదు. శ్రీకృష్ణుడి స్థితి ఎట్లా ఉన్నదో? - అనే భయం పుట్టుతున్నది. దీనిని గురించి ఎవరు చెప్పుతారు?' అన్న పెద్ద దుఃఖం వచ్చింది. అర్జునుడికి. దారుకుడికీ అట్లాగే అయింది. అందుచేత వసుదేవుడి దగ్గరకు వెళ్ళి ఈ విషయం తెలిసికొనటం కొరకు వారిద్దరూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**అర్జునుఁడు సకల స్వజనక్షయ దుఃఖితుండగు వసుదేవునిం గాంచుట (సం.16-7-1)**

**క. తలఁకుచుఁ జని యతనిం గన। బలువగలం బొగిలి సెజ్జపై మేనిడి య**
**శ్రులు గ్రమ్మనున్న యవ్విభుఁ। డలమట క్రొత్త యయి మనసు నలమికొనంగన్. 106**

**ప్రతిపదార్థం:** తలఁకుచున్= బాధపడుతూ; చని= వెళ్ళి; అతనిన్= వసుదేవుడిని; కనన్= చూడగా; బలు వగలన్= అధికమైన బాధతో; పొగిలి= శోకించి; సెజ్జ పైన్= పరుపుమీద; మేను+ఇడి= దేహాన్ని పడవేసి; అశ్రులు= కళ్ళనీరు; క్రమ్మన్= క్రమ్ముకోగా; ఉన్న= దుఃఖిస్తున్న; ఆ+విభుఁడు= వసుదేవుడు; అలమట= దుఃఖం; క్రొత్త+అయి= క్రొత్తగా పుట్టి; మనసున్= మనస్సును అలమికొనంగన్= ఆక్రమించుకొనగా.

**తాత్పర్యం:** బాధపడుతూ వెళ్ళి వసుదేవుడిని చూచారు. ఆయన మిక్కిలి బాధతో దేహాన్ని పరుపుమీద పడవేసి, కన్నునీరు క్రమ్ముకోగా ఏడుస్తున్నాడు. వీళ్ళను చూడగానే ఆయనకు కొత్తగా దుఃఖం పుట్టుకొచ్చింది. మనస్సునంతా ఆక్రమించింది.

**విశేషం:** మేను+ఇడి= దేహాన్ని పడవేయటం - అంటే చైతన్యంతో పడుకొనటం కాదని అర్థం - నిశ్చైతన్యంగా పడి ఉన్నాడని భావం.

**ఆ. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి। గద్గదిక నెలుంగు గడలుకొనఁగ**
**నడరి పెలుచ నేడ్చె నాఅడివోయిన। ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి. 107**

**ప్రతిపదార్థం:** లేచి= పైకిలేచి; అడలి= దుఃఖించి; సవ్యసాచిన్= అర్జునుడిని; కౌఁగిటన్+చేర్చి= కౌగిలించుకొని; గద్గదికన్= డగ్గుత్తికతోడి; ఎలుంగు= కంఠస్వరం; కడలుకొనఁగన్= అతిశయించగా; అడరి= క్షోభించి; ఆఱడి+పోయిన= చనిపోయిన; ప్రజలన్= యాదవవీరులను; పేరు+క్రుచ్చి= పేరుపేరునా తడవి; పనవి, పనవి= ప్రలపించి, ప్రలపించి; పెలుచన్= పెద్దగా; ఏడ్చెన్= ఏడ్చాడు.

**తాత్పర్యం:** వసుదేవుడు తల్పంనుండి పైకి లేచి దుఃఖిస్తూ, అర్జునుడిని కౌగిలించుకొని కంఠంలోని డగ్గుత్తిక అతిశయించగా క్షోభించి చనిపోయిన యాదవవీరులను పేరుపేరునా తడవి, వారిని తలచుకొని ప్రలపించి పెద్దగాఏడ్చాడు.

**క. మనుజాధిపుఁ డమ్మెయి రో। దన మటు సేయంగ నరుఁ డతని నూరార్చెన్**
**విను మవ్వసుదేవుం డి। ట్లను నాలుక తొట్రుపడఁగ నాతని తోడన్. 108**

**ప్రతిపదార్థం:** వినుము= అప్పుడు ఏం జరిగిందో వినుము!; మనుజ+అధిపుఁడు= వసుదేవుడు; ఆ+మెయిన్= ఆ విధంగా; రోదనము+అటు+చేయంగన్= ఏడుస్తూ అట్లా వుంటే; నరుఁడు= అర్జునుడు; అతనిన్= వసుదేవుడిని; ఊరార్చెన్= ఓదార్చాడు; ఆ+వసుదేవుండు= ఆ వసుదేవుడు; నాలుక తొట్రు+పడంగన్= నాలుక తడబడగా; అతనితోడన్= అర్జునుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు వసుదేవుడట్లా ఏడుస్తూ ఉంటే అర్జునుడు ఆయనను ఓదార్చాడు. వసుదేవు డప్పుడు నాలుక తడబడుతుండగా అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'మనుజుల మాత్ర గాక సురమాన్యపరాక్రమ ముల్లసిల్లఁగా**
**దనుజులఁ దాఁకి గీటడఁచు దర్పమునం బెనుపొంది మాఱులే**
**క నెగడి రట్టిబిడ్డల కకారణరోషమునం బరస్పరా**
**హననము గల్గి చావలసె నందఱ కక్కట! దైవ మల్గినన్. 109**

**ప్రతిపదార్థం:** మనుజుల మాత్రకాక= మనుష్యుల చేత మాత్రమే కాకుండా; సురమాన్య= దేవతలచేత గౌరవించబడిన; పరాక్రమము= విక్రమము; ఉల్లసిల్లఁగాన్= అతిశయించగా; దనుజులన్= రాక్షసులను; తాఁకి= ఎదిరించి; కీటడఁచు= చంపేటటువంటి; దర్పమునన్= పరాక్రమంతో; పెనుపు+ఒంది= పేరు పొంది; మాఱులేక= ప్రతిలేక; నెగడిరి= ప్రసిద్ధిపొందారు; అట్టిబిడ్డలకున్= అట్లాంటి యాదవకుమారులకు; అక్కట!= అయ్యో!; దైవము= దేవుడు; అల్గినన్= కోపగించుకొనగా; అందఱకున్= యాదవులందరికీ; అకారణ రోషమునన్= నిష్కారణంగా పుట్టిన రోషంతో; పరస్పర+ఆహననము+కల్గి= ఒకరినొకరు చంపుకొని; చాన్+వలసెన్= చావాల్సి వచ్చింది.

**తాత్పర్యం:** 'మనుష్యులను మాత్రమే కాకుండా దేవతలచేత కూడా ప్రస్తుతించబడ్డ విక్రమం కలిగి, రాక్షసులను ఎదిరించి చంపేటటువంటి పరాక్రమంచేత పేరుపొంది, ఎదురులేక సుప్రసిద్ధులైన యాదవకుమారులంతా దైవం కోపించటంచేత నిష్కారణంగా ఒకరిమీద ఒకరు కోపగించుకొని చంపుకొని చచ్చారు. అయ్యో! ఎంత దురవస్థ!

**క. విను నీ శిష్యులు సాత్యకి। యును ప్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపుసమరం**
**బునఁ దొలుపీనుఁగు లైరని। వినియుఁ బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్. 110**

**ప్రతిపదార్థం:** విను= ఆ యుద్ధం ఎంత బాగా జరిగిందో వినుము!; నీ శిష్యులు= నీవు విద్య నేర్పిన శిష్యులు?; సాత్యకియునున్= సాత్యకీ; ప్రద్యుమ్నుండున్= ప్రద్యుమ్నుడూ; ఈ+మహా+ఉగ్రము+సమరంబునన్= ఈ భయంకర యుద్ధంలో; తొలు= మొదటి; పీనుఁగులు+ఐరి+అని= శవాలు అయ్యారని; వినియున్= వినికూడా; బ్రదికినాఁడన్= బ్రతికి ఉన్నాను; జగతిన్= ఈ జగత్తులో; ఏను+అ+వీరుఁడన్= వీరుడిని నేనొక్కడినే నయ్యా! (చస్తే బాగుండునని భావం)

**తాత్పర్యం:** ఆ యుద్ధం ఎంత బాగా జరిగిందో వినుము. నీవు విలువిద్యారహస్యాలు బోధించిన నీ శిష్యులు సాత్యకి, ప్రద్యుమ్నులే ఈ భయంకర యుద్ధంలో తొలిపీనుగులు అయ్యారు. ఈ విషయం విని కూడా ఇంకా నేను బ్రతికే ఉన్నాను. నేనేనయ్యా ఈ ప్రపంచంలో గొప్పవీరుడిని? (గొప్పవీరుడను కానని భావం.)

**క. తొలితొలి సాత్యకి కృతవ। ర్మలు రేఁపఁగ బుట్టె సంగరము దానను వా**
**రల దూఱనేల? మునిము। ఖ్యుల శాపం బట్టి చేఁతకుం దగియుండన్? 111**

**ప్రతిపదార్థం:** తొలి తొలి= ముందుముందుగా; సాత్యకి, కృతవర్మలు; రేఁపఁగన్= రెచ్చగొట్టగా; సంగరము= యుద్ధం; పుట్టెన్= మొదలైంది; మునిముఖ్యుల శాపంబు= మునిశ్రేష్ఠులు ఇచ్చిన శాపం (ముసలం విషయం); ఇట్టి చేఁతకున్= ఇట్లాంటి కార్యానికి; తగి+ఉండన్= తగి ఉండగా; దానను= ఆ యుద్ధం చేశారని; వారలన్= వారిద్దరినీ; దూఱన్+ఏల?= నిందించటం ఎందుకు?

**తాత్పర్యం:** ముందుముందుగా సాత్యకి కృతవర్మలు రెచ్చగొట్టారు. యుద్ధం ప్రారంభమైంది. అది కాదులే! ముందు మునిశ్రేష్ఠులు ఇచ్చిన శాపం ఈ యుద్ధానికి అనుకూలంగానే ఉందికదా! యుద్ధం చేశారని వాళ్ళిద్దరినీ ఎందుకు నిందించాలి?

**చ. వలసిన నెట్టి కార్యమును వావిరి నెట్టుగ నైనఁ జేయఁగా**
**వలఁతి మృతుం బరీక్షితుని వత్సలతన్ బ్రదికించె శౌరి; మొ**
**క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁ డుపేక్షసేసె నీ**
**పొలియు టవశ్యభావ్యమని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. 112**

**ప్రతిపదార్థం:** శౌరి= శ్రీకృష్ణుడు; వలసినన్= కావాలనుకుంటే; ఎట్టి కార్యమును= ఎట్లాంటి పనినైనా; వావిరిన్= ఉత్కృష్టంగా; ఎట్టుగన్+ఐనన్= ఎట్లాగైనా; చేయఁగాన్= చేయటానికి; వలఁతి= సమర్థుడు; మృతున్= చచ్చిన; పరీక్షితుని= పరీక్షిత్తును; వత్సలతన్= ప్రేమతో; బ్రదికించెన్= బ్రదికించాడు; (అట్లాంటివాడు); మొక్కలమునన్= మూర్ఖత్వంతో; యాదవుల్= యదుకుమారులు; పెనఁగఁగాన్= యుద్ధం చేస్తుండగా; కని= చూచి; మాన్పఁడు= యుద్ధాన్ని మాన్పించలేదు; ఉపేక్ష+చేసెన్= ఉపేక్ష చేశాడు; ఈ+పొలియుట= ఇట్లా యాదవులందరూ చావటం; అవశ్య భావ్యము+అని= తప్పనిసరిగా జరగవలసినదేనని; బుద్ధిన్= బుద్ధిలో; తలంచుట= తలచటమే; కానన్+అయ్యెడున్= కనిపిస్తోంది.

**తాత్పర్యం:** కృష్ణుడు కావాలనుకొంటే ఎంతటి అసాధ్యమైన పనినైనా అత్యుత్కృష్టంగా సాధ్యం చేసి చూపగలడు. అంతెందుకు! చనిపోయిన పరీక్షిత్తును ఎంతో ప్రేమతో బ్రతికించలేదా! అట్లాంటివాడు యదుకుమారులు మూర్ఖత్వంతో యుద్ధం చేస్తుంటే చూస్తూ ఉపేక్ష చేశాడు. యుద్ధాన్ని మాన్పించలేదు. ఇట్లా యాదవులంతా చావటం తప్పనిసరిగా జరగాల్సిన విషయంగా తలచాడేమో?

**క. ఇది విధివశత్వమున నై। నది యని శోకంబు దొఱఁగు నట్టి వివేకం**
**బొదవదు ఫల్గున! యాఱడి। యదువంశం బెల్ల సమసె ననువగపేర్మిన్.' 113**

**ప్రతిపదార్థం:** ఫల్గున!= అర్జునా!; ఆఱడి= వ్యర్థంగా; యదువంశంబు+ఎల్లన్= యదువంశమంతా; సమసెన్= నశించింది; అను= అన్న; వగ= దుఃఖంయొక్క; పేర్మిన్= అతిశయంతో; ఇది= ఇట్లాకావటం; విధి వశత్వమునన్= విధివశంగా; ఐనది=

జరిగింది; అని= అని తెలిసికొనటం ద్వారా; శోకంబున్= దుఃఖాన్ని; తొలఁగునట్టి= పోగొట్టుకొనేటువంటి; వివేకంబు= జ్ఞానం; ఒదవదు= పుట్టటం లేదు.

**తాత్పర్యం:** నిష్కారణంగా ఇంతమంది యదువీరులందరూ చచ్చిపోయారే అన్న దుఃఖాతిశయంలో ఇదంతా విధి వశంగా జరిగిందని తెలిసికొనటం ద్వారా దుఃఖాన్ని పోగొట్టుకొనేటటువంటి జ్ఞానమే పుట్టటంలేదు.'

**విశేషం:** జగన్నాటక సూత్రధారి నిజజీవితంలోని ఈ చరమాంకం చాలా అద్భుతంగా ఉన్నది. శ్రీకృష్ణుడు చనిపోవటం తల్లిదండ్రులకు తెలియదు. మహారాణులకు తెలియదు. అర్జునదారుకులకు తెలియదు. అందుకే అర్జునుడు ఇట్లా అనుకొంటున్నాడు.

వసుదేవుఁ డర్జునునకు యాదవనాశంబు తెలుఁ గెఱింగించుట (సం.16-7-13)

క. **అనునెడఁ గ్రీడి 'యితఁడు కృ। ష్ణునుపేక్షయ చెప్పెఁ గాని శోక మడరియుం**
**బనవఁడు కృష్ణునిఁ గావున। ననుమానము వలవ దమ్మహాత్ము నునికికిన్.'** **114**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= అని వసుదేవుడు చెప్పుతున్నప్పుడు; క్రీడి= అర్జునుడు; ఇతఁడు= వసుదేవుడు; కృష్ణు+ఉపేక్ష+అ= కృష్ణుడు చేసిన ఉపేక్ష మాత్రమే; చెప్పెన్+కాని= చెప్పాడు తప్ప; శోకము+అడరియున్= దుఃఖం అధికమై; కృష్ణునిన్= శ్రీకృష్ణుడిని గురించి; పనవఁడు కావునన్= దుఃఖించటం లేదు కాబట్టి; ఆ+మహాత్ము+ఉనికికిన్= ఆ మహానుభావుడి ఉనికికి (బ్రతుకు విషయంలో); అనుమానము= ఏ అనుమానమూ; వలవదు= అక్కరలేదు.

**తాత్పర్యం:** అని వసుదేవుడు చెప్పుతుంటే అర్జునుడు ఇట్లా ఆలోచించాడు: 'ఈయన కృష్ణుడు చేసిన ఉపేక్షను గురించి మాత్రమే చెప్పుతున్నాడు. దుఃఖాతిశయంతో కృష్ణుడిగురించి తలచుకొనటంలేదు. కాబట్టి కృష్ణుడి ఉనికిని గురించి ఏ అనుమానమూ అక్కరలేదు' (ఆయన బ్రతికే ఉంటాడని ఊహిస్తున్నాడు).

సీ. **అని మదిఁ జర్చించె నప్పు డవ్వసుదేవుఁ। డతనితో ననియె 'సమస్తయాద**
**వులును మహామునీంద్రుల ఘోరశాపంబు। ఘనశక్తి నుద్భవించిన మహోగ్ర**
**ముసలంబు విలసనమున ముసలాయమా। నము లైన తుంగల సమదవృత్తి**
**నన్యోన్యవినిహతి యాచరించి గతాసు। లగుటయు నొక్కఁడు నతివపిండుఁ**

ఆ. **గరులఁ దురగములను నరదంబులను గొని। యరుగుదెంచెఁ గృష్ణుఁ డనిన నా ధ**
**నంజయుండు తన మనంబు దల్లడపడ। 'నమ్ముకుందుఁ డెచటి కరిగె నధిప!'** **115**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; మదిన్= మనసులో; చర్చించెన్= ఆలోచించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+వసుదేవుఁడు= ఆ వసుదేవుడు; అతనితోన్= అర్జునుడితో; అనియెన్= ఇట్లా అన్నాడు; సమస్త యాదవులునున్= యాదవులందరూ; మహాముని+ఇంద్రుల= మహామునీశ్వరుల; ఘోరశాపంబు= ఘోరమైన శాపానికున్న; ఘనశక్తిన్= గొప్పశక్తిచేత; ఉద్భవించిన= పుట్టిన; మహోగ్రవిలసనమునన్= మిక్కిలి భయంకరమైన ప్రకాశంచేత; ముసలాయమానములు+ఐన= రోకళ్ళవలె అవుతున్న; తుంగలన్= తుంగపరకలతో; సమదవృత్తిన్= మదించిన ప్రవృత్తితో; అన్యోన్యవినిహతిన్= ఒకరినొకరు చంపుకొనటాన్ని; ఆచరించి= చేసి; గత+అసులగుటయున్= ప్రాణాలు పోగొట్టుకొనగా; కృష్ణుఁడు ఒక్కఁడు= తానొక్కడే; అతివపిండున్= స్త్రీసమూహాన్నీ; కరులన్= ఏనుగులను; తురగములనున్= గుర్రాలను; అరదములనున్= రథాలను; కొని= వెంటతీసికొని; అరుగుదెంచెన్=

ఇక్కడికి వచ్చాడు; అనినన్= అని వసుదేవుడు చెప్పగా; ఆ ధనంజయుండు= ఆ అర్జునుడు; తన మనంబు= తన మనసు; తల్లడపడన్= కలతపడగా; (ఇట్లా అడిగాడు); అధిప!= ఓ వసుదేవమహారాజా! ఆ+ముకుందుఁడు= ఆ శ్రీకృష్ణుడు; ఎచటికిన్= ఎక్కడికి; అరిగెన్?= వెళ్ళాడు?

**తాత్పర్యం:** ఇట్లా అర్జునుడు ఆలోచించాడు. అపుడు వసుదేవుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'యాదవులంతా మునుల శాపశక్తితో పుట్టిన భయంకరమైన ప్రకాశంచేత రోకళ్ళవలె అయిన తుంగపరకలతో మదించిన ప్రవృత్తితో ఒకరినొకరు చంపుకొన్నారు. ఇట్లా అందరూ చావగా కృష్ణుడు ఒక్కడే స్త్రీలను, ఏనుగులను, గుర్రాలను, రథాలను వెంటతీసికొని ఇక్కడికి వచ్చాడు' అని చెప్పగా, అర్జునుడి మనసు చాలా కలతపడింది. అప్పుడు వసుదేవుడిని ఇట్లా అడిగాడు 'రాజా! కృష్ణు డిప్పు డెక్కడా కనిపించడే! ఎక్కడికి వెళ్ళాడు?'

**క. అని యడిగిన వసుదేవుఁ డ। తని కిట్లను 'నట్లు వచ్చి దామోదరుఁడే**
**వనటం బొందుచు నుండఁగ। నను నూరార్చుటకుఁ గాఁగ నరవర! నాతోన్. 116**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా అర్జునుడు; అడిగినన్= అడుగగా; వసుదేవుఁడు; అతనికిన్= అతడితో; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; నరవర!= ఓ పురుషశ్రేష్ఠా! అర్జునా!; అట్లు= ఆ విధంగా; దామోదరుఁడు= శ్రీకృష్ణుడు; వచ్చి= ఇక్కడికి వచ్చి; ఏన్= నేను; వనటన్= దుఃఖం; పొందుచున్+ఉండఁగన్= అనుభవిస్తుంటే; ననున్= నన్ను; ఊరార్చుటకున్+కాఁగన్= ఓదార్చటానికై; నాతోన్= నాతో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఇట్లా అర్జునుడు అడుగగా వసుదేవు డిట్లా చెప్పాడు: 'ఆ విధంగా కృష్ణు డిక్కడికి వచ్చి నేను దుఃఖపడుతున్నందువలన ఓదార్చటానికై ఇట్లా అన్నాడు.' (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'విధివశంబునఁ జేసి వృష్ణిభోజాంధక। నాశంబు వాటిల్లె నరున కేను**
**జెప్పి పుచ్చినవాఁడ; నిప్పుడ యకౌర। వాగ్రణి యిప్పురి కరుగుదెంచు;**
**నీయెడ భక్తుండు నినుఁ గొల్చియుండెడుఁ। బనిచినపని యొనర్పంగ వలఁతి**
**యమ్మహాభుజుఁడు కార్యజ్ఞుండు శౌర్యస। మగ్రుండు విక్రమమహితుఁ డతఁడు'**

**ఆ. నాఁగ నే ననంగ నరనాథ! భేద మిం। చుకయు లేదు విడువు శోక మతనిఁ**
**జేతఁ బట్టి నీవు మాతంగతురగాది। కముల బంధుజనులఁ గాచికొనుము. 117**

**ప్రతిపదార్థం:** నరనాథ!= వసుదేవమహారాజా!; విధివశంబునన్+చేసి= విధివశంగా; వృష్ణి, భోజ, అంధక= వృష్ణిభోజాంధకుల; నాశంబు= నాశనం; పాటిల్లెన్= సంభవించింది; ఏను= నేను; నరునకున్= అర్జునుడికి; చెప్పిపుచ్చినవాఁడన్= చెప్పి పంపించాను; ఆ+కౌరవ+అగ్రణి= ఆ అర్జునుడు; ఇప్పుడు+అ= ఇప్పుడే (ఇంక కొద్ది కాలంలోనే); ఈ+పురికిన్= ఇక్కడికి; అరుగుదెంచున్= వస్తాడు; నీయెడన్= నీమీద; భక్తుండు= భక్తి గౌరవాలు ఉన్నవాడు; నినున్+కొల్చి+ఉండెడున్= నిన్ను సేవించుకొని ఉంటాడు; పనిచిన పని= నియమించిన పని; ఒనర్పంగన్= చేయటానికి; వలఁతి= సమర్థుడు; ఆ+మహాభుజుఁడు= ఆ మహాబాహుబలవంతుడు; కార్యజ్ఞుండు= చేయతగినది తెలిసినవాడు; శౌర్యసమగ్రుండు= సమగ్రమైన శౌర్యం కలవాడు; విక్రమమహితుఁడు= పరాక్రమవంతుడు; అతఁడు నాఁగన్= అతడని; నేను+అనఁగన్= నేనని; భేదము= తేడా; ఇంచుకయున్= కొంచెం కూడా; లేదు; శోకము విడువు= దుఃఖించవద్దు; అతనిన్= ఆ అర్జునుడిని; చేతన్+పట్టి= ఆధారంగా గ్రహించి (ఊతగా తీసికొని); నీవు;

మాతంగ తురగాదికములన్= ఏనుగులు, గుర్రాలు మొదలైనవాటిని; బంధుజనులన్= బంధువులను; కాచికొనుము= రక్షించుకొనుము.

**తాత్పర్యం:** రాజా! విధివశంగా వృష్ణి భోజాంధకులు నశించటం జరిగింది. నేను అర్జునుడికి చెప్పి పంపించాను. ఆ అర్జును డీపాటికి వస్తూనే ఉంటాడు. అతడికి నీమీద మంచి భక్తి ఉన్నది. శ్రద్ధతో నిన్ను సేవించుకొని ఉంటాడు. ఏ పని చేయుమని నియమించినా చేయటానికి సమర్థుడు, మంచి బాహుబలం ఉన్నవాడు. సమగ్రమైన శౌర్యం ఉన్న వాడు. పరాక్రమించే స్వభావం ఉన్నవాడు. నిజానికి అతడని, నేనని తేడా కొంచెం కూడా లేదు. అతడిని ఊతగా తీసికొని నీవు ఇక్కడ ఉన్న ఏనుగులను, గుర్రాలను, బంధువులను రక్షించుకొనుము.

**విశేషం:** తండ్రిని కుమారుడు 'తండ్రీ!' అని సంబోధించకుండా రాజా! అని సంబోధిస్తున్నాడు. శ్రీకృష్ణుడు యోగీశ్వరుడు. కాబట్టే భవబంధాలను చాలా లీలగా తొలగించుకొనగలిగాడు. ఈ పర్వంలోని కథలో ఎక్కడా శ్రీకృష్ణుడి మమకారం కనిపించదు. కూటస్థుడుగా ఉంటూ తక్కిన కథనంతా చూస్తున్నాడు. తన మృత్యువును కూడా అట్లాగే ఆహ్వానించబోతున్నాడు. అందుకే తండ్రితో 'రాజా! యాదవులు నశించారు. అర్జునుడికి చెప్పిపంపాను. అతడే మీకు రక్ష' అని చెప్పుతున్నాడు. అర్జునుడి పరాక్రమానికి మూడు విశేషణాలు చెప్పాడు. బాహుబలం, నిండు శౌర్యం, విక్రమించే స్వభావం. ఒక వ్యక్తిలోనే ఈ మూడూ సాధారణంగా ఉండవు. ఈ మూడూ ఉన్నవాడు కాబట్టే ఈ పనిని అర్జునుడికి కృష్ణుడు అప్పజెప్పాడు. మరో విశేషాన్ని సూచిస్తున్నాడు. అర్జునుడు నరుడు. కృష్ణుడు నారాయణుడు, నరనారాయణ మహర్షులకథ పూర్వపర్వాలలో ప్రస్తావించబడింది. వారి అవతారంగా ప్రభవించిన కృష్ణార్జునుల నడుమ తేడా ఏమీ లేదు. అందుకే కృష్ణుడు నిర్వహించవలసిన పనిని 'నరు'డికి అప్పగించి 'నారాయణుడు' తప్పుకొంటున్నా డన్నమాట. భారతకథలో అత్యంత విషాదం పొందినవాడు అర్జునుడే. యుద్ధంలో ఎవడు అమితాసక్తిని, అసామాన్య శక్తిని కలిగినవాడో ఆ అర్జునుడికే సకలబంధునాశం చూపే ప్రాప్తిని విధి కలిగించింది. కర్మయోగ సారాంశాన్ని అర్జునుడి చేతులద్వారా అర్థం చేసికొనవచ్చును. అదే యాదవుల కర్మకాండ అర్జునుడి చేతులమీదుగా జరగటంలోని ఆంతర్యం. ఈ పర్వకథలో అర్జునుడిలో కర్మనుండి జ్ఞానంవైపు ప్రస్థానం కనిపిస్తుంది.

**క. అతఁడు వనితలను బాలుర । నతిప్రయత్నమున నరసి యాపదఁ బాపున్**
**ధృతిసారమహిత! యంబుధి । కతిపయదినములను ముంపఁగల దిప్పురమున్. 118**

**ప్రతిపదార్థం:** ధృతిసారమహిత!= ధైర్యసంపదచేత గౌరవించబడినవాడా! (వసుదేవ మహారాజా!); అతఁడు= ఆ అర్జునుడు; వనితలనున్= స్త్రీలను; బాలురన్= పిల్లలను; అతి ప్రయత్నమునన్= మిక్కిలి శ్రద్ధతో; అరసి= చూచికొని; ఆపదన్+పాపున్= ఆపదను తొలగిస్తాడు; కతిపయదినములను= కొన్నిరోజులలోనే; అంబుధి= సముద్రం; ఈ+పురమున్= ఈ ద్వారకను; ముంపన్+కలదు= ముంచబోతున్నది.

**తాత్పర్యం:** ధైర్యసంపదచేత గౌరవించబడిన వసుదేవమహారాజా! వినుము. ఆ అర్జునుడు ఇక్కడున్న స్త్రీలను, పిల్లలను శ్రద్ధతో చూచికొని కాపాడుతాడు. అంతేకాదు. కొన్నిరోజులలోనే సముద్రం ఈ ద్వారకానగరాన్ని ముంచివేయబోతున్నది.

**విశేషం:** ముసలివాడు, ధైర్యాన్ని కోల్పోయినవాడు కాబట్టి వసుదేవుడికి ధైర్యం కలుగటానికి అన్నమాట కాదు 'ధృతిసారమహిత!' అన్న సంబోధన. కంసుడి బాధలను అనుభవించి, చెరసాలలో భార్యతో ఏళ్ళు గడిపి, కృష్ణుడి అవతారంకొరకు వేచి ఉండటంలోనే వసుదేవుడిలోని 'ధృతిసారం' ఉన్నది. చాలా సార్థకమైన సంబోధన ఇది.

**సీ.** **యాదవుల్ తమలోన నాహవం బొనరింప। కటమున్న బలదేవుఁ డడవి కరిగి**
**యత్యంత నియతిమై నధిక తపోవర్త। నంబునఁ దగిలియున్నాఁడు నాకు**
**నదియ యొప్పెడు తెరువై యుండుఁ గర్తవ్య। మిట్టిది; వేయును నేల? యింక**
**నొండు విచారంబు లుడిగి దయాలోల!। యనుమతి సేయు మప్పనికి నన్ను**

**తే.** **నా ధనంజయు చెప్పిన యట్ల సకల। కార్యజాతంబు నడపి నెగడు; మతండ**
**సమరమృత యాదవుల కెల్ల సముచిత ప్ర। కారమునఁ జేయు నగ్నిసంస్కార మనియె.** **119**

**ప్రతిపదార్థం:** యాదవుల్= యాదవులు; తమలోనన్= తమలో తాము; ఆహవంబు= యుద్ధం; ఒనరింపక+అట+మున్న= చేయటానికి ముందే; బలదేవుఁడు= బలరాముడు; అడవికిన్+అరిగి= అడవికి వెళ్ళిపోయి; అత్యంత= మిక్కిలి; నియతిమైన్= నిష్ఠతో; అధిక= అధికమైన (గాఢమైన); తపోవర్తనంబునన్= తపోవృత్తిలో; తగిలి+ఉన్నాఁడు= నిబద్ధుడై ఉన్నాడు; నాకున్= నాకు కూడా; అది+అ= అట్లా తపస్సు చేసికొనటమే; ఒప్పెడు= తగిన; తెరువు+ఐ= మార్గంగా; ఉండున్= ఉన్నది; కర్తవ్యము= చేయదగినది; ఇట్టిది= ఇట్లా ఉన్నది; వేయును ఏల?= అధికంగా చెప్పటానికి ఏమున్నది?; ఇంకన్= ఇక; ఒండు విచారంబులు+ఉడిగి= తక్కిన ఆలోచనలు మాని; దయాలోల!= ఓ దయామూర్తీ!; ఆ+పనికిన్= అట్లా తపస్సుచేసికొనటానికి; నన్నున్= నన్ను; అనుమతి+చేయుము= అనుమతించుము; ఆ ధనంజయుచెప్పిన+అట్ల= ఆ అర్జునుడు చెప్పినట్టుగా; సకలకార్యజాతంబు= అన్ని పనులనూ; నడపి= నిర్వహించి; నెగడుము= ప్రజలమన్నన పొందుము; అతండు+అ= ఆ అర్జునుడే; సమర= యుద్ధంలో; మృత= చనిపోయిన; యాదవులకున్+ఎల్లన్= యాదవులందరికీ; సముచిత ప్రకారమునన్= తగిన పద్ధతిలో; అగ్ని సంస్కారమున్= అగ్ని సంస్కారాన్ని; చేయును= చేస్తాడు; అనియెన్= అని చెప్పాడు.

**తాత్పర్యం:** 'యాదవులు తమలో తాము యుద్ధం చేయటానికి ముందే బలరాముడు అడవికి వెళ్ళిపోయి మిక్కిలి నిష్ఠలో గాఢమైన తపస్సులో నిబద్ధుడై ఉన్నాడు. నాకు కూడా అదే తగిన మార్గంగా కనిపిస్తున్నది. చేయదగినది ఇట్లా ఉన్నప్పుడు ఇక చెప్పటానికి ఏమున్నది? ఓ దయామూర్తీ! నీవు తక్కిన ఆలోచనలు మాని, కృపతో నేను తపస్సు చేసికొనటానికి అనుజ్ఞ ఇమ్ము. ఆ అర్జునుడు చెప్పినట్లుగా అన్ని పనులనూ నిర్వహించి, ప్రజలమన్నన పొందుము. ఆ అర్జునుడే యుద్ధంలో చనిపోయిన యాదవులందరికీ తగిన పద్ధతితో అగ్నిసంస్కారం చేస్తాడు' అని శ్రీకృష్ణుడు నాతో చెప్పాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడు యోగేశ్వరుడే అయినా, అవతార పురుషుడే అయినా పుత్రధర్మం ఏమిటో నిరూపిస్తున్నాడు. తల్లిదండ్రుల అనుమతి తీసికొన్నాకే కుమారుడు ఏ పనైనా మొదలుపెట్టాలి. తపస్సు చేసికొనటానికో, సన్న్యసించటానికో వారి అనుమతి కావాలి. అంతే కాకుండా కుమారుడిగా తాను చేయవలసిన మూడు పనులనుండి విరమణ పొందటానికి తండ్రి అనుజ్ఞ అవసరం. ఒకటి రాజ్యబాధ్యత. మరొకటి కుమారుడుగా తల్లిదండ్రులను చూచికొనటం - వీటన్నింటికంటె ముఖ్యమైనది. యాదవులకు ఉత్తరక్రియలు నిర్వహించటం. అందుకే అనుమతిని అర్థిస్తున్నాడు. అర్జునుడిని తన ప్రతినిధిగా ఉంచి, అతడిద్వారా చేయవలసిన పనులన్నీ చేయించుకొమ్మంటున్నాడు. అట్లా చేసి ప్రజల మన్నన పొందాలని కూడా చెప్పుతున్నాడు. పాలకుడు ఏది చేసినా ప్రజల మన్నన పొందేటట్లు ఉండాలి. ఈ ఘట్టమంతటా శ్రీకృష్ణుడి నిర్మమకారమే ప్రధానమైన అంశం. అందువలననే తాను చేయవలసిన తండ్రిగారి పరలోకవిధులు కూడా అర్జునుడే చేయబోతాడని కూడా తండ్రికి చెప్పి ఆయనను మానసికంగా సిద్ధంచేసి ఉంచాడు. ఇట్లాంటి సందర్భాలను భరించగలగటమే 'ధృతి' అంటే, ఇక్కడ చెప్పుతున్న కృష్ణుడు, విని భరించిన వసుదేవుడు, ఆ విధులు

నిబ్బరంగా నిర్వహించిన అర్జునుడు - ముగ్గురూ ధృతిమంతులే. భారతమహేతిహాసంలోని పాత్రల గాంభీర్యం ఇట్లాంటి సందర్భాలను బట్టి అర్థం చేసికొని, జీవితంలో వచ్చే అనూహ్యమైన సంఘటనలను ఎదుర్కొనటం మనం అభ్యసించవచ్చును.

**క. ఆతడు కాలాంతరమున । బ్రాఁతిగ భవదీయ భవ్యపరలోక విధుల్**
**చేతోగతి భక్తిపరి । స్ఫీతములుగఁ జేయు ననియుఁ జెప్పెఁ గుమారా! 120**

**ప్రతిపదార్థం:** కుమారా!= నాయనా!; అతఁడు= ఆ అర్జునుడే; కాల+అంతరమునన్= కొంతకాలం తరువాత; బ్రాఁతిగన్= ప్రీతితో (శ్రద్ధాసక్తులతో); భవదీయ= మీ; భవ్య= యోగ్యమైన; పరలోకవిధుల్= శ్రాద్ధకర్మలు; చేతస్+గతిన్= మనస్సే ప్రమాణంగా (మనఃపూర్వకంగా); భక్తి పరిస్ఫీతములుగన్= చక్కగా నిండిన భక్తితో; చేయున్= చేస్తాడు; అనియున్= అనికూడా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** నాయనా! ఇంతమాత్రమే కాదు. ఆ అర్జునుడే కొంతకాలం తరువాత శ్రద్ధాసక్తులతో మీకు యోగ్యమైన రీతిలో భక్తిశ్రద్ధలతో మనఃపూర్వకంగా శ్రాద్ధవిధులు కూడా నిర్వహిస్తాడని కూడా చెప్పాడు.

**విశేషం:** ఈ మాటను జాగ్రత్తగా వింటే హృదయవిదారకంగా ఉంటుంది. ఇక్కడ కుమారా! అన్న శబ్దం చాలా అర్థవంతమైనది. అర్జునుడు అల్లుడు. అయినా వసుదేవుడి కుటుంబానికి మగదిక్కుగా మిగిలాడు. అదే! ఈ సంబోధనలోని ఆంతర్యం.

**క. చెప్పిన నేను నొడంబడి । యప్పురుషోత్తముని నెమ్మి ననిచితి; నిట నీ**
**చెప్పిన యట్టులు సేయుట । యొప్పెనను గలదు నీకు నొక్కఁడు సెప్పన్. 121**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= అట్లా చెప్పగా; నేనున్= నేను కూడా; ఒడంబడి= అంగీకరించి; ఆ+పురుషోత్తమునిన్= ఆ కృష్ణుడిని; నెమ్మిన్= ప్రేమతో; అనిచితిన్= పంపాను; ఇటన్= ఇక్కడ; నీ చెప్పిన అట్టులు= నీవు చెప్పిన విధంగా; చేయుట= చేయటం; ఒప్పు+ఐనను= తగిందే అయినా; నీకున్= నీకు; చెప్పన్= చెప్పటానికీ; ఒక్కఁడు= ఒక విషయం; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** అట్లా కృష్ణుడు చెప్పగా నేనుకూడా అంగీకరించి, ప్రేమతో సాగనంపాను. ఇప్పుడు నీవు వచ్చావు. నీవు చెప్పినట్టు చేయటం తగినపనే అయినా నేను నీకు చెప్పవలసిన విషయం ఒకటి ఉన్నది.

**ఉ. పీనుఁగు పెంటగాఁ బడిన బిడ్డల నెల్లఁ దలంచు టెప్పుడున్**
**మానఁగ రామి తెల్ల; మిది మానసముం గలఁగింప నన్నమున్**
**బానము నెమ్మెయిన్ రుచికిఁ బట్టగునట్లును గాక యిద్దెసం**
**దాను సహించి యేమిగతిఁ దావుకొనున్ మెయిఁబ్రాణ మర్జునా! 122**

**ప్రతిపదార్థం:** అర్జునా!= నాయనా అర్జునా! (ఏం చెప్పమంటావు?); పీనుఁగుపెంటగాన్= పీనుగుల కుప్పగా; పడిన= చచ్చిన; బిడ్డలన్+ఎల్లన్= పిల్లలనందరనూ; తలంచుట= తలచుకొనటం; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; మానఁగరామి= మానకపోవటం; తెల్లము= నిస్సంశయంగా; ఇది= ఈ బాధే; మానసమున్+కలఁగింపన్= మనసును కలచివేస్తుండగా; అన్నమున్= అన్నమూ; పానమున్= నీళ్ళు; ఏ+మెయిన్= ఏ విధంగానూ; రుచికిన్= రుచికి; పట్టు+అగునట్లును గాక= రుచికి ఆశ్రయాలు కాకపోగా; ఈ+దెసన్= ఈ రీతిగా; తానుసహించి= తాను భరించి; ప్రాణము= ప్రాణం; మెయిన్= దేహంలో; ఏమి గతిన్= ఏ విధంగా; తావుకొనున్?= నిలదొక్కుకొనగలదు?

**తాత్పర్యం:** నాయనా అర్జునా! ఏం చెప్పమంటావు? సంతానమంతా ఒక్కసారిగా చనిపోయి, పీనుగుల కుప్పగా అయిపోతే వారిని ఎడతెగకుండా తలచుకొని తలచుకొని ఆ శోకం మానలేక ఆ బాధే మనసును కలచివేస్తుండగా అన్నమూ, నీళ్ళూ కూడా సహించటం లేదు. ఈ బాధను ఇట్లా భరిస్తూ ఈ దేహంలో ప్రాణం మాత్రం తాను ఎట్లా నిలదొక్కుకొనగలదు? చెప్పుము.

**క.** **ఈ వనితలఁ బ్రజలను దం। తావళముఖవస్తువులను దగు చందమునన్**
**నీ వరసికొనుము బాహు। శ్రీ విశ్రుత! కృష్ణుపనుపు సెల్లింపవనా!" 123**

**ప్రతిపదార్థం:** బాహుశ్రీవిశ్రుత!= బాహుబలసంపద చేత ప్రసిద్ధి పొందిన అర్జునా!; ఈ వనితలన్= ఈ యాదవ వనితలను; ప్రజలను= పిల్లలను; దంతావళముఖ= ఏనుగులు మొదలైన; వస్తువులను= వస్తుసంపదను; తగుచందమునన్= తగినరీతిగా; నీవు+అరసికొనుము= నీవు జాగ్రత్తగా చూచుకొమ్ము; కృష్ణుపనుపు= కృష్ణుడి ఆజ్ఞను; చెల్లింపవు+అనా!= చెల్లింపవయ్యా!

**తాత్పర్యం:** అర్జునా! నీ బాహుబలం సుప్రసిద్ధం. నీవు చేయలేని పనిలేదు. ఈ యాదవస్త్రీలను, బిడ్డలను, ఏనుగులు, గుర్రాలు మొదలైన వస్తుసంపదను తగిన పద్ధతిలో జాగ్రత్తగా చూచికొమ్ము. ఆ విధంగా కృష్ణుడు నీపై మోపిన పనిని నిర్వహించి ఆయన ఆజ్ఞను పాలించు నాయనా!'

**సీ.** **అన విని ఫల్గునుం డా వృష్ణిపతి హృద। యము దేహనిరపేక్షమగు టెఱింగి**
**డెందంబు నెవ్వగఁ బొంద నిమ్మేదినీ। రమణుతోఁ 'గృష్ణ విరహితమైన**
**యిద్దేశమున వసియింపంగ నాకుఁ జి। త్తము గొల్పునే? ధర్మతనయ భీము**
**లును నేను మాద్రినందనులును బాంచాలి। యును నేకచిత్తుల మనఘ! వినుము**

**తే.** **ధర్మతనయుఁ డిక్కార్యంబు దలఁచి మున్న। నిశ్చయించి బాలకులను నెలఁత పిండుఁ**
**దగుధనమును నింద్రప్రస్థ నగరమునకుఁ। జేర్పవలయుట మాకెల్లఁ జెప్పినాఁడు. 124**

**ప్రతిపదార్థం:** అనన్= అని వసుదేవుడనగా; విని= విన్నవాడై; ఫల్గునుండు= అర్జునుడు; ఆ వృష్ణిపతి= ఆ వసుదేవుడి; హృదయము= అంతరంగం; దేహనిరపేక్షము+అగుట= దేహమమతతో సంబంధంలేనిది కావటం; ఎఱింగి= గుర్తించి; డెందంబు= అతడి హృదయం; నెఱ+వగన్= నిండుబాధను; పొందన్= పొందగా; ఈ+మేదినీరమణుతోన్= ఈ రాజుతో (వసుదేవుడితో); కృష్ణ విరహితమైన= కృష్ణుడు లేని; ఈ+దేశమునన్= ఈ దేశంలో; వసియింపఁగన్= నివసించటానికి; నాకున్= నాకు; చిత్తము+కొల్పునే?= మనసు వస్తుందా! (అని ఆలోచించినవాడై); అనఘ!= ఓ పాపరహిత రాజా!; వినుము; ధర్మతనయ= ధర్మరాజు; భీములును= భీముడు; నేనున్= అర్జునుడనైన నేను; మాద్రినందనులునున్= నకుల సహదేవులూ; పాంచాలియునున్= ద్రౌపదీ; ఏకచిత్తులము= ఒకే అభిప్రాయం ఉన్నవాళ్ళం; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ఈ+కార్యంబున్= ఈ పనిని గురించి; తలఁచి= ఆలోచించి; మున్ను+అ= ముందుగానే; నిశ్చయించి= ఒక నిర్ణయం చేసికొని; బాలకులనున్= పిల్లలను; నెలఁతపిండున్= ఆడవారినీ; తగు ధనమునన్= కావలసినంత ధనాన్నీ; ఇంద్రప్రస్థనగరమునకున్= ఇంద్రప్రస్థ పట్టణానికి; చేర్పవలయుటన్= చేర్చటాన్ని గురించి; మాకున్+ఎల్లన్= మా అందరికీ; చెప్పినాఁడు= చెప్పాడు.

**తాత్పర్యం:** అని వసుదేవు డనగా అర్జునుడు విని, ఆ వసుదేవుడి అంతరంగంలో దేహంమీది మమత పోవటాన్ని గుర్తించి, హృదయంలో నిండు బాధ కలుగగా, 'ఈ వసుదేవుడితో కృష్ణుడు లేని ఈ ద్వారకలో ఉండటానికి నాకు మనసు వస్తుందా!' అని ఆలోచించినవాడై, ఆ రాజుతో 'ఓ పుణ్యాత్మా! వినుము. ధర్మజ, భీమ, నకుల, సహదేవులూ, ద్రౌపదీ నేనూ - మేమందరం ఒకే అభిప్రాయం ఉన్నవాళ్ళం. ధర్మరాజు ఈ పనిని గురించి ఆలోచించి ముందుగానే ఒక నిర్ణయం చేసికొని, పిల్లలనూ, ఆడవారినీ, కావలసినంత ధనాన్నీ ఇంద్రప్రస్థపట్టణానికి చేర్చటాన్ని గురించి మా అందరికీ చెప్పాడు.

**ఉ. కావున నప్పురంబున సుఖస్థితి నుండెడు నట్లు గాఁగఁ బృ**
**థ్వీవర! సంప్రయత్నమున వీరల నందఱ నంద పెట్టెదన్**
**నీవు పురస్సరుండవయి నెమ్మిఁ జనం గొనిపోయెదన్ భవ**
**ద్భావము నుమ్మలంబుఁ బెడఁబాపుము; తప్పునె దైవకృత్యముల్?' 125**

**ప్రతిపదార్థం:** పృథ్వీవర!= ఓ రాజా!; కావునన్= కాబట్టి; ఆ పురంబునన్= ఇంద్రప్రస్థంలో; సుఖస్థితిన్= సుఖంగా; ఉండెడు+అట్లు+కాఁగన్= ఉండేలా; సంప్రయత్నమునన్= చాలా జాగ్రత్తగా; వీరలన్+అందఱన్= వీరినందరనూ; అందున్+అ= ఆ ఇంద్రప్రస్థ నగరంలోనే; పెట్టెదన్= ఉంచుతాను; నీవు; పురస్సరుండవు+అయి= ముందున్నవాడవై; నెమ్మిన్= ప్రేమతో; చనన్= బయలుదేరగా; కొనిపోయెదన్= తీసికొనిపోతాను; భవత్= నీ; భావమున్= ఆలోచనను; ఉమ్మలంబున్= దుఃఖాన్ని; పెడన్+పాపుము= వదలిపెట్టుము; దైవకృత్యముల్= దేవుడి పనులు; తప్పునె?= తప్పుతాయా?

**తాత్పర్యం:** రాజా! అందువలన ఇంద్రప్రస్థపురంలో వారంతా సుఖంగా ఉండేటట్లు నేను చాలా జాగ్రత్తగా అందరినీ అక్కడికి చేరుస్తాను. నీవు అందరికంటె ముందు బయలుదేరగా నీ వెంట వారందరనూ తీసికొనిపోతాను. నీ ఆలోచనను, దుఃఖాన్ని వదలిపెట్టుము. దేవుడి పనులు తప్పటం అంటూ ఉంటుందా!'

**విశేషం:** భావ మంటే తలపు - వసుదేవుడి ఆలోచనలోని మమకారం చేత ఈ దుఃఖం కలుగుతోందని అర్జునుడు గుర్తించే ఇదంతా దైవచేష్ట అని రాజుకు ధైర్యం కలిగిస్తున్నాడు. మరి భగవద్గీతను కృష్ణుడి నోటినుండి స్వయంగా విన్నవాడు కదా!

**క. అని పలికి దారుకునిఁ గనుఁ। గొని యాతని చిత్తవృత్తి గుందుట బుద్ధిం**
**గని యిట్లనుఁ 'గృష్ణుని పో। యిన వంక నెఱింగి పోద మేనును నీవున్. 126**

**ప్రతిపదార్థం:** అని= అని ఈ విధంగా; పలికి= వసుదేవుడితో చెప్పి; దారుకునిన్= దారుకుడిని; కనుఁగొని= చూచి; ఆతని చిత్తవృత్తి= అతని మనోవ్యాపారం; కుందుట= క్రుంగిపోవటాన్ని; బుద్ధిన్= ఊహతో; కని= గుర్తించి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; కృష్ణుని పోయిన వంకన్= కృష్ణుడు వెళ్ళినదారిని; ఎఱింగి= గుర్తిస్తూ; ఏనునున్= నేనూ; నీవున్= నీవూ; పోదము= పోదాము.

**తాత్పర్యం:** వసుదేవుడితో ఇట్లా చెప్పి, దారుకుడివైపు అర్జునుడు చూచాడు. ఆ దారుకుడి మనసు కూడా బాధతో క్రుంగిపోయి ఉండటాన్ని గమనించి ఇట్లా అన్నాడు; 'నీవూ నేనూ కృష్ణుడు వెళ్ళినదారిని గమనిస్తూ పోదాము'.

ఉ. ఇచ్చటి కార్యముల్ నడపుఁ డిట్లని నెమ్మి నమాత్యకోటికిం
బొచ్చెము లేక చెప్పి మఱి వోవుట యుక్తము నిల్చి వారలం
దెచ్చుట కీవ పొ' మ్మనిన దిగ్గన నాతఁడు వోయి యందఱం
దెచ్చె సుధర్మ యన్సభకు దేవపతిప్రియసూనుఁ డుండఁగన్. 127

**ప్రతిపదార్థం:** ఇచ్చటి కార్యముల్= ఇక్కడి పనులు; ఇట్లు= ఈ విధంగా; నడపుఁడు+అని= నడపండి అని; నెమ్మిన్= నెమ్మదిగా; పొచ్చెము లేక= ఏ దాపరికమూ లేకుండా; అమాత్యకోటికిన్= మంత్రివర్గానికి; చెప్పి= బాగా చెప్పి; మఱి+పోవుట= మరీ వెళ్ళటం; యుక్తము= అర్హమైన పని; వారలన్= వారందరినీ; నిల్చితెచ్చుటకున్= ఒకచోట చేర్చి తీసికొనిరావటానికి; ఈవు+అ= నీవే; పొమ్ము+అనినన్= వెళ్ళు అని చెప్పగా; దిగ్గనన్= వెనువెంటనే; అతఁడు= ఆ దారుకుడు; పోయి= వెళ్ళి; అందఱన్= ఆ మంత్రులందరినీ; సుధర్మ+అన్+సభకున్= సుధర్మ అని పేరున్న ఆ రాజసభకు; దేవపతి= ఇంద్రుడి; ప్రియసూనుఁడు= ప్రియ కుమారుడైన అర్జునుడు; ఉండఁగన్= ఆ సభలో ఉండగా; తెచ్చెన్= పిలుచుకొని వచ్చాడు.

**తాత్పర్యం:** ఇక్కడి పనులు ఇట్లా చేయండి - అని కొంత ఆగి వీళ్ళకు నెమ్మదిగా ఏ దాపరికమూ లేకుండా చెప్పిపోవటం తగినపని, అందుచేత నీవు వాళ్ళనందరినీ ఒకచోట చేర్చి తీసికొని రమ్మ' అని దారుకుడితో అర్జునుడన్నాడు. ఉన్నవాడున్నట్లుగా దారుకుడు వెళ్ళి ఆ మంత్రులందరినీ 'సుధర్మ' అనే పేరున్న ఆ రాజసభలో అర్జునుడుండగా అక్కడికి తీసికొనివచ్చాడు.

**విశేషం:** ఇంద్రుడి ధర్మాసనానికి 'ధర్మం' అని పేరు. వసుదేవుడి సభకు కూడా అదే పేరు ఉన్నదన్నమాట. ఇంద్రకుమారు డన్న మాట 'సుధర్మ' ఇంద్రుడి సింహాసనమన్న మాటను గుర్తు చేస్తుంది. భాగవతంలో " సుధర్మామధ్యపీఠంబునందున్నాడా బలభద్రుగూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్ అనే ప్రయోగముంది.

సీ. అమ్మండపమ్మున కరిగిన యమ్మంత్రి। వర్యు లక్కౌరవ వంశవర్యు
వినయ మారఁగఁ బరివేష్టించి రమ్మహి। తాత్ముండుఁ గరమును నార్ద్రుఁ డగుచు
గారవంబున వారి గలయఁ గనుంగొని। యంతరంగంబు శోకాగ్ని నెరియ
వారలతో నిప్డు పౌరజనంబుల। నెల్లను బిలిపింపుఁ డేను మీకు.

తే. వారికిని నెఱిఁగింపంగ వలయునట్టి। పనులు గలవని చెప్పిన విని రయమున
వారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు। లాదిగాఁ బ్రజ రావించి రధిపముఖ్య! 128

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య!= ఓ రాజశ్రేష్ఠుడా!; ఆ+మండపమ్మునకున్+అరిగిన= ఆ మండపానికి వెళ్ళిన; ఆ+మంత్రివర్యులు= ఆ మంత్రిశ్రేష్ఠులు; ఆ+కౌరవ వంశవర్యున్= ఆ కౌరవవంశశ్రేష్ఠుడైన అర్జునుడిని; వినయము+ఆరఁగన్= వినయం నిండగా; పరివేష్టించిరి= సమీపించి చుట్టూకూర్చున్నారు; ఆ+మహితాత్ముండు= ఆ అర్జునుడు; కరమునున్= మిక్కిలి; ఆర్ద్రుఁడు+అగుచున్= కరిగిపోయినవాడై; గారవంబునన్= గౌరవంతో; వారిన్+కలయన్+కనుంగొని= వారినందరినీ చూచి; అంతరంగంబు= తన హృదయం; శోక+అగ్నిన్= శోకాగ్నిలో; ఎరియన్= మండుతుండగా; వారలతోన్= వారితో; ఇప్డు= ఇప్పుడే; పౌరజనంబులన్+ఎల్లను= ద్వారకావాసులందరినీ; పిలిపింపుఁడు= పిలిపించండి; ఏను= నేను; మీకున్+వారికిన్= మీకూ వారికీ; ఎఱిఁగింపంగన్+వలయు+అట్టి= తెలుపవలసిన (చెప్పవలసిన); పనులు+కలవని= పనులున్నాయని; చెప్పినన్= చెప్పగా; విని= విన్నవారై; రయమునన్= వేగంగా;

వారు= ఆ మంత్రులు; బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులు+ఆదిగాన్= బ్రాహ్మణక్షత్రియాది అష్టాదశవర్గీయులుగా ఉన్న; ప్రజన్= జనులనందరినీ; రావించిరి= రప్పించారు.

**తాత్పర్యం:** ఓ రాజా! వినుము. అట్లా ఆ మంటపానికి వెళ్ళిన ఆ మంత్రులు అర్జునుడిని వినయంతో సమీపించి చుట్టూకూర్చున్నారు. అతిదీనంగా కనిపిస్తున్న వారిని చూడగానే అర్జునుడు కరిగిపోయాడు. వారిని చాలా గౌరవంతో సంభావించి, అందరినీ చూచి, తన హృదయం శోకాగ్నిలో మండిపోతుండగా 'ఇప్పుడే ద్వారకావాసులందరినీ పిలిపించండి. వారికి, మీకు చెప్పవలసిన పనులున్నా'యని అన్నాడు. ఆ మాటలు విని వారు బ్రాహ్మణక్షత్రియాది వర్గాల వారిని అందరినీ రప్పించారు.

**విశేషం:** చతుర్వర్గాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులన్న పరిగణనం ప్రాధాన్యదృష్టితోనే కాని, 18 వర్గాలవారు గ్రామ బాధ్యతలను పంచుకొనేవారు. ఈ సందర్భంలో వారందరూ వచ్చారని అర్థం. భిన్నవృత్తులవారందరికీ గ్రామసభలో ప్రాతినిధ్యం ఉండేది.

**తే.. అరుగుదెంచి యా ప్రజ లుచితాసనమున। నున్న యయ్యింద్రనందనుఁ గన్న నతఁడు**
**గరము నెమ్మి నయ్యందఱఁ గలయఁ జూచి। యిట్లనియె మోమునను దైన్య మెసకమెసఁగ. 129**

**ప్రతిపదార్థం:** ఆ ప్రజలు= ఆ జనులందరూ; అరుగుదెంచి= వచ్చి; ఉచిత+ఆసనమునన్= తనకు తగిన ఆసనంలో (సింహాసనంమీద); ఉన్న= కూర్చున్నటువంటి; ఆ+ఇంద్రనందనున్= ఆ అర్జునుడిని; కన్నన్= చూడగా; అతఁడు= అర్జునుడు; కరము= మిక్కిలి; నెమ్మిన్= ప్రేమతో; ఆ+అందఱన్= వారందరినీ; కలయన్+చూచి= పరికించి చూచి; మోమునను= ముఖంలో; దైన్యము= దీనభావం; ఎసకము+ఎసఁగన్= నిండుకొనగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అన్ని వర్గాల ప్రజలూ వచ్చి సింహాసనంమీద కూర్చుని ఉన్న అర్జునుడిని చూచారు. అర్జునుడికి వారిని చూడగానే ఎక్కడలేని అభిమానమూ కలిగింది. కాని, ముఖంలో దైన్యం తాండవిస్తోంది. అందరినీ పరికించి చూచాడు. వారితో ఇట్లా అన్నాడు.

**క. 'వననిధి నేఁటికి నేడవు। దినమున నిప్పురము ముంచు దివిజులు గగనం**
**బుననుండి చెప్పఁగా నే। వినినది యిది వెడలవలయు వేగమ మనకున్. 130**

**ప్రతిపదార్థం:** నేఁటికిన్= ఈ రోజుకు; ఏడు+అవు= ఏడవ; దినమునన్= రోజున; వననిధి= సముద్రం; ఈ+పురమున్= ఈ ద్వారకను; ముంచున్= ముంచుతుంది; (ఈ విషయం); గగనంబుననుండి= ఆకాశంలోనుండి; దివిజులు= దేవతలు; చెప్పఁగాన్= చెప్పగా; నే+వినినది= నేను విన్నది; మనకున్= మనం; వేగము+అ= వెనువెంటనే; ఇది= ఈ ద్వారకను; వెడలవలయున్= వదలివేయాలి.

**తాత్పర్యం:** 'ఈ రోజుకు ఏడవరోజున సముద్రం ఈ ద్వారకను ముంచుతుందని దేవతలు ఆకసంలోనుండి చెప్పగా విన్నాను. అందుచేత మనం వెనువెంటనే ఈ నగరాన్ని వదలి బయటకు వెళ్ళిపోవాలి.

**విశేషం:** సముద్రం ద్వారకను కొన్నిరోజులలో ముంచివేస్తుందన్న విషయం వసుదేవుడికి కృష్ణుడు చెప్పగా విన్నవాడు అర్జునుడు. కాని అట్లా చెప్పకుండా తాను దేవతలద్వారా విన్నానని చెప్పటంలో రాజనీతి ఉన్నది. అర్జునుడి కార్యదక్షతను ప్రస్ఫుటం చేసే

సందర్భ మిది. ఈ విషయం తెలిసీ కృష్ణుడు ఎట్లా వెళ్ళిపోయాడన్న భావం ప్రజలకు కలుగకుండా అర్జునుడు ఈ వార్తను తనదిగా చేసి చెప్పటంలో ఈ రహస్యమున్నది.

**క. వినుఁ డింద్రప్రస్థపురం। బునకు నధీశుఁడుగ వజ్రుఁ బోఁడిమితో నే**
**నునిచెద మీరెల్ల నతఁడు। మనుపంగాఁ దొంటి యట్ల మనుఁ డచ్చోటన్. 131**

**ప్రతిపదార్థం:** వినుఁడు (పై కారణంచేత ఇట్లా చేయాలనుకొంటున్నాను) మీరందరూ సావధానంగా వినండి; ఇంద్రప్రస్థపురంబునకున్= ఇంద్రప్రస్థానికి; అధీశుఁడుగన్= పాలకుడిగా; వజ్రున్= వజ్రుడిని; పోఁడిమితోన్= ఆదరంతో; నేను+ ఉనిచెదన్= నేను నియమిస్తాను; అతఁడు= ఆ వజ్రుడు; మనుపంగాన్= రక్షింపగా; మీరెల్లన్= మీరంతా; తొంటి+అట్ల= మునుపటివలెనే; ఆ+చోటన్= ఆ ఇంద్రప్రస్థనగరంలో; మనుఁడు= హాయిగా ఉండండి.

**తాత్పర్యం:** జాగ్రత్తగా వినండి. ఇంద్రప్రస్థనగరానికి వజ్రుడిని రాజుగా అభిషేకిస్తాను. అతడి రక్షణలో మీరందరూ ముందటివలెనే సుఖంగా బ్రతకండి.

**క. సరకులు భారవహులకును। భరియింపఁగఁ గొలఁది యయిన భంగిని మోపుల్**
**వెరవు పడఁగఁ గట్టుఁడు చె। చ్చెర శకటము లాయితంబు సేయుఁడు మీరల్. 132**

**ప్రతిపదార్థం:** మీరల్= మీరందరూ; సరకులు= సామాన్లు; భారవహులకున్= మోసేవారికి; భరియింపఁగన్= మోయటానికి; కొలఁది+అయిన+భంగిని= వీలయ్యేరీతిలో; మోపుల్= మూటలు; వెరవుపడఁగన్= అనుకూల మయ్యేటట్లు; కట్టుఁడు= కట్టండి; చెచ్చెరన్= త్వరితంగా; శకటములు= బండ్లు; ఆయితంబు+చేయుఁడు= సిద్ధం చెయ్యండి.

**తాత్పర్యం:** మీమీ ఇండ్లలోని సామానులను మోసేవారికి అనువైన రీతిలో వేరువేరుగా మూటలుగా కట్టండి. స్త్రీలు, బాలకులు, వృద్ధులు ప్రయాణం చెయ్యటానికి బండ్లనుకూడా సిద్ధం చెయ్యండి.

**ఆ. వాహనములు వానివాని ముట్టులు నొక్క। వంకగా నొనర్చి వలసినపుడ**
**కట్టి వెడలిపోవునట్టి తెఱంగున। కనువు గాఁగఁ జేసికొనుఁడు వేగ. 133**

**ప్రతిపదార్థం:** వాహనములు= బండ్లను; వానివాని ముట్టులు= వాటికి కావాల్సిన ఇతర పనిముట్లను; ఒక్కవంకగాన్= ఒకవైపుగా; ఒనర్చి= సిద్ధంచేసికొని; వలసిన+అపుడు+అ= అవసరమైనప్పుడే; కట్టి= కట్టుకొని; వెడలిపోవునట్టి= వెళ్ళిపోయే; తెఱంగునకున్= విధానికి; అనువు+కాఁగన్= వీలు అయ్యేటట్లు; వేగన్= తొందరగా; చేసికొనుఁడు= తయారు చేసికొనండి.

**తాత్పర్యం:** బండ్లను, వాటివాటి పనిముట్లను సేకరించి ఒకవైపుగా ఉంచుకొనండి. ఎప్పుడు అవసరమైతే అప్పుడే కట్టుకొని వెళ్ళిపోయే పద్ధతికి వీలు అయ్యేటట్లు తొందరగా అన్నిటినీ సమకూర్చుకొనండి.

**విశేషం:** ప్రాకృతికమైన ఉపద్రవం సంభవిస్తుందని తెలిసినపుడు ప్రభుత్వం ప్రజాసామాన్యుల జీవితాన్ని కాపాడటానికి ఎట్లాంటి చర్యలు తీసికొనాలో, వారు తమతమ వస్తువులతో ఎట్లా ప్రమాదస్థలంనుండి బయటపడేటట్లు సూచించాలో ఈ పద్యం చక్కగా సూచిస్తున్నది. అది ఉప్పెన అయినా, భూకంపమయినా జనులు ఇట్లాగే జాగ్రత్త పడాలి.

**క. ఈ దేశముప్రజ ధర్మజు । నాదరసంభావనముల నాజ్ఞానిరతిన్**
**యాదవవీరుల కలనాఁ । డేది తెఱం గట్టి మనికి యెసకం బారున్.' 134**

**ప్రతిపదార్థం:** ఈ దేశముప్రజ= ఈ ద్వారకా వాసులంతా; ధర్మజు= ధర్మరాజుయొక్క; ఆదర= ఆదరంవలన; సంభావనములన్= సమ్మానములచేత; ఆజ్ఞానిరతిన్= పాలనలోని ఆసక్తిచేత; యాదవవీరులకున్= యాదవులకు; అలనాఁడు= అప్పుడు; ఏది తెఱంగు= ఎట్లా ఉండేదో; అట్టి మనికి= అట్లాంటి జీవనం; ఎసకంబు+ఆరున్= అతిశయంగా పొందుతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ ద్వారకావాసులపై చూపే ఆదరంచేత, చేసే సమ్మానంచేత, అతడి పాలనలోని ఆసక్తిచేత, ఒకనాడు ఏ విధంగా యాదవవీరులు వైభవోపేతంగా బ్రతికారో అట్లాంటి జీవనాన్ని మరలా పొందుతారు.

**విశేషం:** ద్వారకావాసులు వృష్ణిభోజాంధకవర్గాలకు చెందిన గ్రామీణసంస్కృతి కలవారు. మీదుమిక్కిలి తెగ జీవితానికి అలవాటుపడ్డవారు. అందుకే వారు సులభంగా ఏ ఇతరులనూ నమ్మరు. రాజప్రతినిధిగా కృష్ణుడి బంధువుగా అర్జునుడు ఈ 'భరోసా' కలిగించి, వారిలో ఆత్మవిశ్వాసం నింపుతున్నాడు. అందుకే కృష్ణుడు అర్జునుడి భుజాలపై ఈ క్లిష్టమైన భారాన్ని మోపాడు.

**క. అని చెప్పి పురజనులఁ బోఁ । బనిచి సచివకోటితో నిభములాదిగ వా**
**హనముల సవరణ బెరయం । గొనిరాఁదగిన పరిచారకుల మునుముట్టన్. 135**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వారికి చెప్పి; పురజనులన్+పోన్+పనిచి= పురవాసులను పంపించివేసి; సచివకోటితోన్= మంత్రులతో (ఇట్లా అన్నాడు); ఇభములు+ఆదిగన్= ఏనుగులు మొదలైనవాటిని; వాహనములన్= రథాదులను; సవరణ= సిద్ధం; బెరయన్+ కొనిరాన్+తగిన= చేసి తీసికొనిరాగలిగిన; పరిచారకులన్= సేవకులను; మునుముట్టన్= తొలుత.

**తాత్పర్యం:** ఇట్లా వారితో చెప్పి పురప్రజలను పంపించివేసి, మంత్రులను ఇట్లా పురమాయించాడు: 'ఏనుగులు, గుర్రాలు మొదలైనవాటిని, పరికరాలతో కూడిన రథాలను సిద్ధం చేసి తీసికొనిరాగలిగిన సేవకులను తొలుత (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నియమింపుఁడు నగరి సరుకు । లయినవి యిట్టిట్టి భంగి నక్షీణములై**
**యెయిదంగలవారలఁ గని । పయనము తెఱఁగు సమకట్టుపని మఱవకుఁడీ. 136**

**ప్రతిపదార్థం:** నియమింపుఁడు= నియమించండి; నగరి సరుకులు= నగరికి సంబంధించిన సంభారాలను; అయినవి= ఆయా దినుసులకు చెందినవి; ఇట్టి+ఇట్టి+భంగిన్= ఇవి ఇవి ఇంతింత తీసికొనివెళ్ళాలి (అని తెలిసి); అక్షీణములు+ఐ= తరగకుండా; ఎయిదన్+కలవారలన్+కని= ఇంద్రప్రస్థానికి చేరేదాకా సాగించగలవారిని చూచి; పయనము తెఱఁగు= ప్రయాణం చేసే విధానాన్ని; సమకట్టుపని= నియమించే పనిని; మఱవకుఁడీ= మరవకండి.

**తాత్పర్యం:** నియమించండి. నగరికి సంబంధించిన సంభారాలను వేటివేటిని ఎంతెంత తీసికొనివెళ్ళాలో, ప్రయాణానికంతా సరిపడేటట్లు తగ్గకుండా, ఇంద్రప్రస్థానికి చేరేవరకూ సాగించగలవారిని గుర్తించి, ప్రయాణం చేసే విధానాన్ని నియమించే పనిని మరువవద్దు.

**విశేషం:** ఇట్లా బండ్లమీద సంభారాలను సాగించేవారిని ఆ రోజులలో 'సార్థవాహులు' అనేవారు. వారే ఆనాడు సుదూర ప్రాంతాలకు చాలా సామగ్రీ, సంభారాలు చేర్చేవారు. వారిలో ఉత్తమసార్థవాహులను నియమించటం, ప్రయాణం చేసేవిధానం - అంటే ఎక్కడెక్కడ ఆగాలో, విశ్రాంతి తీసికొనాలో, మొత్తం కార్యక్రమ నిర్దేశమన్నమాట.

**క. సుందరులకు బాలురకును। నందలములు వేసడములు నాయితములుగాఁ**
**గందక కుందక చనువిధ। మొందఁగ సమకట్టుఁ డెడలకుండుఁడు తాల్మిన్. 137**

**ప్రతిపదార్థం:** సుందరి+లు= సుందరులు+కున్= స్త్రీలకు; బాలురకునున్= బాలబాలికలను; అందలములు= పల్లకీలు; వేసడములు= కంచరగాడిదలు; ఆయితములుగాన్= సిద్ధంగా ఉంచి (వారు); కందక= అలసిపోకుండా; కుందక= బాధపడకుండా; చనువిధము+ఒందఁగన్= ప్రయాణించే పద్ధతి ఉండేటట్లు; సమకట్టుఁడు= ఏర్పాటు చేయండి; తాల్మిన్= ఓర్పును; ఎడలక+ఉండుఁడు= పోగొట్టుకోకుండా ఉండండి.

**తాత్పర్యం:** స్త్రీలకు, బాలబాలికలకు (పిల్లలకు) పల్లకీలు, కంచరగాడిదలను సిద్ధంగా ఉంచి, వారు అలసిపోకుండా బాధపడకుండా ప్రయాణం చేయటానికి ఏర్పాటు చేయండి. మీరెవ్వరూ ఓర్పును పోగొట్టుకొని హైరానా పడకండి.

**తే. గతము లయిన కార్యంబులు గ్రమ్మఱింప। రాదుగాని మనకు ధర్మరాజు గలఁడు**
**శేషజనరక్ష కొడయనిఁ జేయవచ్చు। వాసుదేవుని మనుమని వజ్రదేవు.' 138**

**ప్రతిపదార్థం:** గతములు+అయిన= జరిగిపోయిన; కార్యంబులు= పనులను; క్రమ్మఱింపన్+రాదు= మరల్చటానికి కాదు; కాని= అయినా; మనకున్= మనలను ఆదుకొనటానికి; ధర్మరాజు= ధర్మరాజు (చక్రవర్తి); కలఁడు= ఉన్నాడు; వాసుదేవుని మనుమనిన్= వాసుదేవుడి (కృష్ణుడి) మనుమడైన; వజ్రదేవున్= వజ్రుని; శేషజనరక్షకున్= మిగిలిన జనులను కాపాడటానికి; ఒడయనిన్= రాజుగా; చేయవచ్చున్= నియమించవచ్చును.

**తాత్పర్యం:** జరిగిపోయిన పనులను మరల్చటానికి సాధ్యంకాదు. (అంటే పోయిన యాదవప్రముఖులు తిరిగిరారు అని అర్థం). అయినా చక్రవర్తి అయిన ధర్మరాజే మనందరను ఆదుకొనగలడు. కృష్ణుడి మనుమడు వజ్రుడిని మిగిలిన యాదవసమూహానికి ప్రభువుగా నియమిస్తాడు. అందుచేత కంగారుపడవలసిన అవసరం లేదు.

**క. అని వారి నిండ్లకును బోఁ। బనిచి మదిని వగలు మిగులఁ బార్థుం డా రే**
**యనవద్యచరిత! కృష్ణుస। దనమున వసియించె సముచితపువృత్తమునన్. 139**

**ప్రతిపదార్థం:** అనవద్యచరిత!= అనింద్యచరిత్రుడా!; అని= ఈ విధంగా; వారిన్= ఆ మంత్రులను; ఇండ్లకునున్+పోన్+పనిచి= ఇళ్ళకు వెళ్ళుడని పంపి; మదిని= మనసులో; వగలు= శోకం; మిగులన్= మిక్కుటంకాగా; పార్థుండు= అర్జునుడు; ఆ రే= ఆ రాత్రి; కృష్ణుసదనమునన్= కృష్ణుడి ఇంటిలో; సముచితపువృత్తమునన్= తగినవిధంగా; నివసించెన్= విశ్రమించాడు.

**తాత్పర్యం:** రాజా! ఆ మంత్రులను ఈ విధంగా పంపించి, మనసులో శోకం అధికం కాగా అర్జునుడు ఆ రాత్రంతా కృష్ణుడి మందిరంలో దైవపూజాదికాలతో పరమపవిత్రంగా గడిపాడు.

**చ.** **తెలతెల వేగునప్డు వసుదేవుడు నిర్మలయోగనిష్ఠ మే**
**నిల నిడి వర్ణనీయగతి కేఁగినఁ దత్సదనాంతరంబునం**
**జెలఁగె ననేక రోదనవిశేషము లవ్వసుదేవవల్లభల్**
**నలువురు నెమ్మిఁ గూడి మరణంబునకై కయిసేసి రత్తఱిన్.** **140**

**ప్రతిపదార్థం:** తెలతెల వేగునప్డు= తెల్లవారుతుండగా; వసుదేవుఁడు= వసుదేవ మహారాజు; నిర్మలయోగనిష్ఠన్= పవిత్రమైన యోగనిష్ఠతో; మేను+ఇలన్+ఇడి= దేహాన్ని నేలపై వదలివేసి; వర్ణనీయుగతికిన్+ఏఁగినన్= పుణ్యలోకాలకు చేరగా; తద్+సదన+అంతరంబునన్= ఆ వసుదేవుడి మందిరంలో; అనేక= చాలాపెద్దగా; రోదన విశేషముల్= బిగ్గర ఏడ్పులు; చెలఁగెన్= వ్యాపించాయి; ఆ+వసుదేవ వల్లభల్ నలువురున్= ఆ వసుదేవుడి నలుగురు భార్యలూ; ఆ+తఱిన్= ఆ సమయంలో; నెమ్మిన్+కూడి= భర్తమీది అనురాగంతో ఒక్కసారిగా; మరణంబునకై= సహగమనానికై; కయిసేసిరి= సన్నాహాలు ప్రయత్నించారు.

**తాత్పర్యం:** అప్పుడే ఉదయం కాబోతుండగా వసుదేవమహారాజు పవిత్రమైన యోగనిష్ఠలో భూమిపై దేహాన్ని వదలివేసి పుణ్యలోకాలకు తరలిపోయాడు. ఆ మందిరంలో ఒక్కసారిగా ఏడుపులు మిన్నుముట్టాయి. ఆ రాజు భార్యలు నలుగురూ భర్తమీది అనురాగంతో సహగమనం చేయటానికి సిద్ధపడ్డారు.

### వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట (సం.16-8-15)

**సీ.** **ఆ సమయంబున నర్జునుఁ డచటికి । నేతెంచి వైభవ మెసకమెసఁగఁ**
**బ్రాలంబమాలికాపంక్తులఁ గదళికా । స్తంభంబులను శాతకుంభకలశ**
**శిఖరంబులను బెంపుఁ జెలువును విలసిల్ల । యానంబు గల్పించి యాదవేంద్రు**
**శవము సుస్నాతంబుఁ జందనచర్చాస । మేతంబుఁ జీనాంబరాతి శోభి**

**తే.** **తంబు నాభరణస్ఫురితంబు మాల్య । యోజితంబునుగాఁ జేసి యాజక ప్ర**
**యుక్తమంత్రతంత్రస్ఫుటయోగ మింపొ । నర్ప నేతెంచె సామగానంబు చెలఁగ.** **141**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; అర్జునుఁడు= కృష్ణుడి మందిరంనుండి అర్జునుడు; అచటికిన్= వసుదేవుడి మందిరానికి; ఏతెంచి= వచ్చి; వైభవము+ఎసకమెసఁగన్= వైభవం అతిశయించగా; ప్రాలంబ= వేలాడుతున్న; మాలికాపంక్తులన్= పూలదండల వరుసలతో; కదళికాస్థంభంబులను= అరటికంబాలతో; శాతకుంభ= బంగారు; కలశ శిఖరంబులనున్= కలశ శిఖరాలతో; పెంపున్= వైభవమూ; చెలువును= శోభా; విలసిల్లన్= అతిశయించగా; యానంబు కల్పించి= శవయాత్రకు తగిన వాహనాన్ని (రథం వంటిదానిని) ఏర్పరచి; యాదవేంద్రు శవమున్= వసుదేవుడి కళేబరాన్ని; సుస్నాతంబున్= బాగా స్నానం చేయించబడినదీ; చందన చర్చాసమేతంబున్= చందనాది సుగంధలేపంతో కూడినదీ; చీన+అంబర+అతి+శోభితంబును= పట్టువస్త్రాలతో బాగుగా అలంకరించబడినదీ; ఆభరణ స్ఫురితంబున్= శవాలంకారానికి తగిన ఆభరణాలతో ప్రకాశిస్తున్నదీ; మాల్య యోజితంబును+కాన్+చేసి= పూలదండలతో ఒప్పినదిగానూ చేసి; యాజకప్రయుక్త= యాజ్ఞికులైన బ్రాహ్మణులచేత చేయబడుతున్న; మంత్ర= మంత్రాలచేత; తంత్ర= తంత్రాలచేత; స్ఫుట= వ్యక్తమవుతున్న; యోగము+ఇంపు+ఒనర్పన్= గంభీరమైన సమాధిస్థితి అందరిలోనూ ఆత్మస్థైర్యంతో కూడిన శోభను కలిగించగా; సామగానంబు చెలఁగన్= సామవేద పారాయణము నలుదిక్కులలో మారుమ్రోగగా; ఏతెంచెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు వసుదేవుడి మందిరానికి వచ్చి పూలదండల వరుసలతో, అరటికంబాలతో, బంగారుకలశ శిఖరాలతో ఒప్పిన శవరథాన్ని వైభవోపేతంగా తయారుచేయించి, వసుదేవుడి కళేబరానికి స్నానం చేయించి, సుగంధద్రవ్యాలను పూయించి, పట్టువస్త్రాలను, ఆభరణాలను అలంకరింపజేయించి, పూలదండలు వేయించి, ఆ రథంలో శవాన్ని ఉంచి, బ్రాహ్మణులు చెప్పుతున్న మంత్రాలతోను, చేయిస్తున్న కార్యకలాపాలతోను, గంభీరమైన సమాధిస్థితి అందరిలోనూ ఒక ఆత్మస్థైర్యంతో కూడిన శోభను కల్పించగా, సామవేద పారాయణంతో నలుదిక్కులు మారుమ్రోగుతుండగా శవయాత్రకు సారథ్యం వహించి ముందుకు సాగాడు.

**క. వినుదేవకియును రోహిణి। యును భద్రయు మదిరయును సముచితవిధానం**
**బున నొనరించిన యానము। లనూన పరికర్మరుచిరలయి యెక్కి తగన్. 142**

**ప్రతిపదార్థం:** విను= రాజా వినుము!; దేవకియును, రోహిణియును, భద్రయును, మదిరయును= (వీరే వసుదేవుడి నలుగురు భార్యలు) వీరు నలుగురూ; అనూన= మెండైన; పరికర్మ రుచిరలు+అయి= కుంకుమాది సుమంగళద్రవ్యాలచేత అలంకృతలు కావటంచేత పుట్టిన కాంతులు కలవారై; సముచిత విధానంబునన్= ఆ సందర్భానికి తగినట్టుగా; ఒనరించిన= ఏర్పాటుచేసిన; యానములు= పల్లకీలను; తగన్+ఎక్కి= సముచితంగా ఎక్కినవారై.

**తాత్పర్యం:** వసుదేవుడి భార్య లయిన దేవకి, రోహిణి, భద్ర, మదిర తత్కాలోచితమైన సుమంగళద్రవ్యాలచేత అలంకృతలై క్రొత్త కాంతులు కలవారయ్యారు. ఆ సందర్భానికి ఉచితంగా తీర్చిన పల్లకీలలో ఎక్కినవారై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చెలులుం జుట్టలు దాపట। వలపట నేతేరఁ దెలిసి వదనసరోజం**
**బులనొప్పం దగియెడు మా। టల వారల వగలు మాన్పుటలు నుతికెక్కెన్. 143**

**ప్రతిపదార్థం:** చెలులున్= మిత్రులు; చుట్టలు= బంధువులు; దాపటన్= ఎడమవైపు; వలపటన్= కుడివైపు; ఏతేరన్= రాగా; తెలిసి= మూర్ఛనుండి తేరినవారై; (ఆ బంధుమిత్రులు); వదనసరోజంబులన్= ముఖపద్మాలతో; ఒప్పన్= సముచితంగా; తగియెడు= తత్కాలోచితములైన; మాటలన్= ఓదార్పు పలుకులతో; వారల వగలు= వసుదేవుడి భార్యల దుఃఖాన్ని; మాన్పుటలు= మాన్పటం; నుతికిన్+ఎక్కెన్= అందరి పొగడ్తనూ పొందింది.

**తాత్పర్యం:** బంధుమిత్రులు ఆ పల్లకీలకు ఇరువైపులా నడుస్తూ రాగా వసుదేవుడి రాణులు మూర్ఛనుండి తేరుకొన్న వా రయ్యారు. ఆ కాలానికి ఉచితమైన ఓదార్పుమాటలతో వారు ఆ మహారాణుల దుఃఖాన్ని ఉపశమింపజేస్తూ రావటాన్ని చూచినవారు, ఎంతో కుదుటపడ్డారు. మేలుమే లన్నారు.

**విశేషం:** బంధుమిత్రులు అన్ని సమయాలలో కన్నా మరణజనితదుఃఖాన్ని బాపటంలో చాలా సహాయపడతారు. అందుకే హైందవ సమాజంలో ఈ బంధుమిత్రసంభావన - వ్యవస్థ ఇన్ని వేల సంవత్సరాలుగా మిగిలింది.

**క. ఆ నృపుని వల్లభలు శవ। యానంబు పిఱుంద నిట్ల యరిగెరి విధి స**
**న్మానితగతి ముందట వి। ప్రానీకము చనియె నుజ్జ్వలాగ్నులు గొనుచున్. 144**

**ప్రతిపదార్థం:** ఆ నృపుని వల్లభలు= ఆ రాజు భార్యలు; శవయానంబు పిఱుందన్= శవరథంవెంట; ఇట్లు+అ= ఇట్లా; అరిగిరి= వెళ్ళారు; ముందటన్= వీరందరి కన్నా ముందుగా; విధి సన్మానితగతిన్= శాస్త్రవిధి ననుసరించిన రీతిలో; విప్ర+అనీకము= బ్రాహ్మణుల సమూహం; ఉత్+జ్వల+అగ్నులు+కొనుచున్= మండుచున్న నిప్పులను తీసికొని; చనియెన్= ముందుకు సాగింది.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ మహారాణులు శవరథం వెంబడి వెళ్ళారు. వీరందరికన్నా ముందుగా శాస్త్రవిధి ననుసరించిన పద్ధతిలో బ్రాహ్మణులు శవదహనానికి అవసరమైన నిప్పులను తీసికొని ముందుకు సాగారు.

**విశేషం:** ఈ రోజులలో కూడా ఉత్తరకర్మలను చేసే వ్యక్తి (అధికారి) ఇట్లా ఉట్టిలో అగ్నిని తీసుకుపోవటం ఉన్నది. ఆనాటి రాజుల ఇళ్ళలో ఇట్లా బ్రాహ్మణులు తీసికొనివెళ్ళేవారు కాబోలు! శవయాత్రలో స్త్రీలు పాల్గొనటం ఆ రోజులలో నిషిద్ధం కాదని భావించాలి.

**తే.** **ద్వారకావాసు లెల్లను దల్లడంబు। లుల్లములఁ గప్ప మోముల నురుల బాష్ప**
**ధార లతికరుణమున హాహారవంబు। లెసఁగ నేఁగిరి వెనుకను నిరుదెసలను.** **145**

**ప్రతిపదార్థం:** (ఆ శవయాత్రలో); వెనుకను= అందరికంటె చివర; ఇరుదెసలను= రెండువైపులా; ద్వారకావాసులు+ఎల్లనున్= ద్వారకలో మిగిలిన జనులంతా; ఉల్లములన్= తమ హృదయాలను; తల్లడంబులు= పలువిధాలైన వ్యథలు; కప్పన్= ఆక్రమించగా; మోములన్= ముఖాలపై; బాష్పధారలు= కంటినీటిధారలు; ఉరులన్= దొర్లగా; అతికరుణమునన్= అతిశోచనీయంగా; హాహారవంబులు= హాహాకారాలు; ఎసఁగన్= చెలగగా; ఏఁగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఆ శవయాత్రలోఅందరికంటె చివర ఇరువైపులా ద్వారకలో మిగిలిన జనులంతా వారివారి హృదయాలలో పలువిధాలైన వ్యథలు నిండిపోయి ముఖాలపై బాష్పధారలు దొర్లగా అతిశోచనీయంగా హాహాకారాలు చేస్తూ వెళ్ళారు.

**సీ.** **ఇమ్మెయిఁ గొని చని యమ్మహీశుఁడు వేడ్క। మెలఁగెడు తోఁటలోపల సమగ్ర**
**చందనాగురు కాష్ఠచయముల మున్న కా। వించిన సొదకు సద్విధియుతముగ**
**నప్పాడె సేర్పించి యర్జునుఁ డయ్యాద। వేంద్రుని పితృమేధ మెల్ల జనులు**
**నభినుతి సేయంగ నచ్చితియం దా శ। వంబు నారోపింపఁ బనిచి యగ్ని**

**తే.** **దీప్త మగునట్లు సేయింప దేవకీ ప్ర। ముఖులు నలువురు నప్పు డా శిఖిఁ బ్రవేశ**
**లీల నంగీకరించి రాబాలవృద్ధ। మైన సకల జనంబులు నార్తి నొంద.** **146**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; కొని చని= తీసికొనివెళ్ళి; ఆ+మహీ+ఈశుఁడు= ఆ రాజు-వసుదేవుడు; వేడ్కన్+మెలఁగెడు= విహారం కోసం తిరుగుతూ ఉండిన; తోఁటలోపలన్= ఉద్యానవనంలో; సమగ్ర= సమృద్ధిగా; చందన+అగురు+కాష్ఠ చయములన్= మంచిగంధపు చెక్కలు, అవురుగడ్డి మొదలైన వాటితోను, ఇతరములైన కర్రలతోనూ; మున్ను+అ= ముందుగానే; కావించిన= సిద్ధం చేసిన; సొదకున్= చితిపైన; ఆ+పాడెన్= ఆ కట్టెను; సత్+విధియుతముగన్= విధ్యుక్త పద్ధతిలో; చేర్పించి; అర్జునుఁడు= ఆ అర్జునుడు; ఆ+యాదవేంద్రుని= ఆ వసుదేవుడి; పితృమేధమున్= పితృయజ్ఞాన్ని (దహన సంస్కారాన్ని); ఎల్లజనులున్= జనులంతా; అభినుతి+చేయంగన్= ప్రశంసించగా; ఆ+చితియందున్= ఆ చితిలో; ఆ శవంబున్= ఆ వసుదేవుడి కళేబరాన్ని; దీప్తము+అగునట్లు= మండేటట్లు; చేయింపన్= చేయించగా; దేవకీప్రముఖులు పలువురు= దేవకీ మొదలైన వసుదేవుడి

ఇల్లాండ్రు నలుగురు; అప్పుడు= ఆ సమయంలో; ఆ బాలవృద్ధము+ఐన= పిల్లలనుంచి పెద్దలవరకు; సకలజనంబులు= జనులంతా; ఆర్తిన్+ఒందన్= ఆర్తిని పొందగా; ఆ శిఖిన్= ఆ మంటలో; ప్రవేశలీలన్= ప్రవేశించే కార్యాన్ని; అంగీకరించిరి= సమ్మతించారు.

**తాత్పర్యం:** ఈ విధంగా తీసికొనివెళ్ళి, ఆ వసుదేవుడి ఉద్యానవనంలో బాగా మంచిగంధపు చెక్కలతోనూ, అవురుగడ్డితోనూ, ఇతరములైన కఱ్ఱలతోనూ ముందుగా సిద్ధంచేసిన చితిపైన విధ్యుక్తమైన పద్ధతిలో ఆ పాడెను చేర్పించి అర్జునుడు ఆ వసుదేవుడి పితృకార్యాన్ని, దహనకాండను జరిపించాడు. ఆ కళేబరాన్ని ఆ చితిపై ఉంచటానికి ఏర్పరచి, అగ్నిని మండేటట్లు చేయించగా దేవకి మొదలైన వసుదేవుడి ఇల్లాండ్రు ఆ సమయంలో ఆ చితాగ్నిలో ప్రవేశించే పనిని అంగీకరించారు. ఈ దృశ్యాన్ని చూస్తున్న జనులంతా పిల్లలనుండి పెద్దలవరకు అంతా బాధాతప్త హృదయు లయ్యారు

**విశేషం:** ఆపద్ధర్మంగా అర్జునుడు ఉత్తరక్రియలు చేస్తున్నాడు. అందుకే బ్రాహ్మణులద్వారా అన్ని కార్యాలు చేయించటం. ఇక్కడ శ్రీకృష్ణుడు చేయవలసిన ఉత్తరక్రియలు అర్జునుడు జరిపించటమే కథలో ఉన్న విశేషం.

**క.** **ఘృతములు పైఁ జల్లఁగ న। చ్చితిఁ బేర్చిన సప్తజిహ్వ శిఖల రవము నూ**
**ర్జిత సామగాన నాదో। ద్గతియును హాహారవంబుఁ గలసి చెలంగెన్. 147**

**ప్రతిపదార్థం:** ఘృతములు= నేతిని; పైన్+చల్లఁగన్= చితిపైన సమృద్ధిగా చల్లగా; ఆ+చితిన్= ఆ చితిలో; పేర్చిన= అతిశయించిన; సప్తజిహ్వ= అగ్నిదేవుడి; శిఖలరవమున్= మంటల సవ్వడి; ఊర్జిత= గంభీరమైన; సామగాన= సామవేదగానం యొక్క; నాద+ఉద్గతియును= శబ్దోచ్చారణ; హహారవంబున్= హాహాకారాలు; కలసి= అన్నీ కలిసిపోయి; చెలంగెన్= ధ్వనించాయి.

**తాత్పర్యం:** ఆ చితిపైన నేతిని సమృద్ధిగా చల్లగా అందులోనుండి అతిశయిస్తూ పుట్టుకొనివస్తున్న మంటల సవ్వడి. గంభీరమైన సామవేద మంత్రోచ్చారణ, జనులు చేస్తున్న హాహాకారాలు అన్నీ కలిసిపోయి నలుదిక్కులా వ్యాపించాయి.

**క.** **తదనంతరంబ వజ్రుఁడు। మొదలగు పురుషులు సతీసమూహముఁ దగుమై**
**నుదకప్రదానవిధి య। య్యదుముఖ్యున కాచరించి రన్వయముఖ్యా! 148**

**ప్రతిపదార్థం:** అన్వయముఖ్యా!= కురువంశశ్రేష్ఠుడా!; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; వజ్రుఁడు మొదలగు పురుషులు= వజ్రుడు మొదలైన మగవారు (ఆ వంశీయులు); సతీసమూహమున్= తక్కిన ఆడవారూ; ఆ+యదు ముఖ్యునకున్= ఆ యదువంశశ్రేష్ఠుడైన వసుదేవుడికి; తగుమైన్= తగిన విధంగా; ఉదకప్రదాన విధిన్= జలతర్పణవిధిని; ఆచరించిరి= ఆచరించారు.

**తాత్పర్యం:** ఓ కురువంశ శ్రేష్ఠా! వినుము. ఆ తరువాత వజ్రుడు మొదలైన మగవారు, తక్కిన ఆడువారు ఆ వసుదేవుడికి జలతర్పణం చేశారు.

**విశేషం:** జల, తిల తర్పణాలని రెండు విధాలున్నాయి. ఆనాడు స్త్రీలు కూడా జలతర్పణం చేసేవారని ఈ వర్ణనను బట్టి గుర్తించాలి. ఈ ఆచారం ఇప్పుడు కూడా 'దశాహం' నాడు (10వ రోజు) ఉన్నది. తగుమెయిన్ - అంటే ఆ జలతర్పణం ఇవ్వటంలోనూ సంకల్పతంత్రాలలో తేడా లున్నాయని గుర్తించవచ్చును.

**తే.** **అప్పు డందఱ బంధుల నాదరమునఁ। దనదు సముచితాలాపసంతానకలన**
**ననునయించి పురంబున కరిగెఁ దాను। వారు వగ మదిఁ గదుర వివ్వచ్చుఁ డధిప! 149**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; అప్పుడు= ఆ సమయంలో; వివ్వచ్చుఁడు= అర్జునుడు, బీభత్సుడు (ప్రకృతి) - వివ్వచ్చుడు (వికృతి) (యుద్ధంలో బీభత్సం సృష్టించేవాడని అర్థం); అందఱ బంధులన్= బంధువులందరినీ; ఆదరమునన్= ఆదరంతో; తనదు= తన; సముచిత+ఆలాప సంతాన కలనన్= తగినటువంటి మాటల సముదాయంచేత పుట్టిన జ్ఞానంచేత; అనునయించి= ఓదార్చి; వారు= ఆ బంధువులు; మదిన్= హృదయాలలో; వగ= దుఃఖం; కదురన్= కలుగగా; తాను; పురంబునకున్= ద్వారకకు; అరిగెన్= తిరిగి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడు సముచితమైన తన మాటలతో పుట్టిన జ్ఞానంతో వారిని ఓదార్చి, ఆ బంధువులు దుఃఖంతో బాధపడుతుండగా ద్వారకకు తిరిగి వెళ్ళాడు.

**తే.** **ఇత్తెఱంగున సత్క్రియాయత్తుఁడైన । యర్జునుఁడు పితృమేధము నభినుతముగఁ**
**జలిపి వృష్ణిభోజాంధకసమరధరణి । తలమునకు బుధజనసహితంబు గాఁగ.** **150**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; సత్+క్రియా+ఆయత్తుఁడైన అర్జునుఁడు= వైదికక్రియలో జాగరూకుడైన అర్జునుడు; పితృమేధమున్= పితృదేవతలకు చేసే వైదికకర్మను; అభినుతముగన్= మిక్కిలి ప్రశస్తంగా; చలిపి= చేసి; వృష్ణిభోజ+అంధక సమరధరణితలమునకున్= వృష్ణిభోజాంధకులు యుద్ధం చేసిన చోటుకు; బుధ జనసహితంబు+కాఁగన్= పండితులైన విప్రులతో కలిసి.

**తాత్పర్యం:** ఈ విధంగా వైదికక్రియలో జాగరూకుడైన అర్జునుడు పితృకార్యాన్ని మిక్కిలి ప్రశస్తంగా చేసి, వృష్ణిభోజాంధకులు యుద్ధం చేసినచోటుకు పండితులైన విప్రులతో కలిసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **అపరదినంబున నరిగె నప్పుడ వృద్ధ । బాలకాంతాజనప్రకరములకు**
**నని నిర్గతప్రాణులై పడియున్న భో । జు లను నంధకుల వృష్ణులను గలయఁ**
**జూపంగ నుత్కటశోకంబు గదిరిన । నఱిముఱి మేదిని నొఱగువారు**
**విప్రలాపంబు నానాప్రకారంబులఁ । జేయువారును నిరుచేయి నెత్తి**

**తే.** **యలఁత నాక్రందనములు హాహారవముల । తో నొనర్చువారును నైన నా నరుండు**
**దద్ద యడలి దారుకు భాషితములఁ దేఱి । యఖిలజనులకు నుపశమ మావహించె.** **151**

**ప్రతిపదార్థం:** అపరదినంబునన్= ఆ పుణ్యకార్యాలు తీరిన చివరిరోజున; అరిగెన్= వెళ్ళాడు; అప్పుడు= ఆ సమయంలో; వృద్ధ= వృద్ధులకు; బాల= బాలురకు; కాంతాజనప్రకరములకున్= స్త్రీల సముదాయానికి; అనిన్= యుద్ధంలో; నిర్గతప్రాణులై= ప్రాణాలుపోయి; పడి+ఉన్న= నేలమీద పడి ఉన్న; భోజులను, అంధకులన్, వృష్ణులనున్; కలయన్+చూపంగన్= అందరినీ చూపగా; ఉత్కట= మిక్కిలి; శోకము= దుఃఖం; కదిరినన్= కలుగగా; అఱిముఱిన్= వెంటనే; మేదినిన్= నేలమీద; ఒఱగువారు= ఒరిగిపోయేవారు; వి+ప్రలాపంబు= మిక్కిలి గట్టిగా ఏడవటం; నానాప్రకారంబులన్= నానావిధాలుగా; చేయువారునున్= చేసేవారు; ఇరుచేయున్= రెండుచేతులూ; ఎత్తి= పైకెత్తి; అలఁతన్= దుఃఖంతో; హాహారవములతోన్= హాహాకారాలతో; ఆక్రందనములు= ఏడ్వటం; తద్ద= మిక్కిలి; అడలి= దుఃఖించి; దారుకు= దారుకుడి; భాషితములన్= మాటలతో; తేఱి= తేరుకొని; అఖిలజనులకున్= వారికందరికీ; ఉపశమము= ఓదార్పును; ఆవహించెన్= కలిగించాడు.

**తాత్పర్యం:** ఆ పుణ్యకార్యాలు తీరిన చివరిరోజున వెళ్ళాడు. ఆ సమయంలో వృద్ధులకు, బాలలకు, స్త్రీల సముదాయానికి యుద్ధంలో ప్రాణాలు పోయి నేలపై పడి ఉన్న భోజాంధక వృష్ణి వీరులను ఒక్కొక్కరినీ చూపించగా, వారిలో కొందరు అమిత దుఃఖంతో అక్కడికక్కడే నేలమీద ఒరిగిపోయారు. కొందరు వారివారితో తమ బాంధవ్యాలు తలచుకొంటూ రకరకాలుగా ఏడవటం మొదలుపెట్టారు. ఇంకొందరు రెండు చేతులూ పైకెత్తి దుఃఖంతో హాహాకారాలు చేస్తూ ఏడుస్తున్నారు. ఇట్లాంటి వీరిని చూచి అర్జునుడు కూడా చాలా దుఃఖాన్ని పొందాడు. చివరకు దారుకుడు చెప్పిన మాటలతో తెప్పరిల్లి వారి కందరికీ ఓదార్పు కలిగించాడు.

**క.** **తదనంతరంబ రణమృత । యదుసంఘములకు సమంచితానలసంస్కా**
**రదశాపూతత్వము నా । విదితయశుఁ డొనర్చె విప్రవితతి ఘటకుఁడై.** **152**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ఆ విదితయశుఁడు= ఆ ప్రఖ్యాతుడైన అర్జునుడు; విప్రవితతి= బ్రాహ్మణసమూహం; ఘటకుఁడై= కలిగినవాడై; రణమృత= యుద్ధంలో చనిపోయిన; యదుసంఘములకున్= యదువీరుల గుంపులకు; సమంచిత= బాగా; అనల= అగ్ని; సంస్కార= సంస్కారంచేత పుట్టిన; దశా= స్థితిచేత; పూతత్వమున్= పవిత్రతను; ఒనర్చెన్= కలిగించాడు.

**తాత్పర్యం:** ఆ తరువాత అర్జునుడు తాను వెంట తెచ్చుకొన్న బ్రాహ్మణులతో యుద్ధంలో చనిపోయిన యదువీరుల గుంపులకు చక్కగా అగ్నిసంస్కారంచేత పుట్టిన స్థితిచేత పవిత్రతను కలిగించాడు.

**విశేషం:** షోడశసంస్కారాలలో భాగమైన అపరకర్మ ఒక దశ. జీవుడి ఉత్క్రమణానికి సంబంధించిన ఒక పవిత్రీకరణం, దానితో ఆ దేహబంధాన్ని ఆ జీవుడు కోల్పోతాడు. అదే పవిత్రత. దానిని కలిగించటమే అపరకర్మ ప్రయోజనం.

**ఆ.** **నిఖిలబంధుజనుల కఖిలమృతులకును । దగఁ దిలోదకప్రదాన మాచ**
**రించునట్లు గాఁగఁ బంచి యలుప్తక్రి । యత్వ మొనర నడపె నక్కిరీటి.** **153**

**ప్రతిపదార్థం:** ఆ+కిరీటి= ఆ అర్జునుడు; నిఖిల బంధుజనులకున్= బంధుజనులందరికీ; అఖిల మృతులకును= మృతులందరికీ; తగన్= వారివారికి తగినట్లు; తిలోదక ప్రదానమున్= తిలలు (నువ్వులు), నీరు కలిపి ప్రేతలకు తర్పణం వదలటాన్ని; ఆచరించినట్లు+కాఁగన్= చేయటానికై; పంచి= (బ్రాహ్మణులను) పంపించి; అలుప్త క్రియత్వము= క్రియాలోపం రాకుండా; ఒనరన్= తగినట్లుగా; నడపెన్= కార్యం నడిపించాడు.

**తాత్పర్యం:** బంధువులందరికీ, చనిపోయినవారందరికీ సామూహికంగా వారివారికి తగినట్లు తిలోదకప్రదానం చేయటానికై బ్రాహ్మణులను పంపించి, క్రియాలోపం రాని విధంగా అర్జునుడు కార్యం నడిపించాడు.

**విశేషం:** పురోహితుడు ఎవరితరపుననైనా ప్రేతకర్మ చేయటానికి 'అధికారి'గా వ్యవహరించగలడు - అట్లాంటి మంత్రాలున్నాయి. గాయత్రీజపం ద్వారా ఆ ఋణాన్ని విమోచనమూ చేసికొనగలడు. బంధువులకు, సఖులకు, గురువులకు, తర్పణం వదిలే విధానాలూ వేరువేరుగా ఉన్నాయి.

**క. ఇవ్విధముగ విశ్రుతముగఁ। గవ్వడి నియతుఁ డయి బంధుకార్యము లెల్లన్**

**నెవ్వగలు దన మనంబున। నివ్వటిలఁగ నాచరించె నృపసంసేవ్యా! 154**

**ప్రతిపదార్థం:** నృపసంసేవ్యా!= సామంతరాజులచే సేవించబడే కురువంశ చక్రవర్తీ వినుము!; ఈ+విధముగన్= ఈ విధంగా; విశ్రుతముగన్= పదిమందీ మెచ్చుకొనే విధంగా; కవ్వడి= అర్జునుడు (రెండుచేతులా వేగంగా బాణాలు వేయగలవాడని అర్థం); (సవ్యసాచి) నియతుఁడు+అయి= నియమవంతుడై; నెఱ+వగలు= నిండుబాధ; తనమనంబునన్= తన మనస్సులో; నివ్వటిలఁగన్= అధికం కాగా; బంధుకార్యములు+ఎల్లన్= బంధువుల మిత్రుల ఉత్తరక్రియలను; ఆచరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు నియమవంతుడై నిండుబాధ తన మనసులో అధికం కాగా బంధుమిత్రుల కార్యాలను పదిమందీ మెచ్చుకొనేటట్లు చేశాడు.

**విశేషం:** కవ్వడిశబ్దం యథార్థంగా రెండు చేతులతోనూ బాణాలు వేసేవాడుకాగా ఇతర సందర్భాలలో ఇద్దరు చేయగలవానిని ఒకడుగా విశ్వసించగలవాడని అర్థాన్నిస్తుంది. అందుకే ఇంత భారాన్ని స్వామి అర్జునుడిపై మోపాడు.

అర్జునుఁడు రామకృష్ణుల వెదకుచు వనంబునకుఁ బోవుట (సం.16-8-31)

**సీ. పదపడి యాదవ భామినీబాలక। వృద్ధజనంబు నా శుద్ధబుద్ధి**

**కలయంగఁ గనుఁగొని పలుకుల మార్దవ। మారఁ బురంబున కరుగఁ జెప్పి**

**రామకృష్ణులు తపోరతులై ప్రవర్తించు। వనభూమి యారసికొని తదీయ**

**సందర్శనమునకుఁ జనియెద నని వారి। నామంత్రితులఁ జేసి యేమి యనుచు**

**ఆ. టకును శోక మార్చుటకును దారుకుఁ డాది। యయిన తగిన వారి నర్థవచన**

**రచన మెఱయఁ బనిచి యుచితాప్తకతిపయ। జనులు దోడ రాఁగఁ జనియె నధిప! 155**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; పదపడి= పిమ్మట; ఆ శుద్ధబుద్ధి= ఆ పవిత్రచిత్తుడైన అర్జునుడు; యాదవభామినీ= యాదవస్త్రీలను; బాలక= బాలకులను; వృద్ధజనంబున్= వృద్ధులను; కలయంగన్= అందరినీ; కనుఁగొని= చూచి; పలుకులన్= మాటలలో; మార్దవము= మృదుత్వం; ఆరన్= నిండగా; పురంబునకున్= ద్వారకకు; అరుగన్= పొమ్మని; చెప్పి; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; తపస్+రతులు+ఐ= తపస్సులో మగ్నులై; ప్రవర్తించు= ఉంటున్న; వనభూమిన్= చోటును; ఆరసికొని= తెలిసికొని; తదీయ= వారి; సందర్శనమునకున్= దర్శనానికి; చనియెదన్+అని= పోతానని; వారిన్= వారిని; ఆమంత్రితులన్+చేసి= వీడ్కోలు చెప్పి విడిచినవాడై; ఏమి= ఏమి కావాలో దానిని; అనుచుటకునున్= సిద్ధంచేసి పంపటానికి; శోకము= దుఃఖం; ఆర్చుటకునున్= పోగొట్టటానికి; దారుకుఁడు+ఆది+అయిన= దారుకుడు మొదలైన; తగినవారిన్= యోగ్యులను; అర్థవచన రచన మెఱయన్= తగిన మాటల పొంతన అతిశయించగా; పనిచి= పంపించి; ఉచిత= తనకు తగిన; ఆప్తకతిపయజనులు= ఆప్తులైన మరి కొంతమంది; తోడరాఁగన్= తోడురాగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఈ కార్యాలు నిర్వర్తించిన తరువాత చూడలేక - అతిప్రయత్నంతో ఆ యాదవస్త్రీలను, బాలురను వృద్ధులను అందరినీ చూచి, మృదుత్వం నిండిన మాటలతో వారిని ద్వారకకు పొమ్మని చెప్పి, 'నేను అడవిలో బలరామకృష్ణులు తపస్సు చేసికొంటున్న చోటును కనుగొని వారిని దర్శించటానికి పోతా'నని అంటూ వారికి వీడ్కోలు

చెప్పి, వారికి ఏమి కావాలో అది సిద్ధంచేయటానికి, వారి బాధను పోగొట్టటానికి దారుకుడు మొదలైన యోగ్యులైన వారిని వారికి తగిన మాటలు చెప్పి పంపి, ఆప్తులైన మరికొంతమంది తనవెంట రాగా అడవిలోకి వెళ్ళాడు.

**క. చనిచని మనమున నిట్లను। ననుఁ బిలువఁగఁ బనిచి జనకునకుఁ గావలిగా**
**నునిచినవాఁ డయి నెమ్మదిఁ। జనిన హరికిఁ జావు సెప్పఁ జనియెద నకటా! 156**

**ప్రతిపదార్థం:** చనిచని= వెళ్ళుతూ వెళ్ళుతూ; మనమునన్= మనస్సులో, ఇట్లు+అనున్= ఇట్లా అనుకొన్నాడు; ననున్= నన్ను; పిలువఁగన్+పనిచి= పిలువనంపి; జనకునకున్= తండ్రికి; కావలిగాన్= కావలిగా; ఉనిచినవాఁడు+అయి= పెట్టినవాడై; నెఱ+మదిన్= నిండుమనసుతో (ధైర్యంగా); చనిన హరికిన్= వెళ్ళినవారికి (శ్రీకృష్ణుడికి); అకటా!= అయ్యో!; చావు+చెప్పన్= తండ్రి చావును గురించి చెప్పటానికి; చనియెదన్= పోతున్నానే!

**తాత్పర్యం:** పోతూ పోతూ మనసులో ఇట్లా అనుకొన్నాడు; 'కృష్ణుడు నన్ను పిలువనంపి, తండ్రికి రక్షకుడిగా నియమించి ఆయన ధైర్యంతో తపస్సు చేసికొనటానికి వెళ్ళాడు. నేనేమో ఆయన తండ్రి చావును ఆయనకు చెప్పటానికి పోతున్నానే! అయ్యో! ఏమి ఈ దురవస్థ!

**సీ. ఆ రాజు సచ్చుట నారాయణున కేల। సెప్పఁ? దపోనిష్ఠఁ జెందియున్న**
**యమ్మహాత్ముని హృదయమునకు మెరమెర। పుట్టింప నేటికిఁ? బోయి కాంచి**
**పంచినపని యాచరించెదఁ గాక స। వినయభక్తికముగ' ననుచు మఱియు**
**వివిధ చింతారూపవిధులు చిత్తమ్మునఁ। బాఱ గాంధారిశాపంబు తెఱఁగుఁ**

**తే. దలఁచి 'యయ్యవ్వ యతఁ డెగ్గతంపుఁ జోట। నరయ ది క్కెవ్వరును లేనియట్టి తెగుట**
**నొందఁగలవాఁడుగాఁ బల్క నొద్దనుండి। వింటి నకట! నిప్పును జెద లంటు నొక్కొ?' 157**

**ప్రతిపదార్థం:** ఆ రాజు చచ్చుట= ఆ వసుదేవుడు మరణించటం; నారాయణునకున్= నారాయణుడికి; చెప్పన్+ఏల?= చెప్పటం ఎందుకు?; తపోనిష్ఠన్= తపోనిష్ఠను; చెంది+ఉన్న= పొంది ఉన్నటువంటి; ఆ+మహాత్ముని= ఆ మహాత్ముడైన కృష్ణుడి; హృదయమునకున్= హృదయానికి; మెరమెర= వ్యథను; పుట్టింపన్+ఏటికిన్?= పుట్టించటమెందుకు?; పోయి= వారి దగ్గరికి వెళ్ళి; కాంచి= చూచి; పంచిన పని= చెప్పిన పనిని; సవినయభక్తికముగన్= వినయ భక్తులతో; ఆచరించెదన్+కాక= చేస్తాను; అనుచున్= అనుకొంటూ; మఱియున్= ఇంకా; వివిధ= నానారకాలైన; చింతారూపవిధులు= ఆలోచనారూపాలైన పనులు; చిత్తమునన్= మనస్సులో; పాఱన్= స్ఫురించగా; గాంధారి= ధృతరాష్ట్రుడి పత్ని గాంధారి; శాపమ్ము తెఱఁగు= ఇచ్చిన శాపంవిధం; తలఁచి= స్మరించుకొని; ఆ+అవ్వ= ఆ పతివ్రత; అతఁడు= కృష్ణుడు; ఎగ్గతంపున్+చోటన్= ఎవరూలేనిచోట (ఒంటరిగా); అరయన్= చూచికొనటానికి; దిక్కు+ఎవ్వరును= దిక్కుగా ఎవ్వరూ; లేని+అట్టి= లేని విధంగా; తెగుటన్= చావటాన్ని; ఒందన్+కలవాఁడు+కాన్= పొందగలవాడుగా; పల్కన్= పలుకగా; ఒద్దన్+ఉండి= సమీపంలో ఉండి; వింటిన్= విన్నాను; అకట!= అయ్యో!; నిప్పును= నిప్పును; చెదలు= చెద పురుగులు; అంటున్+ఒక్కొ?= తాకుతాయా?

**తాత్పర్యం:** ఆ వసుదేవుడి మృతిని కృష్ణుడికి చెప్పటం ఎందుకు? తపోనిష్ఠలో మునిగి ఉన్న ఆ మహాత్ముడి హృదయానికి వ్యథ పుట్టించట మెందుకు? పోయి బలరామకృష్ణులను చూచి, చెప్పిన పనిని వినయ భక్తులతో చేస్తాను - అనుకొంటూ

నానావిధాలైన చింతలు, పనులు, మనసులో ఒకదానివెంట ఒకటి స్ఫురిస్తూ రాగా ఆనాడు గాంధారీమహాదేవి ఇచ్చిన శాపం తలచుకొన్నాడు. 'ఆమె శ్రీకృష్ణుడు ఎవ్వరులేనిచోట దిక్కెవ్వరూలేని విధంగా చనిపోతాడని శపించింది. ఆ మాట నేను దగ్గరే ఉండి విన్నాను. అయ్యో! నిప్పుకు చెదలంటుతాయా?'

**విశేషం:** అర్థాంతర న్యాసం. అర్జునుడు లౌకికాలౌకికవివేకం ఉన్నవాడే. అందుకే కృష్ణుడి మృతి లీలగా స్ఫురిస్తున్నది. శాపమిచ్చిన స్త్రీ మహాపతివ్రత గాంధారి. కాబట్టి శాపం తప్పదు. కాని శాపం పొందినవాడు శ్రీకృష్ణుడు. అతడు అమృతస్వరూపుడు. అందుకే నిప్పువంటివాడు. చెద - నశించటానికి గుర్తు. కృష్ణుడు ఎట్లా మరణిస్తాడని? । అది ఆనాటినుంచి ఈనాటివరకూ 'నరు' లందరూ వేసికొంటున్న చిత్రమైన ప్రశ్న. లీలామానుష విగ్రహుడు - పరీక్షిత్తును బ్రతికించిన కృష్ణుడు తనను తాను చావుబారినుండి ఎందుకు కాపాడుకోలేకపోతున్నాడన్నది పెద్ద ప్రశ్న. శరీరం ధరించిన ప్రతి ఒకడూ నశించవలసినదే. కృష్ణుడు కూడా శరీరాన్ని వదలిపెట్టాడు. అది దేహధారికి సహజమైన ధర్మం. కాని అర్జునుడి దృష్టిలో శ్రీకృష్ణుడు దేహమాత్రుడు కాడు కాబట్టి ఈ ప్రశ్న.

**క. అనుచుఁ బెనుఁగలఁక నొందిన । మనంబుతో వలయుదిక్కు మతి నరయక వే**
**చనుచుండె నొండు దెస; కే । మనఁగలదు? విధాతచేఁత కడ్డము గలదే! 158**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనుకొంటూ; పెను+కలఁకన్= పెద్దవ్యథను; ఒందిన= పొందినట్టి; మనంబుతోన్= మనసుతో; వలయుదిక్కున్= పోవలసిన దిక్కును; మతిన్+అరయక= బుద్ధితో ఆలోచించి తెలిసికొనలేక; ఒండు దెసకున్= మరొక దిక్కుకు; వే+చనుచుండెన్= ఉన్మాదివలె గబాగబా పోతున్నాడు; ఏమి+అనఁగలదు?= ఏం చెప్పగలం?; విధాత చేఁతకున్= బ్రహ్మ సంకల్పించినపనికి; అడ్డము+కలదే?= అడ్డం ఉంటుందా?

**తాత్పర్యం:** ఇట్లా అనుకొంటూ పెద్ద వ్యథను పొంది, కకావికలైన మనసుతో ఏ దిక్కుకు వెళ్ళాలో కూడా ఆలోచించి తెలిసికొనే స్తిమితం లేక మరొక దిక్కుకు పిచ్చివాడివలె గబగబా పోతున్నాడు. ఏమి చెప్పగలం? బ్రహ్మ సంకల్పించిన పనికి అడ్డం ఉంటుందా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. అట్లాంటి ధీరచిత్తుడు కూడా భీరువై స్మృతికోల్పోయాడని అర్థం. (విశేషం సామాన్యంచే సమర్థింపబడింది.)

**క. విను మనుచరు లాతని మో । మునఁ దోఁచు విషాదభావముం గని వెగడొం**
**దిన కతన నట్లుగా ది । ట్లని చనియెడువంక సాలరై రెఱిఁగింపన్. 159**

**ప్రతిపదార్థం:** వినుము= రాజా! వినుము; అనుచరులు=అర్జునుడి వెంట వస్తున్నవారు; అతని= అర్జునుడి; మోమునన్+తోఁచు= ముఖంలో కనిపిస్తున్న; విషాద భావమున్+కని= దుఃఖభావాన్ని చూసి; వెగడు+ఒందిన కతనన్= భయపడిన కారణంగా; అట్లు+కాదు+ఇట్లు+అని= అట్లా కాదు - ఇట్లా అని; చనియెడు వంకన్= వెళ్ళేదారిని; ఎఱిఁగింపన్= తెలుపటానికి; చాలరు+ఐరి= సమర్థులు కాకపోయారు.

**తాత్పర్యం:** ఆ అర్జునుడి వెంట వస్తున్నవారు అతడి ముఖంలో కనిపిస్తున్న దుఃఖభావాన్ని చూచి భయపడ్డ కారణంగా 'వెళ్ళే దారి అట్లాకాదు - ఇట్లా' అని కూడా చెప్పటానికి ధైర్యం చేయలేకపోయారు.

ఆ. అట్లు దిక్కు దప్పి యడవిలోపలఁ గొన్ని। దినము లిట్టునట్టుఁ దిరుగ నొక్క
బోయ చూచి 'యెందుఁ బోయెద?' రనవుడు। 'హరి తపంబుసేయు నచటి' కనిరి. **160**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; దిక్కు+తప్పి= దిక్కు తప్పిపోయి; అడవిలోపలన్= అడవిలో; కొన్ని దినములు= కొద్ది రోజులు; ఇట్టున్+అట్టున్= ఇట్లా అట్లా; తిరుగన్= తిరుగగా; ఒక్క బోయ= ఒక బోయవాడు; చూచి= వీరిని చూచి; ఎందున్+పోయెదరు?+అనవుడున్= ఎక్కడికి వెళ్ళుతున్నారు? అనగా; హరి= శ్రీకృష్ణుడు; తపంబు+చేయు+అచటికిన్= తపస్సు చేస్తున్న ఆ చోటికి; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా దిక్కు తప్పిపోయి అడవిలో కొన్నిరోజులు ఇట్లా అట్లా తిరుగుతుండగా, ఒక బోయవాడు వీరిని చూచి ఎక్కడికి వెడుతున్నా?' రని అడిగాడు. 'శ్రీకృష్ణుడు తపస్సు చేస్తున్న చోటికి' అని వీరు చెప్పారు.

క. అన విని 'యొకనాఁ డొక్కెడఁ। గనుఁగొంటిం గృష్ణుఁ జూపఁగా వచ్చెద నా
వన భూమి నాతఁ డింతకుఁ। జనునో నిలుచునొ యెఱుంగఁ జనుదెం' డనుచున్. **161**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని చెప్పగా విని; ఒకనాఁడు= ఒకరోజు; ఒక్క+ఎడన్= ఒకచోట; కృష్ణున్+కనుఁగొంటిన్= కృష్ణుడిని చూచాను; చూపఁగాన్= చూపటానికి; వచ్చెదన్= వస్తాను; ఆ+వనభూమిన్= అడవిలో అదే చోట; అతఁడు= ఆ కృష్ణుడు; ఇంతకున్= ఇంతవరకు; నిలుచునొ?= ఉంటాడో?; చనునో?= వెళ్ళిపోయి వుంటాడో?; ఎఱుంగన్= నాకు తెలియదు; చనుదెండు= అయినారండి పోదాం; అనుచున్= అంటూ.

**తాత్పర్యం:** అని చెప్పగా విని 'ఒకరోజు ఒకచోట ఎక్కడో కృష్ణుడిని చూచాను. చూపటానికి వస్తాను. అయినా అడవిలో అదే చోట ఆయన ఇంతవరకు ఉంటాడో వెళ్ళిపోయి ఉంటాడో? మాత్రం నేను చెప్పలేను. అయినా పోదాం రండి' అంటూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

తే. అక్కిరాతుండు సన వాని ననుగమించి। వెన్ను రుచిరదేహము పడియున్నచోటు
సేరి తెలియంగఁ జూచి మూర్ఛిల్లి పుడమిఁ। బడియెఁ గవ్వడి యనుచరు లడలు నొంద. **162**

**ప్రతిపదార్థం:** ఆ+కిరాతుండు= ఆ బోయవాడు; చనన్= ముందువెళ్ళగా; వానిన్= వాని; అనుగమించి= వెంటవెళ్ళి; వెన్ను= శ్రీకృష్ణుడి; రుచిర దేహము= మనోహరమైన దేహం; పడి+ఉన్నచోటు+చేరి= నేలమీదపడి ఉన్నచోటు చేరి; తెలియంగన్+చూచి= బాగా పరికించి చూసి; కవ్వడి= అర్జునుడు; అనుచరులు= వెంటవచ్చినవారు; అడలున్+ఒందన్= వ్యథ పొందగా; మూర్ఛిల్లి= మూర్ఛపోయి; పుడమిన్+పడియెన్= నేలమీద పడ్డాడు.

**తాత్పర్యం:** ఆ బోయ ముందు నడుస్తుండగా అతడి వెంటవెళ్ళి కృష్ణుడి కాంతు లీనెడి మనోహరమైన కళేబరం నేలమీద వాలి ఉన్న చోటును చేరి బాగా పరికించి చూచి, అర్జునుడు మూర్ఛపోయి నేలమీద పడిపోయాడు. అతడి వెంట వచ్చినవారు వ్యథతో క్రుంగిపోయారు.

**విశేషం:** ఇంతవరకు నిగ్రహాన్ని ప్రదర్శించిన 'కవ్వడి' కూడా ఇక్కడ బాలుడివలె స్పృహకోల్పోయాడు. వారిద్దరి మైత్రీబంధం. గురుశిష్యసంబంధం అంత గాఢమైనది.

## అర్జునుఁడు రామకృష్ణుల కళేబరంబులు చూచి విలపించుట

**క. మఱి కొంతసేపునకుఁ దె। ప్పిఱి లేచి ముకుందు మేను పెద్దయునుం బ్రొ**
**ద్దిఱియం గౌఁగిటఁ జేర్చెం। బఱివోయిన తాల్మి నూష్మబాష్పము లురులన్. 163**

**ప్రతిపదార్థం:** (అర్జునుడు); మఱి కొంతసేపునకున్= కొంతసేపటికి; తెప్పిఱి= తెప్పరిల్లి; లేచి= లేచికూర్చొని; ముకుందు మేనున్= కృష్ణుడి దేహాన్ని; పెద్దయునున్+ప్రొద్దు= చాలాసేపు; కౌఁగిటన్= కౌగిలిలో; పఱి+పోయిన= నశించిన; తాల్మిన్= ఓపికతో; ఊష్మ= వేడి; బాష్పములు= కంటినీరు; ఉరులన్= ప్రవహిస్తుండగా; ఇఱియన్+చేర్చెన్= ఇరికించుకొని అట్లాగే ఉంచుకొన్నాడు.

**తాత్పర్యం:** కొంతసేపటికి అర్జునుడు తెప్పిరిల్లి లేచి కూర్చున్నాడు. కృష్ణుడి దేహాన్ని తన కౌగిలిలో ఇరికించుకొని వాటేసుకొని అట్లాగే చాలాసేపు ఉండిపోయాడు. ఇంతవరకున్న ఓర్పు, నిగ్రహం ఇప్పు డతడిలో లేవు. నిట్టూర్పులు విడుస్తున్నాడు. కళ్ళలో వేడినీరు ధారలుగా దొర్లుతున్నది.

**క. అనుచరులలోని భూసురు। లనునయవచనములఁ దేర్ప నతఁ డంకిలి దే**
**ఱినమతితో నశ్రులు మఱి। యును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచున్. 164**

**ప్రతిపదార్థం:** అనుచరులలోని= వెంటవచ్చిన వారిలో ఉన్న; భూసురులు= బ్రాహ్మణులు; అనునయ= ఓదార్పు; వచనములన్= మాటలతో; తేర్పన్= ఓదార్చగా; అతఁడు= ఆ అర్జునుడు; అంకిలి= కలఁత; తేఱిన= తగ్గిన; మతితోన్= మనస్సుతో; అశ్రులు= కళ్ళలో నీరు; మఱియును+క్రమ్మన్= మరల క్రమ్ముకొనగా; కరతలమునన్= అరచేతితో; ఒత్తుచున్= తుడుచుకుంటూ; చూచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** వెంటవచ్చిన వారిలో ఉన్న బ్రాహ్మణులు ఓదార్పు మాటలతో ఓదార్చగా అర్జునుడు కలతనుండి కొద్దిగా తేరుకొని, కళ్ళలో మరల నీరు క్రమ్ముకొనగా అరచేతితో తుడుచుకుంటూ అటూ ఇటూ చూచాడు.

**ఉ. 'ఏమిట నిట్టులయ్యె నొకొ? యిమ్మహితాత్మకుఁ' డంచు నున్మిష**
**ద్ధామములైన యంగములఁ దాఁ గలయం బరికించి యోగిహృ**
**ద్యామల పాదపద్మగత మైన విశేషము చూచి రుద్రతే**
**జోమయుఁ డైన సంయమి వచోగతి గాంచి సువిస్మితాత్ముఁడై. 165**

**ప్రతిపదార్థం:** ఏమిటన్= ఏ కారణంచేత; ఈ+మహితాత్మకుఁడు= ఈ మహానుభావుడు; ఇట్టులు+అయ్యెన్+ఒకొ?= ఇట్లా అయ్యాడో?; అంచున్= అనుకొంటూ; ఉన్మిషత్= వికసించుచున్న; ధామములన్= స్థానములు గల; అంగములన్= అవయవాలను; తాన్= తాను (అర్జునుడు); కలయన్+పరికించి= బాగా పరిశీలించి; యోగి= యోగులకు; హృద్య= ప్రీతిని గూర్చునట్టి; అమల= పవిత్రమైన; పాదపద్మగత= కమలంవంటి పాదంలోని; విశేషము= వ్యత్యాసాన్ని (విశేషాన్ని - గాయంచేత ఏర్పడ్డ మార్పును); చూచి= గమనించి; రుద్రతేజోమయుఁడు+ఐన= రుద్రతేజస్సు నిండిన; సంయమి= ఋషి; వచస్+గతి= మాట తెఱగును; కాంచి= చూచి; సువిస్మిత+ఆత్ముఁడు+ఐ= మనసులో ఆశ్చర్యం పొంది.

**తాత్పర్యం:** 'ఈ మహానుభావుడు ఏ కారణంచేత ఇట్లా అయ్యాడో పాపం!' అనుకొంటూ బాగా విప్పారిన, ప్రకాశవంతములైన అవయవాలను అర్జునుడు బాగా పరిశీలించాడు. యోగులకు ప్రీతిని కలిగించే కృష్ణుడి పవిత్రపాదంలో

ఉన్న మార్పును - గాయాన్ని గమనించి రుద్రతేజస్సు నిండిన మహర్షి మాట ఫలితాన్ని - కృష్ణుడి మరణం ద్వారా సత్యం కావటాన్ని - చూచినవాడై, మనసులో ఆశ్చర్యం పొందాడు.

**విశేషం:** రుద్రుడు కాలస్వరూపుడు. ఋషి శాపంలో కాలప్రచోదనమున్నది. అందుకనే అది శ్రీకృష్ణుడిని కూడా వదలటంలేదని అర్థం. ఈ కారణంచేతే అర్జునుడికి ఆశ్చర్యం కలిగింది.

**క. అవికృతమును రుచిరమునై। యవయవములు నిదుర వోయినప్పటి క్రియ నుం**
**డ వఱలు కృష్ణుని దేహం। బవిరత చక్షురభిముఖత నాలోకించెన్. 166**

**ప్రతిపదార్థం:** అవికృతమును= ఏ వికారమూ పొందనివి; రుచిరమును+ఐ= కాంతిమంతములైనవి (అయిన); అవయవములు= దేహభాగాలు; నిదుర+పోయినప్పటి+క్రియన్= నిదురపోతున్నప్పటివలె; ఉండన్= ఉండగా; వఱలు= ప్రకాశిస్తున్న; కృష్ణుని దేహంబు= శ్రీకృష్ణుడి కళేబరాన్ని; అవిరత= ఎడతెరపి లేకుండా; చక్షుః+అభిముఖతన్= కంటి కెదురుగా; ఆలోకించెన్= చూస్తూ ఉండిపోయాడు.

**తాత్పర్యం:** ఆ కృష్ణుడి శరీరావయవాలు ఏ వికారాన్నీ పొందలేదు. కాంతి మునుపటివలెనే ఉన్నది. నిదురపోతున్నప్పటి వలె ప్రకాశవంతంగా వెలిగిపోతున్నది ఆ దేహం. ఆ దేహాన్ని కన్నార్పకుండా అట్లాగే చూస్తూ ఉండిపోయాడు.

**ఉ. అమ్మెయి నూరకుండ ననుయాయి జనమ్ములు పెక్కు లాడి చి**
**త్తమ్ము కలంక దేర్చి యుచితక్రియకున్ మొగకొల్పి 'బంధుసం**
**ఘమ్ముల నిందుఁ దెత్తమొ? వికారవిదూర! యుపేంద్రు భవ్యదే**
**హమ్ముట గొంచుఁ బోదమొ? సమర్థవిధం బొకఁ డేర్పరింపుమా!' 167**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; ఊరకుండన్= అర్జునుడు ఉలుకు పలుకు లేకుండా ఉండగా; అనుయాయి= వెంటవచ్చు; జనమ్ములు= జనులు; పెక్కులు+ఆడి= చాలా విధాలుగా ఓదార్పు మాటలు చెప్పి; చిత్తమ్ము కలంకన్+తేర్చి= మనసు కలతను పోగొట్టి; ఉచిత క్రియకున్= చేయదగిన పనికి; మొగకొల్పి= ప్రోత్సహించి; బంధుసంఘమ్ములన్= బంధువుల సమూహములను; ఇందున్= ఇక్కడికి; తెత్తమొ?= తెద్దామా?; వికార= వికారానికి; విదూర= దూరంగా ఉన్నవాడా!; ఉపేంద్ర= కృష్ణుడి; భవ్యదేహమ్ము= పవిత్రదేహాన్ని; అటన్= ద్వారకకు; కొంచున్+పోదమొ?= తీసికొని వెళ్దామా?; సమర్థ= తగిన; విధంబు= పద్ధతిని; ఒకఁడు= ఒకదానిని; ఏర్పరింపుమా!= ఏర్పరచుము.

**తాత్పర్యం:** ఆ విధంగా ఉలుకూ పలుకూ లేకుండా కృష్ణుడి దేహాన్ని అర్జునుడికి అతడి వెంట వచ్చిన జనులు చాలా విధాలుగా ఓదార్పు మాటలు చెప్పి, అతడి మనసులోని కలతను పోగొట్టి, చేయదగిన పనికి ప్రోత్సహించారు. 'ద్వారకలోని బంధువులను ఇక్కడికి తీసికొనిరావటమో!, ఏ వికారమూ పొందనివాడా! పవిత్రమైన శ్రీకృష్ణుడి దేహాన్ని ద్వారకకు తీసికొని పోవటమో! ఈ రెంటింటిలో తగినపని ఏదో నిర్ణయించి చెప్పుము' అన్నారు.

**చ. అని యడుగంగ 'దైవగతి నంబుధి పట్టణమాక్రమించు టె**
**ద్దినమున నొక్కొ?' యన్వగ మదిం జొనిపెం గురునాథ! యప్పు డ**

వ్వినుతగుణాభిరాముఁ డడవిం దమత్రిమ్మటఁ జన్నప్రొద్దు ల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్క దోఁచినన్. 168

**ప్రతిపదార్థం:** అని= వారు ఈ విధంగా; అడుగంగన్= అడుగగా; కురునాథ!= ఓ రాజా! వినుము; అంబుధి= సముద్రం; పట్టణము+ఆక్రమించుట= ద్వారకను ఆక్రమించటం; ఏ+దినమునన్+ఒక్కో= ఏ రోజో!; అన్+వగ= అనే ఆలోచన; మదిన్= మదిలో; చొనిపెన్= ప్రవేశింపజేశాడు (ఆలోచించాడు); అప్పుడు= ఆలోచించినవాడై; ఆ+వినుత+గుణ+అభిరాముఁడు= ఆ ప్రశస్త గుణాలచేత అభిరాముడైన అర్జునుడు; అడవిన్= అడవిలో; తమ= తమయొక్క; త్రిమ్మటన్= త్రిప్పటలో; చన్న+ప్రొద్దులు= కడచిపోయినరోజులను; ఆ+అనుచర+కోటితోడన్= తనవెంట వచ్చిన వారితో; తెలియన్+తలపోయఁగన్= బాగా ఆలోచించగా; లెక్క+తోఁచినన్= లెక్క తేలగా.

**తాత్పర్యం:** వారు ఈ విధంగా అడుగగా అర్జునుడు 'సముద్రం ద్వారకను ఆక్రమించేది ఏ రోజో!' అన్న ఆలోచన చేశాడు. ఆలోచించి, అడవిలో తాము తిరిగిన తిరుగుళ్ళతో ఎన్నిరోజులు గడిచిపోయాయో తోడుగా ఉన్నవారితో కలిసి బాగా ఆలోచించాడు. చివరికి లెక్క తేలింది. (తరువాతి పద్యంతో అన్వయం).

క. మఱునాఁడ యగుట లెస్సగ । నెఱిఁగె; నినుం డపుడు వేఁడి యెడలిన దీప్తుల్
దుఱఁగలిగొనఁ బశ్చిమగిరి । చఱికి ననతి దూరమున విశదుఁడై తోఁచెన్. 169

**ప్రతిపదార్థం:** మఱునాఁడు+అ= మరుసటిరోజే; అగుటన్= కావటాన్ని; లెస్సగన్= బాగా; ఎఱిఁగెన్= గుర్తించాడు; అపుడు= ఆ సమయంలో; ఇనుండు= సూర్యుడు; వేఁడి= వేడిమి; ఎడలిన= తగ్గిన; దీప్తుల్= కాంతులు; తుఱఁగలిగొనన్= ప్రకాశిస్తుండగా; పశ్చిమగిరి= పడమటికొండ; చఱికిన్= చఱియకు; అనతి దూరమునన్= దగ్గరలోనే; విశదుఁడు+ఐ= స్పష్టంగా; తోఁచెన్= కనిపించాడు.

**తాత్పర్యం:** మరుసటి ఉదయమే సముద్రం ద్వారకను కబళిస్తుందని లెక్కతేలింది. అప్పుడే సూర్యుడు వేడిమి తగ్గిన కాంతులతో పడమటి కొండచరియకు సమీపంలోనే ప్రకాశిస్తూ కనిపించాడు.

సీ. దాని కజ్జనములుఁ దాను నుత్తల మంది । చర్చించి కార్యంబు చాయఁగాంచి
'మనము కృష్ణునిఁ గని చనుదెంచినారమై । పురమున నివ్వార్త పుట్టకుండ
నడఁచి యచ్చటి మాట లవి కొన్ని ఘటియించి । చెప్పి యూరేయి చెచ్చెరఁ బ్రయాణ
మునకుఁ గృత్యములగు పనులెల్ల సమకట్టి । వేగంగ గ్రక్కున వెడలవలయుఁ
ఆ. గాని వెడలకున్న భానూదయంబున । వనధి పురము ముంచికొనిన గణన
సేయరాని యట్టి సేగియుఁ బ్రయ్యుఁ బా । పంబు వగయు నెల్లభంగిఁ గలుగు. 170

**ప్రతిపదార్థం:** దానికిన్= అట్లా సూర్యాస్తమయం చూడటంవలన; ఆ+జనములున్= ఆ జనులు; తానున్= తానూ; ఉత్తలము+అంది= భయపడి; చర్చించి= బాగా ఆలోచించి; కార్యంబు= ఏమి చేయాలో - ఆ పని; చాయన్+కాంచి= పద్ధతిని నిర్ణయించుకొని (అర్జునుడు ఇట్లా చెప్పాడు); మనము= అడవిలోకి వచ్చినమనము; కృష్ణునిన్+కని= కృష్ణుడిని చూచి; చనుదెంచినారము+ఐ= తిరిగి వచ్చినవారివలె; పురమునన్= నగరంలో; ఈ+వార్త= కృష్ణుడి మరణవార్త; పుట్టకుండన్= పుట్టకుండా; అడఁచి= దాచిపెట్టి; అచ్చటి మాటలు= అక్కడ ఆడవలసిన మాటలు; అవి కొన్ని ఘటియించి= ఆ సమయానికి కావలసినవాటిని

కూర్చుకొని; చెప్పి= వారికి చెప్పి; ఈ రేయి= ఈ రాత్రి; చెచ్చెరన్= త్వరితంగా; ప్రయాణమునకున్= ద్వారకను వదలి బయలుదేరటానికి; కృత్యములు+అగు= చేయదగిన; పనులు+ఎల్లన్= పనులన్నిటినీ; సమకట్టి= పూర్తిచేసికొని; వేగంగన్= ఉదయం కాక మునుపే; గ్రక్కునన్= శీఘ్రంగా; వెడలవలయున్= బయటపడాలి; కాని= అట్లా కాకుండా; వెడలక+ఉన్నన్= బయటికి వెళ్ళకపోతే; భాను+ఉదయంబునన్= సూర్యోదయం కాగానే; వనధి= సముద్రం; పురమున్= నగరాన్ని; ముంచివేస్తే; గణన+చేయరాని= లెక్కించటానికి వీలులేని; సేగియున్= కీడు; ప్రయ్యున్= నిందపడును; పాపంబున్= పాపమూ; వగయున్= వ్యథా; ఎల్ల భంగిన్= అన్నివిధాలా; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** అట్లా సూర్యాస్తమయం చూడగానే ఆ జనులూ తానూ భయపడ్డారు. బాగా ఆలోచించి ఏమి చేయాలో నిర్ణయించుకొని అర్జునుడు ఇట్లా చెప్పాడు: 'మనం కృష్ణుడిని చూచి తిరిగి వచ్చిన వారివలెనే - కృష్ణుడి మరణవార్త నగరంలో పొక్కకుండా దాచిపెట్టి, అవసరాన్ని బట్టి ఆ సమయానికి కావలసినట్లుగా వారివారికి చెప్పి ఈ రాత్రికే త్వరితంగా ద్వారకను వదలివేసి బయలుదేరటానికి చేయదగిన పనులన్నిటినీ పూర్తిచేసికొని ఉదయం కాక మునుపే అతి శీఘ్రంగా ద్వారకనుండి బయటపడాలి. అట్లా కాకుండా బయటికి వెళ్ళకపోతే సూర్యోదయం కాగానే సముద్రం నగరాన్ని ఆక్రమించుకుంటే లెక్కకు మిక్కుటంగా ప్రాణనష్టం జరిగి - ఆపద, నింద, పాపం, వ్యథ మనందరికీ కలుగుతాయి.

**విశేషం:** కృష్ణుడి మరణవార్త చెప్పితే ప్రయాణసన్నాహాలు చేసే బుద్ధికూడా ఎవరికీ ఉండదు. అట్లా చేయకపోతే ప్రాణాలు పోయి, ఆస్తులు నశించి ద్వారకావాసులకు ఆపద వస్తుంది. ఈ పరిస్థితిని ఎదుర్కొనలేని రాజప్రతినిధి అర్జునుడికి నింద వస్తుంది. ఇంతమందిని చంపిన పాపం వస్తుంది. దీనితో కలిగేది వ్యథమాత్రమే - అందుకే అర్జునుడు ఈ నిర్ణయం తీసికొన్నాడు.

అర్జునుఁడు రామకృష్ణులకు నగ్నిసంస్కారంబు సేయుట

**ఉ.** **కావున వేగ మగ్నియును గాష్ఠములున్ సమకూర్చి సద్విధి**
**శ్రీవిలసిల్లఁ గృష్ణుని శరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం**
**బోవుట బుద్ధి' యంచు మఱి భూసురకోటియుఁ దాను గాఢసం**
**భావనతోడఁజేసె దృఢభక్తికుఁడై పితృమేధభద్రమున్.** **171**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; వేగము= శీఘ్రంగా; అగ్నియునున్= అగ్నీ; కాష్ఠములున్= కర్రలూ; సమకూర్చి= సిద్ధం చేసికొని; సత్+విధి+శ్రీ= శాస్త్రకర్మ యొక్క ఉత్తమత్వం; విలసిల్లన్= సిద్ధించగా; కృష్ణుని శరీరమున్= శ్రీకృష్ణుడి దేహాన్ని; సంస్కృతిన్= అగ్ని సంస్కారంలో - చితిలో; కూర్చి= చేర్చి; క్రమ్మఱన్= తరువాత; పోవుట బుద్ధి= పోవటం తెలివైనపని; అంచున్= అని; మఱి= తరువాత; భూసురకోటియున్= బ్రాహ్మణసమూహమూ; తానున్= తానూ; గాఢ= గాఢమైన; సంభావనతోడన్= తలపుతో కూడిన శ్రద్ధతో; దృఢభక్తికుఁడై= దృఢమైనభక్తి కలవాడై; పితృమేధభద్రమున్= పితృయజ్ఞ మంగళాన్ని; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** కాబట్టి శీఘ్రంగా అగ్నిని, కర్రలను సిద్ధం చేసికొని శాస్త్రకర్మలో ఉత్తమత్వం సిద్ధించేటట్లు శ్రీకృష్ణుడి దేహాన్ని చితాగ్నిలో చేర్చి తరువాత బయలుదేరిపోవటం తెలివైనపని' అని ఆలోచించి బ్రాహ్మణులతో కూడి అర్జునుడు గాఢంగా శ్రీకృష్ణుడిని తలచుకొంటూ భక్తిశ్రద్ధలతో శ్రేష్ఠమైన పితృయజ్ఞాన్ని నిర్వర్తించాడు.

**విశేషం:** పితృయజ్ఞంలో ప్రధానమైనవి భక్తిశ్రద్ధలు. మృతుడిపట్ల గాఢమైన సంభావన. ఇట్లా చేస్తే ఆ శాస్త్రకర్మలో ఉత్తమత్వం

సిద్ధిస్తుంది. అందుకే శ్రేష్ఠమైన పితృమేధ మది. అది లేకుండా కేవలం పదార్థవైభవంతో చేసేదానికి ఆ ఉత్తమత్వసిద్ధి ఉండదని అర్థం. అర్జునుడు చేసిన పితృమేధం అంత విశిష్టంగా ఉన్నదని అర్థం.

**చ. హలధరునిం దలంచి మునులాడిన మాట తెఱంగు దప్పదం**
**చలయక తత్ప్రదేశమున నారసి కాంచి తదీయదేహమున్**
**వలయు తెఱంగునం బరమవహ్నికి నాహుతి సేసె నయ్యనా**
**కులహృదయుండు భూమిసురకోటియుఁ దానును సత్వరంబుగన్. 172**

**ప్రతిపదార్థం:** హలధరునిన్= బలరాముడిని; తలంచి= తలచుకొని; మునులు+ఆడినమాట+తెఱంగు= మునులు ఇచ్చిన శాపవిధానం; తప్పదు+అంచున్= తప్పదని; అలయక= బడలక; తద్+ప్రదేశమునన్= ఆ ప్రాంతాలలోనే; ఆరసి= వెదకి; తదీయ దేహమున్= అతడి కళేబరాన్ని; కాంచి= చూచి; ఆ+అనాకుల హృదయుండు= కలతలేని హృదయమున్న ఆ అర్జునుడు; భూమిసురకోటియున్+ తానును= బ్రాహ్మణులు, తానూ (కలిసి); సత్వరంబుగన్= అతి శీఘ్రంగానే; (ఆ దేహాన్ని); వలయు తెఱంగునన్= చేయవలసిన పద్ధతిలో; పరమవహ్నికిన్= శ్రేష్ఠమైన చితాగ్నికి; ఆహుతి+చేసెన్= ఆహుతి చేశాడు.

**తాత్పర్యం:** బలరాముడి గురించి తలచుకొని మునుల శాపోక్తి తప్పదని ఆలస్యం చేయకుండా ఆ ప్రాంతాలలోనే వెదుకగా ఆ బలరాముడి దేహమూ కనిపించింది. ఏ కలతాలేని స్థిరమైన హృదయంతో బ్రాహ్మణుల సహాయంతో అర్జునుడు ఆ కళేబరాన్ని కూడా చితాగ్నిలో ఆహుతి చేశాడు.

**విశేషం:** బలరాముడు పెద్దవాడుకదా! తరువాత ఉత్తరక్రియ చేయటం ఎట్లాగని అనిపించవచ్చును. అర్జునుడి మనసులో కృష్ణుడే ఉన్నాడు. బలరాముడి మృతి తొలుత ఊహకు కూడా వచ్చి ఉండకపోవచ్చును. అందుకే ఇట్లా జరిగింది. నారాయణాంశ కృష్ణుడు. శేషాంశ బలరాముడు - కాబట్టి కూడా ఈ వరుస సమర్థనీయమే.

**సీ. అబ్భంగిఁ గృతకృత్యుఁ డైన యప్పార్థుండు। యాదవపురమున కరుగుచున్న**
**యెడ ననుచరులతో నిట్టి కార్యంబును। నడపక తక్కిన నాథు చన్న**
**గతికిఁ బోవుటకునై కడఁగెడు రుక్మిణీ। ప్రభృతుల మనకు నిల్పంగ వశమె?**
**రే యెల్ల నిప్పని సేయు విధముల క। వ్యయ మగు నంతకు వచ్చు నబ్ధి**

**ఆ. మేలు సేయఁ బోయి యీ లోకమంతయుఁ। దిట్టునట్టి కీడు దెచ్చికొనఁగ**
**వచ్చునే? స్వదేశవర్తులమై చూచి। కొంద మెల్లపనులు రండు వేగ. 173**

**ప్రతిపదార్థం:** ఆ+భంగిన్= ఆ విధంగా; కృతకృత్యుఁడైన= విహితమైన పనిని చేసినవాడైన; ఆ+పార్థుండు= ఆ అర్జునుడు; యాదవపురమునకున్= ద్వారకకు; అరుగుచున్న+ఎడన్= వెడుతున్న సమయంలో; (అర్జునుడు ఇట్లా అన్నాడు); ఇట్టి కార్యంబును= ఇట్లాంటి పనిని; నడపక తక్కినన్= చేయకుండా వదిలి ఉంటే; నాథు చన్న గతికిన్= భర్తపోయిన గతికి (మరణించటానికి); పోవుటకున్+ఐ= వెళ్ళటానికి; కడఁగెడు= సిద్ధపడే; రుక్మిణీ ప్రభృతులన్= రుక్మిణి మొదలగు కృష్ణుడి రాణులను; మనకు; నిల్పంగన్+వశమె?= నిలపటానికి వీలవుతుందా?; రేయి+ఎల్లన్= రాత్రంతా; ఈ+పని+చేయు విధములకున్+అ= ఇట్లా వారిని ఓదార్చి సర్దే పనిచేస్తూ ఉండిపోవటానికే; వ్యయమగున్+అంతకున్= వ్యర్థమయిపోతే, అంతలోపలే; అబ్ధి= సముద్రం; వచ్చున్=

ముంచుకొని వస్తుంది; (అట్లా అయితే); మేలు+చేయన్+పోయి= మేలు చేయటానికి పోయి; ఈ లోకము+అంతయున్= ఈ లోకంలోని అందరూ; తిట్టునట్టి కీడున్= తిట్టేటటువంటి ఆపదను; తెచ్చికొనఁగన్?+వచ్చునే= తెచ్చుకోవచ్చునా?; స్వదేశవర్తులమై= మనదేశంలోనే ఉంటూ; ఎల్లపనులు= అన్ని పనులూ; చూచికొందము= చూచికొందాము; వేగన్= వేగంగా; రండు= కదలి రండి.

**తాత్పర్యం:** ఆ విధంగా విహితమైన పితృకార్యాన్ని నెరవేర్చి ధన్యుడైన ఆ అర్జునుడు ద్వారకకు వెళ్ళుతున్న సమయంలో అనుయాయులతో ఇట్లా అన్నాడు: 'ఇంత ముఖ్యమైన పనిని చేయకుండా వదలి ఉంటే భర్తతోపాటు మరణించటానికి సిద్ధపడే రుక్మిణి మొదలైనవారిని నిలుపటానికి వీలవుతుందా? ఇట్లా వారిని ఓదార్చి సర్దే పనిచేస్తూ ఉండిపోవటానికే రాత్రి వ్యర్థమయిపోతే అంతలోపలే సముద్రం ముంచుకొని వస్తుంది. అట్లా అయితే మేలు చేయటానికి పోయి లోకంలోని అందరూ తిట్టిపోసేటటువంటి ఆపదను కొనితెచ్చుకొన్నట్లవుతుంది. అది మంచిదా? మన నగరానికి చేరుకొని, అక్కడే ఉంటూ అన్ని పనులూ చూచికొందాము. తొందరగా కదలిరండి.'

**తే.** **అనుచు నరిగి తాఁ దలఁచిన యట్ల యెల్ల। తెఱఁగు పనులు నా రాత్రిలోఁ దీర్చి ప్రొద్దు**
**పొడుపునకు మున్న వెడలించెఁ బురము సకల। జనములను జీవధనముల సరకు నతఁడు.** **174**

**ప్రతిపదార్థం:** అనుచున్+అంటూ; అరిగి= ద్వారకానగరం చేరి; తాన్= తాను; తలఁచిన+అట్లు+అ= తాను ఆలోచించిన విధంగానే; ఎల్ల+తెఱఁగుపనులు= అన్ని విధాలైన పనులనూ; ఆ రాత్రిలోన్= ఆ రాత్రిలోనే; తీర్చి= పూర్తిచేసి; ప్రొద్దుపొడుపునకున్+ మున్ను+అ= సూర్యోదయం కాక మునుపే; సకలజనములనున్= ప్రజలందరినీ; జీవధనములన్= జీవరాసులను, ధనమును; సరకున్= సామానులను; అతఁడు= అర్జునుడు; పురము= ద్వారక; వెడలించెన్= దాటించాడు.

**తాత్పర్యం:** ఇట్లా అంటూ ద్వారకను చేరి, తాను తలచుకొన్న విధంగానే అన్ని విధాలైన పనులను ఆ రాత్రికి రాత్రే పూర్తిచేసి, సూర్యోదయం కాకమునుపే ప్రజలను, జీవరాసులను, ధనాన్ని, సామానులను అర్జునుడు ద్వారకానగరం దాటించాడు.

**సీ.** **అప్పుడు కృష్ణుని యంతఃపురాంగనా। జనము షోడశ సహస్రమ్ము నతని**
**మహిషీజనుల రాముమహిళల నుచితవా। హనముల నిడికొని యర్హపురుషు**
**లేతేరఁ దేరుల నేనుంగులను గుఱ్ఱ। ములను దత్పరిచారకులు ప్రయత్న**
**మున సవరణ తోడఁ గొని రా నగరి సర। కులుఁ దదీయాధికారులు బహు ప్ర**

**ఆ.** **కారశకటములను గావళ్ళ నెత్తించి। యరసికొని కడంక నరుగుదేర**
**విగతనాథ లైన మగువల గారాము। సెడక యుండునట్లు నడపికొనుచు.** **175**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కృష్ణుని= శ్రీకృష్ణుడి; అంతఃపుర+అంగనాజనమున్= అంతఃపుర స్త్రీలు; షోడశసహస్రమ్మున్= పదారువేలమందిని; అతని= శ్రీకృష్ణుడి; మహిషీజనులన్= పట్టపురాణులను; రాము+మహిళలన్= బలరాముడి భార్యలను; ఉచిత వాహనములన్+ఇడికొని= తగిన వాహనములలో కూర్చొనబెట్టుకొని; అర్హపురుషులు= తగిన సేవకులు; ఏతేరన్= తోడురాగా; తేరులన్= రథాలను; ఏనుంగులనున్= ఏనుగులను; గుఱ్ఱములనున్= గుర్రాలను; తద్+పరిచారకులు= వాటివాటి సేవకులు; ప్రయత్నమునన్= పూనికతో; సవరణతోడన్+కొనిరాన్= వాటివాటి పరికరాలతో సిద్ధం చేసి తీసికొని రాగా; నగరిసరకులు= నగరికి సంబంధించిన సామగ్రిని; తదీయ+అధికారులు= ఆ నగరి పాలకులు; బహుప్రకార= నానావిధాలైన; శకటములనున్=

బండ్లలోను; కావళ్ళన్= కావళ్ళలోను; ఎత్తించి= ఎత్తించుకొని; అరసికొని= బాగా పరిశీలించుకొని; కడంకన్= పూనికతో; అరుగుదేరన్= బయలుదేరగా; విగతనాథలైన= భర్తలుపోయిన; మగువలన్= ఆ స్త్రీలను; గారాము+చెడక+ఉండునట్లు= మర్యాద తగ్గకుండునట్లుగా; నడపికొనుచున్= నడపుకొంటూ.

**తాత్పర్యం:** ఆ సమయంలో శ్రీకృష్ణుడి అంతఃపురకాంతలు పదహారువేలమందిని, అష్టమహిషులను, బలరాముడి నలుగురు భార్యామణులను తగిన వాహనములలో కూర్చొనబెట్టుకొని; తగినసేవకులు తోడు రాగా, రథాలను, గుర్రాలను, ఏనుగులను, వాటి వాటి సేవకులు (చోదకులు, రౌతులు,మావటీలు) పూనికతో వాటివాటి పరికరాలతో అలంకరించి తీసికొనిరాగా, నగరికి సంబంధించిన సామగ్రిని ఆ నగరి ఉద్యోగులు నానావిధాలైన బండ్లలోను. కావళ్ళలోను ఎత్తించుకొని బాగా పరిశీలించి పూనికతో బయలుదేరగా భర్తలు పోయిన ఆ స్త్రీల మర్యాద ఏమాత్రం తగ్గకుండా ఉండేటట్లు చూచికొంటూ అర్జునుడు ప్రయాణం నడిపించాడు.

**క. విను వజ్రముఖ్య యాదవ। జనము నుచితవృత్తి నడపి సర్వంబున క**
**య్యనఘుండు దాన దిక్కయి। చనియె నరదమునను మది విషాదము గదురన్. 176**

**ప్రతిపదార్థం:** విను= రాజా వినుము!; వజ్రముఖ్య= వజ్రుడు మొదలైన; యాదవజనమున్= యాదవులసమూహాన్ని; ఉచితవృత్తిన్= తగిన రీతిలో; నడపి= ప్రయాణం చేయించి; సర్వంబునకున్= అందరికీ, అన్నింటికీ; ఆ+అనఘుండు= ఆ పుణ్యాత్ముడు; తాను+అ= తానే; దిక్కు+అయి= సంరక్షకుడై; మదిన్= మనసులో; విషాదము= దుఃఖం; కదురన్= కలుగగా; అరదముననున్= రథంలో; చనియెన్= ప్రయాణం చేశాడు.

**తాత్పర్యం:** స్త్రీలను మాత్రమే కాకుండా పురుషులైన వజ్రుడు మొదలైన యాదవులను కూడా సముచితమైన రీతిలో గౌరవప్రదంగా ప్రయాణం చేయించి అందరికీ తానే దిక్కుగా ఆ పుణ్యాత్ముడైన అర్జునుడు మనసులో కొండంత దుఃఖం కలుగుతున్నా రథంలో ప్రయాణం చేశాడు.

**క. ఇమ్మెయి నరుండు సకల జ। నమ్ము వెడల నినుఁడు పూర్వనగ మెక్కెను వే**
**గమ్మున ముంచుకొనియె నగ। రమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా! 177**

**ప్రతిపదార్థం:** భరతరాజవరేణ్యా!= భరతవంశరాజులలో శ్రేష్ఠుడా; ఈ+మెయిన్= ఈ విధంగా; నరుండు= అర్జునుడు; సకలజనమ్ము= జనులందరూ; వెడలన్= బయలుదేరగా; ఇనుఁడు= సూర్యుడు; పూర్వ నగము+ఎక్కెను= తూర్పుకొండను ఎక్కాడు; వేగమ్మునన్= అతి త్వరగా; పయోరాశి= సముద్రం; నగరమ్ము= నగరాన్ని; ముంచుకొనియెన్= ముంచివేసింది.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు ద్వారకావాసులు ఎప్పుడు నగరంనుండి బయటపడ్డారో, అప్పుడే సూర్యుడు తూర్పుకొండ నెక్కాడు - సూర్యోదయమైంది. అంతే! ఒక్కుమ్మడిగా సముద్రం నగరాన్ని ముంచివేసింది.

**విశేషం:** అర్జునుడు వసుదేవుడి వద్దకు వచ్చినప్పటినుండి ఇప్పటివరకు-అతడి కార్యదక్షత నిరూపించబడింది. నరుడి శక్తి ఎంతవరకు పనిచేయగలదో ఈ ఘట్టం నిరూపిస్తున్నది.

ద్వారకానగరంబు సముద్రమున మునింగిపోవుట (సం.16-8-40)

**క. వననిధి పురంబు ముంపఁగ। మనుజేశ్వర! యెల్లజనులు మరలఁబడి కనుం**
**గొని రద్భుత రసపూరం। బునఁ బెన్నిట్టఁ దమ చిత్తములు మునుఁగంగన్. 178**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= ఓ నరవరా! రాజా! (ఏమి చెప్పను!); వననిధి= సముద్రం; పురంబున్= నగరాన్ని; ముంపఁగన్= ముంచివేయగా; ఎల్లజనులున్= జనులందరూ; మరలఁబడి= వెనుదిరిగి; అద్భుతరసపూరంబునన్= అద్భుతరస ప్రవాహం యొక్క; పెన్నిట్టన్ (పెను+నిట్టన్)= పెద్దప్రవాహంలో; తమ చిత్తములు= తమ మనస్సులు; మునుఁగంగన్= మునిగిపోగా; కనుఁగొనిరి= చూచారు.

**తాత్పర్యం:** ఆ సముద్రం నగరాన్ని ఒక్కసారిగా ముంచివేస్తుంటే ప్రయాణం చేస్తున్న వీరందరూ ఒక్కసారి వెనుదిరి చూచారు. వారి హృదయాలు అద్భుతరసప్రవాహంలో మునిగిపోయాయి.

**విశేషం:** నగరం నీటిలో మునిగిపోతే వారి మనసు అద్భుతరసమనే ప్రవాహంలో మునిగిపోయినదని - రెండూ మునిగిపోయాయి.

**తే. అపుడు రెండవ జలనిధి యనఁగఁ జాలి। యద్భుతోద్భూత వాక్యచయంబు పేర్మి**
**మ్రోయు నా జనసంఘంబు మురవిరోధి। మఱఁది నడిపించె దర్శితమార్గుఁడగుచు 179**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో, అద్భుత= సముద్రం అట్లా నగరాన్ని ముంచివేయటం చూచినందువలన పుట్టిన అద్భుతరసంచేత; ఉద్భూత= జనించిన వాక్యచయంబు; పేర్మిన్= మాటల సందడిచేత; రెండవజలనిధి+అనఁగన్+చాలి= రెండవ సముద్రమా అనిపించేటట్లు; మ్రోయు+ఆ+జనసంఘంబు= అరుస్తున్న ఆ జనసందోహాన్ని; మురవిరోధి మఱఁది= మురాసురుడి విరోధి అయిన శ్రీకృష్ణుడి మరది - అర్జునుడు; దర్శిత= చూపించిన; మార్గుఁడు+అగుచున్= దారి కలవాడు అవుతూ - దారి చూపించుతూ; నడిపించెన్= ముందుకు నడిపించాడు.

**తాత్పర్యం:** సముద్రం అట్లా నగరాన్ని ముంచివేయటం చూచినందువలన పుట్టిన అద్భుతరసంచేత ప్రయాణం చేస్తున్నవారిలో మాటలసందడి పెరిగింది. అందరూ ఒక్కసారి ఇట్లా గగ్గోలు పెట్టేటప్పటికి ఆ జనసందోహమే మరో సముద్రంవలె అనిపించింది. అట్లాంటి పెద్దగుంపును శ్రీకృష్ణుడి మరది దారి చూపిస్తూ నడిపించాడు.

**విశేషం:** రెండవ జలనిధి యనఁగఁ గాలి... మ్రోయు నా జనసంఘంబు - అలంకారం: ఉత్ప్రేక్ష.

**క. నడిపించి పంచవటమున। విడియించెను; వీడు చోరవీరులు గని 'యె**
**క్కుడు ధనములు గల వీ మ్రు। క్కడి ప్రజలో లేరు దీనిఁ గావఁగ యోధుల్. 180**

**ప్రతిపదార్థం:** నడిపించి= అట్లా నడిపించి (అర్జునుడు వారిని); పంచవటమునన్= పంచవటమనే చోట; విడియించెను= ప్రయాణం ఆపించాడు; వీడున్= ఆ విడిదిని; చోరవీరులు+కని= బలవంతులైన దొంగలు చూచి; ఎక్కుడు ధనములు= దండిగా ధనరాశులు; కలవు= ఉన్నాయి; (కాని); ఈ+ముక్కడి+ప్రజలోన్= ఈ అల్పజనులలో; దీనిన్+కావఁగన్= ఈ ధనాన్ని రక్షించటానికి; యోధుల్= యోధులు; లేరు.

**తాత్పర్యం:** అట్లా నడిపించి అర్జునుడు వారిని పంచవటమనే చోట విడిది చేయించాడు. ఆ విడిదిని గజదొంగలు

చూచి దండిగా ధనరాశులేమో వీరివద్ద కనిపిస్తున్నా దీనికి కాపాడుకొనటానికి తగిన యోధు లెవరూ ఈ క్షుద్రజనులలో కనిపించటంలేదు.

**విశేషం:** కాలం కలిసిరానపుడు మహాయోధులైన యాదవజాతివారు గిరివాసులైన 'క్షుద్రు'లవలెనే ఎవరి కళ్ళకైనా కనిపిస్తారు.

**క. కవ్వడి యొక్కఁడ కంటిరె? జివ్వనఁ జేరుద మితండు సేడ్పడఁ గా నిం**
**దెవ్వరుఁ గడంగ లే రివి। ద్రెవ్విపడిన ధనము లెఱిఁగితిమి లోఁతెల్లన్.' 181**

**ప్రతిపదార్థం:** కవ్వడి= అర్జునుడు; ఒక్కఁడు+అ= ఒకడే; కంటిరె?= చూచారా; చివ్వనన్= శీఘ్రంగా; చేరుదము= అతడిని ఎదుర్కొందాం; ఇతండు= అర్జునుడు; చేడు+పడఁగాన్= ఓడిపోతే; ఇందున్= ఈ యాదవులలో; ఎవ్వరున్= ఎవ్వరూ; కడంగన్+ లేరు= యుద్ధంచేయబూనలేరు; ఇవి+త్రెవ్విపడిన ధనములు= ఈ ధనరాసుల ముల్లెలు సంపూర్ణంగా మనకు తెగిపడిన సొమ్ములే (మనవే); లోఁతు+ఎల్లన్= వీరి లోతుపాతులన్నీ; ఎఱిఁగితిమి= తెలిసికొన్నాం.

**తాత్పర్యం:** అర్జునుడిని ఒకడిని చూస్తే చాలును. అతడిని యుద్ధంలో ఎదుర్కొని ఓడించామంటే ఈ యాదవులలో మరెవ్వరూ మనతో యుద్ధానికి రారు. ఈ సొమ్ము మనదే. వీరి లోతుపాతులు కనుగొన్నాం.'

**క. అని వా రొండురువులతో। మనముల నుత్సాహ మెసఁగ మానితధనముల్**
**గొను నగ్గలికం బలుకుచు। ననేక బలకోటులగుట నలుకేది వడిన్. 182**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; వారు= ఆ దొంగలు; ఒండు+ఒరువులతోన్= ఒకరితో ఒకరు; మానితధనముల్= మన్నింపదగిన అమూల్యమైన ఆ ధనరాసులను; మనములన్= మనసులలో; ఉత్సాహము+ఎసఁగన్= ఉత్సాహం అధికం కాగా; కొను= హరించే; అగ్గలికన్ = విజృంభణతో; పలుకుచున్= మాటాడుతూ; అనేక= చాలామంది; బలకోటులు+అగుటన్= బలవంతుల గుంపు కావటంచేత; అలుకు+ఏది= జంకు విడిచి; వడిన్= వేగంగా.

**తాత్పర్యం:** అని ఆ దొంగలు ఒకరితో ఒకరు, ఆ అమూల్యమైన ధనరాశులను అధికమైన ఉత్సాహంతో కబళించే వారై విజృంభణతో మాటాడుతూ, చాలామంది బలవంతులుండటంచేత జంకు విడిచి వేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'బాలురు వృద్ధులుఁ జుండీ। యాలమునకుఁ గడఁగ నొక్కఁ డయినను లేఁడీ**
**స్త్రీలం బొదువుద మనుచును। నేల యవిసి మూఁగినట్లు నిర్భరభంగిన్. 183**

**ప్రతిపదార్థం:** బాలురు= పిల్లలు; వృద్ధులున్= ముసలివారు; చుండీ!= సుమండీ!; ఆలమునకున్= యుద్ధానికి; కడఁగన్= పూనుకొనటానికి; ఒక్కఁడు+అయినను= ఒక్క డయినా; లేఁడు= లేడు; ఈ స్త్రీలన్= ఈ ఆడువారిని; పొదువుదము= పట్టుకొందాము; అనుచును= అని మాటాడుకొంటూ; నేలయవిసి= నేల పగిలి; మూఁగినట్లు= ఆక్రమించినట్లు; నిర్భరభంగిన్= అందరూ ఒక్కసారిగా.

**తాత్పర్యం:** 'వీరంతా పిల్లలు, ముసలివాళ్ళు మాత్రమే సుమా! అందుచేత యుద్ధం చేయటానికి వీరిలో ఒక్కడైనా పూనుకోడు. ఈ స్త్రీలను పట్టుకొందాము రండి' అని మాటాడుకొంటూ నేల పగిలి పరుచుకొన్నట్లు ఒక్కుమ్మడిగా వారంతా ఆ స్త్రీలపై పడ్డారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. ఏ పెసఁగ రేఁగి యట్ల। ప్పాపాత్మక మగు కిరాతబలము సమగ్రా**
**టోపమునఁ గవిసి వివిధ ధ। నాపహరణ మాచరింప నారంభించెన్. 184**

**ప్రతిపదార్థం:** ఏపు= ఉత్సాహం; ఎసఁగన్= అధికం కాగా; రేఁగి= చెలరేగి (విజృంభించి); అట్లు= ఆ విధంగా; ఆ+పాప+ ఆత్మకము+అగు= ఆ పాపిష్ఠులైన; కిరాతబలము= కిరాతుల సమూహం; సమగ్ర= మిక్కిలి; ఆటోపమునన్= విజృంభణతో; కవిసి= వారినాక్రమించి; వివిధ= నానారకాలైన; ధన+అపహరణము= ధనాలను అపహరించటం; ఆచరింపన్= చేయటానికి; ఆరంభించెన్= మొదలుపెట్టింది.

**తాత్పర్యం:** ఉత్సాహం అధికం కాగా ఆ పాపిష్ఠులైన కిరాతుల సమూహాలు చెలరేగి, మిక్కిలి విజృంభణతో వారిని ఆక్రమించి, నానావిధాలైన నగలను నగ్రలనూ అపహరించటం మొదలుపెట్టారు.

బోయ లర్జును నోర్చి యాదవాంగనల సొమ్ముల నపహరించుట (సం.16-8-50)

**సీ. కనుఁగొని జంభారితనయుఁ డోరోరి యీ। ప్రజ కేన చుండు సంరక్షకుండఁ**
**దొలఁగి పొం డడియాస నొద్దకు వచ్చినఁ। దలలేఱి యుర్వికి బలియొనర్తు**
**నని యదల్చినను వా రఱవాయిగొనక య। ప్పలుకులన్నియును రజ్జులుగఁ గొనుచుఁ**
**జాపల నచట నచ్చట నొల్చికొనఁగ నా। లోకించి యవ్వీరలోకవరుఁడు**

**తే. గాండివం బెక్కువెట్టి ప్రచండబాణ। నికర మక్కిరాతుల మీఁద నిగుడఁ జేయ**
**నలఘుచర్మసంవృతగాత్రు లగుచుఁ దుచ్ఛ। బాణపాషాణలగుడముల్ పరఁగఁ జేసి. 185**

**ప్రతిపదార్థం:** జంభారితనయుఁడు= ఇంద్రుడికొడుకైన అర్జునుడు; కనుఁగొని= దీనిని చూచి; ఓరి+ఓరి= ఒరేయ్ (ఎవడురా అక్కడ?); ఈ ప్రజకున్= ఈ ప్రజలకు; ఏన= నేనే; చుండు!= సుమండీ!; సంరక్షకుండన్= సంరక్షకుడను; చుండు!= సుమండీ; తొలఁగిపొండు= దూరంగా పొండి; అడియాసన్= వ్యర్థమైన ఆశతో; ఒద్దకున్+వచ్చినన్= వీరిని సమీపిస్తే; తలలు+ఏఱి= తలలు నరికి; ఉర్వికిన్= నేలకు; బలి+ఒనర్తున్= బలి ఇస్తాను; అని= అని ఈ విధంగా; అదల్చినను= అదిల్చినా కూడా; వారు= ఆ కిరాతులు; అఱవాయి+కొనక= సరకుచేయక (లెక్కించకుండా); ఆ+పలుకులు+అన్నియును= అర్జునుడి మాటలన్నిటినీ; రజ్జులుగన్= వ్యర్థ భాషణాలుగా; కొనుచున్= గ్రహిస్తూ; చాలన్= ఆ స్త్రీలను; అచటన్+అచ్చటన్= అక్కడక్కడ; ఒల్చికొనఁగన్= దోచుకొంటూ ఉంటే (నగలు ఊడ్చుకొంటుంటే); ఆలోకించి= చూసి; ఆ+వీరలోక+వరుఁడు= వీరులలో శ్రేష్ఠుడైన ఆ అర్జునుడు; గాండివంబు+ఎక్కు+పెట్టి= గాండీవాన్ని ఎక్కుపెట్టి; ప్రచండబాణ నికరము= ప్రచండమైన బాణసమూహాన్ని; ఆ+కిరాతులమీఁదన్= ఆ కిరాతులమీద; నిగుడన్+చేయన్= ప్రయోగించగా; అలఘు= దళసరియైన; చర్మ= చర్మంచేత; సంవృత= దాచబడిన; గాత్రులు+అగుచున్= అవయవాలు కలిగినవారై (ఆ కిరాతులు); తుచ్ఛ= అల్పాలైన; బాణ= బాణాలను; పాషాణ= రాళ్ళను; లగుడముల్= దుడ్డుకర్రలను; పరఁగన్+చేసి= ప్రయోగించి.

**తాత్పర్యం:** అర్జునుడు దీనిని చూచాడు. 'ఎవడురా వాడు! ఈ ప్రజలకు నేనే సంరక్షకుడను. జాగ్రత్త! దూరంగా పొండి. అడియాసతో వీరిని సమీపిస్తే మీ తలలు నరికి భూమికి బలిస్తాను. 'అని అదలించాడు. అయినా ఆ కిరాతులు

ఈ మాటలను వ్యర్థమైన పలుకులుగా లెక్కచేయక, ఆ స్త్రీలనుండి నగలు ఒలుచుకొనటం మొదలుపెట్టారు. దానిని చూచి ఆ వీరోత్తముడైన అర్జునుడు గాండీవధనుస్సును ఎక్కుపెట్టి భయంకరమైన బాణసమూహాన్ని ఆ కిరాతులమీద ప్రయోగించాడు. కాని, వారికి గాయం కూడా కాలేదు. వారి దళసరి చర్మాలచేత వారి అవయవాలన్నీ భద్రంగా కాపాడబడ్డాయి. వారు అతిబలహీనా లైనటువంటి బాణాలను వేశారు. రాళ్ళు విసిరారు. కర్రలు ప్రయోగించారు.

**విశేషం:** ఇక్కడినుండి జరిగిన యుద్ధంలో మహాభారత యుద్ధాన్ని పోల్చి చూచికొనాలి. ఆ యుద్ధంలో అర్జునుడివెంట శ్రీకృష్ణుడు ఉన్నాడు. అందుకే బాణాలు పనిచేశాయి. అక్షౌహిణుల సైన్యాన్ని మట్టి కరిపించాడు. మరి ఇప్పుడో? కేవలం 'నరుడు' మాత్రమే యుద్ధం చేస్తున్నాడు. అందుకే బాణాలు పనిచేయలేదు.

**క. ఆ బోయలు నిర్భయమతు । లై బీభత్సుపయిఁ గవియ నతఁడు మహాస్త్ర**
**ప్రాబల్యంబును మెఱయుటఁ । దా బుద్ధిఁ దలంచి మంత్రతతిఁ దోఁపమికిన్. 186**

**ప్రతిపదార్థం:** ఆ బోయలు= ఆ కిరాతులు; నిర్భయమతులు+ఐ= నిర్భయ మనస్సులు కలవారై; బీభత్సుపయిన్= యుద్ధంలో భయాన్ని సృష్టించే అర్జునుడిమీద; కవియన్= దాడిచేయగా; అతఁడు= అర్జునుడు; మహా+అస్త్ర+ప్రాబల్యంబును= గొప్ప అస్త్రాలశక్తి; మెఱయుటన్= ప్రకాశించగా; తాన్= తాను; బుద్ధిన్+తలంచి= బుద్ధితో తలచుకొని; మంత్రతతి= మంత్రాల సమూహం; తోఁపమికిన్= తోచకుండా పోవటంవలన.

**తాత్పర్యం:** ఆ కిరాతులు నిర్భయంగా అట్లాంటి అర్జునుడిమీదనే దాడిచేశారు. అర్జునుడికి తనవద్ద ఉన్న మహాస్త్రశక్తి స్ఫురించింది. ఆ మంత్రాలను మననం చేయటం మొదలుపెట్టాడు. కాని ఒక్క మంత్రమూ స్ఫురించలేదు. అందువలన (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శస్త్రం కేవలం బలప్రయోగాన్ని ఆశిస్తుంది. అస్త్రం మంత్రసహితం. ఆ కిరాతులకు ఏ అస్త్రాలూరావు. అందుకే వచ్చిన విధంగా అమ్ములు సంధించి వేస్తున్నారు. అయినా వారిదే పై చేయిగా ఉన్నది. అర్జునుడి బాణాలకు వెనకున్న మంత్రశక్తి పోయిందని అర్థం.

**క. ఇది దైవ విరోధం బని । మదిఁ దానూహించి ప్రకృతిమార్గణములు బె**
**ట్టిదముగ నేయఁగ నవియుం । దుదముట్టఁగ రిత్తలయ్యెఁ దొనలు నరేంద్రా! 187**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; ఇది= ఇట్లా కావటం; దైవ విరోధంబు+అని= దైవం శత్రుత్వం వహించటంచేత అని; మదిన్= మనసులో; తాన్+ఊహించి= తాను ఆలోచించి; ప్రకృతి మార్గణములు= సహజమైన బాణాలను (మంత్రాలతో సంబంధంలేనివి); బెట్టిదముగన్= తీవ్రంగా; ఏయఁగన్= ప్రయోగించగా; అవియున్= అవికూడా; తుదిముట్టఁగన్= అయిపోగా; దొనలు= అమ్ములపొదులు; రిత్తలు+అయ్యెన్= ఖాళీ అయిపోయాయి. (ఏమి చెప్పమంటావు దైవలీల!)

**తాత్పర్యం:** ఇట్లా కావటం దైవం ప్రతికూలంగా ఉండటంవలన - అని మనసులో అర్జునుడు ఊహించాడు. మంత్రంతో సంబంధంలేని సాధారణమైన అమ్ములను అతితీవ్రమైన శక్తితో ప్రయోగించాడు. కొంతసేపటికి అవి కూడా అయిపోయాయి. అమ్ములపొదులు ఖాళీ అయిపోయాయి.

**విశేషం:** భారతయుద్ధంలో అర్జునుడు 'విజయుడు' కావటానికి అతడి అమ్ములపొదులు ఎప్పుడూ నిండుగానే ఉండటమే కారణం. వాటిలో బాణాలు ఎప్పుడూ తరిగిపోవు. సవ్యసాచి-కాబట్టి రెండు చేతులతోనూ ప్రయోగించగల డన్నమాట. దైవం-తన సహాయాన్ని మానగానే అర్జునుడి పరాక్రమం ఇట్లా అయింది!

**సీ.** **అప్పుడు కాలపర్యయమున కాశ్చర్య । మును విషాదముఁ దన మనములోనఁ**
**బరిగొన బహువిస్ఫురణకోదండ దం । డమున నా బోయల సమదవృత్తి**
**నెట్టకేలకు నొకయెడ మాన్చి రుక్మిణి । యాదిగాఁ గల కృష్ణు నగ్రమహిషు**
**లెనమండ్ర బలదేవు వనితల మఱియును । గతిపయ యాదవాంగనలఁ గాచెఁ;**

**తే.** **దక్కుఁ గల యింతిగముల నా దస్యులడరి । పట్టికొని యేచి వీ డెల్ల బన్నపడఁగ**
**దొద్దగొని రథకుంజరతురగతతులు । దమకు వలవకునికి దిగఁ ద్రావి చనిరి.** **188**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; (అర్జునుడు); కాలపర్యయమునకున్= కాలవ్యతిక్రమానికి (కాలం అడ్డం తిరగటానికి); ఆశ్చర్యమునున్= ఆశ్చర్యం; విషాదమున్= దుఃఖమూ; తన మనములోనన్= తన మనసులో; పిరిగొనన్= అతిశయించగా; బాహు= చేతిలో; విస్ఫురణ= ప్రకాశిస్తున్న; కోదండదండమునన్= బాణం కఱ్ఱతో; ఆ బోయల= ఆ కిరాతుల; సమదవృత్తిన్= మదించిన వ్యాపారాన్ని; ఎట్టకేలకున్= ఎట్లాగో చివరికి; ఒకయెడన్= కొంతసేపు; మాన్చి= మాన్పించి; రుక్మిణి+ఆదిగాన్+కల= రుక్మిణి మొదలైన; కృష్ణు+అగ్రమహిషులన్+ఎనమండ్రన్= శ్రీకృష్ణుడి ఎనిమిది మంది పట్టపురాణులను; బలదేవు వనితలన్= బలదేవుడి భార్యలను; మఱియును= ఇంకా; కతిపయ= కొంతమంది; యాదవ+అంగనలన్= యాదవస్త్రీలను; కాచెన్= కాపాడాడు; తక్కున్+కల= తక్కిన; ఇంతిగములన్= స్త్రీలను; ఆ దస్యులు= ఆ బోయలు; అడరి= విజృంభించి; పట్టికొని= పట్టుకొని; ఏచి= బాధించి; వీడు+ఎల్లన్= వారి విడిదంతా; బన్నపడఁగన్= నాశనంకాగా; దొద్దగొని= కొల్లగొట్టి; రథ= రథాలు; కుంజర= ఏనుగులు; తురగతతులు= గుఱ్ఱాల గుంపులు; తమకున్= తమకు; వలవక+ఉనికిన్= సాధ్యం కాకపోగా; దిగన్+త్రావి= వదలిపెట్టి; చనిరి= వెళ్ళిపోయారు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడు కాలం ఇట్లా తిరగబడటానికి మనసులో ఆశ్చర్యం, దుఃఖం అతిశయించగా, చేతిలో ప్రకాశిస్తున్న గాండీవంతో ఆ కిరాతుల విజృంభణాన్ని ఏదోవిధంగా కొంతసేపు అరికట్టి, రుక్మిణి మొదలైన అష్టమహిషులను, బలదేవుడి భార్యలను, ఇంకా కొంతమంది యాదవస్త్రీలను కాపాడాడు. ఆ కిరాతులు తక్కిన స్త్రీలను విజృంభించి పట్టుకొన్నారు. బాధించారు. వారి విడిదిని సర్వనాశనం చేశారు. వారి ధనాన్నంతా కొల్లగొట్టారు. రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు - వారికి సాధ్యం కాకపోవటం చేత వదలివేసి వెళ్ళిపోయారు.

**క.** **ఇమ్మాడ్కిం బఱివోయిన । యమ్మొత్తము నడపికొనుచు నతిదైన్యము చి**
**త్త మ్మలఁపంగఁ గురుక్షే । త్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా!** **189**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; ఈ+మాడ్కిన్= ఈ విధంగా; పఱి+పోయిన= నశించిన; ఆ+మొత్తమున్= ఆ జనసమూహాన్ని; నడపికొనుచున్= నడపుకొంటూ; నరుఁడు= అర్జునుడు; అతిదైన్యము= మిక్కిలి దైన్యం; చిత్తమ్ము+అలఁపంగన్= చిత్తాన్ని క్షోభింపజేయగా; కురుక్షేత్రమ్మునకున్+చనియెన్= కురుక్షేత్రానికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కిరాతులచేతిలో క్షీణించి నశించిన ఆ జనసమూహాన్ని నడిపించుకొంటూ అర్జునుడు మిక్కిలి దైన్యం చిత్తాన్ని క్షోభింపజేయగా కురుక్షేత్రానికి వెళ్ళాడు.

**విశేషం:** కురుక్షేత్రంలో యుద్ధం అయిపోయిన తరువాత కూడా కొందరు ఆప్తజనులు, ఋషులు, పురోహితులున్నారని ఈ సందర్భాన్ని బట్టి గుర్తించాలి.

**క. చని యచట నచటఁ దన్నుం। గను నాప్తజనంబుతోడఁ గాలవశత్వం**
**బునఁ బొందిన దుర్దశఁ దగ। వొనర నతఁడు సెప్పఁ జొచ్చె మురివిన మదితోన్. 190**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; అచటన్+అచటన్= అక్కడక్కడ; తన్నున్+కను= తనను చూడవచ్చిన; ఆప్తజనంబుతోడన్= ఆప్తులతో; కాలవశత్వంబునన్= కాలశక్తికి వశమై; పొందిన= తాను పొందిన (తనవారు పొందిన); దుర్దశన్= చెడుస్థితిని; మురివిన మదితోన్= ముక్కలైన మనస్సుతో; తగవు+ఒనరన్= సముచితరీతిలో; అతఁడు= ఆ అర్జునుడు; చెప్పన్+చొచ్చెన్= చెప్పటం మొదలు పెట్టాడు.

**తాత్పర్యం:** కురుక్షేత్రం చేరి, అక్కడ తనను చూడటానికి వచ్చిన ఆప్తులతో కాలశక్తికి వశమై తాము పొందన దుర్దశను ముక్కలైన మనస్సుతో సముచితమైన రీతిలో అర్జునుడు చెప్పటం మొదలుపెట్టాడు.

**సీ. కోపించి గాంధారి శాప మిచ్చిన యది। యాదవసంక్షయ మగుట యెట్లుఁ**
**దప్పదు; మనము తద్బాలవృద్ధస్త్రీజ। నంబుల నెల్ల నర్హంబు లైన**
**ఠావుల సత్ప్రతిష్ఠావిశోకంబులఁ। గాఁ జేయవలయు; నక్కాలమునకు**
**నొదవి యత్తెఱఁగున కుత్సహించుట కృత్య। మర్జున!' నీ కని యాడుచుండుఁ**

**ఆ. బలుమఱును దలంచి పాండవాగ్రజుఁ డది। కారణముగ నతని కరుణ పెంపు**
**నొప్పు నెఱుఁగుఁ గాక యిప్పార్థుఁ డయ్యదు। నికర శేషజనుల నెమ్మి నిలిపె. 191**

**ప్రతిపదార్థం:** కోపించి= కోపగించుకొని; గాంధారి= గాంధారీమహాదేవి; శాపము+ఇచ్చిన+అది= శాపమిచ్చి ఉన్నది; యాదవ సంక్షయము+అగుట+ఎట్లున్+తప్పదు= యాదవులు నశించటం ఎట్లాగూ తప్పదు; మనము= పాండవులమైన మనం; తద్= ఆ యాదవుల; బాల= బాలలను; వృద్ధ+స్త్రీజనంబులన్+ఎల్లన్= వృద్ధులను, స్త్రీలను అందరినీ; అర్హంబులు+ఐన= తగిన; ఠావులన్= చోట్లలో; సత్= బాగుగా; ప్రతిష్ఠా= ఉంచటంచేత; విశోకంబులన్+కాన్= దుఃఖరహితులుగా; చేయవలయున్= చేయాలి; అర్జున!= ఓ అర్జునా!; ఆ+కాలమునకున్= ఆ సమయానికి; ఒదవి= ఉపయోగపడి; ఆ+తెఱఁగునకున్= ఆ కార్యానికి; ఉత్సహించుట= సిద్ధపడటం; నీకున్; కృత్యము+అని= చేయదగినపని అని; పలుమఱును= చాలాసార్లు; తలంచి= తలచుకొంటూ; పాండవ+అగ్రజుఁ డు= ధర్మరాజు; ఆడుచుండున్= అనేవాడు; అది కారణముగన్= అందుచేత; అతనికరుణ= అతడి అధికమైన కరుణను; పెంపున్+ఒప్పున్= వైభవాన్ని, గుణసంపదను; ఎఱుఁగున్+కానన్= తెలిసినవాడు కాబట్టి; ఈ+పార్థుఁడు= ఈ అర్జునుడు; ఆ+యదునికర= ఆ యదుసమూహంలో; శేషజనులన్= మిగిలిన ప్రజలను; నెమ్మిన్= ప్రేమతో; నిలిపెన్= ఆయా చోట్ల నిలిపాడు.

**తాత్పర్యం:** 'యాదవులమీది కోపంతో గాంధారి శాపమిచ్చి ఉన్నది కాబట్టి యాదవనాశనం ఎట్లాగూ తప్పదు. మనం ఆ యదుబాలురను, వృద్ధ, స్త్రీ జనాన్ని తగిన చోట్లలో నిలిపి వారి శోకాన్ని మరిపించటం చేయతగినపని. అర్జునా! ఆ సమయానికి వారికి సహాయపడి ఆ పనికి సిద్ధపడటం నీకు తగిన పని'. అంటూ చాలామార్లు తలచుకొంటూ ధర్మరాజు

అనేవాడు. అందుచేత అతడి అధికమైన కరుణను, వైభవాన్ని, గుణసంపదను తెలిసినవాడు కాబట్టి ఈ విధంగా అర్జునుడు ఆ యదుసముదాయంలో మిగిలిన జనులను ప్రేమతో ఆయా చోట్లలో నిలిపాడు.

**సీ. నిలిపిన తెఱఁగెల్ల నృపవర! చెప్పెద। విను కృతవర్మనందనునిఁ జూచి**
**'నీ తల్లియును నీవు నీతోడఁబుట్టిన। వారును మృత్తికావతపురమున**
**నిలుఁ' డని బహుసంపదలఁ బొల్చు నప్పట్ట। ణంబుఁ దదీయదేశంబు నిచ్చి**
**యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరి। జనములు దాను హర్షం బెలర్ప**

**తే. నందుఁ బోయె; సరస్వతి యనఁగఁ బరఁగు। ఘననగరమున సాత్యకి తనయు నట్ల**
**నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి। యనుప ముదమున నందుల కతఁడు చనియె. 192**

**ప్రతిపదార్థం:** నృపవర!= ఓ రాజశ్రేష్ఠా!; నిలిపిన= నిలిపినటువంటి; తెఱఁగు+ఎల్లన్= విధమంతా; చెప్పెదన్= చెప్తాను; విను= బాగా వినుము; (అర్జునుడు); కృతవర్మనందనునిన్+చూచి= కృతవర్మ కొడుకును చూచి; నీ తల్లియును= నీ తల్లీ; నీవు= నీవూ; నీతోడన్+పుట్టినవారునున్= నీ సోదరులూ; మృత్తికావతపురమునన్= మృత్తికావతపురంలో; నిలుఁడు+అని= నిలవండి (ఉండండి) అని; బహుసంపదలన్+పొల్చు+ఆ+పట్టణంబున్= బాగా సంపదలతో కూడిన ఆ పట్టణాన్ని; తదీయదేశంబున్= ఆ దేశాన్ని; ఇచ్చి= ఏలుకొనటానికి ఇచ్చి; అభిషిక్తున్+చేసినన్= అభిషేకం చేయగా; ఆతండు= అతడు; నిజపరిజనములున్= తన సేవకజనం; తానున్; హర్షంబు+ఎలర్పన్= సంతోషమతిశయించగా; అందున్+పోయెన్= ఆ నగరానికి వెళ్ళాడు; సాత్యకితనయున్= సాత్యకి కుమారుడిని; అట్లు= అట్లాగే; సరస్వతి+అనఁగన్+పరఁగు= సరస్వతి అని పిలువబడే; ఘననగరమునన్= పెద్దపట్టణంలో; నెయ్యమునున్= స్నేహమూ; గారవంబునున్= గౌరవమూ; నెఱయన్= నిండగా; నిలిపి+అనుపన్= ఉండుమని పంపగా; ముదమునన్= సంతోషంతో; అందులకున్= ఆ నగరానికి; అతఁడూ= అతడు; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వారిని ఎట్లా నిలిపాడో చెప్తాను వినుము. కృతవర్మ కొడుకును చూచి అర్జునుడు 'నీవు, నీ తల్లి, నీ సోదరులు, మృత్తికావతపురంలో ఉండండి' అని చెప్పి, చాలా సంపదలు కలిగిన ఆ నగరాన్ని, ఆ దేశాన్ని అతడికి ఏలుకొనటానికి ఇచ్చి అభిషేకం చేశాడు. అతడు తన సేవకులతో కూడి సంతోష మతిశయించగా, ఆ నగరానికి వెళ్ళాడు. అట్లాగే సాత్యకి కుమారుడిని సరస్వతి అనే నగరానికి స్నేహగౌరవాలు నిండిన హృదయంతో అభిషేకంచేసి పంపించాడు. అతడూ సంతోషంతో ఆ నగరానికి వెళ్ళాడు.

**సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబు। నకుఁ గొని చని వజ్రు నాథుఁ గాఁగ**
**నందుఁ బట్టము గట్టి హస్తితురంగ ర। థంబుల విభజించి తగిన భంగి**
**నమ్మువ్వురకును సమర్పితంబులు సేసి। యయ్యయి బంధుల నందు నందు**
**నందును నిలుచు నట్లొందఁగ నియమించి। యక్రూరుభార్యల నాత్మజులను**

**తే. వజ్రునకు నప్పగించె; నవ్వాసుదేవు। పౌత్రుఁ డతి వినయంబునఁ బట్టువఱుప**
**వారు నిలువక పోయిరి వలచు నెడకు;। దాని విని యూరకుండె భీమానుజుండు. 193**

**ప్రతిపదార్థం:** తక్కటివారిన్= తక్కినవారిని; ఇంద్రప్రస్థనగరంబునకున్+కొని చని= ఇంద్రప్రస్థనగరానికి తీసికొనివెళ్ళి; వజ్రున్= వజ్రుడిని; నాథున్+కాఁగన్= ప్రభువుగా; అందున్= ఆ నగరంలో; పట్టము+కట్టి= పట్టాభిషేకం చేసి; హస్తి= ఏనుగులను; తురంగ= గుర్రాలను; రథంబులన్= రథాలను; విభజించి= ఆ మూడు రాజ్యాలకు పంచిపెట్టి; ఆ+మువ్వురకునున్= ఆ ముగ్గురికీ; సమర్పితంబులు+చేసి= సమర్పించి; ఆ+అయి= ఆయా; బంధులన్= బంధువులను; అందున్= మృత్తికావతంలో; అందున్= సరస్వతిలో; అందునున్= ఇంద్రప్రస్థంలో; నిలుచునట్లు+ఒందఁగన్+నియమించి= నివసించేటట్లు తగిన నియామకం చేసి; అక్రూరు భార్యలన్= అక్రూరుడి భార్యలను; ఆత్మజులను= కుమారులను; వజ్రునకున్+అప్పగించెన్= వజ్రుడికి అప్పగించాడు; ఆ+వాసుదేవపౌత్రుఁడు= ఆ వజ్రుడు; అతి వినయంబునన్= అతి వినయంతో; పట్టు+పఱుపన్= అనునయించి ఉండుమని కోరుకొన్నా; వారు; నిలువకపోయిరి= అక్కడ నిలువకుండా వెళ్ళిపోయారు; భీమ+అనుజుండు= అర్జునుడు; దానిన్ విని= ఆ విషయం తెలిసి; ఊరకుండెన్= ఊరుకొన్నాడు.

**తాత్పర్యం:** తక్కినవారిని ఇంద్రప్రస్థానికి తీసికొనివెళ్ళి. వజ్రుడిని ప్రభువుగా ఆ నగరంలో పట్టంకట్టి ఏనుగులను, గుర్రాలను, రథాలను ఆ మూడు రాజ్యాలకు పంచి పెట్టి, ఆ ముగ్గురికీ సమర్పించాడు. ఆయా బంధువులను మృత్తికావతంలో, సరస్వతిలో, ఇంద్రప్రస్థంలో ఉండేటట్లు నియామకం చేశాడు. అక్రూరుడి భార్యలను, పిల్లలను వజ్రుడికి అప్పగించి వారి క్షేమం చూడు మన్నాడు. వజ్రుడు కూడా ఎంతో వినయంతో వారిని అనునయించి ఉండండని కోరినా వారు అక్కడ నిలువకుండా వెళ్ళిపోయారు. ఆ విషయం విన్న అర్జునుడు ఊరుకొన్నాడు.

### అర్జునుఁడు రామకృష్ణుల నిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట

**క.** **యాదవకుటుంబముల న। త్యాదరమున నట్లు నిలిపి హలధరుఁడును దా**
**మోదరుఁడుఁ దెగుట వారల। గాదిలి పొలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్.** **194**

**ప్రతిపదార్థం:** యాదవకుటుంబములన్= యాదవుల కుటుంబాలలోని మూడువంశాలవాళ్ళనూ ఒక్కొక్క నగరంలో; అతి+ఆదరమునన్= మిక్కిలి గౌరవంతో; అట్లు= ఆ విధంగా; నిలిపి= ఉండేటట్లు చేసి (అర్జునుడు); హలధరుఁడును= బలరాముడూ; దామోదరుఁడున్= కృష్ణుడూ; తెగుట= చనిపోవటాన్ని; వారల= వారి; గాదిలి= ప్రియమైన; పొలఁతులకున్= స్త్రీలకు (భార్యలకు); చెప్పఁగాన్= చెప్పాలని; మదిన్= మనసులో; తలఁచెన్= ఆలోచించాడు.

**తాత్పర్యం:** అట్లా యాదవకుటుంబాలను ఆయా నగరాలలో అతి ప్రేమాభిమానాలతో నిలిపి, అర్జునుడు ఒకనాడు బలరామకృష్ణులు మృతినొందిన విషయం వారి ప్రియపత్నులకు చెప్పాలని ఆలోచించాడు.

**చ.** **తలఁచి యతండు మందగతిఁ దానును నర్హజనోత్కరంబు వా**
**రలకడ కేఁగి శోకవిధురంబగు చిత్తముతోడఁ దారు గా**
**నల కటు వోయి పంకరుహనాభుని రాముని రోసి పల్దినం**
**బులు భ్రమ సంచరించుటయు బోయ తముం గని యార్ద్రచిత్తుఁడై.** **195**

**ప్రతిపదార్థం:** తలఁచి= ఆలోచించి; అతండు= అర్జునుడు; మందగతిన్= నెమ్మదిగా; తానును; అర్హజన+ఉత్కరంబు= తగినజన సమూహంతో కలిసి; వారలకడకున్+ఏఁగి= వారివద్దకు వెళ్ళి; శోక= దుఃఖంచేత; విధురంబు+అగు= బాధించబడిన; చిత్తముతోడన్=

మనసులో; తారు= తాము; కానలకున్= అడవులలోకి; అటు+పోయి= ఆ విధంగా వెళ్ళి; పంకరుహనాభునిన్= శ్రీకృష్ణుడిని; రామునిన్= బలరాముడిని; రోసి= వెదకుతూ; పల్+దినంబులు= చాలా రోజులు; భ్రమన్= భ్రమలో; సంచరించుటయున్= తిరుగుతూ ఉండిపోవటమూ; బోయ= ఒక బోయవాడు; తమున్+కని= తమనుచూసి; ఆర్ద్రచిత్తుఁడు+ఐ= ఆర్ద్రమైన చిత్తము కలవాడై, కరగిన మనస్సు గలవాడై.

**తాత్పర్యం:** అట్లా ఆలోచించి, అర్జునుడు నెమ్మదిగా తాను తగిన జనసముదాయంతో కలిసి వారివద్దకు వెళ్ళి, దుః ఖంచేత బాధించబడిన మనసుతో తాము అడవులలోకి ఆ విధంగా వెళ్ళి శ్రీకృష్ణబలరాములను వెదకుతూ చాలా రోజులు భ్రమతో సంచరిస్తూ ఉండిపోవటమూ, చివరికి ఒక బోయవాడు తమను చూచి కనికరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **కందువ చోటికిఁ గొని పో। వం దా రరుగుటయుఁ జెప్పి వనట గదిరినన్**
**డెందము గలంగఁ గన్నీ। రందంద మొగంబు మీఁద నగ్గల మురులన్.** **196**

**ప్రతిపదార్థం:** కందువ= రహస్యమైన; చోటికిన్= ఒక తావునకు; కొనిపోవన్= తీసికొనివెళ్ళగా; తారు+అరుగుటయున్= తాము వెళ్ళటమూ చెప్పి; వనట= దుఃఖం; కదిరినన్= కలుగగా; డెందము= హృదయం; కలంగన్= కలతపొందగా; కన్నీరు= కంటినీరు; అందు+అంద= అక్కడక్కడా; మొగంబుమీఁదన్= ముఖంమీద; అగ్గలము= అధికంగా; ఉరులన్= ప్రవహించగా.

**తాత్పర్యం:** రహస్యమైన ఒకతావునకు తీసికొని వెళ్ళగా తాము వెళ్ళటమూ చెప్పాడు. అతడికి దుఃఖం అతిశయించింది. హృదయం కలతబారింది. కంటినీరు మొగం మీద అక్కడక్కడా ప్రవహించటం మొదలయింది. అప్పుడు(తరువాతి పద్యంతో అన్వయం)

**సీ.** **తలవాంచి యేమియుఁ బలుకక యప్పార్థుఁ। డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ**
**గతి కేఁగు టెఱిఁగి శోకము మూర్తులొందిన। తెఱఁగునఁ బొగిలియు ధీరభావ**
**మాత్మల నెలకొన్న నన్న! నీవింతేల। యడలెదు? కాలపర్యయము నుడుప**
**వశమె యెవ్వరికిని? వార్తలకొఱఁత జె। ప్పుము మాకు ననుడు నప్పుణ్యచరితుఁ**

**ఆ.** **'డడవిలోన మేము తడసిన దినముల। న్నియు గణించి యంబునిధి పురంబు**
**రేపకడయ ముంచు నేపాట నిమ్మెయి। వచ్చు నెడరు దలఁగువార మొక్కొ!** **197**

**ప్రతిపదార్థం:** తల+వాంచి= తలవంచి; ఏమియున్+పలుకక= ఏమీ మాటాడకుండా; ఆ+పార్థుఁడు+ఉన్నన్= అర్జును డుండగా; ఆ+ఉవిదలు= ఆ స్త్రీలు; వెన్నుఁడు= విష్ణుడు (శ్రీకృష్ణుడు); ఊర్ధ్వగతికిన్= ఊర్ధ్వలోకాలకు; ఏఁగుట+ఎఱిఁగి= వెళ్ళిపోవటం గుర్తించి; శోకము= శోకం; మూర్తులు+ఒందిన= మూర్తీభవించిన; తెఱఁగునన్= విధంగా; పొగిలియున్= దుఃఖించి కూడా; ధీరభావము= ధైర్యం; ఆత్మలన్= ఆత్మలలో; నెలకొన్నన్= నెలకొనగా; అన్న= నాయనా!; నీవు+ఇంత+ఏల+అడలెదు?= నీవింతగా ఎందుకు దుఃఖిస్తావు?; కాలపర్యయమున్= కాలవైపరీత్యాన్ని; ఉడుపన్= మాన్పటానికి; ఎవ్వరికిని= ఎవ్వరికైనా; వశమె?= సాధ్యమవుతుందా?; వార్తల కొఱఁత= తక్కిన విషయాలు; మాకున్+చెప్పుము; అనుడున్= అనగా; ఆ+పుణ్యచరితుఁడు= ఆ పుణ్యచరిత్ర కలిగిన అర్జునుడు; అడవిలోనన్= అడవిలో; మేము= మేము; తడసిన= తిరుగుతూ ఆలస్యం చేసిన; దినములు= దినాలు; అన్నియున్+గణించి= అన్నీ లెక్కించి; అంబునిధి= సముద్రం; పురంబు= నగరాన్ని; రేపకడయ= రేపే; ముంచున్=

ముంచివేస్తుంది; ఏ పాటన్= ఏ రీతిగా; ఈ+మెయిన్= ఈ విధంగా; వచ్చు+ఎడరు= వస్తున్న ఆపదను; తలఁగువారము+ఒక్కొ!= తొలగించుకొనగలమో!

**తాత్పర్యం:** అర్జునుడు తలవంచి ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు. ఆ స్త్రీలకు శ్రీకృష్ణుడు పరమపదించాడని అర్థమయిపోయింది. శోకం మూర్తీభవించిన విధంగా దుఃఖించారు. అయినా ధైర్యం మనసులలో ఏర్పడగా, అర్జునుడితో ఇట్లా అన్నారు.' 'నాయనా! నీ వింతగా ఎందుకు దుఃఖిస్తావు? కాలం ఎదురు తిరిగినప్పుడు ఎవరు ఆపగలరు? తక్కిన విషయాలు చెప్పుము' అని వారనగా అర్జునుడు 'మేము అట్లా అడవిలో బలరామకృష్ణులను వెదకుతూ కడచిపోయిన రోజులను అన్నీ లెక్కించి, సముద్రం నగరాన్ని రేపే ముంచివేస్తుంది. ఇట్లా వస్తున్న ఆపదను ఏ ఉపాయంతో తొలగించుకొనగలమో! (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శ్రీకృష్ణుడి భార్యలు, బలరాముడి సతులు ఎంత సంయమనం కలిగినవారో ఈ సందర్భం నిరూపిస్తున్నది. అప్పటికి వారు బాగా వయసు చెల్లినవారు కూడా. అందుకే వారు అర్జునుడిని ఓదార్చారు.

**చ.** **అను తలఁపాత్మ నొందుటయు నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె**
**ప్పిన నుచితంపు భంగులకుఁ బెద్దయుఁ బ్రొద్దు చనంగ నప్పురం**
**బునఁ గల విప్రముఖ్యజనముల్ పయనంబున కర్హమైన వ**
**ర్తన మొనరింపలేమి జలరాశి మునుంగుదు రట్లు గావునన్.** **198**

**ప్రతిపదార్థం:** అను= అన్నటువంటి; తలఁపు= ఆలోచన; ఆత్మన్+ఒందుటయున్= మనసులో రాగా; అప్పటికిన్= అప్పుడే; ఆ+దెసన్= ఆ దుస్థితిని; మీకున్+ఎల్లన్+చెప్పినన్= మీకంతా చెప్పితే; ఉచితంపు+భంగులకున్= ఉచితమైన కార్యాలకు; పెద్దయున్+ప్రొద్దు= చాలా సమయం; చనంగన్= జరిగిపోతే; ఆ+పురంబునన్+కల= ద్వారకలో ఉన్న; విప్రముఖ్య జనముల్= బ్రాహ్మణులు మొదలైన జనులు; పయనంబునకున్= ప్రయాణానికి; అర్హమైన= తగిన; వర్తనము= పనులను; ఒనరింపన్+లేమిన్= చేయలేకపోవటంవలన; జలరాశిన్= సముద్రంలో; మునుంగుదురు= మునిగిపోతారు; అట్లు+కావునన్= అందుచేత.

**తాత్పర్యం:** అన్నటువంటి ఆలోచన మనసులో రాగా అప్పుడే ఆ దుస్థితిని మీకంతా చెప్పితే మీరు మీరు చేయవలసిన కార్యక్రమాలకు చాలా సమయం గడిచిపోతే ద్వారకానగరంలోని బ్రాహ్మణాదులు ఆ పనులలో ఉండిపోయి, ప్రయాణానికి తగిన సన్నాహాలు చేసికొనలేకపోవటంవలన సముద్రంలో మునిగిపోతారు. అందువలన (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఉచితంపు భంగులు= ఓదార్చటం, సహగమనానికి సిద్ధపడితే దానికి తగిన ఏర్పాట్లు చేయటం - ఇత్యాదులు.

**చ.** **హరికిని రామదేవునకు నర్హవిధానము లాచరించి యె**
**వ్వరికిని జెప్ప కెల్ల పరివారముఁ బౌరులు సామజాదులున్**
**సరకులు నాయితంబు లగు సంఘటనం బొనరించి నాఁటికిం**
**గర మవధానయుక్తి సమకట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్.** **199**

**ప్రతిపదార్థం:** హరికినిన్= శ్రీకృష్ణుడికి; రామదేవునకున్= బలరాముడికి; అర్హవిధానములు= అర్హమైన విధులు; ఆచరించి= చేసి; ఎవ్వరికినిన్+చెప్పక= ఎవరికీ చెప్పకుండా; ఎల్లపరివారమున్= పరివారాన్నంతటినీ; పౌరులున్= ప్రజలును; సామజ+ఆదులున్= ఏనుగులు మొదలైనవాటిని; సరకులున్= సామానులూ; ఆయితంబులు+అగు= సిద్ధమయ్యే; సంఘటనంబు= సన్నాహం; ఒనరించి= చేసి; నాఁటికిన్= ఆ రోజుకే; కరము= మిక్కిలి; అవధానయుక్తిన్= ఏకాగ్రతతో; నెవ్వగతోన్= నిండుబాధతో; ప్రయాణమున్= ప్రయాణాన్ని; సమకట్టితిన్= ఏర్పాటుచేశారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణబలరాములకు తగిన ఉత్తరక్రియలను చేసి, ఎవ్వరికీ చెప్పకుండా పరివారాన్ని, ప్రజలను, ఏనుగులు మొదలైనవాటిని, ఇతర సంభారాలను, ప్రయాణానికి సిద్ధమయ్యేరీతిలో సన్నాహం చేసి, ఆ రోజే మిక్కిలి ఏకాగ్రతతో నిండుబాధతో ప్రయాణాన్ని ఏర్పాటు చేశాను.

**తే.** **వినుఁడు యాదవభామినీవృద్ధబాల । జనుల నందఱ నుచితవర్తనముతోడఁ**
**బ్రొద్దువొడువక ముందర పురజనప్ర । యుతముగాఁ బురి వెలువరించితిఁ గడంగి.** **200**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఇంకా వినండి; యాదవభామినీ= యాదవస్త్రీలను; వృద్ధ= వృద్ధులను; బాల జనులన్+అందఱన్= బాలురందరినీ; ఉచితవర్తనముతోడన్= తగినరీతిలో; ప్రొద్దు+పొడువక ముందరన్= ఉదయం కాకముందే; పురజన ప్రయుతముగాన్= పురజనులతో సహా; పురిన్= నగరమునుండి; కడంగి= ప్రయత్నించి; వెలువరించితిన్= బయటకు వచ్చేటట్లు చేశాను.

**తాత్పర్యం:** ఇంతేకాదు; యాదవస్త్రీ, బాల, వృద్ధులను తగిన రీతిలో ఉదయం కాకముందే పురజనులతో సహా అందరినీ ద్వారకనుండి బయటపడేటట్లు చేశాను.

**విశేషం:** దేశంకోసం, ప్రజల సంక్షేమం కోసం కులాచారాలను కూడా త్యాగం చేయాలన్న సందేశం ఈ సందర్భంలో గర్భితంగా ఉన్నది. అందుకే అర్జునుడు తరువాత ఇట్లా చెప్పుతున్నాడు.

**ఆ.** **దానఁ జేసి మీరు నేనును బ్రయ్యుఁ బా । పంబు లేక వెడలఁ బడితి; మిదియ**
**తల్లులార! కరము తప్పయి తోఁచుట । నుల్ల మలఁత పేర్మి నురియుచుండు.** **201**

**ప్రతిపదార్థం:** తల్లులార!= ఓ మాతృస్వరూపులారా!; దానన్+చేసి= అందువలన; మీరు, నేనున్= మీరూ, నేనూ; ప్రయ్యున్= నిందా; పాపంబు= పాపం; లేక= లేకుండా; వెడలన్+పడితిమి= బయటపడ్డాం; ఇది+అ= ఇదే; కరము= మిక్కిలి; తప్పు+అయి= తప్పుగా; తోఁచుటన్= తోచటంవలన; ఉల్లము= హృదయం; అలఁతన్= బాధతో; పేర్మిన్= మిక్కిలిగా; ఉరియుచున్+ఉండున్= అలమటిస్తున్నది.

**తాత్పర్యం:** ఓ తల్లులారా! ఇట్లా చేయటంవలన నేను, మీరు అపనిందనుండి, పాపం నుండి బయటపడ్డాము. ఇదే చాలా పెద్ద తప్పుగా తోచి, నా హృదయం బాధతో మిక్కిలిగా అలమటిస్తున్నది.

**క.** **వినుఁ డీ తప్పున దోషము । దనుకక యుండంగ నన్ను దయతోఁ జూడుం'**
**డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ । గని యందఱు నెత్తి యతని గారవ మెసఁగన్.** **202**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; ఈ తప్పునన్= ఈ తప్పులో; దోషము= పాపం; తనుకక= అంటక; ఉండంగన్= ఉండేటట్లు; నన్నున్= నన్ను; దయతోన్= దయతో; చూడుండు= చూడండి; అనుచున్= అంటూ; ఇలన్+చాఁగి= నేలపై దండాకారంగా వ్రాలి; మ్రొక్కినన్= మ్రొక్కగా; కని= చూచి; అందఱున్= ఆ స్త్రీలందరూ; అతనిన్= అర్జునుడిని; ఎత్తి= పైకిఎత్తి; గారవము= గౌరవం; ఎసఁగన్= అతిశయించగా.

**తాత్పర్యం:** బాగా ఆలోచించండి. నేను చేసిన ఈ తప్పులో పాపం అంటకుండా నన్ను దయతో చూడండి' అంటూ నేలమీద వాలి వారికి సాష్టాంగనమస్కారం చేశాడు. అది చూసి ఆ స్త్రీలకు అతడిపై గౌరవం ఇనుమడించింది. ప్రేమతో అతడిని పైకి లేవనెత్తారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఎంత పెద్ద తప్పుకైనా 'దండం' పెద్ద ప్రాయశ్చిత్తంగా మన భారతీయ సంప్రదాయం చెప్పుతుంది. పశ్చాత్తాపంతో పెద్దల యెడ గౌరవంగా చేసే 'ప్రణిపాతం' తప్ప ఇది కేవలం సభ్యతకోసం చేసేదికాదు.

**క.** **ఊరార్చి 'యింక నుచితా। చారంబులు నడపుటయ యిచటఁ గృత్యము; దు**
**ర్వారం బగు విధిచేఁతకు। నేరికి నడ్డపడవశమె? యేల యలఁదురన్?'** **203**

**ప్రతిపదార్థం:** ఊరార్చి= ఓదార్చి; ఇంకన్= ఇక; ఉచిత+ఆచారంబులు= తగిన కార్యాలు; నడపుట+అ= చేయటమే; ఇచటన్= ఇప్పుడు; కృత్యము= చేయదగినది; దుర్+వారంబు+అగు= వారించటానికి వీలులేని; విధిచేఁతకున్= విధి చేష్టకు; ఏరికిన్= ఎవరికైనా; అడ్డపడన్+వశమె?= అడ్డుపడటానికి వీలవుతుందా?; అలఁదురన్= క్షోభపడటం; ఏల?= ఎందుకు?;

**తాత్పర్యం:** వారు అర్జునుడిని ఓదార్చి, 'ఇక చేయదగిన కార్యాలను చేయటమే తగిన పని. వారించటానికి వీలులేని విధిచేష్టకు అడ్డుపడటానికి ఎవరికైనా వీలవుతుందా! క్షోభపడటం ఎందుకు?'

**విశేషం:** భారతీయుల జీవితంలో వైయక్తికమైన దుఃఖంకన్నా సంప్రదాయం ఎంత ప్రధానమో నిరూపించేది కర్మకాండ. ఈ యాదవస్త్రీలు కర్మయోగినులు. అందుకే విషాదాన్ని అతిక్రమించారు.

రుక్మిణీదేవి మొదలగు కృష్ణభార్య లగ్నిప్రవేశము చేయుట (సం.16-8-71)

**సీ.** **అని పల్కి రప్పిండునందు రుక్మిణియు జాం। బవతియులోనగు పద్మముఖులు**
**గొందఱు గోరిరి కురునాథ! యనుమర। ణమునకు బంధుజనంబులెల్ల**
**శోకార్తులై రోదనాకులత్వము నొంది। రనుమృతికలనకు నమరియున్న**
**యా బలదేవ మురాంతక మహిషుల। కతి విభవం బైన యానకల్ప**

**తే.** **నంబు నాకల్పరచనంబు నడపి నరుఁడు। చందనాగురుమయచితాసంవిధాన**
**మాచరించి యర్థప్రకారాగ్ని విధి యొ। నర్చె మహనీయవిప్రజనంబుఁ బనిచి.** **204**

**ప్రతిపదార్థం:** కురునాథ!= రాజా!; అని= ఈ విధంగా; పల్కిరి= చెప్పారు; ఆ+పిండునందున్= ఆ స్త్రీల గుంపులో; రుక్మిణియున్= రుక్మిణీ; జాంబవతియున్= జాంబవతీ; లోనగు= మొదలైన; పద్మముఖులు= కమలముఖులు (స్త్రీలు); కొందఱు= కొంతమంది;

అనుమరణమునకున్= సహగమనానికి; కోరిరి= కోరుకొన్నారు; బంధుజనంబులు+ఎల్లన్= బంధువులంతా; శోక= శోకంచేత; ఆర్తులు+ఐ= వ్యథితులై; రోదన= ఏడ్పుచేత; ఆకులత్వమున్= క్షోభ; ఒందిరి= పొందారు; అనుమృతి= సహగమనం; కలనకున్= చేయటానికి; అమరి+ఉన్న= సిద్ధంగా ఉన్న; ఆ బలదేవ= ఆ బలరామ; ముర+అంతక= కృష్ణుల; మహిషులకున్= రాణులకు; అతివిభవంబు+ఐన= వైభవోపేతంగా; యానకల్పనంబున్= పల్లకీని ఏర్పాటు చేయటం; ఆకల్పరచనంబున్= వేషభూషణాలను అలంకరించటం; నడపి= చేసి; నరుఁడు= అర్జునుడు; చందన+అగురుమయ= మంచిగంధపు చెక్కలతోనూ, అవురుగడ్డితోనూ తయారుచేసిన; చితా= చితాగ్నిని; సంవిధానము= ఏర్పరచటం; ఆచరించి= చేసి; అర్హప్రకార= తగినవిధంగా; అగ్నివిధిన్= అగ్నికార్యాన్ని; మహనీయ= పూజ్యులైన; విప్రజనంబున్= బ్రాహ్మణజనులను; పనిచి= పంపి; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా యాదవాంగనలు చెప్పారు. వారిలో రుక్మిణి, జాంబవతి మొదలైన స్త్రీలు సహగమనం చేస్తామన్నారు. బంధువు లంతా శోకంతో వ్యథను పొందారు. ఏడ్చిఏడ్చి క్షోభపడ్డారు. సహగమనం చేయటానికి సిద్ధంగా ఉన్న ఆ పట్టపురాణులకు అతివైభవంతో పల్లకీలు ఏర్పాటుచేసి, వస్త్రభూషణాలంకారాలు చేయించి, అర్జునుడు మంచి గంధపు చెక్కలతోనూ, అవురుగడ్డితోనూ చితాగ్నిని ఏర్పరిచి, మహనీయులైన పురోహితులను పంపి, అగ్నికార్యం నిర్వహించాడు.

**క.** **విను సత్యభామలోనగు । వనితాజను లధిక నియతి వనములకుఁ దపం**
**బొనరింపఁ బూని కొందఱు । చని రవ్విధమున నలుప్తసత్కర్ముండై.** **205**

**ప్రతిపదార్థం:** విను= రాజా! వినుము!; సత్యభామలోనగు= సత్యభామ మొదలైన; వనితాజనులు= స్త్రీలు; కొందఱు= కొంతమంది; అధికనియతిన్= తీవ్రమైన నియమంతో; వనములకున్= అడవులకు; తపంబు+ఒనరింపన్+పూని= తపస్సు చేయటానికి పూనుకొని; చనిరి= వెళ్ళారు; ఆ+విధమునన్= ఆ విధంగా (నరుడు); అలుప్త= లోపంరాని; సత్+కర్ముండు+ఐ= విధి ప్రయుక్త కర్మ కలిగినవాడై.

**తాత్పర్యం:** సత్యభామ మొదలైన స్త్రీలు కొంతమంది తీవ్రనియమంతో అడవులలో తపస్సు చేయటానికి నిశ్చయించుకొని వెళ్ళిపోయారు. ఇట్లా అర్జునుడు ఏ లోపమూ రాకుండా విధిప్రయుక్తకర్మను ఆచరించాడు. తరువాత- (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అఖిలబంధు జనంబుల నాప్తజనుల । నర్హవాక్యప్రయుక్తి నూరార్చి యుచిత**
**మార నామంత్రితులఁ జేసి యశ్రు లురులఁ । బోయె నా క్రీడి సాత్యవతేయుగుఱిచి.** **206**

**ప్రతిపదార్థం:** అఖిలబంధుజనంబులన్= బంధువులందరినీ; ఆప్తజనులన్= స్నేహితులను; అర్హవాక్యప్రయుక్తిన్= వారివారికి తగిన మాటలతో; ఊరార్చి= ఓదార్చి; ఉచితము+ఆరన్= తగిన విధంగా; ఆమంత్రితులన్+చేసి= వీడ్కొని; అశ్రులు+ఉరులన్= కన్నీరు కారగా; ఆ క్రీడి= ఆ కిరీటి (అర్జునుడు); సాత్యవతేయున్+గుఱిచి= సాత్యవతేయుడైన వ్యాసుడి వద్దకు; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** బంధుమిత్రులను తగిన విధంగా వీడ్కొని, కంటతడి పెట్టుకొని, అర్జునుడు వ్యాసుడి వద్దకు వెళ్ళాడు.

అర్జునుఁడు వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవక్షయంబు చెప్పుట (సం.16-9-1)

**సీ. పోయి మరున్నదిపొంత యాశ్రమమున। నర్హాసనమున నేకాంతనిరతి**
**నాసీనుఁడై యున్న యమ్మహాత్మునిఁగని। యత్యంతభక్తిసాష్టాంగవినతి**
**యాచరించినఁ జూచి యమ్మహనీయ వి। ద్యానిధి సేరంగ నతనిఁ బిలిచి**
**తన సమీపంబున నునిచి తద్వదనమ్ముఁ। గనుఁగొని ని న్నెఱుగంగ రాదు**

**తే. వెడమొగం బైన దిదియేను విజయ! యెట్ట। కేల కెఱిఁగితి నిదియేమి? కినుకవొడమి**
**వధమునకు నయోగ్యుండగువానిఁ జంపి। తే? పరాజితుఁడైతె? నీ తెఱఁగు సెపుమ.' 207**

**ప్రతిపదార్థం:** పోయి= వెళ్ళి; మరుత్+నది= ఆకాశగంగ; పొంత= సమీపంలో; ఆశ్రమమునన్= ఆశ్రమంలో; అర్హ+ఆసనమునన్= తగిన ఆసనంలో; ఏకాంతనిరతిన్= ఏకాంతంలో ఆసక్తితో; ఆసీనుఁడు+ఐ ఉన్న= ఆసీనుడుగా ఉన్న; ఆ+మహాత్మునిన్+కని= ఆ మహాత్ముడిని చూచి; అత్యంతభక్తిన్= మిక్కిలి భక్తితో; సాష్టాంగవినతి= సాష్టాంగ నమస్కారం; ఆచరించినన్= చేయగా; చూచి; ఆ+మహనీయ విద్యానిధి= ఆ గొప్ప విద్యానిధి (బ్రహ్మవిద్యావేత్త); అతనిన్= అర్జునుడిని; చేరంగన్= రమ్మని; పిలిచి; తన సమీపంబునన్= తన దగ్గర; ఉనిచి= ఉంచికొని; తద్+వదనమ్మున్= అతడి ముఖాన్ని; కనుఁగొని= చూచి; విజయ!= అర్జునా!; నిన్నున్+ఎఱుగంగన్+రాదు= నీవు ఎందుకిట్లా ఉన్నావో తెలియటంలేదు; వెడమొగంబు+అయినది= ముఖం వికారంగా మారిపోయింది; ఇది= ఈ విషయం; ఏను= నేను; ఎట్టకేలకున్= చివరికి; ఎఱిఁగితిన్= గుర్తించాను; ఇది ఏమి!= ఎందుకిట్లా!; కినుక+పొడమి= కోపం పుట్టి; వధమునకున్= చంపటానికి; అయోగ్యుండు+అగువానిన్= అర్హుడు కానివాడిని; చంపితే?= చంపావా?; పరాజితుఁడు+ఐతె?= ఓడించబడ్డావా?; నీ తెఱఁగు= నీ పరిస్థితి; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** అట్లావెళ్ళి అర్జునుడు ఆకాశగంగ ప్రాంతంలో ఒక కుటీరంలో ఉచితాసనంలో ఏకాంతాభిలాషతో కూర్చున్న ఆ మహాత్ముడిని చూచి, మిక్కిలి భక్తితో సాష్టాంగనమస్కారం చేశాడు. ఆ బ్రహ్మవిద్యానిధి అర్జునుడి సమీపానికి రమ్మని కూర్చుండబెట్టుకొని, అతడి ముఖాన్ని చూచి, 'అర్జునా! నీవు వెందుకిట్లా ఉన్నావో తెలియదు. ముఖం వికారంగా మారిపోయింది. ఇది నేను ఇంతసేపటికి గుర్తించాను. ఇది ఏమిటి? కోపం వచ్చి చంపటానికి అర్హుడు కానివాడిని చంపావా? లేక యుద్ధంలో ఓడిపోయావా? నీ పరిస్థితి ఏమిటో చెప్పుము.'

**చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మహితాత్మునితోడఁ బద్మ లో**
**చనుఁడు నవాంబుదప్రతిమ చారుతనూలసితుండు దేవకీ**
**తనయుఁడు రామదేవుఁడును దానును మేను దొఱఁగిపోయె నే**
**మనఁగల? దెల్ల యాదవులు నాఱడి బోయిరి సంయమీశ్వరా! 208**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అడుగగా; అతఁడు= అర్జునుడు; ఆ+మహిత+ఆత్ముని తోడన్= ఆ మహాత్ముడైన వ్యాసమహర్షితో; (ఇట్లా అన్నాడు); సంయమి+ఈశ్వరా!= ఋషిశ్రేష్ఠుడా!; పద్మలోచనుఁడు= కమలనేత్రుడు; నవ+అంబుద+ప్రతిమ= కొత్తమేఘానికి దీటైన; చారు= అందమైన; తనూలసితుండు= దేహప్రకాశం కలవాడు; దేవకీ తనయుఁడున్= దేవకీపుత్రుడును; రామదేవుఁడునున్= బలరాముడూ; తానునున్= తానుకూడా; మేనున్= దేహాన్ని; తొఱఁగిపోయెన్= విడిచిపోయాడు; ఏమనన్+కలదు?= చెప్పటానికి ఏముంది?; ఎల్ల యాదవులు= యాదవులందరూ; ఆఱడిన్+పోయిరి= నశించిపోయారు.

**తాత్పర్యం:** అని అడుగగా అర్జునుడు ఆ మహాత్ముడితో ఇట్లా అన్నాడు; 'ఋషీశ్వరా! పద్మపత్రనేత్రుడు, నీలమేఘానికి దీటైన శరీరకాంతి కలిగినవాడు, దేవకీతనయుడు అయిన శ్రీకృష్ణుడు, బలరాముడు తనువులు వదలిపెట్టారు. ఏమి చెప్పను? యాదవులంతా నశించిపోయారు.

**క. మహితాయుధ సంప్రహతులు । సహించు దృఢదేహధృతుల సడిసన్న మహో**
**త్సహనులు యాదవవీరులు । నిహతు లయిరి తుంగలను మనీషిప్రవరా! 209**

**ప్రతిపదార్థం:** మనీషిప్రవరా!= (పండిత బుద్ధిమంతులలో) శ్రేష్ఠుడా!; మహిత= గొప్ప; ఆయుధ= ఆయుధాల; సంప్రహతులు= దెబ్బలు; సహించు= సహించేటటువంటి; దృఢ= గట్టి; దేహధృతులన్= దేహ దార్ఢ్యాలతో; సడిసన్న= ప్రసిద్ధినొందిన; మహా+ఉత్+ సహనులు= చాలా ఉత్సాహం గలవారు; (అయిన) యాదవవీరులు= యాదవులు; తుంగలను= తుంగపరకలతో; నిహతులు+అయిరి= చచ్చారు.

**తాత్పర్యం:** గొప్ప గొప్ప ఆయుధాల దెబ్బలు సహించేటటువంటి గట్టి దేహ దార్ఢ్యాలతో ప్రసిద్ధి నొందిన మహా సహనశక్తి ఉన్న యాదవవీరులు తుంగపరకలతో చనిపోయారు. పండితశ్రేష్ఠుడా! దీనిని ఏమనాలి?

**విశేషం:** వ్యాసుడిని 'మనీషి ప్రవరా!' అన్న సంబోధనతో పిలవటంలో చాలా ఆంతర్యం ఉన్నది. అర్జునుడు వచ్చినది యాదవనాశనం ఎందుకు జరిగింది? కృష్ణుడు చనిపోవటమేమిటి? తాను బోయల చేత చిక్కటమేమిటి? ఇట్లాంటి ప్రశ్నలతో, దానిని చెప్పగలవాడు 'మనీషి'. వారిలో శ్రేష్ఠుడు 'వ్యాసుడు'.

**తే. అట్లు రామకృష్ణులు సర్వయాదవులును । దెగినఁ జిత్తంబు పొగులంగ మగువపిండు**
**బాలవృద్ధులఁ గొనిరాఁగఁ బథమునందు । నన్ను బోయలు దాఁకిన నగుచు నేను. 210**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; రామకృష్ణులున్= బలరామకృష్ణులు; సర్వయాదవులునున్= యాదవులందరూ; తెగినన్= చనిపోగా; చిత్తంబు= మనస్సు; పొగులంగన్= వ్యథపడగా; మగువపిండున్= యాదవస్త్రీలను; బాలవృద్ధులన్= పిల్లలను, ముసలివారిని; కొనిరాఁగన్= వెంట తీసికొని రాగా; పథమునందున్= దారిలో; నన్నున్= నన్ను; బోయలు= కిరాతులు; తాఁకినన్= ఎదుర్కొనగా; నేను= నేను; నగుచున్= నవ్వుతూ (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఆ విధంగా బలరామకృష్ణులు, సర్వయాదవులు చనిపోగా మనసు వ్యథచెంది యాదవస్త్రీబాలవృద్ధులను వెంట తీసికొని వస్తుండగా దారిలో నన్ను బోయలు ఎదిరించారు. అప్పుడు నేను నవ్వుతూ.

**చ. ఘనతరబాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు**
**న్మనమున నచ్చి యప్డు మునినాథ । కడంగితి నెట్టకేల క**
**ద్ధనువు గుణంబుఁ గూర్చితి; నుదగ్రత బాహుల లేకయుండె న**
**స్త్రనికరమంత్రతంత్రములు సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్? 211**

**ప్రతిపదార్థం:** మునినాథ!= మునులలో శ్రేష్ఠుడా!; ఘనతర= మిక్కిలి గొప్పదైన; బాహుశక్తియునున్= బాహుబలమూ; గాండివశక్తియున్= గాండివధనుస్సు శక్తీ; అస్త్రశక్తియున్= అస్త్రశక్తీ; మనమునన్= మనసులో; నచ్చి= జ్ఞాపకం ఏర్పడి; అప్డు=

అప్పుడు; (నేను); కడంగితిన్= యుద్ధం చేయబూనుకొన్నాను; ఎట్టకేలకున్= ఎట్లాగో; ఆ+ధనువుగుణంబున్+కూర్చితిన్= ధనువునకు అల్లెత్రాడును సంధించాను; బాహులన్= బాహువులలో; ఉదగ్రత= ఉద్ధతి; లేక+ఉండెన్= లేకుండా ఉండింది; అస్త్రనికర= అస్త్రసముదాయానికి సంబంధించిన; మంత్ర తంత్రములు= మంత్రతంత్రాలు; సంస్కృతిన్= గుర్తులోకి; పొందవ= రావయ్యెను; ఏమి+చెప్పుదున్?= ఏమి చెప్పను?

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠా! మిక్కిలి గొప్పదైన నా బాహుబలమూ, గాండీవశక్తీ మనసులో స్ఫురించాయి: వాటి భరోసాతో యుద్ధం చేయబూనాను. ఎట్లాగో ఆ బాణానికి అల్లెత్రాటిని సంధించాను. కాని బాహువులలో ఉద్ధతి లేకుండా పోయింది. అస్త్రసముదాయానికి సంబంధించిన మంత్రతంత్రాలు ఏవీ గుర్తుకు రావటంలేదు ఏమి చెప్పను?

**క. బోయల సంహృతికిఁ బ్రకృతి। సాయకసంపాతనములు సాలవె? యని యే**
**నేయఁ దొడఁగ దొనలు చెనఁటు। లై యుండె; నొకండుఁ జేయునది లే దయ్యెన్. 212**

**ప్రతిపదార్థం:** బోయల= ఆ బోయల యొక్క; సంహృతికిన్= సంహారానికి; ప్రకృతి= సహజమైన; సాయక= బాణాలు; సంపాతనములు= వేయటం; చాలవె?= చాలవా?; అని; ఏను; ఏయన్+తొడఁగన్= వేయటం మొదలుపెట్టగా; దొనలు= అమ్ముల పొదులు; చెనఁటులు+ఐ+ఉండెన్= వ్యర్థం అయ్యాయి; ఒకండున్= ఒకడినికూడా; చేయునది= చేయటానికి; లేదు+అయ్యెన్= ఏమీ లేకపోయింది.

**తాత్పర్యం:** ఆ బోయలను చంపటానికి సహజమైన బాణాలు (మంత్రంతో సంబంధం లేనివి) ప్రయోగిస్తే చాలదా? అనుకొని నేను వేయటం మొదలు పెట్టాను. చిత్రంగా అమ్ముల పొదులు వ్యర్థం అయిపోయాయి. నేను ఒకడినికూడా ఏమీ చేయలేకపోయాను.

**క. నెవ్వగయు నచ్చెరువు మది। నివ్వటిలఁగ నప్పు డేను నివ్వెఱపడితిన్**
**జివ్వన ముసరి కిరాతులు। క్రొవ్వెసకం బెసఁగఁ జూఱగొని రజ్జనులన్. 213**

**ప్రతిపదార్థం:** నెఱ+వగయున్= నిండుబాధా; అచ్చెరువున్= ఆశ్చర్యమూ; మదిన్= మనసులో; నివ్వటిలఁగన్= అతిశయించగా; అప్పుడు= ఆ సమయంలో; ఏను= నేను; నిండు+వెఱ= నిశ్చేష్టతను; పడితిన్= పొందాను; చివ్వనన్= శీఘ్రంగా; కిరాతులు= బోయలు; ముసరి= చుట్టుకొని; క్రొవ్వు+ఎసకంబు+ఎసఁగన్= గర్వం అతిశయించగా విజృంభణతో; ఆ+జనులన్= ఆ యాదవులను; చూఱగొనిరి= దోచుకొన్నారు.

**తాత్పర్యం:** నా మనసులో చాలా బాధా, ఆశ్చర్యమూ కలిగాయి. ఆ సమయంలో నేను నిశ్చేష్టుడ నయ్యాను. ఆ బోయలు వెంటనే ఆ యాదవసమూహాన్ని చుట్టుకొని, గర్వితులై వారిని అతివిజృంభణతో దోచుకొన్నారు.

**ఆ. చాపదండ నిహతి నోపిన భంగిఁ గి। రాతకోటి నాఁగి రామకృష్ణ**
**వల్లభాదు లైన వనితలఁ గొందఱ। వృద్ధబాలకులను వెరవుతోడ. 214**

**ప్రతిపదార్థం:** చాపదండ నిహతిన్= ఆ బాణందెబ్బతో; ఓపిన భంగిన్= నాకు చేతనైనంత; కిరాతకోటిన్= ఆ బోయలను; ఆఁగి= ఆపి; రామకృష్ణ వల్లభాదులు+ఐన= బలరామకృష్ణుల భార్యలు మొదలైన; వనితలన్= స్త్రీలను; కొందఱన్= కొందరినీ; వృద్ధ బాలకులను= ముసలివారినీ, పిల్లలను; వెరవుతోడన్= ఉపాయంతో.

**తాత్పర్యం:** అంత నేను నా గాండీవంతో వారిని నాకు చేతనైనంత వరకు మోది వారిని ఆపి, బలరామకృష్ణుల భార్యలు మొదలైన కొంతమంది స్త్రీలను, వృద్ధబాలకులను ఉపాయంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కాచికొని వచ్చి తగ నా। నేచిన య ట్లచట నచట నిలిపితి మునినా**
**థా! చేటును భంగంబును। నై చిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్. 215**

**ప్రతిపదార్థం:** కాచికొని= రక్షించుకొని; వచ్చి= తిరిగివచ్చి; తగన్= తగినట్లుగా; నా నేచినఅట్లు= నేను నేర్చినట్లు; అచటన్+అచటన్= అక్కడక్కడా; నిలిపితిన్= నిలిపాను; మునినాథా!= ఓ మహర్షీ! (ఇందువలన); చేటును= ఆపద; భంగంబును= ఓటమి; ఐ= పొంది; చిత్తము= మనసు; శోకమునకున్= దుఃఖానికి; అగ్గంబు+అయ్యెన్= వశమయింది.

**తాత్పర్యం:** రక్షించుకొని వచ్చి, తగినట్లుగా వారిని ఆయాచోట్లలో నా నేర్చిన విధంగా నిలిపాను. ఓ మునిశ్రేష్ఠా! ఈ కారణంచేత ఆపద, ఓటములపాలై నా మనసు శోకానికి వశమైపోయింది.

**తే. పడని పాటు వాటిల్లిన వెడమొగంబు। వడక యెట్లుండవచ్చు? దపఃప్రకీర్త**
**నీయ! యిం కిట యే నేమి సేయువాఁడ?। నెసఁగు దయతోడ నానతి యిమ్ము నాకు.' 216**

**ప్రతిపదార్థం:** తపస్+ప్రకీర్తనీయ!= తపస్సుచే మిక్కిలి స్తుతించదగినవాడా!; పడనిపాటు= రారాని అపాయం; పాటిల్లినన్= వస్తే; వెడమొగంబు= వికారమైన ముఖం; వడక= రాకుండా; ఎట్లుండవచ్చున్?= ఎట్లా ఉండగలను?; ఇంకన్+ఇట= ఇక ఇక్కడ; ఏను+ఏమి+చేయువాఁడన్?= నేను ఏమి చేయాలి?; ఎసఁగు= అతిశయించే; దయతోడన్= దయతో; నాకున్= నాకు; ఆనతి+ఇమ్ము= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** ఋషీశ్వరా! నీవు తపస్సుచేత మిక్కిలి స్తుతించబడిన బ్రహ్మజ్ఞానివి. ఎప్పుడూ రాని అపాయం మీదపడితే ముఖం వికారం కాకుండా ఎట్లా ఉంటుంది? ఇక ఇక్కడ నేను ఏమి చేయాలో మీరు దయతో నాకు సెలవివ్వండి.'

### వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము చేయుట (సం.16-9-25)

**సీ. అన విని యమ్మహాముని క్రీడి కిట్లను। 'సంయమిదత్తోగ్రశాపనిహతి**
**నఖిలయాదవులును నట్లైరి; దానికి। నడలఁగఁ బనిలేదు; హరి యెఱుంగు**
**మున్న యా సంక్షయ మన్న! చెప్పెద విను ప్రాప్తకాలంబగు పనికి నడ్డ**
**పడనేల యని యాత్మ భావించి యతఁ డుపేక్షాపరుఁడై యుండెఁగాక; మూఁడు**

**తే. భువనములు నన్యథాత్వంబుఁ బొందఁజేయఁ। జాలువాఁడు కణ్వాదుల శాప ముడుప**
**శక్తి లేకుండెనే? యవశ్యంబు భావి। యైనయదిగాన యదునాశ మయ్యెఁ జువ్వె. 217**

**ప్రతిపదార్థం:** అనన్= అని అడుగగా; విని= వినినవాడై; ఆ+మహాముని= వేదవ్యాసుడు; క్రీడికిన్+ఇట్లు+అనున్= అర్జునుడితో ఇట్లా చెప్పాడు; సంయమి= ఋషులచేత; దత్త= ఇవ్వబడిన; ఉగ్ర= భయంకర; శాపనిహతిన్= శాపందెబ్బకు; అఖిలయాదవులునున్= యాదవులంతా; అట్లు+ఐరి= అట్లా అయ్యారు; దానికిన్= దానికి; అడలఁగన్= బాధపడవలసిన; పనిలేదు= అవసరం లేదు;

అన్న!= ఓ నాయనా!; హరి= శ్రీకృష్ణుడు; ఆ సంక్షయము= యాదవనాశము; మున్ను+అ= ముందుగానే; ఎఱుంగున్= ఎరుగును; చెప్పెదన్= చెప్పుతాను; విను= వినుము; ప్రాప్తకాలంబు+అగు= కాలం దాపురించిన; పనికిన్= కార్యానికి; అడ్డపడన్= అడ్డుగా వ్యవహరించటం; ఏల+అని= ఎందుకని; ఆత్మన్+భావించి= మనసులో భావించి; అతఁడు= శ్రీకృష్ణుడు; ఉపేక్షాపరుఁడు+ఐ= ఉపేక్ష కలిగి; ఉండెన్+కాక= ఉన్నాడు కాని; మూఁడుభువనములు= ముల్లోకాలు; అన్యథాత్వంబున్= తారుమారు; పొందన్+చేయన్+చాలువాఁడు= అయ్యేటట్లు చేయకలిగినవాడు; కణ్వ+ఆదుల= కణ్వాదిమహర్షుల; శాపము+ఉడుపన్= శాపాన్ని ఆపగా; శక్తి లేకుండెనే?= శక్తిలేనివాడా?; అవశ్యంబు= తప్పనిసరిగా; భావి+ఐన+అది= జరగవలసినది; కానన్= కాబట్టి; యదునాశము+అయ్యెన్+చుమ్మె!= యదునాశనం అయింది సుమా!

**తాత్పర్యం:** అని అడుగగా విన్నవాడై వేదవ్యాసుడు అర్జునుడితో ఇట్లా చెప్పాడు: 'ఋషు లిచ్చిన భయంకరమైన శాపపు దెబ్బకు యాదవు లట్లా నశించారు. దానికి దుఃఖించవలసిన పనిలేదు నాయనా! శ్రీకృష్ణుడికి యాదవనాశనం ముందుగానే తెలుసును. చెప్పుతాను వినుము. కాలం దాపురించిన కార్యానికి అడ్డుగా వ్యవహరించటం ఎందుకని మనసులో భావించి శ్రీకృష్ణుడు ఉపేక్షతో ఉన్నాడు కాని, ముల్లోకాలను తారుమారు చేయగలిగిన శ్రీకృష్ణుడు కణ్వాది మహర్షుల శాపాన్ని ఆపటానికి శక్తి లేనివాడా?; తప్పనిసరిగా జరగవలసిన కార్యం కాబట్టి యదునాశన మయింది సుమా!

**విశేషం:** సర్వమూ కాలాధీనమై ప్రవర్తిస్తుందన్న పూర్వపర్వాలలోని సిద్ధాంతాన్నే ఈ పద్యమూ నిరూపిస్తున్నది. వ్యాసుడు మహాభారతంలో ఈ విషయాన్నే కేంద్రభూతంగా నిరూపించాడు.

**ఉ. నీ వని సేయ నీవలని నెయ్యమునం గృప నన్యసైన్యముం**
**దా వధియించు శూలధరతాస్ఫురణం బెసఁగంగ ముంద ర**
**ద్దేవుఁడు; దానిఁ గాంచు భవదీయసమంచిత దృష్టియున్ నినుం**
**గావఁడ యా మురాంతకుఁడు కాలవిపర్యయ మావహిల్లుటన్. 218**

**ప్రతిపదార్థం:** నీవు; అని+చేయన్= యుద్ధం చేయగా; నీవలని= నీపట్ల ఉన్న; నెయ్యమునన్= స్నేహంతో; కృపన్= దయతో; అన్య సైన్యమున్= శత్రుసైన్యాన్ని; తాన్= తాను; ఆ దేవుఁడు= ఆ కృష్ణుడు; శూలధరతాస్ఫురణంబు+ఎసఁగంగన్= రుద్రత్వస్ఫురణ అతిశయించగా; వధియించున్= చంపేవాడు; దానిన్= దానిని; భవదీయ= నీ; సమంచిత దృష్టియున్= సుందరమైన దృష్టి; కాంచున్= కనుగొనేది; ఆ మురాంతకుఁడు= అట్లాంటి శ్రీకృష్ణుడు; కాలవిపర్యయము= కాలం అడ్డ తిరగటం; ఆవహిల్లుటన్= దాపురించటం వలన; నినున్= నిన్ను; కావఁడు+అ= కాపాడలేదు.

**తాత్పర్యం:** అర్జునా! నీవు యుద్ధం చేయగా నీపట్ల ఉన్న స్నేహంతో కృపతో శత్రుసైన్యాన్ని తాను (ఆ శ్రీకృష్ణుడు) రుద్రత్వస్ఫురణ ఆవహిల్లగా చంపేవాడు. నీ సుందరదృష్టి దానిని కనుగొనేది. అట్లాంటి శ్రీకృష్ణుడు కాలం అడ్డ తిరగటం దాపురించటంవలన నిన్ను కాపాడలేదు.

**విశేషం:** గీతోపదేశం చేసినపుడు శ్రీకృష్ణుడు తానే చంపేవాడని అర్జునుడు నిమిత్తమాత్రుడని చెప్పిన పరమేశ్వరకర్తృత్వ సిద్ధాంతాన్ని వ్యాసుడు ఇక్కడ వ్యాఖ్యానిస్తున్నాడు. అంటే మహాభారత యుద్ధాన్ని చేసింది; శత్రువులను 'కాల' రూపుడుగా చంపింది శ్రీకృష్ణుడే అని అర్థం. ఆ 'కాలం' ప్రచోదించిన రీతిగా తన అవతారాన్ని చాలించారు. 'రుద్రాంశ' నశించింది. అందుకే ఓడిపోయాడని అర్థం. (మురాంతకుడు= మురాసురుడిని చంపినవాడు కృష్ణుడు అని అర్థం).

చ. ధరణిభరంబు వాప నవతారము నొందిన విష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కల నిర్వికార భా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుండయి పొందె దానికిం
గురుకులవర్య! శోకమునఁ గుందుదురే మిముఁ బోటి బోధనుల్? 219

**ప్రతిపదార్థం:** కురుకులవర్య!= కురుకులశ్రేష్ఠుడా!; ధరణిభరంబు= భూభారం; పాపన్= తొలగించటానికి; అవతారమున్= అవతారాన్ని; ఒందిన= ఎత్తిన; విష్ణుఁడు= నారాయణుడు; ఆ+తెఱంగు= ఆ పని; అరుదుగన్= అపూర్వంగా; నిర్వహించి= చేసి; అజర+అమర= ముసలితనమూ, మృత్యువూ లేని; నిష్కల= కళారహితమైన; నిర్వికార= వికారాలు లేని; భాస్వర= ప్రకాశించే; నిజ= తన; సత్+పదంబున్= సత్‌స్థానాన్ని; ఉపశాంతి= ఉపశమింపజేయ; పరుండు+అయి= ఆసక్తిగలవాడై; పొందెన్= చేరాడు; దానికిన్= దానికి; మిముఁబోటి= మీవంటి; బోధనుల్= జ్ఞానులు; శోకమునన్= దుఃఖంతో; కుందుదురే?= బాధపడతారా?

**తాత్పర్యం:** భూభారాన్ని తొలగించటానికి అవతారమెత్తిన నారాయణుడు ఆ పని అపూర్వంగా నిర్వహించి ముసలితనం, మృత్యువూ లేనిదీ, కళాతీతమైనదీ, వికృతిలేనిదీ, అయి ప్రకాశిస్తూ ఉండే తన 'సత్' స్థానాన్ని ఉపశమం పొందినవాడై చేరాడు. దానికి మీవంటి జ్ఞానులు శోకంతో బాధపడటమా!

**విశేషం:** పరమాత్మ 'సత్' అని వేదాంతపరిభాషలో పిలువబడింది. 'యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ' అని గీతాశాస్త్రం. దానిని అందుకొన్నవారు మరలిరారు - అది 'సత్ ' పదం. ఆ స్థానానికి 'గడువు' లేదు (అజరం); నాశం లేదు (అమరం); కళలు లేవు (నిష్కల); (శుక్ల, కృష్ణ పక్ష చంద్రుడి కాంతులవలె వృద్ధి క్షయాలు లేవు. అందుచేత సంపూర్ణం); నిర్వికార మది - అంటే వికారం పొందటం - నశించటం - మారటం లేదు. అది ఎప్పుడూ 'ప్రకాశమే' అక్కడ చీకటి లేదు - అంటే 'అసత్' స్థానం చీకటి వెలుగులమయం, 'సత్' స్థానంలో చీకటి లేదు (తమసః పరస్తాత్- చీకటికి ఆవలిది). ఉపశాంతి - ఉపశమం - దానినే 'విరమణ' అన్నారు. సృష్టి అక్కడ మొదలై మరలా అక్కడికే చేరి విశ్రమిస్తున్నది. అందుకే స్వామిని 'శాంతాకారుడు' అని పిలిచారు.

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోడై భీమ సాహాయ్యగౌ
రవదుర్దాంత పరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెన్ దైవప్రకారజ్ఞ! నీ
దువరిష్ఠాచరణంబునన్ సురలు సంతోషించి రప్పోరులన్. 220

**ప్రతిపదార్థం:** అవనీభరము+పాపి= భూభారాన్ని పోగొట్టి; తాన్+హరికిన్+తోడు+ఐ= తాను హరికి తోడుగా నిలిచి; భీమ= భీముడి; సాహాయ్య= సహాయ; గౌరవ= గౌరవంచేత; దుర్దాంత= ఉద్ధతమైన; పరాక్రమంబునన్= పరాక్రమంతో; కృత+అర్థత్వంబునన్+చేసి= అనుకొన్నపనిని సాధించటంచేత; అస్త్రవితానంబునున్= అస్త్రసమూహం కూడా; నిన్నున్+పాసి+చనియెన్= నిన్ను వదలి వెళ్ళిపోయింది; దైవప్రకారజ్ఞ!= దైవం ఎట్లా ప్రవర్తిస్తుందో తెలిసినవాడా!; నీదు= నీ; వరిష్ఠాచరణంబునన్= శ్రేష్ఠమైన అనుష్ఠానంచేత; ఆ+పోరులన్= ఆ యుద్ధాలలో; సురలు= దేవతలు; సంతోషించిరి= సంతోషపడ్డారు.

**తాత్పర్యం:** భూభారాన్ని పోగొట్టి, హరికి సహకరించి భీమసహాయ గౌరవంతో ఉద్ధతపరాక్రమంతో అనుకొన్న పనిని సాధించటంచేత అస్త్రసంపద నిన్ను వదలివెళ్ళిపోయింది. దైవం ఎట్లా ప్రవర్తిస్తుందో నీకు తెలుసుగదా నాయనా! నీ శ్రేష్ఠమైన అనుష్ఠానంచేత దేవతలు కూడా ఆ యుద్ధాలలో చాలా సంతోషించారు. నీవు ధన్యుడవు.

**విశేషం:** దైవప్రకారజ్ఞుడు - గీతాశ్రోతగా, నారాయణ సహాయం పొందిన అర్జునుడికి దైవం 'అఘటనఘటనా పటీయసి' - అని తెలియనిది కాదు. దానిని వ్యాసమహర్షి గుర్తు చేస్తున్నాడు. వరిష్ఠాచరణము - ఆచరణం అంటే నడవడి - ఇక్కడ శస్త్రవిద్యను అనుష్ఠించి, సాధించి, ఆ విద్యను సొంతం నిలుపుకొని యుద్ధంచేసినవాడని అర్థం - విద్య అనుష్ఠానరూపమని అర్థం.

**క. బలమును బుద్ధియుఁ జేవయు। నలఘుమతీ! యుల్లసిల్లు నగు కాలమునం**
**బొలియుం గాలవిపర్యయ। కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే? 221**

**ప్రతిపదార్థం:** అలఘుమతీ!= గొప్ప బుద్ధిగల ఓ అర్జునా వినుము!; అగు కాలమునన్= అయిన కాలంలో (కాలం అనుకూలంగా ఉన్నప్పుడు); బలమునున్= బలమూ; బుద్ధియున్= బుద్ధీ; చేవయున్= శక్తీ; ఉల్లసిల్లున్= అతిశయిస్తాయి (వ్యక్తమవుతాయి); కాల= కాలంయొక్క; విపర్యయ కలనంబునన్= అడ్డు తిరిగిన స్థితిచేత; పొలియున్= నశిస్తాయి; (అందుచేత); బుధులకున్= జ్ఞానులకు; ఉబ్బున్= గర్వమూ; కలఁకయున్= దుఃఖమూ; కలవే?= ఉంటాయా?

**తాత్పర్యం:** అయిన కాలంలో బలమూ, బుద్ధీ, శక్తీ ప్రకాశిస్తాయి. కాలం అడ్డు తిరిగితే నశిస్తాయి. అందువలన జ్ఞానులకు గర్వము కాని, శోకం కాని ఉండవు. నీవు జ్ఞానివి. నీకు తెలియని విషయమా ఇది!

**తే. కాలమూలంబు సర్వంబుఁ గాన దీని। కొండు తలఁపులు దక్కి మీ రుత్తమంపు**
**గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు। విడిచి యార్యజనంబులు వినుతి సేయ.' 222**

**ప్రతిపదార్థం:** సర్వంబున్ కాలమూలంబు= సమస్తమూ అన్ని కాలాలకూ ఆధారమైనది; కానన్= కాబట్టి; దీనికిన్+ఒండు తలఁపులు= దీనికి తక్కిన ఆలోచనలు; తక్కి= మాని; మీరు= పాండవులైన మీరు; ఆర్యజనంబులు= పెద్దలు; వినుతి+చేయన్= ప్రశంసించగా; నిశ్చింతన్= నిశ్చింతగా; వికారతనులు= వికార రూపాలైన ఈ దేహాలు; విడిచి= వదలిపెట్టి; ఉత్తమంపు+గతికిన్= ఉత్తమగతికి; చనుఁడు= వెళ్ళండి.

**తాత్పర్యం:** సృష్టిలో అంతా కాలాధీనంగా ఉంటుంది. అందుచేత ఈ విషయంలో తక్కిన ఆలోచనలు మాని, పాండవులైన మీరు పెద్దలు ప్రశంసించగా నిశ్చింతగా వికారరూపాలైన ఈ దేహాలు విడిచిపెట్టి ఉత్తమగతికి వెళ్ళండి.

**విశేషం:** వికార రూపాలు; వికారమంటే పరిణామం. అసత్ పదార్థాలకు లక్షణం పరిణమించటం - అంటే మార్పు పొందటం. వికార తనువులు - అంటే పరిణామశీలములైన దేహాలను అని అర్థం. ఉత్తమగతి - అంటే పుణ్యలోకాలు. మహాభారతేతిహాసం వ్యాసుడి ఈ ఉపదేశంతో సంపూర్ణేతిహాస మవుతోంది. 'కాలాయ తస్మై నమః' అని కాలశక్తికి అందుకే నమస్కరించారు.

**సీ. అన విని శోకమోహంబులు వాసిన। డెందంబు నిర్భరానంద మొంద**
**నధికభక్తియు వినయంబును దలకొన। నర్జునుఁ డమ్మహితాత్ము వీడు**
**కొని వారణపురికిఁ జనుదెంచి ధర్మజుఁ। గని తన పోయివచ్చిన తెఱంగు**
**వినిపించె సర్వంబు నని యిట్లు సంయమి। నుతుఁడు వైశంపాయనుండు రామ**

**తే.** **కృష్ణు లాదిగఁ గల్గిన వృష్ణిచయము। భోజసంతతి యంధకరాజి నూత్న**
**వృత్తములు జనమేజయ విభున కింపు। సెవులఁ దళుకొత్త నేర్పడఁ జెప్పుటయును.** **223**

**ప్రతిపదార్థం:** అనన్= అని చెప్పగా; విని= అర్జునుడు విని; శోకమోహంబులు= శోకమూ; మోహమూ; పాపిన= పోయిన; డెందంబు= హృదయం; నిర్భర+ఆనందము= అతిశయమైన ఆనందం; ఒందన్= పొందగా; అధికభక్తియున్= అధికమైన భక్తీ; వినయంబునున్= వినయమూ; తలకొనన్= జనించగా; అర్జునుఁడు; ఆ+మహిత+ఆత్మున్= ఆ మహాత్ముడైన వ్యాసుడిని; వీడుకొని= వీడ్కోలు చెప్పి సెలవుతీసికొని; వారణపురికిన్= హస్తినాపురానికి; చనుదెంచి= వచ్చి; ధర్మజున్+కని= ధర్మరాజును చూచి; తన= తనయొక్క; పోయివచ్చిన తెఱంగు= పోయివచ్చిన వైనం; సర్వంబున్= అంతటినీ; వినిపించెన్= వినిపించాడు; అని; ఇట్లు= ఈ విధంగా; సంయమి నుతుఁడు= ఋషులచేత కీర్తించబడిన; వైశంపాయనుఁడు= వైశంపాయనమహర్షి; రామకృష్ణులు+ఆదిగన్= బలరామకృష్ణులు మొదలుగా; కల్గిన= ఉన్న; వృష్ణిసంతతి= వృష్ణివంశీయులు; భోజసంతతి= భోజవంశీయులు; అంధకరాజి= అంధక వంశీయుల సమూహం; నూత్న వృత్తములు= క్రొత్త కథలు; జనమేజయ విభునకున్= జనమేజయ మహారాజుకు; ఇంపు+చెవులన్+తళుకొత్తన్= శ్రవణమాధుర్యం స్ఫురించగా; ఏర్పడన్= స్పష్టమయ్యేటట్లు; చెప్పుటయునున్= చెప్పటమూ.

**తాత్పర్యం:** అని వ్యాసుడు చెప్పగా అర్జునుడు విని, శోకమూ, మోహమూ పోయిన హృదయంతో అతిశయమైన ఆనందం పొంది, అధికమైన భక్తి, వినయం కలుగగా, ఆ మహాత్ముడిని వీడుకొని హస్తినాపురికి వచ్చి, ధర్మరాజును చూచి తాను పోయివచ్చిన వైనమంతా చెప్పాడు - అని ఇట్లా వైశంపాయనమహర్షి జనమేజయమహారాజుకు వృష్ణిభోజాంధక వంశీయుల క్రొత్త కథలను శ్రవణమాధుర్యం స్ఫురించేటట్లు స్పష్టమైన రీతిలో చెప్పటం ఈ పర్వంలోని కథాసారాంశం.

ఆశ్వాసాంతము

**శా.** **కాలస్వైరవిహారభంజన! కళాకౌతూహల స్తవ్య! దు**
**శ్శీలాంతఃకరణావిభావ్య! కరుణాశ్రీమందిరాపాంగ! మం**
**త్రాళీవాచ్య! సుధామయాంగ! పవనవ్యాపారరోధక్రియా**
**శాలిస్వాంత సముల్లసద్విహరణా! సంసార నిస్తారణా!** **224**

**ప్రతిపదార్థం:** కాలస్వైర విహారభంజన!= కాలంయొక్క స్వేచ్ఛా విహారాన్ని భంజించేవాడా!; కళా= కళయొక్క; కౌతూహల= కుతూహల స్వభావంచేత; స్తవ్య= కీర్తించదగినవాడా!; దుశ్శీల= దుష్టమైన శీలం కల; అంతఃకరణ= మనస్సులచేత; అవిభావ్య= భావించటానికి శక్యం కానివాడా!; కరుణా= అనుకంప అనేటటువంటి; శ్రీ= లక్ష్మికి; మందిర= ఆవాసంగా ఉండే; అపాంగ!= కటాక్ష వీక్షణ ప్రసారం కలవాడా!; మంత్రాళి= మంత్ర సముదాయంచేత; వాచ్య!= చెప్పదగినవాడా; సుధామయాంగ!= అమృతరూపమైన శరీరం కలవాడా!; పవన= వాయు; వ్యాపార= వ్యాపారాన్ని (ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలను); రోధ= నిరోధించే; క్రియాశాలి= ప్రక్రియ తెలిపిన మహాయోగుల; స్వాంత సముల్లసత్+విహరణా!= హృదయాలలో విలసిల్లే విహారం కలవాడా!; సంసార నిస్తారణా!= సంసారసాగరం నుండి (భక్తులను) దాటింప జేసేవాడా!

**తాత్పర్యం:** కాలం సర్వభువనాలనూ తనవశం చేసికొనగల శక్తి కలిగినది కావటంచేత అది విజృంభిస్తూ ఉంటుంది. అట్లాంటి కాలాన్ని వశం కావించుకొని దాని గర్వాన్ని అణచినవాడివి నీవు. కళ కుతూహలంతో మాత్రమే నిన్ను

స్తుతిస్తుంది. దుష్టస్వభావులకు నీ రూపం ఆలోచించటానికి కూడా అందదు. నీ వీక్షణం దయకు నిలయం. సర్వవేదాలూ నిన్నే తెలుపుతున్నాయి. నీవు అమృతస్వరూపుడవు. ప్రాణాయామాదులచేత వాయునిరోధం కావించే మహాయోగుల చిత్తాలలో నీవు సదా విహరిస్తుంటావు. సంసారసాగరంనుండి భక్తులను తరింపజేస్తావు.

**విశేషం:** 'కాలః సర్వస్యకారణం' అన్న స్మృతివాక్యం ఈ పద్యంలో స్తుతించబడింది. ఏ కళా భగవంతుడిని స్తుతించకుండా ఉండజాలదు. అన్నీ భగవత్తత్త్వనిరూపణ కుతూహలంలోనే నానావిధాలుగా కీర్తిస్తున్నాయి. మంత్రమన్నా వేదమన్నా ఒకటే. పవనవ్యాపార నిరోధమే ప్రాణాయామం. యోగుల హృదయాలలో పరమాత్మ రమిస్తాడు కాబట్టి యోగి-భగవంతుడు ఒకటేనన్న తాత్పర్యాన్ని గీత ప్రతిపాదించింది. పరమాత్మ అమృతస్వరూపుడు. 'తదేవ శుక్ర మమృతం తద్ బ్రహ్మ' అని ఉపనిషద్వాక్యం. 'తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్' - అన్న గీతాప్రమాణమే 'సంసారనిస్తారణా!' అనే సంబోధనలో కనిపిస్తుంది. సంసారం సాగర రూపమైనది. మృత్యువు దాని స్వరూపం. ఆ సాగరాన్ని దాటించగలవాడు - అమృతరూపుడు మాత్రమే. అందుకనే పరమాత్మను అమృతస్వరూపుడిగా కీర్తించారు.

**క. హృదయకమలమధురూపా! । విదారిత దురంతతాప! వేదస్తోమా**
**స్పద పారాశర్యమన । స్సదనా! దివిజ శుభకృద్వచనపరవదనా! 225**

**ప్రతిపదార్థం:** హృదయ= హృదయమనే; కమల= కమలంలో; మధురూపా!= మధువురూపంలో ఒప్పినవాడా!; విదారిత= నశింపచేయబడిన; దురంత= అంతంలేని; తాప= సంసారతాపం కలవాడా!; వేదస్తోమ= శ్రుతిసముదాయానికి; ఆస్పద= నిలయమైన; పారాశర్య= వేదవ్యాసుడి; మనస్= మనస్సే; సదనా!= ఇల్లుగా కలిగినవాడా!; దివిజ= దేవతలకు; శుభ= శుభాన్ని; కృత్= కలుగజేసే; వచనపర= వచనాలలో ఆసక్తమైన; వదనా!= ముఖం కలిగినవాడా!

**తాత్పర్యం:** యోగులు తమతమ హృదయకమలాలలోని దహరాకాశంలో ప్రకాశించే నిన్ను గాంచి మహానందం పొందుతారు. కాబట్టి నీవు మధుస్వరూపుడవు. అంతులేని సంసారతాపాలను కూడా నీవు నశింపజేస్తావు. సర్వవేదాలకూ నిలయమైన వేదవ్యాసుడి చిత్తమే నీ నిలయం. దేవతలకు సైతం శుభాన్ని కలుగజేసే శ్రుతిస్మృతులు నీ ముఖం నుండే వెలువడ్డాయి.

**విశేషం:** కమలంలోని మధువువలె సారభూతమైన వాడు కాబట్టి యోగానందమే ఆ మధువు. కనుకనే అమృతరూపు డన్నది. సంసారతాపత్రయం - అంతంలేనిది. కేవలం భగవంతుడి దయచేతనే అది 'సాంతం' కావాలి. వ్యాసుడు వేదాలను విభజించాడు. వేదార్థ సందేహనివారణకొరకు బ్రహ్మసూత్రాలు రచించాడు. సర్వోపనిషత్ సారరూపంగా భగవద్గీతను గ్రథనం చేశాడు. జనులకొరకు వేదార్థాన్ని వివరిస్తూ భారతాద్యష్టాదశ పురాణాలు రచించాడు. అందుకనే ఆయన హృదయం వేదస్తోమాస్పద మనటం. అందుకే 'వ్యాసాయ విష్ణురూపాయ' అని కూడా అన్నారు. వేదాలు విరాట్ స్వరూపుడి విశ్వాసాలలో బయటపడ్డాయన్న దానికి అర్థమే-పరవదనా! అనే మాటకు అర్థం.

**మాలిని.**

**అమరగణవిరోధి వ్యాపదాపాది కోపా!**
**శమితవినతచిత్తాసంగిగాఢప్రతాపా!**
**యమనియమ వికాసిధ్యాన గేహప్రదీపా!**
**దమశమకలితానంద ప్రకాశస్వరూపా! 226**

**ప్రతిపదార్థం:** అమరగణ= సురసముదాయానికి; విరోధి= విరోధులైన రాక్షసులకు; వ్యాపద్= ఆపదలను; ఆపాది= కలుగజేసే; కోపా!= కోపం కలవాడా!; శమిత= శమింపచేయబడిన; వినత= వినయశీలురైన; చిత్త= భక్తుల చిత్తాలలో; ఆసంగి= నిండిన; గాఢ= గాఢమైన; ప్రతాపా!= ప్రకృష్టములైన తాపాలు కలిగినవాడా!; యమ= యమ; నియమ= నియమ (ఆదులచేత); వికాసి= వికసించిన; ధ్యాన= ధ్యానమనే; గేహ= గృహానికి; ప్రదీపా= దీపంగా ప్రకాశించేవాడా!; దమ; శమ= శమాలచేత; కలిత= కూడిన; ఆనంద ప్రకాశ= ఆనంద ప్రకాశాలను; స్వరూపా!= స్వరూపంగా కలిగినవాడా!

**తాత్పర్యం:** ధర్మపరులు దేవతలు. అందుచేత దేవగణాలను విరోధిస్తారనే కోపంతో నీవు రాక్షసులకు ఆపదలు కలుగజేస్తావు. నీవు వినయసంపదగల భక్తుల తాపత్రయాన్ని పోగొట్టుతావు. యమనియమాదులతో వికసించిన ఉపాసకుల ధ్యానంలో ప్రకాశిస్తావు. శమదమాదులచేత కలిగిన ఆనందప్రకాశాలే నీ స్వరూపం.

**విశేషం: "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్."**

అన్న గీతోక్తికి వ్యాఖ్యానమే ప్రథమపాదం. సాధువులను రక్షించటం, దుష్కృతులను శిక్షించటం స్వామివారి కర్తవ్యం. అందుకనే అసురులపై స్వామి కోపం. శారీరక, మానసిక, వాచిక (మనోవాక్కాయ)-సంబంధి తాపాలున్నాయి; అట్లాగే ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక-తాపాలున్నాయి; వీటిని - ఈ త్రితాపాలను స్వామి పరిహరిస్తాడు. అందుకే ప్ర- అనే ఉపసర్గ ద్వారా ఈ తాపతీవ్రతను కవి సూచిస్తున్నాడు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు - యోగంలో ప్రధానమైన అష్టాంగాలు. శమం, దమం, విషయనివృత్తి, దుఃఖసహనం, శాస్త్రాచార్యోపదేశాలలో శ్రద్ధ, లక్ష్యవిషయకంగా చిత్తైకాగ్రత - వీటిని శమాదిషట్కమంటారు. వీటిచేత పరమేశ్వరస్వరూపమైన ఆనంద, ప్రకాశాలు గోచరిస్తాయి. ఆనందం దాని అనుభవం. ప్రకాశం-దానిరూపం. తిక్కనగారి ఆశ్వాసాంతాలలో చివర తప్పనిసరిగా ఈ ఆనందశబ్ద ప్రసక్తి ఉంటుంది. బ్రహ్మానంద సాధనకోసం వాగ్రూపమైన తపస్సు చేసిన మహాకవి తిక్కనగారు. అందుకే స్వామిని ఆనందనిలయుడుగా, ఆనందస్వరూపుడుగా, ఆనంద తత్పరుడుగా నానావిధాల కీర్తించి, తిక్కన తాపత్రయవిముక్తు డయ్యాడు. కను 'వెలుగు' ను పొందాడు. అందుకే 'ప్రకాశ' స్మరణం- ఇక్కడ చేయబడింది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబునందు మౌసలపర్వంబు సర్వంబు నేకాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈరచన; శ్రీమత్= ప్రసిద్ధి కెక్కిన; ఉభయ కవి= సంస్కృతాంధ్ర భాషాకవుల; మిత్ర= మిత్రుడును; కొమ్మన= కొమ్మన అనే; అమాత్య= మంత్రియొక్క; పుత్ర= కుమారుడును; బుధ= విద్వాంసులయొక్క; ఆరాధన= పూజచేత; విరాజి= ప్రకాశించేవాడును అయిన; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కనచేత; ప్రణీతంబు+ఐన= రచించబడినదైన; శ్రీమహాభారతంబునన్= శ్రీమహాభారతంలో; మౌసలపర్వంబు+అందున్= మౌసలపర్వంలో; సర్వంబును= సమస్తమును; ఏకాశ్వాసము.

**తాత్పర్యం:** కీర్తికలవాడూ, సంస్కృతాంధ్రభాషా కవిమిత్రుడూ, కొమ్మనమంత్రి కుమారుడూ, బుధపూజనంచేత ప్రకాశించేవాడూ అయిన తిక్కనసోమయాజి రచించిన శ్రీ మహాభారతంలో మౌసలపర్వం సర్వం ఏకాశ్వాసం సమాప్తం.

శ్రీమదాంధ్ర మహాభారతంలోని ఏకాశ్వాసమైన మౌసలపర్వం ముగిసింది.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## మహాప్రస్థానిక పర్వము - ఏకాశ్వాసము

**శ్రీ పదసీమా వాప్తి స। మాపాదన కేళి కౌతుకాధీన దయా**

**వ్యాపార! సకలవేదో। హాపోహాతీతసార! హరిహరనాథా!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీపద= మోక్షస్థానం యొక్క; సీమ= పరమావధిని; అవాప్తి= పొందటాన్ని; సమాపాదన= కలుగజేసేటటువంటి; కేళి= విలాసానికి సంబంధించిన; కౌతుక= ఉత్సాహానికి; అధీన!= వశుడైనవాడా!; దయావ్యాపార!= ఆపన్నుల విషయంలో దయతో వ్యవహరించేవాడా!; సకలవేద= అన్నివేదాలలోని; ఊహ+అపోహ+అతీతసార!= ఊహలకు, అపోహలకు కూడా అందని స్వరూపం కలవాడా!; హరిహరనాథా!= ఓ హరిహరనాథస్వామీ!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీ ఉత్తమ భక్తులకు ఆనందపరమావధి అయిన మోక్షసామ్రాజ్యాన్ని కలుగజేయటంలో నీవు మిక్కిలి ఉత్సాహపరుడివి. ఆపద నందినవారి యందు నీకెంతో కనికరం. నీ స్వరూపం వేదాలలో చెప్పబడిన ఊహలకు అపోహలకు అందనిది.

**విశేషం:** భగవంతుడు నిత్యోత్సాహం కలవాడు. ఆ ఉత్సాహం భక్తులకు అత్యుత్తమ స్థానమైన మోక్షాన్ని అందించటానికి సంబంధించింది. ఆ ఉత్తమస్థానాన్ని శ్రీపదమన్నారు. శ్రీసూక్తంలో చెప్పినట్టు మోక్షలక్ష్మికి కూడా 'శ్రీ' అనే పేరున్నది. అక్కడన్నీ శుభాలే. లోకంలో ఉన్న సుఖదుఃఖాది ద్వంద్వభావా లుండవు. అదొక అద్వైతానందం. దానినే బ్రహ్మానంద మన్నారు. (దానిని అందుకొనటానికే తాను ప్రయత్నించి రచన ప్రారంభించినట్లు విరాటపర్వాదిలో తిక్కన సోమయాజి చెప్పాడు), ఈ చివరి రెండు పర్వాలలో ఆ ఆనంద ప్రారంభ వికాసస్థితులు ప్రస్తావించబడ్డాయి. కవి, నాయక, పాత్రలతో పాటు సహృదయుడికీ ఏ అనుభవప్రాప్తి ఈ గ్రంథపఠనం ద్వారా సిద్ధిస్తుందో కవి ఈ మాట ద్వారా సూచిస్తున్నాడు. ఉత్తమభక్తి శ్రద్ధలతో భారతాన్ని అధ్యయనం చేసినవాడికి శ్రీపదసిద్ధి తప్పక జరుగుతుందని అర్థం. ఇదంతా స్వామికి ఒకలీల. అంటే ఒక ఆట అని అర్థం. అందుకే అవతారాన్ని 'లీల' అని కూడా అంటారు. ఇదంతా శ్రీకృష్ణలీల. పాండవు లిప్పుడు మహాపదలో ఉన్నారు. వారిని సముద్ధరించటానికే వ్యాసస్వరూపుడయిన శ్రీకృష్ణుడు మౌసలపర్వంచివర 'ఈ మానుష తనువులను త్యజించి పరమపదాన్ని చేరుకొనం'డని సూచించి వారిపై దయ చూపాడు. ఆ పరమపదాన్ని పాండవులు చేరుకొన్న స్థితిని ఈ ఏకాశ్వాస పర్వం వర్ణిస్తుంది. మరొక విశేషం-జైమిన్యాదులు మీమాంసాశాస్త్రంలో చెప్పినట్లు ఊహలు, అపోహలు వేదోక్తాలయిన కర్మోపాసనల విషయంలోనే పనికివస్తాయి. తపస్సిద్ధివస్తువయిన భగవంతుడి విషయంలో పనికిరావు. ప్రత్యక్షంగా కనిపిస్తున్న విషయాన్ని బుద్ధితో ఊహిస్తాం. ఇది ఉహ, ప్రకృతకర్తవ్యానికి అనుకూలం కానటువంటి విషయాన్ని తొలగించి ఆ కర్మను చేయటమే అపోహ. ఇట్లాంటి ఊహలు, అపోహలు కర్మలలో, ఉపాసనలలో అవసరమే. ఊహ మానసికం. అపోహ బౌద్ధికం. ప్రత్యక్ష విషయంలో ఊహ, పరోక్ష విషయంలో అపోహ కొంతవరకు పనికివస్తుంది. భగవంతుడి ఉనికి మానసికం. అపోహ బౌద్ధికం. ప్రత్యక్ష విషయంలో, ఊహ, పరోక్ష విషయంలో అపోహ కొంతవరకు పనికివస్తుంది. భగవంతుడి ఉనికిని స్థాపించటానికి ఈ రెండూ సమర్థం కావు. ఎందుకంటే అది కేవలం 'మనీష' యొక్క 'ధీ' గుణంచేత దర్శించదగ్గ విషయం కాదు కాబట్టి. శుశ్రూష, శ్రవణం, గ్రహణం, ధారణం, ఊహ, అపోహ, విజ్ఞానం, తత్త్వజ్ఞానం - అన్న ఈ ఎనిమిది గుణాలనూ 'ధీ' గుణాలంటారు. వీటన్నింటి ద్వారా నలుగురు గుడ్డివాళ్ళ కథలోవలె భగవత్ స్వరూపాన్ని ఒక్కో కోణం నుండి మాత్రమే వర్ణించగలుగుతాం. అసలు స్వరూపం ఈ 'ధీ' గుణాలన్నిటికీ అతీతమైనది. అది కేవలం యోగులకు మాత్రం దర్శనీయమైనది.

అందుకే 'కనువెలుంగు'ను భగవంతుడు ప్రసాదించిన తరువాతే అర్జునుడైనా విశ్వరూపాన్ని చూడగలిగాడు. అందుచేత ఊహాపోహలకు అతీతమని అర్థం.

**వ. దేవా! వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె 'నట్లు కృష్ణుని పరమానందపదప్రాప్తియు, బలభద్రుని యనంతత్వసిద్ధియు, సకలయాదవ మౌసలాహవప్రకారంబును నెఱింగి పదంపడి పాండవు లెత్తెఱంగున వర్తించిరి మునీంద్రా! యెఱింగింపుము.' 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహర స్వరూపుడవైన స్వామీ!; జనమేజయుండు= జనమేజయ మహారాజు; వైశంపాయనునకున్= వైశంపాయనమహర్షితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అడిగాడు; అట్లు= ఆ విధంగా; కృష్ణుని= శ్రీకృష్ణుడి; పరమ+ఆనంద పదప్రాప్తియున్= బ్రహ్మానంద పదప్రాప్తి; బలభద్రుని= బలరాముడి; అనంతత్వసిద్ధియున్= అనంతత్వసిద్ధిని; సకలయాదవ= అందరు యాదవుల; మౌసల+ఆహవ= ముసలయుద్ధం; ప్రకారంబును= జరిగినతీరును; ఎఱింగి= తెలిసికొని; పదంపడి= తరువాత; పాండవులు= పంచపాండవులు; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; వర్తించిరి= ప్రవర్తించారు (ఏం చేశారు?); మునీంద్రా!= మునీశ్వరా!; ఎఱింగింపుము= నాకు తెలుపుము.'

**తాత్పర్యం:** హరిహరనాథస్వామీ! జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు; 'మునీంద్రా! ఆ విధంగా శ్రీకృష్ణుడు, బలరాముడు పరమపదించటమూ, సకలయాదవులు ముసల యుద్ధంలో మడిసిన విధమూ విన్న తరువాత పాండవులు ఏం చేశారో నాకు తెలుపండి!'

**విశేషం:** శ్రీకృష్ణుడు యోగేశ్వరుడు. పూర్వం చెప్పిన భగవంతుడి ఉనికిని చేరుకొనటానికి అర్హత ఉన్నవాడు. అందుకే పరమానంద స్వరూపస్థితిని అందుకొన్నాడు. బలరాముడు 'అనంత' నామధేయుడైన శేషుడి అవతారం. అందుకే కాల స్వరూపమైన అనంతత్వస్థితిని పొందాడు. ఆద్యంతా లున్నది మానవజీవితంలోని పరిమితకాలానికే. అంతం కానిది అనంతం. శేషుడన్నా అర్థం ఇదే. ఎంత కొలిచినా ఇంకా ఉండేవాడని అర్థం.

**క. అని యడిగిన వైశంపా। యనుఁ డక్కురువంశవరు సమాదరణంబున్**
**వినయంబుఁ గౌతుకము పెం। పును సంభావించి యవ్విభున కిట్లనియెన్. 3**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; అడిగినన్= అడుగగా; వైశంపాయనుఁడు= వైశంపాయన మహర్షి; ఆ+కురువంశవరు= ఆ కురువంశ శ్రేష్ఠుడైన జనమేజయుడి; సమాదరణంబున్= మిక్కిలి ఆదరభావాన్ని; వినయంబున్= వినయాన్ని; కౌతుకం పెంపును= ఉత్సాహంయొక్క అతిశయాన్ని; సంభావించి= ప్రస్తుతించి; ఆ+విభునకున్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు;

**తాత్పర్యం:** ఇట్లా అడుగగా వైశంపాయనుడు జనమేజయుడి ఆదరభావాన్ని, వినయాన్ని, అతిశయించిన ఉత్సాహాన్ని మెచ్చుకొని ఆ రాజుతో ఇట్లా అన్నాడు:

**సీ. 'అర్జును డమ్మెయి నచ్యుత రామాది। యాదవజనుల వృత్తాంతములును**
**దనదు తెఱంగు సత్యవతీతనూభవు। హితభాషణంబులు నేర్పడంగఁ**
**జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు। నకు మది యొలయ నన్నరునితోడ**
**నఖిలభూతంబుల ననఘ! పాకంబుఁ బొం। దించుఁ గాలుండు మదీయబుద్ధి**

**తే. కర్మ సంత్యాగకలనంబు కార్య మిప్పు। డను వినిశ్చయ మొందె; నీ మనము నరయ**

**నిదియ మేలుగఁ గనుచున్కి విదిత మయ్యె। నాకు' ననవుడు నయ్యింద్రనందనుండు. 4**

**ప్రతిపదార్థం:** అర్జునుండు= అర్జునుడు; ఆ+మెయిన్= ఆ విధంగా; అచ్యుత= కృష్ణుడు; రామ+ఆది= బలరాముడు మొదలైన; యాదవజనుల= యాదవుల; వృత్తాంతములును= వృత్తాంతాలను; తనదు తెఱంగున్= తన స్థితిని; సత్యవతీ తనూభవు= సత్యవతి కుమారుడైన వ్యాసుడి; హితభాషణంబులున్= హితవచనాలు; ఏర్పడంగన్+చెప్పినన్= వివరంగా చెప్పగా; విని; యుధిష్ఠిరుఁడు= ధర్మరాజు; ప్రస్థానమునకున్= ప్రయాణానికి; మది= మనసు; ఒలయన్= పోగా; ఆ+నరునితోడన్= ఆ అర్జునుడితో; అనఘ!= పాపరహితుడవైన అర్జునా!; కాలుండు= కాలపురుషుడు; అఖిలభూతంబులన్= అన్ని భూతాలనూ; పాకంబున్+పొందించున్= కాల్చిపరిపక్వం చేస్తాడు; మదీయబుద్ధి= నా బుద్ధి; కర్మ= కర్మయొక్క; సంత్యాగ= బాగా త్యాగం చేయటం; కలనంబు= అనే పనిని ఆమోదించటమే; ఇప్పుడు= ఇప్పుడు; కార్యము= చేయదగినపని; అను= అనే; వినిశ్చయము= విశిష్టమైన నిర్ణయం; ఒందెన్= పొందింది; నీ మనమున్+అరయన్= నీ మనసును గ్రహించగా; ఇది+అ= ఇదే; మేలుగన్+కనుచున్+ఉన్కి= మేలని భావిస్తున్నట్లు; నాకున్= నాకు; విదితము+అయ్యెన్= స్పష్టమయింది; అనవుడున్= అనగా; ఆ+ఇంద్రనందనుండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** అర్జును డా విధంగా బలరామకృష్ణుల, తక్కిన యాదవుల వృత్తాంతాలను, తన స్థితిని, వ్యాసుడి హితవచనాలను వివరించి చెప్పగా విని ధర్మరాజు తన మనసు ప్రయాణానికి సిద్ధపడగా అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'అర్జునా! కాలపురుషుడు అన్ని భూతాలను కాల్చి పరిపక్వం చేస్తాడు. ఇప్పుడు నా బుద్ధికి కర్మను సంపూర్ణంగా త్యజించటం మాత్రమే తగినపనిగా ఒక నిశ్చితార్థం ఏర్పడుతున్నది. చూడగా నీ మనసుకూడా ఇదే మేలని భావిస్తున్నట్లు నాకు స్పష్టమవుతున్నది'- అనగా అర్జునుడు యుధిష్ఠిరుడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'పాకం' - అంటే వంట: కాలుడు - యముడని వాచ్యార్థం: మరణస్వరూపుడు కాబట్టి. 'కాలోఽస్మి' అన్న గీతాకారుడి వచనాన్ని బట్టి భగవంతుడు కాలస్వరూపుడు. జఠరాగ్ని రూపంలో చతుర్విధాన్నాలను కాల్చి పక్వం చేసినట్టుగానే జీవుడి పాపరాశిని కూడా కర్మానుభవరూపంలో జననాంతరాల మీద హరించి (ఇదే కాల్చటం). పుణ్యాత్ముడిగా (ఇదే పక్వం చేయటం) మార్చేవాడు కూడా ఆ కాలస్వరూపుడే. పాండవులలో ఆ పరిపక్వత సిద్ధిస్తున్నది - కాబట్టే కర్మను 'సంత్యాగం' చేయటానికి సిద్ధపడుతున్నాడు. త్యాగమంటే వదలటం. సమ్యక్ త్యాగమంటే - సంపూర్ణంగా వదలటం । అంటే సంకల్పస్థితిలోనే వదలివెయ్యటమని భావం. గీతలో మోక్షసన్న్యాస యోగంలో 'కర్మ ఫలత్యాగం' గా చెప్పిన ప్రక్రియకన్నా 'నిరీహుడుగా' (కోరికలు లేనివాడుగా), జ్ఞానాగ్ని దగ్ధకర్ముడుగా చేసే నిష్కామకర్మ ఉత్తమంగా, చెప్పబడింది. అంతేకాదు సంకల్పంలోనే 'కర్మ'ను త్యజించటం. దానికన్నా అత్యుత్తమం. ఇదే సంపూర్ణమైన రాజవిద్య. గుహ్యయోగమని దీన్నే అన్నారు. తరువాతి కథలో ధర్మరాజు ఈ సంకల్పత్యాగాన్ని ఎట్లా సాధించాడో చూస్తాం. పాండవులు పరమాత్ముడి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వర్గం వంటివారు కాబట్టి వారందరిలోనూ ఒకే ఊహపుట్టింది. అందుకనే అర్జునుడి మనసులో కూడా అదే ఊహ ఉందని ధర్మజుడు చెప్పగలిగాడు. 'మమ ప్రాణా హి పాండవాః' - అన్న శ్రీకృష్ణుడి వాక్యానికి అర్థం ఇదే.

**వ. అ న్నరేంద్రున కి ట్లనియె. 5**

**ప్రతిపదార్థం:** ఆ+నర+ఇంద్రునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అర్జునుడు ఈ మాటలు విని ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**క. 'కాలము నే మన వచ్చును?। గాలముఁ గాలంబ పోలుఁగా కొంటికి నీ**

**లీలలు గలవే? లెస్సగ। నాలోకించి: తిది హితము నభిమతము నగున్.' 6**

**ప్రతిపదార్థం:** కాలమున్= కాలాన్ని; ఏమి+అనవచ్చును?= ఏమనాలి?; కాలమున్= కాలాన్ని; కాలంబు+అ= కాలమే; పోలున్= పోలుతుంది; కాక= అట్లాకాక; ఒంటికిన్= మరోదానికి; ఈ లీలలు+కలవే?= ఈ లీల లున్నాయా?; లెస్సగన్= బాగా; ఆలోకించితి(వి)= చూచావు; ఇది= ఇట్లా చెయ్యటం; హితమున్= మంచిదీ; అభిమతమున్+అగున్= నచ్చింది కూడా ఔతుంది.

**తాత్పర్యం:** 'కాలాన్ని ఏమనగలం? ఎట్లా వర్ణించగలం? కాలాన్ని పోలింది కాలం మాత్రమే కాక మరో దానికి లీల లున్నాయా? నేను బాగా ఆలోచించాను. ఇట్లా చెయ్యటం మనకు మంచిది. నచ్చిన పని కూడా.'

**విశేషం:** ఏమనవచ్చును? అన్న మాటలోని నుడికారం చాలా అర్థాన్ని కలిగింది. ఈ సందర్భంలో ఎట్లా వర్ణించగలమని అర్థం -'రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ' - అన్నట్టు కాలాన్ని పోలింది కాలం మాత్రమే. బమ్మిని తిమ్మి చెయ్యగల శక్తి, కొంటెను సాధువుగా మార్చేశక్తి - అఘటన ఘటనాపటీయసి - పరమేశ్వర రూపమైన కాలశక్తి. దానిముందు ఎంతటివారైనా తలవంచాల్సిందేనని అర్థం.

**చ. అని తన మాట కియ్యకొను నన్నరుపల్కుల కిచ్చ మెచ్చి య**
**జ్జనపతి భీమునిం గవలఁ జయ్యనఁ బిల్వఁగఁ బంచి యత్తెఱం**
**గు నెఱి నెఱుంగఁ జెప్ప ననుకూలత వారలయందుఁ దద్ద గ**
**ల్గినఁ దెలి వగ్గలింప నెఱిఁగించె యుయుత్సున కవ్విశేషమున్. 7**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; తనమాటకున్= తన మాటకు; ఇయ్యకొను= అంగీకరించిన; ఆ+నరుపల్కులకున్= ఆ అర్జునుడి మాటలకు; ఇచ్చన్+మెచ్చి= మనఃపూర్వకంగా మెచ్చుకొని; ఆ+జనపతి= ఆ రాజు (ధర్మరాజు); భీమునిన్= భీముడిని; కవలన్= నకుల సహదేవులను; చయ్యనన్= వెంటనే; పిల్వఁగన్+పంచి= రమ్మని చెప్పి పంపి; (వారు రాగా); ఆ+తెఱంగున్= ఆ విధాన్ని; నెఱిన్= చక్కగా; ఎఱుంగన్+చెప్పన్= తెలిసేటట్లు చెప్పగా; వారలయందున్= వారిలో; అనుకూలత= అనుకూల్యం; తద్ద= మిక్కిలి; కల్గినన్= కలుగగా; తెలివు= ప్రసన్నత; అగ్గలింపన్= అతిశయించగా; యుయుత్సునకున్= యుయుత్సుడికి; ఆ+విశేషమున్= ఆ విషయాన్ని; ఎఱిఁగించెన్= తెలిపాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా తన మాటను అంగీకరించిన అర్జునుడి మాటలను మనఃపూర్వకంగా ధర్మరాజు మెచ్చుకొని భీమనకుల సహదేవులను పిలిపించి జరిగిన విషయాన్ని వారికి సంపూర్ణంగా తెలియజేశాడు. వారుకూడా ఈ విషయం పట్ల అనుకూలంగా ఉండటాన్ని చూచి ఆయనలో ప్రసన్నత అతిశయించింది. యుయుత్సుడికి ఈ విషయం వివరించాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడికి వైశ్యస్త్రీ వలన పుట్టినవాడు యుయుత్సుడు. కురుక్షేత్ర సంగ్రామ ప్రారంభంలో పాండవపక్షం చేరి ప్రాణాలు నిలుపుకొన్నవాడు.

**క. ఎఱిఁగించి రాజ్యతంత్రము। తెఱఁగుపఱిచి నడపు వెరవు తేటపడంగాఁ**
**గఱపి, గృహాంతశ్చరితము। నెఱి నుపదేశించె నధిప! నెయ్యం బలరన్. 8**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా వినుము!; ఎఱిఁగించి= అట్లా వివరించి; రాజ్యతంత్రము= రాజ్యాన్ని పాలించే పద్ధతి; తెఱఁ గుపఱిచి= చక్క చేసికొని; నడపు= నడిపే; వెరవు= విధానం; తేటపడంగాన్= స్పష్టమయ్యేటట్లు; కఱపి= నేర్పి; గృహ+అంతస్+

చరితము= అంతఃపురములో వర్తించాల్సిన విధాన్ని; నెఱిన్= చక్కగా; నెయ్యంబు+అలరన్= స్నేహభావం అతిశయించగా; ఉపదేశించెన్= బోధించాడు.

**తాత్పర్యం:** ఆ యుయుత్సుడికి రాజ్యాన్ని పాలించే పద్ధతిని సిద్ధం చేసికొని ఎట్లా పాలన చేయాలో స్పష్టంగా నేర్పించాడు. అంతఃపురంలో ఎట్లా వర్తించాలో కూడా స్నేహభావంతో బోధించాడు.

**క. ఆ యనుజుని నట్లు మహా। నాయకుఁ గావించి భటజనముఁ గూర్చి మహీ**
**నాయకుఁ డార్యులు కీర్తన। సేయఁ బరీక్షితునిఁ రాజుఁ జేసె ధరణికిన్. 9**

**ప్రతిపదార్థం:** ఆ+అనుజునిన్= ఆ సోదరుడిని; అట్లు= ఆ విధంగా; మహానాయకున్+కావించి= కురుసామ్రాజ్యానికి పెద్దగా నియమించి; భటజనమున్+కూర్చి= సైన్యాన్ని ఏర్పాటు చేసి; మహీనాయకుఁడు= ధర్మరాజు; ఆర్యులు= పెద్దలు; కీర్తన+చేయన్= ప్రస్తుతించగా; పరీక్షితునిన్= పరీక్షిత్తును; ధరణికిన్= భారతభూమికి; రాజున్+చేసెన్= రాజుగా చేశాడు.

**తాత్పర్యం:** అట్లా సోదరుడైన యుయుత్సుడిని కురుసామ్రాజ్యానికి పెద్దదిక్కుగా నియమించి, సైన్యాన్ని ఏర్పాటుచేసి, ధర్మరాజు పెద్దలు ప్రస్తుతించగా పరీక్షిత్తును భరతభూమికి రాజుగా చేశాడు.

**వ. ఇట్లభిమన్యు పుత్త్రునభిషిక్తుం జేసి యతనికిం బూజ్య సామ్రాజ్య పరిపాలన ప్రకారంబు లుపదేశించి కురుకుల పవిత్ర సముచిత చరిత్రభద్ర యగు సుభద్ర కిట్లనియె. 10**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అభిమన్యు పుత్త్రున్= అభిమన్యుడి పుత్రుడైన పరీక్షిత్తును; అభిషిక్తున్+చేసి= అభిషేకించి; అతనికిన్= అతడికి; పూజ్య= గౌరవాస్పదమైన; సామ్రాజ్య= రాజ్యానికి సంబంధించిన; పరిపాలన ప్రకారంబులు= పాలనారీతులు; ఉపదేశించి= బోధించి; కురుకుల= కురుకులంలో; పవిత్ర= పరమపవిత్రురాలును; సముచిత= ఉదాత్తమైన; చరిత్ర భద్ర+అగు= చరిత్ర చేత మంగళమూర్తి అయిన; సుభద్రకున్= సుభద్రతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అభిమన్యుడి కుమారుడైన పరీక్షిత్తును రాజుగా అభిషేకించి, అతడికి గౌరవనీయమైన సామ్రాజ్య పాలనా రీతులను బోధించి కురుకులంలో తన పవిత్ర చరిత్రచేత ఉదాత్తురాలైన మంగళమూర్తి అయిన సుభద్రతో ధర్మరాజు ఇట్లా అన్నాడు:

**మ. భవదీయాత్మజు నాత్మజుండు కురుభూభారోద్వహుం డయ్యె యా**
**దవవంశోత్తరుఁడైన వజ్రునకు నింద్రప్రస్థ రాజ్యంబు గౌ**
**రవ దీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రా! రక్షణీయంబు లై**
**నవి యీ యిండులు రెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమా! 11**

**ప్రతిపదార్థం:** సుచరిత్రా!= మంచి నడవడిక గల సుభద్రా!; భవదీయ= నీ; ఆత్మజు+ఆత్మజుండు= కొడుకు కొడుకు (పౌత్రుడు); కురుభూభార= కురురాజ్య భారాన్ని; ఉద్వహుండు+అయ్యెన్= మోసేవాడయ్యాడు; యాదవవంశోత్తరుఁడు+ఐన= యాదవవంశంలో శ్రేష్ఠుడైన; వజ్రునకున్= వజ్రుడికి; ఇంద్రప్రస్థ రాజ్యంబు= ఇంద్రప్రస్థ రాజ్యాన్ని; గౌరవదీప్తంబుగన్= గౌరవం ప్రకాశించగా;

ఇచ్చినాఁడన్= ఇచ్చాను; ఈ+ఇండులు+రెండు= ఈ రెండు ఇళ్ళూ (కురు, యాదవ వంశాలు); రక్షణీయంబులు+ఐనవి= మంచి చరిత్ర చేత రక్షించదగినవిగా ఉన్నాయి; దృఢధైర్యంబు+ఒప్పన్= గట్టి ధైర్యం ఒప్పగా; నీవు; (ఈ రెండు వంశాలనూ); రక్షింపుమా= రక్షించుము.

**తాత్పర్యం:** 'అమ్మా! నీ పౌత్రుడు ఈ రోజు కురురాజ్యభారాన్ని మోసేవాడయ్యాడు. యాదవవంశ శ్రేష్ఠుడైన వజ్రుడికి ఇంద్రప్రస్థం పట్టం కట్టాను. ఇట్లా కురు యాదవవంశాలు రెంటినీ పరిరక్షించుకొనాలి. దానికై వారికి రక్షణ అవసరం. నీవు దృఢమైన ధైర్యం కలిగి వీరిని ఎప్పుడూ రక్షించుకొనాలి.

**విశేషం:** అరణ్యంలో పాండవులు ఇడుమలు పడినప్పుడు కూడా సుభద్ర చాలా ధైర్యంతో అభిమన్యుడిని ధనుర్విద్యా నిపుణుడిగా తయారుచేసింది. అటు మనుమడిది కౌరవరాజ్యం. తన పుట్టింటి వంశం వాడైన వజ్రుడిది ఇంద్రప్రస్థం. అటూ ఇటూ ఇప్పుడు పెద్ద దిక్కు సుభద్రే. అందుకే ఆమెపై బాధ్యత పెట్టుతున్నాడు ధర్మరాజు. పాండవులు తమ తనువులు వదలిపెట్టటానికి సిద్ధపడుతున్నపుడు కూడా రాజ్యపాలనా బాధ్యతలను విస్మరించకపోవటం ఇక్కడ మనం స్మరించాలి. 'రాజధర్మం' అంటే అదే.

**క. వినుఁ! శేషించిన యాదవ । జనులకు నా వజ్రనృపతి సంరక్షకుఁ డా**
**తనిఁ బోషించుట ధర్మం । బనఘా! యది లేమి ధర్మహాని యగుఁ జుమీ!' 12**

**ప్రతిపదార్థం:** విను= సుభద్రా వినుము!; శేషించిన= మిగిలిన; యాదవజనులకున్= యాదవులకు; ఆ వజ్రనృపతి= ఆ వజ్రుడు; సంరక్షకుఁడు= పాలకుడు; అతనిన్= ఆ వజ్రుడిని; పోషించుట= పోషించటం; ధర్మంబు= మనధర్మం; అనఘా!= పుణ్యాత్మురాలా!; అది లేమి= అట్లా మనం చేయకపోతే; ధర్మహాని+అగున్+చుమీ!= ధర్మహాని జరుగుతుంది సుమా!

**తాత్పర్యం:** పుణ్యాత్మురాలా! వినుము!యుద్ధంలో మిగిలిన యాదవులకు వజ్రుడు రక్ష. మనం అతడిని ఆదుకొనాలి. అది మన ధర్మం. అట్లా చేయలేకపోతే ధర్మహాని అవుతుంది.'

**విశేషం:** న్యాయంగా సుభద్ర పుట్టింటివారు కాబట్టి ఈ విషయం ఆమెకు చెప్పాల్సిన అవసరమే లేదు. కాని, ధర్మరాజులోని ధర్మనిష్ఠ అంత ఉదాత్తమైనది కాబట్టే వజ్రుడి విషయం మరోసారి గుర్తు చేస్తున్నాడు.

**క. అని తారు గృహంబు దొఱఁగి । చనునెడ నవ్వనిత పిఱుఁదఁ జనుదేకుండన్**
**జననాథ! యతఁడు నియమిం । చినవాఁడై యూఱడిల్లెఁ జిత్తములోనన్. 13**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా చెప్పి; జననాథ!= ఓ రాజా!; తారు= తాము; గృహంబు= అంతఃపురం; తొఱఁగి= వదలి; చను+ఎడన్= వెళ్ళేటపుడు; ఆ+వనిత= ఆ సుభద్ర; పిఱుఁదన్= వెనక; చనుదేకుండన్= వెంబడించి రాకుండా; అతఁడు= ధర్మరాజు; నియమించినవాఁడు+ఐ= నియమించి; చిత్తములోనన్= మనసులో; ఊఱడిల్లెన్= ఊరట పొందాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు సుభద్రకు ఇట్లా ధర్మబోధ చేసి తామందరూ అంతఃపురంనుండి బయలుదేరేటప్పుడు సుభద్రకూడా తమను వెంబడించి రాకుండ తగిన నియమాన్ని ఏర్పరచి మనసులో కొంత 'ఊరట' పొందాడు.

**విశేషం:** ధర్మరాజాదులు మహాప్రయాణం చేయబోతున్నారు. అదే తనుత్యాగమనే ప్రయాణం. సుభద్రకూడా అట్లా చేస్తే యదు కౌరవులకు రక్షణ ఉండదు. సత్యవతి, కుంతి, సుభద్ర - ఇట్లా తమ తమ వారిని రక్షించుకొనవలసి వచ్చింది. అదే భారత కథలోని వైచిత్రి. సంసార ప్రతిష్ఠను కాపాడటంలో స్త్రీ ఎంత ప్రధానమో ఈ ఘట్టాన్ని బట్టి అర్థం చేసికొనవచ్చును. చనుదేకుండన్ - ముత్తు పరంబగునపుడు తే, తేరులు తెచ్చునకగు

**చ. పదపడి భారతాజి మృతబాంధవకోటికి మౌసలాజి ను**
**న్మదు లయి పడ్డ యాదవజనంబులకుం బరలోకసౌఖ్య సం**
**పద కయి చేసె నక్కురునృపాలవరిష్ఠుఁ డనేకదానముల్**
**రదని తురంగ గోకనక రత్నమయంబులుగా ముదంబునన్. 14**

**ప్రతిపదార్థం:** పదపడి= ఆ వెనుక; ఆ+కురునృపాలవరిష్ఠుఁడు= ఆ కురురాజులలో శ్రేష్ఠుడైన ధర్మరాజు; భారత+ఆజిన్= భారతయుద్ధంలో; మృత= చనిపోయిన; బాంధవకోటికిన్= బంధు సమూహానికి; మౌసల+ఆజిన్= ముసలయుద్ధంలో; ఉన్మదులు+ అయి= మిక్కిలి మదించినవారై; పడ్డ= చనిపోయిన; యాదవజనంబులకున్= యాదవులకు; పరలోక సౌఖ్యసంపదకున్+అయి= పుణ్యలోకాలలో సౌఖ్యసంపద కలుగటానికి; రదని= ఏనుగు; తురంగ= గుర్రం; గో= ఆవు; కనక= బంగారు; రత్న మయంబులుగాన్= రత్నాలతో కూడిన; అనేక దానముల్= షోడశమహాదానాలను; ముదంబునన్= సంతోషంతో; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ తరువాత ధర్మరాజు భారతరణంలో మృతి నందిన బంధువులకు, రోకటి పోరులో నశించిన యదుసమూహానికి పుణ్యలోక ప్రాప్తి కలిగేందుకు ఏనుగులను, గుర్రాలను, ఆవులను, బంగారు, రత్నాలను ఇంకా అనేకదానాలను హృదయపూర్వకంగా చేశాడు.

**విశేషం:** భూ,గో,తిల,హిరణ్య,రత్న, విద్యా, కన్యా, దాసీ, శయ్యా, గృహ, అగ్రహార, రథ, గజ,అశ్వ,ఛాగ, మహిషీ దానాలను షోడశదానాలంటారు. గో, భూ, తిల, హిరణ్య, ఆజ్య, వస్త్ర, ధాన్య, గుడ, రౌప్య, లవణ దానాలను దశదానాలు అంటారు. ఈ దానాల ప్రసక్తి హైందవ జీవితంలో చాలా ప్రధానమైనది. 'అనేక' దానముల్ అనటంలో ఆనాటి సంప్రదాయం ప్రకారం గజాదులుండటం వలన ఈ వివరణ అవసరమైనది.

**క. భూదానంబులునుం గ। న్యాదానంబులును జేసి నన్నరపతి వా**
**సోదానంబులు నత్యం। తాదరమున నాచరించి యరదము లిచ్చెన్. 15**

**ప్రతిపదార్థం:** ఆ+నరపతి= ఆ రాజు; భూదానంబులునున్= భూదానాలు; కన్యాదానంబులును= కన్యాదానాలూ; చేసెన్= చేశాడు; వాసస్+దానంబులు= వస్త్రదానాలు; అత్యంత+ఆదరమునన్= మిక్కిలి ఆదరంతో; ఆచరించి= చేసి; అరదములు+ఇచ్చెన్= రథాలు ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఆ రాజు భూదానాలు, కన్యాదానాలు చేశాడు. అత్యంత ఆదరంతో వస్త్రదానాలు కూడా చేసి రథాలను కూడా బ్రాహ్మణుల కిచ్చాడు.

**తే. ఇట్లు ధౌమ్యాది విప్రులకెల్లఁ దృప్తి। యెసఁగ బహువస్తుకోటుల నొసఁగి కృపుని**
**ధనమునను బహుమానంబునను బ్రమోద। భరితుఁగాఁ జేసెఁ గురుపతి కురువరేణ్య! 16**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= ఓ జనమేజయరాజా!; కురుపతి= ధర్మరాజు; ఇట్లు= ఈ విధంగా; ధౌమ్య+ఆది విప్రులకున్+ఎల్లన్= ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులందరికీ; తృప్తి+ఎసఁగన్= తృప్తి కలిగేటట్లు; బహువస్తుకోటులన్= రకరకాల వస్తు సమూహాలను;

ఒసఁగి= ఇచ్చి; కృపుని= కృపాచార్యుడిని; ధనంబునన్= సంపదతో; బహుమానంబునను= గౌరవంతోను; ప్రమోద భరితున్+ కాన్+చేసెన్= సంతోషభరితుడిగా చేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ విధంగా ధౌమ్యాది పురోహిత బ్రాహ్మణులకు తృప్తి కలిగే విధంగా నానావిధాలైన వస్తు సముదాయాన్ని దానం చేశాడు. కృపాచార్యుడిని మిక్కిలి గౌరవంతో సత్కరించి సంతోషభరితుడిని చేశాడు.

**వ. శేషించిన కాంచనరత్నాదు లా క్షితిపతి పరీక్షితునకుఁ బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపద ప్రవరజనంబుల రావించి. 17**

**ప్రతిపదార్థం:** శేషించిన= మిగిలిన; కాంచన= బంగారు; రత్న+ఆదులు= రత్నాలు, ముత్యాలు, వజ్రాలు మొదలైనవాటిని; ఆ క్షితిపతి= ఆ ధర్మరాజు; పరీక్షితునకున్= పరీక్షిత్తుకు; పరమ+ఆదరమునన్= మిక్కిలి ప్రీతితో; సమర్పించి= ఇచ్చి; అతనిన్= పరీక్షిత్తును; కృపాచార్యునకున్= కృపాచార్యుడికి; శిష్యున్+కాన్= శిష్యుడిగా; అప్పగించి; పౌర= పురజనులలో; జానపద= గ్రామప్రజలలో; ప్రవర= ముఖ్యులైన; జనంబులన్= జనాలను; రావించి= రప్పించి.

**తాత్పర్యం:** మిగిలిన బంగారు, రత్నాలు మొదలైన వాటిని ధర్మరాజు పరీక్షిన్మహారాజులకు మిక్కిలి ఆదరంతో ఇచ్చాడు. అతడిని కృపాచార్యుడికి శిష్యుడిగా అప్పగించి పట్టణ, గ్రామాలలోని ముఖ్య జనులను పిలిపించుకొని. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. ఆ పార్థపౌత్రునిఁ జూపి 'మా యేవుర । మాఱుగా మీ రిక్కుమారవరునిఁ**
**గైకొని తగ నెల్లకార్య జాతంబును । నడపుచు ననురక్తి నాఁడునాఁటి**
**కెక్కుడగుచు నుండ నీతని యుల్లంబు । రంజిల్ల సమ్యగారాధనంబు**
**నందు సంప్రవణుల రగుఁడయ్య!' యని పల్కి । తమ నిశ్చయంబు నుదాత్తభంగిఁ**

**తే. జెప్పుటయు వారు మొగములు చిన్నఁబోవ । 'మము నుపేక్షించి యిటుసేఁత సముచితంబె?**
**నీదు చిత్తంబు కారుణ్య నిలయ; మేము । దరతరంబ యాశ్రితులము ధర్మశీల!' 18**

**ప్రతిపదార్థం:** ఆ పార్థపౌత్రునిన్+చూపి= ఆ పార్థుడి మనుమడైన పరీక్షిత్తును చూపి; (ధర్మరాజు); మా+ఏవుర మాఱుగాన్= మా ఐదుగురికి బదులుగా; మీరు= మీరంతా; ఈ+కుమార వరునిన్= ఈ కుమార శ్రేష్ఠుడిని; కైకొని= ప్రభువుగా స్వీకరించి; తగన్= తగినట్లుగా; ఎల్లకార్య జాతంబును= అన్ని పనులనూ; నడపుచున్= నడుపుకొంటూ; అనురక్తి= అభిమానం; నాఁడునాఁటికిన్= నానాటికి; ఎక్కుడు+అగుచున్+ఉండన్= ఎక్కువ అవుతుండగా; ఈతని+ఉల్లంబు= ఇతడి హృదయం; రంజిల్లన్= సంతసించగా; సమ్యక్+ఆరాధనంబునందున్= బాగా ఆరాధించటంలో; సం+ప్రవణులరు= మిక్కిలి ఆసక్తి కలవారు; అగుఁడు+అయ్య!= అవండి; అని పల్కి= అని చెప్పి; తమ నిశ్చయంబున్= తమ నిర్ణయాన్ని; ఉదాత్తభంగిన్= ఉదాత్తమైన రీతిలో; చెప్పుటయున్= చెప్పగా; వారు= ఆ ప్రజలు; మొగములు= ముఖాలు; చిన్నఁబోవన్= చిన్నబోవగా (ఇట్లా అన్నారు); ధర్మశీల!= ధర్మమే స్వభావంగా కలవాడా!; మమున్+ఉపేక్షించి= మమ్ము ఉపేక్షించి; ఇటుసేఁత= ఇట్లా చేయటం; సముచితంబు+ఎ?= సముచితంగా ఉన్నదా?; నీదుచిత్తము= నీ మనసు; కారుణ్య నిలయము= కరుణకు నిలయం; తరతరంబు+అ= తరతరాలుగా; మేము; ఆశ్రితులము= మిమ్ములను ఆశ్రయించి ఉన్నాం.

**తాత్పర్యం:** ధర్మరాజు పరీక్షిత్తుడిని వారికి చూపి 'మా ఐదుగురికి బదులుగా మీరంతా ఈ కుమారుడిని ప్రభువుగా స్వీకరించి తగిన పద్ధతిలో అన్ని పనులనూ నడపుకొంటూ, అభిమానం రోజురోజుకీ అధికం అవుతుండగా ఇతడి హృదయం సంతోషించేటట్లు బాగా సహకరించటంలో మిక్కిలి ఆసక్తి కలవారు అవండి' అని పలికి తమ నిశ్చయాన్ని ఉదాత్తమైన రీతిలో చెప్పగా, ఆ ప్రజలు ముఖాలు చిన్నబోవగా ధర్మరాజుతో ఇట్లా అన్నారు: 'ధర్మమే స్వభావంగా ఉన్న రాజా! మమ్ములను ఇట్లా నిర్లక్ష్యం చేసి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకొనటం సముచితంగా ఉన్నదా? నీ మనసు దయకు నిలయం. మేము తరతరాలుగా మిమ్ములను నమ్ముకొని బ్రతుకుతున్నాం'.

**వ. అని గద్గదకంఠు లగుచు నాడిన మాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మఱుమాటలాడి తమ గమనంబులకుఁ దజ్జనంబుల నియ్యకొల్పె; నప్పు డందులోనం గొందఱ నివేశనంబు లధికాభిలాషంబున నొత్తి కొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు 'కలియుగంబు ప్రవేశించుటంజేసి కాదే యిట్టివి పుట్టెడు' నని తలంచి నవ్వి నరనాథునకుం జెప్పిన, నప్పౌరవోత్తముండు నవ్వుచు 'మన మనువులు సాలు' నని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం, దమ్ములు ద్రౌపదియు నట్ల చేసి; రందఱుం దత్కాలోచితంబులగు నిష్ఠా విధానంబు లాచరించి, యగ్నుల నంబుగతంబులు సేసి, మొగం బులం దెలి వగ్గలింప గృహంబు వెలువడి; రప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠం బోవ సప్తమం బై యొక్క సారమేయంబు వారల వెనుకఁ జనియె; నప్పుడు. 19**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; గద్గదకంఠులు+అగుచున్= (డగ్గుత్తికపడిన) కంఠాలు కలిగినవారై; ఆడినమాటలకున్= పలికిన పలుకులకు; ఆ+మనుజ+ఇంద్రుండు= ఆ రాజు; తగు+తెఱంగునన్= తగినవిధంగా; మఱుమాటలు+ఆడి= సమాధానం చెప్పి; తమగమనంబులకున్= తమ ప్రయాణానికి; తద్+జనంబులన్= వారిని; ఇయ్యకొల్పెన్= సమ్మతింపచేశాడు; అప్పుడు= ఆ సమయంలో; అందులోనన్= వారిలో; కొందఱు= కొంతమంది; కొందఱ= కొందరి; నివేశనంబులన్= కూర్చున్నచోటులను; అధిక+అభిలాషంబునన్= మిక్కిలి ఆసక్తితో; ఒత్తికొనుట; కారణంబుగాన్= కారణంగా; వివాదంబు= వివాదం; పుట్టినన్= పుట్టగా; సహదేవుండు= సహదేవుడు; కలియుగంబు= కలియుగం; ప్రవేశించుటన్+చేసి+కాదే!= ప్రవేశించటం వలననేకాదా!; ఇట్టివి= ఇట్లాంటివి; పుట్టెడున్+అని= పుట్టు తున్నాయని; తలంచి= ఆలోచించి; నవ్వి; నరనాథునకున్= ధర్మరాజుకు; చెప్పినన్= చెప్పగా; ఆ+పౌరవ+ఉత్తముండు= ఆ పురువంశజులలో శ్రేష్ఠుడైన ధర్మరాజు; నవ్వుచున్= నవ్వుతూ; మన మనువులు= మన జీవితాలు; చాలును+అని= ఇక చాలని; పలికి= అంటూ; సర్వ+ఆభరణంబులున్= నగలన్నిటినీ; ఊడ్చి= తీసివేసి; వల్కల+అజినంబులు= నారబట్టలను, లేడిచర్మాన్ని; ధరియించినన్= కట్టుకొనగా; తమ్ములున్= తమ్ములైన భీమాదులు; ద్రౌపదియును= ద్రౌపదీ(కూడా); అట్ల చేసిరి= అట్లాగే చేశారు; అందఱున్= అందరూ; తద్+కాల+ఉచితంబులు+అగు= ఆ కాలానికి తగిన; నిష్ఠావిధానంబులు= నిష్ఠతో కూడిన ధార్మిక విధులను; ఆచరించి= చేసి; అగ్నులన్= అగ్నులను; అంబుగతంబులు+చేసి= నీళ్ళలో కలిపి; మొగంబులన్= ముఖాలలో; తెలివు= జ్ఞానంతోడి ప్రకాశం; అగ్గలింపన్= అతిశయించగా; గృహంబున్+వెలువడిరి= ఇంటి నుండి బయటికి వచ్చారు; అప్పుడు= ఈ సమయంలో; ద్రౌపది; షష్ఠత్వనిష్ఠన్= ఆరవ వ్యక్తిగా శ్రద్ధతో; పోవన్= వెంటవెళ్ళగా; ఒక్క సారమేయంబు= ఒక కుక్క; సప్తమంబు+ఐ= ఏడవదిగా; వారల వెనుకన్= వారి వెనుక; చనియెన్= బయలుదేరింది; అప్పుడు= అపుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా వణుకుతున్న గొంతులతో వారన్న మాటలకు ధర్మరాజు తగిన విధంగా సమాధానం చెప్పి తమ ప్రయాణానికి వారిని సమ్మతింపజేశాడు. ఆ సమయంలో వారిలో కొందరికి మాత్రం ఆసీనులు కావడానికి

సంసిద్ధమయిన చోట్లలో ఇతరులు కూడా ఆసీనులు కావడానికి ఆసక్తి సంసిద్ధతలు ప్రదర్శించడం వలన వారిలో వారికి తగవు వచ్చింది. అపుడు సహదేవుడు 'కలియుగం ప్రవేశించటం వలననే కదా ఇట్లాంటి తగవు పుట్టిం' దని ఆలోచించి, నవ్వి ధర్మరాజుతో ఈ విషయం చెప్పాడు. అది విన్న ధర్మరాజు నవ్వుతూ ' ఇక మన జీవితాలు చాలు' అని అంటూ నగలన్నింటినీ తీసివేసి నారబట్టలనూ, జింకచర్మాన్నీ ధరించాడు. తమ్ములైన భీమాదులు, ద్రౌపది కూడా అట్లాగే చేశారు. అందరూ ఆ సమయానికి తగిన ధార్మికవిధులను చేసి అగ్నులను నీళ్ళలో కలిపివేశారు. అంతః పురంనుండి బయటికి వచ్చారు. వారివెంట ఆరవవ్యక్తిగా నిష్ఠతో ద్రౌపది బయలుదేరింది. ఒక కుక్క ఏడవదిగా వారివెంట పడింది.

**విశేషం:** కలియుగధర్మం అంటే ఏమిటో ఈ సందర్భాన్ని బట్టి అర్థం చేసికొనవచ్చును. కృతయుగంలో అందరూ సత్యధర్మనిష్ఠులే. త్రేతలో ఒకపాదం. ద్వాపరంలో మరోపాదం పోగా కేవలం ఒకపాదంమీద ధర్మదేవత నిలబడిందన్న సంప్రదాయ భావనకు మూలమిదే. ద్వాపరంలో ఒకరిచోటును మరి ఒకరు ఒత్తుకొని వచ్చినా పెద్దగా పట్టించుకొన్నవారు కారు. కలియుగం శ్రీకృష్ణుడి నిర్యాణంతో ప్రవేశించింది. అందుకే జనులలో 'ఓర్పు' నశించిందని అర్థం. ద్వాపరంలో ఏ ఒకరిద్దరిలోనో ఉన్న అసూయ సమాజ 'రుగ్మత' గా మారింది. కాబట్టే కలిప్రారంభంలోనే అంతచిన్న విషయానికి 'తగవు' వచ్చింది. ద్వాపరంలోని వ్యక్తులు కాబట్టి ధర్మజుడు, సహదేవుడు దీనిని చూసి నవ్వుకొన్నారు. సహదేవుడు భవిష్యద్ జ్ఞాన మున్నవాడు కాబట్టి కలియుగ ధర్మమని వ్యాఖ్యానించాడు. ఇక మనం అవతారాలు చాలించవచ్చునని ధర్మరాజు అనటానికి అర్థ మిదే. భారతంలో ధర్మజుడు 'నాయకుడు' కాబట్టే అవతార పరిసమాప్తి సూచన కూడా ఆయననోటే వెలువడింది. ద్రౌపది వారి నాశ్రయించి భారతరణ సంకల్పం కలిగించిన 'శక్తి' స్వరూపిణి. వెంటవచ్చిన కుక్క సాక్షాత్తు 'ధర్మమే'. వారికన్నా ముందువచ్చి వారివెంట వెళ్ళుతున్నది. ఇక్కడినుండే పాండవుల మహాప్రస్థానం మొదలవుతున్నది.

**సీ.** **పౌరజనంబు లాబాలవృద్ధంబుగా । వచ్చి రక్కురువంశవరులఁ జూడఁ;**
**దత్సమయంబు జూదమునాఁడు వెడలి వా । రరిగెడు నయ్యవసరముఁ బోలెః;**
**భటసమేతముగ నప్పాండుతనూజుల । తోన యుయుత్సుండు దాను నరిగె;**
**భవదీయ జనకుఁ డభ్యంతరసతు లెల్ల । ననుగమించిరి వారి మనుజనాథ!**

**తే.** **యిట్లు కరిపురి వెలువడి యేఁగె ధర్మ । తనయుఁ డందఱు నెంతయు దవ్వు గాఁగ**
ª Ú□† Çŏi-y ~üH ✱#°–E z x □°=ôl =°#–_È` Ç" ŒÐz † ¶Ç~ŒA ‹ #°K Ç#°O_³ 20

**ప్రతిపదార్థం:** పౌరజనంబులు= పురజనులు; ఆ బాల వృద్ధంబుగాన్= పిల్లలు మొదలుకొని, పెద్దలవరకూ అందరూ; ఆ+ కురువంశవరులన్+చూడన్= ఆ కురువంశ శ్రేష్ఠులను చూడగా; వచ్చిరి= వచ్చారు; తద్+సమయంబు= ఆ సమయం; జూదమునాఁ డు= జూదంలో ఓడిపోయినరోజున; వెడలి= హస్తినవదలి; వారు+అరిగెడు= వాళ్ళు వెళ్ళిన; ఆ+అవసరమున్+పోలెన్= ఆ సందర్భంవలె ఉన్నది; యుయుత్సుండు= యుయుత్సుడు; భటసమేతముగన్= భటులతో కూడి; ఆ+పాండుతనూజులతోన్+ అ= ఆ పాండుకుమారులతో పాటే; తానున్+అరిగెన్= తానుకూడా వెళ్ళాడు; మనుజనాథ!= ఓ జనమేజయ మహారాజా!; భవదీయ జనకుఁడు= నీ తండ్రి పరీక్షిన్మహారాజు; అభ్యంతర సతులు+ఎల్లన్= అంతఃపురంలోని స్త్రీలందరూ; వారిన్= వారిని; అనుగమించిరి= వెంబడించారు; ఇట్లు= ఈ విధంగా; కరిపురి వెలువడి= హస్తినాపురాన్ని వదలి; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ఏఁగెన్= బయలుదేరాడు; అందఱున్= అందరూ; ఎంతయున్+దవ్వు+కాఁగన్= ఎంతో దూరం వరకు; సొలయక= వెనుదీయకుండా; ఏఁగిరి= వెంటనడిచారు; ఒకళ్ళను+చూచి= ఎవరినో చూచి (ధర్మరాజు) (ఇంక) నిలువుము= నిలువుము; అనఁడు; తలవాఁచి= తలను వంచి; ఆ రాజు= ధర్మరాజు; చనుచున్+ఉండెన్= వెళ్ళుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** హస్తినాపురంలోని జనులు పిల్లలు మొదలు పెద్దల వరకు అందరూ పాండవులను చూడటానికి వచ్చారు. ఆ సమయం - ఆనాడు జూదంలో ఓడిపోయి హస్తినాపురంనుండి వెళ్ళిపోయిన సందర్భాన్ని గుర్తుకు తెస్తున్నది. యుయుత్సుడు సైన్యంతోకూడి పాండవుల వెంట బయలుదేరాడు. రాజా! నీ తండ్రి పరీక్షిత్తు అతడి అంతఃపురకాంతలు వారిని వెంబడించారు. ఇట్లా ధర్మరాజు హస్తినను వదలి బయలుదేరాడు. వెంట వస్తున్నవారు చాలా దూరం వరకు వెనుదీయకుండా అట్లా వస్తూనే ఉన్నారు. ధర్మరాజు వారిలో ఎవరినో చూచి 'ఇక మీరు ఆగండి' అనక తాను మాత్రం ముందుకు సాగిపోతున్నాడు.

**విశేషం:** జూదంలో ఓడిపోయిన రోజున అరణ్యాజ్ఞాతవాసాలకు ప్రస్థానం. ఈనాడు ముక్తిమార్గానికి చేస్తున్న ఈ ప్రయాణం 'మహాప్రస్థానం'. వెంటవచ్చిన వారికి పాండవులమీద ఎంత అపేక్ష ఉన్నదో ఈ ఘట్టం నిరూపిస్తున్నది.

**చ.** **తనువులు దూల నందఱుఁ బ్రదక్షిణముల్ వినుత ప్రణామముల్**
**వినయసమేతులై నడపి వీడ్కొని రా నృపతిం గ్రమక్రమం**
**బున; నిటు లుమ్మలంబు మనముల్ పొగిలింపఁగ వచ్చి చొచ్చి ర**
**జ్జనములునుం బరీక్షితుఁడు సామజపట్టణ మస్ఫురద్గతిన్.** **21**

**ప్రతిపదార్థం:** అందఱున్= అందరూ; తనువులు+తూలన్= శరీరాలు అలసటతో తూలిపోతుండగా; వినయసమేతులు+ఐ= వినయంతో కూడినవారై; ప్రదక్షిణముల్= ప్రదక్షిణలు; వినుత ప్రణామముల్= ప్రశంసతోడి నమస్కారాలు; నడపి= చేసి; క్రమక్రమంబునన్= ఒక్కొక్కరే; ఆ నృపతిన్= ఆ ధర్మజుడిని; వీడ్కొనిరి= వీడ్కొన్నారు; ఇటు= ఇట్లా; ఉమ్మలంబు= దుఃఖం; మనముల్= మనస్సులను; పొగిలింపఁగన్= పరితపింపచేయగా; ఆ+జనములున్= ఆ పౌరులూ; పరీక్షితుఁడు= పరీక్షిన్మహారాజూ; సామజపట్టణము= హస్తినకు; అస్ఫురత్+గతిన్= కాంతిహీనమైన నడకతో; వచ్చి చొచ్చిరి= వచ్చి చేరారు.

**తాత్పర్యం:** అందరూ తూలిపోతున్న శరీరాలతో వినయంతో కూడినవారై ప్రదక్షిణలు చేశారు. ప్రస్తుతిస్తూ నమస్కరించారు. ఒక్కొక్కరే ధర్మరాజును వీడ్కొన్నారు. ఇట్లా దుఃఖం, వారి మనసులను పరితపింప చేస్తుండగా ఆ పౌరులు, పరీక్షిన్మహారాజు కాంతిలేని నడకలతో ఎట్లాగో హస్తినాపురం చేరుకొన్నారు.

**వ.** **ఆ సమయంబున.** **22**

**తాత్పర్యం:** ఆ సమయంలో- (తరువాతి పద్యంతో అన్వయం)

**తే.** **జనకు కడకు నులూచి (పి) భుజంగలోక। మునకుఁ బోయెఁ; జిత్రాంగద తన తనూజు;**
**డైన బభ్రువాహనుపాలి కరిగెఁ దక్కుఁ। గలుగు సతు లెల్ల నీ తండ్రికడన నిలువ.** **23**

**ప్రతిపదార్థం:** ఉలూచి= అర్జునుడి భార్య ఉలూచి; జనకు కడకున్= తండ్రివద్దకు; భుజంగలోకమునకున్+పోయెన్= నాగలోకానికి వెళ్ళింది; చిత్రాంగద= అర్జునుడి మరొకభార్య అయిన చిత్రాంగద; తన తనూజుఁడు+ఐన= తన కుమారుడైన; బభ్రువాహను పాలికిన్+అరిగెన్= బభ్రువాహనుడి దగ్గరికి వెళ్ళింది; తక్కున్+కలుగు+సతులు+ఎల్లన్= తక్కిన స్త్రీలందరూ; నీ తండ్రి కడన్+అ= నీ తండ్రి అయిన పరీక్షిత్తు వద్దనే; నిలువన్= నిలువగా.

**తాత్పర్యం:** అర్జునుడి భార్య ఉలూచి తన తండ్రి నివాసమైన నాగలోకానికి వెళ్ళింది. మరొకభార్య చిత్రాంగద తన

కుమారుడు బభ్రువాహనుడి వద్దకు చేరింది. తక్కిన స్త్రీలు నీ తండ్రి పరీక్షిత్తు వద్దనే నిలిచిపోగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. అప్పుడు. 24**

**తాత్పర్యం:** ఆ సమయంలో- (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కృపుఁడు ధౌమ్యుండు నా నృపతినిఁ దగువారి । నర్థ్యభాషణముల ననునయించి**
**యెలమి చిత్తంబులఁ దలకొల్పి పౌరులఁ । దగఁ జేర్చి పనుల నుత్సాహ మెసఁగ**
**వర్తింపఁ జేసిన వారణపురి పూర్వ । భంగి సంపత్పరిభరిత మయ్యెఁ;**
**నట ధర్మజుండు ముందటఁ జనఁ గ్రమమున । ననుగమించిరి పవనాత్మజుండు**

**తే. నర్జునుండు నకులుఁడుఁ దదవరజుండు । ద్రౌపదియు నిట్లు సనుచుండఁ దగిలి వారి**
**వెనుక విడువక శునకంబుఁ జనియెఁ; నవ్వి । ధమున వారు మహాపథగమనమునకు. 25**

**ప్రతిపదార్థం:** కృపుఁడు= కృపాచార్యుడు; ధౌమ్యుండున్= ధౌమ్యుడు; ఆ నృపతిన్= ఆ రాజును; తగువారిన్= తగిన మరికొందరిని; అర్థ్యభాషణములన్= సముచితమైన ఓదార్పు మాటలతో; అనునయించి= ఓదార్చి; ఎలమి= ధైర్యం; చిత్తంబులన్= మనస్సులలో; తలకొల్పి= ప్రేరేపించి; పౌరులన్= పురజనులను; తగన్= తగినట్లు; తేర్చి= తేరుకొనేటట్లు చేసి; పనులన్= పనులలో; ఉత్సాహము+ఎసఁగన్= ఉత్సాహం అతిశయించగా; వర్తింపన్+చేసినన్= ప్రవర్తించేటట్లు చేయగా; వారణపురి= హస్తినాపురి; పూర్వభంగిన్= మునుపటివలె; సంపద్+పరిభరితము+అయ్యెన్= సంపదతో కూడినది అయింది; అటన్= అక్కడ; ధర్మజుండు= ధర్మరాజు; ముందటన్+చనన్= ముందరికి వెళ్ళుతుండగా; క్రమమునన్= వరుసగా; పవన+ఆత్మజుండు= భీముడు; అర్జునుండు= అర్జునుడు; నకులుఁడు= నకులుడు; తద్+అవరజుండు= అతడికి వెనుక పుట్టినవాడు (తమ్ముడు) (సహదేవుడు); ద్రౌపదియున్= ద్రౌపదీ; అనుగమించిరి= వెంటనడుస్తున్నారు; ఇట్లు= ఈ విధంగా; చనుచున్+ఉండన్= వెళ్ళుతుండగా; వారి వెనుకన్= వారి వెంబడి; తగిలి= అనుసరించి; విడువక= వదలక; శునకంబున్+చనియెన్= ఆ కుక్క కూడా వెళ్ళింది; ఆ+విధమునన్= ఆ విధంగా; మహా పథగమనమునకున్= అతిపెద్దదారిలో ప్రయాణానికి; (మహాప్రస్థానానికి) వారు.

**తాత్పర్యం:** కృపుడు, ధౌమ్యుడు ఆ రాజును, ముఖ్యులైన ఇతరులను తగిన ఓదార్పు మాటలతో ఓదార్చి ధైర్యం పురికొల్పారు. ఆ పురజనులను తేరుకొనేటట్లు చేసి ఉత్సాహంతో పనులు చేసికొనేటట్లు చేశారు. అందుచేత హస్తినాపురి మునుపటివలె అన్ని సంపదలతో కూడినది అయింది. ఇదిట్లా ఉండగా అక్కడ ధర్మరాజు ముందుకు సాగుతుండగా భీమార్జున నకుల సహదేవులు, ద్రౌపది ఆయన వెంట నడుస్తున్నారు. వారిని వెంబడించి వస్తున్న కుక్క వదలకుండా అట్లాగే వారిని అనుసరించి వెళ్ళుతున్నది. ఇట్లా అతి దీర్ఘమైన దారిలో ప్రయాణానికి వారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'పురోహితు' డనే శబ్దానికి అర్థం ఈ పద్యంలో తెలుస్తున్నది. ముందు కాలానికి హితాన్ని కోరి ఎవరు ప్రజలను ధర్మపథంలో నడిపిస్తారో వారు పురోహితులు. వారికి హైందవ సమాజంలో అత్యుత్తమ గౌరవం ఇవ్వటానికి కారణం ఇదే. వారు రాజుకు ధైర్యం చెప్పారు. ప్రజలను ఉత్సాహవంతులను చేశారు. మళ్ళీ పంటలు పండాయి. లౌకిక వృత్తులన్నీ యథాతథంగా సాగాయి. అంటే కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయని అర్థం. అంతవరకు పాండవులు ఆ మహాప్రస్థానం చేస్తూనే ఉన్నారు.

**వ. పూని యుపవాసవ్రతపరులై భాగీరథి పొంతకుం జని యంత నుండియుఁ బ్రాఙ్ముఖ వర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి పూర్వసముద్ర తీరంబు సేరి; రట్టియెడ. 26**

**ప్రతిపదార్థం:** పూని= పూనుకొని; ఉపవాసవ్రతపరులు+ఐ= ఉపవాసదీక్షలో; భాగీరథి= గంగ; పొంతకున్+చని= సమీపానికి వెళ్ళి; అంతనుండియున్= అక్కడినుండి; ప్రాక్+ముఖవర్తనంబున్+కైకొని= తూర్పుదిశగా తిరిగి; యోగబలంబునన్= యోగశక్తితో; అరిగి= వెళ్ళి; గిరి= కొండలు; సరిత్= నదులు; అరణ్యంబులు= అడవులు; అనేకంబులు+కడచి= అనేకాలు దాటి; పూర్వసముద్రతీరంబు+చేరిరి= తూర్పు సముద్రతీరం చేరారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** పూనుకొని ఉపవాసదీక్షతో గంగను సమీపించి, అక్కడినుండి తూర్పుదిశగా తిరిగి యోగశక్తితో ప్రయాణించి కొండలు, నదులు, అడవులు అనేకాలు దాటి తూర్పు సముద్రతీరం చేరారు. ఆ సమయంలో-(తరువాతి పద్యంతో అన్వయం)

**క. దిక్కులు మేఘపథంబును । బిక్కటిలఁగ నవయవములు భీషణములుగా**
**నొక్కయెడ నగ్నిదేవుం । డక్కౌరవవంశవరుల యగ్రతలమునన్. 27**

**ప్రతిపదార్థం:** మేఘపథంబునన్= ఆకాశంలో; దిక్కులు= అష్టదిక్కులు; పిక్కటిలఁగన్= నిండుకొనగా (వ్యాపించగా); అవయవములు= దేహభాగాలు; భీషణములు+కాన్= భయంకరంగా (కనిపించగా); ఒక్కఎడన్= దారిలో ఒకచోట; అగ్నిదేవుండు; ఆ+కౌరవవంశవరుల= ఆ పాండవుల యొక్క; అగ్రతలమునన్= ముందువైపు.

**తాత్పర్యం:** వీరి ఎదుట అన్ని దిక్కులలో వ్యాపించిన సుదీర్ఘదేహుడై అతిభయంకరంగా కనిపిస్తున్న అవయవాలతో అగ్నిదేవుడు (తరువాతి పద్యంతో అన్వయం).

అగ్నిదేవుఁ డర్జును చేతి గాండీవంబు సముద్రంబున వైపించుట (సం.17-1-33)

**సీ. నిలిచి బీభత్సుండు నిర్భర స్నేహంబు । కతమున విడువక గాండివంబు**
**గొనివచ్చుచున్న నాతనితోడ నవ్వాయు । సఖుఁ 'డో ధనంజయ! శౌరిచక్ర**
**మెన్నఁడే దివమున కేఁగె; నీ వేల గాం । డీవంబు విడువవు? దేవకార్య**
**మునకుఁగా వరుణదేవునిచేత నేను దె । చ్చినయది యీ ధనుశ్శ్రేష్ఠ మమ్మ**

**తే. హానుభావుని కొప్పింపు' మనిన 'లెస్స । యట్లు సేయుదుఁగా' కని యక్కిరీటి**
**యగ్రజానుజులకుఁ జెప్పి యాదరమున । నాతఁ డచ్చాప మంబుధియందుఁ బెట్టె. 28**

**ప్రతిపదార్థం:** నిలిచి= (ఆ విధంగా అగ్నిదేవుడు వారి ముందు) నిలిచి; బీభత్సుండు= అర్జునుడు; నిర్భర= అతిశయించిన (పూర్ణమైన); స్నేహంబుకతమునన్= మైత్రివలన; విడువక= వదలకుండా; గాండివంబున్= గాండీవాన్ని; కొని వచ్చుచున్+ఉన్నన్= తీసికొని వస్తుండగా; అతనితోడన్= అతడితో; ఆ+వాయుసఖుఁడు= వాయుదేవుడి మిత్రుడైన అగ్నిదేవుడు; (ఇట్లా అన్నాడు); ఓ ధనంజయ!= ఓ అర్జునా!; శౌరిచక్రము= శ్రీకృష్ణుడి చక్రం; ఎన్నఁడేన్= ఏనాడో; దివమునకున్+ఏఁగెన్= స్వర్గానికి చేరిపోయింది; నీవు= నీవు మాత్రం; గాండీవంబు= గాండీవాన్ని; ఏల విడువవు?= ఎందుకు వదలిపెట్టవు?; దేవకార్యమునకున్+కాన్= దేవతలు సంకల్పించిన పనిని నెరవేర్చటానికి గాను; నేను; ఈ ధనుస్+శ్రేష్ఠము= ఈ శ్రేష్ఠమైన వింటిని; ఆ+వరుణదేవుని చేతన్=

వరుణదేవుడి నుండి; తెచ్చిన+అది= తెచ్చాను; (దీనిని మరలా); ఆ+మహానుభావునికిన్= ఆ మహానుభావుడయిన వరుణుడికి; ఒప్పింపుము= అప్పగించుము; అనినన్= అని చెప్పగా; లెస్స= చిత్తం; అట్లు+చేయుదుకాన్‌కాక+అని= అట్లాగే చేస్తానని; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; అగ్రజ+అనుజులకున్= అన్నలకు, తమ్ముళ్ళకు చెప్పి; ఆదరమునన్= ఆదరంతో; అతఁడు= అర్జునుడు; ఆ+చాపము= ఆ ధనుస్సును; అంబుధియందున్= ఆ సముద్రంలో; పెట్టెన్= ఉంచాడు.

**తాత్పర్యం:** అట్లా అగ్నిదేవుడు వారిముందు నిలిచి అమితమైన స్నేహంతో ఆ గాండీవాన్ని అట్లాగే తీసికొనివస్తున్న అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'ఓ అర్జునా! శ్రీకృష్ణుడి చేతిలోని సుదర్శనచక్రం ఏనాడో స్వర్గం చేరిపోయింది. మరి నీవు మాత్రం గాండీవాన్ని ఇంకా ఎందుకు వదలకుండా ఉన్నావు? దేవతలు సంకల్పించిన కార్యాన్ని సాధించటానికి నేను స్వయంగా వరుణదేవుడి వద్దనుండి తెచ్చింది ఆ ధనుస్సు. దానిని మరలా ఆ మహానుభావుడికే అప్పగించుము' -అని చెప్పగా, 'అట్లాగే' అని అర్జునుడు అన్నలకు, తమ్ముళ్ళకు ఈ విషయం చెప్పి, ఆ ధనువుకు గౌరవంతో నమస్కరించి ఆ వింటిని సముద్రంలో ఉంచాడు.

**విశేషం:** రాజసూయం ముందు ఏ అగ్నిదేవుడు గాండీవాన్ని ప్రసాదించాడో ఆ మహానుభావుడే స్వయంగా వచ్చి ఆ ధనువును సముద్రంలో సమర్పించుమంటున్నాడు. 'నరుడు' కాబట్టి అర్జునుడికి ఆ 'ధనువు' పై మమత పోలేదన్న మాట. 'సర్వస్వత్యాగం' చేస్తేనే తప్ప విముక్తి లభించదు. అర్జునుడికి ఆభరణాలకన్నా ముఖ్యమైనది, అతడికి 'అహం'కార కారణమైనది ఆ ధనుస్సే - అది దేవకార్యం కోసం ప్రసాదించబడింది - కౌరవయుద్ధంలో దాని ప్రయోజనం తీరిపోయింది. అందుకనే బోయలముందు అది కర్రవలె మాత్రం ఉపయోగపడింది.

**వ. తదనంతరంబ కృశానుం డంతర్ధానంబు సేసి; నయ్యోగపరాయణులు పదంపడి. 29**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; కృశానుండు= అగ్నిదేవుడు; అంతర్ధానంబు+చేసెన్= మాయమైపోయాడు; ఆ+యోగపరాయణులు= యోగనిష్ఠితులైన పాండవులు; పదంపడి= పిమ్మట.

**తాత్పర్యం:** అట్లా చేయగానే అగ్నిదేవుడు మాయమైపోయాడు. ఆ తరువాత యోగనిష్ఠితులైన పాండవులు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. దక్షిణాభిముఖతఁ దలకొని యిలకుఁ బ్ర। దక్షిణంబు గాఁగఁ దమ మనములు**
**తద్ద ముదము నొంద నద్దెస వార్ధి యు। పాంతమునకు నేఁగి రధిపముఖ్య! 30**

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య!= రాజా! (వినుము); దక్షిణ+అభిముఖతన్= దక్షిణంవైపుగా; తలకొని= పూనుకొని; ఇలకున్+ప్రదక్షిణంబు+కాఁగన్= భూమికి ప్రదక్షిణంగా; తమమనములు= తమ మనస్సులు; తద్ద= మిక్కిలి; ముదమున్+ఒందన్= సంతోషం చెందగా; ఆ+దెసన్= ఆ వైపుగా; వార్ధి= సముద్ర; ఉపాంతమునకున్= సమీపానికి; ఏఁగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** అట్లా దక్షిణంవైపుగా ప్రయాణించాలని పూనుకొని భూమికి ప్రదక్షిణమార్గంలో వెళ్ళుతూ తమ మనస్సులు మిక్కిలి సంతోషం చెందగా సముద్రానికి సమీపంగా వెళ్ళారు.

**వ. అచ్చటినుండి. 31**

**తాత్పర్యం:** అక్కడినుండి - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పడమర మొగమై పశ్చిమ। జడనిధి తీరంబు సేరఁజని యుత్తర మె**
**క్కుడు నియతి నడచి వారిధిఁ। బొడ వడఁగిన యాదవేంద్రుపురి చేరువగన్. 32**

**ప్రతిపదార్థం:** పడమర మొగము+ఐ= పడమర వైపుగా; పశ్చిమజడనిధి తీరంబున్= పశ్చిమసముద్రతీరాన్ని; చేరన్+చని= చేరగా బయలుదేరి; ఉత్తరము+ఎక్కుడు నియతిన్+నడచి= ఉత్తరదిశగా అధికనిష్ఠతో నడచి; వారిధిన్= సముద్రంలో; పొడవు+అడఁగిన= నిలువునా మునిగిపోయిన; యాదవేంద్రు+పురి= శ్రీకృష్ణుడి నగరమైన ద్వారకకు; చేరువగన్= సమీపంగా.

**తాత్పర్యం:** అటునుండి పడమరవైపుగా బయలుదేరి పశ్చిమ సముద్రతీరాన్ని చేరి, అటుపైన అధికనిష్ఠతో ఉత్తరంవైపుగా ప్రయాణించి సముద్రంలో నిలువునా మునిగిపోయిన శ్రీకృష్ణుడి నగరమైన ద్వారకకు సమీపంగా (చేరి) (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అటఁ జని యశ్రమంబున హిమాచలమున్ సమతిక్రమించి వా**
**రటవులు భూములున్ నదులు నద్రులునుం గడుఁబెక్కు లంచితో**
**త్కట దృఢయోగసేవన నితాంత నిరాకుల వర్తనంబు నొం**
**దుట గతఖేదులై కడచి తూలక మేరు సమీపభూమికిన్. 33**

**ప్రతిపదార్థం:** అటన్+చని= అక్కడినుండి బయల్దేరి; అశ్రమంబునన్= శ్రమలేకుండానే; హిమాచలమున్= హిమవత్పర్వత్వాన్ని; సమతిక్రమించి= దాటి; వారు= పాండవులు; అటవులు= అడవులూ; భూములన్= భూములూ; నదులున్= నదులూ; అద్రులునున్= కొండలూ; కడున్+పెక్కులు= చాలావాటిని; అంచిత= మిక్కిలి; ఉత్కట= గొప్పదైన; దృఢ= దృఢమైన; యోగసేవన= యోగనిష్ఠచేత; నితాంత= అధికమైన; నిరాకుల= వ్యథలేని; వర్తనంబున్+ఒందుటన్= దేహమనోవృత్తులు కలిగి ఉండటంవలన; గతఖేదులు+ఐ= దుఃఖంలేనివారై; కడచి= ఆ దూరాన్ని దాటి; తూలక= చలించక; మేరు సమీపభూమికిన్= మేరుపర్వత సమీపానికి.

**తాత్పర్యం:** అక్కడినుండి బయలుదేరి శ్రమలేకుండానే హిమవత్పర్వతాన్ని దాటి, వారు అనేక అరణ్యాలూ, భూములూ, నదులూ, కొండలూ మిక్కిలి గొప్పదైన దృఢయోగనిష్ఠ చేత ఏ మాత్రం వ్యథలేకుండా అంత దూరాన్నీ ప్రయాణం చేసి ఏ కలతా లేనివారై అలసిసొలసి పోక మేరుపర్వత భూభాగానికి వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** నాలుగుదిక్కులూ చుట్టారని ఈ పద్యాల తాత్పర్యం. భారతదేశం నాలుగు చెరగులు చూచిన తరువాత హిమవత్ పర్వతం దాటి మేరుపర్వతం సమీపించారు. ఇక ఇదంతా దేవతల ఆవాసం. 'యోగసేవన' మంటే యోగాన్ని అభ్యసించటం. ఇక్కడ యోగం వలననే ఇంత దూరాన్నీ వారు ఏ ఖేదం లేకుండా దాటగలిగారన్న సూచన ఉన్నది. దేహమనోవృత్తులలో సాధించిన సమత్వం వలననే ఈ యోగం వారికి సిద్ధించింది. అందుకే వారు తూలిపోలేదు.

ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట (సం.17-2-3)

**సీ. చనునప్పు డయ్యేడ్వురును నతిస్థిరయోగ। సాధనపరు లయి సత్వరముగఁ**
**బోవంగఁ బాంచాల భూపపుత్రిక యోగ। మెడలిన మేదినిఁ బడియె నధిప!**

**పడిన సమీరణుకొడుకు కనుంగొని యన్నతోఁ జెప్పి 'యయ్యతివవలనఁ**

**గాన మెన్నఁడు ధర్మహాని; యి ట్లగుటకు। నరయంగఁ గత మేమి?' యని విషణ్ణుఁ**

**తే. డగుచు నడిగిన నాతఁ 'డిమ్మగువ యింద్ర। తనయుదెసఁ బక్షపాతిని; దానఁ జేసి**

**సుకృతములు ఫలియింపమిఁ జూవె దీని। కిట్టి దురవస్థ వాటిల్లె నీడ్యచరిత!' 34**

**ప్రతిపదార్థం:** చను+అప్పుడు= వెళ్ళుతున్నప్పుడు; ఆ+ఏడ్వురును= ఆ ఏడుగురూ; అతిస్థిరయోగ= అతిస్థిరమైన యోగాన్ని; సాధనపరులయి= సాధించటంలో తాత్పర్యం గలవారై; సత్వరముగన్= శీఘ్రంగా; పోవంగన్= వెళ్ళుతుండగా; పాంచాల భూపపుత్రిక= పాంచాలమహారాజుకూతురు (ద్రౌపది); యోగము+ఎడలినన్= యోగం సడలిపోగా; మేదినిన్+పడియెన్= నేలమీద పడిపోయింది; అధిప!= ఓ జనమేజయా!; పడినన్= అట్లా పడిపోగా; సమీరణు కొడుకు= వాయుపుత్త్రుడు-భీముడు; కనుంగొని= చూచి; అన్నతోన్= ధర్మరాజుతో; చెప్పి= ఈ విషయం చెప్పి (ఇట్లా అడిగాడు); ఆ+అతివ వలనన్= ఆ స్త్రీవలన; ధర్మహాని= ధర్మానికి చెరుపు; ఎన్నఁడున్+కానము= ఎప్పుడూ మనం చూడలేదు; ఇట్లు+అగుటకున్= ఇట్లా కావటానికి; కతము+ఏమి?= కారణం ఏమిటి?; అని; విషణ్ణుఁడు+అగుచున్= దుఃఖితుడవుతూ; అడిగినన్= అడుగగా; అతడు= ధర్మరాజు (ఇట్లా అన్నాడు); ఈడ్యచరిత= స్తుతించదగిన చరిత్రగల ఓ భీమసేనా!; ఈ+మగువ= ఈ స్త్రీ; ఇంద్రతనయు+దెసన్= అర్జునుడి విషయంలో; పక్షపాతిని= పక్షపాతం కలిగింది: దానన్+చేసి= అందుచేత; సుకృతములు= పుణ్యాలు; ఫలియింపమిన్+చూవె!= ఫలించకపోవటం చేతనే సుమా!; దీనికిన్+ఇట్టి= దీనికి ఇట్లాంటి; దురవస్థ+పాటిల్లెన్= దురవస్థ కలిగింది.

**తాత్పర్యం:** వెళ్ళుతుండగా ఆ ఏడుగురూ అతిస్థిరమైన యోగాన్ని సాధించటంలో తాత్పర్యం కలిగి అతిశీఘ్రగతితో ప్రయాణిస్తున్న సమయంలో పాంచాలరాజపుత్రిక అయిన ద్రౌపది యోగం సడలిపోగా నేలమీద పడిపోయింది. అట్లా పడిపోగా భీముడు చూచి, ఆ విషయం ధర్మరాజుతో చెప్పి ఇట్లా అడిగాడు: 'ఈ స్త్రీవలన ఎన్నడూ ధర్మహాని జరగటం మనం చూడలేదే! ఇట్లా ఈమె పడిపోవటం ఏకారణం చేత?' అని దుఃఖిస్తూ అడుగగా ధర్మరాజు ఇట్లా చెప్పాడు. 'స్తుతించదగిన చరిత్ర కల భీమసేనా! ఈ స్త్రీకి అర్జునుడి విషయంలో పక్షపాతం ఉన్నది. దీనివలననే ఆమె చేసిన పుణ్యాలు ఫలించకపోవటం సంభవించి ఆమెకు (ఇట్లాంటి) దురవస్థ వచ్చిపడింది'.

**విశేషం:** ఆ 'ఏడుగురూ' యోగసాధన తత్పరులై వెళ్లుతున్నారనటంలో 'కుక్క' కూడా ఉన్నది. ఆ కుక్క ఎంతటి గొప్ప సాధన చేసిందో చివరికి తెలుస్తుంది. అందుకే పండితుడైన వాడు 'సమదర్శి' కావాలి. 'శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః' అని గీతాకారుడు వక్కాణించటంలో ఉన్న రహస్య మిదే. అట్లాంటి సమదర్శి ధర్మరాజు. అందుకే చనిపోయింది తన ధర్మపత్ని అన్న మమతకూడా లేకుండా 'ఈస్త్రీ' అంటూ న్యాయనిర్ణయం చేస్తున్నాడు. మత్స్యయంత్రాన్ని భగ్నంచేసి ద్రౌపదిని చేపట్టిన నాటినుండి అర్జునుడి పరాక్రమ సౌందర్య విలాసాల విషయంలో ద్రౌపది మాత్రమే కాదు ఉలూపి, చిత్రాంగద, సుభద్ర, అందరూ ఒకింత పక్షపాతం కలవారే. ఇతరుల విషయం ఒక ఎత్తు. శక్తి అవతారమైన ద్రౌపది విషయం ఒక ఎత్తు. ఆమె ఆ పక్షపాతాన్ని జయించటంలో విఫల అయింది. అందుకే దేహమనోవృత్తుల సమతౌల్యం సడలిపోయింది. యోగం ఎంత కఠినమైన సాధనో ఇట్లాంటి చోట్ల అర్థం చేసికొనవచ్చును. పుణ్యాలు చేసినా అవి ఫలించక ఈ దురవస్థ వచ్చిందంటే - సుకృత దుష్కృతాలకు అతీతమైంది మానవుడి శ్రద్ధాత్రయ స్వరూపమైన ప్రకృతి గుణమని అర్థం. దానిని అనుసరించి 'ప్రారబ్ధాన్ని' పొందక తప్పదని తాత్పర్యం.

**క. అని పలికి సమాధానము। దన బుద్ధిం దిరము చేసి ధైర్యస్థైర్యం**

**బున వికృతి లేని గతి నా। వనితశవము విడిచి కౌరవవిభుం డేఁగెన్. 35**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని సమాధానమిచ్చి; తన బుద్ధిన్= తన చిత్తంలో; సమాధానము= నిశ్చలధ్యానంతో కూడిన సమాధిస్థితిని; తిరముచేసి= స్థిరంగా ఉంచుకొని; ధైర్యస్థైర్యంబునన్= ధైర్యంలోనూ, స్థిరత్వంలోనూ; వికృతిలేనిగతిన్= ఏ వికారమూ లేని విధంగా; ఆ వనితశవమున్ విడిచి= ఆ స్త్రీ శవాన్ని వదలి; కౌరవవిభుండు+ఏఁగెన్= ధర్మరాజు ముందుకు సాగిపోయాడు.

**తాత్పర్యం:** అని భీముడికి సమాధానమిచ్చి, నిశ్చలధ్యానంతో కూడిన సమాధిస్థితిని తన చిత్తంలో స్థిరంగా ఉంచుకొని ధైర్యం సడలకుండా, ఏ చలనమూ లేకుండా, ఏ వికారమూ లేని విధంగా ఆ స్త్రీ శవాన్ని వదలిపెట్టి ధర్మరాజు ముందుకు సాగిపోయాడు.

**విశేషం:** ఈ మహాప్రస్థానం 'భూ' దశను దాటిపోయింది కాబట్టి ఉత్తరక్రియల ప్రసక్తి లేదు.

**సీ.** **భూవర! యమ్మెయిఁ బోవంగ సహదేవుఁ। డపగతప్రాణుఁడై యవనిఁ బడిన**
**గని వాయుజుఁడు ధర్మతనయున కెఱిఁగించి। యితఁ డనహంకారుఁ డెపుడు నీకు**
**నతిభక్తి శుశ్రూష యాచరించుచునుండు। మాలోన నెల్ల సన్మార్గ వర్తి;**
**యితనికి నేలొకో యిద్దెస వాటిల్లె?'। ననిన నమ్మనుజేంద్రుఁ డతనితోడ**

**తే.** **'వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుండు లేఁడు జగతి। నెందు నని సంతతమ్ముఁ దా నెడ్దఁ దలఁచు;**
**దాన నిట్లయ్యె' నం చుపేక్షానిరూఢ। బుద్ధి నరుగుచునుండె నప్పురుషవరుఁడు.** **36**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ జనమేజయా!; ఆ+మెయిన్+పోవంగన్= ఆ విధంగా వెళ్ళుతుండగా; సహదేవుఁడు; అపగత= పోయిన; ప్రాణుఁడు+ఐ= ప్రాణాలు కలవాడై; అవనిన్+పడినన్= నేలమీద పడగా; కని= చూచి; వాయుజుఁడు= భీముడు; ధర్మతనయునకున్+ఎఱిఁగించి= ధర్మరాజుకు తెలిపి; (ఇట్లా అడిగాడు); ఇతఁడు= ఈ సహదేవుడు; అనహంకారుఁడు= అహంకారం లేనివాడు; ఎపుడున్= ఎల్లపుడూ; నీకు; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; శుశ్రూష+ఆచరించుచున్+ఉండున్= సేవ చేస్తుంటాడు; మాలోనన్+ఎల్లన్= మా అందరిలోనూ; సన్మార్గవర్తి= మంచిదారిలో నడిచేవాడు; ఇతనికిన్= ఇట్లాంటి సహదేవుడికి; ఈ+దెస= ఈ దురవస్థ; ఏల+ఒకో!= ఎందుకోమరి!; వాటిల్లెన్?= కలిగింది?; అనినన్= అని అడుగగా; ఆ+మనుజ+ఇంద్రుఁడు= ఆ రాజు (ధర్మరాజు); అతనితోడన్= భీముడితో; వీఁడు= ఇతడు; తన కంటెన్= తనకన్నా; ప్రాజ్ఞుండు= తెలిసినవాడు; జగతిన్= ప్రపంచంలో; ఎందున్= ఎక్కడా; లేఁడు+అని= లేడని; తాన్= తాను; సంతతమ్మున్= ఎల్లప్పుడూ; ఎడ్దన్= హృదయంలో; తలఁచున్= భావిస్తుంటాడు; దానన్= అందుచేత; ఇట్లు+అయ్యెన్= ఇట్లా అయింది; అంచున్= అంటూ; ఆ+పురుషవరుఁడు= ఆ పురుషశ్రేష్ఠుడు; ఉపేక్షా నిరూఢబుద్ధిన్= ఉపేక్షతో కూడిన చిత్తంతో; అరుగుచున్+ఉండెన్= సాగిపోతూనే ఉన్నాడు.

**తాత్పర్యం:** అట్లా వెళ్ళుతుండగా సహదేవుడు చనిపోయి నేలపైపడ్డాడు. భీముడు అతడిని చూచి అన్నకు చెప్పి ఈ సహదేవుడు ఏ అహంకారమూ లేనివాడు. ఎల్లప్పుడూ నిన్ను భక్తి శ్రద్ధలతో సేవిస్తూంటాడు. మా అందరిలోనూ మంచిదారిలో నడిచేవాడు వీడొక్కడే. ఇట్లాంటి వీడికి ఈ దురవస్థ ఎందుకు కలిగిందో మరి!' అని అడిగాడు. అపుడు ధర్మరాజు అన్నాడు: 'ఇతడు తనకంటె తెలిసినవాడు ఈ ప్రపంచంలో ఎక్కడా లేడని ఎప్పుడూ హృదయంలో భావిస్తుంటాడు. అందుకే ఇట్లా అయింది' అంటూ ఉపేక్షతో నిండిన మనస్సుతో ముందుకు సాగిపోయాడు.

**విశేషం:** విద్యాహంకారం కూడా యోగనాశ హేతువు అవుతుందని సహదేవుడి పతనం నిరూపిస్తున్నది.

**క. అనిలజుఁడు నరుఁడు నకులుఁడు । శునకంబునుఁ దోన నరుగ సుస్థిరమతి యై**
**మనుజేంద్రవర్య! య ట్ల । జ్జనపతి సన నకులుతనువు జగతిం బడియెన్. 37**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్రవర్య!= ఓ రాజా! (వినుము); అనిలజుఁడు= వాయుకుమారుడైన భీముడు; నరుఁడు= అర్జునుడు; నకులుఁడు; శునకంబునున్= కుక్కా; తోనన్+అరుగన్= వెంట రాగా; సుస్థిరమతి+ఐ= సుస్థిరచిత్తం కలవాడై; అట్లు= ఆ విధంగా; ఆ+జనపతి= ఆ ధర్మరాజు; చనన్= వెళ్ళుతుండగా; నకులు+తనువు= నకులుడి శరీరం; జగతిన్+పడియెన్= నేలమీద పడింది.

**తాత్పర్యం:** భీమార్జున నకులులు, కుక్క తన వెంట వస్తుండగా సుస్థిరచిత్తం కలిగిన ధర్మరాజు ఆ విధంగా వెళ్లుతుండగా నకులుడి శరీరం నేలమీద వాలిపోయింది.

**క. విను ద్రుపదనందనయుఁ దన । యనుజన్ముఁడు నంత నంత నవనిఁ బడుటఁ దాఁ**
**గని ధృతిదూలినయట్లు వ । డిన నకులునిఁ జూచి యడలు డెందముతోడన్. 38**

**ప్రతిపదార్థం:** విను= రాజా! వినుము; ద్రుపదనందనయున్= ద్రౌపదీ; తన+అనుజన్ముఁడు= తన తమ్ముడైన సహదేవుడు; అంతన్+అంతన్= అక్కడక్కడా; అవనిన్+పడుటన్= నేలమీద పడిపోవటం; తాన్+కని= తాను చూచి; ధృతి= ధైర్యం; తూలిన+అట్లు= చలించినట్లు; పడిన= పడిపోయిన; నకులునిన్+చూచి= నకులుడిని చూచి; అడలు= శోకిస్తున్న; డెందముతోడన్= హృదయంతో.

**తాత్పర్యం:** ద్రౌపదీ, తన తమ్ముడైన సహదేవుడూ ఆ విధంగా అక్కడికక్కడ రాలిపోగా చూచి ధైర్యం చలించి తానూ వాలిపోయాడా అన్నట్లు నకులుడు పడిపోవటం చూచి శోకిస్తున్న హృదయంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. అనిలసూనుఁడు ధర్మతనయున కెఱిఁగించి । యవ్విభుతో 'సుందరాకృతియును**
**శౌర్యంబు ధైర్యంబు సౌజన్యమునకుఁగురు । సంఘమునన కాదు జగతి నెందు**
**నితనికిఁ బోలె నహీనత మెఱయునే । యెవ్వరి కైనను నిట్టి పుణ్యుఁ**
**గుత్సితదశ యె ట్లొకో పొందె నక్కట!' । యనవుడు నక్కౌరవాగ్రగణ్యుఁ**

**తే. డతని కిట్లను 'నీతండు నాత్మసదృశుఁ । డఖిల జగముల లేఁడు రూపాతిశయము**
**తనక కల దని యెపుడుఁ జిత్తమునఁ దలఁచు; । నయ్యహంకృతి నిట్టి కీడయ్యెఁ జువ్వె!' 39**

**ప్రతిపదార్థం:** అనిలసూనుఁడు= భీముడు; ధర్మతనయునకున్+ఎఱిఁగించి= ధర్మరాజుకు తెలిపి; ఆ+విభుతోన్= ఆ రాజుతో; సుందర+ఆకృతియును= సుందరమైన ఆకారం; శౌర్యంబు= శౌర్యమూ; ధైర్యంబు= ధైర్యమూ; సౌజన్యమును= మంచితనమూ; కురుసంఘమునన కాదు= కురు సంఘంలోనే కాదు; జగతిన్+ఎందున్= ప్రపంచంలో ఎక్కడా; ఇతనికిన్+పోలెన్= ఇతడికివలె; అహీనత= నిండుదనం; ఎవ్వరికైనను= ఎవరికైనా; మెఱయునే?= ప్రకాశిస్తుందా?; ఇట్టి పుణ్యున్= ఇట్లాంటి పుణ్యాత్ముడిని; కుత్సితదశ= నీచదశ; ఎట్లు= ఎట్లా; పొందెన్+ఒకో?= పొందిందో!; అక్కట!= అయ్యో!; అనవుడున్= అనగా; ఆ+కౌరవ+అగ్రగణ్యుఁడు= ధర్మరాజు; అతనికిన్= భీముడితో; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; ఈతండు= ఈ నకులుడు; ఆత్మసదృశుఁడు= తనకు దీటైనవాడు; అఖిలజగములన్+లేఁడు= సృష్టిలో లేడు; రూప+అతిశయము= సౌందర్యాధిక్యం; తనకున్+అ= తనకే; కలదు+అని=

ఉన్నదని; ఎపుడున్= ఎల్లప్పుడూ; చిత్తమునన్+తలఁచున్= మనసులో అనుకొంటూ ఉంటాడు; ఆ+అహంకృతిన్= ఆ అహంకారం వలన; ఇట్టి+కీడు+అయ్యెన్+చువ్వె!= ఇట్లాంటి కీడు సంభవించింది సుమా!

**తాత్పర్యం:** అట్లా నకులుడు పడిపోవగా వాయుకుమారుడైన భీముడు ధర్మరాజుకు తెలిపి ఆయనతో ఇట్లా అన్నాడు; 'అతిసుందరాకారం, శౌర్యమూ, ధైర్యమూ, మంచితనమూ ఇన్ని మంచిగుణాలు ఒకచోట ఉన్నవాడు ఈ కురుసంఘంలోనే కాదు ప్రపంచంలో మరెక్కడైనా ఉన్నాడా! ఎవరిలోనైనా ఇంత నిండుతనం కనిపిస్తుందా? ఇట్లాంటి పుణ్యాత్ముడిని ఇంత నీచదశ ఎట్లా పొందిందో మరి! అయ్యో! ఏమిటీ దురవస్థ?' అని అడుగగా ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'ఇతడు తనకు దీటైనవాడు ఈ సృష్టిలోనే లేడని, లోకంలోని సౌందర్యమంతా తనకే ఉన్నదని మనసులో ఎప్పుడూ అనుకొంటూ ఉంటాడు. ఆ అహంకారానికి ఫలితమే ఈ కీడు సుమా!

**విశేషం:** నకులుడిది రూపగర్వం. అయినా నకుల సహదేవులు మనసులలో ఆ గర్వాన్ని పడ్డవారే. అంతమాత్రానికే వారియోగం భ్రష్టం అయిందంటే యోగసాధన కత్తివాదర మీది నడకవంటిది ఎట్లా అవుతుందో అర్థం చేసికొనవచ్చును.

**క.** **అని ధృతిసారం బూఁది య। తని తనువు నుపేక్షఁ గూర్చి ధర్మతనూజుం**
**డనఘ! చనుచుండెఁ దక్కటి। యనుజులుఁ గుర్కురముఁ దోన యరుగుచు నుండన్.** **40**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడవైన ఓ జనమేజయా!; అని= అని భీముడితో చెప్పి; ధర్మతనూజుండు= ధర్మరాజు; ధృతి సారంబు= ధైర్యంయొక్క పరమార్థ రూపమైన చేవను; ఊఁది= అవలంచించి; అతని తనువున్= అతడి దేహాన్ని; ఉపేక్షన్+కూర్చి= ఒప్పరికించి; తక్కటి= తక్కిన; అనుజులు= తమ్ములు; కుర్కురమున్= కుక్కా; తోన్+అ= వెంబడి; అరుగుచున్+ఉండన్= వెంటరాగా; చనుచున్+ఉండెన్= ముందుకుపోసాగాడు.

**తాత్పర్యం:** అని భీముడితో చెప్పి ధర్మరాజు ధైర్యగుణంయొక్క పరమార్థ రూపమైన చేవను అవలంబించి అతడిదేహం మీద తాను మమతకు గురికాకుండా నిశ్చలంగా పోసాగాడు. తక్కిన తమ్ములు, కుక్క అతడిని వెంబడించారు.

**విశేషం:** ఇక్కడ ఉపేక్ష అన్నది యోగసాధనలో చెప్పిన భావనాభేదాలలో ఒక్కటి. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షాభావాలు నాలుగూ చిత్తప్రసాదనం సాధించటంలో యోగి అవలంబిస్తాడు. ఉపేక్ష-అంటే తన మనసు తగులుకొనకుండా చేసికొనటం. అంతే తప్ప లౌకికమైన అర్థంలో నిర్లక్ష్యం చేయటం కాదు. పాండవులందరి విషయంలోనూ ధర్మరాజు ఇదే పాటిస్తున్నాడు. అందుకే ఇతడు ధర్మతనూజుడు - ధర్మం తనువు దాల్చిన యముడి కుమారుడు. పురుషశ్రేష్ఠుడు - ఇక్కడ పురుషుడంటే 'జీవు' డని తాత్త్వికార్థం. జీవుడు బంధవిముక్తుడు కావటంలో తొలుత సాధించవలసింది 'ఉపేక్ష' - దానికంటె ముదిత (సంతోషం), కరుణ (దయ), మైత్రి (సర్వసమభావం) - ఒకదానికన్నా మరొకటి ఉదాత్తమైన యోగగుణసంపద అని సంప్రదాయం చెప్పుతున్నది.

**సీ.** **ద్రౌపదిపాటును దన యనుజన్ముల। పడుటయుఁ గనుఁగొని పార్థుఁ డాత్మ**
**యలమట మునిఁగిన నిల విగతాసుఁడై। పడినఁ గుందుచుఁ జూచి బకవిరోధి**
**యన్నకుఁ జూపి 'యీ యమలచరిత్రుని। యం దెన్నఁడును నసత్యంబుఁ గాన;**
**మిటు వడుటకుఁ గత మేమి?' నావుడు నీతఁ। డక్కౌరవుల నెల్ల నొక్కనాఁడ**

**తే. యాహవంబునఁ దెగటార్తు ననియె; నట్లు । సేయఁ డయ్యెఁ; బల్కొక్కటి సేఁత యొకటి**
**యగుట చాల దోషము; విను మదియుఁగాక । యెల్లకోదండ ధరుల గర్హించుచుండు. 41**

**ప్రతిపదార్థం:** ద్రౌపదిపాటును= ద్రౌపది నేలవాలటం; తన+అనుజన్ముల పడుటయున్= తన తమ్ముల పాటును; కనుఁగొని= చూచి; పార్థుఁడు= అర్జునుడు; ఆత్మ= చిత్తం; అలమటన్= బాధలో; మునిఁగినన్= మునిగిపోగా; విగత+అసుఁడు+ఐ= ప్రాణాలు పోగొట్టుకొని; ఇలన్= నేలపై; పడినన్= పడిపోగా; బకవిరోధి= భీముడు; కుందుచున్+చూచి= దుఃఖిస్తూ చూచి; అన్నకున్+చూపి= ధర్మరాజుకు చూపి (ఇట్లా అన్నాడు); ఈ+అమలచరిత్రునియందున్= ఈ పుణ్యచరిత్రుడిలో; ఎన్నఁడున్= ఎప్పుడూ; అసత్యంబున్+కానము= అసత్యాన్ని చూడం; ఇటు+పడుటకున్= ఇట్లా పడటానికి; కతము+ఏమి= కారణం ఏమిటి?; నావుడున్= అని అడుగగా; (ధర్మరాజు ఇట్లా అన్నాడు); ఈతఁడు= ఇతడు; ఆ+కౌరవులన్+ఎల్లన్= కౌరవులందరినీ; ఒక్కనాఁడు+అ= ఒకే రోజే; ఆహవంబునన్= యుద్ధంలో; తెగటార్తున్+అనియెన్= చంపేస్తానన్నాడు; అట్లు+చేయఁడు+అయ్యెన్= కాని అట్లా చేయలేదు; పల్కు+ఒక్కటి= మాట ఒకటి; చేఁత+ఒకటి= చేత మరొకటి; అగుట= కావడం; చాలదోషం= చాలా తప్పు; అదియున్+కాక= అదీ కాకుండా; వినుము= మరోవిషయం ఉన్నది వినుము; ఎల్లకోదండధరులన్= ధనుర్ధారులందరినీ; గర్హించుచుండున్= నిందిస్తుంటాడు.

**తాత్పర్యం:** అట్లా ద్రౌపది, తన తమ్ములు నేలకూలిపోవటాన్ని చూచి పార్థుడు తన చిత్తం బాధలో మునిగిపోగా ప్రాణాలు పోయి నేలపడ్డాడు. భీముడు ఇది చూచి దుఃఖిస్తూ అన్నకు చూపించి ఇట్లా అన్నాడు: " ఈ పుణ్యచరిత్రుడిలో ఏ రోజూ ఒక అసత్యం కూడా చూడమే. ఇట్లా పడటానికి కారణం ఏమిటి?' అని అడుగగా ధర్మరాజన్నాడు-'ఇతడు కౌరవులందరినీ ఒకేరోజు యుద్ధంలో చంపేస్తానన్నాడు. అట్లా చేయలేదు మరి. చేత ఒకటి - మాట ఒకటి కావటం చాలా తప్పు. అంతే కాదు. ఇతడు ధనుర్ధారు లందరినీ నిందిస్తుంటాడు.

**విశేషం:** అంతటి మహాభారతయుద్ధాన్ని నిర్వహించిన అర్జునుడిలో ఉన్న ఒకదోషం 'అసత్యం'. మనిషి చేయగలిగినదే మాటాడాలి. మాటాడిందే చేయాలి. ఈ దోషం లేని 'నరు 'డెవడు? నకుల సహదేవులలో ఆత్మ 'స్తుతి' దోషం కాగా అర్జునుడిలో 'పరనింద' మచ్చగా మిగిలిపోయింది. అందుకే అట్లాంటి అర్జునుడు కూడా పతనం కాకతప్పలేదు. ఈ పరనిందా దోషంలేని 'నరుడు' ఉంటాడా? అందుకే అర్జునుడిలో మానవుడిలోని ఈ దోషద్వయాన్ని ధర్మరాజు చూపిస్తున్నాడు. కర్ణుడిని అర్జునుడు జీవితాంతమూ ద్వేషిస్తూనే వచ్చాడు. అందుచేత అర్జునుడిది 'మాత్సర్య' దోషం.

**ఉ. దానను దాన నిట్లగుట తప్పునె?' యంచుఁ దదీయ మైన య**
**మ్మానితదేహమున్ విడిచి మానవనాథుఁడు దాల్మిఁ జేసి బ**
**ద్ధానిరతాత్ముఁ డై యరిగె; నత్తఱి వాయుజుఁ డార్తి నెంతయున్**
**దీనతఁ బొంది ధైర్యలత ద్రెవ్విన నేలకు వ్రాలె భూవరా! 42**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా! వినుము; (ధర్మరాజు ఇట్లా చెప్పుతున్నాడు); దానను (దానన్)= ఆయాకారణాలచేత; ఇట్లు+అగుట= ఇట్లా కావటం; తప్పునె?= తప్పుతుందా?; అంచున్= అంటూ; తదీయమైన= అర్జునుడి; ఆ+మానితదేహమున్= మన్నించబడిన ఆ దేహాన్ని; విడిచి= వదలివేసి; మానవనాథుఁడు= ధర్మరాజు; తాల్మిన్+చేసి= ఓర్పువలన; బద్ధానిరతాత్ముఁడు+ఐ= కూర్చబడిన స్థిరచిత్తం కలవాడై; అరిగెన్= ముందుకుపోయాడు; ఆ+తఱిన్= ఆ సమయంలో; వాయుజుఁడు= భీముడు; ఆర్తిన్= దుఃఖంతో; ఎంతయున్= మిక్కిలి; దీనతన్+పొంది= దీనుడై; ధైర్యలత= ధైర్యమనేతీగ; త్రెవ్వినన్= తెగిపోగా; నేలకున్+వ్రాలెన్= నేలపై వాలిపోయాడు.

**తాత్పర్యం:** 'అందుచేత తానే ఈ విధంగా కావటం తప్పుతుందా' అంటూ ధర్మరాజు ఆ అర్జునుడి అతి 'గొప్ప' దేహాన్ని కూడా ఉదాసీన బుద్ధితో వదలివేసి ఓర్పుచేత కూర్చబడిన స్థిరమైన చిత్తంతో ముందుకు పోయాడు. ఆ సమయంలో వాయుకుమారుడైన భీముడు మిక్కిలి ఆర్తిని పొంది దీనుడై ధైర్యమన్నతీగ తెగిపోగా నేలమీద వాలిపోయాడు.

**విశేషం:** అర్జునుడిది 'మానిత' దేహమట. లోకం ఆ దేహానికి అంత 'గౌరవం' చూపిందని అర్థం. స్థిరచిత్తం దేనిచేత ఏర్పడుతుందంటే 'ఓర్పు' చేత అని అర్థం చేసికొనాలి. నిష్ఠచేత ధ్యానం సిద్ధిస్తుంది. ఓర్పు చేత ధ్యానం స్థిరపడుతుంది. ఈ ఓర్పునే 'సహన' మంటారు. సమత్వం దీని లక్షణం. "సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే" అని గీతాకారుడు ఈ సమత్వ నిర్వచనం చెప్పాడు. అర్జునుడిలో ఈ సమత సిద్ధించలేదు. డాంబికంచేత అసత్యదోషం. పరనిందచేత అసహనం అతడిలో చోటు చేసికొన్నాయి. అందుచేత పతనమయ్యాడు. ఇది చూచి భీముడిలోని 'ధైర్యం' కూడా నశించిపోయింది.

**క. అప్పుడు దగ నిట్లను నతఁ । డప్పౌరవవరున 'కో ధరాధిప! కనుఁగొ**
**మ్మిప్పా టేమిట వచ్చెం । జెప్పు; మెఱుఁగు దేనిఁ గరుణ చిగురొత్తంగన్.' 43**

**ప్రతిపదార్థం:** అప్పుడు= అట్లా వాలిపోతూ; తగన్= ఉచితమైన రీతిలో; అతఁడు= భీముడు; ఆ+పౌరవవరునకున్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ఓ ధరా+అధిప!= ఓ రాజా!; ఈ+పాటు= ఇట్లా నేను పడటం; ఏమిటన్= ఏ కారణాన; వచ్చెన్!= జరిగింది?; కనుఁగొమ్ము= కనుగొనుము; ఎఱుఁగుదేని= తెలిస్తే; కరుణచిగురు+ఒత్తంగన్= దయ చిగురించగా; చెప్పుము= తెలుపుము.

**తాత్పర్యం:** అట్లా వాలిపోతూ భీముడు సభక్తికంగా నమస్కరించి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు? 'ఓ రాజా! నేను ఇట్లా పడటం ఎందుచేత జరిగిందో కనుక్కొని తెలిస్తే దయచేసి చెప్పుము!'

**విశేషం:** ఇన్ని మరణాలకు హేతువు చెప్పిన అన్న సామాన్యుడు కాడని భీముడు గ్రహించటంవలననే 'కనుఁగొమ్ము!' అని అభ్యర్థిస్తున్నాడు. కనుగొనటం - అంటే ఇక్కడ దర్శించట మని అర్థం. 'ఎఱుఁగుదేని' - అంటే నీకు 'తెలిస్తే' అన్న మాటకు - తన జీవితంలో తాను ఏ తప్పు చేయలేదన్న 'ధీమా' భీముడికి సంపూర్ణంగా ఉండటమే కారణం. అదే భీముడిలోని 'రాజసగుణం'.

**చ. అన విని యాతఁ డిట్లనియె నాతనితో 'భవదీయ మైన భో**
**జన మతిమాత్ర ముద్ధతిఁ బ్రచండుఁడ వై భుజశక్తి నెవ్వరిం**
**గొనక కడంగి రజ్జుపలుకుల్ గడుఁ బెక్కులు పల్కు దెప్డు నీ**
**వనుపమశౌర్య! యిప్పడుట కత్తెఱఁగుల్ గత; మెల్లఁ జెప్పితిన్.' 44**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అని భీము డనగా విని; అతఁడు= ధర్మరాజు; అతనితోన్= భీముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు; అనుపమశౌర్య!= ఉపమించటానికి వీలులేని పరాక్రమం కల ఓ భీమసేనా!; భవదీయము+ఐన= నీదైనటువంటి; భోజనము= తిండి; అతిమాత్రము= అత్యధికమైనది; ఉద్ధతిన్= ఉద్ధతిలో (గర్వంలో); ప్రచండుఁడవు+ఐ= భయంకరుడవై; భుజశక్తిన్= బాహుబలంలో; ఎవ్వరిన్+కొనక= ఎవ్వరినీ లెక్కచేయక; కడంగి= పూనుకొని; రజ్జుపలుకుల్= వ్యర్థపుమాటలు; కడుపెక్కులు+పల్కుదు+ఎప్డున్= ఎల్లప్పుడూ చాలా చాలా మాటాడుతుంటావు; ఈ+పడుటకున్= ఇట్లా పడటానికి; ఆ+తెఱఁగుల్= ఆ విధాలే; కతము= కారణం; ఎల్లన్+చెప్పితిన్= అంతా చెప్పాను.

**తాత్పర్యం:** అని భీముడు అడుగగా విని, ధర్మరాజు అతడితో ఇట్లా అన్నాడు: 'భీమా! నీ పరాక్రమం నిరుపమానం. కాని, నీ తిండి అత్యధికం కావటం వలన , మిక్కిలి భయంకరుడవై బాహుబలంతో ఎవ్వరినీ లెక్కచేయకుండా పూనుకొని వ్యర్థపుమాటలు ఎప్పుడూ చాలాచాలా మాటాడుతుంటావు. నీ ఈ రీతులే నీ విప్పుడు పడటానికి కారణం. అంతా చెప్పాను. ఇక చెప్పటాని కేముంది?'

**విశేషం:** భీముడిలో తక్కిన వారిలో ఉన్న ఏ దంభాది దుర్గుణాలూ లేవు - కాని అతడి ఆహారం తామసికమైనది. అత్యశనుడికి యోగం అబ్బదని గీతాకారుడు నియమం అందుకే చేశాడు. అధికంగా తినేవాడికి పుట్టే దుర్గుణం ఉద్ధతి. ఈ గర్వంతో భయంకరంగా ప్రవర్తిస్తాడు. బాహుబలం కారణంగా ఎవరినీ లెక్కచేయడు. ఫలితంగా వ్యర్థప్రలాపాలు ఆడుతాడు. భారతయుద్ధాన్ని ఒకసారి స్మరిస్తే ఈ విషయం తెలుస్తుంది. ఆహార జన్యమైన దుర్గుణం కాబట్టే స్వభావసిద్ధమైన గుణాలచేత పతనం పొందిన వారికంటె చాలా దూరం పోగలిగాడు. పై విధంగా పతనం పొందిన ఐదుగురూ ఐదు కారణాలవలన నేల బడ్డారు. ద్రౌపది= పత్నీధర్మమైన సమచిత్తవృత్తిని భంగం చేసిన కారణంగా; సహదేవుడు= జ్ఞానగర్వం చేత; నకులుడు= రూపగర్వంచేత; అర్జునుడు= మాత్సర్యంచేత; భీముడు= తామసాహారంచేత; వీటిలో ఏ దుర్గుణమూ అంటని 'ధర్మ' నందనుడు మాత్రం ఈ ప్రస్థానంలో చివరిమజిలీ చేరుకొన్నాడని అర్థం.

**క. అని పలికి నిరీక్షింపక। చనుచుండె, నితండు ధైర్యసారోదారుం**
**డును నిశ్చయమహితుఁడు నయి। వెనుక శునక మధికభక్తి విడువక చనఁగన్. 45**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; నిరీక్షింపక= ఆగకుండా; ఇతండు= ధర్మరాజు; ధైర్యసార+ఉదారుండును= ధైర్యగుణంలోని సత్త్వంచేత ఏర్పడిన ఉదాత్తమైన మనసు గల వాడును; నిశ్చయమహితుఁడున్+అయి= నిశ్చయమైన మనోవృత్తి చేత ఏర్పడిన మహనీయతతో; వెనుకన్= వెంబడి; శునకము= కుక్క; అధికభక్తి మెయిన్= అధికమైన భక్తితో; విడువక= తనను వదలకుండా; చనఁగన్= రాగా; చనుచుండెన్= ముందుకు సాగిపోయాడు.

**తాత్పర్యం:** అని చెప్పుతూ ఆగకుండా ధర్మరాజు ధైర్యగుణంలోని సత్త్వంచేత ఏర్పడిన ఉదాత్తమైన మనస్సుతో, నిశ్చయబుద్ధి చేత ఏర్పడిన మహనీయతతో శునకం తనవెంబడి భక్తిపూర్వకంగా వదలకుండా వస్తుండగా తాను మాత్రం ముందుకు సాగిపోయాడు.

**తే. ఆ సమంచిత సారమేయంబు పాండు। ధరణి నాయకు నగ్రిమతనయు పిఱుఁద**
**నధికభక్తి యుక్తంబుగ నరుగుచునికి। పలుమఱును నీకుఁ జెప్పితిఁ దలఁచి యుండు.' 46**

**ప్రతిపదార్థం:** (జనమేజయా! వినుము); ఆ= ఇంతవరకు చెప్పిన; సమంచిత= మిక్కిలి పూజ్యమైన; సారమేయంబు= కుక్క; పాండు ధరణినాయకు+అగ్రిమ తనయుపిఱుఁదన్= పాండురాజు పెద్దకొడుకు వెనుక; అధికభక్తియుక్తంబుగన్= చాలా భక్తితోకూడి; అరుగుచున్+ఉనికి= వెళ్తూండటం; పలుమఱును= చాలామార్లు; నీకున్+చెప్పితిన్= నీకు చెప్పాను; తలఁచి+ఉండు!= గుర్తుంచుకొమ్ము!

**తాత్పర్యం:** రాజా! వినుము! ఆ మిక్కిలి పూజ్యమైన కుక్క పాండురాజు పెద్దకొడుకు వెనుక చాలాశక్తితో కూడి వెళ్తూండటం నీకు చాలామార్లు చెప్పాను. గుర్తుంచుకొనుము.'

**వ. అని పలికి వైశంపాయనుండు జనమేజయున కిట్లను నట్లు నిష్ఠాగరిష్ఠుం డయి యుధిష్ఠిరుం డరుగుచుండ.47**

**తాత్పర్యం:** అని పలికి వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు: ' ఆ విధంగా నైష్ఠికులలో శ్రేష్ఠుడైన యుధిష్ఠిరుడు వెళ్ళుతుండగా.

**విశేషం:** ధర్మరాజుకు యుధిష్ఠిరుడని నామాంతరం. యుద్ధంలో స్థిరంగా నిలిచేవాడని అర్థం. అదే స్థిరత్వం యోగంలోనూ ఉన్నదని అర్థం. అందుకే నిష్ఠ కలిగినవారిలో గరిష్ఠుడు - శ్రేష్ఠుడు అయ్యా డాయన.

ఇంద్రుఁడు రథంబుఁగొని ధర్మరాజు నెదురుకొనుట (సం.17-3-1)

**సీ. దివ్యదేహోద్ధత దీప్తి సంతానంబు। దిశలు పదింటను దీటుకొనఁగ,**
**రథ సమాగమన సంరావంబు మేరుగ। హ్వరములఁ బ్రతిరవోత్కరము నీన,**
**నచ్చటి సిద్ధ సాధ్య మునీంద్ర గణముల। నానావిధస్తోత్ర నాద మెసఁగఁ,**
**దత్ప్రదేశంబు బోధ స్ఫీత కల్పవృ। క్షంబులు పుష్పవర్షములు గురియ**

**తే. నింద్రుఁ డేతెంచి యాదర మెసక మెసఁగ। నక్కురుక్షితిపాలున కగ్రభాగ**
**వర్తి యగుటయు నతఁ డభివందనంబు। సేసె సవినయభక్తివిశేష మొప్ప. 48**

**ప్రతిపదార్థం:** దివ్యదేహ= దివ్యమైన దేహమునుండి; ఉద్ధత= వెలువడుతున్న; దీప్తి సంతానంబు= కాంతిసమూహం; దిశలు పదింటను= పదిదిశలలోనూ; దీటుకొనఁగన్= వ్యాపించగా; రథ= రథం యొక్క; సమాగమన= రాకవలని (పుట్టిన); సంరావంబు= పెద్ద ధ్వని; మేరు= మేరుపర్వత; గహ్వరములన్= గుహలలో; ప్రతిరవ+ఉత్కరమున్+ఈనన్= ప్రతిధ్వనుల సముదాయాన్ని పుట్టించగా; అచ్చటి= ఆ పర్వతంలోని; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; మునీంద్రగణములు= మునిశ్రేష్ఠుల సమూహాలు; నానావిధ స్తోత్ర నాదము+ఎసఁగన్= అనేక విధాలైన స్తోత్రాల ధ్వని వ్యాపించగా; తద్+ప్రదేశంబు= ఆ ప్రదేశమంతటా; బోధ= జ్ఞానంచే; స్ఫీత= అధికములైన; కల్పవృక్షంబులు= కల్పవృక్షాలు; పుష్పవర్షములు+కురియున్= పూలవానలు కురిపించగా; ఇంద్రుఁడు+ఏతెంచి= ఇంద్రుడు వచ్చి; ఆదరము= ఆదరభావం; ఎసకము+ఎసఁగన్= అతిశయించగా; ఆ+కురుక్షితిపాలునకున్= ఆ ధర్మరాజుకు; అగ్రభాగవర్తి+ అగుటయున్= ముందుభాగంలో నిలబడగా; అతఁడు= ఆ ధర్మరాజు; సవినయ= వినయంతో కూడిన; భక్తి విశేషము+ఒప్పన్= అధికమైన భక్తి ప్రకటితం కాగా; వందనంబు+చేసెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** ఆ దివ్యదేహంనుండి వెలువడుతున్న కాంతి సమూహం పది దిశలలోనూ వ్యాపిస్తుండగా, రథం వస్తుండగా పుట్టిన పెద్ద ధ్వని మేరుపర్వత గుహలలో ప్రతిధ్వనుల సముదాయాన్ని పుట్టించగా, ఆ పర్వతంలోని సిద్ధసాధ్యముని గణాలు చేస్తున్న నానావిధాలైన స్తోత్రధ్వనులు వ్యాపించగా, ఆ ప్రదేశ మంతటా జ్ఞానప్రదాయకాలైన కల్పవృక్షాలు పూలవానను కురిపించగా, ఇంద్రుడు వచ్చి ఆదరభావం అతిశయించగా ధర్మరాజు ముందుభాగాన నిలబడ్డాడు. ఆ ధర్మరాజు కూడా వినయంతో కూడిన అధికమైన భక్తి ప్రకటితం కాగా నమస్కరించాడు.

**విశేషం:** కల్పవృక్షం - కోరిన కోర్కెలు ఇస్తుందన్నది సాధారణార్థం. మందార, పారిజాత, సంతాన, కల్పవృక్ష, హరిచందనాలకు కల్ప వృక్షాలని - దేవవృక్షాలని సాధారణనామం. ఇవి పూలను వెదజల్లటం దేవతల అనుగ్రహం ధర్మరాజుపై కలిగిందనటానికి సంకేతం. అవి 'బోధస్ఫీతము' లట! బోధ - అంటే జ్ఞానం. స్ఫీత - అంటే వ్యాపనధర్మం. కల్పవృక్షచ్ఛాయలో దివ్యజ్ఞానం కలుగు

తుందని అర్థం. ఈ కారణంగానే నారదుడు ప్రసాదించిన పారిజాత పుష్పాన్ని శ్రీకృష్ణుడు రుక్మిణికి ఇచ్చాడు. దేవలోకంలో రంభాదులుంటారని వారి సుఖం కోసమే యజ్ఞయాగాదులు చేస్తారనే అంశాన్ని కూడా ఈ తాత్త్విక నేపథ్యంలో చూడాలి. ఈ పర్వంలోని కథను జాగ్రత్తగా అనుశీలిస్తే 'స్వర్గతత్త్వం' తెలుస్తుంది.

**క. అట్లు ప్రణతుం డయిన నభినందించి యప్పురందరుం డతని దివ్య స్యందనం బెక్కుమని పలికిన, నతండు శోక సంతప్తుం డగుచు నతని కి ట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ప్రణతుండు+అయినన్= నమస్కరించగా; అభినందించి= మెచ్చుకొని; ఆ+పురందరుండు= ఆ ఇంద్రుడు; అతనిన్= ధర్మరాజును; దివ్యస్యందనంబు+ఎక్కుమని= ఆ దివ్యరథం ఎక్కుమని; పలికినన్= అడుగగా; అతండు= ధర్మరాజు; శోకసంతప్తుండు+అగుచున్= దుఃఖంతో బాధపడుతూ; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఇంద్రుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అట్లా నమస్కరించగా మెచ్చుకొని ఇంద్రుడు అతడిని దివ్యరథంలో ఎక్కుమని అడిగాడు. దానికి ధర్మరాజు దుఃఖంతో కుమిలిపోతూ ఇంద్రుడితో ఇట్లా అన్నాడు:

**శా. 'తోడంబుట్టువు లందఱుం బడిన యా దుఃఖంబు చేతంబు సం**
**పీడం బెట్టెడు; సౌకుమార్యవతి దప్పిం గూలెఁ బాంచాలి; వా**
**ర్తోడై వచ్చిరి; వారు లేక యిట మీతో రాను; వా రెల్ల నా**
**తోడం గూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ! కావింపవే!' 50**

**ప్రతిపదార్థం:** తోడంబుట్టువులు= తమ్ములు; అందఱున్= అందరూ; పడిన= చనిపోయిన; ఆ దుఃఖంబు= ఆ దుఃఖం; చేతంబున్= మనసును; సంపీడన్+పెట్టెడున్= మిక్కిలి బాధిస్తున్నది; సౌకుమార్యవతి= సుకుమారి పాంచాలి (ద్రౌపది); దప్పిన్+కూలెన్= దప్పితో క్రిందపడి చనిపోయింది; వార్+తోడు+ఐ వచ్చిరి= వారు నాకుతోడుగా బయలుదేరి వచ్చారు; కృపాధుర్యాత్మ!= కృపాతిశయం తోడి మనసుగల ఓ మహేంద్రా!; ఇటన్= ఇప్పుడు; మీతోన్ రాను= మీతో బాటు స్వర్గానికి రాను; వారు+ఎల్లన్= వారందరూ; నాతోడన్= నాతోపాటు; కూడఁగన్+వచ్చునట్లుగన్= కలిసివచ్చేటట్లు; కావింపవే= చేయుము.

**తాత్పర్యం:** 'దయాధురంధరమైన' మనసున్న మహేంద్రా! నా తమ్ములు అందరూ చనిపోయారు. ఆ దుఃఖం నా మనసును మిక్కిలి బాధిస్తున్నది. సుకుమారవతి అయిన ద్రౌపది దప్పికతో నేలబడి చనిపోయింది. వారంతా నా ఈ ప్రయాణంలో తోడుగా వచ్చినవారు. వారు లేకుండా నే నిప్పుడు మీతో స్వర్గానికి రాను. వారంతా నాతోపాటు కలిసి వచ్చేటట్లు చేయుము.'

**విశేషం:** ఉపేక్షాపరుడుగా ఇంతవరకు వచ్చిన ధర్మరాజులో వారిపట్ల కృతజ్ఞతతో కూడిన ధార్మికబుద్ధి ఇక్కడ ప్రకటించబడుతున్నది. అంతేకాని కేవలం తమ్ములు, భార్య అన్న మమతానుబంధం కాదు.

**చ. అన విని యింద్రుఁ డి ట్లనియె నక్కురుభర్తకు 'శోక మేల? నీ**
**యనుజులు ద్రౌపదీసహితులై తనువుల్ దిగఁ ద్రావి చన్నవా**
**రనఘ! యమర్త్య లోకమున; కక్కడఁ గాంచెదుగాక వారలం**
**దనువు దొఱంగఁగా వలదు ధర్మమయాత్మక నీవు రావనా!' 51**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని ధర్మరాజు అనగా విని; ఇంద్రుఁడు; అ+కురుభర్తకున్+ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అనఘ!= ఓ పుణ్యాత్మా!; శోకము+ఏల?= ఎందుకు బాధపడతావు?; నీ+అనుజులు= నీ తమ్ములు; ద్రౌపదీ సహితులు+ఐ= ద్రౌపదితో కూడినవారై; తనువుల్+దిగన్+ద్రావి= దేహాలు విడిచిపెట్టి; అమర్త్య లోకమునకున్= స్వర్గానికి; చన్నవారు= వెళ్ళారు; వారలన్= వారినందరినీ; అక్కడన్+కాంచెదు+కాక!= అక్కడ చూద్దువుగాని!; ధర్మమయ+ఆత్మక!= ధర్మంతో నిండిన మనసున్న ఓ ధర్మనందనా!; తనువు+తొఱంగన్+కాన్+వలదు= దేహం విడిచిపెట్టడానికి వీలు కాదు; నీవు రావనా!= నీవు రావయ్యా వెళ్ళుదాం.

**తాత్పర్యం:** అని ధర్మరాజు కోరగా ఇంద్రుడు అతడితో ఇట్లా అన్నాడు: 'ఓ పుణ్యాత్మా! ఎందుకు చింతిస్తావు? నీ తమ్ములు, ద్రౌపదితో కలిసి తమ దేహాలు విడిచిపెట్టి స్వర్గలోకానికి వెళ్ళారు. వారి నందరినీ నీవు అక్కడ చూద్దువుగాని! నీవు ధర్మంతో నిండిన మనసున్నవాడివి! (సాక్షాత్తూ ధర్మనందనుడివి!) దేహం వదలివేసిన తరువాత మళ్ళీ అందులోకి ప్రవేశించటం కుదరని పని. అందుచేత నీవు నాతో రమ్ము వెళ్ళుదాం!''

**విశేషం:** అంటే సశరీరులై స్వర్గానికి చేరే యోగసిద్ధి వారికి లేదని తాత్పర్యం.

ధర్మరాజ సురరాజులకుఁ గుక్కురవిషయముగా జరిగిన వివాదము (సం.17-3-7)

**సీ.** **అనుటయు ధర్మజుం డమరేంద్రుతో 'నన్ను । నత్యంత దృఢభక్తి నాశ్రయించి**
**పుర మేను వెడలునప్పుడు మొదల్గాఁ దోన । చనుదెంచె నీ భవ్యసారమేయ**
**మిది యట రావలదే నా మనంబు ని । ష్ఠురవృత్తి కోర్వ దస్తోకపుణ్య**
**నిరతాత్మ!' నావుడు దరహాస మొప్ప న । బ్బలవైరి' యి ట్లంట పాడియే? య**

**తే.** **మర్త్యభావము కుక్క కేమాడ్కిఁగలుగు । ననఘ! నీ చింత తెఱఁ గశక్యంబు దీని**
**విడిచి చను టేల నిష్ఠురవృత్తి యయ్యెఁ । నిచటఁ దడయంగ నేటికి? నెక్కు రథము.'** **52**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ధర్మజుండు= ధర్మరాజు; అమర+ఇంద్రుతోన్= ఇంద్రుడితో; అస్తోక పుణ్యనిరత+ఆత్మ!= అత్యధిక పుణ్య విషయంలో ఆసక్తి గల చిత్తమున్న మహేంద్రా!; ఏను= నేను; పురము+వెడలునప్పుడు= హస్తినాపురం నుండి బయలుదేరేటప్పుడు; ఈ భవ్య సారమేయము= ఈ గొప్ప శునకం; అత్యంత= మిక్కిలి; దృఢ= దృఢమైన; భక్తిన్= భక్తితో; ఆశ్రయించి= సమీపించి; మొదల్గాన్= అందరికంటె ముందుగా; తోన్+అ= వెంబడే; చనుదెంచెన్= వచ్చింది; ఇది= ఇదికూడా; అట= స్వర్గానికి; రావలదే!= రావద్దా!; నా మనంబు= నా మనస్సు; నిష్ఠురవృత్తికిన్+ఓర్వదు= కఠినమైన పనిని సహించజాలదు; నావుడున్= అని అనగా; ఆ+బలవైరి= ఆ ఇంద్రుడు; దరహాసము+ఒప్పన్= చిరునవ్వు వెలయగా (ఇట్లా అన్నాడు); అనఘ!= పుణ్యాత్మా!; ఇట్లు+అంట= ఇట్లా అనటం; పాడియే?= న్యాయమా?; కుక్కకున్= కుక్కకు; అమర్త్యభావము= దివ్యత్వం; ఏమాడ్కిన్+ కలుగున్?= ఎట్లా కలుగుతుంది?; నీచింత తెఱఁగు= నీవు ఆలోచిస్తున్న విధానం; అశక్యంబు= అసాధ్యంగా ఉన్నది; దీనిన్= ఈ కుక్కను; విడిచి చనుట= వదలిపోవటం; నిష్ఠురవృత్తి= కఠినమైన పని; ఏల+అయ్యెన్?= ఎందుకవుతుంది?; ఇచటన్= ఇక్కడ; తడయంగన్+ఏటికిన్?= ఆలస్యం చెయ్యుట మెందుకని?; రథమున్= రథాన్ని; ఎక్కుము.

**తాత్పర్యం:** అనగా ధర్మరాజు ఇంద్రుడితో ఇట్లా అన్నాడు: ' అత్యధికపుణ్యవిషయంలో ఆసక్తిగల చిత్తమున్న మహేంద్రా! నేను హస్తిననుండి బయలుదేరినపుడు ఈ మహనీయమైన శునకం మిక్కిలి దృఢమైన భక్తితో అందరికంటె ముందుగా

నన్ను వెంబడించి వచ్చింది. ఇది కూడా స్వర్గానికి రావద్దా! నా మనస్సు కఠినమైన పనిని సహించజాలదు' అని ధర్మజుడు పలుకగా ఇంద్రుడు చిరునవ్వు నవ్వి ఇట్లా అన్నాడు: 'పుణ్యాత్మా! నీవు ఇట్లా అనటం న్యాయంగా ఉన్నదా? కుక్కకు దివ్యత్వం ఎట్లా కలుగుతుంది? నీవు ఆలోచిస్తున్న విధానం అసాధ్యంగా ఉన్నది. ఈ కుక్కను వదలిపోవటం కఠినమైన పని ఎందు కవుతుంది? ఇక్క డింక ఆలస్యం చేయటం ఎందుకు? రథ మెక్కుము (వెళ్ళుదాం).

**విశేషం:** ఇంద్రుడు వేసిన ప్రశ్న చాలా ముఖ్యమైనది. కుక్కకు దివ్యత్వం ఎట్లా కలుగుతుందని? సమత్వదర్శనమే యోగం. విశ్వవిభూతి కలిగిన పరమాత్మ ప్రకాశించే ప్రతి వస్తువులోనూ ఉన్నాడు. ఆ కుక్క (సారమేయమంటే మగకుక్క. ఆడకుక్కను సారమేయి అంటారు) 'భవ్య' మైనది. చాలా పుణ్యం చేసికొన్నది. దాని భక్తి చాలా 'గట్టిది' నిశ్చంచలమైనది. అంతే కాదు. భీమార్జునుల కంటె ముందుగానే ధర్మరాజు వెంటపడ్డది. ఆ కుక్కలోనూ విశ్వాత్ముడిని దర్శించాడు ధర్మరాజు. అందుకే స్వర్గానికి అదికూడా రావాలని పట్టుబట్టాడు. ఇంద్రుడికి ఈ సమాధానం తెలియనిది కాదు. ధర్మరాజు కిది పరీక్ష.

**వ. అనిన నమ్మనుజేంద్రుం డింద్రునితోడ 'నకార్యంబును దుష్కరంబును నగుకార్యం బేనియు నార్యుండును బ్రభుండును నైన నీయట్టి సత్పురుషుండు సంశ్రితులకై సంఘటింపవలదె? భక్త పరిత్యాగంబు సేసి పడయుసిరి నాకు నెంత యింపయ్యెడు?' ననుటయు నయ్యనిమిషనాథుండు. 53**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఇంద్రుడనగా; ఆ+మనుజ+ఇంద్రుండు= ఆ రాజు (ధర్మజుడు); ఇంద్రునితోడన్= ఇంద్రుడితో, (ఇట్లా అన్నాడు); ఆర్యుండును= పూజ్యుడూ; ప్రభుండును= పాలకుడూ; ఐన నీ+అట్టి= అయిన నీవంటి; సత్+పురుషుండు= ఉత్తమపురుషుడు; అకార్యంబును= చేయరానిదీ; దుష్కరంబును= దుస్సాధ్యమైనదీ; అగుకార్యంబు+ఏనియున్= అయిన పని అయినాకూడా; సంశ్రితులకై= ఆశ్రయించినవారికొరకు; సంఘటింపన్‌వలదె?= చేయవద్దా?; భక్తపరిత్యాగంబు= భక్తులను వదలివేసి; పడయుసిరి= పొందేభాగ్యం; నాకున్+ఎంత+ఇంపు+అయ్యెడున్?= నాకు ఎంతమాత్రం తృప్తి అవుతుంది?; అనుటయున్= అనగా; ఆ+అనిమిషనాథుండు= దేవతలరాజైన మహేంద్రుడు.

**తాత్పర్యం:** అని ఇంద్రు డనగా ధర్మరాజు ఇంద్రుడితో ఇట్లా అన్నాడు: 'పూజ్యుడు, పాలకుడు అయిన నీ వంటి సత్పురుషుడు చేయరానిదీ, దుస్సాధ్యమైనదీ అయినపనినే అయినా ఆశ్రయించిన వారికొరకు చేయవద్దా! భక్తులను వదలివేసి పొందేటటువంటి భాగ్యం నాకుమాత్రం ఎంత తృప్తిని కలిగిస్తుంది?' అనగా అపుడు ఇంద్రుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'భజ సేవాయాం' అని వ్యుత్పత్తి. భజించుట - అంటే సేవించుట. ఇక్కడ కుక్క- భక్తుడు ఎట్లా అవుతున్నాడంటే - సేవించటం వలననే. వదలకుండా వెంటబడిరావటమే ఆ సేవ. అందుకే సేవకులను వదలివేసి తాను ఏ భాగ్యాన్ని పొందటానికి ఇష్టపడనని ధర్మరాజు చెప్పుతున్నాడు.

**చ. 'అలుక హరించు ధర్మములు; నట్లగుటం గురువంశవర్య! నీ**
**వలుగక విన్ము కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం**
**గలుగునె? నీకు నిష్ఠురత గల్గదు దీనిఁ బరిత్యజించినం**
**జలము కొనంగ నేల? శుభ సంగమనం బెడసేఁత కృత్యమే?' 54**

**ప్రతిపదార్థం:** అలుక= కోపం; ధర్మములన్= ధర్మాలను; హరించున్= నశింపజేస్తుంది; అట్లు+అగుటన్= అందుచేత; కురువంశవర్య!= ఓ కురువంశశ్రేష్ఠుడా!; నీవు+అలుగక= నీవు కోపగించుకొనక; విన్మ= వినుము; కుక్కలకున్= కుక్కలకు; త్రివిష్టపంబునన్= స్వర్గంలో; ఆవసథంబు= మజిలీ (బస); కలుగునె!= లభిస్తుందా!; దీనిన్= ఈ కుక్కను; పరత్యజించినన్= వదలివేస్తే; నీకున్= నీకు; నిష్ఠురత+కల్గదు= పాపమేమీ రాదు; చలము= పట్టుదల, కోపం; కొనంగన్+ఏల?= పొందటం ఎందుకు?; శుభసంగమనంబు= స్వర్గసుఖానుభవమనే శుభంతోడి సంయోగమును; ఎడసేఁత= దూరం చేసికొనటం; కృత్యమే?= చేయదగిన కార్యమా? (కాదని భావం)

**తాత్పర్యం:** కోపం ధర్మాలను నశింపజేస్తుంది. అందుచేత ఓ కురువంశశ్రేష్ఠుడా! నీవు కోపగించుకొనకుండా వినుము. కుక్కలకు స్వర్గంలో చోటు లేదు. ఈ కుక్కను వదలివేస్తే నీకు పాప మేమీ రాదు. కోప పడతా వేల? శుభసందర్భం కలిగినపుడు దానిని దూరంచేసికొనటం తగిన పనికాదుకదా!

**విశేషం:** ఆవసథమంటే 'బస' (మజిలీ) అని అర్థం. చోటన్నది వాచ్యార్థ మయినా స్వర్గం ఒక మజిలీ మాత్రమే కాబట్టి అక్కడి చోటుకూడా 'బస' మాత్రమే. శాశ్వతమైన నివాసం కాదు. గీతను స్మరించుకుంటే ఈ అర్థం తెలుస్తుంది.

**"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి."**

యజ్ఞయాగాదుల పుణ్యం వలన స్వర్గంచేరి అక్కడ సుఖాలు అనుభవించి ఆ పుణ్యం కాస్తా క్షీణించగా వాళ్ళు మరలా మానవలోకంలో ప్రవేశిస్తారు. అందుకే అక్కడివాసం ఒక "మజిలీ" మాత్రమే నన్నమాట.

**సీ.** **అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్ముతో। విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ**
**హత్యఁ బోలెడి పాప మని చెప్పుదురు పెద్ద;। లట్లు గావున దీని నఖిలధర్మ**
**సారజ్ఞ! విడుచుట చనదు; దివ్యసుఖంబు। నకుఁ గాఁగఁ బాపంబునకుఁ జొరంగఁ**
**జాల' నావుడును వాసవుఁడు వ్రతస్థుండు। కుక్కనంటిన వాని కోరి చేయు**

**తే.** **సుకృతమునకు నాశం బగు సువ్రతాత్మ! యింత యొప్పని నిర్బంధ మేల చెపుమ!**
**విడువు మీ శునకము; దీని విడువఁబడుట। నాకలోక సౌఖ్యంబు నొనర్చు నీకు.** **55**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ఇంద్రు డనగా; ధర్మనందనుఁడు= ధర్మరాజు; ఆ+మహాత్ముతోన్= ఆ మహాత్ముడితో; అఖిలధర్మ సారజ్ఞ!= అన్ని ధర్మాలసారాన్నీ తెలిసిన ఓ మహేంద్రా!; విను= నామాట వినుము; భక్తియుక్తుని విడుపు= భక్తితో కూడిన వాడిని వదలిపెట్టటం; బ్రహ్మహత్యన్+పోలెడి= బ్రహ్మహత్యను పోలిన; పాపము+అని పెద్దలు చెప్పుదురు= పాపమని పెద్దలు అంటారు; అట్లు+కావునన్= అందుచేత; దీనిన్= ఈ కుక్కను; విడుచుట= వదలిపెట్టటం; చనదు= తగదు; దివ్యసుఖంబునకున్+కాఁగన్ = స్వర్గసుఖంకొరకని; పాపంబునకున్+చొరంగన్+చాలన్= పాపంలోకి ప్రవేశించలేను; నావుడును= అనగా; వాసవుఁడు= ఇంద్రుడు; సువ్రత+ఆత్మ!= మిక్కిలి ఉత్కృష్టమైన ప్రతిజ్ఞతోకూడిన మనసున్న ఓ ధర్మరాజా!; వ్రతస్థుండు= యజ్ఞదీక్షలో ఉన్నవాడు; కుక్కన్+అంటినన్= కుక్కను తాకితే; వానికోరి చేయు= వాడు ఆశిస్తున్న; సుకృతమునకున్= పుణ్యమునకు; నాశంబు+అగున్= నాశం కలుగుతుంది; (అట్లాంటప్పుడు); ఇంత= ఇంతటి; ఒప్పని= కూడని; నిర్బంధము+ఏల?= నిర్బంధం ఎందుకు?; చెపుమ= నీవే చెప్పుము; ఈ శునకమున్+విడువుము= ఈ కుక్కను వదలిపెట్టుము; దీని విడువన్+పడుట= దీనిని వదలటం; నీకున్= నీకు; నాకలోక= స్వర్గలోక; సౌఖ్యంబున్+ఒనర్చున్= సుఖాన్ని ప్రసాదిస్తుంది.

**తాత్పర్యం:** అని ఇంద్రు డనగా ధర్మరాజు ఆ మహాత్ముడితో ఇట్లా అన్నాడు: ' అన్ని ధర్మాల సారాన్నీ తెలిసిన మహేంద్రా! నా మాట వినుము. భక్తితో కూడిన సేవకుడిని వదలిపెట్టటం బ్రాహ్మణుడిని చంపటంతో సమానమని పెద్దలు చెప్పుతారు. అందుచేత ఈ కుక్కను వదలిపెట్టటం కుదరనిపని. స్వర్గసుఖంకొరకని నేను ఈ పాపానికి ఒడికట్టలేను' అనగా ఇంద్రుడు అన్నాడు: 'మిక్కిలి ఉత్కృష్టమైన ప్రతిజ్ఞతో కూడిన మనసున్న ఓ ధర్మరాజా! యజ్ఞదీక్షలో ఉన్నవాడు కుక్కను తాకితేనే వారు ఆశించిన పుణ్యం నశిస్తుందన్నది నీకు తెలియదా! అట్లాంటప్పుడు ఇంతగా నీ వెందుకు నిర్బంధం చేస్తున్నావు? నీవే చెప్పుమరి! ఈ కుక్కను వదలివేయి. దీనిని వదలటం వలన నీకు స్వర్గలోకసౌఖ్యం లభిస్తుంది.

**విశేషం:** పంచమహాపాతకాలు - బ్రహ్మహత్య, సురాపానం, స్వర్ణస్తేయం, గురుతల్పగమనం ఈ నాలుగు పాపాలు చేసేవారితో స్నేహం చెయ్యటం - అన్నవి ఐదు మహాపాపాలు. బ్రాహ్మణుడిని చంపటం, మద్యపానం, బంగారం దొంగిలించటం, గురువుగారి భార్యతో శయనించటం, ఇట్లాంటి పనులు చేసేవారితో స్నేహం చెయ్యటంకూడా ఒక మహాపాపమే అని మన హైందవధర్మం విధిస్తున్నది. సేవకుడిని పరిత్యజించటం కూడా అంత పాపమే అని ద్వాపర యుగధర్మం. యజ్ఞదీక్ష కలిగినవాడు కుక్కను తాకితే యజ్ఞపుణ్యం కూడా హరించుకుపోతుందన్నది లౌకిక ధర్మం. కుక్క ముట్టిన 'పిండం' పితరులకు చేరదని కూడా ఒక విశ్వాసమున్నది. అట్లాంటి పాపయోనిలో జన్మించినా ధర్మజుడి వెంటవచ్చిన 'భవ్యసారమేయము' సేవానిరతిచేత బ్రహ్మనిష్ఠను సాధించిందని ధర్మజుడి వాద తాత్పర్యం. ఆ భావాన్ని ధర్మజుడి ద్వారా పలికించుటకొరకే ఇంద్రుడింతగా కవ్వించి ప్రశ్నిస్తున్నాడు.

**చ. జనులు నుతింపఁగా సుకృత సంపదఁ జేసి యమర్త్య భావముం**
**గనియును జెంద కి ట్లునికి కార్యమె? ద్రౌపది భీమసేను న**
**ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత! చాలితి చాలవయ్యె దీ**
**శునకము విడ్వ; నిత్తెఱఁగు సూరినుతుం డగు నీకు నర్హమే?' 56**

**ప్రతిపదార్థం:** సువ్రత!= పుణ్యాత్ముడా!; జనులు నుతింపఁగాన్= ప్రజలు ప్రశంసించగా; సుకృత సంపదన్+చేసి= పుణ్యసమృద్ధివలన; అమర్త్యభావమున్= దివ్యత్వాన్ని; కనియును= పొందికూడా; చెందక+ఇట్లు+ఉనికి= స్వీకరించకుండా ఇట్లా ఉండటం; కార్యమె?= చేయదగిన పనేనా?; ద్రౌపదిన్ భీమసేనున్ అర్జునున్ కవలన్= ద్రౌపదిని భీమార్జున నకుల సహదేవులను; త్యజించుటకున్= వదలిపెట్టటానికికూడా; చాలితి(వి)= సిద్ధపడ్డావు; ఈ శునకమున్= ఈ కుక్కను; విడ్వన్+చాలవయ్యెదు= విడిచి పెట్టటానికి వెనుకాడుతున్నావు; సూరినుతుండు+అగు= పండితులచేత ప్రశంసించబడిన; నీకున్; ఈ+తెఱంగు= ఈ పద్ధతి; అర్హమే?= తగినదేనా?

**తాత్పర్యం:** పుణ్యాత్ముడా! ప్రజలందరూ ప్రస్తుతించగా పుణ్యభాగ్యం వలన దివ్యత్వాన్ని దర్శించికూడా ధరించకపోవటం సముచితంగా ఉన్నదా? ద్రౌపదిని, భీమసేనార్జున నకుల సహదేవులను కూడా వదలివెయ్యటానికి సిద్ధపడ్డావే. ఈ కుక్కను విడిచిపెట్టటానికి వెనుకాడుతున్నావు. పండితులచేత ప్రశంసలు పొందిన నీకు ఉచితానుచితాలు నేర్పాలా? ఈ పని తగినదేనా?'

**సీ. అన విని ధర్మజుం 'డఖిలలోకములకుఁ । బతివి, ధర్మమునకుఁ బ్రభువ విట్టి**
**నీకంటె నెఱుఁగుదునే సదసత్ప్రకా । రము లట్లుఁగాక వాదము మహాత్ము**
**లయిన వారలతోడ నగునె చేయంగ? నై । నను విన్నవింపఁదగిన తెఱంగు**
**విన్నవించుట దోష విధము గా దనియెడు । బుద్ధిఁ జేసెద నేను బూని విన్న**

**తే. పంబు భీమముఖ్యులును ద్రౌపదియుఁ జచ్చి; । రేను వారల విడువక యేడ్చుచున్న**
**వత్తురే? తోడ వచ్చి చావని శునకము । విడువకుండుట తప్పుగా నుడువఁ దగునె? 57**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని ఇంద్రు డనగా విని; ధర్మజుండు= ధర్మరాజు; అఖిలలోకములకున్= అన్ని లోకాలకు; పతివి= నీవు భర్తవు; ధర్మమునకున్+ప్రభువవు= ధర్మానికి రక్షకుడివి; ఇట్టి= ఇట్లాంటి; నీకంటెన్= నీకంటె; సత్+అసత్ ప్రకారములు= మంచి చెడుపద్ధతులు; ఎఱుఁగుదునే?= తెలిసినవాడినా?; అట్లున్+కాక= అదీ కాకుండా; మహాత్ములు+అయిన వారలతోడన్= మహాత్ములతో; వాదము= వాదం; చేయంగన్+అగునె= చేయటం ఒప్పుతుందా?; ఐనను= ఐనాకూడా; విన్నవింపన్+తగిన తెఱంగు= విన్నవించదగిన విషయం ఉంటే; విన్నవించుట= విన్నవించటం; దోషవిధము= తప్పుడుమార్గం; కాదు+అనియెడు బుద్ధిన్= కాదనేటటువంటి ఆలోచనతో; నేను; పూని= ప్రయత్నపూర్వకంగా; విన్నపంబున్+చేసెదన్= మీకు విన్నవించుకొంటున్నాను; భీమముఖ్యులును= భీముడు మొదలైనవారు; ద్రౌపదియున్= ద్రౌపదీ; చచ్చిరి= చనిపోయారు; వారలన్+విడువక= వారిని గూర్చి వదలకుండా; ఏను= నేను; ఏడ్చుచున్నన్= ఏడుస్తుంటే; వత్తురే!= మరలివస్తారా!; తోడన్+వచ్చి= నావెంబడి వచ్చి; చావని= చనిపోని; శునకమున్= కుక్కను; విడువకుండుట= విడిచిపెట్టకుండా ఉండటం; తప్పుగాన్= తప్పని; నుడువన్+తగునె?= చెప్పటం సమంజసంగా ఉన్నదా? (నీవే ఆలోచించుము!)

**తాత్పర్యం:** అని ఇంద్రుడు అనగా విని ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'అన్నిలోకాలకూ నీవు భర్తవు. ధర్మసంరక్షకుడివి. ఇట్లాంటి నీకంటె మంచి చెడు పద్ధతులు తెలిసినవాడినా నేను? అదీ కాకుండా మహాత్ములతో వాదం చేయటం సాధ్యమవుతుందా? ఐనా కూడా విన్నవించ దగిన విషయం ఉంటే విన్నవించటం తప్పుడుమార్గం కాదనేటటువంటి ఆలోచనతో విన్నవించుకొంటున్నాను. భీమాదులూ ద్రౌపదీ చనిపోయారు. నేను వారిని గురించి వదలకుండా ఎంత ఏడ్చినా వారేమో మరలిరారు. అట్లా కాకుండా నా వెనుకనే వచ్చి చనిపోకుండా నిలిచిన ఈ కుక్కను వదలకుండటం తప్పు అనటం సమంజసమా? నీవే ఆలోచించుము!'.

**చ. అనఘచరిత్ర! విన్ము శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధమి**
**త్రునియెడఁ జేయు ద్రోహము. వధూటి వధించుట, విప్రునర్థముం**
**గొనుట యనంగఁ గల్గునివి గూడ సమం బగు నాకుఁ జూడ భ**
**క్తు ననపరాధునిన్ విడుచుదోషముతో నిది యోర్వవచ్చునే? 58**

**ప్రతిపదార్థం:** అనఘచరిత్ర= పుణ్యచరిత్రుడవైన ఇంద్రా!; విన్ము= వినుము; నాకున్+చూడన్= నాకు చూడగా; శరణాగతున్= శరణు కోరి వచ్చినవాడిని; చేకొనక+ఉన్కి= స్వీకరించకపోవటం; శుద్ధమిత్రునిఎడన్= పవిత్రుడైన మిత్రుడి విషయంలో; చేయు ద్రోహము= చేసేటటువంటి ద్రోహమూ; వధూటిన్= అప్పుడే వివాహమైన వధువును; వధించుట= చంపటం; విప్రు+అర్థమున్+

కొనుట= బ్రాహ్మణుడి ధనాన్ని దొంగిలించటం; అనంగన్+కల్గు+ఇవికూడన్= అనబడే ఇవన్నీ; భక్తున్= సేవకుని; అనపరాధునిన్= ఏ అపరాధమూ చేయనివాడిని; విడుచుదోషముతోన్= త్యజించే దోషంతో; సమానము= సమానమైనది; ఇది= దీనిని; ఓర్వన్‌వచ్చునే?= సహించశక్యమా?

**తాత్పర్యం:** పుణ్యచరిత్రుడా! వినుము! నా దృష్టిలో శరణుకోరినవాడిని స్వీకరించకపోవటం, మంచిమిత్రుడికి ద్రోహం చెయ్యటం, కులవధువును చంపటం, బ్రాహ్మణుడి ధనాన్ని అపహరించటం - అనే ద్రోహాలతో సమానమే ఏ అపరాధమూ చేయని సేవకుడిని నిర్దాక్షిణ్యంగా వదలివెయ్యటం కూడా. ఈ పాపాన్ని ఎట్లా సహించగలుగుతాం?

**విశేషం:** ధర్మరాజులోని ఉదాత్తమయిన రాజనీతిని ఈ సందర్భంలో కూడా గమనించవచ్చును. భృత్యరక్షణ రాజకర్తవ్యం కనుక శునకాన్ని వదల నంటాడు.

**ఉ. కావున నాకలోకపు సుఖం బటు లుండఁగ నిమ్ము దేవ! నీ**
**భావము నిల్పు నాదెసఁ గృపాభరితంబుగ; సారమేయ సం**
**భావన సేఁత దోసముగఁ బట్టమి నాకు వరంబు; నీవు పొ;**
**మ్మీ వనభూమి నుండెద సమిద్ధతపంబుల నిన్న కొల్చుచున్.' 59**

**ప్రతిపదార్థం:** దేవ!= స్వామీ!; కావునన్= అందుచేత; నాకలోకపు సుఖంబు= స్వర్గసుఖం; అటులు+ఉండఁగన్+ఇమ్ము= అట్లుండనీ!; నీ భావము= నీ విభూతిని; నా దెసన్= నాలో; కృపాభరితంబుగన్= దయతో; నిల్పు= నిలుపుము; (అందుచేత); సారమేయ= కుక్కను; సంభావనసేఁత= సంభావించడం; దోసముగన్+పట్టమి= దోషం కాకపోవటం; నాకున్ వరంబు= నాకు ఒక పెద్దవరం (కాగలదు); నీవు+పొమ్ము= నీవు మరలిపొమ్ము; ఈ వనభూమిన్= ఈ అటవీ భూములలో; సమిద్ధతపంబులన్= అతి తీవ్రమైన తపశ్చర్యలతో; నిన్ను+అ కొల్చుచున్= నిన్నే సేవిస్తూ; ఉండెదన్= ఉండిపోతాను.

**తాత్పర్యం:** స్వామీ! అందుచేత స్వర్గసుఖ విషయం అట్లా ఉండనీ! నీ విభూతిని నాలో దయతో స్థిరంగా ఉండేటట్లు చేయుము. ఆ పుణ్యంచేత కుక్కను ఆదరించిన కార్యం దోషం కాకపోవటమే నాకొక పెద్ద వరం కాగలదు. ఇక నీవు మరలిపొమ్ము. అతితీవ్రమైన తపశ్చర్యలతో నిన్నే సేవిస్తూ ఈ అడవులలోనే ఉండిపోతాను. నాకు అంతమాత్రం చాలును.'

**వ. అని పుయిలోడక పలికెఁ; బౌరవోత్తమా! యాకర్ణింపుము. 60**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా (ధర్మరాజు); పుయిలోడక= ఏ జంకూ లేకుండా; పలికెన్= చెప్పాడు; పౌరవోత్తమా!= పురువంశ శ్రేష్ఠుడయిన ఓ జనమేజయ మహారాజా!; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఈ విధంగా ఏ మాత్రం భయం, జంకూ లేకుండా ధర్మరాజు ఇంద్రుడితో చెప్పాడు. ఇంకా వినుము.

సారమేయరూపంబున వచ్చిన ధర్ముండు ధర్మరాజునకుఁ బ్రత్యక్షం బగుట (సం.17-3-16)

**సీ. అ ట్లతిదృఢ నిశ్చయంబుగఁ బలికిన। తనపుత్త్రుఁ గనుఁగొని ధర్ముఁ డధిక**
**సంప్రమోదముఁ బొంది సారమేయాకృతిఁ। బాసి తా నాత్మరూపంబుఁ దాల్చి**

**పరమ సంభ్రమ కృత ప్రణతియు నానంద । భరితుండు నగు నా నృపాలుతోడ**

**'నీపుణ్యవృత్తంబు నిర్మలమేధయు । నఖిల భూతంబులయందుఁ గలుగు**

**తే. దయయు నాదుచిత్తముఁ బ్రమదమునఁ దేల్చె । వత్స! భూలోకమున నిట్టివారుఁ గలరె?**

**తొల్లియును ద్వైతవనమున దోషదూర । మయిన నీ మనమున తెఱం గరసినాఁడ. 61**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; దృఢనిశ్చయంబుగన్= దృఢమైన నిశ్చయంతో; పలికిన= చెప్పిన; తనపుత్త్రున్+కనుఁగొని= తన కుమారుడిని చూచి; ధర్ముఁడు= యమధర్మరాజు; అధిక= మిక్కిలి; సంప్రమోదమున్+పొంది= సంతోషాన్ని పొంది; సారమేయ+ ఆకృతిన్+పాపి= కుక్క ఆకారాన్ని వదలిపెట్టి; తాను; ఆత్మ= నిజ; రూపంబున్= రూపాన్ని; తాల్చి= ధరించి; పరమ= మిక్కిలి; సంభ్రమ= తొట్రుపాటుతో కూడి; కృతప్రణతియున్= నమస్కరించినవాడు; ఆనందభరితుండును= ఆనందంతో కూడినవాడూ; అగు= అయిన; ఆ నృపాలుతోడన్= ఆ ధర్మరాజుతో; వత్స!= కుమారా!; నీ పుణ్యవృత్తంబున్= నీ పుణ్యచరిత్రను; నిర్మలమేధయున్= నిర్మలమైన బుద్ధిని; అఖిల భూతంబులయందున్+కలుగు+దయయున్= అన్ని భూతాలపట్ల ఉన్న దయాగుణం; నాదుచిత్తమున్= నా మనసును; ప్రమదమునన్+తేల్చెన్= సంతోషంలో తేల్చివేశాయి; భూలోకమునన్= భూమిలో; ఇట్టివారున్= నీవంటివారు కూడా; కలరె?= ఉన్నారా?; తొల్లియును= మునుపుకూడా; ద్వైతవనమునన్= మీరు వనవాసం చేస్తున్నప్పుడు ద్వైతవనంలో; దోషదూరము+ అయిన= దోషాలకు దూరంగా ఉన్న; నీ మనమున+తెఱఁగు= నీ మనోరీతిని; అరసినాఁడన్= గుర్తించాను.

**తాత్పర్యం:** ఆ విధంగా దృఢనిశ్చయంతో పలికిన తన కుమారుడిని చూచి యమధర్మరాజు చాలా సంతోషం పొంది కుక్కరూపాన్ని వదలి తన రూపాన్ని పొంది ఎదుట నిలిచాడు. తొట్రుపాటుతో నమస్కరించి, ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్న ఆ ధర్మరాజుతో యము డిట్లా అన్నాడు: 'నాయనా! నీ పుణ్యచరిత్రా, నిర్మలమైన బుద్ధీ, సర్వభూతాలపట్ల నీకున్న దయాగుణమూ నా మనసును సంతోషసాగరంలో తేల్చాయి. భూమిలో నీవంటివాడు ఎవడున్నాడు? మునుపుకూడా ద్వైతవనంలో దోషాలు లేని నీ పవిత్రమైన మనోరీతిని నేను గుర్తించి ఉన్నాను.

**విశేషం:** ద్వైతవనంలోని యక్ష ప్రశ్నలఘట్టాన్ని ఇక్కడ స్మరించుకొంటే అక్కడకూడా యమధర్మరాజే కుమారుడిని పరీక్షించాడు. ఇది రెండవ పరీక్ష. అక్కడ ధర్మజుడి నిర్మలమేధకు పరీక్ష. ఇక్కడ సర్వభూతదయకు పరీక్ష. అందుకనే నీచయోని రూపమయిన 'కుక్క'గా యముడు ధర్మజుడి వెంటనంటి పరీక్షించాడని అర్థం. ఆ విషయాన్ని యముడు గుర్తుకు తెస్తున్నాడు.

**క. విను నీరు రోసి నీదగు । ననుజులు మృతులయిన వచ్చి యందఱిలో నొ**

**క్కనిఁ గోరుము బ్రదికించెద । నని పలికితి నేను నిర్మలాత్మక! నీతోన్. 62**

**ప్రతిపదార్థం:** నిర్మల+ఆత్మక!= నిర్మలమైన మనసున్న ధర్మరాజా!; విను= వినుము; నీదగు= నీయొక్క; అనుజులు= తమ్ములు; నీరు రోసి= నీటికొరకు వెదకుతూ; మృతులు+అయినన్= చనిపోగా; వచ్చి= నీవు వచ్చి; అందఱిలోన్= అందరిలో (ఆ నలుగురిలో); ఒక్కనిన్+కోరుము= ఒక్కడిని కోరుకొనుము; బ్రతికించెదన్= బ్రదికిస్తాను; అని; నేను; నీతోన్; పలికితిన్= అన్నాను.

**తాత్పర్యం:** నిర్మలమైన మనసున్న ఓ ధర్మరాజా! ఆ కథ చెప్పుతాను వినుము. నీ తమ్ములైన భీమార్జున నకుల సహదేవులు మంచినీటికొరకు వెదకుతూ మరణించారు. వారిని వెదకుతూ నీవు వచ్చావు. అప్పుడు నేను 'వారిలో ఒకరిని కోరుకొనుము బ్రదికిస్తా' నన్నాను.

**ఉ. దానికి నీవు చిత్తమునఁ దల్లుల నిద్దఱనుం దలంచి మా**
**లోన నొకండఁ గల్గితి నలుప్తత వారలయందుఁ గల్మి లో**
**కానుమతంబుగాదె నకులార్థిత ధర్మువు నాకు నన్మతిన్**
**వీనుల కింపుగా నకులు వేఁడితి; తద్విధ మెందుఁ గల్గునే? 63**

**ప్రతిపదార్థం:** దానికిన్= అట్లా నేను చెప్పగా అందుకు; నీవు; చిత్తమునన్= మనసులో; తల్లులన్= తల్లులను; ఇద్దఱనున్+తలంచి= ఇద్దరినీ తలచుకొని; మాలోనన్= మా తల్లి కుంతి సంతానంలో; ఒకండన్= ఒకడిని; కల్గితిన్= మిగిలాను; అలుప్తతన్= అట్లాగే లోపంలేకుండా; వారల+అందున్= వారిలో (మాద్రి సంతానంలో); కల్మి= ఒకరుండటం; లోక+అనుమతంబు+కాదె?= లోక సమ్మతం కాదా?; నకుల+అర్థిత= నకులుడిని కోరుకొనటం; నాకున్= నాకు; ధర్మువు= ధర్మం; అన్+మతిన్= అనేటటువంటి బుద్ధితో; వీనులకున్+ఇంపుగాన్= చెవులకింపు కలిగేటట్లు; నకులున్+వేఁడితి(వి)= నకులుడిని వేడావు; తద్+విధము= అట్లా కోరటం; ఎందున్+కల్గునే?= మరెక్కడైన ఉందా?

**తాత్పర్యం:** అట్లా నేను చెప్పగా దానికి నీవు మనసులో తల్లులను ఇరువురినీ తలచుకొని మా తల్లి కుంతి సంతానంలో నేను ఒకడిని మిగిలాను. అట్లాగే లోపంలేకుండా మాద్రి సంతానంలో ఒకరుండటం లోకసమ్మతం కాదా? అని నకులుడిని కోరుకొనటమే నాకు ధర్మమని తలచినా చెవులకు ఆనందం కలిగేటట్లు నకులుడిని కోరుకొన్నావు. అట్లా కోరుకొనటం మరెక్కడైనా ఉన్నదా?

**క. భీముని నర్జును విడిచియు । నీ మది నకులు బ్రదికింప నిగుడుట పుత్త్రా!**
**నా మనమునఁ బాయదు ని । న్నేమనవచ్చు నఖిలంబు నింద్రుండెఱుఁగున్. 64**

**ప్రతిపదార్థం:** భీమునిన్= భీముడిని; అర్జునున్= అర్జునుడిని; విడిచియున్= విడిచిపెట్టి; నీ మదిన్= నీ మనసులో; నకులున్= నకులుడిని; బ్రదికింపన్= బ్రతికించగా; నిగుడుట= పూనుకొనటం; పుత్త్రా!= నాయనా!; నా మనమునన్= నా మనసులో; పాయదు= తొలగిపోదు; నిన్నున్+ఏమనవచ్చున్?= నిన్ను ఎట్లా ప్రశంసించగలం?; అఖిలంబు= అంతా; ఇంద్రుండు= ఇంద్రుడు; ఎఱుఁగున్= తెలియును.

**తాత్పర్యం:** నాయనా! భీమార్జునులను వదలి నీ మనసులో నకులుడిని బ్రదికించాలని పూనుకొనటాన్ని నా మనసెప్పుడూ మరవనే మరవదు. నిన్ను ఎట్లా ప్రస్తుతించగలం! ఇంద్రుడి కంతా తెలుసు.

**క. విను భక్తియుక్త మిది యని । శునకముఁ జేపట్టి నీవు సురపతి కొనివ**
**చ్చిన యరద మెక్క నొల్లవ । యనఘా! సరి నీకు దివమునందును గలరే? 65**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; విను= వినుము; భక్తియుక్తము= భక్తితో కూడింది; ఇది+అని= ఇది అని; శునకమున్+చేపట్టి= కుక్కను అంటిపెట్టుకొని; నీవు; సురపతి= ఇంద్రుడు; కొనివచ్చిన= తీసికొనివచ్చిన; అరదము= రథాన్ని; ఎక్కన్+ఒల్లవు+అ= ఎక్కటానికి అంగీకరించలేదు; నీకున్= నీతో; సరి= సమానుడు; దివమునందునున్= స్వర్గంలో కూడా; కలరే?= ఉన్నారా?

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఇది భక్తి కలిగిందని కుక్కను అంటిపెట్టుకొని ఇంద్రుడు తీసికొని వచ్చిన రథాన్ని కూడా ఎక్కటానికి అంగీకరించలేదు. నీవంటివాడు స్వర్గంలోనైనా ఉంటాడా?

**ఉ. ఇంతటి పెంపు గల్గుట మహేంద్రుఁడు నీ దెసఁ గాంచె; నీవు ని**
**శ్చింతత మేనితోఁ జనుము సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్**
**వింతలు గాక యుండఁ బృథివీవర! నీకు నుదార సౌఖ్య మ**
**త్యంతము నవ్యయంబు నగు నందలి మాన్యులు సంస్తుతింపఁగన్.' 66**

**ప్రతిపదార్థం:** ఇంతటి= ఇట్లాంటి; పెంపు+కల్గుట= ఔన్నత్యం ఉండటం; మహేంద్రుఁడు= ఇంద్రుడు; నీ దెసన్+కాంచెన్= నీలో చూచాడు; పృథివీవర!= రాజా!; నీవు; నిశ్చింతతన్= ఏ చింతా లేకుండా; మేనితోన్= శరీరంతో; వింతలు+కాక ఉండన్= ఏమీ వింతగా తోచకుండానే; సిద్ధపథంబునన్= యోగమార్గంలో; పుణ్యలోకముల్= పుణ్యలోకాలకు; చనుము= వెళ్ళుము; అందలి= ఆ పుణ్యలోకాలలోని; మాన్యులు= పూజ్యులు; సంస్తుతింపఁగన్= ప్రశంసించగా; నీకున్= నీకు; ఉదారసౌఖ్యము= ఘనమైన సౌఖ్యం; అత్యంతము= పూర్ణంగాను; అవ్యయము= తరగనిదిగాను; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఇట్లాంటి ఔన్నత్యం నీలో ఇంద్రుడు గమనించాడు. రాజా! ఇక నీవు నిశ్చింతగా ఈ దేహంతోనే ఏమీ వింతగా తోచకుండానే యోగమార్గంలో పుణ్యలోకాలకు వెళ్ళుము. ఆ లోకాలలోని పెద్దలు నిన్ను ప్రస్తుతించే విధంగా నీకు అక్కడ ఘనమైన సౌఖ్యాలు సంపూర్ణంగా ఎన్నటికీ తరగకుండా లభిస్తాయి.

**సీ. అనియె నప్పుడు పరమాహ్లాదమునఁ జను । దెంచి గంధర్వులు దేవమునులు**
**మరుదశ్వివసువులు మహితాదరంబున । ధర్ముండు నింద్రుండుఁ దారు నమ్మ**
**హాత్ముని నెత్తి రథారూఢుఁగాఁ జేసి । తమవిమానములు పార్శ్వముల నడపి**
**కొని చన నిఖిలదిక్కులఁ దనతేజంబు । వెలుఁగంగ సిద్ధులు వినుతి సేయ**

**తే. దైవతావాసమునకు నా ధర్మజుండు । చనియె; నయ్యవసరమున సర్వలోక**
**సమ్మతుఁడు బోధఘనుఁడు ప్రసన్నఫణితి । సారతోదారుఁడును నగునారదుండు. 67**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; గంధర్వులు; దేవమునులు= దేవర్షులు; మరుత్+అశ్వి+వసువులు= మరుత్తులు, అశ్వినులు, వసువులు; పరమ+ఆహ్లాదమునన్= మిక్కిలి ఆనందంతో; చనుదెంచి= వచ్చి; ధర్ముండున్= యముడూ; ఇంద్రుండున్= ఇంద్రుడూ; తారు= తామూ (అందరూ కలిసి); ఆ మహాత్మునిన్+ఎత్తి= ఆ మహాత్ముడైన ధర్మరాజును గౌరవపురస్సరంగా పైకెత్తి; రథ+ఆరూఢున్+కాన్+చేసి= రథంలో కూర్చోబెట్టి; తమవిమానములు= తమతమ విమానాలను; పార్శ్వములన్= ఇరువైపులా; నడపికొని= నడుపుకొంటూ; చనన్= వెళ్ళగా; నిఖిలదిక్కులన్= పదిదిక్కులలోనూ; తన తేజంబు= తనకాంతి; వెలుఁగంగన్= ప్రకాశించగా; సిద్ధులు; వినుతి+చేయన్= ప్రస్తుతించగా; ఆ ధర్మజుండు= ఆ ధర్మరాజు; దైవత+ఆవాసమునకున్= స్వర్గానికి; చనియెన్= బయలుదేరాడు; ఆ+అవసరమునన్= ఆ సమయంలో; సర్వలోక సమ్మతుఁడు= సకలలోక పూజ్యుడు; బోధఘనుఁడు= గొప్పజ్ఞాని; సారతా+ఉదారుఁడున్= బ్రహ్మతత్త్వరహస్య వేత్తృత్వంచేత మహనీయుడు; అగు= అయిన; నారదుండు= నారదమహర్షి; ప్రసన్న ఫణితిన్= ప్రసన్నమైన వాక్కుతో (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం:** అని వర మిచ్చాడు. అప్పుడు గంధర్వులు, దేవఋషులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, మిక్కిలి ఆనందంతో వచ్చి యముడు, ఇంద్రుడు, తామూ అందరూ చేరి పరమాదరంతో ధర్మరాజును గౌరవ పురస్సరంగా దివ్యరథంలో ఆసీనుడిని చేశారు. రథం కదులుతుండగా అటూ ఇటూ వారు తమతమ విమానాలను నడుపుకొంటూ

అనుసరించారు. ఇట్లా పది దిక్కులలోనూ తన కాంతి ప్రకాశించగా సిద్ధులు ప్రస్తుతించగా ఆ ధర్మరాజు స్వర్గానికి బయలుదేరాడు. ఆ సమయంలో సకలలోక పూజ్యుడు, గొప్పజ్ఞాని, బ్రహ్మతత్త్వరహస్య వేత్తృత చేత మహనీయుడు అయిన నారదమహర్షి ప్రసన్నమైన వాక్కుతో. (తరువాతి వచనంతో అన్వయం)

**వ ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె: 68**

**ప్రతిపదార్థం:** ఎల్లవారును= అందరూ; వినన్= వినేటట్లు; సంపూర్ణస్వరంబునన్= పెద్ద ఎలుగుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు;

**తాత్పర్యం:** అందరూ వినేటట్లు పెద్ద ఎలుగుతో నారదమహర్షి ఇట్లా అన్నాడు:

**ఉ. 'దానములం దపంబులను దద్దయుఁ బే ర్గలయట్టివారలన్**
**మానవనాథులన్ వినమె! మాసెఁ దదీయ యశంబు లెల్ల నీ**
**మానిత కీర్తిదీప్తులు సమస్తజగంబులయందుఁ బర్వుట**
**న్మేనులతోడ వా రిటులు నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్.' 69**

**ప్రతిపదార్థం:** దానములన్= దానాలతో; తపంబులను= తపస్సులతో; తద్దయున్= మిక్కిలి; పేర్+గల+అట్టి= పేరున్నట్టి; వారలన్= వారిని; మానవనాథులన్= రాజులను (గురించి); వినమె!= వినలేదా!; నీ మానితకీర్తిదీప్తులు= నీ ప్రశస్తమైన కీర్తికాంతులు; సమస్త= అన్ని; జగంబులయందున్= లోకాలలోనూ; పర్వుటన్= వ్యాపించటంచేత; తదీయ= వారి; యశంబులు+ఎల్లన్= వారి కీర్తులన్నీ; మాసెన్= మరుగునపడ్డాయి (మాసిపోయాయి); వారు= ఆ రాజులు; మేనులతోడన్= శరీరాలతో; అమరత్వసిద్ధికిన్= అమరత్వసిద్ధికొరకు; రాన్= రావటానికి; ఇటులు నేర్చిరె!= ఇట్లా నేర్చారా! (రాగలిగారా?)

**తాత్పర్యం:** 'దానాలతో, తపస్సులతో మిక్కిలి పేరున్నట్టి ఎంతో మంది రాజులను గురించి విన్నాం. కాని నీ ప్రశస్తమైన కీర్తికాంతులు అన్ని లోకాలలోనూ వ్యాపించటం చేత వారి కీర్తులన్నీ మాసిపోయాయి. ఆ రాజులు ఇట్లా సశరీరులై అమరత్వసిద్ధికై రాగలిగారా?

**చ. అన విని ధర్మరాజసుతుఁ డాతని కిట్లను 'నాదుతమ్ములం**
**గనుఁగొను నంతకున్ సుఖముగాఁ గొన నయ్యెద; నిత్తెఱంగు నా**
**కు నకట చూపరే పవనుకొడ్కును నింద్రసుతుండు మాద్రినం**
**దనులును నున్న చోటు సుఖదం బయినన్ సుఖహీనమేనియున్. 70**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అనగా విని; ధర్మరాజసుతుఁడు= ధర్మరాజు (యమధర్మరాజు కొడుకు); అతనికిన్= నారదుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; నాదుతమ్ములన్= నా తమ్ముళ్ళను; కనుఁగొను నంతకున్= చూచేంతవరకు; ఈ+తెఱంగున్= దీనిని; సుఖముగాన్+కొనన్+అయ్యెదన్= సుఖంగా తీసికొనలేను; అకట!= అయ్యో!; పవనుకొడ్కును= భీముడు; ఇంద్రసుతుండు= అర్జునుడు; మాద్రినందనులును= నకుల సహదేవులూ; ఉన్నచోటు= ఉన్నచోటు (అది); సుఖదంబు+అయినన్= సుఖాన్నిచ్చేదే అయినా; సుఖహీనము+ఏనియున్= సుఖహీనమైనదే అయినా; నాకున్+చూపరే!= నాకు చూపించరూ!

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు నారదుడితో ఇట్లా అన్నాడు: 'నా తమ్ముళ్ళను చూచేటంతవరకు దీనిని సుఖంగా తీసికొనలేను. అయ్యో! భీమార్జున నకుల సహదేవులను, వా రెక్కడ ఉన్నారో, అది సుఖాన్నిచ్చేదయినా, దుఃఖం కలుగజేసేదయినా, ఆ చోటును నాకు చూపెట్టరూ!

**వ. వారలను మదీయపక్షప్రాప్తు లయిన భూపతులను జూచు వేడ్క యెల్లలోకంబుల మీఁదను గలుగు వేడుక కంటెనుమిగిలియున్నయది యనుటయు నమరేంద్రుండు తన మనంబున నితనితోడ సముచిత భాషణంబులు చేసెద; నిర్విధంబు కటుక వచనత్వంబు గా దని యూహించి యి ట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** వారలను= వారినీ; మదీయ= నా; పక్షప్రాప్తులు+అయిన= పక్షంలో నిలిచినవారు అయిన; భూపతులను= రాజులను; చూచువేడ్క= చూడాలన్న కోరిక; ఎల్లలోకంబుల మీఁదనున్= అన్ని లోకాలమీదా; కలుగువేడుక కంటెను= కలిగే కోరికకంటె; మిగిలి ఉన్నఅది= మించి ఉన్నది; అనుటయున్= అనగా; అమర+ఇంద్రుండు= దేవేంద్రుడు; తనమనంబునన్= తన మనసులో; ఇతనితోడన్= ఈ ధర్మరాజుతో; సముచిత భాషణంబులు= తగిన రీతిగా మాటాడటం; చేసెదన్= చేస్తాను; ఈ+విధంబు= ఈ విధంగా; కటుక= కఠిన; వచనత్వంబు= మాటలు; కాదని= కాదని; ఊహించి= ఆలోచించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు;

**తాత్పర్యం:** నా తమ్ముళ్ళను, నా పక్షంలో నిలిచినవారూ అయిన రాజులను చూడాలన్న కోరిక అన్ని లోకాలమీద ఉన్న కోరికకన్నా అధికంగా ఉన్నది' - అనగా ఇంద్రుడు తన మనసులో ఈ ధర్మరాజుతో తగినరీతిగా మాటాడుతాను. కఠినంగా మాటాడటం బాగాలే దని ఆలోచించి ఇట్లా అన్నాడు:

**విశేషం:** స్వర్గానికి వెళ్ళగా మానవ సంబంధమైన 'మమత' ధర్మరాజులో మిగిలిఉన్నదా! అనిపిస్తుంది. కాని, తరువాత ధర్మరాజు సమాధానంలో ఈ సందేహనివృత్తి జరుగుతుంది.

**చ. 'తనువు దొఱంగ కిట్లు సుకృతంబుల పెంపున వచ్చి తిప్పదం
బునకు మహాత్మ! యిచ్చటను బోవదు నీమదిఁ బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం; దగునె ముందటి చందము నొంది యుండఁగన్? 72**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= ఓ మహాత్మా!; తనువున్= దేహాన్ని; తొఱంగన్= త్యజించకుండా; ఇట్లు= ఈ విధంగా; సుకృతంబుల పెంపునన్= పుణ్య విశేషం వలన; ఈ+పదంబునకున్= ఈ స్వర్గస్థానానికి; వచ్చితి(వి)= వచ్చావు; ఇచ్చటను= ఇక్కడకూడా; మర్త్యతన్= మానవత్వంతో (మనిషిగా ఉన్నప్పుడు); పనుపడి+ఉన్న= నీకుండిన; నెయ్యము= స్నేహభావం; నీ మదిన్+పాపి= నీ మనసును వదలి; పోవదు= పోలేదు; ఆ మునులను= ఆ దేవర్షులను; సిద్ధులన్= సిద్ధులను; సభాసదులన్= స్వర్గసభలో ఉన్న మాన్యులను; శుభదృష్టిన్+చూడుమా!= శుభదృష్టితో చూడుము; ముందటి= మునుపటి; చందమున్= రీతినే; ఒంది+ఉండఁగన్= పొంది శోకిస్తూ ఉండటం; తగునె!= సముచితంగా ఉన్నదా!

**తాత్పర్యం:** 'ఓ మహాత్మా! దేహాన్ని త్యజించకుండా నీవు చేసిన పుణ్యవిశేషంవలన ఇట్లా ఇంత ఉన్నతమైన పదవికి రాగలిగావు. ఇక్కడకూడా మనిషిగా ఉన్నప్పుడు నీ కుండిన స్నేహభావం ఇంకా నీ మనసును వదలిపెట్టకుండా ఉన్నది. ఆ దేవర్షులను, సిద్ధులను, సభాసదులను శుభదృష్టితో చూడుము. ఇంకా మునుపటివలెనే శోకంలో మునిగిఉండటం సముచితంగా ఉన్నదా?

**విశేషం:** ఈ ప్రస్థానంలో చివరి వరకు ధర్మరాజు పరీక్షించబడుతూనే ఉన్నాడు. 'నాపక్షప్రాప్తులు' అన్న ధర్మరాజు మాట చాలా చిత్రమైనది. ఏడు అక్షౌహిణుల సైన్యంలోని యోధానుయోధులు భటులు సైనికులు - వీరంతా తనకు 'ప్రాప్త' మయ్యారు. దుర్యోధనుడివలె కోరి సంపాదించుకొన్నవారు కాదు. వారిని కృతజ్ఞతాపూర్వకంగా చూడాలని ధర్మరాజు కోరుతున్నాడు. దానిపై ఇంద్రుడి వ్యాఖ్య ఇది. నీ కింకా ఆ మనుషజన్మలోని స్నేహాది మమతానుబంధాలు ఇంకా నశించలేదా! అని.

**చ. ఒరులకు నందరానిపద మూర్జిత పుణ్యనిరూఢిఁ బొందఁగా**
**దొరకొని యున్కి నీ వికృత దూరమనస్కతఁ గాదె! నీ సహో**
**దరులు భవన్మహోన్నత పదస్థితి కర్హులె తొంటి నెయ్యమున్**
**బొరయునె దేవతాత్మకులబుద్ధి నెఱుంగుము నీ విశేషమున్.' 73**

**ప్రతిపదార్థం:** ఒరులకున్+అందన్‌రాని= ఇతరులు అందుకొనటానికి వీలుకాని; పదము= స్థానాన్ని; ఊర్జిత= ఘనమైన; పుణ్యనిరూఢిన్= పుణ్యప్రసిద్ధిచేత; పొందఁగాన్= పొందటానికి; దొరకొని ఉన్కి= ప్రయత్నంతో ఉండటం; నీ వికృతదూర మనస్కతన్+కాదె= వికారాలకు దూరమైన నీ మనస్సు చేతనే కదా!; నీ సహోదరులు= నీ తమ్ములు; భవత్+మహోన్నత= నీయొక్క ఉన్నతమైన; పదస్థితికిన్= స్థానంలో ఉండటానికి; అర్హులె?= తగినవారా?; తొంటినెయ్యమున్= మునుపటి స్నేహభావాన్ని; పొరయునె?= కలిగి ఉంటుందా?; దేవతా+ఆత్మకుల బుద్ధిన్= దైవస్వరూపుల యొక్క బుద్ధితో; నీ విశేషమున్= నీయొక్క ప్రత్యేకతను; ఎఱుంగుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** ఇతరులు అందుకొనటానికి వీలులేని స్థానాన్ని ఘనమైన పుణ్యప్రసిద్ధి చేత పొందటానికి ప్రయత్నించటం నీకున్న వికార దూరమైన మనస్సుచేతనే కదా! నీ తమ్ములు నీ అంతటి ఉన్నత పదవిని అందుకొనటానికి తగినవారా! మర్త్యలోకం వీడివచ్చిన నీకు మునుపటి స్నేహబంధాలస్మరణం తగదు. దివ్యస్వరూపంలో ఉన్న నీవు నీ విశేషాన్ని గ్రహించుము.

**క. అని యిట్లాడిన సర్వభు । వనపతియు బుధుండు నైన వాసవుతోఁ దా**
**ననియెం దగ వెండియు ధ । ర్మనందనుఁడు భరతవంశ మహిమాధాయీ! 74**

**ప్రతిపదార్థం:** భరతవంశ= భరతవంశానికి; మహిమ+ఆధాయీ!= కీర్తిని కూర్చేవాడా! (జనమేజయా! వినుము); అని= ఈ విధంగా; ఇట్లు+ఆడిన= పలికిన; సర్వభువనపతియున్= సర్వభువనపాలకుడూ; బుధుండున్+ఐన= పండితుడూ అయిన; వాసవుతోన్= ఇంద్రుడితో; ధర్మనందనుఁడు= ధర్మరాజు; తగన్= తగినట్లుగా; వెండియున్= మరలా; తాను; అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** జనమేజయా! వినుము: ఇట్లా అన్నటువంటి సమస్తలోకపాలకుడూ, మహావిద్వాంసుడూ అయిన ఇంద్రుడితో ధర్మనందనుడు మరలా ఇట్లా అన్నాడు:

**ఉ. 'మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్నదైత్య! యే**
**గారవ మొప్పఁ దమ్ములను గాంతను బుత్త్రుల మిత్త్ర కోటిఁ గ**

**న్నారఁగఁ జూడ కుండుటకు నక్కట యోర్తునె? యెల్లభోగముల్**

**వారలఁ జూచి క్రమ్మఱఁగ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్. 75**

**ప్రతిపదార్థం:** అమేయభుజాబల!= లెక్కించటానికి వీలులేని భుజబలంచేత; భగ్నదైత్య!= ఓడించబడిన రాక్షసులుగల ఓ మహేంద్రా!; మీరు+ఇటులు+ఏమి+చెప్పినన్= మీరు ఇట్లా ఏమి చెప్పినాసరే!; గారవము+ఒప్పన్= ఆదరంతో; తమ్ములను= నా భీమార్జునులను నకులసహదేవులను; కాంతను= ద్రౌపదిని; పుత్త్రులన్= కుమారులను; మిత్రకోటిన్= నా పక్షాన యుద్ధంచేసిన స్నేహితులను; కన్ను+ఆరఁగన్= కనులారా; చూడక+ఉండుటకున్= చూడకుండా ఉండటానికి; అక్కట!= అయ్యో!; ఓర్తునె!= సహించగలనా!; వారలన్+చూచి= వారందరినీ చూచి; క్రమ్మఱఁగన్+వచ్చి= మరలివచ్చి; ఎల్లభోగముల్= అన్ని సుఖాలనూ; సుఖస్థితిమైన్= సుఖమైన ఉనికితో; భుజించెదన్= అనుభవిస్తాను.

**తాత్పర్యం:** లెక్కించటానికి వీలుకాని భుజబలంచేత రాక్షసులను నశింపచేసిన ఓ మహేంద్రా! మీ రేమి చెప్పినా సరే! అయ్యో! కనులారా నా సోదరులను, కాంతను, పుత్రులను, మిత్రులను ఆదరంతో ఒక్కసారి చూడకుండా నేను ఉండగలనా? వారందరినీ చూచి మరలి వచ్చాక ఈ సర్వభోగాలనూ స్తిమితమైన మనస్సుతో అనుభవిస్తాను'.

**వ. నాకతెఱంగు పరమానందకరం' బనియె నని యిట్లు మునీంద్రమాననీయం బయిన పాండవేయ మహాప్రస్థానప్రకారంబు జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 76**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఆ+తెఱంగు= ఆ విధము; పరమ+ఆనందకరంబు+అనియెన్= మిక్కిలి సంతోషాన్ని కూరుస్తుంది అన్నాడు; అని; ఇట్లు= ఈ విధంగా; మునీంద్ర= మునిశ్రేష్ఠులకు; మాననీయంబు+అయిన= గౌరవించదగిన; పాండవేయ= పాండవుల; మహాప్రస్థానప్రకారంబు= మహా ప్రయాణవిధానం; జనమేజయునకున్= జనమేజయ మహారాజుకు; వైశంపాయనుండు= వైశంపాయనమహర్షి; చెప్పుటయున్= చెప్పటం (ఇందలి కథ).

**తాత్పర్యం:** నాకు అదే మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తుందని ధర్మరాజు అన్నాడు' అని ఈ విధంగా మునీంద్రులు కూడా సమాదరించేటటువంటి పాండవుల మహాప్రయాణకథను జనమేజయుడికి వైశంపాయన మహర్షి చెప్పగా.

**విశేషం:** ఏ గుణాలను అభ్యసిస్తే సశరీరంగా స్వర్గాది పుణ్యలోక ప్రాప్తి కలుగుతుందో ధర్మరాజు పొందిన 'విజయాన్ని' బట్టి అర్థం చేసికొనవచ్చును. కాబట్టి మునీంద్రులకు కూడా ఈ కథ మిక్కిలి సమాదరణీయమని అర్థం.

ఆశ్వాసాంతము

**శా. పారాశర్య వచఃపయోనిధి సుధాభంగీ! దయాసంగి! దు**

**ర్వారాశేష విపద్విదారణ విహారా! చిన్మయాకార! వి**

**స్తారోదార! గుణత్రయస్ఫుటవిశేషా! నిర్గుణాశ్లేష! మా**

**గౌరీత్యోజ్జ్వల తత్త్వభాస్వర! నిజాకారాత్మకత్రీశ్వరా! 77**

**ప్రతిపదార్థం:** పారాశర్య= వ్యాసుడి; వచస్= వచనా లనెడి; పయస్+నిధి= క్షీరసాగరానికి; సుధాభంగీ!= అమృతం వంటివాడా!; దయాసంగి!= కరుణారసంతో కూడినవాడా!; దుర్వార= వారించటానికి అలవికానటువంటి; అశేష= అనేకాలైన; విపద్= ఆపదలను; విదారణ= నశింపచేయటమే; విహారా!= క్రీడగా కలిగినవాడా!; చిత్+మయ+ఆకార!= చైతన్య స్వరూపుడా!; విస్తార= సర్వవ్యాపకత్వ;

ఉదార!= మహత్త్వం కలిగినవాడా!; గుణత్రయ స్ఫుటవిశేషా!= సత్త్వరజస్తమోగుణాల రూపమైన ప్రకృతిసంబంధంచేత తెలియదగిన విశిష్టత కలవాడా!; నిర్గుణ+శ్లేష= వాస్తవానికి ఆ గుణత్రయంతో సంబంధంలేక, తత్కారణంగా విశ్వంతో ఏమాత్రం సక్తత లేనివాడా!; మా= లక్ష్మీభావంతో; గౌరీత్వ= గౌరీభావంతో; ఉత్+జ్వల= వెలిగేటటువంటి హరిహరాత్మకమైన; తత్త్వ= తత్త్వంచేత; భాస్వర= ప్రకాశించేవాడా!; నిజ+ఆకార+ఆత్మక+త్రీశ్వరా!= తన వ్యాపారానికి అనుగుణమైన గృహంగా భాసిల్లే బ్రహ్మ,విష్ణు, శివాత్మకరూపమైన మూర్తిత్రయం కలవాడా!;

**తాత్పర్యం:** వ్యాసుడి వచనాలనేటటువంటి క్షీరసాగరానికి అమృతంవలె సారభూతమైనవాడా! దయారసమూర్తీ! వారించటానికి అలవికాని ఎప్పటికీ తీరని ఆపదలను నశింపజేయటమే క్రీడగా కలవాడా! చైతన్యస్వరూపా! సర్వవ్యాపకత్వ మహత్త్వం కలిగినవాడా! సత్త్వరజస్తమోగుణాల రూపమైన ప్రకృతి సంబంధంచేత తెలియదగిన విశిష్టత కలవాడా! వాస్తవానికి గుణత్రయంతో సంబంధం లేని కారణంగా ప్రపంచంతో ఏ మాత్రం సంబంధం లేనివాడా! లక్ష్మీత్వ, గౌరీత్వ భావంతో ప్రకాశించే హరిహరాత్మకమైన తత్త్వంచేత ప్రకాశించేవాడా! తన వ్యాపారానికి అనుగుణమైన గృహంవలె భాసిల్లే బ్రహ్మవిష్ణు శివాత్మకమైన త్రిమూర్తిస్వరూపా! నీకు నమస్కారం.

**విశేషం:** మహాభారత తాత్పర్యమంతా ఆశ్వాసాంత పద్యాలలో కనిపిస్తుంది. అందులోనూ ఇవి పర్వాంత పద్యాలు కూడా. అందుచేత రమణీయమైన విశేషణాలతో హరిహరనాథుడి మహాతత్త్వానికి తిక్కనగారు భాష్యం చెప్తున్నారు. క్షీరసాగరంలో అమృతం పుట్టింది. అట్లాగే వ్యాసవచనాలకు తాత్పర్యరూపమైన హరిహరాత్మక సారం ఉన్నది. లౌకికాలౌకిక వ్యాపారాలమధ్య సమన్వయరూపమైన హరిహరాత్మక సారం ఉన్నది. లౌకికాలౌకిక వ్యాపారాల మధ్య సమన్వయ రూపమైన విచిత్ర తత్త్వమది. అందుకే గుణత్రయంతో ఆశ్లేష (కూడికా ఉన్నది); అశ్లేష (నిరాసక్తత) కూడా ఉన్నది. విష్ణువుగా భోగమూర్తి, శివుడుగా యోగమూర్తి, లక్ష్మీత్వరూపంలో భోగం. గౌరీరూపంలో యోగం. ఈ విచిత్రయోగాన్నే ధర్మాద్వైతమని తిక్కన వ్యాసుడిహృదయంలోని ఒక సూత్రాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. ఆంధ్రమహాభారతం ఏకైకంగా సాధించిన మహావిజయం ఈ సూత్ర వ్యాఖ్యానమే. అన్ని మతాలకూ సమన్వయం ఉన్నదిక్కడ. భోగ, యోగ రూపమైన లక్ష్మీత్వగౌరీత్వ (శ్రీయనశౌరివాచకము...) భావంలోని తత్త్వజ్ఞానమే సరస్వతి. అందుకే ఆమెతోపాటు బ్రహ్మకూడా హరిహరతత్త్వంలో గర్భితంగా ఉన్నాడు.

**క. ప్రణవైకభావ్య! సురరర! క్షణ కేళీస్తవ్య! జన్య సకలద్రవ్యా!**
**గణనాతీతా! పోష్య। ప్రణతవ్రాతా! నిరీహభక్తి ప్రీతా! 78**

**ప్రతిపదార్థం:** ప్రణవ+ఏకభావ్య!= ఒక ప్రణవం చేతనే భావించదగినవాడా!; సుర= దేవతలను; రక్షణ= రక్షించటమనేటటువంటి; కేళీస్తవ్య!= క్రీడ కలిగినవాడు కావటంచేత స్తుతించదగినవాడా!; జన్య= పుట్టదగిన; సకల= అన్ని; ద్రవ్యా!= వస్తువులను కలిగినవాడా!; గణన= లెక్కించటానికి; అతీతా!= సాధ్యంకానివాడా!; పోష్య= పోషించదగిన; ప్రణత= భక్తుల; వ్రాతా!= సమూహం కలవాడా!; నిర్+ఈహ= కోరికలు లేని; భక్తి= భక్తిచేత; ప్రీతా!= సంతోషించేవాడా!

**తాత్పర్యం:** ఒక ప్రణవంచేత మాత్రమే తెలియదగినవాడా! దేవతలను రక్షించటమనే క్రీడచేత స్తుతించబడేవాడా! లెక్కించటానికి వీలులేనివాడా! పుట్టించదగిన సకల వస్తువులు కలవాడా! పోషించదగిన భక్తుల సమూహం కలవాడా! కోరికలు లేని భక్తిచేత ప్రీతుడవయ్యేవాడా! నీకు నమస్కారం.

**విశేషం:** ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ - అని గీత; తస్య వాచకః ప్రణవః - అని పాతంజల యోగసూత్రం. తస్య= తత్ పదార్థానికి వాచకం - సూచకం. అదే హరిహర తత్త్వం. అది కేవలం 'ఓం'కార రూపం. ఓంకార సాధన ద్వారానే తెలియదగింది. ప్రధానమైన

పరమేశ్వర మంత్రం. అది ఒకటేనని శ్రుతి ప్రమాణం కావటంవలన 'ప్రణవైక భావుడు' అవుతున్నాడు.

సురలు - ధర్మపరులు. అందుకే ధర్మరక్షణ కళాశీలుడు కాబట్టి స్వామి అవతరిస్తుంటాడు. అదొక క్రీడ ఆయనకు. ఆ లీలామూర్తిని అందుకే భక్తులు కొలుస్తారు.

బ్రహ్మాదిస్తంబ పర్యంతమున్న సృష్టి మొత్తం పరమేశ్వరుడి నుండి ప్రభవించి అందులోనే లీనమవుతున్నది. అందుచేత సకల వస్తువులకు జన్యస్థాన మాయనే.

సర్వవ్యాపకత్వ - సర్వకర్తృత్వ - సర్వజ్ఞత్వ భావాలు కలవాడు కాబట్టి ఆయన తత్త్వం 'పరిచ్ఛిన్నం' కాదు. పరిచ్ఛిన్నం (ముక్క) అయితే కదా కొలవటానికి, అందుకే అగణితమైన తత్త్వమది.

భక్తులు నాలుగు రకాలని గీతాశాస్త్రం వివరించింది.

'ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ' - అని ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు - అని నాలుగు రకాల భక్తులున్నారు. వీరిలో ఆర్తి తొలగాలని కోరేవారికంటె, అర్థంకావాలని వెళ్ళేవాడికంటె, అదేమిటో తెలిసికొనాలని యత్నించేవాడికంటె (వీడే జిజ్ఞాసువు)- ఏ కోరికా లేనివాడు 'జ్ఞాని' మాత్రమే. అందుకే పరమాత్మ 'జ్ఞానయోగి' తనకు చాలా ప్రీతిపాత్రుడని చెప్పాడు (స చ మే ప్రియః)

అందుచేత హరిహరనాథుడి తత్త్వం కేవలం యోగి ఆరాధనచేత జననాంతర పరిశ్రమచేత సాధించదగ్గ మహావిషయం తప్ప కేవలం విగ్రహవిశేషం కాదని అర్థం.

**మాలిని.**

> **అమృత వికిరణ క్రీడాభిరామా! త్రిధామా!**
> **దమిత సకల దైత్యోద్వాహా! విజ్ఞాన దేహా!**
> **సుమహ దుపనిషత్ప్రస్తుత్యభిశ్రావ్య! సేవ్యా**
> **శమన రమణశీలా! సంభృతానందలీలా!** **79**

**ప్రతిపదార్థం:** అమృత= అమృతాన్ని; వికిరణ= వెదజల్లటం అనే; క్రీడా+అభిరామా!= విహారంచేత మనోహరుడవైనవాడా!; త్రిధామా!= మూడు స్థానాలు కలవాడా!; దమిత= అణచివేయబడిన; సకల= సమస్త; దైత్య= రాక్షసుల; ఉత్+వాహా!= ఉత్సాహం కలవాడా!; విజ్ఞానదేహా!= జ్ఞానమే దేహంగా కలవాడా!; సుమహత్= ఉత్తమ; ఉపనిషద్= వేదోపనిషత్; ప్రస్తుతి+అభిశ్రావ్య= స్తవంచేత వినదగినవాడా! (అంటే కనదగినవాడా!); సేవ్యా!= సేవించదగినవాడా!; శమన= శాంతిలోనే; రమణ= క్రీడించే; శీలా!= స్వభావం కలవాడా!; సంభృత= సంపూర్ణ; ఆనంద= ఆనందంతో కూడిన; లీలా!= విలాసం ఉన్నవాడా!

**తాత్పర్యం:** అమృతాన్ని వెదజల్లటమనే విహారంచేత మనోహరుడవైనవాడా! అణచివేసిన సకల దైత్యుల ఉత్సాహం కలవాడా!; ఉత్తమ వేదోపనిషన్మంత్రాల సంస్తుతిచేత విని కనదగినవాడా! శాంతిలోనే క్రీడించే స్వభావం కలవాడా! సంపూర్ణమైన ఆనందంతో కూడిన విలాసమున్నవాడా! నీకు నమస్కారం.

**విశేషం:** నక్షత్రాలలో నేను చంద్రుడిని-అని గీతాకారుడు స్వామి విభూతియోగంలో చెప్పాడు. చంద్రుడు అమృతకిరణుడు. మోహినీరూపంలో భగవానుడు చేసిన పనికూడా ఇదే. దేవతలకు అమృతాన్ని పంచి రాక్షసులకు లేకుండా చేయటమే 'క్రీడ'. ఆ అభిరామ ధర్మాన్నే 'మోహిని' అన్నారు.

త్రిధామా! - అన్నమాట చాలా విశిష్టమైంది. స్వామి విభూతిని వైష్ణవ సంప్రదాయం 'త్రిపాద్విభూతి, అంటుంది. స్వామి నాలుగు పాదాలలో ఒకటిమాత్రమే ఈ జగత్తులో ఉంది. తక్కిన మూడు పాదాలు ఊర్ధ్వ జగత్తులో ఉన్నాయి అని పురుషసూక్తం. వామన, త్రివిక్రమ, పరమేశ్వర రూపాలని. భూ - అంతరిక్ష - స్వర్లోకాలలో; అగ్ని, వాయు, సూర్యరూపాలలో ఉన్న తత్త్వమది. జాగ్రత్- స్వప్న - సుషుప్తులలో వైశ్వానర, తైజస, ప్రాజ్ఞ రూపాలలో వ్యాపించి ఉన్న తత్త్వమిది. ఆహవనీయ - గార్హపత్య - దక్షిణాగ్ని రూపాలతో జగత్కర్మను ఆవరించి ఉంటుంది. అందుకే త్రిధాముడని హరిహరాత్మక స్వరూపాన్ని స్తుతిస్తున్నాడు.

సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ-అని తైత్తిరీయం చెబుతుంది. 'విజ్ఞానమానందం బ్రహ్మ' అని బృహదారణ్యకం - అందువలన శ్రుతి ప్రమాణంచేత పరమేశ్వరుడు విజ్ఞానరూపుడు.

వేద ఉపనిషన్మంత్రాలు భగవత్ స్తుతిపరాలే. అందుకే వీటిని ఋక్కులన్నారు. వీటిని 'సూక్తము' అని కూడా అందుకే అన్నారు.

స్వామి శాంతాకారుడు. సర్వరసానుభవాలూ ఎక్కడ ప్రశమనం పొందుతాయో అది 'శాంతం' అది కేవలం బ్రహ్మానంద స్వరూపం. అందుకే పరమేశ్వరుడి లీలను 'విలాస' మంటారు. అది అంతా ఆనందమయమే. అక్కడ శోకానికి చోటులేదు. భారతంలో శ్రీకృష్ణుడి చర్యలు అన్నీ ఆనందవిలాసాలే. ఆనందదాయకాలే. కడకు పరమాత్ముడి దేహ విసర్జనంకూడా ఒక 'విలాసం'గా కనిపిస్తుంది.

ఆ లీలలో భాగమే ధర్మనందనాదుల మహాప్రస్థానం. అందుకే ఈ ప్రస్థానంలోని ఘట్టాలు చిత్రంగా కనిపిస్తాయి. అతి చిత్రమైంది. 'కుక్క' వెంటబడటం. అది ధర్ముడి రూపాన్ని పొందటం. ఇంద్రుడు, యమధర్మరాజు, సకల దేవతా సమూహమూ కలిసి ధర్మజుని దివ్యరథంలో స్వర్లోకానికి సాదరంగా తీసికొనిపోవటం ఇవన్నీ పరమేశ్వరుడి క్రీడావిలాసమే.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్రకొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీ మహాభారతంబునందు మహాప్రస్థానిక పర్వంబు సర్వంబు నేకాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= ప్రసిద్ధికెక్కిన; ఉభయ కవి= సంస్కృతాంధ్ర భాషాకవుల; మిత్త్ర= మిత్రుడును; కొమ్మన= కొమ్మన అనే; అమాత్య= మంత్రియొక్క; పుత్త్ర= కుమారుడును; బుధ= విద్వాంసులయొక్క; ఆరాధన= పూజచేత; విరాజి= ప్రకాశించేవాడును అయిన; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కనచేత; ప్రణీతంబు+ఐన= రచించబడినదైన; శ్రీమహాభారతంబునందున్= శ్రీ మహాభారతంలో; మహాప్రస్థానిక పర్వంబు= మహాప్రస్థానిక పర్వంలో; సర్వంబును= సమస్తమును; ఏకాశ్వాసము.

**తాత్పర్యం:** కీర్తికలవాడూ; సంస్కృతాంధ్రభాషా కవిమిత్రుడూ, కొమ్మనమంత్రి కుమారుడూ, బుధపూజనంచేత ప్రకాశించేవాడూ అయిన తిక్కనసోమయాజి రచించిన శ్రీమహాభారతంలో మహాప్రస్థానికపర్వం సర్వం ఏకాశ్వాసం సమాప్తం.

**శ్రీమదాంధ్ర మహాభారతములోని 'ఏకాశ్వాసమైన మహాప్రస్థానికపర్వం సర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్వర్గారోహణ పర్వము - ఏకాశ్వాసము

**శ్రీవర్ధనాయురభివృ। ద్ధ్యావహచరణ శతపత్ర! యమనియమాది**
**ప్రావీణ్య పూర్ణ మిత్ర! మ। హా విద్యోన్మేషగాత్ర! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీవర్ధన= ఐశ్వర్యాభివృద్ధిని; ఆయుస్+అభివృద్ధి+ఆవహ+చరణ+శతపత్ర!= జీవితకాలాభివృద్ధిని కలిగించేటటువంటి పాదపద్మాలు కలవాడా!; యమనియమ+ఆది= యమ నియమాది అష్టాంగయోగంలో; ప్రావీణ్యపూర్ణ= గరిష్ఠులైన మహా యోగీంద్రులకు; మిత్ర!= చెలికాడా!; మహావిద్యా= శ్రుతిరూపమైన శ్రీవిద్యలో; ఉన్మేష= వికసించే; గాత్ర= రూపం కలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథస్వామీ!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీ చరణ కమలసేవ తత్సేవకులకు సంపూర్ణమైన ఐశ్వర్యాన్ని, ఆయుస్సును ప్రసాదిస్తుంది. నీవు యమ నియమాద్యష్టాంగ యోగ నిష్ఠులకు సంపూర్ణ మిత్రుడివి. 'మహావిద్య' సర్వదేవతా రూపమైన నీ స్వరూపాన్ని తెలుపుతుంది. అట్లాంటి నీకు నమస్కారం.

**విశేషం:** వేదాంతులు ఉపనిషత్తుల నాధారంగా 'బ్రహ్మవిద్య' నుపాసించారు. తాంత్రికులు వేద ప్రామాణ్యం ఆధారంగానే 'మహావిద్య' నుపాసించారు. హరిహరనాథ విద్య 'శ్రీవిద్య' కు మరో రూపమని తిక్కనగారి 'మహావిద్య' అనే మాట నిరూపిస్తున్నది. 'కామ కళావిలాసం'లో ఈ శ్రీవిద్యా స్వరూపం వివరించబడింది. 'మహావిద్య' అనే ఒక శాస్త్ర గ్రంథం ఉన్నది. ఇది మంత్ర గ్రంథం. వనదుర్గా ప్రధానంగా అనేక దేవతా మంత్రోపాసనలు ఇందులో ప్రస్తావించబడ్డాయి. తిక్కనకు శ్రీవిద్యా సంప్రదాయంతో ఉన్న దగ్గరి సంబంధం ఈ చివరి పాదంవలన మనం ఊహించవచ్చును.

**వ. దేవా! జనమేజయుండు వైశంపాయనుతోడ 'మత్పూర్వపితామహు లగు పాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టి నెలవుల నిలిచి? రెట్లు వర్తించిరి? చెప్పవే!' తదాకర్ణన కౌతుకంబు మదీయ చిత్తంబున నుత్తరంగం బగుచున్నయది; నీవు సర్వవిదుండ వేను భవదీయ సదయవాక్య సంభావనకు నర్హుండ' నని ప్రార్థించినం బ్రచుర దివ్యజ్ఞాన మాననీయుండును బరమకృపా విధేయుండును నైన సాత్యవతేయుని సాదర కరుణా విశేషంబున సంపోషితం బయిన బోధంబున సాధుజన స్తవ్యం డైన యా భవ్యమునివరుం డక్కురు వంశవరున కిట్లనియె నట్లు బంధు దర్శనంబు గోరి పలికిన పాండవాగ్రజు తలంపున కనుకూలుండై యాఖండలుండు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథ స్వామీ!; జనమేజయుండు= జనమేజయ మహారాజు; వైశంపాయనుతోడన్= వైశంపాయన మహర్షితో (ఇట్లా అన్నాడు); మత్+పూర్వ+పితామహులు+అగు= నా పూర్వ పితామహులైన; పాండవులును= పాండవులూ;ధార్త రాష్ట్రులును= దుర్యోధనాదులు; స్వర్గంబు+ఆరోహించి= స్వర్గం చేరి; ఎట్టి+ఎట్టి= ఎట్లాంటెట్లాంటి; నెలవులన్= చోట్లలో; నిలిచిరి?=

నిలిచారు?; ఎట్లు= ఎట్లా; వర్తించిరి?= ప్రవర్తించారు? (ఏం చేశారు?); చెప్పవే= చెప్పుము; తద్+ఆకర్ణన= దానిని వినాలన్న; కౌతుకంబు= కుతూహలం; మదీయ= నా; చిత్తంబునన్= మనసులో; ఉత్+తరంగంబు+అగుచున్న+అది= ఎగిరి పడుతున్న అలవలె అధికమవుతున్నది; నీవు; సర్వవిదుండవు= అన్నీ ఎరిగినవాడివి; నేను= నేనేమో; భవదీయ= నీ; సదయ= దయతో కూడిన; వాక్య= మాటలతోడి; సంభావనకున్= ఆదరానికి; అర్హుండను+అని= అర్హుడిని అని; ప్రార్థించినన్= వేడుకొనగా; ప్రచుర= విస్తారమైన; దివ్యజ్ఞాన= దివ్యజ్ఞానంచేత; మాననీయుండును= పూజించదగినవాడూ; పరమ= మిక్కిలి; కృపావిధేయుండునున్= దయకు లోబడినవాడూ; ఐన= అయినటువంటి; సాత్యవతేయుని= సత్యవతి కుమారుడైన వ్యాసుడి; సాదర= ఆదరంతోకూడిన; కరుణా విశేషంబునన్= కరుణా విశేషంతో; సంపోషితంబు+అయిన= వృద్ధిచేయబడిన; బోధంబునన్= జ్ఞానంతో; సాధుజన= సాధువులచేత; స్తవ్యుండు+ఐన= స్తుతించదగినవాడైన; ఆ భవ్య మునివరుండు= ఆ పుణ్యాత్ముడైన వైశంపాయన మహర్షి; ఆ+కురువంశవరునకున్= ఆ కురువంశ శ్రేష్ఠుడైన జనమేజయ మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; బంధు దర్శనంబున్+కోరి= బంధువులను చూడాలని; పలికిన= అడిగిన; పాండవ+అగ్రజ= ధర్మరాజు; తలంపునకున్= కోరికకు; అనుకూలుండు+ఐ= ఇష్టపడినవాడై; అఖండలుండు= ఇంద్రుడు.

**తాత్పర్యం:** హరిహరనాథస్వామీ! వినుము. జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు: 'నా ముత్తాతలైన పాండవులు, దుర్యోధనాదులు స్వర్గాన్ని చేరి ఎట్లాంటి స్థానాలు పొందారు? ఏం చేశారు? చెప్పండి. దానిని వినాలనే కోరిక నా మనసులో పరవళ్ళు త్రొక్కుతున్నది. మీకు అన్నీ తెలుసు. నేను మీ దయతో కూడిన మాటలతోడి ఆదరానికి తగినవాడిని' అని ప్రార్థించాడు. అపుడు విస్తారమైన దివ్యజ్ఞానంచేత పూజించదగినవాడూ, మిక్కిలి దయకు లోనైనవాడూ అయిన వ్యాసమహర్షి కరుణా విశేషంతో వృద్ధి పొందించబడిన బ్రహ్మజ్ఞాన సంపన్నుడు, సాధుజన స్తుతిపాత్రుడూ అయిన వైశంపాయన మహర్షి ఆ కురువంశశ్రేష్ఠుడితో ఇట్లా అన్నాడు. 'ఆ విధంగా బంధుజనాలను చూడాలని అడిగిన ధర్మరాజు కోరికకు ఇష్టపడినవాడై ఇంద్రుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** వ్యాసమహర్షిచేత వైశంపాయనుడి 'బోధ' (జ్ఞానం) పోషితం (వృద్ధి) అయిందనటంలో చాలా అర్థముంది. భారతీయ సంప్రదాయంలో గురుస్థానం అంత గరిష్ఠమైనది. విద్య గురువువలన వస్తుంది. బ్రహ్మజ్ఞానం గురుకరుణచేత మాత్రమే సంప్రాప్తమవుతుంది.

**సీ.** **తగువాని రావించి 'ధర్మనందనునకుఁ। దమవారిఁ జూడఁ జిత్తమునఁ గోర్కి**
**దనికినయది; నీ వితని నటఁ గొనిపోయి। యఖిల బంధులఁ జూపు' మనుడు నతఁడు**
**గారవం బెసఁగంగ నా రాజసత్తముఁ। దోడ్కొని పోవఁ గుతూహలమునఁ**
**దోడన నారదాదులు కొంద ఱరిగి ర। ట్లేఁగెడుచోటఁ గట్టెదురఁ దోఁచె**

**తే.** **నున్నతాసనాసీనుఁ డభ్యుదిత సరసి। జాప్త సంకాశుఁ డమృతాశనాంగనాది**
**వృతుఁడు వీరలక్ష్మీ విరాజితుఁడు సతత। యుక్త సుఖసాధనుండు దుర్యోధనుండు.** **3**

**ప్రతిపదార్థం:** ఇంద్రుడు; తగువానిన్= తగినదూతను; రావించి= రప్పించి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; తమవారిన్= తనవారిని; చూడన్= చూడాలని; చిత్తమునన్= మనసులో; కోర్కి= కోరిక; తనికిన+అది= అతిశయించింది; నీవు+ఇతనిన్= నీవు ఇతడిని; అటన్= అక్కడికి; కొనిపోయి= తీసికొనివెళ్ళి; అఖిలబంధులన్= బంధువులందరినీ; చూపుము+అనుడున్=

చూపించుము అని చెప్పగానే; అతఁడు= ఆ సేవకుడు; గారవంబు+ఎసఁగంగన్= గౌరవం అతిశయించగా; ఆ రాజ సత్తమున్= ఆ రాజశ్రేష్ఠుడిని; తోడ్కొని పోవన్= వెంటతీసికొని వెళ్ళగా; కుతూహలమునన్= ఆసక్తితో; తోడన= వెనుకనే; నారద+ఆదులు= నారదాది మహర్షులు; కొందఱు+అరిగిరి= కొంతమంది బయలుదేరారు; అట్లు+ఏఁగెడు చోటన్= అట్లా బయలుదేరుతున్నప్పుడు; కడు+ఎదురన్= ఎట్టఎదుట; ఉన్నత+ఆసన+ఆసీనుఁడు= పెద్ద సింహాసనంమీద కూర్చున్నవాడు; అభి+ఉదిత= ఉదయించిన; సరసిజ+ఆప్త= కమల మిత్రుడైన సూర్యుడితో; సంకాశుఁడు= సమానమైనవాడు; అమృత+అశన+అంగనా+ఆది= అమృతం త్రాగే దేవతాంగనలు- అప్సరసలు మొదలైనవారితో; వృతుఁడు= కూడుకొన్నవాడు; వీరలక్ష్మీ విరాజితుఁడు= శౌర్యలక్ష్మితో ప్రకాశిస్తున్నవాడు; సతత= నిరంతరమూ; యుక్త= పొందిన; సుఖసాధనుండు= సుఖసాధనాలు కలిగిన; దుర్యోధనుండు= దుర్యోధనుడు; తోఁచెన్= కనిపించాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు తగిన దూతను రప్పించి 'ధర్మరాజుకు తనవారిని చూడాలని మనసులో కోరిక అతిశయించింది. నీవు ఇతడిని అక్కడికి తీసికొనివెళ్ళి బంధువులందరినీ చూపించుము' అని చెప్పగా ఆ దూత గౌరవం అతిశయించగా ఆ రాజశ్రేష్ఠుడిని వెంటతీసికొని వెళ్ళగా ఆసక్తితో నారదాది మహర్షులు కొందరు వెంట వచ్చారు. అట్లా బయలుదేరుతున్నప్పుడు ఎదురుగా పెద్ద సింహాసనంమీద కూర్చున్నవాడూ, ఉదయించిన సూర్యబింబంవంటి కాంతితో ప్రకాశిస్తున్నవాడూ, అప్సరఃప్రభృతి దేవకాంతా పరివృతుడూ, శౌర్యలక్ష్మీ విరాజితుడూ, ఎడతెగని సుఖసాధన సామగ్రితో అతిశయిస్తున్న దుర్యోధనుడు కనిపించాడు.

**విశేషం:** ఇక్కడి నుండి ధర్మరాజుకు మరోసారి 'శోధన' మొదలవుతుంది. మానుషభావం ఇంకా ధర్మజుడిలో బ్రదికి ఉన్నందువలన ఈ 'ప్రక్షాళన' అవసరమైనది.

**వ. ఇ ట్లొప్పియున్న యతనిం గని ధర్మనందనుండు దేవమునివరుల మొగంబు లాలోకించి. 4**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; ఒప్పి+ఉన్న= ప్రకాశిస్తున్న; అతనిన్= దుర్యోధనుడిని; కని= చూచి; ధర్మనందనుండు= ధర్మరాజు; దేవమునివరుల మొగంబులు= దేవర్షుల ముఖాలు; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇట్లా ప్రకాశిస్తున్న దుర్యోధనుడిని చూచి ధర్మరాజు దేవముని శ్రేష్ఠుల ముఖాలు చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

ధర్మజుఁడు దుర్యోధనుం జూచి యసూయాపరుం డైన, నారదుఁ డతనిం దేర్చుట (సం.18-1-4)

**సీ. 'ఇతఁ డతిలోభోపహతమానసుఁడు, దీర్ఘ। దర్శిగాఁ, డితని కతమునఁ జేసి**
**నిఖిల దేశంబుల యఖిల నృపాలురుఁ। ద్రుంగిరి దంతి తురంగ సహిత**
**ముగ, ననవద్యాంగి విగతకల్మష ధర్మ। చారిణి సాధ్విఁ బాంచాలి నార్య**
**జనములు గనుఁగొన సభలోన నవమాన। పెట్టిన తులువ; యే నిట్టివాని**

**ఆ. తోడఁ గలసి మెలఁగుదునె? మహితాత్మకు। లార! యెచట నున్నవారు భీమ**
**ఫల్గునులును గవలుఁ బాంచాలియును నన్ను। నచటి కనుపవలయు' ననుచు మరలె. 5**

**ప్రతిపదార్థం:** మహిత+ఆత్మకులార!= ఓ పుణ్యాత్ములారా!; ఇతఁడు= ఈ దుర్యోధనుడు; అతి+లోభ+ఉపహత+మానసుఁడు= మిక్కిలి లోభగుణంచేత దూషితమైన మనసున్నవాడు; దీర్ఘదర్శి+కాఁడు= దూరాలోచన ఉన్నవాడు కాదు; ఇతని కతమునన్+చేసి= ఇతడి కారణంగా; నిఖిల దేశంబుల= అన్ని దేశాల; అఖిలనృపాలురున్= రాజులందరూ; దంతి= ఏనుగులు; తురంగ= గుర్రాలు మొదలైన సైన్యంతో; సహితముగన్= కూడి; త్రుంగిరి= చనిపోయారు; అనవద్య+అంగిన్= పవిత్రమైన దేహం కలిగిన; విగత కల్మషన్= పాపాలు పోయినదానిని; ధర్మచారిణిన్= పతివ్రతను; సాధ్విన్= ఉత్తమ స్త్రీని (శీలవతిని); పాంచాలిన్= ద్రౌపదిని; ఆర్యజనములు= ఆర్యులు; కనుఁగొనన్= చూడగా; సభలోనన్= సభలో; అవమానపెట్టిన= అవమానపరచిన; తులువ= తుంటరి; ఏను+ఇట్టివానితోడన్+ కలసి= నేను ఇట్లాంటివాడితో కలిసి; మెలఁగుదునె?= ఉంటానా?; భీమ= భీముడూ; ఫల్గునులును= అర్జునుడూ; కవలున్= నకుల సహదేవులూ; పాంచాలియును= ద్రౌపదీ; ఎచటన్+ఉన్నవారు= ఎక్కడున్నారో; నన్నున్= నన్నుకూడా; అచటికిన్+అనుపన్వలయున్+ అనుచున్= అక్కడికి పంపించండి అంటూ; మరలెన్= వెనుదిరిగాడు.

**తాత్పర్యం:** ఇట్లా అన్నాడు 'ఓ పుణ్యాత్ములారా! మిక్కిలి లోభగుణంచేత దూషితమైన మనసున్నవాడు దూరాలోచనలేనివాడు ఈ దుర్యోధనుడు. ఇతడి కారణంగానే అన్ని దేశాల రాజులందరూ ఏనుగులతో, గుర్రాలతో కూడిన సైన్యంతో కూడి నశించారు. పవిత్రదేహం కలిగి రాజసూయంచేత పాపాలన్నీ పోగొట్టుకొని పరమ పతివ్రతగా, ఉత్తమ గృహిణిగా ఉన్న శీలవతి ద్రౌపదిని పెద్దలందరూ చూస్తుండగా నిండు సభలో అవమానపరచిన తుంటరి ఇతడు. నేను ఇట్లాంటి వాడితో కలిసి స్వర్గంలో ఉండటమా? నా భీమార్జున నకుల సహదేవులూ ద్రౌపదీ ఎక్కడున్నారో అక్కడికి నన్ను తీసికొని వెళ్ళండి' అంటూ వెనుదిరిగాడు.

**విశేషం:** అగ్ని సంభూత కాబట్టి ద్రౌపది 'పవిత్ర' దేహ. రాజసూయయాగంలో అవభృథస్నానం చేయటంవలన అన్ని పాపాలు నశించాయి. ఐదుగురు భర్తలతో పతివ్రతాధర్మాన్ని నిర్వహించిన కారణంగా 'ధర్మచారిణి' సంస్కారపరంగా సాధ్వి; స్వర్గంలో కూడా ధర్మరాజును 'మానుష' భావం వదలలేదు. అందుకే పూర్వకథనంతా స్మరిస్తున్నాడు.

**వ. మరలినఁ జూచి నారదుండు నవ్వుచు నతని కి ట్లనియె. 6**

**ప్రతిపదార్థం:** మరలినన్= తిరిగి వెళ్ళుతుంటే; చూచి; నారదుండు= నారదుడు; నవ్వుచున్= నవ్వుతూ; అతనికిన్= అతడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తిరిగి వెళ్ళుతుంటే చూచి నారదుడు నవ్వుతూ అతడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఓ ధర్మనందన! యీ ధరణీవిభుం। డాహవ సంపరిత్యక్త తనుఁడు**
**దేవతాసంభావ్యుఁడై వెలింగెడుఁ; బుణ్య। కర్ము లెల్లను గడు గారవింతు**
**రితని; నితండు మహీశుల నుజ్జ్వల। క్షత్రధర్మంబునఁ గాదె త్రుంచె;**
**నది పాప మే లగు? ననఘ! పాంచాలి యీ। తనిచేతఁ బడుటయుఁ దక్కుఁ గలుగు**

**తే. నెగ్గులును నింక నిచ్చట నేల తలఁప? నిచోటు పుణ్యలోకము మది నీసు రోష**
**మను మనోవికృతులు దగునయ్య! వాని। విడిచి సమత నొందుము లోకవినుతచరిత!' 7**

**ప్రతిపదార్థం:** ఓ ధర్మనందన!= ఓ ధర్మరాజా!; ఈ ధరణీ విభుండు= ఈ రాజు (దుర్యోధనుడు); ఆహవ= యుద్ధంలో; సం+పరిత్యక్త= పూర్తిగా వదలివేసిన; తనుఁడు= శరీరం కలవాడు (కనుక); దేవతా సంభావ్యుఁడు+ఐ= దేవతలచేత గౌరవించబడుతూ; వెలింగెడున్= ప్రకాశిస్తున్నాడు; పుణ్యకర్ములు+ఎల్లనున్= ధర్మకర్ములందరూ; ఇతనిన్= ఇతడిని; కడున్= మిక్కిలి; గారవింతురు= గౌరవిస్తారు; ఇతండు= ఇతడు; మహీశులన్= రాజులను; ఉత్+జ్వల= మిక్కిలి ప్రకాశించే; క్షత్ర= రాజ; ధర్మంబునన్+కాదె= ధర్మంతోనే కదా!; త్రుంచెన్= చంపాడు; అది= అట్లా చంపటం; పాపము+ఏల+అగున్?= పాపం ఎందుకు అవుతుంది?; అనఘ= పుణ్యాత్మా!; పాంచాలి= ద్రౌపది; ఈతనిచేతన్= ఇతడిచేతిలో; పడుటయున్= అవమానపడటం; తక్కున్+కలుగు= మొదలైన; ఎగ్గులునున్= దోషాలను; ఇంకన్= ఇక; ఇచ్చటన్= ఇక్కడ; తలఁపన్= తలచటం; ఏల?= ఎందుకు?; ఇచౌటు= ఈ చోటు; పుణ్యలోకము= పుణ్యాదులచేత పొందదగిన లోకం (ఇక్కడ); మదిన్= మనసులో; ఈసున్= ఈర్ష్య; రోషము= కోపం; అను= అనేటటువంటి; మనో వికృతులు= మనోవికారాలు; తగునయ్య!= యుక్తమా!; వానిన్= ఆ వికారాలను; విడిచి= వదలి; లోక వినుత!= లోకంచేత స్తుతించబడిన ఓ ధర్మరాజా!; సమతన్= సమత్వాన్ని; ఒందుము= పొందుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఈ రాజు యుద్ధంలో వదలివేసిన శరీరం కలవాడు. కనుక దేవతలచేత గౌరవించబడుతూ ప్రకాశిస్తున్నాడు. ధర్మ కర్ములందరూ ఇతడిని చాలా గౌరవిస్తారు. ఇతడు రాజులను తన క్షాత్రధర్మంతోనే కదా యుద్ధంలో చంపాడు. అట్లా చంపటం పాపం ఎట్లా అవుతుంది? పుణ్యాత్మా! ఇతడిచేత ద్రౌపది అవమానపడటం మొదలైన పాపాలను ఇంకా తలచుకొనటం ఎందుకు? ఇది పుణ్యలోకం. ఇక్కడ నీ మనసులో ఈర్ష్య, కోపం మొదలైన మనోవికారాలు ఉండవచ్చా? ఆ వికారాలను వదలి నీవు సమత్వాన్ని పొందుము.

**విశేషం: ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ,**

**పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః.**

అని ప్రమాణం. సూర్యమండలాన్ని భేదించుకొని ఊర్ధ్వలోకాలకు ప్రవేశించే అర్హత ఇద్దరికున్నది. ఒకరు యోగమార్గంలో దేహాన్ని వదిలే సన్న్యాసి. మరొకరు యుద్ధంలో శత్రువులకు వీపు చూపకుండా పోరాడి మరణించినవాడు. దుర్యోధనుడు 'సం' పరిత్యక్త తనుడు - అంటే అర్థం ఇదే. చివరికి తాను ఒకడే మిగిలినా ఓడిపోయి దాసోహమనలేదు. ఒంటరిగాపోరి దేహాన్ని గదాఘాతానికి గురై వదిలివేసినవాడు. అందుచేత అతడు స్వర్గభోగార్హు డయ్యాడు.

'సమత్వం యోగ ఉచ్యతే' అని గీతాకారుడి నిర్వచనం. నారద మహర్షి ఇక్కడ సిద్ధి - అసిద్ధి, గౌరవం - అవమానం; సుఖం - దుఃఖం ఇత్యాది ద్వంద్వభావాలను అతిక్రమించటమే యోగమని ప్రబోధిస్తున్నాడు.

'వినుత చరిత్రుఁడు' - ధర్మరాజు, అందుకే స్వర్గలోకానికి నిజదేహంతో రాగలిగాడు. కాని ఆ మానుష తనువునకు అంటుకొన్న భావాలే ఈర్ష్యాదులు. వాటిని తొలగించుకొమ్మని నారదుడి హితవు.

**వ. అని వెండియు.** **8**

**తాత్పర్యం:** అని ఇంకా మరి (ఇట్లా అన్నాడు.) (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'జూదమునఁ గయ్యమున నీ। కే దురితంబులు నితాంత హృదయ క్లేశా**

**పాదకములు వాటిల్లె న। నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా!'** **9**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; జూదమునన్= జూదంలో; కయ్యమునన్= యుద్ధంలో; నీకున్+ఏదురితంబులు= నీకు ఏ పాపకృత్యాలు; నితాంత= అత్యంత; హృదయ క్లేశ+ఆపాదకములు= హృదయానికి దుఃఖాన్ని కలిగించేవి; పాటిల్లెన్= సంభవించాయో; వానిన్= వాటిని; అన్నిటిన్= అన్నిటినీ; అనాదృతములు+చేయుము= లెక్కచేయకుము (నిరాదరణ చేయుము).

**తాత్పర్యం:** పుణ్యాత్ముడవైన ధర్మరాజా! జూదంలో, యుద్ధంలో నీకు ఏ పాపకృత్యాలు హృదయానికి అత్యంత క్లేశాన్ని కలిగించాయో వాటిని ఇప్పుడు మరలా పరిగణించవద్దు; అన్నింటిని మరచిపొమ్ము.'

**చ.** **అన విని యమ్మునీంద్రునకు నవ్విభుఁ డిట్లనుఁ 'బాపశాలి స**
**జ్జన సతతాపకారి కులసంక్షయ కారణరోషభాగి యి**
**మ్మనుజవరాధముం డితఁ డమర్త్యుల కెల్లను మాననీయుఁ డై**
**మనునటె పుణ్యలోకమున? మాటలు వేయును నేల సంయమీ!** **10**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని నారదుడు చెప్పగా విని; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ మునిశ్రేష్ఠుడితో; ఆ+విభుఁడు= ఆ ధర్మరాజు; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; సంయమీ!= ఋషీ!; పాపశాలి= పాపాత్ముడు (పరమపాపి); సత్+జన= మంచివారికి; సతత= నిరంతరం; అపకారి= అపకారంచేసినవాడు; కులసంక్షయ= వంశం నశించటానికి; కారణ= కారణమైన; రోషభాగి= కోపశీలి (ముక్కోపి); ఈ+మనుజవర+అధముండు= ఈ రాజాధముడు; ఇతఁడు= ఇట్లాంటి దుర్యోధనుడు; అమర్త్యులకున్+ఎల్లను= దేవతలందరికీ; మాననీయుఁడు+ఐ= గౌరవాస్పదుడై; పుణ్యలోకమునన్= ఈ స్వర్గంలో; మనునటె?= ఉండటమా?; మాటలు వేయునున్+ఏల?= ఎక్కువగా చెప్పట మెందుకు?

**తాత్పర్యం:** అని నారదుడు చెప్పగా విని అతడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు. 'ఓ మునీ! పరమపాపి, మంచివారికి నిరంతరం అపకారం చేసినవాడు, వంశం నాశనం కావటానికి కారణమైన కోపశీలి ఈ రాజాధముడు. ఇట్లాంటి దుర్యోధనుడు దేవతలకు పూజనీయుడై స్వర్గంలో ఉండటమా! ఎక్కువగా చెప్పట మెందుకు?

**తే.** **అతని నట్లుండనిమ్ము; నా యనుజతనుజ। మిత్ర జనములఁ బాంచాలపుత్త్రి నా క**
**వశ్యమును నభివీక్షింప వలయుఁ జూపఁ। బనుపు వారల యున్నెడ భవ్యచరిత!'** **11**

**ప్రతిపదార్థం:** భవ్యచరిత!= పుణ్యచరిత్రగల నారదమహర్షీ!; అతనిన్+అట్లు+ఉండన్+ఇమ్ము= అతనిని అట్లా ఉండనిమ్ము; నా+అనుజ= నా తమ్ములను; తనుజ= కుమారులను; మిత్రజనములన్= మిత్రులను; పాంచాల పుత్త్రిన్= ద్రౌపదిని; నాకున్= నేను; అవశ్యమును= తప్పకుండా; అభివీక్షింపవలయున్= కనులారా చూడాలి; చూపన్= నాకు చూపటానికి; వారల+ఉన్నఎడ= వారున్నచోటికి; పనుపు= నన్ను పంపించుము.

**తాత్పర్యం:** పుణ్యచరిత్రగల నారదమహర్షీ! అతడు అట్లా సుఖిస్తూ ఉండనీ నా కేమి? నా తమ్ములను, కుమారులను, మిత్రులను, ద్రౌపదిని నేను తప్పకుండా కనులారా చూడాలి. అందుచేత నన్ను వా రున్నచోటికి పంపించుము.'

**వ.** **అని మఱియుం గలుగు మునీంద్రులఁ గలయం గనుంగొని.** **12**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి!; మఱియున్+కలుగు= ఇంకా అక్కడున్న; ముని+ఇంద్రులన్= మునిశ్రేష్ఠులను; కలయన్= అందరినీ బాగా; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా అక్కడున్న మునిశ్రేష్ఠులందరినీ బాగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

ధర్మజుఁడు దేవమునులను గర్ణాది స్వజనులఁ జూప వేఁడుకొనుట (సం.18-3-6)

**సీ.** **'సంగ్రామ మృతులైన సకలబంధులకుఁ ది। లోదకం బే నిచ్చుచుండ వచ్చి**
**కుంతి కర్ణుఁడు తన కొడు కని చెప్పి నా। కతని జన్మము తెఱం గంతవట్టు**
**విదితంబుగాఁ జేసె నది మొదలుగ నమ్మ। హావీరుఁ దలఁచిన యప్పు డెల్ల**
**నుల్లంబు సంతాప మొందుఁ దదీయపా। దంబు లద్దేవి పాదంబులట్ల**

**ఆ** **యని సభక్తికముగ నర్చితంబులు సేయఁ। గానకునికి నేను గరము వగతు;**
**నతఁడు నేము నైన నమరేంద్రుఁడును మమ్ముఁ। జెనయునే త్రిలోకసేవ్యులార!** **13**

**ప్రతిపదార్థం:** త్రిలోక సేవ్యులార!= త్రిలోకాలలోనూ సేవించదగినవారైన ఋషులారా!; సంగ్రామ మృతులు+ఐన= యుద్ధంలో చనిపోయిన; సకలబంధులకున్= బంధువులందరికీ; ఏను= నేను; తిల+ఉదకంబు+ఇచ్చుచుండన్= తిలోదకమిస్తుండగా; వచ్చి= అక్కడికి వచ్చి; కుంతి= మా తల్లి కుంతీదేవి; కర్ణుఁడు; తన కొడుకు+అని+చెప్పి= తన కుమారుడని చెప్పి; నాకున్= నాకు; అతని= ఆ కర్ణుడి; జన్మము తెఱంగు= పుట్టుకతీరు; అంత+పట్టు= అంతా; విదితంబుగాన్+చేసెన్= తెలిపింది; అది మొదలుగన్= అప్పటినుండి; ఆ+మహావీరున్= ఆ మహావీరుడిని; తలఁచిన+అప్పుడు+ఎల్లన్= తలచుకొన్నపుడంతా; ఉల్లంబు= హృదయం; సంతాపము+ ఒందున్= సంతాపాన్ని పొందుతున్నది; తదీయపాదంబులు= అతడి పాదాలను; ఆ+దేవి పాదంబులట్లు+అని= మా అమ్మ పాదాలవలె; సభక్తికముగన్= భక్తితో; అర్చితంబులు+చేయన్= పూజించటానికి; కానక+ఉనికి= వీలుకాక; నేను; కరము= మిక్కిలి; వగతున్= బాధపడుతుంటాను; అతఁడున్+ఏమున్+ఐనన్= అతడు మేము కలిస్తే; అమర+ఇంద్రుండును= ఇంద్రుడుకూడా; మమ్మున్= మమ్ములను; చెనయునే?= ఎదిరించగలడా?

**తాత్పర్యం:** 'త్రిలోకాలలోనూ సేవించతగిన ఋషివర్యులారా! ఒక విషయం వినండి. యుద్ధంలో చనిపోయిన బంధువులందరికీ నేను తిలతర్పణం చేస్తున్న సమయంలో మా అమ్మ కుంతీదేవి అక్కడికి వచ్చి కర్ణుడు తన కొడుకని తెలిపి, నాకు అతడి జన్మ రహస్యమంతా చెప్పింది. అప్పటినుండి ఆ మహావీరుడిని తలచుకొన్నప్పుడెల్లా నా హృదయం సంతాపాన్ని పొందుతున్నది. అతడి పాదాలను మా అమ్మపాదాలవలె భక్తితో పూజించటానికి వీలుకాక నేను చాలా బాధపడుతుంటాను. అతడూ మేమూ కలిస్తే మహేంద్రుడైనా మమ్ములను ఎదిరించగలడా?

**విశేషం:** ధర్మరాజు మొదట కోరుకొన్నది తమ్ముళ్ళను చూడాలని, తరువాత భార్యను, తరువాత మిత్రులను, ఆ తరువాత పుత్రులను, ఇప్పుడు కర్ణుడిని చూడాలంటున్నాడు. పైగా అతడు తమతో ఉండిఉంటే కొరవు లేమిటి? ఇంద్రుడు కూడా ఎదిరించజాలి ఉండేవాడు కాడని చెప్పుతున్నాడు. శత్రుజయం మీద ఎంత తీవ్రకాంక్ష ధర్మరాజులో ఉండేదో దీనినిబట్టి అర్థం చేసికొనవచ్చును. అందుకే ధర్మరాజును 'శాత్రవజైత్రతేజంతో' పుట్టాడని నన్నయగారు వర్ణించారు.

**చ.** **అతని నెఱుంగకుండి వినుఁ డర్జునుఁ బంచితి నమ్మహాత్మునిన్**
**మృతుఁడుగఁ జేయఁగా; నది శమింపదు శోకము నావహించుచున్;**

**మతికి నలంత సేయు గుణమాన్యుని నాతనిఁ జూచు కౌతుకం**
**బతిశయ మొందుచున్న యది; యాయన యెచ్చట నుండుఁ? జెప్పరే! 14**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; అతనిన్+ఎఱుంగక+ఉండి= అతడు మా అన్న అని తెలియక; ఆ+మహాత్మునిన్= ఆ మహనీయుడిని; మృతుఁడుగన్+చేయఁగాన్= చంపటానికి; అర్జునున్+పంపితిన్= అర్జునుడిని పంపాను; అది= ఆ పాపం; శోకమున్+ఆవహించుచున్= దుఃఖాన్ని కలుగజేస్తూ; శమింపదు= ఉపశమనం పొందటం లేదు; మతికిన్= మనసుకు; అలఁతన్= వ్యథను; చేయున్= కలగజేస్తున్నది; ఆతనిన్+చూచు= అతడిని చూడాలన్న; కౌతుకంబు= కుతూహలం; అతిశయము+ ఒందుచున్న+అది= అతిశయమవుతున్నది; ఆయన= ఆ మహనీయుడు; ఎచ్చటన్+ఉండున్= ఎక్కడుంటాడో; చెప్పరే!= చెప్పండి!

**తాత్పర్యం:** ఋషులారా! ఇంకా ఒక విషయం వినండి. అతడు మా అన్న అని తెలియక ఆ మహనీయుడిని చంపటానికి అర్జునుడిని పంపాను. ఆ పాపం నిరంతర దుఃఖాన్ని కలగజేస్తూ ఉపశమించకుండా ఉన్నది. మనసుకు వ్యథను కలగజేస్తున్నది. అతడిని చూడాలన్న కోరిక రానురాను అతిశయిస్తున్నది. ఆ మహానుభావుడు ఎక్కడుంటాడో చెప్పండి!

**వ. ద్రుపద విరాట యుధామన్యులు, శంఖ ప్రభృతి తదీయజ్ఞాతులును రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు; వారల నాకుం జూడవలదే ప్రాణసముండగు జగత్ప్రాణ నందనుని సంక్రందన తేజోవిరాజితుండగు శ్వేతాశ్వుని. నశ్వుల ననుకరించు నకుల సహదేవులను, సహజ సద్గుణ శాలిని యగు పాంచాలినిం జూడక నిలువం జాలుదునె? వారి కెవ్వరికిని నాకలోక నివాసంబు లేక తక్కెనేని సోదర రహిత స్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు; వార లెచ్చోటనుండి రచ్చోట యేను పుణ్యలోకంబుగాఁ దలంచెద; నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా!' యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లిట్లనిరి. 15**

**ప్రతిపదార్థం:** ద్రుపద విరాట యుధామన్యులు= ద్రుపదుడు, విరటుడు, యుధామన్యుడు; శంఖప్రభృతి= శంఖుడు మొదలైన; తదీయ=వారి; జ్ఞాతులును= దాయాదులు; రణ+అగ్నికిన్= యుద్ధమనే అగ్నిలో; ప్రాణహవిస్సులు= ప్రాణాలనే హవిస్సులను; వేల్చినవారు= హోమం చేసినవారు; వారలన్= వారిని; నాకున్+చూడన్‌వలదే?= నేను చూడవద్దా!; ప్రాణసముండు+అగు= నా ప్రాణంతో సమానమైన; జగత్+ప్రాణ+నందనునిన్= జగత్తుకు ప్రాణమిచ్చే వాయు కుమారుడైన భీముడిని; సంక్రందన= ఇంద్ర; తేజో విరాజితుండు+అగు= తేజస్సుతో ప్రకాశించే (ఇంద్ర తనయుడైన); శ్వేతాశ్వునిన్= తెల్లని గుర్రాలుగల అర్జునుడిని; అశ్వులన్= అశ్వినీ దేవతలను; అనుకరించు= పోలిన (అశ్వినీ దేవతల కుమారులైన); నకుల సహదేవులను; సహజ సద్గుణశాలిని+అగు= పుట్టుకతోనే సద్గుణ శీలి అయిన; పాంచాలినిన్= ద్రౌపదిని; చూడక= చూడకుండా; నిలువన్+చాలుదునె?= నిలువగలనా?; వారికిన్+ఎవ్వరికిని= వారికెవ్వరికీ; నాకలోక= స్వర్గలోక; నివాసంబు= నివాసం; లేక తక్కెనేని= లేకుండా పోయినట్లయితే; సోదర రహిత స్వర్గంబునందున్= తమ్ములు లేని స్వర్గలోకంలో; స్వర్గత్వ బుద్ధి= ఇది స్వర్గమనే బుద్ధి; పుట్టదు+అయ్యెడున్= పుట్టదు; వారలు= వారు; ఎచ్చోటన్+ఉండిరి= ఎక్కడుంటారో; అచ్చోట= ఆ చోటునే; ఏను= నేను; పుణ్యలోకంబు= స్వర్గం; కాన్= వలె; తలంచెదన్= భావిస్తాను; అయ్యెడకున్= ఆ చోటికి; అనిమిషవర్యులారా!= దేవతా శ్రేష్ఠులారా!; అనిచి పుచ్చుండు= పంపించండి; అని పలికినన్= అని అడుగగా; ఆ+దేవమునులు= ఆ దేవఋషులు; ఆ+పాండవ+ అగ్రజుతోన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** 'ద్రుపదుడు, విరాటుడు, ద్రుపదుడి కుమారుడైన యుధామన్యుడు, శంఖుడు మొదలైన వారి దాయాదులు యుద్ధమనే అగ్నిలో తమ ప్రాణాలనే హవిస్సులను ధారపోశారు. వారిని నేను చూడవద్దా! నా ప్రాణంతో సమానుడైన

వాయునందనుడిని, ఇంద్రతేజంతో ప్రకాశించే అర్జునుడిని, అశ్వినీదేవతలను పోలిన నకుల సహదేవులను, సహజ సద్గుణశీలి పాంచాలిని చూడకుండా నిలువగలనా? వారి కెవ్వరికీ స్వర్గలోక నివాసం లేకపోయినట్లయితే తమ్ములు లేని స్వర్గంలో ఇది స్వర్గమనే బుద్ధి పుట్టనే పుట్టదు. వారు ఎక్కడుంటారో ఆ చోటే నాకు స్వర్గం. దేవతాశ్రేష్ఠులారా! నన్ను అక్కడికి పంపించండి' అని ప్రార్థించగా దేవమునులు ధర్మరాజుతో ఇట్లా చెప్పారు. (రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు-రూపకం)

**ఆ. 'అట్ల చేయువార మమలాత్మ! నీదు చి। త్తమున నేది దోఁచె దాని నాచ**
**రింప వలయు నని నిలింపేశ్వరుండు పా। టించి మాకు నప్పగించినాఁడు. 16**

**ప్రతిపదార్థం:** అమల+ఆత్మ!= నిర్మలమైన ఆత్మగల ఓ ధర్మరాజా!; అట్ల= అట్లాగే; చేయువారము= చేస్తాము; నీదు= నీ; చిత్తమునన్= మనసులో; ఏది+తోఁచెన్= ఏది తోస్తుందో; దానిన్+ఆచరింపవలయున్+అని= దానిని చేయాలని; నిలింప+ఈశ్వరుండు= దేవతల ప్రభువు (ఇంద్రుడు); పాటించి= పూని; మాకున్= మాకు; అప్పగించినాఁడు= ఆ పని చేసిపెట్టుమని అప్పగించాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! అట్లాగే చేస్తాము. నీ మనసులో ఏ కోరిక పుట్టుతుందో దాని ప్రకారం చేయాలని పూని ఇంద్రుడు ఆ పని చేసి పెట్టండని నిన్ను మాకు అప్పగించాడు.'

**విశేషం:** అది స్వర్గలోకం. అక్కడ అన్నీ చిత్రంగానే ఉంటాయి. అన్ని లోకాలనూ అక్కడే ప్రత్యక్షంచేయగల దేవమాయ అక్కడ ఉన్నది. అందుకే ధర్మరాజు సంకల్పంలో నిగూఢంగా ఉన్న ఆలోచనలు అక్కడ రూపాన్ని పొందుతున్నాయి. ఋషులమాటలకు అర్థం ఇదే.

**సీ. అని దేవదూతునిఁ గనుఁగొని 'యిమ్మహి। తాత్ముని భీమసేనార్జునాదు**
**లున్నచోటికి నన్ను 'మన్న నప్పురుషుఁ డా। దర మెసఁగంగ నా ధర్మతనయు**
**నిందు ర మ్మనుచుఁ దా ముందటఁ జన నమ్మ। హానుభావుఁడు వాని ననుగమించె;**
**నట్లు సనంగఁ గేశాస్థిసాంద్రంబు దు। ర్గం ధంబుఁ బరుషతరంబు దంశ**

**ఆ. మశక నిబిడమును దమఃకలితముఁ గ్రిమి। కీట రక్తమాంస కూట కుణప**
**ఘోరవిధము శాత దారుణ చంచు వా। యసరవాన్వితంబు నయ్యెఁ బథము. 17**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; దేవదూతునిన్= దేవదూతను; కనుఁగొని= చూచి; ఈ+మహిత+ఆత్మునిన్= ఈ మహనీయుడిని; భీమసేన+అర్జున+ఆదులు= భీముడు, అర్జునుడు మొదలైనవారు; ఉన్నచోటికిన్= ఉన్నచోటికి; అన్నుము+అన్నన్= తోడుగా తీసి కొని వెళ్ళుము అని అనగా; ఆ+పురుషుఁడు= ఆ దూత; ఆదరము+ఎసఁగంగన్= ఆదరం అతిశయించగా; ఆ ధర్మతనయున్= ఆ ధర్మరాజును; ఇందున్+రమ్ము+అనుచున్= ఇట్లా రండి అంటూ; తాన్+ముందటన్+చనన్= తాను ముందట వెళ్ళగా; ఆ+ మహానుభావుఁడు= ఆ ధర్మరాజు; వానిన్= ఆ దూతను; అనుగమించెన్= అనుసరించి వెళ్ళాడు; అట్లు+చనఁగన్= అట్లావెళ్ళగా; పథము= ఆ దారి; కేశ+అస్థిసాంద్రంబు= వెంట్రుకలు; ఎముకలచేత దట్టమైనది; పరుషతరంబు= అతికఠినంగా ఉన్నదీ; దంశ= దోమలతో; మశక= ఈగలతో; నిబిడమును= నిండినదీ; తమస్+కలితము= చీకటితో నిండినదీ; క్రిమి= క్రిములతోను; కీట= పురుగులతోనూ; రక్త= రక్తంతోను; మాంస= మాంసంతోను (నిండిన); కూట= గుట్టలు కలిగింది; కుణప= శవాలతో; ఘోర

విధము= భయంకరంగా; శాత= వాడిగా ఉన్న; దారుణ= భీషణమైన; చంచు= ముకుపుటాలు కలిగిన; వాయస= కాకుల; రవ+అన్వితంబున్= అరపులతో కూడినదీ; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** అని చెప్పి దేవదూతను చూచి 'ఈ మహనీయుడిని భీమార్జునాదులు ఉన్నచోటికి తోడుగా తీసికొనివెళ్ళుము' అని చెప్పగా ఆ దూత ఆదరం అతిశయించగా ఆ ధర్మరాజును 'ఇట్లా రండి!' అంటూ తాను ముందట దారి తీస్తూ వెళ్ళగా ధర్మరాజు ఆ దూతను అనుసరించి వెళ్ళాడు. అట్లా వెళ్ళుతుండగా ఆ దారి వెంట్రుకలచేత, ఎముకలచేత దట్టంగా ఉన్నది. అతిహేయంగా దోమలతో, ఈగలతో నిండింది. చీకటిగా ఉన్నది. క్రిములతో, పురుగులతో రక్తమాంసాల గుట్టలతో, శవాల దుర్గంధంతో, భయంకరంగా వాడిగా ఉన్న భీషణమైన ముకుపుటాలు కలిగిన కాకుల అరపులతో కూడిందిగా అయింది.

**వ. అప్పథంబునఁ బాండవాగ్రజుండు చనిచని యారంగ్రాఁగిన నూనియ వోలెం దెరలుచున్న జలంబులు గలిగి యాయస కంటక దుస్స్పర్శంబగుచుఁ దటంబున నిశితాసి పత్త్రవనంబు శోభిల్ల వైతరణియను పేరఁ బరఁగిన యేఱును దత్ప్రదేశంబున ననేక ప్రకార యాతన లనుభవించు పాప కర్ములనుం జూచి దేవదూతునితో 'మనకుఁ బోవలయు చోటింక నెంత దవ్వుగల? దియ్యెడయును దేవతాధీనంబై యుండునే?' యని యడిగిన నప్పురుషుం డతనితోడ. 18**

**ప్రతిపదార్థం:** ఆ+పథంబునన్= ఆ దారిలో; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; చని చని= పోయి పోయి; ఆరన్+క్రాఁగిన= సలసల కాగిన; నూనియ పోలెన్= నూనెవలె; తెరలుచున్న= తెర్లుతున్న; జలంబులు కలిగి= నీళ్ళుకలిగి; ఆయస= ఇనుముతో చేసినట్లున్న; కంటక= ముండ్లతో; దుస్+స్పర్శంబు+అగుచున్= తాకటానికి వీలుకాకుండా ఉన్న; తటంబునన్= ఒడ్డులో; నిశిత+అసి= వాడిగా ఉన్న కత్తులవలె ఉన్న; పత్త్ర= ఆకులతో నిండిన; వనంబు= అడవి; శోభిల్లన్= ఒప్పగా; వైతరణి+అను పేరన్= వైతరణి అనే పేరుతో; పరఁగిన= ప్రసిద్ధమైన; ఏఱును= నది; తద్+ప్రదేశంబునన్= ఆ చోట; అనేక ప్రకార= నానా విధాలైన; యాతనలు= బాధలు; అనుభవించు= అనుభవిస్తున్న; పాపకర్ములనున్+చూచి= పాపకర్మలు చేసినవారిని చూచి; దేవదూతునితోన్= దేవదూతతో (ధర్మరాజు ఇట్లా అన్నాడు); మనకున్= మనం; పోవలయుచోటు= వెళ్ళవలసిన చోటు; ఇంకన్+ఎంత దవ్వుకలదు?= ఇక ఎంత దూర మున్నది?; ఈ+ఎడయును= ఈ చోటుకూడా; దేవతా+అధీనంబు+ఐ= దేవతల అధీనంలోనే; ఉండునే!= ఉంటుందా!; అని అడిగినన్= అని అడుగగా; ఆ+పురుషుండు= ఆ దూత; అతనితోడన్= ఆ ధర్మరాజుతో (ఇట్లా చెప్పాడు).

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ దారిలో వెళ్ళి వెళ్ళి బాగా మరగ గాచిన నూనెవలె తెర్లుతున్న నీళ్ళు కలిగి ఇనుపముక్కలవంటి ముండ్లతో తాకటానికీ దారుణంగా ఉన్న ఒడ్డుతో వాడి కత్తులవలె ఉన్న ఆకులతో కూడిన అడవి ఒప్పగా, వైతరణి అనే పేరున్న నదిని సమీపించారు. అక్కడ నానావిధాలైన శిక్షలను అనుభవిస్తున్న పాపకర్ములను చూచి దేవదూతతో 'మనం వెళ్ళవలసిన చోటు ఇక ఎంత దూరం ఉన్నది? ఈ చోటుకూడా దేవతల అధీనంలోనే ఉన్నదా?' అని అడిగాడు. అందుకు దేవదూత ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** నరకం అధోలోకమని అక్కడే యమయాతనలు పడే పాపిష్ఠులు ఉంటారని ధర్మరాజు కూడా భావిస్తున్నాడు. అందుకే ఈ చోటు స్వర్గవాసులైన దేవతల అధీనంలో ఎట్లా ఉంటుందని ప్రశ్న పుట్టింది ధర్మరాజుకు. అక్కడ తన వారు ఎందుకుంటారని ధర్మరాజు ధీమా. అందుకే దూతను అట్లా అడగటం.

**తే. 'ఈ నెలవును బృందారకాధీన; మిదియ। మనకు రావలసిన చో' టనిన నతం డ**
**సహ్య దుర్గంధ ఘోర దర్శనత నచొటు। చిత్త మతిదుఃఖితంబుగఁ జేయుటయును. 19**

**ప్రతిపదార్థం:** ఈ నెలవును= ఈ చోటుకూడా; బృందారక+అధీనము= దేవతల అధీనంలోనే ఉన్నది; ఇదియ= ఇదే; మనకున్= మనం; రావలసినచోటు; అనినన్= అనగా; అతండు= ధర్మరాజు; అసహ్య= సహించటానికి వీలులేని; దుర్గంధ= దుర్గంధంతో కూడిన; ఘోర దర్శనతన్= ఆ ఘోర దృశ్యాన్ని చూడటంవలన; అచొటు= ఆ చోటు; చిత్తము= చిత్తాన్ని; అతిదుఃఖితంబుగన్= చాలా బాధపడినదిగా; చేయుటయును= చేయగా.

**తాత్పర్యం:** 'ఈ చోటుకూడా దేవతల అధీనంలోనే ఉన్నది. మనం రావలసిన చోటు ఇదే' అని ఆ దేవదూత చెప్పాడు. భరించటానికి వీలులేకుండా దుర్గంధం నిండిపోయిన ఆ ఘోరదృశ్యాన్ని చూడటంవలన ధర్మరాజు మనసు వ్యథతో బాధపడింది. అప్పుడు.

**వ. మరలి పోవం జూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు. 20**

**ప్రతిపదార్థం:** మరలిపోవన్= తిరిగిపోవటానికి; చూచినన్= ప్రయత్నించగా; అయ్యెడన్= ఆ ప్రదేశంలో; కొన్ని+ఎలుంగులు= కొన్ని కంఠస్వరాలు (వినిపించాయి).

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ ఘోరాన్ని చూడలేక మరలిపోదామనుకొన్నాడు. అంతలో అచ్చట కొన్ని కంఠస్వరాలు (వినిపించాయి).

**తే. 'భవ్యజనన! నీ గాత్రము దివ్యసౌర। భంబు బెరసిన గాడ్పు మాపైఁ గరంబు**
**హృద్య మై వీచుటయు దుఃఖ మెల్లఁ బాసె। భూరి సౌఖ్యంబు నొందుచున్నార మేము. 21**

**ప్రతిపదార్థం:** భవ్యజనన!= పవిత్రజన్మ కలవాడా!; నీ గాత్రము= నీ దేహంయొక్క; దివ్యసౌరభంబు= దివ్యమైన పరిమళం; బెరసిన= కలిసిన; గాడ్పు= గాలి; మాపైన్= మా మీద; కరంబు= మిక్కిలి; హృద్యము+ఐ= సంతోషకరమై; వీచుటయున్= వీచగా; దుఃఖము+ఎల్లన్+ పాసెన్= మా దుఃఖమంతా పోయింది; భూరి= మిక్కిలి; సౌఖ్యంబున్= సుఖాన్ని; మేము; ఒందుచున్నారము= పొందుతున్నాం.

**తాత్పర్యం:** 'ఓ పుణ్య చరిత్రుడా! నీ దేహానికున్న దివ్య పరిమళంతో కూడిన గాలి మా మీద సంతోషకరమై వీచగా మా దుఃఖాలన్నీ పటాపంచలయ్యాయి. మేము చాలా సుఖాన్ని పొందుతున్నాం.

**విశేషం:** ధర్మజుడు పుణ్యాత్ముడు - ఆ పుణ్యమే సుగంధం. పాపమే దుర్గంధం.

**క. నినుఁ జూడఁ గనుటఁ బటుయా। తనలం దొరఁగితిమి పరమధర్మాత్మక! నీ**
**వనయము దయ నిచ్చట నిలి। చిన బ్రదుకుదు; మింకఁ గొంత సేపు నిలువవే!' 22**

**ప్రతిపదార్థం:** పరమ ధర్మాత్మక!= ఉత్తమ ధర్మస్వరూపుడా!; నినున్= నిన్ను; చూడన్+కనుటన్= చూడగలగటంవలన; పటుయాతనలన్= భయంకరమైన బాధలను; తొరఁగితిమి= పోగొట్టుకొన్నాం; నీవు+అనయమున్= నీవు ఎల్లప్పుడూ; దయన్=

దయతో; ఇచ్చుటన్= ఇక్కడ; నిలిచినన్= నిలిస్తే; బ్రదుకుదుము= బ్రతుకుతాం; ఇంకన్= ఇంకా; కొంతసేపు; నిలువవే!= నిలువకూడదూ! (దయతో నిలువుము!)

**తాత్పర్యం:** ఉత్తమ ధర్మస్వరూపుడా! నిన్ను చూడగలగటంవలన భయంకరమైన బాధలను మేము దూరంచేసికొన్నాం. నీవు ఎప్పుడూ ఇక్కడే ఉంటే మేము బ్రతుకుతాం. ఇంకా కొంచెంసేపు నీవు ఇక్కడే దయచేసి ఉండుము.'

ధర్మరాజు నరకమున నున్న యన్నదమ్ముల నెఱిఁగి పరితపించుట (సం.18-2-36)

**వ.** **అని దుఃఖ భార కృపణంబు లగుచు వీతెంచినఁ గౌంతేయాగ్రజుం 'డోహో! యెంతబెట్టిదంబులైన యిడుమలం బడియెదరో వీర' లని కారుణ్యం బొలయ నిలిచి, వెండియు నత్తెఱంగు మాటలు విని 'మీ రెవ్వ?' రని యడిగినఁ 'గర్ణుండ భీమసేనుండ నర్జునుండ నకులుండ సహదేవుండ ద్రౌపదిని ధృష్టద్యుమ్నుండ ద్రౌపదేయుల' మను పలుకు లెసంగుటయు.** **23**

**ప్రతిపదార్థం:** అని; దుఃఖ= దుఃఖంయొక్క; భార= భారంచేత; కృపణంబులు+అగుచున్= అతిదీనంగా; వీతెంచినన్= వినరాగా; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; ఓహో!= అయ్యో!; ఎంత బెట్టిదంబులు+ఐన= ఎంత క్రూరమైన; ఇడుమలన్= కష్టాలను; వీరలు= వీరు; పడియెదరో= పడుతున్నారో; అని; కారుణ్యంబు+ఒలయన్+నిలిచి= కారుణ్యం పుట్టగా; అక్కడే నిలబడి; వెండియున్=మరలా; ఆ+తెఱంగు మాటలు విని= అదే విధమైన పలుకులు విని; మీరు+ఎవ్వరు+అని= మీ రెవ రని; అడిగినన్= అడుగగా; కర్ణుండన్= నేను కర్ణుడిని; భీమసేనుండన్= నేను భీమసేనుడిని; అర్జునుండన్= నేను అర్జునుడిని; నకులుండన్= నేను నకులుడిని; సహదేవుండన్= నేను సహదేవుడిని; ద్రౌపదిన్= నేను ద్రౌపదిని; ధృష్టద్యుమ్నుండన్= నేను ధృష్టద్యుమ్నుడిని; ద్రౌపదేయులము= మేము ద్రౌపది పుత్రులం; అను= అన్న; పలుకులు= మాటలు; ఎసంగుటయున్= పుట్టగా.

**తాత్పర్యం:** అని దుఃఖభారంచేత అతిదీనంగా వినరాగా ధర్మరాజు 'అయ్యో! వీరు ఎంత క్రూరమైన కష్టాలు పడు తున్నారో!' అని కరుణ పుట్టగా అక్కడే నిలబడ్డాడు. మళ్ళీ అవే మాటలే వినబడ్డాయి. ధర్మరాజు మీరెవరని అడిగాడు. 'నేను కర్ణుడిని, నేను భీముడిని, నేను అర్జునుడిని, నేను నకులుడిని, నేను సహదేవుడిని, నేను ద్రౌపదిని, నేను ధృష్టద్యుమ్నుడిని, మేము ద్రౌపదీ కుమారులం' అన్న మాటలు వినిపించాయి.

**విశేషం:** దుర్యోధనుడు స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తూ కనిపించగా పాండవులు నరకరూపంలో కనిపించటంలోని తాత్పర్యమే ఈ పర్వంలోని ప్రధానాంశం.

**సీ.** **ధర్మనందనుఁడు చిత్తమ్మున నుద్వేగ । మావహిల్లఁగ 'దైవ మకట! యిట్లు**
**సేసెనే? కీ డేమి చేసిరొకో వీర । లిన్నరకమునకు నేఁగుదేర**
**వలసినయట్టిది? వాసవాద్యమరులు । నీచులు వో వీరి నే విచార**
**మించుకయును లేక యిట్టి కష్టపుటిడు । మలఁ బెట్టెడిదె? ధర్మమా! తెఱంగు**

**తే.** **మాలితే నీవు సజ్జనమాన్యు లలఘు । సత్యపరులు దయాఢ్యులు నిత్యదాన**
**రతులు బహుదక్షిణాంచిత క్రతువితాన । పావితాత్ము లనర్హంపుఁబాటు వడిరి.** **24**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుఁడు= ధర్మరాజు; చిత్తమ్మునన్= మనసులో; ఉద్వేగము= వ్యాకులత; ఆవహిల్లఁగన్= పుట్టగా; దైవము= దేవుడు; ఇట్లు+చేసెనే!= ఇట్లా చేశాడా!; వీరలు= ఈ పాండు తనయులు, ద్రౌపది మొదలైన వీరు; ఈ నరకమునకున్+ఏఁగుదేరన్= ఈ నరకానికి రావటానికి; వలసిన అట్టిది= రావలసినటువంటి; కీడు= అపకారం; ఏమి చేసిరొకో= ఏం చేశారో; వాసవ+ఆది+అమరులు= ఇంద్రాది దేవతలు; నీచులు+పో!= నీచులు సుమా!; వీరిని+ఏ విచారము+ఇంచుకయును లేక= వీరిని ఏ ఆలోచనా కొంచెంకూడా లేకుండా; ఇట్టి= ఇట్లాంటి; కష్టము+ఇడుమలన్= కఠినమైన కష్టాలలో; పెట్టెడిదె?= పెట్టటమా?; ధర్మమా!= ఓ ధర్మమా!; నీవు; తెఱంగు= పద్ధతి (న్యాయం); మాలితే!= వదలివేశావా!; సజ్జన= మంచివారిచేత; మాన్యులు= గౌరవించదగినవారు; అలఘు= గొప్ప; సత్యపరులు= సత్యనిష్ఠ కలవారు; దయా+ఆఢ్యులు= దయాగుణ సంపన్నులు; నిత్యదానరతులు= నిత్యమూ దానం చేయటంలో అభిలాష ఉన్నవారు; బహు= మిక్కిలిగా; దక్షిణా= దక్షిణలతో; అంచిత= ఒప్పిన; క్రతువితాన= యజ్ఞ సముదాయాలచేత; పావిత+ఆత్ములు= పవిత్రం చేయబడిన ఆత్మలు కలవారు; అనర్హము+పాటు+పడిరి= తగని కష్టాలు పడ్డారు.

**తాత్పర్యం:** ధర్మరాజు చిత్తంలో వ్యాకులత్వం పుట్టగా 'దేవుడు ఇట్లా చేశాడా! అయ్యో! అయినా వీరు ఈ నరకానికి రావటానికి తగిన పాపాలు ఏం చేశారు? ఇంద్రాది దేవతలు చాలా నీచులు సుమా! లేకపోతే వీరిని ఏ ఆలోచనా కొంచెంకూడా లేకుండా ఇట్లాంటి క్రూరమైన కష్టాలకు గురిచేస్తున్నారు. ఓ ధర్మమా! నీవు న్యాయం వదలివేశావా? మంచివారిచేత గౌరవించబడిన గొప్ప సత్య నిష్ఠకలవారు, దయాగుణ సంపన్నులు, నిత్యదానశీలురు, మిక్కిలిగా భూరిదక్షిణలతో ఒప్పిన యాగ సముదాయాలచేత పవిత్రీకరించబడిన ఆత్మలు కలవారు - అయినా, వీరు తగని కష్టాల పాలయ్యారు పాపం!

**చ.** **ఒకటను మేలు సేయని సుయోధనుఁ డమ్మెయి దేవపూజ్యుఁ డై**
**సకలసుఖానుభూతియు నజస్రము పెంపు వహింప నొప్పి దృ**
**ష్టికిఁ గడు వ్రేఁకనై తనదు చెల్వలుఁ జుట్టలుఁ దాను సంతసం**
**బు కలిమి నేచి మి న్నడిచి పుణ్యపదావృతుఁడై వెలింగెడున్.** **25**

**ప్రతిపదార్థం:** ఒకటనున్= ఒక విషయంలోకూడా; మేలు+చేయని= ఎవరికీ మేలు చేయని; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ఆ+ మెయిన్= అట్లా; దేవపూజ్యుఁడు+ఐ= దేవతలకు పూజనీయుడై; సకల= అన్ని; సుఖ= సుఖాల; అనుభూతియున్= అనుభవాన్ని(పొంది); అజస్రము= ఎడతెగని; పెంపువహింపన్+ఒప్పి= గొప్పతనంతో కూడి ప్రకాశిస్తూ; దృష్టికిన్+కడు+వ్రేఁకనై= చూడటానికి చాలా దుర్భరంగా; తనదు= తన; చెల్వలున్= స్త్రీలూ; చుట్టలున్= బంధువులూ; తానున్= తానూ; సంతసంబు కలిమిన్= సంతోషంతో; ఏచి= విజృంభించి; మిన్ను+అడిచి= ఆకాశాన్ని లొంగదీసి (అంత పొడవు పెరిగి - సంతోషంతో అతిశయించి); పుణ్యపద+ ఆవృతుఁడు+ఐ= దేవతలచేత చుట్టుకొనబడినవాడై; వెలింగెడున్= ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఒక్క విషయంలో కూడా ఎవరికీ మేలు చేయని దుర్యోధనుడు అట్లా దేవతలకు పూజనీయుడై అన్ని సుఖాల అనుభవాన్ని పొంది ఎడతెగని గొప్పతనంతో కూడి ప్రకాశిస్తూ చూడటానికి చాలా దుర్భరంగా తన కాంతలు, బంధువులు, తానూ, సంతోషంతో విజృంభించి ఆకాశాన్ని మించిపోయి దేవతలచేత చుట్టుకొనబడి ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** దాయాది మాత్సర్యం ఎట్లా ఉంటుందో ఈ పద్యంలోని ప్రతి పదమూ నిరూపిస్తుంది. 'దుర్భరంగా' అంటే అతడి గొప్పతనాన్ని చూచి భరించటం ధర్మరాజు చేతకావటం లేదని అర్థం.

**ఆ. ఈఁగకాలియంత యేనియుఁ బాపంబు। వీరివలనఁ గనుట వినుట గలుగ**
**దొక్కనాఁడు; నట్టి యుత్తములకు విధి। పాడి మాలి యిట్టి పాటు దెచ్చె.' 26**

**ప్రతిపదార్థం:** వీరివలనన్= నా వారైన వీరివలన; ఈఁగ కాలిఅంత= ఈగ కాలంతటి స్వల్పమైన; పాపంబు= పాపం; ఏనియున్= కూడా; కనుట= చూడటం; వినుట= వినటం; ఒక్కనాఁడున్= ఒక్కరోజూ; కలుగదు= లేదు; అట్టి+ఉత్తములకున్= అట్లాంటి ఉత్తములకు; విధి= దైవం; పాడి మాలి= న్యాయం వీడి; ఇట్టి= ఇట్లాంటి; పాటు= కష్టాన్ని; తెచ్చెన్= తెచ్చి పెట్టింది.

**తాత్పర్యం:** నా వారైన వీరివలన ఈగ కాలంతటి స్వల్పమైన పాపంకూడా జరిగినట్లు ఒకనాడూ చూడలేదు. వినలేదు. అట్లాంటి ఉత్తములైన వీరికి దైవం అన్యాయంగా ఇట్లాంటి కష్టాన్ని తెచ్చిపెట్టింది.'

**సీ. అని యగ్గలపుఁజింత మునిఁగి కలంక మ। నోవికారము నాకు నావహిల్లఁ**
**గత మేమి యొకొ! యిది ఘనమాయయో కల। గనుటయో యరయ నిక్కంబొ చిత్త**
**విభ్రాంతిఁ జేసి వివేకింప నేర రా। దయ్యెడు' నని పరమాకులేంద్రి**
**యుఁడు శోకదుఃఖమయుండు నై కొండొక। ప్రొ ద్దూరకుండి సద్బుద్ధిఁ దలఁచి**

**తే. యలుక యింద్రుపైఁ బొడమిన నమ్మహాత్ముఁ। డప్పురుషుఁ జూచి మగుడ నీ వరుగు మార్య**
**వర్య! యెవ్వరి దూతవు వారికడకు। ననుచుఁ బలికి వెండియు నిట్టు లనియె నధిప! 27**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అని; అగ్గలము+చింతన్= మిక్కిలి చింతలో; మునిఁగి= మునిగిపోయి; కలంకన్= క్షోభతో; మనోవికారము= మనసు కకావికలు కావటం; నాకున్= నాకు; ఆవహిల్లన్= కలగటానికి; కతము+ఏమియొ= కారణం ఏమిటో; ఇది ఘనమాయయో!= ఇది దేవతలు పన్నిన గొప్ప మాయా!; కల కనుటయో= కలగనటమా!; అరయన్= లేక బాగా ఆలోచిస్తే; నిక్కంబొ!= నిజమేనా!; విభ్రాంతిన్+చేసి= మిక్కిలి భ్రాంతి పొందటంచేత; వివేకింపన్ నేరరాదు+అయ్యెడున్+అని= విచారించటం చేతకావటం లేదు అని; పరమ+ఆకుల+ఇంద్రియుఁడు= మిక్కిలి వ్యథ చెందిన ఇంద్రియాలు కలవాడై; శోకదుఃఖమయుండున్+ఐ= శోకంతో, దుఃఖంతో నిండినవాడై; కొండొక ప్రొద్దు= కొంచెంసేపు; ఊరకుండి= మిన్నకుండి; సద్బుద్ధిన్+తలఁచి= తేరుకొన్న మనస్సుతో ఆలోచించి; ఇంద్రుపైన్= ఇంద్రుడిపై; అలుక+పొడమినన్= కోపం పుట్టగా; ఆ+మహాత్ముఁడు= ధర్మరాజు; ఆ+పురుషున్+చూచి= ఆ దూతను చూచి; ఆర్యవర్య!= పూజ్యుడా!; నీవు; ఎవ్వరిదూతవు= ఎవరి దూతవో; వారికడకున్= వారి వద్దకు; మగుడన్= మరల; అరుగుము= వెళ్ళుము; అనుచున్= అని; పలికి= చెప్పి; వెండియున్= మరలా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయా! వినుము. ఇట్లా మిక్కిలి చింతలో మునిగిపోయి ' నాకు ఇట్లా క్షోభతో మనసు కకావికలు కావటానికి కారణం ఏమిటో? ఇది దేవతలు పన్నిన మాయా! కలగనుటయా! లేక నిజమేనా! ఏమిటో భ్రాంతి పొందటంచేత విచారించటం చేతకావటం లే' దని మిక్కిలి వ్యథ చెందిన ఇంద్రియాలు కలవాడై శోక దుఃఖాలతో

నిండినవాడై కొంచెం సేపు ఊరకుండి తేరుకొన్న మనసుతో ఆలోచించి ఇంద్రుడిపై కోపం రాగా ఆ దూతను చూచి 'పూజ్యుడా! నీవు ఎవరి దూతవో వారి వద్దకు మరలిపొమ్ము' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధర్మరాజు మానుష శరీరంలో ఉండటంచేత ఇది మాయా? నిజమా? అని భ్రాంతిలో పడ్డాడు. పాండవులు నరకంలో కనిపించటమే - అది నిజం కాకపోవచ్చున్న ఊహను ధర్మరాజులో కలిగించింది. సద్బుద్ధిన్= అంటే మంచిబుద్ధితో అని అర్థం. ఇక్కడ భ్రాంతి తొలగటంకొరకు ఆయన'మౌనం' పాటించి మనసు కుదుటపరచుకొన్నాడని అర్థం.

ఇంద్రుఁడు నరకంబుకడ నున్న ధర్మజు నొద్దకు వచ్చి యతని సంభావించుట (సం.18-2-52)

**క. 'నా యనుజులు దుఃఖార్దితు। లై యున్నా; రట్టు లగుట నచటికి రా; నిం**
**కీ యెడన నేను నిలిచెదఁ। బాయక యని చెప్పు మా కృపానిరతునకున్.' 28**

**ప్రతిపదార్థం:** నా+అనుజులు= నా తమ్ములు; దుఃఖ= దుఃఖంచేత; అర్దితులు+ఐ= పీడితులై; ఉన్నారు; అట్టులు+అగుటన్= అట్లా కావటంవలన; అచటికిన్= అక్కడికి; రాను; నేను; ఈ+ఎడన్+అ= ఇక్కడే; పాయక= వదలకుండా; నిలిచెదన్= ఉంటాను; అని; ఆ+ కృపానిరతునకున్= నిరంతర కృపాగుణం ఉన్న ఆ ఇంద్రుడికి; చెప్పుము= చెప్పుము.

**తాత్పర్యం:** 'నా తమ్ములు దుఃఖపీడితులై ఉన్నారు. అట్లా కావటంవలన నేను ఇక అక్కడికి రాను. ఇక్కడే శాశ్వతంగా ఉండిపోతాను' అని ఆ దయానిధి ఇంద్రుడికి చెప్పుము.'

**చ. అనుటయు దేవదూతుఁడు రయంబున నిర్జరనాథు పాలికిన్**
**జని తెలియంగఁ జెప్పఁ గురుసత్తమ! ధర్మజు నిశ్చయంబు న**
**య్యనఘచరిత్ర భాస్వరుని యాడిన మాటలు నాతఁ డంతయున్**
**విని చనుదెంచె నయ్యెడకు వేగమె సంయమి దేవయుక్తుఁడై. 29**

**ప్రతిపదార్థం:** కురుసత్తమ!= ఓ జనమేజయ మహారాజా!; అనుటయున్= అని ధర్మరా జనగా; దేవదూతుఁడు= ఆ దేవదూత; రయంబునన్= శీఘ్రంగా; నిర్జరనాథు పాలికిన్= దేవేంద్రుడివద్దకు; చని= వెళ్ళి; తెలియంగన్+చెప్పన్= ఈ విషయం వివరించగా; ధర్మజు నిశ్చయంబు= ధర్మరాజు నిర్ణయమూ; ఆ+అనఘ చరిత్ర భాస్వరుని= ఆ పుణ్య చరిత్రచేత ప్రకాశించెడి ధర్మరాజు యొక్క; ఆడినమాటలు= అన్న మాటలు; అతఁడు= ఇంద్రుడు; అంతయున్= సమస్తమూ; విని= విన్నవాడై; ఆ+ఎడకున్= ఆ చోటికి (యడాగమ-త్రికసంధులు); వేగమె= అతి శీఘ్రంగా; సంయమి= ఋషులతోనూ; దేవయుక్తుఁడు+ఐ= దేవతలతోనూ కలిసి; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు చెప్పగా ఆ దేవదూత అతివేగంగా వెళ్ళి ఇంద్రుడికి ఇదంతా వివరించాడు. ధర్మరాజు నిర్ణయాన్ని ఆ పవిత్ర చరిత్రుడి మాటలను విని ఇంద్రుడు వెనువెంటనే ఋషులతోనూ, దేవతలతోనూ కలిసి ఆచోటికి వచ్చాడు.

**ఆ. ధర్ముఁడును మహాముదంబున నిజపుత్త్రుఁ। డగు నజాతశత్రు ననునయించి**
**రక్షణం బొనర్పఁ బ్రకటవాత్సల్యత। నరుగుదెంచెఁ గురుకులాగ్రగణ్య! 30**

**ప్రతిపదార్థం:** కురుకుల+అగ్రగణ్య!= కురువంశంలో మొదట గణింపదగినవాడా! జనమేజయా!; ధర్ముఁడును= యమధర్మరాజు కూడా; మహాముదంబునన్= చాలా సంతోషంతో; నిజపుత్త్రుఁడు+అగు= తనకొడుకైన; అజాతశత్రున్= ధర్మరాజును; అనునయించి= ఓదార్చి; రక్షణంబు+ఒనర్పన్= రక్షించటానికి; ప్రకటవాత్సల్యతన్= వాత్సల్యాన్ని ప్రకటిస్తూ; అరుగుదెంచెన్= అక్కడికి వచ్చాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. యమధర్మరాజుకూడా పుత్రవాత్సల్యాన్ని ప్రకటిస్తూ తన కొడుకైన ధర్మరాజును ఓదార్చి రక్షించటానికి అక్కడికి చాలా సంతోషంతో వచ్చాడు.

**వ. అప్పుడు. 31**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. వివిధ పాపాత్ములు వికృతశరీరు లై। యాతనా బాధితు లగుట మానె**
**దుర్గంధమును గృధ్రవర్గాది పలలాశి। పక్షి పంక్తులుఁ గుణప వ్రజంబుఁ**
**దోఁపన యెఱచి నెత్తురు కేశ పటలంబు। లస్థిపుంజము లదృశ్యంబు లయ్యెఁ;**
**గ్రూరాసిపత్ర ఘోరారణ్యయుక్త వై। తరణి లేకుండె; సత్పరిమళంబు**

**తే. నింపుఁ జేయు సోఁకును సొగియించు తనుపు। నార వీతెంచి సమ్మోద మావహించె;**
**నమృతమయ మిది యనఁదగి యనిల మధిక। విశదభావంబుఁ బ్రాపించె దిశలు పదియు. 32**

**ప్రతిపదార్థం:** వివిధ= నానా విధాలైన; పాప+ఆత్ములు= పాపాలు చేసినవారు; వికృత శరీరులు+ఐ= వికారం పొందిన శరీరాలు కలవారై; యాతనా= శిక్షలచేత; బాధితులు+అగుట= బాధపడటం, మానెన్= ఆగిపోయింది; దుర్గంధమును= చెడ్డవాసన; గృధ్రవర్గ+ ఆది= గ్రద్ద మొదలైన; పలల+ఆశి= మాంసాన్ని తినేటటువంటి; పక్షిపంక్తులు= పక్షుల సమూహాలు; కుణప వ్రజంబు= శవాల గుట్టలు; తోఁపన= కనిపించటంలేదు; ఎఱచి= మాంసం; నెత్తురు= రక్తం; కేశ పటలంబులు= వెంట్రుకల గుట్టలు; అస్థిపుంజములు= ఎముకల ప్రోగులు; అదృశ్యంబులు+అయ్యెన్= మాయమైపోయాయి; క్రూర+అసి= క్రూరమైన కత్తులవంటి; పత్ర= ఆకులున్న; ఘోర+ అరణ్య యుక్త= భయంకరమైన అడవితో కూడిన; వైతరణి= వైతరణీనది; లేక+ఉండెన్= లేకుండా పోయింది; సత్పరిమళంబున్= మంచివాసనను; ఇంపున్= తృప్తినీ; చేయు= కలిగించే; సోఁకును= స్పర్శను; సొగియించు= పారవశ్యం కలుగజేసే; తనుపున్= చల్లదనమూ; ఆరన్+వీతెంచి= బాగా వ్యాపించి; సమ్మోదము= సంతోషం; ఆవహించెన్= కలిగించింది; అమృతమయము+ ఇది అనన్+తగి= ఇది అమృతంతో నిండిందా అన్నట్లుగా; అనిలము= వాయువు; అధిక= మిక్కిలి; విశదభావంబున్= మనోహరత్వాన్ని; దిశలుపదియున్= పది దిశలూ; ప్రాపించెన్= పొందాయి.

**తాత్పర్యం:** నానా విధాలైన పాపకర్మలు చేసినవారు వికారంపొందిన శరీరాలతో శిక్షలకు గురై బాధపడటం ఆగిపోయింది. చెడ్డవాసనతోడి గ్రద్దలు మొదలైన మాంసాన్ని తినే పక్షుల సమూహాలు, శవాలగుట్టలు కనిపించటంలేదు. మాంసం, నెత్తురు, వెంట్రుకల గుట్టలు, ఎముకల పోగులు మాయమైపోయాయి. క్రూరమైన కత్తులవంటి ఆకులున్న భయంకరమైన అడవితోకూడిన వైతరణీనది లేకుండా పోయింది. మంచివాసనను తృప్తినీ కలిగించే గాలి, సుఖాన్ని కలుగజేసే చల్లదనమూ బాగా వ్యాపించి సంతోషం కలిగింది. ఇది అమృతంతో నిండిందా అన్నట్లు వాయువు మనోహరత్వాన్ని పదిదిశలలో వ్యాపింపచేసింది.

**వ. ఆ సమయంబున వాసవుతోడఁ జనుదెంచినట్టి. 33**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సమయంలో; వాసవుతోడన్= ఇంద్రుడితో; చనుదెంచినట్టి= వచ్చినట్టి.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఇంద్రుడితోపాటు వచ్చిన. (తరువాతి పద్యంతో అన్వయం)

**మహాస్రగ్ధర;**

**వసురుద్రాదిత్య గంధర్వ గరుడ భుజగ వ్రాతముల్ వైభవం బు**
**ల్లసనం బొందంగ సిద్ధు ల్మనముల ముదము ల్పల్లవింపంగ సాధ్యుల్**
**హసితస్వాంతంబులం బె ల్లలమికొనఁగ నత్యాదరోత్కర్షముల్ పాం**
**డుసుతో పాంతమ్ము నం బిండు గొని నిలిచి చూడ్కుల్ తదంగంబు గప్పన్. 34**

**ప్రతిపదార్థం:** వసు= వసువుల; రుద్ర= రుద్రుల; ఆదిత్య= ఆదిత్యుల; గంధర్వ= గంధర్వుల; గరుడ= గరుడుల; భుజగవ్రాతముల్= సర్పాల సమూహాలు; వైభవంబు= వైభవం; ఉల్లసనంబు= ప్రకాశాన్ని; ఒందంగన్= పొందగా; సిద్ధుల్= సిద్ధులు; మనములన్= మనసులలో; ముదముల్= సంతోషాలు; పల్లవింపంగన్= చిగురొత్తగా; సాధ్యుల్; హసిత= సంతోషించిన; స్వాంతంబులన్= హృదయాలతో; అతి+ఆదర+ ఉత్కర్షముల్= మిక్కిలి అతిశయించిన ఆదరం; పెల్లు+అలమికొనఁగన్= మిక్కిలి వ్యాపించగా; పాండుసుత+ ఉపాంతమ్మునన్= ధర్మరాజు సమీపంలో; పిండుగొని= చుట్టూ గుంపుగా చేరి; నిలిచి= నిలబడి; చూడ్కుల్= చూపులు; తద్+అంగంబు+కప్పన్= అతడి శరీరాన్ని ఆచ్ఛాదించగా.

**తాత్పర్యం:** వసు, రుద్ర, ఆదిత్య, గంధర్వ, గరుడ, సర్ప సమూహాలు వైభవం ప్రకాశించగా, సిద్ధులు మనసులలో సంతోషం పొందగా సాధ్యులు సంతోషించిన హృదయాలతో మిక్కిలి అతిశయించిన ఆదరం అంతటా వ్యాపించగా ధర్మరాజు సమీపంలో చుట్టూ గుంపుగా చేరి నిలబడి చూపులు అతడి శరీరాన్ని క్రమ్ముకొనగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. ఒండొరులతో నక్కురుమూర్తి గుణవిశేషంబు లుగ్గడించి యగ్గించుచుండ సంయమి సుర సమేతంబుగా నయ్యాఖండలుండు నయ్యఖండ యశో మండితుం జేరంజని సాంత్వన స్వరంబున నిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** ఒండొరులతోన్= ఒకరితో ఒకరు; ఆ+కురుమూర్తి= ఆ ధర్మరాజు; గుణవిశేషంబులు+ఉగ్గడించి= సద్గుణాలను చెప్పి; అగ్గించుచున్+ఉండన్= ప్రశంసిస్తుండగా; సంయమి= ఋషులతో; సురసమేతంబుగాన్= దేవతలతో కూడ; ఆ+ అఖండలుండు= ఆ ఇంద్రుడు; ఆ+అఖండ+యశస్+మండితున్= అఖండమైన కీర్తిచేత ప్రకాశించే ఆ ధర్మరాజును; చేరన్+చని= సమీపించి; సాంత్వన= ఓదార్పు కలిగించే; స్వరంబునన్= గొంతుకతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఒకరితో ఒకరు ఆ ధర్మరాజు సద్గుణాలను చెప్పుకొని ప్రశంసిస్తుండగా ఋషులతో, దేవతలతో కలిసి ఇంద్రుడు ఆ కీర్తిచే ప్రకాశించే ధర్మరాజును సమీపించి ఓదార్పు కలిగించే గొంతుకతో ఇట్లా అన్నాడు.

**క. 'నీ విచ్చో నునికికి ని। ద్దేవతలందఱును వగచి ధిషణాగుణ సం**
**భావిత! నిన్నుం దోడ్కొని। పో వచ్చినవారు కినుకఁ బో విడువ వనా. 36**

**పతిపదార్థం:** ధిషణాగుణ సంభావిత!= బుద్ధిగుణంచేత సమ్మానించబడిన ఓ ధర్మరాజా!; నీవు; ఇచ్చోన్+ఉనికికిన్= ఇక్కడ ఉండటానికి; ఈ+దేవతలు+అందఱును= ఈ దేవతలందరూ; వగచి= బాధపడి; నిన్నున్+తోడ్కొని పోన్+వచ్చినవారు= నిన్ను తీసికొని పోవటానికి వచ్చారు; కినుకన్+పోన్+విడువవనా!= కోపం వదలిపెట్టవయ్యా!

**తాత్పర్యం:** 'బుద్ధిగుణంచేత సమ్మానించబడిన ధర్మరాజా! నీవు ఇక్కడ ఉండటంచేత ఈ దేవతలందరూ బాధపడి నిన్ను తీసికొనిపోవటానికి వచ్చారు. కోపం వదలిపెట్టుము నాయనా!

**క. సిద్ధియు నవ్యయలోక స। మృద్ధ సుఖావాప్తియును శమిత వికృతియు స**
**ద్బుద్ధియు నుదాత్తభంగిని। సిద్ధించెను నీదుగుణ విశేషము కతనన్. 37**

**ప్రతిపదార్థం:** సిద్ధియున్= యోగప్రాప్తి; అవ్యయలోక సమృద్ధ సుఖ+అవాప్తియున్= నాశరహితమైన బ్రహ్మలోక సమృద్ధమైన సుఖప్రాప్తి; శమితవికృతియున్= శమించిన వికారాలు; సద్బుద్ధియున్= సద్బుద్ధి; నీదు= నీ; గుణ విశేషము కతనన్= గుణ విశేషంచేత; ఉదాత్తభంగిన్= ఉదాత్త రీతిలో; సిద్ధించెను= సిద్ధించాయి.

**తాత్పర్యం:** నీకు యోగం ప్రాప్తించింది. నాశరహితమైన బ్రహ్మలోక సమృద్ధమైన సుఖప్రాప్తికూడా సిద్ధించింది. నీ వికారాలు శమించాయి. నీకు సద్బుద్ధి కలిగింది. నీ గుణవిశేషంచేత ఇవన్నీ ఉదాత్తరీతిలో నీకు సిద్ధించాయి.

**విశేషం:** యోగం= ఇంద్రుడు చెప్పుతున్నది యోగసిద్ధిని గురించి, దానివలన అష్టసిద్ధులు కలుగుతాయి. అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వము, వశిత్వము - అన్నవి ఈ సిద్ధులు. ఇవి ఆధారంగానే ధర్మజుడు సశరీరుడై స్వర్గానికి వచ్చాడు. కాని ఇతరులవలె అక్కడ ఉండిపోవటానికి రాలేదు. అది ఇంద్రుడికి తెలుసు.

ధర్మరాజు ముముక్షువుగా వచ్చాడు. సర్వబంధమోక్షం కావాలని ధర్మజుడి ఆకాంక్ష. దానికి తగిన సాధనసంపత్తి ధర్మజుడి జన్మంలోనే ఉన్నది. స్వభావంతో ఆయన సద్గుణి, సద్బుద్ధి సిద్ధించింది. కనుక ఇహపర విభేద దృష్టి ఆయనలో ఆజన్మాంతమూ పనిచేస్తోంది. ఇదే గుణవిశేషం. దీనిచేత ఆయనకు అవ్యయలోక ప్రాప్తి కలిగింది. ఈ మాట చాలా ముఖ్యమైనది. ధర్మజుడు మాత్రమే శమమును సాధించాడు. వికారదూరుడు కావటమే 'శమ' మంటే, ఆ స్థితిని శాంతమంటారు. దీనినే శాస్త్రంలోవలె మోక్షమంటారు. ఆ మోక్షం 'అవ్యయమైనది. అక్కడ తరుగుదల లేదు. స్వర్గంలోవలె సుఖానుభవం తరువాత మళ్ళీ మానుషతనువు ఎత్తవలసిన అవసరంలేదు. దానినే 'బ్రహ్మ' లోకమన్నారు. ఈ బ్రహ్మ అక్షర పర 'బ్రహ్మ' తప్ప సత్యలోకావాసి కాడు. గీతాకారుడు ఈ అక్షర= అవ్యయతత్త్వమే తానని చెప్పాడు.

**"యం ప్రాప్య వ నివర్తంతే తద్ధామ పరమం మమ"** అని స్వామి సెలవిచ్చాడు. దేనిని చేరినవారు మరలి రారో - ఆ స్థానం 'పరమమైనది. ఆ స్థానం నాది అని అర్థం. అది ధర్మజుడికి సిద్ధించిందట. అదికూడా 'ఉదాత్తంగా' ధర్మరాజుకు ఈ సిద్ధి గుణ విశేషంచేత సహజంగా కలిగింది. హఠాత్తుగానూ కలగలేదు. హఠయోగాదులవలన కలిగిందీ కాదు. అందుచేత ఇంద్రుడు ఇట్లా అన్నాడు.

**క. విను మొక్కటి సెప్పెద రా। జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర! యె**
**ట్లును నారక స్థలంబుం। గనుఁగొన వలయు టిది వేదకథితము సుమ్మీ! 38**

**ప్రతిపదార్థం:** ఒక్కటి= ఒక విషయం; చెప్పెదన్= చెప్పుతాను; అవనీ+ఈశ్వర! విను= ధర్మరాజా! వినుము; రాజు+అనువానికిన్+ఎల్లన్= రాజన్న ప్రతి ఒక్కడికీ; ఎట్లును= ఎట్లాగైనా; నారకస్థలంబున్= నరకాన్ని; కనుఁగొనవలయుట= చూడవలసిరావటం; తప్పదు= తప్పేది కాదు; ఇది= ఈ విషయం; వేద కథితము= వేదంచేత చెప్పబడ్డది; సుమ్మీ!= సుమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! ఒక విషయం చెప్తుతాను వినుము. రాజన్న ప్రతి ఒక్కడికీ ఎట్లాగైనా నరక ద్వార దర్శనం చేయవలసిరావటం తప్పేది కాదు. ఇది వేదం చెప్పిన మాట సుమా!

**విశేషం:** 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అని శాస్త్ర ప్రమాణం. అది వేదమూలమైన సిద్ధాంతమని వేదవ్యాసుడు చెప్తుతున్నాడు. రాజ్యపాలనలో సంకల్పితంగానో అసంకల్పితంగానో పాప 'పంకిలం' (బురద) రాజుకు అంటుకొనక తప్పదు. కొన్నిటికి కర్త, కొన్నిటికి ప్రేరకుడు. కొన్నిటికి సాక్షి. అన్నిటికీ బాధ్యుడు. ఇట్లా రాజు 'పాప' భాగి అవుతున్నాడు. అందుకే 'నరకం'లో పడటమో, కనీసం నరక ద్వార దర్శనమో తప్పదట. ధర్మజుడి 'పాపం' చాలా తక్కువ కాబట్టి నరక దర్శన భ్రమనైనా పొందక తప్పలేదు.

**సీ.** **పుణ్యంబులును బాపములు రెండు జోకలై। యుండుఁ బుణ్యంబుల నొదవు నాక**
**సుఖము పాపంబులఁ జొప్పడు నరకదుః। ఖము విను మున్ను నాకంబు సుఖము**
**ననుభవించిన యట్టి యతఁడు పదంపడి। యధిక నారక పీడ ననుభవించు;**
**మున్ను నారక దుఃఖమునఁ బడ్డవాఁ డనం। తరమ నాకమునఁ దాఁ బొరయు సౌఖ్య;**

**తే.** **మల్పపుణ్యుండు తొలి తొలి యమరతా సు। ఖంబు గయికొని మఱియు దుఃఖముల నొందు;**
**భూరిపుణ్యుండు మునుమును ఘోర నిరయ। యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు.** **39**

**ప్రతిపదార్థం:** విను= వినుము; పుణ్యంబులును= పుణ్యాలు; పాపములు= పాపాలు; రెండున్= రెండూ; జోకలు+ఐ= జంటగా; ఉండున్= ఉంటాయి; పుణ్యములన్= పుణ్యాలచేత; నాక సుఖము= స్వర్గ సుఖం; ఒదవున్= కలుగుతుంది; పాపంబులన్= పాపాలచేత; నరక దుఃఖము; చొప్పడున్= కలుగుతుంది; మున్ను= ముందుగా; నాకంబు సుఖము= స్వర్గ సుఖం; అనుభవించిన+అట్టి+అతఁడు= అనుభవించినవాడు; పదంపడి= తరువాత; అధిక= మిక్కిలి అధికంగా; నారకపీడన్= నరక బాధ; అనుభవించున్= అనుభవిస్తాడు; నారకదుఃఖమునన్= తొలుత నరకదుఃఖంలో పడ్డవాడు; అనంతరము+అ= తరువాతే; నాకమునన్= స్వర్గంలో; తాన్= తాను; సౌఖ్యమున్= సౌఖ్యాన్ని; పొరయున్= పొందుతాడు; అల్పపుణ్యుండు= అల్పంగా పుణ్యంచేసికొన్నవాడు; తొలి తొలి= ముందుగా; అమరతాసుఖంబున్= స్వర్గసుఖాన్ని; కయికొని= స్వీకరించి; మఱియున్= పిదప; దుఃఖములన్+ఒందున్= దుఃఖాలను పొందుతాడు; భూరి పుణ్యుండు= అధిక పుణ్యం చేసికొన్నవాడు; మునుమును= ముందుగా; ఘోర= ఘోరమైన; నిరయ= నరక; యాతనలన్+ఒంది= యాతనలను అనుభవించి; వెండి= పిదప; సౌఖ్యంబులు+ఒందున్= సుఖాలు పొందుతాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! జాగ్రత్తగా వినుము. పుణ్యపాపాలు రెండూ జంటగా ఉంటాయి (ఒకదానితో ఒకటి కలిసే ఉంటాయి). పుణ్యంచేత స్వర్గం, పాపంచేత నరకం కలుగుతాయి. తొలుత స్వర్గంలో సుఖం అనుభవించినవాడు పిదప నరకంలో చాలా బాధలు పడతాడు. తొలుత నరకయాతన అనుభవించినవాడు ఆ తరువాతే స్వర్గసుఖాలు చవిచూస్తాడు. అల్పంగా పుణ్యం చేసికొన్నవాడు తొలుత స్వర్గసుఖాన్ని స్వీకరించి తరువాత చాలాకాలం నరకయాతన అనుభవిస్తాడు. అధికపుణ్యం చేసికొన్నవాడు మొదట నరకయాతన అనుభవించి తరువాత చాలాకాలం స్వర్గసుఖాలు పొందుతాడు.

**విశేషం:** భగవద్గీత గుణత్రయ, శ్రద్ధాత్రయాలుగా చెప్పిన విషయ సర్వస్వ సారాంశమూ ఈ ఒక్క పద్యంలో ఉన్నది. దైవత్వం సాత్త్వికసంపద. రాక్షసత్వం తామసికసంపద. మానవత్వం ఈ రెండింటి ధర్మాలలో ఉన్న రాజసికసంపద. సత్త్వ ప్రధానమైన సుఖం తొలుత అమృతతుల్యంగా ఉండి కడపట విషమై ప్రాణం తీస్తుంది. ధర్మరాజుకు పుట్టిన సందేహాలను నివృత్తి చేయటమే

మహేంద్రుడి తాత్పర్యం. దుర్యోధనుడు మహాల్పపుణ్యుడు. అందుచేత స్వర్గసుఖం తొలుత అనుభవిస్తున్నాడు. తరువాత రౌరవాది నరకాలు సిద్ధంగా ఎట్లాగూ ఉన్నాయి. పాండవులు మహాపుణ్యాత్ములు. అందుచేత నరకబాధను తొలుత పడుతున్నారు. చివరకు దీర్ఘమైన స్వర్గసుఖం ఉన్నదివారికి.

మరి ధర్మరాజు! ఇతడికి స్వర్గాన్ని అతిశయించిన అక్షరత్వసిద్ధి కావాలి. అది పుణ్యపాపాలను సమదృష్టితో స్వీకరించిన 'శమిత' చిత్తునికే సాధ్యం. అందుకే ఇంద్రియాధిదేవత అయిన ఇంద్రుడు ఈ ప్రబోధం చేస్తున్నాడు.

'జోక' అంటే 'జంట' అని వాచ్యార్థమే కాని - పరస్పర ఆశ్రితంగా ఉంటాయని పరమార్థం. ఒకే వ్యక్తిలో పుణ్యపాపాలు రెండూ ఉంటాయని అర్థం.

ధర్మరాజులోనూ రాచరికంవలన ఏర్పడిన పాపాంశలేశం చేతనే నరకద్వార దర్శనం కలిగిందని అర్థం చేసికొనాలి. అది ముందు చెప్పబడింది.

ఒక్క మనిషికి మాత్రమే అటు సాత్త్వికానికి ఎగరగలిగిన అవకాశం ఉన్నది. తామసంలో కూరుకుపోయే దౌర్భాగ్యం ఉన్నది.

**క.** **ఇట నేను నిన్నుఁ బుత్తెం । చుట యుత్తరకాల దివ్య సుఖ సంగమ సం**
**ఘటనకుఁ గాదే నీ కట । కటఁ బడుటకు దీనిఁ దెలుపఁగా రావలసెన్.** **40**

**ప్రతిపదార్థం:** ఇటన్= ఇక్కడికి; ఏను= నేను; నిన్నున్= నిన్ను; పుత్తెంచుట= పంపించటం; ఉత్తరకాల= భవిష్యత్తులో; దివ్య= స్వర్గ; సుఖ= సుఖంతో; సంగమ= కలయిక; సంఘటనకున్= జరగటానికి; కాదే!= కాదా! (అవునని అర్థం); నీ= నీవు; కటకటన్+పడుటకున్= బాధపడుతూ ఉండటంవలన; దీనిన్= దీనినంతా; తెలుపఁగాన్= తెలుపగా; రావలసెన్= రావలసి వచ్చింది.

**తాత్పర్యం:** నేను నిన్నిక్కడికి పంపించటం భవిష్యత్తులో సర్వసుఖప్రాప్తికొరకే కదా! నీవు బాధపడుతూ ఉండటంవలన నీ కిదంతా చెప్పవలసి వచ్చింది.

**సీ.** **కర్ణుఁ డుత్తమసిద్ధిఁ గాంచి వెలింగెడు । నమ్మహాభుజునకు నై కరంబు**
**దుఃఖింతు నీ వెప్డుఁ; దుది ముట్టి యున్నాఁ డి । తండు నిజోజ్జ్వలస్థాన మొంది**
**సర్వాస్త్రవిదుని నా జలజాప్త నందనుఁ । గనుఁగొని చిత్తంబు కలఁక విడువు;**
**మనిలనందనుఁడు నర్జునుఁడును నకులుండు । సహదేవుఁడును భవత్సైన్యరూప**

**తే.** **వర్తి సర్వమహీపతివర్గములును । ద్రౌపదియు ద్రౌపదేయులు రాజవర్య!**
**దీప్త నిజధామ సంప్రాప్తిఁ దేజ మలరి । యుండఁగాఁ జూచి సమ్మోదయుతుఁడ వగుము.** **41**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= ధర్మరాజా!; కర్ణుఁడు; ఉత్తమ సిద్ధిన్= ఉత్తమ స్థితి ప్రాప్తిని; కాంచి= పొంది; వెలింగెడున్= ప్రకాశిస్తున్నాడు; ఆ+మహాభుజునకున్+ఐ= ఆ పరాక్రమవంతుడికొరకై; నీవు; ఎప్డున్= ఎప్పుడూ; కరంబున్= మిక్కిలిగా; దుఃఖింతు= దుఃఖిస్తుంటావు; ఇతండు= ఈ కర్ణుడు; నిజ+ఉజ్జ్వలస్థానము+ఒంది= తనదైన ప్రకాశవంతమైన స్థానం పొంది; తుదిముట్టి+ఉన్నాఁడు= పరాకాష్ఠనంది ఉన్నాడు; సర్వాస్త్ర విదున్= అన్ని అస్త్రాలు తెలిసినవాడైన; ఆ జలజాప్తనందనున్= ఆ సూర్యకుమారుడిని, కర్ణుడిని; కనుఁగొని= చూచి; చిత్తంబుకలఁక= మనోవ్యథ; విడువుము= విడిచిపెట్టుము; అనిలనందనుఁడు= వాయుపుత్రుడు

(భీముడు); అర్జునుఁడును= అర్జునుడూ; నకులుండు= నకులుడు; సహదేవుఁడును; భవత్= నీ; సైన్యరూపవర్తి= సైన్యరూపంలో ప్రవర్తించిన; సర్వమహీపతివర్గములును= రాజసమూహాలన్నీ; ద్రౌపదియున్= ద్రౌపదీ; ద్రౌపదేయులున్= ద్రౌపది కుమారులూ; దీప్త= ప్రకాశించే; నిజధామ= తమతమ నెలవులను; సంప్రాప్తిన్= పొందటంవలన; తేజము+అలరి= తేజస్సు అతిశయించి; ఉండఁగాన్= ఉండగా; చూచి; సమ్మోదయుతుఁడవు+అగుము= సంతోషం పొందుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! కర్ణుడు ఉత్తమ స్థానప్రాప్తిని పొంది ప్రకాశిస్తున్నాడు. ఆ పరాక్రమవంతుడికొరకు నీవు ఎప్పుడూ దుఃఖిస్తుంటావు. ఈ కర్ణుడు తనదైన ప్రకాశవంతమైన స్థానాన్ని పొంది పరాకాష్ఠనంది ఉన్నాడు. సకలశస్త్రాస్త్రవిదుడైన ఈ సూర్యనందనుడిని చూచి మనోవ్యథను విడిచిపెట్టుము. భీమార్జున నకుల సహదేవులు, నీ సైన్యంలో ఉండి పోరాడిన రాజసమూహాలూ, ద్రౌపదీ, ద్రౌపది పుత్రులూ అందరూ ప్రకాశిస్తున్న తమ తమ స్థానాలను పొంది తేజస్సు అతిశయించి ఉండగా చూచి సంతోషించుము.

**విశేషం:** 'దేవ' అనే శబ్దానికి మూలమైన ధాతువు అర్థం - దివ, ప్రకాశమని, ప్రకాశించేవారు దేవతలు. దేవతాలోకానికి చెందినవారందరూ తేజోరూపాలతో ప్రకాశిస్తుంటారు. అవి భౌతికతనువులు కావు అని ఇంద్రుడు సూచిస్తున్నాడు.

**ఆ.** **దైవ విహిత మగుటఁ దప్పింప రాకున్న। యట్టి యల్ప దుఃఖ; మనుభవించి**
**తింక నిట సుఖంబు లేపార నాతోడ। విహరణం బొనర్పు విమలచరిత!** **42**

**ప్రతిపదార్థం:** దైవ= దైవంచేత; విహితంబు+అగుటన్= శాసించబడింది కావటంవలన; తప్పింపన్+రాక+ఉన్న+అట్టి= తప్పించటానికి వీలులేని; అల్పదుఃఖము= కొద్ది దుఃఖాన్ని; అనుభవించితి(వి)= అనుభవించావు; ఇట= ఇకమీద; సుఖంబులు+ఏపారన్= సుఖాలు అతిశయించగా; విమలచరిత!= ఓ నిర్మల చరిత్రగల ధర్మరాజా!; నాతోడన్= నాతో కలిసి; విహరణంబు= విహారం; ఒనర్పు= చేయుము.

**తాత్పర్యం:** విమలచరిత్రుడవైన ఓ ధర్మనందనా! దైవం శాసించినందున తప్పించటానికి వీలులేని అల్పదుఃఖాన్ని ఇంతవరకు అనుభవించావు. ఇక నాతో కలిసి సుఖాలు అతిశయించగా స్వర్గవిహారం చేయుము.

**క.** **మానిత సువ్రతములకు। న్దానకరణమునకు ననుగుణం బయిన శుభం**
**బే నీకుం గావింపం। గా నుజ్జ్వల వృత్తిఁ బరఁగు కౌరవముఖ్యా!** **43**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= ధర్మరాజా!; మానిత= మన్నించబడిన; సువ్రతములకున్= ఉత్తమవ్రతాలు చేసినందుకు; దాన= దానాలను; కరణమునకున్= చేసినందుకు; అనుగుణంబు+అయిన= అనుగుణమైన; శుభంబు= శుభాన్ని; ఏన్= నేను; నీకున్+కావింపన్+కాన్= నీకు చేయగా; ఉజ్జ్వలవృత్తిన్= ప్రకాశంతో (తేజస్సుతో); పరఁగు(ము)= ఒప్పుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! మన్నించబడ్డ ఉత్తమవ్రతాలు చేసినందుకు, దానాలు చేసినందుకు అనుగుణమైన శుభాలను నేను కలిగించగా నీవు ప్రకాశవంతుడవై వెలుగుము.

**తే.** **రాజసూయాశ్వమేధాధ్వరముల సంచి। తంబు లయిన యుదాత్త లోకంబు లనుభ**
**వింపు మాధిక్య మహనీయ విభవ మెసఁగ। నక్షయోదార సౌఖ్యంబు లావహిల్ల.** **44**

**ప్రతిపదార్థం:** రాజసూయ= రాజసూయం; అశ్వమేధ+అధ్వరముల= అశ్వమేధ యాగాలను చేసినందువలన; సంచితంబులు+ అయిన= కూడబెట్టబడిన; ఉదాత్తలోకంబులు= పుణ్యలోకాలను; ఆధిక్య= ఆధిక్యంతో కూడిన; మహనీయ= గొప్ప; విభవము+ఎసఁగన్= వైభవం ఒప్పగా; అక్షయ= తరుగులేని; ఉదార= ఘనమైన; సౌఖ్యంబులు= సుఖాలు; ఆవహిల్లన్= కలుగగా; అనుభవింపుము= అనుభవించుము.

**తాత్పర్యం:** ధర్మనందనా! రాజసూయం, అశ్వమేధం మొదలైన యాగాల ఫలితంగా లభించిన పుణ్యలోకాలను ఆధిక్యంతో గొప్ప వైభవంతో తరుగులేని ఘనమైన సుఖాలతో అనుభవించుము.

**సీ.** **మహితవర్తనులైన మాంధాతృ నల హరి । శ్చంద్ర దిలీప దుష్యంత భరతు**
**లొందిన కీర్తనీయోన్నతి నొందుము । నినుఁ గొనియాడంగ ముని నిలింప**
**గంధర్వ గరుడోరగ ప్రధానులు సిద్ధ । సాధ్య సత్తములును సకుతుకముగ**
**వచ్చినవా' రని వారినెల్లనుఁ జూప । నతఁడు వినయ సంభృతాంగుఁ డగుచు**

**తే.** **నాదరముగఁ బ్రత్యుద్గతి యాచరింప । వార లెంతయుఁ బ్రీతిమై గారవంపుఁ**
**బలుకు లెసఁగంగ నధిక సంభావనంబు । సేసి రాననములు విలసిల్లుచుండ.** **45**

**ప్రతిపదార్థం:** మహితవర్తనులు+ఐన= ఉదాత్త జీవనులైన; మాంధాతృ= మాంధాత; నల= నలుడు; హరిశ్చంద్ర= హరిశ్చంద్రుడు; దిలీప= దిలీపుడు; దుష్యంత= దుష్యంతుడు; భరతులు= భరతుడు (వీరంతా); ఒందిన= పొందిన; కీర్తనీయ= ప్రస్తుతించదగిన; ఉన్నతిన్= ఔన్నత్యాన్ని; ఒందుము= పొందుము; నినున్ కొనియాడంగన్= నిన్ను ప్రశంసించటానికి; గంధర్వ= గంధర్వులు; గరుడ= గరుడులలో; ఉరగ ప్రధానులు= పాములలో ముఖ్యులైనవారు; సిద్ధ= సిద్ధులు; సాధ్యసత్తములున్= సాధ్యులలో ముఖ్యులు; సకుతుకముగన్= కుతూహలంతో; వచ్చినవారు+అని= వచ్చారని; వారిన్+ఎల్లనున్+చూపన్= వారినందరినీ చూపగా; అతఁడు= ధర్మరాజు; వినయ= వినయంతో; సంభృత+అంగుఁడు+అగుచున్= నిండిన దేహం కలవాడై; ఆదరముగన్= ఆదరంతో; ప్రతి+ ఉద్గతి= లేచి నిలవటం; ఆచరింపన్= చేయగా; వారలు= వారంతా; ఎంతయున్= ఎంతో; ప్రీతిమైన్= ప్రీతితో; ఆననములు= ముఖాలు; విలసిల్లుచున్+ఉండన్= వికసిస్తుండగా; గారవంపు+పలుకులు= గౌరవవాక్యాలు; ఎసఁగంగన్= అతిశయించగా; అధిక= మిక్కిలిగా; సంభావనంబు+చేసిరి= గౌరవించారు.

**తాత్పర్యం:** ఉదాత్తజీవనులైన మాంధాత, నలుడు, హరిశ్చంద్రుడు, దిలీపుడు, దుష్యంతుడు, భరతుడు - వీరంతా ఏ ఉన్నత స్థితిని పొందారో ఆ కీర్తనీయమైన స్థానాన్ని పొందుము. నిన్ను ప్రశంసించటానికి గంధర్వులు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు - వీరందరూ కుతూహలంతో వచ్చారు' అంటూ వారినందరినీ చూపాడు. వారిని చూచి ధర్మరాజు వినయాంగుడై లేచి నిలబడి నమస్కరించాడు. వారందరూ ఎంతో ప్రీతిగా ముఖాలు వికసించగా గౌరవవాక్యాలతో ధర్మనందనుడిని మిక్కిలిగా సత్కరించారు.

**విశేషం:** భారతచరిత్రలో సుప్రసిద్ధులు షట్చక్రవర్తులు. 'హరిశ్చంద్రో నలోరాజా పురుకుత్సః పురూరవః, సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః' అని చెప్పారు. కాని తిక్కనగారు చెప్పుతున్న మాంధాత్రాది చక్రవర్తులలోని లక్షణాలు ధర్మరాజులో ఏదో ఒకరకంగా అన్వయిస్తాయి కాబట్టి ఈ వరుసలో చెప్పాడు.

మాంధాత : యవనాశ్వుడు భృగుమహర్షి ఉంచిన మంత్ర జాలాగ్నితోడుగా అతడి గర్భంనుండి బయటపడ్డ కుమారుడు మాంధాత. ఇంద్రుడు ఆ శిశువునోట తనవేలుంచి కుడిపి పెంచాడు.

నలుడు : ద్యూతంలో సోదరుడివలన సర్వం కోల్పోయి 'ఏకవస్త్రులు'గా నలదమయంతులు అరణ్యావాసం చేశారు. ఒకే చీర కట్టుకొన్నారు. చివరికి అతడి ధర్మబుద్ధే అతడిని కాపాడింది. ధర్మనందనుడి కథకూడా ఇదే.

హరిశ్చంద్రుడు: సత్యవాక్పరిపాలకుడు. కడకు భార్యను బలిఇవ్వటానికి కూడా సిద్ధపడ్డాడు. ధర్మరాజుకూడా సత్యవాక్కుకనుకే -అశ్వత్థామా 'హతః కుంజరః అనే మాటను లోగొంతుకతో మాటాడాడు. అన్న మాటకు కట్టుబడే అరణ్య అజ్ఞాతవాసాలు చేశాడు.

దిలీపుడు : కామధేనువు శాపంవలన సంతానం కలుగక పోగా వసిష్ఠుడి ఆనతిమేరకు కామధేనువు సంతానమైన నందినిని భార్యతో కలిసి సేవించాడు. చివరకు ఆ నందినిని తినటానికి వచ్చిన పులికి తానే ఆహారం కావటానికి సిద్ధపడ్డాడు. దిలీపుడివలె ధర్మజుడు కూడా త్యాగమూర్తే.

దుష్యంతుడు : భార్యావియోగం సంభవించినా రాజధర్మాన్ని అనుష్ఠించటంలో అప్రమత్తత ప్రదర్శించిన ధీరోదాత్తుడు.

భరతుడు : శకుంతలా దుష్యంతుల పుత్రుడైన ఇతడే భరతరాజవంశాలకు కర్త అయ్యాడు. పాండవ కౌరవులదికూడా భరతవంశమే. అందుకే ఈ గ్రంథం భారతమయింది.అందుచేత ధర్మరాజు దుష్యంత భరతుల వంశంలో పుట్టి - ఆ వంశ ప్రతిష్ఠను తన ఉదాత్తజీవనంచేత వెలిగించాడని అర్థం.

**వ. అమ్మహేంద్రుఁ డమ్మహానుభావునితో మఱియు నిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** ఆ+మహేంద్రుఁడు= ఆ ఇంద్రుడు; ఆ+మహానుభావునితోన్= ధర్మరాజుతో; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు ధర్మరాజుతో ఇంకా ఇట్లా చెప్పాడు.

**క. 'ఆకాశగంగ యిదె పు । ణ్యాకృతి; యిన్నదిఁ బరిప్లుతాంగుఁడ వై సు**
**శ్లోకా! నాచెప్పిన నృప । లోకంబును మిగులు మమరలోకసుఖములన్.' 47**

**పతిపదార్థం:** సుశ్లోకా!= యశోవంతుడా!; ఆకాశగంగ; ఇదె= ఇదిగో ఇదే; పుణ్య+ఆకృతి= పుణ్యమే ఈ నదిరూపంలో ఆకృతిదాల్చింది; ఈ+నదిన్= ఈ నదిలో; పరిప్లుత+అంగుఁడవు+ఐ= స్నానంచేసినవాడవై; అమరసుఖములన్= స్వర్గసుఖాల అనుభవంలో; నా చెప్పిన= నేను ఇంతకు మునుపు చెప్పిన; నృపలోకంబును= రాజుల సమూహాన్ని; మిగులుము= అతిశయించుము.

**తాత్పర్యం:** 'యశోవంతుడవైన ఓ ధర్మరాజా! ఇదిగో ఇదే ఆకాశగంగ. పుణ్యమే ఈ నది ఆకారాన్ని పొందింది. ఈ నదిలో స్నానంచేసి స్వర్గసుఖాల అనుభవంలో ఇంతవరకు చెప్పిన రాజ సమూహాన్ని అతిశయించి ప్రకాశించుము.'

యముఁడు ధర్మరాజు నుచిత వచనంబుల సంభాషించుట (సం.18-3-28)

**సీ. అనియె నప్పుడు ధర్ముఁ డభిరామమూర్తి ము । ఖ ప్రసాదంబునఁ గరము వెలుఁగ**
**నా రాజవర్యునిఁ జేరంగ నరిగి ని । స్సీమగౌరవ! పరీక్షింప! గంటి**
**నిన్ను ముమ్మా; ఱరణీ ప్రసంగంబున । ద్వైతవనంబునఁ దగిలి కుక్క**
**తో వచ్చినప్పుడు దైవతగిరిపొంత । ననుజవర్గము విషయంబు గాఁగ.**

**తే.** **నిప్పు డిచటను; జలన మొకప్పుడైన। నీదుమది నించుకేనియు లేదు; దమము**
**శమము సత్యంబు మద్గత సారభక్తి। నీకు నగ్గలములు మహనీయచరిత!** **48**

**ప్రతిపదార్థం:** అప్పుడు= అట్లా ఇంద్రు డంటున్న సమయంలో; ధర్ముఁడు= యమధర్మరాజు; అభిరామమూర్తి= మనోహరమైన ఆకారంకలవాడు; ముఖప్రసాదంబునన్+కరము వెలుఁగన్= ముఖం యొక్క ప్రసన్నతచేత మిక్కిలి ప్రకాశిస్తూ; ఆ రాజవర్యునిన్= ధర్మరాజును; చేరంగన్+అరిగి= సమీపించి; అనియెన్= ఇట్లా అన్నాడు; నిస్సీమగౌరవ!= ఎల్లలు లేని గౌరవం పొందిన ఓ రాజా!; నిన్నున్= నిన్ను; ద్వైతవనంబునన్= అరణ్యావాస సమయంలో ద్వైతవనంలో; అరణీ ప్రసంగంబునన్= అరణి విషయంగానూ; దైవతగిరిపొంతన్= మేరుపర్వత సమీపంలో; తగిలి= ఇష్టపడి; కుక్కతోన్+వచ్చినప్పుడు= కుక్కతో వచ్చిన సమయంలో; ఇప్పుడు+ ఇచటను= ఇప్పుడిక్కడ; అనుజవర్గము విషయంబు+కాఁగన్= సోదర సమూహ విషయంగానూ; ముమ్మాఱు= మూడుసార్లు; పరీక్షింపన్+కంటిని= పరీక్షించి చూచాను; మహనీయచరిత!= పుణ్యచరిత్రుడా!; నీదుమదిన్= నీ మనసులో; ఒకప్పుడైనన్= ఒకసారైనా; చలనము= కదలిక; ఇంచుకేనియున్= కొంచెంకూడా; లేదు= కనిపించదు; నీకున్= నీకు; దమము= బాహ్యేంద్రియనిగ్రహం; శమము= అంతరింద్రియనిగ్రహం; సత్యంబు= సత్యగుణం; మత్+గత+సారభక్తి= నాపై ఉన్న గాఢభక్తి; అగ్గలములు= మిక్కిలి ప్రశంసనీయాలు.

**తాత్పర్యం:** ఇట్లా ఇంద్రు డంటున్న సమయంలో మనోహరాకారుడూ, ముఖం యొక్క ప్రసన్నతచేత ప్రకాశిస్తున్నవాడూ అయిన యమధర్మరాజు ధర్మరాజును సమీపించి ఇట్లా అన్నాడు; 'అనంత గౌరవం పొందిన ఓ రాజా! నిన్ను మొదటిసారి ద్వైతవనంలో అరణి విషయకంగానూ, రెండోసారి మేరుపర్వత సమీపంలో కుక్కతో నీవు వచ్చినప్పుడూ, మూడోసారి ఇప్పుడు ఇక్కడ నీ సోదరుల స్వర్గప్రాప్తి విషయంలోనూ - మూడుసార్లు నిన్ను నేను పరీక్షించాను. ఓ పుణ్యచరిత్రుడా! నీ మనసులో ఒక్కసారికూడా ఏ కొంచెమైన కదలిక కూడా లేదు. నీకు దమ, శమ, సత్యగుణాలూ, నాపైన ప్రగాఢమైన భక్తీ ఉన్నాయి.

**విశేషం:** ధర్మరాజు అవతార రహస్యం ఇందులో ఉంది. ధర్మం పురుషార్థాలను బంధిస్తుంది. ధరిస్తుంది. అందుకే అది 'అక్షం' (ఇరుసు)వలె కదలకుండా ఉంటుంది. అదే ధర్మనందనుడిలోని నిశ్చలత్వం.

సారభక్తి= గాఢమైన అన్నది వాచ్యార్థంగా చెప్పినా, అంతస్తత్త్వరూపమైన కూడిక అని అర్థం. భక్తి - శబ్దానికి కలిసి ఉండటమనే అర్థం ఉంది. 'సార' మన్నా, 'అంతస్తత్త్వ' మన్నా ఒక్కటే. యముడి అంశే ధర్మరాజు కాబట్టి ఈ మాట చాలా అర్థవంతమైనది. సాక్షాత్తు యముడే సెలవిస్తున్నాడు కాబట్టి.

దమం - అంతరింద్రియ నిగ్రహం. జ్ఞానేంద్రియ వ్యాపారాలను నియమిస్తూ దేహస్థితిని తన అదుపులోనికి తీసికొని నిశ్చలత్వాన్ని సాధించటం. ధర్మరాజు దీనిని సాధించటంచేత ఆ మహాప్రస్థానంలో పడిపోలేదు.

సత్యం- 'ఋతం సత్యం చ, పరం ధీమహి' - పరతత్త్వ స్పృహతోడి ధర్మాన్ని నిర్వహింపజేసే మహాశక్తి 'సత్యం', భారతంలోని పరతత్త్వస్పృహ పేరే శ్రీకృష్ణుడు. ధర్మాన్ని నిర్వహింపజేసిన మహాశక్తి ధర్మరాజు. కనుక ఆయన 'సత్య' రూపుడు. అందుకే ఆయన ఒకడే మిగిలాడు. ఏది 'సత్' పదార్థమో అది ఎప్పటికీ అనంతంగా మిగులుతుంది.

ఇక్కడ 'యముడు' కాలస్వరూపుడు 'కాలో యం' అని శ్రుతి చెప్పిన మహాతత్త్వం ఇది. ఏది సత్యరూపంలో ధర్మాన్ని నిర్వహింపజేసి జగత్తును క్రమబద్ధం చేస్తుందో అదే 'సమవర్తి' అయిన కాలస్వరూపం. ఆ సమ 'వృత్తి'ని ధర్మరాజులో ప్రబోధించటమే ఇంతవరకు ఇంద్రుడు చేసింది. అది ఏర్పడగానే 'యముడు' ప్రత్యక్షమయ్యాడు. ఇదే ఈ సంఘటనలోని సాంకేతికార్థం.

అందుచేత స్వర్గారోహణ మంటే ఈ శమదమ సత్య స్వరూపంలో నరరూపాన్ని అందిన 'ధర్మరాజు' ఐక్యంకావటమని అర్థం. గీతాకారుడు దీనినే అక్షర పరబ్రహ్మయోగమన్నాడు. మోక్షమని దీనికి వ్యావహారిక నామం.

**వ. పరిశోధితుండ వయితి; కలంక దొఱంగి సుఖివి గ'మ్మని పలికి 'రాజునకు నవశ్యంబును నరకంబు సూచుట గలదు గావున నత్తెఱంగున కయి యేనును వాసవుండును నిన్నుం గడుఁగీడగు నచ్చోటు సొనిపితిమి. సూర్యతనయ పవననందనాదుల నరక దుఃఖానుభావంబులు మా చేసిన యెడ మాయంబులగుట నీకుఁ దెలిసె; వారు పుణ్యలోకవాసులయి యునికియు వాసవు వాక్యంబులఁ దేటపడియె' నని చెప్పి. 49**

**ప్రతిపదార్థం:** పరిశోధితుండవు+అయితి(వి)= నీవు బాగా పరిశోధించబడ్డావు; కలంక= వ్యథను; తొఱంగి= వదలిపెట్టి; సుఖివికమ్ము= సుఖంగా ఉండుము; అని పలికి= అని చెప్పి (ఇంకా ఇట్లా అన్నాడు); రాజునకున్= రాజైనవాడికి; అవశ్యంబును= తప్పకుండా; నరకంబు = నరకాన్ని; చూచుట= చూడటం; కలదు= ఉన్నది; కావునన్= అందుచేత; ఆ+తెఱంగునకున్+అయి= దానికొరకని; ఏనును= నేనూ; వాసవుండును= ఇంద్రుడూ; నిన్నున్= నిన్ను; కడున్+కీడు+అగు= చాలా రోత అయినటువంటి; ఆ+చోటు= ఆ చోటికి; చొనిపితిమి= పంపించాము; సూర్యతనయ= కర్ణుడు; పవననందన+ఆదులు= భీమాదులు పడిన; నరకదుఃఖ+ అనుభావంబులు= నరక దుఃఖానుభవాలు; మా చేసిన= మేము పన్నిన; ఎడన్+చోట మాయంబులు+అగు= మాయంకావటం; నీకున్+తెలిసెన్= నీకు తెలిసింది; వారు= కర్ణాదులు; పుణ్యలోక వాసులు+అయి+ఉనికి= పుణ్యలోకవాసులుగా ఉండటం; వాసవు వాక్యంబులన్= ఇంద్రుడి మాటలచేత; తేటపడియెన్= స్పష్టమయింది (కదా); అని చెప్పి (ఇట్లా సెలవిచ్చాడు).

**తాత్పర్యం:** 'నీవు బాగా పరిశోధించబడ్డావు. వ్యథను వదలిపెట్టి సుఖంగా ఉండుము' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు. రాజైనవాడికి నరకాన్ని చూడటం తప్పనిసరి కాబట్టి నేనూ ఇంద్రుడూ నిన్ను కడు రోతను కలిగించే ఆ చోటికి పంపాము. కర్ణ భీమసేనాదులు పడ్డ నరక బాధలన్నీ మేము పన్నిన స్వల్ప మాయాదృశ్యాలని నీకు తెలిసింది కదా! కర్ణాదులు పుణ్యలోక వాసులై ఉన్నారన్నది ఇంద్రుడిమాటలవలన స్పష్టమయిందిగా!' అని చెప్పి ఇట్లా సెలవిచ్చాడు.

**విశేషం:** శోధన= వెదకటమని అర్థం, పరి= మిక్కిలిగా; భగవంతుడు భక్తుడికి పెట్టే పరీక్షలకు 'శోధన' అంటారు. ఋణం నుండి విముక్తుడు కావటాన్నికూడా శోధన మంటారు. పాపక్షాళనం కావటం కూడా శోధనమే. ధర్మరాజు విషయంలో ఇన్ని అర్థాలూ సమన్వయిస్తాయి.

ధర్మరాజు జీవితమంతా సోదరులతో ధర్మపత్నితో నిరంతర పరీక్షలను ఎదుర్కొన్నాడు. సంపాదించిన రాజ్యసంపద నెత్తురుకూడని తెలిసి విరాగభావం పొందగా 'తృష్ణ' క్షయమయింది. 'తృష్ణ' అంటే దప్పిక. రాజ్యకాంక్ష దాయాదులను జయించాలన్న తీవ్రమైన కోరిక - ఈ రెండూ నశించాయి. పూర్వపర్వ కథలలో ఇవన్నీ ప్రస్తావించబడ్డాయి.

పాపక్షాళనం ఇక్కడ జరిగింది. అదే నరకానుభవ దర్శనం. ఈ మూడింటిచేత 'పరి' - సమగ్రంగా 'శోధితుడు' అయ్యాడు.

ఇది భారతీయ సంస్కృతిలో 'పరిశోధన', అంటే ధర్మరాజు జీవితం ఒక మహాశోధన. అన్వేషణ, దీనికి గమ్యస్థానమే 'స్వర్గారోహణం'

**క. 'నీ వియ్యాకాశనదీ। పావన సలిలముల మునుఁగు భవ్యాత్మ! భవ**
**ద్భావంబు విడుచు మానుష। భావ వికారముల శోకబంధము లడఁగున్. 50**

**ప్రతిపదార్థం:** భవ్య+ఆత్మ!= పుణ్యాత్మా!; నీవు; ఈ+ఆకాశ+నదీ= ఈ ఆకాశ గంగానదియొక్క; పావన= పవిత్ర; సలిలములన్ = జలాలలో; మునుఁగు= మునుగుము; భవత్+భావంబు= నీ మనసును; మానుష= మనుష్య సంబంధాలైన; భావ వికారముల= భావ వికారాల; విడుచున్= వదలిపెట్టును; శోకబంధములు= శోకమూ, బంధమూ; అడఁగున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! నీవు ఈ ఆకాశగంగయొక్క పవిత్ర జలాలలో మునుగుము! నీ మనస్సు నుండి మనుష్య సంబంధమైన భావవికారాలు తొలగిపోతాయి. శోకబంధాలూ నశిస్తాయి.

**విశేషం:** ధర్మరాజులోని ఆత్మ భవ్యమైనదే. అది దివ్యత్వం కలిగిందే. కాని అతడి మానుష శరీరం కారణంగా 'సంసార' భావం పోలేదు. భవత్ - సంసార, జన్మ. స్వ సంబంధమైన ఆలోచన. నేను నేనన్న భావన పేరే మోహం. నేను దేహంకాదు, ఆత్మనని గుర్తించటమే జ్ఞానం.

ఈ మోహం కారణంగా - భావ వికారాలు ఏర్పడతాయి. నిశ్చలత్వం ఉండదు. ఈ కుదురులేనితనం నుండి 'శోకం' పుడుతుంది. ఈ విషాదాన్ని పెంచేది 'సంసారబంధం'. స్వర్గానికి చేరిన తరువాత కూడా ధర్మరాజులో 'నేను' అన్న భావన తన సోదరులు దుఃఖ మనుభవిస్తున్నారన్న 'వ్యథ' పోలేదు.

అందుకే ఆకాశగంగలో స్నానం చేయుము అని యముడు ఆదేశిస్తున్నాడు. 'వియద్గంగ' - అని ఆకాశగంగనే అంటారు. విష్ణువు పాదంలోపుట్టిన గంగ ఆకసంనుండి శివుడి శిరస్సుపై పడుతుందని పురాణాలు చెప్పుతాయి. ఆత్మకున్న విశ్వవ్యాపన స్వభావమే 'ఆకాశగంగ' అన్నారు.

**చ. పరమ సుఖంబుఁ జెంది యతిభాస్వరులై విహరించు నీదు సో**
**దరు లగు కర్ణ ముఖ్యుల ముదం బెసలారఁగఁ జూచె దీ మహో**
**త్తర బహు సౌఖ్యనిర్మల పదంబున దివ్య విహార లీలలం**
**బరఁగెద వేల? యిం కిచట బాంధవరక్షక! రమ్ము చెచ్చెరన్.' 51**

**ప్రతిపదార్థం:** బాంధవరక్షక!= బంధువులను రక్షించే స్వభావమున్న ధర్మరాజా!; పరమసుఖంబున్+చెంది= స్వర్గసుఖాన్ని అనుభవిస్తూ; అతిభాస్వరులు+ఐ= మిక్కిలి ప్రకాశించువారై; విహరించు= విహరిస్తున్న; నీదు సోదరులు+అగు= నీ సోదరులయిన; కర్ణముఖ్యులన్= కర్ణాదులను; ముదంబు= సంతోషం; ఎసలారఁగన్= అతిశయించగా; చూచెదు= చూద్దువుగానీ; నిర్మలపదంబునన్= నిర్మలమైన స్థానంలో; దివ్య= దివ్యమైన; విహారలీలలన్= విహార లీలలలో; పరఁగెదవు= ఒప్పుతావు (ప్రకాశిస్తావు); ఇంకన్= ఇంకా; ఇచట= ఇక్కడ ఉండటం; ఏల?= ఎందుకు?; చెచ్చెరన్= శీఘ్రంగా; రమ్ము= రా! (వెళ్ళుదాం పద).

**తాత్పర్యం:** బంధురక్షకా! స్వర్గసుఖాన్ని అనుభవిస్తూ మిక్కిలి ప్రకాశిస్తున్న నీ సోదరులైన కర్ణాదులను సంతోషం అతిశయించగా చూద్దువుగాని ఈ మహత్తర బహు సౌఖ్యాలతో ఒప్పిన నిర్మలస్థానంతో దివ్య విహారంలో నీవుకూడా ప్రకాశిస్తావు. ఇంకా ఇక్కడ ఉండటం ఎందుకు? వెంటనే వెళ్ళుదాం పద!'

**విశేషం:** శ్రీరాముడిని గురించి 'రక్షితా స్వస్య ధర్మస్య - స్వజనస్య చ రక్షితా' అని చెప్పారు. శ్రీరాముడు స్వధర్మాన్ని రక్షించాడు. స్వజనులను రక్షించాడు. సరిగా ఈ అర్థంలోనే ధర్మరాజుకూడా బంధురక్షకుడయ్యాడు. ధర్మరాజే లేకపోతే పాండవపక్షమే లేదు. స్వర్గానికి వెళ్ళికూడా బంధువుల గురించి పరితపించిన ధర్మరాజులో స్వజనరక్షణబుద్ధి అపరిమితంగా ఉన్నది.

ధర్మజుఁ డాకాశగంగావగాహంబుఁ జేసి దేవభావంబు నొందుట (సం.18-3-40)

**సీ.** **అని పల్కి ధర్ముఁ డత్తనయునిఁ దోడ్కొని । యయ్యందఱును దోడ నరుగుదేర**
**నాకాశ గంగ యుపాంతమునకుఁ బోవ । నప్పుణ్యనది నమ్మహానుభావుఁ**
**డార్య సంస్తవన వాక్యంబులు చెలఁగ భ । వ్యస్నానమంగళ మాచరించి**
**మానుష తనువు నమ్మాత్రన విడిచి ది । వ్యం బగు మహితదేహంబు దాల్చి**

**తే.** **వైరమత్సర స్నేహ సంవాసలౌల్య । గర్వశోకాదులైన హృద్గత వికార**
**ములఁ దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు । పావకుఁడుఁబోలె శోభిల్లెఁ బౌరవేంద్ర!** **52**

**ప్రతిపదార్థం:** పౌరవ+ఇంద్ర!= రాజా!; అని పల్కి= అని చెప్పినవాడై; ధర్ముఁడు= యమధర్మరాజు; ఆ+తనయునిన్= ఆ కుమారుడిని (ధర్మజుడిని); తోడ్కొని= వెంటబెట్టుకొని; ఆ+అందఱునున్= వారందరూ; తోడన్+అరుగుదేరన్= వెంట రాగా; ఆకాశగంగా+ ఉపాంతమునకున్= ఆకాశగంగ సమీపానికి; పోవన్= వెళ్ళగా; ఆ+పుణ్యనదిన్= ఆ పుణ్యనదిలో; ఆ+మహానుభావుఁడు= ధర్మరాజు; ఆర్య= పెద్దల; సంస్తవన వాక్యంబులు= ప్రశంసావాక్యాలు; చెలఁగన్= అతిశయించగా; భవ్య= శుభప్రదమైన; స్నానమంగళము= మంగళస్నానాన్ని; ఆచరించి= చేసి; మానుషతనువున్= మనుష్యదేహాన్ని; ఆ+మాత్రన్+అ= ఆ క్షణంలోనే; విడిచి= వదలిపెట్టి; దివ్యంబు+అగు= దివ్యమైన; మహిత= పూజ్య; దేహంబున్= శరీరాన్ని; తాల్చి= ధరించి; వైర= వైరం; మత్సరం= మాత్సర్యం; స్నేహ= స్నేహం; సంవాస= సహవాసం; లౌల్య= చంచలత్వం; గర్వ= గర్వం; శోక+ఆదులు+ఐన= శోకం మొదలైన; హృద్+గత= హృదయంలోని; వికారములన్+తొఱఁగి= వికారాలను పోగొట్టుకొని; నిర్ధూమత్వమునన్= పొగలేకుండా (ఉజ్జ్వలంగా); వెలుంగు= ప్రకాశించే; పావకుఁడున్+పోలెన్= అగ్నిదేవుడివలె; శోభిల్లెన్= ఒప్పాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఇట్లా చెప్పి యమధర్మరాజు తన కుమారుడిని తోడ్కొని వారందరూ తోడు రాగా ఆకాశగంగ సమీపానికి వెళ్ళాడు. ఆ పుణ్యనదిలో ఆ మహానుభావుడు పెద్దల సంస్తుతులు అతిశయించగా శుభప్రదమైన మంగళస్నానం చేశాడు. ఆ క్షణంలోనే మానుషదేహాన్ని వదలిపెట్టి దివ్యమైన పూజ్యదేహాన్ని పొందాడు. అంతటితో అతడి హృదయంలో ఉన్న వైరం, మాత్సర్యం, స్నేహం, సహవాసం, చంచలత్వం, గర్వం, దుఃఖం మొదలైన మనుష్య సహజాలైన మనోవికారాలన్నీ మాయమయ్యాయి. అపుడు ధర్మరాజు పొగలేని అగ్నిదేవుడివలె మహోజ్జ్వలంగా ప్రకాశించాడు.

**విశేషం:** 'దివ్య' మంటే తేజోరూపమైన అని అర్థం. ఇంతకుమునుపే వివరించినట్లు వైరాది భావాలన్నీ ధర్మరాజు దేహాన్ని ఆశ్రయించి ఉండినందువలన ఆ దేహాన్ని వదలగానే అవి కూడా నశించాయి. తేజోరూపంలో ధర్మరాజు దివ్యత్వాన్ని పొందాడు. అలం : ఉపమ.

**వ.** **ఇవ్విధంబున నొప్పి మీ తాత ధర్మనందనుండు బృందారక నాయక నారదాద్యుదార పురుషుల నభి నందించుచు ధర్ముండును దారును దో నరుగుదేర దివ్యశక్తి నటఁ జని మనోహరం బయిన యొక్కయెడ.53**

**పతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; ఒప్పి= ప్రకాశించి; మీ తాత= మీ తాతగారైన (పరీక్షిత్తు పెద్దతండ్రి కాబట్టి తాత); ధర్మనందనుండు= ధర్మరాజు; బృందారక నాయక= ఇంద్ర; నారద+ఆది+ఉదార+పురుషులన్= నారదుడు మొదలైన

మహనీయులను; అభినందించుచున్= ప్రస్తుతిస్తూ; ధర్మ్ముండును= యమధర్మరాజు; తారును= వారూ; తోన్+అరుగుదేరన్= తోడురాగా; దివ్యశక్తిన్= దివ్యశక్తితో; అటన్+చని= ముందుకు వెళ్ళి; మనోహరంబు+అయిన= మనోహరమైన; ఒక్క+ఎడన్= ఒక చోట.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రకాశించే మీ తాతగారైన ధర్మరాజు ఇంద్రుడిని, నారదాది మహర్షులను ప్రస్తుతిస్తూ యమధర్మరాజు, వారు తోడురాగా దివ్యశక్తితో ముందుకు వెళ్ళి అక్కడ మనోహరమైన ఒక చోట. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **విస్ఫుర ద్బహురత్న వితతి కనత్కన । కాత్మకం బయిన మహాసనమున**
**దేదీప్యమాన మై దివ్యావయవదీధి । తి ప్రతానం బెల్ల దిశల వెలుఁగఁ**
**జక్రగదాద్యస్త్రసంతతి నుజ్జ్వలా । త్యంత సుందర పురుషాకృతులును**
**జారుమౌళి స్థలీ సమవేత నిజరూప । ములుఁ గల్గి భక్తిమై బలసి కొలువఁ**

**తే.** **దనదు చూడ్కికి నెంతయుఁ దగు లొనర్చి । మున్ను చూచిన యట్లగుమూర్తి యొప్ప**
**నరుఁడు కేవల సవినయ పరత వెలుఁగఁ । బొలుచు నారాయణునిఁ గాంచె భూపవర్య! 54**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజోత్తమా! జనమేజయ మహారాజా!; విస్ఫురత్= ప్రకాశిస్తున్న; బహురత్న వితతి= బహురత్న సముదాయంతో; కనత్= వెలుగుతున్న; కనక+ఆత్మకంబు+అయిన= బంగారుమయమైన; మహాసనమునన్= సింహాసనంలో; దేదీప్యమానమై= మిక్కిలిగా ప్రకాశిస్తూ; దివ్య+అవయవ దీధితి ప్రతానంబు= దివ్యమైన అవయవాలకాంతి విస్తృతి; ఎల్లదిశలన్= అన్ని దిశలలోనూ; వెలుఁగన్= విస్తరించగా; చక్ర గదా+ఆది అస్త్రసంతతి= చక్రం, గద మొదలైన అస్త్ర సమూహం; ఉత్+జ్వల= మిక్కిలి ప్రకాశిస్తున్న; అతి+అంత= మిక్కిలి; సుందర పురుష+ఆకృతులును= సుందరమైన పురుష రూపాలూ; చారు= అందమైన; మౌళిస్థలీ= కిరీటాలతో; సమవేత= కూడిన; నిజరూపములున్= స్వస్వరూపాలూ; కల్గి= కలిగి; భక్తిమైన్= భక్తితో; బలసి= అతిశయించి; కొలువన్= కొలువగా; తనదు చూడ్కికిన్= తన చూపునకు; ఎంతయున్= ఎంతో; తగులు= ఆసక్తి; ఒనర్చి= కూర్చి; మున్ను= మునుపు; చూచిన+అట్లు+అగు+ మూర్తి= చూచినట్లే ఉన్న ఆకారం; ఒప్పన్= శోభించగా; నరుఁడు= అర్జునుడు; కేవల= స్వచ్ఛంగా; సవినయపరతన్= వినయపరత్వంతో; వెలుఁగన్= ప్రకాశించగా; పొలుచు= ఒప్పుతున్న; నారాయణునిన్= శ్రీమన్నారాయణమూర్తిని; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** ప్రకాశిస్తున్న బహురత్న సముదాయంతో వెలుగుతున్న బంగారు సింహాసనంలో ప్రకాశిస్తున్న దివ్యమైన అవయవాల కాంతి దిశలన్నిటా విస్తరించగా, శంఖ, చక్ర, గదాయుధాలు మిక్కిలి సుందర పురుషాకృతులతో, అందమైన కిరీటాలు కలిగి తమ రూపాలతో అతిభక్తితో కొలుస్తుండగా, తన నేత్రాలకు మిక్కిలి సొంపును కూర్చి, మునుపు చూచినట్లే ఉన్న ఆకారంతో సమీపంలో నరుడు (అర్జునుడు) స్వచ్ఛమైన వినయంతో నమస్కరిస్తుండగా ఒప్పుతున్న శ్రీమన్నారాయణమూర్తిని ధర్మరాజు చూచాడు.

**విశేషం:** నారాయణుడున్నచోట నరుడుంటాడు. నరనారాయణుల ప్రసక్తి పూర్వపర్వాలలో వచ్చింది. చక్రగదాద్యాయుధాలు పురుషరూపాలలో ఉంటాయని మంత్రస్మరణచేత ఆయుధరూపాలను పొందుతాయని అర్థం. కనుకే వీటిని తిక్కనగారు 'అస్త్రా'లని పిలుస్తున్నారు.

**చ. కని మది నమ్మహాత్ముఁ డధిక ప్రమదంబు వహించె; నొండెడం**
**గనుఁగొనియెం బ్రియం బెసఁగఁ గౌరవవంశవరేణ్య! దీప్తి ధా**
**ముని రవిపంక్తిలోనఁ బదుమూఁడవ మూర్తి వెలుంగుచుండఁ గ**
**ర్ణుని మఱి భీమసేనుని మరుద్గణ మధ్యగతత్వ శోభితున్. 55**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఆ+మహాత్ముఁడు= మహాత్ముడైన ఆ ధర్మరాజు; మదిన్= హృదయంలో; అధిక ప్రమదంబున్= మిక్కిలి సంతోషం; వహించెన్= పొందాడు; కౌరవవంశవరేణ్య!= ఓ జనమేజయ మహారాజా!; ఒండెడన్= మరోవైపు; ప్రియంబు+ఎసఁగన్= ప్రేమ అతిశయించగా; దీప్తిధాముని= కాంతికి నెలవుగా; రవిపంక్తిలోన్= సూర్య సమూహంలో; పదుమూఁడవమూర్తి= పదమూడవవాడుగా; వెలుంగుచున్+ఉండన్= ప్రకాశిస్తున్న; కర్ణునిన్= కర్ణుడిని; మరుత్+గణ= మరుద్గణాల; మధ్యగతత్వ శోభితున్= నడుమ ప్రకాశిస్తున్న; భీమునిన్= భీముడిని; కనుంగొనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** అట్లా చూచి ధర్మరాజు తన హృదయంలో మిక్కిలిగా సంతోషించాడు. మరోవైపు ప్రేమ అతిశయించగా, కాంతికి నెలవుగా సూర్యసమూహంలో పదమూడవవాడుగా శోభిస్తున్న కర్ణుడిని, మరుద్గణాలనడుమ ప్రకాశిస్తున్న భీముడిని కూడా చూచాడు.

**విశేషం:** ద్వాదశ - ఆదిత్య మండలాలున్నాయి. ఈ పంద్రెండింటికి తోడుగా పదమూడవస్థానంలో కర్ణుడు ప్రకాశిస్తున్నాడట! సప్త మరుద్దేవతలున్నారు. వారినడుమ భీముడు శోభిస్తున్నాడు.

**తే. అంగముల భంగి తొల్లింటి యట్ల యై య । నూన తేజోవిరాజితు లైన వారిఁ**
**గనియె నశ్విసమీపవర్తనులఁ దత్స । మానమూర్తుల వీక్షించె మాద్రిసుతుల. 56**

**ప్రతిపదార్థం:** అంగములభంగి= ఆకారాలరీతి; తొల్లింటియట్ల+ఐ= మునుపటివలె ఉండి; అనూన= అధికమైన; తేజో విరాజితులు+ఐనవారిన్= తేజంతో ప్రకాశిస్తున్న; అశ్విసమీపవర్తనులన్= అశ్వినీదేవతల సమీపంలో ఉన్నవారూ; తద్+సమాన మూర్తులన్= వారితో సమానమైన రూపాలు కలవారు అయిన; మాద్రిసుతులన్= మాద్రికుమారులైన నకుల సహదేవులను; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఆకారాల రీతి మునుపటివలె ఉండగా తేజంతో ప్రకాశిస్తూ అశ్వినీదేవతల సమీపంలో వారితో సమానమైన రూపాలతో ఒప్పుతున్న నకుల సహదేవులను కూడా చూచాడు.

**చ. ఉదిత రవిచ్ఛవిం దరుణి నుత్పలగంధి నుదాత్తమూర్తి ద్రౌ**
**పది నచొటెల్లనుం దన ప్రభన్ వెలుఁగొందఁగఁ జేయుదాని న**
**వ్విదితయశుండు చూచి మది విస్మయమందఁగ నింద్రుతోడ 'ని**
**మ్మదవతి యెవ్వ? రార్యజనమాన్యచరిత్ర! యెఱుంగఁ జెప్పవే.' 57**

**ప్రతిపదార్థం:** ఉదిత= ఉదయించిన; రవిచ్ఛవిన్= సూర్యకాంతితో (ప్రకాశించే); తరుణిన్= స్త్రీని; ఉదాత్తమూర్తిన్= గంభీరమైన ఆకృతి కలిగినదానిని; అచొటు+ఎల్లనున్= ఆ ప్రదేశమంతటా; తన ప్రభన్= తన దివ్యకాంతిని; వెలుఁగు+ఒందఁగన్+చేయుదానిన్= ప్రకాశింపచేస్తున్న దానిని; ద్రౌపదిన్= ద్రౌపదిని; ఆ+విదితయశుండు= (ప్రఖ్యాత కీర్తి అయిన) ధర్మరాజు; చూచి; మది= హృదయం;

విస్మయము+అందఁగన్= ఆశ్చర్యాన్ని పొందగా; ఇంద్రుతోడన్= ఇంద్రుడితో; ఆర్యజనమాన్యచరిత్ర!= ఆర్య జనులచేత పూజించబడే ఓ ఇంద్రా!; ఈ+మదవతి= ఈ స్త్రీ; ఎవ్వరు= ఎవరు; ఎఱుంగన్+చెప్పవే= తెలియ జెప్పుము.

**తాత్పర్యం:** ఉదయించిన సూర్యకాంతితో ప్రకాశిస్తూ, గంభీరమైన ఆకృతి కలిగి, ఆ చోటును తన దివ్య ప్రకాశంతో వెలుగజేస్తూ ఉన్న ద్రౌపదీ మహాసతిని చూచి ఆశ్చర్యమగ్నుడై, ఎవరో పోల్చుకొనలేక మహేంద్రుడిని ఇట్లా అడిగాడు. 'స్వామీ! ఈ స్త్రీ ఎవరు? నాకు దయచేసి చెప్పండి.'

**విశేషం:** తిక్కన అందరిని పోల్చుకొనగలిగిన ధర్మరాజు ద్రౌపదిని ఎందుకు గుర్తించలే? దన్న సంశయానికి తరువాతి పద్యంలో సమాధానమున్నది. ద్రౌపది అవతారరహస్యం ఈ పద్యంలో ఉన్నది.

**ఇంద్రుఁడు ధర్మజునకు దేవత్వంబు నొందిన స్వజనంబులఁ జూపి చెప్పుట (సం.18-4-9)**

**సీ.** **అనవుడు నతనితో నాతఁ 'డీ భామ మ। హాలక్ష్మి ద్రౌపది' యనఁగ ద్రుపదు**
**నికిఁ గూఁతురై యయోనిప్రభవం బగు। మానుషరూపంబు మహితలీల**
**ముగఁ దాల్చి భవదనుభూతి సెల్లించె గౌ। రీశ్వరు నాజ్ఞ వహించి వచ్చె'**
**నని చెప్పి, యల్ల రమ్యాకృతు లేవురు। గంధర్వవరులు నిక్కమలనయన**

**తే.** **యందు మీకు జన్మించిన యక్కుమారు;। లల్లవాఁడె మీ తండ్రికి నగ్రజుండు**
**ప్రకట గంధర్వపతి ధృతరాష్ట్రనాముఁ। డిందు నతఁ' డంచుఁ జూపె నరేంద్రముఖ్య!** **58**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రముఖ్య!= ఓ జనమేజయమహారాజా!; అనవుడున్= అని ధర్మరాజు అడుగగా; అతఁడు= ఇంద్రుడు; అతనితోన్= ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు); ఈ భామ= ఈ స్త్రీ; మహాలక్ష్మి= శ్రీమహాలక్ష్మి; ద్రౌపది+అనఁగన్= ద్రౌపది అనే పేరుతో; ద్రుపదునికిన్+కూఁతురు+ఐ= ద్రుపదుడి కూతురుగా; అయోనిప్రభవంబు+అగు= అయోనిజగా; మానుషరూపంబున్= మనుష్యరూపాన్ని; మహితలీలముగన్+తాల్చి= ఉదాత్త లీలతో ధరించి; భవత్+అనుభూతిన్+చెల్లించెన్= నీకు సంతోషం కలిగించింది; గౌరీ+ఈశ్వరు+ఆజ్ఞ= ఈశ్వరుడి ఆజ్ఞను; వహించి వచ్చెన్= పాలించి అవతరించింది; అని చెప్పి; అల్ల= అదిగో అక్కడున్నవారు; రమ్య+ఆకృతులు= అందమైన రూపాలు కలవారు; ఏవురు= ఐదుగురు; గంధర్వవరులున్= గంధర్వ శ్రేష్ఠులు; ఈ+కమలనయన+అందున్= కమలములవంటి కన్నులు గల ఈ ద్రౌపదియందు; మీకన్= మీకు; జన్మించిన= పుట్టిన; ఆ+కుమారులు= ఉపపాండవులు; ఇందున్= వీరిలో; అతఁడు= అతడే అల్లవాఁడె= అదిగో ఆయనే; మీ తండ్రికిన్+ అగ్రజుండు= మీ నాయనకు అన్న; ప్రకట గంధర్వపతి= ప్రసిద్ధుడైన గంధర్వనాయకుడు; ధృతరాష్ట్రనాముఁడు= ధృతరాష్ట్రుడని పేరు కలవాడు; అంచున్= అంటూ; చూపెన్= కనబరిచాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అడుగగా ఇంద్రు డిట్లా అన్నాడు. 'నాయనా! ఈమె శ్రీమహాలక్ష్మి. ద్రౌపది అనే పేరుతో ద్రుపదుడి ఇంట అయోనిజగా మానవరూపాన్ని లీలగా పొందిన సాధ్వి. మీకు సర్వసుఖానుభవాన్ని కలిగించింది. మహేశ్వరుడి ఆజ్ఞతో ఈమె అవతరించింది. అదిగో అక్కడున్న ఐదుగురు గంధర్వశ్రేష్ఠులు ఈమెవల్ల మీకు కలిగిన ఉపపాండవులు. మరి అక్కడ కనిపిస్తున్నవాడే ప్రఖ్యాతుడైన గంధర్వనాయకుడు ధృతరాష్ట్రుడు. మీ పెదతండ్రి' అంటూ వారిని చూపాడు.

**విశేషం:** ఆదిపర్వంలో ఉన్న పంచేంద్రోపాఖ్యానాన్ని ఒకసారి స్మరించుకొని ఈశ్వరుడి అనుజ్ఞతో 'ఇంద్రసేన' ద్రౌపదిగా అవతరించినదన్న విషయాన్ని ఇక్కడ అనుసంధించుకొనాలి. 'శ్రీమహాలక్ష్మి' అన్న భావన ఏమిటి? ఆమె పాండవుల శౌర్యలక్ష్మి, విజయలక్ష్మి కూడా. ఇది కథద్వారా మనకు తెలిసే అంశం. ఇచ్ఛాజ్ఞాన క్రియా రూపమైన 'శక్తి' కూడా భారతయుద్ధానికి ద్రౌపదే. అట్లా ఆమెలో 'శ్రీ' తత్త్వమున్నది. ఒకవిధంగా 'శ్రీయన, గౌరినా౯బరఁగు' - అని విరాటపర్వాదిలో తిక్కనగారు స్తుతించిన దేవీతత్త్వం ద్రౌపది. అందుకే వైదికధ్యాయిత'కు మహా ఇష్టమైన పరతత్త్వ లక్షణం ఆమెలో ఉన్నది. అదే 'ధర్మ' పరిరక్షణ రూపమైన పాండవపత్నీత్వం.

మానవులు యోనిజులు - తల్లిగర్భంనుంచి బయపడతారు కాబట్టి. కాని, అవతారమూర్తులు అయోనిజులు. పాండవులందరూ మాతృగర్భసంజాతులే. శ్రీకృష్ణుడు కూడా దేవకీ గర్భంలోనే పుట్టాడు. ఒక ద్రౌపదిమాత్రమే 'అయోనిజ'గా అవతరించింది. అందుకే లీలావతారమనటం.

అనుభూతిని చెల్లించటం - పత్నిగా వారి వారికి కావలసిన అనుభూతులను అందించిందని వాచ్యార్థం. మీ వాంఛలను మహాపతివ్రతగా సఫలంచేసిందని తాత్త్వికార్థం. ఇట్లా ద్రౌపది అవతారరహస్యం ఈ పద్యంలో వివరించబడింది.

**వ. ఇట్లు ద్రౌపదీ ద్రౌపదేయాంబికేయుల తెఱం గెఱింగించి, వెండియు నాఖండలుండు పాండవాగ్రజునకుఁ గర్ణుం జూపి 'భవదగ్రజుండు సూర్యునపరశరీరంబు కౌంతేయుండయి రాధేయుం డనం బరఁగినవాఁడు సుమ్ము! చూడు' మని పలికి, సిద్ధ సాధ్య విశ్వదేవగణంబులతో నున్నవారు తత్తదంశ ప్రభూతు లయి వాసుదేవానుచరణ పరాయణులగుచు వర్తించిన సాత్యకి కృతవర్మాది యాదవుల నాలోకింపుము.' 59**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; ద్రౌపదీ= ద్రౌపది; ద్రౌపదేయ= ద్రౌపది కుమారుల; ఆంబికేయుల= ధృతరాష్ట్రుడి; తెఱంగు+ఎఱింగించి= పుట్టుకను తెలిపి; వెండియున్= మరలా; అఖండలుండు= ఇంద్రుడు; పాండవ+అగ్రజునకున్= ధర్మరాజుకు; కర్ణున్+చూపి= కర్ణుడిని చూపి; భవత్+అగ్రజుండు= మీ అన్న; సూర్యు+అపరశరీరంబు= సూర్యుడి మరోరూపం; కౌంతేయుండు+అయి= కుంతీ కుమారుడుగా పుట్టి; రాధేయుఁడు+అనన్= రాధా కుమారుడుగా; పరఁగినవాఁడు= ప్రసిద్ధినొందినవాడు; సుమ్మా!= సుమ్మా!; చూడుము+ అని పల్కి= చూడుమనిచెప్పి; (ఇట్లా అన్నాడు); సిద్ధ= సిద్ధుల; సాధ్య= సాధ్యుల; విశ్వదేవగుణంబులతోన్+ఉన్నవారు= విశ్వేదేవ సమూహాలతో కనిపిస్తున్నవారు; తత్తద్+అంశ+ప్రభూతులు+అయి= ఆయా అంశలతోపుట్టి; వాసుదేవ+అనుచరణ+ పరాయణులు+ అగుచున్= శ్రీకృష్ణుడి సాహచర్య నిరతులై; వర్తించిన= ప్రవర్తించిన; సాత్యకి; కృతవర్మ+ఆది= కృతవర్మ మొదలైన; యాదవులన్= యదువీరులను; ఆలోకింపుము= చూడుము.

**తాత్పర్యం:** ఇట్లా ద్రౌపది ఉపపాండవులు, ధృతరాష్ట్రుల తీరును వివరించి, ఇంద్రుడు ధర్మరాజుతో 'అదిగో మీ అన్న కర్ణుడు. సూర్యుడి మరోరూపమే కుంతీ కుమారుడుగా పుట్టి రాధాతనయుడుగా పేరు పొందాడు సుమా! అక్కడ చూడుము' అంటూ సిద్ధ సాధ్య విశ్వదేవ సమూహాలతో కనిపిస్తున్నవారు, ఆయా అంశలతో పుట్టి శ్రీకృష్ణుడి సహచరులుగా ప్రవర్తించిన సాత్యకి కృతవర్మాది యదువీరులు! వారి నందరినీ చూడుము.' (అని వారిని చూపించాడు).

**క. అని చెప్పి చూపి 'యభిమ। న్యునిఁ జూచితె చంద్రు భంగి నుజ్జ్వల కాంతిం**
**దనరెడుఁ దదంశజాతుం। డనూన ధృతిశాలి వీఁడె' యంచుం జూపెన్. 60**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; చూపి= వారిని చూపించి (ఇట్లా అన్నాడు); అభిమన్యునిన్= అభిమన్యుడిని; చూచితె= చూచావా; చంద్రుభంగిన్= చంద్రుడివలె; ఉజ్జ్వల కాంతిన్= మిక్కిలి ప్రకాశిస్తున్న కాంతితో; తనరెడున్= ఒప్పుతున్నాడు; తద్+అంశజాతుండు=

ఆ చంద్రాంశతో పుట్టినవాడు; అనూన= మిక్కిలి; ధృతిశాలి= బలశాలి; వీఁడె= ఇదిగో చూడుము; అంచున్= అంటూ; చూపెన్= చూపాడు.

**తాత్పర్యం:** అని చెప్పి వారిని చూపించి ఇట్లా అన్నాడు. 'అభిమన్యుడిని చూచావా! చంద్రుడివలె మిక్కిలి ప్రకాశిస్తున్న కాంతితో ఒప్పుతున్నాడు. ఆ చంద్రాంశతోనే పుట్టిన ఇతడు మిక్కిలి బలశాలి. ఇదిగో చూడుము' అంటూ చూపాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. చూపి తదనంతరం బమ్మహాత్మునితోడ. 61**

**తాత్పర్యం:** తరువాత ఆ మహాత్ముడితో. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. 'పాండురాజు వీఁడె బహురత్న ఖచిత వి। మాన మెక్కి గొంతి మాద్రి తన యు**
**పాంత భాగమున సుఖాసీనలుగ నాదు। వలను వచ్చుచున్నవాఁడు గంటె. 62**

**ప్రతిపదార్థం:** పాండురాజు= మీ తండ్రి పాండుమహారాజు; వీఁడె= ఇతడే; బహురత్న ఖచిత= మిక్కుటంగా రత్నాలు పొదిగిన; విమానము+ఎక్కి= విమానాన్ని అధిరోహించి; గొంతి, మాద్రి= కుంతీ, మాద్రీ; తన= తనయొక్క; ఉపాంత భాగమునన్= సమీపంలో; సుఖ+ఆసీనలుగన్= సుఖంగా కూర్చుని ఉండగా; నాదువలను= నా వైపు; వచ్చుచున్నవాఁడు= వస్తున్నాడు; కంటె!= చూస్తున్నావా!

**తాత్పర్యం:** మీ తండ్రి పాండురాజు ఇతడే. మిక్కుటంగా రత్నాలు పొదిగిన దివ్య విమానాలు ఎక్కి కుంతీ, మాద్రీ దేవులు తన సమీపంలో సుఖంగా ఆసీనలు కాగా నా వైపే వస్తున్నాడు చూస్తున్నావా!

**క. అదె భీష్ముఁడు వసువుల కడఁ। గదిసి యెలమి నున్నవాఁడు కంటే! ద్రోణుం**
**డిదె దివిజగురుని పాలఁ బ్ర। మద మెసఁగ వసించినాఁడు మాన్యచరిత్రా!' 63**

**ప్రతిపదార్థం:** అదె= అదిగో అక్కడ; భీష్ముఁడు= భీష్ముడు; వసువులకడన్= అష్టవసువుల వద్ద; కదిసి= చేరి; ఎలమిన్= ఆనందంగా; ఉన్నవాఁడు= ఉన్నాడు; దివిజ గురుని పాలన్= బృహస్పతి సమీపంలో; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ప్రమదము+ఎసఁగన్= సంతోషం అతిశయించగా; వసించినాఁడు= నిలిచాడు; మాన్యచరిత్రా!= ఓ ధర్మరాజా!; కంటే?= చూచావా?

**తాత్పర్యం:** అదిగో అక్కడ భీష్ముడు వసువులవద్ద చేరి ఆనందంగా ఉన్నాడు. బృహస్పతి సమీపంలో ద్రోణుడు సంతోషంగా నిలిచాడు. చూచావా?

**వ. అని పలుకుచుఁ జూపి, గంధర్వ యక్ష గుహ్యక గణంబులలో ద్రుపద విరాటులను, దదీయానుజ తనుజ వర్గంబులనుం, దక్కునుం గలుగు కేకయ పాండ్యప్రభృతి నానా దేశాధీశులను వేఱువేఱం జెప్పుచుఁ జూపుచు 'భవదీయం బగు సమరంబునం బరిత్యక్త శరీరు లయి యుత్తమలోకంబులు వడసి యున్నవారల నవలో కింపు' మని చెప్పె ననిన విని జనమేజయుండు వైశంపాయనుతో 'మునీంద్రా! యిప్పుడు నీ చెప్పిన సుయోధన**

**శకుని సైంధవులును గర్ణుండును గర్ణకుమారులును వెండియుంగల తత్పక్ష భూపతులును ఘటోత్కచాదులయిన పాండవులవారును నీ చెప్పిన సకల జనంబులు నాకలోకంబున నెప్పుడు నుండుదురో? యట్లుంగాక కొంతకాలంబు నిలిచి క్రమ్మఱ మనుష్యాది జన్మంబుల నొందుటకై యరుగుదెంతురో? యిత్తెఱంగు వినవలతుం జెప్పవే యని యడిగిన నమ్మునిపతి యమ్మనుజపతితో నిట్లనియె. 64**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్= అని అడుగుతూ; చూపి= వారిని చూపించి; గంధర్వ యక్ష గుహ్యక గణంబులలోన్= గంధర్వులు, యక్షులు, గుహ్యకులు వీరి గణాలలో; ద్రుపద= ద్రుపదుడిని; విరాటులను= విరాటుడిని; తదీయ+అనుజ= వారి తమ్ముల; తనుజ= కుమారుల; వర్గంబులనున్= సమూహాలను; తక్కునున్+కలుగు= మిగిలిన; కేకయ= కేకయులు; పాండ్య= పాండ్యులు; ప్రభృతి= మొదలైన; నానాదేశాధీశులనున్= అనేక దేశాధిపతులను; వేఱువేఱన్= వేరు వేరుగా; చెప్పుచున్= వివరిస్తూ; చూపుచున్= చూపిస్తూ; భవదీయంబు+అగు= నీ; సమరంబునన్= యుద్ధంలో; పరిత్యక్త= వదలిన; శరీరులు+అయి= శరీరాలు కలవారై; ఉత్తమలోకంబులు+ పడసి+ఉన్నవారలన్= పుణ్యలోకాలను పొంది ఉన్నవారిని; అవలోకింపుము+అని= చూడుము అని; చెప్పెన్+అనినన్= చెప్పాడు అని చెప్పగా; విని= విన్నవాడై; జనమేజయుండు= జనమేజయుడు; వైశంపాయనుతోన్= వైశంపాయన మహర్షితో; మునీంద్రా!= మునీశ్వరా!; ఇప్పుడు= ఇంతవరకు; నీ చెప్పిన= నీవు చెప్పిన; సుయోధన= దుర్యోధనుడు; శకుని= శకుని; సైంధవులును= సైంధవుడూ; కర్ణుండును= కర్ణుడూ; కర్ణకుమారులును= కర్ణుడి కొడుకులు; వెండియున్+కల= ఇంకా మిగిలిన; తత్పక్షభూపతులును= కౌరవపక్షంలోని రాజులు; ఘటోత్కచాదులు+ఐన= ఘటోత్కచుడు మొదలైన; పాండవులవారును= పాండవపక్షంలోనివారు; నీ చెప్పిన= నీవు ఇంతవరకూ చెప్పిన; సకల జనంబులున్= జనులందరూ; నాకలోకంబునన్= స్వర్గలోకంలో; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; ఉండుదురో= ఉంటారో; అట్లున్+కాక= అట్లా కాకుండా; కొంతకాలంబు నిలిచి= కొంతకాలం ఉండి; క్రమ్మఱన్= మరలా; మనుష్య+ఆది జన్మంబులన్= మనుష్యాది జన్మాలు; ఒందుటకై = పొందటానికై; అరుగుదెంతురో= తిరిగి వస్తారో; ఈ+తెఱంగు= ఈ విషయం; వినన్ వలతున్= వినాలని ఉన్నది; చెప్పవే+అని+అడిగినన్= చెప్పుము అని అడుగగా; ఆ+మునిపతి= ఆ మునిశ్రేష్ఠుడు; ఆ+మనుజపతితోన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగుతూ వారిని చూపి గంధర్వ యక్ష గుహ్యక సమూహాలలో ఉన్న ద్రుపదుడిని, విరాటుడిని, వారి తమ్ములను, వారి కొడుకులను, మిగిలిన కేకయ పాండ్యాది నానా రాజులను వేరువేరుగా వివరిస్తూ చూపిస్తూ ఇంద్రుడు 'ధర్మరాజా! నీవు చేసిన యుద్ధంలో శరీరాలు వదలి పుణ్యలోకాలను పొంది ఉన్నవారిని చూడుము' అని చెప్పాడని వైశంపాయనుడు జనమేజయుడితో చెప్పాడు. అప్పుడు జనమేజయుడు 'ఓ మునీశ్వరా! ఇంతవరకు నీవు చెప్పిన దుర్యోధన శకుని సైంధవులు, కర్ణుడు, అతడి కుమారులు ఇంకా మిగిలిన కౌరవపక్షంలోని రాజులు, ఘటోత్కచుడు మొదలైన పాండపక్షంలోనివారు. నీవు ఇంతవరకు చెప్పిన జనులందరూ స్వర్గలోకంలో శాశ్వతంగా అట్లాగే ఉంటారా? లేక కొంతకాలం ఉండి మళ్ళీ మనుష్యాది జన్మలు ఎత్తటానికి తిరిగి వస్తారా! ఈ విషయం వినాలని నాకు కుతూహలంగా ఉన్నది. దయతో చెప్పుము' అని అడుగగా ఆ మునిశ్రేష్ఠుడు ఆ రాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'కురువర! యిది దేవగుహ్యంబు మునివరుఁ । డైన వేదవ్యాసుఁ డతుల కరుణఁ**
**జెప్పినయది నీకుఁ జెప్పెద సమవధా । నంబుతో వినుము 'సనత్కుమారుఁ**
**గలసెఁ బ్రద్యుమ్నుఁ డన్యులకు దురాసదం । బయిన కుబేర లోకానుభవము**
**ధృతరాష్ట్రుఁ డొందెను సతియుఁ దానును నింద్రు । భవనంబునన నిల్చెఁ, బాండునృపతి**

**తే.** **యాంద్రు రిరువురుఁ దో నిల్వ నమృతకరునిఁ। గూడె నభిమన్యుఁ, డనిమిషగురుని నొందెఁ**
**దత్ప్రతీకాశుఁ డయిన కోదండగురుఁడు, । ద్వాపరాత్మకుం డయ్యె గాంధారవిభుఁడు.** **65**

**ప్రతిపదార్థం:** కురువర!= ఓ జనమేజయా!; ఇది దేవగుహ్యంబు= ఇది దేవరహస్యం; మునివరుఁడు+ఐన= మునిశ్రేష్ఠుడైన; వేదవ్యాసుఁడు= వేదవ్యాసమహర్షి; అతులకరుణన్= సాటిలేని దయతో; చెప్పిన+అది= చెప్పిన విషయ మిది; నీకున్+చెప్పెదన్= నీకు చెప్పుతాను; సమవధానంబుతోన్= ఏకాగ్రతతో; వినుము; ప్రద్యుమ్నుఁడు= ప్రద్యుమ్నుడు; సనత్కుమారున్+కలసెన్= సనత్కుమారుడితో కలిసిపోయాడు; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడు; సతియున్+తానును= భార్యా తానూ; అన్యులకున్= ఇతరులకు; దురాసదంబు+అయిన= పొందటానికి వీలులేని; కుబేరలోక+అనుభవమున్= కుబేరలోక సౌఖ్యాన్ని; ఒందెన్= పొందాడు; పాండునృపతి= పాండురాజు; ఆంద్రురు+ఇరువురున్, తోన్+నిల్వన్= భార్యలిరువురూ కూడా ఉండగా; ఇంద్రుభవనంబునన్+అ= ఇంద్రభవనంలోనే; నిల్చెన్= నిలిచాడు; అభిమన్యుఁడు= అభిమన్యుడు; అమృతకరునిన్+కూడెన్= చంద్రుడితో కలిసిపోయాడు; ఆనిమిషగురునిన్= బృహస్పతిని; తద్+ప్రతీకాశుఁడయిన= అతడితో సమానుడైన; కోదండగురుఁడు= ధనుర్విద్యాగురుడు ద్రోణాచార్యుడు; ఒందెన్= పొందాడు; గాంధార విభుఁడు= శకుని; ద్వాపర+ఆత్మకుఁడు+అయ్యెన్= ద్వాపరయుగాధిదైవతంతో కలిసిపోయాడు.

**తాత్పర్యం:** 'జనమేజయా! ఇది దేవరహస్యం. మునిశ్రేష్ఠుడైన వేదవ్యాసమహర్షి మిక్కిలి కరుణతో చెప్పిన విషయం నీకు చెప్పుతాను. ఏకాగ్రతతో వినుము. ప్రద్యుమ్నుడు సనత్కుమారుడిలో కలిశాడు. ధృతరాష్ట్రుడు భార్య గాంధారితో కలిసి ఇతరులకు ప్రవేశించటానికి వీలులేని కుబేరలోకంలో చేరాడు. పాండురాజు కుంతీ మాద్రీ దేవులతో స్వర్గంలోనే నిలిచిపోయాడు. అభిమన్యుడు చంద్రుడిలో కలిసిపోయాడు. ద్రోణాచార్యుడు బృహస్పతిలో కలిశాడు. శకుని ద్వాపరయుగాధిదైవతంతో కలిసిపోయాడు.

**విశేషం:** కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగు. భాగవతప్రమాణం ప్రకారం ధర్మం నాలుగు, మూడు, రెండు, ఒక పాదాలు కలిగి ఉండటం ఈ యుగాల లక్షణం. కృత-యుగంలో ధర్మం సిద్ధంగా ఉన్నది. త్రేత - లో సంపాదించబడింది. ద్వాపరంలో సందేహించబడింది (ద్వాపర శబ్దానికి సంశయమనే అర్థం) కలి - లో నశించి 'పాపం' స్థిరపడింది. అందుకే 'జగడం' కలియుగధర్మం. భారతంలో శకుని పాత్ర ద్వాపరంలోని 'సంశయాత్మ', దానిని నమ్ముకొన్నవాడు కాబట్టే దుర్యోధనుడు సర్వనాశనమయ్యాడు. (సంశయాత్మా వినశ్యతి - అని భగవద్గీత), యుద్ధకారకుడయ్యాడు.

**క.** **రారాజు నాక నరకో ' దార సుఖాత్యంత దుఃఖ ధామంబులఁ బెం**
**పారియు హీనత నొందియుఁ। గౌరవ కులనాథ! పిదపఁ గలియం దొం(దు)దెన్.** **66**

**ప్రతిపదార్థం:** కౌరవకులనాథ!= కౌరవవంశరాజా! జనమేజయా!; రారాజు= దుర్యోధనుడు; నాక= స్వర్గ; నరక; ఉదార= మహితమైన; సుఖ; అత్యంత= మిక్కిలి; దుఃఖ; ధామంబులన్= స్థానాలలో; పెంపారియున్= అతిశయించీ; హీనతన్+ఒందియున్= హీనస్థితి పొంది; పిదపన్= ఆ తరువాత; కలియందున్= కలిపురుషుడిలో; ఒందున్= చేరుతాడు (ఒందెన్= చేరాడు).

**తాత్పర్యం:** జనమేజయా! వినుము. దుర్యోధనుడు స్వర్గంలో ఉదారమైన సుఖస్థానంలో, అతిశయించే నరకంలో మిక్కిలి హీనస్థితిలో కృశించి చివరకు కలిపురుషుడిలో లీనమయ్యాడు. (అవుతాడు).

**విశేషం:** వేదప్రామాణ్యాన్ని శంకించటమన్నా, భగవంతుడి ఉనికిని ప్రశ్నించటమన్నా రెండూ ఒక్కటే. అదే దుర్యోధనుడిలోని ఆత్మ ద్రవ్యం. దాని పేరే శకుని. అందుకే పాపపుణ్యాల ఫలితాలు రెండూ తీవ్రంగానే అనుభవించి చివరికి భవిష్యద్యుగంలోకి చొచ్చుకొనిపోయే లక్షణం ఒక దుర్యోధనుడిలో మాత్రమే ఉన్నది. అందుకే దుర్యోధనుడు జన్మించినపుడే జ్యోతిష్కులు చెప్పుతారు. ఈ శిశువు యుగ ధర్మధ్వంసకుడు అవుతా డని. అట్లాగే కలియుగ ప్రారంభకుడూ అయ్యాడు. ఈ కథ (స్వర్గారోహణోదంతం) జరుగుతున్నది ద్వాపర, కలియుగాల సంధి దశలో, అందుకే ఒందెన్/ఒందున్ అన్న రెండు క్రియలూ అర్థవంతాలే.

**వ. అట్లపోలె నాక నరకంబు లనుభవించి. 67**

**ప్రతిపదార్థం:** అట్లపోలెన్= అదేవిధంగా; నాక= స్వర్గాన్ని; నరకంబులు= నరకాన్ని; అనుభవించి= అనుభవించినవారై.

**తాత్పర్యం:** అదేవిధంగా స్వర్గ నరకాలను అనుభవించినవారై. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అతని తమ్ములెల్ల యాతుధానావలిఁ। గలిసి; రాత్మజనకుఁ గలసె సూర్యుఁ**
**గర్ణుఁ; డధిప! వసువు గావున వినుము గం। గాత్మజుండు వసువు లందు నిలిచె. 68**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వినుము; అతని తమ్ములు+ఎల్లన్= దుశ్శాసనాదులు అందరూ; యాతుధాన+ఆవలిన్= రాక్షస గణాలను; కలిసిరి= కలిశారు; కర్ణుఁడు; ఆత్మజనకున్= సూర్యుడిని; కలసెన్= కలిశాడు; వసువు+కావునన్= వసువుల అంశలో పుట్టినవాడు కాబట్టి; గంగా+ఆత్మజుండు= గంగాదేవి కుమారుడు భీష్ముడు; వసువులందున్= అష్టవసువులలో; నిలిచెన్= నిలిచిపోయాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి తమ్ములైన దుశ్శాసనాదులు రాక్షసగణాలలో కలిసిపోయారు. కర్ణుడు తన తండ్రి అయిన సూర్యుడిని కలిసికొన్నాడు. 'వసువు' కాబట్టి గంగాపుత్రుడైన భీష్ముడు అష్టవసువులలో నిలిచిపోయాడు.

**విశేషం:** రాక్షసాంశతో ప్రతియుగంలోనూ ఒక్కొక్కడు అవతరిస్తుంటాడు. అట్లాగే దైవతాంశతోకూడా ద్వాపరంలోని రాక్షస ప్రకృతులు కావటంవలననే అన్ని అన్యాయాలకు ఒడిగట్టి పాండవులను చిత్రహింసలు పెట్టారు. భారతం మూడుకాలాలలోనూ, మూడు లోకాలలోనూ జరుగుతున్న ఇతిహాస మనటానికి కారణం ఈ దైవ, రాక్షస పాత్రల సంఘర్షణే.

**వ. ద్రుపదుండు, విరాటుండు, ధృష్టకేతుండును, భూరిశ్రవుండును, శల్యుండును, శంఖుండును, నుత్తరుండును, విశ్వనామదేవతలఁ గలసిరి. ధృష్టద్యుమ్నుండు హుతవహునిఁ గూడికొనియె' నని చెప్పి యప్పరమ సంయమి యప్పుడమిఱేనితో వెండియు నిట్లనియె. 69**

**ప్రతిపదార్థం:** ద్రుపదుండు= ద్రుపద మహారాజు; విరాటుండు= విరాట మహారాజు; ధృష్టకేతుండును= ధృష్టద్యుమ్నుడి కుమారుడైన ధృష్టకేతువు; భూరిశ్రవుండును= సోమదత్తుడి కొడుకయిన భూరిశ్రవుడు; శల్యుండును= శల్యుడూ; శంఖుండును= శంఖుడూ; ఉత్తరుండును= ఉత్తరకుమారుడు; విశ్వనామ దేవతలన్= విశ్వేదేవతలను; కలసిరి= కలిశారు; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు (ద్రౌపది అన్న); హుతవహునిన్= అగ్నిదేవుడిని; కూడికొనియెన్= కలిసికొన్నారు; అని చెప్పి; ఆ+పరమసంయమి= ఆ ఉత్తమ మహర్షి; ఆ+పుడమిఱేనితోన్= ఆ రాజుతో; వెండియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రుపదుడు, విరాటుడు, ధృష్టకేతువు, భూరిశ్రవుడు, శల్యుడు, శంఖుడు, ఉత్తరుడు, విశ్వేదేవతలను చేరారు. ధృష్టద్యుమ్నుడు అగ్నిదేవుడిలో కలిశాడు' అని చెప్పి వైశంపాయనుడు జనమేజయుడితో ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'విశ్వ' నామదేవతలనే విశ్వేదేవతలంటారు. దేవతలలో ఒక గణానికి ఈ పేరున్నది. క్రతువు, దక్షుడు, వసువు, సత్యుడు, కాముడు, ధురి, రోచనుడు, పురూరవసుడు, మాద్రవసుడు - అనే పదిమందికి విశ్వేదేవతలని పేరు.

ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ అగ్నికుండంలో పుట్టారు. అగ్ని సంజాతుడు కాబట్టి అగ్నిలోనే ధృష్టద్యుమ్నుడు లీనమయ్యాడు.

**తే.** **వినుము ధర్మనందను పుణ్యతనువునందుఁ। దగఁ బ్రవేశించి యున్న విద్యామయాత్ముఁ**
**డైన విదురుండు నమ్మహితాత్మ బోధ। శాలియును ధర్ముఁ గూడిరి సచ్చరిత్ర! 70**

**ప్రతిపదార్థం:** సత్+చరిత్ర!= మంచి చరిత్రగల ఓ జనమేజయ రాజా!; వినుము; ధర్మనందను= ధర్మరాజుయొక్క; పుణ్య తనువునందున్= పుణ్యశరీరంలో; తగన్= తగినట్టుగా; ప్రవేశించి+ఉన్న= చేరిఉన్న; విద్యామయాత్ముఁడు+ఐన= జ్ఞానరూపమైన విద్యామయుడైన; విదురుండు= విదురుడు; ఆ+మహిత+ఆత్మబోధశాలియున్= ఆ ఆత్మజ్ఞాన సంపన్నుడైన ధర్మరాజు; ధర్మున్= యమధర్మరాజును; కూడిరి= చేరుకొన్నారు.

**తాత్పర్యం:** ధర్మరాజుయొక్క పుణ్యశరీరంలో అప్పటికే ప్రవేశించి ఉన్న జ్ఞానవిద్యారూపుడైన విదురుడు ఆత్మజ్ఞాన సంపన్నుడైన ధర్మరాజు యమధర్మరాజులో కలిసిపోయారు.

**విశేషం:** యముడే మాండవ్య మహాముని శాపంవలన విదురుడుగా పుట్టాడన్న కథను ఇక్కడ స్మరిస్తే ధర్మరాజుతోపాటు విదురుడుకూడా యమాంశజుడే అని తెలుస్తుంది. అందుకే కాలస్వరూపుడై కౌరవపక్షాన్ని నిరంతరం ప్రబోధిస్తూ వారి అనుచితకార్యాలను ఖండిస్తూ ద్వాపరయుగ వ్యాఖ్యాతగా విదురుడు నిలిచాడు. చివరికి అరణ్యంలో తపస్సు చేసికొంటూ ఉండి తనను చూడటానికి వచ్చిన ధర్మరాజు శరీరంలో యోగబలంతో ప్రవేశించాడు. ఆ శరీరానికి (విదురుడి కళేబరానికి) అగ్నికార్యం చేయకూడదని ఆకాశవాణి చెప్తుతుంది. అట్లాంటి పరమ పవిత్రమూర్తి కాబట్టి విదురాంశ ధర్మనందనుడితో కలిసి 'కాలాంశ'లో లీనమైపోయింది.

**సీ.** **కమలగర్భుని నియోగంబున నిజయోగ। బలము గైకొని బలభద్రదేవుఁ**
**డంబుధి కరిగి యనంతుఁ బరమమూర్తిఁ। గలసె; నత్తెఱఁగు ము న్నలఘుకీర్తి**
**ధన! నీకుఁ జెప్పితిఁ దక్కటి వృష్ణిభో। జాంధకు లెల్ల గుహ్యక గణంబుఁ**
**గూడిరి; కృష్ణు సంక్రీడకుఁ బాత్రంబు। లైన షోడశ సహస్రాంగనలును**

**తే.** **విధినియుక్త కాలంబున విను సరస్వ। తీ జలంబుల మునిఁగి యుత్కృష్ట మగు ని**
**జాప్సరోభావ మొంది నారాయణుని యు। పాంతచారిణు లైరి ప్రహర్ష మెసఁగ. 71**

**ప్రతిపదార్థం:** అలఘుకీర్తిధన!= ఘనమైన కీర్తియే ధనంగా కలిగిఉన్న ఓ జనమేజయా!; విను= వినుము; కమలగర్భుని= బ్రహ్మదేవుడి; నియోగంబునన్= పనుపుమేరకు; నిజయోగబలమున్+కైకొని= తన యోగబలంకొని; బలభద్రదేవుఁడు= బలరాముడు; అంబుధికిన్+ అరిగి= సముద్రం చేరి; పరమమూర్తిన్= ముఖ్యుడైన; అనంతున్= కాలస్వరూపుడైన అనంతుడిని; కలసెన్= కలిశాడు; ఆ+తెఱంగు= ఆ విషయం (ఆ వైనం); నీకున్= నీకు; మున్న= మునుపే; చెప్పితిన్= చెప్పాను; తక్కటి= తక్కిన; వృష్ణి

భోజాంధకులు+ఎల్లన్= వృష్ణి, భోజ, అంధకవంశీయులందరూ; గుహ్యక గణంబున్= గుహ్యకుల సమూహాన్ని; కూడిరి= చేరారు; కృష్ణ= శ్రీకృష్ణుడి; సంక్రీడకున్= విలాసానికి; పాత్రంబులు+ఐన= పాత్రలైన; షోడశ సహస్ర+అంగనలును= పదహారువేలమంది గోపికలు; విధి నియుక్త కాలంబునన్= శాస్త్ర నిర్దిష్ట ముహూర్తంలో; సరస్వతీ జలంబులన్= సరస్వతీ నదీ జలాలలో; మునిఁగి; ఉత్కృష్టము+అగు= గొప్పదైన; నిజ= తమ తమ; అప్సరస్+భావము+ఒంది= అప్సరసల భావాన్ని పొంది; ప్రహర్షము+ఎసఁగన్= సంతోషమతిశయించగా; నారాయణుని= శ్రీమన్నారాయణుడియొక్క; ఉపాంత చారిణులు+ఐరి= సమీపంలో తిరుగుతున్నారు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడి ఆనతిమేరకు బలరాముడు తన యోగబలంతో అనంతుడిలో కలిసిపోయాడు. ఆ విషయం నీకు మునుపే చెప్పాను. తక్కిన వృష్ణి భోజాంధక వీరులంతా గుహ్యకగణంలో కలిసిపోయారు. శ్రీకృష్ణుడి రాసక్రీడకు పాత్రలైన పదహారువేల గోపాంగనలు శాస్త్ర నిర్దిష్టకాలంలో సరస్వతీ నదీజాలాలలో మునిగి తమతమ అప్సరోభావాలను పొంది సంతోష మతిశయించగా నారాయణుడి సమీపంలో తిరుగుతున్నారు.

**చ. అనుమరణంబునం దగ మురాంతకు రుక్మిణి సెందె; లక్ష్మి యవ్వనరుహనేత్ర; తక్కుఁగల వామవిలోచన లేడ్వురుం దదీ**
**యనుత తను ప్రవేశన సమాచరణం బొనరించి రవ్వరాం**
**గనలును లక్ష్మి యంశముల కావునఁ; గౌరవ వంశవర్ధనా! 72**

**ప్రతిపదార్థం:** కౌరవ వంశవర్ధనా!= కురువంశాన్ని వృద్ధిపొందించే ఓజనమేజయా!; మురు+అంతకు+అనుమరణంబునన్= మురాసురుని సంహరించిన శ్రీకృష్ణునితోడి సహగమనం చేత; తగన్= ఒప్పిదముగా; ఆ+వనరుహనేత్ర= పద్మంవంటి కన్నులుగల; రుక్మిణి= రుక్మిణీదేవి; లక్ష్మిన్= లక్ష్మీదేవిని; చెందెన్= పొందినది; తక్కుఁగల= మిగిలినవారైన; వామ+విలోచనలు= అందమైన కన్నులుగలవారు; ఆ+వర+ అంగనలును= ఆ శ్రేష్ఠమైన అవయవములు గల్గినవారు. ఏడ్వురున్= ఏడుమంది (సత్యభామాదులు) లక్ష్మి+అంశములు+అ= లక్ష్మీదేవి యంశభూతలే; కావునన్= అగుటచేత; తదీయ= ఆ లక్ష్మీదేవియొక్క; నుత= పొగడబడిన; తను ప్రవేశన= శరీరమునందు ప్రవేశించుట యనే (చొచ్చుట అనెడి); సమాచరణంబు= గొప్పకార్యాన్ని; ఒనరించిరి= చేశారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణునితో పాటు అనుమరణంచేత రుక్మిణీదేవి లక్ష్మీదేవిలో లీనమయింది. తక్కిన సత్యభామాది కృష్ణపత్నులు ఏడుగురు కూడా ఆ లక్ష్మీదేవి అంశలతో అవతరించిన వారగుట చేత మూలభూతమైన ఆ లక్ష్మీదేవియొక్క దివ్యదేహంలోనికే ప్రవేశించారు.

**విశేషం:** ఇక్కడ చెప్పుతున్న లక్ష్మి విష్ణువుతో 'అనపాయిని'గా (ఎడబాటులేకుండా) ఉన్న ఆదిలక్ష్మి, రాఘవుడికి సీతగా, శ్రీకృష్ణుడికి రుక్మిణిగా జన్మించిన అంశ ఈమెదే. ఈమె అష్టలక్ష్మి స్వరూపం కలిగింది. ఆది, ధాన్య, ధైర్య, గజ, సంతాన, విజయ, విద్యా, ధన రూపాలు ఈ అష్టలక్ష్మి రూపాలని ఉన్నది. వీరే అష్టమహిషులు.

**వ. అని చెప్పి యమ్మహాయుద్ధంబున మృతులైన యట్టివారును, నేను మున్ను ప్రసంగించిన యట్టివారును, బ్రసంగింపనివారును నిట్టిట్టి గతిం బ్రాపించి రని నాచేతం జెప్పంబడిన వారెల్లను నిజార్హప్రకారంబుల సురాసుర యక్షగుహ్యక గంధర్వబృందంబులం జెందిరి; కురునందనా! నీ యడిగిన తెఱం గెఱింగించితి నని వెండియు.**

**73**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వేదవ్యాసులవారు చెప్పి; ఆ+మహాయుద్ధంబునన్= ఆ మహాయుద్ధంలో; మృతులు+ ఐన+అట్టివారును= చనిపోయినవారూ; నేను మున్ను= నేను ముందు; ప్రసంగించిన+అట్టివారును= చెప్పినవారూ; ప్రసంగింపని+వారును= చెప్పనివారూ; ఇట్టి+ఇట్టి= ఇట్లాంటిట్లాంటి; గతిన్+ప్రాపించిరి+అని= స్థితి పొందారని; నా చేతన్= నాచేత; చెప్పబడిన వారు+ఎల్లను= పేర్కొనబడ్డవారందరూ; నిజ+అర్హ ప్రకారంబులన్= వారి వారికి తగినట్లుగా; సుర= దేవతల; అసుర= రాక్షసుల; యక్ష= యక్షుల; గుహ్యక= గుహ్యకుల; గంధర్వ= గంధర్వుల; బృందంబులన్= సమూహాలను; చెందిరి; కురునందనా!= ఓ జనమేజయ మహారాజా!; నీ+అడిగిన= నీవు అడిగిన; తెఱంగు= వైనాన్ని; ఎఱింగించితిన్= తెలిపాను; అని వెండియున్= అని ఇంకా.

**తాత్పర్యం:** అని వేదవ్యాసులవారు చెప్పి, ఆ మహాయుద్ధంలో చనిపోయినవారు, నేను ముందు చెప్పినవారు, చెప్పనివారు, నేను ఇట్లాంటిట్లాంటి స్థితిని పొందారని చెప్పినవారంతా వారి వారికి తగినట్లుగా సుర, అసుర, యక్ష, గుహ్యక, గంధర్వ గణాలలో చేరిపోయారు. ఓ జనమేజయ మహారాజా! నీవు కోరిన విధంగా విషయమంతా తెలిపాను' అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** యక్ష, గుహ్యక, గంధర్వులు దేవయోనులే అయినా భిన్న విద్యలలో ముడిపడినవారు. యక్షులు, గుహ్యకులు కుబేరుడు మూలపురుషుడుగా కలవారు. శ్రీకృష్ణుడు గోలోకంలో ఉన్నప్పుడు అతడి గుహ్య ప్రదేశంనుండి వీరు పుట్టారని బ్రహ్మవైవర్త పురాణం చెప్తున్నది. వీరిలో కుబేరుడు మొదటివాడు. యక్షులందరూ అతడిచేత పాలించబడినవారే. గంధర్వులు బ్రహ్మచేతినుండి పుట్టినవారు. సంగీతం వీరి విద్య.

**తే.** **'వినుము పాండవ కౌరవ విషయ మైన । యట్టి యితిహాస మే నుపాఖ్యానజాత**
**సహిత మగునట్లుగా సమస్తంబు మహిత । విస్తరంబుగఁ జెప్పితి విశదభంగి. 74**

**ప్రతిపదార్థం:** వినుము; పాండవ= పాండవులకు; కౌరవ= కౌరవులకు; విషయము+ఐన= సంబంధించినదైన; అట్టి+ఇతిహాసము= కథను; ఏను= నేను; ఉపాఖ్యాన+జాత+సహితము+అగునట్లుగాన్= ఉపకథల సమూహంతో కూడినదిగా; సమస్తము+ఐన= మొత్తం కథనంతా; మహిత విస్తరంబుగన్= మిక్కిలి వివరణాత్మకంగా; విశదభంగిన్= బాగా స్పష్టమైన రీతిలో; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** 'రాజా! వినుము. పాండవ కౌరవులకు సంబంధించిన ఇట్లాంటి ఇతిహాసాన్ని ఉపకథలతో చేర్చి మొత్తం కథనంతా మిక్కిలి వివరణాత్మకంగా బాగా స్పష్టమైన రీతిలో నేను చెప్పాను.

**వ.** **కృష్ణద్వైపాయన మునీంద్రుండు సత్ప్రసాద భరితుండై యాజ్ఞాపింప నట్లు తదీయానుజ్ఞ వడసి తద్దయా లబ్ధ ప్రజ్ఞావిశేషుండనై యశేషంబును వివరింప నమ్మహాత్ముని కారుణ్యంబున నిమ్మహనీయేతిహాసంబు సమాధాన మానసుండ వై యాకర్ణించి నీవును బహుళ పుణ్యాత్ముండవుఁ గృతార్థుండవుఁ బరమార్థవిదుండవు నైతి' వని యిట్లు సాంద్రానంద సంపాదనశీలుం డై. 75**

**ప్రతిపదార్థం:** కృష్ణద్వైపాయనముని+ఇంద్రుండు= వేదవ్యాసమహర్షి; సత్+ప్రసాద= సదనుగ్రహ; భరితుండు+ఐ= భరితుడై; ఆజ్ఞాపింపన్= ఆజ్ఞాపించగా; అట్లు= అట్లా; తదీయ+అనుజ్ఞ+పడసి= అతడి అనుమతి పొంది; తద్+దయా లబ్ధ= అతడి

దయతో పుట్టిన; ప్రజ్ఞా విశేషుండను+ఐ= బుద్ధి విశేషం గలవాడివై; అశేషంబును= సమస్త విషయాలను; వివరింపన్= వివరించగా; ఆ+మహాత్ముని= ఆ మహాత్ముడియొక్క; కారుణ్యంబునన్= కరుణతో; ఈ+మహనీయ+ఇతిహాసంబున్+ ఈ గొప్ప పూర్వకథను; సమాధాన+ మానసుండను+ ఐ= సమాధి కలిగిన మనస్సుతో (ఏకాగ్రచిత్తంతో); ఆకర్ణించి= విని; నీవును= నీవు కూడా; బహుళ= మిక్కిలి; పుణ్య+ఆత్ముండవు= పుణ్యం పొందినవాడివి; కృతార్థుండవు= ధన్యుడివి; పరమార్థ విదుండవు= బ్రహ్మజ్ఞానవేత్తవు; ఐతిని+అని= అయ్యావని; ఇట్లు= ఈ విధంగా; సాంద్ర+ఆనంద+సంపాదన శీలుండు+ఐ= అధికమైన ఆనందాన్ని (బ్రహ్మానందాన్ని పొందాలన్న తపన కలవాడై.)

**తాత్పర్యం:** 'వేదవ్యాసమహర్షి సదనుగ్రహభరితుడై ఆజ్ఞాపించగా అట్లా అతడి అనుమతి పొంది అతడి దయతో పుట్టిన బుద్ధి విశేషంచేత సమస్త విషయాలనూ వివరించగా, అతడి కరుణతో ఈ మహేతిహాస కథను బాగుగా విని నీవుకూడా పుణ్యాత్ముడివి, ధన్యుడివి, బ్రహ్మజ్ఞాన వేత్తవు అయ్యావు' అని బ్రహ్మానంద సంపాదన తత్పరుడై.

**క. శ్రీనిత్యత్వ ప్రమదా। దాన కుతూహల నిరూఢతాస్త వ్యాపాం**
**గా! నిర్భర వేదవ్యా। సానేక వచోనుషంగ! హరిహరనాథా! 76**

**ప్రతిపదార్థం:** శ్రీ= ఐశ్వర్యం యొక్క; నిత్యత్వ= స్థిరంగా ఉండటంవలన; కలిగే; ప్రమద= సంతోషాన్ని; ఆదాన= కలగజేయటంలోని; కుతూహల= ఆసక్తిచేత కలిగిన; నిరూఢతా= ప్రసిద్ధిచేత; స్తవ్య= స్తుతింపబడిన; అపాంగా= కడగంటి చూపులు కలవాడా!; నిర్భర= వేదశాస్త్రాలలో నిండిన; వేదవ్యాస= వ్యాసమహర్షియొక్క; వచస్= బ్రహ్మసూత్ర పురాణాది బహు వాక్యాలకు; అనుషంగ= అన్వయమైనవాడా!; హరిహరనాథా!= ఓ హరిహరనాథ దేవా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథస్వామీ! ఐశ్వర్యం స్థిరంగా ఉండటంవలన కలిగే ఆనందాన్ని కలుగజేయటంలోని ఆసక్తిచేత కలిగిన ప్రసిద్ధిచేత స్తుతించబడిన కడగంటి చూపులు కలవాడా! వేదశాస్త్రాలతో నిండిన వ్యాసమహర్షియొక్క బ్రహ్మసూత్రపురాణాది బహువాక్యాలకు అన్వయమైనవాడా! నీకు నమస్కారం.

**విశేషం:** భగవంతుడి దయ రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి ఐశ్వర్యాన్ని ప్రసాదించటంలో, రెండవది దానిని నిత్యంగా ఉంచటంలో. ఈ రెండూ చాలా భిన్న విషయాలు. పరమేశ్వర సమర్పణ భావంతో ఎవరు జీవితాన్ని యజ్ఞంగా భావించి జీవిస్తారో వారి ఐశ్వర్యాన్ని భగవానుడు నిరంతరమూ కాపాడుతాడని అర్థం. ఎవరు ధనంచేత మదాది దుష్టగుణాలకు బానిసలవుతారో వారి సంపద హరించుకొనిపోతుంది. భారతంలోని అంతస్సారరూపమైన ప్రబోధం ఇదే.

అనుషంగ మనే మాట శాస్త్ర పరిభాషలోనిది. పూర్వవాక్యంలోని పదాన్ని ఉత్తరవాక్యానికి అన్వయంచేసి సంబంధాన్ని నిరూపించటాన్ని 'అనుషంగ' మంటారు. వేదవాక్యాలలో చెప్పబడిన పరమేశ్వరతత్త్వం వ్యాసమహర్షిచే బ్రహ్మసూత్ర, పురాణాదులలో భిన్న రీతులలో అన్వయించబడటంచేత వ్యాసవచనాలతో 'అనుషంగుడు' హరిహరనాథుడు. ఏ వాక్యాన్ని చదివినా స్వామిత్వం ఎంతో ఒక కొంత స్ఫురిస్తుందని అర్థం. అన్ని వాక్యాలూ కలిపి కడకు పరమేశ్వరుడి 'నిత్యవిభూతి'నే నిరూపిస్తాయని అర్థం. స్వర్గారోహణంలో ఉన్నదే పరమేశ్వరుడి నిత్యవిభూతి. ఇక్కడి ఐశ్వర్యానికి తుది లేదు. ఇక్కడ దుఃఖం లేదు, మదమాత్సర్యాది దుర్గుణాల సంపుటి లేదు.

అందుకే జీవులందరూ ఈ మహత్త్వంలో లీనమవుతున్నారు. 'భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః' అని వ్యాసమహర్షి భారత ప్రారంభంలోనే సూచించాడు. ఇది శ్రీకృష్ణ కీర్తన - అని అర్థం. అందుకే భారతంలోని కథ. సంఘటనలు, వర్ణనలు, పాత్రలు, వారి సంభాషణలు, అంతర్బాహ్యమనోవృత్తులు. వారి కార్యకలాపాలు అన్నీ కలిసి శ్రీకృష్ణపారమ్యాన్నే నిరూపిస్తాయి.

ఇది కావ్యాంతంలో మహాకవి చేసిన హరిహరనాథ స్తుతి కాబట్టి ఇంత విశేషార్థమున్నది. గీతాకారుడు ఈ మహార్థాన్ని ఇట్లా బోధించాడు.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."**

(నీవు అన్ని ధర్మాలను చివరికి నాలో విడిచిపెట్టి నన్ను శరణు వేడుము. నిన్ను సర్వపాపాలనుండి నేను విముక్తుడిని చేస్తాను) ఈ పాప విముక్తి పేరే స్వర్గమంటే. అది నిత్య విభూతి. అక్కడ కేవలం ప్రకాశమున్నది. ఆ ప్రకాశం పేరే 'దేవత' - దైవత్వమంటే అదే. పాండవులు జీవితమంతా ఆ పరతత్త్వ సహాయంతో బ్రదికారు. సర్వ బాధ్యతలూ ఆ శ్రీకృష్ణుడిలోనే ఉంచారు. అందుచేతనే అందరూ దేవతాగణాలలో చేరారు. ఇంతటికీ మూలమైన 'ధర్మ' నిర్వహణచేసిన వారు, జ్ఞాన, సర్వపాప విముక్తుడూ అయిన ధర్మరాజు కేవలం దివ్యత్వం పొందలేదు. నిత్య సత్య పరమరూపమైన ధర్మంలోకి ఆకర్షించబడ్డాడు. ఈ ధర్మాన్ని అవలంబించి అవతరించిన నారాయణమూర్తికూడా శ్రీకృష్ణ దేహాన్ని చాలించి స్వర్గంలో ధర్మరాజు ఆగమనానికి రంగం సిద్ధం చేస్తున్నాడు. ఈ స్వర్గప్రాప్తినే 'శ్రేయస్సు' అన్నారు. అది సిద్ధించాలనే నన్నయగారు భారతాదిలో నాందీ పద్యంలో త్రిమూర్తివర్ణనను ఆశీర్వాదరూపంలో చేశారు. ఆ శ్రేయస్సు సిద్ధించటమే స్వర్గప్రాప్తి.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పినట్లు సర్పయాగ సమయ ప్రవృత్తం బైన మహాభారతం బంతయు దత్సభాగతుండైన రోమహర్షణ నామధేయుండును సాత్యవతేయ శిష్యుండును, బండిత ప్రవరుండును నగు సూతుని పుత్రుండైన యుగ్రశ్రవుండనియెడు కథకుండు సమ్యగవధానంబున నాకర్ణించిన వాఁడగుటను సమాశ్రితవత్సలుం డైన యా కృష్ణద్వైపాయను ననుగ్రహంబునఁ దత్కథా సాకల్య వివరణ విశార దుం డై యుండు; నతండు నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు శౌనకుండను కులపతి మొదలుగాఁ గల కొందఱు మహామునులు సత్రయాగం బాచరించుచుండ నయ్యెడకుం జని వారలం గాంచినఁ బుణ్యకథాశ్రవణ కౌతు కాధీన మానసులైన యమ్మాననీయులు పుణ్యాత్మకుం డైన యక్కథకునకు సముచితార్చనంబులఁ బ్రియంబొనర్చి కథాకథనంబుఁ బ్రసంగించినం బ్రీతుండై యాతం 'డేమి తెఱంగు కథ వినంగోరెద?' రనుటయు నప్పరమార్థ పరాయణు లతనితోడ 'నెయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్ర జ్ఞాన ప్రదంబును నఘ నిబర్హణంబును నైనయది యక్కథ మాకు విన నిష్టం' బని పలుకుటయు. 77**

**ప్రతిపదార్థం:** దేవా= హరిహరనాథ!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్+చెప్పినట్లు= జనమేజయుడికి చెప్పిన విధంగా; సర్పయాగ సమయ ప్రవృత్తంబు+ఐన= సర్పయాగ సమయంలో చెప్పబడిన; మహాభారతంబు+అంతయున్= మహా భారతాన్ని అంతటినీ; తద్+సభాగతుండు+ఐన= ఆ సభలో ఉండిన; రోమహర్షణ నామధేయుండును= రోమహర్షణుడనే పేరుగలవాడు; సాత్యవతేయ శిష్యుండును= వ్యాసుడి శిష్యుడు; పండిత ప్రవరుండునున్= పండిత శ్రేష్ఠుడూ; అగు= అయిన; సూతుని పుత్రుండు+ఐన= సూతుడి కుమారుడైన; ఉగ్రశ్రవుండు= ఉగ్రశ్రవుడు; అనియెడు కథకుండు= అని పేరున్న కథకుడు; సమ్యక్+అవధానంబునన్= మిక్కిలి ఏకాగ్రతతో; ఆకర్ణించినవాఁడు+అగుటను= విన్నవాడు కావటంవలన; సమాశ్రిత వత్సలుండు+ఐన= ఆశ్రయించినవారిని ప్రేమగా చూచే; ఆ కృష్ణ ద్వైపాయను= ఆ వ్యాసుడి; అనుగ్రహంబునన్= అనుగ్రహంచేత; తద్+కథా= ఆ కథను; సాకల్య= సమగ్రంగా; వివరణ= వివరించటంలో; విశారదుండు+ఐ+ఉండున్= నేర్పరిగా ఉంటాడు; అతండు= ఆ ఉగ్రశ్రవుడు; నైమిశారణ్య పుణ్యక్షేత్రంబు నందున్= నైమిశారణ్య పుణ్యక్షేత్రంలో; శౌనకుండు+అను= శౌనకుడు

అనే; కులపతి= విద్యాగురువు; మొదలుగాన్+కల కొందఱు మహామునులు= మొదలైన కొందరు మహర్షులు; సత్రయాగంబు+ ఆచరించుచున్+ఉండన్= సత్రయాగం చేస్తుండగా; ఆ+ఎడకున్+చని= అక్కడికి వెళ్ళి; వారలన్+కాంచినన్= వారిని చూడగా; పుణ్యకథా శ్రవణ= పుణ్యకథలను వినటంలో; కౌతుక+అధీన మానసులు+ఐన= ఆసక్తికల మనస్సులుగల; ఆ+మాననీయులు= ఆ పూజ్యులు; పుణ్య+ఆత్మకుండు+అయిన= పుణ్యాత్ముడైన; ఆ+కథకునకున్= ఆ ఉగ్రశ్రవుడికి; సముచిత+అర్చనంబులన్= తగిన పూజలతో; ప్రియంబు+ఒనర్చి= తృప్తిని కలిగించి; కథాకథనంబు ప్రసంగించినన్= కథను చెప్పుమని ప్రస్తావించగా; ప్రీతుండు+ఐ= సంతోషపడి; అతండు= అతడు; ఏమి తెఱంగుకథ= ఎట్లాంటి కథ; వినన్+కోరెదరు+ అనుటయున్= వినగోరుతారు అని అడుగగా; ఆ+పరమార్థ పరాయణులు= ఆ బ్రహ్మతత్త్వ నిష్ఠ ఉన్నట్టివారు; అతనితోడన్= అతడితో; ఏ+అది= ఏది; హృద్యంబును= హృదయంగమమూ (హృదయాన్ని తాకేది); అపూర్వంబును= మునుపు లేనిది, అద్భుతమైనదీ; సమగ్ర జ్ఞాన ప్రదంబును= సంపూర్ణ జ్ఞానాన్ని ఇచ్చేదీ; అఘనిబర్హణంబును= పాపాన్ని నశింపజేసేదీ; ఐన+అది= అయినటువంటి; ఆ+కథ= ఆ కథను; మాకున్= మాకు; వినన్+ఇష్టంబు+అని పలుకుటయున్= వినాలని ఉన్నదని చెప్పగా.

**తాత్పర్యం:** హరిహరనాథ స్వామీ! వైశంపాయన మహర్షి జనమేజయుడికి సర్పయాగ సమయంలో ఈ భారతకథను చెప్తుతుండగా ఆ సభలో ఉండిన వ్యాసుడి శిష్యుడు, పండిత శ్రేష్ఠుడు అయిన సూతుడి కొడుకు ఉగ్రశ్రవుడనేవాడు మిక్కిలి ఏకాగ్రతతో విన్నాడు. ఉగ్రశ్రవుడు గొప్ప కథకుడు. వ్యాసుడి అనుగ్రహంవలన ఆ కథను సమగ్రంగా వివరించే శక్తి అతడికి అబ్బింది. అతడు నైమిశారణ్యంలో శౌనకుడనే విద్యాగురువు. మరికొందరు మహామునులు సత్రయాగం చేస్తుండగా అక్కడికి వెళ్ళి వారిని చూచాడు. పుణ్యకథలు వినాలన్న కోరిక ఉన్నవారు ఆ పుణ్యాత్ముడికి సముచితమైన సత్కారాలతో సంతోషం కలిగించారు. కథ వినాలని కోరారు. ఉగ్రశ్రవుడు సంతోషించి, మీకు ఎట్లాంటి కథకావాలి? అని అడిగాడు. ఆ పరమార్థపరాయణులైన మహామునులు ఏ కథ హృదయంగమంగా, అపూర్వంగా, సమగ్ర జ్ఞానదాయకంగా, పాపనాశకంగా ఉంటుందో అట్లాంటి కథ వినాలని కోరగా.

**విశేషం:** కులపతి - అనే మాటకు చాలా అర్థమున్నది. పదివేల మంది శిష్యులను అన్నదానాదులచేత పోషిస్తూ వేదాధ్యయనం చేయించే బ్రహ్మర్షిని కులపతి అంటారు. వారే విద్యాగురువులు. అట్లాంటి పరమ పవిత్ర వాతావరణంలో వినిపించబడింది ఈ కథ. అసలు ఈ కథను తొలుత వినిపించినవాడు వైశంపాయనుడు. సమయం - సత్రయాగం. ఒక పాపాన్ని చేయబోతున్న జనమేజయుడికి పాప నాశకమైన ఈ కథ చెప్పబడింది.

ఈ కథ మిక్కిలి ఆసక్తికరమైనది. 'వింటే భారతం వినాలి. తింటే గారెలు తినాలి' అని తెలుగువారు సామెతరూపంలో కూడా భారతాన్ని నిత్యం స్మరిస్తారు. కథలోని మలుపులు, ఆ మలుపులలోని వెలుగులు - పాఠకుడిని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. ఇదే హృదయంగమ ధర్మం.

ఎఱుక సమగ్రత - ఒక బ్రహ్మతత్త్వ జిజ్ఞాస తప్ప మరి ఏదీ సమగ్రమైన విద్య కాదు. భారతంలో చివర బ్రహ్మతత్త్వమే నిత్యమని జగత్తు తాత్కాలికమని నిరూపించబడింది.

భూతాలన్నీ అవ్యక్తంలో పుట్టుతాయి. వ్యక్తమధ్యంలో పెరుగుతాయి. అవ్యక్తంలో లీనమవుతాయి - అన్న గీతా సూక్తికి భారతం వివరణాత్మకమైన అద్భుత కథనం. అందుకే స్వర్గారోహణంతో ఈ పుణ్యకథ అంతమై పాఠకులలో పాపపుణ్య విచక్షణను కలిగిస్తుంది. ఇదే బ్రహ్మజిజ్ఞాసకు మూలమైన జ్ఞానం.

అందుకే వ్యాసమహర్షిని మహాభారత తాత్పర్యాన్ని చెప్పుమని శిష్యు డడిగినపుడు ఇట్లా చెప్పాడు.

'పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్' పరోపకారంచేత పుణ్యం వస్తుంది. పరపీడనచేత పాపం వస్తుంది. ఈ మౌలికమైన జీవితనీతిని నేర్పటమే మహాభారతం సాధించిన అద్భుతమైన సామాజిక ప్రయోజనం.

అపూర్వత్వం - ఈ కథలోని ప్రత్యేకత. ఎన్నో మతాలవారు తమతమ భావాలకు అనుగుణంగా ఈ కథకు రూపకల్పన చేశారు. కాని, నూరుపర్వాలలో ఈ విధంగా సర్పయాగంతో మొదలై స్వర్గారోహణంతో అంతమయిన కథను తొలిసారిగా వ్యాసమహర్షే గ్రథనం చేశాడు. అదే అపూర్వం.

సత్రయాగం - అంటే దీర్ఘకాలం చేయబడే యాగమని అర్థం. పదమూడు రోజులు మొదలు నూరు రోజుల వరకు సాధారణంగా జరుపుతారు. కొన్ని వందల సంవత్సరాల పాటు జరిపినవీ ఉన్నాయి. అట్లాంటి పరమ పుణ్యప్రదమైన సన్నివేశంలో చేయబడిన వాఙ్మయరూపమైన యజ్ఞమే మహాభారత కథనం.

**క. అతఁ డింతటిది మహా భా ၊ రతంబ యను నిశ్చయము తిరంబుగ మతిసం**

**గత మగుడు నమ్మహాత్ముల ၊ కతివిశదము గాఁగ నిమ్మహాకథ చెప్పెన్. 78**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ ఉగ్రశ్రవుడు; ఇంతటిది= ఇటువంటిది; మహాభారతంబు+అ= మహాభారతమే; అను నిశ్చయము= అనే నిశ్చయం; తిరంబుగన్= స్థిరంగా; మతిన్+సంగతము+అగుడున్= హృదయంలో నెలకొనగా; ఆ+మహాత్ములకున్= ఆ మహనీయులకు; అతివిశదము కాఁగన్= మిక్కిలిగా తెలిసేటట్లు; ఈ+మహాకథ= ఈ గొప్ప కథ; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ ఉగ్రశ్రవుడు అటువంటి కథ ఒక మహాభారతం మాత్రమే అనే నిశ్చయం స్థిరంగా మనసుకు తట్టగా ఆ మహనీయులకు మిక్కిలి వివరంగా ఈ గొప్ప కథను చెప్పాడు.

**వ. చెప్పి యిట్లనియె; 'నట్లు జనమేజయుండు సర్పయాగ కర్మానుష్ఠానముల యెడ వైశంపాయనువలన నివ్వినుతేతిహాసంబు విని విస్మితుండును బ్రమోద భరితుండును నయ్యెఁ; నక్కాలంబునఁ దదీయ యాజకులు యజన సమాపన విధి యనుష్ఠించి; రయ్యుధిష్ఠిరానుజ పుత్త్ర పౌత్త్రుం డత్తెఱంగున భుజంగంబుల యాపదఁ దీర్చిన యస్తీకు నభ్యర్చనంబున నత్యంత సంతుష్టునిం జేసి, యతని నివాసంబునకు ననిచి పుచ్చి, ఋత్విజులాదిగా నఖిల బ్రాహ్మణులకు బహు ధనంబు లొసంగి వినయం బెసంగ నామంత్రితులం జేసిన వారలు నిజ నివాసంబులకుం జనిరి; వైశంపాయనుఁ బెంపారు సవిశేష పూజనంబులఁ బరితోషితుం గావించి దేవోప చారంబులఁ గృష్ణద్వైపాయన మునీంద్రులంబూజించి, యజ్ఞపతి సకల జనంబులు ప్రస్తుతింప విభవంబు శోభిల్లం బురంబుఁ బ్రవేశించె.' 79**

**ప్రతిపదార్థం:** చెప్పి= భారతకథను చెప్పి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; జనమేజయుండు= జనమేజయ మహారాజు; సర్పయాగ కర్మ+అనుష్ఠానములయెడన్= సర్పయాగ కర్మలను అనుష్ఠిస్తున్న సమయంలో; వైశంపాయను వలనన్= వైశంపాయన మహర్షివలన; ఈ+వినుత+ఇతిహాసంబున్= ఈ ప్రసిద్ధమైన కథను; విని= విన్నవాడై; విస్మితుండును= ఆశ్చర్యం పొందినవాడూ; ప్రమోదభరితుండును= సంతోషంతో కూడినవాడూ; అయ్యెన్= అయ్యాడు; ఆ+కొలఁదిన్= ఆ పరిమాణంలో; తదీయ= జనమేజయుడు నియమించిన; యాజకులు= యాగంచేయించే బ్రాహ్మణులు; యజన సమాపన విధిన్= యాగ పూర్తికర్మను; అనుష్ఠించిరి= చేశారు; ఆ+యుధిష్ఠిర+అనుజ+పుత్త్ర+పౌత్త్రుఁడు= ఆ ధర్మరాజు తమ్ముడి కొడుకు మనుమడు (జనమేజయుడు ధర్మరాజు, అర్జునుడు, అభిమన్యుడు, పరీక్షిత్తు, జనమేజయుడు); ఆ+తెఱంగునన్= ఆ విధంగా; భుజగంబుల= సర్పాల; ఆపదన్+తీర్చిన= ఆపదను తీర్చిన; అస్తీకున్+అభ్యర్చనంబునన్= అస్తీకుడి పూజతో; అత్యంత= మిక్కిలి; సంతుష్టునిన్+చేసి= సంతోషింపజేసి; అతని నివాసంబునకున్= అతడి నివాసానికి; అనిచి పుచ్చి= పంపించి; ఋత్విజులు+ఆదిగాన్= ఋత్విక్కులు మొదలైన; అఖిలబ్రాహ్మణులకున్= బ్రాహ్మణులందరికీ; బహుధనంబులు+ఒసంగి= మిక్కిలిగా ధనమిచ్చి;

వినయంబు+ఎసఁగన్= వినయం అతిశయించగా; ఆమంత్రితులన్+చేసినన్= వీడ్కోల్పగా; వారలు= వారు; నిజనివాసంబులకున్= తమ తమ ఇళ్ళకు; చనిరి= వెళ్ళారు; వైశంపాయనున్= వైశంపాయన మహర్షిని; పెంపారు= సమృద్ధిగా; సవిశేష= ప్రత్యేకమైన; పూజనంబులన్= అర్చనాదులచేత; పరితోషితున్+కావించి= సంతుష్టుడిని చేసి; దేవ+ఉపచారంబులన్= దైవానికిచేసే దైవోపచార విధితో; కృష్ణద్వైపాయన ముని+ఇంద్రున్+పూజించి= వ్యాసుడిని పూజించి; ఆ+జనపతి= జనమేజయుడు; సకలజనంబులు= అందరూ; ప్రస్తుతింపన్= ప్రశంసించగా; విభవంబు= వైభవం; శోభిల్లన్= ప్రకాశించగా; పురంబు= హస్తినాపురి; ప్రవేశించెన్= చేరుకొన్నాడు.

**తాత్పర్యం:** ఉగ్రశ్రవుడు భారతకథను చెప్పి ఇట్లా అన్నాడు: 'ఆ విధంగా జనమేజయ మహారాజు సర్పయాగ కర్మలను అనుష్ఠిస్తున్న సమయంలో వైశంపాయన మహర్షివలన ఈ ప్రసిద్ధమైన కథను విన్నవాడై ఆశ్చర్యంపొందాడు. సంతోషపడ్డాడు. ఆ విధంగానే యాగం చేయటానికి నియమించబడిన బ్రాహ్మణులు యాగ పూర్తికర్మలను చేశారు. అట్లా జనమేజయుడు సర్పాల ఆపదను తీర్చిన ఆస్తీకుడిని తగిన పూజలతో సత్కరించి సంతోషింపజేసి అతడి నివాసానికి పంపించాడు. ఋత్విక్కులు మొదలైన బ్రాహ్మణులకు మిక్కిలిగా కానుక లిచ్చి వినయంతో వారిని సాగనంపాడు. వారంతా తమ తమ ఇళ్ళకు వెళ్ళారు. ఆ తరువాత వైశంపాయన మహర్షిని ప్రత్యేకమైన పూజలతో సత్కరించి సంతోషాంతరంగుడిని చేసి, వేదవ్యాసమహర్షికి దేవోపచార విధితో పూజలు గావించి జనమేజయ మహారాజు ప్రజలందరూ ప్రస్తుతించగా వైభవం అతిశయించగా హస్తినాపురాన్ని ప్రవేశించాడు.'

**విశేషం:** భారతకర్త వ్యాసమహర్షిని దైవోపచారంతో పూజించారంటే దైవంతో సమానంగా పరిగణించి పూజించారని అర్థం. శక్త్యుపచార, భక్త్యుపచార, షోడశోపచార పూజలని పూజలు మూడు విధాలు. దైవోపచారమంటే ఈ మూడు విధాలా అర్చించటమని అర్థం.

**సీ.** **అని చెప్పి యా శౌనకాది మునీశ్వర। గణముతో మఱియు నక్కథకుఁ డింపు**
**మిగులంగ నిట్లను 'మేటి మునీశ్వర। సంఘంబులో నెల్ల సత్యదర్శి**
**సర్వవిధిజ్ఞాత సర్వవిజ్ఞాన భ। వ్యాత్ముండు సర్వేంద్రియ ప్రబోధ**
**శాలి సర్వజ్ఞుండు శౌచశాంతి క్షమా। దాంతి తపోనిత్యతావిభాసి**

**తే.** **యాప్తసర్వవిధైశ్వర్యుఁ డఖిల సాంఖ్య। యోగ భేద విదుండు ధర్మోపదేశ**
**చతుర వాగ్విలాసుండు నిస్తత్త్వ వస్తు। వేది సాత్యవతేయుండు వేదమయుఁడు. 80**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పినవాడై; ఆ శౌనక+ఆది= ఆ శౌనకుడు మొదలైన; ముని+ఈశ్వర గణముతోన్= మునీశ్వరుల సమూహంతో; మఱియున్= ఇంకా; ఆ+కథకుఁడు= ఉగ్రశ్రవుడు; ఇంపు మిగులంగన్= మాధుర్యం అతిశయించగా; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; ముని+ఈశ్వర సంఘంబులోన్+ఎల్లన్+మేటి= మునీశ్వరుల సమూహంలో గొప్పవాడు; సత్యదర్శి= సత్యాన్ని దర్శించినవాడు; సర్వవిధిజ్ఞాత= అన్ని విధులూ తెలిసినవాడు; సర్వవిజ్ఞాన భవ్యాత్ముండు= ప్రపంచంలోని విజ్ఞానమంతా నిండిన పుణ్యాత్ముడు; సర్వేంద్రియ ప్రబోధశాలి= బ్రహ్మజ్ఞానంద్వారా అన్ని ఇంద్రియాలను మేల్కొల్పగలిగినవాడు; సర్వజ్ఞుండు= అన్నీ తెలిసినవాడు; శౌచ= పవిత్రత; శాంతి; క్షమా= ఓర్పు; దాంతి; తపస్= తపస్సుల; నిత్యతా= నిత్యత్వంచేత; విభాసి= ప్రకాశించేవాడూ; ఆప్త= పొందిన; సర్వవిధ= అన్ని విధాల; ఐశ్వర్యుండు= ఐశ్వర్యం కలవాడు; అఖిల= అన్నివిధాల; సాంఖ్యయోగ భేదవిదుండు=

సాంఖ్యయోగ భేదాలూ తెలిసినవాడు; ధర్మోపదేశ= ధర్మోపదేశంలో; చతుర= నేర్పరితనంగల; వాచ్+విలాసుండు= వాక్కుయొక్క క్రీడ కలవాడు; నిస్తత్త్వ= వాస్తవం కాని; వస్తువేది= వస్తువును తెలిసినవాడు; సాత్యవతేయుండు= సత్యవతీ కుమారుడైన వేదవ్యాసుడు; వేదమయుఁడు= వేద స్వరూపుడు.

**తాత్పర్యం:** అని చెప్పి ఉగ్రశ్రవసుడు ఆ శౌనకాది మునులతో ఇట్లా అన్నాడు; 'సత్యవతీ కుమారుడైన వేద వ్యాసమహర్షి వేదస్వరూపుడు. ముని సంఘంలో గొప్పవాడు. సత్యాన్ని దర్శించినవాడు. అన్ని విధులూ తెలిసినవాడు. ప్రపంచంలోని విజ్ఞానమంతా నిండిన పుణ్యాత్ముడు. బ్రహ్మజ్ఞానంద్వారా అన్ని ఇంద్రియాలనూ మేల్కొల్ప గలిగినవాడు. అన్నీ తెలిసినవాడు. పవిత్రత, శాంతి, క్షమ, దాంతి, తపస్సుల నిత్యత్వంచేత ప్రకాశించేవాడు. అన్ని విధాల ఐశ్వర్యాన్నీ పొందినవాడు. ధర్మోపదేశంలో నేర్పరి. సదసత్ వివేకజ్ఞుడు.

**విశేషం: "అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరో హరిః**
**అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః."**

అని వ్యాసుడిని సంప్రదాయంలో కీర్తిస్తారు. ఈ కీర్తి భారతం చదివినవాడికి ఎవడికైనా సార్థకమనే అనిపిస్తుంది. నాలుగు ముఖాలు లేని బ్రహ్మ. రెండు భుజాలున్న విష్ణువు. ఫాలనేత్రం లేని శివుడు. భగవత్ స్వరూపుడు వ్యాసుడని పై శ్లోకానికి అర్థం. కృష్ణుడనే పేరు వాసుదేవుడికి, ద్రౌపదికి, వ్యాసుడికి ముగ్గురికే చెల్లింది. అందుకే వైష్ణవ సంప్రదాయంలో వ్యాసుడిని విష్ణు స్వరూపుడంటారు. ఈ అర్థాన్నే పై శ్లోకం వివరిస్తున్నది.

ఇంద్రియాలను మేల్కొల్పటమంటే ఏమిటో వివరించవలసిన అవసరం ఉన్నది. అజ్ఞానంచేత ఇంద్రియాలు స్తబ్దంగా అంధకారంలో మునిగి ఉంటాయి. ఆ మత్తునుండి ఇంద్రియాలను మేల్కొల్పితే తప్ప మనసుకూ, ఇంద్రియాలకూ అన్వయం కుదరదు. ఈ అన్వయం చేతనే యోగం సిద్ధిస్తుంది. అప్పుడు జ్ఞానేంద్రియ పంచకాలు కర్మేంద్రియ పంచకాలు, వాటి గుణాలు. శ్రద్ధలూ ఇవన్నీ సాధకుడి గుప్పిట్లో ఉంటాయి. 'యతి' అనే శబ్దానికి అర్థం ఇదే. నియతేంద్రియు డని అర్థం. దానిద్వారా పవిత్రత సిద్ధిస్తుంది. అది అగ్నికి ఉన్న శుచిత్వంవంటిది. బుద్ధీంద్రియాల నిగ్రహం శాంతి. కర్మేంద్రియాల నిగ్రహం దాంతి. సర్వభూత సహనం క్షమ. వీటిని నిరంతరం జ్ఞానాగ్నిలో వేల్చటమే 'తపస్సు'. అట్లాంటి జ్ఞానాగ్ని దగ్ధకర్ముడు వేదవ్యాసుడు. అందుకే సదసద్ వివేకం కలవాడయ్యాడు. సత్ - ఉన్నది (బ్రహ్మతత్త్వం) అసత్-లేనిది (వస్తుజగత్తు). జ్ఞానబోధచేయాలి అంటే అసద్ వస్తువు ఏమిటో - అంటే అజ్ఞానమంటే ఏమిటో బోధపరచాలి. అందుకే విస్తత్త్వ - వాస్తవం కాని వస్తువు ఏమిటో వ్యాసుడికి తెలుసని చెప్పటం.

సాంఖ్యం - కపిలమహర్షి ప్రతిపాదించిన యోగమిది. ప్రధానమైన మూల ప్రకృతి వికారం లేనిది - 1. మహదహంకారశబ్ద స్పర్శ రూప రసగంధరూప పంచతన్మాత్రలు-7. ప్రకృతి, వికృతులు - పంచమహాభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు. పంచకర్మేంద్రియాలు, మనసు అనేది కేవలం వికృతులు-16, ప్రకృతికాని వికృతి కాని కాలపురుషుడు-1. ఇవి మొత్తం-25, సంఖ్యాపూర్వకంగా అవికారుడైన పురుషుడు (ఆత్మ) చెప్పబడినందువలన ఇది 'సాంఖ్య' యోగం. ఈ తత్త్వాలు 24 అని, 25 అని, 36 అని మత భేదాలున్నాయి.

అణిమాదులైన అష్టవిభూతులనే ఐశ్వర్యమంటారు. ఇది కలిగినవాడినే 'ఈశ్వరు' డంటారు. అందుకే వ్యాస భగవానుడు పూజనీయుడయ్యాడు.

**వ. పాండవుల కీర్తిం బ్రకటించుటకును, మఱియుం గొందఱు జనపతుల చరిత్రంబుల జనుల కెఱింగించుటకును, దేవదేవుం డగు వాసుదేవుని సంక్రీడా విశేషంబులు వివరించుటకును, సర్వదేవజాతుల జన్మంబులును దదీయ సాయుజ్యంబులును దేటపఱుచుటకును, సకల ధర్మంబులునుం దెలుపుటకునుగాఁ బంచమవేదం బయి పరఁగు నిమ్మహాభారత సంహిత యొనర్చెఁ; నిమ్మహేతిహాసంబు సంవత్సర త్రయకృతంబు; దీని విశేషంబు వినుండు. 81**

**ప్రతిపదార్థం:** పాండవుల కీర్తిన్= పాండవుల కీర్తిని; ప్రకటించుటకును= ప్రకటించటానికీ; మఱియున్= ఇంకా; కొందఱు= కొంతమంది; జనపతుల చరిత్రంబులన్= రాజుల కథలను; జనులకున్+ఎఱింగించుటకును= జనులకు తెలపటానికి; దేవదేవుండు+అగు= దేవతలకు దేవుడైన; వాసుదేవుని= శ్రీకృష్ణుడి; సంక్రీడా= లీలా; విశేషంబులన్= విశేషాలను; వివరించుటకును= వివరించటానికి; సర్వదేవజాతుల= అన్ని దేవగణాల; జన్మంబులును= పుట్టుకలను; తదీయ= వారి; సాయుజ్యంబును= ఐక్యాన్ని లేదా కలయికను; తేటపఱుచుటకును= విశదంచేయటానికి; సకల ధర్మంబులునున్= అన్ని ధర్మాలను; తెలుపుటకును+కాన్= తెలుపటానికిగాను; పంచమవేదంబు+అయి= ఐదవవేదంగా; పరఁగు= ప్రసిద్ధమైన; ఈ+మహాభారత సంహిత+ఒనర్చెన్= ఈ మహాభారత సంహితను రచించాడు: ఈ+మహేతి హాసంబు= ఈ మహేతిహాసం; సంవత్సరత్రయ కృతంబు= మూడు ఏళ్ళపాటు రచించబడింది; దీని విశేషంబు వినుండు= దీని వైశిష్ట్యం చెప్పుతాను వినండి.

**తాత్పర్యం:** పాండవుల కీర్తిని ప్రకటించటానికీ, ఇంకా కొంతమంది రాజులకథలను జనులకు తెలపటానికీ. దేవదేవుడైన వాసుదేవుడి లీలా విశేషాలను వివరించటానికీ, సర్వదేవతా గణాల పుట్టుక, సాయుజ్యం విశదంచేయటానికీ, సకల ధర్మాలను తెలపటానికి గాను, పంచమవేద మని పేరుపొందిన ఈ మహాభారత సంహితను వేదవ్యాసుడు మూడు సంవత్సరాలలో నిర్మించాడు. దీని వైశిష్ట్యం చెప్పుతాను వినండి.

**విశేషం:** సాయుజ్య (ఐక్యం) సామీప్య (సమీపవాసం), సారూప్య (తత్తుల్యరూపం), సాలోక్య (తల్లోకవాసం) అని ముక్తి నాలుగు విధాలు.

**తే. అమల ధర్మార్థ కామ మోక్షముల గుఱిచి । యొలయు తెరు వెద్దియును నిందుఁ గలుగునదియ**
**యొం డెడలఁ గల్గు దీన లేకుండు చొప్పు । దక్కొకంటను లేదు వేదజ్ఞులార!' 82**

**ప్రతిపదార్థం:** వేదజ్ఞులార!= వేద విదులారా!; అమల= పవిత్రమైన; ధర్మ+అర్థ+కామ+మోక్షములన్+గుఱిచి= ధర్మార్థ కామమోక్షాలను గురించి; ఒలయు= ప్రవర్తించే; తెరువు= ధర్మం; ఎద్దియునున్= ఏదైతే; ఇందున్= ఈ భారతంలో; కలుగున్= ఉన్నదో; అది+అ= అదే; ఒండు+ఎడలన్= మరొకచోట కూడా; కల్గున్= ఉంటుంది; దీనన్= ఇందులో; లేకుండు= కనిపించని; చొప్పు= ధర్మం; తక్కు+ఒకంటను= మరి ఏ చోటా; లేదు= కనిపించదు.

**తాత్పర్యం:** ఓ వేదవిదులారా! పవిత్రమైన ధర్మార్థ కామమోక్షాలకు సంబంధించి ప్రవర్తించే ధర్మం ఏదైతే ఈ భారతంలో చెప్పబడిందో అది మరొకచోట కూడా ఉంటుంది. ఇందులో లేని ధర్మం మరెక్కడా కూడా కనిపించదు.

**విశేషం:** మహాభారతంలో పురుషార్థాలను గురించి సర్వవిషయ సమగ్ర చర్చ జరిగిందని ఈ పద్యానికి అర్థం.

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్'.

అని మూలశ్లోకం. మూలంలో జనమేజయుడికి చెప్పినట్టుండగా తిక్కనగారు వేదవిదులైన మహర్షులతో ఉగ్రశ్రవుడన్నట్టు మార్చినారు. 'వేదవిదులకు' ఇతరత్ర ఈ పురుషార్థాల విషయంగా ఏమి చెప్పారో కరతలామలకంగా ఉంటుంది. కాబట్టి వారికి చెప్పటంలో ఔచిత్యమున్నది. అంటే చతుర్వేదోపనిషత్సారమూ ఈ పంచమ వేదరూపంలో వ్యాసమహర్షిచే అందించబడిందని తాత్పర్యం. ఇదే మునివృషభుడైన వ్యాసమహర్షి నిరూపించిన 'అర్థం'. ఈ అర్థాన్ని వినాలనే రాజరాజనరేంద్రుడు నన్నయభట్టుగారిని కోరింది.

**సీ.** **'పుణ్యాత్ములార! యీ పుణ్యేతిహాసంబు । జనమేజయుఁడు సేయు సర్పమఖము**
**కాలంబునం దట్లు కారుణికోత్తముఁ । డైన వేదవ్యాసుఁ డాదరమున**
**నాజ్ఞాపనము సేయ నతని శిష్యుఁడు లోక । నుతుఁడు వైశంపాయనుండు సెప్ప**
**నన్నరేంద్రుఁడు విన నా సభ నిలిచి స । వినయభక్తికముగ వినినవాఁడఁ**

**తే.** **గథనశక్తియు నమ్ముని కరుణవలనఁ । గలిగె నా కిత్తెఱంగున గారవించి**
**మీరు వినుచుండఁ జెప్పెడి మేటి పదము । గంటి; మంటి మీ దయ పెంపుకతనఁ జేసి.'** **83**

**ప్రతిపదార్థం:** పుణ్య+ఆత్ములార!= పుణ్యాత్ములారా!; ఈ+పుణ్య+ఇతిహాసంబు= పుణ్యప్రదమైన ఈ కథను; జనమేజయుండు= జనమేజయ మహారాజు; చేయు= చేస్తున్న; సర్పమఖము కాలంబునందున్= సర్పయాగ కాలంలో; అట్లు= ఆ విధంగా; కారుణిక+ ఉత్తముఁడు+ఐన= దయగలవారిలో శ్రేష్ఠుడైన; వేదవ్యాసుఁడు= వ్యాసమహర్షి; ఆదరమునన్= ఆదరంతో; ఆజ్ఞాపనము+చేయన్= అనుజ్ఞ ఇవ్వగా; అతని శిష్యుఁడు= అతడి శిష్యుడైన వాడూ; లోకనుతుఁడు= లోకంచేత ప్రస్తుతించబడినవాడూ అయిన; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; ఆ+నర+ఇంద్రుఁడు వినన్= జనమేజయుడు వింటుండగా; చెప్పెన్= చెప్పాడు; ఆ సభన్= ఆ సభలో; నిలిచి= ఉండి; సవినయ భక్తికముగన్= వినయంతోనూ, భక్తితోనూ; వినినవాఁడన్= విన్నాను - వినినవాడిని (నేను); నాకున్= నాకు; కథనశక్తియున్= కథను చెప్పేశక్తికూడా; ఆ+ముని= వ్యాసమహర్షి; కరుణవలనన్= కరుణవలననే; కలిగెన్= కలిగింది (నేను); ఈ+తెఱంగునన్= ఈ విధంగా; గారవించి= నన్ను గౌరవించి; మీరు= మీరందరూ; వినుచుండన్= వింటుండగా; చెప్పెడి= భారతాన్ని చెప్పగలిగే; మేటి పదమున్= ఉన్నత స్థానాన్ని; కంటిన్= పొందాను; మీ దయ= మీ కరుణ; పెంపుకతనన్+చేసి= అతిశయించిన దానివలన; మంటిన్= ఆయుష్మంతుడిని అయ్యాను. (ఆశీస్సులు పొందానని తాత్పర్యం).

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! పుణ్యప్రదమైన ఈ కథను జనమేజయ మహారాజు సర్పయాగం చేస్తున్న సమయంలో దయామయుడైన వ్యాసమహర్షి అనుజ్ఞచేత అతడి శిష్యుడూ లోకంలో ప్రసిద్ధిచెందినవాడూ అయిన వైశంపాయన మహర్షి ఆ రాజు వింటుండగా చెప్పాడు. నేను ఆ సభలో ఉండి వినయ భక్తులలో ఆ కథను సమగ్రంగా విన్నాను. నా కీ కథను చెప్పే సామర్థ్యం కూడా వ్యాసులవారి అనుగ్రహం వలననే కలిగింది. ఇట్లా నన్ను గౌరవించి మీరంతా వింటుండగా నేను భారతాన్ని చెప్పగలిగే ఉన్నత స్థానాన్ని పొందాను. మీ ఆశీస్సులచేత ఆయుష్మంతుడిని అయ్యాను.

**విశేషం:** సూతుడు కావటంచేత మహర్షుల ఆశీర్వాదంచేత తాను తరించానని చెప్తున్నాడు. అదే మన భారతీయ సంప్రదాయంలో పాండిత్యానికీ, ఆశ్రమానికీ ఉన్న చిత్రమైన గౌరవం.

**వ.** **అని పలికి వెండియు.** **84**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

ఫలశ్రుతి

**క. 'అలఘుమతులార! పర్వం। బుల నీ యితిహాస రత్నమును వినిన నఘం**
**బులు వాయు; నాకలోకము। గలుగును; సిద్ధించు ముక్తి కాంక్షిత యైనన్. 85**

**ప్రతిపదార్థం:** అలఘుమతులార!= ఘనబుద్ధి కలిగిన మహర్షులారా!; ఈ+ఇతిహాస రత్నమును= ఈ శ్రేష్ఠమైన ఇతిహాసాన్ని; పర్వంబులన్= పర్వదినాలలో; వినినన్= వింటే; అఘంబులు= పాపాలు; పాయున్= నశిస్తాయి; నాకలోకము= స్వర్గం; కలుగును= కలుగుతుంది; ముక్తి= ముక్తి (మోక్షం); కాంక్షిత+ఐనన్= కోరితే; సిద్ధించున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** ఉదాత్తమతులైన మహర్షులారా! ఈ మహేతిహాసాన్ని పర్వదినాలలో వింటే సర్వపాపాలూ నశిస్తాయి. స్వర్గం లభిస్తుంది. సంకల్పించి గాఢమైన భక్తితో వింటే ముక్తి కూడా లభిస్తుంది.

**విశేషం:** పండుగలు, పబ్బాలు అని రెండు రకాల ఉత్సవాలు. ఉగాది మొదలైన పండుగలు, పర్వాలు (పబ్బాలు) ఐదు ముఖ్యమైనవి. అమావాస్య, పూర్ణిమ, అష్టమి, దశమి, సూర్యసంక్రాంతి - వీటిని పంచపర్వదినా లంటారు. ఇంకా చంద్రగ్రహణాన్ని, చాతుర్మాస్యంలోని వైశ్వదేవాదియాగ సందర్భాలను (వైశ్వదేవం, వరుణం, ప్రఘాస, శాఖమేధ, సునాసీరయా లన్నవి) కూడా పర్వాలనే పిలుస్తారు. అందుచేత భారతం భారతీయులకు మోక్షప్రదమైన పారాయణగ్రంథ మని అర్థం.

**క. ఆద్యంతంబును నీ యన। వద్యకథ వినంగఁ గనినవారికిఁ బాయున్**
**సద్యంబ బ్రహ్మహత్యా। వద్యము మొదలైన పాపవర్గం బెల్లన్. 86**

**ప్రతిపదార్థం:** ఆది+అంతంబునున్= మొదటినుండి తుదివరకూ; ఈ+అనవద్య కథన్= ఈ పుణ్యకథను; వినంగన్+కనినవారికిన్= వినగలిగినవారికి; సద్యంబు+అ= తత్క్షణమే; బ్రహ్మహత్యా+అవద్యము= బ్రహ్మహత్యపాపం; మొదలైన= మొదలైనటువంటి; పాపవర్గంబు+ఎల్లన్= పాపసమూహాలన్నీ; పాయున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** ప్రారంభం మొదలు ఈ పుణ్యకథను ఎవరు వింటారో వారికి ఆ క్షణమే బ్రహ్మహత్యాపాపం మొదలైన మహాపాపసమూహాలు కూడా నశిస్తాయి.

**క. సురపితృకార్యంబుల భూ। సురులకు దీని వినిపించు సుకృతాత్ముఁడు ద**
**త్కరణ ఫలంబుల నధిక। స్ఫురితంబుగఁ బడయు మహితబోధనులారా! 87**

**ప్రతిపదార్థం:** మహిత= గొప్ప; బోధనులారా!= జ్ఞానులారా! (బ్రహ్మజ్ఞానులారా!); సుర= దైవ; పితృ= పితరుల; కార్యంబులన్= కార్యాలలో; భూసురులకున్= బ్రాహ్మణులకు; దీనిన్= ఈ భారతాన్ని; వినిపించు= వినిపించే; సుకృత+ఆత్ముఁడు= పుణ్యాత్ముడు; తద్+కరణ ఫలంబులన్= ఆయా కార్యాలను చేసిన ఫలితాలను; అధిక స్ఫురితంబుగన్= మహా ప్రకాశవంతంగా; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** దైవ, పితృకార్యాలు జరిపేటప్పుడు ఏ పుణ్యాత్ముడు బ్రాహ్మణులకు ఈ మహాభారతాన్ని వినిపిస్తాడో అతడు ఆయా పుణ్యకార్యాల ఫలితాన్ని మిక్కిలి ప్రకాశవంతంగా పొందుతాడు.

**విశేషం:** ఇక్కడ 'స్ఫురితం' అంటే ఐశ్వర్యభరితంగా అని అర్థం.

**క. మానసముల నింద్రియముల। నేనియుఁ జేయంగఁబడిన యేనః పుంజం**
**బీ నిర్మలేతిహాసము। వీనుల నొక్కింత సిలుక విరియు సకలమున్. 88**

**ప్రతిపదార్థం:** మానసములన్= మనస్సులలో; ఇంద్రియములన్= ఇంద్రియాలలో; ఏనియున్= నేటితోనైనా; చేయంగన్+పడిన= చేయబడ్డ; ఏనస్+పుంజంబు= పాప సమూహం; ఈ+నిర్మల+ఇతిహాసము= ఈ పవిత్రమైన భారతకథ; వీనులన్= చెవులలో; ఒక్కింత+చిలుకన్= కొంచెంగా చిలికినా కూడా (పడినాకూడా); సకలమున్= పాపాలన్నీ; విరియున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** మనస్సుతోకాని, ఇంద్రియాలతోకాని చేయబడ్డ పాపసమూహం ఈ పవిత్రమైన భారతేతిహాసం చెవులలో ఏకొంత చిలికినా కూడా ఆ సర్వపాపాలూ వెంటనే విరిగిపోతాయి.

**ఉ. భ్రాజిత వృత్తిమైఁ బరఁగు భారత సంహిత సంయమీంద్రులా**
**రా! జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం**
**బూజిత కీర్తియై నెగడు భూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే**
**రాజు; లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్న యంతటన్. 89**

**ప్రతిపదార్థం:** సంయమి+ఇంద్రులారా!= ఋషీశ్వరులారా!; భ్రాజిత వృత్తిమైన్= ప్రకాశధర్మంతో; పరఁగు= ఒప్పేటటువంటి; భారత సంహిత= మహాభారతేతిహాసం; జయనామకంబునను= జయమనే పేరుతో; రాజితభంగిన్= వెలుగుతూ; జగత్+త్రయంబునన్= మూడు లోకాలలోనూ; పూజిత కీర్తి+ఐ= మన్నించబడిన ప్రఖ్యాతికలదై; నెగడున్= వ్యాపించింది; విన్నఅంతటన్= వినగానే; రాజులు= చక్రవర్తులు; దీనిచేన్= ఈ భారత కథా శ్రవణంచేత; భూరి= మిక్కిలి; జయ+ఉన్నతిన్= విజయంతోడి ఉన్నతస్థితిని; కంద్రు= పొందుతారు; మఱి= ఇంకా; ఇలాసురుల్= బ్రాహ్మణులు సైతం; అరాతులన్= శత్రువులను; గెల్తురు= గెలుస్తారు.

**తాత్పర్యం:** ఋషీశ్వరులారా! ప్రకాశధర్మం కలిగిన ఈ భారతేతిహాసం 'జయ'మనే పేరుతో వెలుగుతూ మూడు లోకాలలోనూ మన్నించబడుతూ ప్రఖ్యాతమై వ్యాపించింది. రాజులు ఈ కథ విని విజయలక్ష్మిని పొంది వెలుగుతారు. బ్రాహ్మణులు కూడా శత్రువులను జయిస్తారు.

**విశేషం:** బ్రాహ్మణులు విపక్షవాద జయం సాధిస్తారని తాత్పర్యం.

**ఉ. భారతమర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్**
**భూరియశంబునుం బ్రమదమున్ దృఢ విద్యయుఁ గల్గు; వారి కే**
**కోరికలైన వేగ మొనఁగూడు; సుపుత్త్రునిఁ గాంచు సద్వరున్**
**గారవ మొప్పఁగాఁ బడయు గర్భిణియున్ వరుసన్ గుమారియున్. 90**

**ప్రతిపదార్థం:** భారతము= భారతాన్ని; అర్థితోన్= కోరికతో; వినినన్= వింటే; భక్తిన్= భక్తితో; పఠించినన్= చదివితే; శ్రీయున్= సంపద; ఆయువున్= ఆయుస్సు; భూరి= మిక్కిలి; యశంబునున్= కీర్తి; ప్రమదమున్= సంతోషమూ; దృఢ= గట్టి; విద్యయున్=

చదువూ; కల్గున్= కలుగుతాయి; వారికిన్= వారికి; ఏ కోరికలు+ఐనన్= ఏ కోరికలైనా; వేగము+ఒనన్+కూడున్= శీఘ్రంగా ఫలిస్తాయి; గర్భిణియున్= గర్భిణీ; కుమారియున్= కన్యా; వరుసన్= వరుసగా; సుపుత్రునిన్= మంచి కొడుకును; సద్వరున్= మంచి మగడిని; పడయున్= పొందుతారు.

**తాత్పర్యం:** భారతాన్ని కోరికతో వినినా, భక్తితో చదివినా సంపద, ఆయుస్సు, మిక్కిలి యశస్సు, సంతోషం, గట్టి చదువు కలుగుతాయి. వారికి ఏ కోరిక అయినా అతి శీఘ్రంగా ఫలిస్తుంది. గర్భిణికి మంచి కుమారుడు పుట్టుతాడు. కన్యకు మంచి వరుడు దొరుకుతాడు.

**విశేషం:** గట్టి చదువు= గట్టి పునాది ఉన్న చదువని అర్థం. బ్రహ్మజ్ఞానమే ఆ గట్టి పునాది. నిత్యానిత్య వస్తు వివేకం ఉన్న చదువునే 'దృఢవిద్య' అని తిక్కనగారు అందంగా పిలిచారు.

భారత శ్రవణంచేత ఇంద్రియాలు ఉద్వేగాన్ని, చంచలత్వాన్ని పోగొట్టుకొని ప్రశాంతగతికి, కార్యనిర్వహణకు సంసిద్ధమవుతాయి. కాబట్టి ఆయుస్సు పెరుగుతుంది. ఇట్లాగే తక్కిన ఫలితాలు కూడా. (క్రమాలంకారం)

**ఉ. శిక్షిత చిత్తులార! శుభసిద్ధులు వొందు ననేక జన్మ పా**
**పక్షపణంబునన్ వెలుఁగు భారత సంహిత కెల్లఁ బుండరీ**
**కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్న మానవుం**
**డక్షయ పుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్. 91**

**ప్రతిపదార్థం:** శిక్షిత= అదుపులో ఉంచబడిన; చిత్తులార!= మనసులుగల ఋషివర్యులారా!; భారతసంహితకున్+ఎల్లన్= భారత సంహితకు అంతటికీ; ప్రకట+అర్థముగాన్= సారాంశంగా; పుండరీకాక్షునిన్= కమలాక్షుడైన; వాసుదేవున్+కని= శ్రీకృష్ణుడినిచూచి; విన్న= విన్నటువంటి; మానవుండు= మానవుడు; అనేక జన్మ పాప= అనేక జన్మాలలో చేసిన పాపాల; క్షపణంబునన్= క్షయం చేత; వెలుఁగున్= ప్రకాశిస్తాడు; శుభసిద్ధులు+పొందున్= శుభమైన ఫలితాలు పొందుతాడు; అక్షయ= తరుగుదలలేని; పుణ్యలోకముల+అందున్= పుణ్యలోకాలలో; నిరామయస్థితిన్= దోషరహితమైన సుఖస్థితిలో; రమించున్= క్రీడిస్తాడు.

**తాత్పర్యం:** అదుపులో ఉంచిన మనస్సులుగల మహర్షులారా! భారత సంహితకు సారాంశభూతుడుగా కమల పత్రనయనుడైన శ్రీకృష్ణ పరమాత్మను దర్శించి ఎవడు ఈ ఇతిహాసాన్ని వింటాడో వాడు జన్మజన్మలలో చేసిన పాపాలు నశించి ప్రకాశిస్తాడు. అన్ని శుభ ఫలితాలను పొందుతాడు. ఎప్పటికీ నశించని పుణ్యలోకాలలో ఏ దోషమూలేని సుఖస్థితిలో రమిస్తుంటాడు.

**విశేషం:** భగవంతుడైన వ్యాసుడు భారతార్థాన్ని శ్రీకృష్ణ పారమ్య బోధకంగానే ఉద్దేశించాడని ముందే వివరించటం జరిగింది.

**ఉ. వ్యాసమునీంద్ర సారకరుణాతిశయంబున భారతార్థ ము**
**ద్భాసితమైనయట్టి నుతభాగ్యునకున్ సకలాగమార్థ సం**
**వాసన మావహిల్లు జనపంక్తులు గీర్తనసేయ శశ్వదు**
**ల్లాస సుఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁడై. 92**

**ప్రతిపదార్థం:** వ్యాసమునీంద్ర= వ్యాసమహర్షియొక్క; సార= సాంద్రమైన; కరుణా+అతిశయంబునన్= కరుణాధిక్యంచేత; భారత+ అర్థము= మహాభారత తాత్పర్యం; ఉత్+భాసితము+ఐన+అట్టి= స్ఫురించినట్టి; నుతభాగ్యునకున్= స్తుతించబడిన భాగ్యవంతుడికి; సకల+ఆగమ+అర్థ+సంవాసనము+ఆవహిల్లున్= అన్ని వేదాల అర్థాల కలిమీ కలుగుతుంది; జనపంక్తులు= జన సమూహాలు; కీర్తన+ చేయన్= కీర్తించగా; అతండు= అతడు; ఉదాత్తుఁడు+ఐ= అధికుడై; శశ్వత్= శాశ్వతమైన; ఉల్లాస+సుఖ+అనుభూతిన్= ఉల్లాసరూపమైన సుఖానుభూతితో; అచలస్థితిన్= చలించనిస్థితిలో; ఒప్పున్= వెలుగుతాడు.

**తాత్పర్యం:** వ్యాసమహర్షియొక్క సాంద్రమైన కరుణాధిక్యంచేత మహాభారత తాత్పర్యం ఎవరికి స్ఫురిస్తుందో ఆ భాగ్యవంతుడికి సకల వేదోపనిషత్సారమూ కరతలామలకం అవుతుంది. జనులు అతడిని కీర్తించగా అతడు శాశ్వతమైన సుఖరూపానుభూతితో చలనంలేని బ్రాహ్మీస్థితిలో వెలుగుతాడు.

**విశేషం:** మహాభారతంలో బయటికి కనిపించే కథవెనుక అతిగంభీరమైన తాత్త్విక ధార ఉందని ప్రాజ్ఞులు సెలవిచ్చారు. 'మహా' అనే శబ్దానికి అర్థ విచారణ చేస్తూ 'పెద్ద' అనే వాచ్యార్థం వెనుక సాంఖ్యం నుండి వేదాంతం వరకూ ఉన్న సర్వ ఆర్ష విజ్ఞానమూ 'మహా' శబ్దంలో దాగి ఉందని పండితులు అంటారు. 'మహత్తు' అని పిలువబడింది సాంఖ్యవిద్యలో చెప్పబడిన ప్రకృతితత్త్వం. 'భారత'మని చెప్పబడింది ప్రాణస్వరూపమైన ప్రణవతత్త్వం, దీనినే బ్రహ్మమని అన్నారు. శతపథబ్రాహ్మణంలో ఈ రహస్యం చెప్పబడింది. కాబట్టి భారతంలో పరాపర గోవృషభ, మాతృపితృ, ద్యావాపృథ్వీ, వాక్ప్రాణ, ద్రవ్యాత్మ, మృతామృత, అగ్నీషోమ, స్త్రీ పురుష, బంధు బిందు - తత్త్వాలు చెప్పబడ్డాయి. సంభవపర్వంనుండి యుద్ధ పర్వాలవరకూ ప్రకృతి (ప్రవృత్తి) యజ్ఞం. స్త్రీ శాంత్యాను శాసనికాదులు నివృత్తిరూప బ్రహ్మయజ్ఞం. ఈ రెండూ కలిసి పూర్ణతత్త్వమైన అద్వైతసార నిరూపణ చేస్తున్నాయి. ఈ లౌకికాలౌకిక తత్త్వ సమన్వయ జ్ఞానాన్నే 'యోగ' మని భారతం స్పష్టం చేస్తున్నది. స్వర్గారోహణపర్వ సారాంశం కూడా ఇదే.

**వ. అని యిట్లు సమస్త పురాణ పారీణుండైన సూతుండు. 93**

**తాత్పర్యం:** అని ఈ విధంగా సమస్త పురాణ కథనంలోనూ నేర్పరి అయిన ఉగ్రశ్రవుడు.

**చ. పరమపదాప్తి హేతు వగు భారత సంహిత శౌనకాది భూ**
**సురవరు లింపునం గరఁగు చొప్పునఁ జెప్పిన వారు మోదసం**
**భరితతఁ బొంది యక్కథకు బ్రాఁతిగ నర్చితుఁ జేసి రర్మిలిన్;**
**హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁ జూడు మెప్పుడున్. 94**

**ప్రతిపదార్థం:** పరమపద= మోక్ష; ఆప్తి= ప్రాప్తికి; హేతువు+అగు= కారణమైన; భారత సంహిత= భారత సంహితను; శౌనక+ఆది= శౌనకుడు మొదలైన; భూసురవరులు= బ్రాహ్మణోత్తములు; ఇంపునన్= తృప్తితో; కరఁగుచొప్పునన్= కరిగిపోయే విధంగా; చెప్పినన్= చెప్పగా; వారు= ఆ మహర్షులు; మోదసంభరితతన్+పొంది= మోద సంభరితులై (సంతోషం నిండినవారై); అర్మిలిన్= ప్రీతితో; బ్రాఁతిగన్= ఘనంగా; ఆ+కథకున్= ఆ ఉగ్రశ్రవసుడిని; అర్చితున్+చేసిరి= పూజించారు; (తిక్కనగారు ఇట్లా ప్రార్థిస్తున్నారు); హరిహరనాథ!= స్వామి హరిహరనాథా!; సర్వభువనార్చిత!= అన్ని భువనాలలోనూ పూజించబడేవాడా!; నన్= నన్ను; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; దయన్+చూడుము= దయతో చూడుము.

**తాత్పర్యం:** మోక్షప్రాప్తి కారణమైన భారత సంహితను శౌనకాది మునులకు వారు తృప్తితో కరిగిపోయేటట్లు చెప్పగా, వారు సంతోషంతో నిండినవారై ఆ కథకుడైన ఉగ్రశ్రవసుడిని ప్రీతితో ఘనంగా పూజించారు. స్వామీ హరిహరనాథా! సర్వలోకార్చితా! నన్ను సర్వదా నీ కృపాకటాక్షాలతో చూడుము.

**విశేషం:** ఇక్కడ 'ఇంపు' అంటే రసానందానుభవంవలన కలిగే 'తృప్తి' అని అర్థం. 'కరఁగట' మంటే కంటతడిపెట్టుకొని 'స్నిగ్ధ' లై సత్త్వగుణసంపన్నులు కావటమని అర్థం.

అశ్వాసాంతము

**ఉ. పావన! దుర్దశాపహా! శుభప్రదమూర్తి! సుధానుభూతి సం**
**జీవిత భక్తలోక! తులసీదళదామ కపాలమాలికా**
**భావిభవాభిరామ! పరిపక్వతపఃఫలరూప! సాంఖ్య వి**
**ద్యావహా! యోగశక్తి విశదాద్భుత ఖేలన! లోకపాలనా! 95**

**ప్రతిపదార్థం:** పావన!= పవిత్రుడా!; దుర్దశా+అపహా!= కష్టాలను తొలగించేవాడా!; శుభప్రదమూర్తి!= శుభాలను కలిగించే స్వరూపం కలవాడా; సుధా+అనుభూతి= అమృతాన్ని అనుభవించటంచేత; సంజీవిత= బ్రతికించబడ్డ; భక్తలోక!= భక్త సముదాయం కలవాడా!; తులసీదళదామ= తులసీపత్రాల దండయొక్క; కపాలమాలికా= పుర్రెల సరంయొక్క; భా= కాంతియొక్క; విభవ+అభిరామ!= అతిశయంచేత మనోహరంగా ప్రకాశించేవాడా; పరిపక్వ= పరిపక్వంపొందిన; తపస్+ఫలరూప!= తపస్సుయొక్క ఫలరూపమైనవాడా!; సాంఖ్య విద్యావహా!= సాంఖ్యవిద్యను ప్రసాదించినవాడా!; యోగశక్తి= యోగశక్తిచేత; విశద= ప్రకటించబడిన; అద్భుతఖేలన!= అద్భుతకార్యాలను లీలగా చేసినవాడా!; లోకపాలనా!= లోకాన్ని పరిపాలించేవాడా!

**తాత్పర్యం:** పరమేశ్వరా! నీవు పరమపవిత్రమూర్తివి. భక్తుల ఆపదలను తొలగిస్తూ వారికి సకల శుభాలూ చేకూరుస్తావు. అపాయసమయంలో అమృతాన్ని చిలికి వారిని బ్రతికిస్తావు. ఎముకల పేరుతో, తులసీదామంతో సితా సిత కాంతులతో నీవు మిక్కిలి మనోహరంగా కనిపిస్తావు. తాపసుల తపస్సుకు ఫలరూపమైన వాడివి నీవే. కపిలుడిరూపంలో సాంఖ్య విద్యను ప్రసాదించావు. యోగ విద్యాతిశయంచేత ఎన్నో అద్భుతకార్యాలను క్రీడగా చేసి చూపావు. లోకంలో ధర్మస్థితిని పరిరక్షిస్తూ సాధువులను కాపాడుతూ లోకపాలకుడివిగా విరాజిల్లుతున్నావు.

**విశేషం:** **"అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాంగతోఽపి వా,**
**యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః."**

అని స్మృతి. ఎవరు పుండరీకాక్షుడిని స్మరిస్తారో వారు శుచిపరులైనా అశుచులైనా ఏ అవస్థలో ఉన్నా బాహ్యాభ్యంతరాలలో 'పవిత్రు' లే అవుతా రని అర్థం. అందుచేత పరమాత్మ 'పవిత్రుడు'.

దేవతలకు అమృత ప్రదానంచేసి వారిని రక్షించాడు. అదే స్వామివారి 'మోహినీ' అవతారం. అమృతమంటే మృతిలేనిదని అర్థం.

ఎముకలహారం - తెల్లనిది. తులసీదామం - నల్లనిది. లౌకికాలౌకిక తత్త్వాలకు సంకేతాలు ఇవి. తులసీదామం హరిది. ఎముకల మాల హరుడిది.

'సాంఖ్య' శబ్దానికి ఆత్మజ్ఞానమని అర్థం. గీతాకారుడు వివక్షించాడు. కపిలుడి 'సాంఖ్య' విజ్ఞానమే శంకరుల అద్వైతానికి, తరువాతి విశిష్టాద్వైత, ద్వైతాలకు మూలం.

శ్రీకృష్ణుడు విరాట్ స్వరూపాన్ని ప్రదర్శించింది కేవలం యోగశక్తిచేతనే. అందుకే అతడు 'యోగేశ్వరుడు'. బ్రహ్మ సృష్టికర్త. రుద్రుడు లయస్వరూపుడు. విష్ణువు పాలకుడు. అందుకే రాజును విష్ణువు అంశకలిగినవాడుగా చెప్పారు. (నావిష్ణుః పృథివీపతిః).

**క. దేవ! చతుర్విధ భూ। తావాసా! సుకృత హృదయ హారివిలాసా!**
**కేవల భావానందమ। యా! వేదవ్యాస వర్ణనారూఢ దయా! 96**

**ప్రతిపదార్థం:** దేవ!= స్వామీ!; చతుర్విధ= నాలుగు విధాలైన; భూత+ఆవాసా= భూతజాలంలోనూ నివసించేవాడా!; సుకృత= పుణ్యాత్ములైన సజ్జనుల; హృదయ= హృదయాలను; హారి= ఆకర్షించే; విలాసా!= క్రీడ కలవాడా!; కేవల= కేవలం; భావ+ఆనందమయా!= ఆత్మానంద రూపుడా!; వేదవ్యాస= వ్యాసమహర్షిచేత చేయబడిన; వర్ణన= వర్ణనలచే; ఆరూఢ= తెలియదగిన; దయా!= కరుణ (అనుగ్రహం) కలవాడా!

**తాత్పర్యం:** దేవా! నాలుగు భూతాలలోనూ నీవు వసిస్తున్నావు. పుణ్యాత్ములైన సజ్జనుల హృదయాలను ఆకర్షించే క్రీడ కలిగినవాడివి నీవు. నీవు కేవలం ఆత్మానంద స్వరూపుడివి. వేదవ్యాస మహర్షి చేసిన వర్ణనలు నీ అనుగ్రహ పారమ్యాన్నే బోధిస్తాయి.

**విశేషం:** దేవ, మనుష్య, తిర్యక్, స్థావరములని నాలుగు విధాలుగా భూతాలు చెప్పబడ్డాయి. అన్ని భూతాలకూ జనుస్థానం కాబట్టి స్వామి అన్నిటిలోనూ వసిస్తున్నాడు. (ఈశావాస్యమిదం సర్వం - అని ఈశావాస్యోపనిషత్తు).

సుకృతులకు స్వామి మనోహరుడు - దుష్కృతులకు భీషణుడు. అందుకే నరసింహాది రూపాలతో దుష్ట సంహారం చేశాడు. లక్ష్మీనరసింహుడై ప్రహ్లాదుడిని కాపాడాడు.

'భావ' మంటే 'ఆత్మ' అని అర్థం. బ్రహ్మ ఆనందస్వరూపుడు. బ్రహ్మపదార్థం కేవలం భావనామయం. అట్లాగే ఆనంద భావానందమయితే అది ఆత్మానందం మాత్రమే.

భారత భాగవతాదులలోని ప్రహ్లాద, గజేంద్ర, కుచేల, ద్రౌపద్యాదుల కథలు స్వామి కరుణనే నిరూపిస్తాయి.

**మాలిని.**

**అకృతక మధురోక్తి వ్యాప్త సందీప్త సారా!**
**సకల భువన రక్షాశాలి శుంభద్విహారా!**
**శుక జనకమనీషా శుద్ధ బుద్ధానుభావా!**
**సకృపకృత విలాసా! సంభృతానందభావా! 97**

**ప్రతిపదార్థం:** అకృతక= కల్పితం కానటువంటి; మధుర+ఉక్తి= మధురోక్తులలో; వ్యాప్త= వ్యాపించి; సందీప్త= ప్రకాశించే; సారా!= సారరూపుడా!; సకల= అన్ని; భువన= భువనాలనూ; రక్షాశాలి= రక్షిస్తూ; శుంభద్విహారా!= వెలిగే క్రీడ కలిగినవాడా!; శుక= శుకమునీంద్రుడి; జనక= జనకుడైన వ్యాసుడి; మనీషా= బుద్ధిచేత; శుద్ధబుద్ధ+అనుభావా!= అకలుషజ్ఞాన స్వరూపుడని నిశ్చయించబడ్డవాడా!; సకృప= దయతో; కృత= చేయబడిన; విలాసా!= లీలలు కలవాడా?; సంభృత= సంపూర్ణంగా నిండిన; ఆనంద భావా!= ఆనంద స్వరూపుడా! (నీకు మరల మరల నమస్కారం).

**తాత్పర్యం:** నిత్యమధురాలైన వేదవాక్యాలలో నీ ప్రకాశం సర్వత్రా వెలుగుతున్నది. సకల భువన రక్షణ రూపమే నీ విహారం. వేదవ్యాసుడు నిన్ను శుద్ధజ్ఞాన స్వరూపుడిగా వర్ణించాడు. భక్తుల సముద్ధరణకొరకు నీవు దయతో అనేక లీలలు ప్రదర్శిస్తావు. నీవు సంపూర్ణానంద స్వరూపుడివి.

**విశేషం:** వేదాలు పురుషప్రయత్నం లేకుండా పుట్టాయి. అందుకే అవి 'అకృతకాలు'. పరమేశ్వర నిశ్వాసరూపమే వేదమని సంప్రదాయం. అందుకే అది అపౌరుషేయం.

బ్రహ్మసూత్ర ప్రకారం పరమాత్ముడు శుద్ధ బుద్ధ ముక్త రూపుడు - అని నిరూపించినవాడు సాధారణమైన ప్రజ్ఞ ఉన్నవాడు కాడు. ఆ ప్రజ్ఞ పురుష 'మనీష'. అది శుకజనకుడిది. శుకుడు జన్మతో బ్రహ్మర్షిగా పుట్టాడు. అతడి తండ్రి వేదవ్యాసుడు. అందుకే 'వ్యాసపీఠం' భారతీయ ఆత్మ సంపదగా మన్నన పొందింది.

స్వామి కృపావిలాసమే ఇన్ని అవతారాలూ. కనుకే స్వామి దయావీరగుణ సంపన్నుడు. కృపామూర్తి. ఆయన కేవలం బ్రహ్మానంద స్వరూపుడు. మాలినీ వృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న,న,మ,య,య - గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిమైత్రీస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు స్వర్గారోహణపర్వంబు సర్వంబు నేకాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= ప్రసిద్ధి కెక్కిన; ఉభయ కవి= సంస్కృతాంధ్ర భాషాకవుల; మిత్త్ర= మిత్రుడును; కొమ్మన= కొమ్మన అనే; అమాత్య= మంత్రియొక్క; పుత్త్ర= కుమారుడును; బుధ= విద్వాంసులయొక్క; ఆరాధన= పూజచేత; విరాజి= ప్రకాశించేవాడును అయిన; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కనచేత; ప్రణీతంబు+ఐన= రచించబడినదైన; శ్రీమహాభారతంబునన్= శ్రీ మహాభారతంలో; స్వర్గారోహణ పర్వంబు= స్వర్గారోహణ పర్వం; సర్వంబును= సమస్తమును; ఏకాశ్వాసము.

**తాత్పర్యం:** కీర్తికలవాడూ, సంస్కృతాంధ్రభాషా కవిమిత్రుడూ, కొమ్మనమంత్రి కుమారుడూ, బుధపూజనంచేత ప్రకాశించేవాడూ అయిన తిక్కనసోమయాజి రచించిన శ్రీ మహాభారతంలో స్వర్గారోహణపర్వం సర్వం ఏకాశ్వాసం సమాప్తం.

శ్రీమదాంధ్ర మహాభారతంలోని ఏకాశ్వాసమైన స్వర్గారోహణపర్వం సమాప్తం.

శ్రీమదాంధ్ర మహాభారతం సంపూర్ణం

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**శ్లో॥ యదక్షర పదభ్రష్టం । మాత్రాహీనం చ యద్భవేత్,**
**తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోఽస్తు తే.**

(స్వామీ! నారాయణమూర్తీ! అక్షరంలోకాని, పదంలోకాని, మాత్ర (గణం)లోకాని ఏదైనా లోపం ఉంటే దానిని నీవే క్షమించుము. నీకు నమస్కారం).

# శ్రీమదాంధ్ర మహాభారతము

## గద్యపద్య ప్రథమపాద సూచి

### అశ్వమేధ పర్వము

## ఆశ్రమవాస పర్వము

## మౌసల పర్వము

# మహాప్రస్థానిక పర్వము

# స్వర్గారోహణ పర్వము

---

# అశ్వమేధపర్వం

సీ. 'సమరంబు ధర్మవిజయ పరికీర్త్యంబు। గాఁ జేసి భూమి నిష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు ప్రజ ప్రీతి నొందంగ, । విద్వజ్జనంబులు వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను వినుతింప, నెగడెడు । శాంతియు సమతయు సకలజనముఁ
గొనియాడు సిద్ధులు మునులు సేవింతురు, । ధర్మనందనుఁ డి ట్లుదాత్తుఁ డగునె!

తే. యతని కున్నతి గావించి రనిలజుండుఁ । గవలు, నెంతయు నీ చేతి గాండివంబు
లీల గల్గి మహాధర్మశాలి సత్య । నిత్యుఁ డమ్మహీపతి గృతకృత్యుఁ డయ్యె,'-శ్రీకృష్ణుడు(**అశ్వ.1.145**)

**1.రాజసూయం: అశ్వమేధం:**

ధర్మనందనుడి సార్వభౌమాధికార చరిత్ర వాహినికి రాజసూయం ఒక ఒడ్డు అయితే, అశ్వమేధం మరొక ఒడ్డు. రాజసంతో రాజలోకాన్ని జయించి వారినుండి విలువైన బహుమానాలు పొంది. వారిచేత స్వీయ సార్వభౌమత్వాన్ని ప్రతిష్ఠాపించు కొనటం ధ్యేయంగా సాగింది రాజసూయం. దానివలన శిశుపాలాదుల వైరంకూడా పెరిగింది. తరువాత మహాయుద్ధానికి దారి తీసింది. విస్తృత ప్రాణహానికి, వీరసంహారానికి కారణమయింది. ఒక విధంగా కురుక్షేత్ర యుద్ధానికి బీజావాపనం రాజసూయంలోనే జరిగింది. సర్వ సర్వంసహా చక్రవర్తిత్వాన్ని అందించింది రాజసూయమే. దానిని సంగ్రహించిందీ రాజసూయమే. పూర్వాధికారాన్ని మరల తెచ్చికొనటానికి భారతయుద్ధ విజయం ఒక్కటే ధర్మరాజుకు చాలలేదు. కురుక్షేత్రంలో కౌరవులను, వారి సహాయకులను చంపి హస్తినాపురానికి రాజయ్యాడే కాని సార్వభౌమ గౌరవం పొందలేదు. దానికి మరల అశ్వమేధయాగం అవసరమయింది. రాజసూయంలో ధర్మనందనుడితోపాటు భీష్మాది కురువీరులూ, దుర్యోధనాది కౌరవవీరులూ, బంధుమిత్రులూ, అందరూ విజయోత్సాహంతో పాల్గొన్నారు. అందరూ ఆయా బాధ్యతలు పంచుకొని నిర్వహించారు. కాని, అశ్వమేధయాగంనాటికి ధర్మరాజు ఆ బంధువర్గాన్నంతటినీ యుద్ధంలో సంహరించాడు. ఆ పాపభయం అతడి అంతరంగాన్ని దహించివేస్తున్నది. బంధుమిత్ర పుత్ర ప్రజాహంతకుడు ప్రభువు కావటం ధర్మమా? అని కొందరు ప్రశ్నించే తరుణం ఏర్పడింది. రాజసూయంలో లేని పాపచింత అశ్వమేధంనాటికి ఏర్పడింది. ఆ పాపఫలం పోవటానికి అశ్వమేధయాగ మొక్కటే తరణోపాయమని వ్యాసమహర్షీ, వాసుదేవుడూ ధర్మరాజును ఒప్పించారు. ఆ యజ్ఞాంతంలో చేసే అవభృథ స్నానం సర్వపాపనివారిణి అని నిశ్చయించారు. ధర్మజుడు దానికి అంగీకరించాడు.

అయితే, రాజసూయానికీ, అశ్వమేధానికీ తారతమ్యం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. రాజసూయంలో పాండవులకు ప్రేరక సహాయక రక్షక శక్తిగా శ్రీకృష్ణుడు త్రిముఖంగా నిలిచి యోగక్షేమం వహించాడు. భీష్ముడి నిర్దేశంతో శ్రీకృష్ణుడిని యజ్ఞపురుషుడిగా సమ్మానించి ధర్మరాజు ధన్యుడయ్యాడు. రాజసూయంలో వ్యాసమహర్షి వెనుక ఉండి నడిపించగా శ్రీకృష్ణుడు ముందుండి ముందుకు సాగించి ఫలాన్ని ధర్మరాజుకు అందించాడు. అశ్వమేధం నాటికి ఆ పరిస్థితి వ్యత్యస్తమయింది. శ్రీకృష్ణుడు భారతయుద్ధానంతరం ఎక్కువగా నిర్లిప్త పాత్రను నిర్వహించాడు. తాను పూర్వం చేసిన వాగ్దానాలను నిలుపుకొనటానికి, భవిష్యత్తుకు పనికివచ్చే ధర్మవేదాంత బోధలు చేయటానికీ, శాపానుభవాలను అనుభవించవలసి వచ్చినప్పుడు జరుగుతున్న చరిత్రను మార్చే మహిమ తనకున్నా కర్మఫలానుభవాన్ని జీవులు అనుభవించే సంసారచక్ర భ్రమణానికి అడ్డుపడక, చివరకు తననూ తనవారినీ ఆ చక్రంలో భోక్తలుగా మార్చే ప్రవృత్తిని ప్రకటించాడు. అందువలన శ్రీకృష్ణుడి పాత్ర అశ్వమేధంలో నిమిత్తమాత్రంగా ఉన్నా నిండుగా, అండగా దండిగా ఉన్నట్లు భాసిస్తుంది. రాజసూయయాగంలో శ్రీకృష్ణుడివలె అశ్వమేధంలో సూత్రధారి పాత్ర నిర్వ హించింది పారాశర్యమహర్షి. అవసరాన్ని తానే గుర్తించి, ధర్మరాజుకు ప్రత్యక్షమై, అడుగడుగున తానే మార్గదర్శిగా, మహర్షిగా నిలిచి, అడ్డంకులను తొలగించి, అవసరాలను తీర్చి, అండదండలుగా నిలిచి, గురువుగా ఋత్విజుడుగా, మహర్షిగా, పురోహితుడుగా తగిన పాత్రను నిర్వహించి ధర్మరాజును చేయిపట్టుకొని అశ్వమేధం నిర్వహించేటట్లు చేశాడు. రాజసూయంలో శ్రీకృష్ణుడిని పూజించిన ధర్మరాజు అశ్వమేధంలో వ్యాసమహర్షిని పూజించి తన సర్వసామ్రాజ్యాన్నీ ఆయనకు దక్షిణగా సమర్పించుకొన్నాడు. ఆ తరువాత వ్యాస, శ్రీ కృష్ణుల ఆదేశానుసారం అసంఖ్యాకంగా బంగారు నాణాలను వ్యాసమహర్షికి సమర్పించి భూవలయాన్ని కొనుక్కొన్నాడు.

అశ్వమేధయాగం సంకల్పించటానికి ముందు ధర్మరాజుకు ఆ యజ్ఞం నిర్వహించి, స్వర్ణదానాలు చేయటానికి తగినంత ధనం లేదు. అతడు తన అశక్తతను ప్రకటించాడు. అప్పుడు అతడికి అపారస్వర్ణ ధననిధు లున్న చోటును చెప్పిందీ, అది ధర్మసంపదగా అతడిని ఒప్పించిందీ. ఆ నిధుల వద్దకు దారి చూపించిందీ. దానికి తగిన విధి విధానాలను తెలిపిందీ, దాని అధిపతి అయిన శివుడిని ఆరాధించే పద్ధతిని దగ్గర ఉండి శాస్త్రోక్తంగా నిర్వహింపచేసిందీ స్వయంగా వేదవ్యాసమునీంద్రుడే. పూర్వం మరుత్తుడనే ప్రభువు అశ్వమేధాది యజ్ఞాలు చేసి అపారస్వర్ణ రాసులను బ్రాహ్మణులకు దానం చేశాడు. వారు మోయగలిగినంత బంగారాన్ని తీసికొని వెళ్ళుతూ మిగిలిన అపారస్వర్ణరాసులను హిమాలయంలో ఒకచోట గుప్తంగా ఉంచి. రాబోయే కాలంలో దానిని కనుగొన్నవారికి ఆ సంపద స్వంతం ఔతుందని వరమిచ్చారు. దానివలన ధర్మరాజుకు ఆ సంపద ధర్మసంపదగా లభించింది. దానితో మూడురెట్ల స్వర్ణ దానాలను యజ్ఞంలో చేసి మూడు యజ్ఞాలు చేసి ఫలాన్ని పొందుమని వ్యాసుడు ధర్మజుడికి హితవు చెప్పాడు. దీనివలన రెండు లాభాలు కలిగాయి. అశ్వమేధయాగంలో అశ్వాన్ని అడ్డగించిన రాజులను హింసించకుండా సౌమ్యంగా శాంతంగా వారిని వారించి, అవసరమైతే సైన్యాన్ని చంపి రాజులను చంపకుండా వదలి, హింసలేని విజయాన్ని, రాజులనుండి ధనాన్ని కప్పంగా స్వీకరించని స్నేహపూర్వక శాంతి విజయాన్ని సాధించాలని అర్జునుడికి ధర్మరాజు ప్రబోధించాడు. అశ్వరక్షణలో అర్జునుడు తన గాండీవ పరాక్రమాన్ని పరిపూర్ణంగా ప్రదర్శించలేకపోయాడు. గాండీవం కొన్నిసార్లు నేలపై పడింది. బభ్రువాహనుడిచేతిలో విజయుడు ఒకసారి ప్రాణాలు కోల్పోయాడు. ఉలూపి సంజీవనీమణిచేత అతడిని పునరుజ్జీవితుడిని చేసింది. అర్జునుడు శిఖండిని అడ్డం పెట్టుకొని భీష్ముడిని అధర్మంగా చంపినందుకు వసువులు కోపించి అర్జునుడు మరణించేటట్లు శపించగా, ఆ శాపపరిహారార్థం ఆ మార్గాన్ని ఆశ్రయించి, భీష్మవధవలన అర్జునుడికి కలిగే నరకబాధను తొలగించటమైనదని ఉలూపి వివరించింది. అశ్వమేధంలో అశ్వరక్షణంలో అర్జునుడికి శ్రీకృష్ణుడి రక్ష ఉన్నా ప్రత్యక్షంగా ఆయనకు సాయపడిన జాడలు లేవు. అతడు నిర్లిప్తుడుగా ఉండిపోయాడు. పై పెచ్చు అతడికి వేదాంత బోధ చేసి మరచిపోయిన భగవద్గీతాపరమార్థాన్ని జ్ఞాపకం చేశాడు.

అశ్వమేధయాగానికి ధర్మరాజు పలికిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని యాగారంభానికి రెండు నెలలముందే శ్రీకృష్ణుడు బంధుమిత్రులతో కలిసి హస్తినాపురానికి వచ్చాడు. దాని కొక దివ్యకారణం లేకపోలేదు. పాండవులు స్వర్ణరాసులతో హస్తినాపురానికి తిరిగిరావటానికి ఒక నెలరోజుల పూర్వమే ఉత్తరకు మృతశిశువు జన్మించాడు. కుంతి, ద్రౌపది, సుభద్ర మొదలైనవారు మృతశిశువును

బ్రతికించుమని శ్రీకృష్ణుడిని ప్రార్థించారు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్ర శిఖలలో మాతృగర్భంలోనే మాడి చనిపోయిన బాలుడిని రక్షిస్తానని ఇదివరలో అతడు చేసిన ప్రతిజ్ఞను అందరూ జ్ఞాపకం చేశారు. మాట నిలుపుకొనటం అతడి సత్యవ్రత ధర్మమైపోయింది. మృతశిశువును తన ముందుంచి శోకించిన ఉత్తర మాతృహృదయాన్ని గమనించి ఆర్ద్రుడైన శ్రీకృష్ణుడు మృతబాలుడిని రక్షించి, పరీక్షితుడని పేరుపెట్టి, విలువైన కానుకలు చదివించి పాండవ పక్షంవారికి మహానందం కలిగించాడు. పాండవ వంశాంకురాన్ని రక్షించటంలో పరమదయాళువుగా వ్యవహరించిన శ్రీకృష్ణుడు యాదవులు తుంగలతో మోదుకొని చనిపోయే సందర్భంలో నిర్లిప్తంగా ఉన్న వైఖరికూడా దివ్యత్వాన్నే ప్రదర్శించింది. కాలం వక్రించేటప్పుడు శ్రీకృష్ణుడు నిర్లిప్తంగా ఉండటం భారతయుద్ధానంతరం ఆయన వర్తనంలో కానవచ్చే అంతరార్థం.

స్థూలంగా ఈ తారతమ్యాలను గమనిస్తే రాజసూయం రాజసంగా సాగినా శ్రీకృష్ణ రక్షితమై శ్రీకరమయింది. అశ్వమేధం సాత్వికంగా సాగి వ్యాస దర్శకత్వంలో శాంతంగా, పాపప్రక్షాళకంగా పావనమయింది. రాజసూయంలో ధర్మరాజును మించిన సమ్రాట్టు మరొకడు లేడు. అశ్వమేధంలో ధర్మరాజు తప్ప మరొక సమ్రాట్టు లేడు. వాసుదేవుడు రాజసూయంనాటికి అవతార కార్యక్రమానికి వ్యూహాన్ని సిద్ధంచేశాడు. అశ్వమేధం నాటికి అవతారకార్యక్రమానికి చరమగీతం పాడుకొన్నాడు. ఇంత భేదం కొట్టవచ్చినట్లు కనబడే అశ్వమేధం పాండవుల చరిత్రకు పూర్ణఫలం!

**2.అశ్వమేధం: అవనీదానం:**

భీష్ముడికి ఉత్తరక్రియలు చేసి తిలోదకాలిచ్చి ధర్మరాజు గంగను దాటి శోకసంతప్తుడై సొమ్మసిల్లాడు. భీమాదులు అతడికి శైత్యోపచారాలు చేసి సొక్కు తీర్చారు. ధృతరాష్ట్రుడు అతడిని అనునయించాడు. నారదాది మహర్షులు ప్రబోధించిన వాక్యాలను శ్రీకృష్ణుడు జ్ఞాపకం చేశాడు. అందరి మాటలు వినినా అతడికి అంతశ్శాంతి కలుగలేదు. వ్యాసమహర్షి నుద్దేశించి ఇట్లా అడిగాడు. 'మహర్షీ! ఇకమీద నేను తపోవనానికి పోవటానికి అనుజ్ఞ ఇవ్వండి. లేదా పితామహ కర్ణులను చంపించిన క్రూరకర్ముడను. నాకు శాంతి ఎట్లా కలుగుతుంది? ఆ మహాపాపం పోయే కర్మానుష్ఠానం బోధించండి' అని ప్రార్థించాడు. వ్యాసుడు ధర్మరాజు చిత్తవృత్తికి విసిగి చివరకు ఇట్లా అన్నాడు.

సీ. 'నిష్ఠించి యిబ్భంగి నీ కేము చెప్పిన । వాక్యంబు లెల్లను వఱదఁ గలసి
పోయెనే? నీదగు బుద్ధి యింతొప్పదో? । కాక మర్త్యుఁడు గాఁడు కర్త యీశ్వ
రుని నియోగమున మేలును గీడు నొనరించుఁ । గాన నీ మదిఁ బాపకర్మశంక
గలిగె నేనియును యాగముల దానంబుల । నది వాపికొనరాదె? యశ్వమేధ
తే. మధిక దక్షిణాన్వితముగ ననఘ! చేయు; । మంతతో భవదీయ చిత్తానుతాప
మంతయును బాయు; రఘురామునట్లు పూరు । భరతులును బోలె దానతత్పరుఁడ వగుము.'**(అశ్వ.1.12)**

చ. 'అన విని యమ్మునీశ్వరున కా నృపుఁ డిట్లను 'నశ్వమేధయా
గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము
న్నును వెడ వింటి; సజ్జన మనోజ్ఞ వచో మహనీయ! నీవు చె
ప్పిన పలుకూఁది యా క్రతువు ప్రీతి నొనర్చెద నెల్ల భంగులన్.' **(అశ్వ.1.13)**

యజ్ఞాలలో భూరిదక్షిణ లిచ్చే యజ్ఞం అశ్వమేధం. స్వర్ణదానంవలన సర్వపాపాలు నశిస్తాయని ధర్మరాజు విన్నాడు. భూరిదక్షిణ లిచ్చే మార్గం లేదని ధర్మజుడు చింతించాడు. వ్యాసుడు మరుత్తుడికథ చెప్పి, అతడు చేసిన స్వర్ణదానాల నిధిని గురించి చెప్పి, దక్షిణలకు కావలసిన ధనాన్ని అనాయాసంగా అందించాడు. ధర్మజు డంగీకరించాడు. చివరకు మొత్తం రాజ్యాన్నే వేదవ్యాసుడికి దక్షిణగా ఇచ్చి ధర్మరాజు తపోవనానికి వెళ్ళుతానని వ్యాసుడిని ప్రార్థించాడు. అశ్వమేధయాగ ప్రయోగమే

వనగమనానికి ఉపాయంగా మార్చుకొన్న ధర్మరాజు చాతుర్యం ప్రశంసనీయం. దానినుండి తప్పించి మరల ధర్మరాజును రాజ్యస్వీకారానికి అంగీకరింపజేయటం వ్యాసమహర్షికి ఒక ప్రత్యేక ప్రయత్నమే కావలసి వచ్చింది. 'ఇలకు వెలగా బంగారాన్ని ఇ'మ్మని వ్యాసుడు అడిగాడు. దానికి ధర్మరాజు ఇట్లా సమాధానం చెప్పాడు.

ఆ. 'అశ్వమేధమునకు నార్యులు దక్షిణ । ధరణి యండ్రు గాన నరునిచేత
విజితమైన ధరణి ప్రజనిత ప్రీతిమై । ఋత్విగర్చనముగ నిచ్చినాఁడ.'

చ. 'వనమున కేఁగి యందు సుఖవాసత నుండఁగలాఁడఁ గాక యే
ననఘవిచార! బ్రహ్మధన మక్కట! కొందునె?' యన్నఁ బ్రీతిమై
ననుజులు యాజ్ఞసేనియును 'నట్టిద యా పని; యొండు చెప్పకుం'
డనుటయు, హర్ష బాష్పపులకాంకురముల్ ధరియించి రందఱున్.' **(అశ్వ.4.190.192)**

అశ్వమేధం ధర్మజుడి ధర్మనియతితో అప్రతిమానంగా నిలిచింది. అమరుల ప్రశంసల నందుకొన్నది. చివరకు వేద వ్యాసుడు కూడా ధర్మజుడిని ప్రశంసించాడు. అంతటితో ఆగక భూమిని వెలపెట్టి కొనుమని బ్రాహ్మణుల కోర్కెగా కోరాడు. శ్రీకృష్ణుడు ఆ ప్రతిపాదనను సమర్థించాడు. ధర్మరాజు తన తమ్ములతో సంప్రతించి ఒప్పుకొన్నాడు. కోటి కోటుల మాడలు కుప్పపోసి 'ధరణికి వెల' అని చెప్పి వ్యాసుడి నుండి భూమిని కొన్నాడు. వ్యాసు డా మాడలను ఋత్విజులకు పంచిపెట్టాడు. ధర్మరాజు కృతార్థు డయ్యాడు.

తే. 'సకల బాంధవ భూపతి సంయుతముగ । నా నరేశ్వరుఁ డవభృథ స్నానపూత
గాత్రుఁడై చిత్తగత సర్వకల్మషములఁ । బాసి నిర్జిత స్వర్గత్వభాసి యయ్యె.' **(అశ్వ.4.204)**

శాంతిపర్వంలో ఆరంభమైన ధర్మజుడి అశాంతి అశ్వమేధపర్వంలో అవభృథస్నానంతో అంతమయింది. శాంతచిత్తుడైన ధర్మజుడు స్వర్గారోహణానికి అధికారి అయ్యాడని పై పద్యం ధ్వనింపజేస్తున్నది.

**3.అంతర్యాగం: అంతర్యోగం:**

అశ్వమేధపర్వంలో ధర్మరాజార్జున పాత్రలకు ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నది. భవిష్యత్కథలో ఆ పాత్రలు నిర్వహించబోయే కార్యాలకు భావికథార్థ సూచకాలుగా ఈ పర్వంలో గోచరిస్తాయి. వారికి యాగపరమైన శిక్షణ వేదవ్యాస మునీంద్రు డిస్తే యోగపరమైన సాధనను శ్రీకృష్ణుడు అందించాడు. యాగం కర్మయోగానికీ, యోగం జ్ఞానయోగానికీ, సంబంధించినవి. అందువలన ఈ పర్వంలో ఒక కర్మయోగి, మరొక జ్ఞానయోగి గురుస్థానాలలో నిలుస్తారు. వారే వ్యాసమహర్షి, శ్రీకృష్ణుడు. వారిరువురి ప్రబోధాలతో జీవితాలను మలచుకొన్నవారు ధర్మరాజు. అర్జునుడు. ఒకరు బహిర్యాగ ప్రక్రియను బోధిస్తే, మరొకరు అంతర్యాగ ప్రబోధాన్ని చేశారు. వ్యాసమహర్షి అశ్వమేధయాగ ప్రక్రియకు అనుగుణంగా మరుత్తుడి చరిత్రను వివరించాడు. కాని, ఆ కథ విని ధర్మరాజు 'బంధువిషయ శోకంబునం గ్రమ్మఱం దెలివినొందియు నొందక ధూమంబు పొదివిన యనలంబునుం బోలె' (అశ్వ.1.108) ఉండిపోయాడు. అతడి మానసిక స్థితిని గమనించి శ్రీకృష్ణుడు అధ్యాత్మిక విషయ ప్రబోధాన్ని ప్రారంభించాడు. అది అంతర్యాగ విధానం. 'ధర్మరాజా! దుఃఖం మృత్యువును, ధైర్యం బ్రహ్మత్వాన్నీ చేరుస్తాయి. నీవు కర్మానుష్ఠానాన్ని నిర్మలంగా నడపలేకపోతున్నావు. దానికి కారణం దుఃఖాన్ని నిర్మూలించగల బుద్ధిశక్తి నీకు అలవడకపోవటమే. అంతశ్శత్రువులను గుర్తించకపోవటం వలననే నీ కీ అవస్థ ఏర్పడింది. ఎన్ని బోధనలు చేసినా నీకు మనశ్శాంతి లభించటంలేదు. మానవులకు రెండు రకాలుగా వ్యాధులు వస్తాయి. మొదటిది శారీరకవ్యాధి. ఇది వాతపిత్తాదుల ప్రకోపంవలన కలుగుతుంది. దానివలన శరీర వికారాలు గోచరిస్తాయి. రెండవది మానసిక వ్యాధి. అది సత్త్వరజస్తమోగుణాల విషమస్థితులవలన కలుగుతుంది. ఇవి అన్యోన్య ప్రభావంతో ఏర్పడుతుంటాయి. అట్లాగే సూక్ష్మ కర్మానుష్ఠానం కూడా నీవు తెలిసికొనాలి. నీవు కౌరవులవలన పొందిన

బాధలు అవమానాలు, అరణ్యాజ్ఞాతవాసాలలో పొందిన కష్టనిష్ఠురాలు, భీష్మాదులతో చేసిన యుద్ధాలు, వాటివలన ఏర్పడిన లాభనష్టాలు - ఇవన్నీ సత్యాలు కావు; మిథ్యలు, నిజంగా మీరు చేసిన యుద్ధం ఏదంటే వినుము.

ఉ. 'అమ్మెయి బంధుమిత్త్రుల సహాయతకల్మి ప్రయోజనంబు లే;
దమ్మహనీయ యుద్ధమున కాత్మయ తోడు, మనంబు శత్రుఁ; డీ
వెమ్మెయినైన శాంతి ఘటియింపుము; లోపగఁ దీర్పు; మెందు శాం
తమ్ము చుమీ మనోజయము; దాన వెలుంగుము శాంతబుద్ధివై.'

తే. 'అంతరం బగు నిక్కయ్య మధిప! గెలువ । కిట్ల యేగతిఁ బోయెదో యెఱుఁగ; దీని
నీవ కనుఁగొని సద్బుద్ధి నిశ్చయ ప్ర । వీణుఁడవు గమ్ము; మాటలు వేయు నేల?' **(అశ్వ.1.119,120)**

కురుక్షేత్ర యుద్ధం ఆత్మకూ మనస్సుకూ జరిగే అంతర్యుద్ధమని తెలిసి, బాహిరమైన యుద్ధం మిథ్యగా భావించటం అధ్యాత్మికం. అదే అంతర్యాగం. దానిని ధర్మరాజు అలవరచుకొనకపోతే మనశ్శాంతి ఏర్పడదని, అతడు శాంతుడు కాలేడని శ్రీకృష్ణుడు తెలియచెప్పాడు. 'మమ' (అహంకారం) అనే రెండక్షరాలు మృత్యువుకూ, 'న మమ' (అహంకారత్యాగం) అనే మూడక్షరాలు బ్రహ్మపదానికీ సంకేతా లని తెలియాలి. తత్త్వం - నాశనం లేనిది, శరీరం లేనిది. పుట్టిన ప్రాణులు గతిస్తాయి. ఈ తత్త్వం తెలిస్తే తాత్త్వికంగా హింస లేదు. విశాలమైన భూమిని పాలిస్తూ దానిమీద మమకారం లేకుండా ఉంటే పాపం పట్టి పీడించదు. అంతశ్శత్రువులలో కాముడు బలిష్ఠుడు. అతడిని జయించగలిగితే - అంటే కామాన్ని జయిస్తే - శాంతి లభిస్తుంది. 'కామగీత' లు ప్రసిద్ధం. మోక్షాన్ని కోరేవాడికి కూడా కామం ఉంటుంది. కాబట్టి కోరికలు మనస్సులో చొరబడనీకుండ, అ లోలుపత్వంతో, ఫలాభిసంధి లేకుండా అశ్వమేధయాగం చేయుము. చచ్చిన బంధువులు ఎట్లాగూ తిరిగిరారు. వారిని గురించి విచారం మాని క్రతువులు చేయుము' - అని శ్రీకృష్ణుడు బోధించాడు. ఈ బోధలు వినిన ధర్మజుడు ఆ తత్త్వాన్ని మననం చేసికొన్నాడు. మునులందరికీ నమస్కరించాడు.

క. 'మీ కారుణ్యంబున నా । శోకం బంతయును బాసె, సుమనస్కృత సు
శ్లోకాత్ములార! కలిగెన్ । నాకున్; విచ్చేయుఁ డింక; నను మఱవకుఁడీ! **(అశ్వ.1.138)**

అని శోకంలేని శాంతచిత్తాన్ని ధర్మరాజు ప్రకటించాడు. పారాశర్యుడు చేయించిన బహిర్యాగం పాప నివారణకు తోడ్పడితే, శ్రీకృష్ణుడు బోధించిన అంతర్యాగం ధర్మజుడి శోకాన్ని మాన్పి మనశ్శాంతిని కలిగించింది.

**4.రెండు రాజ్యాలకు రాజధానులు:**

అశ్వమేధపర్వంలో హస్తినాపురం, ఇంద్రప్రస్థం - అనే రెండు నగరాలకు ప్రస్తావన ఏర్పడింది. ఇది సభాపర్వ కథను స్మరింపజేసినా, దానికి దీనికి తారతమ్యం గమ్యమానం. ధర్మరాజు ప్రజారంజకంగా పరిపాలన సాగిస్తున్న కాలంలో కృష్ణార్జును లిద్దరూ ఇంద్రప్రస్థపురంలో కొంతకాలం నివసించి స్వేచ్ఛా విహారాలు నిర్వహించారు. ఆనాటి మయసభనుకూడా దర్శించారు. వారి విహారాలు విలాసయాత్రలుగా కాక విజ్ఞానయాత్రలుగా మారాయి. అర్జునుడు శ్రీకృష్ణుడిని ఇట్లా అడిగాడు.

'అనికిఁ దొడంగు నప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వ బో
ధన మహనీయ వాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి; తే
మనమున వాని యర్థములు మాధవ! నిల్పఁగ జాలనైతి; న
వ్వినుత వచస్సుధారసము వీనులవిం దొకమాఱు నింపవే!' **(అశ్వ.1.155)**

నరుడికి భగవద్గీత మరపున పడింది. అతడు దాని సారాన్ని అమృతరసంగా మరలా గ్రోలాలని కోరుకొన్నాడు. ఆనాడు విషాదయోగ నివారణార్థం, యుద్ధక్రియా ప్రారంభార్థం ప్రబోధం. ఈనాడు వివేక ప్రకాశార్థం. ఆత్మజ్ఞాన ప్రబోధనార్థం పునః ప్రబోధం. శ్రోతయొక్క మానసిక స్థితిలో భేదం ఉన్నది. ఆనాడు అర్జునుడు బుద్ధియందు తత్త్వహీనుడు, శ్రద్ధారహితుడు. అందువలన అతడికి బోధపడలేదు. ధారణ నిల్వలేదు. అందుకే శ్రీకృష్ణుడు ఇట్లా ఎత్తిపొడిచాడు.

తే. 'బ్రహ్మపదవేదనమునకుఁ 'బరమ హేతు। భూతములు నాఁటి వాక్యముల్ బుద్ధిఁ దన్మ

హార్థములు నిల్ప వైతి; శక్యంబె యింక। నవ్వచనములు సెప్పంగ నలఘుశౌర్య!' **(అశ్వ.1.157)**

బ్రహ్మపదాన్ని తెలిపే పరమహేతువులైన భగవద్గీతా వాక్యాలను యథాతథంగా పునరుక్తం చేయటం సాధ్యపడదని శ్రీకృష్ణుడు తెలిపి, పద్ధతిని మార్చి ఆ పరమార్థాన్ని ప్రతిపాదించాడు. అప్పుడు పాటించింది ప్రత్యక్షబోధ, అది ప్రధానం ప్రవచన రూపంగా సాగింది. ఇప్పుడు ఇతిహాసరూపంగా మారింది. ధారణకు, మనవానికీ ఈ పద్ధతి మేలని శ్రీకృష్ణుడు భావించాడు. శ్రీకృష్ణుడు తనవద్దకు వచ్చిన ఒక విప్రోత్తముడిని తత్త్వజ్ఞానం బోధించుమని కోరాడట! అతడు కాశ్యపు డనే విప్రుడికి సన్న్యస్తుడైన ఒక సిద్ధుడు శిష్యవాత్సల్యంతో బోధించిన పరతత్త్వ ప్రతిపాదక వాక్యాలను వినిపించాడట! అందులోని ముఖ్యాంశా లివి.

**1.బ్రహ్మవిద్యారహస్యం:** శరీరమే ధర్మసాధనం. ధర్మం పరిజ్ఞానాన్ని కలిగిస్తుంది. కాబట్టి మానవుడు శరీరాన్ని అన్నివిధాలా కాపాడుకొనాలి. క్రమశిక్షణ పాటించాలి. వాతపిత్త శ్లేష్మాల విజృంభణాన్ని నియమించాలి. బ్రహ్మ - ప్రధానమనే తత్త్వాన్ని మొదట సృష్టించాడు. దానిని క్షరమంటారు. దానికి పరమైన తత్త్వాన్ని అక్షరం, అమృతం అని పిలుస్తారు. ఈ రెంటినుండి భూతాలన్నీ పుట్టాయి. జీవుడు మోహావరణాన్ని త్రోసిపుచ్చి మోక్షాన్ని పొందుతాడు. పాలకడవను పశువుల నడుమ పెట్టినవాడు దానిని ఎట్లా ఏమరకుండా ఉంటాడో, అట్లాగే మనస్సును ఏమరకుండా ఆత్మను అన్వేషించాలి. ఇంద్రియాలకు అనాదితత్త్వం అందదు. ఎల్లఎడలా శిరస్సులునూ, కన్నులునూ, పాదములునూ, హస్తములునూ కల ఆ ఉజ్జ్వలతత్త్వాన్ని యోగవంతుడు మాత్రమే చూడగలడు. ''సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్''। గీత.

**2.బ్రాహ్మణగీత:** (బ్రహ్మవిద్యా ప్రబోధం) జ్ఞాని అయిన ఒక బ్రాహ్మణుడిని అతడి భార్య అధ్యాత్మవిద్యను బోధించుమని అడుగగా ఆ బ్రాహ్మణుడు ఆమెకు బ్రహ్మవిద్యా ప్రబోధకాలైన అనేకాంశాలు బోధించాడు. వాటి సారాంశం ఇది. కర్మలు సమస్త సిద్ధులను కలిగిస్తాయి. బ్రహ్మాదులు అక్షరోపాస్తిని దీనివలన చేస్తారు. అక్షరం అమలిన బుద్ధికి మాత్రమే తప్ప శబ్దాదులకు అందదు. పంచవాయువులు, మనస్సు, బుద్ధి - ఈ ఏడూ వైశ్వానరుడికి జిహ్వలు, వైశ్వానరుడు అంటే ఆత్మ ('అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః'-గీత) ఘ్రాత, భోక్త మొదలైన ఏడుగురు ఋత్విజులు ఘ్రేయం, భక్ష్యం మొదలైన సప్తసమిధలను వైశ్వానరుడియందు హోమం చేస్తారు. ఇది సప్తహోతృ విధానం. దీనినే అంతర్యాగ మంటారు. అంటే జ్ఞానేంద్రియాలను అంతర్ముఖంగా మలచుకొనటమే.

అంతేకాక జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను పదింటినీ వైశ్వానరుడిలో హోమం చేయటం దశహోతృవిధానం అంటారు. ఇదీ అంతర్యాగంలో భాగమే. జీవాత్ముడు అనే కర్త విషయమూర్తులనే హవిస్సులను అనుభవించకుడా, ఉదాసీనత్వం అనే స్రుక్కునం దుంచి ఆత్మ అనే అగ్నిలో వేలిస్తే, అది ప్రజ్వలితమై అవిద్య అనే ధూమాన్ని హరిస్తుంది. అదియే మోక్షప్రకారం. అంటే విషయానుభూతిని విడచుటయే మోక్షహేతువు. యోగి స్వభావం తామరాకుపై నీటిబిందువు వలె ఉంటుంది.

**3.అధ్వర్యు యతి సంవాదం:-** అధ్వర్యుడు యజ్ఞపశువును ప్రోక్షించి విశసనానికై సిద్ధం చేస్తుండగా ఒక యతి అది హింస కాదా? అని ప్రశ్నించాడు. యజ్ఞంలో పశువిశసనం పాపం కాదనీ, దానివలన పశువు పుణ్యలోకం చెందుతుం దనీ, యజమానునికి శ్రుతివిహితమైన పుణ్యం వస్తుందనీ అధ్వర్యుడు చెప్పాడు. కాని, హింసపాపమని యజ్ఞమే చెప్పుతుందనీ యజ్ఞాలలో కెల్ల తపోయజ్ఞమే ఉత్తమమని యతి నిశ్చయించాడు.

**4.అంబరీషగీతలు:-** అంబరీషుడు బాహ్యశత్రువులను జయించి తృష్ణ మొదలైన అంతశ్శత్రువులను జయించలేక విచారపడ్డాడు. ఒకప్పుడు జనకమహారాజు సభకు యముడు విప్రరూపంలో వచ్చి ఒక ఆకృత్యం చేశాడు. జనకుడు అతడిని తన రాజ్యపు సరిహద్దులు దాటి వెళ్ళుమని ఆజ్ఞాపించాడు. ఆ బ్రాహ్మణుడు 'రాజా!' నీ రాజ్యపు ఎల్ల లేమిటో చెప్పితే వాటిని విడిచి పోతాను' అన్నాడు. వేదాంతి అయిన జనకమహారాజు ఆ ప్రశ్నలోని అధ్యాత్మికార్థాన్ని భావించి మూర్ఛపోయాడు. ఇది నాది అనే మమత్వబుద్ధి లేని జనకుడు తన తప్పు తెలిసికొన్నాడు. యముడు అతడిని ప్రశంసించాడు.

ఈ సంవాదాలన్నీ చెప్పి బ్రాహ్మణుడు తన భార్యతో నిర్గుణతత్త్వాన్ని తెలిసికొనటానికి అహంకార విసర్జన మొక్కటే మార్గమని బోధించాడని శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించాడు. అప్పుడు అర్జునుడు 'పరమవేద్యమైన బ్రహ్మమును గూర్చి తెలుపు'మని శ్రీకృష్ణుడిని అడిగాడు. ఆయన గురుశిష్యసంవాదాన్ని చెప్పాడు.

**5.గురుశిష్య సంవాదం:-** ఒకప్పుడు మునులు 'ఏది హితము? దానిని పొందే మంచిమార్గమేది?' అని ప్రశ్నించగా బ్రహ్మదేవు డిట్లా చెప్పాడు 'సత్త్వమువలననే భూతములు పుట్టుతాయి. అందులోనే వసిస్తాయి. అందులోనే లయిస్తాయి. శ్రుతి, తపస్సు అనేవి సత్త్వానికి మారుపేర్లు. మునులు యోగనిష్ఠతో కామక్రోధాలను జయించి సత్త్వాన్ని సేవిస్తారు. సత్త్వమే హితం. దానిని చేరటానికి ధర్మమే ఉత్తమ మార్గం.

తాబేలు తన అవయవాలను లోపలికి ముడుచుకొన్నట్లు విద్వాంసుడు తన ఇంద్రియాలను తనలోనికి మరల్చికొంటాడు. భూతపంచకం అనే సముద్రానికి కాముడు, క్రోధుడు అనేవారు ప్రభువులు. వారిని జయించి విద్వాంసుడు ఆ సముద్రాన్ని దాటగలుగుతాడు. ధర్మానికి అహింస, మనుష్యులకు కర్మము. వాక్కుకు సత్యం. బుద్ధికి వ్యవసాయం. జ్ఞానానికి సన్న్యాసం లక్షణాలు.

సముద్రంలో తరంగాలవలె అవ్యక్తంలో చరాచరభూతాలన్నీ పుట్టుతాయి. లయిస్తాయి. అవ్యక్తం అవ్యయుడైన పురుషుడిని ఆశ్రయిస్తుంది. దీనిని తెలిసికొని మహాయోగులు మోహబంధంనుండి విముక్తి పొందుతారు. దీనికి తగిన సాధనం తపస్సు. మమత్వంతో అహంకృతితో కూడిన తపస్సువలస సాధకుడు ప్రజాపతి సమీప పదాన్ని పొందుతాడు. మమతాహంకార విముక్తమైన తపస్సుచేత యోగి అవ్యయస్థానాన్ని పొందుతాడు. సత్త్వసహాయంతో రజస్తమోగుణాలను జయించి ఈశ్వరసాక్షాత్కారాన్ని పొంది సత్త్వాన్ని కూడా విడిచిపెట్టాలి.

క. 'జ్ఞాన పరినిష్ఠితాత్మకు। లైన విముక్తి పద నిర్ణయజ్ఞులచే స
మ్మానిత యగు గతి యిది క। ర్మానుగతి విరక్త జన సమంచితము సుఁడీ!'

క. 'కోరికలకుఁ జొరక యసం। గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరిన చిత్తంబులు గల। సారాత్మకు లీ పథమునఁ జనుటకు శక్తుల్.' **(అశ్వ.2.213,215)**

అని బ్రహ్మదేవుడు మునులకు చెప్పినట్లు గురువు శిష్యుడికి చెప్పాడని శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించాడు. చివరకు అర్జునుడు ఆ గురుశిష్యు లెవ రని శ్రీకృష్ణుడిని ప్రశ్నించాడు. శ్రీకృష్ణుడు అసలు రహస్యం బయటపెట్టాడు.

క. 'అనఘ! విను మే గురుఁడ; నా। మనంబు శిష్యుండు, విమలమానస! నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి। ననితర సులభాతిగుహ్య మగు నిప్పదమున్.'

క. 'విమలము నచలము నగు చి। త్తము నా దెస నేకభక్తితత్పరముగఁ జే
యము; నిత్యము నీ యధ్యా। త్మము ననుసంధింపు; పాసెదవు దురితములన్.'

క. 'సమరమునప్పుడు నీ కీ। యమృత పదప్రాప్తి హేతు వగు సమ్యగ్బో
ధము వివరించితి; నచలత। రమింపు మిం దెపుడు శమధురాధుర్యుఁడవై.' **(అశ్వ.2.222-224)**

ఇందులో గురువు ఆత్మ, శిష్యుడు హృదయం, సాధకుడు ఈ రహస్యాన్ని మననం చేసికొంటే - ఈ ప్రబోధం బహిరంగంగా శ్రీకృష్ణుడు అర్జునుడికి చెప్పినా సాధకులకు ఇది అంతర్యోగంగానూ, అంతర్యాగంగానూ ఉపాసించతగిందని స్పష్టమౌతున్నది.

అధ్యాత్మికంగా దీనిని అనుసంధించు మని శ్రీకృష్ణుడు నిర్దేశించటంలో గల తాత్పర్యం కూడా ఇదే. భగవద్గీత ఎంత అధ్యాత్మికమైనా అర్జునుడికి యుద్ధోత్సాహాన్ని కలిగించి బహిః ప్రేరణగా నిలిచింది. అశ్వమేధ పర్వంలో బోధించిన ఈ భాగం గీతా తాత్పర్యమే. అందువలన దీనిని కొందరు 'అనుగీతాపర్వ'మని పిలుస్తారు. ఈ అనుగీత అర్జునుడిలో అధ్యాత్మికంగా అంతఃపరిణామాన్ని కలిగించటానికి ఉద్దేశించబడింది. ధర్మానికి అహింస లక్షణం. అర్జునుడు సవనాశ్వరక్షణలో యుద్ధభూమిలో అహింసనే చాటాడు. ఆచరణలో పాటించాడు. అంతేకాదు మౌసలపర్వంలో వసుదేవ, శ్రీకృష్ణ, బలరామాదులకేకాక, యాదవవీరుల కందరికీ స్వయంగా అపరక్రియలు జరిపించి, ద్వారక సముద్రంలో మునిగినప్పుడు ద్వారకావాసుల నందరినీ ఆ విపత్తునుండి రక్షించి, వారికి ఉచిత విధులు నిర్వహించి, సౌకర్యాలు కల్పించి శ్రీకృష్ణ సేవాతత్పరుడై భాసించిన అర్జునుడు ఈ అనుగీతను విని అంతః పరిణామానికి గురి అయినవాడే.

తే. 'కాలమూలంబు సర్వంబుఁ గాన దీని । కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు । విడిచి యార్యజనంబులు వినుతి సేయ.' **(మౌస.1,222)**

అని వేదవ్యాసుడు మితబోధ చేసినపుడు శోకమోహాలు లేని హృదయంతో మహాప్రస్థానానికి మనసులో సిద్ధమైన స్థిరచిత్తుడు శ్రీకృష్ణుడి శిష్యుడైన అర్జునుడే. మహాప్రస్థానిక పర్వంలో ప్రస్థానానికి సంకల్పించింది ధర్మరాజు, దానికి దోహదం చేసింది కూడా అర్జునుడే.

క. 'కాలము నే మనవచ్చును? । కాలము కాలంబ పోలుఁ గా; కొంటికి నీ
లీలలు గలవే? లెస్సగ । నాలోకించి తిది హితము నభిమతము నగున్.' **(మౌస.1,6.)**

అన్నమాటే అన్నకు కొండంత అండగా నిలిచింది. భీమాదులకు వెలుగుబాటగా తోచింది. మహాప్రస్థాన యాత్రకు మార్గదర్శక మయింది. ఇంతటి అధ్యాత్మికసమున్నత మానసికసంస్కారం శ్రీకృష్ణ ప్రబోధంవలననే కలిగింది.

మరొక విశేషం: హస్తినాపురంలో ధర్మరాజు పాలిస్తూ ఉండగా కృష్ణార్జునులు ఇంద్రప్రస్థపురంలో విహరించటంలో భావికథార్థ ధ్వనికూడా ఉన్నది. పాండవుల తరువాత హస్తినాపురంలో పరీక్షిత్తు ప్రభువు. ఇంద్రప్రస్థపురంలో శ్రీకృష్ణుడి మనుమడు వజ్రుడు ప్రభువు. వారిద్దరి నడుమ కృష్ణార్జునులకు వలెనే స్నేహపూర్వక బంధుత్వాన్ని ధర్మజుడు నెలకొల్పాడు. వస్తుధ్వనిగా ఈ కావ్యార్థం పరమరమణీయం.

**5.దయా, దాన, ధర్మవీరాలు:**

అశ్వమేధపర్వంలో ధర్మరాజుయొక్క దయావీరానికి అర్జునుడి యుద్ధవీరం అండగా నిలిచి పోషించింది. సవనాశ్వాన్ని అనుసరిస్తూ అర్జునుడు ధర్మరాజు తనతో పలికిన పలుకులనే ఎదురుపడిన ప్రతిరాజుకూ తెలియజేస్తూ దయాభావాన్ని ప్రదర్శించాడు.

చ.. 'కవిసినవానితో మఱియుఁ గవ్వడి యిట్టు లనున్ దయా ధురా
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ
పవితతి యెల్లనుం దెగియె భారతయుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమా!'

చ. 'అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యనిఁ దప్పఁగఁ బ్రోవుము గిన్క మాను.' **(మౌస.4,6.7)**

అన్న ధర్మరాజు మాటలు అతడి దయామయ భావస్పందనలు. అహింసాప్రధానమైన ధర్మయజ్ఞం నాయకుడి హృదయశాలలో ప్రారంభమై ఉండటంవలన ఆ పుణ్యవాసనలు విరివిగా వ్యాపించాయి. వాటిని గంధవహుడివలె ఇంద్రతనూజుడు దిగంతాలకు ప్రసరింపజేశాడు.

సవనాశ్వాన్ని అడ్డగించి, పరాక్రమవంతులై త్రిగర్త సేనాధినాథులు తనను ఎదిరించినప్పటికీ, ధర్మరాజ ప్రబోధంతో దయను పూనిన అర్జునుడు సమయోచితంగా యుద్ధవీరాన్ని ప్రకటించలేక గాండీవాన్ని జారవిడుచుకొన్నాడు. అప్పుడు వీరులు కొందరు-

తే. 'ఇంద్రధనువు చందంబున నెసక మెసఁగు । గాండివముపాటు గంటిరే! చండవిక్ర
మాభిరాముండు గాండీవి యన్న పలుకు । లకు మహోగ్రత సూపనొల్లండు గాక!' (మౌస.4.14)

అని అర్జునుడి పరాక్రమాన్ని పరిహాసం చేశారు. పంతానికి శత్రువీరులు యుద్ధానికి దిగి ఔద్ధత్యం ప్రకటించగా మానధనుడైన వీరుడికి క్రోధం రావటం సహజంకాని, అర్జునుడికి క్రోధం రాలేదు. ధర్మజ ప్రేరితమైన దయాభావంతో అతడిలోని క్రోధం స్తంభించిందని భావం. ఆ తరువాత నిజంగా అర్జునుడికి కోపం వచ్చింది. దానికి కారణం గాండీవ పతనాలవలన అవమానం. అవినయపరులైన శత్రువుల ఉద్ధతి. ఇక్కడ ఉన్న విభావానుభావ వర్ణన ఎంత రసోదంచితమో చూడండి.

క. 'ఆట మున్న గాండివం బు । త్కటరయమున నెత్తి కోపదహనం' లత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన మి । క్కుటమై కడకంటి పెంపు గొమరారంగన్.'

వ. 'ఆ బీభత్సుండు.'

క. 'పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ । బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటు విశిఖము ల
ప్పుడు మేదిని దోఁపద చె । ప్పెడు కొలఁదియె రథికవరుల పీనుఁగు పెంటల్. (అశ్వ..4.16-18)

గాండీవాన్ని వెంటనే ఎత్తటం, కోపదహనుడు కావటం, కడకంటి కెంపు రేగటం కోపభావతీవ్రతకు అనుభావాలు. 'బీభత్సుడు' అనే శబ్దం అర్థశక్తితో అర్జునుడు వైరిబలాన్ని చేయటానికి ఉత్సాహం ప్రకటిస్తున్నాడనే భావం కలిగిస్తుంది. క్రుద్ధుడైన విజయుడి గాండీవ వినిర్ముక్త బాణసంపుటి పిడుగులవానగా స్ఫురించాయనటంలో అలంకార ధ్వని ఉన్నది. ఆ పిడుగుల జడివానకు రథిక వరులు పీనుగుపెంటలై పోయారు. ఇందులో మహారథికులను మట్టుపెట్టి సామాన్య వీరులను వదలిపెట్టాడన్న ధ్వని కూడా ఉన్నది. ఇదంతా అర్జునుడికి సహజంగా కలిగిన కోపం కాదు. పాలపొంగువంటిది. 'అన్నమాట'ను నిరాదరించారని శత్రువులమీద ఉప్పొంగిన ఉప్పెనవంటి కోపమే, యుద్ధంలో పోయినవారు పోగా మిగిలినవారు, వారి బంధువులు శరణు వేడగా అతడి కోపం అప్రయత్నంగా చల్లారింది.

శా. 'ఆ యుగ్రోద్ధతి సూచి పెల్కుఱి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయంబాఱెఁ దదాప్తు ' లేము దగ నీ పంపోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా!' యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్

వ. 'అట్లు వెనుకొనక నిలిచి యెలుంగెత్తి వారలతో 'మీ రిట్లు ప్రాణంబులు గాచికొనుండు నా పంచిన పని
సేయంబూని బుద్ధికలిగి సుఖులరై యుండుఁ' డని యయ్యశ్వంబు ననుసరించె.' (అశ్వ..4.19-20)

పై మాటలలో శరణుకోరినవారిని కాపాడవలెనన్న ధర్మంతోపాటు, శత్రువీరులకు తగిన బుద్ధి చెప్పి, తరువాత వారిని దయతో కాపాడాలనే భావం కూడా కనిపిస్తుంది. లేకపోతే వీరులను గొంతెత్తి పిలువవలసిన అవసరం లేదు. 'కృపన్' వారిని 'కాచెన్'అనటానికి అదే కారణం. ఆ అర్థం -

క. 'చంపకుమీ రాజుల నను । కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెం పను కుసుమమునకు । నా పంపొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ!' **(అశ్వ..4.34)**

అన్న ధర్మరాజు ప్రబోధంలో ధ్వనించింది. ఇటువంటి మనఃప్రవృత్తియే అశ్వమేధపర్వమంతా వెన్నెలవలె విరిసి దయావీరాన్ని ప్రకాశింపజేసింది.

శ్రీకృష్ణ ప్రబోధానంతరం ధర్మరాజు సత్త్వగుణ పరిపూర్ణుడు కావటంచేత ఆయనలో యుద్ధవీరంకంటె దయాదాన ధర్మవీరాలు ముప్పేటగా అశ్వమేధపర్వం నుండి ముప్పిరిగొన్నాయి. అశ్వమేధంలో రాజులపట్ల చూపిన దయావీరం, యజ్ఞంలో దానాలలో చివరకు సర్వరాజ్యాన్ని వ్యాసుడికి సమర్పించటంలో దానవీరం, ఆ తరువాతి పర్వాలలో ఇంద్రప్రస్థాన్ని యాదవరాజ్యంగా సమర్పించటంలోనూ దానవీరం, చివరకు కుక్క కొరకు స్వర్గభోగాన్ని కూడా త్యాగం చేయటానికి సిద్ధంకావటంలో ధర్మవీరం ధర్మరాజులో రసోల్లాస స్థాయిని పొందాయి. ఆ విధంగా భారతంలోని చివరి అయిదు పర్వాలూ ధర్మజుడి ధర్మవీరానికి పంచప్రాణాలుగా పరిఢవిల్లా యనటంలో విప్రతిపత్తి లేదు.

**6. అశ్వమేధంలో అద్భుతం:**

అశ్వమేధపర్వంలో సహజమైన అద్భుత ఘట్టాలు ఉన్నాయి. శ్రీకృష్ణుడి ద్వారకాయానంలో ఉదంకాశ్రమోదంతం ఒక అద్భుతం. అందులో శ్రీకృష్ణుడి విశ్వరూప ప్రదర్శనం ఒక అపూర్వ ఘట్టం. ఉదంకుడికి జలప్రదానం మరొక అబ్బురపాటు కలిగించే ఉదంతం. పరీక్షిత్తుకు శ్రీకృష్ణుడు చేసిన ప్రాణదానం మరొక దివ్యాద్భుతం. అశ్వమేధయాగ నిర్వహణం దేవతలనే మెప్పించిన అద్భుతకార్యం. ఇన్ని అద్భుతాలు వినిన జనమేజయుడు

ఆ. 'అనఘ! మత్పితామహుని యశ్వమేధయా । గంబు సమయమునఁ గరంబు విస్మ
యంబుఁ జేయఁజాలునట్టిది యేమేనిఁ । గలిగెనేని వినఁగ జెపుమ!' **(అశ్వ..4.213)**

అని వైశంపాయనుడిని అడగటం ఒక అద్భుతం. అతడు వినిపించిన సక్తుప్రస్థ చరిత్రం సహజంగా అద్భుతం. అది ఆ పర్వాంతంలో నిబంధించటం కథాశిల్పపరంగా పాఠకులకు మరొక అద్భుతం. ఈ చివరి అంశం కొంత వివరించతగింది.

అధ్వర్యు యతి సంవాదంలో వేదవిహితంగా పశువిశసనం చేసిన యజ్ఞం హింసాయజ్ఞం కాదని అధ్వర్యుడు భావించగా, అహింసాయజ్ఞమైన తపోయజ్ఞం హింసాయజ్ఞంకంటె గొప్పదని యతి వాదిస్తాడు. కర్మఠులకూ, జ్ఞానులకూ మధ్య ఈ వాదం ఎపుడూ సాగుతూనే ఉన్నది. అయితే క్షత్రియులకు పశువిశసనరూప యజ్ఞమే ఉపాదేయమన్నట్లు వేదవ్యాసాదులు నిశ్చయించారు. బ్రాహ్మణులకు, జనకాది జ్ఞానులకు అహింసాయాగమే న్యాయమని మునులు భావించి ఉన్నారు. ఈ రెండు మార్గాలూ సమాజంలో సమ్మానించబడుతూ ఉండగా, వాటిలో ఎక్కువ తక్కువలు నిర్ణయించే ఒక పరిస్థితి ఏర్పడటం అశ్వమేధపర్వంలోనే ఒక విచిత్ర ప్రశ్న. ఆకలికై ఏర్పరచుకొన్న పేలపిండిని మొత్తాన్ని అతిథి సత్కారంలో వినియోగించి సక్తుప్రస్థుడు సకుటుంబంగా ప్రాణాలు కోల్పోవటానికి కూడా సిద్ధం కావటం ఆ కథలోని గొప్పతనం. ఆ బ్రాహ్మణుడు అతిథి కిచ్చిన అర్ఘ్యపాద్యాదుల తడిలో పొరలి, పేలపిండి వాసన చూచిన ముంగిస శరీరంలో సగభాగం బంగారంగా మారటం మరొక విశేషం. ఆ ముంగిస ధర్మరాజు చేసిన అశ్వమేధ యాగాన్ని దర్శించి ప్రయత్నించినా మిగిలిన మేను బంగారు కాకపోవటంతో సక్తుప్రస్థుడి దర్మం కంటె ధర్మరాజు యజ్ఞం గొప్పది కాదని బ్రాహ్మణుల ఎదుట చెప్పి మాయ మైపోవడం, ఆశ్చర్యం. ఆ తీర్పు వెనుక యముడు సక్తుప్రస్థుడి ధర్మప్రవృత్తిని ప్రశంసించిన వాక్యం బలమైన ప్రమాణం.

చ. 'వినుము! ప్రభూతదానములు విశ్రుతయజ్ఞములున్ సధర్మతా
వినుతికి నెక్కఁజాలవు వివేకనిధీ! పరిశుద్ధ శోభితా
ర్జనమునఁ దెచ్చికొన్నది వరంబగుఁ బాత్రము నర్హకాలముం
గని లఘువస్తువేని నొసఁగం గను టుజ్జ్వలధర్మ మారయన్.' **(అశ్వ.4.246)**

ఈ ప్రశంసతో యముడు సక్తుప్రస్థుడిని సకుటుంబంగా బొందితో బ్రహ్మలోకానికి పంపాడు. మరి ధర్మరాజు అశ్వమేధంలో చేసిన బహుళ దానాలవలన పొందింది బొందితో స్వర్గమే, ఆ విధంగా చూచినా సక్తుప్రస్థుడి నింద నిజమే ఔతున్నది.

అయితే ఒక విశేషం, ఆ నింద చేసిన నకులం పితృదేవతలచేత శప్తుడైన జమదగ్ని మహర్షి. అతడి పితృదేవతలు అతడికి శాపమోక్షాన్ని కలిగిస్తూ -

వ. 'విదగ్ధ విప్ర సమూహం బొడంబడునట్టి యుచిత వాక్యంబుల నీ వెన్నఁ డేని మహాధర్మంబు కీడని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు' నని నిర్దేశించి; రన్నకులంబును సక్తుప్రస్థుని కతంబునం దగిన మాటల నా తెఱంగున సదస్యులతో ధర్మనందను నశ్వమేధంబు నధిక్షేపించి విగత శాపత్వానందంబు నొంది యంతర్హితం బయ్యెను.'

ముంగిస చేసింది అధిక్షేపం. మహాధర్మాన్ని కీడని పలకటం అధిక్షేపం. దానివలన జమదగ్నికి పితృదేవతల శాపం తొలగింది. అతడికి ఆనందం కలిగింది. అనగా చివరకు తేలింది ఏమిటి? ధర్మరాజు అశ్వమేధంవలన జమదగ్నికి శాపవిమోచనం జరిగి ఒక అద్భుతం బయటపడింది. ఈ ఉదంతం ధర్మజుడి అశ్వమేధానికి ఎటువంటి కొంచెపాటును కలిగించలేదని తెలియటం ఇందులో చెప్పిన అద్భుతం. అదే కథాకథన శిల్పం.

అశ్వమేధ పర్వ ప్రాశస్త్యాన్ని గురించి భూపతి లక్ష్మీనారాయణరావుగారు చేసిన ఈ ప్రశంస పేర్కొనతగింది. "జ్ఞానోపదేశమునం జేసి స్వధర్మోన్ముఖుడైన ధర్మరాజు రాజ్యభారము వహించి, వ్యాసబోధితుఁడై లోకహితార్థమశ్వమేధమును వేదోక్త విధమున నిర్వహించి దేశమునందలి రాజులనెల్లర నేకైక ధర్మశాసనబద్ధులం గావించినాడు. ఇంతియేకాక నిరాసక్తుడై వేదోక్తములగు కర్మల నాచరించుటవలనను, స్వధర్మమును శ్రద్ధతో నిర్వహించుటవలనను గృహస్థుడు భవబంధ విమోచనము బడయగల డను విషయము ధర్మరాజు నశ్వమేధ వృత్తాంతమూలమున వ్యక్తీకరింపబడినది." (భారతము; తిక్కన-పుట 158-159).

# ఆశ్రమవాసపర్వం

### 1. గాంధారీధృతరాష్ట్రుల హస్తినాపురవాసం:

అశ్వమేధయాగంలో పాండవులు హస్తినాపుర ప్రభుత్వంలో స్థిరపడ్డాడు. పదిహేనేళ్ళు ప్రశాంతంగా గడచిపోయాయి. ఆ ప్రశాంతతకు కారణం ధర్మజుడి ధర్మవర్తనం. ఇదివరలో చరిత్ర సృష్టించింది రాజ్యప్రజలు కాదు రాజమందిర ప్రముఖులే. మహాభారత యుద్ధం ప్రవర్తిల్లటానికి దుర్యోధన ధృతరాష్ట్ర వర్తనమే మూలకారణం కాని, భీష్మాది రాజబంధువులు, ద్రోణాచార్యాదులు, మంత్రులు, ప్రజలు అసలే కారు. ఒకవిధంగా అందరూ శాంతినే కోరారు. దుర్యోధనాది దుష్టచతుష్టయం, ధృతరాష్ట్రుడి ద్వంద్వనీతిని ఆదరువుగా చేసికొని అశాంతిని సృష్టించింది, ధృతరాష్ట్ర సంతతిని రణభూమికి అంకితం చేసింది. ఆ దోషాన్ని ధృతరాష్ట్రుడు క్రమంగా గుర్తించాడు. వ్యాసాది మహామునులు, వాసుదేవాదులు ఆయా సందర్భాలలో చెప్పిన నీతులను, హితవాక్యాలను మౌనంగా మననం చేసికొన్నాడు. గాంధారిని శాంతింపజేశాడు. వారిరువురూ కలిసి యథాపూర్వం రాజభవనంలో నివసిస్తూ ఉన్నారు. వారి పుత్రశోకం దావానలం వంటిది. వారు సజీవంగా దానిలో ప్రతిరోజూ దహించుకొని పోతూనే ఉన్నారు. వారి తాపాన్ని తీర్చటం ధర్మరాజు ప్రథమ కర్తవ్యంగా మారింది.

ధృతరాష్ట్రుడు హస్తినాపురంలో ఒక ఆశ్చర్యార్థకం! ధర్మరాజు ప్రభువు కాకపోయినట్లయితే అత డొక ప్రశ్నార్థకమై ఉండేవాడు. దుర్యోధనుడి కాలంలోనే అతడు సమాధానంలేని ప్రశ్నగా మారిపోయాడు. ధర్మరాజు ఆ రాజును సమాధానపరిచాడు. అది అతడి ధర్మనీతి చాతుర్యం. ధృతరాష్ట్రుడు పాండురాజు కాలంలోనూ పెద్దరికాన్ని అనుభవించాడు. రాజ్యం పాండురాజుదైనా ప్రభువుగా ధృతరాష్ట్రుడిని మన్నించి పాండురాజు కాలం గడిపాడు. పాండురాజు తరువాత ధృతరాష్ట్రుడే మహారాజుగా మిగిలాడు. అతడి ప్రభుత్వాన్ని ఎవ్వరూకాదనలేదు. అతడు ఆ మర్యాదను పాటిస్తూ పాండవులకు భాగం కల్పించాడు. కౌరవులు మాయాద్యూతంలో దానిని వశంచేసికొని, పునర్ద్యూతంలో పాండవులను ఓడించగా అరణ్యాజ్ఞాతవాసాలకు నిర్లిప్తతను ప్రకటించాడు. శ్రీకృష్ణుడు రాయబారిగా వచ్చి శాంతి సందేశాన్ని వినిపించిన మహాసభలో కూడా ఆ గ్రుడ్డిరాజు నిర్లిప్తంగా నిలిచిపోయాడు. తాను సర్దిచెప్పలేని కుటుంబసమస్యను శ్రీకృష్ణుడు సరిదిద్దలేదని వాపోయాడు. గాంధారి భర్తతో గొంతు కలిపింది. అశ్వమేధయాగం తరువాత అదంతా ఒక పీడకలగా మిగిలింది. గాంధారీ ధృతరాష్ట్రుల అంత్యక్రియలు చేయటానికి దుర్యోధనాదులైన నూరుగురు కొడుకులూ లేరు. వారిమీద సానుభూతి చేసే జ్ఞాతులెవ్వరూ కానరారు. ఏ విధంగా చూచినా గాంధారీ ధృతరాష్ట్రులు అన్ని విధాలా ఏకాకులయ్యారు. అది ఆ మహారాజు జీవితచరిత్రలో శోచనీయమైన అధ్యాయం.

ఆ తరుణంలో ఆ వృద్ధ దంపతులకు అన్నీ తానై అందరూ ఉన్న అనుభూతినీ, అనురాగాన్నీ పంచింది ధర్మరాజు. ప్రతి ఉదయం తానే స్వయంగా వెళ్ళి వారిని దర్శించి పలకరించేవాడు. వారు అడుగకుండానే అన్నీ సమకూర్చేవాడు. తమ్ములందరూ, అంతఃపుర స్త్రీలందరూ నిత్యం వారికి సేవలందించేటట్లు శ్రద్ధ వహించేవాడు. సామంతులూ, అతిథులూ ముందుగా గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించి తన వద్దకు వస్తే సంతోషించేవాడు. ధర్మరాజు ప్రదర్శించే భక్తి శ్రద్ధలకు గాంధారీ ధృతరాష్ట్రాదులు కొడుకులు లేని లోపం మనసుకు తోచకుండా సుఖంగా హస్తినాపురిలో నివసించారు. ఊరక కలిసి ఉండటమేకాదు వారి వియోగంవలన రాజకుటుంబమంతా దిగులుపడేటట్లు చేసికొన్నారు. పుత్ర వియోగానంతరం ధర్మరాజుతో కలిసి పదిహేనేళ్ళు నివసించగలిగారంటే అది గాంధారీ ధృతరాష్ట్రుల గొప్పతనం అనటంకంటె ధర్మజుడి కుటుంబనీతిమాహాత్మ్యమని చెప్పటమే సమంజసం. ఆ తాత్పర్యం ఆశ్రమవాస పర్వంలోని ధర్మజుడి ప్రవర్తనలో ముమ్మూర్తులా ప్రతిఫలిస్తుంది.

పాండవులందరిలో గాంధారీ ధృతరాష్ట్రులను ఏకాంతంగా ఉపాలంభించేది భీము డొక్కడే. దానికి కారణం దుర్యోధన ధృతరాష్ట్రులే. చిన్నప్పటినుండి దుర్యోధనుడు భీముడిని చంపాలని యత్నించాడు. భీముడు కౌరవులను వధించటానికి పగపూనాడు. ఆ పగసాధింపులో భీముడు నెగ్గాడు. దానిని సహించలేని ధృతరాష్ట్రుడు కౌగిలింతలో భీముడిని నలిపి చంపాలని యత్నించి, శ్రీకృష్ణుడి పన్నాగంతో

బైటపడి అవమానాల పాలయ్యాడు. అందువలన భీముడు రహస్యంగా ఆ గుడ్డిరాజు గుండెలో ములుకులుగా గుచ్చుకొనే మాటలు గాంధారి వింటూ ఉండగా మాటాడి మనసులోని కచ్చెను తీర్చుకొనేవాడు.

సీ. 'అంధుని కొడుకులయం దొకరునిఁ దప్పి। పో నీక త్రుంచితి; భూరి శక్తి
దర్పితంబైన మద్బాహు పంజరము సొ। చ్చిన రిపురాజన్య సింహములకు
వెడలంగ వచ్చునే? వెంగలులై వారు। కయ్యంబు సేసిరి గాక! నన్ను
నెఱిఁగినఁ దొడరుదు రెట్టులు?; దుర్యోధ। నాదుల ననిఁ దెగటార్చినట్టి

తే. నాదు దోర్దండములఁ జందనం బలంది। కుసుమదామముల్ సుట్టి మ్రొక్కుదు మహోప
కారు; లరయంగ దైవముల్ గావె?' యనుఁ ద। దీయ మర్మంబు లెల్ల భేదిల్ల నధిప!' **(ఆశ్వ.1.19)**

ధర్మరాజు కీ సంగతి తెలియదు. గాంధారీధృతరాష్ట్రులు ఆ మాటలకు లోలోన బాధపడేవారే కాని, ఎవ్వరికీ బయటికి చెప్పుకొనలేకపోయేవారు. అయినా, అన్నేళ్ళు గాంధారి ఓర్పు వహించిందంటే, ధృతరాష్ట్రుడు ఎంత నేర్పుగా ఆమెను శాంతంగా ఉంచాడో మనం ఊహించగలగాలి. పదిహేనేళ్ళు గడిచినా పరిస్థితులు మారలేదు. ధృతరాష్ట్రుడు ఆలోచనలో పడ్డాడు. పూర్వం పెద్దలూ, గాంధారీ చెప్పిన నీతులు వినకపోవటంవలననే భీముడు రహస్యోపాలంభనాలకు పాలుకావలసి వస్తున్నదని గ్రహించాడు. కర్తవ్యాన్ని ఆలోచించాడు. గాంధారీ ధృతరాష్ట్రులకు దహనసంస్కారాదులు చేయదగిన కొడుకులు లేని హస్తినాపురిలో నివసించటం గౌరవం కాదు. గృహస్థాశ్రమంలో తనివితీరిన తరువాత సన్న్యాసం కాని, వానప్రస్థంగాని ఆశ్రమధర్మంగా స్వీకరించటం గృహస్థుడి ధర్మం. ధర్మబద్ధంగా జీవించి తనువు చాలించటం వంశమర్యాద. అందువలన బంధువులను పిలిపించి, ధర్మజుడితో తన వనవాస గమనవాంఛను బయటపెట్టాడు. రాజాజ్ఞను తీసికొనటం ధర్మం కాబట్టి ధర్మజుడి అనుమతి కోరాడు. గాంధారితో కలిసి నారచీరలు ధరించి తపోవనంలో మునులతో కలిసి తపస్సు చేస్తూ, కందమూలాలను తింటూ తనువు చాలించాలనే కోర్కెను వెలువరించాడు. ధర్మజు డా మాటలు విని తల్లడిల్లిపోయాడు. ధృతరాష్ట్రుడు లేని హస్తినాపురంలో తాను ఉండలే నన్నాడు. తనకు రాజ్యం వద్దని 'వైరాగ్యం' ప్రకటించాడు. ఇట్లా వేడుకొన్నాడు-

ఉ. 'తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము నా కరయంగ నీవ; భూ
వల్లభ! నీవు కాననినివాసము గోరి చనంగ నెట్టు లే
నుల్లము వట్టి హస్తిపురి నుండఁగ నేర్తు? యుయుత్సుఁ బెంపు శో
భిల్లఁగ రాజుఁ జేయు; నినుఁ బ్రీతి యెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్.' **(ఆశ్వ.1.32)**

అని వాపోయాడు. రాజ్యంకంటె ధృతరాష్ట్రుడి సేవయే తనకు ప్రీతిని కలిగిస్తుందని విన్నవించుకొన్నాడు. నిజానికి ధృతరాష్ట్రుడే రాజనీ, దుర్యోధనాదుల దుష్కృత్యాలను మనసులో తలచటం లేదనీ, తనకు గాంధారీ కుంతీ ఒకటే అనీ, తనమాట నమ్ముమనీ కాళ్ళవేళ్ళపడి వేడుకొన్నాడు. ధృతరాష్ట్రుడి మనసులోని అనుమానాలను పసికట్టి వాటిని కాదని పేర్కొన్నాడు. ధృతరాష్ట్రుడు విషణ్ణుడయ్యాడు. ధర్మజుడి చిత్తశుద్ధికి కరిగిపోయి మూర్ఛపోయాడు. ధర్మరాజే స్వయంగా ఆ రాజును శైత్యోపచారాలతో తేర్చాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజు సేవలను మెచ్చుకొన్నాడు. కాని, తపోవనానికి అనుమతిస్తేకాని అన్నం తిననని భీష్మించుకొని కూర్చున్నాడు.

ఆ పరిస్థితి గమనించి వ్యాసుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ధృతరాష్ట్రుడు వనవాసగమనం ఆశ్రమవాస వ్రత సమ్మతమని పలికాడు. "రాజులకు రణమరణమొండె, దృఢ సమాధిఁ దనువు విడుచు టొండె గాక, వృద్ధులై రోగతల్పమునఁ జావు మేలె?' (1.48) అని ధర్మరాజుకు ధర్మసూత్రం చూపించాడు. ధర్మకర్మ నిష్ఠుడైన ధర్మరాజు వ్యాసోక్తికి మారు పలుకక అంగీకరించాడు. ఆశ్రమవాసపర్వంలో ధృతరాష్ట్రుడు వ్యాసుడి వాక్యం ప్రకారం హస్తినాపురిలో కాబోయే రోగ శయ్యపై మరణాన్ని త్యజించాడు. తపోవనంలో దావాగ్నిమధ్య దృఢసమాధిగతుడై తనువు త్యజించాడు. అట్టి ధర్మకర్మకు వనగమనం ఉపకరించింది. ధృతరాష్ట్రుడు ఆశ్రమధర్మాన్ని ఆచరించిన ఆదర్శప్రభువుల కోవలో నిలిచే అర్హతను ఆశ్రమవాసపర్వం కల్పించింది.

ఒక మహారాజు తపోవనంలో ఆశ్రమవాస వ్రతం స్వీకరించేటప్పుడు నిర్వహించవలసిన వేదవిహిత కర్మల నన్నింటినీ శాస్త్రోక్తంగా పాటించిన ధర్మశీలం ధృతరాష్ట్రుడి చివరి అధ్యాయంలో గోచరిస్తుంది. మొదట ప్రభువుయొక్క అనుమతి, ఆ తరువాత ప్రజల అనుమతి తీసికొన్నాడు. మృతులైన జ్ఞాతులకూ, కొడుకులకూ యథావిధిగా విశేష శ్రాద్ధకర్మలు నిర్వహించారు. (ఆపై ఇక శ్రాద్ధకర్మలు చేయటం మానివేశాడని భావం). వనప్రస్థానానికి ముందు ధర్మరాజుకు రాజనీతి విశేషాలు బోధించాడు. భీష్ముడు, వ్యాసుడు, శ్రీకృష్ణుడు వంటి దిగ్దంతులు బోధించినా ఆశ్రమధర్మంగా ధృతరాష్ట్రుడు తన కర్తవ్యాన్ని నిర్వహించాడు. ధర్మరాజు సవినయంగా ఆ బోధనను స్వీకరించాడు.

క. 'నిత్యనిధి సద్వివేకము । సత్యవ్రతశీల! ధర్మసారజ్ఞ భవ
న్మత్యాకలితమ యైనను । నిత్యంబును వృద్ధసేవ నిష్ఠఁ జలుపుమీ!' **(ఆశ్ర.1.79)**

అని నిరంతర సత్సంగాన్ని ప్రబోధించాడు ధృతరాష్ట్రుడు. ధర్మరాజు భీష్ముడు లేని లోపాన్ని, శ్రీకృష్ణుడు దగ్గరలేని అవకాశాన్ని ధృతరాష్ట్రుడు తీర్చాడని కృతజ్ఞతలు తెలిపాడు.

ధృతరాష్ట్రుడికి వారసులైన పాండవుల ఘనతను ప్రజలు వేనోళ్ళ పొగిడారు.

తే. 'స్వర్గమైనను బాలింపఁ జాలువారు । వీరలకు భూమిపాలన విధి యనంగ
నెంతపని? వీరిచేతికి నిచ్చి తిపుడు । మమ్ము నెల్ల విధంబుల మనిచి తధిప!' **(ఆశ్ర.1.102)**

అనే ప్రశంస పాండవపాలనపై ప్రజ లిచ్చిన బంగారపు తీర్పు! ధృతరాష్ట్రుడి వనవాసగమనానికి అందిన అక్షరాశీస్సులు!'

**2. గాంధారీధృతరాష్ట్రుల ఆశ్రమవాసం:**

గాంధారీ ధృతరాష్ట్రులు వనగమనం చేసేదృశ్యం కరుణరసభరితం. వల్కలాలు కట్టి ఆ వృద్ధరాజదంపతులు గృహాన్ని పూజించి, తమ వస్తువులనన్నింటిని పరిత్యజించి, యాజకులు అగ్నులు పట్టుకొని ముందు నడుస్తూ ఉండగా అంతఃపురం వదలి వెలుపలికి వచ్చారు. ధర్మజుడు అర్ద్రుడై ఆర్తితో 'హా! మహారాజముఖ్యా! ఎక్కడికి నీ పయనం?' అని బిగ్గరగా ఏడ్చి చదికిలపడ్డాడు. భీమాదులు అతడిని అనునయించారు. ధర్మరాజు ఎంతటి ధీరోదాత్తుడో అంతటి బంధుప్రేమ కలవాడు. సాత్త్విక స్వభావుడు. పెదతండ్రి వెంట తానూ వనానికి పోతానని ముందుకు వచ్చాడు. విదురుడు సంజయుడు ధృతరాష్ట్రుడి వెంట నడిచారు. కృపాచార్యుడు కూడా వనగమనానికి సిద్ధం కాగా ధృతరాష్ట్రుడు అతడిని వారించి, ధర్మరాజును అనునయించి ఇద్దరినీ ఆపాడు.

అప్పుడు కుంతీదేవి గాంధారీ ధృతరాష్ట్రులవెంట వనవాసానికి పోవసిద్ధమయింది. ధర్మజాదులు ఆమెను పెక్కు రకాలుగా బ్రతిమిలాడారు. ఆమె వారికి నచ్చచెప్పటానికి యత్నించింది. సహదేవుడు, ద్రౌపది భీమాదులమీది మమకారాన్ని ఒలకబోసింది. కర్ణుడిని మరువవద్దని మరల మరల చెప్పింది. ధర్మరాజు ఆమెను వారించగా నిష్ఠురమాడింది.

తే. 'రాజ్యఫలము కామింపఁ బుత్త్రా! సమగ్ర । తపమునకు ఫలమైన యుత్తమగతి ప్ర
సిద్ధి గోరుదు; నది గల్గఁజేఁత కిట్టి । తోడు మఱి నాకుఁ గలుగునే దురితదూర!' **(ఆశ్ర.1.171)**

అని గాంధారీ ధృతరాష్ట్రుల సేవకై అడవులకు బయలుదేరింది. ముందు కుంతి, ఆమె భుజంమీద చేయివేసి గాంధారి, ఆమె భుజంమీది చేతితో ధృతరాష్ట్రుడు. వారివెంట విదురుడు వన గమనం చేశారు. ఇది ఉత్తమమైన ప్రస్థానం, అందరూ వనంలో తీవ్ర తపస్సు చేయాలని బయలుదేరారు. పూర్వ స్నేహవైరభావాలు లేని ఒక సమభావం వారిలో యోగంగా నిలిచింది.

ధృతరాష్ట్రుడు శతయూపాశ్రమ ప్రాంతంలో నివసించి తపశ్చర్య లారంభించాడు. నారదుడు అక్కడికి వచ్చి ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని వర్ణించి చెప్పి పూర్వరాజు లా క్షేత్రంలో తపస్సుచేసి ఇంద్రలోకానికి చేరిన వృత్తాంతాన్ని తెలిపాడు. ధృతరాష్ట్రుడు మూడేళ్ళు తపస్సు చేసి తనువును త్యజిస్తాడని కుబేరుడి సన్నిధానంలో వైభవంతో ఉంటాడనీ ఇంద్రుడు చెప్పినట్లు నారదుడు శతయూపుడికి తెలిపాడు. ధృతరాష్ట్రుడు దానిని విని సంతోషించాడు. అంటే ధృతరాష్ట్రుడి మూడేళ్ళ ఆశ్రమవాస చరిత్ర తపస్సాధనలో ముఖ్యమైనదని భావం. దానిని మూడు దశలుగా భావించవచ్చును.

**1. పూర్వరంగం:-** హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు అంతఃపుర భోగాలనూ, గృహస్థుడు చేసే వేదవిధులనూ వదలి సంసారబంధాలను త్రెంచుకొని, తపోవన నియమాలకు అనుకూలమైన చిత్తవృత్తితో నియమనిష్ఠలతో మునివృత్తిని స్వీకరించి తపస్వులతో కలిసి నివసించే వానప్రస్థాశ్రమ జీవన పద్ధతికి సిద్ధమయ్యాడు. ఇది వనగమనయోగ్యతను సాధించిపెట్టిన పూర్వరంగం.

**2. ప్రథమదశ: మోహపరిత్యాగ పరీక్ష:-** శతయూపాశ్రమంలో కుటీర నివాసం చేస్తున్న ధృతరాష్ట్రుడు శరీరాన్ని బాగా కృశింపజేసే నియమవ్రతాలు చేపట్టి జ్ఞాన కర్మేంద్రియాలవలన కలిగే వికారాలకు దూరమయ్యే తపస్సు ప్రారంభించాడు. చిక్కి శల్యమయ్యాడు. గాంధారి, కుంతి, విదురుడూ కూడా ఆ మార్గంలో పురోగమించారు. అప్పుడు వారికొక పరీక్ష ఎదురయింది. హస్తినాపురంలో నివసించే రాజకుటుంబ సభ్యులకు కుంతిని, గాంధారీ ధృతరాష్ట్రులను విదురుడినీ దర్శించాలనే బంధుప్రీతి రూప వ్యామోహం మోసులెత్తింది. దానిని మొదట ప్రస్తావించి అందరినీ ప్రేరేపించినవాడు సహదేవుడు. అతడికి కుంతిని చూడాలన్న కోరిక కలిగింది. ఆ సంగతి ధర్మరాజుతో చెప్పాడు. దానితో అందరికీ బంధుప్రీతి పెల్లుబికింది. ధర్మరాజు సబంధుపరివారంగా ధృతరాష్ట్రుడిని చూడాలని బయలుదేరాడు. ఇది బంధుసందర్శనంగా ప్రారంభమైనా, కుంతీ, గాంధారీ ధృతరాష్ట్రులతో కలిసి ధర్మజాదులు ఒక నెలరోజులు వనంలోనే ఉండిపోయారు. తపస్సుకు ఉపక్రమించిన ధృతరాష్ట్రాదులకు అది సంతోషదాయకమైనా, వారి మోహనప్రవృత్తికి అది పరీక్షగా నిలిచింది. ధర్మరాజు తాను వారితో శాశ్వతంగా ఉండి పోవాలని కూడా భావించాడు. ఆ తరుణంలో వ్యాసుడు రంగంలో ప్రవేశించి ధృతరాష్ట్రుడి యోగక్షేమాలు విచారించి, అతడికి తపస్సుమీద ఆసక్తి ఉన్నదని గ్రహించి మరొక పరీక్ష పెట్టాడు. ధృతరాష్ట్రుడికి వరమివ్వటానికి సిద్ధంకాగా, అతడు మరణించిన బంధువుల రూపాలను చూడాలనే కోర్కెను వెలిపుచ్చాడు. కుంతి, గాంధారి మొదలైన స్త్రీలందరూ ఆ కోర్కెను బలపరిచారు. వ్యాసుడు కరుణించి మృతబంధువులు దివ్య శరీరాలతో గంగనుండి వెలువడి వారికి దర్శనమిచ్చే అద్భుత దృశ్యాన్ని కల్పించి చూపాడు. వారు స్నేహవైరాది మనోవికారాలు లేని తేజోమూర్తులుగా దర్శనమిచ్చి, సమత్వభావనకు పోషకంగా అమృతానురుచిని కలిగించారు. గాంధారి కళ్ళగంతలు విప్పి కళ్ళారా చూచింది. ధృతరాష్ట్రుడు వ్యాసదత్త దివ్యదృష్టితో చూచాడు. మిగిలినవారు ఆశ్చర్యంతో వారిని చూచారు. వారి దర్శనంతో ధృతరాష్ట్రాదులలో మోహదృష్టి నశించింది. సమదృష్టి పెరిగి యోగంపై మనస్సు రమించింది. ధృతరాష్ట్రుడి వద్దనే ఉంటానన్న ధర్మజుడి వ్యామోహాన్ని వ్యాసుడు వారించి అతడిని హస్తినాపురానికి తిరిగి పంపాడు. నిరంతర బంధుజన దర్శనం తపస్సుకు ప్రతిబంధకమని తెలిపి ధృతరాష్ట్రుడు ఆ ఆశ్రమప్రాంతాన్ని వదలి దూరవన ప్రదేశాలకు తరలివెళ్ళాడు. మొదటి పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. మోహబంధాలనుండి దూరమై ప్రథమదశ ఉత్తమగతికి ప్రగతి సోపానంగా మారింది.

**2. రెండవదశ - దేహాభిమానాన్ని త్యజించే ఉగ్ర తపస్సు:-** ధృతరాష్ట్రుడు గంగాద్వార పరిసరారణ్యాలలో ఉగ్రతపస్సు మొదలు పెట్టాడు. అతడు వాయుభక్షణంతోనూ, గాంధారి జలభక్షణంతోనూ తపస్సు సాగించారు. కుంతి మాసోపవాస నియమ వ్రతం సాగించింది. ధృతరాష్ట్రుడు క్రమంగా అగ్నికార్యాదులను వదలి కర్మసన్న్యాసం చేశాడు. యాజకులు అగ్నులను ఆ అడవిలో వదలి వెడలిపోయారు. ధృతరాష్ట్రాదుల శరీరాలు నీరసించాయి. వారికి దేహాభిమానం క్రమంగా వీడిపోయింది. ఇది రెండవ దశ.

**3. మూడవదశ: యోగసమాధిలో తనువులు త్యజించటం:-** ఒకనాడు ధృతరాష్ట్రాదులు గంగా నదిలో స్నానంచేసి అడవిలో ప్రవేశించారు. భీకరమైన వాయువుతో దావాగ్ని చెలరేగి వారిని చుట్టుముట్టింది. ఆ అగ్ని ధృతరాష్ట్రుడు వదలిన యజ్ఞాగ్నివలన ఏర్ప డిందే. కుంతీ, గాంధారీ ధృతరాష్ట్రులు నీరసించి ఉండటంతో అగ్నినుండి తప్పించుకొనలేక పోయారు. వారివెంట నున్న సంజయుడు, రాజు కోరికపై యోగమార్గంలో హిమవత్పర్వతంమీదకు వెళ్ళాడు. ప్రస్థానంలో తనువు త్యజించాడు. సంజయుడి సూచనపై ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి తూర్పుదిక్కు మొగమై యోగసమాధిలో కూర్చుండి తమంతటతాము హుతాశనుడి కీలలకు ఆహుతి అయ్యారు. ధృతరాష్ట్రుడు తన గార్హపత్యాగ్నిలో తానే దగ్ధమయ్యాడు. కొడుకులు అగ్నికార్యం చేయవలసిన అవసరం అతడికి ఏర్పడలేదు. దావాగ్ని దగ్ధుడైన ధృతరాష్ట్రుడు యోగమార్గంలో తనువును త్యజించిన పుణ్యపురుషుడై ఉత్తమలోకాలకు వెళ్ళాడు. గాంధారి అతడిని అనుసరించింది. కుంతి యోగాగ్నిలో తనువును త్యజించి పాండురాజును చేరుకొన్నది. నారదుడివలన ఈ వృత్తాంతం విని ధర్మరాజాదులు వారికి తిలోదకాలిచ్చారు.

ధృతరాష్ట్రుడు యోగమార్గంలో తనువును త్యజించి స్వర్గాన్ని పొందాడు. కుంతీ గాంధారు లా బాటలో నడిచారు. సంజయుడు యోగమార్గంలో మహాప్రస్థానం చేశాడు. విదురుడు యతిగా మారి దిగంబరుడై తిరుగుతూ యోగమార్గంలో తనువును త్యజించి తన జీవచైతన్యాన్ని ధర్మరాజులో లీనంచేసి ధన్యుడయ్యాడు. ఈ విధంగా ధృతరాష్ట్రుడి ఆశ్రమవాసం వనగమనం చేసిన అయిదుగురికీ యోగమార్గంలో అయిదు విధాలుగా స్వర్గగమనానికి స్వర్ణమార్గంగా ఉపయోగపడింది.

# మౌసలపర్వం

**1. మూడు మహానగరాలు:-**

మహాభారత యుద్ధానంతరం చరిత్ర కెక్కిన మహానగరాలు మూడు. అవి: హస్తినాపురం, ఇంద్రప్రస్థం, ద్వారక-చంద్రవంశ చక్రవర్తులు ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన రాజ్యానికి ఏకైక రాజధాని హస్తినాపురం. ప్రస్తుతం అది పాండవాధీనంలో ఉన్నది. దానికి ధర్మరాజు చక్రవర్తి. ఆయన అశ్వమేధయాగం చేసి భారత సమ్రాట్టుగా ప్రసిద్ధికెక్కాడు. ధృతరాష్ట్ర పాలనలో పాండవ భాగంగా ఇవ్వబడిన రాజ్యానికి రాజధాని ఇంద్రప్రస్థపురం. ఇది శ్రీకృష్ణుడి దివ్య మహిమతో అద్భుత నగరంగా పాండవుల కాలంలో అభివృద్ధి చెందింది. మయసభ అందులో అద్భుత శిల్పం. ధర్మరాజు రాజసూయం చేశా డక్కడ! పాండవ పూర్వ ప్రభకు ప్రతినిధిగా నిలిచిం దిప్పుడు. హస్తినాపురికి అనుబంధ మహానగరంగా గౌరవించబడుతున్నది. దాని అదృష్ట మేమిటంటే నరనారాయణాంశ సంభూతులైన అర్జున శ్రీకృష్ణులు భారతయుద్ధానంతరం ఆ నగరంలో కొన్నాళ్ళు నివసించారు. శ్రీకృష్ణుడు అర్జునుడికి అనుగీతను బోధించి దానిని జ్ఞానక్షేత్రంగా దీపింపచేశాడు. హస్తినాపురికి అండగా ఆకాలంలో నిలిచింది ద్వారక. దానికి ప్రభువు వసుదేవుడు. అది యాదవ రాజ్యరాజధాని. బలరామ శ్రీకృష్ణుల భవ్య నివాసక్షేత్రం. కౌరవుల తరువాత యాదవులు మహావీరులు, యుద్ధకుశలులు. వారిలో వృష్ణి , భోజక, అంధకాది వంశాలకు చెందినవారు ఉన్నారు. వారందరూ ఏకాభిప్రాయంతో ఎల్లప్పుడూ ఉండకపోయినా వసుదేవుడన్నా, వాసుదేవుడన్నా భయభక్తులతో మసలుకొంటారు. మూడు నగరాలకు ప్రభువు లెవరైనా వాటిమీద శ్రీకృష్ణుడి ప్రభావం మాత్రం ఎప్పుడూ ఉండేది. పాండవులకు బంధువే కాక ప్రత్యక్షదైవం వాసుదేవుడు. అనన్యభక్తితో అతడిని సేవించి, ఆయన కల్పించిన రక్షను, యోగక్షేమాలను సర్వదా పొందిన సార్థక భక్తులు పాండవులు. అందువలన భారతయుద్ధంలోనూ, తరువాతకూడా పాండవజీవిత నౌకకు శ్రీకృష్ణుడు కర్ణధారిగా ఉండి కథను చివరిదాకా విజయపథంలో నడిపించాడు. మొత్తానికి హస్తినాపుర చరిత్రకే కాక, పురత్రయ భవితవ్యానికి కూడా శ్రీకృష్ణుడూ మార్గదర్శి, సూత్రధారుడు, చక్రధారి. అతడు నిర్మించిన ద్వారకానగర చరమాంక చరిత్రను చిత్రించేది మౌసలపర్వం. అది మహాభారత కథలో ఒక కీలకపాత్ర నిర్వహించటం విశేషం.

**2. ద్వారకను ముంచిన ముప్పేట ముప్పు:**

అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు తన అవతార సమాప్తికి ముందే తన భౌతిక వైభవాన్ని ఉపసంహరించుకొనే వ్యూహంలో భాగంగా యాదవ వీర సంహారానికీ, ద్వారకానగరోపసంహారానికీ తగిన హేతువులను కల్పించి తాను నిమిత్తమాత్రుడుగా మిగిలే లీలను ప్రకటించాడు. ఆ విధంగా ద్వారకకు మూడు విపత్తులు ఏర్పడ్డాయి.

**1. కణ్వుడూ, నారదుడూ, విశ్వామిత్రుడూ అనే ముగ్గురు మహర్షులూ సాంబుడు ఆడిన కపట స్త్రీ నాటకం కారణంగా ఇచ్చిన శాపం:-** 'సాంబుడికి యాదవకులాన్ని నశింపచేసే ఒక ముసలం పుట్టుతుందనీ, దాని శక్తివలన బలరామకృష్ణులు తప్ప మిగిలిన యాదవులందరూ నశిస్తారనీ, బలరాముడు యోగశక్తితో తన శరీరం వదలి సముద్రంలో ప్రవేశిస్తాడనీ, శ్రీకృష్ణుడు ఏకాంతంగా నేలపై పరుండి ఉండగా 'జర' అనే రాక్షసి అతడిని ఆక్రమించి చంపుతుందనీ మునులు శపించారు. దానివలన పుట్టిన ముసలం కారణంగా యాదవవీరులు పరస్పర కలహంలో నశిస్తారు. బలరామకృష్ణులు అవతారాలు చాలిస్తారు.

**2. గాంధారిశాపం:-** భారతయుద్ధంలో ఉత్తమ జ్ఞాతులు తమలో తాము పోరాడి చనిపోయేటట్లు శ్రీకృష్ణుడు చేశాడు కాబట్టి శ్రీకృష్ణుడి జ్ఞాతులైన యాదవులుకూడా తమలో తాము పోరాడి చనిపోతారనీ, శ్రీకృష్ణుడు నాటినుండి ముప్పదారేళ్ళకు అదే నాడు ఆదుకొనే దిక్కెవ్వరూ లేక శోచనీయస్థితిలో చనిపోతాడనీ గాంధారి శపించింది.

**3. ద్వారక సముద్రంలో మునగటం:-** శ్రీకృష్ణ నిర్యాణానంతరం ఒక వారం రోజులకు సూర్యోదయ సమయంలో సముద్రం ద్వారకను ముంచి తనలో కలుపుకొంటుందని శ్రీకృష్ణుడు వసుదేవుడికి తెలిపాడు.

ఈ ప్రళయానికి ప్రథమకారణం మునుల శాపంవలన కలిగే ముసలం కాబట్టి, దాని మహిమను ప్రదర్శించే ఈ పర్వం మౌసలపర్వం అని పిలువబడింది. యాదవవీరుల మరణానికి దివ్యమైన కారణం ఉన్నదని చిరునవ్వు నవ్వుతూ గాంధారితో శ్రీకృష్ణుడిట్లా అన్నాడు-

తే. 'మున్న కాదె యాదవులకు మునివరేణ్య । కలిత దారుణశాపంబు గలదు; నీకు
నేల చర్వితచర్వణ మిట్లు సేయ? । దీన నేమి ఫలవ్రితి? దానిఁ జెపుమ!'

క. 'యదువంశజాతులకుఁ ద । ప్పదు నాకము; వారి సురలుఁ బరిమార్పఁగ లే;
రది కారణంబు గాఁగఁ దె । గుదు రొండొరుచేత రణము ఘోరత్వమునన్.'

తే. 'అనిన పలుకులు విని పాండుతనయు లెదలు । వెఱపు పెంపున గంపింప విహ్వలించి
యాత్మజీవితములదెస నాస లపుడు । వదల విడిచిరి కౌరవవంశవర్య! **(స్త్రీ.2.163-165)**

దేవతలకు కూడా అసాధ్యులైన యాదవులు పరస్పర సంహారంతో తనువులు చాలించటమే దైవం నిర్ణయించిన మార్గం. దానికి అనువుగా మునిశాపాన్నీ, గాంధారి శాపాన్నీ కల్పించి కార్యకారణ సంబంధాన్ని కల్పించాడు. ఇది శ్రీకృష్ణుడి దివ్యవ్యూహం! దీనివలన భూతలంమీద మరొక మహాయుద్ధం వారించబడింది. యాదవమరణం క్రమంగా పాండవ మహాప్రస్థానానికి దారి తీస్తుందని పై చివరి పద్యం వ్యంగ్యంగా సూచిస్తున్నది. అది తిక్కన కథాకథనశిల్పం!

చంద్రవంశ చరిత్రలో వ్యాసవాసుదేవులు విష్ణుసన్నిభులు. భీష్ముడి తరువాత హస్తినాపుర సింహాసనానికి వారసులను కల్పించటంలో దోహదకారిగా నిలిచిన మహర్షి వ్యాసుడు. పాండవుల తరువాత వారి వంశాంకురాన్ని ప్రాణంపోసి రక్షించిన మహాత్ముడు శ్రీకృష్ణుడు. వీ రిద్దరూ పాండవులను అశ్వమేధయాగాంతం వరకు మార్గదర్శకులై, రక్షకులై వెంట నడిచారు. యాగానంతరం శ్రీకృష్ణుడు ద్వారకలోనే ఉండిపోయాడు. వ్యాసమహర్షి ఆశ్రమంలో తపోనిష్ఠుడై నిలిచాడు. వా రెక్కడున్నా హస్తినాపుర సామ్రాజ్య శ్రేయోభిలాషులు, సంరక్షణాచార్యులు.'

పాండవులలో పార్థుడు శ్రీకృష్ణుడికి ప్రాణస్థానీయుడు. అతడికి సుభద్ర నిచ్చి వివాహం చేయటంలో శ్రీకృష్ణుడు రహస్యమైన కీలకమైన పాత్ర పోషించాడు. ఆమెకు పాంచాలి వైపునుండి ఎటువంటి ఇబ్బందులు కలగకుండ కంటికి రెప్పవలె కాపాడాడు. అర్జునుడికి సుభద్రవలన కలిగిన పుత్రుడు అనన్యసామాన్య ధానుష్కుడై, అపరపార్థుడని పొగడందిన అభిమన్యుడు. అతడిని తాను అభిమానించి పెంచి పెద్దచేసి మహావీరుడిని చేయటమే కాక, విరాటరాజపుత్రిక అయిన ఉత్తరతో వివాహం జరిపించటంలో సహకరించాడు. ఆ దంపతులకు పుట్టిన పుత్రుడే పరీక్షిత్తు. అతడిని అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మముఖాస్త్రశిఖిశిఖలనుండి రక్షిస్తానని శపథంచేసి మృతశిశువుగా పుట్టిన ఆ బాలుడిని ప్రాణవంతుడిగా తేజోవంతుడిగా మార్చి అనుగ్రహించి పాండవవంశాన్ని నిలిపాడు.

విచిత్ర మేమంటే ధృతరాష్ట్రుడికి గాని, పాండవులకుగాని, వారి సంతతి నిలువ లేదు. వారు భారతయుద్ధంలో మరణించారు. కౌరవభార్యలకు సంతతి మిగలలేదు. ద్రౌపది కొడుకులు ఉపపాండవులు అశ్వత్థామచేత హతులయ్యారు. అపాండవం కావలసిన తరుణంలో అశ్వత్థామ శపథాన్ని కాదని శ్రీకృష్ణుడు సుభద్ర మనుమడే కురురాజ్యాధిపతి కావాలని శ్రీకృష్ణుడి దివ్య ప్రణాళిక అయి ఉంటుంది. ఆయన వ్యూహం అంతటితో ఆగినట్లు లేదు. ద్వారకలో బలరామ వాసుదేవు లున్నారు. వారి పుత్రులూ మౌసలయుద్ధంలో చనిపోయారు. ధృతరాష్ట్రుడికివలె, పాండవులకువలె, శ్రీకృష్ణుడికి కూడా వారి తరువాతి తరం బ్రతికే అదృష్టం లేదన్నమాట! అది-శ్రీకృష్ణుడి సమత్వబుద్ధి. మరొక విశేష మేమంటే ' ద్వారక' ముఖ్యపట్టణంగా యాదవరాజ్యం నిలిస్తే అది హస్తినాపురితో ఎప్పటికైనా పోటీపడవచ్చును. అందువలన దానిని అదృశ్యం చేయటం (సముద్రంలో ముంచటం) శ్రీకృష్ణుడి దివ్యవ్యూహం. అంతటితో ఆగక గతప్రాణులైన యాదవులకూ, తనకూ, బలరాముడికీ అంత్యసంస్కారాలు అర్జునుడు చేసేటట్లు ఏర్పాటు చేయటం శ్రీకృష్ణుడి దైవ సంకల్పం.

నారాయణుడు చేయవలసిన విధులు నరుడు చేయగలడు. 'అమ్మహాభుజుఁడు కార్యజ్ఞుండు, శౌర్యసమగ్రుండు, విక్రమమహితుఁ; డతఁడు, నా ఁగ నేననంగ నరనాథ! భేద మించుకయు లేదు' (మౌస.1.117) అని స్పష్టంగా శ్రీకృష్ణుడు వసుదేవుడితో చెప్పాడు.

మరొక అద్భుత మేమంటే శ్రీకృష్ణుడి తరువాత, ద్వారక నీటిలో మునిగిన తరువాత వసుదేవాదులను, మిగిలిన ప్రజలను ఇంద్రప్రస్థానానికి చేర్చేటట్లు అక్కడ శ్రీకృష్ణుడి మనుమడైన వజ్రుడిని రాజుగా నిలిపేటట్లు ధర్మరాజు ముందే యోచించి అర్జునుడికి అంతరంగికంగా ఆదేశా లిచ్చి ఉండటం గమనిస్తే శ్రీకృష్ణుడి ప్రభావం హస్తినాపురంమీద ఎంత ఉన్నదో తెలుస్తుంది. ద్వారక నీట మునిగి ఇంద్రప్రస్థంలో విలీనమయింది. యాదవ రాజ్యం హస్తినాపురానికి మిత్రరాజ్యంగా మారింది. ఆ రెండూ సుభద్రాదేవి రక్షణలో శాంతి సౌఖ్యాలతో విలసిల్లబోతున్నాయి. మనుమళ్ళను మహారాజులను చేసే ఒక దివ్య ప్రణాళిక వెనుక ఉన్న రహస్యం చివరకు గాని తెలియదు. భీష్మాది మహావీరులూ, బలరామ శ్రీకృష్ణులూ, పాండవులూ, వారి సంతతీ అందరూ అంశావతారులైన కారణజన్ములు. అందుకే వారి కార్యాలు ముగియగానే స్వర్గవాసులయ్యారు. మిగిలిన అదృష్టవంతులు చరిత్రను ముందుకు నడిపారు. దీనికంతా వెనుక ఉన్నది వాసుదేవ మాహాత్మ్యం.

**3. అవతారపురుషుడి అపూర్వప్రస్థానం:**

మహాభారతంలో చివరి నాలుగు పర్వాలూ ప్రస్థాన పర్వాలుగా ప్రసిద్ధికెక్కాయి. భారత పాత్రలన్నింటిలో శ్రీకృష్ణుడి పాత్ర పరిపూర్ణ దివ్య పాత్ర. అతడు పరమేశ్వరుడుగా, సాక్షాత్తు నారాయణుడి అవతారంగా భీష్మాది మహావీరులూ, వ్యాసాది మహర్షులూ గుర్తించి కీర్తించారు. మానవాకృతి తాల్చిన మాధవుడు జీవించిన విధానం లీలామానుషంగా భాసించి, నిర్యాణంకూడా దివ్యాదివ్యంగా తేజరిల్లటం విశేషం.

భారతంలో మరణించిన వారందరి చరిత్రలలో శ్రీకృష్ణ నిర్యాణం విలక్షణమైనది. యుద్ధంలో వీరమరణం పొందినవారందరికి ఆ మరణమే వారికి స్వర్గప్రాప్తిని కలిగిస్తుంది. వారు మరణించిన తరువాత మాటాడరు. రణభూమిలో మరణించని వీరులు యోగమార్గంలో తనువులను త్యజిస్తారు. కాని, పూర్వాంశను పొందిన తరువాత జీవితాంశాలను గురించి సామాన్యంగా మాటాడరు. మరణించిన తరువాత జీవులు దివ్యదేహాలు పొందవచ్చును. అంతవరకు స్వర్గ నరక భోగాలను అనుభవిస్తూ ఉండవచ్చును. ఏమైనా వారికి దేహస్పృహ ఉండటం కాని, దానికి సంబంధించిన ఈర్ష్యాసూయలు, అనురాగాది బంధాలు ఉండటం కాని కానరాదు. మరణించిన వీరుల చరిత్రలన్నీ ఈ లక్షణాలకు సాక్ష్యాలే. అయితే, వారందరికంటె విలక్షణంగా ధర్మరాజు బొందితో స్వర్గానికి పోవటం. స్వర్గనరక దర్శనం చేసికొనటం, ఆ సమయంలోకూడా శరీరావరణ సంబంధాలైన రాగాసూయాదులకు గురికావటం గమనిస్తాం. ఆకాశగంగావగాహనం తరువాత అతడు దివ్యదేహాన్ని పొంది తదనుభూతికి లోనుకావటం స్వర్గారోహణపర్వంలో గోచరిస్తుంది. అట్టి సుకృతులు పూర్వచక్రవర్తులలో కొందరున్నారు. హరిశ్చంద్రుడటువంటివాడు. వారి వరుసలో ధర్మరాజు నిలిచి తన ప్రత్యేకతను నిలుపుకొన్నాడు. ఇందరు ఇన్ని ప్రత్యేకతలతో ప్రకాశించినా శ్రీకృష్ణుడితో సరిపోలజాలరు. బలరాముడు ఆదిశేషుడి అవతారంగా ప్రసిద్ధిచెందాడు. శ్రీకృష్ణుడితో పుట్టిన విష్ణువు ఆయుధాలు ఆయనకంటె ముందే మానవాకృతులు వదలి విష్ణు లోకం చేరుకొన్నాయి. బలరాముడుకూడా శ్రీకృష్ణుడివద్ద అనుమతి పొంది అడవిలో ఒకమ్రాను మొదట యోగసమాధిలో ఉండిపోయాడు. శ్రీకృష్ణుడు అతడిని దర్శిస్తూ ఉన్నప్పుడే అతడి శరీరంలోనుండి వేయిపడగల ఆదిశేషుడు యోగమార్గాన పైకి లేచి ఆకాశగమనంతో సముద్రంలో లీనమైపోయాడు. దేవతలూ, శేషులూ అతడికి ఆహ్వానం పలికారు. ఇది ఒక అద్భుత నిర్యాణం. శరీరపతనానంతరం నిజరూపధారణం చేసి బల రాముడు మరేమీ మాటాడలేదు. జరా ప్రేరితుడై, వ్యాధుడు శ్రీకృష్ణుడి పాదాన్ని జింకగా భ్రమించి బాణంతో గట్టిగా కొట్టి నప్పుడు, లౌకికవ్యక్తిగా భూశయనం చేసి ఉన్న శ్రీకృష్ణుడు, దుర్వాసోమహర్షి శాపం కారణంగా అరికాలిలో తగిలే దెబ్బతో మృత్యువు కలుగుతుందని తెలిపి, నిర్వికారంగా యోగసమాధిలో ఉండి, వేటగాడిని అనునయించి, తన తనువును తానే త్యజించి నిజస్థానంలో అవ్యయుడుగా నిలిచి ఆనందబ్రహ్మగా తనస్థితిని తానే వ్యాఖ్యానించి బ్రహ్మాదులకు చెప్పి వారిని ఆనందపరిచాడు.

తనువును త్యజించినప్పుడు జీవన్ముక్తుడైన మహాయోగివలె కనబడి, తాను పొందిన నిజస్థితిని, తదనుభూతిని చెప్పగలిగినవాడే అవతారపురుషుడని శ్రీకృష్ణుడి నిర్యాణం నిరూపించి చెప్తుతుంది. స్వస్వరూపంతో నిలిచిన ఆ పరమాత్ముడు అన్నమాట లివి-

సీ. 'అప్పరమేశ్వరుం డయ్యెందఱను జూచి । 'యనిరుద్ధ నామకం బైనయదియుఁ;
బ్రద్యుమ్నతా ప్రతిభాసమానమును, సం । కర్షణభావవికాసితంబు,
వాసుదేవాత్మక వరరూపమున నేక । తా విభవత్వమాధాన సిద్ధి
నొందించుకొంటి; నానందబోధ నిరంజ । నామేయ మత్పద ప్రాప్తి పరమ

ఆ మంగళానుభూతి నంగీకరించెద । సుఖుల రగుఁడు మీరు సుకృతులార!'
యనిన వచన సమితి యతిమృదు మధురత । నింపు నొసఁగ నలరి రెల్లవారు.' **(మౌస.2.92)**

దీనిని వ్యాఖ్యాత ఈ పద్యం వద్ద ఈ విధంగా వివరించాడు. ''శ్రీకృష్ణుడు పొందిన మహానారాయణత్వ సిద్ధిని వర్ణించే పద్యం కాబట్టి ఈ పద్యం చాలా విశిష్టమైనది. నిర్వికారమైన పరబ్రహ్మంనుండి సవికారమైన సృష్టి నాలుగు అంచెలుగా ఏర్పడిందని సంస్కృత భారతం శాంతిపర్వంలోని 139వ అధ్యాయంలో చెప్పబడింది. ఆ అధ్యాయాన్ని 'నారాయణీయం' అంటారు. ఈ నాలుగు అంచెలనే నారాయణవ్యూహతత్త్వ మంటారు. ఈ నాలుగు దశలు ఇవి: 1. సనాతన వాసుదేవతత్త్వం- నిష్క్రియ, నిర్గుణ, నిష్కళ, నిర్ద్వంద్వమైన పురుషతత్త్వమిది. దీనినే పరతత్త్వ మంటారు. ఇదే పంచభూతాలను శరీరంగా చేసికొని జీవుడై అవతరించింది. ఈ జీవుడు లేకుండా ఆ పరబ్రహ్మతత్త్వానికి చేష్ట ఉండదు. అంటే కదలిక ఉండదు. అందుకే భారతకథలో వసుదేవుడి కుమారుడుగా కృష్ణుడు చెప్పబడినాడు. 2. సంకర్షణతత్త్వం -ఈ జీవుడి పేరే శేషుడు, లేదా సంకర్షణుడు. పరవాసుదేవ తత్త్వంవైపు పాంచభౌతిక శరీరాన్ని ఆకర్షించే వాడని అర్థం. 'కర్షతి' అంటే ఆకర్షిస్తాడని అర్థం. కృష్ణశబ్దానికి కూడా అర్థం ఇదే ఆకర్షించేవాడని. భారతంలో శ్రీకృష్ణుడిచేత ఆకర్షించబడని పాత్ర లేదు. 3. ప్రద్యుమ్న తత్త్వం: సంకర్షణతత్త్వం నుండి పుట్టేది ప్రద్యుమ్న తత్త్వం. ఇది సనత్కుమారతత్త్వం. విశ్వమనస్స్వరూపం. సర్వభూతాతిరిక్తమైన మనస్తత్త్వమిది. పంచభూతాలు ప్రళయకాలంలో ఈ 'మహామనస్సు' లో లీనమౌతాయి. శ్రీకృష్ణుడి కుమారుడు ప్రద్యుమ్నుడు - అని చెప్పబడిన పురాణకథలకు మూలం ఈ వ్యూహనిర్మాణమే 4. అనిరుద్ధతత్త్వం -అ ప్రద్యుమ్న తత్త్వంనుండి పుట్టేది అనిరుద్ధతత్త్వం. కర్తృకారణ స్వరూపుడై స్థావరజంగమాత్మక విశ్వరూపుడు - సమష్టి అహంకార స్వరూపుడు అనిరుద్ధుడు. పురాణాల ప్రకారం ప్రద్యుమ్నుడి కొడుకే అనిరుద్ధుడు. ఈ నాలుగు తత్త్వాలను కలిగిన పరమేశ్వరుడుగా నారాయణుడు ఈ పద్యంలో వివరించబడుతున్నాడు. ఆ నారాయణతత్త్వం కేవలం ఆనంద రూపమైన జ్ఞానం. అందుకే అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ రూపుడైన వాసుదేవుడు ఆ రూపాలన్నీ క్రమంగా ఉపసంహరించుకొని ఆ మూలస్థితికి చేరుకొన్నానని తానే స్వయంగా చెప్పుకొనటం ఈ ప్రకటన విశేషం. ఇట్లా చెప్పుకొన్న పాత్ర శ్రీకృష్ణు డొక్కడే. అందుకే భారతంలో పరమాత్ముడు శ్రీకృష్ణుడనీ, అతడి అవతారం లీలామానుషరూపమనీ, అందువలననే అతడు మానవుడివలె చనిపోగలడనీ, పరమేశ్వరుడివలె తన తత్త్వాన్ని లోకానికి చెప్పగలడనీ, తెలుపబడింది. మౌసలపర్వం వాసుదేవతత్త్వ మనబడే నారాయణవ్యూహ చతుష్టయ తత్త్వమనీ, అదే భారతంలో తెలియదగిన భగవత్తత్త్వమనీ బోధపరుస్తుంది.

**4. మౌసలపర్వం మహాప్రస్థానికపర్వానికి తొలిపలుకు;**

శ్రీకృష్ణ నిర్యాణం అర్జునుడికి అనంతశోకాన్ని కలిగించింది. తేజోమయమైన శ్రీకృష్ణుడి మృతదేహాన్ని చూచి విజయుడు దుఃఖంతో మొదట మూర్ఛిల్లాడు. ఆ తరువాత అతడి మృత శరీరాన్ని కౌగిలించుకొని చాలాసేపు ఉండిపోయాడు. ఆపై తన చుట్టున్నవారి బలవంతాన తేరుకొన్నాడు. విధి విధానం ప్రకారం అంత్యక్రియలు నిర్వహించాడు. కన్నకొడుకులు కూడా నోచుకొనని ఆ అపూర్వమైన అదృష్టాన్ని అర్జునుడు పొందాడు. అయితే, ఆ తరువాత ద్వారకావాసులను తరలిస్తున్నప్పుడు మార్గమధ్యంలో బోయలు స్త్రీలపై దాడిచేసి బంగారం దోచుకొన్నప్పుడు, అర్జునుడు బాణాలు వేసినా అవి వారిపట్ల ఎటువంటి ప్రభావాన్ని చూపలేకపోయాయి. అర్జునుడికి

అస్త్రాల మంత్రతంత్రాలు ఆ సమయంలో స్ఫురించకుండా పోయాయి. అర్జునుడి ప్రతాపం ఓటుపడ్డట్లయింది. ఆ నిర్వీర్యస్థితికి అతడు తట్టుకొనలేకపోయాడు. శ్రీకృష్ణ నిర్యాణం తన ప్రతాప నిష్క్రమణంగా భావించి శోకించాడు. అతడికి శోకమోహాలు ముంచుకొనివచ్చి వేదవ్యాసమునీంద్రుడివద్దకు చేర్చాయి. అతడు యాదవ వీరుల మరణాన్నీ, బలరామకృష్ణుల నిర్యాణాన్నీ, ద్వారకావాసుల దైన్యాన్నీ, చివరకు తన నిస్సహాయస్థితినీ పేర్కొని వాపోయాడు. దానికి కారణం చెప్పుమన్నాడు. ఆ తరువాతి కర్తవ్యం తెలుపుమన్నాడు. వ్యాసమహర్షి శోకమోహావిష్టుడైన అర్జునుడికి అవతారపురుషుడి లీలా మానుష చర్యల వెనుక నున్న తాత్త్విక భూమికను వివరించి, అది విషాదానికి ఆలంబనం కాకూడదని బోధించాడు. ఆ తాత్పర్యం ఇది-

1. మునిశాపంవలన యాదవనాశనం జరిగింది. అందువలన దానికి దుఃఖించ పనిలేదు. యాదవులు కర్మఫలాన్ని అనుభవించారు. వారికి ప్రాప్తకాలం వచ్చింది. కాబట్టి శ్రీకృష్ణుడు వారి నాశనానికి అడ్డుపడకుండా ఉపేక్షవహించాడు. మూడు లోకాలను అన్యథాకరించగలిగిన సర్వశక్తిమంతుడు శ్రీకృష్ణుడు. యదునాశం అవశ్యభోక్తవ్యం కాబట్టి ఆ మహాత్ముడు అడ్డుకొనలేదు. ఈ తత్త్వం తెలిస్తే యాదవమరణశోకం నీకు ఉపశమిస్తుంది.

2. నీవు యుద్ధం చేసేటప్పుడు నీపట్ల ఉండే స్నేహంవలన శ్రీకృష్ణుడు రథసారథి అయి వర్తించినా, రుద్రరూపుడై శూలాన్ని ధరించి ముందుగా శత్రువులను సంహరిస్తూ నీ విజయానికి దోహదంచేస్తూ ఉండేవాడు. నీ యోగదృష్టికి ఆ దృశ్యం గోచరిస్తూ ఉండేది. అప్పుడు కాలం నీకు అనుకూలంగా ఉండేది. కాబట్టి శ్రీహరి నిన్ను రక్షించాడు. ఇపుడు కాలవైపరీత్యంవలన నీ వెంట నీ జంటగానిలిచి సాయంగా లేడు. కాలానుకూల్య కాలవైపరీత్యాలు దైవసంకల్పం మీద ఆధారపడి ఉంటాయి. అది తెలిస్తే ఇప్పటి నీ స్థితి స్పష్టమౌతుంది. దీనికి విచారించటం అవివేకం.

3. ధరణిభారాన్ని తగ్గించటానికి విష్ణువు అవతరించి, దుష్టశిక్షణాన్నీ, శిష్టరక్షణాన్నీ అబ్బురపాటు కలిగేటట్లుగా నిలిపి తన అవతార కార్యక్రమం ముగియగానే తనువు చాలించి అజరామరం, నిష్కళంకం, నిర్వికారం, నిరంజనం అయిన తన సత్పదాన్ని పొంది ఉపశాంతిపరు డయ్యాడు. ఇది మంగళకరమైన శుభస్థితి. మీ వంటి జ్ఞానులు దీనికి శోకించరాదు.

4. నీవు భీమాదులసహాయంతో అవనీభారాన్ని తగ్గించటంలో శ్రీహరికి తోడ్పడి కృతార్థుడ వయ్యావు. దైవాజ్ఞను అనుసరించి అస్త్రసముదాయం నిన్ను వదలి వెళ్ళింది. నీవు పూర్వం చేసిన యుద్ధాలలో ప్రదర్శించిన పరాక్రమ విశేషాలకు దేవతలు కూడా హర్షించారు. హరి సహకరించినప్పుడు నరుడు రాణిస్తాడు. ఈ రహస్యం తెలిసి విచారించటం వివేకం కాదు.

5. బలం, బుద్ధి, చేప-కాలం అనుకూలంగా ఉన్నప్పుడు ప్రకాశిస్తాయి. కాలం వికటించినప్పుడు నశిస్తాయి. పండితులు కాలం కలిసివచ్చినప్పుడు మూలమైన మీ తనువులను విడిపెట్టండి. అట్లా మీరు చేస్తే ఆర్యులు కీర్తిస్తారు.

మౌసలపర్వ కథార్థాలను వ్యాసమహర్షి వ్యాఖ్యానించి అర్జునుడి శోకమోహాలను తొలగించి వివేకాన్ని ప్రసాదించాడు. దీనివలన పాండవులకు ఒక భవ్యసందేశం అందింది. వారికి కాలం అనుకూలంగా లేదు. లేదని శ్రీకృష్ణ నిర్యాణం ధ్వనింపజేసింది. పాండవులకు సారథిగా, సచివుడుగా, వియ్యంగా, సఖుడుగా, బాంధవుడుగా, విభుడుగా, గురువుగా, దైవంగా వెన్నంటి నిలిచి రక్షించిన దివ్యశక్తిమంతుడు శ్రీకృష్ణుడే కాలస్వరూపుడు. అతడు నిష్క్రమించి పాండవులకు తనువుల వికార స్వభావాన్ని తొలగించుకొనే సందేశ మిచ్చినట్లు సాక్షాత్ కృష్ణద్వైపాయనుడే సూచించాడు. బోధించాడు. ఆ బోధనయే పాండవ జీవితచరమాంకానికి తొలిపలుకు, మౌసలపర్వం బలరామకృష్ణుల జీవితాలకు భరతవాక్యం. పాండవ మహాప్రస్థానానికి నాందీవాక్యం! అదే మౌసలపర్వ సార్థక్యం.

# మహాప్రస్థానికపర్వం

**1. ప్రస్థానప్రయత్నం:**

పాండవుల చరిత్రలోని చరమఘట్టాన్ని రెండు పర్వాలుగా విభజించటం విశేషం. వస్తు విభాగం దృష్ట్యా అది ఔచిత్యం కూడా. మొదటిది మహాప్రస్థానిక పర్వం. రెండవది స్వర్గారోహణపర్వం. ఇందులో మహాప్రస్థానం చేసింది ఏడుగురు. వారిలో స్వర్గారోహణం చేసింది చివరకు ధర్మరాజు ఒక్కడే. వస్తు స్వభావరీత్యా ఈ రెండూ ప్రత్యేక స్వభావాలు కలిగి ఉండటంచేత పరిమాణంలో చిన్నదైనా విడివిడి పర్వాలుగా విభజించబడ్డాయి. మహాప్రస్థానం పాండవు లందరిదీ, స్వర్గారోహణం ధర్మరాజు ఒక్కడిదీ.

తే. ‘కాలమూలంబు సర్వంబు గాన దీని । కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు । విడిచి యార్యజనంబులు వినుతి సేయ. (మౌస.1.222)

అన్నది వ్యాసోపదేశం. దీనిని అన్నివిధాలా అర్థంచేసికొని, అక్షరాలా అమలు చేయటానికి నిశ్చయించాడు. ధర్మరాజు కాలవిపర్యయాన్ని గమనిస్తే కలికాల ప్రవేశాన్ని స్మరిస్తే పాండవులకు కాలం చెల్లిందన్నది సూక్ష్మబుద్ధికి తోచే వాస్తవం. దానిని గుర్తించి ధర్మరాజు దానికి ప్రత్యామ్నాయంగా మరొక సంకల్పం చేయకుండా నిశ్చింతతో కూడిన మనస్సును సమాహితంచేసి యోగనిష్ఠం చేశాడు. అనన్యచింతతో ఉత్తమగతిని పొందాలని దీక్ష వహించాడు. ఉత్తమగతి అంటే తమ కర్మలకు తగిన పరలోక గతి. అది స్వర్గం కావచ్చును. మోక్షం కావచ్చును. ధర్మజుడి చిత్తం కర్మయోగ పరిపక్వత చెంది ఉన్నది కాబట్టి మోక్షాన్నికాని, స్వర్గాన్ని కాని లక్షించక వికారాలకు నెలవైన దేహాన్ని యోగంతో పరిత్యజించ దలచాడు. అతడు కర్మయోగి కాబట్టి శరీరాన్ని జీవన్ముక్తుడివలె వదలటానికి ఉన్ముఖుడు కాలేదు. దానికి కారణం అతడు జనకుడి వంటి రాజర్షి కాడు. అతడు సమగ్ర కర్మయోగి, అతడి ఉత్తమ సంస్కారానికి మహాప్రస్థానం ఉత్తమగతికి ఉత్తమ సాధనంగా తోచింది. దానికి అనుగుణంగా అతడు తమ తనువులకు కాలపరిపాకం సిద్ధించిందనీ, కాలం సమీపించిందనీ దృఢ నిశ్చయంతో యోగబుద్ధిని అనుసంధించాలని నిర్ణయించాడు. దానికి ఉపబలకంగా కర్మపరిత్యాగాన్ని చేయటానికి సంకల్పించాడు. దానికి తమ్ముల నందరినీ ఒప్పించాడు. కాలపురుషుడి లీలలను అందరికీ తెలియచెప్పాడు. తానెత్తుకొన్న బరువులను ఒక్కొక్కటి దింపుకొన్నాడు. యుయుత్సుడిని రాజ్యరక్షకుడిగా నియోగించాడు. అతడికి రాజ్యనిర్వహణ రహస్యాలు తెలిపాడు. పరీక్షిత్తును హస్తినాపుర ప్రభువుగా అభిషేకించాడు. రాజ్యపాలన విధులను అతడికి బోధించాడు. వజ్రుడిని ఇంద్రప్రస్థ రాజ్యానికి ప్రభువుగా చేశాడు. సుభద్రను ఆ ఉభయ రాజ్యాలకు సంరక్షకురాలిగా నియమించాడు. కృపాచార్యుడిని గురువుగా, ధౌమ్యుడిని పురోహితుడిగా నిర్దేశించాడు. పౌరులకు హితవు చెప్పి పరీక్షిత్తును వారికి ప్రభువుగా ప్రతిష్ఠించాడు. పాండవుల తరువాత సుస్థిర పరిపాలన హస్తినాపురిలో కలిగింది. అతడి ప్రభుత్వపు బాధ్యత తీరింది.

ఆ తరువాత పాండవులు మృతులైన కురు యాదవ వీరులకు విశేష శ్రాద్ధకర్మలు నిర్వహించి, విశేష దానధర్మాలు చేసి పితృదేవతల ఋణం తీర్చుకొన్నారు. నిరంతరంగా తాము సాగిస్తున్న అగ్నికార్యాలకు సాక్షులుగా నిలిచిన అగ్నులను నీట కలిపి నిత్య కర్మలకు ఉద్వాసన పలికారు. ఆపైన నారచీరలు కట్టి, మందిరభోగాలను వదలి, మహాప్రస్థానానికి ఉపక్రమించారు. పాండవులవెంట ద్రౌపదిమాత్రం బయలుదేరింది. సుభద్ర రాజ్యరక్షకురాలుగా నిలిచింది. ఉలూచీ, చిత్రాంగదలు వారి వారి పుట్టిళ్ళకు పోయారు. మహాప్రస్థానంలో పాల్గొన్నది మొత్తం ఏడుగురు. వరుసగా వారు - ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది, వారి వెంట విడువకుండా నడుస్తున్న ఒక శునకం. హస్తినాపురం దాటి వారు యోగప్రస్థానాన్ని చేపట్టారు. స్థిరయోగ సాధనలు సడలకుండా వారు గిరివన నదీనదాలను అవలీలగా దాటి భూప్రదక్షిణంగా తిరిగి హిమవత్పర్వతం దాటి. మేరుపర్వత ప్రాంతాలలో ప్రస్థానం సాగించారు. వారితోపాటు శునకంకూడా యోగప్రస్థానం సాగించి వారందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. అయితే, ధర్మజుడు ఆ శునకాన్ని ఎక్కడా ఏమీ ప్రశ్నించలేదు. భీమాదులూ దానిని పట్టించుకొనలేదు.

**2. మహాప్రస్థానం:**

ప్రస్థానం - అంటే ప్రయాణం. మహాప్రస్థానం అంటే శరీరం పతనమయ్యేంత వరకూ యోగసిద్ధితో సాగించే నిరంతరగమనం. ఇది సమాధిగతులై శరీరంనుండి జీవుడిని బ్రహ్మరంధ్రంద్వారా ఎడలించి ముక్తి ప్రస్థానం చేసే మహాయోగు లనుసరించే యోగమార్గం కాదు. శరీరాన్ని ఉపవాసదీక్షలతో కృశింపచేసి యోగసిద్ధితో భూతలాన్ని తాకకుండా పైకెగసి ఆకాశమార్గంలో చేసే యోగయానం. దేహమనోవృత్తుల సమతులన సాధనద్వారా కర్మయోగులు సాధించే అద్భుతయానం. మహాప్రస్థానం. యోగసాధన కలిగించే ఫలాన్ని ఇస్తుంది. అష్టాంగయోగ ఫలసిద్ధివలననే ఆ ప్రస్థానం సాధ్యమౌతుంది. మహాప్రస్థానంలో భూమిపై పడిన శరీరానికి యోగిశరీరానికివలె దహన సంస్కారాదులు అవసరంలేదు. ఆ దేహంపట్ల శోకమోహాలు పొందకుండా, వెనుదిరగకుండా, నిక్షేపాలు, వికారాలు లేకుండా సమాహిత యోగచిత్తంతో, సంగవిరహితంగా ప్రస్థానం సాగించటం మహాప్రస్థాన లక్ష్యం. మహాప్రస్థానంతో తనువు త్యజించిన వారికి దివ్యలోకాలు లభిస్తాయి. వారు యుద్ధంలో చనిపోయినవారికంటె, యోగంతో తనువులు త్యజించినవారికంటె తక్కువ కారు. పాండవు లందరూ అటువంటి పుణ్యాత్ములు పొందే దివ్యపదాలు పొందాలనే మహాప్రస్థానాన్ని చేపట్టారు.

పాండవుల వెంట ప్రస్థానంలో పాల్గొంటున్న శునకం వారి యోగ ప్రస్థానానికి సాక్షిగా సాగుతున్న యమధర్మరాజు. అతడు తన పుత్రుడైన ధర్మరాజును దివ్యపరీక్ష చేసి దివ్యలోకాలకు పంపాలని అంతటి యాత్రకు నడుం కట్టాడు. పాండవులలో ధర్మజుడు నివృత్తికి, భీముడు ప్రవృత్తికి ప్రతినిధులుగా ప్రతిస్పందించేటట్లు సంఘటనలు సాగాయి. మొట్టమొదట ద్రౌపది యోగబలం సడలింది. ఆమె నేలపై కూలి ప్రాణాలు పరిత్యజించింది. ఆమె స్థితిని చూచి భీము డొక్కడే స్పందించాడు. ఆమె ధర్మం తప్పని ఇల్లాలని దుః ఖించాడు. ఆమె పతనానికి కారణమేమిటని ధర్మరాజును ప్రశ్నించాడు. ధర్మరాజు దుఃఖించలేదు. చలించలేదు. యోగం సడలకుండానే సత్యం చెప్పాడు. ఆమె పాండవు లైదుగురిపట్లా సమమైన అనురాగం కలిగి యోగసిద్ధిని పొందవలసింది. కాని, అర్జునుడివలన పక్షపాతం ప్రదర్శించింది. అందువలన ఆమె పుణ్యం ఫలించలేదు. కాబట్టి ఆ దురవస్థ ఏర్పడిం దని చెప్పాడు. యోగఫలసిద్ధికి పుణ్యకర్మల ఫలసిద్ధి కూడా హేతువనే కర్మఫలయోగాన్ని ధర్మరాజు ప్రతిపాదించాడు. ఆమె కర్మదోషమే దేహపతనానికి కారణమయిందని చెప్పాడు. అయినా, మహాప్రస్థానంలో ఆమె తనువును త్యజించింది కాబట్టి దివ్యలోకభోగాలకు తిరుగు ఉండదని తాత్పర్యం. దానివలన ధర్మరాజు కలత చెందక యోగనిష్ఠతో ముందుకు సాగాడు. భీమాదులు అనుసరించారు.

క్రమంగా సహదేవాదులు యోగం సడలి తనువులను త్యజించారు. భీముడు విషణ్ణుడై హేతువులను తెలిసికొంటూనే ఉన్నాడు. సహదేవుడు నిరహంకారంతో ఎల్లప్పుడూ ధర్మరాజుకు సేవలుచేస్తూ కర్మవీరుడుగా కనబడేవాడు. కాని, అతడు అంతరంగంలో తనకంటె ప్రాజ్ఞుడు లేడని గూఢాహంకారాన్ని ప్రదర్శించేవా డని ధర్మజుడు చెప్పాడు. లోకానికి అనహంకారిగా కనబడేవాడు లోలోన దురహంకారి, బైట ఒక వేషం లోన ఒకవేషం. అందువలన ఆ పాటు తప్పలేదు. నకులుడు కూడా పెద్దలపట్ల ఎప్పుడూ సౌజన్యమూర్తిగా లోకంలో ప్రసిద్ధి కెక్కాడు. కాని, లోలోన తనవంటి అందగాడు లోకంలో ఎక్కడా లేడని గర్విస్తూ ఉండేవాడు. ఈ గూఢాహంకారం అతడి పుణ్యపరిపాకానికి తోడ్పడ లేదని ధర్మజుడు తెలిపాడు. ద్రౌపదీ, నకుల సహదేవులు పడిపోయినందుకు అర్జునుడు లోలోన కుమిలిపోతూ నేలపై పడిపోయాడు. పవిత్ర చరిత్రుడు, సత్యసంధుడు అయిన అర్జునుడి చావుకు కారణ మేమిటని భీముడు అడిగాడు. అతడు కౌరవులనందరిని యుద్ధంలో ఒక్కనాడు సంహరిస్తా నన్నాడు. లోకంలోని కోదండ వీరుల నెల్లప్పుడు నిందించాడు. అన్న మాటను నిలబెట్టుకొనక, పరదూషణ చేసే దోషంవలన అర్జునుడి పుణ్యం ఫలించక అతడి శరీరం పతనమైనదని చెప్పి ధర్మజుడు మోహానికి లోనుగాక ముందుకు సాగాడు. చివరకు భీముడు పడిపోతూ, తన పతనానికి కారణమేమిటని అన్నను అడిగాడు. భీముడు ప్రచండభుజశక్తి కలవాడైనా భోజనప్రీతిని ఎక్కువగా ప్రదర్శిస్తూ ఎదుటివారిని లెక్కచేయక గొప్పలు మాటాడే ప్రగల్భస్వభావంతో కూడిన అహంకారం ప్రదర్శిస్తూ ఉండటంవలన తనువు పడిపోయిందని ధర్మరాజు చెప్పాడు. భీమాదులు ప్రవృత్తి వీరులుగా సోదర ప్రేమను, సతిపట్ల అనురాగాన్ని ప్రదర్శించారు. వారికి సహజంగా ఉన్న మమకార, అహంకారాలే వారి యోగసిద్ధికి ఆటంకాలై మహాప్రస్థానంలో పెద్దవారికంటె ముందుగా శరీరపతనం కావటానికి హేతువులయ్యాయి. భీమాదులలో దోషాలుగా ధర్మజుడు చెప్పినవి మోహాహంకారాలు ప్రగల్భాలు. వాటివలన వారికి శోకాదులు కలిగాయి. యోగం సడలింది. శరీరాలు పడిపోయాయి. మరి ధర్మరాజులో అవి లేవా?

**3. అమరేంద్రుడి ఆహ్వానం:**

ఆ పరీక్షలు నిర్వహించటానికే అమరేంద్రుడు స్వర్గంనుండి స్వర్ణరథంతో దిగి వచ్చాడు. కల్పవృక్షాల కొమ్మలనుండి పూలవానలు కురిపించాడు. మునీంద్రులచేత స్తోత్రపాఠాలు చదివించాడు. దివ్యరథాన్ని ఎక్కుమని ధర్మరాజును కోరాడు. సశరీరస్వర్గం ధర్మరాజు ముందు సన్నద్ధమై ఉన్నది. ధర్మజుడిలో ఏ మాత్రం మోహమున్నా ఎగిరి గంతువేసి రథమెక్కేవాడే కాని, అతడు శోకసంతప్తుడయ్యాడు.

శా. 'తోడంబుట్టువు లందఱుం బడిన యా దుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు; సౌకుమార్యవతి దప్పిం గూలెఁ బాంచాలి; వా
ర్లోడై! వచ్చిరి; వారు లేక యిట మీతో రాను; వారెల్ల నా
తోడంగూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ! కావింపవే!' **(మౌస.1.50)**

అని వేడుకొన్నాడు. ద్రౌపదీ, తమ్ములూ పడిపోయిన సన్నివేశాలను ఉద్విగ్నహృదయుడై భీముడు నివేదించినప్పుడు అత్యంత ధైర్య నిగ్రహవృత్తితో చెదరని యోగ సమాధితో ప్రస్థానం సాగించిన ధర్మరాజు ఇంద్రుడి ఎదుట పత్నీ సోదరుల వియోగ దుఃఖం మనస్సును వివరీతంగా పీడిస్తున్నదని వాపోయి, వారు లేని స్వర్గలోక భోగాలు తనకు అనుభోగ్యాలు కావని చెప్తూ, వారినికూడా అనుమతిస్తే అమరలోకానికి రావటానికి సుముఖత వ్యక్తం చేశాడు.

ధర్మజుడి సమాధానం శ్రోతలో కొన్ని అనుమానాలు రేకెత్తించే అవకాశం ఉన్నది.

1. ధర్మరాజుకు పత్నియందూ, తమ్ములయందూ ఉన్నది సమత్వబుద్ధియా? మోహబుద్ధియా? అతడి మాటలలో కానవచ్చేది బంధుప్రీతియా? ధర్మ ప్రీతియా?

2. తనువులను త్యజించిన తమ్ములను, భార్యను గురించి శోకిస్తున్న ధర్మరాజు సశరీరులుగా వారికికూడా దివ్యభోగానుభవాలకు అవకాశమిమ్మని కోరుతున్నాడా? లేక వారందరూ తనువులను వీడగా తాను తనువుతో స్వర్గభోగాల నెట్లా భోగించేది? అని సంశయిస్తున్నాడా? స్వర్గానుభూతిలో అందరికీ సమత్వాన్ని కోరుతున్నాడా?

3. చివరకు మిగిలే ప్రశ్న - స్వర్గం సశరీరంగా అనుభవించేదా? అయితే తా నొక్కడికే ఆ అవకాశం ఎందుకు కలగాలి? తమ్ములకూ భార్యకూ కలిగించవచ్చును కదా? తోడైవచ్చినవారిని మార్గమధ్యంలో వదలి ఒంటరిగా స్వర్గానికి పోవటం ధర్మమా? ఈ అసమానతలను ఇంద్రుడే తన దయాప్రవృత్తితో తీర్చగలడు. అందుకే ధర్మజుడు అతడిని ప్రార్థించటం.

ఇటువంటి ధర్మసందేహాలన్నీ తీరేటట్లు సముచిత సమాధాన మిచ్చాడు స్వర్గాధిపతి. 1. ధర్మరాజా! నీకు శోక మెందుకు? భార్యా సహితులై నీ తమ్ములు తనువులు వదలి స్వర్గలోకానికి వెళ్లారు. నీవు వారిని అక్కడ చూడగలుగుతావు 2. నీవు ధర్మమయాత్ముడవు కాబట్టి శరీరాన్ని వదలవద్దు. వెంటనే ఈ తనువుతో స్వర్గానికి బయలుదేరుము' అన్నాడు. తనువులు వదలిన తమ్ములను, ద్రౌపదిని తనువుతో వెళ్ళితేనే స్వర్గంలో చూడవచ్చుననీ అప్పుడు శోకం శమిస్తుందనీ - సమాధానం చెప్పి ధర్మజుడిలోని శోకమోహాలను వారించి స్వర్గగమనానికి పునరాహ్వానం పలికాడు పురందరుడు.

**4. ధర్మసంవాదం:**

ఆ తరువాత ధర్మరాజు ఒక ధర్మసందేహాన్ని లేవనెత్తాడు. మొదటినుండి మహాప్రస్థానంలో అత్యంత దృఢభక్తితో అనుసరిస్తున్న ఆ భవ్యశునకాన్ని నిర్దయతో వదలిరావటం న్యాయం కాదనీ, అదికూడా తనతో రావటం ధర్మమనీ ఇంద్రుడిని కోరాడు. ఇంద్రుడు కుక్కకు దివ్యభావం కలగటం అసంభవమనీ, దానిని వదలి రావటం క్రూరత్వం కాదనీ, ఆలస్యం చేయక రథాన్ని ఎక్కుమనీ దేవేంద్రుడు ధర్మరాజును త్వరపెట్టాడు.

ధర్మరాజు ధర్మహానివలన పాపం కలుగుతుందనీ, అది పుణ్యహాని కలిగిస్తుందనీ, దానివలన సద్గతులు దూరమౌతాయనీ, కాబట్టి పాపకార్యానికి తాను తలపడననీ వాదించాడు. సత్పురుషులు ఆశ్రితులను రక్షించాలనీ, భక్తపరిత్యాగంవలన కలిగే సంపద

పరిత్యాజ్యమనీ ధర్మసూక్ష్మాన్ని ప్రతిపాదించాడు. శునకానికి స్వర్గంలో స్థానం లేదనీ, దానిని వదలటంవలన పాపం రాదనీ దేవేంద్రుడు పలికి అతడి పాపభీతిని తొలగించాలని యత్నించాడు. ధర్మరాజు దానికి అడ్డు తగిలి, భక్తితో సేవించేవాడిని వదలితే బ్రహ్మహత్యాదోషం వంటి పాపం కలుగుతుందని పలికి కుక్కను వదలనని ప్రతిజ్ఞ చేశాడు. దానికి శుచికి సంబంధించిన అభ్యంతరాన్ని సురేంద్రుడు ప్రస్తావించాడు. నిష్పాపరులు కుక్కను తాకితే వారి పుణ్యమంతా నశిస్తుందని అన్నారు. 'ఇంత పనికిరాని పని నీవు ఎందుకు చేయాలి? దీనిని నీవు వదిలితే చాలు నీకు స్వర్గసౌఖ్యం లభిస్తుంది' అని మోహపెట్టాడు. ఇంకా ఇట్లా అన్నాడు.

చ. 'జనులు నుతింపఁగా సుకృతసంపదఁ జేసి యమర్త్య భావముం
గనియును జెంద కిట్లునికి కార్యమె? ద్రౌపది, భీమసేను, న
ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత! చాలితి; చాల వయ్యె దీ
శునకము విడ్వ; నిత్తెఱఁగు సూరినుతుండగు నీకు నర్హమే?' **(మహా.1.56)**

ఈ సూటి ప్రశ్నకు ధర్మజుడు రోషంతో, అహంకారంతో సమాధానం చెప్పవచ్చును. కాని, అతడు నిగ్రహించుకొని, నిబ్బరంగా, నిరహంకారంగా మాటాడాడు. 'ధర్మప్రభువులకు ధర్మం నేను చెప్పగలనా? పెద్దలతో వాదం చేయవచ్చునా? అయినా, వినయంతో విన్నవించుకొంటా'నని దోషంలేని పద్ధతిలో దోసిలి ఒగ్గి పలికాడు'. భీమాదులూ ద్రౌపదీ చనిపోయారు కాబట్టి ఏడ్చినా తిరిగి రారని మోహం చంపుకొన్నాను. కాని, చావని ఈ కుక్కను విడువనంటే మీరు తప్పుగా భావించటం న్యాయమా?' అని ప్రశ్నించాడు.

చ. 'అనఘచరిత్ర! విన్ముఁ; శరణాగతుఁ జేకొని కున్కి శుద్ధమి
త్రునియెడఁ జేయు ద్రోహము, వధూటి వధించుట, విప్రునర్థముం
గొనుట యనంగఁగల్గు నివిగూడ సమంబగు; నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచు దోషముతో నిది యోర్వ వచ్చునే?

ఉ. కావున నాకలోకపు సుఖం బటు లుండఁగనిమ్ము దేవ! నీ
భావము నిల్పు నా దెసఁ గృపాభరితంబుగ సారమేయ సం
భావనసేఁత దోసముగఁ బట్టమి నాకు వరంబు, నీవు పొ;
మ్మీ వనభూమి నుండెద సమిద్ధతపంబుల నిన్ను గొల్చుచున్.' **(మహా.1.58.59)**

ఈ వాక్యాలు ధర్మరాజుయొక్క పరిపూర్ణ ధర్మస్వరూపాన్ని ప్రత్యక్షీకరింప చేశాయి. వినయంతో విజ్ఞతను ప్రకటించిన ధర్మరాజు ప్రగల్భోక్తులు పలుకని వాడయ్యాడు. "యోగినః సమదర్శినః" అన్న గీతావాక్యానికి అనువుగా కుక్కయందూ, కుక్కమాంసం తినేవాడియందూ సమంగా వ్యవహరించే సమత్వాన్ని ప్రకటించి యోగనిష్ఠను పోషించుకొన్నాడు. కుక్కను శరణాగతుడిగానూ, భక్తుడిగానూ పోల్చి చెప్పి రాజధర్మాన్నీ దైవధర్మాన్నీ స్పృశించి ఇటు మానవులకూ అటు దేవతలకూ గల ధర్మసామ్యాన్ని ధ్వనింపజేశాడు. అపరాధం చేయని భక్తుడిని వదలటం శరణాగతుడిని వంచించటంవలన కలిగే పాపం మిత్రద్రోహం, వనితావధ, బ్రాహ్మణ ద్రవ్యచౌర్యంవంటి దోషాలవలన కలిగే పాపంకంటె దుర్భరమని పాపచింతను వ్యక్తంచేసి స్వర్గ ప్రాప్తికి ఆ పాపం అడ్డుకట్టవంటి దని ధర్మనిష్ఠను ప్రదర్శించాడు. కుక్క కొరకు స్వర్గభోగాలను ప్రక్కకు పెట్టటం ధర్మరాజుయొక్క మోహరాహిత్యాన్నీ, సారమేయాన్ని సమర్థించటమే పాపమని దేవేంద్రుడు భావిస్తే దానిని క్షమించే వరమిమ్మని కోరే వినయాన్నీ విజ్ఞతనూ ప్రకటించే వివేకాన్నీ ప్రదర్శించాడు. ఒకవేళ ఆ విధంగా కోరటంవలన దేవేంద్రుడికి కోపంవస్తే అతడి అనుగ్రహం కలిగేంతవరకు వనంలో ఉండి తపస్సు చేస్తానని తిరుగులేని నియమశీలాన్ని ప్రదర్శించి దేవేంద్రుడిని ధర్మశీలంతో బంధించాడు. ధర్మవినయ దయాదిగుణ ప్రకాశమైన వాక్యరచనా విధానం విషయ నిరూపణ సమర్థం కావటమే కాకుండా విషయాతీతుడైన దైవాన్నికూడా అర్ద్ర పరిచింది. సారమేయరూపుడైన ధర్ముడు నిలువున పులకించి నిజరూపం ధరించి ధర్మజుడి ధర్మస్థితిని వేనోళ్ళ కీర్తించాడు. పూర్వం ద్వైతవనంలో నీటిమడుగులో

నీరుత్రాగి విగతజీవులైన తమ్ములలో ఒక్కరిని కోరుకొమ్ము బ్రతికిస్తానన్నప్పుడు, ధర్మరాజు తన పినతల్లి పెద్దకొడుకైన నకులుడిని కోరుకొని ప్రదర్శించిన ధర్మనీతిని ప్రశంసించాడు. ఆశ్రితరక్షణధర్మంతో శునకంకొరకు ఇంద్రుడి రథాన్నే ఎక్కనన్న ధర్మజుడి త్యాగశీలాన్ని కీర్తించాడు. ధర్మరాజువంటి ధర్మవీరులు స్వర్గంలో కూడా ఉండరని మెచ్చుకొన్నాడు.

ఉ. "ఇంతటి పెంపు గల్గుట మహేంద్రుఁడు నీ దెస గాంచె; నీవు ని
శ్చింతత మేనితోఁ జనుము సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్;
వింతలు గాకయుండఁ బృథివీవర! నీకు నుదారసౌఖ్య మ
త్యంతము నవ్యయంబు నగు నందలి మాన్యులు సంస్తుతింపఁగన్. **(మహా.1.66)**

అని ప్రోత్సహించాడు. ఇంద్రాది దేవతలందరూ కలసి ధర్మరాజు నెత్తికొని దివ్యరథంలో ఉంచి, దాని ప్రక్కన తమ రథాలు నడపుకొంటూ, సిద్ధగణాలు స్తుతిస్తూ ఉండగా స్వర్గలోకానికి పరమాహ్లాదంగా తీసికొనివెళ్ళారు.

ఆ దివ్యసన్నివేశాన్ని చూచి నారదమహర్షి ఎల్లవారును వినేటట్లు సంపూర్ణస్వరంతో ఇట్లా ధర్మజుడి ప్రశంసను ప్రకటించాడు.

ఉ. "దానములం దపంబులను దద్దయుఁ బేర్కలయట్టి వారలన్
మానవనాథులన్ వినమె? మాసె దదీయ యశంబులెల్ల నీ
మానిత కీర్తిదీప్తులు సమస్త జగంబులయందుఁ బర్వుట
న్మేనులతోడ వా రిటుల నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్.' **(మహా.1.69)**

పూర్వ ప్రభువులు చాలామంది స్వర్గాన్ని పొందారే కాని, బొందితో స్వర్గాన్ని అధిరోహించినవారు లేరనీ, ధర్మరాజుకే ఆ పుణ్యం దక్కిందనీ దేవర్షి ప్రకటించాడు. మహాప్రస్థానికపర్వంలో అద్భుతం ధర్మజుడు మేనితో స్వర్గారోహణం చేయటం.

అది కలిగించిన మరొక అద్భుత మేమిటంటే తనకంటె ముందు తనువులు చాలించి స్వర్గంలో నివసిస్తున్న తమ్ములను, భార్యను, తన పక్షంవారైన శూరులనూ చూడాలనే కోర్కె కలగటం, వనవాసం చేస్తున్న ధృతరాష్ట్రుడు వ్యాసమహర్షిని కోరినవరం కూడా ఇటువంటిదే. అప్పుడు గంగనుండి దివ్యదేహాలతో వెలువడిన వీరవర్గాన్ని దర్శించాడు ధర్మరాజుకూడా. ఆ తరువాత ధృతరాష్ట్రుడు. గాంధారి, కుంతి, తమ్ములు, ద్రౌపది మొదలైనవారు దివంగతులయ్యారు. వారినందరినీ స్వర్గంలో చూడవచ్చునని ఇంద్రుడు సూచించాడు. అమరనాథుడు అడగకుండా ఇచ్చిన అపూర్వమైన వర మది. దానిని ప్రసాదింపజేయండని దివ్య మహర్షులను ముందుగా కోరాడు. ధర్మరాజు కాని, నారదాదులు ఆ కోర్కెను వారించారు. అపారపుణ్య ఫలంగా దివ్యదేహాలుండే స్వర్గంలో ప్రవేశించి మానవ దేహ వికారమనస్కతతో బంధుమిత్రులపై దేహబంధమమకారాలను పెంచుకొని దర్శించాలని కోరటం దేవతలు మెచ్చే కార్యంకాదని నచ్చచెప్పటానికి యత్నించాడు. కాని, ధర్మజుడు వారి అభ్యంతరాన్ని పట్టించుకొనలేదు. సరాసరి దేవేంద్రుడినే తెగవేసి అడిగాడు.

ఉ. 'మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్న దైత్య! యే
గారవ మొప్పఁ దమ్ములను గాంతను బుత్త్రుల మిత్రకోటిఁ గ
న్నారఁగఁ జూడకుండుటకు నక్కట యోర్తునె? యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్." **(మహా.1.75)**

అమరలోకానికి భౌతికకాయంతో వచ్చిన భూపతి కోరే కోరిక అమరపతికే అద్భుతంగా తోచవచ్చును. మరి తనువుతో ధర్మరాజును దివ్యలోకానికి దేవతలు ఎందుకు తెచ్చినట్లు? అది మేరుపర్వతమంత ప్రశ్న. దీనికి అద్భుతమైన సమాధానం చెప్పటమే మహాభారతేతిహాసకథా నిర్వహణంలోని నిజమైన అద్భుతం. అందుకే స్వర్గారోహణపర్వం స్వతంత్ర పర్వంగా సముద్భవించింది.

# స్వర్గారోహణపర్వం

**1. మూడు రంగాలు:**

ధర్మరాజుకు ఏర్పడిన ధర్మపరీక్షలు రెండు విధాలు: అవి మానవ పరీక్షలు, దైవపరీక్షలు, మానవకృతపరీక్షలలో కృష్ణ భీమార్జునుల శక్తి యుక్తులను ఉపయోగించుకొని విజయాలను సాధించాడు. దైవకృతమైన ధర్మపరీక్షలలో స్వీయమైన యోగశక్తిని, ధర్మప్రవృత్తిని ఉపయోగించి సర్వ స్వతంత్రుడై వ్యవహరించి మానవులను, మహర్షులను, దేవతలను మెప్పించి తన ఉత్తమ ధర్మవీర నాయకత్వాన్ని నిలుపుకొన్నాడు. దైవపరీక్షలలో మకుటాయమానమైనది స్వర్గారోహణపర్వంలో నిర్వహించబడే చరమపరీక్ష. ఇది విలక్షణమైనది. దీనిలో ప్రదర్శించబడే ధర్మస్థితికి 'దేవత్వమే' ఫలం!

ఇతిహాసంలో నాయకుడు పొందే కర్మఫలానుభవాన్ని కూడా చిత్రించటం ఒక మహాసంప్రదాయం. మహాభారతంలో ఆ భాగం సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దబడింది. ఆ నిర్వహణ శిల్పం స్వర్గారోహణ పర్వంలో నాటకీయంగా, అద్భుతంగా చిత్రించబడింది. ఇందులో ప్రధానంగా మూడు రంగాలు ఉన్నాయి. మూడు అద్భుతాలు ఉన్నాయి. ముప్పేటగా సాగే ఈ కథా సంవిధానం దేవలోకంలో చిత్రించబడిన ధర్మజ ధర్మవీర దివ్యవిలాసం.

దీనిని ఈ విధంగా విశ్లేషించవచ్చును.

1. ధర్మరాజు పాంచభౌతిక శరీరంతో స్వర్గలోకంలో ప్రవేశించినా, ఆ శరీరంతో ఎటువంటి భోగాలు అనుభవించగలడు? శరీర వికారాలకు స్వర్గనరక భోగాలు అందుతాయా? అయితే ఆ రెండు లోకాల భోగాలనూ ధర్మరాజు శరీరానికి అందించి అనుభవింపజేసే మార్గం ఏమిటి? ఆ వ్యూహాన్ని చిత్రించి నిర్వహించిన దర్శకులు స్వర్గనరకాధిపతులు మహేంద్రుడు, యముడు, ప్రక్కనుండి సమీక్షిస్తూ సమయోచిత సూచనలను, ప్రశంసలను అందించిన మార్గదర్శులు మహర్షులు. వీరందరు కలిసి ఆడిన స్వర్గనరక మాయాదర్శన రంగం ప్రథమరంగం.

2. స్వర్గనరకాలలో సంచరించేటప్పుడు శరీరానికి సంబంధించిన రాగద్వేషాలకు మనస్సులోనైనా, ధర్మవర్తనంలో ధర్మరాజు స్థిరంగా నిలువగలుగుతాడా లేదా అన్న పరీక్ష చేయటం రెండవరంగం. దుర్యోధనుడు స్వర్గభోగాలు అనుభవిస్తున్న దృశ్యం ధర్మరాజుకు అసూయ కలిగించింది. దానివలన స్వర్గభోగాల మీద అసహనభావం ఏర్పడింది. కర్ణభీమాదులు నరకలోకయాతనలు అనుభవిస్తున్నారని తెలిసిన ధర్మజుడు- దుస్సహమైన నరకంలో వారితో కలిసి ఉండటమే తనకు ఆనందమని ప్రకటించటం అతడి. ధర్మ ప్రవృత్తికి ప్రతీకగా నిలిచింది. స్వజనం కొరకు స్వర్గాన్ని కాదన్న ధర్మజుడి ప్రవృత్తి యమధర్మరాజును ఆనందంలో ముంచెత్తింది. అది దేవేంద్రుడూ తానూ కలిసి పెట్టిన దివ్యపరీక్షగా ప్రకటించి ధర్మజుడి ఉత్తమ ధార్మిక ప్రవృత్తిని ఉదాత్తంగా కీర్తించాడు. ఉత్తమ ధర్మవీరుడి శరీరధారణం స్వర్గనరకభోగ పరీక్షలో నిగ్గు తేలటం ఈ ద్వితీయరంగ ప్రయోజనం.

3. స్వర్గంలో శరీరంతో అనుభవించే అనుభవం లేదనే రహస్యం తెలిసిన తరువాత కూడా ధర్మరాజు తనువుతో తనవారిని స్వర్గంలో చూడాలని అనుకొనటం ఎంతటి భ్రాంతిమూలమో తెలపటం జరిగింది. స్వర్గవాసులు దివ్య దేహాలతో ఉంటారు. వారిని దివ్యదేహులే చూడగలరు. అందువలన ధర్మరాజు ఆకాశగంగలో మునిగి పాంచభౌతికకాయాన్ని వదలి, దివ్యదేహాన్ని ధరించి కర్ణాదులను దర్శించవచ్చునని యమదేవేంద్రులు చెప్పి, ఒప్పించి దివ్యగంగలో మునిగేటట్లు చేశారు. ధర్మరాజు తనువును గంగలో త్యజించి దివ్యదేహంతో వెలువడి తనవారిని దివ్యదేహులుగా దర్శించాడు. విశేష మేమంటే - ఆ దివ్యదేహాలకు, భౌతికకాయ స్పృహలు లేవు. ధర్మరాజుకూ తమ స్పృహ లేకపోవటంచేత అహంకార మమకార బంధాలు అతడికి స్ఫురించలేదు. పొగలేని అగ్నివలె ధర్మరాజు వెలుగొందుతూ దేహానుబంధాలు లేని దివ్యత్వాన్ని అనుభవించాడు. ఈ అనుభవం కలగటానికి దేవేంద్రుడు, యముడు, నారదాది మునీంద్రులు సహకరించారు. ధర్మరాజు చివరకు తేజోరూపంతో ధర్ముడిలో లీనమైపోయాడు. ఇది అద్భుతాంతమైన చివరిరంగం. దీనితో స్వర్గారోహణపర్వమే కాదు మహాభారతేతిహాసం కూడా పరిపూర్ణమౌతుంది.

**2. ఆరోహణమే కాని అవరోహణం లేదు:**

'స్వర్గారోహణం' అనే సమాసం సార్థకమైనది. స్వర్గమోక్షాల రెండింటిలో ఆరోహణం ఉన్నా, 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అనే గీతా వాక్యం ప్రకారం స్వర్గం నుండి మాత్రమే పుణ్యభోగానంతరం జీవులు మర్త్యలోకానికి 'అవరోహణం' చేసే అవకాశం ఉన్నది. దానిని స్ఫురింపజేసేది మొదటి అర్థం. అంటే పాండవాదులు తాము చేసిన పుణ్యకర్మల ఫలితంగా స్వర్గాన్ని పొందుతారు. పుణ్యఫలాలను అక్కడ అనుభవించి మరల భూలోకంలో జన్మలెత్తుతారు. ఈ సంసారచక్రాన్ని స్ఫురింపజేసే అర్థం ఆ శీర్షికలో ధ్వనింపజేయబడుతుంది. స్వర్గారోహణపర్వం ఇంతకంటె విశిష్టమైన అర్థాన్ని కూడా అందిస్తుంది. అప్పుడే దాని అర్థం సార్థకమౌతుంది.

మహాభారత కథనంతా విని జనమేజయుడు వైశంపాయనుడిని ఒక ప్రశ్న అడుగుతాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్న వీరులందరూ స్వర్గానుభవాలను పొంది తిరిగి మర్త్యలోకంలో పుట్టారా? అని, దానికి వైశంపాయనుడు ఒక దేవరహస్యం చెప్పాడు. అది వేదవ్యాసుడే చెప్పాడని వెల్లడించాడు. భారతయుద్ధం శ్రీకృష్ణావతార లీలా విశేషంలో భాగంగా జరిగిందే కాబట్టి ఆ తరంలో పుట్టిన వారందరూ కారణ జన్ములనీ, వారందరూ దేవాంశలలోనో, రాక్షసాంశలలోనో, గంధర్వాది దేవయోనుల అంశలలోనో పుట్టినవారనీ, వారందరూ శరీరాలను వదలి కర్మఫలానుభోగాలను స్వర్గనరకాలలో అనుభవించి, చివరకు వారి వారి మూల ప్రకృతులలో భాగాలుగా కలిసిపోయారే కాని పునర్జన్మలు ఎత్తలేదని తెలిపారు. అందువలన మహాభారత పాత్రలన్నీ పునర్జన్మలెత్తని వారే అయితే వారందరూ పొందింది మోక్షం మాత్రం కాదు. దానాలూ, ధర్మాలూ, యజ్ఞాలూ, తీర్థయాత్రలూ, వ్రతాలూ, తపస్సులూ, యుద్ధాలూ మొదలైన పుణ్యకర్మలవలన ఆయా యజమానులు వివిధ పుణ్యలోకాలు పొందుతారు. వాటి నన్నింటినీ స్వర్గలోకంలోని భాగాలుగానే పరిగణించటం పరిపాటి. అందువలననే.

తే. 'రాజసూయశ్వమేధాధ్వరముల సంచి। తంబు లయిన యుదాత్తలోకంబు లనుభ
వింపు మాధిక్య మహనీయ విభవ మెసఁగ। నక్షయోదార సౌఖ్యంబు లావహిల్ల.' **(మహా.1.44)**

అని మహేంద్రుడు ధర్మరాజుకు ఆయా లోకానుభవాలను స్వర్గానుబంధంగా నియోగించాడు. ధర్మరాజు చివరకు యమధర్మరాజులో లీనం కావటం కూడా స్వర్గారోహణంలోనికే వస్తుంది. అంటే మహాభారత పాత్రలకు స్వర్గపరంగా ఆరోహణమే కాని, అవరోహణం లేదని ఈ పర్వం ప్రకటించే పరమతాత్పర్యం.

**3. పద్యత్రయం: పర్వహృదయం:**

ఆదర్శ ధర్మవీరుడైన ధర్మరాజు ఉత్తమ కర్మవీరుడు. కర్మయోగానికి సంబంధించిన సర్వధర్మభోగాల అనుభవం అతడి జీవితంలో చూచాడు. చాలావరకు అనుభవించాడు. లోకాంతర వర్తనంలోకూడా తదనుభూతిని దేవేంద్ర యమధర్మరాజుల అనుగ్రహంవలన తెలుసుకొన్నాడు. మహేంద్రుడి ఉపదేశం కర్మఫలోపనిషత్తు వంటిది.

క. 'విను మొక్కటి సెప్పెద రా। జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర! యె
ట్లును నారకస్థలంబుం। గనుఁగొన వలయు; టిది వేదకథితము సుమ్మీ!'

సీ 'పుణ్యంబులును బాపములు రెండు జోకలై। యుండుఁ; బుణ్యంబుల నొదవు నాక
సుఖము పాపంబులఁ జొప్పడు నరక దుః। ఖము; విను మున్ను నాకంబు సుఖము
ననుభవించిన యట్టి యతఁడు పదంపడి। యధిక నారకపీడ ననుభవించు;
మున్న నారకదుఃఖమునఁ బడ్డవాఁ డనం। తరమ నాకమునఁ దాఁ బొరయు సౌఖ్య;

తే. మల్పపుణ్యుండు తొలి తొలి యమరతా సు। ఖంబు గయికొని మఱియు దుఃఖముల నొందు;
భూరిపుణ్యుండు మునుమును ఘోరనిరయ। యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు.'

క. ఇట నేను నిన్నుఁ బుత్తెం। చుట యుత్తరకాల దివ్యసుఖ సంగమ సం
ఘటనకుఁ గాదే? నీ కట। కటఁబడుటకు దీనిఁ దెలుపఁగా రావలసెన్.' **(మహా.1.38-40)**

స్వర్గారోహణపర్వ సారం ఈ పద్యత్రయం.

కవిత్రయం రచించిన ఆంధ్రమహాభారతం తెలుగులో వెలసిన పంచమవేదం.

తే. అమల ధర్మార్థ కామమోక్షముల గుఱిచి । యొలయు తెరు వెద్దియును నిందుఁగలుగు; నదియ
యొండెడలఁ గల్గు; దీన లేకుండు చొప్పు । దక్కొకంటను లేదు వేదజ్ఞులార!' **(మహా.1.82)**

**మహాభారతం: శాంతరసం: ధర్మవీరం:**

శాంతానికి రసస్థితి నంగీకరించే లాక్షణికులలో ప్రధానంగా వినవచ్చే వాదాలు రెండు. ఒకటి శాంతరసం నవమరసమని వివేచించేది ('నిర్వేదస్థాయి భావాత్మకః శాంతోఽపి నవమో రసః'-కావ్యప్రకాశమ్) మరొకటి శాంతం ప్రకృతిరసమని ప్రతిపాదించేది.

'భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః।
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే॥
స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే।
పునర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రలీయతే॥' **(నాట్యశాస్త్రమ్ 1.107-108 అభినవభారతీసహితమ్)**

రసస్థితిని అంగీకరించటంలో ఈ రెండూ సంవదించినా వాదంలో వీటిమధ్య కొంత అంతరం కనబడుతుంది. శృంగారాది రసాలవంటిదే శాంతమని చెప్పే పద్ధతి మొదటిది. శృంగారాదులను వికృతిరసాలుగా వివేచించి వాటి ఉదయానికీ, ఉపశాంతికీ వెనుక మూలకందమైన నిర్వికారచిత్త వృత్తిని ప్రకృతిరసంగా భావించేది రెండవది. సహజమైన ఈ భేదాన్ని ఈ రససమన్వయ మార్గాలలో పాటించాలి.

ఈ పర్యాలోచనలో రసం సహృదయనిష్ఠలం అన్న సత్యం నిర్వివాదాంశం. 'యేషాం కావ్యానుశీలనవశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీ భవన యోగ్యతా తే హృదయ సంవాద భాజః సహృదయాః' అనే ధ్వన్యాలోక సహృదయ లక్షణం ప్రమాణం. కావ్యంలో నాయకాదుల నాశ్రయించి ప్రతీయమాన మయ్యే స్థాయిభావాలను తన్మయీ భవన యోగ్యతతో హృదయసంవాద భాక్కులై అనుభవించేవారు సహృదయులు. వారి అనుభవం నాటకాదులతో అయిన సమరూప చిత్తవృత్తి రూపమైన భావసంవాదం. అందువలననే శారదాతనయాదులు "యస్తుష్టౌ తుష్టి మాప్నోతి? శోక ముపైతి చ । క్రోధే క్రోద్ధో భయే భీరు । స్స శ్రేష్ఠః ప్రేక్షక స్స్మృత॥" (భావప్రకాశమ్) అని పేర్కొనటం, నాయకాశ్రితమైనది రతి అయితే సహృధయానుభవనిష్ఠ మయ్యేది శృంగారరసం. నాయకాశ్రితమైన స్థాయినే వ్యవహార సౌలభ్యం కొరకు రస మంటారు కాని రసం సామాజికనిష్ఠమైనదే.

శాంతం ప్రకృతి రసమన్న వాదాన్ని స్థాపించినవాడు అభినవగుప్తుడు. నవమరసంగా ఆ రసాన్ని స్థాపించటంలో కానవచ్చే కొన్ని అనుపపత్తులను తొలగించటానికీ, శాంతరసస్థాయి భావ కోలాహలాన్ని శాంతింపజేయటానికీ ఒక మహామంత్రంగా ఆయన ఆ క్రొత్తబాటను నిర్మించాడు. అది ఒక రససమీకరణవాదంగా రూపొందింది.

అభినవగుప్తుడు శాంతరసానికి తత్త్వజ్ఞానం స్థాయి భావమని ప్రతిపాదించి స్థాపించిన తీరు. పరమరమణీయం, పరమ ప్రమాణం ఆయన 'శాంతరస ప్రకరణ' ప్రవచనాన్ని మనం రెండంశాలుగా విభజించుకొని పరిశీలించవచ్చును. 1. స్థాయిభావ స్వరూప స్వభావ విచారం. 2. శాంతరసాస్వాదన విధాన విచారం.

**1. తత్త్వజ్ఞాన (స్థాయిభావ) స్వరూపస్వభావాలు:**

1. తత్త్వజ్ఞానమే మోక్షసాధనం కాబట్టి తత్త్వజ్ఞానమే స్థాయి. తత్త్వజ్ఞానమంటే ఆత్మజ్ఞానమే. జ్ఞానానందాది విశుద్ధ ధర్మ యుక్తమైనదీ. పరికల్పిత విషయోపభోగరహితమైనదీ అయిన ఆత్మయే శాంతానికి స్థాయి. దీనిని స్థాయి అని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.[1]

---

1. 'కస్తర్హ్యత్రస్థాయీ? ఉచ్చతే - ఇహతత్త్వజ్ఞానమేవ తావన్మోక్ష సాధన మితి తస్యైవ మోక్షే స్థాయితా యుక్తా తత్త్వజ్ఞానం చవా మాత్మజ్ఞాన మేవ.. తేవ ఆత్మైవ జ్ఞానానందాది విశుద్ధ ధర్మయోగీ పరికల్పిత విషయోపభోగ రహితోఽత్ర స్థాయీ. న చాన్య స్థాయి తయా స్థాయిత్వం వచనీయం' (అభినవ భారతి - పరిష్కృత శాంతరస ప్రకరణమ్ - Number of Rs - Prof v.Raghavan - పుట 97

2. తత్త్వజ్ఞానం సకల భావాంతర భిత్తిస్థానీయం. సర్వస్థాయి భావాలకంటె అది స్థాయితమం. రత్యాది చిత్తవృత్తులన్నీ ^¥H‡‹ ©K©ï□°. JO^ Î=□# Jk x‹ ¬¾Ø ‹ ^ bê □Öò ƒ ì=Q[2]

3. రత్యాదులకూ తత్త్వజ్ఞానానికీ భేదం ఉన్నది. రత్యాదులు భిత్తవృత్త్యంతర సంయుక్తాలై కలుషితాలౌతాయి. వాటికి లౌకిక ప్రతీతి ఉన్నది. తత్త్వజ్ఞానం చిత్తవృత్త్యంతరానుసంధానం కలిగినా అవికల్ప రూపంగా ఉంటుంది. దానికి లౌకిక ప్రతీతి ఉండదు. లోకంలో ఇది కొంత భావించినా, రత్యాదిస్థాయి భావాలవలె దీనిని పరిగణించటానికి వీలు లేదు. సాధ్యరసాలైన శృంగారాదులలో సిద్ధరసమైన శాంతానికి ఉపయోగం లేదు. తత్త్వజ్ఞానం ఎప్పుడూ సంచారిభావంవలె లక్షణీయం కాదు.[3]

**2. శాంతరసాస్వాదనవిధానం:**

1. తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితులే ఇందులో సహృదయసంవాదాన్ని పొందగలుగుతారు.[4]

2. తత్త్వజ్ఞానం, శమం - సర్వం ఆత్మరూపమే రత్యాదులు ఆత్మలోని కాలుష్యోపరాగ విశేషాలు. తత్త్వజ్ఞాన సిద్ధుడైన సహృదయుడు రత్యాదులను అనుగమించినా, సమాధినుండి వ్యుత్థిత చిత్తుడైనా అవ్యవధానంగా సమాధిబలంచేత దానిని అధిగమించి, ప్రశాంతచిత్తు డౌతాడు.[5]

---

2. 'తత్త్వజ్ఞానం తు సకల భావాంతర భిత్తిస్థానీయం: సర్వస్థాయిభ్య; స్థాయితమం; సర్వా రత్యాదికా; చిత్తవృత్తి; వ్యభిచారి భావయిన్ నిసర్గత ఏవ సిద్ధస్థాయిభావ మితి త న్నవచనీయమ్'' - పరిష్కృత శాంతరస ప్రకరణమ్ N.O.R - పు98

3. 'సహ రత్యాదయ ఇవేతరా సంపృక్తేన వపుషా తథావిధ మాత్మరూపం లౌకిక ప్రతీతి గోచరం స్వగతమపి అవికల్పరూపం వ్యుత్థానాపసరే నుసంధేయమానం చిత్తవృత్త్యంతర కలుష మేవావభూతి భాసతాం వా లోకే తథా; తథాపి న సంభవ న్మాత్ర స్థాయినాం గణనమ్, రసేషూక్తేషు అనుపయోగాత్, అపి తు వ్యభిచారిత్వేన లక్షణీయత్వం విజ్ఞాయతే, నే తరతా''. ప. శాం. ప్ర N.O.R - పుట 98.

4 "హృదయసంవాదోఽపి తథావిధ తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితానాం భవత్యేవ''. (ప. శాం. ప్ర N.O.R - పుట 103).

5. "తదిద మాత్మస్వరూప మేవ తత్త్వజ్ఞానం శమః, తథా చ తత్కాలుష్యోపరాగ విశేషా ఏవాత్మవో రత్యాదయః, తదనుగమేఽపి శుద్ధ మస్య రూపం అవ్యవధాన సమాధిబలా దధిగమ్య వ్యుత్థానేఽపి ప్రశాంతతా భవతి.'' (ప. శాం. ప్ర N.O.R - పుట 99).

3. శాంతం సర్వరస ప్రకృతి. ఇతర రసాలు సంస్కారాంతరాలతో ఉంటాయి. శాంతం సర్వసంస్కార మూలప్రకృతి. విషయ విపరివృత్తివలన సర్వరసాలూ పర్యంతాన శాంతంగానే అస్వాదనీయా లౌతున్నాయి.[6]

4. తత్త్వాస్వాదన స్వరూపం ఇట్లా ఉంటుంది. రత్యుత్సాహాదులన్నీ ఉపరాగాన్ని కలిగిస్తాయి. దానివలన ఆత్మస్వరూపం ఉపరంజితమై వాటియందు అనుభూతమౌతుంది. విరళంగా కూర్చబడిన రత్నాలలో సితతరంగా నిర్భాసించే సూత్రంవలె ఉపరంజకాలైన రత్యాదులలో ఆత్మస్వరూపం గోచరిస్తుంది. రత్యాదు లేవీ ఉపరంజకాలుగా లేకపోయినా ఆత్మవలె ఆత్మజ్ఞానం భాసిస్తుంది. అట్లా భాసమానమైన తత్త్వజ్ఞానం విషయ పరాఙ్ముఖత్వంవలన సకల దుఃఖ విరహితమై పరమానంద లాభంతో సంవేదకరూపమై ప్రకాశిస్తుంది. కావ్య ప్రయోగబంధాల వలన సాధారణరూపంలో నిర్భాసించి, అంతర్ముఖావస్థా భేదంతో లోకోత్తర ఆనందాన్ని ఇచ్చి సంవిన్మయమైన హృదయసంవాదాన్ని కలిగిస్తుంది.[7]

పై అంశాలను క్రోడీకరించుకొని శాంతరస సమాలోచనం చేస్తే ఈ క్రింది విధంగా వివేచించాలి.

1. నిసర్గసిద్ధమూ, స్థాయి తమమూ, ఆత్మజ్ఞానరూపమూ, సర్వరస ప్రకృతి భూతమూ అయిన స్థాయివలన కలిగే రససిద్ధి వికృతి రససిద్ధికంటె విశిష్టమై ఉండాలి.

2. రత్యాదులు వికృతులైతే ప్రకృతి అయిన ఆత్మజ్ఞానం నిర్వికారంగా నిలిచేది అయి ఉండాలి. అయితే అది ప్రాగభావం కాకుండా ప్రధ్వంసాభావమని తృష్ణాక్షయ సుఖస్థాయి విచారంలో అభినవగుప్తుడు నిర్దేశించాడు.[8]

3. రత్యాదులు సహృదయులకు రసానందాన్ని కలిగిస్తే, స్థాయితమమైన తత్త్వజ్ఞానం జ్ఞానానందాది విశుద్ధ ధర్మమైన ఆత్మస్వరూపంలో అభిన్నం కాబట్టి, దానివలన కలిగేది జ్ఞానానందమని నిర్దేశించవచ్చును.

4. శాంతరసాస్వాది అయిన సహృదయుడు సహజంగా తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితుడుగా ఉండాలి. కాబట్టి వీతరాగుడైన జిజ్ఞాసువే ఈ రససిద్ధికి తగిన అధికారి. జిజ్ఞాస మోక్షదాయకం కాబట్టి మోక్షపురుషార్థనయమైనదే శాంతం.[9]

5. రసం సామాజికనిష్ఠం కాబట్టి సహృదయుడి తత్త్వజ్ఞానమే శాంతానికి స్థాయి.

6. మోక్షపురుషార్థ సాధనైక వృత్తి గల సహృదయుడికి కావ్యరసాస్వాదన ప్రవృత్తియే ఒక వికృతి. ఆ వికృతి నాశ్రయించి అతడు ముందుకు సాగినా అతడి ఆత్మ తత్త్వజ్ఞానం రత్నహారంలోని దారంవలె ఉపరంజితమైనా, కాకపోయినా స్వస్వరూప ప్రకాశంతో నివృత్తి రూపంగా శోభిస్తూ ఉంటుంది.

---

6. "తత్ర సర్వరసానాం శాంత ప్రాయ ఏవాస్వాదః, విషయేభ్యో విపరివృత్యా, తన్ముఖ్యతాలాభః కేవలం వాసనాంతరోపహిత ఇతి- అత్ర సర్వప్రకృతి త్వాభిధానాయ పూర్వ మభిధానమ్". (ప.శాం.ప్ర.N.O.R - పుట 104).

7, "రత్యాస్వాదోఽస్య కీ దృశః? - ఉచ్యతే - ఉపరాగదాయిభిః ఉత్సాహరత్యాది రుపరక్తం యదాత్మ స్వరూపం తదేవ విరళోంభిత రత్నాంతరాళ నిర్భాసమాన సతతర సూత్రవత్ యదాహిత తత్స్వరూపం సకలేషు రత్యాదిషు ఉపరంజకేషు తథాభావే నాపి సకృద్విభాతోఽయ మాత్మేతి న్యాయేన భాసమానం పరాఙ్ముఖతాత్మక సకల దుఃఖజాలహీనం పరమానందలాభ సంవిదేకత్వేన కావ్య ప్రయోగబంధాభ్యాం సాధారణతయా నిర్భాసమానం అంతర్ముఖావస్థా భేదేన లోకోత్తరానందానయనం తథావిధహృదయం విధత్త ఇతి." (ప.శాం.ప్ర.N.O.R - పుట 106).

8. "అన్యే తు స్వం స్వం నిమిత్త మాసాద్య..ప్రతీయతే ఇతి భరతవాక్యం దృష్టవన్తః సర్వ రససామాన్య స్వభావం. శాన్త మాచక్షాణా అనుపజాత విశేషాన్తరం చిత్తవృత్తిరూపం శాన్తస్య స్థాయిభావం మన్యన్తే. ఏతచ్చ నా తీవాస్మత్పక్షాద్దూరమ్. ప్రాగభావ ప్రధ్వంసాభావ కృతస్తు విశేషంః, యుక్తశ్చ ప్రధ్వంస ఏవ తృష్ణానామ్" -(లోచనవ్యాఖ్యా, ధ్వన్యాలోకః- నిర్ణయసాగర ప్రతి (1935)- పుట. 220)

9. "తతః త్రివర్గఫలక రసానంతరం మోక్షఫలక శ్శాంతః" - అభినవభారతీ, నాట్యశాస్త్రమ్. 24 అధ్యా.

7. రత్యాదులు శకుంతలా దుష్యంతాదులైన విభావాదులను ఆశ్రయించి ప్రతీయమానమౌతుంటే వాటిని సహృదయుడు తన్మయీభవన యోగ్యతతో హృదయసంవాదాన్ని బోధించి అస్వాదిస్తాడు వికృతిరస వివేకంలో. కాని, ప్రకృతిరస వివేకంలో తత్త్వజ్ఞానం నాయకాశ్రితం కావచ్చును. కాకపోవచ్చును. అసలు కావ్యంలోని రత్యాది రసభావాలు కావు. ప్రకృతి రసాస్వాదన పరుడైన సహృదయుడికి ప్రధానం. మోక్షదాయకమైన తత్త్వజ్ఞానమే ముఖ్యం. ఇందువలన కావ్యంలోని తత్త్వజ్ఞానోపదేశమే అతడికి స్థాయి. ప్రకృతిరసమెప్పుడూ కావ్యగత శాస్త్రరూపమైన తత్త్వజ్ఞానాన్ని ఆశ్రయించే స్థాయిత్వాన్ని భజిస్తుంది.

8. ప్రకృతి రస ప్రతీతి సహృదయుడి ఆత్మ స్థితమై ఉండటంచేత తత్త్వజ్ఞానం ప్రధానంగా ఆత్మరతి రూపంగానే భాసిస్తుంది. నిజానికి అతడు తనతోనే తాను తాదాత్మ్యం పొందుతాడు. తన ఆత్మజ్ఞానంతోనే సంవదిస్తాడు. కావ్యార్థాలు అతడికి నిమిత్తసూత్రాలు. కారణమాత్రాలు. పర్యంతంలో నిలిచే స్వస్వరూప సంవిదాత్మకమైన సమాధిస్థితియే అతడి రసస్థితి.

9. ఈ దృష్టితో వివేచిస్తే రత్యాదిస్థాయి భావాలవలన సహృదయుడు పొందేది రసానందం; స్థాయితమమైన తత్త్వజ్ఞానంవలన వీతరాగులు సవికల్పమైనా నిర్వికల్పతను సాధించే చిత్తవృత్తియందు అంతర్ముఖావస్థలో పొందేది జ్ఞానానందం: బహిర్విషయ విముక్తుడై నిర్వికల్ప సమాధిలో బ్రహ్మానుసంధానంవలన యోగి పొందేది బ్రహ్మానందం. మొదటిది అలౌకిక రసానందం; రెండవది లోకోత్తర పరమానందం; మూడవది నిర్వికల్ప బ్రహ్మానందం.

10. శాంతం నవమరస మని అంగీకరిస్తే దానివలన కలిగేది రసానందమే: ప్రకృతి రసమని వివేచిస్తే మోక్షసాధనమైన జ్ఞానానందమౌతుంది. రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి మాత్రమే. జ్ఞానానందం మోక్షోపస్కారకం కూడా. ఒక బ్రహ్మానందమే సాక్షాన్మోక్షస్థితి. ఈ విధమైన వివేచనం లక్షణవిరుద్ధం కాదు. దీనికి దృష్టాంతం మహాభారతంలో శాంతరస సాధనం.

### 3. ఆనందవర్ధనుడి శాంతరస ప్రస్తారం: అభినవగుప్తుడి పరిష్కారం:

శాంతరస అభావ వాదాన్ని ఖండిస్తూ ఆనందవర్ధనుడు తృష్ణాక్షయ సుఖస్థాయిభావాన్ని అంగీకరించాడు. కాని, దానిని ప్రకృతి రసమని కాని, స్థాయితమ మని కాని నిర్దేశించలేదు. అయితే అందరికీ తృష్ణాక్షయ సుఖచిత్తవృత్తి అలవడటం సాధ్యం కాదనీ, ఏ కొద్దిమంది మహామహులలోనో అది సిద్ధమైనా దానిని శాంతరస మని అంగీకరించటంలో అభ్యంతరం ఉండకూడదని కూడా పేర్కొన్నాడు. "దీనిని బట్టి ఆనందవర్ధనుడు శాంతరసాన్ని నవమరసంగా మాత్రమే అంగీకరించా డని స్పష్టమౌతుంది. ఆనందవర్ధనుడి ఈ వాక్యాలపై వ్యాఖ్యానిస్తూ లోచనకారుడు (అభినవగుప్తుడు) శాంతానికి విభావాలుగా జనకాది రాజర్షులు సముచితంగా ఉంటారని సూచించాడు. 'శృంగారా దపి ఫలభూమావవర్ణనీయ త్వైవ పూర్వ భూమౌతు ప్రశాంత వాహితా'' "సంస్కృతాన్త శ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః'' - ఇతి సూత్రద్వయ నీత్మా చిత్రాకారా యమ నియమాది చేష్టా వా రాజ్య వహోద్వహనాది లక్షణా వా శాన్తస్యాపి జనకాదే ర్దుష్టైవేత్యనుభవ సద్భావా ద్యమనియమాది మధ్యా సంభావ్యమాన భూయో వ్యభిచారి సద్భావాచ్చ ప్రతీయత ఏవ'' (ధ్వన్యాలోకః, లోచనవ్యాఖ్యా తృతీయోద్యోతం. పు.220) - ఇత్యాది వాక్యాలవలన నాయకాశ్రితమైన స్థాయి శాంతరస కావ్యంలో ఎట్లా పోషించబడటానికి వీలుందో తెలిసికొనటానికి అవకాశం కలుగుతుంది. అది నవమరసవాదానికి అనుకూలమైన శాంతరసచర్చకు ఉపయోగపడుతుంది.

10. 'ధ్వన్యాలోకః - తృతీయోద్యోతః । పుట. 219-220 (లోచనవ్యాఖ్యా సహితం - నిర్ణయ సాగర్ ప్రెస్ ప్రతి- 1935)

ఆనందవర్ధనుడు ప్రబంధాలలో ఏదో ఒక రసం అంగిగా పోషించబడాలని నిర్దేశిస్తూ రామాయణ భారతాలలోని అంగిరాసాలను నిర్ణయించాడు. ఆ రెండూ రెండు త్రోవల నడిచాయి. వాల్మీకి "శోకః శ్లోకత్వ మాగతః'' అని కరుణరసాన్ని సూచించి, సీతాత్యంత వియోగ పర్యంతంగా తన ప్రబంధాన్ని నిర్మించి తద్రసాన్ని పోషించాడని రామాయణ రససాధన విధానాన్ని పేర్కొన్నాడు. (ధ్వన్యాలోకః - చతుర్థోద్యోతః-పు.298). ఈ పద్ధతినిబట్టి చూస్తే రామాశ్రితమైన శోకస్థాయియే సహృదయ హృదయ సంవాదంలో కరుణరసమయి సిద్ధిస్తుందని స్పష్టమౌతున్నది. మరి మహాభారత రసచర్చలో నాయకాశ్రితమైన స్థాయి ఏదీ చెప్పబడలేదు. ఆ కావ్యాన్ని శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిగా నిర్దేశించి, శాస్త్రనయాన్ని అనుసరించి పరమపురుషార్థమైన మోక్షం, కావ్య నయాన్ని అనుసరించి తృష్ణాక్షయ

సుఖ పరిపోషణాత్మకమైన శాంతం ప్రధాన వివక్షితాలైనట్లు స్పష్టం చేశాడు. భారతంలో శాంతరసాస్వాదన విధానాన్ని నిరూపిస్తూ వృష్ణిపాండవ విరసావసాన కథార్థాలవలన సహృదయుడికి విషయవైమనస్యం కలిగి వైరాగ్యం జనిస్తుందనీ, అది మోక్షమూలం కాబట్టి గీతాదులలో నిబంధించబడిన పరమపురుషార్థ సాధకమైన పరిజ్ఞానాన్ని ఆశ్రయించి విరక్తుడైన సహృదయుడు సనాతనమైన శ్రీకృష్ణ పరబ్రహ్మతత్త్వాన్ని ఉపాసిస్తాడనీ, అవిద్యా ప్రపంచరూపమైన పాండవాదుల చరిత్రలన్నీ నిస్సారాలని గ్రహించి, వాటియందు అభినివేశం పూనకుండా పరమార్థతత్త్వాన్నే అస్వాదిస్తాడనీ, తదాస్వాదన జన్యమైన రసమే శాంతరసమనీ ఆనందవర్ధనుడు పేర్కొన్నాడు. భారతంలో చివర హరివంశవర్ణనంవలన సాంసారిక వృత్తిరూపమైన మహాభారత కథార్థాలలో సంసారాతీత తత్త్వమైన వాసుదేవ పరబ్రహ్మమే వివక్షితమని ప్రబంధ ధ్వనిగా వివేచించాడు. (ధ్వన్యాలోకః, చతుర్థోద్ద్యోతః- పుట. 298-300)

ఆనందవర్ధనుడి భారత శాంతరస సాధన సహృదయ వివేచనపై ప్రధానంగా ఆధారపడి ఉన్నది. భారత తత్త్వోపదేశమే అతడి చిత్తవృత్తికి వైరాగ్యదాయకమై క్రమంగా శాంతరససిద్ధిని కలిగిస్తుందని నిరూపించబడింది. ఈ వైరాగ్యం స్థాయిగా ధర్మరాజాదులనుగాని, శ్రీకృష్ణాదులను గాని ఆశ్రయించి ప్రతీయమాన మయ్యేది కాదు. ప్రబంధార్థ తత్త్వజ్ఞాన చర్వణంవలన సహృదయుడు సాధించేది. ఈ విధమైన విమర్శలో భారత శాంతరసాస్వాదన రామాయణ రసాస్వాదనం వంటిది కాదని ఆనందవర్ధనుడు వాచ్యం చేయకుండా వ్యంగ్యంగా సూచించాడు.

ఇక్కడ వివేచనాపరులకు ఒక సత్యం మాత్రం స్పష్టమౌతుంది. శాంతాన్ని శృంగారాదులవలె నవమరసమని భావించిన ఆనందవర్ధనుడు తద్రసాస్వాదన విధానంలో ప్రకృతిరస వివేచనమార్గాన్ని అనుసరించాడనటంలో అనుమానం లేదు. నిజానికి ఆయన ప్రవచనాన్ని అనుసరించి చూస్తే కావ్యనయమైన తృష్ణాక్షయ సుఖాత్మక స్థాయి భావాన్ని కావ్యనాయకాదుల నాశ్రయించి వివేచించవలసి ఉన్నది. కాని, ఆ పని ఆయన చేయలేదు. దానిని నాయకాశ్రితంగా అన్వయించటం భారతంలో సాధ్యం కాదని ఆయన వ్యంగ్యమార్గాన్ని అనుసరించి అంగీకరించాడని భావించవచ్చును. అయినా, ఆధునికులు ఆ మార్గాన్ని ప్రస్తరించి చూపిస్తున్నారు. కాని, అదంతా ఆనందవర్ధనుడి మతాన్ని అనుసరించి అవిద్యామూలకమై భాసిస్తున్నది. శాంతరస కావ్యాలలో జనకాది జీవన్ముక్తుల చరిత్రలు వర్ణించినప్పుడే అది నాయకాశ్రితమై ప్రతీయమానమౌతుందన్న అభినవగుప్తుడి వివేచనం గమనించదగింది. ధర్మజుడు ధీరశాంతుడని కానీ, తత్త్వజ్ఞాని అనికానీ, జీవన్ముక్తుడు అని కానీ నిరూపించటానికి భారతంలో కూడా అవకాశం లేదు. అందువలన భారతంలో తత్త్వచింతయే స్థాయి కాగా, పాండవాదుల వృత్తాంతాలు ఉపరాగమాత్రదాయకాలై సహృదయుడి విషయపరివృత్తివలన వికృతులై పోతున్నాయి. సంచారులై సమసిపోతున్నాయి. ఇట్టి స్థితిలో ఆనందవర్ధన ప్రతిపాదితమైన తృష్ణాక్షయ సుఖస్థాయి కంటె అభినగుప్తుడి తత్త్వజ్ఞాన స్థాయియే భారత శాంతరస సమన్వయంలో సమాశ్రిత మౌతున్నది. లోతుగా ఆలోచించిచూస్తే అభినవగుప్తుడి ప్రకృతిరసవాదం ఆనందవర్ధనుడి శాంతరస ప్రస్థానానికి నిర్దుష్టమైన పరిష్కారం.

### 4. ఆంధ్రమహాభారత శాంతరసవిమర్శ:

శాంతరస చర్చలో నవమరస, ప్రకృతిరస స్థితులను విశ్లేషించుకొని విమర్శించకపోతే స్పష్టమైన దర్శనం కలగటం సాధ్యం కాదు. ఆంధ్రమహాభారతంలో అంగిరసంగా శాంతాన్ని సాధించే విమర్శలలో ఇట్టి విశ్లేషణ లోపించటంవలన సాంకర్యం కనబడుతున్నది. దానిని తొలగించటానికి పరిశీలకులు ప్రయత్నం చేయవలసి ఉన్నది. అందుకు కొన్ని సూచనలు.

1. ఇతిహాస పురాణాలు శాంతరస ప్రధానాలన్న సాహిత్య సంప్రదాయాన్ని అనుసరించి భారతరసాన్ని నిరూపించదలచుకొంటే అభినవగుప్తుడి ప్రకృతిరస మార్గాన్ని అనుసరించటం సముచితం.

2,భారతంలో నాయకుడు ధర్మరాజనీ, అతడిని ఆశ్రయించి ప్రతీయమానమయ్యే స్థాయి శమమనీ సాధించే మార్గం ప్రకృతి రస వివేచనంలో పొసగని ప్రస్థానం. అయితే, శాంతం నవమరస మనే వాదాన్ని ఆశ్రయిస్తే ఆ మార్గం ఉపాదేయమే.

3. ఆంధ్రభారతం సంస్కృత భారతంకంటె విలక్షణమైన స్వభావాన్ని సంతరించుకొన్నది. మూలభారతం శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి. ఆంధ్రభారతం కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయి. ఈ మార్పు కవిత్రయంవారి కావ్యకళా దృష్టివలన ఏర్పడింది.

తిక్కన 'ధర్మాద్వైతస్థితి'ని పేర్కొన్నాడు. దానికి ధర్మముయొక్కయు అద్వైతముయొక్కయు స్థితి అని శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు వ్యాఖ్యానించారు. (తిక్కన యజ్వ హరిహరనాథ తత్త్వము. పు.13), అట్లయినప్పుడు కావ్యనయమున సాధించబడేది నాయకాశ్రితమైన ధర్మస్థితి. అంటే ధర్మవీరం. శాస్త్రనయమున అద్వైతస్థితి అంటే తత్త్వజ్ఞానం. సూక్ష్మవివేచనను ఆశ్రయిస్తే సమన్వయ సౌలభ్యం కలుగుతుంది. తత్త్వజ్ఞానమే స్థాయి అని అంగీకరిస్తే ప్రకృతి రసవాదాన్ని అనుసరించి సహృదయుడు పొందేది శాంతరస మౌతుంది. కాని, కవిత్రయ ప్రణాళికలో కావ్యరసానికి తత్త్వజ్ఞానం అంగం. అందువలననే భగవద్గీతాదులు తెలుగులో తావన్మాత్రంగానే నిలిచాయి. కావ్య రసాన్ని కొనియాడటంలో (విరా.1,15) నవమరసంగా శాంతాన్ని అంగీకరించే దృక్పథం ఉన్నది. అప్పుడే కావ్యనాయక జీవితానికి ప్రాధాన్యం వస్తుంది. హరివంశాన్ని భారత భాగంగా రచించకపోవటంలోని అంతర్యంకూడా అదే. ధర్మరాజు ధర్మవీరుడు కాని జనకశుకాదులవలె జీవన్ముక్తుడు కాడు. ఆయన జీవితంలో కొంద రన్నట్లు నిర్వేదం స్థాయి కాదు. అతడు విరక్తుడూ కాడు. అందువలన శాంతరసాశ్రయుడుగా ఆయన జీవితంలో స్థాయి ప్రతీయమానం కావటానికి వీలులేదు. యమధర్మరాజు అంశగా భూలోకానికి వచ్చి మరల ఆయనలో లీనం కావటం మోక్షం కాదు. అసలు ఆ చివరి అవస్థకాదు స్థాయిని నిర్ణయించేది. నాయక జీవిత ప్రవృత్తి నిరూపిస్తుంది. యముడిలో లీనం కావటానికి ఆయన జీవితమంతా కృషి చేయలేదు. అట్లని జీవన్ముక్త స్థితిలో నిలిచి జీవితాన్నంతా ఉపరాగంగా భావించలేదు. అంతేకాదు. స్వర్గంకొరకుకూడా ఆయన తాపత్రయపడలేదు. అతడి ధర్మస్థితికి ఫలం స్వర్గం. అంతే అతడు ధర్మాచరణ ప్రమాణాన్ని లోకానికి నిరూపించి చూపటానికి పుట్టిన కారణజన్ముడు. అతడి స్థితి మోక్షస్థితి కాదు; ధర్మస్థితి, భారతంలోని బహుశాస్త్ర విషయాలలో మోక్షవిషయక మొకటి. అది జ్ఞానదీప్తిని కలిగించేది. జ్ఞానదీప్తి ధర్మస్థితికి ఉద్దీప్తిని కలిగించేది. ఇట్లా అంటే శాంతం ధర్మవీరానికి అంగంగా ఉండటం ఉచితం కాదని ఒక శంక రావచ్చును. ఆనందర్ధనాదులు శాంతాన్ని మరొక రసంలో అంతర్భవింపజేయవద్దన్నారు. కాని, మరొక రసానికి అంగంగా నిలుపటానికి వ్యతిరేకరించలేదు. కవిత్రయంవారి మతం కూడా అదే.

4. భారతంలోని తత్త్వ జ్ఞాన విషయాలకే ప్రాధాన్యమిచ్చి, పాండవ వృష్ణివంశ విరసావసానాన్ని సహృదయుడు భావించి వాటి అవిద్యామూలకత్వాన్ని వివేచించి వాసుదేవతత్త్వాన్ని అవిష్కరిస్తే - శాంతరసస్థితి నిరూపిత మౌతుంది. అది నన్నయ అన్నట్లు అధ్యాత్మవిదులు వేదాంతమని భారతాన్ని చూచేచూపు. రసమార్గానికి కావలసింది కవివృషభులు భారతం మహాకావ్యమని ప్రసరింపజేసే దృక్పథం. ఆంధ్రమహాభారతం ముందుగా మహాకావ్యం; ఆ తరువాత శాస్త్రం. శాస్త్రభాగంలో ధర్మవేదాంత నీతి శాస్త్రాలకు మరల అంతర్విభాగమున్నది. అంగాలెన్ని ఉన్నా అంగి కావ్యత్వం. అంగిరసం ధర్మాద్వైతాలలో మొదట నిర్దేశించబడిన ధర్మవీరమే. ఆ ద్వంద్వంలో ఉత్తరోత్తరాలు బలీయాలని ఆశించవచ్చును. దోషం లేదు. బలమైన అంగం అంగికి కార్యసాధకం. శాంతరసవాదం శాస్త్రరూపమైన సంస్కృతభారతానికి వర్తించినట్లు కావ్యరూపమైన ఆంధ్రభారతానికి వర్తించదు.

5. "సంస్కృత భారతమును శాస్త్రేతిహాసమనియు, ఆంధ్రమహాభారతమును కావ్యేతిహాసమనియు అనుకొనవచ్చును." (తిక్కన కావ్య శిల్పము - డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి - పు. 129) అని ఆంధ్రభారతాన్ని కావ్యేతిహాసంగా వివేచించే పద్ధతికూడా ఉన్నది. అందులోకూడా అంగిరసం నాయక ప్రవృత్తి నాశ్రయించే ఉన్నదని భావించబడుతుంది. అది కావ్య విమర్శకూ, నవమరసవాదానికీ అనుగుణంగా ఉన్నది. అయితే, అందులో 'ఇతిహాస రసస్థితి'ని ప్రత్యేకంగా ప్రతిపాదించుకొనవలసి వచ్చింది. "భారత మితిహాసమైనందున రససాంద్రత తక్కువగా నుండును.. ఆంధ్రభారతము కావ్యేతిహాస మగుటవలన ప్రధాన కథా సంబంధియైన యౌచిత్యము, పాత్రోన్మీలనము మొదలైనవి లెస్సగా పాటించబడినవి. మొత్తంమీద శాంత మాస్వాద్యమగునట్లుగా ప్రధానకథ నిర్వహించబడినది" (తిక్కన కావ్యశిల్పము - పు. 148) అని చెప్పుకొని కావ్యత్వానికి ఇతిహాసత్వాన్ని అనుసంధానం చేసికొనవలసి వచ్చింది. ఈ మార్గంలో శాంతం నవమరసంగా భావించి, శృంగారాదులవలె నిరూపించే పద్ధతి ప్రచురంగా కనబడుతున్నది. కాని, స్పష్టమైన ప్రస్థానం కాకపోవటంచేత సమన్వయించుకొనవలసిన విషయాలు మరికొన్ని అట్లాగే మిగిలిపోయి ఉన్నాయి.

6. భారతంలోని శాంతాన్ని ప్రకృతిరసంగా వివేచిస్తే నాయకాశ్రితమైన స్థాయిభావ చర్చ అసంగతమౌతుంది. నవమరసంగా శాంతాన్ని అంగీకరించి నాయకచర్చ చేస్తే సహృదయుడు హృదయసంవాదంవలన పొందే తత్త్వజ్ఞానం లేదా జ్ఞానానందాది విశుద్ధ

ధర్మయుక్తమైనదీ. పరికల్పిత విషయోపభోగ రహితమైనదీ అయిన ఆత్మయే - ఆత్మజ్ఞానమే - పాఠకుడియందు ప్రతీయమాన మౌతున్నట్లు వివేచించవలసి ఉంటుంది. ఆంధ్రమహాభారతానికి సంబంధించినంతవరకు ప్రకృతిరసవాదం సమన్వయించదు. నవమరసవాదాన్ని ఆశ్రయించి నాయకాశ్రితమైన స్థాయిభావాన్ని నిరూపించటం సమగ్రరూపం తాల్చలేదు. ఈ పరిస్థితులలో భారతంలో ధర్మవీరం అంగిరసం అని సాగించే విమర్శప్రస్థానం కావ్యరూపమైన భారతానికి సగౌరవమైన రసస్థితిని అందించ గలుగుతున్నది.

**5. ఆంధ్రమహాభారతంలో అంగిరసం ధర్మవీరమే:**

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు భారతంలో శాంతరసం అంగిగా స్ఫురించటం లేదని సూచించారు. కాని, వ్యాసభారతం శాంతరస ప్రధానమని అంగీకరించాడు. "(సంస్కృత) భారతమున్నది. భారత మహాకావ్యం యొక్క మహాకావ్యార్థము శాంతరసమునందుఁబర్యవసించుచున్నది. అది శాంతరస పర్యవసాయి యగుట వ్యాసోపజ్ఞకమైన విషయము. నన్నయచేసిన చేఁత వేఱు. తిక్కనచేసిన చేఁత వేఱు. ఆయన దృష్టి వేఱు, ఈయన దృష్టివేఱు. మహాకావ్యముయొక్క సమష్టిమీద సంస్కృతభారతమునందు నిర్ణీతమైన శాంతరసము తెనుగు కావ్యమునందుకూడా సహజముగా బర్యవసింపఁజేసికొన వచ్చునుగాని యెచ్చట నీ శాంతరసమునకు నడ్డుతగులునో చెప్పలేము. ఆంధ్రమహాభారతము భిన్నకర్తృక మగుటచేత నా యిబ్బంది కలుగదు. ఇది చాలా అగాధమైన విషయము" (జయంతి - నాచన సోముఁడొకండు (వ్యాసము)) అన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. వారి దృష్టికూడా భారతం ధర్మవీరరస ప్రధానం అన్న వాదానికి ప్రోద్బలకంగానే ఉన్నది. శాంతరస ప్రధానంగా వ్యాసోపజ్ఞకంగా నిర్మించబడిన సంస్కృత భారతం కంటె భిన్నమార్గంలో నడపబడిన ఆంధ్రమహాభారతంలోని రసం శాంతరసం కానప్పుడు న్యాయంగా ధర్మవీర రసాన్నే అంగిరసంగా పేర్కొనాలి.

సాధారణంగా కావ్యరసానికి కథానాయకాశ్రిత రసానికీ - నాయకుడి చరిత్రే కావ్యం కనుక - భేదముండదు. కాని, కావ్యరసం అన్నప్పుడు నాయకాశ్రితమైన అంగాంగిరసాలతోపాటు, మిగిలిన పాత్రలను ఆశ్రయించిన రసాలు వ్యక్తం అయినప్పటికీ అవి నాయకాశ్రితమైన అంగిరసాన్నే మ్రింగివేయకూడదు. ఆ దృష్టితో చూచినప్పటికీ ఆంధ్రమహాభారతంలో భీమార్జునాదులు అనునాయకులుగా కలిగిన ప్రధాన నాయకుడైన ధర్మరాజును ఆశ్రయించింది ధర్మవీర మనటానికి ఎటువంటి విప్రతిపత్తి గోచరించటం లేదు.

కొందరు భారతంలో శ్రీకృష్ణుడు నాయకుడనీ, దానికి ఉపబలకంగా సంస్కృతభారతంలోని 'నారాయణం నమస్కృత్య' అన్న ఉపక్రమణాన్నీ, హరివంశంతో జరిగిన ఉపసంహారాన్నీ, మధ్య మధ్య నిబంధించబడిన శ్రీకృష్ణమాహాత్మ్య సందర్భాలను, భగవద్గీత, సనత్సుజాతీయం. మోక్షధర్మోపన్యాసాలూ మొదలైన గ్రంథాంశాలను కలిపి చదివి, వీటినే గ్రంథతాత్పర్య నిర్ణాయకమైన లింగాలుగా భావించి, వీటి పర్యాలోచనలో అది శాంతరస ప్రధానమని భావిస్తున్నారు. ఇటువంటి సందర్భంలో విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు సంస్కృతభారతానికి సరిపెట్టుకొన్నా సరిపోవచ్చునేమో కాని, ఈ విషయంలో కూడా భిన్నమార్గంలో నడచిన ఆంధ్రమహాభారతానికి అట్లా పొసగదు. దీనికి ఉపస్కారకంగా మరొకటి రెండు ఉపపత్తులను ఇక్కడ పొందుపరుస్తాను.

1. ఆంధ్రమహాభారతంలో నన్నయ భట్టారకుడు 'నారాయణం నమస్కృత్య' అన్న అర్థసందర్భం కలిగేటట్లు కాక 'శ్రీవాణీ గిరిజా..పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః' అని మూర్తిత్రయ స్మరణంతో గ్రంథోపక్రమం చేశాడు. తిక్కన సోమయాజి భారతాన్ని సమగ్రంగా ముగింపదలచినవాడై 'హృదయాహ్లాది...ఉద్యోగాదులంగూడఁగా బదునేనింటిఁ దెనుంగు బాన జనసంప్రార్థ్యంబు' గావింపదలచి, 'హరివంశ' రహితంగా తన గ్రంథోపసంహారాన్ని చేయదలచినట్లు స్పష్టమౌతుంది. తిక్కనసోమయాజి వాసుదేవ తత్త్వ ప్రతిపాదకమైన హరివంశాన్ని కూడా గ్రహించినట్లయితే ఆ గ్రంథ తాత్పర్యం వేరుగా నిర్ణయించవలసి ఉండేదేమో? మధ్యలో భగవద్గీతాది మోక్షప్రతిపాదక గ్రంథాంశాలను కావ్యరస పోషణదృష్టిలో చాలావరకు తగ్గించి రచించటంలో కూడా శాంతరస తాత్పర్యాన్ని ఆంధ్రమహాభారతంలోని వీరరసానికి అంగభూతంగా చేయటానికే అయి ఉండవచ్చునని తాత్పర్య మేర్పడుతున్నది.

2. భగవానుడైన శ్రీకృష్ణుడు భారతంలో నాయకుడైతే "వాసుదేవస్య మాహాత్మ్యం- పాండవానాం చ సత్యతాం - దుర్వృత్తం ధార్తరాష్ట్రానామ్" అన్న వ్యాస వచనానికి అన్వయం కుదుర్చుకొనవలసి వస్తుంది. భారతంలో పాండవుల సద్వృత్తం

(భారతం కాబట్టి) ధార్తరాష్ట్రుల దుర్వృత్తం ప్రధానవస్తువైతే, దానికి అనుగుణంగా వాసుదేవుడికి మాహాత్మ్యం పోషించబడుతుందనే తాత్పర్యం ఏర్పడుతున్నది. మూడింట రెండువంతులుగా ఉన్న పాండవ కౌరవుల సద్వృత్త దుర్వృత్తాలు అన్వయ వ్యతిరేక క్రమంతో ధర్మాశ్రయాలనీ, వాటికీ పోషకంగా శ్రీకృష్ణమాహాత్మ్యం ప్రపంచితమైనదనీ స్పష్టమౌతుంది. ఈ దృష్టితో పరిశీలిస్తే శ్రీకృష్ణుడి చరిత్ర వివిధ మహిమలకు అస్పదమైనట్టిదైనా, పాండవ ధర్మరక్షణ పరత్వంతో కూడి ఉన్నట్లు చిత్రించబడటంవలన ఆయన భారతకథలో ఉపనాయకుడుగానే ప్రకాశిస్తున్నాడు. అటువంటప్పుడు భగవన్మాహాత్మ్యం స్వాశ్రయ రక్షణ తత్పరమౌటం వలన దాని గౌరవం ఇనుమడిస్తుంది. "నాయకం ప్రాగుపన్యస్య వంశ వీర్య శ్రుతాదిభిః । న తస్యైవ వధం బ్రూయాత్" (భామహాలంకారం) అన్న అలంకారికాదేశాన్నిబట్టి కథా మధ్యంలో నాయకవధకాని, మరణంకాని నిబంధించరాదు. దీనికి విరుద్ధంగా శ్రీకృష్ణ నిర్యాణం కథామధ్యంలోనే కూర్చబడటంవలన, అది సాంప్రదాయికం కాకపోవటంవలన శ్రీకృష్ణుడికి కథానాయకత్వం కల్పించటం పొసగదు. నాయక నిర్యాణమైన తరువాత చేర్చిన హరివంశం ఐతిహాసిక దృష్టితో దాని మహిమను ప్రతిపాదిస్తున్నట్లుగా నిలబడటానికి అవకాశం ఉంటుంది కాని కావ్యదృష్టితో అటువంటిది పొసగదని సహృదయులు గుర్తించకపోరు. ఈ విధంగా శ్రీకృష్ణుడు కథానాయకుడు కానప్పుడు పరిశేషన్యాయంతో ధర్మరాజు కాక తప్పదు. "సమగ్ర గుణః కథావ్యాపీ నాయకః" అనే లక్షణం ధర్మరాజుకు నూటికి నూరుపాళ్ళు వర్తిస్తుందని భారత పరిశీలకులకు గోచరిస్తుంది. 'భారతం' 'జయం' - అనే కావ్య నామాలు కూడా ధర్మరాజుయొక్క చరిత్రౌన్నత్యాన్ని "నాయకో ధర్మవిజయీ లోకోత్తర గుణోత్తరః" (విష్ణు ధర్మోత్తర ఖండం) అనే లక్షణాన్ని బట్టి అతడి ధర్మ విజయాన్ని ప్రతిపాదించేవిగా ఉండి, అతడి నాయకత్వానికి ఏకవాక్యతను సంపాదిస్తున్నాయి.

భారత విమర్శకులలో కొందరు - నాయకుడైన ధర్మరాజు పొందింది మోక్షమే అనీ, దానిని ఫలింపజేసే శాంతరసమే రచనను ఆశ్రయించుకొన్న ప్రధాన రసమని అంటారు కాని, అది కూడా సత్యం కాదు. కావ్యశాస్త్రంలో శాంతరసమంటే "న యత్ర దుఃఖం నసుఖం న చింతా న ద్వేషరాగౌ న చ కాచి దిచ్ఛా - రసస్తు శాన్తః" (నాట్యశాస్త్రమ్) అని స్పష్టంగా చెప్పబడింది. ఇది మరణానంతర నిశ్శబ్దస్థితి కాదు. జీవితంలో సాధించే శమస్థితి. అటువంటిది ధర్మరాజులో ఎక్కడా కనబడదు. 'నకాచిదిచ్ఛా, న చింతా'- అన్నది రాజ్య సంపాదనాసక్తుడైన అతడికీ, 'న యత్ర దుఃఖం' అన్నది అరణ్యావాస, బంధుమరణ దుఃఖితుడు, సోదరమరణ దుఃఖితుడై చివరకు మెలగిన అతడికి, 'న సుఖం, న ద్వేషరాగౌ' అన్నది స్వర్గంలో కూడా దుర్యోధనాదులనుగురించి, కర్ణభీమాదులను గురించి ద్వేషరాగాలను ప్రకటించిన అతడికి ఎట్లా వర్తిస్తుంది? కాబట్టి శాంతరసం కాబోదు.

కావ్యాంతంలో ధర్మరాజు పొందిన స్థితులు కూడా గమనించదగినవి. సశరీర స్వర్గారోహణం. మాయామూలక నరకదర్శనం, దేవలోక నివాసం, యమధర్మరాజాంశ రూపంలో పూర్వరూపప్రాప్తి - అన్న వాటిల్లో దేనిని కూడా మోక్షమని పేర్కొనటానికి వీలులేదు. 'అత్యంతిక దుఃఖనివృత్తి రూపమైన స్వరూప స్థితికి' మోక్షమని సంకేతం;' బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' (శ్రుతి) అన్నట్లు ముక్తుడికి గమనాగమనాలు నిషేధించబడటంవలన స్వర్గారోహణం జరిపిన నాయకుడు ముక్తుడని, మోక్షసాధనపరుడని చెప్పటానికి వీలులేదు. ముక్తి ద్వివిధం - జీవన్ముక్తి, విదేహముక్తి అని-స్వర్గంలో కూడా శరీర ధర్మాలైన రాగద్వేషాలు విడువని నాయకుడు జీవన్ముక్తుడని కాని, ఆకాశగంగావగాహనం తరువాత దివ్యశరీరాన్ని ధరించిన ధర్మరాజు విదేహముక్తుడని కాని చెప్పటం సమంజసం కాదు. ఈ విధంగా ముక్తిద్వయానికి దూరమైన శాంతరసాన్ని ధర్మరాజులో ప్రతిష్ఠించి మహాభారతరసాన్ని నిర్ణయించటం పాడికాదు.

నివృత్తి ధర్మరూపమైన మోక్షానికి సోపానరూపమైన ప్రవృత్తి ధర్మాన్ని తక్కువగా భావించుకొని రసవిచారం చేయకూడదు. రసలోకంలోనూ, కావ్యరసిక లోకంలోనూ ప్రవృత్తిరసాలకు నివృత్తి రసాలకంటె ప్రభుత్వం హెచ్చు. శాంతం సన్మునుల మనోదృష్టులకు, తత్త్వవేత్తల శాస్త్రదృష్టులకు అందినంతగా సామాజికులకు సర్వసామాన్యంగా అనుభూతికి అందదు. 'ఆంధ్రావళి మోదముంబొరయు' లక్ష్యంతో ప్రధానంగా రచించబడిన ఆంధ్రమహాభారతంలో పురుషార్థ సాధనోత్సాహాన్ని ధర్మబద్ధంగా సాధించే చిత్తవృత్తికి మూలకందమైన ధర్మవీరం అంగిరస మనటం సర్వాంగీకారం ఔతుంది. వీరం సర్వమానసిక ప్రవృత్తులకు బీజభూతం: ప్రదీపకం. ప్రవృత్తిరసాలలో వీరం రసమూర్ధన్యం. శాంతం దానికి శక్తి నిస్తుంది. కవిత్రయం ఈ సత్యాన్ని ఆంధ్ర మహాభారత రసపోషణం ద్వారా నిరూపించింది. అందువలన ఎన్ని దృక్కోణాలనుండి చూచినా ధర్మరాజు ధార్మిక చరిత్రతోపాటు, కావ్యమంతా పరివ్యాప్తమై ఉన్న ధర్మవీర రసమే అంగిరసమని స్థిరపడుతున్నది. అదే ఆంధ్రమహాభారతం సాధించిన రసామృతత్వ సిద్ధి!

## 6. కవిత్రయ మహాభారతం: వ్యాఖ్యానం:

తెలుగులో అదికావ్యమైన ఆంధ్రమహాభారతం అవతరించి వెయ్యేళ్ళు కావస్తున్నా ఇంతవరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమవేదవ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలరాయడు మాత్రమే చేపట్టి ధర్మరక్షణ కళా ప్రావీణ్యంతో ఈ వ్యాఖ్యానించిన పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధమండలిని పరిష్కరించి, సర్వాంగ సుందరంగా ప్రచురించి, సామాన్య జనులకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుడి పక్షాన బాధ్యత వహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి. బోర్డు ఛైర్మన్, సభ్యులు, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వారి సహకారులూ, సంపాదక సలహామండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్ సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికారులూ, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. ఆది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన అరణ్యపర్వం మూడవ సంపుటిగా రెండు భాగాలలో ప్రచురించబడింది. మొదటి భాగం నన్నయ రచించిన అరణ్యపర్వభాగం. రెండవ భాగం ఎఱ్ఱాప్రెగడ పూరించిన అరణ్యపర్వశేషం. ఈ విధంగా అరణ్యపర్వం విభజించబడి ప్రచురించటం తెలుగులో ఇదే ప్రథమం. నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ సంపుటులుగా విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ పర్వాలు వెలువడ్డాయి. తొమ్మిదవ సంపుటిగా శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు వెలశాయి. పదవ సంపుటిగా శాంతిపర్వం రెండు భాగాలుగా వెలువడింది. పదకొండవ భాగంగా అనుశాసనిక పర్వం ఆకృతి తాల్చింది. అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలన్నీ కలిసి ఈ పన్నెండవ సంపుటిగా సంతరించుకొన్నవి. ఈ వరుసలో ఇది చివరి సంపుటి. దీనితో కవిత్రయ మహాభారతం ముగిసింది.

ఈ సంపుటిలోని పర్వపంచకంలో ముగ్గురు విద్యన్మణులు వ్యాఖ్యానాలు వ్రాశారు. ప్రసిద్ధ సాహిత్యాచార్యులు. ప్రస్తుత టి.టి.డి. ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానందంగారు అశ్వమేధపర్వంలోని, మొదటి రెండాశ్వాసాలకూ, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలకూ సమర్థంగా వ్యాఖ్యను సంతరించారు. మహావిద్వాంసులు శ్రీ నాగళ్ళ గురు ప్రసాదరావుగారు అశ్వమేధపర్వ తృతీయ, చతుర్థాశ్వాసాలకు సారవంతమైన వ్యాఖ్యను రచించారు. విద్వన్మణులైన డాక్టర్ అంబడిపూడి నాగభూషణంగారు ఆశ్రమవాసపర్వవ్యాఖ్యను ఆమోదయోగ్యంగా వ్యాఖ్యానించారు. ఈ పర్వాలన్నింటికీ సంపాదకుడుగా నేను పీఠికనూ, కథాసారాన్నీ రచించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారికి, శ్రీకె. సత్యరాం ప్రసాద్‌గారికి, డాక్టర్ ఎన్. సుధాకర్ నాయుడుగారికి, శ్రీజి. రాధాకృష్ణగారికీ, శ్రీమతులు సుశీలా లక్ష్మీ విద్యానాథులకూ, డాక్టర్ వి.యస్. లక్ష్మికి నా కృతజ్ఞతలు.

పరమ కల్యాణ భద్రమూర్తి అయిన శ్రీపద్మావతీ సహిత శ్రీవేంకటేశ్వరస్వామి వేదవేద్యులు, వేదాంతగమ్యులు. పరతత్త్వ రూపులు, అయినా భక్త సులభులు, సాహిత్య సంగీత కళాప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ, వ్యాఖ్యానం సుగంధ పరిమళ సేవ, విశేషాంశాలు ఉజ్జ్వలాలంకారసేవ, పీఠిక ఆ విరాణ్మూర్తికి మంగళ నీరాజనసేవ. ఈ సర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చన.

సత్య శివ సుందర రూపులైన స్వామివారి దివ్య సన్నిధిలో ఈ వ్యాఖ్యాన సంపుటిని వాఙ్మయారాధనలో భాగంగా పుణ్యపూజకు సుమమంజరిగా సమర్పించుకొంటున్నాము. అన్యథా శరణం నాస్తి. త్వమేవ శరణం మమ! విశ్వశ్రేయస్సును, విజయపరంపరను ప్రసాదించుమని స్వామివారిని వేడుకొంటున్నాము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

హైదరాబాదు

10-9-2005

**జి.వి.సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు,

కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానం

# అశ్వమేధపర్వ కథాసారం

**ధర్మరాజుకు కలుగని మనశ్శాంతి:**

భీష్ముడివలన సమస్త ధర్మాలు విన్నాకూడా ధర్మరాజు మనశ్శాంతిని పొందలేకపోయాడు. 'భీష్మకర్ణులను చంపిన పాపాత్ముడిని నాకు శాంతి ఎట్లా కలుగుతుం' దని వాపోయాడు. అప్పుడు వేదవ్యాసుడు యాగాలు, దానాలు చేసి బంధుసంహారపాపాన్ని పోగొట్టుకొమ్మని బోధించాడు. అశ్వమేధయాగం చేయటానికి ధర్మరాజు అంగీకరించాడు. కాని, ఆ యాగం చేయటానికి భూరిదక్షిణలివ్వటానికీ, చాలా ధనం కావాలి. రాజులందరూ యుద్ధంలో చనిపోవటంవలన ఆడవారు శిశువులు మాత్రమే ఆయారాజ్యాలలో మిగిలి ఉండటంవలన భూములన్నీ పాడై ఉండటంవలన ధనసేకరణ దుస్సాధ్యమని ధర్మరాజు భావించాడు. దీనికి వ్యాసుడు ఒక ఉపాయం చెప్పాడు. మరుత్తుడనే ఒక చక్రవర్తి మునుపు ఒక సారి స్వర్ణరూపంలో అధిక దక్షిణలిచ్చి మహాయాగాలు చేయగా, ఆ స్వర్ణభారాన్ని బ్రాహ్మణులు కొనిపోలేక హిమవత్పర్వత ప్రాంతాలలో భూములలో దాచారనీ ఆ సంపదను కనుగొన్నవారికి అది వశమౌతుందనీ వరాన్ని ప్రసాదించారు. దానిని తీసికొనివచ్చి అశ్వమేధాన్ని జరపటం ధర్మవిరుద్ధం కాదని వ్యాసమహర్షి సూచించాడు. ఈ సందర్భంలో మరుత్తుడికథను వ్యాసమహర్షి వివరించాడు. ఇంద్రాది దేవతలుకూడా ఈర్ష్యాసూయలకు అతీతులు కారని ఈ కథ నిరూపిస్తుంది.

ఈ సందర్భంలో ధర్మరాజు పరితాపాన్ని పోగొట్టటంకొరకు శ్రీకృష్ణుడు ఆధ్యాత్మిక విషయాలను ప్రసంగిస్తూ ధర్మరాజు 'బాహ్యజయం' మాత్రమే పొందాడనీ 'అంతఃశత్రువులజయం' ఇంకా అతడు సాధించాల్సి ఉందనీ చెప్పాడు. ఈ ఆంతరయుద్ధంలో ఆత్మకు, మనస్సుకు సంగ్రామం జరుగుతుందనీ అదే నిజమైన యుద్ధమనీ శ్రీకృష్ణుడు వివరించాడు. భీష్మాదులతో జరిగిన యుద్ధం 'మిథ్యాయుద్ధ'మని చెప్పుతూ 'మమ' అనే రెండక్షరాలు మృత్యువనీ, 'న మమ' అనే మూడక్షరాలు 'బ్రహ్మ' మని నిష్కర్ష చేశాడు. ఈ సందర్భంలోనే భగవంతుడు 'కామగీత' ను బోధించాడు. కాముడు ఒకప్పుడు నన్నెవ్వరూ గెలువజాలరని శపథం చేసి ఇట్లా పలికాడట- 'నన్ను ఎవడు తపస్సు చేసి జయించాలని అనుకొంటాడో వాడికి ఆ తపస్సులోని 'అభిమాన' రూపంలోనే ఉండి వాడికి పరాజయం కలిగిస్తాను. అట్లాగే మహాయాగాలు చేస్తున్న వాడికి కూడా 'దంభ' రూపంలో వాడి మనసులో ఉండి వాడి ప్రయత్నాన్ని వమ్ముచేస్తా' నన్నాడు కాముడు. కాబట్టి కామజయమే ఆంతరజయమని శ్రీకృష్ణుడు ప్రబోధించాడు. (ఇక్కడే 'కాముడిని జయించి కార్యసిద్ధిని సఫలం చేసికొనటం ఎట్లాగో వ్యాసమహర్షి నాధారంగా తిక్కనగారు పరమరమణీయంగా వివరించారు). వ్యాసనారదాది మునీంద్రులు ధర్మరాజును వీడ్కొని వెళ్ళిపోయారు. ధర్మరాజు హస్తినాపురంలో ధర్మబద్ధంగా జనరంజకంగా పరిపాలన సాగిస్తున్నారు. శ్రీకృష్ణార్జునులు కలిసి ఇంద్రప్రస్థపురంలో విహరిస్తున్నారు. అప్పుడు అర్జునుడు పూర్వం శ్రీకృష్ణుడు తనకు బోధించిన 'భగవద్గీత' విషయం ప్రస్తావించి, అది మరపునకు వచ్చిందనీ, దానిని మరల బోధించుమనీ వేడుకొన్నాడు. అర్జునుడి మరుపును చీదరించుకొని మరలా శ్రీకృష్ణుడు అర్జునుడికి తత్త్వజ్ఞానాన్ని స్థిరీకరించే ప్రయత్నం చేశాడు.

**అర్జునుడికి బోధించిన అనుగీత:**

శ్రీకృష్ణార్జునుల సంవాదంలో భాగంగా అధ్యాత్మవిద్యా రహస్యాన్ని బోధించుమని అడిగిన భార్యకు భర్త చేసిన ఉపదేశమే 'బ్రాహ్మణగీత'గా వెలువడింది. కర్మలు సకల సిద్ధిప్రదాలని భర్త భార్యకు బోధించాడు. బ్రహ్మాదులుకూడా అక్షరోపాసనను కర్మమూలకంగానే చేస్తారు. అక్షరమనేది శబ్దాదులచేత తెలియబడేది కాదు. అది అమలిన బుద్ధికిమాత్రమే గోచరమవుతుంది. ప్రాణాది పంచవాయువులు ఆ అక్షరతత్త్వాన్నే చేరుతాయి. పంచవాయువులు, మనస్సు, బుద్ధి అనే ఈ ఏడూ వైశ్వానరుడికి జిహ్వలు. వైశ్వానరుడంటే ఆత్మే. ఘ్రేయము, భక్ష్యము మొదలైన సప్త సమిధలను ఘ్రాత, భోక్త అనబడేటటువంటి ఏడుగురు ఋత్విజులు వైశ్వానరుడిలో హోమం చేస్తారు. దీనినే సప్తహోతృ విధానమంటారు. ఇట్లా జ్ఞానేంద్రియాలను అంతర్ముఖంగా మలవటమే అంతర్యాగం. ఇట్లాగే శబ్దస్పర్శ రూపరసగంధాలనే పంచభూతలక్షణాలు, వక్తవ్య, కర్తవ్య, గంతవ్య, నిసర్గానందాలనే కర్మేంద్రియవ్యాపారాలు ఐదు - మొత్తం ఈ పదీ హవిస్సులు. వీటిని హోమంచేసేవారు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు. వీటిని అంతర్భూతుడైన వైశ్వానరుడిలో హోమం చేయటమే దశహోతృవిధానం. ఇది అంతర్యాగంలో ఒక భాగం.

ఈ చర్చలలో మనస్సు - వాక్కులలో ఏది ప్రధానమన్న విషయం, మనస్సు, ఇంద్రియాలలో ఏది ముఖ్యమన్న విషయం చాలా రమ్యంగా అగుపిస్తాయి. మోక్షప్రకారాన్ని గురించి చెప్పుతూ కరణ, కర్మ కర్తలనేవి 'కారకత్రయం' అనీ, ఘ్రాణాదులు మనస్సు బుద్ధి - ఇవి కరణాలనీ, గంధాదులు కర్మహేతువులనీ, జీవాత్మకు కర్త అనీ,అతడు విషయరూపాలైన హవిస్సులను అనుభవించక ఉదాసీనత్వం అనే స్రుక్కులోఉంచి ఆత్మ అనేటటువంటి అగ్నిలో హోమం చేస్తే మోక్ష విధానమనీ తెలియాలి. దీనికి భిన్నంగా విషయసుఖాలను అనుభవిస్తే అదే బంధహేతు వవుతుందని బ్రాహ్మణగీత బోధిస్తుంది. చివరకు యోగి స్వభావం తామరాకుమీద నీటిబొట్టువలె నిర్లిప్తంగా ఉండటమన్న భగవద్గీతాసారాన్ని బ్రాహ్మణగీత పునరుద్ఘాటిస్తుంది.

అధ్వర్యుయతి సంవాదమనే ప్రసంగం 'హింస' అంటే ఏమిటో చర్చించటం కొరకు ప్రసక్తమయింది. ఒక అధ్వర్యుడు యజ్ఞ పశువును ప్రోక్షించి నరకటానికై సిద్ధపడుతుండగా ఒక యతి 'ఇది హింసకాదా?' అని ఆక్షేపించాడు. ఇది హింస కాదని ఆ యజ్ఞ పశువు ఉర్ధ్వలోకాలు పొందుతుందనీ, శ్రుతి ప్రామాణ్యాన్ని అధ్వర్యుడు ఉదాహరించాడు. 'యజ్ఞపశువుకు ఊర్ధ్వలోకం సిద్ధించటంవలన నీ కేమిఫల' మని యతి అడిగాడు. శ్రుతి విహితమైన పుణ్యమే నాకు ఫల 'మని ఆ అధ్వర్యుడ'న్నాడు. హింస పాపమని వేదమే చెప్పుతున్నది కదా!' అని యతి అడుగగా 'యజ్ఞంలోని పశువిశసనం పాపంకా'దని అతడు సమాధానం చెప్పాడు. కాని యజ్ఞంలో తపోయజ్ఞమే ఉత్తమమన్న నిష్కర్షతో ఈ సంవాదం ముగుస్తుంది.

అంబరీషగీతలు తరువాత ప్రసక్తమయ్యాయి. అంబరీషుడనే రాజు బాహ్య శత్రువులనందరినీ జయించినా తృష్ణ మొదలైన అంతఃశత్రువులను జయించలేకపోయా నని విచారం వ్యక్తం చేశాడు. లోభాన్ని ఎవరు జయించలేరో వారు జన్మ జరామృత్యువులకు వశమవుతారని ఆ మహారాజు ప్రబోధించాడు.

జనక యమ సంవాదం కూడా చాలా ప్రశస్తమైన కథ. ఒకసారి జనకమహారాజు వద్దకు బ్రాహ్మణుడి వేషంలో యమధర్మరాజు వచ్చాడు. ఏదో ఒక చేయరానిపనిని ఆ బ్రాహ్మణుడు తన ముందర చేయగా జనకుడు కోపగించుకొని 'నారాజ్యపు సరిహద్దులను వదలి పొ'మ్మని అతడిని ఆజ్ఞాపించాడు. అప్పుడు 'రాజా! నీ రాజ్యపు మేరలను నిర్దేశించండి. ఆ మేరలను దాటి వెళ్ళిపోతాను' అన్నాడు ఆ బ్రాహ్మణుడు. జనకుడు ఆ మాటలు విని మూర్ఛపోయాడు. తెలివిరాగా తన తప్పును తాను సవరించుకొన్నాడు. పరమవేదాంతి అయిన అతడికి తన రాజ్యం తన నగరమన్న భావనే లేదు. కనుక జనకుడికి భూమ్యాది పంచభూతాలను జయించే మనోధర్మం సిద్ధించిందని ధర్మదేవత సంతోషించి వెళ్ళిపోయాడు.

ఈ కథలన్నింటినీ బ్రాహ్మణుడు బ్రాహ్మణితో చెప్పాడు. చివరికి బ్రాహ్మణుడు ఇట్లా అన్నాడు. 'ఓ వనితా వినుము! జిజ్ఞాసువు అరణి, గురుడు ఉత్తరారణి. తపస్సుచేత వేదంచేత ఈ రెండింటి నిర్మథనంలో జ్ఞానమనే నిప్పు పుట్టుతుంది. క్షేత్రజ్ఞుడని ఆ జ్ఞాన స్వరూపాన్నే అంటాము. అది ఇంద్రియాలకు అందదు. అది నిర్గుణమైనది. దానిని అహంకార విసర్జనం ద్వారా మాత్రమే గుర్తించగలుగుతాం.

ఈ సంవాదాన్ని విన్న అర్జునుడు ఆ పరమవేద్యమైన బ్రహ్మతత్త్వాన్ని గురించి చెప్పుమని అడుగగా శ్రీకృష్ణుడు గురుశిష్య సంవాదాన్ని వినిపించాడు. ఒకప్పుడు మహామునులు అంగిరసుడిని పురస్కరించుకొని బ్రహ్మదగ్గరకు వెళ్ళారు. 'ఏది హితం? దానిని పొందటానికి మంచిమార్గం ఏది?' అని అడిగారు. బ్రహ్మ ఈ విధంగా చెప్పాడు. 'సత్త్వంవలన భూతాలన్నీ పుట్టుతాయి. సత్త్వంలోనే ప్రవర్తించి, అందులోనే లీనమవుతాయి. శ్రుతి, తపస్సు అనేవి సత్త్వానికి మారుపేర్లు. యోగనిష్ఠులైన మునులు కామక్రోధాలను విడిచి సత్త్వాన్నే సేవిస్తాయి. అదే హితం. దానిని చేరుకొనటానికి మంచి మార్గమున్నది. అదే ధర్మం. చతురాశ్రమాలను, వర్ణ చతుష్టయాన్ని ఆశ్రయించిన పవిత్ర జీవనులు ధర్మాన్ని అనుష్ఠించిన వారవుతారు. దీనికి ముందుగా తెలిసికొనదగిన విషయం- చతుర్వింశతి తత్త్వాలను గురించి, పంచమహాభూతాలు, శబ్దాది గుణాలు, జ్ఞాన కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, ప్రకృతి - అనే ఈ 24 తత్త్వాల పుట్టుకను, లయాన్ని తెలిసినవాడు సంసారమోహాన్ని పొందక పరతత్త్వాన్ని పొందుతాడు' అని చెప్పుతూ బ్రహ్మ సత్త్వరజస్తమో గుణాలను గురించి వివరించాడు. గుణత్రయంలో ఎక్కువ తక్కువలు లేకుండా సమస్థితిని కలిగి ఉండటమే అవ్యక్తస్థితి. ఈ అవ్యక్తస్థితినుండి మహత్తత్త్వం పుడుతుంది. దీనికే మతి, బుద్ధి అనే నామాంతరాలు ఉన్నాయి. మహత్తుకే అహంకార సంజ్ఞ ఉన్నది. అహంకారంనుండి పంచభూతాలు, వాటినుండి శబ్దాదులు, జ్ఞానేంద్రియాలు - ఇట్లా సృష్టిపరిణామం సాగింది. వీటిలో శ్రోత్రాదులైదూ, మనస్సు, బుద్ధి, ప్రాణం, అభిమానం లేదా అహంకారం - అనే ఈ తొమ్మిదీ కలిసి

'నవద్వారపురం' అనే సంకేతాన్ని పొంది ఉన్నాయి. అంటే ఈ శరీరమే నవద్వారపుర మన్నమాట. ప్రాణాది పంచకం, వాక్కు, మనస్సు, బుద్ధి- అనే ఈ ఎనిమిదింటి సంపుటికే 'అంతరాత్మ' అని పేరు. లోకం ఈ అంతరాత్మ అనే ఉపాదాన కారణంనుండి పుట్టుతున్నది. అహంకారం నుండి జ్ఞాన కర్మేంద్రియాలు, మనస్సు అనే పదకొండు తత్త్వాలు పుట్టుతాయి. వీటి బారిని పడకుండా ఎవరు ఆత్మను ఉపాసిస్తాడో వాడు పరతత్త్వవేత్త అవుతాడు.

పిదప బ్రహ్మదేవుడు అధ్యాత్మ, అధిభూత, అధిదైవత తత్త్వాలను గురించి చెప్పాడు. ఇంద్రియాలను, ఇంద్రియార్థాలను, భూతసార్థాన్ని వేరువేరుగా తెలిసికొని మనసులో స్థిరంగా నిలుపుకొనటంచేత 'భవం' (పుట్టుక-పాపం) అనే భావన నశిస్తుంది. విద్వాంసుడు తన ఇంద్రియాలను తనలోనికి మరల్చుకొనటం అభ్యసిస్తాడు - తాబేలు బయటపడిన తన అవయవాలను లోపలికి ముడుచుకొన్న రీతిగా - అట్లా కలిగేదే ఇంద్రియజయం. భూతపంచకమనే సముద్రానికి కాముడు, క్రోధుడు ప్రభువులు. వీరిని జయిస్తేకాని విద్వాంసుడు ఆ సముద్రాన్ని దాటలేడు. ధర్మానికి అహింస లక్షణం. మనుష్యులకు కర్మ, వాక్కుకు సత్యం, బుద్ధికి వ్యవసాయం, జ్ఞానానికి సన్న్యాసం ప్రధానవ్యాపారాలు. జ్ఞానపూర్వకమైన సన్న్యాసంవలన ద్వంద్వభావనా రాహిత్యంవలన యోగులు జరామృత్యు నిస్తరణం సాధిస్తారు.

ఈ విధంగా బోధించి బ్రహ్మదేవుడు 'అవ్యక్తతత్త్వం' అతిగహనమైనదని చెప్పుతూ ఇట్లా అన్నాడు.

'అవ్యక్తం సలింగం, పురుషుడు అలింగుడు. అతడు క్షేత్రాన్ని తెలిసినవాడు కావటంచేత క్షేత్రజ్ఞుడు. క్షేత్రమంటే ప్రకృతి. అది త్రిగుణాత్మకం. ప్రకృతిలో లీనమైన మహత్తత్త్వమే అంతరాత్మ. అతడికి ప్రకృతి క్రియాకలాపమంతా తెలుసు. కాని, ప్రకృతి అంతరాత్మను ఎరుగదు. అట్లే భూతాలలో అగ్ని శ్రేష్ఠుడు. విద్యలలో సావిత్రి, ఛందస్సులలో గాయత్రి, ఆశ్రమాలలో గృహస్థాశ్రమం. ప్రజాపతులలో నేను శ్రేష్ఠులం. నా కంటె విష్ణుడు ఎక్కువ. ఈశ్వరుడు దేవతాళిలో అందరిలోనూ శ్రేష్ఠుడు. నేను - విష్ణువు-ఈశ్వరుడు అనే మూర్తిత్రయం ఒక పదార్థమే. ఎవరు మమ్ములను ముగ్గురినీ ఒకే తత్త్వంగా తెలిసికొంటాడో వాడే 'ఎరుక' సమగ్రంగా కలిగినవాడు.'

అని బోధించి చివరకు బ్రహ్మ సత్త్వం ఎట్లా అవశ్యం అనుష్ఠించదగిందో చెప్పాడు.

సత్త్వం పురుషుడే అని కొందరంటారు. కాని, పురుషుడు గుణాతీతుడు. సృష్టిక్రమాన్ని గమనించినా ఈ విషయం తెలుస్తుంది. భూమ్యాది భూతచతుష్కం ఆకాశంలో లీనం అవుతుంది. ఆకాశం అవ్యక్తంనుండే సముద్రాలలోనుండి తరంగాలు పుట్టినట్లుగా చరాచరభూతాలు పుట్టుతూ లీనమవుతూ ఉంటాయి. అవ్యక్తం అవ్యయుడైన పురుషుడిని ఆశ్రయిస్తుంది. అందుచేత పురుషుడు గుణాతీతుడు. కేవల సత్త్వుడు మాత్రమే కాడు. దీనిని గుర్తించటమే మోహబంధవిముక్తి. దీనికి అర్హమైన సాధనం తపస్సు, అహంకృతితో కూడిన తపస్సువలన ప్రజాపతి సమీపత్వాన్ని మాత్రమే పొందగలుగుతాం. కాని, మమకార విదూరమైన తపస్సుచేత అవ్యయస్థానమే ప్రాప్తిస్తుంది. సత్త్వసహాయంతో రజస్తమోగుణాలను జయించి ఈశ్వర సాక్షాత్కారం పొంది ఆ సత్త్వాన్నికూడా వదలిపెట్టాలి.'

అంటూ బ్రహ్మ చేసిన బోధను గుర్తుచేసి శ్రీకృష్ణపరమాత్మ మునుపు తాను కురుక్షేత్రంలో బోధించిన గీతాసారాన్ని పునరుద్ఘాటించాడు.'

## శ్రీకృష్ణుడి ద్వారకాయానం:

శ్రీకృష్ణుడు తాను ద్వారకానగరానికి వెళ్ళి వసుదేవాదులను చూడాలనే కోర్కె వెలిపుచ్చాడు. అర్జును డా విషయాన్ని ధర్మరాజుకు తెలిపి అతడి అనుమతితో ద్వారకకు వెళ్ళవచ్చునని కృష్ణుడితో కలిసి ఇంద్రప్రస్థంనుండి హస్తినాపురానికి వచ్చాడు. అర్జునుడు శ్రీకృష్ణుడిని సగుణ బ్రహ్మస్వరూపుడిగా గ్రహించి అతడిని స్తుతించాడు. అర్జునుడి అభ్యర్థన మేరకు ధర్మరాజు శ్రీకృష్ణుడికి గౌరవ పురస్సరంగా - అశ్వమేధయాగానికి బంధుమిత్ర పరివార సమేతంగా రమ్మని ప్రార్థిస్తూ - ద్వారకకు పోవటానికి అనుమతించాడు. అర్జునుడిని వదలలేక శ్రీకృష్ణుడు రథంమీద ప్రయాణం సాగించాడు.

మార్గమధ్యంలో శ్రీకృష్ణుడు ఉదంకమహాముని ఆశ్రమాన్ని దర్శించాడు. ఉదంకుడు మహాభారతయుద్ధ కాలంలో శ్రీకృష్ణుడు నిర్వహించిన పాత్ర పక్షపాతంగా ఉన్నదనే భావంతో వ్యంగ్యంగా నిందాస్ఫోరకంగా పలకరించాడు. శ్రీకృష్ణుడు నిర్వికారంగా సమాధానం చెప్పుతూ శాంతికొరకు తాను చేసిన కృషిని వివరించి, కౌరవుల కారణంగానే యుద్ధం చెల్లిందని

వివరించాడు. ఉదంకుడి వ్యంగ్యోక్తులకు శపించబోయాడు. ఉదంకుడు శ్రీకృష్ణుడిని ప్రార్థించాడు. అతడు ప్రసన్నుడై తన పరబ్రహ్మతత్త్వాన్ని తెలిపాడు. ఉదంకుడి వేడికోలుపై తన విశ్వరూపాన్ని ప్రసాదించి అతడిని ఆశ్చర్యాంబుధిలో ముంచాడు. ఉదంకుడి ప్రార్థనపై నిజసౌమ్యరూపాన్ని తాల్చి వరం కోరుకొమ్మన్నాడు. ఆ ఋషి నివాసప్రాంతం నిర్జలప్రాంతం కావటంవలన ఎల్లప్పుడూ నీరు చేరువలో ఉండేటట్లు అనుగ్రహించుమని కోరాడు. ఎప్పుడు తన రూపాన్ని స్మరిస్తే అప్పుడు జలం లభిస్తుందని అభయమిచ్చి ద్వారకకు వెళ్ళాడు.

ఒకనాడు ఉదంకుడు దాహార్తుడై శ్రీకృష్ణుడిని స్మరించాడు. ఒక చండాలుడు తన మలిన శరీరంనుండి జలం స్రవిస్తూ ఉండగా ఎదుట గోచరించి, ఆ నీటిని త్రాగి దప్పిక తీర్చుకొనుమని అడిగాడు. ఉదంకుడు ఏవగింపుతో అతడిని నిరాకరించాడు. అతడు అదృశ్యు డయ్యాడు. శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై ఆ చండాలరూపుడు ఇంద్రుడనీ అతడి శరీరంమీద స్రవించే జలం అమృతమనీ చెప్పి గొప్ప అదృష్టాన్ని దూరం చేసికొన్నా వని ఆ మునీంద్రుడికి తెలిపి, ఆపై అతడు తలచుకొన్నప్పుడెల్లా మేఘాలు పట్టి వానపడుతుందనీ చెప్పాడు. ఆ మేఘాలకు ఉదంక మేఘాలనే పేరు ఏర్పడింది. ఈ ఉదంతం విన్న తరువాత జనమేజయుడు వైశంపాయనుడిని ఉదంకుడి చరిత్రను చెప్పుమని అడిగాడు. ఉదంకుడు గౌతముడి భార్య అహల్యకు సౌదాసుడి భార్య మదయంతి యొక్క కుండలాలు తెచ్చి ఇచ్చిన కథను వివరంగా తెలిపాడు.

శ్రీకృష్ణుడు ద్వారకకు చేరాడు. యాదవులు రైవతక పర్వతోత్సవంలో ఆసక్తులై ఉన్నారు. శ్రీకృష్ణుడి రాకకు ఉప్పొంగిపోయారు. శ్రీకృష్ణుడు వసుదేవాదులకు సముచిత సాదరసేవలందించాడు. వసుదేవుడు శ్రీకృష్ణుడిని భారత యుద్ధ విశేషాలను వివరించమని కోరాడు. భారతయుద్ధకర్మ చాలా పెద్దదనీ, దానిని చెప్పటానికి చాలా రోజులు పట్టుతుందనీ పేర్కొని శ్రీకృష్ణుడు సూక్ష్మంగా యుద్ధోదంతాన్ని చెప్పాడు. కౌరవసైన్య సంఖ్యావివరాలూ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యాది వీరులు యుద్ధంచేసిన దినాలూ, శకుని పడిపోయిన తరువాత దుర్యోధనుడు ఒంటరిగా పారిపోయి హ్రదంలో దాగికొన్న సంగతీ, పాండవు లతడిని అధిక్షేపించి హ్రదంబయటికి రప్పించి భీముడిచేతిలో తొడలు విరిగిపడిపోయిన ఉదంతాన్నీ చెప్పాడు. ఆ రాత్రి అశ్వత్థామ విజృంభించి పాండవ స్కంధావారంలో ఉన్న వీరులనూ, బలాలనూ క్రూరంగా సంహరించిన పద్ధతినీ, పాండవపక్షంలో, కౌరవపక్షంలో ప్రాణాలతో మిగిలి ఉన్న వారినీ చివరకు పేర్కొన్నాడు. కాని, అభిమన్యుడి మరణ విశేషాన్ని చెప్పలేదు. సుభద్ర విషాదంతో ఆ సంగతి జ్ఞాపకం చేసి అభిమన్యు వధవృత్తాంతాన్ని చెప్పించింది. వసుదేవాదులు శోకంతో ఆక్రోశించారు. శ్రీకృష్ణుడు వారిని ఓదార్చాడు. అభిమన్యుడి పరాక్రమాన్ని కీర్తించాడు. ఆ తరువాత చుట్టాలతో కలిసి సంతోషంతో కాలం గడిపాడు.

**అశ్వమేధయాగ యత్నం:**

హస్తినాపురంలో చుట్టాలందరూ మాటలవెంబడి అభిమన్యుడి పరాక్రమాన్ని పొగడేటప్పటికి ఉత్తర శోకించేది. అది చూచి పాండవులు దుఃఖమగ్నులయ్యేవారు. దానిని గమనించి వ్యాసమహర్షి ఒకనాడు వారివద్దకు వచ్చి అశ్వమేధయాగం చేయవలసిన అవసరాన్నీ, దాని విషయవిధులనూ వివరించి, వారిని యజ్ఞకార్యానికి ప్రోత్సహించి అదృశ్యుడయ్యాడు. ధర్మరాజు తమ్ములతో సంప్రదించి, హిమాలయంలో గుప్తమైయున్న స్వర్ణనిధులను స్మరించి, వాటిని సాధించే ప్రయత్నంలో చేయవలసిన పూజాదికాలను నిర్వహించి, ధృతరాష్ట్రుడివద్ద అనుమతి తీసికొని, హస్తినాపుర రక్షకు యయుత్సుడినీ, విదురుడినీ నియోగించి ధర్మజాదులు హిమాలయాలకు పయనం కట్టారు. శిఖరాలను ఎక్కి ఒక సమతల ప్రదేశంలో విడిది చేశారు.

అప్పుడు వ్యాసమహర్షి పాండవుల ముందు ప్రత్యక్షమయ్యాడు. ధర్మరాజాదులు ఆ మహర్షిని పూజించి కర్తవ్యాలను బోధించుమని అడిగారు. ఆ రాత్రి పాండవులు నియమ నిష్ఠలతో దర్భశయనాలమీద శయనించారు. పంచాగ్నులవలె వెలుగొందారు. మరునా డుదయం శివుడిని ఒకచోట అవాహనంచేసి ధూపదీప నైవేద్యాలతో విధివిధానంగా పూజించారు. ప్రమథులను అర్చించారు. మంత్ర జలాలతో నిధులున్నచోట ప్రోక్షించారు. పూలతో, మాంసంతో, పేలాలతో శాస్త్రోక్తంగా పూజించారు. బలవంతులైన సేవకులచేత త్రవ్వించారు. అప్పుడు నలుదిక్కులా వెలుగులు విరజిమ్ముతూ స్వర్ణ నిధులు బయటపడ్డాయి. పాండవులు వాటిని పూజించారు. వ్యాసుడు ప్రత్యక్షమయ్యాడు. పాండవు లా మహర్షిని పూజించారు. అతడు వారిని దీవించి అదృశ్యుడయ్యాడు. అప్పుడు ధర్మరాజు ఆ నిధులను వెలికి తీయించి వేలకొలది బండ్లకూ, గాడిదలకూ, ఒంటెలకూ, గుర్రాలకూ, ఏనుగులకూ బరువులు ఎత్తించి, వివిధ హేమ పాత్రలనూ, యజ్ఞోపకరణాలకూ

వీరులకు ఎత్తించి, శ్రమలేని ప్రయాణాలతో హస్తినాపురం వైపు పయనం సాగించాడు. దానిని చూచి మానవులూ, దేవతలూ, ఆశ్చర్యపడ్డారు. శత్రువులు భయపడ్డారు.

## పరీక్షిత్తు జననం:

ధర్మజుడి అశ్వమేధాహ్వానాన్ని పురస్కరించుకొని శ్రీకృష్ణుడు సకల బంధుసమేతంగా హస్తినాపురానికి వచ్చాడు. అందరూ కలిసి సంతోష సల్లాపాలతో ఉంటున్న తరుణంలో ఉత్తరకు మగబిడ్డ పుట్టాడు. కాని, మహాబాణాగ్నితో దగ్ధమై చనిపోయినవాడుగా ఉన్నాడు. అంతఃపురకాంతలు శోకంలో మునిగిపోయారు. కుంతీ సుభద్రలు మృతబాలుడి గురించి శ్రీకృష్ణుడితో మొరపెట్టి చెప్పుకొన్నారు. పాండవ వంశాంకురాన్ని బ్రతికించుమని బహువిధాలుగా ఆక్రందిస్తూ అర్థించారు. అశ్వత్థామ బ్రహ్మముఖాస్త్రాన్ని ప్రయోగించినప్పుడు ఆ శిశువును రక్షిస్తానని చేసిన ప్రతిజ్ఞను వాసుదేవుడికి జ్ఞాపకం చేశారు. ఆ బిడ్డ చనిపోతే ఆ శోకంతో తామంతా ఒకవైపు, పాండవులంతా మరొకవైపూ ప్రాణాలు వదలటం తథ్యమని మొరపెట్టుకొన్నారు. వారి ఆక్రందనలు విని శ్రీకృష్ణుడు అర్ద్రుడయ్యాడు. వారందరితో కలిసి మాధవుడు ప్రసూతిమందిరానికి వెళ్ళాడు.

ద్రౌపది ముందుగా వెళ్ళి ఉత్తరకు శ్రీకృష్ణాగమనాన్ని తెలియపరచింది. ఉత్తర లేచి వాసుదేవుడికి మ్రొక్కి, ఆ బిడ్డ చేత కూడ మ్రొక్కించాలని ముచ్చటపడ్డా, అశ్వత్థామ అస్త్రశక్తికి గురి అయి మృతుడు కావటంవలన ఆ మాట ఓటువోయిందని వాపోయింది. ఆ శిశువును అంకతలంమీద ఉంచుకొని శ్రీకృష్ణాదులను కన్నెత్తి చూడుమని పలవించింది. మృతశిశువు తెలివొందక పోవటంతో మూర్ఛపోయింది. కొంతసేపటికి ఉత్తర తేరికొని లేచి నేలపై పరుండియే శ్రీకృష్ణుడికి 'శరణు శరణు' అని మ్రొక్కింది. శ్రీకృష్ణుడు ఆమెను, 'ఓడకు, ఓడకు' మని అభయహస్తం ఇచ్చాడు. మృతశిశువును శయనంమీద పరుండబెట్టుమన్నాడు. 'నా మాట అబద్ధం కాకుండా ఇదిగో బాలుడిని బ్రతికిస్తున్నాను. సంతోషంతో అందరూ చూడండి' అని హెచ్చరించాడు. బ్రహ్మముఖాస్త్ర ప్రయోగానికి విరుగుడు పెట్టాడు. పంచవిధ శపథాలతో బాలకుడికి పంచ ప్రాణాలు పోశాడు. బాలుడు కదిలాడు; కళ్ళుతెరిచాడు. అంతఃపుర స్త్రీలందరూ ఆనందంలో మునిగి తేలారు. ఉత్తర బాలుడిని తెచ్చి శ్రీకృష్ణుడి పాదాలకు ప్రణమిల్లజేసింది. అతడు బాలుడిని దీవించి వంశమంతా అంతరించిన సమయంలో పుట్టాడు కాబట్టి 'పరీక్షిత్తు' అని పేరుపెట్టాడు. అందరూ సంతసించారు. శ్రీకృష్ణుడూ, యాదవ ప్రముఖులు అందరూ కానుకలు చదివించారు. ప్రజలు పరమానందాన్ని పొందారు.

## యజ్ఞాశ్వవరణం:

శ్రీకృష్ణుడి కరుణవలన పాండవసంతతి నిలిచింది. పరీక్షిత్తుకు ఒక నెల వయస్సు వచ్చింది. పాండవులు స్వర్ణ నిక్షేపాలతో హస్తినకు చేరారు. వాసుదేవాదులు వారికి ఘనస్వాగతం చెప్పారు. పాండవులు నగరప్రవేశం చేసి పెద్దలకూ, బంధువులకూ, సముచిత మర్యాదలు చేశారు. శ్రీకృష్ణాదులతో కలిసి ఒక మందిరంలో కొలువుచేశారు. పరీక్షిత్తుకు ప్రాణంపోసిన శ్రీకృష్ణ మహిమను విని ఆశ్చర్యసంతోషమగ్నులయ్యారు. గోవిందుడి నిరంతర దయాప్రవృత్తిని వేనోళ్ళ పొగడారు.

కొన్నాళ్ళకు వ్యాసమహర్షి పాండవుల మందిరానికి వచ్చాడు. ఆ మహర్షిని పూజించి ధర్మరాజు వాయుజుడి దయవలన పొందిన ఆ మహాసంపదను అశ్వమేధయాగంకొరకు వినియోగించేందుకు అనుమతిని కోరాడు. మహర్షి సంతోషించి 'చంద్రవంశతిలకా! అశ్వమేధం సమస్తపాపాలనూ నశింపజేస్తుంది. దానిని నీవు సమగ్రదక్షిణాన్వితంగా నిర్వహించి పరిశుద్ధుడవై ప్రకాశిస్తూ ప్రసిద్ధికెక్కు' మని ప్రబోధించాడు. ధర్మరాజు సంతోషించి యాగాన్ని నిర్వహించటానికి శ్రీకృష్ణుడి అనుమతినికూడా కోరాడు. 'తల్లివైనా, తండ్రివైనా, గురువువైనా నీవే. నీ ఆజ్ఞ శిరోధార్య' మని ప్రార్థించాడు. 'వ్యాసమహర్షి చెప్పినట్లుగా చేయుము. యజ్ఞము చేసి మనస్తాపాన్ని పోగొట్టుకొనుము. అశ్వమేధయాగపుణ్యం సర్వధర్మాలకంటె శ్రేష్ఠమైనదని నేనే చెప్పాను కదా! యజ్ఞం చేయుమని నేనే ప్రేరేపించాను కదా! ఇక నా అనుజ్ఞ ప్రత్యేకంగా దేనికి? యజ్ఞనిర్వహణలో నేనేమి చేయాలో చెప్పుము. నీ తమ్ములతో కలిసి నేనూ సాయం చేస్తాను. యజ్ఞానికి సత్వరం పూనుకొమ్ము' అని శ్రీకృష్ణుడు ప్రోత్సహించాడు.

ధర్మరాజు వ్యాసమహర్షిని యజ్ఞానికి ముహూర్తాన్ని నిశ్చయించుమని, విధివిధానాలు బోధించుమని ప్రార్థించాడు. ఆ మహర్షి యజ్ఞ నిర్వహణంలో తనకు యాజ్ఞవల్క్యుడూ, పైలుడూ సహకరిస్తారనీ, చైత్రపూర్ణిమ శుభముహూర్తమనీ, యజ్ఞాశ్వాన్ని ఎన్నిక చేయించాలనీ సలహా ఇచ్చాడు. వేదోక్త దీక్షతో విడిచిన యజ్ఞాశ్వం భూమండలమంతా తిరిగి ధర్మజుడి కీర్తిని నలుదిక్కులా వ్యాపింపచేస్తుందనీ, యజ్ఞ పరికరాలనన్నింటినీ క్రొత్తగా సిద్ధం చేయించుమనీ తెలిపాడు. ధర్మరాజు అశ్వశాస్త్రజ్ఞులచేత ఉత్తమాశ్వాన్ని ఎన్నిక చేయించాడు. నిపుణులతో బంగారంతో స్రుక్స్రువాదులను చేయించాడు. వ్యాసుడు సంతోషించి శాస్త్రోక్తంగా అశ్వాన్ని వదలటానికి అనుమతించాడు. అశ్వరక్షణకు దివ్యాస్త్రవిదుడైన అర్జునుడిని నియోగించుమన్నాడు. దేశరక్షణకు భీమనకులులనూ, కుటుంబరక్షణకు సహదేవుడినీ నియోగించాడు. ఇంకా మిగిలిన పనులకు ధర్మరాజు తగినవారిని నియమించారు. కుంతీ గాంధారీ ధృతరాష్ట్రుల అనుజ్ఞతో అశ్వమేధయాగానికి సిద్ధమయ్యాడు.

**సవనాశ్వరక్షణం:**

దైవజ్ఞులు నిర్ణయించిన శుభముహూర్తాన ధర్మరాజు యజ్ఞదీక్ష స్వీకరించాడు. వ్యాసాది మహర్షుల ఋత్విజుల నడుమ ధర్మరాజు బ్రహ్మర్షుల మధ్య బ్రహ్మవలె ప్రకాశించాడు. వేదవ్యాసుడు శాస్త్రోక్తంగా వదలిన ఉత్తమాశ్వం బయలుదేరింది. గాండీవధారి అయిన అర్జునుడు అశ్వాన్ని అనుసరించాడు. అతడిని యజ్ఞకర్మ నిపుణులైన యాజ్ఞవల్క్య శిష్యులు అనుగమించారు.

యాగాశ్వం ధరణిని ప్రదక్షిణంగా తిరిగి ఉత్తరదిశవైపు సాగింది. అశ్వం త్రిగర్తదేశంలో ప్రవేశించింది. త్రిగర్త దేశాధిపతి కొడుకులూ, మనుమలూ కలిసి సూర్యవర్మ నాయకత్వంలో అశ్వాన్ని అడ్డగించి అర్జునుడిని ఎదిరించారు. అర్జునుడు వారిని దయతో పలుకరించి, భారత యుద్ధంలో చాలామంది రాజులు చనిపోవటం కారణంగా ధర్మరాజు దయామయుడై గుర్రాన్ని పట్టుకొన్నవారిని మంచిమాటలతో ఒప్పించి రక్తపాతం జరుగకుండా చూడుమని చెప్పాడనీ హెచ్చరించి యుద్ధంనుండి విరమించుకొనుమని కోరాడు. కాని, సూర్యవర్మ దాడి సాగించాడు. అర్జునుడు అతడి బాణాలను వమ్ము చేశాడు. సూర్యవర్మకు తోడుగా అతడి తమ్ములు కేతువర్మ, ధృతవర్మలు కూడా పూనుకొని అర్జునుడి హస్తాన్ని నొప్పించి గాండీవం నేలమీద పడేటట్లు చేశారు. అర్జునుడు ఆగ్రహించి వారిపై పిడుగులవర్షంవంటి బాణాలను గుప్పించాడు. ఆ విజృంభణానికి త్రిగర్త వీరులు చెల్లాచెదరై అర్జునుడిని శరణు వేడారు. వారిని కరుణించి, ధర్మజుడి అశ్వమేధానికి వారిని ఆహ్వానించి అర్జునుడు అశ్వం వెంట ముందుకు సాగాడు.

యాగాశ్వం ప్రాగ్జ్యోతిషపురం దగ్గరకు వచ్చింది. భగదత్తుడి కుమారుడు భుజబలగర్వంతో యాగాశ్వాన్ని పట్టాడు. అర్జునుడు వాడిబాణాలతో అతడిని నొప్పించి నగరంలోనికి పారిపోయేటట్లు చేశాడు. అతడు ఏనుగునెక్కి మరల యుద్ధానికి వచ్చి అర్జునుడితో ఘోరంగా పోరాడాడు. నాలుగవనాడు మరణించాడు. అతడి కుమారుడు వజ్రదత్తుడు చెలరేగి తన మదపుటేనుగును అర్జునుడిపై పురికొల్పాడు. అర్జునుడు కోపగించి వజ్రాయుధంవంటి బాణంతో ఏనుగును కూల్చాడు. నేలపైబడ్డ వజ్రదత్తుడిని జాలితో చంపకుండా వదలి ధర్మరాజు శాంతి సందేశాన్ని వినిపించి, అశ్వమేధానికి ఆహ్వానించాడు. వజ్రదత్తుడు అంగీకరించి నమస్కరించాడు. అర్జునుడు యజ్ఞాశ్వంతో ముందుకు సాగాడు.

అశ్వం సింధుదేశంలో ప్రవేశించింది. భారతయుద్ధంలో చనిపోయిన సైంధవవీరుల పుత్రులూ, పౌత్రులూ పూర్వవైరాన్ని స్మరించి వేలసంఖ్యలో రథికులు అర్జునుడిమీద దండెత్తారు. గుమిగూడి అతడిపై దారుణంగా దాడిచేశారు. పార్థుడు బడలి తూలిపడ్డాడు. గాండీవం నేలపై పడింది. దేవతలూ, మహర్షులూ భయంతో బలప్రసాదక మంత్రాలు చదివారు. అర్జునుడు తేరుకొని లేచి గాండీవాన్ని ధరించి విజృంభించి శత్రువీరులను భయంకర బాణాలతో పీనుగు గుట్టలుగా మార్చాడు. కొందరు వీరులు తిరగబడ్డారు. కాని, వారికి అర్జునుడు ధర్మజుడి శాంతి సందేశాన్ని వినిపించి ప్రాణాలను దక్కించుకొనండని హితవు చెప్పాడు. అయినా వారు అగలేదు. విజయుడు వారిని చంపాడు. అప్పుడు జరిగినదంతా తెలిసికొని దుస్సల దుఃఖిస్తూ తన మనుమడిని ఎత్తుకొనివచ్చి అర్జునుడిని శరణువేడింది. అర్జునుడి రాక విని తనకొడుకు చనిపోయాడనీ, బాలుడిని రక్షించుమనీ మొరపెట్టుకొన్నది. దుర్యోధన సైంధవుల దుర్ణయాలకు విచారం వ్యక్తపరచింది. అర్జునుడు కరుణించి దుస్సలకూ, ఆమె మనుమడికీ శరణిచ్చి నగరానికి పంపాడు. యజ్ఞమృగాన్ని వెంటాడే శివుడివలె అర్జునుడు అశ్వాన్ని వెన్నంటి వెళ్ళాడు.

యజ్ఞాశ్వం మణిపూరనగరం దగ్గరకు చేరింది. ఆ నగరాధిపతి బభ్రువాహనుడు. తన తండ్రి అయిన అర్జునుడి ఆగమనాన్ని తెలిసికొని పెద్దలతో కలిసి వచ్చి అతడికి అభివాదనం చేయబోయాడు. అర్జునుడు దానిని మెచ్చక రాజధర్మానుగుణంగా యుద్ధం చేయుమని హెచ్చరించాడు. బభ్రువాహనుడు విచారంతో తిరిగి నగరానికి వచ్చాడు. పాతాళలోకంలోని నాగరాజకన్య ఉలూపి(చి) దివ్యదృష్టితో ఆ సంగతి తెలిసికొని అక్కడికి వచ్చి అర్జునుడితో యుద్ధం చేయుమనీ, అది అతడికి ప్రీతి కలిగిస్తుందనీ ప్రబోధించి యుద్ధోత్సాహాన్ని కలిగించి, తండ్రితో పోరు తగదని భావించిన అతడి మనసు మార్చి, అపూర్వ ప్రకాశాన్నీ, ప్రతాపాన్నీ ప్రసాదించి, అతడిని యుద్ధానికి పంపి, తాను అంతఃపురంలో నిలిచింది. బభ్రువాహనుడు హంసధ్వజం గల రథమెక్కి వెడలి యజ్ఞాశ్వాన్ని పట్టి పార్థుడిమీద బాణవర్షాన్ని కురిపించాడు. అతడు కుమారుడి హంసధ్వజాన్ని కూల్చి అతడి శరీరాన్ని బాణాలతో పీడించాడు. బభ్రువాహనుడు వాడిబాణంతో అర్జునుడి భుజసంధిని కొట్టాడు. ఆ దెబ్బకు రక్తంకారగా అర్జునుడు సొమ్మసిల్లి విల్లు ఆలంబనంగా నిలబడ్డాడు. తనంతవా డయ్యాడని కొడుకు ప్రతాపాన్ని మెచ్చుకొన్నాడు. విజయుడు అసూయతో బభ్రువాహనుడి శరీరమంతా బాణాలతో నింపాడు. అతడు వజ్రాయుధంవంటి బాణాన్ని తండ్రి హృదయంలో నాటాడు. అర్జునుడు నేలపై కూలాడు. అర్జునుడు వేసిన బాణానికి బభ్రువాహనుడు కూడా మూర్ఛపడి నేలపై కూలాడు. ఇట్లా భర్తా కుమారుడూ నేలగూలిన సంగతి తెలిసి చిత్రాంగద యుద్ధభూమికి వచ్చింది. ఉలూపికూడా వచ్చింది. పతిపై కొడుకును పురికొల్పి ఇద్దరూ చనిపోయేటట్లు చేసిన ఉలూపిని నిష్ఠురాలాడింది. పతిశరీరంమీదపడి పరిపరివిధాల దుఃఖించింది. అర్జునుడిని బ్రతికించుమని ఉలూపిని కోరింది. బ్రతికించకపోతే ప్రాయోపవేశం చేస్తానని భర్తశవం కాళ్ళవద్ద మోకరిల్లింది. అంతలో బభ్రువాహనుడు తేరుకొని తండ్రిని చంపినందుకూ, తల్లిని దుఃఖంపాలు చేసినందుకూ విచారించి పితృహంతకుడికి ప్రాయశ్చిత్తం లేదని వాపోయాడు. తండ్రిపై యుద్ధానికి పురికొల్పిన ఉలూపిని చూచి నిష్ఠురా లాడాడు. వీర వధ పాపం; దానికంటె ధార్మికవధ మహత్తర పాపం. ఇక జనకవధ మితిలేని పాపం, వీరుడూ, రాజూ, ధార్మికుడూ, తండ్రీ అయిన మహాత్ముడిని చంపిన పాపానికి నిష్కృతి లేదని అంటూ ప్రాయోపవేశానికి పూనుకొన్నాడు బభ్రువాహనుడు.

అప్పుడు ఉలూపి సంజీవనమణిని స్మరించింది. ఆ మణి ఆమె చేతిలో నిలిచింది. ఆమె చిత్రాంగదనూ బభ్రువాహనుడినీ చూచి 'అమాయకులారా! అర్జునుడు ఇంద్రుడిచేతకూడా చావడు. అతడికి ఒక గొప్పమేలు చేయదలచి ఈ పని చేశాను. బభ్రువాహనుడి శక్తని పరీక్షించాను. ఇది మాయా ప్రయోగం కాని నిజం కాదు' అని ప్రకటించింది. సంజీవనమణిని బభ్రువాహనుడిచేత అర్జునుడి హృదయాన్ని తాకించింది. అతడు లేచి కూర్చుండి కొడుకును పలకరించి యోగక్షేమాలు విచారించాడు. బభ్రువాహనుడు అర్జునుడి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు. చుట్టూ ఉన్నవారందరూ విషాదంతో, ఆనందంతో కలిసి ఉండటానికి కారణం అడిగాడు అర్జునుడు. ఉలూపి ఇట్లా అన్నది. 'నీ కుమారుడివలన నీకు అశుభం కలిగింది. నీవు యుద్ధంలో శిఖండి మిషగా భీష్ముడిని పడగొట్టినందుకు వసువులు కోపగించి నిన్ను శపించారు. గంగాదేవి కూడా దానికి అంగీకరించింది. నేను ఆ సంగతి సమీప తీర్థంలో స్నానం చేస్తూ విని మా తండ్రికి ఆ సంగతి నివేదించాను. అతడు వసువులను ప్రార్థించి నివారణోపాయం పొందాడు. బభ్రువాహనుడిచేత రణరంగంలో నిహతుడైతే ఆ పాపం పరిహారమౌతుందని వారు అనుగ్రహించారు. నీకీ ప్రాయశ్చితం జరుగకపోతే మరణానంతరం నరకప్రాప్తి కలుగుతుందని భావించి, తగిన సమయ మిదే అని నిశ్చయించి. బభ్రువాహనుడిని యుద్ధానికి ప్రేరేపించి, అతడికి అనంతశక్తిని ప్రసాదించి ఈ ప్రాయశ్చిత్తాన్ని కలిగించాను' అని చెప్పింది. అర్జునుడితోపాటు అందరూ ఆనందించారు. తనకూ, తనవంశానికీ ఎల్లప్పుడూ పెంపుకోరే ఉలూపిని విజయుడు ప్రశంసించాడు. ధర్మజుడు తలపెట్టిన అశ్వమేధయాగానికి బభ్రువాహనుడినీ, అతడి తల్లులనూ, బంధుమిత్రులనూ ఆహ్వానించాడు. ఉలూపినీ, చిత్రాంగదనూ అభినందించి వారిపూజ లందుకొని అశ్వాన్ని వెంబడించాడు.

యజ్ఞాశ్వం అనేక దేశాలలో ఇచ్ఛవచ్చినట్లు తిరిగి రాజగృహం చేరుకొన్నది. దానికి అధిపతి జరాసంధ పౌత్రుడైన మేఘసంధి. అతడు బాలుడు కావటంచేత అర్జునుడి పరాక్రమం తెలియక గర్వంతో ఎదిరించి యుద్ధం చేశాడు. అర్జును డతడికి ధర్మరాజు శాంతి సందేశాన్ని వివరించినా వినక పోరుకు దిగాడు. అర్జునుడు కరుణతో అతడి శరీరం తాకకుండా బాణవర్షాన్ని కురిపించి అతడి రథాన్ని, గుర్రాలను, విల్లునూ, గదనూ ముక్కలు చేశాడు. చివరకు మేఘసంధి తన బలహీనతను గుర్తించి అర్జునుడి శరణువేడాడు. అతడు క్షమించి అశ్వమేధానికి ఆహ్వానించాడు. అశ్వం క్రమంగా వంగ పుండ్ర మ్లేచ్ఛాది దేశాలలో తిరిగినప్పుడు పార్థుడు ఆయా రాజులనందరిని జయించాడు.

ఆ తరువాత క్రమంగా చేది దేశాధిపతి అయిన శిశుపాలుడి కుమారుడి శరభుడినీ, టేంకణాధిపతి కిరాతరాజునూ, కోసల, కాశ, దశార్ణ, నిషాద పౌండ్ర, ఆంధ్ర, ద్రావిడ, కేరళ, కర్ణాట భూపతులనూ, సౌరాష్ట్ర, గోకర్ణాధిపతులనూ ఓడించాడు. యాదవులు అతడిని పూజించారు. పాంచాల, గాంధారదేశాలలో శకుని కుమారుడు బాల్యచాపల్యంతో అర్జునుడితో తలపడి ఓడిపోయి శరణు వేడాడు. వారందరికీ ధర్మరాజు శాంతి సందేశాన్ని వినిపించి, చైత్ర శుద్ధ పూర్ణిమనాటి అశ్వమేధ యాగానికి ఆహ్వానాన్ని అందించాడు. యజ్ఞాశ్వం హస్తినాపురంవైపు పయనం సాగించింది. చారులవలన ధర్మరాజు ఆ విషయం తెలిసికొని సంతోషించాడు.

ధర్మరాజు మాఘపూర్ణిమనాడు సభ తీర్చాడు. భీమాదులైన సోదరులను అశ్వమేధయాగశాలా నిర్మాణం, అతిథి గృహ నిర్మాణం, అతిథిసన్మానం, అన్నదానం మొదలైన సౌకర్యాలు కల్పించటానికి తగిన ఏర్పాట్లు చేయండని నియమించాడు. వారు కల్పించిన సౌకర్యాలకు శ్రీకృష్ణాదులు హర్షించారు. అర్జునుడు యజ్ఞాశ్వాన్ని ముందుంచుకొని హస్తినాపురిలో ప్రవేశించాడు. ప్రజలు ఆనందోత్సాహాలతో వేడుకలు చేసికొన్నారు. అతిథులందరూ రావటం మొదలు పెట్టారు. బభ్రువాహనుడూ, అతడి తల్లులూ హస్తినాపురానికి చేరారు. అశ్వమేధానికి సర్వం సిద్ధమయింది.

### అశ్వమేధయాగ నిర్వహణం:

ఋత్విజులు అశ్వమేధానికి సుమూహూర్తం నిశ్చయించారు. వ్యాసమహర్షి ధర్మరాజును యజ్ఞదీక్షకు పూనుకొమ్మన్నాడు. ఈ యజ్ఞం చాలా గొప్పది. నీవు మహాధనవంతుడవు. దక్షిణలు ఈయవలసిన దానికంటె మూడురెట్లు ఎక్కువగా ఇచ్చి మూడు యజ్ఞాలు చేసినంత ఫలాన్ని పొందుము. యజ్ఞాంతంలో చేసే అపభృథస్నానం మిక్కిలి పవిత్రమైనది. అది సమస్త పాపాలనూ తొలగిస్తుంది. కురుక్షేత్ర యుద్ధంలో దాయాదులను సంహరించటంవలన పాపం కలిగిందనే వ్యథ నీ మనస్సులో ఉన్నది కదా! అది అపభృథస్నానంవలన తొలగి నీ మనస్సు నిర్మలమౌతుంది. సమస్త శుభాలు కలుగుతాయి' అని పలికాడు. ఆ మాటలు విని ధర్మరాజు యజ్ఞదీక్ష వహించి అశ్వమేధ క్రియా కలాపాన్ని భక్తి శ్రద్ధలతో విధియుక్తంగా నిర్వహించాడు.

వేదవ్యాసాది మహర్షులు ఋత్విజులుగా యజ్ఞం యథావిధిగా సాగింది. యజ్ఞాశ్వంతో పాటు వివిధ జంతువులను మంత్రోచ్చారణతో విశసనంచేసి యజ్ఞాగ్నిలో హుతంచేశారు. ఋత్విజులూ, దేవతలూ, మహర్షులూ ధర్మరాజును, అతడి తమ్ములనూ దీవించారు. ధర్మరాజు సదస్యులకు వేయికోట్ల టంకాలు దక్షిణలుగా ఇచ్చాడు. బ్రహ్మజ్ఞాని అయిన వేదవ్యాసమహర్షికి ధర్మరాజు తన భూమండల సామ్రాజ్యన్నంతా దక్షిణగా సమర్పించాడు. వ్యాస శ్రీకృష్ణుల హితవు నాశ్రయించి వ్యాసదత్తమైన భూమండలాన్ని ధర్మరాజు కోటికోట్ల టంకాలు వెలగా చెల్లించి తిరిగి పొందాడు. వ్యాసు డా ధనరాశిని ఋత్విజులకు పంపిపెట్టాడు. యజ్ఞశాల భాగాల నన్నింటినీ ధర్మరాజు బ్రాహ్మణ బృందాలకు సమర్పించాడు. మిగిలినవర్ణాలవారికి కూడా స్వర్ణదానం చేసి ధర్మరాజు ప్రజలందరినీ సంతోషపెట్టాడు. యజ్ఞాంతంలో ధర్మరాజు సకుటుంబంగా, బంధుమిత్ర సమేతంగా అవభృథస్నానంచేసి పవిత్రుడై సర్వదోషాలూ పోయిన నిర్మల మనస్సుతో పుణ్యకాంతులతో ప్రకాశించాడు. చివరకు వ్యాసుడి పాదాలకు నమస్కరించాడు. ఆ మహర్షి అశీర్వదించి శిష్యసమూహంతో అదృశ్యుడయ్యాడు. ధర్మరాజు తన తమ్ములూ రాజులూ చుట్టూచేరి నిలువగా నక్షత్రాలలో చంద్రుడివలె రాణించాడు.

శ్రీకృష్ణాది బంధువుల కందరికీ ధర్మరాజు సముచిత పూజాగౌరవాలు చేసి తృప్తిపరిచాడు. అందరినీ వారివారి గృహాలకంపి కృతార్థుడయ్యాడు.

### సక్తుప్రస్థ చరిత్రం:

ధర్మరాజు అశ్వమేధయాగం చేసినప్పుడు ఏదైనా ఆశ్చర్యకరమైన సంఘటన జరిగి ఉంటే - దానిని చెప్పుమని జనమేజయుడడుగా వైశంపాయన మహర్షి ఈ విధంగా సక్తుప్రస్థ చరిత్రం చెప్పాడు.

అశ్వమేధయాగంలో అత్యధిక స్వర్ణదక్షిణలతో సంతోషించిన బ్రాహ్మణ సమూహం చెంతకు ముంగిస ఒకటి ప్రక్కనున్న కన్నంనుండి బయటకు వచ్చి 'ఈ అశ్వమేధయాగం వీసమంతకూడా సక్తుప్రస్థుడి మహాధర్మంతో సరిపోలదు' అని ఆక్షేపించింది. దేవతలూ, మహామునులూ మెచ్చుకొన్న ధర్మరాజు అశ్వమేధాన్ని ఏకారణంవలన తక్కువని పేర్కొన్నావో తెలుపుమని ఆ బ్రాహ్మణులు ముంగిస నడిగారు. ముంగిస సక్తుప్రస్థుడి కథ ఇట్లా చెప్పింది.

కురుక్షేత్రంలో రోషకామరహితుడైన ఒక ఉత్తమ బ్రాహ్మణుడు ఉంఛవృత్తితో నివసిస్తూ ఉన్నాడు. అతడికి భార్యా, కొడుకూ, కోడలూ తోడుగా ఉండేవారు. ఒకసారి వానలు కురువక ధాన్యం దొరకటం కష్టమై పోయింది. ఒకనాడు అతికష్టంమీద అందరూ కలిసి పగలెల్లా కష్టపడి తృణధాన్యం పోగుచేసికొని, దానిని నాలుగు మానికల పేలపిండిగా కొట్టుకొని, తలా ఒక మానిక పేలపిండిని సమంగా పంచుకొని వినియోగించుకొనటానికి సిద్ధమయ్యాడు. అంతలో బాటసారి అయిన బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. ఆకలిగొన్న అతడికి అతిథ్యంగా బ్రాహ్మణుడు తనవంతు పేలపిండిని అందించాడు. అతడు దానిని స్వీకరించి తృప్తుడు కాలేదు. అతడి భావం తెలిసికొని బ్రాహ్మణుడు బాధపడుతుండగా అతడి భార్య తన భాగం పిండిని అతిథికి ఇవ్వటానికి సిద్ధమయింది. కాని, బ్రాహ్మణుడు వారించాడు. 'భర్త భార్యకు చుట్టం, పక్కం, స్నేహితుడు, తల్లి, తండ్రి, గురువు, దైవం, కాబట్టి అతడి పనిచేయుటం ఆమె ధర్మం. భర్త భుజించకుండా ఉంటే భార్య తింటుందా? అతిథి సత్కారం సహధర్మచారిణి ధర్మం' అని తన భాగం పేలపిండిని భర్తద్వారా అతిథికి సమర్పించింది. అతడు దానిని తిని ఇంకా అసంతృప్తిని ప్రదర్శించాడు. బ్రాహ్మణుడు పరితపించాడు. అతడి కుమారుడు తన భాగమైన పేలపిండిని అతిథికి సమర్పించటానికి ముందుకు వచ్చాడు. తండ్రి వారించాడు. పిల్లల తిండిని పెద్దలు గ్రహించటం న్యాయం కాదన్నాడు. 'తండ్రియే కుమారుడు' అని చెప్పిన వేదవాక్యాన్ని ప్రమాణంగా చేసి కొడుకు తన భాగాన్ని అతిథికి సమర్పించాడు. అతిథి ఆ పిండిని తిని తృప్తిపడలేదు. అప్పుడు కోడలు తన భాగాన్ని అతిథికి అందించింది. పెద్దలను అనుసరించటమే తన ధర్మమని తెలిపింది. ఆ భాగాన్ని తిని అతిథి తృప్తిని, సంతోషాన్ని ప్రదర్శించి తాను యముడనని ప్రకటించుకొని, వారు ప్రదర్శించిన భక్తి శ్రద్ధలనూ, ఓర్పుతో కూడిన దయాదానగుణాలనూ ప్రశంసించి, దేవతలు వారిని అశీర్వదిస్తున్నారని తెలిపాడు. దేవేంద్రుడు పూలవాన కురిపించాడు; స్వర్గానికి వారిని ఆహ్వానించాడు. యముడు అప్పుడు ఇట్లా ప్రకటించాడు. 'పుణ్యాత్మా! ఆకలి బుద్ధిని, తేజస్సునూ మట్టుపెట్టుతుంది. ఆశ దయను నాశనం చేస్తుంది. ఈ లోకతత్త్వం తెలిసికూడా భార్య అనీ, బిడ్డలనీ, చూడకుండా ఆకలినీ ఆశనూ జయించావు. నీవు చేసిన అతిథి పూజాపుణ్యంవలన బ్రహ్మ అనుగ్రహంతో నిన్ను సకుటుంబంగా తన సభకు రప్పించుకొనాలని నిర్ణయించాడు. దానాలూ యజ్ఞాలూ కూడా సన్మార్గంలో సంపాదించిన ద్రవ్యాన్ని స్వల్పమైనా యోగ్యుడైన వాడికి దానంచేయటంవంటి ఉత్తమ ధర్మాలు కావు' - అని యముడు తన నిజరూపాన్ని చూపాడు; బ్రహ్మ పంపిన దివ్య విమానంతో ఆ బ్రాహ్మణ కుటుంబ సభ్యుల నందరినీ ఎక్కించి బ్రహ్మలోకానికి పంపాడు.

ఆ పేలపిండి వాసన వ్యాపించి అతిథి కాళ్ళు కడిగిన నీటి తడి అంటుకొని సక్తుప్రస్థుడు చేసిన ధర్మం మహిమవలన ఆ ముంగిస శరీరం ఒకవైపు బంగారంగా మారింది. ఆనాటినుండి ఆ ముంగిన దానకార్యాలు జరిగే యజ్ఞప్రదేశాలకూ, మున్యాశ్రమాలకూ వెళ్ళుతూ, తన శరీరంలోని రెండవ భాగంకూడా బంగారం అవుతుందేమోనని యత్నిస్తూ ఉండేది. ఆ ప్రయత్నంలో భాగంగానే ధర్మజుడి అశ్వమేధయాగాన్ని కూడా దర్శించింది. కాని, అక్కడ కూడా ఆ ముంగిన కోరిక తీరలేదు. అందువలన సక్తుప్రస్థుడి యజ్ఞానికి ఆ యజ్ఞం సాటిరాదని పలికింది. ఆ తరువాత ఆ ముంగిన అదృశ్యమై పోయింది. ఇది అక్కడ జరిగిన అద్భుత విశేషం.

మునులు, బ్రాహ్మణులు, రాజులు, దేవతలు మెచ్చుకొనిన ధర్మరాజు అశ్వమేధంకంటె సక్తుప్రస్థుడి యజ్ఞం గొప్పదనటంలో గల తాత్పర్య మేమిటంటే - పశుహింసారూపమైన యజ్ఞంకంటె అహింసారూపమైన యజ్ఞం గొప్పది అని తెలపటానికే, ఈ తత్త్వాన్ని తెలిపే ఒక ఇతిహాసం ఉన్నది.

పూర్వం దేవేంద్రుడు యజ్ఞం చేయతలపెట్టాడు. శాస్త్రోక్తంగా హోమం చేయటానికి జంతువులను తెప్పించాడు. మునులు హింస ధర్మం కాదని వాదించారు. ఇంద్రుడు వారి మాటలు లెక్కించక పశువిశసనంతో యజ్ఞం చేశాడు. దేవతలు ఇంద్రుడి కొమ్ముకాచారు. మునులకూ ఇంద్రుడికీ వివాదం ఏర్పడింది. ఉపరిచర వసువు ఇంద్రుడిని సమర్థించాడు. అందువలన అతడికి అధోగతి కలిగింది. కాబట్టి హింస లేని యజ్ఞం ఉత్తమ మని తాత్పర్యం ఏర్పడింది. సక్తుప్రస్థుడి ధర్మం అందువలననే ఉత్తమమైనదని ముంగిన చెప్పింది - అని వైశంపాయనుడు చెప్పాడు.

**అహింసాయజ్ఞం ఉత్తమం:**

ధర్మమార్గంలో ప్రాప్తించిన పదార్థాన్ని దానంచేయటం ఉత్తమమని చెప్పే మరొక కథను జనమేజయుడు ఇట్లా చెప్పాడు.

అగస్త్యుడు నియమనిష్ఠలతో పన్నెండేళ్ళు ఒక మహాయజ్ఞాన్ని నిర్వహించటం మొదలు పెట్టాడు. మహర్షులెందరో ఆయజ్ఞం లో ఋత్విజులుగా ఉన్నాడు. అప్పుడు ఇం(దుడు వర్షాలు కురిపించకపోవటంవలన కరువు ఏర్పడింది. ధర్మమార్గంలో ధాన్యం దొరకకపోతే పన్నెండేళ్ళ యజ్ఞం ఎట్లా సాగుతుందో అని మహర్షులు భయపడ్డారు. దానిని అగస్త్యుడు (గహించి అవసరం వస్తే తానే ఇం(దపదవి (గహించి వర్షాలు కురిపిస్తాననీ, మూడు లోకాలలో ఎక్కడ ఉన్నా యజ్ఞ(ద్రవ్యాలు తెప్పిస్తానని శపథం చేశాడు. మంచి విత్తనాలతో యజ్ఞం చేస్తే లోకం అనావృష్టినుండి రక్షించబడుతుందని అగస్త్యుడు జంతుహింసలేని యజ్ఞం చేయసంకల్పించాడు. ఇం(దుడు దానికి సంతోషించి మేఘాలను పంపి వానలు కురిపించాడు. బృహస్పతితో కలిసివచ్చి యజ్ఞహవిస్సులు (గహించి అగస్త్యుడిని కృతార్థుడిగా చేశాడు. ఈ విధంగా హింస లేని యజ్ఞం దేవతల (ప్రశంస లందుకొన్నది. ధర్మమార్గాన (ప్రాప్తించిన (ద్రవ్యాలతో చేసే తపోరూపమైన యజ్ఞం విద్వాంసుల మనస్సులను మెప్పించగలుగుతుంది.

**శాప(గస్తుడైన జమదగ్నియే ముంగిస:**

'ఆ ముంగిస ఎవరు?' అని జనమేజయుడు అడుగగా వైశంపాయనుడు ఇట్లా చెప్పాడు. 'జమదగ్ని నిష్ఠతో (శాద్ధం చేయ సంకల్పించాడు. (కొత్తకుండలో హోమధేనువుపాలు పిండి అనువైనచోట దానిని జాగరూకతతో ఉంచాడు. అతడి మనస్సును పరీక్షించాలని (క్రోధభూతం నిశ్చయించింది. అది ఆకారం తాల్చి పొరపాటున జరిగిందని అనుకొనేటట్లు పాలకుండను దొర్లించింది. జమదగ్ని దానిని చూచికూడా కోపించలేదు. ఆ భూతం అతడి శాంత(ప్రవృత్తికి మెచ్చుకొని తన నిజరూపాన్ని తెలిపి, తన తప్పిదానికి మన్నించుమని వేడుకొన్నది. అతడు ఆ భూతాన్ని మన్నించి పితృదేవతలకు తెలిస్తే శపిస్తారని చెప్పి వెళ్ళిపొమ్మన్నాడు. ఆ కోపభూతం భయంతో అదృశ్యమై పోయింది.

పితృదేవతలు జమదగ్నిపై కోపగించి (శాద్ధంపట్ల అ(శద్ధ వహించినందుకు ముంగిసగా పుట్టుమని శపించారు. 'తపస్వులకు కోపం పనికిరాదని (క్రోధభూతాన్ని కోపించలే దని చెప్పి తనను దయతో చూచి శాపవిముక్తిని (ప్రసాదించుమని వేడుకొన్నాడు. వారు (ప్రసన్నులై 'ఏనాడు నీవు పండితులైన (బాహ్మణులు ఒప్పుకొనేటట్లుగా మహాధర్మమును అధమ ధర్మంగా నిరూపిస్తావో ఆనాడే నీకు శాపవిముక్తి ఔతుంది' అని నిర్ణయించారు. అందువలన ముంగిస రూపంలోని జమదగ్ని ధర్మరాజు అశ్వమేధాన్ని అధిక్షేపించి శాపవిముక్తి పొంది ఆనందిస్తూ అదృశ్యుడయ్యాడు.

# ఆ(శమవాసపర్వ కథాసారం

వంశపారంపర్యంగా వచ్చిన సా(మ్రాజ్యాన్ని ధర్మరాజు జగత్పూజ్యంగా పాలిస్తూ గాంధారీ ధృతరా(ష్ట్రులను భక్తిగౌరవాలతో నిత్యమూ సేవిస్తూ ఉన్నాడు. అతడివలెనే అతడి తమ్ములూ, కుంతి, (ద్రౌపది, సుభ(ద, చి(త్రాంగద, ఉలూపి మొదలైన రాణులూ ఆ రాజదంపతులను (ప్రతిరోజూ కలిసి మర్యాదలు జరుపుతుండేవారు. ధర్మరాజును దర్శించవచ్చే రాజులందరూ ముందుగా ధృతరా(ష్ట్రుడిని కొలిచి వచ్చేవారు. కొడుకులు లేని కొదువ ఆ వృద్ధ రాజదంపతులకు కలుగకుండా పాండవులు వారిని కంటికి రెప్పగా కాపాడుతుండేవారు. భీముడు మా(త్రం వారిని చూచినప్పుడు దుర్యోధనుడు తనకు చేసిన కీడులనూ, తాము పడిన పాట్లనూ మనస్సులో స్మరించి కోపగించుకొనేవాడు. గాంధారీ ధృతరా(ష్ట్రులు ఏకాంతంగా తటస్థించినప్పుడు తన భుజపరా(క్రమాన్ని (ప్రశంసించుకొంటూ వారిని ఉపాలంభించేవాడు. వారు దానికి కటకటపడేవారు. ఆ సంగతి ధర్మజార్జునులకు తెలిసేది కాదు. కర్ణాకర్ణిగా నకుల సహదేవులు విన్నా సంతోషించి ఊరకుండేవారు. దుర్యోధనాదులకంటె మిక్కుటమైన అనురాగాన్ని (ప్రదర్శిస్తున్న ధర్మరాజుపట్ల గాంధారీ ధృతరా(ష్ట్రులు (ప్రీతితో మెలగుతూ ఉండేవారు. ఇట్లా పదిహేనేళ్ళు గడచిపోయాయి.

**ధృతరా(ష్ట్రుడి తపోవనగమన సంకల్పం:**

ఒకనాడు ధృతరా(ష్ట్రుడు బంధుజనాన్నీ ధర్మరాజునూ పిలిచి సమావేశపరిచాడు. తనవలన కలిగిన కౌరవవినాశనాన్ని పేర్కొని, భీష్మాదులు చెప్పిన హితవును తాను వినని దోషానికి పశ్చాత్తాపాన్ని (ప్రకటించి, ధర్మజుడు తన పట్ల చూపుతున్న (ప్రేమాభిమానాలకు సంతోషించి, రాజులకు సమరమరణం కానీ, వనంలో తపోమరణం కానీ ధర్మమని పేర్కొని, వార్ధక్యం కారణంగా గాంధారీ తానూ వనాలకు వెళ్ళి, తపస్వులైన మునులతో కలిసి వల్కలధారులై, కందమూలాలను తింటూ, ధర్మరాజు (శ్రేయస్సు కోరుతూ జీవితశేషకాలం గడపాలనే కోరికను వ్యక్తం చేశాడు.

ఆ మాటలు విని ధర్మరాజు ఖిన్నుడై 'నీవే నాకు తల్లివి, తండ్రివి, గురువు, దైవానివి, నీవు అడవులకు వెళ్ళితే నేను 'హస్తినాపురిలో ఉండలేను. బ్రతిమిలాడాడు. పదివేల ఏనుగుల బలంగల ధృతరాష్ట్రుడు దప్పికతో గాంధారి శరీరంపై సొమ్మసిల్లి ఒరిగి పోయాడు. ధర్మరాజు ఆ వృద్ధరాజును చల్లని నీటితో తుడిచి చేర్చి కూర్చుండబెట్టాడు. ధృతరాష్ట్రుడు తనను తపస్సుకై వనగమనం చేయటానికి అనుమతించనిదే ఆహారం తిననని పట్టుపట్టాడు. అప్పుడూ వేదవ్యాసుడు అక్కడ అవతరించి గాంధారీ ధృతరాష్ట్రుల వనగమనం ధర్మబద్ధమని చెప్పి ధర్మరాజుచేత అంగీకరింపజేశాడు.

ఒకనాడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఏకాంతంగా పిలిచి సప్తాంగమైన రాజ్యపాలనంలో ఉన్న కష్టాన్ని తెలిపి సముచిత రాజనీతి విశేషాలను అతడికి బోధించాడు. శత్రురాజులను జయించే పద్ధతులు వివరించి చెప్పాడు. చివరకు ఇట్లా అన్నాడు. 'ధర్మజా! రాజనీతులు నీకు భీష్ముడూ, శ్రీకృష్ణుడూ మొదలైన పెద్దలందరూ ఎన్నో చెప్పారు. అయినా, నాకు నీ పట్ల ఉండే అనురాగం చొప్పున నాకు తెలిసినంతవరకు నీకు తెలియజెప్పాను. సత్యవిధి, సద్వివేకం, సత్యవ్రతశీలం నీకు సహజలక్షణాలు. అయినా, నీవు వృద్ధసేవను నిష్ఠతో ఆచరించుము' అని ప్రబోధించాడు. ధర్మరాజు ఆ విధంగా ఆచరిస్తానని మాట ఇచ్చాడు. ధృతరాష్ట్రుడు సంతోషించాడు.

ధృతరాష్ట్రుడు తపోవన గమనానికి పురజనుల ఆజ్ఞను కోరాడు. ధర్మరాజు పురప్రముఖులను ముఖద్వారంవద్ద నిలిపాడు. ధృతరాష్ట్రుడు హస్తినాపుర పూర్వ ప్రభువుల మహత్త్వాన్ని కీర్తించి దుర్యోధనుడి దుష్టవర్తనాన్ని గర్హించి, ధర్మరాజు ధర్మపాలనాన్ని ప్రజానురక్తిని ప్రశంసించి ప్రజలను పాండవులపట్ల వినయవిధేయతలతో మెలగండని ప్రబోధించాడు. గాంధారితో కలిసి తాను తపోవనానికి వెళ్ళటానికి వారి అనుమతి కోరాడు. ప్రజలు ధృతరాష్ట్రుడి తపోవన గమనానికి దుఃఖితులై శంబువనే విప్రుడిని తమ ప్రతినిధిగా తమ కృతజ్ఞతలను తెలియపరిచారు. పాండవుల బలపరాక్రమాలను, ప్రజానురక్తిని ప్రశంసించాడు. 'పాండవులు స్వర్గాన్నైనా పాలించగలరు. వీరికి ఈ భూమిని పాలించటం ఒక లెక్కా? మమ్ములను వీరి చేతిలో పెట్టి అన్నివిధాలా రక్షించావు. ధర్మరాజు దీర్ఘదర్శి, మహోదాత్త సచివుడు, బంధురక్షణపరుడు, శత్రువులనుకూడా దయతో చూడగలవాడు, భావశుద్ధి, ప్రతిభ, సువ్రతం అనేవి అతడికి వెన్నతో పెట్టిన విద్యలు; ఇతడి తమ్ములు శూరులు, శాంత స్వభావులు, గురుభక్తి పరులు, ధర్మజుడిపై రాజ్యభార ముంచి నీవు నిశ్చింతగా ఉండుము' అని ప్రజాహృదయం తెలిపి, అతడికి ప్రజాపరిషత్తు పక్షాన అనుమతి ఇచ్చారు.

ధృతరాష్ట్రుడు మృతులైన బంధువులకందరికి సవిశేష శ్రాద్ధకార్యాలు జరపటానికి ధర్మరాజును సన్నాహం చేయుమన్నాడు. పాండవులలో భీముడు ఆ ప్రతిపాదనను వ్యతిరేకించాడు. అర్జునుడు భీముడిని కాదని తన ధనంతో శ్రాద్ధ కర్మలు నిర్వహించేటట్లు అనుమతించాడు. ధృతరాష్ట్రుడు బంధువర్గానికంతా ధనకనక రత్న సముదాయాలతో ఘనంగా విశేష శ్రాద్ధ విధులు నిర్వహించాడు.

### గాంధారీధృతరాష్ట్రుల వనగమనం:

కార్తికమాసంలో పూర్ణిమ వెళ్ళిన మరునాడు పాడ్యమిరోజున కుంతీదేవి భుజంమీద గాంధారి చేయి ఇడి నడువగా, గాంధారి భుజాన్ని ఆధారంగా చేసికొని ధృతరాష్ట్రుడు బయలుదేరి, ఋత్విజులు అగ్నులు చేపట్టి ముందు నడువగా, విదురుడు సంజయుడు వెంట నడుపగా వనగమనయాత్ర సాగింది. ఆ దృశ్యం చూచి ధర్మజుడు 'మహారాజా! ఎక్కడికి పోతావు?' అని రోదిస్తూ కుప్పగూలిపోయాడు. అర్జునుడు అతడిని ఓదార్చాడు. భీమాదులు, అంతఃపుర స్త్రీలు, పురజనులు శోకమగ్నులయ్యారు. పాండవులు వనవాసానికి పోయిన ఆనాటి దృశ్యం మరల తలపించింది. కృపాచార్యుడు, యుయుత్సుడు ధృతరాష్ట్రుడి వెంట వనగమనానికి సిద్ధమయ్యారు. కాని, వృద్ధనృపతి వారిని వారించి ధర్మరాజుకు ఒప్పగించాడు. ధర్మరాజు తానూ వనగమనం చేసి ధృతరాష్ట్రాదులకు సేవచేయటానికి అనుమతి ఇమ్మని కుంతీదేవిని కోరాడు. కుంతీదేవి అతడిని వారించి తానే వారిసేవకై వనవాసానికి వెళ్ళటానికి నిశ్చయించుకొన్నట్లు ప్రకటించింది. ధర్మరాజాదులు తల్లిని వారించి దుఃఖించారు. ఆమె గాంధారినుండి కొంత దూరంగా తొలగి ధర్మరాజుతో తన దృఢసంకల్పాన్ని తెలిపి, కర్ణుడిని మరచి పోవద్దనీ, సహదేవుడిని అనురాగంతో చూడుమనీ, భీమార్జున నకులులను క్షేమంగా రక్షించుకొనుమనీ, ద్రౌపదిని దృఢమైన ప్రేమతో మన్నించుమనీ, చెప్పి ధర్మరాజును ఒప్పిచంటానికి యత్నించింది. అతడు వినకపోవటంతో కొంత కఠినంగా, వ్యంగ్యంగా మాట్లాడి అతడిని ఒప్పించింది. అతడు కుంతీదేవిని గాంధారీ ధృతరాష్ట్రులతో పంపటానికి అంగీకరించాడు. ఆమె తమవారినందరినీ ఓదార్చి అడవులకు పయనమయింది. గాంధారీ

ధృతరాష్ట్రులు, కుంతితో విదుర సంజయులతో కలిసి పురం వెడలి గంగానదీతీరానికి చేరాడు. ధర్మరాజాదులు వెనుదిరిగి హస్తినాపురంలో ప్రవేశించారు.

**శతయూపాశ్రమ నివాసం:**

మరునాడు ఉదయం ధృతరాష్ట్రుడు గంగను దాటి కురుక్షేత్రంలో శతయూపుడనే రాజర్షి వసించే ఆశ్రమానికి చేరాడు. అతడిప్రార్థనను అంగీకరించి అక్కడే కుటీరాలు నిర్మించుకొని, తపోనిష్ఠతో కృశించి క్రమంగా శల్యాకారాలతో జీవితం సాగిస్తున్నాడు. అప్పుడు ఒకనాడు నారదాది మునీంద్రులు ఆ ఆశ్రమానికి వచ్చారు. శతయూపుడు కూడా వచ్చాడు. కుంతీదేవి ఇచ్చిన అతిథిసత్కారాలు స్వీకరించి, ఆ ఆశ్రమంతో పూర్వం శతయూపుడి తాత సహస్రచిత్యుడు, అతడి పెద్దకొడుకు శతచిత్యుడికి రాజ్యాన్ని అప్పగించి తపస్సుచేసి ఇంద్రుడితో చెలిమిని సంపాదించాడు. ఇంకా బృషధ్రుడు, శైవాలయుడూ, పురుకుత్సుడూ ఈ వనంలో తపస్సుచేసి ఇంద్రలోకానికి వెళ్ళారని ఆ వన మాహాత్మ్యాన్ని పేర్కొన్నారు. వ్యాసమహర్షి ప్రసాదంచేత ధృతరాష్ట్రుడు ఆ ఆశ్రమ ప్రాంతంలో నివసించటం దైవ నిర్ణయమని నారదుడు ప్రకటించాడు. తా నిదివరలో ఇంద్రుడివలన ధృతరాష్ట్రుడు మూడేళ్ళు ఆ ఆశ్రమంలో తపస్సు చేసి దేహాన్ని వదలి కుబేరుడి వద్దకు చేరుతాడనీ, గాంధారి అతడిని అనుసరిస్తుందనీ, కుంతీదేవి స్వర్గంలో ఉన్న పాండురాజును పొందుతుందనీ వినినట్లు తెలిపాడు.

కొన్నాళ్ళకు హస్తినాపురంలో పాండవులూ, అంతఃపుర స్త్రీలూ గాంధారీ ధృతరాష్ట్రులను గురించి, కుంతీదేవిని గురించి దిగులుపడ నారంభించారు. సహదేవుడు ఒకనాడు ధర్మరాజుతో వారందరిని చూచిరావాలన్న కోరికను వ్యక్తం చేశాడు. ధర్మరాజు సుముఖుడై బంధుసహితంగా ధృతరాష్ట్రాదులను చూడటానికి రాజలాంఛనాలతో శతయూపాశ్రమానికి బయలుదేరాడు. తపోవనంలో ఉన్న కుంతీ, గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించి, యోగక్షేమాలు పంచకొని, వారితోనూ మునులతోనూ కలిసి నెలరోజులు ఆశ్రమవనంలో నివసించారు. ఒకనాడు విదురుడు దిగంబరుడై ధర్మరాజుకు కనబడి, యోగమార్గాన తన జీవతేజాన్ని ధర్మరాజులో లీనంచేశాడు. దానితో ధర్మరాజు మరింత తేజోమయు డయ్యాడు.

ఒకనాడు వేదవ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రుడి ఆశ్రమానికి వచ్చి, అతడి యోగక్షేమాలు తెలిసికొని, తపస్సు అతడికి కష్టం కలిగించటం లేదని గ్రహించి, అతడికి ఒక వరాన్ని ఇవ్వటానికి సుముఖత ప్రకటించాడు. ధృతరాష్ట్రుడు దివంగతులైన తన కొడుకులను, బంధువులను చూడాలనీ, వారెట్లా ఉన్నారో తెలిసికొనాలనీ కోరిక ఉన్నదని అడిగాడు. అట్లాగే గాంధారీ, కుంతీ, తదితర పాండవవర్గ భర్తృవిరహిత వనితలూ తమ తమ వారిని చూడాలని కోరుకొన్నారు. కుంతి తాను కన్యగా ఉన్నప్పుడు జన్మించిన కర్ణుడిని చూడాలని విశేషంగా కోరింది. వ్యాసమహర్షి వారినీ, మునిగణాన్నీ గంగానదీ తీరానికి తీసికొని వెళ్ళి, మరునాటి ఉదయాన పూర్వం భారత రణంలో మృతులైన వీరులందరినీ వారిదివ్యదేహాలతో గంగనుండి వెలువడేటట్లు చేశాడు. వారందరూ పూర్వపు వైరాలను మాని స్నేహపూరిత ప్రవృత్తులతో మసలటం చూచి అందరూ ఆశ్చర్యపడ్డారు. వారందరూ మరునాటి ఉదయం గంగలో అంతర్హితులైపోయేటట్లు చేశాడు. మహాద్భుతమైన ఆ సన్నివేశం అందరినీ ఆనందంలో ముంచెత్తింది. ధర్మరాజు రాజ్యంమీద ఆసక్తి లేక ధృతరాష్ట్రుడి సన్నిధానంలోనే ఉండిపోవాలని సంకల్పించాడు. కాని, వ్యాస బోధితుడై హస్తినాపురానికి చేరి ప్రజాపరిపాలనలో ఆసక్తుడయ్యాడు.

## గాంధారీ ధృతరాష్ట్రుల మరణం:

కొన్నాళ్ళ తరువాత నారదమహర్షి ధర్మరాజును దర్శించటానికి వచ్చి, గాంధారీ ధృతరాష్ట్రులూ, కుంతీదేవీ తపోవనంలో కార్చిచ్చులో దహించబడ్డారనే వర్తమానం చెప్పి హస్తినాపురాన్ని శోకసాగరంలో ముంచాడు. నారదుడు తాను విన్న వివరాలు చెప్పాడు. గాంధారీ ధృతరాష్ట్రులు, కుంతి, సంజయుడు తపస్సును తీవ్రతరం చేశారు. ఆశ్రమాలను విడిచి గంగాద్వార పరిసరారణ్యాలలో ఉగ్రతపస్సు మొదలు పెట్టారు. ధృతరాష్ట్రుడు గాలినే ఆహారంగా, గాంధారి నీటినే ఆహారంగా గ్రహించి తపస్సు సాగించారు. కుంతి మాసోపవాసాలు చేసింది. సంజయుడు ఏడు భోజనాలకాలంలో ఒక భోజనం చేస్తూ తీవ్రతపం చేశాడు. చివరకు ధృతరాష్ట్రుడు అగ్నికార్యం కూడా మానివేశాడు. ఋత్విజులు అగ్నిని అడవిలో వదలి వెళ్ళిపోయారు. ఒకనాడు ధృతరాష్ట్రాదులు గంగలో స్నానంచేసి అడవిలోకి వస్తూ ఉండగా కార్చిచ్చు పెచ్చుపెరిగి

చుట్టుముట్టింది. సంజయుడు సందుచూచుకొని పర్వతంమీదకు ఎక్కిపోయాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీదేవీ తూర్పుకు తిరిగి యోగసమాధిలో కూర్చుండిపోయారు. దావాగ్నిలో దగ్ధమైపోయారు.

ఈ వృత్తాంతం విని ధర్మజుడు శోకించాడు. నారదుడిచేత అనునయించబడి శాంతుడై ధృతరాష్ట్రాదులకు గంగలో తిలోదకాలు యథావిధిగా ఇచ్చాడు. పాండవులందరూ పితృయజ్ఞాన్ని చేసి, పవిత్రులయ్యారు. ధృతరాష్ట్రుడివీ, గాంధారివీ, కుంతివీ ఆస్థికలు తెప్పించి గంగలో కలిపించారు. వారికి ఉత్తమ గతులు కల్పించారు. ఆ తరువాత హస్తినాపురికి చేరి ధర్మబద్ధంగా పరిపాలన సాగించారు. ఇది ధృతరాష్ట్రుడి ఆశ్రమవాస చరిత్ర.

# మౌసలపర్వ కథాసారం

ధర్మరాజుకు పట్టాభిషేకం జరిగి 35 సంవత్సరాలు దాటి 36వ సంవత్సరం మొదలైంది. భయంకరమైన ప్రకృతి వైపరీత్యాలు కనబడటం ప్రారంభించాయి. ఇసుక తుపానులు, సూర్యచంద్రబింబాలచుట్టూ కాంతులతో గాలిసుడులు, మండువేసవిలో పొగమంచులు - ఇట్లా ఎన్నో విధాలైన వైపరీత్యాలు గోచరించాయి. కొంతకాలం తరువాత బలరామ శ్రీకృష్ణులు తప్ప తక్కిన యాదవులందరూ తమలో తాము పోరాడుకొని చనిపోయా రన్నవార్త ధర్మరాజు విన్నాడు. సోదరులకూ, ప్రజలకూ ఈ వార్త తెలియజెప్పాడు. అందరూ శోకసాగరంలో మునిగిపోయారు.

**యాదవకులంలో ముసలం:**

కొంతకాలంక్రితం కణ్వుడూ, నారదుడూ, విశ్వామిత్రుడూ శ్రీకృష్ణ దర్శనార్థం ద్వారకకు వచ్చారు. విధిప్రేరితులై వృష్ణివంశానికి చెందిన కొందరు యువకులు శ్రీకృష్ణుడి కుమారుడైన సాంబుడికి స్త్రీ వేషం వేసి, ఆమెకు సంతానం కలుగుతుందా లేదా? అని ఆ మునులను ప్రశ్నించి కపటనాటకమాడారు. ఆ సంగతి గ్రహించిన ఋషులు 'సాంబుడికి యాదవకులాన్ని నశింపజేసే ఒక ముసలం (బలమైన రోకలి) పుట్టుతుందనీ, దాని శక్తివలన బలరామ కృష్ణులు తప్ప మిగిలిన యాదవులందరూ నశిస్తారనీ, బలరాముడు యోగశక్తితో తన శరీరం వదలి సముద్రంలో ప్రవేశిస్తాడనీ, శ్రీకృష్ణుడు నేలపై పరుండి ఉండగా 'జర' అనే రాక్షసి అతడిని ఆక్రమించి చంపుతుందనీ పలికి ద్వారకలోనికి ప్రవేశించక తిరిగి వెళ్ళిపోయారు. శ్రీకృష్ణుడు ఈ విషయం తెలిసికొని 'ఇది విధి ప్రేరణవలన జరిగిందే' అని బంధువులకు తెలిపాడు.

ఆ మరుసటి రోజే సాంబుడి కడుపులోనుండి ఒక ముసలం భయంకరంగా వెలువడింది. ఆ సంగతి వసుదేవుడికి తెలుపగా, అతడు నివ్వెరపడి దానిని పొడిచేసి సముద్రంలో కలపటానికి ఆజ్ఞాపించాడు. యాదవులు అట్లే చేశారు. గాంధారిశాపం కూడా యాదవకుల నాశనానికి తోడ్పడింది. ద్వారకలో ఉపద్రవాలు సంభవించటం మొదలయ్యాయి. అక్కడక్కడా యాదవులకు యమదర్శనం కూడా జరిగేది. యాదవులలో స్త్రీ పురుషులు నైతిక సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించ నారంభించారు. విడ్డూరాలెన్నో గోచరించాయి. శ్రీకృష్ణుడు దివ్యబుద్ధితో యాదవ క్షయాన్ని గుర్తించి వారందరినీ సముద్రతీరంలో జాతర చేసికొనాలని ప్రకటింపజేశాడు. రాత్రిళ్ళలో రాక్షసులు యాదవ సంపదలను హరించారు. శ్రీకృష్ణుడి శంఖచక్రాలూ, గరుడధ్వజం, రథం, గుర్రాలు, అన్నీ ఆకాశంలోనికి ఎగిరిపోయాయి. ఇన్ని జరిగినా యాదవులలో వివేకం కలగలేదు. మద్యమాంసాలూ, పిండివంటలూ సిద్ధంచేసికొని సముద్రతీరం చేరారు. శ్రీకృష్ణుడు సామాన్య రథ మెక్కి వెళ్ళాడు. బలరాముడు కాలినడకతో బయలుదేరాడు. స్త్రీలు పల్లకీలలో పయనమయ్యారు. ఉద్ధవుడు తపస్సుకై వెళ్ళాడు. అతడివెంట బలరాముడు బయలుదేరి అడవిలో ఒంటరిగా ఒకచెట్టు మొదట్లో సమాధిలో కూర్చున్నాడు.

ఆ తరువాత యాదవులు భక్ష్య భోజ్యాదులను సముద్రుడికి నైవేద్యం పెట్టారు. పురుషులు మత్తుపానీయాలను ఒడలు తెలియనంతవరకు త్రాగారు. విశేషించి సాత్యకి, కృతవర్మ, చారుదేష్ణుడు, గదుడు, ప్రద్యుమ్నుడువంటి మేటి వీరులూ, వృష్ణిభోజ, అంధక వంశాలకు చెందిన వీరులు మద్యాన్ని మిక్కుటంగా త్రాగి మత్తులోనికి జారిపోయారు, ఇంద్రియాలమీద అదుపును పోగొట్టుకొన్నారు. సాత్యకి కృతవర్మను ఉద్దేశించి 'నిద్రించి ఉన్న పాండవవీరులను రాత్రివేళ సంహరించటం నీచకార్య' మని నిందించాడు. ప్రద్యుమ్నుడు అతడితో శ్రుతికలిపారు. కృతవర్మ మండిపడి 'సాత్యకి సోమదత్తుడి కొడుకు తలనరకటం అన్యాయ'మని అధిక్షేపించాడు. ఇట్లా క్రమంగా వాగ్యుద్ధం మొదలైనది. సాత్యకి కత్తితో కృతవర్మ గొంతు నరికాడు. అంతటితో అగక అవేశంతో బోజకులంమీద పడ్డారు. భోజాంధకులు సాత్యకిని చుట్టుముట్టారు. వారిని ప్రద్యుమ్నుడు ఎదుర్కొన్నాడు. వృష్ణివంశీయులు పొంగిపోయారు. భోజాంధకులు వారిపై దాడి

చేశారు. అక్కడ మూడంచుల తుంగలనే ఆయుధాలుగా చేసికొని పోరు ఘోరంగా పోరుసాగించి పరస్పరం చంపుకొన్నారు. మునుల శాపశక్తివలన తుంగలకు రోకళ్ళ బలం వచ్చింది. సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైనవారున్న వృష్ణివంశమంతా నశించింది. బంధువుల శవాలను చూచి శ్రీకృష్ణుడు కోపంతో యుద్ధంలో దూకి చావక మిగిలి ఉన్న యాదవులనందరినీ తుంగలతో తుదముట్టించాడు. ఆ విధంగా యాదవులందరూ నశించారు. శ్రీకృష్ణుడికి గాంధారీశాపం గుర్తుకు వచ్చింది.

శవాల కుప్పల నడుమ నిలిచి ఉన్న శ్రీకృష్ణుడి వద్దకు దొమ్మియుద్ధంలో చావక మిగిలి ఉన్న దారుకుడు, బభ్రుడు వచ్చారు. వారిరువురితో కలిసి కృష్ణుడు బలరాముడి వద్దకు వెళ్ళాడు. దారుకుడిని హస్తినాపురికి పోయి అర్జునుడికి యాదవుల మరణాన్ని తెలిపి ద్వారకకు తీసికొనిరమ్మని పంపాడు. అత డొక చిన్నపాటి రథంమీద హస్తినాపురానికి బయలుదేరాడు. బభ్రుడిని పిలిచి స్త్రీలనూ, పిల్లలనూ, ఏనుగులనూ, గుఱ్ఱాలనూ ద్వారకకు చేర్చుమన్నాడు. కాని, అతడు ఒక బోయవాడిచేతిలో హతుడు కావటంచేత శ్రీకృష్ణుడే వారందరిని తీసికొని ద్వారకకు చేరాడు. వసుదేవుడికి జరిగినదంతా చెప్పి, త్వరలో అర్జునుడు వచ్చి తగిన సేవలు చేస్తాడని తెలిపి, అతడిని ఓదార్చి, బలరాముడివద్దకు తిరిగి వచ్చాడు. బలరాముడి ముఖంనుండి వేయిపడగల మహాసర్పం వెలువడి యోగబలంతో ఆకాశమార్గాన పయనించి సముద్రంలో ప్రవేశించింది. ఆదిశేషరూపుడైన బలరాముడికి వరుణుడూ, నాగులూ స్వాగతం పలికారు. మహావిష్ణువులో ఆ ఆదిశేషుడు లీనమయ్యాడు

## శ్రీకృష్ణ నిర్యాణం:

బలరాముడు అవతారం చాలించిన తరువాత శ్రీకృష్ణుడు తనకు దుర్వాసుడు పెట్టిన శాపంప్రకారం అరికాలులో ప్రమాదముందని ఊహించి, క్షీరసాగరంలో శయనించినట్లుగా నేలమీద పరున్నాడు. ఆ సమయంలో జర ఒక బోయవాడిని ప్రేరేపించి శ్రీకృష్ణుడి అరికాలిని జింకగా భ్రమింపజేసి బాణంతో కొట్టించింది. కొట్టింది శ్రీకృష్ణుడినని తెలిసి బోయవాడు దుఃఖించాడు. శ్రీకృష్ణుడు అతడిని ఓదార్చి తన అవతార కార్యక్రమం పూర్తి అయినదని సంకల్పించి, దేహాన్ని వదలి తన స్థానానికి బయలుదేరాడు. బ్రహ్మాదులు శ్రీకృష్ణుడికి దివంలో స్వాగతం పలికారు. పూలవానలు కురిపించారు. కృష్ణావతారలీలలను కీర్తించారు. అమృతం, అజరం, అవ్యయం, అమలం, అచలం అయిన పరమాత్మ నిజస్థితిలో శ్రీకృష్ణుడు నిలిచాడు. 'పుణ్యాత్ములారా! నేను అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవాత్మకమైన వ్యూహచతుష్టయంచేత అతి శ్రేష్ఠరూపంతో ఏకైకంగా పుట్టుతున్న సమాధిస్థితి వలన ఆనందరూపమైన జ్ఞానంతోడి పరిశుద్ధమైనదీ, కొలవటానికి వీలులేనిదీ అయిన నా స్థానప్రాప్తిని నేనే కలిగించుకొన్నాను. సర్వమంగళకరమైన ఈ అనుభూతిని స్వీకరిస్తున్నాను. మీరందరూ సుఖంగా ఉండండి' అని దేవతలను ఆశీర్వదించాడు.

## ద్వారక సముద్రంలో మునగటం:

దారుకుడివలన ధర్మజుడు యాదవుల మరణవృత్తాంతం విన్నాడు. పాండవులు, ద్రౌపది, సుభద్ర మొదలైనవారందరూ శోకించారు. శ్రీకృష్ణ సందేశం విని అర్జునుడు ధర్మజుడి సలహాతో ద్వారకకు బయలుదేరి వెళ్ళాడు. భర్త చనిపోయిన పుణ్యస్త్రీవలె, చంద్రుడు అస్తమించిన రాత్రివలె ద్వారక గోచరించింది. శ్రీకృష్ణుడు లేని ద్వారకలో అర్జునుడు ప్రవేశించలేకపోయాడు. శ్రీకృష్ణుడి భార్యలు పదహారువేలమంది స్త్రీలు రోదిస్తూ అర్జునుడి దగ్గరకు వచ్చారు. వారి శోకాన్ని చూచి అతడు మూర్ఛపోయాడు. తనంతట తాను నిబ్బరించుకొని ఆ వనితలను ఓదార్చి, వసుదేవుడివద్దకు వెళ్ళాడు. శ్రీకృష్ణుడి యోగక్షేమాలు తెలిసికొనాలనే తాపత్రయం అతడిలో క్షణక్షణం పెరుగుతున్నది. శయ్యమీద శోకమూర్తిగా పరుండి ఉన్న వసుదేవుడు లేచి అర్జునుడిని కౌగిలించుకొన్నాడు. దేవతలచేతకూడా ప్రశంస లందుకొన్న యదువీరులు నిష్కారణంగా పరస్పరం పోరాడుకొని చనిపోయిన ఉదంతాన్ని చెప్పి దుఃఖించాడు. 'ఆ మారణహోమాన్ని తప్పించగల దక్షుడైనా శ్రీకృష్ణుడు ఉపేక్షవహించాడు' - అని వేదన పడ్డాడు. వసుదేవుడు శ్రీకృష్ణుడి ఉపేక్షను గురించే చెప్పటంతో అత డింకా బ్రతికే ఉండి ఉండవచ్చునని అర్జునుడు ఊహించాడు. స్త్రీలను, ఏనుగులను, గుఱ్ఱాలను శ్రీకృష్ణుడు ద్వారకకు తీసికొనివచ్చాడనీ, అర్జునుడు వచ్చి వసుదేవుడిని సేవిస్తాడనీ, అతడికీ శ్రీకృష్ణుడికీ భేదం లేదనీ, అతడిసాయంతో స్త్రీలను, పిల్లలను కాపాడుకొనాలనీ, కొన్ని రోజులలోనే సముద్రం ద్వారకానగరాన్ని ముంచివేస్తుందనీ, అడవిలో తపస్సు చేసికొంటున్న బలరాముడిని కలిసి, తానూ తపస్సు చేసికొనటానికి వెళ్ళాడని, మరణించిన యాదవులకు సముచిత రీతిలో అర్జునుడు

అగ్ని సంస్కారం చేస్తాడనీ, మాకు కూడా అర్జునుడే శ్రాద్ధవిధులు నిర్వహిస్తాడనీ శ్రీకృష్ణుడు చెప్పి వెళ్ళాడని పేర్కొన్నాడు. శ్రీకృష్ణుడు అర్జునుడిపై పెట్టిన బరువు బాధ్యతలను నిర్వహించుమని కోరాడు.

వసుదేవా! ధర్మరాజు ఈ స్థితిని ముందే భావించి ద్వారకలో మిగిలిఉన్న వారినందరినీ ఇంద్రప్రస్థపురానికి చేర్చుమని చెప్పాడు. నీవు ముందుగా బయలుదేరితే నీతో మిగిలినవారినందరినీ భద్రంగా చేరుస్తాను' అని అర్జునుడు పలికి, మంత్రులనందరినీ 'సుధర్మ'సభలో సమావేశపరచుమని దారుకుడిని ఆజ్ఞాపించాడు. సభలో మంత్రులూ, అన్ని వర్గాల ప్రతినిధులూ సమావేశమయ్యారు. ఆనాటినుండి ఏడవరోజున ద్వారక సముద్రంలో మునిగిపోతుందనీ, కాబట్టి ద్వారకావాసులు ఇంద్రప్రస్థనగరానికి తరలివెళ్ళాలనీ, వాటికి తగిన ఏర్పాట్లు త్వరగా చేయాలనీ, ధర్మరాజు వారందరినీ ఆదుకొంటాడనీ, శ్రీకృష్ణుడి మనుమడైన వజ్రుడిని యాదవప్రభువుగా నియమిస్తాడనీ చెప్పి అర్జునుడు వారిని పంపాడు. ఆ రాత్రి శ్రీకృష్ణమందిరంలో దైవపూజలలో గడిపాడు.

తెల్లవారుజామున వసుదేవుడు దివంగతుడయ్యాడన్న వర్తమానం తెలిపింది. అర్జునుడు ఆయనకు రాజలాంఛనాలతో శవయాత్రను జరిపించాడు. వసుదేవుడి భార్యలు దేవకి, రోహిణి, భద్ర, మదిర ఆయనతోపాటు సహగమనం చేశారు. పితృకార్యాన్ని అర్జునుడు యథావిధిగా జరిపించాడు.

ఆ తరువాత అర్జునుడు కొందరు విప్రులతో కూడి యాదవులు మరణించిన యుద్ధభూమికి బయలుదేరాడు. మృతవీరులకు తగిన అగ్ని సంస్కారాలను చేయించాడు. తిలోదకాలు ఇప్పించి అందరి మన్ననలు పొందాడు.

తపస్సు చేసికొంటున్నారు అని తలపోస్తున్న బలరామకృష్ణులను దర్శించటానికి అర్జునుడు కొంతమందిని తనవెంట పెట్టుకొని అడవిలోకి బయలుదేరాడు. 'ఎవ్వరూ లేనిచోట, దిక్కెవ్వరూ లేనివిధంగా చనిపోతా'వని గాంధారి శ్రీకృష్ణుడికి ఇదివరలో ఇచ్చిన శాపం పార్థుడికి జ్ఞాపకం వచ్చింది. మనసు కలతచెంది దిక్కుతోచకుండా అడవిలో తిరిగాడు. మార్గంలో ఒక బోయవాడు కనబడి శ్రీకృష్ణుడున్న తావుకు తీసికొనివెళ్ళాడు. కాంతు లీనెడి శ్రీకృష్ణుడి కళేబరాన్ని నేలమీద పడి ఉండగా చూచి అర్జునుడు శోకావేశంతో మూర్ఛపోయాడు. కొంతసేపటికి తేరుకొని లేచి శ్రీకృష్ణుడి దేహాన్ని కౌగిలించుకొని చాలాసేపు ఉండిపోయాడు. వెంటవచ్చిన బ్రాహ్మణులు అతడిని ఓదార్చి భవిష్యత్కార్యక్రమంమీద దృష్టిమళ్ళించారు. తెల్లవారి సూర్యోదయంతో ద్వారక సముద్రంలో మునుగుతుంది. కాబట్టి సూర్యాస్తమయ సమయం సమీపించటంతో శ్రీకృష్ణుడికి అగ్ని సంస్కారం చేయటానికి నిశ్చయించారు. సమీపంలో ఉన్న బలరాముడి శరీరానికి కూడా అగ్ని సంస్కారం చేశారు. వారి మరణవార్తలు ద్వారకావాసులకు తెలియచెప్పకూడదని నిశ్చయించారు. ఆ రాత్రికే అర్జునాదులు ద్వారకకు తిరిగివచ్చి తెల్లవారేసరికి ద్వారకావాసుల నందరినీ నగరం దాటేటట్లు చేశాడు. సూర్యోదయవేళకు ద్వారకను సముద్రం ముంచివేసింది. అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు.

ఆ మహాజనాన్ని అర్జునుడు తీసికొని వెళ్ళుతున్నాడు. వారిని పంచవటిలో విడిదిచేయించాడు. అక్కడ బలవంతులైన దొంగలు స్త్రీలను బాధించి సంపదలు హరించారు. అర్జునుడు వారిని వారించటానికి యత్నించాడు. కాని, అతడికి అస్త్రాల మంత్రాలు స్ఫురించలేదు. ప్రయోగించిన బాణాలు ఆ దొంగలపై పనిచేయలేదు. అంతఃపుర స్త్రీలను మాత్రం రక్షించుకొని అర్జునుడు యాత్ర సాగించి కురుక్షేత్రం చేరాడు. అక్కడి మిత్రుల సాయంతో యాదవులకు విడుదులు ఏర్పాటు చేశాడు. కృతవర్మ కొడుకునూ అతడి బంధువులనూ మృత్తికావాసపురంలో ఉంచాడు. ఆ నగరానికి అతడిని రాజును చేశాడు. సాత్యకి కొడుకుకు సరస్వతి నగరాన్నిచ్చి పట్టంకట్టాడు. మిగిలినవారి నందరినీ ఇంద్రప్రస్థానికి తరలించి, దానికి వజ్రుడిని రాజుగా చేశాడు. బలాలను ముగ్గురికి తగినట్లుగా పంచాడు. అక్రూరుడి భార్యలు, పిల్లలు అడవులకు పోయారు. ఒకనాడు విజయుడు సవినయంగా బలరామకృష్ణుల నిర్యాణవార్తను వారి రాణులకు తెలిపాడు. విషయాలన్నీ వివరించి విలంబనంగా వార్త చెప్పటానికి గల కారణాలను కూడా తేటపరిచాడు. రాణులు అర్జునుడి

చర్యలను గౌరవించారు. రుక్మిణ్యాదులు అగ్నిలో ప్రవేశించారు. సత్యభామాదులు అడవులకు వెళ్ళారు. అందరినీ వీడ్కొల్పి అర్జునుడు వ్యాసుడిని దర్శించటానికి వెళ్ళాడు.

**వ్యాసోపదేశం:**

ఖిన్నుడై ఉన్న అర్జునుడిని వ్యాసమహర్షి ఆశ్వాసించి కారణం అడిగాడు. బలరామకృష్ణుల నిర్యాణాన్నీ, యాదవవీరుల మరణాన్నీ, బోయలను తాను ఎదిరించలేకపోవటం - మొదలైన వివరాలన్నీ తెలిపి తనకు అస్త్రమంత్రాలు స్ఫురించకపోవటానికీ, బోయలను కూడా జయించలేని బలహీనత ఏర్పడటానికీ కారణమేమిటని అడిగాడు. కర్తవ్యాన్ని బోధించుమని ప్రార్థించాడు.

వ్యాసమహర్షి అర్జునుడితో ఇట్లా చెప్పాడు. 'మును లిచ్చిన భయంకర శాపప్రభావంచేత యాదవు లిట్లా నశించారు. దానికి దుఃఖించవలసిన అవసరం లేదు. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు కావటంచేత కాలం దాపురించిన కార్యానికి అడ్డుగా వ్యవహరించటం ఎందుకని ఉపేక్షతో ఊరుకొన్నాడు. శ్రీకృష్ణుడు కణ్వాది మహర్షుల శాపాన్ని అపేశక్తి కలవాడైనా, తప్పనిసరిగా జరుగదగిన కార్యం కాబట్టి యాదవనాశనాన్ని ఆపలేదు. భారతయుద్ధంలో నీ పట్ల ఉండే స్నేహంవలన దయతో శ్రీకృష్ణుడు రుద్రత్వస్ఫురణ పొంది తానే నీకంటెముందుగా శత్రుసైన్యాన్ని చంపేవాడు. నీ సమంచిత దృష్టి దానిని దర్శించగలిగింది. ఇప్పుడు కాలవిపర్యయంవలన అతడు నిన్ను కాపాడలేదు. నారాయణుడు శ్రీకృష్ణావతారం ఎత్తి అవతార కార్యక్రమం పూర్తిచేసి స్వస్థానాన్ని పొందాడు. అయిన కాలంలో బలమూ, బుద్ధీ, శక్తీ ప్రకాశిస్తాయి. కాలం అడ్డం తిరిగితే నశిస్తాయి. నీ అస్త్రసంపద కూడా ఇటువంటిదే. అందువలన జ్ఞానులు దానికి గర్వించరు, దీనికి శోకించరు. సృష్టిలో సర్వం కాలాధీనంగా ఉంటుంది. అందుచేత తక్కిన ఆలోచనలు మాని, పాండవులైన మీరు పెద్దలు ప్రశంసించగా వికారరూపాలైన ఈ దేహాలను వదలి ఉత్తమగతికి వెళ్ళండి' అని ప్రబోధించాడు.

అర్జునుడు నిర్వికారచిత్తంతో ఆ సందేశం విని, ఆ మహర్షిని వీడ్కొని హస్తినాపురంచేరి ధర్మరాజుకు జరిగిన వృత్తాంతమంతా నివేదించాడు.

# మహాప్రస్థానికపర్వ కథాసారం

వ్యాసమహర్షి సందేశం వినిన ధర్మరాజు మహాప్రస్థానం చేయాలన్న సంకల్పంతో అర్జునుడితో ఇట్లా అన్నాడు.'కాలుడు సర్వభూతాల పరిపాకాన్ని కలిగిస్తాడు. కర్మపరిత్యాగమే ప్రస్తుత కర్తవ్యమని నా బుద్ధికి స్ఫురిస్తున్నది.నీ మనస్సుకూడా దానికి అనుకూలంగా ఉన్నట్లు తోస్తున్నది' అన్నాడు. అర్జునుడు అగ్రజుడి అభిప్రాయానికి అనుకూలంగా పలికాడు. 'కాలాన్ని ఏమనవచ్చును? కాలానికి సాటి కాలమే ఔతుంది. కాలపు లీలలకంటె గొప్ప లీలలు ఉన్నాయా? నీవు బాగా దర్శించావు. నీ ఆలోచన మనకు హితం, అభిమతం కూడా!' అన్నాడు. అతడి మాటలకు ధర్మరాజు సంతోషించి భీమనకుల సహదేవులను పిలిపించి వారి కాసంగతి తెలుపగా, వారు కూడా అంగీకరించారు. వెంటనే యుయుత్సుడిని పిలిపించి అతడి కా విశేషాలను తెలిపి, రాజ్యతంత్రాన్ని వివరించి సర్వసైన్యాధ్యక్షుడిగా నియోగించి, పరీక్షితుడిని రాజ్యాధిపతిగా అభిషేకించి, సామ్రాజ్య పరిపాలన ప్రకారాన్ని ఉపదేశించాడు.

కురుకుల పవిత్రచరిత్ర అయిన సుభద్రకు ధర్మరాజు ఇట్లా ఉపదేశించాడు. 'నీ మనుమడు పరీక్షితుడు కౌరవరాజ్యభారం వహించాడు. యాదవవంశవరుడు వజ్రుడికి ఇంద్రప్రస్థరాజ్యాన్ని ఇచ్చాను. వీరిరువురినీ నీవు రక్షించాలి. నీవు మాతో రావద్దు. వనవాసవ్రతాదులను స్వీకరించవద్దు' అని నియమించాడు. భారతరణంలో మృతులైన బంధువులకూ, యాదవ వీరులకూ పరలోక ప్రాప్తికొరకు అనేక దానాలు చేశాడు. ధౌమ్యాది విప్రులకు బహువస్తుకోటిని దానంచేసి వారిని సంతోషపరిచాడు. మిగిలిన బంగారాన్ని పరిక్షితుడి కిచ్చి కృపాచార్యుడిని అతడికి గురువుగా నియమించి, పౌర జానపద ప్రముఖుల ఎదుట పరీక్షితుడిని ప్రభువుగా ప్రకటించి, వారు తమపట్ల ప్రదర్శించిన అభిమానానికి అభినందించి, తమ మహాప్రస్థానానికి ప్రజాపరిషత్తు అనుమతిని పొందాడు.

ధర్మరాజు సర్వాభరణాలను త్యజించి, నారచీరలు ధరించి, తమ్ములూ ద్రౌపదీ అట్లాగే చేసి తనవెంట రాగా, అగ్నులను నీట పడవైచి, వారివెంట ఏడవదిగా ఒక కుక్క ఉండగా, ప్రజలు వెంటరాగా హస్తినాపురం వెడలి కొంతదూరం వెళ్ళారు. ధర్మరాజు ఏ ఒకరిని ఉద్దేశించి కూడా ఇక ఆగండి అని అనలేదు. తలవంచుకొని పోసాగాడు. క్రమంగా

ప్రజలందరూ ఆగి, ప్రదక్షిణ ప్రణామాలు చేసి తిరిగి వెళ్ళారు. పరీక్షితుడు నగరంలోనికి ప్రవేశించాడు. ఉలూపి నాగలోకం వెళ్ళింది. చిత్రాంగద బభ్రువాహనుడి వద్దకు వెళ్ళింది. మిగిలినవారు హస్తినాపురంలో ఉండిపోయారు. కృపధౌమ్యుల నేర్పరితనంతో రాజ్యం సంపద్భరితమై ఒప్పారింది.

## ప్రస్థానంలో భీమాదుల ప్రాణత్యాగం:

ధర్మజుడు ముందు నడవగా క్రమంగా భీమార్జున నకుల సహదేవులూ, ద్రౌపదీ, శునకం వెంటసాగారు. ఈ ఏడుగురూ యోగబలంతో పర్వతారణ్య నదీప్రాంతాలను అవలీలగా దాటుతూ ప్రస్థానం సాగిస్తున్నారు. తూర్పు సముద్రతీరంలో అగ్ని ప్రత్యక్షమై అర్జునుడి గాండీవాన్ని సముద్రంలో నిక్షిప్తం చేయించాడు. ఆ తరువాత భూప్రదక్షిణంగా దక్షిణ పశ్చిమ సముద్రాలవెంట సాగి ఉత్తర దిశగా పయనించి హిమలయ పర్వతాలను దాటి మేరుపర్వత భూములలో ప్రస్థానం సాగించారు.

ఆ సమయాన పాంచాలికి యోగం సడలింది. ఆమె నేలపై పడి ప్రాణాలు వదలింది. భీముడు విషణ్ణుడై దానికి కారణ మేమిటని అన్నను ప్రశ్నించాడు. ఆమెకు పతులైదుగురైనా అర్జునుడిమీద అనురాగం అధికంగా చూపేది కాబట్టి దాని ఫలితంగా ఆ పతనం జరిగిందని ధర్మరాజు చెప్పి యోగసిద్ధి శిథిలంకాకుండా ముందుకు సాగాడు. కొంతసేపటికి సహదేవుడు పడిపోయాడు. భీముడు దానికి కారణమడిగాడు. తనకంటె పండితుడు లేదని విర్రవీగటంవలన అత డా ఫలితం పొందాడని ధర్మజుడు పలికి నిర్వికారంగా ముందుకు నడిచాడు. ఆపైన నకులుడు నేలపై పడ్డాడు. కారణమడిగిన భీమసేనుడికి అతడి సౌందర్యగర్వమే దానికి కారణమని అగ్రజుడు చెప్పాడు. ఆ తరువాత అర్జునుడు నేలపై వాలిపోయాడు. భీముడు ఆవేదనతో కారణమడిగాడు. కౌరవులనందరినీ, ఒకేరోజున సంహరిస్తానని పలికాడు. సాటి విలుకాండ్రను లెక్కచేయక గర్వించాడు. మాట లొకటి చేతలు మరొకటి కావటంవలన ఫలంగా ఆ పతనం పొందాడని ధర్మరాజు సమాధానం చెప్పాడు. ఆ తరువాత భీముడు కూడా యోగం సడలి ఒరిగిపోతూ దానికి కారణమేమిటని అన్నను అడిగాడు. బలపరాక్రమాలున్నా భోజనప్రీతి ఎక్కువ కావటం, ఎవ్వరినీ లక్ష్యంచేయకుండా మాట్లాడటం అతడి పతనానికి కారణమని ధర్మరాజు చెప్పాడు. ఒక ధర్మరాజూ, అతడివెంట నడుస్తున్న శునకమూ మిగిలారు. వారు వెనుదిరగకుండా ప్రస్థానాన్ని సాగించారు.

## సురేంద్ర ధర్మజ సంవాదం:

అప్పుడు దేవేంద్రుడు దివ్యకాంతులతో వెలుగొందుతున్న రథాన్ని తెచ్చి ధర్మజుడి ముందు నిలిపి కల్పవృక్ష పుష్పాలతో వాన కురిపించి అతడిని రథ మెక్కుమని ఆహ్వానించాడు. అప్పుడు ధర్మరాజుకూ, ఇంద్రుడికీ నడుమ ఈ క్రింది సంవాదం జరిగింది.

**ధర్మరాజు** : దేవేంద్రా! నా తమ్ములూ, నా భార్యా నాతోపాటు తోడుగా ప్రస్థానంచేస్తూ దప్పితో చనిపోయారు. వారిని వదలి నేనొక్కడినే స్వర్గానికి ఎట్లా వచ్చేది? దయతో నాతోపాటు వారుకూడా వచ్చేటట్లు చేయుము.

**ఇంద్రుడు** : ధర్మరాజా! నీ తమ్ములూ, ద్రౌపదీ తనువులు వదలి స్వర్గానికి వెళ్ళారు. నీవు వారిని అక్కడ చూడవచ్చును. నీవు సాక్షాత్తూ ధర్మనందనుడివి, ఒకసారి దేహం వదలిన తరువాత మరల ఆత్మలు అందులో ప్రవేశించటం కుదరదు. కాబట్టి నీవే నాతో రమ్ము వెళ్ళుదాం.

**ధర్మరాజు** : హస్తినాపురం నుండి గాఢ భక్తితో అందరికంటె ముందుగా ఈ శునకం నన్ను అనుసరించి వస్తున్నది. దీనిని వదలి నేను కఠినుడను కాలేను. ఈ శునకాన్ని కూడా స్వర్గానికి రానిమ్ము.

**ఇంద్రుడు** : నీ విట్లా అనవద్దు. కుక్కకు దివ్యత్వం ఎట్లా కలుగుతుంది? కుక్కను వదలటం కఠినత్వం కాదు ఆలస్యం చేయక రథమెక్కుము

**ధర్మరాజు** : ఇంద్రా! నీవంటి సత్పురుషులకు అసాధ్య మేమున్నది? భక్తులను వదలి పొందే భాగ్యం నాకు మాత్రం తృప్తి కలిగిస్తుందా?

**ఇంద్రుడు** : ఉత్తములకు కోపం పనికిరాదు. కుక్కలకు స్వర్గంలో చోటు లేదు. ఈ కుక్కను వదలితే నీ కేమీ పాపం రాదు. కోపతాపాలు వదలి శుభసమయంలో ఆలస్యం చేయవద్దు.

**ధర్మరాజు** : భక్తిగల సేవకుడిని వదలితే బ్రహ్మహత్యతో సమానమైన పాపం కలుగుతుందని పెద్దలంటారు. స్వర్గ సుఖం కొరకై ఈ కుక్కను విడిచి పాపం పొందలేను.

**ఇంద్రుడు** : యజ్ఞదీక్షితులు కుక్కను తాకితే పుణ్యం నశిస్తుంది - అని నీకు తెలియదా? నీవు పట్టుబట్టక ఈ కుక్కను వదలి స్వర్గసౌఖ్యం పొందుము. పుణ్యభాగ్యంవలన దివ్యత్వం పొందావు. ద్రౌపదినీ, తమ్ములనూ వదలటానికి వెనుకాడని నీవు ఈ కుక్కను వదలలేకపోతున్నావు. ఇది నీకు తగిన పనేనా?

**ధర్మరాజు** : ధర్మాన్ని విన్నవించుకొనటం తప్పుకాదు. భీమాదులూ, ద్రౌపదీ చనిపోయారు. ఎంత దుఃఖించినా వారు తిరిగిరారు. బ్రతికి ఉన్న కుక్కను వదలటం న్యాయమా? శరణన్నవారిని స్వీకరించకపోవటం, మిత్రుడికి ద్రోహం చేయటం కులవధువును చంపటం, బ్రాహ్మణధనాన్ని అపహరించటం - అనే వాటికంటె ఏ అపరాధమూ చేయని సేవకుడిని నిర్దాక్షిణ్యంగా వదలేపాపం గొప్పది. ఆ పాపం క్షమించరానిది. దేవేంద్రా! కుక్కను సంభావించిన కార్యం దోషం కాకుండా ఉండేటట్లు వరం ప్రసాదించుము. నీవు నాపై దయను ప్రసరించుము. నేను నీకై తపస్సు చేస్తూ అడవుల లోనే ఉండిపోతాను. నాకు ఈ మాత్రం చాలు. ఇట్లా నిర్భయంగా, నిర్ద్వంద్వంగా పలికిన ధర్మరాజును చూచి శునకరూపంలో ఉన్న యమధర్మరాజు సంతోషించి,నిజరూపాన్ని ప్రదర్శించి ధర్మరాజును అభినందించాడు. యక్షప్రశ్నల సందర్భంలో తమ్ములలో పినతల్లి కొడుకైన నకులుడిని బ్రదికించుమని కోరుకొనటంలో ప్రదర్శించిన ధర్మనీతిని ప్రశంసించాడు. ధర్మ రాజువంటి ధర్మాత్ములు స్వర్గంలోనైనా ఉండరని కీర్తించాడు. ఇంద్రుడితో వెడలి స్వర్గసుఖాల ననుభవించుమని ధర్మరాజుకు వరమిచ్చాడు. అతడిని దివ్యరథంమీద కూర్చుండబెట్టి దివ్యలోకాలకు పంపాడు. ఇంద్రాది దేవతలు ధర్మజుడిని అభినందించారు. అప్పుడు దివ్యమహర్షి అయిన నారదుడు ధర్మరాజును ఎలుగెత్తి ఇట్లా కీర్తించాడు. 'దానాలలో తపస్సులలో కీర్తి కెక్కిన రాజులనెందరి గురించో విన్నాము. కాని, నీ ప్రశస్తమైన కీర్తికాంతులు అన్ని లోకాలలోనూ వ్యాపించటంచేత వారి కీర్తులన్నీ మాసిపోయాయి. ఆ రాజులు ఇట్లా సశరీరులై అమరత్వసిద్ధికై రాగలిగారా?'

**ధర్మరాజు** : నా సోదరులూ, ద్రౌపదీ ఎక్కడ ఉన్నారో, యుద్ధంలో నా పక్షంలో పోరిన యోధులెట్లా ఉన్నారో? చూడాలని ఉన్నది. సుఖమైనా, దుఃఖమైనా వారిని చూపించండి.

**ఇంద్రుడు** : ధర్మరాజా! నీ పుణ్యవిశేషంవలన బొందితో స్వర్గానికి వచ్చావు. ఇంకా నీకు దేహసంబంధాలు వదలలేదు. స్వర్గవాసులను దర్శించుము. ఇదివరలోపలె దేహభావంతో శోకాన్ని పొందకుము.

**ధర్మరాజు** : దేవేంద్రా! మీరేమైనా చెప్పండి. నా సోదరులను, కాంతను, పుత్రులను, మిత్రులను అందరినీ ఆదరంతో ఒక్కసారి చూడనీయండి. వారిని చూడకుండా నేనుండలేను. వారందరినీ చూచి వచ్చి సర్వ భోగాలూ స్తిమితంగా అనుభవిస్తాను. అదే నాకు ఆనందాన్ని కలిగిస్తుంది.'

# స్వర్గారోహణపర్వ కథాసారం

బంధుమిత్రులను చూడాలని కోరిన ధర్మరాజు విన్నపాన్ని మన్నించి ఇంద్రుడు తగిన దూతనిచ్చి పంపాడు. నారదుడు ధర్మరాజును అనుసరించాడు. మొట్టమొదటగా మహాసింహాసనంమీద కూర్చుండి దివ్యాంగనల సేవలందుకొంటున్న దుర్యోధనుడిని చూపించాడు దేవదూత, ధర్మరాజు అసూయపడ్డాడు. తన ప్రక్కన ఉన్న దేవర్షులతో దుర్యోధనుడి దుర్ణయాలను పేర్కొని అతడివద్ద ఉండలేక భీమార్జునాదులు, ద్రౌపదీ ఉన్నచోటికి తీసికొనివెళ్ళండని కోరుకొన్నాడు. దుర్యోధనుడు యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడనీ, తన పక్షంవారిని యుద్ధమృతులుగా చేశాడనీ, అది క్షాత్రధర్మం కాని పాపం కాదనీ, శరీర రహితుడైన దుర్యోధనుడిపై ఈర్ష్యాదులు పొందే తన దేహస్పృహను వీడుమనీ 'దేవర్షులు ధర్మరాజుకు హితవు చెప్పారు.

ధర్మరాజు తన సోదరులనూ, ద్రౌపదినీ, బంధువులనూ చూడాలనే ఆకాంక్షను మరల వ్యక్తం చేయటమే కాక, తిలోదకాల నిచ్చే సమయంలో కుంతివలన కర్ణుడు తనకు జ్యేష్ఠుడని తెలియటంవలన, అతడిని వధించటానికి తానే అర్జునుడిని ప్రేరేపించటంవలన, కర్ణుడిని దర్శించి కృతార్థుడు కావాలని ప్రత్యేకంగా ఆర్థించాడు. అట్లాగే విరాట ద్రుపదాది బంధుమిత్రులను దర్శించాలని పట్టుపట్టాడు. అతడి కోరికను దేవదూత ఇంద్రుడికి తెలియపరిచాడు. అతడి అనుమతితో

ధర్మరాజును ముందుకు నడిపించాడు. వారు దుర్భర దుర్గంధ భూయిష్ఠమైన మలిన ప్రదేశంలో ప్రవేశించారు. దుస్సహ నరకబాధ లనునుభవించే జీవులు గోచరించారు. ధర్మరాజు కలతపడ్డాడు. కాని, ఆ బాధితులందరూ ధర్మరాజు శరీర సుగంధాన్ని అనుభవిస్తూ శాంతిసుఖాలను పొందుతుండటంవలన అతడిని మరికొంతసేపు అక్కడ ఉండుమని వేడుకొన్నారు. ధర్మరాజు 'వారెవరు?' అని అడిగాడు. వారే కర్ణుడు, భీముడు, అర్జున నకుల సహదేవులు, ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు, ఉపపాండవులని గొంతులు వినిపించాయి. ధర్మరాజు వ్యాకులచిత్తుడయ్యాడు. పుణ్యశీలురైన భీమాదులు నరకబాధలు పడటం అధర్మమని అవేశపడ్డాడు. ఒక్కమేలిపనికూడా చేయని దుర్యోధనుడు స్వర్గభోగాలను పొందుతున్నందుకు అసహనం ప్రకటించాడు. ఇంద్రుడిపై అగ్రహించాడు. దేవదూతను తిరిగి పొమ్మని ఏవగించుకొన్నాడు. ఆ సంగతి తెలిసికొని ఇంద్రుడు దేవతలతో కలిసి అక్కడికి వచ్చాడు. యమధర్మరాజు కూడా తనకుమారుడైన ధర్మరాజు వద్దకు వచ్చాడు. అక్కడి దుర్గంధ భూయిష్ఠమైన మలిన వాతావరణమంతా మారి సుగంధయుతమైన పవిత్ర ప్రదేశంగా స్ఫురించింది.

ఇంద్రు డిట్లా అన్నాడు 'ధర్మరాజా!. మరణాంతే నరకం ధ్రువమ్' అనేది రాజులపట్ల మరచిపోలేని సత్యం. పుణ్యపాపాలు రెండూ జంటగా ఉంటాయి. పుణ్యంచేత స్వర్గమూ, పాపంచేత నరకమూ కలుగుతాయి. స్వల్పపుణ్యం చేసినవారు తొలుత స్వర్గసుఖాన్ని అనుభవించి తరువాత దీర్ఘనరకాన్ని పొందుతారనీ, అధిక పుణ్యంచేసినవారు మొదట నరకయాతనలు పొంది తరువాత స్వర్గసుఖాలు పొందుతారనీ, దుర్యోధనాదులు మొదటి తెగకు చెందుతారనీ, కర్ణభీమాదులు రెండవ తెగవారనీ వివరించాడు. ధర్మరాజు స్వల్పనరక బాధను పొందటం శాశ్వత స్వర్గసుఖంకొరకే అనీ పేర్కొన్నాడు. ధర్మరాజు దానధర్మాలు యజ్ఞాలు చేయటంవలన మాంధాత్రాది చక్రవర్తులు పొందిన ఉన్నత స్థితిని పొందాడని కీర్తించాడు. ఆకాశగంగలో స్నానంచేసి పూర్వరాజులు పొందలేని ఉత్తమ స్థితిని పొందుమని సూచించాడు.

యమధర్మరాజు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'నిన్నిప్పటికి మూడుసార్లు పరీక్షించాను. మొదట ద్వైతవనంలో అరణి విషయకంగానూ, రెండవసారి మేరుపర్వత ప్రాంతంలో కుక్కతో కలిసి నీవు వచ్చినప్పుడూ, ఇక్కడ నీ సోదరుల స్వర్గప్రాప్తి విషయంలోనూ నీవు స్థిరచిత్తుడవై శమ, దమ, సత్య గుణాలనూ, నాపై ప్రగాఢమైన భక్తినీ ప్రదర్శించావు. నీవు బాగా పరీక్షించబడ్డావు. ఈ స్వల్ప నరక దర్శనంకూడా మామా కల్పితమే. కర్ణభీమాదులు పుణ్యలోకవాసులయ్యారు. నీవు ఆకాశగంగలో మునిగి మానవ సంబంధాలైన శోకాదులనుండి విముక్తుడవు కమ్ము. పుణ్యలోకాలను పొంది ఉన్న నీ బంధులోకాన్ని చూడగలుగుతావు' అని అన్నాడు. ధర్మరాజును ఆకాశగంగ సమీపానికి తీసికొనివెళ్ళి అందులో మంగళస్నానం చేయించాడు. ధర్మరాజు వెంటనే తన మానవదేహం వదలి దివ్యదేహాన్ని పొందాడు. అతడి మనోవికారాలన్నీ నశించి పొగలేని అగ్నివలె ప్రకాశించాడు. యమాదులతో కలిసి ముందుకు సాగి స్వర్గసింహాసనారూఢుడై, చతుర్భుజమూర్తి అయిన శ్రీమన్నారాయణుడిని నరుడు సేవిస్తూ ఉండటం చూచాడు. మరొకవైపు సూర్యమండల శోభతో వెలుగొందే కర్ణుడిని, మరుద్గణాలతో కూడి ఉన్న భీముడినీ, అశ్వినీదేవతలతో కూడి ఉన్న నకుల సహదేవులనూ చూచి ఆనందించాడు. మరొకవైపు ఉదయించిన సూర్యకాంతితో ప్రకాశిస్తున్న దివ్యశక్తి మూర్తిని చూచి 'ఆమె ఎవరు?' అని దేవేంద్రుడిని ప్రశ్నించాడు. ఆమె మహాలక్ష్మి అనీ, పరమేశ్వరుడి ఆజ్ఞతో ద్రుపదుడికి అయోనిజగా పుట్టి, పాండవులకు సుఖాలను కలిగించిందనీ ఇంద్రుడు పేర్కొన్నాడు. అట్లే గంధర్వరూపులైన ఉపపాండవులనూ, గంధర్వనాయకుడైన ధృతరాష్ట్రుడినీ చూపించాడు. ఆయా దేవతాంశాలతో యక్ష, గుహ్యక గంధర్వాంశలతో, రాక్షసాంశలతో పుట్టి వారిలో లీనమై వివిధవీరులను చూపించాడు. వారు మరల భూమిమీద పుట్టరని పేర్కొన్నాడు. దుర్యోధనుడు స్వర్గసుఖాలను స్వల్పకాలం అనుభవించి ఆ తరువాత నరకంలోపడి దీనస్థితినొంది చివరకు కలిపురుషుడిలో కలిసిపోయాడు. దుశ్శాసనాదులు రాక్షసగణాలలో లీనమయ్యారు. చివరకు విదురుడు, ధర్మరాజు యమధర్మరాజులో లీనమయ్యారు. వేదవ్యాస ప్రోక్తమైన ఈ భారత మహేతిహాసాన్ని వైశంపాయనుడు జనమేజయుడికి సర్పయాగసందర్భంలో వినిపించి, ఆ రాజును ధన్యుడిని చేశాడు. జనమేజయుడు ఈ కథ విని బ్రహ్మానందాన్ని పొందాడు. ఈ కథను సూతుడు శౌనకాది మహామునులకు సత్రయాగ సందర్భంలో వినిపించాడు.

చ. 'పరమపదాప్తిహేతు వగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరcగు చొప్పునc జెప్పిన వారు మోదసం
భరితతc బొంది, యక్కథకుc బ్రాcతిగ నర్పితుcజేసి రర్మిలిన్;
హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయcజూడు మెప్పుడున్.' (స్వర్గా.94)

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

జి.వి.సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

# విషయసూచిక

## అశ్వమేధపర్వము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## ఆశ్రమవాసపర్వము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము

## మౌసలపర్వము

# మహాప్రస్థానిక పర్వము



# స్వర్గారోహణ పర్వము

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీనామక పార్వత్యభి। ధానక మాధుర్య ధుర్యతత్త్వాశ్లేషో**
**పానీతనిరంతర సాం। ద్రానంద ప్లావితాత్మ! హరిహరనాథా ! 1**

**ప్రతిపదార్థం :** హరిహరనాథా!= హరిహరనాథ స్వామీ! శ్రీనామక= శ్రీ (లక్ష్మి) అనే పేరు కలిగినదీ; పార్వతీ+అభిధానక= పార్వతి అనే పేరు కలిగినదీ; మాధుర్యధుర్య= తీయదనం కలిగి ఉన్న; తత్త్వ= శక్తితత్త్వంయొక్క; ఆశ్లేష= కలయికచేత; ఉపానీత= పొందించబడిన; నిరంతర= ఇతరభావాలతో వ్యవధానం లేని, అఖండాకారంతో ఉన్న; సాంద్ర+ఆనంద= దట్టమైన ఆనందంలో; ప్లావిత= తేలించబడిన; ఆత్మ!= హృదయం కలవాడా!

**తాత్పర్యం :** లక్ష్మి, పార్వతి అనే పేర్లుగల మధుర శక్తులతో అంతరాయం లేకుండా కూడి ఉండటంచేత ఎల్లప్పుడు మహానందంలో తేలియాడుతూ ఉండే అంతరంగంతో అలరారే మహానుభావా! ఓ హరిహరనాథా! (అవధరించుము).

(శోకమగ్నుండగు ధర్మజునిఁ గృష్ణాదులు ప్రబోధించుట (సం. 14-1-1))

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె న ట్లమరనదీనందనున కుదకకర్మం బాచరించి**
**ధర్మనందనుండు ధృతరాష్ట్రపురస్సరంబుగ భాగీరథి యుత్తరించి తత్తీరదేశంబున. 2**

**ప్రతిపదార్థం :** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; అమరనదీనందనునకున్= గంగానదీ కుమారుడికి (భీష్ముడికి); ఉదక కర్మంబు= జలతర్పణం; ఆచరించి= చేసి; ధర్మనందనుండు= ధర్మరాజు; ధృతరాష్ట్ర పురస్సరంబుగన్= ధృతరాష్ట్రుడిని ముందుంచుకొని; భాగీరథి= గంగను; ఉత్తరించి= దాటి; తద్+తీరదేశంబునన్= ఆ నదీతీరంలో;

**తాత్పర్యం :** స్వామీ! జనమేజయుడికి వైశంపాయనుడు ఇట్లా చెప్పాడు. ఈ విధంగా భీష్ముడికి జలతర్పణాదులు చేసి ధర్మరాజు ధృతరాష్ట్రుడిని ముందుంచుకొని గంగను దాటి ప్రయాణంచేసి, ఆ నదీతీరంలో.(తరువాతి పద్యంతోఅన్వయం)

**వ. ఉమ్మలికంబునం బొగులు నుల్లముతోఁ బొరి లోచనంబులం**
**గ్రమ్మఁగ నశ్రువారి ధృతిగౌరవ మేద మహోగ్ర బాణపా**
**తమ్మున మ్రొగ్గ నేనుఁగు విధమ్మున నేలకు వ్రాలఁ బెట్టి వే**
**గమ్మ వృకోదరుండు మురఘస్మరుపంపున నమ్మహీశ్వరున్. 3**

**ప్రతిపదార్థం :** (ఆ ధర్మరాజు); ఉమ్మలికంబునన్= శోకంతో; పొగులు= దుఃఖించేటటువంటి; ఉల్లముతోన్= హృదయంతో; పొరిన్= మిక్కిలిగా; లోచనంబులన్= కళ్ళతో; అశ్రువారి= కంటినీరు; క్రమ్మఁగన్= నిండగా; ధృతి గౌరవము= గొప్పధైర్యం; ఏదన్= పోగా; మహా+ఉగ్రబాణ= మిక్కిలి భయంకరమైన బాణాలయొక్క; పాతమ్మునన్= పడుటచేత; మ్రొగ్గు= నేల రాలేటటువంటి; ఏనుఁగు విధమ్మునన్=

ఏనుగువలె; నేలకున్ వ్రాలన్= నేలమీదికి ఒరగగా; వేగమ్ము+అ= అతివేగంగా; వృకోదరుండు= భీముడు; మురఘస్మరు= శ్రీకృష్ణుడి; పంపునన్= ఆజ్ఞతో; ఆ+మహీ+ఈశ్వరున్= ఆ ధర్మరాజును; పట్టెన్= పట్టుకొన్నాడు;,

**తాత్పర్యం :** ఆ ధర్మరాజు మిక్కిలి శోకంతో దుఃఖపడుతూ కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతుండగా ధైర్యం రవ్వంతకూడా లేక, క్రూరమైన బాణాల తాకిడికి నేలకూలే ఏనుగువలె నేలమీదికి ఒరుగుతుండగా, అది చూచి శ్రీకృష్ణుడు చెప్పగా భీముడు ఆయనను క్రిందపడకుండా పట్టుకొన్నాడు.

**విశేషం :** అలం: ఉపమ.

**ఆ. పట్టి యతఁడు దనదు పై చీర యాస్తర । ణంబు సేసి భూస్థలంబునందుఁ**
**బెట్టె మానసములు పెద్దయు నలఁదురి । యర్జునాది సోదరాలి వొదివె. 4**

**ప్రతిపదార్థం :** పట్టి= పట్టుకొని; అతఁడు= భీముడు; తనదు= తన; పై చీర= పైనున్న అంగవస్త్రాన్ని; ఆస్తరణంబు+చేసి= క్రింద పరచి; భూస్థలంబునందున్= నేలపై; పెట్టెన్= ధర్మరాజును నెమ్మదిగా కూర్చోపెట్టాడు; మానసములు= మనస్సులు; పెద్దయున్= మిక్కిలిగా; అలఁదురి= బాధపడి; అర్జున+ఆది సోదర+అలి= అర్జునుడు మొదలైన సోదరవర్గం (ధర్మరాజును); పొదివెన్= పొదివి పట్టుకొన్నది.

**తాత్పర్యం :** అట్లా పట్టుకొని భీముడు తన భుజంపైన నున్న అంగవస్త్రాన్ని నేలమీద పరచి, ధర్మరాజును నెమ్మదిగా దానిపైన కూర్చోపెట్టాడు. అర్జుననకులసహదేవులు మిక్కిలిగా బాధపడుతూ తమ అన్నగారిని పొదివి పట్టుకొన్నారు.

**వ. కృష్ణుం డుచితవచనంబుల నా భూపాలుం బ్రబోధించె; నప్పుడు ధృతరా ష్ట్రుండు గదిసి కూర్చుండియక్కురుపతితోడ. 5**

**పతిపదార్థం :** కృష్ణుండు= శ్రీకృష్ణుండు; ఉచిత వచనంబులన్= తగిన ఓదార్పు మాటలతో; ఆ భూపాలున్= ఆ ధర్మరాజును; ప్రబోధించెన్= మేలుకొలిపాడు; అప్పుడు= ఆ సమయంలో; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; కదసి+కూర్చుండి= దగ్గరగా కూర్చొని; ఆ+కురుపతితోడన్= ఆ ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం :** శ్రీకృష్ణుడు తగిన ఓదార్పుమాటలతో ఆ ధర్మరాజును మేలుకొలిపాడు. ఆ సమయంలో ధృతరాష్ట్ర మహారాజు ఆ ధర్మరాజుకు దగ్గరగా కూర్చొని ఇట్లా అన్నాడు.

**సీ. 'క్షత్రధర్మంబునఁ గైకొంటి మేదిని । యుమ్మలికింపక లెమ్ము వత్స!**
**యనుజవర్గము నీవు ననుభవింపుము శోక । కాలంబు గా దిది యేల వగవ?'**
**నని పల్కి 'విదుర' హితాలాపములు దన । విన కుండుటయు సుయోధనుని కీడు**
**నద్దుష్టబుద్ధిఁ దా ననుసరింపఁగ ధర్మ । మెడలిన కతమున నింత పుట్టె'**

**ఆ. ననియుఁ దెలియనాడి తనకు గాంధారికి । వగలు మిగులఁ బొగులవలయుటయును**
**నుగ్గడించి 'మమ్ము నొంటి వగ్గులఁ గనుం । గొనుము నంత దీర్పు' మనయె నధిప! 6**

**ప్రతిపదార్థం :** అధిప!= జనమేజయరాజా! (ధృతరాష్ట్రుడు ఇట్లా అంటున్నాడు); వత్స!= కుమారా!; క్షత్త్రధర్మంబునన్= క్షత్త్రియ ధర్మంతో; మేదిని+కైకొంటి(వి)= భూమిని గ్రహించావు; ఉమ్మలింపక లెమ్ము= శోకించకుండా లెమ్ము!; అనుజవర్గమున్= నీ తమ్ములూ; నీవున్= నీవు; అనుభవింపుము= ఈ రాజ్యసౌఖ్యాన్ని అనుభవించండి; ఇది= ఇది; శోకకాలంబు+కాదు= దుఃఖించవలసిన సమయం కాదు; వగవన్+ఏల?= దుఃఖించటం ఎందుకు?; అని పల్కి= అని చెప్పి; విదుర= విదురుడి; హిత+ఆలాపములు= మంచి ప్రబోధాలు; తన వినకుండుటయున్= తాను వినకపోవటం; సుయోధనుని కీడున్= సుయోధనుడి దుర్మార్గం; ఆ+దుష్టబుద్ధిన్= ఆ చెడుబుద్ధిగల సుయోధనుడిని; తాన్+అనుసరింపఁగన్= తానుకూడా అనుసరిస్తూ రాగా; ధర్మము+ఎడలిన+కతనమునన్= ధర్మం నశించిన కారణంగా; ఇంత+పుట్టెన్+అనియున్= ఇంత జరిగిందనీ; తెలియన్+ఆడి= వివరించి; తనకున్= తనకూ; గాంధారికిన్= గాంధారికీ; వగలు మిగులన్= చింతలు అతిశయించగా; పొగులన్+వలయుటయును= శోకించవలసి రావటం; ఉగ్గడించి= చెప్పి; మమ్మున్= మమ్మల్ని; ఒంటి వగ్గలన్= ఒంటరి ముసలివాళ్ళను బక్కవాళ్ళను; కనుంగొనుము= చూడుము; వంత+తీర్పుము= మా దుఃఖాన్ని ఉపశమింపజేయుము; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం :** జనమేజయుడికి వైశంపాయనుడు ఇట్లా చెప్పుతున్నాడు. 'రాజా! అట్లా ధర్మరాజు సేదదీరిన తరువాత ధృతరాష్ట్రుడు అతడి దగ్గర కూర్చుని ఇట్లా అన్నాడు. 'నాయనా! క్షత్త్రియధర్మంతో యుద్ధంచేసి భూమిని సంపాదించావు. ఇపుడు శోకించటం ఎందుకు? పైకి లెమ్ము. నీ తమ్ములూ నీవూ ఈ రాజ్యాన్ని అనుభవించండి. ఇది దుఃఖించవలసిన సమయంకాదు. ఎందుకు చింతిస్తావు?' అని చెప్పి, తాను విదురుడి నీతిమాటలను వినకపోవటం, సుయోధనుడి దుర్మార్గం, చెడుబుద్ధిగల సుయోధనుడిని తాను కూడా అనుసరిస్తూ రావటంవలన ధర్మం నశించి ఇంత కీడు పుట్టటం - అంతా వివరించి, చివరికి తానూ గాంధారీ ఇట్లా శోచించవలసిన పరిస్థితి రావటాన్ని చెప్పి 'కుమారా! ఒంటిరివాళ్ళం. ఏ దిక్కూలేని బక్కవాళ్ళం. మమ్ములను నీవే చూచుకొనాలి. మా దుఃఖాన్ని నీవే పోగొట్టాలి' అన్నాడు.

**వ. అనిన విని యూరకున్నం గని శౌరి యక్కౌరవపతితో 'బంధువులు శోకంబు నొందిన మృతకోటికిం బరితాపంబు వాటిల్లు; నట్లుంగాక భవదీయజ్ఞాతులు సమరంబున ననివర్తులై యూర్ధ్వలోక వర్తులైరి; వారికి శోకింపం బని యేమి? శోకించిన వారలు మగిడివత్తురే?' యని పలికి వెండియు. 7**

**ప్రతిపదార్థం :** అనినన్= అని చెప్పగా; విని; ఊరకున్నన్= ఊరకుండగా; కని= చూచి; శౌరి= కృష్ణుడు; అ+కౌరవపతితోన్= ఆ ధర్మరాజుతో; బంధువులు= బంధువులైనవారు; శోకంబున్+ఒందినన్= ఏడిస్తే; మృతకోటికిన్= చనిపోయినవారి సమూహానికి; పరితాపంబు=మిక్కిలి ఆరాటం; పాటిల్లున్= కలుగుతుంది; అట్లున్+కాక= అంతే కాకుండా; భవదీయ= నీ; జ్ఞాతులు= దాయాదులు; సమరంబునన్= యుద్ధంలో; అనివర్తులు+ఐ= వెనుదిరిగి రాకుండా; ఊర్ధ్వలోకవర్తులు+ఐరి= స్వర్గం చేరినవాళ్ళు అయ్యారు; వారికిన్= వారిని గురించి; శోకింపన్= ఏడవటానికి; పని+ఏమి?= అవసరమేమున్నది?; శోకించినన్= ఏడిస్తే; వారలు= వాళ్ళు; మగిడి వత్తురే?= మరలి వస్తారా?; అని పలికి; వెండియున్= మళ్ళీ (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం :** ధృతరాష్ట్రుడి మాటలు విని ధర్మరాజు మౌనంగా ఉండిపోగా కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. 'బంధువులు ఏడుస్తూ ఉంటే చనిపోయినవారి ఆత్మలు పరితపిస్తాయి. అంతే కాకుండా నీ దాయాదులు వీరోచితంగా వెనుదిరుగక పోరాడి, స్వర్గలోకాన్ని పొందారు. వారిని గురించి శోకించవలసిన అవసరం ఏముంది? ఏడిస్తే పోయినవారు తిరిగి వస్తారా?' అని చెప్పి మళ్ళీ ఇట్లా అన్నాడు.

**క. 'వినవలయు వాని నెల్లను । జననాయక! వింటి నీవు శాంతనవునిచే**
**వనట యుడుగు; మిఁక దుర్మతి । యునుబోలెను వగచుచుండు టుచితమె నీకున్? 8**

**ప్రతిపదార్థం :** జననాయక!= రాజా!; వినవలయు వానిన్+ఎల్లను= వినవలసిన ఆ సుభాషితాలను; ఈవు= నీవు; శాంతనవునిచేన్= భీష్ముడివలన; వింటివి= విన్నావు; ఇఁకన్= ఇంక; వనట+ఉడుగుము= శోకాన్ని విడిచిపెట్టుము; దుర్మతియును+పోలెను= దుష్టచిత్తమున్నవాడికివలె; వగచుచుండుట= దుఃఖిస్తూ ఉండటం; నీకున్= నీకు; ఉచితమె?= తగిన పనా?

**తాత్పర్యం :** 'రాజా! పెద్దలు చెప్పే మాటలను వినాలి (అంటే ధృతరాష్ట్రుడి మాటలను వినాలని అర్థం), నీవు మునుపు భీష్ముడి వలన నుండి ఎన్నో ధర్మాలను విన్నావు. ఇంకా చింతిస్తూ కూర్చోవటం బాగాలేదు. నీ చింతను వదలిపెట్టుము. దుష్టచిత్తులు మాత్రమే అట్లా జరిగిపోయిన దానిని గురించి చీకాకు పడుతూ కూర్చుంటారు. అందుచేత నీకు ఇది తగిన పనికాదు.

**వ. వ్యాసనారదాదులును నిన్ను బోధించిరి. వారి వాక్యంబు లూహింపుము. 9**

**ప్రతిపదార్థం :** వ్యాస నారదాదులును= వ్యాసుడు, నారదుడు మొదలైనవారు; నిన్నున్= నీకు; బోధించిరి= ఎన్నో నీతులు చెప్పారు; వారి వాక్యంబులు= వారి సుభాషితాలను; ఊహింపుము= భావనచేయుము.

**తాత్పర్యం :** వ్యాసుడు, నారదుడు మొదలైనవారు నీకు ఎన్నో రీతులుగా నీతిబోధ చేశారు కదా! వారి సుభాషితాలను ఒకసారి భావన చేయుము.

**చ. అతులిత దక్షిణాన్విత మహాధ్వరకర్తవు గమ్ము, దేవతా**
**పితృనివహంబులం గరము ప్రీతియు భక్తియు నుల్లసిల్ల న**
**ర్చితములు సేయు, ముర్విఁ బ్రజఁ జేకొని రక్ష ఘటింపు, బంధు సు**
**స్థితు లొనరింపు, మెప్డు నతిథివ్రతపూజ లొనర్పు భూవరా!' 10**

**పతిపదార్థం :** భూవరా!= రాజా!; అతులిత= సాటిలేని; దక్షిణా+అన్విత= దక్షిణలతో కూడిన; మహా+అధ్వర కర్తవు+కమ్ము= గొప్ప యాగాన్ని చేసినవాడవు కమ్ము (గొప్ప యాగం చేయుము అని అర్థం); దేవతా పితృ నివహంబులన్= దేవతల, పితృదేవతల సమూహాన్ని; కరము= మిక్కిలిగా; ప్రీతియున్= ప్రేమా; భక్తియున్= భక్తీ; ఉల్లసిల్లన్= ప్రకాశించగా; అర్చితములు+చేయుము= అర్చించుము; ఉర్విన్= భూమిలో ఉన్న; ప్రజన్= జనులను; చేకొని= స్వీకరించి; రక్ష+ఘటింపు(ము)= రక్షణను ఏర్పాటు చేయుము; బంధు+సుస్థితులు+ఒనరింపుము= బాంధవుల నుంచి స్థితులు ఏర్పాటు చేయుము; ఎప్డున్= ఎల్లప్పుడూ; అతిథి వ్రత పూజలు= అతిథి వర్గానికి పూజలను; ఒనర్పు(ము)= చేయుము.

**తాత్పర్యం :** రాజా! సాటిలేని దక్షిణలతో కూడిన మహాయాగాలు చేయుము. దేవతలను పితృ దేవతలను మిక్కిలి భక్తి శ్రద్ధలతో అర్చించుము. నీ రాజ్యంలోని ప్రజలను సదా రక్షించుము. బాంధవులకువలె వారికి సుస్థితి కలిగించుము. ఎప్పుడూ అతిథులను, అభ్యాగతులను భగవత్స్వరూపులుగా పూజించుము.'

**విశేషం :** 'దక్షిణ' లేని ఏ యాగం పూర్తికాదని సంప్రదాయం, 'రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్' అని పెద్దలంటారు. 'రాజు దగ్గరకు, దైవతం దగ్గరకు, గురువు దగ్గరకు దక్షిణ లేకుండా వట్టి చేతులతో వెళ్ళరా' దని పై వాక్యానికి అర్థం. ఆరుమార్గాలద్వారా గృహస్థులు పరమేశ్వరుడి అనుగ్రహం పొందవచ్చునని సంప్రదాయం చెప్పుతున్నది. 1. బ్రహ్మయజ్ఞం: 2. వేదాధ్యయనం: 3. పితృయజ్ఞం: 4. దైవయజ్ఞం: 5. భూతయజ్ఞం: 6. అతిథియజ్ఞం. శ్రీకృష్ణుడు చెప్పిన అశ్వమేధయాగంలో బ్రహ్మవేద, దైవయాగాలు కలిసి ఉన్నాయి. ఇక మిగిలినవి పితృ, భూత, అతిథి యజ్ఞాలు. అందుకే ఈ పద్యంలో వాటిని గురించి చెప్పారు.

**వ.** **అనిన విని ధర్మనందనుండు సాత్యవతేయు మొగంబు గనుంగొని 'దేవా! భవదీయ దయాప్రేమంబులు నాపై' నెప్పుడు నత్యంత గాఢంబులై యుండు; నన్నుఁ బెక్కుభంగుల రక్షించితి; రిట మీఁద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియం; బరుగనియట్లయినం బితామహకర్ణులం జంపించిన క్రూరకర్మునకు శాంతి యెట్లుగలుగు? నమ్మహాకల్మషం బేమిటం బాయు? నయ్యనుష్ఠానంబు విధియింపుం'డని పలుకుటయు నా ధర్మధుర్యునకుఁ బారాశర్యుం డిట్లనియె.** **11**

**ప్రతిపదార్థం :** అనినన్= ధర్మరాజుతో శ్రీకృష్ణుడు అట్లా చెప్పగా; విని; ధర్మనందనుండు= ధర్మరాజు; సాత్యవతేయు= వ్యాసమహర్షియొక్క; మొగంబు+కనుంగొని= ముఖం చూచి; దేవా!= స్వామీ; భవదీయ= మీయొక్క; దయాప్రేమంబులు= దయా, ప్రేమా; నాపైన్= నా మీద; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; అత్యంత= మిక్కిలి; గాఢంబులు+ఐ+ఉండున్= అధికంగా ఉంటూ వచ్చాయి; నన్నున్= నన్ను (నా తమ్ములను) (మీరు); పెక్కుభంగులన్= చాలా రీతులలో; రక్షించితిరి= కాపాడారు; ఇటమీఁదన్= ఇకపైన; వనంబునకున్+అరుగన్= అడవికి వెళ్ళటానికి; అనుజ్ఞ+ఇచ్చుట= అనుమతి ఇవ్వటం; నాకున్+ప్రియంబు= నాకు ప్రీతికరమైనది; అరుగని+అట్లు+అయినన్= వెళ్ళకపోతే; పితామహ= భీష్మ; కర్ణులన్= కర్ణులను; చంపించిన; క్రూరకర్మునకున్= పాపకర్ముడికి; శాంతి; ఎట్లు+కలుగున్?= ఎట్లా కలుగుతుంది?; ఆ+మహాకల్మషంబు= ఆ గొప్ప పాపం; ఏమిటన్+పాయున్?= దేనితో తొలగిపోతుంది?; ఆ+అనుష్ఠానంబు= ఆ వ్రతాన్ని (దీక్షను); విధియింపుండు= విధించండి; అని; పలుకుటయున్= చెప్పగా; ఆ ధర్మధర్యునకున్= ఆ ధర్మనిర్వహణ సమర్థుడైన ధర్మరాజుతో; పారాశర్యుండు= పరాశరుడి కుమారుడైన వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం :** శ్రీకృష్ణుడు అట్లా చెప్పగా విని ధర్మరాజు వ్యాసుడిని చూచి, 'స్వామీ! మీ దయాప్రేమలు మామీద ఎప్పుడూ మిక్కిలి గొప్పగా ఉంటూ వచ్చాయి. మమ్ములను మీరు ఎన్నో విధాలుగా రక్షించారు. ఇకమీద నాకు అడవికి వెళ్ళటానికి అనుమతి ఇస్తే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. అట్లా వెళ్ళకుండాపోతే తాతగారైన భీష్ముడిని, అన్నగారైన కర్ణుడిని చంపిన ఈ మహాపాపానికి నిష్కృతి ఎట్లా కలుగుతుంది? ఏమి చేస్తే ఆ మహాపాపం పోతుందో ఆ వ్రతవిధిని నాకు అనుగ్రహించండి' అని అడుగగా వ్యాసమహర్షి ఇట్లా అన్నాడు.

**విశేషం :** 'ధురం' అంటే భారం. ధర్మభారాన్ని మోసేవాడు కాబట్టి ధర్మధురంధరుడు - ధుర్య - ధురీణ శబ్దాలకు కూడా అర్థం ఇదే. యముడు ధర్మదేవత. యముడి అవతారమైన ధర్మరాజు కూడా ధర్మనిర్వహణ సమర్థుడే. అందుకే భీమార్జునాదులందరూ అతడికి ధర్మనిర్వహణవిధిలో సహకరించినవారు మాత్రమే అని అర్థం.

**సీ.** **'నిష్ఠించి యిబ్భంగి నీ కేము చెప్పిన । వాక్యంబు లెల్లను వరదఁ గలిసి**
**పోయెనే? నీ దగు బుద్ధి యిం తొప్పదో । కాక మర్త్యుండు గాఁడు కర్త యీశ్వ**
**రు నియోగమున మేలును గీడు నొనరించుఁ । గాన నీ మదిఁ బాపకర్మ శంక**
**గలిగె నేనియును యాగముల దానంబుల । నది వాపికొనరాదె? యశ్వమేధ**

**తే.** **మధికదక్షిణాన్వితముగ ననఘ । చేయు; । మంతతో భవదీయచిత్తానుతాప**
**మంతయును బాయు; రఘురాము నట్లు పూరు । భరతులును బోలె దానతత్పరుఁడ వగుము.'** **12**

**ప్రతిపదార్థం :** నిష్ఠించి= శ్రద్ధను పూని; ఈ భంగిన్= ఇంతకు ముందు చెప్పిన రీతిలో; నీకున్+ఏము+చెప్పిన= నీకు మేము చెప్పిన; వాక్యంబులు+ఎల్లనున్= సుభాషితాలన్నీ; వఱదన్+కలిసిపోయెనే?= వరదలో కలసి పోయాయా? (వ్యర్థమయ్యాయా?); నీదు+అగు బుద్ధి= నీ బుద్ధి; ఇంత+ఒప్పదో+కాక= దీన్ని అంగీకరించదేమో కాని, మర్త్యుఁడు= మనిషి; కర్త కాఁడు= పనులకు కర్త కాడు; ఈశ్వరుని నియోగమునన్= పరమేశ్వరుడి నియోగంచేత; (తాను) మేలును= మేలూ; కీడున్+ఒనరించున్= కీడు చేస్తాడు; కానన్= కాబట్టి, నీ మదిన్= నీ మనస్సులో; పాపకర్మ శంక= పాపకర్మ విషయకమైన సందేహం; కలిగెన్+ఏనియునున్= ఉంటే; యాగములన్= యాగాలతో; దానంబులన్= దానాలతో; అది= ఆ దుష్కృతం; పాపికొనన్‌రాదె?= పోగొట్టుకొనవచ్చు కదా!; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; అశ్వమేధము= అశ్వమేధయాగాన్ని; అధిక= మిక్కిలిగా; దక్షిణా+అన్వితముగన్= దక్షిణలతో కూడినదిగా; చేయుము= నిర్వహించుము; అంతతోన్= దానితో; భవదీయ= నీ; చిత్త+అనుతాపము+అంతయును= చిత్తంలోని పరితాపమంతా; పాయున్= పోతుంది; రఘురాము+అట్లు= శ్రీరాముడివలె; పూరు భరతులునున్ పోలెన్= పూరు భరతచక్రవర్తులవలె; దానతత్పరుఁడవు+అగుము= దానాలు చేసేవాడివి కమ్ము.

**తాత్పర్యం :** 'ఎంతో శ్రద్ధవహించి ఇంతవరకు శ్రీకృష్ణుడు, నేను నీకు చెప్పిన నీతి వాక్యాలన్నీ వరదలో కలిశాయా! లేక నీ బుద్ధి వాటిని అంగీకరించలేదా! ఏమైనా వినుము. మనిషి చేసే పనులకు కర్త అతడు కాడు. పరమేశ్వరుడు ఎట్లా చేయుమంటే మనిషి అట్లా మంచిచెడులను చేస్తుంటాడు. అందుచేత నీ మనస్సులో పాపకర్మవిషయకమైన అనుమానమేదైనా ఉంటే యాగాలద్వారా, దానాలద్వారా దానిని తొలగించుకొనుము. ఎక్కువగా దక్షిణలు ఇచ్చి, అశ్వమేధయాగాన్ని భక్తిశ్రద్ధలతో చేయుము. దానితోనే నీ మనసులోని పరితాపమంతా పోతుంది. శ్రీరామ పూరు భరత చక్రవర్తులవలె బాగా దానాలు చేయుము. నీకు మంచి' కలుగుతుంది.

**చ.** **అన విని యమ్మునీశ్వరున కా నృపుఁ డిట్లను 'నశ్వమేధయా**
**గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగ జాలు నాఁగ ము**
**న్నును వెడ వింటి సజ్జన! మనోజ్ఞ వచోమహనీయ! నీవు చె**
**ప్పిన పలు కూఁది యా క్రతువు ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్.** **13**

**ప్రతిపదార్థం :** అనన్ విని= అని వ్యాసు డనగా విని; ఆ మునీశ్వరునకున్= ఆ వ్యాసుడితో; ఆ నృపుఁడు= ఆ ధర్మరాజు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అశ్వమేధయాగ నిరతి= అశ్వమేధయాగంలో అభిలాష; భూమిపాలున్= రాజును; గతకల్మషున్= పోయిన కల్మషం కలవాడినిగా; చేయఁగన్+చాలున్+నాఁగన్= చేయగా సమర్థమైనదని; మున్నును= పూర్వం కూడా; వెడ+వింటిన్= కొద్దిగా విన్నాను; సజ్జన!= మహోత్తమ పురుషుడా!; మనోజ్ఞ వచో మహనీయ!= మనోహరమైన వాక్యం కలిగిన గొప్పవాడా!; నీవు చెప్పిన= నీవు బోధించిన; పలుకు+ఊఁది= మాటను ఆధారంగా గ్రహించి; ఆ క్రతువు= ఆ యాగాన్ని; ఎల్ల భంగులన్= అన్ని విధాలుగాను; ప్రీతిన్+ఒనర్చెదన్= భక్తిశ్రద్ధలతో దైవప్రీతికరంగా చేస్తాను.

**తాత్పర్యం :** అని వ్యాసుడనగానే ధర్మరాజు 'స్వామీ!' అశ్వమేధయాగంలో అభిలాష ఉన్న రాజుకు ఏ పాపాలూ అంట వని పెద్దలు ఎంతోమంది చెప్పగా ముందు కొద్దిగా విన్నాను. నీవు ఉత్తమపురుషుడవు. నీ వాక్యం మనోహరమైనది. నీ ప్రజ్ఞ మహనీయమైనది. కనుక నీ మాటలనే ప్రమాణంగా గ్రహిస్తాను. అశ్వమేధాన్ని భక్తిశ్రద్ధలతో దైవప్రీతికరంగా తప్పకుండా చేస్తాను.'

**వ. అని పలికి 'మునీంద్రా! యొక్క విన్నపం బవధానంబుతో నవధరింపు; మశ్వమేధం బధికదక్షిణాన్వితంబుగావలయు ననుట దెల్లంబుగా మీరు నానతిచ్చితిరి; నా కర్థంబు లేదు; కయ్యంబున మృతులయిన నరపతుల సతులు శిశువులును శోకాక్రాంతులునుం గావున వారలవలన ధనాహరణం బత్యంతాకరణీయంబును దుర్లభంబును నైనది; తొల్లి దుర్యోధనుండు మాతోడి యీసునం జేసి పెక్కండ్రు రాజులను మ్రుక్కడి మూకలనుం గూడఁ బెట్టి ధనంబు వ్యయపెట్టి భూమియు బండారంబునుం బాడు చేసె; నివ్విధంబున నిర్ధనత్వంబు వాటిల్లె; ధనార్జనంబునకు నొండొక వెరవు దొరకొన దిట్టిది కర్తవ్యం బని యెఱుంగకున్నవాఁడ; మంత్రులరై నాకుఁ గార్యం బెఱింగింపవలయు' నని ప్రార్థించిన నమ్మహాత్ముం డమ్మహీపతిం బరమాదరంబున నాలోకించి కొండొక విచారించి. 14**

**ప్రతిపదార్థం :** అని పలికి= అని చెప్పి; మునీంద్రా!= మునులలో శ్రేష్ఠుడా!; ఒక్క విన్నపంబు= నా విన్నపం ఒకటి ఉన్నది; అవధానంబుతోన్= ఏకాగ్రచిత్తంతో; అవధరింపుము= వినుము; అశ్వమేధంబు= అశ్వమేధయాగం; అధిక దక్షిణా+అన్వితంబు= మిక్కిలి ఎక్కువ దక్షిణలతో కూడింది; కావలయున్+అనుట= కావాలి అన్నది; తెల్లంబుగాన్= స్పష్టంగా; మీరున్+ఆనతిచ్చితిరి= మీరు కూడా చెప్పారు; నాకున్+అర్థంబు+లేదు= నావద్ద ధనం లేదు; కయ్యంబునన్= యుద్ధంలో; మృతులు+అయిన= చనిపోయిన; నరపతుల= రాజుల; సతులు= భార్యలు; శిశివులునున్= వారి కుమారులు; శోక+ఆక్రాంతులునున్= శోకంలో చిక్కుకొన్నవారు; కావునన్= కావటంచేత; వారలవలనన్= వారి నుండి; ధన+ఆహరణంబు= ధనం తీసికొనటం; అత్యంత+అకరణీయంబునున్= మిక్కిలి చేయరానిది; దుర్లభంబున్+ఐనది= అసాధ్యమైనది; తొల్లి= మునుపు; దుర్యోధనుండు= సుయోధనుడు; మాతోడి ఈసునన్+ చేసి= మాపై ఈర్ష్యచేత; పెక్కండ్రు రాజులను= చాలామంది రాజులను; మ్రుక్కడి మూఁకలనున్= అల్లరి గుంపులను; కూడన్+పెట్టి= చేర్చుకొని; ధనంబు వ్యయపెట్టి= ధనం వృథాగా ఖర్చుపెట్టి; భూమియున్= భూమినీ; భండారంబునున్= ధనాగారాన్నీ; పాడుచేసెన్= నాశనం చేశాడు; ఈ విధంబునన్= ఈ రీతిగా; నిర్ధనత్వంబు= ధనంలేమి; పాటిల్లెన్= వచ్చి పడింది; ధన+ఆర్జనంబునకున్= ధనం సంపాదించడానికి; ఒండొక+వెరవు= మరొక ఉపాయం; దొరకొనన్= లభించటానికి; ఇట్టిది= ఇట్లాంటిది; కర్తవ్యంబు+అని= చేయదగినదని; ఎఱుంగక+ఉన్నవాఁడన్= తెలియకుండా ఉన్నాను; మంత్రులరై= మీరు మంత్రిగా; నాకున్= నాకు; కార్యంబు= చేయదగిన పని; ఎఱింగింపన్‌వలయున్+అని= తెలపాలి అని; ప్రార్థించినన్= ప్రార్థించగా; ఆ+మహాత్ముండు= మహాత్ముడైన ఆ వ్యాసుడు; ఆ+మహీపతిన్= ఆ రాజును; పరమ+ఆదరంబునన్= మిక్కిలి అదరంతో; అలోకించి= చూచి; కొండొక= కొంతసేపు; విచారించి= ఆలోచించి.

**తాత్పర్యం :** అని చెప్పి 'మునీంద్రా! నా విన్నపం ఒకటి ఉన్నది. దయచేసి వినండి. అశ్వమేధయాగంలో అధికంగా దక్షిణలు ఈయవలసి ఉంటుం దన్న విషయం మీరు స్పష్టంగా చెప్పారు. ఇప్పుడు నావద్ద ధనం లేదు. యుద్ధంలో చనిపోయిన రాజుల భార్యలు, శిశువులు మిగిలారు. వారు దుఃఖసముద్రంలో మునిగి ఉన్న ఈ సమయంలో నేను వారినుండి ధనం లాగటం మిక్కిలి హేయమైన పని. దుస్సాధం కూడా. మునుపు దుర్యోధనుడు నాపై అసూయతో ఎంతో మంది వ్యసనపరులైన రాజులను అతిగా గుంపులను చేరదీసి, ధనాన్ని వ్యర్థంగా ఖర్చుపెట్టటంవలన ఈ రీతిగా భూమి, ధనాగారం నాశనమయ్యాయి. అందుచేతనే కోశం ఈనాడు ఈ విధంగా లేమికి గురి అయింది. ధనం సంపాదించటానికి మరొకమార్గం ఏమిటో నాకు గోచరించటంలేదు. కాబట్టి మీరు నాపైన కృపతో మంత్రిత్వం వహించి ఏమి చేయాలో చెప్పండి' అని ప్రార్థించగా ఆ వ్యాసమహర్షి పరమాదరంతో ఆ మహారాజును చూచి, కొంచెంసేపు ఆలోచించి, ఇట్లా అన్నాడు.

**విశేషం :** ద్వాపరయుగంలో రాజనీతి ఎట్లాంటిదో మనం ఇక్కడ చూడవచ్చును. రాజు పన్నులద్వారా ఎప్పుడు పడితే అప్పుడు ప్రజలను శోకింపచేయరాదని అర్థం. యుద్ధం జరిగిన తరువాత ఎంత ధనం వ్యయమై ఉంటుందో అర్థం చేసికొనవచ్చును. తోడుగా దుర్యోధనుడి దుర్వ్యయం. అందుకే మిగిలిన రాణివాసంపైనా, శిశువులపైనా ధనాహరణ ప్రయోగం చేయటం హేయమయిన పని

అని ధర్మరాజు భావించాడు. మనుస్మృతిలోనూ ఇతర రాజనీతి గ్రంథాలలోనూ రాజు ప్రజలను పన్నుల పేరిట ఎట్లా హింసించరాదో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. అందుచేత భారతీయులు 'సంపాదన'ను మాత్రమే గాకుండా 'సంపాదనకు అనుసరించే మార్గాలను' కూడా వివేచించారని అర్థం చేసికొనాలి.

**సీ. 'అనఘ! మరుత్తుండు యజ్ఞంబు సేసి మ । హాధనరాసుల నవనిసురుల**
**కిచ్చె; వా రవి కడు నెక్కుడై యుండుటఁ । ద్రవ్వితండంబులు దమ గృహముల**
**నిడికొని పెఱధన మెల్లను నిధియుఁగా । నిమ్మైన నెలవున నిడుచు నుండి**
**యందఱు నేకవాక్యత దీని నెవ్వరు । గనినను నిది వారి ధనమ యనిరి**

**ఆ. మానవేంద్ర! యమ్మహానిధానము దెచ్చి । వలసినట్లు నీవు వ్యయము సేయు**
**మనిన ధర్మతనయుఁ 'డతఁ డెట్లుపార్జించె । నంత కాంచనము? మహాత్మ! చెపుమ.' 15**

**ప్రతిపదార్థం :** అనఘ!= ఓ పుణ్యాత్ముడవైన ధర్మరాజా!; మరుత్తుండు= మరుత్తుడు; యజ్ఞంబు+చేసి= యజ్ఞం చేసి; మహాధనరాసులన్= గొప్ప ధనరాసులను; అవనిసురులకున్+ఇచ్చెన్= బ్రాహ్మణుల కిచ్చాడు; వారు= ఆ బ్రాహ్మణులు; అవి కడున్+ఎక్కుడై+ఉండుటన్= అవి చాలా ఎక్కువ కాగా; త్రవ్వితండంబులు= సమృద్ధిగా; తమ గృహములన్= తమ ఇళ్ళలో; ఇడికొని= ఉంచుకొని; పెధనము+ఎల్లనున్= తక్కిన ధనాన్ని అంతా; నిధియున్+కాన్= నిధిగా; ఇమ్మైన= అనుకూలమైన; నెలవునన్= చోటిలో; ఇడుచున్+ఉండి= దాస్తూ; అందఱున్= అందరూ; ఏకవాక్యతన్= ఒకే మాటగా; దీనిన్+ఎవ్వరు కనినమున్= దీనిని ఎవరు చూస్తే; ఇది వారి ధనము+అనిరి= (ఇది) వారి ధనమే అన్నారు; మానవ+ఇంద్ర!; రాజా!; ఆ+మహానిధానమున్+తెచ్చి= ఆ మహానిధిని తీసికొని వచ్చి; వలసిన+అట్లు= ఎట్లా అవసరమో అట్లా; నీవు వ్యయము చేయుము= నీవు ఖర్చు పెట్టుము; అనినన్= అని చెప్పగా; ధర్మతనయుఁడు= ధర్మరాజు; అతఁడు= ఆ మరుత్తుడు; అంత కాంచనమున్= అంత బంగారమును; ఎట్లు+ఉపార్జించెన్?= (ఆయన) ఎట్లా సంపాదించాడు?; మహాత్మ!= ఓ మహర్షీ; చెపుమ= దయచేసి చెప్పుము (అని అడిగాడు).

**తాత్పర్యం :** ధర్మరాజా! మరుత్తు డనే ఒక రాజు యజ్ఞంచేసి గొప్ప ధనరాసులను బ్రాహ్మణుల కిచ్చాడు. ఆ బ్రాహ్మణులు ఆ ధనం చాలా ఎక్కువ కావటంవలన సమృద్ధిగా తమకు కావలసినంత ఇళ్ళలో ఉంచుకొని, తక్కిన ధనాన్ని ఒక నిధిగా ఒక అనుకూలమైన చోట దాచిపెట్టుతూ అందరూ ఒకే మాటగా 'ఈ నిధిని ఎవరు కనుగొంటారో ఇది వారిదే' అని అన్నారు. 'కాబట్టి నాయనా! ఆ ధనాన్ని తీసికొనివచ్చి కావలసినంత ఖర్చుపెట్టుకొనుము' అని మహర్షి చెప్పగా ధర్మరాజు 'మహాత్మా! ఆ మరుత్తుడు అంత కాంచనం ఎట్లా సంపాదించాడు?' అని అడిగాడు.

**విశేషం :** ఇక్కడ రెండు ధర్మ మీమాంస లున్నాయి. మొదటిది ఆ బ్రాహ్మణులు ఆ డబ్బును ఎవరు కనుక్కొంటే వాళ్ళదే ఆ ధనమని 'వాచా' దత్తంచేసి ఉండటం, బ్రాహ్మణులు ధనాన్ని అట్లా దాచటంలో విప్రులు ధనసంచయన విషయంలో 'లుబ్ధులు' కారా దన్న సూచన కూడా ఉన్నది. రెండవది - ధర్మరాజు అడిగిన ప్రశ్న, ఆ ధనాన్ని మరుత్తుడు ఎట్లా సంపాదించా డనటం అంటే యజ్ఞానికి వాడే ధనం పవిత్రధనం కావాలి తప్ప దుర్మార్గంగా సంపాదించిన దయితే అది వాడదగినది కాదన్న సూచన ఇందులో ఉన్నది.

**క. అనుటయు నా సత్యవతీ । తనయుండు 'మరుత్తు పుణ్యతరచరితంబున్**
**వినఁ గోరుట మే లెంతయు; । వినిపించెద వీను లలర వినుము నరేంద్రా! 16**

**ప్రతిపదార్థం :** అనుటయున్= అని ధర్మరాజు అంటే; ఆ సత్యవతీ తనయుండు= ఆ వ్యాసుడు; నర+ఇంద్రా!= రాజా!; మరుత్తు= మరుత్తుడి; పుణ్యతర చరితంబున్= గొప్ప పుణ్య చరిత్రను; వినన్+కోరుట= నీవు వినాలని అనుకొనటం; ఎంతయున్+మేలు= ఎంతో మంచిది; వినిపించెదన్= నేను వినిపిస్తాను; వీనులు+అలరన్= చెవులకు విందుగా; వినుము.

**తాత్పర్యం :** ధర్మరాజు అట్లా అనగా వ్యాసమహర్షి 'ఓ రాజా! మరుత్తుడి కథ గొప్ప పుణ్యప్రదమయిన కథ, ఈ కథను నీవు వినాలని కోరుకొనటం చాలా మంచి విషయం. ఈ కథను నీవు వీనుల విందుగా విని తరించుము. చెప్పుతాను.'

వ. **అని పలికి యిట్లనియెఁ 'గృతయుగంబున దండనీతి ప్రవర్తకుం డగు మనువునకుఁ బ్రజాని యను తనయుం డుదయించె; నతనికి క్షుతుం డుద్భవించె; నాతనికి నిక్ష్వాకుండు ప్రభవించె; నా భూపతికి నూర్వురు సుతు లుద యించి; రం దగ్రజుండగు వింశునకు వివింశుం డుదయించె; నప్పుడమిఱేనికిం బదియేవురు గొడుకులు పుట్టిరి; వారిలోనం బెద్దవాఁ డగు ఖనీనేత్రుం డధికబలశౌర్యుండును నకార్యపరుండును నై సోదరులం గలిసికొని నడవక పదునలువురం జెఱచి సామ్రాజ్యంబుఁ గైకొని యుండి.'** **17**

**ప్రతిపదార్థం :** అని పలికి= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు; కృతయుగంబునన్= కృతయుగంలో; దండనీతి ప్రవర్తకుండు+ అగు= దండనీతిని భూలోకంలో ప్రవర్తింపజేసిన; మనువునకున్= మను చక్రవర్తికి; ప్రజాని+అను= ప్రజాని అనే పేరుగల; తనయుండు= కొడుకు; ఉదయించెన్= పుట్టాడు; అతనికిన్; క్షుతుండు; ఉద్భవించెన్= కలిగాడు; అతనికిన్; ఇక్ష్వాకుండు; ప్రభవించెన్= జన్మించాడు; ఆ భూపతికిన్= ఆ రాజుకు; నూర్వురు సుతులు= నూరుగురు కుమారులు; ఉదయించిరి= పుట్టారు; అందున్= వారిలో; అగ్రజుండు+అగు= పెద్దవాడైన; వింశునకున్= వింశుడు అనే వాడికి; వివింశుండు+ఉదయించెన్= వివింశుడు పుట్టాడు; ఆ+పుడమిఱేనికిన్= ఆ రాజుకు; పది+ఏవురు= పదిహేనుమంది; కొడుకులు పుట్టిరి= కుమారులు పుట్టారు; వారిలోనన్= వారిలో; పెద్దవాఁడు+అగు= పెద్దవాడైన; ఖనీనేత్రుండు= ఖనీనేత్రుడు; అధిక బల శౌర్యుండును= మిక్కిలి బలపరాక్రమా లున్నవాడు; అకార్యపరుండును= చేయరాని పనులు చేసేవాడు; ఐ= అయి; సోదరులన్= తమ్ములను; కలిసికొని నడవక= చేర్చుకొని నడవకుండా; పదు నలువురన్= పద్నాలుగుమందిని; చెఱచి= నాశనంచేసి; సామ్రాజ్యంబున్= రాజ్యాన్ని; కైకొని+ఉండి= కైవసం చేసికొని.

**తాత్పర్యం :** అని చెప్పి ఇట్లా మరుత్తుడి కథను వివరించటం మొదలు పెట్టాడు. 'కృతయుగంలో దండనీతిని ప్రవర్తింపజేసిన మనుచక్రవర్తికి ప్రజాని అనే కొడుకు పుట్టాడు. అతడికి క్షుతుడు, క్షుతుడికి ఇక్ష్వాకుడు కలిగారు. ఇక్ష్వాకుడికి నూరుగురు కుమారులు. వారిలో పెద్దవాడు వింశుడు. అతడి కొడుకు వివింశుడు. అతడికి పదిహేనుమంది కొడుకులు పుట్టారు. వారిలో పెద్దవాడు ఖనీనేత్రుడు. అతడు మిక్కిలి బలపరాక్రమాలున్నవాడు, దుర్మార్గుడు. తన తమ్ముళ్ళతో కలిసి ధర్మమార్గంలో జీవించినవాడు కాడు. అతడు చివరికి తన సోదరులు పద్నాలుగుమందిని నాశనంచేసి, రాజ్యాన్ని కైవసం చేసికొన్నాడు.

సీ. **మంత్రివిద్వేషంబు మాన్యపరాభవం । బును బ్రజాపీడనంబులును గలిగి**
**మొక్కలీఁ డగుటయు మ్రుచ్చిలి మంత్రు లా । తనిఁ బాపి యతని నందనుని రాజ్య**
**మునకుఁ బట్టము గట్టికొని; రక్కుమారుండు । దమ యయ్య చేటు చిత్తమునకుఁ దలఁచి**
**సచివప్రభృతు లగు సర్వజనంబుల । యాత్మల ననురాగ మావహిల్ల**

**తే. సత్యమును బాడియును నొప్పి నిత్యధర్మ। పరత వర్తిల్లె నమ్మహీశ్వరుఁడు సతత**
**దానతత్పరుఁడై కల ధనములెల్లఁ। విప్రులకు నిచ్చి దారిద్ర్యవికలుఁ డయ్యె. 18**

**ప్రతిపదార్థం :** మంత్రి= మంత్రులను; విద్వేషంబున్= ద్వేషించటం; మాన్య= ఉత్తములను (మంచివారిని); పరాభవంబునున్= అవమానించటం; ప్రజాపీడనంబులునున్= జనులను హింసించటం; కలిగి= అనే ఈదుర్లక్షణాలు కలిగి; మొక్కలీఁడు+అగుటయున్= ముష్కరుడు (పొగరుబోతు) కాగా; ముచ్చిలి= రహస్యంగా పథకం పన్ని; మంత్రులు= సచివులు= అతనిన్+పాపి= అతడిని తొలగించి; అతని నందనునిన్= అతడి కుమారుడిని; రాజ్యమునకున్= రాజ్యానికి; పట్టమున్+కట్టికొనిరి= పట్టం కట్టుకొన్నారు; ఆ+కుమారుండు= ఆ రాజుకొడుకు; తమ+అయ్య= తన తండ్రి; చేటు= నాశనాన్ని; చిత్తమునన్+తలఁచి= మనసులో ఆలోచించి; సచివ ప్రభృతులు+అగు= మంత్రులు మొదలైన; సర్వజనంబుల= జనులందరి; ఆత్మలన్= హృదయాలలో; అనురాగము= ప్రేమ; ఆవహిల్లన్= పుట్టగా; సత్యమునున్= సత్యం; పాడియునున్= న్యాయం; ఒప్పి= (వాటిచేత) ప్రకాశించి; నిత్యధర్మపరతన్= అనునిత్యమూ ధర్మంలో నిష్ఠ కలిగి; వర్తిల్లెన్= ప్రవర్తించాడు; ఆ+మహీ+ఈశ్వరుఁడు= ఆ రాజు; సతత దాన తత్పరుఁడు+ఐ= నిత్యదానశీలుడై; కల ధనములు+ఎల్లన్= కలిగిన ఆస్తినంతటినీ; విప్రులకున్+ఇచ్చి= బ్రాహ్మణుల కిచ్చి; దారిద్ర్య వికలుఁడు+అయ్యెన్= దారిద్ర్యంచేత బాధితుడు అయ్యాడు.

**తాత్పర్యం :** మంత్రులను ద్వేషించటం, సజ్జనులను అవమానించటం, ప్రజలను హింసించటం నిత్యకృత్యాలు కావటంతో ముష్కరుడైన ఆ రాజును రహస్య పన్నాగం ద్వారా మంత్రులు తొలగించి, అతడి కుమారుడిని రాజ్యానికి పట్టం కట్టుకొన్నారు. ఆ రాజకుమారుడు తన తండ్రి దుర్మార్గంవలన పతనావస్థను పొందటం గుర్తించినవాడై మంత్రులు, పురోహితులు మొదలుగాగల జనులందరి హృదయాలోనూ ప్రేమాభిమానాలు కలిగేటట్లు సత్యం, న్యాయం అనుసరిస్తూ నిత్యధర్మపరుడుగా ప్రవర్తించాడు. నిత్యదానశీలుడై తన ఆస్తినంతా విప్రులకు దానమిచ్చివేసి, దారిద్ర్యంతో బాధపడ్డాడు.

**క. దానఁ గడు డస్సె నాతని। సేన; యరాతు లది యెఱిఁగి చెచ్చెర బలసం**
**తానముతోడం బైకొని। యా నరపతిఁ జెఱిచి; రాతఁ డాప్తులుఁ దానున్. 19**

**ప్రతిపదార్థం:** దానన్= దానివలన; అతని సేన= అతడి సైన్యం; కడున్+డస్సెన్= మిక్కిలి అలసి పోయింది; అరాతులు= శత్రువులు; అది+ ఎఱిఁగి= దానిని తెలిసికొని; చెచ్చెరన్= వెంటనే; బలసంతానముతోడన్= పెద్ద సైన్యబల సమూహంతో; పైకొని= ఆక్రమించి; ఆ నరపతిన్= ఆ రాజును; చెఱిచిరి= ఓడించి తరిమారు; ఆతఁడు= ఆ రాజు; ఆప్తులున్+తానున్= తన ఆప్తులతో కలిసి.

**తాత్పర్యం:** దానివలన అతడి సైన్యం క్షీణించిపోయింది (బలహీనమైనది), ఇది గుర్తించిన శత్రువులు పెద్ద సైన్యబలంతో రాజ్యాన్ని ఆక్రమించి, ఆ రాజును ఓడించి తరిమివేశారు. ఆ రాజు తన ఆప్తులతో కలిపి.

**విశేషం:** డస్సి= అలసి (ఇక్కడ) బలహీనం కావటం; చెఱుచు= నశింపజేయు (కాని ఇక్కడ 'ఓడించి తఱుము')

**క. వనమునకు నేఁగె; సంయమి। జనములు నచ్చెరువు నొందు చందంబున న**
**జ్జనవిభుఁడు నియతి నట తప। మొనరించి మహాప్రభావ మొంది కడంకన్. 20**

**ప్రతిపదార్థం:** వనమునకున్= అడవికి; ఏఁగెన్= వెళ్ళాడు; సంయమి జనములున్= మునులు కూడా;అచ్చెరువున్+ఒందు+చందంబునన్= ఆశ్చర్యం పొందే విధంగా; ఆ+జనవిభుఁడు= ఆ రాజు; నియతిన్= నియమ నిష్ఠలతో; అటన్= ఆ అడవిలో; తపము+ఒనరించి=తపస్సు చేసి; మహాప్రభావము+ఒంది= మహాశక్తిని పొంది; కడంకన్= పూనికతో.

**తాత్పర్యం:** ఆ రాజు తన ఆప్తులతో అడవికి వెళ్ళాడు. మునులు కూడా ఆశ్చర్యం పొందే విధంగా ఆరాజు నియమ నిష్ఠలతో ఆ అడవిలో తపస్సు చేసి, గొప్ప ప్రభావశాలి అయ్యాడు.

**క. అమలమతిఁ గరముఁ గోలఁగ । నమరిచి మానితతపోమయాధికశక్తిన్**

**దమన క్రియ యొనరించిన । నమితగుణా! చెప్పఁ జిట్టలయ్యెను దానన్. 21**

**ప్రతిపదార్థం:** అమితగుణా!= అసంఖ్యాకములైన సుగుణాలు కలిగిన ఓ జనమేజయా!; అమలమతిన్= నిర్మలమైన మనస్సుతో; కరమున్= చేతిని; కోలఁగన్= దండంవలె (కర్రవలె); అమరిచి= అమర్చుకొని; మానిత= గొప్పదైన; తపోమయ+అధిక శక్తిన్= తపస్సుతో నిండిన ఎక్కుడు శక్తితో; దమనక్రియ+ఒనరించినన్= శరీరాన్ని దమింపజేయగా; దానన్= అందువలన; చెప్పన్= చెప్పటానికి; చిట్టలు+అయ్యెన్= ఆశ్చర్యం పుట్టింది.

**తాత్పర్యం :** నిర్మలమైన మనస్సుతో చేతిని దండంవలె చేసికొని గొప్ప తపశ్శక్తితో శరీరాన్ని దమింపచేశాడు. ఓ జనమేజయ మహారాజా! దానితో ఒక పరమాద్భుతం జరిగింది.

**వ. ఆకర్ణింపుము. 22**

**ప్రతిపదార్థం :** ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం :** అదేమిటో చెప్పుతాను వినుము.

**క. భటతురగసామజరథో । ద్భట సేనాసముదయములు బహుళరుచిసము**

**త్కటకాంచన రాసులు న । చ్చటఁ బొడమెం జూడ నక్కజం బగు భంగిన్. 23**

**ప్రతిపదార్థం :** భట= సేవకులు; తురగ= గుర్రాలు; సామజ= ఏనుగులు; రథ= రథాలు; ఉద్భట సేనా సముదయములు= శూరులైన సైనికుల గుంపులు; బహుళ= మిక్కిలి; రుచి సముత్కట= కాంతిచేత అతిశయించే; కాంచన రాసులున్= బంగారు రాసులు; అచ్చటన్= అక్కడ; చూడన్= చూడటానికి; అక్కజంబు+అగు భంగిన్= ఆశ్చర్యమయ్యేటట్లు; పొడమెన్= పుట్టాయి.

**తాత్పర్యం :** సేవకులు, గుర్రాలు, ఏనుగులు, రథాలు, శూరులైన సైనికుల సమూహాలు, మిక్కిలి కాంతిచేత ప్రకాశించే బంగారు రాసులు చూడటానికి ఆశ్చర్యం కలిగిస్తూ అక్కడ పుట్టాయి.

**వ. ఇట్లు బలంబును ధనంబును గల్గుటయును. 24**

**ప్రతిపదార్థం :** ఇట్లు= ఈ విధంగా; బలంబునున్= సైన్యబలమూ; ధనంబునున్= ధనమూ; కల్గుటయునున్= కలుగటంతో.

**తాత్పర్యం :** ఇట్లా సైన్యబలం, ధనం రెండూ కలుగగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఆ నరపతి రయమున రిపు । భూనాథులమీఁద నడచి పోరుల వారిన్**

**సేనాయుతముగఁ జంపియుఁ । గానలకుం దోలియును బ్రకాశత నొందెన్. 25**

**ప్రతిపదార్థం :** ఆ+నరపతి= ఆ రాజు; రయమునన్= వెంటనే; రిపు భూనాథుల మీఁదన్= శత్రురాజులపైన; నడచి= దండెత్తి; పోరులన్= యుద్ధంలో; వారిన్= వారిని; సేనాయుతముగన్= వారి సైన్యాలతో సహా; చంపియున్= చంపి; కానలకున్+తోలియునున్= అడవులలోకి పారద్రోలి; ప్రకాశతన్+ఒందెన్= ప్రకాశాన్ని పొందాడు.

**తాత్పర్యం :** ఆ రాజు శీఘ్రంగా శత్రురాజులపైన దండెత్తి యుద్ధంలో వారిని సైన్యయుతంగా చంపి, తక్కిన వారిని అడవులలోకి పారద్రోలి, విజయం పొంది వైభవంతో అతిశయించాడు.

**క. కరదమనంబున నాతఁడు। కరంధముఁ డనంగఁ బరఁగి గౌరవమున వి**
**స్ఫురణము విభవము శౌర్యముఁ। గరుణయు ధైర్యంబు వెలయఁగా నిల యేలెన్. 26**

**ప్రతిపదార్థం :** కర= చేతియొక్క; దమనంబునన్= దమించటంచేత; అతఁడు= ఆ రాజు; కరంధముఁడు+అనంగన్= కరంధముడనే పేరుతో; పరఁగి= ప్రసిద్ధుడై; గౌరవమునన్= గొప్పగా; విస్ఫురణము= కాంతి; విభవము= సంపద; శౌర్యము= గొప్ప పరాక్రమం; కరుణయున్= కరుణ; ధైర్యంబున్= ధైర్యం; వెలయఁగాన్= అతిశయించగా; ఇల+ఏలెన్= భూమి(ని) పాలించాడు.

**తాత్పర్యం :** చేతిని దమనంచేసినందువలన అతడికి కరంధముడని పేరు వచ్చింది. గొప్ప కాంతి, సంపద, పరాక్రమం, దయ, ధృతి కలిగి ఆ రాజు రాజ్యం ఏలాడు.

**విశేషం:** 'ధమన' మని కొన్ని పాఠాలు ఉన్నాయి. కాని 'దమన' శబ్దమే సరైనది. దమనం అంటే బాహ్యేంద్రియ నిగ్రహం. 'శమం' అంటే అంతరింద్రియ నిగ్రహం (మనోనిగ్రహం ఇత్యాదులు), కరంధముడు చేసినది చేతిని కఠ్రగా నియమించి తపస్సుచేయటం. కాబట్టి అది ధమనక్రియ. అతడిపేరు 'కరంధముడు' కావటమే సహజం. కొన్ని పాఠాలు 'కరందమనుడు' అనే రూపాన్ని ఇచ్చాయి. లోకంలో మహాప్రాణంతోడి 'కరంధముడు' అనే పేరు ప్రసిద్ధమై ఉండాలి.

**తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి। యజనశీలత నశ్వమేధాధ్వరంబు**
**లంగిరసుఁ డుపదర్శకుండై నయింపఁ। బెక్కొనర్చె లోకములు సంప్రీతిఁ బొగడ. 27**

**ప్రతిపదార్థం :** శమమున్= అంతరింద్రియ నిగ్రహం; దమమునున్= బాహ్యేంద్రియ నిగ్రహం; సత్య= సత్యవాక్పాలనం; శౌచములున్= శుచిత్వం (పవిత్రత); కలిగి= కలిగినవాడై; యజనశీలతన్= యాగంలో నిరంతరమైన ఆసక్తి కలిగి; అంగిరసుఁడు= అంగిరో మహర్షి; ఉపదర్శకుండు+ఐ= ఉపద్రష్టగా; నయింపన్= నడిపిస్తుండగా; అశ్వమేధ+అధ్వరంబులు= అశ్వమేధయాగాలు; లోకములు= అన్ని లోకాలలోనివారు; సంప్రీతిన్= తృప్తితో; పొగడన్= ప్రస్తుతించగా; పెక్కు+ఒనర్చెన్= చాలా చేశాడు.

**తాత్పర్యం:** శమ దమ సత్య శౌచాలు కలిగి, ఆ రాజు నిరంతరయజ్ఞదీక్షితుడై అంగిరసమహర్షి ఉపద్రష్టగా సారథ్యం వహించి నడిపిస్తుండగా అశ్వమేధయాగాలు చాలామార్లు చేసి, అన్ని లోకాలవారిచేత ప్రశంసలు పొందాడు.

**(వేదవ్యాస మునీంద్రుండు ధర్మజునకు మరుత్తుని చరితంబు సెప్పుట (సం. 14-4-23))**

**క. అతని మనుమఁడు మరుత్తుం। డతులయశుఁడు విష్ణుసదృశుఁ డనఁ దగు నాగా**
**యుతబలుఁడు ధర్మతత్త్వ। స్థితివిదుఁడు సమిద్ధబహుళతేజుం డధిపా! 28**

**పతిపదార్థం:** అధిపా!= రాజా!; అతని మనుమఁడు= ఆ కరంధముడి మనుమడు; మరుత్తుండు= మరుత్తుడనే పేరుగలవాడు; అతులయశుఁడు= సాటిలేని కీర్తిమంతుడు; విష్ణుసదృశుఁడు+అనన్+తగున్= విష్ణు సమానుడు అనదగినవాడు; నాగ+అయుత

బలు'డు= పదివేల ఏనుగుల బలం కలవాడు; ధర్మతత్త్వస్థితి విదుఁడు= ధర్మతత్త్వస్థితిని తెలిసినవాడు; సమిద్ధ= మిక్కిలి ప్రకాశించే బహుళతేజుండు= అధికమైన తేజస్సు కలవాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ఆ కరంధముడి మనుమడు మరుత్తుడు. అతడు నిర్మలమైన కీర్తికలవాడు. విష్ణుసదృశుడు. పదివేల ఏనుగుల బల మున్నవాడు. ధర్మతత్త్వస్థితి తెలిసినవాడు. మహాతేజోవంతుడు.

**విశేషం:** ధర్మరాజు 'మరుత్తుడికి ఆ బంగారు ఎట్లా వచ్చింది?' అనటానికి సమాధానంగా చెప్పిన కథ కాబట్టి ఈ కథలో మరుత్తుడి దివ్యగుణాల ప్రసక్తి ఉన్నది. అతడి తండ్రి తపోధనుడు. అతడి సంపద తపోజన్యం. కుమారుడు తండ్రికి తగిన కొడుకు అని చెప్పటం ఇక్కడి ఉద్దేశం. 'నా విష్ణుః పృథివీపతిః' అంటే విష్ణ్వంశలేనివాడు చక్రవర్తి కాడని అర్థం. ధర్మానికి ఒక తత్త్వమున్నది. అది సత్యం. దాని స్థితి 'ఋతం' మీద ఆధారపడి ఉన్నది. ధర్మ సత్య ఋత తత్త్వవేత్త అని అర్థం. తరువాతి కథలో దీని నిరూపణ ఉన్నది.

**ఉ. అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే**
**ధమ్మొనరించుచుండి వివిధస్ఫురితాలయముల్ ప్రదీప్తభాం**
**డమ్ములు సత్పదార్థము లిడం దగు తక్కును గల్గు సిద్ధపా**
**త్రమ్ము లసంఖ్యముల్ పసిఁడిఁ బ్రస్తుతి కెక్క ఘటించె భూవరా! 29**

**ప్రతిపదార్థం :** భూవరా!= రాజా!; ఆ+మనుజ+ఈశ్వరుండు= ఆ మరుత్తుడనే రాజు; విభవ+అతిశయంబు= వైభవం యొక్క; పెంపు; వెలుంగన్= ప్రకాశించగా; అశ్వమేధమ్ము+ఒనరించుచున్+ఉండి= అశ్వమేధయాగం చేస్తూ ఉండి; వివిధ= భిన్నములుగా; స్ఫురిత+ఆలయముల్= ప్రకాశించే ఆకారాలు కలిగిన ఇండ్లు, ప్రదీప్త భాండమ్ములు= మిక్కిలి కాంతులు వెదజల్లే కుండలు; సత్+పదార్థములు+ఇడన్+తగు= విలువైన మంచి పదార్థాలను పెట్టగలిగిన; తక్కును+కల్గు= నిడివి కలిగిన; సిద్ధ పాత్రమ్ములన్= ఉపయోగించటానికి సిద్ధంగా ఉన్న పాత్రలను; అసంఖ్యముల్+లెక్కకు మిక్కుటంగా; ప్రస్తుతికిన్+ఎక్కన్= జనులందరూ ప్రశంసించేటట్లుగా; పసిఁడిన్= బంగారంతో; ఘటించెన్= చేయించాడు.

**తాత్పర్యం :** రాజా! ఆ మరుత్తుడనే రాజు వైభవంయొక్క పెంపు మిక్కిలి ప్రకాశించేటట్లుగా అశ్వమేధయాగం చేస్తూ యజ్ఞంలోని మంచి పదార్థాలను దాచటానికి వీలుగా నిడివి కలిగిన పెద్ద పెద్ద బంగారు కుండలను లెక్కకు మిక్కుటంగా చేయించాడు. ఆ కుండలు నానావిధాలైన ఆకారాలతో అత్యధికకాంతితో మెరిసిపోతున్నాయి.

**వ. అట్లు సమకట్టి యతండు. 30**

**ప్రతిపదార్థం :** అట్లు= అట్లా; సమకట్టి= సిద్ధంచేసి; అతండు= ఆ మరుత్తుడు.

**తాత్పర్యం :** అట్లా సిద్ధం చేసికొని ఆ మరుత్తుండు. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. హిమగిరిసానుదేశమున నెక్కుడు వైభవ ముల్లసిల్ల య**
**జ్ఞము తగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హే**
**మ మొసఁగెఁ గుప్పఁ గూరలు సమగ్రకుతూహలుఁడై కనత్సువ**
**ర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్.' 31**

**ప్రతిపదార్థం :** హిమగిరి సానుదేశమున్= హిమవత్పర్వత సానువులలో; ఎక్కుడు వైభవము+ఉల్లసిల్లన్= వైభవం మిక్కిలిగా ప్రకాశించగా; యజ్ఞము= యజ్ఞాన్ని; తగన్+చేసి= శాస్త్రయుక్తంగా చేసి; భూమిసుర సంఘములు+ఎల్లనున్= బ్రాహ్మణ సమూహాలన్నీ; తృప్తిన్+పొందన్= తృప్తిపొందేటట్లు; భక్తితోన్= సభక్తికంగా; కుప్పఁగూరలు= కుప్పలు తెప్పలుగా; హేమము+ఒసఁగెన్= బంగారు (దక్షిణగా) ఇచ్చాడు; సమగ్ర కుతూహలుఁడు+ఐ= యజ్ఞం సమగ్రంగా పూర్తి కావాలన్న ఆసక్తితో; కనత్= ప్రకాశించే; సువర్ణమయ= బంగారంతో చేసిన; గృహక్రియా+ఉపకరణ= ఇంటిలోవాడేటటువంటి చెంబు, పళ్ళెంవంటి ఉపకరణాల; ప్రకరంబులున్= సముదాయాలను; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం :** హిమగిరి సానువులలో మిక్కిలి వైభవంతో శాస్త్రయుక్తంగా యజ్ఞం జరిపి, బ్రాహ్మణసమూహాలకు తృప్తికలిగేటట్లు సభక్తికంగా కుప్పతెప్పలుగా బంగారం దక్షిణగా ఇచ్చాడు. యజ్ఞం సమగ్రంగా పూర్తి కావాలన్న ఆసక్తితో బంగారుతో చేయబడి, ప్రకాశిస్తున్న ఇంటిలో వాడే చెంబు, పళ్ళెం వంటి ఉపకరణాల సముదాయాలను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు.'

**విశేషం:** బంగారును దక్షిణగా ఇచ్చాడు. బంగారు పాత్రలను దానంగా ఇచ్చాడు. వీటినే దానధర్మాలని అంటారు. యజ్ఞసాఫల్యం దానం యొక్క 'సమగ్రత' మీద ఆధారపడుతుందని అర్థం.

**వ. అని చెప్పి 'యిది మరుత్తుని యాభిజాత్యంబును దదీయవిత్తవిశేషంబును నెఱింగించుట; యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెదఁ; దదంచిత క్రతుక్రియాప్రకారంబునుం జెప్పెద విను; మట్లు కరంధముఁ డనం బరఁగి మనువంశదీపకుండై పేర్చిన యా భూపతి నిజ తపఃప్రభావంబున మహానుభావుం డగునంగిరసుండు దన కుపద్రష్టయయి యనేకాశ్వమేధంబులు సేయించుటం జేసి యావహిల్లిన మాహాత్మ్యంబునను మహీపతు లెల్లఁ గొలువం బూజ్యసామ్రాజ్యం బనుభవించి తన వలచిన యప్పుడ తనువుతోడన యూర్ధ్వలోకంబునకుం జనియె; నమ్మనుజపతితనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభార ధౌరేయుండై యతనిన పోలి ప్రజలం బాలించె. 32**

**ప్రతిపదార్థం :** అని చెప్పి= అని చెప్పినవాడై; ఇది= ఈ వృత్తాంతం; మరుత్తుని= మరుత్తుడియొక్క; అభిజాత్యంబునున్= పుట్టుకలోని గొప్పతనాన్ని (వంశగౌరవాన్ని); తదీయ= అతడి; విత్త విశేషంబును= సంపదలయొక్క అధిక్యాన్ని; ఎఱింగించుట= ఎరిగించటంకొరకు చెప్పాను; ఆ+విత్తంబు= ఆ ధనం; అతనికిన్= అతడికి; దొరకొనిన= సంక్రమించిన; తెఱంగునున్= విధానాన్ని కూడ; ఎఱింగించెదన్= తెలుపుతాను; తదంచిత క్రతు క్రియా ప్రకారంబునున్= ఆ గొప్ప క్రతువు జరిగిన తీరును; చెప్పెదన్= చెప్పుతాను; వినుము; అట్లు= ఆ విధంగా; కరంధముడు= అనన్+పరఁగి= అనే పేరు పొంది; మనువంశదీపకుండు+ఐ= మనువంశానికి దీపంవంటివాడై; పేర్చిన= ప్రకాశించిన (ఒప్పిన); ఆ భూపతి= ఆ రాజు; నిజ= తన; తపస్+ప్రభావంబునన్= తపస్సుయొక్క శక్తిచేత; మహానుభావుండు+ అగు= మహాత్ముడైన; అంగిరసుండు= అంగిరసుడు; తనకున్= తనకొరకు; ఉపద్రష్ట+అయి= ఉపద్రష్టగా; అనేక= చాలా; అశ్వమేధంబులు= అశ్వమేధయాగాలు; చేయించుటన్+చేసి= చేయించటంచేత; ఆవహిల్లిన= పుట్టిన; మాహాత్మ్యంబునున్= శక్తివలన; మహీపతులు+ఎల్లన్= రాజు లందరూ; కొలువన్= సేవిస్తూండగా; పూజ్య= గౌరవప్రదమైన; సామ్రాజ్యంబు= రాజ్యాన్ని; అనుభవించి= ఏలి; తన వలచిన అప్పుడు+అ= తాను కోరుకొన్నప్పుడే; తనువుతోడన్= శరీరంతో; ఊర్ధ్వలోకంబునకున్= స్వర్గానికి; చనియెన్= వెళ్ళిపోయాడు; ఆ+మనుజపతి తనయుండు= ఆ రాజు కొడుకు; అవిక్షిత్+నామధేయుండు= అవిక్షిత్తు అని పేరుగలవాడు (అచిక్షిత్తు - అని కూడా నామాంతరం); ధరాభార= భూభార; ధౌరేయుండు+ఐ= మోయటంలో సమర్థుడై; అతనిన్+అ+పోలి= అతనినే (తండ్రినే) పోలి; ప్రజలన్+పాలించెన్= ప్రజలను పరిపాలించాడు.

**తాత్పర్యం :** అని చెప్పిన వ్యాసుడు 'ఈ వృత్తాంతం మరుత్తుడి వంశగౌరవాన్ని, అతడి సంపదలోని వైశిష్ట్యాన్ని చెప్పటంకొరకు చెప్పాను. అతడికి ఆ ధనం ఎట్లా వచ్చిందో చెప్పుతాను వినుము. ఆ క్రతువును ఆయన ఎట్లా చేశాడో కూడా వివరిస్తాను. ఆ విధంగా కరంధముడనే పేరు పొంది మనువంశదీపకుడై ఒప్పిన ఆ రాజు తన తపశ్శక్తిచేత మహాత్ముడైన అంగిరసుడు తనకు ఉపద్రష్టగా చాలా అశ్వమేధాలు చేయించటంచేత పుట్టిన ప్రభావంతో రాజులందరూ సేవిస్తుండగా గౌరవప్రదమైన రాజ్యాన్ని ఏలి, తాను కోరినప్పుడు తన బొందితోసహా స్వర్గానికి వెళ్ళిపోయాడు. ఆ రాజుకొడుకు అవిక్షిత్తు, అతడు భూభారాన్ని వహించటంలో సమర్థుడై, తండ్రిని పోలి ప్రజలను పరిపాలించాడు' అని చెప్పాడు.

**చ.** **అతని సుతుండు సూవె మనుజాధిపసత్తమ! యమ్మహాత్ముఁ డా**
**పతి తన తండ్రి పిమ్మటఁ గృపారతుఁ డార్యుఁడు దండనీతి వి**
**శ్రుతమతి దానశీలుఁ డన రూఢికి నెక్కి తదీయరాజ్య సు**
**స్థితి వెలుఁగొందె వాసవునిఁ జీరికిఁ జేకొనఁ డీసు పెంపునన్.** **33**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిప సత్తమ!= రాజశ్రేష్ఠా! - ఓ ధర్మరాజా!; అతని సుతుండు+చూవె!= అతడి కుమారుడే సుమా!; ఆ+మహాత్ముఁడు= ఆ మరుత్తుడు; ఆ పతి= ఆ రాజు; తన తండ్రి పిమ్మటన్= తన తండ్రి తరువాత; కృపారతుఁడు= కృపామయుడు; అర్యుఁడు= పూజ్యుడు; దండనీతి విశ్రుతమతి= దండనీతిని బాగా ఎరిగినవాడు; దానశీలుఁడు= గొప్ప దానగుణం కలవాడు; అనన్= అనగా; రూఢికిన్+ఎక్కి= ప్రసిద్ధిపొంది; తదీయరాజ్య= అతడి రాజ్యపు; సుస్థితిన్= ఉన్నతస్థితితో; వెలుఁగు+ఒందెన్= ప్రకాశం పొందినది; (అతడు) వాసవునిన్= ఇంద్రుడిని కూడా; ఈసు పెంపునన్= పెరిగిన అసూయతో; చీరికిన్+చేకొనఁడు= లక్ష్యపెట్టడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వినుము. ఆ మరుత్తుడు ఆ అవిక్షిత్తుడి కుమారుడే సుమా! ఆ మరుత్తుడు తండ్రి పోయాక రాజ్యపాలన చేపట్టి, దయగలవాడని, పూజ్యుడని, దండనీతివిశారదుడని, దానగుణం కలవాడని పేరుపొందాడు. అతడి రాజ్యం సుస్థితిని పొంది, వెలుగొందింది. ఆ రాజు తన పెంపుతో ఇంద్రుడిని కూడా లెక్కపెట్టలేదు. అతడికి తన దీక్షపైన అంత విశ్వాసం ఉన్నది. ఇది చూచి, ఇంద్రుడు పట్టరానంత అసూయను పెంచుకొన్నాడు.

**క.** **వాసవుఁడును నవ్విభునెడ। నీసు గలిగి తన్ను మిగులనీనని తచ్చిం**
**తాసక్తుండై మంత్రి ని। వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా!** **34**

**ప్రతిపదార్థం:** పూరువంశప్రవరా!= పూరుడివంశంలోని శ్రేష్ఠుడా! (ధర్మరాజా!); వాసవుఁడునున్= ఇంద్రుడుకూడా; ఆ+విభు+ఎడన్= ఆ మరుత్తుడిపై; ఈసు+కలిగి= ఈర్ష్య కలిగి; తన్నున్= తనను; మిగులనీనని= మించనీయనని; తద్+చింతా+ఆసక్తుండు+ఐ= అదే చింతలో ఆసక్తి కలవాడై; మంత్రి నివాసమునకున్+చనియెన్= మంత్రి నివాసానికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ ఇంద్రుడుకూడా ఆ మరుత్తుడిపై ఈర్ష్య కలిగి, ఈ రాజు తన పుణ్యకార్యాలతో తనను మించిపోగూడదు అనే చింతలో మునిగిపోయినవాడై తన మంత్రి అయిన బృహస్పతి నివాసానికి వెళ్ళాడు.

**విశేషం:** వంద యగాలు చేస్తే ఇంద్రపదవిని పొందుతారని శాస్త్రోక్తి. ఇంద్రుడి భయం అదే. కాబట్టి ఇంద్రుడికి ఒక మానవుడి మీద అసూయ కలిగిందన్నమాట! అంటే దేవతలు కూడా ఈర్ష్యలకు అతీతులు కారని అర్థం.

**వ. చని యతనితోడ. 35**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; అతనితోడన్= అతడితో (ఆ బృహస్పతితో).

**తాత్పర్యం:** వెళ్ళి ఆ బృహస్పతితో ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'అనఘ! మరుత్తుండు నిను వరింపఁ దలంచుఁ। దన యజ్ఞమున కుపద్రష్ట గాఁగ**
**నమరాధిపతి యగు నట్టి నాకును జేసి। యుపదర్శనం బింక నొక్క మర్త్యు**
**నకుఁ జేఁత నీ పెంపునకు హాని గాదె! నన్। విడిచి యాతని యజ్ఞవిధులు నడపుఁ;**
**డాతనిఁ దొఱఁగి మదాప్తత మెఱయు పె। క్కాడంగ నేటికి?' ననుడు నతని**

**తే. పలుకులకు నవ్వి యా బృహస్పతి 'మహాత్మ!। యెఱుఁగనే నిన్ను? నన్ను నీ వింత సెప్ప**
**నేల! సర్వలోకముల కధీశుఁ డైన। నీ గురుం డొరు నాసించునే మహేంద్ర!' 36**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; మరుత్తుండు= మరుత్తుడు; నినున్= నిన్ను; తన యజ్ఞమునకున్= తాను చేయదలచిన యజ్ఞానికి; ఉపద్రష్ట+కాఁగన్= ఉపద్రష్టగా ఉండటానికి; వరింపన్+తలంచున్= వరించాలని అనుకొంటున్నాడు; అమర+అధిపతి+అగు+అట్టి= స్వర్గాధిపతిని అయినటువంటి; నాకును= నాకు; ఉపదర్శనంబు చేసి= ఉపద్రష్టగా పని చేసి; ఒక్కమర్త్యునకున్= ఒక మనిషికి; చేఁత= చేయటం; నీ పెంపునకున్= నీ గొప్పతనానికి; హానికాదె!= హానికాదా!; నన్+విడిచి= నన్నువదలిపెట్టి; అతనిన్= ఆ మరుత్తుడియొక్క; యజ్ఞకార్యం నడిపించడి (లేదా); అతనిన్+తొఱఁగి= అతడిని వదలిపెట్టి; మత్+ఆప్తతన్= నాకు ఆప్తుడుగా; మెఱయు(ము)= విరాజిల్లుము; పెక్కు+అడంగన్+ఏటికిన్?= ఎక్కువగా చెప్పటం ఎందుకు?; అనుడున్= అనగా; అతని పలుకులకున్= ఆ ఇంద్రుడి మాటలకు; నవ్వి; ఆ బృహస్పతి; మహాత్మ!= ఓ మహాత్మా!; మహేంద్ర!= ఓ మహేంద్రా! నిన్నున్= నీవెవడివో; ఎఱుఁగనే?= నాకు తెలియదా?; నన్నున్= నాకు; నీవు+ఇంత+చెప్పనేల?= నీవు ఇంతగా చెప్పటం ఎందుకు?; సర్వలోకములకున్+అధీశుఁడు+ఐన= అతడు అన్ని లోకాలకూ అధిపతి అయిన; వినుము; (నీ గురుండు= నీ గురువైన బృహస్పతి;) ఒరున్+ఆసించునే?= మరి ఒకడిని ఆశిస్తాడా?

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! మరుత్తుడు తాను చేయదలచిన యజ్ఞానికి ఉపద్రష్టగా ఉండటానికి నిన్ను వరించాలని అనుకొంటున్నాడు. స్వర్గాధిపతి నైన నాకు ఉపద్రష్టగా ఉండిన మీరు ఒక మానవుడికి సహకరించటం మీ గొప్పతనానికి హానికరం కాదా! నిన్ను విడిచిపెట్టి అతడి యజ్ఞకార్యాన్ని నడిపించండి. లేదా అతడిని వదలిపెట్టి నాకు ఆప్తుడుగా విరాజిల్లండి. ఇంక ఎక్కువగా చెప్పవలసిన అవసరం లేదు. 'అని అనగా ఆ బృహస్పతి నవ్వి' ఓ మహాత్మా! ఇంద్రా! నీ వెవడవో నాకు తెలియదా? నాకు నీవు ఇంతగా చెప్పాలా? అందువలన అన్ని లోకాలకు అధిపతి అయినప్పటికీ నీవంటివాడికి గురువైన నేను మరొకడిని ఆశించటమా?'

**విశేషం:** ఉపదర్శనంఅంటే యజ్ఞానికి ముందు ఫలానావారు ఫలానా పని చేయాలని కోరుకొనటం, దీన్నే 'ఋత్విగ్వరణం' అంటారు. అట్లా కోరబడ్డవాడు 'వరుడు' అంటే శ్రేష్ఠుడని అర్థం.

**వ. అని వెండియు. 37**

**తాత్పర్యం :** అని ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**అ. 'అగ్ని చల్లనైన, నబ్జమిత్రుఁడు మైల । పడ్డ, నుర్వి పొరలఁబడిన, మేరు**
**నగము సంచలించినను బొంకు పొరయునే? । నాదు పలుకు నెమ్మనమున నమ్ము!' 38**

**ప్రతిపదార్థం:** అగ్ని చల్లనైనన్= అగ్ని చల్లబడినా; అబ్జమిత్రుఁడు= సూర్యుడు; మైలపడ్డన్= మకిలిపట్టినా; ఉర్వి= భూమి; పొరలఁ బడినన్= క్రిందుమీదైనా; మేరునగము= మేరుపర్వతం; సంచలించినను= కదిలిపోయినా, నాదు పలుకు= నా మాట; బొంకు+పొరయునే?= అబద్ధం అవుతుందా?; నెఱ+మనమునన్= నిండు హృదయంతో; నమ్మ(ము)= విశ్వసించుము.

**తాత్పర్యం:** 'అగ్ని చల్లబడినా, సూర్యుడు మకిలిపట్టినా, భూమి క్రిందుమీదైనా, మేరుపర్వతం కదలాడినా, నా మాట అసత్యం కాదు. బాగా విశ్వసించుము.'

**క. అన విని ప్రమదంబునఁ దే । లిన చిత్తముతోడ సమదలీలం జనియెం**
**దన మందిరంబునకు సుర । లనురాగముఁ బొంద నింద్రుఁ డమలచరిత్రా! 39**

**ప్రతిపదార్థం:** అమలచరిత్రా!= పవిత్ర చరిత్రుడవైన ధర్మరాజా!; అనన్= ఈ విధంగా బృహస్పతి చెప్పగా; విని= విన్నవాడై; ఇంద్రుఁడు; ప్రమదంబునన్= సంతోషంతో; తేలిన చిత్తముతోడన్= తేలియాడిన మనస్సుతో; సమదలీలన్= దర్పంగా; సురలు= దేవతలు; అనురాగము పొందన్= సంతోషం పొందగా; తన మందిరంబునకున్= తన భవనానికి; చనియెన్= వెళ్ళాడు.

**విశేషం:** నిర్మలచరిత్రుడవైన ధర్మరాజా! ఈ విధంగా బృహస్పతి చెప్పగా విన్నవాడై, ఇంద్రుడు సంతోషంతో తేలియాడిన మనస్సుతో దర్పంగా, దేవతలు సంతోషించగా తన మందిరం చేరుకొన్నాడు.

**సీ. అది యంతయును విని యమ్మరుత్తుఁడు త్రిద । శాచార్యు కడ కేఁగి యతనితోడ**
**'నీకు నెఱింగించి నీ పంపునన యేను । సంభారముల నెల్ల సంఘటించి**
**యజ్ఞాచరణమున కమరియున్నాఁడ నీ । వుపదర్శనంబు సేయుటకు రమ్ము'**
**నావుడు 'నింద్రుండు ననుఁ దన యాగము । నకు మున్న వరియించినాఁడు; నాకు**

**తే. నెట్లు రావచ్చు?' ననియె నా యింద్రమంత్రి । యట్లు పలికిన 'మా తాత కనఘ! నీదు**
**తండ్రి సంప్రీతితో నుపద్రష్ట యయ్యెఁ । నట్ల కృపసేయు' మని పల్కె నవ్విభుండు. 40**

**ప్రతిపదార్థం:** అది+అంతయునున్+విని= అదంతా విని; ఆ+మరుత్తుఁడు= ఆ మరుత్తుడు; త్రిదశ+ఆచార్యు కడకున్+ఏఁగి= దేవతల గురువైన బృహస్పతి వద్దకు వెళ్ళి; అతనితోడన్= అతడితో; నీకున్+ఎఱింగించి= నీకు తెలిపి; నీ పంపునన్+అ= నీవు చెప్పిన పద్ధతిలోనే; ఏను= నేను; సంభారములన్+ఎల్లన్= యజ్ఞసామగ్రినంతా; సంఘటించి= చేర్చుకొని; యజ్ఞ+ఆచరణమునకున్= యజ్ఞం చేయటానికి; అమరి+ఉన్నాఁడన్= సిద్ధంగా ఉన్నాను; నీవు+ఉపదర్శనము+చేయుటకున్= నీవు ఉపద్రష్టగా ఉండటానికి; రమ్ము= దయచేసి రావలెను; నావుడున్= అని అడుగగా; ఇంద్రుండు; ననున్= నన్ను, తన యాగమునకున్= తాను చేయనున్న యాగానికి; మున్న+అ= ముందే; వరియించినాఁడు= వరించాడు; నాకున్= నేను; ఎట్లు రావచ్చున్?= ఎట్లా రావటం?; అనియెన్= అన్నాడు; ఆ+ఇంద్రమంత్రి= బృహస్పతి; అట్లు పలికినన్= అట్లా అనగా; ఆ+విభుండు= ఆ రాజు; అనఘ!= పుణ్యాత్మా!; నీదు తండ్రి= నీ తండ్రి అంగిరసుడు; మా తాతకున్= మా తాతగారైన కరంధముడికి; సంప్రీతితోన్= ప్రేమతో; ఉపద్రష్ట అయ్యెన్= ఉపద్రష్ట అయ్యాడు కదా!; అట్లు+అ; కృపచేయుము+అని పల్కెన్= అట్లాగే నీవు నన్ను కనికరించుము - అని అన్నాడు.

**తాత్పర్యం:** అదంతా విని ఆ మరుత్తుడు దేవతల గురువు బృహస్పతి వద్దకు వెళ్ళి, అతడితో 'ఆచార్యా! నీకు తెలిపి, నీ అనుమతి చొప్పుననే నేను యజ్ఞసామగ్రిని సిద్ధంచేసికొని యజ్ఞం చేయటానికి తయారుగా ఉన్నాను. నీవు దయతో ఉపద్రష్టగా వ్యవహరించుము. అని అడుగగా అప్పుడు బృహస్పతి 'రాజా! ఇంద్రుడు ఇంతకుముందే తాను చేయనున్న యాగానికి ఉపద్రష్టగా నన్ను వరించాడు. ఇప్పుడు రావటం ఎట్లా?' అన్నాడు. దానికి ఆ రాజు 'మహాత్మా! మీ తండ్రి అంగిరోమహర్షి మా తాతగారైన కరంధముడికి ఉపద్రష్టగా వ్యవహరించారు కదా! అట్లాగే నామీదా మీరు దయచూపండి' అని కోరాడు.

**చ.** **విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతుప్రయోగముల్**
**మనము దలిర్పఁగా నడపి మర్త్యుని యాగము నొజ్జఁ గాఁగఁ జా**
**ల నిది నిజంబ యింక ననులాప మొనర్పక పొమ్ము వేఱ యొ**
**క్కని నుపదర్శనంబునకుఁ గైకొను మారసి నీవు' నావుడున్.** **41**

**ప్రతిపదార్థం:** విని= ఆ రాజుమాటలు విని; ధిషణుండు= బృహస్పతి; అమర్త్యులకున్= మరణంలేనివారైన దేవతలకు; విన్ననువు+ఒప్పన్= నేర్పు మెరసేటట్లు; క్రతుప్రయోగముల్= యాగ ప్రక్రియలను; మనము= మనస్సు; తలిర్పఁగాన్= వికసించగా; నడపి= నడిపించి; మర్త్యునియాగమున్= మానవుడు చేస్తున్న యాగానికి; ఒజ్జన్+కాఁగన్= గురువుగా ఉండటానికి; చాలన్= తగను; ఇది నిజంబు+అ= ఇది నిజం (అంతే); ఇంకన్= ఇక; అనులాపము= వేడికోలు; ఒనర్పక= చేయకుండా; పొమ్ము; వెళ్ళుము; వేఱ+ఒక్కనిన్= మరొకడిని; నీవు ఆరసి= నీవువెదకి; ఉపదర్శనంబునకున్= ఉపద్రష్టత్వం వహించటానికి; కైకొనుము= స్వీకరించుము; నావుడున్= అని అనగా (అప్పుడు).

**తాత్పర్యం:** ఆ రాజు మాటలు విని బృహస్పతి 'రాజా!' దేవతలకు నేర్పుతో వారి మనస్సులు సంతోషించేటట్లు యాగప్రక్రియలను నిర్వర్తించిన ప్రసిద్ధి నాది. అట్లాంటి నేను మానవుడు చేసే యాగానికి గురువుగా వ్యవహరించటం సముచితం కాదు. అందుచేత ఈ వేడికోలు ఇక మాని, మరొకరిని వెదకి ఉపద్రష్టగా గైకొనుము. ఇక వెళ్ళుము' అనగా - తరువాతి వచనంతో అన్వయం.

**వ.** **అజ్జనపతి లజ్జితుండై మగిడి వచ్చి యెదుర నారదుం గని వినయం బెసంగ వినతుండై నిలిచిన నమ్ముని యతనిం గనుంగొని 'యెటవోయి వచ్చె? దేల విన్ననై యున్నవా'డవు? నీ తెఱం గెఱింగింపు; మెవ్విధంబుననైన నీ విషాదంబు మాన్పెద' ననుటయు నమ్మనుజవరుండు 'మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపాధ్యాయుంగా వరియింపం బోయితి; నద్దేవగురుండు నన్ను దూషించి పరిత్యజించె; నింక నేటి బ్రదు? 'కని పలికిన నప్పరమ సంయమి యప్పుడమిఱేనితో 'బృహస్పతి నిన్నొల్లకున్ననేమి? యంగిరసుని పిన్నకొడుకు సంవర్తుండాధిషణు చేత ధిక్కరింపంబడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబు పెంపున దిగంబరుఁ డయి తిరుగుచున్నవాఁడతని పాలికి నరుగు; మమ్మహాత్ముండు భవన్మఖంబునకు నుపదర్శనం బాచరించు' ననవుడు సంతసిల్లి యా భూవరుం డిట్లనియె.** **42**

**ప్రతిపదార్థం:** ఆ+జనపతి= ఆ రాజు; లజ్జితుండు+ఐ= సిగ్గుపడినవాడై; మగిడివచ్చి= తిరిగివచ్చి; ఎదురన్= ఎదురుపడ్డ; నారదున్= నారదమహర్షిని; కని= చూచి; వినయంబు+ఎసంగన్= వినయం ఒప్పగా; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; నిలిచినన్= నిలబడగా; ఆ+ముని= నారదుడు; అతనిన్+ కనుంగొని= ఆ మరుత్తుడిని చూచి; ఎట+పోయి+వచ్చెదు?= ఎక్కడకు వెళ్ళి వస్తున్నావు?; ఏల=

ఎందుకు; విన్నన+ఐ= చిన్నబోయి; ఉన్నవా'డవు?= ఉన్నావు?; నీ తెఱంగు= నీ విధం; ఎఱింగింపుము= తెలుపుము; ఏ+విధంబునన్ ఐనన్= ఎట్లాగైనా నీ విషాదంబున్= నీ దుఃఖాన్ని; మాన్పెదన్+అనుటయున్= మాన్పుతాను అనగా; ఆ మనుజవరుండు= ఆ రాజు; మదీయ+అధ్వరంబునకున్= నేను చేయబూనిన యాగానికి; అంగిరసున్= అంగిరసుడి కుమారుడైన బృహస్పతిని; ఉపాధ్యాయున్+ కాన్= ఉపద్రష్టగా; వరియింపన్+పోయితిని= వరించాలని వెళ్ళాను; ఆ+దేవగురుండు= ఆ బృహస్పతి; నన్నున్+దూషించి= నన్ను తిట్టి; పరిత్యజించెన్= విడిచి పెట్టాడు; ఇంకన్+ఏటి+బ్రదుకు?+అని= ఇక నా బ్రదుకు ఎందుకు? అని; పలికినన్= అనగా; ఆ పరమ సంయమి= ఆ ఋషిశ్రేష్ఠుడు; ఆ+పుడమిఱేనితోన్= ఆ రాజుతో; బృహస్పతి; నిన్నున్+ఒల్లకున్నన్+ఏమి?= నిన్ను ఇష్టపడకపోతే నేమిటి?; అంగిరసుని పిన్నకొడుకు= అంగిరసుడి చిన్న కుమారుడు; సంవర్తుండు= సంవర్తు డనేవాడు; ఆ ధిషణుచేతన్= ఆ బృహస్పతిచేత; ధిక్కరింపన్+పడి= తిరస్కరించబడి; సకలంబును= అన్నిటిని; విడిచి= వదలిపెట్టి; వైరాగ్యంబు పెంపునన్= మిక్కిలి విరాగభావంతో; దిగంబరుఁడు+అయి= బట్టకూడా లేకుండా; తిరుగుచున్నాడు. అతని పాలికిన్+అరుగుము= అతడివద్దకు వెళ్ళుము; ఆ+మహాత్ముండు= ఆ సంవర్తుడు; భవత్+మఖంబునకున్= నీ యాగానికి; ఉపదర్శనంబు+ఆచరించున్+అనవుడున్= ఉపద్రష్టగా వ్యవహరిస్తాడు అని చెప్పగా; సంతసిల్లి= సంతోషపడి; ఆ భూవరుండు= ఆ రాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ రాజు సిగ్గుపడ్డవాడై తిరిగివచ్చి, ఎదురుపడ్డ నారదమహర్షిని చూచి, వినయంతో నమస్కరించి నిలబడ్డాడు. నారదుడు మరుత్తుడిని చూచి 'ఎక్కడికి వెళ్ళి వస్తున్నావు? ఎందుకు చిన్నపోయి కనిపిస్తున్నావు? ఏమిటి నీ వ్యవహారం? ఎందుకిట్లా దుఃఖిస్తున్నావు? నీ విషాదాన్ని ఎట్లాగైనా పోగొట్టుతాను' అన్నాడు. అపుడు ఆ రాజు 'స్వామీ! అంగిరసుడి కుమారుడైన బృహస్పతిని ఉపద్రష్టగా వరించాలని వెళ్ళాను. ఆ దేవగురుడు నన్ను తిట్టి వదలిపెట్టాడు. ఇక నా బ్రదుకు వ్యర్థం' అని బావురుమన్నాడు. ఆ ఋషిశ్రేష్ఠుడు 'రాజా! ఆ బృహస్పతి నిన్ను ఇష్టపడకపోతే ఏమిటి నష్టం? అంగీరసుడి చిన్న కొడుకు సంవర్తుడనే వాడు కూడా బృహస్పతిచేత తిరస్కరించబడి. సర్వం వదలి, వైరాగ్యం అవలంబించి, దిగంబరుడుగా తిరుగుతున్నాడు. నీవు అతడి వద్దకు వెళ్ళుము. ఆ మహాత్ముడు నీ యాగానికి ఉపద్రష్టగా ఉంటాడు' అని చెప్పగా మిక్కిలి సంతోషపడి ఆ రాజు ఇట్లా అన్నాడు.

**క.** **'మునివర! బ్రదికితి సంవ। ర్తుని నెచ్చటఁ గాంతు? నెప్పరుసునం దగ నా**
**డిన నతఁడు ద్రోపు సేయక। ననుఁ గైకొను? నెఱుఁగఁ జెప్పు నాకుం గరుణన్.'** **43**

**ప్రతిపదార్థం:** మునివర!= ఓ మునిశ్రేష్ఠా!; బ్రదికితిన్= బ్రదికాను; సంవర్తునిన్= సంవర్తుడిని; ఎచ్చటన్+కాంతున్?= ఎక్కడ చూడగలను?; ఏ+పరుసునన్= ఏ విధంగా; తగన్= తగినట్లుగా; ఆడినన్= మాట్లాడితే; అతఁడు= ఆ సంవర్తుడు; త్రోపు+చేయక= త్రోసి పుచ్చకుండా; ననున్+కైకొనున్= నన్ను స్వీకరిస్తాడో; నాకున్= నాకు; కరుణన్= దయతో; ఎఱుఁగన్+చెప్పు(ము)= తెలియజెప్పుము

**తాత్పర్యం:** 'ఓ మునిశ్రేష్ఠా! బ్రదికాను, కాని ఆ సంవర్తుడిని ఎక్కడ చూడగలను? అతడితో ఎట్లా మర్యాదగా మాటాతే అతడు నా విన్నపాన్ని తోసిపుచ్చకుండా నన్ను స్వీకరిస్తాడో దయతో వివరంగా చెప్పి పుణ్యం కట్టుకొనండి.'

**వ.** **అని ప్రార్థించిన యప్పార్థివోత్తమునకు నత్తపోధనసత్తముం డిట్లనియె.** **44**

**ప్రతిపదార్థం:** అని= ఈవిధంగా; ప్రార్థించిన= ప్రార్థించినట్టి; ఆ+పార్థివ+ఉత్తమునకున్= ఆరాజశ్రేష్ఠుడితో; ఆ+తపోధన+సత్తముండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా ప్రార్థించగా ఆ రాజుతో ఆ మహర్షి ఇట్లా అన్నాడు.

**సీ. 'భూపాల! యతఁడు కాశీపురిఁ బాయక । వర్తించు నున్మత్తవర్తనమున;**
**నతని నెఱింగెడు నట్టి యుపాయంబు । వినుము పురద్వారమున శవంబు**
**నిడికొని నీ వుండు మేతెంచి చూచి ని । వర్తించు వాని సంవర్తుఁ గాఁగ**
**నెఱుఁగుము; మరలి యట్లేఁగంగ వెనుకన । పొమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ**

**ఆ. నెచట నైన నీకు నేకాంత మొదవిన । శరణు సొరుము వినయభరితవృత్తి**
**నాదు గుఱుతు సెప్పినారెవ్వ రనినను । జెంద నారదుండు సెప్పె ననుము. 45**

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; అతఁడు= ఆ సంవర్తుడు; కాశీపురిన్= కాశీపురిని; పాయక= వదలకుండా; ఉన్మత్త వర్తనమునన్= పిచ్చివాడివలె; వర్తించున్= ప్రవర్తిస్తుంటాడు; అతనిన్+ఎఱింగెడు+అట్టి= అతడిని గుర్తించేటటువంటి; ఉపాయంబు= యుక్తి; వినుము= చెప్తుతాను వినుము; పురద్వారమునన్= ఊరు ముందటి ద్వారం వద్ద; శవంబున్+ఇడికొని= ఒక శవాన్ని దగ్గర ఉంచుకొని; నీవు+ఉండుము= నీవు ఉండుము; ఏతెంచి= వచ్చి; చూచి; నివర్తించువానిన్= వెంటనే మరలిపోయేవాడిని; సంవర్తున్+కాఁగన్= సంవర్తుడని; ఎఱుంగుము= తెలిసికొనుము; మరలి+అట్లు+ఏఁగంగన్= మరలి అట్లా వెళ్ళిపోతుండగా; వెనుకన్+అ= వెనుకనే; నిశ్చల= నిశ్చలమైన; భక్తిపూర్వకమునన్= భక్తితో; పొమ్ము= వెళ్ళుము; ఎచటన్+ఐనన్= ఎక్కడైనా; నీకున్; ఏకాంతము+ఒదవినన్= ఒంటరిగా ఆయన దొరికితే; వినయభరితవృత్తిన్= వినయంతో కూడిన ప్రవృత్తితో; శరణు+చొరుము= ఆశ్రయం పొందుము; నాదు గుఱుతు= నా గుర్తు; ఎవ్వరు+చెప్పినారు+అనినను= ఎవరు చెప్పారని అడిగితే; చెందన్= నిన్ను పొందటానికి; నారదుండు= నారదమహర్షి; చెప్పెన్+అనుము= చెప్పాడు అని చెప్పుము.

**తాత్పర్యం:** రాజా! ఆ సంవర్తుడు కాశీపురాన్ని ఏనాడూ వదలిపెట్టడు; పిచ్చివాడివలె ప్రవర్తిస్తుంటాడు. అతడిని ఎట్లా గుర్తించాలో ఒక ఉపాయం చెప్తుతాను వినుము. ఊరు ముందటి ద్వారంవద్ద ఒక శవాన్ని దగ్గర పెట్టుకొని నీవు ఉండుము. వచ్చి చూచి వెంటనే ఎవరు మరలి పోతారో వారే సంవర్తుడని గుర్తించుము. అట్లా మరలి పోతున్నప్పుడు ఆయన వెంటనే నీవూ నిశ్చలమైన భక్తితో వెళ్ళుము. ఎక్కడైనా ఆయన ఒంటరిగా దొరికినప్పుడు వినయంతో ఆయన శరణు పొందుము. 'నా గుర్తు ఎవరు చెప్పారు?' అని ఆయన అడిగితే నారదమహర్షి చెప్పారని చెప్పుము.

**(మరుత్తుఁడు సంవర్తునిఁ దన యజ్ఞమున కుపద్రష్టఁగా వరియించుట (సం. 14-6-27))**

**సీ. ఇప్పుడు నారదుం డెందున్న వాఁడని । యడిగినయట్లైన నతఁడు నాకు**
**ని న్నెఱింగించి యగ్నిప్రవేశము సేసె । ననుము శంకింపక' యనుడు నమ్మ**
**హీపతి వారాణసీపురంబున కేఁగి । దిక్కుమాలిన పీనుఁ గొక్కచోటఁ**
**బడియున్నఁ గని దానిఁ బట్టించుకొని పుర । ద్వారప్రదేశంబు సేర నరిగి**

**తే. యచట నక్కుణపము నిడి యంతనంత । వేచికొని యుండఁగా నొక్క వెఱ్ఱివాఁడు**
**వచ్చి శవముఁ గనుంగొని వాటువడ్డ । పసరమును బోలెఁ గ్రమ్మఱి పాఱుటయును. 46**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఇపుడు; నారదుండు= నారదమహర్షి; ఎందున్+ఉన్నవాఁడు+అని= ఎక్కుడ+ఉన్నాడని; అడిగిన+అట్లు+ఐనన్= అడిగినట్లయితే; అతఁడు= నారదుడు; నాకున్= నాకు; నిన్నున్+ఎఱింగించి= నిన్ను గురించి తెలిపి; అగ్ని ప్రదేశంబు+చేసెన్= అగ్నిలో ప్రవేశించాడని; శంకింపక= సందేహించకుండా; అనుము= చెప్పుము; అనుడున్= అని చెప్పగా; ఆ+మహీపతి= ఆ రాజు;

వారాణసీ పురంబునకున్+ఏఁగి= వారాణసీ పురానికి వెళ్ళి; దిక్కుమాలిన పీనుఁగు= దిక్కులేని శవం; ఒక్కచోటన్+పడి+ఉన్నన్= ఒకచోట పడి ఉంటే; కని= చూచి; దానిన్+పట్టించికొని= దానిని మోయించుకొని; పురద్వార ప్రదేశంబు= పురద్వారాన్ని; చేరన్+అరిగి= వెళ్ళి చేరుకొని; అచటన్= అక్కడ; ఆ+కుణపమున్+ఇడి= ఆ శవాన్ని ఉంచుకొని; అంతన్+అంతన్= దాచి సమీపంలో అక్కడా ఇక్కడా; వేచికొని ఉండఁగాన్= కాచుకొని ఉండగా; ఒక్క వెఱ్ఱివాఁడు= ఒక పిచ్చివాడు; వచ్చి; శవమున్+కనుంగొని= శవాన్ని చూచి; వాటు+పడ్డ= దెబ్బతిన్న; పసరమును+పోలెన్= పశువువలె; క్రమ్మఱి= వెనుకకు తిరిగి; పాఱుటయునున్= పరుగెత్తగా.

**తాత్పర్యం:** ఇప్పుడు నారదుడు ఎక్కడున్నాడు? అని ఒక సమయంలో అడిగితే ఆయన నాకు మిమ్ములను గురించిచెప్పి అగ్నిలో ప్రవేశించాడని ఏ సంకోచంలేకుండా చెప్పుము. 'అని నారదుడు చెప్పగా ఆ రాజు కాశీపురానికి వెళ్ళి దిక్కులేని శవం ఒకచోట పడి ఉండగా చూచి, దానిని మోయించుకొని నగరద్వారంవద్దకు చేరుకొని ఆ శవాన్ని అక్కడ ఉంచుకొని, దాని సమీపంలో అక్కడా ఇక్కడా ఉంటూ కాచుకొని ఉన్నాడు. అప్పుడు ఒక పిచ్చివాడు వచ్చి శవాన్ని చూచి, దెబ్బతిన్న పశువువలె వెనక్కి తిరిగి పారిపోయాడు.

**వ.** **వాని సంవర్తుంగా నెఱింగి యజ్జనపతి యాతని పజ్జన చనంజన నతండు మరలిచూచి పై ధూళి సల్లియు నుమిసియు వేఁదుఱుచందంబు భావింప నా భూవల్లభుండు.** **47**

**ప్రతిపదార్థం:** వానిన్= అతడిని; సంవర్తున్+కాన్= సంవర్తుడిగా; ఎఱింగి= గుర్తించి; ఆ+జనపతి= ఆ రాజు; అతని= ఆ సంవర్తుడి; పజ్జన్+అ= వెనుకనే; చనన్+చనన్= పోగా పోగా; అతండు= అతడు; మరలిచూచి= తిరిగి చూచి; పైన్= ఆ రాజుపై ధూళి+చల్లియున్= దుమ్ము చల్లి; ఉమిసియున్= ఉమ్మి వేసి; వేఁదుఱు+చందంబున్= పిచ్చివాడి రీతిని; భావింపన్= కలిగించగా; ఆ భూవల్లభుండు= ఆ రాజు.

**తాత్పర్యం:** అతడిని సంవర్తుడినిగా గుర్తించి ఆ రాజు అతడి వెనుకనే పోగా పోగా అతడు తిరిగి చూచి రాజుపై దుమ్ముచల్లి, ఉమిసి, పిచ్చివాడివలె ప్రవర్తించగా ఆ రాజు, (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **వినయముతోఁ గేల్ మొగుచుచు । ననుగమనం బుడుగ కరుగ నాతండును ని**
**ర్జనమగు ప్రదేశమునకుం । జని యొక వటవిటపి నీడఁ జదికిలఁ బడియెన్.** **48**

**ప్రతిపదార్థం:** వినయముతోన్= వినయంగా; కేల్= చేతులు; మొగుచుచున్= ముడిచి నమస్కరిస్తూ; అనుగమనంబు= వెంట వెళ్ళటాన్ని; ఉడుగక= వదలకుండా; అరుగన్= వెళ్ళగా; అతండును= సంవర్తుడూ; నిర్జనము+అగు= ఎవరూ లేని ఏకాంతమైన ప్రదేశమునకున్+చని= ఒక చోటికి వెళ్ళి; ఒక వట విటపి నీడన్= ఒక మఱ్ఱిచెట్టు నీడలో; చదికిలన్+పడియెన్= చతికిలపడ్డాడు.

**తాత్పర్యం:** వినయంగా చేతులు జోడించుకొని నమస్కరిస్తూ ఆయన ఎట్లా వెళ్ళితే అట్లా వెళ్ళుతూ పోగా పోగా ఆ సంవర్తుడు ఒక ఏకాంతమైన చోటికి వెళ్ళి, ఒక మఱ్ఱిచెట్టు నీడన చతికిలపడ్డాడు.

**వ.** **డప్పి భావించుకొని యమ్మహాత్ముం డట్లు గూర్చుండుటయు.** **49**

**తాత్పర్యం:** దప్పి ఉన్నవాడివలె (భావిస్తూ) ఆ మహాత్ముడు అట్లా కూర్చుండగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. ఆ రాజు సేరి సాష్టాంగప్రణామంబు। సేసి నిల్చిన 'ననుఁ జెప్పి నిన్ను**

**ననఘ! పుత్తెంచిన యతని పే రెఱిఁగింపు। నిజమైన సిద్ధించు నీ మనోర**

**థంబు; బొంకగు నేనిఁ దల యేడు వ్రయ్యలై। పడు' దని యమ్ముని పలుకుటయును**

**నారదుఁ డెఱిఁగించె నాకు మి'మ్మని నిజ। మాడిన సంవర్తుఁ 'డాతఁ డెచట**

**తే. నేమి తెఱంగున నున్నవాఁ డెఱుంగవలయుఁ। జెప్పు' మనుడు 'మీ తెఱఁగెల్లఁ జెప్పి నన్ను**

**నిందుఁ బుత్తెంచు నపుడ యయ్యీడ్యధర్మ। పరుఁడు సొదఁ జొచ్చె' నని చెప్పి నరవరుండు. 50**

**ప్రతిపదార్థం:** ఆ+రాజు= ఆ మరుత్తుడు; అపుడు; చేరి= సంవర్తుడిని సమీపించి; సాష్టాంగ ప్రణామంబు+చేసి= ఎనిమిది అవయవాలు పుడమి సోకేటట్లు నమస్కారంచేసి; నిల్చినన్= నిలువగా; అనఘ!= ఓ పుణ్యాత్మా!; ననున్+చెప్పి= నన్ను గురించి చెప్పి; నిన్నున్+పుత్తెంచిన+అతని పేరు= నిన్ను పంపిన అతడి పేరు; ఎఱిఁగింపు(ము)= చెప్పుము; నిజమైనన్= నీవు చెప్పేది నిజమైతే; నీ మనోరథంబు= నీ కోరిక; సిద్ధించున్= నెరవేరుతుంది; బొంకు+అగున్+ఏని= అబద్ధమైతే; తల+ఏడు+వ్రయ్యలై+పడుదు(వు)+అని= తల ఏడు ముక్కలై చనిపోతావు అని; ఆ+ముని= ఆ ముని; పలుకుటయును= పలుకగా; నాకున్= నాకు; మిమ్మున్= మిమ్ములను గురించి; నారదుండు= నారదమహర్షి; ఎఱిఁగించెన్+అని= తెలిపాడని; సంవర్తుఁడు; నిజము+ఆడినన్= నిజం చెప్పగా; అతఁడు= ఆ నారదుడు; ఎచటన్+ఏమి+తెఱఁగునన్+ఉన్నవాఁడు?= ఎక్కడ ఏం చేస్తున్నాడు?; ఎఱుఁగన్ వలయున్= తెలిసికొనాలి; చెప్పుము+అనుచున్= చెప్పుమనగా; మీ తెఱఁగు+ఎల్లన్+చెప్పి= మీ వైనాన్ని గురించి అంతా చెప్పి; నన్నున్+ఇందున్+పుత్తెంచు+అపుడ= నన్ను ఇక్కడికి పంపించేటప్పుడే; ఆ+ఈడ్య+ధర్మపరుఁడు= పొగడదగిన ధర్మ నిష్ఠుడైన ఆ నారదుడు; సొదన్+చొచ్చెన్= చితిలో ప్రవేశించాడు; అని; నరవరుండు= ఆ రాజు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ సంవర్తుడు అట్లా కూర్చోగానే మరుత్తుడు అతడిని సమీపించి నమస్కరించి నిలిచాడు. 'మహాత్మా! నన్ను గురించి చెప్పి నిన్ను పంపించిన వారెవరో చెప్పుము. నీవు చెప్పేది నిజమైతే నీ కోరిక నెరవేరుతుంది. అబద్ధమైతే తల ఏడు ముక్కలై చస్తావు' అని సంవర్తు డన్నాడు. దానికి ఆ రాజు 'అయ్యా! మిమ్ములను గురించి నారద మహర్షి నాకు తెలిపాడు' అని నిజం చెప్పాడు. 'అయితే అతడు ఇప్పుడు ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? తెలిసికొనాలి చెప్పుము' అని సంవర్తుడు అడిగాడు. 'స్వామీ! మీ వైనమంతా నాకు చెప్పి నన్ను ఇక్కడికి పంపిస్తున్న సమయంలోనే ఆ మహర్షి చితి పేర్చి అందులోకి ప్రవేశించాడు' అని మరుత్తుడు (నారదుడు ఎట్లా చెప్పాడో అట్లాగే) చెప్పాడు.

**విశేషం:** ఈ సందర్భాన్ని కేవలం సాంకేతికంగా అర్థం చేసికొంటేనేగాని 'ఇతిహాసం' ఎన్ని లోతులకు పోయి అధ్యాత్మికరహస్యాలను వ్యాఖ్యానించిందో పట్టుకొనలేము.

నారదుడు మహర్షి. సంవర్తుడు అవధూత. సంవర్త శబ్దానికి అర్థం 'తిరిగి వచ్చినవాడు' అని. దేనినుండి? - అన్ని ఇంద్రియ సుఖాలనుండీ, భోగం నుండీ, పదవీవ్యామోహం నుండీ, చివరికి మృత్యువునుండీ అని అర్థాలు చెప్పాలి. అందుకే శవాన్ని చూడగానే 'పారిపోతాడు గుర్తుంచుకో' అని నారదుడు సూచన చేశాడు. అంటే 'మృత్యువెరుగ' డని అర్థం. అట్లాగే అతడికి 'ఇంద్రియలోలత్వం' లేదన్న సారాంశమే నారదుడి 'అగ్నిప్రవేశం'లో ఉన్నది.

'అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్' అన్నారు వేదంలో, అగ్ని వాక్కురూపాన్ని పొందిందని, శుచిమంతుడు అగ్నిరూపంలో ఉంటాడని అర్థం. కాబట్టి నారద - సంవర్తుల నడుమ రహస్యంగా జరిగిన 'సాంకేతిక భావ ప్రకటన' ఈ సంఘటనలో ఉన్నది. నిజంగా నారదుడు అగ్ని ప్రవేశం చేశాడని కాదు.

**వ. చెప్పిన నప్పరమముని యప్పుడమిఱేని యాననం బాలోకించి, 51**

**ప్రతిపదార్థం :** చెప్పినన్; ఆ+పరమముని= ఆ గొప్ప ఋషి; ఆ+పుడమిఱేని= ఆ రాజుయొక్క; ఆననంబు= ముఖాన్ని; ఆలోకించి=చూచి.

**తాత్పర్యం:** మరుత్తుడు అట్లా చెప్పగా ఆ ఋషిశ్రేష్ఠుడు ఆ రాజును చూచి ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతోఅన్వయం)

**క. 'ననుఁ గానఁగ నీ వచ్చిన। పని యెయ్యది?' యనిన నృపతి 'నా యజ్ఞం**
**బునకుఁ గృప మీర లుపద। ర్శనముం జేయంగ వలయు సంయమినాథా! 52**

**ప్రతిపదార్థం:** ననున్+కానఁగన్= నన్ను చూడటానికి; నీ+వచ్చిన= నీవు వచ్చిన; పని+ఏ+అది?= పని ఏమిటి?; అనినన్= అనగా; నృపతి= రాజు; సంయమినాథా!= ఋషిశ్రేష్ఠుడా!; నా యజ్ఞంబునకున్= నేను చేయబోతున్న యజ్ఞానికి; మీరలు= మీరు; ఉపదర్శనమున్+చేయఁగన్+వలయున్= ఉపద్రష్టగా వ్యవహరించాలి.

**తాత్పర్యం:** 'నన్ను చూడటానికి నీవు వచ్చిన పని ఏమిటి?' అని సంవర్తుడు అడిగాడు. దానికి ఆ రాజు 'ఓ ఋషిశ్రేష్ఠుడా! నేను చేయబోయే యజ్ఞానికి మీరు ఉపదర్శనం చేయాలి' అంటూ ఇంకా ఇట్లా అన్నాడు.

**వ. U#° =°~î` త్తుం డనువాఁడ భవదీయజనకుం డుపాధ్యాయుండు గాఁ గ్రతుకర్తయైన కరంధముని పౌత్రుండ' ననుటయు సంవర్తుండు సంప్రీతి నాతనితో 'నీవు నీ కార్యంబు నాకుం జెప్పితి; నా తెఱంగు వినుము; మా యన్న యగు బృహస్పతి దన తపోబలంబున నన్ను నవమానించిన మదీయ గృహధనాది వస్తువు లెల్లను విడిచి యిట్లు దిరిగెద; నను బోఁటి పేద నీ కుపద్రష్ట యైన నయ్యెడు పెంపునుం గలదె? యమ్మహాత్ము నీవు వరియింపు మట్లుగాక యేన కావలయు నను తలంపు గలదేని. 53**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మరుత్తుండు+అనువాఁడన్= మరుత్తుడు అనే వాడను; భవదీయజనకుండు= మీ తండ్రి అంగిరసుడు; ఉపాధ్యాయుండుగాన్= ఉపద్రష్టగా; క్రతుకర్త+ఐన= క్రతువులు చేసిన; కరంధముని= కరంధముడియొక్క; పౌత్రుండను= మనుమడిని; అనుటయున్= అనగా; సంవర్తుండు; సంప్రీతిన్= ప్రేమతో; అతనితోన్; నీవు నీ కార్యంబు= నీవు నీ పనిని; నాకున్+చెప్పితి(వి)= నాకు చెప్పావు; నా తెఱంగు+వినుము= నా విషయం వినుము; మా+అన్న+అగు= మా అన్న అయిన; బృహస్పతి; తన తపోబలంబునన్= తన తపశ్శక్తి ప్రభావంతో; నన్నున్= నన్ను; అవమానించినన్= అవమానపరిస్తే; మదీయ= నా; గృహధనాది వస్తువులు+ఎల్లనున్= గృహం, ధనం, వస్తువులు మొదలైన వాటి నన్నిటినీ; విడిచి= వదలి; ఇట్లు+తిరిగెదన్= ఇట్లా తిరుగుతున్నాను; నను+బోఁటి= నా వంటి; పేద= నిరుపేద; నీకు+ఉపద్రష్ట ఐనన్= నీకు ఉపదర్శనం చేయిస్తే; అయ్యెడు పెంపునున్+కలదె?= ఒరిగే వైభవం ఏమిటి?; ఆ+మహాత్మున్= పెద్దవాడైన ఆ బృహస్పతిని; నీవు; వరియింపుము= వరించుము; అట్లుగాక= అట్లా కాకుండా; ఏను+అ= నేనే; కావలయున్+అను తలంపు+కలదు+ఏని= కావాలి అని ఆలోచన ఉంటే.

**తాత్పర్యం:** 'నా పేరు మరుత్తుడు. మీ తండ్రి అంగిరసుడు ఉపద్రష్టగా వ్యవహరించగా చాలా క్రతువులు చేసిన కరంధముడి మనుమడిని,' అని చెప్పగా సంవర్తుడు అభిమానంతో మరుత్తుడిని చూచి ఇట్లా అన్నాడు 'రాజా! నీ పనిని నీవు చెప్పావు. ఇక నా విషయం వినుము. మా అన్న బృహస్పతి తన తపోబలంతో నన్ను అవమానపరిచాడు. అందుచేత నా ఇంటిని, ధనాన్ని, వస్తుసముదాయాన్ని అంతటినీ వదలివేసి ఇట్లా తిరుగుతున్నాను. నా వంటి నిరుపేద నీకు ఉపద్రష్టగా ఉంటే నీకు ఒరిగే వైభవం ఏమిటి? పెద్దవాడైన ఆయననే కోరుకొనుము. అట్లా కాకుండా నేనే కావాలి అని నీకు మనసులో ఉంటే (తరువాతి పద్యంతో అన్వయం.)

ఆ. **అన్న నాకు మాన్యుఁ డాతండు వనుపంగ। నాచరింతు నీదు యాగమునకు**
**నొజ్జతనము వేగ మర్వీశ! యగ్గురుఁ। గని యనుజ్ఞ వడయు' మనిన విభుఁడు.** **54**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ= రాజా!; అన్న= బృహస్పతి; నాకున్+మాన్యుఁడు= నేను గౌరవింపదగినవాడు; అతండు= అతడు; పనుపంగన్+అనుమతిస్తే; నీదు యాగమునకున్= నీ యజ్ఞానికి; ఒజ్జతనమున్= ఉపాధ్యాయత్వాన్ని; ఆచరింతున్= నిర్వహిస్తాను; వేగము+అ= వెంటనే; అ+గురున్+కని= ఆ దేవగురువును చూచి; అనుజ్ఞ+పడయుము= అనుమతి పొందుము; అనినన్= అని చెప్పగా; విభుఁడు= ఆ రాజు.

**తాత్పర్యం:** రాజా! మా అన్నగారు గౌరవార్హుడు. అతడు అనుమతిస్తేనే నేను నీ యాగానికి ఉపద్రష్టగా ఉండగలను. కనుక వెంటనే మా అన్నను చూచి ప్రార్థించి అనుమతి సంపాదించుము' అని సంవర్తుడు అన్నాడు. అప్పుడు ఆ రాజు (తరువాతి పద్యంతో అన్వయం.)

సీ. **'ఆతని కడకు ము న్నరిగితిఁ గృప పుట్టఁ। బలికితి; నతఁడు నా పలుకు సరకు**
**గొనక యమర్త్యయాజనము ననుష్ఠించు। నేను మర్త్యుని యొజ్జ నేల యగుదు?**
**ననియె నాతోడి యీసున వాసవుఁడు గురు। నుడిపిన కతమునఁ గడఁగి గురుఁడు**
**నను ధిక్కరించె నింకనఘ! యందేమని। పోదు? మీ మాహాత్మ్యముననుు వాస**

ఆ. **వుని నతిక్రమింతు వని నమ్మి యున్నాఁడ;। గైకొనంగవలయుఁ గరుణ వెలయ'**
**ననిన మునియు 'నట్ల యయ్యెడుఁగా కని। పలికె మఱియు నా నృపాలుతోడ.** **55**

**ప్రతిపదార్థం:** అతని కడకున్= అతడి వద్దకు; మున్ను+అరిగితిన్= ముందు వెళ్ళాను; కృప పుట్టన్+పలికితిన్= దయ కలిగేటట్లు మాటాడాను; అతఁడు= ఆ బృహస్పతి; నా పలుకున్= నా మాటను; సరకుగొనక= లెక్కచేయక; అమర్త్య= దేవతలయొక్క; యాజనమున్= యజ్ఞ కార్య నిర్వహణం; అనుష్ఠించు= ఆచరించే; నేను; మర్త్యుని= మానవుడి; ఒజ్జన్= ఉపాధ్యాయుడిగా; ఏల+అగుదున్?= ఎట్లా అవుతాను?; అనియెన్= అన్నాడు; నా తోడి+ఈసునన్= నాపైన అసూయతో; వాసవుఁడు= ఇంద్రుడు; గురున్= బృహస్పతిని; ఉడిపిన కతమునన్= ఆపివేసినందువలన; కడఁగి= పూని; గురుఁడు= ఆ బృహస్పతి; ననున్+ధిక్కరించెన్= నన్ను ఎదిరించి మాటాడాడు; ఇంకన్= ఇక; అందున్+ఏమని+పోదున్?= ఆ స్వర్గానికి ఏమని వెళ్ళను?; మీ మాహాత్మ్యమునను= మీ తపఃప్రభావంతో; వాసవునిన్+అతిక్రమింతువు+అని= ఇంద్రుడిని మీరి వ్యవహరించగలవని; నమ్మి+ఉన్నాఁడన్= నమ్మి ఉన్నాను; అనఘ!= ఓ పుణ్యాత్మా!; కరుణ వెలయన్= కరుణతో; కైకొనంగన్+వలయున్= ఉపాధ్యాయత్వాన్ని తప్పక తీసికొనాలి; అనినన్= అనగా; మునియున్= సంవర్తుడు కూడా; అట్లు+అయ్యెడున్+కాక+అని= అట్లాగే కానిమ్ము అని; ఆ నృపాలుతోడన్= ఆ రాజుతో; పలికెన్= అన్నాడు; మఱియున్.

**తాత్పర్యం:** 'స్వామీ! నేను ముందే బృహస్పతివద్దకు వెళ్ళి, అతడికి దయపుట్టేటట్లుగా ఎంతో వినయంగా మాటాడాను. అయినా అతడు నా మాటలు లెక్క చేయలేదు. దేవతల యజ్ఞాలను జరిపించే తాను మానవుల కుపాధ్యాయుడిగా ఎట్లా ఉండటం? అన్నాడు. నాపైన అసూయతో బృహస్పతిని ఇంద్రుడు ఆపివేయటంవలన బృహస్పతి నన్ను అట్లా ఎదిరించి మాటాడాడు. ఇక మరల అక్కడికి ఏమని వెళ్ళను? మీ తపఃప్రభావంతో ఇంద్రుడిని అతిక్రమించగలరని నమ్మకంతో నేను ఉన్నాను. ఓ పుణ్యాత్మా! కరుణతో ఉపాధ్యాయత్వాన్ని తప్పక మీరు స్వీకరించాలి' అని ఆ రాజు కోరగా సంవర్తుడు ఆ రాజుతో 'అట్లాగే కానిమ్ము' అంటూ ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. 'అయ్యెడుం గాక యిపుడు నీ' కనుచు 'నీవు। సంచలించిన యప్పుడు శాప మిత్తు**
**నీకుఁ గీడును బాటిల్లు నింత దలఁచి। సుస్థిరుండవు గావలె సుజనవర్య! 56**

**ప్రతిపదార్థం:** ఇపుడు= ఇప్పటికి; నీకున్+అయ్యెడున్+కాక= నీవు కోరినట్లే అవుతుంది గాక; అనుచున్= అంటూ; సుజనవర్య!= మంచివారిలో శ్రేష్ఠుడవైన ఓ రాజా!; సంచలించిన+అప్పుడు= నీవు యజ్ఞదీక్షనుండి కదలితే అప్పుడు; శాపము+ఇత్తున్= శాపం ఇస్తాను; నీకున్+కీడునున్+పాటిల్లున్ నీకు దానివలన కీడు కూడా కలుగుతుంది; ఇంత+తలఁచి= దీనినంతా ఆలోచించి; సుస్థిరుండవు+ కావలెన్= నీవు స్థిరచిత్తుడుగా యజ్ఞదీక్ష నిర్వహించాలి.

**తాత్పర్యం:** 'రాజా! ఇప్పటికి నీవు కోరినట్లే అవుతుంది పొమ్ము. కాని, నీవు ఎప్పుడు యజ్ఞదీక్షనుండి కదలుతావో అపుడు శాపం పెట్టుతాను. దానివలన నీకు కీడు కలుగుతుంది. ఇదంతా ఆలోచించి నీవు స్థిరచిత్తంతో యజ్ఞదీక్ష నిర్వహించాలి జాగ్రత్త!

**వ. ఏను నీ యధ్వరంబున కుపదర్శనంబు సేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ బ్రద్వేషించి రోషంబు వాటింతురు; దానికి నులికి నీవు సంచలించిన మదీయ శాపంబునం గీడు వచ్చు; నింత దలంచి సుస్థిర నిశ్చయుండవు గావలయు విచారించుకొ' మ్మనిన నమ్మహనీయుతో నమ్మహీనాథుండు. 57**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నీ+అధ్వరంబునకున్= నీ యాగానికి; ఉపదర్శనంబు చేయుచుండన్= ఉపద్రష్టగా వ్యవరిస్తున్నప్పుడు; ఆ+దివస్పతియున్= ఆ స్వర్గాధిపతి ఇంద్రుడూ; బృహస్పతియున్= ఆ దేవ గురువు బృహస్పతీ; ప్రద్వేషించి; నన్ను మిక్కిలిగా ద్వేషించి; రోషంబు+పాటింతురు= కోపం పూనుతారు; దానికిన్= దానికి; ఉలికి= భయపడి; నీవు; సంచలించినన్= భయపడి దీక్షను విరమిస్తే; మదీయ శాపంబునన్= నా శాపంవలన; కీడు వచ్చున్= కీడు కలుగుతుంది; ఇంత+తలంచి= ఇదంతా ఆలోచించి; సుస్థిర నిశ్చయుండవు+కావలయున్= గట్టి నిర్ణయం కలిగినవాడవు కావాలి. విచారించుకొమ్ము+అనినన్= బాగా ఆలోచించుకొనుము - అనగా; ఆ+మహనీయుతోన్= ఆ మహానుభావుడితో; ఆ+మహీనాథుండు= ఆ భూపతి (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** నేను నీ యాగం నడిపిస్తుంటే ఇంద్రుడు, బృహస్పతి నా మీద కోపగించుకొని, నీ యజ్ఞానికి ఎన్నో ఆటంకాలు కలిగించవచ్చును. దానికి భయపడి యజ్ఞం విరమించుకొంటే నేను నిన్ను శపిస్తాను. దానివలన కీడు జరుగవచ్చును. ఇదంతా ముందుగా ఆలోచించి సుస్థిరమైన నిశ్చయం కలిగి దీక్ష తీసికొనుము. బాగా ఆలోచించుకొనుము' అని ఆ మహర్షి చెప్పగా రాజు (తరువాతి పద్యంతో అన్వయం.)

**(సంవర్తుండు మరుత్తుని యజ్ఞమున కుపద్రష్ట యగుట (సం.14-7-23))**

**సీ. 'నీ కృపగాంచితి నాకు నింకొండు వి। చారంబు లేటికి? సంయమీంద్ర!**
**యా దివస్పతియు బృహస్పతియును నేల?। పశుపతి విద్వేషపరతఁ గలఁచె**
**నేనియుఁ గలఁగుదునే?' యని పలికి 'మీ। సంగతి వాసిన సరసిజాప్త**
**చంద్రతారకకులాచలములు గల యంత। కాలంబుఁ బుణ్యలోకములు లేక**

**తే. పోవు' నని శపథము శుద్ధభావవృత్తిఁ। బలుకుటయు, మెచ్చి యమ్మునిపతి 'మహీంద్రు**
**కంటె నిను ధనవంతునిగా నొనర్చి। క్రతువు నడపుదు' నని చెప్పి ప్రమద మెసఁగ. 58**

**ప్రతిపదార్థం:** సంయమి+ఇంద్ర!= ఋషిశ్రేష్ఠుడా!; నీ కృప+కాంచితిన్= నీ దయను పొందాను; నాకున్+ఇంకన్+ఒండు= నాకు ఇంకవేరే విచారంబులు+ఏటికిన్= ఆలోచనలు ఎందుకు?; ఆ దివస్పతియున్= ఆ ఇంద్రుడూ; ఆ+బృహస్పతియున్= ఆ బృహస్పతీ; ఏల?= మాత్రమే ఏమిటి?; పశుపతి= ఆ ఈశ్వరుడే; విద్వేషపరతన్= శత్రుత్వంతో; కలఁచెన్+ఏనియున్= నన్ను బాధించినా; కలఁగుదునే?= బాధపడి భయపడతానా?; అని పలికి; మీ సంగతి+పాసినన్= మీతో స్నేహాన్ని పోగొట్టుకుంటే; సరసిజ+ఆప్త= సూర్యుడు; చంద్ర= చంద్రుడు; తారక= నక్షత్రాలు; కుల+అచలములు+కల+అంత+కాలంబున్= సప్తకులపర్వతాలు ఉన్నంత కాలమూ; పుణ్యలోకములు= పుణ్యలోకాల ప్రాప్తి; లేకపోవును+అని= లేకపోతాయి అని; శుద్ధభావవృత్తిన్= పరిశుద్ధమైన మనోనిశ్చయంతో; పలుకుటయున్= చెప్పగా; ఆ+మునిపతి= ఆ ఋషిశ్రేష్ఠుడు; మెచ్చి= మెచ్చుకొని, నినున్+మహేంద్రుకంటెన్= నిన్ను ఇంద్రుడికంటె; ధనవంతునిగాన్+ఒనర్చి= ధనవంతుడిగా చేసి; క్రతువు నడపుదున్+అని= క్రతువు నడిపిస్తానని; ప్రమదము+ఎసఁగన్+చెప్పి= సంతోషం పుట్టేటట్లు చెప్పి.

**తాత్పర్యం:** 'ఋషిశ్రేష్ఠుడా! నీ దయను పొందాక నాకు మరో ఆలోచన ఎందుకు? ఆ ఇంద్రబృహస్పతులే కాదు, సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే కోపగించుకొని అడ్డుపెట్టినా భయపడతానా? మీతో స్నేహం పోగొట్టుకొనటం జరిగితే సూర్య, చంద్ర, తారక కులపర్వతా లున్నంత కాలమూ నాకు పుణ్యగతులు కలుగుతాయా?' అని పరిశుద్ధమైన మనోనిశ్చయంతో మరుత్తుడు పలికాడు. ఆ మాటలు విని, మునిశ్రేష్ఠుడైన సంవర్తుడు మెచ్చుకొన్నవాడై '(రాజా! నిన్ను ఇంద్రుడికంటె ధనవంతుడిగా చేసి యజ్ఞం నడిపిస్తా నని సంతోషం కలిగేటట్లు చెప్పి సప్తకులపర్వతములు:- 1.మహేంద్రము, 2.మలయము. 3.సహ్యాము, 4.శక్తిమంతము, 5. గంధమాదనము; 6.వింధ్రము,7.పారియాత్రము. చెప్పి. (తరువాతి వచనంతో అన్వయం)

**వ.** **మఱియు నిట్లను 'నెత్తెఱంగున నేను ధనవంతుండ నగుదు నంటేని వినుము. హిమవంతంబు నుత్తర భాగంబున ముంజవంతంబను పర్వతంబుగల దందు శివుండు శివాసహాయుండై సురసిద్ధ గరుడగంధర్వాది సమస్త భూత జాలంబు సేవింప విహరించుచుండు.** **59**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఇట్లు+అనున్= ఇట్లా అంటాడు; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; నేను; ధనవంతుండన్+అగుదున్+అంటేని= నేను ఎట్లా ధనవంతుడిని అవుతాను అని అంటావా!; వినుము; హిమవంతంబు+ఉత్తరభాగంబునన్= హిమలయాలకు ఉత్తర భాగంలో; ముంజవంతంబు+అను= ముంజవంత మనే; పర్వతంబు కలదు= పర్వతం ఉన్నది; అందున్= ఆ చోట; శివుండు= శివుడు; శివా సహాయుండు+ఐ= పార్వతీదేవితో కూడి; సుర= దేవతలచేత; సిద్ధ= సిద్ధులచేత; గరుడ= గరుడులచేత; గంధర్వ+ఆది= సమస్త భూత జాలంబు= గంధర్వులు మొదలైన సమస్త భూత సమూహాలూ; సేవింపన్= సేవిస్తుండగా; విహరించుచున్+ఉండున్= విహరిస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఇంకా ఇట్లా అన్నాడు. 'ఏ విధంగా నేను ధనవంతుడిని కాగలను?' అని నీవు అంటావా! అయితే వినుము. హిమాలయాలకు ఉత్తరభాగంలో ముంజవంత మనే పర్వతం ఉన్నది. అక్కడ శివుడు పార్వతితో కూడి దేవతలు, సిద్ధులు, గరుడులు, గంధర్వులు మొదలైన సమస్తభూతాలచేత సేవించబడుతూ విహరిస్తుంటాడు.

**క.** **మరణజరారోగము ల। గ్గిరి యే డిరవులను లే వఖిల గుల్మలతా**
**తరువులఁ గుసుమఫలంబులు। గర మొప్పుచునుండు నెల్లకాలము లందున్.** **60**

**ప్రతిపదార్థం:** ఆ+గిరి+ఏడు+ఇరవులను= ఆ కొండలోని ఏడు దిక్కులలోనూ; మరణ= మరణం; జరా రోగములు= ముసలితనం, రోగాలు; లేవు= ఎక్కడా కనిపించవు; అఖిల= అన్ని విధాలైన; గుల్మ= పొదలు; లతాతరువులన్= తీగలలోను, చెట్లలోను;

ఎల్లకాలములందున్= అన్ని కాలాలలోను; కుసుమ ఫలంబులు= పూలు; పండ్లు; కరము= మిక్కిలిగా; ఒప్పుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటాయి.

**తాత్పర్యం:** ఆ కొండలో ఎక్కడా జరారోగమరణాలు లేవు. అన్ని ఋతువులలోనూ పొదలలో, తీగలలో, చెట్లలో పూలు, పండ్లు సమృద్ధిగా కనిపిస్తాయి.

**విశేషం :** ముంజపర్వతం ఉత్తరదిశలో ఉన్నది. కనుక తక్కిన ఏడు దిక్కులనూ ప్రస్తావించారని అర్థం. అంటే 'ఎక్కడా లేదని' అర్థం చూ. పద్యం 76

**తే.** **ఆ నగంబు పార్శ్వంబుల నరుణకిరణ। రుచివితావితానంబు ననుకరించుచు వెలుంగు**
**శుద్ధకాంచనమయ శిలాస్థలవాలు। కాప్రభాజాల మాశ్చర్యకారి యగుచు.** **61**

**ప్రతిపదార్థం:** ఆ నగంబు= ఆ కొండయొక్క; పార్శ్వంబులన్= ప్రక్కలలో; అరుణకిరణ= సూర్యుడి (ఎఱ్ఱటి కిరణాలు కలిగిన); రుచివితానంబున్= కాంతి సమూహాన్ని; అనుకరించుచున్= పోలి; ఆశ్చర్యకారి+అగుచున్= ఆశ్చర్యం కలిగిస్తూ; శుద్ధకాంచనమయ= మేలిమి బంగారుతో నిండిన; శిలా= రాళ్ళతోనూ; స్థలవాలుకా ప్రభాజాలము= పెద్ద ఇసుక రేణువుల కాంతి సముదాయం; వెలుంగున్= ప్రకాశిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ కొండ ప్రక్కల సూర్యకిరణాలను పోలిన బంగారు రాళ్ళు, బంగారు ఇసుక ఆశ్చర్యకరంగా ప్రకాశిస్తూ ఉంటాయి. (అది అంత గొప్ప దివ్యభూమి అని తాత్పర్యం).

**వ.** **మన మయ్యెడకుం బోయి.** **62**

**ప్రతిపదార్థం:** మనము; ఆ+ఎడకున్= ఆ ప్రక్కకు; పోయి.

**తాత్పర్యం:** మనం ఆ ప్రాంతానికి వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **శ్రీకంఠు రుద్రుని శివుఁ బూషదంతఘ్ను। హరునిఁ గపర్ది శంకరుని నంత**
**కాంతకు వరదుని నాదిదేవునిఁ ద్రిలో। చను సహస్రాక్షుని శాంతమూర్తిఁ**
**జీరవాసుని ధన్వి సిద్ధు దండధరు మృ। గవ్యాధు నుష్ణీషిఁ గనకబాహుఁ**
**బశుపతి వృషు భూతపతి మాతృభక్తుని। నజు నగ్నివక్త్రుని నభవు భవుని**

**ఆ.** **భక్తిఁ బ్రస్తుతించి ప్రణతులఁ దేల్చి త। త్కరుణ వడసి పసిఁడి ద్రవ్వి తండ**
**ములు నృపాల! పెక్కుమోపులు దెత్తము। రమ్ము భారవహులఁ దెమ్ము చాల.'** **63**

**ప్రతిపదార్థం:** శ్రీకంఠున్= విషకంఠుడిని; రుద్రున్= రుదం రోదనం ద్రావయతీతి- రుద్రః. రోదనమును బాఱఁద్రోలువాఁడు; రోదించే (శబ్దించే) వాడిని; శివున్= శుభం కూర్చేవాడిని; పూషదంతఘ్నున్= సూర్యుడి దంతా లూడగొట్టిన వాడిని; హరునిన్= సకలాన్ని హరించేవాడిని; కపర్దిన్= పెద్ద జటాజూటం కలవాడిని; శంకరునిన్= శుభకారకుడిని ('శం' అంటే శుభం); అంతక+అంతకున్= యముడికి యముడివంటివాడిని (మృత్యుంజయుడని అర్థం); వరదునిన్= కోరిన వరాలు ఇచ్చేవాడిని; ఆదిదేవునిన్= దేవతలలో

మొదటివాడిని; త్రిలోచనున్= మూడు కన్నులు కలవాడిని; సహస్రాక్షునిన్= వేయి కన్నులు కలవాడిని; శాంతమూర్తిన్= పరమశాంత స్వరూపుడిని; చీరవాసునిన్= ఏనుగు చర్మాన్ని ధరించినవాడిని; ధన్విన్= పినాకమనే ధనుస్సును ధరించినవాడిని; సిద్ధున్= సిద్ధసమాధి నిష్ఠుడిని; దండధరున్= దండాన్ని ధరించినవాడిని; మృగవ్యాధున్= వేటలాడేవానిని; ఉష్ణీషిన్= తలపాగా ధరించినవాడిని; కనకబాహున్= బంగారు బాహువులు కలవాడిని; పశుపతిన్= పశువులకు- ప్రాణులకు పతిని; వృషున్= వర్షించేవాడిని; భూతపతిన్= సర్వభూతపతిని; మాతృభక్తునిన్= మాతకు భక్తుడైన వానిని; అజున్= పుట్టుకలేనివానిని; అగ్నివక్త్రునిన్= అగ్ని ముఖంలో కలవాడిని; అభవున్= పుట్టుకలేనివానిని; భవునిన్= స్వయంగా జన్మించినవాడిని (అట్లాంటి మహాశివుడిని); (మనం చూచి); నృపాల!= ఓ రాజా!; భక్తిన్= భక్తితో; ప్రస్తుతించి= స్తోత్రాలు చేసి; ప్రణతులన్+తేల్చి= నమస్కారాలతో తృప్తి కలిగించి; తద్+కరుణ+పడసి= ఆయన కరుణ పొంది; పసిండి= బంగారును; త్రవ్వి తండములు= సమృద్ధిగా; పెక్కు మోవులు+తెత్తము= చాలా పెద్ద పెద్ద మూటలుగా కట్టి మోయించుకొని తీసికొని వద్దాము. రమ్ము= రమ్ము; బయలుదేరుము; చాల= చాలమంది; భారవహులన్= బరువులు మోసే పనివారిని; తెమ్ము= వెంట పిలుచుకొని రమ్ము.

**తాత్పర్యం:** 'రాజా! అట్లాంటి చోట మన మిద్దరం వెళ్ళి - విషకంఠుడు, రుద్రుడు, శివుడు, పూషదంతఘ్నుడు, హరుడు, కపర్ది, శంకరుడు, అంతకాంతకుడు, వరదుడు, ఆదిదేవుడు, త్రిలోచనుడు, సహస్రాక్షుడు, శాంతమూర్తి, చీరవాసుడు, ధన్వి, సిద్ధుడు, దండధరుడు, మృగవ్యాధుడు, ఉష్ణీషుడు, కనకబాహుడు, పశుపతి, వృషుడు, భూతపతి, మాతృభక్తుడు, అజుడు, అగ్నివక్త్రుడు, అభవుడు, భవుడు అయిన ఆ మహేశ్వరుడిని వివిధరీతులలో ప్రస్తుతించి, నమస్కారాలతో తృప్తి కలిగించి, ఆయన దయను సంపాదించి, అక్కడున్న బంగారును కోకొల్లలుగా పెద్దపెద్ద మూటలు కట్టించి మోయించుకొని వద్దాము, బయలుదేరుము. బరువులు మోసేవారిని దండిగా పిలుచుకొని రమ్ము!' అన్నాడు.

**విశేషం:** ఈ పద్యంలో ఒక గొప్ప శిల్పాన్ని తిక్కనగారు నిక్షిప్తం చేశారు. శివుడిని ఏయే పేర్లతో స్తుతించాలో ఆయా పేర్లను ఇక్కడ చెప్పి, తరువాతి పద్యంలో శివుని కరుణను పొందారు - అని చెప్పటంవలన ఈ పేర్లతో శివుడిని స్తుతించారన్న అర్థం వస్తోంది. ఈ రహస్యం మనం అర్థం చేసికొంటేనే తిక్కనగారు నాటకీయంగా ఇంత మహారచనను ఎట్లా చేశారో గుర్తించగలుగుతాం.

ఇక ఈ పద్యంలోని శివస్తుతులలో ఎన్నో పురాణాల కథలు దాగి ఉన్నాయి. 'కాలకూట భరణజా శ్రీః శోభా కంఠే యస్య సః శ్రీకంఠః' అని అమరకోశకారుడు అర్థం చెప్పాడు. కాలకూట విషాన్ని త్రాగటంవలన వచ్చిన నల్లదనం శోభ, దానివలన శోభించిన కంఠం కలిగినవాడు శ్రీకంఠుడు (శితికంఠుడని కూడా).

శివుఁడు - అంటే శుభాలు కూర్చేవాడని, బ్రహ్మానందస్వరూపుడు కాబట్టి నిర్వికారుడుగా సదా శమరూపంలో స్థిరంగా ఉండే వాడని 'శివు' డన్నారు. అదే 'శుభం' కాబట్టి అట్లా ఆయన 'శుభమూర్తి' అయ్యా డన్నమాట.

ప్రళయకాలంలో సర్వాన్నీ హరిస్తాడు కాబట్టి హరుడు. భక్తుల ఆపదలను హరిస్తాడు కాబట్టి హరుడు. 'హరి' శబ్దానికి యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, సింహం, కిరణం, గుర్రం, చిలుక, పాము, కోతి, కప్ప అనే అర్థాలతో పాటు 'విష్ణువు' అనే అర్థం కూడా ఉన్నది. స్థితికారుడు 'హరి'. లయకారుడు 'హరుడు'. ఈయనకూడా భక్తుల పాపాలు హరించేవాడే. సంస్కృతంలో శబ్దాలు చాలా చిత్రమైన 'శబ్దశక్తి' కలిగినవి. హరిహరాద్వైతానికి మంచి నిదర్శనం హరిహర రూపం.

కపర్ది - శివుడి జటాజూటానికి కపర్దమని పేరు. సుఖం నిండించేదని 'కపర్ద' శబ్దానికి అర్థం చెప్తుతారు. కపర్దము కలిగినవాడు 'కపర్ది' అని. గంగను తన జటాజూటంలో బంధించి లోకానికి అపకారం జరుగకుండా చేశాడు. అట్లా 'కపర్ది' లోకాన్ని రక్షించాడు.

శంకరుఁడు - 'శం' అంటే సుఖం. సుఖరూపి అని, సుఖాన్ని ఇచ్చేవాడని రెండర్థాలు ఉన్నాయి.

అంతకాంతకుడు - అంతకుడు 'యముడు'. అతడిని అంతంచేసినవాడు 'శివుడు'. ఎవరిని ఆశ్రయిస్తే మృత్యుభయం లేదో అతడు అంతకాంతకుడు. మార్కండేయుడి కథ ఇందుకు నిదర్శనం.

కోరిన వరాలు ఇస్తాడు కాబట్టి వరదుఁడు. మహాదేవుడని, ఆదిదేవుడని శివుడికే పేర్లు. తరువాతి దేవతలందరూ శివుడిని పూజించినట్లు పురాణాలు చెప్పుతాయి. సూర్యచంద్రాగ్నులు ఎవరికి 'కళ్ళు'గా ఉంటారో అతడు 'త్రిలోచనుడు' (కాలస్వరూపుడని అర్థం).

సహస్రాక్షుఁడు - పురుష స్వరూపుడు (చూ. పురుష సూక్తం) సహస్రాక్షతత్త్వం శివ, విష్ణు రూపాలలో వ్యక్తమయింది. అదే హరిహర రూపం. శాంతమూర్తి (శివుడనే పదం కింద చెప్పబడింది).

చీరవాసుఁడు - గజాసురుడిని చంపి, అతడి చర్మాన్ని చీరగా ధరించినవాడు;

ధన్వి - పినాకమనే ధనుస్సును ధరించి తారకాసుర సంహారం (కుమార రూపంలో) త్రిపురాసుర సంహారం (స్వరూపంలో) చేసినవాడు. యోగేశ్వరుడు కాబట్టి సిద్ధుడు. కాలదండాన్ని ధరించిన వాడు (యమస్వరూపుడు) కాబట్టి దండధరుడు. వేటాడటంలో ఆసక్తి ఉన్నవాడు (చూ. కిరాతార్జునీయ కథ) కాబట్టి మృగవ్యాధుడు. తలపాగా ధరించినవాడుగా ఉత్తరభారతంలో శివుడిని అర్చిస్తారు. (జటాజూటమే తలపాగా కావచ్చును). ప్రాణులందరూ పశువులు. కనుక పశుపతి. వరాలు వర్షిస్తాడు. కాబట్టి వృషుడు (వృషభరూపుడు - ధర్మస్వరూపుడు కాబట్టి); మాతృభక్తుడు - శివుడు అంబను అర్చించేటట్లుగా శక్తితంత్రం చెబుతుంది. (ఇక్కడ కూడా శివుడి శివాద్వైతం) అగ్ని వక్త్రుడు - అగ్నిముఖుడు (చూ. కుమార సంభవం కథ). అజుడు (బ్రహ్మ - పుట్టుకలేని వాడని) (అభవుడన్నా ఇంతే) భవుడు స్వయంగా పుట్టినవాడు.

**క.** **అని పలికి యమ్మహాత్ముఁడు। గొని పోవఁగఁ బోయి శివు నకుంఠితకరుణన్**
**గనక మసంఖ్యము మోపులు। గొని వచ్చె నతండు మంచుకొండ యివులకున్. 64**

**ప్రతిపదార్థం :** అని పలికి= అని చెప్పి; ఆ+మహాత్ముఁడు= ఆ సంవర్తుడు; కొనిపోవఁగన్= తీసికొని వెళ్ళగా; పోయి= (మరుత్తుడు) ముంజపర్వతానికి వెళ్ళి; శివు+అకుంఠిత కరుణన్= (అర్చించి అతడియొక్క) మొక్కవోని కరుణతో; కనకము= బంగారం; అసంఖ్యము= కొల్లలుగా; మోపులు+కొని= మూటలు కట్టించుకొని మోయించుకొని; అతండు= ఆ రాజు; మంచుకొండ+ఇవులకున్= మంచుకొండను దాటి బయటికి; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అట్లా చెప్పి, ఆ సంవర్తుడు తనను వెంటతీసికొని వెళ్ళగా ఆ మరుత్తుడు ఆ పర్వతానికి వెళ్ళి, శివుడిని స్తుతించి (ఎట్లా స్తుతించాలో పయి పద్యంలోని శివపర్యాయనామాలలోనే ఉన్నది) అతడి దయను మిక్కిలిగా పొంది, బంగారురాసులను కోకొల్లలుగా మూటలు కట్టించి, బంగారు శిలలను మోపులు కట్టించుకొని, పనివారిచేత మోయించుకొని, మోయించుకొని, హిమాలయాలు దాటి నగరం చేరుకొన్నాడు.

**వ.** **ఇట్లు మహాధనవంతుండై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును భాండప్రముఖసకల క్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషంబగు విభవం బెసంగ యజనంబున కుపక్రమించుటయు, బృహస్పతి యంతయు నెఱింగి యంగంబు గృశంబై వెలరువాఱునట్టి వగం బొందిన సంక్రందనుండు సూచి యవ్వాచస్పతి కిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మహాధనవంతుఁడు+ఐ= మిక్కిలి ధనం కలవాడై; మరుత్తుండు; సువర్ణమయంబులుగాన్= బంగారుతో; నిర్మింపబడినవిగా; యజ్ఞవాటంబును= యజ్ఞవాటికను; భాండ ప్రముఖ సకల క్రియా సాధనంబులును= కుండలు మొదలైన యాగప్రక్రియకు కావలసిన పనిముట్లను; శయ్యాసనాదులున్= శయ్యలు; ఆసనాలు మొదలైనవాటినీ, కావించుకొని= చేయించుకొని; తద్+ప్రదేశంబునన్= ఆ యజ్ఞవాటికలో; అతి మానుషంబు+అగు= దివ్యమైన; విభవంబు+ఎసంగన్= వైభవం

అతిశయించగా; యజనంబునకున్= యజ్ఞానికి; ఉపక్రమించుటయున్= ప్రారంభించగా; బృహస్పతి; అంతయున్+ఎఱింగి= అంతా తెలిసికొని; అంగంబు+కృశంబు+ఐ= శరీరం చిక్కిపోయి; వెలరు+పాఱునట్టి= తెల్లబారిన (వెల వెలపోగా); వగన్+పొందినన్= శ్రమను పొందగా; సంక్రందనుండు= ఇంద్రుడు; చూచి= చూచినవాడై; ఆ+వాచస్పతికిన్= ఆ బృహస్పతికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా మహాధనవంతుడై ఆ రాజు బంగారుతో యజ్ఞవాటికను, కుండలు మొదలైన యాగ సాధనాలను, శయ్యలను, ఆసనాలను తయారు చేయించుకొని, అక్కడ దివ్యమైన వైభవంతో యాగం ప్రారంభించగా బృహస్పతి అంతా తెలిసికొన్నాడు. అతడి శరీరం అవమానంతో చిక్కిపోయింది. వెలవెల పోయింది. దీనిని చూచి, ఇంద్రుడు ఆయనతో ఇట్లా అన్నాడు.

**ఆ. 'తెలివు వొంది యున్నదియె నీదు చిత్తంబు? । సురల బ్రదుకుతెరువు లరసి నడపు**
**చున్నవాఁడవే! సముత్సాహమున వారు । నీకుఁ బ్రియ మొనర్చి నేర్చి మంద్రె?' 66**

**ప్రతిపదార్థం:** నీదు చిత్తంబు= నీ మనస్సు; తెలివు= తెలివి; పొంది+ఉన్నదియె?= పొంది ఉన్నదా? (అంటే తెలివిగానే ఉన్నదా?); సురల బ్రదుకు తెరువులు= దేవతల జీవనమార్గాలు; అరసి= తెలిసికొని; సముత్సాహమునన్= ఉత్సాహంతో; నడపుచున్+ఉన్నవాఁడవే!= నడిపిస్తున్నావు కదా!; వారు= ఆ దేవతలు; నీకున్= నీకు; ప్రియము+ఒనర్చి= ప్రీతి కలిగించి; నేర్చి= నేర్పుతో; మంద్రె?= మందురే? (ఉంటున్నారా?)

**తాత్పర్యం:** 'ఆచార్యా! నీ మనసు జాగరూకంగానే ఉన్నది కదా! దేవతల పద్ధతి తెలిసిన మీరు వారికి శ్రేయోదాయకమైన రీతిలో కార్యతంత్రం నడిపిస్తున్నారు కదా! వారు కూడా మిమ్ములను సేవిస్తూ నిపుణంగా కార్యసాఫల్యం అందుకొనగలుగుతున్నారు కదా!

**విశేషం:** కుశలప్రశ్న వేసినట్లు ఉన్నా ఇంద్రుడు బృహస్పతిని ఎట్లా ప్రశ్నించాలో అట్లా అడుగుతున్నాడు. దేవతలు నిరంతర కార్యవ్యగ్రులు. వారి గురువు నిత్యోత్సాహి కావాలి. రాక్షసులపై, మానవులపై ఎత్తుకు పై ఎత్తులు వేయటమే బృహస్పతి పని. ఆ పని చేయగలిగినవాడు ఇట్లా చిన్నబోయి పాలిపోయి కనిపించటం వెనుక ఏమి జరిగిందో ఆ 'సహస్రాక్షు' డికి తెలియనిది కాదు. దేవతలు 'నిపుణ' కర్ములు. అందుకే రాక్షసులపై, మానవులపై ఎప్పుడూ పై చేయిగానే ఉంటారు. దీనిని సూచిస్తూ ఇంద్రుడు పై మాటలు అన్నాడు.

**వ. అనుటయు నాచార్యుండు 'సర్వంబు సంపన్నంబ', యనిన ననిమిషపతి యతనితోడ. 67**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ఇంద్రుడు అనగా; ఆచార్యుండు= బృహస్పతి; సర్వంబు= అంతా; సంపన్నంబు+ఆ= సమగ్రంగానే ఉంది; అనినన్= అనగా; అనిమిషపతి= దేవతాపతి (ఇంద్రుడు); అతనితోడన్= బృహస్పతితో (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం:** అని ఇంద్రు డనగా బృహస్పతి అన్నీ సమగ్రంగా ఉన్నాయని చెప్పాడు. అపుడు ఇంద్రు డాయనతో తరువాతి పద్యంతో అన్వయం.

**విశేషం:** సర్వం సంపూర్ణం, సంపన్నం - అనే మాటలను యజ్ఞసంపూర్తిని సూచించటానికి వాడుతారు. బృహస్పతి ఉపద్రష్ట కాబట్టి అతడి నోట యాగపరిభాష 'అంతా బాగానే ఉన్నది' అనే అర్థంలో ప్రవృత్తం కావటంలో ఆశ్చర్యం లేదు.

**క. 'నీ యొడలు దస్సి వెలువెల । నై యున్నది; నీకు నిట్టి యధికపు వగపుం**
**జేయఁగ వెఱవని నీచులఁ । జేయుదు దండితులఁ గాఁగఁ జెప్పుము వారిన్.' 68**

**ప్రతిపదార్థం:** నీ+ఒడలు= నీ శరీరం; డస్సి= అలిసిపోయి; వెలువలనై+ఉన్నది= వెలవెలపోయి ఉన్నది; నీకున్+ఇట్టి= నీకు ఇట్లాంటి; అధికపు వగపున్= అధికమైన దుఃఖాన్ని; చేయఁగన్= కలుగచేయటానికి; వెఱవని= భయపడని; నీచులన్= నీచులను; దండితులన్+కాఁగన్= దండితులనుగా; చేయుదున్= చేస్తాను; వారిన్= వారు ఎవరో; చెప్పుము.

**తాత్పర్యం:** 'ఆచార్యా! మీ శరీరం అలసటతో చిక్కిపోయింది. వెలవెలబోతున్నది. మీకు ఇట్లాంటి దుఃఖాన్ని కలిగించటానికి జంకని నీచు లెవరో చెప్పండి. వారిని కఠినంగా దండిస్తాను' అన్నాడు.

**వ. అనవుడు నాచార్యుం 'డట్టిదిలేదు; మరుత్తుండు మహనీయం బగు మఖం బొనరింప నుద్యోగించిన వాఁ డతనికి మద్విరోధి యగు సంవర్తుండు యాజకుండయి యది నడపువాఁడయ్యెననివింటి; మద్విషాదంబునకు మూలం బిది; యట్లు గాకుండం జేయవలయు; నజ్జననాయకు నియమించి సంవర్తుని యాజకత్వంబు నవశ్యంబును మాన్పునది' యని పలికినం బాకశాసనుండు పార్శ్వంబున నున్న యగ్నిదేవు నాలోకించి 'నీవు మరుత్తు పాలికిం బొ; మ్మతండు క్రతుకరణంబున కుత్సహించినవాఁడు; తదీయం బగు నుపదర్శనంబు బృహస్పతి యాచరించువాఁడుగా సంఘటించి ర' మ్మని నియోగించిన. 69**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పలుకగా; ఆచార్యుండు= బృహస్పతి; అట్టి+అది లేదు= అట్లాంటిది ఏమీ లేదు; మరుత్తుండు; మహనీయంబు+అగు= గొప్పదైన; మఖంబు+ఒనరింపన్= యాగం చేయటానికి; ఉద్యోగించినవాఁడు= ప్రారంభించాడు; అతనికిన్= అతడికి; మత్+విరోధి+అగు= నా శత్రువైన; సంవర్తుండు; యాజకుండు+అయి= యాజకుడై; అది= దానిని; నడపువాఁడు+అయ్యెను+అని= నడిపించేవాడు అయ్యాడని; వింటిన్= విన్నాను; మత్+విషాదంబునకున్= నా దుఃఖానికి; మూలంబు+ఇది= మూలం ఇది; అట్లు+కాకుండన్= అట్లాకాకుండా; చేయన్ వలయున్= చేయాలి; ఆ+జననాయకున్+నియమించి= ఆ రాజును నియంత్రించి; సంవర్తుని; యాజకత్వంబు= ఉపదర్శనాన్ని; అవశ్యంబునున్= తప్పకుండా; మాన్పునది= మానిపించాలి; అని పలికినన్= అని అడుగగా; పాకశాసనుండు= ఇంద్రుడు; పార్శ్వంబునన్+ఉన్న= దగ్గరే ఉన్నటువంటి; అగ్నిదేవున్+ఆలోకించి= అగ్నిదేవుడిని చూచి; నీవు; మరుత్తు పాలికిన్ పొమ్ము= మరుత్తుడివద్దకు వెళ్ళుము; అతండు; క్రతుకరణంబునకున్= యాగం చేయటానికి; ఉత్సహించినవాఁడు= మొదలుపెట్టాడు; తదీయంబు+అగు= ఆ యాగసంబంధమైన; ఉపదర్శనంబు= యాజకత్వాన్ని; బృహస్పతి; ఆచరించువాఁడుగాన్= చేసేటట్లు; సంఘటించి రమ్ము= ఏర్పాటు చేసి రమ్ము; అని ; నియోగించినన్= నియమించగా.

**తాత్పర్యం:** అని చెప్పగా బృహస్పతి 'అట్లాంటిది ఏమీ లేదు. మరుత్తుడు గొప్పయాగం చేయటానికి ఆరంభించాడు. అతడికి నా విరోధి సంవర్తుడు యాజకత్వం వహిస్తున్నాడని విన్నాను. నా దుఃఖానికి మూలం ఇదే. అట్లా కాకుండా చేయాలి. నీవు ఆ రాజును నియంత్రించి, సంవర్తుడు ఉపద్రష్ట కాకుండా మానిపించాలి' అని కోరగా ఇంద్రుడు తన ప్రక్కనున్న అగ్నిదేవుడితో 'నీవు మరుత్తుడివద్దకు వెళ్ళి ఆ యాజకత్వాన్ని బృహస్పతి వహించేటట్లు ఏం చేయాలో అట్లా చేసి రమ్ము' అని నియమించగా - తరువాతి పద్యంతో అన్వయం.

**ఆ. 'అట్లు సేయువాఁడ' నని యగ్ని నిజతను । స్ఫురణ మతిశయిల్ల నరుగుటయును.**
**నుల్ల మచ్చెరువున నూన మరుత్తుండు । ప్రణతి యాచరించి భక్తితోడ. 70**

**ప్రతిపదార్థం:** అట్లు+చేయువాఁడను+అని= అట్లాగే చేస్తాను అని; అగ్ని; నిజతను స్ఫురణము= తన దేహకాంతి; అతిశయిల్లన్= అతిశయించగా; అరుగుటయునున్= వెళ్ళగా; ఉల్లము= హృదయం; అచ్చెరువునన్= ఆశ్చర్యంతో; ఊనన్= వహించగా; మరుత్తుండు; భక్తితోడన్= భక్తివో; ప్రణతి= నమస్కారం; అచరించి= చేసి.

**తాత్పర్యం:** అట్లాగే చేస్తానని అగ్నిదేవుడు తన శరీరకాంతి మరింత అతిశయించగా క్షణమాత్రంలో ఆ మరుత్తుడి ముందు పోయి వెలిగాడు. అతడిని చూచి, మరుత్తుడు ఆశ్చర్యమగ్ను డయ్యాడు. భక్తితో అగ్నిదేవుడికి నమస్కరించి మరుత్తుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

(అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట (సం.14-9-11))

**సీ.** **సంవర్తుఁ బిలిచి యాసన పాద్యముఖ్యోప । చరణముల్ నడిపించి పరిసరమున**
**నున్న నయ్యనలుఁ డయ్యుర్వీశ్వరునితోడ । 'బలవైరి పనుప నీ పాలి కనఘ!**
**యరుగుదెంచితి దూతనై' యన్న నవ్విభుం । డవ్వాసవుండు సౌఖ్యమున వెలుఁగు**
**చున్నాఁడె? యమరసముత్కరం బతనికిఁ । బ్రియ మాచరించి వర్తించుచున్నె?**

**ఆ.** **యాదరంబు గలదె నాదెస? నా సహ । స్రాక్షు నెమ్మనంబునందు హవ్య**
**వాహ!' యనుడు నతఁడు వసుమతీపతికి ని । ట్లనియెఁ గౌరవాన్వయాగ్రగణ్య!** 71

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయ+అగ్రగణ్య!= కౌరవవంశంలో గొప్పవాడవైన ఓ జనమేజయ మహారాజా! (వినుము); సంవర్తున్+పిలిచి= యాజకుడైన సంవర్తుడిని పిలిచి అతడి సహాయంతో; ఆసన= ఆసనం; పాద్యముఖ్య+ఉపచరణముల్+నడిపించి= పాద్యం మొదలైన ఉపచారాలు చేసి (అగ్నిదేవుడికి); పరిసరమునన్+ఉన్నన్= సమీపంలో నిలబడగా; ఆ+అనలుఁడు= ఆ అగ్ని; ఆ+ఉర్వీ+ఈశ్వరుతోడన్= ఆ రాజుతో; అనఘ!= ఓ పుణ్యాత్మా!; బలవైరి= ఇంద్రుడు; పనుపన్= పంపగా; నీ పాలికిన్= నీ వద్దకు; దూతను+ఐ= దూతగా; అరుగుదెంచితిన్= వచ్చాను; అన్నన్= అనగా; ఆ+విభుండు= ఆ రాజు; హవ్యవాహ!= ఓ అగ్నిదేవా!; ఆ+వాసవుండు= ఆ ఇంద్రుడు; సౌఖ్యమునన్= సుఖంగా; వెలుఁగుచున్న+వాఁడె?= ప్రకాశిస్తున్నాడా?; అమర సముత్కరము= దేవతాసమూహం; అతనికిన్= అతడికి; ప్రియము+ఆచరించి= సంతోషం కలిగించి; వర్తించుచున్నె?= ప్రవర్తిస్తున్నదా?; నా దెసన్= నా యెడ; ఆ సహస్రాక్షు= ఆ ఇంద్రుడి యొక్క; నెమ్మనంబునందున్= నిండు మనసులో; ఆదరంబు+కలదె?= ఆదరం ఉందా?; అనుడున్= అని అడుగగా; అతఁడు= ఆ అగ్ని; వసుమతీపతికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సంవర్తుడిని పిలిపించి అతడి సహాయంతో అగ్ని దేవుడికి ఆసనపాద్యాద్యుపచారాలను సలిపి నమస్కరించి, మరుత్తుడు అతడి సమీపంలో నిలబడ్డాడు. అప్పుడు అగ్నిదేవుడు 'ఓ పుణ్యాత్మా! ఇంద్రుడు పంపగా నీ వద్దకు దూతగా వచ్చాను' అన్నాడు. అపుడు ఆ రాజు 'ఓ అగ్నిదేవా! ఇంద్రుడు సుఖంగా ఉన్నాడా? దేవతలు అతడికి ప్రీతి గూర్చుతూ ప్రవర్తిస్తున్నారు కదా! ఆ సహస్రాక్షుడి నిండు మనసులో నా విషయంగా ఆదరం ఉన్నది కదా!' అని అడుగగా ఆ అగ్నిదేవుడు ఇట్లా అన్నాడు.

**క.** **'సురనాథుఁడు దద్దయు సుఖి । సుర లాతనికిం బ్రియంబు సొలయక యొనరిం**
**తురు నా దెస నాదర మ । ప్పురుషవరున కగ్గలంబు భూపవరేణ్యా!** 72

**ప్రతిపదార్థం:** భూపరేణ్యా!= రాజశ్రేష్ఠుడా!; సురనాథుఁడు= దేవరాజు (ఇంద్రుడు); తద్దయున్= మిక్కిలి; సుఖి= సుఖంతో ఉన్నాడు; అతనికిన్= అతడికి; సురలు= దేవతలు; సొలయక= వెనుకాడకుండా (నిరంతరం); ప్రియంబు= ప్రీతిని; ఒనరింతురు= కూర్చుతున్నారు; ఆ పురుష వరునకున్= ఆ పురుషశ్రేష్ఠుడైన ఇంద్రుడికి; నీ దెసన్= నీ యెడ; ఆదరము= ప్రీతి; అగ్గలము= అత్యధికం.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఇంద్రుడు చాలా సుఖంగా ఉన్నాడు. దేవతలుకూడా అతడికి నిరంతరం ప్రీతిని సంఘటిస్తూ సేవచేస్తున్నారు. ఆ పురుషసత్తముడికి నీ యెడ పరమాదరం ఉన్నది.

**వ. నా వచ్చిన పని సెప్పెద నాకర్ణింపుము. 73**

**తాత్పర్యం:** నేను వచ్చిన పని చెప్పుతాను వినుము.

**క. నీ జన్నమునకు ధిషణుఁడు। యాజకుఁడై మర్త్యు నిన్ను నమరత్వదశా**
**భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి। రాజితముగ నాచరింపు క్రతుకార్యంబున్. 74**

**ప్రతిపదార్థం:** నీ జన్నమునకున్= నీ యజ్ఞానికి; ధిషణుఁడు= బృహస్పతి; యాజకుఁడు+ఐ= ఉపద్రష్టగా ఉండి; మర్త్యున్= మానవుడవైన; నిన్నున్= నిన్ను; అమరత్వ దశా భ్రాజిష్ణున్+చేయున్= దైవత్వస్థితితో ప్రకాశించేవాడిగా చేస్తాడు; ఆ+మెయిన్= ఆ విధంగా; రాజితముగన్= మహావైభవంగా; క్రతుకార్యంబున్= క్రతు కార్యాన్ని; ఆచరింపు(ము)= చేయుము.

**తాత్పర్యం:** నీ యాగానికి బృహస్పతి యాజకుడుగా ఉండి, మానవుడవైన నిన్ను దైవత్వస్థితితో విరాజిల్లే వాడిగా చేస్తాడు. ఆ విధంగా మహావైభవోపేతంగా నీవు బృహస్పతి సహాయంతో ఈ యాగాన్ని నిర్వహించుము.

**విశేషం:** అంటే సంవర్తుడు చాలడని అభిప్రాయం. లోభం కలిగించి మరుత్తుడి మనస్సు మార్చాలని అగ్ని ఉద్దేశం.

**వ. ఇది యింద్రుండు నీతోడం జెప్పుమన్న కార్యం' బనుటయు నమ్మనుజనాథుం డమ్మహాత్మతోడ. 75**

**ప్రతిపదార్థం:** ఇది= ఇంతవరకు నేను చెప్పినది; ఇంద్రుండు= మహేంద్రుడు; నీ తోడన్= నీతో; చెప్పుము+అన్న+కార్యంబు= చెప్పుమన్న పని; అనుటయున్= అనగా; ఆ+మనుజనాథుండు= ఆ రాజు; ఆ+మహాత్మతోడన్= ఆ అగ్నిదేవుడితో.

**తాత్పర్యం:** 'ఇంతవరకు నేను చెప్పినది ఇంద్రుడు నీతో చెప్పుమన్న పని' అని అనగా ఆ రాజు అగ్నిదేవుడితో - తరువాతి పద్యంతో అన్వయం.

**ఆ. 'అనఘ! యేడు మ్రొక్కు లా బృహస్పతికి మ్రొ। క్కెద; నతండు నన్ను నదయవృత్తి**
**నపహసించి తాను యాజకత్వమునకు। నెట్లుఁ జొరకయున్న నేను బోయి. 76**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్మా!; ఆ బృహస్పతికిన్; ఏడు మ్రొక్కులు= అనంతకోటి నమస్కారాలు; మ్రొక్కెదన్= మొక్కుతాను; అతండు= ఆయన; నన్నున్= నన్ను; అదయవృత్తిన్= దయలేని మనసుతో; తాను= తానుగా; అపహసించి= గేలిచేసి; యాజకత్వమునకున్= ఉపద్రష్టగా ఉండటానికి; ఎట్లున్+చొరక+ఉన్నన్= ఎట్లాగూ అంగీకరించకపోతే; నేను+పోయి= నేను వెళ్ళి.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్మా! ఆ బృహస్పతికి అనంతకోటి నమస్కారాలు చేస్తాను. (అంటే నన్ను నా మానాన విడిచిపెట్ట ని'మ్మని అర్థం) ఆయన నిర్దయతో నన్ను పరిహాసం చేసి ఉపాధ్యాయుడుగా ఉండటానికి ఏ మాత్రం అంగీకరించకపోతే నేను వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'సప్త'కు 'అనంత' అనే అర్థంకూడా ఉన్నది. ముందట 60వ పద్యంలోని ఏడు దిక్కులలోనూ అన్నప్పుడు కూడా 'ఎక్కడా' అనే అర్థం చెప్పవచ్చును. అక్కడ కూడా సంపూర్ణార్థమే ఉన్నది. సూర్యుడిని సప్తాశ్వుడని, అగ్నిని సప్తజిహ్వుడని, అట్లాగే సప్తమాతృకలు, సప్తసముద్రాలు, సప్తకులపర్వతాలు ఇత్యాదులలో కూడా 'సప్త' సంపూర్ణత్వ సంకేతమే.

ఇక్కడ మరుత్తుడి నమస్కారాలకు అర్థం 'వారి గొప్పతనం విషయంలో నాకు అభ్యంతరం లే'దనటం కూడా సూచించబడుతున్నది.

**క. అనుజుం డతనికి నను పెను। పొనరిన సంవర్తు భక్తి నొడఁబఱిచి తగం**
**గొనివచ్చితి మత్క్రతు యా। జన మీ యోగీశ్వరుండ చాలుం జేయన్.' 77**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ బృహస్పతికి; అనుజుండు+అను= తమ్ముడనే; పెనువు=పెంపు; ఒనరిన= కలిగిన; సంవర్తున్= సంవర్తుడిని; భక్తిన్+ఒడన్+పఱిచి= భక్తితో ప్రార్థించి అంగీకరింపజేసి; తగన్= మర్యాదతో; కొనివచ్చితిన్= పిలుచుకొని వచ్చాను; మత్+క్రతు+యాజనము= నా క్రతువుయొక్క నిర్వహణాన్ని; ఈ+యోగి+ఈశ్వరుండు+అ= ఈ మునీశ్వరుడే; చేయన్+చాలున్= చేయగలడు.

**తాత్పర్యం:** ఆ బృహస్పతికి తమ్ముడనే ప్రసిద్ధి ఉన్న ఈ సంవర్తమహామునిని భక్తితో ప్రార్థించి అంగీకరింపజేసి, ఎంతో మర్యాదగా ఆహ్వానించి పిలుచుకొనివచ్చాను. నా యాగనిర్వహణను ఈ యోగీశ్వరుడే చేయించగల సమర్థుడు.'

**ఆ. అనిన నగ్నిదేవుఁ 'డమరగురుం డుప। ద్రష్టయైన వజ్రధరుఁడు నీకు**
**నలఘుపుణ్యలోకములు సులభ్యములుగ। లీలఁ జేయు నట్లు మేలు గాదె!' 78**

**ప్రతిపదార్థం:** అనినన్+అని మరుత్తుడనగా; అగ్నిదేవుఁడు (ఇట్లా అన్నాడు); అమరగురుండు= బృహస్పతి; ఉపద్రష్ట+ఐనన్= ఉపాధ్యాయుడుగా యాగం నిర్వహిస్తే; వజ్రధరుఁడు= ఇంద్రుడు; నీకున్= నీకు; అలఘు= గొప్పవైన; పుణ్యలోకములు= పుణ్యలోకాలను; లీలన్= అతి విలాసంగా, అలవోకగా, ఆశ్చర్యకరంగా; సులభ్యములుగన్= బాగా లభించేవిగా; చేయును= చేస్తాడు; అట్లు= అట్లా కావటం; మేలు+కాదె?= మంచిది కదా?

**తాత్పర్యం:** అని మరుత్తుడు చెప్పగా అగ్ని దేవు డిట్లా అన్నాడు. 'బృహస్పతి నీకు ఉపద్రష్టగా ఉంటే ఇంద్రుడు నీకు మహాపుణ్యలోకాలు అత్యాశ్చర్యకరంగా అతిసులభంగా దొరికేటట్లు చేస్తాడు. అది కూడా మంచిదే కదా!' అన్నాడు.

**విశేషం:** సంవర్తుడు జరిపిస్తే రావలసిన స్వర్గాది పుణ్యలోకాల ప్రాప్తి ఇంద్రుడి చేతిలో ఉండటంవలన ఆ పుణ్యలోకాలకు రానివ్వకపోవచ్చు నని భయపెట్టటం ఇందులోని రహస్యం.

**క. అనవుడు సంవర్తుఁడు గడుఁ। గనలి యనలుతోడ 'నిట్టిగతి నీ విం కా**
**డిన మద్దారుణ దృష్టిని। నినుఁ గాల్తున్ మగుడు మిప్పనికిఁ దిరుగకుమీ. 79**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అగ్నిదేవుడు చెప్పగా; సంవర్తుఁడు= సంవర్త మహాముని; కడున్+కనలి= మిక్కిలి కోపించి; అనలుతోడన్= అగ్నిదేవుడితో; ఇట్టిగతిన్= ఇట్లాగే; నీవు+ఇంకన్+ఆడినన్= ఇంకా నీవు మాటాడితే; మత్+దారుణ+దృష్టిని= నా భయంకరమైన చూపుతో; నినున్+కాల్తున్= నిన్ను కాల్చివేస్తాను; మగుడుము= తిరిగిపొమ్ము; ఈ+పనికిన్+తిరుగకుమీ= మళ్ళీ ఈ పనికి ప్రయత్నించవద్దు (అన్నాడు).

**తాత్పర్యం:** అని అగ్నిదేవుడు చెప్పగా సంవర్తుడు మిక్కిలి కోపించి అగ్నిదేవుడితో 'నీవు ఇట్లాగే ఇంకా మాటాడితే నా భయంకరమైన చూపుతోనే నిన్ను కాల్చివేస్తాను. తిరిగిపొమ్ము. మరల ఈ పనికి ప్రయత్నం చేయకుము. వెళ్ళిపొమ్ము.' అన్నాడు.

**విశేషం:** అగ్నిదేవుడు 'మంట'కు అధిదైవతం. అతడినే కాల్చివేయగలది తపస్సునుండి పుట్టే అగ్నిమాత్రమే. అది దృష్టిద్వారా బహిర్గతమవుతుంది. అది మంట కాదు. 'తేజస్సు'. దాని ముందు అగ్ని కూడా నిలువదని తాత్పర్యం.

**చ. అనుటయు భీతి నగ్ని యమరాధిపు పాలికిఁ బోయి 'యే మరు**
**త్తునిఁ గని నెమ్మి నీ దగు క్రతుక్రియకున్ గురు యాజకుండుగాఁ**
**గొనుమని చెప్పితిన్; విని యకుంఠితనిశ్చయుఁడైన యవ్విభుం**
**డనిమిషమంత్రికిన్ వెఱతు నాతని తమ్మునిఁ గోరి తెచ్చితిన్. 80**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని సంవర్తుడు అనగా; భీతిన్= భయంతో; అగ్ని= అగ్నిదేవుడు; అమర+అధిపుపాలికిన్+పోయి= ఇంద్రుడి వద్దకు వెళ్ళి; ఏన్= నేను; మరుత్తునిన్+కని= మరుత్తుడిని చూచి; నెమ్మిన్= స్నేహభావంతో; నీది+అగు= నీవు చేస్తున్న; క్రతుక్రియకున్= యజ్ఞకర్మకు; గురున్= బృహస్పతిని; యాజకుండుగాన్= ఉపద్రష్టగా; కొనుము+అని= గ్రహించుము అని; చెప్పితిన్= చెప్పాను; విని= ఆ మాటలు విన్నవాడై; అకుంఠిత= మొక్కపోని; నిశ్చయుఁడు+ఐన= నిశ్చయం కలిగిన; ఆ+విభుండు= ఆ మరుత్తుడు; అనిమిషమంత్రికిన్= ఆ బృహస్పతి అంటే; వెఱతున్= నేను భయపడతాను; (అందుకే) అతని తమ్మునిన్= అతడి తమ్ముడు సంవర్తుడిని; కోరి= కోరుకొని; తెచ్చితిన్= తెచ్చాను.

**తాత్పర్యం:** అని సంవర్తుడనగా భీతితో అగ్నిదేవుడు పారిపోయి ఇంద్రుడివద్దకు వెళ్ళి, 'అయ్యా! నేను వెళ్ళి మరుత్తుడిని చూచి స్నేహభావంతో యాగానికి ఉపాధ్యాయుడుగా బృహస్పతిని గ్రహించు' మని చెప్పాను. ఆ మాటలు విన్న ఆ కృతనిశ్చయభావుడైన మరుత్తుడు 'స్వామీ! నాకు ఆ బృహస్పతి అంటే భయం. అందుచేతనే వాని తమ్ముడైన సంవర్తుడిని యాజ్ఞికుడుగా కోరుకొని ఆహ్వానించి పిలుచుకొని వచ్చాను.'

**వ. ఈ యోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుండను పలుకుపలికి సంవర్తుం జూపె; నేనంత నిలువక పురుహూతునకుం బ్రియం బొనరించిన నీకుం బుణ్యలోకంబులు సిద్ధించునట్లు చేసిన మేలని తఱిమి చెప్పినను నప్పుడమిఱేఁ డొడంబడండ.' 81**

**ప్రతిపదార్థం:** ఈ యోగి+ఈశ్వరుండు= ఈ యోగిశ్రేష్ఠుడైన సంవర్తుడు; మదీయ+అధ్వరంబునకున్= నా యాగానికి; యాజకుండు+అను పలుకు పలికి= ఉపద్రష్ట అనే మాట చెప్పి; సంవర్తున్+చూపెన్= సంవర్తుడిని చూపించాడు; నేను+అంతన్+నిలువక= నేను అంతటితో ఊరుకొనకుండా; పురుహూతునకున్= ఇంద్రుడికి; ప్రియంబు+ఒనరించినన్= సంతోషం కలిగిస్తే (ఆయనకు నచ్చినట్లు చేస్తే); నీకున్= నీకు; పుణ్యలోకంబులు= పుణ్యలోకాలు; సిద్ధించునట్లు చేసినన్= సిద్ధించేటట్లు చేస్తే; మేలు+అని= మంచిది కాదా! అని, తఱిమి చెప్పిననున్= వెంటపడి మరిమరీ చెప్పినా; ఆ+పుడమిఱేఁడు+ఒడంబడండు+అ= ఆ రాజు ఒప్పుకొనడాయె.'

**తాత్పర్యం:** ఈ యోగిశ్రేష్ఠుడైన సంవర్తుడే నా యాగానికి యాజకుడు అని చెప్తుతూ సంవర్తుడిని చూపాడు. నేను అంతటితో ఊరుకొనకుండా ఇంద్రుడికి వచ్చినట్లు నీవు చేస్తే నాకు ఆయన పుణ్యలోకాలు సిద్ధించేటట్లు చేయటం మంచిదే కదా! అని కూడా మరీమరీ చెప్పాను. అయినా ఆ రాజు ఒప్పుకొనడాయె.'

**చ. అన విని యింద్రుఁ డిట్లనియె నగ్నికి 'నిమ్మడివోయి చెప్పు మ**
**జ్జనపతితోడ నా పలుకు సమ్మతిఁ జేయక తక్కెనేని నేఁ**
**బనిచెద వజ్రమున్ జమునిపాలికి నన్నరనాథు వేగమే;**
**యనుచుట కంత యెల్లిదమె యాతనికిన్ మన యాజ్ఞ యారయన్?' 82**

**ప్రతిపదార్థం:** అనన్+విని= విని అగ్ని అనగా విన్నవాడై; ఇంద్రుఁడు= మహేంద్రుడు; అగ్నికిన్= అగ్నితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; ఇమ్మడి= ఇంకోసారి (రెండోసారి); పోయి= వెళ్ళి; ఆ+జనపతితోడన్= ఆ రాజుతో; చెప్పుము= ఇట్లా చెప్పుము; నా పలుకు= నా మాటను; సమ్మతిన్+చేయక= లెక్కించకుండా; తక్కెను+ఏనిన్= విడిచిపెట్టాడంటే; నేన్= నేను; వజ్రమున్= వజ్రాయుధాన్ని; ఆ నరనాథున్= ఆ రాజును; జమునిపాలికిన్= యముడి వద్దకు; అనుచుటకున్= పంపటానికి; పనిచెదన్= ప్రయోగిస్తాను; అరయన్= చూడగా; మన+ఆజ్ఞ= మా ఆజ్ఞ; ఆతనికిన్= అతడికి; ఇంత+ఎల్లిదమె?= ఇంత నిర్లక్ష్యమా?

**తాత్పర్యం:** అని అగ్ని అనగా ఇంద్రుడు అగ్నితో ఇట్లా అన్నాడు. 'అగ్నిదేవా! మరొకసారి వెళ్ళి ఆ రాజుతో చెప్పుము. నా మాటను లెక్కించకుండా అతిక్రమిస్తే వజ్రాయుధం ప్రయోగిస్తాను. మా ఆజ్ఞను పాలించటానికి అతడికి ఇంత నిర్లక్ష్యమా?'

**వ. అని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి. 83**

**ప్రతిపదార్థం:** అని పలుకుటయున్= అని చెప్పగా; పావకుండు= అగ్ని; పాకశాసనునిన్= ఇంద్రుడిని, ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని పలుకగా అగ్నిదేవుడు ఇంద్రుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'ఇంక వచ్చిన దారుణేక్షణదగ్ధుఁ గా । వింతుఁ జుమ్మీ! యని విపులకోప**
**మూర్తియై పలికె సంవర్తుండు గావున । వెఱతు నే నట వోవ; వేఱొకండు**
**పోవుఁ గా' కనవుడు దేవేంద్రుఁ 'డన్యుల । నీవు దహింతు గా కే విధమున**
**నొరులు నిన్ను దహింతురో! పేదమాట యి । ట్లాడుదే?' యనుటయు నగ్ని పలుకు**

**ఆ. మూఁడులోకములును వాఁడి మగంటిమి । నేలుచున్నవాని నెట్లు వృత్రుఁ**
**డాక్రమించె నిన్ను? నదియును గాక ప । ర్జన్య! మఱియు వినుము బ్రహ్మబలము. 84**

**ప్రతిపదార్థం:** ఇంక వచ్చినన్= ఇంక మరోసారి వచ్చావంటే; దారుణ+ఈక్షణ+దగ్ధున్+కావింతున్= భయంకరమైన చూపులతో కాల్చివేస్తాను; చుమ్మీ!= సుమా!; అని; విపులకోపమూర్తి+ఐ= మిక్కిలి కోపం కలిగినవాడై; సంవర్తుండు; పలికెన్= పలికాడు; కావునన్= కాబట్టి; అట+పోవన్= అక్కడికి పోవటానికి; నేన్+వెఱతున్= నేను భయపడతాను; వేఱు+ఒకండు= మరొకడెవడైనా; పోవున్+కాక= వెళ్ళుతాడులే; అనవుడున్= అని అనగా; దేవేంద్రుఁడు= ఇంద్రుడు; అన్యులన్= వేరే వాళ్ళను; నీవు దహింతు(వు)+కాక= నీవు కాలుస్తావు కాని; ఏ విధమునన్+ఒరులు= ఏ విధంగా ఇతరులు; నిన్నున్+దహింతురో= నిన్ను కాలుస్తారో; ఇట్లు= ఈ విధంగా; పేదమాట= (నిస్సహాయకమైన పలుకులు; ఓదార్పు) ఆడుదు (వు)+ఏ= పలుకుతావా?; అనుటయున్= అనగా; అగ్ని= అగ్నిదేవుడు; పలుకున్= ఇట్లా అన్నాడు; మూఁడులోకములును= మూడు లోకాలూ; వాఁడి+మగంటిమిన్= నిశిత పరాక్రమంతో; ఏలుచుచున్+ఉన్నవానిన్= పరిపాలిస్తున్నవాడిని; నిన్నున్= నిన్ను; వృత్రుఁడు= వృత్రాసురుడు; ఎట్లు+ఎట్లా; ఆక్రమించెన్?= ఆక్రమించాడు?; అదియునున్+కాక= అంతే కాకుండా; పర్జన్య!= ఇంద్రా!; మఱియున్= ఇంకా; బ్రహ్మబలమున్= యోగశక్తివలన పుట్టే బలాన్ని గురించి (చెప్పుతాను); వినుము.

**తాత్పర్యం:** 'మరొకసారి వచ్చానంటే నాకంటి చూపులతో నిన్ను కాల్చివేస్తాను' అని మిక్కిలికోపంతో సంవర్తుడు అన్నాడు. అందుచేత నాకు అక్కడికి పోవటానికి భయం. మరొకరిని ఎవరినైనా పంపించుము' అని అగ్నిదేవుడు అనగా ఇంద్రుడు ఇట్లా అన్నాడు. 'అదేమిటి. అంత నిస్సహాయంగా మాటాడుతున్నావు? నీవు ఇతరులను కాలుస్తావు తప్ప నిన్ను ఎవరైనా ఎట్లా కాలుస్తారయ్యా!' దానికి అగ్నిదేవుడు 'ముల్లోకాలను మహాపరాక్రమంతో పాలించే నిన్ను ఆనాడు వృత్రాసురుడు ఎట్లా ఆక్రమించాడో గుర్తు చేసికొనుము. అంతే కాదు ఓ ఇంద్రా! యోగశక్తి చాలా గొప్పది. ఎందుకో చెప్పుతాను వినుము.

**విశేషం:** 'బ్రహ్మ' శబ్దానికి 'సృష్టికర్త' అన్నది వాచ్యార్థం మాత్రమే. జ్ఞానమని, వేదమని, యోగమని సందర్భాన్నిబట్టి చాలా అర్థాలు ఉన్నాయి. తరువాతి కథలో ఈ అర్థవిశేషాన్ని చూడవచ్చును.

**సీ.** **సయ్యాతి క్రతువున నయ్యాశ్వినుల సోమ। పానంబు నీ కొడఁబాటు గాక**
**పాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు। వారికిఁగా సురవర్గసహిత**
**ముగ నిన్ను బాధితుండుగఁ జేసె నిజమంత్ర। బలమున; దాని కీ వలిగి వజ్ర**
**మేడ్తెఱఁ గొని యమ్మునీశ్వరు సాధింపఁ। గడఁగిన నగుచు బెట్టడఁచెఁ గాదె!**

**తే.** **యతఁడు పుడిసెఁడు నీరన యప్పు డతనిఁ। దెలచి సోమ మాశ్వినులకుఁ గలుగఁ జేసి**
**తరయ నెందును బ్రహ్మ బలాతిశయముఁ। గడచినట్టి బలంబులుఁ గలవె? యనఘ!** **85**

**ప్రతిపదార్థం:** సయ్యాతి= సయ్యాతి నిర్వహించిన; క్రతువునన్= యాగంలో; ఆ+ఆశ్వినుల= ఆ అశ్వినీ దేవతల; సోమపానంబు= సోమరసపానం; నీకున్+ఒడఁబాటు+కాక= నీకు అంగీకారం కాక, పాయంగన్+పెట్టినన్= వారిని దూరంగా ఉంచితే; వారికిన్+కాన్= వారి కొరకని; భార్గవచ్యవనుండు= భార్గవచ్యవన మహర్షి; సురవర్గ సహితముగన్= దేవతాసమూహంతో సహా; నిన్నున్+బాధితుండుగన్= నీవు బాధపడే విధంగా; నిజమంత్ర బలమునన్= తన మంత్ర శక్తితో; చేసెన్= చేశాడు; దానికిన్+ఈవు+అలిగి= దానికి నీవు కోపగించుకొని; వజ్రము= వజ్రాయుధాన్ని; ఏడ్తెఱన్+కొని= పరాక్రమంతో గ్రహించి; ఆ+ముని+ఈశ్వరున్+సాధింపన్+కడఁగినన్= ఆ మునీశ్వరుడిని సాధించాలని ప్రయత్నించగా; నగుచున్= నవ్వుతూ; బెట్టు+అడఁచెన్+కాదె!= నీ గర్వాన్ని మిక్కిలి అణచాడు కాదా!; అతఁడు= ఆ ఋషి; పుడిసెఁడు= పుడిసిలిలో పట్టేటటువంటి; నీరు+అనన్= నీరు అనగా (నీరు కావాలనగా); అప్పుడు= ఆ సమయాన; అతనిన్= ఆ ఋషిని; తెలచి= ప్రస్తుతించి ప్రసన్నుడిని చేసికొని; అశ్వినులకున్= అశ్వినీదేవతలకు; సోమము= సోమరసాన్ని; కలుగన్+చేసితి(వి)= ఇచ్చావు; అరయన్= బాగా ఆలోచించగా; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; బ్రహ్మబల+అతిశయమున్= బ్రహ్మ బలానికున్న గొప్పతనాన్ని; కడచినట్టి= మించినట్టి; బలంబులున్+కలవె?= ఇతర శక్తులు ఏవైనా ఉన్నాయా? (లేవని అర్థం).

**తాత్పర్యం:** ఒకప్పుడు సయ్యాతి క్రతువును జరుపుతుండగా ఆ అశ్వినీదేవతలు సోమపానంకొరకు రావటం నీకు ఇష్టం కాక, వారిని పంక్తిబాహ్యులుగా బయట ఉంచావు. అపుడు వారికొరకు భార్గవ చ్యవన మహర్షి దేవతలందరితో సహా నిన్ను తన మంత్రశక్తితో ముప్పుతిప్పలు పెట్టలేదా! అప్పుడు నీవు కోపగించుకొని పరాక్రమంతో వజ్రాయుధాన్ని గ్రహించి ఆ ఋషిమీద ప్రయోగించలేదా! అప్పుడు ఆయన నవ్వుతూ నీ గర్వాన్ని అణచలేదా! పురిసెడు నీళ్ళు ఆయన అడిగితే ఇవ్వగలిగావా? అప్పుడు నీవు సోమరసాన్ని అశ్వినీదేవతలకు కూడా పంచావు కదా! ఇదంతా చూస్తే - ఓ ఇంద్రా! మంత్రశక్తి కున్న గొప్పతనాన్ని మించిన ఇతరబలాలు ఏమున్నాయి?

**విశేషం:** చ్యవనమహర్షి శక్తి మంత్రశక్తి - తపస్సు, యాగం ద్వారా లభించిన జ్ఞానం దాని స్వరూపం. అదే బ్రహ్మస్వరూపమంటే.

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిః । బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్,**

**బ్రహ్మైవ తేన గన్తవ్యం । బ్రహ్మకర్మసమాధినా - (గీత)**

అనే గీతాకారుడి వాక్యాన్ని ఈ సందర్భంలో అనుసంధించుకొంటే ఇట్లా అర్థం చెప్పవచ్చును. బ్రహ్మకర్మ సమాధి రూపంగా జరిపేది యజ్ఞం. అది ఎవరికి అర్పించబడుతుందో, ఏది హవిస్సో, ఏది అగ్నో, ఏ వ్యక్తి హోమం చేస్తాడో, దానివలన లభించే పరమపదం ఏది ఉన్నదో అంతా 'బ్రహ్మమే'- కనుకనే 'బ్రహ్మ' మంటే కర్త, కారయిత, క్రియ, అన్నీ అవుతున్నాయి.

ఇంద్రుడు ఈ బ్రహ్మజ్ఞానం ఉన్నవాడు కాడు. యజ్ఞకర్మ ఫలంగా వచ్చిన తాత్కాలికమైన ఒక పుణ్యపదవికి మాత్రమే అర్హుడు. అందుకే ఈ కథ అంతా ప్రస్తావించబడినది. బృహస్పతి అంటే 'ధిషణ'కు కూడా బ్రహ్మజ్ఞానస్వరూపం అతీతమని చెప్పటమే ఈ కథ ప్రయోజనం.

ఇంద్రుడిదగ్గర 'వజ్రాయుధం' మాత్రమే ఉన్నది. అది వెన్నుపూసకు సంకేతం. యోగశక్తి ప్రసరించే 'కాలువ' అది, కాని యోగశక్తికి పర్యవసానస్థానం మాత్రం 'సహస్రారకమలమే'. అది లోకవాంఛలకు, ఆకర్షణలకు, ద్వంద్వభావనలకు, సంకల్ప రజస్తమోగుణాలకు అతీతమైన సత్త్వస్థితిని పొందినవాడికి మాత్రమే సాధనచేత పొందదగిన స్థానం. ఆ స్థితిలోనివాడు 'చ్యవనుడే' అందుకే 'వజ్రం' అతడిని ఏమీ చేయలేకపోయింది. సోమపానం చేయ నివ్వనని భీష్మించుకొన్న ఇంద్రుడు ఆ ఋషి ప్రసన్నుడు కావటంకొరకు 'నీరు' ఇవ్వలేకపోయాడు. తాను 'పర్జన్యుడు' - వర్షాధి దేవత అయినా 'వృత్రుడి' చేత ఆక్రమించబడినపుడు ఇంద్రుడికి 'వర్ష' శక్తి లేదు - ఆ శక్తిలేని తాను 'సోమ' పానార్హత ఉన్న అశ్వినీదేవతలకు పానయోగ్యత లేదని చెప్పటం అహంకారం తప్ప మరొకటి కాదు. అందుకే గర్వ మణగి చివరికి ఈ ఋషిపాదాలపై పడి క్షమించుమన్నాడు. ఆ దేవతలకు సోమ మిచ్చాడు. ఇది ఒక గొప్ప ప్రతీకాత్మక కథ.

తరువాతి కథలో ఇంద్ర, బృహస్పతులకు జ్ఞానం ఎట్లా రాబోతుందో సూచించే కథ ఇంతవరకు చెప్పబడింది. వర్షాధిదేవత ఇంద్రుడికే బలం లేకుండా చేసిన మంత్రశక్తి అగ్నిని దహించదా! అన్నది అగ్నిదేవుడి అంతర్యం.

సంవర్తుడికి యాజకార్హత లేదనటం కూడా ఆశ్వినులకు సోమపానార్హత లేదని చెప్పటంవంటిదే కదా! (ఇక తక్కిన కథ చదవండి).

**క. అనవుడు 'బ్రహ్మబలము గడు । ఘనమగు టెఱుఁగుదు; మరుత్తుఁ గాఱియఁ బెట్టం**
**జనదే నా?' కని శక్రుఁడు । పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్. 86**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; శక్రుఁడు= ఇంద్రుడు; బ్రహ్మబలము= బ్రహ్మబలం; కడు ఘనము+అగుట= మిక్కిలి గొప్పది కావటం; ఎఱుఁగుదున్= నాకు తెలుసును; (కాని) మరుత్తున్= మరుత్తుడిని; కాఱియన్+పెట్టన్= బాధపెట్టటానికి; నాకున్+చనదే?= నాకు దుస్సాధమా!; అని; గంధర్వలోకపతి= గంధర్వరాజు; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; పనిచెను= పంపాడు.

**తాత్పర్యం:** అని అగ్ని చెప్పగా ఇంద్రుడు 'బ్రహ్మబలం మిక్కిలి గొప్పదని నేను ఎరుగుదును. కాని ఆ మరుత్తుడిని బాధించటానికి నేను తగనా?' (ఎందుకు తగను?) అని గంధర్వరాజైనటువంటి ధృతరాష్ట్రుడిని పంపాడు.

**వ. పనుచునప్పు డతని కిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** పనుచు+అప్పుడు= పంపుతున్నప్పుడు; అతనికిన్; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** పంపేటప్పుడు ఆ ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **'నీవు వోయి మరుత్తుని నెమ్మిఁ గాంచి। గురుని నీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు;**
**నట్లు చేయక యున్న వృత్రారి క్రోధ। దీప్తుఁడై కులిశంబుఁ బుత్తెంచు ననుము. 88**

**పతిపదార్థం:** నీవు పోయి= నీవు వెళ్ళి; మరుత్తునిన్= మరుత్తుడిని; నెమ్మిన్= నెమ్మదిగా; కాంచి= చూచి; గురునిన్= బృహస్పతిని; నీకు యాజకుఁడుగన్= ఉపద్రష్టగా; కొనఁగన్+వలయున్= తీసికొనాలి; అట్లు చేయక+ఉన్నన్= అట్లా చేయకుంటే; వృత్ర+అరి= వృత్రాసురుడికి శత్రువైన ఇంద్రుడు; క్రోధ దీప్తుఁడు+ఐ= కోపంతో మండిపోయి; కులిశంబున్= వజ్రాయుధాన్ని; పుత్తెంచున్= ప్రయోగిస్తాడు; అనుము= అని చెప్పుము.

**తాత్పర్యం:** 'నీవు వెళ్ళి ఆ మరుత్తుడిని చూచి నెమ్మదిగా ఇట్లా అనుము. 'నీవు బృహస్పతిని ఉపద్రష్టగా తీసికొనటం అభిలషణీయం. అట్లా చేయకపోతే ఇంద్రుడికి కోపం వస్తుంది. మండిపోయి వజ్రాయుధాన్ని ప్రయోగిస్తాడు జాగ్రత్త!' అని చెప్పుము.

**వ.** **ఈ మాట సంవర్తుని సన్నిధిన యాడు 'మని పలికిన నా ధృతరాష్ట్రుం డియ్యకొని సంవర్త సహితుండై యున్న మరుత్తునిం గని తాను గంధర్వుండనియును ననిమిషపతి పంపున వచ్చితి ననియుం జెప్పి, యప్పుడమిఱేనితో మఱియు నిట్లనియె. 89**

**ప్రతిపదార్థం:** ఈ+ మాట= ఆ మాట; సంవర్తుని సన్నిధిన్+అ= సంవర్తుడు సన్నిధానంలో ఉన్నప్పుడే; ఆడుము= పలుకుము; అని; పలికినన్= ఇంద్రుడు చెప్పగా; ఆ ధృతరాష్ట్రుడు; ఇయ్యకొని= అంగీకరించి; సంవర్త సహితుండు+ఐ+ఉన్న= సంవర్తుడితో కూడి ఉన్న; మరుత్తున్+కని= మరుత్తుడిని చూచి; తాను; గంధర్వుండు+అనియును= గంధర్వుడనీ; అనిమిషపతి పంపునన్= ఇంద్రుడి ఆజ్ఞతో; వచ్చితిన్+అనియున్= వచ్చాననీ; చెప్పి; ఆ+పుడమిఱేనితోన్= ఆ రాజుతో; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ మాటలు సంవర్తుడు సమీపంలో ఉన్నప్పుడే పలుకుము' అని ఇంద్రుడు చెప్పగా అదే ప్రకారం చేస్తానని ఆ ధృతరాష్ట్రుడు అంగీకరించి, సంవర్తుడితో కూడి ఉన్న మరుత్తుడిని చూచి, తాను గంధర్వుడననీ, ఇంద్రుడి ఆజ్ఞమేరకు వచ్చాననీ చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**చ.** **'వినుము మదీయ బుద్ధి పృథివీవర! యాజకుఁ గాఁగ నీ మఖం**
**బునకు బృహస్పతిం గొనుము; పూర్వదిశాపతి కవ్విధంబు ప్రీ**
**తి నొసఁగు నట్లు సేయ కవధీరణచేసిత యేని వజ్రముం**
**బనుచు నతండు నీపయి; సభాసదులున్ వినఁ జాటి చెప్పితిన్.' 90**

**ప్రతిపదార్థం:** పృథివీవర!= ఓ రాజా! (భూపతీ!); మదీయబుద్ధిన్= నేను చెప్పే ఉపదేశాన్ని; వినుము; నీ మఖంబునకున్= నీ యాగానికి; యాజకున్+కాఁగన్= యాజకుడుగా; బృహస్పతిన్+కొనుము= బృహస్పతిని గ్రహించుము; ఆ+విధంబు= అట్లా చేయటం; పూర్వదిశాపతికిన్= ఇంద్రుడికి (తూర్పుదిశకు అధిపతి); ప్రీతిన్+ఒసఁగున్= ప్రియం కలిగిస్తుంది; అట్లు+చేయక= అట్లా చేయకుండా; అవధీరణ= నిర్లక్ష్యం; చేసితివి+ఏని= చేశావో; అతండు= ఆ ఇంద్రుడు; నీపయిన్= నీమీద; వజ్రమున్= వజ్రాయుధాన్ని; పనుచున్= ప్రయోగిస్తాడు; సభాసదులున్= నీ సభలోని వారందరూ; వినన్= వినేటట్లుగా; చాటి చెప్పితిన్= స్పష్టంగా చెప్పాను.

**తాత్పర్యం:** 'ఓ రాజా! నా మాటను వినుము. నీ యాగానికి ఉపద్రష్టగా బృహస్పతిని గ్రహించుము. అట్లా చేయటం ఇంద్రుడికి ప్రీతిని కలిగిస్తుంది. అట్లా చేయకుండా నిర్లక్ష్యం చేశావో ఇంద్రుడు నీ మీదకు వజ్రాయుధాన్ని పంపుతాడు. ఈ సభలోని వారందరూ వినేటట్లు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాను.'

**విశేషం:** ధృతరాష్ట్రుడు 'ఈ సభలోనివారు' అంటున్నా ఉద్దేశించినది మాత్రం సంవర్తుడిని మాత్రమే. అతడు వినేటట్లు చెప్పుమని కదా ఇంద్రుడి ఆజ్ఞ!

**వ.** **అనిన మరుత్తుఁ 'డయ్యమరగురుండ నా। యాగంబు నడపుట కాత్మ రోసి**
**రాకున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి;। నింక నట్టులు సేయ కెట్లు వచ్చు**
**ననఘ! మిత్రద్రోహ మధిక పాపముగాదె?। యిది నీ వెఱుంగు దయ్యింద్రుఁ డెఱుఁగు**
**సిద్ధసాధ్యాది ప్రసిద్ధులు నెఱుఁగుదు। రిమ్మాట గురునకు నియ్యకోల'**

**తే.** **యనుడు గంధర్వుఁ 'డదె విన నయ్యె వజ్రఘోరనాదంబు నీ కోర్వఁ గలది యగునొ**
**కాదొ నీవ యెఱుంగుదు మేదినీశ!। యనుటయును నృపుఁ డాలించి విని భయమున.** **91**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా; మరుత్తుడు; ఆ+అమర గురుండు= ఆ బృహస్పతి (దేవతల గురువు); నా యాగంబున్= నా యాగాన్ని; నడపుటకున్= నడిపించటానికి; ఆత్మన్+రోసి= మనసులో ఇష్టపడక; రాక+ఉన్నన్= రాకపోతే; సంవర్తున్= ఈ సంవర్త మహర్షిని; ప్రార్థించి తెచ్చితిన్= ప్రార్థించి తెచ్చాను; ఇంకన్= ఇక; అట్టులు+చేయక= అట్లా చేయకుండా; ఎట్లువచ్చున్?= ఎట్లా అవుతుంది?; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; మిత్రద్రోహము= మిత్రుడికి ద్రోహంచేయటం; అధికపాపము+కాదె?= మిక్కిలి పాపం కాదా?; ఇది= ఈ విషయం; నీవు+ఎఱుంగుదు(వు)= నీకు తెలియును; ఆ+ఇంద్రుఁడు+ఎఱుఁగున్= ఆ ఇంద్రుడికీ తెలియును; సిద్ధ సాధ్యాది= సిద్ధులు, సాధ్యులు మొదలైన; ప్రసిద్ధులు= ప్రసిద్ధ దేవతా గణాలవారూ; ఎఱుఁగుదురు; ఈ+మాట= ఇట్లా స్నేహభావాన్ని కాపాడటం అనే మాట; గురునకున్= ఆ బృహస్పతికీ; ఇయ్యకోలు+అ= సమ్మతమే; అనుడున్= అనగా; గంధర్వుఁడు= ఆ గంధర్వుడు; మేదినీ+ఈశ= ఓ భూపతీ!; అదె= అదిగో; వజ్రఘోరనాదంబు= వజ్రాయుధపు భీకర శబ్దం; వినన్+అయ్యెన్= వినవస్తోంది; నీకున్+ఓర్వన్+ కలది+అగునొ+కాదొ= నీకు దానిని తట్టుకొనగలశక్తి ఉన్నదో లేదో; నీవు+అ= నీవే; ఎఱుంగుదు(వు)= ఎరుగుదువు (తట్టుకొనలేవని సూచన); అనుటయును= అని అనగా; నృపుఁడు= ఆ రాజు; ఆలించి= ఆ శబ్దం విని; భయమునన్= భయంతో.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు చెప్పగా మరుత్తుడన్నాడు; 'ఆ దేవగురువైన బృహస్పతి నా యాగాన్ని నడిపించటానికి మనసులో ఇష్టపడక రాకపోతే ఈ సంవర్తమహర్షిని ప్రార్థించి తెచ్చాను. ఇక 'అట్లా కాకుండా ఏమి చేయను? ఓ పుణ్యాత్ముడా! స్నేహితుడిని మోసగించటం మిక్కిలి పాపం కదా! ఇది నీకు, ఆ ఇంద్రుడికి, సిద్ధసాధ్యాది పురుషులందరికీ తెలిసిన విషయమే. ఇట్లా చేయటం బృహస్పతికీ సమ్మతమే - ఎందుకంటే ధర్మబద్ధం కాబట్టి' అంటూండగానే ఆ గంధర్వుడు 'ఓ రాజా! అదిగో! వజ్రాయుధం ఈ దిశగా వస్తున్న భీకరశబ్దం వినిపిస్తోంది. తట్టుకొనగల శక్తి ఉన్నదో లేదో నీకు తెలియును కదా!' అనగా ఆ శబ్దం విని మరుత్తుడు, భయంతో- (తరువాతి వచనంతో అన్వయం)

**వ.** **సంవర్తు నాలోకించి.** **92**

**తాత్పర్యం :** సంవర్తుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'కులిశము వచ్చుచు నున్నది। యలు కొందెడు నా మనంబు ననఘచరిత! స**
**భ్యులు సంత్రాసము నొందిరి। తలకొని రక్షింపవలయు దయ మమ్మెల్లన్.' 93**

**ప్రతిపదార్థం:** అనఘచరిత!= పుణ్యచరిత్రుడా!; కులిశము= వజ్రం; వచ్చుచున్+ఉన్నది= వస్తోంది; నా మనంబు+అలుకు+ఒందెడున్= నా మనసు భయపడుతున్నది; సభ్యులున్= ఈ యాగసభలోని వారందరూ; సంత్రాసమున్= భీతిని; ఒందిరి= పొందారు; తలకొని= పూనుకొని; దయన్= కరుణతో; మమ్మున్+ఎల్లన్= మమ్ములను అందరినీ; రక్షింపవలయున్= కాపాడాలి.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యచరిత్రుడా! వజ్రాయుధం వచ్చేస్తున్నది. నా మనసు భయపడుతున్నది. సభ్యులు కూడా భీతిపొందారు. మీరు దయ ఉంచి, పూనికతో ఈ ఆయుధాన్ని ఎదిరించి మమ్ములను కాపాడాలి.'

**వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు. 94**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; ఆ+మహాయోగి+ఈశ్వరుండు= ఆ గొప్ప మునిశ్రేష్ఠుడు.

**తాత్పర్యం:** అని మరుత్తుడు అడుగగా ఆ మహాయోగిపుంగవుడైన సంవర్తుడు. (తరువాతి వచనంతో అన్వయం)

**సీ. 'ఇంద్రునిదెస భయం బించుకేనియు వల;। దతఁడు నన్నెఱుఁగఁడే యధిప! వినుము**
**సంస్తంభవిద్యా ప్రశస్తవైభవమున। వజ్రంబు నడఁతు నవ్వాసవాది**
**దైవతంబుల యాయుధంబులు నాచేతఁ। బ్రతిహతం బొందు; దుష్ప వనచండ**
**వృష్టిప్రముఖమహా వికృతుల బాధింతు'। ననుడు 'మ్రోయుచు నిదె యరుగుదెంచె**

**ఆ. భిదుర మెవ్విధమున భీతి దొఱంగుదు?'। ననియె నృపతి; యాతఁ డల్ల నగుచు**
**దాని సరుకుగొనకు 'తగు వర; మడుగు నా। తపము పేర్మి నిత్తు ధరణినాథ!' 95**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఇంద్రుని దెసన్= ఇంద్రుడి వలన; భయంబు= భయం; ఇంచుక+ఏనియున్= ఇంచుకైనా; వలదు= వద్దు; అతఁడు= ఆ ఇంద్రుడు; నన్నున్+ఎఱుఁగడే?= నన్ను ఎరుగడా?; వినుము; సంస్తంభ విద్యా ప్రశస్త వైభవమునన్= సంస్తంభ విద్యయొక్క మిక్కిలి గొప్ప శక్తితో; వజ్రంబున్= వజ్రాయుధాన్ని; అడఁతున్= అణచి వేస్తాను; ఆ+వాసవ+ఆది= ఆ ఇంద్రాదులైన; దైవతంబుల= దేవతల; ఆయుధంబులు= ఆయుధాలు; నాచేతన్= నా చేత; ప్రతిహతంబు+ఒందున్= దెబ్బతింటాయి; దుష్పవన= భయంకరమైన సుడిగాలి; చండవృష్టి= ప్రచండమైన వర్షం; ప్రముఖ= మొదలైన; మహావికృతులన్= గొప్ప ప్రకృతి బీభత్సాలతో; బాధింతున్= వారిని హింసిస్తాను; అనుడున్= అన్న వెంటనే; నృపతి= ఆ రాజు; భిదురము= వజ్రాయుధం; మ్రోయుచున్= భీకరంగా మోతపెడుతూ; ఇదె= ఇదిగో - ఈవైపే; అరుగుదెంచెన్= వచ్చింది; ఏ+విధంబునన్= ఎట్లా; భీతిన్+తొఱంగుదున్?= భయం పోగొట్టుకోను?; అనియెన్= అన్నాడు; అతఁడు= ఆ సంవర్తుడు; అల్ల నగుచున్= చిరునవ్వు నవ్వి; ధరణినాథ!= ఓ రాజా!; దానిన్= ఆ ఆయుధాన్ని; సరకు+కొనకు(ము)= లెక్క చేయకుము; తగు వరము= నీకు యోగ్యమైన వరాన్ని; అడుగుము; నా తపము పేర్మిన్= నా తపోబలంతో; ఇత్తున్= ఇస్తాను(అన్నాడు).

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఇంద్రుడి విషయంగా భయం కొంచెం కూడా వద్దు. అతడికి నా గురించి తెలియదా! వినుము. సంస్తంభవిద్యకున్న గొప్పశక్తితో ఆ వజ్రాన్ని అణచివేస్తాను. ఆ ఇంద్రాది దేవతల ఆయుధాలు నా ముందర పనిచేయవు.

సుడిగాలులతో భయంకరమైన వర్షాలతో దేవతాసమూహాన్ని ముప్పతిప్పలు పెట్టుతాను' అంటుండగానే ఆ రాజు'అయ్యా! ఇదిగో వజ్రాయుధం పెనుమోతతో ఇటు వైపే వస్తున్నది. నాకు భయం కలుగకుండా ఎట్లా ఉంటుంది?' అన్నాడు. అప్పుడు ఆ సంవర్తుడు చిరునవ్వు నవ్వి 'ఓ రాజా! ఆ ఆయుధాన్ని ఒక సరకుగొనకుము. నీకు ఏమి వరం కావాలో అడుగుము. నా తపశ్శక్తితో ఇస్తాను' అన్నాడు.

**విశేషం:** 'స్తంభనం' అంటే స్తంభింపచేయటం, అంటే కదలకుండా చేయటం. అగ్ని, వాయు, జల స్తంభనాది అనేక విద్యలు చెప్పబడ్డాయి. 'వజ్రం' ప్రయోగించటాన్ని మరుత్తుడు చూచాడు. సంవర్తుడు మంత్రం ప్రయోగించాడు. ఇక వజ్రం స్తంభించిపోయింది. అందుకే దాని వర్ణన లేదు. 'వరం ఏం కావాలో కోరుకొమ్ము' అని అంటున్నాడు. మంత్రశక్తి ఎంత అమోఘమైనదో వర్ణించే పద్ధతి ఇదే.

**చ. అనిన మరుత్తుఁ డిట్లనియె నాతనితో 'భయమెల్లఁ బాసె నే**
**నిను వరమర్థి వేఁడెద మనీష విరోధము దక్కి యధ్వరం**
**బున కిట వచ్చి దైవతవిభుండు నిజోచిత హవ్యభాగముం**
**గొనియెడు నట్లు గాఁగ మునికుంజర! చిత్తమునం దలంపవే. 96**

**ప్రతిపదార్థం:** అనినన్= అట్లా సంవర్తుడు అనగా; మరుత్తుఁడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అతనితోన్= ఆ ఇంద్రుడివలన; భయము+ఎల్లన్= భయమంతా; పాసెన్= పోయింది; మునికుంజర!= ఓ మునిశ్రేష్ఠుడా!; ఏన్= నేను; నినున్= నిన్ను; వరము+అర్థిన్+వేఁడెదన్= ఆసక్తితో వరం అడుగుతున్నాను; దైవతవిభుండు= దేవరాజు (ఇంద్రుడు); మనీషన్= వివేకంతో; విరోధము+తక్కి= విరోధం విడిచి; అధ్వరంబునకున్+ఇట+వచ్చి= మన ఈ యాగానికి వచ్చి; నిజ+ఉచిత= తనకు తగిన; హవ్యభాగమున్= హవ్యభాగాన్ని; కొనియెడున్+అట్లు+కాఁగన్= తీసికొనేటట్లు; చిత్తమునన్= నీ మనసులో; తలంపవే= సంకల్పించుము.

**తాత్పర్యం:** అపుడు మరుత్తుడు ఇట్లా అన్నాడు. 'మునిశ్రేష్ఠుడా! ఆ ఇంద్రుడి భయం ఇక నాకు లేదు. భక్తి తాత్పర్యాలతో ఒక వరం అడుగుతాను. ఇంద్రుడు తన ధిషణతో ఆలోచించి, ఇకనైనా మనపైన విరోధం చాలించి ఈ యజ్ఞానికి ఇక్కడికి వచ్చి, తనకు రావలసిన హవ్యభాగాన్ని తీసికొనిపోయేవిధంగా మీరు మనస్సులో సంకల్పం చేసికొనండి.

**విశేషం:** సంవర్తమహర్షి సంకల్పబలం ఎంత ప్రబలమైనదో మరుత్తుడి అనుభవానికి వచ్చింది. అందుకే ఒకసారి సంకల్పించుకొంటే ఇంద్రుడు అనివార్యంగా వస్తాడని తెలుసు. అందుకే ఈ కోరిక. యజ్ఞం చేస్తున్నది దేవతలు సంప్రీతులు కావటానికే. వారితో విరోధం పాటించటం తనకూ అభిమతం కాదు. అందుకే మరుత్తుడు ఇంద్రుడు విరోధం మానివేస్తే చాలని అభిలషిస్తున్నాడు. అంటే ధర్మరాజుకు యజ్ఞం ఎట్లాంటి నిష్కామబుద్ధితో చేయాలో వ్యాసమహర్షి మరుత్తుడి ఈ కథ ద్వారా సూచిస్తున్నాడని అర్థం చేసికొనవచ్చును. ఆ మరుత్తుడి ధనమూ పవిత్రమే, సంకల్పమూ పవిత్రమే, అందుకే అది బ్రహ్మార్పణబుద్ధితో చేయబడినందున సఫలమైనదని తాత్పర్యం.

**క. తమ భాగంబులు దక్కిన। యమరులునుం బ్రీతిఁ గొనఁగ యాగంబు ప్రయో**
**గము సుప్రణీతమయి లో। కమనోజ్ఞము గాఁగవలయుఁ గారుణ్యనిధీ!' 97**

**ప్రతిపదార్థం:** కారుణ్యనిధీ!= కరుణకు నిధి అయిన ఓ సంవర్తమునీ! తమ భాగంబులు= తమ తమ హవిర్భాగాలను; తక్కిన అమరులునున్= తక్కిన దేవతలు కూడా; ప్రీతిన్+కొనఁగన్= ప్రీతితో తీసికొనగా; యాగంబు ప్రయోగము= యజ్ఞకార్యనిర్వహణ; సుప్రణీతమయి= చక్కగా చేయబడినదై; లోక మనోజ్ఞము+కాఁగన్+వలయున్= అతిలోకమనోహరం కావాలి.

**తాత్పర్యం:** కరుణాసాగరుడవైన ఓ మునీశ్వరా! తమతమ హవిర్భాగాలను తక్కిన దేవతలు కూడా ప్రీతితో తీసికొనాలి. అప్పుడు మన యజ్ఞప్రయోగం చక్కగా చేయబడిన దౌతుంది. ప్రపంచంలోనే అత్యంతమనోహరంగా నిర్వహించబడిన యాగమై శాశ్వతకీర్తిని పొందుతుంది. ఇది నా కోరిక.'

**క. అనుటయును 'మదాహ్వానం। బున నింద్రుఁడు సోమపానమున కేతెంచుం**
**జనుదెంతు రతనితోఁ ద। క్కిన యమరులుఁ దొడఁగు యజ్ఞకృతికి నరేంద్రా!' 98**

**ప్రతిపదార్థం:** అనుటయునున్= అని సంవర్తుడితో మరుత్తుడనగా; అపుడు సంవర్తుడు; నర+ఇంద్ర= ఓ రాజా!; మత్+ ఆహ్వానంబునన్= నా ఆహ్వానంతో; ఇంద్రుఁడు= మహేంద్రుడు; సోమపానమునకున్= సోమపానానికి; ఏతెంచున్= తప్పక వస్తాడు; అతనితోన్+తక్కిన+అమరులున్= అతడి వెంట తక్కిన దేవతలు కూడా; చనుదెంతురు= వస్తారు; యజ్ఞకృతికిన్+తొడఁగు(ము)= యజ్ఞకార్యాన్ని మొదలుపెట్టుము.

**తాత్పర్యం:** అని మరుత్తుడు అంటే సంవర్తుడు ఇట్లా అన్నాడు. 'ఓ రాజా! నా ఆహ్వానంతో ఇంద్రుడు తప్పక సోమరసాన్ని త్రాగటానికి వస్తాడు. అతడివెంట తక్కిన దేవతలూ వస్తారు. ఇక యజ్ఞాన్ని మొదలుపెట్టుము.'

**విశేషం:** సోమరసం= 'సోమలత' అని ఒక తీగ ఉన్నది. ఆ తీగను యజ్ఞంలో మంత్రోక్తంగా పిండి రసం తీస్తారు. ఆ రసాన్ని ఋత్విక్కులు, హవిర్భాగం తీసికొనటానికి వచ్చిన దేవతలు కలిసి తాగుతారు. దీనిని సోమపానం అంటారు. అందుకే యాగం చేసినవాడిని సోమయాజి అని, సోమపీథి అని (సోమరసం త్రాగినవాడని) పిలుస్తారు. అది సభాగౌరవానికి సంబంధించిన విషయం.

**(మరుత్తుని యజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట (సం. 14-10-19))**

**వ. అని పలికి దవ్వులన యవ్వజ్రంబు వారించి గంధర్వునకు వీడుకోలు సేయించి యయ్యోగీంద్రుండు దేవేంద్రుని దేవతలనుం బిలిచె; నమ్మహాత్ముని మహనీయమంత్రశక్తి నాహూతులైన యప్పురుహూతప్రభృతి బృందారకులు ప్రియంబున నరుగుదేర నమ్మునిపతి యనుజ్ఞ నజ్జనపతి వారల నెదుర్కొను తెఱంగు నడపి తానునుగూడ నడచి వారికి నర్ఘ్యపాద్యాదిపూజనంబులు విధివిహిత ప్రకారంబునం జెల్లించె; నమ్మరుత్తుండును మరుత్పతికిం బ్రణమిల్లి 'దేవా! నీవు విజయంచేసి నా జన్నంబు సఫలంబు సేసితి; కృతార్థుండనైతిం గృపాధామ! నా మీఁది యలుక మాని నన్నుం జల్లనిచూడ్కిం జూడు 'మని ప్రార్థించి సంవర్తుం జూపి 'యిత్తాపసపతి బృహస్పతి స్వరూపంబ కావునం గ్రతుయాజకుండుగాఁ బ్రతిగ్రహించితి నని విన్నవించుటయు ననిమిషనాథుండు 'నీ వలనం బ్రీతిం బొందితి; నీతం డయ్యమరగురు ననుజుం డతని యట్లగుటకు సందియంబేమి?' యనుచు వికచవదనుండై కనుంగొనిన నమ్మునివరుం డా దివిజవరున కిట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; దవ్వులన్+అ= దూరంగానే; ఆ+వజ్రంబున్= ఆ వజ్రాయుధాన్ని; వారించి= ఆపివేసి; గంధర్వునకున్= ఆ గంధర్వుడైన ధృతరాష్ట్రుడికి; వీడుకోలు+చేయించి= వీడ్కోలు జరిపించి; ఆ+యోగి+ఇంద్రుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; దేవేంద్రునిన్= దేవేంద్రుడిని; దేవతలనున్= దేవతలను; పిలిచెన్= పిలిచాడు; ఆ+మహాత్ముని= ఆ మహనీయుడి; మహనీయ= గొప్ప; మంత్రశక్తిన్= మంత్రబలంతో; ఆహూతులు+ఐన= పిలువబడిన; ఆ+పురుహూత+ప్రభృతి= ఆ ఇంద్రుడు మొదలైన; బృందారకులు= దేవతలు; ప్రియంబునన్= ప్రేమతో; అరుగుదేరన్= రాగా; ఆ+మునిపతి= ఆ ఋషిశ్రేష్ఠుడి; అనుజ్ఞన్= ఆజ్ఞతో;

ఆ+జనపతి= ఆ రాజశ్రేష్ఠుడు; వారలన్= వారిని; ఎదుర్కొను+తెఱంగు+నడపి= ఆహ్వానించే పద్ధతిని నడపి; తానును కూడన్= తాను కూడా; నడచి= నడచివెళ్ళి; వారికిన్= వారికందరికీ; అర్ఘ్యపాద్య+అది= అర్ఘ్యం, పాద్యం మొదలైన; పూజనంబులు= అతిథి మర్యాదలు; విధి విహిత ప్రకారంబునన్= శాస్త్రం విధించిన ప్రకారంగా; చెల్లించెన్= చేశాడు; ఆ+మరుత్తుండునున్= ఆ మరుత్తుడు కూడా; మరుత్+పతికిన్= మరుత్తుల అధిపతి అయిన ఇంద్రుడికి; ప్రణమిల్లి= నమస్కరించి; దేవా!= ఓ స్వామీ!; నీవు; విజయం+చేసి= ఇక్కడికి దయతో వచ్చి; నా జన్నంబు= నా యాగాన్ని; సఫలంబు+చేసితి(వి)= చేశావు; కృత+అర్థుండను+ఐతిన్= నా కోరిక సఫలం అయినది; కృపాధామ!= దయానిలయా; నామీఁది+అలుక+మాని= నా మీద కోపం విడిచి; నన్నున్= నన్ను; చల్లని చూడ్కిన్+ చూడుము+అని= చల్లని చూపులతో చూడుము అని; ప్రార్థించి= ప్రార్థించినవాడై; సంవర్తున్+చూపి= సంవర్త మునీశ్వరుడిని ఇంద్రుడికి చూపించి; ఈ+తాపసపతి= ఈ ఋషీంద్రుడు; బృహస్పతి స్వరూపంబు+అ+కావున= బృహస్పతి స్వరూపమే కాబట్టి; క్రతుయాజకుండు+కాన్+ప్రతిగ్రహించితిన్+అని= ఉపద్రష్టగా తీసికొన్నానని; విన్నవించుటయున్= విన్నవించగా; అనిమిషనాథుండు= దేవతాపతి అయిన ఇంద్రుడు; నీవలనన్+ప్రీతిన్+పొందితిన్= నీ విషయంలో సంతోషం పొందాను; ఈతండు= ఈ సంవర్తుడు; ఆ+అమరగురు+అనుజుండు= ఆ బృహస్పతి తమ్ముడు; అతని+అట్లు+అగుటకున్= అతడివంటివాడే కావటానికి; సందియంబు+ ఏమి?= సందేహం ఏమిటి?; అనుచున్= అంటూ; వికచవదనుండు+ఐ= వికసించిన ముఖం కలవాడై; కనుంగొనినన్= చూడగా; ఆ+మునివరుండు= ఆ సంవర్తుడు; ఆ దివిజవరునకున్= ఆ దేవతాశ్రేష్ఠుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, సంవర్తుడు ఆ వజ్రాయుధాన్ని అల్లంత దూరంలోనే ఆపివేసి (మరలిపోయేటట్లు చేశాడని అర్థం), గంధర్వరాజుకు వీడ్కోలు జరిపించి, మనసులో ఇంద్రుడిని, సకలదేవతలను పిలిచాడు. ఆ మహనీయుడి మహామంత్రప్రభావంతో పిలువబడిన ఇంద్రాది దేవతలు మరుక్షణంలో అక్కడ ప్రత్యక్షమయ్యారు. ఆ మహర్షి అనుజ్ఞతో ఆ రాజు వారిని ఆహ్వానించి పూజించాడు. సంవర్తుడు కూడా వారిని అర్ఘ్యపాద్యాదులైన అతిథి మర్యాదలతో సత్కరించాడు. మరుత్తుడు ఇంద్రుడికి నమస్కరించి 'ఓ దేవా! నీవు విచ్చేసి నా యజ్ఞం సఫలం అయ్యేటట్లు చేశావు. నేను ధన్యుడను. దయానిధీ! నామీద కోపం మాని, నన్ను చల్లని చూపులతో చూడుము' అని ప్రార్థించినవాడై సంవర్తమునిని ఇంద్రుడికి చూపాడు. 'ఈ ఋషీంద్రుడు బృహస్పతివారి అపరస్వరూపమే. అందుకే వీరిని ఉపద్రష్టగా ప్రార్థించి పిలుచుకొనివచ్చాను' అని కూడా విన్నవించాడు. అప్పుడు ఇంద్రుడు 'రాజా! ఇప్పుడు నేను చాలా సంతోషం పొందాను. ఈ సంవర్తుడు బృహస్పతి తమ్ముడే కాబట్టి వారివంటివారే అనటంలో సందేహం ఏమిటి?' అంటూ విప్పారిన ముఖంతో వారిని వీక్షించగా ఆ సంవర్తుడు ఇంద్రుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సంవర్తుడు బృహస్పతి అపర స్వరూపమే అని ఇప్పుడు అంగీకరిస్తున్న ఇంద్రుడికి ఈ జ్ఞానం అప్పుడే ఉంటే ఇంత కథకు అవకాశమే లేదు. యోగశక్తి 'సంకల్పసృష్టి' చేయటానికి సమర్థం అవటానికి నిదర్శనమే ఇంద్రాదుల రాక. బ్రహ్మబలం గొప్ప దనటమే ఇంద్రుడు సంవర్తుడిని మరుత్తుడిని ప్రశంసించటం.

ఆ. **'అఖిలలోకభర్త వమరేంద్ర! నీ విట్టు। లాదరమున వచ్చు టరయ నా త**
**పంబు ఫలముగాదె! పావనమూర్తి యీ। రాజు క్రతువుఁ బుణ్యరాశి యయ్యె. 100**

**ప్రతిపదార్థం:** అమరేంద్ర! దేవతలలో (మరణం లేనివారిలో) శ్రేష్ఠుడవైన ఓ ఇంద్రా!; అఖిల లోక భర్తవు= నిఖిల లోకాలకూ పాలకుడవు; నీవు+ఇట్టులు+ఆదరమునన్= నీవు ఇట్లా ఆదరంతో; వచ్చుట= రావటం; అరయన్= ఆలోచిస్తే; నా తపంబు+ఫలము+కాదె= నాతపఃఫలంకాదా!; పావనమూర్తి+ఈరాజు+క్రతువు= పవిత్రుడైన ఈ రాజుయాగం; పుణ్యరాశి+అయ్యెన్= పున్నెపు ప్రోవు అయినది.

**తాత్పర్యం:** 'మహేంద్రా! మీరు నిఖిలలోకాలకు పాలకులు. అటువంటి మీరు ఆదరంతో ఇక్కడికి రావటం చూస్తే నా తపస్సు ఫలించిం దన్న సంతోషం కలుగుతున్నది. పవిత్రుడైన ఈ రాజు యాగం మీ రాకతో సఫలం అయింది. పుణ్యప్రదం అయింది.

**చ. సకలవిధానదక్షుఁడవు సర్వము నారసి చేయఁ బంపు నీ**
**సకృపవిలోకనంబులను సార్థములై క్రతుమంత్రతంత్రముల్**
**వికలత లేక చెల్లు జనవిశ్రుతుఁ డీ నృపుఁడున్ భవద్దయన్**
**సుకృతులలోనఁ బెంపు గని చూడఁ గనుం దగఁ బుణ్యలోకముల్.' 101**

**ప్రతిపదార్థం:** సకల విధాన దక్షుఁడవు= సకల ధర్మాలూ తెలిసి రక్షించే వాడవు; సర్వమున్= అన్నిటినీ; అరసి= చూచి; చేయన్+పంపు= చేయటానికి సమర్థంగా ఆజ్ఞాపించే; నీ; కృపతో కూడిన; విలోకనంబులను= చూపులతో; క్రతుమంత్రతంత్రముల్= యజ్ఞసంబంధమైన మంత్రాలు తంత్రాలు; స+అర్థములు+ఐ= అర్థవంతాలై; వికలత లేక= ఏ లోపమూ లేకుండా చెల్లున్= ప్రయోగం పొందుతాయి; జనవిశ్రుతుఁడు= లోకంలో ప్రసిద్ధుడైన; ఈనృపుఁడున్= ఈరాజుకూడా; భవత్+దయన్= మీ దయతో; సుకృతులలోనన్= పుణ్యాత్ములలో; పెంపు+కని= అతిశయించి; తగన్= తగినట్టుగా; పుణ్యలోకముల్= పుణ్యలోకాలు; చూడన్+కనున్= చూడగలుగుతాడు.

**తాత్పర్యం:** అంతేకాదు; నీవు సకలధర్మాలు తెలిసి సంరక్షించేవాడవు. కృపతో కూడిన నీ చూపులు అన్ని దిక్కులా ప్రసరిస్తూ తంత్రనిర్వహణసమర్థాలై వేదమంత్రాలను సార్థకాలుగా, ఏ లోపాలూ లేనివిగా చేస్తాయి. లోకంలో ప్రసిద్ధుడైన ఈ రాజు కూడా మీ దయతో పుణ్యాత్ములలో ఒకడై అతిశయించాడు. పుణ్యలోకాలను పొందే భాగ్యాన్ని కలిగినవా డయ్యాడు.'

**విశేషం:** 'సమేంద్రో మేధయాశ్శృణోతు' అని తైత్తిరీయం చెప్తుతున్నది. ఇంద్రుడు మేధను స్ఫురింపజేస్తాడు. దీనివలననే ఉచ్చారణ జరిగేది. మంత్రాలతో ముడిపడింది తంత్రం. యజ్ఞనిర్వహణకు మూలం ఈ మంత్ర స్ఫురణ, ఇది సహస్రముఖమైన జాగరూకతగా ఉంటుంది. అందుకే ఇంద్రుడికి 'సహస్రాక్షు'డని వైదికమైన ప్రసిద్ధి ఉన్నది. తరువాతి పురాణాలలో ఈ వైదికార్థం పోయి అహల్యాజారుడు కావటంవలన 'సహస్రభగు' డయ్యాడని కథలు చెప్పబడ్డాయి. ఈ మౌలికమైన వైదికార్థం ఈ పద్యంలో అత్యద్భుతంగా సూచించబడింది.

**వ. అని యిట్లు నిభృతుండై యభివర్ణపూర్వకంబుగా సంభాషణం బాచరించిన. 102**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= అని ఈ విధంగా; నిభృతుండు+ఐ= వినయంతో; అభివర్ణన పూర్వకంబుగాన్= ప్రశంసాపూర్వకంగా; సంభాషణంబు+ఆచరించినన్= మాటాడగా.

**తాత్పర్యం:** ఈ విధంగా సంవర్తుడు వినయంతో ప్రశంసాపూర్వకంగా మాటాడాడు. (ఆ తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. భూరి హర్షంబునఁ బొంది పురందరుం। డమృతాశనులఁ గలయంగఁ జూచి**
**'యజ్ఞవాటం బుదాత్తాభిరామంబుగఁ। జేయింపుఁ, డప్సరః స్త్రీ జనంబు**
**నాట గంధర్వుల పాట జెల్లింపుఁడు। నావుడు వా రట్ల నడపి, మఱియు**
**సకలకర్మములకు సాహాయ్య మాచరిం। పంగ వేఱొక యగ్ని భంగి వెలఁగి**

**తే. లలితసముచితపీఠ మలంకరించి। వేడ్క సంవర్తముని హవిర్విధి యొనర్ప**
**యాగముజ్జ్వలమును సుప్రయోగకంబు। నగుచు నొప్పారె భరతకులాగ్రగణ్య! 103**

**ప్రతిపదార్థం:** భరత కుల+అగ్రగణ్య!= భరతవంశ శ్రేష్ఠుడా! (వినుము); పురందరుండు= ఇంద్రుడు; భూరి హర్షంబునన్+పొంది= మిక్కుటమైన సంతోషం పొంది; అమృత+అశనులన్+కలయంగన్+చూచి= దేవతలను బాగా పరికించి చూచి; యజ్ఞవాటంబు= యజ్ఞవాటికను; ఉదాత్త+అభిరామంబుగన్= గొప్పగాను, అందంగానూ; చేయింపుఁడు= తీర్చండి; అప్సరస్+స్త్రీ జనంబు+ఆట= అప్సరసల నృత్యం; గంధర్వులపాట= గంధర్వుల గానం; చెల్లింపుఁడు= జరిపించండి; నావుడున్= అనగా; వారు; అట్లు+అ= అట్లాగే; నడిపి= నడిపించి; మఱియున్= ఇంకా; సకలకర్మములకున్= యజ్ఞసంబంధమైన అన్ని పనులకు; సాహాయ్యము+ఆచరింపంగన్= సహాయం చేయగా; సంవర్తముని= సంవర్తమహర్షి; వేఱు+ఒక= రెండవ; అగ్నిభంగిన్= అగ్నివలె; అగ్నివలె; వెలిఁగి= ప్రకాశించి; లలిత= మనోహరమైన; సముచిత= తగిన; పీఠము= ఆసనం; అలంకరించి= గ్రహించి; హవిస్+విధి= యాగవిధి; వేడ్కన్= వేడుకతో; ఒనర్పన్= జరిపించగా; యాగము= ఆ యాగం; ఉజ్జ్వలమునున్= మిక్కిలి ప్రకాశించినదీ; సుప్రయోగకంబున్+అగుచున్= చక్కగా నిర్వహింపబడినదీ అయి; ఒప్పారెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ విధంగా సంవర్తుడు ప్రశంసించగా ఇంద్రుడు ప్రసన్నుడై, దేవతలనందరినీ చూచి 'యజ్ఞవాటికను మహనీయంగానూ మనోహరంగానూ తీర్చిదిద్దండి. అప్సరఃస్త్రీలనాట్యం, గంధర్వుల గానం ఏర్పాటు చేయండి' అని ఆజ్ఞాపించాడు. వారు అట్లాగే చేసి, యజ్ఞకార్యనిర్వహణలో కూడా సహకారం అందించగా యజ్ఞం ప్రారంభమైనది. సంవర్తమహాముని మరొక అగ్నివలె ప్రకాశిస్తూ సముచితమైన ఆసనంమీద కూర్చుని యాగవిధిని నడిపిస్తుండగా యాగం మహావైభవంగా శాస్త్రవిధి ప్రకారం చక్కగా నిర్వహించబడినదై మిక్కిలి అతిశయించింది.

**తే. ప్రీతిఁ బేర్వేరఁ బిలిచి చేసేఁత సోమ। మమ్మహాయోగి యంది యీ నెమ్మిఁ బాన**
**మాచరించి సహస్రనేత్రాదులైన। యమరు లానందమునఁ దేలి రధిపముఖ్య! 104**

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య!= మహారాజా!; ఆ+మహాయోగి= ఆ సంవర్తముని; ప్రీతిన్= ప్రమేతో; పేరు+పేరన్= పేరు పేరునా; పిలిచి= పిలిచి (దేవతలను పేరుపెట్టి పిలిచాడని అర్థం); చేసేఁతన్= ఒక్కొక్కరికీ తానుగా; సోమము= సోమరసాన్ని; అంది+ఈన్= అందివ్వగా; నెమ్మిన్= ప్రీతితో; సహస్రనేత్ర+ఆదులు+ఐన= ఇంద్రాదులైన; అమరులు= దేవతలందరూ; పానము+ఆచరించి= త్రాగి; ఆనందమునన్= ఆనందంతో; తేలిరి= ఓలలాడారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ సంవర్తముని ఆదరంతో స్వయంగా సోమరసాన్ని పేరు పేరునా పిలిచి దేవత లందరికీ అందిచ్చాడు. ఇంద్రాది దేవతలంతా ఎంతో ప్రేమతో రసాన్ని పానంచేసి, ఆనందసాగరంలో ఓలలాడారు.

**వ. ఇట్లు మరుత్తుండు మరుత్పతికిం బరమతృప్తి గావించి యామంత్రణంబు సేయ నయ్యందఱు నభినందించి నిజ నివాసంబులకుం జని; రజ్జననాథుండు. 105**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; మరుత్తుండు; మరుత్పతికిన్= ఇంద్రుడికి; పరమతృప్తి కావించి= మిక్కిలి సంతోషాన్ని కలిగించి; ఆమంత్రణంబు+చేయన్= వీడ్కోగా; ఆ+అందఱున్= ఆ దేవతలందరూ; అభినందించి= ఆ మరుత్తుడిని ప్రశంసించి; నిజ నివాసంబులకున్= తమ తమ నివాసాలకు; చనిరి= వెళ్ళిపోయారు; ఆ+జననాథుండు= ఆ మహారాజు.

**తాత్పర్యం:** ఈ విధంగా మరుత్తుడు ఇంద్రుడిని సంతోషపెట్టాడు. చివరికి సంవర్తుడు, మరుత్తుడు దేవతలందరినీ వీడ్కొన్నారు. ఆ అమరులు వీరిని ప్రశంసించి, తమతమ నివాసాలకు వెళ్ళిపోయారు. అప్పుడు ఆ మరుత్తుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. యజనము సెల్లుకాలము సమాప్తతఁ బొందిననాఁడు తద్ద య**
**క్కజమగు భంగిఁ బ్రస్ఫురితకాంచన రాసు లనేకముల్ బహు**
**ద్విజులకు భక్తియుక్తియును వేడుకయున్ వినయంబు నొప్ప సం**
**భజనపరాత్ముఁడై యొసఁగెఁ బౌరవవంశపయోధిచంద్రమా! 106**

**ప్రతిపదార్థం:** పౌరవవంశ+పయోధి+చంద్రమా!= పురువంశమనే సముద్రానికి చంద్రునివంటి ఓ జనమేజయ మహారాజా!; (ఆ రాజు) యజనము+చెల్లు కాలము= యాగం జరుగుతున్న సమయం; సమాప్తతన్+పొందిననాఁడు= సమాప్తి అయిన రోజున; తద్ద= మిక్కిలి; అక్కజము+అగు భంగిన్= ఆశ్చర్యం కలిగే విధంగా; ప్రస్ఫురిత= ప్రకాశిస్తున్న; కాంచనరాసులు= బంగారు రాసులను; అనేకముల్= చాలా వాటిని; బహు= అనేకులైన; ద్విజులకున్= బ్రాహ్మణులకు; భక్తి యుక్తియునున్= భక్తితోకూడుటయూ; వేడుకయున్= వేడుకా; వినయంబున్= వినయమూ; ఒప్పన్= ప్రకాశించగా; సంభజన పరాత్ముఁడు+ఐ= సేవాపరమైన చిత్తం కలవాడై; ఒసఁగెన్= దక్షిణగాఇచ్చాడు.

**తాత్పర్యం:** మహారాజా! ఆ విధంగా దేవతలు వెళ్ళిపోయిన తరువాత కూడా యాగం జరిగింది. యాగం పూర్తి అయిపోయిన రోజున అందరికీ మిక్కిలి ఆశ్చర్యం కలిగేటట్లు ఎన్నో బంగారు రాసులను ఎందరో బ్రాహ్మణులకు భక్తితో, వేడుకతో, వినయంతో మిక్కిలి ప్రశంసతో దక్షిణగా ఇచ్చాడు.

**తే. అంతఁ బోవక హేమమయత్వమహిత । యజ్ఞవాట భాండాది పదార్థములును**
**బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు । హిమగిరిప్రాంతమునఁ గ్రతు వెలమిఁ జేసి. 107**

**ప్రతిపదార్థం:** హిమగిరి ప్రాంతమునన్= హిమాలయప్రాంతంలో; క్రతువు= యాగం; ఎలమిన్= ప్రీతితో; చేసి= చేసినవాడై; అతఁడు= ఆ మరుత్తుడు; అంతన్+పోవక= అంతటితో ఆగకుండా; హేమమయత్వ= బంగారుతో చేయబడిన; మహిత= గొప్పవైన; యజ్ఞవాట= యజ్ఞవాటిక; భాండ+ఆది= కుండలు, స్రుక్కులు మొదలైన; పదార్థములును= పదార్థాలను; బ్రాహ్మణావళికిన్= బ్రాహ్మణ సమూహానికి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** హిమాలయలలో యాగం పూర్తిచేసినవాడై ఆ మరుత్తుడు అంతటితో ఆగకుండా బంగారుతో చేసిన గొప్పదైన యజ్ఞవాటికను (అందులోని సర్వభాగాలను), కుండలు, స్రుక్కులు మొదలైన పరికరాలను కూడా వదలకుండా అన్ని పదార్థాలను బ్రాహ్మణసమూహాన్ని పిలిచి దానంగా ఇచ్చివేశాడు.

**వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుండై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టిత వసుంధరావలయంబునం బుణ్యపరత వెలయం బాలించె; బ్రాహ్మణులుఁ దమ యోపినంతయుం బసిండి ద్రవ్వితండంబులు దెచ్చుకొని తక్కినదాని నచ్చట నొక్కెడ నిధిగా నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెవ్వరేనిం గని లిదియక్కనిన వారిధనంబ యని రమ్మహాకాంచన**

**సంచయంబు గొనివచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున సకలదేవతలం దృప్తులంజేయు' మనియె; నట్లు వేదవ్యాసమునీశ్వరుండు సెప్పిన వచనంబులు వినియును బంధువిషయ శోకంబునం గ్రమ్మఱం దెలివి నొందియు నొందక ధూమంబు వొదివిన యనలంబునుంబోలె నున్న పాండవాగ్రజుం గనుంగొని కమలనాభుండు. 108**

**ప్రతిపదార్థం:** సంవర్తునిచేతన్= సంవర్తుడిచేత; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతింపబడినవాడై; నిజపురంబునకున్= తన నగరానికి; అరుగుదెంచి= తిరిగివచ్చి; వార్ధివేష్టిత= సముద్రంచేత చుట్టుకొనబడిన; వసుంధరా వలయంబునన్= భూమిలో; పుణ్యపరత వెలయన్= పుణ్యంపట్ల తాత్పర్యం కలిగేటట్లు; పాలించెన్= పరిపాలన చేశాడు; బ్రాహ్మణులున్= బ్రాహ్మణులు కూడా; తమ+ఓపినంతయున్= తాము మోయగలిగినంత; పసిండిన్= బంగారును; త్రవ్వి తండంబులు= కుప్పలుగా; తెచ్చుకొని= తమ ఇళ్ళకు తెచ్చుకొని; తక్కినదానిన్+అచ్చటన్+ఒక్క+ఎడన్= తక్కిన బంగారును అక్కడ ఒకచోట; నిధిగాన్= నిధిగా; నిక్షేపించి= దాచిపెట్టి; దీనిన్= దీనిని; కాలాంతరంబునన్= తరువాతి కాలంలో; ఎవ్వరేనిన్+కనిరి= ఎవరు చూస్తారో; ఇది= ఈ నిధి; ఆ+కనినవారి= ఆ చూచినవారి; ధనంబు+ఆనిరి= ధనమే అన్నారు; ఆ+మహాకాంచన సంచయంబున్= ఆ గొప్ప బంగారు రాశిని; కొనివచ్చి= తీసికొనివచ్చి; విచ్చలవిడిన్= విచ్చలవిడిగా; అశ్వమేధ యాగంబునన్= అశ్వమేధయాగంతో; సకలదేవతలన్= దేవతలందరినీ; తృప్తులన్+చేయుము+ అనియెన్= సంతోషింపజేయుము అన్నాడు; అట్లు= ఆ విధంగా; వేదవ్యాసమునీశ్వరుండు= వేదవ్యాస మహాముని; చెప్పిన వచనంబులు= చెప్పిన మాటలు; వినియును= వినికూడా; బంధువిషయ శోకంబునన్= బంధుమృతిజన్యమైన విషాదంలో; క్రమ్మఱన్= మరల; తెలివిన్+ఒందియున్+ఒందక= తెలివి పొందీ పొందక; ధూమంబు+పొదివిన= పొగ క్రమ్మిన; అనలంబునున్+పోలెన్= నిప్పువలె; ఉన్న పాండవ+అగ్రజున్= ఉన్నటువంటి ధర్మరాజును; కనుంగొని= చూచి; కమలనాభుండు= కృష్ణుడు (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం:** సంవర్తుడి చేత అనుమతింపబడినవాడై తన నగరానికి మరుత్తుడు చేరుకొని, లోకంలో పుణ్యకార్యాలపట్ల తాత్పర్యం కలిగే విధంగా ధర్మంగా పరిపాలన చేశాడు. ఆ బ్రాహ్మణులు కూడా తాము మోయగలిగినంత బంగారును ఇళ్ళకు తెచ్చుకొని, తక్కినదానిని అక్కడే ఒకచోట నిధిగా దాచిపెట్టి 'దీనిని తరువాతి కాలంలో ఎవరు కనుగొంటారో వారిదే ఈ నిధి' అని అందరూ ఒకమాటగా అన్నారు. ఆ మహాకాంచనరాశిని తీసికొనివచ్చి, యథేష్టంగా వాడి, అశ్వమేధయాగంచేసి దేవతలను సంతోషింపజేయుము - అని వ్యాసమహర్షి చెప్పిన మాటలను వినికూడా బంధువుల మృతివలన పుట్టిన శోకంలో మరలా మునిగిపోయి తెలివి పొందీపొందని స్థితిలో ఉన్న ధర్మరాజు పొగక్రమ్మిన నిప్పువలె కనిపించాడు. అట్లాంటి ధర్మరాజుతో కృష్ణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. 'వంకయైన తలం పెల్ల వసుమతీశ! । యరయ మృత్యుపదం బగు నార్జవాన్వి**
**తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల । యీఱతాఱ తలంపుల బీఱవాఱ? 109**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ= భూనాథా! రాజా; వంక+ఐన= వంకరగా ఉన్న; తలంపు+ఎల్లన్= అన్ని ఆలోచనలూ; అరయన్= ఆలోచించగా; మృత్యుపదంబు+అగున్= మృత్యువుకు దారితీస్తాయి; ఆర్జవ+అన్వితంబు= ఋజుత్వంతో కూడినది; బ్రహ్మపదంబు= జ్ఞానానికి దారి; ఇంత+తథ్యము= ఇంత మాత్రం నిజం; ఈఱతాఱ= తారుమారైన; తలంపులన్= ఆలోచనలతో; బీఱు+పాఱన్= బాధపడటం; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ రాజా! వంకర ఆలోచనలు మృత్యువుకు దారితీస్తాయి. బ్రహ్మపదానికి దారి ఎప్పుడు ఋజువుగా (నేరుగా) ఉంటుంది. ఇది నిజం, అట్లాంటప్పుడు తారుమారైన ఆలోచనలతో ఏడుస్తూ కూర్చోవటం ఎందుకు?

**విశేషం:** ఇక్కడ ప్రస్తావించిన మృత్యువు, బ్రహ్మం అనే భావనలు భారతసారాన్ని తెలుపుతాయి. వంకర కానిది ఋజువు. ధర్మపథం ఎప్పుడూ వంకరటింకరగా ఉండదు. అందుకే అది సత్యం మీద ఆధారపడి ఉంటుంది. అధర్మం వంకరటింకరగా ఉన్న దారి మీద నడుస్తుంది. దుర్యోధనాదుల దుశ్చేష్టలు - వారు పడ్డ పరాభవాలు వంకర మార్గానికి సూచికలు. ధర్మరాజాదులు ధర్మాన్ని ఆశ్రయించి విజయం పొందినా వారిలోనూ అహంకారమమకారాలతో కూడిన ఆలోచనలు మిగిలే ఉన్నాయి. వాటినే కృష్ణుడు గుర్తు చేస్తున్నాడు. 'ఈ ఊగిసలాటనుండి బయటపడితేనే నీవు జ్ఞానం వైపు ప్రయాణం చేస్తా'వని కృష్ణుడు ప్రబోధిస్తున్నాడు. ఇక్కడ మృత్యువు దుఃఖానికి, బ్రహ్మం ఆనందానికి సంకేతాలు, మొదటిది బంధరూపం. రెండవది విముక్తిరూపం.

**క. కర్మానుష్ఠానంబును। నిర్మలముగ నడపఁ బడదు నీచే విను మో**
**ధర్మతనూభవ! వగయును। నిర్మూలము సేయ విది మనీష గలిమియే? 110**

**ప్రతిపదార్థం:** ఓ ధర్మతనూభవ!= ఓ ధర్మరాజా!; నీచేన్= నీచేత; కర్మ+అనుష్ఠానంబును= కర్మచేయటం; నిర్మలముగన్= నిర్మలంగా; నడపఁబడదు= చేయబడదు; వగయును= దుఃఖాన్నికూడా; నిర్మూలము+చేయవు= మాపుకొనవు; ఇది= ఇట్లాచేయటం; మనీష= తెలివి; కలిమియే?= ఉన్నదనటానికి నిదర్శనమా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవు నిర్మలంగా ఏ పనీ చేయవు. కనీసం దుఃఖాన్నీ మాపుకోలేకపోయావు. నీ వివేకమంతా ఏమయింది? ఇది ఏమిటి?

**క. వగ నిర్మూలము సేయమి యెట్లంటేని నీ వంతశ్శత్రువుల నెఱుంగవు గాదె! కావున నేతద్విషయం బైన యొక్క యితి హాసంబు గల దాకర్ణింపుము. 111**

**ప్రతిపదార్థం:** వగ= దుఃఖాన్ని; నిర్మూలము+చేయమి= పోగొట్టుకొనకపోవటం; ఎట్లు+అంటే; నీవు; అంతస్+శత్రువులన్= లోపలి శత్రువులను; ఎఱుంగవు+కాదె!= ఎరుగవు కదా!; కావునన్= కాబట్టి; ఏతద్+విషయంబు+ఐన= దీనికి సంబంధించిన; ఒక్క; ఇతిహాసంబు+కలదు= ఒక కథ ఉన్నది; ఆకర్ణింపుము= వినుము

**తాత్పర్యం:** నీవు దుఃఖం నిర్మూలనం చేసుకోలేక పోతున్నావు. కారణం. నీకు లోపలి శత్రువులున్నారని తెలియదు కదా! దీనికి సంబంధించిన ఒక కథ ఉన్నది. చెప్పుతాను.

**విశేషం:** దుఃఖం పోకపోవటానికి; లోపలి శత్రువులకు సంబంధం ఏమిటి? సంబంధం ఉన్నది. కామక్రోధలోభాది గుణాలు ఈర్ష్యాసూయలను, కర్తృత్వభావనను కలిగించి ఉత్సాహం పెంచినట్టే నిరుత్సాహాన్ని కలిగించి, దుఃఖహేతువులూ అవుతాయి. కనుక కృష్ణుడు అంతఃశత్రువులను గురించి ప్రస్తావిస్తున్నాడు.

(శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట (సం.14-11-7))

**సీ. అవని యెల్లను వృత్రుఁ డాక్రమించి తదీయ। గుణమగు గంధంబు గొనిన వజ్రి**
**వానిపై వజ్రంబు వైనఁ గ్రమంబున। నంబుతేజః పవనాంబరముల**
**యందుఁ బ్రవేశించి యందుల రసరూప। సంస్పర్శశబ్దముల్ చండవిక్ర**
**ముండైన యతఁడు సముద్ధతిఁ గొనఁగొనఁ। దొడ్తోడ నమ్మహేంద్రుండు గులిశ**

ఆ. నిహతి వెలువరింప నిర్భరవేగుఁడై । యతనిలోను సొచ్చె నసుర దాన
మూర్ఛ వోయె దివిజముఖ్యుండు బోధితుఁ । జేసె మంత్రవిధి వసిష్ఠుఁ డతని. 112

**ప్రతిపదార్థం:** అవని+ఎల్లనున్= భూమినంతా; వృత్రుఁడు= వృత్రాసురుడు; ఆక్రమించి= ఆక్రమించుకొని; తదీయ= భూమికి సంబంధించిన; గంధంబున్+కొనినన్= గంధగుణాన్ని గ్రహించగా; వజ్రి= ఇంద్రుడు; వానిపైన్= ఆ వృత్రునిపై; వజ్రంబున్+వైవన్= వజ్రాయుధాన్ని ప్రయోగించగా; క్రమంబుననన్= క్రమంగా; అంబు= నీళ్ళు; తేజస్= అగ్ని; పవన= వాయువు; అంబరములు+అందున్= ఆకాశం - వీటిలో; ప్రవేశించి= దూరి; అందుల= అందున్న (అంటే తక్కిన నాలుగు భూతాలలోని); రస= నీటిలోని రసగుణాన్ని; రూప= అగ్నిలోని రూపగుణాన్ని; సంస్పర్శ= వాయువులోని స్పర్శగుణాన్ని; శబ్దములు= ఆకాశంలోని శబ్దగుణాన్ని; చండ విక్రముండు+ఐన= మిక్కిలి పరాక్రమవంతుడైన; అతఁడు= ఆ వృత్రుడు; సముద్ధతిన్= విజృంభణతో; కొనన్+కొనన్= గ్రహించివేయగా; తోడ్తోడన్= వెనువెంటనే; ఆ+మహేంద్రుండు= ఆ ఇంద్రుడు; కులిశ+నిహతిన్= వజ్రప్రహారంచేత; వెలువరింపన్= అతడిని బయటికి లాగగా; నిర్భర వేగుఁడై= అమితమైన వేగం కలవాడై; అసుర= ఆ రాక్షసుడు; అతనిలోను+చొచ్చెన్= ఆ ఇంద్రుడిలోనే దూరాడు; దానన్= దానిచేత; దివిజముఖ్యుండు= దేవతాముఖ్యుడైన ఇంద్రుడు; మూర్ఛ+పోయెన్= మూర్ఛపోయాడు; వసిష్ఠుఁడు= వసిష్ఠమహర్షి; అతనిన్= ఆ ఇంద్రుడిని; మంత్రవిధిన్= మంత్రప్రయోగంతో; బోధితున్+చేసెన్= మూర్ఛదేర్చాడు.

**తాత్పర్యం:** ఒకప్పుడు వృత్రాసురుడు భూమి నంతా ఆక్రమించుకొని, భూమిలోని గంధగుణాన్ని లాగివేశాడు. అపుడు ఇంద్రుడు వాడిమీద వజ్రం ప్రయోగించాడు. వాడు క్రమంగా భూమిని వదలి తక్కిన నాలుగు భూతాలను ఆశ్రయించాడు. వరుసగా నీటిలోని రసాన్ని, అగ్నిలోని రూపాన్ని, వాయువులోని స్పర్శను, ఆకాశంలోని శబ్దాన్ని సంపూర్ణంగా గ్రహించివేశాడు. వెనువెంటనే ఇంద్రుడు మరలా వ్రజాన్ని ప్రయోగించాడు. అపుడు ఆ భూతాలలో దాగికొన్న వృత్రుడు బయటికి వచ్చాడు. వచ్చి ఇంద్రుడిలోనే దూరాడు. దానితో ఇంద్రుడే మూర్ఛపోయాడు. చివరికి వసిష్ఠమహర్షి మంత్రప్రయోగంతో ఇంద్రుడు తెలివి పొందాడు.

వ. ఇట్లు వసిష్ఠప్రయుక్త మంత్రశక్తిం బ్రబుద్ధుండైన వృద్ధశ్రవుండు శరీరాంతర్గతుం డైన వృత్రు సదృశంబైన వజ్రంబున వధియించె; నవ్వాసవుం డీ ధర్మరహస్యంబు తెఱంగు మునుల కెఱింగించె; మునులు నాకుం జెప్పిరి; మానవేశ్వర! దీని నీవు దెలిసికొను' మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు నిట్లనియె. 113

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వసిష్ఠ= వసిష్ఠుడిచేత; ప్రయుక్త= ప్రయోగింపబడిన; మంత్ర= మంత్రముయొక్క; శక్తిన్= బలంచేత; ప్రబుద్ధుండు+ఐన= మేల్కొన్న; వృద్ధశ్రవుండు= ఇంద్రుడు; శరీర= అంతర్గతుండు+ఐన= లోపల ఉన్న; వృత్రున్= వృత్రాసురుడిని; అదృశ్యంబు+ఐన= కనిపించని; వజ్రంబునన్= వజ్రంతో; వధియించెన్= చంపాడు; ఆ+వాసవుండు= ఆ ఇంద్రుడు; ఈ ధర్మరహస్యంబు తెఱంగు= ఈ ధర్మ సూక్ష్మ విధానాన్ని; మునులకున్= ఋషులకు; ఎఱింగించెన్= చెప్పాడు; మునులు= ఆ ఋషులు; నాకున్+చెప్పిరి= నాకు చెప్పారు; మానవ+ఈశ్వర!= ఓ ధర్మరాజా!; దానిన్= ఆ అంతశ్శత్రుస్వభావాన్ని; నీవు; తెలిసికొనుము+అని= తెలిసికొనుమని; పలికి; ఆ+పాండవ+అగ్రజునితోన్= ఆ ధర్మరాజుతో; ఆ+పుండరీకాక్షుండు= ఆ కృష్ణుడు; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా వసిష్ఠుడు ప్రయోగించిన మంత్రబలంతో మేల్కొన్న మహేంద్రుడు తన లోపల ఉన్న వృత్రాసురుడిపై కనిపించని వజ్రం ప్రయోగించి చంపాడు. ఆ విషయాన్ని ఇంద్రుడు ఋషులకు చెప్పగా వారు నాకు చెప్పారు. ధర్మరాజా! ఈ ధర్మ సూక్ష్మాన్ని గ్రహిస్తే అంతశ్శత్రుస్వభావం నీకు అవగత మవుతుంది' అంటూ మరలా కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**సీ. 'శారీరమును మానసంబును నా రెండు । దెఱఁగులై వ్యాధి వర్తించు; నందు**
**విను వాతమును బిత్తమును సమ । త్వంబుఁ బొందిన యప్డు స్వస్థుఁ డగు న**
**రుం; డవి మూఁట నొక్కండైన వికృతి నొం । దిన శరీరవ్యాధి యనఁగ బరఁగు;**
**సత్త్వరజస్తమస్సమత సుస్థితి; విష । మత మనోవ్యాధి; యీ ద్వితయమునకు**

**ఆ. నొంటి దోఁచు టెపుడు నొదవ; దన్యోన్య సం । జనకజన్యభావసత్తఁ జేసి**
**వికృతికాల మొకట నొకటి దోఁచునది వా । తాదులందు గుణములందు నధిప! 114**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! వినుము; శారీరమును= శరీర సంబంధమైనది; మానసంబును= మనస్సుకు సంబంధించినది; నాన్= అని; వ్యాధి= రోగం; రెండు తెఱఁగులు+ఐ= రెండు విధాలుగా; వర్తించుచుండున్= ఉంటుంది; వాతమునున్= వాతం; పిత్తమునున్= పిత్తం (నడుమ 'శ్లేష్మం'); సమత్వంబున్+పొందినన్= సమస్థితిలో ఉంటే; అప్డు= ఆ సమయంలో; నరుండు= మనిషి; స్వస్థుఁడు+అగున్= ఆరోగ్యంగా ఉంటాడు; అవి మూఁటన్= ఆ మూటిలో; ఒక్కండు+ఐనన్= ఒక్కటి అయినా సరే; వికృతిన్+ఒందినన్= వికారం పొందితే; శరీరవ్యాధి+అనఁగన్+పరఁగున్= శరీరవ్యాధి అని పిలవబడుతుంది; (అట్లాగే); సత్త్వ= సాత్త్విక; రజస్= రాజసిక; తమస్= తామసిక (గుణాల); సమత= సమత్వం; సుస్థితి= మానసిక స్వస్థతకు నిదర్శనం; విషమత= వాటిలో ఏదో ఒకటి గాడితప్పటం; మనోవ్యాధి= మానసిక వ్యాధి అవుతుంది; ఈ ద్వితయమునకున్= ఈ రెండు రోగాలకూ; ఒంటిన్+తోఁచుట= ఏదో ఒకటి మాత్రమే కనిపించటం; ఎపుడున్+ఒదవదు= ఎపుడూ ఉండదు (ఎందుకంటే); అన్యోన్య= ఒకదానికొకటి; సంజనక+జన్య భావ సత్తన్+చేసి= ఒకదానినుంచి మరొకటి పుట్టే లక్షణం కలిగినది కావటంవలన; వాత+ఆదులందున్= వాతాది దేహస్థితులలో కాని; గుణములందున్= సత్త్వాదిగుణాలలో కాని; ఒకటన్+ఒకటి+తోఁచునది= ఒకటి మరోదానిలో కనిపిస్తే అది, వికృతికాలము= వికృతి కాలమనే అర్థం.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! వినుము. వ్యాధి శరీరమనస్సంబంధులని రెండు రకాలు. వాతపిత్తశ్లేష్మాలు సమస్థితిలో ఉంటే అది ఆరోగ్యసూచకం. ఆ మూటిలో ఏ ఒక్కటి వికారం పొందినా శరీరవ్యాధి అనిపించుకొంటుంది. అట్లాగే సత్త్వరజస్తమోగుణాలు మూడు సమత్వంలో ఉండటం మానసికస్వస్థతకు నిదర్శనం. ఈ మూటిలో ఏ ఒక్కటి గాడితప్పినా అది మానసికవ్యాధి అవుతుంది. ఈ రెండూ వాటంతట అవి ప్రత్యేకంగా ఎప్పుడూ రోగరూపంలో కనిపించవు. ఎందుకంటే అవి ఒకదాని నుండి మరొకటి పుట్టే లక్షణం కలిగినవి కాబట్టి. అందుచేత వాతాదులలోకాని, సత్త్వాదులలోకాని, ఒకటి మరొకదానిలో కలిస్తే అప్పుడది వికృతికాలమే.(అంటే రోగమే అని తాత్పర్యం).

**విశేషం:** ఆధునిక వైద్యవిజ్ఞానం ప్రకారం కూడా మనస్సంబంధం లేని రోగం ఏదీ లేదని గుర్తించబడింది. గుణప్రసక్తి లేని వాతాదులు రోగరూపాన్ని పొంద వని అర్థం. ముందున్న 'నీవు నిర్మలంగా ఏ పనీ చేయవు. దుఃఖాన్ని మాన్పుకొనలేక పోయావు' అనే వాక్యాల అర్థాన్ని శ్రీకృష్ణుడు 'రోగ నిదానం'తో ప్రారంభించి విశ్లేషిస్తున్నా డని అర్థం.

**వ. ఇది సూక్ష్మ కర్మానుష్ఠానప్రకారంబు, దీని నీ వలవరింపవు గావునం గర్మానుష్ఠానంబును నిర్మలంబుగా నడపం బడ దంటి' నని పలికి మఱియును. 115**

**ప్రతిపదార్థం:** ఇది; సూక్ష్మ= సూక్ష్మమైన; కర్మ+అనుష్ఠాన= పనినిచేసే; ప్రకారంబు= విధం; దీనిన్= దీనిని; నీవు; అలవరింపవు= అభ్యసించలేదు; కావునన్= అందుచేత; కర్మ+అనుష్ఠానంబునున్= కర్మను చేయుటం; నిర్మలంబుగాన్= నిర్మలంగా; నడపంబడదు+అంటిని= నీచేత చేయబడదు అన్నాను; అని పలికి= అని చెప్పి; మఱియును= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కర్మను అనుష్ఠించే పద్ధతిలోని ధర్మసూక్ష్మం ఇది. దీనిని నీవు ఎప్పుడూ అభ్యాసం చేయలేదు. అందుకే నిర్మలంగా 'ఏ పనినీ నువ్వు చేయలేకపోయావు' అని చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** భారతకథనంతా గమనిస్తే ఇంతవరకు ధర్మరాజుతో సత్త్వగుణాతిశయం ఉన్నా రజోగుణం లేదని చెప్పలేము. తామసంతోనే జూదంకూడా ఆడాడు. కృష్ణుడు ఈ కర్మసూక్ష్మాన్ని ఇక్కడ విశ్లేషిస్తున్నాడు. ఇంకా ఈ రహస్యాన్ని వివరించటమే తరువాతి పద్యంలో కనిపిస్తుంది.

**క.** **వాతాదులందు గుణములు । నీ తెరువునఁ దక్కువగుట యెక్కుడగుట నీ**
**చేతఃప్రసక్తిఁ దోఁచి నృ । పా! తెలియఁగవలయు సమత పరశాంతికినై.** **116**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; వాతాదులందున్= వాతాదిదేహస్థితులలో; గుణములు= సత్త్వాది మనోగుణాలు; ఈ తెరువునన్= ఈ విధంగా; తక్కువ+అగుట= తక్కువ కావటం; ఎక్కుడు+అగుట= ఎక్కువ కావటం; నీ చేతస్+ప్రసక్తిన్+తోఁచి= నీ ప్రజ్ఞలోనికి చొరబడి అనుభవంలోనికి రాగా; పరశాంతికిన్+ఐ= శాశ్వతమైన శాంతిధామాన్ని అందుకొనటానికి; సమత= సమత్వాన్ని గురించి; తెలియఁగవలయున్= అర్థం చేసికొనాలి.

**తాత్పర్యం:** 'ఓ రాజా! వాతాదిస్థితులు సత్త్వాది గుణాలతో కలిసి ఈ విధంగా తక్కువ కావటం, ఎక్కువ కావటం అనే ప్రక్రియవలననే ఇన్ని కార్యకలాపాలు జరుపుతున్నాయనే తెలివిడి నీ ప్రజ్ఞాభూమికలో ప్రవేశించిన మరుక్షణం శాశ్వతసుఖంకొరకు ఏ 'సమత్వ' స్థితిని సాధించాలో దానిని గురించిన అవగాహన నీలో కలుగుతుంది.

**సీ.** **అమ్మెయి 'గాక వాతాదులు సత్త్వము । ఖ్యములును దివిచిన గలఁగు దేని**
**నది నీ స్వభావ మేమనఁగలు? దింకను । జెప్పెద నవధాన మొప్ప వినుము**
**సభ కేకవస్త్ర రజస్వలఁ బాంచాలిఁ । గొని రాక మఱవు కాననములోన**
**నిడుమలు గడుచుట నెడ్డఁ బెట్టకు జటా । సుర సైంధవాదుల దురితకృతులు**

**తే.** **తలఁపకుము మాత్స్యపురమున దైన్యపడుట । బుద్ధి సేయకు భీష్మాది యుద్ధతంత్ర**
**మారయంగ యుద్ధంబు గా దందుఁ బుట్టు । కీడు మే లేమియును జిత్తగింపకుండు.** **117**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్+కాక= ఆ విధంగా కాకుండా; వాతాదులున్= వాతాది స్థితులు; సత్త్వముఖ్యములునున్= సత్త్వాది గుణాలు; తివిచినన్= లాగితే; కలఁగుదు(వు)+ఏని= బాధపడుతూ ఉంటే; అది= అట్లా కావటం; నీ స్వభావము= నీకు సహజమైన శరీర మనోధర్మమన్నమాట; ఏమనఁగలదు+ఇంకనున్?= ఇంకేమని చెప్పాలి?; చెప్పెదన్= దీనిని ఎట్లా దాటాలో చెప్పుతాను; అవధానము+ఒప్పన్+వినుము= సావధానమనస్కుడవై వినుము; సభకున్= నిండుసభలోనికి; ఏకవస్త్రన్= ఒకే చీర కట్టినదానిని; రజస్వలన్= రజస్వలగా ఉన్నదానిని; పాంచాలిన్= ద్రౌపదిని; కొని రాక= లాగుకొని రావటాన్ని; మఱవు(ము)= మరచిపొమ్ము; కాననములోనన్= అడవిలో; ఇడుమలు+కుడుచుటన్= కష్టాలు అనుభవించటాన్ని; ఎడ్డన్= ఎదలో (మనసులో); పెట్టకు(ము)= ఉంచుకొనకుము; జటాసుర, సైంధవ+ఆదుల= జటాసురుడు, సైంధవుడు, మొదలైనవారి; దురిత కృతులు= చెడ్డపనులు; తలఁపకుము= మాటిమాటికీ తలచుకొనవద్దు; మాత్స్యపురమునన్= మాత్స్యదేశంలో; దైన్యపడుట= ఆర్తిని పొందటం; బుద్ధి+చేయకు= తలచుకొనకుము; భీష్మ+ఆది= భీష్ముడు మొదలైనవారి; యుద్ధతంత్రము= యుద్ధ ప్రక్రియ; ఆరయంగన్= బాగా ఆలోచిస్తే; యుద్ధంబు+కాదు= అది యుద్ధమే కాదు; అందున్= దానిలో; పుట్టు= పుట్టిన; కీడు= చెడు; మేలు= మంచి; ఏమియునున్= దేనిని; చిత్తగింపక+ఉండు (ము)= మనసులో పెట్టుకొనకుము.

**తాత్పర్యం:** ఆ విధంగా కాకుండా వాతాది స్థితులు, సత్త్వాది గుణాలు లాగుతూ బాధపడేటట్లుగా ఉంటే అది నీకు సహజమైన శరీరమనోధర్మం. ఇక దీనిని గురించి ఏమనాలి? అయినా దీనిని ఎట్లా దాటాలో చెప్పుతాను; సావధాన మనస్సుతో వినుము. నిండు సభలోనికి ఏకవస్త్రను, రజస్వలను (ద్రౌపదిని) లాగుకొని వచ్చారే - అనే దానిని మరచిపొమ్ము, అడవిలో ఇన్ని కష్టాలు అనుభవించామే - అన్నది ఎదలో పెట్టుకొనకుము, జటాసురుడు, సైంధవుడు మొదలైనవారి దుర్మార్గాలు మాటిమాటికీ తలచుకొనవద్దు. మాత్స్యదేశంలో ఆర్తిని పొందామే అని మథనపడకుము. అసలు భీష్మాదులు చేసిన యుద్ధం యుద్ధమే కాదు. అట్లాంటప్పుడు అందులో పుట్టిన కీడు. మేలు - దేనినీ నీ మనసులో ఉంచుకొనవద్దు.

**వ. దాని నెట్లు యుద్ధంబు గాదనియె దంటేని నది మిథ్యాయుద్ధంబు సత్యయుద్ధం బాకర్ణింపుము. 118**

**ప్రతిపదార్థం:** దానిని= భీష్మాదులతో చేసిన యుద్ధం; ఎట్లు= ఏ విధంగా; యుద్ధంబు= యుద్ధం; కాదు+అనియొద+వు+అంటేని= కాదంటావు అంటే; అది; మిథ్యాయుద్ధంబు= మిథ్యాయుద్ధం; సత్యయుద్ధంబు= సత్యయుద్ధాన్ని గురించి చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** భీష్మాదులతో చేసిన యుద్ధం ఏ విధంగా యుద్ధం కాదు అంటావా? అది మిథ్యాయుద్ధం, సత్యయుద్ధాన్ని గురించి చెప్పుతాను వినుము.

**విశేషం:** మిథ్య అంటే అబద్ధం. బయటికి కనిపిస్తూ ఉన్న దేనికి నిజమైన అస్తిత్వం లేదో అది మిథ్య. ఇంతవరకు గుణాదుల విషయంగా మానవప్రకృతిని విశ్లేషించి ఇప్పుడు యుద్ధాన్ని మనోరీత్యా వివరించటంద్వారా దాని సత్యస్వరూపం ఏమిటో శ్రీకృష్ణుడు ప్రతిపాదిస్తున్నాడు.

**ఉ. అమ్మెయి బంధుమిత్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లే;**
**దమ్మహనీయయుద్ధమున కాత్మయ తోడు, మనంబు శత్రుఁ; డీ**
**వెమ్మెయి నైన శాంతి ఘటియింపుము లోపగఁ దీర్పు మెందు శాం**
**తమ్మ చుమీ మనోజయము దాన వెలుంగుము శాంతబుద్ధివై. 119**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; బంధుమిత్రుల= బంధువులయొక్క; స్నేహితులయొక్క; సహాయత కల్మి= సహాయం ఉండటం; ప్రయోజనంబు లేదు= నిష్ప్రయోజనం; ఆ+మహనీయ యుద్ధమునకున్= ఆ గొప్ప యుద్ధానికి; ఆత్మ+అ+తోడు= ఆత్మే తోడు; మనంబు శత్రుఁడు= మనస్సే శత్రువు; ఈవు+ఏమెయిన్+ఐనన్= నీవు ఏ విధంగానైనా; శాంతి ఘటియింపుము= శాంతిని పొందించుకొనుము; లో పగన్= అంతశ్శత్రుత్వాన్ని; తీర్పుము= తీర్చుకొనుము; ఎందున్= ఎక్కడైనా; శాంతమ్ము+అ= శాంతమే సుమా!; మనోజయము= మనస్సును జయించటం అంటే; దానన్= అందుచేత; శాంతబుద్ధివి+ఐ= శాంత బుద్ధిగలవాడవై; వెలుంగుము= ప్రకాశించుము.

**తాత్పర్యం:** ఆ విధంగా అంతమంది బంధుమిత్రుల సహాయం కలిగి ఉండటంవలన ఒరిగిందేమీ లేదు. ఆ మహాయుద్ధానికి ఆత్మే నిజమైన తోడు. మనస్సు శత్రువు. కనుక నీవు లోపలి శత్రువులను జయించి, మనసుకు శాంతిని ఒనగూర్చుకొనుము. శాంతమే కదా మనోజయమంటే! అందుచేత శాంతబుద్ధితో ప్రవర్తించటం అభ్యసించుము.

**విశేషం:** కౌరవులు, పాండవులు శత్రువర్గాలని భావించటం ఒక్క లౌకికవిషయమే తప్ప వారికి వీరు, వీరికి వారు శత్రువులు కారు. ఎవరెవరి శత్రువులు వారిలోపలే ఉన్నారు. దుర్యోధనుడి లోభ, దురభిమానాదులే అతడి శత్రువులు, అట్లాగే పాండవులకూ రాజ్యాభిలాష, తమ పరాక్రమంపై తమ నమ్మకం, కౌరవులపై పగ - తక్కువ స్థాయిలో లేవు. కనుక వారికీ అంతశ్శత్రువులున్నారు. కాకపోతే ద్వేషాన్ని తామే తీర్చుకొన్నట్లు యుద్ధంచేసి అశాంతులై మరణించారు. పాండవులు జయించినా 'శోకంపైన యుద్ధం చేస్తూనే ఉన్నారు. అందుకే మనోజయాన్ని గురించి శ్రీకృష్ణుడు ప్రబోధిస్తున్నాడు. శోకం తమోగుణజన్యం. అందుకే ఎడతెగని దుఃఖం. ఇది కౌరవులపై పగతీరినా పోలే దంటే దానికి కారణం వారి స్వభావంలోని అశాంత మనోవృత్తే. అందుకే, వివేకంతో శాంతబుద్ధిని అభ్యసించుమని భగవానుడు ప్రబోధించాడు. ఈ శాంతస్థితి నాశించే వ్యాసమహర్షి యాగంవైపు మనస్సు ప్రసరింపచేయుమని ప్రబోధించాడు. ఆ మనస్సును నియంత్రించకుండా పోతే అది మనిషిపైన విజయం సాధిస్తుంది. దాని ఫలితమే ఈ శోకాదులు. దానిని పారద్రోలు మని భగవంతుడి సూచన.

**తే. అంతరం బగు నిక్కయ్య మధిప! గెలువ ।కిట్ల యేగతిఁ బోయెదో యెఱుఁగ దీని**
**నీవ కనికొని సద్బుద్ధి నిశ్చయ ప్ర। వీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల? 120**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అంతరంబు+అగు= లోపలి; ఈ+కయ్యము= ఈ యుద్ధాన్ని; గెలువక= గెలువకుండా; ఇట్లు+అ= ఈ విధంగా; ఏగతిన్+పోయెదో= ఏ మార్గం వైపు వెళ్ళుతున్నావో; ఎఱుఁగన్= నాకయితే తెలియటం లేదు; దీనిన్= దీనిని; నీవు+అ= నీవే; కనికొని= కనుగొని; సద్బుద్ధిన్= వివేకంతో; నిశ్చయ ప్రవీణుఁడవు కమ్ము= నిశ్చయబుద్ధి కలిగిన నేర్పరివి కావాలి; మాటలు+ వేయున్+ఏల?= అధికంగా ఎందుకు చెప్పటం?

**తాత్పర్యం:** రాజా! లోపలి ఈ కయ్యాన్ని గెలువకుండా ఇట్లా ఏడుస్తూ నీవు ఏ గతి పడతావో నాకు తెలియకుండా ఉన్నది. దీనిని నీవే కనుగొనుము. వివేకంతో నిశ్చయబుద్ధి కలిగి, నేర్పరిగా నీ దారిని మళ్ళించుకొనుము. ఈ విషయంలో ఇక నేను ఏమి చెప్పను?

**వ. అని చెప్పి కౌంతేయాగ్రజునితోఁ గృష్ణుండు వెండియు నిట్లను 'రెండక్షరంబులుమృత్యువు. మూడక్షరంబులు బ్రహ్మంబని యెయ్యవి యంటేని వినుము 'మమ' యను నవియును 'న మమ' యను నవియును నై యుండు భూతలంబుల చేతం గానంబడక యా బ్రహ్మమృత్యువులు పోరుచుండు. 121**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పినవాడై; కౌంతేయ+అగ్రజునితోన్= ధర్మరాజుతో; కృష్ణుండు; వెండియున్+ఇట్లు+అనున్= మళ్ళీ ఇట్లా అన్నారు; రెండు+అక్షరంబులు= రెండక్షరాలు; మృత్యువు= మరణం (అజ్ఞానం); మూఁడు+అక్షరంబులు= మూడక్షరాలు; బ్రహ్మంబు= బ్రహ్మము (జ్ఞానం); అని; ఏ+అవి= ఏవి; అంటి(వి)+ఏ= అంటే; వినుము; మమ= అనునవియును (అనే రెండక్షరాలు); న మమ= (నాది కాదు); అనునవియును (అనే మూడక్షరాలు); ఐ+ఉండున్= అయి ఉంటాయి; ఆ+బ్రహ్మ+మృత్యువులు= ఆ బ్రహ్మము, మృత్యువు అనబడ్డవి; భూతంబులచేతన్= ఏ భూతాలచేతిలో; కానంబడక= చూడబడక; పోరుచున్+ఉండున్= పోట్లాడుతుంటాయి.

**తాత్పర్యం:** అని చెప్పి మరలా కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు 'రెండక్షరాలు మృత్యువు, మూడక్షరాలు బ్రహ్మము. 'మమ' అనే రెండక్షరాలు 'న మమ' అనే మూడక్షరాలు వరుసగా మృత్యువు, బ్రహ్మము. అవి ఏ భూతరాశికీ కనిపించకుండా నిరంతరం పోట్లాడుతూ ఉంటాయి.

**విశేషం:** 'మమ' (నాది) అనే భావమే 'బంధ' కారకం. అది మనిషిని అజ్ఞానంలో పడవేస్తుంది. 'న మమ' (నాది కాదు) అనే భావమే 'విముక్తి' హేతువు. అది 'సత్య' 'జ్ఞాన' రూపాలతో ఉండి 'అనంతం'గా ఉంటుంది. మమకారంలో 'సత్య' దృష్టి ఉండదు. జ్ఞానప్రసక్తి కూడా లేదు. అది చాలా పరిమితమైన ఉనికి కలిగింది. అందుకే 'న మమ' అనే మూడక్షరాలు బ్రహ్మ మని కృష్ణుడు మరలా భగవద్గీత సారాంశాన్ని ధర్మరాజుకు బోధిస్తున్నాడు.

'మమ' అన్నది శరీరవాదం. 'న మమ' అన్నది ఆత్మవాదం. శరీరం అశాశ్వతం, ఆత్మ శాశ్వతం, చింతించటం శరీర సంబంధి కనుక బంధహేతువు. దానిని మానుమని శ్రీకృష్ణుడు ఎట్లా బోధిస్తున్నాడో తరువాతి పద్యంలో చూడవచ్చును.

**క.** **తత్త్వ మనశ్వర మశరీ। రత్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా**
**శిత్వంబు హింసకత్వము। దాత్త్వికమై లేదు దేహదళమునను నృపా!** **122**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; తత్త్వము= ఆత్మతత్త్వం; అనశ్వరము= నశించనిది, శాశ్వతమైనది; అశరీరత్వంబునన్+పరఁగున్= శరీరసంబంధం లేనిదిగా ఉంటుంది. భూతరాశి= భూతరాశికి ఉన్నటువంటి; నియత నాశిత్వంబు= నియతంగా నశించే స్వభావం; హింసించుకొనటం (అనే ఈ లక్షణాలు); దేహదళమునను= దేహమనే ఖండభాగంలో (ఉన్నాయి); (అది); తాత్త్వికము+ఐ,లేదు= ఆత్మసంబంధమైన ధర్మం కాదు.

**తాత్పర్యం:** ఓ రాజా! ఆత్మతత్త్వం శాశ్వతమైనది. శరీరసంబంధం లేనిది; కాని భూతరాశి శరీరధారి కావటంవలన అది నియతంగా నశించే స్వభావం కలిగినది. పరస్పరం హింసిచుకొనటం దాని లక్షణమే. అందుకే దేహం ఒక 'ఖండ' భాగం తప్ప ఆత్మవలె అఖండం కాదు. శాశ్వతం కాదు. అందుచేత దేహానికి తాత్త్వికలక్షణం లేదు.

**క.** **శరధిపరివేష్టిత క్షితిఁ। బరిపాలించినను దానిపై దృఢమమతం**
**బొరయక వర్తించిన న। ప్పురుషుని దురితంబు లెట్లు వొందఁగ నేర్చున్?** **123**

**ప్రతిపదార్థం:** శరధి= సముద్రంచేత; పరివేష్టిత= చుట్టుకొనబడిన; క్షితిన్= భూమిని; పరిపాలించిననున్= ఏలినా; దానిపైన్= ఆ భూమిపై; దృఢ మమతన్= గట్టి మమతను; పొరయక= పొందక; వర్తించినన్= ప్రవర్తిస్తే; ఆ+పురుషునిన్= ఆ మానవుడిని; దురితంబులు= పాపాలు; ఎట్లు+పొందగన్+నేర్చున్= ఎట్లా ఆక్రమిస్తాయి?

**తాత్పర్యం:** సముద్రమే సీమగా కలిగిన ఈ భూవలయాన్నంతా పాలించినా సరే - ఆ భూమిపైన ఎవరికి గాఢమైన మమకారం ఉండదో అట్లాంటి మానవుడికి పాపాలు ఎట్లా అంటుతాయి?

**క.** **వనమున వన్యాహారం। బున వర్తించినఁ బదార్థములపై మమతన్**
**మనమున విడ కుండిన న। మ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా!** **124**

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా!= రాజా!; వనమునన్= అడవిలో; వన్యాహారంబునన్= అడవిలో దొరికే కందమూలాదులను ఆహారంగా కలిగి; వర్తించినన్= ఉంటున్నా; పదార్థములపైన్= ధన కనక వస్తు వాహనాది పదార్థాలపైన; మమతన్= మమతను; మనమునన్= మనస్సులో; విడక+ఉండినన్= వదలకుండా ఉంటే; ఆ మనుజుఁడు= ఆ మనిషి; మృత్యుముఖవర్తి= మృత్యుముఖంలో ఉండేవాడని అర్థం.

**తాత్పర్యం:** రాజా! అడవిలో ఉంటూ కందమూలాలు తింటూ ఉన్నా, ధన, కనక, వస్తు, వాహనాదులపై మమత పోలేదంటే ఆ మనిషి నిజంగా మృత్యుముఖంలో ఉన్నా డని అర్థం చేసికొనాలి.

**విశేషం:** పాండవులు అరణ్యావాసం చేశారు. కందమూలాలు తిన్నారు. కాని వారికి పదార్థజగత్తుమీద మమత ఇంకా పోలేదు. కనుక చేసిన అరణ్యావాసంనుండి లభించిన జ్ఞానం ఏమిటన్నది శ్రీకృష్ణుడి ప్రశ్న. అందుకే 'మమత' బంధుహేతువని చెప్పటం కొరకే 'మృత్యు' వనే గహ్వారంలోని (గుహ) ముఖద్వారంగా 'మమత'ను చెప్పుతూ ఈ మమతే 'మృత్యు' కారక మవుతుందని, ఇది లోపలి శత్రువని. దానిని జయించటమే అసలు 'విజయ'మని తరువాతి పద్యంలో వివరిస్తున్నాడు.

**క. వెలి పగఱ గెలుపు గెలుపే? । యలఘుమతిన్ గెలువవలయు నభ్యంతర శ**
**త్రులఁ దద్విజయము మోక్షము । నలవఱుపం జాలు నొంట నమ్మేలగునే? 125**

**ప్రతిపదార్థం:** వెలి= బయట ఉన్న; పగఱ= శత్రువుల; గెలుపు - గెలుపు+ఏ= జయం ఒక జయమేనా?; అలఘుమతిన్= గొప్ప వివేకంతో; అభ్యంతర= లోన ఉన్న; శత్రులన్= శత్రువులను; గెలువ వలయున్= గెలవాలి; తద్+విజయము= ఆ లోని శత్రువులను గెలవటమే; మోక్షము= విముక్తిని (బ్రహ్మసాక్షాత్కారం); అలవఱుపన్+చాలును= పొందేదారిని చూపించగలదు (విముక్తిమార్గ సాధనను నేర్పిస్తుంది); ఒంటన్= మరొకదానిలో; ఆ+మేలు+అగునే?= ఆ లాభం ఉంటుందా?

**తాత్పర్యం:** బయట ఉన్న శత్రువును జయించటమూ ఒక జయమేనా? లోపలి శత్రువులను గెలవాలి, ఆ విజయమే మోక్షమార్గసాధనను నేర్పిస్తుంది. మరి దేనితోనూ అది లభించదు.

**విశేషం:** కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు అనే ఆరు శత్రువులు 'అరిషడ్వర్గం' అని ఈ ఆరు గుణాలను పిలుస్తారు. ఈ శత్రువులలో అన్ని బంధాలనూ కలిగించే తొలి శత్రువు 'కామం' (కోరిక, ఇచ్ఛ, స్పందం, సంకల్పం)। దానిని గురించి తరువాత చెప్పుతున్నాడు.

**క. విను మంతశ్శత్రులలో । ఘనుఁడగుఁ గాముఁడు నిరస్తకామం బగు వ**
**ర్తనము విరల మధ్యయన య । జనదానంబులును గామసహితములు గదా! 126**

**ప్రతిపదార్థం:** వినుము= జాగ్రత్తగా వినుము; అంతస్+శత్రులలోన్= లోపలి శత్రువులలో; కాముఁడు= కోరిక, మన్మథుడు; ఘనుఁడు+అగున్= చాలా గొప్పవాడు; నిరస్త= వదలబడిన; కామంబు+అగు= కామం కలిగిన; వర్తనము= పని; విరలము= అరుదు (ఎందుకంటే);అధ్యయనము= వేదాదుల అధ్యయనంకాని; యజన= యజ్ఞంకానీ; దానంబులునున్= దానాదులు కానీ; కామ సహితములు కదా!= ఏదో ఒక సంకల్పంతో కూడినవే కదా!

**తాత్పర్యం:** జాగ్రత్తగా వినుము. లోపలి శత్రువులలో 'కాముడు' చాలా గొప్పవాడు. కామంలేని పని ప్రపంచంలో ఏదీ లేదు. వేదాదులు చదివినా, యాగాలు చేసినా, దానాదు లిచ్చినా దానికి మూలంగా ఏదో ఒక 'సంకల్పం' (కోరిక) ఉండనే ఉన్నది కదా!

**వ. ఇవ్విషయంబునం గామగీత లను వాక్యంబులు గలవు. వాని నాకర్ణింపుము. కాముండు లోకంబు నుద్దేశించి యిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** ఈ+విషయంబునన్= ఈ కామానికి సంబంధించిన; కామగీతలు= కాముడు చెప్పిన వాక్యాలు; అను= అనే; వాక్యంబులు= వాక్యాలు; కలవు= ఉన్నాయి; వానిన్= వాటిని; ఆకర్ణింపుము= చెప్పుతాను వినుము; కాముండు= ఆ మన్మథుడు; లోకంబున్= లోకాన్ని; ఉద్దేశించి= ఉద్దేశించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విషయానికి సంబంధించిన 'కామగీతలు' అనబడే వాక్యా లున్నాయి. వాటిని వినుము. కాముడు లోకాన్ని ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఈ పర్వంలోనే కామగీతలు, బ్రాహ్మణగీతలు రెండు ఉన్నాయి. భగవద్గీతలో ఏ సారాంశం ఉన్నదో ఈ గీతలలోనూ అదే సారాంశం ఉన్నది. 'గీత' అంటే ఇక్కడ 'బోధ కలిగిన వాక్య' మని అర్థం.

**క. 'అనపాయుం డగు నెవ్వం। డును నను బాధింపఁ జాలఁడు ప్రయత్నము సా**
**ధన మగునె వేదవేద్యుం। డనయి పరఁగుచున్న నా యెడను విహతికినై. 128**

**ప్రతిపదార్థం:** న+అపాయుండు+అగు= దూరంగా జరగకుండా ఉండే; ఎవ్వండును= ఎవడూ కూడా; ననున్= నన్ను; బాధింపన్+చాలఁడు= బాధించలేడు; వేదవేద్యుండను+అయి= వేదాలచేత తెలిసికొనబడేటటువంటివాడిని అయి; పరఁగుచున్+ఉన్న= ఉంటున్న; నా ఎడమ= నా విషయంలో; విహతికిన్+ఐ= భంగపాటుకొరకు; ప్రయత్నము= యత్నించటం; సాధనము+అగునె?= కార్యసాఫల్యాన్ని ఒనగూర్చేది అవుతుందా?

**తాత్పర్యం:** నాకు దూరంగా జరగకుండా ఉండేవాడు ఎవడూ నన్ను ఓడించలేడు. వేదాలచేత గుర్తించబడే ఉనికి కలిగిన నన్ను భగ్నపరచే సాధనం ఏమీ లేదు. కనుక నేను అజేయుడను.

**విశేషం:** 'అపాయం' అంటే 'ఎడబాటు'. ఈనాటివలె 'అనర్థం' అని కాదు. ఎడబాటు లేనిది 'అనపాయత్వం' కాముడు తాను జీవులకు పుట్టుకతో వచ్చి మరణం దాకా వారిని వదలకుండా, వారు తనను వదలకుండా ఉంటాడు కాబట్టి 'అనపాయుడైన' ఏ మనిషీ నన్ను ఏమీ చేయలేడని అంటున్నాడు. కాబట్టి ఎంత ప్రయత్నించినా ఏదో ఒక రీతిగా 'కామం' పైచేయి విసురుతూ ఉంటుంది. మనిషి 'నిగ్రహం' కోల్పోతూ ఉంటాడు.

ఇక 'వేదవేద్యుడను' అని కామదేవుడు చెప్పుతున్న విషయం.

'కామస్తదగ్రే సమవర్తత'

ప్రపంచ సృష్టికి ముందు 'కామమే' పుట్టింది. ఇది వైదికమైన సిద్ధాంతం.

'సోఽకామయత బహు స్యాం ప్రజాయేతి' (తైత్తిరీయం) అతడు (ఆ ప్రజాపతి) కోరుకొన్నాడు - ప్రపంచాన్ని సృష్టిస్తానని. అందుకే అతడి 'కోరిక' నుండి ఈ సర్వసృష్టి జరిగింది అని శ్రుతివాక్యం.

ఇది 'కామతత్త్వానికి' వైదికమైన పునాది. ఇక్కడ చెప్పబడ్డ కాముడు పురాణాలలో చెప్పబడిన 'మన్మథుడు' కాడు. ఆ మన్మథుడు శృంగారసంబంధమైన 'కామ' వాంఛకు సంకేతం. వేదాలలో చెప్పబడిన కాముడు ప్రపంచంలోని పదార్థవ్యక్తీకృతికి మూలమైన ఆత్మ 'స్పందానికి' సంబంధించినవాడు. వేదంలోని కాముడు చెప్పుతున్న మాటలివి. అట్లాంటి నన్ను ఎవడూ జయించలేడు. అందుకే శివుడు కూడా చలించక తప్పలేదని పురాణాలు కథలుగా చెప్పాయి.

**క. ధృతి నెవ్వఁడు నన్నుం బ్రవి। హతుఁ జేయఁగఁ జూచు భావ మగుదు నతని; కే**
**నతఁ డది యెఱుఁగఁడు గాన వి। హతి బొంకై పోవఁగా జయము లేకుండున్. 129**

**ప్రతిపదార్థం:** ధృతిన్= ధైర్యంతో; ఎవ్వఁడు= ఎవడైతే; నన్నున్= నన్ను; ప్రవిహతున్= దెబ్బకొట్టబడిన వాడిగా; చేయఁగన్+చూచున్= చేయజూస్తాడో; అతనికిన్+ఏన్= అతడికి నేను; భావము+అగుదున్= భావాన్ని అవుతాను; అతఁడు+అది+ఎఱుఁగఁడు= కాని అట్లా నేను భావ మవుతున్నానని అతడు ఎరుగడు; కానన్= కాబట్టి; విహతి= నన్ను దెబ్బకొట్టటం అనే పని; బొంకై పోవగాన్= అబద్ధం అయిపోగా; జయము లేక+ఉండున్= విజయం అన్నది లేకుండా పోతుంది.

**తాత్పర్యం:** ధైర్యంతో ఎవడు నన్ను దెబ్బకొట్టాలని చూస్తాడో వాడికి భావరూపంగా నేను అతడిలోనే ఉంటాను. కాని, నేను అట్లా అతడిలోనే ఉన్నానని అతడికి తెలియదు. అందుచేత నన్ను ఓడించటమనే ప్రశ్న లేనేలేదు. అందుచేత నన్ను జయించటం అనేదీ లేనేలేదు.

**విశేషం:** 'భూ' ధాతుసంబంధమైనది భావం. పుట్టేది అని అర్థం. ఏది సవ్యంగా పుట్టుతుందో అది భావం. కామం జయిస్తున్నా నన్నది ఒక భావం. ఆ భావరూపంలోనూ కామతత్త్వం ఉన్నది. అంటే కామాన్ని జయించాలని, ఇంద్రియాది నిగ్రహాలు, ఆహారవిహార నియమాలు పాటించేవారిలో ఆ ఇంద్రియజయస్వరూపమైన 'భావం' ఇచ్ఛారూపంలో ఉంటూ అది మరలా కాముడికి స్థానం అవుతుందని తాత్పర్యం. ఆ దీక్షలో ఉన్నవాడి కీ భావమే ఒక కామమని తెలియదు. కాబట్టి కామంమీద దెబ్బకొట్టటం అన్నది నీటి మీద వ్రాలే అని వాసుదేవుడు నొక్కి చెప్పుతున్నాడు.

**క. ననుఁ దపమునఁ బ్రహరించెద। నని యెవ్వఁడు దొడఁగు నతని కా తపము ఫలం**
**బున దెసఁ గోరికనై యే। జనియింతుం; జెఱుపఁగా వశమె యెవ్వనికిన్? 130**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; తపమునన్= తపస్సుతో; ప్రహరించెదన్+అని= దెబ్బకొట్టుతానని; ఎవ్వఁడు+తొడఁగున్= ఎవడు పూనుకొంటాడో; అతనికిన్+ఆ తపముఫలంబున దెసన్= అతడికి ఆ తపస్సుయొక్క ఫలం గురించిన; కోరికన్+ఐ= కోరికగా; ఏన్= నేను; జనియింతున్= పుట్టుతాను; (నన్ను); ఎవ్వనికిన్= ఎవడికైనా; చెఱుపఁగాన్= చెడపటానికి; వశమె?= సాధ్యమా?

**తాత్పర్యం:** తపస్సుచేసి నామీద దెబ్బకొట్టుతానని ఎవడు పూనుకొంటాడో అతడికి ఆ తపస్సుయొక్క ఫలాన్ని గురించిన కోరికగా నేను పుట్టుతాను. నన్ను ఎవరు చెడగొట్టగలరు?

**విశేషం :** తపస్సు చేసేవారిలో ఏదో పొందాలన్న తపన ఉంటుంది. అది ఫలరూపమైన కోరిక. 'నేను స్వర్గసుఖం పొందాలి' అన్నదీ ఒక కోరికే కదా! 'నాకు కుమారుడు జన్మించాలి!' అనేది కూడా కోరికే కదా! మరి అపుడు కోరిక లేని తపస్సు ఎక్కడ ఉన్నది?

రెండవ అంశం - మన్మథుణ్ణి చెడగొట్టటం అంటే ఏమిటన్నది. కోరికను 'అణచటం' అనే భావనకు అర్థం - కోరికపై దెబ్బకొట్టటమనే. కాముడి దెబ్బే పెద్ద దెబ్బ. ఆ కాముడిని దెబ్బతీసేవాడు మరొక్కడు లేదు. అందుకే కామదేవుడు 'నేను మరలా మరలా కోరిక రూపంతో పుట్టుతూనే ఉంటాను' అంటున్నాడు.

**క. నను మోక్ష మూఁది చెఱిచెద। నని యెవ్వఁడు దలఁచు వానియందే మోక్షా**
**ర్థనమై యునికి నవధ్యుఁడ। సనాతనుఁడ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్.' 131**

**ప్రతిపదార్థం:** మోక్షము+ఊఁది= మోక్షాన్నిధ్యేయంగా గ్రహించి; ననున్+చెఱిచెదన్+అని= నన్ను నాశనం చేస్తానని; ఎవ్వఁడు+ తలఁచున్= ఎవడు ఆలోచిస్తాడో; వాని+అందే= వానిలోనే; మోక్ష+అర్థనము+ఐ+ఉనికిన్= మోక్షంలోని కోరికగా ఉండటంవలన;

అవధ్యుఁడన్= నేను చంపటానికి వీలులేనివాడిని; సనాతనుఁడన్= శాశ్వతుడను; నన్నున్= నన్ను; త్రోవన్= త్రోసివేయటానికి; ఒకఁడున్+చాలఁడు= ఎవడూ సమర్థుడు కాడు.

**తాత్పర్యం:** మోక్షాన్ని ధ్యేయంగా గ్రహించి నన్ను నాశనం చేయాలని ఎవడు ఆలోచిస్తాడో వాడిలోనే మోక్షంలోని కోరిక రూపంలో నేను ఉండటంవలన నేను ఎవరిచేతా చంపబడేవాడిని కాను. నేను శాశ్వతుడను. నన్ను ఎవడూ త్రోసివేయజాలడు.'

**విశేషం :** సనాతనం అంటే శాశ్వతమైనదని అర్థం. చిరంతనమంటే ప్రాచీనమైనది. కాముడు 'సనాతనుడు' అంటే తొలి, నడుమ, చివరి దశలలో ఎవడు వదలకుండా ఉంటాడో వాడని అర్థం. అప్పుడే పుట్టిన బిడ్డ పాలవైపో, పంచదార నీళ్ళవైపో చూపే ఆసక్తి ఆహారం మీద కోరిక. నడిమి జీవితమంతా కోరికలపుట్ట. చివరిజీవితంలో జ్ఞానంమీదో మోక్షంమీదో ఆసక్తి. మరలా ఇదీ కోరికే. కనుకే కాముడు 'సనాతనుడు' అందుకే సృష్ట్యాదిలో ఉన్నవాడు కాముడే - అని 'కామస్తదగ్రే సమవర్తత' అనే వేదవాక్యం నిరూపిస్తున్నది.

**క.** **'అని యివ్విధమునఁ గాముఁడు । దనుఁ జెఱుపఁగరామిఁ జెప్పు తలఁపొందినఁ జె**
**ప్పిన భంగి నెదను దోఁచెను । విను మవధానమునఁ బాండవేయప్రవరా!** **132**

**ప్రతిపదార్థం:** పాండవేయప్రవరా!= ఓ ధర్మరాజా!; అని; అంటూ; ఈ+విధమునన్= ఇట్లా; కాముఁడు; తనున్+చెఱుపఁగన్+రామిన్= తనను నాశనంచేయటానికి వీలులేకపోవటం గురించి; చెప్పు= చెప్పేటటువంటి; తలఁపు+ఒందినన్= ఆలోచన పుట్టగా; చెప్పిన భంగిన్= చెప్పినట్లు; ఎదను+తోఁచెన్= మనసుకు తట్టింది; అవధానమునన్= ఏకాగ్రచిత్తంతో; వినుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఈ విధంగా కాముడు తనను ఎవరూ నాశనం చేయ లేరన్న విషయాన్ని గురించి చెప్పే ఆలోచన ఒకటి పుట్టగా అట్లా చెప్పినట్టు నా మనసుకు తోస్తున్నది. ఏకాగ్రచిత్తంతో వినుము చెప్పుతాను.

**విశేషం :** కాముడు చేసిన ఈ ప్రకటనను 'కామగీత' అనటానికి అర్థం ఏమిటో ఇక్కడ తిక్కనగారు చెప్పుతున్నారు. అర్జునుడు యుద్ధరంగంలో విషాదంలో మునిగిపోతే భగవంతుడు ఇచ్చిన ఓదార్పు భగవద్గీత కాగా ఈ 'కామగీత'కు శ్రోతలు, సాక్షులు మానవులందరూ, మానవులే కాదు దేవతలు; రాక్షసులు,సకల సృష్టి దీనికి సాక్ష్యమే. ఎవరో అడిగితే కాముడు ఈ 'గీత' చెప్పలేదు. తనకు తానుగా తన 'అవినాశ' లక్షణాన్ని 'సనాతన' ధర్మాలను తెలియచెప్పటంకొరకు ఈ మాటలు చెప్పాడు - అని శ్రీకృష్ణ భగవానుడికి అనిపించిందట.

అందుకే తరువాతి రెండు పద్యాలలో 'కామగీత'కు ఫలశ్రుతివలె 'కామవిజయం' ఎట్లా సంభవమో వివరిస్తున్నాడు. అశ్వమేధపర్వ రహస్యమంతా ఈ పద్యాలలో ఉన్నది.

**చ.** **పనివడి పూఁచి పట్టమి సుబంధురధైర్యము నిర్వహింతు నే**
**ననుమతి సొన్పకుండుట సమగ్రతపంబున తత్ఫలేచ్ఛ లే**
**కునికి విమోక్షతృష్ణభర మొందమి కాము నడంచుఁ గాన ని**
**య్యనువులు లేమి సువ్వె యనపాయతగా నతఁ డాడె భూవరా!** **133**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ రాజా!; పనివడి= పనిగట్టుకొని; పూఁచి= పూనుకొని; పట్టమి= ఒకపనిని పట్టుకోకపోవటం; సుబంధుర= మిక్కిలి; ధైర్యము= ధృతి (తా); నిర్వహింతున్+ఏన్+అను మతి= నేను ఈ పనిని కొనసాగిస్తానన్న స్థిరబుద్ధి(ని); చొప్పకుండుట= ఆ కార్యనిర్వహణలో ప్రవేశింపజేయకపోవటం; సమగ్రతపంబునన్= గాఢమైన తపశ్చర్యలో; తద్+ఫల+ఇచ్ఛ= ఆ తపస్సుయొక్క

ఫలంలో కోరిక; లేక+ఉనికి= లేకుండా ఉండటం; విమోక్ష+తృష్ణ+భరము= విముక్తి కావాలన్న మిక్కిలి దప్పిక; ఒందమి= పొందకపోవటం; కామున్+అడంచున్= కాముడిని అణచివేస్తాయి; కానన్= కాబట్టి; ఈ+అనువులులేమి+చువ్వె= ఈ అనువులు- ఉపాయాలు లేకపోవటమే సుమా!; అనపాయతగాన్= వదలిపెట్టజాలని ధర్మంగా; అతఁడు= ఆ కాముడు; ఆడెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. ఒక కార్యాన్ని పనిగట్టుకొని ప్రారంభించకపోవటం. దృఢమైన ధైర్యంతో ఈ పనిని తప్పక నిర్వహిస్తాననే స్థిరబుద్ధిని ఆ పనిలో పెట్టకపోవటం. గొప్ప తపస్సు చేస్తున్నప్పుడు కూడా ఆ తపఃఫలంలో కోరిక లేకుండా ఉండటం. చివరికి మోక్షం కావాలన్న కోరిక కూడా లేకుండటం కాముడిని జయిస్తాయి. కాని సాధారణంగా ఈ పనులు మనిషి చేయలేడు. ఈ ఉపాయాలు మనిషికి లభించవు. అందుకే 'నన్ను ఎవరూ వదలిపెట్టజాల' రని కాముడు ప్రకటించాడు.

**విశేషం :** అశ్వమేధపర్వంలోని అతిముఖ్యమైన పద్య మిది. కాముడు మానవుడిని ఎందుకు వెన్నాడుతాడో, అతడిని ఎట్లా జయించవచ్చునో చెప్పే ఉపాయం ఈ పద్యంలో ఉన్నది.

మొదటిది - పనిని చేయటం అంటే పూనుకొనిచేయాలి. త్రికరణశుద్ధిగా పనిని ప్రారంభించటం జరిగితే అది విఫలమయ్యే ప్రశ్న ఉండదు. అంతేకాదు, ఉద్యమించి పనిచేయాలి. ఉత్సాహంతో చేయాలి. దీనినే 'శ్రద్ధ' అంటారు. శ్రద్ధాళువు పనిని నిరాటంకంగా చేయగలుగుతాడు. ఈ శ్రద్ధ ఉన్నా 'పూనిక' మొండి పట్టుదల కాకుండా ఉండాలి.

రెండవది - పనిని తప్పక పూర్తిచేస్తానన్న 'స్థిరబుద్ధి' ఉండాలి. మధ్యలో వదిలివేయటం, చేతకాదేమో అనటం, చేస్తానని చేయకపోవటం. ఇతరులకు ఒప్పజెప్పటం, ఇట్లాంటి పనులు 'సోమరి' లక్షణాలు. పని పూర్తి అయ్యేదాకా ఆ స్థిరబుద్ధి నశించకూడదు. దీనినే 'ఓర్పు' అంటారు. ఓర్పు ఉన్నా 'నా పనే గెలవా' లన్న మూర్ఖత్వం ఉండరాదు.

మూడవది - మనం చేస్తున్న పనిని తాత్పర్యంతో చేయటం. ఆ నిర్దిష్టలక్ష్యం కార్యసాధనకోసమే తప్పా, కోరికను నింపుకొనటంకొరకు కాకూడదు. దాని నే విషయంలో కూడా ఫలాపేక్ష లేకుండా ఉండటం అని ఇక్కడ చెప్పుతున్నారు.

నాలుగవది - మోక్షవిషయంలో కూడా కోరిక ఉండకూడదనటం అంటే మోక్షం పొందాలన్నది ఒక 'దాహ' మట. దాహం అయిన మనిషి నీటికొరకు వెదకి తీరుతాడు. మోక్షం దానంతట అది రావాలి తప్పా నీవు ప్రయత్నం చేసి కృతిమంగా అందుకొనగలిగింది కాదన్న 'జ్ఞానం' ఉన్నపుడు మనిషి ఆ మోక్షాన్నీ కోరడు.

అప్పుడు మనిషి ఎట్లా పని చేస్తాడో తరువాతి పద్యంలో తిక్కనగారు వివరిస్తున్నాడు. 'అనువు' అంటే దారి/ఉపాయం అని అర్థాలున్నాయి. కామజయం అతికష్టం కాదని అర్థం.

**క. విను పెక్కులేల? కోరిక। మనమునఁ జొరనీకయున్న మడియుం గాముం**
**దనపద్య! యశ్వమేధం। బొనరింపుము గోరకుండు మొక్కటియు మదిన్. 134**

**ప్రతిపదార్థం:** అనపద్య!= పుణ్యాత్మా!; విను= ఆ కామజయం ఎట్లా సాధ్యమో చెప్పుతాను వినుము; పెక్కులు+ఏల?= ఇక అధికంగా చెప్పవలసిన అవసరం లేదు; కోరికన్= కోరికను; మనమునన్= మనస్సులో; చొరనీక ఉన్నన్= చొరబడకుండా చేస్తే; కాముండు= మన్మథుడు; మడియున్= చస్తాడు; అశ్వమేధంబు+ఒనరింపుము= అట్లా ఈ అశ్వమేధాన్ని చేయుము; మదిన్= మనస్సులో; ఒక్కటియున్= ఏ కోరికా; కోరక+ఉండుము= కోరకుండా ఉండుము.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్మా! ఆ కామవిజయం ఎట్లా సాధ్యమో చెప్పుతాను వినుము; పెక్కులు+ఏల?= ఇక అధికంగా చెప్పవలసిన అవసరం లేదు; ముందే వివరించానుగదా కోరికను మనస్సులో చొరబడకుండా చేస్తే మన్మథుడు వెంటనే చస్తాడు. ఇప్పుడు అశ్వమేధయాగం చేయుము. దానిని ఏమీ కోరకుండా చేయుము.

**విశేషం :** ఓ పుణ్యాత్మా! ఆ కామవిజయం ఎట్లా సాధ్యమో చెప్పుతాను వినుము. ఇక ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు. (ముందే వివరించాను కదా!) కోరికను మనసులో చొరబడకుండా చేస్తే మన్మథుడు వెంటనే చస్తాడు. ఇప్పుడు అశ్వమేధయాగం చేయుము. దానిని ఏమీ కోరకుండా చేయుము.

**ఆ. అశ్వమేధమఖమునం డట్ల యనఘ! య । లోలుపత్వగుణవిశాలబుద్ధి**
**శాలివై ఫలాభిసంధి లే కక్కాము । ధర్ము గాఁ బొనర్పు ధర్మతనయ! 135**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ!= ఓ యమధర్మరాజ కుమారా! ధర్మరాజా!; అశ్వమేధ మఖమునందున్= అశ్వమేధయాగంలో; అట్లు+అ= అట్లాగే; అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; అలోలుపత్వగుణ= మిక్కిలి ఇష్టంలేని గుణంతో; విశాలబుద్ధిశాలివై= విశ్వజనీనమైన బుద్ధితోకూడిన వాడవై; ఆత్మజ్ఞానంతోడి; ఫల+అభిసంధి లేక= ఫలాన్ని గూర్చిన కోరిక లేక; ఆ+కామున్= ఆ కాముడినే; ధర్మున్+కాన్= ధర్మసాక్షిగా; పొనర్పు(ము)= యాగం చేయుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవు పుణ్యాత్ముడవు. ఈఅశ్వమేధాన్ని ఏ తీవ్రమైన కోరికా లేని మనస్సుతో విశ్వజనీనమైన ధర్మబుద్ధితో ఆ కాముడినే కర్మసాక్షిగా చేసి యాగం చేయుము.

**విశేషం :** వ్యాసమహర్షిని గురించి 'విశాలబుద్ధి' అనే విశేషణం వాడుతారు.

'నమోఽస్తు'తే వ్యాస విశాలబుద్ధే'

అని వ్యాసమహర్షిని కీర్తిస్తారు. వ్యాసమహర్షి బుద్ధి వైశాల్యం ధర్మాద్వైతానికి సంబంధించిన మహోదాత్త గుణం. యాగనిర్వహణ ఫలంకోరి చేయనపుడు ధర్మ నిర్వహణకు సంబంధించిన నిష్కామకర్మ అవుతుంది. అప్పుడు కాముడు కర్మబంధాన్ని కలిగించడు. కర్మకు సాక్షిగా మాత్రమే ఉంటాడు. అందుకే 'ధర్ముని'గా చేయుము అనటం. ధర్ముడంటే యమధర్మరాజువలె 'సమవర్తి' అని అర్థం. అపుడు కాముడు విముక్తి హేతువుగా వర్తిస్తాడు. అది 'ధర్ము'డనటానికి అర్థం.

**క. చచ్చిన బంధులఁ గొని రా । వచ్చునె? తలఁపకుము నీవు వారిం; గ్రతువుల్**
**విచ్చలవిడిఁ జేయుము నిను । మెచ్చు జగంబు సమకూరు మీఁద సుగతియున్.' 136**

**ప్రతిపదార్థం:** చచ్చిన బంధులన్= చనిపోయిన బంధువులను; కొని రావచ్చునె?= మరల తీసికొని రావటానికి అవుతుందా?; నీవు వారిన్= నీవు వారిని గురించి; తలఁపకుము= ఆలోచించకుము; విచ్చలవిడిన్= సమృద్ధిగా (యథేష్టంగా); క్రతువుల్= యాగాలు; చేయుము; నినున్= నిన్ను; జగంబు మెచ్చున్= ప్రపంచం మెచ్చుకొంటుంది; మీఁదన్= తరువాత; సుగతియున్= పుణ్యలోకాల ప్రాప్తికూడా; సమకూరున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** చనిపోయిన బంధువులను మరలా తీసికొనిరావటానికి సాధ్యమా? నీవు వారినిగురించి తలచి తలచి ఏడుస్తూ కూర్చొనవద్దు. నీ ఇష్టం వచ్చినంత బాగా దానధర్మాలుచేసి యాగాలు చేయుము. దీనివలన నీకు ప్రపంచంలో ఖ్యాతి వస్తుంది. పైగా పుణ్యలోకప్రాప్తికూడా సిద్ధిస్తుంది.'

**వ. అని యిట్లు కృష్ణుండు సెప్పెఁ; బారాశర్యుండు బోధించె; దేవస్థానుండు నారదుండును హితవచనంబు లుపదేశించిరి. భీమాదులు నలువురును ద్రౌపదియును దగిన మాటలు సెప్పిరి. శాస్త్రచక్షుర్మహితులైన మహీసురులు యోగ్యవచనంబు లుపన్యసించి; రివ్విధంబున నందఱ వాక్యంబులు నాకర్ణించి, శోకంబు విడిచి,**

**యా భూకాంతుండు ధరణీపాలనాధ్వరకర్మంబుల కియ్యకొని యశుచిత్వనివృత్తికై గంగాతీరంబునఁ గొన్ని దినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి. 137**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= ఈ విధంగా; కృష్ణుండు+చెప్పెన్= కృష్ణుడు చెప్పాడు; పారాశర్యుండు= వ్యాసుడు; బోధించెన్= కర్తవ్యబోధ చేశాడు; దేవస్థానుండు= దేవలోకంలో ఉండే; నారదుండును= నారదుడు; హితవచనంబులు= మంచి మాటలు; ఉపదేశించిరి= బోధించారు; భీమ+ఆదులు నలువురును= భీముడు మొదలైన నలుగురు (తమ్ములు); ద్రౌపదియును= ద్రౌపది కూడా; తగినమాటలు= ఒప్పిదమైన పలుకులు; చెప్పిరి= చెప్పారు; శాస్త్ర+చక్షున్+మహితులు+ఐన= శాస్త్రాలనే చక్షువులుగా కలిగిన-మహనీయులైన; మహీసురులు= బ్రాహ్మణులు; యోగ్యవచనంబులు= తగిన మాటలు; ఉపన్యసించిరి= బోధించారు; ఈ+విధంబునన్= ఈరీతిగా; అందఱ+వాక్యంబులున్= అందరి మాటలను; ఆకర్ణించి= విని; శోకంబున్+విడిచి= శోకం వదలిపెట్టి; ఆ+భూకాంతుండు= ఆ రాజు; ధరణీపాలన+అధ్వర కర్మంబులకున్= భూమిని పాలించటానికి; యాగాలు చేయటానికి; ఇయ్యకొని= అంగీకరించి; అశుచిత్వ= అపవిత్రతను; నివృత్తికై= పోగొట్టుకొనటానికి; గంగాతీరంబునన్= గంగాతీరంలో; కొన్ని దినంబులు= కొన్ని రోజులు; నిలుచు వాఁడు+అయి= ఉండటానికి నిర్ణయించుకొన్నవాడై; మునివర్గంబునకున్= ముని సమూహానికి; ప్రదక్షిణంబునున్= ప్రదక్షిణమూ; ప్రణామంబునున్= వందనమూ; చేసి= చేసినవాడై.

**తాత్పర్యం:** ఈవిధంగా శ్రీకృష్ణుడు చెప్పాడు. వ్యాసమహర్షి కర్తవ్యబోధ చేశాడు. నారదమహర్షి హితోక్తులు పలికాడు. భీమాదులూ, ద్రౌపదీ తగిన మాటలు చెప్పారు. శాస్త్రపండితులైన బ్రాహ్మణులు కూడా ఏ విధంగా ప్రవర్తించాలో బోధించారు. ఈ రీతిగా అందరాడిన మాటలూ విని, శోకాన్ని వదలిపెట్టి, ఆ ధర్మరాజు రాజ్యపాలన చేయటానికి, యాగంచేయటానికి అంగీకరించాడు. ముందుగా యుద్ధపాపంవలన తమ కంటిన అపవిత్రతను పోగొట్టుకొనటంకొరకు గంగాతీరంలో కొన్ని రోజు లుండటానికి నిశ్చయించుకొని, మునిసమూహానికి ప్రదక్షిణంగా తిరిగి, శిరసు వంచి నమస్కరించాడు. ఇట్లా అన్నాడు.

**క. 'మీ కారుణ్యంబున నా। శోకం బంతయును బాసె సుమనస్కత సు**
**శ్లోకాత్ములార! కలిగెన్। నాకున్ విచ్చేయుఁ డింక నను మఱవకుఁడీ.' 138**

**ప్రతిపదార్థం:** సుశ్లోక+ఆత్ములార!= పుణ్యాత్ములని ప్రసిద్ధిగాంచిన ఓ మునివర్యులారా!; మీ కారుణ్యంబునన్= మీ దయతో; నా శోకంబు+అంతయునున్= నా దుఃఖమంతా; పాసెన్= నశించింది; నాకున్= నాకు; సుమనస్కత= ప్రశాంత చిత్తవృత్తి; కలిగెన్= కలిగింది; ఇంకన్+విచ్చేయుఁడు= ఇక దయతో మీమీ స్వస్థానాలకు దయచేయండి; ననున్= నన్ను; మఱవకుఁడీ= మరవకండి.

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! మీ ఉపదేశాలవలన నా మనస్సు ప్రశాంతమైనది. శోకం నశించినది. దయచేసి మీమీ స్వస్థానాలకు దయచేయండి. మీరు మాత్రం నన్ను ఎన్నటికీ మరవకండి.'

(వ్యాసనారదాది మునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట (సం. 14-14-8))

**క. అని పలికి, విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱంగి 'భవత్ప్రసాదంబునం గందువ గనిన కనకమ్ము మిమ్ముంబురస్కరించుకొనిపోయి చేకొనంగలవాఁడ; నప్పటికి సన్నిధిసేయవలయు; నప్పెన్నిధికినాశ్రయంబైన హిమగిరి మహీధరంబులలోన నెల్లను బరమాశ్చర్యనిధి యని చెప్పుదురు గావున భవదీయ రక్షగొనియె చుండీ యందు నా పోవుట' యని సవినయంబుగాఁ బ్రార్థించి 'నాపైఁ బెక్కులు కల్యాణకరణకల్పంబు లగు మాట లాడితిరి; మహాభాగ్యవంతులకుఁ గాక యిట్టివారి కారుణ్యంబు దొరకొనునె? మీ కరుణయ నన్ను భాగ్యవంతుం డని తెలిపెడు'**

**నని బహుప్రకారంబులం బ్రస్తుతిసేసె; న ట్లామంత్రితులై యమ్మహాత్ము లందఱు గృష్ణార్జునామంత్రణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి. పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరా ష్ట్ర సహితుండై యాచరించి కర్ణప్రభృతి కురుప్రకరంబునకు నూర్ధ్వలోక సాంద్రసౌఖ్యసిద్ధ్యర్థంబుగా నానావిధ దాన విధులు నిర్వర్తించి కృతకృత్యుండై కతిపయ దినంబుల కచ్చోటు గదలి పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరంబున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుండగుచుఁ గృష్ణుండును భీమాద్యనుజులు మోదంబు నొంద జనులు నభినందింపఁ బెంపారి వసుంధరాపరిపాలనధురంధరుం డయ్యెనని చెప్పిన విని జనమేజయుండు వైశం పాయనున కిట్లనియె. 139**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; విశేషించి= ప్రత్యేకంగా; వేదవ్యాస మునివరు పాదంబులకున్= వ్యాసమహర్షి పాదాలకు; ఎఱంగి= నమస్కరించి; భవత్+ప్రసాదంబునన్= మీ అనుగ్రహంతో; కందువ కనిన కనకమ్మున్= తెలిసిన రహస్య నిధి అయిన ఆ బంగారాన్ని; మిమ్మున్= మిమ్ములను; పురస్కరించుకొని పోయి= ముందుగా ఉంచుకొని వెళ్ళి; చేకొనన్+కలవాఁడను= తీసికొనగలను (తీసికొంటాను); అప్పటికిన్= అప్పటికి (ఆ సమయానికి); సన్నిధి+చేయవలయున్= మీరు తప్పక దయచేయాలి; ఆ+పెన్నిధికిన్= ఆ మహానిధికి; ఆశ్రయంబు+ఐన= ఆశ్రయమైనటువంటి; హిమగిరి= హిమాలయం; మహీధరంబులలోన్+ఎల్లనున్= పర్వతాలన్నింటిలోనూ; పరమ+ఆశ్చర్య నిధి+అని= గొప్ప గొప్ప ఆశ్చర్యాలకు నిధి అని; చెప్పుదురు= చెప్పుతారు; కావునన్= అందుచేత; అందున్= ఆ చోటికి; నా+పోవుట= నేను వెళ్లటం; భవదీయ= మీ; రక్ష+కొనియె+చుండీ= మీ రక్షణను తీసికొనే సుమండీ!; అని; సవినయంబుగాన్= వినయంతో; ప్రార్థించి= ప్రార్థించినవాడై; నాపైన్= నన్ను గురించి; పెక్కులు= అనేకాలైన; కల్యాణ కరణ కల్పంబులు+అగు= మాటలు= శుభాలను చేకూర్చటానికి అనువైన మాటలు; ఆడితిరి= చెప్పారు; మహాభాగ్యవంతులకున్+కాక= చాలా గొప్ప అదృష్టవంతులకు తప్ప; ఇట్టి వారి= మీవంటి మహనీయుల; కారుణ్యంబు+దొరకొనునె?= దయ సంప్రాప్తిస్తుందా?; మీ కరుణ+అ= మీ దయే; నన్ను; భాగ్యవంతుండు+అని= అదృష్టవంతుడినని; తెలిపెడున్= తెలుపుతున్నది; అని; బహుప్రకారంబులన్= చాలా విధాలుగా; ప్రస్తుతి+చేసెన్= ప్రస్తుతించాడు; అట్లు= ఆ విధంగా; ఆమంత్రితులు+ఐ= వీడ్కొనబడ్డవారై; ఆ+మహాత్ములు+అందఱున్= ఆ మహనీయులందరూ; కృష్ణార్జున+ఆమంత్రణంబున్= శ్రీకృష్ణుడి; అర్జునుడి వీడ్కోళ్ళను; కైకొని; గ్రహించి; అంతర్ధానంబు+చేసిరి= మాయమయ్యాడు; పదంపడి= ఆ తరువాత; భీష్మునకున్= భీష్ముడికి; ధృతరాష్ట్ర సహితుండు+ఐ= ధృతరాష్ట్రుడితో కూడి; పరలోక క్రియలు= ఉత్తర క్రియలు; ఆచరించి= చేసి; కర్ణప్రభృతి= కర్ణుడు మొదలైన; కురు ప్రకరంబునకున్= కురు సమూహానికి; ఉర్ధ్వలోక= పై లోకాలలో; సాంద్ర సౌఖ్య సిద్ధి+అర్థంబుగాన్= మహాసౌఖ్యాలు కలిగే విధంగా; నానావిధ= వివిధాలైన; దానవిధులు= దానధర్మాదులు; నిర్వర్తించి= చేసి; కృతకృత్యుండు+ఐ= తాను చేయదగిన పనులను పూర్తిచేసినవాడై; కతిపయ దినంబులకున్= కొన్ని రోజుల తరువాత; ఆ+చోటు+కదలి= ఆ స్థానంనుండి బయలుదేరి; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; పాండునృప+అగ్రజున్= పాండురాజు అన్నను (ధృతరాష్ట్రుడిని); అగ్రేసరున్+కావించుకొని= ముందుగా ఉంచుకొని; కరి నగరంబునకున్+అరిగి= హస్తినాపురానికి వెళ్ళి; అతనిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజును; పూజించి= మిక్కిలిగా గౌరవించి; తద్+ అనుజ్ఞా శోభితుండు+అగుచున్= అతడి అనుమతిచేత ప్రకాశిస్తున్నవాడై; కృష్ణుండునున్ భీమ+ఆది+అనుజులున్= శ్రీకృష్ణుడు, భీమాదులైన తన సోదరులు; మోదంబున్+ఒందన్= సంతోషం పొందగా; జనులు+అభినందింపన్= ప్రజలు మిక్కిలి సంతోషం పొందగా; పెంపారి= వైభవం అతిశయించగా; వసుంధరా పరిపాలన= భూమిని పాలించటంలో; ధురంధరుండు+అయ్యెన్+అని= ప్రవీణు డయ్యాడని; చెప్పినన్= చెప్పగా; విని; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, ప్రత్యేకంగా వ్యాసమహర్షి పాదాలకు నమస్కరించి 'మహర్షీ! మీ అనుగ్రహంతో తెలిసిన ఆ రహస్యనిధిని మిమ్ములను ముందుగా ఉంచుకొని వెళ్ళి తప్పకుండా గ్రహిస్తాను. ఆ సమయానికి మీరు తప్పకుండా రావాలి. ఆ మహానిధికి ఆకరమైన హిమాలయాలు గొప్పగొప్ప వింతలకు చోటని పెద్దలు చెప్పుతారు. కనుక అట్లాంటి

చోటికి నేను వెళ్ళటం అంటే మీ రక్షణను తీసికొనే సుమండీ!' అని వినయంతో ప్రార్థించినవాడై 'స్వామీ! మీరు మాకు శుభాలను చేకూర్చి, ఎన్నో మంగళకరవాక్యాలను పలికారు. గొప్ప అదృష్టవంతులకు తప్ప మీవంటి మహనీయుల దయ సంప్రాప్తిస్తుందా! మీ అనుగ్రహమే మేము చాలా అదృష్టవంతుల మని చెప్పుతున్నది' అని చాలా విధాలుగా ప్రస్తుతించాడు. ఆ విధంగా ధర్మరాజు వీడ్కోలు పలుకగా, ఆ మహాత్ము లందరూ శ్రీకృష్ణుడు, అర్జునుడు పలికిన వీడ్కోలు మాటలను విని సంతోషంగా అంతర్ధానం చేశారు. ఆ తరువాత ధర్మరాజు ధృతరాష్ట్రుడితో కలిసి భీష్ముడికి ఉత్తరక్రియలు నిర్వర్తించి, కర్ణుడు మొదలైన కురుసమూహానికి స్వర్గంలో మహత్తరసౌఖ్యసిద్ధి కలిగేటట్లు అనేక దానకర్మలు చేసినవాడై ధన్యు డయ్యాడు. కొన్ని రోజులకు ఆ చోటి నుండి బయలుదేరి ధృతరాష్ట్ర మహారాజు వెంట పాండవులు హస్తినాపురానికి చేరుకొన్నారు. ధర్మరాజు పెద్ద మహారాజును సముచితంగా గౌరవించి, ఆయన అనుమతితో విరాజిల్లుతూ శ్రీకృష్ణుడు, భీమాది సోదరులూ సంతోషంతో సహకరిస్తుండగా, ప్రజలు మెచ్చుకొనే విధంగా వైభవంతో ఒప్పారి రాజ్యపాలనాభారాన్ని మోయటంలో ప్రవీణుడని పేరు పొందాడు - అని చెప్పగా విని, జనమేజయుడు వైశంపాయనమహర్షిని చూచి ఇట్లా అడిగాడు.

**(ధర్మజుఁడు ధరణిం బాలించునపుడు కృష్ణార్జునుల వర్తించు విధము (సం.14-15-1))**

**తే.** **'ఇవ్విధంబున ధర్మజుం డెలమి ధరణి । పాలనము సేయఁగాఁ గృష్ణపార్థు లెట్టి**
**తెఱఁగువారలై యెచట వర్తించి రెఱుఁగఁ । జెప్పవే నాకు సజ్జనసేవనీయ!'** **140**

**ప్రతిపదార్థం:** సజ్జన సేవనీయ!= సత్పురుషులచేత సేవించదగిన ఓ వైశంపాయన మహర్షీ!; ఈ+విధంబునన్= ఈ రీతిగా; ధర్మజుండు= ధర్మరాజు; ఎలమిన్= ప్రీతితో; ధరణిపాలనము= రాజ్యపాలన; చేయఁగాన్= చేస్తుండగా; కృష్ణపార్థులు= శ్రీకృష్ణుడు, అర్జునుడు; ఎట్టి తెఱఁగువారలు+ఐ= ఏ విధంగా; ఎచట= ఎక్కడ; వర్తించిరి= ఉన్నారు? నాకున్= నాకు; ఎఱుఁగన్+చెప్పవే= దయచేసి వివరించుము.

**తాత్పర్యం:** మహర్షీ! ఈ విధంగా ధర్మరాజు రాజ్యపాలన చేస్తుండగా శ్రీకృష్ణుడు, అర్జునుడు ఎట్లా కాలం గడిపారు? ఏమి చేశారు? ఎక్కడున్నారు? దయచేసి వివరంగా నాకు చెప్పుము.

**విశేషం :** కృష్ణార్జునులు కలిస్తే ఇద్దరూ ఎప్పుడూ ఊరకే ఉండరు. వారు ఏదో ఒక పనిలో ఉంటారు. అది కూడా చాలా మహత్తర కార్యమే అయి ఉంటుంది. అదీ జనమేజయుడు భారతమంతా విని తెలిసికొన్న విషయం.

**వ.** **అని యడిగిన వైశంపాయనుం డిట్లనియె.** **141**

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు ఇట్లా చెప్పాడు.

**సీ.** **'ధర్మజుం డమ్మెయి ధరణిఁ బాలింపంగ । ననఘ । యింద్రప్రస్థమున వసించి**
**కృష్ణుండుఁ గ్రీడియుఁ గ్రీడాపరత సరి । త్కాననపర్వతసానుదేశ**
**ములఁ జరించుచు విప్రపూజలఁ బుణ్య క । థాశ్రవణముల సత్కావ్యగోష్ఠిఁ**
**బ్రొద్దు పుచ్చుచుఁ దమ పూర్వవృత్తము లైన । సమరతంత్రప్రముఖములఁ జెప్పి**

**తే.** **కొనుచు నుండుదు రాత్మీయతనయు నరుఁడు । దలఁచి వగచిన శోకంబు దలఁగు నట్టి**
**వాక్యసంతతి నా వృష్ణివరుఁడు దేర్చు । సముచితోక్తుల; ధర్మజు శాంతి వొగడు.** **142**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; ధర్మజుండు; ఆ+మెయిన్= ఆ విధంగా; ధరణిన్+పాలింపంగన్= రాజ్యాన్ని పరిపాలిస్తుండగా, ఇంద్రప్రస్థమునన్= ఇంద్రప్రస్థపురంలోనే; వసించి= ఉంటూ; కృష్ణుండున్= శ్రీకృష్ణుడు; క్రీడియున్= అర్జునుడూ; క్రీడాపరతన్= విలాసంగా; సరిత్= నదులు; కానన= అడవులు; పర్వత= కొండలు; సానుదేశములన్= సానువులలో; చరించుచున్= విహరిస్తూ; విప్రపూజలన్= బ్రాహ్మణులను అర్చిస్తూ; పుణ్యకథాశ్రవణములన్= పుణ్య కథలు వింటూ; సత్కావ్యగోష్ఠిన్= పవిత్రకావ్యాలను గురించి సాధుసత్పురుషులలో చర్చిస్తూ; ప్రొద్దు+పుచ్చుచున్= కాలం గడుపుతూ; తమ= తాము నిర్వహించిన; పూర్వవృత్తములైన= ముందు జరిగిన; సమరతంత్ర ప్రముఖములన్= యుద్ధ తంత్రాలను, వ్యూహాలను, చూచిన సాహసాలను; చెప్పికొనుచున్+ఉండుదురు= చెప్పుకొంటూ ఉంటారు; నరుఁడు= అర్జునుడు; ఆత్మీయతనయున్= తన కొడుకు అభిమన్యుడిని గురించి; తలఁచి= చింతించి; వగచినన్= దుఃఖపడినపుడు; శోకంబున్+తలఁగు+అట్టి= శోకాన్ని పోగొట్టుకొనేటటువంటి; వాక్యసంతతిన్= మంచి మాటలతో; ఆ వృష్ణివరుఁడు= ఆ వృష్ణివంశశ్రేష్ఠుడైన కృష్ణుడు; సముచిత+ఉక్తులన్= తగిన విధంగా; తేర్చున్= ఆ అర్జునుడిని; ఓదారుస్తాడు; ధర్మరాజు+శాంతిన్= ధర్మరాజుయొక్క ప్రశాంత స్వభావాన్ని; పొగడున్= పొగుడుతాడు.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్ముడా! వినుము. ఆ విధంగా ధర్మరాజు సుఖంగా రాజ్యపాలన చేస్తుండగా శ్రీకృష్ణుడు, అర్జునుడు ఇంద్రప్రస్థపురంలో ఉంటూ విలాసంగా నదులు, అడవులు, కొండలు, సానువులు వీటిలో విహారంగా తిరుగుతూ, బ్రాహ్మణులను పూజిస్తూ, పవిత్ర కథలను పెద్దవారివలన వింటూ, సత్కావ్యాలను గురించి సాధుసత్పురుషులతో గోష్ఠి జరుపుతూ కాలం గడుపుతుండేవారు. మాటాడుకొంటున్నపుడు తాము మునుపు యుద్ధంలో పన్నిన తంత్రాలను, యుద్ధవ్యూహాలను, చూపిన సాహసాలను ముచ్చటించుకొనేవారు. అప్పుడప్పుడు అర్జునుడు తన కొడుకు అభిమన్యుడి దుర్మరణం గుర్తుకురాగానే చింతలో మునిగి దుఃఖించేవాడు. అపుడు శ్రీకృష్ణుడు ఓదార్పు మాటలు చెప్పి, ఆ దుఃఖాన్ని పోగొట్టేవాడు. ఆ విధంగా ఉంటున్నప్పుడు ధర్మరాజు ప్రసక్తి వచ్చినప్పు డెల్లా శ్రీకృష్ణుడు ఆయన ప్రశాంతస్వభావాన్ని ఎంతగానో ప్రశంసించేవాడు.

**విశేషం :** నరనారాయణుల అవతారాలుగా చెప్పబడే అర్జునుడు. శ్రీకృష్ణుడు పాటించిన 'స్నేహం' బాంధవ్యానికి అతీతమైనది. అది ప్రేమమయమైన భక్తి దైవ - సంబంధం. అందుకే యుద్ధం జరిగేటంతవరకు 'కర్మ' యోగాన్ని బోధించి కార్యశీలుడిగా మార్చాడు కృష్ణుడు. యుద్ధం తరువాత కూడా అతడిలో మనశ్శాంతి కలిగి జ్ఞానోదయం కావటానికై అతడి వెంటనే ఉన్నాడు.

**క. విను మయకృత సభఁ గ్రొత్తగఁ। గని యచ్చో నొక్కయెడ సకౌతుక నానా**
**జనపరివృతులై యుండుదు। రనూన విభవమునఁ బ్రమద మారఁగ వారల్. 143**

**ప్రతిపదార్థం:** విను= ఇంకా వినుము; మయకృత సభన్= ఆనాడు మయబ్రహ్మ వారికొరకు నిర్మించి ఇచ్చిన మయసభను; క్రొత్తగన్+కని= క్రొత్తగా మరల ఒక సారి చూడటానికి వెళ్ళి; ఆ+చోటన్= అక్కడ; ఒక్క+ఎడన్= ఒకచోట; సకౌతుక= కుతూహలంతో కూడిన; నానాజన పరివృతులు+ఐ= అనేక జనులచేత చుట్టుకొనబడి; అనూన విభవమునన్= విశేషమైన వైభవంతో; ప్రమదము+ఆరఁగన్= సంతోషం అతిశయించగా; వారల్= ఆ కృష్ణార్జునులు; ఉండుదురు= ఉంటారు.

**తాత్పర్యం:** ఆనాడు మయబ్రహ్మ నిర్మించిన మయసభను మరలా చూడటానికి ఒకసారి శ్రీకృష్ణుడు అర్జునుడు వెళ్ళారు; అక్కడ ఒక చోట జనులంతా కుతూహలంతో ఈ ఇరువురి చుట్టూ మూగారు. అట్లా పాతకథలు త్రవ్వుకొంటూ క్రొత్త అనుభవం పొందుతూ సంతోషంగా వాళ్ళు కాలం గడిపారు.

**విశేషం :** పద్యంలో స్పష్టంగా చెప్పకపోయినా ఆ ఒక్కచోటు దుర్యోధనుడు భ్రాంతితో కాలుజారి నీటి మడుగులో పడ్డ స్థలమే అయి ఉండాలి. అది విహారస్థలంగా మారిపోయి ప్రజలు రోజూ సందర్శించేవారన్నమాట.

**వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో నిట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఆ+పుండరీక+అక్షుండు= తెల్ల తామరరేకులవంటి కన్నులుగల ఆ శ్రీకృష్ణుడు; గాండీవితోన్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఒక రోజు ఆ పుండరీకాక్షుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'సమరంబు ధర్మవిజయ పరికీర్త్యంబు। గాఁ జేసి భూమి నిష్కంటకముగఁ**
**బాలించుచున్నాఁడు ప్రజ ప్రీతినొందంగ। విద్వజ్జనంబులు వివిధసుఖము**
**లనుభవించుచుఁ దన్ను వినుతింప నెగడెడు। శాంతియు సమతయు సకలజనము**
**గొనియాడు సిద్ధులు మునులు సేవింతురు;। ధర్మనందనుఁ డి ట్లుదాత్తుఁ డగునె!**

**తే. యతని కున్నతి గావించి రనిలజుండు। గవలు నెంతయు నీ చేతి గాండివంబు**
**లీల గల్గి మహాధర్మశాలి సత్య। నిత్యుఁ డమ్మహీపతి గృతకృత్యుఁ డయ్యెఁ.' 145**

**ప్రతిపదార్థం:** సమరంబున్= యుద్ధాన్ని; ధర్మవిజయ పరికీర్త్యంబుగాన్+చేసి= ధర్మవిజయంగా పదిమందీ కీర్తించే విధంగా చేసి; భూమిన్= రాజ్యాన్ని; నిష్కంటకముగన్= ఏ ఆపదా లేకుండా; (భూమిని ఏ ముళ్ళూ లేకుండా చదును చేసినట్టు); పాలించుచున్నాఁడు= పరిపాలిస్తున్నాడు; ప్రజ= ప్రజలు; ప్రీతిన్+ఒందంగన్= సంతోషం పొందగా; విద్వత్+జనంబులు= పండితులైనవారు; వివిధ సుఖములు+అనుభవించుచున్= వివిధాలైన సుఖాలు అనుభవిస్తూ; తన్నున్= తన్ను; వినుతింపన్= ప్రస్తుతించగా; నెగడెడున్= ప్రకాశిస్తున్నాడు; శాంతియున్= ధర్మజుడు ప్రతిష్ఠించిన ప్రశాంతిని; సమతయున్= సమత్వాన్ని; సకల జనమున్= జనులందరూ; కొనియాడున్= ప్రస్తుతిస్తారు; సిద్ధులున్= సిద్ధులూ; మునులున్= మహర్షులు; సేవింతురు= ధర్మరాజును సందర్శించి ఆయనను సేవిస్తారు; ధర్మనందనుఁడు= ధర్మరాజు; ఇట్లు+ఉదాత్తుడు+ అగునె!= ఇట్లా ధర్మరాజు ఎంత ఉన్నతిని పొందాడయ్యా!; అనిలజుండున్= భీముడు; 'కవలున్= నకులసహదేవులు;' ఎంతయున్= ఎంతగానో; అతనికిన్= ధర్మరాజుకు; ఉన్నతి+కావించిరి= ఎంతో ఔన్నత్యాన్ని తెచ్చారు; నీచేతి గాండివంబున్= నీ చేతిలోని గాండీవాన్ని; లీలన్+కల్గి= అతి లీలగా తనదానివలెనే పొంది (అంటే నీ పరాక్రమమంతా అతడిది కాగా); మహాధర్మశాలి= సారధర్మప్రవీణుడైన ఆ ధర్మరాజు; సత్యనిత్యుఁడు= సత్యంలో నిత్యమూ చరించేవాడైన; ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; కృతకృత్యుఁడు+అయ్యెన్= ధన్యు డయ్యాడు.

**తాత్పర్యం:** తాను చేసిన యుద్ధం ధర్మవిజయమని జనులు మిక్కిలిగా కీర్తించే విధంగా చేసి, ధర్మరాజు రాజ్యాన్ని ఏ ఆపదా లేకుండా పరిపాలిస్తూ ఉన్నాడు. ప్రజలు మిక్కిలిగా సంతోషించారు. విద్వజ్జనులు సర్వసుఖాలూ అనుభవిస్తూ తనను ప్రస్తుతిస్తున్నారు. అతడు స్థాపించిన ప్రశాంతి, సర్వసమానత్వ ధర్మాలు ప్రజల సమ్మతిని పొందాయి. సిద్ధులు, మునులు కూడా వచ్చి ఆయన సన్నిధిని చేరుతున్నారు. ధర్మరాజు ఎంత ఉన్నతిని పొందాడయ్యా! అవును - ఆయన కేమి కొదవ! భీముడు, నకులసహదేవులు తమ బలపరాక్రమాలతో ఆయన ఎత్తును ఎంతో పెంచారు. నీ గాండీవం ఆయన చేతిలో ఉన్నట్లే కదా! మీదు మిక్కిలి మహాధర్మశాస్త్రప్రవీణుడు, సత్యపాలనాధ్యక్షుడు. అందుకే ధర్మనందనుడు ధన్యు డయ్యాడు.'

**వ. అని యగ్గించి యతని యాననం బాలోకించి. 146**

**ప్రతిపదార్థం:** అని; అగ్గించి= పొగడి; అతని ఆననంబు= అతడి ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని అర్జునుడిని పొగడి అతడి ముఖం చూచి (తరవాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'నీవలనన్ మహాత్మ! విను నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ**
**బోవు తలంపు పుట్టెడుఁ బ్రభూతగుణున్ బలదేవు వత్సలన్**
**దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని మద్గతరాగసాంద్ర స**
**ద్భావుల సర్వయాదవులఁ బార్థ! ననుం దగ నన్పిపుచ్చువే. 147**

**ప్రతిపదార్థం:** పార్థ!= అర్జునా!; మహాత్మ!= మహనీయ గుణ సంపన్నుడా!; విను(ము)= నాకు ఒక కోరిక పుట్టినది వినుము; నీవలనన్= నీ వలన; నిర్భర చిత్తుఁడన్+ఐతిన్= నా మనసు మిక్కిలిగా సంతోషించింది (ఇపుడు); ప్రభూతగుణున్= మిక్కిలి ప్రశస్తగుణ సంపన్నుడైన; బలదేవున్= బలరాముడిని; వత్సలన్= నామీద వాత్సల్యంతో ఎదురుచూచే; దేవకిన్= దేవకిని; ఆర్ద్రచిత్తున్= ఆర్ద్రమైన (దయాహృదయుడైన) చిత్తం కలిగిన; వసుదేవునిన్= వసుదేవ మహారాజును; మత్+గత+రాగసాంద్ర సద్భావులన్= నా విషయంలో మిక్కిలి అనురాగమూ గాఢమైన సద్భావమూ కలిగిన; సర్వయాదవులన్= యాదవులందరినీ; చూడఁగాన్+పోవు+తలంపు+పుట్టెడున్= చూడటానికి వెళ్ళాలన్న కోరిక కలుగుతున్నది; నన్నున్= నన్ను; తగన్+అన్పి+పుచ్చవే= తగినవిధంగా దయతో పంపించుము.

**తాత్పర్యం:** 'అర్జునా! మహనీయ గుణసంపన్నా! నీవలన నేను మహానందాన్ని పొందాను. ఈ తృప్తి చాలును. ప్రశస్తగుణసంపన్నుడైన బలరాముడిని, వాత్సల్యంతో నాకొరకు ఎదురుచూచే మా అమ్మ దేవకిని, ఆర్ద్రచిత్తుడైన, నా అగమనం నిరీక్షించే మా తండ్రి వసుదేవ మహారాజును, నా విషయంలో గాఢమైన అనురాగ సద్భావాలు కలిగిన యాదవులందరను చూడాలన్న కోరిక పుట్టుతున్నది. ఇక నీవు నన్ను తగినవిధంగా దయతో పంపించుము.

**విశేషం :** అంతటి మహాయోగేశ్వరుడు కూడా లౌకికబాంధవ్యాలలోని మర్యాదలను ఎంత చక్కగా పాటించాడో ఈ పద్యంలో చూడవచ్చును. బావ అనుమతి లేకుండా వెళ్ళకూడదు. అది బంధుమర్యాద. అందుకే 'తగన్' పంపించు అని కోరటం.

**క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ। గౌరవపతి కిత్తెఱంగు కార్యజ్ఞానో**
**దారుఁడ వగు నీ వౌచి। త్యారూఢము గాఁగఁ జెప్పు మగు సమయమునన్. 148**

**ప్రతిపదార్థం:** ద్వారకకున్= ద్వారకా నగరానికి; పోయి వచ్చెదన్= వెళ్ళి వస్తాను; కార్యజ్ఞాన+ఉదారుఁడవు+అగు= కార్యానికి సంబంధించిన జ్ఞానంలో శ్రేష్ఠుడవైన; నీవు; కౌరవపతికిన్= ధర్మరాజుకు; అగు సమయమునన్= తగిన సమయంలో; ఈ తెఱంగు= ఈ విషయాన్ని; ఔచిత్య+ఆరూఢము కాఁగన్= తగిన రీతిలో; చెప్పుము= ప్రస్తావించుము.

**తాత్పర్యం:** అర్జునా! నేను ద్వారకానగరానికి వెళ్ళివస్తాను. ఏ పనిని ఎట్లా చేయాలో నీకు బాగా తెలుసును. సరైన సమయంలో తగిన రీతిలో ధర్మరాజుకు ఈ విషయం చెప్పుము.

**వ. అట్లు గావున ధర్మరాజానుమతంబునం జనువాఁడఁ గావలయు వినుము. 149**

**ప్రతిపదార్థం:** అట్లు+కావునన్= అందువలన; ధర్మరాజు+అనుమతంబునన్= ధర్మరాజు అనుమతితోనే; చనువాఁడన్+కావలయున్= వెళ్ళేవాడిని కావాలి; వినుము= ఎందుకో చెప్పుతాను వినుము.

**తాత్పర్యం:** ఎందుకు నిన్ను ప్రస్తావించు మన్నావంటే ధర్మరాజు అనుమతి గ్రహించే నేను వెళ్ళాలి. అది నా బాధ్యత. కారణం చెప్తుతాను వినుము.

**తే. అవ్విభుఁడు వోయి వత్తుగా కనక పోను। మేనుఁ బ్రాణంబుఁ దనయులు మిత్రగణము**
**బంధులును నర్థచయము నప్పార్థివేంద్రు। సొమ్ము తదనువర్తనము వ్రతమ్ము నాకు. 150**

**ప్రతిపదార్థం:** ఆ+విభుఁడు= ఆ రాజు (ధర్మరాజు); పోయివత్తు(వు)+కాక= వెళ్లిరా; అనక= అనకుండా; పోను= నేను వెళ్ళను; (నా) మేనున్= దేహం; ప్రాణంబున్= ప్రాణం; తనయులున్= సంతానమూ; మిత్రగణమున్= స్నేహితులూ; బంధులునున్= స్నేహితులూ; అర్థచయమున్= సంపదా; ఆ+పార్థివేంద్రు సొమ్ము= ఆ రాజు సొత్తే; (కనుక) నాకున్= నాకు; తద్+అనువర్తనము= ఆయన మాటను అనుసరించి వర్తించటం; వ్రతమ్ము= ఒక దీక్ష.

**తాత్పర్యం:** ఆ రాజు వెళ్ళిరా అనకుండా నేను వెళ్ళను. నా ఈ దేహం, ప్రాణం, సంతతి, స్నేహితులు, బంధువులు, సంపద - అన్నీ ఆ రాజు సొత్తే. అందుచేత ఆయన మాటను పాలించి వర్తించటం నాకు దీక్ష.

**వ. కావున. 151**

**తాత్పర్యం:** కాబట్టి - (తరవాతి పద్యంతో అన్వయం.)

**క. మనము కరినగరమునకుం। జని పుణ్యాత్ముని నజాతశత్రుని నెలమిం**
**గని తగు నవసరమున ని। ప్పని విజ్ఞాపించి యతని పనిచిన భంగిన్. 152**

**ప్రతిపదార్థం:** మనము= మన మిద్దరమూ; కరిగనరమునకున్= హస్తినాపురానికి; చని= వెళ్ళి; పుణ్యాత్మునిన్= పుణ్యాత్ముడైన; అజాతశత్రునిన్= ధర్మరాజును; ఎలమిన్= ప్రీతితో; కని= చూచి; తగు+అవసరమునన్= తగిన సమయంలో; ఈ+పని= ఈ విషయాన్ని; విజ్ఞాపించి= చెప్పి; అతని పనిచిన భంగిన్= అతడు చెప్పిన రీతిలో.

**తాత్పర్యం:** మన మిద్దరమూ హస్తినాపురానికి వెళ్ళి పుణ్యాత్ముడైన ఆ ధర్మరాజును చూచి తగిన సమయంలో ఈ విషయాన్ని విన్నవించి అతడి అనుమతి ప్రకారం చేద్దాము.

**క. నడతము పోద 'మనుడుఁ గ। వ్వడి గొండొక వడి విచారవన్మానసుఁడై**
**'కడుమే లటు సేయుద' మని। యొడఁబాటుం బలుకు పలికి యొయ్యన పిదపన్. 153**

**ప్రతిపదార్థం:** నడతము= నడుచుకొందాము; పోదము+అనుడున్= వెళ్ళుదాము పద - అనగా; కవ్వడి= అర్జునుడు; కొండొక వడిన్= కొంతసేపు; విచారవత్+మానసుఁడు+ఐ= విచారంగల మనసు కలవాడై; కడు మేలు= ఇది చాలా మంచిపని; అటు+చేయుదము= అట్లాగే చేద్దాము; అని; ఒడఁబాటున్= అంగీకారాన్ని సూచించే; మాట; పలికి= చెప్పి; ఒయ్య+న్+అ= వెంటనే; పిదపన్= తరువాత

**తాత్పర్యం:** వెళ్ళుదాము పద' అని కృష్ణు డనగా అర్జునుడు కొంతసేపు బాధపడి, తేరుకొని 'ఇది చాలా మంచిపని అట్లాగే చేద్దాము' అని అంగీకరించి, వెంటనే (తరువాతి వచనంతో అన్వయము.)

**వ. అమ్మహాత్మునితో నిట్లనియె. 154**

**ప్రతిపదార్థం:** ఆ+మహాత్మునితోన్= మహనీయుడైన ఆ కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మహనీయుడైన కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**చ. 'అనికిఁ దొడంగు నప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో**
**ధన మహనీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి; తే**
**మనమున వాని యర్థములు మాధవ! నిల్పఁగఁ జాల నైతి; న**
**వ్వినుతవచస్సుధారసము వీనుల నింకొకమాఱు నింపనే.' 155**

**ప్రతిపదార్థం:** అనికిన్= యుద్ధానికి; తొడంగు+అప్పుడు= ప్రారంభించినపుడు; మత్+ఆత్మ= నా మనస్సు; కలంగినన్= బాధపడగా; కొన్ని తత్త్వబోధన= కొన్ని తత్త్వ బోధకాలైన; మహనీయ= గొప్ప; వాక్యములు= మాటలు; ఉదాత్త కృపన్= గొప్ప దయతో; తగన్= తగినట్లుగా; నీవు చెప్పితి(ని)= చెప్పావు; ఏన్= నేను; మనమునన్= మనస్సులో; వాని+అర్థములు= ఆ మాటల భావాలను; నిల్పఁగన్+చాలన్+ఐతిన్= నిల్పజాలకుండా పోయాను; మాధవ!= కృష్ణా!; ఆ+వినుత+వచస్= ఆ గొప్పమాటలు అనే; సుధారసమున్= అమృతాన్ని; వీనులన్= చెవులలో; ఇంకొక మాఱు= మరొక్కసారి; నింపనే!= నింపవా!

**తాత్పర్యం:** 'యుద్ధానికి పూనుకొన్నప్పుడు నా మనస్సు కలతచెంది, నేను క్రుంగిపోయినప్పుడు నీవు కొన్ని తత్త్వబోధకాలైన మహావాక్యాలను నాపై మహాకరుణతో తగిన విధంగా బోధించావు. నేను మనస్సులో ఆ మాటల సారాంశాన్ని పదిలపరచుకొనలేకపోయాను. కృష్ణా! మళ్ళీ ఆ మాట లనే అమృతాన్ని చెవులలో మరొకసారి దయచేసి నింపవా!

**విశేషం:** యుద్ధప్రారంభంలో శ్రీకృష్ణుడు అర్జునుడిని ఉద్దేశించి చెప్పినదే 'భగవద్గీత.' యుద్ధానికి సన్నద్ధుడై బాణాలు అనుసంధించవలసిన సమయంలో వేదాంతభావన అసలు స్వరూపం తెలియక శోకంలో మునిగిపోయి, 'నాకు రాజ్యం వద్దు; రాజ్యసుఖం వద్దు; నేను యుద్ధం చేయను.' అని విషాదంలో అర్జునుడు కూరుకొనిపోయినప్పుడు శ్రీకృష్ణుడు భక్తిజ్ఞానకర్మలను, మనుష్యతత్త్వాన్ని, పరమేశ్వర విభూతిని, గుణశ్రద్ధాత్రయాలను బోధించి నిష్కామకర్మ చేయటంద్వారా శోకాన్ని దాటవచ్చునని ప్రబోధించి, యుద్ధం చేయుమని ప్రోత్సహించి, ఏ ఫలాపేక్ష కూడా లేకుండా కర్మ చేసినప్పుడు అది యోగమవుతుందని ఆనాడు చెప్పినా 'నరుడు' (అర్జునుడు మానవుడని అర్థం) అప్పటి కప్పుడు కాస్త 'తెలివిడి' పొందినా మరల అతడికి మరుపు ఆవహించి, అదంతా ఎక్కడో జరిగిన విషయంవలె లీలగా మాత్రమే గుర్తున్నది.

దానిని మరలా ఇక్కడా గుర్తు చేసికొంటున్నాడు.

గీతావాక్యాలు 'మహనీయ' వాక్యాలు. సకలోపనిషత్తుల సారాంశమూ గీతలో ఉందని వ్యాఖ్యాతలు నిరూపించారు. అందుకే దానిని 'బ్రహ్మవిద్య' అని గీతను 'ఉపనిషత్తు' అని పిలుస్తారు.

గీతావాక్యసారం 'సుధ' వంటిది. (సుధ అంటే అమృతం). వచస్+సుధారసము= వచస్సు అనే సుధారసము - అలంకారం రూపకం.

కామధేనువై వెలయఁగ సకలా । మ్నాయసారమే గోవత్సముగా
ప్రేమపాత్రుడగు పార్థుని జేసియు । పిండి 'సుధ'ను గోపుడుంచె 'సుధి'కై.

అని భగవద్గీతా హరికథామంజరీకారుడు చెప్తున్నాడు. 'సుధి' అంటే 'మంచి ధిషణ' కలవాడు; సహృదయ సంపద, విజ్ఞానం నిష్పక్షపాతబుద్ధి, తత్త్వస్పృహ ఉన్నవాడు 'సుధి'. అట్లాంటి జ్ఞానానికి అమృతం వంటిది 'గీత'. అందుకే 'ఇంకొకమాఱు నింపవే' అని ప్రేమతో 'గోముగా' అడుగుతున్నాడు. ధర్మరాజుపైనా, పాండవులందరిమీదా అనురాగ మున్నా కృష్ణుడికి ప్రీతిపాత్రుడు 'అర్జునుడే'. 'మమప్రాణా హి పాండవాః' అని అన్నాడు కృష్ణుడు. తన సంపదంతా ధర్మరాజుదే అన్నాడు. ఆయన అనుమతి లేనిదే ద్వారకకు పోను అన్నాడు. కాని చిత్రం ఏమిటంటే 'ప్రేమగలిగిన మిత్రుడు' అర్జునుడే.

**క. అనిన నగుచు నొక కేల న । తనిఁ గౌఁగిఁట జేర్చి 'బుద్ధితత్త్వవిహీనుం**
**డును శ్రద్ధారహితుఁడు నై' । తని దూఱి ముకుందుఁ డిట్టు లను నాతనితోన్. 156**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జును డనగా; నగుచున్= నవ్వుతూ; ఒక కేలన్= ఒక చేతితో; అతనిన్= అతడిని; కౌఁగిటన్+చేర్చి= కౌగిలిలో చేర్చుకొని; బుద్ధితత్త్వ విహీనుండును= బుద్ధితత్త్వం లేనివాడవూ, శ్రద్ధారహితుఁడున్+ఇతి(ఎ)+అని= శ్రద్ధలేనివాడవూ అయ్యావు అని; దూఱి= నిందించి; ముకుందుఁడు= కృష్ణుడు; అతనితోన్= అర్జునుడితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు అనగా నవ్వుతూ కృష్ణుడు ఒక చేతితో అతడిని కౌగిలిలో చేర్చుకొని 'నీకు బుద్ధి, శ్రద్ధ రెండూ లేకుండా పోయాయి' అని మందలించి, అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** శ్రద్ధలేకుండా వినటంవలన మరిచిపోయాడు. బుద్ధితో వినకపోవటంవలన సారాంశంకూడా మిగలకుండా పోయినది. అందుకే మందలించటం. కాని, ఆ మందలింపులోనూ ప్రేమ ఉన్నది. అందుకే కౌగిలించుకొని మరీ మందలించాడు.

**తే. 'బ్రహ్మపదవేదనమునకుఁ బరమహేతు । భూతములు నాఁటి వాక్యముల్ బుద్ధిఁ దన్మ**
**హార్థములు నిల్పవైతి శక్యంబె యింక । నవ్వచనములు సెప్పంగ? నలఘుశౌర్య! 157**

**ప్రతిపదార్థం:** అలఘుశౌర్య!= మహాపరాక్రమవంతుడా!; బ్రహ్మపద వేదనమునకున్= బ్రహ్మపదమంటే ఏమిటో తెలిసికొనటానికి; పరమ హేతు భూతములు= గొప్ప కారణభూతాలు; నాఁటి వాక్యముల్= ఆనాడు నేను చెప్పిన వాక్యాలు; బుద్ధిన్= నీ బుద్ధిలో; తద్+మహార్థములు= ఆ మహార్థాలను; నిల్ప(వు)+ఐతి(వి)= నిలుపకుండా పోయావు; ఇంకన్= మళ్ళీ; ఆ+వచనములు= ఆ మాటలను; చెప్పంగన్= చెప్పటానికి; శక్యంబె?= సాధ్యమా?

**తాత్పర్యం:** 'మహాపరాక్రమశాలీ! ఆనాడు చెప్పిన మహావాక్యాలు బ్రహ్మపదసాధకాలు. ఆ వాక్యాల అర్థాన్ని నీవు మనసులో నిలుపుకొనలేకుండా పోయావు. మరలా ఆ వాక్యాలను చెప్పాలంటే వీలవుతుందా!

**విశేషం:** బ్రహ్మపదం అంటే 'విముక్తి'- 'నడుమ' అనటమే బ్రహ్మమని ముందే వివరించబడింది. ఇక్కడ 'నిష్కామకర్మ' ను దానికి మార్గంగా చెప్పాడు (కామగీత చివరకూడా దీని ప్రసక్తి ఉన్నది) భగవద్గీత సారాంశమూ ఇదే. అందుకే బ్రహ్మపదనిర్వచనం తెలియాలంటే 'గీత'ను చదవాలని అర్థం. మహావాక్యాలు అట్లా తమకు తాముగా బయటపడతాయి తప్ప మాటిమాటికీ చెప్పాలంటే వీలుకానివి. కాబట్టే 'మంచి వాక్యాలను మళ్ళీ మళ్ళీ చెప్పలేము' అని పాశ్చాత్యులు కూడా భావిస్తారు.

**(శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము చేయుట (సం. 14-16-12))**

**వ. ఏతద్విషయం బగునది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. నాకడకు నొక్క విప్రోత్తముండు వచ్చిన నేనును 'దత్త్వజ్ఞానంబు తెలం గుపదేశింపవే' యనుటయు నతండు కాశ్యపనామధేయుం డగు నొక్క ధరామరుం డొక్కెడ**

**విజితేంద్రియుండును జ్ఞానవిజ్ఞానశాలియుఁ ద్య క్తసంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగు నొక్క సిద్ధునిం గాంచి సంభృతవినయుండై శిష్యత్వంబున భక్తి నాశ్రయించిన నమ్మహాద్విజునకు నమ్మహనీయుండు సెప్పిన వాక్యంబులు సెప్పెన; నవధానంబుతో విను' మని పల్కి మదీయవదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె.**

**158**

**ప్రతిపదార్థం:** ఏతద్+విషయంబు+అగునది= ఈ విషయానికి సంబంధించినదైన; ఒక్క ఇతిహాసంబు+కలదు= ఒక కథ ఉన్నది; ఆకర్ణింపుము= వినుము; నాకడకున్= నా దగ్గరకు; ఒక్క విప్ర+ఉత్తముండు= ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడు; వచ్చినన్= రాగా; నేనును్= నేను కూడా; తత్త్వజ్ఞానంబు+తెఱంగు= తత్త్వజ్ఞానరీతిని; ఉపదేశింపవే+అనుటయున్= దయచేసి ఉపదేశించుము అని కోరగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; కాశ్యపనామధేయుండు+అగు= కాశ్యపుడని పేరుగల; ఒక్క ధరా+అమరుండు= ఒక బ్రాహ్మణుడు; ఒక్క+ఎడన్= ఒక చోట; విజిత+ఇంద్రియుండును= ఇంద్రియములను జయించినవాడూ; జ్ఞాన విజ్ఞాన శీలియున్= జ్ఞానం, విజ్ఞానం రెండూ కలవాడూ; త్యక్త= వదలిన; సంసార పరిగ్రహుండును= ఇల్లు, ఇల్లాలు కలవాడు; ప్రబుద్ధ సేవితుండును= జ్ఞానులచేత సేవించబడేవాడూ; అగు= అయిన; ఒక్క సిద్ధునిన్+కాంచి= ఒక సిద్ధుడిని చూచి; సంభృత వినయుండు+ఐ= నిండు వినయంతో; శిష్యత్వంబునన్= శిష్యభావంతో; భక్తిన్+ఆశ్రయించినన్= భక్తితో ఆశ్రయించగా; ఆ+మహాద్విజునకున్= ఆ గొప్ప బ్రాహ్మణుడికి; ఆ+మహనీయుండు= ఆ మహాత్ముడైన సిద్ధుడు; చెప్పిన వాక్యంబులు= చెప్పిన మాటలు; చెప్పెదన్= చెప్పుతాను; అవధానంబుతోన్= ఏకాగ్రచిత్తంతో; వినుము+అని= విను మని; పల్కి= చెప్పి; మదీయ వదనంబునన్= నా ముఖంలో; చూడ్కి+నిలిపి= చూపు నిలిపి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విషయానికి (బ్రహ్మపదప్రాప్తికి సంబంధించిన) ఒక కథ ఉన్నది వినుము. నా వద్దకు ఒకసారి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. 'అయ్యా! నాకు తత్త్వజ్ఞానం బోధించండి అని నే నడిగాను. అతడు కాశ్యపు డనే పేరుగల బ్రాహ్మణుడు ఒకచోట ఒక సిద్ధుడిని చూచారని, ఆ సిద్ధుడు ఇంద్రియాలను జయించినవాడని, జ్ఞానం విజ్ఞానం రెండూ తెలిసినవాడని, సంసారాన్ని భార్యను వదలినవాడని, మహాజ్ఞానులుకూడా ఆయనను సేవిస్తారని చెప్పి' తనకు ఆ సిద్ధుడు బోధించిన విషయాలు నాకు చెప్పిన వాక్యాలు నీకు చెప్పుతాను - ఏకాగ్రచిత్తంతో వినుము. అని పలికి నా ముఖంలో చూపు నిలిపి ఇట్లా అన్నాడు.

**విశేషం:** కృష్ణుడు వేదాంతం చెప్పుమని ఒక బ్రాహ్మణుడిని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు కాశ్యపుడికి సిద్ధుడు బోధించిన వాక్యాలు చెప్పాడు. ఆ వాక్యాలను ఆ బ్రాహ్మణుడు కృష్ణుడికి చెప్పాడు. కృష్ణుడు ఆ మాటలను అర్జునుడికి తెలియజేస్తున్నాడు.

జ్ఞానం - లోకరీతికి సంబంధించినది. దీనినే లోకజ్ఞానం అంటాం. వివిధధర్మాలు, న్యాయపద్ధతులు, ఆర్థిక, సామాజిక పరిజ్ఞానం అంతా దీని కిందకు వస్తుంది. విశేషమైన జ్ఞానం విజ్ఞానం. ఇది అలౌకిక జ్ఞానం. ఇది మనిషి మనోజగత్తుకు సంబంధించిన వివేచన. వీటిని మించినది ప్రజ్ఞానం. దీనినే బ్రహ్మపదమంటారు. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే వేదోక్తికి అర్థం ఇదే. ఇక్కడున్నది సత్య శివ సుందరమైన ఆత్మజ్ఞానం. సిద్ధుడు యోగి కాడు. అవధూత కాడు. కేవలం సాధకుడు. అందుకే ఇంద్రియాలను వశంలో ఉంచుకొని, ఇంటిని ఇల్లాలిని వదలి జ్ఞానుల సంపర్కంలో నివసిస్తుంటాడు. ఇతడే 'బోధకుడు'గా తగినవాడు. అందుకే అతడు చెప్పిన కథను కృష్ణుడు వినిపిస్తున్నాడు.

**ఆ. అట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి। త్వాధికుండు నిర్మలాత్మకుండు**
**నతులవినయపరుఁడు నగు విప్రవరుని వీ। క్షించి యిట్టులనియె సిద్ధవరుఁడు** **159**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తన్నున్= తనను; భక్తిన్= భక్తితో; ఆశ్రయించిన= ఉపదేశం కోరి ఆశ్రయించిన; శుచిత్వ+అధికుండు= మిక్కిలి పవిత్రుడు; నిర్మల+ఆత్మకుండు= నిర్మలమైన మనస్సు కలవాడు; అతుల= సాటిలేని; వినయపరుఁడున్+అగు= వినయ శీలియైన, విప్రవరునిన్= బ్రాహ్మణశ్రేష్ఠుడిని; వీక్షించి= చూచి; సిద్ధవరుఁడు= సిద్ధులలో శ్రేష్ఠుడు; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా భక్తిపూర్వకంగా తనను ఆశ్రయించి, ఉపదేశం కోరిన మిక్కిలి పవిత్రుడు, నిర్మలమైన మనస్సుకలవాడు, వినయశీలి అయిన ఆ బ్రాహ్మణుడిని చూచి, సిద్ధుడు ఇట్లా అన్నాడు.

**సీ.** **'పుణ్యంబు లగు కర్మముల నెప్పుడును జేసి। యింపారుచుండు నైహికసుఖంబుఁ**
**త్రిదినంబుఁ బడసితి ధీయుత! యత్యంత। యత్నలబ్ధం బైన యట్టి పదము**
**పదపడి యొక మాత్ర భ్రంశంబు నొంది కా। మక్రోధ ముఖచిత్తముల విశేష**
**ములఁ బొరిఁబొరి జన్మమును మరణంబును। గలుగంగ నేను దల్లులను దండ్రు**

**తే.** **లను సహోదరులను బుత్త్రులను ననేక। జాతి కలితులఁ గాంచితి జున్నుఁ బాలు**
**వివిధభంగుల వానిఁ ద్రావితి సుహృద్వి। యోగధననాశ దుర్దశ లొందెఁ బెక్కు'** **160**

**ప్రతిపదార్థం:** ధీయుత!= బుద్ధిమంతుడా!; పుణ్యంబులు+అగు= పుణ్యప్రదాలైన; కర్మములన్= పనులను; ఎప్పుడునున్+చేసి= ఎల్లప్పుడు చేసి; ఇంపారుచున్+ఉండు= ఇష్టమైన; ఐహిక సుఖంబున్= ఇహలోక సంబంధమైన సుఖాలను; త్రిదివంబున్= స్వర్గాన్ని; పడసితిన్= పొందాను; అత్యంత= మిక్కిలి; యత్నలబ్ధంబు+ఐన+అట్టి+పదము= ప్రయత్నంతో లభించిన అట్లాంటి స్వర్గ పదవిని; పదపడి= పొందిన అనంతరం; ఒక మాత్రన్= ఒక త్రుటికాలంలో; భ్రంశంబున్+ఒంది= జారి; కామక్రోధముఖ= కామం, క్రోధం మొదలైన; చిత్తమల విశేషములన్= మనస్సుకు సంబంధించిన అపరిశుభ్రతలచేత; పొరిన్+పొరిన్= మాటి మాటికి; జన్మమునున్= పుట్టటం; మరణంబునున్= చావటం; కలుగంగన్= కలుగగా; ఏను= నేను; తల్లులనున్; తండ్రులనున్; సహోదరులను= సోదరులను; పుత్త్రులనున్= కుమారులను; అనేక జాతి కలితులన్= చాలా జాతులతో కూడి ఉన్నవారిని; కాంచితిన్= చూచాను; జున్ను పాలు= జున్ను పాలను; వివిధ భంగులవానిన్= రకరకాలను; త్రావితిన్= త్రాగాను; సుహృద్= స్నేహితుల; వియోగ= పోగొట్టుకొనటం; ధననాశ= ధనం పోవటం; దుర్దశలు= చెడ్డ పరిస్థితులు; పెక్కులు= చాలా; ఒందెన్= వచ్చాయి.

**తాత్పర్యం:** బుద్ధిమంతుడా! పుణ్యం కలిగించే కార్యాలను ఎప్పుడూ చేయటంవలన కోరుకొన్న ఐహికసుఖాలను పొందాను. స్వర్గాన్నీ అందుకొన్నాను. మిక్కిలి ప్రయత్నంతో లభించిన అట్లాంటి స్వర్గపదవిని పొందిన అనంతరం ఒక త్రుటికాలంలో భ్రష్టుడినై అక్కడి నుండి జారిపోయి కామం, క్రోధం మొదలైన ఎన్నో అపరిశుభ్రతలకు లోనై మాటిమాటికి పుట్టి చచ్చి ఇట్లా జననమరణచక్రంలో తిరుగుతూ ఉండిపోయాను. ఎంత మంది తల్లులను, తండ్రులను, అన్నదమ్ములను, కొడుకులను చూచానో లెక్కలేదు. ఎన్ని జాతులలో పుట్టానో దానికి లెక్కలేదు. ఎన్నిరకాల చనుబాలను త్రాగానో ఎంతమంది స్నేహితులను పోగొట్టుకొన్నానో ఎంత ధనాన్ని నాశనం చేసికొన్నానో లెక్క చెప్పలేను. ఎన్నో దుర్దశలను అనుభవించాను.

**విశేషం:** ప్రసవమైన తరువాత 5,6 రోజులపాటు తల్లి శిశువుకు ఇచ్చే పాలను 'జున్నుపాలు' అంటారు. అది ఆరోగ్యప్రదం కాదని కొందరన్నా ఆధునికవైద్యం ఆ పాలు చాలా శక్తిమంతమైనవనీ, రోగనిరోధకత అత్యధికంగా ఆ పాలలోనే ఉంటుందని నిరూపించింది. ఈ పద్యంలో ఉన్న జున్నుపాలు చనుబాలే.

**క. మానస శారీరము లగు। నానావేదనల వివిధ నరకగతుల దుః**
**ఖానేకత్వ మొనర్చు వి। మాననవధబంధనప్రమర్దనకృతులన్. 161**

**ప్రతిపదార్థం:** మానస= మనస్సుకు సంబంధించిన; శారీరములు+అగు= శరీరానికి సంబంధించిన; నానా= అనేక; వేదనలన్= బాధలతో; వివిధ= చాలా విధాలైన; నరకగతులన్= నరకబాధల తీరుగా; దుఃఖ+అనేకత్వము+ఒనర్చు= అనేక దుఃఖాలను కలిగించే; విమానన= అవమానం; వధ= చంపటం; బంధన= కట్టివేయటం; ప్రమర్దన= చిత్రహింసచేయటం వంటి కృతులన్= కఠిన కార్యాలను.

**తాత్పర్యం:** నేను పడ్డ శ్రమ అంతా ఇంతా కాదు. మనసుతో బాధపడ్డాను. శరీరంతోనూ బాధపడ్డాను. నరకంలో పడే బాధలన్నీ ఇక్కడే పడ్డాను. అన్నిరకాల దుఃఖాలూ అనుభవించాను. అవమానం పొందాను. ఎన్నో మార్లు చంపగా చచ్చాను. నన్ను కట్టివేశారు. కొట్టి, చిత్రహింసలు పెట్టారు. ఇటువంటి కఠినశిక్షలన్నీ అనుభవించాను. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అనుభవించుచు నుండి విసివి లోకతంత్రంబు పరిత్యజించితిఁ; బదంపడి యాత్మప్రసాదంబున నిట్టి సిద్ధి వడసితి; నింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గల యంత గాలంబును శుభంబ నిరంతరంబై కలుగుచుండు; నే నంతకంతకు నెక్కుడు లెస్సయగు దశలన పొందుదు; బ్రహ్మానందంబు సులభంబ' యని పలికి మఱియును. 162**

**ప్రతిపదార్థం:** అనుభవించుచున్+ఉండి= అనుభవిస్తూ ఉండి; విసివి= విసుగు పుట్టి; లోక తంత్రంబున్= లోకవ్యాపారాన్ని; పరిత్యజించితిన్= పూర్తిగా వదలిపెట్టాను; పదంపడి= ఆ వెనుక; ఆత్మప్రసాదంబునన్= ఆత్మజ్ఞానంచేత; ఇట్టి సిద్ధి+పడసితిన్= ఇట్లాంటి సిద్ధసమాధిస్థితిని పొందాను.; ఇంకన్= ఇక మీదట; లోకంబులన్+ఆలోకింపన్= జగత్తును చూడగా (సాక్షీభూతుడుగా చూడగా); నాకున్= నాకు; ప్రజా+సర్గంబు= మనుష్యులను వదలిపెట్టే స్వభావం; కల+అంత+కాలంబును= ఉన్నంతకాలమూ; శుభంబు+అ= మేలే; నిరంతరంబై= నిరంతరంగా; కలుగుచుండున్= కలుగుతూ ఉంటుంది; ఏను= నేను; అంతకున్+అంతకున్= అంతకంతకూ; లెస్స+అగు= మేలైన (ఉన్నతమైన); దశలన్+అ= దశలనే; పొందుదున్= పొందుతాను; బ్రహ్మానందంబు= బ్రహ్మానందస్థితి; సులభంబు+అ= అందుకొనటం సులభమే; అని పలికి= అని చెప్పి; మఱియునున్= ఇంకా

**తాత్పర్యం:** అట్లా భిన్నబాధలను అనుభవిస్తూ ఉండి విరక్తిపుట్టి, లోకవ్యాపారాన్ని సంపూర్ణంగా వదలిపెట్టిన వెనుక జ్ఞానోదయమై ఆత్మప్రసాదంచేత ఈ సిద్ధసమాధిచేత ఈ సిద్ధసమాధిస్థితి ఏర్పడినది. ఇక లోకాలను సాక్షీభూతుడుగా చూడటంవలన నాకు మనుష్యులతో సంబంధం లేనంత కాలమూ ఎప్పుడూ మంచిదే జరుగుతున్నది. నేను అంతకంతకూ ఉన్నతమైన దశలనే పొందుతాను. చివరికి బ్రహ్మానందస్థితి కూడా కష్ట మేమీ కాదు' అని చెప్పి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఈ కథలోని రహస్యమంతా 'ప్రజాసర్గము' అనేమాటలో ఉన్నది. బంధంవలన క్లేశమూ, విముక్తివలన మోక్షమూ కలుగుతాయి. లోకతంత్రం వదలిపెట్టటమే బంధరాహిత్యం. అపుడు జనులతో (ప్రజ అంటే సంతానం అని, తోడి మనుష్యులని రెండు అర్థాలు ఉన్నాయి. బంధం ఈ ఇరువురిలోనూ ఉంటుంది.) సంసర్గం అంటే బంధం ఉండదు. సర్గం అంటే విసర్జనం. వదలిపెట్టటం. ప్రజాసర్గమంటే మనుష్యులను వదలిపెట్టటం. అందుకే యోగిలక్షణాలను గురించి చెప్తుతూ భగవద్గీతలో 'ఏకాంత' వాసం చేయటం ప్రధానంగా చెప్పారు.

**ఉ. 'ప్రీతుఁడ నైతి నీ దెసఁ బరిస్ఫుటభంగిని జెప్పు మెద్ది నా**
**చేత నుపాస్తిమైఁ బడయఁ జేరితి నీ కది గల్గు నట్లుగాఁ**

**జూతు నవశ్యమున్ వినయసుందర! నన్ను నెఱింగి వచ్చి తీ**
**వీ తెలి వస్మదీయ మతికెక్కిన నిన్నుఁ బరిగ్రహించితిన్.' 163**

**ప్రతిపదార్థం:** వినయసుందర!= వినయంచేత అబ్బిన ఆధ్యాత్మిక సౌందర్యంకలవాడా!; నీ దెసన్= నీ పట్ల; ప్రీతుఁడన్+ఐతిన్= ప్రసన్నతను పొందాను; ఎద్ది= ఏది; ఉపాస్తిమైన్= ఉపాసనతో; నా చేతన్+పడయన్+చేరితి(వి)= నావలన పొందటానికి ఇక్కడికి వచ్చావో; పరిస్ఫుట భంగిన్= స్పష్టంగా; చెప్పుము; నీకున్; అది= ఆ స్థితి; కల్గు+అట్లుగాన్= కలిగే విధంగా; అవశ్యమున్= తప్పకుండా; చూతున్= చూస్తాను (వరమిస్తాను); ఈవు= నీవు; ఈ తెలివిన్= ఈ ఆత్మజ్ఞానంతో; నన్నున్+ఎఱింగి+వచ్చితి(వి)= నన్ను తెలిసికొని వచ్చావు; అస్మదీయ= మా; మతికిన్+ఎక్కిన= మనసుకు వచ్చిన; నిన్నున్= నిన్ను; పరిగ్రహించితిన్= శిష్యుడిగా స్వీకరించాను.

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణోత్తమా! నీలో వినయంచేత అబ్బిన దివ్యసౌందర్యం ఉన్నది. ఆత్మశోధన ఉన్నది. అందుకే నన్ను గురువుగా గుర్తించి వచ్చావు. నీ విషయంలో నేను ప్రసన్నత పొందాను. నీవు మాకు నచ్చావు. నిన్ను శిష్యుడిగా స్వీకరించాను. నన్ను ఉపాసించి ఏమి సాధించదలచుకొన్నావో స్పష్టంగా చెప్పుము. అది నీకు అబ్బేటట్లు తప్పకుండా చేస్తాను.'

**క. అనుడు నతఁడు హర్షించుచు। 'ననుఁ బరతత్త్వ ప్రబోధనమునఁ గృతార్థా**
**త్మునిఁ జేసి జన్మమృతి దుః। ఖ నిరాస మొనర్పు పరమకారుణ్యనిధీ!' 164**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; అతఁడు= ఆ బ్రాహ్మణోత్తముడు; హర్షించుచున్= సంతోషపడుతూ; పరమ కారుణ్యనిధీ!= ఉత్తమ కరుణకు నిధివంటివాడా! (కరుణాసాగరా!); ననున్= నన్ను; పరతత్త్వ ప్రబోధనమునన్= పరతత్త్వాన్ని గురించి ప్రబోధించటం ద్వారా; కృతార్థ+ఆత్మునిన్+చేసి= ధన్యుడిని చేసి; జన్మ= పుట్టుకవలన; మృతి= మరణంవలన; దుఃఖ= పుట్టే దుఃఖం; నిరాసము= (యొక్క) త్యాగం; ఒనర్పుము= కలుగజేయుము.

**తాత్పర్యం:** ఆ విధంగా సిద్ధుడు పలుకగా బ్రాహ్మణుడు చాలా సంతోషించి 'ఓ మహాత్మా! నీవు గొప్ప కరుణా సముద్రుడవు. నాకు పరతత్త్వాన్ని గురించి బోధించి నన్ను ధన్యుడిగా చేయుము. జననమరణాలవలన పుట్టే దుఃఖంనుండి నన్ను దూరం చేయుము. నాకు ఇంక ఏ వరమూ వద్దు' అన్నాడు.

**వ. అనుచుం దచ్చరణంబులు కరంబుల నవలంబించి, ప్రణతి యాచరించి, కేలు మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తముతో నా సిద్ధసత్తముండు 'నీకుం బరిపాటిం జెప్పెన; సావధానమానసుండవై యాకర్ణింపు మని యిట్లనియె.' 165**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; తద్+చరణంబులు= అతడి పాదాలు; కరంబులన్= చేతులలో; అవలంబించి= పట్టుకొని; ప్రణతి= నమస్కారం; ఆచరించి= చేసి; కేలు మొగిలి+ఉన్న= చేతులు జోడించి ఉన్న; ఆ+ఉర్వీసుర+ఉత్తమునితోన్= ఆ బ్రాహ్మణోత్తముడితో; ఆ సిద్ధసత్తముండు= ఆ సిద్ధోత్తముడు; నీకున్+పరిపాటిన్+చెప్పెదన్= నీకు ఈ విషయాన్ని క్రమంగా చెప్పుతాను; స+అవధాన మానసుండవు+ఐ= ఏకాగ్రచిత్తం కలవాడై; ఆకర్ణింపుము+అని= వినుమని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అంటూ అతడి పాదాలను చేతలతో పట్టుకొని నమస్కారం చేసి చేతులు జోడించి ఉన్న ఆ బ్రాహ్మణుడితో ఆ సిద్ధుడు 'నీకు ఈ విషయం ఒక క్రమంలో చెప్పుతాను. ఏకాగ్రచిత్తంతో వినుము' అంటూ ఇట్లా చెప్పాడు.

**ఆ. 'ధర్మసాధనంబు దనువు; ధర్మము పరి। జ్ఞానదాయి యట్లు గాన తనువు**
**నోమవలయు మర్త్యుఁ డేమిటి నేమఱ। కాత్మహితము గోరి యనఘచరిత! 166**

**ప్రతిపదార్థం:** అనఘచరిత!= ఓ పుణ్యచరిత్రుడా!; తనువు= ఈ శరీరం; ధర్మసాధనంబు= ధర్మాన్ని సాధించటానికి గొప్ప ఉపకరణం; ధర్మము= మరి ఆ ధర్మం; పరిజ్ఞానదాయి= విశిష్టమైన మోక్షజ్ఞానాన్ని ఇస్తుంది; అట్లు+కాన= అందుచేత; మర్త్యుఁడు= మనుష్యుడు; ఏమిటన్= ఏ విధంగానైనా సరే; ఏమఱక= ఏమరకుండా; ఆత్మహితము+కోరి= తన శ్రేయస్సును కోరి; తనువున్= శరీరాన్ని; ఓమన్+వలయున్= రక్షించుకొనాలి.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్మా! ధర్మసాధనకు ఈ శరీరం ఒక గొప్ప సాధనం. మరి ధర్మం విశిష్టమైన మోక్షజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఈ కారణంచేత మనుష్యుడు ఏ విధంగానైనా సరే ఏమరకుండా తన శ్రేయస్సును కోరి, శరీరాన్ని రక్షించుకొనాలి.

**విశేషం:** దేహాన్ని నిర్లక్ష్యం చేస్తే తరువాత ఏ సాధనా చేయజాలము. అందుకే 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' అని కాళిదాస మహాకవి కూడా శివుడిచేత అనిపించాడు. మనం చేసే సాధనల జయాపజయాలకు ఆధారం కూడా దేహమే. దానిని ఆరోగ్యంగా దృఢంగా ఉత్సాహవంతంగా సంరక్షించుకొంటే, వాక్కు, మనస్సు రెండూ నియంత్రణలో ఉంటాయి. ఈ మూడింటినీ కలిసి 'త్రికరణాలు' అంటారు. ఈ మూటి శుద్ధి లేనిదే యోగం సిద్ధించదు. ఏ విధంగా దేహాన్ని నిర్లక్ష్యం చేస్తామో దాని ఫలితాలు ఎట్లా ఉంటాయో తరువాత వివరిస్తున్నాడు.

**వ. ఏమఱుటల తెఱంగు వివరించెద. 167**

**ప్రతిపదార్థం:** ఏమఱుటల= ఏమరుపాటుల; తెఱంగు= పద్ధతులను; వివరించెదన్= వివరిస్తాను.

**తాత్పర్యం:** ఏమరుపాటు పొందే పద్ధతులను వివరిస్తాను వినుము.

**సీ. తన సత్త్వమును బలంబును దన కయ్యెడు। కాలంబు నారయఁగాఁ దలంపఁ**
**డాహారముల గొను నవియును నగునవి। గానివి యను వివేకంబు బుద్ధిఁ**
**జొనుపఁడు బహుళభోజన మొక మరి సేయు। నొక మరి దుర్నిష్ఠ నుపవసించు**
**గతకాలమును నపక్వంబును గురుదుష్ట। విషమవిరుద్ధము విపులరసము**

**తే. నైన యన్నము దా నరయక భుజించుఁ। గుడుపుపైఁ గుడ్చు దిననిద్ర గూరు సురత**
**పరత నొందుఁ బె ల్లాయాసపడు విమూఢుఁ। డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి.' 168**

**ప్రతిపదార్థం:** విమూఢుఁడు= మందబుద్ధి; తన సత్త్వమునున్= తన స్వభావ సిద్ధగుణాన్ని; బలంబునున్= శక్తిని; తనకున్+అయ్యెడు+కాలంబున్= తన కాలనియమాన్ని; అరయఁగాన్+తలంపఁడు= పూర్తిగా గ్రహించడు; ఆహారములు+కొనున్= తిండ్లు తింటాడు; అవియును= అవికూడా; అగునవి= సరిపడేవి; కానివి= సరిపడనివి; అను వివేకంబు= అనే విచక్షణను; బుద్ధిన్+చొనుపఁడు= బుద్ధిలోనికి ప్రవేశింపనీడు; ఒక మరి= ఒక సారి; బహుళభోజనము+చేయున్= మిక్కిలిగా తింటాడు; ఒక మరి= మరొకసారి; దుర్నిష్ఠన్= భయంకరమైన నిష్ఠతో; ఉపవసించున్= ఉపవాసం ఉంటాడు; గతకాలమునున్= వండి చాలా కాలమైనదీ; అపక్వమునున్= సరిగా ఉడకనిది; గురు= తొందరగా పాకం కానిదీ; దుష్ట= పదార్థదోషం కలిగినదీ; విషమ= విరుద్ధపదార్థాల కలయిక కలిగినదీ;

విరుద్ధము= సమయానికి వ్యతిరేకమైనదీ; విపులరసమున్+ఐన+అన్నమున్= మిక్కిలి జావగా ఉన్న అన్నాన్ని (ఆహార పదార్థాలను); తాన్= తాను; అరయక= మంచి చెడులు పట్టించుకొనక; భుజించున్= తింటాడు; కుడువుపైన్= తిండిపైన (అనగా తిన్న వెంటనే); కుడ్చున్= మళ్ళీ తింటాడు; తినన్= తిన్నవెంటనే; నిద్రన్+కూరున్= నిద్రలో మునిగిపోతాడు; సురత పరతన్+ఒందున్= మైథునంలో పరవశుడైపోతాడు; పెల్లు+ఆయాసపడున్= మిక్కిలి ఆయాసపడతాడు; (అట్లాంటి) అతనిన్= ఆ వ్యక్తిని; దోషత్రయంబు= వాత, పిత్త, శ్లేష్మాలనబడే త్రిదోషాలు; కెరలి= విజృంభించి; బాధించున్= బాధిస్తాయి.

**తాత్పర్యం:** మూర్ఖుడైనవాడు తన స్వభావసిద్ధ గుణాన్ని, శక్తిని, తన కాలనియమాన్ని గుర్తించకుండానే ఆహారం తింటూ ఉంటాడు. ఆ ఆహారము తనకు సరిపడుతుందా? సరిపడదా? అనే విచక్షణను కూడా మనస్సులోనికి రానీయకుండా తింటుంటాడు. ఒక్కొక్కసారి విపరీతంగా తింటాడు. మరొక్కసారి భయంకరంగా నిష్ఠనుపూని ఉపవాసం చేస్తాడు. వండి ఎంతోకాలం గడిచిపోయినవి, సరిగా ఉడకనివి, తొందరగా పాకం కానివి, పదార్థదోషం కలిగినవి, విరుద్ధపదార్థాల కలయిక కలిగినవీ, సమయానికి వ్యతిరేకమైనవీ, మిక్కిలి జావగా ఉన్నవీ అయిన ఆహారపదార్థాలను మంచిచెడులు పట్టించుకొనకుండా తింటాడు. తిన్నవెంటనే మరల తింటాడు. తినిన వెంటనే నిద్రలోనికి జారిపోతాడు. మైథునంలో పరవశుడై మిక్కిలి ఆయాసపడతాడు. అట్లాంటి వ్యక్తిని వాతపిత్తశ్లేష్మాలు విజృంభించి బాధిస్తాయి.'

**విశేషం :** అన్ని రోగవికారాలకు మూలం ఆహారమే అన్నది ఆయుర్వేద సిద్ధాంతం. తన సహజగుణం 'పిత్త' మని గుర్తించాక దానికి విరుద్ధమైన ఆహారం గ్రహిస్తే ఏమవుతుంది? అట్లాగే తన శక్తికి మించి తినవచ్చునా? కాలనియమం అక్కరలేదా? ఈ మూడూ ఎవడు పట్టించుకొనడో వాడికి ఆహారమే శత్రువు అవుతుంది.

అట్లాగే విపరీతంగా తినటమూ, అతికఠినంగా ఉపవసించటమూ రెండూ అనారోగ్యకారణాలే. వేడిగా ఉన్నప్పుడే తినాలి. వంటలో వాడే పదార్థాల నడుమ ఒక ఆనుకూల్యం ఉంటుంది. దానిని అట్లాగే పాటించటం ఆయా ప్రాంతాలలో మంచిదని ఆయుర్వేదం చెప్పుతున్నది. తిన్నవెంటనే నిద్రించరాదు. కొంతసేపు తిరగాలి (భుక్త్వా శతపదం గచ్ఛేత్ - తిని నూరు అడుగులు నడవాలి). నిద్ర మొదలుపెట్టిన వెంటనే 'సంగమం' నిషిద్ధం. ఇట్లాంటి దుష్ప్రవర్తన ఆహారవిషయంలోను, విహారంలోను ఉన్నప్పుడు వాత, పిత్త, శ్లేష్మాలు ప్రకోపిస్తాయి. వాటి మూలానే అన్ని సమస్యలూ ఉత్పన్నమవుతాయి.

**వ. అని చెప్పి. 169**

**ప్రతిపదార్థం:** అని చెప్పినవాడై- తరవాతి పద్యంతో అన్వయం.

**శ్లేష్మాది రోగవికారంబుల నిరూపించుట (సం.14-17-14)**

**ఆ. 'అర్హకర్మలోప మపచయ మొనరించు। ననఘ! దేహమున కనర్హవేగ**
**ధారణములు రోగతతి జనింపఁగఁ జేయుఁ। గామరోషములను గాయ మెడలు. 170**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; అర్హ= తగిన; కర్మ= పనిని; లోపము= చేయకుండటం; దేహమునకున్= శరీరానికి; అపచయమున్= లోపాన్ని; ఒనరించున్= కలిగిస్తున్నది; అనర్హ= తగని; వేగధారణములు= ఉద్రిక్తతలను పొందటం; రోగతతిన్= రోగ సముదాయాన్ని; జనింపఁగన్+చేయున్= పుట్టిస్తాయి; కామ= కామంతోనూ; రోషములను= రోషంతోనూ; కాయము= శరీరం; ఎడలున్= నశిస్తుంది.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్మా! తగిన పనిని చేయకుండా ఉండటం దేహస్థితిని మార్చివేస్తుంది. తగని ఉద్రేకాలు పుట్టుతాయి. వాటితో అన్నిరోగాలూ పుట్టుకొనివస్తాయి. కామక్రోధాదులు విజృంభించి దేహాన్ని నశింపజేస్తాయి.

**విశేషం :** మనిషి దేహాన్ని కాపాడేది ఎప్పుడు ఏది ఎట్లా చేయాలో అట్లా చేయటం. అని సారాంశం. అపచయమంటే 'కోత' సుకర్మ దేహాన్ని పోషిస్తుంది. దుష్టకర్మ దేహాన్ని కోస్తుంది.

**క. అత్యంతప్రబలంబులు। పైత్యవికారములు రేఁగి ప్రాణములకు శీ**
**ఘ్రాత్యయముం జేయు మహౌ। ద్ధత్యంబున నెలవు వెడల దఱిమి సుచరితా! 171**

**ప్రతిపదార్థం:** సుచరితా!= పుణ్యచరితా!; అత్యంత= మిక్కిలి; ప్రబలంబులు= బలిష్ఠాలైన (శక్తి మంతాలైన); పైత్య వికారములు= పైత్యాది గుణాల వికారాలు; రేఁగి= విజృంభించి; మహా+ఔద్ధత్యంబునన్= గొప్ప విజృంభణతో (పట్టరాని రీతిలో); నెలవు= స్థానం; వెడలన్+తఱిమి= వదలిపోయేటట్లుగా తరిమికొట్టి; ప్రాణములకున్= ప్రాణాలకు; శీఘ్ర+అత్యయమున్= తొందరగా వదలిపోవటాన్ని; చేయున్= కలగ చేస్తాయి.

**తాత్పర్యం:** పుణ్యచరిత్రుడా! మునుపు చెప్పిన ఆహారవిహారాదుల నియమరాహిత్యంచేత పైత్యవికారాదులు పుట్టుతాయి. అవి రేగితే వాటిని నియంత్రించటం దుస్సాధం. వాటి ఉద్ధతికి తట్టుకొనజాలని ప్రాణాలు తమతమ నెలవులు వదలి పారిపోతాయి. (అంటే మనిషి మరణానికికూడా దారితీస్తాయని అర్థం).

**తే. అవ్వికారంబు లెక్కుడై యడరి యెచ్చ। టెచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ**
**నామకంబులు మర్మభిన్నత్వ మెట్లు। సేయకుండుఁ బరిచ్యుతి జీవమునకు? 172**

**ప్రతిపదార్థం:** ఆ+వికారంబులు= ఆ వికారాలు; ఎక్కుడు+ఐ= అధికమై; అడరి= విజృంభించి; ఎచ్చటు+ఎచటు= ఎక్కడెక్కడ; భిన్నంబు+చేయున్= నాశనం చేస్తాయో; ఆ+ఎడలు= ఆ చోటులు; మర్మనామకంబులు= మర్మస్థానాలని పిలువబడుతాయి; మర్మభిన్నత్వము= మర్మావయవాలు నశించటం; జీవనమునకున్= జీవానికి; పరిచ్యుతిన్= నాశనాన్ని; ఎట్లు+చేయక+ఉండున్?= ఎట్లా కలిగించకుండా ఉంటుంది?

**తాత్పర్యం:** ఆ వికారాలు విజృంభించి మర్మస్థానాలను దెబ్బతీస్తాయి. మర్మస్థానాలు దెబ్బతినటమంటే ప్రాణాలు పోవటమనే అర్థం.

**విశేషం :** ఆధునిక పాశ్చాత్యవైద్యం రోగాలను గుర్తించే పద్ధతికంటె ఆయుర్వేదపద్ధతి భిన్నం. ఆయుస్సును పెంచే ఆరోగ్యపద్ధతులు ఆహారవిహారనియమాలు. ఈ రెంటినీ పాటించనివాడిలో వాత, పిత్త, శ్లేష్మ వికారాలు విజృంభిస్తాయి. వికారమంటే 'అసాధారణ స్థితి' అని అర్థం. శ్లేష్మవాతాలు పిత్తంలో కలిసి, పిత్త శ్లేష్మాలలో వాతం కలిసి, వాతంలో పిత్త శ్లేష్మాలు కలిసి - ఇట్లా పొందే అసాధారణ స్థితివలననే గుండె, మెదడు, మూత్రపిండాలు, శ్వాసకోశాలు (ఇవే మర్మావయవాలు) ఎట్లా దెబ్బతింటాయో ఈ పద్యంలో వివరించబడింది. ప్రాణహాని వీటివల్లనే వస్తుందని అర్థం.

**క. వినుము తెలియంగ శ్లేష్మం। బను దోషం బారఁ బరగి యవయవములు జా**
**డ్యనిరూఢంబులుగాఁ జే। యును లోపలి బయలు నెల్ల నొయ్యన కప్పున్. 173**

**ప్రతిపదార్థం:** శ్లేష్మంబు+అను దోషంబు= శ్లేష్మమనే దోషం; ఆరన్+పరఁగి= బాగా వ్యాపించి; అవయవములు= దేహంలోని భిన్న అవయవాలను; జాడ్య= రోగ; నిరూఢంబులుగాన్= కలిగిన స్థానాలుగా; చేయును= చేస్తుంది; లోపలి+బయలున్+ఎల్లన్= అంతర్బాహ్య శరీరాన్ని అంతటినీ; ఒయ్యనన్= క్రమక్రమంగా; కప్పున్= ఆక్రమిస్తుంది; తెలియంగన్= బాగా; వినుము.

**తాత్పర్యం:** ఇక శ్లేష్మం ఎట్లాంటిదో చెప్పుతాను వినుము. శ్లేష్మదోషం ఏఏ అవయవంమీద వ్యాపిస్తుందో అది రోగ స్థానం అవుతుంది. అంతే కాదు; క్రమక్రమంగా లోపలి, బయటి ఇంద్రియాలన్నింటినీ శ్లేష్మం ఆక్రమించే లక్షణం కలిగినది.

**వ. పదంపడి. 174**

**తాత్పర్యం:** ఆ తరువాత (తరువాతి పద్యంతో అన్వయం)

**క. కుత్తుకకు నడ్డుపడు, నూ। ర్పొత్తిలి పోనీక యాఁగు, నూర్ధ్వశ్వాసం**
**బెత్తఁగఁ జేయును; జీవుం। డత్తనువున నుండనేర కంతట వెడలున్. 175**

**ప్రతిపదార్థం:** కుత్తుకకున్= గొంతుకు; అడ్డుపడున్= అడ్డుపడుతుంది; ఊర్పు= ఊపిరి; ఒత్తిలిపోనీక= ప్రక్కకు తప్పించుకొని పోనీయకుండా; అఁగున్= ఆపుతుంది; ఊర్ధ్వశ్వాసంబు= ఎగ ఊపిరి; ఎత్తఁగన్+చేయును= పీల్చేటట్లు చేస్తుంది (ప్రాణోత్క్రమణ సమయంలోనే అట్లా పీల్చుతారు); జీవుండు; అంతటన్= అపుడు; ఆ తనువునన్= ఆ శరీరంలో; ఉండన్+నేరక= ఉండలేక; వెడలున్= బయటికి వెళ్ళిపోతాడు.

**తాత్పర్యం:** ఆ శ్లేష్మగుణం (కళ్ళె మొదలైన రూపాలలో) గొంతుకలో అడ్డుపడుతుంది. దానివలన ఊపిరి సజావుగా పీల్చుకొనటానికి వీలుండదు. అపుడు ఎగశ్వాసతో ప్రాణం చాలా ఇబ్బందిపడుతుంది. జీవుడు ఇక ఆ శరీరంలో ఉండలేక బయటికి వెళ్ళిపోతాడు. ఈ విధంగా శ్లేష్మం ప్రాణాంతకమవుతుంది.

**క. స్రోతోమార్గంబులఁ జూ। వే తమ కర్థంబు లైన విషయంబులఁ బ్ర**
**స్ఫీతమతిం జాతుర్యో। పేతములై యింద్రియంబు లేనును బట్టున్. 176**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు+ఏనునున్= ఐదు ఇంద్రియాలు; ప్రస్ఫీతమతిన్= ప్రకాశించే బుద్ధితో; చాతుర్య+ఉపేతములు+ఐ= నేర్పుతో కూడినవై; తమకున్+అర్థంబులు+ఐన= తమకు తమకు తగిన; విషయంబులన్= విషయ సుఖాలను; స్రోతస్+మార్గంబులన్= నవరంధ్రాల ద్వారా; పట్టున్= అనుభవిస్తాయి; చూవే!= సుమా!

**తాత్పర్యం:** కాళ్ళు; చేతులు మొదలైన అవయవాలు బుద్ధిచేత ప్రబోధించబడి మిక్కిలి నేర్పుతో నోరు, ముక్కు, చెవులు మొదలైన నవరంధ్రాల ద్వారా తమకు ఏ విషయసుఖాలు కావాలో వాటిని అనుభవిస్తుంటాయి సుమా!

**విశేషం :** వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు కర్మేంద్రియాలు. త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణాలు మొదలైనవి జ్ఞానేంద్రియాలు. నోరు, ముక్కురంధ్రాలు, చెవులు, కళ్ళు, పాయు, ఉపస్థలు నవద్వారాలు, మనిషి పొందే సుఖాలను విషయసుఖాలంటారు. కళ్ళద్వారా చూస్తాము. నోటిద్వారా తింటాము. ఇట్లాగే ఇతర అవయవాల విషయమూ గ్రహించవచ్చును. నేర్పుతో అనుభవించటం అంటే ఆ సుఖాన్ని అనుభవిస్తున్నామన్న స్పృహకూడా కలుగకుండా అనుభవించటం అని అర్థం.

**క. స్రోతోమార్గములు గఫము। చేత నిరుద్ధంబు లైనఁ జెడు నింద్రియజా**
**తాతతశక్తులు దానను। వీతములగుఁ జేష్టితములు విను మనుజులకున్. 177**

**ప్రతిపదార్థం:** విను= జాగ్రత్తగా వినుము; మనుజులకున్= మనుష్యులకు; స్రోతస్+మార్గములు= నవరంధ్రాది మార్గాలు (స్రోతమంటే జారటం, కారటం, ప్రవహించటం అని అర్థం); కఫముచేతన్= కళ్ళెచేత; విరుద్ధంబులు+ఐనన్= అడ్డుపెట్టబడగా ఇంద్రియజాత=

ఇంద్రియసమూహానికి చెందిన; ఆతత= గొప్ప; శక్తులున్; చెడున్= నశిస్తాయి; దాననున్= దానితో; చేష్టితములు= ఇంద్రియ కార్యకలాపాలు; వీతములు+అగున్= ఆగిపోతాయి.

**తాత్పర్యం:** ఎప్పుడైతే కళ్ళె నవరంధ్రాలకు అడ్డుపడుతుందో అప్పుడు ఇంద్రియశక్తులు నశిస్తాయి. దానితో అన్ని అవయవాల కార్యకలాపాలూ స్తంభించిపోతాయి.

**తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి। నొవ్వుఁ దెవులును బుట్టించుఁ, గ్రొవ్వు సెఱుచు,**
**సందు లెడలించుఁ గ్రమమున నెందుఁ బరఁగి। తనువు ధ్రానుగఁ జేసి జీవుని వెలార్చు. 178**

**ప్రతిపదార్థం:** వాయువు= నాశమనే దోషం; అంగంబులందున్= అవయవాలలో; దుర్వ్యాప్తిన్= మిక్కిలి అనియంత్రితంగా వ్యాప్తిపొంది; కదిరి= విజృంభించి; నొవ్వున్= బాధను; తెవులునున్= రోగాన్ని; పుట్టించున్= పుట్టిస్తుంది; క్రొవ్వు= మదాన్ని; చెఱుచున్= నశింపజేస్తుంది; సంధులు= సంధిస్థానాలను; ఎడలించున్= బలహీనపరుస్తుంది; క్రమమునన్= మెల్లగా; ఎందున్= అన్నిచోట్లా; పరఁగి= వ్యాపించి; తనువున్= శరీరాన్ని; ధ్రానుగన్+చేసి= కొయ్యబారేటట్లు చేసి; జీవునిన్= ప్రాణాన్ని; వెలార్చున్= బయటికి పడవేస్తుంది.

**తాత్పర్యం:** వాతదోషం అన్ని అవయవాలలోనూ అనియంత్రితంగా వ్యాపించి విజృంభిస్తుంది. బాధను, రోగాన్ని కలిగిస్తుంది. క్రొవ్వును కరగించి, సంధిస్థానాలను బలహీనపరుస్తుంది. క్రమంగా అన్ని చోట్లా వ్యాపించి, దేహాన్ని కొయ్యబారేటట్లు చేస్తుంది. చివరికి ప్రాణం పోయేటట్లు కూడా చేస్తుంది.

**విశేషం :** 'పక్షవాతం' మొదలైన రోగాలు సరిగ్గా ఇట్లాగే వ్యాపిస్తాయి. సంధులు అంటే కీళ్ళు అని అర్థం. అందుకే 'అజీర్ణేన వినా వాతం (న భవతి) 'అజీర్తి' లేకుండా 'వాతం' రాదు అని ఆయుర్వేదం చెప్పుతున్నది. అనియతాహారం అనియతమైన వాతానికి మూల మవుతుందని భావం.

**క. నాలుక యాడుట కేలుం। గాలు ముడుఁపఁ జాఁప నగుట కాయంబున యం**
**దీ లీలలు వాయుగతుల్। మేలే నివి గలుగుఁ దక్కు మే లమలాత్మా! 179**

**ప్రతిపదార్థం:** అమల+ఆత్మా!= పుణ్యాత్మా!; నాలుక+ఆడుట= నాలుక ఆడటం; కేలున్+కాలున్+ముడుఁపన్+చాఁపన్+అగుట= చేతులు, కాళ్ళు ముడవటానికి, చాపటానికి కావటం; కాయంబున+అందున్= దేహంలో; ఈ లీలలు= ఈ పనులు; వాయుగతుల్= వాతగుణానికి చెందిన వ్యాపకధర్మాలు; మేలు+ఏని= సక్రమంగా ఉంటే; ఇవి కలుగున్= ఈ పనులూ ఉంటాయి; తక్కు+మేలున్= తక్కువ, ఎక్కువలు కూడా; కలుగున్= కలుగుతుంటాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! నాలుకను కదలించటం, చేతులు కాళ్ళు ముడవటం, చాపటం మొదలైన పనులు దేహంతో వాతగుణప్రసారధర్మాలు సరిగా ఉంటేనే చేయగలుగుతాము. లేకపోతే ఎక్కువ తక్కువలు అవుతాయి. (అంటే ఆ పనులు సక్రమంగా చేయలేమని అర్థం).

**విశేషం :** ఇప్పటికీ పక్షవాతవ్యాధిని గుర్తించటానికి నాలుకను ఆడించుమంటారు. చేతులు, కాళ్ళు చాపుమంటారు, ముడువుమంటారు. వాతప్రకోపంవలన ఈ పనులు చేయలేకపోతారు. వాతం నియతంగా ఉంటే ఈ పనులు చేయగలుగుతాము. అందువలన వాతంలోని మేలు కీళ్ళే ఈ సమస్యలకు మూలమని అర్థం.

**క. ఎక్కటి యిట్టివి దోషము। లొక్కొకమఱి రెండు మూఁడు నొదవి బెరయుఁ దా**
**నక్కీడు సన్నిపాతం। బక్కజముగఁ దనువుఁ బాపునది జీవాత్మున్. 180**

**ప్రతిపదార్థం:** ఎక్కటి= ఒక్కొక్కటి; ఇట్టివి దోషములు= ఇట్లాంటి దోషాలు; ఒక్కొక మఱి= ఒక్కొక్కసారి; రెండు+మూఁడున్+ఒదవి= రెండు మూడు కలిసి; బెరయున్= (ఒకచోట) చేరుతాయి; తాను+ఆ+కీడు= అట్లాంటి అపాయం; సన్నిపాతంబు= సన్నిపాతం; అది= ఆ రోగం; జీవాత్మున్= ప్రాణాన్ని; తనువున్+పోవున్= శరీరాన్ని వదలిపోయేటట్లు చేస్తుంది.

**తాత్పర్యం:** ఒక్కొక్కటిగా ప్రవర్తించే ఈ దోషాలు ఒక్కొక్కసారి రెండు మూడు కలిసి ఒకచోట చేరితే పుట్టే మహావ్యాధి సన్నిపాతం. అది చివరికి ప్రాణాన్నే తీస్తుంది.

**విశేషం :** సన్నిపాతం - బాలెంతరాళ్ళలో 'సంధి' రూపంలో జ్వర, మూర్ఛ, మానసిక దౌర్బల్యాది రూపాలలో ఉంటుంది. పిల్లలలో వివిధాలుగా రూపం దాలుస్తుంది. ఆయుర్వేదం దీన్ని త్రిదోషజన్యంగా గుర్తిస్తుంది. ముందు దోషాన్ని పోగొట్టాలి తప్ప రోగాన్ని మరోచోటికి తరిమేది కాకూడదని ఈనాడు వైద్యరంగంలో విజ్ఞులందరూ అంగీకరిస్తున్నారు. త్రిదోషమీమాంస ఈ దృష్టితో చాలా ప్రధానమైనది. వాతపిత్తశ్లేష్మాలు మూడూ మరణాంతకాలు అవుతాయన్నది ఈ వివరణ సారాంశం.

**క. ఈ విధమున వెడలి చనిన। జీవుఁడు నిజకర్మజాలసిద్ధగతులకుం**
**బోవుం; దద్భవసుఖ దుః। ఖావేశముఁ బొందుచుండు నయ్యె యెడలన్. 181**

**ప్రతిపదార్థం:** ఈ విధమునన్= ఈ రీతిగా; వెడలి చనిన= బయటపడిన; జీవుఁడు= ప్రాణధారి; నిజకర్మజాల= తానుచేసిన కర్మసమూహాలవలన; సిద్ధ= సిద్ధంగా ఉన్న; గతులకున్= పుణ్య పాపగతులకు; పోవున్= వెళ్ళుతాడు; తద్+భవ= ఆయా పుణ్యాపాప గతులవలన పుట్టిన; సుఖ+దుఃఖ+ఆవేశమున్= సుఖదుఃఖభావాలను; ఆ+ఆ+ఎడలన్= ఆయా సందర్భాలలో; పొందుచుండున్+ ఉండున్= పొందుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఈ రీతిగా బయటపడ్డ జీవుడు తాను చేసిన పుణ్యాపాపాదికర్మలవలన సిద్ధంగా ఉన్న గతులను చెందుతాడు. ఆయా గతులవలన పుట్టిన సుఖదుఃఖాలను ఆయా సందర్భాలలో పొందుతూ ఉంటాడు.

**విశేషం:** జీవం అంటే ప్రాణం. జీవధారి ఎవడోవాడు జీవుడు. దేహం వేరు. జీవుడు వేరు. జీవుడు దేహంలో ఉండటంవలన వాడు 'మనిషి' అవుతున్నాడు. జీవుడు వెళ్ళిపోగానే 'శరీరం' (శవం) అవుతున్నాడు. కనుక జీవుడి రాకపోకలను గురించి చెప్పుతున్నాడు.

**క. కృతకర్మఫలము దెగఁ గుడి। చి తనకుఁ దగినట్టి పుట్టు సెందు మగుడ ని**
**ట్టి తెఱంగున జీవాత్ముఁడు। గతాగతము లనుభవించుఁ గల్మషరహితా! 182**

**ప్రతిపదార్థం:** కల్మషరహితా!= పాపరహితుడా!; జీవాత్ముఁడా= జీవుడు; కృతకర్మఫలము=చేసిన కర్మల ఫలితము; తెగన్+కుడిచి= సంపూర్ణంగా అనుభవించి; తగిన+అట్టి= తగిన; పుట్టు= జన్మను; చెందున్= పొందుతాడు; మగుడన్= మళ్ళీ; ఇట్టి తెఱంగునన్= ఇదే విధంగా; గత+ఆగతములన్= పోయినదానిని, వచ్చినదానిని; అనుభవించున్= అనుభవిస్తాడు.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడా! వినుము. జీవుడు తాను చేసిన పాపపుణ్యకర్మల ఫలాన్ని సంపూర్ణంగా అనుభవించి తగిన జన్మను పొందుతాడు. మళ్ళీ ఇట్లాగే జననమరణాలను అనుభవిస్తూ ఉంటాడు.

**విశేషం:** జీవాత్ముడు అంటే జీవుడే. ఒక నిర్దిష్టవస్తుగతమైన ఆత్మను జీవాత్మ డంటారు. సర్వసృష్టిలోనూ వ్యాపించిన ఆత్మను పరమాత్ముడంటారు.

గతం - పోయినది (మరణం); ఆగతం - వచ్చినది. జన్మం. ఒక శరీరం పోయి మరో శరీరం వస్తున్నది - కనుక జనన

మరణాలని అర్థం. 'పునరపి జననం, పునరపి మరణం - పునరపి జననీ జఠరే శయనం' అని శ్రీ శంకరాచార్యులవారు బోధించినది. ఈ జన్మమరణతత్త్వాన్నే.

**క. పాపాత్ములు నరకముఁ బు । ణ్యోపేతులు దివము విధి నియుక్తి నవశతం**
**బ్రాపింతురు గావున ని । ర్లేపంబగు మోక్ష మొందలే రట్టి జనుల్. 183**

**ప్రతిపదార్థం:** విధి నియుక్తిన్= విధి నియామకంచేత; అవశతన్= తప్పకుండా; పాపాత్ములు= పాపంచేసినవారు; నరకమున్= నరకాన్ని; పుణ్య+ఉపేతులు= పుణ్యంతో కూడుకొన్నవారు; దివమున్= స్వర్గాన్ని; ప్రాపింతురు= పొందుతారు; కావునన్= అందుచేత; నిర్లేపంబు+అగు= ఏ బంధమూ లేని; మోక్షము= మోక్షస్థానాన్ని; అట్టి జనుల్= అట్లాంటివారు; ఒందలేరు= పొందజాలరు.

**తాత్పర్యం:** విధి నియామకంచేత పాపంచేసినవారు నరకాన్ని, పుణ్యం చేసినవారు స్వర్గాన్ని అవశ్యం పొందుతారు. అందుచేత ఏ బంధస్పర్శా లేని మోక్షాన్ని వీరెవరూ పొందలేరు.

**విశేషం:** స్వర్గనరకాలు రెండూ అంతర్దశలే తప్ప చివరి స్థితులు కావు. 'తే తం భుంక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి'(ఆ స్వర్గంలో పుణ్యఫలాన్ని అనుభవించి ఆ పుణ్యఫలం కాస్తా అయిపోగా తిరిగి మానవలోకంలో పుట్టుతారు) అని గీత చెప్తున్నది.కనుక పుణ్యాపాపకార్యాల బంధంలేని జ్ఞానులు మాత్రమే మోక్షస్థానాన్ని పొందగలరని ఈ వివరణకు అర్థం. విధి-అంటే బ్రహ్మ,ధర్మం,శాస్త్రం అని అర్థాలున్నాయి. ఈ సందర్భాన్నిబట్టి 'అనీ అర్థం చెప్పవచ్చును. 'శాస్త్రవిధి' అనికూడా చెప్పవచ్చును.

**తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి । నెలవు లార్యులు శాస్త్రసునిశ్చయమునఁ**
**గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ । దెలియునట్లుగఁ జెప్పెద ధీసమగ్ర! 184**

**ప్రతిపదార్థం:** ధీసమగ్ర!= సమగ్ర బుద్ధిగలవాడా!; ఊర్ధ్వగతికిన్= ఊర్ధ్వలోకాలకు; ఏఁగు= వెళ్ళేటటువంటి; మానవులు= మనుష్యులు; ఉండు+అట్టి= ఉండేటటువంటి; నెలవులు= స్థానాలు (లోకాలు); ఆర్యులు= పెద్దలు; శాస్త్ర సునిశ్చయమునన్= శాస్త్రాలచేత బాగా నిర్ణయం చేయబడిన రీతులలో; కని= చూచి; ఎఱింగింతురు= చెప్తుతారు; నీకున్+తెలియునట్లుగన్= నీకు బాగా తెలిసే విధంగా; చెప్పెదన్= చెప్తుతాను; అని= ఆ విషయాలను; నీవు వినుము= నీవు శ్రద్ధతో వినుము.

**తాత్పర్యం:** బుద్ధిమంతుడా! వినుము. ఊర్ధ్వలోకాలకు వెళ్ళే జనులు ఏ ఏ స్థానాలలో ఉంటారో పెద్దలు శాస్త్రాలచేత నిర్ణయించబడిన రీతిలో దర్శించి, మునుపే చెప్పి ఉన్నారు. ఆ లోకాలను గురించి నీకు బాగా తెలిసే విధంగా చెప్తుతాను. శ్రద్ధగా ఆలకించుము.

**విశేషం :** స్వర్గలోకంతోపాటు వేరే ఊర్ధ్వలోకా లున్నాయని అర్థం.

**తే. సోముఁ డనఁ దారకము లన సూర్యుఁ డనఁగ । గలుగు తేజస్విమూర్తుల నెలవు లందు**
**ధర్మపరు లుండుదురు తారతమ్యములకు । మనసు లెఱియునట్టివి గడుమంచి వగునె? 185**

**ప్రతిపదార్థం:** సోముఁడు+అనన్= చంద్రుడని; తారకములు+అనన్= నక్షత్రాలని; సూర్యుఁడు+అనఁగన్= సూర్యుడని; కలుగు= ఉన్నటువంటి; తేజస్విమూర్తులు= కళామూర్తులు; నెలవులందున్= స్థానాలలో; ధర్మపరులు= ధర్మంలో నిష్ఠకలిగి బ్రతికినవారు; ఉండుదురు= ఉంటారు; తారతమ్యములకున్= మంచిచెడు మొదలైన తేడాలకు; మనసులు= మనస్సులు; ఎరియు+అట్టివి= మండేటటువంటి చోట్లు; కడు= మిక్కిలి; మంచివి+అగునే?= మంచిలోకాలు అవుతాయా?

**తాత్పర్యం:** ధర్మపరులుగా బ్రతికినవారు చంద్ర, నక్షత్ర, సూర్యమండలాలలో నివసిస్తారు. కాని, అక్కడ కూడా మంచి, చెడు అనే తారతమ్యాలకు మనస్సులు మండటం అనేది ఉన్నది. అందుచేత ఆ లోకాలుకూడా చాలా మంచివేమి కావు.

**విశేషం :** ఈ పర్వంలోని కథనుబట్టి బృహస్పతికి అసూయాదిగుణాలు పోలేదు. స్వర్గారోహణపర్వంలోని కథనుబట్టి మానుషదేహంలో అక్కడికి పోయినా ధర్మరాజులో 'అసూయ' నశించలేదు. అందుచేతనే ఈ విషయాన్ని చెప్పటం.

**క. అదియును గాక ఫలంబులు। దుదిముట్టఁగఁ గుడిచి వెడల ద్రోవఁబడుదు ర**
**ట్టిది సౌఖ్య మగునె? శాశ్వత। పదంబు మోక్షంబ కాక భవ్యవిచారా!' 186**

**ప్రతిపదార్థం:** భవ్యవిచారా!= ఉదాత్తమైన ధర్మవిషయచింతన కలవాడా!; అదియునున్+కాక= ఇంతే కాకుండా; ఫలంబులు= ఫలాలను; తుదిముట్టన్+కుడిచి= చివరిదాకా అనుభవించి; వెడలన్+త్రోవన్+పడుదురు= బయటికి వెళ్ళగొట్టబడుతారు; అట్టి+అది= అటువంటి స్వర్గాది లోకాల నివాసం; సౌఖ్యము+అగునె?= నిజంగా సుఖప్రద మవుతుందా?; శాశ్వతపదంబు= శాశ్వతస్థానం; మోక్షంబు+కాక= మోక్షం తప్ప.

**తాత్పర్యం:** ఉదాత్తమైన ధర్మచింతనగల ఓ బ్రాహ్మణుడా! ఇంతే కాదు. చేసిన పుణ్యఫలం ఎంతవరకు ఉంటుందో ఆ చివరిదాకా అనుభవించాక, జీవుడు ఆ లోకంనుండి బయటికి వెళ్ళగొట్టబడతాడు. అట్లాంటిస్థానం చిరసౌఖ్యదాయి ఎట్లా అవుతుంది? అట్లాంటి శాశ్వతస్థానం మోక్షం తప్ప మరొకటి కాదు.'

**విశేషం :** బంధవిముక్తి ఏ స్థితిలో ఉంటుందో అది విముక్తి. మోక్షమంటే విముక్తి మాత్రమే. అందుకే స్వర్గారోహణ పర్వకథలో చివరికి ఆకాశగంగ తీరంలో మోక్షాన్ని గురించి ధర్మరాజు తపస్సు చేశా డని, వ్యాసమహర్షి నిరూపించి 'జయ' ఇతిహాసాన్ని ముగించాడు. ఆ మోక్షవిజయమే మహాభారత తాత్పర్యం.

**వ. అని చెప్పి 'గర్భావాప్తి ప్రకారం బెఱింగించెద విను' మని పలికి సిద్ధుం డా భూసురున కిట్లనియె. 187**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పినవాడై; గర్భ+అవాప్తి= గర్భం ఏర్పడటం యొక్క; ప్రకారంబు= విధానాన్ని; ఎఱింగించెదన్= చెప్పుతాను; వినుము+అని+పలికి= వినుమని చెప్పి; సిద్ధుండు= ఆ సిద్ధుండు; ఆ భూసురునకున్= ఆ బ్రాహ్మణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, 'గర్భం ఎట్లా ఏర్పడుతుందో చెప్పుతాను విను' మని సిద్ధుడు ఆ బ్రాహ్మణుడితో ఇట్లా చెప్పాడు.

**తే. 'అశుభములును శుభమ్ములు నైన కర్మ। ముల ఫలంబులు గుడువక పోవఁ గాదు**
**మన్యువశగత మైన యాత్మకు నుదాత్త। చరిత! యది కారణము సువ్వె! జన్మమునకు. 188**

**ప్రతిపదార్థం:** ఉదాత్తచరిత!= ఉత్తమ చరిత్ర కలిగినవాడా!; మన్యు= నేను అనే అహంభావం నుండి పుట్టిన క్రోధ, దుఃఖాది భావజాలానికి; వశగతము+ఐన= లోబడిన; ఆత్మకున్= జీవుడికి (జీవాత్మకు); అశుభములును= అశుభాలు; శుభమ్ములున్= శుభాలు; ఐన= అయినటువంటి; కర్మముల ఫలంబులు= కర్మల ఫలాలను; కుడువక= అనుభవించకుండా; పోవన్+కాదు= తీరదు; జన్మమునకున్= పుట్టుకకు; అది కారణము సువ్వె!= అదే కారణం సుమా!

**తాత్పర్యం:** 'ఉత్తమచరితుడా! నేను అనే అహంభావంనుండి పుట్టే క్రోధదుఃఖాది భావజాలానికి (మన్యువు అంటే ఇదే) దాసుడైన జీవుడు శుభాశుభఫల మిశ్రితములైన కర్మలఫలాలను అనుభవించక తప్పదు. పుట్టుకకు కారణం ఇదే సుమా!

**క.** **ఎనయఁగ శుక్లము శోణిత। మును బెరసి వెలంది గర్భమున నెలకొను న**
**ప్పని బ్రహ్మశక్తి బీజ। త్వ నిరూఢిం బొనరు నవి వొదలుఁ బిండంబై.** **189**

**ప్రతిపదార్థం:** ఎనయఁగన్= ఒకదానికొకటి తగినట్టుగా; శుక్లము= పురుషుడి వీర్యం; శోణితమునున్= స్త్రీ రక్తం; బెరసి= కలిసి; వెలంది గర్భమునన్= స్త్రీ గర్భంలో; నెలకొనున్= నిలుస్తాయి; ఆ పని= ఆ విధంగా ఆ రెండూ సంయోగం పొందటం; బ్రహ్మశక్తిన్= బ్రహ్మకున్న సృజనాత్మక శక్తిచేత; బీజత్వ నిరూఢిన్= బీజం ఏర్పడటం అనే కార్యంగా; పొనరున్= ఒప్పతుంది; అవి= ఆ శుక్లశోణితాలు; పిండంబు+ఐ= పిండంగా; పొదలున్= పెరుగుతాయి.

**తాత్పర్యం:** శుక్లశోణితాలు తగినట్లుగా కలిపి స్త్రీ గర్భంలో బీజంగా ఒకచోట నిలుస్తాయి. అట్లా కావటం బ్రహ్మకున్న సృష్టిసామర్థ్యశక్తిచేత జరిగే పని. అట్లా ఆ శుక్లశోణితాలు కలిసి, పిండంగా వృద్ధిపొందుతాయి.

**విశేషం :** ఆధునిక విజ్ఞానశాస్త్రం ప్రకారం కూడా వీర్యరజస్సులు కలిసినప్పుడు అందులోకి ప్రాణం ఎట్లా ప్రవేశిస్తున్నదనే విషయం (అదే బీజం) పరమాశ్చర్యంగానే మిగిలిపోయింది. ఈ ఆశ్చర్యకార్యాన్ని పురాణాలు 'బ్రహ్మ' అనే ప్రతీకద్వారా వివరించాయి.

**క.** **విను మా బీజము పిండము। తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరం**
**బును గేలుఁ గాలు నుదరం। బు నురము వెన్ను నను నంగముల నేర్పఱుచున్.** **190**

**ప్రతిపదార్థం:** వినుము; ఆ బీజము= ఆ విధంగా ఏర్పడ్డ బీజం; పిండము తనువునన్= పిండంలోపల; చైతన్యరూపతన్= చైతన్యస్వరూపంగా; పరఁగి= వ్యాపించి ఉండి; శిరంబును= తలా; కేలున్= చేతులూ; కాలున్= కాళ్ళు; ఉదరంబున్= పొట్టా; ఉరమున్= రొమ్ముూ; వెన్నున్= వీపూ; అను+అంగములన్= అనే అవయవాలను; ఏర్పఱుచున్= ఏర్పరుస్తుంది.

**తాత్పర్యం:** ఆ బీజం పిండంలోపల చైతన్యస్వరూపంగా ఉంటూ తల, చేతులు, కాళ్ళు, పొట్ట, రొమ్ము, వీపు అనే అవయవాలను ఏర్పరుస్తుంది.

**విశేషం :** శుక్లశోణితాల కలయికతో ఏర్పడ్డ బీజశక్తి పిండంలో ప్రాణశక్తిగా దాగి ఉంటున్నది - అనే విషయం గొప్ప వైజ్ఞానికసత్యం. అందుకే విగ్రహాది పూజలు చేసేటప్పుడు ఆ ప్రాణశక్తిని మనం ఆవాహన చేస్తాం. కాబట్టి దేహం వేరు. ప్రాణం వేరు. అందుచేత పిండం వేరు. పిండంలోని జీవశక్తి వేరు. దానినే బ్రహ్మశక్తిగా ముందు చెప్పారు.

**వ.** **అని చెప్పి.** **191**

**తాత్పర్యం:** అని చెప్పినవాడై (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **జననార్హవేళ వెలువడి। తన తొల్లిటి కర్మములకుఁ దగిన వివిధవ**
**ర్తనములఁ బొందు; నవి దెగినఁ। జని మఱియుం బుట్టుఁ గర్మసంతతికిఁ దగన్.** **192**

**ప్రతిపదార్థం:** జనన+అర్హవేళన్= పుట్టటానికి తగిన సమయంలో; వెలువడి= గర్భంనుండి బయటపడి; తన= తనయొక్క; తొల్లిటి కర్మములకున్= పూర్వజన్మ కర్మలకు; తగిన= తగిన రీతిలో; వివిధ= వివిధాలైన; వర్తనములన్= ప్రవర్తనలను; పొందున్= పొందుతాడు; అవి+తెగినన్= ఆ కర్మలు తెగగా; చని= చనిపోయి; మఱియున్= మళ్ళీ; కర్మ సంతతికిన్+తగన్= కర్మసమూహానికి తగిన విధంగా; పుట్టున్= పుడతాడు.

**తాత్పర్యం:** పుట్టటానికి తగిన సమయం రాగానే గర్భంనుండి బయటపడి జీవుడు తన పూర్వజన్మకర్మలకు తగిన రీతిలో వివిధ పద్ధతులలో జీవనం సాగిస్తాడు. ఆ కర్మలు తెగిన తరువాత చనిపోయి, మరలా తన కర్మలకు అనుగుణమైన విధంగా జన్మను ఎత్తుతాడు.

**విశేషం :** కర్మఫలశేషమే జన్మకు కారణమని, కర్మానుభవ సంపూర్తి మరణకారణమని అర్థం. ఇదే జననమరణ చక్రభ్రమణానికి కారణం.

**క.** **నరుఁ డెంత కాల మేనిం। బరమం బగు ముక్తిపదముఁ బడయక యుండుం**
**బురుషవర! యంతకాలముఁ। బొరిఁ బొరి నిబ్భంగిఁ జావుఁ బుట్టువు నొందున్.** **193**

**ప్రతిపదార్థం:** పురుషవర!= పురుషశ్రేష్ఠుడా!; నరుఁడు= మానవుడు; ఎంతకాలము+ఏనిన్= ఎంతకాలమైతే; పరమంబు+అగు= గొప్పదైన; ముక్తిపదమున్+పడయక+ఉండున్= ముక్తిస్థానాన్ని చెందకుండా ఉంటాడో; అంత కాలమున్= అంతదాకా; పొరిన్+పొరిన్= మరలా మరలా; ఈ+భంగిన్= ఈ రీతిగా; చావున్+పుట్టువున్= చావు పుట్టుకలను; పొందున్= పొందుతూనే ఉంటాడు.

**తాత్పర్యం:** పురుషశ్రేష్ఠుడా! మానవుడు ఎంత కాలంవరకు ఉత్కృష్టమైన మోక్షస్థానాన్ని పొందకుండా ఉంటాడో అంతవరకు మరలా మరలా ఈ విధంగా చావుపుట్టుకలను పొందుతూనే ఉంటాడు.

**వ.** **కావున ముక్తికిఁ గారణంబగు దాని। నేర్పడఁ జెప్పద నెఱిఁగికొనుము;**
**దానంబు శమమును దమమును బ్రహ్మ। చర్యంబును వ్రతపరిరక్షణంబు**
**దయయును బరధనదారవర్జనమును। నియమయమేంద్రియనిగ్రహములు**
**జననీజనకగురు జనపూజలును దేవ। తాతిథిపితృదేవతార్చనములు**

**తే.** **సత్యమును శౌచమును శుభసంవిధాన। నిరతియును ధైర్యమును గ్రౌర్యనిరసనమ్ముఁ**
**గలిమి పుణ్యవృత్తం బిది గలుగు నరుఁడు। మొనయు దీని నూఁతఁగ గొని మోక్షమునకు.** **194**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ముక్తికిన్+కారణంబు+అగు దానిన్= ముక్తికి కారణమైన దానిని; ఏర్పడన్+చెప్పెదన్=స్పష్టంగా చెప్తుతాను; ఎఱింగికొనుము= తెలిసికొనుము; దానంబున్= దానం; శమమునున్= శమం; దమమునున్= దమం; బ్రహ్మచర్యంబునున్= బ్రహ్మచర్యం; వ్రతపరిరక్షణంబున్= దీక్షను కాపాడుకొనుటయూ; దయయునున్= దయయూ; పర= ఇతరుల; ధన; దారవర్జనమున్= ధనమునూ; స్త్రీలనూ; ఆశించకుండా ఉండటం; నియమ= నియతితో; యమ+ఇంద్రియ+నిగ్రహంబులు= నియమించి ఇంద్రియాలను జయించటం; జననీ జనక= తల్లిదండ్రుల; గురుజన= గురువుల; పూజలును= పూజించటం; దేవతా= దేవతల; అతిథి= అతిథుల; పితృదేవతార్చనములు= పితృదేవతలను అర్చించటం; సత్యమునున్= సత్యపరిపాలన; శౌచమునున్= పరిశుద్ధిగా ఉండటం; శుభ+సంవిధాన+నిరతియునున్= శుభకార్యాల విషయంలో నిష్ఠ కలిగి ఉండటం; ధైర్యమునున్= ఎప్పుడూ ధైర్యం కలిగి ఉండటం;

క్రౌర్య నిరసనమ్ముల్+కలిమి= క్రూరత్వాన్ని నిరసించటం అనే ఈ గుణాలు కలిగి ఉండటం; పుణ్యావృత్తంబు= పుణ్యచరిత్ర; ఇది+కలుగు నరుఁడు= ఇది ఉన్న మానవుడు; దీనిన్= ఈ చరిత్రనే; ఊఁతగన్+కొని= ఊతగా గ్రహించి; మోక్షమునకున్= మోక్షానికి; మొనయున్= ప్రయత్నిస్తాడు.

**తాత్పర్యం:** కాబట్టి ముక్తిహేతువైన దానిని చెప్పుతాను బాగా తెలిసికొనుము. దానం, శమం, దమం, బ్రహ్మచర్యం, దీక్షను పరిరక్షించుకొనటం, దయ, పరధనాన్ని, పరస్త్రీని కోరకుండటం; నియతితో ఇంద్రియాలను నిగ్రహించటం, తల్లిదండ్రులను, గురువులను పూజించటం, దేవతలను, అతిథులను, పితృదేవతలను ఆర్చించటం, సత్యవాక్పాలన, సదా శుచిగా ఉండటం, శుభకార్యాల విషయంలో నిష్ఠ కలిగి ఉండటం, ఎల్లప్పుడూ ధృతి కోల్పోకుండా ఉండటం. క్రూరత్వాన్ని ఎప్పుడూ నిరసించటం - అనే ఈ గుణాలు పుణ్యచరిత్రకు నిదర్శనాలు. ఈ విధమైన ప్రవృత్తి ఉన్న మానవుడు ఈ జీవితాన్నే సాధనంగా చేసికొని, మోక్షస్థానానికి ప్రయత్నిస్తాడు.

**క. పదపడి ధర్మాచరణము। వొదలుం దత్సూక్ష్మ విధము బుధజనుల కడం**
**గదలక నిలిచి యెఱిఁగికొన। విదితంబగు వారి శీలవృత్తములఁ గడున్. 195**

**విశేషం :** పదపడి= మరి ఇంకా; ధర్మాచరణము= ధర్మాన్ని ఆచరించటం; పొదలున్= (ఒకటి) ఉన్నది; తద్+సూక్ష్మ విధమున్= ఆ ధర్మసూక్ష్మవిధాన్ని; బుధజనులకడన్= పండితులైన వారి దగ్గర; కదలక= ఏకాగ్రతతో; నిలిచి= భక్తిప్రవత్తులలో ఉండి; ఎఱిఁగికొనన్= తెలిసికొనగా; వారి శీలవృత్తములన్= వారి శీలప్రవర్తనలవలన, కడున్= మిక్కిలిగా; విదితంబు+అగున్= తెలుస్తుంది.

**తాత్పర్యం:** ఇంతమాత్రమే కాదు, ఇంకా ఒకటి ఉన్నది. అది ధర్మాన్ని ఆచరించటం, అది చాలా సూక్ష్మమైన విషయం. దానిని పండితులవద్ద శిష్యభావంతో చేరి, వారిని సేవించి, ఏకాగ్రతతో వారివలన తెలిసికొనాలి. అప్పుడు వారి ప్రవర్తనవలన, వారి జీవితంవలన మనకు ఆ ధర్మనిర్వహణలోని తత్త్వం బోధపడుతుంది.

**క. వారలు చెప్పెడి శాంతో। దారవచనసమితి వినఁగఁ దద్గత బహుగం**
**భీరార్థము లంతఃకర। ణారూఢము లైనఁ బొరయ వాపద లెందున్. 196**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ పండితులు; చెప్పెడి= చెప్పే; శాంత+ఉదార= శాంతమైన; ఉదారమైన; వచన సమితిన్= మాటల సముదాయాన్ని; వినఁగన్= వింటూపోగా; తద్+గత= ఆ మాటలలోని; బహు= మిక్కిలి; గంభీర= గంభీరాలైన; అర్థములు= అర్థాలు; అంతఃకరణ+ఆరూఢములు+ఐనన్= మనస్సులో నాటుకొనగా; ఆపదలు= అపాయాలు; ఎందున్= ఎన్నడూ; పొరయవు= సమీపించవు.

**తాత్పర్యం:** ఆ పండితులు చెప్పే శాంతోదార వచనాలను వింటూ పోగా ఆ మాటలలోని మిక్కిలి గంభీరాలైన అర్థాలు మనస్సులలో గాఢంగా నాటుకొనగా, ఆపదలు ఎన్నటికీ సమీపించవు. అట్లాంటి వారు ధర్మనిర్వహణ చేయగలరు.

**సీ. వ్రతపరినిష్ఠమై వర్తించుచుండి యిం। ద్రియవిజయమును శాంతియును గలిగి**
**బ్రహ్మైకభజనతత్పరుఁ డగుచుండెడు। నతనికి బ్రహ్మంబు హుతవహుండు**
**సంస్తరంబును యోగ్యసమిధలు జలమును। మంత్రంబు గురుఁడు బ్రహ్మంబ యిట్టి**
**సచ్చరణంబు సూక్ష్మ బ్రహ్మచర్యంబు। దీనియం దుత్తమ స్థిరత గలుగు**

**తే. వాఁడు హర్షశోకోద్దామ వాయుహతుఁడు। గాఁడు మేదుర మోహాంధకారమున వె**
**డంగుపడఁడు సంసారనిస్సంగసిద్ధిఁ। బొందుఁ గాలక్రమమున నప్పురుషవరుఁడు. 197**

**ప్రతిపదార్థం:** వ్రతపరినిష్ఠమైన్= పై విధంగా నియమబద్ధమైన జీవితాన్ని వ్రతంవలె మిక్కిలి నిష్ఠతో; వర్తించుచున్+ఉండి= కడపుతూ; ఇంద్రియ విజయమునున్= ఇంద్రియ జయాన్ని; శాంతియునున్= శాంతిని; కలిగి; బ్రహ్మ+ఏక భజన తత్పరుఁడు+అగుచున్+ ఉండెడు+అతనికిన్= కేవలం బ్రహ్మనే ఉపాసించటంలో నిష్ఠకలిగి వర్తించే మానవుడికి; బ్రహ్మంబు= ఆ బ్రహ్మమే; హుతవహుండు= అగ్ని; సంస్తరంబునున్= యాగమూ; యోగ్య సమిధలు= తగిన సమిధలు; జలమునున్= నీళ్ళూ; మంత్రంబున్= మంత్రమూ; గురుఁడున్= ఉపద్రష్టా; బ్రహ్మంబు= బ్రహ్మమే; ఇట్టి= ఈ విధమైన; సత్ +చరణంబు= సత్కర్మాచరణం; సూక్ష్మ= అతి సూక్ష్మమైన; బ్రహ్మచర్యంబు= బ్రహ్మపథంలో చరించటం; దీని+అందున్= దీనిలో; ఉత్తమ స్థిరత+కలుగువాఁడు= ఉత్తమ స్థిరత్వం కలిగినవాడు; హర్ష= సంతోషం; శోక+ఉద్దామ= దుఃఖం అనేటటువంటి భయంకరమైన; వాయుహతుఁడు+కాఁడు= గాలిచేత దెబ్బతినడు; మేదుర= దట్టమైన; మోహ+అంధకారమునన్= మోహమనే చీకటిలో; వెడంగు+పడఁడు= భయపడడు; కాలక్రమమునన్= కాలక్రమంలో; ఆ+పురుషవరుండు= ఆ పురుష శ్రేష్ఠుడు; సంసార= సంసార విషయంగా; నిస్సంగ సిద్ధిన్+పొందున్= సంగరాహిత్య ప్రాప్తిని పొందుతాడు.

**తాత్పర్యం:** పై విధంగా నియమబద్ధమైన ధార్మికజీవితాన్ని వ్రతంవలె మిక్కిలి నిష్ఠతో గడపుతూ ఇంద్రియ జయాన్ని, శాంతిని కలిగి కేవలం బ్రహ్మను ఉపాసించటంలోనే నిష్ఠ కలిగి వర్తించే మానవుడికి ఆ బ్రహ్మమే అగ్ని, యాగమూ, సమిధలు, నీరూ, మంత్రమూ, ఉపద్రష్ట అంతా బ్రహ్మమే. ఈ విధంగా సత్కర్మను ఆచరించటమే బ్రహ్మపథంలో చరించటమంటే. ఈ ఆచరణలో ఉత్తమ స్థిరత్వాన్ని కలిగినవాడు సంతోషం, దుఃఖం అనే పెనుగాలులచేత దెబ్బతినడు. దట్టమైన మోహమనే చీకటిలో భయపడడు. కాలక్రమంలో ఆ మహాపురుషుడు సంసార బంధవిముక్తిని కాంచగలుగుతాడు.

**విశేషం :** "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః । బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం । బ్రహ్మకర్మ సమాధినా."

అని భగవద్గీత చెప్పుతున్నది. బ్రహ్మే హవిస్సు, అగ్ని, హోత, యజ్ఞానికి ధ్యేయం. యజ్ఞఫలప్రదాత. యజ్ఞ మతనికే అర్పితం. అది ఒక బ్రహ్మకర్మ సమాధి. దానితోనే ఆ యాగం సాధ్యం. ఈ బ్రహ్మకర్మాచరణం స్థిరంగా చేయటంవలన 'అహం' నశించి. కర్తృత్వభావన లోపించి, దాని ఫలితంగా 'నిస్సంగం' (బంధవిముక్తి) సిద్ధిస్తుంది అని అర్థం.

**వ. అని చెప్పె మఱియును. 198**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

### తత్త్వజ్ఞానవిశేష ప్రదర్శనము (సం. 14-18-25)

**సీ. ఆదిసృష్టిఁ బ్రధాన మను తత్త్వ మంబుజా। సనుఁడు గల్పించి చేతన మొనర్చె**
**క్షరమండ్రు దానిఁ దత్పర మగు తత్త్వంబు। నక్షర మనియును నమృత మనియు**
**నార్యులు సెప్పుదు రమ్మిథునంబున। యందు సంపన్నంబు లఖిలభూత**
**జాలంబులకును సంజనకంబులైన బీ। జము లిది శ్రుతివాక్యసంభృతార్థ**

**తే. మతఁడు గలిగించె గమనము నాగమనము। జీవరాశికిఁ గావున నా విధమున**
**నది భ్రమించుచునుండుఁ బుణ్యాతిశయము। కతన జీవాత్ముఁ డొకఁడు దన్ గాంచినపుడు. 199**

**ప్రతిపదార్థం:** ఆదిన్= తొలుత; సృష్టిన్= సృష్టి క్రమంలో; అంబుజ+ఆసనుఁడు= బ్రహ్మ (పద్మం ఆసనంగాకలవాడు;) ప్రధానము+అను= తత్త్వమున్= ప్రధాన మనే పేరుగల తత్త్వాన్ని; కల్పించి= సృష్టించి; చేతనము+ఒనర్చెన్= దానికి ప్రాణం పోశాడు; దానిన్= దానిని; క్షరము+అంద్రు= క్షరం అని పిలుస్తారు; తద్+పరము+అగుతత్త్వంబు= దానికి అతీతమైన తత్త్వాన్ని; అక్షరము+అనియున్= అక్షరమనీ; అమృతము+అనియున్= అమృతమనీ; ఆర్యులు= పెద్దలు; చెప్పుదురు= చెప్పుతారు; ఆ+మిథునంబున్+అందున్= ఆ జంటలో; అఖిల భూతజాలంబులకున్= అన్ని భూత సమూహాలకు; సంజనకంబులైన= పుట్టుకకు కారణాలైన; బీజములు= బీజాలు; సంపన్నంబులు= పుట్టాయి; ఇది= ఈవిధంగా పుట్టటం; శ్రుతివాక్య= వేదవాక్యాలలో; సంభృత+అర్థము= నిండిన అర్థమే; అతఁడు= ఆ బ్రహ్మ; జీవరాశికిన్= జీవులకు; గమనము= వెళ్ళిపోవటం; ఆగమనము= రావటం; కలిగించెన్= కలిగించాడు; కావునన్= కాబట్టి; ఆ విధమునన్= ఆ రీతిగా; అది= ఆ బీజం; భ్రమించుచున్+ఉండున్= భ్రమిస్తూ ఉంటుంది; పుణ్య+అతిశయము కతనన్= పుణ్యాతిశయంవలన; జీవాత్ముఁడు+ఒకఁడు= జీవాత్మ ఒకటి; తన్+కాంచినపుడు= తనను ఆవహించినపుడు.

**తాత్పర్యం:** తొలుత సృష్టిక్రమంలో బ్రహ్మదేవుడు 'ప్రధాన'మనే తత్త్వాన్ని కల్పించి, దానికి ప్రాణం పోశాడు. దానిని 'క్షర'మంటారు. దానికి అతీతమైన తత్త్వం 'అక్షరం.' దీనినే అమృతమని కూడా అంటారు. క్షర - అక్షరాల జంటవలననే ఈ సకల భూతసమూహాల పుట్టుకను కలిగించగల బీజాలు పుట్టాయి. ఈ విషయాన్ని వేదాలు ప్రతిపాదించాయి కూడా; ఇట్లా ఆ బ్రహ్మ జీవులకు గమనం. ఆగమనం (చావు పుట్టుక) రెండూ నిర్దేశించి ఉన్నందువలన ఆ బీజం నిరంతరం జననమరణచక్రంలో భ్రమిస్తూ ఉంటుంది. పుణ్యం పండిన జీవాత్ముడు తనను పొందినపుడు ఆ బీజం ఏం చేస్తుందంటే. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం :** గీతాకారుడు 'అక్షరపరబ్రహ్మ' యోగంగా ఈ అక్షరతత్త్వాన్ని వ్యాఖ్యానించాడు.

**"అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,**
**భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః,"**

బ్రహ్మం అక్షర స్వరూపం. అతడి స్వభావం అధ్యాత్మం. సకలసృష్టికి విసర్గమని పేరు.

**"అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,**
**అధియజ్ఞో హమేవాత్ర దేహే దేహభృతాం వర."**

(నశించిపోయే దేహాదులన్నిటికీ - అధిభూతాలైనవాటికి - 'క్షర'మని పేరు. పురుషుడు దీనికి అధిదైవతం. ఈ దేహంలో ఉండే నేనే అధియజ్ఞాన్ని)

**"అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్,**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ."**

అవ్యక్తమని చెప్పబడే ఆ అక్షరతత్త్వమే పరమపదం. దానిని చెందినవాడు మరలిరాడు. అందువలన అక్షర, క్షర పురుషులతోనే ఈ జగమంతా నిండి ఉన్నది - అని తాత్పర్యం.

**"ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,**
**క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే."** (పురుషోత్తమప్రాప్తియోగం)

**క. విను సుఖదుఃఖము లచిరము। లనియుం దను వశుచి యనియు నఖిలపదార్థం**
**బును నశ్వర మనియుం గ। ర్మనిరూఢత జాడ్య మనియు మది నూహించున్. 200**

**ప్రతిపదార్థం:** విను= జాగ్రత్తగా వినుము; సుఖదుఃఖములు= సుఖం; దుఃఖం; అచిరములు+అనియున్= అశాశ్వతాలని; తనువు= శరీరం; అశుచి+అనియున్= అపరిశుభ్రమయిందనీ; అఖిలపదార్థంబున్= సర్వపదార్థ సమూహమూ; నశ్వరము+అనియున్= అశాశ్వతమైనదనీ; కర్మవిరూఢత= కర్మలోనే నిరంతరం నిల్చిపోయి జ్ఞానం విషయంగా ఆలోచన చేయకుండుటం (అంటే సదా లౌకికమైన జీవితకర్మలలోనే మునిగి ఉండటం); జాడ్యము+అనియున్= ఒక జడత్వమని (రోగమని); మదిన్= అంతశ్శక్తితో; ఊహించున్= ఊహిస్తాడు.

**తాత్పర్యం:** అట్లా సంసారచక్రంలో తిరుగుతున్న జీవుడు పుణ్యపరిపాకంవలన సుఖదుఃఖాలు అశాశ్వతాలని, దేహం అపవిత్రమని, సకలపదార్థచయమూ అశాశ్వతమని, కర్మలో నిరంతరం కూరుకుపోయి ఉండటం ఒక జాడ్యమని అంతశ్శక్తితో ఊహించి తెలిసికొంటాడు.

**విశేషం:** భగవంతుడి అంశమాత్రమైన సంస్కారబీజంలోనే సదాలోచన కలుగుతుందని అర్థం చేసికొనాలి. అందుకే పుణ్యం పండినపుడే జీవుడు ఇట్లా ఆలోచిస్తాడని చెప్పటం.

**క. ఊహించి తన్నుఁ గప్పెడు । మోహావేశంబు ద్రోచి మోక్షపదప్రా**
**ప్తీహను సంసారాబ్ధివ । గాహనముం జేయకుండు గతకల్మషుఁడై 201**

**ప్రతిపదార్థం:** ఊహించి= ఇట్లా గుర్తించి; తన్నున్= తనను; కప్పెడు= ఆక్రమిస్తున్న; మోహ+అవేశంబున్+త్రోచి= మోహావేశాన్ని త్రోసిరాజని; మోక్షపద= మోక్షస్థానం; ప్రాప్తి= పొందాలన్న; ఈహనున్= కోరికతో; గతకల్మషుఁడై= పాపాలు పోయినవాడై; సంసార+అబ్ధి= సంసార సాగరంలో; అవగాహనమున్= మునగటాన్ని; చేయక+ఉండున్= చేయకుండా ఉంటాడు.

**తాత్పర్యం:** ఇట్లా గుర్తించి తన్ను ఆవేశిస్తున్న మోహాన్ని ఆవలకుత్రోసి, మోక్షం పొందాలన్న ఆకాంక్షతో పాపప్రక్షాళన గావించుకొని సంసారసాగరంలో దిగకుండా జాగ్రత్తపడతాడు. అలంకారం-సంసారాబ్ధి-సంసారమనెడి అబ్ధి-రూపకం

**వ. అని పలికి వెండియు. 202**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. జనిరుగ్జరామరణములు । గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద**
**జ్జనితక్లేశమునకు విసి । విన మర్త్యులు పరమపదము వెదకుదు రనఘా! 203**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పుణ్యాత్మా! వినుము; జని= పుట్టుక; రుజ్= రోగము; జరా= ముసలితనము; మరణము(లు)= చావూ; కని= చూచి; ప్రకృతి విధంబున్= ప్రకృతి విధానాన్ని; లెస్సగాన్= బాగా; ఎఱుఁగుటన్= తెలిసికొనటంవలన; తద్+జనిత= వాటినుండి పుట్టిన; క్లేశమునకున్= దుఃఖానికి; విసివిన= విసిగిన; మర్త్యులు= మానవులు; పరమపదమున్= మోక్షస్థానాన్ని; వెదకుదురు= అన్వేషిస్తారు.

**తాత్పర్యం:** పుట్టుక, రోగం, ముసలితనం, చావు - వీటిని చూచి చూచి, ఇది ప్రకృతి సహజ పరిణామమని తెలిసికొనటం వలన వీటివలన పుట్టే దుఃఖానికి మానవులు విసిగిపోయి, చివరికి మోక్షస్థానాన్ని అన్వేషించటం మొదలు పెట్టుతారు.

**విశేషం :** విసుగుపుట్టటం అంటే రోత పుట్టటమని అర్థం. ఏ విషయాన్ని చూడగా చూడగా అందులో ఏ చింతా లేదో దానిమీద కలిగే భావం 'రోత', అందుకే 'రోజూ చచ్చేవాడికి ఏడ్చేవారెవరు?' అనే సామెత పుట్టింది. ఇది అసహ్యాము కాదు; జ్ఞానంవలన పుట్టే విరక్తిభావం మాత్రమే.

**సీ.** **అట్టివా రిట్టి వా రగుట మేల్ గనికొని। యజనంబుఁ బూతంబు నైన చోట**
**నాసీనుఁడై హృదయంబున నొక చింత। యును లేక యూఱడి యుండి యడరి**
**తోఁచు తోఁపుల నెల్లఁ దోడ్తో నడంచి ని। రాలంబనుం డైన యతఁడొకండు**
**సర్వమిత్రుండును సర్వసహుండును। నిర్జితేంద్రియుఁడును నిర్భయుఁడును**

**తే.** **గామకోపహీనుఁడు శమఘనుఁడు నైన। యతఁ డొకండు మానాభిమానాపగమము**
**సర్వభూతాత్మకత్వదర్శనముఁ గలుగు। నతఁ డొకండు వీరలు గందు రనఘ! ముక్తి** **204**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; అట్టివారు= అటువంటివారు; ఇట్టివారు= ఇట్లాంటివారు; అగుట= కావటాన్ని; మేల్+కనికొని= బాగా గుర్తించి; యజనంబున్= యజ్ఞం జరిగి; పూతంబున్+ఐన చోటన్= పవిత్రమైన స్థలంలో; ఆసీనుఁడై= కూర్చున్నవాడై; హృదయంబునన్= హృదయంలో; ఒక చింతయును లేక; ఊఱడి+ఉండి= ఓదార్పు కలిగిఉండి; అడరి= విజృంభించి; తోఁచు= వచ్చేటటువంటి; తోఁపులన్+ఎల్లన్= ఆలోచన లన్నిటినీ; తోడ్తోన్= వెంటనే; అడంచి= అణచివేసి; నిరాలంబనుండు+ఐ= ఏ ఆధారాన్ని గ్రహించకుండా ఉండేటటువంటి; అతఁడు+ఒకండు= అతడు ఒకడు; సర్వమిత్రుండును= అందరిలోనూ; అన్నిటిలోను మిత్రత్వాన్ని పాటించేవాడూ; సర్వసహుండును= అన్నిటిని సహించేవాడూ; నిర్భయుఁడును= భయరహితుడు; కామకోప హీనుఁడు= కామం, కోపం లేనివాడు; శమఘనుఁడు= శమగుణంచేత గొప్పవాడైనవాడు; ఐన= అయినటువంటి; అతఁడు+ఒకండు= అతడు ఒకడు; మానాభిమాన+అపగమము= మానం, అభిమానం ఈ రెండూ లేకపోవటం; సర్వభూత+ఆత్మకత్వదర్శనమున్+కలుగు+అతండు+ఒకండు = సర్వభూతాలలోని ఆత్మను దర్శించే లక్షణం కలిగినవాడు ఒకడు; వీరలు= ఈ ముగ్గురూ; ముక్తిన్= ముక్తిని; కందురు= పొందుతారు.

**తాత్పర్యం:** ఎవరు ఎట్లాంటివారో గుర్తించి పవిత్రమైన స్థలంలో కూర్చొని, ఏ చింతా లేకుండా ఓర్పుతో ఉంటూ ఎప్పటికప్పుడు దాడిచేసే ఆలోచనలను వెంటవెంటనే అణచి, ఏ ఆధారాన్నీ ఆశించకుండా ఉండేటువంటి ఆ సంయమి; ' అందరిలోనూ సమంగా మిత్రత్వాన్ని పాటిస్తూ అన్నిటినీ సహిస్తూ నిర్భయంగా కామక్రోధాదులను జయించి 'శమము'ను సాధించే ఆ 'సమదర్శి'; మానం, అవమానం ఇట్లాంటి ద్వంద్వభావాలను దాటి అన్నిటిలోనూ ఆత్మను దర్శించగలిన ఆ 'ఆత్మజ్ఞాని' - ఈ ముగ్గురూ ముక్తిస్థానాన్ని అందుకొంటారు.

**విశేషం :** ఇంద్రియజయం, సమదర్శనం, ఆత్మజ్ఞానం ఈ మూడు 'యోగి' లక్షణాలు. యోగులే ముక్తిని పొందగలరు. మార్గాలు భిన్నంగా ఉంటాయి. భగవద్గీతలో బోధించిన అంశాలనే మళ్ళీ శ్రీకృష్ణపరమాత్మ ప్రతినిధిగా సిద్ధుడు ఇక్కడ చెప్తున్నాడు.

**సీ.** **ఒలయు లాభాలాభములుఁ బ్రియద్వేషంబు। లును సుఖదుఃఖములును సమంబు**
**లై యుండు నెవ్వని కాసపాటును నవ। జ్ఞతయు నెందును లేక సర్వధర్మ**
**తంత్రలోలుండును ధర్మశీలుండుఁగాఁ। డెవ్వఁడు గూర్చు వారొవ్వకుండు**
**వారని తనకు నెవ్వరు గల్గక త్రివ। ర్గేచ్ఛ యెవ్వనిచేత నీడ విడువఁ**

**తే.** **బడు నకర్మభావంబుఁ దాపత్రయాప। గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు**
**నరయ నెవ్వని యందేని యతఁడు నతఁడు। నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు.** **205**

**ప్రతిపదార్థం:** ఒలయు= కలిగేటటువంటి; లాభ+అలాభములున్= లాభ నష్టాలూ; ప్రియ+ద్వేషంబులునున్= ఇష్టమైనవీ, అనిష్టమైనవీ; సుఖదుఃఖములునున్= సుఖమూ; దుఃఖమూ; ఎవ్వనికిన్= ఎవ్వడికి; సమంబులు+ఐ= సమానంగా; ఉండున్= ఉంటాయో (అతడు); ఆసపాటును= మిక్కిలి ఆశకు లోనుకావటం; అవజ్ఞతయున్= మిక్కిలి నిరాదరణం; ఎందునున్ లేక= ఎప్పుడూ కలిగి ఉండక; సర్వధర్మతంత్ర లోలుండును= అన్ని ధర్మతంత్రాలపట్ల ఇచ్ఛ గలిగినవాడూ; ధర్మశీలుండును= ధర్మమే శీలంగా కలిగినవాడూ; ఎవ్వఁడు+కాఁడు= ఎవడు కాకుండా ఉంటాడో (అతడును); కూర్చువారు= ఇష్టులు; ఒవ్వక+ఉండువారు+అని= శత్రువులు అని; తనకున్= తనకు; ఎవ్వరు+కల్గక= ఎవరూ ఉండక; త్రివర్గ+ఇచ్ఛ= ధర్మ, అర్థ, కామాలు ఈ మూడింటిలోనూ ఆకాంక్ష; ఎవ్వనిచేతన్+ఈడన్+విడువన్+పడున్= ఎవడిచేత సంపూర్ణంగా వదలబడుతుందో (అతడు); ఆకర్మభావంబున్= కర్మ చేయటంలేదన్న భావన; తాపత్రయ+అపగమము= దార, ధన, పుత్రేషణలు తాపత్రయం- ఇవి లేకుండటం; వైరాగ్య= విరాగ భావంయొక్క; సుస్థిరత్వమునున్= సుస్థిరత్వం; అరయన్= బాగాచూడగా; ఎవ్వని+అందున్+ఏనిన్= ఎవడిలోనైతే; కల్గున్= ఉంటుందో (అతడును); అవ్యయపదంబున్= మోక్షస్థానాన్ని; కందురు= పొందుతారు.

**తాత్పర్యం:** కలిగే లాభాలాభాలు, ప్రియద్వేషాలు, సుఖదుఃఖాలు ఎవరికి సమంగా ఉంటాయో అతడు; ఆశానిరాశలు రెండూ లేక అటు ధర్మతంత్రలోలత్వం, ఇటు ధర్మశీలత్వం రెండూ లేక ఎవడు ఉంటాడో అతడు; ప్రియులు ద్వేషులు ఇరువురూ లేక, ధర్మార్థకామాలు ఎవడిచేత సంపూర్ణంగా వదలబడుతాయో అతడు; ఎవడిలో తాను కర్తను కాదన్న భావన, తాపత్రయరాహిత్యం, సుస్థిరవైరాగ్యం ఉంటాయో అతడు-ఈ నలుగురూ శాశ్వతమైన మోక్షస్థానాన్ని చెందుతారు.

**విశేషం:** ఈ పద్యంలో ద్వంద్వమోహరాహిత్యం, సమదర్శనం, నిష్కామకర్మ, అకర్తృత్వభావన, వైరాగ్యభావనలో సుస్థిరత్వం ప్రధానంగా చెప్పబడ్డాయి. భగవద్గీతలో ఈ అంశాలన్నీ బోధింపబడ్డవే.

ధర్మతంత్రలోలుపత, ధర్మశీలత, రెండూ విరాగభావాన్ని పెంచేవి కావటం చాలా అద్భుతమైన అంశం. యుద్ధానంతర పర్వాలలో పాండవులను సంస్కరించటంలో వ్యాసమహర్షి ఉద్దేశం ఇదే. 'నేను ధర్మాత్ముడ'ను అనే భావన. నాది 'ధార్మిక కార్యమనే నిర్ణయం. రెండూ భ్రమలకు నిదర్శనలే. అందుకే భీష్మాదులు వైరాగ్యభావన అంటే ఏమిటో చెప్పవలసివచ్చింది. సిద్ధుడు కూడా దానినే బోధిస్తున్నాడు.

**క. అసమాలంబ మశబ్దము । రసగంధస్పర్శరూపరహిత మగుణ ము**
**ల్లసితగుణమగు వెలుఁగు న । భ్యసననియతి పరుఁ డొకండు వడయుం బుత్రా! 206**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; అసమాలంబము= ఏ ఆధారమూ లేకుండా నిలిచి ఉన్నది; అశబ్దము= శబ్దంచేత బోధించబడనిది; రస గంధ స్పర్శ రూపరహితము= రసం, గంధం, స్పర్శం, రూపం - ఇవేవి లేనిది; అగుణము= ఏ గుణమూ లేనిది; ఉల్లసిత= మిక్కిలిగా ప్రకాశించే; గుణము+అగు= లక్షణం కలిగిన; వెలుఁగున్= ఆ కాంతిని; అభ్యసన నియతి వరుడు+ఒకండు= యోగాభ్యాసనియమ పరుడు ఒక్కడు మాత్రమే; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** కుమారా! ఏ ఆధారమూ లేకుండా నిలుచున్నది. శబ్దంచేత బోధించబడనిది. రసగంధస్పర్శరూప రహితమైనది. నిర్గుణమైనది, ప్రకాశించటమే లక్షణంగా కలిగిన ఆ కాంతి స్థానాన్ని నిరంతరయోగాభ్యాసనిష్ఠుడైన 'ఒక్కడు' మాత్రమే పొందగలుగుతాడు.

**విశేషం :** 'కశ్చిన్ మాం వేత్తి తత్త్వతః' అని గీతాకారుడు స్పష్టంగా చెప్పి ఉన్నాడు. ఎందరో యోగులు ప్రయత్నిస్తే వారిలో ఎవడో ఒకడు మాత్రమే ఆ పరమాత్మ తత్త్వాన్ని పూర్తిగా గుర్తిస్తాడని అర్థం. తక్కిన వారందరూ ఆ మహాప్రస్థానంలో ఏదో ఒక స్థాయిలో ఆగిపోతారు. లేదా వెనుదిరుగుతారు.

ఆ తత్త్వం 'కాంతి' రూపం, ప్రపంచంలోని మతాలన్నీ భగవంతుడిని 'కాంతి' స్వరూపంగా చెప్పాయి. గీతలో విశ్వరూపం కూడా ఒక కాంతిగోళంగా వర్ణించబడినది. అది అన్నిదిక్కులలోనూ వ్యాపించినది. దాని ఉనికి ఏ ఇతర వస్తువు మీదా ఆధారపడినది కాదు. అందుకే 'నిరాలంబం' అని దానిని పిలిచారు (అ+సమ+ఆలంబం= అన్నా అర్థం ఇదే).

'న తత్ర వాక్ గచ్ఛతి' అని ఆ స్థానాన్ని గురించి గీత చెప్పింది. ఆ స్థానం శబ్దంచేత బోధింపబడేది కాదు. అంటే ఆకాశమనే భూతం కాని, రస (జల) గంధ (భూమి) స్పర్శ (వాయు) రూప (అగ్ని) అనే ఇతర భూతాలు కాని,వాతగుణాలుకాని ఆ పరమాత్ముడి 'కాంతి'ని నిర్వచించలేవు. సత్త్వరజస్తమోగుణాలు అక్కడ లేవు. ఒకే లక్షణమున్నది అది 'ప్రకాశం'. నిత్యమూ వెలగటమే దాని ధర్మం. కనుక అది అక్షర మని (నశించని దని) పరబ్రహ్మ మని సిద్ధుడు చెప్పుతున్నాడు.

**తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు**
**నతఁ డనింధనానలము న ట్లల్లఁ బొందు। వికృతివర్జితయైన నిర్వృతిఁ గృతాత్మ!' 207**

**ప్రతిపదార్థం:** కృతాత్మ!= ధన్యాత్ముడా!; సర్వ= అన్ని; సంకల్ప= సంకల్పాలను; వర్జనశాలి+అగుచున్= వదలిపెట్టటంలో సమర్థుడై; పరమశాంతి= గొప్పశాంత స్థితిని; చిత్తంబునన్= మనసులో; పట్టుకొల్పు+న్+అతఁడు= స్థిరంగా ఉంచుకొనేటటువంటివాడు; అనింధన+అనలమున్+అట్లు= ఏ కట్టెలు లేకుండా అగ్నివలె; అల్లన్= నెమ్మదిగా; వికృతి వర్జిత+ఐన= ఏ వికారాలు లేనటువంటి; నిర్వృతిన్= మోక్షాన్ని; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ధన్యుడా! సర్వసంకల్పాలను వర్జించి, పరమశాంతస్థితిని స్థిరంగా మనసులో పాదుకొల్పి, ఎవడు సాధన చేస్తాడో అతడు కర్ర, తైలం మొదలైన సాధనాలు లేకుండానే మండే అగ్నివలె ఏ వికారాలు పొందని ఆ మోక్షస్థానాన్ని అందుకొనగలడు.'

**విశేషం :** సాధారణంగా అగ్ని మండటానికి కర్ర కావాలి. కర్రలేనిదే మంటలేదు. కాని పరమాత్మ అనే అగ్ని నిరంతరం మండే లక్షణం కలిగినది. ఆ అగ్నికి ఆరిపోవటమనే 'వికారం' లేదు (వికారమంటే పరిణామం). అందుచేతనే అది కర్రను ఆధారంగా కలిగినది కాదనటం. ఈ లక్షణాన్నే 'నిరాలంబ' ధర్మంగా ముందు చెప్పింది.

నిర్వృతి, నిర్వాణం, బ్రహ్మపదం, మోక్షం - ఇవన్నీ పర్యాయ వాచకాలే. ఎక్కడ చేరి తిరిగి రామో అది 'నిర్వృతి' పదం.

**వ. అనినిర్దేశించి 'యోగిజనానుభావ్యంబైన నెలవెఱింగించెద' నని పలికి 'యోగులు దాన నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు' మని యిట్లనియె. 208**

**ప్రతిపదార్థం:** అని= అని ఈ విధంగా; నిర్దేశించి= బోధించి; యోగిజన= యోగులచేత; అనుభావ్యంబైన= అనుభవించదగిన; నెలవు= స్థానం; ఎఱింగించెదను+అని పలికి= చెప్పుతానని చెప్పి; యోగులు= యోగసాధకులు; దానన్= ఆ పదప్రాప్తిచేత; ఆత్మదర్శన= తమను తాము తెలిసికొనటంచేత కలిగే; ఆనందంబున్= ఆనందాన్ని; ఒందుదురు= పొందుతారు; అవధానంబునన్= ఏకాగ్రతతో; ఆకర్ణింపుము+అని= వినుమని; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా బోధించి, 'యోగులు పొందే స్థానం ఏదో చెప్పుతాను వినుము. యోగసాధకులు ఆ పదాన్ని పొంది ఆత్మానుభవానందాన్ని పొందుతారు. ఆ విషయం వివరిస్తాను. ఏకాగ్ర చిత్తంతో విను' మంటూ సిద్ధుడు ఇట్లా అన్నాడు.

**విశేషం :** యోగి పొందే ఆ ఆత్మదర్శనమే పరమాత్మదర్శనం. పరమాత్మనే ఉపనిషత్తులు బ్రహ్మ మన్నాయి. తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మానందమని వివరించింది యోగులు పొందే ఆ ఆత్మానందతత్త్వాన్నే.

**ఆ. అనఘ! ముంజగర్భ మగు నిషీకనిదర్శ । నంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ**
**దనువు ముంజ యాత్మ దదిషీక నిష్కర్ష । విధము సుమ్ము! యోగవిదుని వెరవు. 209**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్మా!; ముంజగర్భము+అగు= ముంజగడ్డిలోని; నిషీక= ముల్లును; నిదర్శనంబు+కాఁగన్= ఎట్లా చూస్తామో అట్లా; కనుఁగొనంగన్+వలయున్= అత్యంత సూక్ష్మమైన చూపుతో చూడాలి; తనువు= ఈ శరీరం; ముంజ= ముంజగడ్డి; ఆత్మ; యోగవిదుని= యోగసాధనలో పండిన వాడి; వెరవు= విధం; తద్= ఆ గడ్డిలోని; ఇషీక+నిష్కర్ష విధము సుమ్ము= ఒక్కొక్క పరకను వేరుపరచటంవంటిది సుమా!

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ముంజగడ్డిలోని అతిసూక్ష్మమైన ముల్లును ఎట్లా చూస్తామో ఆత్మను అట్లాగే చూడాలి. యోగవిదులైనవారు దేహాన్ని ముంజగా, ఆత్మను అందులోని అతిసూక్ష్మమైన పరకలుగా వేరుచేస్తారు. ఇదే యోగంలో తలపండినవారి పద్ధతి

**విశేషం :** 'నీవార శూకవత్తన్వీ పీతాభాస్వస్యణూపమః' అనే మంత్రపుష్పభాగాన్ని మనం మాములుగా చదువుతాం, నీవారమంటే వడ్లగింజ. శూక అంటే మొన. వడ్లగింజ మొనను చూడటం ఎంత సూక్ష్మమో ఆత్మ స్వరూపుడిని కనుగొనటమూ అంతే కష్టమని అర్థం. ముంజలోని పొరల విషయమూ ఇంతే. ముంజగడ్డితో మొలత్రాడు పేని. ఉపనయనసమయంలో బ్రహ్మచారికి కట్టుతారు. అతిసూక్ష్మమైన ముంజపరకలను వేరు చేయటంద్వారా ఒక 'సూక్ష్మగ్రాహిత'. బుద్ధికుశలత' ఏర్పడుతాయి. మనిషిలోకూడా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలని పంచకోశాలను 'శారీరకులు' గుర్తిస్తారు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరత్రయాన్ని వరుసగా విశ్వ, తైజస, ప్రజ్ఞానమని వ్యష్టిదశలోనూ, విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వరులని సమష్టి దశలోనూ పిలుస్తారు. ముంజలోని పోలిక ఇట్లాంటిదే.

**క. తనువువలన నిష్కర్షం । బొనర్చి జీవాత్ముఁ గాంచు యోగివరుం డ**
**య్యను వొదవి యట్లు దన్నుం । గనినప్పుడు జననమరణగతులం దొఱఁగున్. 210**

**ప్రతిపదార్థం:** తనువువలనన్= శరీరంనుండి; నిష్కర్షంబు+ఒనర్చి= వేరుచేసి; జీవాత్మున్+కాంచు= జీవుడిని వేరుగా చూచే; యోగివరుండు= యోగిశ్రేష్ఠుడు; ఆ+అనువు+ఒదవి= అదే పద్ధతిని పాటించి; అట్లు= అట్లాగే; తన్నున్= తనలోని పరమాత్మను; కనినప్పుడు= చూచినప్పుడు; జననమరణ= చావు పుట్టుకలనే; గతులన్= స్థితులను; తొఱఁగున్= విడిచిపెడతాడు (తప్పించుకొంటాడు).

**తాత్పర్యం:** శరీరంనుండి జీవుడిని వేరుచేయటం నేర్చుకొన్న యోగి, సాధన పండగా అదే పద్ధతిలో తనలోని పరమాత్మనుకూడా చూడటం నేర్చుకొని, జననమరణ చక్రభ్రమణంనుండి బయటపడతాడు.

**క. ముక్తుండు జరామరణ వి । యుక్తుండై హర్షశోకయోగ మెడలి స**
**ద్భక్తులకును నప్పద మీ । శక్తుండగుఁ జువ్వె బ్రహ్మచర్యము పేర్మిన్. 211**

**ప్రతిపదార్థం:** ముక్తుండు= ఈ విధంగా జరామరణ భ్రమణం నుండీ ముక్తిని పొందిన యోగివర్యుడు; జరామరణ= ముసలితనం, చావు అనే బాధలనుండి; వియుక్తుండు+ఐ= బయటపడ్డవాడై; హర్షశోక యోగము+ఎడలి= సంతోషం, దుఃఖం అనే అనుభవాల కలయికను కోల్పోయి; బ్రహ్మచర్యము పేర్మిన్= బ్రహ్మచర్యశక్తితో; సత్+భక్తులకునున్= ఉత్తమ భక్తులకు; ఆ+పదము+ఈన్= ఆ పరమ పదాన్ని ప్రసాదించటానికి; శక్తుండు+అగున్+చువ్వె!= సమర్థుడు అవుతాడు సుమా!

**తాత్పర్యం:** ఈ విధంగా ముక్తుడైన యోగిశ్రేష్ఠుడు ముసలితనం, చావు మొదలైన బాధలనుండి బయటపడ్డవాడై సంతోషశోకాది భావాలు లేనివాడై, నిత్యబ్రహ్మచర్యపాలనచేత అబ్బిన అనుగ్రహశక్తితో ఉత్తమభక్తులకు ఆ పరమపదాన్ని ప్రసాదించటానికి సమర్థుడు అవుతాడు సుమా!

**ఆ.** **ఒడలి యస్థిరత్వ మూహించి యాత్మయం। దధికనిష్ఠ గలుగు నతఁడు సకల**
**భూతకోటివలనఁ బొందఁడు భయము రా। గాది దుఃఖములకు నగపడండు** **212**

**ప్రతిపదార్థం:** ఒడలి= దేహంయొక్క; అస్థిరత్వము= అశాశ్వతత్వాన్ని; ఊహించి= గుర్తించి; ఆత్మయందున్= ఆత్మ విషయంలో; అధికనిష్ఠ+కలుగు+అతఁడు= మిక్కిలి శ్రద్ధకలిగిన యోగి; సకల భూతకోటివలనన్= సృష్టిలోని ఏ భూత సముదాయం నుండికాని; భయము; పొందఁడు; రాగ+ఆది= అనురాగదులవలన కలిగే; దుఃఖములకున్= శోకాది భావాలకు; అగపడండు= వశ పడడు.

**తాత్పర్యం:** ఈ శరీరం అశాశ్వతమని గుర్తించి, ఆత్మ విషయంలో గాఢమైన శ్రద్ధ కలిగి ఎవడు యోగసాధన చేస్తాడో అతడికి ఏ భూతంవలన భయం ఉండదు. ఏ అనురాగాదులవలన కలిగే దుఃఖమూ అతడు పొందడు.

**విశేషం :** ఆత్మ విషయంలో 'నిష్ఠ' కలిగి ఉండటమన్న విషయం యోగసాధనలో చాలా ప్రధానమైనది. దేహాభిమానం ఎవరికి పోతుందో వారే ఆత్మనిష్ఠులు కాగలుగుతారు. వారి సర్వకర్మలూ ఆత్మాభిముఖంగానే ప్రసరిస్తాయి. భయరాగద్వేషాదులు శరీర సంబంధులు కాబట్టి యోగి వాటినుండి విముక్తుడవుతాడని అర్థం.

**క.** **విను యోగయుక్తునకు శ। స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై**
**చను నవ్వికారములు లే। వనఘ! యతఁడు గోరఁ డైంద్ర మగు పదమైనన్.** **213**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విను= బాగా వినుము; యోగయుక్తునకున్= యోగంతో కూడినవాడికి; శస్త్రనిహతి= ఆయుధాలచే దెబ్బతినటం; జలబాధ= నీటివలన బాధింపబడటం; అగ్నిదాహము= అగ్నివలన కాలటం; మొదలైచను+ఆ+వికారములు= మొదలైన అట్లాంటి పరిణామాలు; లేవు= ఉండవు; అతండు= అట్లాంటి యోగి; ఐంద్రము+అగు= ఇంద్ర సంబంధమైన; పదము+ఐనన్= పదం అయినా; కోరడు= ఇష్టపడడు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! యోగి అయినవాడికి శస్త్రాలచేత కాని, నీటివలన కాని బాధ ఉండదు. అగ్ని అతడిని కాల్చటానికి సమర్థం కాడు. ఇట్లాంటి వికారాలులేని అతడు ఇంద్రపదవిని కూడా ఆశించడు.

**విశేషం :** ఆయుధాలకు దెబ్బతినటం, జలం తడపటం, అగ్ని దహించటం వంటి వాటిని శాస్త్రపరిభాషలో 'వికారాలు' అంటారు. ప్రకృతిసహజమైన కార్యాలను 'వికారాలు' అంటారన్నమాట. అది లేనివాడు కాబట్టి యోగిని 'నిర్వికారి' అంటారు. ఇంద్రపదవి అశాశ్వతమైనది కాబట్టి యోగి దానిని ఆశించడు.

**క.** **తనయందఁ దన్ను లెస్సగఁ। గనుటం గడచిన సుఖంబు గలుగదు లోకం**
**బున నెందు దాని కయ్యెడు। వినుతానుష్ఠానమునకు విసువమి వలయున్.** **214**

**ప్రతిపదార్థం:** తనయందున్+ఆ= తనలోనే తన్నున్= తనను; లెస్సగన్= సమగ్రంగా; కనుటన్= చూడటంలో; కడచినన్= కాలం గడిస్తే; లోకంబునన్= లోకంలో; ఎందున్= ఎక్కడా; సుఖంబు+కలుగదు= సుఖం ఉండదు; దానికిన్+అయ్యెడు= దానికొరకు;

అయ్యేటటువంటి; వినుత= గొప్ప; అనుష్ఠానమునకున్= దీక్షకు; విసువమి= విసుగుపడకుండా ఉండటం; వలయున్= అవసరం.

**తాత్పర్యం:** తనలో తననే బాగా చూడడాన్ని మించిన సుఖం లోకంలో ఎక్కడా లేదు. దాని కొరకు (తనలో తన్ను) చూచుకోవడం కొరకు) కావలసిన పొగడదగిన నిష్ఠకు విసుగు చెందకుండా ఉండడం కూడా కావలెను.

**వ. అయ్యనుష్ఠానం బెట్టిదనిన. 215**

**తాత్పర్యం:** ఆ అనుష్ఠానం ఎట్లాంటిదంటే.- (తరువాతి పద్యంలో అన్వయం.)

**క. తన యెఱిఁగిన తెరువున నె। మ్మన మంతర్వృత్తిఁ జేసి మఱి బాహ్యగతిన్**
**జన నీ కుండఁగ నది యెం। దనువునఁ బడు నిలుపవలయు నచ్చట దానిన్. 216**

**ప్రతిపదార్థం:** తన+ఎఱిఁగిన= తనకు తెలిసిన; తెరువునన్= పద్ధతిలో; నెమ్మనమున్= తన నిండు మనస్సును; అంతర్వృత్తిన్+చేసి= లోపలికి మునుగజేసి; మఱి= ఇంక; బాహ్యగతిన్= బయటికి; చననీకుండఁగన్= వెళ్ళకుండా; అది= ఆ మనస్సు; ఎందున్+అనువునన్+పడున్= ఎక్కడ దారిలో పడుతుందో; అచ్చటన్= అక్కడ; దానిన్= దానిని; నిలుపవలయున్= నిలపాలి.

**తాత్పర్యం:** తనకు తెలిసిన మార్గంలో మనసును అంతర్ముఖం చేసి, ఇంక బయటికి పోనీయకుండా అది ఎక్కడ దారిలో పడుతుందో అక్కడే స్థిరంగా నిలపటం అభ్యసించాలి.

**వ. అది యెట్లనిన. 217**

**తాత్పర్యం:** అది ఎట్లాగంటే - (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. దంతములు జిహ్వ గుత్తుక తాలుతలము। కంఠనాళంబు హృదయంబు గణ్యచరిత!**
**మఱియు లోపల నెచటికి మనసు మెలఁగెఁ। దాఁ గదల్పక యచటన యాఁగ వలయు.' 218**

**ప్రతిపదార్థం:** గణ్యచరిత!= ప్రసిద్ధచరిత్ర కలవాడా!; దంతములు= పళ్ళు; జిహ్వ= నాలుక; కుత్తుక= మెడ; తాలుతలము= దౌడ; కంఠనాళంబు= గొంతుక; హృదయంబు= ఎద; మఱియున్= ఇంకా; లోపలన్= లోపల; ఎచటికిన్= ఎక్కడికి; మనసు; మెలఁగెన్= వెళ్ళి ఆగుతుందో; అచటన్= అక్కడే (దానిని); తాన్= తాను; కదల్పక= కదల్చకుండా; ఆఁగవలయున్= నిలపాలి.

**తాత్పర్యం:** ప్రసిద్ధచరితుడా! దంతాలు, నాలుక, మెడ, దౌడ, గొంతుక, ఎద - ఇంకా లోపలికి ఎక్కడికి మనసు వెళ్ళి నిలుస్తుందో దానిని అక్కడే కదల్చకుండా ఆపాలి.'

**వ. అని చెప్పెనని చెప్పి నాతో శిష్యుం డని మఱపునం బలికి తలంచికొని కొండొక విచారించి నవ్వుచు నవ్విప్రుండు నా మొగంబు సూచి 'యచ్యుతా! యా సిద్ధుం డనువాఁడ నేన కదా నీ యెఱుంగని యదియునుం గలదె? మఱియు నక్కాశ్యపనామధేయుం డడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నా యిచ్చిన విధంబును విను' మని యిట్లనియె.219**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; చెప్పెను+అని= సిద్ధుడు చెప్పాడని; చెప్పి; నాతోన్= నాతో; శిష్యుండు+అని= నీవు నా శిష్యుడివైతివని; మఱపునన్+పలికి= మరుపుతో అన్నవాడై; తలంచికొని= గుర్తుకు తెచ్చుకొని; కొండొక విచారించి= కొంతసేపు ఆలోచించి; నవ్వుచున్=

నవ్వుతూ; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; నామొగంబు+చూచి= నా ముఖం చూచి; అచ్యుతా!= కృష్ణా!; ఆ సిద్ధుండనువాఁడన్+నేను+ఆ కదా!= ఆ సిద్ధుడనబడేవాడను నేనే కదా!; నీ+ఎఱుంగని+అదియున్+కలదె?= నీకు తెలియనిది కూడా ఉన్నదా?; మఱియున్= ఇంకా; ఆ+కాశ్యప నామధేయుండు= ఆ కాశ్యపుడు అనే పేరుగల బ్రాహ్మణుడు; అడిగిన+తెఱంగు= అడిగిన విధం; దానికిన్+ఉత్తరంబు+నా యిచ్చిన+విధంబునున్= దానికి ఇచ్చిన సమాధానం తీరు; వినుము+అని= వినుమని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా సిద్ధుడు చెప్పాడని నాతో అని మరుపుతో నా 'శిష్యుడి'వి అని గుర్తుకు తెచ్చుకొని కొంతసేపు ఆలోచించి నవ్వుతూ ఆ బ్రాహ్మణుడు నా ముఖం చూచి 'కృష్ణా! ఆ సిద్ధుడను నేనే కదా! నీకు తెలియనిది ఏమున్నది? ఆ కాశ్యపుడు అడిగిన ప్రశ్న, నా సమాధానం చెప్పుతాను వినుము' అంటూ ఇట్లా అన్నాడు.

**విశేషం :** శ్రీకృష్ణుడికి తానే తత్త్వబోధ చేసినట్లు చెప్పటం బాగుండదని ఆ బ్రాహ్మణుడు 'సిద్ధుడి' కల్పన చేశాడు. కాని కృష్ణుడి సమీపంలో అసత్యం చెప్పటం కష్టం. అందుచేత 'సిద్ధుడి' 'శిష్య' డున్నాడేమో తెలియదు. బహుశా కృష్ణుడు గుర్తించి ఉంటాడు. అందుకే తన తప్పు తెలిసికొని, బ్రాహ్మణుడు ఆ సిద్ధుడిని నేనే అన్నాడు. ఇదంతా శ్రీకృష్ణుడి లీలలో భాగమే. అంతమాత్రమే కాదు. ఇదంతా చెప్పుతున్నవాడు కృష్ణుడే. అందుచేత ఈ పాత్రలన్నీ ఆయన కల్పించినవే. తానుకూడా జ్ఞానులను ఆశ్రయించి తెలిసికొంటా నన్న వినయసూత్రాన్ని అర్జునుడికి నేర్పటంకొరకు పరమాత్ముడు ఈ కల్పన మొత్తం చేసి ఉండాలి. చెప్పుతున్నవాడు బ్రాహ్మణుడే అయినా అవన్నీ శ్రీకృష్ణుడి వాక్యసంపదే. అందుకే దీనిని మొత్తం 'అనుగీత' అని కూడా పిలుస్తారు.

**ఆ. 'కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి। విశదకరుణఁ జెప్పవే మహాత్మ!**

**„ ¬╤ º" ¶ HÆ } „ ᴴ } ` Ǫƒ ∯ † Ç l ^ ¥ ₠ ¶ HÆ ºH ^ ÑÑ= ºx † ³. 220**

**ప్రతిపదార్థం:** వినయశాలి= వినయవంతుడు; ఆ+మేధావి= ఆ ధీగుణ సంపన్నుడైన బ్రాహ్మణుడు; కేలు మొగిచి= చేతులు జోడించి; మహాత్మ!= ఓ మహాత్మా!; పరమ= ఉత్కృష్టమైన; మోక్షకరణ= మోక్షసాధనలో; పరిణతంబు+ఐన= పండిన; ఉదాత్త= గొప్పదైన; సూక్ష్మ= అతి సూక్ష్మమైన; సుకర= సులభమైన; ధర్మము= మార్గం; విశదకరుణన్= మిక్కిలి దయతో; చెప్పవే= బోధించవా!; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వినయవంతుడైన ఆ మేధావి చేతులు జోడించి 'మహాత్మా! ఉత్కృష్టమైన మోక్షసాధనలో సమర్థమైన. ఉత్కృష్టమైన సూక్ష్మసులభమార్గం ఏదో నాకు దయతో బోధించుము' అని అడిగాడు.

**వ. అనిన 'నవహితుండవై యాకర్ణింపు'మని పలికి యిట్లంటి. 221**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అవహితుండవు+ఐ= సావధానుడవై; ఆకర్ణింపుము+అని= వినుమని; పలికి= చెప్పి; ఇట్లు+అంటిన్.

**తాత్పర్యం:** అని అడుగగా ఏకాగ్రతతో వినుము అని చెప్పి ఇట్లా అన్నాడు.

**ఆ. 'పాలకడవ పెక్కు పసులలో డించిన। యాతఁ డెట్లు దాని నరసికొనుచు**
**నుండు నట్లు లోన నునిచిన మనసు నే। మఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు. 222**

**ప్రతిపదార్థం:** పాలకడవ= పాలకుండ; పెక్కు పసులలోన్= అనేక పశువుల నడుమ; డించిన= ఉంచినపుడు; అతఁడు= ఆ గొల్లవాడు; ఎట్లు= ఏ విధంగా; దానిన్= ఆ కుండను (పశువులు త్రొక్కివేయకుండా); అరసికొనుచున్+ఉండున్= జాగ్రత్తగా చూచికొంటూ

ఉంటాడో (అట్లాగే); లోనన్= లోపల; ఉనిచిన= స్థిరంగా ఉంచిన; మనసున్= మనస్సును; ఏమరక= ఏమరకుండా; ఆత్మన్= ఆత్మను; గొల్లవాడివలె; వెదకు తెఱఁగు= జాగ్రత్తగా చూచికొనే పద్ధతి; మేలు= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** పశువులమందలో ఒకచోట గొల్లడు పాలకుండను దించి తాను చుట్టూ తిరుగుతున్నా ధ్యాసను కుండమీద ఎట్లాఉంచుతాడో అట్లాగే విషయసుఖాలలో, దుఃఖాలలో జీవుడు భ్రమిస్తున్నా ఆత్మద్వారా లోన ఉంచిన మనసును జాగరూకంగా కాపాడుకొనటం ఉత్తమమార్గం.

**విశేషం :** అలం; ఉపమ. ఈ ఉపమానాన్నిబట్టి కృష్ణుడు గోవులు కాచాడు అనటానికి వెనుక ఉన్న తాత్త్వికభావం అర్థం చేసికొనవచ్చును. పశువులమంద అనియంత్రితమైన మనిషి ప్రవృత్తికి నిదర్శనం కాగా దానిని కాపాడుతూ వచ్చిన గోపాలకుడు ఆ ప్రవృత్తికి ఒక దారి చూపి 'పాలకుండ' (జ్ఞానాన్ని) భద్రపరచి ఇచ్చిన 'ఆత్మ' తత్త్వానికి సంకేత మవుతున్నాడు. పాలకుండను ఏ పశువైనా ఎప్పుడైనా త్రొక్కివేయవచ్చును. అట్లాగే విషయవాంఛాదులు మనసును పక్కదారి పట్టించవచ్చును. అందుకే ఈ పోలిక చాలా అర్థవంతమైనదీ. సహజమైనదీ కూడా.

**క. ఈ తెఱఁగున నుద్యుక్తుం । డై తెలి వొందిన మనంబు నతులవివేక**
**ఖ్యాతి మరిగించి శశ్వ । ద్ద్యోతితమగు బ్రహ్మముం జతురయోగి గనున్. 223**

**ప్రతిపదార్థం:** ఈతెఱఁగునన్= ఈవిధంగా; చతుర యోగి నేర్పరియైన యోగీశ్వరుడు; ఉద్యుక్తుండు+ఐ= పూనుకొని; తెలివి+ఒందిన= జాగరూకమైన; మనంబున్= మనస్సును; అతుల= సాటిలేని; వివేక ఖ్యాతిన్= బుద్ధివైభవంతో; మరిగించి= అభ్యసింపచేసి; శశ్వత్= శాశ్వతంగా; ద్యోతితము+అగు= ప్రకాశించేటటువంటి; బ్రహ్మతత్త్వాన్ని; కనున్= చూస్తాడు (పొందుతాడు).

**తాత్పర్యం:** ఈ విధంగా నేర్పరితనమున్న యోగీశ్వరుడు పూనికతో జాగరూకమైన మనస్సును సాటిలేని బుద్ధివైభవసాహచర్యంతో శిక్షింపజేసి శాశ్వతంగా, ప్రకాశరూపంగా సాక్షాత్కరించే బ్రహ్మపదాన్ని సులభంగా పొందుతాడు.

**విశేషం :** బ్రహ్మపదప్రాప్తిలో రెండు ముఖ్యమైన దశలు ఇక్కడ చెప్పబడ్డాయి. తొలిదశ ముందటి పద్యంలోనే ప్రస్తావించాడు. విషయవాంఛలపాలు కాకుండా మనసును స్థిరీకరించటం. అట్లా స్థిరమైన చిత్తంలో 'జాగరూకత (మేల్కొన్న లక్షణం) ఏర్పడుతుంది; దానికి వివేకాన్ని తోడుచేయాలి. అంటే శాస్త్రాద్యవేక్షణవలన, సాధుసత్పురుషుల బోధలవలన సత్కర్మాచరణవలన కలిగే బుద్ధి వైభవం ఆ మనసుకు తోడైతే కలిగే సాత్త్వికజ్ఞానానికి బ్రహ్మపదప్రాప్తి సులభమని తాత్పర్యం.

**తే. అయ్యనాదితత్త్వ చక్షురాదికంబు । లైన యింద్రియములకు గ్రాహ్యంబు గాదు**
**సకలమలనిరాసాజ్య ప్రసన్నతర మ । నఃప్రదీపంబు తద్దర్శనం బొనర్చు. 224**

**ప్రతిపదార్థం:** ఆ+అనాదితత్త్వము= మొదలు ఎరుగజాలని ఆ మహాతత్త్వం; చక్షుస్+ఆదికంబులైన= కన్నులు, చెవులు మొదలైన; ఇంద్రియములకున్= ఇంద్రియాలకు; గ్రాహ్యంబు కాదు= గ్రహించదగినది కాదు; సకల= అన్ని; మల= మలినాలనూ; నిరాస= నిరసించటమనే; ఆజ్య= నేయిచేత; ప్రసన్నతర= మిక్కిలి ప్రసన్నంగా చేయబడిన; మనస్+ప్రదీపంబు= మనస్సనే గొప్ప దీపం; తద్+దర్శనంబున్+ఒనర్చున్= ఆ దర్శనాన్ని; చేయించగలుతుంది.

**తాత్పర్యం:** ఆ ఆనాదితత్త్వం కన్నులు, చెవులు మొదలైన అవయవాలచేత చూడదగినది. వినదగినది కాదు. అన్ని మలినాలను

క్షాళనం చేయట మనే నేతివలన మిక్కిలి మనోహరంగా వెలిగేటటువంటి ప్రశాంతమైన మనస్సు అనే గొప్పదీపం మాత్రమే ఆ బ్రహ్మపదాన్ని చూపగలుగుతుంది.అలంకారం - నిరాస+ఆస్య; మనఃప్రదీపంబు - రూపకం

**క. కలయంగ నెల్ల యెడలం। దలలును లోచనములును బదంబులు హస్తం**
**బులునై యా తత్త్వం బు। జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 225**

**ప్రతిపదార్థం:** ఎల్ల+ఎడలన్= అన్నివైపులా; తలలును= తలలూ; లోచనములును= కళ్ళూ; పదంబులు= కాళ్ళూ; హస్తంబులున్+ఐ= చేతులు కలిగి; కలయంగన్= వ్యాపించి; ఆ+తత్త్వంబు= ఆ మహాతత్త్వం; ఉత్+జ్వల= మిక్కిలి మండుతున్న; భంగిన్= రీతిలో; వెలుంగన్= ప్రకాశిస్తుండగా; యోగవంతుఁడు= యోగం కలిగినవాడు; కాంచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** అన్ని దిశలలోనూ తలలు, కళ్ళు, కాళ్ళు, చేతులు, కలిగి అంతటా వ్యాపించిన ఆ మహాతత్త్వం మిక్కిలిగా మండిపోతున్న కాంతిపుంజంవలె ప్రకాశిస్తుండగా దానిని మహాయోగి దర్శిస్తాడు.

**విశేషం :** పురుషసూక్తంలోనూ, భగవద్గీతలోను పురుషోత్తముడిని ఎట్లా వర్ణించారో ఇక్కడ కూడా అట్లాగే చెప్పటం గమనించవచ్చును. 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' అని పురుషసూక్తం ఆ పురుషుడిని వర్ణించినది. వేయితలలు, వేయి కన్నులు, వేయి కాళ్ళు అనంతత్వ సంకేతం. 'అనేక బాహూదరవక్త్రనేత్రు' డని భగవద్గీత వర్ణించింది. అతడికి పెక్కు చేతులు, కడుపులు, నోళ్ళు, కళ్ళు ఉన్నాయట. 'నాంతం, న మధ్యం, న పునస్తవాదిం' (నీకు అంతము, మధ్యము, అది లేదు. అందుకే 'దిశలు తోచటం' లేదు అని అర్జునుడు ఆ విరాట్పురుషుడిని చూచి ఆక్రందిస్తాడు' సర్వతోనంతరూపమ్ అని వర్ణించినట్లుగా ఆయన అనంతరూపుడు. దానినే 'ఎల్లయెడలన్' అని తిక్కనగారు చాలా సొగసైన తెలుగులో వర్ణించాడు.)

**క. తను వేర్పరించి కేవల। మును శాంతము నైన తత్త్వమును సంతతమున్**
**గనుచున్నఁ దన్ను నెఱుఁగం। గనుఁజీఁకటిఁ బాపు వెలుఁగు గలుగుం బుత్రా! 226**

**ప్రతిపదార్థం:** పుత్రా!= ఓ కుమారా! (శిష్యవాత్సల్యంతో పిలిచే పిలుపు); తనువు= శరీరం; ఏర్పరించి= వేరు చేసి; కేవలమును= ఏకైకమూ; శాంతమును+ఐన= శాంత స్వరూపమైన; తత్త్వమును= తత్త్వాన్ని; సంతతమున్= ఎల్లప్పుడూ; కనుచున్+ఉన్నన్= చూస్తుంటే; తన్నున్= తనను; ఎఱుఁగన్+కనున్= తాను చూచికొనటానికి (తెలిసికొనటానికి) సాధ్యమవుతుంది; చీఁకటికిన్+పాపున్= చీకటిని పోగొట్టుతుంది; వెలుఁగు+కలుగున్= ఆ పరమకాంతి నిధానం సంప్రాప్తిస్తుంది.

**తాత్పర్యం:** నాయనా! శరీరాన్ని వేరుచేసి; ఏకైకమూ శాంతస్వరూపమూ అయిన ఆ పరమతత్త్వాన్ని నిరంతరం దర్శించే యోగి క్రమంగా ఆత్మదర్శనం చేయగలుగుతాడు. లోని తమస్సు అణగుతుంది. పరమకాంతి నిధానం సంప్రాప్తిస్తుంది.

**విశేషం :** శ్రీమన్నారాయణుడు 'శాంతాకారు'డట. శాంతమే అతడి స్వరూపం. తక్కిన ఎనిమిది రసాలలో లౌకికస్పర్శ ఉంది. కాని 'శాంత' రసంలో దివ్యత్వం ఉంది. మహాభారతంలో ప్రధానం ఈ శాంతరస నిరూపణమే. అది కేవలము' ఏకైకం, అద్వితీయం. అక్కడ ద్వంద్వభావరాహిత్యం ఉండటంవలన ఏకం. అనంతం అనే స్ఫూర్తి ఉంది. అందుకే మోక్షాన్ని 'కైవల్యం' అని అంటారు. 'శాంత' మంటే మోక్షపదానుభవం అని తాత్పర్యం.

**వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి; నీ వింక సుఖివి గమ్ము; నేనుం బోయెద' నని యామంత్రణంబు సేసిన నపాస్తసంశయుం డయి యా శిష్యుం డరిగె; నిట నిన్ను దర్శింప వచ్చితి' నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుండయ్యెఁ; బరమహితంబైన యా వాక్యసంతానంబు సమవధానంబున వినంబడియెనే పాండవ**

**మధ్యమా! నాఁడు రథస్థుండ వయిన నిన్ను నేతదీయంబైన యర్థజాతంబు వినిపించితి' నని నప్పురుషవరుతోడం బురుపోత్తముండు వెండియు నిట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** బ్రహ్మవిద్యారహస్యంబు= బ్రహ్మవిద్యలోని రహస్యాన్ని; సర్వంబు= అంతటినీ; నీకున్+చెప్పితిన్= నీకు చెప్పాను; నీవు+ఇంకన్= నీవు ఇంక; సుఖివి+కమ్ము= సుఖంగా ఉండుము; పొమ్ము= వెళ్ళిరమ్ము; నేనున్+పోయెదను+అని= నేనూ వెడుతున్నానని; ఆమంత్రణంబు+చేసినన్= వీడ్కోలు చెప్పగా; ఆ శిష్యుండు= ఆ కాశ్యపుడు; అపాస్త= పోయిన; సంశయుండు+అయి= సందేహాలు కలవాడై; అరిగెన్= వెళ్ళిపోయాడు; ఇట= ఇక్కడ; నిన్నున్= నిన్ను; దర్శింపన్= దర్శించుకొనటానికి; వచ్చితిన్= వచ్చాను; అని; పలికి; ఆ+మహాద్విజుండు= ఆ గొప్ప బ్రాహ్మణుడు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమైపోయాడు; పరమ= మిక్కిలి; హితంబు+ఐన= మేలును కలిగించే; ఈ వాక్యసంతానంబు= ఈ వాక్యసమూహం; సమవధానంబునన్= మిక్కిలి అవధానంతో; వినంబడియెనే!= విన్నావా?; పాండవ మధ్యమా!= ఓ అర్జునా!; నాఁడు= ఆ రోజు; రథస్థుండవు+అయిన= రథం మీద నిలిచిన; నిన్నున్= నిన్ను గురించి; ఏతదీయంబైన= ఈ బ్రహ్మపదప్రాప్తికి సంబంధించిన; అర్థజాతంబు= అర్థసముదాయం, వినిపించితిన్= వినిపించాను; అని= అని చెప్పి; ఆ+పురుషవరుతోడన్= ఆ పురుషశ్రేష్ఠుడితో; పురుషోత్తముడు= శ్రీకృష్ణుడు; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రహ్మవిద్యలోని రహస్యాన్ని అంతటినీ నీకు చెప్పాను. నీవు ఇక సుఖంగా ఉండుము. పోయిరమ్ము. నేనూ వెళ్ళుతున్నాను' అని వీడ్కోలు చెప్పగా ఆ శిష్యుడు తన సందేహాలన్నీ తీరగా వెళ్ళిపోయాడు. ఆ తరువాత నిన్ను దర్శించుకొనటానికి నేను ఇక్కడికి వచ్చాను' అని పలికి, ఆ బ్రాహ్మణుడు మాయమైపోయాడు. ఓ అర్జునా! పరమహితాన్ని కలిగించే ఈ వాక్యసముదాయాన్ని ఏకాగ్రచిత్తంతో విన్నావా! ఆనాడు యుద్ధభూమిలో రథంమీద నిలిచి, విషాదంతో ఉన్న నీకు ఆ బ్రహ్మపదసంప్రాప్తిని గురించిన ఈ విషయాలన్నిటినీ వినిపిచాను. గుర్తున్నదా!' అని కృష్ణుడు చెప్పి, మరలా అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**సీ. వ్యామిశ్రమతి యగు నతనికి నకృతాత్ముఁ। డైనవానికి నవధానరహిత**
**చేతస్కునకు నిది సెప్పఁగాదే! దొల్లి। దెలియంగఁ జెప్పితి దేవతలకు**
**గాండివి నీవు దక్కఁగ నిది మర్త్యు లా। కర్ణింపఁ దగువారు గలరె యొరులు?**
**పరమరహస్య మీ పరిపాటి దీన న। య్యమృతవస్తువు గని యఖిలదుఃఖ**

**ఆ. ములుఁ దొఱంగి నిత్యముక్తత వెలుఁ గొందు। నరుఁడు వైశ్యులైన నాతులైన**
**శూద్రులైనఁ గంద్రు సువ్వె యిమ్మెయి ముక్తి। బ్రాఁతె బ్రాహ్మణులకు రాజులకును? 228**

**ప్రతిపదార్థం:** వ్యామిశ్రమతి+అగునతనికిన్= అస్థిరమైన మనస్సు కలవానికి (అనేకాలైన ఆలోచనలవలన ఏర్పడ్డ అస్థిరత్వం కలవాడని అర్థం); అకృత+ఆత్ముఁడు+ఐన వానికిన్= ఆత్మవిద్యాపరిశ్రమ లేనివాడికి; అవధానరహిత= అవధానంలేని; చేతస్కునకున్= చిత్తమున్నవాడికి; ఇది= ఈ బ్రహ్మవిద్య; చెప్పన్+కాదే!= చెప్పరాదు సుమా!; తొల్లి= మునుపు; దేవతలకున్= దేవతలకు; తెలియంగన్+చెప్పితిన్= వివరంగా చెప్పాను; గాండివి= గాండీవాన్ని ధరించిన మహాధనుర్వేత్త అయిన; నీవు తక్కగన్= నీవు తప్ప; ఇది= ఈ విద్యను; ఆకర్ణింపన్+తగువారు= వినదగినవారు; ఒరులు= ఇతరులు; మర్త్యులు+కలరె?; మానవులున్నారా?; ఈ పరిపాటి= ఈ బ్రహ్మవిద్యాక్రమం; పరమ రహస్యము= మిక్కిలి గుప్తమైనది; దీనన్= దీనిచేత; నరుఁడు= మనిషి; ఆ+అమృతవస్తువున్+కని= ఆ అమృతవస్తువును దర్శించి; అఖిల= అన్ని; దుఃఖములున్+తొఱంగి= దుఃఖాలు పోగొట్టుకొని; నిత్యముక్తతన్= నిత్యముక్తస్థితిలో; వెలుఁగు+ఒందున్= ప్రకాశిస్తాడు; వైశ్యులు+ఐనన్= వైశ్యులు అయినా; నాతులు+ఐనన్= స్త్రీలైనా; శూద్రులు+ఐనన్=

శూద్రులైనా; ఈ+మెయిన్= ఈ క్రమంలో; ముక్తిన్= ముక్తిని; కంద్రు= పొందుతారు; చువ్వె!= సుమా!; (ఇక); బ్రాహ్మణులకున్; రాజులకును= క్షత్రియులకూ; బ్రాఁతె?= దుర్లభమా?

**తాత్పర్యం:** అస్థిరచిత్తుడికి, ఆత్మవిద్యాపరిశ్రమలేనివాడికి, ఏకగ్రత లేనివాడికి ఈ బ్రహ్మవిద్యను బోధించరాదు సుమా! నేను మునుపు దేవతలకు ఈ విద్యను బోధించాను. మానవులలో ధనుర్విద్యానిపుణుడవు కాబట్టి నీవు తప్ప మనుషులెవ్వరూ ఈ విద్యను నానుండి వినదగ్గవా రెవరూ లేరు. ఈ బ్రహ్మవిద్యాక్రమం చాలా రహస్యమైనది. దీనివలన మానవుడు ఆ అమృతవస్తువును దర్శించి అన్ని దుఃఖాలూ పోగొట్టుకొని నిత్యముక్తుడుగా ప్రకాశిస్తాడు. వైశ్యశూద్రులైనా, స్త్రీలైనా ఈ విద్యానుష్ఠానంతో ముక్తిని పొందగలరంటే ఇక బ్రాహ్మణులకు, రాజులకు ఈ స్థితి దుర్లభమవుతుందా?

**విశేషం :** ధనుర్విద్యారహస్యం 'గురి'ని ఛేదించటం. దీనివలన లక్ష్యశుద్ధి కలుగుతుంది. అందుకే బ్రహ్మవిద్యకూడా ఒక ధనుర్విద్యవంటిదే అని ఉపనిషత్తులు చెప్తుతాయి. అందుకే 'నరుడు' ఒక్కడే గీతకు శ్రోత అయ్యాడు. అతడికే విషాదమూ కలిగింది. అతడికే పాపభీతి పుట్టింది. అతనే చివరికి మహాయుద్ధం చేశాడు. విజయుడయ్యాడు కూడా! ఈనాడు 'అనుగీత'కు శ్రోత కూడా ఆయనే. అందుకే ధర్మరాజుకు బోధించని గీతారహస్యాన్ని శ్రీకృష్ణుడు అర్జునుడికే బోధించాడు.

వేదవిద్యకు స్త్రీవైశ్య శూద్రులు ఒకప్పుడు బాహ్యులు. అయినా వారికి కూడా బ్రహ్మపదసంప్రాప్తి మాత్రం నిషిద్ధం కాదు. అందుకే ఇది 'యోగ' విద్యగా చెప్పబడినది. యాగం కర్మవిద్య. దానికి దూరులైనవారు కూడా బ్రహ్మత్వసిద్ధికి అర్హులే. స్థిరచిత్తం. ఆత్మవిద్యాపరిశ్రమ, మనోనిగ్రహాది సాధన, ఇంద్రియజయం, అవధానచిత్తం, వ్రతపరిరక్షణబుద్ధి కలిగిన ఎవరైనా బ్రహ్మపద సంప్రాప్తికి అర్హులేనని అర్థం. బ్రాహ్మణులు, రాజులు నిత్యజీవిత కార్యకలాపాలద్వారానే మొదటి మెట్టులోకి ప్రవేశించగలరు. కాబట్టి వారికి ఈ విద్య సుసాధ్యమని చెప్పటం మహర్షి వాక్యానికి అర్థం.

అర్యుడైనా అనార్యమైన దుఃఖాది భావాలలోకి వెళ్ళిపోతూ ఉంటాడు కాబట్టి భగవద్గీతలోనూ, ఇక్కడా ద్వంద్వ స్థితులను దాటటంద్వారా కలిగే చిత్తస్థైర్యాన్ని ప్రధానగుణంగా చెప్పటం కనిపిస్తుంది.

**క. వినిపించితి నిను బోధం। బునకు నుపాయంబ ఫలసముదయము మోక్షం**
**బును సౌఖ్యనిర్ణయము ని। క్కనుట గడవ సుఖము లొండు గలవే యరయన్? 229**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను గురించి (నీకు); బోధంబునకున్= బ్రహ్మబోధకు; ఉపాయంబు= పద్ధతి; ఫలసముదయము= దాని ఫలితాలు; మోక్షంబును= విముక్తి; సౌఖ్యనిర్ణయమున్= ఆ సుఖస్వరూపం; వినిపించితిన్= వినిపించాను; ఈ+కనుటన్+కడవన్= ఈ బ్రహ్మపద దర్శనం విడిచి (అతిశయించి); అరయన్= బాగా చూడగా; ఒండు సుఖములు= మరి ఇతర సుఖాలు; కలవే?= ఉన్నాయా?

**తాత్పర్యం:** అర్జునా! నీకు ఇంతవరకు బ్రహ్మబోధకు సంబంధించిన క్రమం, దానిఫలం, విముక్తి ఆ సుఖస్వరూపం ఇవన్నీ చెప్పాను. ఈ బ్రహ్మపదసందర్శనంకంటె మరొక సుఖం ఏదైనా ఉందా!

**విశేషం :** ఇక్కడ సుఖమంటే ఆనందమని అర్థం. బ్రహ్మపదసుఖమే బ్రహ్మానందమని అర్థం. 'బ్రహ్మానందం పరమసుఖదం' అని స్తుతి. ఆ ఆనందం పరమసుఖాన్ని ఇస్తుందట. అందుకే మానుషానంద, రాజానందాదులు ఆ బ్రహ్మానందం ముందు ఏ మాత్రం కొరగానివి అని తైత్తిరీయం సిద్ధాంతం చేసింది. (చూ॥ ఆనందవల్లి).

ఈ సుఖం వ్యసనకారకం కాదు. బంధం కలిగించదు. దాని లక్షణం విముక్తి. దాని గుణం ప్రకాశం.

**ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహ సంగంబు। నీడ విడిచి యెవ్వఁ డీ యుపాయ**
**ముల భజించు వాఁడు మోక్షలక్ష్మి కిఁ బతి। యగు నొకింత సందియంబు వలదు. 230**

**ప్రతిపదార్థం:** శ్రద్ధ కలిగి= శ్రద్ధతో కూడినవాడై; లోక సంగ్రహ= లోకాన్ని అవలంబించటంచేత కలిగిన; సంగంబున్= కలయికను; ఈడన్+విడిచి= సంపూర్ణంగా పరిత్యజించి; ఎవ్వఁడు= ఏ యోగి; ఈ ఉపాయములన్= ఈ మార్గాలతో; భజించున్+వాఁడు= మోక్ష సంపదను ఉపాసిస్తాడో అతడు; మోక్షలక్ష్మికిన్= మోక్షరూపమైన శ్రీదేవికి; పతి+అగున్= భర్త అవుతాడు; ఒక+ఇంత= కొంచెం కూడా; సందియంబు= సందేహం; వలదు= అక్కరలేదు.

**తాత్పర్యం:** ఎవడు శ్రద్ధాళువై ఈ లోకబంధంచేత పట్టిన మమతానుబంధాలను సంపూర్ణంగా దిగవిడిచి, ఇంతవరకు బోధించిన మార్గాలలో మోక్షపదవిని గురించి ఉపాసిస్తాడో అతడు మోక్షలక్ష్మిని వరిస్తాడు. ఈ విషయంలో కొంచెం కూడా సందేహం అక్కరలేదు. మోక్షలక్ష్మికిఁ బతియగు- అలంకారం రూపకం.

**క. చెప్పం గలయది యెల్లను। జెప్పితి; నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లేఁ**
**డిప్పాట నెలల నాఱిటఁ। జొప్పడు యోగంబు నియతి శుద్ధాత్మునకున్.' 231**

**ప్రతిపదార్థం:** చెప్పన్+కల+అది= చెప్పగలిగినది; ఎల్లనున్= అంతా; చెప్పితిన్= చెప్పాను; నీకున్+ఇంతన్+కడవన్= నీకు ఇంతకుమించి; చెప్పన్= చెప్పటానికి; ఒకఁడున్+లేఁడు= ఏదీ లేదు; శుద్ధాత్మునకున్= పరిశుద్ధమైన ఆత్మగలవాడికి; ఈ+పాటన్= ఈ పద్ధతిలో; నియతిన్= నియమంతో పాలిస్తే; యోగంబు= యోగం; నెలలన్+ఆఱిటన్= ఆరు నెలలలో; చొప్పడున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** చెప్పగలిగినదంతా చెప్పాను. ఇంతకుమించి దీనిని గురించి చెప్పగలవారెవ్వరూ లేరు. నియమపాలన గల శుద్ధాత్ముడికి ఈ పద్ధతిలో ఆరునెలలలోనే సంపూర్ణయోగం సిద్ధిస్తుంది.'

**వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిషయంబులగు వాక్యంబులు సెప్పె నని చెప్పిన విని యన్నర నారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించి రని యడుగుటయు. 232**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా, కృష్ణుండు= శ్రీకృష్ణుడు; జిష్ణునకున్= నరుడికి; అధ్యాత్మ విషయంబులగు వాక్యంబులు= వేదాంత సంబంధంగల వాక్యాలను; చెప్పెనని= చెప్పాడని; చెప్పినన్ విని= చెప్పగా విని; ఆ+నరనారాయణులు= ఆ కృష్ణార్జునులు; మఱియున్= ఇంకా; ఏ+విధంబునన్= ఏ తీరుగా; వర్తించిరి?= కాలం గడిపారు?; అని; అడుగుటయున్= జనమేజయుడు అడుగగా.

**తాత్పర్యం:** ఇట్లా శ్రీకృష్ణుడు అర్జునుడికి బ్రహ్మవిద్యాసంబంధాలైన మహావాక్యాలు వినిపించాడని చెప్పగా విని జనమేజయుడు 'ఆ తరువాత కృష్ణార్జునులు ఏమేమి చేశారు తెలుపుము' అని అడుగగా- తరువాతి ఆశ్వాసంలోనికి అన్వయం.

### అశ్వాసాంతము

**చ. గుణసమతానుభూతిహృతికోవిదసారవివేకభావ్య! చా**
**రణ సురసిద్ధసాధ్యఖచర ప్రముఖాఖిల భూతసేవ్య! వీ**
**క్షణకలనా కృతార్థమునిసార్థ బహుస్తుతివాక్యరత్నభూ**
**షణ! మహనీయ ఖేలన! నిసర్గకృపాకృత లోకపాలనా! 233**

**ప్రతిపదార్థం:** గుణసమతా+అనుభూతి= సత్త్వరజస్తమోగుణాల ప్రకృతిస్థితియొక్క; హృతి= హరించటంలో; కోవిద= పండితులైనవారి; సార= సారభూతమైన; వివేక= వివేకంచేత; భావ్య!= భావింపదగినవాడా!; చారణ= గంధర్వులు; సుర= దేవతలు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; ఖచర= ఆకాశసంచారులు; ప్రముఖ= మొదలైన; అఖిల= అన్ని; భూత భూతాలచేత; సేవ్య= సేవింపబడేవాడా!; వీక్షణకలనా= కటాక్షప్రసారమాత్రంచేత; కృతార్థ= ధన్యులైన; మునిసార్థ= ముని సముదాయంయొక్క; బహుస్తుతివాక్య= అనేక

స్తుతివాక్యాలనేటటువంటి; రత్నభూషణ= మణుల అలంకారం కలిగినవాడా!; మహనీయఖేలన!= పూజనీయమైన విహారం కలిగినవాడా!; నిసర్గ= సహజమైన; కృపాకృత= దయతో నిర్వహించబడిన; లోకపాలనా= విశ్వసంరక్షణకార్యం కలవాడా!

**తాత్పర్యం:** సత్త్వరజస్తమోగుణాల సహజానుభవాన్ని పరిహరించటంలో సమర్థులైన ధీరుల సారవివేకంచేత భావింపదగినవాడవు నీవు. గంధర్వులు, దేవతలు, ఆకాశసంచారులు మొదలైన అన్ని ప్రాణులు నిన్ను సేవిస్తుంటాయి. నీ కటాక్షమాత్రంచేత ధన్యులైన మునిసముదాయం చేసే స్తోత్రాలనే అనేకరత్నాలతో పొదిగిన అలంకారం కలిగినవాడవు నీవు. నీ విహారం చాలా పూజనీయమైనది. ఈ విశ్వసంరక్షణకార్యాన్ని నీకున్న సహజమైన కృపతో నిర్వహిస్తున్న దేవదేవుడవైన ఓ హరిహరనాథా! నీకు నమస్కారం.

**విశేషం :** ప్రకృతి గుణాలు సత్త్వరజస్తమస్సులు. వీటి సముదాయ స్థితినే 'మాయ' అని అంటారు. వీటి 'సమత' అంటే సహజస్థితి అనే అర్థం. దీని లక్షణమే 'అహంకృతి', ఇంద్రియాదుల మోహధర్మం. దీనితో జీవుడు అనుభవిస్తున్నదే ఈ అజ్ఞానమయమైన లోకసుఖదుః ఖాది భావసముదాయం. దీనిని పోగొట్టుకొనటమే 'యోగ' సాధనఫలితం. వారు 'వివేకం' తో దీనిని సాధిస్తారు.

'భూతా'లని ప్రాణులకు సాధారణ నామం. హరిహరనాథస్వామి త్రిలోకసేవ్యుడని అర్థం. చారణులు, గంధర్వులు దేవనాయకులు. సురలని ఇంద్రాదులకు పేరు. సాధ్యులు అని పండ్రెండుగురు. వీరు దేవగణంలోని వారే. మన, మంత ప్రాణ, భర, ఆపాన, నిర్యవత్, నిర్మయ, నరక, దంశ, నారాయణ, వృష, ప్రభు లనివారి పేర్లు, ఇంకా ఆకాశంలో తిరిగే దేవయోనులు కొందరున్నారు. వారిని ఖచరులంటారు. సిద్ధులు- చంద్రలోకం దిగువ నివసించే విశ్వవసు ప్రభృతులు. వీరందరూ నిరంతరం దేవసేనాధురంధరులు.

ముని సార్థమంటే - మహర్షి సముదాయాలు; సప్తమహర్షులు మొదలైనవారు చేసిన స్తుతులే స్వామికి ఆభరణాలని అర్థం. అంటే వారి స్తుతులచేత స్వామి మహనీయత్వం ఇనుమడించినదని భావం.

స్వామికి లోకపాలన ఒక 'క్రీడ', దుష్టశిక్షణ శిష్టరక్షణ ఆ ఆటలోని ప్రధాన అంశాలు. సత్యధర్మసంరక్షణలే దాని ప్రయోజనం. ఈ నిర్వహణకు హేతువు స్వామివారికున్న అపారకృప. వైష్ణవ భక్తులు స్వామి 'కృపా' ధర్మం ఆధారంగా 'ప్రపత్తి' యోగాన్ని ప్రతిపాదించారు. స్వామి లోకాన్ని సంరక్షించటంలో ఆయనకు ఏ స్వార్థమూలేదు. అంతా పరార్థమే. అంతా ఆయన సహజ దానదయాధర్మకర్మమే. అందుకే ఈ పర్వంలో స్వామి అర్జునుడిపై 'కృప' వహించి మరలా గీతార్థాన్ని బోధించాడు. యజ్ఞదీక్షను అనుగ్రహించి, పాండవులను సముద్ధరించాడు. వారికి ఆముష్మికచింత కలిగించి, జ్ఞానులుగా మార్చాడు. స్తుతివాక్యరత్న-అనుచో రూపకాలంకారం

**క. నవ్యత్వ పురాణత్వ ద। శావ్యపనయదుర్నిరూప సౌందర్యా! వే**
**దవ్యాసవాక్ప్రకాశిత!। దివ్యధురాధుర్య! యోగిధీసత్కార్యా! 234**

**ప్రతిపదార్థం:** నవ్యత్వ= కొత్తదనం; పురాణత్వ= ప్రాచీనత్వం అనే ఈ రెండు; దశావ్యపనయ= దశలు తొలగిపోవటంచేత; దుర్నిరూప= నిరూపించటానికి సాధ్యంకాని; సౌందర్యా!= అందం కలిగినవాడా!; వేదవ్యాస= వేదవ్యాస మహర్షియొక్క; వాక్= వాక్కులచేత; ప్రకాశిత!= ప్రకాశింపచేయబడినవాడా!; దివ్య= ఉత్తమమైన; ధురాధుర్య!= భారాన్ని వహించేవాడా!; యోగి= కపిలాది మహామునుల; ధీ= ప్రజ్ఞా విశేషంచేత; సత్కార్యా!= సత్కరింపబడేవాడా!

**తాత్పర్యం:** స్వామీ! క్రొత్తపాతదనాలు రెండూ లేనివాడిని కావటంచేత నీ సౌందర్యం ఇదమిత్థమని నిర్ణయించటం కష్టం. వ్యాసమహర్షి రచనలచేత నీ ప్రకాశం ఉద్దీప్తమైనది. సకలభువనరక్షణ కార్యాన్ని నిర్వహించే నీవు ప్రసిద్ధులైన కపిలాది మహర్షుల ప్రజ్ఞావిశేషంచేత సత్కరింపబడేవాడవు. నీకు నమస్కారం.

**విశేషం :** పరమేశ్వరుడు కాలస్వరూపుడు. కనుక వ్యావహారికమైన భూతభవిష్యద్వర్తమాన విభాగం ఆయనకు వర్తించదు. కాబట్టి ఆ కాంతిరూపానికి క్రొత్తపాతలు లేవు. ఆ కారణంవలననే ఆయన రూపం దుర్నిరీక్ష్యం (చూడసాధ్యం కానిది). కనుక నిరూపణకు

అసాధ్యమైనది. మరి పురాణాలు 'శతకోటి మన్మథాకారు' డనటంలో ఉద్దేశం. ఆ సౌందర్యం వ్యామోహజనకం కాదని. ఆ అర్థంలోనే మన్మథుడి 'తండ్రి' అనటం కూడా.

వ్యాసమహర్షి వేదవిభాగజ్ఞుడు. కనుక వేదవాక్కులు, బ్రహ్మసూత్రాలు, అష్టాదశపురాణాలు ఇత్యాదులచేత ఏ బ్రహ్మతత్త్వ నిరూపణం జరిగిందో ఆదంతా వ్యాసవాక్యసముదాయమే. కనుక వ్యాసవాక్కు స్వామిని ప్రకాశింపజేసినదనటం.

స్వామి భరిస్తున్నది మానుషమైన భారంకాదు. అది దివ్యభారం. భువననిర్వహణ రూపమైన ధర్మసంరక్షణ దివ్యకార్యం. కాబట్టి దివ్యభారమని అనటం.

యోగులు తమ ధీవిలాసంచేత ఎవరిని గుర్తించి సేవించారో ఆ బ్రహ్మపదం యోగులచేత సత్కరించబడింది. అందుకే గీతను బోధించిన శ్రీకృష్ణుడిని యోగేశ్వరుడని అన్నారు.

**మాలిని.**

> **భువనభవన దీపస్ఫూర్తి తేజోవిలాసా!**
> **సవితృశశిమయత్వ స్ఫారచక్షుర్వికాసా!**
> **వివిధనిగమవిద్యావేద్యసూక్ష్మ ప్రభాసా!**
> **పవనవిజయలీలాప్రౌఢ చేతోవిలాసా!** **235**

**ప్రతిపదార్థం:** భువన= సప్త సప్త భవనాలనేటటువంటి; భవన= ఇంటికి; దీపస్ఫూర్తి; దీపమనిపించే; తేజోవిలాసా!= కాంతిప్రకాశం కలిగినవాడా!; సవితృ= సూర్య; శశిమయత్వ= చంద్రమయమైన; స్ఫార= విస్తారమైన; చక్షుర్వికాసా!= దృష్టివికాసం కలవాడా!; వివిధ= బహువిధాలైన; నిగమవిద్యావేద్య= వేదవిద్యచేత తెలియదగిన; సూక్ష్మప్రభాసా!= అతి సూక్ష్మమైన తేజోరూపం కలిగినవాడా!; పవన విజయ= గాలిని నిరోధించటంచేత (యోగవిద్యాభ్యాసంచేత); లీలాప్రౌఢ= మహత్త్వాన్ని సాధించిన ప్రౌఢులైన యోగుల; చేతస్+విలాసా!= హృదయాలలో విహరించేవాడా!

**తాత్పర్యం:** చతుర్దశభువనాలనే భవనాన్ని నీ దీప్తిచేత ప్రకాశింపచేస్తున్నావు నీవు. సూర్యచంద్రులను నేత్రాలుగా కలిగి, ఈ సర్వసృష్టిని వీక్షిస్తావు నీవు. నీ తేజోవిలాసం వేదవిద్యారూపమైన జ్ఞానచక్షువుచేత మాత్రమే దర్శింపదగినది. ప్రాణాయామాది యోగసాధనలచేత ప్రౌఢులైన యోగుల హృదయాలలో నీవు సదా విహరిస్తుంటావు. అట్లాంటి నీకు నమస్కారం.

**విశేషం :** భూలోక భువర్లోకాది సప్త ఊర్ధ్వ లోకాలు, అతల, సుతల, వితలాది సప్త అధోలోకాలు - ఈ రెండు ఏళ్ళు కలిసి చతుర్దశ భువనాలు (2X7=14) అవుతాయి. ఈ లోకాలకు ఉన్న ఒకే మహాకాంతిపుంజం హరిహరనాథస్వామిదే.

విరాట్ పురుషుడి వర్ణనలో చెప్పినట్టు సూర్యచంద్రులు స్వామి నయనాలు. అంటే రాత్రింబవళ్ళులో నిరంతరం స్వామి వారి వీక్షణ లోకంమీద ఉన్నదని తాత్పర్యం. భువనభవనదీప-అలంకారం రూపకం.

చతుర్వేదాలని సాధారణనామం ఉన్నా వేదాలు అనంతాలని తైత్తిరీయం చెప్పుతున్నది. (అనంతావై వేదాః)

> "ఏక శతమధ్వర్యుశాఖాః । నవధాఽథర్వణో వేదః,
> సహస్రధా సామవర్త్మా । ఏకవింశతిధా బాహ్వృచం."

అని పతంజలి మహర్షి మహాభాష్యంలో చెప్పటాన్ని గమనిస్తే ఎన్నో శాఖలు వేదవాఙ్మయంలో ఉన్నట్లు తెలుస్తుంది.

'పవన విజయం' అంటే 'గాలిని నిరోధించటం' అని అర్థం. ప్రాణాయామంతోనే యోగ సాధన మొదలవుతుంది. కనుక యోగులు పవనవిజయులు. కనుక ద్వంద్వభావాతీతులై యోగసాధనలో ప్రౌఢు' లవుతారు.

'రామ' శబ్దన్ని నిర్వచిస్తూ 'యోగినాం హృదయేషు రమతీతి రామః' అని చెప్తుతారు. యోగుల హృదయాలలో రమించే ధర్మమున్నందువలన రాముడని వసిష్ఠుడు పేరు పెట్టాడట! ఇదే ఇక్కడా అనువర్తించుకొనాలి.

మాలినీ వృత్తంలో ప్రతిపాదంలోనూ వరుసగా న,న,మ,య,య గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిమైత్రిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజ తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము**

**ప్రతిపదార్థం:** ఇది= ఈరచన; శ్రీమత్= మంగళకరుడైన; ఉభయకవిమిత్ర= కావ్యశాస్త్ర కవులిరువురికీ మిత్రుడైనవాడు, బుధ+ఆరాధన విరాజి= పండితులను (జ్ఞానులను) సేవించటం వలన కీర్తితో ప్రకాశించేవాడు; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కన చేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీ మహాభారతంబునన్; అశ్వమేధ పర్వంబునందున్; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసము.

**తాత్పర్యం:** ఇది ఉభయకవిమిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, జ్ఞానులచేత ఆరాధించబడి రాణించేవాడూ అయిన తిక్కన సోమయాజి శుభప్రదంగా రచించిన శ్రీ మహాభారతంలోని అశ్వమేధపర్వంలో మొదటి ఆశ్వాసం.

అశ్వమేధపర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీసుఖనిష్పాదన కే। లీసక్త పదారవిందలీలా! సతతా**

**భ్యాసవికాసిసమాధి స। మాసాదిత శాంతిలోల! హరిహరనాథా!** **1**

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= హరిహరనాథ స్వామీ! శ్రీసుఖ= మోక్షసుఖాన్ని; నిష్పాదనకేలీ= కలుగజేయటం అనే క్రీడలో; సక్త= ఆసక్తమైన; పదారవిందలీలా!= చరణపద్మాల విలాసం కలిగినవాడా!; సతత+అభ్యాస= నిరంతరం అభ్యసించటం వలన; వికాసి= పరిపూర్ణమైన= సమాధి= సమాధిచేత; సమాసాదిత= పొందబడిన; శాంతిలోల!= స్వస్వరూప శాంతియందు ఆసక్తి కలిగినవాడా!

**తాత్పర్యం:** స్వామీ - హరిహరనాథా! నీ శ్రీచరణకమలసేవకులు పరమపదసుఖాన్ని అవలీలగా పొందగలరు. సంతత యోగాభ్యాసం వలన కలిగే సమాధిలో సిద్ధించే శాంతి అంటే నీకు ఆసక్తి మెండు.

**విశేషం:** 'శ్రీ' శబ్దానికి వేదాంత పరిభాషలో నిశ్శ్రేయసమని అర్థం. మోక్షం ఒక లక్ష్మీస్వరూపం. దానినే 'శ్రీ' పదంచేత పిలుస్తారు. 'సాహి శ్రీ రమృతా సతాం' అని తైత్తిరీయం అమృతభావరూపమైన మోక్షం శ్రీపదవాచ్యమని చెప్పుతున్నది.

హరిహరనాథుడు 'శాంతి'లోలుడు. సమాధిలో యోగి నిర్వికల్పం పొందుతాడు. నిర్వికారమే శాంతరూపం. శ్రీకృష్ణుడు ఏ గీతాసారాన్ని మరలా పూర్వపర్వంలో బోధించాడో ఆ తత్త్వాన్ని మరలా ఈ పర్వంలో కూడా బ్రాహ్మణగీతల ద్వారా చెప్పుతున్నాడు.

బ్రాహ్మణగీతలు (సం. **14-20-1**)

**వ.** **దేవా! వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె.** **2**

**ప్రతిపదార్థం:** హరిహరనాథస్వామీ! వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**ఆ.** **అట్లు శౌరి పార్థు నంచిత బ్రహ్మ వి। ద్యాప్రబోధకంబు లైన యట్టి**

**వినుతవాక్యవాక్యములు సవిస్తరంబుగ విని। పించి యతనివలన ప్రీతిఁ జేసి.** **3**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; శౌరి= కృష్ణుడు; పార్థున్= అర్జునుడిని (గురించి); అంచిత= గొప్పదైన; బ్రహ్మవిద్యా ప్రబోధకంబులు+ఐన+అట్టి= వేదాంత విద్యను బోధించేటటువంటి; వినుత= ప్రసిద్ధ; వాక్యములు= వాక్యాలు; సవిస్తరంబుగన్= విశదంగా; వినిపించి= చెప్పి; అతనివలనన్= అతడియందు; ప్రీతిన్+చేసి= ప్రేమకారణంగా.

**తాత్పర్యం:** అట్లా పూర్వపర్వంలో చెప్పిన విధంగా శ్రీకృష్ణుడు అర్జునుడికి గొప్ప వేదాంతవిద్యను బోధించేటటువంటి ప్రసిద్ధకావ్యాలను విశదంగా బోధించినవాడై, అతడిపట్ల ఉన్న ప్రేమకారణంగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ.** **వెండియు నిట్లని బోధించు** **4**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరల; ఇట్లు+అని= ఈ విధంగా; బోధించున్= బోధించాడు.

**తాత్పర్యం:** ఇంకా ఇట్లా చెప్పాడు.

**సీ.** **భర్తృభార్యాకృత భవ్యసంవాదంబు। నభయ నామకమునై యతిశయిల్లు**
**నట్టిది యొక యితిహాసంబు విను పార్థ! జననుతసమధికజ్ఞానవర్ణి**
**తాత్మకుఁ డైన మహాద్విజుఁ డొకఁడు వి। విక్త ప్రదేశసేవిత్వనిరతి**
**నున్నెడ నల్ల నాసన్నయై వినయంబు। భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి**

**తే.** **యాచరించి 'మహాత్మ! యధ్యాత్మబోధ। భరితఁగాఁ జేయవే నన్నుఁ గరుణ పల్ల**
**వింప' నని దయవుట్టంగ వేఁడుటయును। మందహాసవిభాసియై మగువఁ జూచి.** **5**

**ప్రతిపదార్థం:** పార్థ!= అర్జునా!; భర్తృ భార్యా కృత= భర్తృభార్యలచేత చేయబడిన; భవ్య= గొప్ప; సంవాదంబున్= సంభాషణ; అభయ నామకమున్+ఐ= అభయమని పేరు కలిగినది; అతిశయిల్లున్= ప్రసిద్ధి చెందిన; అట్టిది= అట్లాంటిది; ఒక+ఇతిహాసంబు= ఒక కథ (ఉన్నది); విను; జననుత= ప్రజలచేత ప్రస్తుతించబడిన; సమధిక= మిక్కిలి అధికమైన; జ్ఞాన వర్ణిత+ఆత్మకుఁడు+ఐన= జ్ఞానంచేత పేరెన్నిక గన్న ఆత్మ కలిగిన (ఆత్మజ్ఞానం కలిగిన అని అర్థం); మహాద్విజుఁడు= ఉత్తమ బ్రాహ్మణుడు; ఒకఁడు= ఒకాయన; వివిక్త= ఏకాంతమైన; ప్రదేశ= స్థలాలలో; సేవిత్వనిరతిన్= భగవంతుడిని ఉపాసనచేయాలన్న కోరికతో; ఉన్న+ఎడన్= ఉన్న సందర్భంలో; అల్లన్= నెమ్మదిగా; ఆసన్న+ఐ= సమీపించినదై; వినయంబున్= వినయమూ; భక్తియున్= భక్తీ; ఎసఁగన్= అతిశయించగా; తద్+పత్ని= ఆయన భార్య; ప్రణతి+ఆచరించి= నమస్కారంచేసి; మహాత్మ!= ఓ మహనీయుడా!; నన్నున్= నన్ను; కరుణ+పల్లవింపన్= దయ చిగురొత్తగా; అధ్యాత్మబోధ+భరితన్+కాన్= అధ్యాత్మజ్ఞానంతో నిండినదానినిగా; చేయవే+ దయతో చేయుము; అని; దయ+పుట్టంగన్= దయ జనించేటట్లుగా; వేఁడుటయును= ప్రార్థించగా; మందహాస= చిరునవ్వుతో; విభాసి+ఐ= ప్రకాశిస్తున్నవాడై; మగునవన్+చూచి= ఆ స్త్రీని చూచి.

**తాత్పర్యం:** 'అర్జునా! వినుము. భార్యాభర్తలు చేసిన ఒక గొప్ప సంభాషణ 'అభయ' మనే పేరుతో ప్రసిద్ధమైనది ఒక కథ ఉన్నది. ఆ కథ చెప్తాను. ఒక ఊరిలో ప్రజలందరూ స్తుతించే ఒక ఉత్తమబ్రాహ్మణుడు ఉండేవాడు. ప్రజలందరూ అతడి ఆత్మజ్ఞానాన్ని ప్రశంసించేవారు. అతడు ఒకప్పుడు ఏకాంతంగా కాలం గడుపుతూ భగవంతుడిని ఉపాసించాలని అభిలషించాడు. ఆ సమయంలో ఆయన భార్య నెమ్మదిగా అక్కడికి వచ్చి భక్తి, వినయం అతిశయించగా ఆయనకు నమస్కరించి 'స్వామీ! నాకు అధ్యాత్మజ్ఞానాన్ని దయతో బోధించి నన్ను తరింపజేయండి' అని ప్రార్థించింది. అప్పుడు ఆయన చిరునవ్వు నవ్వుతూ ఆమెను చూచి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **'ఈ మాటకుఁ జారుముఖీ। నామది ముదమందెఁ గాన నాతికి నిదియే**
**లా మేటితలంపను త్రో। పేమియు లే; దోపి వినుము హితవచనంబుల్.** **6**

**ప్రతిపదార్థం:** చారుముఖీ!= ఓ అందమైన ముఖం కలిగిన నారీమణీ!; ఈ మాటకున్= నీ వాడిన ఈ మాటతో; నా మది= నా మనస్సు; ముదము+అందెన్+కాన= సంతోషపడింది కాబట్టి; నాతికిన్= స్త్రీకి; ఇది= ఇట్లా అడగటం; ఏలా?= ఎందుకు?; మేటి తలంపు= గొప్ప ఆలోచన; అను= అనేటటువంటి; త్రోపు+ఏమియున్+లేదు= నిషేధం ఏమీ లేదు; హిత వచనంబుల్= నేను చెప్పే మంచి మాటలు; ఓపి+వినుము= ఓపికతో వినుము.

**తాత్పర్యం:** 'ఓ వనితా! నీ మాటతో నా హృదయం సంతోషపడింది. స్త్రీ ఇంత పెద్ద ఆలోచన చేయటమా అనే నిషేధం ఏమీ లేదు. (అంటే నీవు అడగటానికి అర్హురాలవే అని అర్థం). కాబట్టి నేను చెప్పే మంచి మాటలు సావధానంగా వినుము.'

**విశేషం :** వేదభ్యాసం చేయటం స్త్రీకి తగినదా? కాదా? - అనే ధర్మశాస్త్రమీమాంస ఉన్నది. యజ్ఞం ఆచారకాండతో ముడిపడినది. ఆ యజ్ఞానికి కూడా స్త్రీ సహకారం ప్రధానమైనది. ధర్మపత్నితో కూడినవాడై యజ్ఞంచేయాలి. అట్లాగే వేదాంత చర్చ స్త్రీకి అనవసరమనే సాధారణభావమూ ప్రజలలో ఉన్నది. ఈ సందర్భాన్ని చూస్తే వేదాభ్యాసమూ, వేదాంత ప్రశ్న స్త్రీకి అనుచితాలు కావని స్పష్టంగా అర్థం చేసికొనవచ్చును. కాబట్టి స్త్రీకి వేదవిద్య నిషిద్ధమనే భావన చారిత్రకంగా మధ్యయుగాలలో పుట్టినది అని మనం అర్థం చేసికొనవచ్చును.

**వ. నా యెఱింగిన భంగిఁ జెప్పెద' నని పలికి యయ్యతులవ్రతుం డా పతివ్రత కిట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** నా+ఎఱింగిన= నాకు తెలిసిన; భంగిన్= విధంగా చెప్పెదన్= చెప్పుతాను; అని; పలికి= చెప్పి; ఆ+అతులవ్రతుండు= ఆ నిరుపమదీక్షగల బ్రాహ్మణుడు; ఆ పతివ్రతకున్= ఆ పతివ్రతతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'నాకు తెలిసిన రీతిలో చెప్పుతాను' అని ఆ దీక్షితుడైన బ్రాహ్మణుడు ఆ పతివ్రతతో ఇట్లా అన్నాడు.

**సీ. 'వినను గానను జేయ వెరవైన యవి కర్మ। ములు; వానిఁ గర్మకర్తలు సమస్త**
**సిద్ధిప్రదము లని చెప్పుదు రజ్ఞాన। తిమిరాంధులై విను ధీరచిత్త!**
**జగమున లేదు నిష్కర్మత్వ మెందేనిఁ। గలిగె నేనియును మౌర్ఖ్యముగ దాని**
**నిందింతు రెక్కుడు నెల వది యాత్మ నేఁ। గందు బ్రహ్మంబు నిష్కలత నందు**

**తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున। ధర్మమం దెప్డు నడపి భూతములఁ దాల్చు**
**నజుఁడు మొదలుగ నక్షరోపాస్తియందుఁ। జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8**

**ప్రతిపదార్థం:** ధీరచిత్త!= ధీరత్వంతో కూడిన చిత్తం కలిగిన ఓ వనితా!; విననున్= వినటానికి; కాననున్= చూడటానికి; చేయన్= చేయటానికి; వెరవు+ఐన= వీలైన; అవి= పనులు ఏవి ఉన్నాయో అవి; కర్మములు= కర్మలు; కర్మకర్తలు= కర్మవాదులు; వానిన్= ఆ కర్మలను; అజ్ఞాన= అజ్ఞానమనే; తిమిర+అంధులు+ఐ= చీకటితో కన్ను గాననివారై; సమస్త సిద్ధి ప్రదములు+అని చెప్పుదురు= అన్ని సిద్ధులను ఇస్తాయని చెప్పుతారు; జగమునన్= ప్రపంచంలో; నిష్కర్మత్వము= కర్మలేనితనం; లేదు; ఎందేనిన్= ఎక్కడైనా; కలిగెను+ఏనియున్= ఉన్నాకూడా; మౌర్ఖ్యముగన్= మూర్ఖుడి లక్షణంతో; దానిన్= ఆ నిష్కర్మపరత్వాన్ని; నిందింతురు= నిరసిస్తారు; అది= ఆ నిష్కర్మపరత్వం; ఎక్కుడు+నెలవు= ఉన్నతమైన స్థితి (ఎందుకంటే); ఏను= నేను; ఆత్మన్=ఆత్మలో; బ్రహ్మంబున్= బ్రహ్మన్ని; కందున్= చూస్తాను (ఆ తత్త్వం); నిష్కలతన్+అందు= ఏ కళాలేని స్థితిలో ఉంటుంది (అది నిజంగా నిష్కర్మతోడి స్థితి); వెలుఁగన్= నిరంతరం ప్రకాశించే; అగ్నితో; సోముండు= చంద్రుడు; కలసి= కలసినవాడై; మిథునధర్మమందున్+ఎప్డున్+నడపి= సంగమధర్మంలో జగత్తును ఎప్పుడూ నడిపించి; భూతములన్+తాల్చున్= సర్వప్రాణులనూ జనింపచేస్తున్నాడు; అజుఁడు= బ్రహ్మ; మొదలుగన్= మొదలైన దేవతలందరూ; శాంతిన్= పరమశాంత చిత్తస్థితులై; ఇంద్రియ జిత్త్వము+ఒంది= ఇంద్రియజయాన్ని కలిగి, అక్షర+ఉపాస్తి+అందున్+చేయుదురు= అక్షర తత్త్వాన్ని ఉపాసించటమనే కర్మలో నిరంతరం మగ్నులుగా ఉంటారు.

**తాత్పర్యం:** 'ఓ ధీరస్వభావురాలా! వినుము! వినటానికి, చూడటానికి, చేయటానికి వీలైన పనులు ఏవేవి ఉన్నాయో అవన్నీ కర్మలు, కర్మవాదులు అజ్ఞానమనే చీకటిలో ఉన్నవారై ఆ కర్మలు సమస్తసిద్ధులను ప్రసాదిస్తాయని అంటారు.

అసలు ప్రపంచంలో నిష్కర్మత్వం అనే స్థితే లేదు. ఎక్కడైనా ఉన్నా అది మూర్ఖుడి ధర్మంగా అందరూ నిందిస్తారు. కాని, అట్లా ఏ క్రియా లేని స్థితి అన్నది పరమోన్నతమైనది. అది బ్రహ్మలక్షణం. నేను ఆత్మలో చూస్తాను. బ్రహ్మోపాసనచేస్తాను. ఆ బ్రహ్మతత్త్వం 'నిష్కళంకంగా కనిపిస్తుంది (అందుకే అది 'నిష్కర్మం'గా ఉండగలుగుతుందని అర్థం). ఇక తక్కిన జగత్తంతా క్రియాత్మకమే. అగ్నితో సోముడు కలసి సంగమధర్మంతో జగత్తును నడిపిస్తూ సకలప్రాణరాశినీ సృష్టిస్తున్నాడు. బ్రహ్మాది దేవతలు పరమశాంతిచిత్తులై ఇంద్రియవిజయం పొంది అక్షరతత్త్వోపాసనలో నిరంతరం మగ్నులై ఉంటారు.

**విశేషం :** లోకంలోని కర్మ మోహజనకమైనది. ఇంద్రియాలు చేసే పనులు అట్లాంటివే. అది సకామం (కామంతో కూడినది). యోగి అభ్యసించేది నిష్కర్మ. దానికి ఫలితం ఇంద్రియజయం. ఆ అనుభవం 'శాంత' స్థితి. అక్కడ ఏ రసాల అలజడులూ లేవు. అది బ్రహ్మ కర్మ, ఇక్కడ బ్రహ్మ శబ్దం చతుర్ముఖబ్రహ్మను సూచించేది కాదు. పరతత్త్వసూచకం. ఇది 'బ్రహ్మం.'

'అగ్నిషోమాత్మకం బీజం రామనామే ప్రతిష్ఠితమ్' అని వేదాంతులు రామశబ్దాన్ని నిర్వచిస్తారు. రకారం అగ్నిబీజమని, మకారం సోమబీజమని, స+ఉమ - అని విడదీస్తే ఉమతోకూడినవాడు 'ఈశ్వరుడు' అవుతాడు. అగ్ని శివపార్వతుల సమాగమాన్ని భంగంచేసి శివతేజస్సును గ్రహించగా కుమారుడు పుట్టాడు. ఈ కుమారుడు విశ్వకుమారుడు. (ప్రపంచంలో ప్రతి కుమారుడి పుట్టుకకూడా ఈ కథలోనే ఉన్నదని అగ్ని, సోముల కలయిక ప్రస్తావన నిరూపిస్తున్నది. సర్వప్రాణుల హృదయాలలో ఉన్నవాడు ఈశ్వరుడు (ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి - అని గీత). కనుక చంద్రాగ్నుల కలయికతో జగద్బీజం ఏర్పడుతున్నదని తాత్పర్యం. ఇదీ కర్మమే కాని ఇది మోహజయం కలిగిన నిర్వికారకర్మ. జగత్తును రక్షించటానికి వినియోగించిన నిష్కామకర్మ కాబట్టి కర్మ-అకర్మ - నిష్కర్మలను గుర్తించటంద్వారా మనిషి జ్ఞానవంతు డవుతాడని ఆ భర్త భార్యకు బోధిస్తున్నాడు.)

**వ. అక్షరంబు తెఱం గెఱింగించెద. 9**

**ప్రతిపదార్థం:** అక్షరంబు= అక్షరతత్త్వపు; తెఱంగు= లక్షణాన్ని; ఎఱింగించెదన్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** అక్షరతత్త్వ స్వభావాన్ని వివరిస్తాను.

**విశేషం:** పూర్వపద్యంలో బ్రహ్మాది దేవతలు అక్షరతత్త్వాన్ని ఉపాసిస్తా రన్నాడు కదా! ఆ 'అక్షర' స్వభావం ఏమిటో చెప్తుతున్నాడు. న+క్షరం - అంటే ఎప్పటికీ తరగనిది. క్షీణించనిది అని అర్థం. ప్రకృతిశక్తులన్నీ నశిస్తాయి. పురుషతత్త్వమైన ఆత్మపదార్థం ఒకటే ఎప్పుడూ స్థిరంగా ఉండేది. అది ఎట్లాగో నిరూపిస్తున్నాడు.

**సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు । గంధంబుఁ గాకున్కి కారణముగఁ**
**ద్వక్కున జిహ్వ నేత్రమున శ్రోత్రంబున । ఘ్రాణంబునను బరిగ్రహవిధాన**
**మాచరించుటకు లోనై యుండ దాతత్త్వ । మమలిన బుద్ధ్యవగమము దానిఁ**
**బ్రాపించుఁ బ్రాణాది పంచవాయువులును । విను దానివలన వర్తనముఁ బొందు**

**తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స । మాననామకవ్యానమధ్యమున నడచు**
**మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి । దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱిచె. 10**

**ప్రతిపదార్థం:** అ తత్త్వము= ఆ అక్షర పరబ్రహ్మతత్త్వం; స్పర్శంబు= స్పర్శ; రసము= రసం; రూపంబును= రూపం; శబ్దంబు= శబ్దం; గంధంబు= గంధం; కాక+ఉన్కి+కారణముగన్= కాకుండా ఉండటంవలన; త్వక్కునన్= చర్మంతో; జిహ్వన్= నాలుకతో;

నేత్రమునన్= కంటితో; శ్రోత్రంబునన్= చెవితో; ఘ్రాణంబునన్= ముక్కుతో; పరిగ్రహవిధానము+ఆచరించుటకున్= గ్రహించటానికి; లోను+ఐ+ఉండదు= వీలుకాదు; అమలిన= నిర్మలమైన; బుద్ధి+అవగమము= వివేకంతోనే తెలిసికొనదగింది (బుద్ధికి అందేది); దానిన్+ప్రాపించు= ఆ తత్త్వాన్ని పొందేటట్లు చేసేటటువంటి; ప్రాణాది= ప్రాణాది= ప్రాణ, అపానాదులైన; పంచవాయువులునున్= ఐదు వాయువులూ; దానివలనన్= అ అక్షరతత్త్వంవలననే; వర్తనమున్+పొందున్= ప్రవర్తిస్తున్నాయి; విను= బాగా శ్రద్ధగా వినుము. అందున్+అ= ఆ తత్త్వంలోనే (అవి); డిందున్= లీనమవుతాయి; ప్రాణంబున్+అపానమునున్= ప్రాణం, అపానం అనబడేవి; సమాన నామక= సమానమనే పేరుగలిగిన; వ్యానమధ్యమునన్= వ్యానం నడుమ; నడచున్= ప్రసరిస్తూ ఉంటుంది; ప్రాణ+అపానములకున్= ప్రాణాపానాలకు; నడిమి దెసన్= నడుమగా; ఉదానంబు= ఉదానం; మెలఁగుచుండున్= వ్యాపించి ఉంటుంది; ఇట్లు= ఈ విధంగా; శ్రుతి= వేదం; తేటపఱిచెన్= స్పష్టంగా చెప్పినది.

**తాత్పర్యం:** ఆ అక్షర పరబ్రహ్మతత్త్వం స్పర్శ, రస, రూప, శబ్ద, గంధాలు లేనిది కావటంచేత చర్మంతోకాని, నాలుకతోకాని, కంటితోకాని, చెవితోకాని, ముక్కుతోకాని గుర్తించటానికి సాధ్యం కాదు. అది కేవలం పవిత్రమైన బుద్ధివిశేషంచేత మాత్రమే తెలిసికొనబడుతుంది. ఆ తత్త్వాన్ని పొందించేటటువంటి ప్రాణాపానాది పంచవాయువులు కూడా ఆ అక్షరతత్త్వంవలననే ప్రభవిస్తున్నాయి. అందులోనే చివరికి లీన మవుతున్నాయి కూడా. ప్రాణాపానాలు సమానమని పేరు కలిగిన వ్యానం మధ్యంలో ఉండగా, ప్రాణాపానాలనడుమ ఉదానం ప్రసవిస్తూ ఉంటుంది - అని వేదం స్పష్టంగా ప్రతిపాదించి ఉన్నది.

**విశేషం :**

**"హృది ప్రాణః గుదే-ఽపానః సమానో నాభిసంస్థితః,**
**ఉదానః కంఠదేశస్థః వ్యానః సర్వశరీరగః" అని చెప్పుతారు.**

(హృదయంలో ప్రాణం, గుదస్థానంలో అపానం, నాభిలో సమానం, కంఠంలో ఉదానం ఉండగా, వ్యానం సర్వదేహంలోనూ వ్యాపించి ఉంటుంది.)

**"నాగశ్చ కూర్మః కృకరో దేవదత్తో ధనంజయః,**
**వాగ్ద్వారే నాగ ఆఖ్యాతః కూర్మ ఉన్మీలనే స్మృతః.**
**కృకరాచ్చ క్షుతం జ్ఞేయం దేవదత్తా విజృంభణే,**
**న జహాతి మృతం వాపి సర్వవ్యాపీ ధనంజయః.''**

(ఈ పంచప్రాణాలకు - నాగ, కూర్మ, కృకర, దేవత్త, ధనంజయాలని పేర్లు, నోటి ద్వారంలో నాగం, కంటి రెప్పలలో కూర్మం, తుమ్ములో కృకరం, ఆవులింతలో దేవదత్తం, మనిషి చనిపోయినా దేహమంతటా వ్యాపించి ధనంజయం - అనే ప్రాణాలు ఉంటాయి.)

**క. నెలకొని ప్రాణపానం । బులఁ బురుషుఁడు సుప్తుఁ డైనఁ బొలఁతి! విలీనం**
**బులగు సమానవ్యానం । బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11**

**ప్రతిపదార్థం:** పొలఁతి!= ఓ వనితా!; పురుషుఁడు= జీవుడు; ప్రాణ+అపానంబులన్= ప్రాణాపానాలలో; నెలకొని= ఉండి; సుప్తుఁడు+ఐనన్= నిద్రిస్తే; సమాన వ్యానంబులు= సమానం, వ్యానం అనే ప్రాణాలు; విలీనంబులు+అగున్= కలిసిపోతాయి; దీనన్= ఈ విషయంలో; యోగులు= యోగసాధకులు; సంశయంబున్+పొందరు= ఏ సందేహమూ పడరు.

**తాత్పర్యం:** ఓ వనితా! జీవుడు ప్రాణాపానాలలో ఉండి నిదురపోతే సమానవ్యానాలు కలిసిపోతాయి. యోగులు ఈ విషయంలో ఏ సందేహమూ పడరు.

**క.** **విను తెలియంగ నుదానం। బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబున్**
**వనజనిభలోచనా! పురు। షుని విడువవు యోగిజనుల చూ పిట్లుండున్. 12**

**ప్రతిపదార్థం:** వనజనిభలోచనా!= కమలసమాననయనా!; తెలియంగన్+విను= బాగా వినుము; ఉదానంబునన్= ఉదానంలో; సుప్తుండు+ఐనన్= నిద్రిస్తే; పురుషునిన్= పురుషుడిని; ప్రాణమున్+అపానంబున్= ప్రాణాపానాలు; విడువవు= వదలిపెట్టవు; యోగిజనుల= యోగులగుజనుల; చూపు= దృష్టి; ఇట్లు+ఉండున్= ఇట్లా ఉంటుంది.

**తాత్పర్యం:** పద్మలోచనా! బాగా వినుము, ఉదానంలో నిద్రిస్తే ప్రాణాపానాలు ఆ జీవుడిని వదలిపెట్టవు. యోగుల దృష్టి ఇట్లాంటిది.

**విశేషం :** పై రెండు పద్యాలలో వివరించిన వాయువుల సమ్మేళనవిషయం తరువాత వివరించబోయే 'అంతర్యాగవిషయం'గా చాలా ప్రధానం. యోగులు ప్రాణవాయువులను ఏయే విధంగా శిక్షణలో ఉంచుకొంటారో ఈ వర్ణనవలన తెలిసికొనవచ్చును.

అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట (సం. 14-20-18)

**వ.** **ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుంగూడ నీ యేడును వైశ్వానరునకు జిహ్వలు; వైశ్వానరుం డనఁ బ్రాణుల దేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్ముండు; ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగు నీ సప్తసంఖ్య సమిధలు, ఘ్రాతయు, భక్షయితయు, ద్రష్టయు, స్పృష్టయు, శ్రోతయు, మంతయు, బోద్ధయు నయిన యీ యేడ్వురును వరుసన ఘ్రేయాదులయిన హవిస్సులేడింటిని వేల్చుబుత్విజు; లిదిసప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరు వదనంబులు పదియు దిగ్వాయుసూర్యచంద్రపృథివీపావకశక్ర విష్ణుప్రజాపతిమి త్రాత్మకంబులు; శబ్దస్పర్శరూపరసగంధ వక్తవ్యకర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీ పదింటినిం గ్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థంబు లయిన దశేంద్రియంబు; లిత్తెఱంగు దశహోతృవిధి; యీ రెంటిని నెఱింగి యిం దేవిధంబున నేనియు జీవాత్ముం డుపద్రష్టగా నంతర్యాగంబు నడపు యోగి జనంబులు జననమరణవిముక్తులగుదురు. బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణంబులం బొందుచుండుదు' రని చెప్పి వెండియు. 13**

**ప్రతిపదార్థం:** ఈ+వాయువులు+ఏనునున్= ఈ ఐదు వాయువులూ; మనంబునున్= మనస్సూ; బుద్ధియున్+కూడన్= బుద్ధీ కలిస్తే; ఈ+ఏడును= ఈ ఏడూ; వైశ్వానరునకున్= వైశ్వానరుడికి; జిహ్వలు= నాలుకలు; వైశ్వానరుండు+అనన్= వైశ్వానరుడు అనే పేరుతో; ప్రాణుల దేహములందున్= ప్రాణుల దేహాలలో; అగ్నిరూపంబునన్= అగ్నిరూపంలో; వెలుంగుచున్+ఉన్న= వెలుగుతున్న; ఆత్ముండు= ఆత్మ; ఘ్రేయంబునున్= వాసన చూడదగినది; భక్ష్యంబునున్= తినదగినది; దృశ్యంబునున్= చూడదగినది; స్పృశ్యంబునున్= స్పర్శించదగినది; శ్రావ్యంబునున్= వినదగినది; మంతవ్యంబునున్= ఆలోచింపదగినది; బోద్ధవ్యంబునున్= తెలిసికొనదగినది; అగు= అనేటటువంటి; ఈ సప్తసంఖ్య సమిధలున్= ఈ ఏడు సమిదలును; ఘ్రాతయున్= వాసన చూచేవాడూ. భక్షయితయున్= తినేవాడూ; ద్రష్టయున్= చూచేవాడూ; సృష్టయున్= తాకేవాడూ; శ్రోతయున్= వినేవాడూ మంతయున్= ఆలోచించేవాడూ; బోద్ధయున్= తెలిసికొనేవాడూ; అయిన+ఈ+ఏడ్వురును= అనే ఈ ఏడుగురూ; వరుసన్+అ= క్రమంగా; ఘ్రేయాదులు+ అయిన= వాసన

చూడదగినవి అయిన; హవిస్సులు+ఏడింటినిన్= ఏడు హవిస్సులను; వేల్చు= హోమంచేసే; ఋత్విజులు= ఋత్విక్కులు; ఇది= ఇట్లా చేయటం; సప్త హోతృ విధాన ప్రకారంబు= ఏడుగురు హోతలు హోమం చేసే విధానం; వైశ్వానరు వదనంబులు= వైశ్వానరుడి ముఖాలు; పదియున్= పది (ఏ వంటే); దిక్= దిక్కులు; వాయు= వాయువూ; సూర్య= సూర్యుడూ; చంద్ర= చంద్రుడూ; పృథివీ= భూమీ; పావక= అగ్నీ; శక్ర= ఇంద్రుడూ; విష్ణు= విష్ణువూ; ప్రజాపతి; మిత్ర+ఆత్మకంబులు= మిత్రుడు అనబడేవాడు; శబ్ద= శబ్దము; స్పర్శ= తాకటం; రూప= రూపమూ; రస= రసమూ; గంధ= గంధమూ; వక్తవ్య= మాటాడదగినదీ; కర్తవ్య= చేయదగినదీ; గంతవ్య= పోదగినదీ; విసర్గ= విసర్జించదగినదీ; ఆనందంబులు= ఆనందం - అనబడేవి; హవిస్సులు= హోమద్రవ్యాలు; ఈ పదింటిని, క్రమంబునన్= క్రమంగా; ఆహుతులు+చేయు= హోమం చేసే; హోతలు= ఋత్విక్కులు; శ్రోత్ర= చెవి; త్వక్= చర్మ; చక్షుస్= కన్నులు; జిహ్వా= నోరు; ఆఘ్రాణ= ముక్కు; వాక్= నాలుక; పాణి= చేతులు; పాద= కాళ్ళు; పాయు= గుదం; ఉపస్థంబులు= జననేంద్రియం అనబడే; దశ+ఇంద్రియంబులు= పది కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు; ఈ+తెఱంగు= ఇట్లా హోమం చేయటం; దశహోతృవిధి= పదిమంది ఋత్విక్కులు హోమం చేసే విధానం అనబడుతుంది; ఈ రెంటినిన్+ఎఱింగి= ఈ రెండింటిని గుర్తించి; ఇందున్+ఏవిధంబునన్+ఏనియున్= ఇందులో ఏ విధంగానైనా; జీవాత్మన్= జీవాత్ముడిని; ఉపద్రష్టగాన్= ఉపాధ్యాయుడిగా; అంతర్+యాగంబు= శరీరంలోపల జరిపే యాగాన్ని; నడపు= నడిపే; యోగిజనంబులు= యోగులైనవారు; జనన మరణ= చావు పుట్టుకలనుండి; విముక్తులు+అగుదురు= విడుదల పొందుతారు; బహిస్+యజ్ఞపరులు= సాధారణంగా బయట జరిపే యజ్ఞం చేసేవారు; గమన+ఆగమన= చావుపుట్టుకలనే; భ్రమణంబులన్= చక్రభ్రమణం; పొందుచున్+ ఉండుదురు= పొందుతూ ఉంటారు; అని చెప్పి; వెండియున్= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ప్రాణాపానాది పంచవాయువులు, మనస్సు, బుద్ధి - అనే ఏడూ వైశ్వానరుడికి జిహ్వలు. అందుకే అగ్నిదేవుడిని సప్తజిహ్వుడంటారు. వైశ్వానరుడు - అంటే ప్రాణుల దేహాలలో అన్ని రూపాలలో వెలుగుతున్న ఆత్మతత్త్వమే. ఇక శరీరంలోపల రెండు విధాలుగా 'హోమ' విధి జరుగుతుంది. దానిని వివరిస్తాను. మొదటిది సప్తహోతృవిధి. వాసన చూడదగినది, తినదగినది, చూడదగినది, తాకదగినది, వినదగినది, ఆలోచింపదగినది, తెలిసికొనదగినది - అనే ఈ ఏడు సమిధలను వాసన చూచేవాడు, తినేవాడు, చూచేవాడు, తాకేవాడు, వినేవాడు, ఆలోచించేవాడు, తెలిసికొనేవాడు అనే ఏడుగురు ఋత్విక్కులు వైశ్వానరాగ్నిలో హోమం చేస్తారు. ఇదే సప్తహోతృ విధానం. ఇక రెండవది దశహోతృవిధానం; ఇక్కడ వైశ్వానరుడి ముఖాలు పది ఉంటాయి. దిక్కు, వాయువు, సూర్యుడు, చంద్రుడు, భూమి, అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, ప్రజాపతి, మిత్రుడు - అనబడేవి ఆ ముఖాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు, మాటాడదగిన, చేయదగిన, పోదగిన, విసర్జించదగిన, ఆనందించదగిన - అనే ఈ పదీ హోమద్రవ్యాలు. ఈ పదింటినీ చెవి, చర్మం, కళ్ళు, నోరు, ముక్కు (జ్ఞానేంద్రియాలు), నాలుక, చేతులు, కాళ్ళు, గుదం, జననేంద్రియం (కర్మేంద్రియాలు) అనే ఈ పది ఇంద్రియాలు హోమం చేస్తాయి. ఇది దశహోతృవిధానం. ఈ రెండు పద్ధతులను గుర్తించి ఎంత ప్రయత్నించి అయినా జీవాత్మను ఉపద్రష్టగా ఉంచుకొని ఈ అంతర్యాగాన్ని జరిపే యోగిజనులు జననమరణభ్రమణంనుండి విముక్తులవుతారు. అట్లా కాకుండా సాధారణంగా జరిపే బాహ్యయజ్ఞాన్ని జరిపేవారు జననమరణ చక్రభ్రమణంలో తిరుగుతూ ఉంటారు.

**విశేషం :** చేసే ప్రతిపనీ 'యాగమే'. ఆత్మ సాక్షీభూతుడైన 'ఉపద్రష్ట'. అందుచేత అతడికి ఏ కర్మఫలమూ అంటదు. కానీ, అన్నీ అతడే చేయిస్తాడు. ఇంద్రియాలు తాము చేస్తున్న పనిని 'బ్రహ్మకర్మ'గా భావించి చేస్తే అది అంతర్యాగం. బంధమోక్షణహేతువు.

కేవలం పనిగా చేస్తే అది బంధహేతువు. ఇక వైశ్వానరుడనే అగ్నిని గురించి కొంత వివరించాలి. ఈ అంతర్యాగం చేయటానికి ఆత్మ 'చైతన్య' రూపంలో 'అగ్ని'గా నిరంతరం పనిచేస్తూ ఉంటుంది.

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్" అని గీత.

(ప్రాణుల దేహాలను ఆశ్రయించి నేను వైశ్వానరుడనే అగ్నిరూపంగా ప్రాణాపానాలతో కూడినవాడనై భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలనబడే నాలుగు విధాలైన ఆహారాలనూ పచనం చేస్తున్నాను).

**క. విను ప్రణవాదికరూప । త్వనిరూఢిం బుట్టు వాక్కు దాని వెను చనున్**
**మనము పురుషార్థబుద్ధిన్ । బనుపడి' యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా! 14**

**ప్రతిపదార్థం:** విను= ఓ వనితా జాగ్రత్తగా వినుము; ప్రణవ+ఆదిక+రూపత్వ నిరూఢిన్= ఓం కారం మొదలైన మంత్ర రూపంగా; వాక్కు; పుట్టున్= పుట్టుతుంది; దానిన్= దానిని వెంబడించి; పురుషార్థబుద్ధిన్= పురుషార్థ సాధనకొరకని; పనుపడి= పూనికతో; మనము= మనస్సు; వెనుచనున్= వెనకనే వెళ్ళుతుంది; అని; అనఘా!= ఓ అర్జునా!; బ్రాహ్మణుండు= ఆ విప్రుడు; సతికిన్+చెప్పెన్= భార్యకు చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓంకారం' ఇత్యాదిగా ఉన్న మంత్రరూపంగా వాక్కు పుట్టుతుంది. దానిని అనుసరించి పురుషార్థసాధన నిమిత్తంగా మనస్సు పరుగిడుతుంది' అని ఆ విప్రుడు భార్యతో ఇట్లా చెప్పాడు.

**క. విని యా విప్రునితో ని । ట్లను నయ్యెలనాగ 'మన మనఘ! ప్రేరేపం**
**గ నెగయు వాక్కు తదనువ । ర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్?' 15**

**ప్రతిపదార్థం:** విని= భర్తమాటలు విని, ఆ విప్రునితోన్= ఆ బ్రాహ్మణుడితో; ఆ+ఎలనాగ= ఆ స్త్రీ; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది; అనఘ!= పుణ్యాత్మా!; మనము= మనస్సు; ప్రేరేపంగన్= ప్రేరేపించగా; వాక్కు+ఎగయున్= వాక్కు పుట్టుతుంది (కదా!) అట్లాంటప్పుడు); తద్+అనువర్తనము= దానిని అనుసరించి ప్రవర్తించటం; మనంబునకున్= మనస్సునకు; ఏ విధంబునన్+కలుగున్?=ఏ విధంగా కలుగుతుంది?

**తాత్పర్యం:** ఆ మాటలు విని భర్తతో ఆ స్త్రీ ఇట్లా అన్నది. 'పుణ్యాత్మా! మనస్సు ప్రేరేపిస్తే కదా వాక్కు పుట్టుతుంది. అట్లాంటప్పుడు వాక్కును అనుసరించి మనస్సు ప్రవర్తించటం ఎట్లా సాధ్యం?'

**విశేషం:** ఇక్కడ బ్రాహ్మణవనిత అడుగుతున్న ప్రశ్న వేదమూలాన్ని కలిగిన జిజ్ఞాస. 'దేవీం వాచమజనయంత దేవాః' (దేవతలు దేవీవాక్కును సృష్టించారు) అని వేదమంత్రం (దేవం మనః - దేవత మనస్స్వరూపుడు).

**'వాఙ్ మే మనసి ప్రతిష్ఠితా । మనో మే వాచి ప్రతిష్ఠితం'** అని ఐతరేయ శాంతిపాఠం. వాక్కు మనస్సులో, మనస్సు వాక్కులో అవిభక్తంగా ఉన్నాయి. మరి ఈ రెండూ ఒకదానినుండి మరొకటి పుట్టటం, ఒకటి మరొకదానిని అనుసరించటం - అనే అంశాలు బాహ్యంగా విరుద్ధంగా కనిపిస్తాయి. దానికి ఆ విప్రుడు సమాధానం చెప్పాడు.

**వ. అనవుడు నతండు 16**

**తాత్పర్యం:** అని చెప్పగా ఆ బ్రాహ్మణుడు (తరవాతి పద్యంతో అన్వయం.)

**చ. 'మనసు నుదానవాయువును మానిని! కూడి వెలార్చు వాక్కు నా**
**త్మునివలనన్ భవద్వచనమున్ జనతానుభవంబు చొప్ప యై**
**నను విను కార్యముం గుఱిచినం దగ వాగనువర్తనంబు సే**
**యన వలసెన్ మనంబునకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్. 17**

**ప్రతిపదార్థం:** మానిని!= ఓ వనితా!; మనసు; ఆత్మునివలనన్= ఆత్మ ప్రేరణతో; ఉదానవాయువునున్+కూడి= కంఠస్థానంలో ఉండే ఉదాన వాయువును కలిసికొని; వాక్కున్+వెలార్చున్= వాక్కును బహిర్గతం చేస్తుంది; భవత్+వచనమున్= నీవు అన్నమాట కూడా; జనతా= అనుభవంబు+చొప్పు+అ= జనులందరి అనుభవం ప్రకారంగానే ఉన్నది (అందరూ ఇట్లాగే భావిస్తారు); ఐననున్= ఐనా కూడా; విను(ము)= ఒక వైశిష్ట్యం ఉన్నది వినుము; కార్యమున్+గుఱిచినన్= ఒక కార్యాన్ని గురించి ప్రవర్తించవలసివచ్చినప్పుడు; మనంబునకున్= మనస్సునకు; తగన్= తగినట్టుగా; వాక్+అనువర్తనంబున్= వాక్కును అనుసరించటం; చేయన్+అ+వలసెన్= చేయవలసి వచ్చింది (వస్తున్నది); ఆ+మెయిన్+కల్గుటన్= అట్లా ఉండటంవలన; అట్లు+చెప్పితిన్= అట్లా చెప్పాను.

**తాత్పర్యం:** ఓ వనితా! ఆత్మప్రేరణతో మనస్సు ఉదానవాయువును కూడుకొని వాక్కును బహిర్గతం చేస్తుందని నీవు అన్నట్లే ప్రజలందరూ భావిస్తారు. అందులో దోషమేమీ లేదు. కాని ఒక ప్రత్యేకవ్యాపారం ఉన్నది వినుము. ఒక కార్యాన్ని గురించి ప్రవర్తించవలసి వచ్చినప్పుడు మాత్రం మనస్సు వాక్కుకు అనుగుణంగానే ప్రవర్తిస్తుంది. అందుచేత అట్లా చెప్పాను.

**వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డిట్లనియె. 18**

**ప్రతిపదార్థం:** అని పలికి; మఱియున్; ఆ+మహీసుర+ఉత్తముండు= ఆ బ్రాహ్మణోత్తముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి ఆ బ్రాహ్మణోత్తముడు ఇంకా ఇట్లా అన్నాడు.

**క. మనసును వాక్కును మాలోఁ । ననఘచరిత! యెక్కు డెవ్వ? రని యంభోజా**
**సను నడిగిన నతం డెక్కుడు । మన మనవుడు వాని యక్కమలభవుతోడన్. 19**

**ప్రతిపదార్థం:** మనసునున్= మనస్సూ; వాక్కునున్= వాక్కూ; అనఘచరిత!= ఓ పుణ్య చరిత్రుడా! (చెప్పుమని); మాలోనన్= మా ఇద్దరిలో; ఎక్కుడు+ఎవ్వరు= ఎవరు అధికం (గొప్ప); అని; అంభోజాసనున్= కమలాసనుడైన బ్రహ్మదేవుడిని; అడిగినన్= అడుగగా; అతఁడు= ఆ బ్రహ్మదేవుడు; మనము= మనస్సు; ఎక్కుడు= గొప్ప; అనవుడున్= అని చెప్పగా; వాణి= సరస్వతి; ఆ+కమలభవుతోడన్= ఆ కమలగర్భుడైన బ్రహ్మతో

**తాత్పర్యం:** ఒకప్పుడు మనస్సు, వాక్కు బ్రహ్మదేవుడివద్దకు వెళ్ళి 'స్వామీ! మా ఇద్దరిలో ఎవరు గొప్ప? తేల్చి చెప్పండి' అని అడుగగా ఆయన 'మనస్సే గొప్పది' అని చెప్పాడు. అప్పుడు సరస్వతి ఆయనతో (తరవాతి వచనంతో అన్వయం)

**వ. 'ఏను నీకుం గామదోహిని నయి యుండ న న్నెట్లు తక్కువగాఁ బలికి?' తనిన నతండు 'స్థావరంబును జంగమంబును నన నాకు రెండు మనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను**

**నిలుచు; భవద్గోచరత్వంబునం బరఁగు వర్ణంబు మంత్రంబు స్వరంబు జంగను మనస్సుగా నెగడు; దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడంగలదానవు గా' వని నిర్దేశించె. 20**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నీకున్; కామదోహినిన్+అయి= కోరిన కోర్కెలను పిదికేదిగా; ఉండన్= ఉండగా; నన్నున్+ఎట్లు= నన్ను ఎట్లా; తక్కువగాన్= తక్కువచేసి; పలికితి(వి)?= పలికావు?; అనినన్= అని సరస్వతి అడుగగా; అతండు= ఆ బ్రహ్మదేవుడు; నాకున్= నాకు; స్థావరంబును= స్థిరమైనదీ; జంగమంబును= కదిలేదీ; అనన్= అని పేర్లుగల; రెండు మనస్సులు+కలవు= రెండు మనస్సు లున్నాయి; అందున్= ఆ రెండింటిలో; స్థావరంబు= కదలనిది; నా+ఒద్దను= నా వద్దా; జంగమంబు= కదిలేది; నీ కడను= నీ వద్దా; నిల్చున్= ఉంటాయి; భవత్+గోచరత్వంబునన్= నీకు తెలిసి; పరఁగు= ఉచ్చరింపబడేటటువంటి; వర్ణంబు= వర్ణాలు; మంత్రంబు= మంత్రాలు; స్వరంబు= ఉదాత్తాది స్వరాలు; జంగమ మనస్సుగాన్= జంగమ మనస్సుగా; నెగడున్= ఉంటుంది; దానికంటెన్= ఆ జంగమమనస్సుకన్నా; నీవు+ఎక్కుడు= నీవు గొప్ప; నీకంటెన్; స్థావర మనస్సు= స్థిరమైన మనస్సు; ఎక్కుడు= అధికం; కావున= అందుచేత; ఈ+మాట= ఈ పలుకు; ఆడన్+కలదానవు+కావు= పలకటానికి తగినదానవు కావు (ఈ మాట అనరాదు); అని; నిర్దేశించెన్= ఉపదేశించాడు.

**తాత్పర్యం:** 'నేను నీకు అన్ని కోరికలను వర్షిస్తున్న దానిని కదా! నన్ను ఇట్లా తక్కువ చేసి మాటాడటం బాగున్నదా? అని సరస్వతి అడుగగా బ్రహ్మ ఇట్లా అన్నాడు. 'స్థిరమని, చరమని (కదిలేది) నాకు రెండు మనస్సులున్నాయి. వాటిలో స్థిరం నావద్దా, చరం నీవద్దా ఉంటాయి. నీ అనుగ్రహంతో పుట్టే వర్ణమంత్రస్వరాదు లన్నీ చరచిత్తంగా పర్యవసిస్తాయి. దానికన్నా నీవు గొప్పదానవు. నీకన్నా స్థిర చిత్తం గొప్పది. అందుచేత నీవు ఇట్లా మాటాడటం సమంజసంగా లేదు.' అని ఆయన ఉపదేశించాడు.

**విశేషం :** ఈ సందర్భంలో చెప్పబడ్డ స్థిర, చర చిత్త విషయం ఆధునిక మనస్తత్త్వశాస్త్రప్రకారంగా (విశ్వ, వైయక్తిక చైతన్యాలుగా) పరిగణించబడుతున్న చైతన్యభేదాలనే స్థిర, చర మనస్సులుగా భారతం ప్రతిపాదిస్తున్నది. విశ్వమనస్సు సర్వభావభాండాగారం. వర్ణమంత్రస్వరరూపమైన శబ్దం. దాని భావజగత్తు పరిమిత మైనది. అందుకే 'జంగమ' (కదిలేది) మని బ్రహ్మ చెప్పుతున్నాడు. దీనికి పరమైన వాగ్దేవి జంగమమనస్సుకంటె గొప్పది. కాని బ్రహ్మపదార్థం అపరిమితమైన విశ్వభావపర్యాప్తమైనది. అందుకే బ్రహ్మ ఇట్లా ఉపదేశించాడు.

**క. విను మమ్మెయి నిర్దేశం। బున నవ్వాగ్దేవి మూర్ఛవోయినయ ట్లే**
**మిని బలుక కుండి పదపడి। వినయంబున నజుని శరణువేఁడె లతాంగీ!' 21**

**ప్రతిపదార్థం:** లతాంగీ!= తీగవంటి దేహం కలిగిన ఓ వనితా!; వినుము; ఆ+మెయిన్= ఆ విధంగా (చేసిన); నిర్దేశంబునన్= ఉపదేశంతో; ఆ+వాగ్దేవి= ఆ సరస్వతి మూర్ఛ+పోయిన+అట్లు= మూర్ఛపోయిన విధంగా; ఏమినిన్= ఏమీ; పలుక+ఉండి= మాటాడకుండా ఉండిపోయిన; పదపడి= తరువాత; వినయంబునన్= వినయంతో; అజునిన్= బ్రహ్మను; శరణువేఁడెన్= శరణు కోరింది.

**తాత్పర్యం:** ఓ వనితా! ఆ విధంగా బ్రహ్మ ఉపదేశం చేయటంతో సరస్వతి మూర్ఛపోయినట్లుగా ఏమీ పలకకుండా ఉండిపోయి. కొంచెం సేపటికి బ్రహ్మదేవుడిని శరణుకోరింది.'

**వ. అనిన బ్రాహ్మణి పతితో 'బ్రహ్మమాటకుం గొఱవోయిన వాణి యేమిటం దేటె?' నని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అనినన్= అని బ్రాహ్మణుడు చెప్పగా; బ్రాహ్మణి= ఆ బ్రాహ్మణస్త్రీ; పతితోన్= తన భర్తతో; బ్రహ్మమాటకున్= బ్రహ్మమాటకు; కొఱ+పోయిన= చిన్నబోయిన; వాణి= సరస్వతి; ఏమిటన్= దేనిచేత; తేఱెను?+అని= తేరుకుంది?అని; అడిగినన్= అడుగగా; బ్రాహ్మణుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని బ్రాహ్మణుడు చెప్పగా ఆయన భార్య 'బ్రహ్మ మాటలతో చిన్నబోయిన సరస్వతి ఎట్లా సర్దుకొంది' అని అడుగగా బ్రాహ్మణుడు ఇట్లా చెప్పాడు.

**క. 'ప్రాణాపానంబుల యెడ। వాణి నిలుచుఁ గాన ప్రాణవాయు వొదవి తత్**
**క్షీణత్వ ముడిపె నది గీ। ర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23**

**ప్రతిపదార్థం:** ప్రాణ+అపానంబుల+ఎడన్= ప్రాణాపానాల నాశ్రయించి; వాణి= సరస్వతి; నిలుచున్+కానన్= నిలుస్తుంది (ఉంటుంది) కాబట్టి; ప్రాణవాయువు+ఒదవి= ప్రాణవాయువు ప్రసరించి; తద్+క్షీణత్వము= దానియొక్క నశించటాన్ని (లేదా సరస్వతి క్షీణించటాన్ని); అది= ఆ ప్రాణవాయువు గీర్వాణ జ్యేష్ఠ= సురజ్యేష్ఠుడైన బ్రహ్మ యొక్క; ప్రభావ వాసిత+అగుటన్= ప్రభావంచేత మహనీయమైనది కావటంచేత (బ్రహ్మదేవుడు వాక్కును సృష్టించారు కాబట్టి, ఉడిపెన్= పోగొట్టింది)

**తాత్పర్యం:** 'వాణి ప్రాణాపానాలను ఆశ్రయించి పుట్టుతుంది కాబట్టి, వాణి క్షీణించగానే ఆమెలోని ప్రాణవాయువు గీర్వాణి' ప్రథముడైన బ్రహ్మయొక్క ప్రభావంవలన మహనీయమైనది కావటంచేత ఆ సరస్వతి పడుతున్న క్షోభను పోగొట్టగలిగింది.

**వ. ఇట్టి వని వాఙ్మనఃప్రకారంబు లెఱుంగుట మోక్షంబునకు మూలం; బింకను వాణి మనస్సుల తెఱంగు సెప్పెద వినుము. 24**

**ప్రతిపదార్థం:** వాక్+మనస్+ప్రకారంబులు= వాక్కుల, మనస్సుల పద్ధతులు; ఇట్టివి+అని= ఇట్లాంటివని; ఎఱుంగుట= తెలిసికొనటం; మోక్షంబునకున్+మూలంబు= మోక్షానికి ఆధారం; ఇంకను= ఇంకా; వాణీ= వాక్కు; మనస్సుల= మనస్సులు ప్రవర్తించే; తెఱంగు= రీతిని; చెప్పెదన్= చెప్పుతాను; వినుము.

**తాత్పర్యం:** వాక్కు, మనస్సులు ప్రవర్తించే రీతులు ఇవని గుర్తించటం మోక్షానికి మూలమవుతుంది. ఇంకా ఈ రెండూ ఎట్లా ఉంటాయో చెప్పుతాను వినుము.

**తే. ప్రాణుఁ బొదువుట వాణి యపానుఁ జెంది। తాను దాన భూతాత్మ యై తనువు విడిచి**
**వ్యానచేష్టిత సర్వసంవ్యాప్తి నొంద। మనసు సుస్థితి నొందు సమాను నందు. 25**

**ప్రతిపదార్థం:** ప్రాణున్= ప్రాణం అనే వాయువును; పొదువుటన్= ఆక్రమించుకొనటంవలన; వాణి= వాక్కు; అపానున్+చెంది= అపానుడనే ప్రాణాన్ని చెంది; తాను+తాను+అ= తానే స్వయంగా (తనకు తానే); భూతాత్మ+ఐ= భూతరూపాన్ని పొంది= తనువు+విడిచి= దేహాన్ని వదలిపెట్టి; వ్యాన+చేష్టితన్= వ్యానుడి క్రియవలన; సర్వసంవ్యాప్తిన్+ఒందన్= దేహమంతటా వ్యాపించగా; మనసు ప్రశాంతమై సుస్థితి పొందుతుంది.

**తాత్పర్యం:** ప్రాణుని పొందటంవలన వాణి అపానుడిని కూడా చేరుతుంది. తనకు తానే తన రూపాన్ని (శబ్దరూపాన్ని)

వదలిపెట్టి, భూతాలలో కలిసిపోయి, వ్యానుడి క్రియవలన దేహమంతటా వ్యాపిస్తుంది. సమానుడిలో ప్రవేశించినపుడు మనస్సు ప్రశాంతమై సుస్థితి పొందుతుంది.

**వ. మనసు సుస్థితం బొందుట ముక్తికిం గారణ' మని చెప్పి వెండియు. 26**

**ప్రతిపదార్థం:** మనసు; సుస్థితిన్+పొందుట= ప్రశాంతత్వాన్ని పొందటం; ముక్తికిన్= ముక్తికి; కారణము+అని= కారణమని; చెప్పి; వెండియున్= మళ్ళీ,

**తాత్పర్యం:** మనసు ప్రశాంతతను పొందటమే ముక్తికి కారణ' మని చెప్పి మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. 'ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు । దెఱంగులు గలిగి వాగ్దేవి పరఁగు**
**నం దఘోషిణి గరీయసి యుత్తమరసంబు । గోవు చందంబునఁ గురియుచుండు**
**నవ్యయరూప దివ్యప్రభావోజ్జ్వల । బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మివిధము**
**గనుట మహానందకర' మని చెప్పి య । వ్విప్రుండు మఱియు నవ్వెలఁదితోడ**

**తే. 'వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి । యొక యధిష్ఠానమున నుండియును నెఱుంగ**
**వబల! యొండొంటి విషయంబు నలమికొనఁగ' । ననిన 'వివరింపు మా తెఱం' గనియె నింతి 27**

**ప్రతిపదార్థం:** ఘోషిణి+నాఁగన్= ఘోషిణి అని; అఘోషిణి అనన్= అఘోషిణి అని; రెండు తెఱఁగులు= రెండు విధాలు; కలిగి; వాగ్దేవి+ఎసఁగున్= వాగ్దేవి ప్రకాశిస్తుంది; అందున్= వాటిలో; అఘోషిణి; గరీయసి= గొప్పది; ఉత్తమరసంబున్= అత్యుత్తమ రసాన్ని; గోవు చందంబునన్= గోవువలె; కురియుచున్+ఉండున్= కురుస్తూ ఉంటుంది; అవ్యయ+రూప= ఆమె నశించనటువంటి రూపం కలిగినది; దివ్యప్రభావ+ఉజ్జ్వల= మహనీయశక్తితో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది; బ్రహ్మవాదిని= బ్రహ్మపదానికి వాచకం; ఇట్లు= ఈ విధంగా; బ్రాహ్మి విధమున్+కనుట= సరస్వతీతత్త్వాన్ని తెలిసికొనటం; మహానందకరము= మహానందాన్ని ప్రసాదిస్తుంది; అని; చెప్పి; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; మఱియున్= ఇంకా; ఆ+వెలఁదితోడన్= ఆ స్త్రీతో; వినుము; ఘ్రాణ+ఆదికములు= ముక్కు మొదలైన; ఐదున్= ఐదు ఇంద్రియాలు; మనసు; బుద్ధి (ఈ ఏడూ); ఒక= ఒకే; అధిష్ఠానమునన్= ఆధారంలో; ఉండియునున్= ఉన్నా కూడా; అబల!= ఓ వనితా!; ఒండొంటి విషయంబున్= ఒకటి మరొక విషయాన్నిగురించి; అలమికొనఁగన్= వ్యాపించటానికి; ఎఱుంగవు= సమర్థాలు కావు; అనినన్= అనగా ఇంతి= ఆ స్త్రీ; ఆ తెఱంగు= ఆ విధం; వివరింపుము+అనియెన్= వివరంగా చెప్పుము అని కోరింది.

**తాత్పర్యం:** 'వాక్కు ఘోషిణి (శబ్దించేది), అఘోషిణి (శబ్దించనిది) అని రెండు విధాలుగా ఉంటుంది. అందు అఘోషిణి గొప్పది. తనంతట తాను వర్షించే గోవువలె అది అమృతాన్ని (ఉత్తమరసమంటే అదే) వర్షిస్తుంది. ఆ వాక్కు అవ్యయరూపమైనది. మహనీయశక్తితో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. అది బ్రహ్మపదానికి వాచకం. ఇది బ్రాహ్మీతత్త్వం. దీనిని తెలిసికొంటే మహానందం సిద్ధిస్తుంది' అని చెప్పి, ఆ బ్రాహ్మణుడు అతడి భార్యతో ఇట్లా చెప్పాడు 'ముక్కు మొదలైన కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే ఈ ఏడూ ఒకే జీవుడిని ఆశ్రయించి ఉన్నా ఒకదాని పనిని మరొకటి చేయటానికి సమర్థం కావు' అని భర్త చెప్పగా ఆ వనిత 'అది ఎట్లాగో వివరంగా చెప్పండి' అని అడిగింది.

**విశేషం :** వైదికవాఙ్మయంలో శబ్దించే వాక్కును 'వైఖరి' అని, శబ్దించని వాక్కును పరా, పశ్యంతి, మధ్యమ అని వేరు చేసి

చెప్పటం జరిగింది. మనుష్యులు మాటాడేది 'వైఖరి' అని; తక్కిన 'అఘోషిణి' వాక్కు 'గుహ'లో దాగి ఉంటుందని; దానిని ధీమంతులు మాత్రమే గుర్తించగలరని చెప్పారు.

> **"చత్వారి వాక్ పరిమితా పదావి । తావి విదుర్బ్రహ్మణో యే మనీషిణః**
> **త్రీణి గుహా నిహితానేఙ్గయంతి । తురీయో వాచో మనుష్యా వదంతి"**

ఇక 'అఘోషిణి' ఎట్లాంటిదో, అది 'గోవు' రూపం కలిగినది అంటే ఏమిటో కూడా చాలా ప్రధానమైనది. 'బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ' అని ఏడు పేర్లు (సరస్వతి, వాణి, వాక్కు, గీః, భాషా, భారతీ, బ్రాహ్మీ)- వాక్కుకు పర్యాయపదాలున్నాయి. వీరు సప్తమాతృకాస్వరూపాలు. బ్రహ్మతత్త్వం ఏ వాక్కుచేత వ్యక్తీకరించబడుతుందో ఆ అవ్యక్త - అమృత నిష్యంది-వాక్కు పరా వాక్కు అనబడింది. అదే 'బ్రాహ్మి'. స్వతంత్రమైనదీ, అతర్క్యమైనదీ అయిన సృజనాత్మకప్రతిభ దాని లక్షణం. అందుకే అది తన అంతస్తత్త్వాన్ని తనకు తానుగా మనీషులకు వ్యక్తం చేస్తుందని వేదం ప్రతిపాదించింది (జాయేవ పత్య ఉశసీ సువాసాః అని వైదికోపమానం - ధర్మపత్ని తన స్వస్వరూపాన్ని భర్తకు మాత్రమే చూపించినట్లు అని అర్థం.)

మునుపు 20వ పద్యంలో నేను నీకు 'కామదోహిని' గా ఉన్నాను కదా! అనే మాటకు అర్థమే 'అమృతాన్ని గోవు రూపంగా వర్షిస్తుంది' అని ఇక్కడ చెప్పుతున్నది కూడా. కామధేను వని, కల్పవృక్షమని, నందిని అనే పేర్లతో ఏయే వర్ణనలు కావ్యాలలో కనిపిస్తాయో అవన్నీ దివ్యవరప్రభావసమర్థాలైనవే. దివ్యవాక్కును అనుసరించి అర్థం ప్రవర్తిస్తుంది కాబట్టి (ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోఽను ధావతి - అని భవభూతి) తన ఉత్తరరామచరిత్ర నాటకంలో) పరావాక్కు అమృతరసనిష్యందిని.

కవులనే బాలకులకు సరస్వతీమాత అనే గోవు తన క్షీరాన్ని స్వయంగా కురిపించి, వారికి తన రసస్వరూపాన్ని ప్రసాదించి వారిని బలోపేతులుగా చేస్తుందని అభినవగుప్త పాదాచార్యులు 'లోచన' వ్యాఖ్యానంలో అంటారు.

శ్రీ శంకరులు కూడా 'తవ స్తన్యం మన్యే' అనే సౌందర్యలహరి శ్లోకంలో 'నీ స్తన్యం త్రాగటంవలననే కదా ద్రావిడశిశువైన నేను సంస్కృతంలో ఇంత గొప్ప కవిని అయ్యాను!' అని ఆ మహామాతృస్వరూపిణిని వర్ణించారు. 'సంగీతసాహిత్యాలు సరస్వతీ స్తనరూపాలని వర్ణించటంలోనూ ఈ రహస్యమే ఉన్నది. కనుక వాణి ఉపాసనీయురాలైన దేవతగా పురాణాలలో చెప్పబడినది.'

**వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కిట్లనియె** **28**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; ఆ+అవనీదేవుండు= ఆ బ్రాహ్మణుడు; ఆ+ఉవిదకున్= ఆ స్త్రీతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ఆమె అడుగగా ఆ భూసురుడు ఆ స్త్రీతో ఇట్లా అన్నాడు.

**సీ. 'గంధంబు ఘ్రాణంబ కాని తక్కిన యాఱు । నధిగమింపఁగ నోప, వధిగమించు**
**రసము జిహ్వయ యితరము లాపనికిఁ గావు; । రూపంబుఁ జక్షుస్స యోపు నెఱుఁగఁ**
**బెఱయని యెఱుఁగవు తెఱవ! సంస్పర్శంబుఁ । గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ**
**జాలవు; శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రో । త్రంబ; యన్యములు దత్కరణమునకు**

**తే. వెరవులేవు; సంశయిత సంవేదనంబు । మనసు కృత్యంబ యిక్కార్యమునకు నొండ్లు**
**సొరవు; నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర; । విత్తెఱంగున కపరంబు లెఱిఁగి కొనుము.** **29**

**ప్రతిపదార్థం:** తెఱవ!= ఓ వనితా!; గంధంబున్= గంధాన్ని గుర్తించటానికి; ఘ్రాణంబు+అ= ముక్కు మాత్రమే; కాని; తక్కిన+ఆఱున్= ముందు చెప్పిన ఆరూ; అధిగమింపఁగన్+ఓపవు= ఆక్రమించటానికి సమర్థాలు కావు; రసమున్= రసాన్ని (రుచిని); జిహ్వ+అ= నాలుకే; అధిగమించున్= గుర్తిస్తుంది; ఇతరములు= ఇతరాలు; ఆ పనికిన్+కావు= ఆ పనిచేయజాలవు; రూపంబున్= రూపాన్ని; చక్షుస్సు+అ= కళ్ళు మాత్రమే; ఎఱుఁగన్+ఓపున్= గుర్తించగలుగుతాయి; పెఱ+అవి= తక్కిన అవయవాలు; ఎఱుఁగవు= గుర్తింపజాలవు; సంస్పర్శంబున్= స్పర్శలక్షణాన్ని; చర్మంబు+అ= చర్మం మాత్రమే; కాంచున్= కలిగి ఉంటుంది; తక్కటివి= తక్కిన అవయవాలు; కానన్+చాలవు= ఆ లక్షణాన్ని పొందలేవు; శబ్దంబున్= శబ్దాన్ని; శ్రోత్రంబు+అ= చెవి మాత్రమే; పట్టంగన్+చాలున్= వినగలుగుతుంది; అన్యములు= తక్కినవి; తద్+కరణమునకున్= ఆ పనిచేయటానికి; వెరవు లేవు= సమర్థాలు కావు (వెరవు= ఉపాయం, శక్తి); సంశయిత= సంశయించటం; సంవేదనంబు= తెలిసికొనటం; మనసు= మనస్సుయొక్క; కృత్యంబు+అ= పని మాత్రమే; ఈ+కార్యమునకున్= ఈ పనికి; ఒండ్లు= తక్కినవి; చొరవు= ప్రవేశింపవు; నిష్ఠ= శ్రద్ధతో కార్యనిర్వహణం చేయగల సంస్కారం; బుద్ధిన్+ఆ+అగున్= బుద్ధివలననే అవుతుంది; ఈ+తెఱంగునకున్× ఈ పనికి; అవసరంబులు= తక్కినవి; చొరఁగన్+నేరవు= ప్రవేశింపజాలవు; ఎఱిఁగికొనుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** వాసన పట్టటం ముక్కు మాత్రమే చేస్తుంది. రుచిని నాలుక మాత్రమే గ్రహిస్తుంది. రూపాన్ని కళ్ళు మాత్రమే చూస్తాయి. స్పర్శను చర్మం మాత్రమే గుర్తిస్తుంది. శబ్దాన్ని చెవి మాత్రమే వింటుంది. తక్కిన అవయవాలు కూడా వాటి వాటి పనులు తప్ప వేరే వాటిని చేయజాలవు. సంశయించటం, తెలిసికొనటం మనస్సు పనులు. బుద్ధిలో మాత్రమే నిష్ఠ ఉంటుంది. గుర్తించుము.

**విశేషం :** కర్మేంద్రియాలకంటె జ్ఞానేంద్రియాలు, వాటికంటె మనస్సు, అన్నిటికంటె బుద్ధి - వీటి కంటె ఆత్మ ఎట్లా ఉన్నత స్థాయిని కలిగినవో అర్థం చేసికొనటంద్వార బ్రహ్మతత్త్వాన్ని సులభంగా వ్యాఖ్యానించవచ్చును. అందుకే సర్వశాస్త్రవిదుడైన ఆ విప్రుడు ఇంద్రియాదుల పరిమితవ్యాపారనిరూపణం చేస్తున్నాడు. ఈ ఇంద్రియాలలో వాగింద్రియం (నాలుక) వాక్ వ్యాపారం (శబ్దించటం) మనిషిని జ్ఞానిగా మార్చగలిగిన ఉత్తమసాధనాలు కాబట్టి వాణీతత్త్వాన్ని గురించి ముందు ఉపన్యసించాడు. వాక్కు - మనస్సు 'తగాదా'ను బ్రహ్మ పరిష్కరించాడు. తక్కిన ఇంద్రియాలు కూడా 'మనస్సు'తో ఎట్లా వివాదపడుతుంటాయో తరువాత వివరిస్తున్నాడు.

### ఇంద్రియ మనఃపరస్పరసంవాదప్రకారము (సం. 14-22-13)

**వ. 'అని చెప్పి, మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపు 'మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్క రూప' యనుటయు మనస్సు వాని కిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని ఇంద్రియాల పరిమితవ్యాపారపరత్వాన్ని వివరించినవాడై ఆ వనితతో; మనస్సునకున్= మనస్సునకూ; ఇంద్రియంబులకున్= ఇంద్రియాలకు; తొల్లి= మునుపు; కలిగిన= జరిగిన; సంవాదంబు= సంభాషణ (ఇక్కడ తగాదా); చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుము (అంటూ ఇట్లా చెప్పాడు); ఇంద్రియంబులు= ఇంద్రియాలు; మనస్సుతోన్; ఏమున్= మేమూ; నీవు; ఒక్కరూపు+అ= ఒకే విధమైన వాళ్ళమే; అనుటయున్= అనగా; మనస్సు; వానికిన్= ఇంద్రియాలతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని చెప్పి, ఆ విప్రుడు తన భార్యతో 'ఒకప్పుడు మనస్సుకు, ఇంద్రియాలకు పెద్ద వాగ్వాదం జరిగింది. ఆ విషయం చెప్పుతాను వినుము. అంటూ ఇట్లా మొదలు పెట్టాడు. 'మనస్సుతో ఇంద్రియాలు అన్నాయి - మేము నీవు ఒకే తీరువాళ్ళమే కదా!' అని. అపుడు మనస్సు ఇట్లా అన్నది.

**విశేషం :** ఇవి సాంకేతికమైన కథలు, వీటిద్వారా తత్త్వాన్ని సులభంగా బోధించటం వ్యాసమహర్షి ఆశయం.

**చ. 'చన దిటులంట గం పెఱుఁగఁ జాలదు నాసిక, జిహ్వయుం జవుల్**
**గొన వెరవేదు, రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతిగాదు, సోఁ**
**కు నెఱుఁగు శక్తి చర్మమునకుం బ్రభవింపదు, శబ్దజాతము**
**న్వినఁ జెవి కల్ప మేనియును నేర్పొడఁగూడదు నేఁ దొఱంగినన్. 31**

**ప్రతిపదార్థం:** ఇటులు+అంట= ఇట్లా అనటం; చవదు= తగదు; నేన్+తొఱంగినన్= నేను వదలిపెడితే (నన్ను నేను ఉపసంహరించుకొంటే); నాసిక= ముక్కు; కంపు+ఎఱుఁగన్+చాలదు= వాసన పట్టజాలదు; జిహ్వయున్= నాలుక; చవుల్+కొనన్+వెరవు+ఏదున్= రుచిపట్టే శక్తిని కోల్పోతుంది; రూపున్+కనుఁగొంటకున్= రూపాన్ని చూడటానికి; కన్ను+వలంతి+కాదు= కన్ను సమర్థం కాదు; సోఁకు= తాకును; ఎఱుఁగు శక్తి= తెలిసికొనే శక్తి; చర్మమునకున్+ప్రభవింపదు= చర్మానికి పుట్టదు; శబ్దజాతమున్= శబ్దజాలాన్ని; వినన్= వినటానికి; చెవి; కల్పము+ఏనియునున్= కల్పకాలం కాచుకొన్నా; నేర్పు+ఒడన్+కూడదు= శక్తిని సంపాదించుకొనజాలదు.

**తాత్పర్యం:** 'ఇట్లా అనటం సమంజసం కాదు. నేను లేకపోతే ముక్కు వాసన పట్టదు. నాలుక రుచులు లెక్కింపజాలదు. కన్ను దేనినీ చూడజాలదు. చర్మం గుర్తించదు. ఎన్ని ఏళ్ళు గడిచినా శబ్దాన్ని వినే శక్తి చెవికి ఉండదు.

**విశేషం :** అందుకే ముందటి పద్యంలో సంవేదనంబు (తెలిసికొనటం) మనస్సు చేసే పనిగా చెప్పాడు. చెవి ఇత్యాదులు చేస్తున్న పనులను మనసు సహాయంతోనే ఇంద్రియాలు చేస్తున్నాయి. లేకపోతే వాటి కా శక్తిలేదు.

**వ. నిజంబుగా నేను దొఱంగితి నేని. 32**

**ప్రతిపదార్థం:** నిజంబుగాన్= నిజానికి; నేను+తొఱంగితిన్+ఏనిన్= నేను నన్ను ఉపసంహరించుకొంటే.

**తాత్పర్యం:** నిజంగా నేను పక్కకు వెళ్ళితే - పనిచేయటం మానేస్తే. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. అప్రయోజనంబులై యుండు నాఱిన। నిప్పులట్లు శూన్యనిలయములును**
**బోలె మీ స్వరూపములు గాన మనలోన। నెక్కుడేన సూవె యింత నిజము.' 33**

**ప్రతిపదార్థం:** ఆఱిన నిప్పులు+అట్లు= ఆరిపోయిన నిప్పులవలె; శూన్యనిలయములునున్+పోలెన్= ఎవరూ లేని ఇళ్ళవలె; మీ స్వరూపములు= మీ మీ రూపాలు; అప్రయోజనంబులు+ఐ+ఉండున్= ఏ ప్రయోజనమూ లేనివిగా ఉంటాయి; కానన్= కాబట్టి; మనలోనన్= మనందరిలో; ఏను+అ= నేనే; ఎక్కుడు= అధికుడిని; చూవె!= సుమా!; ఇంత= నేను చెప్పినదెల్ల, నిజము= సత్యం.

**తాత్పర్యం:** నేను లేని పక్షంలో మీ మీ రూపాలు ఆరిపోయిన నిప్పువలె, శూన్యగృహాలవలె ఏ ప్రయోజనమూ లేనివిగా పడి ఉంటాయి. అందుచేత మన అందరిలో నేనే గొప్పదానను. ఇది మాత్రం సత్యం."

**వ. అనిన విని యింద్రియంబులు మనంబున కిట్లనియె. 34**

**తాత్పర్యం:** అనగా విని ఇంద్రియాలు మనస్సుతో ఇట్లా అన్నాయి.

**విశేషం :** మనసు అనుభవాలను కలిగిస్తున్నదన్నమాట నిజమే. కాని ఇంద్రియాలు అనుభవద్వారాలు. అవి లేకుండా మనసు మాత్రం ఏమి చేస్తుంది! అందుకే ఇంద్రియాలు ఇట్లా అన్నాయి.

**సీ.** **'ఇంతవ ట్టిట్టిద యిట్లైన యంతన । కలుగనేర్చునె యధికత్వ మేము**
**వెలిగాఁగ? నీ వొక విషయంబు నేనియు । ననుభవించితయేని నధిక మగుట**
**గానంగ వచ్చు? మాలో నొకం డడఁగిన । ననుభవింపుము తదీయార్థ; మట్లుఁ**
**గాక ఘ్రాణంబున గంధంబ జిహ్వ ర । సంబ చక్షువున రూపంబ వినుము**

**ఆ.** **చర్మశక్తిఁ జేసి సంస్పర్శ విషయంబ । శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబ**
**కానియొంట నొంటిఁ గబళింపఁ జాల వె । ట్లధికతా నిరూఢి కాసపడితి? 35**

**ప్రతిపదార్థం:** ఇంత+పట్టు+ఇట్టిది+అ= ఇంతమాత్రం నిజమే; ఇట్లు+ఐన+అంతన= ఇంతమాత్రాన; అధికత్వము= గొప్పతనం; కలుగన్+నేర్చునె?= ఏర్పడుతుందా!; ఏము+వెలికాఁగన్= మేము లేకుండా; ఈవు= నీవు; ఒక విషయంబును ఏనియున్= ఒక విషయాన్నైనా; అనుభవించితి(ని)+అ+ఏనిన్= అనుభవించగలిగి ఉంటే; అధికము+అగుటన్+ గొప్పకావటాన్ని; కానంగన్+వచ్చున్= చూడవచ్చును; మాలోన్= మాలో; ఒకండు= ఒకడు; అడఁగినన్= అణగిపోయినపుడు; తదీయ+అర్థము= అతడి కోరికను; అనుభవింపుము= అనుభవించుము (చూద్దాము); అట్లు+కాక= అట్లా కాకుండా; ఘ్రాణంబునన్= ముక్కుద్వారా; గంధంబు+అ= గంధమే; జిహ్వన్= నాలుకతో; రసంబు+అ= రసమే; చక్షువునన్= కంటితో; రూపంబు+అ= రూపమే; వినుము= ఇంకా వినుము; చర్మశక్తిన్+చేసి= చర్మశక్తివలన; సంస్పర్శ విషయంబు+అ= బాగా తాకటమే; శ్రోత్రయుక్తిన్= చెవితోకూడి; శబ్దమాత్రకంబు+అ= శబ్దాన్ని మాత్రమే (వింటావు); కాని; ఒంటిన్= ఒకదానితో; ఒంటిన్= మరొకదానిని; కబళింపన్+చాలవు= ఆక్రమింపజాలవు; అధికతా నిరూఢికిన్= ఆధిక్యం పొందటానికి; ఎట్లు= ఏ విధంగా; ఆసపడితి(వి)?= ఎట్లా ఆశపడ్డావు?

**తాత్పర్యం:** 'నీవు చెప్పినది నిజమే! ఒప్పుకుందాము కాని ఇంత మాత్రాన నీకు గొప్పతనం ఏర్పడుతుందా? మేము లేకుండా నీవు ఒక విషయాన్ని అయినా అనుభవించగలిగి ఉంటే అప్పుడు నీ గొప్పతనాన్ని గుర్తించవచ్చును. మాలో ఒకడు లోపించినపుడు ఆ ఇంద్రియసుఖాన్ని నీవు అనుభవించుము (చూద్దాము). అట్లా నీవు చేయలేవు. ముక్కు ద్వారా గంధాన్ని మాత్రమే వాసన పట్టగలుగుతావు. నాలుకతో రసాన్నే చవిచూస్తావు. కంటితో రూపాన్ని మాత్రమే చూడగలవు. చర్మంతో స్పర్శను, చెవితో శబ్దాన్ని చేయగలవు. ఒకదానితో మరొకదానిని కబళించేశక్తి నీకు లేదు కదా! అందుచేత నీ గొప్ప ఏమిటి? ఎందుకంత ఆశ?

**క.** **మును మే మాలంబించిన । వెనుకఁ గదా నీకు ననుభవింప వశం? బో**
**మనసా! నీ వెంగిలి కా । దనుమా యవ్విషయ మెక్కు డయ్యెడు మనలోన్. 36**

**ప్రతిపదార్థం:** ఓ మనసా!= మును= ముందుగా; మేము; ఆలంబించిన= పట్టుకొన్న (ఆక్రమించిన, అనుభవించిన); వెనుకన్= తరువాత; కదా; నీకున్+అనుభవింపన్= నీకు అనుభవించటానికి (శక్యమౌతుంది); ఆ+విషయమున్= ఆ విషయాన్ని; నీవు+ఎంగిలి కాదు+అనుమా= నీవు ఎంగిలికాదని చెప్పుము; ఎక్కుడు= అధిక్యం; మనలోన్= మనలో; అయ్యెడున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** ఓ మనసా! ముందుగా మేము అనుభవించాక కదా విషయసుఖాన్ని నీవు అనుభవించటం! అందుచేత నీవు అనుభవిస్తున్నది ఎంగిలి మాత్రమే. అట్లా కాదని చెప్పుము చూద్దాము. అప్పుడు నీదే అధిక్యం.

**విశేషం :** మనసు ఇంద్రియాల ద్వారా అనుభవిస్తున్న సుఖదుఃఖస్పర్శ తొలుత ఇంద్రియాలకే కదా తగిలేది! తరువాతే మనసు అనుభవిస్తుంది. ఇది ఇంద్రియాలు చేస్తున్న వాదం.

**క.** **నీ వడఁగిననుం బ్రాణముఁ। గావఁగ మాయందు బోధకం బగు ద్రవ్యం**
**బావర్తింపఁగఁ జేయుట। గావించును నీకుఁ దెలివు గనికొను మిదియున్.** **37**

**ప్రతిపదార్థం:** నీవు+అడఁగిననున్= నీవు నశించినా; ప్రాణమున్+కావఁగన్= ప్రాణాన్ని కాపాడటానికి; మా+అందున్= మాలో; బోధకంబు+అగు= జ్ఞానదాయకమైన; ద్రవ్యంబు= పదార్థం; నీకున్= నీకు; తెలివున్= జ్ఞానాన్ని; ఆవర్తింపఁగన్+చేయుటన్= మరల తిరిగివచ్చేటట్లు చేయటాన్ని; కావించును= చేస్తుంది; ఇదియున్= ఇదికూడా; కనికొనుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** నీవు ఇంకొకవిషయం తెలిసికొనుము. ఒక సమయంలో నీవు నశించినా మాలోని పదార్థమే మరలా నీలో జ్ఞానదాయకమైన శక్తిని మరలా కలిగించి నిన్ను బ్రతికిస్తుంది. (ప్రాణదాయకమైన చైతన్యశక్తి మాలోకూడా ఉన్నది. దీనిని మరచిపోవద్దు అని అర్థం).

**సీ.** **అట్లు గా దిట్లని యనుశాసనము సేయఁ। గడు నేర్చు శిష్యులకడకుఁ బోయి**
**వినిపింపఁ దొడఁగి యవ్వినుతార్థములు వార। లుగ్గడింపఁగఁ గను నొజ్జపోలె**
**మముఁ గొని విషయోత్కరము నీవు భోగ్యంబు। గాఁ జేసికొందు నీ కలలు గన్న**
**యప్పుడు మా లేమి నవ్విషయంబు బొం। కైన వాకిలిలేని యాలయంబుఁ**

**ఆ.** **జెందిమరలినట్లు సేడ్పాటు వొరయుదు। గాక సత్యభుక్తి గలదె నీకు?**
**నింతపట్టు గాన్పు మేమును నీవును। గలసి పరఁగ భోగకలన గలుగు.'** **38**

**ప్రతిపదార్థం:** అట్లు+కాదు= అట్లా కాదు; ఇట్లు+అని= ఇట్లా అని; అనుశాసనము+చేయన్= నిర్ణయం చేయటానికి; కడున్+నేర్చు = మిక్కిలి నేర్పరులైన; శిష్యులకడకున్+పోయి= శిష్యులవద్దకు వెళ్ళి; వినిపింపన్+తొడఁగి= ఉపదేశం ప్రారంభించి; ఆ+వినుత+అర్థములు= ఆ గొప్ప విషయాలను; వారలు= ఆ శిష్యులు; ఉగ్గడింపఁగన్= చెప్పుతుండగా; కను= చూస్తున్న; ఒజ్జ+పోలెన్= గురువువలె; మమున్+కొని= మమ్ములను ఆధారంగా గ్రహించి; నీవు; విషయ+ఉత్కరమున్= విషయసమూహాన్ని; భోగ్యంబుగాన్= అనుభవించదగినదిగా; చేసికొందు(వు)= చేసికొంటావు; నీ కలలు= నీవు కలలు; కన్న+అప్పుడు= కన్నప్పుడు; మా లేమిన్= మేము లేకపోతే; ఆ+విషయంబు= ఆ విషయానుభవం; బొంకు+ఐనన్= అబద్ధం కాగా; వాకిలిలేని= తలుపులేని; ఆలయంబున్+చెంది= ఇంటిలోనికి వెళ్ళి; మరలినట్లు= తిరిగివచ్చినట్లు; చేడ్పాటున్= కీడును (నిర్వ్యాపారాన్ని); పొరయుదు(వు)+కాక= పొందుతావు తప్ప; నీకున్= నీకు; సత్యభుక్తి= నిజంగా అనుభవించటం; కలదె?= ఉన్నదా?; ఇంత+పట్టున్+కాన్పు(ము)= ఇంతమాత్రం అర్థంచేసికొనుము; ఏమునున్= మేమూ; నీవునున్= నీవూ; కలసి+పరఁగన్= కలిసి పనిచేస్తే; భోగకలన= భోగానుభవం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** అట్లా కాదు - ఇట్లా చేయాలి అని చెప్పటంకొరకు మిక్కిలి నేర్పరులైన శిష్యులవద్దకు వెళ్ళి ఉపదేశం ప్రారంభించి, చివరికి ఆ శిష్యులు ఆ గొప్ప విషయాలను చెప్పుతుండగా నివ్వెరపోయి చూచి వింటున్న గురువువలె ఉన్నది నీ పని, మమ్ములను ఆధారంగా గ్రహించి నీవు విషయసమూహాన్ని అనుభవించదగినదిగా చేసికొంటున్నావు. మేమే లేకుండాపోతే ఆ విషయానుభవం వట్టి 'బొంకు' మాత్రమే! తలుపులులేని ఇంటిలోనికి వెళ్ళి మరలివచ్చినట్లు

నిష్ప్రయోజకంగా నీవు తయారవుతావు. అందుచేత నీకు నిజమైన అనుభవం ఎక్కడిది? ఇంతమాత్రం అర్థంచేసికొనుము. మేమూ నీవూ కలిస్తేనే 'భోగానుభవం' కలుగుతున్నది. అందుచేత నీ గొప్ప ఏమిటీ?' అని ఇంద్రియాల వాదం.'

**విశేషం:** అలం; ఉపమ మనస్సు లేక ఇంద్రియాలు, ఇంద్రియాలు లేక మనస్సు రెండూ అనుభవాన్ని పొందజాలవని భావం. నిజానికి మనస్సు ఇంద్రియముఖంగా అనుభవం పొందుతుండగా, ఇంద్రియాలు మనస్సుద్వారా విషయాభిరమణం పొందుతున్నాయి. అందుచేత రెండూ ప్రధానమే. మనస్సు ఇంద్రియాలను నియంత్రించగల సందర్భం ఉంటుందేమో కాని, ఎక్కువ ఇంద్రియాలు చెప్పినట్లు మనస్సు ప్రవర్తించటమూ ఉన్నది. ఇంద్రియాలలోని ప్రాణశక్తివలన మనస్సును మరలా ఉత్తేజితంచేసే శక్తి అవయవాలకున్నది.

**వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె' నని యప్పురుషవరుం డా వర వర్ణినితో 'వేఱొక్కండు విను' మని యిట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ఈ విధంబునన్= ఈ రీతిగా; మనంబునున్= మనస్సూ; ఇంద్రియంబులునున్= ఇంద్రియాలూ; సంవాదంబు+చేసెను+అని= వాదోపవాదాలు జరిపాయని; ఆ+పురుషవరుండు= ఆ పురుషశ్రేష్ఠుడు; ఆ+వర+వర్ణినితోన్= ఆ శ్రేష్ఠమైన స్త్రీతో; వేఱు+ఒక్కండు= మరొక విషయం; వినుము+అని= వినుమని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి. 'ఈ రీతిగా మనస్సు ఇంద్రియాలు వాదోపవాదాలు చేశా' యని ఆ బ్రాహ్మణుడు తన భార్యతో చెప్పి 'ఇంకా మరొక విషయం ఉన్నది వినుము' అంటూ ఇట్లా అన్నాడు.

**సీ. 'ప్రాణప్రభృతులగు పవను లంభోరుహ। గర్భుని నొక్కటఁ గానఁబోయి**
**'యెక్కుడు మాలోన నెవ్వరు?' నావుడు। నవ్విభుం 'డెవ్వార లడఁగ నడఁగు**
**దురు పెఱవార? లెవ్వరికిఁ బ్రవర్తన। మొందిన నెల్లవారును జరింతు**
**రధికు లందఱకును నట్టి వారలు మీరు। సనుఁ' డని పలికినఁ జనక నిలిచి**

**ఆ. ప్రాణుఁ డాది గాఁగ బవనులందఱుఁ దమ। వలన నవ్విధంబు గలుగఁ దెలుప**
**నాతఁ 'డే నెఱుంగనా? యది యట్టిద। వినుఁడు మీ విశేషవృత్తి భంగి'. 40**

**ప్రతిపదార్థం:** ప్రాణ ప్రభృతులు+అగు= ప్రాణుడు, అపానుడు మొదలైన; పవనులు= వాయువులు; అంభోరుహగర్భునిన్= కమలగర్భుడైన బ్రహ్మను; ఒక్కటన్= అందరూ కలిసి; కానన్+పోయి= చూడబోయి; మాలోనన్= మా అందరిలోనూ; ఎక్కుడు= అధికుడు; ఎవ్వరు?= ఎవడు?; నావుడున్= అనగా; ఆ+విభుండు= ఆ స్వామి; ఏ+వారలు= ఎవరు; అడఁగన్= అణిగిపోతే; పెఱవారలు= ఇతరులు; అడఁగుదురు= అణిగిపోతారో; ఎవ్వరికిన్= ఎవరు; ప్రవర్తనము+ఒందినన్= పనిచేయటం మొదలు పెట్టితే; ఎల్లవారునున్+చరింతురు= అందరూ ప్రవర్తిస్తారో; అట్టివారలు= అట్లాంటివారు; అందఱకునున్= అందరిలోనూ; అధికులు= గొప్పవారు; మీరు= ఇక మీరు; చనుఁడు= బయలుదేరండి; అని; పలికినన్= చెప్పగా; చనక= తిరిగిపోకుండా; నలిచి= అక్కడే ఆగిపోయి; ప్రాణుఁడు+అది+కాఁగన్= ప్రాణుడు మొదలైన; పవనులు+అందఱున్= వాయువులందరూ; తమవలనన్= తమచేత; ఆ+విధంబు+కలుగన్+తెలుపన్= ఆ రీతిగా అవుతుందన్న విషయాన్ని; చెప్పగా; అతఁడు= ఆ బ్రహ్మ; ఏన్+ఎఱుంగనా?= నాకు తెలియదా?; అది+అట్టిది+అ= అది అట్లాంటిదే; మీ విశేషవృత్తి భంగిన్= మీ మీ ప్రత్యేక కార్యకలాపాన్ని; వినుఁడు= వినండి.

**తాత్పర్యం:** ఒకప్పుడు ప్రాణాపానాదులైన వాయువులు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి, 'మాలో ఎవరు గొప్పవాడో దయచేసి చెప్పండి' అని అడిగారు. బ్రహ్మ అన్నాడు: 'ఎవరు అణగిపోతే ఇతరులందరూ అణగిపోతారో, ఎవరు పనిచేయటం మొదలుపెట్టితే ఇతరులంతా తమతమ పనులు మొదలు పెట్టుతారో అట్లాంటివారు గొప్పవారు. ఇక మీరు మీ మీ దారులలో వెళ్ళండి' అని చెప్పగా ప్రాణుడు మొదలైనవారు అట్లాగే నిలబడి పోయారు. తిరిగిపోలేదు. ప్రతి ఒకడూ తమవలననే ఇతరులు ప్రవర్తిస్తున్నారని చెప్పాడు. అపుడు బ్రహ్మ 'అది నాకు తెలియదా! దాని విషయం అంతే. మీలో ప్రతి ఒక్కరూ ఒక విశిష్టవృత్తి కలిగినవారు. ఎట్లాగో చెప్పుతాను వినండి' అని ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు.

**తే.** **'ఎప్పు డెవ్వరివలన నే చొప్పు గలుగు। నపుడ వారెక్కుడగుదు రన్యోన్యమిత్ర**
**భావమునఁ దాల్పుఁ డొండొరుఁ బవనులార!। పొరిఁ బరస్పరభావనాపరుల రగుఁడు.** **41**

**ప్రతిపదార్థం:** ఎప్పుడు= ఏ సమయంలో; ఎవ్వరివలనన్= ఎవరివలన; ఏ చొప్పు కలుగున్= ఏ తీరున పని జరుగుతుందో; అపుడు+అ= అప్పుడే; వారు; ఎక్కుడు+అగుదురు= అధికులవుతారు; పవనులార!= ఓ వాయువులారా!; అన్యోన్య= పరస్పరం; మిత్రభావమునన్= స్నేహభావంతో; ఒండొరులన్= ఒకరినొకరు; తాల్పుఁడు= భరించండి (అనుసరించి ప్రవర్తించండి); పొరిన్= మిక్కిలిగా; పరస్పర= ఒకరి నొకరు; భావనాపరులరు+అగుఁడు= సంభావించుకొనేవారు కండి.

**తాత్పర్యం:** ఎప్పుడూ ఎవరివలన ఏ తీరుగా ఒక పని జరుగుతుందో అప్పుడు మాత్రమే వారు అధికులవుతారు. అట్లా అందరూ ఒక్కొక్క సమయాన గొప్పవారే అవుతారు. అందుచేత ఒకరి నొకరు స్నేహభావంతో అనుసరించాలి. ఒకరి నొకరు గౌరవించుకొనండి.

**వ.** **ఇత్తెఱంగున మీకు భద్రంబగుం బొం' డని పుచ్చె న ట్లుపదేశించిన బ్రహ్మవాక్యంబుల వాయువులు సమత నొందె'నని చెప్పి, 'వాయువిషయం బైనయది నారద దేవమత సంవాదంబు సెప్పెద నాకర్ణింపు' మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి కిట్లనియె.** **42**

**ప్రతిపదార్థం:** ఈ తెఱంగునన్= ఈ విధంగా ప్రవర్తిస్తే; మీకున్= మీకు; భద్రంబు+అగున్= క్షేమమవుతుంది; పొందు+అని= వెళ్ళండని; పుచ్చెన్= పంపించాడు; అట్లు+ఉపదేశించిన= ఆ విధంగా ఉపదేశించిన; బ్రహ్మవాక్యంబులన్= బ్రహ్మదేవుడి మాటలవలన; వాయువులు= పంచవాయువులూ; సమతన్+ఒందెను+అని= సమభావనను పొందాయని; చెప్పి; వాయు విషయంబు+ఐన+అది= వాయువిషయ సంబంధమైన; నారద= నారదుడికి; దేవమత= దేవమతుడికీ జరిగిన; సంవాదంబు= సంభాషణ; చెప్పెదన్= చెప్పుతాను; ఆకర్ణింపుము= వినుమని; బ్రాహ్మణుండు= ఆ విప్రుడు; బ్రాహ్మణికిన్= ఆ బ్రాహ్మణస్త్రీకి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రవర్తిస్తే మీకు క్షేమం కలుగుతుంది. వెళ్ళిరండి' అని బ్రహ్మ వారిని పంపించాడు. బ్రహ్మ వాక్యాలవలన పంచవాయువులూ సమతను పొందాయి. ఇంతేకాకుండా వాయుసంబంధమైన మరొక సంవాదం నారదుడికి, దేవమతుడికి నడుమ జరిగింది. దానిని చెప్పుతాను విను' మని ఆ విప్రుడు ఆ విప్రస్త్రీకి ఇట్లా చెప్పాడు.

**విశేషం :** 'సమత' అంటే సమభావనతో ప్రవర్తించటమని అర్థం. పంచవాయువులు ఒక సమరసభావనతో ప్రవర్తించటమే ఆరోగ్యం. ఇందులో ఏది ప్రకోపించినా దానిని 'రోగ'మని అంటారు.

**తే.** **'దేవమతుఁ డను విప్రుఁడు దేవముని వ। రేణ్యుఁ డగు నారదుని నొక్క పుణ్యభూమిఁ**
**గాంచి వినతుఁడై యాతని కరుణ వడసి। భక్తిరసము పొంగారఁ దత్ప్రాంతమునకు.** **43**

**ప్రతిపదార్థం:** దేవమతుఁడు+అను= దేవమతుఁడనే పేరుగల; విప్రుఁడు= బ్రాహ్మణుడు; దేవముని వరేణ్యుఁడు+అగు= దేవర్షిశ్రేష్ఠుడైన; నారదునిన్= నారదుడిని; ఒక్కపుణ్యభూమిన్= ఒక పవిత్రమైన చోట; కాంచి= చూచి; వినతుఁడు+ఐ= నమస్కరించినవాడై; అతని కరుణ+పడసి= అతడి అనుగ్రహం పొంది; భక్తిరసము= భక్తి రసానుభవం; పొంగారన్= అతిశయించగా; తద్+ప్రాంతమునకున్= అతడి సమీపానికి (వెళ్ళి).

**తాత్పర్యం:** దేవమతుడనే పేరుగల బ్రాహ్మణుడు దేవర్షిశ్రేష్ఠుడైన నారదుడిని ఒక పవిత్రభూమిలో చూచి, వినయంతో నమస్కరించి, ఆయన అనుగ్రహం పొంది, భక్తి అతిశయించగా అతడి సమీపానికి (తరవాతిపద్యంతో అన్వయం.)

**సీ.** **అల్లన చన నాతఁ డాదరంబున 'నిందు। ర మ్ముండు' మనుచుఁ గరమునఁ జూపు**
**నెడ సమాసీనుఁడై కడు వినయంబున। హస్తముల్ మొగిచి దయాసమగ్ర!**
**యెఱిఁగింపు పవనంబు లేనింటియందును। జాయమానంబగు జంతువునకుఁ**
**దొలితొలి యెద్ది దాఁదొడఁగు వర్తింపంగ?'। ననవుడు నారదుం డతనితోడ**

**తే.** **'వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ। జొనుపు జీవునిఁ దజ్జంతుజననవేళఁ**
**దొలుత దాని కనంతరకలిత మైన। మారుతంబు ప్రవర్తించు: మఱియు వినుము.** **44**

**ప్రతిపదార్థం:** అల్లన= నెమ్మదిగా; చనన్= వెళ్ళగా; అతఁడు= నారదుడు; అదరంబునన్= ఆదరంతో; ఇందున్= ఇక్కడికి; రమ్ము= రా!; ఉండుము= కూర్చొనుము; అనుచున్= అంటూ; కరమునన్= చేతితో; చూపు+ఎడన్= చూపించిన చోట; సమాసీనుఁడు+ఐ= కూర్చున్నవాడై; కడు= మిక్కిలి; వినయంబునన్= వినయంతో; హస్తముల్ మొగిచి= చేతులు జోడించుకొని; దయాసమగ్ర!= సంపూర్ణ దయస్వరూపుడా!; పవనంబులు+ఏనింటి+అందును= ఐదు ప్రాణవాయువులలోనూ; జాయమానంబు+అగు= పుట్టేటటువంటి; జంతువునకున్= ప్రాణికి; తొలి తొలి= ముని ముందుగా; ఎద్ది= ఏ వాయువు; తాన్+వర్తింపన్+తొడఁగున్= తాను ప్రవర్తించటం మొదలుపెట్టుతుంది?; ఎఱిఁగింపు(ము)= తెలపండి; అనవుడున్= అని కోరగా; నారదుండు; అతనితోడన్= ఆ దేవమతుడితో; వాయువు+ఏ+అది= ఏ వాయువైతే; గర్భసంవాసమునకున్= గర్భంలో ఉండటానికి; తొలుతన్= ముందు; జీవునిన్+చొనుపున్= జీవుడిని ప్రవేశపెడుతుందో; తద్+జంతు+జననవేళన్= ఆ జంతువు పుట్టే సమయంలో; దానికిన్= దానికి; అనంతర కలితము+ఐన= తరువాత ఉండేటటువంటి; మారుతంబు= వాయువు; ప్రవర్తించున్= పనిచేస్తుంది; మఱియున్= ఇంకా; వినుము.

**తాత్పర్యం:** అట్లా నెమ్మదిగా సమీపించగా నారదుడు ఆదరంతో 'ఇక్కడికి వచ్చి కూర్చొనుము' అని చేతితో ఒకచోటు చూపించాడు. దేవమతుడు ఆ చోట కూర్చున్నాడు. మిక్కిలి వినయంతో చేతులు జోడించి 'అయ్యా! మీరు కరుణా స్వరూపులు. ఐదు ప్రాణవాయువులలోనూ పుట్టే సమయంలో ప్రాణిలో మొట్టమొదట ఏ వాయువు పనిచేయటం మొదలు పెట్టుతుందో చెప్పండి' అని అడిగాడు. నారదుడు 'నాయనా! ఏ వాయువు ప్రాణిని గర్భసంవాసానికి ప్రేరేపిస్తుందో - ఆ జంతువు పుట్టే సమయంలో దాని తరువాత ఉన్న వాయువు పనిచేయటం మొదలుపెట్టుతుంది.

**తే.** **పురుషునందు సమానంబుఁ బొలఁతియందు। వ్యానమును జువ్వె పొడమించు వరుస ననఘ!**
**శుక్లమునకు శోణితమునఁ జాలు గల్గు। నయ్యుగంబును విధి చెయ్ది నమరఁ బొంద.** **45**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్ముడా!; వరుసన్= వరుసలో; పురుషునందున్= మగవాడిలో; సమానంబున్= సమాన ప్రాణమూ; పొలఁతి అందున్= అడుదానిలో; వ్యానమునున్= వ్యానమనే ప్రాణమూ; పొడమించున్= పుట్టిస్తాయి; చువ్వె!= సుమా!; శుక్లమునకున్= వీర్యానికి; శోణితమునన్= రజస్సులో; ఆ+యుగంబును= ఆ రెండూ (శుక్లశోణితాలు); విధిచెయ్దిన్= దైవచేష్టవలన; అమరన్= తగినట్లు; పొందన్= కలువగా; చూలు+కల్గున్= గర్భం కలుగుతుంది.

**తాత్పర్యం:** సమానవాయువు పురుషుడిలో వీర్యాన్ని, వ్యానమనే వాయువు స్త్రీలో రజస్సును ప్రభవింపచేస్తాయి. శుక్లశోణితాల కలయిక గర్భంగా మారుతుంది. ఆ కలయిక దైవలీల.

**క. విను సృష్టశోణితంబునఁ । బనుగొను శుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ**
**ర్తన మొందుఁ బ్రాణశుక్లము । లనూనహేతువులుగా నపానుఁడు నడచున్. 46**

**ప్రతిపదార్థం:** విను(ము)= ఇంకా వినుము; సృష్ట= పుట్టిన (సవ్యంగా స్రవించిన); శోణితంబునన్= రక్తంలో; పనుగొను= గట్టిపడేటటువంటి; శుక్లంబువలనన్= వీర్యంవలన; ప్రాణుఁడు= ప్రాణమనే వాయువు; తగన్= తగినట్లుగా; వర్తనము+ఒందున్= వ్యాపిస్తాడు; ప్రాణ శుక్లములు= ఇటు ప్రాణమూ,అటు వీర్యమూ; అనూన= గొప్ప; హేతువులుగాన్= కారణాలుగా; అపానుఁడు= అపానమనే మరొక వాయువు; నడచున్= వ్యాపిస్తాడు.

**తాత్పర్యం:** అప్పటి కప్పుడు నవ్యంగా పుట్టే రజస్సులో గట్టిపడ్డ వీర్యం కారణంగా అందులో ప్రాణుడు ప్రవేశిస్తాడు. ప్రాణుడు, వీర్యం - ఈ రెండూ కారణాలుగా అపానుడూ వ్యాపిస్తాడు.

**విశేషం :** ఏ వాయువు తరువాత ఏ వాయువు వ్యాపిస్తుంది? అనే ప్రశ్నకు సమాధానం ఇక్కడ ఉన్నది. గర్భధారణంలో ముందుగా పనిచేసేది ప్రాణం. అందుకే శుక్లశోణితాల కలయిక ముద్ద కట్టినపుడు అందులో ప్రాణశక్తి ప్రవేశిస్తున్నది. దానిని అనుసరించి అధోమార్గం కలిగిన అపానం వ్యాపిస్తుంది. అప్పుడు ఏమి జరుగుతుందో తరువాతి పద్యంలో వివరించాడు.

**క. చనుఁ బ్రాణుఁ డధోగతి నూ । ర్ధ్వనిరూఢి నపానుఁ డివ్విధము గల యీ రెం**
**టను నగ్నిమయోదానం । బును వ్యానంబును సమానమును వర్తించున్. 47**

**ప్రతిపదార్థం:** ప్రాణుఁడు= ప్రాణుడనేవాయువు; అధోగతిన్= క్రిందివైపు; చనున్= ప్రసరిస్తాడు; అపానుఁడు= అపానుడనే వాయువు; ఊర్ధ్వ విరూఢిన్= పై వైపు (చనున్); ఈ విధము+కల= ఈ రీతిగా ప్రసరించే; ఈ రెంటనున్= ఈ రెండింటిలోను; అగ్నిమయ= అగ్నిశక్తితో నిండిన ఉదానంబునున్= ఉదానమూ; వ్యానంబును; వ్యానమూ; సమానమునున్= సమానమూ; వర్తించున్= వ్యాపిస్తాయి.

**తాత్పర్యం:** అపుడు ప్రాణుడు అధోముఖంగానూ, అపానుడు ఊర్ధ్వముఖంగానూ ప్రసరిస్తారు. అపుడు ఈ రెండు వాయువులలో 'అగ్ని' శక్తితో నిండిన ఉదాన, వ్యాన, సమానులు ప్రసరిస్తారు. (ఇట్లా పిండం ప్రాణశక్తితో నిండుతుందని అర్థం).

**ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రా । ణంబునకు నపాననామమునకు**
**నంతరమున వెలుఁగు నా భవ్యమూర్తి యు । దానరూప మండ్రు తజ్జ్ఞ జనులు. 48**

**ప్రతిపదార్థం:** తద్‌జ్ఞ+జనులు= ఆ ప్రాణాగ్నితత్త్వం తెలిసిన పండితులు; పావకుండు= అగ్ని; సర్వదేవ+ఆత్మకుండు= దేవతలందరిలోనూ వ్యాపించి ఉన్నవాడు (అందుకే దేవతలందరూ తేజోరూపులు); ప్రాణంబునకున్= ప్రాణానికి; అపాన నామమునకున్= అపానానికి; అంతరమునన్= నడుమ; వెలుఁగు= ప్రకాశించేటటువంటి; ఆ+భవ్యమూర్తి; ఉదానరూపము+అంద్రు= ఉదానరూపుడని అంటారు.

**తాత్పర్యం:** ఆ ప్రాణాగ్నితత్త్వం తెలిసిన పండితులు దేవతలందరిలోనూ వ్యాపించి ఉండేవాడూ, ప్రాణాపానాల నడుమ వెలిగే పుణ్యమూర్తీ అయిన అగ్నిని ఉనానరూపుడుగా గుర్తిస్తారు.

**సీ.** **విను మహోరాత్రంబులును శుభాశుభములు। సత్యానృతంబులు సదసదాహ్వ**
**యములును నైన ద్వంద్వములు ప్రాణాపాన। ములకు నామాంతరములు; దదీయ**
**మధ్యవర్తిత నొప్పు మహనీయ వహ్ని; యుదానంబు దాని నిర్ద్వంద్వభావ**
**మాంతరయాగ విద్యాప్రవీణులు గంద్రు। పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ**

**తే.** **నరయ భేదంబు లే దన్న యట్టులుండు। నమ్మహావస్తువును నుదానాకృతియ య**
**నంగఁ జెవియార విందుము నలినగర్భు। చేత' నని దివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.** **49**

**ప్రతిపదార్థం:** వినుము= ఇంకా ఈ ప్రాణతత్త్వం ఎట్లాంటిదో వినుము; అహోరాత్రంబులునున్= రాత్రింబవళ్ళు; శుభ+అశుభములున్= మేలు కీళ్ళు; సత్య+అనృతంబులున్= సత్యం, అసత్యం, సత్+అసత్+అహ్వాయములునున్+ఐన= సత్తు, అసత్తు అనే పేర్లు కలిగినటువంటి; ద్వంద్వములు= ద్వంద్వ భావాలు ఏవి ఉన్నాయో-అవి; ప్రాణ+అపానములకున్= ప్రాణపానాలకు; నామాంతరములు= మారుపేర్లు; తదీయ= వాటి; మధ్యవర్తితన్= నడుమ ఉండటం అనే లక్షణంతో; ఒప్పు అతిశయించేటటువంటి; మహనీయ= గొప్ప; వహ్ని= అగ్ని; ఉదానంబు= ఉదానం; దాని నిర్+ద్వంద్వ భావము= ఆ అగ్ని యొక్క, అద్వైతస్థితిని (అంటే అది ఒకవైపు అగ్ని, మరొకవైపు వాయువు, ఈరెండూ కలిసిన మహాతత్త్వం అది - అని అర్థం); ఆంతర+యాగవిద్యా ప్రవీణులు= ఆంతర్యాగవిద్యలో నిష్ణాతులైన వారు; కంద్రు= తెలిసికొంటారు; పరమశాంతి+అనంగన్= పరమశాంతి స్థితి అని; బ్రహ్మము+అనఁగన్= బ్రహ్మమనీ; అరయన్= అలోచించగా; భేదంబు+లేదు+అన్న+అట్టులు+ఉండు= భేదం లేదన్నట్లు కనిపించే; ఆ+మహావస్తువును= ఆ గొప్పతత్త్వాన్ని; ఉదాన+ఆకృతి+ఆ= ఉదానమే; అనంగన్= అని; నలినగర్భుచేతన్= బ్రహ్మదేవుడివలన; చెవి+అరన్+విందుము= చెవులారా విన్నాము; అని; దివ్యముని= నారదుడు; కరుణన్= దయతో; ఇట్లు+చెప్పెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంకా ఈ ప్రాణతత్త్వం ఎట్లాంటిదో వినుము. రాత్రింబవళ్ళు, మేలు కీళ్ళు, సత్యాసత్యాలు, సదసత్తులు అనే ద్వంద్వాలు ప్రాణాపానాలకు మారుపేర్లే. వాటి నడుమ వర్తిల్లేటటువంటి అగ్ని ఉదానం. అగ్నితత్త్వాన్ని వాయుతత్త్వాన్ని రెండింటినీ కలిగినదాని అద్వైతస్థితిని అంతర్యాగవిద్యానిపుణులు మాత్రమే గుర్తించగలరు. పరమశాంతి అని, బ్రహ్మమని పిలువబడే ఆ తత్త్వంలో ఏ భేదపరిగణనా సాధ్యం కాదు. అదే ఉదానతత్త్వమని సాక్షాత్తు బ్రహ్మదేవుడు చెప్పగా మా చెవులారా విన్నాము' అని నారదమహర్షి అతడితో చెప్పాడు.

**వ.** **అని చెప్పి 'యింద్రియ మనః పవనంబుల భంగులు గనుంగొనుట యీ తత్త్వంబులకుఁ బరమంబైన తత్త్వంబు' గనుటకుఁ గతంబై యుండు' నని పలికి యద్ధరామరుం డా రామారత్నంబును సదయంబుగా నవలోకించి 'యుత్తమరహస్యంబు సెప్పెద నాకర్ణింపు' మని యిట్లనియె.** **50**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పినవాడై; ఇంద్రియ= ఇంద్రియాల; మనస్= మనస్సుయొక్క; పవనంబుల= వాయువుల; భంగులు= రీతులు; కనుంగొనుట= కనుగొనటం; ఈ+తత్త్వంబులకున్= ఈ తత్త్వాలకు; పరమంబు+ఐన= అతీతమైన; తత్త్వంబున్+కనుటకున్= మహాతత్త్వాన్ని దర్శించటానికి; కతంబు+ఐ+ఉండున్+అని= మూలమై ఉంటుందని; పలికి; ఆ+ధరామరుండు= ఆ భూదేవుడు; ఆ+రామారత్నంబును= ఆ స్త్రీరత్నాన్ని; సదయంబుగాన్= దయతో; అవలోకించి= చూచి; ఉత్తమ రహస్యంబు+చెప్పెదన్= అత్యుత్తమ రహస్యం నీకు చెప్పుతాను; ఆకర్ణింపుము+అని= వినుమని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, 'ఇంద్రియాలు, మనస్సు - ప్రాణం వీటిని గురించి తెలిసికొనటంద్వారా ఈ తత్త్వాలకు అతీతమైన మహాతత్త్వాన్ని (అంటే ఆత్మతత్త్వాన్ని) గుర్తించటానికి సాధ్యమవుతుం'దని ఆ బ్రాహ్మణుడు తన భార్యకు చెప్పి, ఆమెవైపు దయామృతవీక్షణాలతో చూచి, 'మరో రహస్యాన్ని నీకు చెప్పుతాను జాగ్రత్తగా విను' మని ఇట్లా ప్రారంభించాడు.

### జీవాత్మస్వరూప నిరూపణప్రకారము (సం.14-25-3)

**సీ.** **'కరణంబు కర్మంబు కర్త యన్నేతద్వి। రాజితకారకత్రయముచేత**
**నఖిలంబు సంవ్యాప్తమై యుండు ఘ్రాణాదు। లును మనంబును బుద్ధియును బ్రవరులు**
**కరణహేతువు లండ్రు గంధాది విషయ సం। తతియు మంతవ్యబోద్ధవ్యములును**
**గర్మహేతువు లగుఁ గంపుకొనఁగ నానఁ। గాన ముట్టఁగ వినఁగా దలంప**

**తే.** **నిశ్చయము దగఁ జేయంగ నేర్పు లేడు। గలవు జీవాత్మునకు నవి కర్తృహేతు**
**భూతములు వాన విషయానుభూతి నతఁడు। దొఱఁగు నిష్ఠలు మోక్షహేతువులు సుమ్ము. 51**

**ప్రతిపదార్థం:** కరణంబు= కరణం (సాధనం); కర్మ= ధాత్వర్థ ఫలాశ్రయం; (క్రియాఫలాన్ని అనుభవించేవాడు కర్మ); కర్త= ధాత్వర్థవ్యాపారాశ్రయం (క్రియావ్యాపారాన్ని చేసేవాడు కర్త); అన్+ఏతద్+విరాజిత= అనబడే ఈ ప్రసిద్ధమైన; కారక త్రయముచేతన్= మూడు కారకాలచేత; అఖిలంబున్= అంతా; సంవ్యాప్తము+ఐ+ఉండున్= బాగా వ్యాపించబడి ఉంటుంది. ఘ్రాణ+ఆదులునున్= ముక్కు మొదలైన ఐదు కర్మేంద్రియాలు; మనంబునన్= మనస్సు; బుద్ధియునున్= బుద్ధీ; కరణహేతువులు= కరణాలు (సాధనాలని); ప్రవరులు= శ్రేష్ఠులైన పండితులు; అండ్రు= అంటారు; గంధాది విషయ సంతతియున్= వాసన చూడటం మొదలైన విషయసమూహం; మంతవ్య, బోద్ధవ్యములునున్= ఆలోచించదగినది, తెలిసికొనదగినది; కర్మహేతువులు+అగున్= కర్మ హేతువు లవుతాయి; కంపు కొనఁగన్= వాసన చూడటానికి; ఆనన్= తినటానికీ; కానన్= చూడటానికి; ముట్టఁగన్= తాకటానికి; వినఁగన్= వినటానికి; తలంపన్= ఆలోచించటానికి; నిశ్చయంబు+తగన్+చేయంగన్= తగినట్టు నిర్ణయించటానికి; నేర్పులు= శక్తులు; ఏడు+కలవు= ఏడున్నాయి. జీవాత్మునకున్= జీవాత్ముడికి; అవి= ఈ ఏడు నేర్పులూ; కర్తృ హేతు భూతములు= కర్తృత్వాన్ని కలిగించే లక్షణాలు; వానన్= వాటిలోనే; అతఁడు= ఆ జీవాత్ముడు; విషయానుభూతిన్= విషయానుభవాన్ని; తొఱఁగున్= వదిలిపెట్టగలుగుతాడు; నిష్ఠలు= అతడు అవలంబించే నిష్ఠలు (నియమాలు, దీక్షలు); మోక్షహేతువులు; సుమ్ము!= సుమా!

**తాత్పర్యం:** 'కరణం, కర్మ, కర్త - ఈ మూడు కారకాలు, ప్రపంచమంతా ఈ మూడింటితోనే నిండి ఉన్నది. ముక్కుమొదలైన కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధికరణహేతువులు. వాసన చూడటం మొదలైన విషయసమూహం.

ఆలోచించదగినది, తెలిసికొనదగినది - ఏవి ఉన్నాయో అవి కర్మహేతువులు. వాసన పట్టటం, తినటం, చూడటం, తాకటం, వినటం, ఆలోచించటం, నిర్ణయం చేయటం - అనే ఏడు పనులు జీవాత్ముడు చేయగలుగుతాడు. ఈ నేర్పులు కర్తృహేతువులు అవుతాయి. వీటితోనే ఆ జీవుడు విషయసుఖాలను తరిమికొట్టగలడు కూడా. తోడుగా అవలంబించే శ్రద్ధ, నియమనిష్ఠలు మోక్షాన్ని కలిగిస్తాయి.

**వ. కరణకర్మకర్తృకారకాత్మకుండును జీవాత్ముండు భోక్త యగుట దక్కి వివిధవిషయమూర్తులగు హవిస్సుల నుదాసీనత్వస్రుగ్గతంబులు సేసి వేల్చు నిష్ఠ నాత్మస్వరూపం బగు ననలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమ రహితం బగుచుం బొలుచు; నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగు' నేని నట్టిద బంధ ప్రకారం బని నిర్దేశించి 'ముక్తభావంబునకు మూలం బయిన యోగయజ్ఞంబునం దేను బ్రవృత్తుండనై యున్నవాఁడ; దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ; దాన సకలాత్ముండగు నారాయణుండు ప్రీతుండై స్వీకరించు; నద్దశ పేరు మునులు ముక్తి యని చెప్పుదు' రని చెప్పి యన్విప్రుండు వెండియు. 52**

**ప్రతిపదార్థం:** కరణ, కర్మ, కర్తృ కారక+ఆత్ముండు+అగు= కరణ, కర్మ, కర్తృ కారకత్రయాన్ని ఆత్మగా కలిగిన; జీవాత్ముండు= జీవుడు; భోక్త+అగుటన్+తక్కి= తాను కర్త అనే భావాన్ని వదలిపెట్టి; వివిధ విషయమూర్తులు+అగు= వివిధాలైన విషయసుఖాల స్వరూపం కలిగిన; హవిస్సులన్; ఉదాసీనత్వ= ఉదాసీన మనేటటువంటి; స్రుక్+గతంబులు+చేసి= (యజ్ఞంలో వాడే) కొయ్యగరిటెలో వేసి; వేల్చునిష్ఠన్= హోమం చేసే నిష్ఠవలన; ఆత్మస్వరూపంబు+అగు+అవలంబు= ఆత్మస్వరూపమైన అగ్ని; ప్రజ్వలితంబు+అయి= బాగా మండి; అవిద్యారూప= అవిద్య (అజ్ఞానం అనే) పొగచేత; రహితంబు+అగుచున్= లేనిదై; పొలుచున్= ప్రకాశిస్తుంది; అది మోక్షప్రకారంబు= అట్లా చేయటం మోక్షం చేకూరే పద్ధతి; అట్లు+కాక+భోక్త+అగునేనిన్= అట్లాకాకుండా తానే తినేవాడు. అనుభవించేవాడు అయితే; అట్టిది+ఆ= అట్లాంటి విషయానుభవమే; బంధప్రకారంబు+అని= బంధం కలిగించే తీరు అని; నిర్దేశించి= బోధించి; ముక్తభావంబునకున్= వదలిపెట్టటం (ముక్తం) అనే భావానికి; మూలంబు+అయిన= హేతువైన; యోగ యజ్ఞంబు నందున్= యోగమనే యజ్ఞంలో; ఏను= నేను; ప్రవృత్తుండను+ఐ= పనిలో తలమునుకలుగా ఉన్నాను; దానికిన్+ సర్వపరిత్యాగంబు దక్షిణ= దానికి అన్నిటినీ వదలిపెట్టటమే దక్షిణ, దానన్= దానివలన; సకల+ఆత్ముండు+అగు= సకలలోకాలలోనూ ఆత్మమూలంగా వ్యాపించిన; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; ప్రీతుండై= సంతోషించినవాడై; స్వీకరించున్= స్వీకరిస్తాడు; ఆ+దశపేరు= ఆ మహోత్తమస్థితి పేరు; మునులు= మహర్షులు; ముక్తి+అని చెప్పుదురు+అని= ముక్తి అని చెప్పుతారని; చెప్పి= చెప్పినవాడై; ఆ విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; వెండియున్= ఇంకా (ఇట్లా అన్నాడు.)

**తాత్పర్యం:** కరణ, కర్మ, కర్త అనే కారకత్రయాన్ని ఆత్మగా కలిగిన జీవుడు తాను కర్త ననే భావాన్ని (తాను అనుభవిస్తున్నాననే భావనను) వదలిపెట్టి, వివిధాలైన విషయసుఖాల స్వరూపం కలిగిన హవిస్సులను ఉదాసీనమనే 'స్రుక్కు' లో వేసి హోమం చేయటంలోని 'నిష్ఠ' చేత ఆత్మస్వరూపమైన అగ్ని బాగా మండి, 'అవిద్య' అనే పొగలేనిదై ప్రకాశిస్తుంది. ఇది మోక్షం అందుకొనే విధం. అట్లా కాకుండా 'భోక్త' నేనే అని భావించి చేస్తే (లేదా తానే అన్నిటినీ అనుభవిస్తే) ఆ విషయానుభవమే బంధకారక మవుతుంది' అని బోధించి, 'విముక్తి భావానికి మూలమైన యోగయజ్ఞంలో నేను తలమునకలుగా ఉన్నాను. దానికి అన్నిటినీ వదిలిపెట్టటమే దక్షిణ, దానివలన సకలంలోనూ వ్యాపించిన పరమాత్ముడైన నారాయణుడు సంతోషించి జీవుడిని గ్రహించే ఆ మహోత్తమ స్థితినే మోక్ష మని (ముక్తి అని) మునులు పిలుస్తారు' అని చెప్పినవాడై ఆ బ్రాహ్మణుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ.** **'శాస్త యొక్కండ తచ్ఛాసనంబునన యేఁ। జరియింతు నొక్కండ గురుఁ డతండు**
**సెప్పిన యర్థంబు చిత్తంబులో నుంతు। శ్రోత యొక్కండ తద్జ్ఞాతబుద్ధి**
**నెగడుదు నొక్కండ వగవంగ విద్వేష్ట। వాని వ్రాల్చినదిక్క వ్రాలి యెదరుఁ**
**గడపుదు గడవంగఁ గారణమయ్యెడు। తెఱఁగు పెద్దలచేత నెఱిఁగినాఁడ**

**తే.** **వినుము దేవతలును మునులును బరమేష్ఠి। యొద్ద కరిగి 'మాకు నెద్ది హితమొ'**
**యనిన నా విధాత యక్షరోపాసన। మనియెఁ గాన దుర్గ మబల! కడతు. 53**

**ప్రతిపదార్థం:** శాస్త= అనుశాసకుడు; ఒక్కండు+అ= ఒక్కడే ; తద్+శాసనంబునన్+అ= అతడి శాసనంతోనే; ఏన్+చరియింతున్= నేను చరిస్తాను; ఒక్కండ గురుఁడు= గురుడు ఒక్కడే; అతండు+చెప్పిన+అర్థంబు= అతడు చేసిన ఉపదేశాన్ని; చిత్తంబులోన్+ఉంతున్= మనస్సులో ఉంచుకొంటాను; శ్రోత+ఒక్కండు+అ= శ్రోత ఒకడే; తద్+జ్ఞాతబుద్ధిన్= గురువు చెప్పిన దానిని తెలిసికొనే నైపుణ్యంగల బుద్ధితో; నెగడుదున్+ఒక్కండన్= ఏకైకంగా ప్రవర్తిస్తాను; విద్వేష్ట= శత్రువు; వగవంగన్= బాధింపగా; వాని+వ్రాల్చిన దిక్కు+అ= వాడు ఏదిక్కులో వాల్చితే ఆ దిక్కులోనే; వ్రాలి= వాలి; ఎదరున్= ఆపదను; కడపుదున్= దాటుతాను; పెద్దలచేతన్= పెద్దలవలన; కడవంగన్= తరించటానికి; కారణము+అయ్యెడు+తెఱఁగున్= మూలమైన మార్గాన్ని; ఎఱిగినాఁడన్= తెలిసికొన్నాను; వినుము= ఇంకా ఒక ప్రధాన విషయం ఉన్నది వినుము; దేవతలునున్= మునులునున్; పరమేష్ఠి+ఒద్దకున్= బ్రహ్మవద్దకు; అరిగి= వెళ్ళి; మాకున్; ఎద్ది?= ఏ మార్గము?; హితమో= శ్రేయస్సో; అనినన్= అనగా; ఆ విధాత= ఆ బ్రహ్మ; అక్షర+ఉపాసనము+అని= అక్షరతత్త్వాన్ని ఉపాసించటమని; అనియెన్= అన్నాడు; అబల!= ఓ వనితా!; దుర్గము-కాన= దాటటానికి వీలులేని అరణ్యాన్ని; కడతున్= దాటగలను.

**తాత్పర్యం:** అనుశాసకుడు ఒకడే. అతడి అనుశాసనంతోనే నేను చరిస్తాను. గురుడు ఒక్కడే. అతడు చేసిన ఉపదేశాన్ని మనస్సులో ఉంచుకొంటాను. శ్రోత ఒకడే, గురూపదేశాన్ని తెలిసికొన్న బుద్ధితో ప్రవర్తిస్తాను. శత్రువు ఏ వైపు వ్రాల్చితే ఆ వైపు వ్రాలి, ఓర్పుతో ఆ ఆపదను దాటుతాను. తరించే మార్గం ఏదో దానిని పెద్దలవలన తెలిసికొన్నాను. అంతేకాదు. మరొక విషయం ఉన్నది వినుము. ఒకప్పుడు దేవతలు మునులు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి, 'మాకు శ్రేయోమార్గం చెప్పండి' అని అడిగారు. వారికి ఆయన 'అక్షరోపాసన' మాత్రమే తగిన మార్గమని బోధించాడు. ఓ వనితా! నేను ఆ మార్గంలో వెళ్ళుతున్నాను కాబట్టి సంసారమనే దుర్గమారణ్యాన్ని తప్పకుండా దాటగలను.

**విశేషం :** 'దుర్గం' అంటే లోపలికి పోవటానికి, బయటికి రావటానికి కష్టమైన దని అర్థం. అది అరణ్యమే కానక్కరలేదు. తరువాతి వచనంలో ఈ అర్థం ఉన్నది.

**వ.** **ఇంక నెక్కడ గడచెద! మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాళంబును గామదస్యుదూషితంబును నగు దుర్గంబు గడచి యొక వనంబు ప్రవేశించితి 'ననిన విని 'యవ్వనిత యవ్వనం బెట్టి?' దని యడిగిన నమ్మహాద్విజుం డిట్లనియె. 54**

**ప్రతిపదార్థం:** ఇంకన్+ఎక్కడన్+కడచెదన్!= ఇంకా ఎక్కడ దాటటం! (ఇంకా ఏమి దాటాలి? అని); మున్ను+అ+కడచితిన్= ముందే దాటాను; క్రోధ= కోపమనే; తిమిరంబునున్= చీకటిని; లోభ= లోభమనే; వ్యాళంబునున్= సర్పాన్ని; కామ= కోరికలనే దస్యు= దొంగలచేత; దూషితంబును= భయంకరంగా ఉన్న; దుర్గంబు+కడచి= కోటను దాటి; ఒకవనంబు= ఒక అడవిని;

ప్రవేశించితిన్= చేరాను; అనినన్= అనగా; విని; ఆ+వనిత= ఆ స్త్రీ; ఆ+వనంబు= అ అడవి; ఎట్టిది+అనినన్= ఎట్లాంటిదని అడుగగా; ఆ+మహాద్విజుండు= ఆ గొప్ప బ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంకా నేను ఏం దాటాలి? ముందే అన్నిటిని అధిగమించాను. కోపమనే చీకటిని, లోభమనే మహా సర్పాన్ని తప్పించుకొని, కోరికలనే దొంగలతో నిండిన భయంకరమైన పాడువడిన కోటను దాటి, ఒక అడవిలోనికి ప్రవేశించాను' అని భర్త చెప్పగా ఆమె 'ఆ అడవి ఎట్లాంటి'దని అడిగింది. దానికి ఆ విప్రుడు ఇట్లా చెప్పాడు. క్రోధతిమిరము-క్రోధమనెడితిమిరము, లోభవ్యాళము-లోభమనే వ్యాళము, కామదస్యు-కామమనే దస్యు-రూపకాలంకారాలు

**ఉ. అంతకుఁ బిన్నలున్ వెదక నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ**
**త్యంతముఁ జేయ సౌఖ్య మెసలార నొనర్పఁగ నొం డొకంటి యం**
**దంతటి నేర్పు లేదు వెఱ పన్నది యేమియు నవ్వనంబు ని**
**శ్చింతతఁ జొచ్చియున్న నరుఁ జెందదు నిర్వృతి సెందు నుగ్మలీ! 55**

**ప్రతిపదార్థం:** ఉగ్మలీ!= ఓ వనితా!; వెదకన్= వెదకగా; అంతకున్= అంతకంటె; పిన్నలున్= చిన్నవి; అంతకున్= అంతకంటె; పెద్దలున్= పెద్దవి; లేవు= అక్కడ కనిపించవు; దుఃఖము+అత్యంతమున్+చేయన్= మిక్కిలి దుఃఖాన్ని కలిగించటానికి కాని; సౌఖ్యము+ఎసలారన్= ఒనర్పఁగన్= సౌఖ్యం మిక్కిలి అధికంగా కలిగించటానికి కాని; ఒండు+ఒకంటి+అందున్= ఏ ఒక్కదానిలోనూ; అంతటి నేర్పు లేదు= అంతటి నైపుణ్యం లేదు; ఆ+వనంబున్= ఆ అడవిని; నిశ్చింతతన్= ఏ చింతా లేకుండా; చొచ్చి ఉన్న= ప్రవేశించి ఉన్న; నరున్= మనిషిని; వెఱపు+అన్నది= భయమన్నది; ఏమియున్+చెందదు= కొంచెంకూడా ఆక్రమించదు; (అతడు); నిర్వృతిన్= విముక్తిని; చెందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** 'ఓ వనితా! ఆ అడవి చాలా చిత్రమైనది. అక్కడ చిన్నా పెద్దా అనే ఏ తారతమ్యమూ లేదు. మిక్కిలి దుఃఖం కలిగించేవి కాని, మిక్కిలి సుఖాన్ని కలిగించేవి కాని అక్కడ ఏ ఒక్క 'విషయ'మూ లేదు. ఏ చింతా లేకుండా అక్కడ ప్రవేశించిన మనిషికి 'భయం' కలుగనే కలుగదు. అట్లాంటి వాడు ముక్తినే పొందుతాడు.

**విశేషం :** సుఖదుఃఖకారులు 'విషయాలు'. అవి ఇంద్రియాలను చాలా నేర్పుగా లొంగదీసికొంటాయి. దానితో ఏర్పడేది 'చింత'. దానితో 'భయం'.ఇవేవీ అక్కడ లేవు. చిన్నా పెద్దా అంటే ద్వంద్వభావం, సుఖదుఃఖాలు అంటే కర్తృత్వభావన. ఈ రెండూ లేని మనిషి 'నిశ్చింత' గా ఉంటాడు. వాడు నిర్భయుడు. దానినే 'ధృతి' అంటారు. అందుచేత అట్లాంటి ధీరుడికి 'నిర్వృతి' సులభంగా ప్రాప్తిస్తుంది. అదే అక్షరతత్త్వం.

**తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమఫలము;। లందుఁ గొన్నిటి కేకవర్ణాంచితంబు**
**లవనిజములు కొన్నిటికి నవ్యక్తవర్ణ । కములు సౌరభ్యమాధుర్యసమధికములు. 56**

**ప్రతిపదార్థం:** కుసుమఫలములందున్= పూవులు, పండ్లలో; కొన్నిటికిన్= కొన్నిటికి; పంచవర్ణముల్= ఐదు రంగులు; కొన్నిటికిన్= కొన్నిటికి; ఏకవర్ణ+అంచితంబులు= ఒకే వర్ణంతో కూడినవి; అవనిజములు= చెట్లు; కొన్నిటికిన్= కొన్నిటికి; అవ్యక్తవర్ణకములు= రంగు ఏమిటో తెలియటంలేదు (కాని అవి); సౌరభ్య= సువాసనకలిగిన పూలు; మాధుర్య= తీపు కలిగిన పండ్లు; సమధికములు= అత్యధికంగా కలిగి ఉన్నాయి.

**తాత్పర్యం:** ఆ అడవిలో చిత్రవిచిత్రాలైన పూలు, పండ్లు కనిపిస్తున్నాయి. కొన్నిటికి ఐదురంగులు, మరికొన్ని ఒకే రంగుతో ఉన్నాయి. కొన్ని చెట్లు ఏ రంగులో ఉన్నాయో గుర్తించటానికి అవకాశం లేదు. కాని, వాటి పూలు సువాసన

కలిగినవి: పండ్లు అతి మధురమైనవి.

**విశేషం:** ఈ అడవి వర్ణన సాంకేతికమైనది. పంచవర్ణాలు - పంచేంద్రియవ్యాపారజనిత సుఖానుభవాలకు సంకేతం. ఒకేవర్ణం-సమత్వభావసాధనకు సంకేతం. అవ్యక్తవర్ణం-నిర్గుణత్వసంకేతం. వాటి కున్న సౌరభం. మాధుర్యం అవ్యక్త అక్షరోపాసనలో లభించే బ్రహ్మానందానికి నిదర్శనం.

**వ. అవ్విపినంబున. 57**

ఆ+విపినంబునన్

**తాత్పర్యం:** ఆ అడవిలో- తరువాతి పద్యంతో అన్వయం.

**క. వృక్షంబులకుం గలుగును। దీక్షాగుణములును నతిథితృప్తికృతియుఁ బ**
**ద్మాక్షీ! యతిథులు బ్రహ్మ స। దృక్షులు సౌఖ్యంబు నిట్టఁ దేలుదురు మునుల్. 58**

**ప్రతిపదార్థం:** పద్మాక్షీ= కనులలోచనా!; వృక్షంబులకున్= చెట్లకు; దీక్షాగుణములునున్= దీక్షాలక్షణాలు; కలుగును= ఉంటాయి; అతిథి తృప్తి కృతియున్= అతిథులకు తృప్తి కలిగించటమూ; అతిథులు= వచ్చే అతిథులు; బ్రహ్మసదృక్షులు= బ్రహ్మ సదృశులు; మునులు= ఋషులు; సౌఖ్యంబు నిట్టన్+తేలుదురు= సంతోషంతో తేలుతుంటారు.

**తాత్పర్యం:** అక్కడ చెట్లు కూడా దీక్షలో ఉంటాయి. అతిథులను సంతృప్తి పరుస్తుంటాయి. అక్కడికి వచ్చే అతిథులు సాక్షాత్తు బ్రహ్మస్వరూపులు. ఆ ఋషులు ఆ వనంలో బ్రహ్మానందంతో మునిగి ఉంటారు.

**ఆ. కెలఁకులకును మింటికిని మేర లివి యన। రాదు గాన యయ్యరణ్యభూమి**
**వెలుఁగు లొండ్లు సొరవు వినుము క్షేత్రజ్ఞుండు। రవి దదీయసేవ భవముఁ బాచు. 59**

**ప్రతిపదార్థం:** కెలఁకులకును= దిక్కులకు; మింటికిని= ఆకాశానికి; ఇవి; మేరలు= సీమలు (సరిహద్దులు); అనరాదు= చెప్పలేము; కానన్= కాబట్టి; ఆ+అరణ్యభూమిన్= ఆ అడవిలో; వెలుఁగులు+ఒండ్లు= వేరే కాంతు లేవీ; చొరవు= దూరవు; వినుము= ఇంకా ఒక విచిత్రం వినుము; క్షేత్రజ్ఞుండు= యజమానుడు; రవి= సూర్యుడు; తదీయసేన= అతడి సేన; భవమున్+పాచున్= పుట్టుకను పోగొట్టుతుంది.

**తాత్పర్యం:** దిక్కులకు, ఆకాశానికి సరిహద్దులు చెప్పలేము కాబట్టి ఆ అడవిలో కూడా ఏ వేరే వెలుగులూ సోకవు. కాని, చిత్రం ఏమిటంటే - ఆ అడవికి యజమానుడు సూర్యుడు. అతడిని సేవిస్తే మరలా పుట్టుక అంటూ ఉండదు.

**విశేషం :** అది అనంతమైన సౌఖ్యసామ్రాజ్యం. అక్కడ మామూలు దీపపు కాంతులు కనిపించవు. క్షేత్ర యజమానుడు సూర్యుడు కాబట్టి అక్కడి కాంతులు ఎప్పుడూ క్షీణించవు.

**క. మృగనయన! బ్రహ్మసంభవ। మగు జలము వహించుచుండు నందుల నదులన్**
**నగములు విను దానఁ దప। స్విగుణం బవ్యయపదంబుఁ జెందం గాంచున్. 60**

**ప్రతిపదార్థం:** మృగనయన!= లేడి కన్నులవంటి కన్నులు కలదానా!; విను; అందులన్= ఆ అడవిలో; నదులన్= నదులలో; బ్రహ్మసంభవము+అగు= బ్రహ్మపదంనుండి పుట్టిన; జలము= నీరు; వహించుచున్+ఉండున్= పారుతూ ఉంటుంది; నగములు=కొండలు; దానన్= అందువలన; తపస్విగణంబు= ఋషుల సమూహం; అవ్యయపదంబున్= మోక్షస్థానాన్ని; చెందన్+ కాంచున్= పొందగలుగుతుంది.

**తాత్పర్యం:** ఆ అడవిలోని నదులలో బ్రహ్మసంభవమైన జలం ప్రవహిస్తుంది. ఆ అడవిలోని కొండలు పరమపవిత్రాలు. అక్కడ తపస్సు చేసి, ఋషులు ముక్తిపదాన్ని పొందగలుగుతారు.

**వ. అట్టి దవ్విపినంబు. 61**

**ప్రతిపదార్థం:** ఆ అడవి అట్లాంటిది.

**తాత్పర్యం:** రవి క్షేత్రజ్ఞుడై. బ్రహ్మపదస్థానంనుండి పుట్టిన జలాలు స్రవించే నదులు, కొండలు ఉన్న ఆ చోటు స్వర్గం కంటె చాలా గొప్పది.

**ఆ. మాననీయనియతి మహితతపోధన। వంతులైన యట్టివారు శాంతి**
**దాంతి నిస్పృహతలు దలకొన సుసమాహి। తాత్ములై వసింతు రందు సాధ్వి!' 62**

**ప్రతిపదార్థం:** సాధ్వి!= ఉత్తమురాలా!; అందున్= అక్కడ; మాననీయ= పూజనీయమైన గొప్ప; నియతిన్= నిష్ఠతో; మహిత= ప్రభావం కలిగిన; తపోధనవంతులు+ఐన+అట్టివారు= తపోధనం కల యోగులు; శాంతి= శాంతస్థితి; దాంతి= ఇంద్రియనిగ్రహాదులతో ఏర్పడ్డ ఓర్పు; నిస్పృహతలు= వైరాగ్యభావం; తలకొనన్= కూడగా; సు+సమాహిత+ఆత్ములు+ఐ= చక్కగా సుస్థితిని పొందిన ఆత్మ కలవారై; వసింతురు= ఉంటారు.

**తాత్పర్యం:** ఆ అడవిలో మహానిష్ఠాపరులై, ఉత్తమతపోధనం కలిగిన యోగులు నివసిస్తారు. వారికి శాంతమైన మనః స్థితి, బ్రహ్మచర్యాది వ్రతనిష్ఠవలన ఏర్పడ్డ ఓర్పు, వైరాగ్యభావం ఉండి సంయమితాత్ములై 'సుస్థితి'ని పొంది అక్కడ ఆనందంతో ఉంటారు.

**విశేషం:** అంటే అట్లాంటి స్థితిని చేరుకొనటం కష్టం (దుర్+గమ= చేరటానికి దుష్కరమైనదని) కాబట్టి 'అడవి'గా ఇక్కడ వర్ణించాడని భావం.

**వ. అని చెప్పి మఱియును. 63**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. 'వినుము మూర్కొనఁ జవిగొన దర్శనస్పర్శ। నము లాచరింప వినంగ నెలయ**
**నేమి సంకల్పము నెడఁ జేర్ప నిష్టార్థ। ములను ననిష్టార్థములను గోరు**
**టయును నొల్లక త్రోచుటయును స్వభావవక్ర। త్యము లవి గనుఁగొంచు నబల! వానఁ**
**బొరయ నెట్లన్న మేల్ దొరకొనుఁ గోరక। యును బోదు కీడు ద్రోచినను దీని**

**తే. నెఱిఁగి యేను స్వభావంబునెడఁ బయోజ । పత్రగతజలబిందువుభంగిఁ దాల్తు'**
**నని యెఱింగించి బ్రాహ్మణుఁ డతివతోడ । మఱియు నిట్టను శాత్రవమథనకల్య! 64**

**ప్రతిపదార్థం:** వినుము; మూర్కొనన్= వాసన చూడటానికి; చవిగొనన్= రుచి చూడటానికి; దర్శన స్పర్శనములు ఆచరింపన్= చూడటానికి; తాకటానికి; వినంగన్= వినటానికి; ఎలయన్= సిద్ధించేటట్లు; ఏమి సంకల్పంబున్= ఏ విధమైన సంకల్పాన్ని; ఎడన్= హృదయంలో; చేర్పన్= చేర్చగా; ఇష్ట+అర్థములనున్= నచ్చిన కోరికలను; అనిష్ట+అర్థములనున్= నచ్చనివాటిని; కోరుటయునున్= కోరుకొనటం; ఒల్లక త్రోచుటయునున్= వద్దని వదలిపెట్టటం; స్వభావకృత్యములు= సహజంగా జరిగే పనులు; అవి= వాటిని; కనుఁగొంచున్= పరిశీలిస్తూ; అబల!= ఓ వనితా!; వానన్= ఆ పనులలో; పొరయన్= ప్రవేశించను; ఎట్లు+అన్నన్= ఎట్లాగంటే; మేల్= మేలు; కోరకయును= కోరకుండానే; దొరకొనున్= లాభిస్తుంది; కీడు; త్రోచినను= త్రోసిపారవేసినా; పోదు= జరగకపోదు; దీనిన్+ఎఱిఁగి= దీనిని గుర్తించి; ఏను= నేను; స్వభావంబు+ఎడన్= స్వభావంలో; పయోజపత్ర= తామరాకు; గత= మీదనున్న; జలబిందువు భంగిన్= నీటిబొట్టువలె; తాల్తున్= ధరిస్తాను; అని; బ్రాహ్మణుఁడు= ఆ విప్రుడు; అతివతోడన్= ఆస్త్రీతో; ఎఱింగించి= చెప్పి; మఱియున్+ఇట్లనున్= మరి ఇంకా ఇట్లా చెప్పాడు; శాత్రవ= శత్రువులను; మథనకల్య!= బాధించటంలో నేర్పరి అయిన ఓ అర్జునా! (వినుము).

**తాత్పర్యం:** ఇంద్రియాలతో పనులు చేసేటప్పుడు - అంటే వాసన చూసేటప్పుడుకాని, రుచి ఎరిగేటప్పుడుకాని, చూచినప్పుడు కాని, తాకినప్పుడుకాని, విన్నప్పుడుకాని - హృదయంలో ఎట్లా సంకల్పిస్తే కోరిక సిద్ధించినా, సిద్ధించకపోయినా లభించిన వస్తువు నచ్చినా నచ్చకపోయినా, కోరుకొనటం, వద్దని వదలిపెట్టటం రెండూ ఉండవో అట్లా అత్యంత సహజంగా నిర్లిప్తంగా ఆ పనులు చేస్తూ నేను ఏ బంధాన్నీ పొందకుండా ఉంటాను. ఎందుకంటే జరగబోయే మేలు కోరకుండానే జరుగుతుంది. ఎంత వారించినా రాబోయే ఆపద ఆగదు. దీనిని గుర్తించి, తామరాకుమీద నీటి బొట్టువలె ఏ సంస్పర్శా లేకుండా నేను స్వభావరీత్యా 'నిర్మగ్నుడు' కావటానికి ప్రయత్నిస్తాను' అని చెప్పి ఆ విప్రుడు ఇంకా ఇట్లా చెప్పాడు. (ఓ అర్జునా! నీవు యుద్ధంలో లక్షలమంది శత్రువులను అవలీలగా చంపినవాడవు. ఈ సాధనకూడా మొదలుపెట్టుము అని అర్థం).

**విశేషం :** అలం: ఉపమ. శ్రీకృష్ణుడు 'విముక్తి' సాధించే సులభమార్గం చెప్తున్నాడు. బంధానికి కారణం 'సంకల్పమే'. దానివలననే ఇష్ట అనిష్ట భావనలు ఏర్పడుతాయి. ఈ బ్రాహ్మణుడు దానిని జయించటానికి (నిష్కామ' సంకల్పంతో పని ప్రారంభించటం మొదలుపెట్టాడు. దానితో ఏర్పడేది నేను 'కర్త'ను కానన్న వైరాగ్యభావన. దానితో కార్యసిద్ధి దైవం 'దైవం' మీద వదలి, తాను 'నిష్కర్ముడు' అవుతాడు. అదే మంచి చెడులు ఎట్లాగైనా జరుగుతాయన్న జ్ఞానం కలిగి ఉండటం, చివరకిది 'తామరాకుమీద నీటి బొట్లు. భగవద్గీతలో యోగి సమాజంలో ఉంటూ ఎట్లా బంధ విముక్తుడు అవుతాడంటే దేనిలోనూ అంటి - అంటకుండా ప్రవర్తించటంచేత.

'పద్మపత్ర మివాంభసా' అని గీతాకారుడి పోలిక, దీనినే స్వామి మరలా ఇక్కడ చెప్పాడు.

**వ. 'ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపు; మధ్వర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి 'యిది హింస గాదె?' యనిన నతండు. 65**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఎడన్= ఒకచోట; అధ్వర్యునకున్= యాజ్ఞికుడికి; యతికిన్= సన్యాసికి; కలిగిన= జరిగిన; సంవాదంబు= సంభాషణ; చెప్పెదన్= చెప్తుతాను; ఆకర్ణింపుము= వినుము; అధ్వర్యుండు= ఆ యజ్ఞంచేసే వ్యక్తి; పశువున్= యజ్ఞంలో బలి

ఇచ్చే పశువును; ప్రోక్షించుచుండన్= మంత్రజలం చల్లి పవిత్రం చేస్తుండగా; యతి= సన్న్యాసి; నిరీక్షించి= పొంచి చూచి; ఇది= ఇట్లా చేయటం; హింస+కాదె?= హింసకాదా?; అనినన్= అనగా; అతండు= ఆ యాజ్ఞికుడు.

**తాత్పర్యం:** ఒక చోట ఒక యాజ్ఞికుడికి, యతికి జరిగిన సంవాదం చెప్తుతాను వినుము. ఒక యాజ్ఞికుడు బలిపశువును మంత్రజలం ప్రోక్షించి బలికి సిద్ధం చేస్తుండగా యతి పొంచి ఉండి, అక్కడకు వచ్చి 'ఇట్లా చేయటం హింస కాదా' అని అడిగాడు. అప్పుడు ఆ యాజి (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ఛాగ మిది యరయంగ నాశంబు బొంద। దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁగాని**
**శ్రుతుల వాక్యముల్ నీ కెక్క సూనృతంబు। లగున యేని నీ విట్లంట యనుచితంబు.' 66**

**ప్రతిపదార్థం:** ఛాగము+ఇది= ఈ మేక; అరయంగన్= బాగా తెలిసికొంటే నాశంబున్+పొందదు= చావదు; ఊర్ధ్వలోక సుఖంబులన్= స్వర్గాద్యుత్తమ లోకాలను; ఒందున్+కాని= పొందుతుంది తప్ప; శ్రుతులవాక్యముల్= వేదవాక్యాలు; నీకున్+ఎక్కన్= నీ తలపులో (భావనలో); సూనృతంబులు+అగును+అ+ఏని= సత్యాలు అయితే; నీవు+ఇట్లు+అంట= నీవు ఇట్లా అనటం; అనుచితంబు= సముచితం కాదు.

**తాత్పర్యం:** 'అయ్యా! వేదవాక్యాలలో మీకు నమ్మకం ఉంటే ఇట్లా ఆనటం సముచితం కాదు. ఈ మేక చావదు. ఊర్ధ్వగతి పొందుతుంది.'

**వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= ఇంకా; ఆ+పశువున్= ఆ మేకను; ఉద్దేశించి= దృష్టిలో పెట్టుకొని.

**తాత్పర్యం:** అని ఇంకా ఆ బలిపశువును దృష్టిలో ఉంచుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'భూతములు నింద్రియంబులు। నాతతగుణ! యాత్మ యోనులందుఁ గలయఁ బిం**
**డేతరుఁ డగు జీవుఁడు సౌ। ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్.' 68**

**ప్రతిపదార్థం:** అతతగుణ!= ఉత్తమ గుణాలు కలిగిన ఓ యతీశ్వరుడా!; భూతములున్= పంచభూతాలూ; ఇంద్రియంబులున్= ఇంద్రియ పంచకమూ; ఆత్మయోనులందున్= తమ తమ జీవులు ప్రవేశించే దేహాలలో; కలయన్= ప్రవేశించగా; పిండ+ఇతరుఁడు+ అగు= జీవుఁడు= పిండరూపం పొందనిజీవుడు; అధ్వర+అతిశయమునన్= యజ్ఞశక్తివలన; సౌఖ్య+అతిశయమున్+పొందున్= మిక్కిలి గొప్పదైన స్వర్గసౌఖ్యాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** 'యతీశ్వరా! పంచభూతాలు, పంచేంద్రియాలు ఆయా జీవులు ప్రవేశించే యోనులలో చేరి, జన్మను పొందుతాయి. యజ్ఞంలో బలి అయ్యే జీవుడు పిండరూపం పొందడు. యజ్ఞప్రభావంవలన మిక్కిలి గొప్పదైన స్వర్గ సుఖాన్ని పొందుతాడు.'

**విశేషం :** మామూలుగా చనిపోతే పిండరూపం తప్పకపొందుతాడు. యజ్ఞంలో మరణిస్తే అట్లా కాదు. ఆ జీవుడు చేసిన పుణ్యఫలాన్ని అనుభవిస్తాడు. అందుకే జీవితం కర్మప్రధానంగా ఉండాలి. ఆ కర్మ యజ్ఞకర్మ కావాలని 'యాగ' మతం. ఇదీ బంధహేతువే అని,

'జ్ఞానయాగం' ఒకటే ఉత్తమసాధనమని 'జ్ఞానమతం'. అదే 'అక్షరోపాస్తి'గా ముందు ప్రస్తావించినది. ఈ రెండింటిని వ్యాసమహర్షి ఎట్లా సమన్వయించాడో ఈ అధ్వర్యు - యతి సంవాదంలో అర్థంచేసికొనవచ్చును.

**క. అని పలుకుటయును యతి యి । ట్లను 'ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బో యి**
**ప్పని నీ కెవ్విధము ప్రయో । జనంబు సిద్ధించుఁ? జెపుమ సమ్యక్ఫణితిన్.' 69**

**ప్రతిపదార్థం:** అని పలుకుటయును= అని 'యాజి' చెప్పగా; యతి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; ఛాగము= మేక;పుణ్య గతికిన్+అరిగెడున్+పో= పుణ్యలోకాలకు పోతుందే అనుకొందాం; ఈ+పనిన్= ఈ పశువిశసనం వలన; నీకున్+ఏ+విధము+ ప్రయోజనంబు= నీకు ఏమి లాభం; సిద్ధించున్?= ఒనగూడుతుంది?; సమ్యక్+ఫణితిన్= విశదంగా; చెపుము+అను= చెప్పుము.

**తాత్పర్యం:** అని యాజ్ఞికుడు చెప్పగా అపుడు యతి ఇట్లా అన్నాడు. 'నీ వన్నట్టు ఆ మేక స్వర్గానికి వెళ్ళుతుందనే అనుకొందాము. దానివలన నీకు ఒరిగే లాభం ఏమిటి? బాగా వివరించి చెప్పుము.'

**వ. అనుటయు నధ్వర్యుం డతని కిట్లనియె. 70**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అధర్వుండు= యాజి; అతనికిన్+ఇట్లు+అనియెన్= అతడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని యతి అనగా 'యాజి' అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం :** యజ్ఞఫలం ఏమిటి? అనేది ప్రశ్న. మేక స్వర్గానికి వెళ్ళితే 'యాజి'కి వచ్చిన లాభం ఏమిటన్నదీ ఆలోచించదగిన విషయమే. వేదప్రామాణ్యాన్ని బ్రాహ్మణుడు చెప్పుతున్నాడు.

**క. 'అగమము పశువిధిం దగ । యాగ మొనర్చినఁ ద్రివిష్టపానేక మహా**
**భోగానుభూతి భవ్య స । మాగమ మగు ననుట బొంకె? యాగమవేదీ! 71**

**ప్రతిపదార్థం:** ఆగమవేదీ!= ఓ యతీశ్వరా! నీవు వేదాలు తెలిసినవాడవు; ఆగమము= వేదం; పశువిధిన్= పశుబలి విధానంతో; తగన్= శాస్త్రోక్తంగా; యాగము+ఒనర్చినన్= యజ్ఞం చేస్తే; త్రివిష్టపం= స్వర్గం మొదలైన; అనేక= చాలా; మహాభోగ+అనుభూతి+భవ్య+ సమాగమము+అగున్+అనుట= గొప్ప సుఖాల అనుభవం కలుగుతుంది అనటం; బొంకె?= తప్పా?

**తాత్పర్యం:** 'యతీశ్వరా! నీకు వేదాలు బాగా తెలుసు కదా! వేదాల ప్రకారం బలిపశువిధానంతో శాస్త్రోక్తంగా యాగం చేస్తే స్వర్గాది దివ్యసౌఖ్యాలు సిద్ధిస్తాయి. ఇది తప్పంటావా?'

**చ. అనవుడు 'హింస పాప మని యాగమవాక్యములంద కాదె! యేఁ**
**గని యిటు లంటి' నన్న యతిఁ గన్గొని 'నీవు సమాధిఁ బ్రాణరో**
**ధనము మనోలయంబు సుకృతంబులుగా నొనరించి వెండి యో**
**గ నిరతిఁ బొందె; దత్తెఱఁగు గాదొకొ హింస? దలంచి చూడఁగన్.' 72**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని యాజి చెప్పగా; యతి; హింస పాపము+అని= హింస మహాపాపమని; ఆగమ వాక్యములందున్+అ కాదె!= వేదవాక్యాలలోనే కదా!; ఏన్+కని= నేను చూచి; ఇటులు+అంటిన్= ఇట్లా అన్నాను; అన్నన్= అనగా; యతిన్+కన్గొని=

యతిని చూచి; సమాధిన్= సమాధిలో; ప్రాణరోధనమున్= వాయువును బంధించటం; మనస్+లయంబున్= మనసును లోపలికి తోయటం; సుకృతంబులుగాన్= మంచి పనులుగా; ఒనరించి= చేసి; వెండి= ఆ తరువాత; యోగనిరతిన్= యోగంలో స్థిరపడటాన్ని; పొందెదు= పొందుతున్నావు; ఆ+తెఱఁగు= ఆ పద్ధతి; తలంచి చూడఁగన్= బాగా విమర్శించి చూస్తే; హింస+కాదొకొ?= హింస కాదా మరి?

**తాత్పర్యం:** అని యాజి చెప్పగా యతీశ్వరుడు 'ఆ వేదవాక్యాలలోనే హింస మహాపాపమని నేను చూచే ఇట్లా అన్నాను' అన్నాడు. అపుడు యాజి ఆ యతితో అన్నాడు: 'నీవు సమాధిలో వాయువును బంధించి, మనస్సును లోపలికి ముంచి వాటిని చాలా పుణ్యకార్యాలుగా చేసి, ఆ తరువాత యోగంలో స్థిరపడుతున్నావు. బాగా విమర్శించి చూస్తే ఇందులో మాత్రం హింస లేదా మరి?' అని ప్రశ్నించాడు.

**వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డిట్లనియె. 73**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని చెప్పగా; ఆ+అధ్వర్యునకున్= ఆ యాజితో; ఆ+యతిముఖ్యుండు= ఆ యతిశ్రేష్ఠుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికిన ఆ యాజికి ఆ యతీశ్వరు డిట్లా అన్నాడు.

**విశేషం :** యజ్ఞఫలం ఏమిటి? అనేది ప్రశ్న, మేక స్వర్గానికి వెళ్ళితే 'యాజి'కి వచ్చిన లాభం ఏమిటన్నదీ ఆలోచించదగిన విషయమే. వేదప్రామాణ్యాన్ని బ్రాహ్మణుడు చెప్పుతున్నాడు.

**చ. 'పరమతపంబు గాఢపరిపాకము నొందినఁ జిత్సుఖాత్మకా**
**క్షరమునఁ జిత్తభూతగుణజాలతనున్ క్షరమున్ వివేకితా**
**పరిణతిఁ; బాపి చూచి యనపాయసుఖస్థితి నూఁది పొల్లలం**
**బొరయక త్రోపు హింస యనుబుద్ధి విమూఢత గాక బోధమే? 74**

**ప్రతిపదార్థం:** పరమతపంబు= గొప్ప తపస్సు; గాఢ= మిక్కుటమైన; పరిపాకమున్+ఒందినన్= పరిపక్వతను పొందగా; చిత్+సుఖ+ఆత్మక+అక్షరమునన్= జ్ఞానస్వరూపమైన సుఖాన్ని ఆత్మ కలిగిన అక్షరతత్త్వాన్ని అవలంబించి; చిత్తభూత= మనసునుండి పుట్టిన; గుణజాలతనున్= ప్రకృతి గుణాలతో కూడిన శరీరం కలవాడిని; క్షరమున్= నశించే లక్షణం కలిగిన క్షరతత్త్వాన్ని; వివేకితాపరిణతిన్= వివేకపరిణతిచేత; పాపి= నశింపజేసి; చూచి= ఆ అనంతమైన అద్వైతస్థితిని దర్శించి; న+అపాయ= ఎడబాటులేని; సుఖస్థితిన్+ఊఁది= సుఖస్థితిని పొంది; పొల్లలన్= వ్యర్థమైన వాటిలో; పొరయక= ప్రవేశించకుడా; త్రోపు= నిషేధించటం; హింస+అను బుద్ధి= హింస అనేటటువంటి ఆలోచన; విమూఢత+కాక= తెలివిలేనితనం తప్ప; బోధమే?= అది జ్ఞానమా?

**తాత్పర్యం:** 'గాఢంగా చేసిన తపస్సు పండగా జ్ఞానానందస్వరూపం కలిగిన అక్షరోపాసనచేత చిత్తజాతమైన ప్రకృతి గుణాలతో కూడిన ఈ శరీరాన్ని ఆశ్రయించిన క్షరతత్త్వాన్ని వివేకసమగ్రతద్వారా నశింపజేసి, నిరంతరమైన అద్వైతానంద స్థితిని దర్శించి, ఆ సుఖాన్ని పొంది, వ్యర్థమైన ఐహికసుఖాలలోనికి మనస్సు జారకుండా నియంత్రించటం 'హింస' అనటం వట్టి అజ్ఞానం తప్ప మరొక్కటి కాదు.'

**చ. అనవుడు నాతఁ 'డార్యవచనామృత మానినవాఁడు కీడుమేల్**
**గనుఁగొనఁజాలు; నేను బశుకార్యమునప్పుడు మీ రనుగ్రహిం**

**చిన క్రియఁ జూడనేర్తుఁ జిదచిద్ద్వయమున్ విభజించి దాన హిం**
**సనము నొకింతయుం బొరయ జన్నము సేయుదు మేలు నొందుదున్.' 75**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని యతి ప్రశ్నించగా; ఆతఁడు= ఆ యాజి; ఆర్య+వచనామృతము= పెద్దల మాటలనే అమృతాన్ని; ఆనినవాఁడు= తాగినవాడు; కీడుమేల్= చెడు మంచి; కనుఁగొనన్+చాలున్= గుర్తించగలుగుతాడు; నేను; పశుకార్యము+అప్పుడు= పశుబలి ఇస్తున్న సమయంలో; మీరు+అనుగ్రహించిన+క్రియన్= మీరు ఇంతసేపు బోధించిన పద్ధతిలో; చిత్+అచిత్= జ్ఞానాజ్ఞానాలను; ద్వయమున్= రెండింటినీ; విభజించి= వేరుచేసి; చూడనేర్తున్= యజ్ఞక్రియను దర్శించగలుగుతాను; దానన్= అందుచేత; హింసనమున్= హింసాపాపాన్ని; ఒక+ఇంతయున్= కొంచెంకూడా; పొరయన్= పొందను; జన్నము+చేయుదున్= యాగం చేస్తాను; మేలున్+ఒందుదున్= ఉత్తమగతిని పొందుతాను.

**తాత్పర్యం:** అని యతి ప్రశ్నించగా ఆ యాజి అన్నాడు: 'స్వామీ! పెద్దలమాటలు అనే అమృతాన్ని త్రాగినవాడు మంచిచెడులను గుర్తించగలుగుతాడు. నేను పశుసంప్రోక్షణచేసి బలి ఇచ్చే సమయంలోకూడా జ్ఞానాజ్ఞానాలను వేరుచేసి, మీరు ఇంతసేపూ ఏ అక్షర, క్షరతత్త్వాన్ని ఉపదేశించారో ఆ తత్త్వాన్ని దర్శించగలుగుతున్నాను. అందువలన నాకు ఏ హింస చేసిన పాపమూ అంటటంలేదు. నేను యజ్ఞం చేస్తాను; ఉత్తమగతిని పొందుతాను.' (ఇందులో దోషం ఏమిటి? ఇది జ్ఞానం ఎందుకు కాదు? అని యాజ్ఞికుడి మీమాంస). వచనామృతము-వచన మనెడి అమృతము - రూపకాలంకారం.

**క. అనుటయు నతనికి యతి యి । ట్లనుఁ 'బశుయజ్ఞమున కంటె ననఘ! తపోయ**
**జ్ఞనిరూఢి మేలు గావున । వినిపింపఁ దలంచి యంటి వేయును నేలా?' 76**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని యాజ్ఞికుడు చెప్పగా; అతనికిన్= అతడితో; యతి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అనఘ!= ఓ పుణ్యాత్మా!; పశుయజ్ఞమునకంటెన్= పశుయజ్ఞంకంటె; తపస్+యజ్ఞ నిరూఢి= తపోయజ్ఞంలో నిరతుడై ఉండటం; మేలు+కావునన్= మేలు కాబట్టి; వినిపింపన్+తలంచి= నీకు చెప్పుదామని భావించి; అంటిన్= ఆ విధంగా చెప్పాను; వేయునున్+ఏలా?= ఇంక ఎక్కువగా చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** అని యాజ్ఞికుడు చెప్పగా యతి ఇట్లా అన్నాడు'పుణ్యాత్మా! పశుయజ్ఞంకంటె తపోయజ్ఞం మేలుగా భావించినందువలన నీతో అట్లా చెప్పాను. ఇక దీనిని గురించి అధికంగా చెప్పటం ఎందుకు?'

**వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొడంబడియె' నని చెప్పి యాభూసురపర్యుం డా భామినితో 'నీ యర్థంబున కొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. సహస్రబాహుండగు నర్జునుండు దుర్జయప్రతాపంబున నఖిల ద్వీపంబులు నేలి వ్రాలి తనకు నెదురు లేకున్న విజృంభించి పరశురాముం డొడరి యతనికి నత్యంతం బప్రియంబాచరించిన నతండు బహుశాఖోపశాఖాశోభితంబయిన పాదపంబు నుఱుముగా నఱకి పడవైచిన చందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసె; నంత నిలువక తత్క్షణంబు రాజులు గూడికొని తదీయ తనయులుం దారు నా రాముని యసన్నిధి నతని జనకుం డగు జమదగ్నిం జంపినం బెంపారు కోపంబున నాటోపం బెసంగ నా జామదగ్న్యుండు రాజుల నెల్లం దరమిడి యిరువదియొక్కమాఱు పరశుధారపాలుచేసిన నతనికిఁ బితృదేవతలు సన్నిధి సేసి. 77**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని యతీశ్వరుడు చెప్పగా; ఆ+మాటకున్= ఆ మాటకు; ఆ+అధ్వర్యుండు= ఆ యాజ్ఞికుడు; ఒడంబడియెన్+అని= అంగీకరించాడని; చెప్పి; ఆ భూసురవర్యుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; ఆ భామినితోన్= ఆ స్త్రీతో; ఈ అర్థంబునకున్= ఈ విషయాన్ని వివరించేటటువంటి; ఒక్క+ఇతిహాసంబు+కలదు= ఒక కథ ఉంది; ఆకర్ణింపుము= వినుము; సహస్ర బాహుండు+అగు+అర్జునుండు= వేయి బాహువులుగల కార్తవీర్యార్జునుడు; దుర్జయ ప్రతాపంబునన్= జయించటానికి వీలులేని పరాక్రమంతో; అఖిల ద్వీపంబులున్+ఏలి= అన్ని ద్వీపాలూ పరిపాలించి; వ్రాలి= అతిశయించినవాడై; తనకున్+ ఎదురు లేకున్నన్= తనకు ఎక్కడా ఎదురులేకపోతే; విజృంభించి= పరాక్రమించి; పరశురామున్+తొడరి= పరశురాముడిని ఎదిరించి; అతనికిన్= అతడికి; అత్యంతంబు= మిక్కిలి; అప్రియంబు= కీడు; ఆచరించినన్= చేయగా; అతండు= ఆ పరశురాముడు; బహుశాఖా+ ఉపశాఖాశోభితంబు+అయిన= చాలా కొమ్మలతో రెమ్మలతో బాగా శోభిస్తున్న; పాదపంబున్= చెట్టును; నుఱుముగాన్= నుగ్గుగా; నఱికి పడవైచిన చందంబునన్= నరికివేసిన రీతిగా; పరశుఖండిత= పరశువు (గొడ్డలి) చేత నరకబడిన; సర్వాంగునిన్+ చేసెన్= అన్ని అంగాలు కలవాడివిగా చేశాడు; అంతన్+నిలువక= దానితో ఆగక; తద్+పక్షంబు రాజులు= ఆ కార్తవీర్యుడి పక్షాన చేరిన రాజులు; కూడికొని= ఒక్కటై; తదీయ తనయులున్= ఆ కార్యవీర్యుడి కుమారులు; తారున్= తామూ కలిసి; ఆ రాముని= ఆ పరశురాముడిని; అసన్నిధిన్= లేని సమయంలో; అతని జనకుండు+అగు= అతడి తండ్రి అయిన; జమదగ్నిన్= జమదగ్నిని; చంపినన్= చంపివేయగా; ఆ జామదగ్న్యుండు= ఆ పరశురాముడు; పెంపారు కోపంబునన్= అతిశయించిన కోపంతో; ఆటోపంబు+ఎసంగన్= విజృంభించిన; రాజులన్+ఏల్లన్= రాజుల నందరినీ; తరమిడి= వరుసపెట్టి; ఇరువది+ఒక్కమాఱు= ఇరవై ఒకసార్లు; పరశుధారపాలు+చేసిన= గొడ్డలి అంచుకు బలిచేసిన; అతనికిన్= అతడికి; పితృదేవతలు; సన్నిధి+చేసి= కనిపించి.

**తాత్పర్యం:** అని యతీశ్వరుడు చెప్పగా ఆ మాటకు ఆ యాజ్ఞికుడు అంగీకరించా'డని చెప్పి, ఆ బ్రాహ్మణుడు ఆ వనితతో 'ఈ విషయాన్ని వివరించే కథ ఒకటున్నది చెప్పుతాను; వినుము. వేయి చేతులున్న కార్తవీర్యార్జునుడు జయించటానికి వీలులేని పరాక్రమంతో అన్ని ద్వీపాలూ పాలించి, అతిశయించినవాడై తనకు ఎక్కడా ఎదురులేకపోగా విజృంభించినవాడై పరశురాముడిని ఎదిరించి, అతడికి చాలా కీడు చేశాడు. దానితో ఆ పరశురాముడు చాలా కొమ్మలతో రెమ్మలతో కూడుకొన్న నిండైన చెట్టును నుగ్గునుగ్గుగా నరికివేసినట్లు గొడ్డలితో ఆ కార్తవీర్యుడి అంగాంగాలూ ఖండించి చంపాడు. దానితో రెచ్చిపోయిన అతడి పక్షంలోని రాజులు, అతడి కుమారులు కలిసి పరశురాముడు దగ్గరలేని సమయంలో అతడి తండ్రి అయిన జమదగ్ని మహామునిని చంపివేశారు. అతిశయించిన కోపంతో మిక్కిలి విజృంభించినవాడై ఆ పరశురాముడు రాజుల నందరినీ వరుసపెట్టి ఇరవై ఒక్కసార్లు తన గొడ్డలి అంచుకు గురిచేశాడు. చివరికి అతడికి పితృదేవతలు ప్రత్యక్షమయ్యారు.

**విశేషం :** కార్తవీర్యుడు త్రిశూలంతో పరశురాముడిని కొట్టగా అతడు క్రిందపడిపోయాడు అని ఒక కథ ఉన్నది. దానినే ఈ వచనంలో అత్యంతమైన అప్రియంగా చెప్పుతున్నారు. బహుశాఖోపశాఖాశోభితంబైన పాదపంబు నుఱుముగా నఱికి పడవైచిన చందంబున- అలంకారం ఉపమ.

**ఆ. పరశురామ! నీవు బ్రాహ్మణుండవు నరే। శ్వరులఁ జంపనేల? వలవ దుడుగు**
**మయ్య!' యనుడు నాతఁ 'డట్లనకుం డుఁ డీ। రేను రాజ పశు విధానమునను.' 78**

**ప్రతిపదార్థం:** పరశురామ!= ఓ పరశురామా!; నీవు; బ్రాహ్మణుండవు= బ్రాహ్మణుడవు; నర+ఈశ్వరులన్= రాజులను; చంపన్+ఏల?= చంపటం ఎందుకు?; వలవదు= కూడదు; ఉడుగుము+అయ్య!= ఆపివేయవయ్యా!; అనుడున్; అతఁడు= ఆ పరశురాముడు;ఈరు= మీరు; అట్లు+అనకుండుఁడు= అట్లా అనవద్దండి; ఏను= నేను; రాజ పశు విధానముననున్= రాజు లనే పశువులను యజ్ఞం చేయటంలో

**తాత్పర్యం:** పరశురామా! నీవు బ్రాహ్మణుడవు. రాజులను చంపటం ఎందుకు? ఈ పని తప్పు, మానివేయవయ్యా! అని వారు చెప్పగా పరశురాముడు 'మీరు అట్లా అనవద్దు. నేను ఈ రాజపశువులను యజ్ఞం చేసి తీరుతాను. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సారనియతిఁ బాటించి మ । హారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా**
**వీరాధ్వరంబు సేసెద । వారింపక యరుగుఁ' డనిన వా రాతనితోన్. 79**

**ప్రతిపదార్థం:** సారనియతిన్= గొప్ప నియమాన్ని; పాటించి= అవలంబించి; మహారోష+అగ్ని పరితృప్తము+అగు+అట్టులుగాన్= గొప్ప రోషమనే అగ్నిచేత బాగా కాలిపోయేటట్లు; వీర+అధ్వరంబు+చేసెదన్= వీరోచితమైన యజ్ఞం చేస్తాను; వారింపక= నన్ను వారించకుండా; అరుగుఁడు+అనినన్= వెళ్ళిపొండి; అనగా; వారు; అతనితోన్= ఆ పరశురాముడితో,

**తాత్పర్యం:** గొప్ప నియమాన్ని పాటించి గొప్ప రోషమనే అగ్నిచేత ఆ రాజులను హోమంచేసి వీరోచితమైన యజ్ఞం చేస్తాను. నన్ను అడ్డుకోకుండా వెళ్ళిపొండి' అని పరశురాము డంటే అప్పుడు ఆ పితృదేవతలు. (తరువాతి పద్యంతో అన్వయం.-) రోషాగ్ని-రోషమనెడి అగ్ని-రూపకాలంకారం.

**క. 'యజ్ఞంబులలోనఁ దపో । యజ్ఞం బుత్తమము; దాని నాదరణమునఁ**
**బ్రాజ్ఞోత్తమ! చేయుము స । ర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పుఁ జుమీ!' 80**

**ప్రతిపదార్థం:** ప్రాజ్ఞ+ఉత్తమ!= జ్ఞానులలో శ్రేష్ఠుడా!; యజ్ఞంబులలోనన్= యజ్ఞాలన్నింటిలోనూ; తపస్+యజ్ఞంబు= తపస్సు అనే యజ్ఞం; ఉత్తమము= శ్రేష్ఠమైనది; దానిన్= ఆ తపస్సును; ఆదరణమునన్= ఆదరంతో; చేయుము; సర్వజ్ఞుఁడు= ఈశ్వరుడు; ప్రీతుఁడు+అగున్= సంతోషిస్తాడు; శాంతరసము+ఒప్పున్+చుమీ!= నీవు శాంతస్థితిని పొందుతావు సుమా!

**తాత్పర్యం:** 'యజ్ఞాలలో కెల్లా తపస్సు చాలా శ్రేష్ఠమైనది. ఆ తపస్సును ఆదరంతో నిర్వహించుము. ఈశ్వరుడు నిన్ను కరుణిస్తాడు. నీకూ ప్రశాంతి లభిస్తుంది.'

**వ. అని చెప్పి మఱియు నిట్లనిరి; 'తొల్లి యలర్కుం డను రాజు మనస్స్పృష్టంబు లగు నింద్రియంబులు గలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం జూచిన నవి నయ్యవనిపతితో నయ్యప్రియంబులం దారు సెడ మనియును రోషావేశంబునం బ్రయోగించిన నతండ చెడు ననియునుం బలికి 'యోపుదేని నీ తపోమయంబు లైన యస్త్రంబులు సంధింపు' మనిననతండు క్రోధంబుదక్కి యోగంబున శాంతి నొంది వానిం దద్రూపతపఃఫలా స్త్రసాధితంబులం జేసె; నీవునుం దపంబున నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుగాఁ గొనకుము.' 81**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని బోధించి; మఱియున్+ఇట్లు+అనిరి= ఇంకా ఇట్లా చెప్పారు; తొల్లి= మునుపు; అలర్కుండు+అను= రాజు= అలర్కు డనే పేరుగల రాజు; మనస్+స్పృష్టంబులు+అగు= మనస్సుచేత అపవిత్రంచేయబడిన; ఇంద్రియంబులు+కలిగి= ఇంద్రియాలు కలిగినవాడై; దివ్య+అస్త్రంబులు= గొప్ప ఆయుధాలు; ప్రయోగింపన్+చూచినన్= ప్రయోగించాలని ప్రయత్నిస్తే; అవి= ఆ ఇంద్రియాలు; ఆ+అస్త్రంబులన్= ఆ అస్త్రాలతో; తారు= తాము; చెడము+అనియునున్= నశించమనీ;

రోష+అవేశంబునన్= రోషంతోడ; ప్రయోగించినన్= ప్రయోగిస్తే; అతండు+అ= అతడే; చెడున్+అనియున్= నశిస్తాడని; పలికి= చెప్పి; ఓపుదు(వు)+ఏని= సమర్థుడవైతే; నీ తపోమయంబులు+ఐన= నీవు తపస్సు చేసి సాధించిన; అస్త్రంబులు= అస్త్రాలను; సంధింపుము+అనినన్= అనుసంధించుమని అడుగగా; అతండు= ఆ అలర్కుడు; క్రోధంబు+తక్కి= కోపం విడిచిపెట్టి; యోగంబునన్= యోగంతో; శాంతిన్+ఒంది= ప్రశాంతిని పొంది; వానిన్= ఆ ఇంద్రియాలను; తద్+రూప= ఆయా ఇంద్రియాలకు తగిన; తపస్+ఫల+అస్త్ర= తపఃఫలరూపం కలిగిన అస్త్రాలచేత; సాధితంబులన్+చేసెన్= సాధింపబడ్డవిగా చేశాడు; నీవునున్= నీవుకూడా; తపంబునన్= తపస్సుతో; అంతస్+శత్రు జయ= లోపలి శత్రువులను జయించటంవలన పుట్టే సౌఖ్యంబు+ అనుభవింపుము= ఆత్మసంతోషాన్ని పొందు; బాహ్య శత్రుజయంబున్= బయటి శత్రువును జయించటం; జయంబుగాన్+ కొనకుము= జయంగా అనుకొనవద్దు.

**తాత్పర్యం:** అని బోధించి ఇంకా ఇట్లా చెప్పాడు 'మునుపు అలర్కుడు అనే రాజు మనస్సుచేత అపవిత్రం చేయబడిన ఇంద్రియాలు కలవాడై, వాటిని జయించటంకొరకు తన దగ్గరున్న గొప్ప గొప్ప ఆయుధాలు ప్రయోగించాడు. అప్పుడు ఆ ఇంద్రియాలు తాము ఆ ఆయుధాలచేత చావము అని, రోషంతో ప్రయోగిస్తే అతడే చస్తాడని చెప్పి, 'సమర్థుడవైతే తపస్సుచేసి సాధించిన అస్త్రాలు ఉంటే ప్రయోగించుము' అని ఉపదేశించాము' అని ఉపదేశించాయి. అప్పుడు ఆ అలర్కుడు కోపం విడిచిపెట్టి, యోగాభ్యాసంతో ప్రశాంతిని పొంది, ఆ ఇంద్రియాలకు అనుగుణమైన తపోమయదివ్యాస్త్రాలను ప్రయోగించి వాటిని అదుపులోనికి తెచ్చుకొన్నాడు. అట్లాగే నీవు కూడా తపస్సుతో లోపలిశత్రువులను జయించి ఆత్మసౌఖ్యం అనుభవించుము. బయటి శత్రువులను జయించటం విజయమని అనుకోవద్దు' అని చెప్పాడు.

**క.** **అని నిష్ఠించి పలుక న। వ్వినుతచరిత్రుండు శాంతివిభవంబున మా**
**నిన మనసుతోడ ముని మా। ననపాత్రం బైన తపమునన మే లొందెన్.'** **82**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; నిష్ఠించి పలుకన్= నిర్ణయించి పలుకగా; ఆ+వినుత చరిత్రుండు= ఆ పుణ్యచరిత్రుడు; శాంతి విభవంబునన్= ప్రశాంతి వైభవంతో; ఊనిన= నిలిచిన; మనసుతోడన్= మనస్సుతో; ముని మానన పాత్రుంబు+ఐన= మునుల గౌరవానికి పాత్రమైన; తపమునన్+అ= తపస్సుతోనే; మేలు+ఒందెన్= ఉత్తమగతిని పొందాడు.

**తాత్పర్యం:** అని ఈ విధంగా నిర్ణయించి పలుకగా ఆ పుణ్యమూర్తి ప్రశాంతిని పొందాలన్న కోరికతో మునుల ప్రశంసకు పాత్రమైన తపస్సుచేతనే ఉత్తమగతిని పొందాడు.'

**సీ.** **అని చెప్పి బ్రాహ్మణుం డయ్యింతి కిట్లనుఁ। 'దొమ్మిది గుణములు కొమ్మ! కలవు**
**స్తంభాభిమానహర్షంబులు సాత్త్విక। ములు; క్రోధసంరంభములును శోక**
**మును రాజసంబులు మోహతంద్రాస్వప్న। ములు తామసము లిట్లు గలుగు రిపులఁ**
**దునుమ నే యస్త్రంబు లనువగు వాన న। య్యంతర శత్రుచయంబు నెల్లఁ**

**తే.** **దునిమి యేనింద్రియంబుల మనము నోర్చి। శాంతి నొంది శ్రేయస్సిద్ధి సాధనం బొ**
**నర్చునది ముఖ్యవైరి నిర్ణయముఁ జేయు। నంబరీషగీతలు విను మంబుజాక్షి!** **83**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పినవాడై; బ్రాహ్మణుఁడు= ఆ విప్రుడు; ఆ+ఇంతికిన్+ఇట్లు+అనున్= ఆ వనితతో ఇట్లా అన్నాడు; కొమ్మ!= ఓ వనితా!; తొమ్మిది గుణములు కలవు= తొమ్మిది గుణాలున్నాయి; స్తంభ= స్థిరత్వం; అభిమాన= ఆత్మగౌరవం; హర్షంబులు= సంతోషం; సాత్త్వికములు= సాత్త్వికాలు; క్రోధ= కోపం; సంరంభములునున్= ఉద్రేకం; శోకమునున్= దుఃఖం; రాజసంబులు= రాజసాలు; మోహ= భ్రాంతి; తంద్రా+స్వప్నములు= బడలిక; నిద్రపోవటం; తామసములు= తామస గుణాలు; ఇట్లు= ఈ విధంగా; కలుగు రిపులన్= ఉన్న శత్రువులను; తునుమన్= చంపటానికి; ఏ అస్త్రంబులు+అనువు+అగున్= ఏ అస్త్రాలు తగినవో; వానన్+అ= వాటితోనే; ఆ+అంతర శత్రు చయంబున్+ఎల్లన్= ఆ లోపలి శత్రుసమూహాన్ని అంతటినీ; తునిమి= చంపి; ఏను+ఇంద్రియంబులన్= పంచేంద్రియాలలో; మనమున్= మనస్సును; ఓర్చి= జయించి; శాంతిన్+ఒంది= శాంతిని పొంది; శ్రేయస్సిద్ధి సాధనంబు+ఒనర్చునది= శ్రేయస్సును సిద్ధించేటట్లు ప్రయత్నించాలి; అంబుజ+అక్షి!= పద్మలోచనా!; ముఖ్యవైరి నిర్ణయమున్+చేయు= ముఖ్యశత్రు నెవరో గుర్తించే; అంబరీషగీతలు= అంబరీష గీతలను; వినుము.

**తాత్పర్యం:** అని చెప్పినవాడై ఆ విప్రుడు తనభార్యతో ఇట్లా అన్నాడు. 'వనితా! తొమ్మిది గుణాలున్నాయి. వాటిలో స్థిరత్వం, ఆత్మగౌరవం, సంతోషం అనేవి సాత్త్వికాలు. కోపం, ఉద్రేకం, దుఃఖం అనేవి రాజసాలు. భ్రాంతి, బడలిక, నిద్ర అనేవి తామసాలు. ఇవే లోపల ఉన్న శత్రువులు. వీటిని జయించటానికి ఏ అస్త్రం తగినదో దానిని ప్రయోగించియే వీటిని జయించగలము. తరువాత ఐదు ఇంద్రియాలతోనూ మనస్సును జయించి, ప్రశాంతస్థితిని పొంది, మోక్షానికి ప్రయత్నంచేయాలి. ఈ మార్గంలో ముఖ్యశత్రువు ఎవరో నిర్ణయించటంలో పనికి వచ్చేటటువంటి అంబరీష గీతలున్నాయి. వాటిని గురించి చెప్పుతాను వినుము.

**వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరాతుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగు రాజ్యంబు పరిపాలించుచుండి యొక్కనాఁడు విద్వజ్జనంబులతో నిట్లనియె. 84**

**ప్రతిపదార్థం:** అంబరీషుండు+అను రాజు= అంబరీషుడనే పేరుగల రాజు; రాజనీతి పరత్వంబునన్= రాజనీతిలో నిష్ఠ కలిగి; పరమ ప్రభుత్వంబున్+ఒంది= గొప్ప చక్రవర్తియై; అరాతులన్+ఎల్లన్= శత్రువులందరినీ; విగత+అసులన్+చేసి= పోయిన ప్రాణాలు గలవారిగా చేసి (చంపి); పూజ్యంబు+అగు= మహనీయమైన; రాజ్యంబున్= రాజ్యాన్ని; పరిపాలించుచున్+ఉండి= ఏలుతూ ఉండి; ఒక్కనాఁడు= ఒకరోజు; విద్వత్+జనంబులతోన్= ఆస్థానంలోని పండితులతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అంబరీషుడనే రాజు గొప్పరాజనీతిపరుడు. మహాచక్రవర్తి, శత్రువులనందరినీ చంపి, రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండి. ఒకనాడు తన ఆస్థానంలోని పండితులతో ఇట్లా అన్నాడు.

**తే. 'అరుల నెల్ల జయించియు నది జయంబు। గాఁ గొనక యున్నవాఁడ; నగ్గలపుఁ బగ జ**
**యింప కున్కిఁ దద్విజయవిహీనుఁ దృష్ణ। జనిజరామృత్యువశగ వర్తనునిఁ జేయు. 85**

**ప్రతిపదార్థం:** అరులన్+ఎల్లన్= శత్రువులందరినీ; జయించియున్= జయించికూడా; అది= అట్లా జయించటం; జయంబుగాన్+కొనక+ఉన్నవాఁడన్= విజయంగా నేను గ్రహించకుండా ఉన్నాను (ఎందుకంటే); అగ్గలపున్= మిక్కిలి అయినటువంటి; పగన్+జయింపక+ఉన్కిన్= శత్రుత్వ భావనను జయించకపోవటంచేత; తద్+విజయ+విహీనున్= ఆ పగను జయించనివాడివి; తృష్ణ= దురాశ; జని= పుట్టుక; జరామృత్యువశగ వర్తనునిన్= ముసలితనం, చావులకు వశుడై మరల మరల తిరిగేవాడిగా; చేయున్= చేస్తుంది.

**తాత్పర్యం:** శత్రువులందరినీ జయించినా నాలోని పగ నశించలేదు. అందువలన నేను ఇంకా సంపూర్ణవిజయం పొందినవాడను కాను. పగను జయించనివాడిని దురాశ జన్మజరామృత్యువులకు వశుడై బాధపడేటట్లు చేస్తుంది.

**క. అంతటి లోభము గెలువక। శాంతి గలదె?' యని తదీయశక్తి నడఁచి ని**
**శ్చింతత్వ మొంది యా భూ। కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి వడసెన్. 86**

**ప్రతిపదార్థం:** అంతటి= అట్లాంటి; లోభమున్= లోభాన్ని (దురాశను); గెలువక= జయించకుండా; శాంతి+కలదె?+అని= శాంతి లభిస్తుందా? అని; తదీయశక్తిన్+అడఁచి= ఆ లోభగుణాన్ని ఏ శక్తితో అణచిపెట్టెలో అట్లాచేసి; నిశ్చింతత్వము+ఒంది= నిశ్చింతను పొంది; ఆ భూకాంతుఁడు= ఆ రాజు; సామ్రాజ్యమునన్= రాజ్యపాలనలో; సుఖస్థితి= సుఖస్థితిని; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** అట్లాంటి లోభాన్ని గెలువకుండా శాంతి ఎక్కడిది?' అని నిర్ణయించుకొన్నవాడై విరాగభావంతో ఆ దురాశను జయించి, నిశ్చింతుడై ఆ రాజు పాలనలో సుఖశాంతులను పొందాడు.

**విశేషం:** 'యతి'

జనకునకు విప్రరూపధరుండైన యమునితో నైన సంవాదము (సం. 14-32-1)

**వ. అని వెండియు నవ్విప్రుం డిట్లను. 'జనకచక్రవర్తికి నొక్క బ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము. జనకుండు తన కట్టెదుర బ్రాహ్మణుండు కొఱగామి సేసిన నతనితో 'నీవు నా విషయంబున వసియింప వలదు పొ' మ్మనిన నతండు. 87**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; వెండియున్= మరల; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; జనక చక్రవర్తికిన్= జనకుడికీ; ఒక్క బ్రాహ్మణునకున్= ఒక బ్రహ్మణుడికీ; కలిగిన= జరిగిన; సంవాదంబు= సంవాదం; చెప్పెదన్+ఆకర్ణింపుము= చెప్పుతాను వినుము; జనకుండు; తన కడు+ఎదురన్= తన ఎదుటే; బ్రాహ్మణుడు; కొఱగామి= వ్యర్థమైన పని; (తప్పు) చేసినన్= చేయగా; అతనితోన్= అతడితో; నీవు; నా; విషయంబునన్= దేశంలో; వసియింపన్ వలదు= ఉండవద్దు; పొమ్ము+అనినన్= పొమ్ము; అని అనగా; అతండు= ఆ బ్రాహ్మణుడు.

**తాత్పర్యం:** అని అంబరీషగీతలను చెప్పి, మరల ఆ బ్రాహ్మణుడు తన భార్యకు జనకమహారాజుకు విప్రుడి రూపంలో వచ్చిన బ్రాహ్మణుడికి నడుమ జరిగిన సంవాదాన్ని ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు. ఒకసారి జనకుడు తన కళ్ళ ఎదుటే ఒక బ్రాహ్మణుడు ఒక అనుచితమైన పనిని చేయగా అతడితో 'నీవు నా దేశంలో ఉండవద్దు. వెళ్ళిపొమ్ము' అని అన్నాడు. దానికి ఆ విప్రుడు ఇట్లా అన్నాడు.

**విశేషం :** విషయము= దేశము.

**క. 'నీ విషయ మెంత వ? ట్టది। యే విని పరవిషయమునకు నేఁగెదఁ దెలియం**
**గా వినిపింపు' మనుడు నా। భూవల్లభుఁ డూరకుండెఁ బుణ్యచరిత్రా! 88**

**ప్రతిపదార్థం:** పుణ్యచరిత్రా!= ఓ పుణ్యచరిత్ర కలిగిన వనితామణీ!; నీ విషయము= నీ దేశం; ఎంత+పట్టు?= ఎంతమేరకు?; అది+ఏన్+విని= దానిని చెప్పుము అది నేను తెలిసికొని; పరవిషయమునకున్= మరొక దేశానికి; ఏఁగెదన్= వెళ్లిపోతాను; తెలియంగాన్+వినిపింపుము+అనుడున్= బాగా స్పష్టంగా చెప్పుము అని అనగా; ఆ భూవల్లభుఁడు= ఆ రాజు; ఊరకుండెన్= మౌనంగా ఉండిపోయాడు.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యచరిత్రా! నీ దేశం ఏ మేరకుందో స్పష్టంగా నాకు చెప్పుము. దానిని తెలిసికొని నేను మరో దేశానికి వెళ్ళిపోతాను' అని ఆ బ్రాహ్మణుడు అన్నాడు. దానికి ఏమీ బదులు చెప్పక జనకుడు మౌనంగా ఉండిపోయాడు.

**ఆ. ఊరకుండి మూర్ఛ నూని యొక్కింత సే। పునకుఁ దేఱి యిట్టులనియె 'నాదు**
**తాత తండ్రి తరము ధరణి మద్వశ్యత। నుండ నాకు మమత యొలయ దందు. 89**

**ప్రతిపదార్థం:** ఊరక+ఉండి= అట్లా మౌనంగా ఉండి; మూర్ఛన్+ఊని= మూర్ఛపోయి; ఒక్కింతసేపునకున్+తేఱి= కొంతసేపటికి తేరుకొని; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు; నాదు= నా యొక్క; తాత తండ్రి తరము= నా తాతతండ్రుల తరాలనుండి;

ధరణి= భూమి; మత్= నా; వశ్యతన్+ఉండన్= వశంలో ఉండగా; అందున్= ఆ భూమి విషయంలో; నాకున్; మమత= నాది అనే భావన; ఒలయదు= పుట్టదు.

**తాత్పర్యం:** అట్లా మౌనంగా ఉండి, మూర్ఛలో మునిగి కొంతసేపటికి తేరుకొని ఇట్లా అన్నాడు. 'అయ్యా! ఈ రాజ్యం మా తండ్రి తాతల కాలంనుండీ నా వశంలో ఉన్నదే. అందువలన ఇది నాది అనే భావన నాకు ఎప్పుడూ కలుగలేదు. (అంటే ఇది నా దేశమని ఎట్లా చెప్పను? అని అర్థం).

**వ. మిథిల నెప్పుడు వసియించెద; నిప్పురంబును మదీయంబని యంగీకరింపం బడదు కావున నిది నా విషయంబున లేమింజేసి మున్ను నీతో నాడిన మాటలఁ బుట్టిన వగ పెంపున మూర్ఛ వచ్చె' ననిన విని యవ్విప్రుం డా భూవిభు నాననం బాలోకించి. 90**

**ప్రతిపదార్థం:** మిథిలన్= మిథిలలో; ఎప్పుడున్= ఎప్పుడూ; వసియించెదన్= నివసిస్తాను; ఈ+పురంబునున్= ఈ నగరం కూడా; మదీయంబు+అని= నా దని; అంగీకరింపంబడదు= ఒప్పుకొనటానికి వీలులేదు; కావునన్+ఇది= కాబట్టి ఇది; నా విషయంబు+అనన్+లేమిన్+చేసి= నా రాజ్యం అని చెప్పటానికి వీలులేని కారణంవలన; మున్ను= మునుపు; నీతోన్+ఆడిన= నీతో అన్న; మాటన్= మాటవలన; పుట్టిన= కలిగిన; వగ పెంపునన్= దుఃఖాతిశయంతో (బాధతో); మూర్ఛ వచ్చెన్= మూర్ఛ వచ్చింది; అనినన్ విని= అని జనకుడు చెప్పగా విని; ఆ విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఆ భూ విభు+అననంబు+అలోకించి= ఆ రాజు ముఖం చూచి.

**తాత్పర్యం:** నేను మిథిలలో ఎప్పుడూ ఉంటాను. కాని, ఇది కూడా నా నగరమని చెప్పటం కుదరదు. అందువలన ఇది నా రాజ్యం అని చెప్పటానికి ఏదీ లేకపోవటంవలన ముందు నీతో అట్లా ఎందుకన్నానా? అనే బాధ అతిశయించి మూర్ఛపోయాను' అని జనకుడు చెప్పగా విని, ఆ బ్రాహ్మణుడు ఆ రాజు ముఖం చూచి ఇట్లా అన్నాడు.

**క. 'నరనాయక! నీ యేలెడు । పురమున భూమిని మమత్వబుద్ధి గలుగ కి**
**ట్లిరవై యుండుటకుఁ గతం । బరయఁగ నెద్ది? వినిపింపు మది విశదముగన్.' 91**

**ప్రతిపదార్థం:** నరనాయక!= ఓ రాజా!; నీ ఏలెడు పురమునన్= నీవు పరిపాలించే నగరం విషయంలోనూ; భూమినిన్= రాజ్య విషయంలోరూ, మమత్వబుద్ధి+కలుగక= నాది - అనే బుద్ధి ఏర్పడక; ఇట్లు+ఉండుటకున్= ఇట్లా అనాసక్తంగా ఉండటానికి; కతంబు= కారణం; అరయఁగన్= బాగా ఆలోచిస్తే; ఎద్ది?= ఏమిటి?; అది= దానిని; విశదముగన్= వివరంగా; వినిపింపుము= వినిపించుము.

**తాత్పర్యం:** రాజా! నీవు ఉంటున్న నగర మిది; నీవు పాలిస్తున్న రాజ్య మిది. ఈ రెంటి విషయంలోనూ 'నాది' అనే భావన నీకు లేకుండా నీవు ఏదో పరుల సొత్తును వాడుకొంటున్న భావనతో అనాసక్తుడివలె ఎట్లా ఉండగలుగుతున్నావు? ఆ రహస్యం ఏమిటో నాకు వివరంగా చెప్పుము' అన్నాడు.

**వ. అనుటయు నజ్జనపతి యతని కిట్లనియె. 92**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+జనపతి= ఆ రాజు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ విప్రుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ఆ రాజు ఆ విప్రుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అరయ నివి యెట్లుఁ జెడియెడు నవియకాన । వినుము మద్ధన మిది యని వీనిలోన**
**నొకటి యందు నంగీకార మొలయ దెల్ల । విషయమును నా యదియ యను విధము గలదె?' 93**

**ప్రతిపదార్థం:** అరయన్= బాగా చూడగా; ఇవి+ఎట్లున్= ఇవి ఎట్లాగైనా; చెడియెడు+అవి+అ+కాన= చెడిపోయేవే కాబట్టి; వినుము; మత్+ధనము+ఇది+అని= ఇది నా సంపద అని; వీనిలోనన్= వీటిలో; ఒకటి+అందున్= ఒకదానిలోనూ; అంగీకారము= ఒప్పుదల; ఒలయదు= కలగలేదు; ఎల్ల విషయమును= అంతా; నా+అది+అ= నాదే; అను విధము= అనే పద్ధతి; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** 'అంతేకాదు, బాగా చూస్తే ఈ రాజ్యం, ధనం-ఇవన్నీ ఎప్పటికైనా నశిస్తాయి. కాబట్టి ఇది నా సంపద అని ఏ ఒక్క విషయంలోనూ నాకు అనిపించటం లేదు. అంతా నాదే అనే పద్ధతి - అంటూ ఒకటి ఉన్నదా?

**వ. ఎట్లంటేని ఘ్రాణాదులకు గోచరంబు లయినను గంధాదులు సెడంగలయవి గావున నాయవి యనకుండుటం జేసి భూమ్యాదిభూతంబులు నాచేత నిర్జితంబులై మద్వశగత్వంబు నొంది యుండు.' 94**

**ప్రతిపదార్థం:** ఎట్లు+అంటి(వి)+ఏని= ఎట్లాగంటే; ఘ్రాణ+ఆదులకున్= ముక్కు; మొదలైనవాటికి, గోచరంబులు+అయిననున్= తెలిసినా; గంధ+ఆదులు= వాసన మొదలైనవి; చెడన్+కలయవి+కావున= చెడిపోయే స్వభావం కలిగినవి కాబట్టి; నా+అవి= నావి; అనకుండుటన్+చేసి= అనకుండా ఉండటంవలన; భూమి+ఆది భూతంబులు= భూమి, ఆకాశం మొదలైన పంచభూతాలు; నాచేతన్; నిర్జితంబులు+ఐ= జయింపబడ్డవై; మత్+వశ గత్వంబున్= నేను చెప్పినట్టుగా ప్రవర్తించే ధర్మాన్ని; ఒంది+ఉండున్= కలిగి ఉంటున్నాయి.

**తాత్పర్యం:** ఎట్లాగంటే ముక్కు - మొదలైన ఇంద్రియాలకు తెలిసినా వాసన - మొదలైనవి నశించే స్వభావం కలిగినవి. కాబట్టి అవి నావి అని అనుకోకుండా ఉండటంవలన భూమ్యాదులైన పంచభూతాలూ నాచేత జయించబడి నేను చెప్పినట్లు ప్రవర్తిస్తున్నాయి.'

**చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు 'నిన్ను నారయ**
**న్మనమున వేడ్క పుట్టి నరనాయక! వచ్చితి నేను ధర్ముఁడం**
**బనుపడు నివ్వివేకపరిపాకము గాఢనిరూఢభావ మొం**
**ది నిలుచుఁ గాత! నీ దగు మదిన్ సతతంబును శాంతికారియై. 95**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; బ్రాహ్మణ ప్రవరుఁడు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; అల్లనన్= నెమ్మదిగా; నవ్వుచున్= నవ్వుతూ; నరనాయక!= రాజా!; నిన్నున్= నిన్ను; అరయన్= పరీక్షించటానికి; వేడ్క+పుట్టి= కోరిక కలిగి; వచ్చితిన్= వచ్చాను; నేను; ధర్ముఁడున్= యమధర్మరాజును; పనుపడు+ఈ+వివేక+పరిపాకము= క్రమంగా వికసించే లక్షణం కలిగిన ఈ వివేకపరిపక్వత; నీది+అగు మదిన్= నీ మనస్సులో; సతతంబునున్= శాశ్వతంగా; శాంతికారి+ఐ= శాంతిదాయకమైన; గాఢనిరూఢభావము+ఒంది+నిలుచుఁ గాత!= గాఢమై స్థిరమై నిలుచునుగాక!

**తాత్పర్యం:** అని అనగా బ్రాహ్మణశ్రేష్ఠుడు నెమ్మదిగా నవ్వుతూ 'నాయనా! నిన్ను పరీక్షించాలనే కోరిక కలిగి ఇట్లా వచ్చాను. నేను యమధర్మరాజును. క్రమంగా వికసించే లక్షణం కలిగిన ఈ వివేకం పక్వమై నీ హృదయంలో శాశ్వతంగా శాంతిప్రదాయకమై, గాఢమై, స్థిరమై నిలుచునుగాక!' అని అశీర్వదించాడు.

**వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె' నని చెప్పి యా ధరణీసురోత్తముం డయ్యుత్తమాగంగనతో 'హితోపదేశంబు సేసెద; నవహిత వయి యాకర్ణింపు' మని పలికి యిట్లను 'సంసారవర్తనంబు వదలవిడిచి యే నేకతంబ యున్నయెడ నీవు మ్రుచ్చిలి వచ్చి 'మదీయవైరాగ్యంబు మాన్పఁ దలంచి నాకు నధ్యాత్మబోధంబు గలుగంజేయు' మని యభ్యర్థించిన నీ తలం పెఱింగియు నెఱుంగని వాఁ డపోలె నధ్యాత్మ విద్యాబోధకప్రకారంబు లైన వాక్యంబులు సెప్పితి; నేనింక లోకంబులం గలసి చరించువాఁ డంగాను; నిక్కపు బ్రాహ్మణుండ నయితి; బ్రహ్మచారి నయితి; జీవన్ముక్తుండ నయితి; మిముబోంట్ల కొలఁదిగా నన్నుంజూచెద వది నా తెఱం గెఱుంగమి; యేను జగంబు సమస్తంబును వ్యాపించి యున్నవాఁడ; నా యున్న భంగికి నా బుద్ధి సకల పృథ్వీరాజ్యంబును నాకలోకాధి రాజ్యంబును సరిగావని తలంచు నా బుద్ధియ నాకు ధనంబు; దారువుల నగ్నియున్న చందంబున సర్వజంతువుల యందును నంతర్గతయై సిద్ధియున్నది; గురువాస గృహవాస వనవాస పరులగు బ్రాహ్మణులకెల్లను శ్రేయః ప్రాప్తికిం దెరువొక్కండ; యందఱును సరిత్తులు సాగరంబుఁ బ్రాపించిన తెఱంగునఁ బరతత్త్వంబు నొందుదురు; బుద్ధి నిమ్మార్గంబు నధిగమింప నగుఁగాని శరీరంబున వశంబుగాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు గర్మబంధనకరం బింత యెఱుంగుదుం గాన నా హృదయంబునం బరలోకభయంబులేదు నా చెప్పిన యధ్యాత్మ విద్యావిషయ వాక్యంబుల తాత్పర్యంబు చిత్తంబున నెలకొలిపి భావనానిరతవయి యుండుము; నన్న పోలెదు; వెఱవకు' మనినఁ బతికి సాష్టాంగదండ ప్రణామం బాచరించి కేలు మొగిచి. 96**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; ధర్మదేవత= యమధర్మరాజు; జనకునకున్= జనకమహారాజుకు; వరంబు+ఇచ్చి= వరం ఇచ్చి; అంతర్ధానంబు+చేసెన్= మాయమయ్యాడు; అని చెప్పి; ఆ ధరణీసుర+ఉత్తముండు= ఆ బ్రాహ్మణుడు; ఆ+ఉత్తమాంగనతోన్= ఆ ఉత్తమ స్త్రీతో; హితోపదేశంబు+చేసెదన్= నీకు హితోపదేశం చేస్తాను; అవహితవు+అయి= ఏకాగ్రచిత్తంతో; ఆకర్ణింపుము+అని పలికి= విను మని చెప్పి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; సంసారవర్తనంబు= సంసారంలో ప్రవర్తించటాన్ని; వదలవిడిచి= పూర్తిగా వదలివేసి; ఏను= నేను; ఏకతంబ= ఏకాంతంగా, ఉన్న+ఎడన్= ఉన్నపుడు; నీవు; మ్రుచ్చిలి వచ్చి= దొంగగా వచ్చి; మదీయ వైరాగ్యంబున్= నా వైరాగ్యాన్ని; మాన్పన్+తలంచి= పోగొట్టాలని ఆలోచించి; నాకున్= నాకు; అధ్యాత్మ బోధంబున్= వేదాంతాన్ని (ఆత్మజ్ఞానాన్ని); కలుగన్+చేయుము+అని= కలిగించండని; అభ్యర్థించినన్= కోరితే; నీ తలంపు+ఎఱింగియున్= నీ ఆలోచన తెలిసినవాడినే అయినా; ఎఱుంగనివాఁడు+అ+పోలెన్= తెలియనివాడివలె; అధ్యాత్మ విద్యా బోధక ప్రకారంబులు+ఐన, వాక్యంబులు= వేదాంతవిద్యను నేర్పించే పద్ధతికి సంబంధించిన వాక్యాలను చెప్పితిన్= చెప్పాను; నేను; ఇంకన్= ఇక; లోకంబులన్+కలసి= లోక వ్యవహారాలలో కలిసి; చరించువాఁడన్+కాను= ప్రవర్తించేవాడను కాను; నిక్కపు బ్రహ్మణుండను+అయితిన్= నిజమైన బ్రాహ్మణుడను అయ్యాను; బ్రహ్మచారిని+అయితిని= బ్రహ్మచారి నయ్యాను; జీవన్ముక్తుండను+ఐతిన్= బ్రతికి ఉండగానే బంధాలనుండి విముక్తిని పొందాను; మిముబోంట్ల కొలఁదిగాన్= మీవంటి వారితో సమానంగా; నన్నున్+చూచెదవు= నన్ను చూస్తావు; అది; నా తెఱంగు+ఎఱుంగమి= నా విషయం తెలియకపోవటం; ఏను= నేను; జగంబు సమస్తంబును= ప్రపంచాన్ని అంతటినీ; వ్యాపించి ఉన్నవాఁడన్= నిండి ఉన్నాను; నా+ఉన్న భంగికిన్= నేనున్న స్థితికి; నా బుద్ధిన్= నా ఆలోచనలో; సకల పృథ్వీ రాజ్యంబునున్= ఈ భూమండల మంతా పాలించినా; నాకలోక+ అధి రాజ్యంబునున్= స్వర్గలోకాధిపత్యం చేసినా; సరి+కావని= సమానం కావని; తలంచు= తలచేటటువంటి; నా బుద్ధి+అ= నా బుద్ధే; నాకున్+ధనంబు= నాకు సంపద; దారువులన్= కొయ్యలలో; అగ్ని+ఉన్న చందంబునన్= అగ్ని ఉన్న విధంగా;

సర్వజంతువులయందునున్= అన్ని జంతువులలోనూ; అంతర్గత+ఐ= లోన వ్యాపించినదై; సిద్ధి+ఉన్నది= యోగరూపమైన భగవదంశ ఉన్నది; గురువాస= గురువు వద్ద వసించటం (బ్రహ్మచర్యం); గృహవాస= ఇంటిలో ఇల్లాలితో వసించటం (గృహస్థాశ్రమం); వనవాస పరులు+అగు= వనంలో వసించటం (వానప్రస్థం)- వీటిలో నిష్ఠ కలిగిన; బ్రాహ్మణులకున్+ఎల్లనున్= బ్రాహ్మణులందరికీ; శ్రేయస్+ప్రాప్తికిన్= మోక్షప్రాప్తికి; తెరువు+ఒక్కండు+అ= దారి ఒకటే; సరిత్తులు= నదులు; సాగరంబున్+ప్రాప్తించిన తెఱంగునన్= సముద్రాన్ని చేరుకొన్నట్లుగా; అందఱునున్= అందరూ; పరతత్త్వంబున్+ఒందుదురు= పరతత్త్వాన్ని (బ్రహ్మపదాన్ని) పొందుతారు; బుద్ధిన్= బుద్ధితో (వివేకంతో); ఈ మార్గంబున్= ఈ మార్గాన్ని; అధిగమింపన్+అగున్+కాని= దాటవచ్చును కాని; శరీరంబునన్= శరీరంతో; వశంబు కాదు= సాధ్యం కాదు; కర్మంబులు= పనులు; ఆద్యంతవంతంబులు= తొలి, చివరలు కలిగినవి; శరీరంబు= ఈ శరీరం; కర్మ బంధనకరంబు= కర్మబంధాన్ని కలిగిస్తుంది; ఇంత+ఎఱుంగుదున్+కాన= ఇది తెలుసును కాబట్టి; నా హృదయంబునన్= నా హృదయంలో; పరలోక భయంబు లేదు= పరలోకవిషయంగా ఏ భయమూ లేదు; నా+చెప్పిన= నేను చెప్పిన; అధ్యాత్మవిద్యా విషయ= వేదాంతవిద్యకు సంబంధించిన; వాక్యంబుల తాత్పర్యంబు= వాక్యాల అర్థాన్ని; చిత్తంబునన్+నెలకొలిపి= మనస్సులో పదిలపరుచుకొని; భావనా నిరతవు+అయి= భావనలో నిష్ఠకలిగినదానవై; ఉండుము; నన్నున్+అ= నన్నే; పోలెదు= నీవు పోలెదు= పోలుతావు (నావలె అవుతావు); వెఱవకుము+అనినన్= భయపడకు అని చెప్పగా; పతికిన్= ఆమె భర్తకు; సాష్టాంగ దండప్రణామంబు+ ఆచరించి= సాష్టాంగ నమస్కారంచేసి; కేలు మొగిచి= చేతులు జోడించి.

**తాత్పర్యం:** అని ఈ ప్రకారంగా ధర్ముడు జనకమహారాజునకు వరమిచ్చి మాయ మయ్యాడు' అని చెప్పి, ఆ బ్రాహ్మణుడు తన భార్యతో 'నీకు హితోపదేశం చేస్తాను. అవధానంతో వినుము' అని ఇట్లా అన్నాడు. 'నేను సంసారబంధాలను పూర్తిగా వదలివేసి ఇక్కడ ఏకాంతంగా ఉండగా నీవు దొంగగా వచ్చి నా వైరాగ్యాన్ని పోగొట్టాలని ఆలోచించి, పైకి ఆత్మజ్ఞానాన్ని బోధించుమని అడిగావు. నీ ఆలోచన నాకు తెలిసినా ఏమీ తెలియనివాడివలెనే నీకు వేదాంతవిద్యను బోధించే మహావాక్యాలను బోధించాను. చూడుము. ఇక నేను ఈ లోకవ్యవహారాలలో తలదూర్చను. నిజమైన బ్రాహ్మణుడను అయ్యాను, బ్రహ్మచారినయ్యాను. జీవన్ముక్తుడనయ్యాను. నన్ను కూడా మీవంటివారితో సమానంగానే చూస్తున్నావు. నా సాధన విషయం నీకు తెలియదు. నేను ప్రపంచమంతటా నిండి ఉన్నాను. నేనున్న స్థితికి, ఈ భూమండలాన్నంతా పాలించినా; స్వర్గలోకాన్ని ఏలినా సమానం కావు- అని నా ఆలోచన. ఈ తలపుగల నాబుద్ధే నాకు పరమసంపద. అన్ని కొయ్యలలోనూ అగ్ని అణగి ఉన్న విధంగా అన్ని జంతువులలోనూ యోగపరమైన భగవదంశ నిండి ఉన్నది. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమాలలో నిష్ఠ కలిగిన బ్రాహ్మణులందరికీ మోక్షప్రాప్తి మార్గం ఒకటే. నదు లన్నీ సాగరంలో కలిసిపోయినట్లు అందరూ బ్రహ్మపదాన్నే చేరుతారు. ఈ మార్గాన్ని వివేకంతో అధిగమించగలము కాని శరీరంతో కుదరదు. కర్మలు మొదలుచివరలు కలిగినవి. ఈ శరీరం కర్మబంధాన్ని కలిగిస్తుంది. నాకు ఇదంతా తెలుసును కాబట్టి నా హృదయంలో మృత్యువు తరువాత ఏమిటి? అనే భయం లేదు. నేను ఇంతవరకు చెప్పిన ఆధ్యాత్మికవాక్యాల అర్థాన్ని మనసులో పాదుకొల్పి 'భావనా' నిష్ఠురాలివై ఉండుము. నావలె నీవు కూడా సిద్ధి పొందుతావు. భయపడకుము' అని భర్త చెప్పగా ఆమె భర్తకు సాష్టాంగదండ నమస్కారం చేసి, చేతులు జోడించుకొని ఇట్లా అన్నది.

**విశేషం :** దారువుల నగ్నియున్నచందంబున, -సరిత్తులు సాగరంబుఁబ్రాపించిన తెఱంగున-అలంకారములు ఉపమలు.

**సీ.** **'నీవు సెప్పిన మహనీయవాక్యనికాయ । మతిగహనం బకృతాత్ములకును**

**నర్థగ్రహణశక్తి యనఘ! కల్గునె కృతా । త్ములకైన? గ్రమ్మనఁ దెలియవచ్చి**

యుండ దయ్యెఱుకకు నుదయింపఁ బట్టైన। యట్టి యుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర!' నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. 'నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి। దపము శ్రుతము నిర్మథన మొనర్చి
జ్ఞానవహ్ని పుట్టు మానిని! యని చెప్ప। వనిత యిట్టులనియె వల్లభునకు. 97

**ప్రతిపదార్థం:** నీవు చెప్పిన= నీవు ఇంతవరకు చెప్పిన; మహనీయ= గొప్ప; వాక్య నికాయము= వాక్య సముదాయం; అకృత+ఆత్ములకును= సాధనా రహితులకు; అతిగహనంబు= మిక్కిలి కష్టమైనది; అనఘ!= పుణ్యాత్మా!; కృతాత్ములకున్+ఐనన్= కొంత సాధనచేసినవారికైనా; అర్థగ్రహణశక్తి= ఆ వాక్యాల అర్థాన్ని గ్రహించే శక్తి; కల్గునె= కలుగుతుందా?; గ్రమ్మనన్= శీఘ్రంగా; తెలియన్+వచ్చి ఉండదు= అర్థం కాకపోవచ్చుకూడా; ఆ+ఎఱుకకున్= ఆ జ్ఞానం; ఉదయింపన్= పుట్టటానికి; పట్టు+ఐన+అట్టి= ఆధారమైనటువంటి; ఉపాయంబున్= ఉపాయాన్ని; ఆదరమునన్= ఆదరంతో; కరుణాకర!= కరుణామూర్తీ!; నాకున్+ప్రసాదింపవే!= నాకు ప్రసాదించు స్వామీ!; నావుడున్= అని ప్రార్థించగా; అతఁడు= ఆ బ్రాహ్మణుడు; ఆ నాతితోడన్= ఆ స్త్రీతో; బ్రాహ్మణుండు; అరణి= అరణివంటివాడు; గురుఁడు= గురువైనవాడు; ఉత్తర+అరణి= ఉత్తరారణివంటివాడు; తపమున్+శ్రుతమున్= తపస్సును, వేదాన్ని; నిర్మథనము+ఒనర్పన్= కలిసి ఒరిపిడి పెట్టగా; మానిని!= ఓ స్త్రీ; జ్ఞానవహ్ని= జ్ఞానమనే అగ్ని; పుట్టున్= పుట్టుతుంది; అని చెప్పన్= అని చెప్పగా; వనిత= ఆ స్త్రీ; వల్లభునకున్= మగనితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** నీవు ఇంతవరకు చెప్పిన మహనీయవాక్యసముదాయాన్ని అర్థంచేసికొనటం సాధనలేని వారికి చాలా కష్టం. సాధన చేసినవారికైనా అర్థం త్వరగా గ్రహించటం అంత సులభం కాదు. ఒకసారి తెలిసినా, మరచిపోయే ప్రమాదం కూడా లేకపోలేదు. అట్లాంటి జ్ఞానం కలిగేటందుకు ఆధారమైన ఉపాయాన్ని నాకు బోధించి కృతార్థురాలిని చేయండి. మీరు కరుణగలవారు' అని భార్య ప్రార్థించగా ఆయన ఇట్లా అన్నాడు. 'బ్రాహ్మణుడు అరణి, గురువు ఉత్తరారణి. విప్రుడి తపస్సు, గురువుగారి వేదం - ఈ రెండు కొయ్యలనూ మథనం చేయగా పుట్టే జ్ఞానం ముక్తి సాధకం' అని అతడు చెప్పగా ఆమె భర్తతో ఇట్లా అన్నది.

**విశేషం:** యాగాగ్నిని రెండు అరణులచేత పుట్టిస్తారు. అరణులంటే ఒక విధమైన కర్రలు. వర్తులాకారమైన కర్రకు రంధ్రం పొడిచి గుండ్రని స్తంభాకారమైన మరి ఒక కర్రను అందులో దూర్చి కింద ఉన్న కర్ర (అధరారణి) ను కవ్వంవలె అతివేగంగా, బలంగా త్రిప్పినప్పుడు నిప్పు పుట్టుతుంది. ప్రత్తి అంటుకొన్నాక దానిని యాగంలో వాడుతారు. గురువు 'ఉత్తరారణి' అని కొందరు. 'దక్షిణారణి' అని కొందరు చెప్పుతారు. ఎట్లా చెప్పినా విద్య గురుశిష్యుల ముఖంగా ఉంటుం దని అర్థం. అరణి బ్రాహ్మణుండు; గురుఁడుత్తరారణి; జ్ఞానవహ్ని-రూపకాలంకారములు.

క. జనవినుతచరిత! బ్రాహ్మణుఁ। డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము దోఁచెన్;
మనమున నతని నరణిగాఁ। గొను టవ్వస్తువు నెఱింగికొని పిదపఁ గదా!' 98

**ప్రతిపదార్థం:** జనవినుతచరిత!= ప్రజలు ప్రస్తుతించే చరిత ఉన్న ఓ విప్రోత్తమా!; బ్రాహ్మణుఁడు+అనఁగాన్= బ్రాహ్మణుడు అంటే; క్షేత్రజ్ఞుఁడు+అగుట= క్షేత్రజ్ఞుడు కావటం; అల్పము+తోఁచెన్= కొద్దిగా మాత్రమే తెలిసినది; మనమునన్= మనస్సుతో; అతనిన్= అతడిని; అరణిగాన్= అరణిగా; కొనుట= స్వీకరించటం; ఆ+వస్తువున్+ఎఱింగికొని= ఆ వస్తువును తెలిసికొని; పిదపన్+కదా!= తరువాత కదా!

**తాత్పర్యం:** 'స్వామీ! బ్రాహ్మణుడు అంటే క్షేత్రజ్ఞుడనే విషయం ఏమిటో పూర్తిగా బోధపడలేదు. అతడిని అరణిగా గుర్తించటానికి ముందు బ్రాహ్మణుడు అంటే ఎవరో తెలియాలి కదా! అని ఆమె అన్నది.

**వ. అనిన నతం డిట్లనియె. 99**

**తాత్పర్యం:** అనగా ఆ బ్రాహ్మణుడు ఇట్లా అన్నాడు.

**ఆ. 'అతనిఁ దోఁపఁ జేయునట్టి సాధనము లేఁ। దింద్రియముల కందఁ; డేమి లక్ష**
**ణములు లేవు; నిర్గుణత్వనిరూఢుం డ। హంత లేమిఁ దోఁచుఁ గాంత! కనుము.' 100**

**ప్రతిపదార్థం:** కాంత!= ఓ వనితా!; అతనిన్= ఆ బ్రాహ్మణుడిని; తోఁపన్+చేయునట్టి= గుర్తింపచేసేటటువంటి; సాధనము లేదు= ఏ సాధనమూ లేదు; ఇంద్రియములకున్+అందఁడు= ఏ అవయవాలచేతా అతడిని గుర్తించలేము; ఏమి లక్షణములు లేవు= ఇక ఏ లక్షణాలతోనూ అతడిని గుర్తుపట్టలేము; నిర్గుణత్వ నిరూఢుండు= నిర్గుణత్వమే అతడి స్వభావం; అహంత= అహంకారిత్వం; లేమిన్+తోఁచున్= లేకపోవటంచేత కొంత గుర్తించవచ్చును; కనుము= చూడుము.

**తాత్పర్యం:** 'ఓ కాంతా! అతడిని ప్రత్యేకంగా గుర్తించే ఏ సాధనమూ లేదు. ఏ అవయవాలచేతా అతడిని గుర్తించలేము. అతడికి ఏ లక్షణాలూ లేవు. నిర్గుణత్వమే అతడి ధర్మం. అహంకారం లేకపోవటం అనే లక్షణంచేత అతడిని కొంత గుర్తించవచ్చును. నీవు ప్రయత్నించుము.'

**వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి నొందె' నని గోవిందుండు సెప్పి గాండీవి 'యా బ్రాహ్మణుండును బ్రాహ్మణియు నిట్టి వారగుదురె! వారెచ్చటివారు? వారల నా కెఱింగింపవే' యని యడిగిన నద్దేవుం డతని యాననం బాలోకించి. 101**

**ప్రతిపదార్థం:** అని ఈ విధంగా; నిర్దేశించుటయున్= నిర్దేశించగా; క్షేత్రజ్ఞ విషయ= క్షేత్రజ్ఞుడి విషయంగా; సంశయంబు= సందేహం; పాసి= పోగొట్టుకొని; ఆ+ఇంతి= ఆ స్త్రీ; శాంతిన్+ఒందెను+అని= శాంతిని పొందినదని; గోవిందుండు= కృష్ణుడు; చెప్పినన్= చెప్పగా; గాండీవి= అర్జునుడు; ఆ బ్రాహ్మణుండును= ఆ బ్రాహ్మణుడు; బ్రాహ్మణియున్= బ్రాహ్మణస్త్రీ; ఇట్టివారు+అగుదురె!= ఇంత గొప్పవారా!; వారు= వారిద్దరు; ఎచ్చటివారు?= ఎక్కడివారు? వారలన్= వారిని గురించి; నాకున్+ఎఱింగింపవే= దయచేసి తెలుపుము; అని; అడిగినన్= అడుగగా; ఆ+దేవుండు= కృష్ణుడు; అతని; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి

**తాత్పర్యం:** ఈ విధంగా ఉపదేశం చేయగా క్షేత్రజ్ఞుడి విషయంగా సందేహం పోయి, ఆ స్త్రీ పరమశాంతిని పొందింది అని శ్రీకృష్ణుడు చెప్పగా అర్జునుడు 'ఆ దంపతులు ఇంత గొప్పవారా? వారు ఎక్కడివారు? వారిని గురించి నాకు తెలుపుము' అని అడుగగా శ్రీకృష్ణుడు అతడి ముఖంవైపు చూచి (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'నా మనమును బుద్ధియును గృ। పా మహితా! బ్రాహ్మణుండు బ్రాహ్మణియు హృషీ**
**కామేయమైన క్షేత్ర। జ్ఞానుల వస్తువును నేన యనియె నరేంద్రా!' 102**

**ప్రతిపదార్థం:** కృపామహితా!= ఓ కృపాగుణంచే అధికుడా!; నా మనమునున్= నా మనస్సు; బుద్ధియునున్= బుద్ధీ; బ్రాహ్మణుండు; బ్రాహ్మణియు= బ్రాహ్మణస్త్రీ; హృషీక= ఇంద్రియాలచేత; అమేయము+ఐన= కొలవటానికి వీలులేని; క్షేత్రజ్ఞ= పరమాత్మ రూపమైన; అమల= నిర్మలమైన; వస్తువునున్= వస్తువుకూడా; నేను+అ= నేనే; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'కృపాగుణంచేత మహితుడవైన ఓ అర్జునా! నా మనస్సే బ్రాహ్మణుడు, బుద్ధి బ్రాహ్మణి, ఇంద్రియాలచేత కొలవటానికి వీలుకాని పరమాత్మస్వరూపమైన నిర్మలవస్తువును కూడా నేనే' అని కృష్ణుడన్నాడు.

గురుశిష్యసంవాదంబు గృష్ణుం డర్జునున కెఱింగించుట (సం. 14-35-2)

**వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో 'భవత్ప్రసాదంబున మదీయమతి యతి విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది; పరమంబైన వేద్యంబగు బ్రహ్మంబు నెఱింగింపవే?' యనుటయు నా కృష్ణుండు 'గురుశిష్యసంవాదం బను నితిహాసంబు విను; మది నీ ప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు; నిత్తెఱంగున మేధావి యగు నొక్క శిష్యుండు సంశితవ్రతుం డయిన గురు నడిగిన నగ్గురుండు బృహస్పతి భరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వసిష్ఠాత్రి విశ్వామిత్రప్రముఖులగు మునిజనంబు లాంగిరసుంబురస్కరించి కొనివిరించికడకుం జని తచ్చరణంబులకుం బ్రణమిల్లి 'హితం బెయ్యది? తత్ప్రాప్తి సుపథం బెట్టిది? వివరింపవే' యని విన్నవించిన నన్నలినాసనుండు గృపాధురీణంబైన చిత్తంబుతో నత్తపస్వి సత్తముల కెఱింగించిన తెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపు' మని పలికి యిట్లనియె. 103**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని కృష్ణుడు చెప్పగా విని; అర్జునుండు; అచ్యుతునితోన్= శ్రీకృష్ణుడితో; భవత్+ప్రసాదంబునన్= నీ అనుగ్రహం; మదీయ మతి= నా బుద్ధి; అతివిశదయునున్= అతి స్వచ్ఛమైనదీ; సూక్ష్మగ్రాహిణియున్= అతి సూక్ష్మాంశాలను గ్రహించేదీ; అయి+ఉన్న+అది= అయి ఉంటుంది; పరమంబు+ఐన= మిక్కిలి ఉత్కృష్టమైన; వేద్యంబు+అగు= తెలిసికొనదగిన; బ్రహ్మంబున్= బ్రహ్మపదార్థిన్ని; ఎఱింగింపవే= దయచేసి తెలుపుము; అనుటయున్= అని అడుగగా; ఆ+కృష్ణుడు= ఆ కృష్ణుడు; గురుశిష్య సవాదంబు+అను= గురుశిష్యసంవాద మనే; ఇతిహాసంబు వినుము= ఇతిహాసం ఉన్నది - వినుము; అది= ఆ కథ; నీ ప్రశ్నంబునకున్+ఉత్తరంబు+అయి+ఉండెడున్= నీ ప్రశ్నకు సమాధానమై ఉంటుంది; ఈ+తెఱంగునన్= ఇదే విధంగా; మేధావి+అగు+ఒక్క శిష్యుండు= తెలివైనవాడు అయిన ఒక శిష్యుడు; సంశిత వ్రతుండు+అయిన= నిర్ణయింపబడిన దీక్షకలిగిన; గురున్+అడిగినన్= గురువును అడుగగా; ఆ+గురుండు= ఆ గురువు; బృహస్పతి; భరద్వాజ; భార్గవ; గౌతమ; కాశ్యప; వసిష్ఠ; అత్రి; విశ్వామిత్ర; ప్రముఖులు+అగు= మొదలైన; మునిజనంబులు= మునులు; ఆంగిరసున్= ఆంగీరసుడిని; పురస్కరించుకొని= ముందుగా ఉంచుకొని; విరించికడకున్+చని= బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి; తద్+చరణంబులకున్= అతడి పాదాలకు; ప్రణమిల్లి= నమస్కరించి; హితంబు+ఏ+అది?= శ్రేయస్సు ఏది?; తద్+ప్రాప్తికిన్= దానిని అందుకొనటానికి; సుపథంబు= మంచిమార్గం; ఎట్టిది?= ఎటువంటిది?; వివరింపవే= దయతో వివరించుము; అని; విన్నవించినన్= ప్రార్థించగా; ఆ+నలిన+ఆసనుండు= ఆ కమలగర్భుడు; కృపాధురీణంబు+ఐన= కృపాగుణంతో మహనీయమైన; చిత్తంబుతోన్= మనస్సుతో; ఆ+తపస్వి సత్తములకున్= ఆ ఋషిశ్రేష్ఠులకు; ఎఱింగించిన= తెలిసిన; తెఱంగు= విధం; నీకున్+చెప్పెదన్= నీకు చెప్పుతాను; అవహితుండవు+అయి= అవధానచిత్తంతో; ఆకర్ణింపుము= వినుము; అని పలికి= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని కృష్ణుడు చెప్పగా విని అర్జునుడు శ్రీకృష్ణుడితో 'స్వామీ! నీ ప్రసాదంతో నా బుద్ధి స్వచ్ఛమై సూక్ష్మగ్రాహిణిగా తయారైనది, ఉత్కృష్టమైన, జ్ఞానరూపమైన బ్రహ్మతత్త్వం ఏమిటో, ఎట్లా తెలిసికొనాలో దయతో

చెప్పుము' అని అడిగాడు. అందుకు కృష్ణుడు 'గురుశిష్యసంవాదం అని ఒక ఇతిహాసం ఉన్నది. ఆ కథ నీ ప్రశ్నకు సరైన సమాధానం. నీవు ఇప్పుడు అడిగినట్లే మేధావి అయిన శిష్యుడు దీక్షితు డైన ఒక గురువును అడిగాడట. అప్పుడు ఆ గురువు బృహస్పతి , భరద్వాజుడు, భార్గవుడు, గౌతముడు, కాశ్యపుడు, వసిష్ఠుడు, అత్రి, విశ్వామిత్రుడు మొదలైన మహర్షులు ఆంగిరోమహర్షిని ముందుంచుకొని బ్రహ్మదేవుడివద్దకు వెళ్ళి, అతడి పాదాలకు నమస్కారం చేసి 'బ్రహ్మదేవా! ఏది హితం? దానిని అందుకొనటానికి మార్గం ఏది? దయతో చెప్పుము' అని అడిగారు. అప్పుడు వారికి ఆ బ్రహ్మదేవుడు కృప నిండిన చిత్తంతో ఏమి చెప్పాడో దానినే నీకూ నేను చెప్పుతాను. ఏకాగ్రచిత్తంతో వినుము' అని ఇట్లా చెప్పాడు.

**ఆ. ఆదరార్ద్రుఁ డగుచు నలరిన మోముల। కాంతి వింత గాఁగఁ గమలగర్భుఁ**
**డా తపస్విజనుల యాననంబులు గల। యంగఁ జూచి యిట్టులనియె వత్స! 104**

**ప్రతిపదార్థం:** వత్స!= శిష్యా!; ఆదర+ఆర్ద్రుఁడు+అగుచున్= ఆదరంతో కరగిపోయినవాడై; అలరిన మోముల కాంతి= వికసించిన నాలుగు ముఖాల కాంతి; వింత+కాఁగన్= ఆశ్చర్యం కలిగించగా; కమలగర్భుఁడు= బ్రహ్మ; ఆ తపస్విజనుల= ఆ ఋషుల; ఆననంబులు= ముఖాలు; కలయంగన్+చూచి= తేరిపార చూచి; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శిష్యా! ఆదరంతో కరిగిపోయినవాడై వికసించిన నాలుగు ముఖాల కాంతి ఆశ్చర్యం కలిగించగా బ్రహ్మదేవుడు ఆ ఋషుల ముఖాలను పరికించి చూచి ఇట్లా అన్నాడు.

**తే. 'సత్త్వమునను భూతంబులు సంభవించు.। నంద వర్తించు, దానన యడఁగు; నిది గు**
**ణత్రయాత్మకసత్త్వచరిత్ర మమల। బుద్ధులార! సత్త్వంబు ప్రసిద్ధి వినుఁడు. 105**

**ప్రతిపదార్థం:** అమల బుద్ధులార!= పవిత్ర బుద్ధికలిగిన ఓ ఋషులారా!; భూతంబులు= ప్రాణులన్నీ; సత్త్వముననున్= సత్వంలోనే; సంభవించున్= పుట్టుతాయి; అందున్+అ+వర్తించున్= అందులోనే ప్రవర్తిస్తాయి; దానన్+అ= అందులోనే; అడఁగున్= అణగిపోతాయి; ఇది; గుణత్రయాత్మక= గుణత్రయంతో కూడిన; సత్త్వచరిత్రము= సత్త్వచరిత్ర; సత్త్వంబు+ప్రసిద్ధిన్= సత్త్వప్రాధాన్యం; వినుఁడు= వినండి.

**తాత్పర్యం:** పవిత్ర బుద్ధులుగల ఓ ఋషులారా! ప్రాణులన్నీ సత్త్వంలోనే పుట్టుతాయి. అందులోనే ప్రవర్తించి, అందులోనే అణగిపోతాయి. మూడు గుణాలతో కూడిన సత్త్వచరిత్ర ఇదే. సత్త్వగుణ ప్రాధాన్యాన్ని గురించి చెప్పుతారు. బాగా వినండి.

**విశేషం:** మూలభారతంలో 'సత్యాద్భూతాని జాతాని స్థావరాణి చరాణి చ' (14-36-32) అని ఉండగా తిక్కనగారు సత్వమన్నారు. శాశ్వతంగా ఉన్నది కాబట్టీ సత్యమంటారు. మౌలికమైన ధర్మం కాబట్టి 'సత్త్వ' మంటారు. పారమార్థికంగా సత్య, సత్త్వాలమధ్య తేడా లేదు.

**క. శ్రుతియనఁ దపమనఁగఁ బ్రజా। పతియన సత్త్వంబునకు సపర నామంబుల్**
**వ్రతులార సత్త్వమన న। వ్వితత మహిమమైన పరమవేద్యము సుండీ! 106**

**ప్రతిపదార్థం:** శ్రుతి+అనన్= వేదమని; తపమనఁగన్= తపస్సు అని; ప్రజాపతి+అనన్= ప్రజాపతి అని; సత్త్వంబునకున్= సత్త్వానికి; అపరనామంబుల్= మారుపేర్లు; వ్రతులార!; దీక్షితులారా!; సత్త్వము+అనన్= సత్త్వమంటే; ఆ+వితత+మహిమము+ఐన=

ఆ విస్తరించిన; మహిమగల; పరమవేద్యము= గొప్పగా తెలిసికొనదగిన తత్త్వం; చుండీ!= సుమండీ!

**తాత్పర్యం:** వేదమని, తపమని, ప్రజాపతి అని సత్త్వానికి మారు పేర్లు. సత్త్వమంటే ఆ విస్తరించింది. గొప్పమహిమ కలిగినది. అయిన పరమవేద్యమైన తత్త్వం సుమండీ!

**క. కావునఁ గామ క్రోధ స । మావేశము లెడల విడిచి యనవతరంబున్**
**సేవింతురు సత్త్వము దృఢ । భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్. 107**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; యోగపరినిష్ఠ+ఆత్ములు= యోగంలో మిక్కిలి నిష్ఠకలిగిన సాధకులు; కామక్రోధసమావేశములు= కామాన్ని, క్రోధాన్ని పొందటం; ఎడలవిడిచి= సంపూర్ణంగా వదలిపెట్టి; అననరతంబున్= ఎల్లప్పుడూ; దృఢభావాకలనమునన్= దృఢమైన దీక్షాభావం కలిగినవారై; సత్త్వమున్= ఆ సత్త్వాన్ని; సేవింతురు= ఉపాసిస్తారు.

**ప్రతిపదార్థం:** కాబట్టి యోగ సాధనలో పరినిష్ఠ కలిగిన పుణ్యాత్ములు కామక్రోధాలను సంపూర్ణంగా వదలిపెట్టి దృఢమైన దీక్షభావం కలిగి ఎల్లప్పుడూ సత్త్వాన్ని ఉపాసిస్తారు.

**వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు. 108**

**తాత్పర్యం:** అది శ్రేయస్సు. దానిని అందుకొనటానికి ఉత్తమమార్గం చెప్పుతాను వినండి.

**క. చతురాశ్రమములును జరణ । చతుష్టయము గాఁగ వర్ణ సముదయ సంసే**
**వ్యత నొప్పెడు ధర్మము సుం । డతులంబు శివ ప్రదంబు నగు పథ మరయున్. 109**

**ప్రతిపదార్థం:** చతురాశ్రమములును= నాలుగు ఆశ్రమాలు (బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమాలు); చరణ చతుష్టయము కాఁగన్= నాలుగు పాదాలు కాగా; వర్ణసముదయ సంసేవ్యతన్+ఒప్పెడు= నాలుగు వర్ణాలచేత; ఇతర వర్ణసముదాయాలచేత అనుసరించబడుతూ ప్రకాశించేటటువంటి; ధర్మము+చుండి= ధర్మమే సుమండీ!; అరయన్= బాగా చూడగా; శివప్రదంబున్+అగు పథము= శుభప్రదమైన మార్గం.

**తాత్పర్యం:** నాలుగు ఆశ్రమాలు నాలుగు పాదాలుగా, అన్ని వర్ణాలకు చెందినవారిచేతా అనుసరించబడుతున్న సనాతనధర్మం ఏది ఉన్నదో అదే పరీక్షించిచూడగా శుభప్రదమైన అత్యుత్తమ మార్గం. దీనిద్వారా శ్రేయోరూపమైన మోక్షసాధన సులభమని తాత్పర్యం.

**వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మవిత్త్వంబు లేక పరతత్త్వంబు నొందరామి మారుతాదిత్యేంద్ర ప్రజాపతులకునులోనుగానిట్టిద యధ్యాత్మ దర్శనంబనం జతుర్వింశతి తత్త్వావలోకనంబు కావునఁ దత్త్వంబులు వివరించెద. 110**

**ప్రతిపదార్థం:** నాలుగు+ఆశ్రమంబులకున్= బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమాలలోని వారికీ; అధ్యాత్మ విత్త్వంబులేక= ఆత్మను గురించి తెలిసికొనకుండా; పరతత్త్వంబున్+ఒందన్+రామి= పరతత్త్వాన్ని పొందలేకపోవటం అన్నది; సామాన్యంబు+అ= సమానమే; మారుత= సప్తమరుత్తులకు; ఆదిత్య= ద్వాదశ ఆదిత్యులకు; ఇంద్ర= ఇంద్రుడికి; ప్రజాపతికిన్= బ్రహ్మకు; లోనుగాన్= మొదలైనవారికి కూడా; అధ్యాత్మ దర్శనంబు= అధ్యాత్మ దర్శనం; ఇట్టిది+అ= ఇట్లాంటిదే; అనన్= అనగా; చతుర్వింశతి= ఇరవై నాలుగు; తత్త్వ+అవలోకనంబు= తత్త్వాలను దర్శించటం; కావునన్= కాబట్టి; తత్త్వంబులు= ఆ తత్త్వాలను; వివరించెదన్= వివరిస్తాను.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమాలలోని వారెవరైనా ఆత్మవిద్యా సాధకులు కాకుండా మోక్షప్రాప్తిని పొందలేరు అనే నియమం అందరికీ సమానమే. మరుత్తులైనా, ఆదిత్యులైనా, ఇంద్రుడైనా, చివరికి బ్రహ్మదేవుడైనా అధ్యాత్మ దర్శన మార్గం మాత్రం ఇదే. అనగా ఇరవైనాలుగు తత్త్వాలు ఏవి ఉన్నాయో వాటి తత్త్వాన్ని గురించిన దర్శనం కలిగి ఉండటమనే అర్థం. అందుచేత ఆ తత్త్వాలను వివరిస్తాను.

**విశేషం:** బ్రహ్మాది దేవతలుకూడా బ్రహ్మవిద్యా సాధనలో అవలంబించవలసిన క్రమం మానవులు అవలంబించే క్రమమే అని అర్థం. అందుకే భారతకథ త్రిలోకాలకు సంబంధించినదని అనటం. ఇంద్రాది పాత్రలు మానవ పాత్రలతో కలిసి ప్రవర్తించటం ఇత్యాదులు కనిపిస్తాయి.

**తే.** **అంబరాది భూతములు శబ్దాది గుణము। లింద్రియము లిరుదెఱఁగు మునీంద్రులార!**
**మన మహంకార బుద్ధు లిట్లొనరి ప్రకృతి। గలయఁ దత్త్వ చతుర్వింశకత్వ మొందు** **111**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రులార!= మునిశ్రేష్ఠులారా!; అంబర+ఆది భూతములు= ఆకాశం మొదలైన ఐదు భూతాలు-5; శబ్ద+ఆదిగుణములు= శబ్దాదులైన ఐదు గుణాలు-5; ఇంద్రియములు+ఇరుదెఱఁగు= జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచకాలు-5+5; మనము= మనస్సు-1; అహంకారము-1; బుద్ధి-1; ఇట్లు+ఒనరి= ఈ విధంగా కూడి; ప్రకృతిన్+కలయన్= ప్రకృతితో కలిస్తే; తత్త్వచతుర్వింశకత్వము+ఒందున్= 24 తత్త్వాలని పేరు పొందుతాయి.

**తాత్పర్యం:** ఆకాశం మొదలైన ఐదు భూతాలు, శబ్దాదులైన ఐదు గుణాలు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచకాలు, మనస్సు, అహంకారం, బుద్ధి - అనే ఈ తత్త్వాలు ప్రకృతితో కలిస్తే 24 తత్త్వాలుగా పిలువబడుతాయి.

**క.** **వినుఁడు ప్రభవ విలయ జ్ఞా। న నిరూఢము గాఁగ వీని నైజ మఖిలముం**
**గనిన భవమోహ మొందఁడు । గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁడై.** **112**

**ప్రతిపదార్థం:** వినుఁడు= బాగా వినండి; ప్రభవ= పుట్టుక; విలయ= నశించటం అనే ఈ రెండు; జ్ఞాన నిరూఢము కాఁగన్= జ్ఞానాలతో స్థిరమైన బుద్ధితో; వీనినైజము+అఖిలమున్= ఈ ఇరవై నాలుగు తత్త్వాల అసలు రూపాన్ని; కనినన్= దర్శిస్తే; భవమోహము+ఒందరు= సంసార రూపమైన భ్రాంతిని పొందరు; అతఁడు= అట్లాంటి యోగి; గతకల్మషుఁడు+ఐ= పాపాలు పోయినవాడై; పరతత్త్వంబున్+కనున్= పరతత్త్వాన్ని చూడగలుగుతాడు.

**తాత్పర్యం:** జనన మరణాలకు సంబంధించిన ప్రజ్ఞానంతోడి స్థిరమైన బుద్ధితో ఈ 24 తత్త్వాల నైజాన్ని దర్శిస్తే సంసార బంధరూపమైన భ్రాంతి నశిస్తుంది. పవిత్రుడై ఆ యోగి పరతత్త్వదర్శనం చేయగలుగుతాడు.'

**వ.** **అని నిర్దేశించి యద్దేవుండు వెండియు.** **113**

**తాత్పర్యం:** అని ఉపదేశించి బ్రహ్మదేవుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**క.** **'వ్యక్త మనిర్వాచ్యం బ। వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా**
**యుక్తము కలిత గుణత్రయ। శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ!** **114**

**ప్రతిపదార్థం:** అనిర్వాచ్యంబు= మాటలకందనిది; అవ్యక్తము= వ్యక్తం కానిది; సుస్థిరము= మిక్కిలి స్థిరమైనది; ధ్రువము= శాశ్వతంగా ఉండేది; వ్యాపిత్వధురాయుక్తము= అన్ని దిశలా వ్యాపించిన బరువుకలిగింది; కలిత గుణత్రయశక్తి= మూడు గుణాల

శక్తులతో కూడింది; అయిన వ్యక్తము= వ్యక్తమైన; నవద్వారపురము= ఈ తొమ్మిది ద్వారాలు కలిగిన ఆ నగరం; అసాధ్యము= జయించటం చాలా కష్టం; చుండీ!= సుమండీ!

**తాత్పర్యం:** మాటల కందనిది, అవ్యక్తమైనది, స్థిరమైనది, శాశ్వతమైనది, అన్నివైపులా వ్యాపించిన శక్తి కలిగినదీ, త్రిగుణ శక్తులతో కూడింది అయిన ఈ వ్యక్తమైన తొమ్మిది ద్వారాల నగరం జయించటానికి చాలా కష్టతరమైనది.

**విశేషం:** నవరంధ్రాలు కలిగినది దేహం. అందుకే నగరంగా చెప్పటం. జయించటమంటే ఆత్మ దర్శనమని అర్థం. అది అవ్యక్తం. కాని దేహానికి ప్రాణశక్తి అదే. చిత్రమేమంటే ఈ దేహం వ్యక్తం. దానితత్త్వం మాత్రం అవ్యక్తం. అందుకే జయించటం అసాధ్యమనటం.

**క. తత్సాధనంబు దద్గత । చిత్సులభత్వ ప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణ సం**
**పత్సారవంత మది గుణ । జిత్సువ్రతు లైన వారిచే సాధ్య మగున్. 115**

**ప్రతిపదార్థం:** తద్+సాధనంబు= ఆ పురాన్ని సాధించటానికి మార్గం; తద్+గత= ఆ దేహంలోని; చిత్= జ్ఞానాన్ని; సులభత్వ ప్రసిద్ధిన్+చేయున్= సులభంగా పొందే విధానాన్ని అందిస్తుంది; అది; త్రిగుణ సంపద్+సారవంతము= సత్త్వరజస్తమో గుణసంపద యొక్క సారరూపమైనది; గుణ జిత్+సువ్రతులు+ఐన= వారిచేన్= త్రిగుణాలను జయించటమే దీక్షగా కలిగినవారిచేత; సాధ్యము+అగున్= సాధించబడుతుంది.

**తాత్పర్యం:** దేహంలోని సహజ యోగసిద్ధిని సులభంగా సాధించే పద్ధతిని ఆ మార్గం చూపిస్తుంది. త్రిగుణాల సారరూపమైనది అది. గుణాలను జయించటాన్ని దీక్షగా కలిగినవారే ఆ పని చేయగలరు. వారికే ఇంద్రియ జయం సాధ్యం. వారే దేహాన్ని తమ నియంత్రణలో ఉంచుకొనగలరు.

**సీ. సంయమివరులార! సత్త్వరజస్తమో । నామరూఢములు గుణంబు; లవియు**
**నన్యోన్య మిథునత్వ మన్యోన్య సంశ్రయ । మన్యోన్య సంకలితాను వృత్త**
**భావ మన్యోన్యోప జీవనాచరణంబు । గలిగి దుర్బోధత్వ గాఢ భంగు**
**లైయుండుఁ; దమము నియమితమైన రజస్సుఁ । దన్నియమమున సత్త్వంబు నడచు;**

**తే. సత్త్వ మడఁగినచోఁ దమశ్చరిత మెసఁగు । లోభశోక సమ్మోహ నిద్రాభయములు**
**వికృతి దుర్మాన మౌఢ్య పాపకృతి కోప । శార్య మాత్సర్యములు తమస్సంభవములు. 116**

**ప్రతిపదార్థం:** సంయమివరులార!= ఋషిశ్రేష్ఠులారా!; సత్త్వరజస్తమో నామరూఢములు= సత్త్వం, రజస్సు, తమస్సు అనే పేర్లతో ప్రసిద్ధాలు, గుణంబులు= గుణాలు; అవియున్= అవి; అన్యోన్యమిథునత్వము= ఒకదానితో ఒకటి సంగమించటం; అన్యోన్యసంశ్రయము= ఒకటి మరోదానిని ఆశ్రయించటం; అన్యోన్య సంకలిత+అనువృత్తభావము= ఒకటి మరోదానిలో కలిసి అనుసరించి ప్రవర్తించటం; అన్యోన్య+ఉపజీవన+ఆచరణంబు కలిగి= ఒకదానిని ఆశ్రయించి మరోటి సహజీవనం చేయటం కలిగి; ఇట్లా ఉంటూ; దుర్బోధ గాఢ భంగులు+ఐ+ఉండున్= వాటి ప్రవృత్తిని గుర్తించటానికి వీలులేకుండా చాలా తీవ్రరీతిలో ప్రవర్తిస్తాయి; తమము= తమోగుణం; నియమితము+ఐనన్= నియమించబడితే; రజస్సున్= రజోగుణమూ; తద్+నియమమునన్= ఆ రజోగుణ నియమంచేత; సత్త్వంబు+నడచున్= సత్త్వగుణం ప్రవర్తిస్తాయి; సత్త్వము+అడఁగినచోన్= సత్త్వం అణగిపోతే; తమశ్చరితము+ఎసఁగున్= తమస్సు ప్రవర్తించటం మొదలు పెడుతుంది; లోభ= లోభం; శోక= శోకం; సమ్మోహ= సమ్మోహం; నిద్రాభయములు= నిద్ర, భయం; వికృతి= వికారాలు; దుర్మాన= దురభిమానం; మౌఢ్య= మంకుతనం; పాపకృతి= పాపాలుచేయటం; కోప= క్రోధం; శార్య= మోసం; మాత్సర్యములు= అసూయ మొదలైనవి; తమస్సంభవములు= తమోగుణంనుండి పుట్టుతాయి.

**తాత్పర్యం:** ఋషిశ్రేష్ఠులారా! సత్త్వం రజస్సు తమస్సు అనే పేర్లతో ఈ గుణాలు ప్రసిద్ధి పొందాయి. అవి ఒకదానితో ఒకటి సంగమించి పనిచేస్తాయి. ఒకటి మరోదానిని ఆశ్రయిస్తాయి. ఒకటి మరోదానిలో కలిసి అనుసరించి ప్రవర్తిస్తాయి. ఒకదాని ప్రవృత్తి మరోదానికి సహకారిగా ఉండటమూ కనిపిస్తుంది. కాని, వాటి ప్రవృత్తిని గుర్తించటం దుస్సాధం. అతి తీవ్ర రీతిలో ప్రవర్తిస్తాయి. తమోగుణం నియంత్రితమైతే రజోగుణమూ, దానిని బట్టి సత్త్వమూ ఉంటాయి. సత్త్వం అణగిపోతే తమస్సు బయటపడుతుంది. లోభం, శోకం, భ్రాంతి, నిద్ర, భయం, వికారం, దురభిమానం. మంకుతనం, పాపకార్యాలు చేయటం, క్రోధం, మోసం, అసూయ ఇట్లాంటివన్నీ తమస్సులో పుట్టే దుర్గుణాలే.

**విశేషం:** ఒకే మనిషి మంచిగా, చెడుగా, మెత్తగా, తీవ్రంగా, తెలివిగా, మూర్ఖంగా ప్రవర్తించటానికి కారణాలు ఈ మూడు గుణాల కలయికలోని తేడాలని అర్థం.

**ఉ. పాములుఁ దేళ్ళునుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్ళులుం**
**జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలు**
**న్దోమలు వ్రాఁకులుం బొదలు నోవులఁ బొందువారు మున్**
**తామసభాగు లట్ల మఱి తద్విధ జంతువు లెన్ని యన్నియున్. 117**

**ప్రతిపదార్థం:** పాములున్= పాములు; తేళ్ళునున్= తేళ్ళూ; పసులున్= పశువులూ; పందులున్= పందులూ; కుక్కలున్= కుక్కలూ; మీలున్= చేపలూ; కోళ్ళులున్= కోళ్ళూ; చీమలున్= చీమలు; కాకులున్= కాకులూ; క్రిములున్= పురుగులూ; జింకలున్= జింకలూ; నక్కలున్= నక్కలూ; కొంక నక్కలున్= పిరికి నక్కలు; దోమలున్= దోమలూ; వ్రాఁకులున్= చెట్లు; పొదలున్= పొదలూ; నోవులన్= బాధలూ; పీడలన్= కష్టాలూ; పొందువారు= పడేవారు, మున్= ముందు; తామసభాగులు= తామస గుణభాగం ఉన్నవారు; మఱి= ఇంకా; తద్విధ జంతువులు+ఎన్ని+అన్నియున్= అట్లాంటి జంతువులు ఎన్ని ఉన్నాయో అన్నీ; అట్లు+అ= అట్లాగే.

**తాత్పర్యం:** పాములు, తేళ్ళూ, పశువులు, పందులు, కుక్కలు, చేపలు, కోళ్ళు, చీమలు, కాకులు, పురుగులు, జింకలు, నక్కలు, పిరికి నక్కలు, దోమలు, చెట్లు, పొదలు, బాధలు, కష్టాలు పొందేవారు అందరూ ముందుగా తామసగుణ భాగస్వాములే. అట్లాగే తక్కిన జంతువులు ఏవేవి ఉన్నాయో అవన్నీ తామసగుణంతో కూడినవే.

**విశేషం:** ఆహార నిద్రా భయమైథునాలు నరులకు, పశువులకు సమానం. ఒక జ్ఞానార్జనచేతనే మనిషి, జంతుప్రపంచంనుండి వేరుపడుతున్నాడు. అందుకే తామసగుణం నరులకు జంతువులకు, పక్షులకు క్రిమికీటకాలకు సమానమని ఈ పద్యం వివరిస్తోంది. ఈ గుణంనుండి మనిషి బయటపడగలడు.

**క. ఇవి తామసంబు లని గుణ। నివహములోఁ గీడు వాప నేర్చునతఁడు త**
**ద్వివిధ వికృతి నిరసన హే। తువివేకము గలుగఁ గా నధోగతిఁ దలఁగున్. 118**

**ప్రతిపదార్థం:** ఇవి తామసంబులు+అని= ఈ గుణాలు తామసాలని గుర్తించి; గుణనివహములోన్= తనకున్న గుణ సముదాయంలో; కీడు= కీడును; పాపన్= పోగొట్టుకొనటానికి; నేర్చున్+అతఁడు= సమర్థుడైనవాడు; తద్+వివిధ= దానికి చెందిన వివిధాలైన; వికృతి= వికారాలను; నిరసన= దూరంచేయటానికి తగిన; హేతు వివేకము కలుగన్= బుద్ధి వివేకం కలుగగా; అధోగతిన్= అధోగతి పొందటాన్ని; తలఁగున్= వారించగలుగుతాడు.

**తాత్పర్యం:** బాధలు, కష్టాలు పొందటం ఇత్యాదిగా ఉన్న గుణకర్మలు తామసాలని ఎవడు గుర్తించగలడో వాడు తన గుణ సముదాయం నుండి వీటిని దూరం చేయగలుగుతాడు. తద్వారా ఆ తామసికాలైన వికారాలను దూరం చేయగల హేతుబుద్ధి వివేకాలు కలిగి అధోగతి పొందకుండా బయట పడతాడు.

**చ.** **బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖ భాగితా**
**కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతానముం**
**గలహము నీర్ష్యయున్ బహువికల్పపు భాషలుఁ గామినీ జనం**
**బుల యెడ గాఢ రాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్.** **119**

**ప్రతిపదార్థం:** బలమునున్= బలమూ; శౌర్యమున్= పరాక్రమమూ; మదమున్= గర్వమూ; ప్రాభవమున్= వైభవమూ; సుఖదుఃఖ భాగితాకలనము= సుఖాన్ని, దుఃఖాన్ని పొందటం అనే గుణం; చెల్మి+చేఁతయును= స్నేహం చేయటం; కాంక్షయున్= కోరికా; ఒల్లమియున్= నచ్చకపోవటం (ఇష్టం లేకపోవటం); ప్రతానమున్= విరివిగా ఉండాలని కోరుకొనటం; కలహమున్= వ్యాజ్యం; ఈర్ష్యయును= అసూయయు; బహు వికల్పపు భాషలు= నానా వికారాలైన మాటలు (తిట్లు); కామినీజనంబుల+ఎడన్= స్త్రీల పట్ల; గాఢరాగతయున్= మిక్కిలి అనురాగమును; బొంకును= అబద్ధం చెప్పటమును; ఉబ్బున్= అసహనం (ఇవన్నీ); రజస్+ప్రభూతముల్= రజోగుణంలో పుట్టేవి.

**తాత్పర్యం:** బలం, పరాక్రమం, గర్వం, వైభవం, సుఖదుఃఖాలు పొందటం, స్నేహంచేయటం, కోరిక, కోరకపోవటం, విరివిగా ఉండాలన్న ఆశ, వ్యాజ్యం, అసూయ, తిట్లు, స్త్రీలపట్ల మిక్కిలి అనురాగం, అబద్ధం చెప్పటం, అసహనంగా ఉండటం ఇవన్నీ రజోగుణంలో పుట్టుతాయి.

**చ.** **అవి తొలుబామునం గలుగు నట్టి జనంబులు నీతు లిట్టి వి**
**ట్టివి యవినీతు లన్మతి పటిష్ఠత గల్గ త్రివర్గ వర్తనం**
**బు వెరవు నొంది యర్థములఁ బొంపిరివోవుచుఁ గామ సౌఖ్యవై**
**భవములఁ గ్రాలుచున్ మనుజ భావ నిరూఢతఁ బొల్తు రెంతయున్** **120**

**ప్రతిపదార్థం:** అవి= పైన వివరించిన గుణాలు; తొలుబామునన్= పూర్వజన్మలో; కలుగునట్టి జనంబులు= కలిగిన మనుష్యులు; ఇట్టివి నీతులు= ఇవి నీతులు; ఇట్టివి+అవినీతులు= ఇవి అవినీతులు; అన్+మతి= అనే బుద్ధియొక్క; పటిష్ఠత+కల్గి= గట్టిదనం కలిగి; త్రివర్గ= మూడు పురుషార్థాల విషయంలో; వర్తనంబు= ప్రవర్తించేటటువంటి; వెరవున్= పద్ధతిని; ఒంది= పొంది; అర్థములన్= ధనసంపదలతో; పొంపిరి+పోవుచున్= అతిశయిస్తూ; కామ సౌఖ్య వైభవములన్= కోరికలను తీర్చుకొని సుఖవైభవాలతో; క్రాలుచున్= వైభవంతో ప్రకాశిస్తూ; ఎంతయున్= మిక్కిలిగా; మనుజభావ నిరూఢతన్= మానుష భావంలో స్థిరులై; పొల్తురు= ఉంటారు.

**తాత్పర్యం:** ఈ గుణాలు పూర్వజన్మం నుండీ సంక్రమించిన మనుష్యులు నీతి, అవినీతి అనే విచక్షణ కలిగిన పటిష్ఠమైన బుద్ధి కలిగి, ధర్మార్థకామాల విషయంలో ఎట్లా ప్రవర్తించాలో తెలిసి, మిక్కిలి ధనసంపదలతో కోరికలు తీర్చుకొని సుఖంతోను వైభవంతోనూ అతిశయిస్తూ ప్రకాశిస్తారు. జీవితమంతా 'మానుష' భావంతోనే స్థిరంగా కాలం గడిపేస్తారు.

**క. రాజసగుణములకుం గల। నైజ మెఱుఁగు వారు తజ్జనక వైకృతముల్**
**ధీజితములు గావింపఁగ। నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 121**

**ప్రతిపదార్థం:** రాజస గుణములకున్+కల= రాజసగుణాల కున్న; నైజము= స్వభావం; ఎఱుఁగువారు= తెలిసికొనేవారు; తద్+జనక= దానిని కలిగించే; వైకృతముల్= వికారాలను; ధీ= బుద్ధిచేత; జితములు+కావింపఁగన్= జయించినవిగా చేయటానికి; ఓజ+కలిగి= శక్తి కలిగి; శుభదవృత్తిన్= మేలు కలిగించే ప్రవృత్తిని; ఎందున్+ఒందుదురు= ఎక్కడైనా పొందగలరు.

**తాత్పర్యం:** రాజసగుణాల తత్త్వం ఇది అని ఎవరు గుర్తిస్తారో వారు తమ వివేకంతో రాజసగుణ వికారాలను జయించగలుగుతారు. మంచి దారిని ఏనాడైనా పొందగలుగుతారు.

**విశేషం:** రాజసగుణానికి కొంత శిక్షణ కలిగితే సాత్త్విక ప్రభావంలో పడిపోతుంది. అశిక్షితమైతే తామసంలోకి దిగిపోతుంది. సత్త్వ తమస్సులే ఎవ్వరికీ పడని గుణభేదాలు. అందుకే 'గురు' సేవ ద్వారా గుణసంపదను నియంత్రించవచ్చునని పెద్ద లంటారు.

**సీ. సంతోషము సుప్రకాశత్వంబుఁ బ్రియమును। నానందమును గరుణాభిరతియు**
**క్షమయును సత్యంబు శౌచంబు ధృతియు న। కార్పణ్యమును దితిక్షయు నహింస**
**యును నార్జవంబును ననసూయయును గ్రోధ। రాహిత్యమును నసంరంభతయును**
**సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు న। క్రూరభావంబు హ్రీగౌరవంబు**

**తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మ సంక। లితము లైనట్టివా రహంకృతి మమత్వ**
**మర్థతృష్ణ కామార్తి లే కతులబోధ। భరితులై యూర్ధ్వలోక వైభవము గండ్రు. 122**

**ప్రతిపదార్థం:** సంతోషమున్= సంతోషంగా ఉండటం; సుప్రకాశత్వంబున్= బాగా కాంతిమంతంగా ఉండటం; ప్రియమునున్= ప్రేమగా ఉండటం; ఆనందమునున్= ఆనందమూ; కరుణా+అభిరతియున్= దయలో ఆసక్తి ఉండటం; క్షమయున్= క్షమాగుణం; సత్యంబు= సత్యపాలన; శౌచంబు= పవిత్రంగా ఉండటం; ధృతియున్= ధైర్యం; అకార్పణ్యమును= లోభగుణం లేకుండటం; తితిక్షయున్= ఓర్పు; అహింసయును= హింసచేయకుండా ఉండటం; ఆర్జవంబును= వంకరగా కాకుండా నేరుగా ప్రవర్తించటం; అనసూయయును= అసూయలేమి; క్రోధరాహిత్యమును= కోధం లేకుండటం; అసంరంభతయును= ఉద్రేకం లేకుండా ఉండటం; సమత= అన్నిటిలోనూ సమత్వభావన కలిగి ఉండటం; దాక్షిణ్యంబు= కనికరం; శ్రద్ధధానతయున్= నిష్ఠతోడి విశ్వాసం ఉండటం; అక్రూరభావంబున్= కఠినత్వం లేకుండటం; హ్రీ= సిగ్గు; గౌరవంబు= గురుభావం కలిగి ఉండటం; ఇవి= అనే ఈ గుణాలు; సత్త్వ జాతంబులు= సత్త్వంలో పుట్టుతాయి (ఈ గుణాలు); పూర్వజన్మ సంకలితములు+ఐనట్టివారు= ఈ గుణాలలో పూర్వజన్మ సిద్ధంగా కలవారు; అహంకృతి= అహంకారం; మమత్వము= మమకారం; అర్థతృష్ణ= ధనదాహం; కామ+అర్తి= కామంతో దుఃఖితుడుకావటం; లేక; అతుల= సాటిలేని; బోధ భరితులు+ఐ= జ్ఞానయుక్తులైన; ఊర్ధ్వలోక వైభవమున్+కంద్రు= ఉత్తమలోక వైభవాలను పొందుతారు.

**తాత్పర్యం:** సంతోషం, ప్రకాశం, ప్రేమ, ఆనందం, కరుణ, క్షమాగుణం, సత్యం, శుచిత్వం, ధైర్యం, లోభరాహిత్యం. ఓర్పు, అహింస, చక్కని నడవడి, అసూయ లేమి, కోపం లేకుండటం, ఉద్రిక్తుడు కాకపోవటం, సమత్వం, కనికరం, నిష్ఠతోడి విశ్వాసం, కాఠిన్యం లేకుండా ప్రవర్తించటం, లజ్జ, గౌరవం అనే ఈ గుణాలు సత్త్వంలో పుట్టుతాయి. ఈ గుణాలను పూర్వజన్మ సంక్రమితాలుగా ఎవరు కలిగి ఉంటారో వారు అహంకార మమకారాలు లేక అర్థ కామ దాహాలు లేక అసామాన్యజ్ఞాన సంపద కలిగి విముక్తిసాధనకు తగినవారుగా ఉంటారు.

**క. వినుఁ డా గుణంబు లన్నిటిఁ। గనికొని తత్త దనుషక్తి గలుగనివాఁ డ**
**ప్పనిచే భుజింపఁగాఁ బడఁ। డనఘాత్మకులార! గ్రింగు నతఁ డారాశిన్.' 123**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఋషులారా వినండి; ఆ గుణంబులు+అన్నిటిన్= ఆ గుణాలన్నిటిని; కనికొని= తెలిసికొని; తత్తద్= వాటి వాటిలో; అనుషక్తి= మిక్కిలి కూడిక; కలుగనివాఁడు= లేనివాడు; ఆ+పనిచేన్= ఆ పనివలన; భుజింపఁగాఁ బడఁడు= తినబడడు; అనఘ+ఆత్మకులార!= పుణ్యాత్ములారా!; అతఁడు= ఆ పుణ్యాత్ముడు; ఆ రాశిన్= ఆ కర్మ సముదాయాన్ని; గ్రింగున్= తినేస్తాడు (అతిక్రమిస్తాడు= కర్మనుండి విముక్తుడవుతాడు).

**తాత్పర్యం:** ఋషులారా! వినండి. ఆ గుణాల తత్త్వాన్ని దర్శించి ఆయా పనులలో ఆసక్తుడు కానివాడు ఆ పనివలన బంధించబడడు. పుణ్యాత్ములారా! అతడే ఆ కర్మ సముదాయాన్ని నియంత్రణలో ఉంచుకొనగలడు.'

**వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును. 124**

**తాత్పర్యం:** అనిచెప్పి ఆ బ్రహ్మదేవుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'వేర్వేఱ యుండవు వినుఁడు! గుణంబు ల। న్యోన్య సంకలితంబు లగుచుఁ బరఁగు**
**సంగతత్వమునన సంసారయాత్రా ప్ర। వర్తనం బొనరించు; వానిలోన**
**నెయ్యది మిగులఁ దోఁపించెఁ దజ్జన్యంబు। లొలయుఁ బాయుటయు నొక్కొక్కమాటు**
**గలుగుఁ; దమం బెఱుఁగమి యధికం బైన। స్రోతస్సధోముఖ స్రుతి రజస్సు**

**ఆ. లెఱిఁగినపుడు మధ్యసరణి సత్త్వమువృద్ధిఁ। బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు; వీని**
**మును ప్రకార భేదమున నెఱింగించితి;। నవియు దుస్తరంబు లనఘులార! 125**

**ప్రతిపదార్థం:** అనఘులార!= పుణ్యాత్ములారా!; వినుఁడు= ఇంకా వినండి; గుణంబులు= ఈ త్రిగుణాలు; వేర్వేఱన్= వేరు వేరుగా; ఉండవు= ప్రవర్తించవు; అన్యోన్య= ఒకదానితో మరొకటి; సంకలితంబులు+అగుచున్= కలిసిపోయి; పరఁగున్= ఉంటాయి; సంగతత్వమునన్+అ= కలయికవలననే; సంసారయాత్రా ప్రవర్తనంబు+ఒనరించున్= సంసారయాత్ర జరిగిటట్లు చేస్తున్నది; వానిలోనన్= వాటిలో; ఏ+అది= ఏది; మిగులన్= అధికంగా; తోఁపించెన్= ప్రకటితమవుతుందో; తద్+జన్యంబులు= దానినుండి పుట్టిన ఇతరాలు; ఒలయున్= కలుగుతాయి; ఒక్కొక్కమాటు= ఒక్కొక్కసారి; పాయుటయున్= నశించటమూ; కలుగున్= ఉంటుంది; ఎఱుఁగమి= తెలియకపోవటం; అధికంబు+ఐ= అధికంకాగా పుట్టినటువంటి; స్రోతస్సు= ప్రవాహం; తమంబు= తమస్సు; అధోముఖస్రుతి= అధోముఖంగా ప్రవహించేది; రజస్సు(లు)= రజోగుణం (ఇవి రెండూ ఇట్లా ఉంటాయి); ఎఱిఁగినపుడు= జ్ఞానం ఉన్నప్పుడు; మధ్యసరణిన్+నడిమి ప్రవాహంగా; సత్త్వమువృద్ధిపొందన్= సత్త్వం వృద్ధికాగా; ఊర్ధ్వవృత్తిన్ పొందున్= ఊర్ధ్వముఖంగా ప్రవహిస్తుంది; వీనిన్= వీటిని; మును= ముందు; ప్రకారభేదమునన్= వాటి వాటి ప్రకారాలనుబట్టి; ఎఱింగించితిన్= చెప్పాను; అవియున్= అవికూడా; దుస్తరంబులు= దాటటానికి చాలా కష్టమైనవి.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ములారా! ఈ గుణాలు వేరు వేరుగా ప్రవర్తించవు. ఒకదానితో మరొకటి కలిసి ఉంటాయి. వీటి కలయికే సంసార యాత్రను జరిపిస్తున్నాయి. వాటిలో ఏది అధికంగా ప్రకటితమయితే దాని నుండి తక్కినవి పుట్టటమో, లోపించటమో జరుగుతూ ఉంటుంది. అజ్ఞానం పూర్తిగా వ్యాపిస్తే తమం పుట్టుతుంది. అపుడు రజోగుణం మనిషిని

అధోగతికి ఈడుస్తుంది. సత్త్వం ఈ రెంటి నడుమా ఉంటూ పెరిగి ఊర్ధ్వమార్గాన్ని అవలంబిస్తుంది. మునుపే ఈ గుణాలు ఒకదానిలో ఒకటి కలిసి ఏయే విధాలుగా ప్రవర్తిస్తాయో చెప్పాను. వీటిని దాటి మనిషి బయటపడటం అసాధ్యమైన విషయం.

**విశేషం:** ముందు 114వ పద్యంనుండి ఇప్పటిదాకా గుణాల ప్రవృత్తినే వివరిస్తున్నాడు. 116లో వివరంగా ఈ గుణత్రయం ఎట్లా పనిచేస్తుందో వివరించాడు. దీనినే ఇక్కడ మరలా గుర్తు చేస్తున్నాడు.

**క. స్రోత స్సన జీవగమన । హేతు వగు దశా విశేష; మీ గుణమునఁ దా**
**నీ తెరువు నొందు నని కనుఁ । డాతతమతులార! కరణ మగు నది త్రోవన్. 126**

**ప్రతిపదార్థం:** అతతమతులార!= విశాలమైన బుద్ధులున్న ఓ ఋషులారా!; స్రోతస్సు+అనన్= ప్రవాహం అని ఇంతకుముందు చెప్పిన విషయం; జీవగమన హేతువు+అగు= జీవితం సాగటానికి కారణ భూతమైన; దశావిశేషము= ఒక దశ; ఈ గుణమునన్+తాను+ఈ తెరువున్+ఒందును= ఈ గుణాల ప్రభేదంచేత ఆయా మార్గాన్ని పడుతుంది; అది= ఆ ప్రవహమే; త్రోవన్= ఆ బాటలో; కరణము+అగున్= సాధన మవుతుంది.

**తాత్పర్యం:** స్రోతస్సు అంత జీవితం సాగడానికి కారణభూతమైన ఒకానొకదశ. ఈ గుణంతో తానీదారిని పొందుతానని విశాలబుద్ధులారా కనుక్కోండి. దీన్ని త్రోసివేయడమే చేయదగినపని.

**విశేషం:** జీవితగమనం ఒక నదీ ప్రవాహంవంటిదే. అందుకే 'స్రోతస్సు' అనటం. ఎవరెవరి గుణభేదాలనుబట్టి వాడువాడు తన తన జీవితగమన దశలను, దిశలను, మార్గాలను, సాధనాలను వెదుక్కొంటాడు. అన్నిటికీ గుణభేదమే ప్రధానం. ఒకడు సాత్త్వికుడు. భగవదనుగ్రహం పొందాలన్నది ధ్యేయంగా ఉంచుకొంటాడు. (దశ- భక్తినిమార్గంగా ఎంచుకొంటాడు (దిశ)- ఇదే వాడిజీవిత స్రోతస్సు, పూజనో, పురస్కారాన్నో కరణంగా ఎంచుకొంటాడు (సాధనం). ఇట్లాగే తక్కిన గుణాలవారు వారు చేసే పనులను వారే నియంత్రించుకొంటారు. కాని, ఈ త్రిగుణాలూ, బంధహేతువులే అవుతాయి.

**వ. గుణత్రయంబునుం ద్రోచుట మేఁ; లది త్రోవువడునట్టి వితృష్ణత్వంబు లేకుండు నేని. 127**

**ప్రతిపదార్థం:** గుణత్రయంబునున్= ఈ మూడు గుణాలను; త్రోచుట= విసర్జించటం; మేలు= ఉత్తమం; అది; త్రోవు+పడునట్టి= తొలగిపోయేటటువంటి; వితృష్ణత్వంబు= దాహం లేకుండటం; లేకుండును+ఏని= లేకుండా ఉంటే.

**తాత్పర్యం:** ఈ మూడు గుణాలూ విసర్జింపదగినవే. అవి తొలగిపోవాలంటే తృష్ణ (దురాశ) నశించాలి. అది నశించేమార్గం లేకపోతే-(తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సాత్త్వికులకు దివము రజో । మత్త్వ కలిత వర్తనులకు మధ్య భువన వా**
**సత్త్వముఁ దామసులకు నీ । చత్వ కరాధోజగంబు సంప్రాప్త మగున్. 128**

**ప్రతిపదార్థం:** సాత్త్వికులకున్= సత్త్వగుణంతోడి జీవితం గడిపినవారికి; దివమున్= స్వర్గమూ; రజోమత్త్వ+కలిత+వర్తనులకున్= రజోగుణంతో కలిసిన ప్రవృత్తి కలవారికి; మధ్యభువన వాసత్వము= భూలోకవాసం; తామసులకున్= తమోగుణులకు; నీచత్వకర+అధోజగంబున్= నీచత్వాన్ని కలిగించే అధోజగత్తు; సంప్రాప్తము+అగున్= ప్రాప్తం అవుతాయి.

**తాత్పర్యం:** సాత్త్వికులు స్వర్గం, రజోగుణులు భూలోకం. తమోగుణులు నీచమైన నరకాన్ని పొందుతారు.

**విశేషం:** గుణకర్మలు జీవితం ఉన్నపుడు మాత్రమే కాకుండా మరణానంతర జీవితంలో ఫలరూపంలో ప్రవర్తిస్తాయని అర్థం.

**క. ధర్మార్థ కామ గోచర। కర్మములకు సాత్త్వికాదిక ప్రకర వికా**
**రోర్ములు హేతువు లగు; ని। ష్కర్మత కేత దవధూతి గారణము సుఁడీ! 129**

**ప్రతిపదార్థం:** ధర్మ+అర్థ+కామ= ధర్మం, అర్థం, కామం; గోచర= గోచరించే; కర్మములకున్= కర్మలకు; సాత్త్విక+ఆదిక ప్రకర= సాత్త్వికం మొదలైన గుణ సమూహరూపమైన; వికార+ఊర్ములు= వికారా లనబడే అలలు; హేతువులు+అగున్= కారణాలు; అవుతాయి; నిష్కర్మతకున్= నిష్కర్మతను సాధించాలంటే; ఏతద్= ఈ అలలను; అవధూతి= ఎగరకొట్టటం; కారణము= కారణం; చుఁడీ!= సుమండీ!

**తాత్పర్యం:** ధర్మార్థ కామాలు ప్రకటమయ్యే కర్మలకు కారణం సాత్త్విక రాజస తామసాది గుణ సమూహంలో పుట్టే వికారాలు అనబడే అలలే. నిష్కర్మతను సాధించాలంటే ఈ అలలను ఎగరకొట్టాలి. అనగా వికారాలను అతిశయించిన గుణసమతను తద్ద్వారా నిర్గుణతను సాధించాలని అర్థం.

**క. క్రమమునఁ బ్రాణంబు నపా। నము సత్త్వంబును రజస్సు నాకుం జూడన్**
**యమివరులార! యుదానము। దమ మిట్టుల శ్రుతియు సువిదితంబుగఁ జెప్పున్. 130**

**ప్రతిపదార్థం:** క్రమమునన్= క్రమపద్ధతిలో; ప్రాణంబు= ప్రాణవాయువు; సత్త్వంబును= సత్త్వం; అపానము= అపానవాయువు; రజస్సు= రజోగుణం; యమివరులార!= ఋషి శ్రేష్ఠులారా!; నాకున్+చూడన్= నాకు చూడగా; ఉదానము= ఉదానమే; తమము= తమోగుణం; శ్రుతియున్= వేదం; ఇట్టులన్= ఇదే విధంగా; సువిదితంబుగన్= స్పష్టంగా; చెప్పున్= చెప్పుతున్నది.

**తాత్పర్యం:** క్రమంగా ప్రాణమే సత్త్వం, అపానమే రజస్సు, తమమే ఉదానం, వేదమూ ఇట్లాగే చెప్పుతున్నది.

**క. జపమును దానము యజ్ఞముఁ। దపమును గర్తృజన చిత్తదశలును సత్త్వా**
**ద్యుపహితము లగుట నడచుం। ద్రిపథంబుల సాత్త్వికపు గతియ మే లెందున్. 131**

**ప్రతిపదార్థం:** జపమును= జపమూ; దానమున్= దానమూ; యజ్ఞమున్= యజ్ఞమూ; తపమునున్= తపస్సూ; కర్తృజన చిత్త దశలునున్= పనిచేసేవారి మనస్సులూ; సత్త్వ+ఆది+ఉపహితములు+అగుట= సత్త్వము మొదలైన త్రిగుణాలకింద అణగిఉండటం; త్రిపథంబులన్= మూడు దారులలోనూ; నడచున్= నడుస్తాయి; ఎందున్= ఎప్పుడైనా; సాత్త్వికపు గతియ= సాత్త్వికమైన గమనమే; మేలు= శ్రేష్ఠమైనది.

**తాత్పర్యం:** జపం, దానం, యజ్ఞం, తపస్సు చేసేవారి మనస్సులు సత్త్వాది గుణాలచేత ప్రేరణ పొందినపుడు అవి మూడు దారులలోనే నడుస్తాయి. కాని, ఈ దారులలో సాత్త్వికమే ఉత్తమమైనది.

**క. వినుఁ డెక్కువ తక్కువ లే। క నయము నెనసిన గుణత్రయంబును జూరే**
**వినుతా వ్యక్తం బనఁగాఁ। జను తత్త్వము శివ మచలము శాశ్వత మరయున్. 132**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; ఎక్కువ; తక్కువ; లేక= లేకుండా; అనయమున్= ఎల్లప్పుడూ; ఎనసిన= కలిసిన; గుణత్రయంబును= గుణత్రయం; వినుత= గొప్పదైన; అవ్యక్తంబు+అనఁగాన్= అవ్యక్తం అని చనుతత్త్వము= పిలువబడే తత్త్వం; అరయన్= బాగా చూస్తే (అది); శివము= శుభప్రదం; అచలము= చలనం లేనిది; శాశ్వతము= శాశ్వతమైనది; చూరే= చూడరే (సుడీ!);

**తాత్పర్యం:** ఋషులారా! వినండి. ఎక్కువ తక్కువ లేక ఎల్లప్పుడూ కలిసిన గుణత్రయమే "అవ్యక్త" అని ప్రసిద్ధమైన మహాతత్త్వం. అది శుభప్రదం, చలనం లేనిది. శాశ్వత మైనది కూడా సుమండీ!

**క. సదసత్ప్రకార నిత్యం । బది; దాని తెఱం గెఱుంగు నాతఁడు విజ్ఞా**
**నదళావధూత గుణుఁడై । యదీనగతిఁ బొందఁగను నిరామయపదమున్.' 133**

**ప్రతిపదార్థం:** అది= ఆ అవ్యక్తపదం; సత్+అసత్+ప్రకార నిత్యంబు= సత్తుకు అసత్తుకు అతీతమైన నిత్యతత్త్వం; దాని తెఱంగు= దాని పద్ధతి; ఎఱుంగు+అతఁడు= తెలిసినవాడు; విజ్ఞాన+దళ+అవధూత+గుణుఁడు+ఐ= విజ్ఞానమనే దళంచేత పరిశుభ్రంచేయబడిన; గుణాలు కలవాడై; అదీనగతిన్= ఏ ఆర్తిపాలూ కాకుండా; నిరామయ పదమున్= ఏ లోపమూ లేని మోక్షస్థానాన్ని; పొందన్+కనున్= పొందగలుగుతాడు.

**తాత్పర్యం:** ఆ అవ్యక్తపదం సత్తు, అసత్తులకు అతీతమైన నిత్యతత్త్వం. దాని తత్త్వం తెలిసినవాడు విజ్ఞానంచేత పవిత్రుడై గుణత్రయానికి అతీతుడై ఏ కొరతా లేని శాశ్వతమైన మోక్షస్థానాన్ని సులభంగా పొందగలుగుతాడు.

**వ. అని యుపదేశించి వివరించి వెండియు. 134**

**తాత్పర్యం:** అని విరించి ఉపదేశంచేసి వివరించినవాడై మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం.)

మనోబుద్ధ్యహంకారాది తత్త్వప్రకారము (సం. 14-40-1)

**సీ. 'అవ్యక్తముననను మహత్తత్త్వ ముదయించు । నది బుద్ధిమతి ధృతిఖ్యాతి సంవి**
**దుపలబ్ధి నామంబు వొంది యెందును గని । విని చని కావించి విభుత నొప్పుఁ;**
**దాన నహంకార తత్త్వంబునకుఁ గల్గుఁ ; బ్రభవంబు; వినుఁడు! తద్భావితాత్మ**
**కంబై ప్రవర్తించుఁ గార్యనీతుల లోక । మఖిలంబు; వర్ణత్రయ ప్రజనితు**

**తే. లధ్యయనమును వ్రతమును నధ్వరంబుఁ । దపము మొదలైన క్రియ; లందుఁ దగిలి నడచు**
**టెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియ తెల్ల మింత । జగము రంజిల్లు దాని తేజంబువలన. 135**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఋషులారా వినండి; అవ్యక్తముననను= అవ్యక్తంలో; మహత్+తత్త్వము+ఉదయించున్= మహత్తు అనే తత్త్వం పుడుతుంది; అది= ఆ మహత్తు; బుద్ధి, మతి, ధృతి, ఖ్యాతి, సంవిత్తు, ఉపలబ్ధి నామంబులు+ఒంది= అనే పేర్లు కలిగి; ఎందునున్= సర్వత్రా; కని= చూడటం; విని= వినటం; చని= వెళ్ళటం; కావించి= పనిచేయటం; విభుతన్= అధికారంతో; ఒప్పున్= ప్రకాశిస్తుంది; దానన్= దానినుండి; అహంకార తత్త్వంబునకున్= అహంకారమనబడే తత్త్వానికి; ప్రభవంబు= పుట్టుక; కల్గున్= కలుగుతుంది; తద్+భావిత+ఆత్మకంబు+ఐ= ఆ అహంకారభావం ఆత్మగా కలిగి (ఆ అహంకారంతోనే); లోకము

అఖిలంబున్= ఈలోకమంతా; కార్యనీతులన్= కర్మవిధులలో; ప్రవర్తించున్= ప్రవర్తిస్తుంది; తద్+వ్యాప్తిన్+చేసి+అ= ఆ అహంకార ప్రభావంవలననే; వర్ణత్రయ ప్రజనితులు= మూడు వర్ణాలలో పుట్టినవారూ; అధ్యయనమును= వేదాది అధ్యయనాన్ని; వ్రతమునున్= దీక్షను; అధ్వరంబున్= యాగాన్ని; తపము మొదలైన క్రియలందున్+తగిలి= తపస్సు మొదలైన పనులలో మగ్నులై; నడచుట ఎల్లన్= నడపటం అంతా; ఇంత+తెల్లము= ఇది స్పష్టం; దాని తేజంబువలనన్= దాని కాంతివలననే; జగము రంజిల్లున్= ప్రపంచం ప్రకాశిస్తున్నది.

**తాత్పర్యం:** ఋషులారా! వినండి! ఆ అవ్యక్తంలో మహత్తు పుట్టుతుంది. ఆ మహత్తునే బుద్ధి, మతి, ధృతి, సంవిత్తు, ఉపలబ్ధి అనే పేర్లతో పిలుస్తారు. సృష్టిలో జరిగే అన్ని పనులను చేసేది, చూసేది, వినేది, జరిపేది అదే. అందుకే అది సృష్టికి ప్రభువు. దానినుండి అహంకార తత్త్వం పుట్టుతుంది. ఈ లోకం కర్మరీతులలో ఇన్ని విధాలుగా ప్రవర్తించటానికి ఈ అహంకార భావనే మూలం. మూడువర్ణాలలో- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో పుట్టినవారు చేసే అధ్యయన, వ్రత, యజ్ఞ తపస్సులన్నీ ఈ అహంకారంచేతనే అనటం స్పష్టం. ఈ లోకంలోని ఆకర్షణ అంతా ఈ అహంకారతత్త్వ మహిమే.

**క. వినుఁ డా తత్త్వంబున సం। జనితము లగు మేదినియును జలమును దేజం**
**బును వాయువు నాకాశము। ననఁగ మహాభూతములు నిరతిశయ మహిమన్. 136**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఈ అహంకార మనే తత్త్వం ఇంకా ఏం చేస్తుందో వినండి; ఆ తత్త్వంబునన్= ఆ అహంకారంలో; మేదినియును= భూమి; జలమును= నీరు; తేజంబును= అగ్ని; వాయువున్= గాలి; ఆకాశము; అనఁగన్= అని పేర్లు గల; మహాభూతములు= పంచ మహాభూతాలు; (దాని); నిరతిశయ= గొప్ప; మహిమన్= ప్రభావంచేత; సంజనితములు+అగున్= పుట్టుతున్నాయి.

**తాత్పర్యం:** ఈ అహంకారం అనే తత్త్వానికున్న అపారమైన ప్రభావంచేతనే పృథివ్యాపస్తే జోవాయు రాకాశా లనబడే పంచమహాభూతాలు పుట్టుతున్నాయి.

**తే. తద్గుణంబులు సూరె గంధంబు రసము। రూప సంస్పర్శ శబ్దముల్ రూఢ భంగిఁ**
**బరఁగు నివ్విషయముల పాల్పడ్డ మనసు। గలుగు జంతువు మోహాంధకార మొందు. 137**

**ప్రతిపదార్థం:** తద్+గుణంబులు= ఆ మహాభూతాల గుణాలే; చూరె!= సుమండీ!; గంధంబు= వాసన (పృథ్వి); రసము= రసం; రూపం; సంస్పర్శ= తాకిడి; శబ్దముల్= శబ్దము; రూఢభంగిన్= ఆయాభూతాలనుండి పుట్టినవిగా; పరఁగున్= ప్రవర్తిస్తాయి; ఈ+విషయములన్= ఈగుణజన్యమైన సుఖాలలో; పాల్పడ్డ+మనసు+కలుగు+జంతువు= తగులుకొన్న మనసున్న ప్రాణి; మోహ+అంధకారము= మోహమనే చీకటిని; పొందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** ఆ భూతాల గుణాలే గంధ, రస, రూప, స్పర్శ, శబ్దాలు అనబడేవి. ఈ గుణాలనుండి కలిగే విషయ (ఇంద్రియ) సుఖాలలో ఏ ప్రాణి మనస్సు తగులుకొంటుందో అది మోహం అనే చీకటిలో మునిగిపోతుంది.

**విశేషం:** జ్ఞానానికి వివేకం, అజ్ఞానానికి మోహం ప్రధాన ధర్మాలుగా గుర్తించాలి.

క. దీన సకల జంతువులును। లీనము లగుచుండుఁ దమ యలీన స్మృతి ధై
ర్యానూనం బగు నిర్మల। మానసములఁ బొరయనీరు మహితార్యజనుల్. **138**

**ప్రతిపదార్థం:** దీనన్= ఈ మోహాంధకారంలో; సకలజంతువులునున్= అన్ని ప్రాణులూ; లీనములు+అగుచున్+ఉండున్= పడిపోతూ ఉంటాయి; మహిత+ఆర్యజనుల్= గొప్పవారైన పుణ్యాత్ములు (జ్ఞానులు); తమ= తమవైన; అలీన= మునగని; స్మృతి+ధైర్య+ అనూనంబు+అగు= ఆత్మ స్మరణవలన, ధృతివలన కలిగిన స్థిరత్వంతో కూడుకొన్న; నిర్మల మానసములన్= నిర్మలమైన మనస్సులను; పొరయవీరు= ఈ మోహంలో పడనీయరు.

**తాత్పర్యం:** సాధారణంగా ప్రాణాలన్నీ ఈ మోహాంధకారంలో కూరుకొనిపోతాయి. బయటికి రాజాలవు. పుణ్యాత్ములైన జ్ఞానులు తమ నిస్సంగమైన మనస్సులతో ఆత్మ స్మృతివలన లభించిన ధైర్యంతో స్థిరంగా నిలిచి ఆ మోహంలో పడకుండా బయటపడతారు.

క. విషయంబులు నశ్వరములు। విష సన్నిభములు సమగ్ర వికృత జనకముల్
ధిషణాగుణముల నెల్లఁ గ। లుషములుగాఁ జేయు మోహలోభకరము లై. **139**

**ప్రతిపదార్థం:** విషయంబులు= విషయసుఖాలు; నశ్వరములు= అశాశ్వతాలైనవి; విషసన్నిభములు= విషతుల్యాలు; సమగ్ర= మిక్కిలి; వికృత జనకముల్= వికారాలను కలిగిస్తాయి; మోహ లోభకరములు+ఐ= మోహాన్ని; లోభాన్ని పుట్టించి; దిషణాగుణములన్+ ఎల్లన్= బుద్ధికి సంబంధించిన మంచి ఆలోచనలను అన్నిటినీ; కలుషములుగాన్+చేయున్= పక్కదారి పట్టించి పాప సంకలితాలు చేస్తాయి.

**తాత్పర్యం:** విషయసుఖాలు అశాశ్వతాలు, విషతుల్యాలు, అన్ని వికారాలకు మూలమవుతాయి. మోహాన్ని లోభాన్ని కలిగిస్తాయి. సదాలోచనలను దురాలోచనలుగా మార్చి మనిషిని పాపంలో తోస్తాయి.

ఆ. మాంసశోణితాస్థిమయ శరీరంబులఁ। దారు గాఁగ లగ్గ తలఁచునట్టి
కృపణజనులు వీని కీడు గానఁగ లేక। చిక్కి చెడుదు; రింత నిక్కువంబు. **140**

**ప్రతిపదార్థం:** మాంస= మాంసంతోనూ; శోణిత= రక్తంతోనూ; అస్థిమయ= ఎముకలతోనూ కూడిన; శరీరంబులన్= దేహాలను; తారు+కాఁగన్= తాము అని; లగ్గ తలఁచునట్టి= మిక్కిలిగా భావించే; కృపణ జనులు= దీన జనులు; వీని= ఈ అవయవాల; కీడు= అపాయం; కానఁగలేక= చూడలేక; చిక్కి= మోహబంధంలో చిక్కుకొని; చెడుదురు= పాడైపోతారు; ఇంత= ఇది; నిక్కువంబు= నిజం.

**తాత్పర్యం:** మాంస, రక్త, అస్థిమయమైన ఈ శరీరాలనే తా మనుకొనే నీచమానవులు ఈ అవయవాలవలన (ఇంద్రియ సుఖాలవలన) కలిగే మోహబంధాన్ని గుర్తించలేక, అందులోనే కూరుకుపోయి నశిస్తారు. ఇంతమాత్రం నిజం.

వ. పండితులు వీని చేతం జెడ' రని పలికి పద్మసంభవుండు వెండియు. **141**

**తాత్పర్యం:** పండితులైనవారు ఈ ఇంద్రియ సుఖాలచేత చెడిపోరని చెప్పి బ్రహ్మదేవుడు మరలా (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇక్కడ పండితులంటే జ్ఞానులని అర్థం. శాస్త్రజ్ఞానాన్ని 'పండ' అంటారు. అది కలిగినవాడు పండితుడు.

**తే.** **అంతరాత్మ యనంగఁ బ్రాణాది పంచ। కమును వాఙ్మనోబుద్ధులుఁగా నిరూఢి**
**గలుగు నీ యష్టకంబు లోకమున కెల్లఁ। దా నుపాదాన కారణత్వము వహించు.** **142**

**ప్రతిపదార్థం:** అంతరాత్మ+అనంగన్= అంతరాత్మ అనే పేరుతో; ప్రాణాదిపంచకమునున్= పంచప్రాణాలు; వాక్+మనస్+బుద్ధులుగాన్= వాక్కు, మనస్సు, బుద్ధి అనే ఈ మూడు (5+3) పేర్లతో; నిరూఢి+కలుగు+ఈ+అష్టకంబు= ప్రసిద్ధిగల ఈ ఎనిమిది; లోకమునకెల్లన్= లోకానికంతా; తాను= ఈ అంతరాత్మ; ఉపాదాన కారణత్వము+వహించున్= సమవాయి కారణం అవుతుంది.

**తాత్పర్యం:** పంచప్రాణాలు, వాక్కు, మనస్సు, బుద్ధి అనే ఈ ఎనిమిది కలిసి 'అంతరాత్మ' అని పేరుపొంది ఈ లోకానికి ఉపాదానకారణం అవుతున్నది.

**విశేషం:** 'కుండ' తయారుచేయటానికి మన్ను ఉపాదాన కారణం అని తర్కశాస్త్రం వివరిస్తున్నది. ఈ లోకం ఏర్పడటానికి అట్లా ప్రాణాదులు కారణాలు అవుతున్నాయి. అందుకే 'ఆత్మ' ఉపాదాన కారణమని చెప్తున్నారు.

**వ.** **ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిదానంబు.** **143**

**తాత్పర్యం:** ఈ విధంగా దర్శించటం జ్ఞానానికి మూలకారణమవుతుంది.

**సీ.** **వినుఁ డహంకార సంజనితంబు లగు చక్షు। రాదిక బుద్ధీంద్రియములుఁ బాద**
**ముఖ్యకర్మేంద్రియములను మనంబునకు। నేకాదశేంద్రియానీక మీక**
**డింది సందడిఁ బడి కుందక యందేది। యింపేనిఁ దనవంక కీడ్వఁ జాలు**
**బుద్ధితత్త్వము గల్గు శుద్ధాత్మకుఁడు పర। తత్త్వంబు గనుటకుఁ దా వలంతి**

**తే.** **యని యెఱింగించి మఱియు నిట్లను నజుండు। స్వేదముద్భేద మండ మన్వీనఁ బుట్టు**
**నధమ మధ్యమోత్తమ దశలైన భూత। రాసు లత్యుత్తమములు జరాయుజములు.** **144**

**ప్రతిపదార్థం:** వినుఁడు= భూతరాసుల ఉత్పత్తి వినండి; అహంకార= మహత్తునుండి పుట్టిన అహంకారం నుండి; సంజనితంబులు+అగు= పుట్టిన; చక్షుస్+ఆదిక= కన్నులు మొదలైన; బుద్ధి+ఇంద్రియములున్= జ్ఞానేంద్రియాలు; పాదముఖ్య= పాదాలు మొదలైన; కర్మేంద్రియములను; మనంబును= మనస్సు; ఏకాదశ+ఇంద్రియ+అనీకము= అన్నవి పదకొండు ఇంద్రియాల సమూహం; కడింది సందడిన్= మిక్కిలి అయిన సందడిలో; పడి= పడిపోయిన; కుందక= దుఃఖించక; అందున్+ఏది= వాటిలో ఏది; ఇంపు+ఏనిన్= ఇష్టమైతే; తనవంకకున్= తన వైపునకు; ఈడ్వన్+చాలు= లాగ కలిగిన; బుద్ధితత్త్వము+కల్గు= బుద్ధి తత్త్వం కలిగిన; శుద్ధాత్మకుడు= పరిశుద్ధమైన ఆత్మ ద్రవ్యం ఉన్నవాడు; పరతత్త్వంబున్+కనుటకున్= పరతత్త్వాన్ని దర్శించటానికి; తాన్+వలంతి= తాను సమర్థుడు; అని; ఎఱింగించి= తెలిపి; అజుఁడు= బ్రహ్మ; మఱియున్+ఇట్లు+అనున్= ఇంకా ఇట్లా అన్నాడు; స్వేదము= చెమటనుండి; ఉద్భేదము= నేలను చీల్చుకొని బయటికి రావటం; అండము= గుడ్డునుండి; అన్+వీనన్= అనే ఈ మూడు రీతులలో; అధమ, మధ్యమ, ఉత్తమ దశలు+ఐన= అధమ, మధ్యమం ఉత్తమం అని చెప్పదగ్గ దశలు కలిగిన; భూతరాసులు= ప్రాణిసమూహాలు; పుట్టున్= జన్మిస్తాయి; జరాయుజములు= మావివలన జన్మించేవి; అతి+ఉత్తమములు= మిక్కిలి శ్రేష్ఠాలు.

**తాత్పర్యం:** అని తెలిపి బ్రహ్మ ఇంకా ఇట్లా అన్నాడు. స్వేదం నుండి నేలనుండి గ్రుడ్డునుండి అధమ మధ్యమ ఉత్తమదశలుగల జీవరాసులు పుట్టుతాయి. జరాయుజములు మిక్కిలి ఉత్తమమైనవి.

**వ. భూత తారతమ్య జ్ఞానంబు మాననీయం బగుట నిట్లు సెప్పితి; నధ్యాత్మాదులం జెప్పెదఁ; దద్వేదిత్వంబు విద్యామూలంబై యుండు; నవధానంబుతో వినుండు. 145**

**ప్రతిపదార్థం:** భూత= ప్రాణులలోని; తారతమ్యజ్ఞానంబు= ఎక్కువ తక్కువ తనాలను గురించిన తెలివిడి; మాననీయంబు+అగుటన్= ప్రశస్తమైనది కాబట్టి; ఇట్లు+చెప్పితిన్= ఇట్లా చెప్పాను; అధ్యాత్మాదులన్+చెప్పెదన్= ఆత్మను ఆశ్రయించినవాటిని గురించి చెప్పుతాను; తద్+వేదిత్వంబు= ఆత్మను గురించి తెలిసికొనటం; విద్యామూలంబు+ఐ+ఉండున్= విద్యద్వారా సాధ్యం; అవధానంబుతోన్ వినుండు= ఏకాగ్ర చిత్తంతో వినండి.

**తాత్పర్యం:** ప్రాణరాశిలోని ఉత్తమ మధ్యమాది భేదాలనుగురించి తెలియటం చాలా ముఖ్యం కాబట్టి ఇట్లా చెప్పాను. ఇక అధ్యాత్మ విషయాలను ప్రస్తావిస్తాను. దానిని గురించి తెలిసికొనటం విద్యద్వారా మాత్రమే సాధ్యం. జాగ్రత్తగా వినండి.

**విశేషం:** ప్రకృతిని గురించిన లౌకిక పరిజ్ఞానమంతా 'అవిద్య' అని, ఆత్మను గురించిన వేదోపనిషద్విద్య మాత్రమే 'విద్య' అని అది జ్ఞానరూపమని బంధ వినిర్ముక్తిహేతువని భారత సంప్రదాయం చెప్పుతున్నది.

**క. అంబరమాది యనిల తే। జోంబుధరలు వరుసతోడ నగుఁ జూరె ద్వితీ**
**యంబుఁ దృతీయంబుఁ జతు। ర్థంబును బంచమము భూతతతి యట్లుండున్. 146**

**ప్రతిపదార్థం:** అంబరము+అది= ఆకాశం మొదటిది; అనిల= వాయువు; తేజస్= అగ్ని; అంబు= నీరు; ధర+లు= భూమి (ఇవి); వరుసతోడన్= వరుసగా; ద్వితీయంబు= రెండవది; తృతీయంబు= మూడవది; చతుర్థంబును= నాలుగవది; పంచమమున్= ఐదవది; అగున్+చూరె= అవుతాయి సుమండీ!; భూతతతి= భూతరాశి; అట్లు+ఉండున్= అట్లా ఉంటుంది.

**తాత్పర్యం:** పంచభూతాల వరుస గురించి చెప్పుతున్నాడు. మొదటిది ఆకాశం, రెండవది వాయువు, మూడవది అగ్ని, నాలుగవది నీరు, ఐదవది భూమి. భూతరాశి ఇట్లా ఏర్పడింది.

**విశేషం:** ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, ఆపః పృథివీ - అని ప్రాచీన సంప్రదాయంలో చెప్పారు.

**వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబుల ము న్నుపన్యసించితి. 147**

**ప్రతిపదార్థం:** అధ్యాత్మాదులు భూతాలను ఆశ్రయించి ఉంటాయి. కాబట్టి భూతాలను గురించి ముందు చెప్పాను.

**సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూరె శబ్దం బధి। భూతంబు దిశలు ప్రబుద్ధులార!**
**యధిదైవతము చర్మమధ్యాత్మ మందలి। సంస్పర్శ మధిభూత సంజ్ఞకంబు;**
**దానికి నధిదైవతంబు విద్యుత్తు; నే। త్రంబు దా నధ్యాత్మకంబు రూప**
**మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ। యధ్యాత్మకము రస మారయంగ**

**తే.** **దాని యధిభూత ముడుపతి తదధిదైవ। తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ**
**మంచితాధిభూతము దదీయాధిదైవ। తంబు మారుత మండ్రు విద్వజ్జనములు.** **148**

**ప్రతిపదార్థం:** శ్రోత్రము= చెవి; అధ్యాత్మంబు+చూరె= అధ్యాత్మం సుడీ!; ప్రబుద్ధులార!= ఓ జ్ఞానులారా!; అధిభూతంబు= అధిభూతం; దిశలు= దిక్కులు (అధిదైవతము); చర్మము; అధ్యాత్మము; అందలి= చర్మంలోని సంస్పర్శ= తాకుడు లక్షణం; అధిభూతసంజ్ఞకంబు= అధి భూతం; దానికి అధిదైవతంబు= అధి దైవతం; విద్యుత్తు= మెరుపు; నేత్రంబు+తాన్= కన్ను; అధ్యాత్మకంబు; రూపము; అధిభూతము= అధిదైవతము; ఆదిత్యుఁడు= సూర్యుడు, జిహ్వ= నోరు; అధ్యాత్మికము= దాని అధిభూతము+అరయంగన్+రసము= దాని అధిభూతం రసం; తద్+అధిదైవతంబు+ఉడుపతి= చంద్రుడు దానికి అధిదైవతం; ఘ్రాణము= ముక్కు; అధ్యాత్మంబు; తలఁపన్= ఆలోచించగా; గంధము+అంచిత+అధిభూతము= దాని అధిభూతమే గంధం; తదీయ+అధిదైవతంబు మారుతము= దాని అధిదైవతం వాయువు అని; విద్వజ్జనములు= పండితులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ఓ జ్ఞానులారా! వినండి అధ్యాత్మ, అధిభూత, అదిదైవతాలని మూడు తీరులుగా భూతరాశి ప్రకృతితో సంబంధం కలిగి అధ్యాత్మ విద్యామూలంగా మారుతున్నది.

| అధ్యాత్మము | అధిభూతము | అధిదైవతము |
|---|---|---|
| చెవి | శబ్దం | దిక్కు |
| చర్మం | స్పర్శ | విద్యుత్తు |
| కన్ను | రూపం | సూర్యుడు |
| నోరు | రసం | చంద్రుడు |
| ముక్కు | గంధం | వాయువు |

'విద్య' అనగా ఈ జ్ఞానేంద్రియాలకు, పంచభూతాల గుణాలకు, అధిదైవతాలైన సూర్యచంద్రాదులు ఉన్నారని గుర్తించటమే. దైవత, భూత, ఆత్మ, సంజ్ఞలచేత తెలిసే విషయం ఏమిటంటే ప్రత్యవయవం పనిని నిర్దేశించి నడి పించే దైవశక్తి కలదని. దానినే 'ఆత్మ' జ్ఞానమంటాం.

**వ.** **ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు.** **149**

**తాత్పర్యం:** ఇది జ్ఞానేంద్రియప్రపంచస్వరూపం.

**సీ.** **పాదపాయూపస్థ పాణి వాగ్వర్గంబు। కర్మేంద్రియములు సత్కర్ములార!**
**యధ్యాత్మములు వాని కగు నధిభూతముల్। గంతవ్యమును విసర్గమును శుక్ర**
**మును గ్రమవృత్తిమై వినుఁడు కర్తవ్య వ। క్తవ్యంబులును నధిదైవతములు**
**బభ్రుమిత్ర ప్రజాపతి శక్రవహ్నులు। మఱి యహంకారంబు మనసు బుద్ధి**

**తే.** **పూజితాధ్యాత్మకము లధిభూత వృత్తి। వెలయు నభిమాన మంతవ్యములును నిశ్చ**
**యంబు నధిదైవతము రుద్రుఁ డమృత కరుఁడు। బ్రహ్మమిది వేద వాక్య నిర్ణయము తెఱఁగు.** **150**

**ప్రతిపదార్థం:** సత్కర్ములార!= పుణ్య కర్ములైన ఋషులారా!; వినుఁడు= వినండి; పాద; పాయు= గుదం; ఉపస్థ= జననావయం; పాణి= చేయి; వాక్కు= నాలుక; కర్మ+ఇంద్రియములు= కర్మేంద్రియాలు అధ్యాత్మములు; వానికిన్+అగు= వాటికి సంబంధించిన అధిభూతముల్= అధిభూతాలు; క్రమవృత్తిమైన్= క్రమంగా; గంతవ్యము= వెళ్ళదగినది; విసర్గమును= విసర్జనం; శుక్రమును= వీర్యం; కర్తవ్య= పనిచేయటం; వక్తవ్యంబులును= మాటాడదగినది; వీటి అధిదైవతములు; బభ్రు= బభ్రువు; మిత్ర= సూర్యుడు; ప్రజాపతి; శక్ర= ఇంద్రుడు; వహ్నులు= అగ్ని; మఱి= ఇంకా; అహంకారంబు= అహంకారం; మనస్సు= బుద్ధి (ఇవి); పూజిత+అధ్యాత్మకములు= మహనీయమైన అధ్యాత్మకాలు; అభిమాన= అభిమానం; మంతవ్యములు= ఆలోచించదగినవి; నిశ్చయంబు= తెలిసి నిర్ణయించగలిగినది; అధిభూతములు= అధి భూతాలు; రుద్రుఁడు= శివుడు; అమృతకరుఁడు= చంద్రుడు; బ్రహ్మము; అధిదైవతములు; ఇది వేదవాక్య నిర్ణయము తెఱఁగు= వేదవాక్యాలు నిర్ణయించిన విధానం.

**తాత్పర్యం:** పుణ్యకర్ములారా! వినండి. అధ్యాత్మకాలైన కర్మేంద్రియాలైన పాదాదులకు కూడా గంతవ్యాది అధిభూతాలూ, బభ్రుమిత్రాది అధిదైవతాలు ఉన్నాయి. అహంకారాదులకు కూడా ఇంతే.

| | అధ్యాత్మము | అధిభూతము | అధిదైవతము |
|---|---|---|---|
| కర్మేంద్రియాలు | వాక్కు | మాటాడటం | అగ్ని |
| | పాణి | పనిచేయటం | శక్రుడు |
| | పాదం | వెళ్ళదగింది | బభ్రు |
| | పాయు | విసర్జనం | మిత్రుడు |
| | ఉపస్థ | శుక్రం | ప్రజాపతి |
| | అహంకారం | అభిమానం | రుద్రుడు |
| | మనస్సు | ఆలోచించటం | చంద్రుడు |
| | బుద్ధి | తెలిసికొనటం | బ్రహ్మం |

కర్మేంద్రియాలు చేసే పనులకు మాత్రమే కాకుండా అహంకారాది అంతర వ్యాపారాలకు కూడా అధిదైవతాలు ఉన్నారని తెలిసికొనటం ద్వారా మనిషి కర్తృత్వభావనను ఎట్లా తొలగించుకొనవచ్చునో తరువాత వివరిస్తున్నారు.

**ఆ. ఇట్లు తెలియ నెఱిఁగి యింద్రియంబుల నింద్రి। యార్థములను భూతసార్థమును దె**
**మల్చి చిట్లకుండ మనసున నొదిఁగించు। టనఘులార! భవనిరాసనంబు.' 151**

**ప్రతిపదార్థం:** అనఘులార!= పుణ్యాత్ములారా!; ఇట్లు= ఈ విధంగా; తెలియన్+ఎఱిఁగి= తెలిసికొని; ఇంద్రియంబులను= ఇంద్రియాలను; ఇంద్రియ+అర్థములను= ఇంద్రియ ప్రయోజనాలను; భూతసార్థమును= భూతసమూహాన్ని; తెమల్చి= పైకిలాగి; చిట్లకుండ= విడిపోకుండ; మనసునన్= మనస్సులో; ఒదిఁగించుట= దాచుట; భవవిరాసనంబు= పుట్టుకను జయించుట (మోక్షం పొందుట).

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! ఈ విధంగా జ్ఞానం పొంది ఇంద్రియాలను, వాటి విషయాలను, భూతసముదాయాన్నీ పైకితీసి, చెదరిపోకుండా మనస్సులో కుదుటపరచుకొనటమే పుట్టుకను లేకుండా చేసికొనే మోక్షమార్గం.'

**వ. అని నిర్దేశించి నీరజాసనుం డా సంయమివరులతో 'సూక్ష్మ భావత్వ సంపాదినియు శివయు నగు నివృత్తి తెఱం గెఱింగించెద' నను మాట మున్నాడి యిట్లనియె. 152**

**ప్రతిపదార్థం:** అని నిర్దేశించి= అని ఉపదేశించి; నీరజాసనుండు= బ్రహ్మ; ఆ సంయమి వరులతోన్= ఆ ఋషి శ్రేష్ఠులతో; సూక్ష్మభావత్వ సంపాదినియున్= ఆత్మ రహస్య భావాన్ని సంపాదించేది; శివయున్+అగు= శుభప్రదము అయినటువంటి; నివృత్తి తెఱంగు= నివృత్తి పద్ధతిని; ఎఱింగించెదన్= చెప్పుతాను; అనుమాటన్= అని; మున్నాడి= ముందుగా చెప్పి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ఉపదేశించి బ్రహ్మదేవుడు ఆ ఋషులను చూచి 'ఆత్మరహస్య భావాన్ని సంపాదించటానికి శ్రేయోరూపమైన శుభాన్ని అందుకొనటానికి మూలమైన నివృత్తి పద్ధతిని బోధిస్తా' నని ఇట్లా చెప్పాడు.

**సీ. 'కమఠంబు దన యంగకముల నెట్లట్లు। కామముల విద్వాంసుండు మరలఁ దివుచుఁ;**
**గామంబుల మరల్పఁగా నోపు ధీరుండు। విరజస్కుఁడై ముక్తి తెరువు గాంచు;**
**నింద్రియంబులు పదియింటిని గుదియించు। టెక్కుడు వెర వది యింధనముగ**
**నాత్మాగ్ని వెలుఁగు; భూతావలి నాత్మఁ గాం। చిన సూక్ష్మ తత్త్వ దర్శనము గలుగు;**

**తే. భూత పంచక జలధి రోగాతిశోక। సహిత భోగలవాంశ కాశ్రయము దీని**
**విభులు గాముండుఁ గ్రోధుండు; వీరి గెల్వ। వచ్చునప్పుడ యది గడవంగ వచ్చు. 153**

**ప్రతిపదార్థం:** కమఠంబు= తాబేలు; తన అంగకములన్+ఎట్లు= తన అవయవాలను ఎట్లా (లోపలికి లాక్కుంటుందో); అట్లు= ఆ విధంగా; కామములన్= కోరికలను; విద్వాంసుండు= పండితుడు; మరలన్+తివుచున్= వెనక్కి తిప్పుకొంటాడు; కామంబులన్= కోరికలను; మరల్పఁగాన్+ఓవు+ధీరుండు= (కోరికలను) వెనక్కి తిప్పుకొనగలిగిన ధీరుడు; విరజస్కుఁడు+ఐ= రజోగుణం లేనివాడై; ముక్తి+తెరువున్+కాంచున్= ముక్తిమార్గాన్ని అందుకొనగలుగుతాడు; ఇంద్రియంబులు పదియింటిని= పది ఇంద్రియాలనూ; కుదియించుట= నియమంచటం; ఎక్కుడు+వెరవు= గొప్ప పద్ధతి; అది= ఆ ఇంద్రియ సముదాయమే; ఇంధనముగన్= సమిధలుగా; ఆత్మ+అగ్ని+వెలుఁగున్= ఆత్మ అనే అగ్ని ప్రకాశిస్తుంది; భూత+ఆవలిన్+ఆత్మన్+కాంచిన= ఆత్మలో భూతావళిని దర్శించటం ప్రారంభిస్తే; సూక్ష్మ తత్త్వదర్శనము కలుగున్= అతి సూక్ష్మమైన తత్త్వదర్శనం కలుగుతుంది; భూతపంచక జలధి= పంచభూతాలతో కూడిన ఈ దేహమనే సముద్రం; రోగ+అతి+శోక సహిత= అత్యధికమైన రోగాదులతో పుట్టిన దుఃఖంతో కూడి= భోగల వాంశక+ ఆశ్రయము= కొద్దిపాటి సుఖానికి ఆశ్రయం; దీని విభులు= దీని ప్రభువులు; కాముండున్, క్రోధుండున్= కామక్రోధాలు; వీరిన్+గెల్వవచ్చునప్పుడ= వీరిరువురినీ గెల్చినప్పుడే; అది= ఆ సముద్రాన్ని; కడవంగన్+వచ్చున్= దాటవచ్చును.

**తాత్పర్యం:** తాబేలు బయటపడ్డ తన అవయవాలను అనుకూల పరిస్థితి లేనప్పుడు ఎట్లా లోపలికి ముడుచు కొంటుందో అట్లాగే పండితుడు కామాలను వెనుకకు మరలిస్తాడు. కోరికలను ఎవడు అణచగలడో వాడే ధీరుడు. అతడు రజోగుణ వివర్జితుడై ముక్తి మార్గాన్ని దర్శించగలుగుతాడు. పది ఇంద్రియాలనూ నియంత్రించటం ఒక గొప్పపని. ఆ ఇంద్రియాలను సమిధలుగా గలిగి ఆత్మ అనే అగ్ని వెలుగుతూ ఉంటుంది. సమస్త ప్రాణులనూ తన ఆత్మలో దర్శింప గలిగిన వాడికి సూక్ష్మ తత్త్వ దర్శనం కలుగుతుంది. పంచభూతాలతో కూడిన ఈ శరీర సముద్రాన్ని దాటటం చాలా కష్టం. రోగాదులతో పుట్టే శోకం అధికంగానూ, ఇంద్రియాది సుఖాలవలన కలిగే సుఖం కొద్దిగానూ కలిగినది ఈ సంసారం. దీనికి కాముడు, క్రోధుడు ప్రభువులు. వీరిని గెలిచినపుడే ఈ సముద్రాన్ని దాటగలుగుతాం.

**విశేషం:** వ్యాస మూలంలో ఉన్న విషయాలు భిన్నంగా ఉన్న కారణంగా ఆ శ్లోకాన్ని చూద్దాం.

**"రోగశోక సమావిష్టం । పంచ స్రోత సమావృతం,**

**పంచభూత సమాయుక్తం । నవద్వారం ద్విదైవతమ్"** - అని వ్యాసుడి శ్లోకం.

(రోగశోకాలతో కూడినది. పంచ ప్రవాహాలతో కూడుకొన్నది. పంచభూతాలతో నిండినది. తొమ్మిది ద్వారాలు కలిగినది. ఇద్దరు దైవతాలు కలిగినది.)

నీలకంఠీయ వ్యాఖ్యానాన్నిబట్టి 'స్రోతస్సు' ప్రవాహం ఇంద్రియ పర్యాయవాచకమని తెలుస్తుంది (ఇంద్రియగోలకాని). ద్విదైవతమ్ అనగా జీవ పరమేశ్వరులని నీలకంఠీయం చెప్తున్నది. కాని, తిక్కనగారు నవద్వార విషయం వదలివేశారు. కామక్రోధులను ప్రభువులుగా చెప్పారు. పంచప్రవాహాలకు బదులు 'జలధి' అని తిక్కనగారు అన్నారు.

తాబేలు తన అంగాలను లోపలికి లాక్కుంటుందన్న పోలికను గీతాకారుడు ఉపయోగించాడు.

**"యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః,**

**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా!"** (సాంఖ్యయోగం)

**ఆ. మనసు మనసునంద మడఁచి, యాత్మని నాత్మ । యంద కాంచునట్టి యతఁడు సర్వ**
**విదుఁడు; సకల భూత వితతి యందును దనుఁ । గమచునుండు నిర్వికల్పకముగ. 154**

**ప్రతిపదార్థం:** మనసున్= మనస్సును; మనసునందున్+అ= మనసులోనే; మడఁచి= దాచి; ఆత్మునిన్= ఆత్మను; ఆత్మయందున్+అ= ఆత్మలోనే; కాంచునట్టి అతఁడు= చూడగలిగిన యోగి; సర్వవిదుఁడు= అన్నీ తెలిసినవాడు; సకల భూతవితతి అందునున్= అన్ని ప్రాణిసముదాయాలలోనూ; నిర్వికల్పకముగన్= ఏ వికారమూ లేకుండా; తనున్= తన్ను తాను; కనుచున్+ఉండున్= చూస్తుంటాడు.

**తాత్పర్యం:** మనస్సును మనసులో అణచి, ఆత్మను ఆత్మలో చూసేటటువంటి యోగి సర్వవిదు డవుతాడు. అన్ని ప్రాణులలోనూ తననే చూచుకొనగలుగుతాడు. అతడు ఏ వికారాన్నీ పొందడు.

**తే. ఆత్మతత్త్వమేకంబ దీపాంతరములఁ । గలుగఁ జేయు ప్రదీపంబు కరణి నావ**
**హించు రూపాంతరముల నయ్యెలమియును బు । ధుండు గనుఁగొని బ్రమయక నుండు నొకట. 155**

**ప్రతిపదార్థం:** దీప+అంతరములన్= ఎన్నో దీపాలను; కలుగన్+చేయు= వెలిగించేటటువంటి; ప్రదీపంబు కరణిన్= దివ్వెవలె; ఆత్మతత్త్వము+ఏకంబ= ఒకే ఆత్మ తత్త్వం; రూపాంతరములన్= ఎన్నో రూపాలను; ఆవహించున్= పొందుతుంది; ఆ+ఎలమియును= ఆ వికాసాన్ని కూడా; బుధుండు= పండితుడు; కనుఁగొని= గుర్తించి; ఒకటన్= దేనిలోనూ; బ్రమయక= భ్రమించకుండా (భ్రాంతి చెందకుండా); ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** ఎన్నో దీపాలను వెలిగించే దివ్వెవలె ఆత్మ ఎన్నో రూపాలను పొందుతుంది. పండితుడు ఈ విధానాన్ని గుర్తించి ఏ విషయంలోనూ భ్రాంతిని పొందకుండా ఉంటాడు.

**విశేషం:** అలం; ఉపమ.

**తే. ఆ పరంజ్యోతి పేళ్ళు లర్యముఁడు వరుణుఁ। డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ**
**నంగఁ బరఁగు శబ్దములు సన్మతులు దానిఁ। బ్రయతులయి భజియింతురు నియతులార!' 156**

**ప్రతిపదార్థం:** నియతులార!= దీక్షితులైన ఓ ఋషులారా!; ఆ పరంజ్యోతి పేళ్ళులు= ఆ పరంజ్యోతికి చాలా పేర్లున్నాయి; వరుణుడు; అనిలుడు; అగ్ని; సోముడు; విష్ణువు; అజుడు; శివుడు; అనంగన్+పరఁగు+శబ్దములు= అనే శబ్దాలు (ఆ తత్త్వాన్నే బోధిస్తాయి); సత్+మతులు= సద్బుద్ధి గలవారు; దానిన్= ఆ తత్త్వాన్ని; ప్రయతులు+అయి= ప్రయత్నం చేసినవారై (నిష్ఠకలిగిన); భజియింతురు= సేవిస్తారు.

**తాత్పర్యం:** ఓ ఋషులారా! వరుణుడని, అనిలుడని, అగ్ని అని, సోముడని, విష్ణువని, అజుడని, శివుడని ఆ పరంజ్యోతికి చాలాపేర్లు ఉన్నాయి. సద్బుద్ధిగల ధీరులు ఆ తత్త్వాన్ని నిష్ఠతో సేవిస్తారు.'

**వ. అని చెప్పి యచ్చతురాసనుం డమ్మాననీయులతో మఱియు నిట్లను; ధర్మంబునకు నహింస లక్షణం 'బధర్మంబునకు హింసయు దేతలకుఁ బ్రకాశత్వంబును మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దంబును వాయువునకు స్పర్శంబును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును భారతికి సత్యంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయ మహత్తత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు సాధుత్వంబును యోగంబునకుఁ బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు; లక్షణ జ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; ఆ+చతురాననుండు= ఆ బ్రహ్మదేవుడు; ఆ మాననీయులతోన్= ఆ పూజ్యులైన ఋషులతో; మఱియున్+ఇట్లనున్= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు పూజ్యులైన ఆ ఋషులతో పరతత్త్వజ్ఞానం కలగటానికి మూలమైన 'లక్షణ' జ్ఞానాన్ని గురించి చెప్పటం మొదలు పెట్టాడు. ఒక్కొక్కదానికి ఒక్కొక లక్షణం ఉన్నది. ఆ లక్షణాన్ని గుర్తిస్తే వీటికి అతీతమైన తత్త్వం ఎట్లా ఉంటుందో తెలుస్తుంది అంటూ ఆయా తత్త్వాల లక్షణాలు చెప్పారు. ఆ లక్షణాలను ఇట్లా పేర్కొనవచ్చును.

| తత్త్వం | లక్షణం |
|---|---|
| ధర్మం | అహింస |
| అధర్మం | హింస |
| దేవతలు | ప్రకాశత్వం |
| మనుష్యులు | కర్మ |
| ఆకాశం | శబ్దం |
| వాయువు | స్పర్శ |
| జ్యోతిస్సు | రూపం |

| | |
|---|---|
| జలం | రసం |
| పృథ్వి | గంధం |
| భారతి | సత్యం |
| మనస్సు | చింత |
| బుద్ధి | వ్యవసాయం |
| మహత్తు | ధ్యానం |
| అవ్యక్తం | సాధుత్వం |
| యోగం | ప్రవృత్తి |
| జ్ఞానం | సన్న్యాసం |

**విశేషం:** ఈ అంశాలను సులభంగా అర్థం చేసికొనటానికి ఒక పద్ధతి ఉన్నది. ధర్మాధర్మాలు అహింస - హింస అనే రూపంలో ఉంటాయి. దేవతలు మనుష్యులు ప్రకాశత్వ కర్మరూపాలలో ఉంటారు. ఆకాశాదులకు శబ్దాదులు లక్షణాలు. భారతి అంటేవాక్కు. దీనికి సత్యం లక్షణమనటం చాలా గొప్ప విషయం. మూలంలో ఇట్లా లేదు.

స్వరవ్యంజన సంస్కారా భారతీ శబ్దలక్షణా అని ఉన్నది. హల్లులతో కూడిన శబ్దమే సరస్వతీ రూపం. కాని అది 'సంస్కారం' పొంది ఉండాలి. నియమంచేత సంస్కారం ఏర్పడుతుంది. వ్యాకరణమే నియమం. దానివలన శబ్దం సాధువై సత్యప్రతిపాదక మవుతుంది. ఈ అర్థాన్ని స్ఫురింపజేస్తూ తిక్కనగారు 'సత్యం భారతికి లక్షణమ'ని అన్నారు. మనోబుద్ధులకు చింతా వ్యవసాయాలు కూడా ముందు చెప్పిన అంశాలే. వ్యవసాయాత్మికా బుద్ధిః- అని గీత.

ఇక్కడ మూలంలో కొంచెం మార్పుంది.

**"లక్షణం మనసో ధ్యాన । మవ్యక్తం సాధులక్షణమ్,**
**ప్రవృత్తి లక్షణో యోగో । జ్ఞానం సన్న్యాసలక్షణమ్".**

అని మూలం. తిక్కన మహత్తు ధ్యాన లక్షణమైనదని మార్చాడు. 'సమత్వం యోగ ఉచ్యతే' అని గీత, యోగానికి 'సమత్వం' లక్షణం అని సాధారణ నిర్వచనం ఉండగా ఇక్కడ ప్రవృత్తి అని చెప్పుతున్నాడు.

బహుశా ఇక్కడ తిక్కనగారు నిర్దేశిస్తున్నది కర్మను. యోగం కర్మ, జ్ఞాన రూపాలలో రెండు రకాలుగానూ ఉండవచ్చును. ఇంద్రియమనోబుద్ధుల ఏకీకరణం 'సమత్వం'. అది జ్ఞాన సమాధికి అవసరం. కర్మయోగానికి ధిషణద్వారా ఇంద్రియాలను కర్మలో ప్రవేశింపచేయటం. ఇక్కడ 'ప్రవృత్తి' అని ఉండాలి.

**ఆ. జ్ఞాన పూర్వమైన సన్న్యాస కలనంబు। పరమగతి నొనర్చు భవ్యులార!**
**ద్వంద్వరహితుఁ డైన నతని జరామృత్యు ని। స్తరణ కరణ మైన ధర్మ మొందు. 158**

**ప్రతిపదార్థం:** భవ్యులార!= పుణ్యులార!; జ్ఞానపూర్వము+ఐన= జ్ఞానపూర్వకమైన; సన్న్యాసకలనంబు= సన్న్యాస స్వీకారం; పరమగతిన్= ఉత్తమ గతిని; ఒనర్చున్= కలిగిస్తుంది; ద్వంద్వరహితుఁడు+ఐన= ద్వంద్వ భావనలు లేని; అతనిన్= ఆ సన్న్యాసిని; జరామృత్యు= ముసలితనం; మరణం అనే అపాయాలను; నిస్తరణ కరణము+ఐన= దాటటానికి సాధనమైన; ధర్మము+ఒందున్= ధర్మం పొందుతుంది.

**తాత్పర్యం:** పుణ్యులారా! జ్ఞాన పూర్వకమైన సన్న్యాసస్వీకారం పరబ్రహ్మ ప్రాప్తిని కలిగిస్తుంది. ద్వంద్వరహితుడైన అతడిని జరామృత్యువులు ఏమీ చేయజాలవు. ధర్మం అతడిని ఆశ్రయించి అన్నిటినీ దాటించగలుగుతుంది.

(అవ్యక్తనామ తత్త్వ నిరూపణ ప్రకారము (సం.14-43-34))

**సీ.** **అవ్యక్త నామకం బగు తత్త్వ మరయ స। లింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు;**
**క్షేత్రంబు నెఱఁగుట క్షేత్రజ్ఞుఁడనఁ జనుః। క్షేత్రంబు నాఁగఁ బ్రకృతియనంగ**
**నవ్యక్తమునకు నామాంతరములు; గుణ। ప్రభవ మాతత్త్వ మా ప్రభువు గుణము**
**లెఱుఁగవు చేతనా హీనముల్ గాన య। య్యంతరాత్ముఁడు దత్క్రియా ప్రపంచ**

**ఆ.** **మెఱుఁగు; నిట్టులగుట యెఱిఁగి గుణమ్ముల। విడిచి నిలిచి తత్త్వవేది యంత**
**రాత్మ వేశమునన నచల నిరామయా। వ్యయపదంబు నందు ననఘులార!** **159**

**ప్రతిపదార్థం:** అవ్యక్త నామకంబు+అగు= అవ్యక్తమనే పేరు కలిగిన; తత్త్వము+అరయన్= తత్త్వం బాగా ఆలోచిస్తే; సలింగంబు= లింగం కలిగింది; పురుషుఁడు= పురుషుడనబడేవాడు; అలింగుఁడు= లింగంలేనివాడు; అతఁడు= ఆ పురుషుడు; క్షేత్రంబున్+ఎఱుఁగుటన్= క్షేత్రాన్ని తెలిపినవాడు కావటంవలన; క్షేత్రజ్ఞుఁడు+అనన్+చనున్= క్షేత్రజ్ఞుడు అని పిలవబడతాడు; క్షేత్రంబునాఁగన్= క్షేత్రమని; ప్రకృతి+అనంగన్= ప్రకృతి అని; అవ్యక్తమునకున్= అవ్యక్తానికి; నామాంతరములు= మారు పేర్లు (ఉన్నాయి); ఆ తత్త్వము= ఆ అవ్యక్తం; గుణ ప్రభావము= గుణాలతో పుట్టింది (అందుకే సలింగమనటం); చేతనాహీనముల్= చైతన్యరహితాలైన జీవరాసులు; కానన్= కాబట్టి; ఆ ప్రభువు గుణములు+ఎఱుఁగవు= ఆ ప్రభువైన పురుషుడి గుణాలను తెలిసికొనజాలవు (అందువలననే పురుషుడిని నిర్లింగుడనటం); ఆ+అంతరాత్ముఁడు= ఆ పురుషుడైన అంతరాత్ముడు; తద్+క్రియా ప్రపంచము+ఎఱుఁగున్= సర్వప్రకృతిలోని లోకక్రియ ప్రపంచాన్ని తెలిసినవాడవుతాడు; ఇట్టులు+అగుటన్+ఎఱిఁగి= దీనిని గుర్తించి; ఆత్మవేది= ఆత్మవేత్త అయిన యోగీశ్వరుడు; గుణమ్ముల విడిచి+నిలిచి= గుణాలను వదలిపెట్టి స్థిరంగా నిలిచినవాడై (అచంచలుడై); అనఘులార!= ఓ పుణ్యాత్ములారా!; అంతరాత్మ+ఆవేశమునన్= ఆ అంతరాత్మ ఆవేశించటంచేతనే; అచల= స్థిరమైన; నిరామయ= రోగాదులవంటి ఏ లోపాలు లేని; అవ్యయ= ఎప్పటికీ తరగని; పదంబున్+అందున్= మోక్షపదాన్ని చేరుకొంటాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! బాగా అనుశీలిస్తే అవ్యక్తమనబడేది సలింగమైనది. పురుషుడు అలింగుడు. అవ్యక్తమైన అట్లాంటి క్షేత్రాన్ని తెలిసినవాడు కాబట్టి క్షేత్రజ్ఞుడని కూడా అతడిని పిలుస్తారు. అవ్యక్తానికే క్షేత్రమని, ప్రకృతి అని మారుపేర్లు ఉన్నాయి. అది గుణాలలో ప్రభవిస్తుంది. చైతన్యరహితాలైనవి ఆ ప్రభువు గుణాలను ఎఱుగజాలవు. కాని, ఆ పురుషుడైన అంతరాత్మకు ఈ ప్రకృతిలోని కార్యకలాపాలన్నీ తెలుసు. ఆత్మవేత్త అయిన యోగి ఈ రహస్యాన్ని గుర్తించి గుణాలను వదలిపెడతాడు. స్థిరత్వం పొందుతాడు. అపుడు అతడు అంతరాత్మచేత ఆక్రమించబడతాడు. దానితో ఏ లోపాలు లేని, ఎప్పటికీ తరగని, శాశ్వతమైన మోక్షస్థానాన్ని పొందుతాడు.'

**విశేషం:** లింగం అంటే కార్య కారణరూప సంబంధం అని అర్థం. అది కలిగింది 'లింగి'. ప్రకృతిలోని కార్యకలాపాలన్నీ కార్యకారణ సమావేశం వలన కలిగినవే. అందుకే అది 'లింగం' కలిగింది. పురుషుడు - ఆత్మ స్వరూపుడు కాబట్టి అతడిని గుర్తించగలిగిన సాధనం లేదు. అందుచేత 'అలింగుడు'.

**వ.** **అని వెండియు.** **160**

**తాత్పర్యం:** అని మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం.)

సీ. **జ్యోతిస్సులందు వర్యుఁడు రవి, భూతంబు । లం దగ్ని వరుఁడు, విద్యలఁ బ్రధాన**
**సావిత్రి, దేవతా సమితిఁ బ్రజాపతి । ఘనుఁడు, వేదముల ముఖ్యంబు ప్రణవ,**
**మనిల నిచయమ్మునఁ బ్రాణ మగ్ర్యము, ఛంద । ములకు గాయత్రి యగ్గలము, పశువు**
**లకు మేటి యజ, మఖిల చతుష్పదములకు । ధేనువు మిక్కిలి, మానవులకు**

తే. **బ్రాహ్మణుండు వరిష్ఠుండు, పక్షులందు । శ్యేన మధికంబు, యజ్ఞవిధానముల హు**
**తంబు పెద్ద, యుగముల కృతంబు మేలు । ధాతువర్గములోన నుత్తమము పసిఁడి.** 161

**ప్రతిపదార్థం:** జ్యోతిస్సులందున్= జ్యోతిష్మంతులలో; రవి= సూర్యుండు; వర్యుండు= శ్రేష్ఠుడు; భూతంబులందున్= పంచభూతాలలో; వరుఁడు= శ్రేష్ఠుడు; అగ్ని= అగ్నిదేవుడు; విద్యలన్= విద్యలలో; ప్రధాన= శ్రేష్ఠురాలు; సావిత్రి; దేవతాసమితిన్= దేవతల సమూహంలో; ప్రజాపతి= బ్రహ్మ; ఘనుఁడు= గొప్పవాడు; వేదములన్= వేదాలలో (మంత్రాలలో); ముఖ్యంబు= ముఖ్యమైనది; ప్రణవము= ఓంకారం; అనిల చయమ్మునన్= వాయు సమూహంలో; ప్రాణము= ప్రాణవాయువు; అగ్ర్యము= మొదటిది; ఛందములకున్= ఛందస్సులలో; అగ్గలము= శ్రేష్ఠం; గాయత్రి= గాయత్రీ ఛందస్సు; పశువులకున్= పశువులలో; మేటి= ఉత్తమమైనది; అజము= మేక; అఖిలచతుష్పదములకున్= నాలుగు కాళ్ళ జంతువులన్నిటిలోనూ; మిక్కిలి= గొప్పది; ధేనువు= ఆవు; మానవులకున్ వరిష్ఠుండు= మనుష్యులలో శ్రేష్ఠుడు; బ్రాహ్మణుఁడు= విప్రుడు; పక్షులందున్= పక్షులలో; అధికంబు= గొప్పది; శ్యేనము= డేగ; యజ్ఞవిధానములన్= యజ్ఞవిధులలో; పెద్ద= గొప్పది; హుతంబు= హవిస్సు; యుగములన్= యుగాలలో; కృతంబు+మేలు= కృతయుగం మేలు; ధాతువర్గములలోనన్= ధాతు సముదాయాలలో; ఉత్తమము= శ్రేష్ఠం; పసిఁడి= బంగారం.

**తాత్పర్యం:** జ్యోతిష్మంతులలో రవి, పంచభూతాలలో అగ్ని, విద్యలలో సావిత్రి, దేవతలలో ప్రజాపతి, మంత్రాలలో ఓంకారం, వాయువులలో ప్రాణవాయువు. ఛందస్సులలో గాయత్రి, పశువులలో మేక, చతుష్పాద జంతువులలో ఆవు, మనుష్యులలో బ్రాహ్మణుడు, పక్షులలో, డేగ, యజ్ఞ విధిలో హవిస్సు, యుగాలలో కృతయుగం, ధాతువులలో బంగారం గొప్పవి.

సీ. **యవ లోషధులలోన, నన్నంబు భక్ష్యభో । జ్యములందు, జలము పేయములలోన,**
**నమలాచలము పర్వతములలోఁ బ్లక్షంబు । దరువులలోన, నూర్ధ్వంబు దిశల,**
**జాహ్నవి నదులందు, సాగరంబు సరస్సు । లందు, గృహస్థత్వ మాశ్రమముల**
**నెక్కు డారయ; నెక్కు డేను బ్రజాపతు । లంద; చింత్యాత్మకుండైనయట్టి**

తే. **విష్ణుఁ డెక్కుడు నాకంటె; వినుఁడు తెలియ । నీశ్వరుఁడు దేవతావలికెల్ల నెక్కు;**
**డతఁడు నా నే ననఁగ విష్ణుఁ డనఁగ వస్తు । వొకఁడ మూర్తి త్రయంబున నుల్లసిల్లు.** 162

**ప్రతిపదార్థం:** ఓషధులలోనన్= పండిన వెంటనే నశించే మొక్కలు ఓషధులు - వాటిలో; యవలు= యవలనబడే ధాన్యం; భక్ష్యభోజ్యంబులందున్= తినదగిన పదార్థాలలో; అన్నంబు= అన్నం; పేయములలోనన్= తాగదగినవాటిలో; జలము= నీరు; పర్వతములలోన్= పర్వతాలలో; అమరాచలము= దేవతల నివాసమైన మేరుపర్వతం; తరువులలోనన్= చెట్లలో; ప్లక్షంబు= జువ్వి; దిశలన్= దిక్కులలో; ఊర్ధ్వము= పై దిక్కు; నదులందున్= నదులలో; జాహ్నవి= గంగ; సరస్సులందున్= సరస్సులలో; సాగరంబు= సముద్రం; ఆశ్రమములన్= ఆశ్రమాలలో; గృహస్థత్వము= గార్హస్థ్యం; ఎక్కుడు= అధికం; ప్రజాపతులందున్= ప్రజాపతులలో;

ఆరయన్= బాగాచూస్తే; ఎక్కుడు+ఏను= నేనే అధికుడిని; నాకంటెన్= నాకన్నా; అచింత్య+ఆత్మకుఁడైన= తెలిసికొనటానికి వీలుకాని తత్త్వం కలిగిన; విష్ణుఁడు= విష్ణువు; ఎక్కుడు= అధికం; తెలియన్+వినుఁడు= ఇంకా ఒక విషయం వినండి, దేవతా+ఆవలికిన్+ఎల్లన్= దేవతా సముదాయానికి; ఈశ్వరుఁడు= శివుడు; ఎక్కుడు= అధికం; అతఁడునాన్= శివుడని; నేననఁగన్= బ్రహ్మ అని (చెప్పుతున్నవారు బ్రహ్మే కదా!); విష్ణుఁడు+అనఁగన్= విష్ణువని; వస్తువు+ఒకఁడ= ఒకే తత్త్వం; మూర్తిత్రయంబునన్= ముగ్గురు మూర్తులలోనూ; ఉల్లసిల్లున్= ప్రకాశిస్తూ ఉంది.

**తాత్పర్యం:** ఓషధులలో యవలు, భోజ్యాలలో అన్నం, పానీయాలలో నీరు, పర్వతాలలో మేరువు, తరువులలో జువ్వి, దిక్కులలో ఊర్ధ్వం, నదులలో గంగ, సరస్సులలో సముద్రం, ఆశ్రమాలలో గార్హస్థ్యం అధికమైనవి. ప్రజాపతులలో నేను పెద్దని. నాకంటే ఆచింత్యమైన తత్త్వంకలిగిన విష్ణువుపెద్ద. దేవతలందరిలోనూ పెద్ద ఈశ్వరుడు (అందుకే మహాదేవుడంటారు) పేరుకు శివుడని, బ్రహ్మని, విష్ణువని అన్నా త్రిమూర్తులలోని వస్తువు మాత్రంఒకటే.

**విశేషం:** భారతీయ మతాలలో 'శైవం' చాలా ప్రాచీనమైనదిగా కనిపిస్తున్నది. పశుపతిగా, శివుడిగా, రుద్రుడిగా అర్చించబడిన 'ఈశ్వర' తత్త్వానికే 'మహాదేవు'డని పేరు. బ్రహ్మ ఇట్లా ఈశ్వరుడిని, ఈశ్వరుడివలె విష్ణువు. విష్ణువు శివుడిని వీరిరువురూ బ్రహ్మను స్తుతించటం అష్టాదశపురాణాలలో కనిపిస్తుంది. పరతత్త్వం సత్త్వరజస్తమో రూపాలైన ఈ త్రిమూర్తులుగా సృష్టి స్థితి లయాలను నిర్వహిస్తోందనే అర్థాన్ని తిక్కనగారు ఈ సందర్భంలో స్ఫురింపజేస్తున్నారు. వ్యాసమూలంలో ఈ భావన ఇంత స్పష్టంగా లేదు.

**క. నెఱయఁ బ్రధాన పదార్థము। లెఱుఁగుట పరిబోధమూల మెఱుకల కెల్లన్**
**మెఱుఁగిడుట మమ్ము ముప్వుర। గుఱుకొని యొకఁడుగ నెఱింగికొనుట దలంపన్. 163**

**ప్రతిపదార్థం:** నెఱయన్= సంపూర్ణంగా; ప్రధాన పదార్థములు= ఏఏ తత్త్వంలో ఏది ప్రధానమో; ఎఱుంగుట= తెలిసికొనటం; పరిబోధమూలము= బ్రహ్మజ్ఞానానికి హేతు వవుతుంది; మమ్మున్= మమ్ములన్; ముప్వురన్= ముగ్గురినీ; గఱుకొని= పూనుకొని; ఒకఁడుగన్= ఒకడుగా; ఎఱింగికొనుట= తెలిసికొనటం; తలంపన్= ఆలోచించగా; ఎఱుకలకున్+ఎల్లన్= జ్ఞానాలన్నిటికీ; మెఱుఁగు+ఇడుట= వన్నె పెట్టటం (అన్నమాట).

**తాత్పర్యం:** ఇట్లా సంపూర్ణంగా ఏఏ తత్త్వాలలో ఏది ఏది ప్రధానమో తెలిసికొనటం బ్రహ్మజ్ఞాన సాధనకు హేతువవుతుంది. మమ్ములను ముగ్గురినీ పూనుకొని ఒకడుగా గుర్తించటం అంటే తత్త్వజ్ఞానాలకు వన్నె పెట్టటమనే అర్థం.

**విశేషం:** తిక్కనగారు ప్రతిపాదించిన 'హరిహరాద్వైతం అనే భావన పూర్వ మార్గాలకు వన్నె పెట్టటమనే ఆయన తాత్పర్యం. అందుకే త్రిమూర్తుల వెనుక ఒకే తత్త్వం ఉందని స్వతంత్రంగా ప్రతిపాదించాడు. ఇది వ్యాసహృదయానికి అనుగుణమే అయినా మూలశ్లోకాలలో ఎక్కడా ఈ భావన ఇంత స్పష్టంగా కనిపించదు. శివ, విష్ణు సహస్రనామాలను గమనిస్తే వ్యాసుడికి కూడా ఈ భావన ఇష్టమేనని చెప్పవచ్చు.

**క. దివసము రాత్రియునుం బోరిఁ। బ్రవర్తనముఁ బొందుచుండు పగిదిని సుఖసం**
**భవ దుఃఖ జననములు జం। తువులకుఁ గలుగు; వలవ దుబ్బ దురపిల్లంగన్. 164**

**ప్రతిపదార్థం:** దివసము= పగలూ; రాత్రియునున్= రాత్రీ; పొరిన్= క్రమంగా; ప్రవర్తనమున్= కడవటం; పొందుచున్+ఉండు పగిదిన్= జరిగే విధంగా; సుఖ సంభవ= సుఖం కలగటం; దుఃఖ జననములు= దుఃఖం కలగటం అనేవి; జంతువులకున్= ప్రాణులకు; కలుగున్= కలుగుతూ ఉంటాయి (దానికి); ఉబ్బన్= సంతోషించటం; దురపిల్లంగన్= దుఃఖించటం; వలవదు= కూడదు.

**తాత్పర్యం:** పగలూ, రాత్రీ క్రమంగా ఎట్లాగైతే కలుగుతూ ఉంటాయో అట్లాగే ప్రాణులకు సుఖాలూ; దుఃఖాలు కూడా కలుగుతూ ఉంటాయి. దీనికి - అంటే సుఖాలు కలిగినప్పుడు పొంగిపోకూడదు. దుఃఖాలు కలిగితే క్రుంగిపోకూడదు.

**తే.** **పొదలుఁ దఱుఁగుటకై, పొడ వొదవుఁ బడుట । కై, కడను జేరుఁ బాయుటకై, జనించుఁ**
**బొలియుటకునై, సుఖంబును బొందు దుఃఖ । మందుటకునై పదార్థము లఖిలములును. 165**

**ప్రతిపదార్థం:** పదార్థములు+అఖిలములును= అన్ని పదార్థాలూ; తఱుఁగుటకై= నశించటానికై; పొదలున్= పెరుగుతాయి; పడుటకై= క్షీణించటానికి; పొడవు+ఒదవున్= పెరుగుతాయి; పాయుటకై= విడివడటానికి; కడను+చేరున్= ప్రక్కలకు చేరుతాయి; పొలియుటకునై= చావటానికి; జనించున్= పుట్టుతాయి; దుఃఖము+అందుటకునై= దుఃఖం పొందటానికై; సుఖంబును+పొందున్= సుఖాన్ని పొందుతాయి.

**తాత్పర్యం:** అన్ని పదార్థాలూ విరుద్ధమైన కార్యకారణ సంబంధాన్ని కలిగి ఉంటాయి. నశించటంకొరకే పెరుగుతాయి. బాగా వృద్ధి పొందటం క్షీణించటానికే. సమీపించటం విడిపోవటానికే, పుట్టటం చావటానికే. సుఖించటం దుః ఖించటానికే. (ఈ విరుద్ధ ఫలితాలను గుర్తించిన మహనీయులు సుఖాన్ని, దుఃఖాన్ని రెండింటినీ పొందరు. అంటే పెరుగుదలను చూచి సంతోషించరు. తరుగుదలను చూచి బాధపడరు. ఇట్లా రెండింటినీ సమంగా చూడటమే 'యోగం').

**క.** **జ్ఞానము సవిశేషస్థితి; । దానికి నాశంబు లేదు, దానిఁ దెలియుటన్**
**మానాహంకృతి మమతలు । మానిన నిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్.' 166**

**ప్రతిపదార్థం:** జ్ఞానము= జ్ఞానం; స+విశేష+స్థితి= ఒక ప్రత్యేకతతో కూడిన స్థితి కలిగింది (అది విశిష్టమైనది); దానికిన్+నాశంబు లేదు= దానికి నశించటమన్నదే లేదు; దానిన్+తెలియుటన్= దానిని తెలియటంవలన; మాన+అహంకృతి+మమతలు= అభిమానం, అహంకారం,మమతలను; మానిన+నిర్మలుఁడు= వదలిపెట్టిన నిర్మలమైన అంతఃకరణం కలిగినవాడు; మోక్షమార్గమున్+కాంచున్= మోక్షమార్గాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** జ్ఞానం విశిష్టమైనది. అది ఎన్నడూ నశించదు. దానిని తెలియటంవలన అభిమానం అహంకారం మమత తొలగి మానవుడు నిర్మలుడవుతాడు. అట్లాంటివాడే మోక్షమార్గాన్ని ఆవలంబించ గలుగుతాడు.'

**విశేషం:** శేషమంటే మిగిలేది. విశేషమంటే మిక్కిలిగా మిగిలేది. జ్ఞానం ఎంత నేర్చుకొన్నా ఇంకా మిగిలే ఉంటుంది. అందుకే అది 'అనంత'మనటం. ఎంత ఖర్చుపెట్టినా ధనంవలె అది కరిగిపోదు. ఇంకా పెరుగుతూనే ఉంటుంది.

'వ్యయీ కృతే వర్ధత ఏవ విద్యా' (ఎంత వ్యయం చేసినా విద్య పెరుగుతూనే ఉంటుంది).

**వ. అని వివరించి విరించి యా సమంచితాచారులతోడ 'నాశ్రమ ప్రకారంబు లెఱింగించెద' నని పలికి యిట్లని యుపన్యసించె. 167**

**ప్రతిపదార్థం:** అని వివరించి= అని వివరించినవాడై; విరించి= బ్రహ్మ; ఆ+సమంచిత+ఆచారులతోడన్= ఆ ఉత్తమ ఆచారం కలిగిన ఋషులతో; ఆశ్రమప్రకారంబులు= ఆశ్రమాలలోని విధాలను; ఎఱింగించెదను+అని పలికి= తెలుపుతానని చెప్పి; ఇట్లు+అని+ఉపన్యసించెన్= ఇట్లా ఉపన్యసించటం మొదలు పెట్టాడు.

**తాత్పర్యం:** అని వివరించి ఆ ఋషులతో 'ఆశ్రమవిధాలను గురించి మీకు చెప్పుతా'నని ఇట్లా చెప్పటం మొదలు పెట్టాడు.

**సీ. 'గురునకుఁ బ్రియహితకరుఁ డయి వేదాధ్య। యన మొనరించుచు నశన మమల**
**భిక్ష నొనర్చుచు బిల్వపలాశదం। డములలో నొకటి ధార్యముగఁ జేసి**
**స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును। నియమితేంద్రియుఁడును నిత్యశుచియు**
**యజ్ఞోపవీతియు నబహుభాషియు మేఖ। లాఢ్యుండు నై శయనాసన ప్ర**

**తే. చారవిధములు సముచితాచరితములుగ। సత్యధర్మ నిరూఢుఁడై శాంతి గలిగి**
**వేల్మి యిరుప్రొద్దు నడుపుచుఁ గల్మషంపుఁ। బనుల కెలయక వర్తించు బ్రహ్మచారి. 168**

**ప్రతిపదార్థం:** గురునకున్= గురువుకు; ప్రియహితకరుఁడు+అయి= మిక్కిలి అనుకూలుడై సేవిస్తూ; వేద+అధ్యయనము+ ఒనరించుచున్= వేదాధ్యయనం చేస్తూ; అమలభిక్షన్= పవిత్రమైన భిక్షావృత్తితో; అశనము+ఒనర్చుచున్= ఆహారం గ్రహిస్తూ; బిల్వపలాశదండములలోన్= బిల్వం మోదుగ కొమ్మలలో; ఒకటిన్= ఒకదానిని; ధార్యముగన్+చేసి= ధరించి; స్నానశీలుఁడు= త్రిసంధ్యలలో స్నానంచేయటం అభ్యాసంగా కలిగి; బ్రహ్మచర్యపరుండును= బ్రహ్మచర్యనిష్ఠకలిగినవాడై; నియమితేంద్రియుఁడును= ఇంద్రియాలను నియమించినవాడై; నిత్యశుచియున్= నిత్యం పవిత్రుడుగా ఉంటూ; యజ్ఞోపవీతియున్= జందెం ధరించి; అబహుభాషియున్= అధికంగా మాటాడకుండా; మేఖలాఢ్యుండు= మొలత్రాడుతో ఒప్పినవాడై; శయన+అసన+ప్రచార విధములు= నిద్రించటం, కూర్చొనటం, తిరగటం మొదలైనవి; సముచిత+అచరితములుగన్= సముచితమైన పద్ధతిలో చేస్తూ; సత్యధర్మనిరూఢుఁడు+ఐ= సత్య, ధర్మ నిష్ఠకలిగినవాడై; శాంతి కలిగి= శాంత చిత్తవృత్తుడై; ఇరుప్రొద్దు= రెండు ప్రొద్దులూ; వేల్మి= అగ్నిహోత్రం; నడుపుచున్= చేస్తూ; కల్మషంపు+పేలకున్+ఎలయక= పాపకార్యాలకు పూనుకొనకుండా; బ్రహ్మచారి; వర్తించున్= ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** బ్రహ్మచర్యంలో ఉండేవాడు బ్రహ్మచారి, అతడు గురువును అత్యంతం కుమారుడివలె సేవిస్తూ వేదాధ్యయనం చేస్తాడు. పవిత్రంగా భిక్షమెత్తి తెచ్చిన ఆహారాన్ని స్వీకరిస్తాడు. బిల్వం మోదుగ కొమ్మలలో ఒకదానిని చేత ధరిస్తాడు. త్రిసంధ్యలలో స్నాంచేసి బ్రహ్మచర్యనిష్ఠకలిగి నియతేంద్రియుడై నిత్యం పవిత్రుడుగా ఉంటాడు. జందెం, మొలతాడు ధరించి అధికంగా మాటాడకుండా నిద్రించటం, కూర్చొనటం, తిరగటం మొదలైనది కూడా శాస్త్ర విధిని అతిక్రమించకుండా సముచితంగా చేస్తాడు. సత్య ధర్మాలను పాలిస్తూ శాంత ప్రవృత్తి కలవాడై రెండు ప్రొద్దులా అగ్నిహోత్రం నిర్వహిస్తూ పాపకార్యాలకు దూరంగా బ్రహ్మచారి వర్తిస్తాడు.

**సీ. అర్థప్రకార సమావర్తనుం డయి। నిజదార నిరతుండు నిర్మల ప్ర**
**చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథి శి। ష్టాశియు శుక్ల వస్త్రాన్వితుండు**

శక్త్యనుగుణదాన శాలియు నచపలేం । ద్రియుఁడును శుచియు మైత్త్రీపరుండు

స్వాధ్యాయశీలుండు సద్వ్రత నిష్ఠుండు । నై యాజనంబు నధ్యాపనంబు

ఆ. శక్యమైనఁ జల్పి, క్షమ గల్గి సత్ప్రతి । గ్రహ మొనర్చి, మిత్త్రు లహితు లనక

మాట కార్యమునను మధ్యస్థుఁడై గృహ । స్థుండు నడచు దురితదూరుఁ డగుచు. 169

**ప్రతిపదార్థం:** అర్హప్రకార= తగిన రీతిలో; సమావర్తనుండు+అయి= చక్కని నడవడి కలిగి (లౌకిక వ్యవహారాలలో అని అర్థం); నిజదార= తన భార్య విషయంలో; వితతుండు= అనురాగం కలవాడు; నిర్మల ప్రచారుండు= నిర్మలమైన ప్రవృత్తి కలవాడు; పంచయజ్ఞపరుండు= పంచయజ్ఞాలలో దీక్షకలవాడు; అతిథిశిష్ట+ఆశియున్= అతిథులు భోజనంచేయగా మిగిలినదానిని భుజించేవాడు; శుక్లవస్త్ర+అన్వితుండు= తెల్లటి బట్టలు ధరించేవాడు; శక్తి+అనుగుణ దానశీలియున్= శక్తికి అనుగుణంగా దానం చేసేవాడు; అచపల+ఇంద్రియుఁడును= ఇంద్రియ చపలత్వం లేనివాడు; శుచియున్= పవిత్రుడు; మైత్త్రీపరుండున్= స్నేహశీలి; స్వాధ్యాయ శీలుండు= వేదాధ్యయన పరుడు; సద్వ్రత నిష్ఠుఁడు= మంచి వ్రతదీక్ష కలవాడు; ఐ= అయి; యాజనంబు= యజ్ఞప్రక్రియ; అధ్యాపనంబు= వేదం శిష్యులచేత చదివించటం (వేదపాఠం చెప్పటం); శక్యమైనన్+చల్పి= సాధ్యమైతే చేస్తూ; క్షమకల్గి= ఓర్పు కలిగి; సత్ప్రతిగ్రహము+ఒనర్చి= మంచిదానాన్ని మాత్రం గ్రహిస్తూ; మిత్త్రులు+అహితులు+అనక= మిత్రులు శత్రువులని ఎంచకుండా; మాట కార్యమునను= వ్యవహారాలలో (నిర్ణయం చెప్పవలసివచ్చినపుడు); మధ్యస్థుఁడు+ఐ= పక్షపాతం వహించకుండా మధ్యస్థుడుగా వ్యవహరిస్తూ; దురితదూరుఁడు+అగుచున్= పాపకార్యాలకు దూరంగా ఉంటూ; గృహస్థుండు నడచున్= గృహస్థుడు నడుచుకొంటాడు.

**తాత్పర్యం:** గృహస్థుడు లోక వ్యవహారాలలో ధర్మాన్ని అనుసరించి సముచిత రీతిలో ప్రవర్తిస్తాడు. తన భార్యపై అనురాగం కలిగి జీవితం సాగిస్తాడు. నిర్మల ప్రవర్తన కలిగి ఉంటాడు. పంచయజ్ఞ నిష్ఠ కలిగి ఉంటాడు. అతిథి భుజించగా మిగిలిన దానినే తింటాడు. తెల్లబట్టలు ధరిస్తాడు. శక్తినిబట్టి దానం చేస్తాడు. ఇంద్రియ చాపల్యానికి దూరంగా ఉంటాడు. పవిత్రుడుగా జీవిస్తాడు. స్నేహశీలిగా ఉంటాడు. వేదాధ్యయనం చేస్తూ ఉత్తమ వ్రతాలలో నిష్ఠకలిగి ఉంటాడు. చేతనయిన పక్షంలో యాగం అధ్యాపనం కూడా చేస్తాడు. ఉత్తము లిచ్చే దానాన్ని మాత్రం గ్రహిస్తాడు. శత్రుమిత్రభావం లేకుండా వ్యవహార నిర్ణయాలలో నిష్పక్షపాతంగా వ్యవహరిస్తాడు. పాపకార్యాలకు దూరంగా ఉంటాడు.

సీ. గ్రామంబు దొఱఁగి యరణ్యస్థలంబునఁ । బర్ణశాలా పరత నొంది

స్నానతంత్రము రెండు సంధ్యల నడపుచు । బ్రహ్మచర్యవ్రత భాసి యగుచుఁ

బూరిపంటలు ఫలంబులు మూలములు శాక । సముదయంబును నశనముగఁ గొనుచు

నజినంబు వల్కల మంబరంబుగఁ గొని । శయన కృత్యంబు భూస్థలి నొనర్చి

తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను । భక్తి నాత్మీయములలోనఁ బంచిపెట్టి

యధ్యయన హోమశీలుఁడై యన్ని యింద్రి । యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు. 170

**ప్రతిపదార్థం:** గ్రామంబు+తొఱఁగి= గ్రామాన్ని వదలిపెట్టి; అరణ్యస్థలంబునన్= అరణ్యంలో; పర్ణశాలా+ఆవాస పరతన్+ఒంది= పర్ణశాలలో నివసిస్తూ, రెండు సంధ్యలన్= ఉదయసాయంకాలాలలో; స్నాన తంత్రము నడుపుచున్= స్నానం చేస్తూ; బ్రహ్మచర్య వ్రతభాసి+అగుచున్= బ్రహ్మచర్య వ్రతం పాటిస్తూ; పూరిపంటలు= వరి మొదలైన గడ్డి నిచ్చే పంటలను; ఫలంబులు= పండ్లు;

మూలములు= గడ్డలు; శాక సముదయంబును= ఆకుకూరలు మొదలైన వాటిని; ఆశనముగన్+కొనుచున్= ఆహారంగా తీసికొంటూ; అజినంబు= జంతుచర్మాన్ని; వల్కలము= నారచీరను; అంబరంబుగన్+కొని= వస్త్రంగా గ్రహించి; భూస్థలిన్= నేలమీద; శయనకృత్యంబున్= పండుకొనటాన్ని; ఒనర్చి= చేసి; అతిథులకున్+ఎడము+ఇచ్చి= అతిథులకు ఆశ్రయమిచ్చి; ఆహారములను= ఆహార పదార్థాలను; భక్తిన్+ఆత్మీయములలోనన్= భక్తిగా ఆత్మీయంగా (ప్రేమతో); పంచిపెట్టి= అందరికీ పంచి; అధ్యయన హోమశీలుఁడుఁ+ఐ= అధ్యయనం; అగ్నిహోత్రం-ఇవి చేస్తూ; అన్ని ఇంద్రియములన్+గెలిచి= అన్ని ఇంద్రియాలను గెల్చి; వానప్రస్థుఁడు= వానప్రస్థంలో ఉన్నవాడు; అతిశయిల్లున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** వానప్రస్థంలో ఉన్నవాడు గ్రామం వదలిపెట్టి అడవులలో ఉంటూ పర్ణశాలల్లో నివసిస్తుంటాడు. రెండు పూటలా స్నానం చేస్తూ బ్రహ్మచర్యం పాటిస్తాడు. తృణధాన్యాలు, పండ్లు, గడ్డలు, పూలు, కాయలు, ఆకులు ఆహారంగా తీసికొంటాడు. జంతువుల చర్మాన్నో నారచీరలనో వస్త్రంగా ధరిస్తాడు. నేలమీదనే పడుకొంటాడు. అతిథులకు చోటు కల్పించి ఆహారం భక్త్యనురాగాలతో అందరికీ పంచిపెట్టుతాడు. అధ్యయనం, అగ్నిహోత్రం చేస్తూ అన్ని ఇంద్రియాలనూ అదుపులో ఉంచుకొని వానప్రస్థుడు పవిత్రజీవనం గడపుతాడు.

**క. ఈ మూఁ డాశ్రమములలో। నేమిట వర్తించువార లేనియు ముక్తిం**
**గామించినఁ జొరనగు వి। ద్యామూలాచార మైన యత్యాశ్రమమున్. 171**

**ప్రతిపదార్థం:** ఈ మూఁడు+ఆశ్రమములలోన్= బ్రహ్మచర్య, గార్హస్థ్య; వానప్రస్థాశ్రమాలలో; ఏమిటన్ వర్తించువారు+ఏనియున్= ఎందులో ఉంటున్నవారైనా; ముక్తిన్+కామించినన్= మోక్షాన్ని కోరుకొంటే; విద్యామూల+ఆచారము+ఐన= జ్ఞానహేతువైన ఆచారం కలిగిన; యతి+ఆశ్రమమున్= యతి ఆశ్రమంలో (సన్న్యాసంలో); చొరన్+అగున్= ప్రవేశించవచ్చును.

**తాత్పర్యం:** పై మూడు ఆశ్రమాలలో ఎందులో ఉంటున్న వాడైనా ముక్తిని కోరుకొంటే జ్ఞాన హేతువులైన ఆచార విధులు కలిగిన యత్యాశ్రమంలో ప్రవేశించవచ్చును. అదే సన్న్యాసం.

**సీ. సర్వభూత దయానుషంగంబు గలిగి య। తీత వస్తువులఁ జింతింప కెద న**
**నాగతంబులమీఁద నాస సేయక వర్త। మాన లబ్ధము లుపేక్షా నిరూఢిఁ**
**గూర్చు చంగంబులఁ గూర్మ మెట్లట్ల యిం। ద్రియముల లోనికిఁ దిగిచికొనుచు**
**సముచితకాల భిక్షా చర్య దొరకొన్న। యంతన నిజదేహ యాత్ర నడపి**

**తే. గ్రాస మాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ। డర్థి నెయ్యది యిచ్చిన నంద కేక**
**వార భోజ యగుచు నమస్కార సఖ్య। నుతి నిరాకృతి సహితుఁడై యతి వెలుంగు.' 172**

**ప్రతిపదార్థం:** సర్వభూత= అన్ని ప్రాణులపట్ల; దయానుషంగంబు+కలిగి= దయ ప్రేమ కలిగి; అతీతవస్తువులన్= గతించిన వాటిని గురించి; ఎదన్= హృదయంలో; చింతింపక= బాధపడక; ఆగతంబులమీఁదన్= రాబోయే వాటిమీద; ఆస+చేయక= ఆశ పడకుండా; వర్తమాన లబ్ధములు+ఉపేక్షా+నిరూఢిన్= అప్పటికి లభించిన వాటిని ఉదాసీన పరత్వంతో; కూర్చుచున్= గ్రహిస్తూ; కూర్మము= తాబేలు; అంగంబులన్+ఎట్లు+అట్ల= అంగాలను ఎట్లాగో అట్లాగా; ఇంద్రియములన్ లోనికిన్+తిగిచికొనుచున్= ఇంద్రియాలను లోనికి లాగుకొంటూ; సముచితకాల= తగిన సమయంలో; భిక్షా చర్యన్= భిక్షాటనంతో; దొరకొన్న+అంతన= లభించినంత; నిజదేహయాత్ర+నడపి= తనదేహయాత్రను నడుపుతూ; గ్రాసము= ఆహారం; ఆచ్ఛాదనంబు= వస్త్రం; తక్కంగన్=

తప్ప; ఎవ్వరు= ఎవ్వరైనాసరే; ఎయ్యది+ఇచ్చినన్= ఏది ఇచ్చినాసరే; అందక= తీసికొనక; ఏకవారభోజి+అగుచున్= దినంలో ఒకసారి మాత్రమే భుజిస్తూ; నమస్కార= నమస్కరించటంకాని; సఖ్య= స్నేహంకాని; మతి= ప్రశంసించటం కాని (నీటిలో); నిరాకృతి సహితుండు+ఐ= నిరాకరించేబుద్ధి కలవాడై; యతి= సన్న్యాసి; వెలుంగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** అన్ని ప్రాణులపట్ల దయ ప్రేమ కలిగి, గతించినవాటిని గురించి చింతించక, రాబోయేవాటిని గురించి ఆశపడక, అప్పటికి లభించిన వాటిని ఉదాసీనంగా గ్రహిస్తూ తాబేలు తన అంగాలను లోనికి లాక్కున్న విధంగా తన ఇంద్రియాలను నియంత్రిస్తూ భిక్షతో లభించినంత గ్రహించి తన దేహాన్ని సంరక్షించుకొంటూ, అన్న వస్త్రాలు తప్ప తక్కినది ఎవరు ఏమి ఇచ్చినా పరిగ్రహించకుండా, రోజుకు ఒకసారిమాత్రమే భుజిస్తూ, నమస్కారంకాని, స్నేహంకాని, ప్రశంసకాని, పట్టించుకొనకుండా (నిరాకరిస్తూ) యతి (జ్ఞానమయమైన) జీవితం గడుపుతాడు.

**క. అనసూయయు నక్రోధం। బును దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం**
**బును సత్యంబు నపైశున। ము నహింసయుఁ జూరె యతికి ముఖ్య వ్రతముల్. 173**

**ప్రతిపదార్థం:** అనసూయయున్= అసూయ లేకుండా ఉండటం; అక్రోధంబును= కోపంలేకుండా ఉండటం; దమమును= ఇంద్రియాలను నియంత్రించటం; బ్రహ్మచర్యమును= స్త్రీకి దూరంగా బ్రహ్మజ్ఞాన విషయంగా నిరంతరం సంచరించటం; ఋజుభావంబును= వేరుగా (డొంకతిరుగుడు వ్యవహారం కాకుండా) ప్రవర్తించే స్వభావం; సత్యంబున్= సత్యపాలన; అపైశునము= లోభగుణం లేకుండటం; అహింసయున్= హింసచేయకుండటం; యతికిన్= సన్న్యాసికి; ముఖ్యవ్రతముల్= ముఖ్యమైన దీక్షలు; చూరె= సుమండీ! (కదా!).

**తాత్పర్యం:** అసూయ, కోపం లేకుండా ఉండటం, ఇంద్రియాలను నియంత్రించుకొనటం; బ్రహ్మచర్యంలో సంచరించటం; ఋజుప్రవర్తన, సత్యపాలన, లోభగుణం లేకుండా ఉదారంగా ఉండటం, హింస చేయకుండటం, సన్న్యాసికి ముఖ్యమైన దీక్షలు.

**విశేషం:** 'యతి' అంటే 'నియతి' కలవాడని అర్థం. 'సమ్యక్'= బాగుగా; 'న్యాసము'= దాచి పెట్టటం అంటే భగవంతుడిలో సర్వాన్ని దాచిపెట్టినవాడని అర్థం. 'సర్వం బ్రహ్మమయం' అని ఎవడు అన్నిటిని త్యజిస్తాడో వాడు 'సన్న్యాసి'.

**తే. వృక్షమూల నదీతీర విజన నిలయ। విపిన గిరిగుహా నిత్య వివిక్త దేవ**
**సదనవాసియై కౌటిల్య సాధ్య వస్తు। సంచయనము లుడిగి యతి సంచరించు. 174**

**ప్రతిపదార్థం:** వృక్షమూల= చెట్టు మొదట; నదీతీర= నదీతీరంలో; విజననిలయ= జనాలు లేనిచోట; విపిన= అడవిలో; గిరిగుహా నిత్య వివిక్త= గిరిగుహలలో నిత్యం ఒంటరిగా; దేవసదన= దేవాలయాలలో; వాసి+ఐ= వాసంచేస్తూ; కౌటిల్య= వంకరమార్గాలతో; సాధ్య వస్తు సంచయనములు= సాధించదగ్గ వస్తుసముదాయాలను; ఉడిగి= వదలిపెట్టి; యతి= సన్న్యాసి; సంచరించున్= తిరుగుతాడు.

**తాత్పర్యం:** సన్న్యాసి ఏ చెట్టు మొదటో, నది ఒడ్డునో, మనుష్యులు లేని అడవులలోనో, కొండగుహలలోనో, నిత్యం ఒంటరిగా, ఏ ఆలయాలలోనో నివసిస్తాడు. దుర్మార్గంగా కుయుక్తులతో ఏ వస్తువులూ సంపాదించడు. ఇట్లా యతి సంచరిస్తూ ఉంటాడు.

**క. తన మేలు ప్రకాశింపక। తనుఁ గనుఁగొనునట్టి జను లుదాసీనతమై**
**నునికికిఁ దగియెడు చందం। బున వర్తించుయతి సర్వముక్తత నొందున్. 175**

**ప్రతిపదార్థం:** తన= తనయొక్క; మేలు= గొప్పతనం; ప్రకాశింపక= బయటపెట్టకుండా; తనున్+కనుఁగొనునట్టి జనులు= తనను చూచేటటువంటి జనాలు; ఉదాసీనతమైన్= ఉదాసీనంగా; ఉనికికిన్= ఉండటానికి; తగియెడు= తగిన; చందంబునన్= రీతిలో; వర్తించు యతి= ఉండే సన్న్యాసి; సర్వముక్తతన్= అన్నిటినుండీ విముక్తిని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** తన గొప్పతనం ఎవరికీ చాటకుండా; తనను చూస్తున్న వారుకూడా ఉపేక్షాభావంతో తనను పట్టించుకొనకుండా ఉండేటట్లుగా ఏ సన్న్యాసి వర్తిస్తాడో అతడు సర్వబంధ విముక్తుడౌతాడు.'

**వ. అని యెఱిఁగించి మఱియును. 176**

**తాత్పర్యం:** అని తెలిపి ఇంకా (తరవాతి పద్యంతో అన్వయం.)

**సీ. సన్న్యాస మనఁ దపశ్చరణంబు పేరు త। పోజ్ఞాన యుక్తి ప్రబుద్ధు లైన**
**జనము లచింత్యం బజర మమృతంబు నా। వెలుఁగు తత్త్వము గంద్రు వీతతామ**
**సము నవధూత రాజసమునై శుద్ధ స। త్త్వాశ్రయం బగు హృదయంబు గలుగు**
**వారు తపోవృత్తివలన సుక్షేమ మా। ర్గంబున నడతు రేకత్వ శోభి**

**తే. మహిత నానాత్వ మనంగ సమస్త భూత। సముదయస్థమై యున్న తత్త్వము ప్రకాశ**
**మగుట నఖిలగతులఁ దోఁచు నవ్విధంబు। గలుగు బుధుఁడు నిర్ద్వంద్వుఁడై కాంచు ముక్తి. 177**

**ప్రతిపదార్థం:** సన్న్యాసము+అనన్= సన్న్యాసమంటే; తపశ్చరణంబు పేరు= తపస్సుచేయటానికి పేరు; తపోజ్ఞాన+యుక్తి+ ప్రబుద్ధులు+ఐన= తపస్సువలన పుట్టిన జ్ఞానంతో మేల్కొన్నవారైన; జనములు= యోగిజనులు; అచింత్యంబు= చింతించి (ఆలోచించి); తెలిసికొనటానికి వీలులేనిది; అజరము= ముసలితనం లేనిది; అమృతంబునాన్= చావులేనిదిగా; వెలుఁగు తత్త్వమున్= వెలిగేటటువంటి మహాతత్త్వాన్ని; కంద్రు= దర్శిస్తారు; వీత తామసమున్= తమోగుణం పోయినదీ; అవధూత రాజసమున్+ఐ= పోగొట్టబడిన రాజసం కలిగినదీ అయినటువంటి; శుద్ధసత్త్వ= పరిశుద్ధసత్త్వగుణానికి; ఆశ్రయంబు+అగు= ఆశ్రయమైన; హృదయంబు= హృదయం; ఉరుతపోవృత్తివలనన్= గొప్పతపశ్చర్యవలన; కలుగున్= కలుగుతుంది; సంక్షేమ మార్గంబునన్+నడతురు= క్షేమం కలిగించే భద్రమైన పద్ధతిలో నడుస్తారు; ఏకత్వశోభి= ఏకంగా ప్రకాశించే; మహిత నానాత్వము+అనఁగన్= గొప్పదైన అనేకత్వం అనబడి; సమస్తభూత సముదయస్థమై; ఉన్నతత్త్వము= సమస్త ప్రాణి సముదాయాలలోనూ ఉన్న ఆత్మ వస్తువు; ప్రకాశము+అగుటన్= ప్రకాశించగా; అఖిల గతులన్+తోఁచున్= అన్ని విధాలా కనిపిస్తుంది; ఆ విధంబు+కలుగు బుధుఁడు= ఆ విధంగా దర్శించగల పండితుడు (జ్ఞాని); నిర్ద్వంద్వుడు+ఐ= ద్వంద్వమోహం పోయినవాడై; ముక్తిన్+కాంచున్= ముక్తి పొందుతాడు.

**తాత్పర్యం:** సన్న్యాస మంటే తపస్సుచేయటమే. తపోజ్ఞానంచేత జాగరూక చిత్తం కలిగిన యోగులు చింతించి తెలిసికొనజాలనిదీ, ఎప్పటికీ నిత్యనూతనమైనదీ, చావు లేనిదీ అయిన ఆ మహాతత్త్వాన్ని చూస్తారు. తపోవృత్తివలన రజస్తమస్సులు లేని శుద్ధసత్త్వానికి ఆశ్రయమైన హృదయం ఏర్పడుతుంది. క్షేమమైన దారిలో పయనించటానికి అది

మూలమవుతుంది. ఏకత్వం అనేకత్వం అనే రెండు లక్షణాలూ కలిగిన ఆ ఆత్మవస్తువు సకల ప్రాణి సముదాయాలలోనూ అన్ని రీతులలోనూ ప్రకాశించటం మొదలవుతుంది. అట్లాంటి జ్ఞాని ద్వంద్వమోహాలను అధిగమించి ముక్తిని పొందుతాడు.

**వ. అవ్యక్త ప్రభవంబును బుద్ధి స్కంధంబును నహంకార విటపంబును మహా భూతోపశాఖంబును నింద్రియ కోటరంబును సంతతాశా పల్లవంబును శుభాశుభ ఫలంబును నై సంసార వృక్షం బొప్పుచుండు. 178**

**ప్రతిపదార్థం:** అవ్యక్త ప్రభవంబును= తెలియని పుట్టుక కలిగింది (అవ్యక్తాన్నే వేరుగా, బీజంగా కలిగింది); బుద్ధి స్కంధంబును= బుద్ధినే కాండంగా కలిగింది; అహంకార విటపంబును= అహంకారాన్నే కొమ్మగా కలిగిందీ; మహాభూత+ఉపశాఖంబును= మహా భూతాలనే రెమ్మలుగా కలిగిందీ; ఇంద్రియకోటరంబును= ఇంద్రియాలనే తొర్రలుగా కలిగింది; సంతత= నిరంతరం; ఆశా పల్లవంబును= పుట్టే ఆశలనే చిగురులుగా కలిగింది; శుభ+అశుభ ఫలంబును+ఐ= శుభం అశుభం అనే పండ్లను కలిగిందై; సంసారవృక్షంబు= సంసారమనే చెట్టు; ఒప్పుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** అవ్యక్తమనే బీజాన్ని, బుద్ధి అనే కాండాన్ని, అహంకారమనే కొమ్మను, మహాభూతాలనే రెమ్మలను, ఇంద్రియాలనే తొర్రలను, నిరంతరం పుట్టే ఆశ లనే చిగుళ్ళను, మంచిచెడు లనే ఫలాలను కలిగినదై ఈ సంసారమనే చెట్టు ప్రకాశిస్తూ ఉంటుంది.

**విశేషం:** అలం: రూపకం.

**క. జ్ఞానాసి నది నటికి యభి। మానాహంకార మతి నియతి యగు పురుషుం**
**డానందము ప్రస్ఫుటముగఁ। గానంగా నేర్చు విగతకల్మషులారా! 179**

**ప్రతిపదార్థం:** విగతకల్మషులారా!= పోయిన పాపాలుగల ఋషులారా!; జ్ఞాన+అసిన్= జ్ఞానమనే కత్తితో; అది= ఆ చెట్టును; నటికి= నరికివేసి; అభిమాన+అహంకార మతి= అభిమానం, అహంకారం అనే లక్షణాలుకల మతి; నియతి+అగు= నియంత్రణలో ఉన్న; పురుషుండు= యోగిపురుషుడు; ఆనందము= ఆత్మానందాన్ని; ప్రస్ఫుటముగన్= స్పష్టంగా; కానంగాన్+నేర్చున్= దర్శించగలుగుతాడు.

**తాత్పర్యం:** జ్ఞానమనే కత్తితో ఆ చెట్టును నరికివేసి అభిమాన, అహంకారాలను ఎవరు నియంత్రించుకొంటారో ఆ యోగి నిస్సందేహంగా బ్రహ్మానందాన్ని పొందగలుగుతాడు.

**విశేషం:** అశ్వత్థ వృక్షంగా జగత్తును వర్ణించిన గీతాకారుడు 'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా' అన్నాడు. ఈ లోకమనే మహావృక్షాన్ని 'నిస్సంగం' (అంటే ఎందులోనూ ప్రవేశించని మనస్సు) అనే శస్త్రంతో ఖండించాలని చెప్పాడు.

ఇక్కడ ఈ వృక్షానికి మూలం మొదలు ఫలం దాకా అన్నీ చెప్పబడ్డాయి. 'జ్ఞానం' అనే కత్తితో ఈ చెట్టును ఖండించవచ్చునట. అప్పుడు అభిమాన, అహంకారాలు నశిస్తాయి. అప్పుడు సాత్త్విక ప్రజ్ఞ ప్రవర్తించి 'ఆత్మ' దర్శనమిస్తుంది. ఆ ఆనందమే బ్రహ్మానందమని యోగులు పిలిచింది.

**ఆ. నిమిషమైనఁ బరమ నియతి నాత్మని నాత్మ। యంద కనినఁ దెలివి నారఁ బడసి**
**బోధమహితమునులు పొందు నవ్యయగతిఁ। బొందఁ గంద్రు ప్రకృతి పొందు దొఱఁగి. 180**

**ప్రతిపదార్థం:** నిమిషము+ఐనన్= ఒక నిమిషంపాటైనాసరే; పరమనియతిన్= మిక్కిలి నిష్ఠతో (యోగసాధనతో); ఆత్మునిన్+ ఆత్మ+అందున్+అ+కనినన్= ఆత్ముడిని ఆత్మలో చూస్తే; తెలివిన్+ఆరన్+పడసి= సమగ్రమైన జ్ఞానం పొంది; ప్రకృతిపొందు+తొఱఁ గి= ప్రకృతితోడి అనుబంధాన్ని వదలి; బోధమహిత= జ్ఞానంచేత మహనీయులైన; మునులు+పొందు= మునులు పొందేటటువంటి; అవ్యయగతిన్= ముక్తిస్థానాన్ని; పొందన్+కంద్రు= పొందగలుగుతారు.

**తాత్పర్యం:** మిక్కిలి నిష్ఠతో యోగసాధన మూలంగా తనలోని జీవాత్మను తాను దర్శించగలిగితే, అది ఒక నిమిషంపాటు జరిగినా చాలు. ఈ లోకంతోడి విషయానుబంధాలనుండి ముక్తుడై జ్ఞానులైన మహర్షులు పొందే ఆ ముక్తిస్థానాన్ని పొందగలుగుతాడు.

**ఆ.** **పరమనియతి యనఁగఁ బ్రాణసంయమనంబు; । యది క్రమాభివృద్ధి నలవరింపఁ**
**గాఁ బ్రసాద సిద్ధి గలిమి ధ్రువం; బవ్వి । శేషకలన మిష్టసిద్ధిఁ జేర్చు.** **181**

**ప్రతిపదార్థం:** పరమనియతి+అనఁగన్= పరమనియతి అనగా; ప్రాణసంయమనంబు= ప్రాణవాయువును నియంత్రించటమే (అంటే యోగసాధనే); అది= ఆ సాధన; క్రమాభివృద్ధిన్= క్రమంగా పెంచుకొంటూ; అలవరింపఁగాన్= సాధనచేయగా; ప్రసాదసిద్ధి+కలిమి= ప్రసార సిద్ధి కలగటం; ధ్రువంబు= సత్యం; ఆ+విశేషకలనము= ఆ ప్రసాద సిద్ధిరూపమైన వైశిష్ట్యం కలిగి ఉండటం; ఇష్టసిద్ధిన్+చేర్చున్= కోరిన దానిని ఇస్తుంది.

**తాత్పర్యం:** పరమనియతి అని ముందు చెప్పింది ప్రాణవాయు నిరోధరూపమైన యోగసాధననే, దానిని క్రమంగా పెంచుకొంటూ అభ్యసిస్తూ పోగా భగవత్ ప్రసాదరూపమైన సిద్ధి తప్పకుండా కలుగుతుంది. దానివలన ఇష్టార్థాలు సిద్ధిస్తాయి.

**విశేషం:** పద్యంలో ఎక్కడా భగవంతుడి పేరులేదు. కాని, ప్రసాద దాత పరమాత్మస్వరూపుడైన భగవంతుడే. యోగానికి ఆత్మదర్శనమే ప్రయోజనం కాబట్టి యోగసిద్ధికూడా దైవానుగ్రహంవలననే జరుగుతుందని మహర్షులంతా సెలవిచ్చారు. అందుకే యోగం, క్షేమం రెండూ నేనే వహిస్తాను అని భగవంతుడు అర్జునుడికి వరప్రసాదమిచ్చాడు.

**క.** **అవ్యక్త తత్త్వ జాతము । భవ్యము సత్త్వంబు దురిత పంక హరంబై**
**యవ్యయ మమృత మనింద్రియ । భావ్యం బగు తత్త్వ మొందఁ బ్రాఁకగుఁ జుండీ!** **182**

**ప్రతిపదార్థం:** అవ్యక్త తత్త్వజాతము= అవ్యక్త తత్త్వానికి సంబంధించిన జ్ఞానం; భవ్యము= పుణ్యప్రదమైనది; సత్త్వంబు= సాత్త్వికమైనది; దురితపంకహరంబు+ఐ= దురితాలనే బురదను తొలిగించేదై; అవ్యయము= అనంతమైన; అమృతము= శాశ్వతమైన; న+ఇంద్రియ భావ్యంబగు తత్త్వము+ఒందన్= ఇంద్రియాలచేత భావింపజాలని తత్త్వాన్ని (ఆత్మతత్త్వాన్ని) పొందటానికి; ప్రాఁకు+అగున్= ఆధారమవుతుంది; చుండీ!= సుమండీ!

**తాత్పర్యం:** ఇంతవరకు చెప్పిన అవ్యక్త తత్త్వజ్ఞానం పుణ్యప్రదం. సాత్త్వికం, పాపహరం, అవ్యయమైన అనంతమైన ఇంద్రియాతీతమైన ఆత్మతత్త్వ దర్శనాన్ని చేయటానికి జ్ఞానం పాకుడు తీగవలె పనికి వస్తుంది. (అంటే ఇది దొరికితే దానిని చేరుకొనటం సులభమని అర్థం.)

**వ.** **కావున.** **183**

**తాత్పర్యం:** అందుచేత (-తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **సత్త్వభావన కంటెఁ బ్రశస్తమైన । కృత్య మరయంగ లేదండ్రు నిత్యవస్తు**
**సమ్యగధిగమ సిద్ధికి సంయమ ప్ర । సిద్ధు లాగమతంత్ర ప్రసిద్ధులార!** **184**

**ప్రతిపదార్థం:** సంయమ ప్రసిద్ధులు= ఋషిశ్రేష్ఠులు; నిత్యవస్తు సమ్యక్+అధి గమ+సిద్ధికిన్= నిత్యమైన ఆత్మవస్తువును సమగ్రంగా చేరుకొనటానికి; సత్త్వభావనకంటెన్= ఆ సత్త్వరూపమైన మహాతత్త్వాన్ని (ఆత్మను) భావించటంకన్నా; ప్రశస్తమైన కృత్యము= శ్రేష్ఠమైన కార్యం; అరయంగన్= బాగా చూడగా; లేదు+అండ్రు= లేదు అంటారు; ఆగమతంత్ర ప్రసిద్ధులార!= వేద తంత్రం తెలిసిన వారిలో శ్రేష్ఠులైన వారా! (ఇది మీకు చెప్పాలా? అని అర్థం).

**తాత్పర్యం:** మీరు వేదతంత్రం తెలిసినవారిలో శ్రేష్ఠులు, మీకు తెలియనిది ఏమున్నది? ఋషిశ్రేష్ఠులు నిత్యమైన ఆత్మ వస్తువును సమగ్రంగా చేరుకొనటానికి ఆ 'సత్త్వ' భావనకంటె శ్రేష్ఠమైన పని మరొకటి లేదు- అని నిశ్చయంగా చెప్పారు.

**విశేషం:** ముందు 106వ పద్యంలో 'సత్త్వ'మంటే 'పరమవేద్య' తత్త్వమని చెప్పారు. గమనించి ఇక్కడ అన్వయించుకొనాలి.

**క.** **వినుఁడీ! సత్త్వస్థుఁ బురుషుఁ । గనుఁగొనుఁ డనుమాన కలనఁ గాని మదిం ద**
**క్కిన తెఱఁ గేమిట నైనం । గనుఁగొనియెద మనుట వెరవు గాకుండుఁ జుఁడీ!** **185**

**ప్రతిపదార్థం:** వినుఁడీ!= వినండి!; ఈ+సత్త్వస్థున్= ఈ సత్త్వస్థితిలో ఉండే; పురుషున్= మహాపురుష తత్త్వాన్ని (పరమాత్మను); కనుఁగొనుఁడు= దర్శించండి (ఇంతరకు చెప్పిన తపోయజ్ఞ యోగసాధనాది మార్గాల ద్వారా); అనుమానకలనన్+కాని= అనుమాన ప్రమాణంతోకాని; మదిన్= మదిలో; తక్కిన= ఇతరమైన; తెఱఁగు+ఏమిటన్+ఐనన్= ఏ పద్ధతిలోగాని; కనుఁగొనియెదము+అనుట= చూడగలుగుతాం అనటం; వెరవు+కాకుండున్= సాధ్యం కాదు; చుఁడీ!= సుమండీ!

**తాత్పర్యం:** ఈ 'సత్త్వ' నిష్ఠుడైన ఆ మహావేదవేద్యుడి తపోయజ్ఞయోగాది మార్గాలద్వారా 'సత్త్వ' భావనచేతనే సాధించాలి తప్ప అనుమాన ప్రమాణం కాని, ఏ ఇతర ఉపాయం కాని లేదు. అట్లా చూడగలుగుతామనుకొనటం అసాధ్యం సుమండీ!

**విశేషం:** న్యాయశాస్త్రంలో 'అనుమాన' ప్రమాణం చర్చించబడింది. ఇతరమైన ప్రత్యక్ష ఉపమానాది ప్రమాణాలూ ఉన్నాయి. 'ధూమాగ్ని న్యాయం' అనుమాన ప్రమాణానికి నిదర్శనం. ఎక్కడ పొగ ఉన్నదో అక్కడ అగ్ని ఉంటుందన్నది అనుమానం. భగవత్తత్త్వ వివేచన అట్లాంటిది కాదు. అది నిష్కారణమైన కారణం- కార్యం. కర్తలేని కర్మ, కర్మలేని క్రియ, అందుచేత 'సత్త్వ' మన్నారు. అంటే అట్లాగే ఉన్నదని అర్థం. దానిని 'భావించటం' అంటే 'తర్కించటం' కానేకాదు. ఉపాసించటమని అర్థం. అది ప్రాణ 'రూపం కాబట్టి 'ప్రాణ' నియంత్రణద్వారా చేస్తున్నాం. అందుచేత అనుమాన ప్రమాణంద్వారా సాధ్యం కాదనటం. దానికి 'ప్రత్యక్ష' నిరూపణ. 'అనుమానం' జరిపించటం సాధ్యంకాదు. అందుచేత మార్గాంతరం లేదనటం.

**సీ.** **ఇట్లగ టె ట్లనియెదరేని సత్యంబు । సంతోషమును నహింసయును ధృతియు**
**క్షమయు నార్జవమును సన్న్యాసమును బరి । త్యాగంబు విజ్ఞానయోగ దశయు**
**సాత్త్వికంబులు గాన తత్త్వవిజ్ఞమలీ । యనుమానముఁ బురుషాధిగమముఁ**
**బడయుట యొప్పెడు పదమండ్రు తత్త్వంబుఁ । బురుషుండు నొకఁ డను బుద్ధిఁ గొంద**

**తే. ఊర్చ్యు లూఁదురు రట్లేలయగు సుదుంబ। రమున మశకమ్ము వారి మీనము వసించు**
**నట్లు సత్త్వంబునం దంతరాత్ముఁ డండుఁ। గాక యనియెడివారు పెక్కంద్రు గలరు.' 186**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అగుట= ఇట్లాకావటం; ఎట్లు+అనియెదరు+ఏని= ఎట్లాఅంటారా! (అయితే వినండి); సత్యంబున్= సత్యమూ; సంతోషమును= సంతోషమూ; అహింసయును= అహింసా; ధృతియున్= ధైర్యమూ; క్షమయున్= ఓర్పూ; అర్ధవమును= ఋజుమార్గమూ; సన్న్యాసమును; పరిత్యాగంబున్= త్యాగబుద్ధీ; విజ్ఞానయోగదశయున్= విజ్ఞానయోగస్థితి; సాత్త్వికంబులు+కాన= సాత్త్వికాలు కాబట్టి; తత్త్వవిజ్ఞులు= తత్త్వవేత్తలు; అనుమానమునన్= అనుమానప్రమాణంతో; పురుషాధిగమమున్+పడయుట= పురుష తత్త్వాన్ని; తెలిసికొనటం; ఒప్పెడు+పదమంద్రు= తగిన పద్ధతి అంటారు; కొందఱు+ఆర్యులు= కొందరు విద్వాంసులు; తత్త్వంబున్= తత్త్వమూ; పురుషుఁడున్= పురుషుఁడు; ఒకఁడు+అనుబుద్ధిన్= ఒకడనే ఆలోచనతో; ఊఁదుదురు= నొక్కి చెప్తుతారు; అట్లు+ఏల+అగున్= అట్లా ఎందుకవుతుంది?; ఉదుంబరమునన్= మేడిపండులో; మశకమ్ముు= పురుగూ; వారిన్= నీటిలో; మీనమున్= చేప; వసించునట్లు= బ్రతికేటట్లు; సత్త్వంబునందున్= సత్త్వంలోనే; అంతరాత్ముఁడు+ఉండుఁగాక= అంతరాత్మ ఉంటుంది పోండి!; అనియెడువారు= అనేవారూ; పెక్కంద్రు+కలరు= చాలా మంది ఉన్నారు.

**తాత్పర్యం:** ఇట్లా ఎందుకు అన్నానంటే సత్యం, సంతోషం, అహింస, ధృతి, క్షమ, ఋజుత్వం, సన్న్యాసం, త్యాగబుద్ధి, విజ్ఞానయుక్తి-ఇవన్నీ సాత్త్విక గుణాలు కాబట్టి ఇవి ఉన్నచోట 'పురుషతత్త్వం' ఉన్నట్లే కాబట్టి పురుషతత్త్వాన్ని గుర్తించటానికి ఈ అనుమాన ప్రమాణం చాలు అంటారు. కొందరు పురుషుడూ, తత్త్వమూ ఒకటే నంటారు. మరికొందరు అట్లాఎట్లా అవుతుంది! మేడిపండులో పురుగులు, నీటిలో చేప ఉన్నట్లే సత్త్వంలోనే అంతరాత్మ ఉంటాడు. ఇది నిశ్చయం - అని అనేవారూ ఉన్నారు.'

**విశేషం:** 'మశక'మంటే దోమ, మేడిచెట్టు నాశ్రయించి 'దోమ' లుంటాయన్నది ప్రసిద్ధం కాదు కాబట్టి 'మేడిపండు'ను గ్రహించి వివరించాను

మేడిపండులోని పురుగు, నీటిలోని చేప ఆధార ఆధేయ సంబంధం కలిగినవి. సాత్త్వికాదిగుణాలను ఆధారంగా పురుషతత్త్వాన్ని గుర్తించటం ఇట్లాంటిదే అని కొందరనవచ్చును. కొందరు ఆ 'పురుషుడే' తత్త్వసంకేత మనవచ్చును. కొందరు 'సత్త్వం' అని ఏ గుణాన్ని పిలుస్తామో అదే 'ఆత్మ' దర్శనానికి ఆధార మనవచ్చును. ఎట్లా అన్నా అర్థం ఒకటే. వాదమంతా ఆ రెంటి సంబంధాన్ని గుర్తించటంలోనే. తిక్కనగారు సత్త్వపురుష సంబంధాన్ని తరువాత వివరిస్తున్నారు. అక్కడ ఈ రెంటినడుమ అన్వయం ఎట్లా ఉన్నదో చూడవచ్చును.

**వ. అనిన విని యమ్మును లమ్మహితాత్మునితో 'ధర్మంబు లనేక విధంబులు; వీనిలో నెవ్వం డెయ్యది యవలంబించె నదియ వాఁడు మేలను; నే మన్నింటి మీఁదనుం బరఁగిన బుద్ధులు గలిగి యనిశ్చయ దర్శనులమయి యుండుదు; మిది ప్రధానానుష్ఠేయంబని యుపదేశింపవలయు; సత్త్వపురుష సంబంధ ప్రకారంబును బ్రస్ఫుటంబుగా నెఱింగింపు' మనుటయు వారికి వారిజాసనుం డిట్లనియె. 187**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని బ్రహ్మ చెప్పగా విన్నవారై; ఆ+మునులు= ఆ ఋషులు; ఆ+మహిత+ఆత్మునితోన్= ఆ మహాత్ముడితో; ధర్మంబులు= ధర్మాలు; అనేక విధంబులు= అనేక రీతులు; వీనిలోన్= వీటిలో; ఎవ్వండు= ఎవడు; ఏ+అది=

ఏది; అవలంబించెన్= పాటిస్తాడో; వాఁడు; అది+అ= అదే; మేలు+అనున్= మేలు అంటాడు; ఏము= మేమైతే; అన్నింటిమీఁదనున్= అన్నిటిమీదా; పరఁగిన= వ్యాపించిన; బుద్ధులు+కలిగి= బుద్ధులున్నవారమై; అనిశ్చయ= స్పష్టంగా లేని; దర్శనులము+అయి= జ్ఞానం కలవారమై; ఉండుదుము= ఉన్నాం; ఇది= ఇట్లాంటిది; ప్రధాన+అనుష్ఠేయంబు+అని= ప్రధానంగా అనుష్ఠించదగినదని; ఉపదేశింపవలయున్= ఉపదేశించబడి; సత్త్వ, పురుష సంబంధ ప్రకారంబును= సత్త్వానికి పురుషుడికీ ఉన్న సంబంధాన్ని; ప్రస్ఫుటంబుగాన్= స్పష్టంగా; ఎఱింగింపుము= చెప్పండి; అనుటయున్= అని వారు కోరగా; వారికిన్= ఆ ఋషులకు; వారిజాసనుండు= బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ఋషులు అతడితో 'స్వామీ! ధర్మాలు అనేక రీతులలో ఉంటాయి. వీటిలో ఎవడు దేన్ని పాటిస్తే వాడు దానినే మేలంటాడు. మేము అన్నిటిమీదా ప్రసరించిన బుద్ధులు కలవారమై నిశ్చయజ్ఞానం లేకుండా ఉన్నాం. ముఖ్యంగా అనుష్ఠించదగిన పద్ధతి ఇది అని బోధించండి. సత్త్వానికి పురుషుడికీ సంబంధం ఏమిటో స్పష్టంగా తెలపండి' అని కోరగా బ్రహ్మ వారితో ఇట్లా అన్నాడు.

**(సత్త్వం బవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట (సం.14-49-2))**

**సీ.** **'సకల ధర్మములలో సర్వభూతాహింస । మేటి; యహింసా సమేతుఁ డైన**
**వానికి నుత్తమ జ్ఞానోదయం బగు; । నది మోక్షమొనరించు ననఘులార!**
**కోరిక మెయిఁ గర్మకారి యయ్యెడు వాఁడు । వొందు గతాగతంబులు ఫలాభి**
**లాషంబు లేక నిర్దోషత మే లాచ । రించిన ముక్తి సిద్ధించు వినుఁడు!**

**తే.** **విషయి పురుషుండు, సత్త్వంబు విషయ; మిట్లు । భోక్తృ భోజ్యత్వ సంబంధమునఁ బొసంగి**
**యుండియును బద్మపత్త్రపయోలవంబు । కరణి నతఁడు తత్సంగంబుఁ బొరయకుండు.** **188**

**ప్రతిపదార్థం:** అనఘులార!= పుణ్యాత్ములారా! సకలధర్మములలోన్= అన్ని ధర్మాలలోనూ; సర్వభూత+అహింస= ఏ ప్రాణినీ హింసించకుండా ఉండటం; మేటి= గొప్పది; అహింసాసమేతుఁడు+ఐనవానికిన్= అహింసను పాటించేవాడికి; ఉత్తమజ్ఞాన+ఉదయంబు+అగున్= ఉత్తమజ్ఞానం కలుగుతుంది; అది= ఆ జ్ఞానం; మోక్షము+ఒనరించున్= మోక్షం ప్రసాదిస్తుంది; కోరికమెయిన్= కోరిక కలిగి (సకామమైన); కర్మకారి+అయ్యెడువాఁడు= కర్మమార్గ నిష్ఠుడయ్యేవాడు; గత+అగతంబులు+పొందున్= జన్మమరణాలను పొందుతాడు; ఫల+అభిలాషంబు లేక= ఫలితంలో కోరిక లేకుండా; నిర్దోషతన్= ఏ దోషాన్నీ చేయకుండా; మేలు+ఆచరించినన్= పుణ్యంచేస్తే; ముక్తి సిద్ధించున్= ముక్తి కలుగుతుంది; వినుఁడు= వినండి; పురుషుండు; విషయి= విషయానుభవం పొందేవాడు; సత్త్వంబు= సత్త్వం; విషయము= విషయం; ఇట్లు= ఈ విధంగా భోక్తృ= తినేవాడు; భోజ్య= తినబడేది అనే; సంబంధమునన్+ పొసంగి+ఉండియును= సంబంధంతోకూడి ఉన్నాకూడా; పద్మపత్ర+పయస్+లవంబు= తామరాకుమీద నీటిబొట్టు; కరణిన్= చందంగా; అతఁడు= ఆ పురుషుడు; తద్+సంగంబున్= ఆ సత్త్వంతో కూడికను; పొరయఁక+ఉండున్= పొందకుండా ఉంటాడు.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ములారా! అన్ని ధర్మాలలోనూ అహింస గొప్పది. ఏ ప్రాణినీ హింసించనివాడికి ఉత్తమ జ్ఞానం కలుగుతుంది. అది మోక్షదాయిని అవుతుంది. కోరికతో పని చేసేవాడు నిరంతరం జననమరణ రూపమైన 'బంధం' లో చిక్కుకొనే ఉంటాడు. ఫలితం మీద ఆశలేకుండా, ఏ దోషాన్ని చేయకుండా పుణ్యం నిర్వహించిన వాడికి తప్పక ముక్తి లభిస్తుంది. పురుషుడు విషయి; సత్త్వం విషయం. భోక్తకు భోజ్యానికి నడుమ ఉన్న సంబంధం ఈ రెండింటినడమ

ఉన్నది. తామరాకుమీద నీటిబొట్టు చందాన పురుషుడు సత్త్వాన్ని అంటీ అంటకుండా ఉంటాడు. ఏ బంధాన్నీ పొందడు. పద్మపత్త్రపయోలవంబు కరణి-అలంకారం ఉపమ.

**క. సత్త్వము ప్రదీప మా పర। తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా**
**తత్త్వము వదలక చిత్త సు। ఖత్వాకలిత మగు నెలవు గంద్రు కృతాత్ముల్. 189**

**ప్రతిపదార్థం:** సత్త్వము; ఆ+పరతత్త్వమున్+కాంచుటకున్= ఆ పరతత్త్వాన్ని దర్శించటానికి; ప్రదీపము= దివ్వె వంటిది; కాన= కాబట్టి; తద్+సాధనతా+తత్త్వమున్= దాని కారణంగా గ్రహించి సాధించాలన్న ధ్యేయాన్ని వదలకుండా; చిత్త+సుఖత్వ+ఆకలితము+ అగు+నెలవున్= చిత్త సుఖాన్ని కలిగించేటటువంటి స్థిరమైన పదాన్ని; కృతాత్ముల్= పుణ్యాత్ములు (పరిణతాత్ములు); కంద్రు= పొందుతారు.

**తాత్పర్యం:** ఆ పరతత్త్వాన్ని దర్శించటానికి దివ్వెవంటిది సత్త్వం. అందుచేత సత్త్వాన్ని సాధనంగా గ్రహించి పరతత్త్వసాధన చేయాలన్న ధ్యేయంతో వదలకుండా ప్రయత్నించి ఆత్మవిద్యలో పరినిష్ఠులై యోగులు చిత్త సుఖంతో కూడుకొన్న స్థిరమైన 'ముక్తి' ధామాన్ని చేరుకొంటారు.

**చ. అది సదుపాయ మెందును నుపాయసమగ్రత లేమి సేర్ప ద**
**భ్యుదయము దూరమార్గమునఁ బొందెడు భద్రము వాహనాఢ్యుఁడున్**
**నది నెఱి నుత్తరించి కనునందము నౌ సహితుండుఁ గాంచు నొ**
**ప్పిదము విసాధనుం డయిన బే లెటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా! 190**

**ప్రతిపదార్థం:** అది= ఆ సత్త్వాన్ని సాధనంగా గ్రహించటం; సత్+ఉపాయం= మంచి పద్ధతి; ఎందునున్= ఎప్పుడైనా; ఉపాయసమగ్రత లేమి= సమగ్రమైన ఉపాయం లేకపోవటం; అభ్యుదయమున్+చేర్పదు= ఫలసాధనవైపు మనిషిని నడిపించదు; వాహనాఢ్యుఁ డున్= వాహనం కలిగినవాడు; దూరమార్గమునన్= దూరప్రయాణంలో; భద్రమున్+పొందెడున్= క్షేమం పొందుతాడు; నదిన్= నదిని; నెఱిన్+ఉత్తరించి= సులభంగా దాటి; కను+అందము= పొందే సంతోషం; నౌ+సహితుండు= నావ కలిగినవాడు; కాంచున్+ఒప్పిదము= పొందే తీరుగా; విసాధనుండు+అయిన= ఏ సాధనమూ లేని; బేల= అమాయకుడు; ఎటులు+ఒందఁ గన్+నేర్చున్?= ఎట్లా పొందగలరు?; చెప్పుఁడా!= చెప్పండి.

**తాత్పర్యం:** ఆ సత్త్వాన్ని సాధనంగా గ్రహించటం ఉత్తమపద్ధతి. ఎవరికైనా ఉపాయం లేకుండా ఫలసాధన పొందగలగటం అసాధ్యం. వాహనం కలిగినవాడే దూరప్రయాణంలో క్షేమం పొందుతాడు. నావ కలిగినవాడు నదిని దాటి పొందే సుఖం ఏ సాధనమూ లేని బేల ఎట్లా పొందగలుగుతాడో మీరే చెప్పండి!

**విశేషం:** అలం: దృష్టాంతం, బ్రహ్మ చూపిస్తున్న రెండు పోలికలూ 'ప్రయాణం'తో సంబంధం కలిగినవే. ఈ ప్రయాణమే 'మహాప్రస్థానం'- చివర పొందే ఫలాన్ని 'అభ్యుదయం' అంటున్నాడు. 'భద్రము' అనబడేది శ్రేయస్సు. 'అందము' అనబడేది సచ్చిదానంద రూపమైన 'ముక్తిధామం' 'నావ' సత్త్వం, నావికుడు 'పురుషుడు'. నావ లేని పురుషుడు 'బేల'. వాడే సాధనం తెలియక ప్రయాణంచేయలేక ఏడుస్తూ కూర్చుంటాడు.

**ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యెఱిఁగి యేనియును నె। ఱుంగకేని బలిమి ఱొచ్చు గడిగి**
**చేయుపని ఫలంబు సిద్ధింపకుండుట। కొలఁదిఁ బోక దుఃఖములును గలుగు. 191**

**ప్రతిపదార్థం:** ఇట్టులు+అగుట= ఇట్లా సాధనం లేక కార్యసాధనం కుదరదని; ఎఱిఁగి= గుర్తించి; ఎఱిఁగి+ఏనియును= తెలిసినా; ఎఱుంగక+ఏని= తెలియకపోయినా; బలిమిన్= పూనికతో; ఱొచ్చు= మాలిన్యాన్ని; కడిగి= శుభ్రపరచి; చేయుపని= చేసేపని; ఫలంబు+సిద్ధింపకుండుట= ఫలసిద్ధి కాకపోవటం; కొలఁదిన్+పోకన్= తన సామర్థ్యాన్ని గుర్తిచకపోవటంచేత; (దానితో) దుఃఖములున్+కలుగున్= క్లేశాలు కూడా కలుగుతాయి.

**తాత్పర్యం:** ఇట్లా కావడం (సాధనం చాలా అవసరం కావడం) తెలుసుకొనికూడా తెలొసో తెలియకో (సాధనం లేకుండా) బలంగా మాలిన్యాన్ని కడిగి చేసే పని సిద్ధించకపోవడం మాత్రం చేతనే పోకుండా దుఃఖములు కూడా కలుగుతాయి.

**క. స్థలపథమునఁ బోతమ్ము। స్థలమార్గమునందు వాహనము వినియోజ్యం**
**బులుగా నిమ్మెయి సాధన। కలన విభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితముల్. 192**

**ప్రతిపదార్థం:** స్థలపథమునన్= స్థలమార్గంలో; పోతమ్మున్= ఓడను; జలమార్గమునందున్= నీటిమార్గంలో; వాహనము= బండి; వి+నియోజ్యంబులుగాన్= వాడదగనివిగా; ఈ+మెయిన్= ఈ రీతిగా; సాధనకలన+విభాగజ్ఞుఁడు+ఐనన్= సాధన సంపత్తిని విభజించుకొనే వాడైతే; దురితముల్+కడచున్= పాపాలను అధిగమిస్తాడు.

**తాత్పర్యం:** స్థలమార్గంలో ఓడ, జలమార్గంలో బండి పనికిరాదని ఎవడు సాధన విభాగ పరిజ్ఞానం సాధిస్తాడో వాడు పాపాలను అధిగమించగలడు.

**వ. అని చెప్పి. 193**

**తాత్పర్యం:** అని చెప్పినవాడై- (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. తటినిఁ దగ నుత్తరించునంతకును బోత। మాదరించి తక్కొల్లనియట్లు పురుష**
**దర్శనము సంభవించు నంతకును సత్త్వ। మూఁది పిదపఁ దత్సంబంధ ముడుగుఁ డనియె. 194**

**ప్రతిపదార్థం:** తటినిన్= నదిని; తగన్= తగినట్లుగా; ఉత్తరించునంతకునున్= దాటేంతవరకూ; పోతము+ఆదరించి= ఓడను పట్టుకొని; తక్కు+ఒల్లని+అట్లు= ఆ మీదట వదలివేసినట్లు; పురుష దర్శనము= పురుషుడి దర్శనం; సంభవించునంతకును= కలిగేదాకా; సత్త్వము+ఊఁది= సత్త్వాన్ని అవలంబించి; పిదపన్= తరువాత; తద్+ సంబంధము= ఆ సత్త్వ సంబంధాన్నికూడా; ఉడుగుఁడు+అనియెన్= వదలివేయండి అని అన్నాడు.

**తాత్పర్యం:** నదిని పూర్తిగా దాటేదాకా ఓడను ఆశ్రయిస్తాం. తరువాత దానిని విడిచిపెడతాం. అట్లాగే 'పురుషుడి దర్శనం అయ్యేంతవరకు 'సత్త్వం' అవలంబించి ఆ తరువాత దానితో కూడా సంబంధాన్ని విడిచిపెట్టండి.

**విశేషం:** అలం: ఉపమ. 'ఏరు దాటాక తెప్ప తగలెయ్యట' మని ఒక సామెత ఉంది. అదికాదు ఇది. 'సాధనం' కార్యసాఫల్యానికి ఉత్తమ 'కరణం' మాత్రమే. మార్గంలో 'అభ్యుదయం' ప్రధానం కాబట్టి 'సాధనాన్ని' ఎంత మేరకు ఎట్లా వాడుకోవాలో అట్లా

వాడుకొనటమే ముందుచెప్పిన 'ఉపాయం'. పురుషుడు - క్షేత్రజ్ఞుడు అతడి దర్శనమైన తరువాత 'క్షేత్ర' రూపమైన ప్రకృతితో ఎంత సాక్షీభూతమైన సంబంధం ఉంటుందో, సాధకుడు 'సత్త్వం' అనే గుణసంపదను కూడా వదలి నిస్సంగుడై, నిర్గుణుడు అవుతాడని తాత్పర్యం.

**వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబు గుణంబు మహత్తత్త్వంబు మహత్తత్త్వగుణం బహంకారం బహంకారంబు గుణంబులు మహాభూతంబులు మహాభూతగుణంబులు శబ్దాదులం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు దేజస్సునకు శబ్దస్పర్శ రూపంబులు జలంబునకు శబ్దస్పర్శ రూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరస గంధంబులు గుణంబులు; శబ్దంబు మృదు ఖరాది బహువిధ భేదంబులు గలిగియుండు స్పర్శంబు శీతోష్ణ ముఖ్య వివిధ ప్రకారంబులం బరఁగు రూపంబు శుక్ల కృష్ణ ప్రభృతి నానా విధంబులం జను రసంబు మధుర తిక్తాది ప్రచురభంగుల నడచు గంధంబు సురభి తీక్ష్ణ ప్రముఖానేక విధంబుల వర్తించు నిట్లు పెక్కు చందంబులం జెల్లు విషయముల తెఱం గెఱుంగుట వానిఁ దొఱంగుటకుం దోడ్పడం జాలు నని చెప్పి వెండియు. 195**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఉపదేశించి= బోధించి; మఱియున్+ఇట్లు+అనున్= ఇంకా ఇట్లా చెప్పాడు; అవ్యక్తంబు గుణంబు మహత్తత్త్వంబు= అవ్యక్త గుణమే మహత్తత్త్వం; మహత్తత్త్వ గుణంబు+అహంకారంబు= మహత్తత్త్వ గుణం అహంకారం; అహంకార గుణంబులు మహాభూతంబులు= అహంకార గుణాలే మహాపంచభూతాలు;

ఆకాశమునకు-శబ్దం.
వాయువునకు-శబ్దం+స్పర్శం.
తేజస్సునకు-శబ్దం+స్పర్శం+రూపం.
జలమునకు-శబ్దం+స్పర్శ+రూపం+రసం.
పృథివికి-శబ్దం+స్పర్శ+రూపం+రసం+గంధం **గుణాలు**

శబ్దం= మృదువు. కఠినం (ఖర) అని అనేక భేదాలు కలిగినది;
స్పర్శం= శీత (చల్లని), ఉష్ణ (వేడి) మొదలైన తేడాలు కలిగినది;
రూపం= శుక్ల (తెల్లని), కృష్ణ (నల్లని) మొదలైన చాలా భేదాలున్నది;
రసం= మధురం (తీపు), తిక్తం (చేదు) మొదలైన విశేషరీతులలో ఉంటుంది;

గంధం= సురభి (సువాసన కలిగినది), తీక్ష్ణ (ఘాటైనది) మొదలైన తీరులున్నది; ఇట్లు= ఈ విధంగా; పెక్కు చందంబులన్= అనేక రీతులుగా; చెల్లు= ప్రవర్తించే; విషయంబుల తెఱంగు= విషయాల విధానం; ఎఱుంగుట= తెలిసికొనటం; వానిన్+తొఱంగుటకున్= వాటిని వదలిపెట్టటానికి; తోడ్పడన్+చాలును+అని చెప్పి= తోడ్పడగలదని చెప్పి; వెండియున్= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా ఉపదేశించి ఋషులతో అవ్యక్తం నుండి మహత్తు, మహత్తునుండి అహంకారం, అహంకారంనుండి పంచభూతాలు గుణాత్మకాలుగా ఎట్లా ఏర్పడ్డాయో చెప్పి శబ్ద స్పర్శ రూప రస గంధాలు ఆకాశాదులలో ఒక్కొక్కటీ ఎట్లా పెరుగుతూ పోయి చివరికి పృథ్విలో ఈ ఐదుగుణాలు ఎట్లా సమన్వయించాయో చెప్పారు. శబ్దాదులలోని

సూక్ష్మభేదాలు చెప్పి, వీటినే 'విషయాలు' అంటారు. వీటి ప్రవృత్తిని తెలిసికొంటే వీటిని పోగొట్టుకొనటం సులభం అని కూడా చెప్పారు.

**ఆ. భూమిముఖ చతుష్కమునకంటె దివి యహం। కారతత్త్వ మంతకంటె దాని**
**కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యొక్కు। డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ. 196**

**ప్రతిపదార్థం:** భూమిముఖ= భూమి మొదలైన; చతుష్కమునకంటెన్= నాలుగింటికంటె; దివి= ఆకాశం; అంతకంటెన్= దానికంటె; అహంకారతత్త్వము= అహంకారం; దానికంటెన్= దానికంటె; బుద్ధి; బుద్ధికంటెన్= బుద్ధికంటె; ప్రకృతి; ఎక్కుడు= అధికం; అన్నిటికిని= అన్నిటికంటె; అరయన్= చూడగా; పురుషుఁడు; అధికుఁడు= గొప్పవాడు.

**తాత్పర్యం:** భూమిమొదలైన నాలుగు భూతాలకంటె ఆకాశం, దానికంటె అహంకారం, దానికంటె బుద్ధి, బుద్ధికంటె ప్రకృతి, గొప్పవి కాగా, పురుషుడు వీటన్నిటికంటె చాలా గొప్పవాడు.

**క. భూతముల తారతమ్యము। చేతోగతమైన యట్టి శిష్టజనము ప్ర**
**ద్యోతితుఁ డగు పురుషుఁ గని ని। రాతంకావ్యయ పదంబు ప్రాపింపఁ గనున్. 197**

**ప్రతిపదార్థం:** భూతముల= ఈ విధంగా పంచభూతాల; తారతమ్యము= భేదాలను (తర తమ భేదాలను); చేతోగతము+ఐన+ అట్టి= హృదయంలో నిలుపుకొన్నటువంటి; శిష్టజనము= ధీరులు; ప్రద్యోతితుఁడు+అగు= నిరంతరం ప్రకాశించే; పురుషున్+కని= పురుషుడిని దర్శించి; నిరాతంక+అవ్యయ పదంబు= ఏ అడ్డూలేని అనంతమైన ముక్తి పదాన్ని; ప్రాపింపన్+కనున్= పొంద గలుగుతారు.

**తాత్పర్యం:** ఈ విధంగా పంచభూతాల తారతమ్యాన్ని హృదయంలో పదిలపరుచుకొన్న జ్ఞానులు (శిష్టులు) నిరంతరం ప్రకాశించే పురుషుడిని దర్శించి ఏ అడ్డూలేక అనంతంగా నిలిచిన ముక్తిపదాన్ని పొందగలుగుతారు.

**సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ। జాలు దక్షత వాని నేలు ప్రభుతఁ**
**దనరుమనంబు రథ్యముల సారథి యెట్టు। ల ట్లింద్రియముల నాఁగ నడప**
**నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి। సన్నాహమును మనస్సారథికము**
**నింద్రియాశ్వము నైన యీాద్యరథంబున। నభిమతగతి నంతరాత్ముఁ డెందు**

**తే. నెలమి వర్తించు; నిట్లగు టెఱుఁగు బుధుఁడు। ఘోరసంసార మోహవాగురకు లోను**
**గాక నిర్గుణ పథమునఁ గ్రాలి కను ని। రామయము నవ్యయంబును నగు పదంబు.' 198**

**ప్రతిపదార్థం:** పంచభూతంబులన్= పంచభూతాలను; పరఁగింపన్= ప్రకటింపజేయటానికి; కుదియింపన్= లోపలికి కుదించటానికి; చాలు సమర్థమైన; దక్షత= శక్తి; వానిన్+ఏలు= వాటిని పరిపాలించే; ప్రభుతన్= ప్రభుత్వ ధర్మంతో; తనరుమనంబు= ప్రకాశించే మనస్సు; రథ్యములన్= గుర్రాలను; సారథి; ఎట్టులు= ఎట్లాగో; అట్లు= ఆ విధంగా; ఇంద్రియములన్= ఇంద్రియాలను; ఆఁగన్= ఆపటానికి; నడపన్= నడపటానికి; అది+అ+వలంతి= అదే సామర్థ్యం కలిగింది; భూత+ఆత్మకంబును= భూతాలతో

కూడింది; బుద్ధి సన్నాహమును= బుద్ధి అనే ప్రయత్నం కలిగింది; భూత+ఆత్మకంబును= భూతాలతో కూడింది; బుద్ధి సన్నాహమును= బుద్ధి అనే ప్రయత్నం కలిగింది; మనస్సారథికము= మనస్సు అనే సారథి కలిగింది; ఇంద్రియ+అశ్వమున్+ఐన= ఇంద్రియాలనే గుఱ్ఱాలను కలిగిన; ఈడ్య= ప్రశస్తమైన; రథంబునన్= రథంలో; అభిమతగతిన్= తనకు నచ్చిన విధంగా (స్వతంత్రంగా); అంతరాత్ముఁడు= అంతరాత్మ; ఎందున్+ఎలమిన్= చక్కగా; వర్తించున్= ప్రవర్తిస్తాడు; ఇట్లు+అగుట+ఎఱుఁగు బుధుఁడు= ఇట్లా ఉంటుందని తెలిసిన పండితుడు; ఘోర సంసార= భయంకరమైన సంసార; మోహవాగురకున్= మోహమనే వలలో; లోను కాక= పడకుండా; నిర్గుణపథమునన్= నిర్గుణమార్గంలో; క్రాలి= పయనించి; నిరామయమున్= ఏ లోపమూ లేని; అవ్యయంబును+అగు= అనంతమైన; పదంబున్= ముక్తి స్థానాన్ని; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పంచభూతాలను ప్రకటింపజేయటానికి కుదించటానికి శక్తి కలిగి వాటిని పాలించేటటువంటి ప్రభువువలె ప్రకాశించే మనస్సు సారథి గుఱ్ఱాలను నియంత్రించినట్టు ఇంద్రియాలను నడపటానికి ఆపటానికి సమర్థమైనది. భూతమయమైనది. (ఆ రథాన్ని లోహంతో చేయలేదని అర్థం) బుద్ధిని ప్రయత్నంగా కలిగింది ఇంద్రియాలను గుఱ్ఱాలుగా కలిగింది. మనస్సు సారథిగా కలిగింది, అయిన ఈ దేహమనే ప్రశస్తమైన రథంలో కూర్చుండి అంతరాత్మ తనకు నచ్చిన విధంగా స్వతంత్రంగా చక్కగా తిరుగుతాడు. ఈ రహస్యాన్ని ఏ పండితుడు తెలిసికొంటాడో అతడు ఘోరమైన సంసారమనే వలలో చిక్కుకొనకుండా నిర్గుణమనే మార్గంలో పయనించి ఏ లోపమూ లేని అనంతమైన ముక్తిస్థానాన్ని పొందుతాడు.'

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. మనస్సు సారథి, ఇంద్రియాలు గుఱ్ఱాలు, దేహమే రథం, అంతరాత్మ రథంలోని రథికుడు. ఇట్లా ముక్తి సాధనను ప్రయాణంగా చెప్పటంలోనూ 'మహాప్రస్థాన'మనే తాత్పర్యమున్నది.

**వ. అని పలికి మఱియును. 199**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. శరనిధి తరఁగల భంగిం। బొరిఁబొరి నవ్యక్తమునన పుట్టు నడంగున్**
**సురనరధరణీరుహ ముఖ। చరాచరానేక భూతజాలము లెల్లన్. 200**

**ప్రతిపదార్థం:** శరనిధి= సముద్రంలోని; తరఁగల= అలల; భంగిన్= రీతిగా; పొరిన్+పొరిన్= మాటి మాటికీ; అవ్యక్తమునన్+అ= అవ్యక్తంలోనే; సుర= దేవతలు; నర= మనుష్యులు; ధరణీరుహ= చెట్లు; ముఖ= మొదలైన; చర= తిరిగేవి; అచర= కదలనివి అయిన; అనేక= వివిధాలైన; భూతజాలములు= ప్రాణి సమూహాలు; ఎల్లన్+అన్నీ; పుట్టున్= పుట్టుతాయి; అడంగున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** సముద్రంలో అలలు ఎట్లా మాటి మాటికి పుట్టుతుంటాయో అట్లాగే దేవతలు, మనుష్యులు, వృక్షాలు మొదలైన చరాచర సమూహాలన్నీ అవ్యక్తంనుండి పుట్టుతూ అవ్యక్తంలోనే లీనమవుతూ ఉంటాయి.

**విశేషం:** **"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా."**

అని గీతాకారుడు అవ్యక్తంనుండే భూతాలు పుట్టుతాయని, అందులోనే లీనమవుతాయని స్పష్టంగా చెప్పాడు. అలం:ఉపమ

క. **అవ్యక్తాదిక సకలము । నవ్యయుఁడగు పురుషుఁ డాశ్రయంబుగఁ బరఁగున్**
**సువ్యక్తంబుగ నిది గను । భవ్యులు వడయుదురు మోహ బంధ విముక్తిన్.** **201**

**ప్రతిపదార్థం:** అవ్యక్త+ఆదిక+సకలమున్= అవ్యక్తం మొదలైనవన్నీ; అవ్యయుఁడు+అగు పురుషుఁడు= అవ్యయుడైన పురుషుడు; ఆశ్రయంబుగన్= ఆశ్రయంగా; పరఁగున్= పుట్టుతాయి; సువ్యక్తంబుగన్= స్పష్టంగా; ఇది+కను+భవ్యులు= దీనిని గుర్తించే పుణ్యులు; మోహబంధ విముక్తిన్= మోహబంధంనుండి విముక్తిని; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** ఈ అవ్యక్తాది ప్రపంచమంతా 'అవ్యయు'డైన ఆ మహాపురుషుడు ఆధారంగా పుట్టి పెరిగినదే. ఈ రహస్యాన్ని ఏ పుణ్యాత్ములు గుర్తిస్తారో వారు 'మోహ' బంధంనుండి విముక్తులవుతారు.

క. **వినుఁ డక్కనుటకు మూలం । బనఘం బగు తపమ యగుట నతినిష్ఠఁ దపో**
**ధన సమ్యగ్విధ సముపా । ర్జనం బవశ్యంబు వలయు సన్మతులారా!** **202**

**ప్రతిపదార్థం:** సత్+మతులారా!= మంచి బుద్ధిగల ఋషులారా!; వినుఁడు= వినండి; ఆ+కనుటకున్= అట్లా దర్శించటానికి; అనఘంబు+అగు= (పాప స్పర్శ లేని) పుణ్యమైన; తపము+అ= తపస్సే; మూలంబు= మూలం; అగుటన్= కాబట్టి; అతినిష్ఠన్= మిక్కిలి శ్రద్ధతో; తపోధన= ఆ తపోధనాన్ని; సమ్యక్+విధ= అన్ని విధాలా; సముపార్జనంబు= సంపాదించటం; అవశ్యంబున్= తప్పక; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! ఆ విధంగా దర్శించటానికి తపస్సే సాధనం. అందుచేత మిక్కిలి శ్రద్ధతో అన్ని విధాలా ప్రయత్నించి ఆ తపోధనాన్ని సంపాదించటం అవశ్యకర్తవ్యం. తపోధన-అన్నచోట రూపకాలంకారం.

సీ. **భూరితపంబునఁ జూరె ప్రజాపతుల్ । బహువిధ సృష్టి నిర్వహణ నిపుణు**
**లైరి; వన్యంబు లాహారంబులుగఁ దప । మాదరంబునఁ జేసి కాదె మునులు**
**కాలత్రయంబు లోక త్రితయంబును । గాంతురు; విద్యల గౌరవంబు**
**లొదవుఁ దపంబున; నొండు విధంబులఁ । బడయంగ రాని యెక్కుడు పదంబు**

తే. **లచ్చమైన తపంబున వచ్చుఁ బడయ; । బ్రహ్మవధ మద్యపానాది పాతకంబు**
**లెల్లఁ బాయుఁ దపఃకృతి; నిద్ధతపము । పేర్మి సర్వభూతంబులుఁ బ్రీతిఁ బొందు.** **203**

**ప్రతిపదార్థం:** ప్రజాపతుల్= ప్రజాపతులు; భూరితపంబునన్+చూరె= గొప్ప తపస్సుతోనే సుడీ!; బహువిధ సృష్టి నిర్వహణ నిపుణులు+ఐరి= నానావిధాలైన సృష్టులు చేయటంలో నేర్పరు లయ్యారు; మునులు= మహర్షులు; వన్యంబులు= శాకాలను (అడవిలో పుట్టేవి) ఆకులలములను; ఆహారంబులుగన్= ఆహారాలుగా; తపము= తపస్సును; ఆదరంబునన్= నిష్ఠతో; చేసికాదె= చేసే కదా!; కాలత్రయంబున్= మూడుకాలాలనూ; లోకత్రితయంబునున్= మూడులోకాలను; కాంతురు= చూడగలుగుతారు; తపంబునన్= తపస్సుతో; విద్యలన్= విద్యలలో; గౌరవంబులు= గురుత్వం; పటుత్వం మొదలైనవి; ఒదవున్= కలుగుతాయి; ఒండువిధంబులన్= మరే రీతిలోనూ; పడయంగరాని=

పొందజాలని; పదంబులు= ఉత్తమ గతులను; అచ్ఛమైన= స్వచ్ఛమైన; తపంబునన్= తపస్సుతో; పడయవచ్చున్= పొందవచ్చును; బ్రహ్మవధ= బ్రాహ్మణులను చంపటం; మద్యపాన+అది= మద్యంతాగటం; పాతకంబులు= పాపాలు; ఎల్లన్= అన్నీ; తపస్+కృతిన్= తపస్సు చేయటంవలన; పాయున్= నశిస్తాయి; ఇద్ధతపము పేర్మిన్= ప్రశస్తమైన తపస్సువలన; సర్వభూతంబులున్= అన్ని భూతాలూ; ప్రీతి పొందున్= సంతసిస్తాయి.

**తాత్పర్యం:** ప్రజాపతులు మహాతపస్సు చేసే ఈ వివిధాలైన సృష్టి కర్మలు చేయగలుగుతున్నారు. మహర్షులు ఆకులలములు తింటూ నిష్ఠతో తపస్సు చేసే ముల్లోకాలను, మూడు కాలాలను చూడగలుగుతున్నారు. తపస్సువలన విద్యలో గురుత్వ పటుత్వపు భావాలు పెరుగుతాయి. మరి ఏ ఇతర మార్గంలోనూ పొందలేని ఉత్తమ గతులను తపస్సుద్వారా పొందవచ్చును. బ్రాహ్మణవధ మద్యపానాది పాపాలను తపస్సు దూరం చేస్తుంది. తపస్సువలన భూతరాసులు తృప్తినందుతాయి.

**క. మమతాహంకృతి రహిత త । పమునఁ బ్రజాపతి సమీప భవ్యపదము సం**
**యమి వొందు; నిందు సందే । హ మొకింతయు లేదు నిర్మలాత్మకులారా! 204**

**ప్రతిపదార్థం:** నిర్మల+ఆత్మకులారా!= నిర్మలమైన మనస్సున్న ఓ ఋషులారా!; మమతా= మమకారం; అహంకృతి= అహంకారం; రహిత= లేని; తపమునన్= తపస్సులో; సంయమి= మునీశ్వరుడు; ప్రజాపతి; సమీపభవ్యపదమున్= సామీప్యంలో ఉండటం అనే గౌరవాన్ని; పొందున్= పొందుతాడు; ఇందున్= ఇందులో; సందేహము; ఒక+ఇంతయున్= కొంచెంకూడా; లేదు.

**తాత్పర్యం:** ఋషులారా! మమత, అహంకారం లేని తపస్సుతో మునీశ్వరుడు ప్రజాపతి 'సమీపం'లో ఉండే మహా పుణ్యగతిని పొందుతాడు. సందేహం లేదు.

**విశేషం:** సాయుజ్య, సారూప్య, సామీప్యాలని ముక్తిలో మూడు రకాలు. సాయుజ్యం కలిసిపోవటం, సారూప్యం - అభిన్నంకావటం, సామీప్యం దగ్గర ఉండటం, తపస్సువలన 'సామీప్యం' సిద్ధిస్తుందట.

**క. మమతాహంకార విము । క్తముశుద్ధమునైన యచలిత ధ్యానముతో**
**సమవేతంబగు తపమున । యమి గను సకలోత్తరావ్యయ పదప్రాప్తిన్. 205**

**ప్రతిపదార్థం:** మమతా= మమకారం; అహంకార= అహంకారం; విముక్త= లేని; శుద్ధమున్+ఐన= పవిత్రమైన; అచలిత= చలనంలేని; ధ్యానముతోన్= ధ్యానంతో; సమవేతంబు+అగు= కూడిన; తపమునన్= తపస్సుతో; యమి= ఋషి; సకల= అన్నిటికంటె; ఉత్తర= శ్రేష్ఠమైన; అవ్యయ పదప్రాప్తిన్= అనంతమైన ముక్తిపదాన్ని; కనున్= పొందుతాడు.

**తాత్పర్యం:** మమత, అహంకారం విసర్జించిన పవిత్రమైన అచంచలమైన ధ్యానంతో కూడిన తపస్సుతో ఋషి సర్వోత్తరమైన అనంతమైన ముక్తిధామాన్ని చేరుకొంటాడు.

**వ. అని చెప్పి వెండియు. 206**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తమము రజస్సుఁ దొఱఁగి స। త్త్వమునన రమియించి యగుణతత్త్వము గని స**
**త్త్వమును దిగవిడుచు వైరా। గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా! 207**

**ప్రతిపదార్థం:** అకల్మషులారా!= పుణ్యాత్ములారా!; మునివరుండు= మునిశ్రేష్ఠుడు; తమమున్= తమస్సును; రజస్సున్= రజస్సును; తొఱఁగి= విడిచి; సత్త్వమునన్= సత్త్వగుణంలోనే; రమియించి= లీనమై; అగుణతత్త్వమున్= నిర్గుణ స్థితిని; కని= పొంది, సత్త్వమునున్= ఆ సత్త్వాన్నికూడా; దిగవిడుచున్= సంపూర్ణంగా వదలిపెట్టే; వైరాగ్యమహితుఁడు+అగున్= వైరాగ్యంచేత గొప్పవాడు అవుతాడు.

**తాత్పర్యం:** పుణ్యులారా! మునిశ్రేష్ఠుడు తమోరజస్సులను విడిచిపెట్టి సత్త్వంలో లీనమై చివరికి నిర్గుణస్థితి నంది ఆ సత్త్వాన్ని కూడా వదలివేసి గొప్ప వైరాగ్యవంతు డవుతాడు.

**క. పరమం బనంగ వేదాం। తరహస్యాత్మత వెలుంగు తత్త్వము నిక్కం**
**బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను। పరిణతి గల యతఁడు సర్వపదవిదుఁడు సుఁడీ! 208**

**ప్రతిపదార్థం:** పరమంబు+అనంగన్= శ్రేష్ఠమైనది అనబడేది; వేదాంత+రహస్య+ఆత్మతన్= ఉపనిషద్రహస్యరూపమై; వెలుంగు+తత్త్వము= ప్రకాశించే తత్త్వం; నిక్కంబు+అరయఁగన్= సత్యశోధన చేయగా; క్షేత్రజ్ఞుఁడు+అ+అను= క్షేత్రజ్ఞుడే అనేటటువంటి; పరిణతి= సంస్కారం; కల+అతఁడు= కలయోగి; సర్వపద విదుఁడు= అన్ని తత్త్వాలను తెలిసినవాడు; చుఁడీ!= సుమండీ!

**తాత్పర్యం:** వేదాంతశాస్త్రమంటే ఉపనిషత్తు, ఉపనిషత్తుల రహస్యం బ్రహ్మతత్త్వం. బ్రహ్మతత్త్వమే రహస్యంగా కలిగిన జ్ఞానరూపంగా వెలిగేటటువంటి 'ఆత్మ'నే పురుషుడని క్షేత్రజ్ఞుడని అంటారని ఎవడు గుర్తిస్తాడో వాడు అన్ని తత్త్వాలను తెలిసినవా డవుతాడు.

**క. వృత్తి విశేషమునఁ జనిన। చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా**
**నెత్తెఱఁగునకుం దివియమి। యుత్తమపు రహస్య మండ్రు యోగమున మునుల్. 209**

**ప్రతిపదార్థం:** వృత్తి విశేషమునన్+చనిన= పనిలో భాగంగా బయలుదేరిన; చిత్తము+వెనుకన్+చని= బుద్ధివెంట వెళ్ళి; మనసున్+అందున్+చేర్చి= మనస్సును ఆ పనిలో ప్రవేశపెట్టి; తాన్= ఆత్మ రూపుడైన తాను; ఎత్తెఱఁగునకున్+తివియమి= ఏ వైపునకూ లాగబడకుండా ఉండటం; మునుల్= ఋషులు; యోగమునన్= యోగవిద్యలో; ఉత్తమపురహస్యము+అండ్రు= ఉత్తమ రహస్యమంటారు.

**తాత్పర్యం:** యోగవిద్యలో ఉత్తమ రహస్యం ఏదో చెప్పుతున్నాడు. బుద్ధి వ్యవసాయాత్మకం కాబట్టి ఏదో పని వెంటబడుతుంది. దానివెంటనే మనస్సును పంపించి, అందులోనే మనసు నుంచినా 'ఆత్మ' రూపుడైన జీవుడు ఏ కర్మవైపూ, ఇంద్రియాభిలాషవైపూ లాగబడకుండా 'సాక్షీభూతుడు'గా ఉండటమే మిక్కిలి గొప్ప విషయం. దీనిని యోగులు అభ్యసించి సాధించి 'నిర్మములు' అవుతారు.

**క.** **వినుఁ డవ్యక్తాంతం బగు । పనియెల్ల నవిద్య నొలయు బంధము మమతం**
**బనుపడిన మృత్యు వమృతం । బనఁ జను; నది నిర్మమత్వ మారఁ గలిగినన్.** **210**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; అవ్యక్తాంతంబు+అగు= అవ్యక్తంలో అంతమయ్యే; పనిఎల్లన్= అన్ని పనులూ; అవిద్యన్= అవిద్యకారణంగా; బంధమున్+ఒలయున్= బంధాలను పొందుతాయి; మమతన్+పనుపడిన= మమతలో కూరుకుపోతే; మృత్యువు; అది= ఆ కర్మచేయటం; నిర్మమత్వము= నిర్మమకారం; ఆరన్+కలిగినన్= పూర్తిగా కలిగితే; అమృతంబు+అనన్+చనున్= అమృతమని పిలువబడుతుంది.

**తాత్పర్యం:** అవ్యక్తంలో లీనమయ్యే ప్రతి పనీ 'అవిద్య' కారణంగా బంధహేతు వవుతుంది. మమతలో మునిగిన ఏ పని ఐనా మృత్యుహేతువే అవుతుంది. నిర్మమత్వం పూర్తిగా కలిగి చేసిన పని 'అమృత' మవుతుంది.

**సీ.** **కర్మముల్ మేలండ్రు కర్మతత్పరులు బు । ద్ధాత్ములు విద్య వర్యత నుతింతు**
**రవి షోడశ వికార యగు మూర్తిఁ గల్పించు । నది నిత్యుఁ డగ్రాహ్యుఁ డన వెలుంగు**
**పురుషునిఁ దోఁపించు నరయంగఁ గర్మమ । యత్వంబు లేమి విద్యామయత్వ**
**మతనికి నైజమై యతిశయిల్లుట శ్రుతి । పాటు నిత్తెఱఁగు సుజ్ఞాన మే మ**

**తే.** **హాత్మునకుఁ గల్గియుండు నయ్యార్యవర్యుఁ । డఖిల సంకల్పములఁ బాచి యాత్మ నాత్మ**
**యంద కాంచి యనామయ మజర మమృత । మను పదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార!** **211**

**ప్రతిపదార్థం:** కృతాత్ములార!= ఆత్మవిద్యలో సాధన ఉన్న ఋషులారా!; కర్మతత్పరులు= కర్మలో తాత్పర్యమున్నవారు (కర్మఠులు); కర్మముల్ మేలు+అండ్రు= కర్మలు మేలంటారు; బుద్ధ+ఆత్ములు= మేలుకొన్న ఆత్మకలిగిన సంయములు; విద్య+వర్యతన్+నుతింతురు= జ్ఞానమే పరాకాష్ఠ అని దానిని ప్రస్తుతిస్తారు; అవి= ఆ కర్మలు; షోడశ+వికార+అగు+మూర్తిన్= పదహారు వికారాలున్న మూర్తిని కల్పిస్తాయి (కర్మలు పదహారు కాబట్టి వీటినే షోడశకర్మలు అంటారు); అది= ఆ జ్ఞానం; నిత్యుఁడు= నిత్యం ఉండేవాడు; అగ్రాహ్యుఁడు+అని= ఇంద్రియాదులచేత గ్రహించటానికి వీలుకాని వాడుగా; వెలుంగు= ప్రకాశించే; పురుషునిన్= పురుషుడిని; తోఁపించున్= దర్శింపచేస్తుంది; కర్మమయత్వంబులేమిన్= కర్మతో నిండినవాడు కాకపోవటంవలన; విద్యామయత్వము= జ్ఞానంతో నిండిన లక్షణం; అతనికిన్= ఆ పురుషుడికి; నైజము+ఐ= సహజధర్మమై; అతిశయిల్లుట= ప్రకాశించటం; శ్రుతి+చాటున్= శ్రుతి చాటి చెప్పింది; ఈ+తెఱంగు= ఈ విధమైన; సుజ్ఞానము= ఉత్తమజ్ఞానం; ఏ మహాత్మునకున్+కల్గి+ఉండున్= ఏ మహాత్ముడికి ఉంటుందో; ఆ+ఆర్యవర్యుఁడు= ఆ పూజ్యుడు; అఖిల సంకల్పములన్= అన్ని సంకల్పాలనూ; పాచి=వదలివేసి; ఆత్మన్+ఆత్మ+అంద+కాంచి= ఆత్మను ఆత్మలోనే చూచుకొని; అనామయము= ఏ లోపాలూ లేని; అజరము= ముసలితనం లేని; అమృతము; అను= అనబడే; పదమ్మున్= స్థానాన్ని; ప్రాపించున్= పొందుతాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! కర్మయోగులు కర్మ చాలా ముఖ్య మంటారు. జ్ఞానయోగులు జ్ఞానమే అన్నిటికీ పర్యవసాన మంటారు. కర్మలు పదహారు వికారాలతో కూడిన 'మూర్తి'ని సృష్టించగా, జ్ఞానంచేత నిత్యుడు, ఇంద్రియాతీతుడు (వికారరహితుడైన) అయిన కాంతిరూపుడైన పురుషుడిని ప్రకాశింపజేస్తుంది. బాగా శోధిస్తే కర్మ లేకపోవటం జ్ఞానమయుడు కావటం అన్నది ఆ పురుషుడి సహజ స్వభావమని వేదం ఏనాడో ఘోషించింది. ఈ విధమైన ఉత్తమజ్ఞానం ఏ మహాత్ముడికి ఉంటుందో అతడు అన్ని సంకల్పాలను వర్జించి ఆత్మను ఆత్మలో చూస్తూ అనామయమూ, అజరమూ, అమృతమూ అయిన 'ముక్తి' ధామాన్ని చేరుతాడు.

**విశేషం:** కామం సంకల్పరూపమైనది. సంకల్పమే వర్జించినపుడు కర్మ ఉండదు. అంటే కర్మానుబంధమూ ఉండదని అర్థం.

**వ. అని యిట్లు కమలగర్భుండు. 212**

**తాత్పర్యం:** అని ఈ విధంగా బ్రహ్మ బోధించి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. జ్ఞాన పరినిష్ఠితాత్మకు। లైన విముక్తి పద నిర్ణయజ్ఞులచే స**
**మ్మానిత యగు గతి యిది క। ర్మానుగతి విరక్తజన సమంచితము సుఁడీ!' 213**

**ప్రతిపదార్థం:** జ్ఞాన= జ్ఞానంలో; పరినిష్ఠిత= మిక్కిలి నిష్ఠకలిగిన; ఆత్మకులు+ఐన= ఆత్మలు కలిగిన; విముక్తిపద= మోక్షస్థాన; నిర్ణయజ్ఞులచేన్= నిర్ణయం తెలిపిన మహర్షులచేత; సమ్మానితము+అగుగతి+ఇది= మన్నింపబడిన మార్గం ఇది; కర్మానుగతి+విరక్తజన= కర్మానుగతిలో విరక్తిగల యోగి సమూహంచేత; సమంచితము= మన్నింపబడినది; చుఁడీ= సుమండీ!

**తాత్పర్యం:** ఇంతవరకు చెప్పిన జ్ఞానమార్గం మోక్షస్థాన నిర్ణయం తెలిపిన మహర్షులు అనుసరించింది. కర్మానుగతిలో విరక్తిపొందిన మహర్షులైన యోగులు మన్నించింది సుమా!'

**వ. అని నిర్దేశించి వెండియు. 214**

**తాత్పర్యం:** అని బోధించి మరలా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'కోరికలకుఁ జొరక యసం। గారూఢత గలిగి యెల్లయందును సమతం**
**గూరిన చిత్తంబులు గల। సారాత్మకు లీ పథమునఁ జనుటకు శక్తుల్. 215**

**ప్రతిపదార్థం:** కోరికలకున్+చొరక= కోరికల జోలికి పోక; అసంగ+ఆరూఢతన్+కలిగి= నిస్సంగంలో స్థిరత్వం కలిగి; ఎల్ల అందును= అన్నిటిలోనూ; సమతన్+కూరిన= సమత్వం నిండిన; చిత్తంబులు+కల= మనసులు కలిగిన; సార+ఆత్మకులు= నిండైన ఆత్మకలవారు; ఈ పథమునన్= ఈ దారిలో; చనుటకున్+శక్తుల్= నడవటానికి సమర్థులు (అవుతారు.)

**తాత్పర్యం:** కోరికలలో ప్రవేశించకుండా నిస్సంగత్వంలో స్థిరత్వం కలిగి అన్నిటిలోనూ సమత్వం నిండిన మనస్సులు కలిగిన నిండైన ఆత్మ కలవారు మాత్రమే ఈ దారిలో నడవగలరు.

**విశేషం:** భగవంతుడు పూర్ణతత్త్వం కాబట్టి సాధకుడు కూడా 'పూర్ణ హృదయుడు' కావాలి. ఆత్మ దర్శనంలో అరకొరలు పనికిరాదు.

**క. చెప్పితి సర్వంబును నీ। చొప్పున నడపుఁడు; డెడ నొండు సొరనీకుఁడు; మీ**
**రొప్పెడు తెరు విది దీనం। దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా!' 216**

**ప్రతిపదార్థం:** ధార్మికులారా!= ధర్మచింతనగల ఓ మహర్షులారా!; సర్వంబునున్= అన్ని విషయాలను; చెప్పితిన్= చెప్పాను; ఈ చొప్పునన్= ఈ విధంగా; నడపుఁడు= మీ కార్యకలాపాలు నడిపించండి; ఎడన్= ఎదలో; ఒండున్= మరిదేనినీ; చొరనీకుఁడు=

చొరబడనీయకండి; మీరు= మీరందరూ; ఒప్పెడు= అంగీకరించే; తెరువు+ఇది= మార్గమిది; పరమసిద్ధి= పరమపదప్రాప్తి; దీనన్= దీనితో; తప్పదు= తప్పకుండా కలుగుతుంది.

**తాత్పర్యం:** ధర్మమూర్తులారా! మీకు అన్ని విషయాలూ చెప్పాను. ఈ పద్ధతిలో మారు అన్ని కార్యాలనూ నిర్వహించండి. హృదయాలలో మరి దేనినీ ప్రవేశింపజేయకండి. మీరందరూ అంగీకరించే పద్ధతినే చెప్పాను. దీనితో తప్పకుండా పరమపదప్రాప్తి కలుగుతుంది.'

**క. 'అని యిట్లు కమలగర్భుఁడు। మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా**
**రనవద్య సమాధికులై। యనితర సులభ మగు సౌఖ్యమందిరి వత్సా!' 217**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= అని ఈ విధంగా; కమలగర్భుఁడు= బ్రహ్మ; మునులకున్= ఋషులకు; తత్త్వ+ఉపదేశమునున్+చేసినన్= తత్త్వాన్ని ఉపదేశించగా; వారు= ఆ ఋషులు; అనవద్య+సమాధికులు+ఐ= గొప్ప సమాధిని కలవారై; అనితర సులభము+అగు= ఇతరులచేత సాధ్యం కాని; సౌఖ్యము+అందిరి= పరమసుఖాన్ని పొందారు; వత్సా!= శిష్యుడా! వినుము.

**తాత్పర్యం:** 'అని' ఈ విధంగా బ్రహ్మదేవుడు ఆ ఋషులకు తత్త్వోపదేశం చేశాడు. ఆ ఋషులకు సార్థకమైన సమాధి సిద్ధించి అనితర సులభమైన పరమపద సుఖాన్ని వాళ్ళు పొందారు. శిష్యా! ఈ కథను మనసులో ఉంచుకొనుము.'

**వ. అని పలికి గురుం డా శిష్యునితోడ. 218**

**తాత్పర్యం:** అని పలికి గురువు ఆ శిష్యుడితో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'నీవును నివ్వాక్యంబులు। భావంబునఁ బాదుకొలిపి పరమ సమాధి**
**శ్రీ వాటింపుము; నిత్య వ। దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్.' 219**

**ప్రతిపదార్థం:** నీవును= నీవుకూడా; ఈ వాక్యంబులు= ఈ బ్రహ్మ వాక్కులను; భావంబునన్= మనసులో; పాదు కొలిపి= స్థిరంగా నిలుపుకొని; పరమ సమాధి శ్రీ+పాటింపుము= గొప్ప సమాధి సంపదను అవలంబించుము; నీకున్= నీకు; అనాయాసముగన్= ఏ శ్రమా లేకుండా; నిత్యపద+అవాప్తి= నిత్యమైన పరమపద ప్రాప్తి; ఫలించున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'నాయనా! నీవుకూడా ఈ బ్రహ్మవాక్కులను మనసులో స్థిరంగా నిల్పుకొనుము. అత్యున్నత సమాధిని సాధించుము. దానితో ఏ శ్రమా లేకుండా నీకు పరమపదప్రాప్తి కలుగుతుంది.'

**క. అని గురుఁడు ప్రబోధించిన। మనమునఁ దెలివొంది తత్సమంచితమార్గం**
**బున నడచి పొందె శిష్యుం। డనామయం బజర మమృత మనియెడి పదమున్. 220**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; గురుఁడు= గురువు; ప్రబోధించినన్= ఉపదేశించగా; శిష్యుండు; మనమునన్= మనస్సులో; తెలివి+ఒంది= జాగరూకుడై; తద్+సమంచిత+మార్గమునన్+నడచి= ఆ ఉత్తమ మార్గంలో ప్రవర్తించి; అనామయంబు= ఏ లోపాలూ లేని; అజరము= ముసలితనంలేని; అమృతము+అనియెడి+పదమున్= అమృతమనబడే స్థానాన్ని; పొందెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా గురుడు ఉపదేశించగా ఆ శిష్యుడు జాగరూకత పొంది ఆ ఉత్తమ మార్గంలో ప్రవర్తించి ఏ లోపాలూలేని నిత్యనూతనమైన అమరమైన ఆ పరమ ముక్తిధామాన్ని పొందాడు.

**చ. అని వసుదేవసూనుఁడు సమాదరమేదుర చిత్తవృత్తిఁ జె**
**ప్పిన విని 'నారి యుల్లముల పెంపిటులుండునె వార లెవ్వరో**
**వినుటకు నాదు డెందమున వేడ్క జనించె; నెఱుంగఁ జెప్పవే'**
**యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచి నవ్వుచున్. 221**

**ప్రతిపదార్థం:** వసుదేవసూనుఁడు= అని శ్రీకృష్ణుడు; సమాదర= ప్రీతి నిండిన; మేదుర= చక్కని; చిత్తవృత్తిన్= మనోభావంతో; చెప్పినన్= చెప్పగా; విని= విని; వారి+ఉల్లముల+పెంపు= వారి హృదయాల సౌభాగ్యం; ఇటులు+ఉండునె!= ఇంత గొప్పగా ఉంటుందా?; వారలు+ఎవ్వరో= వారు ఎవరో; వినుటకున్= వినాలని; నాదు డెందమునన్= నా హృదయంలో; వేడ్క జనించెన్= కోరిక పుట్టింది; చెప్పవే= దయచేసి చెప్పుము; అనుటయున్= అనగా; పార్థుమోము+అర్జునుడి ముఖం; ఆ+మహితాత్ముఁడు= ఆ మహాత్ముడు; కృపన్= కృపతో; చూచి; నవ్వుచున్= నవ్వుతూ (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడు ఆదరంనిండిన హృదయంతో చక్కగా బోధించగా విని అంత గొప్పసంస్కారమున్న వారెవరో వినాలని మనసులో వేడుకగా ఉన్నది. వా రెవరో దయచేసి చెప్పుము' అని అర్జునుడు అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు దయతో అతడిని చూచి ఇట్లా అన్నాడు.

**క. 'అనఘ! విను మే గురుఁడ, నా । మనంబు శిష్యుండు; విమలమానస! నీపైఁ**
**బనుపడు ప్రీతిం జెప్పితి । ననితర సులభాతి గుహ్యమగు నిప్పదమున్. 222**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్మా! (అర్జునా); వినుము; ఏన్+గురుఁడన్= నేనే ఆ గురువును; నా మనంబు= నా మనసు; శిష్యుండు= శిష్యుడు; విమలమానస!= పవిత్రమైన మనసున్న ఓ అర్జునా!; నీపైన్= నీ మీద; పనుపడు= గాఢంగా నాటుకొన్న; ప్రీతిన్= ప్రేమతో; అనితర సులభ= ఇతరులకు సాధ్యంకాని; అతిగుహ్యము+అగు= అతిరహస్యమైన; ఈ పదమున్= ఈ మోక్ష పదప్రాప్తిని గురించి నీకు; చెప్పితిన్= చెప్పిను.

**తాత్పర్యం:** అర్జునా! నేనే ఆ గురువును. నా మనస్సే ఆ శిష్యుడు. నీపై నాటుకున్న ప్రేమతో ఇతరులకు సాధ్యంకాని అతి రహస్యమైన ఈ మోక్షపద ప్రాప్తిని గురించి నీకు చెప్పాను.

**క. విమలము నచలము నగు చి । త్తము నాదెస నేక భక్తి తత్పరముగఁ జే**
**యుము; నిత్యము నీ యధ్యా । త్మము ననుసంధింపు పాసెదవు; దురితములన్. 223**

**ప్రతిపదార్థం:** విమలమున్= నిర్మలమైనది; అచలమున్+అగు= స్థిరమైనది అయినటువంటి; చిత్తమున్= చిత్తాన్ని; నా దెసన్= నా వైపు; ఏకభక్తి తత్పరముగన్= అవ్యభిచారమైన భక్తి కలిగినవాడవై; చేయుము; నిత్యమున్= నిరంతరం; ఈ అధ్యాత్మమున్= ఈ బ్రహ్మతత్త్వాన్ని; అనుసంధింపుము= అనుసంధానం చేయుము (ధ్యానంచేయుము); దురితములన్= పాపాలను; పాసెదవు= పోగొట్టుకొంటావు.

**తాత్పర్యం:** నిర్మలమూ; స్థిరమూ అయిన నీ మనస్సును అవ్యభిచార భక్తి నిష్ఠ కలిగినదిగా నా వైపు చేర్చుము. అనునిత్యమూ ఈ బ్రహ్మతత్త్వాన్ని అనుసంధించుము. నీ పాపాలు నశిస్తాయి.

**క. సమరము నప్పుడు నీకీ। యమృతపద ప్రాప్తి హేతువగు సమ్యగ్బో**
**ధము వివరించితి; నచలత। రమింపు మిందెపుడు శమధురాధుర్యుఁడవై.' 224**

**ప్రతిపదార్థం:** సమరము+అప్పుడు= యుద్ధసమయంలో; నీకున్+ఈ+అమృతపదప్రాప్తి హేతువు+అగు= నీకు ఈ అమృతపదప్రాప్తికి హేతువైన; సమ్యక్+బోధమున్+వివరించితిన్= సమగ్రజ్ఞానాన్ని వివరించాను; అచలతన్= చాపల్యం వదిలి (స్థిరమనస్కుడవై); శమధురాధుర్యుడవు+ఐ= శమదమాది సాధన సంపత్తిని సాధించి; శమభారం వహించిన వాడవై; ఇందున్= ఈ తత్త్వ జిజ్ఞాసతో; ఎపుడున్ రమింపుము= ఎల్లప్పుడూ సంతోషాన్ని పొందుము.

**తాత్పర్యం:** యుద్ధసమయంలో ఈ అమృతపదప్రాప్తి హేతువైన సమగ్రజ్ఞానాన్ని బోధించాను. స్థిరమైన మనస్సుతో శమదమాదులు సాధించి ఈ తత్త్వజిజ్ఞాసలో ఆనందాన్ని నిరంతరంగా పొందుము.'

**వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మ విద్య వివరించె నని చెప్పినఁ 'బరమ గురుండును విశిష్ట శిష్యుండును నగు నప్పురుష వరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి రాకర్ణించు కౌతుకంబు నా మనంబున నెసకం బెసగెడు మునీంద్రా! యెఱింగింపవే' యని యడుగుటయు. 225**

**ప్రతిపదార్థం:** అని; ఈ విధంగా; కృష్ణుండు; జిష్ణునకున్= అర్జునుడికి; అధ్యాత్మవిద్య= అధ్యాత్మవిద్యను; వివరించెను+అని= వివరించాడని; చెప్పినన్= చెప్పగా; పరమగురుండును= గురుశ్రేష్ఠుడూ; విశిష్ట శిష్యుండును= శిష్యశ్రేష్ఠుడూ; అగు= అయినటువంటి; ఆ+పురుషవరులు= ఆ పురుషశ్రేష్ఠులు; మఱియున్+ఏవిధంబునన్= ఇంకా ఏ విధంగా; ప్రవర్తించిరి= ప్రవర్తించారు; ఆకర్ణించు కౌతుకంబు= వినే కుతూహలం; నా మనంబునన్= నా మనసులో; ఎసకంబెసగెడున్= అతిశయిస్తున్నది; ముని+ఇంద్రా!= ఓ వైశంపాయన మునీంద్రా!; అని; అడుగుటయున్= జనమేజయ మహారాజు అడుగగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడు అర్జునుడికి వేదాంత విద్య బోధించాడని చెప్పగా 'ఆ గురుశ్రేష్ఠుడూ ఆ విశిష్ట శిష్యుడూ అయిన నారాయణుడు, నరుడు ఆ తరువాత ఏం చేశారు? అది వినాలని నాకు కుతూహలం అతిశయిస్తున్నది' అని జనమేజయమహారాజు వైశంపాయనుడిని అడిగాడు.

అశ్వాసాంతము

**చ. పరమ దయా విధేయ! పరిపాలిత వేదకలాప! పక్వ ని**
**ర్భరశమ! సూక్ష్మ తాతనువిభాసిత! పన్నగ తల్పభూషణా**
**దర భరితా! పవిత్రపద తామరస స్మరణా! వరావర**
**త్వరహిత! పద్మజాది సురవందిత! పశ్చిమ నాళనందితా! 226**

**ప్రతిపదార్థం:** పరమదయావిధేయ!= భక్తుల విషయంలో కృపగలవాడు కాబట్టి వారికి విధేయుడైనవాడా!; పరిపాలిత వేదకలాప= రక్షింపబడిన వేద సముదాయం కలిగినవాడా!; పక్వనిర్భర శమ!= అభ్యాసాదులచేత పరిపక్వమైన లేదా వాస్తవ రూపాన్ని ధరించిన

శమ స్వరూపుడా!; సూక్ష్మతా తనువిభాసిత!= సూక్ష్మత్వం అనబడే శరీరంతో ప్రకాశించేవాడా!; పన్నగ తల్ప భూషణాదరభరితా!= ఆదిశేషుడిని తల్పంగానూ; (హరి) ఆభరణంగానూ (హర) గ్రహించటంలో ఆదరం నిండినవాడా!; పవిత్రపద తామరస స్మరణా!= పావనమైన పాదపద్మాల స్మరణం కలవాడా! పరాపరత్వ రహిత!= శ్రేష్ఠమని, అధమమని తేడాలు లేనివాడా! (పరాపరత్వ రహిత అని కూడా పాఠం - పరాపర భేదాలకు అతీతుడా! అని చెప్పాలి); పద్మజ+ఆది సురవందిత!= బ్రహ్మాది దైవతాలచేత నమస్కరించ బడేవాడా!; పశ్చిమనాళవందితా!= సుషుమ్నానాడిలో పుట్టే ఆనందస్వరూపం కలవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీవు భక్తుల విషయంలో దయగలవాడివి కాబట్టి వారికి విధేయుడివి. వేదాలను పరిరక్షించినవాడివి. అభ్యాసాదులచేత పరిపక్వమైన సంపూర్ణశాంతి స్వరూపుడివి. సూక్ష్మత్వం అనబడే శరీరంతో ప్రకాశించేవాడివి. ఆదిశేషుడిని తల్పంగానూ, భూషణంగానూ గ్రహించటంలో ఆదరం కలవాడివి. పావనమైన పాదపద్మాల స్మరణం కలవాడివి, ఉత్తమాధమభేదాలు లేనివాడివి, బ్రహ్మాది దేవతలచేత నమస్కరించబడేవాడివి. సుషుమ్నానాడిలో పుట్టే ఆనందస్వరూపుడివి. అట్లాంటి నీకు నమస్కారం.

**విశేషం: ఈ పద్యంలోని ప్రతి విశేషణమూ** శ్రీకృష్ణుడు బోధించిన 'అనుగీత'కు వ్యాఖ్యాన ప్రాయంగా ఉన్నది. అధ్యాత్మవిద్యా రహస్య నిధిగా హరిహరనాథుడిని నిరూపించటం ఈ పద్యంలో ఉన్నది.

ఆత్మవిద్య పరమాత్మ కృపవలన సిద్ధించాల్సిందే. అందుకే ఆ పరతత్త్వాన్ని ఉపాసించాలని చివర్లో బ్రహ్మ సెలవిచ్చాడు. దీనికి కారణం శ్రీ యుక్తుడైన భగవంతు డొకడే యోగాన్నికూడా ప్రసాదిస్తాడు. కాబట్టి ఈ రహస్యమే భక్తుల పట్ల భగవంతుడు విధేయు డనటంలో ఉన్నది.

ప్రళయసమయంలో వేదాన్ని పరిరక్షిస్తూ వచ్చినవాడు భగవంతుడే. అంటే జ్ఞానం ఇన్నియుగాలపాటు స్వామివారి కృపవలననే మిగిలి యోగుల ముఖంగా ప్రకటించబడుతూ వచ్చిందని అర్థం. ఈ భావాన్నే జయదేవు డిట్లా కీర్తించాడు.

> **"ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం । విహిత వహిత్ర చరిత్రమఖేదం**
> **కేశవ ధృతమీనశరీర । జయ జగదీశ హరే"** (జయదేవుడి గీతగోవిందం)

'ఉపశాంతో యమాత్మా' అని వేదవాక్యం. దీనినిబట్టి భగవానుడు శాంతాభాసస్వరూపుడు కాదు - శాంతి స్వరూపుడే. దీనినే 'నిర్భర' పదంచేత తిక్కనగారు వ్యక్తీకరించారు. అందుకే 'పరమపదం' అని అనటం.

స్వామివారు సూక్ష్మ స్వరూపుడు. అణోరణీయాన్ - అని శ్రుతి. అణువులకు అణువు అని అర్థం. అంటే ఇంద్రియాలకు అందదని అర్థం.

> "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః
> న విద్మో న విజానీయో యథై తదనుశిష్యాత్"

అని కేనోపనిషత్తు ఆ పరమతత్త్వం ఏ ఇంద్రియ ప్రమాణానికి లొంగనిదని వ్యాఖ్యానించింది.

హరిరూపంలో పన్నగం పానుపు. హరరూపంలో అభరణం. ఆదిశేషుడు సహస్ర ఫణులు కలిగినవాడు. ఈ సహస్రత్వం శబ్దానికున్న అనంతత్వానికి సంకేతం. అందుకే అది శివుడికి భూషణం. విష్ణువుకు తల్పం.

పరమేశ్వరుడి పాదపద్మాలు పవిత్రమైనవి. ఆ పదమే మోక్షపదం. అందుకే 'సామీప్య' ప్రస్తావన ఈ అశ్వాసంలో వచ్చింది.

వాక్కుకు, మనస్సుకు అతీతుడు కావటంవలన ద్వంద్వభావాలు అతడిలో లేవు. అందుకే 'పరాపరత్వ' రహితుడనటం.

'నాడి' అంటే ప్రాణవాయువు ప్రసారణమార్గం. ముఖ్యమైన 101 నాడులలో ఇడ, పింగళ, సుషుమ్న అనే మూడు నాడులు ప్రధానమని యోగవిద్య చెప్పుతున్నది.

ఈ నాడులలో సుషున్న మిక్కిలి శ్రేష్ఠం. తామరతూడు దారంవలె సన్నదిగా ఉండి వెన్నుపాములోని 72 వేలనాడులమధ్య నుండి బ్రహ్మరంధ్రం దాకా విద్యుత్తేజంలో ప్రసరించేది సుషున్న. దీనిని 'బ్రహ్మనాడి' అని కూడా అంటారు. దీనిని ఎడమవైపు ఇడ. కుడివైపు పింగళ ప్రసరిస్తాయి. పశ్చిమనాళ నందితుడంటే 'ఇడా' నాడి చేత సంతోషించేవాడనే అర్థం రావాలి. కాని వ్యాఖ్యాతలు బ్రహ్మానందాన్ని అనుభవింపచేసేవాడి 'సుషుమ్న' అని అంటారు. (చూ. ఓరుగంటి నీలకంఠశాస్త్రి 'తిక్కయజ్వ హరిహరనాథ తత్త్వము' పు.359).

ఈ పద్యంలో 'అమృత' స్వరూపంగా 'అనామయంగా'. 'అవ్యయంగా' చెప్పబడ్డ ఆనందం యోగ సాధనలో లభించే ఆనందమే. ఇడా పింగళలు సవ్యాపసవ్యాలు కాగా హరిహరతత్త్వం 'సుషుమ్న' అనటమే సమంజసం.

**క.** **వినుత చతుర్వర్ణక సం। జనక ముఖ భుజోరుపాద! సంవి దభేదా!**

**మునిహృత్కమల మరాళా! జనన మరణ హరణ చరణ సరసిజలీలా!** **227**

**ప్రతిపదార్థం:** వినుత= ప్రసిద్ధమైన; చతుర్వర్ణక= నాలుగు వర్ణాలకు; సంజనక= ఉత్పత్తిహేతువైన; ముఖ+భుజ+ఊరు+పాద!= ముఖం, భుజాలు, తొడలు, పాదాలు కలవాడా!; సంవిద్+అభేదా!= సంవిత్తు కన్నా భిన్నం కానివాడా!; మునిహృత్కమలమరాళా!= మునుల హృదయాలు అనే కమలాలలో సంచరించే హంస స్వరూపుడా!; జనన మరణ= పుట్టుక చావులనే రూపం కలిగిన సంసారాన్ని; హరణ= హరించే; చరణ సరసిజలీలా!= పాదపద్మాల విలాసం కలవాడా! నీకు నమస్కారం.

**తాత్పర్యం:** స్వామీ! ప్రశస్తమైన నాలుగు వర్ణాలకు మూలమైన ముఖాద్యవయవాలు కలిగినవాడివి నీవు. నీవు అఖండ చైతన్య స్వరూపుడివి. జ్ఞానుల హృదయ కమలాలలో సంచరించే హంస స్వరూపుడివి. జనన మరణ భయం లేకుండా చేసే పాదపద్మాలు కలవాడివి.

**విశేషం:** బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు విరాట్పురుషుడి ముఖ బాహు ఊరు పాదాలనుండి జనించారని పురుషసూక్తం (ఈ విషయం ముందటి ఆశ్వాసాలలో వివరించబడింది).

'సంవిత్తు' అని ఏ అఖండ చైతన్యం ఈ ఆశ్వాసంలో బోధించబడిందో అది హరిహర ప్రకాశమే అని ఈ స్తుతిని బట్టి అర్థం అవుతుంది.

'హంస' అనేమాట 'సోహం' అనేమాటను తిప్పిచూస్తే తెలుస్తుంది. 'అహం బ్రహ్మాస్మి' అనే బ్రహ్మజ్ఞానం ఉన్నవాడు హంస. యోగుల హృదయాలు ద్వంద్వ తిమిరం నశించి అవధూతాలైనవి. అందుకే తెల్లగా ఉంటాయని పురాణాల కల్పన. దానికి రూపకల్పనే ఈ 'హంస'.

ముక్తి 'పదం' చేరినవాడికి జననమరణ క్లేశం లేదు - అని ఈ ఆశ్వాసంలో ప్రతిపాదించిన తాత్పర్యాన్ని ఇక్కడ హరిహర స్వామికి విశేషణంగా తిక్కనగారు ప్రయోగించారు.

**మాలిని.**

**పదనమదమరాళీ! భక్త సంపోషశాలీ!**

**విదళిత సురవైరీ! విశ్వలోకైకధారీ!**

**మదరహిత హితైషీ! మాన్యయోగ ప్రతోషీ!**

**సదవన పరచిత్తా! సర్వనిర్మాణ వేత్తా!** **228**

**ప్రతిపదార్థం:** పదనమత్+అమరాళీ!= పాదాలకు వినయంగా నమస్కరిస్తున్న దేవతల సముదాయం కలవాడా!; భక్త సంపోషశాలీ!= భక్తులను బాగా పోషించేవాడా!; విదళితసురవైరీ!= రాక్షసులను చీల్చి చెండాడేవాడా!; విశ్వలోకైకధారీ!= సర్వలోకాలను ఒకడై భరించేవాడా!; మదరహితహితైషీ!= మదాది దుర్గుణాలు లేని వారి మంచిని కోరే వాడా!; మాన్యయోగ ప్రతోషీ!= ఉత్తమమైన యోగవిద్యచేత సంతోషించేవాడా!; సత్+అవన పరచిత్తా!= సత్పురుషులను కాపాడటంలో ఆసక్తమైన మనస్సు కలవాడా!; సర్వనిర్మాణవేత్తా! చరాచర జగత్తు నంతటినీ ఎట్లా నిర్మించాలో తెలిసినవాడా!.

**తాత్పర్యం:** స్వామీ! నీ పాదపద్మాలకు దేవతలు కూడా వినయంగా నమస్కరిస్తారు. నీవు భక్తులను నిరంతరం రక్షిస్తావు. పోషిస్తావు. రాక్షసులను వధించి దేవతలను కాపాడుతావు. సర్వలోకాన్ని నీవు ఒక్కడివే భరిస్తున్నావు. కామాది దుర్గుణాలు లేని వారి హితాన్ని వహిస్తావు. యోగవిద్య నీకు పరమ ప్రీతికరమైనది. నీవు సదా సత్పురుషులను కాపాడుతావు. నీవు సకల జగత్కల్పన క్రమం ఎరిగినవాడివి.

**విశేషం:** ఇంద్రాదులు కూడా ఎవరి పాదంబులను ఉపాసించి బ్రహ్మతత్త్వ పరిజ్ఞానంచేత పరిపూతులవుతారో ఆ 'పరమపద' మూర్తి హరిహరనాథుడు.

> **"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
>
> **అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"**

అని స్వామి ప్రతిజ్ఞ. కాబట్టి రాక్షససంహారం, భక్తసంపోషణ, లోకస్థితిపాలన, సద్గుణుల హితాన్ని కోరటం ఆయన ధర్మం.

"యోగ క్షేమం వహామ్యహమ్'' అని కూడా ఆయనే సెలవిచ్చారు.

సర్గ నిర్మాణ విషయం ఈ పర్వంలో సమగ్రంగా వివేచింపబడింది. బ్రహ్మతత్త్వంనుండి పుట్టిన జగత్తు మరలా బ్రహ్మలో లీనం కావటమే ఆ నిర్మాణ రహస్యం. దానిని తెలిసినవాడు స్వామిమాత్రమే. అందుకే గీతను సెలవిచ్చిన స్వామి 'అనుగీత'ను సెలవిచ్చాడు.

భగవద్గీతలో 'కర్మ' యోగం ప్రధానంగా చేసి చెప్పి, ఈ అనుగీతలో ఉపనిషద్విద్య సారాంశాన్ని అంతా 'జ్ఞాన' యోగ సంస్థాపనకొరకు చేయటం ద్వారా కూడా తిక్కనగారు హరిహరాద్వైతాన్ని ప్రతిష్ఠించారు. ఇదే అత్యుత్తమ సాధక మార్గమని ఆయన సిద్ధాంతం.

**గద్యము**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన**

**శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందుఁ ద్వితీయాశ్వాసము**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= మంగళకరుడైన; ఉభయకవిమిత్ర= కావ్యశాస్త్ర కవులిరువురికీ మిత్రుడైనవాడు, బుధ+ఆరాధన విరాజి= పండితులను (జ్ఞానులను) సేవించటం వలన కీర్తితో ప్రకాశించేవాడు; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కన చేత; ప్రణీతంబు+ఐన= రచించబడిన; శ్రీ మహాభారతంబునన్; అశ్వమేధ పర్వంబునందున్; ద్వితీయాశ్వాసము= రెండవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది ఉభయకవిమిత్రడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, జ్ఞానులచేత ఆరాధించబడి రాణించే వాడూ అయిన తిక్కన సోమయాజి శుభప్రదంగా రచించిన శ్రీ మహాభారతంలోని అశ్వమేధపర్వంలో రెండవ ఆశ్వాసం.

**అశ్వమేధపర్వంలోని రెండవ ఆశ్వాసం సమాప్తం.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీనగసుతాత్వ మహిత వి। ధానుత శశ్వల్లస ల్లతా వేష్టన హే**

**లా నిత్య శాద్వలతరు। త్వానుగుణ ఫలప్రదత్వ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= ఓ హరిహరనాథ స్వామీ! శ్రీనగసుతాత్వ = లక్ష్మీభావమూ; పర్వత పుత్రిక అయిన పార్వతి భావమూ అనే; మహిత= గొప్ప; విధా= ప్రకారములచేత; నుత= పొగడబడిన; శశ్వత్= స్థిరమయిన; లసత్= ఒప్పుతున్న; లతా= తీగలయొక్క; ఆవేష్టన= అల్లుకొనటం అనే; హేలా= విలాసంచేత; నిత్య= ఎల్లప్పుడునూ, శాద్వల= పచ్చగా ఉన్న; తరుత్వ= వృక్షభావానికి; అనుగుణ= తగినట్లుగా; ఫల+ప్రదత్వ!= ఫలాలను ఇచ్చే స్వభావం కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! లక్ష్మీపార్వతులు అనే తీగలు నిన్ను నిత్యమూ మనోహరంగా అల్లుకొని ఉన్నాయి. అందువలననే నీవు ఎల్లప్పుడూ పచ్చగా ఉండే చెట్టుమాదిరిగా ప్రకాశిస్తున్నావు. పచ్చగా ఉన్న చెట్టే పండ్లు ఇస్తుంది. అదే విధంగా నీవు నిన్ను ఉపాసించేవారి కోరికలు ఫలింపజేస్తున్నావు.

**విశేషం:** లక్ష్మి నిత్యమూ విష్ణువు రొమ్మున ఉంటుంది. పార్వతి ఎల్లప్పుడూ శివుడికి అర్ధశరీరంగా ఉంటుంది. అందుచేత లక్ష్మీపార్వతులు అనే తీగలు స్థిరంగా విష్ణుపరమేశ్వర స్వరూపుడయిన హరిహరనాథు డనే వృక్షాన్ని చుట్టుకొని ఉన్నవని చెప్పటం సముచితంగా ఉన్నది.

లక్ష్మీపార్వతు లనే తీగలు ఎల్లప్పుడూ అల్లుకొని ఉండటంవలననే హరిహరనాథు డనే వృక్షం పచ్చగా ఉన్నది. భక్తులకు అభిమత ఫలాలను ప్రసాదింపగలుగుతున్నది. కాబట్టి హరిహరనాథుడి వరప్రదాయకత్వానికి వారిద్దరూ మూలకారణం అవుతున్నారు. లక్ష్మీపార్వతు లిద్దరూ ఒకే శక్తియొక్క రెండు రూపాలు. కవిబ్రహ్మ తిక్కనే విరాటపర్వం మొదట్లోనే '**శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకు**' అని చెప్పాడు. శక్తి తోడ్పడినప్పుడే పరమాత్మ అయిన హరిహరనాథుడు పనులు చేయగలుగుతున్నాడు. అందువలననే శంకర భగవత్పాదులు సౌందర్యలహరి ప్రారంభ శ్లోకంలో **"శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, నచే దేవం దేవో నఖలు కుశలః స్పన్దితు మపి"** అని వక్కాణించారు. శివుడు - పరమాత్మ - శక్తితో కూడుకొని ఉన్నప్పుడే ప్రపంచసృష్టి చేయగలుగుతున్నాడనీ, శక్తియుక్తుడు కాకపోతే ఆయన కదలటానికి కూడా శక్తిమంతుడు కాడనీ, శ్లోకార్థం. త్రిమూర్తులూ సైతము శక్తిని సేవించవలసినవారే అని ఆచార్యులవారు చెప్పారు.

లక్ష్మీపార్వతులయందు తీగలధర్మాన్నీ హరిహరనాథునిలో వృక్షభావాన్నీ ఆరోపించి, అభేదం చెప్పటంచేత ఈ పద్యంలో రూపకాలంకారం ఉన్నది.

**తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట (సం.14-50-49)**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గు విద్యా విశారదుం జేసి శౌరి యతనితోడ. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; శౌరి= శ్రీకృష్ణుడు; అట్లు= ఆ విధంగా; ఫల్గునిన్= అర్జునుడిని; అఫల్గు= అమోఘమయిన; విద్యా= విద్యయందు; విశారదున్= నేర్పరినిగా; చేసి; అతనితోడన్= ఆ అర్జునుడితో.

**తాత్పర్యం:** వైశంపాయనుడు జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు. శ్రీకృష్ణుడు ఆ విధంగా అర్జునుడిని అధ్యాత్మవిద్యా నిపుణుడిగా తీర్చిదిద్ది అతడితో. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అశ్వమేధపర్వ ప్రథమ ద్వితీయాశ్వాసాలలో శ్రీకృష్ణుడు ఎన్నో అధ్యాత్మ విద్యా విషయాలను అర్జునుడికి బోధించాడనే విషయం ఇక్కడ గుర్తుకు తెచ్చుకొనాలి.

**క. 'నా చిత్తము వసుదేవునిఁ । జూచుట గోరియును, నీవు సుమనోవృత్తిం**
**జూచి, యనుమతి యొనర్చుట । వేచినయది; నన్నుఁ బుచ్చవే ద్వారకకున్.' 3**

**ప్రతిపదార్థం:** నా= నాయొక్క; చిత్తము= మనస్సు; వసుదేవునిన్= తండ్రి అయిన వసుదేవుడిని; చూచుట; కోరియును= కోరినప్పటికీ; నీవు= అర్జునా! నీవు; సుమనస్= మంచిమనస్సుయొక్క; వృత్తిన్= స్థితితో (సుమనస్సు అంటే సంతోషం, సంతోషపూర్వకంగా అని కూడా అర్థం చెప్పవచ్చును); చూచి= ఆలోచించి; అనుమతి+ఒనర్చుట= అంగీకరించటం; వేచిన+అది= ఎదురుచూస్తున్నది; నన్నున్= నన్ను; ద్వారకకున్= ద్వారకకు; పుచ్చవే!= పంపుమా!

**తాత్పర్యం:** 'అర్జునా! మా తండ్రి వసుదేవుడిని చూడాలని నా మనస్సు ఆరాటపడుతున్నది. అయినప్పటికీ నీ అంగీకారంకొరకు ఎదురుచూస్తున్నాను. నీవు మంచి సెబ్బరలు విచారించి నన్ను సంతోషపూర్వకంగా ద్వారకకు పంపుము.'

**విశేషం:** నరనారాయణు లయిన కృష్ణార్జునుల ఆత్మీయతను ఈ పద్యం నిరూపిస్తున్నది.

**చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశ వరేణ్యుతోడ ని**
**ట్లను; 'నటు లేనిఁ బోవలయు హస్తిపురంబున; కిత్తెఱంగు సె**
**ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పిపుచ్చు; న**
**య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా!' 4**

**ప్రతిపదార్థం:** అనవుడున్= శ్రీకృష్ణు డా విధంగా పలికిన తరువాత; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; ఆ+యదువంశ+వరేణ్యునితోడన్= ఆ యదువంశ ముఖ్యుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అచ్యుతా!= శ్రీకృష్ణా!= అటులు+ఏనిన్= అట్లయితే; హస్తిపురంబునకున్= హస్తినాపురానికి; పోవలయున్= మనం ఈ ఇంద్రప్రస్థంనుండి వెళ్ళాలి; ఈ+తెఱంగు= ద్వారకకు వెళ్ళాలనుకొంటున్న నీ యీ తీరును గూర్చి; చెప్పినన్= చెప్పినట్లయితే; ధర్మనందనుఁడు= యముని కుమారుడు ధర్మరాజు; నినున్= నిన్ను; ప్రీతిగన్= సంతోషంగా; అందులకున్= ద్వారకకు; అన్పిపుచ్చున్= పంపిస్తాడు; ఆ+విభు= ఆ మహారాజుయొక్క; పాలన్= సమక్షంలో; ఆ+అనుమతి= నీవు వెళ్ళటానికి అంగీకారం; కల్గు+అట్లు= లభించేటట్లుగా; తగన్= తగిన విధంగా; ఆడెదన్= మాటాడుతాను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణు డావిధంగా మాటాడిన తరువాత, అర్జునుడు అతడితో 'అట్లయితే మనం వెంటనే ఈ ఇంద్రప్రస్థంనుండి హస్తినాపురం వెళ్ళాలి. నీ ద్వారకాప్రయాణాన్ని గూర్చి చెప్పితే సంతోషంగా ధర్మరాజు నిన్ను పంపిస్తాడు. ఆ మహారాజు అంగీకరించేటట్లు నేను కూడా సమయోచితంగా మాటాడుతాను.'

**వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి, 'రథంబు పూన్పు' మని నియోగించెఁ; దదనంతరంబ ధనంజయుండు దమతోడం జనుదేరం దగుపరివారంబు సమకట్టం బడవాళ్ళం బనిచె; నొక్కింతసేపునకు దారుకుండునుం దే రాయితంబుసేసి తేరం, బడవాళ్ళునుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితులంజేయ, నా కృష్ణార్జునులు ప్రయాణోచితాలంకారాలంకృతులై, రథంబెక్కి, కరినగరపథంబు గైకొని చను సమయంబున. 5**

**ప్రతిపదార్థం:** అనినన్= అర్జునుడు పై విధంగా అనగా; విని; దామోదరుండు= శ్రీకృష్ణుడు; దారుకున్= దారుకుడనే పేరు కలిగిన తన సారథిని; రావించి= రప్పించి; రథంబును= రథమును; పూన్పుము= గుర్రాలు కట్టి సిద్ధం చేయుము; అని; నియోగించెన్= ఆజ్ఞాపించాడు; తదనంతరంబు+అ= ఆ వెంటనే; ధనంజయుండు= అర్జునుడు; తమతోడన్= తమతోపాటు; చనుదేరన్= రావటానికి; తగు= తగిన; పరివారంబున్= సేవకులను, బలగమును; సమకట్టన్= సిద్ధంచేయగా; పడవాళ్ళన్= సేనాపతులను; పనిచెన్= ఆజ్ఞాపించాడు; ఒక్కింతసేపునకున్= కొంతసేపటికి; దారుకుండునున్= దారుకుడునూ; తేరు= రథాన్ని; ఆయితంబు+చేసి= సిద్ధంచేసి; తేరన్= తీసికొనిరాగా; పడవాళ్ళునున్= సేనానాయకులు కూడా; పరిజనంబులన్= సేవకులను; సన్నద్ధులన్= సిద్ధమయిన వారినిగా; కావించి= చేసి; సన్నిహితులన్= దగ్గర ఉన్నవారినిగా; చేయన్= చేయగా - దగ్గరకు తీసికొనిరాగా; ఆ+కృష్ణార్జునులు= ఆ కృష్ణుడునూ, అర్జునుడునూ; ప్రయాణ= ప్రయాణానికి; ఉచిత= తగిన; అలంకార= హారాలు మొదలైన నగలను; అలంకృతులు+ ఐ= అలంకరించుకొన్నవారై; రథంబు; ఎక్కి; కరినగరంబు= హస్తినాపురంయొక్క; పథంబు= మార్గం; కైకొని= పట్టి; చను= వెళ్ళే; సమయంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా అనగా విని, కృష్ణుడు దారుకుడిని రప్పించి, రథం సిద్ధంచేయుమని ఆజ్ఞాపించాడు. అర్జునుడు కూడా తమతోపాటు హస్తినాపురానికి రావటానికి తగిన బలగాన్ని సిద్ధంచేయండని సేనాపతులను ఆజ్ఞాపించాడు. కొంతసేపటికి దారుకుడు రథాన్ని సిద్ధంచేసి తీసికొని వచ్చాడు. సేనా నాయకులుకూడా సేవకులను సిద్ధంచేసి సముఖానికి తీసికొని వచ్చారు. తరువాత కృష్ణార్జునులు ప్రయాణానికి తగ్గట్టుగా అలంకరించుకొని రథం ఎక్కి హస్తినాపురం దారిపట్టి వెళ్ళేటప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. వినయ మారంగ గోవిందున కిట్లను। గాండీవి; 'దేవ! నీ కరుణఁ జేసి**
**కౌరవసైన్యసాగర ముత్తరింపంగఁ। గంటిమి; గురు భీష్మ కర్ణ ముఖ్య**
**దుర్జయవీరుల నిర్జించితిమి; నీవు। శాత్రవ యోధుల సమయఁ జేయ,**
**వెనుక నేము జయంబు గొనుచు వచ్చితిమి; తే। జంబును బేరు సౌఖ్యంబు నతుల**

**తే. మైన భవదీయ సుప్రసాదాతిశయము। కతనఁ బడసితి; మప్రతిహత మహార్థి**
**రాజ్య సంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు; సంశ్రి। తాభిరక్షణవ్రత నిరతాంతరంగ! 6**

**ప్రతిపదార్థం:** గాండీవి= అర్జునుడు; వినయము; ఆరంగన్= ఒప్పగా; గోవిందునకున్= శ్రీకృష్ణుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; దేవ!= పరమాత్మా!; సంశ్రిత= ఆశ్రయించినవారిని; అభిరక్షణ= పూర్తిగా రక్షించటం అనే; వ్రత= కార్యమందు; నిరత= ఆసక్తి కలిగిన; అంతరంగ!= హృదయం కలవాడా!; నీ= నీయొక్క; కరుణన్+చేసి= దయవలన; కౌరవ= కౌరవులయొక్క; సైన్య= సైన్యమనే; సాగరము= సముద్రాన్ని; ఉత్తరింపంగన్+కంటిమి= దాటగలిగాము; గురు= ఆచార్యుడయిన ద్రోణుడు; భీష్మ= భీష్ముడు; కర్ణ= కర్ణుడూ అనే; ముఖ్య= ప్రధానమయిన; దుర్జయ= జయించ శక్యంగాని; వీరులన్= వీరులను; నిర్జించితిమి= జయించాము; నీవు; శాత్రవ= శత్రువులైన; యోధులన్= వీరులను; సమయన్+చేయన్= నశింపచేయగా; వెనుకన్= ఆ తరువాతనే; ఏము= మేము; జయంబు= జయం; కొనుచున్+వచ్చితిమి= పొందగలిగాము; తేజంబును= ప్రభావాన్నీ; పేరు= కీర్తినీ; సౌఖ్యంబున్= సుఖాన్నీ; అతులము= సాటిలేనిది; ఐన= అయినట్టి; భవదీయ= నీయొక్క; సుప్రసాద= శోభను కలిగించే దయయొక్క; అతిశయము= అధిక్యం; కతనన్= వలన; పడసితిమి= పొందాము; ధర్మజుఁడు= ధర్మరాజు; అప్రతిహత= ఎదురులేని; మహత్= గొప్ప; ఆధిరాజ్య= సార్వభౌమత్వంవలన; సంపూజ్యుఁడు= మిక్కిలి పూజింపదగినవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వినయపూర్వకంగా కృష్ణుడితో ఈ విధంగా అన్నాడు. 'పరమాత్మా! ఆశ్రితజన సంరక్షకా! నీ దయవలన మేము కౌరవసైన్య సముద్రాన్ని దాటగలిగాము. జయించటానికి అసాధ్యులయిన ద్రోణుడూ, భీష్ముడూ, కర్ణుడూ మొదలైన ప్రధాన వీరుల నందరినీ జయించాము. వాస్తవానికి నీవే శత్రువీరుల నందరినీ నశింపజేశావు. ఆ తరువాతనే మేము జయం పొందగలిగాము. నీ దయవలననే మేము తేజస్సునూ, కీర్తినీ, సుఖాన్నీ పొందాము. ధర్మరాజు సార్వభౌముడై అందరికీ పరమపూజ్యు డయ్యాడు.

**విశేషం:** కౌరవసైన్య సాగరము - కౌరవసైన్యం ఉపమేయం. సాగరం ఉపమానం. ఉపమానం అయిన సాగరంయొక్క ధర్మం ఉపమేయమయిన కౌరవసైన్యానికి ఆరోపించి, రెండింటికీ అభేదం కల్పించటం జరిగింది కాబట్టి రూపకాలంకారం.

**క. నీ మహిమ వొగడఁ గొలఁదియె? । దామోదర! విశ్వసంవిధాతవు; భవదీ**
**యామల తేజమ యగ్ని । ష్టోమము; గాలాత్మకత్వ శోభివి కృష్ణా! 7**

**ప్రతిపదార్థం:** దామోదర!= ఉదరమున తులసిమాల కలవాడా! లేదా బాల్యంలో యశోదకట్టిన త్రాడు ఉదరమున - నడుమున కలవాడా!; కృష్ణా!; నీ= నీయొక్క; మహిమన్= గొప్పతనాన్ని; పొగడన్= పొగడగా; కొలఁది+ఎ?= సాధ్యమా?; విశ్వ= ప్రపంచముయొక్క; సంవిధాతవు= మహా సృష్టికర్తవు; భవదీయ= నీయొక్క; అమల= స్వచ్ఛమయిన; తేజము+అ= ప్రకాశమే; అగ్నిష్టోమము= అగ్నుల సమూహం; కాల+ఆత్మకత్వ= కాల స్వరూపకత్వంతో; శోభివి= ప్రకాశించేవాడవు.

**తాత్పర్యం:** కృష్ణా! నీ గొప్పతనం పొగడటం సాధ్యంకాదు. నీవు విశ్వసృష్టికర్తవు. అగ్నులు నీ వెలుగులే! నీవు కాలస్వరూపుడవు.

**విశేషం:** అగ్నిష్టోమ మంటే అగ్నుల సమూహం. సంస్కృత భారతంలో ఈ ప్రకరణంలో **"త్వత్తేజస్సంభవో నిత్యం హుతాశో మధుసూదన"** అని ఉండటమే దీనికి కారణం.

**క. భవదీయ శ్వసనము వా । యువు; నీ క్రోధముఁ బ్రసాద యోగంబును మృ**
**త్యువు లక్ష్మియు; నీ వలనన । యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్. 8**

**ప్రతిపదార్థం:** భవదీయ= నీయొక్క; శ్వసనము= ఊపిరి; వాయువు= పంచభూతాలలో ఒకటయిన గాలి; నీ= నీయొక్క; క్రోధముఁ= ఇష్టార్థం ప్రాప్తించటానికి ఆటంకం కలిగినప్పుడు ఏర్పడే మానసిక వికారం, కోపం; ప్రసాద= దయయొక్క; యోగంబును= కలయికయే; మృత్యువు= మరణం; లక్ష్మియున్= సంపద; నీ వలనన్+అ= నీవలననే; ప్రీతియున్= సంతృప్తి; మరణమును= చావును; మహత్= గొప్ప; ఆనందంబున్= ఆనందమూ; అవున్= అగును.

**తాత్పర్యం:** నీ ఊపిరి వాయువు. నీ కోపం మృత్యువు. నీ అనుగ్రహం సంపద. నీ వలననే సంతృప్తీ, మరణమూ, ఆనందమూ కలుగుతున్నాయి.

**విశేషం:** "నీ క్రోధముఁ బ్రసాదయోగంబును మృత్యువు, లక్ష్మియు" అనేచోట క్రమంగా చెప్పిన వస్తువులకు క్రమంగా అన్వయం చెప్పటం జరిగింది. కాబట్టి యథాసంఖ్యాలంకారం. ఇదే క్రమాలంకారం.

**క. స్థావర జంగమ మయ జగ। దావిర్భావ స్థితి క్రియా విలయంబుల్**
**నీవలనన యగుచుండును। భావాతీతుఁడవు; సర్వపతివి; ముకుందా!' 9**

**ప్రతిపదార్థం:** ముకుందా!= కృష్ణా!; స్థావర= స్థిరంగా నిలిచే పదార్థాలయొక్క; జంగమ= సంచరించే ప్రాణులయొక్క; మయ= రూపమయిన; జగత్= ప్రపంచముయొక్క; ఆవిర్భావ= పుట్టుట; స్థితిక్రియా= ఉనికి; విలయంబు= వినాశమూ; నీవలనన్+అ= నీవలననే; అగుచున్+ఉండును= సంభవిస్తూ ఉంటాయి; భావ= ఊహకు; అతీతుఁడవు= అందనివాడవు; సర్వ= సమస్తమైన సృష్టికీ; పతివి= సంరక్షకుడవు.

**తాత్పర్యం:** ప్రాణుల అప్రాణుల రూపమయిన ఈ ప్రపంచం సృష్టిస్థితి లయాలు నీవలననే జరుగుతున్నాయి. నీవు ఊహకు కూడా అందేవాడవు కావు. నీవే సమస్తసృష్టికీ సంరక్షకుడవు.'

**వ. అని వెండియు. 10**

**తాత్పర్యం:** అని చెప్పి; ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం)

### శ్రీకృష్ణార్జును లింద్రప్రస్థమున నుండి హస్తినాపురంబునకు వచ్చుట (సం.14-51-15)

**క. 'నారద దేవల కౌశిక। పారాశర్యాది మునుల పలుకుల, భీష్మో**
**దారవచనముల నిను నఘ। దూరా! యే నెఱిఁగియుండుదును సకలముగన్. 11**

**ప్రతిపదార్థం:** అఘ!= పాపమునకు; దూరా!= దూరంగా ఉన్నవాడా!; నారద= నారదుడు; దేవల= ధర్మశాస్త్రకర్త అయిన దేవలుడూ; కౌశిక= విశ్వామిత్రుడూ; పారాశర్య= పరాశరమహర్షి కుమారుడయిన వ్యాసుడూ; ఆది= మొదలయిన; మునుల= మునులయొక్క; పలుకులన్= మాటలచేతనూ; భీష్మ= భీష్ముడియొక్క; ఉదార= గొప్పవి అయిన; వచనములన్= మాటలవలననూ; ఏన్= నేను; నినున్= నిన్ను; స+కలము+కన్= సగుణబ్రహ్మ స్వరూపంగా; ఎఱింగి= తెలిసికొని; ఉండుదును= ఉంటిని.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! నారదాది మహామునులూ, భీష్ముడూ చెప్పిన గొప్ప మాటలవలన నిన్ను సగుణబ్రహ్మ స్వరూపంగా తెలిసికొన్నాను.

**వ. కావున. 12**

**తాత్పర్యం:** కాబట్టి- (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నావలని కరుణ పెంపున। నీవు ప్రసాదించినట్టి నిరవద్యక వి**
**ద్యా విస్తారంబున దృఢ। తావిశదమతిన్ రమించెదం గ్రతుపురుషా!' 13**

**ప్రతిపదార్థం:** క్రతుపురుషా!= విష్ణుమూర్తీ!; నావలనన్= నా యందలి; కరుణ= దయయొక్క; పెంపునన్= ఆధిక్యంచేత; నీవు; ప్రసాదించిన= అనుగ్రహించిన; అట్టి; నిరవద్యక= దోషంలేని, ప్రశస్తమయిన; విద్యా= అధ్యాత్మవిద్యయొక్క; విస్తారంబునన్= ఆధిక్యంవలన, వైశాల్యంవలన అని అర్థం; దృఢతా= జ్ఞానబలంతో కూడిన; విశద= శాంతమయిన; మతిన్= బుద్ధితో; రమింతున్= బ్రహ్మానంద మనుభవిస్తాను.

**తాత్పర్యం:** విష్ణుమూర్తీ! నాయందలి దయతో నీవు విపులంగా అనుగ్రహించిన అధ్యాత్మవిద్యవలన నా బుద్ధికి జ్ఞానబలమూ; శాంతీ సమకూరాయి. ఇందువలన నేను బ్రహ్మానంద మనుభవిస్తాను.'

**వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన, వాసుదేవుండును వితతాదరవాక్యంబుల నభినందించె; నప్పురుషవరు లట్లు సల్లాపంబులు సేయుచుం బోయి, తమరాకకు సమలంకృతంబైన సామజపురంబు ప్రవేశించి, ధృతరాష్ట్ర మందిరంబున కరిగి, యక్కురువృద్ధుని గాంధారినిం బ్రణామ వినయ విశేషంబులం బ్రీతులంజేసి, కుంతీసమారాధనం బాచరించి, విదుర ధౌమ్య యుయుత్సు సంజయుల దర్శనంబులు సముచిత ప్రకారంబుల నడపి, కౌంతేయాగ్రజు నత్యంత భక్తిపూర్వకంబుగా సమంచిత విధంబునం గాంచి, తదాలింగ నాద్యాదరణంబులు వడసి; రప్పద్మనాభుండు నాఁడు సవ్యసాచి సదనంబున నతని చేయు పూజావిధానంబుల మానసంబలర వసియించి, మఱునాఁడు మహనీయాస్థానమండపంబున నున్న యన్నరేంద్రు కడకు నుపేంద్రుం డయ్యింద్రసుతుండు తోడన చనం జని, సుఖగోష్ఠినుండె; నట్టియెడ నగ్గాండీవి యప్పాండవపూర్వజు నాననంబునఁ జూడ్కి నిలిపి, నిభృతుండై. 14**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; సభక్తికంబు+కాన్= భక్తితో కూడియుండేటట్లుగా; సంభాషణంబు+చేసినన్= మాటాడగా; వాసుదేవుండును= వసుదేవుడి కుమారుడును, కృష్ణుడును; వితత= విరివి అయిన; ఆదర= ప్రేమతోకూడిన; వాక్యంబులన్= మాటలచే; అభినందించెన్= పొగడాడు; ఆ+పురుషవరులు= ఆ మనుష్యులయందు శ్రేష్ఠులు; అట్లు= ఆ విధంగా; సల్లాపంబులు= పరస్పర సంభాషణలు; చేయుచున్= చేస్తూ; పోయి; తమ= తమయొక్క; రాకకున్= వచ్చుటకు; సమ్+అలంకృతంబు= చక్కగా అలంకరించబడినది; ఐన= అయిన; సామజపురంబు= హస్తినాపురం; ప్రవేశించి; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడియొక్క; మందిరంబునకున్= గృహానికి; అరిగి= వెళ్ళి; ఆ+కురువృద్ధునిన్= ఆ కురువంశంలో పెద్ద అయినవాడిని; గాంధారినిన్= గాంధారినీ; ప్రణామ= నమస్కారముయొక్క; వినయ= వినయముయొక్క; విశేషంబులన్= ఆధిక్యములతో; ప్రీతులన్= సంతోషించిన వారినిగా; చేసి; కుంతీ= కుంతీదేవియొక్క; సమారాధనంబు= సంతోషపెట్టటం; ఆచరించి= చేసి; విదుర= విదురుడియొక్క; ధౌమ్య= ధౌమ్యుడి యొక్క; యుయుత్సు= యుయుత్సుడియొక్క; సందర్శనంబులు= చూచుటలు; సముచిత= మిక్కిలి తగిన; ప్రకారంబులన్= విధాలుగా; నడపి= చేసి; కౌంతేయ= కుంతీకుమారులలో; అగ్రజున్= పెద్దవాడిని - ధర్మరాజును; అత్యంత= మిక్కిలి; భక్తి పూర్వకంబుగాన్= భక్తి కలిగేటట్లుగా; సమంచిత= మిక్కిలి పూజ్యమైన; విధంబునన్= విధంగా; కాంచి= చూచి;

తద్= ఆ ధర్మరాజుయొక్క; ఆలింగన= కౌగిలింత; ఆది= మొదలైన; ఆదరణంబులు= గౌరవములు; పడసిరి= పొందారు; ఆ+పద్మనాభుండు= నాభియందు పద్మంకలవాడు, విష్ణుమూర్తి - కృష్ణుడు; నాఁడు= ఆ రోజు; సవ్యసాచి= అర్జునుడియొక్క; సదనంబునన్= గృహంలో; అతని చేయు= అతడు చేస్తున్న; పూజావిధానంబులన్= పూజాపద్ధతులచేత; మానసంబు= మనస్సు; అలరన్= సంతోషించగా; వసియించి= ఉండి; మఱునాఁడు= మరుసటిరోజున; మహనీయ= గొప్ప; ఆస్థానమండపంబునన్= కొలువు కూటంలో; ఉన్న; ఆ+నరేంద్ర!= ఆ రాజుయొక్క(ధర్మరాజు); కడకున్= దగ్గరకు; ఉపేంద్రుండు= శ్రీకృష్ణుడు; ఆ+ఇంద్రసుతుండు= ఆ ఇంద్రుడి కొడుకు అర్జునుడు; తోడన్+అ= వెనువెంటే; చనన్= వెళ్ళగా; చని= వెళ్ళి; సుఖ= సుఖం కలిగించు; గోష్ఠిన్= సల్లాపంతో; ఉండెన్= ఉన్నాడు; అట్టి+ఎడన్= అట్టి సమయాన; ఆ+గాండీవి= ఆ గాండీవమనే విల్లు కలవాడు అర్జునుడు; ఆ+పాండవ= ఆ పాండవులయందు; పూర్వజ= ముందు పుట్టినవాడియొక్క, ధర్మరాజుయొక్క; ఆననంబునన్= ముఖమునందు; చూడ్కి= చూపు; నిలిపి= ఉంచి; నిభృతుండు+ఐ= వినయం కలవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు భక్తితో మాటాడిన మాటలకు కృష్ణుడు ప్రేమపూర్వకంగా అతడిని ప్రశంసించాడు. వారిద్దరూ పరస్పరం మాటాడుకొంటూ, ప్రయాణం సాగించి, హస్తినాపురం ప్రవేశించి ముందుగా ధృతరాష్ట్రుడి గృహానికి వెళ్ళారు. అక్కడ గాంధారీ ధృతరాష్ట్రులకు వినయపూర్వకంగా నమస్కరించి వారిని ఆనందింపజేశారు. తరువాత కుంతీదేవిని సంతోషింపజేశారు. పిదప విదురుడినీ, ధౌమ్యుడినీ, యుయుత్సుడినీ, సంజయుడినీ సందర్శించారు. భక్తిపూర్వకంగా ధర్మరాజును చూచారు. ధర్మరాజుకూడా వారిద్దరినీ కౌగిలించుకొని గౌరవించాడు. ఆ రోజు శ్రీకృష్ణుడు అర్జునుడి గృహంలో ఉండి, అతడు చేసే మర్యాదలకు ఎంతో సంతోషించాడు. మరునాడు అర్జునుడు వెంటరాగా కొలువుకూటంలో ఉన్న ధర్మరాజు దగ్గరకు వెళ్ళి సరససల్లాపం చేస్తూ ఉన్నాడు. అప్పుడు అర్జునుడు అన్న అయిన ధర్మరాజు ముఖం చూస్తూ వినయంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **'కమలనాభుండు పెద్దయుఁ గాల మిచట। నున్నవాఁడు; దండ్రియును సహోదరాది**
**సకల బంధులు నితని దర్శనము గోర। కుందురే; వారిఁ జూడ నీతండుఁ గోరె.'** **15**

**ప్రతిపదార్థం:** కమలనాభుండు= నాభియందు పద్మం కలవాడు, శ్రీకృష్ణుడు; పెద్దయున్+కాలము= చాలాకాలం; ఇచటన్= ఈ హస్తినాపురంలో; ఉన్నవాఁడు= ఉన్నాడు; తండ్రియును= ఇతడి తండ్రి అయిన వసుదేవుడూ; సహోదర= సోదరులు; ఆది= మొదలయిన; సకల= సమస్తమైన; బంధులు= బంధువులు, చుట్టాలు; ఇతని= ఈ శ్రీకృష్ణుడియొక్క; దర్శనము= చూచుట; కోరక= కోరకుండా; ఉందురే?= ఉంటారా?; ఈతండున్= ఈ కృష్ణుడు కూడా; వారిన్= తండ్రినీ, సోదరులనూ, చుట్టపక్కాలనూ; చూడన్= చూచుట; కోరెన్= కోరాడు.

**తాత్పర్యం:** అగ్రజా! శ్రీకృష్ణుడు చాలాకాలం నుండీ హస్తినాపురంలో ఉన్నాడు. వసుదేవుడూ, సోదరులూ, చుట్టపక్కాలూ అందరూ ఇతడిని చూడాలని కోరుకుంటారు గదా! ఇతడు కూడా వారినందరినీ చూడాలనుకొంటున్నాడు.

**క.** **ద్వారకకు నిమ్మహాత్ముఁడు। మీ రనుమతిసేయఁ జని, యమేయగుణుల నా**
**సీరిని వసుదేవుని గని। గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్.** **16**

**ప్రతిపదార్థం:** మీరు; అనుమతి+చేయన్= సెలవిచ్చి పంపిస్తే; ఈ+మహాత్ముఁడు= ఈ గొప్ప జీవాత్మ కలవాడు - శ్రీకృష్ణుడు; ద్వారకకున్= ద్వారకకు; చని= వెళ్ళి; అమేయ= మితిలేని; గుణులన్= సద్గుణాలు కలవారిని; ఆ+సీరిని= ఆ నాగలిగలవాడిని, బలరాముడిని; వసుదేవునిన్= వసుదేవుడిని; కని= చూచి; గౌరవము; ఎసఁగంగన్= అతిశయించగా; తల్లిన్= తల్లి దేవకిని; కాంచి= చూచి; ముదమునన్= సంతోషంతో.

**తాత్పర్యం:** మీరు సమ్మతిస్తే ఈ పుణ్యాత్ముడు ద్వారకకు వెళ్ళి, అక్కడ బలరాముడిని, వసుదేవుడిని చూచి; దేవకిని సందర్శించి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. తక్కటి సోదరుల, సుతుల, । నక్కునఁ బ్రియమారఁ జేర్చి, యప్పురజనులన్**
**మిక్కిలి మన్నన మక్కువ । నెక్కొనఁగా నాదరించి, నిలువక మగుడున్. 17**

**ప్రతిపదార్థం:** తక్కటి= మిగిలిన; సోదరులన్= అన్నలనూ, తమ్ములనూ; సుతులన్= కుమారులనూ; ప్రియము= సంతోషం; ఆరన్= అతిశయించగా; అక్కునన్= రొమ్మునందు; చేర్చి; కౌగిలించికొని అని అర్థం; ఆ+పురజనులన్= ఆ ద్వారక ప్రజలను; మిక్కిలి; మన్నన= దయ; మక్కువ= ప్రేమ; నెక్కొనఁగాన్= అతిశయించగా; ఆదరించి= అనుగ్రహించి; నిలువక= ద్వారకలో ఎక్కువకాలం ఉండక; మగుడున్= తిరిగి వస్తాడు.

**తాత్పర్యం:** మిగిలిన సోదరులనూ, కుమారులనూ ప్రేమతో చూచి, ద్వారకా నివాసులను దయానురాగాలతో అనుగ్రహించి, శ్రీకృష్ణుడు ద్వారకలో ఎక్కువకాలం ఉండక తిరిగి హస్తినాపురం వస్తాడు.

**సీ. దేవర యిప్పని దివ్యచిత్తంబునఁ । జూచి, మీ కెట్టులు చూడఁ బోలు**
**నట్టుల యుత్తరం బానతి యిత్తురు । గాక; నావుడు, నధిక ప్రియమున**
**మాతులుఁ గాంచి, యిమ్మాధవదేవుండు । మన మాఱుగాఁగ నమస్కృతులును**
**నాలింగనంబులు నాచరించి, హలాయు । ధుని దేవకీదేవిఁ గనిన యపుడు**

**తే. భక్తి మనకునై పూజించి, బంధుజనుల । నందఱను దత్తదౌచిత్య మభినుతముగ**
**నాదరించి, వారలకుశలానుయోగ । విధము నస్మత్కృతమ్ముగ విస్తరించి. 18**

**ప్రతిపదార్థం:** దేవర!= ప్రభూ!; ఈ+పని= శ్రీకృష్ణుడిని అనుమతించటం; దివ్యచిత్తంబునన్= ఘనమయిన మీ మనస్సున; చూచి= ఆలోచించి; మీకున్= మీకు; ఎట్టులు= ఏ విధంగా; చూడన్= చేయగా; పోలున్= తగునో; అట్టులు+అ= అట్లే; ఉత్తరంబు= సమాధానం; ఆనతి+ఇత్తురు+కాక= సెలవియ్యవలయును; నావుడున్= అర్జును డీవిధంగా అన్న తరువాత; అధిక= మిక్కిలి; ప్రియమునన్= ప్రేమతో; ఈ+మాధవదేవుండు= ఈ భగవంతు డయిన కృష్ణుడు; మాతులున్= మేనమామను; వసుదేవుడిని; కాంచి= చూచి; మనమాఱు+కాఁగన్= మన బదులుగా; నమస్కృతులును= నమస్కారములును; ఆలింగనంబులున్= కౌగిలింతలును; ఆచరించి= చేసి; హల+ఆయుధున్= నాగలి ఆయుధంగా కలవాడిని బలరాముడిని; దేవకీదేవిన్= దేవకీదేవిని; కనిన+అపుడు= చూచినప్పుడు; భక్తిన్= భక్తితో; మనకున్+ఐ= మన నిమిత్తంగా; పూజించి; బంధుజనులన్= చుట్టపక్కాలను; అందఱను= అందరినీ; తత్+తత్+ఔచిత్యము= వారి వారికి తగ్గట్టుగా చూపు మర్యాద; అభినుతముగన్= పొగడబడినది కాగా; ఆదరించి= గౌరవించి; వారల= వారియొక్క; కుశల+అనుయోగ= కుశల ప్రశ్నలు వేసే; విధము= తీరు; అస్మద్+కృతమ్ముగన్= నాయొక్క సత్కారంగా లేదా నేను చేసినట్లుగా; విస్తరించి= సవిశేషంగా చెప్పి.

**తాత్పర్యం:** ప్రభూ! తాము చక్కగా ఆలోచించి, ఏ విధంగా చేయటం సమంజసంగా ఉంటుందో ఆ విధంగా సెలవియ్యండి' అని అర్జునుడు పలికాడు. తరువాత శ్రీకృష్ణుడు వసుదేవుడిని చూచి మనబదులుగా నమస్కారాలుచేసి కౌగిలించుకొనాలి. బలరాముడినీ, దేవకీదేవినీ మన నిమిత్తంగా పూజించాలి. చుట్టపక్కాల నందరినీ వారి వారికి తగ్గట్లుగా గౌరవించి వారి యోగక్షేమం తెలిసికొనటానికి నేను ప్రశ్నిస్తున్నట్లుగా వివరించాలి.

**క. పరిజన యోగ క్షేమము। లరసి, పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా**
**క్యరచనలుం గార్య సమా। చరణములు నొనర్చి, నడపి సఖి సత్కృతులున్. 19**

**ప్రతిపదార్థం:** పరిజన= సేవకులయొక్క; యోగక్షేమములు= యోగమును, క్షేమమును (లేనిది సంపాదించటం యోగం; కలిగినది కాపాడుకొనటం క్షేమం. కుశలం అని ఇక్కడ అర్థం); అరసి= విచారించి; పురజనమ్ములకున్= ద్వారకా పౌరులకు; ప్రియంబు= సంతోషం; ఎసఁగఁగన్= అతిశయించగా; వాక్యరచనలున్= మాటలాడుటయు; కార్య= పనులయొక్క; సమాచరణములున్= చేయుటలును; ఒనర్చి= కావించి; సఖి= మిత్రులయొక్క; సత్కృతులున్= సత్కారములును; నడపి= చేసి.

**తాత్పర్యం:** సేవకుల యోగక్షేమాలు విచారించాలి. ద్వారకావాసులు సంతోషించేటట్లుగా మాటాడి ఆయా పనులు చేయాలి. మిత్రులను సత్కరించాలి.

**తే. మఱియు వలయు కృత్యంబులుఁ దెఱఁగు పఱుప। వలసినన్ని దినంబులు నిలిచి, యశ్వ**
**మేధమునకు బాంధవజన మిత్ర భృత్య। వర్గ సహితుఁడై చనుదెంచువాఁడు గాక.' 20**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ; వలయు కృత్యంబులున్= చేయదగిన పనులను; తెఱఁగు పఱుపన్= నెరవేర్చగా; వలసిన= ఆవశ్యకమైన; అన్ని దినంబులు= అన్ని రోజులు; నిలిచి= ద్వారకలో ఉండి; బాంధవజన= చుట్టపక్కాలయొక్క; మిత్ర= స్నేహితులయొక్క; భృత్య= సేవకులయొక్క; వర్గ= సమూహంతో; సహితుఁడు+ఐ= కూడినవాడై; అశ్వమేధమునకున్= మనం చేయబోయే అశ్వమేధానికి; చనుదెంచువాఁడు+కాక= వచ్చువాడు అగును గాక. (రావాలి అని అర్థం).

**తాత్పర్యం:** ఇంకా చెయ్యవలసిన పనులు నెరవేర్చటానికి పట్టినన్ని రోజులు ద్వారకలో ఉండి బంధుమిత్ర పరివార సమేతంగా అశ్వమేధయాగానికి వచ్చును గాక!'

**క. అని ధర్మజుండు పలికిన। విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుండై, గొం**
**తిని ద్రౌపదిఁ దగుమెయి వీ। డ్కొని తాను సుభద్రఁ దోడుకొనిపోవుటకున్. 21**

**ప్రతిపదార్థం:** అని; ధర్మజుండు= ధర్మరాజు; పలికినన్= పలుకగా; కృష్ణుడు; విని; సంతసిల్లి= సంతోషించి; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; గొంతిని= కుంతీదేవినీ; ద్రౌపదిన్= ద్రౌపదినీ; తగుమెయిన్= తగినవిధంగా; వీడ్కొని= పోయి వస్తానని చెప్పి వదలి; తాను; సుభద్రన్= సుభద్రను; తోడుకొని= వెంటబెట్టుకొని; పోవుటకున్= వెళ్ళటానికి.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు మాటాడగా శ్రీకృష్ణుడు సంతోషించి, అతడికి నమస్కరించాడు. తరువాత కుంతీదేవితో, ద్రౌపదితో వెళ్ళి వస్తానని చెప్పాడు. సుభద్రను తనతోపాటు తీసికొని వెళ్ళటానికి. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. గొంతి యెంతయుం బ్రియంబున ననుజ్ఞ సేయుటయు, నర్జును ననుమతియుం గొని, 22**

**ప్రతిపదార్థం:** గొంతి= కుంతీదేవి; ఎంతయున్= మిక్కిలి; ప్రియంబునన్= సంతోషంతో; అనుజ్ఞ+చేయుటయున్= సమ్మతించిన తరువాత; అర్జును= అర్జునుడియొక్క; అనుమతియున్= అంగీకారమును; కొని= పొంది.

**తాత్పర్యం:** కుంతీదేవి మహాసంతోషంతో సమ్మతించింది. తరువాత శ్రీకృష్ణుడు అర్జునుడి అంగీకారం కూడా పొందాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. వివిధ వాహనారూఢులై విభవ మెసఁగఁ । బాండవేయులుఁ దక్కిన బంధుజనులు**
**ననుప రాఁగ, సాత్యకి దోడ నరుగుదేరఁ । బురము వెడలి యొక్కెడ నిల్చి కరమునెమ్మి. 23**

**ప్రతిపదార్థం:** పాండవేయులున్= పాండవులునూ; తక్కిన= మిగిలిన; బంధుజనులున్= చుట్టాలునూ; విభవము= హోదా, గొప్పతనం; ఎసఁగన్= అతిశయించగా; వివిధ= అనేక విధాలయిన; వాహన= వాహనాలను; ఆరూఢులు+ఐ= ఎక్కినవారై; అనుపన్= పంపగా; రాఁగన్= రాగా; సాత్యకి; తోడన్= వెంట; అరుగుదేరన్= రాగా, పురము= హస్తినాపురం నుండి, వెడలి= బయలుదేరి; ఒక్క+ఎడన్= ఒకచోట; నిల్చి= ఆగి; కరము= మిక్కిలి; నెమ్మిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** పాండవులూ, మిగిలిన చుట్టాలూ, తమ హోదా వెల్లడయ్యేటట్లు రకరకాల వాహనాలు ఎక్కి కృష్ణుడిని సాగనంపటానికి వచ్చారు. ఆయన వెంట సాత్యకికూడా ఉన్నాడు. కృష్ణుడు హస్తినాపురంనుండి బయలుదేరి ఒకచోట ఆగి మహాప్రీతితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సముచితభంగుల నందఱఁ । గ్రమమున వీడ్కొని, పథంబు గైకొని, తన చి**
**త్తము దృష్టియుఁ బాండవ మ । ధ్యముపై నొలయంగ నల్ల నరుగుచు నుండెన్. 24**

**ప్రతిపదార్థం:** సముచిత= తగిన; భంగులన్= విధాలుగా; అందఱన్= అందరికీ; క్రమమునన్= వరుసగా; వీడ్కొని= సెలవిచ్చి పంపి; పథంబు= ద్వారకకు పోయేదారి; కైకొని= పట్టుకొని; తన= తనయొక్క; చిత్తము= మనస్సు; దృష్టియున్= చూపును; పాండవ= పాండవులందు; మధ్యము= అర్జునుడి; పైన్= మీద; ఒలయంగన్= వ్రాలగా; అల్లన్= మెల్లగా; అరుగుచున్+ఉండెన్= వెళ్ళుతున్నాడు.

**తాత్పర్యం:** కృష్ణుడు తగినట్లుగా అందరికీ సెలవిచ్చి పంపి ద్వారకకు పోయేదారిపట్టి మెల్లగా వెళ్ళుతున్నాడు. కాని, అతడి మనస్సూ, చూపూ అర్జునుడిమీదే నిలిచి ఉన్నాయి.

**ఆ. అట్లు మరలి మరలి యర్జునుం జూచుచుఁ । జనఁగ, నతఁడు సూడ్కి సనినయంత**
**దవ్వుఁ జూచుచుండె నవ్విధంబున సితాం । బురుహ లోచనుండు వోవునపుడు. 25**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; మరలి మరలి= తిరిగి, తిరిగీ; అర్జునున్= అర్జునుడిని; చూచుచున్= చూస్తూ; చనఁగన్= వెళ్ళగా; అతఁడు= ఆ అర్జునుడు కూడా; అవ్విధంబునన్= అదే రీతిగా (కృష్ణుడు చూస్తున్నట్లే); సిత= తెల్లని; అంబురుహ= తామరలవంటి; లోచనుండు= కన్నులు గలవాడు - కృష్ణుడు; పోవు+అపుడు= వెళ్ళేటప్పుడు; చూడ్కి= చూపు; చనిన+అంత= సాగినంత; దవ్వున్= దూరాన్ని; చూచుచున్+ఉండెన్= చూస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడిని మాటిమాటికీ వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు. ఆ విధంగానే అర్జునుడు కూడా కనుచూపుమేరదాకా కృష్ణుడిని చూస్తూ ఉన్నాడు.

**క. సరసన సాత్యకి రుచిరపు । టరదంబునఁ జనియె; వెనుక నలఁతిరథముపై**
**నరిగె సుభద్రయు; నిమ్మెయి । నరుగఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్. 26**

**ప్రతిపదార్థం:** సాత్యకి; సరసన్+అ= ప్రక్కనే; రుచిరము= సుందరమయిన; అరదంబునన్= రథంమీద; చనియెన్= వెళ్ళాడు; వెనుకన్; అలఁతి= చిన్న; రథముపైన్= రథంమీద; సుభద్రయున్= సుభద్రయూ; అరిగెన్= వెళ్ళింది; ఈ+మెయిన్= ఈ విధంగా; అరుగఁగన్= వెళ్ళుతూ ఉండగా; ఇంద్రుఁడు; హరిమీఁదన్= శ్రీకృష్ణుడిమీద; అలరులు= పూలు; కురిసెన్= కురిపించాడు.

**తాత్పర్యం:** సాత్యకి శ్రీకృష్ణుడి ప్రక్కనే అందమయిన రథంమీద వెళ్ళాడు. సుభద్ర శ్రీకృష్ణుడి వెనక చిన్న రథంమీద వెళ్ళింది. ఈ విధంగా వెళ్ళుతుండగా దేవేంద్రుడు శ్రీకృష్ణుడిమీద పూలవాన కురిపించాడు.

**క. పవనుం డనుకూలతమెయిఁ। బ్రవర్తితుం డయ్యె; నతి శుభప్రద భంగుల్**
**వివిధములు మఱియు ధరణీ। ధవ! తోఁచె నిమిత్తములు నితాంతస్ఫుటతన్. 27**

**ప్రతిపదార్థం:** ధరణీధవ!= భూపతీ!, జనమేజయా!; పవనుండు= వాయువు; అనుకూలతమెయిన్= అనుకూలంగా ఉండేటట్లు; ప్రవర్తితుండు= వీస్తున్నవాడు; అయ్యెన్= అయ్యాడు; మఱియున్= మరియు; అతి= మిక్కిలి; శుభ= శుభాలను; ప్రద= ఇచ్చునట్టి; భంగుల్= తీరులుగలవీ; వివిధములు= అనేక విధములయినవీ; నిమిత్తములు= శకునాలు; నితాంత= మితిమీరిన; స్ఫుటతన్= స్పష్టతతో; తోఁచెన్= కనబడ్డాయి.

**తాత్పర్యం:** జనమేజయా! శ్రీకృష్ణుడు వెళ్ళేటప్పుడు గాలి అనుకూలంగా వీచింది. ఎడతెగకుండా శుభాలిచ్చే అనేక విధములైన శకునాలు తేటతెల్లంగా కనబడ్డాయి.

### శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకుఁ బోవుట (సం.14-52-7)

**వ. అట్లు వోయి పోయి, మార్గంబు కెలనం జేరువ నున్న యుదంకాశ్రమంబు గని, యందుఁ జని, వినయం బొప్ప నమ్మునిం గని, యతని చేయు నతిథి సత్కారంబులం బ్రియంబంది, యతనిపాల నాసీనుండయి యుండ, నతం డప్పుండరీకాక్షున కిట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; పోయి పోయి= వెళ్ళి వెళ్ళి; మార్గంబు= బాటకు; కెలనన్= ప్రక్కనే; చేరువన్= దగ్గరలో; ఉన్న; ఉదంక= ఉదంకుడియొక్క; ఆశ్రమంబు= ఆశ్రమాన్ని; కని= చూచి; అందున్= అక్కడికి; చని= వెళ్ళి; వినయంబు= అణకువ; ఒప్పన్= ఒప్పగా; ఆ+మునిన్= ఆ ఉదంక మునిని; కని= చూచి; అతని చేయు= అతడు (ఉదంకుడు) చేసిన; అతిథి= అతిథులయొక్క; సత్కారంబులన్= మర్యాదలచేత; ప్రియంబు= సంతోషం; అంది= పొంది; అతని= ఆ ఉదంకుడియొక్క; పాలన్= సమీపంలో; ఆసీనుండు= కూర్చున్నవాడు; అయి; ఉండన్= ఉండగా; అతండు= ఆ ఉదంకుడు; ఆ+పుండరీక= తెల్లతామరలవంటి; అక్షునకున్= కన్నులు గలవాడితో - శ్రీకృష్ణుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా కృష్ణుడు చాలాదూరం వెళ్ళి, దారి ప్రక్కనే దగ్గరగా ఉన్న ఉదంకుడి ఆశ్రమాన్ని చూచాడు. అక్కడికి వెళ్ళి ఉదంకుడిని సందర్శించి, ఆ మహర్షి చేసిన అతిథి మర్యాదలకు సంతోషించాడు. తరువాత తన దగ్గర కూర్చున్న శ్రీకృష్ణునితో ఉదంకుడు ఈ విధంగా అన్నాడు.

**చ. 'భరతులపాలి కేఁగి, తగఁ బాండవ కౌరవ బంధుభావమున్**
**గరము దృఢంబు సేసితె? సుఖస్థితి రాజుల వారి వారి వి**

**స్ఫురిత మహాధిరాజ్యముల చొప్పుల నిల్పితె? పక్షపాతితా**

**దురితము లేని నీవు జనతోష విధాన విశారదుండవై.'** **29**

**ప్రతిపదార్థం:** పక్షపాతితా= పక్షపాతం అనే; దురితము= పాపం; లేని; నీవు; జన= జనులయొక్క; తోష= సంతోషాన్ని కలిగించే; విధాన= ఉపాయములందు; విశారదుండవు= నేర్పరివి; ఐ= అయి; భరతుల= భరత వంశీయులయొక్క; పాలికిన్= దగ్గరకు; ఏఁగి= వెళ్ళి; తగన్= ధర్మప్రకారంగా; పాండవ= పాండవులయొక్క; కౌరవ= కౌరవులయొక్క; బంధుభావమున్= చుట్టరికాన్ని; కరము= మిక్కిలి; దృఢంబు= గట్టిపడిన దానినిగా; చేసితి+ఎ?= చేశావా?; రాజులన్= రాజులను; సుఖ= సుఖముయొక్క; స్థితిన్= అవస్థతో; వారి వారి= వారి వారియొక్క; విస్ఫురిత= పెంపొందిన; మహత్= గొప్ప; అధిరాజ్యముల= రాజ్యాలయొక్క; చొప్పులన్= వంతులతో; నిల్పితి+ఎ?= నిలిపావా?

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! పక్షపాత పాపం అంటని నీవు సర్వప్రజలూ సంతోషించేటట్లుగా, భరత వంశీయుల దగ్గరకు వెళ్ళి, నేర్పరివై కౌరవపాండవుల బంధుత్వం బలపడేటట్లు చేశావా? రాజులను వారివారివంతులకు వచ్చిన రాజ్యాలలో సుఖంగా ఉండేటట్లు నిలిపావా?

**వ. అని యిట్లెఱుంగనివాఁడయి యడిగెడు నట్లపోలె, నిందా గర్భంబుగాఁ బలికినం, బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి, యా భార్గవు నాననం బాలోకించి.** **30**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; ఎఱుఁగనివాఁడు= తెలియనివాడు; అయి; అడిగెడు= అడుగుతున్న; అట్లు+అ+పోలెన్= ఆ విధంగానే; నిందా= నింద; గర్భంబు+కాన్= మాటలోపల ఉండేటట్లుగా; పలికినన్= పలుకగా; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు; తానును= తాను కూడా; దానిన్= ఆ నిందను; ఎఱుంగమి= గ్రహించకుండటం; భావించి= నటించి; ఆ+భార్గవు= ఆ భృగువంశీయుడియొక్క, ఉదంకుడియొక్క; ఆననంబు= ముఖమును; ఆలోకించి= తేరిపార చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉదంకుడు ఏమీ తెలియనివాడై అడుగుతున్నట్లుగా, మాటలలో వ్యంగ్యంగా నింద వ్యక్తమయ్యేటట్లు పలికాడు. దానికి తగ్గట్టుగానే కృష్ణుడు కూడా ఆ నిందను గ్రహించనట్లుగానే నటించి ఉదంకుడి ముఖం సూటిగా చూస్తూ.(తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'కర ముచితంబుగాఁ బలికి, గర్వపుమాట నదల్చి, భీతికిన్**

**దెరు వగునట్ల చెప్పి, గడుదీనత దోఁపఁగ నాడి, సంధి క**

**క్కురుపతిఁ దమ్ముప్రోవు మొగకొల్పఁగ జాలన; నాకు భీష్ముఁడు**

**న్గురుఁడును దోడు చెప్పిరి; మునుల్ బహుభంగుల నొత్తి రత్తఱిన్.** **31**

**ప్రతిపదార్థం:** కరము= మిక్కిలి; ఉచితంబు+కాన్= సమంజసంగా; పలికి; గర్వపుమాటన్= అహంకారంతో కూడిన మాటలతో; అదల్చి= గద్దించి; భీతికిన్= భయానికి; తెరువు= దారి; అగు+అట్లు+అ= అయ్యే విధంగానే; చెప్పి; కడున్= మిక్కిలి; దీనత= జాలి; తోఁపఁగన్= పుట్టేటట్లుగా; ఆడి= పలికి; సంధికిన్= సంధికి; ఆ+కురుపతిన్= ఆ కురురాజును - దుర్యోధనుడిని; తమ్మ= అతడి తమ్ములయొక్క; ప్రోవున్= సమూహాన్నీ; మొగకొల్పఁగన్= సుముఖులయ్యేటట్లు చేయగా; చాలన్+అ= సమర్థుడిని కాలేక పోయాను; భీష్మండున్= భీష్ముడునూ; గురుఁడును= ద్రోణుడునూ; ఆ+తఱిన్= ఆ సమయంలో; నాకున్= నాకు; తోడు= సహాయంగా; చెప్పిరి= చెప్పారు; మునుల్= మునులు; బహు= అనేకములయిన; భంగులన్= విధాలుగా; ఒత్తిరి= బలవంతం చేశారు.

**తాత్పర్యం:** 'మహర్షీ' సంధి చెయ్యటానికి వెళ్ళి సమంజసంగా మాటాడాను. అహంకారంతో గద్దించాను. భయం కలిగేటట్లు బెదిరిస్తూ పలికాను. కాని, ఆ దుర్యోధనునీ, అతడి తమ్ములనూ సంధికి సుముఖులను చేయలేకపోయాను. అప్పుడు భీష్మద్రోణులు నాకు తోడుగా చెప్పారు. మునులు కూడా బలవంతం చేశారు.

**వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి, యెవ్విధంబులను సంధికిం జొరక, కురుకుమారులు పాండవులతో భండనంబొనర్చి, సబంధు పరిజనంబుగా మరణంబు నొంది, యుత్తమ లోకంబుల కరిగి; రిక్కడఁ బాండు నందన పంచకంబు ద్రిక్కఁ దక్కటి వారెల్ల నట్లపోయిరి; కాల నియతి గడవ నెవ్వరికిని శక్యం బగునే?' యనిన విని రోషకషాయితంబు లగు తారకంబు లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధన సత్తముండు. 32**

**ప్రతిపదార్థం:** అతి= మిక్కిలి; లోభంబునన్+చేసి= దురాశవలన; వంశ= వంశముయొక్క; ధర్మంబు= ఆచారం; విడిచి= వదలి; ఏ+విధంబులను= ఎన్ని విధాలకూడా; సంధికిన్= సంధికి; చొరక= అంగీకరించక; కురుకుమారులు= కౌరవులు; పాండవులతోన్= పాండవులతో; భండనంబు= యుద్ధం; ఒనర్చి= చేసి; సహ+బంధు+పరిజనంబు+కాన్= చుట్టాలతో, బలగంతోకూడా; మరణంబున్= చావును; ఒంది= పొంది; ఉత్తమ లోకంబులకున్= స్వర్గం మొదలైన లోకాలకు; అరిగిరి= వెళ్ళారు; ఇక్కడన్= ఈ పక్షాన; పాండునందన పంచకంబు= పాండవులయిదుగురు; త్రిక్కన్= తప్ప; తక్కటివారు= మిగిలినవారు; ఎల్లన్= అందరూ; అట్లు+అ= అట్లే, కౌరవులవలెనే; పోయిరి= వెళ్ళారు; కాల= కాలంయొక్క; నియతి= నియమాన్ని; కడపన్= జవదాటగా; ఎవ్వరికినిన్= ఎంతటివారికయిననూ; శక్యంబు+అగును+ఏ?= సాధ్యమగునా?; అనినన్= అని శ్రీకృష్ణుడనగా; విని; రోష= కోపంచేత; కషాయితంబులు= ఎర్రగా చేయబడినవి, ఎర్రనయినవి; అగు= అయిన; తారకంబులు= నల్లని కనుగ్రుడ్డులను; ఉద్వృత్తంబులు= పైకి ఉబ్బినవిగా; చేయుచున్= చేస్తూ; ఆ+తపోధన= ఆ తపస్సే ధనంగాగల ఋషులలో; సత్తముండు= మిక్కిలి శ్రేష్ఠుడు-ఉదంకుడు.

**తాత్పర్యం:** పేరాసవలన వంశాచారాన్ని వదలి, ఎన్ని విధాల కూడా సంధికి అంగీకరించకుండా, పాండవులతో యుద్ధంచేసి మరణించి, కౌరవులు బంధుపరివారసమేతంగా ఉత్తమలోకాలకు వెళ్ళారు. పాండవపక్షాన కూడా పాండవులయిదుగురు తప్ప మిగిలిన వారందరూ కౌరవులగతినే పొందారు. కాలనియమాన్ని ఎంతటివారయినా అతిక్రమింపలేరు. శ్రీకృష్ణుడీవిధంగా పలుకగా విన్న ఉదంకుడికి కోపం వచ్చింది. ఆ మహర్షి కళ్ళు చింత నిప్పులయ్యాయి. ఆ తరువాత ఋషీశ్వరుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విశేషం సామాన్యంచేత సమర్థింపబడింది.

**క. 'కౌరవ కులమును మిథ్యా । చారుఁడవై త్రుంచి తకట!; శక్తుఁడ వయ్యున్**
**నేరిమిమైఁ జేయవ పొం । దారఁగ; నిక్కిల్బిషమున కంతటికిఁ దగన్. 33**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; మిథ్యా= మోసంతో కూడిన; ఆచారుఁడవు= నడత కలవాడవు; ఐ= అయి; కౌరవకులమును= కౌరవవంశాన్ని; త్రుంచితి= నశింపజేశావు; శక్తుఁడవు= సమర్థుడవు; అయ్యున్= అయికూడా; నేరిమిమైన్= నేర్పుతో; పొందు= సంధి; ఆరఁగన్= చక్కగా; చేయవు+అ= చేయనే చేయవు; ఈ+కిల్బిషమునకున్= ఈ పాపానికి; అంతటికిన్= అంతకూ; తగన్= తగినట్లుగా.

**తాత్పర్యం:** అయ్యో! మోసంతో ప్రవర్తించి కౌరవవంశాన్ని నాశనంచేశావు. సమర్థుడవయికూడా నేర్పుతో సంధి చేయనే చేయలేదు. నీవు చేసిన ఈ పాపానికి తగినట్లుగా, (తరువాతి వచనంతో అన్వయం)

**వ. ఘోరప్రకారంబగు శాపంబు నీకిచ్చెద' ననిన, నచ్యుతుం డా మునితో, 'నా మాటలు దేటపడ విని తగినయట్లు సేయుదుగాక' యని పలికి యిట్లనియె. 34**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; ఘోర= భయంకరమైన; ప్రకారంబు= లక్షణం కలది; అగు= అయిన; శాపంబు+ఇచ్చెదన్= శాపం పెట్టుతాను; అనినన్= అని ఉదంకుడు అనగా; అచ్యుతుండు= చ్యుతం (జాఱుట) లేనివాడు, స్వస్వరూపంనుండి వేరుపడనివాడు - సుస్థిరుడు- శ్రీకృష్ణుడు; ఆ+మునితోన్= ఆ మునితో; నా= నాయొక్క; మాటలు; తేటపడన్= స్పష్టంగా; విని ; తగిన+అట్లు= తగిన విధంగా; చేయుదు(వు)+కాక= చేయుము; అని; పలికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నీకు భయంకరమయిన శాపం పెట్టుతా'నన్నాడు. ఆ మాటలు విని శ్రీకృష్ణుడు ఉదంకుడితో 'ముందు నా మాటలు తేటతెల్లంగా విని తరువాత నీకు తగినట్లు చేయుము' అని ఇంకా ఈ విధంగా అన్నాడు.

**చ. 'కినియుట మాను; మేలె మునికిం గుపితత్వము? శాంతవృత్తి నా**
**యనునయ మాదరింపు; విను, మల్పతపంబులచేతఁ గోలుపో**
**దునె? మఱి యట్లుఁగాక యతిదుష్కరమైన తపంబు, సంచితం**
**బనఁదగు బ్రహ్మచర్యమును నాఱడివోవె కటా! శపించినన్.' 35**

**ప్రతిపదార్థం:** కినియుట= కోపించటం; మాను= చాలించుము; మునికిన్= మునికి; కుపితత్వము= కోపం; మేలు+ఎ?= క్షేమకరమా?; శాంత= కలత లేని; వృత్తిన్= స్థితితో; నా= నాయొక్క; అనునయము= విన్నపం; ఆదరింపు= అంగీకరించుము; వినుము; అల్ప= తక్కువ అయిన; తపంబులచేతన్= తపస్సులచేత; కోలుపోదును+ఎ?= చెడిపోవుదునా?; మఱి= మరియు; అట్లున్+కాక= అంతే కాకుండ; అతి= మిక్కిలి; దుష్కరము= చేయుటకు సాధ్యంకానిది; ఐన= అయినటువంటి; తపంబున్= తపమూ; సంచితంబు= చెడకుండా నిలుపుకొన్నది; అనన్= అనుటకు; తగు= తగిన; బ్రహ్మచర్యమును= వేదపఠన నియమమూ లేదా బ్రహ్మచర్యాశ్రమమూ; శపించినన్= శపిస్తే; కటా!= అయ్యో!; ఆఱడి+పోవు+ఎ?= వ్యర్థం కావా?

**తాత్పర్యం:** 'మునీశ్వరా! కోపం చాలించుము. మునికి కోపం క్షేమకరం కాదు. శాంతుడవై నా విన్నపం అంగీకరించుము. అల్పతపస్సులవలన నే నేమీ చెడిపోను. అంతేకాకుండా ఒకమాట చెప్పుతాను వినుము. నీ మహా తపస్సు, సుస్థిరమైన బ్రహ్మచర్యమూ శపిస్తే వ్యర్థం కావా?' (నాకు వచ్చేకీడు లేదు గాని నీకు మాత్రం మహానష్టం కలుగుతుందని అర్థం).

**వ. అనిన విని యుదంకుండు శ్రీవత్సాంకు నవలోకించి. 36**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఉదంకుండు= ఉదంకుడు; శ్రీవత్స= శ్రీవత్స మనెడి; అంకున్= పుట్టుమచ్చగలవాడిని- శ్రీకృష్ణుడిని; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణు డీవిధంగా అనగా విని ఉదంకుడు అతడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'అగుఁ గాక; నీవు సెప్పెడు । తగ వెయ్యది సెపుమ; వినియెదం; బోలిన నే**
**మగిడించెద శాపోన్ముఖ । బగు మన్మానసము' ననుడు నల్లన నగుచున్. 37**

**తాత్పర్యం:** అగున్+కాక= అట్లే కానిమ్ము; నీవు; చెప్పెడు= చెప్పునట్టి; తగవు= న్యాయం; ఏ+అది= ఏదియో; చెపుము+అ= చెప్పుము; వినియెదన్= వింటాను; పోలినన్= నీవు చెప్పేది యుక్తంగా ఉన్నట్లయితే; నేన్= నేను; శాప= శాపమిచ్చుటకు; ఉన్ముఖము= సిద్ధమయినది; అగు= అయిన; మత్= నాయొక్క; మానసమున్= మనస్సును; మగిడించెదన్= త్రిప్పుతాను; అనుడున్= ఉదంకు డీ విధంగా పలికిన తరువాత; అల్లనన్= మెల్లగా, నెమ్మదిగా; నగుచున్= (శ్రీకృష్ణుడు) నవ్వుచూ.

**తాత్పర్యం:** 'అట్లే కానిమ్ము, నీవు చెప్పే న్యాయమేదో చెప్పుము. అది యుక్తంగా ఉంటే ఇప్పటికిప్పుడే నీకు శాపంపెట్టటానికి సిద్ధమయిన నా మనస్సును మరలిస్తా'నని ఉదంకు డన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు చిరునవ్వునవ్వి. (-తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **'తమము రజస్సు సత్త్వము నుదంక! మదీయ వశప్రవర్త మా**
**నములు; మరుద్వసు ప్రభృతి నాకిచయంబు మదుద్భవంబు; స**
**ర్వము నను నేన నిల్తు; సుఖవాసత నన్ దగఁ జెంది నిల్చు స**
**ర్వము; విను; మేన చూవె యపరంబు పరం బనఁగల్గు తత్త్వముల్.** **38**

**ప్రతిపదార్థం:** ఉదంక!= ఉదంకా!; తమము= తపస్సూ; రజస్సు= రజస్సూ; సత్త్వము; మదీయ= నా యొక్క; వశ= వశంలో; ప్రవర్తమానములు= ఉంటున్నవి; మరుత్= మరుత్తులూ; వసు= వసువులూ; ప్రభృతి= మొదలయిన; నాకి= దేవతల; చయంబు= సమూహం; మత్= నావలన; ఉద్భవంబు= పుట్టింది; సర్వమునను= సమస్త సృష్టియందునూ; నేను+అ= నేనే; నిల్తున్= ఉన్నాను; సర్వము= సమస్త సృష్టియూ; సుఖ= సుఖంతోకూడిన; వాసతన్= ఉనికితో; నన్= నన్ను; తగన్= ఒప్పుగా; చెంది= పొంది; నిల్చున్= ఉంటుంది; అపరంబు= అచిత్తు, అజ్ఞానం, ప్రకృతి; చిత్తు= జ్ఞానం, పరమాత్మ; అనన్+కల్గు= అనదగిన; తత్త్వముల్= తత్త్వములు; నేను+అ= నేనే; చూవె!= సుమా!

**తాత్పర్యం:** ఉదంకా! సత్త్వరజస్తమస్సు లనే గుణత్రయమూ నాయందే ఉంటున్నది. మరుత్తులూ, వసువులూ మొదలైన దేవతలందరూ నా నుండే పుట్టారు. నేనే సృష్టియందంతటా వ్యాపించి ఉన్నాను. నాలోనే నిశ్చలంగా సృష్టి ఉన్నది. చిత్తూ అచిత్తూ అనే తత్త్వాలు రెండూ నేనే సుమా!

**తే.** **ప్రణవ ముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ, జ। తుర్విధాశ్రమములును, దత్సర్వ కర్మ**
**జాతములును, సమంచిత స్వర్గ మోక్ష। ములును మన్మయముల కాఁగఁ దెలిసికొనుము.** **39**

**ప్రతిపదార్థం:** ప్రణవ= ఓంకారం; ముఖ= మొదటగల లేదా ప్రధానమయిన; వేదములున్= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అని వేదాలు నాలుగు; చతుర్+వర్ణములున్= నాలుగు వర్ణములును; (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు,) చతుర్+విధ+ఆశ్రమములును= నాలుగు విధాలయిన ఆశ్రమములు; (బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాసాశ్రమాలు,) తద్= ఆ నాలుగు వర్ణములకూ, నాలుగు ఆశ్రమాలకూ సంబంధించిన; సర్వ= సమస్తమైన; కర్మ= విధులయొక్క; జాతములును= సమూహములునూ; సమంచిత= ఘనమైన; స్వర్గమోక్షములును= స్వర్గమునూ; మత్+మయములు+అ= నా రూపములే; కాఁగన్= అగునట్లుగా; తెలిసికొనుము.

**తాత్పర్యం:** ఓంకారం ఆదినిగల నాలుగు వేదాలూ, నాలుగు వర్ణాలూ, నాలుగు ఆశ్రమాలూ వాటికి సంబంధించిన విధులూ, స్వర్గమూ, మోక్షమూ నా రూపాలే అని తెలిసికొనుము.

**విశేషం:** స్వర్గమూ, మోక్షమూ ఒకటి కావు. యజ్ఞాలు చేసినవారూ, వీరమరణం పొందినవారూ, స్వర్గలోకంచేరి దేవభోగాలనుభవిస్తారు. ఆ భోగానుభవం వలన వారి వారి పుణ్యకర్మఫలం నశిస్తుంది. తిరిగి వారు భూలోకంలో జన్మిస్తారు. పుణ్యం క్షీణించి తిరిగి మానవలోకాన్ని ప్రవేశిస్తారని (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) భగవద్గీత (అధ్యా 9, శ్లో.21) చెప్తుతున్నది.

జననమరణాలనుండి విముక్తి మోక్షం. స్వర్గం పొందినవారికి పునర్జన్మముంటుంది. మోక్షం పొందినవారికి అది కలుగనే కలుగదు.

**క. క్రతుపరులు నన్న తగ సం। స్తుతించి ఫల మందఁ గంద్రు; దోషయుతులు స**
**మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ। గృతాత్ము లగుదురు మదీయకీర్తన పరులై. 40**

**ప్రతిపదార్థం:** క్రతు= యజ్ఞములయందు; పరులు= ఆసక్తిగలవారు; నన్నున్+అ= నన్నే; తగన్= విధుల కనుకూలంగా; సంస్తుతించి= మిక్కిలి కొనియాడి; ఫలము= ఫలితాన్ని; అందన్+కంద్రు= పొందగలుగుతారు; దోష= విధులను అతిక్రమించటంవలన కలిగిన పాపాలతో; యుతులు= కూడినవారు; సమ్మతిన్= శాస్త్ర సమ్మతితో; ప్రాయశ్చిత్తంబులన్= పాపపరిహారంకొరకు చేసే కర్మలవలన; మదీయ= నాయొక్క; కీర్తన= స్తోత్రములయందు; పరులు+ఐ= ఆసక్తికలవారై; కృతాత్ములు= దోషంలేనివారు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** యజ్ఞపరాయణులు నన్ను స్తుతించి పుణ్యఫలాన్ని పొందుతారు. పాపులు కూడా ప్రాయశ్చిత్తకర్మలుచేసి నన్ను స్తుతించి దోష విముక్తులౌతారు.

**క. మానసు మదగ్ర పుత్త్రుం। గా నెఱుఁగుము ధర్మునిని; జగద్రక్షకు నై**
**యే నభిమత కాలములను। మానిత జన్మముల నొంది మనుతుఁ దపస్వీ! 41**

**ప్రతిపదార్థం:** తపస్వీ!= మునీశ్వరా!; మానసున్= మనస్సున పుట్టిన వాడిని; ధర్మునిని= యముడిని; మత్= నా యొక్క; అగ్రపుత్త్రున్+కాన్= పెద్దకొడుకుగా; ఎఱుంగుము= తెలిసికొనుము; ఏను= నేను; జగత్= లోకముయొక్క; రక్షకున్+ఐ= రక్షణముకొరకు; అభిమత= సమ్మతమయిన; కాలములను= సమయాలలో; మానిత= గౌరవించబడిన; జన్మములన్= పుట్టువులను; ఒంది= పొంది; మనుతున్= కాపాడుతాను.

**తాత్పర్యం:** తపస్వీ! మనస్సున జన్మించిన యముడు నా పెద్దకొడుకని తెలిసికొనుము. సమ్మతమయిన సమయాలలో నేను ఆయా అవతారాలనెత్తి లోకాన్ని కాపాడుతాను.

**క. భవ వర్ధన విలయంబుల। నవలీలన వరుస బ్రహ్మయన, విష్ణుఁ డనన్**
**శివుఁ డన, నిర్వర్తింతును। భువనంబుల నేన చూవె భూరిమహిమలన్. 42**

**ప్రతిపదార్థం:** నేను+అ= నేనే; భువనంబులన్= లోకాలలో; భూరి= గొప్పవి అయిన; మహిమలన్= మహిమలతో; అవలీలన్+అ= అనాయాసంగా; భవ= సృష్టించుట; వర్ధన= పెంచుట; విలయంబులన్= నాశమును; వరుసన్= క్రమంగా; బ్రహ్మ; అనన్= అనగా; విష్ణుఁడు= విష్ణువు; అనన్= అనగా; శివుఁడు; అనన్= అనగా; నిర్వర్తింతును= చేస్తాను; చూవె!= సుమా!

**తాత్పర్యం:** సర్వలోకాలలోనూ, మహామహిమలు కలిగిన నేనే బ్రహ్మగా సృష్టినీ, విష్ణువుగా స్థితినీ, శివుడుగా లయాన్నీ అనాయాసంగా చేస్తాను.

**క. ధర్మంబు కలఁకఁ గాంచి, య। ధార్మికులం బొలియఁ జేసి, ధార్మికులను బే**
**రర్మిలి రక్షింతు నుచిత। కర్మాచరణముల నే జగద్ధితమునకై. 43**

**ప్రతిపదార్థం:** నేన్= నేను; ధర్మంబు= ధర్మంయొక్క; కలఁకన్= సంక్షోభాన్ని; కాంచి= చూచి; జగత్= లోకంయొక్క; హితమునకున్+ఐ= మేలుకొరకు; ఉచిత= తగిన; కర్మ= పనులను; ఆచరణములన్= చేయటంచేత; అధార్మికులన్= అధర్మం ఆచరించేవారిని; పొలియన్+చేసి= నశింపజేసి; పేరు+అర్మిలిన్= గొప్ప ప్రేమతో; రక్షింతున్= రక్షిస్తాను.

**తాత్పర్యం:** ధర్మక్షోభ పుట్టినప్పుడు నేనే లోకోపకారకంగా తగిన పనులు చేస్తూ అధర్మాత్ములను నశింపజేస్తాను. ధర్మాత్ములను మహానురాగంతో రక్షిస్తాను.

**విశేషం:** భగవద్గీతలో శ్రీకృష్ణు డర్జునునకు చెప్పిన **"యదా యదా హి** ధర్మస్య "పరిత్రాణాయ సాధూనామ్" అనే శ్లోకాలను ఇక్కడ గుర్తుకు తెచ్చుకొనాలి.

**వ. అట్టివాఁడ నయి యుండియు. నధర్మపరులగు ధార్తరాష్ట్రుల నత్యంత ధార్మికులగు ధర్మనందనాదులతోఁ గలుపుటకుం బలుదెఱంగులం బడితి; నది దివ్యజ్ఞాన దేదీప్యమానులగు పారాశర్యప్రభృతిమునివరుల చిత్తంబుల కెక్కె; నక్కౌరవులు దమదౌర్మాత్యంబున మాహాత్మ్యవంతులగు నా కౌంతేయులం దొడరి ధర్మసమరంబున సమసిరి; నా చేసినపని యిట్టిది; నన్ను నుదంక! నీ వింక నే మనియెద వను' మని పలికిన నతండు వినతుండగుచు నిట్లనియె. 44**

**ప్రతిపదార్థం:** అట్టివాఁడను= అటువంటివాడను; అయి; ఉండియున్= ఉన్నప్పటికీ; అధర్మ= అధర్మమునందు; పరులు= ఆసక్తికలవారు; అగు= అయిన; ధార్తరాష్ట్రులన్= ధృతరాష్ట్రుడి కుమారులను, దుర్యోధనాదులను; అత్యంత= ఎల్లప్పుడునూ; ధార్మికులు= ధర్మం ఆచరించేవారు; అగు= అయిన; ధర్మనందన= ధర్మరాజు; ఆదులతోన్= మొదలగువారితో; కలుపుటకున్= ఏకం చేయటానికి; పలు+తెఱంగులన్= అనేక విధాలుగా; పడితిన్= ప్రయత్నించాను; అది= ఆ విధంగా నేను ప్రయత్నించటం; దివ్యజ్ఞాన= బ్రహ్మజ్ఞానంతో; దేదీప్యమానులు= ప్రకాశిస్తున్నవారు; అగు= అయిన; పారాశర్య= వ్యాసుడు; ప్రభృతి= మొదలైన; మునివరుల= మునీశ్వరులయొక్క; చిత్తంబులకున్= మనస్సులకు; ఎక్కెన్= ప్రీతి కలిగించింది; ఆ+కౌరవులు= ఆ దుర్యోధనాదులు; తమ= తమయొక్క; దౌర్మాత్యంబునన్= దుర్బుద్ధిభావంచేత; మాహాత్మ్యవంతులు= ఘనత కలవారు; అగు= అయిన; ఆ+కౌంతేయులన్= ఆ కుంతీకుమారులను, పాండవులను; తొడరి= ఎదిరించి; ధర్మసమరంబునన్= ధర్మయుద్ధంలో; సమసిరి= మరణించారు; నా చేసిన= నేను చేసిన; పని; ఇట్టిది= ఇటువంటిది; నన్నున్= నన్ను; ఉదంక!; నీవు; ఇంకన్= ఇంకా; ఏమి; అనియెదవు= అందువో; అనుము; అని; పలికినన్= పలుకగా; అతండు= ఆ ఉదంకుడు; వినతుండు= నమస్కరించినవాడు; అగుచున్= ఔతూ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుష్టశిక్షణం, శిష్టరక్షణం చేయగలిగే వాడనయినప్పటికీ, కౌరవులు పాండవులతో కలిసి మెలిసి ఉండేటట్లు చేయటానికి నే నెంతో ప్రయత్నించాను. దీనిని బ్రహ్మజ్ఞాన సంపన్నులయిన వ్యాసాది మహర్షు లెంతో మెచ్చుకొన్నారు. ఆ కౌరవులు తమ దుర్బుద్ధులవలన, గొప్పవారయిన పాండవులతో తలపడి ధర్మయుద్ధంలో మరణించారు. నే నింత పనిచేశాను. ఇప్పుడు నీవు నన్ను ఏమంటావో అనుము' శ్రీకృష్ణు డీ విధంగా పలుకగా ఉదంకుడు అణకువతో అతడికి నమస్కరించి ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'ఇప్పుడు నీ మహామహిమ యేర్పడ, సమ్యగనుగ్రహంబునన్**
**జెప్పిన యీ సమంచిత విశేషము లెల్ల నెఱుంగుదున్; మదిం**
**గప్పిన యీ దురాగ్రహపు గర్వము ముంచికొనంగ నాకు మున్**
**చొప్పడియెన్; సుధాసదృశ సూక్తులఁ దేర్చితి వీవయచ్యుతా!" 45**

**ప్రతిపదార్థం:** అచ్యుతా!= శ్రీకృష్ణా!; ఇప్పుడు; నీ= నీయొక్క; మహత్= గొప్ప; మహిమ; ఏర్పడన్= స్పష్టమయ్యేటట్లుగా; సమ్యక్= పరిపూర్ణమయిన; అనుగ్రహంబునన్= దయతో; చెప్పిన= నీవు చెప్పిన; ఈ సమంచిత= ఈ గొప్పవి అయిన; విశేషములు= విశిష్ట విషయాలు; ఎల్లన్= అన్నియూ; ఎఱుంగుదున్= ఇదివరకే తెలిసికొన్నాను; మున్= ఇంతకుముందు; మదిన్= మనస్సును; కప్పిన= ఆవరించిన; ఈ దురాగ్రహపు గర్వము= ఈ నీచకోపంతో కూడిన గర్వం; ముంచికొనంగన్= అతిశయించగా; చొప్పడియెన్= కలిగింది; ఈవు+అ= నీవే; సుధా= అమృతంతో; సదృశ= సమానమైన; సూక్తులన్= హితవాక్యాలతో; తేర్చితివి= సంతోషపెట్టావు, ప్రసన్నుడిని చేశావు.

**తాత్పర్యం:** 'ఇప్పుడు పరిపూర్ణమైన దయతో, నీ మహామహిమ వెల్లడయ్యేటట్లుగా నీవు చెప్పిన విశేషాలన్నీ నా కిదివరకే తెలుసు. కాని, ఇంతకుముందు నీచకోపంతో కూడిన గర్వం నా మనస్సును ముంచుకొనివచ్చినట్లుగా కప్పివేసింది. అమృతతుల్య మయిన వాక్కులతో నీవు నన్ను నిర్మలుడిని చేశావు.'

**వ. అని వెండియు. 46**

**తాత్పర్యం:** అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'అతులమైన నీ దయా మహిమకు నేను। బాత్ర మగుదు నేనిఁ బద్మనాభ!**
**యనుపమాన తావకాకృతిఁ జూపవే। నాకుఁ జూడ్కియును మనంబు నలర.' 47**

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= శ్రీకృష్ణా!; అతులము= సాటిలేనిది; అగు= అయిన; నీ= నీయొక్క; దయా= దయయొక్క; మహిమకున్= గొప్పతనానికి; ఏను= నేను; పాత్రము= అర్హుడను; అగుదున్+ఏనిన్= అయినవాడనయితే; చూడ్కియును= దృష్టులును; మనంబు= మనస్సునూ; అలరన్= ఆనందించగా; నాకున్= నాకు; అనుపమాన= సాటిలేని; తావక= నీయొక్క; ఆకృతిన్= రూపాన్ని; చూపవే!= చూపుమా!

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! నేను నీ మహానుగ్రహానికి అర్హుడనయిన పక్షంలో నా మనోనేత్రాలు ఆనందించేటట్లుగా నీ విశ్వరూపాన్ని చూపించుము.'

శ్రీకృష్ణుఁ డుదంకునకుఁ దన విశ్వరూపంబుఁ జూపుట (సం.14-54-4)

**చ. అనుడు దయాళుఁ డైన హరి యర్జును చూచిన దివ్యమూర్తిఁ జూ**
**పినఁ గని, సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్**
**మునిపతి పాణిపద్మములు మోడ్చి 'నమః పురుషోత్తమాయ తే'**
**యనుచు, వినీతి నమ్రు మగునంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48**

**ప్రతిపదార్థం:** అనుడున్= ఉదంకుడు ఈ విధంగా పలికిన తరువాత; దయాళుఁడు= దయ కలిగినవాడు; ఐన= అయిన, హరి= శ్రీకృష్ణుడు; అర్జును+చూచిన= అర్జునుడు దర్శించిన; దివ్యమూర్తిన్= విశ్వరూపాన్ని; చూపినన్= చూపగా; మునిపతి= మునీశ్వరుడు ఉదంకుడు; కని= చూచి; సంప్రమోదమును= మహానందమూ; భీతియున్= భయమూ; విస్మయమున్= ఆశ్చర్యమూ; పెనంగొనన్= ముప్పిరిగొనగా; పాణిపద్మములు= పద్మములవంటి చేతులు; మోడ్చి= జోడించి; పురుషోత్తమాయ= పురుషోత్తముడవైన; తే= నీ కొరకు; నమః= నమస్కారం; అనుచున్= అంటూ; వినీతి= వినయంచేత; నమ్రము= వంగినది; అగు= అయిన; అంగము= శరీరం; నివ్వెఱన్= పరిపూర్ణమయిన పారవశ్యంతో; నిశ్చలంబు= కదలనిది; కన్= కాగా.

**తాత్పర్యం:** ఉదంకుడు ఈ విధంగా పలికిన తరువాత దయామయుడైన శ్రీకృష్ణుడు అర్జునుడు చూచిన విశ్వరూపాన్ని చూపాడు. ఆ మునీశ్వరుడు భయానందాశ్చర్యాలు ముప్పిరిగొనగా చేతులు జోడించి 'పురుషోత్తముడవయిన నీకు నమస్కారం' అని అన్నాడు. వినయంచేత వంగిన ఉదంకుడి శరీరం పారవశ్యంవలన నిశ్చలమయింది.

**వ. ఒక్కింత నిలిచి నిభృత స్వరంబున. 49**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఇంత= కొంచెం సేపు; నిలిచి= కదలకుండా ఉండి; నిభృత= నిశ్చలమైన, తొట్రుపడని; స్వరంబునన్= కంఠమాధుర్యంతో.

**తాత్పర్యం:** ఆ విధంగా ఉదంకుడు కొంచెంసేపు నిశ్చేష్టుడై ఉండి తొట్రుపడని గొంతుతో, (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'పుండరీకాక్ష! యీ పుడమి యంతయును భ। వత్పాద పంక్తి సంవ్యాప్త మయ్యె;**
**నంబరం బెల్లను నావృత మయ్యె నీ। మహిత సముజ్జ్వల మస్తకముల;**
**నంతరిక్షము దావకాద్భుత కుక్షిదే। శంబులచేత సంఛన్నమయ్యె;**
**భవదీయ మహనీయ బాహార్గళా నిచ। యాపిహితము లయ్యె నన్ని దిశలు**

**తే. బహుచరణముల, బహుశిరోభాగములను। బహుజఠరముల, బహు భుజాప్రకరములను**
**దేవ! యిట్లు సర్వంబును నీవ యైత। నర్చి; తిది నాదు కన్ను మనంబుఁ దనిపె.' 50**

**ప్రతిపదార్థం:** పుండరీకాక్ష!= తెల్లతామరలవంటి కన్నులు కలవాడా!; దేవ!= పరమాత్మా!; ఈ పుడమి= ఈ భూమి; అంతయును= అంతయూ; భవత్= నీ యొక్క; పాద= పాదాలయొక్క; పంక్తి= వరుసలచేత; సంవ్యాప్తము= మిక్కిలి నిండినదిగా; అయ్యెన్; అంబరంబు= ఆకాశం; ఎల్లను= అంతయు; నీ= నీయొక్క; మహిత= గొప్పదీ; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశించేదీ అయిన; మస్తకములన్= తలలతో; అమృతము= కప్పబడింది; అయ్యెన్= అయింది; అంతరిక్షము= భూమ్యాకాశ మధ్యప్రదేశం; తావక= నీ యొక్క; అద్భుత= ఆశ్చర్యకరమైన; కుక్షి= ఉదరముల (పొట్టం) యొక్క; దేశంబులచేతన్= భాగాలచేత; సంఛన్నము= మిక్కిలి కప్పబడింది, మిక్కిలి నిండింది; అయ్యెన్= అయింది; అన్ని; దిశలు= దిక్కులు; భవదీయ= నీ యొక్క; మహనీయ= గొప్పవి అయిన; బాహా+అర్గళా= తలుపు గడియలవంటి భుజాలయొక్క; నిచయ= సమూహాలచేత; ఆపిహితములు= అంతటా కప్పబడినవి; అయ్యెన్= అయ్యాయి; బహు= అనేకములయిన; చరణములన్= పాదములతో; శిరస్+భాగములను= శిరః ప్రదేశాలతో; బహు= అనేకములైన; జఠరములన్= ఉదరములతో; బహు= అనేకాలైన; భుజా= భుజాలయొక్క; ప్రకరములను= సమూహాలతో; ఇట్లు= ఈ విధంగా; సర్వంబును= విశ్వమంతయును; నీవ= నీవే; ఐ= అయి; తనర్చితి= ఒప్పితివి; ఇది= నీ ఈ విశ్వరూపం; నాదు= నా యొక్క; కన్ను= చూపునూ; మనంబున్= మనస్సునూ; తనిపెన్= తృప్తిపరచింది.

**తాత్పర్యం:** పద్మనేత్రా! పరమాత్మా! భూమియందంతటా నీ పాదాలు నిండి ఉన్నాయి. ఆకాశాన్ని మహోజ్జ్వలమయిన నీ శిరస్సులు కప్పివేశాయి. భూమ్యాకాశ మధ్యప్రదేశాన్ని నీ ఉదరభాగాలు ఆక్రమించాయి. నీ మహాభుజాలు సర్వదిక్కుల యందునూ వ్యాపించాయి. అనేకములయిన పాదాలతో, శిరస్సులతో, ఉదరాలతో, భుజాలతో నీవే విశ్వమై ఒప్పినావు. నీ ఈ విశ్వరూపం నా కన్నులనూ, మనస్సునూ తృప్తిపరచింది.

**వ. విశ్వరూపా! యీ రూపం బుపసంహరించి, నీదగు నెప్పటి యాకారంబు గైకొనవే' యనిన నప్పరమేశ్వరుండు 'వరంబు గోరు'మని యానతిచ్చిన, నమ్మహితాత్ముండు 'సంశ్రితార్తి హర! నీ మూర్తిఁ గంటి; నింతకంటె మిక్కిలి వరంబులును గలవే?' యనుటయు. 51**

**ప్రతిపదార్థం:** విశ్వరూప!= అంతా వ్యాపించిన రూపం కలవాడా!; ఈ రూపంబు= ఈ రూపం; ఉపసంహరించి= విచారించి, మరలించి; నీది+అగు= నీదయిన; ఎప్పటి= ఎప్పుడూ ఉండే; ఆకారంబు= రూపాన్ని; కైకొనుము+ఏ= ధరింపవే; అనినన్= అనగా; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమాత్మ శ్రీకృష్ణుడు; వరంబు= వరం; కోరుము; అని; ఆనతి+ఇచ్చినన్= సెలవియ్యగా; ఆ+ మహితాత్ముండు= ఆ మహాత్ముండు; సంశ్రిత= ఆశ్రయించిన వారియొక్క; ఆర్తి= దుఃఖమును; హర= నశింపజేసేవాడా!; నీ= నీయొక్క; మూర్తిన్= రూపాన్ని; కంటిన్= చూచాను; ఇంతకంటెన్= ఇంతకంటెకూడా; మిక్కిలి= గొప్పవైన; వరంబులును= వరాలుకూడా; కలవు+ఏ?= ఉన్నవా?; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** పరమాత్మా! ఈ రూపాన్ని మరలించి, నీ సహజరూపాన్ని ధరించుము' అని ఉదంకు డన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు 'వరం కోరుకొను'మని ఆ మహర్షిని ఆజ్ఞాపించాడు. ఈ మాటకు ఉదంకుడు 'ఆశ్రిత రక్షకా! 'నీ విశ్వరూపాన్ని దర్శించాను. ఇంతకంటె మహా వరాలంటూ వేరే ఉంటాయా?' అనగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఆ దేవుఁ డతనితో 'నటు । గాదు; ననుం గనుట శుభము గావింపక పోఁ;**
**దేది ప్రియ మడుగు; మిత్తుఁ బ్ర। మోదంబుగ నీకు' ననిన ముని యిట్లనియెన్. 52**

**ప్రతిపదార్థం:** ఆ దేవుఁడు= ఆ దేవుడు శ్రీకృష్ణుడు; అతనితోన్= అతడితో, ఉదంకుడితో; అటు+కాదు= అట్లా కాదు; ననున్= నన్ను; కనుట= దర్శించటం; శుభము; కావింపకపోదు= కలిగించకుండా ఉండదు; ఏది= నీకు ఏది; ప్రియము= ఇష్టమో; అడుగుము= దానిని అడుగుము; ప్రమోదంబుగన్= ఆనందంగా; నీకున్= నీకు; ఇత్తున్= ఇస్తాను; అనినన్= అనగా; ముని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఉదంకుడితో 'అట్లా గాదు. నన్ను దర్శించటం శుభదాయకం అనేమాట నిజమే అయినా నీకేది ఇష్టమో అడుగుము. మహానందంగా దానిని ఇస్తాను' అన్నాడు. అప్పుడు ఆ మునీశ్వరుడు ఈ విధంగా అన్నాడు.

**వ. 'అవశ్యంబును నా కట్లు గావలయు నని యవధరించితేని దేవా! యిది మరుదేశం; బిచ్చట జలంబు దుర్లభంబు; నాకు జలసన్నిధి యెప్పుడుం గలుగఁ బ్రసాదింపుము.' 53**

**ప్రతిపదార్థం:** అవశ్యంబును= తప్పకుండా; నాకున్= నాకు; అట్లు= ఆ విధంగా, నీవు చెప్పినట్లే; కావలయును= కాక తప్పదు; అని; అవధరించితి+ఏని= దయతో సెలవిచ్చినట్లయితే; దేవా!= పరమాత్మా!; ఇది; మరుదేశంబు= జలంలేని ప్రాంతం; ఇచ్చటన్= ఇక్కడ; జలంబు= నీరు; దుర్లభంబు= పొంద శక్యం కానిది; నాకున్= నాకు; జల= నీటియొక్క; సన్నిధి= సాక్షాత్కారం, చేరువ;

ఎప్పుడున్= ఎల్లప్పుడూ; కలుగన్= కలిగేటట్లుగా; ప్రసాదింపుము= అనుగ్రహించుము.

**తాత్పర్యం:** 'తప్పకుండా నీవు చెప్పినట్లే కావాలని అంటే, దేవా! ఇది నిర్జలప్రాంతం. ఇక్కడ నీరు దొరకదు. కాబట్టి ఎల్లప్పుడూ నాకు నీరు చేరువలో ఉండేటట్లు అనుగ్రహించుము.'

**వ. అనుటయు, నంబుజనాభుఁడు। తన యెప్పటి లలితమూర్తి ధరియించి, మునీం**
**ద్రునితోడ నన్నుఁ దలఁపఁగ। ననఘా! దొరకొను జలంబు' లని పలికి తగన్. 54**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ఉదంకుడు ఆ విధంగా అనగా; అంబుజనాభుఁడు= పద్మం నాభియందు గలవాడు, శ్రీకృష్ణుడు; తన= తనయొక్క; ఎప్పటి= ఎప్పుడూ ఉండే; లలిత= మనోహరమైన; మూర్తిన్= రూపాన్ని; ధరియించి= ధరించి; మునీంద్రునితోడన్= మునిశ్రేష్ఠుడితో; అనఘా!= పాపం లేనివాడా!; నన్నున్= నన్ను; తలఁపఁగన్= స్మరించగా; జలంబులు= నీళ్ళు; దొరకొనున్= లభిస్తాయి; అని; పలికి; తగన్= ఆచారానుగుణంగా.

**తాత్పర్యం:** ఉదంకుడు ఆ విధంగా పలుకగా శ్రీకృష్ణుడు తన కెప్పుడూ ఉండే రూపాన్ని ధరించి, ఆ మునిశ్రేష్ఠుడితో 'నన్ను స్మరిస్తే నీళ్ళు లభిస్తాయి' అని చెప్పాడు. తరువాత ఆచారానుగుణంగా. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. వీడ్కొని చనియెం; బదంపడి యా భృగువంశవరుం డొక్కెడ మెలంగుచుండి, తృషితుండయి, హృషీకేశుం**
**దలంచిన. 55**

**ప్రతిపదార్థం:** వీడ్కొని= పోయి వస్తానని చెప్పి వదలి; చనియెన్= వెళ్ళాడు; పదంపడి= తరువాత; ఆ+భృగు= ఆ భృగుమహర్షియొక్క; వంశ= వంశంలో; వరుండు= శ్రేష్ఠుడు; ఒక్క+ఎడన్= ఒకచోట; మెలంగుచున్= తిరుగుతూ; ఉండి; తృషితుండు= దప్పికగొన్నవాడు; అయి; హృషీకేశున్= ఇంద్రియాలకు నియామకు డయినవాడిని, శ్రీకృష్ణుడిని; తలంచినన్= స్మరించగా,

**తాత్పర్యం:** పోయివస్తానని చెప్పి శ్రీకృష్ణుడు వెళ్ళాడు. తరువాత భృగువంశశ్రేష్ఠుడైన ఉదంకుడు ఒకచోట తిరుగుతూ, దప్పికై శ్రీకృష్ణుడిని స్మరించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కుక్కలు చుట్టిరా నొక్కమాతంగుండు। బాణ బాణాసన పాణియును ది**
**గంబరుండును, మలినాంగుండు, నగువాఁడు। దోఁచె నచ్చజలంబు దొరఁగుచుండు**
**మేనితోఁ; నమ్ముని వానిఁ దప్పకచూడ;। వాఁ 'డోయుదంక! యివ్వారి దప్పి**
**వోఁ ద్రావు' మనుడు, నాభూసురాగ్రణి యొల్ల। నని పల్కెఁ; బల్కిన 'వినుము నీవు**

**ఆ. నీరువట్టు శ్రమముఁ గూరిన నీ మీఁది। కరుణ వచ్చినాఁడఁ, గాదు నాక**
**యర్థిఁ ద్రావు టొప్పు 'ననియె; నా చండాలు। నలుకమెయి నదల్చె నత్తపస్వి. 56**

**ప్రతిపదార్థం:** ఒక్క= ఒకానొక; మాతంగుండు= హీనజాతివాడు, మాలవాడు; కుక్కలు; చుట్టి= చుట్టూ చేరి; రాన్= వస్తుండగా; బాణ= బాణాలు; బాణ+ఆసన= ధనుస్సు ఉన్న; పాణియును= చేతులుకలవాడును; దిగంబరుండును= దిక్కులే వస్త్రాలుగా గలవాడునూ (దిసమొలవాడు అని అర్థం); మలిన= మురికితో కూడిన; అంగుండును= అవయవములు కలవాడును; అగువాఁడు= అయినవాడు; అచ్చ= నిర్మలమయిన; జలంబు= నీరు; తొరఁగుచున్+ఉండు= కారుతున్న; మేనితోన్= శరీరంతో; తోఁచెన్= కనబడ్డాడు; ఆ+ముని= ఆ ఉదంకుడు; వానిన్= వాడిని; తప్పక= తదేకదృష్టితో; చూడన్= చూడగా; వాఁడు= ఆ మాలవాడు;

ఓ+ఉదంక!= ఓ ఉదంకా!; ఈ+వారిన్= ఈ నా శరీరంనుండి కారుతున్న నీటిని; డప్పి= దప్పిక; పోన్= తీరేటట్లుగా; త్రావుము= త్రాగుము; అనుడున్= అనగా; ఆ+భూసుర= ఆ బ్రాహ్మణులలో; అగ్రణి= శ్రేష్ఠుడు, ఉదంకుడు; ఒల్లన్= ఇచ్చగింపను, ఇష్టపడను; అని; పల్కెన్= పలికెను; పల్కినన్= పలుకగా; వినుము; నీవు; నీరువట్టు= దప్పిక; శ్రమమున్= బడలికనూ; కూరినన్= పొందగా; నీ మీఁదన్= నీ యందలి; కరుణన్= దయతో; వచ్చినాఁడన్= వచ్చితిని; కాదు= తగదు; నాక= అనక; అర్థిన్= ప్రీతితో; త్రావుట= త్రాగటం; ఒప్పున్= తగును; అనియెన్= అన్నాడు; ఆ+తపస్వి= ఆ ఋషి - ఉదంకుడు; ఆ+చండాలున్= ఆ మాలవాడిని; అలుకమెయిన్= కోపంతో; అదల్చెన్= గద్దించాడు.

**తాత్పర్యం:** ఇంతలో ఒక మాలవాడు కనిపించాడు. కుక్కలు అతడిచుట్టూ చేరి వస్తున్నవి. అతడిచేతులలో ధనుస్సూ, బాణాలూ ఉన్నాయి. వాడి మొలమీద బట్టలు లేవు. అవయవాలన్నీ మురికిపట్టి ఉన్నవి. అతడి శరీరంనుండి నిర్మలమయిన నీరు కారుతున్నది. ఉదంకుడు అతడిని తేరిపార చూచాడు. అప్పుడు అతడు 'ఓ ఉదంకా! నా శరీరం నుండి కారుతున్న ఈ నీటిని త్రాగుము' అన్నాడు. దానికి ఉదంకుడు ఇష్టపడలేదు. అంతట ఆ మాలవాడు 'నా మాట వినుము నీవు దప్పికతో ఆయాసపడటం తెలిసి, నీ మీది దయతో నేను వచ్చాను. కాదనకుండా నీవు త్రాగటం మంచిది' అని అన్నాడు. అప్పుడు ఉదంకుడు అతడిని గద్దించాడు.

**వ. అదల్చిన, నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబు సేసె; నా సంయమి వెఱఁగుపడి, యొక్కింత విచారించి, యిక్కపట ప్రచారంబు కృష్ణసంపాదితంబు గావలయు; నని యూహించు సమయంబున, నయ్యెడకుం గృష్ణుం దరుగుదెంచుటయుం, గనుంగొని, యమ్మహాత్మునితోడ నమ్మునివరుండు. 57**

**ప్రతిపదార్థం:** అదల్చినన్= గద్దించగా; అతండు= ఆ మాలవాడు; సారమేయంబులున్= కుక్కలునూ; తానున్= తానునూ; అంతర్ధానంబు+చేసెన్= అదృశ్యమయ్యాడు; ఆ సంయమి= ఆ ముని - ఉదంకుడు; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; ఒక్క+ఇంత= ఒకించుక విచారించి; ఈ+కపట= ఈ మోసంతోకూడిన; ప్రచారము= వ్యవహారం; కృష్ణ= కృష్ణుడిచేత; సంపాదితంబు= కలిగించబడింది; కావలయున్= అయి ఉండవచ్చును; అని; ఊహించు= ఊహిస్తున్న; సమయంబునన్= సమయాన; ఆ+ఎడకున్= ఆ చోటికి; ఆ+మహాత్మునితోడన్= ఘనుడయిన జీవాత్మ కలవాడితో, శ్రీకృష్ణుడితో; ఆ+మునివరుండు= ఆ మునీశ్వరుడు.

**తాత్పర్యం:** ఉదంకుడు గద్దించేటప్పటికి మాలవాడు కుక్కలతోపాటు అదృశ్యమయ్యాడు. అంతట ఉదంకుడు ఆశ్చర్యపడి 'ఈ కపట వ్యవహారమంతా శ్రీకృష్ణుడిపని అయి ఉండవచ్చును' అని ఊహిస్తున్న సమయంలో, శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చాడు. అప్పుడు ఆ మహర్షి ఆ మహాత్ముడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'జలము నినుఁ దలఁపగా నిటు। గలుగునె; చండాలు నొడలఁ గాఱెడు నీరే**
**నలఘుగుణ! త్రావుదునె యే। కొలఁది శ్రమంబైన; వరము కుచ్చిత మయ్యెన్.' 58**

**ప్రతిపదార్థం:** అలఘు= గొప్ప; గుణ= గుణాలు కలవాడా!, శ్రీకృష్ణా!; నినున్= నిన్ను; తలఁపఁగాన్= స్మరించగా; జలము= నీరు; ఇటు= ఈ ప్రకారంగా; కలుగును+ఎ?= లభిస్తుందా?; ఏ కొలఁది= ఎంతటి; శ్రమంబు= కష్టం; ఐనన్= అయినప్పటికీ; ఏన్= నేను; చండాలు= మాలవాడియొక్క; ఒడలన్= శరీరంనుండి; కాఱెడు= కారుతున్న; నీరు= నీటిని; త్రావుదును+ఎ?= త్రాగుతానా?; వరము= నీ విచ్చిన వరం; కుచ్చితము= తుచ్ఛము; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** 'మహాగుణా! నిన్ను స్మరిస్తే ఈ విధంగా నీరు లభిస్తుందా? ఎంతటి ముప్పు మూడినప్పటికీ నేను మాలవాడి దేహంనుండి కారుతున్న నీటిని త్రాగుతానా? నీవు తుచ్ఛమయిన వరం ఇచ్చావు.'

**చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టులను; 'నాఱడిఁబోయెఁ బ్రయత్న మెల్ల; నీ**
**వనఘ! యెఱుంగవైతి; సమయం బొకఁ డిమ్మెయిఁ గల్గె; నేర్పడన్**
**వినుము; నిలింప వల్లభుని నీకయి వేఁడితి నే సుధారసం;**
**బనితరసాధ్యమైన శుభ మయ్యెడు భూతి దొలంగె నక్కటా! 59**

**ప్రతిపదార్థం:** అనవుడున్= ఉదంకుడు ఆ విధంగా అనగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అనఘా!= పాపరహితుడా!; ఏర్పడన్= స్పష్టంగా; వినుము; అక్కటా!= అయ్యో!; ప్రయత్నము; ఎల్లన్= అంతయు; ఆఱడిన్+పోయెన్= వ్యర్థమయింది; నీవు; ఎఱుంగవు+ఐతివి= తెలిసికొనవయితివి; సమయంబు+ఒకఁడు= ఒక మంచి సమయం; ఈ+మెయిన్= ఈ విధంగా; కల్గెన్= తటస్థించింది; నేన్= నేను; నీకయి= నీకొరకు; నిలింప= దేవతలయొక్క; వల్లభునిన్= ప్రభువును, దేవేంద్రుడిని; సుధారసంబు= అమృతరసాన్ని; వేఁడితిన్= అర్థించాను; అనితర సాధ్యము= ఇతరులకు సాధింప శక్యంకానిది; ఐన= అయిన; శుభము; అయ్యెడు= కలిగే; భూతి= భాగ్యం; తొలంగెన్= తొలగిపోయింది.

**తాత్పర్యం:** ఉదంకుడి మాటలు విన్న శ్రీకృష్ణుడు నేను చెప్పేమాటలు స్పష్టంగా వినుము. అయ్యో! చేసిన ప్రయత్నమంతా వ్యర్థమయింది. మంచి సమయం తటస్థించిందన్న సంగతి నీకు తెలియదు. నేను నీకొరకు అమృతం ఇమ్మని దేవేంద్రుడిని అర్థించాను. ఎవ్వరూ పొందలేని శుభం కలిగే భాగ్యం తప్పిపోయింది కదా!

**వ. అది యెట్లంటేని. 60**

**తాత్పర్యం:** అది ఎట్లా జరిగిందని అడుగుతావేమో? (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఏను సుధ యడుగుటయు, హరి । 'మానవునకు నేల యగు సమర్త్యత్వము? మే**
**లైన తెఱఁ గొండు గోరుము; । దానిం దగ నిచ్చెదన్ ముదం బారంగన్.' 61**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సుధ= అమృతాన్ని; అడుగుటయున్= అడుగగా; హరి= ఇంద్రుడు; మానవునకున్= మానవుడికి; అమర్త్యత్వము= దేవత్వం; ఏల+అగున్= ఎట్లా కలుగుతుంది; మేలు= హితం కలిగించేది; ఐన= అయిన; తెఱఁగు= చేయదగ్గ దానిని; ఒండు= మరొక దానిని; కోరుము; దానిన్= నీవు కోరినదానిని; తగన్= సముచితంగా; ముదంబు= సంతోషం; ఆరంగన్= అతిశయించగా; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** నేను అమృతం అడుగగా ఇంద్రుడు 'మానవుడికి దివ్యత్వం ఎట్లా ప్రాప్తిస్తుంది? హితం కలిగించేదీ చేయదగిందీ అయిన మరొక దానిని కోరుము. దానిని మహానందంగా ప్రసాదిస్తాను.'

**వ. అనిన నయ్యనిమిషపతి యాననం బాలోకించి. 62**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+అనిమిషపతి= ఆ దేవతలయొక్క ప్రభువు ఇంద్రుడియొక్క; ఆననంబు= ముఖాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇంద్రు డావిధంగా అనగా, నేను ఆ దేవపతి ముఖాన్ని సూటిగా చూచి.(తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'నిను వేఁడుట మోఘముగాఁ। జనునే యెట్లైన నాదు చనవు సెఱుప క**
**మ్మునిపతికి నమృతరస మి'। మ్మని ప్రార్థించిన మహాత్మ! యాతఁడు నాతోన్. 63**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; వేఁడుట= అర్థించటం; మోఘము= నిష్ఫలం; కాన్= కావటం, చనును+ఏ= తగునా?; ఎట్లు+ఐనన్= ఏ విధంగానయినా; నాదు= నాయొక్క; చనవు= కోరిక; చెఱుపక= వ్యర్థం చేయక; ఆ+మునిపతికిన్= ఆ మునీశ్వరుడికి; అమృతరసము; ఇమ్ము= ప్రసాదించుము; అని; ప్రార్థించినన్= ప్రార్థించగా; మహాత్మ!= పుణ్యాత్మా!, ఉదంకా!; అతఁడు= ఇంద్రుడు; నాతోన్=నాతో.

**తాత్పర్యం:** 'నిను వేడటం వృథా కావటం తగునా? ఏ విధంగానైనా నా కోరిక వ్యర్థంచేయక ఆ మునీశ్వరుడికి అమృతరసాన్ని ప్రసాదించుము' అని ప్రార్థించగా ఇంద్రుడు నాతో. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. సమయంబు చేసికొని వచ్చె; నత్తెఱం గాకర్ణింపు; మమ్మహిత సౌజన్య ధన్యుండు. 64**

**ప్రతిపదార్థం:** సమయంబు= ఏర్పాటు; చేసికొని; వచ్చెన్= నీ కడకు వచ్చాడు; ఆ+తెఱంగు= ఆ విధం; ఆకర్ణింపుము= వినుము; ఆ+మహిత= ఆ గొప్ప; సౌజన్య= మంచితనంచేత; ధన్యుండు= పొగడదగినవాడు.

**తాత్పర్యం:** (ఇంద్రుడు నాతో) ఒక ఏర్పాటుచేసికొని నీ దగ్గరకు వచ్చాడు. వచ్చిన తీరు చెప్పుతాను వినుము. తరువాత మంచితనంవలన శ్లాఘించదగినవాడయిన అతడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. 'మాతంగత్వము దాల్చి, యే నరిగి, సమ్మానించి, యాభార్గవుం**
**బ్రీతుం జేసెద; నట్టు లిచ్చిన సుధన్ హ్రీదూషిత స్వాంతుఁడై**
**యాతం డొల్లకయున్న నేమి? విను; నా కన్యాయ్యవృత్తంబు గా;**
**దీతంత్రంబున కీవ సాక్షి; యని తా నేతెంచె నిన్ గానఁగన్. 65**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మాతంగత్వము= మాలవాడి ఆకారాన్ని ; తాల్చి= ధరించి; అరిగి= వెళ్ళి; ఆ భార్గవున్= ఆ భృగుసంతతివాడిని, ఉదంకుడిని; సమ్మానించి= గౌరవించి; ప్రీతున్= తృప్తిపొందినవాడినిగా; చేసెదన్= చేస్తాను; అట్టులు= ఆ విధంగా, సత్కారపూర్వకంగా; ఇచ్చిన= ఇచ్చినట్టి; సుధన్= అమృతాన్ని; హ్రీ= లజ్జచేత; దూషిత= భంగపరువబడిన; స్వాంతుఁడు+ఐ= మనస్సు కలవాడై; అతండు= ఆ ఉదంకుడు; ఒల్లక+ఉన్నన్= ఇష్టపడకుంటే; ఏమి; నాకున్= నాకు; అన్యాయ్య= న్యాయము గాని; వృత్తంబు= ప్రవర్తనం; కాదు; ఈ తంత్రంబునకున్= ఈ కల్పనకు; నీవు+అ= నీవే; సాక్షి= సాక్షివి; అని; తాను; నిన్= నిన్ను; కానఁగన్= చూడటానికి; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** 'నేను చండాలరూపం ధరించి వెళ్ళి సత్కారపూర్వకంగా ఆ ఉదంకుడిని తృప్తిపరుస్తాను. లజ్జతో నే నిచ్చిన అమృతాన్ని అతడు ఇష్టపడకపోతే నా కేమిటి? నాకు అధర్మం కానేకాదు. ఈ కల్పనకు నీవే సాక్షివి' అని ఇంద్రుడు నిన్ను చూడటానికి వచ్చాడు.

**వ. నీవు ప్రత్యాఖ్యానంబు చేసిన, నతం డంతర్ధానంబు చేసెం; గానిమ్ము; దాని కేమి సేయవచ్చు? నా యిచ్చిన వరంబు బొంకుగాకుండ నీకు జలం బెప్పుడుం గలుగం జేసెద. 66**

**ప్రతిపదార్థం:** నీవు; ప్రత్యాఖ్యానంబు= నిరాకరణం; చేసినన్= చేయగా; అతండు= ఇంద్రుడు; అంతర్ధానంబు చేసెన్= అదృశ్యమయినాడు; కానిమ్ము; దానికిన్= జరిగినదానికి; ఏమి; చేయవచ్చున్?= చేయగలం?; నా+ఇచ్చిన= నే నిచ్చిన; వరంబు= వరం; బొంకు= అసత్యమయినది; కాకుండన్= కాకుండేటట్లుగా; నీకున్= నీకు; జలంబు= నీరు; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; కలుగన్= దొరకేటట్లుగా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** నీవు నిరాకరించేటప్పటికి, ఇంద్రుడు అదృశ్యమయ్యాడు. కాని, జరిగినదానికి మన మేం చేయగలం? నేను నీ కిచ్చిన వరం కల్ల కాకుండా నీళ్ళు ఏడాది పొడుగునా దొరికేటట్లు చేస్తాను.

**చ. అనఘ! జలంబు నీవలసినప్పుడు మేఘము లీమరుస్థలం**
**బున నొసఁగున్; భవద్యశము పొంపిరిపోవ నుదంక మేఘనా**
**మ నుత విహారముల్ గలిగి మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం**
**చును జలదంబు; లింక నను సువ్రత! దూఱకు; పోయి వచ్చెదన్.' 67**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; సువ్రత!= సదాచారం కలవాడా!; నీవలసినప్పుడు= నీవు ఇష్టపడినప్పుడే; మేఘములు; ఈ మరుస్థలంబునన్= ఈ ఎడారిలో; జలంబు= నీరు; ఒసఁగున్= కురిపించును; జలదంబులు= మేఘాలు; భవత్= నీయొక్క; యశము= కీర్తి; పొంపిరి+పోవన్= పెంపొందగా; ఉదంకమేఘ= ఉదంకమేఘము అనే; నామ= పేరుతో; నుత= కొనియాడదగిన; విహారములు= వ్యాపించుటలు; కలిగి; మాన్యతన్= గౌరవయోగ్యంగా; ఎప్పుడున్= ఎల్లప్పుడును; ఈ+ఎడన్= ఇక్కడ; చరించును= తిరుగుతాయి; ఇంకన్= ఇంకా; ననున్= నన్ను; దూఱకు= నిందింపకుము; పోయి వచ్చెదన్= వెళ్ళి వస్తాను.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! సదాచార సంపన్నా! ఈ నిర్జల ప్రదేశంలో నీకిష్టమయినప్పుడు మేఘాలు నీళ్ళు కురిపిస్తాయి. నీ కీర్తి పెంపొందేటట్లుగా వాటికి ఉదంకమేఘాలు అనే పేరు కలుగుతుంది. అవి ఇక్కడ చక్కగా వ్యాపించి సంచరిస్తాయి. నీ వింక నన్ను నిందింపకుము. వెళ్ళి వస్తాను.'

**క. అనినం బ్రీతుం డయ్యెను।ముని; యంతర్ధాన కలనమునఁ గృష్ణుండుం**
**జనియె; నని చెప్పి మఱియును। జనమేజయ నృపతితోడ సంప్రీతి మెయిన్. 68**

**ప్రతిపదార్థం:** అనినన్= కృష్ణుడు అనగా; ముని= ఉదంకుడు; ప్రీతుండు= సంతోషించినవాడు; అయ్యెను; కృష్ణుండున్= కృష్ణుడునూ; అంతర్ధాన= అదృశ్యముయొక్క; కలనమునన్= స్వీకరణంతో; చనియెన్= వెళ్ళాడు; అని; చెప్పి; మఱియును; జనమేజయ= జనమేజయుడు; నృపతితోడన్= రాజుతో; సంప్రీతిమెయిన్= మహాసంతోషంతో.

**తాత్పర్యం:** ఈ విధంగా కృష్ణుడు చెప్పగా ఉదంకుడు సంతోషించాడు. శ్రీకృష్ణుడు అదృశ్యమయ్యాడు. ఈ కథంతా జనమేజయునకు చెప్పి ఇంకా. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. వైశంపాయనుం డిట్లనియె. 69**

**తాత్పర్యం:** వైశంపాయనుడు ఈ విధంగా అన్నాడు.

ఆ. 'మనుజనాథ! యెప్పుడును మరుదేశంబు । నందు నియతవృత్తి, నద్భుతంబు
దలకొనంగ, నయ్యుదంక మేఘంబు లొ । క్కొక్క పుణ్యతిథుల నొలసి కురియు.' **70**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; ఆ+ఉదంకమేఘంబులు; మరుదేశంబునందున్= ఆ నిర్జల ప్రదేశంలో; నియత= నియమంతో కూడిన; వృత్తిన్= విధంగా; అద్భుతంబు= ఆశ్చర్యం; తలకొనంగన్= కలుగగా; ఒక్కొక్క= ఆయా; పుణ్య= పవిత్రమైన; తిథులన్= తిథులలో; ఒలసి= వ్యాపించి; కురియున్= వర్షిస్తాయి.

**తాత్పర్యం:** 'జనమేజయా! ఉదంకమేఘాలు ఆ నిర్జలప్రదేశంలో నియమం తప్పకుండా ఆశ్చర్యకరంగా ఆయా పుణ్యతిథులలో నీళ్ళు కురిపిస్తాయి.'

వ. అనిన విని జనమేజయుండు 'మునీంద్రా! యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన యుదంకుం డేమి విధంబు తపంబున నమ్మహానుభావంబు నొందె? నెఱింగింపవే!' యనుడు నా విభునకు వైశంపాయనుం డిట్లనియె. **71**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని; జనమేజయుండు; మునీంద్రా!= మునులలో శ్రేష్ఠుడా!; ఉపేంద్రునిన్= శ్రీకృష్ణుడిని; శపించుటకున్= శపించటానికి; ఉత్సహించిన= పూనుకొనిన; ఉదంకుడు; ఏమి విధంబు= ఏ విధమైన; తపంబునన్= తపస్సుచేత; ఆ+మహత్+అనుభవంబున్= ఆ గొప్ప మహిమను; ఒందెన్= పొందాడు; ఎఱింగింపవే?= తెలియజేయుమా!; అనుడున్= అని అనగా; ఆ విభునకున్= ఆ రాజుతో; వైశంపాయనుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడు ఆ విధంగా చెప్పగా జనమేజయుడు 'మునీశ్వరా! ఉదంకుడు శ్రీకృష్ణుడినే శపించటానికి పూనుకొన్నాడు కదా! అంతటి మహిమ అతడికి ఏ విధమయిన తపస్సువలన లభించినదో నాకు చెప్పుము' అని అడిగాడు. అంతట జనమేజయుడితో వైశంపాయనుడు ఈ విధంగా అన్నాడు.

### జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకుని చరిత్రంబు చెప్పుట (సం. 14-55-1)

సీ. అతనికి గురుభక్తి కతనఁ జొప్పడియె న । త్తెఱఁగు పెం; పది విను తెలియ; నతఁడు
తన గురుండైన గౌతమునకు శుశ్రూష । నియతిమైఁ జేయ సస్నేహ భక్తి
కంబుగఁ బెద్దయుఁ గాలంబు చనిన, నా । సంయమిపతి శిష్య సమితి కెల్ల
వివిధవరము లిచ్చి, వీడ్కొల్పి, పుచ్చి, యు । దంకుని దిక్కును దలఁప కుండె;

ఆ. అత్తపఃపరాత్ముఁ డతినిష్ఠఁ బరిచర్య । నడపు, చొక్కనాఁడు కడును వ్రేఁగు
గలుగునట్టి వంటకట్టియమో పట్టు । గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య! **72**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశ శ్రేష్ఠుడా!, ఓ జనమేజయా!; తెలియన్= స్పష్టమగునట్లుగా; విను; అతనికిన్= ఆ ఉదంకుడికి; గురు= గురువునందలి; భక్తి; కతనన్= వలన; ఆ+తెఱఁగు= ఆ విధమైన; పెంపు= మహిమ; అది; చొప్పడియెన్= కలిగింది; అతఁడు= ఆ ఉదంకుడు; తన గురుండు+ఐన= తన గురువయిన; గౌతమునకున్= గౌతముడికి; శుశ్రూష= సేవ; నియతిమైన్= నియమంతో; సస్నేహ= అనురాగంతో కూడిన; భక్తికంబు+కన్= భక్తి కలిగేటట్లుగా; చేయన్= చేయగా; పెద్దయున్=

చాలా; కాలంబు= కాలం; చనినన్= కడవగా; ఆ సంయమి= ఆ ఋషులయొక్క; పతి= రాజు, గౌతముడు; శిష్య= శిష్యులయొక్క; సమితికిన్= సమూహానికి; ఎల్లన్= అంతటికి; వివిధ= అనేక విధాలైన; వరములు; ఇచ్చి; వీడ్కొల్పి= పోవ అనుమతించి; పుచ్చి= పంపి; ఉదంకుని= ఉదంకుడియొక్క; దిక్కు= వైపు; తలఁపక= విచారించక; ఉండెన్= ఉన్నాడు; ఆ+తపస్ = ఆ తపస్సునందు; పర= ఆసక్తి కలిగి; ఆత్ముఁడు= ఆత్మగలవాడు; అతి= మిక్కిలి; నిష్ఠన్= శ్రద్ధతో; పరిచర్య= సేవ; నడపుచున్= చేస్తూ; ఒక్కనాఁడు= ఒక రోజున; కడును= మిక్కిలి; వ్రేఁగు= బరువు; కలుగు+అట్టి= కలిగినదయిన; వంట కట్టియ= వంటకట్టెలయొక్క, మోపు; అఱ్ఱు= మెడ; కుదియన్= క్రుంగేటట్లుగా; మోచి; తెచ్చెన్= తెచ్చాడు.

**తాత్పర్యం:** జనమేజయా! గురుభక్తివలన ఉదంకుడికి అటువంటి మహిమ కలిగింది. అతడు చాలాకాలం నియమబద్ధంగా తన గురువైన గౌతముడికి సేవ చేశాడు. మునిపతి అయిన గౌతముడు శిష్యులందరికీ ఆయా వరాలిచ్చి పంపివేశాడు. కాని, ఉదంకుడిమాట తలపనే తలపలేదు. అయినప్పటికీ ఉదంకుడు మహానిష్ఠతో గురు శుశ్రూష చేస్తూనే ఉన్నాడు. ఒక రోజున అతడు మెడ దిగబడిపోయేటంత బరువు కలిగిన వంటకట్టెలమోపు తెచ్చాడు.

**క.** **అటు మోచి తెచ్చి యం దొక । జట పెద్దయుఁ దగిలియుండ, సరభసముగ వై**
**చుటయు దెగి, మోపుతో ముం । దట నది పడియెను జరాసితచ్ఛవి మెఱయన్.** **73**

**ప్రతిపదార్థం:** అటు= ఆ విధంగా; మోచి; తెచ్చి; అందున్= ఆ వంటకట్టెల మోపులో; ఒక; జట= జడ; పెద్దయున్= మిక్కిలి; తగిలి= చిక్కుకొని; ఉండన్= ఉండగా; సరభసముగన్= వేగంగా; వైచుటయున్= కిందపడవేయగా; అది= ఆ జడ; తెగి; జరా= ముసలితనంచేత కలిగిన; సిత= తెల్లని; ఛవి= కాంతి; మెఱయన్= మెరుస్తూ ఉండగా; మోపుతోన్= మోపుతోపాటు; ముందటన్= అతడిముందు; పడియెను= పడింది.

**తాత్పర్యం:** ఆ విధంగా వంటకట్టెలమోపు తెచ్చి, ఉదంకుడు వేగంగా కింద పడవేశాడు. అయితే ఆ మోపులో అతనిజడ ఒకటి గట్టిగా చిక్కుకొని ఉన్నది. మోపు కిందపడవేసినప్పుడు అది తెగి అతడిముందు పడింది. ముసలితనం ముంచుకొని రావటంవలన ఆ జడలోని వెంట్రుకలు తెల్లబడిపోయి ఉన్నాయి.

**సీ.** **దాన నన్నియతుండు దనవయఃపాకంబు । నెఱిఁగి, శోకంబున నేడ్వ, నమ్మ**
**హాముని యశ్రువు లంజలిఁ బట్టంగ । నిజపుత్త్రిఁ బనిచె; నన్నీరజాక్షి**
**రయమునఁ బట్టి కరంబులు వేఁడిమి । నెరిసిన విడిచిన, ధరయుఁ దలరె;**
**నమ్ముని యా శిష్యు రమ్మని చేరంగఁ । బిలిచి, 'నీ వేటికి నలఁతఁ బొందె!'**

**ఆ.** **దనిన, నతఁడు 'శిష్యులందఱపైఁ గల । కరుణ మీకుఁ బెద్దకాల మేని**
**మునివరేణ్య! నావలన లేదు; దానికి । నుమ్మలింప కెట్టు లుండవచ్చు?'** **74**

**ప్రతిపదార్థం:** దానన్= వెంట్రుకలు తెల్లబడటంచేత; ఆ నియతుండు= ఆ నియమం కలవాడు; తన= తనయొక్క; వయస్= వయస్సుయొక్క; పాకంబున్= పరిణామం; ఎఱింగి= తెలిసికొని; శోకంబునన్= బాధతో; ఏడ్వన్= ఏడువగా; ఆ+మహత్+ముని= ఆ గొప్పవాడయిన గౌతమ ముని; అశ్రువులు= ఉదంకుడి కన్నీళ్ళు; అంజలిన్= దోసిటిలో; పట్టంగన్= పట్టటానికి; నిజ= తనయొక్క; పుత్రిన్= కుమార్తెను; పనిచెన్= పంపాడు; ఆ+నీరజాక్షి= ఆ తామరపూలవంటి కన్నులు గలది; రయమునన్= తొందరగా; పట్టి; కరంబులు= చేతులు; వేఁడిమిన్= కన్నీళ్ళవేడిచేత; ఎరిసినన్= కాలగా; విడిచినన్= వాటిని వదలటంచేత;

ధరయున్= భూమికూడా; తలరెన్= క్షోభించింది; ఆ+ముని= ఆ గౌతముడు; ఆ శిష్యున్= ఆ శిష్యుడైన ఉదంకుడిని; రమ్ము; అని; చేరంగన్= సమీపించగా; పిలిచి; నీవు; ఏటికిన్= ఎందువలన; అలఁతన్= బాధను; పొందెదు= పొందుతున్నావు; అనినన్= అనగా; అతఁడు= ఆ ఉదంకుడు; మునివరేణ్య!= మునులలో శ్రేష్ఠుడా!; మీకున్= మీకు; శిష్యులు; అందఱపైన్= అందరిమీదా; కల= ఉన్న; కరుణ= దయ; పెద్దకాలము+ఏని= చాలాకాలం గడచినప్పటికినీ; నావలనన్= నా యందు; లేదు; దానికిన్= దయలేకుండటానికి; ఉమ్మలింపక= దుఃఖించక; ఎట్టులు= ఏ విధంగా; ఉండవచ్చున్?= ఉండగలను?

**తాత్పర్యం:** నియమశాలి అయిన ఉదంకుడు తెల్లబడి నిగనిగలాడుతున్న జడను చూచి వయస్సు గడచి పోయిందని గుర్తించి శోకించాడు. అప్పుడు గౌతముడు అతడి కన్నీటిని దోసిట్లో పట్టుకొనటానికి తన కూతురిని పంపాడు. ఆమె దోసిట్లో పట్టిన కన్నీళ్ళ వేడికి తనచేతులు కాలేటప్పటికి వాటిని భూమిమీద వదలింది. కన్నీళ్ళ వేడికి భూమికూడా క్షోభించింది. అప్పుడు గౌతముడు ఉదంకుడిని దగ్గరకు పిలిచి 'ఎందుకు ఏడుస్తున్నా?' వని ప్రశ్నించాడు. దానికి ఉదంకుడు 'మహర్షీ! ఎంతో కాలం గడచినప్పటికీ మీకు శిష్యులందరిమీదా ఉన్నదయ నా యందు కలగదాయె. దీని కెట్లా శోకించకుండా ఉండగలను?'

**వ. అనుటయుఁ గృప చిగురొత్తు చిత్తంబుతోడ. 75**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ఉదంకుడు అనగా; కృప= దయ; చిగురొత్తు= పుట్టిన; చిత్తంబుతోడన్= మనస్సుతో.

**తాత్పర్యం:** అనిన ఉదంకుడి మాటలు వినగానే గౌతముడి మనస్సులో అతడిమీద దయ కలిగింది. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'ఎలప్రాయ మిచ్చితిని నీ। కలఘుమతీ! యిచ్చెదను మదాత్మజ, నుల్లం**
**బలరఁగఁ బెండిలి గ' మ్మని। పలికి, మఱియు నా తపస్విపతి యి ట్లనియెన్. 76**

**ప్రతిపదార్థం:** అలఘు= గొప్ప; మతీ= మనస్సు కలవాడా!; నీకున్= నీకు; ఎలప్రాయము= యౌవనం; ఇచ్చితిని= ప్రసాదించాను; మత్= నా యొక్క; ఆత్మజను= కూతురిని; ఇచ్చెదను= నీకు అర్పిస్తాను; ఉల్లంబు= హృదయం; అలరఁగన్= ఆనందించగా; పెండిలి+కమ్ము= పెండ్లాడుము; అని; పలికి; మఱియున్= ఇంకా; ఆ తపస్విపతి= ఆ గౌతముడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'మహాత్మా! నీకు యౌవనాన్ని ప్రసాదించాను. నా కూతురిని కూడా సమర్పిస్తాను. హృదయానందంతో ఆమెను పెండ్లాడుము' అని ఆ ఋషీశ్వరుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'నీ తేజంబు సహింపఁగ। నీ తామరసాక్షి దక్క నెవ్వరికిఁ దప**
**స్స్ఫీతా! శక్యముగా; దిది। చేతోగతిఁ జూచి, తగవు సిద్ధించుటకై. 77**

**ప్రతిపదార్థం:** తపస్= తపస్సుయొక్క; స్ఫీతా= అధిక్యం కలవాడా!; నీ= నీయొక్క; తేజంబు= తేజస్సు; సహింపఁగన్= ఓర్చుకొనగా; ఈ తామరస+అక్షి= ఈ తామరపూలవంటి కన్నులు కలది; తక్కన్= తప్ప; ఎవ్వరికిన్= ఇతరుల కెవ్వరికీ; శక్యము= సాధ్యం; కాదు; ఇది= నా కూతురుయొక్క ఈ శక్తిని; చేతస్+గతిన్= మనోజ్ఞానం చేత; చూచి= కనుగొని; తగవు= ధర్మం - అనగా ఇద్దరికినీ సమానలక్షణం కలగటం అనే ధర్మం; సిద్ధించుటకై= ప్రాప్తించటానికి.

**తాత్పర్యం:** మహాతపస్వీ! ఈమె తప్ప ఇతరులెవ్వరూ నీ తేజస్సును సహించలేరు. మీ ఇద్దరకూ సమానధర్మం కలిగేటట్లుగా. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. ఇమ్ముద్దియకును. 78**

**తాత్పర్యం:** ఈ స్త్రీకి కూడా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. తను వొండుగఁ జేసెద; నది । జననాంతర మెట్టు లట్ల సజ్జననుత! నీ**
**వనుమానము దక్కుము, యౌ । వనమును గైకొనుము, కన్య వరియింపు తగన్. 79**

**ప్రతిపదార్థం:** సజ్జన= మంచివారిచేత; నుత=పొగడబడినవాడా!; తనువు= శరీరం; ఒండుగన్= మరియొకవిధంగా ఉండేటట్లుగా; చేసెదన్= చేస్తాను; అది= ఆ కొత్త శరీరం; జనన+అంతరము= మరియొక జన్మం; ఎట్టులు= ఎట్టిదో; అట్లు+అ= అట్టిదే; నీవు; అనుమానము= అనుమానాన్ని; తక్కుము= వదలుము; యౌవనమును= యౌవనాన్ని; కైకొనుము= స్వీకరించుము; కన్యన్= నా ఈ కూతురిని; తగన్= ధర్మయుక్తంగా; వరియింపు= పెండ్లిచేసికొనుము.

**తాత్పర్యం:** (ఈమెకు) నూతన శరీరం ప్రాప్తించేటట్లు చేస్తాను. ఆ శరీరప్రాప్తి పునర్జన్మం వంటిదే. నీ వే అనుమానం పెట్టుకొనవద్దు. యౌవనవంతుడవై నా కుమార్తెను పెండ్లాడుము.

**వ. అధర్మంబు గాకుండు నట్లుగా వరంబిచ్చితి' నని యనుగ్రహించి, యక్కన్యకారత్నంబునకును. 80**

**ప్రతిపదార్థం:** అధర్మంబు= అధర్మము; కాక+ఉండు+అట్లు+కాన్= కాకుండేటట్లుగా; వరంబు= వరాన్ని; ఇచ్చితిన్= ఇచ్చాను; అని; అనుగ్రహించి= దయచూపి; ఆ కన్యకారత్నంబునకున్= ఉత్తమురాలయిన ఆ కన్యకు కూడా.

**తాత్పర్యం:** ఇది అధర్మం కాకుండేటట్లుగా వర మిచ్చాను' అని గౌతముడు దయచూపి ఆ ఉత్తమకన్యకు కూడా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. తనులత యొండు చేసిన, నుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య**
**వ్వనిత వివాహమయ్యె నృపవర్య! పదంపడి యమ్మునీంద్రుతో**
**'ననుఁ బనిగొండు మీరలు మనంబున నెద్ది దలంచి వేడ్క సే**
**సిన నది దెత్తు; మీకరుణఁ జేసియ కల్గెడు నాకు శక్తియున్.' 81**

**ప్రతిపదార్థం:** నృపవర్య!= రాజోత్తమా!; తనులత= అందమయిన తీగవంటి దేహాన్ని; ఒండు= మరొకటి; చేసినన్= కలిగించగా; ఉదంకుఁడు= ఉదంకుడు; యౌవన లక్ష్మిన్= యౌవన సంపదను; తాల్చి= ధరించి; ఆ వనితన్= ఆ స్త్రీని; వివాహము+అయ్యెన్= పెండ్లాడాడు; పదంపడి= తరువాత; ఆ ముని+ఇంద్రుతోన్= ఆ మునిశ్రేష్ఠుడితో; ననున్= నన్ను; పనిగొండు= ఆజ్ఞాపించండి; మీరలు= మీరు; మనంబునన్= మనస్సులో; ఎద్ది= దేనిని; తలంచి= అనుకొని; వేడ్క+చేసినన్= ఆపేక్షిస్తారో; అద్ది= దానిని; తెత్తున్= తెస్తాను; మీ= మీయొక్క; కరుణన్+చేసి+అ= దయవలననే; నాకున్= నాకు; శక్తియున్= శక్తికూడా; కల్గెడున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** అందమైన తీగవంటి శరీరాన్ని కలిగించాడు. రాజోత్తమా! ఉదంకుడు యౌవనం పొంది గురుపుత్రిని

వివాహం చేసికొన్నాడు. తరువాత అతడు గౌతముడితో 'మీరు న న్నాజ్ఞాపించండి. మీరు ఆపేక్షించిన దానిని తీసికొని వస్తాను. ఈ పని చేయటానికి కావలసిన శక్తి నాకు మీ దయవలననే సమకూరుతుంది.

**క. అని విన్నపంబు సేసిన । విని దక్షిణఁ బ్రీతియగుట వే ఱొరులకుఁ గా**
**కనఘ! భవదీయ చరితం । బునఁ జూవే నాకు ననియె ముని మనుజేంద్రా! 82**

**ప్రతిపదార్థం:** అని; విన్నపంబు+చేసినన్= మనవిచేయగా; ముని= గౌతముడు; విని; అనఘ!= పాపరహితుడా!; నాకున్= నాకు; దక్షిణన్= గురుదక్షిణచేత; ప్రీతి= సంతోషం; అగుట; వేఱు+ఒరులకున్+కాక= ఏ ఇతరులవలన కాక; భవదీయ= నీయొక్క; చరితంబునన్= నడవడివలననే; చూవే!= సుమా!; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉదంకుడు విన్నవించుకొన్నాడు. అప్పుడు గౌతముడు 'పుణ్యాత్మా! ఇతరులవలన గాక; నీ నడవడిచేతనే నాకు దక్షిణవలన కలిగే సంతోషం లభిస్తుంది' అని అన్నాడు. నీ సత్ప్రవర్తనయే నాకు గురుదక్షిణ' అని అర్థం.

**తే. అంత నిలువక మునిపత్ని కతఁడు భక్తి । నెఱఁగి తల్లి! మీ రానతియిండు, మీకు**
**వలయునట్టి పదార్థ మవశ్యమును స । మాహరింతు నే, ననుటయు నయ్యహల్య. 83**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ ఉదంకుడు; అంతన్= అంతటితో; నిలువక= ఆగకుండా; మునిపత్నికిన్= గౌతమముని భార్యకు; భక్తిన్= భక్తితో; ఎఱఁగి= నమస్కరించి; తల్లి!= అమ్మా!; మీరు; ఆనతి+ఇండు= సెలవియ్యండి; మీకున్= మీకు; వలయు+అట్టి= కావలసినటువంటి; పదార్థము= పదార్థాన్ని; అవశ్యమును= తప్పకుండా; నేను; సమాహరింతున్= తెస్తాను; అనుటయున్= అనిన తరువాత; ఆ+అహల్య= ఆ గౌతముడి భార్య అయిన అహల్య.

**తాత్పర్యం:** గురువు మాటలు విన్న తరువాత కూడా ఉదంకుడు ఊరుకొనలేదు. అతడు గురుపత్నికి భక్తితో నమస్కరించి 'అమ్మా! మీరయినా సెలవియ్యండి. మీకు కావలసిన పదార్థాన్ని నేను తప్పకుండా తీసికొని వస్తాను' అని అన్నాడు. అప్పుడు గౌతముడి భార్య అయిన అహల్య. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'వలవదు; లాఁతి వాఁడవె? భవద్గుణతోషిత గౌతమాంచి తో**
**క్తులు మది నూఁదు మన్నను నకుంఠిత చిత్తత నొత్తి పల్కె న**
**య్యలఘుతపస్వి యాసతి ప్రియంబున మిత్త్రసహాఖ్యు దేవికుం**
**డలములు దెమ్ము; నాకుఁ బ్రకటంబుగఁ బెంపు వహింపు తమ్ముఁడా! 84**

**ప్రతిపదార్థం:** వలవదు= వద్దు; లాఁతి వాఁడవు+ఎ= నీవు పరాయివాడవా; భవత్= నీయొక్క; గుణ= సుగుణాలచేత; తోషిత= సంతోషించిన; గౌతమ= గౌతముడియొక్క; అంచిత= సమంజసాలయిన; ఉక్తులు= మాటలు; మదిన్= మనస్సులో; ఊఁదుము= నిలుపుము; అన్నను= ఈ విధంగా గురుపత్ని అనిన తరువాతకూడా; ఆ అలఘు= ఆ గొప్ప; తపస్వి= ముని; అకుంఠిత= అడ్డగింప సాధ్యంకాని; చిత్తతన్= సంకల్పంతో; ఒత్తి= బలవంతంచేసి; ప్రియంబునన్= ప్రీతితో; పల్కెన్= పలికాడు; ఆ సతి= ఆ ఉత్తమ స్త్రీ, అహల్య; తమ్ముఁడా!; మిత్త్రసహ= మిత్త్రసహుడను; ఆఖ్య= పేరుగలవాడియొక్క; దేవి= పట్టపురాణియొక్క; కుండలములు= చెవి పోగులు; నాకున్= నాకొరకు; తెమ్ము= తీసికొని రమ్ము!; ప్రకటంబుగన్= ప్రసిద్ధంగా; పెంపు వహింపు= ఘనత కెక్కుము.

**తాత్పర్యం:** (అహల్య) 'నాయనా! ఈ పని వద్దు, నీవు మాకు పరాయివాడవా? నీ సద్గుణాలకు సంతోషించిన గౌతములవారు చెప్పిన మాటలు మనస్సులో పెట్టుకొమ్ము' అని అన్నది. అయినప్పటికీ ఉదంకుడు స్థిరచిత్తుడై పట్టుపట్టాడు. అప్పు డామె ప్రీతితో 'తమ్ముడా! మిత్రసహుడి దేవేరి చెవిపోగులు నాకు తెచ్చి ఇమ్ము. లోకంలో ఘనత కెక్కుము.'

**వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుండయి యప్పనికిం జనియెఁ; బదంపడి గౌతముఁ 'డుదంకునిం బొడగాన; మెచట నున్నవాఁ? డని యహల్య నడిగిన నా భృగువంశవరుం డరిగిన తెఱంగెఱింగించిన, నద్దయాళుం డద్దేవి యాననం బాలోకించి. 85**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; పనిచినన్= ఆజ్ఞాపించగా; ఆతండు= ఆ ఉదంకుడు; ప్రీతుండు+అయి= సంతోషించినవాడై; ఆ పనికిన్= ఆ చెవిపోగులు తెచ్చేపనిమీద; చనియెన్= వెళ్ళాడు; పదంపడి= తరువాత; గౌతముఁడు; ఉదంకునిన్= ఉదంకుడిని; పొడగానము= చూడము; ఎచటన్= ఎక్కడ; ఉన్నవాఁడు= ఉన్నాడు; అని; అహల్యన్= భార్య అయిన అహల్యను; అడిగినన్= అడుగగా; ఆ భృగు= ఆ భృగుమహర్షియొక్క; వంశ= వంశంలో; వరుండు= శ్రేష్ఠుడు - ఉదంకుడు; అరిగిన= వెళ్ళిన; తెఱంగు= తీరు; ఎఱింగించినన్= తెలియజేయగా; ఆ దయాళుండు= ఆ కనికరం కలవాడు; ఆ దేవి= భార్య అగు అహల్యయొక్క; ఆననంబు= ముఖాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని, ఈ విధంగా అహల్య ఆజ్ఞాపించగా ఉదంకుడు సంతోషించి ఆపనిమీద వెళ్ళిపోయాడు. తరువాత గౌతముడు 'ఉదంకుడిని ఎక్కడా చూడము. అతడు ఎక్కడకు వెళ్ళాడు' అని అహల్యను అడిగాడు. ఆమె ఉదంకుడు వెళ్ళిన పనిని గూర్చి చెప్పింది. అప్పుడు ఆ గౌతముడు భార్యముఖం చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఆ సౌదాస నరేంద్రుం। డాసుర చరితుండు; శాప మాతని నటు కాఁ**
**జేసిన యది; మానుషమాం। సాసక్తుం డగు టెఱుంగఁ డమ్ముని యతనిన్. 86**

**ప్రతిపదార్థం:** ఆ సౌదాస= ఆ సౌదాసుడనే; నర+ఇంద్రుండు= రాజు; ఆ సుర= రాక్షస సంబంధమయిన; చరితుండు= నడవడి కలవాడు; శాపము; అతనిన్= ఆ రాజును; అటు= ఆ విధంగా; కాన్= అయ్యేటట్లు; చేసిన+అది= చేసినది; ఆ ముని= ఆ ఉదంకుడు; అతనిన్= ఆ సౌదాసుడిని; మానుష= మనుష్య సంబంధమయిన; మాంస= మాంసమందు; ఆసక్తుండు= ప్రీతిగలవాడు; అగుట= అయ్యుండటం; ఎఱుంగఁడు= తెలియడు.

**తాత్పర్యం:** ఆ సౌదాసుడు రాక్షసప్రవృత్తి గలవాడు. ఒకానొకశాపం అతడిని ఆ విధంగా చేసింది. అతడికి మనుష్యమాంసం చాలా ఇష్టమనే విషయం ఉదంకుడికి తెలియదు.

**సీ. అకట! యెట్లగునొక్కొ!' యనుపల్కు కృపదోఁపఁ। బలికిన, నమ్ముగ్ధ భయము గొనుచు,**
**'నెఱుఁగ నిట్లగుట, మునీశ్వర! నా మీఁది। దయ చిగురొత్త నాతనికిఁ గీడు**
**రా కుండునట్లుగాఁ జేకొని కావవే'। యనిన నా సంయమి 'యంత వెఱవ**
**నేల? యే నతనికి నెడరు రానీ' నని। తగ నూఱడించె; నుదంకుఁ డరిగి**

**ఆ మనుజ రక్తసిక్త తనువును, గోర మీ। సములు, వృత్తలోచనములు నైన**
**యుగ్రమూర్తితోడ నొక్కశూన్యాటవి। నెలమి నున్న యన్నరేంద్రుఁ గాంచె. 87**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; ఎట్లు= ఏ విధంగా; అగున్+ఒక్కొ= జరుగుతుందో; అను= అనే; పల్కు= మాట; కృప= దయ; తోఁపన్= వెల్లడి అయ్యేటట్లు; పలికినన్= పలుకగా; ఆ+ముగ్ధ= ఆ పొరపాటు చేసిన స్త్రీ అహల్య; భయము గొనుచున్= భయపడుతూ; ముని+ఈశ్వర!= మునిశ్రేష్ఠా!; ఇట్లు= ఈ విధంగా; అగుట= సంభవించటం; ఎఱుఁగన్= తెలియను; నా మీఁదన్= నా యందు; దయ; చిగురొత్తన్= పుట్టగా; ఆతనికిన్= ఆ ఉదంకుడికి; కీడు; రాక= కలుగక; ఉండు+అట్లు+కాన్= ఉండేటట్లుగా; చేకొని= సంగ్రహించి; కావవే!= కాపాడుమా!; అనినన్= అనగా; ఆ+సంయమి= ఆ ఋషి; అంత= అంతగా; వెఱవన్= భయపడటం; ఏల?= ఎందుకు?; ఏను= నేను; అతనికిన్= ఆ ఉదంకుడికి; ఎడరు= ఆపద; రానీను= రానీయను; అని; తగన్= తగిన విధంగా; ఊఱడించెన్= ఓదార్చాడు; ఉదంకుడు; అరిగి= వెళ్ళి; ఒక్క= ఒకానొక; శూన్య= పాడువడిన; అటవిన్= అడవిలో; మనుజ= మనుష్యులయొక్క; రక్త= నెత్తురుచేత; సిక్త= తడిసిన; తనువును= శరీరాన్ని; కోరమీసములు= చివర సన్నగా ఉన్న పెద్దమీసాలు; వృత్త= గుండ్రని; లోచనములున్= కన్నులూ; ఐన= కలిగిన; ఉగ్ర= భయంకరమయిన; మూర్తితోడన్= ఆకారంతో; ఎలమిన్= ధైర్యంగా; ఉన్న; ఆ+నర+ఇంద్రున్= ఆ రాజును; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** అయ్యో! ఇంకేమి జరుగుతుందో అని గౌతముడు అన్నాడు. ఆ మాటలు విని అహల్య భయపడుతూ 'మునీంద్రా! ఇట్లా జరుగుతుందని నాకు తెలియదు. నా యందు దయకలిగి ఉదంకుడికి ఏ కీడూ కలుగకుండా రక్షించండి' అని అన్నది. అప్పుడు గౌతముడు 'ఎందుకు అంతభయం? అతడికి ఏ ఆపదా రానియ్యను' అని ఆమెను ఓదార్చాడు. ఉదంకుడు వెళ్ళీ వెళ్ళీ ఒక నిర్జనారణ్యంలో ధైర్యంగా ఉన్న సౌదాసుడిని చూచాడు. అతడి ఒళ్ళంతా మనుష్యుల రక్తంతో తడిసి ఉన్నది. కన్నులు గుండ్రంగా ఉన్నవి. అతడి మీసాలు పొడవై కొసదేలి ఉన్నాయి. అతడి ఆకారం భయంకరంగా ఉన్నది.

**క. ముని యిట్లు నెమ్మిఁ గాంచినఁ। గని యతఁ 'డాఁకొనుటఁ జేసి గాసిలి యెచ్చోఁ**
**గను వాఁడనొ? తగు భక్ష్యం?। బనుచుండఁగ వచ్చితివి ప్రియంబుగ' ననుడున్. 88**

**ప్రతిపదార్థం:** ముని= ఉదంకుడు; ఇట్లు= ఈ విధంగా; నెమ్మిన్= ధైర్యంతో; కాంచినన్= తనను చూడగా; అతఁడు= ఆ సౌదాసుడు; కని= చూచి; ఆఁకొనుటన్+చేసి= ఆకలిగొని ఉండటంచేత; గాసిలి= బాధపడి; ఎచ్చోన్= ఎక్కడ; తగు= తగిన; భక్ష్యంబు= తినుబండాన్ని; కనువాఁడను+ఒ= చూడగలుగుతానో అని; అనుచున్+ఉండఁగన్= అనుకొంటూ ఉండగా; ప్రియంబు+కన్= ప్రీతి కలిగేటట్లుగా; వచ్చితివి= వచ్చావు; అనుడున్= అనిన తరువాత.

**తాత్పర్యం:** ఉదంకుడు ధైర్యంగా తనను చూడటం సౌదాసుడు చూచాడు. అప్పుడు అతడు 'ఆకలితో బాధపడుతూ ఈ వేళ తినటానికి తిండి ఎక్కడ చూడగలుగుతానో? అని అనుకొంటున్నాను. సమయానికి సంతోషం కలిగేటట్లు నీవు వచ్చావు' అని అన్నాడు. ఆ విధంగా అనిన తరువాత.

**వ. ఉదంకుం డతని కిట్లనియె. 89**

**ప్రతిపదార్థం:** ఉదంకుడు; అతనికిన్= అతడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఉదంకుడు అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'గురుకార్యంబునకై భూ। వర! నిన్నుం గాన నేను వచ్చితి; గుర్వ**
**ర్థ రతులు హింస్యులు గా; రి। ట్లరయక యాడుదె యధర్మ మగు మాట నృపా! 90**

**ప్రతిపదార్థం:** భూవర!= భూపతీ!; గురు= గురువుయొక్క; కార్యంబునకున్+ఐ= పనిమీద; నేను; నిన్నున్= నిన్ను; కానన్= చూడటానికి; వచ్చితిన్= వచ్చాను; నృపా!= రాజా!; గురు= గురువుయొక్క; అర్థ= ప్రయోజనమందు; రతులు= ఆసక్తికలవారు; హింస్యులు= చంపదగినవారు; కారు; ఇట్లు= ఈ విధంగా; అరయక= ఆలోచించక; అధర్మము= ధర్మం కానిది; అగు= అయిన; మాట; ఆడుదు+ఎ?= పలుకుతావా?

**తాత్పర్యం:** రాజా! గురువుగారి పనిమీద నిన్ను చూడటానికి వచ్చాను. గురువుల ప్రయోజనంపట్ల ఆసక్తిగలవారు చంపదగినవారు కానేకారు. ఈ విధంగా నీవు ఆలోచింపక అధర్మమయిన మాట పలుకుతావా?

**వ. అనుటయు. 91**

**తాత్పర్యం:** ఈ విధంగా ఉదంకుడు అనిన తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'దినమున మూఁడవ యామం। బున నపరార్ధంబు యోగ్యముగ నాహారం**
**బునకుం గల్పించిరి నా। కనిమిషు, లటు గాన మాన; నాఁకలి పుత్తున్.' 92**

**ప్రతిపదార్థం:** అనిమిషులు= దేవతలు; దినమునన్= దినమునందు; మూఁడు+అవ= మూడో; యామంబునన్= జాములో; అపర= రెండో; అర్ధంబు= సగభాగం; నాకున్= నాకు; ఆహారంబునకున్= తిండికి; యోగ్యము+కన్= తగినదిగా; కల్పించిరి= నిర్ణయించారు; అటు+కాన= అందుచేత; మానన్= నిన్ను తినకుండా మానను; ఆఁకలి= నా ఆకలి; పుత్తున్= తీర్చుకొంటాను.

**తాత్పర్యం:** 'దేవతలు ప్రతిరోజూ మూడోజాములోని రెండోభాగంలో నేను తిండి తినటానికి తగినదిగా నిర్ణయించారు. కాబట్టి నిన్ను తినకుండా మానను. తిని నా ఆకలి తీర్చుకొంటాను.'

**సీ. అని పల్కె సౌదాసుఁ; డమ్ముని 'యట్లేని। నధిప! మద్గురు కార్య మాచరించి,**
**వచ్చెద మగుడ నవశ్యంబు; నా మాట। నన్నృతంబు చొరదు; నీ వర్థికోటి**
**కిష్టపదార్థంబు లిత్తు; పాత్రమ యేను;। గురులకుఁ గాఁగ నా కోరు కోర్కి**
**నీవ తీర్తని కృత నిశ్చయత్వంబున। నరుగుదెంచిన వాఁడ' ననుడు నృపతి**

**ఆ. 'యట్లకాక; యేమి యర్థించి వచ్చితి; చెప్పు 'మనిన నతఁడు చిత్త మలర**
**'ననఘ! నీదు పత్ని యర్థిమై ధరియించు। కుండలంబు' లని యతండు సెప్పె. 93**

**ప్రతిపదార్థం:** అని; సౌదాసుఁడు; పల్కెన్= అన్నాడు; ఆ+ముని= ఆ ఉదంకుడు; అధిప!= రాజా!; అట్లు+ఏని= అట్లయితే; మత్= నా యొక్క; గురు= గురువుయొక్క; కార్యంబు= పని; ఆచరించి= చేసి; అవశ్యంబు= తప్పక; మగుడన్= మరలా, తిరిగి;

వచ్చెదన్= వస్తాను; నా= నాయొక్క; మాటన్= మాటయందు; అనృతంబు= అసత్యం; చొరదు= కలుగదు; నీవు; అర్థి= యాచకులయొక్క; కోటికిన్= సమూహానికి; ఇష్ట= ప్రీతి పాత్రమయిన; పదార్థంబులు= పదార్థాలను; ఇత్తు= ఇస్తావు; ఏను= నేను; పాత్రము+అ= యోగ్యుడినే; గురులకున్= గురువులకు; కాఁగన్= ప్రయోజనం కలిగేటట్లుగా; నా కోరు= నేను కోరుతున్న; కోర్కి= కోరిక; నీవు+అ= నీవే; తీర్తు(వు)= నెరవేరుస్తావు; అని; కృత= చేయబడిన; నిశ్చయత్వంబునన్= నిశ్చయధర్మంతో, నిశ్చయంచేసికొని; అరుగుదెంచినవాఁడన్= వచ్చినవాడిని; అనుడున్= అని అనగా; నృపతి= రాజు సౌదాసుడు; అట్లు= అట్లే; కాక= అగునుగాక; ఏమి= దేనిని; అర్థించి= కోరి; వచ్చితి= వచ్చావు; చెప్పుము; అనినన్= అనగా; అతఁడు= ఆ ఉదంకుడు; చిత్తము= మనస్సు; అలరన్= సంతోషించగా; అనఘ!= పాపంలేనివాడా!; నీదుపత్ని= నీ భార్య; అర్థిమైన్= ప్రీతితో; ధరియించు= ధరించే; కుండలంబులు= చెవిపోగులు; అని; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని సౌదాసుడు అన్నాడు. అప్పుడు ఉదంకుడు 'రాజా! అట్లయితే నేను నా గురువుగారి పని తీర్చి తప్పకుండా తిరిగి వస్తాను. నా మాట కల్లగాదు. నీవు యాచకుల కిష్టమయిన పదార్థాలను దానంచేస్తావు. నేను యోగ్యుడినే! గురువుగారికి ప్రయోజనం కలిగేటట్లుగా నేను కోరే కోరికను నీవే తీరుస్తావని నిశ్చయించుకొని వచ్చాను' అని అన్నాడు. అంతట రాజు 'అట్లే అవుతుందిలే! నీవు దేనిని కోరి వచ్చావు?' అని అడిగాడు. ఆ మాటకు సంతోషించి ఉదంకుడు 'పుణ్యాత్మా! నీ భార్య పరమప్రీతితో ధరించే కుండలాలే కోరి వచ్చాను' అని చెప్పాడు.

**వ. చెప్పిన విని యమ్మనుజవరుం 'డొరులధనం బిచ్చు వారలు గలరె? కుండలంబు లడుగ కొండెద్దేనియు నడుగు' మనుటయు, నాసంయమి 'నీవు నెపంబిడి త్రోవం గలవాఁడవు గావే నన్యవస్తువు లొల్ల' నని పలికిన, నా భూవల్లభుం డమ్మాట కియ్యకొని, 'యానాతి యున్న చోటికిం జను; మేఁ బుత్తెంచితి, నని చెప్పి, నీ వాంఛితం బెఱింగింపు' మని నియోగించిన, నమ్ముని 'యద్దేవి యెచ్చోట నున్న యది?' యని యడిగిన నప్పుడమిఱేఁ 'డల్లదె తన్నివాస ప్రదేశం' బని చూపినం బోయి. 94**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= ఉదంకుడు చెప్పగా; విని; ఆ+మనుజవరుండు= ఆ నరపతి సౌదాసుడు; ఒరుల= ఇతరులయొక్క; ధనంబు= డబ్బు; ఇచ్చువారలు= ఇచ్చేవారు; కలరు+ఎ?= ఉన్నారా?; కుండలంబులు; అడుగక= అడుగకుండా; ఒండు= మరియొకటి; ఎద్ది+ఏనియున్= ఏదైనా; అడుగుము; అనుటయున్= అనగా; ఆ+సంయమి= ఆ ముని ఉదంకుడు; నీవు; నెపంబు+ఇడి= వంకపెట్టి; త్రోవన్+కలవాఁడవు= త్రోసిపుచ్చగలవాడవు; కావు; ఏను= నేను; అన్య= ఇతరములయిన; వస్తువులు; ఒల్లన్= కోరను; అని; పలికినన్= పలుకగా; ఆ+భూవల్లభుండు= భూపతి సౌదాసుడు; ఆ+మాటకున్= ఆ మాటకు; ఇయ్యకొని= ఒప్పుకొని; ఆ+నాతి= ఆ స్త్రీ (సౌదాసుడి భార్య); ఉన్న; చోటికిన్= చోటికి; చనుము= వెళ్ళుము; ఏన్= నేను; పుత్తెంచితిన్= పంపితిని; అని; చెప్పి; నీ= నీ యొక్క; వాంఛితంబు= కోరిక; ఎఱింగింపుము= తెలియజేయుము; అని; నియోగించినన్= నియమించగా; ఆ+ముని= ఆ ముని; ఆ దేవి= ఆ పట్టపురాణి; ఏ+చోటన్= ఎక్కడ; ఉన్న+అది= ఉన్నది; అని; అడిగినన్= అడుగగా; ఆ+పుడమి= ఆ భూమియొక్క; ఱేఁడు= రాజు; అల్ల+అది+ఎ= ఆ కనబడుచున్నదే; తత్= ఆమెయొక్క; నివాస ప్రదేశంబు= నివసించే చోటు; అని; చూపినన్= చూపగా; పోయి.

**తాత్పర్యం:** ఉదంకుడు చెప్పినమాటలు విని సౌదాసుడు 'పరాయివారి సొమ్ము దానం చేసేవారు ఎక్కడయినా ఉన్నారా? కుండలాలు తప్ప ఇంకేమయినా అడుగుము' అని అన్నాడు. అప్పుడు ఉదంకుడు 'నీవు ఏదో వంకపెట్టి నా కోరికను త్రోసిపుచ్చే వాడవు కావు. నేను ఇతర వస్తువులకు ఇష్టపడను' అని చెప్పాడు. సౌదాసుడు ఉదంకుడి మాటలు ఒప్పుకొని 'నీవు నా ధర్మపత్ని ఉన్నచోటికి వెళ్ళుము. నేను పంపానని చెప్పి నీ కోరిక ఆమెకు తెలియజేయుము' అని నియోగించాడు.

అప్పుడు ఉదంకుడు 'అయితే ఆ దేవి ఎక్కడ ఉన్నది?' అని ప్రశ్నించాడు. దానికి సౌదాసుడు 'అదిగో ఆ కనబడేదే ఆమె నివసించే చోటు' అని చూపి చెప్పాడు. ఉదంకుడు సౌదాసుడు చూపిన చోటికి వెళ్లాడు.

**సీ.** **అద్దేవిఁ గని యతఁ డట్ల చెప్పిన 'ముని। వల్లభ! నా కానవాలు దెమ్ము**
**నృపుపాల' ననియె నన్నెలఁత; యుదంకుండు। చనుదెంచి విభు నభిజ్ఞాన మడిగె;**
**నాతఁ 'డీగతి సేమ మగు నని నిష్ఠింప। రా; దిది వెలిగాఁగ లేదు వేఱ**
**గతియును ననుపలు కతివకు నా యిచ్చు। వర్ణితాభిజ్ఞాన నిర్ణయముగఁ**

**ఆ.** **జెప్పు; మనిన సంతసిల్లి యమ్మదయంతి। కడకు నరిగి, తత్ప్రకారమునన**
**పలుకుటయును, 'భర్తపనుపున నిచ్చెదఁ। గుండలములు నీకు గురుహితార్థి!'** **95**

**ప్రతిపదార్థం:** ఆ+దేవిన్= ఆ దేవేరిని; కని= చూచి; అతఁడు= ఆ ఉదంకుడు; అట్లు+ఆ= అట్లే (సౌదాసుడు చెప్పిన విధంగానే); చెప్పినన్= చెప్పగా; ఆ+నెలఁత= ఆ స్త్రీ, సౌదాసుడి భార్య; మునివల్లభ!= మునీంద్రా!; నృపుపాలన్= రాజు దగ్గరి నుండి; నాకున్= నాకు; ఆనవాలు= గుర్తు; తెమ్ము= తీసికొనిరమ్ము; అనియెన్= అన్నది; ఉదంకుండు=ఉదంకుడు; చనుదెంచి= తిరిగివచ్చి; విభున్= రాజును; అభిజ్ఞానము= గుర్తు; అడిగెన్= అడిగాడు; అతఁడు= ఆ సౌదాసుడు; ఈ గతిన్= ఈ విధంగా; సేమము= క్షేమం; అగును; అని; నిష్ఠింపరాదు= నిశ్చయించరాదు; ఇది= ఈ పద్ధతి; వెలి= బహిష్కరించినది, వదలినది; కాఁగన్= అయ్యేటట్లయితే; అభిజ్ఞాన= గుర్తుకు సంబంధించిన; నిర్ణయము+కన్= నిర్ణయంగా; చెప్పుము; అనినన్= అనగా; సంతసిల్లి= సంతోషించి; ఆ మదయంతి= ఆ సౌదాసుడి భార్య అయిన మదయంతియొక్క; కడకున్= దగ్గరకు; తిరిగి= వెళ్ళి; తద్= ఆ; ప్రకారమునన్+అ= విధంగానే, సౌదాసుడు చెప్పినట్లే; పలుకుటయును= పలుకగా; గురు= గురువుయొక్క; హిత= హితాన్ని; అర్థి= కోరేవాడా!; నీకున్= నీకు; భర్త= నా నాథుడియొక్క; పనుపునన్= ఆజ్ఞచేత; కుండలములు= కుండలాలు; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** ఉదంకుడు ఆ దేవేరిని చూచి సౌదాసుడు చెప్పినట్లే చెప్పాడు. అప్పుడామె 'మునీశ్వరా! రాజు దగ్గరినుండి ఒక గుర్తు తీసికొనిరమ్ము!' అని అడుగగా ఉదంకుడు తిరిగివచ్చి రాజును గుర్తు అడిగాడు. అంత రాజు 'ఈ విధంగానే క్షేమం కలుగుతుందని నిశ్చయించలేము. దీనిని వదలితే వేరే గతీ లేదు. ఈ మాటలే నేను స్పష్టంగా తెలియజేసే గుర్తు అని ఆమెతో చెప్పుము' అని అన్నాడు. ఉదంకుడు సౌదాసుడి భార్య అయిన మదయంతి దగ్గరకు తిరిగి వెళ్ళి అతడు చెప్పిన మాటలే చెప్పాడు. మదయంతి 'ఓ గురుహితాభిలాషీ! నీకు నా నాథుడి ఆజ్ఞవలన కుండలాలు ఇస్తాను.'

**వ.** **అని యక్కొమ్మ యమ్మహితాత్మునితో మఱియును.** **96**

**ప్రతిపదార్థం:** అని; ఆ+కొమ్మ= ఆ స్త్రీ, మదయంతి; ఆ+మహిత= గౌరవించబడిన-గొప్పదైన; ఆత్మునితోన్= ఆత్మగలవాడితో; మఱియును= ఇంకనూ.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి మదయంతి ఆ మహాత్ముడితో ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

సీ. **'సురులు గంధర్వులు నురగులు నిక్కుండ । లములకుఁ బెక్కుపాయముల వేచి**
**తరుగుదు; రెంగిలి పొరసిన, నేమఱి । నీవు నిద్రించిన, నేల నిడిన,**
**నపహరింతురు; భక్తి నర్చించి యివిదాల్ప । నాఁకలి నీరువ ట్టగ్నిభయము**
**విషవికారము, భూతబేతాళ బాధలు । పొరయవు; వినుము, బాలురకు నైనఁ**

ఆ. **బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యయి । కొలఁది నమరియుండుఁ; గురియుఁ బసిఁడి;**
**వీని నప్రమత్త వృత్తిమైఁ గొని చను । మయ్య! గురులు నిన్ను నభినుతింప.'** **97**

**ప్రతిపదార్థం:** సురులు= దేవతలు; గంధర్వులున్= గంధర్వులు; ఉరగులున్= నాగులు; ఈ కుండలములకున్= ఈ కుండలాలకొరకు; పెక్కు= ఎన్నెన్నో; ఉపాయములన్= ఉపాయాలతో; వేచి= ఎదురుచూస్తూ; తిరుగుదురు= తిరుగుతుంటారు; ఎంగిలి; పొరసినన్= తగిలినా; నీవు; ఏమఱి= పరాకుపడి; నిద్రించినన్= నిద్రించినా; నేలన్= నేలమీద; ఇడినన్= ఉంచినా; అపహరింతురు= దొంగిలిస్తారు; భక్తిన్= భక్తితో; అర్చించి= పూజించి; ఇవి= వీటిని; తాల్పన్= ధరించగా; ఆఁకలి= ఆకలి; నీరువట్టు= దప్పికా; అగ్నిభయము= అగ్నివలన భయమూ; విష= విషంవలన; వికారము= వ్యాధీ, మార్పూ; భూత= భూతాలయొక్క; బేతాళ= బేతాళాలయొక్క; బాధలు= పీడలు; పొరయవు= కలుగవు; వినుము; బాలురకున్+ఐనన్= బాలురకయినా; పెద్దవారికిన్+ఐనన్= పెద్దవారికయినా; పెట్టినన్= పెడితే; అయ్యయి= వారి వారి; కొలఁదిన్= కొలత ప్రకారం; అమరి+ఉండున్= సరిపోయి ఉంటాయి; పసిఁడిన్= బంగారాన్ని; కురియున్= కురిపిస్తాయి; గురులు= గురువులు; నిన్నున్= నిన్ను; అభినుతింపన్= మిక్కిలి కొనియాడగా; వీనిన్= వీటిని; అప్రమత్త= పరాకు లేని; వృత్తిన్= నడవడితో; కొని= తీసికొని; చనుము= వెళ్ళుము; అయ్య!= అయ్యా!.

**తాత్పర్యం:** 'అయ్యా! దేవతలూ, గంధర్వులూ, నాగులూ ఎన్నో ఉపాయాలు పన్నుతూ ఈ కుండలాలకొరకు ఎదురుచూస్తూ తిరుగుతుంటారు. ఎంగిలి అంటుకొన్నా, నీవు మైమరచి నిద్రించినా, నేలమీద పెట్టినా వారు దొంగిలిస్తారు. వీటిని భక్తితో పూజించి ధరించితే ఆకలీ, దప్పికా, అగ్ని భయమూ, విషంవలన వ్యాధీ, భూత బేతాళాల పీడలూ కలుగవు. పిల్లలు పెట్టుకొన్నా,పెద్దలుపెట్టుకొన్నా వారి వారి కొలతల ప్రకారం అతికించినట్లు సరిపోతాయి. పైగా ఇవి బంగారాన్ని కురిపిస్తాయి. గురువులు నిన్ను మెచ్చుకొనేటట్లుగా పరాకులేకుండా వీటిని తీసికొనివెళ్ళుము.'

### ఉదంకుఁడు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట (సం. 14-57-3)

వ. **అని చెప్పి యప్పరమ పతివ్రత భక్తి ప్రీతి వినయంబులు మనంబున నంకురింప, నక్కుండలంబు లొసంగినం, బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు చేసి, యాసంయమివరుం డబ్భామచేత నా మంత్రితుండై, భూమీశ్వరు పాలికి, వికాస లసిత వదనారవిందుం డగుచు నేతెంచి, యక్కుండల లాభంబు ప్రకటించి, దీవించి, 'దేవా! నీ వలనం గృతార్థుండ నైతి' నని పలికి, 'నా కానవాలుగా నీవు చెప్పిన వాక్యం బత్యంత గూఢంబు; తదభిప్రాయంబు నెఱుంగ వలతుం; జెప్పం దగియుండు నేనిం జెప్పు' మని యడిగిన, నతం డతని తోడ.** **98**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; ఆ పరమ= ఆ గొప్ప; పతివ్రత; భక్తి= భక్తీ; ప్రీతి= సంతోషమూ; వినయంబు= వినయమూ; మనంబునన్= మనస్సులో; అంకురింపన్= మొలకెత్తగా; ఆ కుండలంబులు= ఆ కుండలాలను; ఒసంగినన్= ఇవ్వగా; ఆ సంయమి= ఆ

మునులలో; వరుండు= శ్రేష్ఠుడు; ప్రమోదంబు= మహానందం; ఎసంగన్= అతిశయించగా; ఆశీర్వాదంబుచేసి= దీవించి; ఆ భామచేతన్= ఆ స్త్రీచేత, మదయంతిచేత; ఆమంత్రితుండు+ఐ= వీడ్కోలుపొందినవాడయి; భూమీ+ఈశ్వరు= భూపతి అయిన సౌదాసుడియొక్క; పాలికిన్= దగ్గరకు; వికాస= సంతోషం చేత; లసిత= విలసిల్లిన; వదన+అరవిందుండు= ముఖపద్మం కలవాడు; అగుచున్= అవుతూ; ఏతెంచి= వచ్చి; ఆ కుండల= ఆ కుండలాలయొక్క; లాభంబు= ప్రాప్తి; ప్రకటించి= వెల్లడించి; దీవించి; దేవా!= ప్రభూ!; నీవలనన్= నీ వలన; కృత+అర్థుండన్= ధన్యుడిని; ఐతిన్= అయ్యాను; అని; పలికి; నాకున్= నాకు; ఆనవాలు+కాన్= గుర్తుగా; నీవు; చెప్పిన; వాక్యంబు= వాక్యం; అత్యంత= మిక్కిలి; గూఢంబు= రహస్యం; తత్= దానియొక్క; అభిప్రాయంబు= భావం; ఎఱుంగన్= తెలిసికొనగా; వలతున్= కోరుతున్నాను; చెప్పన్= తెలియజేయటానికి; తగి= తగినదిగా; ఉండున్+ఏనిన్= ఉండేటట్లయితే; చెప్పుము; అని; అడిగినన్= అడుగగా; అతండు= ఆ సౌదాసుడు; అతనితోడన్= ఆ ఉదంకుడితో.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి మహాపతివ్రత అయిన మదయంతి భక్తి సంతోష వినయపూర్వకంగా కుండలాలిచ్చింది. ఉదంకుడు పరమానందంతో వాటిని స్వీకరించి, ఆమెను దీవించి, వీడ్కోలుపొంది సౌదాసుడి దగ్గరకు వచ్చి, తనకు కుండలాలు లభించాయని చెప్పాడు. 'ప్రభూ! నీవలన నా కోరిక నెరవేరింది. అయితే నీవు నాకు గుర్తుగా చెప్పిన వాక్యభావం గూఢంగా ఉన్నది. ఆ భావం తెలిసికొనాలని కోరుకొంటున్నాను. అది చెప్పదగిందయితే చెప్పండి' అని అన్నాడు. అప్పుడు సౌదాసుడు అతడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **'బ్రాహ్మణజనముల రాజులు పూజింతు; । రటుగాన నేను విప్రార్చనంబు**
**సేయుదు; విప్రుని చేతన యిట్లైతి । వెడదప్పునన; యొండు వెరవు నాకు**
**దురితంబు వాపంగ దొరకొన; దది కార । ణముగ భూసుర పూజనంబు దుష్క**
**రము; దీన మేలు గందు మనంగ రా; దిది । గాదన్న వేఱొండు గలదె మార్గ;**

**తే.** **మని యభిజ్ఞానముగ మదయంతి కపుడు । చెప్పి పుచ్చితి; నిట్లు విశిష్టరత్న**
**మయ మహాకుండలము లిచ్చి మాన్తుఁ గీడు । నీకతన; నను తలఁపున లోకవంద్య!'** **99**

**ప్రతిపదార్థం:** లోక= లోకంచేత; వంద్య!= కొనియాడదగినవాడా!; రాజులు; బ్రాహ్మణజనములన్= బ్రాహ్మణులను; పూజింతురు= పూజిస్తారు; అటు+కాన= అందుచేత; నేను; విప్ర= బ్రాహ్మణులయొక్క; అర్చనంబు= పూజను; చేయుదున్= చేస్తుండేవాడిని; వెడ= చిన్న; తప్పునన్+అ= తప్పువలననే; విప్రునిచేతన్+అ= బ్రాహ్మణుడిచేతనే; ఇట్లు= ఈ విధంగా; ఐతిన్= అయ్యాను; దురితంబు= పాపాన్ని; పాపంగన్= తొలగించుకొనగా; ఒండు= ఇతరమైన; వెరవు= ఉపాయం; దొరకొనదు= చేకూరదు; అది; వేరే ఉపాయం లేకపోవటం; కారణము+కన్= కారణంగా; భూసుర= బ్రాహ్మణులయొక్క; పూజనంబు= పూజ; దుష్కరము= చేయశక్యం కానిది; దీనన్= బ్రాహ్మణ పూజవలన; మేలు= మంచి; కందుము= పొందుతాము; అనంగన్+రాదు= అనటానికి వీలులేదు; ఇది= బ్రాహ్మణపూజ; కాదు= తగదు; అన్నన్= అంటే; వేఱు+ఒండు= మరియొక; మార్గము= దారి; కలదు+ఎ?= ఉన్నదా?; అని= అనుకొని; ఇట్లు= ఈ విధంగా; విశిష్ట= శ్రేష్ఠములైన; రత్న= రత్నాలతో; మయ= నిండిన; మహత్= గొప్ప; కుండలములు= చెవిపోగులు; ఇచ్చి= సమర్పించి; నీకతనన్= నీ వలన; కీడు; మాన్తున్= తొలగించుకొంటాను; అను= అనే; తలఁపునన్= అభిప్రాయంతో; అపుడు; అభిజ్ఞానముగన్= గుర్తుగా; మదయంతికిన్= మదయంతికి; చెప్పి; పుచ్చితిన్= పంపాను.

**తాత్పర్యం:** 'లోకస్తుత్యా! రాజులు బ్రాహ్మణులను పూజిస్తారు. అందుచేత నేనూ బ్రాహ్మణపూజ చేస్తుండేవాడిని; ఒక చిన్న తప్పుచేత బ్రాహ్మణుడివలన ఇట్లా అయ్యాను. నా పాపం పోగొట్టుకొనటానికి వేరే ఉపాయం లేదు. కాబట్టి బ్రాహ్మణపూజ చాలా కష్టం. దీనివలన మేలు కలుగుతుందని చెప్పటానికి వీలులేదు. అట్లని మేలు కలిగించే వేరే

మార్గమూ లేదు. ఇదే గుర్తుగా మదయంతికి చెప్పాను. రత్నఖచిత కుండలాలను నీ కిచ్చి నీ వలన నాకు కలిగిన కీడును తొలగించుకొనవచ్చని నేను అభిప్రాయపడ్డాను.'

**వ. అనియె నా భృగువంశ వరేణ్యుని పుణ్యసన్నిధింజేసి యా సౌదాస నరేంద్రునకు సంప్రాప్త సమాధాన నూతన సత్త్వంబు గలుగుట కతంబునం గార్యదర్శనంబును, గుండలదాన శ్రద్ధయు, శాంతవచనంబునుం గలిగెఁ; దదీయవచన శ్రవణానంతరంబ యుదంకుం డతనితో 'మిత్రత్వంబు సంభాషణమాత్ర సిద్ధంబగుట బోధవృద్ధులు చెప్పుదు 'రేను నీవలనం గృతార్థుండ నైతిఁ; బోవుచున్నవాఁడ; మగిడి వచ్చెద; నని పలికితి; 'బొంకువడకుండ వత్తు' ననినఁ జిత్తంబు కృపాయత్తంబగుచుండ నా భూపతి యత్తాపసోత్తము నాననం బాలోకించి. 100**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; ఆ భృగు= ఆ భృగుమహర్షియొక్క; వంశ= వంశంలోని; వరేణ్యుని= శ్రేష్ఠుడియొక్క, ఉదంకుడియొక్క; పుణ్య= పవిత్రమైన; సన్నిధిన్+చేసి= సమక్షంవలన; ఆ సౌదాస= ఆ సౌదాసుడనే; నరేంద్రునకున్= రాజునకు; సంప్రాప్త= చక్కగా పొందబడిన; సమాధాన= శాంతివలన కలిగిన; నూతన= కొత్తదయిన; సత్త్వంబు= తెలివి; కలుగుట= లభించటం; కతంబునన్= వలన; కార్య= పనియొక్క; దర్శనంబును= జ్ఞానమునూ; కుండల= కుండలాలను; దాన= ఇవ్వటంలో; శ్రద్ధయున్= తీవ్రమయిన కోరికయూ; శాంత= నెమ్మదితో కూడిన; వచనంబునున్= మాటయు; కలిగెన్= లభించాయి; తదీయ= ఆ సౌదాసుడియొక్క; వచన= మాటలను; శ్రవణ= వినుటయొక్క; అనంతరంబు+అ= తరువాతనే; ఉదంకుండు= ఉదంకుడు; అతనితోన్= ఆ సౌదాసుడితో; మిత్రత్వంబు= స్నేహం; సంభాషణ= సల్లాపం; మాత్ర= మాత్రాననే; సిద్ధంబు= పొందబడేది; అగుట= కావటం; బోధ= జ్ఞానంచేత; వృద్ధులు= వృద్ధులైనవారు; చెప్పుదురు= చెప్పుతారు; ఏను= నేను; నీవలనన్= నీ వలన; కృత+అర్థుండన్= కోరిక నెరవేరిన వాడిని; ఐతిన్= అయ్యాను; పోవుచున్నవాఁడన్= వెళ్ళిపోతున్నాను; మగిడి= తిరిగి; వచ్చెదన్= వస్తాను; అని; పలికితిన్= చెప్పాను; బొంకు+పడక+ఉండన్= అసత్యాన్ని పొందకుండా; వత్తున్= తిరిగి వస్తాను; అనినన్= అనగా; చిత్తంబు= మనస్సు; కృపా= దయకు; ఆయత్తంబు= వశమైనది; అగుచున్+ఉండన్= అవుతుండగా; ఆ భూపతి= ఆ రాజు; ఆ తాపస= ఆ మునులలో; ఉత్తమ= ఉత్తముడియొక్క; ఆననంబు= ముఖాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని సౌదాసుడు చెప్పాడు. భృగువంశంలో శ్రేష్ఠుడయిన ఆ ఉదంకుడి పవిత్ర సన్నిధానంచేత సౌదాసుడికి శాంతీ, దానివలన తెలివీ కలిగాయి. ఆ ఎరుకవలన ఏం చెయ్యాలో తెలిసింది. కుండలాలు దానం చేయాలనే శ్రద్ధ, నెమ్మదిగా మాటాడటం పుట్టుకొనివచ్చాయి. అతడిమాటలు విన్న ఉదంకుడు అతడితో 'సల్లాప మాత్రాననే స్నేహం సిద్ధిస్తుం'దని జ్ఞానవృద్ధులు ప్రవచిస్తారు. నీ వలన నా కోరిక నెరవేరింది. నేను పోతున్నాను. తిరిగివస్తానని నీతో చెప్పాను. అసత్యవాదిని కాకుండా మరలి వస్తాను అని అన్నాడు. ఆ మాటలు విన్న సౌదాసుడి మనస్సు దయతో నిండిపోయింది. అతడు మునీశ్వరుడయిన ఉదంకుడి ముఖంలోకి కన్నులు పెట్టి చూచి.(-తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'చంపెడు నట్టి నా కడకు సంయమివల్లభ! వత్తురయ్య? నీ**
**పెంపును నిక్కముం దెలిసెఁ; బ్రీతుఁడ నైతి; మదార్తి నీ తప**
**స్సంపదఁ జేసి పాపు' మని సమ్మతిఁ బల్కిన వీనులందుఁ బే**
**రిం పొలయం, బ్రసన్నత వహింపఁగఁ జిత్త ముదంకుఁ డిట్లనున్. 101**

**ప్రతిపదార్థం:** సంయమి వల్లభ!= మునీశ్వరా!; చంపెడు+అట్టి= ప్రాణాలు తీసే; నా కడకున్= నా దగ్గరకు; వత్తురు+అయ్య!= ఎవరైనా వస్తారటయ్యా!; నీ= నీ యొక్క; పెంపును= గొప్పతనమూ; నిక్కము= సత్యమూ; తెలిసెన్= తెలిసినవి; ప్రీతుఁడన్= సంతోషించినవాడిని; ఐతిన్= అయ్యాను; నీ= నీ యొక్క; తపస్+సంపదన్+చేసి= తపస్సంపదవలన; మత్= నాయొక్క; ఆర్తిన్= దుఃఖాన్ని; పాపుము= పోగొట్టుము; అని; సమ్మతిన్= అభిలాషతో; పల్కినన్= పలుకగా; ఉదంకుఁడు; వీనులు+అందున్= చెవులలో; పేరు= ఎక్కువ అయిన; ఇంపు= ఆనందం; ఒలయన్= వ్యాపించగా; చిత్తము= మనస్సు; ప్రసన్నత= దయను; వహింపఁగన్= పొందగా; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** 'మునీశ్వరా! ప్రాణాలు తీసే నా దగ్గరకు ఎవరైనా వస్తారటయ్యా! నీ గొప్పతనమూ, సత్యమూ నాకు తెలిశాయి. సంతోషించాను. నీ తపస్సుచేత నా దుఃఖాన్ని తొలగించుము' అని సౌదాసుడు ఎంతో అపేక్షతో అన్నాడు. ఆ మాటలతో ఉదంకుడి చెవులకానందం కలిగింది. మనస్సు దయవలన ఆర్ద్రమయింది. అతడు సౌదాసుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'ఏమిటనైన నొప్పమి నరేంద్ర! సుచిత్తులఁ బొందె నేనియున్**
**వే మరలున్; భవద్గుణమ వీతకళంకునిఁ జేసె నిన్ను; సాం**
**ద్రామలకీర్తి గౌతమ మహాముని చల్లని చిత్తవృత్తి నీ**
**పై మలఁగించెఁ గావలయుఁ బార్థివసత్తమ! పొందు మున్నతిన్. 102**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; ఏమిటన్+ఐనన్= ఏ కారణంవలననైనా; ఒప్పమి= ఆపద, కీడు; సుచిత్తులన్= మంచి మనస్సు కలవారిని; పొందెన్+ఏనియున్= పొందినప్పటికీ; వే= శీఘ్రంగా; మరలున్= అది తొలగిపోతుంది; భవత్= నీ యొక్క; గుణము+అ= మంచిగుణమే; నిన్నున్= నిన్ను; వీత= తొలగిన; కళంకునిన్= పాపంగలవాడినిగా; చేసెన్= చేసింది; సాంద్ర= దట్టమయిన; అమల= నిర్మలమైన; కీర్తి= కీర్తి కలవాడైన; గౌతమ= గౌతముడనే; మహత్+ముని= గొప్ప మునియొక్క; చల్లని= శాంతిని కలిగించే; చిత్తవృత్తి= మనోవ్యాపారం; నీ పైన్= నీమీదికి; మలఁగించెన్= మరలించాడు; కావలయున్= కాబోలు; పార్థివ= రాజులలో; సత్తమ!= మిక్కిలి శ్రేష్ఠుడా!; ఉన్నతిన్= గొప్పతనాన్ని; పొందుము.

**తాత్పర్యం:** 'ఏ కారణంవలననైనా మంచి మనస్సుకలవారికి ఆపద కలిగినప్పటికీ అది వెంటనే తొలగిపోతుంది. నీ మంచిగుణమే నిన్ను పుణ్యాత్ముడిని చేసింది. మహాకీర్తి సంపన్ను డయిన గౌతమ ఋషీశ్వరుడు ఇప్పుడు నిన్ను చల్లని మనస్సుతో చూచాడు కాబోలు! నీవు నీ పూర్వోన్నత్యాన్ని పొందుము.'

**క. అని పలికి, మఱియుఁ బలుదీ । వన లిచ్చి యతండు గారవమున నతనిమేన్**
**దన కరముల నివిరి, ప్రియం । బొనర్చె; నిర్దురితుఁ డైన యుర్వీపతియున్. 103**

**ప్రతిపదార్థం:** అని; పలికి; మఱియున్= ఇంకా; పలు= అనేకములయిన; దీవనలు+ఇచ్చి= దీవనలిచ్చి; అతండు= ఆ ఉదంకుడు; గారవమునన్= ప్రేమతో; అతని= ఆ సౌదాసుడి; మేన్= శరీరాన్ని; తన= తనయొక్క; కరములన్= చేతులతో; నివిరి= నిమిరి; ప్రియంబు+ఒనర్చెన్= ప్రీతిని కలిగించాడు; నిర్+దురితుఁడు= పాపంలేనివాడు; ఐన= అయిన; ఉర్వీపతియున్= భూపతియూ-సౌదాసుడునూ.

**తాత్పర్యం:** ఉదంకుడు ఈ విధంగా పలికి, అంతటితో ఊరుకొనకుండా సౌదాసుడిని దీవనలతో ముంచెత్తాడు. ప్రేమపూర్వకంగా తన చేతులతో అతడి శరీరాన్ని నిమిరి ఆనందం కలిగించాడు. దీనివలన పుణ్యాత్ముడయిన సౌదాసుడు.(-తరువాతి వచనంతో అన్వయం.)

**వ.** **భక్తి వినయ సంభరితుం డయి, యప్పరమమునిం బ్రస్తుతించి, నమస్కరించి, యామంత్రణంబు చేసిన, నమ్మహాత్ముండు కుండలంబులు కృష్ణాజినంబునం బదిలంబుగా ముడిచికొని, గౌతమమాశ్రంబునకు రయంబునం బోయి పోయి, పక్వఫలంబులం బెరిఁగిన బిల్వంబుం గని, యాఁకటి పెల్లునం దదీయ విటపంబున సకుండలం బగునయ్యజినంబు దగిల్చి, యమ్మహీరుహం బెక్కి ఫలంబులు గోసికొనుచుండె.104**

**ప్రతిపదార్థం:** భక్తి= భక్తితో; వినయ= వినయంతో; సంభరితుండు= మిక్కిలి నిండినవాడు; అయి; ఆ పరమ= సర్వశ్రేష్ఠుడగు; మునిన్= ఆ ఉదంకుడిని; ప్రస్తుతించి= మిక్కిలి కొనియాడి; నమస్కరించి; ఆమంత్రణంబు చేసినన్= వీడ్కోల్పగా; ఆ మహత్+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మగలవాడు - ఉదంకుడు; కుండలంబులు= కుండలాలను; కృష్ణ= నల్లని; అజినంబునన్= లేడితోలుతో; పదిలంబుగాన్= జాగ్రత్తగా; ముడిచికొని= కట్టుకొని, గౌతమ= గౌతమునియొక్క; ఆశ్రమంబునకున్= ఆశ్రమానికి; రయంబునన్= వేగంగా; పోయి పోయి= వెళ్ళి వెళ్ళి; పక్వ= పాకానికి వచ్చిన; ఫలంబులన్= పండ్లతో; పెరిఁగిన= పెరిగిన; బిల్వంబున్= బిల్వవృక్షాన్ని; కని= చూచి; ఆఁకలి+పెల్లునన్= ఎక్కువ ఆకలిచేత; తదీయ= ఆ; విటపంబునన్= ఆ చెట్టునందు; సకుండలంబు= కుండలాలతో కూడినది; అగు= అయిన; ఆ అజినంబు= ఆ లేడితోలును; తగిల్చి= తగిలించి; ఆ మహీరుహంబు= ఆ చెట్టు; ఎక్కి; ఫలంబులు= పండ్లు; కోసికొనుచుండెన్= కోసికొంటున్నాడు.

**తాత్పర్యం:** భక్తి వినయాలతో నిండినవాడై, ఆ మహర్షిని పొగడి, నమస్కరించి వీడ్కొలిపాడు. ఉదంకుడు కుండలాలను జాగ్రత్తగా లేడితోలులో మూటకట్టుకొని గౌతమాశ్రమానికి తొందరగా వెళ్ళాడు. దారిలో పండ్లతో నిండిన బిల్వవృక్షాన్ని చూచి, ఆకలి ఎక్కువ కావటంవలన, కుండలాలున్న లేడితోలును చెట్టుకు తగిలించి, దానినెక్కి పండ్లు కోసికొంటున్నాడు.

**సీ.** **గాలి నవ్విటప మాలోల మగుడుఁ దగు। లెడలి, యయ్యజినంబు పుడమిఁ బడినఁ**
**గని, యొక్కనాగంబు గ్రక్కునఁ జనుదెంచి। వెసఁ బుచ్చికొని కడు వేగ పఱవఁ**
**గాంచి యుదంకుండు గ్రమ్మన దిగదాఁటి। వెనుకొనునంతకు గనపపుట్టఁ**
**జొచ్చె నయ్యురగ, మా సువ్రత పరుఁడు దీ। వ్రముఖ కాష్ఠము గొని త్రవ్వఁదొడఁగె;**

**తే.** **దాని సైరింపఁ జాలక ధరణి తలరె;। విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య**
**కోలఁ ద్రవ్విన మాత్రఁ బాతాళయాన। మేల సిద్ధింపనేర్చు మునీంద్ర! వినుము. 105**

**ప్రతిపదార్థం:** గాలిన్= గాలిచేత; ఆ విటపము= ఆ కొమ్మ; ఆలోలము= అంతటా ఊగింది; అగుడున్= అయిన తరువాత; తగులు= కట్టు; ఎడలి= సడలి; ఆ అజినంబు= ఆ లేడితోలు; పుడమిన్= నేలమీద; పడినన్= పడగా; ఒక్కనాగంబు= ఒక పాము; కని= చూచి; గ్రక్కునన్= తొందరగా; చనుదెంచి= వచ్చి; వెసన్= శీఘ్రంగా; పుచ్చికొని= తీసికొని; కడున్= మిక్కిలి; వేగ= వేగంగా; పఱవన్= పారిపోగా; ఉదంకుండు; కాంచి= చూచి; క్రమ్మనన్= శీఘ్రంగా; దిగదాఁటి= కిందికి దూకి; వెనుకొను+అంతకున్= వెంబడించేటప్పటికి; ఆ ఉరగము= ఆ పాము; గనపపుట్టన్= పెద్ద పుట్టలో; చొచ్చెన్= ప్రవేశించింది; ఆ సువ్రత= ఆ సదాచారములందు; పరుఁడు= ఆసక్తికలవాడు, ఉదంకుడు; తీవ్ర= వాడి అయిన; ముఖ= మొనగలిగిన; కాష్ఠము=

కఱ్ఱను; కొని= తీసికొని; త్రవ్వన్= పుట్ట త్రవ్వటానికి; తొడఁగెన్= పూనుకొన్నాడు; దానిన్= ఆ తవ్వటాన్ని; సైరింపన్= ఓర్చుకొనగా; చాలక= సమర్థం కాక; ధరణి= భూమి; తలరెన్= కంపించింది; గీర్వాణ= దేవతలకు; విభుఁడు= ప్రభువు, ఇంద్రుడు; విప్రుఁడై= బ్రాహ్మణుడై; వచ్చి; కొయ్యకోలన్= ములుగఱ్ఱతో; త్రవ్వినమాత్రన్= త్రవ్వినంతమాత్రాన; మునీంద్రా!= మునీశ్వరా!; పాతాళయానము= పాతాళలోక ప్రయాణం; ఏల?= ఎట్లా?; సిద్ధింప నేర్చున్= ప్రాప్తిస్తుంది; వినుము.

**తాత్పర్యం:** గాలికి ఆ చెట్టు ఊగేటప్పటికి, కట్టు సడలి, లేడితోలు నేలమీద పడింది. అది చూచి ఒకపాము వచ్చి, ఆ కుండలాలు తీసికొని వేగంగా పారిపోయింది. ఇదంతా చూచిన ఉదంకుడు వెంటనే క్రిందకుదూకి పామును వెంబడించాడు. అది ఒక పెద్దపుట్టలో దూరింది. అప్పుడు అతడు వాడిమొన ఉన్న కఱ్ఱతో పుట్టను త్రవ్వటం మొదలు పెట్టాడు. త్రవ్వటం సహించలేక భూమి కంపించింది. ఆ సమయంలో ఇంద్రుడు బ్రాహ్మణరూపంతో వచ్చి 'మునీశ్వరా! ములుగఱ్ఱతో తవ్వినంతమాత్రాన పాతాళలోకానికి ప్రయాణం చెయ్యటం సాధ్యమవుతుందా?'

**వ. పాతాళభువనం బిచ్చటికి సహస్రయోజనంబుల నున్నది; కుండలంబులు గొనిపోయిన భుజంగం బైరావతా పత్యం' బనిన విని యమ్మునిశిష్యుండు. 106**

**ప్రతిపదార్థం:** పాతాళభువనంబు= పాతాళలోకం; ఇచ్చటికిన్= ఇక్కడికి; సహస్ర= వేయి; యోజనంబులన్= ఆమడలదూరంలో; ఉన్నది; కుండలంబులు= కుండలాలు; కొనిపోయిన= దొంగిలించిన; భుజగంబు= పాము; ఐరావత= ఐరావతుడియొక్క; అపత్యంబు= సంతానం (కొడుకు); అనినన్= అనగా; విని; ఆ ముని= ఆ గొప్ప మునియొక్క; శిష్యుండు= ఉదంకుడు.

**తాత్పర్యం:** పాతాళలోకం ఇక్కడికి వేయి ఆమడల దూరంలో ఉన్నది. కుండలాలు దొంగిలించిన పాము ఐరావతుడి కుమారుడు' అని చెప్పగా విని ఉదంకుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'పాతాళంబున నున్నను। వే తెత్తుం గుండలములు; వినుః మప్పని నా**
**చేతం గాకున్న నసు। వ్రాతము విడువఁబడు; నిది ధ్రువం' బని పలికెన్. 107**

**ప్రతిపదార్థం:** కుండలములు= కుండలాలు; పాతాళంబునన్= పాతాళలోకంలో; ఉన్నను= ఉన్నప్పటికీ; వే= వెంటనే; తెత్తున్= తీసికొని వస్తాను; వినుము; ఆ పని; నా చేతన్= నా వలన; కాక+ఉన్నన్= కాకపోతే; అసు= ప్రాణాలయొక్క; వ్రాతము= సమూహం; విడువఁబడున్= వదలివేస్తాను; ఇది; ధ్రువంబు= నిశ్చయం; అని; పలికెన్= పలికాడు.

**తాత్పర్యం:** 'కుండలాలు పాతాళలోకంలో ఉన్నప్పటికీ నేను వాటిని వెంటనే తీసికొని వస్తాను. ఆ పని నా చేత కాకపోతే పంచప్రాణాలూ విడిచివేస్తాను. ఇది నా నిశ్చయం' అని పలికాడు.

**చ. పలికిన నత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుఁ డొండు ప**
**ల్కుల పని నిల్పి, కాష్ఠమునకుం గులిశంబునఁ గల్గువాఁడియున్**
**బలువును నిచ్చి వజ్ర చనె బాంధవ మేర్పడఁ జెప్పిః భీతిమై**
**నిల దెరు విచ్చెః నమ్మునియు నేడ్తెఱఁ జొచ్చె భుజంగలోకమున్. 108**

**ప్రతిపదార్థం:** పలికినన్= ఈ విధంగా ఉదంకుడు పలుకగా; సుర+ఇంద్రుఁడు= దేవతల రాజయిన ఇంద్రుడు; ఆ తపస్వి= ఆ ఋషియొక్క; దృఢ= సుస్థిరమయిన; భావము= అభిప్రాయం; ఎఱింగి= తెలిసికొని; ఒండుపల్కులు= ఎదురు మాటాడే; పని; నిల్పి= విరమించి; కాష్ఠమునకున్= కఱ్ఱకు; కులిశంబునన్= వజ్రాయుధమునందు; కల్గు= ఉండే; వాఁడియున్= పదునునూ; బలువును= గట్టితనాన్ని; ఇచ్చి= కలిగించి; వజ్రి= ఇంద్రుడు; బాంధవము= తన చుట్టరికాన్ని; ఏర్పడన్= స్పష్టంగా; చెప్పి= వివరించి; చనెన్= వెళ్లాడు; ఇల= భూమి; భీతిమైన్= భయంతో; తెరువు+ఇచ్చెన్= దారి ఇచ్చింది; ఆ మునియున్= ఆ ఉదంకుడును; ఏడ్తెఱన్= విజృంభణంతో; భుజంగలోకమున్= నాగలోకమును; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఉదంకుడు పలికేటప్పటికి దేవేంద్రుడికి ఆ మునీశ్వరుడి పట్టుదల తెలిసింది. ఇక అతడు ఎదురు మాటలు మాట్లాడే పనికి స్వస్తిచెప్పి ఉదంకుడి చేతిలో ఉన్న కఱ్ఱకు వజ్రాయుధానికుండే వాడినీ, గట్టితనాన్నీ కలిగించాడు. తన చుట్టరికాన్ని ప్రస్తావించి వెళ్ళిపోయాడు. భయంవలన భూమికూడా దారి ఇచ్చింది. వెంటనే ఉదంకుడు నాగలోకంలో ప్రవేశించాడు.

**వ. చొచ్చి యనేక ప్రకార ప్రాకార పరిరక్షితంబును, బహురత్న దీప్తిజాల దేదీప్యమానంబును నైన యమ్మహనీయ లోకం బాలోకించి, దశయోజనాయామంబునుం బంచయోజన విస్తారంబును నగు తద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు దుర్లభం బను తలంపున డిల్లపడియె; నయ్యెడ నరుణ వదనంబును నసితాంగంబును సితవాలంబునునై వెలుంగు తురంగం బతని కిట్లనియె. 109**

**ప్రతిపదార్థం:** చొచ్చి= ప్రవేశించి; అనేక ప్రకార= అనేక విధాలైన; ప్రాకార= చుట్టు గోడలచేత; పరిరక్షితంబును= చక్కగా రక్షింపబడిందీ; బహు= అనేకాలైన; రత్న= రత్నాలయొక్క; దీప్తి= కాంతులయొక్క; జాల= సమూహంచేత; దేదీప్యమానంబునున్= మిక్కిలి ప్రకాశించేదీ; ఐన= అయిన; ఆ మహనీయ= ఆ గొప్పదైన; లోకంబు= లోకాన్ని; ఆలోకించి= చూచి; దశయోజన= పది ఆమడల; ఆయామంబునున్= పొడవునూ; పంచయోజన= ఐదు ఆమడల; విస్తారంబునున్= వెడల్పునూ; అగు= కలిగినదయిన; తద్= ఆ నాగలోకంయొక్క; ద్వారంబు= ద్వారాన్ని; కని= చూచి; అతండు= ఆ ఉదంకుడు; కుండల= కుండలాలయొక్క; ఆహరణంబు= కొనిరావటం; దుర్లభంబు= శక్యంగానిది; అను= అనే; తలంపునన్= అభిప్రాయంతో; డిల్ల పడియెన్= అధైర్యపడ్డాడు; ఆ+ఎడన్ = ఆ సమయాన; అరుణ= ఎఱ్ఱని; వదనంబును= ముఖమూ; అసిత= నల్లని; అంగంబును= శరీరమూ; సిత= తెల్లని; వాలంబును= తోకయూ; ఐ= కలదై; వెలుంగు= ప్రకాశిస్తున్న; తురంగంబు= గుఱ్ఱం; అతనికిన్= ఆ ఉదంకుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** ప్రవేశించి ఉదంకుడు ఎన్నో రకాలయిన చుట్టుగోడలచేత రక్షింపబడేదీ, నానావిధ రత్నకాంతులచేత మిక్కిలి ప్రకాశిస్తున్నదీ అయిన ఆ మహాలోకాన్ని చూచాడు. దాని ద్వారం పొడవు పది ఆమడలు, వెడల్పు అయిదు ఆమడలు. ఆ ద్వారాన్ని చూచి అతడు కుండలాలు తీసికొని రావటం అసాధ్యమని తలంచి అధైర్యపడ్డాడు. ఇంతలో ఒక గుఱ్ఱం అతడి కంటబడింది. దాని ముఖం ఎఱ్ఱగా ఉన్నది. శరీరం నల్లగా ఉన్నది. తోక తెల్లగా ఉన్నది. అది ఉదంకుడితో ఇట్లా అన్నది.

**ఉ. 'ఆతత మైన నాదగు నపానము నూఁదు; మొకింతయున్ జుగు**
**ప్సాతురవృత్తి నీదుహృదయంబునఁ జొన్పకు; లోకవంద్యుఁ డ**

**గ్గౌతము నాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి చేసి, నన్**

**బ్రీతునిం జేసినాఁడవు; వరిష్ఠతపోధన! యట్లు గావునన్. 110**

**ప్రతిపదార్థం:** వరిష్ఠ= మిక్కిలి శ్రేష్ఠమైన; తపస్= తపస్సే; ధన= ధనంగాకలవాడా!; ఆతతము= వెడల్పుగా ఉన్నది; ఐన= అయిన; నాదగు= నా దయిన; అపానము= గుదస్థానం; ఊఁదుము= ఊదుము; ఒక+ఇంతయున్= ఏ కొంచెం కూడా?; నీ= నీయొక్క; హృదయంబునన్= హృదయంలో; జుగుప్సా= రోతవలన కలిగే; ఆతుర= బాధకలదయిన; వృతిన్= అవస్థను; చొన్పకు(ము)= కలిగించుకొనకుము; లోక= లోకంచేత; వంద్యుఁడు= కొనియాడదగినవాడు; ఆ గౌతము= ఆ గౌతముడియొక్క; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; అఖండిత= ఎడతెగని; భక్తిన్= భక్తితో; ఉపాస్తి= సేవ; చేసి; నన్= నన్ను; ప్రీతునిన్= సంతోషించిన వాడిని; చేసినవాడవు= చేశావు; అట్లు+కావునన్= అందుచేత.

**తాత్పర్యం:** మహోత్తమ తపోధనా! వెడల్పుగా ఉన్న నా గుదస్థానాన్ని ఊదుము. నీ హృదయంలో రోతవలన బాధపడకుము. లోకస్తుత్యు డయిన గౌతముడి ఆశ్రమంలో నన్ను సేవించి సంతోషింపజేశావు. అందుచేత. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. నీకుం బొడసూపి, యైరావత సుతుం డపహరించిన సమంచిత కుండలంబులు మగుడం జేరెడు నుపాయం బుపదేశించితి; ననిన నుదంకుం 'డేను నిన్ను నెఱుంగ; నుపాసించుట యెట్లు గలిగెఁ? దెలుపు' మనుడు నయ్యశ్వం బతనితోడ 'భవద్గురునకు గురుండం; బావకుండ; నీవు శుచివయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను నియతిం బూజించి; తత్తెఱం గెఱుంగవే' యని పలికినం బ్రీతినొంది యతండు తదీయోపదిష్ట ప్రకారం బాచరించిన. 111**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; పొడసూపి= సాక్షాత్కరించి; ఐరావత= ఐరావతుడియొక్క; సుతుండు= కుమారుడు; అపహరించిన= దొంగిలించిన; సమంచిత= మిక్కిలి అందమైన; కుండలంబులు= కుండలాలు; మగుడన్= మరలా; చేరెడు= పొందే; ఉపాయంబు= ఉపాయాన్ని; ఉపదేశించితిన్= బోధించాను; అనినన్= అనగా; ఉదంకుండు= ఉదంకుడు; ఏను= నేను; నిన్నున్= నిన్ను; ఎఱుంగను= ఎరుగను; ఉపాసించుట= సేవించటం; ఎట్లు= ఏ విధంగా; కలిగెన్= సంభవించింది; తెలుపుము= తెలియజేయుము; అనుడున్= అని అనగా; ఆ అశ్వంబు= ఆ గుర్రం; అతనితోడన్= ఆ ఉదంకుడితో; భవత్= నీ యొక్క; గురునకున్= గురువునకు, గౌతముడికి; గురుండన్= గురువును; పావకుండన్= అగ్నిని; నీవు; శుచివి= పరిశుద్ధుడవు; అయి; స+భక్తికంబు+కాన్= భక్తితో కూడినట్లుగా; నిత్యంబును= ఎల్లప్పుడూ; నన్నున్= నన్ను; నియతిన్= నియమంతో; పూజించితి(వి)= పూజించావు; ఆ తెఱంగు= ఆ విషయం; ఎఱుంగవు+ఏ?= గుర్తు చేసికొనలేవా?; అని; పలికినన్= చెప్పగా; ప్రీతిన్= సంతోషాన్ని; ఒంది= పొంది; అతండు= ఆ ఉదంకుడు; తదీయ= ఆ గుర్రానిదైన; ఉపదిష్ట= ఉపదేశించబడిన; ప్రకారంబు= విధంగా; ఆచరించినన్= చేయగా.

**తాత్పర్యం:** నీకు కనబడి, ఐరావతుడి కుమారుడు దొంగిలించిన కుండలాలు, నీకు తిరిగి చేరే ఉపాయం ఉపదేశించాను. ఆ మాటలు విన్న ఉదంకుడు 'నేను నిన్ను ఎరుగను. నిన్ను సేవించటం ఏ విధంగా సంభవిస్తుంది' అని అన్నాడు. అప్పుడు ఆ గుర్రం అతడితో 'నేను నీ గురువునకు గురువును. అగ్నిని. నీవు పరిశుద్ధుడవై, భక్తితో నిత్యమూ నన్ను పూజించావు. ఆ విషయం నీవు గుర్తుకు తెచ్చుకొనలేదా?' అని అన్నది. అంతట ఆ ఉదంకుడు గుర్రం ఉపదేశించిన విధంగా చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

సీ. ఘోటకోత్తమ రోమకూపంబులం దెల్ల । నొక్కట ఘనధూమ ముద్గమించి,
కవిసి, పాతాళ లోకంబంతయును గప్పి । వాసుకి ప్రభృతి నివాస భూము
లుపరుద్ధ భావంబు నొందె; నైరావతా । వాసంబు హాహారవంబు తోడ
నాకులంబయ్యె; న ట్లతిదారుణంబైన । పెనుఁబొగ నెంతయు భీతి నొంది

ఆ. యమ్మునీంద్రు కడకు నహివరుల్ రయమున । వచ్చి, భక్తి నర్చలిచ్చి, వినతు
లై తదీయ కార్య మడిగి యెఱింగి, వే । తెచ్చి కుండలంబు లిచ్చి రధిప! 112

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!, జనమేజయా!; ఘోటక+ఉత్తమ= ఆ శ్రేష్ఠమైన గుర్రం యొక్క; రోమకూపంబులు+అందున్= చర్మరంధ్రాలందు; ఎల్లన్= అన్నిటా; ఒక్కటన్= ఒక్కసారిగా; ఘన= గొప్ప; ధూమము= పొగ; ఉద్గమించి= పుట్టి; కవిసి= వ్యాపించి; పాతాళలోకంబు= పాతాళలోకం; అంతయును= అంతటా; కప్పెన్= కప్పింది; వాసుకి; ప్రభృతి= మొదలైనవారియొక్క; నివాసభూములు= మందిర ప్రదేశాలు; ఉపరుద్ధభావంబు= పీడావస్థను; ఒందెన్= పొందాయి; ఐరావత= ఐరావతుడియొక్క; ఆవాసంబు= గృహం; హాహా= హాహా అనే; రవంబులతోడన్= ఆక్రందన ధ్వనులతో; ఆకులంబు= క్షోభించింది; అయ్యెన్= అయింది; అట్లు= ఆ విధంగా; అతి= మిక్కిలి; దారుణంబు= దుస్సహం; ఐన= అయిన; పెను+పొగన్= గొప్ప పొగచేత; ఎంతయున్= మిక్కిలి; భీతిన్= భయమును; ఒంది= పొంది; అహివరుల్= నాగరాజులు; ఆ ముని+ఇంద్రు+కడకున్= ఆ మునీశ్వరుడి దగ్గరకు; రయమునన్= వేగంగా; వచ్చి; భక్తిన్= భక్తితో; అర్చలు+ఇచ్చి= పూజించి; వినతులు+ఐ= వినమ్రులయి; తదీయ= ఉదకుండిదైన; కార్యము= వచ్చినపని; అడిగి; ఎఱింగి= తెలిసికొని; వే= శీఘ్రంగా; కుండలంబులు= కుండలాలు; తెచ్చి; ఇచ్చిరి= ఇచ్చారు.

**తాత్పర్యం:** ఆ ఉత్తమాశ్వం రోమరంధ్రాలనన్నిటా ఒక్కసారిగా పొగపుట్టి పాతాళలోకమంతటా క్రమ్ముకొన్నది. వాసుకి మొదలైనవారి మందిరాలు పీడావస్థ పాలయ్యాయి. ఐరావతుడి గృహం ఆక్రందన ధ్వనులతో కలత చెందింది. ఈ విధంగా దుస్సహమయిన ఆ మహాధూమంవలన భయపడి నాగరాజులు ఉదంకుడి దగ్గరకు త్వరగా వచ్చి, భక్తితో పూజించి వినమ్రులయి, అతడు వచ్చినపని తెలిసికొని వెంటనే కుండలాలు తెచ్చిచ్చారు.

### ఉదంకుండు కుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట (సం.14-37-53)

చ. అతఁడును వారిఁ బోఁబనిచి, యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు చే
సి, తగ నమస్కరించి, విలసిల్లఁగఁదేజము, ప్రీత చిత్తుఁడై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి 'తె
చ్చితి నివె కుండలంబు' లని చే నిడి, భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్. 113

**ప్రతిపదార్థం:** అతఁడును= ఆ ఉదంకుడును; వారిన్= నాగులను; పోన్= వెళ్ళగా; పనిచి= ఆజ్ఞాపించి; భక్తిన్= భక్తితో; అగ్నికిన్= అగ్నికి; ప్రదక్షిణంబు చేసి= ప్రదక్షిణంచేసి; తగన్= తగినట్లుగా; నమస్కరించి; తేజము= శరీరకాంతి; విలసిల్లఁగన్= ప్రకాశించగా; ప్రీతి= తృప్తి పొందిన; చిత్తుఁడు+ఐ= మనస్సు కలవాడై; అతలము= పాతాళలోకం; నిర్గమించి= వెడలి; రయము= వేగం; ఆరఁగన్= అతిశయించగా; వచ్చి; అహల్యన్= అహల్యను; కాంచి= దర్శించి; ఇవి+ఎ= ఇవిగో; కుండలంబులు= కుండలాలు; తెచ్చితిన్= తెచ్చాను; అని; చేన్= ఆమెచేతిలో; ఇడి= పెట్టి; భూస్థలిన్= భూమిమీద; చాఁగి= సాష్టాంగపడి; మ్రొక్కినన్= నమస్కరించగా.

**తాత్పర్యం:** ఉదంకుడు నాగులను వెళ్ళనంపి, అగ్నికి భక్తితో ప్రదక్షిణంచేసి నమస్కరించాడు. అతడి శరీరకాంతి ప్రకాశిస్తున్నది. మహానందంతో అతడు పాతాళలోకంనుండి బయలుదేరి, త్వరత్వరగా గౌతమాశ్రమానికి వచ్చాడు. గురుపత్ని అయిన అహల్యను దర్శించి 'ఇవిగో! కుండలాలు తెచ్చా'నని వాటిని ఆమె చేతిలో పెట్టి ఆమెకు సాష్టాంగ నమస్కారం చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. ఆయమయు గౌతముండు నత్యాదరమునఁ। గౌఁగిలించుచు దీవించి గారవింప**
**నతఁడు నమ్మునిపతికిని నయ్యమకును। బెక్కుమాఱులు భక్తిమై మ్రొక్కి నిలిచి. 114**

**ప్రతిపదార్థం:** ఆ+అమయున్= ఆ అహల్యయు; గౌతముండున్= గౌతముడునూ; అతి= మిక్కిలి; ఆదరమునన్= ప్రేమతో; కౌఁగిలించుచున్= కౌగిలిస్తూ; దీవించి; గారవింపన్= లాలింపగా; అతఁడున్= ఆ ఉదంకుడునూ; ఆ+మునిపతికిన్= ఆ మునీశ్వరుడికి, గౌతముడికి; ఆ+అమకును= ఆమెకూ, అహల్యకూ; పెక్కుమాఱులు= చాలాసార్లు; భక్తిమైన్= భక్తితో; మ్రొక్కి= సాష్టాంగ నమస్కారం చేసి; నిలిచి= నిలబడి.

**తాత్పర్యం:** అహల్య, గౌతముడూ మహానురాగంతో ఉదంకుడిని కౌగిలించుకొని దీవించి, లాలించారు. అతడు కూడా ఆ దంపతులకు చాలాసార్లు సాష్టాంగ నమస్కారాలు చేసి నిలబడి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'మీకరుణఁ గాక తగుమెయి। నీ కుండలములు పరిగ్రహించుట నడుమన్**
**వైకృతి యొలసినఁ దలఁగుట। నా కొలఁదియె?' యనియె వినయనమ్రుం డగుచున్. 115**

**ప్రతిపదార్థం:** వినయ= వినయంచేత; నమ్రుండు= వంగినవాడు; అగుచున్= అవుతూ; తగు= అనుగుణమయిన; మెయిన్= విధంగా; ఈ కుండలములు= ఈ కుండలాలు; పరిగ్రహించుట= స్వీకరించటం; నడుమన్= మధ్యలో; వైకృతి= కష్టస్థితి; ఒలసినన్= కలుగగా; తలఁగుట= తొలగించుకొనటం; మీ= మీయొక్క; కరుణన్= అనుగ్రహంవలన; కాక= తప్ప; నా= నా యొక్క; కొలఁది+ఎ= తరమా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'మీ కోర్కెకు తగినట్లుగా ఈ కుండలాలను స్వీకరించటం, మధ్యలో కష్టం కలుగగా దానిని నివారించటం ఇవన్నీ మీ దయవలన తప్ప నా శక్తి సామర్థ్యాలవలన మాత్రం జరిగినవి కావు' అని వినయంతో అన్నాడు.

**వ. అనిన విని వార లత్యంత సంతుష్టాంతరంగులై; రగ్గౌతముం డతని కిట్లనియె. 116**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఉదంకుడు పలుకగా; విని; వారలు= ఆ దంపతులు; అత్యంత= మిక్కిలి; సంతుష్ట= సంతృప్తి పొందిన; అంతరంగులు= మనస్సులు కలవారు; ఐరి= అయ్యారు; ఆ గౌతముండు; అతనికిన్= అతడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఉదంకుడు ఈ విధంగా పలుకగా ఆ దంపతులు పరమ సంతృప్తి పొందారు. అప్పుడు గౌతముడు అతడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'నీ చరితంబు చిత్రమహనీయము; మిత్ర సహక్షితీశ్వరున్**
**నీచతఁ బాప, నాగ మపనీతము చేసిన కుండలద్వయం**

**బాచతురత్వ మా బలిమి యాదృఢ నిశ్చయ మట్టు లొప్ప ధ**
**ర్మోచిత లీలఁ దేర నొరుఁ డోపునె! యేను నిజంబ పల్కితిన్.' 117**

**ప్రతిపదార్థం:** నీ= నీయొక్క; చరితంబు= శీలం; చిత్ర= ఆశ్చర్యకరమూ; మహనీయము= గొప్పదీ; మిత్రసహ= మిత్రసహుడనే; క్షితి+ఈశ్వరున్= రాజును; నీచతన్= హీనస్థితినుండి; పాపన్= దూరంచేయగా; నాగము= పాము; అపనీతము చేసిన= అపహరించిన; కుండల ద్వయంబు= కుండలాల జంట; ఆ చతురత్వము= నేర్పు; ఆ బలిమి= ఆ బలం; ఆ దృఢ= గట్టిదయిన; నిశ్చయము; అట్టులు= ఆ విధంగా; ఒప్పన్= ప్రకాశించగా; ధర్మ= ధర్మానికి; ఉచిత= తగిన; లీలన్= ప్రకారంగా; తేరన్= తీసికొనిరాగా; ఒరుఁడు= ఇంకొకడు; ఓపును+ఎ?= సమర్థుడగునా?; ఏను= నేను; నిజంబు+అ= నిజమే; పల్కితిన్= పలికాను.

**తాత్పర్యం:** 'నీ స్వభావం ఆశ్చర్యం కలిగించేదీ, గొప్పదీ. మిత్రసహుడి హీనస్థితిని తొలగించటానికి గానీ, పాము దొంగిలించిన కుండలాలజంటను నేర్పుతో బలంతో పట్టుదలతో తిరిగి తీసికొని రావటానికి గానీ, ఇంకొకడు సమర్థుడు కానేకాడు. నేను అతిశయోక్తులు గాక, నిజం చెప్పాను.'

**వ. అనియె; నయ్యుదంకుం డట్లు తన మహాతపంబు బలిమిం బరాక్రమించి, యనన్య సులభంబులగు కుండలంబు లాహరించి, గురుజన మనోరథసిద్ధి గావించె; నా భృగువంశ మహత్తరు మహానుభావం బిట్టి' దనిన విని జనమేజయుం 'డమ్మహాత్మునకు వరం బొసంగి చనిన వాసుదేవు ననంతర వృత్తాంతంబు మునిసత్తమా! యెఱింగింపవే' యని యడిగి, నవ్విభునకు వైశంపాయనుం డిట్లనియె. 118**

**ప్రతిపదార్థం:** అనియెన్= గౌతముడు ఈ విధంగా అన్నాడు; ఆ+ఉదంకుండు= ఆ ఉదంకుడు; అట్లు= ఆ విధంగా; తన= తనయొక్క; మహత్= గొప్పదయిన; తపంబు= తపస్సుయొక్క; బలిమిన్= బలంచేత; పరాక్రమించి= పరాక్రమం చూపి; న+అన్య+సులభంబులు= ఇతరులకు తేలికగా లభించనివి; అగు= అయిన; కుండలంబులు= కుండలాలు; ఆహరించి= తీసికొని వచ్చి; గురుజన= గురువులయొక్క; మనోరథ= కోరికయొక్క; సిద్ధి= ఈడేరుటను; కావించెన్= చేశాడు; ఆ భృగు= ఆ భృగుమహర్షియొక్క; వంశ= వంశంలోని; మహత్తరు= ముఖ్యుడియొక్క; మహత్= గొప్ప; అనుభావంబు= మహిమ; ఇట్టిది= ఇటువంటిది; అనినన్= అని చెప్పగా; విని; జనమేజయుండు= జనమేజయుడు; ముని= మునులలో; సత్తమా!= శ్రేష్ఠుడా!; ఆ మహత్+ఆత్మునకున్= ఆ గొప్ప మనస్సు కలవాడికి; వరంబు= వరము; ఒసంగి= ఇచ్చి; చనిన= వెళ్ళిన; వాసుదేవు= వసుదేవుడి కుమారుడయిన శ్రీకృష్ణుడియొక్క; అనంతర= తరువాతి; వృత్తాంతంబు= కథ; ఎఱింగింపుము+ఏ= తెలియజేయుమా; అని; అడిగినన్= అడుగగా; వైశంపాయనుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** గౌతముడు ఈ విధంగా అన్నాడు. ఈ ఉదంకుడి ఉపాఖ్యానం చెప్పి వైశంపాయనుడు జనమేజయుడితో 'ఆ విధంగా ఉదంకుడు తన తపోబలంచేత పరాక్రమించి, ఇతరులకు తేలికగా లభించని కుండలాలు తీసికొనివచ్చి గురువుల కోరిక నెరవేర్చాడు. ఆ భృగువంశోత్తముడి మహిమ ఇటువంటిది' అని అన్నాడు. అప్పుడు జనమేజయుడు 'మునిశ్రేష్ఠా! మహాత్ముడయిన ఉదంకుడికి వరమిచ్చి శ్రీకృష్ణుడు వెళ్ళిపోయాడు కదా! తరువాత ఆ భగవంతుడు ఏం చేశాడో ఆ కథ నాకు తెలియజేయుమా!' అని అడుగగా వైశంపాయనుడు ఈ విధంగా చెప్పాడు.

**సీ. ఆ భార్గవోత్తము నట్లు వీడ్కొని కృష్ణుఁ। డరిగి యలంకృత మైన నిజపు**
**రము సొచ్చునప్పుడు రైవత కాచల। యాత్రామహోత్సవ మఖిలజనులుఁ**
**గొనియాడుచుండి, యగ్గోవిందు సందర్శ। నంబున నుత్సవోన్మత్త భావ**
**మిమ్మడియై ప్రమోదమ్మునం దేలి; ర। ద్దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి**

**తే.** **దేవకీదేవి బలభద్రదేవుఁ దక్కుఁ। గలుగు వృద్ధ బాంధవులను గని వినీతిఁ**
**దత్తదుచిత మనోజ్ఞవిధాసమంచి। తాచరణములు నడపెఁ బ్రియం బెలర్ప. 119**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు; ఆ భార్గవ= ఆ భృగుమహర్షి సంతతివారిలో; ఉత్తమున్= ఉత్తముడైన ఉదంకుడిని; అట్లు= ఆ విధంగా; వీడ్కొని= అనుమతిపొంది విడిచిపోయి; అలంకృతము= అలంకరించబడింది; ఐన= అయిన; నిజ= తనయొక్క; పురము= పట్టణమును, ద్వారకను; చొచ్చు+అప్పుడు= ప్రవేశించే సమయమున; అఖిల= సమస్తమైన; జనులున్= ప్రజలును; రైవతక= రైవతకమనే; అచల= పర్వతమునకు సంబంధించిన; యాత్రా= జాతర అనే; మహత్= గొప్ప; ఉత్సవము= పండుగను; కొనియాడుచున్= పొగడుతూ; ఉండి; ఆ గోవిందు= కృష్ణుడియొక్క; సందర్శనంబునన్= దర్శనంచేత; ఉత్సవ= ఉత్సవంవలన కలిగిన; ఉన్మత్త భావము= వెర్రితనం; ఇమ్మడి+ఐ= రెట్టింపై; ప్రమోదమ్మునన్= మహానందంతో; తేలిరి= ఉప్పొంగిరి; ఆ దేవదేవుఁడు= ఆ దేవాధిదేవుడు కృష్ణుడు; వసుదేవున్= వసుదేవుడిని; కాంచి= దర్శించి; దేవకీ దేవిన్= దేవకీదేవినీ; బలభద్రదేవున్= బలరాముడినీ; తక్కన్+కలుగు= మిగిలిన; బాంధవులను= చుట్టాలనూ; కని= చూచి; వినీతిన్= వినయంతో; తద్+తద్= వారి వారికి; ఉచిత= తగిన; మనోజ్ఞ= మనస్సును ఆనందింపజేసే; విధా= విధానాలతో కూడిన; సమంచిత= మిక్కిలి పూజితమైన; ఆచరణములు= మర్యాదలు; ప్రియంబు= ప్రీతి; ఎలర్పన్= అతిశయించగా; నడపెన్= చేశాడు.

**తాత్పర్యం:** భృగువంశోత్తముడైన ఉదంకుడిని ఆ విధంగా శ్రీకృష్ణుడు వీడ్కొని తన రాకకు అలంకరించిన ద్వారకాపురం ప్రవేశించాడు. రైవతకపర్వతం జాతరకొరకై అప్పటికే సాగుతున్న ద్వారకావాసులందరూ శ్రీకృష్ణ సందర్శనం వలన వెర్రెత్తినట్లు మహానందంతో ఉప్పొంగిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవులనూ, బలరాముడినీ మిగిలిన చుట్టాలనూ చూచి, వారి వారికి తగినట్లుగా ఆనందకరమైన మర్యాదలు చేశాడు.

**వ.** **వారలందఱకు ధర్మనందను చెప్పిన చొప్పునఁ బ్రణామాది యోగ్యోపచారంబు లాచరించె; ననుజ తనూజామాత్య భృత్యులు దన్నుం గనినం బ్రీతి వాత్సల్య సంభావనా బహుమానంబులు మెఱయ నాదరించె; సాత్యకి సుభద్రలం దగు తెఱంగులం దగిన వారలం గానిపించె; నట్లు సకలజన ప్రమోదాపాది యైన దామోదరు నత్యంత సమీపాసనుం జేసికొని వసుదేవుడు 'భారతరణప్రకారంబు యాతాయాత జనంబులచేత వింటిం, బ్రస్ఫుటంబుగా వినవలతుం జెప్పవే' యని యడిగిన నచ్యుతుం డతని కిట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** వారలు+అందఱకున్= వారందరికీ; ధర్మనందను= ధర్మనందనుడు; చెప్పిన; చొప్పునన్= విధంగా; ప్రణామ= నమస్కారం; ఆది= మొదలైన; యోగ్య= తగిన; ఉపచారంబులు= సేవా గౌరవాలు; ఆచరించెన్= చేశాడు; అనుజ= తమ్ముళ్ళూ; తనూజ= కుమారులూ; అమాత్య= మంత్రులూ; భృత్యులు= సేవకులూ; తన్నున్= తన్ను; కనినన్= దర్శింపగా; ప్రీతి= సంతోషం; వాత్సల్యము= మమత; సంభావన= ప్రేమ; బహుమానంబు= గౌరవం; మెఱయన్= వెల్లడికాగా; ఆదరించెన్= ఆదరించాడు; సాత్యకిన్= సాత్యకినీ; సుభద్రన్= సుభద్రనూ; తగు= తగిన; తెఱంగులన్= విధములుగా; తగినవారలన్= యోగ్యులయినవారిని; కానిపించెన్= దర్శింపజేశాడు; అట్లు= ఆ విధంగా; సకలజన= సమస్త జనులకూ; ప్రమోద= మహానందాన్ని; ఆపాది= కలిగించేవాడు; ఐన= అయిన; దామోదరున్= శ్రీకృష్ణుడిని; అత్యంత= మిక్కిలి; సమీప= దగ్గరగా; ఆసీనున్= కూర్చున్న వాడినిగా; చేసికొని; భారతరణ= భారతయుద్ధంయొక్క; ప్రకారంబు= విధానం; యాత+ఆయాత= పోతూ వస్తూఉండే; జనంబులచేతన్= జనులచేత; వింటిన్= అరగొరగా విన్నాను; ప్రస్ఫుటంబుగాన్= మిక్కిలి తేటతెల్లంగా; వినన్+వలతున్= వినగోరుతాను; చెప్పవే= చెప్పుమా; అని; అడిగినన్= అడుగగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అతనికిన్= ఆ వసుదేవుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వారందరికీ ధర్మరాజు చెప్పిన రీతిగా శ్రీకృష్ణుడు నమస్కరించటం మొదలయిన విధులన్నీ నడిపాడు. తమ్ముళ్ళూ, కొడుకులూ, మంత్రులూ, సేవకులూ తనను దర్శించటానికి రాగా వారిని సంతోషంతో, మమకారంతో, ప్రేమతో, గౌరవంతో ఆదరించాడు. సాత్యకినీ, సుభద్రనూ చూడటానికి తగినవారిని పంపించాడు. ఆ విధంగా అందరికీ ఆనందాన్ని కలిగించే శ్రీకృష్ణుడిని దగ్గర కూర్చుండబెట్టుకొని వసుదేవుడు 'నాయనా! పోతూ వస్తూ ఉండే వారివలన భారతయుద్ధాన్ని గూర్చి అరగొరగా విన్నాను. నీవు సంపూర్ణంగా చెప్పితే వినాలని ఉన్నది. నాకు తేటతెల్లంగా చెప్పు' మని అడిగాడు. అంతట శ్రీకృష్ణుడు వసుదేవుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'అది యతివిస్తారము; పె। క్కు దినంబులు చెప్పఁ బట్టుఁ; గొంత దగం జె**
**ప్పెద నేఁ బ్రధాన పురుష స। ముదయ సమర విధము లఘుతరోక్తులఁ దెలియన్. 121**

**ప్రతిపదార్థం:** అది= భారతయుద్ధ కథ; అతి= మిక్కిలి; విస్తారము= పెద్దది; చెప్పన్= దానిని చెప్పగా; పెక్కు= చాలా; దినంబులు= రోజులు; పట్టున్= గడుస్తాయి; ఏన్= నేను; తెలియన్= అర్థమయ్యేటట్లుగా; ప్రధాన= ముఖ్యులయిన; పురుష= వీరులయొక్క; సముదయ= సమూహంయొక్క; సమర= యుద్ధంయొక్క; విధము= తీరు; కొంత; లఘుతర= కొలది అయిన; ఉక్తులన్= మాటలలో; తగన్= తగినట్లుగా; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** భారతయుద్ధ కథ చాలా పెద్దది. దానినంతా చెప్పటానికి చాలా రోజులు పట్టుతాయి. అందువలన ముఖ్యులయిన వీరులు యుద్ధాలు చేసిన తీరు కొంత నీకు కొద్ది మాటలలో అర్థమయ్యేటట్లుగా చెప్పుతాను.

**సీ. కౌరవసైన్యమేకాదశాక్షౌహిణీ। కలితంబు; దానికిఁ గట్టె వీర**
**పట్టంబు భీష్ముఁ; డా ప్రభువున కెదురొడ్డి। రెలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి;**
**నక్కడ సప్త సంఖ్యాక్షౌహిణీక మ। నీక; మిమ్మాడ్కిఁ బన్నిన బలద్వ**
**యంబును ఖేచరు లచ్చెరువడఁ బోరెఁ;। గాండీవి దోడ్పడఁగా శిఖండి**

**తే. యన్నదీనందనునిఁ బదియవు దినంబు। నందుఁ గూలిచె; నుత్తరాయణము వచ్చు**
**నంతకును మృతి పొందక యాతఁ డుండె। నధిప! శరతల్పమున! గడు నద్భుతముగ. 122**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! వసుదేవా!; కౌరవ= కౌరవులయొక్క; సైన్యము; ఏకాదశ= పదకొండు; అక్షౌహిణీ= అక్షౌహిణులతో; కలితంబు= కూడినట్టిది; భీష్ముఁడు= భీష్ముడు; దానికిన్= ఆ పదకొండు అక్షౌహిణుల సైన్యానికి; వీరపట్టంబు= ఆధిపత్యమును సూచించే వీరవేషమును; కట్టెన్= ధరించాడు; ఆ ప్రభువునకున్= ఆ సైన్యాధిపతి భీష్ముడికి; పాండుపుత్త్రులు= పాండురాజు కుమారులు, పాండవులు; ఎలమిమైన్= ఉత్సాహంతో; శిఖండిన్= శిఖండిని; ఎదురొడ్డిరి= ఎదురుగా నిలిపారు; అక్కడన్= పాండవపక్షమున; అనీకము= సైన్యం; సప్తసంఖ్యా= ఏడు సంఖ్యగల; అక్షౌహిణీకము= అక్షౌహిణులు కలది; ఈ+మాడ్కిన్= ఈ విధంగా; పన్నిన= మోహరించిన; బలద్వయంబును= సేనాద్వితయం; ఖేచరులు= దేవతలు; అచ్చెరువు+పడన్= ఆశ్చర్యం పొందేటట్లుగా; పోరెన్= యుద్ధం చేసింది; శిఖండి; గాండీవి= అర్జునుడు; తోడ్పడన్+కాన్= సహాయంచేయగా; పది+అవు= పదవ; దినంబు+అందున్= రోజున; ఆ నదీ= ఆ గంగానదియొక్క; నందనునిన్= కుమారుడిని, భీష్ముడిని; కూలిచెన్= పడగొట్టాడు; అతండు= ఆ భీష్ముడు; ఉత్తరాయణము వచ్చు+అంతకును= ఉత్తరాయణ పర్వకాలం వచ్చేవరకూ; మృతిపొందక= మరణించక; కడున్= మిక్కిలి; అద్భుతముగన్= ఆశ్చర్యకరంగా; శరతల్పమునన్= బాణాల పాన్పుమీద; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** వసుదేవా! కౌరవసైన్యం పదకొండు అక్షౌహిణులు. భీష్ముడు దానికి సేనాధిపతి. పాండవులు అతని కెదురుగా శిఖండిని నిలిపారు. పాండవ సైన్యం ఏడు అక్షౌహిణులు. ఈ రెండు సైన్యాలూ హోరాహోరిగా పోరాడాయి. ఆ పోరాటాన్ని చూచి దేవతలు సైతము ఆశ్చర్యపడ్డారు. అర్జునుడు తోడు రాగా శిఖండి యుద్ధం మొదలయిన పదవ రోజున భీష్ముడిని పడగొట్టాడు. ఆ మహాత్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకూ, మరణించకుండా అంపపానుపుమీద ఉన్నాడు.

**విశేషం:** అక్షౌహిణి= 21,870 రథములు, 21,870 ఏనుగులు, 65,610 గుఱ్ఱాలు, 1,09,350 పదాతులు కలిగిన సేన, ఉత్తరాయణము-సూర్యుడు ఉత్తరపు వైపుగా సంచరించే ఆరునెలలకాలం. మకరసంక్రాంతినుండి కర్కటసంక్రాంతివరకుగల కాలం. మార్గశిరమాసం సమాప్తి అయిన తరువాత ఉత్తరాయణం ప్రారంభమవుతుంది.

**క.** **గురుఁ డైదు దివసములు ని । ర్భరసమర మొనర్చె; నతనిఁ బరిమార్పఁగ నా**
**వెరవున నర్జును ప్రాపున । దొరఁకొనియె హుతాగ్నిభవుఁడు ద్రుపదసుతుండున్.** **123**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; ఐదు= అయిదు; దివసములు= రోజులు; నిర్భర= తీవ్రమయిన; సమరము= యుద్ధం; ఒనర్చెన్= చేశాడు; హుత+అగ్ని= యజ్ఞాగ్నినుండి; భవుడు= పుట్టినవాడైన; ద్రుపద= ద్రుపదుడియొక్క; సుతుండున్= కుమారుడు-ధృష్టద్యుమ్నుడు; నా= నాయొక్క; వెరవునన్= ఉపాయంతో; అర్జును= అర్జునుడియొక్క; ప్రాపునన్= అండతో; అతనిన్= ద్రోణాచార్యుడిని; పరిమార్పఁగన్= చంపగా; దొరఁకొనియెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు ఐదురోజులు తీవ్రయుద్ధం చేశాడు. యజ్ఞాగ్నినుండి పుట్టినవాడూ, ద్రుపదుడి కొడుకూ అయిన ధృష్టద్యుమ్నుడూ నా ఉపాయంవలన అర్జునుడి అండవలనా ఆ ఆచార్యుడిని చంపగలిగాడు.

**క.** **గండున రాధాతనయుఁడు । రెండు దినంబులు పెనంగి గ్రీష్మ సమయ సూ**
**ర్యుండుంబోలె వెలింగెడు । గాండివధరు శరకరోష్మఁ గ్రాఁగె నరేంద్రా!** **124**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!, వసుదేవా!; గండునన్= పరాక్రమంతో; రాధా= రాధయొక్క; తనయుఁడు= కొడుకు-కర్ణుడు; రెండు; దినంబులు= రోజులు; పెనంగి= యుద్ధంచేసి; గ్రీష్మసమయ= వేసవి నాటి; సూర్యుండున్+పోలెన్= సూర్యుడివలె; వెలింగెడు= ప్రకాశించే; గాండివ= గాండీవమును; ధరు= ధరించే అర్జునుడియొక్క; శర= బాణాలనెడి; కర= కిరణాలయొక్క; ఊష్మన్= వేడిచేత; క్రాఁగెన్= కాలిపోయాడు.

**తాత్పర్యం:** కర్ణుడు రెండు రోజులు యుద్ధంచేసి; నడివేసవి సూర్యుడివలె వెలిగే అర్జునుడి బాణకిరణాలవలన దగ్ధమయ్యాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, రూపకం

**చ.** **విను, మఱునాఁడు శల్యుఁ డతివిక్రమతన్ సమరం బొనర్చి య**
**ద్దినము సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగుడున్, బలంబు గై**
**కొని యనిసేయఁగా శకునిఁ గూల్చె వడిన్ సహదేవుఁ; డంతతో**
**మనమునఁ జేవ దక్కి తనమానము డిగ్గఁగఁద్రావి హీనుఁడై.** **125**

**ప్రతిపదార్థం:** విను; మఱునాఁడు= ద్రోణుడు చనిపోయిన మరునాడు; శల్యుఁడు; అతి= మిక్కిలి; విక్రమతన్= పరాక్రమంతో; సమరంబు= యుద్ధం; ఒనర్చి= చేసి; ఆ దినము= ఆ రోజు; సగంబు= సగం; చెల్లఁగన్= కడవగా; యుధిష్ఠిరుచేన్= ధర్మరాజువలన; తెగుడున్= చచ్చిన తరువాత; శకుని; బలంబు= సైన్యాన్ని; కైకొని= తీసికొని; అని= యుద్ధం; చేయఁగాన్= చేయగా; సహదేవుఁడు; వడిన్= వేగంగా; కూల్చెన్= చంపాడు; అంతతోన్= అంతటితో; మనమునన్= మనస్సులో; చేవ= స్థైర్యాన్ని; తక్కి= కోల్పోయి; తన; మానము= ఆత్మాభిమానం, పౌరుషం; డిగ్గఁగన్+త్రావి= విడిచి; హీనుఁడు+ఐ= అల్పుడై.

**తాత్పర్యం:** ద్రోణుడు మరణించిన మరునాడు శల్యుడు మహాపరాక్రమవంతుడై యుద్ధం చేశాడు. కాని, ఆ రోజు ఒకపూట గడిచిన తరువాత ధర్మరాజుచేతిలో చనిపోయాడు. అప్పుడు శకుని సైన్యంతో వచ్చి యుద్ధం చేశాడు. వెంటనే సహదేవుడు అతడిని చంపాడు. అంతటితో చేసేది ఏమీలేక నిబ్బరం కోల్పోయి ఆత్మాభిమానం విడిచి అల్పుడై.(తరువాతి వచనంతో అన్వయం).

**వ. దుర్యోధనుండు తనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగటార్చియుండ, భంగంబున కోర్చి పలపలని మూఁక విడిచి, గద చేతంగొని, పాదచారియయి, యొక్కండును బాఱి, యొక్కమడువు సొచ్చి, నీళ్ళు పాషాణమయముగా మంత్రించుకొని, డాఁగి యుండెఁ; బాండవు లెఱింగి పోయి పొదివికొని మర్మభేదంబు లగు దూషణభాషణంబుల నొప్పించిన. 126**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; తన; తమ్ములన్= తమ్ముళ్ళను; భీమసేనుండు= భీముడు; సంగ్రామంబునన్= యుద్ధంలో; తెగటార్చి= చిత్రవధచేసి; ఉండన్= ఉండగా; భంగంబునకున్= వినాశనానికి; ఓర్చి= సహించి; పలపలనిమూఁకన్= పలచనయిన సైన్యాన్ని; విడిచి; గద; చేతన్+కొని= చేపట్టి; పాదచారి+ఐ= కాలినడకను వెళ్ళినవాడై; ఒక్కండును= ఒక్కడే; పాఱి= పారిపోయిన; ఒక్కమడువు= ఒక పెద్ద చెరువులో; చొచ్చి= ప్రవేశించి; నీళ్ళు; పాషాణమయము= శిలారూపం; కాన్= అగునట్లుగా; మంత్రించికొని= మంత్రోచ్చారణం చేసికొని; డాఁగి= దాగికొని; ఉండెన్= ఉన్నాడు; పాండవులు; ఎఱింగి= ఈ గుట్టు తెలిసికొని; పోయి; పొదివికొని= చుట్టూచేరి; మర్మ= ఆయువు పట్లను; భేదంబులు= బ్రద్దలు చేసేవి, బాణాలవంటివి; అగు= అయిన; దూషణ= నిందలతో కూడిన; భాషణంబులన్= మాటలచేత; నొప్పించినన్= బాధపెట్టగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన తమ్ముళ్ళనందరినీ భీముడు యుద్ధంలో మట్టుపెట్టినప్పటికీ, వారి వినాశనాన్ని దిగమ్రింగాడు. తరువాత క్షీణించి పలచనయిన సైన్యాన్ని వదలి, గదను చేపట్టి, కాలి నడకను పోయినవాడై, ఒక్కడే పెద్దచెరువులో ప్రవేశించాడు. మంత్రం జపించి నీళ్ళు శిలారూపం పొందేటట్లు చేశాడు. ఈ గుట్టు తెలిసికొన్న పాండవులు చెరువు చుట్టూ చేరి అతడిని జీవస్థానాలను బ్రద్దలుచేసే నిందావాక్యాలు పలికి బాధపెట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అతఁడు మడువు వెడలి యనిలనందనుతోడఁ। దగఁ బెనంగి, తద్గదావినిహతిఁ**
**దొడలు విఱిగి కూలి విడిచెఁ బ్రాణంబు; లి। బ్భంగి జయము గొనిరి పాండుసుతులు. 127**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ దుర్యోధనుడు; మడువు= చెరువునుండి; వెడలి= బయటికి వచ్చి; అనిల= వాయువుయొక్క; నందనుతోడన్= కుమారుడితో - భీముడితో; తగన్= వీరోచితంగా; పెనంగి= పోరాడి; తద్= ఆ భీముడియొక్క; గదా= గదయొక్క; వినిహతిన్= విశేషమైన దెబ్బచేత; తొడలు; విఱిగి= విరిగి; కూలి= పడిపోయి; ప్రాణంబులు= ప్రాణాలు; విడిచెన్= వదిలాడు; పాండు= పాండురాజుయొక్క; సుతులు= కుమారులు; ఈ+భంగిన్= ఈ విధంగా; జయము+కొనిరి= జయం పొందారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చెరువునుండి బయటికి వచ్చి, భీముడితో వీరోచితంగా పోరాడాడు. చివరకు భీముడి గదాఘాతంవలన తొడలు విరిగి కూలిపోయి ప్రాణాలు విడిచాడు. ఈ విధంగా పాండవులు జయం పొందారు.

**క. గురుసుతుఁడు పాండుతనయ శి। బిర మా రే యడరి పొదివి భీషణవృత్తిన్**
**బొరిగొనియెం గరిఘోటక। నరనిచయము నెల్ల; నే మనం గల దధిపా! 128**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!, వసుదేవా!; గురు= ద్రోణాచార్యుడియొక్క; సుతుఁడు= కొడుకు - అశ్వత్థామ; ఆ రే= ఆ రాత్రి; అడరి= చెలరేగి; పాండు తనయ= పాండవుల యొక్క; శిబిరము= దండు విడిసినచోటు; పొదివి= ఆక్రమించి; భీషణ= దారుణమైన; వృత్తిన్= వ్యాపారంతో; కరి= ఏనుగులయొక్క; ఘోటక= గుర్రాలయొక్క; నర= సైనికులయొక్క; నిచయమున్= సమూహాన్ని; ఎల్లన్= అంతటినీ; పొరిగొనియెన్= సంహరించాడు; అనన్= చెప్పగా; ఏమి= ఇంకా ఏమి; కలదు?= మిగిలి ఉన్నది?

**తాత్పర్యం:** వసుదేవా! ఆ రాత్రి అశ్వత్థామ విజృంభించి, పాండవశిబిరం ప్రవేశించి ఏనుగుల, గుర్రాల, సైనికుల సమూహాన్ని ఒక్క పురుగు మిగులకుండా ఊచకోత కోశాడు. ఇంకా చెప్పటానికి ఏమున్నది?

**వ. ఆ రాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంతపుట్టె; నిట్లు పదునెనిమిది దివసంబులు చెల్లిన సంగ్రామంబున నే మార్వురము సాత్యకియును దక్క మా దిక్కున సమస్తజనంబులు నస్తమించిరి; కౌరవుల దెస నశ్వత్థామ కృప కృతవర్మలు ముప్వురు బ్రదికిరి; యుయుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి చావునకుం దప్పె; నిది భారతరణ ప్రకారంబు.' 129**

**ప్రతిపదార్థం:** ఆ రాత్రి; ఏనును= నేనూ; పాండుసుతులు= పాండురాజు కొడుకులు; పాండవులూ; అచ్చటన్= అక్కడ; లేమిన్= లేకపోవుటచే; అంత= ఆ ఘోరకార్యం; పుట్టెన్= సంభవించింది; ఇట్లు= ఈ విధంగా; పదునెనిమిది దివసంబులు= పద్దెనిమిది రోజులు; చెల్లిన= నడిచిన; సంగ్రామంబునన్= యుద్ధంలో; ఏము= మేము; ఆర్వురము= ఆరుగురము; సాత్యకియును= సాత్యకీ; తక్కన్= తప్ప; మా దిక్కునన్= మా వైపున; సమస్త జనంబులును= అందరునూ; అస్తమించిరి= మరణించారు; కౌరవుల= కౌరవులయొక్క; దెసన్= వైపున; అశ్వత్థామయున్= అశ్వత్థామ; కృపుఁడున్; కృతవర్మయున్= కృతవర్మ; ముప్వురు= ముగ్గురు; బ్రదికిరి= బ్రతికారు; యుయుత్సుండు; మున్ను+అ= పూర్వమే; పాండవులన్= పాండవులను; ఆశ్రయించుటన్+చేసి= ఆశ్రయించటంవలన; చావునకున్= మరణానికి; తప్పెన్= తప్పించుకొన్నాడు; ఇది; భారతరణ= భారతయుద్ధంయొక్క; ప్రకారంబు= విధం.

**తాత్పర్యం:** ఆ రాత్రి నేనూ పాండవులూ అక్కడ లేకపోవటంవలన ఆ ఘోరకార్యం జరిగింది. ఈ విధంగా పద్దెనిమిది రోజులు నడిచిన యుద్ధంలో మేము ఆరుగురమూ (శ్రీకృష్ణుడు+పంచపాండవులు) సాత్యకీ తప్ప మిగిలిన మా వైపు వారందరూ మరణించారు. కౌరవపక్షంలో అశ్వత్థామా, కృపుడూ, కృతవర్మా బ్రదికారు. యుయుత్సుడు ముందే పాండవుల పంచకు చేరటంవలన చావు తప్పించుకొన్నాడు. ఇదీ భారతయుద్ధం జరిగినతీరు.'

**క. అని చెప్పెఁ గాని యభిమ। న్యుని చా వేర్పడఁగఁ జెప్ప నొల్లఁడ వసుదే**
**వునకు వగ మిగులుటకు నె। మ్మనమునఁ దా నోర్వకునికి మాధవుఁ డధిపా! 130**

**ప్రతిపదార్థం:** అని; మాధవుఁడు= శ్రీకృష్ణుడు; చెప్పెన్= చెప్పాడు; కాని; వసుదేవునకున్= వసుదేవుడికి; వగ= దుఃఖం; మిగులుటకున్=

ఎక్కువ కావటానికి; తాన్= తాను; నెఱ+మనమునన్= నిండు మనస్సుతో; ఓర్వక= సహింపక; ఉనికిన్= ఉండటంచేత; అభిమన్యుని= అభిమన్యుడియొక్క; చావు= మరణం; ఏర్పడఁగన్= స్పష్టంగా; చెప్పన్= చెప్పగా; ఒల్లఁడు+అ= ఇష్టపడనే ఇష్టపడ డాయెను.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు భారతయుద్ధం జరిగినవిధమంతా చెప్పాడు. కాని వసుదేవుడికి దుఃఖం ఎక్కువకావటం తాను ఓర్చుకొనలేడు కాబట్టి అభిమన్యుడి చావును గూర్చి అతడికి చెప్పటానికి ఇష్టపడనేలేదు.

**వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ 'నీ యల్లుం డభిమన్యుండు దెగుట మీ తండ్రికిం జెవులా రం జెప్పుమన్నా!' యని వసుదేవుండు వినం బలుకుచుం బుడమింబడిన వసుదేవాది యాదవజనంబులు మనంబులం గదిరిన క్రొత్త నెవ్వగలం బలవించినం, బద్మనాభుండు వారల నెల్ల నూరార్చి వారణపురంబున సుభద్రయు నుత్తరయు నభిమన్యునిదెస నెత్తిన శోకంబున నాకులత్వంబు నొందిన చందంబును, గొంతితగు మాటల వారిం దేర్చిన తెఱంగును, నెఱింగించి, పాండవు లేవురును వేర్వేఱ యభిమన్యునకై మణికాంచన గవాది వస్తువులు విప్రప్రకరంబుల కొసంగుటయు, మఱియుఁ దటాక కరణాది ధర్మంబు లాచరించుటయుం, జెప్పి, మఱియు 'దురంబునం దెరలక మరలక యాసౌభద్రుండు రౌద్రమూర్తియై దుర్యోధన ద్రోణ కృపద్రౌణి కృతవర్మ కర్ణాది వీరవ్రాతంబుఁ గలంచి యనేక నృపలోకంబును జములోకంబున కనిచి యనిమిషులు పొగడ నుత్తమలోకంబున కరిగి సుఖియై యున్నవాఁడు; వానికి వగవనేల?' యనియుం బలికి యిట్లుపశాంతి గావించి. 131**

**ప్రతిపదార్థం:** దానిన్= అభిమన్యుడి చావును గూర్చి చెప్పకుండుటను; ఎఱింగి= తెలిసికొని; సుభద్ర; గద్గద= దుఃఖంవలన తడబడే; స్వరంబునన్= గొంతుతో; గోవిందునితోడన్= శ్రీకృష్ణుడితో; నీ= నీయొక్క; అల్లుండు= మేనల్లుడు అగు; అభిమన్యుండు; తెగుట= మరణించటం; మీ= మీయొక్క; తండ్రికిన్= తండ్రి వసుదేవుడికి; చెవులు+ఆరన్= చెవులకెక్కునట్లుగా; చెప్పుము; అన్నా!; అని; వినన్= వినగా; పలుకుచున్= పలుకుతూ; పుడమిన్= భూమిమీద; పడినన్= కూలిపోగా; వసుదేవ= వసుదేవుడు; ఆది= మొదలైన; యాదవ జనంబులు= యాదవులందరూ; మనంబులన్= మనస్సులలో; కదిరిన= క్రమ్మిన; క్రొత్త= క్రొత్తగా పుట్టినవైన; నెఱ+వగలన్= పరిపూర్ణ దుఃఖములతో; పలవించినన్= ఆక్రోశింపగా; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు; వారలన్= వారిని; ఎల్లన్= అందరనూ; ఊరార్చి= ఓదార్చి; వారణపురంబునన్= హస్తినాపురంలో; సుభద్రయున్= సుభద్రయూ; ఉత్తరయున్= ఉత్తరయూ; అభిమన్యుని+దెసన్= అభిమన్యుడిని గూర్చి; ఎత్తిన= ఉప్పొంగిన; శోకంబునన్= శోకంచేత; ఆకులత్వంబు= క్షోభను; ఒందిన= పొందిన; చందంబును= విధమునూ; గొంతి= కుంతి; తగు= తగిన; మాటలన్= మాటలతో; వారిని; తేర్చిన= ఓదార్చిన; తెఱంగును= విధమునూ; ఎఱింగించి= తెలియజేసి; పాండవులు; ఏవురును= ఐదుగురునూ; వేఱు+వేఱ= విడి విడిగా; అభిమన్యునకై= అభిమన్యుడి తృప్తికై; మణి= మణులు; కాంచన= బంగారము; గో= గోవులు; ఆది= మొదలైన; వస్తువులు; విప్ర= బ్రాహ్మణులయొక్క; ప్రకరంబులకున్= సమూహాలకు; ఒసంగుటయున్= దానం చేయుటయు; మఱియున్= ఇంకా; తటాక కరణ= చెరువులు త్రవ్వించటం; అది= మొదలైన; ధర్మంబులు= ధర్మాలు; ఆచరించుటయున్= చేయుటయూ; చెప్పి; మఱియున్= ఇంకా; దురంబునన్= యుద్ధంలో; తెరలక= తొలగక; మరలక= వెనుకంజవేయక; ఆ సౌభద్రుండు= ఆ సుభద్రా కుమారుడు, అభిమన్యుడు; రౌద్రమూర్తి+ఐ= రౌద్రము మూర్తీభవించినవాడై; దుర్యోధన= దుర్యోధనుడు; ద్రోణ= ద్రోణుడు; కృప= కృపుడూ; ద్రౌణి= ద్రోణుడి కుమారుడు, అశ్వత్థామ; కృతవర్మ; కర్ణ= కర్ణుడు; ఆది= మొదలైన; వీర= వీరులయొక్క; వ్రాతంబున్= సమూహాన్ని; కలంచి= కలతపెట్టి; అనేక= అనేకులైన; నృప= రాజులయొక్క; లోకంబును= సమూహాన్ని; జము= యముడియొక్క; లోకంబునకున్= లోకానికి; అనిచి= పంపి; అనిమిషులు= దేవతలు; ఎగడన్= పొగడగా; ఉత్తమ లోకంబునకున్=

ఉత్తమలోకానికి; అరిగి= వెళ్ళి; సుఖి+ఐ= సుఖంతో కూడినవాడై; ఉన్నవాఁడు= ఉన్నాడు; వానికిన్= వాడికొరకు; వగవన్= దుఃఖించగా; ఏల?= ఎందుకు?; అనియున్= అనియూ; పలికి; ఇట్లు= ఈ విధంగా; ఉపశాంతి= మనశ్శాంతిని; కావించి= కలిగించి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అభిమన్యుడి వధనుగూర్చి చెప్పకపోవటం గ్రహించిన సుభద్ర 'అన్నా! నీ మేనల్లుడైన అభిమన్యుడు మరణించటం మీ తండ్రి వసుదేవుడికి చెవుల కెక్కేటట్లు చెప్పు'మని వసుదేవుడు వినేటట్లుగా పలికింది. అప్పుడు వసుదేవుడు మొదలైన యాదవులు కొత్తగా పుట్టిన దుఃఖంతో ఆక్రోశించారు. శ్రీకృష్ణుడు వారినందరినీ ఓదార్చి, హస్తినాపురంలో ఉత్తరా సుభద్రలు అభిమన్యుడిని గూర్చి మహాదుఃఖంతో క్షోభిస్తే కుంతీదేవి వారిని ఓదార్చటం, పాండవులు విడివిడిగా అభిమన్యుడి తృప్తికై మణులూ, బంగారం, గోవులూ మొదలైన వస్తువులను బ్రాహ్మణులకు దానం చేయటం, ఇంతేకాకుండా తటాక నిర్మాణం మొదలైన ధర్మకార్యాలు చేయటం వారికి వివరించాడు. ఇంకనూ వారితో 'అభిమన్యుడు రౌద్రం మూర్తీభవించినట్లుగా దుర్యోధన ద్రోణాది మహావీరులందరినీ చెల్లాచెదరుచేసి కలత పెట్టాడు. నానాదేశ రాజులను యమలోకానికి పంపాడు. దేవతలు పొగడుతుండగా ఉత్తమలోకానికి వెళ్లి సుఖంగా ఉన్నాడు. వాని కొరకు శోకించటం ఎందుకు?' అని పలికి వారి మనస్సులు కుదుటపరిచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. బంధులోకమునకుఁ బరమ ప్రియంబైన। యుచిత వర్తనమున నుండెఁ గృష్ణుఁ;'**
**డని సవిస్తరంబు లగు వాక్యములఁ బ్రీతి। చిగురులొత్త నిట్లు చెప్పి మఱియు. 132**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; బంధు= చుట్టాలయొక్క; లోకమునకున్= సమూహానికి; పరమ= మిక్కిలి; ప్రియంబు+ఐన= ఇష్టమైన; ఉచిత= తగిన; వర్తనమునన్= నడవడితో; ఉండెన్= ఉన్నాడు; అని; సహ+విస్తరంబులు= విపుల శబ్దజాలంతో కూడినవి; అగు= అయిన; వాక్యములన్= వాక్యాలతో; ప్రీతి= ఆనందం; చిగురులొత్తన్= పుట్టగా; ఇట్లు= ఈ విధంగా; చెప్పి; మఱియున్= ఇంకనూ.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు చుట్టాలకందరికీ మిక్కిలి ఇష్టమయిన రీతిగా నడుచుకొంటూ ఉన్నాడు. ఈ విధంగా సవిస్తరంగా సంతోషం కలిగేటట్లు చెప్పి ఇంకనూ. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. కరిపురంబునం బుట్టిన విశేషంబులు వినుమని పలికి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.133**

**ప్రతిపదార్థం:** కరిపురంబునన్= హస్తినాపురంలో; పుట్టిన= కలిగిన; విశేషంబులు= విశేషాలు; వినుము; అని; పలికి; వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** హస్తినాపురంలో పుట్టిన విశేషాలు వినుమంటూ వైశంపాయనుడు జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు.

వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట (సం.14-61-8)

**సీ. చుఱచుఱఁ దనచెవుల్ సూఁడిన యట్లుగ। నభిమన్యు సంస్తుతి యైన వాక్య**
**యము ప్రసంగాధీనమై బంధుజనులందుఁ। బొడముటయును, ధృతి యెడలి తలరి**
**యుత్తర విలపింప, నత్తన్వియలమట। గనుఁగొని, పాండునందనులు వనటఁ**
**గూరిన, నచటికిఁ గారుణ్యమూర్తి వే। దవ్యాసుఁ దేతెంచి తగినమాట**

**తే.** **లాడి, వారలవగ మాన్పి, యశ్వమేధ। విషయవిధులు ప్రసంగించి వేగ తొడఁగుఁ**
**దని నియోగించి, వా రెల్ల నట్లకాక। యనిన నాతఁ డంతర్హితుం డయ్యె నధిప! 134**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! జనమేజయా!; బంధుజనులు+అందున్= చుట్టాల నడుమ; ప్రసంగ= ప్రస్తావమునకు; అధీనము+ఐ= వశమై; అభిమన్యు= అభిమన్యుడి; సంస్తుతి= ప్రశంస; ఐన= అయిన; వాక్= మాటలయొక్క; చయము= సమూహం; చుఱచుఱన్= చుర చురా; తన= తనయొక్క; చెవుల్= చెవులు; చూఁడిన= కాల్చిన; అట్లు+కన్= అట్లుగా; పొడముటయును= పుట్టిన పిదప; ధృతి= ధైర్యం; ఎడలి= క్షీణించి; తలరి= కంపించి; ఉత్తర; విలపింపన్= దుఃఖించగా; ఆ తన్వి= ఆ స్త్రీయొక్క; అలమట= దుఃఖం; కనుఁగొని= చూచి; పాండు= పాండురాజుయొక్క; నందనులు= కుమారులు; వనటన్= శోకంలో; కూరినన్= మునుగగా; అచటికిన్= అక్కడకు; కారుణ్యమూర్తి= దయాస్వరూపుడు; వేదవ్యాసుఁడు= వ్యాసమహర్షి; ఏతెంచి= వచ్చి; తగిన; మాటలు; ఆడి= పలికి; వారల= పాండవుల; వగ= దుఃఖం; మాన్పి= పోగొట్టి; అశ్వమేధ= అశ్వమేధంయొక్క; విషయ= ప్రధానకార్యము నందలి; విధులు= పద్ధతులు; ప్రసంగించి= వివరించి; వేగ= త్వరగా; తొడఁగుఁడు= పూనుకొనండి; అని; నియోగించి= ఆజ్ఞాపించి; వారు= పాండవులు; ఎల్లన్= అందరూ; అట్లు+అ= అట్లే; కాక= అగునుగాక; అనినన్= అనగా; అతఁడు= ఆ మహర్షి; అంతర్హితుండు= అదృశ్యుడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** జనమేజయా! చుట్టాలందరూ మాటల వెంబడి అభిమన్యుడిని పెక్కుమాటలలో పొగడేటప్పటికి ఎంతో బాధకలిగి ఉత్తర శోకించింది. ఆమె దుఃఖపడటం చూచి పాండవులు దుఃఖంలో మునిగిపోయారు. అప్పుడు దయామయుడైన వ్యాసమహర్షి వచ్చి తగిన మాటలు చెప్పి వారిని ఓదార్చాడు. ఆ సందర్భంగా అశ్వమేధయాగ సంస్కారాలను వివరించి 'మీరు వెంటనే దానిని చేయటానికి పూనుకొనం'డని వారిని ఆజ్ఞాపించి అదృశ్యుడయ్యాడు.

**క.** **అన విని జనమేజయుఁ 'డ। మ్ముని యిట్లు హితోపదేశముం జేసినఁ బాం**
**డు నృపాగ్రతనయుఁ డెమ్మెయి। ననఘ! తొడఁగె నశ్వమేధ యాగంబునకున్?' 135**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; జనమేజయుఁడు; అనఘ!= పాపంలేనివాడు!; ఆ ముని= ఆ వ్యాసమహర్షి; ఇట్లు= ఈ విధంగా; హిత= మేలు కలిగించే; ఉపదేశమున్= ప్రబోధం; చేసినన్= చేయగా; పాండునృప= పాండురాజుయొక్క; అగ్రతనయుఁడు= పెద్దకొడుకు -ధర్మరాజు; ఏ+మెయిన్= ఏ విధంగా; అశ్వమేధయాగంబునకున్= అశ్వమేధ యజ్ఞానికి; తొడఁగన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడి మాటలు విని జనమేజయుడు 'పుణ్యాత్మా! వ్యాసమహర్షి ఈ విధంగా హితం కలిగించే ఉపదేశం చేయగా; ధర్మరాజు అశ్వమేధయాగం చేయటానికి ఏ విధంగా పూనుకొన్నాడు?'

**క.** **అని యడిగిన వైశంపా। యనుఁ డాతని కిట్టు లనియె; నప్పుడు కుంతీ**
**తనయాగ్రజుండు తమ్ములఁ। గనుఁగొని యుత్సాహలక్ష్మి కనుఁగవ నొప్పన్. 136**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్= అడుగగా; వైశంపాయనుఁడు; ఆతనికిన్= జనమేజయుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అప్పుడు= వ్యాసమహర్షి వెళ్ళిన తరువాత; కుంతీ= కుంతియొక్క; తనయ= కొడుకులలో; అగ్రజుండు= పెద్దవాడు; కను+కవన్= రెండు కళ్ళల్లో; ఉత్సాహ= ఉత్సాహంవలన కలిగిన; లక్ష్మి= శోభ; ఒప్పన్= ఒప్పగా; తమ్ములన్= తమ్ముళ్ళను; కనుఁగొని= చూచి.

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు అతడితో ఈ విధంగా అన్నాడు. వ్యాసమహర్షి వెళ్ళిన తరువాత ధర్మరాజు కళ్ళల్లో ఉత్సాహ శోభ ఒప్పగా తన తమ్ముళ్ళను చూచి.(తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'వ్యాసమహాముని వత్సలత్వంబున। నానతి యిచ్చిన మాననీయ**
**వాక్యంబు వింటిరె? వసుధ యిత్తఱి వసు। హీనయై యున్నది; దానఁ జేసి**
**భూదేవ నిహిత ధనాదాన మావశ్య। కంబయ్యెఁ; దాని శక్యత్వమును హి**
**మాచల యాత్రా సమాచరణ ప్రకా। రమును విచారణీయములు గావె?**

**ఆ. యనుడుఁబవన తనయుఁ డతనితో నీశ్వరుఁ। బరమ నియతిఁ గొలిచి, కరుణ వడసి**
**ప్రమథగణము నెల్ల భక్తిఁ బూజించి, య। త్తలమునందు భూతబలు లొనర్చి. 137**

**ప్రతిపదార్థం:** వ్యాసమహాముని= వ్యాసమహర్షి; వత్సలత్వంబునన్= మమకారంతో; ఆనతి+ఇచ్చిన= సెలవిచ్చిన; మాననీయ= మన్నింపదగిన; వాక్యంబు= మాట; వింటిరి+ఎ= విన్నారు కదా!; ఈ+తఱిన్= ఈ సమయాన; వసుధ= భూమి, సామ్రాజ్యం; వసు= ధనంచేత; హీన+ఐ= తక్కువదియై; ఉన్నది; దానన్+చేసి= అందువలన; భూదేవ= బ్రాహ్మణులచేత; నిహిత= ఉంచబడిన; ధన= ధనంయొక్క; ఆదానము= తీసికొనిరావటం; అవశ్యకంబు= తప్పనిసరి; అయ్యెన్= అయినది; దాని= ఆ ధనం తీసికొనివచ్చే పనియొక్క; శక్యత్వమును= సాధ్యతనూ; హిమ+అచల= హిమవత్పర్వతమును గూర్చి; యాత్రా= యాత్రను; సమాచరణ= లెస్సగా చేయునట్టి; ప్రకారమును= విధానమునూ; విచారణీయములు= ఆలోచింపదగినవి; కావు+ఎ!= అగును కదా!; అనుడున్= అనిన తరువాత; పవన= వాయువుయొక్క; తనయుఁడు= కుమారుడు-భీముడు; అతనితోన్= ధర్మరాజుతో; ఈశ్వరున్= శివుడిని; పరమ= మిక్కిలి; నియతిన్= నియమంతో; కొలిచి= పూజించి; కరుణ= దయ; పడసి= పొంది; ప్రమథ= ప్రమథులయొక్క; గణమున్= సమూహమును; ఎల్లన్= అంతటినీ; భక్తిన్= భక్తితో; పూజించి; ఆ+తలము+అందున్= ఆ ప్రదేశంలో; భూత= భూతముల కొరకు; బలులు; ఒనర్చి= చేసి.

**తాత్పర్యం:** 'వ్యాసమహర్షి మమకారంతో చెప్పినమాట విన్నారు కదా! ఈనాడు భూమండలంలో ధనంలేదు. అందుచేత బ్రాహ్మణులు దాచిపెట్టిన ధనాన్ని తీసికొనిరావటం తప్పనిసరి అవుతున్నది. అయితే ఆ పని సాధ్యాసాధ్యాలనూ హిమాలయ యాత్రా విధానమూ ఆలోచించవలసి ఉన్నది' అని అన్నాడు. అప్పుడు భీముడు ధర్మరాజుతో 'పరమ శివుడిని నియమబద్ధంగా పూజించి ఆయన అనుగ్రహం పొంది ప్రమథగణాలను సేవించి అక్కడ భూతబలులు చేసి, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తెత్తము గాక నరేంద్ర! మ। రుత్తకలితమైన దానరూపము సుమహో**
**దాత్త స్థితి నున్న కనక;। మిత్తఱి నిలదెసఁ దలంప నేటికి మనకున్. 138**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= రాజా!; మరుత్త= మరుత్తుడిచేత; కలితము= కల్పించబడింది; ఐన= అయిన; దాన= దానంయొక్క; రూపము= రూపం కలది; సు= మంచి; మహత్= గొప్ప; ఉదాత్త= ఒప్పిదమైన; స్థితిన్= స్థితితో; ఉన్న; కనకము= బంగారం; తెత్తము+కాక= తీసికొని వస్తాము; ఈ+తఱిన్= ఈ సమయాన; మనకున్= మనకు; ఇల= భూమియొక్క; దెసన్= దురవస్థను; తలంపన్= విచారించగా; ఏటికిన్?= ఎందులకు?

**తాత్పర్యం:** రాజా! మరుత్తుడు దానంచేసిందీ, ఈనాటికీ చెక్కు చెదరకుండా ఉన్నదీ అయిన బంగారాన్ని తీసికొని వద్దాము. రాజ్యదురవస్థను గూర్చి మనం విచారించటం దేనికి?

**విశేషం:** మరుత్తుడు షోడశమహారాజులలో ఒకడు. ఆ రాజు సంవర్తుడిని ఉపద్రష్టగా చేసికొని, హిమవత్పర్వత పార్శ్వప్రదేశంలో యజ్ఞంచేసి, బ్రాహ్మణులకు సువర్ణరాసులూ, కనక పాత్రలూ దక్షిణగా ఇచ్చాడు. బ్రాహ్మణులు త్రవ్వితండాలుగా ఉన్న ఆ

బంగారాన్ని తీసికొని వెళ్ళగలిగినంత స్వీకరించి మిగిలినదానిని అక్కడ నిధిగా నిలిపి 'ఇది కాలాంతరంలో చూచినవారికే చెందుతుం'దని కట్టడి చేశారు. ఆ బంగారాన్నే తీసికొనివద్దామని భీముడు ధర్మరాజుతో అంటున్నాడు.

**వ. అప్పనికి సముచిత సైన్య సమేతంబుగా దేవర విజయంచేయవలయు' ననిన నర్జునుండును గవలును నట్ల పలికిరి; దానికి ధర్మనందనుండు ప్రియంబంది, కృతనిశ్చయుండయి, ధృతరాష్ట్రు కడకుం జని, యశ్వమేధ యాగోపక్రమోత్సవ శ్రవణంబునం బుత్త్రులం దలంచి శోకసంతాప సమాక్రాంతుండయి యున్న యన్నరపతి చరణంబుల కెఱంగి, వేదవ్యాసు వచనంబులు గాంధారియు వినుచుండ నతనికిం జెప్పి, యతనిచేత నయ్యజ్ఞాచరణంబునకు ననుజ్ఞ వడసి యయ్యిరువురను దండ ప్రణామపూర్వకంబుగా వీడ్కొని, గొంతిపాలికిం బోయి, సంతోష వికచవదనయయి యున్న యద్దేవి యధ్వర విధానంబునకు ననుమతి సేయం దదీయ పాదంబులకుం బ్రణమిల్లి, తదామంత్రితుండై యాస్థానమండపంబునకు నరుగుదెంచి, యుయుత్సు రావించి కార్యంబు తెఱంగెఱింగించి నీవు నగర రక్షకై నిలువుమని నెయ్యంబలర విదుర సమేతంబుగా నిలిపి, బలంబుల సంఘటింపం బడవాళ్ళం బనిచి, నియతుండయి. సురపితృ పూజనంబులు దీర్చి, మహేంద్రార్చనం బొనర్చి మహితావధానుండై. 139**

**ప్రతిపదార్థం:** ఆ+పనికిన్= బంగారం తీసికొని వచ్చే పనికి; దేవర= ఏలినవారు; సముచిత= తగినంత; సైన్య= సైన్యంతో; సమేతంబు+కాన్= కూడియుండేటట్లుగా; విజయంచేయవలయున్= వెళ్ళవలయును; అనినన్= అనగా; అర్జునుండును= అర్జునుడూ; కవలునున్= నకుల సహదేవులునూ; అట్లు+అ= ఆ విధంగానే; పలికిరి= అన్నారు; దానికిన్= సోదరులు చెప్పిన మాటకు; ధర్మ= యముడియొక్క; నందనుండు= కుమారుడు; ప్రియంబు+అంది= సంతోషించి; కృతనిశ్చయుండు+ఐ= నిశ్చయించుకొన్నవాడై; ధృతరాష్ట్రు= ధృతరాష్ట్రుడియొక్క; కడకున్= దగ్గరకు; చని= వెళ్ళి; అశ్వమేధయాగ= అశ్వమేధయాగంయొక్క; ఉపక్రమ= ప్రారంభమనెడు; ఉత్సవ= వేడుకయొక్క; శ్రవణంబునన్= వినుటవలన; పుత్త్రులన్= కుమారులను; తలంచి= స్మరించి; శోక= శోకంవలన కలిగిన; సంతాప= సంతాపంచేత; సమాక్రాంతుండు+ఐ= ఆక్రమించబడినవాడై; ఉన్న; ఆ నరపతి= ఆ రాజుయొక్క; చరణంబులకున్= పాదాలకు; ఎఱంగి= మ్రొక్కి; వేదవ్యాసు= వేదవ్యాసుడియొక్క; వచనంబులు= మాటలు; గాంధారియున్= గాంధారికూడా; వినుచున్+ఉండన్= వింటూ ఉండగా; అతనికిన్= ధృతరాష్ట్రుడికి; చెప్పి; అతనిచేతన్= అతడిచేత; ఆ యజ్ఞ= ఆ యజ్ఞంయొక్క; ఆచరణంబునకున్= చేయటానికి; అనుజ్ఞ= అనుమతి; పడసి= పొంది; ఆ ఇరువురను= ఆ ఇద్దరినీ, గాంధారీ ధృతరాష్ట్రులను; దండప్రణామ= సాష్టాంగ నమస్కారం; పూర్వకంబు+కాన్= మొదటిది కాగా; వీడ్కొని= పోయి వస్తానని వదలి; గొంతి= కుంతీదేవియొక్క; పాలికిన్= దగ్గరకు; పోయి= వెళ్ళి; సంతోష= సంతోషంచేత; వికచ= వికసించిన; వదన= ముఖం కలది; అయి; ఉన్న; ఆ దేవి= ఆ దేవేరి; అధ్వర= యజ్ఞంయొక్క; విధానంబునకున్= చేయటానికి; అనుమతి+ చేయన్= అంగీకరించగా, అనుజ్ఞ ఇవ్వగా; తదీయ= ఆమెవి అయిన; పాదంబులకున్= కాళ్ళకు; ప్రణమిల్లి= నమస్కరించి; తద్= ఆమెచేత; ఆమంత్రితుండు+ఐ= వీడ్కొల్పబడినవాడై; ఆస్థాన మండపంబునకున్= ఆస్థాన మండపానికి; అరుగుదెంచి= వచ్చి; యుయుత్సున్= యుయుత్సుడిని (ధృతరాష్ట్రుడికి వైశ్య స్త్రీ యందు పుట్టినవాడు); రావించి= రప్పించి; కార్యంబు= పనియొక్క; తెఱంగు= తీరు; ఎఱింగించి= తెలియజేసి; నీవు; నగర= పట్టణముయొక్క; రక్షకై= రక్షణకొరకు; నిలువుము= ఆగుము; అని; నెయ్యంబు= ప్రేమ; అలరన్= కలుగగా; విదుర= విదురుడితో; సమేతంబు+కాన్= కూడియుండునట్లుగా; నిలిపి= ఉంచి; బలంబులన్= సేవలను; సంఘటింపన్= సిద్ధంచేయగా; పడవాళ్ళన్= సేనాపతులను; పనిచి= ఆజ్ఞాపించి; నియతుండు+ఐ= వ్రతనిష్ఠ కలవాడై; సుర= దేవతలయొక్క; పితృ= మరణించిన పూర్వులయొక్క; పూజనంబులు= పూజించుటలు; తీర్చి= నిర్వహించి; మహేంద్ర= ఇంద్రుడియొక్క; అర్చనంబు= పూజను; ఒనర్చి= చేసి; మహిత= గొప్ప; అవధానుండు+ఐ= శ్రద్ధగలవాడై.

**తాత్పర్యం:** ఆ బంగారం తీసికొనివచ్చే పనికి తగిన సైన్యంతో ప్రభువులు వెళ్ళవలయును అని అన్నాడు. అర్జునుడూ, నకుల సహదేవులూ ఆ విధంగానే అన్నారు. వారి మాటలకు సంతోషించి ధర్మరాజు అశ్వమేధయాగం చేయాలని నిశ్చయించుకొన్నాడు. తరువాత ధృతరాష్ట్రుడి దగ్గరకు వెళ్ళాడు. అశ్వమేధయాగం ప్రారంభం అవుతుందనేమాట చెవినిబడేటప్పటికి, ఆ మహారాజు కొడుకులను తలచుకొని విలపించాడు. ధర్మరాజు అతడికి పాదాభివందనం చేసి గాంధారి వింటుండగా వ్యాసమహర్షి పలికిన మాటలు చెప్పి, అశ్వమేధయాగం చేయటానికి అనుమతిపొందాడు. తరువాత ధర్మరాజు తల్లి అయిన కుంతిదగ్గరకు వెళ్ళాడు. ఆమె ఎంతో సంతోషించి యాగం నిర్వహించటానికి అనుమతించింది. అత డామె కాళ్ళకు మ్రొక్కి సెలవు తీసికొని, ఆస్థానమండపానికి వచ్చి, యుయుత్సుడిని రప్పించి చేయవలసిన పని తెలియజేసి, 'నీవు నగరాన్ని రక్షించటానికి ఆగుమని చెప్పి అతడికి విదురుడిని తోడుగా నిలిపాడు. తగిన సైన్యం సమకూర్చటానికి సేనాపతులను ఆజ్ఞాపించాడు. తరువాత నిష్ఠతో ఇంద్రుడిని, దేవతలనూ, పితృదేవతలనూ పూజించి గొప్ప శ్రద్ధకలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నానావిధ బహుళాంచిత। దానము లొనరించి యర్చితం బగు నగ్నిన్**
**దాని యధికారి ధౌమ్యుం। దాను బ్రదక్షిణ విధాయితం గొలిచి తగన్. 140**

**ప్రతిపదార్థం:** నానావిధ= అనేక విధములైన; బహుళ= అధికమైన; అంచిత= ఒప్పుచున్న; దానములు; ఒనరించి= చేసి; అర్చితంబు= ఆరాధించబడినది; అగు= అయిన; అగ్నిన్= అగ్నినీ; దాని= ఆ అగ్నియొక్క; అధికారిన్= అధికారంకలవాడిని; ధౌమ్యున్= ధౌమ్యుడిని; తాను; ప్రదక్షిణ= ప్రదక్షిణమనే; విధాయితన్= విధానంతో; తగన్= శాస్త్రోక్తంగా; కొలిచి= ఉపాసించి.

**తాత్పర్యం:** రకరకాలయిన దానాలు అధికంగా చేసి అగ్నిని పూజించి, దానికీ, దాని యజమానుడయిన ధౌమ్యుడికీ ప్రదక్షిణం గావించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సిత లేపన సితభూషణ। సితమాల్య సితాంబరములఁ జెన్నుగ సమలం**
**కృతుఁడై సితాతపత్ర। ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రు పగిది వెలుఁగుచున్. 141**

**ప్రతిపదార్థం:** సిత= తెల్లని; లేపన= మైపూతలచేతను; సిత= తెల్లని; భూషణ= నగలచేతను; సిత= తెల్లని; మాల్య= పూలదండలచేతను; సిత= తెల్లని; అంబరములన్= వస్త్రాలచేతను; సమలంకృతుఁడు+ఐ= మిక్కిలి అలంకరించుకొన్నవాడై; సిత= తెల్లని; ఆతపత్ర= గొడుగులయొక్క; ప్రతతి= సమూహం; మెఱయన్= మెరుస్తుండగా; పూర్ణచంద్రు పగిదిన్= నిండు చంద్రుడివలె; వెలుఁగుచున్= ప్రకాశిస్తూ.

**తాత్పర్యం:** తెల్లని మైపూతలూ, నగలూ, పూలదండలూ, బట్టలూ అలంకరించుకొని, కట్టుకొని తెల్లని గొడుగులగుంపు మెరుస్తుండగా పున్నమినాటి చంద్రుడివలె ప్రకాశిస్తూ, (తరువాతి వచనంతో అన్వయం).

**ప్రతిపదార్థం:** అలం: ఉపమ.

**వ. షోడశ శ్వేతాశ్వ వ్యూఢ రథారూఢుండై. 142**

**ప్రతిపదార్థం:** షోడశ= పదహారు; శ్వేత= తెల్లని; అశ్వ= గుర్రములు; వ్యూఢ= పన్నిన; రథ= రథమును; ఆరూఢుండు+ఐ= ఎక్కినవాడై.

**తాత్పర్యం:** పదహారు తెల్లని గుర్రాలు కట్టిన రథం ఎక్కినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. భూదైవత దత్తాశీ। ర్వాదంబులుఁ బుణ్యగానరవములు; రోదో**
**మేదుర మంగళ తూర్యని। నాదంబులుఁ జెలంగ, బుధజనస్తుతు లెసఁగన్. 143**

**ప్రతిపదార్థం:** భూదైవత= బ్రాహ్మణులచేత; దత్త= ఇయ్యబడిన; ఆశీర్వాదంబులున్, దీవనల సవ్వడియునూ; పుణ్య= పుణ్యం కలిగించే; గాన= సంగీతంయొక్క; రవములున్= ధ్వనులునూ; రోదన్= భూమ్యాకాశ మధ్య ప్రదేశమందంతటా; మేదుర= దట్టమైన; మంగళ= శుభం కలిగించే; తూర్య= వాద్యాలయొక్క; నినాదంబులున్= ధ్వనులునూ; చెలంగన్= అతిశయించగా; బుధజన= విద్వాంసులయొక్క; స్తుతులు= స్తోత్రాలు; ఎసఁగన్= ఒప్పగా.

**తాత్పర్యం:** బ్రాహ్మణుల దీవనల సవ్వడీ, పవిత్ర సంగీతధ్వనులూ, మంగళవాద్య ఘోషలూ అతిశయించగా విద్వాంసుల స్తోత్రములు ఒప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. వెడలెడు నమ్మహీవిభుని వేడ్క యెఱింగి, వృకోదరుండుఁ గ**
**వ్వడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యె**
**క్కుడు మెఱయం, బ్రధాన భట ఘోటక దంతి రథ ప్రతానముల్**
**దడిగలుఁ గుంచెలుం గొడుగు తండములున్ విలసిల్ల వచ్చినన్. 144**

**ప్రతిపదార్థం:** వెడలెడు= బయలుదేరే; ఆ మహీవిభుని= ఆ రాజుయొక్క; వేడ్క= అభిలాష; ఎఱింగి= తెలిసికొని; వృకోదరుండున్= భీముడూ; కవ్వడియును= అర్జునుడునూ; పిన్నతమ్ములును= చిన్న తమ్ముళ్ళునూ - నకుల సహదేవులునూ; వైభవము= సంపద; ఒప్పన్= ఒప్పగా; అలంకరించి= అలంకరించుకొని; ప్రధాన= ముఖ్యమైన; భట= సైనికులయొక్క; ఘోటక= గుర్రాలయొక్క; దంతి= ఏనుగులయొక్క; రథ= రథాలయొక్క; ప్రతానముల్= సమూహాలూ; ఎక్కుడు= ఎక్కువగా; మెఱయన్= ప్రకాశించగా; దడిగలున్= డాళ్ళు; కుంచెలున్= చామరాలూ; గొడుగు= గొడుగులయొక్క; తండములున్= గుంపులు; విలసిల్లన్= ఒప్పగా; వచ్చినన్= రాగా.

**తాత్పర్యం:** ఈ విధంగా బయలుదేరిన ధర్మరాజు కోరిక తెలిసికొని, భీమార్జున నకుల సహదేవులు తమ తమ విభవం కొలది సింగారించుకొని, చతురంగబలాలూ; డాళ్ళూ, చామరాలూ, గొడుగులూ ఒప్పుచుండ, రాగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. కని యా నృపుఁ డలఁతి నగవు। నినుపారెడు చూడ్కి వారి నెమ్మొగములపైఁ**
**దనుపారుచుఁ బొలయం, జనఁ। జన రాజులు గూడుకొనిరి సైన్యంబులతోన్. 145**

**ప్రతిపదార్థం:** కని= తమ్ముళ్ళను చూచి; ఆ నృపుఁడు= ఆ రాజు, ధర్మరాజు; అలఁతి నగవు= చిరునవ్వు; నినుపారెడు= నిండిన; చూడ్కి= చూపు; వారి= వారియొక్క; నెఱి= అందమైన; మొగములపైన్= ముఖాలమీద; తనుపారుచున్= చల్లనిదగుచూ; పొలయన్= వ్యాపించగా; చనన్+చనన్= వెళ్ళగా వెళ్ళగా; రాజులు; సైన్యంబులతోన్= సేనలతో; కూడుకొనిరి= కలిసికొన్నారు.

**తాత్పర్యం:** ధర్మరాజు వచ్చిన తమ్ముళ్ళను చూచి, చిరునవ్వుతో కూడిన చల్లని చూపు వారి ముఖాల మీద ప్రసరింపజేస్తూ ప్రయాణం చేస్తుండగా, రాజులు తమ సేనలతో కూడినవారై వచ్చి కలిశారు.

**వ.** **ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుఁడు సముచిత ప్రయాణంబుల గిరి సరిదరణ్యంబులు గడచి, హిమశైలంబు సేరి, ధౌమ్యాది పురోహితులఁ బురస్కరించికొని, తదీయ తలం బధిష్ఠించి, యొక్క యుచిత ప్రదేశంబున విడిసె; నట్టియెడ. 146**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; అరిగి= వెళ్ళి; ఆ కురువంశ= ఆ కురువంశంయొక్క; వరుండు= పతి, ధర్మరాజు; సముచిత= తగిన; ప్రయాణంబులన్= ప్రయాణాలతో; గిరి= కొండలూ; సరిత్= నదులూ; అరణ్యంబులు= అడవులూ; కడచి= దాటి; హిమశైలంబు= హిమవత్పర్వతం; చేరి; ధౌమ్య= ధౌమ్యుడూ; ఆది= మొదలైన; పురోహితులన్= పురోహితులను; పురస్కరించికొని= ముందుంచుకొని; తదీయ= ఆ హిమాలయంయొక్క; తలంబు= సమప్రదేశంబును; అధిష్ఠించి= ఎక్కి ఆశ్రయించి; ఒక్క= ఒకానొక; ఉచిత= తగిన; ప్రదేశంబునన్= చోటున; విడిసెన్= విడిది చేశారు; అట్టి+ఎడన్= ఆ సమయమున.

**తాత్పర్యం:** ఈ విధంగా కురుపతి అయిన ఆ ధర్మరాజు ప్రయాణాలు చేసి, కొండలూ, నదులూ, అడవులూ, దాటి హిమవత్పర్వతం చేరాడు. ధౌమ్యుడూ మొదలయిన పురోహితులను ముందుంచుకొని ఆ పర్వతసమప్రదేశాన్ని ఆశ్రయించి, ఒక చోట విడిది చేశాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ్యాసుఁడు హిమవత్పర్వతంబున నున్న పాండవులకడకు వచ్చుట (సం.14-64-1)**

**శా.** **బాలార్కద్యుతి పుంజ పింజర జటాభారంబుఁ బ్రావృడ్ఘన**
**శ్రీలీలం బ్రహసించునంగమును, రోచిస్స్ఫార దండంబు ను**
**న్మీలన్నీల మృగాజినాంబరము నై, నిర్వాణదాన క్రియా**
**శీలుం డైన పరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై. 147**

**ప్రతిపదార్థం:** బాల+అర్క= ఉదయిస్తున్న సూర్యుడియొక్క; ద్యుతి= కాంతులయొక్క; పుంజ= సమూహంయొక్క; పింజర= బంగారువన్నె కలిగిన; జటా= జడలయొక్క; భారంబు= బరువునూ; ప్రావృట్= వర్షాకాలంలోని; ఘన= మేఘంయొక్క; శ్రీ= రంగు యొక్క; లీలన్= తీరును; ప్రహసించు= నవ్వు, తిరస్కరించే; అంగమును= శరీరమును; రోచిస్= కాంతిచేత; స్ఫార= పెద్దది అగు; దండంబున్= కర్రయూ (మునులు ధరించునది); ఉన్మీలత్= ప్రకాశిస్తున్న; నీల= నల్లని; మృగ+అజిన= లేడితోలు అనే; అంబరమున్= వస్త్రమును; ఐ= కలవాడై; నిర్వాణ= మోక్షముయొక్క; దాన క్రియా= దానం చేయటమే; శీలుండు+ఐ= శీలంగా కలవాడైన; పరాశర= పరాశరమహర్షియొక్క; ఆత్మజుఁడు= కుమారుడు - వ్యాసుడు; కృపాలోలుఁడు= దయాపరుడు; ఐ= అయి; విచ్చేసెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఉదయిస్తున్న సూర్యుడి కాంతులతో కూడిన జడలగుంపు, వర్షాకాలమందలి మబ్బువన్నెగల శరీరమూ కాంతిమంతమైన దండమూ, లేడితోలు అనే వస్త్రం కలవాడూ, మోక్షప్రదాతా, దయాసంపన్నుడూ అయిన వ్యాసుడు వచ్చాడు.

**వ.** **ఇట్లు సన్నిహితుండయిన వేదవ్యాస మునీశ్వరునిఁ బాండవులు పరమభక్తిం బ్రణామ పూర్వకంబుగాఁ బూజించి, 'కర్తవ్యం బెయ్యది! యానతిం' డనిన, నమ్మాననీయుం 'డెల్లి మీరెల్లవారును ద్ర్యంబకపూజలు చెల్లింపవలయు; నేఁటిరాత్రి నియతులై దర్భసంస్తరణంబుల శయనించునది' యని నియోగించిన. 148**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సన్నిహితుండు= ప్రత్యక్షమైనవాడు; అయిన; వేదవ్యాస= వేదవ్యాసుడనే; ముని+ఈశ్వరునిన్= మునీంద్రుడిని; పాండవులు; పరమ= మిక్కిలి; భక్తిన్= భక్తితో; ప్రణామపూర్వకంబు+కాన్= నమస్కారపూర్వకంగా; పూజించి;

కర్తవ్యంబు= చేయదగినది; ఏ+అది= ఏది; ఆనతి+ఇండు= సెలవు ఇవ్వండి; అనినన్= అడుగగా; ఆ మాననీయుండు= ఆ గౌరవార్హుడు; ఎల్లి= రేపు; మీరు; ఎల్లవారును= అందరూ; త్ర్యంబక= ముక్కంటియొక్క; పూజలు; చెల్లింపవలయున్= చేయవలయును; నేఁటి= ఈ రోజు; రాత్రి; నియతులు+ఐ= నియమం కలవారై; దర్భ= దర్భలతో ఏర్పరచిన; సంస్తరణంబులన్= పడకలమీద; శయనించునది= పడుకొనండి; అని; నియోగించినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రత్యక్షమైన వ్యాసమహర్షిని భక్తితో పూజించి పాండవులు మేము చేయవలసిన పని ఏమి?' అని అడిగారు. అంత ఆ మునీంద్రుడు రేపు మీరు శివపూజలు చేయాలి. ఈ రాత్రి నియమనిష్ఠలతో దర్భపడకలమీద పడుకొనండి' అని ఆజ్ఞాపించాడు.

**ఆ. రమ్యమైన చప్పరంబుల దర్భసం। స్తరణములను, యాగ సదనమునఁ బ్ర**
**భాసమానములగు పంచాగ్నులును బోలె। నమ్మహాత్ము లుండి రధిపముఖ్య! 149**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజులలో; ముఖ్య!= అగ్రగణ్యా!, జనమేజయా!; యాగ= యజ్ఞముయొక్క; సదనమునన్= గృహంలో; ప్రభాసమానములు= మిక్కిలి ప్రకాశించేవి; అగు= అయిన; పంచ+అగ్నులును+పోలెన్= ఐదు అగ్నులవలె; ఆ+మహాత్ములు= ఆ గొప్ప మనస్సు కలవారు; రమ్యము= అందమయినవి; ఐన= అయిన; చప్పరంబులన్= పర్ణశాలలలో; దర్భ= దర్భలతో చేసిన; సంస్తరణములన్= పడకలమీద; ఉండిరి= శయనించారు.

**తాత్పర్యం:** యజ్ఞగృహంలో మిక్కిలి ప్రకాశించే పంచాగ్నులవలె పాండవులు అందమైన పర్ణశాలలలో దర్భపడకలమీద శయనించారు.

**విశేషం:** అలం: ఉపమ. పంచాగ్నులు= ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని, సభ్యము అపసధ్యము అను ఐదు అగ్నులు.

**వ. అట్లుండి యవనీసురాశీర్వాదంబుల నాదరించుచు నారేయి గడపి, కల్యం బగుటయుం గాలోచిత కరణీయంబులు నిర్వర్తించి, సర్వక్రియా కలాప నిర్వహణ ధుర్యుండగు పారాశర్యుండు వనుప ధౌమ్యప్రముఖ పురోహిత సహాయ మహనీయ సమాచారులగు పాండవేయులు పరమస్థండిలంబునం బార్వతీపతి నావహించి, యుత్కృష్టంబులును బహుళంబులు నగు। గంధపుష్ప ధూప దీపంబులం బూజించి, సమంచిత మనోహారి భూరి పాయసాది భవ్యద్రవ్య భార మహోదారంబగు నైవేద్యంబు సమర్పించి, వేఱువేఱ ప్రధాన ప్రమథులకుఁ దద్గణంబులకు నర్చలిచ్చి, కుబేర మాణిభద్ర ప్రభృతి భూతయక్షజనంబులను సభక్తికావాహన కలితులం గావించి, పూజనంబు లాచరించి. 150**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఉండి; అవనీసుర= బ్రాహ్మణులయొక్క; ఆశీర్వాదంబులన్= దీవనలను; ఆదరించుచున్= స్వీకరిస్తూ; ఆ రేయి= ఆ రాత్రి; కడపి= వెళ్ళబుచ్చి; కల్యంబు= వేకువ; అగుటయున్= అయిన తరువాత; కాల= ఆ సమయమునకు; ఉచిత= తగిన; కరణీయంబులు= చేయదగిన పనులను; నిర్వర్తించి= చేసి; సర్వ= సమస్తమైన; క్రియా= ధర్మకార్యాలయొక్క; కలాప= సమూహముయొక్క; నిర్వహణ= చేయటం అనే; ధుర్యుండు= భారం వహించినవాడు; అగు= అయిన; పారాశర్యుండున్= పరాశరుడి కుమారుడు, వ్యాసుడు; పనుపన్= పంపగా; ధౌమ్య= ధౌమ్యుడు; ప్రముఖ= ముఖ్యులైన; పురోహిత= పురోహితులయొక్క; సహాయ= తోడ్పాటు చేత; మహనీయ= గొప్ప; సమాచారులు= చక్కగా చేయించుట కలవారు; అగు= అయిన; పాండవేయులు= పాండవులు; పరమ= ఉత్కృష్టమైన; స్థండిలంబునన్= దర్భలచేత సంస్కరించిన చోటునందు; పార్వతీపతిన్= శివుడిని; ఆవహించి=

మంత్రపూర్వకంగా ప్రవేశపెట్టి; ఉత్కృష్టంబులును= మంచివీ; బహుళంబులును= అనేకములును; అగు= అయిన; గంధ= గంధంచేత; పుష్ప= పూలచేత; ధూప= సువాసనగల పొగలచేత; దీపంబులన్= దీపాలచేత; పూజించి; సమంచిత= మిక్కిలి ఒప్పుచున్న; మనోహారి= మనస్సునకు ఇంపైన; భూరి= అధికమైన; పాయస= పాయసం; ఆది= మొదలైన; భవ్య= యోగ్యమైన; ద్రవ్య= పదార్థాలయొక్క; భార= భారములచేత; మహత్= మిక్కిలి; ఉదారంబు= గొప్పది; అగు= అయిన; నైవేద్యంబు= నైవేద్యం; సమర్పించి; వేఱు+వేఱు+అ= విడివిడిగానే; ప్రధాన= ముఖ్యులయిన; ప్రమథులకున్= ప్రమథులకు; తద్= వారియొక్క; గణంబులకున్= అనుచరుల సమూహానికి; అర్చలు+ఇచ్చి= పూజలు చేసి; కుబేర= కుబేరుడు; మాణిభద్ర= మాణిభద్రుడు; ప్రభృతి= మొదలైన; భూత= భూతముల; యక్ష= యక్షుల; జనంబులను= సమూహాలను; సభక్తిక= భక్తితో కూడిన; ఆవాహన= ఆహ్వానంతో, మంత్రపూర్వకంగా పిలుచుటతో; కలితులన్= కూడినవారినిగా; కావించి= చేసి; పూజనంబులు= పూజించుటలు; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ఆ విధంగా ఉండి పాండవులు బ్రాహ్మణులదీవనలు పొంది, ఆ రాత్రి వెళ్ళబుచ్చారు. వేకువజామున కాలకృత్యాలు తీర్చుకొని, ధర్మకర్మ నిర్వహణదక్షుడైన వ్యాసుడి అనుజ్ఞతో ధౌమ్యుడు మొదలైన పురోహితుల తోడ్పాటుతో దర్భలతో సంస్కరించినచోట శివుడిని నిలిపి, ధూప దీప గంధ పుష్పాలతో పూజించి, పాయసం మొదలైన మహానైవేద్యాలను ఆ దేవుడికి అర్పించారు. తరువాత ముఖ్యప్రమథులనూ, వారి అనుచరులనూ, కుబేరుడు మాణిభద్రుడూ మొదలైన భూతాలనూ, యక్షులనూ మంత్రపూర్వకంగా ఆహ్వానించి పూజించారు.

**క. రక్షాకర మంత్ర కలన । దక్షాత్మకు లైనయట్టి ధౌమ్య ముఖోదా**
**త్త క్షోణీసురులు బెరయ । నక్షయపుణ్యుఁ డగు కౌరవాధిపుఁ డెలమిన్. 151**

**ప్రతిపదార్థం:** రక్షా= రక్షణను; కర= కలిగించే; మంత్ర= మంత్రములయొక్క; కలన= జ్ఞానంవలన; దక్ష= నేర్పుగలిగిన; ఆత్మలు= ఆత్మలు కలవారు; ఐన+అట్టి= అయినటువంటి; ధౌమ్య= ధౌమ్యుడు; ముఖ= మొదలైన; ఉదాత్త= గొప్ప; క్షోణీసురులు= బ్రాహ్మణులు; బెరయన్= చుట్టి ఉండగా; అక్షయ= క్షీణించని; పుణ్యుఁడు= పుణ్యం కలవాడు; అగు= అయిన; కౌరవ= కౌరవ వంశీయుడైన; అధిపుఁడు= రాజు, ధర్మరాజు; ఎలమిన్= ఉత్సాహంతో.

**తాత్పర్యం:** రక్షణ కలిగించే మంత్రాల జ్ఞానంవలన సమర్థులయిన ధౌమ్యాది పురోహితులు, చుట్టూ చేరి ఉండగా మహాపుణ్యాత్ముడైన ధర్మరాజు ఉత్సాహంతో, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అనుజులుఁ దానుఁ బరాశర । తనయ పురస్సరముగా నిధాన స్థలికిం**
**జని, యరుణ గంధ కుసుమము । లను మాంసాపూపములను లాజములఁ దగన్. 152**

**ప్రతిపదార్థం:** అనుజులున్= తమ్ముళ్ళునూ; తానున్= తానునూ; పరాశర= పరాశర మహర్షియొక్క; తనయ= కుమారుడైన వ్యాసుడు; పురస్సరము+కాన్= ముందుండేటట్లుగా; నిధాన= నిధులున్న; స్థలికిన్= చోటికి; చని= వెళ్ళి; అరుణ= ఎఱ్ఱని; గంధ= గంధంతో; కుసుమములను= పూలతో; మాంస= మాంసంతో; అపూపములను= అప్పాలతో; లాజములన్= పేలాలతో; తగన్= శాస్త్రోక్తంగా.

**తాత్పర్యం:** తానూ తమ్ముళ్ళూ వ్యాసుడు ముందు నడుస్తుండగా నిధులున్న చోటికి వెళ్ళి, ఎఱ్ఱని గంధ పుష్పాలతో, మాంసంతో, అప్పాలతో, పేలాలతో, శాస్త్రోక్తంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. భూతతృప్తిఁ జేసి భూరి బలాఢ్యులఁ। బరిజనములఁ ద్రవ్వఁ బనుచుటయును**
**నతి కుతూహలమున నార్చి వారలు ద్రవ్వి। రన్నిధానదేశ మధిపముఖ్య! 153**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజులలో; ముఖ్య= అగ్రగణ్యుడయిన వాడా!; భూత= భూతములయొక్క; తృప్తిన్= తృప్తిని; చేసి; భూరి= గొప్ప; బల= బలంచేత; ఆఢ్యులన్= సంపన్నులను; పరిజనములన్= సేవకులను; త్రవ్వన్= నిధులు త్రవ్వగా; పనుచుటయును= ఆజ్ఞాపించగా; వారలు= ఆ సేవకులు; అతి= మిక్కిలి; కుతూహలమునన్= సంతోషంతో; ఆర్చి= అరచి; ఆ నిధాన= ఆ నిధులున్న; దేశము= చోటును; త్రవ్విరి= త్రవ్వారు.

**తాత్పర్యం:** జనమేజయా! భూతములకు తృప్తిచేసి, మహాబల సంపన్నులైన సేవకులతో నిధులున్నచోటు త్రవ్వండని ఆజ్ఞాపించాడు. ఆ సేవకులు ఉత్సాహం ఉరకలు వేస్తుండగా అరుస్తూ ఆ చోటును త్రవ్వారు.

**క. త్రవ్వినఁ బ్రభలెల్ల దెసల। నివ్వటిలఁగ వెలుంగుచుండె నిధి; యనిలజుఁడుం**
**గవ్వడియుఁ గవలు నలరఁగ। నవ్వసుధాధిపుఁడు దాని కర్చన లిచ్చెన్. 154**

**ప్రతిపదార్థం:** త్రవ్వినన్= త్రవ్వగా; ప్రభలు= కాంతులు; ఎల్లన్+దెసలన్= దిక్కులన్నిటా; నివ్వటిలఁగన్= వ్యాపించగా; నిధి; వెలుఁగుచున్+ఉండెన్= ప్రకాశిస్తూ ఉన్నది; ఆ+వసుధా= ఆ భూమియొక్క; అధిపుఁడు= అధిపతి; అనిలజుఁడున్= వాయువునకు జనించినవాడునూ, భీముడునూ; కవ+వడి+ఉన్= అర్జునుడునూ; కవలున్= నకుల సహదేవులునూ; అలరఁగన్= సంతోషించగా; దానికిన్= ఆ నిధికి; అర్చనలు+ఇచ్చెన్= పూజలు చేశాడు.

**తాత్పర్యం:** త్రవ్వేటప్పటికి అన్ని దిక్కులందునూ వెలుగులు విరజిమ్ముతూ నిధి ప్రకాశిస్తూ ఉన్నది. అప్పుడు భీమార్జున నకుల సహదేవులు ఉబ్బిపోతుండగా ధర్మరాజు దానికి పూజలు చేశాడు.

**వ. అట్లు వివిధ విద్యానిధి యగు వేదవ్యాసుండు సన్నిధిచేసి, యప్పెన్నిధి సాధించిన, నా ధర్మనందనుం డా పరాశర నందను పాదంబులకు దండప్రణామంబు చేసి, కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి, వినయావనతుండై యున్న నన్నరేంద్రు నమ్మునీంద్రుండాలింగ నాశీర్వాదంబుల నాదరించి, యామంత్రణంబు సేసి యంతర్హితుం డయ్యెఁ; నమ్మానవనాథుండు, 155**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; వివిధ= అనేక విధాలైన; విద్యా= విద్యలయొక్క; నిధి= గని; అగు= అయిన; వేదవ్యాసుండు; సన్నిధి+చేసి= ప్రత్యక్షమై; ఆ+పెను+నిధిన్= ఆ గొప్పనిధిని; సాధించినన్= సాధించగా; ఆ ధర్మనందనుండు= ఆ యముడి కుమారుడైన ధర్మరాజు; ఆ పరాశరనందను= ఆ పరాశరుడి కుమారుడైన వ్యాసుడియొక్క; పాదంబులకున్= కాళ్ళకు; దండప్రణామంబు= సాష్టాంగ నమస్కారం; చేసి; కేలు మొగిడ్చి= చేతులు జోడించి; ఫాలతలంబునన్= నుదుటను; కదియించి= చేర్చి; వినయ= వినయంచేత; అవనతుండు+ఐ= వంగినవాడై; ఉన్నన్= నిలవగా; ఆ నర+ఇంద్రున్= ఆ రాజును; ఆ ముని+ఇంద్రుండు= ఆ మునిశ్రేష్ఠుడు; ఆలింగన= కౌగిలింతచేతనూ; ఆశీర్వాదంబులన్= దీవనలచేతనూ; ఆదరించి= గౌరవించి; ఆమంత్రణంబు+చేసి= వీడ్కొని; అంతర్హితుండు= అదృశ్యుడు; అయ్యెన్= అయ్యాడు; ఆ మానవనాథుండు= ఆ నరపతి-ధర్మరాజు.

**తాత్పర్యం:** ఆ విధంగా అనేక విద్యాఖని అయిన వ్యాసుడు ప్రత్యక్షమై ఒక మహానిధిని సాధించాడు. అపుడు ధర్మరాజు ఆ మహర్షికి సాష్టాంగనమస్కారం చేసి, చేతులు జోడించి నుదుట చేర్చి వినయం ప్రకటించాడు. అంతట ఆ మహర్షి

ధర్మరాజును కౌగిలించుకొని, దీవనలు కురియించి, సెలవిచ్చి అదృశ్యుడయ్యాడు. అప్పుడు ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **శకట ఖరోష్ట్ర ఘోటక కుంజరంబు ల। నేక సహస్రంబు లెలమి సంఘ**
**టించి, భారంబు లెత్తించి భారవహత్వ। దక్షజనుల్ పెక్కులక్ష లర్థిఁ**
**గదిసి యే నే నని కడఁగి మోపఁగ యాగ। నిలయంబు కలపయుఁ గలశములును**
**నలఁకులు గాఁగులు నాదిగాఁగల భాండ। ములును బీఠములు శయ్యలును ఱోళ్ళు**

**తే.** **రోఁకకులుఁ జట్టువంబులు స్రుక్స్రువాజ్య। పాత్ర దండకమండలు దాత్రములును**
**లోనుగాఁ గల వస్తువుల్ శుద్ధి హేమ। మయము లొక్కట నడపించె మనుజనాథ!** **156**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= నరపతీ!, జనమేజయా!; శకట= బండ్లు; ఖర= గాడిదలు; ఉష్ట్ర= ఒంటెలు; ఘోటక= గుర్రాలు; కుంజరంబులు= ఏనుగులు; అనేక సహస్రంబులు= వేలకు వేలు; సంఘటించి= సమకూర్చి; భారంబులు= బరువులు; ఎత్తించి; భారవహత్వ= బరువులు మోచుటయందు; దక్ష= సమర్థులయిన; జనుల్= జనులు; పెక్కు లక్షలు= లక్షలకొలది మంది; అర్థిన్= ప్రీతితో; కదిసి= సమీపించి; ఏను= నేను; ఏను= నేను; అని కడఁగి= అని పూనుకొని; మోపఁగన్= మోయగా; యాగనిలయంబు= యజ్ఞశాలయొక్క; కలపయున్= కలపయూ; కలశములును= కుండలు; అలఁకులు= అలుకు కుండలూ; కాఁగులు= కాగులూ; ఆదిగాన్+కల= మొదలైన; భాండములును= పాత్రలునూ; పీఠములు= పీటలూ; శయ్యలును= మంచములును; ఱోళ్ళు; రోఁకళులు= రోకళ్ళూ; చట్టువంబులు= తెడ్లు; స్రుక్= చంద్రకొయ్యచే నిర్మించబడి ముష్టియాకువలె ఉండి భుజమంత పరిమాణంగల యజ్ఞ పాత్రలూ; స్రువ= స్రుక్కువంటిదేయై చేతియంతటి పరిమాణంగల పాత్రలూ; ఆజ్యపాత్ర= నేతికుండలూ; దండ= మునులు ధరించే కర్రలూ; కమండలు= కమండలాలూ; దాత్రములును= కొడవళ్ళూ; లోను+కాన్= మొదలుగా; కలుగు= కలిగిన; వస్తువుల్= వస్తువులు; శుద్ధ= పరిశుద్ధమైన; హేమ= బంగారంతో; మయములు= నిర్మింపబడినవి; ఒక్కటన్= ఒక్కసారిగా; నడపించెన్= సాగిపోనిచ్చాడు.

**తాత్పర్యం:** జనమేజయా! వేలకొలది బళ్ళనూ, గాడిదలనూ, ఒంటెలనూ, గుఱ్ఱాలనూ, ఏనుగులనూ ఉత్సాహంతో సమకూర్చి బరువులెత్తించాడు. బరువులు మోయటంలో మొనగాళ్ళైన అనేక లక్షలమంది నేనూ నేనూ అంటూ పూనుకొని మోయగా యాగశాలలో కలపా, బంగారంతో చేసిన కలశాలూ, అలుకు కుండలూ, కాగులూ మొదలైన పాత్రలు, పీటలూ, మంచాలూ, రోళ్ళూ, రోకళ్ళూ, నేతి గిన్నెలూ, దండాలూ, కమండలాలూ, కొడవళ్ళూ మొదలైన వస్తువులన్నీ శుద్ధబంగారంతో చేయించి ఒక్కసారిగా నడిపించినాడు.

**చ.** **మఱియును సన్నిధిం గల సమంచిత కాంచనరాశి బండులం**
**బెఱికల మోపులం గొలఁది వెట్టఁగఁ బెక్కగు బారువుల్, జనుల్**
**వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కస మందఁగ, శత్రుకోటికిన్**
**వెఱ పొనరించువార్త పృథివిం బరఁగన్ నడపించె భూవరా!** **157**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; మఱియున్= ఇంకనూ; సన్నిధిన్= దగ్గర; కల= ఉన్న; సమంచిత= మిక్కిలి మేలైన; కాంచన= బంగారంయొక్క; రాశిన్= గుట్టను; కొలఁది+పెట్టఁగన్= లెక్కించటానికి; పెక్కు+అగు= మించిపోయిన; బారువుల్= ఇరవై మణుగుల తూకం గలవాటిని; జనులు= ప్రజలు; వెఱఁగుపడంగన్= ఆశ్చర్యపడగా; ఖేచరుల్= దేవతలు; వెక్కసము+అందఁగన్= ఆశ్చర్యం పొందగా; శత్రు= శత్రువులయొక్క; కోటికిన్= సమూహానికి; వెఱవు= భయం; ఒనరించు= కలిగించే; వార్త; పృథివిన్= భూమియంతటా; పరఁగన్= వ్యాపించగా; బండులన్= బళ్ళలోనూ; పెఱికెలన్= జంతువుల వీపుమీద రెండు ప్రక్కలా వ్రేలాడే సంచులలోనూ; మోపులన్= మూటలలోనూ; నడిపించెన్= తీసికొని వెళ్ళేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** రాజా! ఇంకా తనకు దగ్గర ఉన్న బంగారపు గుట్టలోనుండి లెక్కించటానికి శక్యంకాని బారువుల కొలది బంగారాన్ని బళ్ళలోనూ, పెరికలలోనూ, మూటలలోనూ తీసికొని వెళ్ళేటట్లు చేశాడు. దీనిని చూచి ప్రజలూ, దేవతలూ ఆశ్చర్యపడ్డారు. శత్రువులు భయపడ్డారు.

**ఆ.** **ఏరునేల కొలఁది నెడనెడ విడియుచుఁ। బోవవలసి యుండె భూరి భార**
**వహుల డప్పి యెఱుఁగువాఁడగు నా ధర్మ। నందనునకు ధరణినాథవర్య! 158**

**ప్రతిపదార్థం:** ధరణినాథ= రాజులలో; వర్య!= శ్రేష్ఠుడా!; భూరి= పెద్ద; భార= బరువులను; వహుల= మోసేవారి యొక్క; డప్పి= ఆయాసం; ఎఱుఁగువాఁడు= తెలిసినవాడు; అగు= అయిన; ఆ ధర్మనందనునకున్= ఆ ధర్మరాజునకు; ఏరు నేల= రెండుకోసుల దూరం; కొలఁదిన్= లెక్క చొప్పున; ఎడన్+ఎడన్= అక్కడక్కడా; విడిది చేయుచున్= మజిలీ చేస్తూ; పోవవలసి= వెళ్ళవలసి; ఉండెను= ఉన్నది.

**తాత్పర్యం:** రాజేంద్రా! పెద్ద పెద్ద బరువులు మోసేవారికి బడలికా, దప్పికా కలుగుతాయి. ఈ విషయం తెలిసిన ధర్మరాజు ప్రతి రెండు కోసులకూ అక్కడక్కడా మజిలీ చేస్తూ వెళ్ళవలసి వచ్చింది.

**వ.** **అంత నక్కడఁ గృష్ణుండు. 159**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయాన; అక్కడన్= ద్వారకలో; కృష్ణుండు= శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** అక్కడ ద్వారకలో శ్రీకృష్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చు। నపుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు**
**సమయ మగుట ప్రతీక్షించి సకల బంధు। యుక్తముగ రమ్మనిన మధురోక్తి యూఁది. 160**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; ద్వారకానగరమునకున్= ద్వారకాపట్టణానికి; తన్నున్= తనను; పుచ్చు+అపుడు= సాగనంపేటప్పుడు; అశ్వమేధ+అధ్వరంబు= అశ్వమేధయాగంయొక్క; సమయము= సమయం; అగుట= కావటం; ప్రతీక్షించి= ఎదురుచూచి; సకల= సమస్తమైన; బంధు= చుట్టాలతో; యుక్తము+కన్= కూడికొని ఉండేటట్లుగా; రమ్ము= రా; అనిన= చెప్పిన; మధుర= ఇంపైన; ఉక్తి= మాట; ఊఁది= విశ్వసించి.

**తాత్పర్యం:** ధర్మరాజు ద్వారకకు తనను పంపేటప్పుడు తనతో 'అశ్వమేధయాగ సమయంకొరకు ఎదురుచూస్తూ చుట్టపక్కాలందరితో కలిసిరమ్ము!' అని చెప్పిన మాటను విశ్వసించి.(తరువాతి వచనంతో అన్వయం.)

శ్రీకృష్ణుండు సకలబంధు సహితుండై కరినగరంబునకు వచ్చుట (సం.14-65-1)

**వ. అరసికొనియుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు చేయుట చారులు చెప్ప నాకర్ణించి, కుతూహ లోన్నిద్రుండై, బలభద్ర సాత్యకి కృతవర్మ ప్రద్యుమ్న చారు (ధే) దేష్ణ సాంబాది యాదవ సమేతంబుగా వసుదేవదేవకీ సమనుజ్ఞాతుండై, సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన, ధృతరాష్ట్రుండును గాంధారియు గొంతియుం బనుప నుత్సుకుండై యుయుత్సుండు విదురుం బురస్కరించికొని యప్పాంచజన్యధరు నెదుర్కొని, పరమ భక్తిం దోడ్కొని వచ్చిన. 161**

**ప్రతిపదార్థం:** అరసికొని= నిరీక్షిస్తూ; ఉండి; ఆ పాండవ= ఆ పాండవులయందు; అగ్రజుండు= పెద్దవాడు, ధర్మరాజు; యాగంబునకున్= అశ్వమేధయాగానికి; ఉద్యోగంబు చేయుట= ప్రయత్నించటం; చారులు= గూఢచారులు; చెప్పన్= చెప్పగా; ఆకర్ణించి= విని; కుతూహల= సంతోషంచేత; ఉన్నిద్రుండు= ప్రకాశించేవాడు; ఐ= అయి; బలభద్ర= బలరాముడు; సాత్యకి; కృతవర్మ; ప్రద్యుమ్న= ప్రద్యుమ్నుడు; చారు (ధే)దేష్ణ= చారు (ధే) దేష్ణుడు; సాంబ= సాంబుడు; ఆది= మొదలైన; యాదవ= యాదవులతో; సమేతంబు+కాన్= కూడికొనియుండేటట్లుగా; వసుదేవ= వసుదేవుడిచేత; దేవకీ= దేవకిచేత; సమ్+అనుజ్ఞాతుండు+ఐ= బాగుగా అనుమతి ఇవ్వబడినవాడై; సుభద్రన్= సుభద్రను; తోడ్కొని= వెంటబెట్టుకొని; కరినగరంబునకున్= హస్తినాపురానికి; అరుగుదెంచినన్= రాగా; ధృతరాష్ట్రుండును; గాంధారియున్= గాంధారియును; గొంతియున్= కుంతియు; పనుపన్= పంపగా; ఉత్సుకుండు= ఉత్సాహం కలవాడై; యుయుత్సుండు; విదురున్= విదురుడిని; పురస్కరించికొని= ముందుంచుకొని; ఆ పాంచజన్య= పాంచజన్యమనే శంఖాన్ని; ధరున్= ధరించినవాడిని, కృష్ణుడిని; ఎదుర్కొని= ఎదురుగా పోయి; పరమ= మిక్కిలి; భక్తిన్= భక్తితో; తోడ్కొని= తీసికొని; వచ్చినన్= రాగా.

**తాత్పర్యం:** అశ్వమేధయాగసమయం కొరకు నిరీక్షిస్తూ ధర్మరాజు దానిని చేయటానికి ప్రయత్నిస్తున్నాడని గూఢచారులు చెప్పినమాట విని కృష్ణుడు ఎంతో సంతోషించాడు. వెంటనే బలరాముడు, సాత్యకి మొదలైన యాదవులతో సుభద్రను వెంటబెట్టుకొని హస్తినాపురానికి వచ్చాడు. అతడిరాక విన్న గాంధారీ ధృతరాష్ట్రులూ, కుంతీ, అతడిని తీసికొని రావటానికి యుయుత్సుడిని పంపారు. అతడు ఉత్సాహంతో విదురుడు ముందు నడుస్తుండగా ఎదురుగా వెళ్ళి శ్రీకృష్ణుడిని మహాభక్తితో తీసికొని రాగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. మున్ను ధృతరాష్ట్రుకడకు నా వెన్నుఁ డేఁగి। యతని గాంధారిఁ బ్రణతి పూర్వాతి మధుర**
**వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి, గొంతిఁ। గాంచి ప్రణమిల్ల నద్దేవి గౌఁగిలించి. 162**

**ప్రతిపదార్థం:** ఆ వెన్నుఁడు= ఆ విష్ణువు, కృష్ణుడు; మున్ను= ముందు; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడియొక్క; కడకున్= దగ్గరకు; ఏఁగి= వెళ్ళి; అతనిన్= అతడినీ; గాంధారిన్= గాంధారినీ; ప్రణతిపూర్వ= నమస్కారపూర్వకమైన; అతి= మిక్కిలి; మధుర= ఇంపైన; వాక్యములన్= మాటలతో; ప్రీతిన్+ఒందించి= సంతోషింపజేసి; వచ్చి; గొంతిన్= కుంతిని; కాంచి= చూచి; ప్రణమిల్లన్= నమస్కరించగా; ఆ+దేవి= ఆ దేవేరి; కౌఁగిలించి= కౌగిలించుకొని.

**తాత్పర్యం:** కృష్ణుడు ముందుగా ధృతరాష్ట్రుడి దగ్గరకు వెళ్ళి, అతడినీ, గాంధారినీ నమస్కారపూర్వకంగా ఇంపైన మాటలతో సంతోషింపజేశాడు. తరువాత కుంతిని చూచి ఆమెకు నమస్కరించాడు. ఆమె అతడిని కౌగిలించుకొని. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. పెక్కుభంగుల దీవించె; బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజ మహిషిం గని; రక్కులపాలికా తిలకంబు పులకంబులం బెరిఁగిన మేనితో మాననీయచరిత్రుం డగు నద్దేవకీపుత్త్రు సంభావించి. 163**

**ప్రతిపదార్థం:** పెక్కు= అనేకములైన; భంగులన్= విధాలుగా; దీవించెన్= దీవించింది; బలదేవ= బలరాముడు; ఆదులున్= మొదలగువారును; తగిన; తెఱంగునన్= విధంగా; ఆ+పాండురాజు= ఆ పాండురాజుయొక్క; మహిషిన్= పట్టపురాణిని; కనిరి= దర్శించారు; ఆ+కులపాలికా= ఆ ఉత్తమ కులశీలములు కలిగిన స్త్రీలలో; తిలకంబు= శ్రేష్ఠురాలు; పులకంబులన్= గగుర్పాటులతో; పెరిఁగిన= పొంగిన; మేనితోన్= శరీరంతో; మాననీయ= గౌరవించదగిన; చరిత్రుండు= నడవడి కలవాడు; అగు= అయిన; ఆ+దేవకీ= ఆ దేవకియొక్క; పుత్త్రున్= కుమారుడిని, కృష్ణుడిని; సంభావించి= గౌరవించి.

**తాత్పర్యం:** (కుంతి) అనేక విధాలుగా దీవించింది. బలరాముడు మొదలైనవారుకూడా తగినరీతిగా ఆమెను దర్శించారు. కులస్త్రీ రత్నమైన కుంతీదేవి గగుర్పాటులతో శరీరం ఉప్పొంగగా పూజ్య చరిత్రుడైన శ్రీకృష్ణుడిని గౌరవించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగు నర్చనంబు సంకర్షణ పూ**
**ర్వము గాఁగ నడపి యదు నిక। రము నర్చలు సంభృతాదరంబున నడపెన్. 164**

**ప్రతిపదార్థం:** ప్రమదము= సంతోషం; ఎసఁగన్= అతిశయించగా; విదురున్= విదురుడిని; పనిచి= పంపి; సముచితము+అగు= మిక్కిలి తగినదైన; అర్చనంబు= పూజ; సంకర్షణ= బలరాముడితో; పూర్వము= మొదలు; కాఁగన్= అగునట్లుగా; నడపి= జరిపించి; సంభృత= పరిపూర్ణమైన; ఆదరంబునన్= ఆదరంతో; యదు= యాదవులయొక్క; నికరము= సమూహం యొక్క; అర్చలు= పూజలు; నడపెన్= జరిపించాడు.

**తాత్పర్యం:** మహా సంతోషంతో విదురుడిని పంపి, బలరాముడితో మొదలుపెట్టి తగిన విధంగా పూజలు జరిపించింది. అట్లే మిగిలిన యాదవులకు కూడా ఆదరం అతిశయించగా సత్కారాలు జరిపించింది.

**వ. సుభద్ర తన్నుం గనినం బరమప్రియంబున గారవించి, యభ్యంతర మందిరంబునకుం బుచ్చెఁ; బద్మనాభ ప్రభృతులగు నా బంధుజనంబు నెల్లను నగరుచేరువ శోభిల్లుమందిరంబుల విడియింప యుయుత్సునియోగించె; నట్లయ్యందఱు నభినందితులై యున్న సమయంబున. 165**

**ప్రతిపదార్థం:** సుభద్ర; తన్నున్= తనను; కనినన్= దర్శింపగా; పరమ= మిక్కిలి; ప్రియంబునన్= ప్రేమతో; గారవించి= ఆదరించి, లాలించి; అభ్యంతర= లోపలి; మందిరంబునకున్= ఇంటికి, అంతఃపురమునకు; పుచ్చెన్= పంపారు; పద్మనాభ= శ్రీకృష్ణుడు; ప్రభృతులు= మొదలైనవారు; అగు= అయిన; ఆ+బంధుజనంబున్= చుట్టాల సమూహాన్ని; ఎల్లను= అంతటినీ; నగరు= అంతఃపురం; చేరువన్= దగ్గర; శోభిల్లు= ఒప్పుచున్న; మందిరంబులన్= భవనాలలో; విడియింపన్= దిగునట్లు చేయగా; యుయుత్సున్= యుయుత్సుడిని; నియోగించెన్= ఆజ్ఞాపించింది; అట్లు= ఆ విధంగా; ఆ+అందఱున్= ఆ అందరూ; అభినందితులు= సంతోషపెట్టబడినవారు; ఐ= అయి; ఉన్న; సమయంబునన్= సమయంలో

**తాత్పర్యం:** సుభద్ర తనను చూడటానికి రాగా, కుంతి ఆమెను ఆదరించి అంతఃపురానికి పంపింది. శ్రీకృష్ణుడు మొదలైన చుట్టాలను, అంతఃపురానికి దగ్గరగా ఉన్న భవనాలలో బసచేయించటానికి యుయుత్సుడిని ఆజ్ఞాపించింది. ఈ విధంగా యాదవులందరూ సంతోషపెట్టబడినవారై ఉన్న సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఉ. ఉత్తర పుణ్యగర్భముననుండి భవజ్జనకుండు పూరువం**
**శోత్తరుఁ డాది రాజగుణయోగి పరిక్షితుఁ డుద్భవించినన్**
**జిత్త మెలర్పఁ బుత్త్రుఁడని చెప్పిరి వెల్పలివారి కింటిలో**
**నత్తఱి నున్న వృద్ధ సతు; లార్చె జనం బఖిలంబు నుబ్బునన్. 166**

**ప్రతిపదార్థం:** ఉత్తర= ఉత్తరయొక్క; పుణ్య= పవిత్రమైన; గర్భమునన్+ఉండి= గర్భంనుండి; భవత్= మీయొక్క తండ్రి; పూరువంశ= పూరుడియొక్క కులమందు; ఉత్తరుఁడు= శ్రేష్ఠుడు; ఆదిరాజ= పూర్వ మహారాజులయొక్క; గుణ= సద్గుణాలయొక్క; యోగి= కూడిక కలవాడు; పరిక్షితుఁడు; ఉద్భవించినన్= పుట్టగా; ఇంటిలోన్= పురిటింటిలో; ఆ+తఱిన్= ఆ సమయాన; ఉన్న; వృద్ధ సతులు= ముదుసలులగు ఉత్తమ స్త్రీలు; చిత్తము= మనస్సు; ఎలర్పన్= సంతోషించగా; వెల్పలివారికిన్= బయట ఉన్నవారికి; పుత్త్రుడు= కొడుకు; అని; చెప్పిరి= చెప్పారు; జనంబు= జనసమూహం; అఖిలంబున్= అంతా; ఉబ్బునన్= సంతోషంతో; ఆర్చెన్= కేకలు పెట్టింది.

**తాత్పర్యం:** పూరువంశంలో శ్రేష్ఠుడూ, పూర్వమహారాజులవలె సకల సద్గుణ సంపన్నుడూ, మీ తండ్రీ అయిన పరిక్షితుడు ఉత్తరకు జన్మించాడు. వెంటనే పురిటింట్లో అప్పుడున్న వృద్ధాంగనలు కొడుకు పుట్టాడని బయటఉన్న జనానికి చెప్పారు. ఆ జనమంతా సంతోషంతో కేకలుపెట్టింది.

**క. బాలుఁడు మృతజాతుం డని । యాలోనన యేడ్పు బెరయ, నలమట నచ్చో**
**నాలలన లుగ్గడించినఁ । దేలిరి శోకమున జనులు ధీరవిచారా! 167**

**ప్రతిపదార్థం:** ధీర= గంభీరమైన; విచారా!= ఆలోచనలు కలవాడా!; ఆ+లోనన్+అ= అంతలోనే; బాలుఁడు= బాలుడు; మృతజాతుఁడు= చనిపోయి పుట్టినవాడు; అని; ఏడ్పు= ఏడ్పులూ; బెరయన్= రేగగా; అచ్చోన్= అక్కడనే; అలమటన్= దుఃఖంతో; ఆ= మొదట శుభవార్త చెప్పిన; లలనలు= స్త్రీలు; ఉగ్గడించినన్= ప్రకటించగా; జనులు; శోకమునన్= దుఃఖంలో; తేలిరి.

**తాత్పర్యం:** జనమేజయా! అంతలోనే చచ్చిన బిడ్డడు పుట్టాడంటూ ఏడ్పులు రేగాయి. మొదట శుభవార్త చెప్పిన ఆ వృద్ధ స్త్రీలు దుఃఖంతో అశుభవార్త ప్రకటించేటప్పటికి జనులందరూ దుఃఖంలో మునిగిపోయారు.

**వ. అత్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాద వేదనాయత్తం బయిన చిత్తాంగంబుతో శౌరి సాత్యకి యను గమనంబు సేయ, సత్వరంబుగా గొంతి యున్నెడకుం జనుదెంచె; నప్పు డా కుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకడకు రయంబునరా నెదుర నయ్యదువీరుండు గాంచి, శోకసమాకుల మానసుం డయ్యె; నప్పాండురాజపత్ని పురుషోత్తముతో డగ్గుత్తిక నెలుంగు దవుల నిట్లనియె. 168**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయమున; రోదనధ్వనులు= దుఃఖధ్వనులు; కలయన్= అంతటనూ; చెలంగినన్= వ్యాపించగా; విషాద= దుఃఖంవలన కలిగిన; వేదనా= బాధకు; ఆయత్తంబు+ఐన= వశమైన; చిత్త+అంగంబు+తోన్= మనస్సుతో, శరీరంతో; శౌరి= కృష్ణుడు; సాత్యకి; అనుగమనంబు= వెంట రావటం; చేయన్= చేయగా; సత్వరంబు+కాన్= త్వరగా; గొంతి= కుంతి; ఉన్న= ఉండిన; ఎడకున్= చోటికి; చనుదెంచెన్= వచ్చాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ కుంతిభోజ= ఆ కుంతిభోజుడియొక్క; నందనయున్= కూతురునూ; కుంతియూ; ద్రౌపదియున్; సుభద్రయున్; ఆర్తనాదంబులు= శోకధ్వనులు; ఎసంగన్= అధికం

కాగా; తనకడకున్= తన దగ్గరకు; రయంబునన్= వేగంగా; రాన్= రాగా; ఎదురన్= ఎదుట; ఆ+యదు= ఆ యదువంశమునందు; వీరుండు= వీరుడు; కాంచి= చూచి; శోక= శోకంచేత; సమాకుల= మిక్కిలి కలతచెందిన; మానసుండు= మనస్సు కలవాడు; అయ్యెన్= అయ్యాడు; ఆ+పాండురాజు= ఆ పాండురాజుయొక్క; పత్ని= భార్య-కుంతి; పురుషోత్తముతోన్= శ్రీకృష్ణుడితో; డగ్గుత్తికన్= దుఃఖంవలన కలిగిన కంపమునందు; ఎలుంగు= గొంతు; తగులన్= చిక్కుకొనగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఏడ్పులు పెడబొబ్బలు అంతటా వ్యాపించాయి. వాటిని విన్న శ్రీకృష్ణుడి మనస్సూ, శరీరమూ బాధకు లోనయ్యాయి. సాత్యకి వెంటనడచి వస్తుండగా అతడు కుంతి ఉన్నచోటికి వెళ్ళాడు. అప్పుడు కుంతీ, ద్రౌపదీ, సుభద్రా పెద్దపెట్టున ఏడుస్తూ దగ్గరకు రాగా, ఎదుట ఉన్నవారిని చూచిన అతడి మనస్సు దుఃఖంచేత ఎంతో కలత చెందింది. అంత కుంతి అతడితో ఈ విధంగా పలికింది.

**పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట (సం.14-65-25)**

**క. 'గతి నీవె నాకు, మత్సం । తతికిని; నీ యల్లుఁగుఱ్ఱతనయుఁడు పుట్టెన్**
**మృతుఁడై క్రూరుండగు గురు । సుతుని యిషీకాస్త్ర వహ్నిఁ జూఁడిన కతనన్. 169**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకూ; మత్= నా యొక్క; సంతతికిని= సంతానానికీ; నీవు+ఎ= నీవే; గతి= దిక్కు; క్రూరుండు= కఠినుడు; అగు= అయిన; గురు= ద్రోణాచార్యుడియొక్క; సుతుని= కొడుకు, అశ్వత్థామయొక్క; ఇషీక+అస్త్ర= మంత్రపూర్వకంగా, బ్రహ్మాస్త్రాన్ని ప్రవేశపెట్టిన రెల్లుకాడనుండి పుట్టిన; వహ్నిన్= అగ్నిచేత; చూఁడిన= మాడిన; కతనన్= కారణంగా; నీ= నీయొక్క; అల్లు+కుఱ్ఱ= ముద్దుల మేనల్లుడియొక్క; తనయుఁడు= కొడుకు; మృతుఁడు= చనిపోయినవాడు; ఐ= అయి; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** 'నాకూ నా సంతానానికీ నీవే దిక్కు. కఠినాత్ముడైన అశ్వత్థామ ప్రయోగించిన ఇషీకాస్త్రంనుండి పుట్టిన అగ్నిచేత మాడి, నీ ముద్దుల మేనల్లుడి కొడుకు చచ్చిపోయి జన్మించాడు.

**విశేషం:** ఇషీక+అస్త్రము= ఇషీకాస్త్రము. ఇషీకం అంటే రెల్లు. అశ్వత్థామ సౌప్తికవధ చేశాడు. ద్రౌపదిమాటమీద భీముడు అతడిమీదికి వెళ్ళాడు. వెంటనే కృష్ణార్జునులుకూడా వెళ్ళారు. తన కెటూ చావు మూడిందనుకొని, అశ్వత్థామ ఒక రెల్లుపుల్ల తీసికొని దానిలో మంత్రపూర్వకంగా బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రవేశపెట్టి ప్రయోగించాడు. ప్రయోగించేటప్పుడు లోకం అపాండవం కావాలని పలికాడు. అర్జునుడుకూడా బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించాడు. లోకం భయాకులమైనది. వ్యాసుడు అశ్వత్థామ రోషాన్ని నివారించి, అతడి ప్రతిజ్ఞ వమ్ము అయ్యేటట్లు చేయాలని ప్రయత్నించాడు. కాని, అశ్వత్థామ ఆ మహర్షిమాటలు వినలేదు. తన అస్త్రం పాండవుల ప్రేమకు యోగ్యులయిన స్త్రీల గర్భాలకు హానిచేసి శాంతి పొందుతుందని అన్నాడు. అప్పుడు అభిమన్యుడిభార్య ఉత్తర గర్భవతియై ఉన్నది. ఆమె బిడ్డను తప్పక రక్షిస్తానని కృష్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. (ఈ కథంతా సౌప్తికపర్వ ద్వితీయాశ్వాస ప్రారంభంలో ఉన్నది).

**సీ. దేవకీపుత్త్ర! సంజీవితుఁ జేయవే । యబ్బాలు; నద్దారుణాస్త్ర సంప్ర**
**యోగంబు నపుడు కృపాగరిష్ఠుండ వై । చేసితి ప్రతిన 'గాచెద నవశ్య**
**మును నుత్తరాగర్భజనితు నే' నని; బాలు । బ్రదుకుతోడిద నాదు బ్రదుకు; ద్రుపద**
**తనయా సుభద్రలు, ధర్మజుం డనుజు, లా । శిశువు సంజీవితుఁ జేయకున్న**

ఆ. బ్రదుక; రన్వయమున కుదక పిండ ప్రదా। నంబు లెడలు; మత్స్యనందనయును
నూఱడింపఁ బడియె నొకనాఁడు నీ చేత;। దాని యార్తి కరుణఁ దలుఁగవయ్య! **170**

**ప్రతిపదార్థం:** దేవకీ= దేవకియొక్క; పుత్త్ర!= కుమారా!, కృష్ణా!; ఆ బాలున్= ఆ బాలుడిని; సంజీవితున్= తిరిగి బ్రదికిన వాడినిగా; చేయవే!= చేయుమా!; ఆ దారుణ= ఆ భయంకరమైన; అస్త్ర= అస్త్రంయొక్క; సంప్రయోగంబు+అపుడు= ప్రయోగించిన సమయంలో; కృపా= దయచేత; గరిష్ఠుండవు= అధికుడవు; ఐ= అయి; నేను; అవశ్యమును= తప్పక; ఉత్తరా= ఉత్తరయొక్క; గర్భ= కడుపున; జనితున్= పుట్టినవాడిని; కాచెదన్= కాపాడుతాను; అని; ప్రతిన చేసితి(వి)= ప్రతిజ్ఞ చేశావు; నా+బ్రదుకు= నా బ్రదుకు; బాలు= బాలుడియొక్క; బ్రదుకుతోడిది+అ= బ్రదుకుతోనే ముడిపడి ఉన్నది; ద్రుపదతనయ= ద్రుపదుడి కూతురు, ద్రౌపది; సుభద్ర; ధర్మజుండు= ధర్మరాజు; అనుజులు= అతడి తమ్ముళ్ళు; ఆ+శిశువున్= ఆ నెత్తురు కందును; సంజీవితున్= తిరిగి బ్రదికిన వాడినిగా; చేయక+ఉన్నన్= చేయకుంటే; బ్రదుకరు; అన్వయమునన్= వంశంలో; ఉదక= నీటియొక్క; పిండ= శ్రాద్ధసమయాలలో పిండములయొక్క; ప్రదానంబులు= ఇచ్చుటలు; ఎడలున్= తొలగిపోతాయి; ఒకనాఁడు= ఒకప్పుడు; మత్స్య= మత్స్యులరాజయిన విరాటుడియొక్క; నందనయును= కూతురునూ; నీ చేతన్= నీ చేత; ఊఱడింపఁబడియెన్= ఓదార్చబడింది; దాని= ఆమెయొక్క; ఆర్తిన్= దుఃఖమును; కరుణన్= దయతో; తలుఁగుము+అయ్య!= పోగొట్టవయ్యా!

**తాత్పర్యం:** కృష్ణా! ఆ బాలుడిని నీవు తిరిగి బ్రదికించుము. భయంకరమైన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించినపుడు 'నేను తప్పకుండా ఉత్తర కడుపున పుట్టిన బిడ్డను కాపాడుతా'నని ప్రతిజ్ఞ చేశావు. బాలుడు బ్రదికితే నేను బ్రదుకుతాను. అతడు తిరిగి బ్రదుకకపోతే, ద్రౌపదీ, సుభద్రా, పాండవులూ బ్రదుకనే బ్రదుకరు. దానితో వంశంలో నీళ్ళు వదలటానికీ, పిండాలు పెట్టటానికీ ఎవ్వరూ ఉండరు. ఒకప్పుడు నీవు ఉత్తరను కూడా ఓదార్చావు. దయామయుడవై ఆమె గర్భశోకాన్ని తొలగించవయ్యా!

వ. దేవా! నీ విక్కులంబు గలిగించినవాఁడ; వింకను నీవ వీని బ్రదికింపవే' యని పల్కుచుం బుడమిఁబడిన గొంతి నగ్గోవిందుం డనునయ వచనంబుల నూరార్చి యెత్తె; నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో నిట్లనియె. **171**

**ప్రతిపదార్థం:** దేవా!; నీవు; ఈ కులంబు= ఈ కులాన్ని; కలిగించినవాఁడవు= నిలిపినవాడవు; ఇంకను= కాబట్టి, ఇంకా; నీవు+అ= నీవే; వీనిన్= ఈ శిశువును; బ్రదికింపవే= బ్రదికించుమా; అని; పల్కుచున్= పలుకుతూ; పుడమిన్= భూమిమీద; పడిన= కూలిన; గొంతిన్= కుంతిని; ఆ+గోవిందుండు= ఆ కృష్ణుడు; అనునయ= ఓదార్పు కలిగించే; వచనంబులన్= మాటలతో; ఊరార్చి= ఉపశమం కలిగించి; ఎత్తెన్= లేవదీశాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; సుభద్ర; ఆ+మహా+ఆత్మునితోన్= ఆ గొప్ప ఆత్మకలవాడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికింది.

**తాత్పర్యం:** దేవా! ఈ భరతవంశాన్ని నిలిపినవాడవు నీవే. కాబట్టి నీవే ఈ శిశువును కూడా బ్రదికించుము' అని పలుకుతూ కుంతి నేలమీద కూలిపోయింది. అప్పుడు కృష్ణుడు ఆమెను ఉపశమనం కలిగే మాటలతో ఓదార్చి.

క. 'గురుసుతుఁడు భీమునకు నై। పర మాస్త్రం బెత్తె; దాని ఫల మందంగా
నరుఁడును దత్ప్రతియుఁ గాం। చిరి తుది; నీకు నేమి చెప్పుదుఁ బ్రభువా! **172**

**ప్రతిపదార్థం:** ప్రభువా!= ప్రభూ!; గురు= ద్రోణాచార్యుడియొక్క; సుతుఁడు= కొడుకు-అశ్వత్థామ; భీమునకున్+ఐ= భీముడిని ఉద్దేశించి; పరమ= బ్రహ్మశిరమనే; అస్త్రంబు= అస్త్రాన్ని; ఎత్తెన్= ప్రయోగించాడు; తుదిన్= చివరకు; నరుఁడును= అర్జునుడునూ;

తత్= అతడియొక్క; పత్నియున్= భార్యయూ; దాని= ఆ అస్త్రప్రయోగంయొక్క; ఫలము= ఫలితాన్ని; అందంగాన్= పొందేటట్లుగా; కాంచిరి= దుర్గతి పాలయిరి; నేను; నీకున్= నీకు; ఏమి; చెప్పుదున్= చెప్పుతాను.

**తాత్పర్యం:** 'అశ్వత్థామ భీముడిమీద బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించాడు. కాని చివరకు అర్జునుడూ, అతడి భార్యనయిన నేనూ దాని ఫలితాన్ని పొందే దుర్గతి పాలయ్యాము. నీ కింకా ఏమి చెప్పగలను ప్రభూ!

**క. నీ మఱఁది యా కొడుకుపైఁ। బ్రేమం బెప్పుడును బెంపఁ బ్రేలెడి; మనుమం**
**డీమెయి వమ్మయి పోయిన। నేమి యగునొ యెఱుఁగ; నీవ యెఱుఁగుదు దీనిన్. 173**

**ప్రతిపదార్థం:** నీ= నీయొక్క; మఱఁది= బావమరది అర్జునుడు; ఆ= ఆ మరణించిన; కొడుకుపైన్= కొడుకుమీద, అభిమన్యుడిమీద; ప్రేమంబు= ప్రేమ; ఎప్పుడును=ఎల్లకాలమూ; పెంపన్= అతిశయించగా; ప్రేలెడిన్= సంతాపం చెందుతున్నాడు; మనుమండు= మనుమడు; ఈమెయిన్= ఈ విధంగా; వమ్ము+అయి= నాశమై; పోయినన్= పోగా; ఏమి; అగును+ఒ= అగునో; ఎఱుఁగన్= ఎరుగను; దీనిన్= దీనిని; నీవు+అ= నీవే; ఎఱుఁగుదు= తెలిసి ఉంటావు.

**తాత్పర్యం:** నీ బావమరది చనిపోయిన కన్నకొడుకు మీది తీపి రోజు రోజుకూ పెరుగుతూ ఉంటే తపించిపోతున్నాడు. మనుమడు కూడా ఈ విధంగా నాశనమైపోతే ఆయన ఏమైపోతాడో ఎరుగను. ఇది నీకే తెలియును.

**సీ. ధర్మజుం డెమ్మెయి ధరియించు నెవ్వగ?। పవన నందనుఁడును గవలు నేమి**
**వెరవున నుపశమింతురు? దీని విను. దేవ!। యస్త్రప్రయోగంబు నపుడు నీవు**
**గురుసుతు నదలించి కుత్సిత! నిన్ను మో।ఘాస్త్రునిఁ జేసెద నంటి; దాన**
**నూఱడియుండుదు ముజ్జ్వల తేజ! నీ। మహితానుభావత మాకు నెల్లఁ**

**ఆ. దెలిసి యుండుఁ గాన యలుకము; సత్య ద। యాశ్రితాభిరక్ష లనఘ! నీకు**
**నైజములు; శిరః ప్రణతి నేను వేఁడెదఁ। గరుణ నిక్కులంబుఁ గాచికొనుము. 174**

**ప్రతిపదార్థం:** ధర్మజుండు= ధర్మరాజు; ఏ+మెయిన్= ఏ విధంగా; నెఱ+వగ= పరిపూర్ణ దుఃఖం; ధరియించున్?= భరిస్తాడు?; పవన= వాయువుయొక్క; నందనుఁడును= కుమారుడైన భీముడు; కవలు= నకుల సహదేవులు; ఏమి= ఏ; వెరవునన్= ఉపాయంచేత; ఉపశమింతురు?= శాంతిస్తారు; దేవా!; దీనిన్= ఈ మాటను; విను= వినుము; అస్త్రప్రయోగంబు+అపుడు= బ్రహ్మ శిరోనామకాస్త్రమును ప్రయోగించినపుడు; నీవు; గురుసుతున్= ద్రోణాచార్య పుత్రుడిని, అశ్వత్థామను; అదలించి= బెదరించి; కుత్సిత= నీచుడా; నిన్నున్= నిన్ను; మోఘ= వ్యర్థమైన; అస్త్రునిన్= అస్త్రం కలవాడినిగా; చేసెదన్= చేస్తాను; అంటి(వి)= అన్నవాడవు; దానన్= ఆ నీమాటచేత; ఊఱడి= శాంతిపొంది; ఉండుదుము= ఉంటాము; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; తేజ= శక్తి కలవాడా!; నీ= నీయొక్క; మహిత= గొప్ప; అనుభావత= మహిమ; మాకున్+ఎల్లన్= మా కందరికీ; తెలిసి= విదితమై; ఉండున్= ఉన్నది; కాన; అలుకము= భయపడము; అనఘ!= పాపరహితుడా!; సత్య= సత్యమూ; దయా= దయ; ఆశ్రిత= ఆశ్రయించిన వారియొక్క; అభిరక్ష= సంరక్షణం; నీకున్= నీకు; నైజములు= సహజములు; నేను; శిరస్+ప్రణతిన్= తలవంచి నమస్కరించి; వేఁడెదన్= ప్రార్థిస్తున్నదానను; కరుణన్= దయతో; ఈ+కులంబు= ఈ పాండవుల వంశాన్ని; కాచికొనుము= కాపాడుకొనుము.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ మహాదుఃఖాన్ని ఏ విధంగా భరిస్తాడు? భీమ నకుల సహదేవులు ఏ ఉపాయంచేత చిత్తస్వాస్థ్యాన్ని పొందుతారు? దేవా? ఈ మాట వినుము. అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించినపుడు నీవు అతడిని

బెదరించి 'నీచుడా! నీ అస్త్రాన్ని పనికిరాకుండా చేస్తాను' అని అన్నావు. ఆ మాటలవలన మా గుండెలు కుదుటబడ్డాయి. నీ మహిమ మాకు తేటతెల్లం కాబట్టి మేము భయపడము. సత్యమూ, దయా, ఆశ్రిత రక్షణమూ నీకు సహజగుణాలు. తలవంచి నమస్కరించి నిన్ను వేడుకొంటున్నాను. దయతో ఈ పాండవుల కులాన్ని కాపాడు కొనుము.

**తే. ఏ విధంబునఁ గోలుపోనీవు నీవు। పాండవుల; నీదు సన్నిధిఁ బాపకర్మ**
**శీలుఁడైన యశ్వత్థామ గోలుపుచ్చె;। వాని నే మనఁ గలదు దుర్వారతేజ!' 175**

**ప్రతిపదార్థం:** దుర్వార= నివారించశక్యంగాని; తేజ= ప్రతాపం, ప్రాభవం కలవాడా!; ఏవిధంబునన్= ఏ విధంగానూ; నీవు; పాండవులన్= పాండవులను; కోలుపోనీవు= భంగపడనియ్యవు; నీ+సన్నిధిన్= నీ దగ్గరనే; పాపకర్మ= పాపకార్యాలు చేయటమే; శీలుఁడు= స్వభావంగా కలవాడు; ఐన= అయిన; అశ్వత్థామ; కోలుపుచ్చెన్= భంగపడజేశాడు; వానిన్= వాడిని; అనన్= నిందించటానికి; ఏమి; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** దుర్వార ప్రతాపశాలీ! ఏ విధంగానూ నీవు పాండవులను భంగపడనియ్యవు. కాని నీ కన్నులయెదుటనే అశ్వత్థామ పాండవులను భంగపడజేశాడు. వాడిని నిందించటానికి ఇంకా ఏమున్నది?'

**వ. అని వెండియు. 176**

**తాత్పర్యం:** అని ఇంకనూ. (ఇట్లా అన్నది).

**చ. 'భువనము లొక్కపెట్టఁ మృతిపొందిన జీవము లావహింపనే**
**ర్తు; వలచినట్టులైన గుణరూఢుఁడు మేనమఱంది పౌత్రుఁ జా**
**వ విడుతె? వంత పెంపున నవారణ నీ యెదురం బ్రలాపముల్**
**వివిధము లే మొనర్చితిమి వెఱ్ఱులమై యిటు భక్తవత్సలా!' 177**

**ప్రతిపదార్థం:** భక్త= భక్తులయందు; వత్సలా!= మమత కలవాడా!; భువనములు= లోకాలు (సర్వలోకాలలోనివారు అని అర్థం); ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; మృతిపొందినన్= మరణించిననూ; జీవములు= ప్రాణాలు; ఆవహింపన్= కలిగించటానికి; నేర్తు(వు)= సమర్థుడవగుదువు; వలచిన= ఇష్టపడిన; అట్టులు+ఐనన్= అట్లయితే; గుణ= సద్గుణాలచేత; రూఢుఁడు= ప్రసిద్ధికెక్కినవాడు; మేనమఱంది= మేనత్తకొడుకు యొక్క, అర్జునుడియొక్క; పౌత్రున్= మనుమడిని; చావన్= మరణించగా; విడుతు(వు)+ఎ?= వదలుదువా?; వంత= దుఃఖంయొక్క; పెంపునన్= అతిశయంచేత; అవారణన్= అడ్డులేకుండా; నీ= నీయొక్క; ఎదురన్= ఎదుట; వెఱ్ఱులము= వివేకం లేనివారము; ఐ= అయి; ఏము= మేము; వివిధములు= అనేక విధాలైన; ప్రలాపముల్= అర్థం లేని మాటలు; ఒనర్చితిమి= పలికితిమి.

**తాత్పర్యం:** 'భక్తవత్సలా! సర్వలోకాలలోనివారు ఒక్కసారిగా మరణించినప్పటికీ వారి కందరికీ తిరిగి ప్రాణాలు పోయటానికి సమర్థుడవు. నీ కిష్టమైతే మేనత్తకొడుకయిన అర్జునుడి మనుమడు చావగా వదలిపెట్టుదువా? దుఃఖం ముంచెత్తటంవలన మేము అవివేకులమై నీ ఎదుట అనేక విధాలుగా అర్థంలేని మాటలు అడ్డులేకుండా పలికితిమి.'

**తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప। వనజనాభుండు జను లర్థి వినఁగఁ 'బిన్న**
**వాని బ్రదికింతు; వగవంగ వలవ' దనియె। నెలుఁగు జలదస్వనమ్ము న ట్లెసక మెసఁగ. 178**

**ప్రతిపదార్థం:** అనినన్= సుభద్ర ఈ విధంగా పలుకగా; కృపయును= దయయూ; శోకంబున్= దుఃఖమునూ; అగ్గలింపన్= ఎక్కువ కాగా; వనజనాభుండు= పద్మం నాభియందు కలవాడు, విష్ణువు, కృష్ణుడు; ఎలుఁగు= కంఠస్వరం; జలద= మేఘంయొక్క; స్వనమ్ము+అట్లు= గర్జవలె; ఎసకమెసఁగన్= ఒప్పగా; జనులు= అక్కడ ఉన్నవారందరూ; అర్థిన్= ఆసక్తితో; వినఁగన్= వినగా; పిన్నవానిన్= పసిబిడ్డను; బ్రదికింతున్= బ్రదికేటట్లు చేస్తాను; వగవంగన్+వలవదు= విచారించవద్దు.

**తాత్పర్యం:** సుభద్ర ఈ విధంగా పలికేటప్పటికి శ్రీకృష్ణుడికి దయా, దుఃఖమూ ఎక్కువయ్యాయి. అతడు కంఠస్వరం మేఘగర్జవలె ఒప్పగా అందరూ సంతోషంతో వింటుండగా ' ఈ పసికందును బ్రదికిస్తాను. మీరు విచారించకండి' అని అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి, సూతికాగృహంబునకుం గుంతీ ప్రభృతులు తోడ రా నతండు వోవునప్పు, డది ధవళకుసుమ సితసర్షప లాజ పూర్ణకుంభ ప్రముఖ మంగళవస్తువులను, బ్రజ్వలితపావక ప్రదీప్త శస్త్ర పిచుమంద పల్లవాది భూత (భయ) పరిహారక పదార్థంబులను, జతుర వృద్ధాంగనా చికిత్సక దక్షపరిచారికా ముఖ్యహితకారి పరివారజన ప్రవర్తనంబులను బరిశోభితంబయి యుండె; నమ్మందిరం బా గోవిందుండు ప్రవేశించె; నట్టియెడ నంతకమున్న. 179**

**ప్రతిపదార్థం:** ఎల్లవారును= అందరునూ; ప్రమోదంబు= సంతోషం; ఒందన్= పొందగా; అట్లు= ఆ విధంగా; పలికి; సూతికా గృహంబునకున్= పురిటింటికి; కుంతీ; ప్రభృతులు= మొదలగువారు; తోడన్= వెంట; రాన్= రాగా; అతండు= కృష్ణుడు; పోవు+అప్పుడు= వెళ్ళేసమయంలో; అది= ఆ పురిటిల్లు; ధవళ= తెల్లని; కుసుమ= పూలు; సిత= తెల్లని; సర్షప= ఆవాలు; లాజ= పేలాలు; పూర్ణకుంభ= పూర్ణకుంభమూ; ప్రముఖ= ముఖ్యమైన; మంగళ= శుభం కలిగించే వస్తువులతో; ప్రజ్వలిత= బాగుగా మండజేసిన; పావక= అగ్ని; ప్రదీప్త= మిక్కిలి మెరుగుపెట్టబడిన; శస్త్ర= కత్తి మొదలగు ఆయుధములూ; పిచుమంద పల్లవ= వేప చిగుళ్ళూ; ఆది= మొదలైన; భూత= భూతములవలన కలుగు; (భయ)= భయమును; పరిహారక= తొలగించునవైన; పదార్థంబులను= పదార్థాలతో; చతుర= నేర్పరులైన; వృద్ధ+అంగనా= ముదుసలి స్త్రీలయొక్క; చికిత్సక= రోగ ప్రతిక్రియ చేయువారిలో; దక్ష= సమర్థతగల; పరిచారికా= పనికత్తెలయొక్క; ముఖ్య= ముఖ్యమైన; హిత= మేలును; కారి= కలిగించే; పరివార+జన= దాసీజనంయొక్క; ప్రవర్తనంబులను= చుట్టు చుట్టుకొని యుండుటలతోడను; శోభితంబు= ఒప్పునది; అయి; ఉండెన్; ఆ= అట్టి; మందిరంబు= పురిటిల్లు; ఆ+గోవిందుఁడు= ఆ కృష్ణుడు; ప్రవేశించెన్= ప్రవేశించాడు; అట్టి+ఎడన్= ఆ సమయాన; అంతకమున్న+అ= అంతకుముందే.

**తాత్పర్యం:** అందరూ విని ఆనందించేటట్లు ఆ విధంగా పలికి శ్రీకృష్ణుడు కుంతి మొదలైనవారు అనుసరించగా పురిటింటికి వెళ్ళాడు. అందు తెల్లని పూలూ, ఆవాలూ, పేలాలూ, పూర్ణకుంభం మొదలైన మంగళవస్తువులు చేర్చారు. భూతభయం పోగొట్టటానికి అగ్నులు గనగన మండేటట్లు చేశారు. పదనుగల ఆయుధాలనూ, వేప చిగుళ్ళనూ ఉంచారు. అన్నిటా నేర్పరులైన ముదుసలి స్త్రీలతో వైద్యం చేయటంలో సామర్థ్యంగల పనికత్తెలతో మేలు కలిగించే దాసీజనంతో ఆ ఇల్లు కిటకిటలాడుతున్నది. ఈ విధంగా ఒప్పుతున్న ఆ పురిటింటిలో శ్రీకృష్ణుడు ప్రవేశించాడు. ఆ సమయంలో అంతకుముందే. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కడచి ద్రౌపది చని యడలునఁ బడియున్న। మాత్స్యనందనతోడ 'మాధవుండు**
**చనుదెంచె వీఁడె; సవినయంబుగాఁ గను'। మనవుడు నుత్థిత యై వికీర్ణ**
**వేణీభరంబుతో వినతి యొనర్చి 'భ। క్తార్తి వాపుట నీకు నతిదృఢ వ్ర**
**తంబు కదే! దేవ! దయ వెలయంగ నీ। శిశువు సంజీవితుఁ జేయవయ్య!**

**తే. నీవు గూర్తేని మేనల్లునికిఁ దదీయ। పుత్త్రు ద్రోణుని పుత్త్రుండు పాలియఁజేయు**
**వాఁడె? పతిహీన యగుపాపవతికిఁ బుత్త్ర। హీనతయును బాటిల్లిన నెట్లు బ్రదుకు? 180**

**ప్రతిపదార్థం:** ద్రౌపది; కడచి చని= బయలుదేరిన వారందరికంటె ముందు వెళ్ళి; అడలునన్ పడి+ఉన్న= సొమ్మసిల్లి ఉన్న; మాత్స్య= విరాటుడియొక్క; నందనతోడన్= కూతురు ఉత్తరతో; మాధవుండు= కృష్ణుడు; వీఁడు+ఎ= వీడే; చనుదెంచెన్= వచ్చాడు; సహ+వినయంబు+కాన్= వినయంతో; కనుము= చూడుము; అనవుడున్= అనిన తరువాత; ఉత్థిత+ఐ= లేచినదై; వికీర్ణ= చెదరిన; వేణీభరంబుతోన్= వెంద్రుకల సమూహంతో; వినతి= ప్రార్థన; ఒనర్చి= చేసి; దేవ!= దేవా!; భక్త= భక్తులయొక్క; ఆర్తి= దుఃఖాన్ని; పాపుట= తొలగించటం; నీకున్= నీకు; అతి= మిక్కిలి; దృఢ= గట్టిపట్టుదలగల; వ్రతంబు= ప్రతిజ్ఞ; కద+ఏ!= కదా!; దయ; వెలయంగన్= వెల్లడికాగా; ఈ శిశువున్= ఈ శిశువును; సంజీవితున్= తిరిగి బ్రదికిన వాడినిగా; చేయుము+అయ్య!= చేయవయ్యా!; నీవు; మేనల్లునికిన్= మేనల్లుడియందు, అభిమన్యునియందు; కూర్తు+ఏని= ప్రేమ కలవాడవైతే; తదీయ= అతడియొక్క; పుత్త్రున్= కుమారుడిని; ద్రోణుని= ద్రోణుడియొక్క; పుత్త్రుండు= కొడుకు, అశ్వత్థామ; పాలియన్+చేయు= చంపెడి; వాఁడు+ఎ?= వాడా?; పతిహీన= భర్తలేనిది; అగు= అయిన; పాపవతికిన్= పాపాత్మురాలికి; పుత్త్ర= కుమారుడియొక్క; హీనతయును= లేకపోవటం; పాటిల్లినన్= సంభవిస్తే; ఎట్లు= ఏ విధంగా; బ్రదుకున్= బ్రదుకుతుంది?

**తాత్పర్యం:** అందరిని దాటుకొనిపోయి ద్రౌపది శోకంతో సొమ్మసిల్లిపడియున్న ఉత్తరతో ఇదుగో కృష్ణుడు వచ్చినాడు. వినయంతో చూడు అనగా లేచి చెదరిన వెంట్రుకల సమూహంతో ప్రార్థనచేసి దేవా! భక్తుల దుఃఖం తొలగించడం నీకు మిక్కిలి గట్టి వ్రతం కదా! దయ ప్రకాశించగా ఈ శిశువును తిరిగి బ్రతికించవయ్యా? నేను నీమేనల్లుడు ఇప్పుడైనట్లైతే ఆయన కొడుకును ద్రోణుడి కొడుకు (అశ్వత్థామ) చంపగలిగేవాడా! భర్తలేని పాపాత్మురాలికి పుత్రుడు కూడా లేకపోవడం సంభవిస్తే ఎట్లా బ్రతుకుతుంది?

**ఉ. నందను చావు నిక్కమయినం జనుటప్పుడు కల్గు దేవకీ**
**నందన! యెల్ల భంగీ నరనందను పాలికి; నాజి కేచి పో**
**వం దనతోడి పెంపునకు వారక యిచ్చిన బాస డప్పె; నిం**
**కం దనుఁ గన్న దెప్పు నొడికాఁడని కొంకెదఁ గాని యచ్యుతా! 181**

**ప్రతిపదార్థం:** దేవకీ= దేవకియొక్క; నందన!= కుమారా!; అచ్యుతా!= నాశంలేనివాడా!, కృష్ణా!; ఆజికిన్= యుద్ధానికి; ఏచి= ఉత్సహించి; పోవన్= వెళ్ళగా; తనతోడి పెంపునకున్= తనతోపాటు నశించుటకు, సహగమనమునకు; ఇచ్చిన= చేసిన; బాస= వాగ్దానం; వారక= తప్పక, పూర్తిగా; తప్పెన్= భంగమయ్యెను; ఇంకన్= ఇక ఇప్పుడు; తనున్= తనను; కన్నన్= చూచినచో; దెప్పు= ఎత్తిపొడుపుమాటలాడే; ఒడికాఁడు= సమయజ్ఞుడు, పట్టుదలకలవాడు; అని; కొంకెదన్+కాని= సంకోచిస్తున్నదాననుగాని; నందను= కుమారుడియొక్క; చావు= మరణం; నిక్కము= నిజం; అయినన్= అయితే, కొడుకుచావు తప్పదని ముందుగా

తెలిస్తే; ఎల్లభంగిన్= అన్నివిధాలా; నర= అర్జునుడియొక్క, నందను= కొడుకుయొక్క; అభిమన్యుడియొక్క; పాలికిన్= దగ్గరకు; అప్పుడు+అ= అప్పుడే (ఆయన మరణించినప్పుడే); చనుట= వెళ్ళటం; కల్గున్= సంభవించేది.

**తాత్పర్యం:** కృష్ణా! అభిమన్యుడు యుద్ధంలో మరణిస్తే తప్పక ఆయనతోపాటు సహగమనం చేస్తానని మాట ఇచ్చాను. పూర్తిగా ఆడినమాట తప్పాను. ఇప్పుడు చనిపోయి దగ్గరకు వెళ్ళితే ఆయన ఎత్తిపొడుపు మాటలు మాటాడుతాడని సంకోచిస్తున్నాను. ఆయన చాలా పట్టుదల కలవాడు. నా కొడుకు తప్పక చనిపోతాడని ముందుగా తెలిసినట్లయితే అభిమన్యుడు మరణించినప్పుడే సహగమనం చేసి ఆయన దగ్గరకు వెళ్ళి ఉండేదానిని. వాగ్దానభంగం చేసిన దుర్గతి నాకు తప్పేది.

**తే.** **పద్మనాభుండు వచ్చిన బాలుఁ జంకఁ । బెట్టుకొని పోయి మ్రొక్కింతుఁ బ్రీతియెసఁగ**
**నని తలంచుచు నుండితి; నమ్మనో ర । థంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి.'** **182**

**ప్రతిపదార్థం:** పద్మనాభుండు= కృష్ణుడు; వచ్చినన్= వస్తే; బాలున్= బాలుడిని; చంకన్= చంకయందు; పెట్టుకొని; పోయి; ప్రీతి= సంతోషం; ఎసఁగన్= అతిశయించగా; మ్రొక్కింతున్= నమస్కరింపజేస్తాను; అని; తలంచుచున్+ఉండితిన్= ఆశపెట్టుకొని ఉన్న దానను; ద్రౌణి= ద్రోణుడి కొడుకు - అశ్వత్థామ; పేర్చి= చెలరేగి; ఆ మనోరథంబు= ఆ కోరిక; విఫలంబు= నెరవేరనిది; కాన్= అయ్యేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు వచ్చినప్పుడు కొడుకును చంకకెత్తుకొనిపోయి వాడిచేత మ్రొక్కిస్తానని గంపెడాశపెట్టుకొన్నాను. కాని, అశ్వత్థామ చెలరేగి నా కోరిక నెరవేరకుండా చేశాడు.'

**వ.** **అని యంత నిలువని వలవంత పెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడికొని, తదాననం బాలోకించి.** **183**

**ప్రతిపదార్థం:** అని; అంతన్= వెంటనే; నిలువని= ఆగని; వలవంత= బాధయొక్క; పెంపునన్= వృద్ధితో; బాల= బాలుడియొక్క; శవంబున్= పీనుగును; ఎత్తికొని= చేతులతో ఎత్తి; అంకతలంబునన్= ఒడిలో; ఇడికొని= పెట్టుకొని; తద్= ఆ శిశువుయొక్క; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని వెంటనే అత్యంత దుఃఖంతో బిడ్డ శవాన్ని ఒడిలోపెట్టుకొని అతడి ముఖాన్ని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ.** **'తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి । యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ!**
**ధర్మవేది యైన తండ్రికిఁ బుట్టి య । ధర్మపరుఁడ వగుట తగునె నీకు.** **184**

**ప్రతిపదార్థం:** ఉజ్జ్వల= ప్రకాశించునట్టి; అంగ= శరీరము కలవాడా!; తాత= తాతగారు (వరుసకు); లోక= లోకములయొక్క; గురుఁడు= తండ్రి; దామోదరుఁడు= శ్రీకృష్ణుడు; వచ్చి+ఉండన్= వచ్చియుండగా; లేచి; మ్రొక్కవు= నమస్కరింపవు; ధర్మవేది= ధర్మములు తెలిసినవాడు; అయిన; తండ్రికిన్= తండ్రికి; పుట్టి; అధర్మ= అధర్మమునందు; పరుఁడవు= ఆసక్తిగలవాడవు; అగుట; నీకున్= నీకు; తగును+ఎ?= తగునా?

**తాత్పర్యం:** లోకములకు తండ్రీ, తాతగారూ అయిన శ్రీకృష్ణుడు వచ్చి ఉండగా లేచి నమస్కరించకున్నావు. ధర్మవేత్త అయిన తండ్రికి పుట్టి. అధర్మం పాటించటం నీకు తగునా? (పెద్దలకు లేచి మ్రొక్కకుండటం అధర్మం).

**క. కనువిచ్చి గొంతిఁ జూడుము. । ననుఁ జూడుము, ద్రుపద నృపతనయఁ జూడుము; నీ**
**జనకుని తల్లి సుభద్రం । దనయా! చూడు తల యెత్తి దరహాసముతోన్.' 185**

**ప్రతిపదార్థం:** తనయా!= కుమారా!; కనువిచ్చి= కన్నులు తెరచి; తల+ఎత్తి= తలయెత్తి; దరహాసముతోన్= చిరునవ్వుతో; గొంతిన్= కుంతిని; చూడుము; ననున్= నన్ను; చూడుము; ద్రుపద= ద్రుపదుడనే; నృప= రాజుయొక్క; తనయన్= కూతురును; చూడుము; నీ= నీయొక్క; జనకుని= తండ్రియొక్క; తల్లిన్= తల్లిని; సుభద్రన్= సుభద్రను; చూడు= చూడుము.

**తాత్పర్యం:** కుమారా! కళ్ళు తెరచి, తలయెత్తి చిరునవ్వులు చిందిస్తూ కుంతిని చూడుము. నన్ను చూడుము. ద్రౌపదిని చూడుము. మీ నాయనమ్మ సుభద్రను చూడుము.'

**చ. అని పలవించి యా సరసిజానన మూర్ఛ మునింగి నేలవ్రా**
**లినఁ గరుణంబు పెంపున విలీనతఁ బొందు మనంబులున్ సబా**
**ష్పనయన యుగ్మకంబులును, బాడఱు మోములు నైన కౌరవాం**
**గనల యలంతఁ గాంచిన పగల్ మిగులుం బగవారి కేనియున్. 186**

**ప్రతిపదార్థం:** అని; పలవించి= ఏడ్చి; ఆ సరసిజ= పద్మమువంటి; ఆనన= ముఖం కలది-ఉత్తర; మూర్ఛన్= మూర్ఛలో; మునింగి= మునిగి; నేలన్= నేలమీద; వ్రాలినన్= పడిపోగా; కరుణంబు= దయయొక్క; పెంపునన్= ఆధిక్యంచేత; విలీనతన్= కరగిపోవుటను; పొందు= పొందిన; మనంబులున్= మనస్సులూ; స+బాష్ప= కన్నీటితో కూడిన; నయన= కన్నులయొక్క; యుగ్మకంబులును= జంటలూ; పాడఱు= కళదప్పిన; మోములున్= ముఖాలూ; ఐన= కలవారయిన; కౌరవ+అంగనల= కురువంశ స్త్రీలయొక్క; అలంతన్= ముఖాన్ని; కాంచినన్= చూస్తే; పగవారికిన్+ఏనియున్= శత్రువులకైనా; పగల్= దుఃఖాలు; మిగులున్= పొంగిపొరలుతాయి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉత్తర ఏడ్చి ఏడ్చి మూర్ఛపడి నేలమీద కూలిపోయింది. ఆమెను చూచి కౌరవస్త్రీల మనస్సులు జాలిచేత కరగిపోయాయి. వారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. వారి ముఖాలు కళదప్పాయి. వారి దుఃఖం చూచిన పగవారికైనా ఏడ్పు పొంగిపొరలుతుంది.

**వ. ఒక్కింత సేపునకుం దెలివొంది విరాటనందన ధరాతలంబునం బడియున్న భంగిన ఫాలతలంబునం గేలు మొగిచి గోపాలదేవునకు మ్రొక్కుచు వెక్కుచు శరణు శర ణని పలికిన, నప్పరమకృపాపరుం డోడ కోడకు మను చుఁ బ్రాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి, అశ్వత్థామ ప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగునమ్మహాస్త్రం బుపసంహరించి, యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టంబనిచి, దరోల్లసితులయిన యెల్లవారలం గలయం గనుంగొని. 187**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఇంత సేపునకున్= కొంతసేపటికి; తెలివి+ఒంది= స్మృతి పొంది; విరాట= విరాటుడియొక్క; నందన= కూతురు ఉత్తర; ధరాతలంబునన్= నేలమీద; పడి+ఉన్న= పడి యున్న; భంగిన్+అ= విధంగానే; ఫాలతలంబునన్= నుదుటియందు;

కేలు మొగిచి= చేతులు జోడించి; గోపాలదేవునకున్= శ్రీకృష్ణుడికి; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; వెక్కుచున్= వెక్కి వెక్కి ఏడ్చుచూ; శరణు శరణు= రక్షకుఁడవు అగుము; అని; పలికినన్= పలుకగా; ఆ పరమ= అత్యధికమైన; కృపా= దయయందు; పరుండు= ఆసక్తికలవాడు; ఒడకుము+ఒడకుము= భయపడకుము, భయపడకుము; అనుచున్= అంటూ; పాద= కాళ్ళయొక్క; ప్రక్షాళనము= కడగటం; ఉపస్పర్శనంబు= (మూడుసార్లు నీళ్ళు త్రాగటం) - ఆచమనం; ఆచరించి= చేసి; అశ్వత్థామ= అశ్వత్థామచేత; ప్రయుక్తంబును= ప్రయోగించబడినదియూ; బ్రహ్మశిరస్= బ్రహ్మశిరమనే; నామకంబును= పేరుగలదియూ; అగు= అయిన; ఆ మహత్= ఆ గొప్ప; అస్త్రంబు; ఉపసంహరించి= నివారించి, అణచి; ఆ బాల= ఆ బాలుడియొక్క; శవంబున్= శవాన్ని; శయ్యాతలంబునన్= మంచంమీద; పెట్టన్= ఉంచగా; పనిచి= ఆజ్ఞాపించి; దర= కొంచెం; ఉల్లసితులు= సంతోషించినవారు; అయిన; ఎల్లవారలన్= అందరినీ; కలయన్= బాగుగా; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** కొంచెంసేపటికి ఉత్తర మూర్ఛనుండి తేరుకొన్నది. ముందు నేలమీద ఉన్నట్లే ఉండి, నుదుటిమీద చేతులు చేర్చి జోడించి శ్రీకృష్ణునికి నమస్కరిస్తూ, వెక్కి వెక్కి ఏడుస్తూ 'రక్షించు రక్షించు' మని అన్నది. అప్పుడు దయామయుడైన శ్రీకృష్ణుడు 'భయపడకు భయపడకు' మని అభయమిచ్చి, కాళ్ళు కడుగుకొని నీరు ఆచమనం చేసి, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అణచి వేశాడు. ఆ శిశువు శవాన్ని మంచంమీద ఉంచండని ఆజ్ఞాపించాడు. తరువాత చిరునగవుతో కొంచెం సంతోషించిన అక్కడి వారినందరినీ పూర్తిగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

### కృష్ణుఁడు మృతజాతుండైన పరిక్షితు లబ్ధజీవితుం జేయుట (సం.14-68-18)

**తే.** **'మీఁద బొం కగుమాట యే మీరు వినఁగ । నాడ; నిబ్బాలు బ్రదికింతుఁ; జూడుఁ డఖిల**
**జనులు నిప్పుడ; తేలుండు సంతసమున; దీని విని పాండవులు ప్రీతి నూనువారు.'** **188**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; మీఁదన్= తరువాత; బొంకు+అగు= కల్ల అయ్యే; మాట= మాటను; మీరు; వినఁగన్= వినగా; ఆడన్= చెప్పను; ఈ+బాలున్= ఈ బాలుడిని; బ్రతికింతున్= బ్రదికిస్తాను; అఖిల= సమస్తమైన; జనులును= జనులూ; ఇప్పుడు+అ= ఇప్పుడే; చూడుఁడు= చూడండి; సంతసమునన్= సంతోషంలో; తేలుండు= ఓలలాడండి; పాండవులు; దీనిన్= బాలుడు తిరిగి బ్రదికాడనే వార్తను; ప్రీతిన్= సంతోషమును; ఊనువారు= పొందేవారు (ఔతారు).

**తాత్పర్యం:** 'తరువాత బూటకమయ్యేమాటను నేను మీతో చెప్పను. మీరందరూ ఇప్పుడే చూడండి. బాలుడిని బ్రదికిస్తాను. మీరు సంతోషం పొందండి. పాండవులు కూడా ఇది విని సంతోషిస్తారు.'

**వ.** **అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె.** **189**

**ప్రతిపదార్థం:** అని; ప్రతిజ్ఞ+చేసి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ప్రతిజ్ఞచేసి శ్రీకృష్ణుడు ఇంకా ఇట్లా అన్నాడు.

**తే.** **'పగఱయెడ నైన నే బొంకు పలుక నేని, । సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ**
**బిఱిఁది కడుగిడ నేని, యిప్పిన్నవాని । యంగమున జీవ మీ ప్రొద్ద యావహిల్లు.** **190**

**ప్రతిపదార్థం:** నేన్= నేను; పగఱయెడన్= శత్రువుల విషయంలో; ఐనన్= అయినా; బొంకు= అసత్యం; పలుకన్+ఏని= పలుకనిచో; సమర ముఖమునన్= యుద్ధ ప్రారంభమున; ఏ+నాఁడున్= ఏనాడూ; చలిత= చంచలమైన; వృత్తిన్= స్వభావంతో; పిఱిఁదికిన్=

వెనుకకు; అడుగిడన్+ఏని= అడుగుపెట్టనిచో; ఈ+పిన్నవాని= ఈ శిశువుయొక్క; అంగమునన్= శరీరమునందు; ఈ+ప్రొద్దు+అ= ఈ వేళనే; జీవము= ప్రాణం; ఆవహిల్లున్= కలుగును గాక!

**తాత్పర్యం:** నేను శత్రువుల విషయంలోనైనా అసత్యం పలకని వాడనైతే, యుద్ధపు మొనల్లో ఎపుడూ మనసు చెదరి వెనుకంజ వేయనివాడనైతే ఈ బాలుడి శరీరానికి ఈ రోజే ప్రాణం కలుగుతుంది.

**వ.** **ధరణీసుర కులము నెడం। గర మెక్కుడు ప్రియము నాకుఁ గలదేని, సధ**
**ర్మరతుఁడన యేని, నియ్యు। త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్.** **191**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ధరణీసుర= బ్రాహ్మణులయొక్క; కులము+ఎడన్= జాతిపట్ల; కరము= మిక్కిలి; ఎక్కుడు= ఎక్కువ అయిన; ప్రియము= ప్రేమ; కలదు+ఏనిన్= ఉన్నట్లయితే; సహ+ధర్మ+రతుఁడన్+అ= ధర్మాసక్తితో కూడినవాడను; ఏనిన్= అయితే; ఈ ఉత్తరా= ఈ ఉత్తరయొక్క; సుతుఁడు= కొడుకు; లబ్ధ= ప్రాప్తించిన; జీవితత్వమున్= జీవించిన వాని ధర్మాన్ని; ఒందున్= పొందునుగాక!

**తాత్పర్యం:** బ్రాహ్మణజాతిపట్ల నాకు అత్యధిక ప్రేమ ఉన్నట్లయితే; నేను ధర్మాసక్తిగలవాడనైతే ఈ ఉత్తర కొడుకు జీవిస్తాడు గాక!

**క.** **నరునియెడ నామనంబున। విరోధ మెన్నఁడును నేమి విధమున నైనం**
**బొరయమి నిజమేనియు సు। స్థిరముగ నిబ్బాలుమేన జీవము సెందున్.** **192**

**ప్రతిపదార్థం:** నా= నాయొక్క; మనంబునన్= మనస్సులో; నరుని+ఎడన్= అర్జునుడియందు; ఎన్నఁడును= ఏనాడునూ; ఏమి విధమునన్= ఏ విధంగా; ఐనన్= అయిననూ; విరోధము= పగ; పొరయమి= పొందకుండటం; నిజము+ఏనియున్= నిజమైతే; సుస్థిరముగన్+శాశ్వతంగా; ఈ+బాలు= ఈపిల్లవాడియొక్క; మేనన్= శరీరమునందు; జీవము= ప్రాణం; చెందున్= చేరునుగాక!

**తాత్పర్యం:** నేను ఏనాడూ, ఏ విధంగానూ మనసా అర్జునుడిపట్ల వైరం పొందకుండటం నిజమైతే, శాశ్వతంగా ఈ శిశువు శరీరంలో ప్రాణం చేరును గాక!

**క.** **నిక్కపు ధర్మువు నన యే। నక్కంసాదుల వధించు టారసి, చూడన్**
**నిక్కువమై యార్యజనుల। కెక్కిన యేని నసువర్గ మీ శిశువు గనున్.** **193**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; నిక్కము= అసందిగ్ధమైన; ధర్మువునన్+అ= ధర్మంచేతనే; ఆ కంస= ఆ కంసుడు; ఆదులన్= మొదలగు వారిని; వధించుట= చంపటం; ఆరసి= పరీక్షించి; చూడన్= చూడగా; నిక్కువము+ఐ= నిజమై; ఆర్యజనులకున్= కర్మనిష్ఠులకు; ఎక్కెన్+అ+ఏనిన్= సమ్మతమైనట్లయితే; ఈ+శిశువు= ఈ పసిబిడ్డ; అసు= ప్రాణములయొక్క; వర్గమున్= సమూహమును, పంచప్రాణాలను; కనున్= పొందునుగాక!

**తాత్పర్యం:** అసందిగ్ధమైన ధర్మాన్ని ఆశ్రయించి నేను కంసుడు మొదలగువారిని సంహరిస్తే, నేను చేసిన పని ధర్మబద్ధం కావటం నిజమై, కర్మనిష్ఠులకు సమ్మతమైనట్లయితే ఈ శిశువు పంచప్రాణాలను తిరిగి పొందునుగాక!

**తే.** **మహిత సత్యంబుఁ బరమధర్మంబు గాఢ। నిర్మల బ్రహ్మచర్యంబు నిత్య సుప్ర**
**తిష్ఠితంబులై నాయందుఁ దేజరిల్లు। నేని నిబ్బాలునకు జీవ మిపుడ వచ్చు.' 194**

**ప్రతిపదార్థం:** మహిత= గొప్ప; సత్యంబున్= సత్యమూ; పరమ= ఉత్కృష్టమైన; ధర్మంబున్= ధర్మమూ; గాఢ= అస్ఖలితమైన; నిర్మల= కళంకంలేని; బ్రహ్మచర్యంబున్= బ్రహ్మచర్యమూ; నా+అందున్= నాయందు; నిత్య= ఎల్లప్పుడూ; సుప్రతిష్ఠితంబులు= చక్కగా నిలుపబడినవి; ఐ= అయి; తేజరిల్లున్+ఏనిన్= ప్రకాశించేటట్లయితే; ఇపుడు+అ= ఇప్పుడే; ఈ+బాలునకున్= ఈ మగబిడ్డకు; జీవము= ప్రాణం; వచ్చున్= వచ్చును గాక!

**తాత్పర్యం:** మహాసత్యమూ, ఉత్కృష్ట ధర్మమూ, అస్ఖలిత బ్రహ్మచర్యమూ నా యందు చక్కగా నెలకొన్నవై ప్రకాశిస్తున్నట్లయితే, ఈ మగబిడ్డకు ఇప్పుడే ప్రాణం వచ్చును గాక!

**వ.** **అని యిట్లప్పురుషోత్తముండు పలికిన. 195**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు= ఈ విధంగా; ఆ+పురుషోత్తముండు= కృష్ణుడు; పలికినన్= పలుకగా.

**తాత్పర్యం:** ఈ విధంగా కృష్ణుడు పలుకగా. (-తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **బాలుని మేనికిఁ బ్రాణముల్ వచ్చిన। నల్లన కదలెఁ దదంగకములు;**
**మఱి కనువిచ్చె; నత్తెఱఁగు తెల్లంబుగాఁ। గని గొంతి మొదలైన కౌరవాంగ**
**నలు మనంబులు నిండి, యలువులఁ బాఱెడు। నానందపూరంబు లనఁగఁ బొల్చు**
**హర్ష బాష్పములు రోమాంచ కంచుకిత దే। హంబులు నై యలరార, నఖిల**

**తే.** **జన సమూహమ్ములును సంతసమునఁ దేలి। గగనమున దివ్యవాణి యక్కమలనాభుఁ**
**బొగడె; మీ తండ్రి యున్న యప్పుణ్య గృహము। కరము శోభిల్లె నప్పుడు కౌరవేంద్ర! 196**

**ప్రతిపదార్థం:** కౌరవ= కౌరవులలో; ఇంద్ర!= శ్రేష్ఠుడా!; బాలుని= బాలుడియొక్క; మేనికిన్= శరీరానికి; ప్రాణముల్= ప్రాణాలు; వచ్చినన్= రాగా; అల్లన్+అ= మెల్లగా; తద్= ఆ శిశువుయొక్క; అంగకములు= చిన్న అవయవాలు; కదలెన్= కదలాడినవి; మఱి= పిదప; కను విచ్చెన్= కళ్ళు తెరచాడు; గొంతి= కుంతి; మొదలైన; కౌరవ+అంగనలు= కౌరవ స్త్రీలు; ఆ+తెఱఁగు= ఆ తీరు; తెల్లంబు+కాన్= స్పష్టంగా; కని= చూచి; ఆనందపూరంబులు= ఆనంద జల సమూహం; మనంబులు= మనస్సులు; నిండి; అలువులన్= పరీవాహములనుండి; పాఱెడు= ప్రవహిస్తున్నవి; అనఁగన్= అని ఊహింపగా; పొల్చు= ఒప్పుచున్న; హర్ష= సంతోషంవలన కలిగిన; బాష్పములు= కన్నీళ్ళు; రోమాంచ= గగుర్పాటులనే; కంచుకిత= కవచం తాల్చిన; దేహంబులు= శరీరాలు; ఐ= కలవాడై; అలరారన్= సంతోషించగా; అఖిల= సమస్తమైన; జన= జనులయొక్క; సమూహమ్ములను= సమూహాలూ; సంతసమునన్= సంతోషంతో; తేలన్= ఓలలాడగా; గగనమునన్= ఆకాశమున; దివ్యవాణి= ఆకాశవాణి; ఆ+కమలనాభున్= ఆ కృష్ణుడిని; పొగడెన్= పొగిడింది; మీ= మీయొక్క; తండ్రి; ఉన్న; ఆ+పుణ్యగృహము= ఆ పవిత్రగృహం; అప్పుడు= ఆ సమయంలో; కరము= మిక్కిలి; శోభిల్లెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** బాలుడికి ప్రాణాలు వచ్చేటప్పటికి అతడి చిన్న చిన్న అవయవాలు కదిలాయి. అతడు కళ్ళు తెరిచాడు. ఆ తీరు కనులార చూచిన కుంతి మొదలైన కౌరవస్త్రీలు పరమానందం పొందారు. ఆనంద ప్రవాహంతో వారి మనస్సులనే చెరువులు నిండాయి. అక్కడ నిండి కళ్ళు అనే జలనిర్గమనమార్గాల ద్వారా ప్రవహించాయా అనేటట్లు వారు ఆనందాశ్రువులు రాల్చారు. వారి శరీరాలు గగుర్పాటులతో నిండాయి. నానాజాతుల ప్రజలూ సంతోషించారు. ఆకాశవాణి శ్రీకృష్ణుడిని స్తుతించింది. మీ తండ్రి ఉన్న, పవిత్రమైన ఆ పురిటిల్లు వెలుగులు విరజిమ్మింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఉ.** **ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన మో మలరంగ వచ్చి య**
**త్యుత్తమతేజుఁ డైన పురుషోత్తము నంఘ్రుల పొంత భూస్థలిం**
**జిత్త మెలర్పఁగాఁ దనదు చెన్నగు ఫాలము సేర్చినన్ ముదా**
**యత్తమనస్కుఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్.** **197**

**ప్రతిపదార్థం:** ఉత్తర; బిడ్డన్= బిడ్డను; ఎత్తికొని= ఎత్తుకొని; మోము= ముఖం; అలరంగన్= కళకళలాడగా; చిత్తము= మనస్సు; ఎలర్పఁగాన్= సంతోషింపగా; ఒయ్యన్+అ= మెల్లగా; వచ్చి; అతి+ఉత్తమ= మిక్కిలి ఉత్తమమైన; తేజుఁడు= తేజస్సు కలవాడు; ఐన= అయిన; పురుషోత్తము= శ్రీకృష్ణుడియొక్క; అంఘ్రుల= పాదములయొక్క; పొంతన్= సమీపమున; భూస్థలిన్= నేలమీద; తన= తనయొక్క; చెన్ను+అగు= అందమైన; ఫాలము= నుదురు; చేర్చినన్= చేర్చగా; అతఁడు= శ్రీకృష్ణుడు; ముత్= సంతోషమునకు; ఆయత్త= వశమైన; మనస్కుఁడు+ఐ= మనస్సు కలవాడై; స+ఆదర= అనురాగంతో కూడిన; భాషలన్= మాటలతో; గారవించుచున్= లాలిస్తూ.

**తాత్పర్యం:** బిడ్డ బ్రదికేటప్పటికి ముఖం కళకళలాడగా, మనస్సు సంతోషమయం కాగా ఉత్తర బిడ్డను ఎత్తుకొని వేగంగా వచ్చి శ్రీకృష్ణుడి కాళ్ళ దగ్గర వ్రాలి నేలమీద నుదురు మోపింది. శ్రీకృష్ణుడు ఆమెను అనురాగవాక్యాలతో లాలిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **వినుత బహురత్న విస్ఫుర । దనేక భూషణ నికాయ మబ్బాలున కి**
**చ్చినఁ దక్కటి యదువీరులు । జననాయక! యొసఁగి రక్కజంబుగఁ దొడవుల్.** **198**

**ప్రతిపదార్థం:** జననాయక!= రాజా!; వినుత= కొనియాడబడిన, ప్రశస్తమైన; బహు= అనేకములైన; రత్న= రత్నాలతో; విస్ఫురత్= ప్రకాశిస్తున్న; అనేక= అనేకాలైన; భూషణ= నగలయొక్క; నికాయము= సమూహం; ఆ+బాలునకున్= ఆ బాలుడికి; ఇచ్చినన్= ఇవ్వగా; తక్కటి యదువీరులు= మిగిలిన యాదవ వీరులు; అక్కజంబు+కన్= ఆశ్చర్యకరంగా; తొడవుల్= నగలు; ఒసఁగిరి= ఇచ్చారు.

**తాత్పర్యం:** రాజా! ప్రశస్త రత్నాలతో ప్రకాశిస్తున్న వివిధాలంకారాలను ఆ బాలుడికి ఇచ్చారు. మిగిలిన యాదవులు కూడా ఆశ్చర్యం కలిగించే విధంగా నగలు పెట్టారు.

**వ. అప్పుడు. 199**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. ఆత్మకులము పరిక్షీణమైన జనన । మొందెఁగాన యియ్యభిమన్యు నందనునకు**
**నర్హమగుఁ బరిక్షిన్నామ మనియెఁ గృష్ణుఁ । డఖిల జనములు వినఁ బౌరవాధినాథ! 200**

**ప్రతిపదార్థం:** పౌరవ+అధినాథ= పురువంశీయుడవైన ప్రభూ!; కృష్ణుఁడు= కృష్ణుడు; అఖిల= సమస్తమైన; జనములు= జనులు; వినన్= వినగా; ఆత్మ= తనయొక్క; కులము= కులం; పరిక్షీణము= నశించినది; ఐనన్= కాగా; జననము+ఒందెన్= జన్మించాడు; కాన; ఈ+అభిమన్యు= ఈ అభిమన్యుడియొక్క; నందనునకున్= కుమారుడికి; పరిక్షిత్= పరిక్షిత్తు; అను= అనెడి; నామము= పేరు; అర్హము= తగింది; అగున్= ఔతుంది; అనియెన్= ప్రకటించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! జనులందరూ వింటుండగా కృష్ణుడు 'తన వంశమంతా నశించిపోయినప్పుడు జన్మించాడు కాబట్టి ఈ అభిమన్యుడి కుమారుడికి పరిక్షిత్తు అనే పేరు సముచితంగా ఉంటుంది' అని ప్రకటించాడు.

**వ. అట్లు పుండరీకాక్షుండు పాండవ సంతానంబు గలిగించె; న ట్లప్పరమపురుషుచేతం బ్రత్యుజ్జీవితుం డైన భవజ్జనకుం డేకమాసవయస్కుండగు కొలంది నొకపుణ్య దివసంబున. 201**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; పుండరీక= తెల్లతామరలవంటి; అక్షుండు= కన్నులు కలవాడు, శ్రీకృష్ణుడు; పాండవ= పాండవులయొక్క; సంతానంబు= సంతతిని; కలిగించెన్= నిలిపాడు; అట్లు= ఆ విధంగా; ఆ+పరమపురుషు చేతన్= ఆ పరమాత్ముడిచేత; ప్రతి+ఉత్+జీవితుండు+ఐన= తిరిగి బ్రదికినవాడైన; భవత్= మీయొక్క; జనకుండు= తండ్రి; ఏకమాస= ఒకనెల; వయస్కుండు= వయస్సు కలవాడు; అగు కొలందిన్= అగునప్పటికి; ఒక= ఒకానొక; పుణ్య= పావనమైన; దివసంబునన్= దినమునందు.

**తాత్పర్యం:** ఆ విధంగా శ్రీకృష్ణుడు పాండవ సంతతిని నిలిపాడు. ఆ పరమాత్ముడిచేత తిరిగి జీవించిన మీ తండ్రి ఒక నెల వయస్సు కలవాడయ్యేటప్పటకి ఒక మంచి రోజున. (-తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహా । కనక మ ట్లెత్తించికొని, యుదాత్త**
**వైభవ మెసఁగంగ వచ్చినఁ, గృష్ణవి । యుక్తులై విదుర యుయుత్సు లర్థిఁ**
**గస్తూరి నీళ్ళుల కలయంపులను, గప్పు । రంపు ముగ్గుల, బహురత్న తోర**
**ణములఁ దోరపు ముత్తియముల నొనర్చిన । ప్రాలంబమాలికా పంక్తులను, బ**

**తే. సిండి పూర్ణ కుంభములను, విశిష్ట మరక । తప్రకరమయ కదళికాస్తంభములను**
**గరము దోరంబుఁ జిత్రరేఖంబుఁ గా న । లంకరించిరి పురముఁ గులప్రదీప! 202**

**ప్రతిపదార్థం:** కుల ప్రదీప!= కులానికి దీపంవంటివాడా! ధర్మసుతుండును= ధర్మరాజూ; తమ్ములున్= తమ్ముళ్ళూ; అట్లు= ఆ విధంగా; ఆ+మహాకనకంబున్= ఆ పెద్దమొత్తంగా ఉన్న బంగారాన్ని; ఎత్తించికొని; ఉదాత్త= గొప్ప; వైభవము; ఎసఁగంగన్=

అతిశయించగా; వచ్చినన్= రాగా; కృష్ణ= కృష్ణుడిచేత; నియుక్తులు+ఐ= నియోగించబడినవారై; విదురయుయుత్సులు= విదురుడునూ, యుయుత్సుడునూ; అర్థిన్= ప్రీతితో; కస్తూరి= కస్తూరి కలసిన; నీళ్ళుల= నీళ్ళయొక్క; కలయంపులను= కళ్ళాపులతో; కప్పురము+ముగ్గులన్= కర్పూరపు ముగ్గులతో; బహు= అనేకములైన; రత్న= రత్నాలయొక్క; తోరణములన్= తోరణాలతో; తోరము= పెద్దవైన; ముత్తియములన్= ముత్యాలతో; ఒనర్చిన= చేసిన; ప్రాలంబ= వ్రేలాడుతున్న; మాలికా= దండలయొక్క; పంక్తులను= వరుసలతో; పసిండి= బంగారు; పూర్ణ కుంభములను= పూర్ణకుంభాలతో; విశిష్ట= ఉత్తమమైన; మరకత= మరకత మణులయొక్క; ప్రకర= సమూహంతో; మయ= కూడిన; కదళికాస్తంభములను= అరటి స్తంభాలతో; కరము= మిక్కిలి; తోరంబున్= నిండినదీ; చిత్ర= ఆశ్చర్యకరమైన; రేఖంబున్= అందం కలదీ; కాన్= అగునట్లుగా; పురమున్= హస్తినాపురమును; అలంకరించిరి= అలంకరించారు.

**తాత్పర్యం:** ధర్మరాజూ, అతడి తమ్ములూ సువర్ణరాసులతో హస్తినాపురానికి విచ్చేశారు. అప్పుడు కృష్ణుడు పట్టణం అలంకరించటానికి విదురుడినీ, యుయుత్సుడినీ నియోగించాడు. వారి ఆజ్ఞ ననుసరించి కస్తూరినీళ్ళతో కళ్ళాపులు చల్లి, ముత్యాలముగ్గులు పెట్టారు. రత్నాల తోరణాలు కట్టారు. పెద్ద ముత్యాలు గ్రుచ్చిన దండలు వరుసగా వ్రేలాడదీశారు. స్వర్ణ పూర్ణ కుంభాలు నిలిపారు. మరకతమణిమయమైన అరటిస్తంభాలు పాతారు. ఈ అలంకారాలతో నిండి, హస్తినాపురం చిత్ర విచిత్ర సౌందర్యం కలిగినదయింది.

**వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయ నపు డప్పురంబు చంద్రోదయ ఘూర్ణమానంబయిన యర్ణ వంబు ననుకరించె; నయ్యచ్యుతుండును బలదేవ సాత్యకి ప్రద్యుమ్న ప్రముఖులు ప్రమోదంబునం బొంపిరి పోవుచుంబెంపారునలంకారంబుల నభినవోదార చారుత్వంబు వహించి యెదురు చనిపాండవులం గని; రయ్యిరుదెఱంగుల వారలు సౌహార్దంబును సౌముఖ్యంబును సౌజన్యంబును నత్యంతంబును మెఱయ నర్హంబులగు నాచారంబులు నడపి; రట్లు కృష్ణ సమేతులై మీ తాతలు హర్షోల్లాస భావమానులగుచు నా సమగ్ర కాంచన సంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203**

**ప్రతిపదార్థం:** సకల= సమస్తమైన; జనంబులున్= జనులునూ; కయిసేసి= అలంకరించుకొని; కలయన్= అంతటా; పొలయన్= సంచరించగా; అపుడు= ఆ సమయాన; ఆ+పురంబు= ఆ పట్టణం; చంద్ర= చంద్రుడియొక్క; ఉదయ= ఉదయంచేత; ఘూర్ణమానంబు= ఘోషపెట్టుతున్నది; అయిన; అర్ణవంబున్= సముద్రమును; అనుకరించెన్= పోలింది; ఆ+అచ్యుతుండును= ఆ కృష్ణుడును; బలదేవ= బలరాముడు; సాత్యకి; ప్రద్యుమ్న= ప్రద్యుమ్నుడు మొదలైన; ప్రముఖులు= ముఖ్యులు; ప్రమోదంబునన్= సంతోషంతో; పొంపిరి పోవుచున్= సంతోషిస్తూ; పెంపారు= అధికమైన; అలంకారంబులన్= అలంకరణాలతో; అభినవ= క్రొత్తదైన; ఉదార= గొప్పదైన; చారుత్వంబు= అందం; వహించి= తాల్చి; ఎదురు చని= ఎదురు వెళ్ళి; పాండవులన్= పాండవులను; కనిరి= చూచి కలిసికొన్నారు.; ఆ+ఇరు+తెఱంగుల= ఆ రెండు వైపుల ఉన్న; వారలు= వారు; సౌహార్దంబును= మైత్రియూ; సౌముఖ్యంబును= ప్రసన్నతయూ; సౌజన్యంబును= ప్రేమయూ; అత్యంతంబును= మిక్కిలి; మెఱయన్= వెల్లడికాగా; అర్హంబులు= తగినవి; అగు= అయిన; ఆచారంబులు= విధులు; నడపిరి= నిర్వహించారు; అట్లు= ఆ విధంగా; మీ తాతలు; కృష్ణ= కృష్ణుడితో; సమేతులు+ఐ= కూడుకొన్నవారై; హర్ష= సంతోషంచేత; ఉల్లాస= ఉత్సాహంచేత; భాసమానులు= ప్రకాశిస్తున్నవారు; అగుచున్= అవుతూ; ఆ+సమగ్ర= ఆ సమస్తమైన; కాంచన= బంగారంయొక్క; సంచయంబున్= రాశిని; పురస్కరించుకొని= ముందుపెట్టుకొని; పుర= పట్టణంయొక్క; ప్రవేశంబు= ప్రవేశం; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ప్రజలందరూ అలంకరించుకొని అంతటా సంచరిస్తుండగా పట్టణం చంద్రోదయంచేత కల్లోలపడుచున్న సముద్రాన్ని పోలింది. అప్పుడు కృష్ణుడూ బలరాముడూ మొదలైన ముఖ్యులూ సంతోషిస్తూ నానా విధాలంకారాలతో సరికొత్త సొగసును పొందినవారయ్యారు. వారందరూ పాండవులకు ఎదురు వెళ్ళి కలిసికొన్నారు. అప్పుడు రెండువైపులవారూ మైత్రీ ప్రసన్నతా ప్రేమా వెల్లడి అయ్యేటట్లుగా సముచిత విధులు నిర్వహించారు. మీ తాతలు హర్షోత్సాహాలతో ఆ సమస్త సువర్ణరాశిని ముందుంచుకొని పురప్రవేశం చేశారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **తొలుత ధృతరాష్ట్ర గాంధా । రులఁ గని, మఱి గొంతిఁ గాంచి, ప్రోన్మీలచ్చ**
**క్షులుఁ బ్రమద సంభరిత చి । త్తులు నయిన యుయుత్సునిన్ విదురునిన్ బ్రీతిన్.** **204**

**ప్రతిపదార్థం:** తొలుతన్= మొదట; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడినీ; గాంధారిన్= గాంధారినీ; మఱి= తరువాత; గొంతిన్= కుంతినీ; కాంచి= దర్శించి; ప్ర+ఉన్మీలత్= మిక్కిలి వికసించుచున్న; చక్షులున్= కన్నులు గలవారూ; ప్రమద= సంతోషంచేత; సంభరిత= నిండిన; చిత్తులున్= మనస్సులు కలవారూ; అయిన; యుయుత్సునిన్= యుయుత్సుడినీ; విదురునిన్= విదురుడినీ; ప్రీతిన్= ప్రేమతో, సంతోషంతో.

**తాత్పర్యం:** ధర్మరాజాదులు మొదట గాంధారీ ధృతరాష్ట్రులనూ, తరువాత కుంతినీ దర్శించారు. తమను చూడటంవలన ఆనందంతో వికసించిన కన్నులూ, నిండిన మనస్సులూ కలవారైన యుయుత్సుడినీ, విదురుడినీ ప్రేమతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ.** **కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదు లగుచుం గృష్ణాది యాదవ లోకంబునుం దారు నొకరమ్య మండపంబున నుండి; రట్టియెడ.** **205**

**ప్రతిపదార్థం:** కానిపించికొని= దర్శింపజేసికొని, రప్పించుకొని; సంభావించి= గౌరవించి; సంభృత= పరిపూర్ణమైన; ఆహ్లాదులు= ఆనందం కలవారు; అగుచున్= అవుతూ; కృష్ణ= కృష్ణుడు; ఆది= మొదలైన; యాదవ= యాదవులయొక్క; లోకంబునున్= సమూహమునూ; తారున్= తామునూ; ఒక= ఒకానొక; రమ్య= అందమైన; మండపంబునన్= మండపంలో; ఉండిరి= కొలువు చేశారు; అట్టి+ఎడన్= ఆ వేళ.

**తాత్పర్యం:** తమ దగ్గరకు రప్పించుకొని గౌరవించి, పరమానందం పొందుతూ, కృష్ణుడు మొదలైన యాదవులతోపాటు ఒకానొక సుందరమండపంలో కొలువుచేశారు. ఆ వేళ. (తరువాతి పద్యంతో అన్వయం.)

### వ్యాసుఁడు కృష్ణ సహితులై యున్న పాండవుల యొద్దకు వచ్చుట (సం.14-70-8)

**సీ.** **తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవ । జ్జనకుతెఱంగు విస్తార మొప్పఁ**
**జెప్పిన, వార లచ్చెరువాటు సంతసం । బును నెమ్మనంబులఁ బెనఁగొనంగఁ**
**బద్మనాభు ననేక భంగుల వినుతించి, । 'యిట్టివి వింతలే? యెల్లనాఁడు**
**నిట్టులకాక మాయెడ నీదు కరుణ పెం' । పని యభినందించి, రట్లు గలిసి**

**తే. నెమ్మిఁ దారును గృష్ణుండు సమ్మదమున । నుచిత వర్తన కలితులై యుండఁ గొన్ని**
**దివసములకు సంప్రీతి నేతెంచి బోధ । భాసితుం డైన సత్యవతీసుతుండు. 206**

**ప్రతిపదార్థం:** తగు= శక్తిమంతులగు; వారిన్= వారిని, పాండవులను; కాంచి= చూచి; అతి+అద్భుతంబు= మిక్కిలి ఆశ్చర్యకరమైనది; అగు= అయిన; భవత్= మీయొక్క; జనకు= తండ్రియొక్క; తెఱంగు= జన్మవృత్తాంతమును; విస్తారము= విస్తృతి, సమగ్రముగా ఉండటం; ఒప్పన్= ఒప్పగా; చెప్పినన్= చెప్పగా; వారలు= పాండవులు; అచ్చెరువాటు= ఆశ్చర్యం; సంతసంబును= సంతోషమూ; నెమ్మనంబులన్= మనస్సులందంతటా; పెనఁగొనంగన్= ఆదరింపగా; పద్మనాభున్= శ్రీకృష్ణుడిని; అనేక భంగులన్= అనేక విధాలుగా; వినుతించి= పొగడి; ఇట్టి+అవి= ఇటువంటివి; వింతలు+ఏ?= అపూర్వాలా?; ఎల్లనాఁడు= ఎల్లప్పుడు; నీదు+కరుణ= నీ కరుణయొక్క; పెంపు= అతిశయము; మా+ఎడన్= మాయందు; ఇట్టులు+అ= ఇట్లే; కాక= తప్ప; అని; అభినందించిరి= పొగిడారు; అట్లు= ఆ విధంగా; తారును= తామూ; కృష్ణుండున్= కృష్ణుడూ; నెమ్మిన్= నిశ్చింతగా; కలిసి కూడి; సమ్మదమునన్= సంతోషంతో; ఉచిత= తగిన; వర్తన= నడవడితో; కలితులు+ఐ= కూడినవారై; ఉండన్= ఉండగా; కొన్ని; దివసములకున్= రోజులకు; సంప్రీతిన్= మహానందంతో; బోధ= జ్ఞానంచేత; భాసితుండు= ప్రకాశించేవాడు; ఐన= అయిన; సత్యవతీ= సత్యవతియొక్క; సుతుండు= కొడుకు - వ్యాసుడు; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** పాండవులకు ఆశ్చర్యకరమైన పరిక్షిత్తు జన్మ వృత్తాంతాన్ని విపులంగా చెప్పారు. వారికి ఆశ్చర్యమూ, సంతోషమూ కలిగాయి. వారు శ్రీకృష్ణుడిని అనేక విధాలుగా స్తుతించి 'నీవు చేసిన ఈ పనులు క్రొత్తలు గావు. ఎప్పుడూ నీ దయ మాయందు ఈ విధంగానే ప్రసరించింది' అని ప్రశంసించారు. వారందరూ నిశ్చింతగా ఉండి తమ తమ విధులు నిర్వహిస్తూ ఉండగా కొన్నాళ్ళకు జ్ఞాన తేజో విరాజితుడైన వ్యాసుడు వచ్చాడు.

**క. ఏతెంచిన గోవింద స । మేతంబుగ నెదురుకొని మహిత పూజా సం**
**ప్రీతునిఁ గావించి, యతని । మీ తాతలు గొలిచియుండి, మృదు వచనములన్. 207**

**ప్రతిపదార్థం:** ఏతెంచినన్= రాగా; మీ తాతలు; గోవింద= శ్రీకృష్ణుడితో; సమేతంబుగన్= కూడియుండునట్లుగా; కూడా; అతనిన్= వ్యాసుడిని; ఎదురుకొని= ఎదురుగా వెళ్ళి కలిసి; మహిత= గొప్ప; పూజా= పూజలచేత; సంప్రీతునిన్= సంతోషించిన వాడినిగా; కావించి= చేసి; కొలిచి+ఉండి= సేవిస్తూ ఉండి; మృదు= మెత్తనయిన; వచనములన్= మాటలతో.

**తాత్పర్యం:** అప్పుడు మీ తాతలు శ్రీకృష్ణుడితో కూడా ఎదురుగా వెళ్ళి, ఆయనను పూజలచేత సంతోషింపజేసి తీసికొని వచ్చి పరిచర్యలు చేస్తూ, మెత్తని మాటలతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. సముచితగోష్ఠినడపి; రప్పాండవాగ్రజుండు మునిజనాగ్రణితో 'భవత్ప్రసాదంబునం బడసిన యమ్మహా ధనంబు మహనీయంబుగా నశ్వమేధయాగంబునం దుపయోగంబు నొందింపఁ గోరెద; ననుజ్ఞ యీవే!' యనిన సంతసిల్లి యాసంయమివరుం డిట్లనియె. 208**

**ప్రతిపదార్థం:** సముచిత= తగిన; గోష్ఠి= సల్లాపం; నడపిరి= చేశారు; ఆ+పాండవ అగ్రజుండు= ఆ పాండవులలో పెద్దవాడు, ధర్మరాజు; మునిజన= మునులయందు; అగ్రణితోన్= శ్రేష్ఠుడితో, వ్యాసుడితో; భవత్= నీయొక్క; ప్రసాదంబునన్= అనుగ్రహంతో; పడసిన= పొందిన; ఆ+మహత్= ఆ గొప్ప; ధనంబు= ధనం; మహనీయంబు+కాన్= గొప్పగా; అశ్వమేధయాగంబునందున్= అశ్వమేధయాగంలో; ఉపయోగంబు= వినియోగం; ఒందింపన్= పొందించగా; కోరుదున్= కోరెదను; అనుజ్ఞ= అనుమతి; ఇమ్ము+ఏ=

ఇయ్యవే; అనినన్= అనగా; సంతసిల్లి= సంతోషించి; ఆ సంయమివరుండు= ఆ మునులలో శ్రేష్ఠుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** సముచిత సల్లాపం చేశారు. అంత ధర్మరాజు వ్యాసుడితో 'మీ దయవలన పొందిన ఆ మహాధనాన్ని అశ్వమేధయాగంలో గొప్పగా వినియోగించాలని కోరుతున్నాను అనుమతించండి' అని అన్నాడు. ఈ మాటలకు సంతోషించి ఆ మునీశ్వరుడు ఈ విధంగా అన్నాడు.

**ఆ.** **'తురగమేధ మఖిల దుష్కృతహరము, నీ । వది సమగ్ర దక్షిణాన్వితముగఁ**
**జేసి నిర్మలత్వ భాసమానుండ వై । వెలయు, మమృతకిరణకులవరేణ్య!'** **209**

**ప్రతిపదార్థం:** అమృతకిరణ= చంద్రుడియొక్క; కుల= వంశమునందు; వరేణ్య!= శ్రేష్ఠుడా!; తురగమేధము= అశ్వమేధం; అఖిల= సమస్తమైన; దుష్కృత= పాపాలను; హరము= నశింపజేసేది; నీవు; అది= దానిని; సమగ్ర= సమస్తమైన; దక్షిణ= దక్షిణలతో; అన్వితము+కన్= కూడి ఉండేదిగా; చేసి; నిర్మలత్వ= పరిశుద్ధితో; భాసమానుండవు= ప్రకాశిస్తున్నవాడవు; ఐ; వెలయుము= ప్రసిద్ధికెక్కుము.

**తాత్పర్యం:** 'చంద్రవంశశ్రేష్ఠా! అశ్వమేధం సమస్త పాపాలనూ నశింపజేస్తుంది. దానిని నానావిధ దక్షిణలతో కూడి ఉండేదిగా చేసి; పరిశుద్ధుడవై ప్రకాశిస్తూ ప్రసిద్ధి కెక్కుము.'

**చ.** **అనవుడుఁ బ్రీతి నొంది యతఁ డచ్యుతుఁ గన్గొని 'భవ్య మైన యి**
**ప్పని తగ నిట్లు చేయు మని పన్పుము; తల్లియుఁ దండ్రియున్ గురుం**
**డును సచివుండు నిష్టసఖుఁడుం గరుణాకర! నీవ మాకు; నీ**
**యనుపమ ముఖ్యవృత్తి జగ మంతటికిన్ గతి; వేయు నేటికిన్?'** **210**

**ప్రతిపదార్థం:** అనవుడున్= వ్యాసుడు ఈ విధంగా పలుకగా; అతఁడు= ధర్మరాజు; ప్రీతిన్= సంతోషాన్ని; ఒంది= పొంది; అచ్యుతున్= శ్రీకృష్ణుడిని; కన్గొని= చూచి; కరుణా= దయకు; ఆకర!= నిలయమైనవాడా!; భవ్యము= శుభకరము; అయిన; ఈ పని= ఈ పని, అశ్వమేధయాగం; తగన్= శాస్త్రోక్తంగా; ఇట్లు= ఈ విధంగా; చేయుము; అని; పన్పుము= ఆజ్ఞాపించుము; మాకున్= మాకు; తల్లియున్= తల్లి అయినా; తండ్రియున్= తండ్రి అయినా; గురుండును= గురువు అయినా; సచివుండు= మంత్రి అయినా; ఇష్టసఖుఁడున్= ప్రియ మిత్రుడయినా; నీవు+అ= నీవే; నీ= నీయొక్క; అనుపమ= సాటిలేని; ముఖ్య= ప్రధానమైన; వృత్తి= ఆలోచన; జగము+అంతటికిన్= లోకాని కంతటికీ; గతి= రక్ష; వేయున్= వేయి మాటలు; ఏటికిన్?= ఎందులకు?

**తాత్పర్యం:** వ్యాసుడు ఈ విధంగా పలుకగా ధర్మరాజు సంతోషించి శ్రీకృష్ణుడిని చూచి 'దయానిధీ! శుభప్రదమైన ఈ అశ్వమేధయాగాన్ని శాస్త్రోక్తంగా చేయుమని ఆజ్ఞాపించుము. మాకు తల్లయినా, తండ్రయినా, గురువయినా, ప్రియమిత్రుడయినా నీవే! సాటిలేనిదీ, ప్రధానమయినదీ అయిన నీ ఆలోచనయే లోకానికంతటికీ రక్ష. వేయి మాట లెందుకు?'

**వ.** **అనిన విని యంబుజనాభుం డతని కిట్లనియె.** **211**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; అంబుజనాభుండు= పద్మము నాభియందు కలవాడు, కృష్ణుడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ విధంగా పలుకగా విని, కృష్ణుడు అతడితో ఈ రీతిగా అన్నాడు.

**ఉ. 'వ్యాసులు పంచినట్ల నియమాఢ్యతఁ జేయుద మశ్వమేధముం;**
**జేసి కృతార్థతం బొరసి చిత్తము నెవ్వగ యెల్లఁ బాచికొ;**
**మ్మాసుకృతంబు ధర్మనిచయ ప్రవరం బని యేన చెప్పి కా**
**దే సుగుణాభిరామ! నిను దీనికిఁ జొన్పితి మున్ దృఢంబుగన్. 212**

**ప్రతిపదార్థం:** సుగుణ= మంచిగుణాలచేత; అభిరామ!= మనోహరుడవైనవాడా!; వ్యాసులు= వ్యాసులవారు; పంచిన+అట్లు+అ= ఆజ్ఞాపించినట్లే; నియమ= నియమాలయొక్క; ఆఢ్యతన్= సంపన్నతచేత; అశ్వమేధమున్= అశ్వమేధమును; చేయుదము= చేద్దాము; చేసి= కావించి; కృతార్థతన్= ధన్యతను; పొరసి= పొంది; చిత్తము= మనస్సు యొక్క; నెవ్వగ= పరిపూర్ణసంతాపాన్ని; ఎల్లన్= అంతటినీ; పాచికొమ్ము= పోగొట్టుకొనుము; ఆ= అశ్వమేధయాగం చేయటంచేత కలిగిన; సుకృతమ్ము= పుణ్యం; ధర్మ= ధర్మాలయొక్క; నిచయ= సమూహమందు; ప్రవరంబు= శ్రేష్ఠం; అని; ఏను+అ= నేనే; మున్= పూర్వం; దృఢంబుగన్= గట్టిగా; చెప్పి; కాదు+ఏ!= కదా!; నినున్= నిన్ను; దీనికిన్= యాగం చేయటానికి; చొన్పితిన్= పురికొల్పాను.

**తాత్పర్యం:** 'వ్యాసులవారు ఆజ్ఞాపించినట్లుగా; నియమసంపన్నులమై అశ్వమేధయాగం చేద్దాము. 'నీవు దానిని చేసి ధన్యుడవై నీ మనస్తాపా న్నంతటినీ పోగొట్టుకొనుము. అశ్వమేధయాగం చేయటంవలన కలిగే పుణ్యం సర్వ ధర్మాలకంటె శ్రేష్ఠం' అని పూర్వం నీకు గట్టిగా చెప్పినది నేనే కదా! ఆ పనికి నిన్ను నేనే పురికొల్పాను.

**చ. అనుమతి యింక వేఱ పడయం దలఁ పేటికిఁ గౌరవేంద్ర! న**
**న్బనుపుము, వాజిమేధకరణంబున కేపని చేయువాఁడ? నీ**
**యనుజులు నల్వు రే నొకఁడ నధ్వరకార్యము లెల్ల నీదు నె**
**మ్మనమున కెక్కఁ జేయుదుము; మాన్యచరిత్ర! తొడంగు మర్థితోన్.' 213**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులయందు శ్రేష్ఠుడా!; మాన్య= గౌరవించదగిన; చరిత్ర!= నడవడి కలవాడా!; ఇంకన్= ఇంకా; వేఱు+అ= వేరే; అనుమతి పడయన్= నా అనుమతి పొందగా; తలఁపు= ఆలోచన; ఏటికిన్?= ఎందులకు?; నన్= నన్ను; పనుపుము= ఆజ్ఞాపించుము; వాజిమేధ!= అశ్వమేధంయొక్క; కరణంబునకున్= చేయటానికి; ఏ పనిన్= ఏ పని; చేయువాఁడన్= చేయవలసినవాడను; నీ= నీయొక్క; అనుజులు= తమ్ముళ్ళు; నల్వురు= నలుగురు; ఏన్= నేను; ఒకఁడన్= ఒక్కడనూ, అధ్వర= యజ్ఞంయొక్క; కార్యములు= పనులు; ఎల్లన్= అన్నిటినీ; నీదు+నెమ్మనమునకున్= నీ మనస్సునకు; ఎక్కన్= తృప్తికలిగేటట్లుగా; చేయుదుము= చేస్తాము; అర్థితోన్= ప్రీతితో; తొడంగుము= పూనుకొనుము.

**తాత్పర్యం:** కౌరవశ్రేష్ఠా! మాననీయ వర్తనా! నేనే అశ్వమేధయాగం చేయటానికి నిన్ను పురికొల్పాను. కావున నీవు నా అనుమతి పొందాలని ఆలోచించటం దేనికి? నీవే నన్ను ఆజ్ఞాపించుము. అశ్వమేధయాగ నిర్వహణంలో నే నేపని చేయవలయును? నీ తమ్ముళ్ళు నలుగురూ, నే నొక్కడినీ కలిసి యాగకార్యాలన్నీ నీ మనస్సునకు తృప్తి కలిగేటట్లు చేస్తాము. నీవు ప్రీతితో యజ్ఞానికి పూనుకొనుము.'

సీ. **అన విని, సమ్మోద మారిన చిత్తంబు। తో నభినందించి, యా నరేంద్ర**
**వరుఁడు పారాశర్యువలను గనుంగొని। 'దీక్షకు నయ్యెడు దినము మీరు**
**చూచి యా సంస్కార మాచరింపుఁడు దయ'। ననవుడు నమ్ముని యాజ్ఞవల్క్యుఁ**
**బేర్కొని, పైలునిఁ బ్రీతి నెఱింగించి, । వారును నేనును వసుమతీశ!**

ఆ. **నడపవలయు పనులు నడపు వారము; చైత్ర। మాస కలిత పౌర్ణమాసి నిప్డు;**
**దరయఁ బనుపు మేధ్య మగుతురంగముఁ దద్జ్ఞ। లైన యట్టి జనుల; నంచితాత్మ!** **214**

**ప్రతిపదార్థం:** ఆ నరేంద్ర= ఆ రాజులకు; వరుఁడు= రాజు - రాజాధిరాజు, ధర్మరాజు; అనన్= కృష్ణుడు పలుకగా; విని; సమ్మోదము= సంతోషం; ఆరిన= నిండిన; చిత్తంబుతోన్= మనస్సుతో; అభినందించి= అతడిని ప్రశంసించి; పారాశర్యు= పరాశరుడి కుమారుడైన వ్యాసుడి; వలను= వైపు; కనుంగొని= చూచి; మీరు; దయన్= దయతో; దీక్షకున్= యజ్ఞదీక్షకు; అయ్యెడు= యుక్తమైన; దినము; చూచి= నిశ్చయించి; ఆ= యజ్ఞదీక్షకు సంబంధించిన; సంస్కారము= వేదోక్త కర్మమును; ఆచరింపుఁడు= చేయుడు; అనవుడున్= అనిన తరువాత; ఆ ముని= ఆ వ్యాసుడు; యాజ్ఞవల్క్యున్= యాజ్ఞవల్క్యుడిని; పేర్కొని= ప్రస్తావించి; ప్రీతిన్= సంతోషంతో; పైలునిన్= పైలుడిని; ఎఱింగించి= తెలియజేసి, చెప్పి; వసుమతీ+ఈశ!= రాజా!; వారును= వారూ; నేనును= నేనూ; నడపన్+వలయు= చేయవలసిన; పనులు; నడపువారము= చేస్తాము; ఇప్డు= ఈ సమయం; చైత్రమాస= చైత్రమాసంతో; కలిత= కూడిన; పౌర్ణమాసిన్= పూర్ణిమనాడు; అంచిత= గొప్పదైన; ఆత్మ!= ఆత్మకలవాడా!; మేధ్యము= పవిత్ర యజ్ఞమునకు తగినది; అగు= అయిన; తురంగమున్= గుఱ్ఱమును; అరయన్= వెదకగా; తద్+జ్ఞులు= దాని లక్షణములు తెలిసినవారు; ఐన+అట్టి= అయినటువంటి; జనులన్= జనులను; పనుపుము= పంపుము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని ధర్మరాజు మహానందంతో అతడిని ప్రశంసించాడు. తరువాత వ్యాసుడిని చూచి 'యజ్ఞదీక్షకు యుక్తమైన రోజును నిశ్చయించి మీరు ఆ సంస్కారమును నిర్వహించండి' అని అడిగాడు. అపుడామహర్షి యాజ్ఞవల్క్యుడినీ, పైలుడినీ ప్రస్తావించి 'రాజా! వారూ, నేనూ, చేయవలసిన పనులన్నీ చేస్తాము. ఇది చైత్రమాసం. ఈ రోజు పూర్ణిమ. యజ్ఞానికి పనికివచ్చే గుఱ్ఱాన్ని వెదకుటకు అశ్వశాస్త్రజ్ఞులను పంపించుము.'

క. **వేదోక్త విధి సహిత భ। వ్యాదరమున విడువఁ బడిన యయ్యశ్వం బీ**
**మేదినిఁ గలయం దిరుగును। నీ దగు నిర్మలయశంబు నెఱయ మెఱయఁగన్** **215**

**ప్రతిపదార్థం:** వేద+ఉక్త= వేదాలలో చెప్పబడిన; విధి= విధులతో కూడిన; భవ్య= శుభప్రదమైన; ఆదరమునన్= దీక్షతో; ఆదరంతో; విడువఁబడిన= వదలబడిన; ఆ+అశ్వంబు= ఆ గుఱ్ఱం; నీది+అగు= నీదైన; నిర్మల= స్వచ్ఛమైన; యశంబు= కీర్తి; నెఱయన్= వ్యాపించగా; మెఱయన్= ప్రకాశించగా; ఈ మేదినిన్= ఈ భూమియందు; కలయన్= అంతటా; తిరుగును= తిరుగుతుంది.

**తాత్పర్యం:** నీవు శుభప్రదమైన దీక్షతో, వేదోక్త కర్మములు ఆచరించి విడిచిన ఆ గుఱ్ఱం నీ కీర్తి వ్యాపించి ప్రకాశించే విధంగా భూమండలం అంతటా సంచరిస్తుంది.

వ. **సర్వ సంభారంబులును సమకట్టింపుము; స్రుక్ సువాది క్రతు సాధనంబులు గ్రొత్తలుగాఁ గనకంబునం గావింపం బనుపు' మని చెప్పిన నప్పుడమిఱేఁడు.** **216**

**ప్రతిపదార్థం:** సర్వ= సమస్తమైన; సంభారంబులును= సామగ్రినీ; సమకట్టింపుము= సిద్ధంచేయించుము; స్రుక్= యజ్ఞ ద్రవ్యాలను వేల్చటానికి చంద్ర కొయ్యతో చేసినదీ, మఱ్ఱియాకుమాదిరిగా ఉండేదీ, భుజమంత కొలత కలిగిన యజ్ఞపాత్రము; సువ= స్రుక్కువంటిదే అయి చేతియంత కొలతగల యజ్ఞపాత్ర; ఆది= మొదలైన; క్రతు= యజ్ఞంయొక్క; సాధనంబులు= పనిముట్లు; క్రొత్తలు+కాన్= క్రొత్తగా ఉండేటట్లు (ఇదివరకు వాడినవి కావు); కనకంబునన్= బంగారంతో; కావింపన్= చేయగా; పనుపుము= ఆజ్ఞాపింపుము; అని; చెప్పినన్= చెప్పగా; ఆ+పుడమిఱేఁడు= ఆ భూపతి, ధర్మరాజు.

**తాత్పర్యం:** 'సమస్త సామగ్రినీ సిద్ధం చేయించుము. స్రుక్కు, సువమూ మొదలైన పనిముట్టులను కొత్తగా బంగారంతో చేయించుము' అని చెప్పగా ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తురగ పరీక్షావిదులగు । పురుషులఁ బిలిపించి, 'యశ్వపుంగవుఁ గని తెం;**
**డరయుఁడు మనకొదమలలో । నిరుపమ లక్షణముఁ గీర్తనీయంబును గాన్. 217**

**ప్రతిపదార్థం:** తురగ= గుఱ్ఱాలయొక్క; పరీక్షా= పరీక్షించటం; విదులు= తెలిసినవారు; అగు= అయిన; పురుషులన్= అశ్వశాస్త్ర పండితులను; పిలిపించి; అశ్వ= గుఱ్ఱాలయందు; పుంగవున్= శ్రేష్ఠమైన దానిని; తెండు= తీసికొనిరండి; మన= మనయొక్క; కొదమలలోన్= బలం కలిగిన (గుఱ్ఱపు) పిల్లలలో; నిరుపమ= సాటిలేని; లక్షణమున్= లక్షణాలు గలదీ; కీర్తనీయంబును= ప్రశంసించదగిందీ; కాన్= అయినట్లుగా; అరయుఁడు= ఎన్నిక చేయుడు.

**తాత్పర్యం:** గుఱ్ఱాల పరీక్షలో ఆరితేరిన అశ్వశాస్త్రజ్ఞులను పిలిపించి 'మనకున్న గుఱ్ఱాలలో ఉత్తమ లక్షణాలు కలదీ, ప్రశస్తమైనదీ అయిన శ్రేష్ఠాశ్వాన్ని ఎన్నికచేసి తీసికొని రండి.'

**వ. అని పలికి కర్మాధికారులం గలయం గనుంగొని యజ్ఞంబునకు వలయునట్టి భాండ ప్రముఖంబులయిన సాధనంబులును, స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణమయంబులుగా వేగంబ చేయింపవలయు' నని నియోగించిన, నట్ల కాక యని చని వారును బదంపడి. 218**

**ప్రతిపదార్థం:** అని పలికి; కర్మాధికారులన్= కార్మికులపైనుండే అధికారులను, తలమానుసులను; కలయన్= బాగుగా; కనుంగొని= చూచి; యజ్ఞంబునకున్= యజ్ఞానికి; వలయు+అట్టి= కావలసిన; భాండ= కుండలు; ప్రముఖంబులు= మొదలైనవి; అయిన; సాధనంబులును= పనిముట్లనూ; స్రుక్= స్రుక్కూ; స్రువ= స్రువమూ; ఆది= మొదలైన; ఉపకరణంబులును= పరికరాలునూ; సువర్ణమయంబులుగాన్= బంగారు రూపం కలిగినవిగా; వేగంబు+అ= అతి త్వరగా; చేయింపవలయున్= చేయించవలె; అని; నియోగించినన్= నియోగించగా; అట్లు+అ+కాక= అట్లే అగునుగాక; అని; చని= వెళ్ళి; వారును= వారందరూ; పదంపడి= తరువాత.

**తాత్పర్యం:** అని అశ్వశాస్త్రజ్ఞులకు చెప్పి, తరువాత కార్మికుల పెత్తనదారులను రప్పించి 'యజ్ఞానికి కావలసిన భాండం మొదలైన పనిముట్టులనూ, స్రుక్కూ మొదలైన పరికరాలనూ బంగారంతో సత్వరంగా చేయించవలె' నని నియోగించాడు. వారు ఏలినవారు చెప్పినట్లే అగునుగాక అని వెళ్ళి కొంతకాలం గడచిన తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తురగంబును సంభారో । త్కరమును గొనివచ్చి చూప ధర్మజుఁడు పరా**
**శరసుతునకు వాని వినయ । పరత సమర్పించెఁ గురునృపాలవరేణ్యా! 219**

**ప్రతిపదార్థం:** కురునృపాల వరేణ్యా!= కురువంశ రాజులలో శ్రేష్ఠుడా!; తురగంబును= గుర్రాన్నీ; సంభార= సామగ్రియొక్క; ఉత్కరమును= సమూహాన్నీ; కొని వచ్చి= తీసికొని వచ్చి; చూపన్= చూపగా; ధర్మజుఁడు= ధర్మరాజు; వానిన్= వాటిని; వినయపరతన్= వినయాసక్తితో; పరాశర= పరాశరమహర్షియొక్క; సుతునకున్= కుమారుడైన వ్యాసుడికి; సమర్పించెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** నియుక్తులైనవారు గుర్రాన్నీ, సాధన సామగ్రినీ తెచ్చి చూపగా, ధర్మరాజు వాటిని వినయంతో వ్యాసుడికి సమర్పించాడు.

**క. ముని యశ్వముఁ జూచి కరం । బనురాగముఁ బొంది 'మేధ్య మగు నిది; దీనిన్**
**వినుత విధానమున విడుత' । మనవుడు నతఁ డతనితోడ నాదర మలరన్. 220**

**ప్రతిపదార్థం:** ముని= వ్యాసుడు; అశ్వమున్= గుర్రాన్ని; చూచి; కరంబు= మిక్కిలి; అనురాగమున్= సంతోషం; పొంది; ఇది= ఈ గుర్రం; మేధ్యము= పవిత్ర యజ్ఞానికి తగినది; అగున్= అవుతుంది; దీనిన్= దీనిని; వినుత= కొనియాడబడిన; విధానమునన్= శాస్త్రోక్త విధంగా; విడుతము= వదలిపెట్టుదాము; అనవుడున్= అనగా; అతఁడు= ధర్మరాజు; ఆదరము= గౌరవం; అలరన్= ఒప్పగా; అతనితోడన్= వ్యాసుడితో.

**తాత్పర్యం:** వ్యాసుడు గుర్రాన్ని చూచి, మిక్కిలి సంతోషించి 'ఇది యజ్ఞానికి తగినట్టిది. దీనిని శాస్త్రోక్తంగా వదలుదాము' అని అన్నాడు. అప్పుడు ధర్మరాజు ఆ మహర్షితో గౌరవ మొప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'దీని రక్షింప నర్హుండు మాననీయ । బోధ! యెవ్వండు? నీదు సద్బుద్ధి నరసి**
**యిట్టివాఁడని యానతి యిమ్ము నాకు' । ననిన నమ్మునినాథుఁ డయ్యధిపుతోడ. 221**

**ప్రతిపదార్థం:** మాననీయ= గౌరవించదగిన; బోధ= జ్ఞానం కలవాడా!; ఎవ్వండు= ఎవ్వడు; దీనిన్= ఈ గుర్రాన్ని; రక్షింపన్= రక్షించగా; అర్హుండు= తగినవాడు; నీదు= నీ యొక్క; సత్= ఉత్తమమైన; బుద్ధిన్= వివేకంతో; అరసి= పరిశీలించి; ఇట్టివాఁడు= ఇటువంటివాడు; అని; నాకున్= నాకు; ఆనతి+ఇమ్ము= ఆదేశించుము; అనినన్= అనగా; ఆ+మునినాథుఁడు= ఆ మునిరాజు; ఆ+అధిపుతోడన్= ఆ రాజుతో.

**తాత్పర్యం:** పూజ్యజ్ఞానమయా! 'ఈ గుర్రాన్ని రక్షించటానికి ఎవడు తగినవాడు? నీవు వివేకబలంతో విచారించి ఫలానవాడని నాకు చెప్పుము' అని అనగా, ఆ మహర్షి ధర్మరాజుతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'దివ్యాస్త్ర విదుఁడు, ధిషణా । భవ్యుఁడు, శౌర్యోత్తరుండు పార్థుఁడు దగు న**
**శ్వవ్యాపన క్రియకు' నితఁ । డవ్యాహతి నాచరించు నక్కార్యంబున్. 222**

**ప్రతిపదార్థం:** దివ్య= దేవతా సంబంధమైన; అస్త్ర= అస్త్రములు; విదుఁడు= తెలిసినవాడు; ధిషణా= బుద్ధిచేత; భవ్యుఁడు= యోగ్యుడు; శౌర్య= శౌర్యంచేత; ఉత్తరుండు= శ్రేష్ఠుడు; పార్థుఁడు= అర్జునుడు; అశ్వ= గుర్రంయొక్క; వ్యాపన= ఆచ్ఛాదించటం, రక్షించటం అనే; క్రియకున్= పనికి; తగున్= తగినవాడు; ఇతఁడు= ఈ అర్జునుడు; అవ్యాహతిన్= అవరోధం లేకుండా; ఆ+కార్యంబున్= అశ్వరక్ష అనే పనిని; ఆచరించున్= చేస్తాడు.

**తాత్పర్యం:** 'దివ్యాస్త్రవేత్త, బుద్ధిబలయోగ్యుడు, పరాక్రమశ్రేష్ఠుడు అయిన అర్జునుడు అశ్వాన్ని రక్షించటానికి తగినవాడు (లేక అశ్వసంచార కార్యానికి తగినవాడు.) ఇతడు ఏ ఆటంకం లేకుండా అశ్వరక్షణం చేస్తాడు.

**వ. భీమసేనుండును నకులుండును మన రాష్ట్రంబు రక్షించువారు; భవదీయ కుటుంబ కార్యంబులు సహదేవుండు నడపువాఁ' డని నిర్దేశించిన. 223**

**ప్రతిపదార్థం:** భీమసేనుండును= భీముడూ; నకులుండును= నకులుడూ; మనరాష్ట్రంబున్= మనదేశాన్ని; రక్షించువారు= రక్షిస్తారు; భవదీయ= మీ యొక్క; కుటుంబ= కుటుంబంయొక్క; కార్యంబులు= పనులు; సహదేవుఁడు; నడపువాఁడు= చేస్తాడు; అని; నిర్దేశించినన్= నిర్ణయపూర్వకంగా చెప్పగా.

**తాత్పర్యం:** 'భీముడూ, నకులుడూ దేశాన్ని రక్షిస్తుంటారు. సహదేవుడు మీ ఇంటి పనులు చేస్తుంటాడు' అని నిర్ణయించి చెప్పగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

### ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట (సం.14-71-22)

**సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి 'య । ధ్వరయుక్త మయిన యిత్తురగరత్న**
**మనఘ! సంరక్షణీయంబు నీ; కొరులకు । నిప్పని శక్యంబె? యెల్లభంగి**
**నిక్కార్యమునకు నీ వేఁగంగవలయు; నీ । యంచితాశ్వము చరియించుచుండ**
**నెడనెడ రాజుల కేనశ్వమేధ దీ । క్షితుఁడనై యుండుట సెప్పు; ముచిత**

**తే. కరణనియతి నిరోధంబు గాకయుండ । నడపు' మని చెప్పి, భీముని నకులు రాష్ట్ర**
**గోపనమునకు, సహదేవుఁ గులకుటుంబ । సమితిరక్షకుఁ బనిచె నుత్సాహ మెసఁగ. 224**

**ప్రతిపదార్థం:** ఆ+మహీ= భూమియొక్క; వల్లభుఁడు= పతి, రాజు, ధర్మరాజు; అర్జునున్= అర్జునుడిని; పిలిచి; అనఘ!= పాపరహితుడా!; నీకున్= నీకు; అధ్వర= యజ్ఞమునకు; యుక్తము= యోగ్యము; అయిన; ఈ+తురగరత్నము= ఈ ఉత్తమాశ్వం; సంరక్షణీయంబు= జాగ్రత్తగా రక్షించదగింది; ఈ+పని= ఈ పనిని, అశ్వరక్షణం; ఒరులకున్= ఇతరులకు; శక్యంబు+ఎ= సాధ్యమా?; నీవు; ఎల్లభంగిన్= సర్వసన్నాహంతో; ఈ+కార్యమునకున్= ఈ పనికి; ఏఁగంగవలయున్= వెళ్ళవలయును; ఈ+అంచిత= పూజింపబడిన; అశ్వము= గుర్రం; చరియించుచున్+ఉండన్= సంచరిస్తుండగా; ఎడన్+ఎడన్= అప్పుడప్పుడు; రాజులకున్= రాజులకు; ఏను= నేను; అశ్వమేధ= అశ్వమేధయాగంయొక్క; దీక్షితుఁడను= దీక్షవహించినవాడను; ఐ= అయి; ఉండుట= ఉండటం; చెప్పుము; ఉచిత= తగిన; కరణ= పనులు చేయుటయొక్క; నియతిన్= నియమంతో; నిరోధంబు= ఆటంకం; కాక+ఉండన్= కలుగకుండ; నడపుము= నడిపించుము; అని; చెప్పి; ఉత్సాహము; ఎసఁగన్= అతిశయించగా; భీమునిన్= భీముడిని; నకులున్= నకులుడిని; రాష్ట్ర= దేశముయొక్క; గోపనమునకున్= రక్షణమునకు; సహదేవున్= సహదేవుడిని; కుల= తన కులమునందలి; కుటుంబ= కుటుంబాలయొక్క; సమితి= సమూహంయొక్క; రక్షకున్= రక్షణకు; పనిచెన్= నియోగించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అర్జునుడిని పిలిచి 'అనఘా! యజ్ఞయోగ్యమైన ఈ గుర్రం నీకు రక్షించదగినది. ఇతరులకు ఈ పని సాధ్యంకాదు. నీవు సర్వసన్నద్ధుడవై ఈ పనిమీద వెళ్ళుము. పూజించిన గుర్రం సంచరిస్తుండగా నీవు అప్పుడప్పుడు రాజులతో 'నేను అశ్వమేధ యాగదీక్ష వహించా' నని చెప్పుము. నియమపూర్వకంగా తగిన పనులు చేస్తూ, ఏ ఆటంకం లేకుండా ఈ గుర్రాన్ని నడిపించుము' అని చెప్పాడు. భీముడినీ, నకులుడినీ దేశసంరక్షణకు నియమించాడు. సహదేవుడిని తన కులంలోని సర్వకుటుంబాల వారిని రక్షించటానికి నియోగించాడు.

**వ. మఱియునుంగల యలంతి పనుల కర్హజనంబుల నియోగించి, గాంధారీ ధృతరాష్ట్రుల యనుమతి వడసి, కుంతీసమనుజ్ఞాతుం డయి, ద్రౌపది నియ్యకొలిపి, యశ్వమేధ మఖంబున కున్ముఖుం డయ్యె' నని యిట్లు ధర్మపుత్రు పుణ్యచరిత్రంబు చెప్పిన, 'నప్పరమధార్మికుండు సకలలోక మనోజ్ఞం బగు యజ్ఞం బెవ్విధంబున నిర్వహించె? వినువేడ్క నా చిత్తంబునం జిగురొత్తెడుఁ జెప్పవే' యనుటయు. 225**

**ప్రతిపదార్థం:** మఱియునున్= ఇంకనూ; కల= ఉన్న, మిగిలిన; అలంతి= చిన్న చిన్న; పనులకున్= పనులకు; అర్హజనంబులన్= తగిన వారిని; నియోగించి= ఆజ్ఞాపించి, నియమించి; గాంధారీధృతరాష్ట్రుల= గాంధారీ ధృతరాష్ట్రులయొక్క; అనుమతి= అనుజ్ఞ; వడసి= పొంది; కుంతీ= కుంతిచేత; సమ్+అనుజ్ఞాతుండు+ఐ= అనుజ్ఞ ఇయ్యబడినవాడై; ద్రౌపదిన్= ద్రౌపదిని; ఇయ్యకొలిపి= ఒప్పించి; అశ్వమేధ= అశ్వమేధమనే; మఖంబునకున్= యజ్ఞమునకు; ఉన్ముఖుండు= సిద్ధమైనవాడు; అయ్యెను= అయ్యాడు; అని; ఇట్లు= ఈ విధంగా; ధర్మపుత్ర= యముడి కుమారుడైన ధర్మరాజుయొక్క; పుణ్య= పవిత్రమైన; చరిత్రంబు= చరిత్ర; చెప్పినన్= చెప్పగా; ఆ+పరమ= ఆ ఉత్తముడైన; ధార్మికుండు= ధర్మమునందు చరించువాడు. ధర్మరాజు; సకల= సమస్తమైన; లోక= లోకములకు; మనోజ్ఞంబు= మనోహరము; అగు= అయిన; యజ్ఞంబు= యజ్ఞమును; ఏ+విధంబునన్= ఏ విధంగా; నిర్వహించెన్= చేశాడు; విను= వినవలయునను; వేడ్క= కుతూహలం; నా= నాయొక్క; చిత్తంబున్= మనస్సులో; చిగురొత్తెడున్= అతిశయిస్తున్నది; చెప్పవే= చెప్పుమా; అనుటయున్= అని అనగా.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇంకా మిగిలిన చిన్న చిన్న పనులకు తగినవారిని నియమించాడు. కుంతీ గాంధారీ ధృతరాష్ట్రుల అనుజ్ఞ పొందాడు. ద్రౌపదిని ఒప్పించాడు. తరువాత అశ్వమేధయాగం చేయటానికి సిద్ధపడ్డాడు' అని వైశంపాయనుడు ధర్మరాజు పవిత్రచరిత్రను చెప్పాడు. అప్పుడు జనమేజయుడు 'ధార్మికశ్రేష్ఠుడైన ధర్మరాజు సమస్త లోకాలకూ మనోహరమైన యజ్ఞం ఏ విధంగా చేశాడు? వినాలని నా చిత్తం ఉవ్విళ్ళూరుతున్నది. చెప్పుమా!' అని అడుగగా. (తరువాతి ఆశ్వాసంతో అన్వయం).

ఆశ్వాసాంతము

**ఉ. మాన మదాదిదోష పరిమార్జన నిర్మల చిత్త భక్త స<br>న్మానసలోల! వీత పరిమాణ విభూతి విశాల! శాంతతా<br>హీన విదూర! విశ్వహితహేల విచార! నిరామయావ్యయ<br>స్థానక సిద్ధిమంగళ విధాయక! వేద సభైకనాయకా! 226**

**ప్రతిపదార్థం:** మాన= అహంకారం; మద= పొగరు; ఆది= మొదలైన; దోష= దోషాలను; పరిమార్జన= తుడిచివేయటంచేత; నిర్మల= స్వచ్ఛమైన; చిత్త= మనస్సులు కలిగిన; భక్త= భక్తులయొక్క; సత్= మంచివైన; మానస= మనస్సులందు; లోల= నివసించే ఆసక్తికలవాడా!; వీత= తొలగిన; పరిమాణ= మితిచేత కలిగిన; విభూతి= విస్తృతిచే; విశాల!= విశాలమైనవాడా!; శాంతతా= శాంతస్వభావంచేత; హీన= హీనులయినవారికి; విదూర= మిక్కిలి దూరంగా ఉండేవాడా!; విశ్వ= ప్రపంచానికి; హిత= మేలు కలిగించటం అనే; హేల= విలాసంతో కూడిన; విచార!= ఆలోచనం కలవాడా!; నిర్+ఆమయ= బాధలేనిది; అవ్యయ= శాశ్వతమైనది అగు; స్థానక= ప్రశస్తస్థానముయొక్క బాధలేని శాశ్వతమైన స్థానం మోక్షం; సిద్ధి= ప్రాప్తించటం అనే; మంగళ= శుభమును; విధాయక= కలుగజేసేవాడా!; వేద= వేదాల; సభా= చర్చలు జరిగే; సదస్సుయొక్క; ఏక= ప్రధానమైన; నాయకా!= అధ్యక్షా!, నడిపించేవాడా!.

**తాత్పర్యం:** అరిషడ్వర్గమును జయించిన భక్తుల నిష్కళంక చిత్తాలలో నివసించే కోరిక కలవాడా! పరిమితిలేని విస్తృతిచే విశాలమైనవాడా! శాంతస్వభావం లేనివారికి దూరంగా ఉండేవాడా! మోక్షమును ప్రసాదించేవాడా! వేద సభాధ్యక్షా! వేదాలచేత ప్రధానంగా ప్రతిపాదించబడేవాడా!

**క.** **అనపేక్షిత ఫలతా శో। భన మహనీయ క్రియా విపాకాత్మక రూ**
**ప! నితాంత ధూత సంశ్రిత। జనపాపా! పరమ మిత్ర! సత్యాలాపా!** **227**

**ప్రతిపదార్థం:** అనపేక్షిత= కోరబడని; ఫలతా= ఫలం కలిగి ఉండటంచేత; శోభన= ప్రకాశించేది; మహనీయ= గొప్పది ఐన; క్రియా= కర్మముయొక్క; విపాక+ఆత్మక= పరిణామంవలన ప్రాప్తించే చిత్తశుద్ధియొక్క; రూప!= రూపమైనవాడా!; నితాంత= ఎడతెగకుండా; ధూత= ఎగురగొట్టబడిన; సంశ్రితజన= ఆశ్రయించినవారియొక్క; పాపా!= పాపాలు కలవాడా!; పరమ= ఉత్తమమైన; మిత్ర= మిత్రుడా!; సత్య= సత్యస్వరూపాలైన; ఆలాపా!= వాక్కులు కలవాడా!

**తాత్పర్యం:** నిష్కామంగా ఆచరించే కర్మలవలన ప్రాప్తించే చిత్తశుద్ధియే రూపంగా కలవాడా! ఎల్లప్పుడూ ఆశ్రయించినవారి పాపాలను హరించేవాడా! ఉత్తమమిత్రుడా! సత్యమును బోధించే పలుకులు కలవాడా!

**మాలిని**

**తరుణ జరఠ భావ ద్రావణోదారమూర్తీ!**
**హరణ కరణ నిర్మూలానతాభ్యంతరార్తీ!**
**మరణ జనన దుఃఖోన్మాద హృత్పుణ్యకీర్తీ!**
**చరణ కమల పూజాశాలి చిత్తానువర్తీ!** **228**

**ప్రతిపదార్థం:** తరుణ= యౌవనం; జరఠభావ= ముసలితనం అనే అవస్థలను; ద్రావణ= పోగొట్టుకొన్న; ఉదార= గొప్ప; మూర్తీ!= శరీరం కలవాడా!; హరణ= (పాపాలను) హరించటం అనే; కరణ= పనిని చేయటం చేత; నిర్మూల= మొదలు చెడిన; ఆనత= వినతులైన భక్తులయొక్క; అభ్యంతర= లోపలిదైన; ఆర్తీ!= బాధలు కలవాడా!; మరణ= చావు; జనన= పుట్టువు అనే; దుఃఖ= దుఃఖాలవలన కలిగిన; ఉన్మాద= వెర్రిని; హృత్= హరించుటచేత పుట్టిన; పుణ్య= పవిత్రమైన; కీర్తీ!= కీర్తి కలవాడా!; చరణ కమల= (నీ) పాదపద్మాలయొక్క; పూజా= పూజచేత; శాలి= ప్రకాశించే భక్తులయొక్క; చిత్త= మనస్సును; అనువర్తీ!= అనుసరించి ప్రవర్తించేవాడా!

**తాత్పర్యం:** యౌవనంగానీ, వార్ధకం గానీ లేని శరీరంకలవాడా! పాపాలను నిర్మూలించి, భక్తుల అంతరబాధలు తొలగించేవాడా! చావు పుట్టువులవలన కలిగే దుఃఖానికి ఫలమైన మతిభ్రమణాన్ని సంసార దుఃఖాలవలన కలిగే వెర్రిని హరించే కీర్తి కలవాడా! నీ పాద పద్మాలను ఆరాధించే భక్తుల ఇచ్చవచ్చినట్లు నడుచుకొనేవాడా!

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున నశ్వమేధ పర్వంబునందుఁ తృతీయాశ్వాసము**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= విద్యాసంపత్తి కలిగిన; ఉభయ= రెండు భాషలయొక్క, సంస్కృతాంధ్రములయొక్క; కవి= కవులయొక్క; మిత్ర= మిత్రుడును; కొమ్మన= కొమ్మన అనే; అమాత్య= మంత్రియొక్క; పుత్ర= పుత్రుడును; బుధ= విద్వాంసులయొక్క; ఆరాధన= పూజచేత; విరాజి= ప్రకాశించేవాడును; తిక్కన సోమయాజి= యజ్ఞంచేసినవాడైన తిక్కనచేత; ప్రణీతంబు+ఐన= రచించబడినదైన; శ్రీ= గౌరవించదగిన; మహాభారతంబునన్= మహాభారతంలో; అశ్వమేధ= అశ్వమేధమనే యాగం వస్తువుగా గల; పర్వంబు+అందున్= పర్వంలో; తృతీయ= మూడవదైన; ఆశ్వాసము= ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది విద్యాసంపత్తి కలిగినవాడును, సంస్కృతాంధ్ర కవుల మిత్రుడును, కొమ్మన మంత్రి కుమారుడును, విద్వాంసుల ఆరాధనంచేత ప్రకాశించేవాడును, యజ్ఞం చేసినవాడును అయిన తిక్కన రచించిన పూజ్యమహాభారతమందలి అశ్వమేధపర్వంలో తృతీయాశ్వాసం.

**అశ్వమేధపర్వంలోని మూడవఆశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము

**శ్రీవిద్యాశాంతి కృతి । ప్రావీణ్య నిరూఢి గణ్య పాద సతత సం**

**సేవన తత్పర హృత్కమ । లావాస కృత ప్రమోద! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= ఓ హరిహరనాథా! శ్రీవిద్యా= ఉపనిషద్విద్యయొక్క, ఆత్మవిద్యయొక్క, మోక్షవిద్యయొక్క; శాంతి= శాంతి అనే కర్మమును; కృతి= చేయటంలో; ప్రావీణ్యా= నేర్పుచేత కలిగిన; నిరూఢి= ప్రసిద్ధిచేత; గణ్యా= లెక్కించదగిన; పాద= పాదాలయొక్క; సతత= ఎల్లప్పుడును; సంసేవన= మిక్కిలి సేవించుటయందు; తత్పర= ఆసక్తి కలిగిన భక్తులయొక్క; హృద్+కమల= హృదయ పద్మములందు; ఆవాస= నివసించటంచేత, కృత= కలుగజేయబడిన; ప్రమోద!= ఆనందం కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! మోక్ష విద్యాసమాప్తి తరువాత గురుశిష్యులు చేసే శాంతికర్మం నిర్విఘ్నంగా కొనసాగటానికి మూలమైన నీ పాదాలను ఎల్లప్పుడూ సేవించే భక్తుల హృదయాలలో నివసిస్తూ వారికి ఆనందాన్ని కలుగజేసేవాడా!

**విశేషం:** హరిహరనాథుడి పాదసేవవలన మోక్షవిద్యను ఆమూలాగ్రంగా సంపాదింపవచ్చును. ఆ పాదసేవవలననే శాంతి నిరాటంకంగా ప్రాప్తిస్తుంది. అట్టి పాదసేవ చేసేవారి హృదయాలలో హరిహరనాథుడు నిత్యం నివసిస్తూ వారికి ఆనందం కలుగజేస్తాడు. ఆయన ఆనందస్వరూపుడు. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' (ఆనందమే బ్రహ్మగా తెలిసికొనెను) అని శ్రుతి చెప్తున్నది. కావున ఆనందస్వరూపుడైన భగవంతుడు తన భక్తులకు ఆనందం కలిగించే సమర్థుడౌతున్నాడు.

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిఁ దిరుగ విడుచుట (సం.14-72-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; న ట్లశ్వమేధయాగోద్యోగప్రద్యోతితుం డయిన పాండవాగ్రజు దీక్షకు నర్హం బయిన దినంబు సంప్రాప్తం బగుటయు, మౌహూర్తిక దత్త శుభ ముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేద విహిత విధాన మహితంబుగ నక్కురు క్షితిపతి దీక్షితుం జేసి; రవ్వసుంధరా వల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్గనంబులు బలియం బరమ సంయమి పరివృత ప్రజాపతి ప్రఖ్యుండును గనత్కాంచనాభరణభూషితుండు నయి బహుళ ప్రభలు నిగుడ సందీప్త పావక సన్నిభుండును నగుచు వెలింగెఁ; దత్తుల్యాకల్పనంబున ఋత్విగ్గన సమాజంబునుం దేజరిల్లె; నా వేదవ్యాస మహామునిచేత శాస్త్రోక్త ప్రకారంబున ముక్తంబయి హయోత్తమంబు వెడలె; నప్పుడు.2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా; వైశంపాయనుండు= వైశంపాయనుడు; జనమేజయునకున్= జనమేజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; అశ్వమేధ= అశ్వమేధమనే; యాగ= యాగముయొక్క; ఉద్యోగ= ప్రయత్నంచేత; ప్రద్యోతితుండు+అగు= ప్రకాశిస్తున్నవాడైన; పాండవ= పాండవులయొక్క; అగ్రజు= అన్నయొక్క, ధర్మరాజుయొక్క;

దీక్షకున్= దీక్షకు; అర్హంబు= తగినది; అయిన; దినంబు= రోజు; సంప్రాప్తంబు= ప్రాప్తించింది, వచ్చింది; అగుటయున్= కాగా; మౌహూర్తిక= ముహూర్తాలు తెలిసినవారిచేత; దత్త= ఇయ్యబడిన, నిర్ణయించబడిన; శుభ= మంగళకరమైన; ముహూర్తంబునన్= ముహూర్తమందు; కృష్ణద్వైపాయన= వ్యాసుడు; ఆదులు= మొదలగువారు; ఐన= అయిన; ఋత్విజులు= దక్షిణ పుచ్చుకొని యజ్ఞంచేయించేవారు; వేద= వేదాలచేత; విహిత= విధించబడిన; విధాన= పద్ధతులచేత; మహితంబుగన్= గౌరవించబడినదగునట్లుగా, ఆ+కురు= ఆ కురువంశీయుడైన; క్షితిపతిన్= రాజును; దీక్షితున్= దీక్షవహించిన వాడినిగా; చేసిరి= చేశారు; ఆ+వసుంధరా= ఆ భూమియొక్క; వల్లభుండు= భర్త - ధర్మరాజు; సంవీత= ధరించబడిన; క్షౌమ= పట్టుబట్టయు; కృష్ణ+అజినుండును= నల్లలేడితోలు కలవాడును; దండపాణియున్= యజ్ఞదండము చేతియందు కలవాడును; అయి; ఋత్విక్+జనంబులు= అనేకులు ఋత్విజులు; బలియన్= చుట్టి ఉండగా; పరమ సంయమి= బ్రహ్మర్షులచేత; పరివృత= చుట్టబడిన; ప్రజాపతి= బ్రహ్మతో; ప్రఖ్యుండును= సమానుండును; కవత్= ప్రకాశిస్తున్న; కాంచన+ఆభరణ= బంగారు నగలచేత; భూషితుండును= అలంకరించబడినవాడును; అయి; బహుళ= అత్యధికమైన; ప్రభలు= కాంతులు; నిగుడన్= వ్యాపించగా; సందీప్త= మిక్కిలి వెలుగుతున్న; పావక= అగ్నితో; సన్నిభుండును= సమానుడును; అగుచున్= అవుతూ; వెలింగెన్= వెలిగాడు; తద్= ఆ ధర్మజుడియొక్క; తుల్య= వేషభాషలతో సమానమైన; ఆకల్పనంబునన్= అలంకారాలచేత; ఋత్విక్+జన= ఋత్విజులయొక్క; సమాజంబునున్= సంఘంకూడా; తేజరిల్లెన్= వెలిగింది; ఆ+వేదవ్యాస= ఆ వేదవ్యాసుడనే; మహత్+మునిచేతన్= మహర్షిచేత; శాస్త్ర= శాస్త్రమునందు; ఉక్త= చెప్పబడిన; ప్రకారంబునన్= విధంగా; ముక్తంబు+అయి= విడువబడినదై; హయ+ఉత్తమంబు= ఆ మంచి గుర్రం; వెడలెన్= బయలుదేరింది; అప్పుడు= ఆ సమయంలో,

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు. అశ్వమేధయాగం చేయాలని ప్రయత్నిస్తున్న ధర్మరాజు దీక్షవహించవలసినరోజు వచ్చింది. దైవజ్ఞులు నిర్ణయించిన శుభ ముహూర్తంలో వ్యాసుడు మొదలైన ఋత్విజులు వేదవిధుల ననుసరించి ధర్మరాజును యజ్ఞదీక్షితుడిగా చేశారు. ధర్మరాజు పట్టుబట్టా, నల్లయిట్టితోలూ ధరించాడు. యజ్ఞదండాన్ని చేపట్టాడు. ఋత్విజులు చుట్టూ చేరిన ఆ మహారాజు బ్రహ్మర్షులు చుట్టిన బ్రహ్మవలె ప్రకాశించాడు. తళ తళా మెరుస్తున్న బంగారు నగలు పెట్టుకొన్న ఆ ప్రభువు గన గనా మండుచున్న అగ్నివిధంగా వెలుగొందాడు. ఋత్విజులు కూడా ధర్మజుడి వేషభూషలతో సమానమైన అలంకారాలతో ప్రకాశించారు. తరువాత వేదవ్యాసుడు శాస్త్రోక్తంగా వదలిపెట్టగా ఆ ఉత్తమాశ్వం బయలుదేరింది.

**విశేషం:** ఇక్కడ అశ్వమేధయాగాన్ని గూర్చి కొంత వివరించాలి. గుర్రాన్ని బలిపశువుగా చేసి సార్వభౌముడు చేసే యజ్ఞ విశేషం అశ్వమేధం. దీనిని చైత్రమాసంలో పూర్ణిమనాడు ఆరంభించాలి. అందువలననే వ్యాసుడు మూడో ఆశ్వాసంలో 'చైత్రమాస కలిత పౌర్ణమాసి' (పద్య 214) అని ధర్మరాజుతో అన్నాడు.

యజ్ఞం ఆరంభమయ్యే మొదటి సంవత్సరంలో చైత్రపూర్ణిమనాడు సార్వభౌముడు సాంగ్రహణం అనే ఒక యజ్ఞాన్ని జరిపించి, మరునాడు బ్రహ్మౌదనం మొదలైన కర్మలు చేసి గుర్రాన్ని వదలాలి. ఆ యజ్ఞాశ్వం స్వేచ్ఛగా తిరుగుతుంటే రాజపుత్రులు మొదలైనవారు దానిని వెంబడించాలి. వదలిన సంవత్సరంలో పదకొండు నెలలు గడచిన తరువాత అశ్వాన్ని తోలుకొనివచ్చి రావిచెట్ల తోపులో బంధించాలి.

పండ్రెండో నెలలో యజ్ఞ సామగ్రిని సంపాదించి ఫాల్గునమాసంలో అమావాస్యనాడు సార్వభౌముడు ఋత్విజులతో కూడి యజ్ఞశాలలో ప్రవేశించాలి. రెండోసంవత్సరం మొదటి పాడ్యమి మొదలు అశ్వమేధయాగం ఆరంభించి, ఏడు రోజులు హోమం చేసి పూర్ణాహుతి చేయాలి. గుర్రాన్ని రథకారుడి గృహంలో బంధించి బ్రహ్మ మొదలైన ఋత్విజులు నలుగురూ 'ఇహ ధృతి స్వాహా' ఇత్యాది మంత్రాలు చెప్పి హోమం చేస్తారు.

తరువాత సోమలతకు కొన్ని క్రియలు జరిపి సోమపానం చేస్తారు.

**సీ.** **వివ్వచ్చుఁ డాగమవిధివంతముగ ధర్మ। నందను నామంత్రణంబు వడసి,**
**గాండీవపాణియై, కవదొనల్ ధరియించి, । తేజోవిశేషంబు రాజితముగ**
**నయ్యశ్వరత్నంబు ననుసరింపఁగఁ బ్రజ। బాలురు వృద్ధులు భామినులును**
**లోనుగాఁ బఱతెంచి, లోలత నతని నా। హయమును గనుఁగొను నప్పు డగ్గ**

**తే.** **లంపు సందడి నూష్మజనింప, నాజ। నంబు లవ్వీరునకు దీవనలఁ బొగడ్త**
**లను బ్రమోద మొనర్చిరి; వనధిరవము। ననుకరించె నయ్యులివు నృపాగ్రగణ్య!** **3**

**ప్రతిపదార్థం:** నృప= రాజులలో; అగ్రగణ్య!= మొదట లెక్కింపదగినవాడా! జనమేజయా!; వివ్వచ్చుఁడు= అర్జునుడు; ఆగమ= వేదములయొక్క; విధివంతముగన్= విధుల ప్రకారంగా; ధర్మ= యముడియొక్క; నందను= కుమారుడైన ధర్మరాజుయొక్క; ఆమంత్రణంబు= వీడ్కోలు; పడసి= పొంది; గాండీవ= గాండీవమనే విల్లు ఉన్న; పాణి+ఐ= చేయికలవాడై; కవదొనల్= రెండు అమ్ముల పొదులను; ధరియించి; తేజస్+విశేషంబు= తేజస్సుయొక్క అతిశయం; రాజితముగన్= ప్రకాశిస్తున్నది కాగా; ఆ+ అశ్వరత్నంబున్= ఆ ఉత్తమాశ్వాన్ని; అనుసరింపఁగన్= వెంటరాగా; బాలురు; వృద్ధులు= ముసలివారు; భామినులును= స్త్రీలునూ; లోనుగాన్= మొదలుగా; ప్రజ= ప్రజలు; పఱతెంచి= వేగంగా వచ్చి; లోలతన్= ఆసక్తితో; అతనిన్= అర్జునుడినీ; హయమును= గుర్రాన్నీ; కనుఁగొను+అప్పుడు= చూచేటప్పుడు; అగ్గలము= అత్యధికమైన; సందడిన్= సమ్మర్దంచేత; ఊష్మ= వేడిమి; జనింపన్= పుట్టగా; ఆ జనంబులు= ఆ ప్రజలు; ఆ+వీరునకున్= వీరుడైన ఆ అర్జునుడికి; దీవనలన్= దీవనలచేతనూ; పొగడ్తలను= ప్రశంసలచేతనూ; ప్రమోదము= సంతోషము; ఒనర్చిరి= కలిగించారు; ఆ+ఉలివు= ఆ ఆశీర్వాదాల, ప్రశంసల ధ్వని; వనధి= సముద్రంయొక్క; రవమున్= ఘోషమ; అనుకరించెన్= పోలెను.

**తాత్పర్యం:** రాజాగ్రగణ్యా! జనమేజయా! అర్జునుడు వేదోక్తంగా ధర్మరాజు వీడ్కోలు పొంది గాండీవాన్ని చేతబట్టి, అమ్ములపొదులజంటను ధరించి, వెలుగులు వెల్లువ కట్టుతుండగా గుర్రాన్ని అనుసరించాడు. అప్పుడు ఆబాలగోపాలమూ అతడినీ, గుర్రాన్నీ ఆసక్తితో చూచేటప్పుడు జనసమ్మర్దంవలన వేడిపుట్టింది. ఆ ప్రజలు ఆశీర్వాదాలు చేసి, ప్రశంసించి అర్జునుడికి సంతోషం కలిగించారు. వారి మాటల సవ్వడి సముద్రఘోషను పోలింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **ఇవ్విధంబునం జను నా కవ్వడితోడ యజ్ఞకర్మకుశలుండైన యాజ్ఞవల్క్య శిష్యం డర్హవిధానంబుల కయి మాననీయ విప్రజన సహితంబుగాఁ జనియె; నప్పరమ తురంగంబు ధరణిం బ్రదక్షిణ రూపంబునం దిరిగి, యుత్తరాభిముఖంబై యల్లనల్లన యరుగుచుండ, నర్జునుం డనుసరించి పాలన పరుండగుచుం బ్రవర్తింపం ద్రిగర్తదేశంబునందు.** **4**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; చను= గుర్రాన్ని అనుసరించే; ఆ+కవ్వడితోడన్= ఆ అర్జునుడితో; యజ్ఞ= యజ్ఞంయొక్క; కర్మ= విధులయందు; కుశలుండు= నేర్పరి; ఐన= అయిన; యాజ్ఞవల్క్య= యాజ్ఞవల్క్యుడియొక్క; శిష్యుండు; అర్హ= తగిన, మార్గంలో చేయదగిన; విధానంబులకున్+అయి= పవిత్ర కర్మముల నిమిత్తం; మాననీయ= ఆదరింపదగిన; విప్రజన= బ్రాహ్మణులతో; సహితంబు+కాన్= కూడిఉండేటట్లుగా; చనియెన్= వెళ్ళాడు; ఆ+పరమ= ఆ శ్రేష్ఠమైన; తురంగంబు=

గుర్రం; ధరణిన్= భూమియందు; ప్రదక్షిణ= కుడివైపునుండి తిరిగి వచ్చే; రూపంబునన్= ప్రకారంగా; తిరిగి; ఉత్తర= ఉత్తర దిక్కునకు; అభిముఖంబు+ఐ= ఎదురుముఖం కలిగినదై, ఉత్తరదిక్కువైపుగా; అల్లన్+అల్లన్+అ= మెల్ల మెల్లగా; అరుగుచున్+ఉండన్= వెళ్ళుతూ ఉండగా; అర్జునుండు; అనుసరించి= వెంబడించి; పాలన= రక్షించటంలో; పరుండు= శ్రద్ధకలవాడు; అగుచున్= ఔతూ; ప్రవర్తింపన్= నడచుకొంటుండగా; త్రిగర్తదేశంబు+అందున్= త్రిగర్తదేశంలో.

**తాత్పర్యం:** యజ్ఞకర్మ నిపుణుడైన యాజ్ఞవల్క్యశిష్యుడు మార్గమధ్యంలో తగిన పనుల నిమిత్తం బ్రాహ్మణులతో కూడి అర్జునుడి వెంట వెళ్ళాడు. ఆ యజ్ఞాశ్వం భూమిమీద ప్రదక్షిణం చేసే విధంగా సంచరించి, ఉత్తర దిక్కు వైపునకు మెల్లమెల్లగా వెళ్ళుతున్నది. అర్జునుడు దానిని అనుసరిస్తూ రక్షించటానికి ఎంతో ఆసక్తి చూపుతూ నడుచుకొంటున్నాడు. గుర్రం త్రిగర్తదేశంలో ప్రవేశించింది. (తరువాతి పద్యంతో అన్వయం)

**అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము చేయుట (సం.14-73-1)**

**సీ. ఉద్ధతులై త్రిగర్తోర్వరాపతి పుత్త్ర। పౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు**
**గాఁ బూని తేరులు గడురయంబునఁ దోలి। కొని యడ్డముగ వచ్చు కోలుతలకు**
**నలుగక, నరుఁ డన్నయానతిఁ దలఁచి యా। రాజ కుమార వర్గంబుతోడ**
**'ధర్మజు నశ్వమేధంబున కపకార। మాచరించుట పాప; మదియుఁ గాక**

**తే. యేము మీరును బాంధవ మెసక మెసఁగ। నడచు టొప్పదె; పగ యే?' లనంగ వారు**
**సూర్యవర్మ నామకుఁ డగు శూరతమ కు। మారుఁ డగ్రణి గాఁగ నుదారలీల. 5**

**ప్రతిపదార్థం:** త్రిగర్త+ఉర్వరా= త్రిగర్తదేశంయొక్క; పతి= రాజుయొక్క; పుత్త్ర= కుమారులు; పౌత్త్రులు= మనుమలు; ఉద్ధతులు+ఐ= గర్వం కలవారై; ఆ+అశ్వంబున్= ఆ గుర్రాన్ని; పట్టువారు= బంధించేవారు; కాన్= అయ్యేటట్లుగా; పూని= పూనుకొని; కడున్= మిక్కిలి; రయంబునన్= వేగంగా; తేరులు= రథాలు; తోలికొని= తీసికొని; అడ్డముగన్= అడ్డంగా; వచ్చు= వచ్చునట్టి; కోలుతలకున్= హెచ్చరికకూ, సన్నాహానికీ; అలుగక= కోపించక; నరుఁడు= అర్జునుడు; అన్న= అన్నగారైన ధర్మరాజుయొక్క; ఆనతిన్= ఆజ్ఞను; తలఁచి= స్మరించి; ఆ+రాజకుమార= ఆ రాజకుమారులయొక్క; వర్గంబుతోడన్= సమూహంతో; ధర్మజ= ధర్మరాజుయొక్క; అశ్వమేధంబునకున్= అశ్వమేధయాగానికి; అపకారము= కీడు; ఆచరించుట= చేయటం; పాపము; అదియున్+కాక= అంతేకాకుండా; ఏము= మేమూ; మీరును= మీరూ; బాంధవము= చుట్టరికం; ఎసక మెసఁగన్= అతిశయించగా; నడచుట= ప్రవర్తించటం; ఒప్పదు+ఎ= తగదా; పగ= వైరం; ఏల?= ఎందులకు?; అనంగన్= అనగా; వారు; సూర్యవర్మ; నామకుఁడు= పేరుగలవాడు; అగు= అయిన; శూరతమ= వీరశ్రేష్ఠుడైన; కుమారుఁడు= రాజపుత్రుడు; అగ్రణి= సేనాపతి; కాఁగన్= కాగా; ఉదార= అధికమైన; లీలన్= వీర విలాసంతో.

**తాత్పర్యం:** అప్పుడు త్రిగర్త దేశాధిపతి కుమారులూ, మనుమలూ కన్నూ మిన్నూ కానకుండా గుర్రాన్ని బంధించటానికి వేగంగా రథాలు నడుపుతూ, ఎచ్చరికలు చేస్తూ వచ్చారు. వారి పరవళ్ళు చూచి కూడా అర్జునుడు అన్నగారి ఆజ్ఞను గుర్తుచేసికొని వారిని కోపించలేదు. పైగా వారితో 'మీరు ధర్మరాజు అశ్వమేధయాగానికి కీడు తలపెట్టటం పాపం. అదీ కాక మీరూ మేమూ పొత్తు కలిగి నడచుకొనటం తగినపని కదా! మనకు వైరం దేనికి?' అన్నాడు. కాని, ఆ రాజకుమారులు శూరశ్రేష్ఠుడైన సూర్యవర్మ అనే రాజకుమారుడిని సేనాపతిగా చేసికొని వీరవిలాసంతో, (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లనున్ 'దయాధురా**
**ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమ రక్షకు నంపునప్డు భూ**
**పవితతియెల్లనుం దెగియె భారతయుద్ధమునందు; బాలురం**
**దివిరి వధింపఁ గాదు; కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ! 6**

**ప్రతిపదార్థం:** కవిసిన= ఎదుర్కొనిన; వారితోన్= ఆ రాజకుమారులతో; మఱియున్= ఇంకనూ; కవ్వడి= అర్జునుడు; ఇట్టులు= ఇట్లు; అనున్= అన్నాడు; దయా= దయ అనెడు; ధురా= బరువునందు; ప్రవణుఁడు= ఆసక్తిగలవాడు (దయా పరిపూర్ణుడని అర్థం); అజాతశత్రుఁడు= తనకు విరోధులు లేనివాడు, తానుగా ఎవ్వరియందునూ శత్రుత్వం వహించనివాడు, ధర్మరాజు; తురంగమ= గుర్రంయొక్క; రక్షకున్= రక్షకు; అంపు+అప్డు= పంపేటప్పుడు; భారతయుద్ధమునందున్ = భారతయుద్ధంలో; భూప= రాజులయొక్క; వితతి= సమూహం; ఎల్లనున్= అంతయూ; తెగియెన్= నశించింది; తివిరి= ప్రయత్నించి; పూని; బాలురన్= బాలురను, యుద్ధంలో నశించిన ఆ రాజుల కొడుకులను; వధింపన్= చంపగా; కాదు= తగదు; కృపన్= దయతో; తిన్న+తనంబు= మంచితనం; ఎసఁగన్= ఒప్పగా; చరింపుము+ఈ= నడుచుకొనుమా.

**తాత్పర్యం:** ఎదుర్కొనిన ఆ రాజకుమారులతో అర్జునుడు ఇంకా ఈ విధంగా అన్నాడు 'దయామయుడైన ధర్మరాజు అశ్వ సంరక్షణానికి నన్ను పంపేటప్పుడు 'భారతయుద్ధంలో రాజులందరూ నశించారు. నీవు తొందరపడి వారి కొడుకులను చంపబోకుము. దయతో మంచితనం ఉట్టిపడేటట్లు నడుచుకొనుము.'

**చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం**
**ధవము దలిర్పఁ బల్కి, యని దప్పఁగ ద్రోవుము; కిన్క మాను; మ**
**న్నవచనవృత్తి నాదగుమనంబున నెక్కొని యున్కిఁ జేసి యా**
**హవమున కొల్ల నయ్యెదఁ బ్రియంబులు గా వొకొ! మీకుఁ బ్రాణముల్? 7**

**ప్రతిపదార్థం:** అవినయ= వినయంలేని; వృత్తిన్= ప్రవర్తనతో; అశ్వమునకున్= గుర్రానికి; అడ్డము వచ్చిరి+అ= అడ్డం వచ్చినవారే; ఏని= అయినప్పటికీ; నీవు; బాంధవము= చుట్టరికం; తలిర్పన్= వెల్లడి అయ్యేటట్లుగా; పల్కి= మాటలాడి; అని= యుద్ధం; తప్పఁగన్= తప్పిపోయేటట్లుగా; త్రోవుము= నిరాకరించుము; కిన్క= క్రోధం; మానుము= వదలుము; అన్న= అనిన ధర్మరాజుయొక్క; వచన= మాటలయొక్క; వృత్తిన్= తాత్పర్యం; నా+అది+అగు= నాదైన; మనంబునన్= మనస్సులో; నెక్కొని= గట్టిగా నిలిచి; ఉన్కిన్+చేసి= ఉండటంవలన; ఆహవమునకున్= పోరునకు; ఒల్లన్+అయ్యెదన్= ఒప్పుకొననివాడనయ్యాను; మీకున్= మీకు; ప్రాణముల్= ప్రాణాలు; ప్రియంబులు= ప్రేమించేవి; కావు+ఒకొ?= కావా ఏమి?

**తాత్పర్యం:** వినయం చూపకుండా గుర్రానికి అడ్డుపడినప్పటికీ, నీవు చుట్టరికం వెల్లడయ్యేటట్లు మాటలాడి యుద్ధం తప్పిపోయే విధంగా నిరాకరింపుము. క్రోధం వదలిపెట్టుము' అని చెప్పిన వాక్యార్థం నా మనస్సులో గట్టిగా నిలవటంచేత నేను పోరాటానికి ఒప్పుకొననివాడనయ్యాను. మీకు ప్రాణాలమీద తీపి లేదా ఏమి?

**చ. వలవదు పొం' డనంగ నిలువంబడ కేపున సూర్యవర్మ య**
**బ్బలియుని మీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ, ద్రుంచెఁ జిప్పయ**

**మ్ముల నది, యెఱ్ఱనవ్వు తనమోమునుతమ్మికి లేఁతయెండయై**
**చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ నా విజయుండు భూవరా! 8**

**ప్రతిపదార్థం:** వలవదు= పోరు వద్దు; పొండు= వెళ్ళిపోండి; అనంగన్= అనగా; సూర్యవర్మ; నిలువంబడక= అంతటితో ఆగక; ఏపునన్= మిడిసిపాటుతో; ఆ+బలియునిమీఁదన్= శక్తిమంతుడిమీద, ఆ అర్జునుడిమీద; క్రూర= భయంకరమైన; శర= బాణాలయొక్క; పంక్తిన్= వరుసను; నిగిడ్చినన్= ప్రయోగించగా; భూవరా!= రాజా!; ఆ విజయుండు= ఆ అర్జునుడు; ఎఱ్ఱనవ్వు= క్రోధంవలన కలిగిన నవ్వు; తన= తనయొక్క; మోము= ముఖం; అను= అనెడి; తమ్మికిన్= పద్మమునకు; లేఁత+ఎండ+ఐ= లేత ఎండై; చెలువము= సౌందర్యంయొక్క; చెన్ను= విలాసం; వింతలు+కన్= ఆశ్చర్యకరంగా; చేయఁగన్= చేయగా; చిప్ప= చిప్పవంటి మొనలుగల; అమ్ములన్= బాణాలతో, అర్ధచంద్ర బాణాలతో; అది= సూర్యవర్మ ప్రయోగించిన బాణముల పరంపరను; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** పోరువద్దు. వెళ్ళిపొండి' అని అనగా సూర్యవర్మ అంతటితో ఆగకుండా పొగరుతో అర్జునుడిమీద పుంఖానుపుంఖంగా బాణాలు ప్రయోగించాడు. జనమేజయా! అప్పుడు అర్జునుడు క్రోధంవలన కలిగిన నవ్వు తన ముఖపద్మానికి లేత ఎండవలె దాని అందాన్ని ఆశ్చర్యకరంగా చేయగా, సూర్యవర్మ ప్రయోగించిన బాణ పరంపరను, అర్ధచంద్రబాణాలతో ముక్కలు ముక్కలుగా చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడ. 9**

**తాత్పర్యం:** ఆ సమయంలో

**తే. సూర్యవర్ముని తమ్ముండు శూరవరుఁడు। కేతువర్మ గాండీవిపై శాతబాణ**
**వృష్టిఁ గురియుచు నుద్ధురవేగ మొప్ప। నన్నఁ గడచి బె ట్టడరిన నన్నరుండు. 10**

**ప్రతిపదార్థం:** సూర్యవర్ముని= సూర్యవర్మయొక్క; తమ్ముండు; శూర= శూరులయందు; వరుఁడు= శ్రేష్ఠుడు; కేతువర్మ; గాండీవిపైన్= అర్జునుడిమీద; శాత= వాడి అయిన; బాణ= బాణాలనెడు; వృష్టిన్= వానను; కురియుచున్= కురిపిస్తూ; ఉద్ధుర= దృఢమైన; వేగము= వేగం; ఒప్పన్= ఒప్పగా; అన్నన్= అన్నను; కడచి= మించి, దాటి; బెట్టు= దిట్టతనంతో; అడరినన్= విజృంభించగా; ఆ+నరుండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** సూర్యవర్మ తమ్ముడూ, వీరశ్రేష్ఠుడూ అయిన కేతువర్మ అర్జునుడిమీద నిశిత బాణవర్షం కురిపిస్తూ మహావేగంతో అన్నను మించి ముందుకు వచ్చి దిట్టతనంతో చెలరేగగా ఆ అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అతని నొదుంగ నేయుటయు, నాతని తమ్ముఁడు చండ విక్రమో**
**ద్ధతి ధృతవర్మ నాముఁ డతిదారుణ సాయకపంక్తి సత్వరా**
**తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చు వచ్చి య**
**య్యతిరథవర్యుఁ డప్పుడు తదంగము లేయఁగ నొల్లకుండుటన్. 11**

**ప్రతిపదార్థం:** అతనిన్= కేతువర్మను; ఒదుంగన్= తొలగిపోవగా, యుద్ధరంగంనుండి వెళ్ళేటట్లుగా; ఏయుటయున్= బాణప్రయోగం చేయగా; ఆతని= కేతువర్మయొక్క; తమ్ముఁడు; ధృతవర్మ= ధృతవర్మ అనే; నాముఁడు= పేరుగలవాడు; చండ= తీవ్రమైన; విక్రమ= పరాక్రమంయొక్క; ఉద్ధతిన్= గర్వంతో; అతి= మిక్కిలి; దారుణ= ఘోరమైన; సాయక= బాణాలయొక్క; పంక్తిన్= వరుసను; సహ+త్వరా= వేగంతో కూడిన; ఆతత= విస్తృతమైన; గతిన్= ప్రకారంగా; పర్వన్+చేయుచున్= వ్యాపింపజేస్తూ; పృథా= కుంతియొక్క; సుతున్= కుమారుడు అర్జునుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా; అప్పుడు= ఆ సమయంలో; ఆ+అతిరథ= ఆ అతిరథులలో; వర్యుఁడు= శ్రేష్ఠుడు; మెచ్చు= మెప్పు; వచ్చి= పుట్టి; తద్= ధృతవర్మయొక్క; అంగములు= అవయవములు; ఏయఁగన్= గురిగా బాణాలు ప్రయోగింపగా; ఒల్లక= ఇష్టపడక; ఉండుటన్= ఉండటంచేత.

**తాత్పర్యం:** కేతువర్మ రణరంగంనుండి తొలగిపోయేటట్లుగా బాణాలు ప్రయోగించాడు. అంత కేతువర్మ తమ్ముడు ధృతవర్మ మహాపరాక్రమ గర్వంతో తీవ్రవేగంగా బాణాలు అఖండంగా వేస్తూ అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు అతడి యుద్ధనైపుణ్యాన్ని మెచ్చి అతడి శరీరావయవాలు గురిగా బాణాలు వదలటానికి మనస్కరించకుండా ఉన్నాడు.

**చ. శరములు ద్రుంప, నాతఁడు వెసన్ బలునారసముల్ నిగిడ్చె న**
**న్నరుపయి; నా బలిష్ఠుఁడు మనంబునఁ గొండొక యల్క పుట్టి య**
**న్నరవరసూతి పేరురమునం బదితూపులు గ్రుచ్చె; దానికిం**
**దెరలక యక్కుమారుఁడును దీవ్రశరంబులఁ జేయి నొంచినన్. 12**

**ప్రతిపదార్థం:** శరములు= బాణాలు మాత్రం; త్రుంపన్= ఖండింపగా; అతఁడు= ఆ ధృతవర్మ; వెసన్= శీఘ్రంగా; ఆ+నరుపయిన్= ఆ అర్జునుడిమీద; పలు= అనేకములైన; నారసముల్= బాణాలను; నిగిడ్చెన్= ప్రయోగించాడు; ఆ బలిష్ఠుఁడు= బలవంతుడైన ఆ అర్జునుడు; మనంబునన్= మనస్సునందు; కొండొక= కొంచెం; అల్క= కోపం; పుట్టి= పుట్టగా; ఆ నరవర= ఆ రాజుయొక్క; సూతి= బిడ్డయొక్క; పేరు= విశాలమైన; ఉరమునన్= రొమ్ముమీద; పది తూపులు= పదిబాణాలు; గ్రుచ్చెన్= నాటాడు; దానికిన్= ఆ బాణప్రయోగానికి; తెరలక= వెనుకంజవేయక; ఆ కుమారుఁడును= ఆ రాజపుత్రుడునూ; తీవ్ర= వాడి అయిన; శరంబులన్= బాణాలతో; చేయి= చేతిని; నొంచినన్= కొట్టి బాధించగా.

**తాత్పర్యం:** అర్జునుడు ధృతవర్మ వేసిన బాణాలనుమాత్రం ఖండించాడు. అతడు వేగంగా అర్జునుడిమీద అనేక బాణాలు ప్రయోగించాడు. దీనితో అర్జునుడికి కొంచెం కోపం వచ్చింది. అతడు ఆ రాచబిడ్డ రొమ్ముమీద పది బాణాలు నాటుకొనేటట్లు చేశాడు. రాజపుత్రుడైన ధృతవర్మకూడా వాడితూపులతో అర్జునుడి చేతిని కొట్టి బాధించాడు.

**ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండీవ మిలఁ। బడిన నా త్రిగర్తబలము దెసలు**
**చెలఁగ నార్చె; నందుఁ జేయంగఁగల యోధు। లక్కుమారవర్యు నవులఁ ద్రోచి. 13**

**ప్రతిపదార్థం:** ముష్టి= పిడికిలి పట్టు; సడలి= తప్పి; చోద్యముగను= ఆశ్చర్యకరంగా; గాండివము= గాండీవం; ఇలన్= భూమిమీద; పడినన్= పడగా; ఆ త్రిగర్త= ఆ దేశానికి చెందిన; బలము= సైన్యం; దెసలు= దిక్కులు; చెలఁగన్= మార్మోగగా; ఆర్చెన్= పెద్దగా అరచారు; అందున్= ఆ సైన్యంలో; చేయంగన్+కల= సమర్థులైన; యోధులు= వీరులు; ఆ కుమార= ఆ రాజపుత్రులలో; వర్యున్= శ్రేష్ఠుడిని; అవులన్= అవతలకు; త్రోచి= నెట్టి వైచి.

**తాత్పర్యం:** అర్జునుడి పిడికిలి పట్టుతప్పి గాండీవం భూమిమీద పడింది. దానిని చూచిన త్రిగర్త సైన్యం దిక్కులు మార్మోగేటట్లుగా పెద్దగా అరచింది. ఆ సైన్యంలో సమర్థులైన వీరులు కొందరు ధృతవర్మను అవతలికి నెట్టివైచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **'ఇంద్రధనువు చందంబున నెసక మెసఁగు। గాండివము పాటు గంటిరే; చండవిక్ర**
**మాభిరాముండు గాండీవి యన్న పలుకు। లకు మహోగ్రత సూప నొల్లండు గాక. 14**

**ప్రతిపదార్థం:** ఇంద్ర= ఇంద్రుడియొక్క; ధనువు= ధనుస్సు; చందంబునన్= వలె; ఎసకమెసఁగు= ఒప్పు అతిశయించే; గాండివము= గాండీవంయొక్క; పాటు= పతనం, దుర్గతి; కంటిరి+ఏ= చూచారా; గాండీవి= అర్జునుడు; చండ= తీవ్రమైన; విక్రమ= పరాక్రమంచేత; అభిరాముండు= మనోహరుడు; అన్న= అన్న అయిన ధర్మరాజుయొక్క; పలుకులకున్= మాటలవలన; మహత్= గొప్ప; ఉగ్రత= క్రోధము, భయంకరత్వం; చూపన్= చూపగా; ఒల్లండు+కాక= ఇష్టపడడుగాని.

**తాత్పర్యం:** 'ఇంద్రధనుస్సువలె అతిశయించే గాండీవ పతనం చూచారా! అర్జునుడు తీవ్ర పరాక్రమంవలన లోకానికి మనోహరుడైనవాడు అన్న ధర్మరాజు పలికిన మాటకు కట్టువడి మాటకు తన వాడినీ వేడినీ చూపటానికి ఇష్టపడటం లేదు కాని. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఉ.** **నిక్కపుఁ గిన్క వచ్చిన ననిన్ నొసలం గనుచూపు, వింటి పా**
**టక్కట! రిత్తవోవునె? నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం**
**దొక్కఁడుఁ ద్రిక్కకుండ; మన యొప్పమి చూడఁగనేల? మున్న పే**
**రుక్కునఁ దాఁకు టొప్పు' నని యొక్కట నర్జును నాక్రమించినన్. 15**

**ప్రతిపదార్థం:** నిక్కము= నిజమైన; కిన్క= కోపం; వచ్చినన్= పుట్టితే; ఈతఁడు= ఈ అర్జునుడు; నొసలన్= నుదుటియందు; కను= కంటిని; చూపున్= చూపును; వింటి= విల్లుయొక్క, గాండీవంయొక్క; పాటు= పతనం; రిత్త+పోవును+ఎ?= వ్యర్థమగునా!; ఇందున్= ఈ పక్షమున; ఒక్కఁడున్= ఒకడు కూడా; త్రిక్కక+ఉండన్= మిగలకుండా; నృప= రాజుయొక్క; ఆత్మజులన్= కుమారులను; తెగటార్చున్= చంపును; మనము= మనం; ఒప్పమి= కీడు, వినాశం; చూడఁగన్+ఏల?= చూడటం దేనికి? మున్న+అ= ముందుగానే; పేరు+ఉక్కునన్= మహాశక్తితో; తాఁకుట= ఎదుర్కొనటం; ఒప్పున్= తగును; అని; ఒక్కటన్= ఒక్కసారిగా; అర్జునున్= అర్జునుడిని; ఆక్రమించినన్= చుట్టుముట్టగా, ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** అర్జునుడికి నిజంగా కోపంవస్తే నొసటియందు మూడోకన్ను చూపిస్తాడు. గాండీవం భూమిమీద పడటం ఊరికేపోదు. మన పక్షంలోని రాజకుమారులను ఒక్కడు కూడా మిగలకుండా ఇతడు సంహరిస్తాడు. మనం ఆ వినాశాన్ని మన కనులార చూడటం దేనికి? ముందుగానే మనం మన బలమంతా చూపి అతడిని ఎదుర్కొనటం మంచిది' అని అర్జునుడిని ఒక్కసారిగా ఎదుర్కొనగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క.** **అటమున్న గాండివం బు। త్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు**
**ద్భటమూర్తిఁ దాల్చెనన మి। క్కుటమై కడగంటి కెంపు గొమరారంగన్. 16**

**ప్రతిపదార్థం:** అటమున్న+అ= అంతకుముందే; ఉత్కట= అధికమైన; రయమునన్= వేగంతో; గాండివంబు= గాండీవాన్ని; ఎత్తి= పైకెత్తి; కోపదహనుండు= కోపాగ్ని; అతి= మిక్కిలి; ఉద్భట= భయంకరమైన; మూర్తిన్= రూపాన్ని; తాల్చెన్= ధరించాడు; అనన్= అనగా; మిక్కుటము+ఐ= అధికమై; కడ+కన్ను+కెంపు= కనుగొలుకుల ఎరుపు; కొమరారంగన్= సొంపారగా.

**తాత్పర్యం:** అంతకుముందే భూమిమీద పడిన గాండీవాన్ని మహావేగంగా పైకి తీసికొని కోపాగ్ని భయంకరాకారం ధరించిందా? అనేటట్లుగా కడగన్నులలో ఎరుపు సొంపారగా. (తరువాతి వచనంతో అన్వయం)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ.** **ఆ బీభత్సుండు** **17**

**తాత్పర్యం:** ఆ అర్జునుడు (తరువాతి పద్యంతో అన్వయం)

**క.** **పిడుగులు వడిఁ బె క్కొక్కటఁ। బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటు విశిఖము ల**
**ప్పుడు మేదిని దోఁపద చె। ప్పెడు కొలఁదియె రథికవరుల పీనుఁగు పెంటల్.** **18**

**ప్రతిపదార్థం:** పిడుగులు; పెక్కు= అనేకములు; వడిన్= వేగంగా; ఒక్కటన్= ఒక్కమారుగా; పడియెడున్= పడుతున్నాయో; అనన్= అనగా; పటు= వాడియైన; విశిఖములు= బాణాలు; తొరఁగన్+చేసెన్= విడిచాడు; అప్పుడు= ఆ సమయంలో; మేదిని= భూమి; తోఁపదు+అ= కనబడనే లేదు; రథిక= రథ యజమానులలో; వరుల= శ్రేష్ఠులైన వారియొక్క; పీనుఁగు పెంటల్= శవాల కుప్పలు; చెప్పెడు= ఇన్నీ అన్నీ అని చెప్పేటటువంటి; కొలఁది+ఎ= స్థితియా, విధమా.

**తాత్పర్యం:** ఎన్నో పిడుగులు ఒక్కసారిగా పడుతున్నాయనేటట్లుగా వాడి బాణాలు ప్రయోగించాడు. అవి అంతటా పడటంవలన భూమి కనబడనేలేదు. ఇక రథికశ్రేష్ఠుల పీనుగుల ప్రోగులు ఇన్నీ అన్నీ చెప్పే స్థితి కూడా లేదు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**శా.** **ఆ యుగ్రోద్ధతి చూచి పెల్కుటి త్రిగర్తానీకముల్ నల్గడం**
**బాయం బాఱెఁ; దదాప్తు ' లేము దగ నీపం పోపి సద్భక్తిమైఁ**
**జేయంగాఁ బనిగొమ్ము; పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా**
**శ్రీయుక్తా!' యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారినెల్లం గృపన్.** **19**

**ప్రతిపదార్థం:** త్రిగర్త= త్రిగర్త దేశంయొక్క; అనీకముల్= సేనలు; ఆ+ఉగ్ర= ఆ భయంకరమైన; ఉద్ధతి= విజృంభణం; చూచి; పెల్కుటి= భయపడి; నలు+కడన్= నాలుగు దిక్కులయందు; పాయన్= చెల్లాచెదరయ్యేటట్లుగా; పాఱెన్= పారిపోయారు; తద్= ఆ పారిపోయిన సేనలయొక్క; ఆప్తులు= మిత్రులు? ముఖ్యులు?; సమ్యక్= పరిపూర్ణమైన; దయా= దయ అనెడి; శ్రీ= లక్ష్మితో; యుక్తా!= కూడినవాడా!= ఏము= మేము; నీ= నీయొక్క; పంపు= ఆజ్ఞ; ఓపి= అప్రమత్తతతో ఉండి; సత్+భక్తి+మైన్= ఉత్తమ భక్తితో; తగన్= అనుకూలంగా; చేయంగాన్= చేయగా; పనికొమ్ము= నియోగించుము; మమున్= మమ్ము; పేర్మిగన్= ప్రేమగా; చేకొమ్ము= ఆదరించుము; అనినన్= అనగా; ధనంజయుఁడు= అర్జునుడు; కృపన్= దయతో; వారిన్+ఎల్లన్= వారినందరినీ; కాచెన్= కాపాడాడు.

**తాత్పర్యం:** అర్జునుడు భయంకర విజృంభణాన్ని చూచి భయపడి త్రిగర్త సేనలు చెల్లాచెదరై నాలుగు దిక్కులకు పారిపోయాయి. ఆ సేనలలోని ముఖ్యులు పరిపూర్ణ దయాసంపన్నా! మేము మీ ఆజ్ఞను పరాకులేకుండా సద్భక్తితో అనుకూలంగా చేసేటట్లుగా నియోగించుము. ప్రేమతో మమ్ము ఆదరించుము' అని అన్నారు. అర్జునుడు వారినందరిని దయతో కాపాడాడు.

**వ. అట్లు వెనుకొనక నిలిచి, యెలుంగెత్తి, వారలతో 'మీ రిట్లు ప్రాణంబులు గాచికొనుండు; నా పంచిన పనిసేయం బుద్ధి గలిగి సుఖులరై యుండుం' డని పలికి యయ్యశ్వంబు ననుసరించె; నది క్రమగతిం బ్రాగ్జ్యోతిష పురపరిసరంబునకుం బోయిన, దాని తెఱం గాకర్ణించి. 20**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; వెనుకొనక= వెంబడించక; నిలిచి= ఉన్నచోటనే ఉండి; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి; వారలతోన్= వారితో; మీరు; ఇట్లు= ఈ విధంగా; ప్రాణంబులు= ప్రాణాలు; కాచికొనుండు= కాపాడుకొనండి; నా పంచిన= నేను ఆజ్ఞాపించిన; పని; చేయన్= చేయగా; పూని= తలపెట్టి; బుద్ధి= వివేకం; కలిగి; సుఖులరు+ఐ= సుఖం కలిగినవారై; ఉండుఁడు= బ్రతకండి; అని; పలికి= చెప్పి; ఆ అశ్వంబున్= ఆ గుర్రాన్ని; అనుసరించెన్= వెంబడించాడు; అది= ఆ గుర్రం; క్రమ= సక్రమమైన; గతిన్= గమనంతో; ప్రాగ్జ్యోతిష= ప్రాగ్జ్యోతిషమనే; పుర= పట్టణంయొక్క; పరిసరంబునకున్= సమీప ప్రదేశానికి; పోయినన్= వెళ్ళగా; దాని= ఆ గుర్రంయొక్క; తెఱంగు= వృత్తాంతం; ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** ఆ విధంగా అర్జునుడు ఆ సేనలను వెంబడించకుండా ఉండి వారితో 'మీరు ఈ విధంగా ప్రాణాలు కాపాడుకొనండి. నేను ఆజ్ఞాపించిన పని చేస్తూ బుద్ధికలిగి సుఖంగా ఉండండి' అని చెప్పి ఆ యజ్ఞాశ్వాన్ని వెంబడించాడు. అది సక్రమంగా నడుస్తూ ప్రాగ్జ్యోతిషపురం దగ్గరకు వచ్చింది. దాని సమాచారం విని. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. భగదత్తతనయుండు బాహుగర్వంబున । బాల్యసిద్ధం బగు లౌల్యమునను**
**బురి నిర్గమించి యత్తురగంబు వెలిపించి । కొని పోవఁ గాంచి యర్జునుఁడు గాండి**
**వము సజ్యముగఁ జేసి వాలమ్ము లొక్కట । నక్కుమారునిమీఁదఁ బెక్కు గురియ**
**నవ్వజ్రదత్తుండు నొవ్వు దక్కిన దాని । నచ్చట దిగఁ ద్రావి చొచ్చెఁ బురము**

**తే. సత్వరంబుగ నటు సొచ్చి సామజంబుఁ । బన్నఁగాఁ బంచి వెస నెక్కి బలముఁ జలము**
**వీఁకయును నొప్ప నన్నరుఁ దాఁకి శాత । ఘన శరంబులు పరఁగించెఁ గౌరవేంద్ర! 21**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులలో శ్రేష్ఠుడా!, జనమేజయా!; భగదత్త= భగదత్తుడియొక్క; తనయుండు= కొడుకు వజ్రదత్తుడు; బాహు= భుజబలంవలన కలిగిన; గర్వంబునన్= గర్వంతో; బాల్య= కుర్రతనంవలన; సిద్ధంబు= కలిగినది; అగు= అయిన; లౌల్యమునను= చాపల్యంతో; పురిన్= పట్టణం నుండి; నిర్గమించి= వెలువడి; ఆ తురగంబున్= ఆ యజ్ఞాశ్వమును; వెలిపించి= రక్షణ వలయమునుండి బయటికి రప్పించి; కొనిపోవన్= తీసికొనిపోగా; అర్జునుఁడు; కాంచి= చూచి; గాండివము= గాండీవాన్ని; సజ్యముగన్= ఎక్కు పెట్టినదిగా; చేసి; ఒక్కటన్= ఒక్కసారిగా; వాలు+అమ్ములు= వాడియైన బాణాలు; పెక్కు= అనేకములు; ఆ కుమారునిమీఁదన్= ఆ రాజపుత్రుడిమీద; కురియన్= కురిపించగా; ఆ వజ్రదత్తుండు= ఆ వజ్రదత్తుడు; నొవ్వు= బాధ; తక్కినన్= ఎక్కువకాగా; దానిన్= ఆ యజ్ఞాశ్వమును; అచ్చటన్= అక్కడ; దిగఁద్రావి= విడిచి; పురము= పట్టణం; చొచ్చెన్= ప్రవేశించాడు; అటు= ఆ విధంగా; చొచ్చి= ప్రవేశించి, సామజంబున్= ఏనుగును; సత్వరంబుగన్= వేగంగా; పన్నఁగాన్= సిద్ధం చేయగా; పంచి= ఆజ్ఞాపించి; వెసన్= తొందరగా; ఎక్కి; బలమున్= బలమూ; చలమున్= పట్టుదల; వీఁకయును= పరాక్రమమునూ, ఉత్సాహమునూ; ఒప్పన్= ఒప్పగా; ఆ నరున్= ఆ అర్జునుడిని; తాఁకి= ఎదుర్కొని; శాత= వాడి అయిన; ఘన= గొప్పవి అయిన; శరంబులు= బాణాలు; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! భగదత్తుడి కుమారుడు వజ్రదత్తుడు భుజబలగర్వంవలన, బాల్యచాపల్యంవలన నగరంనుండి వెలువడి ఆ గుర్రాన్ని సైనిక వలయం నుండి బయటికి రప్పించి తీసికొనిపోయాడు. అది చూచి అర్జునుడు గాండీవం

ఎక్కుపెట్టి ఒక్కసారిగా వజ్రదత్తుడిమీద వాడి బాణాలు ఎన్నో ప్రయోగించాడు. వాటివలన బాధ ఎక్కువై, ఆ రాజకుమారుడు గుర్రాన్ని వదలి పట్టణం ప్రవేశించాడు. వెంటనే ఏనుగును యుద్ధానికి సన్నద్ధం చేయండని ఆజ్ఞాపించాడు. తొందరగా ఏనుగు నెక్కి వచ్చి బలమూ, పట్టుదలా, పరాక్రమమూ ఒప్పుతుండగా అర్జునుడిని ఎదుర్కొని అతడిమీద గొప్ప గొప్ప వాడిబాణాలు ప్రయోగించాడు.

**క. నడుమన వానిం బార్థుఁడు । పొడిగా నేయంగఁ గనలి భూపకుమారుం**
**డడరించెఁ దోమరంబులు । గడుఁ బె క్కవి మిడుత కదుపు గతిఁ గవియంగన్. 22**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= అర్జునుడు; వానిన్= ఆ బాణాలను; నడుమన్+అ= మధ్యలోనే; పొడి+కాన్= పొడి అయ్యేటట్లుగా; ఏయంగన్= బాణాలు వేయగా; భూప= రాజుయొక్క, భగదత్తుడియొక్క; కుమారుండు= కొడుకు; కనలి= కోపించి; తోమరంబులు= చిల్లకోలలు, చెవివంటి వంకర మొనలుగల బాణాలు; పెక్కు= అనేకములు; కడున్= మిక్కిలి; అడరించిన్= ప్రయోగించాడు; అవి= వజ్రదత్తుడి బాణాలు; మిడుత= మిడుతలయొక్క; కదుపు= గుంపు; గతిన్= వలె; కవియన్+కన్= క్రమ్మగా.

**తాత్పర్యం:** అర్జునుడు మధ్యలోనే వజ్రదత్తుడి బాణాలు పొడి పొడి చేశాడు. అప్పుడు ఆ రాజపుత్రుడు క్రోధం వహించి ఎన్నో చిల్లకోలలు ప్రయోగించాడు. అవి మిడుతలదండువలె అర్జునుడిని పొదివినవి.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అనల శిఖలు వోని యమ్ములగమి వాని । రూపుమాపి యన్నరుండు వాఁడి**
**లేని దొడ్డ తూఁపు లేనింటిఁ దొడి రాచ । కొడుకు నేసెఁ దూలి పుడమిఁ గూల. 23**

**ప్రతిపదార్థం:** ఆ నరుండు= ఆ అర్జునుడు; అనల= అగ్నియొక్క; శిఖలు+పోని= జ్వాలలవంటి; అమ్ముల= బాణాలయొక్క; గమిన్= సమూహంతో; వానిన్= ఆ చిల్లకోలలను; రూపుమాపి= రూపం లేకుండా చేసి, నాశంచేసి; వాఁడి= వాడి; లేని; దొడ్డ= పెద్దవైన; తూఁపులు= బాణాలు; ఏనింటిన్= అయిదింటిని; తొడి= తొడిగి; తూలి= ఒక ప్రక్కకు వ్రాలి; పుడమిన్= నేలమీద; కూలన్= పడగా; రాచకొడుకున్= రాజపుత్రుడైన వజ్రదత్తునిమీద; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు అగ్నిజ్వాలలవంటి బాణాలతో వజ్రదత్తుడి బాణాలను అడ పొడ కానరాకుండా చేశాడు. వాడిలేని పెద్ద బాణాలను ఐదింటిని ప్రయోగించి రాజపుత్రుడైన వజ్రదత్తుడు తూలి నేలమీద పడేటట్లు చేశాడు.

**క. కూలియు నీడంబోవక । బాలుఁడు రయమార దంతిపైకిం జని దో**
**ర్లీల మెఱయ నరుఁ బటు శర । జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్. 24**

**ప్రతిపదార్థం:** బాలుఁడు= వజ్రదత్తుడు; కూలియున్= నేలమీద పడినప్పటికీ; ఈడన్+పోవక= వెనుదీయక; రయము+ఆరన్= వేగం అతిశయిల్లగా; దంతిపైకిన్= ఏనుగు మీదికి; చని= వెళ్ళి; దోస్+లీల= భుజబల విలాసం; మెఱయన్= ప్రకాశించగా; గగన చరులు= దేవతలు; అగ్గింపన్= పొగడగా; పటు= శక్తిమంతాలైన; శర= బాణాలయొక్క; జాలంబులన్= సమూహాలతో; పొదివెన్= కప్పాడు.

**తాత్పర్యం:** నేలమీద పడినప్పటికీ వజ్రదత్తుడు వెనుకంజవేయక మహావేగంతో ఏనుగు నెక్కి, భుజబలవిలాసం వెల్లడి కాగా, దేవతలు స్తుతించేటట్లు అర్జునుడిని బలమైన బాణాలతో కప్పివేశాడు.

**చ.** **అతఁడును దీవ్రబాణముల నా భగదత్త తనూజు దంతి నా**
**వృతముగఁ జేసె; నట్లు పృథివీవర నందన! యేమి చెప్పుదున్;**
**శతమఖ పుత్త్రుతోడ దివసత్రయ ముగ్రరణం బొనర్చె; న**
**ద్భుత మెసఁగం జతుర్థదినముం దెగునంతకుఁ బోరె ధీరతన్.** **25**

**ప్రతిపదార్థం:** పృథివీవర= భూపతియొక్క; నందన!= కుమారా! జనమేజయా!; అతఁడును= ఆ అర్జునుడునూ; తీవ్ర= వాడిఅయిన; బాణములన్= బాణాలతో; ఆ భగదత్త= ఆ భగదత్తుడియొక్క; తనూజ= కుమారుడియొక్క (వజ్రదత్తుడి); దంతిన్= ఏనుగును; ఆవృతముగన్+చేసెన్= కప్పబడినదానినిగా చేశాడు; ఏమి= ఏమని; చెప్పుదున్= చెప్పుతాను; అట్లు= ఆ విధంగా; శతమఖ= ఇంద్రుడియొక్క; పుత్త్రుతోడన్= కొడుకైన అర్జునుడితో; దివసత్రయము= మూడు రోజులు; ఉగ్ర= భయంకరమైన; రణంబు= యుద్ధం; ఒనర్చెన్= చేశాడు; అద్భుతము= ఆశ్చర్యం; ఎసఁగన్= అతిశయించగా; చతుర్థదినమున్= నాలుగవ రోజు కూడా; తెగు+అంతకున్= ముగిసేవరకు; ధీరతన్= ధైర్యంతో; పోరెన్= పోరాడాడు.

**తాత్పర్యం:** జనమేజయా! అర్జునుడు వాడిబాణాలతో వజ్రదత్తుడి ఏనుగును కప్పివేశాడు. ఇక చెప్పటానికి ఏమున్నది? అతడు అర్జునుడితో మూడు రోజులు భయంకర యుద్ధం చేశాడు. ఆశ్చర్యకరంగా నాలుగవ రోజు ముగిసేవరకు పోరాడాడు.

**వ.** **తెగియెడు సమయంబున.** **26**

**ప్రతిపదార్థం:** తెగియెడు= ముగిసే; సమయంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** నాలుగవరోజు ముగిసేటప్పటికి, (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ.** **అక్కుమారుఁ డేచి 'యర్జున! యర్జున! యేను గలుగ నీకు నెందుఁ బోవ**
**వచ్చు? వృద్ధుఁడైనవాఁడు గావునఁ దండ్రి। సమసె; నట్లు నన్ను సమతె బేల!'** **27**

**ప్రతిపదార్థం:** ఆ కుమారుఁడు= ఆ రాజకుమారుడు; ఏచి= చెలరేగి; అర్జున! అర్జున!; ఏను= నేను; కలుగన్= ఎదుటపడిన; నీకున్= నీకు; ఎందున్= ఎక్కడకు; పోవన్= పోవగా; వచ్చున్?= సాధ్యమగును!; తండ్రి= మా తండ్రి అగు భగదత్తుడు; వృద్ధుఁడు= ముదుసలి; ఐనవాఁడు= అయినాడు; కావునన్= కావున; సమసెన్= నీ చేతిలో మరణించాడు (చూడు, ద్రోణపర్వం,ప్రథమాశ్వాసం); బేల!= పిరికిపందా!; అట్లు= ఆ విధంగా; నన్నున్= నన్ను; సమతు+ఎ?= చంపుతావా?

**తాత్పర్యం:** భగదత్తుడి కుమారుడూ, యువకుడూ అయిన వజ్రదత్తుడు చెలరేగి 'అర్జునా! అర్జునా! నీవు నా కంటబడిన తరువాత ఇం కెక్కడికి వెళ్ళగలవు? మా తండ్రి ముసలివాడు కావున నీ చేతిలో మరణించాడు. ఆ విధంగా నన్ను చంపగలవా?'

**విశేషం:** ఈ పద్యంలో 'సమతె' అనే క్రియ ఉన్నది. ఇది విశిష్ట క్రియ. శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు దీనిని నిరూపించలేదు. దీనిని రెండు రకాలుగా సాధింపవచ్చును.

సమయుధాతువు ప్రేరణార్థక రూపం 'సమచు' అని భావించి (పాయు ప్రేరణార్థక రూపము పాచు అయినది కదా) దాని నుండి సమతువు - సమతు - సమతె అను రూపాలను క్రమంగా నిష్పాదించవచ్చును. కాని, 'సమచు' ప్రేరణార్థక ధాతువు ప్రాచీనకవి ప్రయోగాలలో కనబడదు. తిక్కనయే దీనిని ప్రయోగించాడని అనుకొనాలి.

కిట్టెలుదొర రచించిన కర్ణాట భాషా నిఘంటువులలో సమసు, సమయసు మున్నగు ధాతురూపాలున్నాయి. సమయిసు ధాతువు తెలుగులోని సమయించు ధాతువు వంటిదే. కావున సమసు ధాతువు వంటి సమచు ధాతువు తెలుగులో ఒక కాలంలో ఉండి ఉండవచ్చును. కిట్టెలు దొరగారు 'సమయిసు= సమసు= To destroy' అని వ్రాశారు. పెద్దలు ఇందలి ఔగాములు నిర్ణయింతురు గాక!

**వ. అని యదల్చి. 28**

**తాత్పర్యం:** అని అర్జునుడిని గద్దించి.

**క. పెను సెలయేఱులు వాఱఁగఁ । దనరు గిరియుఁ బోలె బహుమదంబులు దొరఁగం**
**గనుపట్టు కుంజరము సిం । హనిభుం డగు పార్థుమీఁద నడరం జేసెన్. 29**

**ప్రతిపదార్థం:** పెను= పెద్ద; సెలయేఱులు= సెలయేళ్ళు; పాఱఁగన్= పైనుండి క్రిందికి ప్రవహిస్తుండగా; తనరు= ఒప్పెడి; గిరియున్+ పోలెన్= కొండవలె; బహు= అధికమైన; మదంబులు= మదజలాలు; తొరఁగన్= కారుచుండగా; కనుపట్టు= కనిపించే; కుంజరమున్= ఏనుగును; సింహ= సింహంతో; నిభుండు= సమానుడు; అగు= అయిన; పార్థుమీఁదన్= అర్జునుడిమీద; అడరన్+చేసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** బహుళంగా మదజలాలు ప్రవహించటంవలన పెద్ద పెద్ద సెలయేళ్ళతో కూడిన కొండవలె ఉన్న ఏనుగును, సింహ సమానుడైన అర్జునుడిమీదకు వజ్రదత్తుడు తోలాడు.

**విశేషం:** అలం: ఉపమ. అర్జునుడు సింహంతో సమానుడు. అటువంటివాడి మీదికి వజ్రదత్తుడు ఏనుగును తోలాడు. గజసింహాల వైరం ప్రసిద్ధం. సింహంవంటి అర్జునుడు తనమీదకు వచ్చిన ఏనుగును తప్పక సంహరిస్తాడని కవిబ్రహ్మ ముందుగా సూచించాడు.

**క. అది పూత్కారము చేసిన । నొదవిన కర శీకరముల నుర్వీవర! యం**
**బుదముక్త సలిల ధారలు । పొదివిన గిరివోలె నింద్రపుత్త్రుం డొప్పెన్. 30**

**ప్రతిపదార్థం:** ఉర్వీవర!= భూపతీ! జనమేజయా!; అది= ఏనుగు; పూత్కారము చేసినన్= ఊదగా; ఒదవిన= పుట్టిన; కర= తొండముయొక్క; శీకరములన్= నీటి తుంపురులచేత; అంబుద= మేఘంచేత; ముక్త= విడువబడిన; సలిల= ఏటియొక్క; ధారలు; పొదివిన= క్రమ్మిన; గిరి+పోలెన్= కొండవలె; ఇంద్ర= ఇంద్రుడియొక్క; పుత్త్రుండు= కుమారుడు అర్జునుడు; ఒప్పెన్= ఒప్పాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆ ఏనుగు ఊదినప్పుడు తొండంనుండి పుట్టిన నీటి తుంపురులతో నిండిన అర్జునుడు మేఘం వదలిన జలధారలు క్రమ్మిన కొండవలె ఒప్పాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్త ని**
**ష్ఠుర శరపంక్తి నాహవపటుత్వము సూపిన నల్పకోప సుం**
**దరుఁ డగుచున్ నరుండు శతధారనిభం బగు నారసంబు భీ**
**కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక! పర్వతాకృతిన్. 31**

**ప్రతిపదార్థం:** కౌరవ నాయక!= కౌరవులలో శ్రేష్ఠుడా!; కరి= ఏనుగు; ఇటులు= ఈ విధంగా; ఏపునన్= సంరంభంతో; కవియఁగాన్= పై కురుకగా; భగదత్త= భగదత్తుడియొక్క; సుతుండు= కుమారుడు (వజ్రదత్తుడు); దీప్త= మండుతున్న; నిష్ఠుర= కఠినాలైన; శర= బాణాలయొక్క; పంక్తిన్= వరుసతో; ఆహవ= యుద్ధంయొక్క; పటుత్వము= దిట్టతనం; చూపినన్= ప్రదర్శించగా; అల్ప= తక్కువ అయిన; కోప= కోపంచేత; సుందరుఁడు= అందగాడు; అగుచున్= అవుతూ; నరుండు= అర్జునుడు; శతధార= వజ్రాయుధంతో; నిభంబు= సమానం; అగు= అయిన; నారసంబున్= బాణాన్ని; భీకర= భయం కలిగించే; గతిన్= విధంగా; ఏయన్= ప్రయోగించగా; అది; పర్వత+ఆకృతిన్= పర్వతంవలె; కూలెన్= కూలిపోయినది.

**తాత్పర్యం:** జనమేజయా! ఈ విధంగా ఏనుగు అర్జునుడిపైకి ఉరకగా వెంటనే వజ్రదత్తుడు మండుచున్న బాణపరంపర ప్రయోగించి తన యుద్ధపాటవాన్ని చూపాడు. ఇదంతా చూస్తున్న అర్జునుడికి చిరుకోపం వచ్చింది. అది అతడికి అందాన్ని తెచ్చింది. అతడు వజ్రాయుధంతో సమానమైన బాణాన్ని భీకరంగా ప్రయోగించేటప్పటకి ఏనుగు పర్వతంవలె కూలిపోయినది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కూలిన నేలకు వచ్చిన। బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా**
**లోలుండై మార్దవ హృ। ద్యాలాపము లొప్ప నిట్టు లను నాతనితోన్. 32**

**ప్రతిపదార్థం:** కూలినన్= ఏనుగు కూలిపోగా; నేలకున్ వచ్చిన= నేలపై పడిపోయిన; బాలున్= వజ్రదత్తుడిని; కని= చూచి; నాకలోక= స్వర్గలోకంయొక్క; పతి= నాథుడైన ఇంద్రుడియొక్క; సుతుఁడు= కుమారుడు అర్జునుడు; దయా= దయచేత; లోలుండు= చలించినవాడు; ఐ= అయిన; మార్దవ= మెత్తదనంతో కూడిన; హృద్య= మనోహరమైన; ఆలాపములు= మాటలు; ఒప్పన్= ఒప్పగా; అతనితోన్= ఆ వజ్రదత్తుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**వ. 'ధర్మతనయుం డశ్వమేధ దీక్షితుండయి యిత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచునప్పుడు. 33**

**ప్రతిపదార్థం:** ధర్మ= యముడియొక్క; తనయుండు= కుమారుడు ధర్మరాజు; అశ్వమేధ= అశ్వమేధయాగంలో; దీక్షితుండు= దీక్షవహించినవాడు; అయి; ఈ తురంగంబు= ఈ గుర్రంయొక్క; పజ్జన్= వెనుక; నన్నున్= నన్ను; పుత్తెంచు+అప్పుడు= పంపేటప్పుడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజు అశ్వమేధయాగ దీక్ష వహించి నన్ను ఈ గుర్రం వెంట పంపేటప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'చంపకుమీ! రాజుల; నను । కంపాతిశయంబు మెఱయఁగా నడపుము; నీ**
**పెం పను కుసుమమునకు నా । పం పొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ!' 34**

**ప్రతిపదార్థం:** రాజులన్= రాజులను; చంపకుము+ఈ= చంపకుమా!; అనుకంపా= దయయొక్క; అతిశయంబు= ఆధిక్యం; మెఱయఁగాన్= ప్రకాశించగా; నడపుము= గుర్రాన్ని నడిపింపుము; నీ= నీయొక్క; పెంపు= గొప్పతనం అనే; కుసుమమునకున్= పువ్వునకు; నా= నాయొక్క; పంపు= ఆజ్ఞ; ఒనరించుట+అ= నిర్వర్తించటమే; సౌరభము+కన్= వాసనగా; ఎఱుఁగుము+ఈ!= తెలిసికొనుమా!

**తాత్పర్యం:** 'రాజులను చంపవలదు. దయామయుడవై గుర్రాన్ని నడిపించుము. నా ఆజ్ఞను పరిపాలించటమే నీ గొప్పతనం అనే పువ్వునకు వాసన.'

**విశేషం:** అలం: రూపకం. పూవునకూ తావికీ అవినాభావ సంబంధం ఉంటుంది. ధర్మజుడి ఆజ్ఞ ప్రకారం నడచుకొనటానికీ, అర్జునుడి గొప్పతనానికీ ఆ సంబంధమే ఉంటుంది. ధర్మరాజు చెప్పిన రీతిగా నడచుకొనటమే అర్జునుడి గొప్పతనానికి మూలకందం.

**క. అనియెం గావున నీపైఁ । గినుక వొడమ; దలుక విడువు; గీతయశుం డా**
**జనపతి యాగంబునకుం । జనుదేరఁగ వలయు బంధుజనముల్ నీవున్. 35**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; కావునన్= కావున; నీపైన్= నీ మీద; కినుక= కోపం; పొడమదు= పుట్టదు; అలుక= (నీవునూ) కోపాన్ని; విడువు= వదలుము; గీత= గానం చేయబడిన; యశుండు= కీర్తికలవాడు; ఆ జనపతి= ఆ రాజుయొక్క; యాగంబునకున్= ఆ యజ్ఞానికి; నీవున్= నీవునూ; బంధుజనముల్= నీ చుట్టాలునూ; చనుదేరఁగన్‌వలయున్= తప్పక రావలెను.

**తాత్పర్యం:** అని అన్నాడు. కాబట్టి నాకు నీ మీద కోపం లేదు. నీవూ కోపాన్ని త్యజించుము. అందరూ గానం చేసే కీర్తి పొందిన ఆ మహారాజు యజ్ఞానికి నీవూ నీ చుట్టపక్కాలూ తప్పక రావాలి.

**ఆ. అధిపతనయ! నిన్ను నామంత్రితునిఁ జేసి । పోవుచున్నవాఁడ; నీవు హస్తి**
**పురికి భావి చైత్రమునఁ బున్నమకు ముద । మొదవ నరుగుదెంచు టొప్పుఁజేయు.' 36**

**ప్రతిపదార్థం:** అధిప తనయ!= రాజకుమారా!; నిన్నున్= నిన్ను; ఆమంత్రితునిన్= ఆహ్వానించబడినవాడినిగా; చేసి= చేసి (నిన్ను పిడ్కొల్పి అని అర్థం); పోవుచున్+ఉన్నవాఁడన్= వెళ్ళుతున్నాను; నీవు; ముదము= సంతోషం; ఒదవన్= కలుగగా; భావి= రాబోయే; చైత్రమునన్= చైత్రమాసంలో; పున్నమకున్= పూర్ణిమనాటికి; హస్తినాపురికిన్= హస్తినాపురానికి; అరుగుదెంచుట= రావటం; ఒప్పుచేయున్= ఆనందాన్ని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** రాజకుమారా! నిన్ను ఆహ్వానించి నేను వెళ్ళుతున్నాను. నీవు రాబోయే చైత్రమాసంలో పూర్ణిమనాటికి నిర్విచారంగా హస్తినాపురానికి రమ్ము! నీ రాక మా కానందాన్ని కలిగిస్తుంది.'

**క. అనిన నతఁ డట్ల కా కని । వినతుం డగుటయును, బ్రీతి విజయుం డభినం**
**దన మాచరించి యశ్వము । వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్రచరిత్రా! 37**

**ప్రతిపదార్థం:** పూరు= పూరుడియొక్క; కుల= కులానికి; పవిత్ర= శుద్ధి కలిగించే; చరిత్ర!= నడవడి కలవాడా! జనమేజయా!; అనినన్= అర్జునుడు ఆ విధంగా అనగా; అతఁడు= వజ్రదత్తుడు; అట్ల కాక= అట్లే అగును గాక! సరే; అని; వినతుండు= నమస్కరించినవాడు; అగుటయును= కాగా; విజయుండు= అర్జునుడు; ప్రీతిన్= సంతోషంతో; అభినందనము= ప్రశంస; ఆచరించి= చేసి; అశ్వము= గుర్రంయొక్క; వెనుకన్= వెంట; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా అనగా వజ్రదత్తుడు సరే అని అతడికి నమస్కరించాడు. అతడు సంతోషించి రాజకుమారుడిని ప్రశంసించి గుర్రంవెంట వెళ్ళాడు.

అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు చేయుట (సం. 14-76-1)

**వ.** **అది సింధుదేశవర్తి యగుటయు, భారత రణ హతులైన సైంధవ యోధుల పుత్త్రపౌత్త్రులు, పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేక సహస్ర సంఖ్యల రథికులు రాజనందనులు గూడుకొని క్రీడిపై నడచి; రట్టియెడ.** **38**

**ప్రతిపదార్థం:** అది; సింధుదేశ= సింధుదేశంలో; వర్తి= ఉన్నది; అగుటయున్= కాగా; భారత రణ= భారతయుద్ధంలో; హతులు+ఐన= చంపబడినవారైన; సైంధవ= సింధుదేశీయులగు; యోధుల= వీరులయొక్క; పుత్త్రులు= కొడుకులూ; పౌత్త్రులు= మనుమలూ; పూర్వ= మునుపటి; వైరంబు= పగ; పాటించి= పరిగణించి, తలచుకొని; ఆటోపంబునన్= సంరంభంతో; అనేక= పెక్కు; సహస్ర సంఖ్యల= వేలమంది; రథికులు= రథాలమీద ఉండి యుద్ధం చేసేవారు; రాజనందనులు= రాజకుమారులును; కూడుకొని= కలిసి; క్రీడిపైన్= అర్జునుడిమీద; నడచిరి= దండెత్తారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** యజ్ఞాశ్వం సింధుదేశంలో సంచరిస్తున్నది. అప్పుడు భారతయుద్ధంలో పాండవులచేతిలో చావు మూడిన సింధుదేశ వీరుల కుమారులూ, మనుమలూ పూర్వవైరాన్ని తలచుకొన్నారు. సంరంభంతో పెక్కు వేలమంది రథికులూ, 'రాజకుమారులూ ఏకమై అర్జునుడిమీద దండెత్తారు.'

**సీ.** **అరుణాంబుదంబులు పరఁగి పెన్నెత్తురుఁ। గండలుఁ గురిసె; మార్తాండ బింబ**
**మసితారుణచ్ఛాయ మయ్యె; నుల్కాతతు। లెల్ల దిక్కులఁ బెల్లు డుల్లె; నశ్వ**
**సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి। యతనిపై నయ్యోధవితతి యొక్క**
**పెట్ట శస్త్రాస్త్రముల్ బెట్టుగాఁ గురిసిన। నప్పాండవుఁడు పెనుడప్పి సోలె;**

**తే.** **నేమి చెప్పుదు నీకు; నుద్దామ విక్ర। మాభిరాముండు నాఁ జను నక్కిరీటి**
**కరము గరము బెం డగుటయు గాండివంబు। వడియెఁ బుడమిపైఁ గురునరపతివరేణ్య!** **39**

**ప్రతిపదార్థం:** కురు నరపతి= కురురాజులలో; వరేణ్య!= శ్రేష్ఠుడా!; అరుణ= ఎఱ్ఱని; అంబుదంబులు= మేఘాలు; పరఁగి= వ్యాపించి; పెన్+నెత్తురున్= గొప్ప నెత్తురూ; కండలున్= కండలూ; కురిసెన్= వర్షించాయి; మార్తాండ= సూర్యుడియొక్క; బింబము; అసిత= నల్లని; అరుణ= ఎఱ్ఱని; ఛాయము= కాంతులు కలది; అయ్యెన్= అయినది (ధూమ్రవర్ణకాంతి కలది అయ్యెనని అర్థం); ఎల్లన్+దిక్కులన్= అన్ని దిక్కులయందునూ; ఉల్కా= ఉల్కలయొక్క; తతులు= గుంపులు; పెల్లు= మిక్కిలి ఎక్కువగా; డుల్లెన్= రాలాయి; ఆ యోధ= ఆ సింధుదేశ వీరులయొక్క; వితతి= సమూహం; అశ్వ= గుర్రంతో; సహితంబు+కాన్=

కూడిఉండేటట్లుగా; సవ్యసాచిన్= అర్జునుడిని; చుట్టును ముట్టి= చుట్టుముట్టి; అతనిపైన్= అతడిమీద; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; ఏకధాటిగా; శస్త్ర+అస్త్రముల్= శస్త్రాలు, అస్త్రాలూ; బెట్టుగాన్= మిక్కిలి; కురిసినన్= వర్షించగా; ఆ పాండవుఁడు= ఆ అర్జునుడు; పెనుడప్పిన్= ఎక్కువ ఆయాసంతో; సోలెన్= ఒరిగిపోయాడు; నీకున్= నీకు; ఏమి= ఏమని; చెప్పుదున్= చెప్పుతాను; ఉద్దామ= భయంకరమైన; విక్రమ= పరాక్రమ గుణంచేత; అభిరాముండు= మనోహరుడు; నాన్= అనగా; చను= ఒప్పే; ఆ కిరీటి= ఆ అర్జునుడియొక్క; కరము= చేయి; కరము= మిక్కిలి; బెండు= సత్తువలేనిది; అగుటయున్=కాగా; గాండివంబు= గాండీవం; పుడమిపైన్= భూమిమీద; పడియెన్= జారిపడింది.

**తాత్పర్యం:** జనమేజయా! ఎర్రని మొయిళ్ళు ఆకాశమంతటా వ్యాపించి కుండపోతగా నెత్తురూ కండలూ కురిశాయి. సూర్యబింబం ధూమ్రకాంతులు కలదైనది. దిక్కులం దంతటా ఉల్కలు రాలాయి. సింధుదేశ సైనికులు యజ్ఞాశ్వాన్నీ, అర్జునుడినీ చుట్టుముట్టారు. అర్జునుడిమీద అందరూ ఒక్కసారిగా శస్త్రాస్త్రాలు కురిపించారు. అంతట అర్జునుడు ఎక్కువ బడలికతో వాలిపోయాడు. నీకు ఏమని చెప్పేది? భయంకర పరాక్రమగుణంవలన సర్వలోకాభిరాముడని ప్రసిద్ధికెక్కిన అర్జునుడి చేయి సత్తువ కోల్పోయింది. అందువలన గాండీవం అతడి చేతినుండి జారి భూమిమీద పడిపోయింది.

**చ. అనిమిషులున్ మునీశ్వరులు నప్పుడు శోకమునన్ మునింగి య**
**ర్జునజయ కాంక్షులై నియతి శుద్ధి వహించి సవీర్య మంత్రసా**
**ధనపరులైరి; తెప్పిఱి యతండు ధనుర్ధరుఁడున్ సముల్లస**
**త్తను విభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా! 40**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; అనిమిషులున్= దేవతలూ; ముని+ఈశ్వరులున్= మహర్షులూ; అప్పుడు= ఆ సమయంలో; శోకమునన్= దుఃఖంలో; మునింగి= మునిగి; అర్జున= అర్జునుడియొక్క; జయ= జయమును; కాంక్షులు+ఐ= కోరుతున్నవారై; నియతి= శాస్త్ర నియమ పూర్వకంగా; శుద్ధి= పవిత్రత; వహించి= కలిగి; సహ+వీర్య= బలంతో కూడిన, బలాన్ని ప్రసాదించే; మంత్ర= మంత్రాలయొక్క; సాధన= ఉపాయములను, సాధించుటయందు; పరులు= ఆసక్తికలవారు; ఐరి= అయ్యారు; అతండు= అర్జునుడు; తెప్పిఱి= తేరి, ఆయాసం లేనివాడై; ధనుస్= వింటిని; ధరుఁడున్= ధరించినవాడునూ; సమ్+ఉలసత్= మిక్కిలి ప్రకాశిస్తున్న; తను= శరీరంయొక్క; విభవ= శక్తిచేత; ఉజ్జ్వలుండున్= పెంపొందేవాడును; సముదగ్ర= మిక్కిలి దార్ఢ్యం కలిగిన; మనస్కుఁడున్= మనస్సుకలవాడునూ; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** అర్జునుడి దౌర్బల్యాన్ని చూచి దేవతలూ మహర్షులూ దుఃఖంలో మునిగిపోయారు. వారు అతడి విజయం కోరి నియమ పూర్వకంగా బలాన్ని ప్రసాదించే మంత్రాలను జపించారు. దానివలన అర్జునుడు తేరుకొని మనోదార్ఢ్యం కలవాడూ దేహశక్తి సంపద కలవాడూ అయి మరలా విల్లు చేపట్టాడు.

**వ. ఇట్లు తెలివొంది విజృంభించి. 41**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తెలివి= సహజస్వస్థతను, జ్ఞానం; ఒంది= పొంది; విజృంభించి= చెలరేగి.

**తాత్పర్యం:** ఈ విధంగా యథాపూర్వ స్థితిని పొంది చెలరేగి. (తరువాతి పద్యంతో అన్వయం)

**శా. నారాచ ప్రముఖాస్త్రజాల పటువిన్యాసంబు తీవ్ర త్వరా**
**ఘోరంబై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయున్**

**వైరివ్రాత శవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధు ల**
**వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్. 42**

**ప్రతిపదార్థం:** నారాచ= ఇనుపబాణం; ప్రముఖ= మొదలైన; అస్త్ర= బాణ విశేషాలయొక్క; జాల= సమూహంయొక్క; పటు= శక్తిమంతమైన; విన్యాసంబు= ప్రయోగవిధానం; తీవ్ర= తీవ్రమైన; త్వరా= వేగంచేత; ఘోరంబు+ఐ= భయంకరమై; విల్లసిల్లన్= ఒప్పునట్లు; చేయన్= చేయగా; సమర= యుద్ధంయొక్క; క్షోణీతలంబు= భూమి; అంతయున్= అంతా; వైరి= శత్రువులయొక్క; వ్రాత= సమూహంయొక్క; శవ= పీనుగులచేత; ఆవృతంబు= కప్పబడినది; అగుడున్= కాగా; గీర్వాణుల్= దేవతలూ; మునుల్= మునులూ; సిద్ధులు= సిద్ధులూ; ఆ వీరున్= ఆ వీరుడిని; ప్రస్తుతిచేయుచున్= ప్రశంసిస్తూ; ఉద్వేల= మిక్కుటమైన; ప్రమోదంబునన్= సంతోషంతో; పొదలిరి= ఒప్పారారు.

**తాత్పర్యం:** అర్జునుడు నారాచం మొదలైన రకరకాల బాణాలను శత్రువులమీద మహావేగంతో భయంకరంగా ప్రయోగించాడు.యుద్ధభూమి అంతా శత్రువుల పీనుగులతో నిండిపోయింది. అది చూచి దేవతలూ, మునులూ, సిద్ధులూ ఆ వీరుడిని స్తుతిస్తూ ఆనందించారు.

**వ. హతశేషంబైన యా సింధు రాజకుమార సైన్యంబుదైన్యంబునొంది నలుదిక్కుల విచ్చియు నొచ్చియు వివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్సర్యధుర్యంబై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందర నందనుం డందలి రథికముఖ్యులతోడం దమయన్న చెప్పిన వాక్యంబు లుపన్యసించి 'మీరేలజాలిం బడియెదరు, ప్రాణంబులు మీ కింత చేఁ దయ్యెనే' యని పలికినను నిలువక పైపయి వా రురవణించిన. 43**

**ప్రతిపదార్థం:** హత= చావగా; శేషంబు= మిగిలినది; ఐన= అయిన; ఆ సింధురాజకుమార= ఆ సింధుదేశ రాజకుమారులయొక్క; సైన్యంబు= సైన్యం; దైన్యంబున్= దురవస్థను; ఒంది= పొంది; నలుదిక్కులన్= నాలుగు దిక్కులందును; విచ్చియున్= విడిపోయియూ, చెల్లచెదరై; నొచ్చియున్= బాధపడియూ; వివ్వచ్చుండు= అర్జునుడు; రణధరణిన్= యుద్ధభూమియందు; పొలిచి= ప్రకాశించి; నిలుచుటన్= నిలిచి ఉండుట; చూచి; మాత్సర్య= కోప (భారం); ధుర్యంబు+ఐ= వహించినదై; మగుడన్= మరల; పోరికిన్= యుద్ధానికి; పూని= యత్నించి; అడరినన్= విజృంభించగా; ఆ పురందర= ఆ ఇంద్రుడియొక్క; నందనుండు= కుమారుడు; అందలి= సింధుదేశ సైన్యంలోని; రథిక= రథంమీద నిలిచి యుద్ధం చేసేవారిలో; ముఖ్యులతోడన్= ముఖ్యులతో; తమ+అన్న= తమ అన్న అగు ధర్మరాజు; చెప్పిన; వాక్యంబులు= మాటలు; ఉపన్యసించి= చెప్పి; మీరు; ఏల?= ఎందుకు?; జాలిన్= దుఃఖాన్ని; పడియెదరు= పొందుతారు; ప్రాణంబులు= ప్రాణాలు; మీకున్= మీకు; ఇంత= మిక్కిలి; చేఁదు= ఇష్టంకానివి; అయ్యెను+ఏ?= అయినవా?; అని; పలికినను= పలికినప్పటికీ; నిలువక= ఆగక; పైపయిన్= మీద మీదకు; వారు; ఉరవణించినన్= వేగిరపడగా.

**తాత్పర్యం:** చచ్చినవారు చావగా మిగిలిన సింధురాజపుత్ర సైన్యవీరులు దురవస్థపాలై నాలుగు దిక్కులా చెల్లాచెదరయ్యారు. అర్జునుడు మాత్రం యుద్ధభూమిలో గట్టిగా నిలిచి ప్రకాశిస్తున్నాడు. అతడిని చూచి సింధుదేశ సైన్యం క్రోధం వహించి తిరిగి యుద్ధం చేయటానికి పూనుకొని విజృంభించింది. అప్పుడు అర్జునుడు ఆ సైన్యంలో ముఖ్యులయిన రథికులకు ధర్మరాజు చెప్పిన మాటలు చెప్పి 'మీ రెందుకు దుఃఖం కొనితెచ్చుకొంటారు? మీకు మీ ప్రాణాలంటే గిట్టవా?' అని అన్నాడు. అయినా వారు ఆగకుండా మీద మీదకు వచ్చి పడగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. నవ్వుచు నానా శరముల। నవ్వీరులఁ బొలియఁ జేయ, నంతయు విని తా**
**నెవ్వగతో దుశ్శల యా। కవ్వడిఁ బౌత్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్. 44**

**ప్రతిపదార్థం:** నవ్వుచున్= నవ్వుతూ; నానా= అనేక విధాలైన; శరములన్= బాణాలతో; ఆ= సింధుదేశ సైన్యంలోని; వీరులన్= వీరులను; పొలియన్+చేయన్= చంపగా; దుశ్శల; తాన్= తాను; అంతయున్= జరిగినదంతా; విని; నెఱ+వగతోన్= మహాదుఃఖంతో; పౌత్ర= మనుమలతో; అన్వితముగన్= కూడి ఉండేటట్లుగా; ఆ కవ్వడిన్= అ అర్జునుడిని; కానఁగన్= చూడగా; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** అర్జునుడు నవ్వుతూ అనేక విధాలైన బాణాలతో ఆ సింధుసైన్యంలోని వీరులను సంహరించాడు. దుశ్శల జరిగినదంతా విని, మహాదుఃఖంతో మనుమలతోపాటు అర్జునుడిని చూడటానికి వచ్చింది.

**విశేషం:** దుశ్శల గాంధారీ ధృతరాష్ట్రుల కూతురు. సైంధవుడి భార్య. దుశ్శల అనే రూపం కూడా గ్రంథాలలో కనబడుతుంది.

**సీ. వచ్చి కన్నీకులు వదనంబుపై వెల్లి। గొన రోదనంబు చేసిన నతండు**
**దయ నిల నిడియెఁ గోదండ మప్పడఁతుక। పౌత్త్రునిఁ జూపి 'యిబ్బాలుఁ గావు**
**మితఁడు మీ యల్లుని సుతుఁ; డన్న నప్పార్థుఁ। డిప్పుడు నా యల్లుఁ డెచట నున్న**
**వాఁ?' డని యడిగిన వనిత వెక్కుచు 'నతం। డాత్మీయ జనకుఁ డుగ్రాహవమున**

**తే. ననఘ! నీచేతఁ దెగుట దా విని నితాంత। శోకమగ్నుఁడై యుండి నీ రాక బిట్టు**
**వినుట బెగ్గిలి ప్రాణముల్ విడిచె 'ననుచు। నెలుఁగు గడలుకొనంగఁ బెల్లేడ్చె నధిప! 45**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! జనమేజయా!; వచ్చి= దుశ్శల ఆ విధంగా వచ్చి; కన్నీళులు= కన్నీరు; వదనంబుపైన్= ముఖంమీద; వెల్లిగొనన్= కాలువలు కట్టగా; రోదనంబు చేసినన్= దుఃఖించగా; అతండు= అర్జునుడు; దయన్= దయతో; కోదండంబు= విల్లు; ఇలన్= నేలమీద; ఇడియెన్= ఉంచాడు; ఆ పడఁతుక= ఆ స్త్రీ - దుశ్శల; పౌత్త్రునిన్= మనుమడిని; చూపి; ఈ బాలున్= ఈ బాలుడిని; కావుము= కాపాడుము; ఇతఁడు= ఈ బాలుడు; మీ= మీయొక్క; అల్లుని= మేనల్లుడి; సుతుఁడు= కొడుకు; అన్నన్= అనగా; ఆ పార్థుఁడు= ఆ అర్జునుడు; ఇప్పుడు; నా= నాయొక్క; అల్లుఁడు= మేనల్లుడు; ఎచటన్= ఎక్కడ; ఉన్నవాఁడు?= ఉన్నాడు?; అని; అడిగినన్= అడుగగా; వనిత= స్త్రీ - దుశ్శల; వెక్కుచున్= వెక్కి వెక్కి ఏడుస్తూ; అనఘ!= పాపరహితుడా!; అతండు= నీ మేనల్లుడు; తాన్= తాను; ఆత్మీయ= తనయొక్క; జనకుఁడు= తండ్రి - సైంధవుడు; ఉగ్ర= భయంకరమైన; ఆహవమునన్= యుద్ధంలో; నీచేతన్= నీచేత; తెగుట= చనిపోవటం; విని; నితాంత= ఎడతెగని; శోక= శోకమునందు; మగ్నుఁడు+ఐ= మునిగినవాడై; ఉండి; నీ= నీయొక్క; రాక= వచ్చుట; బిట్టు= హఠాత్తుగా; వినుటన్= వినటంచేత; బెగ్గిలి= భయపడి; ప్రాణముల్= ప్రాణాలు; విడిచెన్= వదిలాడు; అనుచున్= అంటూ; ఎలుఁగు= కంఠస్వరం; కడలుకొనంగన్= అతిశయించగా, గొంతెత్తి పెద్దగా; పెల్లు= ఎక్కువగా; ఏడ్చెన్= ఏడ్చింది.

**తాత్పర్యం:** జనమేజయా! దుశ్శల వచ్చి కన్నీరు ముఖంమీద కాలువలు కట్టగా ఏడ్చింది. అంత అర్జునుడు జాలిపుట్టి వింటిని నేలమీద పెట్టాడు. ఆమె అర్జునుడికి మనుమడిని చూపి 'ఈ బాలుడిని కాపాడుము. ఇతడు నీ మేనల్లుడి కొడుకు' అని అన్నది. అర్జునుడు 'నా మేనల్లుడు ఇప్పు డెక్కడ ఉన్నాడు?' అని అడిగాడు. దుశ్శల వెక్కి వెక్కి ఏడుస్తూ

'పుణ్యాత్మా! భయంకర సంగ్రామంలో తన తండ్రి నీ చేతిలో చనిపోయాడని విని నీ మేనల్లుడు ఎడతెగని వగపులో మునిగిపోయాడు. ఇప్పుడు హఠాత్తుగా నీవు వచ్చావన్న మాట విని ప్రాణాలు విడిచాడు' అని చెప్పి గొంతెత్తి పెద్దగా ఏడ్చింది.

**వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచియుండ నయ్యుగ్మలి యతని నుద్దేశించి. 46**

**ప్రతిపదార్థం:** అప్పుడు; శోక= శోకంచేత; ఆక్రాంతుండు+అయి= ఆక్రమింపబడినవాడై; గాండీవి= అర్జునుడు; వదనంబు= ముఖం; వాంచి= వంచుకొని; ఉండన్= ఉండగా; ఆ ఉగ్మలి= ఆ స్త్రీ (దుశ్శల); అతనిన్= ఆ అర్జునుడిని; ఉద్దేశించి= గురిగా చేసి; అర్జునుడితో.

**తాత్పర్యం:** దుశ్శల మాటలకు అర్జునుడు విచారించి ముఖం వంచుకొన్నాడు. అప్పు డామె అతడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'ధార్తరాష్ట్రుల కీడు దలఁపక సైంధవు। కొఱగాము లెల్లను మఱచి తండ్రి**
**లేని యీ శిశువుపై మానితంబైన నీ। యక్కటికంపుఁ జూ పడరఁ జేయు**
**మాశ్రితవత్సల!' యనుచు నబ్బాలునిఁ। జరణానతునిఁ జేసి 'శరణు! శరణు!**
**కృప నన్ను రక్షింపు కీర్తియుఁ ధర్మంబుఁ। జేకొను' మనవుడుఁ జిత్త మడల**

**తే. 'రాచకొల మిది గాల్పనే క్రౌర్యమూల'। మని తలంచుచు నాతఁ డయ్యతివతోడ**
**'నధమవృత్తి సుయోధనుఁ డంతకంటె। నేముఁ గొఱగాము. మాచేత నింతపుట్టె.' 47**

**ప్రతిపదార్థం:** ఆశ్రిత= ఆశ్రయించినవారియందు; వత్సల!= దయ కలవాడా!; ధార్తరాష్ట్రుల= ధృతరాష్ట్రుడి కుమారులయొక్క, దుర్యోధనాదులయొక్క; కీడు= అపకారం; తలఁపక= మనసులో పెట్టుకొనకుండా; సైంధవు= సైంధవుడియొక్క; కొఱగాములు= దుష్కార్యములు; ఎల్లను= అన్నిటినీ; మఱచి= మరచిపోయి; తండ్రి లేని; ఈ శివువుపైన్= ఈ శిశువుమీద; మానితంబు= గౌరవించబడినది, పేరుపొందినది; ఐన= అయిన; నీ= నీయొక్క; అక్కటికము= దయతో కూడిన; చూపు; అడరన్+చేయుము= ప్రసరింపజేయుము; అనుచున్= అంటూ; ఆ బాలునిన్= ఆ బాలుడిని; చరణ= పాదాలకు; ఆనతున్= నమస్కరించినవాడినిగా; చేసి; శరణు= నమస్కారం; శరణు= అండగా ఉండుము; కృపన్= దయతో; నన్నున్= నన్ను; రక్షింపు= రక్షించుము; కీర్తియున్= కీర్తియూ; ధర్మంబున్= పుణ్యమూ; చేకొనుము= పొందుము; అనవుడున్= అని అనగా; చిత్తము= మనస్సు; అడలన్= తపింపగా; క్రౌర్య= క్రూరత్వానికి; మూలము= ఆధారం; ఇది= ఈ; రాచకొలము= రాజవంశం; కాల్పను+ఏ?= తగులబెట్టుటకా?; అని; తలంచుచున్= భావిస్తూ; అతఁడు= అర్జునుడు; ఆ అతివతోడన్= ఆ స్త్రీతో, సోదరితో; సుయోధనుండు= దుర్యోధనుడు; అధమ= నీచమైన; వృత్తి= నడవడి కలవాడు; ఏము= మేము; అంతకంటెన్= వారికంటె; కొఱగాము= తక్కువ వారం గాము; మాచేతన్= మావలన; ఇంత= ఈ మహా వినాశం; పుట్టెన్= సంభవించింది.

**తాత్పర్యం:** 'ఆశ్రితవత్సలా! దుర్యోధనాదులు మీకు చేసిన అపకారం మనసులో పెట్టుకొనకుము. నా భర్త సైంధవుడు చేసిన పాడు పనులన్నీ మరచిపొమ్ము. తండ్రిలేని ఈ బిడ్డపై జగద్విఖ్యాతమైన నీ దయ చూపుము' అని ఆ బాలుడిచేత అర్జునుడి కాళ్ళకు మ్రొక్కించింది. 'నీకు నమస్కారం. మాకు ప్రాపు నీవే. దయతో నన్ను రక్షించుము. కీర్తీ, పుణ్యమూ కట్టుకొనుము' అని ఆమె అన్నది. ఆమె ఈ మాటలు పలుకగా అర్జునుడి మనస్సు తపించింది. అతడు 'క్రూరత్వానికి

మూలకందమైన ఈ రాజవంశం తగులబెట్టటానికా?' అని అనుకొని దుశ్శలతో 'దుర్యోధనుడు నీచమైన నడవడి కలవాడే. కాని మేము అతనికంటె తక్కువ వారము గాము. మా వలననే ఈ ఘోరవినాశం సంభవించింది.'

**క. అను పలుకు పలికి, బహుసాం। త్వనముల నూరార్చి, యాసుదతి మస్తకముం**
**దన యక్కునఁ జేర్చి 'యబల! చనుము వగపు దక్కి' యని ప్రసాద భరితుఁడై. 48**

**ప్రతిపదార్థం:** అను పలుకు పలికి= అనునట్టి మాటలు, మాటాడి; బహు= వివిధములైన; సాంత్వనములన్= ఆదరంతో కూడిన మాటలచేత; ఊరార్చి= ఓదార్చి; ఆ సుదతి= ఆ స్త్రీయొక్క; మస్తకమున్= తలను; తన= తనయొక్క; అక్కునన్= రొమ్మున; చేర్చి; అబల!= దుశ్శలా!; వగపు= విచారం; తక్కి= వీడి; చనుము= వెళ్ళుము; అని; ప్రసాద= దయతో; భరితుఁడు+ఐ= నిండినవాడై.

**తాత్పర్యం:** అని పలికి ఆమెను సాదరవచనాలతో ఓదార్చి, ఆమె శిరస్సును రొమ్మున చేర్చి దయామయుడై 'దుశ్శలా! దిగులు వదలి వెళ్ళుము' అని. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. వీడ్కొలిపిన దుశ్శల దనమనుమనిం దమబలంబులంగొని ప్రియంబునం జనియె; నయ్యనిమిషపతి సుతుండును గ్రతువిషయంబులై వలయుననుష్ఠానంబులు విధివంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దా నామృగానుసారియయిన పినాకపాణియుం బోలెఁ బోవుచుండ, నదియును నఖిల దేశంబుల సుఖసంచారంబునఁ బ్రవర్తిల్లుచుఁ, గ్రమంబున మణిపూర పురంబు నుపాంతంబున కరిగిన, నన్నగరంబు పతి యైన బభ్రువాహనుండు నిజజనకుం డయిన యర్జును రాక యాకర్ణించి. 49**

**ప్రతిపదార్థం:** వీడ్కొలిపినన్= వీడ్కొలుపగా; దుశ్శల; తన= తనయొక్క; మనుమనిన్= మనుమడినీ; తమ= తమయొక్క; బలంబులన్= సైన్యాలను; కొని= వెంటబెట్టుకొని; ప్రియంబునన్= సంతోషంతో; చనియెన్= వెళ్ళింది, ఆ అనిమిష= ఆ దేవతలయొక్క; పతి= నాథుడియొక్క; సుతుండును= కుమారుడునూ, అర్జునుడునూ; క్రతు= యజ్ఞము యొక్క; విషయంబులు= అంశాలు; ఐ= అయి; వలయు= అవశ్యకాలైన; అనుష్ఠానంబులు= కర్తవ్యాలు; విధివంతంబులు= శాస్త్రానికి అర్హములు; కాన్= అయ్యేటట్లు; చలుపుచున్= చేస్తూ; తురంగంబు= గుర్రంయొక్క; వెనుకన్= వెనుక; తాను; ఆ మృగ= ఆ యజ్ఞ మృగాన్ని; అనుసారి= అనుసరించేవాడు; అయిన; పినాకపాణియున్+పోలెన్= పినాకమనే విల్లు చేతియందు కలవాడైన శివుడివలె; పోవుచున్+ఉండన్= వెళ్ళుతుండగా; అదియును= ఆ యజ్ఞాశ్వం కూడా; అఖిల= సమస్తమైన; దేశంబులన్= దేశములయందు; సుఖ= సుఖము కలిగించే; సంచారంబునన్= గమనంతో; ప్రవర్తిల్లుచున్= తిరుగుతూ; క్రమంబునన్= క్రమ క్రమంగా; మణిపూర= మణిపూరమనే; పుర= పట్టణంయొక్క; ఉపాంతంబునకున్= సమీప ప్రదేశానికి; అరిగినన్= వెళ్ళగా; ఆ నగరంబు= ఆ పట్టణంయొక్క; పతి= ప్రభువు; ఐన= అయిన; బభ్రువాహనుండు; నిజ= తనయొక్క; జనకుండు= తండ్రి; అయిన; అర్జును= అర్జునుడియొక్క; రాక= ఆగమనాన్ని గూర్చి; ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** వీడ్కొలుపగా దుశ్శల తన మనుమడినీ, సైన్యాలను వెంటబెట్టుకొని సంతోషంగా వెళ్ళిపోయింది. అర్జునుడూ యజ్ఞాంశాలై తప్పక చేయదగిన పనులన్నిటినీ శాస్త్రోక్తంగా చేస్తూ యజ్ఞమృగాన్ని వెంటాడే శివుడివలె ఆ యజ్ఞాశ్వం వెనుక వెళ్ళుతున్నాడు. అది అన్ని దేశాలలో హాయిగా తిరుగుతూ తిరుగుతూ క్రమంగా మణిపూరమనే పట్టణం దగ్గరకు చేరింది. ఆ నగరాధిపతి అయిన బభ్రువాహనుడు తన తండ్రి అయిన అర్జునుడి ఆగమనం గూర్చి విని. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: ఉపమ. ఆ మృగానుసారి అయిన పినాకపాణియుం బోలె..దేవతలు పరమేశ్వరుడి మహిమను గుర్తించక, యజ్ఞం చేస్తూ ఆ దేవుడికి యజ్ఞభాగం కల్పింపరయిరి. ఈ కారణంవలన కోపం పొందిన శివుడు విల్లు చేపట్టి దేవతలు యజ్ఞం చేస్తున్న చోటికి వచ్చాడు. రౌద్రాస్త్రంతో యజ్ఞమును గొట్టాడు. అంతట యజ్ఞం మృగరూపమును ధరించి పారిపోయింది. పరమేశ్వరుడు దానిని వెంబడించాడు. అది తప్పించుకొని పరువెత్తి మింట వెలుగొందింది. ఈ కథ శాంతిపర్వంలోని పంచమాశ్వాసంలో ఉన్నది. సంస్కృత భారతమున శాంతిపర్వంలో 283వ అధ్యాయంలో ఉన్నది. కాళిదాసుడి అభిజ్ఞాన శాకుంతలంలో ప్రథమాంక ప్రారంభంలో మృగమును వెంటాడే దుష్యంతుడిని చూచి సారథి 'మృగానుసారిణం సాక్షాత్ పశ్యామీవ పినాకినమ్' అని అంటాడు. రఘువంశము (సర్గ 11. శ్లో. 44)లో 'విద్రుత క్రతుమృగానుసారిణం యేన బాణ మసృజత్ వృషధ్వజః' అని ఉన్నది.

**ఆ. వినయ మెసఁగ నార్యజనసమేతంబుగా। నరుగుదెంచి, యతని చరణములకుఁ**
**బ్రీతి నెఱఁగ, నక్కిరీటి యన్నరపతి। నాదరింప కుండె మేదినీశ! 50**

**ప్రతిపదార్థం:** మేదినీ= భూమియొక్క; ఈశ!= నాథుడా! రాజా!, జనమేజయా!; ఆర్యజన= పెద్దలతో; సమేతంబు+కాన్= కూడిఉండేటట్లుగా; అరుగుదెంచి= వచ్చి; వినయము= అణకువ; ఎసఁగన్= ఒప్పగా; అతని= అర్జునుడియొక్క; చరణములకున్= కాళ్ళకు; ప్రీతిన్= ఆనంద పూర్వకమైన భక్తితో; ఎఱఁగన్= మ్రొక్కగా; ఆ కిరీటి= ఆ అర్జునుడు; ఆ నరపతిన్= ఆ రాజును, బభ్రువాహనుడిని; ఆదరింపక= మన్నించక; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయా! పెద్దలతో కూడివచ్చి సవినయంగా అర్జునుడి కాళ్ళకు ఆనందపూర్వకమైన భక్తితో మ్రొక్కాడు. కాని, అర్జునుడు ఆ బభ్రువాహనుడిని ఆదరించలేదు.

**వ. అట్లుండి తన యనాదరణంబునకుం గారణం బెఱుంగక సవిచారుండై యూరకున్న యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా, బభ్రువాహనుడిని ఆదరించక; ఉండి; తన= తనయొక్క; అనాదరణంబునకున్= ఆదరించకుండ ఉండటానికి; కారణంబు= కారణం; ఎఱుంగక= తెలియక; సహ+విచారుండు+ఐ= మనస్తాపముతో కూడినవాడై; ఊరక+ఉన్న= కిమ్మనకుండా ఉన్న; ఆ కుమారునితోన్= ఆ కొడుకుతో; ధనంజయుండు= అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్=అన్నాడు.

**తాత్పర్యం:** ఆదరించకుండా ఉండి, తన తిరస్కారానికి కారణం తెలియక మనస్తాపం పొంది మిన్నకున్న కుమారుడితో అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'యాగ విముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా**
**కీగతి మెత్తఁబాటు దగునే? నృపధర్మవిహీనతన్ రణో**
**ద్యోగము లేక తక్కి భయ ముల్లముఁ జేరఁగ నిచ్చు రాజు రా**
**జే? గుణహీన! పో' మ్మనిన నేమియుఁ బల్కకతండు గ్రమ్మఱన్. 52**

**ప్రతిపదార్థం:** గుణ= పౌరుషగుణంచేత; హీన= హీనుడైనవాడా!; యాగ= యజ్ఞమునందు; విముక్తము= విడువబడినది; ఐ; చను= సంచరిస్తున్న; హయంబునకున్= గుర్రానికి; అడ్డము వచ్చి= అడ్డుపడి; పట్టి= బంధించి; కాక= తప్పు; ఈ గతిన్= ఈ విధంగా; మెత్తఁబాటు= మెత్తగా ఉండటం; తగును+ఏ?= తగునా?; నృప= రాజుయొక్క; ధర్మ= ధర్మంచేత; విహీనతన్=

హీనత్వంతో; రణ= యుద్ధంయొక్క; ఉద్యోగము= ప్రయత్నం; లేక; తక్కి= వదలి; భయము= భయం; ఉల్లమున్= మనస్సును; చేరఁగన్+ఇచ్చు= చేరేటట్లు చేసికొనే; రాజు; రాజు+ఏ= రాజేనా?; పొమ్ము= పోరా; అనినన్= అనగా; అతండు= బభ్రువాహనుడు; ఏమియున్= చిన్న మెత్తుమాటకూడా; పల్కక= అనక; క్రమ్మఱన్= మరలా తిరిగి.

**తాత్పర్యం:** 'పౌరుషగుణహీనా! యజ్ఞంలో వదలిన గుర్రం తిరిగేటప్పుడు అడ్డుపడి దానిని బంధించాలి కాని ఈ విధంగా చేతకానితనంతో మెత్తగా ఉండటం తగునా? రాజధర్మానికి తిలోదకా లిచ్చి యుద్ధ ప్రయత్న మన్నమాటే లేకుండా భయపడుతూ ఉండే రాజూ ఒక రాజేనా? పోరా!' అని అనగా బభ్రువాహనుడు చిన్నమాట కూడా మాటాడకుండా మరల. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **అరిగి పట్టణవీథి నల్లన చనుచుండ । నర్జునుం డతనితో నాడినట్టి**

**తెఱఁగెల్లఁ దన దగు దివ్యబోధంబునఁ । గని భుజంగోత్తమతనయ సదయ**

**వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా । ధిపుని పాలికిఁ జనుదెంచి ' యేను**

**మీ తల్లి నాగేంద్రు సూతి నులూపి నా । పేరు; హితంబు చెప్పెడు మనీష**

**తే.** **నరుగుదెంచితి వినుము! మీయయ్య పనుపు । దలకొనుము; రాజులకు నర్హధర్మమైన**

**యని యొనర్పుము; దనతోడఁ బెనఁగు టధిక । సమ్మదము సేయు నక్కురుసత్తమునకు.** **53**

**ప్రతిపదార్థం:** అరిగి= వెళ్ళి; పట్టణ వీథిన్= పట్టణంయొక్క, రాజమార్గంలో; అల్లన్+అ= మెల్లగా; చనుచున్+ఉండన్= వెళ్ళుతుండగా; అర్జునుండు; అతనితోన్= బభ్రువాహనుడితో; ఆడిన+అట్టి= పలికినట్టి; తెఱఁగు+ఎల్లన్= విధమంతయూ; తనది+అగు= తనదైన; దివ్యబోధంబునన్= దివ్యజ్ఞానంచేత; కని= తెలిసికొని; భుజంగ= సర్పాలలో; ఉత్తమ= ఉత్తముడియొక్క; తనయ= కూతురు; సహ+దయా= దయతో కూడిన; వృత్తిన్= నడవడితో; పాతాళంబు= పాతాళ లోకంనుండి; వెలువడి= బయటికివచ్చి; ఆ+నర+అధిపుని= ఆ రాజు బభ్రువాహనుడియొక్క; పాలికిన్= దగ్గరకు; చనుదెంచి= వచ్చి; ఏను= నేను; మీ తల్లిన్= మీ తల్లిని; నాగ+ఇంద్ర= నాగరాజుయొక్క; సూతిన్= బిడ్డను; నా పేరు; ఉలూపి; హితంబు= మేలు కలిగించే మాటను; చెప్పెడు= చెప్పే; మనీషన్= బుద్ధితో; అరుగుదెంచితిన్= వచ్చాను; వినుము; మీ= మీయొక్క; అయ్య= తండ్రియొక్క; పనుపున్= ఆజ్ఞను; తలకొనుము= తలదాల్చుము; రాజులకున్= రాజులకు; అర్హ= తగినదగు; ధర్మము; ఐన= అయిన; అని= యుద్ధం; ఒనర్పుము= చేయుము; ఆ కురు= ఆ కురువంశమందలి; సత్తమునకున్= శ్రేష్ఠుడికి; తనతోడన్= తనతో; పెనఁగుట= యుద్ధం చేయటం; అధిక= మిక్కిలి; సమ్మదము= ఆనందం; చేయున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** తండ్రి దగ్గరకు వెళ్ళి రాజమార్గంలో మెల్లగా పోతున్నాడు. అర్జునుడు బభ్రువాహనుడితో పలికిన తీరంతా నాగేంద్ర తనయ తన దివ్య జ్ఞానంవలన తెలిసికొన్నది. వెంటనే పాతాళ లోకంనుండి వచ్చి, బభ్రువాహనుడి దగ్గరకు వెళ్ళి 'నాయనా! నేను మీ తల్లిని. నాగరాజు పుత్రిని. నా పేరు ఉలూపి. నీకు మేలు కలిగించేమాట చెప్పవలెననే బుద్ధితో వచ్చాను. నా మాట వినుము. మీ తండ్రి ఆనతి శిరసావహించుము. రాజోచితధర్మమైన యుద్ధం చేయుము. కురువంశ శ్రేష్ఠుడైన మీ తండ్రికి తనతో పోరాడటం మహానందం కలిగిస్తుంది.

**క.** **అనిన సభక్తికముగ న । వ్వనితకుఁ బ్రణమిల్లి 'యాహవము జనకునితోఁ**

**జనునె యొనర్పఁగ' నని య । ప్పనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ!** **54**

**ప్రతిపదార్థం:** శుభ= శుభాలను; ప్రద= ఇచ్చునట్టి; మూర్తీ!= ఆకారం కలదానా!; అనినన్= అని పలుకగా; ఆ వనితకున్= ఆ స్త్రీకి, తల్లికి; సభక్తికముగన్= భక్తియుతంగా; ప్రణమిల్లి= నమస్కరించి; జనకునితోన్= తండ్రితో; ఆహవము= యుద్ధం; ఒనర్పఁగన్= చేయగా; చనును+ఎ?= తగునా?; అని= అని తలచి; ఆ పనికిన్= ఆ పనికి, యుద్ధమునకు; చొరక= పూనుకొనక; వచ్చితిని= వచ్చాను.

**తాత్పర్యం:** అని పలుకగా బభ్రువాహనుడు భక్తిపూర్వకంగా తల్లికి మ్రొక్కినాడు. అతడు ఆమెతో 'కల్యాణమూర్తీ! తండ్రితో కయ్యం చేయటం తగనిపని అని తలచి తిరిగి వచ్చాను.

**క.** **నీ వింత దెలిపి పలికెద; వావిభుఁడును మున్న నన్ను ననుమతుఁ జేసెం;**
**గావునఁ దల్లీ! మీకుం । గావించెద నిద్దఱకు నఖండ ప్రియమున్.'** **55**

**ప్రతిపదార్థం:** తల్లీ!; నీవు; ఇంత= ఇంతగా; తెలిపి= వివరించి; పలికెదవు= చెప్పావు; ఆ విభుఁడును= ఆ ప్రభువునూ; మున్న= ముందే; నన్నున్= నన్ను; అనుమతున్= అనుమతిపొందిన వాడినిగా; చేసెన్= చేశాడు; కావునన్= కావున; మీకున్= మీకు; ఇద్దఱకున్= ఇద్దరికీ; అఖండ= ఎడతెగని; ప్రియమున్= సంతోషమును; కావించెదన్= కలిగిస్తాను.

**తాత్పర్యం:** తల్లీ! నీవు ఇంతగా వివరించి చెప్పావు. తండ్రికూడా ఇంతకుముందే నన్ను అనుమతించాడు. కాబట్టి యుద్ధం చేసి ఇద్దరకూ అఖండానందాన్ని కలిగిస్తాను.'

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు చేయుట (సం. 14-78-14)

**చ.** **అని నిజమందిరంబునకు నయ్యెలనాఁగఁ దగంగఁ బుచ్చి య**
**మ్మనుజవరుండు సాధన సమంచితమైన రథం బుదాత్త రే**
**ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పిత భూషణ లేపనాంబరం**
**బును సమరోత్సవోద్ధత విభూతియునై తనమే నెలర్పఁగన్.** **56**

**ప్రతిపదార్థం:** అని; నిజ= తనయొక్క; మందిరంబునకున్= భవనానికి; ఆ ఎలనాఁగన్= ఆ స్త్రీని, తల్లిని; తగంగన్= రాజమాతకు తగినట్లుగా; పుచ్చి= పంపి; ఆ మనుజవరుండు= ఆ మానసపతి, బభ్రువాహనుడు; సాధన= ఆయుధాలు మొదలైన సాధనాలతో; సమంచితము= మిక్కిలి ఒప్పుచున్నది; ఐన= అయిన; రథంబు= రథాన్ని; ఉదాత్త= మనోజ్ఞమైన; రేఖ= రీతి, తీరు; నెఱయన్= ప్రకాశించగా; ఎక్కి; తనమేను= తన శరీరం; అర్హ= యుద్ధానికి తగినట్లుగా; పరికల్పిత= ఏర్పాటు చేసికొనిన; భూషణ= అలంకారాలు; లేపన= పూతలు, గంధాదులు; అంబరంబును= వస్త్రాన్ని; సమర= యుద్ధమనెడు; ఉత్సవ= ఉత్సవముయొక్క; ఉద్ధత= అతిశయించిన; విభూతియున్= శక్తియును; ఐ= కలది అయి; ఎలర్పఁగన్= శోభిల్లగా.

**తాత్పర్యం:** ఆ విధంగా పలికి బభ్రువాహనుడు తల్లిని రాజలాంఛనాలతో తన మేడకు పంపాడు. సాధన సంపత్తి కలిగిన రథాన్ని రాజసం అతిశయించగా ఎక్కాడు. సమయానికి తగిన విధంగా నగలు పెట్టుకొన్నాడు. గంధాదులు అలదుకొన్నాడు. వస్త్రాలు ధరించాడు. ఈ అలంకారాలతో యుద్ధక్రీడకు కావలసిన శక్తితో అతడి శరీరం శోభిల్లుతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ.** **ఎక్కి హంసకేతు వేడ్తెఱఁ గ్రాలంగ । నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ**
**జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ । గురిసె నతఁడు నిశితశరచయంబు.** **57**

**ప్రతిపదార్థం:** ఎక్కి= రథమెక్కి; హంస= హంస చిహ్నంతో కూడిన; కేతువు= జెండా; ఏడ్తెఱన్= తేజస్సుతో; క్రాలంగన్= ప్రకాశించగా; అరిగి= వెళ్ళి; అశ్వమునకున్= గుర్రానికి; అడ్డపడఁగన్= అడ్డుపడగా; సవ్యసాచి= అర్జునుడు; చూచి; మెచ్చి= మెచ్చుకొని; మార్కొనుటయున్= ఎదుర్కొనగా; అతఁడు= బభ్రువాహనుడు; నిశిత= వాడియైన; శర= బాణాలయొక్క; చయంబు= గుంపును; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** మహాతేజస్సుతో ప్రకాశిస్తున్న హంసధ్వజం కట్టిన రథమెక్కి వెళ్ళి బభ్రువాహనుడు గుర్రానికి అడ్డుపడ్డాడు. అతడిని చూచి మెచ్చుకొని అర్జునుడు ఎదుర్కొన్నాడు. అప్పుడు బభ్రువాహనుడు అతడిమీద వాడి బాణాల సమూహం వర్షించాడు.

**శా.** **వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి**
**త్సూనుం డొక్కట నాత్మసూను నొడలం దూపుల్ నిగిడ్చెం బదా;**
**ఱా నిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరుపై**
**వే నారాచము లైదు నాలుగులు పృథ్వీనాథ। నాటించినన్.** **58**

**ప్రతిపదార్థం:** పృథ్వీనాథ!= భూపతీ, జనమేజయా!; దుర్వార= నివారించ శక్యంకాని; ఉద్యముండు= యుద్ధ ప్రయత్నం కలవాడు; అద్రి= కొండలను; భిత్= భేదించినవాడియొక్క, ఇంద్రుడియొక్క; సూనుండు= కుమారుడు, అర్జునుడు; వానిన్= బభ్రువాహనుడు ప్రయోగించిన బాణాలను; తాన్= తాను; అవలీలమైన్= సునాయాసంగా; తునిమి= ఖండించి; ఒక్కటన్= ఒక్కసారిగా; ఆత్మ= తనయొక్క; సూను= కుమారుడియొక్క; ఒడలన్= శరీరమునందు; పది+ఆఱు= పదహారు; తూపుల్= బాణాలను; నిగిడ్చెన్= పడజేశాడు; ఆ నిశ్శంకుఁడు= ఆ జంకులేనివాడు, బభ్రువాహనుడు; బాహు= భుజములయొక్క; సార= బలంచేత కలిగిన; మదము= గర్వం; ఏపారంగన్= ప్రకాశించగా; ఆ వీరుపైన్= ఆ వీరుడిమీద, అర్జునుడిమీద; వే= వేగంగా; ఐదు నాలుగులు= ఇరువది; నారాచములు= బాణాలు; నాటించినన్= నాటుకొనేటట్లు చేయగా.

**తాత్పర్యం:** దుర్వార ప్రయత్నం కలవాడూ, ఇంద్రుడి కుమారుడూ అయిన అర్జునుడు బభ్రువాహనుడు ప్రయోగించిన వాడి అమ్ములను సునాయాసంగా ఖండించాడు. ఖండించటమే కాక తన కొడుకు శరీరంమీద పడేటట్లు పదహారు బాణాలు ప్రయోగించాడు. అయితే బభ్రువాహను డేమీ జంకలేదు. భుజబలగర్వం వెల్లడయ్యేటట్లుగా అర్జునుడి శరీరంమీద ఇరవై బాణాలు నాటుకొనేటట్లు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ.** **మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచి యే**
**పొదవఁగ మేను నొంప; నచలోద్ధతి నాతని జత్రు వేసె బె**
**ట్టిద మగునారసంబునఁ గడింది మగం డగు బభ్రువాహనుం;**
**డది వడిపేర్మి శోణితజలార్ద్రత నొందక యుచ్చిపోయినన్.** **59**

**ప్రతిపదార్థం:** ఆ రిపు= ఆ శత్రువులను; విమర్దనుఁడు= సంహరించేవాడు; మదిన్= మనస్సులో; కొనియాడి= కుమారుడిని మెచ్చుకొని; అంచసిడంబు= హంసధ్వజం; త్రుంచి= నరకి; ఏపు= ఉత్సాహం; ఒదవఁగన్= కలుగగా; మేను= బభ్రువాహనుడి శరీరమును; నొంపన్= బాధించగా; కడింది మగండు= మహావీరుడు; అగు; బభ్రువాహనుండు; అచల= చలింపనిదైన, స్థిరమైన;

ఉద్ధతిన్= దిట్టతనంతో; బెట్టిదము= వాడి అయినది; అగు= అయిన; నారసంబునన్= బాణంతో; అతని= అర్జునుడియొక్క; జత్రువు= రొమ్ము ఎముకలు భుజశిరస్సులను కలియు స్థానము, భుజసంధి; ఏసెన్= కొట్టాడు; అది= బభ్రువాహనుడు ఏసిన బాణము; వడి= వేగంయొక్క; పేర్మిన్= అతిశయంచేత; శోణితజల= నెత్తురుచేత; ఆర్ద్రతన్= తడియటం, అంటుకొనటం; ఒందక= పొందక; ఉచ్చిపోయినన్= గ్రుచ్చుకొనకుండ దూసికొనిపోగా.

**తాత్పర్యం:** అర్జునుడు కుమారుడి బాణప్రయోగ చాతుర్యాన్ని పొగడి ముందు అతడి హంసధ్వజాన్ని ఖండించి, తరువాత శరీరాన్ని బాణాల చేత పీడించాడు. కాని, మహావీరుడు బభ్రువాహనుడు ఏ మాత్రమూ చలించకుండా ఒక వాడి బాణంతో అర్జునుడి భుజసంధిని కొట్టాడు. మహావేగంతో బాణం దూసికొనిపోవటంచేత దానికి నెత్తురు అంటుకొనకపోగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. అమ్మేటిమగఁడు తన చా। ప మ్మూఁతగ నిల్చి సోలి పదపడి తెలి వు**
**ల్లమ్మున నొలసిన నౌరా। యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. 60**

**ప్రతిపదార్థం:** ఆ మేటి మగఁడు= ఆ మహాశూరుడు; తన= తనయొక్క; చాపమ్ము= విల్లు; ఊఁతగన్= ఆలంబంగా; నిల్చి; సోలి= వివశత్వమునొంది; పదపడి= తరువాత; తెలివు= జ్ఞానం; ఉల్లమ్మునన్= హృదయమునందు; ఒలయన్= కలుగగా; ఔరా; ఇమ్మడి= సాటిఅయినవాడు, సరిసమానుడు; అని; ఎంతయున్= మిక్కిలి; ప్రీతిన్= ఆనందంతో; కొడుకున్= కొడుకును; పొగడెన్= పొగడాడు.

**తాత్పర్యం:** శూరశ్రేష్ఠుడైన అర్జునుడు తన విల్లు ఆలంబంగా నిలబడ్డాడు. కాని, శరీరం అతడి వశంలో లేదు. తరువాత కొంతసేపటికి హృదయంలో జ్ఞానం జనించి అతడు యథాస్థితిని పొందాడు. 'ఔరా! నాకు సాటి అయినవాడు' అని మహానందంతో కొడుకును పొగడాడు.

**తే. పొగడి 'యేఁ దీవ్ర శరములు నిగుడఁ జేయు। నుద్ధతికి మంచిబంటవై యోర్వవలయుఁ**
**జుమ్ము రా' యని పలికి వాలమ్ము లధిక। రయము మెఱయంగఁ బరఁగించె రాజముఖ్య! 61**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజాగ్రణీ, జనమేజయా!; పొగడి= ఆ విధంగా కొడుకును పొగడి; ఏన్= నేను; తీవ్రశరములు= వాడి బాణాలు; నిగుడన్+చేయు= ప్రయోగించే; ఉద్ధతికిన్= సంరంభానికి; మంచి= గొప్ప; బంటవు= యోధుడవు; ఐ; ఓర్వన్‌వలయున్= ఓర్చుకొనవలయును; చుమ్ము!= సుమా!; రా= రారా!; అని; పలికి; వాలమ్ములు= తీక్ష్ణ బాణాలను; అధిక= మిక్కిలి; రయము= వేగం; మెఱయంగన్= వెల్లడికాగా; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆ విధంగా కొడుకును పొగడి అర్జునుడు 'నేను వాడి బాణాలు ఏసే ఊపునకు మహాయోధుడవై ఓర్చుకొనాలి సుమా! రారా!' అని వడివడిగా వాడి అలుగులు ప్రయోగించాడు.

**ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ। జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ**
**దనికి సత్వరముగఁ దద్గాత్రమున నించె। నరుఁడు పెక్కు మెఱుఁగు నారసములు. 62**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ బభ్రువాహనుడు; మొనసి= గట్టిగా పూనుకొని; వానిన్= అర్జునుడు ప్రయోగించిన బాణాలను; మూడు+తునియలు= మూడు ముక్కలు; కాఁగన్= అయ్యేటట్లుగా; చేయన్= చేయగా; మత్సరంబు= అసూయ; చిత్తవృత్తిన్= చిత్తస్థితియందు; తనికి= ఎక్కువ అయి; నరుఁడు= అర్జునుడు; పెక్కు= అనేకములైన; మెఱుఁగు= వాడిఅయిన; నారసములు= బాణాలు; సత్వరముగన్= వేగముగా; తద్= ఆ బభ్రువాహనుడియొక్క; గాత్రమునన్= శరీరమునందు; నించెన్= ప్రయోగించాడు (నిండేటట్లు చేశాడు.)

**తాత్పర్యం:** బభ్రువాహనుడు గట్టి పూనికతో అర్జునుడు ప్రయోగించిన బాణాలలో ఒక్కొక్కటీ మూడు ముక్కలయ్యేటట్లు చేశాడు. దీనితో అర్జునుడి మనస్సులో అసూయ అంకురించింది. అతడు వేగంగా బభ్రువాహనుడి ఒంటినిండా వాడి బాణాలు వేశాడు.

**ఉ. దానికి నీడఁ బోవక యుదగ్ర పరాక్రమ మొప్ప వజ్ర కీ**
**లానిభతన్ మెఱుంగుల విలాసము నింగి వెలుంగ నుద్భటుం**
**డై నిగిడించెఁ బార్థు హృదయస్థలి నారస మస్త్ర శస్త్ర వి**
**ద్యానిపుణత్వశాలి యగు నన్నరపాలసుతుండు భూవరా! 63**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; అస్త్ర= అస్త్రాలయొక్క; శస్త్ర= శస్త్రాలయొక్క; విద్యా= విద్యలయందలి; నిపుణత్వ= నైపుణ్యంచేత; శాలి= ప్రకాశించేవాడు; అగు= అయిన; ఆ నరపాల= ఆ రాజుయొక్క; సుతుండు= కొడుకు; దానికిన్= ఒంటినిండా బాణాలు వేయటానికి; ఈడఁబోవక= వెనుదీయక; ఉదగ్ర= భయంకరమైన; పరాక్రమము= శౌర్యం; ఒప్పన్= ఒప్పగా; వజ్ర= వజ్రాయుధంనుండి పుట్టిన; కీలా= జ్వాలలతో; నిభతన్= సమానంగా; మెఱుంగుల= కాంతులయొక్క; విలాసము= తళుకు; నింగిన్= ఆకాశంలో; వెలుంగన్= వెలుగగా; ఉద్భటుండు+ఐ= భయంకరుడై; పార్థు= అర్జునుడియొక్క; హృదయస్థలిన్= హృదయస్థానంలో; నారసము= బాణము; నిగిడించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఒంటినిండా బాణాలు వేసినప్పటికి బభ్రువాహనుడు వెనుకంజ వేయలేదు. అస్త్ర శస్త్ర విద్యా నిపుణుడైన ఆ రాజపుత్రుడు భయంకర పరాక్రమం ఒప్పగా వజ్రాయుధాగ్ని జ్వాలలవంటి కాంతులతో ఆకాశాన్ని ప్రకాశింపజేస్తున్న ఒక బాణాన్ని సూటిగా అర్జునుడి హృదయంలో గ్రుచ్చుకొనేటట్లు ప్రయోగించాడు.

అర్జునుఁడు బభ్రువాహనుని శరంబుచేతఁ బుడమిం ద్రెళ్ళుట (సం. 14-78-35)

**క. వడి నది వీఁపున వెడలినఁ। బడియెఁ బుడమి నర్జునుండు; పదపడి త్రెళ్ళెం**
**గొడుకును ము న్నతఁ డేసిన। బెడిదపుటేటుల యలంతఁ బృథ్వీనాథా! 64**

**ప్రతిపదార్థం:** పృథ్వీనాథా!= రాజా!, జనమేజయా!; అది= బభ్రువాహనుడి బాణము; వడిన్= వేగంగా; వీఁపునన్= వీపునుండి; వెడలినన్= దూసికొనిపోగా; అర్జునుండు= అర్జునుడు; పుడమిన్= నేలమీద; పడియెన్= పడ్డాడు; పదపడి= తరువాత; మున్ను= ఇంతకుముందు; అతఁడు= అర్జునుడు; ఏసిన= ప్రయోగించిన బాణాలయొక్క; బెడిదము= గట్టివైన; ఏటుల= దెబ్బలయొక్క; అలంతన్= బాధచేత; కొడుకును= అతడి కొడుకైన బభ్రువాహనుడుకూడా; త్రెళ్ళెన్= నేల కూలాడు.

**తాత్పర్యం:** జనమేజయా! బభ్రువాహనుడి బాణం అర్జునుడి హృదయంలో నిలువక అతడి వీపునుండి దూసికొనిపోయింది. అతడు భూమిమీద పడిపోయాడు. తరువాత అర్జునుడి బాణాల దెబ్బలవలన పుట్టిన బాధచేత అతడి కొడుకు బభ్రువాహనుడు కూడా నేలకూలాడు.

**వ. అట్లు తనపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగుచుఁ జిత్రాంగద యులూపి (చి) యుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె; నట్లు వచ్చి యచ్చెలువ యయ్యిరువురం గనుంగొని యుల్లంబు జల్లనఁ దల్లడిల్ల మూర్ఛమునింగి మేదినిం బడి, కొంత వడికిం దెలిసి యులూపి నాలోకించి. 65**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తన పతియును= తన భర్తయూ; సుతుండును= కుమారుడునూ; భండనంబునన్= యుద్ధంలో; పడుట= నేలకూలటం; విని; శోక= శోకంచేత; ఆక్రాంత= ఆక్రమించబడినది; అగుచున్= అవుతూ; చిత్రాంగద; ఉలూపి (చి)యున్= ఉలూపియు; తోడన్+అ= వెనువెంట; చనుదేరన్= రాగా; అచ్చటికిన్= అక్కడకు - యుద్ధభూమికి; వచ్చెన్= వచ్చింది; అట్లువచ్చి; ఆ+చెలువ= ఆ స్త్రీ; చిత్రాంగద; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరినీ (భర్తను, కుమారుడినీ); కనుంగొని= చూచి; ఉల్లంబు= హృదయం; జల్లనన్= జల్లుమని; తల్లడిల్లన్= భయపడగా, దుఃఖపడగా; మూర్ఛన్= మూర్ఛలో; మునింగి= మునిగి; మేదినిన్= భూమిమీద; పడి; కొంతవడికిన్= కొంతసేపటికి; తెలిసి= తేరుకొని; ఉలూపిన్= ఉలూపిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** తన భర్తా, కుమారుడూ యుద్ధంలో నేలగూలారని విన్న చిత్రాంగద దుఃఖంలో మునిగిపోయింది. వెనువెంటనే ఉలూపి కూడా రాగా, ఆమె యుద్ధభూమికి వచ్చి, మగనినీ కొడుకునూ చూచింది. గుండె జల్లుమనగా మూర్ఛచెంది నేలమీద పడి కొంతసేపటికి తేరుకొని ఉలూపిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'నీ కతంబునఁ బతి నాకుమారునిచేత । ననిఁ బడియున్నవాఁ డతివ! కంటె;**
**నీవు పతివ్రత గావె; ధర్మజ్ఞవు । గాని దానవె; యేమి కారణమున**
**నిది కార్యముగఁ జెప్పి తీపిన్నవానికిఁ । గొడుకు దిక్కున నాకు నడలు లేదు;**
**వరుఁజూచి పొక్కెద; వామాక్షి! నీ దెసఁ దప్పు సేసినను నీతనిఁ గృపార్ద్ర**

**తే. చిత్తవై యెల్లభంగి సంజీవితుఁడుగఁ । జేయవమ్మ; యక్కట! నాథు నేయఁ బనిచి**
**చావు చూచియు వగవవు; సాహసమున । కొలఁది లేదు; ని న్నేమందుఁ గులపవిత్ర!' 66**

**ప్రతిపదార్థం:** అతివ!= కాంతా!; నీకతంబునన్= నీవు కారణంగా; నా= నాయొక్క; కుమారునిచేతన్= కుమారుడివలన; పతి= భర్త; అనిన్= యుద్ధమునందు; పడి= కూలిపోయి; ఉన్నవాఁడు= ఉన్నాడు; కంటి(వి)+ఎ?= చూచితివా?; నీవు; పతివ్రత= పతివ్రతవు; కావు+ఎ= కావా?; ధర్మజ్ఞవు= ధర్మం తెలిసినదానవు; కానిదానవు+ఎ?= కానిదానవా?; ఏమి= ఏ; కారణమునన్= కారణంచేత; ఈ పిన్నవానికిన్= ఈ చిన్నవాడికి; ఇది; కార్యము+కన్= చేయదగినదిగా; చెప్పితి(వి)= చెప్పావు; కొడుకు= కొడుకుయొక్క; దిక్కునన్= విషయమున; నాకున్= నాకు; అడలు= దుఃఖం; లేదు; వామ= అందమైన; అక్షి!= కన్నులు కలదానా; వరున్= భర్తను; చూచి; పొక్కెదన్= పరితపింతును; నీ దెసన్= నీ యెడ; తప్పు; చేసినను= చేసినప్పటికిని; ఈతనిన్= భర్తను; కృపా= దయచేత; ఆర్ద్ర= కరగిన; చిత్తవు+ఐ= మనస్సుకలదానవై; ఎల్లభంగిన్= అన్ని విధాలా, నీ శక్తు లన్నీ ఉపయోగించి; సంజీవితుఁడు+కన్= తిరిగి బ్రదికిన వాడినిగా; చేయుము+అమ్మ!= చేయుమమ్మ!; అక్కట!= అయ్యో!; నాథున్= భర్తను; ఏయన్= బాణాలతో కొట్టగా; పనిచి= ఆజ్ఞాపించి; చావు= అతడి చావు; చూచియున్= కనులార చూచికూడా; వగవవు= విచారించవు; సాహసము+కొలఁది= సాహసంయొక్క మితి; లేదు; కుల= కులమును; పవిత్ర= పావనము చేయుదానా!; నిన్నున్= నిన్ను; ఏమి= ఏమని; అందున్?= అనగలను?

**తాత్పర్యం:** ఉలూపీ! నీ మూలాన నా కుమారుడివలన భర్త యుద్ధభూమిలో పడిపోయాడు. చూచావా! నీవు పతివ్రతవు కావా? ధర్మం తెలిసినదానవు కావా? ఏ కారణంచేత తండ్రితో యుద్ధంచేసి పడగొట్టుమని ఈ చిన్నవాడికి చెప్పావు. నా కొడుకును గూర్చి నాకు ఏ చింతా లేదు. భర్తను చూచి మాత్రమే పరితపిస్తున్నాను. ఒకవేళ భర్త నీ విషయంలో తప్పు చేశాడే అనుకో! అయినప్పటికీ నీవు దయార్ద్రమైన అంతరంగంతో నీ శక్తులన్నీ ఉపయోగించి భర్తను పునర్జీవితుడిగా చేయవమ్మా! అయ్యో! భర్తను బాణాలతో కొట్టుమని ఆజ్ఞాపించి, అతడు చనిపోగా ఏ మాత్రమూ విచారించకుండా ఉన్నావు. నీ సాహసానికి మితి లేనట్లున్నది. కులపావనీ! నిన్ను ఏమనగలను?'

**వ. అని పలికి పార్థుం జేరంబోయి. 67**

**ప్రతిపదార్థం:** అని; పలికి= ఉలూపితో పలికి; పార్థున్= అర్జునుడిని; చేరన్= సమీపించగా; పోయి= సమీపించి.

**తాత్పర్యం:** అని ఉలూపితో పలికి అర్జునుడిని సమీపించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'మహిత కీర్తిలోల! మత్ప్రాణవల్లభ! । యన్యజనుల ప్రాణ మరసి కావఁ**
**జాలునట్టి నీకు నేల ప్రాణంబుల । నిట్లు వదలి పోవనిచ్చియుండ. 68**

**ప్రతిపదార్థం:** మహిత= గౌరవించబడిన; కీర్తి= కీర్తియందు; లోల!= ఆసక్తి కలవాడా!; మత్+ప్రాణ= నా ప్రాణాలయొక్క; వల్లభ!= నాథుడవైనవాడా!; అన్యజనుల= ఇతరులయొక్క; ప్రాణము; అరసి= పోషించి; కావన్= కాపాడటానికి; చాలు+అట్టి= సమర్థుడవైనట్టి; నీకున్= నీకు; ఇట్లు= ఈ విధంగా; ప్రాణంబులన్= ప్రాణాలను; వదలి= నిన్ను వదలి; పోవన్+ఇచ్చి= పోయేటట్లు చేసి; ఉండన్= ఉండగా; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** ఉదాత్త కీర్తి పరాయణా! ప్రాణేశ్వరా! నీవు ఇతరుల ప్రాణాలు కాపాడగల సమర్థుడవు. నీ ప్రాణాలు నీవు కాపాడుకొనలేక పోయా వేల?

**సీ. 'నాథ! నీ వెప్పుడు నన్ను మన్నింతువు; । కనువిచ్చి చూడక యునికి దగునె;**
**హయమున కెవ్వరు నడ్డంబు రాకుండ । నాఁగితి వగ్రజు నధ్వరంబు**
**వమ్మయిపోకుండ; లె మ్మిత్తురంగంబు । వెనుకొన వలవదే యనఘ! నీకు'**
**నని యార్తిఁ బలవించి యహిపుత్త్రి దెసఁ జూచి । 'సుతుఁ డెట్టులుండినఁ బతికి నిమ్ము**

**తే. జీవ; మాంద్రురఁ బెక్కండ్రఁ జేసికొనుట । పురుషులకుఁ దప్పె; భార్య లిత్తెరువునందు**
**నడవరే; యోర్చి నీదుమనమున నింత । యెఱిఁగి కలిగింపు వరు; వేయు నేల తల్లి!' 69**

**ప్రతిపదార్థం:** నాథ!= నాథా!; నీవు; ఎప్పుడున్= ఎప్పుడునూ; నన్నున్= నన్ను; మన్నింతువు= గౌరవిస్తావు; కనువిచ్చి= కన్నులు తెరచి; చూడక; ఉనికి= ఉండటం; తగును+ఎ?= తగునా?; అగ్రజు= అన్నగారియొక్క; అధ్వరంబు= యజ్ఞం; వమ్ము+అయి= భంగమై; పోక+ఉండన్= పోకుండా; ఎవ్వరున్= ఎవరునూ; హయమునకున్= గుర్రానికి; అడ్డంబురాక+ఉండన్= అడ్డుపడకుండా; ఆఁగితివి= ఆపితివి; లెమ్ము= లే!; అనఘ!= పాపంలేనివాడా!; నీకున్= నీకు; ఈ తురంగంబున్= ఈ గుర్రాన్ని; వెనుకొనన్= వెంటాడగా; వలవదు+ఏ?= వలదా?; అని; ఆర్తిన్= దుఃఖంతో; పలవించి= మొరపెట్టి; అహి= సర్పముయొక్క; పుత్త్రి=

కూతురుయొక్క; దెసన్= వైపు; చూచి; సుతుఁడు= కుమారుడు; ఎట్టులు= ఏ విధంగా; ఉండినన్= ఉన్నప్పటికిని; పతికిన్= భర్తకు; జీవము= ప్రాణం; ఇమ్ము= పోయుము; పురుషులకున్= మగవారికి; పెక్కం౦డ్రన్= పలువురను; ఆం౦డ్రురన్= స్త్రీలను; చేసికొనుట= పెండ్లియాడటం; తప్పు+ఎ?= దోషమా?; భార్యలు= భార్యలు కూడా; ఈ తెరువు+అందున్= మార్గంలో; నడవరు+ఏ= నడవరు కదా?; తల్లి!= తల్లీ!; నీదు మనమునన్= నీ మనస్సులో; ఓర్చి= సహించి; ఇంత= దీనినంతయును; ఎఱిఁగి= ఆలోచించి, తెలిసికొని; వరున్= భర్తను; కలిగింపు= బ్రతికించుము; వేయున్= వేయి మాటలు; ఏల= ఎందుకు?

**తాత్పర్యం:** 'నాథా! నీవు నన్నెప్పుడూ గౌరవిస్తుంటావు. అటువంటివాడవు కన్నులు తెరచి నన్ను చూడకుండటం తగునా? అన్నగారి యజ్ఞానికి భంగం కలుగకుండా ఎవ్వరూ గుర్రానికి అడ్డుపడకుండా ఆపావు కదా! పుణ్యాత్మా! లే లెమ్ము. నీవు గుర్రాన్ని వెంటాడవలదా?' అని చిత్రాంగద శోకించింది. తరువాత ఆమె ఉలూపివైపు చూచి 'కుమారుడు ఏమైనప్పటికీ భర్తను బ్రదికించుము. పలువురు స్త్రీలను వివాహమాడటం మగవారికి తప్పుకాదు కదా! భార్యలు ఈ దారి త్రొక్కరుకదా! (పలువురు భర్తలను కలిగియుండరని అర్థం). కాబట్టి మనసులో ఓర్పు వహించి దీనినంతా ఆలోచించి తల్లీ! భర్తను బ్రదికించుము. ఇంకా వేయిమాట లెందులకు?'

**వ. అని యంత నిలువక. 70**

**ప్రతిపదార్థం:** అని; అంతన్= అంతటితో; నిలువక= ఆగకుండా.

**తాత్పర్యం:** అని అంతటితో అగక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'కొడుకు చేతఁ జచ్చి పడియున్న యిక్కురు। కులవరేణ్యుఁ గరుణ గూరి నీవు**
**బ్రదుకఁ జేయకున్నఁ బ్రాయోపవేశన। మాచరింతు నహికులాగ్రగణ్య!' 71**

**ప్రతిపదార్థం:** అహికుల= నాగకులమునందు; అగ్రగణ్యా= మొదట లెక్కింపదగినదానా!; కొడుకుచేతన్= కొడుకువలన; చచ్చి; పడి+ఉన్న= యుద్ధభూమిలో పడియున్న; ఈ కురుకుల= ఈ కురుకులంలో; వరేణ్యున్= శ్రేష్ఠుడిని; కరుణ= దయ; కూరి= కలిగి; నీవు; బ్రదుకన్+చేయక= బ్రదికించక; ఉన్నన్= ఉంటే; ప్రాయ= మరణించుటకై; స్వకర్మత్యాగ పూర్వకంగా ఉపవాసం చేయటంతో; ఉపవేశనము= కూర్చుండటం; ఆచరింతున్= చేస్తాను.

**తాత్పర్యం:** 'నాగకులాగ్రగణ్యా! కొడుకుచేతిలో చచ్చి పడియున్న ఈ కురుకులశ్రేష్ఠుడిని నీవు బ్రతికించకపోతే నేను ప్రాయోపవేశం చేస్తాను.

**వ. అనిపలికి పతిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి, యాసీనయై యూరకుండె; నట్టియెడ బభ్రువాహ నుండు దెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి. 72**

**ప్రతిపదార్థం:** అని; పలికి; పతి= భర్తయొక్క; చరణంబులు= పాదాలు; శిరంబు= తలను; సోఁకన్= తాకేటట్లుగా; ప్రణమిల్లి= నమస్కరించి; ఆసీన+ఐ= కూర్చున్నదై; ఊరక+ఉండెన్= మిన్నక ఉండిపోయింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; బభ్రువాహనుండు; తెప్పిఱి= తేరుకొని; లేచి; ఆ పొలంతిన్= ఆ స్త్రీని, తల్లిని; చూచి.

**తాత్పర్యం:** అని చిత్రాంగద పలికి మగని కాళ్ళకు తల తగిలేటట్లుగా నమస్కరించి, కూర్చుండి మాటాడకుండా ఉన్నది. ఆ సమయంలో బభ్రువాహనుడు తేరుకొని లేచి తల్లిని చూచి.

**ఉ. 'ఇంచుకయేనియున్ వనట నెన్నఁడుఁ బొందని తల్లి నేఁడు నా**
**మంచితనంబునన్ బలుకు మాలిన నాథుని నుగ్రశత్రులన్**
**మంచు నినుండు వోలెఁ బరిమార్చు మహాబలుఁ జూచి యిట్లు దుః**
**ఖించుచు నుండఁ జూచితి; సకిల్బిషచిత్తున కింత పెద్దయే? 73**

**ప్రతిపదార్థం:** ఎన్నఁడున్= ఏ నాడునూ; ఇంచుక+ఏనియున్= కొంచెంకూడా; వనట= దుఃఖమును; పొందని; తల్లి; నేఁడు; నా= నాయొక్క; మంచితనంబునన్= గొప్పతనంచేత (పరాక్రమాతిశయంచేత అని భావం); పలుకు= మాట; మాలిన= లేని, మాటపలుకూ లేని (మూర్ఛపోయిన అని అర్థం); నాథునిన్= భర్తను; ఉగ్ర= భయంకరులైన; శత్రులన్= శత్రువులను; మంచున్= మంచును; ఇనుండు+పోలెన్= సూర్యుడివలె; పరిమార్చు= రూపుమాపే; మహాబలున్= గొప్పబలం కలవాడిని; చూచి; ఇట్లు= ఈ విధంగా; దుఃఖించుచున్= దుఃఖిస్తూ; ఉండన్= ఉండగా; చూచితిన్= చూచాను; సహ+కిల్బిష= పాపంతో కూడిన; చిత్తునకున్= మనస్సు కలవాడికి; ఇంత= ఇది; పెద్ద+ఏ?= మహాపాపమా?

**తాత్పర్యం:** 'మా అమ్మ ఏనాడూ దుఃఖం ఎటువంటిదో ఎరుగదు. నా పరాక్రమాతిశయంచేత మాటా పలుకూ లేని భర్తను, మంచును సూర్యుడివలె భయంకరులైన శత్రువులను రూపుమాపే బలిష్ఠుడిని చూచి ఈనాడు ఆమె దుఃఖిస్తున్నది. నేను ఆమె శోకస్థితిని కనులారా చూచాను. తండ్రిని పడగొట్టిన పాపాత్ముడికి తల్లిని దుఃఖం పాలు చేయటం మహాపాపం కానే కాదు గదా!

**విశేషం:** అలం: ఉపమ, అర్థాంతరన్యాసం.

**క. గాదిలి తనయుఁడ నగు నేఁ। గా దన కిక్కురుకులాగ్రగణ్యుని నిమ్మై**
**మేదినిఁ గూల్చితి మణికిర। ణోదాత్తంబైన మకుట ముర్విం బొందన్.' 74**

**ప్రతిపదార్థం:** గాదిలి= ప్రియమైన; తనయుఁడన్= కుమారుడను; అగు= అయిన; నేన్= నేను; కాదు= తగదు; అనక= అని తలంచక; ఈ కురుకుల= ఈ కురువంశంలో; అగ్రగణ్యునిన్= ముందు లెక్కించదగిన వాడిని; ఈ+మైన్= ఈ విధంగా; మణి= పొదిగిన మణులయొక్క; కిరణ= కాంతులచేత; ఉదాత్తంబు+ఐన= సుందరమైన; మకుటము= కిరీటం; ఉర్విన్= భూమిని; పొందన్= కూడగా; మేదినిన్= నేలమీద; కూల్చితిన్= కూలేటట్లు చేశాను.

**తాత్పర్యం:** ప్రియ పుత్రుడనయిన నేను ఇది తగదు అని భావించకుండా మణికిరణ మనోజ్ఞమైన కిరీటం నేలమీద పడేటట్లుగా ఈ కురువంశ శ్రేష్ఠుడిని కూల్చాను.'

**వ. అని విలాపంబు చేసి వివ్వచ్చుతోడం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన యాజ్ఞవల్క్య శిష్యప్రభృతి బ్రాహ్మణ జనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 75**

**ప్రతిపదార్థం:** అని; విలాపంబుచేసి= దుఃఖించి; విప్పచ్చుతోడన్= అర్జునుడితో; కూడన్= కూడా; యజ్ఞతురంగ= యజ్ఞాశ్వమును; అనుసారులు+ఐ= అనుసరిస్తున్నవారై; వచ్చిన; యాజ్ఞవల్క్య= యాజ్ఞవల్క్యుడియొక్క; శిష్య= శిష్యుడు; ప్రభృతి= మొదలైన; బ్రాహ్మణజనంబులు= బ్రాహ్మణులు; నయనపథ= కంటిచూపు ఒలయువారిని; ప్రాప్తులు= పొందినవారు; అగుటయున్= కాగా; (కన్నులకు కనబడగా అని అర్థం)

**తాత్పర్యం:** అని బభ్రువాహనుడు విలపించాడు. ఇంతలో అర్జునుడితోపాటు యజ్ఞాశ్వాన్ని అనుసరిస్తున్న యాజ్ఞవల్క్య శిష్యుడు మొదలగు బ్రాహ్మణులు అతడికి కనపడ్డారు.

**సీ.** **'అధ్వర హయ విషయంబుగా వీ రేమి। పనిచేయు వారొక్కొ? పార్థుఁ డిట్లు**
**పడియున్నవాఁడని పలవించి జనకుని। నిట్లు చేసిన పాపుఁ డెవ్విధమున**
**నాచరించునొకొ? ప్రాయశ్చిత్త మని పల్కి। పంద్రెండు వర్షముల్ భైక్షవృత్తి**
**నిమ్మహాత్ముని కపాలమ్మున నడపంగ। వలయుఁగా కొం డెద్ది గలుగ నేర్చు?'**

**ఆ.** **నని యులూపి దిక్కు గనుఁగొని 'నీవు ప। న్పంగఁ దండ్రి నిట్లు భండనమున**
**విగత జీవితుఁడుగఁ దెగఁ జేసితిని నింక। నెలమిఁ బొందు భరతకులపవిత్ర!'** **76**

**ప్రతిపదార్థం:** అధ్వర= యజ్ఞంయొక్క; హయ= గుఱ్ఱంయొక్క; విషయంబు+కాన్= పనిగా; వీరు= ఈ బ్రాహ్మణులు; ఏమి పని?= ఏ పని?; చేయువారు+ఒక్కొ= చేయువారో; పార్థుఁడు= అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; పడి; ఉన్నవాఁడు= ఉన్నాడు; అని; పలవించి= శోకించి; జనకునిన్= తండ్రిని; ఇట్లు= ఈ విధంగా; చేసిన= పడగొట్టిన; పాపుఁడు= పాపి; ఏ+విధమునన్= ఏ విధంగా; ప్రాయశ్చిత్తము= పాపాన్ని పోగొట్టేపని; ఆచరించున్+ఒకొ= చేయునో; అని; పల్కి= పలికి; పంద్రెండు= పన్నెండు; వర్షముల్= ఏండ్లు; ఈ మహత్+ఆత్ముని= ఈ గొప్ప ఆత్మగల వాడియొక్క; కపాలమ్మునన్= తల పుఱ్ఱెయందు; భైక్షవృత్తిన్= భిక్షాన్నమును భుజించే వ్యాపారం; నడపంగన్ వలయున్+కాక= చేయవలయునే తప్ప; ఒండు= మరొక విధానం; ఎద్ది= ఏదియూ; కలుగనేర్చున్= కలుగుతుంది; అని; ఉలూపి దిక్కున్= ఉలూపివైపు; కనుఁగొని= చూచి; నీవు; పన్పంగన్= ఆజ్ఞాపించగా; భండనమునన్= యుద్ధంలో; ఇట్లు= ఈ విధంగా; తండ్రిన్= తండ్రిని; విగత= పోయిన; జీవితుఁడుగన్= జీవిత కాలం కలవాడినిగా, జీవితం ముగిసేటట్లుగా; తెగన్+చేసితిని= చంపితిని; భరతకుల= భరతుడి వంశముయొక్క; పవిత్ర= శుద్ధిని కలిగించుదానా!, పాపాదులను పోగొట్టేదానా; ఎలమిన్= ఆనందపారవశ్యమును; ఇంకన్= ఇక; పొందు= పొందుము.

**తాత్పర్యం:** 'యజ్ఞాశ్వానికి సంబంధించిన ప్రధాన కార్యాలలో ఏ విధిని నిర్వహించటానికి ఈ బ్రాహ్మణులు వచ్చారో! అర్జునుడు ఈ విధంగా యుద్ధభూమిలో పడి ఉన్నాడు కదా!' అని బభ్రువాహనుడు శోకించాడు. 'తండ్రిని ఈ విధంగా పడగొట్టిన పాపి ప్రాయశ్చిత్తం ఏ విధంగా చేసికొనునో!' అని అన్నాడు. పన్నెండేళ్ళు మహాత్ముడైన అర్జునుడి కపాలంలో భిక్షాన్నం భుజించవలయునే తప్ప మరియొక విధమైన ప్రాయశ్చిత్తం కనబడదు' అని పలికాడు. అతడు ఉలూపివైపు చూచి 'నీవు ఆజ్ఞాపించగా యుద్ధంలో ఈ విధంగా తండ్రిని అకాలమరణం పాలుచేశాను. భరతకుల పరిశుద్ధి కారిణీ! ఇక నీవు ఆనందపారవశ్యం పొందుము.

**వ. అని వెండియు.** **77**

**తాత్పర్యం:** అని ఇంకనూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'జనకునిఁ దెగటార్చిన పా। పునకుం బ్రాణంబు తోడి పొత్తు మనంగా**
**మనమునఁ దాలిమి గలుగునె?। చనుఁగాక యతండు చనిన సద్గతిక తగన్.'** **78**

**ప్రతిపదార్థం:** జనకునిన్= తండ్రిని; తెగటార్చిన= చంపిన; పాపునకున్= పాపికి; ప్రాణంబుతోడన్+పొత్తు= ప్రాణముల సంబంధం; మనంగాన్= ఉండగా; మనమునన్= మనస్సులో; తాలిమి= శాంతి; కలుగును+ఎ?= పుట్టునా? (పుట్టదని భావం); అతండు= తండ్రి; చనిన= వెళ్ళిన; సత్+గతికిన్+అ= ఉత్తమలోకానికే; తగన్= సదాచారానికి తగినట్లుగా; చనున్+కాక= వెళ్ళును గాక!

**తాత్పర్యం:** 'తండ్రిని చంపిన పాపికి ప్రాణాలున్నంత వరకూ మనశ్శాంతి కలుగదు. తండ్రి వెళ్ళిన ఉత్తమలోకానికే కొడుకు కూడా ధర్మానికి తగ్గట్లుగా వెళ్ళాలి.'

**వ. అని యుగ్గడించి స్థావరంబులు జంగమంబులు నగు భూతంబులు విన, భుజంగపుత్త్రియు నాకర్ణింపఁ; జెప్పి 'వ్రతంబు నిష్ఠం బూనెద; మా తండ్రి లే కునికి నిజంబగు నేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమ కృత్యంబు; వీరవధంబు పాపం; బంతకంటెను రాజవధం బెక్కు; డంతకంటెఁ గడు నగ్గలంబు ధార్మికవధంబు; జనక వధ పాతకం బింత యని కొలంది యిడరా; దిట్లుండ వీరుండును రాజును ధార్మికుండును జనకుండును నైన యిమ్మహితాత్ముని వధియించిన మహాపాతకుని కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే; దీని నడపెద'? నని పలికి యప్పరమనియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె; నప్పుడు.** **79**

**ప్రతిపదార్థం:** అని; ఉగ్గడించి= వక్కాణించి; స్థావరంబులు= కదలనివి, అచేతనములు; జంగమంబులున్= కదిలేవి, చేతనములు; అగు= అయిన; భూతంబులు= పదార్థాలు; వినన్= వినగా; భుజంగ= సర్పముయొక్క; పుత్త్రియున్= కుమార్తెయు; ఆకర్ణింపన్= వినగా; చెప్పి; వ్రతంబు= సదాచారంయొక్క; నిష్ఠన్= శ్రద్ధను; పూనెదన్= పూనుతాను; మా తండ్రి= అర్జునుడు; లేక+ఉనికి= లేకుండటం, మరణించటం; నిజంబు+అగు+ఏనిన్= నిజమయితే; ప్రాయోపవేశంబు+అ= మరణార్థం ఉపవసించి కూర్చుండటం; ఉత్తమ= మంచిదైన; కృత్యంబు= పని, వీర= వీరుడియొక్క; వధంబు= చంపటం; పాపంబు= పాపం; అంతకంటెను= వీరవధకంటె; రాజ= రాజుయొక్క; వధంబు= చంపుట; ఎక్కుడు= మహాపాపము; అంతకంటెన్= రాజ వధకంటె; ధార్మిక= ధర్మమునందు చరించువాడియొక్క; వధంబు= వధ; కడున్= మిక్కిలి; అగ్గలంబు= అధికం; మహత్తరపాపం; జనక= తండ్రియొక్క; వధ= చంపుటవలన కలుగు; పాతకంబు= పాపం; ఇంత= ఈ పరిమాణం కలది; అని; కొలంది= మితి; ఇడరాదు= పెట్టటం శక్యం కాదు; ఇట్లు= వాస్తవము ఈ విధంగా; ఉండన్= ఉండగా; వీరుండును= వీరుడునూ; రాజును; ధార్మికుండును= ధర్మమునందు చరించేవాడునూ; జనకుండును= తండ్రియూ; ఐన= అయిన; ఈ మహిత= పూజించబడిన; ఆత్మునిన్= ఆత్మకలవాడిని; వధియించిన= చంపిన; మహత్= గొప్ప; పాతకునికిన్= పాపికి; ఏతద్= ఈ; వ్రత= ప్రాయోపవేశ వ్రతముయొక్క; అనుష్ఠానంబు= ఆచరణమే; తక్కన్= తప్ప; ఒండు= మరియొక, ఇతరమైన; మెయిన్= విధంగా; నిష్కృతి= పాపవిముక్తి; కలుగున్+ఏ?= కలుగునా?; దీనిన్= ప్రాయోపవేశాన్ని; నడపెదన్= ఆచరిస్తాను. అని; పలికి; ఆ పరమ= ఆ అధికమైన; నియతుండు= నియమం కలవాడు; ఉపస్పర్శనంబు= ఆచమనం (మూడుసార్లు నీరు లోపలికి పుచ్చుకొనటం); ఆచరించి= చేసి; పలుకులు= మాటలు; ఉడిగి= మాని; కూర్చుండెన్= కూర్చున్నాడు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని అక్కడ ఉన్నవారు వింటూ ఉండగా బభ్రువాహనుడు వక్కాణించాడు. అంతేకాక సృష్టియందలి సర్వచేతనాచేతనములూ నాగకన్య అయిన ఉలూపీ వింటూ ఉండగా పలికాడు. మరియు 'నేను సదాచార శ్రద్ధ పాటిస్తాను. మాతండ్రి మరణించటం నిజమయితే ప్రాయోపవేశమే నాకు చేయదగిన మంచిపని. వీరవధ పాపం. అంతకంటె రాజవధ మహాపాపం. దానికంటె ధార్మికవధ మహత్తర పాపం. ఇక జనకవధ ఇంతటిదని మితిపెట్టలేము. సత్యమిట్టిది కాబట్టి వీరుడూ, రాజూ, ధార్మికుడూ, తండ్రీ అయిన మహాత్ముడిని చంపిన మహాపాపికి ప్రాయోపవేశం చేయటంవలన తప్ప అన్యవిధంగా పాపవిముక్తి లేదు. కాబట్టి ప్రాయోపవేశమే చేస్తాను' అని చెప్పి, ఆ పరమ నియమబద్ధుడు ఆచమనంచేసి మౌనియై కూర్చున్నాడు. అప్పుడు.

ఉలూపి(చి) సంజీవనమణిచేత నర్జును బ్రదికించుట (సం. 14-81-1)

**ఆ.** **అట్లు తెంపు చేసి యాసీను లైన యా । తల్లిఁ, గొడుకు, నవనిఁ ద్రెళ్ళియున్న**
**విజయుఁ జూచి పాఁపవెలఁది సంజీవన । మణిఁ దలంచెఁ గురుసమాజముఖ్య!** **80**

**ప్రతిపదార్థం:** కురుసమాజ= కురురాజ సమూహంలో; ముఖ్య!= శ్రేష్ఠుడా!; అట్లు= ఆ విధంగా; తెంపుచేసి= సాహసించి; ఆసీనులు+ఐన= కూర్చున్నవారైన; ఆ తల్లిన్= ఆ తల్లినీ, చిత్రాంగదనూ; కొడుకున్= కొడుకునూ; అవనిన్= భూమిమీద; త్రెళ్ళి+ఉన్న= పడి ఉన్న; విజయున్= అర్జునుడినీ; చూచి; పాఁపవెలఁది= నాగకాంత ఉలూపి; సంజీవన= తిరిగిబ్రదికించే; మణిన్= మణిని; తలంచెన్= స్మరించింది.

**తాత్పర్యం:** కురురాజశ్రేష్ఠా! ఉలూపి ఆ విధంగా సాహసించి కూర్చున్న చిత్రాంగదనూ, బభ్రువాహనుడినీ, యుద్ధభూమిలో పడి ఉన్న అర్జునుడినీ చూచి తిరిగి బ్రదికించే సంజీవన మణిని స్మరించింది.

**వ.** **తలంచినం భుజంగమంబులకుఁ బరాయణంబైన యమ్మణి యమ్మహాభాగ హస్తతలంబునకు వచ్చిన నా భామిని భభ్రువాహను నాననం బాలోకించి.** **81**

**ప్రతిపదార్థం:** తలంచినన్= స్మరించగా; భుజంగమంబులకున్= సర్పాలకు; పరాయణంబు+ఐన= ప్రియమైనదైన; ఆ+మణి; ఆ మహాభాగ= మహాపవిత్రయొక్క; హస్తతలంబునకున్= అరచేతకి; వచ్చినన్= రాగా; ఆ భామిని= ఆ స్త్రీ - ఉలూపి; బభ్రువాహను= బభ్రువాహనుడియొక్క; ఆననంబు(న్)= ముఖమును; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** స్మరించిన వెంటనే నాగజాతివారికి ప్రియమైన ఆ సంజీవనమణి ఉలూపి అరచేతిలో నిలిచింది. అప్పుడు ఆమె బభ్రువాహనుడి ముఖం చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **విజయుండు చచ్చునే వేఁదురులార! యిం । ద్రునిచేత నైన; నీతనికి నొక్క**
**ప్రియము సేయంగఁ గోరియును నీ కొలఁది యా । రయు బుద్ధి నీతండు రణ మొనర్పఁ**
**దలఁచిన నివ్వీరుతలఁపు సిద్ధింపంగఁ । జేయుటకును నింత సేయవలసె**
**నాకుఁ; గావున మోహనంబగు మాయా ప్ర । యోగంబు నడపితి నుజ్జ్వలాత్మ!**

**తే.** **నరుఁడు నారాయణుఁడు; మహత్తరము సువ్వె । యితని తేజ; మెవ్వరికిని నెట్లు దాని**
**నార్పవచ్చు; మీ వగ పెల్లఁ దీర్ప నిపుడ । యుత్థితుం డగు నీ కౌరవోత్తముండు.** **82**

**ప్రతిపదార్థం:** వే(దురులార!= వెర్రులార!; ఇంద్రునిచేతన్= ఇంద్రుడిచేతను; ఐనన్= అయినను; విజయుండు= అనేక విజయాలు పొందినవాడు అర్జునుడు; చచ్చున్+ఏ?= చనిపోవునా?; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; ఆత్మ= ఆత్మకలవాడా!, బభ్రువాహనా!; ఈతనికిన్= అర్జునుడికి; ఒక్క= ఒక; ప్రియము= మేలు; చేయన్= చేయగా; కోరియును= కోరియూ; నీ= నీయొక్క; కొల(ది= శక్తి; ఆరయు= పరీక్షించే; బుద్ధిన్= తలంపుతో; ఈతండు= ఈ అర్జునుడు; రణము= యుద్ధం; ఒనర్పన్= చేయగా; తలచినన్= నిశ్చయించగా; ఈ వీరు= ఈ వీరుడియొక్క; తల(పు= కోరిక; సిద్ధింపంగన్= నెరవేర్పగా; చేయుటకును= చేయటానికీ; నాకున్= నాకు; ఇంత= ఈ పెద్దపని; చేయవలసెన్= చేయవలసి వచ్చింది; కావునన్= కావున; మోహనంబు= మూర్ఛ కలిగించేది; అగు= అయిన; మాయా= మాయయొక్క; ప్రయోగంబు= ప్రయోగం; నడపితిన్= చేశాను; నరు(డు= అర్జునుడు; నారాయణు(డు; ఇతని= ఇతడియొక్క; తేజము= తేజస్సు; మహత్తరము= చాలా గొప్పది; చువ్వె= సుమా!; దానికిన్= ఆ తేజస్సును; ఎవ్వరికినిన్= ఎటువంటి వారికైనను; ఎట్లు= ఏ విధంగా; ఆర్పన్= రూపుమాపగా; వచ్చున్?= సాధ్యమౌతుంది?; ఈ కౌరవ= ఈ కౌరవులలో; ఉత్తముండు= శ్రేష్ఠుడు; మీ= మీయొక్క; వగపు= విచారం; ఎల్లన్= అంతయూ; తీర్పన్= పోగొట్టగా; ఇపుడు+అ=ఇప్పుడే; ఉత్థితుండు= లేచినవాడు; అగున్= అవుతాడు.

**తాత్పర్యం:** వెర్రులారా! ఇంద్రుడిచేతనైనా అర్జునుడు చనిపోతాడా! నేను ఇతడికి గొప్ప మేలు చేయాలని కోరాను. అదీగాక నీ శక్తి పరీక్షించాలనే తలంపుతో నీతో యుద్ధం చేయ నిశ్చయించిన ఇతడి కోర్కె నెరవేర్ప నిర్ణయించాను. ఈ రెండు హేతువుల వలన మూర్ఛపోయేటట్లుగా మాయా ప్రయోగం చేశాను. అర్జునుడు నారాయణుడే. ఇతడి తేజస్సు చాలా గొప్పది. దానిని ఏ విధంగానైనా నశింపజేయటం ఎవ్వరికీ సాధ్యంకాదు. మీ విచారం తొలగించటానికి ఈ కౌరవశ్రేష్ఠుడు ఇప్పుడే లేస్తాడు.

**వ. 'మాయా ప్రయోగంబ; వేఱొండుగాదు; నీకు మీతండ్రితోడ భండనంబు సేయ బుద్ధి పుట్టించితి; ఇంతమాత్ర' యని తత్ప్రదేశంబున నున్న యెల్లజనంబులు నుల్లంబుల నానందంబు నొంద( బలికి, యమ్మణిపూరపురపతి కరతలంబున నమ్మణి యిడి, 'దీని నిమ్మహాత్ముని హృదయదేశంబు మోపు', మనవుడు నతం డట్ల చేయుట యుం. బార్థుండు ప్రత్యుజ్జీవితుండై. 83**

**ప్రతిపదార్థం:** మాయా= మాయయొక్క; ప్రయోగంబు+అ= ప్రయోగమే; వేఱు+ఒండు= మరియొకటి; కాదు; మీ తండ్రితోడన్= మీ తండ్రితో; భండనంబు= యుద్ధం; చేయన్= చేయగా; నీకున్= నీకు; బుద్ధి= ఆలోచన; పుట్టించితిన్= కలిగేటట్లు చేశాను; ఇంతమాత్ర= ఇంతే; అని; తద్= ఆ; ప్రదేశంబునన్= చోటున; ఉన్న; ఎల్లన్+జనంబులున్= జనులందరూ; ఉల్లంబులన్= హృదయాలలో; ఆనందంబున్= ఆనందమును; ఒందన్= పొందగా; పలికి; ఆ మణిపూర= ఆ మణిపూరమనే; పుర= పట్టణంయొక్క; పతి= నాథుడియొక్క; కరతలంబునన్= అరచేతియందు; ఆ మణి= ఆ సంజీవనమణి; ఇడి= ఉంచి; దీనిన్= ఈ మణిని; ఈ మహత్+ఆత్ముని= పెద్దమనస్సుకలవాడియొక్క; హృదయదేశంబు= హృదయస్థానాన్ని; మోపుము= ఆనించుము; అనవుడున్= అనిన తరువాత; అతండు= బభ్రువాహనుడు; అట్లు+అ= అట్లే, ఉలూపి చెప్పిన విధంగానే; చేయుటయున్= చేసిన పిదప; పార్థుండు= అర్జునుడు; ప్రతి+ఉజ్జీవితుండు+ఐ= తిరిగి బ్రదికినవాడై.

**తాత్పర్యం:** 'ఇది మాయా ప్రయోగమే కాని మరియొకటి కాదు' అని ఉలూపి అన్నది. ఆ మాటలు విని అక్కడివారందరూ ఆనందించారు. అప్పు డామె ఆ మణిని బభ్రువాహనుడి అరచేతిలో ఉంచి దీనిని మహాత్ముడైన అర్జునుడి హృదయస్థానాన పెట్టు' మని పలికింది. బభ్రువాహనుడు ఆమె చెప్పినట్లే చేసిన వెంటనే అర్జునుడు తిరిగి బ్రతికాడు.

**తే.** **లేచి కూర్చుండి కలయంగఁ జూచి యెఱ్ఱ। సెరల కాంతియు దంతరుచియును బెరయ**
**నతి మనోహరముగఁ దనసుతునితోడ। 'మనుజనాయక! కుశలమే?' యనుడు నతఁడు. 84**

**ప్రతిపదార్థం:** లేచి= అర్జునుడు లేచి; కూర్చుండి; కలయంగన్= అంతటా, నలువైపులా; చూచి; అతి= మిక్కిలి; మనోహరముగన్= అందంగా; ఎఱ్ఱ= కంటియందలి ఎర్రని; సెరల= గీరల; కాంతియున్= కాంతియూ; దంత= పండ్లయొక్క తెల్లని; రుచియును= కాంతియూ; బెరయన్= కూడగా; తన= తనయొక్క; సుతునితోడన్= కొడుకుతో; మనుజనాయక!= రాజా!; కుశలము+ఏ?= సేమమే కదా?; అనుడున్= అని అనగా; అతఁడు= ఆ బభ్రువాహనుడు.

**తాత్పర్యం:** అర్జునుడు లేచి కూర్చుండి నాలుగు దిక్కులా చూచాడు. అతడి కన్నులలోని ఎర్రగీరల కాంతీ, తెల్లని పండ్లకాంతీ చాలా అందంగా కలిసిపోయినవి. అప్పుడు అతడు తన కొడుకును 'రాజా! సేమమే కదా!' అని ప్రశ్నించాడు. పిదప బభ్రువాహనుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **వినయ మారంగ నాతని చరణంబుల। కెఱఁగి 'భవత్పుణ్య వీక్షణమున**
**నఖిలంబుఁ గుశలంబ' యనిన 'నిజ్జనముల। మొగములయందెల్ల వగపు దోఁచి**
**యచ్చెరువాటును హర్షంబుఁ గదిరెడు;। నిది యేమి చెప్పవే యెఱుఁగు దేని;**
**నాచెప్పినట్ల రణంబున కేతెంచి। తీవు; చిత్రాంగద యేల వచ్చె?**

**ఆ.** **నిచ్చటికి నులూపి(చి) యేమిటి కిపుడు చ। న్దెంచె?' ననుడు భక్తి నిర్భరముగ**
**నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మొగిచి య। య్యహి తనూజఁ జూపి యతనితోడ. 85**

**ప్రతిపదార్థం:** వినయము; ఆరంగన్= నిండగా; అతని= అర్జునుడియొక్క; చరణంబులకున్= కాళ్ళకు; ఎఱఁగి; భవత్= మీయొక్క; పుణ్య= పవిత్రమైన; వీక్షణమునన్= చూపుచేత; అఖిలంబున్= సమస్తమునూ; కుశలంబు+అ= సేమమే; అనినన్= అనగా; ఈ జనములు= ఈ జనులయొక్క; మొగముల+అందున్= ముఖాలలో; ఎల్లన్= అంతటా; వగపు= విచారం; తోఁచి= కనబడి; అచ్చెరువాటును= ఆశ్చర్యమూ; హర్షంబు= సంతోషమూ; కదిరెడున్= కలుగుతున్నవి; ఎఱుఁగుదు+ఏని= తెలిసినవాడవైతే; ఇది; ఏమి= ఏమిటో; చెప్పవే= చెప్పుమా; ఈవు; నా+చెప్పిన+అట్ల= నేను చెప్పిన విధంగానే; రణంబునకున్= యుద్ధానికి; ఏతెంచితి= వచ్చావు; చిత్రాంగద; ఏల= ఎందువలన; వచ్చెన్= వచ్చింది. ఇచ్చటికిన్= ఇక్కడకు; ఉలూపి(చి)= ఉలూపి; ఇపుడు; ఏమిటికిన్= దేనికి; చన్+తెంచెన్= వచ్చింది; అనుడున్= అనగా; భక్తి= భక్తిచేత; నిర్భరము+కన్= నిండి ఉండేటట్లుగా; అతఁడు= బభ్రువాహనుడు; చాఁగి= సాష్టాంగపడి, మ్రొక్కి; హస్తముల్= చేతులు; మొగిచి= మోడ్చి; ఆ అహి= ఆ నాగరాజుయొక్క; తనూజన్= పుత్రికను; చూపి; అతనితోడన్= అర్జునుడితో.

**తాత్పర్యం:** పరిపూర్ణ వినయంతో అర్జునుడి కాళ్ళకు మ్రొక్కి 'మీ పావన కటాక్ష వీక్షణం చేత అందరూ సేమమే' అని అన్నాడు. తరువాత అర్జునుడు 'నాకు వీరి ముఖాలలో విచారం గోచరించి ఆశ్చర్యమూ సంతోషమూ కలుగుతున్నవి. వీరి విచారానికి కారణం నీకు తెలిస్తే నాకు చెప్పుము. నీవు నేను చెప్పిన విధంగానే యుద్ధం చేయటానికి వచ్చావు. మరి ఇక్కడకు చిత్రాంగద ఎందుకు వచ్చింది? ఉలూపి ఇప్పుడు దేనికి వచ్చింది?' అని అడిగాడు. అంతట బభ్రువాహనుడు సాష్టాంగ నమస్కారం చేసి, లేచి చేతులు మొగిడ్చి నాగకన్య అయిన ఉలూపిని చూపి అర్జునుడితో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. 'అంతయు నిమ్మహానుభావ నడుగుం' డనిన, గాండీవి యా యింతివదనం బాలోకించి 'కురువంశ నిస్తారకా! నీ రాకకుం గారణంబేమి?; ' యిమ్మణిపూర పురనాథుని దెస నావలన భవదీయ చిత్తంబు ప్రసన్నంబయి యున్న యదియె?; యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీకేమియు నపరాధంబు సేయము గదా' యనుటయు. 86**

**ప్రతిపదార్థం:** అంతయున్= వృత్తాంతమంతయూ; ఈ మహానుభావన్= మహిమగలదానిని; అడుగుండు= అడుగుడు; అనినన్= అనగా; గాండీవి= అర్జునుడు; ఆ ఇంతి= ఆ స్త్రీయొక్క; వదనంబు= ముఖమును; ఆలోకించి= చూచి; కురువంశ= కురువంశమును; నిస్తారకా!= ఉద్ధరించుదానా!; నీ= నీయొక్క; రాకకున్= వచ్చుటకు; కారణంబు= కారణం; ఏమి?= ఏది?; ఈ మణిపూరపుర= ఈ మణిపూర పురముయొక్క; నాథునిదెసన్= నాథుడియెడ; నా వలనన్= నా యెడల; భవదీయ= నీ యొక్క; చిత్తంబు= మనస్సు; ప్రసన్నంబు+ఐ= తృప్తి పొందినదై, దయగలదై; ఉన్న+అది+ఎ?= ఉన్నదా?; ఈ నరపతియును= ఈ రాజునూ; నేనును= నేనూ; చిత్రాంగదయున్= చిత్రాంగదయూ; నీకున్= నీ యెడ; ఏమియున్= ఏమియూ; అపరాధంబు= తప్పు; చేయము+కదా= చేసి ఉండము కదా; అనుటయున్= అని అన్నతరువాత. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** 'వృత్తాంతమంతా ఈ మహానుభావను అడుగుము' అని అన్నాడు. అప్పుడు అర్జునుడు ఉలూపిని తేరిపారజూచి 'కురుకులోద్ధారకా! నీ రాకకు కారణ మేది? బభ్రువాహనుడియెడలా, నా యెడలా నీ మనస్సు తృప్తి వహించి ఉన్నదా? ఇతడు గానీ, నేనుగానీ, చిత్రాంగద గానీ నీ యెడ తప్పుచేశామా? అని అన్నాడు.

**ఉలూపి(చి) యర్జునునితో వసువుల కోపప్రసాదంబుల నెఱింగించుట (సం. 14-82-5)**

**సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో। 'నాథ! నీయం దొకనాఁడు నెగ్గు**
**గలదె?; నా పుత్త్రుని వలనఁ గీ డెక్కడి। యది?; వినీతాత్మ చిత్రాంగదయును;**
**గినియక విను; మేను వినతోత్తమాంగ నై। చెప్పెద; నీ సుతుచేత నీకు**
**నావహిల్లె నశుభ; మాహవంబున నీవు। గంగాతనూజు శిఖండి నెపము**

**తే. గాఁగ దెగటార్చి; తది పాతకంబు; దాని। కనఘ! నిష్కృతి సేయక తనువు విడిచి**
**తేని నరకవాసమునకుఁ బోనువలయుఁ;। గాన నిష్కృతిసేసితిఁ గడఁగి వచ్చి. 87**

**ప్రతిపదార్థం:** ఆ ఇంతి= ఆ స్త్రీ ఉలూపి; అల్లన్+అ= మెల్లగా; నవ్వుచున్= నవ్వుతూ; అతనితోన్= అర్జునుడితో; నాథ!= నాథా!; నీయందున్= నీయెడ; ఒకనాఁడున్= ఏనాడైనను; ఎగ్గు= తప్పు; కలదు+ఎ= ఉన్నదా; నా= నాయొక్క; పుత్త్రుని వలనన్= కుమారుడివలన, బభ్రువాహనుడివలన; కీడు= తప్పు; ఎక్కడి+అది?= ఎక్కడ ఉన్నది?; చిత్రాంగదయును= చిత్రాంగద కూడా; వినీత= నాగరకతను పొందిన, సుశిక్షితమైన; ఆత్మ= మనస్సు కలది; కినియక= కోపగించక; వినుము; ఏను= నేను; వినత= ముందునకు వాలిన; ఉత్తమాంగన్= తల కలదానను (వినయంతో తలవాల్చిన దానను అని అర్థం); ఐ; చెప్పెదన్= చెప్తుతాను; నీకున్= నీకు; నీ= నీయొక్క; సుతుచేతన్= కుమారుడివలన; అశుభము; ఆవహిల్లెన్= కలిగింది; నీవు; ఆహవంబునన్= యుద్ధంలో; శిఖండి; నెపము= మిష; కాఁగన్= కాగా; గంగా= గంగానదియొక్క; తనూజున్= కుమారుడిని, భీష్ముడిని; తెగటార్చితి(వి)= చంపితివి; అది= భీష్మవధ; పాతకంబు= మహాపాపం; అనఘ!= పాపరహితా! పుణ్యాత్మా; దానికిన్= ఆ మహాపాపానికి; నిష్కృతి= ప్రాయశ్చిత్తం; చేయక; తనువు విడిచితి (వి)+ఏనిన్= శరీరమును వదలితే, మరణిస్తే; నరక= నరకంయొక్క; వాసమునకున్= నివసించటానికి; పోను+వలయున్= పోవలయును; కాన; కడఁగి=పూనుకొని; వచ్చి; నిష్కృతి= ప్రాయశ్చిత్తం - ప్రతిక్రియ; చేసితిన్= చేశాను.

**తాత్పర్యం:** మెల్లగా నవ్వుతూ ఉలూపి అర్జునుడితో 'ప్రాణేశ్వరా! ఏనాడూ నీవు తప్పుచేయలేదు. నా కుమారుడివలన తప్పు ఎక్కడ? ఇక చిత్రాంగద అంటావా సుశిక్షితమైన మనస్సు కలదే. కోపగించకుండా వినుము. వినయంతో తలవాల్చి నమస్కరించి చెప్పుతాను. నీ కుమారుడివలన నీకు అశుభం కలిగింది. నీవు యుద్ధంలో శిఖండి మిషగా భీష్ముడిని పడగొట్టావు. అది మహాపాపం. ఆ పాపానికి ప్రాయశ్చిత్తం చేసికొనకుండా నీవు మరణిస్తే నరకానికి వెళ్ళవలసి ఉంటుంది. అందువలన నేను పూనుకొని వచ్చి నీకు పాపవిముక్తి చేశాను.

**విశేషం:** 'ఏని నరకవాసమునకుఁ బోవ వలయు'- ఈ ఎత్తుగీతి మూడవ పాదములో యతి దప్పింది. వావిళ్ళవారు, రామా అండ్ కో వారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రకటించిన భారత ప్రతులయందును ఈ పాఠమే కనబడుతున్నది. 'పోవవలయు' అనేచోట 'పోను వలయు' అని ఉండటం ఒప్పు.

**వ. అది యెట్లంటేని నాకర్ణింపు; మే నొక్కనాఁడు సఖీసమేతంబుగా సురనదీస్నానంబునకు వచ్చియుండ, వసువు లక్కడకేతెంచి యింతనంత నొక్కరేవునం దోఁచి కృత స్నానులై నిజరూపంబున సన్నిహితయైన గంగాదేవితోడ 'గాండీవధరుండు శిఖండిం బురస్కరించుకొని, గాంగేయుం డేయకుండం బరమ సాయకంబుల నతనిం గూల్చె; నట్లు కుత్సితజయార్జనం బొనర్చిన యయ్యర్జును నేము శాపసంతాపితుం జేయుదు' మని చెప్పిన నప్పరమానుభావయు దాని కొడంబడిన పలుకు పలికె; నంతయు విని తత్క్షణంబ. 88**

**ప్రతిపదార్థం:** అది; ఎట్లు; అంటి(వి)+ఏని= అని అనినచో; ఆకర్ణింపుము= వినుము; ఏను= నేను; ఒక్కనాఁడు= ఒక రోజు; సఖీ= చెలికత్తెలతో; సమేతంబు+కాన్= కూడిఉండేటట్టుగా; సురనదీ= గంగానదియొక్క; స్నానంబునకున్= స్నానానికి; వచ్చి+ఉండన్= వచ్చి ఉండగా; వసువులు; అక్కడకున్= అక్కడకు; ఏతెంచి= వచ్చి; ఇంతన్+అంతన్= సమీపాన; ఒక్కరేవునన్= ఒకానొక రేవులో; తోఁచి= కనబడి; కృతస్నానులు+ఐ= స్నానం చేసినవారై; నిజ= తనయొక్క; రూపంబునన్= రూపంతో, స్వస్వరూపంతో; సన్నిహిత+ఐ= దగ్గరకు వచ్చినదైన; గంగాదేవితోడన్= గంగాదేవితో; గాండీవ= గాండీవమును; ధరుండు= ధరించినవాడు అర్జునుడు; శిఖండిన్= శిఖండిని; పురస్కరించుకొని= ముందుంచుకొని; గాంగేయుండు= గంగానది కుమారుడు భీష్ముడు; ఏయక= బాణాలు ప్రయోగించక; ఉండన్= ఉండగా; పరమ= శ్రేష్ఠములైన; సాయకంబులన్= బాణాలతో; అతనిన్= అతడిని; కూల్చెన్= పడగొట్టాడు; అట్లు= ఆ విధంగా; కుత్సిత= నీచమైన; జయ= జయంయొక్క; ఆర్జనంబు= సంపాదనము; ఒనర్చిన= చేసిన; ఆ+అర్జునున్= ఆ అర్జునుడిని; ఏము= మేము; శాప= శాపంచేత; సంతాపితున్= మిక్కిలి తపింపజేయబడిన వాడినిగా; చేయుదుము= చేస్తాము; అని; చెప్పినన్= చెప్పగా; ఆ పరమ= ఆ అధికమైన; అనుభావయున్= మహిమ కలదియు, గంగాదేవియు; దానికిన్= వసువుల నిర్ణయానికి; ఒడంబడిన= ఒప్పుకొనిన; పలుకు= మాట; పలికెన్= పలికింది; అంతయున్= దీనినంతయూ; విని; తద్+క్షణంబు+అ= ఆ క్షణముననే.

**తాత్పర్యం:** అది యెట్లని నీవంటే నేను చెప్పుతాను వినుము. నేను ఒక నాడు చెలికత్తెలతో కూడి స్నానం చేయటానికి గంగానదికి వెళ్ళాను. ఇంతలో వసువులు కూడా వచ్చి మాకు దగ్గరగా ఉన్న రేవులో స్నానం చేశారు. వారు స్వస్వరూపంతో వచ్చిన గంగాదేవితో 'అర్జునుడు శిఖండిని ముందుంచుకొని భీష్ముడిని ఎదుర్కొన్నాడు. భీష్ముడు తన నియమం ప్రకారం బాణాలు ప్రయోగించలేదు. ఈ సందు చూచికొని అర్జునుడు ఉత్తమ బాణాలతో పడగొట్టాడు. ఈ విధంగా నీచ విజయం సంపాదించిన అర్జునుడిని మేము శాపంతో మాడ్చి వేస్తాము' అని అన్నారు. గంగాదేవి కూడా వారి నిర్ణయాన్ని ఆమోదించింది. దీనినంతా వినిన నేను వెంటనే. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. అరిగి యేఁ దండ్రికి నత్తెఱంగంతయు। నెఱిఁగించుటయు, నతం డెసక మెసఁగ**
**భయమున రయమునఁ బఱతెంచి వసువులఁ। బెక్కు విధంబులఁ బ్రియము పుట్టఁ**
**దెలిచి ప్రార్థించిన నలుక వో విడిచి వా। రతనితో 'విను సమయం బొకండు**
**చేసెద; మనిలోన వాసవిఁ దత్సూనుఁ। డగు బభ్రువాహనుం డస్త్రవితతిఁ**

**ఆ. బఱపి గూల్చె నేనిఁ బాయు నక్కిల్బిష;। మనిన మగిడి వచ్చి యా భుజంగ**
**నాథుఁ డెల్లఁ జెప్పె నాకు; నిప్పని దగ। నిట్లు దీర్చితిని సమిద్ధతేజ! 89**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; అరిగి= వెళ్ళి; తండ్రికిన్= మా తండ్రికి; ఆ తెఱంగు= ఆ వృత్తాంతం; అంతయున్= అంతయూ; ఎఱిఁగించుటయున్= తెలిపిన తరువాత; అతండు= మా తండ్రి; ఎసకము= తత్తరపాటు; ఎసఁగన్= ఎక్కువ కాగా; భయమునన్= భయంతో; రయమునన్= వేగంతో; పఱతెంచి= పరుగున వచ్చి; పెక్కువిధంబులన్= అనేక విధాలుగా; ప్రియము= ప్రీతి; పుట్టన్= పుట్టగా; వసువులన్= వసువులను; తెలిచి= పొగడి; ప్రార్థించినన్= ప్రార్థించగా; వారు= వసువులు; అలుక= కోపం; పోవిడిచి= పూర్తిగా వదలి; అతనితోన్= మా తండ్రితో; విను= వినుము; సమయంబు= నియమం; ఒకండు= ఒకటి; చేసెదము; అనిలోనన్= యుద్ధంలో; వాసవిన్= అర్జునుడిని; తద్= అతడియొక్క; సూనుఁడు= కుమారుడు; అగు= అయిన; బభ్రువాహనుండు; అస్త్ర= అస్త్రాలయొక్క; వితతిన్= సమూహంచేత; పఱపి= బాధించి; కూల్చెన్+ఏనిన్= పడగొట్టితే; ఆ కిల్బిషము= ఆ పాపం; పాయున్= వదలును; అనినన్= అని అనగా; మగిడి= తిరిగి; వచ్చి; ఆ భుజంగ= సర్పములయొక్క; నాథుఁడు= రాజు; నాకున్= నాకు; ఎల్లన్= అంతయు; చెప్పెన్= చెప్పాడు; సమిద్ధ= ప్రజ్వలింపచేయబడిన; తేజ!= తేజస్సు కలవాడా!; ఈ పని= వసువులు చెప్పిన పని; ఇట్లు= ఈ విధంగా; తీర్చితిని= నెరవేర్చాను.

**తాత్పర్యం:** వెళ్ళి ఆ వృత్తాంతమంతా మా తండ్రికి చెప్పాను. ఆయనకు తత్తరపాటు హెచ్చింది. మా తండ్రి భయపడి సత్వరంగా పరుగున వచ్చి వసువులను స్తుతించి ప్రార్థించాడు. వారికి ఆనందం కలిగింది. కోపం వీడి వసువులు మా తండ్రితో 'ఒక నియమం పెట్టాము. వినుము, అర్జునుడి కుమారుడైన బభ్రువాహనుడు యుద్ధంలో అనేకాస్త్రాలచేత బాధించి అతడిని పడగొట్టాలి. అప్పుడు గాని అతడికి పాపవిముక్తి కలుగదు' అని చెప్పారు. ఆ నాగనాథుడు తిరిగివచ్చి జరిగినదంతా నాకు చెప్పాడు. మహాతేజస్వీ! వసువులు చెప్పిన పనిని ఈ విధంగా నెరవేర్చాను.

**వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద' నని పలికి బభ్రువాహను నుపలక్షించి 'యిక్కుమారుండు నీతో సమరంబు చేయనొల్లక నమస్కరించి మరలి మందిరంబునకుం బోవు చున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవసరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి 'రణంబు మీ తండ్రికిఁ బ్రియంబును ధర్మంబు' నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యివ్వీరునియందు వసువులు చెప్పిన విధంబు గలుగునట్లుగా విక్రమ విశేషం బావహించితి.' 90**

**ప్రతిపదార్థం:** తీర్చిన= నెరవేర్చిన; తెఱంగు= తీరు; ఎఱింగించెదన్= తెలుపుతాను; అని; పలికి; బభ్రువాహనున్= బభ్రువాహనుడిని; ఉపలక్షించి= ఉద్దేశించి; ఈ కుమారుండు= ఈ రాజపుత్రుడు; నీతోన్= నీతో; సమరంబు= యుద్ధం; చేయన్= చేయగా, ఒల్లక= ఇష్టపడక; నమస్కరించి= మ్రొక్కి; మరలి= వెనుదిరిగి; మందిరంబునకున్= తన సౌధానికి; పోవుచున్+ఉన్కి= పోవుచుండటం; బుద్ధిన్= దివ్యజ్ఞానంతో; కని= తెలిసికొని; సమయ= వసువులు పెట్టిన నియమముయొక్క; కార్యంబునకున్= పనికి; ఇది;

అవసరంబు= సమయం; అని; ఊహించి; రయంబునన్= వేగంగా; ఇతని కడకున్= ఇతడి దగ్గరకు; వచ్చి; రణంబు= యుద్ధం; మీ తండ్రికిన్= మీ తండ్రికి; ప్రియంబును= ఇష్టమయినది; ధర్మంబును= ధర్మమును; అని; చెప్పి; ఇతనిన్= ఇతడిని; పోరికిన్= యుద్ధానికి; పురికొల్పి= ప్రోత్సహించి; ఈ వీరుని యందున్= ఈ వీరుడియందు; వసువులు; చెప్పిన; విధంబు= విధం; కలుగు+అట్లు+కాన్= జరిగేటట్లుగా; విక్రమ విశేషంబు= పరాక్రమాతిశయం; ఆవహించితిన్= కలిగించాను.

**తాత్పర్యం:** నేను ఏ విధంగా ఆ పని నెరవేర్చానో చెప్తుతాను' అని పలికి బభ్రువాహనుడిని ఉద్దేశించి 'ఈ రాచకొడుకు నీతో యుద్ధం చేయటానికి ఇష్టపడక ఒక నమస్కారం పెట్టి తిరిగి తన సౌధానికి వెళ్ళాడు కదా! దివ్యజ్ఞానంచేత ఇతడు తిరిగి వెళ్ళటం నేను తెలిసికొని వసువులు పెట్టిన నియమానికి తగినపని చేయటానికి ఇదే సమయమని ఊహించి ఇతడి దగ్గరకు వచ్చాను. వచ్చి 'యుద్ధం మీ తండ్రికి ఇష్టం. అది ఆయనకు ధర్మం' అని ఇతడిని యుద్ధానికి రెచ్చగొట్టాను. అంతేకాక వసువులు చెప్పిన రీతిగా సిద్ధించటానికి ఇతడిలో పరాక్రమాతిశయాన్ని కలిగించాను.'

**క. అనినఁ బ్రియమంది 'దేవీ! యనఘం బగు నీ చరిత్ర మస్మత్కుల వ**
**ర్ధన కారి యగుట యెప్పుడుఁ। గనినది గాదె!' యని పలికె గాండీవి నృపా! 91**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా! జనమేజయా!; అనినన్= అని ఉలూపి ఆ విధంగా అనగా; గాండీవి= అర్జునుడు; ప్రియము= ప్రీతి; అంది= పొంది; దేవీ!; అనఘంబు= పాపరహితం; అగు= అయిన; నీ= నీయొక్క; చరిత్ర= నడవడి; అస్మద్= మాయొక్క; కుల= కులంయొక్క; వర్ధన= పెంపును; కారి= చేసేది; అగుట; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కనిన+అది= తెలిసిందే; కాదు+ఎ!= కదా!; అని; పలికెన్= పలికాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆ విధంగా చెప్పిన ఉలూపి మాటలు విని అర్జునుడు ఆనందించాడు. అతడు 'దేవీ! నీ పుణ్యచరిత్రం ఎల్లప్పుడూ మా వంశానికి పెంపు కలిగించటం తెలిసిందే కదా!' అని అన్నాడు.

**ఆ. పలికి సాదరముగ బభ్రువాహనుఁ జూచి। మానితాగమిష్యమాణ చైత్ర**
**మాస పౌర్ణమాసి మహితాశ్వమేధ కా। లంబు; దాని దెసఁ దలంపు గలిగి. 92**

**ప్రతిపదార్థం:** సహస+ఆదరము+కన్= గౌరవ పూర్వకంగా; పలికి; బభ్రువాహనున్= బభ్రువాహనుడిని; చూచి= ఉద్దేశించి; మానిత= పూజించబడిన, పవిత్రమైన; ఆగమిష్యమాణ= రానున్న; చైత్రమాస= చైత్రమాసంయొక్క; పౌర్ణమాసి= పూర్ణిమ; మహిత= పూజించబడినదగు, పుణ్యప్రదమైన; అశ్వమేధ= అశ్వమేధంయొక్క; కాలంబు= సమయం; దానిదెసన్= దానియెడ; తలంపు కలిగి= మనస్సు పెట్టి; (దానిని గుర్తుపెట్టుకొని అని అర్థం).

**తాత్పర్యం:** ఆ విధంగా సగౌరవంగా ఉలూపితో పలికి అర్జునుడు బభ్రువాహనుడిని చూచి 'రానున్న పవిత్రచైత్రమాస పూర్ణిమే పుణ్యప్రదమైన అశ్వమేధ సమయం. దానిని గుర్తుపెట్టుకొని. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. నీవును దల్లులు బంధు జ। నావళియుం బరిజనములు హస్తినగరికిన్**
**రావలయు; ధర్మజుని సం। భావనముం బడయు టొసఁగుఁ బరమ శుభంబున్.' 93**

**ప్రతిపదార్థం:** నీవును= నీవూ; తల్లులు= మీ తల్లులునూ; బంధుజన= బంధువులయొక్క; ఆవళియున్= సమూహమునూ;

పరిజనములు= సేవకులునూ; హస్తినగరికిన్= హస్తినాపురానికి; రావలయున్= రావాలి; ధర్మజుని= ధర్మరాజుయొక్క; సంభావనమున్= మన్నన; పడయుట= పొందుట; పరమ= ఉత్తమమైన; శుభంబున్= శుభమును; ఒసంగున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** నీవూ, మీ తల్లులూ, బంధువులూ, సేవకులూ హస్తినాపురానికి తప్పకరావాలి. ధర్మజుడి మన్నన మీకు ఉత్తమ శుభాలను కలిగిస్తుంది.

**చ. అనవుడు ' నట్ల చేసెద నుదాత్త చరిత్ర! పురంబు చొచ్చి యి**
**వ్వనితలు నీవు నా వలని వత్సలతం గొనియాడు చియ్యెడన్**
**మన మలరంగ నిల్చి, జనమాన్యునిఁగా ననుఁజేసి ప్రీతి నే**
**ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగ రక్షకై. 94**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఉదాత్త= గొప్ప; చరిత్ర= నడవడి, స్వభావం కలవాడా!; అట్లు+అ= అట్లే; చేసెదన్= చేస్తాను; ఈ+వనితలు= ఈ స్త్రీలు, ఈ తల్లులందరు; నీవు; పురంబు= పట్టణం; చొచ్చి= ప్రవేశించి; నావలనన్= నా యందలి; వత్సలతన్= పుత్రప్రేమతో; కొనియాడుచున్= ఆదరిస్తూ; ఈ+ఎడన్= ఇక్కడ; మనము= మనస్సు; అలరంగన్= సంతోషించగా; నిల్చి= ఉండి; ననున్= నన్ను; జన= ప్రజలచేత; మాన్యునిన్+కాన్= గౌరవించతగినవాడినిగా; చేసి; ప్రీతిన్= సంతోషంతో; నేను; అనుపఁగన్= వీడ్కోల్పగా; వచ్చి; యజ్ఞతురంగ= యజ్ఞాశ్వంయొక్క; రక్షకై= రక్షణకొరకు; అనుయానము= అనుసరించి వెళ్ళటం; వెంబడించటం; చేయుము.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా పలుకగా 'ఉదాత్త ప్రకృతి కలవాడా! నీవు చెప్పినట్లే చేస్తాను. ఈ తల్లు లిద్దరూ, నీవూ పట్టణం ప్రవేశించండి. నాపై ప్రేమతో నన్ను ఆదరిస్తూ ఇక్కడ కొన్నాళ్ళపాటు ఉండి, ప్రజలు పూజించతగినవాడినిగా చేయండి. సంతోషించి, నేను వీడ్కోల్పగా యజ్ఞాశ్వాన్ని రక్షించటానికి వెంట వెళ్ళండి.

**వ. అనుచుం బ్రణతుండై బభ్రువాహనుండు ప్రార్థించినం, బార్థుండప్పార్థివుతో ' నేను దీక్షితుండనగుట యెఱుంగవే; నాకుం బురప్రవేశంబు చేయం జనదు; పోయి వచ్చెద; మీరును సుఖులరయి యుండుం 'డనిన 'నట్లకాక' యని యతం డుచిత ప్రకారంబునం బూజించి యామంత్రణంబు చేయ నబ్భామలచేత ననుజ్ఞాతుండై యమ్మహాత్ముండు యజ్ఞాశ్వంబు ననుసరించె; నదియు నిజేచ్ఛ నఖిల దేశంబులం బ్రవర్తిల్లె; నట్టియెడ. 95**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; ప్రణతుండు+ఐ= నమస్కరించినవాడై; బభ్రువాహనుండు; ప్రార్థించినన్= ప్రార్థించగా; పార్థుండు= అర్జునుడు; ఆ పార్థివుతోన్= ఆ రాజుతో; నేను; దీక్షితుండను+అగుట= దీక్షపూనినవాడను కావటం, ఎఱుంగవు+ఏ?= తెలిసికొనవా?; నాకున్= నాకు; పుర= పట్టణంయొక్క; ప్రవేశంబు= ప్రవేశం; చేయన్= చేయగా; చనదు= తగదు; పోయి వచ్చెదన్= వెళ్ళుతున్నాను; మీరును; సుఖులరు+ఐ= సుఖంకలవారై; ఉండుండు= ఉండండి; అనినన్= అనగా; అట్లు+అ= అట్లే; కాక= అగును గాక; అని; అతండు= బభ్రువాహనుడు; ఉచిత= తగిన; ప్రకారంబునన్= విధంగా; పూజించి; ఆమంత్రణంబు చేయన్= వీడ్కోల్పగా; ఆ భామలచేతన్= ఆ స్త్రీలచేత, భార్యలచేత; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతించబడినవాడై; ఆ+మహత్+ఆత్ముండు= ఆ గొప్ప మనస్సు కలవాడు; యజ్ఞ= యజ్ఞంయొక్క; అశ్వంబున్= గుర్రమును; అనుసరించెన్= వెంబడించాడు; అదియున్= ఆ గుర్రమునూ; నిజ= తనయొక్క; ఇచ్ఛన్= ఇష్టంవచ్చినట్లు; అఖిల= సమస్తమైన; దేశంబులన్= దేశాలలో; ప్రవర్తిల్లెన్= సంచరించింది.

**తాత్పర్యం:** అంటూ బభ్రువాహనుడు నమస్కార పూర్వకంగా ప్రార్థించాడు. అర్జునుడు ఆ రాజుతో 'నేను దీక్ష వహించానని నీకు తెలుసు కదా! కావున నాకు పట్టణంలో ప్రవేశించటం తగదు. నేను వెళ్ళుతున్నాను. మీరు సుఖంగా ఉండండి' అని అన్నాడు. అంత బభ్రువాహనుడు సరే అని సముచితంగా పూజించి అర్జునుడిని వీడ్కొల్పాడు. అతడు భార్యల అనుమతి పొంది యజ్ఞాశ్వాన్ని వెంబడించాడు. అది సమస్త దేశాలలో ఇచ్ఛ వచ్చినట్లు సంచరించింది. ఆ సమయంలో.

**క.** **రాజగృహపురము కడ న। వ్వాజి యరుగు టెఱిఁగి, యాహవమునకుఁ బిలిచెన్**
**రాజ త్కీర్తి ధనుం డగు। నా జిష్ణుని మేఘసంధి యను రా జధిపా!** **96**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; ఆ వాజి= ఆ గుర్రం; రాజగృహ= రాజగృహమనే; పురము కడన్= పట్టణం దగ్గర; అరుగుట= చేరటం; ఎఱిఁగి= తెలిసి; మేఘసంధి; అను= అనే; రాజు; రాజత్= ప్రకాశిస్తున్న; కీర్తి= కీర్తియే; ధనుండు= ధనంగా కలవాడు; అగు= అయిన; ఆ జిష్ణునిన్= ఆ జయశీలుడిని, అర్జునుడిని; ఆహవమునకున్= యుద్ధానికి; పిలిచెన్= ఆహ్వానించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! గుర్రం రాజగృహం చేరింది. ఇది తెలిసి మేఘసంధి-మహాకీర్తి సంపన్నుడూ, జయశీలుడూ అయిన అర్జునుడిని యుద్ధానికి ఆహ్వానించాడు.

**వ.** **అట్టు లప్పురంబు పతి యగు జరాసంధ పౌత్త్రుండు బాల్యంబునం దన్నునెదిరి నెఱుంగమిం గవ్వడిం గయ్యం బునకుం బిలిచి పుచ్చి తోడన కల్పిత రథారూఢుండై వెడలి యవ్వాసవికి నడ్డపడి.** **97**

**ప్రతిపదార్థం:** అట్టులు= ఆ విధంగా; ఆ పురంబు= ఆ రాజగృహ నగరంయొక్క; పతి= అధిపతి; అగు= అయిన; జరాసంధ= జరాసంధుడియొక్క; పౌత్త్రుండు= మనుమడు; బాల్యంబునన్= పిల్లతనంచేత; తన్నున్= తనను; ఎదిరిన్= శత్రువునూ; ఎఱుంగమిన్= ఎరుగకుండటంచేత; కవ్వడిన్= అర్జునుడిని; కయ్యంబునకున్= యుద్ధానికి; పిలిచి పుచ్చి= ఆహ్వానించి; తోడన్+అ= వెంటనే; కల్పిత= సిద్ధంచేయబడిన; రథ= రథమును; ఆరూఢుండు+ఐ= ఎక్కినవాడై; వెడలి= వెళ్ళి; ఆ+వాసవికిన్= ఆ ఇంద్రుడి కుమారుడు అర్జునుడికి; అడ్డపడి= అడ్డం వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** రాజగృహ నగరాధిపతీ, జరాసంధుడి మనుమడూ అయిన మేఘసంధి పిల్లతనంచేత స్వపర తారతమ్యం తెలియక అర్జునుడిని యుద్ధానికి ఆహ్వానించి వెంటనే సర్వసన్నద్ధమైన రథమెక్కి వెళ్ళి అతడికి అడ్డుపడి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ.** **'వనితలలోపలఁ జనియెడు చాడ్పున। నివ్వాజిఁ గొని యించుకేని శంక**
**లేక పోయెదవు; పోనీక యేఁ బట్టెద। దీనిఁ; గయ్యము చేసెదేనిఁ జేయు;**
**మనుడు నవ్వుచు నతం డమ్మగధేశుతో। 'విఘ్నకర్తల నేను వెరవుతోడ**
**మాన్పింతు; వినుము; నామనమునఁ గిన్కలే;। దది యెట్టులనిన మదగ్రజుండు**

**తే.** **సామమునన కర్జము నీవు చక్కఁ బెట్టి। కొందు గాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి**
**వలవ దని నాకుఁ జెప్పినవాఁడుఁ గాన। యట్లు చేయుదు; నీ యిష్ట మాచరింపు.'** 98

**ప్రతిపదార్థం:** వనితలలోపలన్= ఆడువారి మధ్య; చనియెడు= సంచరిస్తున్న; చాడ్పునన్= విధంగా; ఈ వాజిన్= ఈ గుర్రాన్ని; కొని= వెంబడించి; ఇంచుక+ఏనిన్= కొంచెంకూడ; శంక= జంకు; లేక; పోయెదవు= పోతున్నవాడవు; పోన్+ఈక= నిన్ను పోనీకుండా; ఏన్= నేను; దీనిన్= ఈ గుర్రాన్ని; పట్టెదన్= బంధిస్తాను; కయ్యము= యుద్ధం; చేసెదు+ఏనిన్= చేయదలచుకొంటే; చేయుము; అనుడున్= అని అనగా; అతండు= అర్జునుడు; నవ్వుచున్= నవ్వుతూ; ఆ+మగధ+ఈశుతోన్= ఆ మగధరాజుతో; నేను; విఘ్న= చెరుపు; కర్తలన్= చేసేవారిని; వెరవుతోడన్= ఉపాయంతో; మాన్పింతున్= విరమింప జేస్తాను; వినుము; నా= నాయొక్క; మనమునన్= మనస్సులో; కిన్క= కోపం; లేదు; అది= కోపంలేకపోవటం; ఎట్టులు= ఎట్లు పొసగును; అనినన్= అని అంటే; మత్= నా యొక్క; అగ్రజుండు= అన్న; సామమునన్+అ= సంప్రదింపులచేతనే; నీవు; కర్జము= పని; చక్కన్+పెట్టికొందు(వు)= నిర్వహించుకొంటావు; కాని; ఎవ్వరి+ఎడన్= ఎవ్వరి పట్లనూ; క్రూర= కఠినమైన; వృత్తి= పద్ధతి; వలవదు= వద్దు; అని; నాకున్= నాకు; చెప్పినవాఁడు= చెప్పాడు; కాన= కావున; అట్లు= ఆ విధంగా, మా అన్న చెప్పినట్లుగా; చేయుదున్= చేస్తాను; నీ= నీయొక్క; ఇష్టము= సమ్మతం; ఆచరింపు= చేయుము.

**తాత్పర్యం:** 'ఆడువారి నడుమ సంచరిస్తున్నట్లుగా (అర్జునాదులు ఆడువారని వ్యంగ్యం) ఈ గుర్రాన్ని జంకుకొంకులు లేకుండా నీవు వెంబడిస్తున్నావు. నిన్ను పోనీకుండా దీనిని బంధిస్తాను. యుద్ధం చేయాలనుకొంటే చేయుము' అని మేఘసంధి అన్నాడు. అర్జునుడు ఆ మాటలకు నవ్వుతూ అతడితో 'అడ్డపడినవారిని ఉపాయంతో నివర్తిస్తాను. ఒకమాట చెప్తుతాను వినుము. నా మనస్సులో కోపం లేదు. అదేమిటి? అని అనుమానింపవచ్చు. మా అన్న ధర్మరాజు 'నీవు నచ్చజెప్పి నీ పని నెరవేర్చుకొనుముగాని ఎవ్వరిపట్లా కఠినపద్ధతి పాటింపకుము' అని చెప్పాడు. కావున నేను మా అన్న చెప్పినట్లే చేస్తాను. నీ కిష్టమైనది నీవు చేసికొనుము.

### అర్జునుఁడు జరాసంధ పౌత్త్రునితో యుద్ధంబు చేసి యోడించుట (సం. 14-83-1)

**చ.** **అనవుడు నేమియుం బలుక కా నృపపుత్త్రుఁడు నిర్జరేంద్ర పు**
**త్త్రునిపయి నుజ్జ్వలంబులగు తూపుగముల్ పరఁగింప వాని నె**
**ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద**
**త్తను వొక బాణమేనియును దాఁకఁగఁజేయ నరేశ్వరోత్తమా! 99**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర+ఉత్తమా!= రాజులలో ఉత్తముడా!; అనవుడున్= అని అనగా; ఆ+నృపపుత్త్రుఁడు= ఆ రాజకుమారుడు; ఏమియున్= ఏమియూ, ఒక్కమాటకూడా; పలుకక= మాటాడక; నిర్జర= దేవతలయొక్క; ఇంద్ర= ప్రభువుయొక్క, దేవేంద్రుడియొక్క; పుత్త్రునిపయిన్= కుమారుడిమీద; ఉజ్జ్వలంబులు= ప్రకాశిస్తున్నవి; అగు= అయిన; తూపు= బాణాలయొక్క; గముల్= సమూహాలు; పరఁగింపన్= ప్రయోగించగా; అతఁడు= అర్జునుడు; వానిన్+ఎల్లన్= వాటినన్నిటినీ; శాత= వాడి అయిన; భల్ల= బాణాలయొక్క; తతులన్= సమూహాలతో; తునుమాడియున్= ముక్కలు చేసియూ; తద్= ఆ మేఘసంధియొక్క; తనువు= శరీరమును; ఒక; బాణము+ఏనియును= బాణంకూడా; తాఁకఁగన్= తగిలేట్లుగా; చేయన్= చేయగా; ఒల్లఁడు+అయ్యెన్= ఇష్టపడలేదు.

**తాత్పర్యం:** జనమేజయా! అర్జునుడు ఈ విధంగా పలుకగా రాజకుమారుడు మేఘసంధి ఒక్కమాటకూడా మాటాడక అర్జునుడిమీద ధగధగమండే బాణాలను ప్రయోగించాడు. అర్జునుడు వాటినన్నిటినీ వాడి బాణాలతో ముక్కలుముక్కలు చేశాడే తప్ప; ఒక్క బాణం కూడా మేఘసంధి శరీరాన్ని తాకేటట్లు చేయటానికి ఇష్టపడలేదు.

**వ. అగ్గాండీవి కృప యేమని చెప్పుదు? 100**

**ప్రతిపదార్థం:** ఆ+గాండీవి= అర్జునుడియొక్క; కృప= దయ; ఏమి= ఎటువంటిది; అని; చెప్పుదున్= చెప్పగలను.

**తాత్పర్యం:** ఆ అర్జునుడి దయ ఎటువంటిదని చెప్పగలను? (ఇది వైశంపాయనుడి మాట).

**క. తనమీఁద మగధుఁ డేయఁగ। జననాయక! రథ్యములను సారథి నైనన్**

**గొనకొని నొప్పింపక య। ల్లన శరనికరంబుపైఁ గలయ నిగిడించెన్. 101**

**ప్రతిపదార్థం:** జననాయక!= రాజా! జనమేజయా!; తనమీఁదన్= తనమీద; మగధుఁడు= మగధరాజు మేఘసంధి; ఏయఁగన్= బాణాలు ప్రయోగించగా; రథ్యములను(ఐనన్)= గుర్రాలను గానీ; సారథిన్+ఐనన్= సారథినిగానీ; గొనకొని= పూని; నొప్పింపక= బాధపెట్టక; అల్లన్+అ= మెల్లగా; శర= బాణాలయొక్క; నికరంబు= సమూహం; పైన్= మీద; కలయన్= పడగా, కప్పగా; నిగిడించెన్= వేశాడు.

**తాత్పర్యం:** జనమేజయా! మగధపతి అయిన మేఘసంధి తనమీద బాణాలు వేయగా అర్జునుడు అతడి గుర్రాలనుగానీ, సారథిని గానీ, బాధించక మెల్లగా అతడి శరీరాన్ని కప్పేటట్లు బాణాలు ప్రయోగించాడు.

**క. అది బలహీనతగాఁ గొని। మద మేపారంగ నక్కుమారుఁడు లీలం**

**గదిసి బలునారసంబులు। తదంగమునఁ గ్రుచ్చె; నతఁడు దాన నలిగియున్. 102**

**ప్రతిపదార్థం:** అది= అర్జునుడు ఆ విధంగా వేయటాన్ని; బలహీనత+కాన్= బలంలేకపోవటంగా, చేతకాని తనంగా; కొని= భావించి; ఆ+కుమారుఁడు= ఆ మగధరాజకుమారుడు; మదము= గర్వం; ఏపారంగన్= అతిశయించగా; లీలన్= విలాసంగా; కదిసి= డీకొని; బలు= గట్టిపైన; నారసంబులు= బాణాలు; తద్+అంగమునన్= ఆ అర్జునుడియొక్క శరీరాన; గ్రుచ్చెన్= నాటాడు; అతఁడు= అర్జునుడు; దానన్= దానివలన, నాటటంవలన; నలిగియున్= బాధపడియూ.

**తాత్పర్యం:** అర్జునుడు ఎవ్వరినీ నొప్పించకుండా బాణాలు వేయటం అతడి చేతకానితనంగా మేఘసంధి భావించాడు. ఆ రాజకుమారుడు పొగరు తలకెక్కి విలాసంగా అర్జునుడిని చేరి అతడి శరీరంలో గట్టి బాణాలు నాటాడు. నాటటంవలన బాధపడి కూడా అర్జునుడు.

**వ. ఆ సహదేవు పుత్త్రు గాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబులు నిగిడించి. 103**

**ప్రతిపదార్థం:** ఆ+సహదేవు= ఆ జరాసంధుడి కుమారుడైన సహదేవుడియొక్క; పుత్త్రు= కొడుకుయొక్క; గాత్రంబు= శరీరం; తాఁకక= తాకక; ఉండు+అట్లు+కాన్= ఉండేటట్లుగా; శరంబులు= బాణాలు; నిగిడించి= వేసి. (ప్రయోగించి)

**తాత్పర్యం:** సహదేవుడి కుమారుడైన మేఘసంధి శరీరాన్ని తాకకుండా ఉండేటట్లుగా బాణాలు వేసి.(తరువాతి పద్యంతో అన్వయం)

**ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం**

**జీరి శరాసనంబుఁ బొడిసేసిన నమ్మగధుండు ధీరతో**

**దారగతిన్ సముజ్జ్వల గదా భ్రమణంబున బాహు వొప్ప న**

**వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి పొల్చె నాన్. 104**

**ప్రతిపదార్థం:** సారథిన్= సారథిని; కూల్చి= పడగొట్టి; అశ్వములన్= గుర్రాలను; చంపి; రథంబున్= రథాన్ని; పగిల్చి= బ్రద్దలుచేసి; కేతువున్= జెండాను; చీరి= త్రుంచి; శర+ఆసనంబున్= వింటిని; పొడి+చేసినన్= పిండి పిండి చేయగా; ఆ+మగధుండు= ఆ మగధపతి; ధీరతా= దిట్టతనంతో కూడిన; ఉదార= గొప్ప; గతిన్= గమనంతో; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; గదా= గదయొక్క; భ్రమణంబునన్= తిరుగుడుచేత; బాహువు= భుజము; ఒప్పన్= ఒప్పగా; విక్రమము= పరాక్రమం; ఆకృతి= ఆకారం; తాల్చి= ధరించి; పొల్చెన్= ప్రకాశించింది; నాన్= అనగా; ఆ+వీర= ఆ వీరుల అందు; వరేణ్యుపైన్=శ్రేష్ఠుడిమీద; కవిసెన్= ఉరికాడు.

**తాత్పర్యం:** అర్జునుడు సారథిని పడగొట్టాడు. గుర్రాలను చంపాడు. రథాన్ని బ్రద్దలు చేశాడు. వింటిని పొడి పొడి గావించాడు. అప్పుడు మేఘసంధి పరాక్రమం మూర్తీభవించి ప్రకాశిస్తున్నదా అని అనేటట్లు ధీరగంభీర గమనంతో చేతితో ఉజ్జ్వలమైన గదను త్రిప్పుతూ అర్జునుడి మీదికి ఉరికాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అట్లు గవియుటయు. 105**

**తాత్పర్యం:** ఆ విధంగా ఉరుకగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అప్పుడును మత్సరంబున కతఁడు భాజ। నంబు గాకుండెఁ; గాన యన్నరుఁడు వెడఁద**

**వాతియమ్ముల గద పలు వ్రయ్యలై మ। హీతలంబునఁ దొరఁగంగ నేసె నధిప! 106**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అప్పుడును= అప్పుడుకూడా; అతఁడు= అర్జునుడు; మత్సరంబునకున్= క్రోధానికి; భాజనంబు= స్థానం; కాక+ఉండెన్= కాకుండా ఉన్నాడు; కాన= కావున; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; వెడఁద= విశాలమైన; వాయి= మొనగలిగిన; అమ్ములన్= బాణాలతో; గద; పలు= పెక్కు; వ్రయ్యలు+ఐ= ముక్కలై; మహీతలంబునన్= భూమిమీద; తొరఁగంగన్= పడగా; ఏసెన్= కొట్టాడు. (వాయి=నోరు. వాతి-ఔపవిభక్తిక రూపం)

**తాత్పర్యం:** జనమేజయా! అప్పుడుకూడా అర్జునుడు క్రోధం పొందలేదు. అందువలననే అతడు వెడల్పు మొనలు గలిగిన బాణాలతో గద ముక్కలు ముక్కలై భూమిమీద పడేటట్లు కొట్టాడు.

**వ. అ ట్లేసిన. 107**

**తాత్పర్యం:** ఆ విధంగా కొట్టగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. నివ్వెఱపడిన యాన్నృపనందనునితోడ। నయ్యతిబలుఁడు "మా యన్న యొకని**

**ప్రాణంబులకును దప్పకు మయ్య!' యని యాన। తిచ్చిన కతన నే నేయకున్న**

**నీ వింతవడి పోర నిలువఁ జాలితి; విను;। మది యట్టులుండె; రాజార్హమైన**

**ధర్మంబు వాటించి తాఁకితి నన్నుఁ; నిం। తియ చాలు; నింక శాంతియ నరేంద్ర!**

**తే. తగిన యది యని పల్కెఁ నతండు 'నిజము । నట్ల కా' కని యూహించి యమ్మహాత్ము**
**పాద పరిసరమున భక్తిఁ బ్రణతుఁ డైన । గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యక్కురువిభుండు. 108**

**ప్రతిపదార్థం:** నివ్వెఱపడిన= మిక్కిలి భయపడిన; ఆ+నృప= ఆ రాజుయొక్క; నందనునితోడన్= కుమారుడితో; ఆ+అతి= ఆ అధికమైన; బలుఁడు= బలంకలవాడు, అర్జునుడు; మా+అన్న= మా అన్న ధర్మరాజు; ఒకని= ఎవ్వరి యొక్క; ప్రాణంబులకును= ప్రాణాలకు; తప్పకుము= హానిచేయకుము; అయ్య!; అని; ఆనతి+ఇచ్చిన= ఆజ్ఞాపించిన; కతనన్= కారణంచేత; నేను; ఏయక= బాణప్రయోగం చేసి కొట్టక; ఉన్నన్= ఉండగా; నీవు; ఇంతవడి= ఇంతసేపు; పోరన్= యుద్ధంలో; నిలువన్= నిలువగా; చాలితి(వి) సమర్థుడవైతివి; వినుము; అది= ఆ మాట; అట్టులు= ఆ విధంగా; ఉండెన్= ఉండనిమ్ము (ఆ మాట అట్లుండనిమ్ము అని అర్థం. ఇది చక్కని తెనుగు నుడికారం); రాజ= రాజునకు; అర్హము+ఐన= తగినదైన; ధర్మంబు= ధర్మాన్ని; పాటించి= ఆదరించి, పరిశీలించి; నన్నున్= నన్ను; తాఁకితి(వి)= ఎదుర్కొన్నావు; ఇంతి+అ= ఇంతమాత్రం; చాలున్= చాలు; నర+ఇంద్ర!= రాజా!; ఇంకన్= ఇక; శాంతి+అ= శాంతియే; తగిన+అది= తగింది; అని; పల్కెన్= పలికాడు; అతండు= మేఘసంధి; నిజమును= నిజమే; అట్లు+అ= అట్లే; కాక= అగును గాక; అని; ఊహించి= నిశ్చయించి, దృఢబుద్ధి చేసికొని; ఆ+మహత్+ఆత్ము= పెద్దమనసు కలవాడియొక్క, అర్జునుడియొక్క; పాద= పాదములయొక్క; పరిసరమునన్= సమీపంలో; భక్తిన్= భక్తితో; ప్రణతుఁడు+ఐనన్= నమస్కరించినవాడు కాగా; ఆ+కురువిభుఁడు: ఆ కురువంశ శ్రేష్ఠుడు; గ్రుచ్చి= లేవనెత్తి; కౌఁగిటన్= కౌగిటిలో; చేర్చి= నిలిపి (కౌగిలించి అని అర్థం).

**తాత్పర్యం:** గద ముక్కలు ముక్కలుగా భూమిమీద పడగా మేఘసంధి భయపడ్డాడు. మహాబలవంతుడైన అర్జునుడు అతడితో 'మా అన్న ధర్మరాజు ఎవ్వడి ప్రాణాలకూ హానిచేయవద్దు అని నన్ను ఆజ్ఞాపించాడు. అందువలన నేను నిన్ను బాణాలతో కొట్టలేదు. కాబట్టే నీవు నాతో ఇంతసేపు పోరాడుతూ యుద్ధభూమిలో నిలువగలిగావు. సరే దానినట్లా ఉంచుము. రాజధర్మాన్ని ఆదరించి నీవు నన్ను ఎదుర్కొన్నావు. ఇంత మాత్రం చాలు. ఇక కావలసింది శాంతి' అని అన్నాడు. మేఘసంధి 'అర్జునుడు చెప్పిన మాట నిజం. ఆయన చెప్పినట్లే అగుగాక' అని మనసులో నిశ్చయించి అర్జునుడి పాదాలకు భక్తితో ప్రణామం చేశాడు. కురువంశ శ్రేష్ఠుడైన అర్జునుడు మేఘసంధిని లేవనెత్తి కౌగిలించుకొని. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. 'వచ్చు చైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజు నశ్వమేధంబు ననుసంధించుట కై బంధులు నీవును రావలయు' ననిన నవ్వసుమతీపతి 'యట్ల చేసెద' నని యత్యంత వినయంబున నవ్విజయుం బ్రియపూర్వ కంబుగాఁ బూజించి యామంత్రితుం జేసిన నాతండు ప్రీతుండయి యభినందించి యమ్మగధపతిం బురం బునకుఁబోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె; నదియును వంగపుండ్ర మ్లేచ్ఛదేశంబులం జరియింప నయ్యైరాజులు చెనకినం దేజోధనుండగు నాధనంజయుండు జయించుచుఁ జన నత్తురంగంబు. 109**

**ప్రతిపదార్థం:** వచ్చు= రాబోవు; చైత్ర= చైత్రమనే; మాసంబునన్= నెలలో; పున్నమనాఁడు= పున్నమిరోజున; పాండవ+అగ్రజు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజుయొక్క; అశ్వమేధంబున్= అశ్వమేధమును; అనుసంధించుటకై= చూచుటకై; బంధువులు= చుట్టాలు; నీవును; రావలయును= రావలెను; అనినన్= అనగా; ఆ+వసుమతీ= ఆ భూమియొక్క; పతి= నాథుడు, మేఘసంధి; అట్లు+అ= ఆ విధంగానే; చేసెదన్= చేస్తాను; అని; అత్యంత= మిక్కిలి; వినయంబునన్= వినయంతో; ఆ+విజయున్= ఆ అర్జునుడిని; ప్రియపూర్వకంబుగాన్= సంతోషపూర్వకంగా; పూజించి; ఆమంత్రితున్= వీడ్కొలుపబడినవాడినిగా; చేసినన్= చేయగా;

ఆతండు= అర్జునుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; అభినందించి= మెచ్చుకొని; ఆ+మగధపతిన్= ఆ మగధనాథుడిని; పురంబునకున్= పట్టణానికి; పోవన్= వెళ్ళగా; పనిచి= ఆజ్ఞాపించి; అశ్వరత్నంబున్= శ్రేష్ఠమైన గుర్రమును; అనుసరించెన్= వెంబడించాడు; అదియును= ఆ యజ్ఞాశ్వమును; వంగ= వంగము; పుండ్ర= పుండ్రము; మ్లేచ్ఛ= మ్లేచ్ఛము అనెడి; దేశంబులన్= దేశాలలో; చరియింపన్= తిరుగగా; ఆ+అయి= ఆయా; రాజులు; చెనకినన్= ఎదుర్కొనగా; తేజస్= పరాక్రమాదులవలన కలిగిన తేజస్సు; ధనుండు+అగు= ధనంగా కలవాడైన; ఆ+ధనంజయుండు= ఆ అర్జునుడు; జయించుచున్= జయిస్తూ; చనన్= వెళ్ళగా; ఆ+తురంగంబు= ఆ గుర్రం.

**తాత్పర్యం:** 'రాబోయే చైత్రమాసంలో పున్నమరోజున ధర్మరాజు అశ్వమేధయాగాన్ని చూడటానికి నీవూ మీ చుట్టాలూ రావాలి' అని అర్జునుడు చెప్పగా మేఘసంధి సరే అన్నాడు. అతడు అర్జునుడిని వినయంతో పూజించి వీడ్కొలిపాడు. అర్జునుడు చాలా సంతోషించి మెచ్చుకొని మేఘసంధిని పట్టణానికి వెళ్ళుము అని ఆజ్ఞాపించి, యజ్ఞాశ్వాన్ని వెంబడించాడు. అది వంగపుండ్ర మ్లేచ్ఛ దేశాలలో తిరిగేటప్పుడు ఆయా రాజులు ఎదుర్కొన్నారు. తేజస్వి అయిన అర్జునుడు వారినందరినీ జయించాడు. తరువాత ఆ గుర్రం. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **చేదిదేశంబు సొచ్చిన శిశుపాలుని। తనయుండు శరభుండు తనదు శక్తి**
**పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి। యమ్మహావీరున కర్చ లిచ్చె;**
**నతని వీడ్కొల్పి యయ్యతుల తేజుఁడు ఘోట। కము వెన్కఁ జనుచుఁ డేంకణ కిరాత**
**ముఖ దేశ నృపతులు ముట్టినఁ దగ గెల్పు। గొనుచుఁ గ్రమంబునఁ గోసలులను**

**ఆ.** **గాశులను జయించెఁ; గ్రమ్మఱ యత్తురం। గము దశార్ణదేశగామి యయ్యె**
**జిష్ణుఁ డనుసరింపఁ జిత్రాంగదుం డని। చేసి యోడి పూజ చేసె నధిప! 110**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! జనమేజయా!; చేదిదేశంబు= చేదిదేశము; చొచ్చినన్= ప్రవేశించగా; శిశుపాలుని= శిశుపాలుడియొక్క; తనయుండు= కుమారుడు; శరభుండు= శరభుడనేవాడు; తనదు= తనయొక్క; శక్తిపురము= రాజధాని అయిన శక్తిపురంనుండి; వెల్వడి= బయటికి వచ్చి; యుద్ధపూర్వకంబుగన్= ముందు యుద్ధం చేయగా; చేరి= ఆశ్రయించి; ఆ+మహత్= ఆ గొప్ప; వీరునకున్= వీరుడికి; అర్చలు+ఇచ్చెన్= పూజలు చేశాడు; అతనిన్= శరభుడిని; వీడ్కొల్పి= నగరానికి పోవననుమతించి; ఆ+అతుల= ఆ సాటిలేని; తేజుఁడు= తేజస్సు కలవాడు; ఘోటకము= గుర్రంయొక్క; వెన్కన్= వెంట; చనుచున్= వెళ్ళుతూ; టేంకణ= టేంకణము; కిరాత= కిరాతము; ముఖ= మొదలైన; దేశ= దేశములయొక్క; నృపతులు= రాజులు; ముట్టినన్= ఎదుర్కొనగా; గెల్పు= విజయం; కొనుచున్= పొందుతూ; కోసలులను= కోసలదేశవాసులను; కాశులను= కాశదేశమువారిని; జయించెన్= జయించాడు; క్రమ్మఱన్= మరల; ఆ+తురంగము= ఆ గుర్రం; దశార్ణదేశ= దశార్ణదేశమును గూర్చి; గామి= వెళ్లినది; అయ్యెన్= అయింది; జిష్ణుఁడు= జయశీలుడైన అర్జునుడు; అనుసరింపన్= వెంబడించగా; చిత్రాంగదుండు= చిత్రాంగదుడు; అని= యుద్ధం; చేసి; ఓడి= ఓడిపోయి; పూజచేసెన్= పూజించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! చేదిదేశం ప్రవేశించగా శిశుపాలుడి కుమారుడు శరభుడు తన రాజధాని అయిన శక్తిపురంనుండి బయటికివచ్చి మొదట యుద్ధంచేసి తరువాత అర్జునుడిని ఆశ్రయించి, అతడికి పూజలు చేశాడు. అర్జునుడు అతడిని వీడ్కొలిపి, గుర్రాన్ని అనుసరిస్తూ టేంకణాధిపతి కిరాతరాజు మొదలైన భూపతులు ఎదుర్కొనగా వారిపై విజయం సాధించాడు. క్రమంగా కోసలదేశీయులనూ కాశదేశవాసులనూ జయించాడు. అర్జునుడు వెంబడిస్తుండగా యజ్ఞాశ్వం దశార్ణదేశానికి వెళ్ళింది. ఆ దేశాధిపతి చిత్రాంగదుడు అర్జునుడితో పోరాడి ఓడిపోయి అతడిని పూజించాడు.

**వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతని యాదరణంబు వడసి పోయెఁ; బదంపడి తురంగంబు నిషాదాధీశ దేశంబునకుం జనిన నేకలవ్యనందనుఁడు పాకశాసననందను మీఁద నైషాద సేనాసమేతుండై తోఁ తెంచిన. 111**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దశార్ణ= దశార్ణదేశంయొక్క; పతి= రాజు; పార్థునిన్= అర్జునుడిని; పూజించి; ఆతని= అర్జునుడియొక్క; ఆదరణంబు= ఆదరమును; పడసి= పొంది; పోయెన్= వెళ్ళాడు; పదంపడి= తరువాత; తురంగంబు= గుఱ్ఱం; నిషాద= నిషాదులయొక్క; అధి+ఈశ= ప్రభువుయొక్క; దేశంబునకున్= దేశానికి; చనినన్= వెళ్ళగా; ఏకలవ్య= ఏకలవ్యుడియొక్క; నందనుండు= కుమారుడు; పాకశాసను= ఇంద్రుడియొక్క; నందను మీఁదన్= కుమారుడి మీదకు; నైషాద= నిషాదదేశానికి సంబంధించిన; సేనా= సేనతో; సమేతుండు+ఐ= కూడినవాడై; తోఁతెంచినన్= రాగా.

**తాత్పర్యం:** ఈ విధంగా దశార్ణపతి అర్జునుడిని పూజించి అతడి ఆదరం పొంది వెళ్ళిపోయాడు. తరువాత యజ్ఞాశ్వం నిషాదరాజు దేశానికి వెళ్ళింది. ఆ దేశప్రభువు ఏకలవ్యుడి కుమారుడు. అతడు నిషాదదేశసైన్యంతో అర్జునుడిమీద దండెత్తగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. అతని బలంబుఁ గ్రూర విశిఖార్చుల నేర్చిన బాహుసార గ**
**ర్వితుఁ డగు నన్నిషాదపతి వీఁక నెదుర్కొనినం గిరీటి యా**
**తత పటుబాణ దీధితులఁ దన్మద సంతమసం బడంచెఁ; వాఁ**
**డతి వినయంబునన్ వినతుఁడై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112**

**ప్రతిపదార్థం:** అతని= ఏకలవ్యుడియొక్క; బలంబున్= సైన్యమును; క్రూర= భయంకరమైన; విశిఖ= బాణాలనుండి పుట్టిన; అర్చులన్= మంటలచేత; ఏర్చినన్= దహించగా; బాహు= భుజములయొక్క; సార= బలంచేత; గర్వితుఁడు= గర్వించినవాడు; అగు= అయిన; ఆ నిషాద= ఆ నిషాదులయొక్క; పతి= రాజు; వీఁకన్= పరాక్రమంతో; ఎదుర్కొనినన్= ఎదుర్కొనగా; కిరీటి= అర్జునుడు; ఆతత= విస్తారమైన; పటు= గట్టివైన; బాణ= బాణాలయొక్క; దీధితులన్= కాంతులచేత; తద్= ఆ ఏకలవ్య కుమారుడియొక్క; మద= గర్వమనెడి; సంతమసంబు= అంధకారమును; అడంచెన్= నశింపజేశాడు; వాఁడు= ఏకలవ్యుడి కుమారుడు; అతి= మిక్కిలి; వినయంబునన్= అణకువతో; వినతుఁడు+ఐ= నమస్కరించినవాడై; తగన్= తగినట్లుగా; ఆతనిన్= అర్జునుడిని; అర్చితున్= పూజించబడిన వాడినిగా; చేసెన్= చేశాడు (పూజించాడని అర్థం.)

**తాత్పర్యం:** అర్జునుడు నిషాదరాజసైన్యాన్ని బాణాగ్ని జ్వాలలచేత దహించాడు. భుజబలగర్వితుడైన ఏకలవ్యుడి కుమారుడు ఎదుర్కొనగా అతడి గర్వాంధకారాన్ని తీవ్ర బాణకాంతులచేత నశింపజేశాడు. అప్పుడు నిషాదపతి లొంగిపోయి నమస్కార పూర్వకంగా అర్జునుడిని పూజించాడు.

**వ. అ ట్లేకలవ్యనందనుం దనవశంబు చేసికొని ధనంజయుండు హయంబు ననుగమించె; నది మరలి మఱియును దక్షిణాభిముఖంబయి చని తిరుగఁ బౌండ్రాంధ్ర ద్రవిళ కేరళ కర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించికొనియెఁ; గ్రమంబున సౌరాష్ట్రంబు సొచ్చి గోకర్ణ సమీపంబునం బ్రవర్తించి పదంపడి. 113**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఏకలవ్య= ఏకలవ్యుడియొక్క; నందనున్= కుమారుడిని; తనవశంబు= స్వాధీనం; చేసికొని; ధనంజయుండు= అర్జునుడు; హయంబున్= గుఱ్ఱాన్ని; అనుగమించెన్= అనుసరించాడు; అది= ఆ గుఱ్ఱం; మరలి= తిరిగి;

మఱియును= ఇంకను; దక్షిణ= దక్షిణ దిక్కునకు; అభిముఖంబు= ఎదురుగా ముఖం కలది (దక్షిణదిక్కు, వైపునకు పోవునది అని అర్థం) అయి; చని= వెళ్ళి; తిరుగన్= తిరుగగా; పౌండ్ర= పౌండ్రము; ఆంధ్ర= ఆంధ్రము; ద్రవిళ= ద్రావిడము; కేరళ కర్ణాట= కేరళ, కర్ణాటము అనెడి; దేశ= దేశాలయొక్క; అధి+ఈశులన్= రాజులను; న+ఆయాసంబునన్= శ్రమలేకుండా; వశగతులన్= వశమైనవారినిగా; కావించి కొనియెన్= చేసికొన్నాడు; క్రమంబునన్= క్రమంగా; సౌరాష్ట్రము; చొచ్చి= ప్రవేశించి; గోకర్ణ= గోకర్ణంయొక్క; సమీపంబునన్= దగ్గర; ప్రవర్తించి= నడచి; పదంపడి= తరువాత. (న+ఆయాసంబునన్-అన్+ ఆయాసంబునన్= అనాయాసంబునన్)

**తాత్పర్యం:** ఆ విధంగా ఏకలవ్యుడి కుమారుడిని వశపరచుకొని అర్జునుడు గుర్రాన్ని అనుసరించాడు. అది అక్కడక్కడా సంచరించి దక్షిణాపథం చేరింది. అర్జునుడు పౌంధ్ర, ఆంధ్ర, ద్రావిడ, కేరళ, కర్ణాట భూపతులను స్వాధీనం చేసికొని గుర్రం వెంట సౌరాష్ట్రదేశంలో ప్రవేశించి, గోకర్ణం చేరి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ.** **ద్వారకానగరంబు చేరువ ఘోటక। మరుగంగఁ బ్రీతులై యదుకుమారు**
**లాలపుటాలంబు ననువున నయ్యింద్ర। నందనుఁ గని పూజనం బొనర్ప**
**నభినందనము చేసె నవ్వీరుఁ; డపరాబ్ధి। తీరదేశంబులఁ దిరిగి పంచ**
**నదముపైఁ జని మావు నరనాథ! గాంధార। దేశంబు చొచ్చి వర్తింప శకుని**

**తే.** **నందనుఁడు బాల్యకలిత దుర్నయము పేర్మిఁ। దనదు సేనలఁ గూర్చి యుద్దామగతిఁ గి**
**రీటిఁ దాఁకిన నతఁడు వారించి పాండ। వాగ్రజుని యాజ్ఞ దెలుపంగ నంతఁ బోక.** **114**

**ప్రతిపదార్థం:** నరనాథ!= రాజా! జనమేజయా!; ద్వారకా= ద్వారక అనే; నగరంబు= పట్టణంయొక్క; చేరువ= దగ్గరకు; ఘోటకము= గుర్రం; అరుగంగన్= వెళ్ళగా; యదుకుమారులు= యాదవులు; ప్రీతులు+ఐ= సంతోషించినవారై; ఆలము= యుద్ధంయొక్క; ఆలంబు= ఉపేక్షయొక్క; అనువునన్= విధంగా (యుద్ధం ఉపేక్షించిన ప్రకారంగా, యుద్ధంచేయక అని అర్థం); ఆ+ఇంద్రనందనున్= ఆ ఇంద్రుడి కుమారుడైన అర్జునుడిని; కని= దర్శించి; పూజనంబు= పూజ; ఒనర్పన్= చేయగా; ఆ+వీరుఁడు= ఆ వీరుడు; అభినందనము చేసెన్= ప్రశంసించాడు; మావు= గుర్రం; అపర+అబ్ధి= పశ్చిమ సముద్రంయొక్క; తీర= ఒడ్డుననున్న; దేశంబులన్= దేశములందు; తిరిగి; పంచనదము= ఐదు నదులయొక్క; పైన్= మీదుగా, పాంచాల దేశము మీదుగా; చని= వెళ్ళి; గాంధార= గాంధారమనే; దేశంబు= దేశం; చొచ్చి= ప్రవేశించి; వర్తింపన్= నడపగా; శకుని= శకునియొక్క; నందనుఁడు= కుమారుడు; బాల్య= పిల్లతనంచేత; కలిత= పొందబడిన; దుర్నయము= చెడ్డనడవడియొక్క; పేర్మిన్= అతిశయంచేత, పెంపుచేత; తనదు= తనయొక్క; సేనలన్= సేనలను; కూర్చి= ప్రోగుచేసి; ఉద్దామ= భయంకరమైన; గతిన్= విధంగా; కిరీటిన్= అర్జునుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా; అతఁడు= అర్జునుడు; వారించి= నివారించి; పాండవ+అగ్రజుని= ధర్మరాజుయొక్క; ఆజ్ఞ= ఆదేశం; తెలుపంగన్= తెలియజేయగా; అంతన్= (శకుని కుమారుడు) అంతటితో; పోక= వెనుదిరిగి వెళ్ళక.

**తాత్పర్యం:** గుర్రం ద్వారక దగ్గరకు వెళ్ళింది. దానిని చూచి యాదవులు యుద్ధం చేయకుండా అర్జునుడిని పూజించారు. అతడు కూడా వారిని ప్రశంసించాడు. తరువాత యజ్ఞాశ్వం పశ్చిమసముద్ర తీరాన ఉన్న దేశాలలో తిరిగి, పాంచాల దేశంమీదుగా వెళ్ళి గాంధారదేశం ప్రవేశించింది. శకుని కుమారుడు ఆ దేశానికి రాజు. అతడు పిల్లతనంవలన కలిగిన దుష్ప్రవర్తనంచేత మిడిసిపడుతూ తన సేనలను ప్రోగుచేసికొని భయంకరంగా అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు తొందరపడకుండా ముందు ధర్మజుడి ఆదేశం శకుని కుమారుడికి తెలియజేశాడు. కాని, అతడు అంతటితో వెనుదిరిగి పోక. (తరువాతి పద్యంతో అన్వయం)

క. **పొదివినఁ గనుఁగవ వెడ కెం। పొదవఁగఁ జతురంగముల శరోత్కరములఁ దాఁ**
**బొదివె విజయుఁ; డవి వడియుం। జెదరియు సన్నంబు లైనఁ జిత్తములోనన్.** **115**

**ప్రతిపదార్థం:** పొదివినన్= ఎదుర్కొనగా; విజయుఁడు= అర్జునుడు; తాన్= తాను; కను+కవన్= కన్నుల జంటయందు; వెడ= కొంచెం; కెంపు= క్రోధంవలన కలిగిన ఎరుపు; ఒదవఁగన్= పుట్టగా; శర= బాణాలయొక్క; ఉత్కరములన్= సమూహాలచేత; చతుస్+అంగములన్= నాలుగు భాగాలనూ (రథాలనూ; ఏనుగులనూ, గుర్రాలనూ; సైనికులనూ;) పొదివెన్= కప్పాడు; అవి; పడియున్= కూలిపోయియూ; చెదరియున్= చెల్లా చెదరయియూ; సన్నంబులు= తరిగిపోయినవి; ఐనన్= కాగా; చిత్తములోనన్= మనస్సులో.

**తాత్పర్యం:** శకుని కుమారుడు ఎదుర్కొనగా అర్జునుడికి రోషం కలిగింది. అతడి రెండు కన్నులలో కొంచెం ఎరుపు పుట్టింది. అతడు పుంఖానుపుంఖంగా బాణాలు ప్రయోగించి గాంధారదేశ చతురంగబలాలను కప్పివేశాడు. అవి యుద్ధభూమిలో కూలిపోయాయి. చెల్లాచెదరయ్యాయి. గాంధారసైన్యం తరిగిపోయింది. అపుడు తన మనస్సులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** (సన్నంబువై-ఇది వెలుగు 'సన్నలు' కాదు. సద్ ధాతువు యొక్క క్తాంత రూపము. సీదతి-సీదతః-సీదన్తి:)

ఉ. **మత్సర మెక్కఁగా సుబలు మన్మఁడు దుర్దమలీలఁ గిట్టి బీ**
**భత్సునిపై నిశాత శరపంక్తి నిగుడ్పఁ దదీయ బాహు సం**
**పత్సముదీర్ణతం దనదు భావమునం గొనియాడి యెంతయున్**
**వత్సలుఁ డైన యన్నరుఁడు వానికి నిట్లనుఁ గౌరవోత్తమా!** **116**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఉత్తమా!= కౌరవులలో ఉత్తముడా! జనమేజయా!; మత్సరము= క్రోధం; ఎక్కఁగాన్= పెరుగగా; సుబలు= సుబలుడియొక్క; మన్మఁడు= మనుమడు (సుబలుడు శకుని తండ్రి); దుర్దమ= అణపరాని; లీలన్= విధంగా; కిట్టి= సమీపించి; బీభత్సునిపైన్= అర్జునుడిమీద; నిశాత= వాడిఅయిన; శర= బాణాలయొక్క; పంక్తిన్= వరుసను; నిగుడ్పన్= ప్రయోగించగా; తదీయ= శకుని కుమారుడియొక్క; బాహు= భుజబలంయొక్క; సంపద్= సంపదయొక్క; సముదీర్ణతన్= ఆధిక్యాన్ని; తనదు= తనయొక్క; భావమునన్= మనస్సులో; కొనియాడి= పొగడి; ఎంతయున్= మిక్కిలి; వత్సలుఁడు+ఐన= చిన్నవారి పట్ల ప్రేమ కలవాడైన; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; వానికిన్= అతడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయా! రోషం ఎక్కువ కాగా, శకుని పుత్రుడు విజృంభిస్తూ సమీపించి, బాణపరంపరను అర్జునుడిమీద ప్రయోగించాడు. అర్జునుడు అతడి బాహుబల సంపదను మనస్సులో పొగడి, వాత్సల్యంతో అతడితో ఇట్లా అన్నాడు.

క. **'రాజులఁ జంపకు మని మా। రా జానతి యిచ్చె; నుద్ధురత నే నని న**
**య్యోజ విడిచినట్లైనఁ బ। రాజితుఁగా నన్ను నద్ధరాపతి దలఁచున్.** **117**

**ప్రతిపదార్థం:** రాజులన్= రాజులను; చంపకుము; అని; మా రాజు= మా ప్రభువు ధర్మరాజు; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞాపించాడు; నేను; ఉద్ధురతన్= స్వతంత్రతతో; అనిన్= యుద్ధంలో; ఆ+ఓజన్= ఆ ధర్మాన్ని; విడిచిన+అట్లు+ఐనన్= విడిచినట్లయితే; ఆ+ధరాపతి= ఆ భూపతి, ధర్మరాజు; నన్నున్= నన్ను; పరాజితున్+కాన్= పరాజయం పొందిన వాడినిగా; తలఁచున్= నిర్ణయిస్తాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజు రాజులను చంపవద్దని న న్నాజ్ఞాపించాడు. నేను స్వతంత్రించి ఆ ధర్మాన్ని వదలితే ఆ ప్రభువు నన్ను పరాజయం పొందినవాడినిగానే నిర్ణయిస్తాడు.

**అర్జునుఁడు గాంధారదేశాధీశుతో యుద్ధంబు చేసి జయించుట (సం. 14-85-9)**

**ఉ.** **కావున నేఁ గడంగ విను; కయ్యము నీ కిది యేల తమ్ముఁడా!**
**నా వినియున్ వడిన్ శకునినందనుఁ డయ్యమరేంద్ర నందనుం**
**దా విశిఖంబులం బొదివె; దానికి నవ్వుచు వాని శీర్షకం**
**బావిజయుండు బల్వెడఁదయమ్మున నేలఁ బడంగ నేసినన్.** **118**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నేన్= నేను; కడంగన్= యుద్ధం చేయటానికి పూనుకొనను; విను= వినుము; తమ్ముఁడా!= తమ్ముడా!; నీకున్= నీకు; కయ్యము= యుద్ధం; ఇది; ఏల!= ఎందుకు?; నాన్= అనగా; వినియున్= వినికూడా; శకుని= శకునియొక్క; నందనుఁడు= కుమారుడు; తాన్= తాను; వడిన్= వేగంగా; ఆ+అమర= ఆ దేవతలయొక్క; ఇంద్ర= ప్రభువుయొక్క, దేవేంద్రుడియొక్క; నందనున్= కుమారుడిని - అర్జునుడిని; విశిఖంబులన్= బాణాలతో; పొదివెన్= కప్పాడు; దానికిన్= ఆ బాణప్రయోగానికి; నవ్వుచున్= నవ్వుతూ; వాని= శకుని కుమారుడి యొక్క; శీర్షకంబు= శిరస్త్రాణం; నేలన్= భూమిమీద; పడంగన్= పడగా; ఆ+విజయుండు= ఆ అర్జునుడు; బల్= గట్టి; వెడఁద= వెడల్పయిన మొనగల; అమ్మునన్= బాణంతో; ఏసినన్= కొట్టగా.

**తాత్పర్యం:** కాబట్టి నేను పోరునకు పూనుకొనను. తమ్ముడా! వినుము. యుద్ధ మిది నీకెందుకు?' అని అన్నాడు. ఆ మాటలు వినినప్పటికీ శకుని కుమారుడు అర్జునుడిని బాణాలతో కప్పివేశాడు. దానికి నవ్వుతూ అర్జునుడు వెడల్పు మొనగల గట్టి బాణాలతో అతడి శిరస్త్రాణం నేలమీద పడేటట్లుగా కొట్టగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ.** **అచ్చిత్రము చూచి యచ్చోటం గలయట్టి.** **119**

**ప్రతిపదార్థం:** ఆ+చిత్రము= ఆ ఆశ్చర్యకరమైన కార్యం; చూచి; ఆ+చోటన్= ఆ యుద్ధభూమిలో; కల+అట్టి= ఉన్న.

**తాత్పర్యం:** ఆ ఆశ్చర్యకరమైన పని చూచి అక్కడ ఉన్న. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **ఎల్లజనులు నివ్వీరుం। డొల్లఁడుగా కుత్తమాంగ ముర్వి నిటుల వే**
**డొల్లఁగ నేయఁడె వలసినఁ;। జెల్లంబో! యితని కరుణ చెలు విట్లున్నే!'** **120**

**ప్రతిపదార్థం:** ఎల్లన్+జనులు= జనులందరూ; ఈ+వీరుండు= ఈ వీరుడు; ఒల్లఁడు+కాక= ఇష్టపడడు కాని; వలసినన్= చేయదలిస్తే; వే= శీఘ్రంగా; ఉత్తమ+అంగము= తల; ఉర్విన్= భూమిమీద; ఇటులు+అ= ఇట్లే, శిరస్త్రాణంవలెనే; డొల్లఁగన్= తెగిపడేటట్లుగా; ఏయఁడు+ఎ?= బాణాలతో కొట్టడా? (కొట్టునని అర్థం); చెల్లంబో= ఇది ప్రశంసను తెలిపేమాట; ఇతని= ఇతడియొక్క; కరుణ= దయయొక్క; చెలువు= విధం; ఇట్లు= ఈ విధంగా; ఉండును+ఏ?= ఉంటుందా?

**తాత్పర్యం:** జనులందరూ 'ఈ మహావీరుడు ఇష్టపడడు గాని చేయాలని అనుకొంటే శీఘ్రంగా ఈ శకుని కుమారుడి తల శిరస్త్రాణంవలెనే నేలమీద తెగిపడేటట్లుగా కొట్టడా? బళీ! ఇతడి దయాస్వరూపం ఇట్లా ఉంటుందా?'

**వ. అనుచు నక్కుమారుం జేరి, యతనితేరు మరల్చికొని పోవం బోవ. 121**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; ఆ+కుమారున్= ఆ శకుని కుమారుడిని; చేరి= సమీపించి; అతని= అతడియొక్క; తేరు= రథాన్ని; మరల్చికొని= వెనుకకు త్రిప్పుకొని; పోవన్+పోవన్= వెళ్ళగా వెళ్ళగా.

**తాత్పర్యం:** అంటూ శకుని కుమారుడిని సమీపించి అతడి రథాన్ని వెనుకకు (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. దురభిమానము పేర్మి నన్నరవరుండు । మరలి నరుమీఁద నడవ, మున్ తెరలి చనిన**
**బలము గ్రమ్మఱి, యయ్యింద్రుపట్టిఁ జుట్టు । బలసి శస్త్రాస్త్రచయములు పరఁగఁజేయ. 122**

**ప్రతిపదార్థం:** దురభిమానము= దుర్గర్వంయొక్క; పేర్మిన్= ఆధిక్యంచేత; ఆ+నరవరుండు= ఆ నరనాథుడు - రాజు; మరలి= తిరిగి వచ్చి; నరుమీఁదన్= అర్జునుడిమీద; నడవన్= ఉరుకగా; మున్= అంతకుముందు; తెరలి= రణరంగంనుండి తొలగి; చనిన= పారిపోయిన; బలము= సైన్యం; క్రమ్మఱి= మరలివచ్చి; ఆ+ఇంద్రు= ఆ ఇంద్రుడియొక్క; పట్టిన్= కుమారుడిని - అర్జునుడిని; చుట్టున్= చుట్టునూ, నాలుగువైపులా; బలసి= ఆవరించి; శస్త్ర+అస్త్ర= శస్త్రాస్త్రాలయొక్క; చయములు= సమూహాలు; పరఁగన్+చేయన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** శకుని కుమారుడు దుర్గర్వాతిశయంచేత తిరిగి వచ్చి అర్జునుడిమీద ఉరికాడు. ఇది చూచి అంతకుముందు రణరంగం నుండి తొలగి పారిపోయిన సైన్యం మరలివచ్చి అర్జునుడిని నాలుగువైపులా ఆవరించి బహుళంగా శస్త్రాలూ అస్త్రాలూ ప్రయోగించగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. అవి నిశితాస్త్ర పంక్తిఁ దునుమాడి రయం బెసఁగంగఁ గప్పె నా**
**హవతల మంతయుం దలర నప్పటువిక్రమశాలి; యమ్మహో**
**గ్ర విహరణంబునం గలఁగి కన్కనిఁ బాఱె బలంబు; లక్కుమా**
**రవరునిఁ గాచికొంటకు ధరావరుమంత్రులు వాని తల్లియున్. 123**

**ప్రతిపదార్థం:** ఆ+పటు= ఆ నేర్పుతో కూడిన; విక్రమ= పరాక్రమంతో; శాలి= ప్రకాశించేవాడు; అవి= గాంధారసైన్యం ప్రయోగించిన బాణాలను; నిశిత= వాడి అయిన; అస్త్ర= అస్త్రాలయొక్క; పంక్తిన్= వరుసచేత; తునుమాడి= ఖండించి; రయంబు= వేగం; ఎసఁగంగన్= ఒప్పగా; ఆహవతలము= యుద్ధభూమి; అంతయున్= అంతయూ; తలరన్= క్షోభించగా, కంపించగా; కప్పెన్= కప్పాడు; ఆ= అర్జునుడియొక్క; మహత్= గొప్ప; ఉగ్ర= భయంకరమైన; విహరణంబునన్= విహారంచేత; బలంబులు= సైన్యాలు; కలఁగి= క్షోభించి; కన్కనిన్= సంభ్రమంతో; పాఱెన్= పారిపోయాయి; ధరావరు= రాజుయొక్క; మంత్రులు= మంత్రులునూ; వాని= అతడియొక్క; తల్లియున్= తల్లియూ; ఆ+కుమార వరునిన్= ఆ రాజకుమార శ్రేష్ఠుడిని; కాచికొంటకున్= రక్షించుకొనటానికి.

**తాత్పర్యం:** మహాపరాక్రమశాలి అర్జునుడు తీక్ష్ణ బాణపరంపరతో గాంధారసైన్యం ప్రయోగించిన బాణాలను ఖండించి యుద్ధభూమి అంతా క్షోభించగా కప్పివేశాడు. అతడి భయంకర వీరవిహారాన్ని చూచి సైన్యాలు భయంతో పారిపోయాయి. శకుని కుమారుడిని మంత్రులూ, తల్లీ రక్షించుకొనటానికి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అర్ఘ్యంబుగొని రయంబున శరణు శర ణనుచు వచ్చిన నవ్విప్పచ్చుండును నవ్వెలంది నభినందించి మంత్రులకు మాననీయ వచనంబులం బ్రియం బొనర్చి యబ్బాలునితో సాంత్వనస్వరంబున నిట్లనియె. 124**

**ప్రతిపదార్థం:** అర్ఘ్యంబు= పూజాద్రవ్యాలు; కొని= తీసికొని; రయంబునన్= వేగంగా; శరణు= నమస్కారం; శరణు= రక్షకుడవు; అనుచున్= అంటూ; వచ్చినన్= రాగా; ఆ+వివ్వచ్చుండును= ఆ అర్జునుడును; ఆ+వెలందిన్= ఆ సాధ్విని; అభినందించి= ప్రశంసించి; మంత్రులకున్= మంత్రులకు; మాననీయ= గౌరవించదగిన; వచనంబులన్= మాటలతో; ప్రియంబు= సంతోషం; ఒనర్చి= కలిగించి; ఆ+బాలునితోన్= ఆ బాలుడితో, శకుని కుమారుడితో; సాంత్వన= ఓదార్చే, మృదువైన; స్వరంబునన్= గొంతుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** పూజాద్రవ్యాలు తీసికొని వేగంగా 'నమస్కారం రక్షకుడవు' అంటూ రాగా అర్జునుడు ఆ సాధ్విని ప్రశంసించి, మన్నించదగిన మాటలతో మంత్రులకు సంతోషం కలిగించి మృదుస్వరంతో శకుని కుమారుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'నీ విట వన్ని నాపయి ననింద్యపరాక్రమ! రాక చూచి మ**
**ద్భావము ఖేద మొందుటయు 'ధర్మజుపం పిది రాజకోటి నే**
**నే విధినైనఁ జంప' నని యెల్లజనంబు వినంగఁ జెప్పనే!**
**కావున నీ బలంబులన కాని నినుం దెగటార్ప కుండితిన్. 125**

**ప్రతిపదార్థం:** అనింద్య= దూషించతగని, ఉత్తమమైన; పరాక్రమ= పరాక్రమం కలవాడా!; నీవు; ఇట= ఇక్కడ; పన్ని= యుద్ధానికి సిద్ధపడి; నాపయిన్= నా మీదకు; రాక= రావటం; చూచి; మత్= నా యొక్క; భావము= మనస్సు; ఖేదము= సంతాపం; ఒందుటయున్= పొందగా; ఇది; ధర్మజు= ధర్మరాజుయొక్క; పంపు= ఆజ్ఞ; నేను; ఏ విధిన్= ఏ విధంగా; ఐనన్= అయిననూ; రాజ= రాజులయొక్క; కోటిన్= సమూహాన్ని; చంపన్= చంపను; అని; ఎల్లన్= సమస్తమైన; జనంబు= జనం; వినంగన్= వినగా; చెప్పన్+ఏ?= చెప్పలేదా?; కావునన్= కాబట్టే; నీ= నీయొక్క; బలంబులన్+అ= సైన్యాలనే; కాని; నిన్= నిన్ను; తెగటార్పక= చంపక; ఉండితిన్= ఉన్నాను.

**తాత్పర్యం:** ఉత్తమ పరాక్రమా! ఇక్కడ నీవు యుద్ధానికి సిద్ధపడి నా మీదకు రావటం చూచి నా మనస్సు బాధపడింది. 'ఇది ధర్మరాజు ఆజ్ఞ. నేను ఏ విధంగానూ రాజులను చంపను' అని అందరూ వింటుండగా చెప్పలేదా? కాబట్టే నీ సైన్యాలను తప్ప నిన్ను చంపకుండా ఉన్నాను.

**వ. విశేషించి గాంధారీ ధృతరాష్ట్రులం దలంచి నాకు నీ దెస నిట్లు గావలసి యుండె. 126**

**ప్రతిపదార్థం:** విశేషించి= పైపెచ్చు; గాంధారీ ధృతరాష్ట్రులన్= గాంధారినీ, ధృతరాష్ట్రుడినీ; తలంచి= స్మరించి; నాకున్= నాకు; నీ దెసన్= నీయెడ; ఇట్లు= ఈ విధంగా; కాన్= అగుట; వలసి= తప్పనిసరియై; ఉండెన్= ఉన్నది.

**తాత్పర్యం:** పైపెచ్చు గాంధారినీ, ధృతరాష్ట్రుడినీ స్మరించి నాకు నీ పట్ల ఈ విధంగా నడుచుకొనటం తప్పనిసరి అయింది.

**ఆ. అట్టులగుటఁజేసి యవనీశనందన! యింత ప్రొద్దుఁ బోరి; తింక శాంతిఁ**
**బొందు టొప్పు; ధర్మపుత్రునితోడ పొం। దొప్పదయ్యు! నీకు నుదితశౌర్య!' 127**

**ప్రతిపదార్థం:** అవనీశ నందన!= రాజకుమారా!; ఉదిత= ప్రసిద్ధమైన; శౌర్య!= పరాక్రమము కలవాడా!; అట్టులు= ఆ విధం; అగుటన్= అగుటవలన; ఇంత; ప్రొద్దున్= కాలమునూ; పోరితి(వి)= పోరాడితివి; ఇంకన్= ఇక; శాంతిన్= శాంతిని; పొందుట= పొందటం; ఒప్పున్= తగును; నీకున్= నీకు; ధర్మపుత్రునితోడన్= ధర్మరాజుతో; పొందు= పొత్తు; ఒప్పదు+అయ్య!= తగదా? (తగునని అర్థం).

**తాత్పర్యం:** రాజకుమారా! విఖ్యాత విక్రమా! ఆ విధంగా నేను నడుచుకొనటంవలన నీవు ఇంతకాలం నాతో పోరాడావు. ఇంక శాంతి పొందటం మంచిది. నీకు ధర్మరాజుతోపొత్తు తగదటయ్యా!'

**వ. అని చెప్పి యాగామి యయిన చైత్రంబున పున్నమ నాఁ డన్నరేంద్రచంద్రు నశ్వమేధ యాగంబున కనురాగం బెసఁగ రమ్మీ! యనియునుం బలికి, యప్పాండవ మధ్యముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబు దిక్కుమొగంబయి యరుగం జొచ్చె; నట్టియెడ నతండు వివిధ దేశంబులం దిరిగిన తెఱం గెల్లనుం జారులచేత విని యజాతశత్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్లు ధర్మప్రకారంబున నిర్వహించుటకుం బ్రీతి వహించె; నద్దివసంబు. 128**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; ఆగామి= రానున్నది; అయిన; చైత్రంబున= చైత్రమాసంయొక్క; పున్నమనాఁడు= పున్నమరోజున; ఆ+నరేంద్ర= ఆరాజులలో; చంద్రు= శ్రేష్ఠుడియొక్క; అశ్వమేధయాగంబునకున్= అశ్వమేధ యజ్ఞానికి; అనురాగంబు= ప్రేమ; ఎసఁగన్= అతిశయించగా; రమ్ము+ఈ!= రమ్మా!; అనియునున్= అనికూడా; పలికి= చెప్పి; ఆ+పాండవ= ఆ పాండవులయందు; మధ్యముండు= నడిమివాడు - అర్జునుడు; మేధ్య= పవిత్రమైన; అశ్వంబున్= గుర్రాన్ని; అనుసరింపన్= వెంబడించగా; అది= ఆ గుర్రం; కరిపురంబు= హస్తినాపురంయొక్క; దిక్కు= వైపునకు; మొగంబు= ముఖం; అయి= కలదియై; అరుగన్+చొచ్చెన్= వెళ్ళటానికి మొదలు పెట్టింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; అతండు= అర్జునుడు; వివిధ= వివిధాలైన; ఆయా; దేశంబులన్= దేశాలయందు; తిరిగిన; తెఱంగు= విధం; ఎల్లనున్= అంతయూ; చారులచేతన్= గూఢచారులవలన; విని; అజాతశత్రుండు= తనకు శత్రువులు లేనివాడు - ధర్మరాజు; ఆ+పురుహూత= ఆ ఇంద్రుడియొక్క; పుత్త్రుండు= కుమారుడు - అర్జునుడు; అశ్వ= గుర్రంయొక్క; రక్షణంబు= సంరక్షణం; అట్లు= ఆ విధంగా; ధర్మ= ధర్మంయొక్క; ప్రకారంబునన్= ప్రకారంగా; నిర్వహించుటకున్= చేసినందుకు; ప్రీతి వహించెన్= సంతోషించాడు; ఆ+దివసంబు= ఆ రోజు.

**తాత్పర్యం:** అని చెప్పి 'రాబోయే చైత్రమాస పూర్ణిమనాడు రాజశ్రేష్ఠుడైన ధర్మరాజు అశ్వమేధయాగానికి ప్రేమతో నీవు రమ్మ!' అని పలికాడు. తరువాత అర్జునుడు పవిత్రమైన యజ్ఞాశ్వాన్ని అనుసరిస్తుండగా అది హస్తినాపురంవైపు వెళ్ళటం మొదలు పెట్టింది. తన తమ్ముడు ఆయా దేశాలలో తిరిగిన తీరంతా గూఢచారులవలన ధర్మరాజు విని అతడు ధర్మప్రకారంగా అశ్వసంరక్షణం చేసినందుకు పరమానందం పొందాడు. ఆ రోజు. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. మాఘమాస పౌర్ణమాసి యై యుండె; నా। ధర్మనందనుండు పేర్మి వెలయ**
**నెలమి మిగులఁ బెద్దకొలువున నుండి త। మ్ముల సగౌరవముగఁ బిలువఁ బనిచి. 129**

**ప్రతిపదార్థం:** మాఘమాస= మాఘమాసము నందలి; పౌర్ణమాసి= పూర్ణిమ; ఐ= అయి; ఉండెన్= ఉన్నది; ఆ+ధర్మనందనుండు= ఆ యముడి కుమారుడు ధర్మరాజు; పేర్మి= వైభవం; వెలయన్= ప్రకాశించగా; ఎలమి= సంతోషం; మిగులన్= ఎక్కువకాగా;

పెద్దకొలువునన్= నిండు కొలువున; ఉండి; తమ్ములన్= తమ్ములను; సహ+గౌరవము+కన్= గౌరవంతో కూడి ఉండేటట్లుగా; పిలువన్= పిలువగా; పనిచి= పంపి.

**తాత్పర్యం:** (ఆ రోజు) మాఘమాసంలోని పూర్ణిమ. ధర్మరాజు వైభవోపేతంగా సంతోషాతిశయంతో నిండు కొలువై ఉండి తమ్ములను సగౌరంగా పిలువనంపి. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. అనిల నందను నాననం బాలోకించి. 130**

**ప్రతిపదార్థం:** అనిల= వాయువుయొక్క; నందను= కుమారుడైన భీముడియొక్క; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** భీముడిని చూచి.

**క. 'నీ తమ్ముఁడు తురగముఁ గొని । యేతెంచుట వింటిఁ; జైత్ర మింకఁ దడవు లే**
**దీతఱి మునులను నృపసం । ఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131**

**ప్రతిపదార్థం:** నీ= నీయొక్క; తమ్ముఁడు= తమ్ముడు; తురగమున్= యజ్ఞాశ్వమును; కొని= తీసికొని, ఏతెంచుట= రావటం; వింటిన్= విన్నాను; చైత్రము= చైత్రమాసం; ఇంకన్= ఇంక; తడవులేదు= ఆలస్యం లేనిది (సమీపిస్తున్నదని అర్థం); ఈతఱిన్= ఈ సమయంలో; మునులను; నృప= రాజులయొక్క; సంఘాతంబును= సమూహాన్ని; తగన్= తగినట్లుగా; పిలువన్= ఆహ్వానించగా; పంపఁగాన్+వలయున్= రాజపురుషులను పంపాలి.

**తాత్పర్యం:** 'నీ తమ్ముడు అర్జునుడు గుర్రంతోపాటు వస్తున్నాడని విన్నాను. చైత్రమాసం సమీపిస్తున్నది. ఈ సమయంలో మునులనూ, రాజసమూహమునూ సముచితంగా ఆహ్వానించటానికి రాజపురుషులను పంపాలి.

**వ. యాగశాలయు శిల్పి జనులం గొని కల్పింపుము; తగువారలకు విడియం దగియెడు వివిధ గృహంబుల నొనరింపు'మని పనిచిన నతండు. 132**

**ప్రతిపదార్థం:** శిల్పిజనులన్= ఆయా పనులు చేసే శిల్పులను; కొని= రప్పించి; యాగశాలయున్= యజ్ఞగృహాన్ని; కల్పింపుము= నిర్మించుము; తగువారలకున్= అర్హులైనవారికి; విడియన్= విడిదిచేయుగా; తగియెడు= తగిన; వివిధ= పలురకాలైన; గృహంబులన్= ఇండ్లను; ఒనరింపుము= కట్టించుము; అని; పనిచినన్= ఆజ్ఞాపించగా; అతండు= భీముడు.

**తాత్పర్యం:** వివిధ శిల్పులను రప్పించి యజ్ఞ గృహాన్ని నిర్మించుము. అర్హులైనవారు విడిదిచేయటానికి తగిన పలురకాల ఇండ్లను కట్టించుము' అని ఆజ్ఞాపించగా భీముడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు ముని । వ్రాతములకు విడియ వలయునట్టి**
**మందిరములుఁ గనక మణిమయంబులుగా నొ । నర్చెఁ దద్జ్ఞ మగు జనంబు వొగడ. 133**

**ప్రతిపదార్థం:** యజ్ఞ= యజ్ఞంయొక్క; వాటమును= శాలయును; జన+అధిపులకున్= జనపతులకు, రాజులకు; ముని= మునులయొక్క; వ్రాతములకున్= సమూహాలకు; విడియ వలయు= విడిదిచేయదగిన; అట్టి= అటువంటి; మందిరములున్= గృహాలను; తత్జ్ఞము= వాస్తుశాస్త్రం తెలిసిన; అగు= అయిన; జనంబు= ప్రజ; పొగడన్= ప్రశంసించగా; కనక= బంగారంయొక్క; మణి= మణులయొక్క; మయంబులు= వికారాలు కలవి; కాన్= అయ్యేటట్లుగా; ఒనర్చెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** భీముడు యజ్ఞశాలను రాజులు; మునులు విడిది చేయదగిన గృహాలను స్వర్ణమయాలుగా మణిమయాలుగా నిర్మించాడు. వాస్తుశాస్త్రం తెలిసినవారు వాటిని చూచి మెచ్చుకొన్నారు.

**క. ధరణీసురులను బనిచెను । ధర నెందును దిరిగి మునుల ధాత్రీశుల న**
**ధ్వరమునకుఁ బిలువుఁ డని య । మ్మరుత్సుతుఁడు; వారుఁ జని సమంచిత భక్తిన్. 134**

**ప్రతిపదార్థం:** ఆ+మరుత్+సుతుఁడు= ఆ వాయు కుమారుడు భీముడు; ధరన్= భూమండలంలో; ఎందున్= అన్నిచోట్లా; తిరిగి; మునులన్= మునులను; ధాత్రీ+ఈశులను= భూపతులను, రాజులను; అధ్వరమునకున్= యజ్ఞానికి; పిలువుఁడు= ఆహ్వానించండి; అని; ధరణీసురులను= బ్రాహ్మణులను; పనిచెను= పంపాడు; వారున్= ఆ బ్రాహ్మణులును; చని= వెళ్ళి; సమ్+అంచిత= మిక్కిలి ఒప్పుచున్న; భక్తిన్= భక్తితో.

**తాత్పర్యం:** భూమియం దంతటా తిరిగి మునులనూ, రాజులనూ యజ్ఞమునకు ఆహ్వానించండని భీముడు బ్రాహ్మణులను పంపాడు. ఆ బ్రాహ్మణులూ సద్భక్తిపూర్వకంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. పిలిచిన రాజులున్ మునులుఁ బ్రీతి యెలర్ప బలోత్కరంబు శి**
**ష్యులుఁ దమతోడ రా మనము లువ్విళు లూరఁగ యజ్ఞవర్తనం**
**బులుఁ గనుఁగొంటకై సకల భూవలయంబునఁ గల్గునట్టి వా**
**రలు సనుదెంచినం గురుధరాపతి చిత్తము వేడ్క నూనఁగన్. 135**

**ప్రతిపదార్థం:** పిలిచినన్= పిలువగా; సకల= సమస్తమైన; భూవలయంబునన్= భూమండలంలో; కల్గు+అట్టి= ఉన్నట్టి; వారలు= వారు; రాజులున్= రాజులూ; మునులున్= మునులూ; ప్రీతి= సంతోషం; ఎలర్పన్= అతిశయించగా; బల= సైన్యంయొక్క; ఉత్కరంబు= సమూహం; శిష్యులన్= శిష్యులూ; తమతోడన్= తమతోపాటు; రాన్= రాగా; యజ్ఞ= యజ్ఞంయొక్క; వర్తనంబులు= నడచుపద్ధతులు; కనుఁగొంటకై= చూచుటకై; మనములు= మనస్సులు; ఉవ్విళులూరఁగన్= తహతహపడుతుండగా; చనుదెంచినన్= రాగా; కురుధరాపతి= కురురాజు, ధర్మరాజు; చిత్తము= మనస్సు; వేడ్కన్+ఊనఁగన్= సంతోషం పొందగా.

**తాత్పర్యం:** (బ్రాహ్మణులు) ఆహ్వానించగా భూమండలంలో అంతటా ఉన్న రాజులూ, మునులూ ఆనందం అతిశయించగా వచ్చారు. రాజులు తమసైన్యాలతో వచ్చారు. మునులు తమ శిష్యులతో వచ్చారు. యజ్ఞం జరిగే పద్ధతులు చూడటానికి వారి మనస్సులు తహతహపడుతుండగా అప్పుడు ధర్మరాజు మనస్సులో సంతోషించి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఎదురుకొని వీడుఁ బట్లకు । ముద మారఁగఁ దాన యనిచి మొక్కలములు నిం**
**పొద వించునట్టివియుఁ గాఁ । బదార్థములు ప్రజదలమునుఁ బాటించి తగన్. 136**

**ప్రతిపదార్థం:** తాను+అ= తానే; ఎదురుకొని= ఎదురువెళ్ళి; ముదము= సంతోషం; ఆరఁగన్= కలుగగా; వీడు+పట్లకున్= విడిది ఇండ్లకు; అనిచి= పంపి; మొక్కలములు= ఉత్సాహ వచనములు; పదార్థములు= ఉపయోగించే వస్తువులు మొదలగునవి; ఇంపు= ప్రీతిని; ఒదవించు= పుట్టించే; అట్టి+అవియున్= అటువంటివి; కాన్= కాగా; తగన్= సముచితంగా; ప్రజ= జనులయొక్క; తలమునున్= హెచ్చుతగ్గులను, అంతస్తులను; పాటించి= పరిశీలించి.

**తాత్పర్యం:** వచ్చినవారు సంతోషించగా తానే ఎదురువెళ్ళి తీసికొనివచ్చి వారి వారి విడిది ఇళ్ళకు పంపాడు. వారికి ప్రీతి కలిగేటట్లు ఉత్సాహ వచనాలు పలికాడు. కావలసిన పదార్థాలు సమకూర్చాడు. ఈ పనులన్నీ వచ్చినవారి అంతస్తులను బట్టి హోదాలనుబట్టి ధర్మరాజు నిర్వర్తించాడు.

**క. భోజన శయనాసనములు। రాజిల్లెడు నట్లుగాఁగ రాజుల కెల్లం**
**దేజోధనుఁ డా ధర్మత। నూజుం డిడఁ బనుచు జనవినుతసుచరిత్రా! 137**

**ప్రతిపదార్థం:** జన= జనులచేత; వినుత= కొనియాడబడిన; సుచరిత్రా!= మంచి నడవడి కలవాడా!; తేజస్= సద్గుణాలవలన కలిగే తేజస్సు; ధనుఁడు= ధనముగా కలవాడు; ఆ+ధర్మతనూజుండు= ఆ యముడి కుమారుడు ధర్మరాజు; భోజన= భోజనాలూ; శయన= శయ్యలూ, మంచములూ, పాన్పులూ; ఆసనములు= కూర్చుండటకు కుర్చీలు, పీటలూ; రాజిల్లెడు+అట్లు+కాఁగన్= ప్రకాశించేటట్లుగా; రాజులకున్+ఎల్లన్= రాజులకందరకూ; ఇడన్= సమకూర్చగా; పనుచున్= పంపుతాడు.

**తాత్పర్యం:** జనమేజయా! తేజస్వంతుడైన ధర్మరాజు రాజులందరికీ కావలసిన భోజనాలూ, శయ్యలూ, ఆసనాలూ సమృద్ధిగా సమకూరేటట్లు పంపేవాడు. ఇవి కూడా వారి వారి హోదాలకు తగినట్లు పంపేవాడని గ్రహించాలి.

**చ. మునులకు నెల్లఁ గందములు మూలములున్ ఫలకోట్లునుం బ్రియం**
**బొనరఁగఁ దాన పోయి మధురోక్తులతోడ సమర్పణంబు సే**
**యు; నిటుల సంవిధానము లనూనములై విలసిల్లఁజేయు; న**
**య్యనిమిషనాథవైభవుఁ డహంకృతి వర్జన సంస్తుతంబుగన్. 138**

**ప్రతిపదార్థం:** ఆ+అనిమిషనాథ= దేవతలయొక్క ప్రభువు దేవేంద్రుడియొక్క; వైభవుఁడు= వైభవం కలవాడు; అహంకృతి= అహంకారంయొక్క; వర్జన= విడుచుటచేత; సంస్తుతంబు+కన్= మిక్కిలి కొనియాడబడేటట్లుగా; మునులన్+ఎల్లన్= మునుల కందరకూ; కందములున్= దుంపలూ; మూలములున్= వేరులూ; ఫలకోట్లునున్= ఫలముల సమూహమునూ; ప్రియంబు= ప్రీతి; ఒనరఁగన్= కలుగగా; తాన్+అ= తానే; పోయి; మధుర= తియ్యనైన; ఉక్తులతోడన్= మాటలతో; సమర్పణంబు+చేయున్= సమర్పిస్తాడు; ఇటులు+అ= ఇట్లే; సంవిధానములు= ఏర్పాట్లు; న+ఊనములు= తక్కువగానివి, పరిపూర్ణమైనవి; ఐ= అయి; విలసిల్లన్= ఒప్పగా; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** దేవేంద్ర వైభవం కలిగిన ధర్మరాజు అహంకారాన్ని వదలి, వినయంతో తానే పోయి తియ్యనైన పలుకులు పలుకుతూ మునుల కందరకూ దుంపలూ, వేరులూ, పలురకాల పండ్లూ సమర్పించేవాడు. ఈ విధంగా ఏర్పాటులన్నీ పరిపూర్ణంగా ఉండేటట్లు చేసేవాడు.

**తే. యజ్ఞవాటంబుఁ దక్కటి యాలయములు,। లలితభంగి రమ్యములు, సలక్షణములు**
**గా నొనర్చిన శిల్పి నికాయమునకుఁ। బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ. 139**

**ప్రతిపదార్థం:** యజ్ఞవాటంబున్= యజ్ఞశాలనూ; తక్కటి= ఇతరములైన; ఆలయములున్= మందిరములనూ; లలిత= కోరబడిన; భంగిన్= విధంగా; రమ్యములు= అందమైనవి; సహ+లక్షణములు= వాస్తుశాస్త్రం చెప్పిన లక్షణాలతో కూడినవి; కాన్= అయ్యేటట్లుగా; ఒనర్చిన= నిర్మించిన; శిల్పి= శిల్పులయొక్క; నికాయమునకున్= సమూహానికి; సంతసంబు= సంతోషం; ఎసకము+ఎసఁగన్= అతిశయించగా; పసదనంబు= బహుమానం; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** కోరిన విధంగా, అందంగా, శాస్త్రోక్తంగా యజ్ఞశాలనూ, ఇతర మందిరాలనూ నిర్మించిన శిల్పి బృందానికి మహానందం కలిగేటట్లుగా ధర్మరాజు బహుమానా లిచ్చాడు.

**సీ.** **పాండవాగ్రజుఁ డట్లు పవననందనుఁ బంచి। యజ్ఞశాలా కరణాదు లైన**
**కృత్యముల్ నడపుటఁ గృష్ణుండు గనుఁగొని। కడుఁ బ్రీతిఁ బొందె; నాగత నృపాలు**
**రచ్చెరువొందిరి; రయ్యమృతాంశు వంశ ని। స్తారకుం డర్థిమైఁ దేరఁ బనుప**
**ననవద్య పశువుల నఖిలజాతులవానిఁ। గొనివచ్చి రత్యంత కుశల పరిజ**

**ఆ.** **నంబు; లన్న పర్వతంబులు నాజ్య వా। హినులుఁ గల్గి విప్రజనపరంప**
**రలు భుజించు పేర్మి యొలసి యాగారంభ। సమయ మద్భుత ప్రజనక మయ్యె.** **140**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడు ధర్మరాజు; అట్లు= ఆ విధంగా; పవన నందనున్= వాయు కుమారుడైన భీముడిని; పంచి= ఆజ్ఞాపించి; యజ్ఞశాల= యజ్ఞశాలయొక్క; కరణ= నిర్మాణం; ఆదులు+ఐన= మొదలగునవైన; కృత్యముల్= పనులు; నడపుటన్= చేయుట; కృష్ణుండు; కనుఁగొని;= చూచి; కడున్= మిక్కిలి; ప్రీతిన్= సంతోషమును; పొందెన్= పొందాడు; ఆగత= వచ్చిన; నృపాలురు= రాజులు; అచ్చెరువు= ఆశ్చర్యం; ఒందిరి= పొందారు; ఆ+అమృతాంశు= ఆ చంద్రుడియొక్క; వంశ= వంశంయొక్క; నిస్తారకుండు= ఉద్ధరించేవాడు; అర్థిమైన్= ప్రీతితో; తేరన్= తీసికొనిరాగా; పనుపన్= ఆజ్ఞాపించగా; అత్యంత= మిక్కిలి; కుశల= నేర్పు కలిగిన; పరిజనంబులు= సేవలకు; న+అవద్య= దోషంలేని, తప్పుడు సుళ్ళు మొదలగునవి లేని; పశువులన్= జంతువులను; అఖిల= సమస్తమైన; జాతుల వానిన్= తెగలవారిని; కొని= తీసికొని; వచ్చిరి= వచ్చారు; అన్న పర్వతంబులున్= కొండలవంటి అన్నపురాసులు; ఆజ్యవాహినులున్= నేతుల నదులు; కల్గి= ఒనగూడి; విప్రజన= బ్రాహ్మణులయొక్క; పరంపరలు= ఎడతెగని సమూహాలు; భుజించు= భోజనం చేసే; పేర్మి= పెంపు; ఒలసి= కలిగి; యాగ= యజ్ఞంయొక్క; ఆరంభ సమయము= ప్రారంభ కాలం; అద్భుత= ఆశ్చర్యమును; ప్రజనకము= మిక్కిలి కలిగించేది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా భీముడిని ఆజ్ఞాపించి యజ్ఞశాలా నిర్మాణం మొదలైన పనులు చేయించటం చూచి శ్రీకృష్ణుడు మహాసంతోషం పొందాడు. వచ్చిన రాజులూ ఆశ్చర్యపడ్డారు. చంద్రవంశోద్ధారకుడైన ధర్మరాజు నేర్పరులైన సేవకులను దోషరహితమైన వివిధజాతుల జంతువులను తీసికొనిరావలెనని పంపాడు. వారు అటువంటి వాటిని చూచి తీసికొనివచ్చారు. అన్నరాసులు కొండలవలె లేచాయి. నేయి నదులవలె ప్రవహించింది. బ్రాహ్మణులు ఎడతెగకుండా భోజనాలు చేశారు. ఈ పెంపువలన యాగ ప్రారంభోత్సవం ఆశ్చర్యదాయకమైనది.

**క.** **విను లక్ష భూసురులు గుడి। చిన నొకమరి మ్రోయుభేరి సెలఁగుచునుండున్**
**జననాయక! యెప్పుడు; నే। మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్.** **141**

**ప్రతిపదార్థం:** జననాయక!= రాజా!; విను= వినుము; లక్ష భూసురులు= లక్షమంది బ్రాహ్మణులు; కుడిచినన్= భోజనంచేయగా; ఒకమరి= ఒకసారి; మ్రోయు= మ్రోగెడి; భేరి; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; చెలఁగుచున్+ఉండున్= మ్రోగుతూ ఉంటుంది; అశ్వమేధ= అశ్వమేధమను; యజ్ఞ= యజ్ఞంయొక్క; విభూతిన్= వైభవమును; ఏమి+అని= ఎటువంటిదని; చెప్పుదున్= వర్ణించగలను?

**తాత్పర్యం:** జనమేజయా! వినుము. లక్షమంది బ్రాహ్మణులు భుజిస్తే ఒకసారి మ్రోగే భేరి ఎడతెగకుండా మ్రోగుచూ ఉన్నది. ఆ అశ్వమేధ యాగ వైభవాన్ని గూర్చి ఏమని ఎంతని వర్ణించేది?

**చ. శరధిపరీత భూమిఁ గలసర్వజనంబును దోఁచె; నమ్మహా**
**ధ్వరమున భూపతుల్ మకుట పంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ**
**బొరిఁబొరిఁ ద్రోచి కొంచు మదిఁ బొంపిరి వోయెడు వేడుకం బనుల్**
**వెరవులు లావులున్ మెఱయ వేయు విధంబులఁ జేయు టొప్పఁగన్. 142**

**ప్రతిపదార్థం:** శరధి= సముద్రాలచేత; పరీత= చుట్టబడిన; భూమిన్= భూమండలంలో; కల= ఉన్న; సర్వ= సమస్తమైన; జనంబును= జనమూ; తోఁచెన్= వచ్చారు; ఆ+మహత్+అధ్వరమునన్= ఆ గొప్ప యజ్ఞంలో; భూపతుల్= రాజులు; మకుట= కిరీటములయొక్క; పంక్తులు= సమూహాలు; భూషణ= నగలయొక్క; రాజిన్= సమూహాన్ని; చక్కఁగాన్= మొదట ఉన్నట్లు అందంగా; పొరిన్+పొరిన్= మాటి మాటికీ; త్రోచికొంచున్= సర్దుకొంటూ; మదిన్= మనస్సులో; పొంపిరి+పోయెడు= అతిశయిస్తున్న; వేడుకన్= కుతూహలంతో; వెరవులు= ఉపాయాలూ; లావులున్= శక్తులూ; మెఱయన్= వెల్లడి కాగా; పనుల్= పనులు; వేయు+విధంబులన్= వేలకొలది తీరులుగా; చేయుట= చేయటం; ఒప్పఁగన్= ఒప్పగా.

**తాత్పర్యం:** నాలుగు సముద్రాలూ చుట్టిన భూమండలంలోని జనమంతా వచ్చింది. ఆ యజ్ఞంలో రాజులు నేను చేస్తాను నేను చేస్తాను అని ముందుకు వచ్చి తమ తమ శక్తియుక్తులు వెల్లడయ్యేటట్లుగా ఎన్నో విధాలుగా పనులు చేసేవారు. ఆ ఒత్తిడికి వారి కిరీటాలూ, నగలూ తొలగిపోయేవి. వారు వాటిని మాటి మాటికీ చక్కగా సర్దుకొనేవారు.(తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కలయంగ రాజులఁ గనుఁగొని ధర్మనం । దనుఁడు భీమునిఁ బిల్చి మనుజపతుల**
**కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మరు । త్తనయుండు దగఁ దన తమ్ముదోయి**
**నెలమిఁ గూర్చికొని మహీశుల సబహుమా । నంబునఁ బూజించె; నలిననాభుఁ**
**డప్పుడ సీరి సాత్యకి ముఖ యాదవ । సహితంబుగాఁగఁ బ్రసన్నవదన**

**తే. కమల మొప్పంగఁ బాండవాగ్రజుని కడకు । వచ్చుడును, బ్రియ మలర నవ్వసుమతీశుఁ**
**డా బలుండును నతఁడును నాదిగా స । మస్త యాదవులకు నధికార్ఘ లిచ్చె. 143**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుఁడు= యముడి కుమారుడు ధర్మరాజు; రాజులన్= రాజులను; కలయంగన్= పూర్తిగా; కనుఁగొని= చూచి; భీమునిన్= భీముడిని; పిల్చి= పిలిచి; మనుజపతులకున్+ఎల్లన్= రాజులకందరకూ; వే= శీఘ్రంగా; పూజలు+ఇమ్ము=పూజలు చేయుము; అన్నన్= అని చెప్పగా; ఆ+మరుత్+తనయుండు= ఆ వాయు కుమారుడు భీముడు; తన= తనయొక్క; తమ్ముదోయిన్= తమ్ముల జంటను, నకుల సహదేవులను; కూర్చికొని= కలుపుకొని; తగన్= తగినట్లుగా; ఎలమిన్= ఆనందంతో; మహీ+ఈశులన్= రాజులను; సహ+బహుమానంబునన్= బహుమాన పురస్సరంగా; పూజించెన్= పూజించాడు; అప్పుడు+అ= ఆ సమయముననే; నలిన నాభుఁడు= పద్మం నాభియందు గలవాడు - కృష్ణుడు; సీరి= బలరాముడు; సాత్యకి; ముఖ= మొదలైన; యాదవ= యాదవులతో; సహితంబు+కాఁగన్= కూడియుండినట్లుగా; ప్రసన్న= తృప్తిచేత నిర్మలమైన; వదనకమలము= ముఖపద్మం; ఒప్పంగన్= వెలుగొందగా; పాండవ+అగ్రజుని= ధర్మరాజుయొక్క; కడకున్= దగ్గరకు; వచ్చుడును= రాగా; ఆ+వసుమతీ+ ఈశుఁడు= ఆ

రాజు; ప్రియము= సంతోషం; అలరన్= కలుగగా; ఆ+బలుండును= బలరాముడును; అతఁడును= కృష్ణుడును; ఆది+కాన్= మొదలుగా; సమస్త= సమస్తమైన; యాదవులకున్= యాదవులకూ; అధిక+అర్చలు+ఇచ్చెన్= మిక్కిలి పూజలు చేశాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా పనులు చేస్తున్న రాజులను ధర్మరాజు పూర్తిగా చూచాడు. ఆ ప్రభువు భీముడిని పిలిచి 'శీఘ్రంగా రాజులను అందరినీ పూజించుము' అని చెప్పాడు. అతడు నకుల సహదేవులను కలుపుకొని ఆనందంతో వారి వారికి తగినట్లుగా రాజులను అందరినీ బహుమాన పురస్సరంగా పూజించాడు. అప్పుడే ప్రసన్నముఖుడైన శ్రీకృష్ణుడు సాత్యకి బలరామాది యాదవులతో కూడి వచ్చాడు. ధర్మరాజు ఆనందించి బలరాముడు, శ్రీకృష్ణుడు మొదలైన యాదవుల నందరినీ అత్యధికంగా పూజించాడు.

**వ. నారాయణుండు నరునిం బ్రసంగించి పాడవాగ్రజు మొగంబు గనుంగొని 'ద్వారవతినుండి యాప్తుండును విచక్షణుండును నగు వాఁ డొక్కరుండు వచ్చె; వివ్వచ్చుం డప్పురంబు పరిసరంబునఁ బోవం జూచితి ననియె; వివిధ సంగరంబులం దదంగంబు కృశంబై యున్నయది యనియుం జెప్పి; నప్పార్థుండు చేరువకు నరుగు దెంచెం; గాలోచిత క్రియా కలాపంబునకుం దొడంగు'; మనవుడు నప్పుడమితేఁ డప్పురుషోత్తముని తోడ 144**

**ప్రతిపదార్థం:** నారాయణుండు= శ్రీకృష్ణుడు; నరునిన్= అర్జునుడిని; ప్రసంగించి= ప్రస్తావించి; పాండవ+అగ్రజు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజుయొక్క; మొగంబు= ముఖమును; కనుంగొని= చూచి; ద్వారవతినుండి= ద్వారకనుండి; ఆప్తుండును= ముఖ్యుడూ, కావలసినవాడూ; విచక్షణుండునున్= వివేకశాలి; అగు= అయిన; వాఁడు= వాడు; ఒక్కరుండు= ఒకడు; వచ్చెన్= వచ్చాడు; వివ్వచ్చుండు= అర్జునుడు; ఆ+పురంబు= ఆ పట్టణముయొక్క; పరిసరంబునన్= సమీప ప్రదేశంలో; పోవన్= వెళ్ళుతుండగా; చూచితిన్= చూచాను; అనియెన్= అన్నాడు; వివిధ= అనేకవిధాలైన; సంగరంబులన్= యుద్ధాలలో; తద్+అంగంబు= అతడియొక్క శరీరము; కృశంబు+ఐ= చిక్కినదై; ఉన్న+అది= ఉన్నది; అనియున్= అనికూడా; చెప్పెన్= చెప్పాడు; ఆ+పార్థుండు= ఆ అర్జునుడు; చేరువకున్= దగ్గరకు; అరుగు+తెంచెన్= వచ్చాడు; కాల= సమయానికి; ఉచిత= తగిన; క్రియా= పనులయొక్క; కలాపంబునకున్= సమూహానికి; తొడంగుము= పూనుకొనుము. అనవుడున్= అని అనగా; ఆ+పుడమితేఁడు= ఆ భూపతి ధర్మరాజు; ఆ+పురుషోత్తమునితోడన్= శ్రీకృష్ణుడితో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడి ప్రస్తావన తెచ్చి 'ద్వారకనుండి కావలసినవాడూ, వివేకీ అయినవాడు ఒకడు వచ్చాడు. అర్జునుడు ఆ పట్టణ సమీపంలో వెళ్ళుతుండగా చూచానని వాడు చెప్పాడు. యుద్ధాలవలన అర్జునుడి శరీరం చిక్కిపోయిందని కూడా చెప్పాడు. విజయుడు దగ్గరకు వచ్చాడు. కాబట్టి ఈ సమయాన చేయదగిన పనులన్నీ చేయటానికి పూనుకొను' మని ధర్మరాజుతో చెప్పాడు. అప్పుడు ఆ రాజు కృష్ణుడితో.(తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నీ పంపునఁ బోవుట ను। ద్దీపిత బల శౌర్య ధైర్య తేజోయుతుఁడై**
**యా పార్థుఁడు యోగక్షే। మోపేతుం డయ్యెఁ; నడపు ముచితంపుఁ బనుల్.' 145**

**ప్రతిపదార్థం:** ఆ+పార్థుఁడు= ఆ అర్జునుడు; నీ= నీయొక్క; పంపునన్= ఆజ్ఞచేత; పోవుటన్= వెళ్ళుటవలన; ఉద్దీపిత= ప్రకాశింపజేయబడిన; బల= బలంచేత; శౌర్య= పరాక్రమంచేత; ధైర్య= ధైర్యంచేత కలిగిన; తేజస్= తేజస్సుతో; యుతుఁడు+ఐ= కూడినవాడై; యోగ= అపూర్వ వస్తులాభంతో; క్షేమ= ప్రాప్త వస్తు సంరక్షణంతో; ఉపేతుఁడు= కూడినవాడు; అయ్యెన్= అయ్యాడు; ఉచితము+న్+పనుల్= చేయదగిన పనులను; నడపుము= చేయుము.

**తాత్పర్యం:** 'అర్జునుడు నీ ఆజ్ఞానుసారం వెళ్ళాడు. అందువలన అతడు బల శౌర్య ధైర్య తేజస్వంతుడు అయ్యాడు. యోగ క్షేమం కలవాడయ్యాడు. నీవే చేయదగిన పనులన్నీ చేయించుము.'

కృష్ణుఁడు ధర్మజునితో నర్జును సందేశంబు చెప్పుట (సం. 14-88-13)

**వ. అనిన నవ్వారిజనాభుండు 'ద్వారకనుండి వచ్చినవాఁ డగ్గాండీవి తనతోడం జెప్పె నని చెప్పిన మాటల తెఱంగా కర్ణింపుము. 146**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఆ+వారిజ నాభుండు= పద్మము నాభియందు కలవాడు-కృష్ణుడు; ద్వారకనుండి= ద్వారక నుండి; వచ్చినవాఁడు= వచ్చినవాడు; ఆ+గాండీవి= అర్జునుడు; తనతోడన్= తనతో; చెప్పెన్= చెప్పాడు; అని; చెప్పిన= చెప్పగా; మాటల= మాటలయొక్క; తెఱంగు= తీరు; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అనగా శ్రీకృష్ణుడు అతడితో 'ద్వారకనుండి వచ్చినవాడు, 'అర్జునుడు తనతో చెప్పినా' డంటూ చెప్పిన మాటలు నీకు తెలిపెదను వినుము.

**ఆ. నాదు విన్నపముగ నరనాథునకు విన్న। వింపు; రాజులెల్ల వేడ్కతోడ**
**జన్నమునకు వచ్చుచున్నారు; మున్నెట్టి। వార లైనఁ బూజ వలయు ననుము. 147**

**ప్రతిపదార్థం:** నాదు= నాయొక్క; విన్నపముగన్= మనవిగా; నరనాథునకున్= రాజుగారితో; విన్నవింపు= విజ్ఞప్తిచేయుము; రాజులు+ఎల్లన్= రాజులందరూ; వేడ్కతోడన్= కుతూహలంతో; జన్నమునకున్= యజ్ఞమునకు; వచ్చుచున్+ఉన్నారు= వస్తున్నారు; మున్ను= ఇంతకుముందు; ఎట్టివారలు= ఎటువంటివారు; ఐనన్= అయినప్పటికీ; పూజ= పూజించటం, వలయున్= యుక్తమౌతుంది, విధి ఔతుంది; అనుము= అని చెప్పుము.

**తాత్పర్యం:** 'నా మనవిగా ప్రభువునకు విజ్ఞప్తి చేయుము. రాజులందరూ కుతూహలంతో యజ్ఞానికి వస్తున్నారు. వారు పూర్వం ఎటువంటివారైనప్పటికీ (పగ పూనిన వారయినప్పటికీ అని అర్థం) వారిని పూజించటం మన విధి అని చెప్పుము.

**వ. విశేషించి మదీయ పుత్త్రుండు. 148**

**ప్రతిపదార్థం:** విశేషించి= అతిశయించి; మదీయ= నా యొక్క; పుత్త్రుండు= కుమారుడు.

**తాత్పర్యం:** విశేషంగా నా కుమారుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. మణిపూర పురాధీశుఁడు। గుణ గణ విభ్రాజితుండు గురుహితుఁడు విచ**
**క్షణపరుఁడు బభ్రువాహనుఁ। డణుమాత్రముఁ గీడులేని యట్టిం డెందున్. 149**

**ప్రతిపదార్థం:** మణిపూర= మణిపూరం; పుర= పట్టణంయొక్క; అధి+ఈశుఁడు= అధిపతి; గుణ= సద్గుణములయొక్క; గణ= సమూహాలచేత; విభ్రాజితుండు= ప్రకాశించేవాడు; గురు= గొప్ప; హితుఁడు= మేలు చేసేవాడు; విచక్షణ= మంచిచెడ్డలను ఎరుగుటలో; పరుఁడు= ఆసక్తికలవాడు; ఎందున్= దేనియందునూ; అణుమాత్రమున్= అణువంతకూడా; కీడు= దోషం; లేని; అట్టిండు= అట్టివాడు అయిన; బభ్రువాహనుఁడు.

**తాత్పర్యం:** మణిపూర పురమునకు అధిపతీ, సకల సద్గుణాలచేత ప్రకాశించేవాడూ, గొప్పమేలు చేసేవాడూ, వివేకశాలీ, దేనియందునూ అణువంత కూడా దోషం లేనట్టివాడూ అయిన బభ్రువాహనుడు.

**క. మీ చరణ సరసిజంబులు। చూచుటకై రాక తనకు సువ్రతముగ మున్**
**వేచి యునికి వచ్చుఁ; గృపా। గోచరమగు చేఁతకుం దగును మీ; కనుమీ! 150**

**ప్రతిపదార్థం:** మీ= మీయొక్క; చరణ సరసిజంబులు= పాదపద్మాలు; చూచుటకై= దర్శించటానికి; రాక= రావటం; తనకున్= తనకు; సువ్రతముగన్= ఉత్తమ విధిగా; మున్= పూర్వం నుండియు; వేచి= ఎదురుచూస్తూ; ఉనికిన్= ఉండటంచేత; వచ్చున్= వస్తాడు; మీకున్= మీకు; కృపా= దయకు; గోచరము= వశమైనది; అగు= అయిన; చేఁతకున్= మన్నన చేయుటకు; తగును; అనుము+ఈ!= అని చెప్పుమా!

**తాత్పర్యం:** మీ పాదపద్మాలు దర్శించటానికి రావటమే తనకు ఉత్తమ విధి అని నమ్మి ఎన్నాళ్ళనుండో వేచి ఉన్నాడు. కాబట్టి వస్తాడు. అతడు దయాయుక్తమైన మీ మన్ననకు తగినవాడు అని చెప్పుము.'

**వ. అని చెప్పె ననిన విని యవ్వాక్యంబు లభినందించి ధర్మనందనుండు గోవిందునితోడ. 151**

**ప్రతిపదార్థం:** అని; చెప్పెన్= ద్వారకనుండి వచ్చినవాడితో అర్జునుడు చెప్పాడు; అనినన్= అనగా; విని; ఆ+వాక్యంబులు= ఆ మాటలను; అభినందించి= పొగడి, మెచ్చి; ధర్మనందనుండు= ధర్మరాజు; గోవిందునితోడన్= కృష్ణుడితో.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పినాడని అనగా విని ఆ మాటలను మెచ్చుకొని ధర్మరాజు కృష్ణుడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'ఏ వింటి విజయుఁ డనేక యుద్ధంబుల। నలజడి వడుట; య ట్లతఁడు నాఁడు**
**నక్కట! ద్రోణభీష్మాదులతోడి యె। క్కుడుఁ బోర నిడుమలఁ బడియెఁ; నేఁడు**
**నిత్తెఱంగునఁ బడియెడు; నాకుఁగా నిన్ని। పాటులు వడునె యప్పరమ సౌఖ్య**
**యోగ్యదేహుండు; ని న్నొక్కటి నడిగెద;। నతని మేను సులక్షణాన్వితంబు;**

**తే. నా మదికి నెక్క నీవు గన్వఱపి కన్న। యట్టికీడు తదీయంబులైన యవయ**
**వముల నెందేనిఁ గలిగెనే? యమితదుఃఖ। భాగి యగుటకు మూలమై పద్మనాభ! 152**

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= శ్రీకృష్ణా!; విజయుఁడు= అర్జునుడు; అనేక యుద్ధంబులన్= అనేక యుద్ధాలయందు; అలజడి+పడుట= కష్టపడటం; ఏన్= నేను; వింటిన్= విన్నాను; అక్కట!= అయ్యో!; నాఁడు= ఆనాడు; అట్లు= ఆ విధంగా; అతఁడు= అర్జునుడు; ద్రోణ= ద్రోణుడు; భీష్మ= భీష్ముడు; ఆదులతోడన్= మొదలైనవారితోడ; ఎక్కుడు(న్+పోరన్= మహాసంగ్రామంలో; ఇడుమలన్= కష్టాలను; పడియెన్= పొందాడు; నేఁడున్= ఈనాడు కూడా; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పడియెడున్= శ్రమిస్తున్నాడు; నాకున్+కాన్= నా కొరకు; ఆ+పరమ= ఆ ఉత్తమోత్తమమైన; సౌఖ్య= సుఖములకు; యోగ్య= తగిన; దేహుండు= శరీరం కలవాడు; ఇన్ని; పాటులు= కష్టాలు; పడను+ఎ?= పొందునా?; నిన్నున్= నిన్ను; ఒక్కటిన్= ఒకమాట; అడిగెదన్= అడుగుతాను; అతని= అర్జునుడి యొక్క; మేను= శరీరం; సు= మంచిదైన; లక్షణ= లక్షణాలతో; అన్వితంబు= కూడినదని; నా= నాయొక్క; మదికిన్= మనస్సునకు; ఎక్కన్= బోధపడేటట్లుగా నీవు; కను+పఱపి= దృష్టిసారించి; కన్న+అట్టి= తెలిసికొనినట్టి; కీడు= దోషం; అమిత= మితిలేని; దుఃఖ= దుఃఖాలు; భాగి= పొందినవాడు; అగుటకున్= అగుటకు; మూలము+ఐ= ఆదికారణమై; తదీయంబులు+ఐన= అతడివి అయిన; అవయవములన్= అవయవాలలో; ఎందున్+ఏనిన్= దేనియందైనా; కలిగెన్+ఏ?=ఉన్నదా?

**తాత్పర్యం:** అర్జునుడు అనేక యాద్ధాలలో క్లేశపడటం నేను విన్నాను. ఆనాడు ఆ విధంగా భీష్ముడు ద్రోణుడు మొదలైన వీరులతో చేసిన భయంకర యుద్ధంలో కష్టాలు పొందాడు. ఈనాడు ఈ విధంగా క్లేశాల పాలౌతున్నాడు. ఉత్కృష్ట సౌఖ్యాలకు యోగ్యమైన శరీరం కలిగిన అర్జునుడు ఈ విధంగా నాకొరకే పడరాని పాట్లు పడుతున్నాడు కదా! నేను నిన్ను ఒకమాట అడుగుతాను. అతడి శరీరం ఉత్తమ లక్షణాలతో కూడినట్టిది. ఈ విధంగా అతడు మితిలేని దుః ఖాలను అనుభవించటానికి హేతువైన దోషం అతడి అవయవాలలో దేనియందైనా ఉన్నదా? నీవు సూక్ష్మంగా చూపు పెట్టి కనుగొన్న దేదైనా ఉంటే నాకు స్పష్టంగా తెలియజేయుము.

**క. తెలుపఁదగు నేనిఁ గరుణం । దెలుపుము నా; కనుడు వాసుదేవుఁడు 'నీకుం**
**దెలుపుటయుఁ గృత్యమే; విను; । తెలిపెదఁ గలమాత్ర వసుమతీవరముఖ్యా! 153**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; తెలుపన్+తగున్+ఏనిన్= తెలియజేయదగినదైనచో; కరుణన్= దయతో; తెలుపుము= తెలియజేయుము; అనుడున్= అని అనగా; వాసుదేవుఁడు= శ్రీకృష్ణుడు; వసుమతీ+వర= భూపతులలో, రాజులలో; ముఖ్యా!= అగ్రణీ!; నీకున్= నీకు; తెలుపుటయున్= తెలియజేయటం కూడా; కృత్యము+ఏ= చేయదగిన పనియే; విను= వినుము; కలమాత్రన్= యథార్థాన్ని; తెలిపెదన్= తెలియజేస్తాను.

**తాత్పర్యం:** నాకు తెలియజేయదగిన దైతే దయతో చెప్పుము' అని అనగా శ్రీకృష్ణుడు 'రాజాగ్రణీ! నీకు తెలియజేయటం నా విధి. యథార్థం చెప్పుతాను వినుము.'

**తే. సర్వగాత్రంబులందును సవ్యసాచి । కధిక శుభలక్షణంబుల యతిశయిల్లుఁ;**
**దనువు మాత్రకు నించుక ధరణినాథ । యెక్కుడై యుండుఁ జిఱుదొడ; లిదియ కొఱఁత. 154**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; సవ్యసాచికిన్= అర్జునుడికి; సర్వ= సమస్తమైన; గాత్రంబుల+అందున్= అవయవాలలోనూ; అధిక= మిక్కిలి; శుభ= శుభం కలిగించే; లక్షణంబులు+అ= లక్షణాలే; అతిశయిల్లున్= ఒప్పారుతాయి; తనువు= శరీరంయొక్క; మాత్రకున్= పరిమాణానికి; ఇంచుక= కొంచెం; ఎక్కుడు+ఐ= పెద్దవియై; చిఱుదొడలు= పిక్కలు; ఉండున్= ఉంటాయి; ఇది+అ= ఇదే; కొఱఁత= లోపం.

**తాత్పర్యం:** రాజా! అర్జునుడి సర్వావయవాలూ శుభలక్షణ సంపన్నములై ఉన్నవి. కాని పిక్కలు అతడి ఒడ్డు పొడవులను మించి ఉన్నవి. ఇదొక్కటే లోపం.

**క. అలజళ్ళు దీనివలనం । కలిగెడునో కాని తక్కు గలుగ దరిష్టం**
**బలఘుశుభలక్షణాన్విత । విలసిత తనుఁ డైన గాండివికి నియ్యెడలన్.' 155**

**ప్రతిపదార్థం:** దీనివలనన్= పిక్కలు శరీర పరిమాణానికి మించి ఉండటంవలన; న+లఘు= అధికమైన; శుభ= శుభములను; కలిగించే; లక్షణ= లక్షణాలతో; అన్విత= కూడి ఉండటంచేత; విలసిత= ప్రకాశించునట్టి; తనుఁడు+ఐన= శరీరం కలవాడైన; గాండివికిన్= అర్జునుడికి; ఈ+ఎడలన్= ఈ సమయములందు; అలజళ్ళు= కష్టాలు; కలిగెడున్+ఓ= కలుగుతున్నవేమో; కాని; తక్కు= ఇతరమైన; అరిష్టంబు= కీడు; కలుగదు.

**తాత్పర్యం:** ఈ లోపంవలన అధిక శుభ లక్షణాలతో కూడి ప్రకాశించే శరీరం కలిగిన అర్జునుడికి ఇప్పుడు కష్టాలు కలుగుతున్నవేమో కాని, ఇంక ఏ అరిష్టమూ సంభవించదు.'

**వ. అట్లున్నరూపు చెప్పిన వెన్నుని వచనంబులు విని యవ్వసుంధరా వల్లభుం డతని యాననం బాలోకించి 'యది యట్లుకాక' యని పలికె; నప్పుడు పాంచాలి పద్మనాభుం బ్రీతి స్ఫీతంబగు చూడ్కినాలోకించిన నాలోకనాథుం డది యర్జున విషయంబైన ప్రీణనంబు తెఱం గగుట యెఱింగికొనియె; నట్టియెడ భీమాదులును యాదవ కుమారులును నక్కిరీటి గుణంబు లగ్గించుచు. నా ప్రొద్దున కదియ గోష్ఠిగ సల్లాపంబు సేయుచుండ నగ్గాండీవి పాలనుండి కాలరి చనుదెంచి. 156**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఉన్నరూపు= సత్యం; చెప్పినన్= చెప్పగా; ఆ+వసుంధరా= భూమియొక్క; వల్లభుండు= నాథుడు, ధర్మరాజు; వెన్నుని= శ్రీకృష్ణుడియొక్క; వచనంబులు= మాటలు; విని; అతని= అతడియొక్క; ఆననంబు= ముఖమును; ఆలోకించి= చూచి; అది= నీవు చెప్పిన విషయం; అట్లు కాక= సరియే, సమంజసమే; అని; పలికెను= పలికాడు; అప్పుడు= ఆ సమయంలో; పాంచాలి= ద్రౌపది; పద్మనాభున్= శ్రీకృష్ణుడిని; ప్రీతి= ఆనందం; స్ఫీతంబు= వ్యాపించింది; అగు= అయిన; చూడ్కిన్= చూపుతో; ఆలోకించినన్= చూడగా; ఆ+లోక= లోకాలయొక్క; నాథుండు= ప్రభువు; అది= ఆ చూపు; అర్జున= అర్జునుడియొక్క; విషయంబు= సంబంధం కలది; ఐన= అయిన; ప్రీణనంబు= సంతృప్తియొక్క; తెఱంగు= విధం; అగుట; ఎఱింగికొనియెన్= తెలిసికొన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; భీమ= భీముడు; ఆదులును= మొదలైనవారును; యాదవ= యదువంశీయులైన; కుమారులును= యువకులును; ఆ+కిరీటి= అర్జునుడియొక్క; గుణంబులు= సద్గుణాలు; అగ్గించుచున్= కొనియాడుతూ; ఆ ప్రొద్దునకున్= ఆ నాటికి; అది+అ= అదే, అర్జున ప్రశంసయే; గోష్ఠిగన్= సభగా; సల్లాపంబు= పరస్పర సంభాషణం; చేయుచున్+ ఉండన్= చేస్తూ ఉండగా; ఆ+గాండీవి= అర్జునుడియొక్క; పాలన్+ఉండి= దగ్గరనుండి; కాలరి= దూత, వార్తాహరుడు; చను+తెంచి= వచ్చి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఆ విధంగా యథార్థం చెప్పగా ధర్మరాజు విని అతడి ముఖం చూచి అది సరే అని అన్నాడు. ఆ సమయాన ద్రౌపది ఆనందమయమైన చూపుతో చూచింది. ఆ చూపు అర్జున సంబంధమైన సంతృప్తి తీరును సూచిస్తున్నదని లోకేశ్వరుడైన శ్రీకృష్ణుడు గ్రహించాడు. అప్పుడు భీముడు మొదలగువారునూ, యాదవ యువకులునూ, అర్జునుడి గుణగణాలను కొనియాడుతున్నారు. అర్జున స్తుతియే ఆనాటికి తాము చేసే గోష్ఠి అని వారు భావించి పరస్పర సంభాషణం సాగిస్తుండగా విజయుడి దగ్గరనుండి ఒక దూత వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. పాండవాగ్రజునకుఁ బ్రణతి యొనర్చి 'వి। వ్వచ్చుఁ డిప్పురి సేరవచ్చె; నెల్లి**
**వచ్చు మీ శ్రీపాదవనజంబులకు మ్రొక్క'। ననవుడు హర్షాశ్రు లడరఁ బులకి**
**తాంగుఁడై వానికి నన్నరేంద్రుఁడు పస। దన మాభరణవస్త్ర కనకములు స**
**మగ్రంబుగా నిచ్చె; నందఱు నానంద। రసమునఁ దేలి యా రాత్రి పార్థుఁ**

**ఆ. జూచు వేడ్క నూనుచును వేగు టెప్పుడో। యనుచు నుండ నుదయ మయ్యె నినుఁడు;**
**క్రీడి సమయ విహిత కృత్యముల్ సలిపి, హ। యంబు మున్ను గాఁగ నరుగుదెంచె. 157**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజునకున్= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజునకు; ప్రణతి+ఒనర్చి= నమస్కారం చేసి; వివ్వచ్చుఁడు= అర్జునుడు; ఈ+పురి= ఈ నగరం; చేరవచ్చెన్= సమీపించాడు; ఎల్లి= రేపు; మీ= మీయొక్క; శ్రీ= శుభములు కలిగించు; పాదవనజంబులకున్= పాదపద్మాలకు; మ్రొక్కన్= నమస్కరించగా; వచ్చున్= వస్తాడు; అనవుడున్= అని అనగా;

ఆ+నరేంద్రుఁడు= ఆ రాజు, ధర్మరాజు; హర్ష+అశ్రులు= ఆనందబాష్పాలు; అడరన్= అలముకొనగా; పులకిత= గగుర్పొడిచిన; అంగుఁడు+ఐ= శరీరం కలవాడై; వానికిన్= ఆ దూతకు; పసదనము= బహుమానంగా; ఆభరణములు= నగలు; వస్త్రములు= బట్టలు; కనకములు= బంగారు నాణెములు; సమగ్రంబు+కాన్= పరిపూర్ణంగా; ఇచ్చెన్= ఇచ్చాడు; అందఱున్= అందరునూ; ఆనంద= ఆనందమనెడు; రసమునన్= అమృతమునందు; తేలి= ఓలలాడి; ఆ+రాత్రి; పార్థున్= అర్జునుడిని; చూచు= చూడవలయుననే; వేడ్క= తహతహపాటు; ఊనుచును= పొందుతూ; వేగుట= తెల్లవారుట; ఎప్పుడు+ఓ= ఎప్పుడో; అనుచున్= అనుకొంటూ; ఉండన్= ఉండగా; ఇనుఁడు= సూర్యుడు; ఉదయము+అయ్యెన్= ఉదయించాడు; క్రీడి= అర్జునుడు; సమయ= ఉదయకాలానికి; విహిత= ధర్మశాస్త్రం విధించిన; కృత్యముల్= పనులు; చలిపి= చేసి; హయంబు= గుర్రం; మున్ను= ముందు; కాఁగన్= అయ్యేటట్లుగా; అరుగు+తెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** దూత ధర్మరాజునకు నమస్కరించి 'అర్జునుడు ఈ నగరం సమీపించాడు. రేపు మీ పాదాభివందనం చేయవస్తాడు' అని చెప్పాడు. ఆ మాటలు విన్న ధర్మరాజు ఆనందబాష్పాలు రాల్చాడు. అతడి శరీరంపై గగుర్పాటులు పొడమినవి. ఆ మహారాజు దూతకు బహుమానంగా నగలూ, బట్టలూ, బంగారు నాణెములూ ఇచ్చాడు. అందరూ ఆనందామృతమున ఓలలాడారు. అర్జునుడిని చూడవలెననే తహతహపాటుతో తెల్లవారుటెప్పుడో అని వారనుకొంటూ ఉండగనే సూర్యుడు ఉదయించాడు. అర్జునుడు కాలకృత్యాలన్నీ తీర్చికొని, యజ్ఞాశ్వాన్ని వెంబడిస్తూ పట్టణానికి వచ్చాడు.

**వ. అప్పుడు. 158**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకు వచ్చుట (సం.14-89-16)**

**క. విను మింద్ర తురగ సమ ఖే। లనమున నవ్వాజి జనములకు నెల్లను లో**
**చనపర్వమయ్యె; వారి వ। దనముల సంతోష మధురతర భాషణముల్. 159**

**ప్రతిపదార్థం:** వినుము= జనమేజయా! వినుము; ఆ+వాజి= ఆ గుర్రం; ఇంద్ర= ఇంద్రుడియొక్క; తురగ= గుర్రంతో; సమ= సమానమైన; ఖేలనమునన్= క్రీడా విలాసంతో; జనములకున్+ఎల్లను= పౌరులందరికీ; లోచన పర్వము= కన్నుల పండువు; అయ్యెన్= అయింది; వారి= వారియొక్క; వదనములన్= నోళ్లవెంట; సంతోష= సంతోషంచేత; మధురతర= మిక్కిలి మనోహరమైన, తియ్యని; భాషణముల్= పలికెడి మాటలు.

**తాత్పర్యం:** జనమేజయా! వినుము. ఆ యజ్ఞాశ్వం ఉచ్చైశ్రవము యొక్క క్రీడా విలాసంచేత పౌరులకందరకూ కన్నుల పండువు చేసింది. సంతోషంచేత వారు పలికే తియ్యని నోటి మాటలు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. కలయంగ నిట్లని చెలఁగె; 'నిగ్గాండీవి। దక్క నిమ్మాడ్కి నొండొక్కరునకు**
**నశ్వంబు తనయిచ్చ నఖిలదేశములకు। నరుగంగ ధరణీశు లచట నచట**
**బలములతో వచ్చి బలసి తదీయ రో। ధం బాచరింపఁ దృణంబు గాఁగఁ**
**గొని లీలమై గెల్పు గొనుచోట్ల నుగ్రత। వాటింప కగ్రజు పలుక యెట్టి**

**తే. దశల నైనను బాటించి, తా నొకండ। ననుతలం పెప్ప నుల్లంబునందు లేక**
**తనువు గవుసెనఁ బెట్టి పుచ్చిన విధమున। నరుగుదేవచ్చునే? యిది యక్కజంబు! 160**

**ప్రతిపదార్థం:** కలయంగన్= అంతటనూ; ఇట్లు+అని= ఈ ప్రకారంగా; చెలఁగెన్= మ్రోసింది; అశ్వంబు= గుర్రం; తన+ఇచ్చన్= స్వేచ్ఛగా; అఖిల దేశములకున్= సమస్త దేశాలకు; అరుగంగన్= వెళ్ళగా; ధరణీ+ఈశులు= భూపతులు, రాజులు; అచటన్+అచటన్= అక్కడక్కడ; బలములతోన్= సైన్యాలతో; వచ్చి; బలసి= చుట్టుముట్టి; తదీయ= ఆ గుర్రంయొక్క; రోధంబు= అడ్డగించటం, ఆపుట; ఆచరింపన్= చేయగా; తృణంబు+కాఁగన్= గడ్డిపరకగా; కొని= భావించి; లీలమైన్= అనాయాసంగా; గెల్పు= విజయం; కొను= పొందే; చోట్లన్= సమయాలలో; ఉగ్రత= క్రోధం; పాటింపక= ప్రకటించక; అగ్రజు= అన్నగారియొక్క; పలుకు+అ= ఆజ్ఞా వాక్యమునే; ఎట్టి= ఎటువంటి; దశలన్= అవస్థలలో; ఐనను= ఐనా; పాటించి= ఆదరించి, లెక్కచేసి; తాను; ఒకండన్= ఒక్కడను, అసహాయుడను; అను= అనెడి; తలంపు= ఆలోచన, అభిప్రాయం; ఎప్డున్= ఏనాడునూ; ఉల్లంబు+అందున్= హృదయంలో; లేక; తనువు= శరీరం; గవుసెనన్= గలీబులో; పెట్టి= ఉంచి; పుచ్చిన= బయటికి తీసిన; విధమునన్= విధంగా (గలీబులో ఉంచి కొన్నాళ్ళ తరువాత బయటికి తీసిన వీణ, విల్లు మొదలైనవి చెక్కు చెదరక ఉంటాయో, అట్లే అర్జునుడు ఎవరెవరితో ఎన్ని యుద్ధాలు చేసినను, ఎన్ని కష్టాలు అనుభవించినను, అతడి శరీరం చెక్కు చెదరలేదని భావం); ఈ+గాండీవి= అర్జునుడు; తక్కన్= తప్ప; ఈ+మాడ్కిన్= ఈ విధంగా; ఒండు+ఒక్కరునకున్= మరియొకడికి; అరుగు+తేన్= రాగా; వచ్చును+ఏ?= శక్యమగునా?; ఇది= అర్జునుడు ఇట్లు వచ్చుట; అక్కజంబు= ఆశ్చర్యకరం.

**తాత్పర్యం:** అంతటా ఈ ప్రకారంగా మ్రోసింది. 'ఈ యజ్ఞాశ్వం స్వేచ్ఛగా సమస్త దేశాలలోనూ తిరిగింది. అక్కడక్కడా రాజులు సైన్యాలతో వచ్చి చుట్టుముట్టి దీనిని ఆపారు. కాని, అర్జునుడు వారిని గడ్డిపరక వలె పరిగణించాడు. వారిని ఓడించి విజయం పొందినప్పుడూ సైతం ఇతడు క్రోధం చూపలేదు. అన్నగారు చెప్పినమాట ప్రకారం నడచుకొన్నాడు. నేను అసహాయుడిని అని ఏనాడూ ఇతడు మనసులో అనుకొనలేదు. ఈ అర్జునుడు తప్ప ఈ విధంగా మరొకడికి ఒడలు అలవకుండా చెక్కు చెదరకుండా రావటం శక్యమా? ఇది ఎంతో వింతగా ఉన్నది.

**క.** **సగరాదులఁ జెప్ప వినమె! మగఁటిమియును బలము ని ట్లమానుష భంగిన్**
**నెగడునె? యింకను బుట్టరు। జగతిని గాండీవితోడ సరి వచ్చు మగల్.** **161**

**ప్రతిపదార్థం:** సగర= సగరుడు; ఆదులన్= మొదలైనవారిని; చెప్పన్= వర్ణించగా, పొగడగా; వినము+ఎ?= మనం వినలేదా?; ఇట్లు= ఈ విధంగా; మగఁటిమియును= పౌరుషమూ, పరాక్రమమూ; బలమున్= బలమూ; అమానుష= మానవాతీతమైన; భంగిన్= విధంగా; నెగడును+ఎ?= సంభవించునా?; జగతిని= లోకంలో; గాండీవితోడన్= అర్జునుడితో; సరివచ్చు= సాటివచ్చు; మగల్= వీరులు; ఇంకను= ఇకముందు; పుట్టరు.

**తాత్పర్యం:** సగరుడు మొదలైన వారిని పొగడటం మనం విన్నాము కదా! ఈ విధంగా మానవాతీతమైన బలపరాక్రమాలు ఎవరికైనా కలిగినవా? అర్జునుడితో సాటిరాగల వీరులు ఈ ప్రపంచంలో ఇకముందు పుట్టరు.

**క.** **మానుషము దైవమును సరి। నే నే నని కార్యసిద్ధి నెలయింపఁగ ని**
**త్యానందుఁ డయ్యె ధర్మజుఁ;। డీ నిర్మల భాగ్యమహిమ యేరికిఁ గలదే?** **162**

**ప్రతిపదార్థం:** మానుషమున్= మనుష్య ప్రయత్నం, పరాక్రమం; దైవమును; సరిన్= సమానంగా; ఏన్= నేను; ఏన్= నేను; అని; కార్య= పనులయొక్క; సిద్ధి= నెరవేరటం; ఎలయింపఁగన్= కలిగించగా; ధర్మజుఁడు= ధర్మరాజు; నిత్య= అఖండమైన; ఆనందుఁడు= ఆనందం కలవాడు; అయ్యెన్= అయ్యాడు; ఈ నిర్మల= స్వచ్ఛమైన; భాగ్య= అదృష్టంయొక్క; మహిమ= గొప్పతనం; ఏరికిన్= ఎవరికైనను; కలదు+ఏ?= ఉన్నదా?

**తాత్పర్యం:** మానవ ప్రయత్నమూ, దైవబలమూ ఒకదానితో ఒకటి పోటీపడి కార్యసాఫల్యం కలిగిస్తుండగా ధర్మరాజు అఖండానందం అనుభవిస్తున్నాడు. ఇటువంటి గొప్ప ఇంకెవరికైనా ఉన్నదా?' (ధర్మరాజు నిత్యమూ తన ధర్మాన్ని గుర్తించి విధులు నిర్వహిస్తున్నాడనీ దైవము ఎల్లప్పుడూ అతడికి తోడ్పడుతూ అతడు చేసే పనులు జయప్రదములయ్యేటట్లు చేస్తున్నదని తాత్పర్యం).

**క. విను మట్లు చెలంగఁగ ఘూ। ర్ణన మొందిన యర్ణవం బనఁగఁ బొంగారెన్**
**జన నికురుంబం; బాపెం। పనఘా! చూడ వినఁ బడయ మఖిల జగములన్. 163**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!, జనమేజయా!; విను= వినుము; అట్లు= ఆ విధంగా; చెలంగఁగన్= మ్రోయగా; జన= పౌరులయొక్క; నికురుంబంబు= సమూహం; ఘూర్ణనము= ఘోష, తిరుగుడు; ఒందిన= పొందిన; అర్ణవంబు= సముద్రం; అనఁగన్= అనగా; పొంగారెన్= ఉప్పొంగెను; ఆ= అటువంటి; పెంపు= వైభవం; అఖిల= సమస్తమైన; జగములన్= లోకాలలో; చూడన్+పడయము= చూడజాలము; వినన్+పడయము= వినజాలము, చూడలేదు, వినలేదు అని అర్థం.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఆ విధంగా మాటలు మ్రోయుచుండగా, పౌరసమూహం ఘోషించే సముద్రమో అన్నట్లు ఉప్పొంగింది. ముల్లోకాలలో అటువంటి వైభవాన్ని మనం చూడలేదు. వినలేదు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. మఱియును. 164**

**తాత్పర్యం:** ఇంకనూ- (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. నృపు లోహటింప జంత్రపుమీను నేసి చే। కొనియెఁ బాంచాలుని కూఁతు నితఁడె!**
**సురసేనతోఁ బురందరుఁ గెల్చి భుజగర్వ। మేపార ఖాండవం బేర్చె నితఁడె!**
**యెక్కటి బవరాన నీశాను మెప్పించి। పాశుపతాస్త్రంబుఁ బడసె నితఁడె!**
**యొంటిమై భీష్మాది యోధుల కురుపతి। ధృతిఁ బాపి గోవులఁ దెచ్చె నితఁడె!**

**తే. ప్రతిన సేసి విషమ సమరమునఁ బ్రొద్దు। గ్రుంకనీ కాఁగి సైంధవుఁ గూల్చె నితఁడె!**
**యనుచు సందడిగాఁ గ్రమ్మి యఱ్ఱులెత్తి। చూచె జనలోక మాసవ్యసాచిఁ బ్రీతి. 165**

**ప్రతిపదార్థం:** ఇతఁడు+ఎ= ఇతడే; నృపులు= రాజులు; ఓహటింపన్= అవమానం పొందగా; జంత్రపుమీను= యంత్రమునందలి చేపను; ఏసి= పడగొట్టగా; పాంచాలుని= ద్రుపదుడియొక్క; కూఁతున్= పుత్రికను; చేకొనియెన్= పెండ్లాడాడు; ఇతఁడు+ఎ= ఇతడే; భుజగర్వము= భుజబల గర్వం; ఏపారన్= అతిశయించగా; పురందరున్= దేవేంద్రుడిని; సురసేనతోన్= దేవసైన్యంతోపాటు; గెల్చి= జయించి; ఖాండవంబు= ఖాండవవనమును; ఏర్చెన్= కాల్చాడు; ఇతఁడు+ఎ= ఇతడే; ఎక్కటి బవరానన్= ద్వంద్వ యుద్ధంలో; ఈశానున్= శివుడిని; మెప్పించి; పాశుపత= పాశుపతమనే; అస్త్రంబున్= అస్త్రాన్ని; పడసెన్= పొందాడు; ఇతఁడు+ఎ= ఇతడే; ఒంటిమైన్= ఒంటరిగా; భీష్మ= భీష్ముడు; ఆది= మొదలైన; యోధుల= వీరులయొక్క; కురుపతి= కురు రాజయిన దుర్యోధనుడియొక్క; ధృతిన్= ధైర్యమును; పాపి= పోగొట్టి; గోవులన్= ఆవులను; తెచ్చెన్= తిరిగి తీసికొని వచ్చాడు;

ఇతఁడు+ఎ= ఇతడే; ప్రతిన+చేసి= ప్రతిజ్ఞచేసి; విషమ= కష్టస్థితికి చేరిన, భయంకరమైన; సమరమునన్= యుద్ధంలో; ప్రొద్దున్= సూర్యుడిని; క్రుంకన్+ఈక= అస్తమించనీయక; సైంధవున్= సైంధవుడిని; కూల్చెన్= చంపాడు; అనుచున్= అంటూ; సందడి+కాన్= సమ్మర్దంగా, ఒత్తిడిగా; క్రమ్మి= ఆవరించి; అఱ్ఱులు= మెడలు; ఎత్తి; జన= పౌరులయొక్క; లోకము= సమూహం; ఆ+సవ్యసాచిన్= అర్జునుడిని; ప్రీతిన్= ఆనందంతో; చూచెన్= చూచింది.

**తాత్పర్యం:** 'ఇతడే రాజులకు తలవంపులయ్యేటట్లుగా యంత్రమత్స్యాన్ని పడగొట్టి ద్రౌపదిని పెళ్ళిచేసికొన్నాడు. ససైన్యంగా దేవేంద్రుడిని జయించి ఖాండవదహనం గావించాడు. శివుడితో ద్వంద్వయుద్ధం చేసి అతడిని మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. అసహాయుడై భీష్ముడు మొదలైన మహావీరులను దుర్యోధనుడిని ధైర్యహీనులను గావించి గోవులను తీసికొని వచ్చాడు. ప్రతిజ్ఞచేసి భయంకర సంగ్రామంలో ప్రొద్దుక్రుంకకముందే సైంధవుడిని సంహరించాడు' అంటూ పౌరజన సమూహం ఒత్తిడిగా చుట్టూ గుమిగూడి మెడలెత్తి ఆ అర్జునుడిని ఆనందంతో చూచింది.

**క. ఆ వాక్యము లెల్ల వినుచు। భావ మలర నర్జునుండు భాసురమగు న**
**మ్మా వగ్రేసరముగ య। జ్ఞావాసంబునకు వచ్చె నంచితలీలన్. 166**

**ప్రతిపదార్థం:** అర్జునుండు; భావము= మనస్సు; అలరన్= సంతోషించగా; ఆ వాక్యములు= ఆ మాటలు; ఎల్లన్= అన్నియూ; వినుచున్= వింటూ; భాసురము= ప్రకాశించేది; అగు= అయిన; ఆ+మావు= ఆ గుర్రం; అగ్రేసరము+కన్= ముందు నడచేది కాగా; అంచిత= గౌరవించబడిన, ఒప్పుతున్న; లీలన్= నడకల సొగసుతో; యజ్ఞ= యజ్ఞంయొక్క; ఆవాసంబునకున్= శాలకు; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** పౌరజనుల మాటలు వింటున్న అర్జునుడి మనస్సు సంతోషించింది. అతడు నడకల సొగసుతో గుర్రం ముందు నడుస్తుండగా యజ్ఞశాలకు వచ్చాడు.

**వ. అట్టియెడ ధర్మనందనుండు భీమాదులును గృష్ణుండును బలదేవ ప్రభృతులును ధృతరాష్ట్రుం బురస్కరించు కొనుచు నప్పార్థు నెదుర్కొని; రతండు వారలనెల్ల సముచితాచార సంప్రీతులం గావించి గాంధారినిఁగుంతినిం గాంచి యీఁతకాఁడు తీరంబు గనిన చందంబుఁ బొంది, యందఱునభినందించుచుం బొదివికొనియుండ నొక్కరమ్యప్రదేశంబున నుండె; నా సమయంబున. 167**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయమున; ధర్మనందనుండున్= ధర్మరాజునూ; భీమ+ఆదులును= భీముడు మొదలైనవారునూ; కృష్ణుండును= కృష్ణుడునూ; బలదేవ= బలరాముడు; ప్రభృతులును= మొదలైనవారునూ; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; పురస్కరించుకొనుచున్= ముందుంచుకొంటూ; ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; ఎదుర్కొనిరి= ఎదురుగా వెళ్ళి కలిశారు; అతఁడు= అర్జునుడు; వారలన్= వారిని; ఎల్లన్= అందరను; సముచిత= మిక్కిలి తగిన; ఆచార= నమస్కారం చేయటం మొదలైన సదాచారములచేత; సంప్రీతులన్= మహానందము పొందినవారినిగా; కావించి= చేసి; గాంధారినిన్= గాంధారినీ; కుంతినిన్= కుంతినీ; కాంచి= చూచి; ఈఁతకాఁడు= ఈతకొట్టేవాడు; తీరంబు= ఒడ్డును; కనిన= చూచిన; చందంబున్= విధమును; పొంది; అందఱున్= అందరును; అభినందించుచున్= పొగడుతూ; పొదివికొని= చుట్టును చేరి; ఉండన్= ఉండగా; ఒక్క= ఒకానొక; రమ్య= అందమైన; ప్రదేశంబునన్= చోటును; ఉండెన్= ఉన్నాడు; ఆ+సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అప్పుడు ధర్మరాజు, భీమాదులూ, బలరామకృష్ణ ప్రభృతులూ అర్జునుడికి ఎదురుగా వెళ్ళి అతడిని కలిసికొన్నారు. అతడు వారినందరినీ సమయానికి తగిన సదాచారాలతో సంతోషింపజేశాడు. తరువాత గాంధారినీ, కుంతినీ చూచాడు. చివరకు అర్జునుడు ఒడ్డు చేరిన ఈతగాడైనాడు. అందరూ తన చుట్టూ చేరి పొగడ్తలతో ముంచితేలుస్తుండగా అతడు ఒక సుందర స్థానంలో ఉన్నాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**సీ.** **బభ్రువాహనుఁడు వైభవ మొప్పఁ జిత్రాంగ । దయు నులూపి(చి)యుఁ బ్రమదంబుతోడఁ**
**దోడ రా ధర్మపుత్త్రుని మందిరమునకు । నరుగుదెంచుటయు, నక్కురువరేణ్యుఁ**
**డును దమ్ములును గృష్ణుఁడును బలభద్రాది । యాదవులును బ్రీతులై తదీయ**
**సందర్శనము నర్హసత్కార చరితార్థ । ముగఁ జేసి; రతఁడును దగిన విధుల**

**తే.** **నందఱకుఁ బ్రియ మొనరించి యాంబికేయు । నతని భార్యను గని నమస్కృతు లొనర్చి,**
**గొంతిఁ గాంచి యాయమయడుగులకు నెఱఁగి । పలుదెఱఁగు దీవనలును గౌఁగిలియుఁ బడసి. 168**

**ప్రతిపదార్థం:** బభ్రువాహనుఁడు; వైభవము= దొరతనం; ఒప్పన్= ఒప్పగా; చిత్రాంగదయున్= చిత్రాంగదయు; ఉలూపి(పి)యున్= ఉలూపియూ; ప్రమదంబుతోడన్= సంతోషంతో; తోడన్+రాన్= వెంటరాగా; ధర్మపుత్త్రుని= ధర్మరాజుయొక్క; మందిరమునకున్= గృహానికి; అరుగుదెంచుటయును= రాగా; ఆ+కురు= ఆ కురువంశంలో; వరేణ్యుఁడును= శ్రేష్ఠుడును; తమ్ములును= భీముడు మొదలైవారును; కృష్ణుఁడును= కృష్ణుడును; బలభద్ర= బలరాముడు; ఆది= మొదలైన; యాదవులును; ప్రీతులు+ఐ= ఆనందించినవారై; తదీయ= ఆ బభ్రువాహనుడియొక్క; సందర్శనము= సందర్శించటం; అర్హ= తగిన; సత్కార= సన్మానాలచేత; చరితార్థము+కన్= సఫలమైన దానినిగా; చేసిరి= చేశారు; అతఁడును= ఆ బభ్రువాహనుడును; తగిన= సమయోచితమైన; విధులన్= కర్తవ్యములచేత; అందఱకున్= అందరకు; ప్రియము= ప్రీతి; ఒనరించి= కలిగించి; ఆంబికేయున్= అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుడిని; అతని= అతడియొక్క; భార్యను= పెండ్లమును, గాంధారిని; కని= దర్శించి; నమస్కృతులు= నమస్కారాలు; ఒనర్చి= చేసి; గొంతిన్= కుంతిని; కాంచి= దర్శించి; ఆ+అమ= ఆమెయొక్క; అడుగులకున్= పాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; పలు+తెఱఁగు= అనేక విధాలైన; దీవనలును= దీవెనలూ; కౌఁగిలియున్= కౌగిలింతయు; పడసి= పొంది.

**తాత్పర్యం:** బభ్రువాహనుడు దొరతనం ప్రకాశిస్తుండగా ఉలూపీ చిత్రాంగదలతో కూడి ధర్మరాజు గృహానికి వచ్చాడు. ధర్మరాజూ అతడి తమ్ముళ్లూ బలరామ కృష్ణాది యాదవులూ ఆనందించారు. అతడిరాక సఫలమయ్యేటట్లుగా అతడిని సన్మానించారు. బభ్రువాహనుడు కూడా అందరికీ కర్తవ్య నిష్ఠతో ప్రీతి కలిగించి గాంధారీ ధృతరాష్ట్రులను దర్శించి నమస్కారాలు చేశాడు. కుంతిని చూచి పాదాభివందనం గావించాడు. ఆమె అతడిని దీవించి కౌగిలించుకొన్నది.

**వ.** **ధర్మపుత్త్రుం గొలిచి కూర్చుండ నతని కతండును ననుజులును వేర్వేఱ సర్వరత్న రాజీవిరాజితంబు లగు భూషణంబులును బరమాంబరంబులును నొసంగిరి; సీరపాణి శౌరి ప్రభృతులు ప్రభూతాభరణంబులను భాసుర వాసోవిశేషంబులను నతని నర్చించి; రయ్యవసరంబున. 169**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్రున్= ధర్మరాజును; కొలిచి= పూజించి, సేవించి; కూర్చుండన్= కూర్చుండగా; అతనికిన్= బభ్రువాహనుడికి; అతండును= ధర్మరాజును; అనుజులును= అతడి తమ్ములును; వేఱు+వేఱన్= వేరువేరుగా; సర్వరత్న= సమస్త రత్నాలయొక్క;

రాజీ= వరుసలతో; విరాజితంబులు= ప్రకాశిస్తున్నట్టివి; అగు= అయిన; భూషణంబులును= నగలును; పరమ= ఉత్తమమైన; అంబరంబులును= వస్త్రాలను; ఒసంగిరి= ఇచ్చారు; సీరపాణి= నాగలి చేతియందు కలవాడు బలరాముడు; శౌరి= శ్రీకృష్ణుడు; ప్రభృతులు= మొదలగువారు; ప్రభూత= మిక్కిలి ఎక్కువైన; ఆభరణంబులను= నగలచేతను; భాసుర= ప్రకాశిస్తున్న, దివ్యమైన; వాసస్= వస్త్రాలయొక్క; విశేషంబులను= ఆధిక్యములచేతను; అతనిన్= బభ్రువాహనుడిని; అర్చించిరి= గౌరవించారు; ఆ+అవసరంబునన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** బభ్రువాహనుడు ధర్మరాజును సేవించి కూర్చున్నాడు. ధర్మరాజూ, అతడి తమ్ములూ అతడికి నవరత్న ఖచితములైన నగలూ, శ్రేష్ఠమైన వస్త్రాలూ ఇచ్చారు. బలరాముడూ, కృష్ణుడూ మొదలగువారు అతడికి పలు నగలూ, తళతళలాడే బట్టలు పెక్కులు పెట్టారు. ఆ సమయాన. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **చిత్రాంగదయు నాగపుత్త్రియుఁ దొలితొలి। గాంధారిఁ గని గొంతిఁ గాంచి రెలమి;**
**దీవించి గాఢసంభావనఁ గౌఁగిటఁ। జేర్చి యద్దేవి రత్నార్చు లెసఁగు**
**తొడవుల నర్పించె; ద్రోవదియును సుభ। ద్రయు వారు త మ్ముచిత ప్రకార**
**మునఁ గన్న నమ్మెయి వినుత పూజనముల। నతుల సమ్మోదము నావహించి**

**ఆ.** **యోగ్యపీఠములను నునిచి, తత్సల్లాప। సౌఖ్యమొంది; రట్లు సకలవర్త**
**నముల నశ్వమేధ సముపక్రమం బుదా। త్తాభిరామమయ్యె నధిపముఖ్య!** **170**

**ప్రతిపదార్థం:** అధిపముఖ్య!= రాజులలో మొదటివాడా!, రాజాగ్రణీ; చిత్రాంగదయున్= చిత్రాంగదయూ; నాగపుత్త్రియున్= నాగకుమారి అయిన ఉలూపియూ; తొలి తొలి= మొట్టమొదట; ఎలమిన్= ప్రీతితో; గాంధారిని; కని= దర్శించి; గొంతిన్= కుంతిని; కాంచిరి= దర్శించారు; ఆ+దేవి= ఆ రాజుపత్ని; దీవించి; గాఢ= అత్యధికమైన; సంభావనన్= మన్ననతో; కౌఁగిటన్= కౌగిలియందు; చేర్చి; రత్న= రత్నాలయొక్క; అర్చులు= కాంతులు; ఎసఁగు= అతిశయించే; తొడవులన్= నగలను; అర్పించెన్= ఇచ్చింది; ద్రోవదియును= ద్రౌపదియు; సుభద్రయున్= సుభద్రయు; వారు= ఉలూపీ చిత్రాంగదలు; తమ్మున్= తమ్ము; ఉచిత= తగిన; ప్రకారముననన్= విధంగా; కన్నన్= దర్శించగా; ఆ+మెయిన్= ఆ విధంగానే; (తమను దర్శించిన విధమునకు సమానంగా అని అర్థం); వినుత= కొనియాడబడిన; పూజనములన్= పూజలను; ఆవహించి= కలిగించి; యోగ్య= తగిన; పీఠములన్= ఆసనములయందు; ఉనిచి= కూర్చుండబెట్టి; తద్= ఆ ఇద్దరియొక్క; సల్లాప= మధుర సంభాషణములవలన కలుగు; సౌఖ్యము= సుఖం: ఒందిరి= పొందారు; అట్లు= ఆ విధంగా; సకల= అన్ని; వర్తనములన్= నడవడులచేత; అశ్వమేధ= అశ్వమేధంయొక్క; సముపక్రమంబు= ఆరంభం; ఉదాత్త= గొప్పదీ; అభిరామము= మనోజ్ఞమూ; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** రాజాగ్రణీ! ఉలూపీ చిత్రాంగదలు మొట్టమొదట గాంధారినీ, తరువాత కుంతినీ దర్శించారు. కుంతీదేవి వారిని గొప్ప మన్ననతో దీవించి కౌగిలించుకొన్నది. రత్నకాంతిమయమైన నగలు పెట్టింది. పిదప ఉలూపీ చిత్రాంగదలు ద్రౌపదినీ, సుభద్రను సముచిత రీతిగా దర్శించారు. ద్రౌపదీ సుభద్రలు వారు దర్శించిన తీరునకు తుల్యంగా వారిని చక్కగా గౌరవించి, ఆనందింపజేసి తగిన ఆసనములమీద కూర్చుండబెట్టారు. వారితో సంభాషించి సంతోషించారు. ఈ విధంగా అశ్వమేధ ప్రారంభం అన్ని నడవళ్ళచేత ఉన్నతమూ, మనోజ్ఞమూ అయింది.

**వ.** **పదంపడి యర్థదివసంబు సంప్రాప్తం బగుటయు,సాత్యవతేయమునిపతి కురుపతిపాలికిం జనుదెంచి'నేఁడు యజనంబునకుం దొడంగుము; యాజ్ఞికులు శుభముహూర్తం బాసన్నంబయ్యె ననుచున్నవారు; నీ మఖంబు**

**మహనీయంబు; నీవు మహాధనవంతుండవైతి; దక్షిణలు ముమ్మడుంగులుగా నిడి మూఁడు మఖంబుల ఫలంబు నొందు; మశ్వమేధావభృథంబు పరమపావనంబు; సమస్తదురిత పరిహరణ నిపుణంబు; నీకు భారత రణకృత జ్ఞాతివధంబు పాతకంబను మెరమెర మనంబునం గలిగియుండు; నట్టివి యెల్లను దీన నిస్తుషంబులగు, సమస్త శుభంబులు నావహిల్లు' నని యాజ్ఞాపనంబు సేయుటయుఁ బ్రాజ్ఞపరుండైన యా భూవరుండు. 171**

**ప్రతిపదార్థం:** పదంపడి= తరువాత; అర్హ= యోగ్యమైన; దివసంబు= రోజు; సంప్రాప్తంబు= ప్రాప్తించింది, వచ్చింది; అగుటయున్= అయిన తరువాత; సాత్యవతేయమునిపతి= వ్యాసమునీశ్వరుడు, సత్యవతి కుమారుడూ అయిన వ్యాసుడు; కురుపతి= కురురాజు (ధర్మరాజు); పొలికిన్= దగ్గరకు; చనుదెంచి= వచ్చి; నేఁడు= ఈ రోజు; యజనంబునకున్= యజ్ఞంచేయటానికి; తొడంగుము= పూనుకొనుము, మొదలు పెట్టుము; యాజ్ఞికులు= యజ్ఞం చేయించేవారు, ఋత్విక్కులు; శుభ= శుభములు కలిగించే; ముహూర్తంబు= ముహూర్తం; ఆసన్నంబు= దగ్గరపడింది; అయ్యెన్= అయినది; అనుచున్+ఉన్నవారు= అంటున్నారు; నీ= నీ యొక్క; మఖంబు= యజ్ఞం; మహనీయంబు= గొప్పది; నీవు; మహత్= గొప్ప; ధనవంతుండవు= ధనం కలవాడవు; ఐతి(వి)= అయ్యావు; దక్షిణలు; ముమ్మడుంగులు= మూడురెట్లు; కాన్= అయ్యేటట్లుగా; ఇడి= ఇచ్చి; మూఁడు= మూడు; మఖంబుల= యజ్ఞములయొక్క; ఫలంబున్= ఫలితమును; ఒందుము= పొందుము; అశ్వమేధ= అశ్వమేధమనే; అవభృథంబు= యజ్ఞం చివర-దొరలిన దోషములు తొలగించుకొనుటకు చేసే స్నానం; పరమ= మిక్కిలి; పావనంబు= పవిత్రమైనది; సమస్త= సమస్తమైన; దురిత= పాపాలను; పరిహరణ= తొలగించుటయందు; నిపుణంబు= సమర్థం, నీకున్= నీకు; భారతరణ= భారతయుద్ధంలో; కృత= చేయబడిన; జ్ఞాతి= దాయాదులయొక్క; వధంబు= సంహారము; పాతకంబు= పాపము; అను; మెరమెర= దుఃఖము; మనంబునన్= మనస్సులో; కలిగి= పుట్టి; ఉండున్= ఉన్నది; అట్టి+అవి= అటువంటివి; ఎల్లను= అన్నియు; దీనన్= యజ్ఞాంత స్నానంవలన; నిస్తుషంబులు= విడువబడినవి, నిర్మలములు; అగున్= అవుతాయి; సమస్త= సమస్తమైన; శుభంబులు= శుభాలు; ఆవహిల్లున్= కలుగుతాయి; అని; ఆజ్ఞాపనంబు= ఆదేశం; చేయుటయున్= చేసిన తరువాత; ప్రాజ్ఞ= పండితులయందు; పరుండు= ఆసక్తికలవాడు; ఐన= అయిన; ఆ+భూవరుండు= ఆ రాజు - ధర్మరాజు.

**తాత్పర్యం:** తరువాత యజ్ఞయోగ్యమైన రోజు వచ్చింది. అప్పుడు వ్యాసుడు వచ్చి ధర్మరాజుతో 'నీవు ఈ రోజు యజ్ఞం చేయటానికి పూనుకొనుము. ఋత్విక్కులు శుభముహూర్తం సమీపించిందని అంటున్నారు. నీ యజ్ఞం చాలా గొప్పది. నీవు మహాధనవంతుడవు అయ్యావు. దక్షిణలు ఈవలసినదానికంటె మూడురెట్లు ఎక్కువగా ఇచ్చి మూడు యజ్ఞాలు చేసినంత ఫలాన్ని పొందుము. అశ్వమేధ యజ్ఞం చివర దోషపరిహారార్థం చేసే స్నానం మిక్కిలి పవిత్రమైనట్టిది. అది సమస్త పాపాలను తొలగింపజాలినట్టిది. భారతయుద్ధంలో దాయాదులను సంహరించటం పాపం అనే వ్యథ నీకు మనస్సులో పుట్టింది. అటువంటివన్నీ యజ్ఞాంత స్నానంవలన తొలగి నీ మనస్సు నిర్మలమవుతుంది; సమస్త శుభాలు కలుగుతాయి' అని చెప్పాడు. జ్ఞానులపట్ల ఆసక్తి కలిగిన ఆ ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

ధర్మరా జశ్వమేధ యాగంబు సుప్రయోగంబుగాఁ జేయుట (సం.14-90-17)

**క. ప్రయతుండై హయమేధ। క్రియా కలాపంబునకుఁ బ్రకీర్త్యముగాఁ జొ**
**చ్చి యుదాత్తభంగి జనమే। జయ భూవర! నడపె గాఢసంప్రీతిమెయిన్. 172**

**ప్రతిపదార్థం:** జనమేజయ భూవర!= జనమేజయ భూనాథా!; ప్రయతుండు+ఐ= దీక్షాసంస్కారమును పొందినవాడై, ఆత్మనిగ్రహం కలవాడై; ప్రకీర్త్యము= మిక్కిలి కొనియాడదగినది; కాన్= అయ్యేటట్లుగా; హయమేధ= అశ్వమేధ యజ్ఞంయొక్క;

క్రియాకలాపంబునకున్= కర్మకాండమునకు; చొచ్చి= పూనుకొని; ఉదాత్త= గొప్పదైన; భంగిన్= విధంగా; గాఢ= అధికమైన; సంప్రీతిమెయిన్= ఆనందంతో; నడపెన్= నిర్వర్తించాడు.

**తాత్పర్యం:** జనమేజయా! దీక్షవహించి మిక్కిలి కొనియాడదగినట్లుగా అశ్వమేధయాగ కర్మకాండమునకు పూనుకొని చాలా గొప్పగా మహానందంతో నిర్వర్తించాడు.

**క. క్రమయుక్తము యుక్తముఁ గా। నమరగురుప్రతిములైన యాజ్ఞికులు క్రియా**
**సముదయము నడపఁగా స్థలి। తము లే కపహుతము సొరక తత్క్రతు వొప్పెన్. 173**

**ప్రతిపదార్థం:** క్రమ= దేని తరువాత ఏది చేయవలయునో ఆ యజ్ఞకర్మ క్రమంతో; యుక్తమున్= కూడినట్టిది; యుక్తమున్= యోగ్యమైనది; కాన్= అయ్యేటట్లుగా; క్రియా= యజ్ఞకార్యములయొక్క; సముదయమున్= సమూహమును; అమర గురు= దేవతల గురువైన బృహస్పతితో; ప్రతిములు+ఐన= సమానులైన; యాజ్ఞికులు= ఋత్విక్కులు; నడపఁగాన్= చేయగా; స్థలితము= మంత్రపఠనమున జారుపాటు; లేక; అపహుతము= క్రమపద్ధతి వదలి వేల్పుట; చొరక= తటస్థించక; తద్+క్రతువు= ఆ యజ్ఞం; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** బృహస్పతితో సమానులైన ఋత్విజులు శాస్త్రక్రమంగా శాస్త్రోచితంగా యజ్ఞకార్యకలాపాన్ని నడిపారు. అందువలన మంత్రపఠనదోషాలు లేకుండా క్రమపద్ధతి వదలి హోమద్రవ్యాలు వేల్చటం సంభవించకుండా ఆ యజ్ఞం ప్రకాశించింది.

**చ. అవహితులై ప్రవర్గ్యము బుధాభినుతంబుగఁ జేసి ఋత్విజుల్**
**సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేద వా**
**క్యవిహిత వృత్తిమై నభినవాభ్యుదయం బొనరించి రర్థి మా**
**ధవుఁ గొనియాటలం దమ కృతంబులకున్ మెఱుఁ గిడ్డయట్లుగన్. 174**

**ప్రతిపదార్థం:** ఋత్విజుల్= యజ్ఞం చేయించేవారు; మాధవున్= పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడిని; కొనియాటలన్= పలుసార్లు స్తుతించటంచేత; తమ= తమయొక్క; కృతంబులకున్= పనులకు; మెఱుఁగు+ఇడ్డ= వన్నె పెట్టిన; అట్లు= విధం; కన్= కాగా; అవహితులు+ఐ= ఏమరుపాటు లేనివారై, అవధానం కలవారై; ప్రవర్గ్యము= యజ్ఞమునకు మొదట చేసే యాగ విశేషం; బుధ= పండితులచేత; అభినుతంబు+కన్= కొనియాడబడినట్లుగా; చేసి; ఉక్త= వేదాలచేత చెప్పబడిన; మార్గము= పద్ధతిగా; సవనములు= మంత్రపూతముగా సోమరసం పిండటం (దీనినే అభిషవం అంటారు); సవనము అనే యాగవిశేషం చేయటం; ప్రశంసకున్+ఎక్కన్= పొగడ్తపొందగా; నయించి= నడపి; అర్థిన్= ప్రీతితో; వేద= వేదాలయొక్క; వాక్య= మంత్ర వాక్యాలచేత; విహిత= అనుశాసించబడిన; వృత్తిమైన్= విధానంతో; అభినవ= నూతనమైన; అభ్యుదయంబు= శ్రేయస్సును, అభీష్టప్రాప్తిని; ఒనరించిరి= చేశారు.

**తాత్పర్యం:** ఋత్విజులు సావధానులయి ప్రవర్గ్యమనే యజ్ఞాంగాన్ని పండితులు ప్రశంసించేటట్లుగా చేశారు. మంత్రపూతంగా సోమరసం పిండారు. సవనకర్మం ఆచరించారు. వేదశాసనం తప్పక ఆయా కార్యాలు ఒనరించి నూతన శ్రేయస్సులు ప్రాప్తించేట్లు చేశారు. వారు పరబ్రహ్మస్వరూపుడైన శ్రీకృష్ణుడిని స్తుతించటంచేత తాము చేసే యజ్ఞకార్యాలకు వన్నె తెచ్చినవారయ్యారు.

**వ. అట్టియెడ. 175**

**తాత్పర్యం:** ఆ సమయాన. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. వివిధ భోజ్యపదార్థ విభవంబు వలనను। సంతృప్తిఁ బొందక చను నరుండు**
**ధనధాన్యవస్త్రసంతతిలబ్ధి దారిద్ర్య। మపనయింపక యేఁగునట్టివాఁడు**
**గోరి యెయ్యదియైన గారవ మెసఁగంగఁ। బడయక రిత్త వోయెడు మనుష్యుఁ**
**డెద్ది యేనియు దుఃఖ మెలసినఁ జనుదెంచి। యది నిస్తరింపక యరుగునతఁడు**

**తే. మందునకు వెదకినను లేఁ డంద మొంద। నరసి కుడువుఁడు కట్టుఁ డిచ్ఛానురూప**
**వస్తువులు గైకొనుఁడు దురవస్థ తెలిపి ' పాపికొనుఁ డని భీముండు పలుకుచుండ. 176**

**ప్రతిపదార్థం:** భీముండు; అందము+ఒందన్= తగిన రీతిగా; అరసి= పరీక్షించి; కుడువుఁడు= భుజింపుడు; కట్టుఁడు= ధరించండి; ఇచ్ఛా= కోరికకు; అనురూప= అనుగుణమైన, కోరిన కోర్కెకు తగినట్లుగా; వస్తువులు; కైకొనుఁడు= స్వీకరించండి; దుర్+అవస్థ= హీనస్థితి; తెలిపి= తెలియజేసి; పాపికొనుఁడు= పోగొట్టుకొనండి; అని; పలుకుచుండన్= చెప్పుచుండగా; వివిధ= అనేక విధాలైన; భోజ్య= భుజించదగిన; పదార్థ= పదార్థాలయొక్క; విభవంబువలనను= సమృద్ధివలన; సంతృప్తిన్= మిక్కిలి తృప్తిని; పొందక; చను= వెళ్ళెడి; నరుండు= మానవుడు; ధన= ధనముయొక్క; ధాన్య= ధాన్యాలయొక్క; వస్త్ర= వస్త్రాలయొక్క; సంతతి= సమూహముయొక్క; లబ్ధిన్= ప్రాప్తిచేత; దారిద్ర్యము= పేదరికమును; అపనయింపక= పోగొట్టుకొనక; ఏఁగు+అట్టి= వెళ్ళునట్టి; వాఁడు= మనుజుడు; ఏ+అది= ఏది; ఐనన్= అయినను; కోరి; గారవము= గౌరవం; ఎసఁగంగన్= అతిశయించగా; పడయక= పొందక; రిత్త= ఉత్తచేతులతో; పోయెడు= పోవునట్టి; మనుష్యుండు; ఎద్ది= ఏది; ఏనియున్= అయినను; దుఃఖము; ఎలసినన్= కలుగగా; చనుదెంచి= వచ్చి; అది= దానిని; నిస్తరింపక= దాటకుండ, పోగొట్టుకొనకుండ; అరుగు= వెళ్ళెడి; అతఁడు= మనిషి; మందునకు వెదకినను= బొత్తిగా, ఒక్కడు కూడా; లేఁడు= లేడు.

**తాత్పర్యం:** భీముడు యజ్ఞానికి వచ్చినవారిని ఉద్దేశించి 'చూచీ చూచీ తినండి, ధరించండి, కోరిన వస్తువులు తీసికొనండి. దుఃస్థితిని తెలిపి తొలగించుకొనండి' అని చెప్పుతూ ఉండేవాడు. అందువలన బహువిధ పదార్థ సమృద్ధివలన తృప్తి పడకుండా వెళ్ళేవాడూ, ధనధాన్య వస్త్రాలను పుష్కలంగా పొంది పేదరికాన్ని తొలగించుకొననివాడూ, గౌరవ పురస్సరంగా కోరినదానిని పొందకుండా వట్టిచేతులతో పోయేవాడూ, ఏదైనా దుఃఖం సంభవిస్తే దానిని తెలిపి పోగొట్టుకొనకుండా వెళ్ళిపోయేవాడూ ఒక్కడు కూడా లేడు.

**ఉ. ఆయతులాధ్వరంబున వ్రతాభిరతత్వము లేనివాఁ డుపా**
**ధ్యాయుఁడు గానివాఁడు నిగమాంగకషట్కము లేనివాఁడు లేఁ**
**డేయెడఁ జూచినన్ సభ నరేశ్వర! యట్టి సదస్యు లమ్మరు**
**న్నాయకు కొల్వు దివ్యమునినాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= రాజా!; ఆ+అతుల= ఆ సాటిలేని; అధ్వరంబునన్= యజ్ఞమునందు; ఏ+ఎడన్= ఎక్కడనైన; చూచినన్= పరిశీలించినా; సభన్= సదస్సులో; వ్రత= ఆచారానుష్ఠానమందు; అభిరతత్వము= అధికమైన ఆసక్తి; లేనివాఁడు=

లేనట్టివాడు; ఉపాధ్యాయుఁడు= ఉపద్రష్ట - యజ్ఞనిర్వహణలో గుణదోషములను కనిపెట్టి చూచేవాడు; కానివాఁడు= కానట్టివాడు; నిగమ= వేదాలయొక్క; అంగకషట్కము= ఆరు అంగాలు; లేనివాఁడు= తెలియనట్టివాడు; లేఁడు= లేడు; అట్టి= అటువంటి; సదస్యులు= యజ్ఞంలో సాహాయ్యం చేసే ఋత్విజులు, యజ్ఞమున హెచ్చుతగ్గులు అనే దోషాలను తొలగించే విధానమును చూస్తూ ఉండెడి ఋత్విక్కులు; ఆ+మరుత్= ఆ దేవతలయొక్క; నాయకు= ప్రభువు దేవేంద్రుడియొక్క; కొల్వు= కొలువునందలి; దివ్యమునినాథులు= దేవర్షులు; తక్కఁగన్= తప్ప; ఎచ్చటన్= ఇంకెచ్చటను; కల్గరు= కనబడరు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆ అసమాన యజ్ఞసదస్సులో ఎక్కడ చూచినా వ్రతానుష్ఠానంలో ఆసక్తి లేనివాడూ, ఉపద్రష్ఠ గానివాడూ, వేదాంగవేత్తగానివాడూ లేడు. అటువంటి సదస్యులు దేవేంద్రుడి కొలువులోని దివ్యర్షులలో తప్ప మరెక్కడా కనబడరు.

**విశేషం:** నిగమాంగక షట్కము= ఆరు వేదాంగాలు. అవి శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం.

| | |
|---|---|
| శిక్ష | = వర్ణోచ్చారణ పద్ధతి తెలిపే శాస్త్రం |
| వ్యాకరణం | = శబ్దనిష్పత్తిని నిరూపించే శాస్త్రం. |
| ఛందస్సు | = గణ, యతి, ప్రాస, పద్య లక్షణాలను బోధించే శాస్త్రం. |
| నిరుక్తం | = వేదపదముల వ్యుత్పత్త్యర్థమును వివరించే శాస్త్రం. |
| జ్యోతిషం | = సూర్యాది గ్రహ సంచారమును తెలియజేసే శాస్త్రం. |
| కల్పము | = వైదిక విధానాలను తెలిపే గ్రంథం. |

**వ. అట్లుంగాక. 178**

**తాత్పర్యం:** ఆ విధంగా కాక. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. కనుఁగొను కౌతుకంబునఁ గూడి చనుదెంచి । దివ్యమునీంద్రు లతిప్రియమున**
**నభినందనము సేయ నఖిల గంధర్వులు । నానందనము లగు గానములను**
**నప్సరః స్త్రీలు హృద్యము లైన నృత్య వి । శేషంబులను నుల్లసిల్లుచుండ**
**సిద్ధ విప్రజనంబు సేసలు చల్లుచు । బహువిధాశీర్వాద పరతఁ బరఁగ**

**తే. నాద్యులై పేరు గలుగు పదార్వు రవని । వరుల యాగంబులకు సరివచ్చు మిగులుఁ**
**గాని యిది వట్రపడ దనఁగా వెలుంగు । ధర్మతనయుని యశ్వమేధము నరేంద్ర! 179**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా!; దివ్యముని+ఇంద్రులు= దేవర్షులు; కనుఁగొను= చూచెడి; కౌతుకంబునన్= వేడుకతో; కూడి= కలసికట్టుగా; చనుదెంచి= వచ్చి; అతి= మిక్కిలి; ప్రియమునన్= ఆనందంతో; అభినందనము+చేయన్= ప్రశంసించగా; అఖిల= సమస్తమైన; గంధర్వులున్= గంధర్వులు; ఆనందనములు= ఆనందింపజేసేవి; అగు= అయిన; గానములను= సంగీతాలతో; అప్సరస్+స్త్రీలు= అప్సరసలు; హృద్యములు= మనోహరములు; ఐన= అయిన; నృత్యవిశేషంబులను= వివిధ నృత్యాలతో; ఉల్లసిల్లుచున్= సంతోషిస్తూ; ఉండన్= ఉండగా; సిద్ధ= అతీంద్రియ దర్శనంగల; విప్రజనంబు= బ్రాహ్మణులు; సేసలు= అక్షతలు;

చల్లుచున్= చల్లుతూ; బహువిధ= అనేక విధాలైన; ఆశీర్వాద= దీవనయందలి; పరతన్= ఆసక్తితో; పరఁగన్= ఒప్పగా; ఆద్యులు= మొదటివారు, పూర్వకాలంవారు; ఐ= అయి; పేరు+కలుగు= ప్రసిద్ధికెక్కిన; పది+ఆర్వురు= పదహారుగురు; అవనివరుల= రాజులయొక్క; యాగంబులకున్= యజ్ఞాలకు; సరివచ్చున్= సాటిఅగును; మిగులున్= మించిపోతుంది; కాని; ఇది= ఈ ధర్మరాజు యజ్ఞం; వ్రటపడదు= తక్కువ కాదు; అనఁగాన్= అనగా; ధర్మతనయుని= ధర్మరాజుయొక్క; అశ్వమేధము= అశ్వమేధయజ్ఞం; వెలుంగున్= శోభిల్లింది.

**తాత్పర్యం:** జనమేజయా! దేవర్షులు యజ్ఞం చూచే వేడుకతో కలిసికట్టుగా ఆనందదాయకాలైన గానాలు చేశారు. అప్సరసలు అనేక విధాలైన మనోహర నృత్యాలు ప్రదర్శించారు. బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు అక్షతలు చల్లుతూ పెక్కు దీవనలు ఇచ్చారు. 'ప్రాచీన కాలంలో ప్రసిద్ధులైన షోడశ మహారాజులు గావించిన యజ్ఞాలతో ఇది సాటి అవుతుందనటం ఎందుకు; మించిపోతుంది గాని ఏ మాత్రమూ వాటికి తక్కువ కాదు' అనేటట్లుగా ధర్మరాజు అశ్వమేధం ఒప్పారింది.

**వ. పసిఁడి యిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబును గరుడాకృతియునుగా యజనం బొనర్చి మహనీ యంబై యొప్పుచుండు యూపక్రియా సమయంబున ఖాదిరంబు లాఱును, బైల్వంబు లాఱును బాలాశంబు లాఱును, దేవదారుమయంబులు రెండును, శ్లేష్మాతకతరు కల్పితం బొకండును గా నిరువదియొక్క యూపం బులు దక్కును శోభనార్థంబుగా ననేక కాంచన యూపసంచయంబును శాస్త్రోక్త ప్రకారంబున యాజకులు నిలిపి వానియందు. 180**

**ప్రతిపదార్థం:** పసిఁడి= బంగారు వికారములైన; ఇట్టికలన్= ఇటుకలతో; చతుస్+చిత్యంబును= నాలుగు వరుసలుగా పేర్చినదియు; అష్టాదశ= పదునెనిమిది; కర= మూరల (మూర= 18 అంగుళములు); ఆత్మకంబును= రూపం కలదియు; గరుడ= గ్రద్దయొక్క; ఆకృతియును= ఆకారం కలదియును; కాన్= అగునట్లుగా; యజనంబు= యజ్ఞవేదిని; ఒనర్చి= నిర్మించి; మహనీయంబు= గొప్పది; ఐ= అయి; ఒప్పుచున్+ఉండు= ఒప్పారుతుండే; యూప= యజ్ఞమున జంతువులను కట్టుటకు పాతే కొయ్యలను ఎత్తుట అనే; క్రియా సమయంబునన్= పనులు చేయదగిన సమయమున; ఖాదిరంబులు= చంద్రకొయ్యలతో చేసినవి; ఆఱును= ఆరును; బైల్వంబులు= మారేడుతో చేసినవి; ఆఱును= ఆరును; పాలాశంబులు= మోదుగు కర్రలతో చేసినవి; ఆఱును= ఆరును; దేవదారుమయంబులు= దేవదారు రూపములైనవి; రెండును; శ్లేష్మాతక+తరు= విరివిచెట్టుతో; కల్పితంబు= చేసింది; ఒకండును= ఒకటియు; కాన్= అయ్యేటట్లుగా; ఇరువది+ఒక్క= ఇరువదియొక్కటి; యూపంబులు= యజ్ఞస్తంభాలయొక్క; సంచయంబును= సమూహమును; శాస్త్ర= శాస్త్రమునందు; ఉక్త= చెప్పబడిన; ప్రకారంబునన్= విధంగా; యాజకులు= యజ్ఞం చేయించేవారు; నిలిపి; వాని+అందున్= ఆ స్తంభాలయందు.

**తాత్పర్యం:** ఋత్విజులు బంగారు ఇటుకలతో యజ్ఞవేదిని నిర్మించారు. దానియందు ఇటుకలు నాలుగు వరుసలుగా పేర్చారు. దాని కొలత పదమూడు మూరలు. అది గ్రద్ద ఆకారాన ఉన్నది. ఋత్విక్కులు ప్రధానమైన యూపప్రతిష్ఠ గావించారు. యూపములమొత్తం ఇరవైయొక్కటి. వాటిలో చంద్రకొయ్యలతో చేసినవి ఆరు, మారేడుతో చేసినవి ఆరు, మోదుగు కర్రలతో చేసినవి ఆరు, దేవదారుదుంగలతో చేసినవి రెండు, విరివిచెట్టుతో చేసినది ఒకటి. ఈ ఇరవైయొక్క యూపాలనుగాక అలంకారార్థం అనేక సువర్ణయూపాలను కూడా శాస్త్రప్రకారంగా నిలిపారు. వాటియందు. (తరువాతి పద్యంతో అన్వయం)

క. **నలుగాలివానిఁ బక్షుల, । జలచరముల, విధియుతముగ సంయోజింపం**
**బొలిచెం బశువులు మున్నూ । అలఘు యశోమహిత! యమ్మహాయజ్ఞమునన్.** **181**

**ప్రతిపదార్థం:** అలఘు= అధికమైన; యశస్= కీర్తిచేత; మహిత!= పూజించబడినవాడా! జనమేజయా!; నలుగాలివానిన్= నాలుగు కాళ్ళుకల వాటిని, చతుష్పాత్తులను; పక్షులన్= పక్షులను; జలచరములన్= నీటియందు తిరిగే వాటిని (చేపలు, తాబేళ్ళు మొదలైనవి); విధియుతముగన్= శాస్త్రప్రకారంగా; సంయోజింపన్= కూర్పగా, బంధించగా; ఆ+మహత్= ఆ గొప్ప; యజ్ఞమునన్= యజ్ఞమున; పశువులు= ప్రాణులు; మున్నూఱు= మూడువందలు; పొలిచెన్= ఒప్పారాయి.

**తాత్పర్యం:** జనమేజయా! మహాయశశ్శాలీ! యాజకులు యూపాలకు నాలుగు కాళ్ళు కలిగిన జంతువులనూ, పక్షులనూ, మత్స్యాదులనూ కట్టారు. ఆ యజ్ఞంలో ఆ విధంగా బంధించిన ప్రాణులసంఖ్య మూడు వందలు.

క. **వరయూప సుయోజిత మగు । తురంగమము చుట్టుఁ బశుతతుల నిల్పిన సుం**
**దర భావము దక్ష మఖ । స్ఫురణం బిట్టిదని చూపుపోలిక మెఱసెన్.** **182**

**ప్రతిపదార్థం:** వర= శ్రేష్ఠమైన; యూప= యజ్ఞస్తంభమునందు; సుయోజితము= చక్కగా కట్టినది; అగు= అయిన; తురంగమము= గుర్రంయొక్క; చుట్టున్= చుట్టునూ, నలువైపులా; పశు= ప్రాణులయొక్క; తతులన్= గుంపులను; నిల్పిన= చేర్చిన; సుందరభావము= సౌందర్యం; దక్ష= దక్షుడియొక్క; మఖ= యజ్ఞంయొక్క; స్ఫురణంబు= ప్రకాశం; ఇట్టిది= ఇటువంటిది; అని; చూపు= కనబడజేసే; పోలికన్= సామ్యంతో; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** యజ్ఞాశ్వాన్ని ఉత్తమ యూపానికి కట్టారు. దానిచుట్టూ పశుసమూహాన్ని నిలిపారు. ఆ నిలిపిన సొగసు ధర్మజుడి అశ్వమేధయాగం దక్షప్రజాపతి యాగమువంటిదే అని చాటుతున్నది. (ఈ అశ్వమేధయాగం దక్షుడి యజ్ఞమువంటిదని భావం).

**విశేషం:** అలం: ఉపమ.

తే. **ఆగమోక్తంబు దర్శనీయంబు నైన । యా సుతంత్రంబు నొనరించు యాజకోత్త**
**మావలికిఁ దా నలంకారమై పరాశ । రాత్మజుని శిష్యకోటి యొప్పారె నధిప!** **183**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఆగమ= వేదాలచేత; ఉక్తంబు= చెప్పబడింది; దర్శనీయంబున్= చూడదగినదియూ; ఐన= అయిన; ఆ; సు= శోభాయుతమైన; తంత్రంబున్= యజ్ఞకర్మకాండమును; ఒనరించు= నిర్వర్తిస్తున్న; యాజక+ఉత్తమ= యాజక శ్రేష్ఠులయొక్క; ఆవలికిన్= బృందానికి; అలంకారము+ఐ= అలంకారమై; పరాశర= పరాశర మహర్షియొక్క; ఆత్మజుని= కుమారుడి-వ్యాసుడియొక్క; శిష్య= శిష్యులయొక్క; కోటి= సమూహం; ఒప్పారెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** వేదాలు ప్రతిపాదించినదీ, చూడదగినదీ అయిన ఆ అశ్వమేధ కర్మకాండం గావించే ఋత్విజాల బృందానికి వేదవ్యాసుడి శిష్య సమూహం వన్నె పెట్టేదిగా ప్రకాశించింది.

ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట (సం.14-91-1)

**వ. సర్వపశు శ్రవణంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభ సమయంబున యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబు నవయవంబుల మాంసంబులయ్యై దేవతలకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియెడు హుతంబులు చేయించిరి; తదనంతరం బయ్యశ్వవపాహోమంబునం బరఁగుగంధం బాఘ్రాణించి ధర్మనందనుండు తమ్ములుందానును బరమానందంబునం బొందె; శేషించిన యశ్వావయవంబు లర్హప్రకారంబున యాజకులు వేల్చి; రిట్లు సాత్యవతేయుండు యుధిష్ఠిరు నశ్వమేధం బఖిలలోక హితంబుగా నిర్వహించి యాతని గుఱించి యుదాత్తనాదం బెసంగ నాశీర్వాదంబుసేసె; సమస్తదేవమునులును దీవనలిచ్చి; రప్పుడు కౌరవవంశపావనుం డగు భూవరుండు. 184**

**ప్రతిపదార్థం:** సర్వ= సమస్తమైన; పశు= ప్రాణులయొక్క; శ్రవణంబులు= వండుటలు; ఆచరించి= చేసి; ఋత్విక్+జనంబు= యజ్ఞం చేయించేవారు, ఋత్విజులు; అశ్వ= గుర్రంయొక్క; ఆలంభ= చంపటం చేసే; సమయంబునన్= వేళయందు; యాజ్ఞసేనిన్= ద్రౌపదిని; సన్నిహితన్= దగ్గర ఉండేదానినిగా; చేసి; అశ్వంబు= గుర్రంయొక్క; అవయవంబులు= ఆయా అవయవాలయొక్క; మాంసంబులు= మాంసాలు; ఆ+ఆ= ఆయా; దేవతలకున్= దేవతలకు; ఆహుతులు+ఇడు= అగ్నియందు మంత్రపూర్వకంగా వేల్చునట్టి; అప్పుడు= ఆ సమయంలో; ఆ+మహాదేవి= ఆ పట్టపురాణి; నిజ= తనయొక్క; హస్తంబునన్= చేతిమీదుగా; చేయన్+తగియెడు= చేయదగిన; హుతంబులు= ఆహుతులు; చేయించిరి= చేయించారు; తద్+అనంతరంబు= ఆ తరువాత; ఆ+అశ్వ= ఆ గుర్రంయొక్క; వపా= కడుపులో బొడ్డుక్రిందనుండే ఉల్లిపొరవంటి క్రొవ్వును వేల్చి చేసెడి; హోమంబునన్= యజ్ఞమునందు; పరఁగు= వ్యాపించునట్టి; గంధంబు= వాసనను; ఆఘ్రాణించి= పీల్చి; ధర్మనందనుండు= ధర్మరాజు; తానునున్= తానునూ; తమ్ములున్= తమ్ములునూ; పరమ= అధికమైన; ఆనందబునన్+పొందెన్= ఆనందించారు; శేషించిన= మిగిలిన; అశ్వ= గుర్రంయొక్క; అవయవంబులు= అవయవాలను; అర్హ= తగిన; ప్రకారంబునన్= విధంగా; యాజకులు= ఋత్విజులు; వేల్చిరి= హోమం చేశారు; ఇట్లు= ఈ విధంగా; సాత్యవతేయుండు= సత్యవతీ కుమారుడు - వ్యాసుడు; యుధిష్ఠిరు= ధర్మరాజుయొక్క; అశ్వమేధంబు= అశ్వమేధయాగం; అఖిల= సమస్తమైన; లోక= లోకాలకు; హితంబు= మేలు కలిగించునది; కాన్= అగునట్లుగా; నిర్వహించి= చేసి; అతనిన్= అతడిని; గుఱించి= ఉద్దేశించి; ఉదాత్త= ఉదాత్తము అనే స్వరభేదంయొక్క (ఉచ్చైరుదాత్తః అని పాణిని); నాదంబు= ధ్వని; ఎసంగన్= ప్రకాశించగా; ఆశీర్వాదంబు+చేసెన్= దీవించాడు; సమస్త= సమస్తమైన; దేవమునులును= దేవర్షులును; దీవనలు+ఇచ్చిరి= దీవించారు; అప్పుడు= ఆ సమయంలో; కౌరవవంశ= కౌరవవంశమును; పావనుండు= పవిత్రం చేసేవాడు; అగు= అయిన; భూవరుండు= రాజు, ధర్మరాజు.

**తాత్పర్యం:** ఋత్విజులు సర్వజంతువులనూ చంపి వండారు. యజ్ఞాశ్వాన్ని కూడ చంపేటప్పుడు పట్టపురాణి అయిన ద్రౌపదిని దానికి దగ్గరగా ఉండేటట్లు చేశారు. అశ్వమాంసాలను ఆయా దేవతలకు వేల్చే సమయంలో ఆమెచేతకూడా తనచేతిమీదుగా చేయదగిన హోమాలు చేయించారు. తరువాత గుర్రం వపను వేల్చేవేళ వ్యాపించిన వాసనను పీల్చి ధర్మరాజు తమ్ములతోపాటు ఆనందించాడు. మిగిలిన అశ్వావయవాలను కూడా ఋత్విజులు శాస్త్రవిధులను అనుసరించి వేల్చారు. వేదవ్యాసుడు సకలలోకాలకూ శ్రేయస్సు సమకూరేటట్లు ధర్మరాజు అశ్వమేధయాగాన్ని నిర్వహించి, ఉదాత్తస్వరంతో ఆ యజమానుడిని దీవించాడు. దేవర్షులందరునూ ధర్మరాజును ఆశీర్వదించారు. కౌరవవంశమును పవిత్రం చేసే ఆ చక్రవర్తి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **అలఘుభక్తి సదస్యుల కెలమి యెసక । మెసఁగఁ గోటివేల్ నిష్కము లిచ్చి తనదు**
**వసుధ యంతయు నొసఁగె దివ్య ప్రబోధ । ఘనత నొప్పు వేదవ్యాస మునివరునకు. 185**

**ప్రతిపదార్థం:** అలఘు= గొప్పది ఐన; భక్తిన్= భక్తితో; సదస్యులకున్= ఋత్విజులకు; ఎలమి= ఆనందం; ఎసకము+ఎసఁగన్= అతిశయించగా; కోటివేల్= కోటి వేల; నిష్కముల్= టంకములు; ఇచ్చి= దక్షిణగా ఇచ్చి; దివ్య ప్రబోధ= దివ్యజ్ఞానంచేత, బ్రహ్మజ్ఞానంచేత కలిగిన; ఘనతన్= గొప్పతనంతో; ఒప్పు= ప్రకాశించే; వేదవ్యాస= వేదవ్యాసుడనే; మునివరునకున్= మహర్షికి; తనదు= తనయొక్క; వసుధ= భూమండల సామ్రాజ్యం; అంతయున్= అంతయూ; ఒసఁగెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు సదస్యులకు మహానందం కలుగగా వేయికోట్ల టంకాలు దక్షిణలుగా ఇచ్చాడు. బ్రహ్మజ్ఞాన మహత్త్వంతో ప్రకాశించే వేదవ్యాస మహర్షికి తన భూమండల సామ్రాజ్యమంతా సమర్పించాడు.

**క.** **విను ఋత్విగాధ్యుఁడగు న । మ్మునిపతి యట్లు కురువంశముఖ్యుఁ డొసఁగ మే**
**దిని సంప్రమోదమునఁ గై । కొని యిట్లను నా నరేంద్రకుంజరుతోడన్. 186**

**ప్రతిపదార్థం:** విను= జనమేజయా! వినుము; అట్లు= ఆ విధంగా; కురువంశ= కురువంశమునందు; ముఖ్యుఁడు= అగ్రణి, ధర్మరాజు; ఒసఁగన్= సమర్పించగా; ఋత్విక్+ఆధ్యుఁడు= ఋత్విక్కులలో ప్రధాన నిర్వాహకుడు; అగు= అయిన; ఆ+మునిపతి= ఆ మునీశ్వరుడు వ్యాసుడు; సంప్రమోదమునన్= మహానందంతో; మేదినిన్= భూమిని; కైకొని= స్వీకరించి; ఆ+నరేంద్ర= రాజులలో; కుంజరుతోడన్= శ్రేష్ఠుడితో, ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా కురువంశాగ్రణి అయిన ధర్మరాజు సమర్పించగా ఋత్వికులలో ప్రధాన నిర్వాహకుడైన వ్యాసుడు భూమిని స్వీకరించాడు. రాజశ్రేష్ఠుడైన ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

**ఆ.** **'జగతి ఋత్విగర్థముగ నిచ్చి; తేము వి । ప్రస్వభావకలనఁ బసిఁడిఁ గొనఁగఁ**
**గోరెదము; కరంబు గారవంబున బ్రాహ్మ । ణాభిలషితదాయి వగుట మేలు' 187**

**ప్రతిపదార్థం:** ఋత్విక్+అర్థముగన్= ఋత్విక్కుల ధనంగా, ఋత్విక్కుల కొరకు; జగతి= భూమిని; ఇచ్చితి(వి)= సమర్పించావు; ఏము= మేము; విప్ర= బ్రాహ్మణులయొక్క; స్వభావ= ప్రకృతియొక్క; కలనన్= కలుగుటచేత; పసిఁడిన్= బంగారమును; కొనఁగన్= స్వీకరించగా; కోరెదము= కోరుతాము; కరంబు= మిక్కిలి; గారవమునన్= గౌరవంతో; బ్రాహ్మణ= బ్రాహ్మణులచేత; అభిలషిత= కోరబడినదానిని; దాయిని= ఇచ్చేవాడవు; అగుట; మేలు= శ్రేయస్కరం.

**తాత్పర్యం:** 'నీవు ఋత్విక్కులకు భూమి నిచ్చావు. బ్రాహ్మణ ప్రకృతి కలిగిన మేము బంగారాన్ని కోరుతాము. కాబట్టి గౌరవభావంతో బ్రాహ్మణులు కోరినదానిని ఇవ్వటం శ్రేయస్కరం.'

**వ.** **అని వెండియు. 188**

**తాత్పర్యం:** అని ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం)

**క.** **'ఇలకు వెలగా హిరణ్యం । బలఘుమతీ! మాకు నొసఁగు' మనుటయు ధరణీ**
**శులు వినఁగా నప్పారవ । కులపతి యా వేదరక్షకున కి ట్లనియెన్. 189**

**ప్రతిపదార్థం:** అలఘుమతీ!= మహామతీ!; ఇలకున్= భూమికి; వెల= ఖరీదు; కాన్= అయ్యేటట్లుగా; మాకున్= మాకు; హిరణ్యంబు= బంగారం; ఒసఁగుము= ఇమ్ము; అనుటయున్= అని అనగా; ఆ+పౌరవకుల= ఆ పౌరవకులం యొక్క; పతి= రాజు; ధరణీశులు= రాజులు; వినఁగాన్= వినుచుండగా; ఆ+వేద= ఆ వేదాలయొక్క; రక్షకునకున్= సంరక్షకుడితో-వ్యాసుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'మహామతీ! భూమియొక్క వెలగా మాకు బంగారాన్ని ఇమ్ము' అని అనగా పౌరవకులజుడైన ధర్మరాజు రాజులందరూ వింటుండగా వేదసంరక్షకుడైన వ్యాసుడితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'అశ్వమేధమునకు నార్యులు దక్షిణ । ధరణి యండ్రు; గాన నరునిచేత**
**విజిత యైన ధరణి ప్రజనిత ప్రీతిమై । ఋత్విగర్చనముగ నిచ్చినాఁడ.' 190**

**ప్రతిపదార్థం:** ఆర్యులు= పెద్దలు; అశ్వమేధమునకున్= అశ్వమేధ యాగానికి; ధరణి= భూమి; దక్షిణ= దక్షిణ అని; అండ్రు= అంటారు; కాన= కావున; నరునిచేతన్= అర్జునుడిచేత; విజిత= జయించబడినది; ఐన= అయిన; ధరణి= భూమిని; ప్రజనిత= మిక్కిలి ఎక్కువగా కలిగిన; ప్రీతిమైన్= ఆనందంతో; ఋత్విక్= ఋత్విక్కులయొక్క; అర్చనము+కన్= ఆరాధనంగా; ఇచ్చినాఁడన్= సమర్పించాను.

**తాత్పర్యం:** 'పెద్దలు అశ్వమేధయాగానికి దక్షిణ అని అంటారు. కావున అర్జునుడు జయించిన భూమినెల్లా మహానందంతో ఋత్విక్కుల యారాధనమయ్యేటట్లుగా ఇచ్చాను.'

**వ. అని మఱియును. 191**

**తాత్పర్యం:** అని, ఇంకనూ (తరువాతి పద్యంతో అన్వయం)

**చ. 'వనమున కేఁగి యందు సుఖవాసత నుండఁగలాఁడఁ గాక యే**
**ననఘవిచార! బ్రహ్మధన మక్కట! గొందునె?' యన్నఁ బ్రీతిమై**
**ననుజులు యాజ్ఞసేనియును 'నట్టిద యా పని యొండు చెప్పకుం'**
**డనుటయు హర్షబాష్పపులకాంకురముల్ ధరియించి రందఱున్. 192**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితమైన; విచార!= ఆలోచనము కలవాడా!; ఏన్= నేను; వనమునకున్= అడవికి; ఏఁగి= వెళ్ళి; అందున్= అక్కడ; సుఖ= సుఖంతో కూడిన; వాసతన్= వసించువాడి ధర్మంతో (సుఖంగా నివసిస్తూ అని అర్థం); ఉండన్+ కలాఁడన్= ఉండగలవాడను; కాక= కాని; అక్కట!= అయ్యో!; బ్రహ్మధనము= బ్రాహ్మణుల సొత్తును; కొందును+ఎ?= తిరిగి తీసికొందునా?; అన్నన్= అనగా; ప్రీతిమైన్= సంతోషంతో; అనుజులున్= తమ్ములును; యాజ్ఞసేనియును= ద్రౌపదియు; ఆ+పని= ఆ పని; అట్టి+అది+అ= అటువంటిదే ('అరణ్యావాసము చేయుదును. బ్రహ్మస్వము ముట్టను' అని మీరు నిర్ణయించిన పని నిర్ణయించినట్లే జరుగవలయునని అర్థం); ఒండు= మరియొకమాట; చెప్పకుండు= చెప్పకండి; అనుటయున్= అని అనగా; అందఱున్= అక్కడ ఉన్నవారందరూ; హర్ష= సంతోషంవలన కలిగిన; పులక+అంకురముల్= గగుర్పాటు మొలకలు; ధరించిరి= పొందారు.

**తాత్పర్యం:** 'పుణ్యవిచార! నేను అడవికి వెళ్ళి అక్కడ సుఖంగా నివసించగలవాడనే కాని బ్రహ్మస్వమును తిరిగి తీసికొంటానా?' అని ధర్మరాజు అన్నాడు. అతడి తమ్ములూ, ద్రౌపదీ 'మీరు నిర్ణయించిన పని నిర్ణయించినట్లే జరగాలి.

మరొకమాట చెప్పవద్దు' అని అన్నారు. అక్కడ ఉన్నవారందరూ ఈ మాటలు విని ఆనందరోమాంచములు అనుభవించారు.

**వ. అప్పుడు. 193**

**తాత్పర్యం:** ఆ సమయాన (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. దివ్యవాణి కీర్తించెఁ గౌరవ్యవరుని; । నఖిల జనములుఁ బ్రస్తుతిముఖరు లైరి;**
**తానుఁ బొగడి వేదవ్యాసుఁ డానరేంద్ర। చంద్రునకు నిట్టులను విప్రచయము వినఁగ. 194**

**ప్రతిపదార్థం:** దివ్యవాణి= ఆకాశవాణి; కౌరవ్య= కౌరవులలో; వరునిన్= శ్రేష్ఠుడిని; కీర్తించెన్= పొగడింది; అఖిల= సమస్తమైన; జనములు= జనులు; ప్రస్తుతి= ప్రశంసావాక్యములను; ముఖరులు= అధికంగా పలికేవారు; ఐరి= అయ్యారు; వేద వ్యాసుండు= వేదవిభజం కావించిన వ్యాసుడు; తానున్= తానుకూడా; పొగడి; ఆ+నరేంద్ర చంద్రునకున్= ఆ రాజశ్రేష్ఠుడితో; విప్ర= బ్రాహ్మణులయొక్క; చయము= సమూహం; వినఁగన్= వినగా; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ కౌరవశ్రేష్ఠుడిని ఆకాశవాణి ప్రశంసించింది. సమస్త జనులూ అతడిని మిక్కిలి పొగడారు. వ్యాసుడు కూడా స్తుతించి బ్రాహ్మణబృందం వింటుండగా ఆ రాజశ్రేష్ఠుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'ఏ మమ్మెద మనినఁ బృథివి । యో మనుజాధీశ! కొనుట యొప్పెడు తెరు; విం**
**దేమియును నెగ్గు లే; దీ । భూమిసురుల కోర్కి దీర్చి పుచ్చుము ప్రీతిన్.' 195**

**ప్రతిపదార్థం:** ఓ మనుజ+అధి+ఈశ!= ఓ మానవులయొక్క అధిపతీ!; ఏము= మేము; అమ్మెదము= అమ్ముతాము; అనినన్= అనగా; పృథివి= భూమిని; కొనుట= ధనమిచ్చి కొనటం; ఒప్పెడు= సమంజసమైన; తెరువు= మార్గం, పద్ధతి; ఇందున్= ఈ పద్ధతియందు; ఏమియును= ఏమియూ; ఎగ్గు= దోషం; లేదు; ప్రీతిన్= సంతోషంతో; ఈ భూమిసురుల= ఈ బ్రాహ్మణులయొక్క; కోర్కి= కోరికను; తీర్చి= నెరవేర్చి; పుచ్చుము= పంపుము.

**తాత్పర్యం:** 'ఓ మానవాధిపతీ! మేము అమ్ముతాము అన్నప్పుడు నీవు భూమిని ధనమిచ్చి కొనటం సమంజసమైన పద్ధతే అవుతుంది. దీనిలో తప్పు ఏమీ లేదు. ఈ బ్రాహ్మణుల కోరిక నెరవేర్చి సంతోషంగా పంపుము.'

**క. అని పలికినఁ గృష్ణుం 'డి । మ్మునినాయకు పనుపు సేయుము నరేశ్వర! నీ'**
**వని చెప్పిన నొడఁబడి తన । యనుజులతో నట్లకాక యని యతఁ డర్థిన్. 196**

**ప్రతిపదార్థం:** అని= అని; పలికినన్= పలుకగా; కృష్ణుండు= కృష్ణుడు; నర+ఈశ్వర!= రాజా!; నీవు; ఈ+మునినాయకు= ఈ మునీశ్వరుడియొక్క; పనుపు+చేయుము= ఆజ్ఞాపించినపని చేయుము; అని; చెప్పినన్= చెప్పగా; ఒడఁబడి= ఒప్పుకొని; తన= తనయొక్క; అనుజులతోన్= తమ్ములతో; అట్లు+అ= అట్లే; కాక= చేయుదునుగాక; అని; అతఁడు= ధర్మరాజు; అర్థిన్=ప్రీతితో.

**తాత్పర్యం:** అని వేదవ్యాసుడు పలుకగా, కృష్ణుడు 'రాజా! నీవు ఈ మహర్షి ఆజ్ఞాపించినపని చేయుము' అని అన్నాడు. ఆ మాటకు ఒప్పుకొని ధర్మరాజు తమ్ములతో 'అట్లే చేయుదుముగాక!' అని సంతోషంతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే.** **కోటి కోటులు మాడలు కుప్పవోసి। ధరణి వెల యని చెప్పి యప్పరమసంయ**
**మాధిపతికి సమర్పించె; నతఁడు ఋత్వి। గావలికిఁ బంచిపెట్టె నయ్యతులధనము.** **197**

**ప్రతిపదార్థం:** కోటి కోటులు= కోటి కోట్లు; మాడలు= టంకములు; కుప్ప+పోసి= రాశిపోసి; ధరణి= భూమియొక్క; వెల= ఖరీదు; అని; చెప్పి; ఆ+పరమసంయమ= ఆ మహర్షులయొక్క; అధిపతికిన్= ప్రభువుకు, వ్యాసుడికి; సమర్పించెన్= ఇచ్చాడు; అతఁడు= వ్యాసుడు; ఆ+అతుల= సాటిలేని; ధనము; ఋత్విక్= ఋత్విజులయొక్క; ఆవలికిన్= సమూహానికి; పంచిపెట్టెన్= పంచిపెట్టాడు.

**తాత్పర్యం:** కోటికోట్లు టంకాలు కుప్పపోసి 'ఇదే భూమి వెల' అని చెప్పి ఆ మహర్షి నాయకుడికి సమర్పించాడు. వేదవ్యాసుడు ఆ అసమాన ధనరాశిని ఋత్విజుల బృందానికి పంచిపెట్టాడు.

**వ.** **మఱియును.** **198**

**తాత్పర్యం:** ఇంకనూ. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 'యతి'

**తే.** **అతుల కనకమయములైన యజ్ఞవాట। వేదికా యూప తోరణ వివిధ భాండ**
**దండ శయ్యాసనాదులఁ ధరణినాథుఁ। డొసఁగె విప్రచయంబుల కుల్ల మలర.** **199**

**ప్రతిపదార్థం:** ధరణినాథుఁడు= రాజు, ధర్మరాజు; అతుల= సాటిలేని; కనకమయములు= బంగారు రూపములు; ఐన= అయిన; యజ్ఞవాట= యజ్ఞశాల; వేదికా= వేది; యూప= యజ్ఞస్తంభాలు; తోరణ= వెలుపలి గుమ్మాలు; వివిధ= పలురకాలైన; భాండ= కుండలు, పాత్రలు; దండ= కర్రలు; శయ్యా= సెజ్జలు; ఆసన= పీఠాలు; ఆదులన్= మొదలైనవాటిని; ఉల్లము= హృదయం; అలరన్= ఆనందించగా; విప్ర= బ్రాహ్మణులయొక్క; చయంబులకున్= సమూహాలకు; ఒసఁగెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు బంగారంతో చేసిన యజ్ఞశాల భాగాలూ, యజ్ఞవేదీ, యూపాలూ, బహిర్ద్వారాలూ, వివిధ పాత్రలూ, దండములూ, సెజ్జలూ, పీటలూ హృదయానందం కలుగగా బ్రాహ్మణ బృందాలకు సమర్పించాడు.

**తే.** **అట్లు విప్రుల కిచ్చి యనంతరంబ। రాజులకు, వైశ్యులకు, శూద్రరాజి కన్య**
**జాతులకు మ్లేచ్ఛులకును బ్రభూతధనము। ద్రవ్వి తండంబు లిచ్చె నా ధరణివిభుఁడు.** **200**

**ప్రతిపదార్థం:** ఆ+ధరణి విభుఁడు= ఆ రాజు ధర్మరాజు; అట్లు= ఆ విధంగా; విప్రులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చి= సమర్పించి; అనంతరంబు+అ= తరువాతనే; రాజులకున్= క్షత్రియులకు; వైశ్యులకున్= వైశ్యులకు; శూద్ర= శూద్రులయొక్క; రాజికిన్= సమూహానికి; అన్య= ఇతరమైన; జాతులకున్= జాతులకు; మ్లేచ్ఛులకున్= విదేశీయులకు; ప్రభూత= అత్యధికమైన; ధనము; త్రవ్వితండంబులు= లెక్కకు మిక్కిలిగా; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా బ్రాహ్మణులకు సమర్పించిన తరువాతనే క్షత్రియులకూ, వైశ్యులకూ, శూద్రులకూ, ఇతర జాతులవారికీ, విదేశీయులకూ కోకొల్లలుగా అపారధనాన్ని ఇచ్చాడు.

**క. ఇమ్మెయి సకలజనులు హే। మమ్మునఁ బరితృప్తులై యమంద మ్మగు మో**
**దమ్మునఁ దేలుచు నిజవా। సమ్ములకుం జని రజాతశత్రుఁ బొగడుచున్. 201**

**ప్రతిపదార్థం:** సకల= సమస్తమైన; జనులు= ప్రజలు; ఈ+మెయిన్= ఈ విధంగా; హేమమ్మునన్= బంగారంచేత; పరితృప్తులు= మిక్కిలి తృప్తిపొందినవారు; ఐ= అయి; అమందమ్ము= అధికమైనది; అగు= అయిన; మోదమ్మునన్= సంతోషంతో; తేలుచున్= ఉప్పొంగుతూ; అజాతశత్రున్= ధర్మరాజును; పొగడుచున్= పొగడుతూ; నిజ= తమయొక్క; వాసమ్ములకున్= నివాసస్థానాలకు; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** సమస్త జనులూ ఈ విధంగా సువర్ణదానంచేత మిక్కిలి సంతృప్తి చెందారు. వారు ఆనందంతో పొంగుతూ ధర్మరాజును ప్రశంసిస్తూ తమ తమ నివాసాలకు వెళ్ళారు.

**క. రెండవ మరుత్తుఁడై య। ప్పాండవముఖ్యుండు చేయు పరమ వితరణం**
**బొండొకయెడఁ గల్గునె యె। న్నండును జూడ విన సజ్జనస్తుతచరితా! 202**

**ప్రతిపదార్థం:** సజ్జన= సజ్జనులచేత; స్తుత= కొనియాడబడిన; చరితా!= నడవడి కలవాడా!; రెండవ; మరుత్తుఁడు= మరుత్తుడనే రాజు; ఐ= అయి; ఆ+పాండవ= ఆ పాండవులయందు; ముఖ్యుండు= మొట్టమొదటివాడు; చేయు= చేసిన; పరమ= సర్వోత్తమమైన; వితరణంబు= దానం; ఒండు+ఒక= మరొక; ఎడన్= చోట; ఎన్నండును= ఏనాడును; చూడన్= చూడగా; వినన్= వినగా; కల్గును+ఎ?= శక్యమగునా?

**తాత్పర్యం:** జనమేజయా! మరుత్తుడితో సమాను డయిన ఆ ధర్మరాజు చేసిన సర్వోత్తమదానం మరొకచోట ఏనాడూ చూచినదీ కాదు విన్నదీ కాదు. (చూడబోము, వినబోము అని అర్థం)

**క. తనయంశ మైన కనకము। విను కుంతీదేవి కిచ్చె వేదవ్యాసుం;**
**డనఘా! యది యంతయు న। వ్వినుతచరిత ధర్మకృతుల వినియోగించెన్. 203**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; విను= వినుము; వేదవ్యాసుండు= వేదవ్యాసుడు; తన= తనయొక్క; అంశము= భాగం; ఐన= అయిన; కనకమున్= బంగారమును; కుంతీదేవికిన్= కుంతికి; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ+వినుత= కొనియాడబడిన; చరిత= నడవడి కల కుంతి; అది= దానిని; అంతయున్= ఎల్లనూ; ధర్మకృతులన్= ధర్మకార్యాలందు; వినియోగించెన్= ఉపయోగించింది.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! వేదవ్యాసుడు తన భాగమైన బంగారాన్ని కుంతీదేవికి ఇచ్చాడు. ఆ సాధ్వి దాని నెల్ల ధర్మకార్యాలకు ఉపయోగించింది.

**తే. సకల బాంధవ భూపతి సంయుతముగ। నా నరేశ్వరుఁ డవభృథస్నాన పూత**
**గాత్రుఁడై చిత్తగత సర్వ కల్మషములఁ। బాసి నిర్జితస్వర్గత్వభాసి యయ్యె. 204**

**ప్రతిపదార్థం:** ఆ+నర+ఈశ్వరుండు= ఆ రాజు ధర్మరాజు; సకల= సమస్తమైన; బాంధవ= చుట్టాలతో; భూపతి= రాజులతో; సంయుతము+కన్= కూడి ఉండేటట్లుగా; అవభృథ= యజ్ఞమునందు దొరలిన దోషాల ఫలమును నివారించటానికై చేసే; స్నాన= స్నానంచేత; పూత= పవిత్రమైన; గాత్రుండు+ఐ= శరీరం కలవాడై; చిత్త= మనస్సును; గత= పొందిన; సర్వ= సమస్తమైన;

కల్మషములన్= పాపములను, దోషములను; పాసి= పోగొట్టుకొని; నిర్జిత= జయించబడిన; స్వర్గత్వ= స్వర్గాన్ని పొందినవాడి ధర్మంచేత; (పుణ్యాత్ములకు గాని స్వర్గం లభించదు. అట్టి వారి ధర్మమును జయించినవాడు మహాపుణ్యాత్ముడు ఔతాడు. ధర్మరాజు అట్టివాడయ్యెనని అర్థం); భాసి= ప్రకాశిస్తున్నవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు చుట్టాలతో రాజులతో కూడి యజ్ఞాంతస్నానం చేశాడు. దీనివలన అతడి శరీరం పవిత్రమయింది. మనస్సునందలి సర్వదోషాలూ వదలిపోయాయి. అతడు చివరకు మహాపుణ్యంతోప్రకాశించేవాడయ్యాడు.

**వ. అట్లొప్పి యప్పుడమిఱేఁడు పరాశరనందను చరణారవిందంబులు దన వెడంద నొసలు సోఁకఁ జాఁగి మ్రొక్కి యక్కులపతిం బెక్కుభంగులంబ్రస్తుతించి యామంత్రితుం జేసిన నా మునిశ్రేష్ఠుండు శిష్యసంఘ సహితం బుగా నంతర్ధానంబు సేసె; నట్టియెడ. 205**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఒప్పి= ప్రకాశించి; ఆ+పుడమిఱేఁడు= ఆ భూపతి - ధర్మరాజు; పరాశర= పరాశర మహర్షి; నందను= కుమారుడు, వ్యాసుడియొక్క; చరణ+అరవిందంబులు= పాదపద్మాలు; తన= తనయొక్క; వెడంద= విశాలమైన; నొసలు; సోఁకన్= తాకగా; చాఁగి= సాష్టాంగపడి; మ్రొక్కి; ఆ+కులపతిన్= ఆ కులపతిని; పెక్కు= పలు; భంగులన్= విధాలుగా; ప్రస్తుతించి= ప్రశంసించి; ఆమంత్రితున్= వీడ్కొలుపబడిన వాడినిగా; చేసినన్= చేయగా; ఆ+మునిశ్రేష్ఠుండు= ఆ వ్యాసుడు; శిష్య= శిష్యులయొక్క; సంఘ= సమూహంతో; సహితంబు+కాన్= కూడి ఉండేటట్లుగా; అంతర్ధానంబు+చేసెన్= అదృశ్యుడయ్యాడు; అట్టి+ఎడన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రకాశించి ధర్మరాజు వ్యాసుడి పాదాలు తన నొసటిని తాకేటట్లుగా సాష్టాంగ నమస్కారం చేసి ఆ కులపతిని అనేకవిధాలుగా ప్రస్తుతించాడు. తరువాత ఆ మహర్షి శిష్యులతోపాటు అదృశ్యుడయ్యాడు.

**విశేషం:** కులపతి= పదివేల శిష్యులను అన్నదానాదులచేత పోషించి, అధ్యయనం చేయించే బ్రహ్మర్షి.

శ్లో॥ మునీనాం దశసాహస్రం । యోఽన్న దానాది పోషణాత్

అధ్యాపయతి విప్రర్షి । రసౌ కులపతిః స్మృతః॥

**ధర్మజుఁడు యజ్ఞంబునకు వచ్చిన రాజుల నెల్ల సత్కరించి పంపుట (సం. 14-91-30)**

**క. అనుజులు నఖిల నృపాలురుఁ । దనుఁ బరివేష్టింప నొప్పెఁ దారలలోనం బెనుపొందు చంద్రుగతి న । మ్మనుజాధీశ్వరుఁడు కురుకుమారప్రవరా! 206**

**ప్రతిపదార్థం:** కురుకుమార= కురురాజకుమారులలో; ప్రవరా= శ్రేష్ఠుడా!; అనుజులున్= తమ్ములును; అఖిల= సమస్తమైన; నృపాలురున్= రాజులును; తనున్= తనను; పరివేష్టింపన్= చుట్టిఉండగా; ఆ+మను= ఆ మానవులయొక్క; అధి+ఈశ్వరుఁడు= ప్రభువు, ధర్మరాజు; తారలలోనన్= నక్షత్రాలలో; పెనుపొందు= అతిశయించే; చంద్రు= చంద్రుడియొక్క; గతిన్= విధంగా; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** కురుకుమార శ్రేష్ఠా! తమ్ములూ, సమస్త రాజులూ చుట్టూచేరి ధర్మరాజు నక్షత్రాలలో చంద్రుడివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **క్రతువుఁ జూడ నేతెంచిన రాజవరుల। కందఱకు మణిభూషణ హస్తి వాజి**
**వారకాంతాచయముల నవ్వసుమతీశుఁ। డొసఁగె ధనదుని కైవడి నెసక మెసఁగ.** **207**

**ప్రతిపదార్థం:** ఆ+వసుమతీ= ఆ భూమియొక్క; ఈశుఁడు= నాథుడు, ధర్మరాజు; క్రతువున్= యజ్ఞాన్ని; చూడన్= చూడటానికి; ఏతెంచిన= వచ్చిన; రాజవరులకున్= రాజశ్రేష్ఠులకు; అందఱకున్= అందరకు; ధనదుని= కుబేరుడియొక్క; కైవడిన్= విధంగా; ఎసక మెసఁగన్= అతిశయం వర్ధిల్లగా; మణిభూషణ= మణులు పొదిగిన నగల; హస్తి= ఏనుగుల; వాజి= గుర్రాల; వారకాంతా= వేశ్యల; చయములన్= సమూహాలను; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు కుబేరుడివలె అతిశయిస్తూ యజ్ఞం చూడవచ్చిన రాజులకందరకూ మణులు పొదిగిన నగలూ, ఏనుగులూ, గుర్రాలూ, వేశ్యా బృందమునూ అత్యధికంగా ఇచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ.** **బభ్రువాహనునకుఁ బరమ విశేషంబు। మెఱయ గారవించి మేలివస్తు**
**కోటు లొసఁగి ప్రీతిఁ గూరిన మనముతోఁ। నతనిఁ దత్పురమున కరుగఁ బనిచె.** **208**

**ప్రతిపదార్థం:** ప్రీతిన్= సంతోషమును; కూరిన= పొందిన; మనముతోన్= మనస్సుతో; బభ్రువాహనునకున్= బభ్రువాహనుడికి; పరమ= మిక్కిలి; విశేషంబు= ఘనత; మెఱయన్= వెల్లడి కాగా; గారవించి= గౌరవించి; మేలి= శ్రేష్ఠమైన; వస్తు= వస్తువులయొక్క; కోటులు= సమూహాలు; ఒసఁగి= ఇచ్చి; అతనిన్= అతడిని; తద్= అతడియొక్క; పురంబునకున్= పట్టణానికి, రాజధానికి; అరుగన్= వెళ్ళగా; పనిచెన్= అనుమతించాడు, ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ప్రీతిపొందిన మనస్సుతో మహాఘనత వెల్లడయ్యేటట్లుగా గౌరవించి, బభ్రువాహనుడికి శ్రేష్ఠమైన వస్తుసముదాయా లిచ్చి, స్వరాజధానికి వెళ్ళటానికి అతడిని అనుమతించాడు.

**క.** **చిత్రాంగదయు నులూపి(చి)యు। వృత్రారి తనూజుపాల విభవమహితలై**
**గోత్రావర! నిలువఁగ న। ధ్ధాత్రీశుఁడు చనియె సమ్మదం బెలరారన్.** **209**

**ప్రతిపదార్థం:** గోత్రా= భూమియొక్క; వర!= నాథుడా! రాజా!; చిత్రాంగదయున్= చిత్రాంగదయూ; ఉలూపి(చి)యున్= ఉలూపియూ; విభవ= ఉన్నతస్థితితో; మహితలు+ఐ= గౌరవించబడినవారై; వృత్ర= వృత్రుడికి; అరి= శత్రువైన, ఇంద్రుడియొక్క; తనూజ= కుమారుడు అర్జునుడియొక్క; పాలన్= దగ్గర; నిలువఁగన్= ఉండగా; ఆ+ధాత్రీ+ఈశుఁడు= ఆ రాజు, బభ్రువాహనుడు; సమ్మదంబు= సంతోషం; ఎలరారన్= అతిశయించగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** రాజా! ఉలూపీ చిత్రాంగదలు సముచితమైన హోదాను, గౌరవాన్ని పొంది అర్జునుడి దగ్గరనే ఉండగా బభ్రువాహనుడు సంతోషం అతిశయించగా తన నగరానికి వెళ్ళాడు.

**తే.** **మున్న చనుదెంచి ప్రీతిమై నున్న యట్టి। దుశ్శలకుఁ బెంపుఁ గలుగఁ దత్పుత్త్ర పుత్త్రు**
**సింధుదేశంబునకు నభిషిక్తుఁ జేసె। దోహలమున నజాతశత్రుఁడు నరేంద్ర!** **210**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా!; అజాతశత్రుండు= ధర్మరాజు; దోహలమునన్= ఉత్సాహంతో; మున్ను+అ= ముందే; చనుదెంచి= వచ్చి; ప్రీతిమైన్= ఆనందంతో; ఉన్న+అట్టి= ఉన్నటువంటి; దుశ్శలకున్= దుశ్శలకు; పెంపున్= గొప్పతనమును; కలుగన్= కలుగగా; తద్= ఆమెయొక్క; పుత్ర= కుమారుడియొక్క; పుత్రున్= కుమారుడిని, దుశ్శల పౌత్రుడిని (మనుమడిని అని అర్థం); సింధుదేశంబునకున్= సింధుదేశానికి; అభిషిక్తున్= పట్టాభిషిక్తుడిని; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** రాజా! ముందుగానే వచ్చి ఆనందంగా కాలం గడపుతున్న దుశ్శలకు ఉన్నత స్థితి ప్రాప్తించగా ధర్మరాజు ఉత్సాహంతో ఆమె మనుమడిని సింధుదేశానికి పట్టాభిషిక్తుడిని చేశాడు.

**క. తమ తమ దేశంబుల భూ। రమణుల నెల్లను విభక్తరాజ్యులు గా నె**
**య్యము నెఱయ నిలిపెఁ బాండు। క్షమారమణు పెద్దకొడుకు గౌరవముఖ్యా! 211**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= కౌరవులలో అగ్రణీ!; పాండు= పాండువు అనే; క్షమారమణు= భూపతియొక్క, పాండురాజుయొక్క; పెద్దకొడుకు= మొదటివాడు ధర్మరాజు; నెయ్యము= ప్రేమ; నెఱయన్= పూర్ణముగా; తమతమ; దేశంబులన్= దేశాలలో; భూరమణులన్= రాజులను; విభక్త= విభజించబడిన; రాజ్యులు= రాజ్యాలు కలవారు; కాన్= అయ్యేటట్లు; నిలిపెన్= ప్రతిష్ఠించాడు.

**తాత్పర్యం:** పాండురాజు పెద్దకొడుకయిన ధర్మరాజు పరిపూర్ణ ప్రేమతో వారి వారి దేశాలలో ఎవరికి దక్కవలసిన రాజ్యాలను వారికి విభజించి ఇచ్చి రాజులనందరినీ సింహాసనాలమీద నిలిపాడు. ధర్మరాజు రాజులనందరినీ జయించిన వాడు. అయినప్పటికీ ఎవరిరాజ్యాలను వారికి తిరిగి ఇచ్చాడు. ఇది అతడి ఔదార్యానికి తార్కాణం.

**వ. ఇత్తెఱంగున నెల్లరాజుల యుల్లంబులు ప్రమదంబునం బొందంజేసి వీడుకొలిపి, కృష్ణునకు నత్యుత్తమ వస్తు విస్తార మహోదారంబగు నుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొంది య ప్పార్థివోత్తముండు బలభద్రునకు భక్తియుక్తంబును వివిధ రత్నవిరాజితంబును నగు పూజా విశేషంబునం బరమసంతోషం బావహించి, సాత్యకి ప్రభృతి యాదవలోకంబున కతిలోకంబులగు నానావిధ పదార్థంబు లొసంగి, యయ్యం దఱుం దనచేత నుచిత ప్రకారంబుల నామంత్రితులై ద్వారకానగరంబున కరుగం, దాను మఱియు ననేక దేశాగతులైన జనంబుల నన్నపానంబులం గనక వస్త్రాది దానంబుల ననురక్తులం గావించి, మహా రావంబుల దిశలు పిక్కటిల్లం జెలంగు మంగళ తూర్యంబులు మొరయం బుణ్యపాఠకరవం బులు నానంద గానంబులు వినుచు మందిరంబునకుఁ జనుదెంచె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 212**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఎల్లన్+రాజుల= రాజులందరియొక్క; ఉల్లంబులు= హృదయాలు; ప్రమదంబునన్= ఆనందాన్ని; పొందన్= పొందగా; చేసి; వీడుకొలిపి= పోవ ననుమతించి; కృష్ణునకున్= కృష్ణుడికి; అతి= మిక్కిలి; ఉత్తమ= మంచివి అయిన; వస్తు= వస్తువులయొక్క; విస్తార= విరివిచేత; మహత్= పవిత్రమైనది; ఉదారంబు= ఘనమైనది; అగు= అయిన; ఉపహారంబు= కానుక; ఇచ్చి; దేవ= దేవుడియొక్క; ఉపచారంబులన్= సేవలచేత; ఆరాధించి= పూజించి; కృతార్థత్వంబున్= ధన్యతను; ఒంది= పొంది; ఆ+పార్థివ= ఆ రాజులలో; ఉత్తముండు= శ్రేష్ఠుడు; బలభద్రునకున్= బలరాముడికి; భక్తి= భక్తితో; యుక్తంబును= కూడినదియు; వివిధ= పలురకాలైన; రత్న= రత్నాలచేత; విరాజితంబును= ప్రకాశించేదియు; అగు= అయిన;

పూజావిశేషంబునన్= ఘనమైన పూజతో; పరమ= అధికమైన; సంతోషంబు= సంతోషం; ఆవహించి= కలిగించి; సాత్యకి; ప్రభృతి= మొదలైన; యాదవ= యాదవులయొక్క; లోకంబునకున్= సమూహానికి; అతిలోకంబులు= లోకాతీతాలు, లోకమునతిక్రమించినవి; అగు= అయిన; నానావిధ= అనేక విధాలైన; పదార్థంబులు= వస్తువులు; ఒసంగి= ఇచ్చి; ఆ+అందఱున్= ఆ అందరును; తనచేతన్= తనచేత; ఉచిత= తగిన; ప్రకారంబులన్= విధాలుగా; ఆమంత్రితులు= వీడ్కొలుపబడినవారు; ఐ= అయి; ద్వారకానగరంబునకున్= ద్వారకా నగరానికి; అరుగన్= వెళ్ళగా; తాను= ధర్మరాజు; మఱియున్= మరియు; అనేక= అనేకములైన; దేశ= దేశాలనుండి; ఆగతులు= వచ్చినవారు; ఐన= అయిన; జనంబులన్= జనాలను; అన్నములన్= అన్నాలచేత; పానములన్= పానీయాలచేత; కనక= బంగారము, బంగారు నాణెముల; వస్త్ర= వస్త్రాలు; ఆది= మొదలైన వాటియొక్క; దానంబులన్= దానాలచేత; అనురక్తులన్= తృప్తిపొందిన వారినిగా; కావించి= చేసి; మహత్= గొప్ప; రావంబులన్= ధ్వనులచేత; దిశలు= దిక్కులు; పిక్కటిల్లన్= నిండగా; చెలంగు= ధ్వనించుచున్న; మంగళతూర్యంబులు= మంగళవాద్యాలు; మొరయన్= మ్రోగగా; పుణ్య= మనోహరమైన; పాఠక= స్తోత్రపాఠకులయొక్క; రవంబులు= నాదాలు; ఆనంద= ఆనందంతో చేసే; గానంబులు= గానాలు; వినుచున్= వింటూ; మందిరంబునకున్= నిలయానికి; చనుదెంచెన్= వచ్చాడు; అని; చెప్పినన్= చెప్పగా; వైశంపాయనునకున్= వైశంపాయనుడితో; జనమేజయుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు రాజులనందరినీ సంతోషపెట్టి వీడ్కొలిపాడు. కృష్ణుడికి ఉత్తమోత్తమ వస్తువులతో కూడిన గొప్ప కానుకలిచ్చి అతడిని దేవుడివలె పూజించాడు. భక్తితో బలరాముడిని పూజించి అతడికి రత్నాలు సమర్పించి సంతోషం కలిగించాడు. సాత్యకి మొదలైన యాదవులకందరికీ లోకాతీతాలైన వస్తువులు సమర్పించాడు. తగినరీతిగా వీడ్కొలుపగా వారందరూ ద్వారకానగరానికి వెళ్ళిపోయారు. అనేక దేశాలనుండి వచ్చిన జనులను అన్నపానీయాలచేత సువర్ణ వస్త్ర దానాదులచేత సంతృప్తిపరిచాడు. మంగళవాద్య ధ్వనులు దిక్కులందంతటా నిండగా స్తోత్రపాఠాలూ ఆనందగానాలూ వింటూ స్వగృహానికి వచ్చాడు. ఈ విధంగా వైశంపాయనుడు అశ్వమేధయాగ వృత్తాంతం వినిపించిన తరువాత జనమేజయుడు అతడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'అనఘ! మత్పితామహుని యశ్వమేధ యా । గంబు సమయమునఁ గరంబు విస్మ**
**యంబుఁ జేయఁ జాలునట్టిది యే మేనిఁ । గలిగెనేని వినఁగ వలతుఁ జెపుమ!' 213**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపంలేనివాడా!; మత్= మాయొక్క; పితామహుని= తాతగారియొక్క; అశ్వమేధయాగంబు= అశ్వమేధయాగంయొక్క; సమయమునన్= సమయంలో; కరంబు= మిక్కిలి; విస్మయంబున్= ఆశ్చర్యం; చేయన్+చాలు= పుట్టించగలిగిన; అట్టి+అది= అటువంటి సంఘటన; ఏమి+ఏనిన్= కలిగితే; వినఁగన్+వలతున్= దానిని వినగోరుతాను; చెపుము+అ= చెప్పుము.

**తాత్పర్యం:** 'పుణ్యామూర్తీ! మా తాతగారు అశ్వమేధయాగం చేసేటప్పుడు అత్యాశ్చర్యకరమైన సంఘటన ఏదైనా సంభవించి ఉంటే దానిని వినగోరుతాను చెప్పుము.'

**వ. అని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె. 214**

**ప్రతిపదార్థం:** అని; అడిగిన, =అడిగినట్టి; ఆ+మహీ= ఆ భూమియొక్క; నాయకునకున్= నాథుడికి, రాజునకు; వైశంపాయనుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అడిగిన ఆ రాజుతో వైశంపాయనుడు ఈ విధంగా అన్నాడు.

**క. అమ్మెయిఁ బ్రభూతధనలా । భమ్మున భూమిఁ గలయట్టి బ్రాహ్మణు లెల్లన్**
**సమ్మద మొందఁగ హయమే । ధ మ్ముజ్జ్వలభంగి నొప్పెఁ దత్సమయమునన్. 215**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; ప్రభూత= అత్యధికమైన; ధన= ధనంయొక్క; లాభమ్మునన్= లాభంచేత; భూమిన్= భూమియందు; కల+అట్టి= ఉన్నటువంటి; బ్రాహ్మణులు; ఎల్లన్= అందరును; సమ్మదము= సంతోషం; ఒందఁగన్= పొందగా; హయమేధమ్ము= అశ్వమేధం; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; భంగిన్= విధంగా (అసామాన్యంగా అని అర్థం); ఒప్పెన్= ఒప్పారింది; తద్= ఆ; సమయమునన్= వేళయందు.

**తాత్పర్యం:** ఆ విధంగా భూమండలంలోని బ్రాహ్మణులందరూ అత్యధిక ధనప్రాప్తివలన ఆనందించగా అశ్వమేధయాగం లోకాతీతంగా నడచింది. ఆ వేళ. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. అఖిల జనములు నచ్చెరువంద ధర్మ । నందనుని మానసమున నానంద మొలయ**
**నతనిపై మకరంద ధారాభిశోభి । కుసుమవర్షంబు పెల్లుగఁ గురిసె నధిప! 216**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అఖిల= సమస్తమైన; జనములున్= జనులు; అచ్చెరువు= ఆశ్చర్యం; అందన్= పొందగా; ధర్మ= యముడియొక్క; నందనుని= కుమారుడు ధర్మరాజుయొక్క; మానసమునన్= మనస్సులో; ఆనందము; ఒలయన్= వ్యాపించగా; అతనిపైన్= అతడిమీద; మకరంద= తేనె; ధారా= జాలుచేత; అభిశోభి= శోభిల్లుతున్న; కుసుమ వర్షంబు= పూలవాన; పెల్లుగన్= ఎక్కువగా; కురిసెన్= కురిసింది.

**తాత్పర్యం:** రాజా! సమస్తజనులూ ఆశ్చర్యపడగా ధర్మరాజు మనస్సు ఆనందించగా అతడిమీద తేనె సోనలు జాలువారే పూలవాన కురిసింది.

**వ. అట్టియెడ. 217**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

సక్తుప్రస్థచరిత్రంబు నకులంబు బ్రాహ్మణులకుం జెప్పుట (సం. 14-92-5)

**సీ. ఒక్కబిలంబుననుండి వెల్వడి యొక్క । నకులంబు విప్రజనంబు నడుమ**
**నిలిచి 'సక్తుప్రస్థ నలఘు ధర్మంబు నే । మియుఁ బోల దీ యశ్వమేధ' మనిన**
**నవ్విప్రు లతివిస్మయంబంది యమ్ముంగిఁ । గనుఁగొని 'మంత్రవర్తనముఁ దంత్ర**
**గమనికయును వివిధములైన దాన వి । ధులు బహుళ త్యాగములును లోక**

**తే. సంస్తుతము లయ్యె; భక్తియు శ్రద్ధయును బ్రి । యంబు వినయంబు సురముని హర్ష మావ**
**హిల్లఁ జేసె; నీ వేమిట నిమ్మహాధ్వ । రంబుఁ గీ డంటి; చెప్పుమ! ప్రస్ఫుటముగ!' 218**

**ప్రతిపదార్థం:** ఒక్క= ఒకానొక; నకులంబు= ముంగిస; ఒక్క= ఒక; బిలంబునన్+ఉండి= కన్నంనుండి; వెల్వడి= బయటికి వచ్చి; విప్రజనంబు= బ్రాహ్మణులయొక్క; నడుమన్= మధ్య; నిలిచి; ఈ+అశ్వమేధము; ఏమియున్= ఏ మాత్రం; సక్తుప్రస్థ= సక్తుప్రస్థుడియొక్క; అలఘు= తక్కువకాని, గొప్ప; ధర్మంబున్= ధర్మమును; పోలదు; అనినన్= అనగా; ఆ+విప్రులు= ఆ బ్రాహ్మణులు; అతి= మిక్కిలి; విస్మయంబు= ఆశ్చర్యం; అంది= పొంది; ఆ+ముంగిసన్= ఆ ముంగిసను; కనుఁగొని= సూటిగా చూచి; మంత్ర= మంత్ర పఠనంయొక్క; వర్తనమున్= పద్ధతియు; తంత్ర= కర్మకాండంయొక్క; గమనికయును= విధానమును; వివిధములు= రకరకాలు; ఐన= అయిన; దాన= దానాలయొక్క; విధులు= కార్యాలు; బహుళ= అనేకములైన; త్యాగములును= త్యాగాలూ; లోక= లోకాలచేత; సంస్తుతములు= మిక్కిలి పొగడబడినవి; అయ్యెన్= అయినవి; భక్తియున్= భక్తియు; శ్రద్ధయును= శ్రద్ధయు; ప్రియంబున్= ప్రేమయూ; వినయంబున్= వినయమూ; సుర= దేవతలయొక్క; ముని= మునులయొక్క; హర్షము= సంతోషం; ఆవహిల్లన్+చేసెన్= కలిగించాయి; నీవు; ఏమిటన్= ఏ కారణంచేత; ఈ+మహత్= ఈ గొప్ప; అధ్వర్యంబున్= యజ్ఞమును; కీడు= తక్కువది; అంటి(వి)= అన్నావు; ప్రస్ఫుటముగన్= విస్పష్టంగా; చెప్పుము+అ!= చెప్పుమా!

**తాత్పర్యం:** ఒకానొక ముంగిస ఒక కన్నం నుండి బయటికివచ్చి బ్రాహ్మణులమధ్య ఉండి ' ఈ అశ్వమేధయాగం వీసమంత కూడా సక్తుప్రస్థుడి మహాధర్మాన్ని పోలదు' అని అన్నది. ఈ మాటలు విని బ్రాహ్మణులు ఆశ్చర్యపడ్డారు. వారు దానిని సూటిగా చూస్తూ 'ఈ యజ్ఞంలో మంత్రపఠనం, కర్మకాండ నిర్వహణం, వివిధ దానకార్యాలు, అనేక త్యాగాలు లోకాలచేత ప్రశంసించబడ్డాయి. ధర్మరాజు చూపిన భక్తిశ్రద్ధలు, అనురాగం, వినయం; దేవతలకూ, మునులకూ హర్షం కలిగించాయి. నీవు ఏ కారణంవలన ఈ మహాయజ్ఞాన్ని లొచ్చు అని అన్నావు. మాకు అర్థమయ్యేటట్లు చెప్పుము' అని అన్నారు.

**వ. అనుటయు నన్నకులంబు వారల కిట్లనియె. 219**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అనగా; ఆ+నకులంబు= ఆ ముంగిస; వారలకున్= వారితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** బ్రాహ్మణులమాటలు విని ఆ ముంగిస వారితో ఈ విధంగా అన్నది.

**సీ. 'వినుఁడు ధర్మక్షేత్ర మన రూఢమైన కు। రుక్షేత్రమునయందు రోషకామ**

**విరహితుం డొక మహాద్విజుఁ డుంఛవృత్తిమై। నుండు; భార్యయుఁ దనయుండు నతని**

„ ¤ß ǫ ‹ ¬ìK Ȩƒ ì=O| ° <ùOk = l i ȅ` Ç~@"□° ` Ç ¡ Å" ³□°OQ®

# °<ß_Ȅ| °□°„ Ɵ@□x ß ǫ # ` Ꝙ` Ç q H□O| °Qê # < Œ $ ª Ȅ ¬

` Í =¶=, ʔeǺ # ` ǩ Hȩ, ǒ~¡" ǒ # ~┬l * è ʔù # °@^ î~@=°~ò K ³□°Ǩ Ç_Ȅ

^ ¥~¡ # □°=ô¡–[ x ` $ ^ ¥# ¼ °□æ" íŽ ùx = ` Ȩ~ŒHe n Ž ä½_È 220

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; ధర్మక్షేత్రము= పుణ్యభూమి; అనన్= అనగా; రూఢము+ఐన= పేరుపొందినదైన; కురుక్షేత్రమున+అందున్= కురుక్షేత్రంలో; రోష= రోషం; కామ= కోరిక; విరహితుండు= లేనివాడు; ఒక= ఒకానొక; మహాద్విజుఁడు= గొప్ప బ్రాహ్మణుడు; ఉంఛవృత్తిమైన్= ఉంఛవృత్తితో, (ఉంఛము జీవికగా కలిగి; పొలాలు మున్నగువాటితో రాలిన గింజలను

ఏరుకొని తినటం ఉంఛవృత్తి); ఉండున్= బ్రతుకుతుండేవాడు; భార్యయున్= భార్యయూ; తనయుండున్= కుమారుడూ; అతని= కొడుకుయొక్క; పత్నియున్= భార్యయూ-కోడలు అని అర్థం; సహచర భావంబున్= సాహచర్యమును; ఒంది= పొంది, తోడుగా ఉండి; వర్తింతురు= నడచుకొందురు; అట్టులు= ఆ విధంగా; తపస్= తపస్సు అనెడి; శ్రీ= సంపద; వెలుంగన్= ప్రకాశించగా; ఉన్న= ఉండిన; ఎడన్= వేళయందు; పులుపంటలు= గడ్డికాడలవలె ఉండే మొక్కలనుండి పండిన పంటలు, వరి గోధుమలు మొదలైనవి; అన్నియున్= అన్నియూ; అత్యంత= మిక్కిలి; వికలంబు= నశించినవి; కాన్= అయ్యేటట్లుగా; అనావృష్టి= వర్షం లేకుండటం అనే; దోషము= బాధ; ఆవహిల్లినన్= కలుగగా; అతనికిన్= సక్తుప్రస్థునకు; ఆహారము= తిండి; ఒనరన్+చేసికొనుట= సమకూర్చుకొనటం; దుర్ఘటము= అసాధ్యమైనది; అయి; చెల్లుచున్+ఉండన్= కొనసాగుతుండగా; తారు= వారు; నలువురున్= నలుగురును; చని= వెళ్ళి; తృణధాన్యము= విత్తకుండ గడ్డివంటి మొక్కలనుండి పుట్టు ధాన్యం, నివ్వరి మొదలైనవి; అల్పము= కొంచెం; ఏఱికొని= ఏరుకొని; వత్తురు= వస్తారు; ఆఁకలి= దానిచేత ఆకలి; తీఱక+ఉండున్= పోలేదు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులారా! వినండి. పుణ్యభూమిగా ప్రసిద్ధికెక్కిన కురుక్షేత్రంలో ఒక గొప్ప బ్రాహ్మణు డున్నాడు. అతడు కోపతాపాలు లేనివాడు. కోరికలు లేనివాడు. పొలాలలో రాలిన గింజలు ఏరికొని తినేవాడు. అతడికి భార్యా కొడుకూ కోడలూ తోడుగా ఉంటారు. తపస్సే అతడికి సంపద. ఇట్లా ఉండగా ఒకసారి వానలు కురవలేదు. వరి గోధుమపంటలన్నీ బుగ్గి అయిపోయాయి. అతడికి తిండి దొరకటమే అసాధ్యమైనది. అతడూ, అతడి ఇల్లాలూ, కొడుకూ, కోడలూ నలుగురూ వెళ్ళి నివ్వరిధాన్యం ఏ కొంచెమో ఏరుకొని వస్తారు. దానివలన వారి ఆకలి తీరటం లేదు.

**వ.** **అట్టియెడ నొక్కనాఁ డయ్యందఱును రేపు దొడంగి పడమటి జామునకు వెదకి తెచ్చిన పూరి కొలుచు ప్రస్థమాత్రంబు సక్తు వయ్యెం; గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరంబ యాకుంచెఁడు పేలపిండియుఁ జెఱిమానెండుగా నలువురును సమంబుగాఁ బంచికొని యుపయోగించువారై యున్న సమయంబున. 221**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయాన; ఒక్కనాఁడు= ఒకరోజు; ఆ+అందఱును= ఆ నలుగురునూ; రేపు= ఉదయం; తొడంగి= మొదలుకొని; పడమటి జామునకున్= ప్రొద్దు పడమటికి వ్రాలిన వేళదాక; వెదకి= వెతికి; తెచ్చిన; పూరికొలుచు= తృణధాన్యం, నివ్వరివడ్లు మొదలైనవి; ప్రస్థమాత్రంబు= నాలుగు మానికల కొలది (నాలుగు మానికల కొలత పాత్రకు, ప్రస్థము అని పేరు. దీనిని తెలుగులో కుంచము అంటారు); సక్తువు= పేలపిండి; అయ్యెన్= అయింది; కర్తవ్య= శాస్త్రోక్త కర్మముల యొక్క; అనుష్ఠానంబులు= చేయుటలు; నడపి; అనంతరంబు+అ= తరువాతనే; ఆ+కుంచెఁడు= ఆ నాలుగు మానికల; పేలపిండియున్= పేలపిండియు; చెఱి= ఒక్కొక్కరికి; మానెండు= మానిక కొలది; కాన్= వచ్చేటట్లుగా; నలువురును= నలుగురును; సమంబు+కాన్= సమానంగా; పంచికొని; ఉపయోగించువారు= ఉపయోగించుకొనటానికి సిద్ధంగా ఉన్నవారు; ఐ= అయి; ఉన్న సమయంబునన్= ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** ఒకనాడు వారు నలుగురూ ఉదయంనుండి ప్రొద్దు పడమటికి వ్రాలేదాకా తృణధాన్యం వెదకి తెచ్చారు. అది నాలుగు మానికల పేలపిండి అయింది. ప్రతిదినమూ చేసే శాస్త్రోక్త కర్మములనన్నిటినీ చేసిన తరువాత వారు నలుగురూ ఆ కుంచెడు పేలపిండిని తలకొకమానెడు సమానంగా పంచుకొని ఉపయోగించుకొనటానికి సిద్ధంగా ఉన్నప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

యముఁడు సక్తుప్రస్థునికడ కతిథియై వచ్చుట (సం.14-93-11)

**తే.** **అతిథి యొక్కధరామరుం డరుగుదెంచెఁ; గని ప్రియంబున వా రెదుర్కొని సభక్తి**
**కముగఁ బర్ణశాలాభ్యంతరమున కతనిఁ, దోడికొనిపోయి యాసనస్థునిగఁ జేసి. 222**

**ప్రతిపదార్థం:** అతిథి= భోజన సమయానికి వచ్చినవాడైన, బాటసారి అయిన; ఒక్క= ఒకానొక; ధరా+అమరుండు= భూమియందు దేవత, బ్రాహ్మణుడు; అరుగుదెంచెన్= వచ్చారు; వారు= ఆ నలువురు; కని= చూచి; ప్రియంబునన్= సంతోషంతో; ఎదుర్కొని= ఎదురుగా వెళ్ళి; సభక్తికముగన్= భక్తితో కూడి ఉండేటట్లుగా; అతనిన్= అతడిని; పర్ణశాలా= పర్ణశాలయొక్క; అభ్యంతరమునకున్= లోపలికి; తోడికొనిపోయి= తీసికొనిపోయి; ఆసనస్థునిగన్= పీఠమున ఉన్నవాడినిగా; చేసి= చేసి.

**తాత్పర్యం:** బాటసారి అయిన ఒక బ్రాహ్మణుడు ఆ సమయానికి వచ్చాడు. వారు నలుగురూ చూచి సంతోషంతో అతడికి ఎదురుగా వెళ్ళి అతడిని పర్ణశాలలోనికి తీసికొనిపోయి పీటమీద కూర్చుండబెట్టి. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ.** **అడుగులు గడ్గి ప్రీతి యెసలారఁగఁ దద్దయు నెమ్మిఁ బల్కి; ర**
**ప్పుడు మది పల్లవింప మునిపుంగవుఁ డాతని కాత్మభాగ మె**
**క్కు డగు వినీతిఁ జూపి 'బుధకుంజర! నిర్దురితార్జనంబునం**
**బడసిన యట్టి సక్తువు; కృపారతి నాఁకలి దీనఁ దీర్పవే!' 223**

**ప్రతిపదార్థం:** అడుగులు= పాదాలు; కడ్గి= కడిగి; ప్రీతి= సంతోషం; ఎసలారఁగన్= అతిశయించగా; తద్దయున్= మిక్కిలి; నెమ్మిన్= ప్రీతితో; పల్కిరి= మాటాడారు; అప్పుడు= ఆ సమయంలో; మునిపుంగవుఁడు= మునిశ్రేష్ఠుడు; ఎక్కుడు= అధికమైన; వినీతిన్= వినయంతో; ఆత్మభాగము= తనవంతుగా వచ్చిన పేలపిండిని; చూపి= చూపించి; మది= అతిథియొక్క, మనస్సు; పల్లవింపన్= రక్తి పొందగా, సంతోషించగా; బుధకుంజర!= బ్రాహ్మణశ్రేష్ఠా!, పండితశ్రేష్ఠా; నిర్+దురిత= పాపంలేని; ఆర్జనంబునన్= సంపాదనంలో; పడసిన+అట్టి= పొందినటువంటి; సక్తువు= పేలపిండి; కృపా= దయయందలి; రతిన్= ఆసక్తితో; దీనన్= ఈ పేలపిండితో; ఆఁకలి= ఆకలి; తీర్పుము+ఏ!= తీర్చుకొనుమూ!

**తాత్పర్యం:** ఆ నలుగురూ బాటసారి కాళ్ళు కడిగి పరమ ప్రీతితో కుశల సంభాషణం నడిపారు. అప్పుడు మునిశ్రేష్ఠుడు తనవంతుకు వచ్చిన పేలపిండిని వినయంతో చూపి 'బ్రాహ్మణ శ్రేష్ఠా! ఈ పేలపిండి పాపంచేసి సంపాదించినది కాదు. దీనితో ఆకలి తీర్చికొనుము.

**విశేషం:** (తీర్పవే-తీర్పుము+ఏ= ఏదాదు లనుప్రయుక్తంబులగునపుడు మజ్జునకు వుజీరుజీ యగు. బా. వ్యాక్రి.34)

**వ.** **అని సమర్పణంబు చేసిన నమ్మహీసురోత్తముం డాసక్తు వుపయోగించె; దాన నతండు తృప్తిం బొందకునికి యమ్ముని గనుంగొని 'యేమిట నితండు తృప్తుం డగు? నెట్లు చేయుదు నొకో' యను విచారంబు వొడమి డోలాయమాన మానసుం డయ్యెం; దదీయభార్య తదింగితం బూహించి యతనితోడ. 224**

**ప్రతిపదార్థం:** అని; సమర్పణంబు చేసినన్= సమర్పించగా; ఆ+మహీసుర= ఆ బ్రాహ్మణులయందు; ఉత్తముండు= శ్రేష్ఠుడు; ఆ సక్తువు= ఆ పేలపిండిని; ఉపయోగించెన్= తిన్నాడు; దానన్= తనవంతు పేలపిండిచేత; అతండు= ఆ బ్రాహ్మణుడు; తృప్తిన్= తృప్తిని; పొందక; ఉనికి= ఉండటం; ఆ ముని; కనుంగొని= చూచి; ఏమిటన్= దేనిచేత; ఇతండు= ఇతడు; తృప్తుండు=

తృప్తిపొందినవాడు; అగున్= ఔతాడు; ఎట్లు= ఏ విధంగా; చేయుదున్+ఒకో?= తృప్తిపరతును? (ఒకో ఇచ్చట ప్రశార్థకము); అను= అనే; విచారంబు= ఎటూ తోచని స్థితి; పొడమి= కలిగి; డోలాయమాన= ఆందోళనపడుతున్న; మానసుండు= మనస్సు కలవాడు; అయ్యెన్= అయినాడు; తదీయ= అతడియొక్క; భార్య; తద్= అతడియొక్క; ఇంగితంబు= మనస్సులోని అభిప్రాయం; ఊహించి= ఊహించి తెలిసికొని; అతనితోడన్= అతడితో.

**తాత్పర్యం:** ఆ ముని ఈ విధంగా అని తనవంతు పేలపిండిని సమర్పించాడు. ఆ బ్రాహ్మణుడు ఆ పిండిని తిన్నాడు. కాని, అతడికి తృప్తి కలుగలేదు. దీనిని గమనించి ఆ ముని 'దేనివలన ఇతడు సంతృప్తుడౌతాడు ఏ విధంగా ఇతడికి తృప్తి కలిగించాలి?' అని దిక్కు తోచని స్థితివలన మనస్సులో ఆందోళన పడ్డాడు. అప్పుడు అతడి భార్య అతడి మనస్సులోని అభిప్రాయం తెలిసికొని. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'నాపాలి సక్తు విచ్చెద; । నీ పురుషునిఁ దృప్తుఁ జేయు మీ!' వనిన నతం**
**డా పొలఁతి డప్పియును సం । దీపిత జఠరాగ్నియైన తెఱఁగును గనుచున్. 225**

**ప్రతిపదార్థం:** నా పాలి సక్తువు= నా భాగం పేలపిండిని; ఇచ్చెదన్= సమర్పిస్తాను; ఈవు= నీవు; ఈ పురుషుని= ఈ బ్రాహ్మణుడిని; తృప్తున్= తృప్తి కలవాడినిగా; చేయుము; అనినన్= అనగా; అతండు= ఆ ముని; ఆ పొలఁతి= ఆ స్త్రీ, భార్య; డప్పియును= ఆయాసమునూ; సందీపిత= మిక్కిలి, మండుచున్న; జఠర+అగ్ని= ఆకలిచిచ్చు; ఐన= కలదైన; తెఱఁగును= స్థితియూ; కనుచున్= కనులారా చూస్తూ.

**తాత్పర్యం:** 'నా వంతు పేలపిండి సమర్పిస్తాను. మీ రీ బ్రాహ్మణుడిని తృప్తిపరచండి' అని అన్నది. అప్పుడు ఆ ముని తన భార్య ఆయాసమూ, ఆకలిచిచ్చునూ కనులారా చూస్తూ. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. ఇట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** (ఇట్లు+అనియెన్)

**తాత్పర్యం:** ఈ విధంగా అన్నాడు.

**క. 'మృగములుఁ బక్షులు లోనుగఁ । దగు నాహారములు దెచ్చి తమ ప్రియలకు నిం**
**పుగ నిచ్చు; నాకుఁ గొనఁగాఁ । దగునె భవద్భోజ్య మైన ద్రవ్యము సాధ్వీ! 227**

**ప్రతిపదార్థం:** సాధ్వీ!= ఉత్తమాంగనా!; మృగములున్= జంతువులూ; పక్షులున్= పక్షులూ; లోనుగన్= మొదలైనవి కూడా; తగు= తగిన; ఆహారములు; తెచ్చి= వెదకి తెచ్చి; తమ= తమయొక్క; ప్రియలకున్= భార్యలకు; ఇంపుగన్= ప్రీతి కలుగగా; ఇచ్చున్= పెట్టుతాయి; భవత్= నీచేత; భోజ్యము= భుజింపదగినది; ఐన= అయిన; ద్రవ్యము= పదార్థం; నాకున్= నాకు; కొనఁగాన్= పుచ్చుకొనగా; తగును+ఎ?= తగునా?

**తాత్పర్యం:** 'ఉత్తమాంగనా! నోరు లేని జంతువులూ పక్షులూ వెదకి తెచ్చిన తిండి ప్రేమతో తమ భార్యలకు పెట్టుతున్నాయి. అటువంటప్పుడు నీవు భుజించదగిన పదార్థాన్ని నేను తీసికొనటం తగునా?

**వ. స్త్రీ సంతోషించు తెఱం । గాస పడని మనసు గలుగునట్టి యధముఁ డి**
**చ్చో నడిఁ గనుఁ జని యచ్చో । గాసింబడు జముని భటులు గాఁటియ వెట్టన్'. 228**

**ప్రతిపదార్థం:** స్త్రీ; సంతోషించు= సంతోషించే; తెఱంగు= తీరును; ఆసపడని= కోరని; మనసు; కలుగు+అట్టి= కలిగినట్టి; అధముఁడు= నీచుడు; ఇచ్చోన్= ఈ లోకంలో; సడిన్= అపకీర్తిని; కనున్= పొందుతాడు; చని= మరణించి; అచ్చోన్= ఆ లోకంలో, నరకలోకంలో; జముని= యముడియొక్క; భటులు; కాఱియ+పెట్టన్= హింసించగా; గాసిన్+పడున్= బాధపొందుతాడు.

**తాత్పర్యం:** తన భార్య సంతోషించేతీరు కోరని నీచుడు ఈ లోకంలో అప్రతిష్ఠ పాలవుతాడు. నరకలోకంలో యమభటులు హింసిస్తుంటే బాధపడతాడు.'

**వ. అనిన విని యవ్వనిత యతని వదనంబునం జూడ్కి నిలిపి. 229**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని; ఆ+వనిత= ఆ స్త్రీ - మునిభార్య; అతని= మునియొక్క; వదనంబునన్= ముఖమునందు; చూడ్కి= చూపు; నిలిపి= పెట్టి.

**తాత్పర్యం:** ఆ మాటలు విని మునిపత్ని అతడి ముఖాన్ని సూటిగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. 'పతియ చుట్టంబుఁ బక్కంబుఁ బతియ చెలియుఁ। బతియ తల్లియుఁ దండ్రియుఁ బతియ గురువుఁ**
**బతియ దైవంబుఁ గావున నతనిపని యొ। నర్చుటయఁ జూవె ధర్మంబు నాతి కరయ. 230**

**ప్రతిపదార్థం:** అరయన్= పరిశీలించగా; నాతికిన్= స్త్రీకి; పతి+అ= భర్తయే; చుట్టంబున్= చుట్టమూ; పక్కంబున్= తోడూ; పతి+అ= మగడే; చెలియున్= మిత్రుడూ; పతి+అ= నాథుడూ; తల్లియున్= తల్లియూ; తండ్రియున్= తండ్రియూ; పతి+అ= భర్తయే; గురువున్= గురువు; పతి+అ= నాథుడే; దైవంబు= దేవుడు; కావునన్= కావున; అతని= భర్తయొక్క; పని; ఒనర్చుట+అ= చేయుటే; ధర్మంబు= ధర్మం; చూవె!= సుమా!.

**తాత్పర్యం:** 'స్త్రీకి చుట్టమైనా, తోడైనా, మిత్రుడైనా, తల్లి అయినా, తండ్రిఅయినా, గురువు అయినా, దేవుడైనా, భర్తయే. కాబట్టి ఆమెకు మగనిపని చేయటం ధర్మం.

**విశేషం:** ఈ పద్యం యథాతథంగా నిర్వచనోత్తర రామాయణంలో (ఆ. 9. పద్య 29) ఉన్నది.

**వ. అట్లుంగాక. 231**

**తాత్పర్యం:** అదియును గాక (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మానితగుణ! నీ వాఁకలి। తో నుండఁగ నేటిపాలు; దోషం బిది; యి**
**ట్లే నాహారము గొందునె?;। యీ నిర్మలమతికి దీని ని మ్ముచిత విధిన్.' 232**

**ప్రతిపదార్థం:** మానిత= గౌరవించబడిన; గుణ= సుగుణాలు కలవాడా!; నీవు; ఆఁకలితోన్= ఆకలితో; ఉండఁగన్= బాధపడుతుండగా; ఏటి పాలు?= భాగ మేమిటి?; ఇది= ఈ భాగమును అనుభవించటం; దోషంబు= పాపం; ఇట్లు= ఈ విధంగా, నీవు ఆకలితో బాధపడుచుండగా ఈ విధంగా భాగము తీసికొని; ఏను= నేను; ఆహారము= తిండి; కొందును+ఎ?; దీనిన్= నా వంతు పేలపిండిని; ఉచిత విధిన్= తగిన ధర్మం ప్రకారం; ఈ నిర్మల= ఈ మచ్చలేని; మతికిన్= మనస్సు కలవాడికి; ఇమ్ము= అర్పించుము.

**తాత్పర్యం:** సద్గుణ సంపన్నా! నీవు ఆకలితో మలమలమాడుతుండగా నాకు భాగమేమిటి? భాగాన్ని తీసికొనటం పాపం కదా? ఈ విధంగా నేను తిండి తింటానా? నావంతు పేలపిండిని ధర్మప్రకారం మచ్చలేని మనస్సు కలిగిన ఆ బ్రాహ్మణుడికి అర్పించుము.'

**చ. అని తనసక్తు విచ్చినఁ బ్రియమ్మున నమ్ముని యమ్మహాద్విజుం**
**గనుఁగొని 'డప్పి వో దిదియుఁ గైకొను' మన్న నతండు ప్రీతి నె**
**క్కొన భుజియించి వెండియును గూరఁడ తృప్తిఁ; దదంతరంగముం**
**గనుఁగొని యత్తపస్విపతి గ్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందినన్. 233**

**ప్రతిపదార్థం:** అని; తన; సక్తువు= పేలపిండి; ఇచ్చినన్= అర్పించగా; ప్రియమ్మునన్= సంతోషంతో; ఆ+ముని= ఆ ముని; ఆ+మహా= గొప్ప; ద్విజున్= బ్రాహ్మణుడిని; కనుఁగొని= చూచి; డప్పి= ఆకలివలన కలిగిన బడలిక; పోదు= పోలేదు; ఇదియున్= ఈ పేలపిండి కూడా; కైకొనుము= స్వీకరించుము; అన్నన్= అనగా; అతండు= ఆ అతిథి; ప్రీతి= ఆనందం; నెక్కొనన్= కలుగగా; భుజియించి= తిని; వెండియును= మరియునూ; తృప్తిన్= తృప్తిని; కూరఁడు+అ= పొందనే పొందడాయెను; ఆ+తపస్వి= ఆ మునియొక్క; పతి= నాథుడు, మునిరాజు; తద్= ఆ అతిథియొక్క; అంతరంగమున్= మనస్సును; కనుఁగొని= గ్రహించి; క్రమ్మఱన్= మరల; నెమ్మదిన్= మనస్సులో; చింతన్= విచారాన్ని; ఒందినన్= పొందగా.

**తాత్పర్యం:** అని మునిపత్ని తనవంతు పేలపిండి ఇచ్చింది. అప్పుడు ముని ఆ బ్రాహ్మణుడిని చూచి 'మీ ఆకలి తీరనట్లున్నది. దీనిని కూడా స్వీకరించండి' అని అన్నాడు. ఆ అతిథి దానిని తిని కూడా తృప్తిని పొందనే పొందలేదు. మునినాథుడు అతడి మనస్సును గ్రహించి మరలా విచారం పొందగా. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. తదీయ తనయుండు తద్దశావిశేషం బెఱింగి. 234**

**ప్రతిపదార్థం:** తదీయ= ఆ మునియొక్క; తనయుండు= కుమారుడు; తద్= ఆ; దశావిశేషంబు= అధికమైన దుఃఖస్థితిని; ఎఱింగి= గ్రహించి.

**తాత్పర్యం:** ఆ మునీశ్వరుడి కుమారుడు తండ్రి శోచనీయస్థితిని గ్రహించి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. తనపాలి సక్తువుఁ దండ్రికిఁ జూపి 'యీ। యతిథిఁ దృప్తునిఁ జేయు మనఘ! దీనఁ;**
**దనయుండు దండ్రి చిత్తమున నెక్కొనిన కృ। త్యం బాచరించుట యర్థధర్మ;**
**మన విని యమ్మహాముని 'యెంత ప్రాయంబు। చనినను విను జనకునకు సుతుఁడు**
**బాలుండ; యాఁకలి బాలుర కగ్గల;। మట్లు గావున నిది యనుచితంబు';**

**తే. నావుడును 'దాన పుత్త్రుఁ డనంగ విందు;। నన్నుఁ గాచుట యరయంగ నిన్నుఁ గాచి**
**కొనుట; యిప్పిండి యమ్మహాత్మునకు నిచ్చి। కావవే! నన్నుఁ; గారుణ్యభావితాత్మ!' 235**

**ప్రతిపదార్థం:** తన= తనయొక్క; పాలు= భాగమైన; సక్తువున్= పేలపిండిని; తండ్రికిన్= తండ్రికి; చూపి; అనఘ!= పాపరహితుడా!; దీనన్= ఈ పేలపిండితో; అతిథిన్= అతిథిని; తృప్తున్= తృప్తిగలవాడినిగా; చేయుము; తనయుండు= కుమారుడు; తండ్రి=

తండ్రియొక్క; చిత్తమున్= మనస్సులో; నెక్కొనిన= గట్టిగా ఉండిన; కృత్యంబు= పని; ఆచరించుట= చేయటం; అర్హ= తగిన; ధర్మము; అనన్= అనగా; విని; ఆ+మహా= గొప్ప; ముని; విను= వినుము; ఎంత; ప్రాయంబు= వయస్సు; చనినను= కడచినను; జనకునకున్= తండ్రికి; సుతుఁడు= కుమారుడు; బాలుండు+అ= బాలుడే; బాలురకున్= బాలకులకు; ఆఁకలి= ఆకలి; అగ్గలము= ఎక్కువ; అట్లు+కావునన్= ఆ కారణంచేత; ఇది= నీ పిండితో అతిథిని తృప్తిపరచుట; అనుచితంబు= తగినది; నావుడును= అని అనగా; తాను+అ= తానే, తండ్రియే; పుత్త్రుఁడు= కుమారుడు; అనంగన్= చెప్పగా; విందున్= వింటాను; నన్నున్= నన్ను; కాచుట= కాపాడటం; అరయంగన్= పరిశీలించగా; నిన్నున్= నిన్ను; కాచికొనుట= అధర్మంవలన కాపాడుకొనటం; ఈ పిండి= ఈ పేలపిండి; ఈ మహా= గొప్ప; ఆత్మునికిన్= మనస్సు కలవాడికి; ఇచ్చి; కారుణ్యా= దయచేత; భావిత= పొందబడిన; ఆత్మ= ఆత్మకలవాడా?; నన్నున్= నన్ను; కావవే!= కాపాడుమా!

**తాత్పర్యం:** మునికుమారుడు తన పేలపిండిని తండ్రికి చూపి 'పుణ్యపురుషా! ఈ పిండిచేత అతిథిని తృప్తిపరచుము. తండ్రి చేయదలచిన పనిని చేయటం కుమారుడి ధర్మం' అని అన్నాడు. అప్పుడు ముని కొడుకుతో 'కుమారుడు ఎంత పెద్దవాడయినా అతడు తండ్రికి బాలుడుగానే కనబడతాడు. బాలురకు ఆకలి ఎక్కువ. కావున నీ పేలపిండి తీసికొనటం తగనిపని' అని పలికాడు. అప్పుడు మునికుమారుడు 'తండ్రియే కుమారుడు అని వేదం చెప్పుతున్నది కదా! ఆలోచించగా నన్ను కాపాడటం నిన్ను కాపాడుకొనటమే. దయాంతరంగా! ఈ పిండి ఈ మహాత్ముడికి ఇచ్చి నన్ను కాపాడుము'.

**విశేషం:** తాన పుత్త్రుఁ డనంగ విందు - తండ్రియే కుమారుడు, తండ్రియే కుమారుడుగా జన్మిస్తాడని వేదం చెప్పుతున్నది. ఆదిపర్వంలో (ఆశ్వా. 4-85) శకుంతల దుష్యంతుడితో 'పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భమునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లుఁ గాన "నఙ్గాదఙ్గాత్సంభవసి'' యనునది యాదిగాఁగల వేదవచనంబుల యందును జనకుండును బుత్త్రుండును నను భేదంబు లేదు' అని చెప్పును.

సంస్కృతభారతంలో ఈ సందర్భాన

**"వేదేష్వపి వదన్తీమం మన్త్రవాదం ద్విజాతయః।**
**జాతకర్మణి పుత్రాణాం తవాపి విదితం తథా ॥**

**"అఙ్గాదఙ్గా త్సంభవసి హృదయా దభిజాయసే।**
**ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరదః శతమ్॥**

**"పోషోహి త్వదధీనో మే సంతాన మపి చాక్షయమ్।**
**తస్మాత్ త్వం జీవ మే వత్స సుసుఖీ శరదాం శతమ్"**

అనే శ్లోకాలు గలవు. వీటిని శకుంతలయే చెప్పినది. (భండార్కర్ ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ మహాభారత ప్రతి. అధ్యా 68. శ్లో. 61.62.63).

'బ్రాహ్మణులు పుత్రుల జాతకర్మములందు వేదములందలి మంత్రసమూహమును ఇట్లు పఠింతురు. నీకు నవి చక్కఁగాఁ దెలిసినట్టివే. అవి ఏవనగా? - నా యొక్కొక్కయంగమునుండి నీవు జనించియున్నావు. నా హృదయము నుండియు నెక్కుడు గాఁగలిగి యున్నావు. పుత్రుఁ డను పేరు గల నేనేయై నీ వున్నావు. అట్టి నీవు నూఱేండ్లు జీవించి యుండుము. నా పోషణము నీ వలననే కలుగవలసి యున్నది. నా సంతానమును నీ వలననే మాయకుండవలసి యున్నది. కాబట్టి నా పుత్రా! అట్టి నీవు నూరేండ్లు సుఖముగా జీవించి యుండుమా!' (దేవరాజ సుధీమణి ప్రణీతము; ఆదిపర్వము ద్వితీయభాగము. పుటలు 524-525 ఆర్. వెంకటేశ్వర్ అండ్ కంపెనీవారి ప్రతి. 1926).

**వ. అనినం గొడుకు మాటలకు నమ్మహితాత్ముండు ప్రీతాత్ముండై యాసక్తు వాయతిథి కిచ్చినం బుచ్చికొని యతం డుపయోగించె; దానను నాఁకలి వోని తెఱంగు దోఁ చిన నయ్యంచిత వ్రతునిడెందంబు గుందు నొందినం గోడలు తదాకార ప్రకారంబు గని తనయంశంబైన పిండి మామముందటికిం దెచ్చి. 236**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; కొడుకు= కొడుకుయొక్క; మాటలకున్= మాటలకు; ఆ+మహిత= గౌరవించబడిన,గొప్పది అయిన; ఆత్ముండు= ఆత్మకలవాడు; ప్రీత= సంతోషించిన; ఆత్ముండు+ఐ= ఆత్మకలవాడై; ఆ సక్తువు= ఆ పేలపిండిని; ఆ అతిథికిన్= ఆ అతిథికి; ఇచ్చినన్= అర్పించగా; పుచ్చికొని= స్వీకరించి; అతండు= అతడు; ఉపయోగించెన్= తిన్నాడు; దానను= దానిచేత కూడా; ఆఁకలి= ఆకలి; పోని= తీరని; తెఱంగు= వాలకం; తోఁచినన్= కనబడగా; ఆ+అంచిత= గౌరవించబడిన; వ్రతుని= సదాచారం కలిగినవాడియొక్క; డెందంబు= హృదయం; కుందున్= విచారం; ఒందినన్= పొందగా; కోడలు; తద్= ఆ మునీశ్వరుడియొక్క; ఆకార= హృదయభావాలను సూచించే ముఖ వికారముయొక్క; ప్రకారంబు= విధం; కని= చూచి; తన= తనయొక్క; అంశంబు= భాగం; ఐన= అయిన; పిండి= పిండిని; మామ= మామయొక్క; ముందటికిన్= ముందుకు; తెచ్చి= పెట్టి.

**తాత్పర్యం:** ఈ విధంగా అనిన కొడుకు మాటలకు ఆ మహాత్ముడు సంతోషించి అతడి పేలపిండిని అతిథికి సమర్పించాడు. అతిథి దానిని తిన్నాడు కాని, అతడి ఆకలి తీరలేదు. ఇది చూచి మునీశ్వరుడు హృదయతాపం పొందాడు. ఆ తాపాన్ని సూచించే అతడి ముఖాకృతిని కోడలు చూచింది. ఆమె తన వంతు పిండిని మామగారిముందు పెట్టి. (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'ఇదియును నతిథికి నిం' డన్న 'నక్కట! యాఁకటఁ దలరి నీ యంగకములు**
**శిథిలంబు లైనవి; చేడ్పడి యున్నది। చిత్తంబు; దీనిఁ బుచ్చికొని నిన్ను**
**డప్పితో నుండంగ నెప్పాటఁ జూడఁగ। లాఁడ నే' ననుడు నాలలన 'మీరు**
**మద్గురు గురులరు; మహిత శుశ్రూషకుఁ। గాదె ప్రాణములు నంగములుఁ గలిమి;**

**తే. విహిత మిటు సేఁత నా; కనువృత్తి శీలఁ। గాఁగఁ జేయుండు నన్ను మీ కరుణ యలర'**
**ననిన సంయమివరుఁ డియ్యకొని యతనికి। నచ్చెలువపాలి సక్తువు నర్థి నిచ్చె. 237**

**ప్రతిపదార్థం:** ఇదియును= దీనినికూడా; అతిథికిన్= అతిథికి; ఇండు= సమర్పించుడు; అన్నన్= అనగా; అక్కట!= అయ్యో!; నీ= నీయొక్క; అంగకములు= సుకుమారమైన అవయవములు; ఆఁకటన్= ఆకలిచేత; తలరి= సత్తువ కోల్పోయి; శిథిలంబులు= సడలినివి; ఐనవి= అయినవి; చిత్తంబు= మనస్సు; చేర్పడి= కలతపొంది; ఉన్నది; దీనిన్= ఈ పేలపిండిని; పుచ్చికొని= తీసికొని; డప్పితోన్= బడలికతో; ఉండంగన్= బాధపడుతుండగా; నేన్= నేను; ఏ+పాటన్= ఏ విధంగా; నిన్నున్= నిన్ను; చూడన్+కలాఁడన్= చూడగలవాడను; అనుడున్= అని అనగా; ఆ లలన= ఆ స్త్రీ, కోడలు; మీరు; మత్= నా యొక్క; గురు= గురువునకు; గురులరు= గురువులు; ప్రాణములున్= ప్రాణాలను; అంగములున్= అవయవాలను; కలిమి= కలిగియుండుట; మహిత= గౌరవించబడినవారియొక్క, పూజ్యులయొక్క; శుశ్రూషకున్= ఉపచారముకొరకు; కాదు+ఎ!= కదా!; నాకున్= నాకు; ఇటు= ఇట్లు; చేఁత= చేయటం; విహితము= ఆజ్ఞ, శాసనం, విధి; మీ= మీయొక్క; కరుణ= దయ; అలరన్= ఒప్పగా; నన్నున్= నన్ను; అనువృత్తి= పెద్దలను అనుసరించటమే; శీలన్= శీలంగలదానను; కాఁగన్= అయ్యేటట్లుగా; చేయుండు= చేయుడు; అనినన్= అనగా; సంయమి= మునులలో; నరుఁడు= పతి; ఇయ్యకొని= ఒప్పుకొని; అర్థిన్= ప్రీతితో; అతనికిన్= అతిథికి; ఆ+చెలువ= ఆ స్త్రీయొక్క, కోడలియొక్క; పాలు= భాగమైన; సక్తువున్= పేలపిండిని; ఇచ్చెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** 'దీనిని కూడా అతిథికి సమర్పించుడు' అని కోడలు అన్నది. ఆ మాటలు విని ఋషీశ్వరుడు 'అయ్యో! ఆకలిచేత నీ అవయవాలు సత్తువలేక సడలిపోయాయి. నీ మనస్సు వ్యాకులత చెందింది. ఈ పేలపిండిని తీసికొని, నీవు అలసి సొలసి ఉండగా నేను ఏ విధంగా చూడగలను?' అని అన్నాడు. అప్పుడు కోడలు 'మీరు నా గురువునకే గురువులు, ప్రాణాలు గానీ, అవయవాలు గానీ మహాత్ముల సేవకే అంకితాలు కదా! ఈ పేలపిండి ఇవ్వటం నా విధి. మీరు దయతో నేను పెద్దలను అనుసరించే స్వభావం కలదాననని నిరూపించుడు' అని పలికింది. ఆ మునిపతి ఆ మాటలకు ఒప్పుకొని కోడలివంతుకు వచ్చిన పేలపిండిని ప్రీతితో అతిథికి సమర్పించాడు.

**విశేషం:** మీరు మద్గురు గురులరు= కోడలికి భర్త గురువు. ఆ గురువు తండ్రి అయిన మునీశ్వరుడును గురువే. గురువు అనగా తండ్రి అని అర్థం. కావున మామ అగు ముని కోడలికి గురువుయొక్క గురువు ఔతున్నాడు.

**ఉ.** **ఇచ్చినఁ బ్రీతిఁ బుచ్చికొని యింపెసలార భుజించి తృప్తిమై**
**నచ్చుపడంగ మెచ్చున ముఖాంబురుహం బలరంగ నిట్లనుం**
**బొచ్చెము లేక యయ్యతిథి 'భూరిగుణోత్తర! నిన్నుఁ జూడఁగా**
**వచ్చితి; నేను ధర్ముఁడ; భవద్వ్రతశీలతఁ జూచి మెచ్చితిన్.** **238**

**ప్రతిపదార్థం:** ఇచ్చినన్= సమర్పించగా; ఆ+అతిథి= ఆ అతిథి; ప్రీతిన్= సంతోషంతో; పుచ్చికొని= తీసికొని; ఇంపు= వేడుక; ఎసలారన్= అతిశయించగా; భుజించి= తిని; తృప్తి; మైన్= శరీరమునందు; అచ్చుపడంగన్= గోచరించగా; ముఖ+అంబురుహంబు= పద్మంవంటి ముఖం; మెచ్చునన్= మెప్పుతో; అలరంగన్= వికసించగా; పొచ్చెము= కొరత; లేక; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; భూరి= అత్యధికమైన; గుణ= సద్గుణములచేత; ఉత్తర!= శ్రేష్ఠుడా!; నిన్నున్= నిన్ను; చూడఁగాన్= చూచుటకై; వచ్చితిన్= వచ్చాను; నేను; ధర్ముఁడన్= యముడను; భవత్= నీ యొక్క; వ్రత= సదాచారాలను పాటించే; శీలతన్= శీలంగలవాడి ధర్మమును, శీలమును; చూచి; మెచ్చితిన్= మెచ్చాను.

**తాత్పర్యం:** మునిపతి సమర్పించగా అతిథి సంతోషంతో పేలపిండిని తీసికొని వేడుకతో తిన్నాడు. అతడి శరీరమునందు తృప్తీ, ముఖంలో మెప్పూ కనబడ్డాయి. అతడు మునీశ్వరుడితో 'సద్గుణశ్రేష్ఠా! నిన్ను చూడటానికి వచ్చాను. నేను యముడిని, నీ సదాచార ప్రకృతిని చూచి మెచ్చుకొన్నాను' అని హృదయపూర్వకంగా అన్నాడు.

**క.** **భక్తియు వినయము శ్రద్ధా। యుక్తియునుం దాల్మితోడి యొప్పును గరుణా**
**సక్తియు నతిథులయెడ నను। రక్తియు నీయంద సుస్థిరత్వముఁ బొందెన్.** **239**

**ప్రతిపదార్థం:** భక్తియున్= భక్తియూ; వినయమున్= వినయమూ; శ్రద్ధా= శ్రద్ధతో; యుక్తియునున్= కూడికయూ; తాల్మితోడన్= ఓర్పుతో కూడిన; ఒప్పును= మర్యాదయూ; కరుణా= దయయందలి; ఆసక్తియున్= ఆసక్తియూ; అతిథుల+ఎడన్= అతిథులపట్ల; అనురక్తియున్= ప్రేమయూ; నీ+అందున్+అ= నీయందే; సుస్థిరత్వమున్= గట్టి నిలుకడను; పొందెన్= పొందాయి.

**తాత్పర్యం:** భక్తీ, వినయమూ, శ్రద్ధా, ఓర్పుతో కూడిన మర్యాదా, దయా, అతిథులయందలి ప్రేమా నీ యందే నిలుకడగా ఉన్నవి.

**క. నీ దానంబున విస్మితు । లై దైవత యక్ష సిద్ధు లభివర్ణన మ**
**త్యాదరమునఁ జేసెద రిదె! । రోదసి సమ్మర్దముగ నరుగుదెంచి తగన్. 240**

**ప్రతిపదార్థం:** నీ= నీయొక్క; దానంబునన్= దానంచేత; విస్మితులు+ఐ= ఆశ్చర్యపడినవారై; దైవత= దేవతలూ; యక్ష= యక్షులు; సిద్ధులు; రోదసిన్= ఆకాశంలో; సమ్మర్దముగన్= ఒత్తిడి అయ్యేటట్లుగా; అరుగుదెంచి= వచ్చి; తగన్= తగినట్లుగా; అతి= మిక్కిలి; ఆదరమునన్= ఆదరంతో; అభివర్ణనము చేసెదరు= మిక్కిలి వర్ణిస్తున్నారు; ఇది+ఎ= ఇదిగో; చూడుము.

**తాత్పర్యం:** దేవతలూ, యక్షులూ, సిద్ధులూ, నీ దానం చూచి ఆశ్చర్యపడి ఆకాశంలో గుంపులుగట్టి మహానురాగంతో నిన్ను వర్ణిస్తున్నారు. ఇదిగో చూడుము.

**క. అని చూపి పల్కునవసర । మునఁ బర్జన్యుండు గురిసెఁ బుష్పాసారం;**
**బనవద్య హృద్యనాదం । బున మ్రోసెను దేవదుందుభులు గగనమునన్. 241**

**ప్రతిపదార్థం:** అని; చూపి= చూపించి; పల్కు+అవసరమునన్= మాటాడుతున్న సమయాన; పర్జన్యుండు= దేవేంద్రుడు; పుష్ప= పూలయొక్క; ఆసారంబు= జడివాన; కురిసెన్= కురిపించాడు; గగనమునన్= ఆకాశంలో; దేవదుందుభులు= దేవతల భేరులు; అనవద్య= నిర్దోషమైన; హృద్య= మనోహరమైన; నాదంబునన్= ధ్వనితో; మ్రోసెను= మ్రోగాయి.

**తాత్పర్యం:** అని యముడు చూపేటప్పుడు దేవేంద్రుడు పూలజడివాన కురిపించాడు. లయబద్ధంగా మనోహరంగా దేవదుందుభులు మ్రోగాయి.

**వ. అప్పు డయ్యతిథి వెండియు. 242**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయమున; ఆ+అతిథి= ఆ యముడు; వెండియున్= ఇంకనూ.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ అతిథి మరల (ఇట్లా అన్నాడు).

**యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకంబునకుఁ బో నియోగించుట (సం. 14-93-60)**

**క. 'నినుఁ జూచువేడ్క నేడ్వురు । మునుల మనంబుల సమగ్రముగఁ గదిరెడు; స**
**జ్జన కీర్తనీయ! దివికిం । జనుదెమ్ము ప్రియాసుతస్నుషాసహితముగన్. 243**

**ప్రతిపదార్థం:** సజ్జన= సజ్జనులచేత; కీర్తనీయ!= కీర్తించదగినవాడా!; ఏడ్వురు= ఏడుగురు; మునుల= మునులయొక్క; మనంబులన్= మనస్సులందు; సమగ్రముగన్= సంపూర్ణంగా; నినున్= నిన్ను; చూచు= చూడవలెననే; వేడ్క= కుతూహలం; కదిరెడున్= వ్యాపిస్తున్నది; ప్రియా= భార్య; సుత= కుమారుడు; స్నుషా= కోడలు; సహితముగన్= కూడికొని యుండునట్లుగా; దివికిన్= స్వర్గానికి; చనుదెమ్ము= రమ్ము.

**తాత్పర్యం:** సజ్జనస్తుత్యా! సప్తర్షుల మనస్సులు నిన్ను చూడాలని ఉవ్విళ్ళూరుతున్నాయి. నీవు నీ భార్యతో, కొడుకుతో, కోడలితో కూడి స్వర్గానికి రమ్ము.

**తే.** **క్షుధ హరించుఁ బ్రజ్ఞాపరిశోభనతలఁ;। దృష్ణ గుందించుఁ గృప; నీవు దెలిసి వాని**
**ననఘ! నిర్జించి తాలు బిడ్డనక; యతిథి। పూజనం బిట్లు నడపిన పుణ్యమునకు.** **244**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; క్షుధ= ఆకలి; ప్రజ్ఞను= బుద్ధినీ; పరిశోభనతలన్= తేజస్సునూ; హరించున్= నశింపజేయును; తృష్ణ= ఆశ; కృపన్= దయను; కుందించున్= నశింపజేయును; నీవు; తెలిసి= తెలిసికూడా; ఆలు= భార్య; బిడ్డ+అనక= బిడ్డ అని కూడ చూడకుండా; వానిన్= ఆ ఆకలినీ, ఆశనూ; నిర్జించితి= జయించావు; ఇట్లు= ఈ విధంగా; అతిథి= అతిథియొక్క; పూజనంబు= పూజ; నడపిన= చేసిన; పుణ్యమునకున్= పుణ్యంచేత.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఆకలి బుద్ధినీ తేజస్సునూ మట్టుపెట్టుతుంది. ఆశ దయను నాశం జేస్తుంది. ఈ లోకతత్త్వం తెలిసి తెలిసీ భార్య అనీ బిడ్డలనీ చూడకుండా ఆకలినీ ఆశనూ జయించావు. ఈ విధంగా అతిథిపూజ చేసిన పుణ్యంచేత. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **తగు ప్రియమున సకుటుంబం। బుగఁ దన సభ కీవు రాక బుద్ధిం గని బ్ర**
**హ్మ గడున్ వేడ్క విమానం। బు గురువ్రత శీల! శీఘ్రమునఁ బుత్తెంచున్.** **245**

**ప్రతిపదార్థం:** గురు= గొప్ప; వ్రత= నియమాలను పాటించటమే; శీల= శీలంగా కలవాడా!; బ్రహ్మ; తగు= నీ పట్ల చూపదగిన; ప్రియమునన్= అనుగ్రహంతో; నీవు; సహ+కుటుంబంబుగన్= కుటుంబంతో కూడి ఉండేటట్లుగా; తన= తనయొక్క; సభకున్= సభకు; రాక= రావటం; బుద్ధిన్= బుద్ధియందు; కని= ఆలోచించి, నిర్ణయించి; కడున్= మిక్కిలి; వేడ్కన్= కుతూహలంతో, సంతోషంతో; విమానంబు= విమానమును; శీఘ్రమునన్= తొందరగా; పుత్తెంచున్= పంపుతాడు.

**తాత్పర్యం:** మహానియమశీలా! నీ యందలి అనుగ్రహంతో బ్రహ్మ నీవు కుటుంబంతో కూడా తన సభకు రావాలని నిర్ణయించాడు. ఆ సృష్టికర్త పరమానందంతో నీ కొరకు తొందరలోనే విమానం పంపుతాడు.

**చ.** **వినుము ప్రభూతదానములు విశ్రుతయజ్ఞములున్ సధర్మతా**
**వినుతికి నెక్కఁజాలవు; వివేకనిధీ! పరిశుద్ధ శోభితా**
**ర్జనమునఁ దెచ్చికొన్నది వరం బగుఁ బాత్రము నర్హకాలముం**
**గని లఘువస్తువేని నొసఁగం గను టుజ్జ్వలధర్మ మారయన్.'** **246**

**ప్రతిపదార్థం:** వివేక= మంచిచెడ్డలు తెలిసికొనే బుద్ధికి; నిధీ!= గని అయినవాడా!; వినుము; ఆరయన్= పరిశీలించగా; ప్రభూత= అధికమైన; దానములున్= దానాలూ; విశ్రుత= ప్రసిద్ధికెక్కిన; యజ్ఞములున్= యజ్ఞములూ; సహ+ధర్మతా= ధర్మంతో కూడిన; వినుతికిన్= ప్రశంసకు; ఎక్కన్+చాలవు= తగినవి కావు; పరిశుద్ధ= పవిత్రంగా ఉండటంచేత, పాపరహితత్వంచేత; శోభిత= అలంకరింపబడిన, ప్రకాశించే; ఆర్జనమునన్= సంపాదనంచేత; తెచ్చికొన్నది= కూడబెట్టింది; వరంబు= శ్రేష్ఠం; అగున్= అగును; పాత్రమున్= యోగ్యుడైనవాడిని; అర్హ= యుక్తమైన; కాలమున్= సమయాన్ని; కని= పరిశీలించి; లఘు= చిన్నదైన; వస్తువు; ఏనిన్= అయిననూ; ఒసఁగన్+కనుట= దానము చేయగలుగుట; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న, ప్రకటితమైన; ధర్మం.

**తాత్పర్యం:** వివేకనిధీ! వినుము. అనేక దానాలూ, ప్రఖ్యాత యజ్ఞాలూ, ధర్మబద్ధమైన ప్రశంసకు తగినవి కావు. సన్మార్గంలో సంపాదించి కూడబెట్టిందే శ్రేష్ఠం. యోగ్యుడైనవాడికి తగిన సమయంలో అల్పవస్తువైనా దానం చేయగలగటం ఉత్తమ ధర్మం'.

**క. అని పలుకుచు దివ్యంబగు । తన యాకారంబు సూపె ధర్ముండు; కన**
**త్కనక మణిమయ విమానము । వినువీథిం దోఁచె మునులు విస్మయ మందన్. 247**

**ప్రతిపదార్థం:** అని; పలుకుచున్= పలుకుతూ; ధర్ముండు= యముడు; దివ్యము= దేవతా సంబంధమైనది; అగు= అయిన; తన= తనయొక్క; ఆకారంబు= రూపం; చూపెన్= చూపాడు; మునులు; విస్మయము= ఆశ్చర్యము; అందన్= పొందగా; వినువీథిన్= ఆకాశమార్గంలో; కనత్= ప్రకాశిస్తున్న; కనక= బంగారంయొక్క; మణి= మణులయొక్క; మయ= వికారమైన; విమానము; తోఁచెన్= కనబడింది.

**తాత్పర్యం:** అని పలుకుతూ యముడు తన దేవరూపాన్ని చూపాడు. ఇంతలో ఆకాశాన సువర్ణమణి నిర్మితమైన విమానం కనబడింది. దానిని చూచి మునులు ఆశ్చర్యపడ్డారు.

**వ. అప్పుడు సక్తుప్రస్థుండు పరమప్రీతిం దానును దనవారును ధర్మదేవతకు దండప్రణామంబు చేసి నిలిచిన. 248**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; సక్తుప్రస్థుండు= సక్తుప్రస్థుడు; పరమప్రీతిన్= మహానందంతో; తానును= తానూ; తనవారును= తన వారూ; ధర్మదేవతకున్= యముడికి; దండప్రణామంబు= సాష్టాంగ నమస్కారం; చేసి; నిలిచినన్= నిలబడగా.

**తాత్పర్యం:** అప్పుడు సక్తుప్రస్థుడూ, అతడి భార్యా, కొడుకూ, కోడలూ యముడికి సాష్టాంగ నమస్కారం చేసి నిలబడగా.

**తే. ధర్మదేవత యతనితో 'ధర్మనిరత! । కంటె! బ్రహ్మ పుత్తెంచిన ఘనవిమాన'**
**మనఁగ నది భూమి కవతరించినఁ బ్రమోద । మెసఁగ నా ధర్ముఁ డాతని కిట్టు లనియె. 249**

**ప్రతిపదార్థం:** ధర్మదేవత= యముడు; అతనితోన్= సక్తుప్రస్థుడితో; ధర్మ= ధర్మమునందు; నిరత!= మిక్కిలి ఆసక్తి కలవాడా!; బ్రహ్మ; పుత్తెంచిన= పంపిన; ఘన= గొప్పదైన; విమానము= విమానమును; కంటి+ఎ?= చూచితివా?; అనఁగన్= అనగా; అది= ఆ విమానం; భూమికిన్= భూమిమీదకు; అవతరించినన్= దిగగా; ప్రమోదము= సంతోషం; ఎసఁగన్= అతిశయించగా; ఆ+ధర్ముండు= ఆ యముడు; అతనికిన్= సక్తుప్రస్థుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** యముడు సక్తుప్రస్థుడితో 'ధర్మపరాయణా! బ్రహ్మ పంపిన విమానాన్ని చూచావా!' అని అంటూ ఉండగనే విమానం భూమిమీదకు దిగింది. ఆనందంతో యముడు సక్తుప్రస్థుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'వేడుక నాలుం గొడుకును । గోడలు నీవును బ్రభూతగుణ! యెక్కుము సం**
**క్రీడమెయి నివ్విమానము; । నీడితగతి బ్రహ్మసభకు నేఁగఁగ వలయున్'. 250**

**ప్రతిపదార్థం:** ప్రభూత= అధికమైన; గుణ!= సద్గుణాలు కలవాడా!; వేడుకన్= ఆనందంతో; ఆలున్= నీ భార్యయూ; కొడుకును= నీ కొడుకూ; కోడలున్= నీ కోడలూ; ఈవును= నీవూ; సంక్రీడమెయిన్= హాయిగా; ఈ+విమానము= ఈ విమానం; ఎక్కుము; ఈడిత= పొగడబడిన; గతిన్= గమనంతో, బ్రహ్మ= బ్రహ్మయొక్క; సభకున్= సభకు; ఏఁగఁగన్+వలయున్= వెళ్ళ వలయును.

**తాత్పర్యం:** 'సద్గుణాతిశయా! నీవూ, నీ భార్యా, కొడుకూ, కోడలూ వేడుకతో హాయిగా ఈ విమానం ఎక్కండి. ప్రశస్తగతితో బ్రహ్మసభకు వెళ్ళాలి.'

**క. అనవుడు సక్తుప్రస్థుఁడు। తనవారును దాను నెక్కి ధర్ముం డనుపం**
**జనియె; నది యంతయును నేఁ। గనుఁగొనుచు బిలంబు వెడలఁగా నామేనన్. 251**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; సక్తుప్రస్థుఁడు; తనవారును= తన వారు; తానును= తానూ; ఎక్కి= విమానం ఎక్కి; ధర్ముండు= యముడు; అనుపన్= సాగనంపగా; చనియెన్= వెళ్ళాడు; నేన్= నేను; అది+అంతయును= దానినంతటినీ; కనుఁగొనుచున్= చూస్తూ; బిలంబు= కన్నమునుండి; వెడలఁగాన్= బయటికి రాగా; నా= నాయొక్క; మేనన్= శరీరమునందు.

**తాత్పర్యం:** అని అనగా సక్తుప్రస్థుడు తనవారితోపాటు విమానం ఎక్కి యముడు సాగనంపగా వెళ్ళిపోయాడు. జరిగిన దానినంతా నేను చూస్తున్నాను. కన్నంనుండి వెలుపలికి రాగా నా శరీరం మీద. (తరువాతి వచనంతో అన్వయం).

సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకంబునకుఁ బోవుట (సం. 14-93-83)

**వ. ఆ సక్తువు గంధంబును నతిథి పాద్యజల క్లేదంబునుం బొలసి సక్తుప్రస్థ కృతంబైన పరమధర్మంబు మహిమం జేసి మదీయ మస్తకంబును నొక్కపార్శ్వంబునుం గనకమయంబులయ్యెఁ; నాఁడు దొడంగి యేను దానవిధి స్థలంబులకును బుణ్యాశ్రమ భూములకును వివిధాధ్వర ప్రదేశంబులకుం జనుచుండుదుఁ; దక్కటి ప్రక్కపసిండి యగు ననుతలంపున నెన్ని చోట్లకుఁ బోయిననుం గాకుండు. లోకోత్తర చరితుం డజాతశత్రుం డశ్వమేధంబు సేయుచున్న వాఁ; డయ్యెడ నా కోర్కి సిద్ధించునని పెద్దయు నాసతో నరుగుదెంచితి; నించుక విశేషంబునుం గాన; వినుం; డది కారణంబుగా నయ్యుంఛవృత్తి విప్రుని ధర్మంబు (నకు) నీ యజ్ఞంబు వోలదంటి' నని పలికి యన్నకులంబు దా నెక్కడఁ బోవుటయు నెఱుంగకుండం బోయెఁ; 'బాండుకులపవిత్ర! యమ్ముఖంబునం గలిగిన యాశ్చర్యంబు తెఱం గెఱింగించితి; ననిన విని జనమేజయుండు. 252**

**ప్రతిపదార్థం:** ఆ సక్తువు= ఆ పేలపిండియొక్క; గంధంబును= సువాసనయూ; అతిథి= అతిథియొక్క; పాద్య= పాదాలు కడుగుటకు ఉపయోగించే; జల= నీటియొక్క; క్లేదంబునున్= తడియును; పొలసి= వ్యాపించి, అంటుకొని; సక్తుప్రస్థ= సక్తుప్రస్థుడిచేత; కృతంబు= చేయబడినది; ఐన= అయిన; పరమ= ఉత్తమమైన; ధర్మంబు= ధర్మంయొక్క; మహిమంబునన్+చేసి= మహిమవలన; మదీయ= నాయొక్క; మస్తకంబును= తలయూ; ఒక్క= ఒక; పార్శ్వంబునున్= ప్రక్కయూ; కనకమయంబులు= బంగారు వికారాలు; అయ్యెన్= అయ్యాయి; నాఁడు= ఆ రోజు; తొడంగి= మొదలుకొని; ఏను= నేను; దాన విధి= దాన కార్యాలు జరుగుతున్న; స్థలంబులకును= చోటులకు; పుణ్య= పవిత్రాలైన; ఆశ్రమ= మునుల ఆశ్రమాలయొక్క; భూములకును= ప్రదేశాలకు; వివిధ= అనేక విధాలైన; అధ్వర= యజ్ఞాలు జరుగుతున్న; ప్రదేశంబులకును= తావులకు; చనుచున్= వెళ్ళుతూ; ఉండుదున్= ఉంటాను; తక్కు= మిగిలిన, రెండవదైన; ప్రక్క= వైపు; పసిండి= బంగారం కలది; అగు+న్= ఔతుంది; అను= అనెడి; తలంపునన్= అభిప్రాయంతో; ఎన్నిచోట్లకున్= ఎన్నోచోట్లకు; పోయిననున్= పోయినప్పటికినీ; కాక= రెండవప్రక్క బంగారం కాకుండా; ఉండున్= ఉన్నది; లోకోత్తర= లోకమునందు శ్రేష్ఠమైన; చరితుండు= నడవడి కలవాడు; అజాతశత్రుండు= ధర్మరాజు; అశ్వమేధంబు= అశ్వమేధం; చేయుచున్నవాఁడు= చేస్తున్నాడు; ఆ+ఎడన్= అక్కడ; నా= నాయొక్క; కోర్కి= కోరిక; సిద్ధించున్= నెరవేరుతుంది; అని; పెద్దయున్= మిక్కిలి; ఆసతోన్= ఆశతో; అరుగుదెంచితిన్= వచ్చాను; ఇంచుక= కొంచెం కూడా; విశేషంబునున్= ఆధిక్యమును; కానన్= చూడను; వినుండు= వినండి; అది; కారణంబుగాన్= కారణంగా; ఆ+ఉంఛవృత్తి= పొలం మొదలైనచోట్ల రాలిన గింజలను ఏరుకొని తిని బ్రదుకుతున్న; విప్రుని= బ్రాహ్మణుడియొక్క; ధర్మంబు(నకున్)= ధర్మానికి; ఈ యజ్ఞంబు= ఈ యజ్ఞం; పోలదు= సాటికాదు; అంటిన్= అన్నాను; అని; పలికి= చెప్పి; ఆ నకులంబు= ఆ ముంగిస; తాన్=

తాను; ఎక్కడన్= ఎక్కడకు; పోవుటయున్= పోవాలో; ఎఱుంగక+ఉండన్= తెలియకుండా; పోయెన్= పోయింది; పాండు= పాండురాజుయొక్క; కుల= కులమునందు; పవిత్ర!= పవిత్రుడైనవాడా!; ఆ మఖంబునన్= ఆ యజ్ఞమునందు; కలిగిన= సంభవించిన; ఆశ్చర్యంబు= ఆశ్చర్యకరమైనదానియొక్క; తెఱంగు= సమాచారాన్ని; ఎఱింగించితిన్= తెలియజేశాను; అనినన్= అనగా; విని; జనమేజయుండు.

**తాత్పర్యం:** ఆ పేలపిండి సువాసన వ్యాపించి అతిథి కాళ్ళు కడిగిన నీటి తడి అంటుకొని సక్తుప్రస్థుడు చేసిన ధర్మము మహిమవలన నా తలా శరీరం ఒకవైపు బంగారం అయినవి. ఆనాటినుండి నేను దానకార్యాలు జరిగేచోట్లకూ పవిత్రములైన మున్యాశ్రమాలకూ, వివిధ యజ్ఞాలు చేసే ప్రదేశాలకూ వెళ్ళుతూ ఉన్నాను. రెండోవైపు బంగారం అవుతుందేమో అనే అభిప్రాయంతో ఎన్నో చోట్లకు వెళ్ళినప్పటికీ కానే కాలేదు. 'లోకంలో శ్రేష్ఠమైన నడవడిగల ధర్మరాజు అశ్వమేధయాగం చేస్తున్నాడు. అక్కడ నా కోరిక నెరవేరుతుందేమో అనే ఆశతో ఇక్కడకు వచ్చాను కాని, నాకేమీ విశేషం కనబడలేదు. అందుచేత పొలాలు మొదలైన చోట్ల రాలిన గింజలను ఏరుకొని తిని బ్రదుకుతున్న ఆ బ్రాహ్మణుడి ధర్మంతో ఈ యజ్ఞం సాటికాదు అని అన్నాను. ఈ విధంగా పలికి ఆ ముంగిస తాను ఎక్కడకు వెళ్ళేది ఎవ్వరికీ తెలియకుండా వెళ్ళిపోయింది. పాండురాజ కులపావనా! ఆ యజ్ఞంలో సంభవించిన ఆశ్చర్యకరమైన విషయం నీకు తెలియజేశాను అని వైశంపాయనుడు అనగా విని జనమేజయుడు.

**సీ.** **'జన్నంబునందు రాజన్యులుఁ దపమున । మునిజనంబులు శాంతి ననఘ! విప్రు**
**లాసక్తు లగుదు; రట్లగుటఁ గాదే పల్వు । రవనీశ్వరులు దొల్లి యాగకృతుల**
**నతులకీర్తులను సద్గతులను బడసిరి; । ధర్మనందనుఁ డత్యుదాత్త భంగిఁ**
**దొంటి భూనాథులకంటె సత్యముననను । శౌచముననను భక్తి శ్రద్ధ నీగి**

**తే.** **నతిశయిల్లె; వేదవ్యాసుఁ డాది గాఁగఁ । గలుగు నార్యజనుల చిత్తములకు నెక్క**
**నమరవల్లభు చంద మందముగఁ జేసె । నశ్వమేధంబు మెచ్చుల కాకరముగ.'** **253**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!, పుణ్యాత్మా!; రాజన్యులు= క్షత్రియవంశీయులు, రాజులు; జన్నంబు+అందున్= యజ్ఞంలో; మునిజనంబులు= మునులు; తపమునన్= తపస్సునందు; విప్రులు= బ్రాహ్మణులు; శాంతిన్= అంతరింద్రియ నిగ్రహంలో; ఆసక్తులు= ఆసక్తి కలవారు; అగుదురు= అవుతారు; అట్లు= ఆ విధంగా; అగుటన్= ఆసక్తి కలిగిఉండటంవలననే; కాదు+ఏ!= కదా!; తొల్లి= పూర్వం; పల్వురు= అనేకులు; అవనీ+ఈశ్వరులు= భూపతులు, రాజులు; యాగ= యజ్ఞములయొక్క; కృతులన్= చేయుటచేత; అతుల= సాటిలేని; కీర్తులను; సత్+గతులను= ఉత్తమ లోకాలను; పడసిరి= పొందారు; ధర్మ= యముడియొక్క; నందనుఁడు= కుమారుడు; అతి= మిక్కిలి; ఉదాత్త= గొప్పదైన; భంగిన్= విధంగా; తొంటి= పూర్వకాలమునందలి; భూనాథులకంటెన్= రాజుల కంటె; సత్యముననను= సత్యముచేత; శౌచముననను= అంతరంగ శుద్ధిచేత; భక్తిన్= భక్తిచేత; శ్రద్ధన్= శ్రద్ధచేత; ఈగిన్= దానంచేత; అతిశయిల్లెన్= అధికుడయ్యాడు; వేదవ్యాసుఁడు; ఆది+కాఁగన్= మొదలుగా; ఆర్యజనుల= పూజ్యులయొక్క, కర్మనిష్ఠులయొక్క; చిత్తములకున్= మనస్సులకు; ఎక్కన్= ఆనందం కలిగించగా; అమర= దేవతలయొక్క; వల్లభు= ప్రభువుయొక్క, దేవేంద్రుడియొక్క; చందము= లక్షణం, విధము; అందముగన్= ఒప్పగా; మెచ్చులకున్= మెప్పులకు; ఆకరముగన్= నిలయంగా; అశ్వమేధంబు= అశ్వమేధము; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! రాజులు యుద్ధంలో ప్రీతిగలవారు. మునులు తపస్సునందు ఆసక్తికలవారు. బ్రాహ్మణులు అంతరింద్రియ నిగ్రహంలో శ్రద్ధకలవారు. అందువలననే కదా పూర్వకాలంలో రాజులు అనేకులు యాగాలు చేసి అనుపమ కీర్తులనూ ఉత్తమలోకాలనూ పొందారు. ధర్మరాజు సత్యంవలన అంతరంగ శుద్ధివలన భక్తిశ్రద్ధవలన, దానక్రియలవలన పూర్వరాజుల కంటె అధికుడయ్యాడు. వేదవ్యాసాది కర్మనిష్ఠులు సంతోషించగా అందరూ మెచ్చుకొనేటట్లుగా దేవేంద్రుడు యాగాలు చేసిన రీతిగా అశ్వమేధం చేశాడు.

**వ. అట్టి పరమధర్మంబా నకులంబుచేత గర్హితం బగుటకుం గారణంబేమి? యని యడిగిన వైశంపాయనుండు ధర్మపుత్త్రు నధ్వరంబు నీ చెప్పిన యట్టిద యైనను నొక్కటి చెప్పెద; నవహితుండవగు; మన్నకులంబు హింసాత్మకంబైన పశు యజ్ఞంబుకంటె నహింసా మహితంబైన తపోయజ్ఞం బధికంబని చెప్పినయదియయ్యె; రిత్త చెప్పుటగాక తనశిరంబును శరీరార్ధంబును సువర్ణమయంబు లైన కతంబునుం బలికెం; । గాన దానివచనంబులు ద్రోపువడ; వేత ద్విషయం బైనది యొక్క యితిహాసంబు గల; దది యాకర్ణింపు' మని యమ్మనుజనాథున కిట్లనియె. 254**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; పరమ= ఉత్తమమైన; ధర్మంబు= ధర్మం; ఆ+నకులంబుచేతన్= ఆ ముంగిసచేత; గర్హితంబు= నిందించబడింది; అగుటకున్= అగుటకు; కారణంబు= కారణం; ఏమి; అని; అడిగినన్= అడుగగా; వైశంపాయనుండు; ఆ ధర్మపుత్త్రు= ఆ ధర్మరాజుయొక్క; అధ్వరంబు= యజ్ఞం; నీ చెప్పిన= నీవు చెప్పిన; అట్టిది+అ= అటువంటిదే; ఐనను= అయినప్పటికిని; ఒక్కటి= ఒకమాట; చెప్పెదన్= చెప్పుతాను; అవహితుండవు= అవధానం కలవాడవు, ఏమరుపాటు లేనివాడవు; అగుము; ఆ+నకులంబు= ఆ ముంగిస; హింసా+ఆత్మకంబు= హింసాస్వరూపమై; పశు= పశువధతో కూడిన; యజ్ఞంబు కంటెన్= యజ్ఞంకంటె; అహింసా= అహింసచేత; మహితంబు= గౌరవించబడినది, గొప్పది; ఐన= అయిన; తపస్+మయ= తపోరూపమైన; యజ్ఞంబు= యజ్ఞము; అధికంబు= ఎక్కువది; అని; చెప్పిన+అది= చెప్పినట్టిది; అయ్యెన్= అయింది; రిత్త= కారణంలేకుండా, వ్యర్థంగా; చెప్పుట= చెప్పటం; కాక= కాకుండా; తన= తనయొక్క; శిరంబును= తలయూ; శరీర= శరీరంయొక్క; అర్థంబును= సగభాగాన్ని; సువర్ణమయంబులు= బంగారు వికారములు; ఐన= అయిన; కతంబునున్= కారణమునూ; పలికెన్= చెప్పింది; కాన= కావున; దాని= ఆ ముంగిసయొక్క; వచనంబులు= మాటలు; త్రోపువడవు= త్రోసి వేయదగినవి కావు; ఏతద్= ఈ; విషయంబు= అంశానికి సంబంధించినది; ఐన+అది= అయినట్టిది; ఒక్క= ఒక; ఇతిహాసంబు= జరిగిన కథ; కలదు= ఉన్నది; అది= దానిని; ఆకర్ణింపుము= వినుము; అని; ఆ+మనుజనాథునకున్= మానవపతితో, రాజుతో, జనమేజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ ఉత్తమధర్మాన్ని ముంగిస ఆక్షేపించటానికి కారణమేమి? అని జనమేజయుడు అడిగాడు. వైశం పాయనుడు ఆ రాజుతో 'ధర్మనందనుని ఆ యజ్ఞం నీవు వర్ణించినటువంటిదే. కాని, ఒకమాట చెప్పుతాను సావధానంగా వినుము. ఆ ముంగిస పశుహింసారూపమైన యజ్ఞంకంటె అహింసారూపమైన యజ్ఞం గొప్పదని చెప్పింది. అది కారణం వివరించకుండా చెప్పలేదు. తన తల, శరీరంలోని సగభాగమూ బంగారం కావటానికి కారణం చెప్పింది కాబట్టి దాని మాటలు త్రోసివేయదగినవి కావు. దీనికి సంబంధించిన ఒక కథ ఉన్నది వినుము' అని ఈ విధంగా చెప్పాడు.

**సీ. 'అమరాధిపతి దొల్లి యాగంబు సేయంగఁ । దొడఁగ మహాముని స్తోమములును**
**సురసంఘములుఁ గూడి కురుముఖ్య! ఋత్విగ్గ । ణముల నేర్పఱిచి సొం పమర వేదిఁ**

గల్పించి తగ నగ్నికార్యంబు నడపంగ । నర్హులు పశు నిచయంబుఁ దేర
నమ్మునుల్ గనుఁగొని యధిక దయా ర్ద్రంబు । లగు చిత్తములతోడ నమ్మహేంద్రు

ఆ. నాననంబు చూచి 'యక్కట! హింస ధ । ర్మంబు గాదు; కృతయుగంబు సొచ్చె;
ననఘ! వత్సరత్రయము ప్రాంతగిలిన బీ । జంబు లిపుడు యజన సాధనములు. 255

**ప్రతిపదార్థం:** కురు= కురువంశంలో; ముఖ్య= అగ్రగణీ!; అమర= దేవతలయొక్క; అధిపతి= ప్రభువు, ఇంద్రుడు; తొల్లి= పూర్వం; యాగంబు= యజ్ఞం; చేయంగన్= చేయగా; తొడఁగన్= పూనుకొనగా; మహత్= గొప్ప; ముని= మునులయొక్క; స్తోమములును= సమూహాలును; సుర= దేవతలయొక్క; సంఘములున్= సమూహాలును; కూడి; ఋత్విక్= యజ్ఞం చేయించువారియొక్క; గణములన్= సమూహాలను; ఏర్పఱిచి= నియమించి; సొంపు= అందం; అమరన్= కలుగగా; వేదిన్= యజ్ఞవేదిని; కల్పించి= నిర్మించి; తగన్= శాస్త్రోక్తంగా; అగ్నికార్యంబు= హోమం; నడపంగన్= చేయించగా; అర్హులు= యోగ్యులైన వారు; పశు= జంతువులయొక్క; నిచయంబున్= సమూహమును; తేరన్= తీసికొనిరాగా; ఆ+మునుల్= ఆ మునులు; కనుఁగొని= చూచి; అధిక= మిక్కిలి; దయా= దయచేత; ఆర్ద్రంబులు= కరగినవి; అగు= అయిన; చిత్తములతోడన్= మనస్సులతో; ఆ మహేంద్రు= దేవేంద్రుడియొక్క; ఆననంబు= ముఖం; చూచి; అక్కట!= అయ్యో!; హింస; ధర్మంబు= ధర్మం; కాదు; కృతయుగంబు= ధర్మం నాలుగు పాదాలతో నడచునట్టి కృతయుగం; చొచ్చెన్= ప్రవేశించింది; అనఘ!= పుణ్యాత్మా!; ఇపుడు= ఇప్పుడు; వత్సరత్రయము= మూడేళ్ళు; ప్రాఁతగిలిన= ప్రాతవడిన; బీజములు= విత్తనాలు; యజన= యజ్ఞముయొక్క; సాధనములు= ద్రవ్యములు, పదార్థములు.

**తాత్పర్యం:** కురువంశాగ్రణీ! పూర్వం దేవేంద్రుడు యజ్ఞం చేయటానికి పూనుకొన్నాడు. అప్పుడు మునులూ, దేవతలూ కూడి ముందు ఋత్విక్కులను నియమించారు. సుందరమైన యజ్ఞవేదిని నిర్మించారు. శాస్త్రోక్తంగా హోమం చేయటానికి తగినవారు వెళ్ళి జంతువులను కొని తెచ్చారు. వాటిని చూచి మునుల మనస్సులు కరగినవి. వారు ఇంద్రుడి ముఖాన్ని సూటిగా చూచి 'అయ్యో! పుణ్యాత్మా! హింస ధర్మం కాదు. కృతయుగం ప్రవేశించింది. కావున ఇపుడు మూడేళ్ళు నిలువ ఉన్న విత్తనాలే యజ్ఞద్రవ్యాలు.

క. వేదోదిత ప్రకారం । బాదర మెసఁగఁగ నడపు; మది యుత్తమ ధ
ర్మోదయము సేయు నీకు; ద । యాదృష్టిం జూడు పశుగణార్తి మహాత్మా! 256

**ప్రతిపదార్థం:** మహా+ఆత్మా= గొప్ప మనస్సు కలవాడా!; ఆదరము= ప్రేమ; ఎసఁగంగన్= అతిశయించగా; వేద= వేదాలచేత; ఉదిత= చెప్పబడిన; ప్రకారంబు= విధానం; నడపుము= ప్రవర్తిల్లజేయుము; అది; నీకున్= నీకు; ఉత్తమ= ఉత్తమమైన; ధర్మ= ధర్మంయొక్క; ఉదయము= వృద్ధిని; చేయున్= చేస్తుంది; దయా= దయతో కూడిన; దృష్టిన్= చూపుతో; పశు= జంతువులయొక్క; గణ= సమూహంయొక్క; ఆర్తిన్= దుఃఖాన్ని; చూడుము.

**తాత్పర్యం:** మహాత్మా! వేదోక్త ప్రకారంగా ప్రేమతో హోమం చేయుము. అది నీకు ధర్మాభివృద్ధిని చేకూరుస్తుంది. కరుణా కటాక్ష వీక్షణాలతో జంతువుల దుఃఖాన్ని చూడుము.

ఆ. అనిన వారిమాట లాదరింపక యుండె । వాసవుండు; దాన వాదు పుట్టె
నమ్మునీశ్వరులకు నతనికి; సురసంఘ । మతనిఁ గూడ వాద మతిశయిల్లె. 257

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; వాసవుండు= ఇంద్రుడు; వారి= మునులయొక్క; మాటలు; ఆదరింపక= లక్ష్యపెట్టక; ఉండెన్= ఉన్నాడు; దానన్= దానిచేత, ఆ నిరాదరణంచేత; ఆ ముని+ఈశ్వరులకున్= ఆ ముని శ్రేష్ఠులకు; అతనికిన్= ఇంద్రుడికి; వాదు= వివాదం; పుట్టెన్= కలిగింది; సుర= దేవతలయొక్క; సంఘము= సమూహం; అతనిన్= ఇంద్రుడిని; కూడన్= కలియగా; వాదము= వివాదం; అతిశయిల్లెన్= పెరిగింది.

**తాత్పర్యం:** ఇంద్రుడు మునిపతులమాటలు లెక్కచేయలేదు. దానివలన వారికీ ఇంద్రుడికీ వివాదం కలిగింది. దేవతలు ఇంద్రుడి కొమ్ము కాచారు. అందువలన వివాదం ఇంకా ఎక్కువ అయింది.

**వ. అట్టియెడం గర్మకాండ విదుండగు నుపరిచరవసువు సన్నిహితుం డగుటయు, నయ్యిరుదెఱంగులవారును నారాజన్యుని సాక్షిగాఁ గోరిన నతండు పక్షపాతంబునఁ బశువిశసనంబు కర్తవ్యం బని పలికి యధః పాతంబు ప్రాపించెం; గావున హింసారహితంబయిన యజనంబు పూజనీయంబగుటకు సంశయింప వలవ; దట్లుం గాక. 258**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; కర్మకాండ= వేదమునందలి యజ్ఞ సంబంధమైన భాగం; విదుండు= తెలిపినవాడు; అగుఅయిన; ఉపరిచరవసువు; సన్నిహితుండు= సమీపించినవాడు; అగుటయున్= కాగా; ఆ+ఇరు+తెఱంగుల+వారును= ఆ రెండు పక్షాలవారూ; ఆ రాజన్యుని= ఆ రాజును; సాక్షి+కాన్= నిర్ణయించేవాడినిగా; కోరినన్= కోరగా; అతండు= అతడు; దేవతా= దేవతలయొక్క; పక్షపాతంబునన్= పక్షమునందలి అభిమానంచేత; పశు= జంతువులయొక్క; విశసనంబు= సంహారం; కర్తవ్యంబు= చేయదగింది; అని; పలికి; అథస్+పాతంబు= అధోగతి; ప్రాపించెన్= పొందాడు; కావునన్= కావున; హింసా= హింస; రహితంబు= లేనిది; అయిన; యజనంబు= యజ్ఞం; పూజనీయంబు= పూజించదగింది; అగుటకున్= అగుటకు; సంశయించవలవదు= అనుమానించవలదు; అట్లున్+కాక= అంతే కాకుండా.

**తాత్పర్యం:** ఆ సమయాన వేదంలో యజ్ఞసంబంధమైన భాగం తెలిసిన ఉపరిచర వసువు అక్కడకు వచ్చాడు. అప్పుడు ఆ రెండు పక్షాలవారూ ఆ రాజును నిర్ణయించుమని కోరారు. అతడు దేవతా పక్షమునందలి అభిమానంచేత జంతువధ చేయదగినదే అని చెప్పాడు. అందువలన అతడికి అధోగతి కలిగింది. కాబట్టి హింస లేని యజ్ఞం మన్నించదగింది. ఇందులో అనుమానించవలసిన దేమీ లేదు. అంతే కాకుండా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. ఉంఛవృత్తియైన యుర్వీసురోత్తముం। డట్లు ప్రాణరక్షకై ఘటించి**
**స్వజనములును దాను భుజియింపనుండి యా। సక్తు నతిథి కిచ్చెఁ; జనదె పొగడ.' 259**

**ప్రతిపదార్థం:** ఉంఛవృత్తి= క్షేత్రాదులలో రాలిన గింజలను ఏరుకొని తినటమే జీవికగా కలిగినవాడు; ఐన= అయిన; ఉర్వీసుర= బ్రాహ్మణులయందు; ఉత్తముండు= ఉత్తముడు; అట్లు= ఆ విధంగా; ప్రాణ= ప్రాణాలయొక్క; రక్షకై= రక్షణకై; ఘటించి= కూర్చుకొని; స్వజనములును= తన వారును; తాను; భుజియింపన్= తినగా; ఉండి= సిద్ధంగా ఉండి; ఆ సక్తున్= పేలపిండిని; అతిథికిన్= అతిథికి; ఇచ్చెన్= సమర్పించాడు; పొగడన్= పొగడగా; చనదు+ఎ?= తగదా?

**తాత్పర్యం:** ఉంఛవృత్తి అయిన బ్రాహ్మణోత్తముడు ప్రాణరక్షణార్థం సమకూర్చుకొని తానూ తనవారూ తినటానికి సిద్ధంగా ఉన్న ఆ పేలపిండిని అతిథికి సమర్పించాడు. ఇది పొగడదగదా? పొగడదగినదే అని అర్థం.'

**వ. అనిన విని జనమేజయుం 'డిది యట్టిద; మునీంద్రా! నీ వచనంబుల కొడంబడితి; ధర్మమార్గగతంబైన ద్రవ్యం బింత భవ్యంబు గదే; యవ్వస్తువు దానంబునకుం బ్రధానం బగుట యింకనుం బ్రస్ఫుటంబుగాఁ బ్రకీర్తింపు' మనవుడు నా సంయమి యవ్వాసవ పౌత్త్ర పౌత్త్రు నాలోకించి యిట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; జనమేజయుండు; ఇది= మీరు చెప్పిన సక్తుప్రస్థుడి త్యాగం; అట్టిది+అ= పొగడదగినదే; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; నీ= నీయొక్క; వచనంబులకున్= మాటలకు; ఒడంబడితిన్= ఒప్పుకొంటున్నాను; ధర్మమార్గ= ధర్మమార్గంచేత; గతంబు= ప్రాప్తించింది; ఐన= అయిన; ద్రవ్యంబు= పదార్థము; ఇంత= ఇంతగా; భవ్యంబు= శుకరం; కద+ఏ!= కదా!; ఆ+వస్తువు= ఆ వస్తువు; దానంబునకున్= దానానికి; ప్రధానంబు= ప్రశస్తం; అగుట; ఇంకను= మరియును; ప్రస్ఫుటంబు+కాన్= విస్పష్టంగా; ప్రకీర్తింపుము= వివరింపుము; అనవుడున్= అని అనగా; ఆ+సంయమి= ఆ ముని వైశంపాయనుడు; ఆ+వాసవ= ఆ ఇంద్రుడియొక్క; పౌత్త్ర= పుత్రుడి కుమారుడియొక్క (మనుమడు); పౌత్త్రున్= పుత్త్రుడి కుమారుడిని, మనుమడిని, జనమేజయుడిని; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడు చెప్పిన మాటలు విని జనమేజయుడు 'మునీంద్రా! సక్తుప్రస్థుడి త్యాగం కొనియాడదగినదే. మీ మాటలకు ఒప్పుకొంటాను. ధర్మమార్గంచేత ప్రాప్తించిన పదార్థం శుభకరం కదా! ఆ వస్తువు దానానికి ప్రశస్తం కావటం ఇంకా విస్పష్టంగా వివరించుము' అని అన్నాడు. ఆ తరువాత వైశంపాయనుడు జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** అవ్వాసవ పౌత్త్ర పౌత్త్రున్-ఇంద్రుడి పుత్త్రుడు అర్జునుడు. అర్జునుడి పుత్త్రుడు అభిమన్యుడు కావున ఇంద్రుడికి అభిమన్యుడు పౌత్త్రుడు. అభిమన్యుడి పుత్త్రుడు పరీక్షిత్తు. పరీక్షిత్తు పుత్త్రుడు జనమేజయుడు. కావున జనమేజయుడు అభిమన్యుడికి పౌత్త్రుడు. ఇంద్రుడికి పౌత్త్రుడి పౌత్త్రుడు.

అగస్త్య మహాముని ద్వాదశ వార్షిక యజ్ఞ ప్రభావము (సం.14-95-4)

**సీ. 'ఇవ్విషయంబున నెందుఁ బ్రసిద్ధతం। బరఁగెడు నట్టిది ధరణినాథ!**
**వినుతేతిహాసంబు వినుము చెప్పెద; నగ। స్త్యుండు పండ్రెండేండ్లు సువ్రతాభి**
**రతిఁ జేయు మహితాధ్వరమునకు దివ్యాను। భావంబు గలయట్టి పరమమునులు**
**వేడ్క ఋత్విజులయి వెలయ నిజప్రౌఢి। నఖిల తంత్రంబులు నాచరింప;**

**తే. నా సమయమున వర్షింపఁ డయ్యె నింద్రుఁ। డోషధులు వికలత్వంబు నొందె; దానిఁ**
**జూచి యత్తపోధను 'లగస్త్యునకు నన్న। దానవిధు లెట్లు చెల్లునో తగు విధమున. 261**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= భూనాథా!, రాజా!; ఈ విషయంబునన్= ఈ విషయంలో; ఎందున్= అంతటా; ప్రసిద్ధతన్= ప్రఖ్యాతితో; పరఁగెడు= ఒప్పెడు; అట్టి+అది= అటువంటిది; వినుత= కొనియాడబడిన; ఇతిహాసంబు= జరిగిన కథ; వినుము; చెప్పెదన్= చెప్పుతాను; అగస్త్యుండు; సువ్రత= ఉత్తమ నియమమునందలి; అభిరతిన్= ఆసక్తితో; పండ్రెండు; ఏండ్లు= ఏళ్లు; చేయు= చేసే; మహిత= పూజించబడిన, గొప్పదైన; అధ్వరమునకున్= యజ్ఞానికి; దివ్య= దేవతాసంబంధమైన; అనుభావంబు= మహిమ; కల+అట్టి= కలిగినట్టి; పరమమునులు= మహర్షులు; వేడ్కన్= సంతోషంతో; ఋత్విజులు= యజ్ఞం చేయించేవారు; అయి;

వెలయన్= పొగడ్త కెక్కగా; నిజ= తమయొక్క; ప్రౌఢిన్= కార్యసామర్థ్యంతో; అఖిల= సమస్తమైన; తంత్రంబులు= ఏర్పాటులు; ఆచరింపన్= చేయగా; ఇంద్రుఁడు= ఇంద్రుడు; ఆ సమయమునన్= అప్పుడు; వర్షింపఁడు+అయ్యెన్= వానలు కురిపించని వాడాయెను; ఓషధులు= ఫలించిన వెంటనే నశించే వరి మొదలైనవి; వికలత్వంబున్= వినాశాన్ని; ఒందెన్= పొందాయి; ఆ+తపస్+ధనులు= ఆ తపస్సే ధనంగా కలవారు; దానిన్= ఆ దుస్స్థితిని; చూచి; అగస్త్యునకున్= అగస్త్యుడికి; అన్నదాన= అన్న దానంయొక్క; విధులు= కర్తవ్యాలు; అగు= తగిన; విధమునన్= విధంగా; ఎట్లు= ఏ రీతిగా; చెల్లును+ఓ?= సాధ్యమగునో?

**తాత్పర్యం:** రాజా! ఈ విషయంలో లోకంలో ప్రసిద్ధికెక్కిన ఒక కథ నీకు చెప్పుతాను వినుము. అగస్త్యుడు నియమనిష్ఠలతో పన్నెండేళ్ళు ఒక గొప్ప యజ్ఞం చేయటానికి నిశ్చయించాడు. దివ్య మహిమ గల మహర్షులు ఆ యజ్ఞానికి ఋత్విజులై సమర్థంగా అన్ని ఏర్పాట్లు చేశారు. కాని, అప్పుడు ఇంద్రుడు వర్షాలు కురిపించలేదు. వరి మొదలైనవన్నీ చెడిపోయాయి. ఆ దుస్స్థితిని చూచి ఆ మహర్షులు 'శాస్త్రోక్తంగా అన్నదానాన్ని అగస్త్యుడు ఎట్లా చేస్తాడో?

**వ. ఇతండు ద్వాదశవార్షికం బైన దీక్షా విశేషంబు నొందినవాఁడు; ధర్మమార్గాగతం బయిన ద్రవ్యంబు దక్కనొండు వినియోగింపండు; వానయుం గురియ; దని ముచ్చిరి తమలోఁ బలుకు పలుకులు ప్రతాపదీపితుం డగు నక్కుంభసంభవుం డాలించి వారలతో నిట్లనియె. 262**

**ప్రతిపదార్థం:** ఇతండు= ఈ మహాత్ముడు; ద్వాదశ వార్షికంబు= పన్నెండేళ్ళకు సంబంధించినది; ఐన= అయిన; దీక్షావిశేషంబున్= మహాయజ్ఞ దీక్షను; ఒందినవాఁడు= పూనినవాడు; ధర్మమార్గ= ధర్మమార్గంచేత; ఆగతంబు= వచ్చింది, ప్రాప్తించింది; అయిన; ద్రవ్యంబు= పదార్థం; తక్కన్= తప్ప; ఒండు= మరియొకటి; వినియోగింపండు= ఉపయోగించడు; వానయున్= వానకూడా; కురియదు= కురియలేదు; అని; ముచ్చిరి= విచారించి; తమలోన్= వారిలోవారు; పలుకు= అనుకొనుచున్న; పలుకులు= మాటలు; ప్రతాప= శక్తిచేత; దీపితుండు= ప్రకాశింపజేయబడినవాడు; అగు= అయిన; ఆ కుంభ= ఆ కుండయందు; సంభవుండు= పుట్టినవాడు - అగస్త్యుడు; ఆలించి= ఆలకించి; వారలతోన్= వారితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ మహాత్ముడు పన్నెండేళ్ళ యజ్ఞదీక్ష వహించాడు. ధర్మమార్గంచేత ప్రాప్తించిన పదార్థాన్ని తప్ప మరొక దానిని ఉపయోగించడు. వానలూ పడటంలేదు' అని విచారించారు. వారు తమలో తాము అనుకొనే మాటలు శక్తిశాలి అయిన అగస్త్యుడు విని వారితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'న్యాయము గల్గి యధ్వరమునందు విఘాతము పుట్టకుండఁ దాఁ**
**దోయదకోటిఁ బన్చి హరి తుష్టిగ వృష్టి యొనర్పకున్న నే**
**నా యమరేంద్రతం గొని మహాద్భుత వృత్తి జగంబుఁ బ్రోచెదన్;**
**మీయెదఁ జింత దక్కుఁడు సమిద్ధతపఃపరులార! నా దెసన్. 263**

**ప్రతిపదార్థం:** సమిద్ధ= అప్రతిహతమైన; తపస్= తపస్సునందు; పరులు+ఆర!= ఆసక్తి కలిగిన మునులార!; హరి= ఇంద్రుడు; తాన్= తాను; న్యాయము= ధర్మం; కల్గి= కలిగి; అధ్వరము+అందున్= యజ్ఞమునందు; విఘాతము= విఘ్నం; పుట్టక+ఉండన్= కలుగకుండ; తోయద= మేఘాలయొక్క; కోటిన్= సమూహాన్ని; పన్చి= పంపించి; తుష్టి+కన్= తృప్తిగా; వృష్టి+ఒనర్పక= వాన కురిపించక; ఉన్నన్= ఉంటే; నేను; అమరేంద్రతన్= ఆ దేవేంద్రత్వమును; కొని= స్వీకరించి; మహా+అద్భుత= ఆశ్చర్యం కలిగించే; వృత్తిన్= వ్యాపారంతో; జగంబున్= లోకాన్ని; ప్రోచెదన్= కాపాడుతాను; నాదెసన్= నా విషయంలో; మీ= మీయొక్క; ఎదన్= హృదయాలలో; (ఇట ఎద జాత్యేకవచనము;) చింతన్= విచారమును; తక్కుఁడు= వదలండి.

**తాత్పర్యం:** 'అప్రతిహత తపఃపరులారా! దేవేంద్రుడు ధర్మబుద్ధిఅయి యజ్ఞానికి విఘ్నం కలుగకుండా మేఘాలను పంపి నెలకు మూడు వానలు నిండుగా కురిపిస్తాడా సరేసరి. లేదా నేనే ఆ దేవేంద్రత్వాన్ని స్వీకరించి లోకాన్ని కాపాడుతాను. మీరు నా విషయంలో నిర్విచారంగా ఉండండి.

**క. కాదేనిఁ ద్రిజగముల బహు। ళోదార ద్రవ్యకోటు లున్న యునికి మీ**
**పాదముల పరిసరమునకుఁ। దే దొరఁకొను; నశ్రమమునఁ దెచ్చెద వానిన్. 264**

**ప్రతిపదార్థం:** కాదు+ఏనిన్= అట్లా కాకపోతే; త్రిజగములన్= మూడు లోకాలలో; బహుళ= అధికమైన; ఉదార= గొప్పదైన; ద్రవ్య= పదార్థాలయొక్క; కోటులు= సమూహాలును; ఉన్న+ఉనికిన్= ఉన్నవి ఉన్నట్లే; మీ= మీయొక్క; పాదములపరిసరమునకున్= కాళ్ళదగ్గరకు; తేన్= తీసికొనగా; దొరఁకొనున్= లభిస్తుంది; వానిన్= వాటిని; అశ్రమమునన్= సునాయాసంగా; తెచ్చెదన్= తెస్తాను.

**తాత్పర్యం:** ఆ విధంగా కాకపోతే మూడు లోకాలలో యజ్ఞద్రవ్యాలు కోటానకోట్లు ఉన్నవి కదా! వాటిని ఉన్నవి ఉన్నట్లే మీ కాళ్ళదగ్గర సునాయాసంగా తెచ్చి పడవేస్తాను.

**తే. అంత చేయంగవలయునే యన్న ననఘు। లార! యుత్తర కురుభూము లారఁ బండి**
**యున్నయవి; యాగ కాలోచితాన్నమునకు। వలయు ధాన్యముల్ తలఁపున వచ్చు నిందు.' 265**

**ప్రతిపదార్థం:** అంత= అంతపెద్దపని; చేయంగన్+వలయున్+ఏ= చేయవలయునా; అన్నన్= అని మీరు అంటే; అనఘులు+ఆర!= పుణ్యాత్ములారా!; ఉత్తర కురు భూములు= ఉత్తర కురుదేశంలోని భూములు; ఆరన్= పరిపూర్ణంగా; పండి; ఉన్న+అవి= ఉన్నవి; యాగకాల= యజ్ఞసమయానికి; ఉచిత= తగిన; అన్నమునకున్= అన్నం కొరకు; వలయు= కావలసిన; ధాన్యముల్= ధాన్యాలు; తలఁపునన్= తలచిన వెంటనే; ఇందున్= ఇక్కడకు; వచ్చున్= చేరుతాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్ములారా! అంతపెద్దపని చేయాలా? అని మీరు అన్నట్లయితే ఉత్తర కురుభూములలో పంటలు చక్కగా పండాయి. యాగకాలంలో అన్నప్రదానం చేయటానికి కావలసిన ధాన్యాలు తలచినవెంటనే ఇక్కడకు చేరుతాయి.'

**వ. అని పలికి వెండియు. 266**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా (ఇట్లా అన్నాడు.)

**క. 'ఆ జాలియేల? నిర్మల। బీజహవిస్తంత్ర మేను బ్రీతి నొనర్పం**
**గా జగతి వఱపునం జెడు। నే? జన్నము విఘ్నపడునె? యేటికి వగవన్.' 267**

**ప్రతిపదార్థం:** ఆ జాలి= ఆ విచారం, బాధ; ఏల?= ఎందుకు?; ఏను= నేను; నిర్మల= స్వచ్ఛమైన; బీజ= బీజాలు అను; హవిస్= హోమద్రవ్యాలతో కూడిన; తంత్రము= హోమం; ప్రీతిన్= సంతోషంతో; ఒనర్పఁగాన్= చేయుగా; జగతి= లోకం; వఱపునన్= అనావృష్టిచేత; చెడున్+ఏ?= చెడునా?; జన్నము= యజ్ఞం; విఘ్నపడును+ఎ= విఘ్నం కలది అగునా?; వగవన్= విచారించగా; ఏటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** 'ఆ బాధ ఎందుకు? నేను సంతోషంగా మంచి విత్తనాలతో యజ్ఞంచేస్తే లోకం అనావృష్టిచే చెడుతుందా? యజ్ఞానికి ఆటంకం కలుగుతుందా? విచారించనేల?'

**సీ.** **అన విని 'నీవు ధర్మాగతి సంసిద్ధ। వస్తుదాయిని; నిరవద్య తపము**
**వ్యయముగా నీ కేల వాసవుపై కిన్క? నఖిల జగద్ధన మాహరించి**
**కొననేల? యుత్తర కురుభూములందలి। ధాన్యంబు లేల? సన్మాన్యబీజ**
**హుతములందు ఫలేచ్ఛ యోజింప నేల? మా। కై యిన్ని దెఱఁగులయందుఁ బాఱె**

**తే.** **నీదు చిత్తంబు; దీని వినిశ్చయముగఁ। జేసి సుఖి వగు; మేము మా చేసినట్టి**
**సుకృతములఁ దెచ్చికొందుము సులభములుగ। వలయు నాహారములు; లోకవందనీయ!'** **268**

**ప్రతిపదార్థం:** లోక= లోకాలచేత; వందనీయ= నమస్కరించదగినవాడా!; అనన్= అనగా; విని; నీవు; ధర్మ+ఆగతి= ధర్మ ప్రాప్తిచేత; సంసిద్ధ= ఆమోదించబడిన; వస్తు= వస్తువులను; దాయిని= ఇచ్చేవాడవు; నీకున్= నీకు; వాసవుపైన్= ఇంద్రుడిమీద; కిన్కన్= కోపంచేత; నిరవద్య= దోషంలేని; తపము; వ్యయము+కాన్= వ్యయంకావటం; ఏల?= ఎందుకు?; అఖిల= సమస్తమైన; జగత్= లోకాలయొక్క; ధనము= ధనమును; ఆహరించికొనన్= తీసికొనగా; ఏల?= ఎందుకు?; ఉత్తర కురుభూములు+అందున్+అలి= ఉత్తర కురుభూములలోని; ధాన్యంబులు= ధాన్యాలు; ఏల?= ఎందుకు?; సత్= సజ్జనులచేత; మాన్య= గౌరవించదగిన; బీజ= బీజాలు; హుతములు+అందున్= హోమద్రవ్యాలలో; ఫల= ఫలమునందలి; ఇచ్ఛన్= కోరికను గూర్చి; యోజింపన్+ఏల?= ఆలోచించటం ఎందుకు?; మాకున్+ఐ= మా కొరకు; ఇన్ని; తెఱఁగుల+అందున్= దారులందు; నీదు చిత్తంబు= నీ మనస్సు; పాఱెన్= పోయింది; దీనిన్= ఈ యజ్ఞాన్ని; వినిశ్చయము+కన్= నిశ్చయించినట్లు తప్పక; చేసి; సుఖివి= సుఖం కలవాడవు; అగుము; ఏము= మేము; చేసిన; అట్టి; సుకృతములన్= పుణ్యాలచేత; వలయు= కావలసిన; ఆహారములు; సులభములుగన్= సులభంగా; తెచ్చికొందుము= తెచ్చికొంటాము.

**తాత్పర్యం:** అగస్త్యుడు ఈ విధంగా అనగా విని మునులు 'లోకనందనీయా! నీవు ధర్మబద్ధంగా ప్రాప్తించిన వస్తువులు ఇచ్చేవాడవు. ఇంద్రుడిమీద కోపంచేత నీ నిష్కళంకమైన తపస్సు వ్యయం కావటం దేనికి? లోకాలన్నిటిలో ఉన్న ధనం తీసికొనటం ఎందుకు? ఉత్తర కురుభూములలోని ధాన్యాలెందుకు? మంచి విత్తనాలతో ఫలం కోరి యజ్ఞం చేయటం ఎందుకు? మా కొరకు నీ మనస్సు ఇన్ని దారులు త్రొక్కింది. ఈ యజ్ఞాన్ని అనుకొన్నట్లు చేసి సుఖంగా ఉండుము. మేము చేసిన పుణ్యాలవలన మాకు కావలసిన ఆహార పదార్థాలను మేము తెచ్చుకొంటాము.'

**మ.** **అని సల్లాపము సేయుచుండఁగ ననేకాంభోదజాలంబులన్**
**బనిచెం బెల్లుగ వర్షముల్ గురియఁగాఁ బర్జన్యుఁ డా ప్రొద్ద; తా**
**నును నాచార్యుఁ బురస్కరించికొని నన్నుం గావవే యంచు న**
**మ్మునిశార్దూలునిఁ గానవచ్చె వినయంబున్ భక్తియుం దోఁపఁగన్.** **269**

**ప్రతిపదార్థం:** అని; సల్లాపము= సంభాషణం; చేయుచున్= చేస్తూ; ఉండఁగన్= ఉండగా; ఆ ప్రొద్దు+అ= అప్పటికప్పుడే; పర్జన్యుఁడు= ఇంద్రుడు; అనేక= పెక్కులైన; అంభోద= మేఘాలయొక్క; జాలంబులన్= గుంపులను; పెల్లు+కన్= ఎక్కువగా; వర్షముల్= వర్షాలు; కురియఁగాన్= కురియగా; పనిచెన్= పంపాడు; తానును= తానుకూడా; ఆచార్యున్= గురువును, బృహస్పతిని; పురస్కరించికొని= ముందుంచుకొని; వినయంబున్= వినయమూ; భక్తియున్= భక్తియూ; తోఁపఁగన్= వెల్లడి కాగా; నన్నున్= నన్ను; కావవే= రక్షింపవే; అంచున్= అంటూ; ఆ ముని శార్దూలునిన్= ఆ మునులలో శ్రేష్ఠుడిని; కానన్= దర్శించగా; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అని మునులు మాటాడుతుండగా ఆ సమయంలోనే ఇంద్రుడు జోరున వానలు కురియటానికి మేఘాలను పంపాడు. అంతే కాకుండా తన గురువును బృహస్పతిని ముందుంచుకొని వినయమూ భక్తీ వెల్లడి ఔతుండగా తాను కూడా అగస్త్యుడిని దర్శించటానికి వచ్చాడు.

**ఉ. వచ్చిన గారవించి, యనవద్యపు టర్చన లిచ్చి సంయముల్**
**మెచ్చఁగ శాంతసద్వచనలీలఁ బ్రమోద మొనర్చి యాతనిం**
**బుచ్చె సురేజ్యయుక్తముగఁ బోఁడిగఁ గ్రమ్మఱ వేల్పువీటి కా**
**సచ్చరితుండు; లోకమును సంతస మందె; వెలింగె జన్నమున్. 270**

**ప్రతిపదార్థం:** ఆ+సత్= ఆ ఉత్తమమైన; చరితుండు= నడవడిగలవాడు, అగస్త్యుడు; వచ్చినన్= ఇంద్రుడు రాగా; గారవించి= గౌరవించి; అనవద్యము= దోషం దొరలని; అర్చనలు+ఇచ్చి= పూజలు చేసి; సంయముల్= మునులు; మెచ్చఁగన్= మెచ్చుకొనగా; శాంత= నెమ్మదితో కూడిన; సత్+వచన= మంచిమాటలయొక్క; లీలన్= సొగసుతో; ప్రమోదము= సంతోషం; ఒనర్చి= కలిగించి; పోఁడిగన్= తగిన విధంగా; క్రమ్మఱన్= మరల; అతనిన్= ఆ ఇంద్రుడిని; సుర= దేవతలయొక్క; ఇజ్య= గురువుతో, బృహస్పతితో; యుక్తముగన్= కూడి ఉండేటట్లుగా; వేల్పు= దేవతలయొక్క; వీటికిన్= పట్టణానికి, అమరావతికి; పుచ్చెన్= పంపాడు; లోకమును= లోకంకూడా; సంతసము+అందెన్= సంతోషించింది; జన్నమున్= యజ్ఞమూ; వెలింగెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** ఇంద్రుడు రాగా అగస్త్యుడు గౌరవించి, శాస్త్రోక్తంగా పూజించి నెమ్మదితో మంచిమాటలు చెప్పి అలరించి, అతడిని బృహస్పతితోపాటు మరలా అమరావతికి తగినవిధంగా పంపాడు. ఇది చూచి మునులు మెచ్చుకొన్నారు. లోకమూ సంతోషించింది. యజ్ఞమూ శోభిల్లింది.

**తే. క్రతు సమాప్తి సమయమున నతఁడు వినయ । భరితుఁడై యోగ్యభంగి నప్పరమ మునుల**
**కర్చ లిచ్చి యామంత్రణ మాచరింప । వారుఁ బ్రీతి నేఁగిరి నిజావాసములకు. 271**

**ప్రతిపదార్థం:** అతండు= అగస్త్యుడు; క్రతు= యజ్ఞంయొక్క; సమాప్తి= ముగింపుయొక్క; సమయమునన్= కాలంలో; వినయ= వినయంచేత; భరితుఁడు+ఐ= నిండినవాడై; ఆ పరమ మునులకున్= ఆ మహర్షులకు; యోగ్య= తగిన; భంగిన్= విధంగా; అర్చలు+ఇచ్చి= పూజలుచేసి; ఆమంత్రణము= వీడ్కోలు; ఆచరింపన్= చేయగా; వారున్= వారూ; ప్రీతిన్= ఆనందంతో; నిజ= తమయొక్క; ఆవాసములకున్= నివాసాలకు; ఏఁగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** యజ్ఞం ముగిసినప్పుడు అగస్త్యుడు వినయపరిపూర్ణుడై ఆ మహర్షులకు తగినవిధంగా పూజలుచేసి వీడ్కోలుపగా వారు తమ తమ నివాసాలకు వెళ్ళారు.

జమదగ్ని మహాముని పితృదేవతల శాపంబున నకులం బై పుట్టిన కథ (సం.14-96-1)

**వ. ఇవ్విధంబున హింసారహితంబుగా మహిత యాగంబు సుప్రయోగంబు చేసి యగస్త్యుండు పరమ ప్రశస్తి నుజ్జ్వలుఁ డయి వెలింగెం; గావున ధర్మమార్గాగత ద్రవ్యకృతంబై తపోమయం బగు యజ్ఞంబు ప్రాజ్ఞజన మనోజ్ఞంబై వెలయు' నని చెప్పిన విని జనమేజయుం డిట్లనియె. 272**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; హింసా= హింస; రహితంబు+కాన్= లేనట్లుగా; మహిత యాగంబు= గొప్ప యజ్ఞం; సుప్రయోగంబు= సదనుష్ఠానం కలదిగా; చేసి; అగస్త్యుండు; పరమ= మిక్కిలి; ప్రశస్తిన్= పొగడ్తతో; ఉజ్జ్వలుండు= పెంపొందేవాడు; అయి; వెలింగెన్= ప్రకాశించాడు; కావునన్= కాబట్టి; ధర్మమార్గ= ధర్మమార్గంచేత; ఆగత= ప్రాప్తించిన; ద్రవ్య= పదార్థాలచేత; కృతంబు+ఐ= చేయబడినదై; తపస్+మయంబు= తపోరూపం; అగు= అయిన; యజ్ఞంబు= యజ్ఞం; ప్రాజ్ఞజన= విద్వాంసులకు; మనోజ్ఞంబు+ఐ= మనోహరమై; వెలయున్= ప్రసిద్ధికెక్కుతుంది; అని; చెప్పినన్= చెప్పగా; విని; జనమేజయుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా హింస లేకుండా సదనుష్ఠానం కలదిగా మహాయజ్ఞం చేసి మిక్కిలి పొగడ్తలు పొంది అగస్త్యుడు ప్రకాశించాడు. ధర్మమార్గాన ప్రాప్తించిన ద్రవ్యాలతో చేసే తపోరూపయజ్ఞం విద్వాంసులకు మనోహరమై ప్రసిద్ధి కెక్కుతుంది' అని వైశంపాయనుడు చెప్పగా విని, జనమేజయుడు ఈ విధంగా పలికాడు.

**తే.** **'అనఘ! నకులరూపంబున నట్లు దోఁచి। బ్రాహ్మణులతోడ మానవ భాషణముల**
**నెవ్వఁడేనియు నొక్క యహీన బోధ। ఘనుఁడు సల్లాప మొనరించె నని తలంచి.** **273**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్మా!; ఎవ్వఁడు+ఏనియున్= ఎవ్వడో; ఒక్క= ఒకానొక; అహీన= హీనంకాని, అత్యధికమైన; బోధ= జ్ఞానంచేత; ఘనుఁడు= గొప్పవాడు; అట్లు= ఆవిధంగా; నకుల= ముంగిస; రూపంబునన్= రూపంతో; తోఁచి= కనబడి; బ్రాహ్మణులతోడన్= బ్రాహ్మణులతో; మానవ= మనుష్యులయొక్క; భాషణములన్= మాటలతో; సల్లాపము= సంభాషణం; ఒనరించెన్= చేశాడు; అని; తలంచి= ఊహించి.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఎవ్వడో ఒక మహాజ్ఞాని ఆ విధంగా ముంగిసరూపంతో సాక్షాత్కరించి బ్రాహ్మణులతో మనుష్యవాక్కులతో మాటాడి యుండవచ్చునని యూహించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **ఆతఁ డెవ్వఁడో? యని నిన్ను నడుగఁ జూచి। వెండియును బ్రస్తుతోక్తుల విందు మను మ**
**నంబుతో నూరకుండితి; నాకు నతనిఁ। జెప్పఁ దగు నేని బోధనశీల! చెపుము!'** **274**

**ప్రతిపదార్థం:** బోధన= బోధించుటయే; శీల!= శీలంగా కలవాడా!; అతఁడు= ఆ మహాజ్ఞాని; ఎవ్వఁడు+ఓ= ఎవ్వడో; అని; నిన్నున్= నిన్ను; అడుగన్= అడుగగా; చూచి= తలచియూ; వెండియును= మరియును; ప్రస్తుత= ముందు సందర్భమునుబట్టి వచ్చిన; ఉక్తులన్= మాటలను; విందుము= విందాము; అను; మనంబుతోన్= మనస్సుతో; ఊరక+ఉండితిన్= ఊరకున్నాడు; అతనిన్= అతడిని గూర్చి; చెప్పన్+తగున్+ఏనిన్= చెప్పదగినచో; నాకున్= నాకు; చెపుము+అ!= చెప్పుమా!

**తాత్పర్యం:** బోధనశీలా! అత డెవ్వడో నిన్ను అడగాలని అనుకొన్నప్పటికీ ముందు సందర్భముననుసరించి వచ్చినమాటలు వినవలెననే మనస్సుతో నేను ఊరకున్నాను. అతడిని గూర్చి చెప్పటానికి వీలుంటే నాకు చెప్పండి.

**క.** **అనుటయు వైశంపాయనుఁ। 'డనూన పుణ్య ప్రదీప్తుఁ డగు నీ కెందున్**
**వినఁ దగని యదియుఁ గలదే! వినిపించెద ముంగి విధము విను తెలియంగన్.** **275**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; వైశంపాయనుఁడు; న+ఊన= తక్కువకాని,అధికమైన; పుణ్య= పుణ్యంచేత; ప్రదీప్తుఁడు= ప్రకాశింపజేయబడినవాడవు; అగు= అయిన; నీకున్= నీకు; ఎందున్= ఏ విషయంలోనైనా; వినన్= వినగా; తగని= తగని;

అదియున్= అదికూడా; కలదు+ఏ?= ఉన్నదా?; ముంగి= ముంగిసయొక్క; విధము= వృత్తాంతం; తెలియంగన్= తెలిసేటట్లుగా; వినిపించెదన్= వినిపిస్తాను; విను= వినుము.

**తాత్పర్యం:** అనగా వైశంపాయనుడు 'నీవు మహాపుణ్యంచేత ప్రకాశిస్తున్నావు. ఏ విషయమైనా నీకు తెలియకుడదనిదంటూ ఒకటి ఉన్నదా! నీకు తెలిసేటట్లుగా ముంగిస వృత్తాంతం వినిపిస్తాను వినుము.

**సీ. జమదగ్ని పితృకార్య సంకల్ప మత్యంత । నియతాత్ముఁడై చేసె; నిష్ఠ యొప్పఁ**
**జారు నూతన కలశంబున హోమ ధే । నువుఁ దాన పిదికి గారవముతోడ**
**నిమ్మైనయెడఁ బదిలమ్ముగా డించిన । నతని చిత్తము తెఱం గరయు బుద్ధి**
**సాకారవృత్తిఁ గ్రోధాధిదైవము వచ్చి । ప్రామాదికం బను భంగి దోఁపఁ**

**ఆ. గుండతోడిపాలు గూల్చినఁ గినియక । యూరకుండె నా సముజ్జ్వలాత్ముఁ;**
**డప్పు డాత్మ మెచ్చి యద్దైవ మతనికి । నిట్టు లనియెఁ గురుమహీశవర్య! 276**

**ప్రతిపదార్థం:** కురు= కురువంశీయులైన; మహి+ఈశ= రాజులలో; వర్య!= శ్రేష్ఠుడా!; జమదగ్ని; అత్యంత= మిక్కిలి; నియత= నిగ్రహించబడిన; ఆత్ముండు+ఐ= మనస్సు కలవాడై; పితృకార్య= శ్రాద్ధం చేయవలయుననే; సంకల్పంబు= ఆలోచన; చేసెన్= చేశారు; నిష్ఠ= శ్రద్ధ; ఒప్పన్= ఒప్పగా; తాన్+అ= తానే; చారు= అందమైన; నూతన= క్రొత్తది అయిన; కలశంబునన్= కుండలో; హోమ= యజ్ఞానికి ఉపయోగించు; ధేనువున్= ఆవును; పిదికి; గారవముతోడన్= ప్రేమతో; ఇమ్ము+ఐన= అనుకూలమైన; ఎడన్= చోటునందు; పదిలమ్ము+కాన్= జాగరూకతతో; డించినన్= చేర్పగా, ఉంచగా; అతని= అతడియొక్క; చిత్తము= మనస్సు; తెఱంగు= తీరు; అరయు= పరీక్షించే; బుద్ధిన్= తలపుతో; సాకార= ఆకారంతో కూడిన; వృత్తిన్= వ్యాపారంతో; క్రోధ= క్రోధమునకు; అధిదైవము= అధిష్ఠానం. (క్రోధభూతము అని అర్థం); వచ్చి; ప్రామాదికంబు= పొరపాటున జరిగింది; అగు= అయిన; భంగి= విధం; తోఁపన్= చూపట్టగా; కుండతోడన్+పాలున్= కుండతోపాటు పాలను, పాలకుండను; కూల్చినన్= పడద్రోయగా; ఆ సముజ్జ్వల= ఆ పాపరహితమైన; ఆత్ముఁడు= ఆత్మకలవాడు, జమదగ్ని; కినియక= కోపించక; ఊరకుండెన్= ఊరకున్నాడు; ఆ దైవము= ఆ క్రోధభూతం; అప్పుడు; ఆత్మన్= మనస్సులో; మెచ్చి= మెచ్చుకొని; అతనికిన్= జమదగ్నితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నారు.

**తాత్పర్యం:** జమదగ్ని నిగ్రహచిత్తుడై శ్రాద్ధం చేయ సంకల్పించాడు. నిష్ఠతో అందమైన క్రొత్త కుండలో హోమధేనువు పాలు పిండి అనుకూల ప్రదేశంలో దానిని జాగరూకతతో ఉంచాడు. అతడి మనస్సు పరీక్షించాలని క్రోధభూతం నిశ్చయించింది. అది ఆకారం ధరించి వచ్చి చూచినవారు పొరపాటున జరిగిందని అనుకొనేటట్లుగా పాలకుండను పడద్రోసింది. పుణ్యాత్ముడైన జమదగ్ని చూచికూడా కోపించలేదు. అప్పుడు ఆ భూతం మనస్సులో మెచ్చుకొని అతడితో ఇట్లా అన్నది.

**క. భృగువులు క్రోధను లనఁగా । జగతిఁ బరఁగు వాద; మది మృషాపరికలితం**
**బగుట దెలిసె; నోడితి నీ; । కగణిత మగు నీ తపమున కలికెద ననఘా! 277**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; భృగువులు= భృగుమహర్షి సంతతివారు; క్రోధనులు= క్రోధస్వభావులు; అనఁగాన్= అనగా; వాదము= వదంతి; జగతిన్= లోకంలో; పరఁగున్= వ్యాపించి ఉన్నది; అది= ఆ వదంతి; మృషా= అసత్యంతో, పరికలితంబు=

కూడింది; అగుట; తెలిసెన్= తెలిసింది; నీకున్= నీకు; ఓడితిని= ఓడిపోయాను; అగణితము= ఇంతా అంతా అని లెక్కించబడనిది; అగు= అయిన; నీ= నీ యొక్క; తపమునకున్= తపస్సునకు; అలికెదన్= భయపడతాను.

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! భృగు సంతతివారికి ముక్కుమీద కోపం ఉంటుందనే వదంతి లోకంలో వ్యాపించి ఉన్నది. అది అసత్య మని నేడు తెలిసింది. నీకు ఓడిపోయాను మితీమేరా లేని నీ తపస్సుకు నేను భయపడతాను.'

**వ. అని వెండియు. 278**

**తాత్పర్యం:** అని ఇంకా ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'నా దెసఁ బ్రసన్నుఁడవు గ; । మ్మాదరమునఁ జూడు; సైఁపు మపరాధము; వి**
**ద్యాదయిత!' యనిన నమ్ముని । యా దైవముఁ జూచి శాంతి యలవడ నెమ్మిన్. 279**

**ప్రతిపదార్థం:** విద్యాదయిత!= విద్యానాథా!; నా దెసన్= నా యెడ; ప్రసన్నుఁడవు= దయగలవాడవు అగుము; ఆదరమునన్= ప్రేమతో; చూడుము; అపరాధము= తప్పు; సైఁపుము= సహింపుము; అనినన్= అనగా; ఆ ముని= ఆ జమదగ్ని; ఆ దైవమున్= ఆ దయ్యమును, భూతమును; శాంతి; అలవడన్= అబ్బగా; నెమ్మిన్= ప్రేమతో; చూచి.

**తాత్పర్యం:** 'విద్యానాథా! నా యందు దయ చూపుము. నన్ను ప్రేమతో చూడుము. నా తప్పు సహింపుము' అనగా జమదగ్ని శాంతమూర్తి అయి ఆ భూతాన్ని ప్రేమతో చూచి.

**వ. నా యెడ నిప్పుడు. 280**

**తాత్పర్యం:** నా విషయం ఇప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. నీ వేమి తప్పు సేసితి? । త్రోవుము శంకాభయంబు తొలఁగఁగ; సంక**
**ల్పావిలతకు నలుగుట పితృ । దేవతలకుఁ గలుగుఁ; బొమ్ము దిగ్గన' ననుడున్. 281**

**ప్రతిపదార్థం:** నీవు; ఏమి తప్పు= ఏ తప్పు; చేసితి?(వి)= చేశావు?; శంకా= అనుమానంవలన కలిగిన; భయంబు= భయం; తొలఁగఁగన్= తొలగిపోగా; త్రోవుము= త్రోసివేయుము; సంకల్ప= శ్రాద్ధం చేయవలయునను నా సంకల్పముయొక్క; ఆవిలతకున్= నష్టానికి, భగ్నమునకు; పితృదేవతలకున్= పితృదేవతలకు; అలుగుట= కోపించటం; కలుగున్= సంభవిస్తుంది; దిగ్గనన్= శీఘ్రంగా; పొమ్ము= వెళ్ళిపొమ్ము; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** 'నీవు నా యెడ ఏ తప్పు చేశావు? అనుమానంవలన చేశాననే నీ కేమయినా భయం కలిగితే దానిని త్రోసివేయుము. శ్రాద్ధ సంకల్పము భగ్నమవటంచేత పితృదేవతలు నన్ను కోపిస్తారు. నీవు శీఘ్రంగా వెళ్ళిరమ్ము' అనగా.(తరువాతి వచనంతో అన్వయం)

**వ. భీతి నా భూతం బంతర్ధానంబు చేసెం; దదనంతరంబ యాజమదగ్నిం బితృదేవతలు కోపించి పొడసూపి యతనితో 'నీవు శ్రాద్ధంబునకు సంకల్పించి యుండి తద్వైకల్యంబు పుట్టిన నూరకుండి' తని పలికి 'ముంగి వయి పుట్టు' మని శపించిన నతండు వారలకు దండప్రణామంబు చేసి 'తపస్వికి నలుగం దగదని యపరాధంబు గనియునుం గ్రోధాధిదైవంబునకు నలుగనైతి. 282**

**ప్రతిపదార్థం:** భీతిన్= భయంతో; ఆ భూతంబు= ఆ భూతం; అంతర్ధానంబు చేసెన్= అదృశ్యమయింది; తద్= ఆ; అనంతరంబు+అ= తరువాత; ఆ జమదగ్నిన్= ఆ జమదగ్నిని; పితృదేవతలు; కోపించి= కోపగించుకొని; పొడసూపి= సాక్షాత్కరించి; అతనితోన్= అతడితో; నీవు; శ్రాద్ధంబునకున్= శ్రాద్ధానికి; సంకల్పించి+ఉండి= నిశ్చయించి ఉండి; తద్= దానియొక్క; వైకల్యంబు= లోపం; పుట్టినన్= పుట్టగా; ఊరకుండితి (వి)= ఊరకున్నావు; అని; పలికి; ముంగివి= ముంగిసవు; అయి; పుట్టుము; అని; శపించినన్= శపించగా; అతండు= అతడు, జమదగ్ని; వారలకున్= పితృదేవతలకు; దండప్రణామంబు= తప్పు; కనియునున్= చూచికూడా; క్రోధ= క్రోధమును; అధిదైవంబునకున్= అధిష్ఠించి ఉండే దేవతకు; అలుగన్+ఐతిన్= కోపింపనయ్యాను.

**తాత్పర్యం:** ఆ భూతం భయంతో అదృశ్యమైనది. తరువాత పితృదేవతలు జమదగ్నిపై కోపంపూని సాక్షాత్కరించి అతడితో 'నీవు శ్రాద్ధం చేయాలని తలంచి దానికి లోపం కలిగినా ఊరకున్నావు' అని అన్నారు. 'ముంగిసవయి పుట్టుము' అని శపించారు. అప్పుడు వారికి జమదగ్ని సాష్టాంగ నమస్కారం చేసి 'తపస్సు చేసేవారికి కోపగించటం తగదని తలచి తప్పు కనబడుతున్నప్పటికి క్రోధభూతాన్ని కోపించ లేదు.

**ఆ. తప్పు సైఁచి నన్ను దయఁ జూచి శాపమో। క్షము ననుగ్రహింపుఁ డమితతేజు**
**లార!' యని వినీతిలంపటుం డగుచుఁ బ్రా। ర్థించుటయును వారు తెలివి నొంది. 283**

**ప్రతిపదార్థం:** అమిత= మితిలేని; తేజులార!= తేజస్సు కల దేవతలారా!; తప్పు; సైఁచి= సహించి; నన్నున్= నన్ను; దయన్= దయతో; చూచి; శాప= శాపంవలన; మోక్షమున్= విముక్తిని; అనుగ్రహింపుఁడు= ప్రసాదించండి; అని; వినీతి= వినయంతో; లంపటుండు= అత్యాసక్తి కలవాడు; అగుచున్= ఔతూ; ప్రార్థించుటయున్= ప్రార్థించగా; వారు= ఆ పితృదేవతలు; తెలివిన్= ప్రసన్నతను; ఒంది= పొంది.

**తాత్పర్యం:** అమిత తేజస్వులారా! నా తప్పు సహించి నన్ను దయతో చూచి శాపవిముక్తిని ప్రసాదించండి' అని వినయ సంపన్నుడయి ప్రార్థించాడు. అంతట పితృదేవతలు ప్రసన్నులై. (తరువాతి వచనంతో అన్వయం)

**వ. 'విదగ్ధ విప్రసమూహం బొడంబడునట్టి యుచిత వాక్యంబుల నీ వెన్నఁడేని మహాధర్మంబు కీడని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు' నని నిర్దేశించి; రన్నకులంబును సక్తుప్రస్థుని కతంబునం దగిన మాటల నా తెఱంగున సదస్యులతో ధర్మనందను నశ్వమేధంబు నధిక్షేపించి విగత శాపత్వానందంబు నొంది యంతర్హితంబయ్యె' నని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు పాండవాగ్రజు నశ్వమేధంబు విధంబు విస్తార ప్రస్తవనీయంబుగా వివరించుటయు. 284**

**ప్రతిపదార్థం:** విదగ్ధ= పండితులైన; విప్ర= బ్రాహ్మణులయొక్క; సమూహంబు= సమూహం; ఒడంబడు+అట్టి= ఒప్పుకొనునట్టి; ఉచిత= తగిన; వాక్యంబులన్= మాటలచేత; నీవు; ఎన్నఁడు+ఏనిన్= ఏనాడైనా; మహత్= గొప్పది ఐన; ధర్మంబు= ధర్మం; కీడు= తక్కువది; అని; ఆడితి(వి)= పలికి నిరూపిస్తావో; నాఁడు= ఆ నాడు; నీకున్= నీకు; శాప= శాపంవలన; మోక్షంబు= విముక్తి; అగును= అవుతుంది; అని; నిర్దేశించిరి= నిర్ణయించి చెప్పారు; ఆ నకులంబును= ఆ ముంగిసకూడా; సక్తుప్రస్థుని= సక్తుప్రస్థుడియొక్క కతంబునన్= కారణంచేత; తగిన; మాటలన్= మాటలచేత; ఆ తెఱంగునన్= ఆ విధంగా; సదస్యులతోన్= ఋత్విజులతో; ధర్మనందను= ధర్మరాజుయొక్క; అశ్వమేధంబున్= అశ్వమేధమును; అధిక్షేపించి= ఆక్షేపించి; విగత= తొలగిపోయిన; శాపత్వ= శాపావస్థచేత కలిగిన; ఆనందంబున్= ఆనందమును; ఒంది= పొంది; అంతర్హితంబు+అయ్యెన్= అదృశ్యమయింది; అని; ఇట్లు= ఈ విధంగా; జనమేజయునకున్= జనమేజయుడికి; వైశంపాయనుండు; పాండవ+అగ్రజు= పాండవులలో పెద్దవాడు

ధర్మరాజు; అశ్వమేధంబు= అశ్వమేధం; విధంబు= వృత్తాంతం; విస్తారంబుగాన్= సవిశేషంగా; ప్రస్తవనీయంబుగాన్= మిక్కిలి కొనియాడదగినట్లుగా; వివరించుటయున్= విపులంగా చెప్పగా.

**తాత్పర్యం:** 'ఏనాడు నీవు పండితులైన బ్రాహ్మణులు ఒప్పుకొనేటట్లుగా మహాధర్మమును అధమధర్మంగా నిరూపిస్తావో ఆనాడే నీకు శాపవిముక్తి అవుతుంది' అని నిర్ణయించి చెప్పారు. ఆ ముంగిస ఆ విధంగా సదస్యులతో సక్తుప్రస్థుడి కథ చెప్పి తగిన మాటలతో ధర్మరాజు అశ్వమేధయాగాన్ని ఆక్షేపించి శాపవిముక్తి గాంచి ఆనందిస్తూ అదృశ్యమైనది' అని ఈ విధంగా వైశంపాయనుడు జనమేజయుడికి ధర్మరాజాశ్వమేధ వృత్తాంతాన్ని సవిశేషంగా పొగడదగినట్లుగా చెప్పగా. (తరువాతి ఆశ్రమవాసపర్వ ప్రథమాశ్వాస ప్రారంభముతో అన్వయం).

**శా.** **భక్తి స్మేర మునీంద్ర చిత్తకమల ప్రస్ఫీత సౌరభ్య సం**
**యుక్తారూఢ తర ప్రకాశ తనురూపోల్లాస! రాగాది ని**
**ర్ముక్తై కాంతి జనైకతా రసిక! చిన్ముద్రాసదోన్నిద్ర! ధీ**
**శక్తిస్వైర విహారదూరలసితా! సద్భావనోన్మీలితా!** **285**

**ప్రతిపదార్థం:** భక్తి= భక్తి అనే ప్రకాశించే; స్మేర= వికసించిన; మునీంద్ర= మునీశ్వరులయొక్క; చిత్త= మనస్సులు అనే; కమల= పద్మములయొక్క; ప్రస్ఫీత= మిక్కిలి విస్తారమైన; సౌరభ్య= జ్ఞానం అనే పరిమళంతో; సంయుక్త= కూడియున్న; ఆరూఢతర= మిక్కిలి ప్రసిద్ధమైన; ప్రకాశ= ప్రకాశమైన; తనురూప= దేహరూపంతో; ఉల్లాస= వెలిగేవాడా!; రాగ= రాగం; ఆది= మొదలైన అంతశ్శత్రువులనుండి; నిర్ముక్త= విడుదల పొందిన; ఏకాంతిజన= ఏకాగ్ర చిత్తులతోడ; ఏకతా= ఐక్యంతో; రసికా= ఆనందించేవాడా!; చిత్+ముద్రా= చిన్ముద్రయందు (చూపుడువ్రేలు, బొటనవ్రేలు కలయుట చిన్ముద్ర. అది జీవాత్మ పరమాత్మ భేదం లేనివారు అని చెప్పటానికి గుర్తు); సదా= ఎల్లప్పుడునూ; ఉన్నిద్ర= మేల్కొని ఉండేవాడా!; ధీశక్తి= బుద్ధి శక్తియొక్క; స్వైర విహార= స్వేచ్ఛా విహారానికి; దూర= దూరంగా; లసితా!= క్రీడించేవాడా!; సత్= ఉత్తమమైన; భావనా= సంస్కార విశేషంచేత; ఉన్మీలితా!= గోచరించేవాడా!

**తాత్పర్యం:** భక్తి ప్రకాశంచేత వికసించిన మునీశ్వరుల చిత్త పద్మాల జ్ఞాన పరిమళంచేత కూడిన తేజోమయ శరీర రూపంచేత వెలిగేవాడా! రాగద్వేషాదులనుండి విముక్తి గాంచిన ఏకాగ్రచిత్తులతో ఏకమై ఆనందించేవాడా! చిన్ముద్రయందు ఎల్లప్పుడూ జాగరూకుడవై యుండేవాడా! స్వేచ్ఛావిహారం చేసే బుద్ధికి దూరంగా ఉండేవాడా! ఉత్తమమైన సంస్కార విశేషంచేత గోచరించేవాడా!

**క.** **అజరామర పదకర పద। భజనా! సంసార జలధి పారీణస్తో**
**తృజనా! స్వమూర్తి వైదిక। యజనా! పాశ్చాత్యనాడి కార్ద్రవ్యజనా!** **286**

**ప్రతిపదార్థం:** అజరా= వార్ధక్యం; అమర= మృత్యువులేని; పద= స్థానమును, మోక్షమును; కర= కలిగించే; పదభజనా!= పాదసేవ కలవాడా! (హరిహరనాథుడి పాదభక్తి మోక్షాన్ని ప్రసాదించేదని అర్థం); సంసార= సంసారమనే; జలధి= సముద్రమును; పారీణ= దాటునట్టి; స్తోతృజనా!= సంస్తుతిచేసే జనులు కలవాడా!; స్వమూర్తి= ఆత్మరూపమైన; వైదిక= వేదములచేత విధించబడిన; యజనా!= యజ్ఞాలు కలవాడా!; పాశ్చాత్యనాడికా= సుషుమ్న అనెడి నాడియే; ఆర్ద్ర= చల్లనైన; వ్యజనా!= వీవనగా కలవాడా!

**తాత్పర్యం:** జరామృత్యువులు అంటని మోక్షమును ప్రసాదించే పాదారాధనం కలవాడా! సంసార సాగరమును తరించిన వారే వందిమాగధులుగా కలవాడా! వేదాలు కర్తవ్యాలుగా విధించేయజ్ఞాల స్వరూపమైనవాడా!; సుషుమ్న అనే నాడియే చల్లని వీవనగా కలవాడా!

**మాలిని:**

**త్రియుగ కమల వీథీ దీప్త సంచార లీలా!**
**నియమిత పవనాత్మాగ్ని ప్రభాస్నిగ్ధ సంగా!**
**స్మయ వికచ మహాబ్జ స్వైర మాధ్వీక ధారో**
**దయమయ మధురాత్మా! దర్శితానందవర్త్మా ! 287**

**ప్రతిపదార్థం:** త్రియుగ= మూడు జంటలు అయిన (ఆరు); కమల= పద్మాల; వీథీ= వీథియందు; దీప్త= ప్రకాశిస్తున్న; సంచార= గమనంయొక్క; లీలా!= విలాసం కలవాడా!; నియమిత= నియమించబడిన; పవన= వాయువుచేత (ప్రాణాయామముచేత అని అర్థం); ఆత్మ+అగ్ని= జీవజ్యోతియొక్క; ప్రభా= కాంతితో; స్నిగ్ధ= స్థిరమైన; సంగా!= సమావేశం కలవాడా!; స్మయ= ఆశ్చర్యకరంగా; వికచ= వికసించిన; మహా= గొప్పది అయిన; అబ్జ= కమలమునందు; స్వైర= స్వేచ్ఛగా స్రవించే; మాధ్వీక ధార!= అమృతధారయొక్క; ఉదయమయ= ప్రాదుర్భావ రూపమైన; మధుర= మధురమైన; ఆత్మ= ఆత్మ కలవాడా!; దర్శిత= యోగాదులచేత చూపబడిన; ఆనందవర్త్మా!= ఆనందమార్గం కలవాడా!

**తాత్పర్యం:** షట్కమల వీథిలో సంచరించే విలాసం కలవాడా! ప్రాణాయామంచేత ప్రాప్తించే సుస్థిర జీవాత్మ సాంగత్యం కలవాడా! అద్భుతంగా వికసించిన సహస్రారకమలంనుండి స్రవించే అమృతధారయే స్వరూపంగా కలవాడా! యోగాదులు నిరూపించిన ఆనందమార్గం కలవాడా!

**విశేషం:** పాశ్చాత్య నాడికా. (286) త్రియుగకమలవీథి. (287) ఈ రెండు పద్యాలలో తిక్కన మహాదార్శనికుడు కావున కుండలినీ యోగమును గూర్చి చెప్పాడు. సంగ్రహంగా ఈ యోగమును గూర్చి ఇట్లా చెప్పవచ్చును.

బ్రహ్మాండమంతా దివ్యశక్తితో నిండిఉన్నది. ఆ శక్తియే పిండాండం (శరీరం) నందు కూడా కలదు. శరీరంలోని ఈ శక్తిని అనుభవమునకు తెచ్చికొని మానవుడు మోక్షం పొందవచ్చునని యోగదర్శనం వెల్లడిస్తున్నది. ఆగమములు ప్రకటిస్తున్నవి. ఈ ఆగమములకే తంత్రము లని పేరు. ఈ తంత్రములు సాధనలో ఉపాయాలను బోధిస్తాయి. వేదములు కర్మం ఉపాసనం జ్ఞానం అనే వాటి రూపాలను బోధిస్తాయి. ఇక తంత్రములో వాటి సాధనోపాయాలను వెల్లడిస్తాయి. వాటిలో కుండలినీయోగం ఒకటి. కుండలిని అనేదే శక్తికి పేరు. ఇదియే ప్రాణశక్తి, చైతన్యం.

శరీరంలో ప్రధానాలైన నాడీ స్థానాలు ఏడున్నాయి. వీటిని శాస్త్రం చక్రములనీ, పద్మములనీ పేర్కొంటున్నది. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞ అనే ఆరు చక్రాలూ లేక కమలాలూ శరీరంలో ఉన్నవి. వీటినే తిక్కన 'త్రియుగ కమల' (3X2) అని పేర్కొన్నాడు.

మూలాధార కమలమునకు స్థానం గుదము (ముడ్డి). స్వాధిష్ఠానం లింగమున, మణిపూరం నాభియందు, అనాహతం హృదయమున, విశుద్ధం కంఠమున, ఆజ్ఞ కనుబొమల నడుమ ఉంటాయి.

శరీరమునందు ఒక ముఖ్యమైన నాడి ఉన్నది. ఇది శరీరానికి వెనుక ఉన్న బ్రహ్మదండం అనే వెన్నెముక నడుమగా మూలాధారం నుండి బ్రహ్మరంధ్రం వరకూ వ్యాపించి ఉంటుంది. దీనికి సుషుమ్న అని పేరు. దీనినే వైష్ణవి బ్రహ్మనాడి అని అంటారు. తిక్కన దీనిని పశ్చిమ నాడి (శల్య, ఆశ్వా1. పద్య. 404), పాశ్చాత్యనాడి ఒక (చూడు. 285 పద్య.) అని అన్నాడు. ఇది తామరతూడు దారంవలె ఉంటుంది.

మూలాధారంలో పాము చుట్టచుట్టుకొని నిద్రించి ఉన్నట్లు కుండలినీ శక్తి ఉంటుంది. సాధకుడు ప్రాణాయామం మొదలగు వాటిచేత కుండలినీ శక్తిని మేల్కొల్పి ఆరు కమలాలను క్రమంగా భేదించి సుషుమ్న ద్వారాన సహస్రారానికి చేరుస్తాడు. సహస్రారమందు చంద్రమండలం కురిసే అమృతమును గ్రోలి బ్రహ్మనంద మనుభవిస్తాడు. అతడికి అపూర్వశక్తులు కలుగుతాయి.

ఈ సాధన క్రమమును తిక్కన ఆశ్వాసాంత పద్యాలలో వర్ణించాడు. షట్కమలములను ఛేదించి క్రమంగా సాధకుడు కుండలిని అనే ప్రాణశక్తి సహస్రారానికి చేర్చును కదా! ఈ క్రమమును తిక్కన నిచ్చెన ఎక్కుటతో పోల్చి 'భరిత వికస నాంతః పద్మ నిశ్రేణికా సంచరణ' అని వర్ణించాడు. (శల్య. ఆశ్వా. 2. పద్య. 422)

సహస్రారకమలంలో పరమేశ్వరుడు ఉంటాడని తంత్రములు చెప్పుతున్నాయి. యోగి ప్రాణశక్తిని ఆ పరమేశ్వరుడితో చేరుస్తాడని గ్రహించాలి. జీవశక్తి పరమేశ్వర సంయోగమునే తిక్కన 'నియమిత పవనాత్మాగ్ని ప్రభా స్నిగ్ధసంగా' అని అన్నాడు. సహస్రారకమలములో చంద్రమండలమునుండి స్రవించే అమృతము పరమేశ్వరుడి రూపమే. కావున పరమేశ్వరుడు అమృతధారా స్వరూపుడు. దీనినే తిక్కన 'స్మయవికచ మహాబ్జ' అనే సమాసంలో పేర్కొన్నాడు.

మూలధారంలో ఉన్న చైతన్యశక్తి షట్చక్రములను ఛేదించి సహస్రారం చేరటానికి సుషుమ్నానాడియే ద్వారం లేక మార్గం కావున హరిహరనాథుడిని 'పశ్చిమనాడీ సరణ' (శల్య అశ్వా1. పద్య 404) 'పాశ్చాత్యనాడి కార్ద్ర వ్యజనా' (చూడు. 286) అని తిక్కన వర్ణించాడు. చైతన్య శక్తి మూలాధారంనుండి సహస్రారానికి పోవటానికి ప్రాణాయమం మున్నగునవి సాధనములు. యోగులు వాయువు బంధించి ప్రాణాయామాదులు చేస్తారు. వాయువునకు సంబంధించింది కావటంచేత తిక్కన సుషుమ్నా నాడిని హరిహరనాథుడికి చల్లని విసనకర్రవలె (ఆర్ద్రవ్యజనా!) వర్ణించాడు.

మూలాధారంనుండి పరావాక్కు బయలుదేరుతుందని శాబ్దికులంటారు. దీనిని తెలిసికొన్న తిక్కన 'లలిత చతుర్దళాఢ్య కమల' (ద్రోణ. ఆశ్వా. 2. ప. 381) అనే సమాసంలో హరిహరనాథుడిని 'నాలుగు దళాలతో ఒప్పారుతున్న వాక్సౌరభ ప్రసారంలో ఉన్నవాడా!' అని సంబోధించాడు.

సాధకుడు కుండలినీశక్తిని మేల్కొల్పి సహస్రారానికి చేరుస్తాడనీ అచట ఉన్న చంద్రమండలం నుండి జాలువారే అమృతమును గ్రోలి ఆనందించుననీ చెప్పితిమి కదా! ఈ విషయాన్నే తిక్కన 'క్రమోద్యన్మరుదుపగమలీలా మథ్యమానేందు బిక్షాక్షర దమృత వికారోత్సారణానంద రూపా' అని హరిహరనాథుడిని స్తుతించాడు. (శల్య.ఆశ్వా2. పద్య. 422). క్రమముగా పైకి లేస్తున్న ప్రాణమును పొందటంచేత చంద్రబింబంనుండి స్రవించే అమృతరూపమున పైకెగసే ఆనంద స్వరూపా' అని దీని అర్థం.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున నశ్వమేధ పర్వంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; శ్రీమత్= ప్రసిద్ధికెక్కిన; ఉభయ కవి= సంస్కృతాంధ్ర భాషాకవుల; మిత్ర= మిత్రుడును; కొమ్మన= కొమ్మన అనే; అమాత్య= మంత్రియొక్క; పుత్ర= కుమారుడును; బుధ= విద్వాంసులయొక్క; ఆరాధన= పూజచేత;

విరాజి= ప్రకాశించేవాడును అయిన; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కనచేత; ప్రణీతంబు+ఐన= రచించబడినదైన; శ్రీమహాభారతంబునన్= శ్రీమహాభారతంలో; అశ్వమేధపర్వంబు+అందున్= అశ్వమేధపర్వంలో; సర్వంబును= సమస్తమును; చతుర్థ= నాలుగవ; ఆశ్వాసము= ఆశ్వాసం.

**తాత్పర్యం:** కీర్తికలవాడూ, సంస్కృతాంధ్రభాషా కవిమిత్రుడూ, కొమ్మనమంత్రి కుమారుడూ బుధపూజనంచేత ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలో అశ్వమేధపర్వములో సర్వమూ చతుర్థాశ్వాసం ముగిసింది.

**అశ్వమేధపర్వంలోని చతుర్థాశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలో అశ్వమేధపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆశ్రమవాసపర్వము: ప్రథమాశ్వాసము

**శ్రీసాదనపదపద్మో, పాసనవిద్యా! శమైకపరతానిత్యా**

**భ్యాసజనహృద్య! వేద, వ్యాస వచోవిభవవేద్య, హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సంపదలకు; సాదన= నివాసమైన; పద పద్మ= తామరపూలవంటి పాదాలను; ఉపాసన= సేవించటం అనే; విద్యా!= విద్య కలవాడా!; శమ= శాంతిలో; ఏకపరతా= ప్రధాన మైన తాత్పర్యంతో; నిత్య= ఎల్లవేళలా; అభ్యాస= అలవాటుగా కలిగిన; జన= జనానికి; హృద్య!= మనోహరమైనవాడా!; వేదవ్యాస= వేదాలను వేరు చేసిన (వ్యాస) మహర్షియొక్క; వచస్= వాక్యాల; విభవ= మహిమచేత; వేద్య!= తెలియదగినవాడా; హరిహరనాథా!= విష్ణు - పరమేశ్వర స్వరూపుడా! (వినుము).

**తాత్పర్యం:** నీపాద పద్మాలను సేవించుకొనేవారికి సంపద లిచ్చేవాడా! ఎప్పుడూ శాంతంగా ఉండే వారి హృదయాలలో నిలిచేవాడా! వ్యాసమహర్షి బ్రహ్మసూత్ర, పురాణాది వాక్యాలవలన తెలియదగినవాడా! హరిహర స్వరూపా!. (తదుపరి వృత్తాంతం వినుము.)

**విశేషం:** పదసేవతో సిరు లివ్వటం అనే మొదటి అంశంలో హరి లక్షణమూ, శాంతపరుల హృదయంలో ఉండడం అనే రెండో అంశంలో హరలక్షణమూ, వ్యాసవాక్యాలలో తెలియబడటం అనే మూడో అంశంలో హరిహర ఉభయలక్షణమూ కనబడతాయి. శ్రీ అంటే మోక్షం కూడా. అదీ ఒక కామితమే.

యుధిష్ఠిరాదులును గాంధారీధృతరాష్ట్రులును నొండొరులయెడల నడచికొనిన ప్రవర్తనము: (సం.15-1-1)

**వ. దేవా! జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె; నట్లు పితృపితామహక్రమప్రాప్తం బయిన సామ్రాజ్యంబు జగత్పూజ్యప్రకారంబునం గైకొని మహాధ్వరప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయా విధేయులు నగు - పాండవేయులు ధృతరాష్ట్రువలన నెవ్విధంబు వారై నడచిరి? హతపుత్రమిత్రామాత్యుండును గతైశ్వర్యుండును నగు నా రాజును యశోమహితయగు గాంధారియు నెట్టిభంగి వర్తించి? రత్తెఱంగు నా కెఱింగింపుము. 2**

**ప్రతిపదార్థం:** దేవా= హరిహరనాథా!; జనమేజయుండు= జనమేజయమహారాజు; వైశంపాయనునకున్= వైశంపాయనమునితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు (అట్లులోగడ చెప్పినవిధంగా); పితృ= తండ్రి; పితామహ= తాతల; క్రమ= వరుసలో; ప్రాప్తంబు అయిన= లభించిన; సామ్రాజ్యంబు= సార్వభౌమత్వాన్ని; జగత్= ప్రజలచేత; పూజ్య= గౌరవించదగిన; ప్రకారంబునన్= పద్ధతిలో; కైకొని= స్వీకరించి; మహా అధ్వర= గొప్ప యజ్ఞాలు; ప్రముఖ= మొదలైన; ధర్మ= వేదవిహితాలు అయిన; కార్య= క్రియలను నిర్వహించటంలో; ధుర్యులును= నేర్పరులూ; సమ్ ఉపాసిత= చక్కగా సేవించబడిన; ఆర్యులును= పెద్దలు కలవారూ; దయా విధేయులును= దయకు లోబడినవారూ; అగు= అయిన; పాండవేయులు= పాండురాజు కొడుకులు; ధృతరాష్ట్రువలనన్= ధృతరాష్ట్రుడి విషయంలో; ఏ+విధంబు వారు అయి= ఎటువంటి ప్రవర్తనం కలిగి; నడచిరి?= వ్యవహరించారు?; హత= చంపబడ్డ;

పుత్ర= దుర్యోధనాదు లైన కొడుకులూ; మిత్ర= కౌరవపక్షాన నిల్చి యుద్ధంచేసిన రాజ స్నేహితులూ; అమాత్యుండును= మంత్రులూ కలవాడునూ; గత+ఐశ్వర్యుండును= ప్రాభవం కోల్పోయిన వాడునూ; అగు= అయిన; ఆరాజును= ఆధృతరాష్ట్రుడూ; యశస్ మహిత= కీర్తిచేత గొప్పది; అగు= అయిన; గాంధారియున్= ధృతరాష్ట్రుడిభార్యా; ఎట్టిభంగిన్= ఏవిధంగా; వర్తించిరి= వ్యవహరించారు; ఆ+తెఱంగు= ఆవిధం; నాకున్= నాకు (జనమేజయుడికి); ఎఱింగింపుము= తెలుపవలసింది.

**తాత్పర్యం:** హరిహరదేవా! జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు. గొప్పగొప్పయజ్ఞాలు మొదలైన వేదకర్మలను ఆచరించేవాళ్ళూ, పెద్దలను గౌరవించేవాళ్ళూ, కరుణా స్వభావులూ అయిన పాండవులు తాతల, తండ్రుల క్రమంలో తమకు లభించిన ప్రభుత్వాన్ని సర్వజనామోదకరంగా స్వీకరించిన తర్వాత ధృతరాష్ట్రుడి విషయంలో ఎట్లా నడుచుకున్నారు? కొడుకులనూ, హితులనూ, మంత్రులనూ, తనవారందరినీ, సార్వభౌమత్వాన్నీ పోగొట్టుకొన్న ధృతరాష్ట్రుడూ, మంచిపేరున్న గాంధారీ (పాండవులతో) ఎట్లా వ్యవహరించారు? ఆ సంగతి తెలియజెప్పవలసింది.

**విశేషం:** ఇందులో విశేషణాలన్నీ సాభిప్రాయాలు. పాండవులకు రాజ్యం హక్కుగా వచ్చిందే కాని బలవంతంగా లాక్కున్నది కాదు. దాయాదులను చంపి కాజేశారనీ, అది హేయమనీ ప్రజలు కూడా అనుకోలేదు. కాబట్టి యీవిషయంలో ధృతరాష్ట్రుడు పాండవులపై ద్వేషం పెట్టుకొనగూడదని ఉద్దేశం. ఆర్యులను సేవించే లక్షణం ఉన్నది. పైగా దయా విధేయులు గూడా కాబట్టి గాంధారీధృతరాష్ట్రులునూ పెద్దతల్లితండ్రులునూ పుత్రశోకంలో ఉంటారు. కాబట్టి సానుభూతితో గూడ పాండవులు తప్పక గౌరవించేఉంటారు. గతంలో తమ కష్టాలకు ధృతరాష్ట్రుడూ కొంత కారణం అని అతనిపై పాండవులకు కోపం ఉండదు - అని తన వంశంలో ఆర్యులైన పాండవులను గూర్చి జనమేజయుడి నమ్మకం. ఇంక హతపుత్రమిత్రామాత్యుడైన ధృతరాష్ట్రుడికే దానికి హేతువైన పాండవులమీద కోపం ఉండక తప్పదు. 'పవనాత్మజుండు సన్నిహితుఁ డైన యప్పు డజ్జనవిభుండు తన తనూజులఁ దలఁచి సంతాప మందు' (16వ.) తుండడం గమనిస్తాం (ఇట్లాగే 31స.) కాబట్టి, ధృతరాష్ట్రుడు పాండవులతో మనసు కలిసిఉండటం జరగదు. యశోమహిత అనటంలో గాంధారిమీద కొంత సదభిప్రాయం. మహాధ్వరకార్యధుర్యులు మొదలైన విశేషణాలు పాండవులకు సామ్రాజ్యం గైకొన్న తర్వాతే కాదు ముందూ అన్వయిస్తాయి.

**సీ.** **అనవుడు నమ్ముని యమ్మహీపతికి ని। ట్లనుఁ, బాండునందను లాంబికేయు**
**నెడ భక్తివినయంబు లెసఁగంగ వర్తింతు। రతని యోగక్షేమ మరసి యెపుడుఁ**
**దత్సమీపంబునఁ దగ నిల్చి తమకు నె। య్యది యైన నెఱిఁగించునట్లు గాఁగ**
**నుందురు విదుర యుయుత్సు సంజయులు దా। రును నిత్యమును వచ్చి వినతిఁ జేసి**

**తే.** **కొలిచి కూర్చుండి యా నృపు నలఘుకార్య। విధము లేర్పడ నడిగి యవ్విభుని చెప్పి**
**నట్లు చేయుదు రతఁడును నాదరంబు। గాఢవత్సలత్వంబును గలిగియుండు.** **3**

**ప్రతిపదార్థం:** అనవుడున్= (జనమేజయుడు పైవిధంగా) అనగా; ఆ+ముని= ఆ వైశంపాయన మహర్షి; ఆ+మహీపతికిన్= ఆ జనమేజయ భూపాలుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; పాండునందనులు= పాండురాజుకొడుకులు, ఆంబికేయు+ఎడన్= ఆ ధృతరాష్ట్రుడి విషయంలో; భక్తి వినయంబులు= సేవాభావమూ, అణకువా; ఎసఁగంగన్= ఎక్కువగా; వర్తింతురు= నడచుకొనేవారు; అతని= ఆ ధృతరాష్ట్రుడియొక్క; యోగక్షేమము= ఉన్నతస్థితీ, అది పదిలంగా ఉండేటట్లూ; అరసి= చూస్తూ; ఎపుడున్= అన్ని వేళల్లోనూ; తద్+సమీపంబునన్= ఆ ధృతరాష్ట్రుడి దగ్గరే; తగన్= తగువిధంగా (అతడి ఇచ్ఛకు భంగంకల్గకుండా); నిల్చి= ఉండి; ఏ+అది ఐనన్= ఎటువంటి పని అయినా; తమకున్= తమతో; ఎఱిఁగించునట్టుగాన్=

తెలియజేసేటట్లుగా; ఉందురు= ఉండేవారు; విదుర యుయుత్సు, సంజయులు= విదురుడూ, యుయుత్సుడూ, సంజయుడూ; తారును= తా మై (స్వయంగా= పిలవ నవసరం లేకుండానే); నిత్యమును= ఎల్లప్పుడూ (ప్రతిరోజూ); వచ్చి= ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి; వినతిన్= నమస్కారం; చేసి= చేసి; కొలిచి= సేవించి; కూర్చుండి= ఆసీనులై; ఆనృపు= ఆ ధృత (ధర్మ) రాష్ట్రుడి యొక్క; అలఘుకార్యవిధములు= ఉత్తమాలైన పనులూ; ఏర్పడన్= స్పష్టంగా; అడిగి; ఆ+విభుని= ఆరాజు; చెప్పిన+అట్లు= పేర్కొన్నవిధంగా; చేయుదురు= చేస్తుండేవారు; అతఁడును= ఆ ధృతరాష్ట్రుడు కూడా; ఆదరంబు= (పాండవాదులపై) అభిమానమూ; గాఢ= దృఢమైన; వత్సలత్వంబును= వాత్సల్యాన్నీ; కలిగి ఉండున్= కలిగి వ్యవహరించేవాడు.

**తాత్పర్యం:** జనమేజయుడు అడిగినదానికి సమాధానంగా వైశంపాయనుడు ఇట్లా చెప్పుతున్నాడు: పాండవులు ధృతరాష్ట్రుడిని వినయంగా సేవించేవాళ్ళు. అతడికి మేలు కలిగేటట్లుగా, ఔన్నత్యానికి భంగం రాకుండా నడుచుకొనేవారు ఏ సమయంలో అయినా ఎటువంటి పని అయినా తమకు ఆజ్ఞాపించటానికి వీలుగా ఎప్పుడూ అతడిసమీపంలో, అతడికి ఇబ్బంది కలగనివిధంగా ఉండేవాళ్ళు. విదురుడూ, యుయుత్సుడూ, సంజయుడూ ప్రత్యేకంగా పిలిపించవలసిన అవసరం లేకుండా రోజూ స్వయంగా వచ్చి ధృతరాష్ట్రుడిని సేవించేవాళ్ళు. ఏం కావాలో అడిగి చిన్నా పెద్దా పను లన్నీ చేసిపెట్టేవాళ్ళు. ధృతరాష్ట్రుడు కూడా పాండవాదు లందరిమీదా ప్రేమతో, వాత్సల్యంతో ఉండేవాడు.

**విశేషం:** జనమేజయుడు గతైశ్వర్యు డన్నా పాండవాదులు యోగక్షేమాలకు లోటు లేకుండా కింకరభావంతో సేవించటంవలనా, ధృతరాష్ట్రుడు 'నృపుడే' క్రమంగా చూస్తే ఆంబికేయుడికి పాండునందనులమీద ఆదరం, విదురాదులమీద గాఢవాత్సల్యం ఉన్నాయనాలి. యుయుత్సుడు స్వయానా (వైశ్యస్త్రీ వలన) కొడు కయితే విదుర సంజయులు మొదటినుండి తన్నాశ్రయించి ఉన్నవాళ్ళు కాబట్టి వాత్సల్యంలో గాఢత సహజమే. పాండునందనులమీద కొంతభేదభావం అంతరాలనుండి అపుడప్పుడూ బయటపడుతుంటుంది.

**ఉ.** **కౌరవనాథ! కుంతియును గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం**
**ధారి నతిప్రయత్నమున ద్రౌపది తాను సుభద్రయున్ ముదం**
**బారఁగ నిత్యముం గొలుతు రక్కురువంశమహత్తరన్ మహో**
**దారము లైన వస్తువు లుదాత్తత నిత్తురు వార లందఱున్.** **4**

**ప్రతిపదార్థం:** కౌరవనాథ!= జనమేజయమహారాజా!; కుంతియును= కుంతీదేవి; కూడా వచ్చి= తానుగా వచ్చి; గాంధారిన్= ధృతరాష్ట్రుడి భార్యను; గౌరవము= గురువు అనే దృష్టి (పెద్దరికం); ఒప్పఁగన్= మెరిసే విధంగా; కొల్చున్= సేవించేది; అతిప్రయత్నమునన్= మిక్కిలిపూనికతో; ద్రౌపది, తానున్= ఆ ద్రౌపదీ; ముదంబు ఆరఁగన్= సంతోషం నిండగా; సుభద్రయున్= సుభద్రా; నిత్యమున్= ప్రతిరోజూ; ఆ+కురువంశమహత్తరన్= కురువంశంలో పెద్ద దయిన ఆ గాంధారిని; కొల్తురు= సేవించేవారు; వారలు+అందఱున్కుంతీ, ద్రౌపదీ, సుభద్రలు ముగ్గురూ; ఉదాత్తతన్= త్యాగబుద్ధితో; మహా+ఉదారములు+అయిన= గొప్ప విలువైన; వస్తువులు= కానుకలు; ఇత్తురు= గాంధారికి ఇస్తుండేవారు.

**తాత్పర్యం:** జనమేజయా? కుంతికూడ గౌరవము మెరిసే విధంగా వచ్చి గాంధారిని కొలిచేది. మిక్కిలి పూనికతో తానూ సుభద్రాకూడ సంతోషం నిండగా ఆ గాంధారిని నిత్యమూ కొలిచేవారు. వారందరూ గొప్ప విలువైన కానుకలను గాంధారికి గౌరవంతో ఇచ్చేవారు.

**విశేషం:** కుంతీ, ద్రౌపదీ, సుభద్రలను ప్రముఖంగా ప్రస్తావించడం విశేషం. ఈ ముగ్గురూ కురుక్షేత్రంలో తమ కొడుకులను పోగొట్టుకున్నవాళ్ళే. కుంతికి కర్ణుడూ ప్రియసుతుడే కదా! ద్రౌపదీ సుభద్రల పిల్లలు కౌరవుల మూలంగా వంచనతో మరణించినవారే అయినా వా ర దంతా మర్చిపోయారు. అందుకే ధృతరాష్ట్రుడిని గురించి భీముడు పలికే పరుషవచనాలు ద్రౌపది క్కూడా తెలియకుండా జాగ్రత్తపడడం జరిగింది. కుంతి 'గౌరవ మొప్పఁగ కొల్చి' అప్పగారిని గురువు చేసికొని శిష్యురాలివలె శాసించబడేది 'గౌరవ మొప్పఁగ వచ్చి' - రావడంలోనే రాజమాతగా గౌరవం. కుంతిలోనూ పట్టమహిషి గావటమే కాకుండా గాంధారీ పుత్ర వినాశానికి ప్రధానకారణ మైనదీ గాబట్టి తననూ ద్రౌపదినీ చూస్తూనే గాంధారికి విపరీతభావం కలగవచ్చు. తనకూ భర్తలకూ కూడా మంచితనాన్ని సంపాదించటంలో ద్రౌపది 'అతిప్రయత్నంతో' గాంధారిని కొలువవలసివచ్చింది. ప్రియసుతుడు అభిమన్యుడిని పోగొట్టుకొన్నా కృష్ణుడి చెల్లెలు సుభద్ర - సంతోషంగానే గాంధారిని సేవించింది. (తర్వాత ఈమె మనుమలే రాజ్యం చేశారు.) 'నిత్యముం గొలుచు నక్కురు' - అనే ముద్రితప్రతులపాఠం "తీసికొంటే" చెప్పనివాఁడును, సత్యముచెప్పనివాఁడును ఘోర నరకపంకమున పడున్ - అనేవిధంగా అన్వయం.

**క. చిత్రాంగదయు నులూపియు। ధాత్రీశ్వర! వత్తు రెపుడు ద్రౌపదితోడన్**
**గాత్రములు భూరి వినయా। మాత్రములుగ సుబలసుతఁ బ్రమదమునఁ గొలువన్. 5**

**ప్రతిపదార్థం:** ధాత్రీశ్వర!= ఓ రాజా! (జనమేజయా!); గాత్రములు= శరీరాలు; భూరి వినయ ఆమాత్రములు గన్= మిక్కిలి అణకువతో నిండినవి కాగా; చిత్రాంగదయున్= చిత్రాంగదా; ఉలూపియున్= ఉలూపీ; ప్రమదంబునన్= సంతోషంతో; సుబలసుతన్= గాంధారిని; కొలువన్= సేవించటానికి; ద్రౌపదితోడన్= ద్రౌపదితో కలిసి; ఎపుడున్= అన్నివేళలా; వత్తురు= వస్తుంటారు.

**తాత్పర్యం:** జనమేజయా! అర్జునుడి భార్యలైన చిత్రాంగదా, నాగకన్య ఉలూపీ అణకువతోనూ, సంతోషంతోనూ ద్రౌపదితో కలిసి వచ్చి నిత్యమూ గాంధారిని సేవిస్తుండేవాళ్ళు.

**విశేషం:** చిత్రాంగద అప్సరస. ఉలూపి నాగకన్య. అన్యలోక స్త్రీలు చిన్నవాళ్ళు కాబట్టి అక్కగారితో కలిసి వెళ్ళటం స్వభావానికి అనుగుణం. పైగా ఈ ముగ్గురూ అర్జునుని తీర్థయాత్రలో వలచి సతులయినవారు కావడం సాన్నిహిత్యానికి మరో కారణం. ఈ ముగ్గురి ప్రస్తావనతో ముల్లోకపు స్త్రీల సేవవలన గాంధారికి ప్రాభవం. పాండవస్త్రీలు గూడా గాంధారిని సేవించేవారే, అందులో విశేషం లేదని.

**క. ఆ తల్లికిఁ దండ్రికి సం। ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ నుదాత్త**
**స్ఫీతంబు లైన వస్తు। వ్రాతంబుల నిచ్చు ధర్మరా జనుదినమున్. 6**

**ప్రతిపదార్థం:** ధర్మరాజు= ధర్మతనయుడు; అనుదినమున్= ప్రతిరోజూ; ఆ తల్లికిన్= పెదతల్లి అయిన గాంధారికీ; తండ్రికిన్= పెద్ద తండ్రి అయిన ధృతరాష్ట్రుడికీ; సంప్రీతి= ఇష్టం; అలరన్= అతిశయించేటట్లుగా; కుడువన్= తినడానికీ; కట్టన్= ధరించడానికీ; పెట్టన్= అలంకరించుకొనటానికీ; ఉదాత్త స్ఫీతంబులు ఐన= రాజులకు తగినవీ, సమృద్ధము లైనవీ అయిన; వస్తు వ్రాతంబులన్= వస్తువుల సమూహాలను; ఇచ్చున్= ఇస్తుండేవాడు.

**తాత్పర్యం:** గాంధారీ ధృతరాష్ట్రులు సంతృప్తిపడే విధంగా తినటానికీ, కట్టుకొనటానికీ, పెట్టుకొనటానికీ, రాజులకు అర్హమైన భక్ష్యభోజ్యాలు, శయన, మాల్య అనులేపనాలు మొదలైన వివిధ వస్తువులు, వస్త్రాలు, ఆభరణాలు సమృద్ధిగా ధర్మరాజు వారికి ప్రతిరోజూ అందజేసేవాడు.

**విశేషం:** సంప్రీతి అలరుట పుచ్చుకొన్న గాంధారీ ధృతరాష్ట్రులకే కాకుండా ఇచ్చే ధర్మరాజులోనూ అన్వయిస్తుంది. తల్లి, తండ్రి అనే భావం వలన ఇచ్చేవాడికీ, పుచ్చుకొనే వాళ్ళకూ సంప్రీతి. పెట్టన్ అనేది గాంధారీ ధృతరాష్ట్రులు తాము అనుభవించటానికి మాత్రమే కాక తమ కిష్టమైన వాళ్ళకు పెట్టుకొనటానికి కూడా సరిపోయేంత సమృద్ధిగా వస్తువ్రాతం ధర్మరాజు ఇస్తున్నా డని తెలుపుతున్నది. అనుదినమూ ఇవ్వటంలో అత్యంత శ్రద్ధ. అప్రమత్తత.

**తే.** **గుళ్ళుఁ జెఱువులుఁ గట్టించుఁ, గోరి యూళ్ళు। లగ్రహారముల్ గావించు నాంబికేయుఁ**
**డధిప! ధర్మతనూజుఁ డత్యంత హర్ష। చిత్తవృత్తి యై యనుమతి సేయుచుండ.** **7**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓరాజా!; ధర్మ తనూజుఁడు= ధర్మరాజు; అత్యంత= మిక్కిలి; హర్ష= సంతోషం నిండిన; చిత్త= మనస్సుయొక్క; వృత్తి+ఐ= వర్తనం కలవాడై; అనుమతి= అంగీకారం; చేయుచుండన్= తెలుపుతూ ఉండగా; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; కోరి= తన ఇచ్ఛానుసారంగా; (అడిగి); గుళ్ళున్= దేవాలయాలూ; చెఱువులున్= తటాకాలూ; కట్టించున్= నిర్మింపజేసేవాడు; ఊళ్ళులు= గ్రామాలు; అగ్రహారముల్= బ్రాహ్మణ నివాసస్థలాలూ; కావించున్= ఏర్పాటు చేయించేవాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ధర్మరాజు సంతోషంగా ఆమోదించగా ధృతరాష్ట్రుడు గుళ్ళూ, చెరువులూ ఏర్పరిచేవాడు. ఊళ్ళూ, అగ్రహారాలూ కల్పించేవాడు.

**విశేషం:** ధర్మరాజు గూడా కింకరభావంతో ధృతరాష్ట్రుడిని సేవిస్తూ 'నీవు' రాజవుగాక నీ కేను రాజనే' అంటాడు. (34.స.) అయినా 'ఏ కార్యమైన నెవ్వఁ డేనియుఁ జేయఁ దొడఁగు నప్పుడు పుడమివేనిచే ననుజ్ఞాతుండై కాని తొడంగఁ గారు' (27స.) అంటాడు ధృతరాష్ట్రుడు. అందుకే రాజానుమతి ధర్మమని తప్ప ధృతరాష్ట్రుడి ఇచ్ఛకు అవరోధం లేదు. ఇక్కడ వాక్య రచనా విధానంలో ధర్మరాజు అనుమతికి అంతగా ప్రాముఖ్యం కనబడకపోవడం అందుకే. గుళ్ళూ, చెరువులూ, ఊళ్ళూ, అగ్రహారాలు ధృతరాష్ట్రుడేర్పరచటం మరణించిన తనవారికి పుణ్యగతులు సాధించటానికే. అయినా 'హర్షచిత్తవృత్తితో అనుమతించటం ధర్మరాజుసౌశీల్యం. అగ్రహారాలు బ్రాహ్మణులకు మాత్రమే ఇచ్చేవి; సాధారణంగా బ్రాహ్మణులే నివసించే ప్రదేశాలు. వీటిని వంశపారంపర్యంగా అనుభవించవచ్చును. రాజు మారినా ఇవి పోవు. పన్నులు వసూలు చేసికొనే అధికారం మాత్రం ఉండదు. ఊళ్ళు దీనికి వ్యతిరిక్తాలు అంటే పన్నులు వసూలు చేసికొనవచ్చును. రాజు మారితే ఇవీ పోతాయి.

**క.** **జనవర! ధర్మజుఁ గొలువం। జనుదెంచిన యట్టి వివిధ జనపతు లెల్లన్**
**మును ధృతరాష్ట్రునిఁ గొలుతురు। విను మా కొడుకు మది పల్లవించున్ దానన్.** **8**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా!; వినుము= వినవలసింది; ధర్మజున్= సమ్రాట్టు అయిన ధర్మరాజును; కొలువన్= సేవించటానికి; చనుదెంచిన అట్టి= వచ్చిన; వివిధ జనపతులు= వేర్వేరు దేశాల రాజులు; ఎల్లన్= అందరూ; మును= ధర్మరాజుకంటె ముందుగా; ధృతరాష్ట్రునిన్= ధృతరాష్ట్రుడిని; కొలుతురు= సేవించేవారు; దానన్= సామంతుల ఆ చర్యవలన; ఆ కొడుకుమది= ధర్మరాజు మనస్సు; పల్లవించున్= సంతోషించేది.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! వినుము. సార్వభౌముడైన ధర్మరాజును సేవించటానికి వచ్చిన సామంత రాజు లందరూ ధర్మరాజునుకంటె ముందుగా ధృతరాష్ట్రుడిని సేవించేవారు. అందుకు ధర్మరాజు సంతోషించేవాడు.

**విశేషం:** తన కంటె ధృతరాష్ట్రుడికే ప్రాభవం అధికంగా ఉండడం ధర్మజుడికి సంతోషం. తన కొడుకులే మరణించగా పాండవులకు రాజ్యాధిపత్యం గల్గటంవలన కలిగే మనఃఖేదం ధృతరాష్ట్రుడికి ఈ చర్యవలన ఉపశమిస్తుంది. (9స.) సామంతులు ముందుగా

అతడిని కొలవటానికి కారణం అతడు ధృతరాష్ట్రుడు కావటం. ఆ తండ్రిని ముందుగా మన్నించడం వలన ధర్మజుడు తన ఆధిపత్యానికి భంగం కలిగిందని అనుకొనకపోగా సంతోషించటం. 'ఆ కొడుకు' కావటం వలన పైగా వారు 'ధర్మజుఁ గొలువం జనుదెంచినవారు.' వారి ఆంతర్యం ధర్మరాజుకు తెలుసు.

**క. సూనులు లేమిం గలిగెడు। దీనత్వము దోఁపకుండఁ దేజస్సౌఖ్యా**
**నూనులుగఁ జేయు ధర్మజుఁ। డా నరపతి నతనిదేవి నతులిత భక్తిన్. 9**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁ(డు= ధర్మరాజు; అతులిత భక్తిన్= సాటిలేని సేవాభావంతో; ఆ నరపతిన్= ఆ ధృతరాష్ట్రుడినీ; అతనిదేవిన్= ఆయన భార్య, గాంధారినీ; సూనులు= కొడుకులు; లేమిన్= (యుద్ధంలో మరణించడం చేత) లేకపోవడం వలన; కలిగెడు= సంభవించే; దీనత్వము= దుఃఖం; తోఁపకుండన్= తలపులోకి రాకుండా; తేజస్+సౌఖ్య+అనూనులుగన్= ప్రాభవమూ, సుఖమూ తక్కువ కాకుండెడివారుగా; చేయున్= చేసేవాడు.

**తాత్పర్యం:** కొడుకులు లేకపోవటం వలన కలిగే బాధ మనసులోకి రాకుండా ప్రభుత్వానికీ, సుఖానికీ లోటు రాకుండా, గాంధారీ ధృతరాష్ట్రులను చూచుకొనేవాడు ధర్మరాజు.

**సీ. వంశవృద్ధులు పుత్త్రవర్గ వియుక్తులై। యున్నవా రేమిట నుమ్మలింతు**
**రో యను పుయిలోట నా యుధిష్ఠిరుఁడు ద। మ్ములకును దగునమాత్యులకు నిష్ట**
**భృత్యులకును మీరు ప్రీతియు భక్తియు। నాంబికేయునిదెస నతిశయిల్ల**
**నారాజు పంచినయట్ల చేసి చరింపుఁ। డతని నారాధించు టస్మదీయ**

**ఆ. చిత్తమునకుఁ బ్రియము సేయుట యతనికి। మనసు గాని యట్టిపని యొనర్చు**
**టగ్గలంపు దుఃఖ మావహించుట యని। యనుదినంబుఁ జెప్పు మనుజనాథ! 10**

**ప్రతిపదార్థం:** మనుజనాథ= రాజా! (జనమేజయా!); వంశవృద్ధులు= కురువంశంలో పెద్దవాళ్ళు; పుత్త్ర వర్గ వియుక్తులు= పెక్కురైన కొడుకులు దూరమైనవారు; అయి ఉన్నవారు= (జీవిస్తూ) ఉన్నారు; ఏమిటన్= ఏ విషయంలో; ఉమ్మలింతురో= బాధ పడతారో; అను పుయిలోటన్= అనే సంకోచంతో; ఆ యుధిష్ఠిరుఁడు= ఆ ధర్మరాజు; తమ్ములకును= భీముడు మొదలైన తమ్ముళ్ళతోనూ; తగు అమాత్యులకున్= అర్హు లైన మంత్రులతోనూ; ఇష్ట భృత్యులకును= ప్రియమైన సేవకులతోనూ; అనుదినంబున్= ప్రతిరోజూ-(ఇట్లా చెప్తాడు); మీరు= మీరు అందరు; ఆంబికేయుని దెసన్= ధృతరాష్ట్రుడి మీద; ప్రీతియున్= ఇష్టమూ; భక్తియున్= సేవాదృష్టీ; అతిశయిల్లన్= అధికం కాగా; ఆరాజు= ధృతరాష్ట్రుడు; పంచిన+అట్ల= ఆజ్ఞాపించినవిధంగానే; చేసి= ఆయాపనులు చేసి; చరింపుఁడు= నడచుకొనండి; అతనిన్= ధృతరాష్ట్రుడిని; ఆరాధించుట= సేవించటం; అస్మదీయ చిత్తమునకున్= నా మనస్సుకు; ప్రియము= ఇష్టం; చేయుట= కల్గించటమే; అతనికిన్= ధృతరాష్ట్రుడికి; మనసు కాని అట్టిపని= ఇష్టం లేనిపని; ఒనర్చుట= చేయటం; అగ్గలంపు దుఃఖము= (నా మనస్సుకు) మిక్కిలి విచారం; ఆవహించుట= కల్గించటమే; అని= అనేవిధంగా; చెప్పున్= చెప్పుతుంటాడు.

**తాత్పర్యం:** రాజా! గాంధారీ, ధృతరాష్ట్రులు కురువంశంలో పెద్దవాళ్ళు. కొడుకులను పోగొట్టుకొని బ్రతుకుతున్నారు. ఎందుకైనా బాధ పడతారేమో అనే సంకోచంతో ధర్మరాజు, తమ్ములు, మంత్రులు, సేవకులతో ప్రతిరోజూ ఇట్లా చెప్పుతుంటాడు. మీరు ధృతరాష్ట్రుడు ఏ విధంగా ఆజ్ఞాపిస్తే ఆ విధంగా చేస్తూ ఆయన చెప్పిన ప్రకారం నడుచుకొనండి. అతడిని సేవిస్తేనే నా మనసూ సంతోషిస్తుంది. ధృతరాష్ట్రుడికి ఇష్టం లేని పని చేయటం అంటే నన్ను బాధ పెట్టటమే.

**విశేషం:** యుద్ధంలో చాలామంది పోగా మిగిలినవాళ్ళలో గాంధారీ ధృతరాష్ట్రులు 'వంశవృద్ధులు'. వార్ధకంలో కొడుకులతోడు ఉండవలసిన సమయంలో పుత్రవియోగం. పైగా పుత్ర 'వర్గ' వియోగం. కొడుకులు చాలామంది ఉన్నా ఒక్కడూ మిగలకుండా పోవటం. (యుయుత్సుడు క్షత్రియుడు కాదు కాబట్టి, సూనులు లేమి ఐయున్నవారు. వార్ధకం, బహుపుత్ర వియోగంతో 'బ్రతికి ఉండటం' బాధ. దీనివల్ల 'పుత్ర వియోగబాధ' అనుక్షణమూ ఉంటుంది. ఇవి వారిని సేవించవలసిన అవసరమూ, ఔచిత్యమూ సూచిస్తున్నాయి. అందుకే ధర్మరాజు వారి సేవావిషయంలో 'అనుదినంబు' జాగ్రత్తలు మళ్ళీ మళ్ళీ చెప్పటం.

**క. విను మెల్లవారు నతని వ । చనములు మది నూఁది యట్ల చరియింప మరు**
**త్తనయుండును నమ్మెయి వ । ర్తనము నడపుచుండు మనసు తద్దయు నెరియన్. 11**

**ప్రతిపదార్థం:** వినుము= జనమేజయ రాజా! వినుము. ఎల్లవారున్= అందరూ కూడా; అతని వచనములు= ఆ ధర్మరాజు మాటలు; మదిన్= మనసులో; ఊఁది= ఉంచుకొని (స్థిరపరచుకొని); అట్లు+అ= ధర్మరాజు చెప్పిన ప్రకారంగానే; చరియింపన్= నడుచుకుంటూ ఉండగా; మరుత్ తనయుండును= వాయుపుత్రుడు-భీముడు కూడా; మనసు= హృదయం; తద్దయున్= అధికంగా; ఎరియన్= బాధపడుతున్నా; ఆ+మెయిన్= ధర్మజుడు చెప్పినవిధంగా; వర్తనము= నడవడికను; నడపుచున్ ఉండున్= సాగిస్తూ ఉండేవాడు.

**తాత్పర్యం:** జనమేజయా! అట్లా ధర్మరాజు చెప్పిన మాటలు మనసులో ఉంచుకొని అందరూ, తమ్ములు, అమాత్యులు, భృత్యులూ, ఆ ప్రకారంగా ధృతరాష్ట్రుడిని కొలిచేవారు. భీముడు కూడా మనసులో బాధపడుతూనే అన్నగారి మాటలను అనుసరించి నడిచేవాడు.

**విశేషం:** భీముడు అన్నపై గౌరవం వలన ఇష్టం లేకున్నా ఎంత (నడపు-ప్రేరణ క్రియ) బలవంతంగా ఆచరించేవాడో తెలుస్తుంది. ఎరియు ధాతువుకు మండటం అనే అర్థమూ ఉన్నది. అనిష్టుల సేవ చేయవలసివచ్చినందుకు బాధా వారిపై కోపమూను.

**క. ద్యూతంబున దుర్యోధను । చేతం దమ పడిన పాటు చిత్తంబున క**
**త్యాతురతఁ జేయుచుండుట । నాతఁడు ధృతరాష్ట్రుఁ జూచి యలుగు మనమునన్. 12**

**ప్రతిపదార్థం:** ద్యూతంబునన్= జూదంలో; దుర్యోధనుచేతన్= దుర్యోధనుడు కారణంగా; తమ పడిన పాటు= తాము (పాండవులు) అనుభవించిన కష్టాలు; చిత్తంబునకున్= తన మనస్సుకు; అతి+ఆతురతన్= మిక్కిలి పీడను; చేయుచున్+ఉండుటన్= కలిగిస్తూ ఉండటం వలన; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; చూచి అతఁడు= ఆ భీముడు; మనమునన్= మనసులో; అలుగున్= కోపగించుకొనేవాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడివలన ఆనాడు జూదం మూలాన తాము అనుభవించిన కష్టాలు రాజ్యం పోవటం, భార్యకు సభలో అవమానం, అరణ్యావాసం మొదలైనవన్నీ భీముడి మనస్సును పీడిస్తుండేవి. అందువలన ధృతరాష్ట్రుడిని చూస్తేనే భీముడు మండిపడేవాడు.

**విశేషం:** పాండవులందరూ కష్టాలుపడ్డా ఆ స్మృతులు ఇంకా భీముడిని బాధిస్తున్నాయి. మిగిలిన నలుగురి కంటె భిన్నంగా భీముడి విషయంలోనే ఈ ప్రస్తావన. చూచి - మనసులో ఆ బాధ ఎపుడూ ఉన్నా ధృతరాష్ట్రుడిని చూసిన సమయంలో మాత్రం కోపం వచ్చేది. తమ కష్టాలకు హేతువైనవాడిని, అసలు రాజైన అన్నగారికంటె అధికంగా పూజించాల్సిరావటం కోపకారణం. మిగిలిన పాండవులు సర్దుకొన్నా స్వభావాన్ని బట్టి భీముడి కది కష్టం.

**తే. శ్రాద్ధ దివసంబులందుఁ బుత్త్రవ్రజమున। కాంబికేయుండు గో కనకాది దాన**
**కీర్త్యముగఁ బారలౌకిక క్రియలు సేయు। నట్లుగా సంఘటించు ధర్మాత్మజుండు. 13**

**ప్రతిపదార్థం:** ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; శ్రాద్ధ దివసంబులందున్= శ్రాద్ధ కర్మలను ఆచరించే మరణ తిథులలో; పుత్త్రవ్రజమునకున్= దుర్యోధనుడు మొదలయిన కొడుకుల సముదాయానికి; పారలౌకిక క్రియలు= పుణ్యలోకాదులు కలగటం కొరకు చేసే కర్మలను; గో= ఆవులు; కనక= బంగారం; ఆది= మొదలైన; దాన= దానాలచేత; కీర్త్యముగన్= బ్రాహ్మణాదిజనం ప్రశంసించే విధంగా; చేయునట్లుగాన్= నిర్వహించేటట్లుగ; ధర్మాత్మజుండు= ధర్మరాజు; సంఘటించున్= ఏర్పాటు చేసేవాడు.

**తాత్పర్యం:** 'ఆంబికేయుండు చేయునట్లుగా ధర్మాత్మజుండు సంఘటించు' అనడంలో ధృతరాష్ట్రుడికంటె ధర్మరాజులో ఎక్కువపూనిక వ్యక్తం అవుతున్నది. 'ధర్మాత్మజుండు' కాబట్టి ఇటువంటి క్రియలలో శ్రద్ధ అధికం. అపకారులకు కూడ పుణ్యలోకాలు సాధించే ఉపకారబుద్ధి విశేషం. అభిమన్యు ప్రభృతిస్వజనవిషయం ప్రత్యేకంగా చెప్పనే అక్కరలేదు.

**సీ. అతులభోగంబును నంచితత్యాగంబుఁ। దొల్లింటియట్టుల చెల్లఁజేయు**
**ధృతరాష్ట్రునకు ధర్మసుతుఁడు గాంధారికిఁ। బూర్వప్రకార సంపూజ్యదాన**
**నిరతిఁజెల్లించు; నక్కురువృద్ధుఁ డిమ్మెయిఁ। బాండుపుత్త్రులు దన్నుఁ బరమభక్తి**
**శిష్యవర్తనమున సేవింపఁ దానును। గురునట్ల వాత్సల్యపరత నెపుడు**

**తే. వారలకు శ్రీయు నాయువు వైరిజయము। మానసమున నాశాసించు మానవేంద్ర!**
**యతని తొంటివర్తనముఁ దత్సుతుని కీడు। నాత్మఁ దలఁపఁ డెన్నండు ధర్మాత్మజుండు! 14**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర!= జనమేజయ మహారాజా!; ధర్మసుతుఁడు= ధర్మరాజు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడికి; తొల్లింటి అట్టులు+అ= అతడి కొడుకులు బ్రతికివున్నపుడు సార్వభౌముడుగా ఉన్నప్పటివలెనే; అతులభోగంబునున్= సాటిలేనిసుఖాలూ; అంచిత త్యాగంబున్= పూజింపదగిన దానమూ; చెల్లన్ చేయున్= సాగేటట్లుగా చేసేవాడు; గాంధారికిన్= గాంధారికి కూడా; పూర్వ= మునుపటి (కొడుకులు జీవించి ఉన్నప్పటి); ప్రకార= విధంగానే; సంపూజ్య= పూజించదగిన; దాన= దానముయొక్క; నిరతిన్= ఆసక్తిని; చెల్లించున్= చెల్లేటట్లు చేసేవాడు; పాండుపుత్త్రులు= ధర్మజుడు మొదలుగా పాండురాజు కొడుకులు అందరూ; ఇమ్మెయిన్= ఈవిధంగా; పరమభక్తిన్= శ్రేష్ఠమైన ఆరాధనా భావంతో; శిష్య వర్తనమునన్= శాసించబడే నడవడితో (శిష్యులవలె); తన్నున్= తనను; సేవింపన్= సేవిస్తూ వుండగా; ఆ+కురువృద్ధుఁడు= కురువంశంలో పెద్దవాడైన ఆ ధృతరాష్ట్రుడు; తానును= తను కూడా; గురు+అట్లు+అ= పాండవులకు గురువువలెనే; వాత్సల్య పరతన్= పిన్నలయందుండేటటువంటి స్నేహభావం, ప్రధానంగా; వారలకున్= ఆ పాండవులకు; శ్రీయున్= రాజ్యాది సంపదలూ; ఆయువున్= అధిక జీవితకాలాన్నీ; వైరిజయమున్= శత్రువులను జయించే సామర్థ్యమూ కలగాలని; మానసమునన్= తన మనస్సులో; ఎపుడున్= నిరంతరమూ; ఆశాసించున్= దీవించేవాడు; ధర్మాత్మజుండు= ధర్మరాజు; అతని= ఆ ధృతరాష్ట్రుడియొక్క; తొంటివర్తనమున్= పూర్వపు (దుర్యోధనాదులు జీవించిఉన్నప్పటి) నడవడికనూ; తద్ సుతుని కీడు= అతని కొడుకు దుర్యోధనుడు తమకు చేసిన అపకారమూ; ఎన్నండున్= ఏ సమయంలోనూ; ఆత్మన్= మనసులో (కూడా); తలఁపఁడు= స్మరింపడు.

**తాత్పర్యం:** జనమేజయా! పుత్రులు జీవించిఉన్నప్పటివలెనే ధృతరాష్ట్రుడికి సార్వభౌముడివలె సంపదలు అనుభవించటమూ, యథేష్టంగా దానం చేయటమూ సాగనిచ్చాడు ధర్మరాజు. అట్లాగే గాంధారికి కూడా

వ్రతాదులసందర్భాలలో బ్రాహ్మణాదులకు దానం చేయటం వగైరా యథాపూర్వం సాగనిచ్చాడు. ధర్మరాజే కాదు ఇట్లా పాండవులందరూ శిష్యులవలె ఏకాగ్రతతో తనను సేవిస్తూ ఉండడంవలన ధృతరాష్ట్రుడు కూడా పాండవులను శిష్యవాత్సల్యంతో చూచేవాడు. పాండవులకు ఇంకా సంపదలూ, ఆయుస్సూ, శత్రుజయమూ కలగాలని మనస్సులో ఆశీర్వదిస్తుండేవాడు. ధర్మరాజు కూడా ధృతరాష్ట్రుడి పూర్వ ప్రవర్తననూ అతడి కొడుకు దుర్యోధనుడు తమకు చేసిన అపకారాన్నీ మనసులోనికి రానిచ్చేవాడు కాడు.

**విశేషం:** గురుశబ్దానికి- ఉన్న వంశంలో పెద్దా, తండ్రీ, మొదలైన అర్థాలు ఇక్కడ అన్వయిస్తాయి. ధృతరాష్ట్రుడినుండి దీన్ని సాధించటంలో పాండవుల శిష్యవర్తనంలో పరమభక్తి ఉత్కర్షే కారణం తప్ప ధృతరాష్ట్రుడిస్వభావం కాదు. శ్రీ, ఆయుస్సు, వైరిజయం అనేవాటిలో క్రమం ఉన్నది. తన భోగత్యాగాలకు గూడా, పాండవులకు - శ్రీ, అని తనకు దూరం కాకుండా ఉండాలంటే పాండవులకు శత్రుజయమూ క్రమంగా అవసరం. ధృతరాష్ట్రుడి ఆశీస్సు ఉభయతారకం.

**క.** **విను మతని తెఱఁ గెఱిఁగి పరి। జనములలో నాంబికేయు చరితము దుర్యో**
**ధను కొఱగామియు నెవ్వా। రును వాక్రువ్వంగ వెఱతురు కురుప్రవరా! 15**

**ప్రతిపదార్థం:** కురుప్రవరా!= కురువంశంలో శ్రేష్ఠుడ వైన జనమేజయా!; వినుము= వినవలసినది; అతని= ఆ ధర్మరాజుయొక్క; తెఱఁగు= విధం; (మనస్సు) ఎఱిఁగి= తెలిసి; పరిజనములలోన్= పరివారంలో (చుట్టూ ఉండే జనంలో); ఏ+వారును= ఏ ఒక్కడు కూడా; ఆంబికేయు= ధృతరాష్ట్రుడియొక్క; చరితము= పూర్వప్రవర్తనం గురించీ; దుర్యోధను= దుర్యోధనుడి యొక్క; కొఱ+కామియున్= (పనికిమాలినతనమూ) దుష్టమైన పని - కీడునూ; వాక్రువ్వంగన్= పలకటానికే; వెఱతురు= భయపడేవారు.

**తాత్పర్యం:** ఓ జనమేజయా! విను ధర్మరాజుతత్త్వం తెలిసిన అతని చుట్టు జనంలో ఎవరూ కూడా ధృతరాష్ట్రుడి పూర్వ వర్తనమూ, దుర్యోధనుడు చేసిన అకార్యమూ ఉచ్చరించడానికే భయపడేవారు.

**విశేషం:** పరిజనములతో - అనే పూర్వ ముద్రితపాఠం సరికాదు. పరిజనంతో ఈ విషయాలెట్లా చెప్పుతారు? రాజు మనస్సు తెలిసికొని దానికి అనుగుణంగా రాజపరిజనం వ్యవహరిస్తుంది. అందుకే ధర్మరాజు మనసులో అతడి తొంటివర్తనమూ, తత్సుతుడి కీడూ - లే వనే విషయం గ్రహించారు - 'తెఱఁ గెఱిఁగి' చాల జాగ్రత్తగా పరిశీలించి తత్త్వం తెలిసికొన్నారు. అందుకే ఆంబికేయు చరితము, (అతని తొంటివర్తనము) దుర్యోధనుకొఱగామి (తత్సుతునికీడు) గురించి ఉచ్చరించడానికీ భయపడేవారు.

**సీ.** **రాజ్యాధిపత్య సంపూజ్యత్వమున ధృత। రాష్ట్ర పాండుసుతాంతరంబు గాన**
**రొకలులు జానపదోత్కరమునఁ బౌర। వర్గంబునందును వసుమతీశ!**
**యమ్మెయి నడపెడు నప్పాండవాగ్రజు। వలన నిజాత్మజువలని కంటె**
**నక్కురురాజు ప్రియం బందు; న ట్లున్న। యక్కాలమునఁ। బవనాత్మజుండు**

**తే.** **సన్నిహితుఁ డైనయప్పు డజ్ఞనవిభుండు। తన తనూజులఁ దలఁచి సంతాప మందు;**
**నతనిఁ గనుఁగొని యబ్భీముఁ డతనిసుతులు। తమ్ముఁ బఱిచిన పాటులు దలఁచి యలుగు. 16**

**ప్రతిపదార్థం:** వసుమతీశ!= ఓ జనమేజయ భూపాలా!; జానపద ఉత్కరమునన్= గ్రామాలలో ఉండే జనాల సమూహంలోనూ; పౌర వర్గంబునందును= పట్టణాలలో ఉండే జనసముదాయంలోనూ; ఒకళులు(న్)= ఒక్కరు గూడా; రాజ్య ఆధిపత్య= రాజ్యము యొక్క దొరతనంతో; సంపూజ్యత్వమునన్= గౌరవింపబడేలక్షణంలో; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడికీ; పాండుసుత= పాండవులకూ; అంతరంబు= భేదం; కానరు= కనలేకపోయారు; ఆ+మెయిన్= ఆవిధంగా తన (ధృతరాష్ట్రుడి)తో ఏకాభిప్రాయంగా; నడపెడు= పరిపాలనం సాగిస్తున్న; ఆ+పాండవ+అగ్రజువలనన్= పాండు కుమారులలో జ్యేష్ఠుడైన ఆ ధర్మరాజు వలన; ఆ+కురురాజు= ఆ ధృతరాష్ట్రుడు; నిజ+ఆత్మజువలనికంటెన్= తన పెద్దకొడుకైన దుర్యోధనుడి కంటె కూడా, ప్రియంబు= సంతోషాన్ని; అందును= పొందేవాడు; అట్లు+ఉన్న= ఆవిధంగా జరుగుతూ ఉన్న; ఆ+కాలంబునన్= ఆ రోజులలో; ఆ+జనవిభుండు= ఆ ధృతరాష్ట్రుడు; పవన+ఆత్మజుండు= వాయుపుత్రుడైన భీముడు; సన్నిహితుఁడు= దగ్గర ఉన్నవాడుగా; ఐన+అప్పుడు= అయిన సమయంలో; తన తనూజులన్= దుర్యోధన దుశ్శాసనాదు లైన తన కొడుకులను; తలఁచి= స్మరించి; సంతాపము= మిక్కిలిబాధ; అందున్= పొందేవాడు; ఆ+భీముఁడు= ఆ సమయంలో భీముడు కూడా; అతనిన్= ఆ ధృతరాష్ట్రుడిని; కనుఁగొని= చూచి; అతని సుతులు= ధృతరాష్ట్రుడి కొడుకు లైన దుర్యోధనాదులు; తమ్మున్= తమను (పాండవులను); పఱిచిన పాటులు= పెట్టిన కష్టాలు; తలఁచి= స్మరించి; అలుగున్= ధృతరాష్ట్రుడిపై కోపగించేవాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ఆ రాజ్యంలో ప్రభుత్వం నడిపే విషయంలో ధృతరాష్ట్రుడికీ, పాండవులకూ భేదం అనేది, అటు గ్రామవాసులు గాని, (ఇటు) పట్టణవాసులు గానీ చూడలేదు. ధర్మరాజు ఆ విధంగా తనను గౌరవిస్తుండటంవలన ధృతరాష్ట్రుడికి తన సొంత కొడుకుల కంటె కూడా ధర్మరాజుపైనే ఇష్టం కలిగేది. అయితే భీముడు తన దగ్గరకు వచ్చినపుడు మాత్రం కొడుకులను తలచుకొని బాధ పడేవాడు. భీముడు కూడా ధృతరాష్ట్రుడిని చూస్తే అతనికొడుకులు తమకు కల్గించిన కష్టాలను తలచుకొని ధృతరాష్ట్రుడిపై కోపించేవాడు.

**విశేషం:** తన పెద్దకొడుకైనా దుర్యోధనుడితో వచ్చే అభిప్రాయభేదం ధర్మరాజుతో కలగకపోవడంవలన ధృతరాష్ట్రుడికి ధర్మరాజు కన్న కొడుకుకంటె ప్రీతిపాత్ర మయ్యాడు. అక్కడ కొడుకుమాట తాను వినవలసివచ్చేది. ఇక్కడ తనమాటే ధర్మరాజు వింటున్నాడు. ధృతరాష్ట్రుడికి భీముడిని చూస్తే పుత్రులు గుర్తుకు రావటానికి కారణం దుర్యోధన దుశ్శాసనుల చావు భీముడివలన సంభవించడమే. భీముడిని చంపా లని స్వయంగా తానూ విఫలుడైనాడు కూడా. భీముడికీ ధృతరాష్ట్రుడిని చూస్తే గతం గుర్తుకు వస్తుంది. ఈ రెండింటిలో ముందు ధృతరాష్ట్రుడి విషయం ప్రస్తావించటం గమనించాలి. తనను చూచినపుడు ధృతరాష్ట్రుడిలో కలిగే మార్పువలన అటువంటి 'అతని' చూచినపుడు భీముడికీ గతం తలపునకు వస్తుంది.

**తే.** **హృదయముల నొండొరులదెస నిట్టివార। లయ్యు నతఁడు నతండు నన్యోన్యభాష**
**ణములయప్పుడు మృదుల విన్యాస మొప్ప। నాడుదురు చుట్టములు మెచ్చునట్లు గాఁగ.** **17**

**ప్రతిపదార్థం:** అతఁడున్= ఆ ధృతరాష్ట్రుడూ; అతఁడున్= ఆ భీముడూ; ఒండొరులదెసన్= పరస్పరం, ఒకళ్ళ విషయంలో ఇంకొకళ్ళు; హృదయములన్= తమ తమ మనస్సులలో; ఇట్టివారు= పూర్వం చెప్పినవిధంగా ద్వేషం కోపం కలిగినవారు; అయ్యున్= అయినప్పటికీ; అన్యోన్యభాషణముల+అప్పుడు= పరస్పరం మాట్లాడుకొనేటప్పుడు మాత్రం; చుట్టములు= బంధువులు; మెచ్చునట్లు+కాఁగన్= పొగడే విధంగా; మృదుల విన్యాసము= తెచ్చుకోలు మెత్తదనం; ఒప్పన్= ప్రకాశించేవిధంగా; ఆడుదురు= సంభాషిస్తుంటారు.

**తాత్పర్యం:** ఇంతకు ముందు (16 పద్యంలో) చెప్పినట్లుగా ధృతరాష్ట్రుడూ, భీముడూ మనస్సులో ఒకళ్ళమీద ఒకళ్ళు ద్వేషమూ, కోపమూ కలిగి ఉన్నప్పటికీ పరస్పరం మాటాడుకొనేటప్పుడు మాత్రం బంధువులందరూ మెచ్చుకొనే విధంగా మాటలలో మెత్తదనం తెచ్చిపెట్టుకొనేవారు.

**విశేషం:** భీముడు అన్నగారిఆజ్ఞలను పాలించటానికి అయితే ధృతరాష్ట్రుడు తన పెద్దరికాన్ని కాపాడుకొనటానికి అయినా 'అతఁడు నతఁడు అనే పదద్వయం వాళ్ళు కలివిడిగా లేక ఎవరికి వారుగా వేరుగా ఉండిపోవటాన్ని వ్యక్తం చేస్తున్నది. 'విన్యాసం' శబ్దం మృదుత్వం తెచ్చిపెట్టుకొన్నది, కృతకమే, కాని హృద్గతం కాదని తెలుపుతున్నది.

**వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత నంత నుండి గాంధారి వినుచుండ. 18**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఏకతంబు+అ= ఒంటరిగా; ఉన్న+ఎడన్= ఉన్న సమయంలో; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఇంతన్, అంతన్ ఉండి= ఇక్కడ అక్కడగా నిలిచి; గాంధారి= ధృతరాష్ట్రుడిభార్య; వినుచున్+ఉండన్= వినేటట్లుగా; వృకోదరుండు= భీముడు. (ఇట్లా అంటాడు. తర్వాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఒంటరిగా ఉన్నపుడు అతడికి కొంచెం సమీపంగా ఉండి గాంధారి కూడా వినేటట్లుగా భీముడు ఇట్లా అంటాడు.

**సీ. 'అంధుని కొడుకులయం దొకరునిఁ దప్పి। పోనీక త్రుంచితి భూరిశక్తి**
**దర్పితం బైన మద్బాహుపంజరము సొ। చ్చిన రిపురాజన్య సింహములకు**
**వెడలంగ వచ్చునే? వెంగలు లై వారు। కయ్యంబు సేసిరి గాక నన్ను**
**నెఱిఁగినఁ దొడరుదు రెట్టులు? దుర్యోధనాదుల ననిఁ దెగటార్చినట్టి**

**తే. నాదు దోర్దండములఁ జందనం బలంది। కుసుమదామముల్ సుట్టి మ్రొక్కుదు మహోప**
**కారు లరయంగ దైవముల్ గావె?' యనుఁ ద। దీయ మర్మంబు లెల్ల భేదిల్ల నధిప! 19**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ జనమేజయరాజా!; తదీయమర్మంబులు= ఆ గాంధారీ ధృతరాష్ట్రుల, జీవస్థానాలు; ఎల్లన్= అన్నీ; భేదిల్లన్= చీలేటట్లుగా; అనున్= భీముడు ఇట్లా అన్నాడు; అంధుని కొడుకులయందున్= గ్రుడ్డిరాజు ధృతరాష్ట్రుడి కొడుకులలో; ఒకరునిన్= ఒక్కడిని కూడా; తప్పిపోన్+ఈక= తప్పించుకు పోకుండ, మిగల్చకుండా; భూరి శక్తిన్= గొప్ప పరాక్రమంతో; త్రుంచితిన్= చంపి వేశాను; దర్పితంబు+ఐన= మదించిన; మత్ బాహుపంజరము= నా భుజములు (వలయం) అనే బోనులోనికి; చొచ్చిన= ప్రవేశించిన; రిపు, రాజన్య సింహములకున్= శత్రువులైన రాజులు అనే సింహాలకు; వెడలంగన్= బయటపడడానికి; వచ్చునే?= సాధ్యమా?; వారు= ఆ కౌరవులు; వెంగలులు+ఐ= తెలివితక్కువవారు అయి; కయ్యంబు= (మాతో) యుద్ధం; చేసిరి= చేశారు; కాక= (వెంగలులు) కాకపోతే; నన్నున్= నన్ను; ఎఱిఁగినన్= భూరిశక్తిమంతుడుగా తెలిసికొంటే; ఎట్టులు= ఏవిధంగా; తొడరుదురు?= ఎదిరిస్తారు? (యుద్ధానికి పూనుకుంటారు?); అనిన్= యుద్ధంలో; దుర్యోధనాదులన్= దుర్యోధనుడు మొదలైనవారిని; తెగటార్చిన+అట్టి= చంపివేసినటువంటి; నాదు దోర్దండమున్= దుడ్డు కర్రలవంటి నా భుజాలకు; చందనంబు= మంచి గంధాన్ని; అలఁది= పూసి; కుసుమదామముల్= పూలమాలలు; చుట్టి= అలంకరించి; మ్రొక్కుదున్= నమస్కరిస్తాను; అరయంగన్= పరిశీలిస్తే; మహోపకారులు= ఇంత గొప్పమేలు చేసినవారు; దైవముల్= దేవతలె; కావె!= కదా!

**తాత్పర్యం:** జనమేజయరాజా! ఆ గాంధారీ ధృతరాష్ట్రుల ప్రాణస్థానాలు చీలిపోయేటట్లుగా భీముడు ఇట్లా అంటాడు; 'గుడ్డివాడి కొడుకులలో ఒక్కడు కూడా మిగలకుండా అందరినీ చంపేశాను. నా బాహువలయం అనే బోనులోకి ప్రవేశించిన ఏ రాజసింహమైనా ఎట్లా బయటపడగలదు? మూర్ఖులు కాబట్టి ఆ కౌరవులు మాతో యుద్ధానికి వచ్చారు

కాని, నా పరాక్రమం తెలిస్తే ఎదిరించేవారే కాదు. ఆ యుద్ధంలో దుర్యోధనప్రభృతు లందరినీ కూల్చిన యీ నా భుజాలకు చందనం పూసి, పూలమాలలు చుట్టి నమస్కరిస్తాను. నిజానికి ఇంత గొప్ప ఉపకారం చేసింది దేవతలే కదా!'

**విశేషం:** ధృతరాష్ట్రుడు అంధుడే అయినా దుర్యోధనాదుల మాటలను గుడ్డిగా నమ్మి ఇంతకు తెచ్చుకొన్నాడు కాబట్టి ఇక్కడ సాభిప్రాయం. 'అంధుని కొడుకులు' కావడం చేతనే దుర్యోధనాదులు కూడా అంధులై అవివేకులై ప్రాణాలమీదకు తెచ్చుకొన్నారు. 'భూరిశక్తి' అన్నపుడు భూరి అనేది తన పరాక్రమంలో గొప్పదనాన్ని చెప్తుండగా, 'త్రుంచితి' అనేది కౌరవులను 'అవలీలగా' చంపటం తెలుపుతుంది. చొచ్చిన - భూతార్థకం, ప్రవేశించడం జరిగిపోయాక - వెడలంగన్ ఆ తర్వాత కోరుకొన్నా తప్పుకోవటం అనేది మాత్రం వాళ్ళ చేతులలో లేదు. రోట్లో తల దూర్చాక చేసేదేం లేదు. త్రుంచితిన్ - అనే ఉత్తమపురుషైకవచనక్రియ, అట్లాగే 'నన్ను నెఱిఁగిన దుర్యోధనాదుల తెగటార్చినట్టి నాదు దోర్దండములు' మొదలైన మాటలో అస్మదర్థం - భీముడి వికత్థనత్వానికీ, ధృతరాష్ట్రుడిపై కోపతీవ్రతకీ నిదర్శనాలు. అంధుని మొదలుగా ఇందులో మాటలన్నీ గాంధారీ ధృతరాష్ట్రులకు మర్మభేదకాలే. మద్బాహుపంజరము చొచ్చిన - వెడలంగవచ్చునే' అనేది ధృతరాష్ట్రుడు తన బాహు పంజరంలో చంపుదామనుకున్నా తాను (భీముడు) వెడలివచ్చిన విషయాన్ని స్మరింపజేస్తూ తన సామర్థ్యంలో ధృతరాష్ట్రుడి అసమర్థతను (వెంగలితనం) ఎత్తి చూపుతుంది. ఈ మహోపకారం దేవతలు చేసిందే అనడం ఈ అంశాన్ని ప్రధానంగా ఉద్దేశించి ఉండవచ్చును. భీముడు బ్రతికి బయటపడ్డ దందువలననే కదా! చివర్లో ఆఖరిఘట్టమూ భీముడికి గుర్తు వచ్చింది.

**వ. దీని ధర్మనందనుండును ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు; కవ లొక్కొక్క మాఱిమ్మాటలు విని సంతసిల్లుదురు; ధర్మనందను తెఱం గెఱుంగుటంజేసి పుయిలోడి తా రేమియు నాడరు; ధృతరాష్ట్రగాంధారులుం గాలపర్యాయంబు గని డెందంబులు గంద నూరకుండుదు; రట్టిభంగిఁ బంచదశవత్స రంబులు చనియె నంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం గూర్చి ధర్మనందను రావించి; యతండు వినుచుండ గద్గదకంఠుం డగుచు వారలతోడ. 20**

**ప్రతిపదార్థం:** దీనిన్= భీముడు ధృతరాష్ట్రగాంధారులు నొచ్చుకొనేటట్లుగా మాటాడటం; ధర్మనందనుండును= ధర్మరాజూ; ధనంజయుండునున్= అర్జునుడూ; కుంతియున్= కుంతీ; ద్రౌపదియున్= ద్రౌపదీ; ఎఱుంగరు= తెలియరు; ఈ+మాటలు= భీముడి ఈ పలుకులు; ఒక్కొక్కమారు= అపుడప్పుడూ; విని= ఆలకించి; కవలు= నకులసహదేవులు; సంతసిల్లుదురు= సంతోషించేవారు; తారు= తాము మాత్రం; ధర్మనందను= ధర్మరాజుయొక్క; తెఱంగు= (మనస్సు) విధం; ఎఱుంగుటన్ చేసి= తెలిసినందువలన; పుయిలోడి= సంకోచంతో; ఏమియున్= ఏమీ; ఆడరు= మాటాడరు; ధృతరాష్ట్రగాంధారులున్= ధృతరాష్ట్రుడూ, గాంధారీ; (ఆ మాటలు విని) కాల పర్యాయంబు= సమయం తారుమారవటం; కని= తెలిసి; డెందంబులు= మనసులు; కందన్= కలత చెందగా; ఊరకుండుదురు= మిన్నకుండేవారు; అట్టిభంగిన్= ఆవిధంగా; పంచదశవత్సరంబులు= పదిహేను ఏండ్లు; చనియెన్= గడిచాయి; అంతన్= పనిహేనోయేడు పూర్తయినతర్వాత; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; ఆ+అంధనృపతి= ఆ (గుడ్డిరాజు) ధృతరాష్ట్రుడు; బంధుజనబులన్= చుట్టాలను; కూర్చి= సమావేశపరిచి; ధర్మనందనున్= ధర్మరాజును; రావించి= పిలిపించి; అతండు= ఆ ధర్మరాజు; వినుచున్+ఉండన్= వింటుండగా; వారలతోడన్= బంధువులతో; గద్గదకంఠుండు= డగ్గుత్తిక కలవాడు; అగుచున్= అవుతూ-(ఇట్లా అంటున్నాడని తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** భీముడు పలికేమాటలు ధర్మరాజుకూ, అర్జునుడికీ, కుంతికీ, ద్రౌపదికీ తెలియవు. నకుల సహదేవులు మాత్రం అప్పుడప్పుడూ ఆ మాటలు విన్నా, ధర్మరాజుపట్ల ఉన్న భయం వలన వారు మారు పల్కరు. గాంధారీ

ధృతరాష్ట్రులు కాలవైపరీత్యాన్ని గమనించి మనసులలో బాధపడుతూ మిన్నకుండేవారు. అట్లా పదిహేనేళ్ళు గడిచాయి. ఆ తరువాత ఒకనాడు ధృతరాష్ట్రుడు బంధువులనందరినీ సమావేశపరిచి, ధర్మజుడిని పిలిచి అతడు వింటూఉండగా, బొంగురుపోయిన గొంతుతో వారందరితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధర్మరాజు అర్జునుడు, కుంతితోపాటు, ద్రౌపది కూడా గతంలో కౌరవులవలన కలిగిన కష్టాలను మరిచిపోయి గాంధారీ ధృతరాష్ట్రులపై గౌరవంతో వ్యవహరిస్తున్నారు. అందుకే వా ళ్ళెవరూ వినకుండానే భీముడు పై విధంగా మాటాడేవాడు. కవలు ఆమోదించేవాళ్ళు కావటం చేతనే ఒక్కొక్కమారైనా భీముడి మాటలు వినగలిగారు. ధర్మనందను తెఱంగు భీముడికీ తెలిసినా పిన్నలు కావడంచేత నకులసహదేవులు ఏమైనా అనడానికి సంకోచించేవారు. స్వభావం వలననూ, ధర్మరాజుకు వెంటనే జన్మించినవాడు కావడంవలననూ భీముడు నిస్సంకోచంగా అనదలచుకొన్నమాట లనేవాడు. పరోక్షంగా నైనా ధృతరాష్ట్రుడికి కొడుకులు బతికున్నప్పటి వలె నడపటానికి ప్రయత్నించినవాడు ధర్మరాజు (14పద్యం) తేడా లే దనిపించటానికి ధర్మరాజు ప్రయత్నించినా భీముడివలన గాంధారీధృతరాష్ట్రులకు 'కాలపర్యయ' భావన రాక తప్పలేదు. అయినా 15 సంవత్సరాలు ఊరకుండటంలో వార్ధకాదులతోపాటు ధర్మరాజునడవడీ, 'చుట్టములు మెచ్చునట్లు' ఉండాలనే అభిప్రాయం కారణం. ఇపుడొకసారి తన జీవితాన్నంతా గుర్తుచేసుకొనడమూ, నగరం విడిచిపోవటం, (ఆశ్రమవాసం) అనే నిర్ణయం ప్రకటించబోతూండటం, వలన కంఠంలో గాద్గద్యం.

ధర్మరాజును రప్పించి అతడు వింటూఉండగా బంధువులకు చెపుతున్నాడు. ధర్మరాజుతో ముఖాముఖిగా చెప్పటానికి కాకుండా, తన ఆంతర్యం, యథార్థంగా పరోక్షంగా వ్యక్తం చేసినట్లుగా గూడ. గతంలో తాను పొరపాట్లు చేశానని చెపుతున్నాడు మరి.

### ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దన మనోరథంబుఁ దెలుపుట (సం.15-5-1)

**సీ.** **నాకతంబునఁ జేసి యా కౌరవులకు నా। శంబు వాటిలుట దెల్లంబు మీకు**
**జడుఁ గ్రూరు నతిలోభి జ్ఞాతి జనద్రోహ। కరు రాజుఁ జేసితిఁ గురుధరిత్రి**
**కచ్యుతు చెప్పిన యమలవాక్యంబులు। విననేరనైతి నా తనయువలని**
**ఘనతరస్నేహంబునను మొగమోటను। దగియెడుమాటలఁ దఱిమి యొత్తి**

**తే.** **యాడకుండితి; భీష్ముండు నస్త్రగురుఁడు। విదురుఁడును సంజయుండును వే విధముల**
**నాకుఁజెప్పిరి; గాంధారి నన్ను దూఱి। చెప్పె; న మ్మాట లేఁ బెడచెవుల నిడితి.** **21**

**ప్రతిపదార్థం:** నా కతంబునన్+చేసి= నా కారణంగా; ఆ కౌరవులకున్= నా పుత్రులు మొద లైన కురువంశీయులకు; నాశంబు= చేటు; పాటిలుట= సంభవించటం; మీకున్= (నా బంధువు లైన) మీ అందరికీ; తెల్లంబు= బాగా తెలిసిందే; కురుధరిత్రికిన్= కురువు అనేపేరు గల్గిన ఈ రాజ్యానికి; జడున్= (ఒకానొక) బుద్ధిహీనుడూ; క్రూరున్= దుష్ట బుద్ధీ; అతిలోభిన్= మిక్కిలిగా పరద్రవ్యాభిలాష ఉన్నవాడూ; జ్ఞాతిజనద్రోహకరున్= దాయాదులకు కీడు చేసేవాడూ అయిన దుర్యోధనుడిని; రాజున్= పాలకుడుగా; చేసితిన్= ఏర్పరిచాను; అచ్యుతు= శ్రీకృష్ణుడు; చెప్పిన= బోధించిన; అమలవాక్యంబులు= దోషం లేని (అర్థవంతములైన) మాటలు; వినన్, నేరన్, ఐతిని= ఆలకించకపోయాను; నాతనయు వలని= దుర్యోధనుని యెడ ఉన్న; ఘనతర= మిక్కిలి అధికమైన; స్నేహంబునను= ప్రేమవలనను; మొగమోటను= సంకోచంతోనూ; తఱిమి= తనమాట వినేంతవరకూ విడువకుండా; ఒత్తి= ఒత్తిడి చేసి (బలవంతంగా); తగియెడు మాటలన్= ఉచితమైన పలుకులను; ఆడక+ఉండితిన్= చెప్పలేదు; నాకున్= నాకు;

భీష్ముండున్= పితామహుడైన భీష్ముడూ; అస్త్ర గురుఁడు (ను)= పిల్లల కస్త్రవిద్య నేర్పిన ద్రోణుడూ; విదురుఁడును= విదురుడూ; సంజయుండును= సంజయుడూ, వేవిధములన్= అనేక విధాలుగా; చెప్పిరి= (కర్తవ్యం, ఉచితం) చెప్పారు; గాంధారి= నా భార్య గాంధారీ; నన్నున్= నన్ను; దూఱి= నిందిస్తూ, దృఢంగా; చెప్పెన్= మంచి ఏదో (కర్తవ్యం) గట్టిగా చెప్పింది; ఏన్= నేను; ఆ+మాటలు= వారందరి పలుకులూ; పెడచెవులన్+ఇడితిన్= నిరాదరణంతో వినిపించుకొనలేదు.

**తాత్పర్యం:** నా కారణంగానే కౌరవులు నాశనమైనారని మీకు బాగా తెలుసు. బుద్ధి లేనివాడూ, దుర్మార్గుడూ, ఇతరుల ద్రవ్యంపై అధికమైన అభిలాష ఉన్నవాడూ, దాయాదులకు కీడు చేసేవాడూ అయిన దుర్యోధనుడిని ఈ కురురాజ్యానికి రాజును చేశాను. కృష్ణుడు చెప్పినా వినలేదు, కొడుకుమీది వల్లమాలిన ప్రేమవలన వారికి మంచిని ముఖంమీద గట్టిగా చెప్పలేకపోయాను. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, సంజయుడూ చెప్పినా, గాంధారి మరీ నొక్కిచెప్పినా ఆ మాట లేవీ నేను వినిపించుకొనలేదు.

**విశేషం:** 'నా కతంబున అని గతాని కంతా తానే కారణం కావడం అనే అంశంతోటే ప్రారంభించటం ధృతరాష్ట్రుడి ఆత్మ పరిశీలనకు అర్థం. కౌరవనాశనం అనే సారాంశం చిన్న వాక్యంలో సంగ్రహంగా ముందు ప్రతిపాదించి ఆ తర్వాత అందుకు కారణాలు క్రమంగా వివరిస్తున్నాడు. అందులో ముఖ్యమైనది దుర్యోధనుడిని రాజు చేయటమే, 'రాజుఁ జేసితి' అనటంలో అది పొరపాటు అనీ, అందువలన ధర్మరాజును చేసి వుండాల్సిందనీ వ్యక్తం అవుతుంది. 'యచ్చాహం పాండు పుత్రేషు గుణవత్సు మహాత్మసు, న దత్తవాన్ శ్రియం దీప్తాం పితృపైతామహీ మిమామ్'. తెలుగులో ధృతరాష్ట్రుడీ మాటలు వాచ్యంగా తననోటిమీదుగా ఇప్పటికీ అనలేకపోయాడు. దుర్యోధనుడిలోని గుణహీనతను ప్రతిపాదిస్తూ పాండవులు గుణవంతు లనీ, (రాజ్యం వారి కివ్వవలసిందనీ) వ్యంగ్యంగా అంగీకరిస్తున్నాడు. 'రాజుఁ జేసితి కురుధరిత్రికి' అన్నపుడు కురుధరిత్రి అనేమాట పితృపైతామహీయం కాబట్టి రాజ్యం పితృపితామహక్రమప్రాప్తం' (అనే అంశం అందరికీ తెలిసిన సామాన్య విషయంగా) అని ఈ మాట మొదటే(2వ) చెప్పటం అయింది. 'రాజుఁ జేసితి 'గురుధరిత్రి' కన్నపుడు రాజుఁజేసితిఁ గురుధరిత్రికి అన్నప్పుడు గు' వర్ణాన్ని ఎట్లా స్వీకరించడం? అల్పబుద్ధి అయిన దుర్యోధనుడిని రాజు చేయగూడదు. కొంత కొడుకున కిచ్చి, కొంత భాగాని కైనా పాండవులను రాజులను చేసి ఉంటే ఇంత అనర్థం, కౌరవనాశనం ఆగిఉండేది అని భావం. ఇక్కడ దుర్యోధనుడి గుణహీనతనూ, అల్పత్వాన్నీ ప్రతిపాదించే విశేషణాలు అర్థవంతాలు - జడుడు. మందబుద్ధి. మంచిచెడులు స్వయంగా తెలియలేడు. పాండవులను ద్వేషించటంద్వారా ప్రజలకు వారిపై అభిమానం ఇనుమడింపజేశాడు. క్రూరుడు - ద్రౌపదిని పరాభవించడం వగైరా విషయాలలో క్రూరత్వం. సున్నితంగా చెప్పిన తన (ధృతరాష్ట్రుడి) మాటలు వినిపించుకొనక తనను బాధించటం వలననూ పాండవుల రాజ్యం ఆశించటంలో అయిదూళ్ళయినా ఇవ్వననటంలో అతిలోభం. ఈ లక్షణాలు లేని ధర్మరాజును రాజు చేయవలసింది. జ్ఞాతిద్రోహకరున్ అనడంలో ఇతరులకు ద్రోహకారి కాదు. ప్రజలను బాగానే చూచాడు (99 పద్యం). దాయాదిశత్రుత్వం సామాన్యమే అనే అభిప్రాయం ఉండవచ్చును. 'అచ్యుతు మాటలలో చ్యుతి= పొల్లు లేదు. 'వధ్యతా సా ద్వయం పాప సామాత్య ఇతి దుర్మతిః' అని దుర్యోధనుడిని అతడి సహచరులనీ చంపుమనే చెప్పాడు కృష్ణుడు మూలంలో. తండ్రికి ఈ మాటలు ఏ సమయంలోనైనా బాధాకరాలే. ఆ మాట లేదో ధృతరాష్ట్రుడిక్కడ చెప్పలేదు. 'నీ పుత్త్రుఁ డవినీతుఁడగుట యెఱిఁగి యెఱిఁగి వానివశంబున నేల పోయె దీవు పాండవులకు నేమి యిచ్చి తేని నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప' (ఉద్యో 3,386) అంటాడు. ఇంతకుముందు కృష్ణుడు కురుధరిత్రి మొత్తానికి దుర్యోధనుడిని రాజు చేశాననే కదా ధృతరాష్ట్రు డిక్కడ బాధ పడుతున్నది. కృష్ణు డన్నట్లు కొంతైనా పాండవుల కిచ్చి ఉన్న ట్లయితే అచ్యుతుమాటలు అమలములుగా ఆ రోజే గ్రహించి విని ఉన్నట్లయితే తన వంశానికి 'చ్యుతి' లేకుండా ఉండేది. (పాండవపక్షపాతంతో అంటున్నాడని ఆ రోజు కృష్ణుడి మాటలు నిష్కల్మషాలుగా గుర్తించలేక పోయాడు - 'అమలవాక్యంబు లని' ఇప్పుడు తలచుకొంటున్నాడు అనుభవంలోకి వచ్చాక తెలిసింది. పుత్రుడివశంలో ఆ మార్గంలో పోవద్దన్నాడు కృష్ణుడు 'నా తనయువలని ఘనతరస్నేహంబునను అనేది పూర్వంలోకే 'అన్వయిస్తుంది'.

అచ్యుతు చెప్పిన అమల వాక్యంబులు వినఁనేరనైతి నా తనయువలని ఘనతరస్నేహంబున. అందువలననే పుత్ర వశవర్తి అయినాడు. దుర్యోధనుడి కిష్టం లేకుండా పాండవులకు రాజ్యం ఇవ్వలేకపోయాడు. అట్లా అని దుర్యోధనుడిని ఇష్టపఱచనూ లేకపోయాడు. అదే చెప్పుతున్నాడు. స్నేహమునను మొగమోటను తగుమాటలు చెప్పలేకపోయాను కొడుక్కి అని. మొగమోటకు కారణం పుత్రస్నేహం. కొడుకు ఏం బాధపడతాడో అని అతడి కిష్టం లేని మాటలు చెప్పలేకపోయాడు. 'తఱిమి యొత్తి ఆడకుండితి' తగియెడు మాటలు, వెంటబడి, బలవంతంగా చెప్పాలి దుర్యోధనుడికి, మంచిమాటలు మామూలుగా మనసు కెక్కకపోవడం దుర్యోధనుడి స్వభావం అన్నమాట తనమాటలు కొడుకు వినలేదు; భీష్మాదులు చెప్పినమాటలు తాను పెడచెవినిపెట్టాడు, కారణాలు వేరుగా ఉన్నా తండ్రికొడుకులకు మంచి వినిపించుకొకపోవడం అనే లక్షణం సమానం. అయితే తనమాటలు వినలే దని కొడుకుపై తప్పుమోపకుండా, వినేటట్లుగా నేనే చెప్పలేకపోయానన్నాడు. తగిన మాటలు చెప్పినా - తఱిమి, ఒత్తి చెప్పలేదు అపుడపుడూ అనడమే తప్ప తనమాట వినేదాకా వెంటబడి చెప్పలేదు. చెప్పినపుడు వినితీరవలసినంత దృఢంగానూ చెప్పలేదు. దుర్యోధనుడి ముఖంలో కనిపించే అనిష్టభావం చూడలేక, అతడికి సమ్మతం కాని తగుమాటలు చెప్పటంలో ధృతరాష్ట్రుడికి మొగమోటమి ఘనతరస్నేహం అన్నప్పటి తరప్రత్యయం పాండవులకంటె, కృష్ణాదులు చెప్పినమాటలలో హితం కంటె అధిక స్నేహాన్ని వ్యక్తం చేస్తుంది. భీష్మాదుల ప్రస్తావనలో, పెద్దలూ, పిన్నలూ, అందరూ చివరికి పతివ్రత ఐనభార్యా కూడా నిందించి మరీ చెప్పినా వినకపోవడం తప్పయిందనుకొంటున్నాడు 'అస్త్రగురుడు' కావడంవలన కౌరవపాండవుల శస్త్రాస్త్ర సామర్థ్యం ద్రోణుడికి తెలుసు. యుద్ధం వస్తే తనకొడుకులకు నాశం తప్పదని అస్త్రగురుడిమాటలతో నైనా గ్రహించవలసింది. 'నన్ను దూఱి' గాంధారి ధృతరాష్ట్రుడిలో దూరిపోయి= ప్రవేశించి అంటే నిరంతరము చెప్పింది. వినఁనేరనైతిని, ఆడకుండితివంటి భూతార్థకాలు - అంతా అయిపోయింది. ఇపుడు బాధపడి ప్రయోజనం ఏముంది అనేభావం వ్యక్తం చేస్తున్నాయి 'పెడ చెవిని ఇడితి' అనే మాటలు తేలిపోతూ, ఆ మాటలు, ఆదరించకపోవటాన్ని ధ్వనింపచేస్తున్నాయి.

**వ. ఇత్తెఱం గంతరంగంబున శల్యం బై యున్నయది, యని చెప్పి వెండియు. 22**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగు= పైవిధంగా ఎవరు చెప్పినా వినకుండా కొడుకులను, (హితులు మొ॥) పోగొట్టుకోవడం; అంతరంగంబునన్= మనస్సులో (గుచ్చుకొని బాధించే); శల్యంబు ఐ= బాణం, అయి; ఉన్నది= నిలిచి ఉన్నది; అని చెప్పి= అని పలికి; వెండియున్= తిరిగి ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** ఈ విధం నా మనస్సులో ములుకై బాధపెట్టుతున్నది అని చెప్పి మరలా ఇట్లా అన్నాడు.

**క. సుతులు సమరమునఁ దిరుగక। మృతు లై సద్గతికిఁ జనిన మేలిమి యస్మ**
**న్మతిఁ దలఁచి వరక్షత్త్ర చ। రిత మని యప్పనికి వగవఁ బ్రీతియ కలుగున్. 23**

**ప్రతిపదార్థం:** సుతులు= కొడుకులు; సమరమునన్= యుద్ధంలో; తిరుగక= పారిపోయి తిరిగిరాకుండా; మృతులు+ఐ= చనిపోయి; సద్గతికిన్= ఉత్తమస్థితికి; చనిన మేలిమి= చేరుకున్న గొప్పతనాన్ని; అస్మద్+మతిన్= నామనస్సులో; తలఁచి= స్మరించి;- (అది), వరక్షత్త్రచరితము= శ్రేష్ఠమైన క్షత్రియుడికి తగిన లక్షణం; అని= అనుకొని; ఆ+పనికిన్=యుద్ధంలో వారి మరణానికి; వగవన్= బాధపడను; ప్రీతి+అయ= ఇంకా (ఆ పని వలన), సంతోషమే; కలుగున్= కలుగుతున్నది.

**తాత్పర్యం:** యుద్ధం కోరిన కొడుకులు క్రమంగా అపజయం కలుగుతున్నా పారిపోయి వెనుకకు రాకుండా అందరూ మరణించి ఊర్ధ్వలోకాలకు చేరుకొన్నారు. అది క్షత్రియులకు తగినదే కాబట్టి అందుకు నేను విచారించను. ఇంకా సంతోషమే పొందుతున్నాను.

**వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి, యతనితోడ. 24**

**ప్రతిపదార్థం:** అని పలికి= బంధువులతో పైవిధంగా చెప్పి; పాండవ+అగ్రజున్= పాండురాజు సుతులలో పెద్దవాడైన ధర్మరాజును; చేరన్= దగ్గరకు; పిలిచి= రమ్మని; అతని తోడన్= ధర్మరాజుతో (ఇట్లా అంటున్నాడు - తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** బంధువులతో ఈ విధంగా పలికి, ధర్మరాజును దగ్గరకి పిలిచి అతడితో ఇట్లా అంటున్నాడు.

**సీ. నీ వరయంగ సుఖావాప్తిఁ గొఱఁత లే। కుండితిఁ జనవును నుజ్జ్వలంపుఁ**
**దేజంబుఁ గలిగి వర్తించితి దానంబు లంచితములుగఁ బె క్కాచరింపఁ**
**గంటి శ్రాద్ధంబులు గాంధారిసుతులకుఁ। బలుమాఱుఁ జేసితిఁ; బరమధర్మ**
**శీల పాంచాలికిఁ జెట్ట చేసి రగణ్య। పుణ్యుండ వగు నీదు భూరిలక్ష్మి**

**తే. నపహరించి రద్దుర్యోధనాదు లట్టి; కష్టచరితులఁ బాడిమైఁ గయ్యమునన**
**నిహతులుగఁ జేసి తక్కురునికర మూర్ధ్వ; భువనగతిఁ గాంచి సుఖ మందె భూపవర్య! 25**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజులలో శ్రేష్ఠుడా!; నీవు= నీవు (ధర్మరాజు); అరయంగన్= పరిశీలింపగా; సుఖ+అవాప్తిన్= రాజ్యం మొదలైన సుఖాలు పొందటం చేత; కొఱఁత లేక= ఏలోటూ లేకుండా; ఉండితిన్= ఉన్నాను; చనవును= ప్రేమా; ఉజ్జ్వలంపు= మిక్కుటమైన; తేజంబున్= ప్రకాశమూ; కలిగి= కలిగిఉండి; వర్తించితిన్= నడుచుకొన్నాను. (అందువలననే నేను) దానంబులు= దానాలు; పెక్కు= చాలా; అంచితంబుగన్= ప్రశస్తంగా; ఆచరింపన్+కంటిన్= చేయగలిగాను; గాంధారిసుతులకున్= దుర్యోధ నాదులకు; శ్రాద్ధంబులు= శ్రాద్ధాలు; పలుమాఱున్= అనేక పర్యాయాలు; చేసితిన్= చేశాను; దుర్యోధనాదులు= దుర్యోధనుడు మొదలైన కొడుకులు; పరమ ధర్మశీల= ఉత్తమమైన న్యాయపు నడవడి గలిగిన; పాంచాలికిన్= ద్రౌపదికి; చెట్ట= కీడు; చేసిరి= చేశారు; అగణ్య= లెక్కింపరాని; పుణ్యుండవు= ధర్మములు గలిగినవాడవు; అగు= అయిన; నీదు భూరిలక్ష్మిన్= నీ గొప్ప సంపదను; దుర్యోధన+ఆదులు= దుర్యోధనుడు మున్నగువారు; అపహరించిరి= కాజేశారు; అట్టి= అటువంటి; కష్టచరితులన్= దుర్మార్గపు నడత గలిగిన దుర్యోధనాదులను; కయ్యమునన్+అ= యుద్ధంలోనే; పాడిమైన్= న్యాయంగా; నిహతులుగన్= చంపబడినవారినిగా; చేసితి(వి)= చేశావు (చంపావు); ఆ+కురునికరము= యుద్ధంలో నీవు చంపిన ఆ కౌరవ వీరు లందరూ; ఊర్ధ్వ భువన గతిన్= ఉత్తమలోకాలలో, ఉనికిని; కాంచి= పొంది; సుఖము= సుఖాన్ని; అందెన్= పొందారు.

**తాత్పర్యం:** 'రాజశ్రేష్ఠుడా! ధర్మరాజా! నీవు ఏలోటూ లేకుండా చూస్తూ ఉండగా సుఖంగా ఉన్నాను. అభిమానాన్నీ, ఇతర జనాలపై ప్రభావాన్నీ, (అధికారమూ) చూపుతూ వ్యవహరించాను. నీవలన గొప్పదానాలు చేయగలిగాను. మా పుత్రులకు శ్రాద్ధక్రియలు పలుసార్లు మేలుగా చేయగలిగాను. ఉత్తమురాలైన పాంచాలిని పరాభవించి, నీ సంపదలు కాజేసిన దుర్యోధనాదులను న్యాయంగా యుద్ధంలోనే చంపావు. వాళ్లందరూ ఉత్తమలోకాలలో సుఖంగా ఉన్నారు.

**క. కావున నేమియుఁ జేయం। గా వలవదు వారికయి యకారణ కరుణా**
**శ్రీవిలసితుఁ డగునీతో। నా విధముం జెప్పవలసె నరవరముఖ్యా! 26**

**ప్రతిపదార్థం:** నరవరముఖ్యా!= రాజ శ్రేష్ఠా! (ధర్మరాజా!); కావునన్= అందుచేత; వారికయి= పుత్రులకొరకు; ఏమియున్= ఇంక ఏ విధమైన పనులూ; చేయంగాన్= చేయటం; వలవదు= అవసరం లేదు; అకారణ= హేతువు (ప్రయోజనం మొ॥) లేకుండానే;

కరుణా(శ్రీ= దయాసంపదతో; విలసితుఁడు+అగు= (ప్రకాశిస్తూ ఉన్న; నీతోన్= నీతో; నా విధమున్= నన్ను గురించి; చెప్పవలసెన్= చెప్పవలసి ఉన్నది.

**తాత్పర్యం:** రాజా! దుర్యోధనాదులకొరకు దాన (శాద్ధాదికార్యాలు అనేకం చేశాను. కాబట్టి ఇక వారికొరకు కొత్తగా చేయవలసిం దేమీ లేదు. సహజంగా దయ గలిగిన నీతో ఇపుడు నావిషయమే చెప్పుకోవలసి ఉన్నది.

**విశేషం:** 'అకారణ కరుణా(శ్రీవిలసితుఁడు' అనే విశేషణం సాభి(ప్రాయం. ధృతరా(ష్టుడిపై చూపుతున్న అభిమానాన్నీ దుర్యోధనాదులకు పుణ్యలోక (ప్రాప్తి దానాదు లేర్పరచటాన్నీ సూచిస్తూనే తర్వాత తాను కోరబోయే అంశం కూడా తప్పక నెరవేర్చాలి అని ధృతరా(ష్టుడి అభి(ప్రాయం.

**సీ.** **ఏ కార్యమైనను నెవ్వఁడేనియుఁ జేయఁ । దొడఁగునప్పుడు విను పుడమిఱేని**
**చే ననుజ్ఞాతుఁ డై కాని తొడంగఁ గా । దట్లు గావున వార్ధకాభిలీఢ**
**మైన మదీయకాయమునకు సంస్కార । మాచరింపఁగఁ దప మాచరించు**
**పనికి భూపాల! నీయనుమతి వడయంగ । వలసి చెప్పెద రాజవంశజునకు**

**ఆ.** **సమరమరణ మొండె, విమలతపమునకుఁ । జొచ్చి యందు నిలిచి చచ్చు టొండె**
**వలయు; నస్మదీయకులముఖ్యు లిట్టుల । నడపి రనుపు నన్ను నడవి కనఘ!** **27**

**(ప్రతిపదార్థం:** భూపాల!= ఓ, (ధర్మ) రాజా!; విను= నా విధం వినవలసింది; ఎవ్వఁడు+ఏనియున్= ఎంతటివాడు అయినప్పటికీ; ఏకార్యము+ఐనను్= ఎంతటి పని అయినా గాని; చేయన్= చేయడానికి; తొడఁగు+అప్పుడు= (ప్రారంభించేటప్పుడు; పుడమిఱేనిచేన్= భూపాలకుడి చేత; అనుజ్ఞాతుఁడు+అయి= అనుమతించబడినవాడు అయితేనే; కాని= తప్ప; తొడంగన్= (ప్రారంభించడం; కాదు= కూడదు; అట్లు కావునన్= పద్ధతి అది కాబట్టి; వార్ధక+అభిలీఢము= ముసలితనం చేత ఆ(క్రమింపబడింది; ఐన= అయినటువంటి; మదీయ కాయమునకున్= నా శరీరానికి; సంస్కారము= శోధనం; ఆచరింపఁగన్= చేయటానికి; తపము= తపస్సు; ఆచరించుపనికిన్= చేయవలసిన కార్యానికి; నీ+అనుమతి= నీ అంగీకారం; పడయంగన్+వలసి= పొందవలసి ఉండటం వల్ల; చెప్పెదన్= అనుమతిమ్మని అడుగుతున్నాను; రాజవంశజునకున్= క్ష(త్రియుడికి; సమర మరణము+ఒండెన్= యుద్ధంలో మరణించడమో, లేదా; విమల తపమునకున్= (శేష్ఠమైన తపస్సునకు; చొచ్చి= పూనుకొని; అందున్= ఆ తపస్సులోనే; నిలిచి= స్థిరపడి; చచ్చుట ఒండెన్= మరణించటమో; వలయున్= అవసరం; అస్మదీయ-కుల-ముఖ్యులు= నా వంశంలో పే రున్నవాళ్ళంతా; ఇట్టులన్= ఈ విధంగానే; నడపిరి= ఆచరించారు; అనఘ!= పాప మెరుగని వాడా-ధర్మరాజా! అందువలన; నన్నున్= నన్ను; అడవికిన్= అరణ్యానికి; అనుపు= (అనుమతించి) పంపవలసింది.

**తాత్పర్యం:** (ధర్మ)రాజా! ముందుగా రాజునుండి అనుమతి తీసికొనకుండా, ఆ రాజ్యంలో వా డెవడైనా, ఎటువంటి పనైనా (ప్రారంభించకూడదు. ఇపుడు ముసలితనం నా శరీరాన్ని మింగేస్తున్నది. ఈ శరీరాన్ని శుద్ధి చేయాలంటే తపస్సు చేయాలి. అందుకు నీవు అనుమతించాలి. క్ష(త్రియుడైన వాడు యుద్ధంలోనైనా మరణించాలి. లేదా తపస్సుతోనైనా శరీరాన్ని విడిచిపెట్టాలి. (వ్యాసుడూ ఇదే మాట చెప్తాడు 48 పద్యం). ముఖ్యమైనవా ళ్ళందరూ ఈ పద్ధతినే అనుసరించారు. కాబట్టి తపస్సు చేసుకోవడం కోసం నన్ను అడవులకు పంపుము.

**క.** **రాజు గురుఁ డెల్లవారికి; । రాజోత్తమ! గురునియాజ్ఞ రంజిల్లఁగఁ బే**
**రోజం జేసిన కృత్యము । సూ జగములు రెంటియందు శోభన మిచ్చున్.** **28**

**ప్రతిపదార్థం:** రాజ+ఉత్తమ!= రాజులలో శ్రేష్ఠుడా!; (ధర్మరాజా!); ఎల్లవారికిన్= రాజ్యంలోని పిన్నలు పెద్దలు అందరికీ; రాజు= పాలకుడు; గురుఁడు= గురువు; గురుని+ఆజ్ఞ= గురువుయొక్క శాసనం; రంజిల్లఁగన్= ఒప్పుతూ ఉండగా; పేరు+ఓజన్= మిక్కిలిగా అదే క్రమంలో; చేసిన కృత్యము+చూ= చేసినటువంటి పనే సుమా; జగములు= లోకాలు; రెంటియందున్= రెండింటిలోనూ; (ఇహపరాలలో) శోభనము= ప్రకాశం, కీర్తిని; ఇచ్చున్= కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** రాజా! రాజ్యంలో వా రందరికీ రాజే పూజ్యుడు. అటువంటి రాజు అనే గురువు యొక్క ఆజ్ఞతో చేసినపని మాత్రమే ఇహపరసుఖా లందిస్తుంది.

**తే.** **ఏను గాంధారియును దపోమాననీయ। మునుల చేరువ వల్కలములు ధరించి**
**కందమూల ఫలముల నాఁకలి హరించి। నిన్ను దీవించుచుండెద మన్న నతఁడు.** **29**

**ప్రతిపదార్థం:** ఏనున్= నేనూ (ధృతరాష్ట్రుడు); గాంధారియును= గాంధారీ; తపస్= తపస్సుచేత; మాననీయ= గౌరవించదగిన; మునుల= మునుల యొక్క; చేరువన్= సమీపంలో; వల్కలములు= నారవస్త్రాలు; ధరించి= కట్టుకొని; కంద-మూల-ఫలములన్= దుంపలు, వేళ్లూ, పండ్లతో; ఆఁకలిన్= ఆకలిని; హరించి= పోగొట్టి; నిన్నున్= నిన్ను (ధర్మరాజును); దీవించుచున్+ఉండెదము= మేలు కలగాలని ఆశీర్వదిస్తూ ఉంటాము; అన్నన్= అని ధృతరాష్ట్రుడు అనగానే; అతఁడు= ఆ ధర్మరాజు- ఇట్లా అంటున్నాడు; (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** నేనూ గాంధారీ నారబట్టలు కట్టుకొని అడవులకు పోయి, అక్కడ మహర్షులను సేవిస్తూ, దుంపలూ, వేళ్ళూ, పండ్లూ తింటూ ఆకలి దీర్చుకొంటూ (సుఖంగా ఉండాలని) నిన్ను ఆశీర్వదిస్తూ ఉంటాము' అని ధృతరాష్ట్రుడనగా అతడితో ధర్మరాజు ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** 'నిన్ను దీవిస్తూ వుంటాం' అనటంలో నగరంలో లేకపోయినా ఎక్కడ ఉన్నా, ఎలా (మునివృత్తితో) ఉన్నా (ధర్మరాజు) శ్రేయస్సు కోరుతూ ఉంటాము కాబట్టి మేం అడవులకు పోవటానికి అనుమతించవచ్చని అభిప్రాయం.

**క.** **ధరణీరాజ్యము నాకును। నరవర! సౌఖ్యంబుఁ జేయునా! నీ విమ్మై**
**దురపిల్లి దుష్కరం బగు। నరణ్యవాసమున కేఁగినట్టిది యైనన్.** **30**

**ప్రతిపదార్థం:** నరవర= రాజా; నీవు= నీవు (ధృతరాష్ట్రుడు); ఈ+మైన్= ఈ విధంగా; దురపిల్లి= దుఃఖించి; దుష్కరంబు+అగు= ఆచరణానికి సాధ్యం కాని; అరణ్యవాసమునకున్= అడవులలో నివసించటానికి; ఏఁగిన+అట్టిది+అ= వెళ్ళినట్లు; ఐనన్= అయితే; ధరణీ రాజ్యము= (నీవు లేని) ఈ భూమి పాలనం; నాకున్= నాకు మాత్రం; సౌఖ్యంబున్= సుఖాన్ని; చేయునా!= కలిగిస్తుందా?

**తాత్పర్యం:** మహాత్మా! నీవు ఈ విధంగా బాధపడి కఠోరమైన అరణ్యాలలో ఉండటానికి వెళ్లితే ఈ రాజ్యం నాకు మాత్రం సుఖ మిస్తుందా?

**విశేషం:** నీవు అడవులకు వెళ్ళితే అనటంలో నీవు లేకుంటే ఈ ప్రభుత్వం గూడా నా కక్కరలేదు. ఈ రాజ్యం కంటె నీవే ఎక్కువ అని ధర్మరాజు భావం. రాజ్యము సౌఖ్యము చేయునే - ధర్మరాజే రాజయినా పెద్దవాడుగా ధృతరాష్ట్రుడు నడిపించిన ప్రకారం పోవటంలో పాలనం బరువు ధర్మజుడికి తక్కువ. అపుడు పరిపాలనం సుఖం పెద్ద దిక్కుగా (ధృతరాష్ట్రుడు) లేకపోతే తానై అన్నిటికీ బాధ్యత తీసికొనవలసివస్తే అపుడు ప్రభుత్వంవలన సుఖం ఉండదు.

ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో మాటాడుతూ మొదటగా అన్నది నీ వరయంగ సుఖావాప్తి కొఱఁత లేకుండితి - భూపవర్య! (25పద్యం). దానికి సమాధానంగా ధర్మరాజు ధరణీరాజ్యంబు నాకును సౌఖ్యంబుఁ జేయునా అన్నాడు. రాజ్యం సుఖం కాదు గాబట్టి దాని కొరకు దుర్యోధనాదులను చంపా వనరాదని తాత్పర్యం. 'దురపిల్లి'- ఆశ్రమవాస ధర్మనిర్వహణకుగాను అరణ్యవాసం పోతే అంటే ఇట్లా పాండవులు రాజ్యం వలన సుఖపడుతున్నారని భావించే వీలుంది. ఏడుస్తూ ధృతరాష్ట్రుడు పోతే నాకు సుఖం లేదు. మనస్ఫూర్తిగా నిజంగా ఆశ్రమవాసం ధృతరాష్ట్రుడు కోరటం లేదని ఆంతర్యం ధర్మరాజుకు అర్థం అయింది.

ధర్మరాజాదులు సుఖపడుతున్నారనీ, బాధపడుతూ పాండవుల సుఖం చూస్తూ వాళ్ళ దగ్గర ఉండలేకపోవటంవలననే ధృతరాష్ట్రుడు అడవులకు వెళ్ళిపోదామనుకొంటున్నాడన్నమాట. ఇమ్మై- అనేమాట ధృతరాష్ట్రుడు బాధపడుతున్న కారణాలనేకంగా నిర్దేశిస్తూ - అది ఉచితం కాదని ధ్వనింపజేస్తుంది. సౌఖ్యంబు చేయునా, ఇమ్మై దురపిల్లి- అంటే - ధరణీ రాజ్యం వలన నేను సుఖపడుతున్నానని బాధపడి - ఆకారణంగా - మా సుఖం చూడలేని కారణంగా అడవులకు పోతానంటున్నావు. 'దుష్కర' మైనా అరణ్యవాసం కోరుకొనటం వలన పాండవుల రాజ్యసుఖానికి ధృతరాష్ట్రుడు ఎంతో మిక్కుటంగా విచారిస్తున్నాడని ధర్మరాజు భావంగా గోచరిస్తుంది. ఇటువంటి తక్కువస్థాయి ఆలోచనలు గలిగినవాడుగా గుర్తిస్తూ నరవర అని సంబోధించడంలో విపరీతార్థవివక్ష ఉంది.

**తే. గూఢబుద్ధి వై నమ్మించి కురువరేణ్య ! । యే నెఱుంగక యుండంగ నిట్లు శోక**
**వనధిఁ దేలుచు నుండి తివ్వనట గంటి । నింక రాజ్యంబు నా కెట్టు లించుఁ జెపుమ. 31**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశంలో శ్రేష్ఠుడా!; గూఢ బుద్ధిని+ఐ= అసలైన ఆలోచనలను రహస్యంగా దాచుకొని; నమ్మించి= బాధలు మరచినట్లుగా, నేను (ధర్మరాజు) నమ్మేటట్లుగా నడుచుకొని; ఏను= నేను, (ధర్మరాజు); ఎఱుంగక+ ఉండంగన్= తెలిసికొనలేకపోగా; ఇట్లు= ఈ విధంగా; శోకవనధిన్= దుఃఖం అనే సముద్రంలో; తేలుచున్+ఉండితి(తి)= తేలిపోతూ ఉన్నావు; ఈ+వనట= (అందువలన), ఈ విధమైన బాధ; కంటిన్= నేనూ పొందాను; ఇంకన్= ఈ బాధ వలన; నాకున్= నాకు; రాజ్యంబు= ప్రభుత్వం; ఎట్టులు= ఏ విధంగా; ఇంచున్?= ఇష్ట మవుతుంది?; చెపుమ= నీ వే చెప్పుము.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠా! బుద్ధిని దాచుకొని నమ్మించి నాకు తెలియకుండా ఈ విధంగా శోకసముద్రంలో తేలుతూ ఉండినావు. ఈ (దాచుకొన్న) నీ బాధను ఇప్పుడు చూచినాను. ఇంక రాజ్యము నాకెట్లా ఇష్టమవుతోందో చెప్పుము.

**విశేషం:** 25గీతం, 26 పద్యాలలో ధృతరాష్ట్రుడి మాటలలోని ఆంతర్యానికి సమాధానం ధర్మరాజు ఈ పద్యం.

**ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము నా కరయంగ నీవ భూ**
**వల్లభ! నీవు కానన నివాసము గోరి చనంగ నెట్టు లే**
**నుల్లము వట్టి హస్తిపురి నుండఁగ నేర్తు? యుయుత్సుఁ బెంపు శో**
**భిల్లఁగ రాజుఁ జేయు; నినుఁ బ్రీతి యెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్. 32**

**ప్రతిపదార్థం:** భూవల్లభ!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); అరయంగన్= పరిశీలించి చూస్తే; నాకున్= నాకు; తల్లియున్= తల్లీ; తండ్రియున్= తండ్రీ; గురుఁడున్= గురువూ; దైవమున్= దైవమూ; నీవు+అ= నీవే; నీవు= అటువంటి నీవు; కానన నివాసము= అడవులలో నివసించటాన్ని; కోరి= స్వయంగా అభిలషించి; చనంగన్= వెళ్ళిపోతే; ఏన్= నేను; ఉల్లము= మనసును; పట్టి= నిగ్రహించుకొని; హస్తిపురిన్= హస్తినగరంలో; ఉండఁగన్= ఉండటానికి; ఎటులు= ఏ విధంగా; నేర్తున్= ఓర్చుకొనగలను; పెంపు= గౌరవం; శోభిల్లఁగన్= అతిశయించేవిధంగా; యుయుత్సున్= నీ కొడుకైన యుయుత్సుణ్ణి; రాజున్= ఈ రాజ్యానికి పాలకుడిగా;

చేయు(ము)= చేయవలసింది; ప్రీతి= ఇష్టం; ఎలర్పఁగన్= అధికం కాగా; నినున్= నిన్ను; కొల్చి= సేవిస్తూ; వచ్చెదన్= నీతో అరణ్యావాసానికి నేనూ వస్తాను.

**తాత్పర్యం:** ఓ రాజా! పరిశీలించి చూస్తే నాకు తల్లీ, తండ్రీ, గురువూ, దైవం అన్నీ నీవే. నా సర్వస్వం అయిన నీవు బుద్ధిపూర్వకంగా అరణ్యావాసానికి వెళ్ళితే మనసు చిక్కబట్టుకుని నే నీ రాజధానిలో ఎట్లా ఉండగలను. నీ కొడుకైన యుయుత్సుడిని ఈ రాజ్యానికి రాజును చేయుము. నేను సంతోషంగా నిన్ను సేవిస్తూ నీతోపాటు అరణ్యాలకు వస్తాను.

**విశేషం:** రాజైన ధర్మరాజు ధృతరాష్ట్రుడిని అడవులకు అనుసరించగోరుతున్నాడు. కాబట్టి తాను హస్తిపురిలో లేకుంటే రాజ్యం అరాజకం అవుతుంది. అట్లా కాకూడదు కాబట్టి ముందుగా వేరే రాజుని ఏర్పరిచే విషయం ప్రస్తావించటం రాజనీతిజ్ఞత. అయితే యుయుత్సుడిని రాజు చేయు మనడం విశేషం. తన కొడుకులను చంపి ధర్మరాజు రాజయ్యాడని ధృతరాష్ట్రుడు బాధపడుతున్నట్లుగా అతని మాటలలో గూఢంగా ఉన్న అంశం ధర్మరాజు గ్రహించాడు. కాబట్టే ధృతరాష్ట్రుడికి కొడుకైన యుయుత్సుడిని రాజు చేయు మంటున్నాడు. తన సొంత కొడుకే రాజు అయితే ధృతరాష్ట్రుడికి కొంత బాధ తగ్గుతుంది. పాండవులు పరాయి వాళ్ళనుకొంటున్నాడు ధృతరాష్ట్రుడు. పెంపు శోభిల్లఁగ - యుయుత్సుడిని రాజు చేస్తే యుయుత్సుడికే కాక ధృతరాష్ట్రుడు తనకు (తన కొడుకు రాజైనందు వలన) పెంపు శోభిల్లుతుందని భావిస్తాడు. ధర్మరాజు రాజవటం వలన తన పెంపు పోయినట్లు భావిస్తున్నాడన్నమాట. వైశ్య స్త్రీ వలన పుట్టినా రాజును చేస్తే యుయుత్సుడికి (లేని) పెంపు శోభిల్లుతుంది. మేం రాజ్యం సంపాదించుకొన్నాం. నీవు ఇవ్వలేదు కాబట్టి యుయుత్సుడు అట్లా సంపాదించలేడు. నీవే అతడిని రాజును చేయాలి అని ధృతరాష్ట్రుడి కొడుకు అసామర్థ్యం సూచన. రాజ్యార్హత లేనివాడు కావటం వలననూ, ఇలాగే ప్రీతి యెలర్పఁగ - నీకు (ధృతరాష్ట్రుడికి) సంతోషం కలిగేటట్లుగా నీకు సేవచేస్తూ అడవులకు వస్తానని ధర్మరాజు భావం. యుయుత్సుడిని రాజును చేసిన తర్వాత కూడా అరణ్యావాసం చేయాలని నీవనుకుంటే (అప్పటికీ పాండవులు రాజధానిలో సుఖపడతా రేమో నన్నే బాధ ఉండి 'అహం వనం గమిష్యామి, భవా న్రాజ్యం ప్రశాస్త్విదమ్' నేనే అడవులకు పోతే నీవు రాజ్యం చేసుకోమనడం ధృతరాష్ట్రుడి దోషం మరీ ఎక్కువ చేస్తుంది. అందుకే తిక్కన ధృతరాష్ట్రుడితో అరణ్యానికి వస్తా ననిపించాడు. ఇక్కడ కూడా అప్పుడు నేనూ అడవులకు వస్తా నంటాడు ధర్మరాజు.

**క.** **అతఁ డౌరసుండు నీ కీ। క్షితి కొడయుఁడు దుర్యశంబుచేఁ గుందుట భూ**
**పతివర! కని కని మీ రి। ట్లతి మాత్రము చేయఁదగునె యక్కట నాకున్?** **33**

**ప్రతిపదార్థం:** భూపతివర!= రాజులలో శ్రేష్ఠుడ వైన ధృతరాష్ట్రా!; అతఁడు= ఆ యుయుత్సుడు; నీకున్= నీకు; ఔరసుండు= ధర్మపత్నియందు పుట్టినవాడు; ఈక్షితికిన్= ఈ కురురాజ్యానికి; ఒడయుఁడు= యజమానుడు; దుర్యశంబుచేన్= (కౌరవులను) చంపటం అనే అపకీర్తి చేత; కుందుట= నేను బాధపడుతూ ఉండడం; కని కని= బాగా చూచి కూడా; అక్కట= అయ్యో; నాకున్= నాకు; మీరు= మీరు (గాంధారీ ధృతరాష్ట్రులు); ఇట్లు= ఈ విధంగా; అతిమాత్రము= (ఆ దుఃఖాన్ని) ఇంకా అధికం; చేయన్+తగునె?= చేయటం ఒప్పుతుందా?

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడా! ఆ యుయుత్సుడు నీకు ధర్మపత్ని యందు పుట్టినవాడే కాబట్టి ఈ కౌరవరాజ్యానికి అతడే రాజు. ఇప్పటికీ బంధువినాశాదులవలన అపకీర్తితో, విచారిస్తుండటం కళ్లారా చూచి కూడా ఇంకా నాదుఃఖాన్ని అధికం చేయటం సమంజసమేనా?

**సీ.** **నీవు రాజవు గాక నీ కేను రాజనే? । గురుని మహారాజుఁ గురువరేణ్యు**
**నిటు చేయు మని పంప నే నొడయండనే? । దుర్యోధనాదుల దుష్కృతములు**
**నా మదిలో నిల్ప, నేమును వారును । విధిమోహమున నైన విరస భావ**
**మావహిల్లినఁ బుట్టె నంతలు పనులు; గాం । ధారియు గొంతియు గారవమున**

**ఆ.** **నాకు నొక్కరూప; మీకుఁ గాననవాస । మెల్ల భంగిఁ గలుగు నేని యేనుఁ**
**దగిలి తోన వత్తుఁ దగుమాటగా నాటఁ గాదు నాదుహృదయగతియు నిట్ల.** **34**

**ప్రతిపదార్థం:** రాజవు= ఈ రాజ్యానికీ, నాకూ రాజువి; నీవు= నీవే; కాక= అంతే కాని; నీకున్= నీకు; ఏను= నేను; రాజనే?= రాజునా?; గురునిన్= గురువు; మహారాజున్= చక్రవర్తిని; కురువరేణ్యున్= కురువంశంలో శ్రేష్ఠుడూ అయిన నిన్ను; ఇటు= ఈ విధంగా; చేయుము= చేయవలసింది; అని= అనే తీరుగా; పంపన్= ఆజ్ఞ చేయటానికి; నేను= నేను; ఒడయండనే?= ఏలికనా?; దుర్యోధనాదుల= దుర్యోధనుడు మొదలైన వారి (నీ కొడుకుల); దుష్కృతములు= చెడు పనులు; నా మదిలోన్= నా మనస్సులో, నిల్పన్= ఉంచుకోలేదు (మరిచాను); ఏమును= మేమూ (పాండవులు); వారును= దుర్యోధనాదులూ; విధిమోహమునన్= బ్రహ్మదేవుడు కల్పించిన అజ్ఞానం వలన; ఐన= పుట్టిన; విరసభావము= ద్వేషం; ఆవహిల్లినన్= ఆవరించటంవలన; అంతలు పనులు= అటువంటి దుష్కృతములు; పుట్టెన్= సంభవించాయి; నాకున్= నాకు; గారవమునన్= ఆదరం విషయంలో; గాంధారియున్= గాంధారీ; గొంతియున్= కుంతీదేవీ; ఒక్కరూపు+అ= ఒకటే; మీకున్= అటువంటి మీ యిద్దరికి; ఎల్ల భంగిన్= అన్ని విధాలుగానూ; కానన వాసము= అడవులలో ఉండడం; కలుగున్+ఏని= సంభవించే పక్షంలో; ఏనున్= నేను కూడా; తగిలి= వెన్నంటి; తోన్+అ= మీతో కలిసే; వత్తున్= అడవులకు వస్తాను; తగు మాటగాన్= మీ మాటలకుబదులుగా, ఆటన్+కాదు= పలుకుటకాదు; నాదు హృదయగతియున్= నా మనసులో ఉన్నది కూడా; ఇట్లు+అ= ఇంతే.

**తాత్పర్యం:** నువ్వే (నాకూ, అందరికీ) రాజువి కాని నీకు నేను రాజును కాదు. గురువువీ, మహారాజువీ, వంశశ్రేష్ఠుడివీ అయిన నిన్ను ఇట్లా చేయు మని ఆజ్ఞాపించటానికి నేను అధికారిని కాదు. నీ కొడుకులు చేసిన కీడు పనులు నేను మనసులో పెట్టుకొనలేదు (మరిచేపోయాను). విధి వలన అజ్ఞానంతో ద్వేషం ఏర్పడి అటువంటి కీడు పనులు జరిగాయి. నాకు గాంధారీ, కుంతీ ఇద్దరూ ఒకటే. సమానంగా గౌరవిస్తాను. అటువంటి గాంధారీ, నీవూ ఏ విధంగా నైనా అడవికి పోవడం తప్పకపోతే వెన్నంటి నేనూ మీతోపాటే వస్తాను. ఇది నిజం. సమయానికి తగినట్లు మాటాడటం కాదు. నా మనసులో ఉన్న మాట అదే.

**విశేషం:** ధృతరాష్ట్రుడు తనతో చెప్పిన మాట లన్నింటికీ సంగ్రహంగా ఇక్కడ ధర్మరాజు సమాధానం చెప్పాడు.

**క.** **పలికెద నే సత్యము నా । కిల ప్రీతిం జేయ దధిప! యీ వి ట్లయినం**
**గులము కలఁక దైవకృతం । బలఘుమతీ! విడువు శోక మరయుము నన్నున్.** **35**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; నేన్= నేను; సత్యము= యథార్థం; పలికెదన్= చెపుతున్నాను; ఈవు= నీవు; ఇట్లు+అయినన్= ఇట్లాగు అయితే; నాకున్= నాకు; ఇల= రాజ్యం; ప్రీతిన్= సంతోషాన్ని; చేయదు= కలిగించదు; అలఘుమతీ!= దొడ్డబుద్ధి కలవాడా; కులము కలఁక= మన వంశంలో ఏర్పడ్డ కలత; దైవకృతంబు= దేవుడు కల్పించిందే; శోకము= పుత్రవియోగాదులవలన పుట్టిన దుఃఖాన్ని; విడువు= విడిచిపెట్టుము; నన్నున్= నన్ను; అరయుము= కాపాడుము.

**తాత్పర్యం:** రాజా! నిజం చెపుతున్నాను. నీవు ఈ విధంగా శోకిస్తూ అరణ్యాలకు పోతే (నీవు లేని) యీ రాజ్యం వలన నాకు సుఖం లేదు. ఇంక మనకులంలో ఏర్పడ్డ కలతలు దైవం వలన కలిగినవే. దొడ్డబుద్ధి గలవాడా!. ఇక దుఃఖాన్ని విడిచిపెట్టుము, నన్ను ఉద్ధరించుము.

**విశేషం:** మొత్తం తన సమాధానం సారాన్ని ఇక్కడ ధర్మరాజు సంగ్రహంగా చెప్పుతున్నాడు. ఇక్కడినుండి ధర్మరాజు మాటలు సూటిగా అంతరార్థం ఇంకొక విధంగా లేకుండా తోస్తుంది. ఇదే సత్య మన్నమాట.

**తే. నీకు శుశ్రూష యొనరించి నృపవరేణ్య! చిత్తతాపంబు మానంగఁ జేసికొందు**
**నని తలంచు నన్ విడువంగ నగునె? యవన । తుండ నై నిన్ను వేఁడెదఁ దొఱఁగు వగలు. 36**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజులలో శ్రేష్ఠుడా!; నీకున్= నీకు; శుశ్రూష= (చెప్పిన పనులు చేస్తూ) సేవ; ఒనరించి= చేసి; ఆ విధంగా; చిత్త - తాపంబు= మనసులో చింతను; మానంగన్= అణగి పోయేటట్లుగా; చేసికొందున్= చేసుకుంటాను; అని= అనే విధంగా; తలంచు= ఆలోచించే; నన్= నన్ను; విడువంగన్= విడిచిపెట్టటం (అరణ్యాలకు వెళ్ళటం); అగునె?= ఉచితమా?; అవనతుండను= వినమ్రుడిని; ఐ= అయి (వంగి); నిన్నున్= నిన్ను; వేఁడెదన్= ప్రార్థిస్తున్నాను; వగలు= బాధలు; తొఱఁగు(ము)= విడిచిపెట్టుము:

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడి వైన ధృతరాష్ట్రుడా! నీకు సేవ చేసికొంటూ నా బాధలు మరచిపోవా లనుకొనే నన్ను విడిచి అరణ్యాలకు వెళ్ళకుము. ప్రాధేయపడుతున్నాను. నీ శోకాన్ని విడిచిపెట్టుము.

**విశేషం:** ధర్మరాజు ప్రాధేయపడడంలో ధృతరాష్ట్రుడి శోకం ధర్మరాజును చాలా బాధపెట్టినట్లు చెప్పుతుంది. ధృతరాష్ట్రుడిని తృప్తి పరచలేకపోవడంతో 15 సంవత్సరాలుగా తాను పడ్డ శ్రమంతా వృథా అయినపుడు ఈ విధంగా బాధపడటం సహజమే.

**క. అనుచు నతని చరణంబులు । తన ఫాలతలంబు చేర్చె ధర్మతనయుఁడా**
**తని గ్రుచ్చి యెత్తి కౌఁగిట । నెనయంగాఁ జేర్చి యాతఁ డిట్లను నధిపా! 37**

**ప్రతిపదార్థం:** అధిపా!= జనమేజయరాజా!; అనుచున్= పైవిధంగా అంటూనే; ధర్మతనయుఁడు= ధర్మరాజు; తన, ఫాలతలంబు= తన నుదుటి ప్రదేశాన్ని, శిరస్సును; అతని చరణంబులు= ధృతరాష్ట్రుడి పాదాలను; చేర్చెన్= చేరేటట్లు చేశాడు; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; ఆతనిన్= పాదాభివందనం చేస్తున్న ధర్మరాజును; గ్రుచ్చి= గట్టిగా పట్టుకొని; ఎత్తి= పైకి లేపి; కౌఁగిటన్= తన బాహువుల మధ్య; ఎనయంగాన్= కుదురుగా; చేర్చి= చేర్చుకొని; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! 'నీ సేవ చేస్తూ నా విచారం పోగొట్టుకొంటా' నని మొదలుగా ఆ మాటలు అంటూనే ధర్మరాజు ధృతరాష్ట్రుడి పాదాలపై తన శిరస్సు ఉంచి ప్రణామం చేశాడు. ధృతరాష్ట్రుడు ఆ ధర్మరాజును పట్టుకొని లేపి కౌగిలిలో చేర్చుకొని ఇలా అంటున్నాడు.

**తే. నీవు శుశ్రూష చిరకాలనియతిఁ జేసి । తేను వృద్ధుండ నైతి; నా కింకఁ దపము**
**వలవదయ్య? రాజును బాలివాఁడ యెవ్వ । రేమి చేసిన ఫలములయెడ నృపాల!' 38**

**ప్రతిపదార్థం:** నృపాల!= (ధర్మ) రాజా!; నీవు= నీవు; చిరకాల నియతిన్= చాలాకాలం నియమంగా; శుశ్రూష= సేవ; చేసితి(వి)= (నాకు) చేశావు; ఏను= నేను; వృద్ధుండన్= ముసలివాడిని; ఐతిన్= అయ్యాను; ఇంకను= ఈ వార్ధక్యంలో; నాకున్= నాకు; తపము= తపస్సు చేసికొనటం; వలవదు+అయ్య?= వద్దా?; ఎవ్వరు= రాజ్యంలో ప్రజలలో ఎవరైనా; ఏమి= ఏపని; చేసినన్= చేసినా; ఫలముల - ఎడన్= దానికి కలిగే ఫలితం విషయంలో; రాజును= రాజు కూడా; పాలివాఁడు+అ= భాగస్థుడే.

**తాత్పర్యం:** రాజా! నీవు చాలాకాలంగా నియమంగా నాకు శుశ్రూష చేస్తూనే వున్నావు. ఇపుడు నేను పెద్దవాణ్ణయిపోయాను. ఈ వార్ధక్యంలో నైనా తపసు చేసికొనవద్దా? ప్రజలు చేసిన ప్రతిపనికి కలిగే ఫలంలో రాజుకు కూడా భాగం ఉంటుంది.'

**వ. అని పలికి విదుర కృప సంజయుల నుద్దేశించి తనకు ముఖశోషయుం దనుగ్లానియుం గలిమి నుగ్గడించి, నాలుక తొట్రుపడ వారలతో మీర లనునయవచనంబుల నజాతశత్రుం దెలి వొందం జేయుం' డని చెప్పి డప్పి యెక్కుడు గదిరిన గాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనంద నాగ్రజుం డిట్లని పలవించె. 39**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= చెప్పి; విదుర - కృప - సంజయులన్= విదురుడినీ, కృపాచార్యుడినీ, సంజయుడినీ; ఉద్దేశించి= లక్ష్యం చేసికొని - వాళ్లతో; తనకున్= తనకు (ధృతరాష్ట్రుడికి); ముఖశోషయున్= నోరు ఎండిపోవటమూ, (నాలుక తడి ఆరటం), తను గ్లానియున్= (ఎక్కువ మాటాడటం వలన) శరీరం బలహీనమై పోవటమూ; కలిమి= ఉన్నవిషయాన్ని; ఉగ్గడించి= చెప్పి; నాలుక= నాలుక; తొట్రుపడన్= తడబడుతుండగా; వారలతోన్= ఆ విదురుడు మొదలైన వారితో-మీరలు= మీరు; అనునయవచనంబులన్= ఊరడింపు మాటలతో; అజాతశత్రున్= శత్రువులు లేనివాడిని - ధర్మరాజును; తెలివి+ఒందన్= తెలివి పొందేవిధంగా; చేయుండు= చేయండి; అని= అనే విధంగా; చెప్పి= పలికి; డప్పి= దాహం; ఎక్కుడు= అధికంగా; కదిరినన్= కలుగగా; గాంధారి తనువునన్= గాంధారి శరీరంపై; మేను= తన శరీరాన్ని, చేర్చి= ఉంచి; మూర్ఛిల్లుటయున్= సొమ్మసిల్లిపోగా; ఆ+కుంతీ నందన+అగ్రజుండు= కుంతి కొడుకులలో పెద్ద అయిన ధర్మరాజు; ఆర్తిన్= దుఃఖం; ఒంది= పొంది; ఇట్లు+అని= ఈ విధంగా; పలవించెన్= దుఃఖించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజుతో పైవిధంగా పలికిన ధృతరాష్ట్రుడు విదుర, కృప, సంజయులతో 'నాకు నాలుక తడి ఆరిపోతున్నది. శ్రమవలన శరీరం దుర్బల మవుతున్నది' అని, నాలుక తడబడుతుండగా 'ఇక మీరే ధర్మరాజుకు ఊరటపు మాటలు చెప్పి విచారం పోగొట్టండి' అని చెప్పి దాహం ఎక్కువ కావటంతో గాంధారి శరీరాన్ని ఆసరా చేసికొని స్పృహ తప్పిపోయాడు. ధర్మరాజు అది చూచి దుఃఖంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** విదురాదులు జ్ఞానులు, మాట నేర్పరులూ, పాండవులపై అభిమానం కలవారూ కాబట్టి వాళ్ళు జాగ్రత్తగా ధర్మరాజుకు అమోదయోగ్యంగా మాటాడగలరు. తనకంటె వాళ్ళ మాటలు ధర్మరాజు ఆప్తవాక్యంగా స్వీకరించనూ గలడు. కాబట్టి ధర్మరాజును సాంత్వనపరిచే బాధ్యత వారి కప్పగించాడు. ఉభయులకూ కావలసినవారు కాబట్టి తన అభిప్రాయాన్ని ధర్మరాజుకు నచ్చేటట్లుగా చెప్పుతారని. ధర్మరాజును అజాత శత్రువుగా పేర్కొనడంలో ధర్మరాజుకు తమపై శత్రుభావం ఉండదని మెచ్చుకోలూ, స్నేహంగా తమ అరణ్యవాసానికి అంగీకరించాలని సూచన. తనకు ముఖశోష, తనుగ్లానీ ఉన్నవన్నాడు. దానివలన నాలుక తొట్రుపాటూ, చివరికి మూర్ఛా కలిగాయి. కార్యకారణభావం కుదిరింది. మూర్ఛాస్థితి రావడం ముందుగా గుర్తించటం వలన గాంధారిని ఆశ్రయించాడు.

**క. కరి దశసహస్ర బలవి। స్ఫురితుఁ డగు విచిత్రవీర్యపుత్త్రుఁ డొక తలో**
**దరి నూఁత గొనియె; విధి యె। వ్వరి హీనులఁ జేయఁ డకట వక్రుం డైనన్! 40**

**ప్రతిపదార్థం:** కరి= ఏనుగులు; దశసహస్ర= పదివేలయొక్క; బల= శక్తిచే; విస్ఫురితుఁడు= వెలిగేవాడు; అగు= అయిన; విచిత్ర వీర్య పుత్త్రుఁడు= విచిత్రవీర్యుడి కొడుకు ధృతరాష్ట్రుడు; ఒక తలోదరిన్= ఒకానొకస్త్రీని; ఊఁత కొనియెన్= ఆధారం చేసికొని ఉన్నాడు; అకట!= అయ్యో!; విధి= బ్రహ్మ; వక్రుండు= వంకర; ఐనన్= అయితే; ఎవ్వరిన్= ఎంతటివారిని; హీనులన్= అల్పులుగా; చేయఁడు?

**తాత్పర్యం:** పదివేల యేనుగుల బలం కలిగిన ధృతరాష్ట్రుడు ఈనాడు ఒక అబలను ఆధారం చేసికొనవలసి వచ్చింది. బ్రహ్మ సరిగా చూడకపోతే ఎంతటి గొప్ప వాళ్ళనైనా మిక్కిలి హీనస్థితికి తెస్తాడు.

**విశేషం:** అలం; అర్థాంతరవ్యాసం. (సామాన్యంచేత విశేషం సమర్థింపబడుతుంది.)

**చ. 'అనిలజు మేని చంద మగు నాయసరూపము చూర్ణితంబు చే**
**సిన బలమాననీయుఁ డొక చేడియ నక్కట; యాశ్రయించె; నే**
**మనఁగల దవ్విధాతృ' నని యాతని కీడును మానసంబునం**
**జొనుపమి లావు పేరుకొని శోకము ధర్మజుఁ డొందె భూవరా! 41**

**ప్రతిపదార్థం:** అనిలజు= వాయుపుత్రుడి; మేని చందము= శరీరము వంటిది; అగు= అయిన; ఆయసరూపము= ఉక్కు విగ్రహాన్ని; చూర్ణితంబు= పొడి అయ్యేటట్లుగా; చేసిన= చేసినట్టి; బల-మాననీయుఁడు= శక్తిచే ప్రశంసించ దగిన ధృతరాష్ట్రుడు; అక్కట= అయ్యో; ఒక చేడియన్= ఒకానొక ఆడదాన్ని; ఆశ్రయించెన్= అండగా చేసుకున్నాడు; ఆ+విధాతృన్= (అంతటి బలవంతుడి కీ గతి కల్గించిన) ఆ బ్రహ్మనుగూర్చి; ఏమి+అనన్+కలదు?= ఏమనవచ్చు?; అని= అని పలికి; భూవరా!= ఓ జనమేజయ మహారాజా!; అతని కీడును= ధృతరాష్ట్రుడు చేసిన అపకారాన్ని; తన మానసంబునన్= తన మనస్సులో; చొనుపమి= పెట్టుకోకపోవడంచేత; ధర్మజుఁడు= ధర్మరాజు; లావు= ధృతరాష్ట్రుడి బలాన్ని; పేరుకొని= ప్రశంసిస్తూ; శోకము= దుఃఖాన్ని; ఒందెన్= పొందాడు.

**తాత్పర్యం:** 'భీముడి రూపంలో ఉన్న ఉక్కు విగ్రహాన్ని పొడిగా చేసిన బలవంతుడైన ధృతరాష్ట్రుడు ఇపుడు ఒక ఆడదానిని ఆధారం చేసికొనవలసివచ్చింది. అంతటి బలవంతుడి కింతటి హీనస్థితిని తెచ్చిన విధాతను ఏ మనగలం?' అంటూ జనమేజయా ! ధృతరాష్ట్రుడు చేసిన అపకారాన్ని మనసులో పెట్టుకొనకపోవటం వలన అతడి బలాన్ని తలచుకొని ధర్మరాజు అతడి ప్రస్తుతస్థితికి దుఃఖపడ్డాడు.

**సీ. అప్పుడు గాంధారి యల్లన ధర్మజు। తోడ 'మీతండ్రి యతుల తపంబు**
**తోడి సంతతచింతఁ గూడు దొఱంగి తా। నుండుటఁ గూర్చుండ నోప కునికి**
**నిట్లయ్యె' ననవుడు నెవ్వని కతమున। నిమ్మహాత్మున కిట్టి యెడరు పుట్టె**
**నట్టి నా మనువు నే మనఁ గల?' దంచు నా। తఁడు శీతజలము హస్తమునఁ బుచ్చి**

**ఆ. కొని యతని మోమునందు నక్కున విదిర్చు। సమయమున విదురుండును సంజయుండు**
**నఖిలభరతభార్యలు నేడ్చి రవ్విభుండు। నివిరెఁ జలికేల నా నృపు నవయవములు. 42**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ధర్మరాజు దుఃఖిస్తున్న సమయంలో; గాంధారి= ధృతరాష్ట్రుడి భార్య; ధర్మజుతోడన్= ధర్మరాజుతో; అల్లనన్= మెల్లగా; (ఇట్లా అంటున్నది); మీ తండ్రి= ధృతరాష్ట్రుడు; అతుల తపంబుతోడి= సాటిలేని తపస్సుతో కూడిన; సంతత చింతన్= నిరంతరమైన ఆలోచనతో; తాను= తానుగా; కూడు= భోజనం; తొఱంగి= విడిచి; ఉండుటన్= (రోజులు గడుపుతూ) ఉండటం వలన; కూర్చుండన్= కూర్చోవడానికి; ఓపక= శక్తి చాలని; ఉనికిన్= స్థితిలో; ఇట్లు= ఈ విధంగా మూర్ఛిల్లినవాడు; అయ్యెన్= అయినాడు; అనవుడున్= అని గాంధారి చెప్పగా; అతఁడు= ఆ ధర్మరాజు; ఎవ్వని కతమునన్= ఎవరు కారణంగా; ఈ+మహాత్మునకున్= ఈ పెద్దవాడికి, (ధృతరాష్ట్రుడికి); ఇట్టి+ఎడరు= ఇటువంటి కష్టం; పుట్టెన్= కలిగిందో; అట్టి= (ధృతరాష్ట్రుడి ఈ కష్టానికి కారణమైన) అటువంటి; నా మనువున్= నా బ్రతుకు గూర్చి; ఏమి అనన్ కలదు?= చెప్పేది ఏముంది; అంచున్= అంటూ; హస్తమునన్= తన చేత్తో; శీతజలమున్= చల్లటి నీళ్ళను; పుచ్చికొని= తీసికొని; అతని= ఆ ధృతరాష్ట్రుడి; మోమునందున్= ముఖంపైన; అక్కునన్= గుండెలపైన; విదిర్చు సమయంబునన్= (విదిలించే) చల్లేటప్పుడు; విదురుండును= విదురుడూ; సంజయుండున్= సంజయుడూ; అఖిల భరత భార్యలు= ఆ భరతవంశజులందరి భార్యలూ; ఏడ్చిరి= విలపించారు; ఆ+విభుండు= ఆ ధర్మరాజు; ఆ నృపు అవయవములు= ధృతరాష్ట్రుడి శరీర భాగాలను; చలికేలన్= చల్లని నీళ్లచేతితో; నివిరెన్= నిమిరాడు.

**తాత్పర్యం:** అప్పుడు మెల్లగా గాంధారి ధర్మరాజుతో ఇట్లా అన్నది; 'మీ పెదతండ్రి గాఢ తపస్సును గురించి ఎల్లప్పుడూ ఆలోచిస్తూ తిండితినటం మానేసి ఉండటం వలన కూర్చుండలేకపోతున్నారు. అందులన ఇట్లా అయింది: ఆ మాటలు విని ధర్మరాజు 'ఈ మహాత్ముడికి నావలననే ఈ ఇబ్బంది కలిగిం'దని విచారించి చల్లని నీటిని చేతితో తీసికొని ధృతరాష్ట్రుడి ముఖంమీదా, గుండెలమీదా చిలకరించాడు. ఆ సమయంలో విదురుడూ, సంజయూడూ, భరతవంశపురాణులు కంటతడి పెట్టారు. ధర్మరాజు చల్లని చేతితో ఆ వృద్ధనృపతి శరీరాన్ని మెల్లగా నిమిరాడు.

**క. నివురంగఁ దెలిసి యతనిం। గవుఁగిటిలోఁ జేర్చి మస్తకము మూర్కొను కౌ**
**రవవృద్ధు నతఁడు నా శ్లే। ష విశేషంబున నొనర్చె సంప్రీతునిఁగన్. 43**

**ప్రతిపదార్థం:** నివురంగన్= ధర్మరాజు చల్లని చేతులతో ఒళ్ళంతా నిమరడం వలన; తెలిసి= ధృతరాష్ట్రుడికి తెలివి రాగా; (మూర్ఛనుంచి తేరుకొనగా); అతనిన్= ఆ ధర్మరాజును; కవుఁగిటిలోన్= తన కౌగిటిలో; చేర్చి= ఉంచి; మస్తకమున్= ధర్మరాజు తలను; మూర్కొను= ఆఘ్రాణిస్తున్న; కౌరవవృద్ధున్= కౌరవవంశంలో పెద్ద అయిన ధృతరాష్ట్రుడిని; అతఁడు= ఆ ధర్మరాజు; ఆశ్లేషవిశేషంబునన్= అతిశయించిన (దృఢమైన) కౌగిలితో; సంప్రీతునిఁగన్= సంతోషించినవాడిగా; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు చల్లటినీళ్ళు ముఖం మీద గుండెలమీద చల్లి, ఆ చల్లటి చేతులతో ఒళ్ళంతా నిమరటంతో ధృతరాష్ట్రుడు మూర్ఛనుంచి తేరుకొని, ధర్మరాజును కౌగిలించుకొని అతడి శిరస్సు నాఘ్రాణించాడు. అపుడు ధర్మరాజు కూడా ధృఢమైన కౌగిలితో ధృతరాష్ట్రుడిని సంతోషపెట్టాడు.

**వ. అట్లు తెలివొంది ధృతరాష్ట్రుండు ధర్మరాజుతో 'నా కెట్లునుం దపంబునకయి కాననంబునకుం బోవ వలయు' ననిన నజ్జనపతి, 'నీ వారగింపు; మప్పని మఱి చెప్పెద' నని త్రోపు మాటగాఁ బలికిన నయ్యంబికేయుండు**

**'పెక్కుమాట లాడ శక్తి లేదు; న న్నింక నలజడిఁ బెట్టకుము; తపశ్చరణంబునకు నీ యాజ్ఞ వడసి కాని కుడువ' ననియె; నయ్యవసరంబున సాత్యవతేయుండు కృపావిధేయుండై యచటికి వచ్చి సకలజనంబుల వినతులు గైకొని దీవన లిచ్చి యా ధర్మతనయు నాననం బాలోకించి. 44**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; అట్లు= ఆ విధంగా ధర్మరాజుపరిచర్యలవలన; తెలివి= జ్ఞానాన్ని; ఒంది= పొంది; ధర్మరాజుతోన్= ధర్మరాజుతో; (ఇట్లా అన్నాడు)? నాకున్= నాకు, ఎట్లునున్= ఏ విధంగా నయినా; తపంబునకయి= తపస్సు చేసికొనే నిమిత్తం; కాననంబునకున్= అరణ్యానికి; పోవ(న్) వలయున్= తప్పకుండా వెళ్ళవలసిందే; అనినన్= అనగా; ఆ+జనపతి= ఆ (ధర్మ) రాజు; నీవు= నీవు (ధృతరాష్ట్రుడు); ఆరగింపుము= భోజనం చేయవలసింది; ఆ+పని= మీరు అరణ్యాలకు వెళ్ళే పనిని గురించి; మఱి= తరువాత; చెప్పెదన్= చెప్తాను; అని= అంటూ; (త్రోపు) మాటగాన్= అవతలకు త్రోయదగిన అతనిమాటను తోసిపుచ్చేవిధంగా; ధృతరాష్ట్రుడి మాట ప్రక్కకు నెట్టి; పలికినన్= ధర్మరాజు పలుకగా; ఆ+ఆంబికేయుండు= ఆ ధృతరాష్ట్రుడు; పెక్కు మాటలు ఆడన్= ఎక్కువగా మాటాడడానికి; శక్తి= సత్తువ; లేదు= నాకు లేదు; ఇంకన్= ఇంకా; నన్నున్= నన్ను; అలజడిన్= కలవరం; పెట్టకు= పెట్టవద్దు; తపస్+చరణంబునకున్= తపస్సు ఆచరించుకొనటానికి; నీ+ఆజ్ఞ= నీ మాట; పడసి= పొంది; కాని= తప్ప; కుడువన్= భోజనం చేయను; అనియెన్= అన్నాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సాత్యవతేయుండు= సత్యవతి కొడుకు అయిన వ్యాసమహర్షి; కృపావిధేయుండు+ఐ= దయకు లోబడినవాడై (దయతో); అచటికిన్= ధృతరాష్ట్రాదుల వద్దకు; వచ్చి= వచ్చి; సకల-జనంబుల-వినతులు= అక్కడ వున్నవారి అందరిచేతా ప్రణామాలు; కైకొని= గ్రహించి; దీవనలు= వారికి ఆశీస్సులు; ఇచ్చి= కలుగజేసి; ఆ+ధర్మతనయు-ఆననంబు= ఆ ధర్మరాజు ముఖాన్ని; ఆలోకించి= చూచి (ఇట్లా అన్నాడు) అని (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు పరిచర్యలతో మూర్ఛ తేరుకొన్న ధృతరాష్ట్రుడు 'ఎలాగైనా సరే తపస్సు చేసుకొనటానికి నేను అడవికి పోవలసిందే' నన్నాడు. అపుడు ధర్మరాజు ముందు భోజనం చేయండి. ఆ విషయం తర్వాత చూద్దా' మని ధృతరాష్ట్రుడి మాటలను త్రోసి పుచ్చాడు. అపుడు 'ధృతరాష్ట్రుడు నేను ఎక్కువ మాటాడలేను. నన్ను ఇబ్బంది పెట్టకుము. (అరణ్యగమనానికి) తపస్సు చేసుకొనటానికి నీవు సెలవిచ్చే వరకు భోజనం చేయను' అన్నాడు. అటువంటి సమయంలో అక్కడికి వ్యాసమహర్షి వచ్చాడు. అక్కడ ఉన్న జనమంతా ఆయనకు వినమ్రంగా నమస్కరించారు. వ్యాసుడు వారిని దీవించాడు. ధర్మరాజు ముఖం చూసి అతడితో ఇట్లా అన్నాడు.

వ్యాసుఁడు ధృతరాష్ట్రు వనవాసంబున కనుజ్ఞ యిచ్చుట (సం.15-8-1)

**సీ. 'ఆంబికేయుఁడు చెప్పినట్టుల చేయుము। వృద్ధుఁడు నాత్మజ విరహితుండు**
**నైన యీతఁడు తప మాచరింపఁగఁ గోర। కున్నె? గాంధారి శోకోపశమము**
**తాలిమి నొదవి యిందాఁకఁ బ్రవర్తించె;। నింక నియ్యమకును నిదియ తలఁపుఁ**
**గావున నీకు నీ కార్యంబు చెప్పంగ। వచ్చితి; వీరిఁ బోనిచ్చు టొప్పు**

**తే. ననఘ! పూర్వ రాజన్యులు చనినయట్టి। సౌమ్యపథమున నీ రాజు చనుట మేలు**
**గాన నీతని కానన గమనమునకు। ని మ్మనుజ్ఞ విచారంబు లెల్లఁ దక్కి 45**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం ఎరుగని వాడా! ధర్మరాజా!; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; చెప్పిన+అట్టులు+అ= చెప్పిన ప్రకారంగానే; చేయుము= చేయవలసింది; వృద్ధుఁడు= పెద్దతనం వచ్చినవాడూ; ఆత్మజ-విరహితుండు= కొడుకులను పోగొట్టుకున్నవాడూ; ఐన ఈతఁడు= అయినటువంటి ధృతరాష్ట్రుడు; తపము= తపస్సు; ఆచరింపఁగన్= చేసుకొనాలని; కోరక+ ఉన్నె?= కోరుకోకుండా ఉంటాడా!; గాంధారి= గాంధారి కూడా; శోక+ఉపశమము= దుఃఖం యొక్క ఉపశమనాన్ని; తాలిమిన్= ఓర్పుతో; ఒదవి= పొంది; ఇందాఁకన్= ఇంతవరకూ; ప్రవర్తించెన్= నడుచుకొన్నది; ఇంకన్= ఇక పైన; ఈ+అమకునున్= ఈవిడకు (గాంధారికి) కూడా; తలఁపు= ఆలోచన; ఇది+అ= ఇదే (తపస్సు చేసికొనాలనే); కావునన్= అందుచేత; ఈకార్యంబు= ఈ పని (ఈమాట); నీకున్= నీతో; చెప్పంగన్= చెప్పటానికి; వచ్చితిన్= (నీవద్దకు) వచ్చాను; వీరిన్= ఈ గాంధారీ ధృతరాష్ట్రులను; పోన్+ఇచ్చుట= పోనివ్వటం; ఒప్పును= (నీకూ తగును) మంచిది; ఈ రాజు= ఈ ధృతరాష్ట్రుడు; పూర్వరాజన్యులు= (మనవంశంలోనూ) పూర్వులైన రాజశ్రేష్ఠులు; చనిన= వెళ్ళిన; అట్టి= అటువంటి; సౌమ్యపథమునన్= తిన్ననైన (గంతవ్యమగు), మంచిమార్గంలో; చనుట= వెళ్ళటం; మేలు= మంచిది; కానన్= అందుచేత; ఎల్లన్= సమస్తములైనటువంటి; విచారములు= బాధలూ, (ఆలోచనలు); తక్కి= విడిచిపెట్టి; ఈతని - కానన - గమనమునకున్= ఈ ధృతరాష్ట్రుడు, అడవులకు వెళ్లడానికి; అనుజ్ఞన్= అనుమతిని; ఇమ్ము= ఇవ్వవలసినది.

**తాత్పర్యం:** పాపరహితుడా! ధృతరాష్ట్రుడు కోరినట్లు చేయుము; పెద్దతనం వచ్చింది. పైగా పిల్లలు దూరమైనవాడు తపస్సు కోరుకొనటం తప్పదు. గాంధారి కూడా ఓర్పుతో ఇన్నాళ్ళూ దుఃఖం అణచుకొన్నది. ఇపుడు ఆమె కూడా భర్తతో తపస్సు చేసుకొనటమే కోరుతున్నది. అందువలన నీ కొక మాట చెప్పుదామని నేనిక్కడికి వచ్చాను. వీళ్ళను అడవులకు పోనివ్వటం మంచిది. పూర్వపు రాజులవలె చివర్లో, వీళ్ళూ అడవులకు వెళ్ళి ఉత్తమగతులను పొందటమే శ్రేయం. ఇంక నీవు ఏ విచారమూ పెట్టుకొనకుండా వీళ్ళకు అరణ్యాలకు వెళ్ళటానికి అనుమతి ఇమ్ము.

**విశేషం:** అనఘ అనే సంబోధన అనుమతి నీయకపోవటం అనే అఘం చేయవద్దని తెలుపుతుంది. యుద్ధంలో చావటమో, తపస్సుతో చావటమో అవసరమన్న ధృతరాష్ట్రుడి మాటలని (27) కొంత అనువదిస్తున్నాయి. ఇక్కడి పూర్వరాజన్యులు చనిన యట్టి సౌమ్య (సౌఖ్య అనే ముద్రిత పాఠంకంటె సౌమ్యపాఠం సందర్భోచితం) పథమున నీ రాజు చనుట మేలు అనే వ్యాసవచనాలు అన్నాడు. ధర్మరాజుకు కూడా పుత్రశోకంతో పురంలోనే అన్నపానాలు లేక కళ్ళ ఎదుట మరణించాడనటం కంటే తపశ్చర్యవలన అరణ్యాలలో (పరోక్షంగా) ప్రాణాలు విడిచాడనే పేరు ధృతరాష్ట్రుడికే కాక ధర్మరాజుకూ మేలే. 'కానన్' అందుకు - ఆ కారణంగా అనుజ్ఞ ఇమ్మంటున్నాడు వ్యాసుడు. ధృతరాష్ట్రుడక్కడ అస్మదీయకుల ముఖ్యులు, (27) అంటే వ్యాసుడిక్కడ 'పూర్వరాజన్యులు' అని సామాన్యం చేశాడు. తెలుగులో ఉన్న 'మన' (నీవూ - నేనూ) అనే అర్థం ఇచ్చే శబ్దం సంస్కృతంలోనే చెప్పవలసి వస్తే అస్మదర్థకాన్ని తొలగించి 'పూర్వ రాజన్యులు' అని సామాన్యంగా చెప్తే అది మన శబ్దార్థాన్ని తెలుపుతుంది. ధృతరాష్ట్రుడు ప్రయోగించిన అస్మచ్ఛబ్దంతో అర్థం సంకోచించుకుపోతే అది తొలగించిన వ్యాసవచనం సముచితంగా ఉభయార్థ సాధకం అయింది. పద్యంలో చివరిమాట 'విచారంబు లెల్లఁ దక్కి' 'ధర్మతనయు నాననం బాలోకించి' (44) మాటాడుతున్న వ్యాసుడికి ఇన్ని చెప్పి ముగించాడు. అపుడే (విచారం విడిచినపుడే) తన మాటలతో సారం ధర్మరాజు తెలిసికొనగలుగుతాడు.

**క. నీ వినయము భక్తియు, సం । భావనమును వీరి వగలఁ బాపఁగ శుశ్రూ**
**షావశవర్తిత నడచితి । భూవర! చిరకాల మింకఁ బోనిమ్ము తగన్. 46**

**ప్రతిపదార్థం:** భూవర!= (ధర్మ) రాజా!; నీ, వినయము(న్)= నీయొక్క, అణకువా; భక్తియు(న్)= నీ సేవా తత్పరతా; సంభావనమును= నీవు చూపే గౌరవమూ; వీరి= గాంధారీ ధృతరాష్ట్రుల యొక్క; వగలన్= బాధలను; పాపఁగన్= పోగొట్టగా,

(పోగొట్టునట్లుగా); చిరకాలము= చాలాకాలం; శుశ్రూషా - వశ - వర్తితన్= వీరు చెప్పిన ప్రకారంగా నడుచుకునే స్థితికి లోబడి ఉంటూ; నడచితి(వి)= వ్యవహరించావు; ఇంకన్= ఇక పైన; తగన్= సముచితంగా; పోన్+ఇమ్ము= వీళ్ళని, అడవికి పోనిమ్ము.

**తాత్పర్యం:** ధర్మరాజా! నీ అణకువా, భక్తీ, గౌరవమూ వీరికి అన్ని బాధల్ని పోగొట్టింది. చాలా కాలం నుండి ఈవిధంగా వీరికి శుశ్రూష చేస్తూ ఉన్నావు. ఇక వీళ్ళను అడవులకు పోనిమ్ము.

**చ. అన విని యాకురుప్రవరుఁ డమ్మునివల్లభుమోముఁ జూచి యి**
**ట్లను - మహితాత్మ! మాకు గురుఁ డన్నను ధర్మవిధోపదేష్ట య**
**న్నను బరదైవ మన్నను మనః ప్రియకార్యకలాపకర్త య**
**న్నను విను నీవ; నీదువచనంబున కడ్డము పల్కువాఁడనే?' 47**

**ప్రతిపదార్థం:** అనన్= వ్యాసమహర్షి ఆ విధంగా పలుకగా; విని= ఆలకించి; ఆ కురుప్రవరుఁడు= కురువంశంలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజు; ఆ+ముని వల్లభు= మునిశ్రేష్ఠుడైన ఆ వ్యాసుడి; మోమున్= ముఖాన్ని; చూచి= చూచి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనున్= అంటున్నాడు; మహిత+ఆత్మ= గొప్ప మనసు కలిగిన వాడా; విను= వినవలసింది; మాకున్= మా అందరికీ; గురుఁడు+అన్నను= గురువు అయినా; ధర్మ-విధా-ఉపదేష్ట అన్నను= ధర్మముయొక్క తీరును బోధించేవాడు అయినా; పరదైవము+అన్నను= సర్వోత్కృష్టమైన దేవుడు అయినా; మనస్= మనస్సుకు; ప్రియ= ఇష్టమైన (ఇష్టం కలిగించే); కార్య= పనులయొక్క; కలాప= సమూహానికి; కర్త= చేసేవాడు; అన్నను= అయినా; నీవు+అ= నీ వొక్కడివే; నీదు - వచనంబునకున్= అటువంటి నీమాటలకు; అడ్డము= వ్యతిరేకంగా; పల్కువాఁడను+ఏ= చెప్పేటంతటి వాడను కాను.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి ఆ విధంగా అనగా ధర్మరాజు వ్యాసుడి ముఖం చూస్తూ ఇట్లా అన్నాడు. 'మహానుభావా! మాకు గురు వైనా; ధర్మం చెప్పేవాడవైనా, దేవుడివైనా, మా మనసులు సంతోషించే పనులు చేసేవాడివైనా నీవే. అటువంటి నీ మాటలకు భిన్నంగా నేను ఏమీ అనగలిగినవాడిని కాదు.

**ఆ. అనిన నమ్మహాత్ముఁ డను 'రాజులకు రణ। మరణ మొండె దృఢ సమాధిఁ దనువు**
**విడుచు టొండెఁ గాక వృద్ధులై రోగ త। ల్పమునఁ జావు మేలె భరతముఖ్య!' 48**

**ప్రతిపదార్థం:** అనినన్= ధర్మరాజు ఆ విధంగా అనగా; ఆ+మహాత్ముఁడు= మహానుభావుడైన వ్యాసుడు; అనున్= ధర్మరాజుతో ఇట్లా అన్నాడు; భరతముఖ్య!= భరతవంశంలో ప్రధానుడివైన ధర్మరాజా!; రాజులకున్= క్షత్రియులకు; రణ మరణము= యుద్ధంలో తనువు చాలించటం, ఒండెన్+కాని; (లేదా) దృఢ సమాధిన్= నిశ్చలమైన తపస్సు (ఏకాగ్ర ధ్యానం)తో; తనువున్= శరీరాన్ని; విడుచుట= వదలిపెట్టటం, ఒండెన్= కాని; కాక= అంతే తప్ప; వృద్ధులు+ఐ= పెద్దవారు అయిన తర్వాత; రోగతల్పమునన్= వ్యాధులతో మంచాన; చావు= మరణించటం; మేలు+ఎ?= మంచిదా?.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనగా అతడితో వ్యాసుడు ఇట్లా అన్నాడు. 'భరతకులంలో ప్రధానుడివైన ధర్మరాజా! రాజు అయినవాడికి యుద్ధంలో సంభవించే చావో, కాకపోతే నిశ్చలమైన ధ్యానంతో కలిగే మరణమో మేలు. అంతే కాని ముసలితనం వచ్చాక రోగాలతో మంచానపడి చావటం మేలా?

**వ. అనిన విని ధర్మతనయుం డొండు పలుక వెఱచి యిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వ్యాసుడు అనగా; ధర్మతనయుండు= ధర్మరాజు; విని= ఆలించి; ఒండు= దానికి భిన్నంగా; పలుకన్= మాటాడటానికి; వెఱచి= భయపడి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వ్యాసుడట్లా అనగా విని ధర్మరాజు ఇంకొకమాట మాటాడడానికి భయపడి ఇట్లా అన్నాడు.

**క. అనఘా! యిక్కురుముఖ్యున। కనుజ్ఞ యే నిచ్చితిని మహత్తర మగు మీ**
**యనుమతియుఁ బడసెఁ జనుఁ గా। క నిజేచ్ఛను నాకు విఘ్నకరణముఁ దగునే?' 50**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; ఏన్= నేను; ఈ+కురుముఖ్యునకున్= కురువంశంలో ప్రధానుడైన ఈ ధృతరాష్ట్రుడికి; అనుజ్ఞన్= అడవులకు వెళ్లేందుకు అనుమతిని; ఇచ్చితిని= ఇచ్చేశాను; మహత్తరము= అంతకంటె గొప్పది; అగు= ఐన; మీ అనుమతియున్= తమయొక్క అంగీకారం కూడా; పడసెన్= (ఈ ధృతరాష్ట్రుడు) పొంది ఉన్నాడు; నిజ ఇచ్ఛను= తన ఇష్టప్రకారంగానే; చనున్ కాక= అడవులకు వెళ్ళుతాడు. నాకున్= నాకు; విఘ్నకరణమున్= అడ్డు పెట్టటం; తగునే?= తగదు కదా!

**తాత్పర్యం:** పాపరహితుడైన వ్యాసమహర్షీ! ఈ ధృతరాష్ట్రుడి అరణ్య గమనానికి అనుజ్ఞ ఇచ్చాను. అంతకంటె మహిమ గలిగిన మీ అనుమతి కూడా వీరికి లభించింది. కాబట్టి ఇక తన ఇష్ట ప్రకారంగానే అడవులకు వెళ్ళవచ్చును. నేను అడ్డంపడటం తగదు కదా!

**విశేషం:** ధర్మరాజుది 'అనుజ్ఞ' - ధృతరాష్ట్రుడు స్వయంగా కోరుకొన్నదానికి అడ్డుచెప్పకుండా ఉండటమే. (స్వయం ప్రవృత్తస్య అన్యస్య ప్రవృత్తి విఘాతాకరణేన ప్రవర్తనారూ పానుమతిః అనుజ్ఞ యేని - ఇచ్చితిన్ - అనుజ్ఞ మాత్రమే అయితే ఇచ్చేశాను. ఆజ్ఞలాంటి వైతే ఇచ్చే అధికారం లేదు - ఇవ్వనని తాత్పర్యం. ధర్మరాజు అనుజ్ఞ లాంఛనం. వ్యాసానుమతి మహిమాన్వితం మహత్తరం. తరప్ప్రత్యయంతో వ్యాసానుమతి ఆధిక్య సూచన, రాజానుమతి తర్వాత కులవృద్ధుగా వ్యాసుడి అనుమతి మరోవిధంగానూ మహత్తే 'నిజేచ్ఛను చనుఁ గాక, నాకు విఘ్నకరణముఁ దగునే' అనేది తెలుగునుడికారానికి సంస్కృతీకరణం.

**సీ. అనుటయుఁ బ్రియ మంది యమ్మహామౌని యమ్మ। హీశ్వరుతోఁ 'బాండుఁ డీ నృపాలు**
**గద్దియ నిడికొని క్రతువులు సేయించి। యవిరళభోగానుభవము నడపి**
**యీతని వారలఁ బ్రీతి నీక్షించి తా। శిష్యుండ పోలె సంసేవనంబు**
**భక్తిమై నొనరించెఁ; బదపడి నీవును। దిగ్విజయాదులఁ దేజమితని**

**తే. నొందునట్లుగఁ జేసితి వొకటఁ; బిదప। దాన పదుమూఁడు వర్షముల్ ధరణి యేలె;**
**నీవు శుశ్రూష యిత్తఱి నియతి నడపి। తితని మది లేదు కలఁక యొక్కింత యేని. 51**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధర్మరాజు అట్లా అనగానే; ఆ+మహామౌని= ఆ వ్యాసమహర్షి; ప్రియము+అంది= సంతోషించి; ఆ+మహీశ్వరుతోన్= ఆ (ధర్మ) రాజుతో, - ఇట్లా అన్నాడు; ఈ నృపాలున్= ఈ రాజును (ధృతరాష్ట్రుడిని); గద్దియన్= సింహాసనంపై; ఇడికొని= కూర్చుండబెట్టి; పాండుఁడు= మీ తండ్రి పాండు మహారాజు; క్రతువులు= యజ్ఞాలు; చేయించి=

ధృతరాష్ట్రుడి చేత చేయించి; అవిరళ - భోగ - అనుభవము= ఎడతెరపి లేని (నిరతరాయంగా) సుఖాలను పొందే స్థితిని; నడపి= (ధృతరాష్ట్రుడికి) ఏర్పాటు చేసి; ఈతని వారలన్= ధృతరాష్ట్రుడి మనుష్యులను; ప్రీతిన్= ప్రేమగా; ఈక్షించి= చూస్తూ; తాన్= తాను; శిష్యుండు+అ+పోలెన్= శిష్యుడే అన్నట్లుగా; భక్తిమైన్= భక్తితో; సంసేవనంబు= ఈ ధృతరాష్ట్రుడికి సేవలను; ఒనరించెన్= చేశాడు; పదపడి= తర్వాత; నీవును= నీవు కూడా; ఒకటన్= ఏకాగ్రతతో; దిగ్విజయ+ఆదులన్= రాజ్యం విస్తరింపజేయటం మొదలైన వాటివలన; ఇతనిన్= ఈ ధృతరాష్ట్రుడిని; తేజము= కీర్తి; (ప్రతాపం) ఒందునట్లుగన్= ప్రాపించే విధంగా; చేసితివి= చేశావు; పిదపన్= ఆ తరువాత; తాను+అ= తానే, స్వయంగా; పదుమూడు వర్షముల్= (పాండవులు వనవాసం చేసిన) పదమూడు సంవత్సరాలు; ధరణి= ఈ రాజ్యాన్ని; ఏలెన్= పాలించాడు; ఇత్తఱిన్= భారత యుద్ధానంతరం; శుశ్రూష= సేవ; నడపితి(వి)= చేశావు; ఇతని మదిన్= ఈ ధృతరాష్ట్రుడి మనసులో; కలఁక= విచారం; ఒక్క+ఇంత+ఏని= ఏ కొంచెం కూడా; లేదు= లేదు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అనగానే వ్యాసుడు సంతోషించి ధర్మజుడితో ఇట్లా అన్నాడు. 'మీ తండ్రి పాండురాజు ఈ ధృతరాష్ట్రుడిని సింహాసనం మీద కూర్చోబెట్టి ఇతడి చేత ఎన్నో యజ్ఞాలు చేయించాడు, నిరంతరంగా సుఖాలు అనుభవింపజేశాడు. ఇతడి బంధువులను గూడా ప్రేమగా చూశాడు. గురువుకు శిష్యుడివలె ధృతరాష్ట్రుడిని పాండురాజు భక్తితో సేవించాడు. మీ తండ్రి తర్వాత నీవు గూడా దిగ్విజయంతో రాజ్యాన్ని విస్తరింపజేసి ధృతరాష్ట్రుడి కీర్తినీ, ప్రతాపాన్నీ పెంపొందించావు. తర్వాత (మీరు) అరణ్యవాసం చేసిన పదుమూడేండ్లు (దుర్యోధనుడు రాజైనపుడు) తనే ఈ రాజ్యాన్ని పాలించాడు. భారతయుద్ధం అయి రాజయ్యాక నీవు ఎంతో నియమంగా ఇతడికి శుశ్రూష చేశావు. ఈ ధృతరాష్ట్రుడికి మనసులో గూడా కొంచెమైనా కలత లేదు.

**విశేషం:** ధృతరాష్ట్రుడి వనవాసానికి 'అనుజ్ఞ ఇచ్చితివి' అని ధర్మరాజనటం వలన వ్యాసుడు ప్రియ మందాడు. తాను వచ్చిన పని అయినట్లే. ధర్మరాజు చేత ఆ మాట అనిపించటంలో వ్యాసుడు చాల శ్రమించాడన్నమాట. ఇది ధర్మజుడికి ధృతరాష్ట్రుడిపై గల అభిమానాధిక్యాన్ని సూచిస్తుంది. 'మహత్తర మగుమీయనుమతియుఁ బడసె' అని తనను గౌరవించటంతో, ధర్మరాజు ధర్మశీలానికి 'ప్రియము' తర్వాత వీడు కొలువు మాటల వలె చెప్పినా అందులోనూ ధర్మరాజును అనునయించటం ఉన్నది. అన్నిరకాలుగా సుఖాలు అనుభవించాడు గాబట్టి ధృతరాష్ట్రుడికి 'మదిన్ కలఁక ఒక్కింత యేని లేదు.' మాటలలో చెప్పకపోయినా మనసులో లేదని అర్థం. మదిన్ ఏని= మనసులో కూడా ఏ మాత్రమూ బాధ లేదు. 'ఇతని మది లేదు' - అనటంలో 'ఇతని' శబ్దం నీకు మనసులో కలఁక ఉన్నది (ధృతరాష్ట్రుడు దుఃఖిస్తున్నాడని) కాని ధృతరాష్ట్రుడికి మాత్రం ఏమీ లేదు అందుచేత నువ్వేమీ బాధపడకు అని సూచన. నీవును దిగ్విజయాదుల - తేజ మితని నొందునట్లుగఁ జేసితి' అనటంలో ధర్మరాజు కూడా తన తండ్రి పాండురాజువలెనే తన శక్తిని ధృతరాష్ట్రుడి సౌఖ్యానికి ఉపయోగించాడని అర్థం. ధర్మరాజు రాజసూయం చేసేకాలంలో దుర్యోధనుడూ రాజే అయినా ధృతరాష్ట్రుడు తేజ మొందేటట్లుగా చెల్లిందని వ్యక్తం అవుతుంది. పరోక్షంగా రాజుగా పరిపాలనం చేస్తూ రాజులైన పాండు, తత్కుమారులచేత సేవ లందుకొంటూ తన జీవితకాలమంతా సుఖంగా గడిపాడని సారాంశం.

**క. కేవలతపః క్రియా సం సేవన తాత్పర్య మిపుడు చిత్తంబునయం**
**దావేశించినయది యీ। భూవరునకు నితని ననిచిపుచ్చు మడవికిన్।' 52**

**ప్రతిపదార్థం:** ఈ భూవరునకున్= ఈరాజు (ధృతరాష్ట్రుడి)కి; ఇపుడు= ప్రస్తుతం; చిత్తంబున+అందున్= మనసులో; కేవల= అచ్చంగా (ఇంకోభావం లేకుండా); తపస్+క్రియా= తపస్సు అనే పనిని; సంసేవన= ఆచరించడంలో; తాత్పర్యము= తత్త్వము, ఏకాగ్రత; ఆవేశించినయది= నిండివున్నది, కాబట్టి; ఇతనిన్= ధృతరాష్ట్రుడిని; అడవికిన్= అరణ్యానికి; అనిచి పుచ్చుము= అనుమతించి పంపవలసింది.

**తాత్పర్యం:** (ధర్మరాజు!) ఈ ధృతరాష్ట్రుడి కిపుడు, అచ్చంగా తపస్సు చేసుకొనటం అనే దొక్కటే మన సంతా+నిండిపోయింది. అందుచేత ఇతడిని అనుమతించి (అడవులకు) పంపవలసింది.'

**ఆ. అనిన ధర్మ తనయుఁ 'డట్టుల కా కని'। పలికెఁ దత్క్షణంబ పరమయోగి**
**వంద్యుఁ డయిన సత్యవతి కొడు కాత్మత। పోవనమున కరిగె భూపవర్య! 53**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజులలో శ్రేష్ఠుడా! (జనమేజయా!); అనిన‌న్= వ్యాసు డట్లా అనగా; ధర్మతనయుఁడు= ధర్మరాజు; అట్టులు+అ; కాక= అట్లే అగును గాక; అని= అని; పలికెన్= అన్నాడు; పరమయోగి వంద్యుఁడు అయిన= ఉత్తములైన యోగులచేత నమస్కరించదగిన; సత్యవతి కొడుకు= సత్యవతికి జన్మించినవాడైన వ్యాసమహర్షి; తత్క్షణంబు+అ= ఆ క్షణంలోనే; ఆత్మ తపోవనమునకున్= తాను, తపసు చేసుకొనే స్థలానికి; అరిగెన్= వెళ్లాడు.

**తాత్పర్యం:** జనమేజయా! ధృతరాష్ట్రుడిని అడవి కనుమతించి పంపు మని వ్యాసుడు చెప్పగా ధర్మరాజు అట్లాగే కానిమ్మన్నాడు. మహాయోగులచేత స్తుతించబడే ఆ వ్యాసుడు ఆ క్షణంలోనే తన తపోవనానికి వెళ్ళాడు.

**సీ. తదనంతరమ ధర్మతనయుండు ధృతరాష్ట్రు। తోడ నీ కెట్టుల సూడఁ బోలె**
**విదురుండుఁ గృపుఁడు నెయ్యది కృత మని విని। శ్చయ మొనరించిరి సంజయుని యు**
**యుత్సుని మనముల నొలసిన కర్తవ్య। మెద్ది దానిన చేయు టెంత యేని**
**నాకుఁ బ్రియంబు భూనాథ యానతుఁడ నై। వేఁడెద నొకటి నీ విశదబుద్ధి**

**ఆ. నేమి సేయఁదలఁచి తేని నీ వక్కట। యారగించి చేయు మయ్య!' యనుడు**
**నరిగె నా నృపాలుఁ డభ్యంతరావాస। మునకుఁ దోన సుబలతనయ సనఁగ 54**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరము+అ= వ్యాసుడు వెళ్ళిపోయిన వెంటనే; ధర్మతనయుండు= ధర్మరాజు; ధృతరాష్ట్రుతోడన్= ధృతరాష్ట్రుడితో, (ఇట్లా అన్నాడు); భూనాథ!= రాజా!; నీకున్= నీకు; చూడన్= ఆలోచనలో; ఎట్టులు= ఏవిధం; పోలెన్= తగినదని తోచిందో; విదురుండున్= విదురుడూ; కృపుఁడున్= కృపాచార్యుడూ; ఏ+అది= ఏది; కృతము= (చేయవలసిన) కార్యం; అని= అనేవిధంగా; వినిశ్చయము= దృఢమైన నిర్ణయం; ఒనరించిరి= చేశారో; సంజయుని= సంజయుడి యొక్కయు; యుయుత్సుని= యుయుత్సుడియొక్కయు; మనములన్= మనసులలో; ఒలసిన= ఉన్న (తోచిన); కర్తవ్యము= చేయవలసినపని; ఎద్ది= ఏదో; దానిన్+అ= దానినే; చేయుట= నీవు చేయటం; నాకున్= నాకు; ఎంత+ఏని= ఎంతైనా; (చాలా) ప్రియంబు= ఇష్టం; ఆనతుఁడను+ఐ= వినమ్రంగా; ఒకటి= ఒక విషయం మాత్రం; వేఁడెదన్= నిన్ను ప్రార్థిస్తున్నాను; అక్కట!= అయ్యో!; నీ విశదబుద్ధిన్= నిష్కల్మషమైన నీ మనసులో; ఏమి= ఏపని; చేయన్ తలఁచితి(వి)+ఏని= చేయదలచుకున్నప్పటికీ; నీవు= నీవు; ఆరగించి= (ముందుగా) ఆహారం తీసికొని; చేయుము+అయ్య= ఆ తర్వాతనే నీవు చేయదలచుకున్న దేదో చేయవలసింది; అనుడున్= అని ధర్మరాజు పలుకగా; ఆ నృపాలుఁడు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; తోన్+అ= తనతో కలిసి; సుబలతనయ= సుబలుడి కూతురైన గాంధారి; చనఁగన్= వెళ్ళగా; అభ్యంతర+ఆవాసమునకున్= లోపలి మందిరంలోనికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** వ్యాసుడు వెళ్ళిపోయాక ధర్మరాజు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'రాజా! నీకు మంచిది అనిపించింది ఏదో, విదురుడూ, కృపాచార్యుడూ ఏం చేయాలని నిర్ణయించారో, సంజయుడూ, యుయుత్సుడూ ఏం చేద్దామనుకుంటున్నారో నీవు ఆ పని చేయటం నాకు కూడా ఇష్టం. అయితే శిరసు వంచి నేను ఒకటే వేడుకొంటున్నాను.

నీవు మనసులో ఏం చేయాలనుకొన్నప్పటికీ ముందుగా భోజనం చేసి, తర్వాత ఆ పనిచేయుము. ధర్మరాజు అట్లా అనగానే ధృతరాష్ట్రుడు భార్య (గాంధారి) వెంటరాగా అభ్యంతర మందిరంలోకి వెళ్ళాడు.

**వ. ఇట్లు కురువృద్ధుండు వృద్ధసామజంబు చందంబునం జనునప్పుడు విదురుండును, యుయుత్సుండును గృపాచార్యుండును, సంజయుండును వెనుకన చని; రజ్జనపతి దివసకృత్యంబు లాచరించి భూమిసురులం బూజించి యాహారతంత్రంబు నిర్వర్తించె; గాంధారియుఁ గుంతీ ప్రముఖ భరత భార్య లనునయింప భోజనవిధి యొనర్చెం; దదనంతరంబ విదురాదులుం బాండవేయులును వనితా జనంబులుం గృతాహారులయి యా వైచిత్ర్యవీర్యుం బరివేష్టించియుండఁ, బాండవాగ్రజు నిప్పాండునృపాగ్రజుం డేకాంతస్థానంబునకుం దోడ్కొనిపోయి యతని తోడ 'సప్తాంగం బయిన రాజ్యంబు పూజ్యం బగుధర్మంబుతో నెనయ నడపుట దుష్కరంబు గావున నా యెఱిఁగినంత బోధించెద నాకర్ణింపు' మని పలికి యిట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కురువృద్ధుండు= కురువంశంలో పెద్ద అయిన ధృతరాష్ట్రుడు; వృద్ధసామజంబు= ముసలి యేనుగు; చందంబునన్= విధంగా; చను+అప్పుడు= అభ్యంతరమందిరానికి వెళ్ళేటప్పుడు; విదురుండును= విదురుడూ (తమ్ముడు); యుయుత్సుండును= యుయుత్సుడూ (కొడుకూ); కృపాచార్యుండును= కృపుడూ; సంజయుండును= సంజయుడూ; వెనుకన్+అ= వెనుకగానే; చనిరి= (ధృతరాష్ట్రుడిని అనుసరించి) వెళ్ళారు; ఆ+జనపతి= ఆ ధృతరాష్ట్ర మహారాజు; దివస కృత్యంబులు= ఆ రోజు పగలు చేయవలసిన సంధ్యాది కార్యాలను; ఆచరించి= చేసి; భూమిసురులన్= బ్రాహ్మణులను; పూజించి= అర్చించి, దానాదులతో సత్కరించి; ఆహారతంత్రంబు= భోజనవిధానం; నిర్వర్తించెన్= పూర్తిచేశాడు; గాంధారియున్= గాంధారి కూడా; కుంతీ ప్రముఖభరత భార్యలు= కుంతీదేవి మొదలైన భరతవంశస్త్రీలు; అనునయింపన్= (బ్రతిమలాడగా, ప్రార్థించగా); భోజనవిధి= భోజనం చేసే పని; ఒనర్చెన్= పూర్తిచేసింది; తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత; విదుర+ఆదులన్= విదురుడూ, యుయుత్సుడూ, కృపుడూ, మొదలైన వారున్నూ; పాండవేయులును= పాండవులూ; వనితాజనంబులున్= ఆడవాళ్ళూ; కృత ఆహారులు+అయి= భోజనం చేసి; ఆ+వైచిత్ర్యవీర్యున్= విచిత్రవీర్యుడి కొడుకైన ఆ ధృతరాష్ట్రుడిని; పరివేష్టించి ఉండన్= చుట్టుకొని ఉండగా; పాండవ+అగ్రజున్= పాండుకుమారులలో పెద్దవాడైన ధర్మరాజును; ఆ+పాండునృప+అగ్రజుండు= పాండురాజు అన్నఅయిన ధృతరాష్ట్రుడు; ఏకాంతస్థానంబునకున్= ఒంటిచోటికి; తోడ్కొనిపోయి= వెంటబెట్టుకొనిపోయి; అతనితోడన్= ధర్మరాజుతో-ఇట్లా అన్నాడు; సప్త+అంగంబు అయిన= (స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాష్ట్ర, దుర్గ, బలము అనే (ప్రకృతి-8) ఏడు అంగాలు కలిగిన; రాజ్యంబు= రాజ్యాన్ని; పూజ్యంబు అగు= పూజించదగిన; ధర్మంబుతోన్= శాస్త్రాదులలో చెప్పబడినమార్గంతో; ఎనయన్= కూర్చి; నడపుట= సాగించటం; దుష్కరంబు= చాల కష్టం; కావునన్= అందుచేత; నా+ ఎఱిఁగిన+అంత= నాకు తెలిసిన మేరకు; బోధించెదన్= రాజ్య పరిపాలనా పద్ధతిని గురించి తెలుపుతాను; ఆకర్ణింపుము= చెవి ఒగ్గి (శ్రద్ధగా) విను; అని= అని పలికి; ఇట్లు+అనియెన్= ఆ రాజ్యాంగం గురించి ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ధృతరాష్ట్రుడు ముసలి యేనుగువలె అభ్యంతర మందిరానికి భార్యతో కలసి వెళ్ళుతున్నపుడు, అతడిని వెన్నంటి, విదురుడూ, యుయుత్సుడూ, కృపుడూ, సంజయుడూ వెళ్ళారు. ధృతరాష్ట్రుడా తర్వాత ఆరోజు చేయవలసిన పగటి పనులన్నీ చేసి బ్రాహ్మణులను అర్చించి, భోజనం చేశాడు. గాంధారి కూడా కుంతి మొదలైన స్త్రీలు బతిమిలాడగా భోజనం చేసింది. ఆ తర్వాత విదురుడు, యుయుత్సుడు మొదలైనవారూ, పాండవులూ, ఆడవాళ్ళూ భోజనం చేశారు. భోజనాలు అయినతర్వాత అందరూ ధృతరాష్ట్రుడి చుట్టూచేరారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును వెంట బెట్టుకుని ఏకాంతస్థానానికి తీసికొనివెళ్ళి ఇట్లా అన్నాడు. 'ఏడు అంగాలు కలిగిన రాజ్యాన్ని ధర్మబద్ధంగా

నడపటం చాల కష్టం. ఈ పరిపాలనావిధానం నాకు తెలిసినంతవరకు చెప్పుతాను. జాగ్రత్తగా వినుము' అని రాజ్యపాలనా విధానం గురించి రాజనీతి ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజనీతి విశేషంబులు చెప్పుట (సం.15-9-7)

**సీ. 'నీవు నిచ్చలును విద్యావృద్ధజనములఁ । దగ నుపాసింపు, మర్థముల వారిఁ**
**బ్రీతులఁ జేయుము; నీతులు వా రుప । దేశింప వాని నూఁదినమనంబు**
**గలిగి నిర్వర్తింపు; కార్యంబు నింద్రియం । బుల రాజ్యతంత్రంబుఁ బోలె నరసి**
**రక్షింపు; మప్పిండు రక్షితం బైన శు । భంబులం గావించు; భావశుద్ధి**

**ఆ. ధామములును బితృపితామహక్రమసమా । గతులు విశదమతులుఁ గాఁగవలయు**
**సచివు; లతివిదగ్ధ చారులఁ బనుపుము । పరుల యాప్తజనుల భంగు లరయ. 56**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (ధర్మరాజు); నిచ్చలును= ఎల్లప్పుడూ; విద్యా వృద్ధ, జనములన్= విద్యచేత పెద్దలైనవారిని; తగన్= అర్హమైనవిధంగా; ఉపాసింపుము= సేవించు; అర్థములన్= వారు కోరిన ధనవస్తు ప్రభృతులతో; వారిన్= ఆ విద్యావృద్ధులను; ప్రీతులన్; చేయుము= ఆనందింపజేయుము; వారు= ఆ విధంగా నీ సమ్మానం చేత సంతుష్టులైనవారు; నీతులు= రాజాదులు ప్రవర్తించవలసిన విధానాన్ని - హితాన్ని; ఉపదేశింపన్= నీకు బోధించగా; వానిన్= ఆ నీతులను; ఊఁదిన మనంబు= ఆశ్రయించిన మనస్సు; కలిగి= పొంది (విద్యావృద్ధులు ఉపదేశించిన హితం-కర్తవ్యం బుద్ధితో స్థిరపరుచుకొని, తు - చ. తప్పకుండా) కార్యంబున్= చేయవలసిన పనిని; నిర్వర్తింపు= నడిపించుము (చేయవలసింది); ఇంద్రియంబులన్= జ్ఞాన, కర్మ, ఇంద్రియాలు అన్నింటినీ; రాజ్యతంత్రంబున్ పోలెన్= రాజ్యతంత్రంవలె; అరసి= జాగ్రత్తగా; రక్షింపుము= కాపాడుకొమ్ము; రక్షితంబు+ఐనన్= నిగ్రహంతో రక్షించుకొంటే; ఆ+పిండు= ఆ (రక్షించబడ్డ) ఇంద్రియ సమూహం, రాజ్యాంగాలూ; శుభంబులన్= అనేకాలైనా మేళ్ళు; కావించున్ (నీకు) కలుగ జేస్తుంది; సచివులు= మంత్రులు, (పాలనాయంత్రాంగంలో ఉన్నతోద్యోగులు); భావశుద్ధి ధామమును= మనసుశుచికి నిలయమైనవారూ, (కపటం లేని, పవిత్రమైన, మనసు కలవారు); పితృపితామహక్రమ సమాగతులు(న్)= తండ్రి, తాతలవరుసలో క్రమంగా సచివులుగా, వచ్చినవారూ; విశదమతులున్= శాంతమయిన మనసు కలవారూ; కాఁగన్ వలయు(న్)= కావాలి; పరుల= ఇతరుల యొక్క (ఇతరదేశపురాజుల); ఆప్తజనుల= తన వారియొక్క; భంగులు= నడవడికలు; అరయన్= తెలిసికొనటానికి; అతి విదగ్ధ చారులన్= మిక్కిలి నేర్పు గలిగిన వేగులను; పనుపుము= నియోగించుము (పంపించు).

**తాత్పర్యం:** ధర్మరాజా! 1. పాండిత్యంలో పెద్దలైనవారిని, నిరంతరమూ సేవించే వారిని తగు విధంగా సమ్మానించుము. దానివలన సంతోషించిన వాళ్ళు నీకు ఉపదేశించిన హితాన్ని మనసు కెక్కించుకొని ఆ ప్రకారం నీ పనులు (రాజ్యపాలనం) నిర్వహిస్తూ రాజ్యాంగం వలెనే ఇంద్రియాలను జాగ్రత్తగా అదుపులో ఉంచుకొని కాపాడుకొమ్ము. అట్లా రక్షింపబడ్డ ఇంద్రియాలు (రాజ్యాంగము) నీకు మేలు చేస్తాయి. 2. ఇంక తర్వాత మంత్రుల విషయానికి వస్తే- తండ్రితాతల కాలం నుండి క్రమంగా వస్తున్నవారినీ, శుచులూ, ఇంద్రియనిగ్రహం ఉన్న వాళ్ళనీ మాత్రమే మంత్రులుగా చేసికొమ్ము. 3. శత్రువుల, ఆప్తుల, నడవడికలు తెలిసికొనటానికి మంచినేర్పు గలిగిన చారులను ఏర్పాటుచేయుము.

**విశేషం:** అలం: ఉపమ. ఇంద్రియాలకూ రాజ్య తంత్రానికీ పోలిక. రెండింటినీ సమానంగా అదుపులో ఉంచుకొనాలి (1-61-62). రాజ్యాంగాలు ఏడూ మానవ శరీరాంగాలతో పోల్చబడ్డాయి. మంత్రులు - కన్నులు, మిత్రులు - చెవులు, దుర్గం - చేతులు,

రాష్ట్రం - పాదాలు సైన్యం - మనస్సు ఇంక రాజు - శిరస్సు. ఇట్లా రాజ్యతంత్రం అమాత్యాది అంగాలన్నీ రాజు అధీనంలో ఉండాలి. అదే విధంగా నేత్రాదులైన ఇంద్రియా లన్నీ తన అధీనంలో ఉంచుకొని వాటిని జాగ్రత్తగా నడిపిస్తే అధీనమైన రాజ్యంగంవలన రాజుకు పరిపాలనం సుఖంగా సాగినట్లు, నిగ్రహించబడిన ఇంద్రియాలవలన మేలు గలుగుతుంది. ఇట్లా అనడంలో ఇంద్రియాలు స్వాధీనం కాకపోవటంవలననే, తానూ, దుర్యోధనాదులూ అశుభం పొందవలసివచ్చిందనే అభిప్రాయం వ్యక్తం అవుతుంది. మూలంలో 'ఇంద్రియాణి చ సర్వాణి వాజివ త్పరిపాలయ, హితాయ చ భవిష్యన్తి రక్షితం ద్రవిణం యథా (9-13) సారథి గుర్రాలను తన అదుపులో ఉంచుకొన్నట్లుగా ఇంద్రియాలను నీవు అదుపులో ఉంచుకుంటే అవి దాచుకొన్న డబ్బువలె మేలు చేస్తాయంటుంది. రాజ్యతంత్రంతో పోలిక తెలుగులో విశేషం.

**క. పురరక్షణము దృఢంబుగ । నరవర! చేయంగవలయు నమ్మఁగలుగు స**
**త్పురుషుల నిడఁ దగుఁ గుడుపు ని । దుర మొదలగులోని పనుల తొడరువు లరయన్. 57**

**ప్రతిపదార్థం:** నరవర= రాజా!; పురరక్షణము= రాజధానిని శత్రువులనుండి కాపాడుకొనే పని; దృఢంబుగన్= గట్టిగా, (లోటు పాట్లు లేకుండా); చేయంగన్ వలయున్= చేయాలి; కుడుపు= భోజనం; నిదుర= నిద్ర; మొదలు+అగు= మొదలు అయినటువంటి; లోని పనుల= ఆంతరంగికాలైన పనులకు సంబంధించిన; తొడరువులు= ప్రయత్నాలను; అరయన్= చూసుకొనటానికి; నమ్మన్+ కలుగు= నమ్మదగిన; సత్ పురుషులన్= కులశీలాదులచేత ఉత్తములైన వారిని; ఇడన్ తగున్= ఏర్పరచాలి.

**తాత్పర్యం:** ధర్మరాజా! రాజధానిని రక్షించే ఏర్పాట్లు కట్టుదిట్టంగా ఉండాలి. భోజనం, నిద్ర మొదలైనటువంటి ఆంతరంగికకార్యాలను చూచుకొనటానికి నమ్మదగిన మంచి మనుష్యులను ఏర్పాటు చేసికొనాలి.

**విశేషం:** 'లోని పనులు' అనే తెలుగు అర్థవంతం, విహారమూ, మాల్యాది అలంకారమూ, మొదలైనవి లోని పనులు.

**సీ. ఆప్త వృద్ధులఁ బెట్టు మంగనాజనులసం । రక్షకు నెల్లకార్యముల మంత్రి**
**జనములతోడ విచారించి చేయంగ । వలయును; గుప్త నివాస మొండె**
**మాడువు మీఁ దొండె మాటు లేని యరణ్య । తల మొండె మంత్ర విధానమునకు**
**నర్హముల్ గేవల మైనట్టి మంత్రంబు । గోపనం బొందినఁ గురువరేణ్య!**

**ఆ. యఖిల కర్మములు ఫలావాప్తి నొప్పుఁ బం । గ్వంధజడులు బధిరు లైన నీ ర**
**హస్య భాషణములయప్పుడు చేరువ । నునికి యొప్ప దార్యవినుతచరిత! 58**

**ప్రతిపదార్థం:** కురువరేణ్యా!= కురువంశంలో శ్రేష్ఠుడా! (ధర్మరాజా)! అంగనా జనుల సంరక్షకున్= అంతఃపురస్త్రీలను కాపాడటానికి; ఆప్తవృద్ధులన్= నమ్మదగిన, (బంధువులైన) ముసలివారిని; పెట్టుము= నియోగించుము; ఎల్లకార్యములన్= రాజుగా నీవు చేయవలసిన పనులన్నీ; మంత్రి జనముల తోడన్= మంత్రులతో; విచారించి= ఆలోచన చేసి; చేయంగన్ వలయును= చేయాలి; మంత్రవిధానమునకున్= ఆలోచనకు; గుప్తనివాసము+ఒండెన్= రహస్యంగా ఉండే ఇల్లు (నాలుదిక్కులూ జాగ్రత్తగా రక్షించబడుతున్న మంత్రగృహం) గానీ; మాడువు మీఁదు+ఒండెన్= (నాలుగు దిక్కులూ తెరపిగా ఉండే) మేడ పై భాగంగానీ; మాటు లేని= (పొదలు చెట్టు మొదలైనవాటిచేత) మరుగు కాని, (చుట్టు ప్రక్కలు తెఱపిగా ఉన్న); అరణ్య తలము+ఒండెన్= అడవి గాని; అర్హముల్= తగినచోట్లు; కేవలము= ఐనట్టి (ఆ విధంగా ఆలోచన చేసి నిశ్చయింపబడిన) ప్రధానమైనటువంటి; మంత్రంబు= ఆలోచన; గోపనంబు+ఒందినన్= రహస్యంగా ఉంచబడితే; అఖిలకర్మములు= అన్ని పనులూ; ఫల+అవాప్తిన్=

ఉద్దేశించిన ప్రయోజనాన్ని పొంది; ఒప్పున్= ప్రకాశిస్తాయి; ఆర్యవినుత చరిత!= పెద్దలు ప్రశంసించే నడవడి కలిగినవాడా! (ధర్మరాజా); పంగు, అంధ, జడులు (ఐనన్)= కుంటివారైనా, గుడ్డివారైనా, తెలివితక్కువవారైనా (బుద్ధిహీనులైనా); బధిరులు+ఐనన్= చెవిటివారైనా సరే; నీ రహస్య భాషణముల+అప్పుడు= నీవు చేసే రహస్యపు సంభాషణల, ఆలోచనల సమయంలో; చేరువన్= నీ సమీపంలో; ఉనికి= ఉండటం; ఒప్పదు= మంచిది కాదు.

**తాత్పర్యం:** కురువంశంలో శ్రేష్ఠుడి వైన ధర్మరాజా! ఇక ఆడవాళ్ళ రక్షణకు ఆత్మీయు లైన ముసలివారిని నియమించుము. ఏ పని అయినా మంత్రులతో ఆలోచించి మాత్రమే చేయాలి. ఆ ఆలోచనం చేయటానికి రహస్యమందిరం గానీ, మేడ మీద బయలు ప్రదేశం గాని, మరుగులేనటువంటి అడవి ప్రదేశం గానీ తగిన ప్రదేశాలు. ఇట్లా మంత్రులతో విచారణ చేసి చివరకు నిశ్చయించిన అంశం మాత్రం రహస్యంగా ఉంచాలి. రాజ నిర్ణయం గోప్యంగా ఉంటేనే అనుకొన్న ఫలితాన్నిస్తుంది. మంత్రులు చారులు మొదలైన వారితో రహస్యాలు మాటాడేటప్పుడు కుంటివారైనా, గుడ్డివారైనా, తెలివితక్కువవారైనా చివరకు చెవిటివారైనా సరే ఎవరినీ దగ్గరకు రానీయకుము.

**క.** **విను మంత్ర భేదనమున వ। చ్చిన కీడున కనఘ! శాంతి సేయు టరిది గా**
**వున మంత్రులతో మంత్రా। వన నియమం బూఁది చెప్పవలయుం జుమ్మీ!** **59**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాప రహితుడా! (ధర్మరాజా)! విను= వినవలసింది; మంత్ర భేదనమునన్= రహస్యంగా ఉండవలసిన ఆలోచన (రాజు నిర్ణయం) బయటపడితే; వచ్చిన కీడునకున్= కలిగే అపకారానికి; శాంతి+చేయుట= ప్రతీకారం చేయటం, తొలగించటం; అరిది= ఏ విధంగానూ శక్యం కాదు; కావునన్= అందుచేత; మంత్రులతోన్= నీతో ఆలోచన చేసిన మంత్రులతో; మంత్ర+అవన, నియమంబు= ఆ ఆలోచనను రక్షించవలసిన కట్టుబాటును; ఊఁది= నొక్కి (గట్టిగా); చెప్పవలయున్+చుమ్మీ!= (నీవు) చెప్పాలి సుమా!

**తాత్పర్యం:** అనఘుడా! రాజు చేసిన నిర్ణయాలు, ఆలోచనలు బయటకు పొక్కితే గలిగే నష్టం నివారించటం ఎవ్వరివలనా కాదు. అందుచేత మంత్రాన్ని గోప్యంగా ఉంచటం అనేది నియమంగా నీ మంత్రులకు నొక్కి చెప్పుము.

**సీ.** **వ్యవహారములు శుచు లైన విద్వాంసులఁ। దోడుగఁ గొని తీర్పు; దుష్టజనుల**
**దండించునెడ వారి తప్పుల కొలఁదులు। మదిఁ దూఁచి చూచి తన్మాత్రదండ**
**మాచరింపుము; విను మాయవ్యయములు సం। క్షేపరూపంబున రేపకడలు**
**దానికి మును దేవతాపూజనము భూసు। రార్చనమును జేయు మమలబుద్ధి!**

**తే.** **ప్రొద్దు సొలంగ నెక్కినప్పుడు సమర్థ। భోజన క్రియ నిర్వహింపుము సుశీల**
**మాన్య! తదనంతరమ గంధమాల్యభూష। ణాంబరములు నిజేచ్ఛమై ననుభవింపు.** **60**

**ప్రతిపదార్థం:** శుచులు= విష్కళంకులు, (నీతిమంతులు); ఐన= అయినటువంటి; విద్వాంసులన్= పండితులను; తోడుగన్= సహాయంగా; కొని= స్వీకరించి, వ్యవహారములు= (అప్పు పుచ్చుకోవటం మొదలైనవాటిలో 18 విధాలైన) తగవులు; తీర్పు(ము)= పరిష్కరించుము; దుష్టజనుల(నె)= తప్పు కలిగిన వారిని; దండించు+ఎడన్= శిక్షించేటప్పుడు; మదిన్= నీ మనస్సులో; వారి తప్పుల కొలఁదులు= వారు చేసిన తప్పులయొక్క పరిమాణం (ఎంతటి తప్పో); తూఁచి= గణించి (తూకం వేసి); చూచి= దాన్ని

జాగ్రత్తగా పరిశీలించి; తద్ - మాత్ర దండము= ఆ తప్పుయొక్క పరిమాణానికి తగినంత శిక్ష మాత్రమే; ఆచరింపుము= విధించుము; అమలబుద్ధి!= కల్మషం లేని బుద్ధి కలవాడా! ధర్మరాజా!; వినుము= వినవలసింది; రేపకడలు= ప్రాతః కాలాలలో; సంక్షేపరూపంబునన్= సంగ్రహంగా; ఆయవ్యయములు= ఆదాయమూ, ఖర్చు (చూచుకొమ్ము); దానికిన్= ఆయవ్యయాలు చూడటానికి; ప్రాతఃకాలానికి; మును= ముందుగా; దేవతా పూజనము(న్)= ఇష్టదైవాలను అర్చించటమూ; భూసుర+అర్చనమును= బ్రాహ్మణులను పూజించటమూ; చేయుము= చేయవలసింది; చాలంగన్= మిక్కిలిగా; ప్రొద్దు= సూర్యుడు; - ఎక్కినపుడు= పైకి వచ్చినపుడు (బాగా పొద్దెక్కింతర్వాత); సమ్ అర్హ భోజనక్రియ= రాజుల కుచితమైనటువంటి భోజనకార్యాన్ని; నిర్వహింపుము= చేయవలసింది; సుశీల మాన్య!= మంచి స్వభావం చేత గౌరవించదగిన వాడా! ధర్మరాజా!; తద్+అనంతరము+అ= ఆ తర్వాతనే; నిజ+ఇచ్ఛమైన్= స్వేచ్ఛగా (నీ ఇష్టం వచ్చినట్లుగా); గంధ, మాల్య, భూషణ, అంబరములు= చందనాది గంధాలూ, పూలూ, ఆభరణాలూ, వస్త్రాలూ మొదలైన సౌఖ్యాలను; అనుభవింపు(ము)= పొందవలసింది.

**తాత్పర్యం:** శుచులూ, శాస్త్రజ్ఞులూ అయిన వారి సహాయంతో తగవులు పరిష్కరించుము. తప్పు చేసిన వారిని శిక్షించేటప్పుడు వారు చేసిన తప్పు ఎంతటిదో జాగ్రత్తగా లెక్కించి దానికి తగినంతటి శిక్ష మాత్రమే విధించుము. ఉదయం వేళలలో జమాఖర్చులు సంగ్రహంగా చూచుకోవాలి. అంతకు ముందే తెల్లవారటానికి పూర్వమే దేవతార్చనమూ, బ్రాహ్మణార్చనమూ చేయాలి. బాగా పొద్దెక్కినతర్వాత భోజనం చేయాలి. ఆ తర్వాతనే అలంకారాలు మొదలైన సుఖాలను పొందాలి.

**క. కొలు విమ్ము మాపుకడ యో। ధుల కెల్లను; సంధ్య వడ్డ దూతలనుం జా**
**రుల సంభావింపుము; రా। త్రులఁ గాంతాభోగతత్పరుఁడ వగుము నృపా! 61**

**ప్రతిపదార్థం:** నృపా!= (ధర్మ) రాజా!; యోధులకున్+ఎల్లను= యుద్ధం చేసే వారికి, (వీరభటులకు) అందరికీ; మాపుకడన్= సాయం సమయంలో; కొలువు+ఇమ్ము= కలుసుకొమ్ము; సంధ్య-వడ్డన్= సంజ పడిన తర్వాత; దూతలనున్= దూతలనూ; చారుల(న్)= వేగులనూ; సంభావింపుము= (గౌరవించుము) కలుసుకొమ్ము; రాత్రులన్= రాత్రివేళలలో; కాంతా, భోగతత్పరుఁడవు, అగుము= స్త్రీలతో సుఖాన్ని పొందుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! సాయం సమయంలో వీరులకు నిన్ను సేవించే అవకాశం ఇమ్ము. సంజ పడినతర్వాత దూతలనూ, వేగుల వాళ్ళనీ కలిసికొమ్ము. స్త్రీ సుఖాన్ని రాత్రి సమయంలో పొందుము.

**తే. ఏమి క్రొత్తగఁ బుట్టిన నించు కేని। నలసుఁడవు గాక దాని నీ వరసి తీర్పు;**
**మిది దెఱంగుగ నే ప్రొద్దు నింతవట్టు। నర్హములు కౌరవక్షితిపాగ్రగణ్య! 62**

**ప్రతిపదార్థం:** కౌరవ, +క్షితిప+అగ్రగణ్య= కురువంశపురాజులలో మొదట లెక్కించదగినవాడా, (శ్రేష్ఠుడా), (ధర్మరాజు)!; క్రొత్తగన్= వింతగా; ఏమి పుట్టినన్= ఏమి జరిగినప్పటికీ; ఇంచుక+ఏనిన్= కొంచెం కూడా; అలసుఁడవు= సోమరివి; కాక= కాకుండా; దానిన్= ఆ అంశాన్ని; నీవు= నీవు (స్వయంగా); అరసి= విచారించి; తీర్పుము= పరిష్కరించుము; ఇది+తెఱంగుగన్= ఈ విధంగా; ఇంతవట్టు= ఈ చెప్పిన, పనులన్నీ; ఏ ప్రొద్దున్= నిత్యమూ; అర్హములు= చేయదగినవి.

**తాత్పర్యం:** కౌరవ రాజులలో శ్రేష్ఠుడా! ఎంతటి దైనా వింత సంఘటన ఏర్పడితే బద్ధకించక ఏ సమయంలో నైనా సరే వెంటనే దానిని గురించి విచారణ చేసి పరిష్కారం చేయుము. ఈ విధంగా ఆయావేళలలో ఆయా పనులు ప్రతిరోజూ తప్పకుండా ఆచరిస్తూ ఉండుము.

**క. న్యాయంబుతోడ వివిధో । పాయంబుల నర్థముల నుపార్జింపుము భూ**
**నాయక రాజ్య విఘాతము । సేయు జనుల నెఱిఁగి చంపఁ జెఱుపన వలయున్. 63**

**ప్రతిపదార్థం:** భూనాయక!= (ధర్మ) రాజా!; అర్థములన్= అనేకవిధాలైన సంపదలను; వివిధ ఉపాయంబులన్= రకరకాల మార్గాలలో; న్యాయంబుతోడన్= ధర్మమార్గంలో; ఉపార్జింపుము= సంపాదించుము; రాజ్యవిఘాతము= ప్రభుత్వానికి అడ్డంకులు చేసే; జనులన్= కలిగించే వారిని; ఎఱిఁగి= తెలిసికొని; చంపన్= చంపటమో, చెఱుపన్+అ= చెడగొట్టటమో; తప్పక వలయున్= అవసరం.

**తాత్పర్యం:** రాజా! పలువిధాలైన మార్గాలలో సంపదలను న్యాయంగా సంపాదించుము. ప్రభుత్వానికి అంతరాయం కలిగించే వారిని కనుగొని వారిని చంపివేయటమో లేదా వారి ప్రయత్నాలను నిర్మూలించటమో, తప్పనిసరిగా చేయాలి.

**క. పనులయెడ మేలు గాంచిన । మనుగడ యగ్గలము చేసి మన్నింపుము రా**
**జనయజ్ఞ! భృత్యకోటిం । గొనియాడుము సేఁతపేరు క్రుచ్చి కొలువునన్. 64**

**ప్రతిపదార్థం:** రాజనయజ్ఞ!= రాజధర్మం(నీతి) తెలిసినవాడా! (ధర్మరాజా)!; పనుల+ఎడన్= రాజకార్యాలలో; మేలు= నేర్పును; కాంచినన్= చూస్తే (చూపించిన అటువంటి భృత్యుల); మనుగడ= జీవనం; అగ్గలము చేసి= ఉన్నతంగా ఏర్పాటు చేసి; మన్నింపుము= వారిని గౌరవించుము; కొలువునన్= సభలో; చేఁత= భృత్యులు నేర్పుగా చేసిన ఆ పనిని; పేరు= వారి పేరూ; క్రుచ్చి= పేర్కొని; భృత్యకోటిన్= ఆసేవకులను; కొనియాడుము= ప్రశంసించుము.

**తాత్పర్యం:** రాజనీతిజ్ఞుడి వైన ధర్మరాజా! రాజకార్యాలలో తమనేర్పును ప్రదర్శించిన భృత్యకోటికి, వారి బ్రతుకు ఉన్నతంగా నడిచేటట్లుగా వారిని సత్కరించుము. వారు చేసిన పనులూ, వారిపేరూ సభలో ప్రత్యేకంగా ప్రస్తావించి ప్రశంసించుము.

**క. నీ వలనను భక్తిస్నే । హావేశము గలిగి శూరుఁడై యలజడికిం**
**దా విసువని సత్కులజుం । గావింపుము సైన్యవిభునిగాఁ గురుముఖ్యా! 65**

**ప్రతిపదార్థం:** కురుముఖ్యా!= కురువంశంలో ప్రధానుడా! (ధర్మరాజా!); నీవలనను= నీపై; భక్తి, స్నేహ, ఆవేశము= సేవాభావమూ, ప్రేమా, ఆధిక్యం; కలిగి= ఉండి; శూరుఁడు+ఐ= పరాక్రమవంతుడై; తాన్= తాను (స్వయంగా); అలజడికిన్= ఆపద (కష్టం)లో; విసువని= నిర్వేదం (విరక్తి) పొందని, (వాడు ఐన); సత్ కులజున్= ఉత్తమవంశంలో పుట్టినవాడిని; సైన్యవిభునిన్ కాన్= సైన్యానికి నాయకుడిగా; కావింపుము= నియమించుము.

**తాత్పర్యం:** కౌరవశ్రేష్ఠుడా, ధర్మరాజా! నీమీద భక్తీ, ప్రేమా, అధికంగా ఉండి పరాక్రమవంతుడై, కష్టం వచ్చినా నిలబడ గలిగిన, ఉన్నతవంశంలో పుట్టినవాడిని సేనాపతిగా చేసికొమ్ము.

**సీ. ఆత్మరంధ్రము లించు కైనను నొరులకు । నెఱుఁగ రాకుండఁగ మఱువు సేయు**
**మన్య రంధ్రంబుల నారసి కనుము; శ । త్రుల కడ బుద్ధియు బలుపుఁ గలుగు**
**వారల నెఱిఁగి భూవర! యొక్కమై నీగి । మన్నన నెఱపి తన్మానసములు**
**నీ యెడ నార్ద్రంబులై యుండఁ జేయుము । చేరువనృపులకు వైరబంధ**

**ఆ. మెట్లు గలుగు దాని నేమఱకుండుము । వారి యవుల నున్నవారు మిత్రు**
**లగుదు రెల్ల భంగి నధిప! యుదాసీను । లట సమీపవర్తు లైన విభులు. 66**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; ఆత్మరంధ్రములు= నీలోపాలను (తప్పులను); ఒరులకున్= ఇతరులకు; ఇంచుక+ఐనను= కొంచెమైనా; ఎఱుఁగన్ రాక ఉండఁగన్= తెలియటానికి అవకాశం ఈయకుండా; మఱువు చేయుము= రహస్యంగా ఉంచుము; అన్యరంధ్రంబులన్= ఇతరుల తప్పులను; అరసి= నిశితంగా పరిశీలించి; కనుము= గ్రహించుము; శత్రువులకడన్= శత్రువుల వద్ద; బుద్ధియున్= వివేకమూ; బలుపున్= శక్తి; కలుగువారలన్= ఉన్న వ్యక్తులనే; ఎఱిఁగి= తెలిసికొని; ఒక్కమైన్= అధికంగా; ఈగి= దానమూ; మన్నన= గౌరవమూ (సాయం); నెఱపి= చూపి; తద్+మానసములు= వారి మనస్సులు; నీ+ఎడన్= నీ మీద; ఆర్ద్రంబులు+ఐ= అనుకూల్యం కలిగి; ఉండన్ చేయుము= ఉండేటట్లు చేసికొమ్ము; అధిప!= ఓ రాజా!; చేరువన్నృపులకున్= నీకు దగ్గరి రాజులకు; వైరబంధము= శత్రుత్వం; ఎట్లు= ఏవిధంగా నైనా; కలుగున్= కలుగుతుందో; దానిన్= ఆ అంశాన్ని; ఏమఱక ఉండుము= ఏమరుపాటు లేకుండా (అప్రమత్తంగా) ఉండుము; వారి+అవులన్= వారికి తరువాతగా; ఉన్నవారు= ఉన్నరాజులు; ఎల్లభంగిన్= అన్ని విధాలుగానూ; మిత్రులు అగుదురు= నీకు స్నేహితులు అవుతారు; అటన్= వారికి; సమీపవర్తులు+ఐన= చేరువలో ఉన్న; విభులు= రాజులు; ఉదాసీనులు= నీ విషయంలో తటస్థులు, అని గ్రహించుము.

**తాత్పర్యం:** రాజా! నీ తప్పులు కొంచెం కూడా ఇతరులకు తెలియకుండా దాచిపెట్టుము. ఇతరుల దోషాలు మాత్రం జాగ్రత్తగా తెలిసికొమ్ము. శత్రువులవద్ద ఉన్నవాళ్ళలో బుద్ధిమంతులూ, శక్తిమంతులూ అయిన వ్యక్తులను దానాదులతో సత్కరించి, వాళ్ళ మనసులు నీ వైపు తిప్పుకొమ్ము. నీరాజ్యానికి సమీపంలో ఉండే రాజులకు నీతో వైరం కలుగుతుంది. కాబట్టి ఆ విషయంలో జాగ్రత్తగా అప్రమత్తుడివై ఉండుము. వారికి తర్వాత రాజ్యం పాలించుకొనే వాళ్లు నీకు మిత్రులవుతారు. ఆ తర్వాత ఉండే రాజ్యపాలకులు నీవిషయంలో ఉదాసీనంగా ఉంటారని గ్రహించుము.

**క. వీరుల సప్తాంగంబులు । నారసికొని యునికి కార్య మవనీశ! సదృ**
**క్సారబలుఁ డైన నృపుతో । గారవమున సంధి సేయఁగావలయుఁ దగన్. 67**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ!= రాజా!; వీరులన్= (పైన చెప్పిన) పొరుగురాజులను; సప్త+అంగంబులు= రాజ్యానికి సంబంధించిన (స్వామి) అమాత్యాది అంగములు ఏడింటినీ; ఆరసికొని= మెలకువతో గ్రహిస్తూ; ఉనికి= ఉండటం; కార్యము= (రాజుకు) కర్తవ్యం; సదృక్ సార బలుఁడు= తనతో సాటి వచ్చేటంతటి గట్టి పరాక్రమం కలిగినవాడు; ఐన= అయినటువంటి; నృపుతోన్= పొరుగురాజుతో; తగన్= తగువిధంగా; గారవమునన్= మన్ననతో; సంధి= శాంతి; ఒడంబడిక; చేయఁగాన్ వలయున్= చేసికొనాలి.

**తాత్పర్యం:** రాజా! శత్రువులూ, మిత్రులూ, ఉదాసీనులూ అని మూడు విధాలుగా ఉన్న పొరుగురాజులనూ, (శాంతి 6,107) (స్వామి) అమాత్య, జానపద, దుర్గ, బలాదిరూపమైన రాజ్యం సప్తాంగాలనూ, రాజు అప్రమత్తంగా గమనిస్తూ ఉండాలి. తనతో సమానమైన బలం కలిగిన రాజుతో తగువిధంగా అతడిని గౌరవించి సంధి చేసికొనాలి.

**తే. దైవమానుష బలములు దఱిఁగి యుండు । నెవ్వనికి నెప్పు డప్పుడ యెసక మెసఁగ**
**వైర మతనితోఁ బాటింపవలయుఁ జెఱుచు । టప్పనము గొను టర్థత్వ మరసి నడపు. 68**

**ప్రతిపదార్థం:** ఎవ్వనికిన్ = ఏ (శత్రు) రాజుకు; ఎప్పుడు= ఏ సమయంలో; దైవమానుషబలములు= దైవబలమూ, మానుషబలమూ, అతడి స్వబలమూ; తఱిఁగి+ఉండున్= తక్కువగా ఉంటాయో; అతనితోన్= ఆ రాజుతో; అప్పుడు+అ= ఆ సమయంలోనే,

వెంటనే; ఎసకము= పెంపు; ఎసఁగన్= ఒప్పుతుండగా; వైరము= శత్రుత్వాన్ని; పాటింపన్‌వలయున్= ఆచరించాలి; అర్హత్వము= అతడి అర్హతను; అరసి= గమనించి; చెఱుచుట= నాశనం చేయటమో; లేదా; అప్పనము= కానుకలు (కప్పం); కొనుట= స్వీకరించటమో; నడపు(ము)= చేయవలసింది.

**తాత్పర్యం:** ఎవడికి, తన బలమూ, దైవబలమూ, రెండూ ఏ సమయంలో తక్కువగా ఉంటాయో వాడితోనే ఆ సమయంలోనే శత్రుత్వాన్ని అనుసరించాలి. ఔచిత్యాన్ని బట్టి ఆ శత్రురాజును నిర్మూలించడమో లేకుంటే సామంతుడుగా ఉంచి కప్పం పుచ్చుకొనటమో చేయాలి.

**క.** **నడపునఁ గోల్పుచ్చఁగ నగు । నెడయు విడిసి యుండి చెఱుచు నిక్కయు నీ వే**
**ర్పడఁ గనుఁగొని యం దర్హము । నడపుము; నిజసైన్య రక్షణము వలయుఁ జుమీ!** **69**

**ప్రతిపదార్థం:** నడపునన్= సైన్యాన్ని నడిపించటం ద్వారా; కోల్ పుచ్చఁగన్= చెడగొట్టటానికి (నిర్మూలించడానికి); అగు+ఎడయున్= వీలైన స్థానమూ; విడిది+ఉండి= సైన్యం విడిది చేసికొని; చెఱుచు+ఇక్కయున్= శత్రువును నశింపజేసే స్థానమూ; ఏర్పడన్= స్పష్టంగా; నీవు= నీవు (స్వయంగా); కనుఁగొని= తెలిసికొని, అందున్= ఆ రెండింటిలో; అర్హము= ఉచితమైన పనిని; నడపుము= చేయవలసింది; నిజ సైన్య రక్షణము= స్వసైన్యం నాశనం కాకుండా కాపాడుకొనటం; వలయున్+చుమీ= అవసరం సుమా!

**తాత్పర్యం:** సైన్యాన్ని నడిపి (దండెత్తి), శత్రువును నిర్మూలించాలో, లేకపోతే సైన్యాన్ని విడిది చేసి రాజ్యం చుట్టూ నిలిపి రాజ్యాన్ని దిగ్బంధం చేసి శత్రువులను నిర్మూలించాలో - ఈ రెండింటిలో ఏ మార్గం తగినదో నీవే ఆలోచించి అది అనుసరించుము. నీ సైన్యాన్ని తప్పకుండా రక్షించుకొనాలి సుమా!

**విశేషం:** విదేశీ రాజనీతిలో షడ్గుణాలలో 'యానం' అనేది సంధి - ఆసనం - విగ్రహం - యానం - అనీ ఇదొక క్రమంలో నిరూపితం. శత్రు నిర్మూలనం అవసరంకాని సమయంలో సైన్యప్రయోగం అవసరమైతేనే చేయాలని సారాంశం.

**క.** **ప్రెగడల మనసులు విరసము । లగుగతి నడచు రిపురాజ్య మరసి విభిన్నం**
**బుగఁ జేసి కలఁచి పైకొని । జగతీవర! కొనఁగవలయు సౌకర్యమునన్.** **70**

**ప్రతిపదార్థం:** జగతీవర!= (ధర్మ) రాజా!; ప్రెగడల= అమాత్యుల యొక్క; మనసులు= హృదయాలు; విరసములు= ఇష్టం లేనివి (ప్రతికూలములు); అగుగతిన్= అయ్యే విధంగా; నడచు= సాగుతున్న; రిపురాజ్యము= శత్రురాజ్యాన్ని; అరసి= కనుగొని; విభిన్నంబుగన్+చేసి= చెదరగొట్టి; కలఁచి= క్షోభింపజేసి; పైకొని= దండెత్తి; సౌకర్యమునన్= తేలికగా; కొనఁగన్‌వలయున్= స్వీకరించాలి.

**తాత్పర్యం:** రాజా! మంత్రులు రాజుకు ప్రతికూలంగా ఉండి, సాగుతున్న శత్రురాజ్యాన్ని, చెదరగొట్టి (విడదీసి) వ్యాకులపెట్టి, ఆ తర్వాత ఒక్కసారిగా మీదబడి (దండెత్తి) (ఆ రాజ్యాన్ని) తేలికగా సాధించాలి.

**ఆ.** **బలము లెసఁగ దైవబలమును గలిగి లో । గుట్టు చేటు లేనియట్టి నృపతి**
**వలన మత్సరంబు వల; దాశ్రయంబు చం । దంబు పొందు వడయఁ దగు నృపాల!** **71**

**ప్రతిపదార్థం:** నృపాల!= (ధర్మ) రాజా!; బలము= (రథగజాదిగా) సైనికబలం; ఎసఁగన్= ఎక్కువగా ఉండగా; దైవబలమును= అదృష్టశక్తి కూడా; కలిగి= ఉండి; లో గుట్టు= ఆంతరంగికాలైన రహస్యాలకు; చేటు= కీడు (వెల్లడి కావటం); లేని+ అట్టినృపతి వలనన్= లేనటువంటి రాజు విషయంలో; మత్సరంబు= విరోధం; వలదు= వద్దు; ఆశ్రయంబు చందంబు= అటువంటి వాడిని ఆశ్రయించే మార్గమే; (లేదా) పొందు= స్నేహమో (సంధి); పడయన్+తగున్= అనుసరించటం ఉచితం.

**తాత్పర్యం:** మానుష బలం ఉండీ, దానికి తోడు దైవబలం కూడా ఉండి స్వీయ రహస్యాలు వెల్లడి కాకుండా మరుగు చేయగలిగిన రాజుతో విరోధం పనికిరాదు. అతడిని అనుసరించి ఉండటమో, లేదా, సంధి (స్నేహం) చేసికొనటమో యుక్తం.

ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు శత్రురాజుల జయించు తెఱంగు చెప్పుట (సం.15-12-6)

**ఆ. కుడువ నిచ్చు తఱియుఁ గురువర! కక్కించు। నవసరంబు నెఱిఁగి యరినృపాలు**
**నీవు ధీరవృత్తి నిడుఁ ద్రాటఁ బోనిమ్ము। క్రమ్ము కపిల యనఁగ గ్రమ్మి చెఱపు? 72**

**ప్రతిపదార్థం:** కురువర!= కురువంశంలో శ్రేష్ఠుడా! ధర్మరాజా!; నీవు= నీవు; అరినృపాలున్= శత్రురాజును; కుడువన్+ఇచ్చు; తఱియున్= తిన నివ్వదగిన సమయమూ; కక్కించు+అవసరంబున్= తిన్న దాన్ని కక్కించవలసిన సమయమూ; ఎఱిఁగి= గ్రహించి; కపిల అనఁగన్= పుల్లావు వలె; (శత్రురాజును) నిడుఁద్రాటన్= పొడుగైన తాడుతో; కట్టిపోన్+ఇమ్ము= విడిచిపెట్టుము; క్రమ్ము= (ఆక్రమించుము)లో బఱుచుకొమ్ము; క్రమ్మి= ఆక్రమించుకొన్నపుడు; చెఱవు= రాపిడి పెట్టుము.

**తాత్పర్యం:** కురుశ్రేష్ఠుడా! తిన నివ్వదగిన సమయం ఏదో, కక్కించవలసిన సమయం ఏదో గ్రహించి శత్రురాజును పుల్లావు వలె పొడుగాటి త్రాడుతో స్వేచ్ఛగా విడిచిపెట్టుము. లోబరుచుకొమ్ము, లోబరుచుకొన్నపుడు ఆ శత్రురాజువలన లాభాలు జాగ్రత్తగా పిండుకొమ్ము.

**విశేషం:** అలం: ఉపమ. 'కపిల' తో ఉపమానం. ఆవు కట్టుత్రాడు చేతిలో ఉంచుకొనాలి. అపు డా తాడు ఎంత నిడుపైనా దాన్ని విడిచిపెట్టడం కట్టివేయడం అనేది తన ఇచ్ఛ ననుసరించి ఉంటుంది. త్రాడు ఎంత నిడుపైనా, కుడవనివ్వదగినంత దాకానే విడిచిపెట్టడం కాబట్టి దాని ఇచ్ఛ కట్టుఁత్రాడు పట్టుకున్నవాడి స్వేచ్ఛకు లోబడే ఉంటుంది. శత్రురాజు (నిడుత్రాటి బంధనంలో) తనకు లోబడి ఉన్నంత కాలం తన రాజ్యాన్ని అనుభవింపనీయవచ్చును. 'కక్కించు అవసరం' క్రొత్తగా తినడం కాదు. అంతకు ముందు తినిఉన్నది కూడా లాక్కోవడం. అవసరమైతే అదీ చేయాలి. 'చెఱవు' అనే ముద్రితపాఠం కంటె 'చెఱుము' అనే వ్రాతప్రతుల పాఠంలో ఔచిత్యం కనబడుతున్నది. 'చెఱవు అంటే నశింప జేయడం. అరినృపాలుడు కాబట్టి కక్కించవలసిన అవసరం వస్తే వాడిని కమ్ముకొని శత్రువును నిర్మూలించుము అని అర్థంలో చెఱవు అనే పాఠం అన్వయిస్తుంది. కాని శత్రురాజుకు 'కపిల' తో పోలిక. ('నిడుఁద్రాట' బంధించి ఉంచాలి గదా) కాబట్టి 'కపిల'ను చెఱచడం సరికాదు. 'కక్కించు నవరసంబు' అన్నపుడు కూడా కపిల పరంగా పాలు పిదుకుకోవటమే. శత్రురాజు సైన్యాది బలాలను స్వాధీనపరచుకొనటం. (ఇది శత్రురాజుకు చెఱుపే) రాజును చంపే పని లేదు. ఇది ఎంతదూరం యథేచ్ఛగా వెళ్ళి మేయదగినంత మేయనిస్తే, అవసరమైనపుడు దాని నుండి ఫలితాన్ని (పాలు), అధికంగా పిండుకొనవచ్చును. అట్లా పిండుకొనాలంటే 'చెఱుము' అంటే గంగడోలు వగైరా అవయవాలు రుద్ది (చెఱుము= ఊచు) పరవశింప జేసి ప్రయోజనాన్ని పొందాలి అనే అర్థం సాధించడంలో 'చెఱవు' అనే ముద్రిత పాఠంకంటె కూడా 'చెఱుము' అనే వ్రాతప్రతులలోని పాఠమే అర్థవంతంగా ఉంటుంది. కపిల అంటే పసుపు నిండిన తెలుపు - బంగారు రంగులో ఉన్న ఆవు 'కపిల వైశిష్ట్యం కూడా ప్రయోజనంలోనే దానికి చెరుపు చేయటం అభీష్టం కాదు కదా.

**సీ. ఉత్సాహ శక్తియు నుర్వీశ మంత్రశ। క్తియుఁ బ్రభుశక్తియుఁ గెలనివాని**
**కిని నీకు నిట్టివి యని తారతమ్యముల్। వెరవునఁ బరికించి వేర మెత్త।**
**వలయుట నెఱిగల్గి పలుకక యుండంగఁ। దగుట యూహించు టుత్తమ విధంబు ;**
**మూలబలంబును మొత్తాలవారును। మిత్త్రబలంబును శత్త్రుబలముఁ**

**ఆ. గాననంబు బలముఁగ్గై జీతగాండ్రును। నైనయట్టిబలము లాఱు నరసి**
**యుచితకాల దేశ యుక్తంబులుగఁ బన్ని। కొనఁగ వలయు వాని కొలఁదు లెఱిఁగి. 73**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ!= రాజా!; కెలనివానికిన్= నీ పొరుగు (శత్రు) రాజుకూ; నీకున్= నీకూ; ఉత్సాహశక్తియున్= ఉత్సాహమనే శక్తి; మంత్రశక్తియున్= (ఆలోచన) మంత్ర శక్తీ; ప్రభు, శక్తియున్= ప్రభు (అధికారం) శక్తి; ఇట్టివి అని= ఈ ప్రకారంగా ఉన్నాయి అని; తారతమ్యముల్= తక్కువ ఎక్కువలు; వెరవునన్= ఉపాయంతో; పరికించి= పరిశీలించిన తర్వాతే; నేరము= విరోధం; ఎత్తవలయుట= అనుసరించాల్సి రావటమూ; నెఱి, కల్గి= పౌరుషం కలిగి కూడా; పలుకక+ఉండంగన్+తగుట= మాటాడకుండా ఊరుకోవటమూ; ఊహించుట= (ఏది ఉచితమో ఆలోచించి) నిర్ణయించుకొనటం; ఉత్తమవిధంబు= శ్రేష్ఠమైన పద్ధతి; మూలబలంబును= 1. ప్రధాన సేనా, మొత్తాలవారునూ= 2. శ్రేణీబలమూ మిత్రబలంబును= 3.స్నేహితులైన రాజులవలన లభించే సైన్యమూ; శత్రుబలమున్= 4. శత్రువుల నుండి లభించిన సైన్యమూ; కాననంబు బలమున్= 5. కిరాతులు మొదలైన అడవి వీరుల సైన్యమూ; కై జీత గాండ్రును= 6. తాత్కాలిక ప్రయోజనం కొరకు భృతితో నియమించబడిన సైన్యమూ; ఐన అట్టి బలములు ఆఱున్= అయినటువంటి ఆరు విధాలైన సైన్యాలను; అరసి= గమనించి; వాని కొలఁదులు= ఆ ఆరు విధాలైన సైన్యాల పరిమాణాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; ఉచిత కాల దేశ యుక్తంబులుగన్= ఆయాకాలాలకూ, ప్రాంతాలకూ, తగిన విధంగా ఉండేటట్లుగా; పన్ని కొనఁగన్వలయున్= సిద్ధం చేసికొని ఉంచుకొనాలి.

**తాత్పర్యం:** రాజా! నీకూ నీ పొరుగు (శత్రు) రాజుకూ ఉత్సాహ మంత్ర, ప్రభుశక్తులలోని తక్కువయెక్కువలు జాగ్రత్తగా తెలిసికొని, దండెత్తాలనుకొన్నపుడు మూలశ్రేణి, మిత్ర, శత్రు, కానన, భృత్యశ్రేణులు - అనే షడ్బలాలనూ, పరిశీలించి దేశ, కాలాలకు తగిన విధంగా వ్యూహం ఏర్పాటు చేసికొనాలి.

**విశేషం:** యుద్ధానికి తలపడే ముందు రాజు శక్తి త్రయాన్ని అంచనా వేసికొనాలి. ఉద్యమించే శక్తి, పనిలో పూనుకోవాలనే కోర్కె ఉత్సాహశక్తి, సఫలమయ్యే విధంగా ఆలోచన చేయగలిగిఉండటం మంత్రశక్తి; తన ఆలోచనలను; ప్రయత్నాన్ని అమలు చేయగలిగిన అధికారం - ప్రభుశక్తి; కోశ సైన్యాలు ప్రభుశక్తికి చెందుతాయి. కెలనివాని శక్తి తెలిసికొనటం కష్టం కాబట్టి 'వెరవున' - ఉపాయంతో, ఎట్లాగో మార్గం చేసికొని ఎదుటివారి బలం గ్రహించాలి. తనకంటె పొరుగువాడికే శక్తి అధికం అయితే మాటాడకుండా ఊరుకొనటమే ఉత్తమం. తర్వాత ఆరు విధాలైన బలాలను సంసిద్ధం చేసికొని యుద్ధానికి దిగాలి. 'మౌల్య భృత్య సుహృచ్ఛ్రేణీ ద్విష దాటవికం బలమ్' రఘు- (4.26 మల్లినాథవ్యాఖ్య) సైన్యానికి కోశం మూలం, మూల బలం అంటే ధనబలం (నీలకంఠీయ) అర్థం. మూల బలం -(మౌల్యం) ప్రధానసేన= వంశపారంపర్యంగా రాజసేవలో కొనసాగివస్తున్న సైన్యం - మూలబలం, మొత్తాలరు అంటే శ్రేణీబలం. కొంతమందిని కూర్చుకొని సైనికులవలె తీర్చి వారికి ఒకడు నాయకత్వం వహిస్తుంటాడు. ఇట్లా కొంతమంది సైనికుల సమూహాలకు నాయకులైన వారిద్వారా ఉపయోగించే బలం శ్రేణీ బలం. వారే మొత్తాలవారు. మిత్రబలం - స్నేహితులైన రాజులు తనకు సహకారంగా పంపే సైన్యం (68.వ.) (సుహృద్బలం). శత్రుబలం. యుద్ధంలో తన చేతిలో ఓడిపోయి సామంతులై ఉన్నరాజులు విధిగా పంపటంవల్ల వచ్చే సైన్యం. అవకాశం దొరికితే ఎదురు తిరిగేవాళ్ళు గాబట్టి వీళ్ళు సామంతులై కప్పాలు కడుతున్నా శత్రువులే, (ద్విషద్బలం) కిరాతాది సైన్యం ఆటవికబలం; కైజీతగాండ్రు భృత్యబలం; జీతం (కూలి) ఇచ్చి తాత్కాలికంగా పెట్టుకొన్న సైన్యం. ఈ ఆరు విధాలైన బలగాలను 'వాని కొలఁదులు ఎరిఁగి దేశ - కాల ఉచితంగా ఉపయోగించాలి'. తనకున్న

ఆయా బలగాల పరిమాణం, శత్రువుకున్న బలాల పరిమాణం - తెలిసికొని - యుద్ధం జరిగే ప్రదేశాన్నీ కాలాన్నీ అనుసరించి షడ్బలాలలో దేన్ని ఏ పరిమాణంలో ఎట్లా వాడుకొనాలో జాగ్రత్తగా (ఎరిగి) గ్రహించి చేయాలి.

**తే. సంపదల నాపదల నొక్క చంద మగుట । వికృతి నొందుట యా బలవితతులందుఁ**
**గాంచి యెల్లప్పుడును హితకారి యైన । బలము నెక్కుడుగాఁ బ్రోవు భరతముఖ్య! 74**

**ప్రతిపదార్థం:** ఒందుట= పొందటమూ; కాంచి= పరిశీలించి; హితకారి ఐన= ప్రభువులకు మేలు కూర్చగలిగిన; బలమున్= బలాన్ని; ఎల్లప్పుడును= అన్నివేళలా; ఎక్కుడుగాన్= అధికంగా; ప్రోవుము= (కాపాడుతూఉండు) వృద్ధి చేసుకొమ్ము.

**తాత్పర్యం:** భరతవంశంలో శ్రేష్ఠుడా, ధర్మరాజా! మూలబలం, మిత్రబలం మొదలుగా ఆరువిధాలైన బలాలలోనూ కష్ట సుఖాలలో ఒకే విధంగా నిలబడగలిగినదేదో, నిలబడలేనిదేదో గ్రహించి రాజుకు మేలు చేసే బలగాన్ని ఎప్పుడూ అధికంగా పోషించుము.

**క. పరుల గెలిచి నిర్భయముగ । ధరణిఁ బ్రజం గాచువెరవు ధర్మపథమునం**
**బరిపాలించిన వెలయుం । గురువర! కృపపెంపు వదలకుము ప్రజలయెడన్. 75**

**ప్రతిపదార్థం:** కురువర!= కురువంశంలో శ్రేష్ఠుడివైన ధర్మరాజా!; పరులన్= శత్రువులను; గెలిచి= ఓడించి; ధరణిన్ ప్రజన్= (ఆశత్రు రాజ్యంలోని) ప్రజలను; నిర్భయముగన్= భయం లేకుండే విధంగా; కాచు వెరవు= రక్షించే ఉపాయం; ధర్మపథమునన్= ధర్మమార్గంలో; పరిపాలించినన్= ప్రజా సంరక్షణం చేస్తే; వెలయున్= ప్రశస్త మవుతుంది; ప్రజల+ఎడన్= ప్రజలమీద; కృప పెంపు= అధికమైన దయను; వదలకుము= విడిచిపెట్టకు.

**తాత్పర్యం:** కురుశ్రేష్ఠుడా! శత్రురాజులను ఓడించి ఆ రాజ్యాన్ని వశం చేసికొన్న తర్వాత, ఆ శత్రురాజ్యంలోని ప్రజలు, నీ గురించి భయపడకుండేటట్లుగా నీవు రక్షించే విధం, ధర్మబద్ధంగా ప్రజా సంరక్షణం చేయటం వలన ఇంకా కీర్తించబడుతుంది. నీ ప్రజలమీద ఎప్పుడూ మిక్కిలి దయతో ఉండాలి.

**క. వినికి గలిగి రక్షించుచు । ననువున దయతోడిపాడి నాయతు లెల్లం**
**గొనుచుఁ దగ నేలి పొగడొం । దినరాజున కుర్వి కామధేనువ కాదే! 76**

**ప్రతిపదార్థం:** వినికి కలిగి= రాజ ధర్మాది వివిధ శాస్త్రాలను వినీ (తెలిసికొని); రక్షించుచున్= ప్రజలను కాపాడుతూ; అనువునన్= ఉపాయంతో; దయతోడి పాడిన్= దయ గలిగిన నీతితో; ఆయతులు= రాబడులు; ఎల్లన్= అన్నీ; కొనుచున్= సమకూర్చుకొంటూ; తగన్= తగువిధంగా; ఏలి= రాజ్యాన్ని పాలించి; పొగడు= ప్రశంసలను; ఒందిన రాజునకున్= పొందేటటువంటి రాజుకు; ఉర్వి= ఈ రాజ్యం; కామధేనువు+అ= కామధేనువే; కాదే!= కదా!

**తాత్పర్యం:** వివిధ శాస్త్రాలు గ్రహించి, ప్రజలను, జాగ్రత్తగా కాపాడుతూ, ఉపాయంతోనూ, దయ గలిగిన పద్ధతిలోనూ, రాబడులను కూర్చుకొంటూ ధర్మబద్ధంగా భూమిని పరిపాలించే రాజుకు ఆ రాజ్యమే కామధేను వవుతుంది.

**విశేషం:** అలం: రూపకం.

**సీ.** **ధర్మమార్గంబున ధరణిఁ బాలించిన। నైహిక సుఖములు నగ్గలంపుఁ**
**బొగడును బరలోక భూరి సౌఖ్యములును। సిద్ధించు; విపుల దక్షిణలు పెట్టి**
**యశ్వమేధ ప్రముఖాధ్వరంబులు పెక్కు। లాచరించుట కంటె నధిక మండ్రు**
**మేదినీ ప్రజల నత్యాదరంబును గరు। ణాతిశయంబు మధ్యస్థతయును**

**తే.** **గలిగి బిడ్డల నరసిన కరణి గాఢ। రక్షణం బొనరించుట రాజవర్య!**
**వినుము తమ్ముల నీగి మన్ననల ననుది। నంబుఁ గొనియాడు మానందనంబు గాఁగ.** **77**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= రాజులలో శ్రేష్ఠుడా! (ధర్మరాజా!); వినుము= వినవలసింది; ధరణిన్= ఈ భూమిని; ధర్మ మార్గంబునన్= ధర్మంతో కూడిన (ధర్మబద్ధమైన) పద్ధతిలో; పాలించినన్= రక్షిస్తే; ఐహిక సుఖములున్= ఈ లోకానికి, సంబంధించిన సుఖాలూ; అగ్గలంపు పొగడును= అధికమైన ప్రశంసలూ; పరలోక భూరి సౌఖ్యములును= స్వర్గలోకంలో మిక్కుటమైన సుఖాలూ; సిద్ధించున్= లభిస్తాయి; విపుల= విస్తారంగా; దక్షిణలు పెట్టి= దక్షిణలు ఇచ్చి; మేదినీ ప్రజలన్= రాజ్యంలోని ప్రజలను; అతి+ఆదరంబును= మిక్కుటమైన వాత్సల్యమూ; కరుణా+అతిశయంబు(న్)= మిక్కుటమైన దయా; మధ్యస్థతయును= నిష్పక్షపాతబుద్ధీ; కలిగి= ఉండి; బిడ్డలన్= కన్న బిడ్డలను; అరసిన కరణిన్= చూసుకునే విధంగా; గాఢ-రక్షణంబు= దృఢమైన రక్షణం; ఒనరించుట= చేయటం; అశ్వమేధ, ప్రముఖ+అధ్వరంబులు= అశ్వమేధం మొదలైన యాగాలు; పెక్కులు= అనేకంగా; ఆచరించుట కంటెన్= చేయటం కంటె; అధికము= ఎక్కువ; అండ్రు= అంటారు; తమ్ములన్= నీ సోదరులను; ఆనందనంబు కాఁగన్= సంతోషం కలిగేటట్లుగా; ఈగి- మన్ననలన్= దానమూ, సమ్మానాలతో; అనుదినంబున్= ప్రతీరోజూ; కొనియాడుము= ప్రశంస చేస్తూ ఉండుము.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడా! రాజ్యాన్ని ధర్మమార్గంలో పరిపాలిస్తే ఈ లోకంలో సుఖాలు మాత్రమే కాకుండా, పదుగురి చేత పొగడ్తలూ, ఊర్ధ్వ లోకంలోనూ గొప్ప సుఖాలూ కలుగుతాయి. ప్రజలను ప్రేమతో, దయతో, నిష్పక్షపాతంగా, కన్నబిడ్డలవలె, గట్టిగా కాపాడటం - గొప్ప దక్షిణలు ఇచ్చి అశ్వమేధం మొదలైన అనేక యజ్ఞాలు చేసిన దానికంటె కూడా ఎక్కువ అని అంటుంటారు. ఓ రాజా! వినుము. నీ తమ్ముళ్ళను, వాళ్ళు సంతోషించేటట్లు దానమూ, సమ్మానమూ చేస్తూ ప్రతిరోజూ ప్రశంసిస్తూ ఉండుము.

**చ.** **నరవర! రాజనీతుల జనస్తుతుఁడైన నదీ తనూజుఁడున్**
**హరియుఁ బరాశరాత్మజుఁడు నాదిగఁ గల్గిన పెద్ద లెల్ల నీ**
**కరయఁగఁ బెక్కు సెప్పిరి; మదాత్మయు నీదెసఁ బ్రీతి పెద్దయుం**
**బొరయుట నేనుఁ గొన్ని యిటు పోలిన భంగి నెఱుంగఁ జెప్పితిన్.** **78**

**ప్రతిపదార్థం:** నరవర!= ఓ రాజా!; అరయఁగన్= పరిశీలించి చూస్తే; జనస్తుతుఁడు+ఐన= ప్రజలచేత పొగడబడేవాడు అయిన; నదీ తనూజుఁడున్= గంగాపుత్రుడు, భీష్ముడూ; హరియున్= శ్రీకృష్ణుడూ; పరాశర+ఆత్మజుఁడున్= పరాశరమహర్షి కొడుకైన వ్యాసుడు; ఆదిగన్, కల్గిన పెద్దలు= మొదలయిన పెద్దవారు; ఎల్లన్= అందరూ; నీకున్= నీకు; రాజనీతులు= రాజధర్మాలు; పెక్కు= చాలా (వివరంగా); చెప్పిరి= చెప్పి ఉన్నారు; మత్ ఆత్మయున్= నా మనసు కూడా; నీదెసన్= నీ మీదే; పెద్దయున్= మిక్కుటంగా; ప్రీతి= వాత్సల్యం; పొరయుటన్= పొంది ఉండటం చేత; నేనున్= నేను కూడా; ఇటు= ఈ విధంగా; కొన్ని= కొద్దిగా రాజనీతులును; పోలిన భంగిన్= సాధ్యమైన (చేతనైన) విధంగా; ఎఱుంగన్, చెప్పితిన్= (నీకు) తెలియజెప్పాను.

**తాత్పర్యం:** నరశ్రేష్ఠుడా! ఇంతకు మునుపే భీష్ముడూ, కృష్ణుడూ, వ్యాసుడూ మొదలైన పెద్దలు నీకు రాజనీతులు విస్తారంగా చెప్పారు. అయినా, నీ మీద ఉండే వాత్సల్యం వలన నేను కూడా ఏదో నాకు తెలిసినంత మేర కొద్దిగా రాజధర్మాలు చెప్పాను.

**క. నిత్యవిధి సద్వివేకము । సత్యవ్రతశీల! ధర్మసారజ్ఞ! భవ**
**న్మత్యాకలితమ యైనను । నిత్యంబును వృద్ధసేవ నిష్ఠఁ జలుపుమీ!' 79**

**ప్రతిపదార్థం:** సత్యవ్రతశీల!= సత్యమందే తాత్పర్యం ఉన్న నడవడి కలవాడా; ధర్మసారజ్ఞ!= ధర్మం యొక్క సారాన్ని (తత్త్వాన్ని) తెలిసినవాడా! ధర్మరాజా!; నిత్యవిధి(న్)= ఎల్లప్పుడూ, ఆచరించడంలో; సత్+వివేకము= శ్రేష్ఠమైన రాజనీతి జ్ఞానం; భవత్+మతి+ఆకలితము+అ= నీ బుద్ధిలో ఉన్నదే; ఐనను= అయినప్పటికీ; నిత్యంబును= ఎప్పుడూ; నిష్ఠన్= శ్రద్ధతో; వృద్ధసేవ(న్)= పెద్దలను సేవించటం; చలుపుమీ!= చేయుమా!

**తాత్పర్యం:** సత్యవ్రతం కల ప్రవర్తన కలవాడా! ధర్మసూక్ష్మం ఎరిగినవాడా! ధర్మరాజా! ఎల్లప్పుడూ ఆచరిస్తుండటం వలన రాజనీతిజ్ఞానం నీకు బుద్ధిస్థమే. అయినా నిత్యము శ్రద్ధతో పెద్దలను సేవించుము.'

**సీ. అన విని ధర్మజుం డంబికా పుత్త్రుతో । 'నాపగాసుతుఁడు లేఁ' డబ్జనాభుఁ**
**డాత్మపురంబున కరిగె; వాత్సల్యత । నీవు దక్కఁగ నాకు హితము సెప్ప**
**నొడయఁ డెవ్వఁడు? భవదుపదిష్ట పథమున । నిష్ఠమై నడచెద; నెమ్మనమున**
**నీవు ప్రీతిని బొందు నృపముఖ్య!' నావుడు । నాతఁడు సంతసమంది యతని**

**ఆ. 'నధిప! విశ్రమింపు మధికశ్రమంబు నా । తనువునందుఁ జెందె' నని తగంగఁ**
**బోవఁ జెప్పి; బాంధవావళి కభిముఖుఁ । డయి నిజాలయముల కరుగఁ బనిచి. 80**

**ప్రతిపదార్థం:** అనన్= ధృతరాష్ట్రుడీ విధంగా రాజనీతులను చెప్పగా; విని= గ్రహించి; ధర్మజుండు= ధర్మరాజు; అంబికా పుత్త్రుతోన్= అంబిక కొడుకైన ధృతరాష్ట్రుడితో (ఇట్లా అన్నాడు); నృపముఖ్య= రాజులలో ప్రధానుడా; ఆపగా సుతుఁడు= గంగాపుత్రుడైన భీష్ముడు; లేఁడు= ప్రస్తుతం లేడు (మరణించాడు); అబ్జనాభుఁడు= కృష్ణుడు; ఆత్మపురంబునకున్= తన నగరానికి (ద్వారకకు); అరిగెన్= వెళ్ళాడు కాబట్టి; నాకున్= నాకు; వాత్సల్యతన్= ప్రేమగా; హితము= మంచిని, (కర్తవ్యాన్ని); చెప్పన్= తెలియజెప్పడానికి; నీవు= నీవు (ధృతరాష్ట్రుడు); తక్కఁగన్= తప్ప; ఒడయఁడు= నాథుడు; ఎవ్వఁడు?= ఎవరున్నారు?; భవత్+ఉపదిష్ట, పథమునన్= నీవు ఉపదేశించిన మార్గంలోనే; నిష్ఠమైన్= శ్రద్ధగా (ఏకాగ్రతతో) నడచెదన్= నడచుకొంటాను; నీవు= నీవు; నెమ్మనమునన్= (నీ) నిండు మనస్సులో (మనసునిండా); ప్రీతిని= సంతోషం; పొందు= పొందవలసింది; నావుడున్= అని ధర్మరాజు పలుకగా; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; సంతసము= సంతోషాన్ని; అంది= పొంది; అతనిన్= ఆ ధర్మరాజుతో (ఇట్లా అన్నాడు); అధిప!= (ధర్మ) రాజా!; విశ్రమింపుము= నీ విక విశ్రాంతి తీసికొమ్ము; నా తనువునందున్= నా శరీరంలో; అధిక శ్రమంబు= మిక్కిలి అలసట; చెందెన్= కలిగింది; అని= అని చెప్పి; తగంగన్= తగు విధంగా; పోవన్+చెప్పి= ధర్మరాజునకు వీడుకోలు పలికి; బాంధవ+ఆవళికిన్= తన బంధు సమూహానికి; అభిముఖుఁడు+అయి= ఎదురుగా ఉండి, బంధువులవైపు తిరిగి, వాళ్ళతో వాళ్ళని; నిజ+ఆలయములకున్= తమ తమ ఇండ్లకు; అరుగన్= వెళ్ళటానికి; పనిచి= నియోగించి; (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు చెప్పిన రాజనీతులు విన్న తర్వాత ధర్మరాజు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: రాజశ్రేష్ఠుడా! ఇపుడు భీష్ముడు అసలు లేడు. కృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు. ప్రేమతో హితం చెప్పగలిగిన పెద్దవాడివి నీవు తప్ప నాకు ఇంకెవ రున్నారు? నీవు ఉపదేశించిన మార్గంలో శ్రద్ధగా నడుస్తాను. మనసు నిండుగా సంతోషించుము.' ధర్మరాజు పలికిన ఈ మాటలు విని ధృతరాష్ట్రుడు సంతోషించాడు. 'ధర్మరాజా! ఇక విశ్రాంతి తీసికొమ్ము. నాకు కూడా ఒళ్ళంతా బాగా అలసిపోయింది' అని ధర్మరాజును మంచి మాటలతో వీడుకొలిపాడు. బంధువులను వాళ్ళ ఇళ్ళకు పంపించాడు ధృతరాష్ట్రుడు.

**వ. తాను నభ్యంతర గృహంబున కరిగి సుఖాసీనుం డైయున్న నమ్మానవనాథుతో గాంధారి 'దేవా! వనంబున కెపుడు విచ్చేయువాఁడ?' వని యడిగిన, నా భూవల్లభుం డద్దేవి కిట్లనియె. 81**

**ప్రతిపదార్థం:** తానున్= తాను కూడా; అభ్యంతర గృహంబునకున్= లోపలి మందిరానికి; అరిగి= వెళ్ళి; సుఖ ఆసీనుండు, ఐ= సుఖంగా కూర్చున్న వాడై; ఉన్నన్= ఉండగా; ఆ+మానవ నాథుతోన్= ఆ (ధృతరాష్ట్ర) రాజుతో; గాంధారి= భార్య ఐన గాంధారి - (ఇట్లా అన్నది); దేవా= రాజా!; వనంబునకున్= అరణ్యానికి; ఎపుడు= ఎప్పుడు; విచ్చేయువాఁడవు= వస్తావు; అని అడిగినన్= అని ప్రశ్నించగా; ఆ భూవల్లభుండు= ఆ (ధృతరాష్ట్ర) రాజు; అ+దేవికిన్= ఆ పట్టపురాణితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజునూ, ఇతర బంధువులనూ అందరినీ పంపి వేసిన తరువాత ధృతరాష్ట్రుడు కూడా తన మందిరానికి వెళ్ళి సుఖంగా ఆసీనుడయ్యాడు. అపుడు గాంధారి, 'రాజా! అరణ్యానికి ఎప్పుడు వెళ్ళుతావు?' అని అడిగింది. భార్యతో ధృతరాష్ట్రుడిట్లా అన్నాడు.

**క. మా తండ్రి పరాశరసుతు। చేతం బడసితి ననుజ్ఞ; శీలపరత్వో**
**పేతుఁ డగు ధర్మతనయుఁడు। ప్రీతి నొడంబడియె బంధుబృందయుతముగన్. 82**

**ప్రతిపదార్థం:** మా తండ్రి= మా తండ్రి; పరాశర సుతు చేతన్= వ్యాసమహర్షి చేత; అనుజ్ఞన్= అనుమతిని; పడసితిన్= పొందాను; శీలపరత్వ+ఉపేతుఁడు= నడవడియొక్క ఉత్తమధర్మంతో కూడినవాడు (మంచి నడవడి గలవాడు); అగు= అయిన; ధర్మ తనయుఁడు= ధర్మరాజు; బంధు బృంద యుతముగన్= చుట్టాలందరితో కలిసి; ప్రీతిన్= ఇష్టపూర్వకంగా; ఒడంబడియెన్= అంగీకరించాడు.

**తాత్పర్యం:** 'మా కన్నతండ్రి వ్యాసమహర్షి నుండి ఆశ్రమవాసానికి అనుమతి పొందాను. నేను అరణ్యాలకు వెళ్ళటానికి ఉత్తమశీలుడైన ధర్మరాజు కూడా బంధువులతో సహా అంగీకరించాడు.

**ఆ. ఇంకఁ దడయ నేల? యింతి! వే వెడలుద। మట్లు కల్లజూద మాడి పాప**
**భాగు లైన నీదు పట్టుల సుగతికి। ననుచువాఁడఁ దపము నతిశయమున. 83**

**ప్రతిపదార్థం:** ఇంతి!= ఓ వనితా!; ఇంకన్= ఇంకా; తడయన్= ఆలసించటం; ఏల?= ఎందుకు?; వే= త్వరగా; వెడలుదము= అడవికి బయలుదేరుదాం; అట్లు= ఆ విధంగా; కల్ల జూదము= అబద్ధపు (మోసపు) జూదం; ఆడి= ఆడి; పాపభాగులు= పాపాన్ని పొందిన వారు; ఐన= అయినటువంటి; నీదు పట్టులన్= నీకొడుకులను; తపము+అతి శయమునన్= (నా) తపస్సు మేలిమి చేత; సుగతికిన్= మంచి ఊర్ధ్వలోక స్థితులకు; అనుచువాఁడన్= పంపుతాను.

**తాత్పర్యం:** వనితా! ఇంకా ఆలస్యం ఎందుకు? వెంటనే అడవులకు బయలుదేరుదాం. అబద్ధపు జూదమాడి పాపాన్ని పొందిన నీ కొడుకులను, అడవులలో గొప్ప తపస్సు చేసి మంచిలోకాలకు పంపుతాను.

**విశేషం:** కారణాలు ముందుగా గాంధారిచేత కూడా అనిపించింది మూలం. ప్రశ్న మాత్రం గాంధారిది. ధృతరాష్ట్రుడే సమాధానంలో కారణం చెప్పడం తెలుగులో మార్పు. 'పాపభాగులైన' అనే సందర్భంలో 'నీదుపట్టులు' నీ (గాంధారి) కొడుకులు - అనటం గమనించదగింది. గొప్ప పనులు చేసినపుడు నా పుత్రులనీ, తప్పుడు పనులు చేసినపుడు నీ కొడుకు లనీ భార్యాభర్తలు వ్యవహరించడం సహజం. ఆ స్వభావానికి ఇది అనుగుణం. వార్ధకదశలో ఆశ్రమవాసం చేయడం కులోచితం. కాని ధృతరాష్ట్రుడి అసలు ఆంతర్యం ఇక్కడ బయటికివచ్చింది. దుర్మార్గాల వలన పాపులైన కొడుకులకు మరణానంతరం దుర్గతులే కలిగి ఉంటాయని ధృతరాష్ట్రుడి నిశ్చయం. పైకి ఊర్ధ్వగతులు పొందా రంటున్నా (25), తపస్సు చేసి కొడుకులకు సుగతులు సాధించడం కోసం అడవులకు వెళ్ళటం అని ఇక్కడ చెప్పుతున్నాడు. 'నీదుపట్టు' లన్నా కొడుకుల మీది ప్రేమ నిది నిరూపిస్తుంది. మూలంలో ఈ అంశం ఇపుడు కానరాదు.

### ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచే ననుజ్ఞ గొనుట (సం.15-13-8)

**వ.** **అని పలికి యమ్మగువదిక్కు మొగం బయి ' వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొన్ని పుణ్యక్రియ లజాతశత్రుననుమతితో నాచరించి పోదము గాక!' యని నిశ్చయించి తనకుఁ దపోవనగమనంబునకై పౌరులయనుజ్ఞ గొనవలయు నని పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగుపురజనంబుల నెల్లను బడి చేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రు మందిర ద్వారపురోభాగం బున నిలిచె; నయ్యాంబికేయుండు గాంధారియుం దోడ రా వెడలి వారి సన్నిధికిం జని, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర సంకులం బైయున్న యన్నగర జన ప్రకరంబు నుద్దేశించి. 84**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఈ విధంగా చెప్పి; ఆ+మగువదిక్కు= ఆ గాంధారివైపుగా; మొగంబు అయి= ముఖం తిప్పి; వారికిన్ = కొడుకులకు; సుగతి= ఉత్తమ లోకస్థితి; కల్గునట్లు గాన్= సిద్ధించే విధంగా; ఇప్పుడును= ఇప్పుడు కూడా; అజాత శత్రు= ధర్మరాజు యొక్క; అనుమతితోన్= అంగీకారంతో; కొన్ని పుణ్యక్రియలు= శ్రాద్ధ దానాది కర్మలు కొన్ని; ఆచరించి= చేసి; పోదము, కాక= (తర్వాత) అడవికి వెళ్దాం; అని= అనే విధంగా; నిశ్చయించి= నిర్ణయం చేసికొని; పాండవ+అగ్రజునకున్= పాండు కుమారులలో మొదటివాడైన ధర్మరాజుతో; తనకున్= ధృతరాష్ట్రుడికి; తపోవనగమనంబునకున్+అయి= తపస్సు చేసికొనడానికి, అరణ్యాలకు వెళ్ళటం కొరకు; పౌరుల అనుజ్ఞ= ప్రజలయొక్క అనుమతి; కొనవలయున్= పొందవలసి ఉన్నది; అని= అని; చెప్పన్+పనిచినన్= నివేదింపగా; అతండు= ఆ ధర్మరాజు; తగు పురజనులన్= అర్హులైన నగర వాసులను; ఎల్లను= అందరినీ; పడిచేసి= ఆజ్ఞాపెట్టి; వెలార్చికొనుచున్= పంపుతూ; అఖిలబంధు మిత్రులున్= చుట్టాలూ; స్నేహితులూ అందరూ; తానును= స్వయంగానూ (ధర్మరాజూ); వచ్చి= వచ్చి; ధృతరాష్ట్రు= ధృతరాష్ట్రుడియొక్క; మందిర-ద్వార-పురస్+భాగంబునన్= భవనంయొక్క వాకిటిముందు; నిలిచెన్= నిలువబడ్డాడు; ఆ+ఆంబికేయుండు= అంబికా పుత్రుడైన ఆ ధృతరాష్ట్రుడు; గాంధారియున్= గాంధారి కూడా; తోడన్ రాన్= వెంట రాగా; వెడలి= బయలుదేరి; వారి సన్నిధికిన్= వాకిట ఉన్న పౌర, బంధు మిత్రాదుల వద్దకు; చని= వెళ్ళి; బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, సంకులంబు+ఐన= బ్రాహ్మణులతోనూ, క్షత్రియులతోనూ, వైశ్యులతోనూ, శూద్రులతోనూ నిండిన; ఆ+నగర జనప్రకరంబు= ఆ నగరంలో ఉండే ప్రజలయొక్క సమూహాన్ని; ఉద్దేశించి= లక్ష్యం చేసికొని (వారితో) ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తర్వాత గాంధారివైపు తిరిగి 'కొడుకులకు ఊర్ధ్వలోకాలు కలిగేటట్లుగా ఇపుడు కూడా ధర్మరాజు అంగీకారంతో, శ్రాద్ధాది పుణ్యకర్మలు కొన్ని చేసి తర్వాత అడవులకు పోదాం' అని నిర్ణయించాడు ధృతరాష్ట్రుడు. తపస్సుకై అరణ్యాలకు పోవటానికి పౌరుల అనుమతి తీసికొనా లని ధర్మరాజుకు కబురంపాడు. వెంటనే ధర్మరాజు రాజధానిలో ఉన్న ప్రజలలో అర్హులైన వారికి ఆజ్ఞ చేసి రప్పించాడు, బంధువులనూ, స్నేహితులనూ అందర్నీ తీసికొని తానూ వెళ్ళాడు. అందరూ కలిసి ధృతరాష్ట్రుడి ముందరి వాకిటి ముందు నిలిచారు. అపుడు గాంధారి వెంట రాగా ధృతరాష్ట్రుడు వారి వద్దకు వచ్చి, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులతో నిండి ఉన్న ఆ నగర ప్రజలతో ఇట్లా అన్నాడు.

**సీ.** **'కౌరవ కోటియు మీరుఁ బెద్దయుఁ గాల। మనఁగి పెనంగి యన్యోన్య సంభృ**
**తాధిక స్నేహుల రై ప్రవర్తించితి। రనఘవర్తనులార! వినుఁడు నాదు**
**పలుకు; వృద్ధునకుఁ దపశ్చరణంబున। కై వనంబున కేఁగు టర్హ కర్మ;**
**ముచిత కృత్యంబుల యోజ మీ రెఱిఁగిన - యదియ కా మదిముదమార మీర**

**ఆ.** **లెల్ల నా కనుజ్ఞ యిచ్చి కానకుఁ బుచ్చుఁ। డనుడు సర్వజనులు నశ్రు పిహిత**
**దృష్టు లగుచు గద్గదిక నెలుం గెడలఁగ। నార్తి దోఁప నేడ్చి రధిపముఖ్య! 85**

**ప్రతిపదార్థం:** అనఘవర్తనులార!= పాపం లేని నడవడి కలిగిన జనులారా!; కౌరవకోటియున్= కురువంశీయుల సమూహమూ; మీరున్= మీరూ; పెద్దయున్+కాలము= చాలా కాలంగా; అనఁగి-పెనంగి= కలిసి మెలసి; అన్యోన్య-సంభృత+అధిక+స్నేహులరు+ఐ= ఒకరి మీద ఒకరికి నిండిన అధికమైన ఆదరం కలిగినవారై; ప్రవర్తించితిరి= వ్యవహరించారు; నాదు పలుకు= (ఇపుడు) నా మాట; వినుఁడు= వినండి; వృద్ధునకున్= వయసు మీరినవాడికి; తపస్+చరణంబునకున్+ఐ= తపస్సు ఆచరించటం కొరకు; వనంబునకున్= అరణ్యాలకు; ఏఁగుట= వెళ్ళడం; అర్హవిధము; తగిన పద్ధతి; ఉచిత కృత్యంబుల ఓజ= తగిన పనుల క్రమం; మీరు= మీ రందరు; ఎఱిఁగిన+అది+అకా= తెలిసినదే కదా; మీరలు= మీరు; ఎల్లన్= అందరూ; మదిన్= మనస్సులో; ముదము+ఆరన్= సంతోషం నిండగా; నాకున్= నాకు; అనుజ్ఞ= అనుమతిని; ఇచ్చి= ఇచ్చి; కానకున్= అరణ్యానికి; పుచ్చుఁడు= పంపండి; అనుడున్= ధృతరాష్ట్రుడు అట్లా అనగానే; అధిపముఖ్య!= ఓ జనమేజయ మహారాజా!; సర్వజనులు= అక్కడ ఉన్నవారు అందరూ; అశ్రు పిహిత దృష్టులు= కన్నీటి చేత కప్పబడిన చూపు కలిగినవారు; అగుచున్= అవుతూ; గద్గదికన్= డగ్గుత్తికచేత; ఎలుంగు= కంఠస్వరం; ఎడలఁగన్= క్షీణించగా; ఆర్తి= దుఃఖం; తోఁపన్= వ్యక్తం కాగా; ఏడ్చిరి= విలపించారు.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ములారా! కౌరవులూ, మీరూ చాలా కాలంగా పరస్పరం దృఢ స్నేహంతో కలిసి మెలిసి ఉన్నారు. ఇపుడు నా మాట వినండి. వయసు మీరిన వాడికి తపస్సు చేసికొనే నిమిత్తం అడవులకు పోవటం అనేది తగిన పద్ధతి. యుక్తమైన పనుల క్రమం (ఎప్పుడు ఏ పని చేయాలో) మీకు తెలిసిందే కదా! అందుచేత మీ రందరూ సంతోషంగా అనుమతించి నన్ను అడవికి పంపండి. (అన్నాడు ధృతరాష్ట్రుడు). జనమేజయ మహారాజా! ధృతరాష్ట్రుడు అట్లా అనగానే అక్కడ ఉన్న వారంతా కళ్ళలో నీళ్ళు నిండిపోగా చూపు సరిగా లేనివారై, డగ్గుత్తిక వలన కంఠస్వరం క్షీణించి దుఃఖంతో విలపించారు. (అన్నాడు వైశంపాయనుడు).

**వ.** **విని ధృతరాష్ట్రుఁడు వారి కిట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** విని= వారి ఏడుపులు ఆలకించి; వారికిన్= వారితో; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** బంధుజనాదుల ఏడుపులు విని ధృతరాష్ట్రుడు వాళ్ళతో ఇట్లా అన్నాడు.

**సీ. 'ప్రజ ముద మొందఁగఁ బాలించెఁ బుడమి శం। తనుఁ; డనంతరము శాంతనవు చేత**
**రక్షితుఁ డగుచు మీరలు ప్రీతిఁ బొదల వి। చిత్రవీర్యుండు నిద్ధాత్రి యేలెఁ।**
**బదపడి పాండు నృపాలుండు మీరు హ। ర్షింపంగ భూమి రక్షించెఁ బిదప**
**ధర్మనందనుని చందము మీ యెఱింగిన। యది; సత్యధర్మాత్ముఁడైన యితని**

**తే. ననుసరింపక యన్యాయ మాచరించి। దుర్ణయంబున నిల యేలి త్రుంచెఁ గులము**
**నుర్విఁ గల భూపతులను దుర్యోధనుండు;। వాని దుశ్చేష్టలకు మూల మేన కాదె! 87**

**ప్రతిపదార్థం:** శంతనుఁడు= (భీష్ముడి తండ్రి) శంతన మహారాజు; ప్రజ= జనం; ముదము= సంతోషం; ఒందఁగన్= పొందే విధంగా; పుడమిన్= ఈ భూమిని; పాలించెన్= పాలించాడు; అనంతరము= శంతనుడి తర్వాత; శాంతనవు చేతన్= శంతనుడి కొడుకైన భీష్ముడి చేత; రక్షితుఁడు= కాపాడబడినవాడు; అగుచున్= అవుతూ; మీరలు= మీరు(ప్రజలు); ప్రీతిన్= సంతోషంతో; పొదలన్= వర్ధిల్లగా; విచిత్రవీర్యుండున్= విచిత్రవీర్యుడు కూడా; ఈ+ధాత్రిన్= ఈ భూమిని; ఏలెన్= పాలించాడు; పదపడి= ఆ తర్వాత; మీరు= మీరు (ప్రజలు); హర్షింపంగన్= సంతోషించే విధంగా; పాండు నృపాలుండు; భూమిన్= ఈ భూమిని; రక్షించెన్= కాపాడాడు; పిదపన్= ఆ తర్వాత (రాజవడం మొ॥); ధర్మనందనుని చందము= ధర్మరాజు సంగతి; మీ ఎఱింగిన+అది= మీకు తెలిసిందే; సత్య ధర్మాత్ముఁడు= యథార్థమైన ధర్మరూపుడు; ఐన= అయినటువంటి; ఇతనిన్= ఈ ధర్మరాజును; అనుసరింపక= అతడివలె ఆచరించకుండా; అన్యాయము= అధర్మం; ఆచరించి= చేసి; దుర్ణయంబునన్= అనుచితమార్గంలో; ఇల= ఈ భూమిని; ఏలి= పాలించి; దుర్యోధనుండు= దుర్యోధనుడు; కులమున్= కౌరవవంశాన్నీ; ఉర్విన్= ఈ భూమిపై; కల= ఉన్న; భూపతులన్= రాజులను; ఎల్లన్= అందరినీ; త్రుంచెన్= నాశనం చేశాడు; వాని= ఆ దుర్యోధనుడియొక్క; దుశ్చేష్టలకున్= దుర్మార్గాలకు; మూలము= ప్రధాన కారణం; ఏను+అ= నేనే; కాదె!= కదా!

**తాత్పర్యం:** (పౌరులారా!) ఈ రాజ్యాన్ని శంతను మహారాజు ప్రజారంజకంగా పరిపాలించాడు. తర్వాత అతడి కొడుకు భీష్ముడు కాపాడుతూ ఉండగా విచిత్రవీర్యుడు రాజ్యం చేశాడు. ఆ తర్వాత పాండురాజు ఈ రాజ్యాన్ని రక్షించాడు. అటు పిదప ధర్మరాజు రాజు కావటం అతడి పాలనం అంతా మీకు తెలిసిందే. ధర్మహృదయుడైన ఈతడిని అనుసరించకుండా అన్యాయంగా అవినీతితో రాజ్యాన్ని పాలించిన దుర్యోధనుడు కురువంశాన్నీ మిత్రులైన రాజులనూ నాశనం చేశాడు. నిజానికి దానికి కారణం నేనే.

**వ. అది మీ మనంబులం బెట్టక. 88**

**ప్రతిపదార్థం:** అది= దుర్యోధనుడి దుర్మార్గాలకు తానే (ధృతరాష్ట్రుడే) మూలం అనే విషయం; మీ మనంబులన్= మీ హృదయాలలో; పెట్టక= ప్రవేశింపనీయకుండా.

**తాత్పర్యం:** దీనిని మీ మనసులలో పెట్టుకొనకుండా (తరువాతి పద్యంతో అన్వయం)

**క. మహి లెస్సఁగ రక్షించిన। మహిత గుణుల యన్న కొడుకు మనుమం డని నా**
**కు హితంబు గోరి కరుణా। సహితుల రై యిం డనుజ్ఞ సద్వ్రతమునకున్. 89**

**ప్రతిపదార్థం:** మహిన్= ఈ భూమిని; లెస్సగన్= మంచిగా; రక్షించిన= పాలించినట్టి; మహిత గుణుల= గొప్ప గుణవంతు లైన; పాండు - విచిత్ర వీర్య - శంతనులకు; అన్న= అగ్రజుడూ; కొడుకు= పుత్రుడూ; మనుమండు= పౌత్రుడూ; అని= అనే అభిప్రాయంతో (నైనా); హితంబు= మేలు; కోరి= కోరుకొని; కరుణా-సహితులరు-ఐ= దయగలవారై; సత్+వ్రతమునకున్= తపశ్చరణం అనే మంచిపనికై; నాకున్= నాకు; అనుజ్ఞ= అనుమతి; ఇండు= ఇవ్వండి.

**తాత్పర్యం:** (పౌరులారా)! ఈ రాజ్యాన్ని చక్కగా పాలించిన గుణవంతులైన పాండురాజుకి అన్ననని, విచిత్రవీర్యుడికి కొడుకుననీ, భీష్మశంతనులకు మనుమడిననీ మనసులో ఉంచుకొని (అయినా) నాకు మేలు కోరుతూ నా తపశ్చరణానికి దయతో అనుమతించండి.

**విశేషం:** దుర్యోధనుడి దుశ్చేష్టలకు మూలం కావడం చేత తనమీద ప్రజలకు కోపం ఉండాలి. ఒకవేళ అది మనసులో పెట్టుకొనకపోయినా ధృతరాష్ట్రుడిని అభిమానించాల్సిన గుణ విశేషం అతడిలో లేదు. అందుకే నన్ను చూసి కాకపోయినా ప్రజలు కీర్తించే, పాండురాజు, విచిత్రవీర్యుడు - (భీష్ముడు శంతనుడు - అనే పెద్దవారితో ఉన్న బంధుత్వాన్ని అనుసరించి అయినా తనకు మేలు కోరుకొమ్మని, ధృతరాష్ట్రుడి తాత్పర్యం.)

**వ. అని యప్పు డజ్జనంబులమనంబుల లేకున్నను దన కీ ళ్లుగ్గడించి యరణ్యగమనానుజ్ఞాకరణంబునకుఁ బ్రార్థించి యవ్విభుండు వెండియు. 90**

**ప్రతిపదార్థం:** అని= అట్లా పలికి; అప్పుడు= ఆ సమయంలో; ఆ+జనంబుల= అక్కడ ఉన్న పౌరుల; మనంబులన్= మనస్సులలో; లేకున్నను= లేకపోయినప్పటికీ; తన కీళ్ళు= తాను చేసిన తప్పిదాలు; ఉగ్గడించి= చెప్పి; అరణ్య గమన అనుజ్ఞా కరణంబునకున్= అడవులకు వెళ్ళడానికి అనుమతి చేయటం కొరకు; ప్రార్థించి= వేడుకొని; ఆ+విభుండు= ఆ ధృతరాష్ట్రుడు; వెండియున్=మరలా,

**తాత్పర్యం:** (జనమేజయ మహారజా!) ఆ పౌరులమనసులలో అపుడు లేకపోయినా ధృతరాష్ట్రుడు తాను లోగడ చేసిన తప్పిదాలను చెప్పి, అడవులకు వెళ్ళటానికి అనుమతిమ్మని వాళ్ళను ప్రార్థిస్తూ ఆ రాజు (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. వృద్ధ కృపణ పుత్త్ర విరహిత గాంధారి। యీ నెలంతఁ జూచి యైన మీర**
**లకట! కాననమున కరుగుట మే లని। మా కనుజ్ఞ యిండు మాన్యులార!' 91**

**ప్రతిపదార్థం:** మాన్యులార!= గౌరవించదగినవారలార!; గాంధారి= ఈ గాంధారి; వృద్ధ= వయసుచేత పెద్దది; కృపణ= తపః ప్రభృతి కర్మలచేత కృశించినదీ; పుత్త్రవిరహిత= కొడుకులను పోగొట్టుకొన్నది; అకట!= అయ్యో!; ఈ నెలంతన్= ఇటువంటి స్థితిలో ఉన్న ఆడదాన్ని, చూసి ఐన; కాననమునకున్= అడవికి; అరుగుట= వెళ్ళటం; మేలు+అని= మంచిదని; మీరలు= మీరందరు; మాకున్= మాకు; అనుజ్ఞ ఇండు= అనుమతి ఇవ్వండి.

**తాత్పర్యం:** పూజ్యు (లైన పౌరు) లారా! గాంధారి వృద్ధురాలు. వ్రతాదులవలన కృశించింది. కొడుకులను పోగొట్టుకొన్నది. అటువంటి గాంధారిని చూచి ఐనా మేము అడవులకు వెళ్ళటమే మంచిదని గ్రహించి అందుకు మాకు అనుమతి ఇవ్వండి.'

**వ. అని పలికి పాండవాగ్రజుం జూపి. 92**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= మాటాడి; పాండవ+అగ్రజున్= ధర్మరాజును; చూపి= చూపించి.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి ధృతరాష్ట్రుడు పౌరులకు ధర్మరాజును చూపిస్తూ (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. తమ్ముల నడుమ నీతండు దిక్పాలక। మధ్య భాసితుఁ డైన మఘువుఁ బోలి**
**మహనీయ విభవ సమగ్రత వెలిఁగెడు। నేమిట నేమఱ కెపుడు మీర**
**లీతనిఁ బొదివి సంప్రీతిగ వర్తింపుఁ। డయ్య! యిల్లడ యిమ్మహానుభావు**
**నిడితి మీకడ; మిమ్ము నెల్ల భంగులఁ దన। పరిపాలనంబునఁ బరమసుఖులఁ**

**ఆ. గా నొనర్చువాఁడు గా నప్పగించిన। వాఁడ నేను మీకు వేఁడి దాఁకు**
**నట్లుగాఁ జరింప నస్మత్కులీనుల।కధిక దుఃఖకారి నైతిఁ గాని. 93**

**ప్రతిపదార్థం:** ఈతండు= ఈ ధర్మరాజు; తమ్ముల నడుమన్= భీముడు మొదలైన నలుగురు తమ్ముళ్ళ మధ్య; దిక్పాలక మధ్య భాసితుఁడు= దిక్పాలకులైన దేవతలకు నడుమ ప్రకాశించేవాడు; ఐన= అయినటువంటి; మఘువున్= దేవేంద్రుడిని; పోలి= వలె; మహనీయ విభవ సమగ్రతన్= గొప్పదీ, లోటు లేనిదీ అయిన వైభవంతో; వెలిఁగెడున్= వెలుగుతున్నాడు; మీరలు= మీరు; ఏమిటన్= ఏవిషయంలోనూ; ఏమఱక= (మరువు లేకుండా) అప్రమత్తతతో; ఎపుడు(న్)= నిత్యమూ; ఈతనిన్= ఈ ధర్మరాజును; పొదివి= దగ్గరకు తీసికొని, (జాగ్రత్తగా); సంప్రీతిగన్= ఇష్టంగా; వర్తింపుఁడయ్య= నడుచుకొనండి; ఈ+మహానుభావున్= గొప్పవాడైన ఈ ధర్మరాజును; మీకడన్= మీవద్ద; ఇల్లడ= న్యాసంగా; ఇడితిన్= ఉంచాను; తనపరిపాలనంబునన్= తన యొక్కరాజ్యరక్షణ విధానంచేత; ఎల్ల భంగులన్= అన్ని విధాలుగానూ; మిమ్మున్= ప్రజలను; పరమసుఖులన్= మిక్కిలి సుఖపడేవారలు; కాన్= అయ్యేటట్లుగా; ఒనర్చువాఁడు కాన్= చేసేవాడిగా; అప్పగించిన వాఁడన్= ఒప్ప జెప్పుతున్నాను; నేను= నేను; అస్మత్కులీనులకున్= నా వంశంవారికి; అధిక దుఃఖకారిన్= మిక్కిలి కష్టం కల్గించినవాడిని; ఐతిన్= అయ్యాను; కాని= అంతేతప్ప; మీకున్= ప్రజలకు; వేఁడి= కష్టం; తాఁకునట్లుగాన్= తగిలేవిధంగా; చరింపన్= నడవను; అధిక దుఃఖకారిన్= మిక్కిలి కష్టం కలిగించినవాడిని; ఐతిన్= అయ్యాను; కాని= అంతే తప్ప; మీకున్= ప్రజలకు; వేఁడి= కష్టం, (నొప్పి); తాఁకునట్లు కాన్= తగిలేవిధంగా; నేను= నేను (ధృతరాష్ట్రుడు); చరింపన్= నడవను.

**తాత్పర్యం:** ఈ ధర్మరాజు తమ్ములనడుమ దిక్పాలకుల మధ్య దేవేంద్రుడివలె వైభవంగా వెలిగిపోతున్నాడు. ఏ విషయంలోనూ ఏమరుపాటు లేకుండా, మీరు ఈతడిని పొదుపుకొని ఇష్టంగా నడుచుకొండి. మీవద్ద న్యాసంగా నేను ఈ ధర్మరాజును ఉంచుతున్నాను. తన పరిపాలనా విధానం చేత అన్ని విధాలుగా మిమ్మల్ని సుఖపెడతాడనే ఇతడిని మీకు రాజుగా అప్పగిస్తున్నాను. నా వాళ్ళకు కష్టం కలిగించాను కానీ, మీకు కష్టం కలిగే పని నేను ఎప్పుడూ చేయను.

**క. అరయ నెన్నం డైనను। మీరలు నా కెగ్గు గాఁగ మెలఁగుట లే; దో**
**పౌరవరులార! నన్నున్। గారవమున ననుపరయ్య కాననమునకున్!' 94**

**ప్రతిపదార్థం:** ఓ పౌరవరులార!= ఓ పురజనోత్తములారా!; ఆరయన్= పరిశీలించి చూడగా; మీరలు= మీరు; ఎన్నండు, ఐనను= ఏ నాడు కూడా; నాకున్= నాకు; ఎగ్గు= కీడు; కాఁగన్= కలిగేటట్లుగా; మెలఁగుట= వ్యవహరించటం; లేదు= జరగ లేదు; నన్నున్= అటువంటి నన్ను; గారవమునన్= ప్రేమతో; కాననమునకున్= అడవికి; అనుపరయ్య= పంపండి.

**తాత్పర్యం:** ఓ పౌరశ్రేష్ఠులారా! ఏనాడూ నాకు అపకారం కలిగే విధంగా మీరు ప్రవర్తించలేదు. ఇపుడు గూడా అదేవిధంగా ఆదరంతో నన్ను అడవికి పంపించండి.'

**వ.** **అనినం బౌరజనంబు లేడ్పులు ఘ్రింగికొని యొండొరులం జూచుచు నూరకున్న నమ్మహీశ్వరుండు మఱియును.** **95**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ధృతరాష్ట్రుడు) పల్కగా; పౌరజనంబులు= ఆ పురజనులు; ఏడ్పులు= ఏడుపులను; ఘ్రింగికొని= అణచుకొంటూ; ఒండొరులన్= ఒక ళ్ళొక్కళ్ళని - పరస్పరం; చూచుచున్= చూస్తూ; ఊరకున్నన్= మాటాడకుండా ఉండగా; ఆ +మహీ+ఈశ్వరుండు= ఆ ధృతరాష్ట్రుడు; మఱియును= మరలా - (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు పై విధంగా చెప్పగా ఆ పురజనులు ఏడుపులు దిగమ్రింగుకొంటూ పరస్పరం ఒకళ్ళ నొకళ్ళు చూచుకొంటూ ఏమీ మాటాడకుండా ఊరకున్నారు. అప్పుడు ధృతరాష్ట్రుడే మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ.** **'సాధుచరిత్రయు శాంతయు నైన యి। గ్గాంధారియును నేను గాఢ వినయ**
**మార మీ తెలి విట్లు గోరుచు నున్నార। మఖిల ధర్మాభిజ్ఞుఁ డగు పరాశ**
**రాత్మజుండును ధార్మికాగ్రణి పాండవా। గ్రజుఁడును నాకు నరణ్య గమన**
**మునకు నిచ్చి రనుజ్ఞ; మోడ్పుఁ గే లౌదలఁ। గదియించి మిమ్ము వేఁడెదఁ గృపాఢ్యు**

**తే.** **లార! యనుమతి సేయుఁడు మీరు' ననుడు। వార లుత్తరీయంబులు వదన వినిహి**
**తములుగాఁ జేసికొని రోదనము రవంబు। లెసఁగఁ జేసిరి విను ధరణీశవర్య!** **96**

**ప్రతిపదార్థం:** సాధు చరిత్రయున్= గుణవంతమైన శీలం కలిగిందీ; శాంతయున్= నిర్వికారయూ; ఐన= అయినటువంటి; ఈ+గాంధారియును= గాంధారీ; నేను(న్)= నేనూ; వినయము+ఆరన్= మిక్కిలి అణకువతో; ఇట్లు= ఈ విధంగా; మీ తెలివి= మీ యొక్క అంగీకారాన్ని; కోరుచున్+ఉన్నారము= కోరుకొంటున్నాము; అఖిల+ధర్మ+అభిజ్ఞుఁడు= సమస్తములైన ధర్మములను చక్కగా తెలిసినవాడు; అగు= అయిన; పరాశర+ఆత్మజుండును= పరాశరమహర్షి కొడుకైన వ్యాసుడూ; ధార్మిక+అగ్రణి= ధర్మబద్ధమైన వర్తనం గల వారిలో ప్రథముడు అయిన; పాండవ+అగ్రజుండును= ధర్మరాజు కూడా; అరణ్య గమనమునకున్= అడవులకు వెళ్ళటానికి; నాకున్= నాకు; అనుజ్ఞ= అనుమతిని; ఇచ్చిరి= ఇచ్చారు; మోడ్పుఁగేలు= అంజలించిన చేతులు; ఔదలన్= శిరస్సుపై; కదియించి= గట్టిగా కూర్చి; మిమ్మున్= మిమ్మల్ని; వేఁడెదన్= ప్రార్థిస్తున్నాను; కృపా+ఆఢ్యులార!= అత్యధికమైన దయ గలిగిన వారలారా!; మీరును= మీరు కూడా; అనుమతి+చేయుఁడు= మా వన గమనానికి అనుజ్ఞ ఇవ్వండి; అనుడున్= అని ధృతరాష్ట్రుడు పల్కగా; ధరణీ+ఈశవర్య!= రాజ శ్రేష్ఠుడివైన జనమేజయమహారాజా!; విను= వినవలసింది; వారలు= ఆ పౌరులు; ఉత్తరీయములు= పై వస్త్రాలను; వదన వినిహితములు= ముఖం మీద ఉండేవి; కాన్= అయ్యేటట్లుగా; చేసికొని= చేసికొని; రవంబులు= (ఏడుపు) ధ్వనులు; ఎసఁగన్= మిక్కుటం కాగా; రోదనము చేసిరి= ఏడ్చారు.

**తాత్పర్యం:** సద్వర్తనం కలిగిందీ, ప్రశాంత చిత్తురాలూ, అయిన ఈ గాంధారీ నేనూ అరణ్య గమనానికి మీ అనుమతిని వినయంగా అర్థిస్తున్నాం. సమస్త ధర్మాలు తెలిసిన వ్యాసమహర్షీ, ధర్మరాజూ మాకు అనుమతి ఇచ్చారు. రెండు చేతులు మోడ్చి శిరస్సుపై ఉంచి మిమ్మల్ని వేడుకొంటున్నాను దయావంతులైన నా పౌరులారా! మీరు కూడా మాకు అనుమతి ఇవ్వండి'. ఓ జనమేజయ మహారాజా! ధృతరాష్ట్రుడు అట్లా అనగానే అక్కడి పౌరులందరూ ఉత్తరీయాలు ముఖాలమీద కప్పుకొని, బిగ్గరగా ఏడ్చారు.

**వ. అట్లేడ్చి యుడిగి తమయంతవట్టునుం గూడికొని కార్య వచనంబు లార్యచరితుండును జతురాలాప కల్యుం డును నగు శంబు వను విప్రోత్తమునకుం జెప్పి యిత్తెఱంగున ధృతరాష్ట్రునితో నాడుమని నియోగించిన నాతం డారాజు నగ్రభాగంబునఁ జేరి సవినయంబుగా ని ట్లనియె. 97**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; ఏడ్చి= (కొంతసేపు) రోదించి; ఉడిగి= ఏడుపులు మానుకొని; తమ అంతవట్టునున్= తమలో తాముగా అందరూ; కూడికొని= కలిసి నిశ్చయించుకొని; కార్యవచనంబులు= అవసరమైన మాటలు; ఆర్య చరితుండును= ఉత్తమవర్తనం కలవాడూ; చతుర+ఆలాప+కల్యుండును= నిపుణము లైన మాటలలో సమర్థుడూ; అగు= అయినటువంటి; శంబువు+అను= శంబువు అనే పేరు గలిగిన; విప్ర+ఉత్తమునకున్= బ్రాహ్మణ శ్రేష్ఠుడికి; చెప్పి= వినిపించి; ఈ+తెఱంగునన్= ఈ (తాము చెప్పిన) విధంగా; ధృతరాష్ట్రునితోన్= ధృతరాష్ట్రుడికి; ఆడుము= చెప్పు; అని; నియోగించినన్= ఆ పౌరులు ఏర్పరచగా; ఆతండు= ఆ శంబువు; ఆ రాజు+అగ్రభాగంబునన్= ఆ ధృతరాష్ట్రుడికి ఎదురుగా; చేరి= నిలిచి; సవినయంబుగాన్= అణకువతో; ఇట్లు= ఈప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మాటలకు పెద్దగా ఏడవటం ప్రారంభించిన పౌరులు కాసేపు అట్లా ఏడ్చిన తర్వాత ఏడుపు మానుకొని అందరూ కలిసి మాటాడుకొని, శంబువు అనే మాట నేర్పరికి ధృతరాష్ట్రుడితో ఈ విధంగా చెప్పుమని (కొన్ని మాటలు చెప్పి) ఏర్పాటు చేశారు. అపుడు ఆ శంబువు ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి ఎదురుగా ఉండి ఇట్లా చెప్పనారంభించాడు.

**విశేషం:** సాంబాఖ్యో బహ్వృచో - అని యీ బ్రాహ్మడి పేరు సాంబుడు అని ఒక మూలం, శాకల్యుడని తెనుగుభారతం ప్రత్యంతరాల్లో ఉన్నదట!. తిక్కన కాధారమైన మూలం నేటిదానికి కొంత భిన్నంగా ఉన్నదని ఇట్లాంటి సందర్భాలను బట్టి గుర్తించవచ్చును.

ధృతరాష్ట్రునితో శంబు వను విప్రుఁడు పౌరజన సమ్మతి చెప్పుట (సం. 15-15-10)

**సీ. 'భరతవంశోత్తమ। పౌరజనంబులు తమ మాటలుగ భవత్సన్నిధాన**
**మున న న్నుపన్యాస మొనరింపఁ బంచిన। యట్టిభాషణము లేకాగ్రబుద్ధి**
**నవధరింపుము! మీ మహాన్వయంబున మహీ। విభులయం దొప్పమి వెదకి యైనఁ**
**గానము మము మీరు గన్నట్టి ప్రజల నె। ట్లట్ల రక్షించితి రాదరమున**

**తే. వినుము! దుర్యోధనుండు చేసిన యనర్థ। మొక్కటియు లేదు; నినుఁ ద్రిలోకోత్తరుండు**
**సత్యవతి కొడు కే మని సమ్మతించి। పంచె దానిన చేయుము పరమనియతి. 98**

**ప్రతిపదార్థం:** భరతవంశ+ఉత్తమ!= భరతవంశంలో గొప్ప వాడివైన ధృతరాష్ట్ర మహారాజా!; భవత్ సన్నిధానమునన్= నీ సన్నిధిలో; తమమాటలుగన్= తమ సొంతమాటలుగా; ఉపన్యాసము ఒనరింపన్= తెలియజేయడానికి (ఉంచడానికి); నన్నున్= నన్ను; పౌరజనులు= ఈ పుర ప్రజలు; పంచిన+అట్టి= నియోగించినటువంటి; భాషణములు= మాటలు; ఏకాగ్రబుద్ధిన్= అవధానమతితో; అవధరింపుము= విను; మీ మహా+అన్వయంబునన్= మీ ఉత్తమవంశంలో; మహీవిభులయందున్= (పుట్టిన) రాజులలో; వెదకి+ఐనన్= వెదికి చూచినప్పటికీ; ఒప్పమి= తగనిది. (అనుచితం); కానము= చూడలేము; మీరు= భరతవంశపురాజులు; కన్న అట్టి ప్రజలన్= కన్న కొడుకులను; ఎట్లు= ఏవిధంగానో; అట్లు= ఆవిధంగా; మమున్= ఈ పౌరులను; ఆదరమునన్= వాత్సల్యంతో; రక్షించితిరి= పాలించారు; వినుము= ధృతరాష్ట్ర మహారాజా విను; దుర్యోధనుండు= నీకొడుకైన దుర్యోధనుడు; చేసిన= మాకు చేసిన; అనర్థము= తగనిపని; ఒక్కటియున్= ఒక్కటి కూడా; లేదు= లేదు; త్రిలోక+ఉత్తరుండు= మూడులోకములను, దాటిన మేలిమి కలవాడైన; సత్యవతి కొడుకు= వ్యాసమహర్షి; సమ్మతించి= అంగీకరించి; నినున్= నిన్ను; ఏమి+అని= ఏవిధంగా చేయుమని; పంచెన్= నియమించాడో; పరమ నియతిన్= దృఢమైన నియమంతో; దానిన్+అ= అదే; చేయుము= ఆచరించవలసింది.

**తాత్పర్యం:** భరతవంశంలో శ్రేష్ఠుడివైన ధృతరాష్ట్ర మహారాజా! ఈ పౌరులంతా కలిసి తమ మాటలుగా నీకు చెప్పుమని నన్ను నియమించిన మాటలను జాగ్రత్తగా విను. మీవంశంలో పుట్టిన రాజులలో వెదకినప్పటికి ఎక్కడా తగనిది అంటూ కనబడదు. మీరు కన్న కొడుకుల వలె, మమ్మల్ని (ప్రజలని) ప్రేమగా పాలించారు. నిజానికి దుర్యోధనుడైనా ప్రజలకు చేసిన అకృత్యమంటూ ఏమీ లేదు. ఇంక లోకోత్తరుడైన వ్యాసమహర్షి నిన్ను ఏం చేయు మని చెప్పాడో ఆ పని తప్పకుండా చేయవలసింది.

**క. అడ లెడఁబడఁగా మమ్మును। విడిచితి గురు వైన శోక వేదన యే మిం**
**కుడిపికొనునప్పటికిఁ దో। డ్పడు నీదగు సద్గుణములు బంధులు వోలెన్. 99**

**ప్రతిపదార్థం:** అడలు= శోకం; ఎడఁబడఁగాన్= మనస్సుల పొందగా; మమ్మును= ఈ పౌరులను; విడిచితి(వి)= విడిచి వెళ్ళుతున్నావు; ఏము= మేము, ఇంకన్= ఇక పైని; గురువు= అధికం; ఐన= అయినటువంటి; శోకవేదన= దుఃఖంవలని ఏడుపును; ఉడిపి కొను+అప్పటికిన్= పోగొట్టుకొనడానికి; నీదు+అగు సద్గుణములు= నీకు సంబంధించిన గొప్ప లక్షణాలు; బంధులు పోలెన్= చుట్టాల వలె; తోడ్పడున్= మాకు సహకరిస్తాయి.

**తాత్పర్యం:** మాకు దుఃఖం అతిశయించేటట్లుగా నీవు మమ్మల్ని విడిచి వెళుతున్నావు. మేమీ దుఃఖం పోగొట్టుకొనే స్థితికి నీ గుణాలే మాకు బంధువులవలె తోడు నిలుస్తాయి. నీ గుణాలు తలచుకొంటూ నీ వియోగ దుఃఖం మరిచిపోతామని భావం.

**విశేషం:** ఈ పద్యం ప్రాచీన ప్రతులలో లేదు. మూలాన్ని బట్టి ముద్రాపకులు తర్వాత స్వీకరించి ఉంటారు. ఉండి ఉంటుందని ఊహించటానికి, లేదని మానటానికి ఇంకా పరిశీలనం చేయాలి. తిక్కన తర్వాతి వాళ్ళెవరైనా కలిపారా? ఇది లేకుంటే (98,100) వరస బాగుంది. 'అడిఁబడు' అనేది కొత్త శబ్దం. (ఇది శ,ర,లో గాని, సూ, ని,లోగాని కానరాదు. అడలు= శోకం, ఎడన్= హృదయంలో, పడఁగాన్= పొందగా - అని భావించవచ్చునేమో)

**ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్రవీర్యుఁడుఁ బాండు। రాజు నెట్టు లట్ల రాజరాజు**
**ప్రజకు సంతసముగఁ బాలించె; నీయందు। నతనియందుఁ గలదె యధిప! యెగ్గు? 100**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; శంతనుఁడు(న్)= శంతనుడూ; విచిత్ర వీర్యుఁడున్= విచిత్రవీర్యుడూ; పాండురాజున్= పాండురాజూ; ఎట్టులు= ఏవిధంగా (పాలించారో); అట్లు+అ= ఆవిధంగానే; రాజరాజు= దుర్యోధనుడు కూడా; ప్రజకున్= మాకు; సంతసముగన్= ఆనందం కలిగే విధంగా; ధాత్రిన్= ఈ రాజ్యాన్ని; పాలించెన్= పరిపాలించాడు; నీయందున్= నీవిషయంలో గానీ; అతని యందున్= ఆ దుర్యోధనుడి విషయంలో కానీ; ఎగ్గు= తప్పు; కలదె?= ఉన్నదా? (లేదు).

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మీ తాత శంతనుడూ, తండ్రి విచిత్రవీర్యుడూ, సోదరుడు పాండురాజూ ఎట్లాగో దుర్యోధనుడు కూడా అట్లాగే ఈ రాజ్యాన్ని ప్రజారంజకంగా పాలించాడు. నీలో గానీ, దుర్యోధనుడిలో గానీ తప్పు ఏమీ లేదు.

**వ. భీష్మద్రోణ కృపద్రౌణి కర్ణ కృతవర్మ, శల్యు, లొక్క దిక్కును, భీమార్జుననకుల సహదేవ ద్రుపద విరాట సాత్యకు లొక్కదెసయు నై విధిప్రేరణంబునం బోరిరి; వారివలన నఖిల క్షత్రియసంక్షయం బావహిల్లె నది యొక్క దుర్యోధను చేతన యయ్యెనె? యట్లుం గాక రణంబు రాజుల కుత్తమ ధర్మంబ కాదె! యందుల మరణంబును సుగతికరణకల్యంబు; నీ సుతుండు సహాయులుం దానునుం బుణ్యలోకసౌఖ్యంబునంబొందియున్నవాఁడు; ధర్మాచరణశాలి వగు నీకును సుగతిప్రాప్తి సులభంబ యగు; నిట మీఁదటికి మా భాగ్యంబునం జేసి పరమ కృపాభరితు లైన పాండవులు మాకు రక్షకులుగాఁ బడసితి; మాకర్ణింపుము. 101**

**ప్రతిపదార్థం:** భీష్మ- శల్యులు= భీష్ముడూ, ద్రోణుడూ, కృపాచార్యుడూ, ద్రోణుడి కొడుకయిన అశ్వత్థామా, కర్ణుడూ, కృతవర్మా, శల్యుడూ; ఒక్కదిక్కును= ఒక (కౌరవుల) పక్షంగానూ; భీమ.....సాత్యకులు= భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సమదేవుడూ, ద్రుపదమహారాజూ, విరాటరాజూ, సాత్యకీ; ఒక్కదెసయును= ఇంకొక (పాండవుల) పక్షంగానూ; ఐ= ఏర్పడి; విధిప్రేరణంబునన్= విధి ప్రేరేపించగా; పోరిరి= యుద్ధం చేశారు; వారివలనన్= వారి అందరి (యుద్ధం) కారణంగా; అఖిల క్షత్రియ సంక్షయంబు= సమస్తమైన (బంధు - తదితర) క్షత్రియలోకానికీ, వినాశనం; ఆవహిల్లెన్= కలిగింది; అది= ఆ విధమైన క్షత్రియకుల నాశం; ఒక్క దుర్యోధను చేతన్+అ= దుర్యోధనుడు ఒక్కడి వలన మాత్రమే; అయ్యెన్+ఎ= సంభవించిందా?; అట్లును+కాక= అంత మాత్రమే కాకుండా; రాజులకున్= భూపాలకులకు; రణంబు= యుద్ధం; ఉత్తమధర్మంబు+అ= శ్రేష్ఠమైన ధర్మమే; కాదె= కదా; అందులన్= ఆ యుద్ధంలో; మరణంబును= చావు కూడా; సుగతి కరణ కల్యంబు= ఉత్తమ లోకస్థితిని కలిగించే సాధనమే; నీ సుతుండు= నీ కొడుకైన దుర్యోధనుడు; సహాయులన్= తన పక్షంలో యుద్ధం చేసినవారితో కలిసి; తానునున్= స్వయంగా తనుకూడా; పుణ్యలోక సౌఖ్యంబునన్= ఉత్తమలోకాలలో సుఖాలను; పొంది ఉన్నవాఁడు= అనుభవిస్తున్నాడు; ధర్మ+ఆచరణ శాలివి= ధర్మాన్ని అనుష్ఠించడంలో సమర్థుడివి; అగు= అయినటువంటి; నీకును= నీకు (ధృతరాష్ట్రుడికి) కూడా; సుగతి ప్రాప్తి= ఉత్తమలోకాలను (పొందటం) కల్గడం; సులభంబు+అ= తేలికే; అగును= అవుతుంది; ఇటన్= ఇంక; మీఁదటికిన్= పైన (మీ తరువాత); మా భాగ్యంబునన్, చేసి= మా అదృష్టవశాన; పరమ+కృపా+భరితులు= మిక్కిలి దయతో నిండినవారు; ఐన= అయినటువంటి; పాండవులు= పాండురాజు కుమారులు; మాకున్= మాకు, (ఈ రాజ్య ప్రజలకు); రక్షకులు కాన్= కాపాడేవారుగా; పడసితిమి= పొందాము; ఆకర్ణింపుము= ఆ పై మా వినతి వినవలసింది.

**తాత్పర్యం:** భీష్ముడూ, ద్రోణుడూ, కృపాచార్యుడూ, అశ్వత్థామా, కృతవర్మా, శల్యుడూ, ఒక (దుర్యోధనుడి) వైపూ, భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ, ద్రుపదుడూ, విరటుడూ, మరో (ధర్మరాజు) వైపూ అయి విధి ప్రేరేపించడం మూలంగా యుద్ధం చేశారు. అందువలననే క్షత్రియు లంతా నశించిపోవటం జరిగింది. ఇదంతా దుర్యోధను

డొక్కడే చేశాడా? అదీ కాక రాజులకు యుద్ధం అనేది ఉత్తమ కర్తవ్యమైన ధర్మం గదా! ఆ యుద్ధంలో మరణం కూడా ఉత్తమలోకాలు సాధించి పెట్టేదే. నీకొడుకు (దుర్యోధనుడు) తనకు సహాయంగా తన పక్షంలో యుద్ధం చేసిన వారితో కలిసి తనుగూడా ఇపుడు పుణ్యలోక సౌఖ్యాలను అనుభవిస్తున్నాడు. ఎప్పుడూ ధర్మమే ఆచరించే స్వభావం కలిగిన నీకు కూడా ఉత్తమ లోకాలు సులువుగానే లభిస్తాయి. ఇంక ఆ తర్వాత - మా అదృష్టవశాన దయ నిండిన పాండవులను మాకు (రాజ్యానికి) రక్షకులుగా పొందాము. ఆ పైన వినుము.

**తే.** **స్వర్గ మైనను బాలింపఁ జాలువారు। వారలకు భూమిపాలన విధి యనంగ**
**నెంతపని? వీరి చేతికి నిచ్చి తిపుడు। మమ్ము నెల్ల విధంబుల మనిచి తధిప!** **102**

**ప్రతిపదార్థం:** అధిప!= (ధృతరాష్ట్ర) రాజా!; స్వర్గము= దేవతల రాజ్యం; ఐనను= అయినప్పటికీ; పాలింపన్= రక్షించటానికి; చాలువారు= (ఈ పాండవులు) సమర్థులు; వీరలకున్= అటువంటి ఈ పాండవులకు; భూమి పాలన విధి= ఈ భూలోకాన్ని పాలించటం; అనంగన్= అనగా; ఎంత పని?= ఎంతటి కార్యము?; ఇపుడు= ఇప్పుడు; మమ్మున్= మమ్మల్ని (ఈ ప్రజలను); వీరి చేతికిన్= ఈ పాండవుల చేతికి; ఇచ్చితి(వి)= అప్పగించావు; ఎల్లవిధంబులన్= (ఈ పాండవులను మాకు రక్షకులుగా చేయటం ద్వారా మమ్మల్ని) అన్ని రకాలుగానూ; మనిచితి(వి)= బ్రతికించావు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! దేవలోకాన్నైనా పాలించే సామర్థ్యం ఉన్న పాండవులకు ఈ భూమిని పరిపాలించటం ఎంత పని? ఈ రాజ్యాన్ని పాండవులచేతి కప్పగించి, అన్ని విధాలుగా మమ్మల్ని బ్రతికించావు.

**విశేషం:** (స్వర్గమైనను.....యనంగ నెంతపని?...... అలంకారం కావ్యార్థాపత్తి.)

**సీ.** **ధర్మపుత్త్రుఁడు దీర్ఘదర్శి, మహోదాత్త। సచివుండు, బంధు రక్షణ పరుండు,**
**రిపు నెడ నైనను గృప పెద్ద, భావసం। శుద్ధియుఁ బ్రతిభయు సువ్రతంబు**
**నితనికి వెన్నతో నిడినవి। యొరులను దనయట్ల కాఁ జూచుఁ దమ్ము లెల్ల**
**సన్నుతి కెక్కిన సకలగుణముల ని। మ్మహితాత్ముచందాన మమ్ముఁ బ్రోచు**

**తే.** **మాత్రయే దేవవిషయసమంచితాగ్ర। హార సజ్జన మాన్యంబు లైన గ్రామ**
**ములు దగంగ రక్షింతురు వెలయఁ దారు। నిత్తు రూళ్ళులు దేవమహీసురులకు.** **103**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్రుఁడు= యమ తనయుడైన ధర్మరాజు; దీర్ఘదర్శి= దూరపు చూపు కలవాడు; మహా-ఉదాత్త-సచివుండు= మిక్కిలి అధికులయిన అమాత్యులు కలవాడు; బంధు-రక్షణపరుండు= చుట్టాలను పాలించేవాడు; రిపు-ఎడన్= శత్రువుపైన; ఐనను= కూడా; కృప= దయ; పెద్ద= అధికంగా, గలవాడు; భావ సంశుద్ధియున్= నిర్మలమైన ఆలోచనలు; ప్రతిభయున్= క్రొంగ్రొత్త ఆలోచనలతోడి బుద్ధి విశేషమూ; సువ్రతంబు= మంచినడవడికా; ఇతనికిన్= ఈ ధర్మరాజుకు; వెన్నతోన్= పిన్న నాటినుండి వెన్న (ఆహారం)తో; ఇడినవి= ఇచ్చినవి; ఒరులన్= ఇతరులను (సర్వభూతాలను); తన+అట్లు+అ= తనవలెనే; కాన్= అయ్యేవిధంగా; చూచున్= చూచుకొంటాడు; తమ్ములు= ఇతనికి సహోదరులు అయిన భీముడు మొదలైనవారు; ఎల్లన్= అందరూ; సన్నుతికిన్= శ్రేష్ఠమయిన పొగడ్తలకు; ఎక్కిన= స్థానమైన; సకల గుణములన్= సమస్తమైన మంచి లక్షణాలతో; ఈ+ మహిత+ఆత్ము= గొప్ప మనసు గలిగిన ఈ ధర్మరాజుయొక్క; చందానన్= విధంగానే; మమ్మున్= మమ్మల్ని, (ప్రజలను);

ప్రోచు-మాత్ర-ఏ= రక్షించడం మాత్రమే కాదు సుమా; దేవ విషయ= దేవతల (దేవ-ఆలయాలు నిర్వాహాదిదైవ- ఉపభోగం నిమిత్తంగా); సమంచిత= ఒప్పుతున్న (ఇవ్వబడిఉన్న); అగ్రహార= అగ్రహారాలూ; సజ్జన= శ్రేష్ఠ (బ్రాహ్మణు)ల యొక్క; మాన్యంబులు= (గౌరవంగా ఇవ్వబడిన) మాన్యాలూ; ఐన= అయినటువంటి; గ్రామములు= ఊళ్ళు; తగంగన్= సముచితంగా; రక్షింతురు= కాపాడుతారు; తారున్= స్వయంగా తాము (పాండవులు) కూడా; వెలయన్= ప్రసిద్ధిగా; దేవ మహీసురులకున్= దేవతలకూ, బ్రాహ్మణులకూ; ఊళ్ళులు= గ్రామాలను; ఇత్తురు= ఇస్తారు.

**తాత్పర్యం:** ధర్మరాజు చాలా ముందుచూపు ఉన్నవాడు. గొప్ప మంత్రులు గలవాడు. చుట్టాలను పాలించే స్వభావం గలవాడు. శత్రువులపై గూడా దయ ఎక్కువగా గలవాడు. నిష్కల్మషమైన ఆలోచనలూ, సమయస్ఫూర్తితో గూడిన బుద్ధి వైభవమూ, మంచి నడవడిక ధర్మరాజుకు చిన్నప్పటినుంచీ అలవడ్డాయి. ఇతరు లందరినీ తనవలెనే చూస్తాడు. ఇతడి తమ్ముళ్ళు గూడా ప్రశంసించబడే మంచి లక్షణాలతో ఈ ధర్మరాజు వంటివారే. ఈ పాండవులును మమ్మల్ని (ప్రజలను) రక్షించటం మాత్రమే కాదు, దేవతల కొరకు అగ్రహారాలుగానూ, బ్రాహ్మణులకు మాన్యాలుగానూ పూర్వరాజులు ఇచ్చిన ఊళ్ళను కాపాడుతారు. అంతే కాకుండా దేవతలకూ, బ్రాహ్మణులకూ తాము స్వయంగా కూడా చాలా ఊళ్ళు ఇస్తారు.

**క. మృదువులకుఁ జాల మృదువులు; । విదితయశా! వినుము పాండవేయులు కడు బె**
**ట్టిదులు బెడిదంపు వారికి । మదలోభిత్వములు లేవు మందున కైనన్. 104**

**ప్రతిపదార్థం:** విదిత యశా!= ప్రసిద్ధమైన కీర్తి కల ఓ ధృతరాష్ట్ర మహారాజా!; వినుము= మా మనవి వినవలసింది; పాండవేయులు= పాండురాజు కొడుకులు; మృదువులకున్= సాధువులైన వారి విషయంలో; చాలన్= తగినంత (అధికంగా); మృదువులు= సాధు జనులు; బెడిదంపు వారికిన్= క్రూరుల విషయంలో; కడున్= మిక్కిలి; బెట్టిదులు= కఠినులు; మద లోభిత్వములు= గర్వమూ, పిసినిగొట్టుతనమూ; మందునకున్+ఐనన్= మందుకు కూడా; లేవు= (పాండవులందు) లేవు.

**తాత్పర్యం:** ప్రసిద్ధ మైన కీర్తి కలిగిన ధృతరాష్ట్ర మహారాజా! వినుము. పాండవులు మంచివారి విషయంలో చాలా మంచివారు. దుర్మార్గుల విషయంలో చాలా కఠినులు. ఆ పాండవులలో అహంకారం గానీ, లోభం కాని మందుకు కూడా (స్వల్పంగా నైనా) లేవు.

**క. శూరులు, శాంత స్వాంతులు, । పౌరజన ప్రకర జానపదచయ నిత్యా**
**పార ప్రమదాపాదన । పారగు లతుల గురుభక్తి పరతంత్రాత్ముల్. 105**

**ప్రతిపదార్థం:** శూరులు= పాండవులు శౌర్యం కలిగినవారు; శాంత-స్వాంతులు= (అయినా) ప్రశాంతమైన మనసులు కలవాళ్ళు; పౌరజన-ప్రకర= నగరవాసుల సమూహానికీ; జానపద చయ= పల్లెలలో నివసించే జనుల సమూహానికీ; అపార= మితిమీరిన; ప్రమద= సంతోషాన్ని; ఆపాదన= కల్పించటంలో; పారగులు= సర్వమూ తెలిసిన వాళ్ళు; అతుల= సాటిలేని; గురు= పెద్దల యందలి; భక్తి= సేవాభావానికి; పరతంత్ర= అధీనమైన; ఆత్ముల్= మనసులు కలిగినవారు.

**తాత్పర్యం:** పరాక్రమవంతులూ, నిర్వికారమైన మనస్సు కలిగిన వారూ అయిన పాండవులు పట్టణవాసులకూ, పల్లెలలో ఉండే ప్రజలకూ; నిరంతరమూ మిక్కిలి సంతోషం గలిగిస్తారు. పెద్దలమీద అత్యధికమైన భక్తి గలవారు.

**తే. గొంతి దేవికిఁ గోడండ్రకును మనములఁ । గరుణ యగ్గల మై యుండు ధరణినాథ!**
**పౌరులందును జనపద ప్రజల యెడను । నాడుదురు మేలు తమ కగ్గ మైన యపుడు. 106**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= (ధృతరాష్ట్ర) రాజా!; గొంతిదేవికిన్= కుంతికీ; కోడండ్రకును= ఆ కుంతీదేవికి కోడళ్లైన ద్రౌపది, ఉలూచి, సుభద్రా మొదలైన వారికీ; మనములన్= మనస్సులలో; పౌరులందును= పుర (పట్టణ) ప్రజలపైనా; జనపద ప్రజల ఎడను= పల్లె ప్రజల విషయంలోనూ; కరుణ= దయ; అగ్గలము+ఐ= అధికంగా; ఉండున్= ఉంటుంది; తమకున్= వారికి; అగ్గము+ఐన+అపుడు= కనబడిన సమయంలో (ప్రజలకు); మేలు= మంచి; ఆడుదురు= చెపుతారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కుంతీదేవికీ, ఆమె కోడళ్ళకూ పట్టణ ప్రజలమీదా, పల్లె జనుల మీదా దయ చాలా ఎక్కువ, వాళ్ళు ఆ ప్రజలు తమకు గోచరించినపుడు మేలు మాటలు చెపుతారు.

**వ. వీర లెప్పుడు మము నీవు గారవించు । టెఱిఁగి మన్నింతు రమలినహృదయ! కలఁక**
**దక్కి ధర్మజుపై రాజ్యతంత్రభార । మిడి మనంబున నూఱడి యిచ్చ సలుపు.' 107**

**ప్రతిపదార్థం:** అమలిన హృదయ!= స్వచ్ఛమైన మనసు కలిగిన వాడా! ( ధృతరాష్ట్రా); నీవు= నీవు; మమ్మున్= మమ్మల్ని (ప్రజలను); ఎప్పుడు(న్)= నిరంతరమూ; గారవించుట= ఆదరించటం; ఎఱిఁగి= గ్రహించి; వీరలు= ఈ పాండవులు, వారికి సంబంధిన స్త్రీలూ; మన్నింతురు= మమ్మల్ని గౌరవిస్తారు; కలఁక= (నీవు) విచారాన్ని; తక్కి= విడిచిపెట్టి; రాజ్య తంత్ర భారము= ఈ రాజ్యాన్ని పాలించవలసిన బాధ్యతను; ధర్మజుపైన్= ధర్మరాజు మీద; ఇడి= ఉంచి; మనంబునన్= నీ మనస్సులో; ఊఱడి= ఊరట పొంది; ఇచ్చ= నీ ఇష్టం వచ్చిన పని, (నీ కిష్టమైన వనగమనం); చలుపు= చేయవలసినది.

**తాత్పర్యం:** నిర్మలమైన మనసు కలిగిన ధృతరాష్ట్ర మహారాజా! మమ్మల్ని నీవెప్పుడూ ఆదరించటం తెలిసిన ఈ పాండవులూ వారి స్త్రీలూ మమ్మల్ని గౌరవిస్తారు. విచారం విడిచిపెట్టు. సామ్రాజ్యం నిర్వహించవలసిన బరువు ధర్మజుడిపైన ఉంచుము. మనసు నిశ్చింత చేసికొమ్ము. నీకు తోచిన విధంగా (వనగమనం) చేయుము'.

**వ. అని చెప్పె ని ట్లవ్విప్రముఖంబునఁ బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు ప్రీతుం డయి సముచిత ప్రకారంబుల నజ్జనంబులం గ్రమంబున వీడుకొలిపి, కౌంతేయాది బంధువులను మిత్రులను నిజనివాసంబులకుం బోవం బనిచి, గాంధారీ సమేతుం డై యభ్యంతరమందిరంబున కరిగి యద్దినశేషంబును రాత్రియుం దగు వర్తనంబులఁ గడపి, మఱునాఁడు విదురుని రావించి 'మృతు లయిన బాంధవుల కెల్లను సవిశేషశ్రాద్ధంబులు చేయు తలంపు పుట్టి కొన్ని దివసంబులు పయనంబు మానితి; మానిత మాననీయ చరిత్రుం డగు ధర్మపుత్త్రుపాలికిం బోయి నీ విక్కార్యంబు సంఘటింపు' మని పనిచిన నతం 'డట్ల చేసెద' నని యనుజసహితుం డై యున్న యన్నరేంద్రునిం గాంచి. 108**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; చెప్పెన్(న్)= శంబువు పౌరుల అభిప్రాయాన్ని ధృతరాష్ట్రుడికి చెప్పాడు; ఇట్లు= ఈ విధంగా; ఆ+విప్రముఖంబునన్= ఆ బ్రాహ్మణుడైన శంబువు నోట; పౌరుల భాషణంబులు= అక్కడి పురజనులమాటలను; విని= ఆలకించి; ధృతరాష్ట్రుండు; ప్రీతుండు+అయి= సంతోషించినవాడై; సముచిత ప్రకారంబులన్= తగినవిధంగా; (ఎవరి

కెటువంటి పద్ధతి ఉచితమో ఆ విధంగా) ఆ+జనంబులన్= ఆ పౌరులను; క్రమంబునన్= వరుసగా అందరినీ; వీడు కొలిపి= పంపి; కౌంతేయ ఆదిబంధువులను= పాండవులు మొదలైన చుట్టాలనూ; మిత్రులనూ= స్నేహితులనూ; నిజ నివాసంబులకున్= తమతమ ఇళ్ళకు; పోవన్ పనిచి= వెళ్ళండని పంపి; గాంధారీ సమేతుండు+ఐ= గాంధారితో కూడినవాడై; అభ్యంతర మందిరంబునకున్= తమ లోపలి ఇంటికి; అరిగి= వెళ్ళి; ఆ+దినశేషంబును= మిగిలి ఉన్న ఆరోజు పగటిసమయాన్ని; కడపి= దాటించి; మఱునాఁడు= తరువాతిరోజు; విదురునిన్= సోదరుడైన విదురుడిని; రావించి= పిలిపించి; (అతనితో ఇలా అంటున్నాడు) మృతులు+అయిన= మరణించినట్టి; బాంధవులకున్= చుట్టాలకు; ఎల్లను= అందరికీ; సవిశేష శ్రాద్ధంబులు= విశేషమైన శ్రాద్ధక్రియలు; చేయుతలంపు= చేయాలనే ఆలోచన; పుట్టె= ఏర్పడి; పయనంబు= అరణ్యాలకు చేయవలసిన ప్రయాణం; కొన్ని దివసంబులు= కొన్ని రోజులు; మానితి(న్)= మానుకొన్నాను; మానిత= గౌరవించబడేవారిచేత; మాననీయ= గౌరవించదగిన; చరిత్రుండు= నడవడిక కలిగినవాడు; అగు= అయినటువంటి; ధర్మపుత్త్రుపాలికిన్= ధర్మరాజువద్దకు; నీవు= నీవు (విదురుడు); పోయి= వెళ్ళి; ఈ+కార్యంబు= తాను మృతబాంధవులకు చేయ తలపెట్టిన శ్రాద్ధలకు అనుమతీ-ఏర్పాట్లు-అనే పని; సంఘటింపువము= సాధించవలసింది; అని= అని చెప్పి; పనిచినన్= నియోగించగా; అతండు= ఆ విదురుడు; అట్లు+అ= ఆ (ధృతరాష్ట్రుడు చెప్పిన) విధంగానే; చేసెదన్= చేస్తాను; అని= అనిచెప్పి; అనుజసహితుండు ఐ+ఉన్న= భీముడు మొదలైన తమ్ములతో కూడి ఉన్న; ఆ+నరేంద్రునిన్= ఆ (ధర్మ) రాజును; కాంచి= చూచి (ఎదురుగ ధర్మరాజుతో ఇట్లా అంటున్నాడు).

**తాత్పర్యం:** పౌరుల అభిప్రాయాన్ని ఆ బ్రాహ్మణుడి (శంబువు) నోట ఆ విధంగా విన్న ధృతరాష్ట్రుడు చాలా సంతోషించాడు. ఈ పౌరజనులకు ఎవరిస్థాయికి తగిన విధంగా వారికి ఆ ప్రకారంగా క్రమంగా వీడుకోళ్ళు చెప్పి ఇళ్ళకు పంపించాడు. తను గూడా గాంధారితో కలిసి లోపలి మందిరానికి వెళ్ళాడు. ఆరోజు ఇంకా మిగిలిఉన్న పగలు, ఆ రోజు రాత్రీ గడిపి, మర్నాడు విదురుడిని పిలిపించి అతడితో ఇట్లా అన్నాడు. మరణించిన బంధువులందరికి సవిశేషంగా శ్రాద్ధాలు పెట్టాలనే సంకల్పం కలిగింది. అందువలన అరణ్యగమనం కొన్నాళ్ళు మానుకొంటున్నాను. నీవిపుడు ఆ ధర్మరాజు దగ్గరికి పోయి ఈ పని ఏర్పాటు చేయుము. అనగానే విదురుడు సరే అని వెళ్ళాడు. అక్కడ తమ్ముళ్ళతో కలిసిఉన్న ధర్మరాజును చూచి అతడితో విదురుడు ఇట్లా అన్నాడు.

**సీ.** **'మీ తండ్రి సురనదీసూతి బాహ్లికులకు । సోమదత్తునకుఁ, దత్సూనునకును,**
**దుర్యోధనాదిసుతులకును; దక్కును । గలుగు బంధులకు నుత్కర్ష మెసఁగ**
**శ్రాద్ధముల్ సేయు విచారంబు దోఁచిన । మసలెఁ గార్తికపౌర్ణమాసి దాఁక**
**వనమున కరుగ కప్పని నీకుఁ బోలిన । యట్టులు గావింపు' మనిన నాతఁ**

**తే.** **డెంతయును వేడ్క నమ్మాట కియ్యకొనియె; । నర్జునుండును బ్రీతుఁ డై యర్హ మనియె;**
**భీముఁ డపుడు కమర్చిన మోముతోడ । విదురు వదనంబు సూచుచుఁ బెదవు లదర** **109**

**ప్రతిపదార్థం:** మీ తండ్రి= (మీకు తండ్రి అయిన) ధృతరాష్ట్రుడు; సురనదీసూతి, బాహ్లికు= బాహ్లికుడికీ; సోమదత్తునకున్= (బాహ్లికుడి కొడుకు అయిన) సోమదత్తుడికీ; తద్ సూనునకునున్= ఆ సోమదత్తుడి కొడుకయిన భూరిశ్రవసుడికీ; దుర్యోధన+ఆది, సుతులకున్= దుర్యోధనుడు మొదలైన కొడుకులకూ; తక్కను కలుగు= ఇంకా మిగిలిఉన్న; బంధులకున్= యుద్ధంలో మరణించిన బంధువులకూ; ఉత్కర్షము= ఆధిక్యం; ఎసఁగన్= అతిశయించే విధంగా; శ్రాద్ధముల్= ఉత్తమ లోకాలు కలుగజేసే (శ్రాద్ధ) కర్మలను; చేయు విచారంబు= చేయాలనే ఆలోచన; తోఁచినన్= కలగటం వలన; వనమునకున్= అడవులకు; అరుగన్=

వెళ్లకుండా; కార్తిక పౌర్ణమాసి దాఁకన్= కార్తికమాస పూర్ణిమ వరకూ; మసలెన్= ప్రయాణం చేయకుండా ఆగాడు; నీకున్= నీకు; పోలిన+అట్టులు= తగిన విధంగా; కావింపుము= చేయవలసింది; అనినన్= అని విదురుడు పల్కగా; అతఁడు= ఆ ధర్మరాజు; ఎంతయున్= చాలా; వేడ్కన్= ఆనందంతో; ఆ+మాటలన్= విదురుడి మాటలకు; ఇయ్యకొనియెన్= అంగీకరించాడు; అర్జునుండును= అర్జునుడు కూడా; ప్రీతుఁడు+ఐ= ఆనందించినవాడై; అర్హము= (ధృతరాష్ట్రుడు చేయదలచినపని) తగినది; అనియెన్= అన్నాడు; అపుడు= ఆ సమయంలో; భీముఁడు= భీమసేనుడు; కమర్చిన మోము తోడన్= మండిపడుతున్న ముఖంతో; విదురువదనంబు= విదురుడి ముఖాన్ని; చూచుచున్= చూస్తూ; పెదవులు= పెదవులు; అదరన్= అదురుతుండగా (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** '(ధర్మరాజా!) మీ తండ్రి ధృతరాష్ట్రుడు, భీష్ముడికీ, బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవులకూ; దుర్యోధనుడు మొదలైన కొడుకులకూ; ఇంకా యుద్ధంలో మరణించిన మిగిలిన బంధువులకూ, సవిశేషంగా, శ్రాద్ధ కర్మలు చేయాలనే ఆలోచన కలగటంవలన కార్తిక పూర్ణిమవరకూ అరణ్యాలకు వెళ్ళకుండా ఆగాడు. ఇంక నీవు తగువిధంగా చేయవలసింది' అన్నాడు విదురుడు ధర్మరాజుతో. ధర్మరాజు ఆ మాటలకు సంతోషంగా అంగీకరించాడు. అర్జునుడు కూడా అది తగిన పని అన్నాడు. భీముడు మాత్రం కోపంతో ఎర్రబడిన ముఖంతో విదురుడి ముఖంలోకి చూస్తూ పెదవులు అదురుతుండగా ఏదో అనబోయాడు.

**వ. ఏమేనిం బలుకం జూచినన్ బీభత్సుండు మెలుపున నతని వారించి యల్లన యిట్లనియె. 110**

**ప్రతిపదార్థం:** ఏమి+ఏనిన్= ఏదో; పలుకన్+చూచినన్= మాట్లాడబోతుండగా; బీభత్సుండు= అర్జునుడు; మెలుపునన్= చాకచక్యంతో; అతనిన్= ఆ భీముడిని; వారించి= (మాటాడకుండా) ఆపి; అల్లన= మెల్లగా; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** (భీముడు కోపంతో విదురుడితో ఏదో) అనబోతూ ఉండగా అర్జునుడు నేర్పుగా భీముడిని మాటాడకుండా నివారించి మెల్లగా ఇట్లా అన్నాడు.

**సీ. 'రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుండు భీష్మము। ఖ్య జ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ**
**రింపఁ దలంచి యర్థించె; భవజ్జిత। ధనధాన్యములు నీవు దాని కియ్య**
**కొనమి యశంబునకును ధర్మమునకు వి। ధ్వంసంబు సేయదే? ధర్మతనయు**
**తలఁచినపని విఘ్నితము సేయఁదగునయ్య?। మనకు నయ్యంబికాతనయుఁ దొల్లి**

**ఆ. వేఁడికొందు మతఁడు వేఁడెడుఁ గానకు। నేఁగుచుండి మనల నిప్పు డింత**
**సూడవలదె? యొండులాడక యప్పని। సలుపు టొప్పు బాహుశాలి! నీకు. 111**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; రాజు= మనకు పాలకుడు; వృద్ధుఁడు= పైగా (వయసు మళ్ళిన) పెద్దవాడు; భీష్మ- ముఖ్య జ్ఞాతులకున్= భీష్ముడు మొదలైన దాయాదులకు; శ్రాద్ధకర్మము= సుగతులు కలగటం కొరకు శ్రాద్ధక్రియలు; ఆచరింపన్= చేయాలని; తలంచి= అనుకొని; భవత్-జిత-ధనధాన్యములు= నీవు ఇతరరాజులను జయించి తెచ్చిన సంపదలు; అర్థించెన్= కోరుతున్నాడు; దానికిన్= ధృతరాష్ట్రుడి ఆ కోరికను; నీవు= నీవు; ఇయ్యకొనమి= ఒప్పుకొనకపోవటం; యశంబునకును= కీర్తికి; ధర్మమునకున్= ధర్మానికీ; విధ్వంసంబు= వినాశనం; చేయదే?= కలిగింపదా?; ధర్మతనయు= ధర్మరాజు; తలఁచిన పని= ఉద్దేశించిన పని; విఘ్నితము చేయన్= అడ్డగించటం; మనకున్= (అతడి తమ్ములమైన) మనకు; తగునయ్య?= ఉచితమా?;

తొల్లి= పూర్వం; ఆ+అంబికాతనయున్= ఆ ధృతరాష్ట్రుడిని; వేఁడికొందుము= మనమే అర్థించేవాళ్ళం; అతఁడు= అటువంటి ధృతరాష్ట్రుడు; ఇప్పుడు= ఈనాడు; మనలన్= మనలను; కానకున్= అరణ్యానికి; ఏఁగుచున్+ఉండి= వెళ్ళుతూ; వేఁడెడున్= అర్థిస్తున్నాడు; ఇంత= ఈ మాత్రం ధృతరాష్ట్రుడి చిన్న పని; చూడన్వలదె?= మనం చేసిపెట్ట నవసరం లేదా?; బాహుశాలి!= మిక్కిలి భుజబలం కలిగిన భీమా!; ఒండులు= విరుద్ధమైనమాటలు; ఆడక= చెప్పక; ఆ+పని= ఆ ధృతరాష్ట్రుడి కార్యం; చలుపుట= చేయటం; నీకున్= నీకు; ఒప్పున్= తగును.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడు మనరాజు. పైగా పెద్దవాడు. భీష్మాదు లైన దాయాదులకు శ్రాద్ధక్రియలు చేయుటకొరకు నీవు రాజులను జయించి సంపాదించిన ధనధాన్యాలు అడుగుతున్నాడు. నీవు దానికి ఒప్పుకోకపోవటం (మన) కీర్తిని, ధర్మాన్ని నాశనం చేస్తుంది. ధర్మరాజు చేయదలచుకొన్న పనిని మనం అడ్డగింపవచ్చునా? పూర్వం మనమే ధృతరాష్ట్రుడిని అర్థించేవాళ్ళం. అటువంటి ధృతరాష్ట్రుడు ఇప్పుడు, అదీ అడవులకు పోతూ, మనలను అర్థిస్తున్నాడు. ఆ పని మనం చేసి పెట్టవద్దా? మరొక మాట చెప్పకుండా నీవు ధృతరాష్ట్రుడి పని చేయటం ఉచితం' (అన్నాడు భీముడితో అర్జునుడు).

**క. అని చెప్పఁగ జెవిఁ దాఁటిచి। విని ధర్మతనూజుఁ డంత విజయునిఁ బొగడెన్**
**మనమున నమ్మాటల క। య్యనిలతనయుఁ డిట్టు లనియె నన్నరుతోడన్. 112**

**ప్రతిపదార్థం:** అని= పై ప్రకారంగా; చెప్పఁగన్= అర్జునుడు భీముడితో పల్కఁగా; అంతన్= అపుడు; ధర్మతనూజుఁడు= ధర్మరాజు; చెవిన్= తన చెవిని; తాఁటిచి= ఆ వైపు కూర్చి; విని= ఆలకించి; మనమునన్= తనమనస్సులోనే; విజయునిన్= అర్జునుడిని; పొగడెన్= ప్రశంసించాడు; ఆ+మాటలకున్= అర్జునుడన్న మాటలకు; ఆ+అనిలతనయుఁడు= వాయుపుత్రుడైన ఆ భీముడు; ఆ+నరుతోడన్= ఆ అర్జునుడితో; ఇట్టులు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా భీముడితో చెప్పినమాటలను అటువైపు చెవిపెట్టి ధర్మరాజు విన్నాడు. చాల సంతోషించి, అర్జునుడిని మనసులోనే ప్రశంసించాడు. అర్జునుడి మాటలకు అతడితో భీముడు ఇట్లా అన్నాడు.

**భీముఁ డర్జునునితో ధృతరాష్ట్రు నుద్యోగంబునకుఁ బ్రతికూలించి చెప్పుట (సం.15-17-15)**

**క. 'మును చేసినయవి చాలవె?। విను గాంగేయాది బంధువితతికిఁ దగ నిం**
**కను శ్రాద్ధంబులు వలసిన। మనము దగమె చేయ దుష్టమతి యతఁ డేలా? 113**

**ప్రతిపదార్థం:** మును= (ధృతరాష్ట్రుడు) ఇంతకు మునుపు; చేసిన+అవి= ఆచరించిన శ్రాద్ధాదికర్మలు; చాలవె?= సరిపోవా?; విను= (అర్జునా) వినవలసింది; గాంగేయ+ఆది బంధు వితతికిన్= భీష్ముడు మొదలైన బంధువుల సమూహానికి; ఇంకను= ఇంకా; తగన్= తగు విధంగా; శ్రాద్ధంబులు= శ్రాద్ధక్రియలు; వలసినన్= చేయవలసి వస్తే; చేయన్= చేయడానికి; మనము= మనం (పాండవులము); తగమె?= అర్హులం కాదా?; దుష్టమతి= దుర్బుద్ధి అయిన; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; ఏలా?= ఎందుకు (ఆచరించాలి)?

**తాత్పర్యం:** 'అర్జునా! ధృతరాష్ట్రుడు ఇంతవరకూ చేసిన శ్రాద్ధాలు సరిపోలేదా? భీష్మాదు లైన బంధువుల మూకకు ఇంకా చేయవలసివస్తే అందుకు మనం పనికి రామా? దుష్టబుద్ధి అయిన ధృతరాష్ట్రుడే ఎందుకు చేయాలి?

**క. మఱచితె యాతఁడు మనలం। బఱచిన బన్నములు భీష్మ బాహ్లిక ముఖు ల**
**త్తఱి నెటఁ బోయిరి? వారల। నెఱుఁగమె మన? మట్టి బంధు లేటికి మనకున్? 114**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; మనలన్= పాండవులను; పఱచిన బన్నములు= చేసిన అవమానాలు; మఱచితి(వి)+ఎ= మర్చిపొయ్యావా?; భీష్మ-బాహ్లిక-ముఖులు= భీష్ముడూ, బాహ్లికుడూ, మొదలైన ఆ బంధువులు; ఆ+తఱిన్= మనలను అవమానించే టప్పుడు; ఎటన్+పోయిరి?= ఎక్కడికి వెళ్ళారు? వారలన్= ఆ భీష్మాదులను; మనము= మనం; (నీవూ,నేనూ); ఎఱుఁగమె?= తెలిసిన వాళ్లం కదా?; అట్టిబంధులు= అటువంటి చుట్టాలు; మనకున్= మనకు; ఏటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడు మనకు చేసిన పరాభవాలు మరచిపోయావా? ఆ సమయంలో భీష్ముడూ బాహ్లికుడూ మొదలైన ఈ బంధువులు ఏమైనారు? వాళ్లసంగతి మనకు తెలియదా? అటువంటి బంధువులు మన కెందుకు? (వాళ్ళకు శ్రాద్ధక్రియలు చేయ నవసరం లేదు). కాబట్టి ధృతరాష్ట్రుడికోరిక, అంగీకరించ నక్కర్లేదు.

**వ. వారి విషయం బైన మేలునకు మాఱాడుట యెగ్గు గా; దాకర్ణింపుము. 115**

**ప్రతిపదార్థం:** వారి విషయంబు= భీష్మ ముఖ్యులైన జ్ఞాతులకు సంబంధించినది; ఐన= అయినటువంటి; మేలునకున్= ప్రయోజనానికి; మాఱు+ఆడుట= విరుద్ధంగా మాటాడటం; ఎగ్గు= తప్పు; కాదు= కాదు; ఆకర్ణింపుము= (అర్జునా! ఇంకొక మాట) విను.

**తాత్పర్యం:** భీష్మాదులను మనం బంధువులుగా గ్రహించనే అవసరం లేదు కాబట్టి వారికి సంబంధించిన మేలు (ఊర్ధ్వలోకాలు కలగడం) కొరకు విరుద్ధంగా మాటాడితే తప్పేమీ లేదు. ఇంకొక మాట వినుము.

**తే. కర్ణునకుఁ జేయవలసిన గారవమున। గొంతి యింకను శ్రాద్ధ మత్యంతవిభవ**
**ముల్లసిల్లంగఁ జేయుఁగా కుచిత నిరతి। యావిధమునకు మాఱాట సూవె యెగ్గు.' 116**

**ప్రతిపదార్థం:** కర్ణునకున్= కర్ణుడికి; చేయవలసిన= ఆచరించవలసిన; గారవమునన్= వాత్సల్యంతో; ఉచిత-నిరతిన్= తగినంతటి ఆసక్తి (శ్రద్ధ)తో; ఇంకను= ఇంకా, పూర్వంకంటె అధికంగా; అత్యంత-విభవము= మిక్కిలి వైభవం; ఉల్లసిల్లంగన్= ప్రకాశించేటట్లుగా; శ్రాద్ధము= శ్రాద్ధకర్మను; గొంతి= కుంతీదేవి; చేయున్+కాక= చేస్తుంది; ఆ విధమునకున్= కర్ణుడికీ, కుంతి-శ్రాద్ధం చేసే విషయానికి మాత్రమే; మాఱు+ఆట= విరుద్ధంగా పలకటం; ఎగ్గు= తప్పు; చూవె= సుమా.

**తాత్పర్యం:** ఊర్ధ్వ దైహిక క్రియలు కర్ణుడికి చేయాలనుకొంటే, పుత్రవాత్సల్యంతో, శ్రద్ధగా అపూర్వమైన వైభవంతో కుంతీదేవి చేయవచ్చు. దానికి ఎదురు మాటాడటం తప్పు.

**వ. అని పలికి వెండియు. 117**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; పలికి= (అర్జునుడితో, భీముడు) చెప్పి; వెండియున్= మళ్ళీ ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా చెప్పి భీముడు అర్జునుడితో మళ్ళీ ఇలా అన్నాడు.

**సీ. 'పాంచాలి నవమానపఱిచిన తెఱఁగును। నయ్యింతి వెనుక రా నడవిఁ గలయ**
**ధర్మజుచన్న చందంబును మది గీఁటి। యుండక మఱ పెట్టు లొలసె నీకు**
**నాంబికేయుఁడు తండ్రి యగుట నాఁ డెటఁబోయె। భీష్ముండు మొదలగు పెద్దవారి**
**బాంధవం బేమయ్యెఁ బార్థ! యీవిదురుఁ డె। ఱుంగఁడే వారల భంగి?' యనిన**

**ఆ. ధర్మజుండు భీముఁ దగువచనముల న। దల్చె నరుఁడు మఱియుఁ దగఁడె పూజ**
**కాంబికేయుఁ? డిట్టు లనకుము మనకు న। గ్రజుని పనుపు సేఁత వ్రతము గాదె!' 118**

**ప్రతిపదార్థం:** పార్థ!= అర్జునా!; పాంచాలిన్= (పాంచాలరాజు కూతురైన) ద్రౌపదిని; అవమాన పఱిచిన తెఱఁగును= పరాభవించిన విధమూ; ఆ+ఇంతి= ఆద్రౌపది; వెనుకన్= వెన్నంటి; రాన్= రాగా (అనుసరింపగా); అడవిన్= అడవులలో; కలయన్= చుట్టి; ధర్మజు-చన్న చందంబును= ధర్మరాజు తిరిగిన విధమూ; మదిన్= మనసులో; గీఁటి+ఉండక= నాటుకొని నిలువకుండా; నీకున్= నీకు (అర్జునుడికి); మఱపు= మర్చిపోవటం; ఎట్టులు= ఏ విధంగా; ఒలసెన్= సంభవించింది; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; తండ్రి= మనకు (పెద్ద) తండ్రి; అగుట= కావటం, నాఁడు= ద్రౌపదిని, (మనలను) పరాభవించినరోజు; ఎటన్= ఎక్కడికి; పోయెన్?= పోయింది?; భీష్ముండు= భీష్ముడూ; మొదలు-అగువారి-బాంధవంబు= మొదలైన వాళ్ళకు మనతో ఉన్న చుట్టరికం; ఏమి-అయ్యెన్?= ఆ రోజు ఏమయిపోయింది?; వారల భంగి= ఆ ధృతరాష్ట్రుడు భీష్ముడు మొదలైనవారి విధానం; ఈ విదురుఁడు= (ధృతరాష్ట్రుడి మాట మోసుకొనివచ్చిన) ఈ విదురుడు; ఎఱుంగఁడే?= తెలిసిన వాడు కాదా?; అనినన్= అని (భీముడు) పల్కగా; భీమున్= భీముడిని; ధర్మజుండు= ధర్మరాజు; తగు వచనములన్= తగిన మాటలతో; అదల్చెన్= వారించాడు; నరుఁడు= అర్జునుడు; మఱియున్= ఇంకా (ఇట్లా అంటున్నాడు); ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; పూజకున్= (మనం) గౌరవించడానికి; తగఁడె?= అర్హుడా కాదా?; ఇట్టులు= ఈ విధంగా, (భీష్మ ధృతరాష్ట్రాదులను నిందిస్తూ); అనకుము= మాటాడకు; అగ్రజుని పనుపు= అన్నగారి ఆజ్ఞ; చేఁత= ఆచరించటం; మనకున్= అతడికి తమ్ముళ్లమైన మనకు అందరికీ; వ్రతము= నియమం; కాదె!= కదా!.

**తాత్పర్యం:** 'అర్జునా! ఆ రోజు ద్రౌపదిని సభలో పరాభవించిన విధమూ, ఆ ద్రౌపది వెన్నంటి రాగా ధర్మరాజు అడవుల వెంట తిరగటమూ, మనసులో నాటుకొనకుండా మర్చిపోవటం నీకు ఎట్లా సంభవించింది? ద్రౌపదిని అవమానించిన ఆ రోజు ఈ ధృతరాష్ట్రుడు తండ్రి కాడా? అపుడు భీష్మాదుల బాంధవ్యం ఎక్కడికి పోయింది? వాళ్ళ సంగతి ఈ విదురుడికి తెలియదా?' అని అంటూంటే ధర్మరాజు భీముడిని తగు మాటలతో వారించాడు. అర్జునుడింకా భీముడితో ఇట్లా అన్నాడు. ధృతరాష్ట్రుడు గౌరవానికి అర్హుడు కాడా? ఈ విధంగా మాటాడకుము. అన్నగారి ఆజ్ఞ నిర్వహించటం మనకు నియమం గదా!'

**క. అని భీము నదిమి విదురునిఁ। గనుఁగొని మా తండ్రి పుణ్య కర్మము లెమ్మైఁ**
**దన బంధులకై చేయఁగ। మనంబునం దలఁచె నా సమంచితభంగిన్. 119**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; భీమున్= భీముడిని; అదిమి= మాటాడకుండా చేసి, (అదిమిపట్టి); విదురునిన్= విదురుడిని; కనుఁగొని= చూచి ఇట్లా అన్నాడు; మా తండ్రి= ధృతరాష్ట్రుడు; తన బంధులకున్= తన చుట్టాలకొరకుగా; పుణ్య కర్మములు= శ్రాద్ధ క్రియలు; ఏ+మైన్= ఏ విధంగా; చేయఁగన్= చేయటానికి; మనంబునన్= తన మనస్సులో; తలంచెన్= అనుకొన్నాడో; ఆ సమంచిత భంగిన్= ఆ గొప్ప తీరుగా (చేయవచ్చును). (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని చెప్పి భీముడిని బలవంతంగా మాటాడకుండా చేసి అర్జునుడు విదురుడిని చూచి ఇట్లా అన్నాడు. 'మా తండ్రిగారైన ధృతరాష్ట్రుడు తన బంధువుల కొరకు శ్రాద్ధాది పుణ్యకర్మలు ఏ విధంగా చేయాలని మనసులో అనుకొన్నాడో ఆ విధంగా, ఘనంగా చేయవచ్చును.

**క. నా యింటి ధనము గైకొని । చేయఁగలాఁ డమ్మహీశు చిత్తము సంతో**

**షాయత్తంబుగ వేగమ । పోయి యనఘ! చెప్పు మవ్విభుఁడు ప్రియ మందన్. 120**

**ప్రతిపదార్థం:** నా+ఇంటి ధనము= (నా ఇంట ఉన్న= నేను సంపాదించిన) నా ధనం; కైకొని= స్వీకరించి; ఆ+మహీ+ఈశు చిత్తము= ఆ ధృతరాష్ట్రుడి మనస్సు; సంతోష+ఆయత్తంబుగన్= (ఆనందానికి అధీనం కాగా) ఆనందంతో నిండిపోగా; చేయఁ గలాఁడు= చేస్తాడు; అనఘ!= పుణ్యాత్ముడా! (విదురా); ఆ+విభుఁడు= ఆ ధృతరాష్ట్రుడు; ప్రియము-అందన్= సంతోషించేటట్లుగా; వేగము+అ= త్వరగా; పోయి= ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి; చెప్పుము= ఈ విషయం చెప్పవలసింది.

**తాత్పర్యం:** నా సంపదను గ్రహించి తన మనసు సంతోషించే విధంగా (తన బంధువులకు పుణ్యకర్మలు ఘనంగా) ధృతరాష్ట్రుడు చేస్తాడు. పుణ్యాత్ముడా! (విదురా!) ఆ ధృతరాష్ట్రుడికి ఆనందం కలిగించే ఈ విషయాన్ని తొందరగా వెళ్ళి చెప్పవలసింది' (అన్నాడు అర్జునుడు).

**చ. అన విని మెచ్చి ధర్మసుతుఁ డర్జునునిం గొనియాడి యాదరం**

**బున విదురుం గనుంగొని 'ప్రభూత విధానములన్ నిజేచ్ఛ నా**

**ధనమును నర్జునార్థమును దాఁ గొని శ్రాద్ధము లాచరించు నాఁ**

**డనఘ! కురూద్వహుం డిది మదాత్మకు నిం పని విన్నవింపుమీ!' 121**

**ప్రతిపదార్థం:** అనన్-అని (అర్జునుడు) చెప్పగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; విని= ఆలకించి; అర్జునున్= అర్జునుడిని; మెచ్చి= మెచ్చుకొని; ఆదరంబునన్= వాత్సల్యంతో; కొనియాడి= ప్రశంసించి; విదురున్= విదురుడిని; కనుంగొని= చూచి (ఇట్లా అన్నాడు); అనఘ!= పాపరహితుడా!; కురు+ఉద్వహుండు= కురువంశాన్ని ఉద్ధరించేవాడైన-ధృతరాష్ట్రుడు; తా(న్)= తాను (స్వయంగా); నా ధనమును= నా సంపదనూ; అర్జున+అర్థమును= అర్జునుడి సంపదను; కొని= స్వీకరించి; శ్రాద్ధములు= భీష్మాదులకొరకు శ్రాద్ధకర్మలు; ప్రభూత విధానములన్= శ్రేష్ఠమయిన పద్ధతులలో- ఘనంగా; నిజ+ఇచ్ఛన్= తన ఇష్టానుసారంగా; ఆచరించువాఁ డు= చేస్తాడు; ఇది= ఇట్లా చేయటం; మత్+ఆత్మకున్= నా అంతరంగానికి; ఇంపు= ఇష్టం; అని= అని; విన్నవింపుమీ= ఆ ధృతరాష్ట్రుడికి (నా మాటగా) వినయంగా చెప్పుము.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విని ధర్మరాజు చాలా సంతోషించాడు. వాత్సల్యంతో అర్జునుడిని ప్రశంసించాడు. విదురుడిని చూచి - 'పుణ్యాత్ముడా! కురువంశాన్ని ఉద్ధరించే దృతరాష్ట్రుడు నా సంపదలూ, అర్జునుడి సంపదలూ తీసికొని తన ఇష్టప్రకారం ఘనంగా శ్రాద్ధకర్మలు చేస్తాడు. ఇట్లా చేయటమే నా మనసుకు ఇష్టం అని నీవు ధృతరాష్ట్రుడితో విన్నవించుము' (అన్నాడు).

**వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 122**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; చెప్పి= విదురుడితో పలికి; మఱియున్= మళ్ళీ; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= (ధర్మరాజు) అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి మళ్ళీ ధర్మరాజు విదురుడితో ఇట్లా అన్నాడు.

**క. 'వనవాసాయాసంబుల। ననయంబును నలఁగి దాని నాత్మ నిడి మరు**
**త్తనయుండు పెక్కులాడెఁ ద। గని మాటల; దీన రాజుఁ గనలకు మనుమీ! 123**

**ప్రతిపదార్థం:** మరుత్+తనయుండు= (వాయుపుత్రుడు) భీముడు; వనవాస-ఆయసంబులన్= అరణ్యవాసంలో కలిగిన శ్రమ వలన; అనయంబును= మిక్కిలిగా; నలఁగి= బాధపడి; దానిన్= ఆ బాధను; ఆత్మన్= మనసులో; ఇడి= ఉంచుకొని; తగని మాటలన్= అనుచితమైన మాటలు; పెక్కులు= చాలా; ఆడెన్= అన్నాడు; రాజున్= ధృతరాష్ట్రుడిని; దీనన్= ఈ అంశంలో; కనలకుము= కోపించవద్దు; అనుము+ఈ= అని చెప్పుము.

**తాత్పర్యం:** అరణ్యవాసంలో చాలా శ్రమపడ్డవాడు కాబట్టి భీముడు ఆ బాధలు మనసులో పెట్టుకొని అనుచితమైన మాటలు ఏవో చాలా అన్నాడు. అందుకు, ధృతరాష్ట్రుడితో కోపగించుకొనవద్దని చెప్పుము. (అని ధర్మరాజు విదురుడితో అన్నాడు).

**క. ఇతఁ డేమి యన్ననే మగు? ధృతరాష్ట్రుఁడు మాకుఁ బరమదేవత; విను స**
**మ్మతిఁ దత్ప్రసాదముం బడ। సితి మేమును దత్కృతాభిషిక్తుల మనఘా! 124**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ భీముడు; ఏమి+అన్నన్= ఏ విధంగా మాటాడితే మాత్రం; ఏమి-అగున్?= ఏమవుతుంది?; ధృతరాష్ట్రుడు= ధృతరాష్ట్రుడు; మాకున్= పాండవులకు; పరమ దేవత= ఉత్కృష్టమైన దేవుడు; అనఘా!= పాపం లేనివాడా! (విదురా!); విను= వినవలసింది; సమ్మతిన్= నిండు మనస్సుతో; తద్-ప్రసాదమున్= ఆ ధృతరాష్ట్రుడియొక్క అనుగ్రహాన్ని; పడసితిమి= పొందాము; ఏమును= మేం; తద్+కృత+అభిషిక్తులము= ఆ ధృతరాష్ట్రుడి చేత ఈ రాజ్యానికి అభిషేకించబడినవాళ్ళం.

**తాత్పర్యం:** (విదురా!) ఈ భీము డేమంటే మాత్రం ఏమవుతుంది? ధృతరాష్ట్రుడే మాకు ఉత్తమ దైవం. హృదయపూర్వకంగా ఆయన అనుగ్రహాన్ని మేము పొందాము. ఆయనే ఈ రాజ్యానికి మమ్మల్ని అభిషేకించాడు'.

**వ. అని పలికి యప్పుడమిఱేఁడు వికచవదనుం డగుచు. 125**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; ఆ+పుడమిఱేఁడు= ఆ (ధర్మ)రాజు; వికచవదనుండు= వికసించిన ముఖం కలిగినవాడు; అనుచున్= అవుతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పిన తరువాత ధర్మరాజు ముఖవికాసంతో.

**క. మా తండ్రి నిష్ట విధములఁ। బైతృక విధు లాచరింపఁ బంపుము రథ్య**
**వ్రాత కనక గో రథములన్। జేతి కొదవ నర్జునుండు చేర్చుచు వచ్చున్. 126**

**ప్రతిపదార్థం:** మా తండ్రిన్= ధృతరాష్ట్రుడిని; పైతృక విధులు= భీష్మాది పితృదేవతలకు శ్రాద్ధకర్మలు; ఇష్ట విధములన్= తనకు నచ్చిన తీరుగా; ఆచరింపన్= చేయటానికి; పంపుము= సిద్ధం చేయుము; అర్జునుండు= అర్జునుడు; చేతికి+ఒదవన్= చేతికి అందేటట్లు; రథ్యవ్రాత, కనక, గో, రథములన్= గుర్రాల సమూహము, బంగారమూ, ఆవులూ, రథాలూ; చేర్చుచున్= ఏర్పాటు చేస్తూ; వచ్చున్= వస్తాడు.

**తాత్పర్యం:** భీష్మాదులైన పితృదేవతలకు శ్రాద్ధకర్మలు తనకు నచ్చినట్లుగా నిర్వహించేటట్లు ధృతరాష్ట్రుడిని సిద్ధం చేయుము. అర్జునుడు ఉత్సాహంగా పెక్కు గుర్రాలూ, బంగారమూ, ఆవులూ, రథాలూ ఏర్పాటు చేస్తాడు.

**క. గ్రామములు దేవతలకును। భూమిసురులకును గురు ప్రభువు ని మ్మను మీ**
**పో మసలితి చెపు మాతని। కీ మాటలు వలయు పనుల కీవు మెలఁగుమీ! 127**

**ప్రతిపదార్థం:** గురు ప్రభువున్= గురువైన (కురునాథుడైన) ఆ ధృతరాష్ట్ర మహారాజును; దేవతలకును= దేవతలకూ; భూమిసురులకును= బ్రాహ్మణులకూ; గ్రామములు= ఊళ్ళు; ఇమ్ము+అనుము+ఈ= దానంగా ఇవ్వుమని చెప్పు; పోన్= ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళడానికి; మసలితి(వి)= ఇప్పటికే ఆలస్యం చేశావు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఈ మాటలు= (మేము)-నేను (అర్జునుడూ) చెప్పుమన్న మాటలు; చెపుము= నువ్వు చెప్పవలసింది; వలయు పనులకున్= అతడికి అవసరమైన పనులకు; ఈవు= నీవు (విదురుడు); మెలఁగుము+ఈ= నడుచుకొమ్ము (ఆయనకు అవసరమైన పనులు నీవు దగ్గరుండి చూస్తూ వుండుము).

**తాత్పర్యం:** మాకు తండ్రీ, పాలకుడూ అయిన ధృతరాష్ట్రుడిని దేవతలకూ బ్రాహ్మణులకు ఊళ్ళు ఇమ్మని చెప్పుము. నీవు ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగి వెళ్ళటానికి, ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. నేను చెప్పిన మాటలు అతడికి చెప్పుము. అవసరమైన పనులు నీవు చూస్తూ ఉండుము.

**క. అనినఁ బ్రియ మంది విదురుఁడు। చని యానృపుతో నజాతశత్రు కడకు నీ**
**పనిచిన పనికిం బోయితి। వినిపించితిఁ దెఱఁ గతండు విని మోదమునన్. 128**

**ప్రతిపదార్థం:** అనినన్= ధర్మరాజు ఆ విధంగా చెప్పగా; విదురుఁడు= విదురుడు; ప్రియము+అంది= సంతోషించి; చని= ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి; ఆ నృపుతోన్= ఆ (ధృతరాష్ట్ర) రాజుతో, - (ఇట్లా అన్నాడు). అజాతశత్రు కడకున్= ధర్మరాజు వద్దకు; నీ-పనిచినపనికిన్= నీవు పంపిన పనికొరకు; పోయితిన్= వెళ్ళాను; తెఱఁగు= నీవు చెప్పిన విధం; వినిపించితిన్= (ధర్మరాజుకు) చెప్పాను; అతండు= ఆ ధర్మరాజు; విని (నీ ఉద్దేశాన్ని)= నేను చెప్పినదాన్ని గ్రహించి; మోదమునన్= ఆనందంతో - (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ధర్మరాజు మాటలకు విదురుడు చాలా సంతోషించాడు. వెంటనే ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళాడు. ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'నీవు పంపిన పనికొరకు ధర్మరాజు వద్దకు వెళ్ళాను. విషయం చెప్పాను. అతడు సంతోషించాడు.

**క. నరువలను సూచె నతఁడుం। బరమ ప్రియ భరితుఁ డయ్యెఁ బార్థివవర! య**
**య్యిరువురుఁ బ్రాణంబులు డాఁ। పరు నీకును ధనము దాఁచు పని కలిగెడినే? 129**

**ప్రతిపదార్థం:** నరు వలను= (ధర్మరాజు) అర్జునుడి (దిక్కు) వైపు; చూచెన్= చూచాడు; అతఁడున్= అర్జునుడు కూడా; పరమ ప్రియ భరితుఁడు= అత్యధిక సంతోషంతో నిండినవాడు; అయ్యెన్= అయినాడు; పార్థివవర!= ఓ ధృతరాష్ట్ర రాజా!; ఆ+ఇరువురు= ఆ ఇద్దరు, (ధర్మరాజూ, అర్జునుడూ); నీకును= నీకోసం; ప్రాణంబులు(ను)= తమ ప్రాణాలు సైతం; డాఁపరు= దాచుకునే వారు కాదు; ఇంక, ధనము= సంపద; దాఁచుపని= ఇవ్వకుండా దాచి పెట్టుకొనటం అనేది; కలిగెడిన్+ఏ?= సంభవిస్తుందా?

**తాత్పర్యం:** నీ కోరిక విని సంతోషించిన ధర్మరాజు అర్జునుడివైపు చూచాడు. అర్జునుడు ఇంకా ఎంతో సంతోషించాడు. ఓ రాజా! ఆ ధర్మరాజూ, అర్జునుడూ ఇద్దరూ నీ కొరకు తమ ప్రాణాలు సైతం దాచుకొనరు. ఇక సంపద దాచుకొనటం అనేది సంభవమా?

**విశేషం:** (అ-య్యిరువురు.....పని కలిగెడునే?....అలంకారం= కావ్యార్థాపత్తి...కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే! (సజితస్త్వన్ముఖేనేందుః కా వార్తా సరసీరుహమ్)

**క.** **చేయుము విచ్చలవిడి గాం। గేయ ప్రముఖులు నిరస్త కిల్బిషు లై మో**
**దాయత్త చిత్తులుగ భూ। నాయక! శ్రాద్ధములు జగమునం బొగ డెసఁగన్.** **130**

**ప్రతిపదార్థం:** భూ-నాయక!= రాజా!; గాంగేయ ప్రముఖులు= భీష్ముడు మొదలైనవారు; నిరస్త-కిల్బిషులు+ఐ= తొలగిపోయిన పాపాలు కలవారై; మోద+ఆయత్త-చిత్తులు గన్= సంతోషంతో నిండిన మనసు కలవారు అయ్యే విధంగా; జగమునన్= లోకంలో; పొగడు= ప్రశంస; ఎసఁగన్= పెరిగే విధంగా; శ్రాద్ధములు= పరలోక క్రియలు; విచ్చలవిడిన్= యథేచ్ఛగా; చేయుము= ఆచరించుము.

**తాత్పర్యం:** రాజా! భీష్ముడు మొదలైన వాళ్ళందరూ తమ తమ పాపాలు పోగొట్టుకొని, మనసు నిండా సంతోషించే విధంగానూ, లోకంలో (నీకు) మంచిపేరు వచ్చే విధంగానూ, నీ ఇష్టం వచ్చిన విధంగా వాళ్ళకు శ్రాద్ధకర్మలు చేయుము.

**చ.** **కనకము మేలి రత్నములు గ్రామములన్ హయగోవ్రజంబులుం**
**దనియఁగ నిమ్ము సర్వవసుధాసుర కోటులకున్ నిజేచ్ఛ నీ**
**తనయులు పుణ్యలోక సుఖధామము లై విలసిల్లునట్లుగా'**
**ననుటయు నాంబికేయుహృదయంబున మోదమెలర్చె భూవరా!** **131**

**ప్రతిపదార్థం:** నీ తనయులు= నీ కొడుకులైన దుర్యోధనాదులు; పుణ్యలోక సుఖ ధామములు+ఐ= పుణ్యకర్మలు ఉండే మంచి లోకాలలోని సుఖాలకు నిలయాలు, అయి; విలసిల్లు+అట్లు కాన్= ప్రకాశించే తీరుగా; సర్వ వసుధా సురకోటులకున్= సమస్తమైన బ్రాహ్మణుల సమూహాలకు; తనియన్= తృప్తిగా; కనకము= బంగారూ; మేలి రత్నములు= మంచి విలు వైన రత్నాలూ; గ్రామములున్= ఊళ్ళూ; హయ, గో, వ్రజంబులున్= గుర్రాలు, ఆవుల మందలూ; నిజ+ఇచ్ఛన్= నీ యిష్టం వచ్చినట్లుగా; ఇమ్ము= దానం చేయుము; భూవరా!= (ఓ జనమేజయమహా) రాజా!; అనుటయున్= విదురుడు అట్లా అనగానే; ఆంబికేయు హృదయంబునన్= ధృతరాష్ట్రుడి మనస్సులో; మోదము= సంతోషం; ఎలర్చెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** నీ కొడుకులు - దుర్యోధనాదులు పుణ్యలోక సుఖాలకు నివాసాలు అయ్యే విధంగా, సమస్తమైన బ్రాహ్మణ సమాజానికీ, వాళ్ళు తృప్తిపడేంతగా, నీ ఇష్టం వచ్చినట్లుగా, బంగారమూ, మంచి రత్నాలూ, ఊళ్ళూ గుర్రాల, ఆవుల మందలూ, దానం చేయుము. 'ఓ జనమేజయ మహారాజా! విదురు డిట్లా అనటంతోటే ధృతరాష్ట్రుడికి మనసులో సంతోషం అధికమైనది.

**చ.** **పదపడి భీముమాట లోకభంగి నెఱుంగఁగఁ జెప్పి, 'వాఁడు దు**
**ర్మదుఁ, డవి పాటి గావు కురురాజ మహత్తర! పెట్టకుండు నీ**

**హృదయమునందు వాని నని యేర్పడ ధర్మజు పార్థవాక్యముల్**
**విదురుఁడు సెప్పె సంతసము వెల్లిగొనంగ ననేకభంగులన్. 132**

**ప్రతిపదార్థం:** పదపడి= అనంతరం; భీము మాటలు= ధృతరాష్ట్రుడి కోర్కె విషయమై భీముడు అన్న మాటలను; ఒక భంగిన్= ఒక విధంగా; ఎఱుంగఁగన్= (ధృతరాష్ట్రుడికి) తెలిసేటట్లుగా; చెప్పి= పలికి; కురురాజ మహత్తర!= కురువంశపు రాజులలో మేలైన (ధృతరాష్ట్ర) రాజా!; వాఁడు= ఆ భీమసేనుడు; దుర్మదుఁడు= (చెడు) గర్వం కలవాడు; అని= (మదంతో) ఆ (భీముడు) పలికిన మాటలు; పాటి కావు= లెక్క చేయదగినవి కావు; వానిన్= ఆ మాటలను; నీ హృదయమునందున్= నీ మనస్సులో; పెట్టక+ఉండు(ము)= పెట్టుకొనకుము; అని= అనే ప్రకారంగా; సంతసంబు= (ధృతరాష్ట్రుడికి) సంతోషం; అనేక భంగులన్= బహువిధాలుగా - (మిక్కుటంగా); వెల్లి; కొనంగన్= ప్రవాహం కాగా; విదురుఁడు= విదురుడు; ధర్మజు, పార్థు, వాక్యముల్= ధర్మరాజూ, అర్జునుడూ చెప్పిన మాటలను; ఏర్పడన్= వివరంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** తరువాత ఆ సందర్భంలో భీముడన్న మాటలు గూడా విదురుడు ఒక విధంగా ధృతరాష్ట్రుడికి తెలియజేశాడు. 'కురు రాజా! ఆ భీముడు దురహంకారి. అహంకారంతో అతడు అన్న మాటలు లెక్క చేయదగినవి కావు. నీవు వాటిని మనసులో పెట్టుకొనవద్దు' అని ధృతరాష్ట్రుడికి ఆనందం పొంగి ప్రవహించే విధంగా ధర్మరాజూ, అర్జునుడూ చెప్పిన మాటలను విదురుడు ధృతరాష్ట్రుడికి వివరంగా చెప్పాడు (అని వైశంపాయనుడు జనమేజయుడితో చెప్పాడు.)

**ఆ. అట్లు సంతసిల్లి యధిప కార్తిక పౌర్ణ । మాసి నవ్విభుండు మహిత భూమి**
**దేవకోటి నెల్ల రావించి యంచిత । శ్రద్ధఁ జేయఁ దొడఁగె శ్రాద్ధవిధులు. 133**

**ప్రతిపదార్థం:** అధిప!= (ఓ జనమేజయ) రాజా!; అట్లు= ఆ ప్రకారంగా; ఆ+విభుండు= ఆ (ధృతరాష్ట్ర) రాజు; సంతసిల్లి= ఆనందించి; కార్తిక పౌర్ణమాసిన్= కార్తికమాసంలో పూర్ణిమనాడు; మహిత భూమి దేవ కోటిన్= శ్రేష్ఠులైన బ్రాహ్మణుల సమూహాన్ని; ఎల్లన్= అంతటినీ; రావించి= రప్పించి; అంచిత శ్రద్ధన్= మిక్కిలి ఆసక్తితో; శ్రాద్ధ విధులు= పితృదేవతలకు శ్రాద్ధ కర్మలను; చేయన్+తొడఁగెన్= చేయటం మొదలుపెట్టాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఆ ప్రకారంగా, ధర్మరాజార్జునుల అభిప్రాయాన్ని విదురుడి మాటలలో విని ధృతరాష్ట్రుడు చాలా సంతోషించాడు. కార్తికమాసంలో పూర్ణిమనాడు మంచి బ్రాహ్మణులను అందర్నీ పిలిపించి, భీష్మాదుల నుద్దేశించి మిక్కిలి ఏకాగ్రతతో, శ్రాద్ధకర్మలు చేయ నారంభించాడు.

**సీ. కనకాది వస్తువుల్ గడువేడ్క ధర్మనం । దనుఁడు పుత్త్రేర నుదాత్త భంగి**
**బాహ్లికునకు, గంగపట్టికి, సోమద । త్తునకుఁ దదీయపుత్త్రునకుఁ దొలుత**
**నంచిత శ్రాద్ధంబు లాచరించె సుయోధ । నాది కుమారుల కందఱకును**
**బేర్వేర క్రియలు నీప్సిత విధంబులఁ దగ । నొనరించె సింధురాజునకుఁ దక్కఁ**

**ఆ. గలుగు బంధులకును వలయు రాజులకును । ద్రోణునకును బుద్ధిఁ దోఁచినట్టి**
**యిష్టజనములకు నహీన భవ్యప్రకా । రములఁ బారలౌకికము లొనర్చి. 134**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుఁడు= ధర్మరాజు; కడున్= మిక్కిలి; వేడ్కన్= ఉత్సాహంతో; కనక+ఆది వస్తువుల్= బంగారం మొదలైన అవసర వస్తువులను; పుత్తేరన్= పంపించగా; ఉదాత్త భంగిన్= మంచిమార్గంలో ధృతరాష్ట్రుడు; తొలుతన్= మొదట; బాహ్లికునకున్= బాహ్లికుడికీ; గంగపట్టికిన్= గంగ కొడుకైన భీష్ముడికీ; సోమదత్తునకున్= సోమదత్తుడికీ; తదీయ పుత్త్రునకున్= సోమదత్తుడి కొడుకైన భూరిశ్రవసుడికీ; అంచిత శ్రాద్ధంబులు= తగిన (గొప్ప) విధంగా శ్రాద్ధ కర్మలను; ఆచరించెన్= చేశాడు; సుయోధన+ఆది కుమారులకున్= దుర్యోధనుడు మొదలైన కొడుకులు; అందఱకును= అందరికీ; పేర్వేర!= పేరు పేరునా; ఈ పితృవిధంబులన్= తన ఇష్టం వచ్చినట్లుగా; తగన్= తగినట్లుగా; క్రియలు= శ్రాద్ధకర్మలు; ఒనరించెన్= చేశాడు; సింధురాజునకున్= సింధుదేశపు రాజైన (అల్లుడు) సైంధవుడికీ; తక్కు కలుగు బంధులకును= మిగిలిన తన ఇతర బంధువులకూ; వలయు రాజులకును= అవసరమైన మిత్ర రాజులకూ; ద్రోణునకును= ద్రోణాచార్యుడికీ; బుద్ధిన్= తన మనస్సుకు; తోఁచిన అట్టి ఇష్ట జనములకున్= స్ఫురించిన తనకు ఇష్టమైన వాళ్ళకు; అహీన భవ్య ప్రకారములన్= తక్కువ కాని, తగిన (మన) పద్ధతులలో; పార లౌకికములు= ఊర్ధ్వలోకాలు కలిగించేటటువంటి (శ్రాద్ధ) కర్మలను; ఒనర్చి= చేసి.

**తాత్పర్యం:** ధర్మరాజు ఎంతో ఉత్సాహంగా, బంగారం, రత్నాలు, ఆవులు మొదలైన వస్తువులు పంపించాడు. ధృతరాష్ట్రుడు వాటితో, గొప్పగా-బాహ్లికుడికీ, సోమదత్తుడికీ, భూరిశ్రవసుడికీ, శ్రేష్ఠమైన విధంగా శ్రాద్ధకర్మలు చేశాడు. తన కొడుకులు అందరికి పేరు పేరునా, ఇష్టానుసారం తగు విధంగా శ్రాద్ధకర్మలు చేశాడు. తర్వాత అల్లుడైన సైంధవుడికీ, ఇంకా మిగిలి ఉన్న బంధువులకూ, అవసరం అనిపించిన మిత్రులైన రాజులకూ, ద్రోణుడికీ, ఇంకా మనసుకు తోచిన, తన కిష్టమైన వారికీ, లోటు లేనివిధంగా ఉత్తమలోకాలు కలిగించే శ్రాద్ధక్రియలను చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ.** **అతులితరత్న కాంచన గవాశ్వ విభూషణ వస్త్రకన్యకా**
**క్షితిముఖ వస్తుదానములు గీర్తన కెక్కఁగ నవ్విభుండు సు**
**వ్రతుఁ డయి చేసెఁ బంచదశవాసరముల్ నిజదానలౌల్య మ**
**ప్రతిహత వృత్తిఁ జెల్ల విని పాండుసుతాగ్రణి ప్రీతిఁ బొందఁగన్.** **135**

**ప్రతిపదార్థం:** ఆ+విభుండు= ఆ ధృతరాష్ట్రుడు; సువ్రతుఁడు+అయి= మిక్కిలి దీక్ష కలిగినవాడై; నిజ దాన లౌల్యము= దానం చేయాలనే తన అత్యధికమైన వాంఛ; అప్రతిహత వృత్తిన్= అడ్డులేని విధంగా; చెల్లన్= సాగుతుండగా; పాండుసుత+అగ్రణి= పాండురాజు కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు; విని= అది (ధృతరాష్ట్రుడు స్వేచ్ఛగా చేస్తున్న దానాది విషయాలు) తెలిసికొని; ప్రీతిన్= ఆనందాన్ని; పొందఁగన్= పొందుతుండగా; కీర్తనకున్= అందరి ప్రశంసకు; ఎక్కఁగన్= పొందే విధంగా; పంచదశవాసరముల్= పదిహేను రోజుల పాటు; అతులిత-రత్న-కాంచన-గో-అశ్వ-విభూషణ-వస్త్ర-కన్యకా-క్షితి-ముఖ-వస్తు-దానములు= సాటి లేనటువంటి రత్నాలూ, బంగారమూ, ఆవులూ, గుర్రాలూ, ఆభరణాలు, వస్త్రాలూ, కన్యలూ, నేలా, మొదలైన వస్తువుల దానం; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడు శ్రాద్ధ కర్మాచరణంలో మిక్కుటమైన దీక్ష కలిగినవాడై దానం చేయాలనే తన కోరిక అడ్డు లేని విధంగా సాగుతుంటే, అది తెలిసి ధర్మరాజు ఆనందిస్తుండగా, అందరూ ప్రశంసించే విధంగా, పదిహేను రోజులపాటు సాటిలేని రత్నాలూ, బంగారమూ, ఆవులూ, గుర్రాలూ, అలంకారాలూ, వస్త్రాలూ, కన్నెలూ, ఊళ్ళూ, మొదలైన అనేక వస్తువులను దానం చేశాడు.

**ఆ. భూమి దాన విధులు భూవర యొక మాత్ర। నంబికాతనూజుఁ డాచరింప**
**నంతఁ బోక యూళు లగ్రజన్ములకు నీ నతనిఁ బనిచెఁ బాండవాగ్రజుండు. 136**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ జనమేజయ మహారాజా!; అంబికా తనూజుఁడు= అంబిక కొడుకైన ధృతరాష్ట్రుడు; అగ్రజన్ములకున్= బ్రాహ్మణులకు; భూమిదానవిధులు= నేలను దానం చేసే పనులు; ఒక మాత్రన్= కొంతగా; ఆచరింపన్= చేయగా; పాండవ+అగ్రజుండు= (పాండురాజు కొడుకులలో పెద్దవాడైన) ధర్మరాజు; అంతన్+పోక= అంతటితో ఆగకుండా; ఊళులు= గ్రామాలు; ఈన్= ఇంకా దానం చేయటానికి; అతనిన్= ఆ ధృతరాష్ట్రుడిని; పనిచెన్= ప్రోత్సహించాడు.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! ధృతరాష్ట్రుడు బ్రాహ్మణులకు భూదానం కొంత చేస్తే, ధర్మరాజు అంతటితో ఆగకుండా, ఇంకా ఊళ్లకు ఊళ్ళు ఆ ధృతరాష్ట్రుడిచేత దానం చేయించాడు.

ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుండై వనంబునకుఁ బోవుట (సం.15-20-1)

**వ. పనిచినం బ్రియంబు పెంపున హృదయంబు పల్లవింప నా భూవల్లభుం డనేకగ్రామంబు లగ్రహారంబులు గావించి గాంధారరాజు మొద లయిన నిజ బంధువులకు బహుళ దక్షిణలుగాఁ బార లౌకిక క్రియలు చేసెనిట్లు ధృతరా ష్ట్రుండు; భారత రణంబున మరణంబు నొందిన బంధు లోకంబునకుం బుణ్యలోక సౌఖ్యాతిశయ పదంబు లగు పరమ శ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుం డై సర్వ కృత్యంబులుం జలిపి పాడ్యమి నాఁడు। రేపకడ ఋత్విక్సమేతుం డై యిష్టి నడపి। పాండవులను దక్కటి బంధువులను మిత్రులను రావించి వనవాసంబునకు సంకల్పంబు చేసి, సకల భృత్యజనంబులకు నర్థధనంబు లిచ్చి, గాంధారీ సమన్వితుం డై వల్కలాజినంబులు ధరియించి, యక్షత గంధ పుష్పంబుల గృహంబుఁ, బూజించి సర్వపదార్థంబులుం బరిత్యజించి యద్దేవియుఁ గదిసి నడవ యాజకు లగ్నులు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ నరుగ నగరు వెడలె, నట్టియెడ నేతెంచి. 137**

**ప్రతిపదార్థం:** పనిచినన్= ధర్మరాజు ఇంకా ఊళ్ళు దానం చేయుమని చెప్పగా; ఆ భూవల్లభుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; ప్రియంబు పెంపునన్= ఆనందంయొక్క ఆధిక్యంతో; హృదయంబు= మనస్సు; పల్లవింపన్= చిగురించగా; అనేక గ్రామంబులు= చాలా ఊళ్లను; అగ్రహారంబులు= బ్రాహ్మణులకు దానంగా; కావించి= ఇచ్చి; గాంధార రాజు= గాంధార దేశపు రాజు (భార్య గాంధారికి తండ్రి సుబలుడు) మొదలు అయిన; నిజ-బంధువులకున్= మొదలుగా కలిగిన తన చుట్టాలకు; బహుళ దక్షిణలుగాన్= అనేకం (అధికమూ) అయిన దక్షిణలతో; పార లౌకిక క్రియలు= ఉత్తమ లోకాలు కలుగజేసే పనులు (శ్రాద్ధకర్మలు); చేసెన్= నిర్వహించాడు; ఇట్లు= ఈ విధంగా; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; భారత-రణంబునన్= మహాభారత యుద్ధంలో; మరణంబున్-ఒందిన= (చావును పొందిన) మరణించిన; బంధులోకంబునకున్= బంధువుల సముదాయానికి; పుణ్య-లోక-సౌఖ్య అతిశయ-పదంబులు= ఉత్తమ లోకాలకు సంబంధించిన, సుఖం యొక్క ఆధిక్యానికి, ఆశ్రయాలు; అగు= అయినటువంటి; పరమ-శ్రాద్ధంబులు= ఉత్కృష్టములైన శ్రాద్ధకర్మలు; నిర్వర్తించి= ఆచరించి; కృత-కృత్యుండు+అయి= చేయదలచిన (వారందరికి) శ్రాద్ధకర్మలు చేసినవాడై; సర్వకృత్యంబులున్= సమస్త కార్యాలూ; చలిపి= (కార్తిక పూర్ణిమ నుండి 15 రోజులలో పూర్తిగా) చేసి; పాడ్యమి నాఁడు= ఆ మరుసటి రోజు (మార్గశీర్ష? శుద్ధ) పాడ్యమి రోజున; రేపకడ= ప్రాతఃకాలంలోనే; ఋత్విక్+సమేతుండు+ఐ= ఋత్విక్కులతో కూడినవాడై; ఇష్టి= అరణ్యయాత్రకొరకు; ఉదవసీయం అనే యజ్ఞం; నడపి= జరిపి; పాండవులను= పాండురాజు కొడుకులనూ (ధర్మరాజాదులనూ); తక్కటి-బంధువులను= ఇంకా ఇతర బంధువులనూ; మిత్రులను= స్నేహితులనూ; రావించి= రప్పించి; వనవాసంబునకున్= అరణ్యాల (కు వెళ్ళి) అందు నివసించటానికి; సంకల్పంబు చేసి= తన ఉద్దేశాన్ని చెప్పి;

సకల-భృత్య-జనంబులకున్= సమస్తమైన సేవకులకూ; అర్హ ధనంబులు= వారి వారి స్థాయికి తగినంతగా సంపదలను; ఇచ్చి= ఇచ్చి; గాంధారీ-సమన్వితుండు+ఐ= భార్య గాంధారితో కూడినవాడై; వల్కల+అజినంబులు= నారబట్ట, జింకచర్మాలూ; ధరియించి= కట్టుకొని; గృహంబున్= తన మందిరాన్ని, (విడిచేముందు); అక్షత-గంధ-పుష్పంబులన్= అక్షతలతోనూ, గంధంతోనూ, పూలతోనూ; పూజించి= అర్చించి; సర్వ పదార్థంబులున్= అన్ని విధములైన (గృహసంబంధి) వస్తువులనూ; పరిత్యజించి= విడిచిపెట్టి; ఆ+దేవియున్= భార్య; (గాంధారి); కదిసి-నడవన్= వెన్నంటి నడచి వస్తూండగా; ముందటన్= ఎదుట; చేరువన్= సమీపంలో; యాజకులు= యజ్ఞం చేసేవారు; అగ్నులు= అగ్నులనూ; ఉపకరణంబులును= సమిధలు మొదలైన ఇతర సాధనాలూ; ధరియించి= పుచ్చుకొని; అరుగన్= నడుస్తుండగా; (ధృతరాష్ట్రుడు) నగరు= తన అభ్యంతరమందిరాన్ని; వెడలెన్= దాటాడు; అట్టి-ఎడన్= ఆ సమయంలో; ఏతెంచి= అక్కడికి వచ్చి, (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ధర్మరాజు ఇంకా అధికంగా బ్రాహ్మణులకు గ్రామాలు దానం చేయుమని ధృతరాష్ట్రుడిని ప్రోత్సహించగా ధృతరాష్ట్రుడు అందుకు మనసులో చాలా సంతోషించాడు. అనేకాలైన గ్రామాలను బ్రాహ్మణులకు దానంగా అగ్రహారాలుగా ఇచ్చాడు. గాంధారరాజు మొదలైన చుట్టాలకు అధిక దక్షిణలతో శ్రాద్ధకర్మలు చేశాడు. ఈ విధంగా ధృతరాష్ట్రుడు భారతయుద్ధంలో మరణించిన తన బంధువులందరికీ ఉత్తమలోకాల సౌఖ్యం కలుగజేసే శ్రాద్ధ కర్మలు చేసి తన కోర్కె నెరవేర్చుకొన్నాడు. (అరణ్యగమనానికి వీలుగా) మిగిలిన అన్ని పనులూ పూర్తిచేసికొని మర్నాడు అంటే మార్గశీర్ష శుద్ధ పాడ్యమి నాడు ఉదయాననే ఋత్విక్కులను కూర్చుకొని, గృహం విడిచిపోవడానికి-ఉదవసీయం అనే యజ్ఞం చేశాడు. పాండవులనూ, మిగిలిన బంధువులనూ, తన స్నేహితులనూ అందరినీ పిలిపించాడు. అరణ్యాలకు బయలుదేరుతున్న విషయం చెప్పాడు. సేవకులకు అందరికీ వారి వారి స్థాయికి తగిన విధంగా ధనమిచ్చి గౌరవించాడు. గాంధారితో కలిసి, నారచీరలూ, జింకచర్మాలూ ధరించి, అక్షతలూ, గంధమూ, పుష్పాలతో ఇంటిని పూజించాడు. అందుకు సంబంధించిన వస్తువులన్నిటినీ విడిచిపెట్టాడు. భార్య వెన్నంటి నడుస్తుండగా, యాజకులు, అగ్నులు, సమిధలు మొదలైన సాధనాలను తీసికొని తనకు ముందుగా సమీపంలో వెళ్లుతుండగా వారి వెనుకే బయలుదేరి మందిరం దాటి వచ్చాడు. ఆ సమయంలో అక్కడికి-కుంతీ ప్రభృతులు వచ్చారు.

**విశేషం:** కార్తిక పూర్ణిమనాడు శ్రాద్ధకర్మ లారంభించాడు ధృతరాష్ట్రుడు. దానాదులతో 15 రోజులు (135పద్యం) ఆ పనులు చేశాడు. మర్నాడు పాడ్యమి అంటే మార్గ శీర్ష శుద్ధ ప్రతిపత్తు నాడు అరణ్యానికి బయలుదేరాడన్నమాట. ధృతరాష్ట్రుడు గృహాన్ని వీడు కొలిపిన సన్నివేశాన్ని ఒక క్రమంలో ప్రత్యక్షంగా ప్రదర్శించటం ఇక్కడి రచనలో విశేషం.

**క.** **గొంతి మొద లైన కౌరవ। కాంతా జను లెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ**
**క్ష్మాంతంబుల బాష్పసలిల। సంతానము లురలఁ దోన చనుదేరంగన్** **138**

**ప్రతిపదార్థం:** గొంతి= కుంతీదేవి; మొదలు+ఐన= మొదలైన; కౌరవ-కాంతా-జనులు= కురువంశపు స్త్రీలు; ఎల్లన్= అందరూ; నెవ్వగలన్= సంపూర్ణమైన విచారంతో; పొగులుచున్= దుఃఖిస్తూ; పక్ష్మ+అంతంబులన్= కనురెప్పల కొనలనుండి; బాష్ప-సలిల-సంతానములు= కన్నీటి బిందువుల సమూహాలు; ఉరలన్= దొర్లిపడుతుండగా; తోన్+అ= ఆ ధృతరాష్ట్రుడి వెంట; చనుదేరంగన్= వస్తూ ఉండగా- (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** కుంతి మొదలైన కురువంశపు స్త్రీలు అందరూ, మిక్కిలి దుఃఖంతో కుమిలిపోతూ కనురెప్పల చివరల నుండి కన్నీటి చుక్కలు రాలి పడుతుండగా వెంట వస్తూ ఉంటే-

**వ. అజ్జనపతి చనుచుండె. 139**

**ప్రతిపదార్థం:** ఆ+జనపతి= ఆ ధృతరాష్ట్రుడు; చనుచున్+ఉండె(న్)= పోతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** (కుంతీప్రభృతి స్త్రీ లందరూ విచారిస్తూ వెంట వస్తూ ఉండగా) ఆ ధృతరాష్ట్రుడు (అరణ్యాభిముఖంగా) ముందుకు వెళ్ళుతూ ఉన్నాడు.

**తే. పాండవాగ్రజుఁ డక్కురుభర్తవలను। శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి**
**'హా మహారాజ ముఖ్య! యెం దరిగె?' దనుచు। నొడలు కంపింపఁ జదికిలఁ బడియె నధిప! 140**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ జనమేజయ మహారాజా!; పాండవ+అగ్రజుఁడు= (పాండురాజు కొడుకులలో పెద్దవాడైన) ధర్మరాజు; ఆ+కురు భర్తవలను= ఆ (కురువంశపురాజు) ధృతరాష్ట్రుడి వైపు; శోక-దీనుఁడు+ఐ= విచారం వలన జాలికొలిపే వాడు అయి; తప్పక= అదే పనిగా (దీర్ఘంగా); చూచి= చూచి; ఏడ్చి= రోదించి; హా-మహారాజ ముఖ్య!= అయ్యో! మహారాజులలో ప్రధానుడా? (ధృతరాష్ట్రుడా); ఎందున్= ఎక్కడికి; అరిగెదు= వెళ్తున్నావు; అనుచున్= అంటూ; ఒడలు= తన శరీరం; కంపింపన్= వణకుతుండగా; చదికిలఁ బడియెన్= కూలబడిపోయాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఆ విధంగా నగరు విడిచివెళ్ళిపోతున్న ధృతరాష్ట్రుడిని, ధర్మరాజు రెప్పవేయకుండా, దుఃఖంతో జాలిగొలుపుతూ చూచి, 'ఏడ్చి అయ్యో మహారాజా!' ఎక్కడికి వెళ్ళుతావు అంటూ ఒళ్ళు వణకిపోతూ ఉండగా కూలబడిపోయాడు.(అని వైశంపాయనుడు జనమేజయుడితో అన్నాడు)

**క. నరుఁ డనునయించె వెస న। న్నరపతి నెత్తుచును దా ననయమున్ వనటం**
**బురపురఁ బొక్కెం గురు భూ। వర! యద్దెస తెఱఁగు రాదు వాక్రువ్వంగన్. 141**

**ప్రతిపదార్థం:** కురు-భూ-వర= (కురువంశపు రాజులలో శ్రేష్ఠుడా!) (జనమేజయ) రాజా!; నరుఁడు= అర్జునుడు; వెసన్= త్వరగా, వెంటనే; ఆ+నరపతిన్= ఆ ధర్మరాజును; ఎత్తుచును= లేవదీస్తూ; అనునయించెన్= ఓదార్చాడు; తాన్= తాను గూడా; అనయమున్= మిక్కిలిగా; వనటన్= దుఃఖంచేత; పురపురన్-పొక్కెన్= అధికంగా కుమిలిపోయాడు; ఆ+దెస-తెఱఁగు= ఆ సన్నివేశం విధం; వాక్రువ్వంగన్= మాటలతో చెప్పటానికి; రాదు= సాధ్యం కాదు.

**తాత్పర్యం:** జనమేజయా! (దుఃఖాతిశయంచేత ధర్మరాజు నేలమీద చతికిలబడిపోవటంతో) అర్జునుడు వెంటనే సత్వరంగా ఆ ధర్మరాజును లేవదీసి ఓదార్చాడు. తాను కూడా దుఃఖంతో కుమిలిపోయాడు. వారిద్దరి దురవస్థ తీరు మాటలతో చెప్పడం సాధ్యం కాదు.

**వ. భీమసేన నకుల సహదేవులును గృప యుయుత్సు సంజయులును ధౌమ్యాది ధరణీ సురులును శోక వ్యాకులత్వంబు నొందిరి; గొంతి యడలుచు గాంధారి కరంబు నిజస్కంధంబున నిడికొని నడవ నంధనృపతి గాంధారీ స్కంధ భాగ కలిత బాహుం డై పోవుచుండె నప్పుడు పాంచాలియు సుభద్రయుఁజిత్రాంగదయు నులూపియు, సపుత్ర యగు నుత్తరయు మఱియుం గల యట్టి మగువలుం గురరీనిచయ నాదంబుల చందంబు దోఁప నాక్రందనంబు సేసి రయ్యవస్థ జూదంబునాఁడు పాండవులు పురంబు వెలువడునప్పటి దశం బోలియుండె నట్లు ధృతరాష్ట్రకానన గమనంబు నిశ్చితం బగుటయు నాబాల వృద్ధంబుగాఁ బురజనంబు గనుంగొనం జనుదెంచిన. 142**

**ప్రతిపదార్థం:** భీమసేన-నకుల-సహదేవులును= భీముడూ, నకులుడూ, సహదేవుడూ; కృపయుయుత్సు-సంజయులును= కృపాచార్యుడూ, యుయుత్సుడూ (ధృతరాష్ట్రుడి కొడుకు), సంజయుడూ; ధౌమ్య+ఆది-ధరణీసురులును= ధౌమ్యుడు మొదలయిన బ్రాహ్మణులూ; శోక-వ్యాకులత్వంబున్= దుఃఖం చేత కలతను; ఒందిరి= పొందారు; గొంతి= కుంతీదేవి; అడలుచున్= దుఃఖిస్తూ; గాంధారి-కరంబు= గాంధారి చేతిని; నిజ-స్కంధంబునన్= తన భుజం మీద; ఇడికొని= ఉంచుకుని; నడవన్= నడుస్తుంటే; అంధ-నృపతి= ఆ గ్రుడ్డిరాజు, (ధృతరాష్ట్రుడు); గాంధారీ-స్కంధ-భాగ-కలిత-బాహుండు+ఐ= భార్య గాంధారియొక్క భుజ దేశం మీద (ఉంచిన తన చేయి కలవాడై) చేయి ఇచ్చి; పోవుచున్-ఉండెన్= పోతున్నాడు; అప్పుడు= ఆ సమయంలో; పాంచాలియున్= పాంచాల దేశపు రాజు (ద్రుపదుడి) కూతురు ద్రౌపదీ; సుభద్రయున్= సుభద్రా; చిత్రాంగదయున్= చిత్రాంగదా; ఉలూపియున్= ఉలూపీ; సపుత్ర= కొడుకుతో కలిసి (వచ్చి) ఉన్నది; అగు= అయిన; ఉత్తరయున్= (అభిమన్యుడి భార్య) ఉత్తరా; మఱియున్= ఇంకా; కల-అట్టి మగువలున్= మిగిలిన స్త్రీలూ; కురరీ-నిచయ-నాదంబుల-చందంబు= గొఱ్ఱె గుంపుల అరుపుల తీరు; తోఁపన్= స్ఫురించగా; ఆక్రందనంబు-చేసిరి= పెద్దగా ఏడ్చారు; ఆ+అవస్థ= ఆ స్థితి; జూదంబునాఁడు= ధర్మరాజు దుర్యోధనాదులతో జూదమాడిన రోజు; పాండవులు= పాండురాకుమారులు; పురంబున్= రాజధానిని; వెలువడిన-అప్పటి దశన్= విడిచి వెళ్ళేటప్పటి స్థితితో; పోలి-ఉండెన్= సమానమై ఉన్నది; అట్లు= ఆ విధంగా; ధృతరాష్ట్ర-కానన-గమనంబు= ధృతరాష్ట్రుడు అడవులకు వెళ్ళటం; నిశ్చితంబు= రూఢి; అగుటయున్= కాగా; పురజనంబు= ఆ నగరంలోని ప్రజలు; ఆబాలవృద్ధంబుగాన్= పిల్లలు మొదలుకొని వృద్ధులవరకూ అందరూ; కనుంగొనన్= ఆ ధృతరాష్ట్రుడిని చూడడానికి; చనుదెంచినన్= రాగా.

**తాత్పర్యం:** భీమనకుల సహదేవులూ, కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ ఇంకా ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులూ, దుఃఖంతో క్షోభించారు. కుంతి శోకిస్తూ గాంధారిచేతిని తన భుజంపై ఉంచుకొని నడుస్తున్నది. ధృతరాష్ట్రుడు గాంధారి భుజంపై చెయ్యివేసి పోతున్నాడు. అపుడు ద్రౌపదీ, అర్జునుడి భార్యలైన సుభద్రా, చిత్రాంగదా, ఉలూచీ, తనకొడుకును తీసికొని అభిమన్యుడి భార్య ఉత్తరా, ఇంకా అక్కడ ఉండే స్త్రీ జనం అంతా గొర్రెలమందల అరపులను స్ఫురింపజేస్తూ పెద్దగా ఏడ్చారు. వారి ఆ అవస్థ జూదం ఆడిన ఆ రోజు పాండవులు నగరు విడిచి వెళ్ళే సమయంలో వలె ఉన్నది. ఆ విధంగా ధృతరాష్ట్రుడు అరణ్యానికి పోవటం రూఢి కావడంతో పౌరుల పిల్లలు, పెద్దలూ అంతా ఆ ధృతరాష్ట్రుడిని చూడటానికి వచ్చారు.

**వ.** **వచ్చి రెండ కన్ను వాన కన్నును నెఱుంగని పురంధ్రు లెల్లఁ గరము వంతఁ**
**దలరు నంతరంగములతోడ నక్కురు వృద్ధుఁ జూడ నార్తి వికలగతుల. 143**

**ప్రతిపదార్థం:** ఎండకన్నును= ఎండ (ముఖమూ) పొడనూ; వాన కన్నును= వర్షపు (ముఖమూ) తీరునూ; ఎఱుంగని-పురంధ్రులు= ఎప్పుడూ తెలియని (చూడని), కుటుంబినులు (ఇల్లాళ్ళు); ఎల్లన్= అందరూ; ఆ+కురువృద్ధున్= కురువంశంలో పెద్ద అయిన ఆ ధృతరాష్ట్రుడిని; చూడన్= చూడడానికీ; కరము= మిక్కిలి; వంతన్= బాధతో; తలరు-అంతరంగముల తోడన్= చెదరిపోయిన మనస్సులతో; ఆర్తిన్= వ్యథవలన; వికల-గతులన్= వికలమైన (తడబడే) నడకలతో; వచ్చిరి= వచ్చారు.

**తాత్పర్యం:** ఎండా వానల పొడ తెలియని (ఎప్పుడు ఇల్లు విడిచి బయటకు రాని) ఇల్లాళ్ళు అంతా ఆ వృద్ధుడైన ఆ ధృతరాష్ట్రుడిని చూడటానికి దుఃఖంతో చెదరిన మనస్సులతోనూ, వ్యథ వలన తడబడుతున్న నడకలతోనూ బయటకు వచ్చారు.

**విశేషం:** 'ఎండకన్ను - వానకన్ను - నెఱుంగని' అనేది తెలుగు జాతీయం.

**క. నేలను హర్మ్యంబులపై। నోలి నిలిచి చూచు మానవోత్కరముల శో**
**కాలాప విలాపంబులు। నేలకు మింటికిని నడుమ నిండి చెలంగెన్ 144**

**ప్రతిపదార్థం:** నేలను= నేలమీదా; హర్మ్యంబులపైన్= ఎత్తైన మేడలమీదా; ఓలిన్= వరుసగా; నిలిచి= నిలువబడి; చూచు= (ధృతరాష్ట్రుడిని), చూస్తున్న; మానవ+ఉత్కరముల - శోక+ఆలాప-విలాసంబులు= మనుష్యుల సమూహాలు, దుఃఖంతో అనే మాటలూ, ఏడుపులూ; నేలకును= భూమికీ; మింటికిని= ఆకాశానికీ; నడుమన్= మధ్య ప్రాంతం అంతా; నిండి= వ్యాపించి; చెలంగెన్= అతిశయించాయి, ధ్వనించాయి.

**తాత్పర్యం:** అడవులకు వెళ్ళుతున్న ధృతరాష్ట్రుడిని చూడటానికి ఇండ్లలోనుండి బయటకు వచ్చిన జనం నేలమీదా, ఎత్తైన మేడలమీదా, క్రింది నుండి పైదాకా బారులు తీరి నిలబడి చూస్తూ ఉన్న మనుష్యుల గుంపులు దుఃఖంతో అనుకునే మాటలూ, ఏడుపులూ నేలకూ నింగికీ మధ్యభాగం అంతా నిండి విజృంభించాయి.

**వ. ధృతరాష్ట్రుండుఁ బురద్వారంబు నిర్గమించుచుండి సకల పౌరజనంబుల నిలువం బనిచె; విదురుం డక్కురు వృద్ధునితోడ వనంబున కరుగుటకు దృఢనిశ్చయుం డై పలికె; సంజయుండు నవ్విధంబు వాఁ డయ్యెఁ; గృపా చార్యుండును యుయుత్సుఁడు నత్తెఱంగుమాట లాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి నిలిపి, కోడండ్ర నెల్లను సముచిత వచనంబుల మరల నియమించిన, వార లా వైచిత్రవీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లిగొనుచుండ వీడ్కొనియును బాండురాజమహిషిం జూచి కొని వెనుకం జనుచుండి; రా సమయంబున నజాతశత్రుం డాగొంతి కి ట్లనియె. 145**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడు కూడా; పురద్వారంబు= హస్తినగరం సరిహద్దు ద్వారాన్ని; నిర్గమించుచున్+ఉండి= దాటిపోతూ; సకలపౌరజనంబులన్= తనను వెన్నంటి వస్తున్న నగరవాసుల నందరినీ; నిలువన్= (ఆ పైన ముందుకు రాకుండా) ఆగిపొమ్మని; పనిచెన్= నియోగించాడు; విదురుండు= విదురుడు; ఆ+కురు వృద్ధునితోడన్= కురువంశంలో పెద్ద అయిన ఆ ధృతరాష్ట్రుడితో; వనంబునకున్= అరణ్యానికి; అరుగుటకున్= వెళ్ళటానికి; దృఢనిశ్చయుండు+ఐ= గట్టిగా, నిర్ణయించుకొన్న వాడై; పలికెన్= తన నిశ్చయాన్ని చెప్పాడు; సంజయుండును= సంజయుడు కూడా; ఆ+విధంబు వాఁడు+అయ్యెన్= అదేవిధంగా చేశాడు (వనగమనానికి దృఢంగా నిశ్చయించుకొని ఆ నిర్ణయాన్ని ధృతరాష్ట్రుడికి చెప్పాడు); కృపాచార్యుండును= కృపుడూ; యుయుత్సుఁడున్= యుయుత్సుడూ; ఆ+తెఱంగుమాటలు= ఆ విధమైన మాటలే (ధృతరాష్ట్రుడితో అడవులకు తామూ వస్తా మని); ఆడినన్= చెప్పగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; వారినిన్= ఆ కృప యుయుత్సులను; వారించి= నివారించి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; అప్పగించి= వారిని ఒప్పజెప్పి; నిలిపి= నగరంలోనే ఉండేటట్లు చేసి; కోడంద్రన్= ద్రౌపదీ, సుభద్రా మొదలైన కోడళ్ళను; ఎల్లన్= అందరినీ; సముచిత వచనంబులన్= తగుమాటలతో; మరలన్= తిరిగి ఇళ్లకు వెళ్ళడానికి; నియమించినన్= నియోగించగా; వారలు= ద్రౌపది మొదలైన ఆ కోడళ్ళు; ఆ వైచిత్ర వీర్యునకున్= ఆ ధృతరాష్ట్రుడికీ; గాంధారికిన్= గాంధారికీ; ప్రణమిల్లి= పాదాభివందనం చేసి; వదనంబునన్= ముఖంమీద; బాష్పంబులు= కన్నీటి బిందువులు; వెల్లిగొనుచుండన్= ప్రవహిస్తుండగా; వీడ్కొనియును= ధృతరాష్ట్రుడికి వీడ్కోలు (వెళ్ళి వస్తాం అని) చెప్పి గూడా; పాండురాజు మహిషిన్= పాండురాజు భార్య (తమ అత్త) అయిన కుంతిని; చూచికొని= దృష్టిలో ఉంచుకొని; వెనుకన్= వారి (ఆమె) వెనకే; చనుచుండిరి= అనుసరించి పోతూ ఉన్నారు; ఆ సమయంబునన్= అప్పుడు; అజాతశత్రుండు= ధర్మరాజు; ఆ గొంతికిన్= తల్లి అయిన కుంతితో; ఇట్లు= ఈప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు హస్తినగరద్వారం దాటిపోతూ తనవెంట వస్తూ ఉన్న పౌరులందరినీ అక్కడే ఆగిపొమ్మన్నాడు. విదురుడు ధృతరాష్ట్రుడితో అడవులకు పోవటానికి తిరుగులేని నిశ్చయం చేసికొని అదే విన్నవించాడు. సంజయుడూ అట్లాగే చేశాడు. కృపుడూ, యుయుత్సుడూ కూడా తనతో అడవులకు వస్తామంటే ధృతరాష్ట్రుడు వారిని నివారించాడు. వాళ్ళను ధర్మరాజు కప్పగించి నగరంలోనే ఉండుమన్నాడు. ద్రౌపది మొదలైన (పాండురాజు) కోడళ్ళను గూడా తగుమాటలతో తిరిగి ఇండ్లకు వెళ్ళండని చెప్పాడు. వాళ్లు ఆ ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ ప్రణామం చేసి కన్నీళ్ళు ముఖమంతా నిండి ప్రవహిస్తుండగా, ధృతరాష్ట్రుడికి వీడ్కోలు చెప్పారు. అయినా తమ అత్తగారు ధృతరాష్ట్రుడిని అనుసరించి వెళ్ళుతూ ఉండడం చూచి తాము కూడా (కుంతికి) వెనకే ముందుకు వెళ్ళసాగారు. అప్పుడు ధర్మరాజు కుంతితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఊరి పొలిమేర వరకు సాగనంపడం ధర్మం గాబట్టి తనవెంట వస్తున్నవారిని పురద్వారం వరకు రానిచ్చిన ధృతరాష్ట్రుడు అక్కడినుండి వెనక్కు వెళ్ళుమన్నాడు. 'కురువృద్ధుఁడు' అన్నప్పటి వృద్ధశబ్దం విదురుడు ఆయనను సేవార్థం (179) అనుసరించాలనే నిశ్చయంలో 'ధృడ' త్వానికి హేతువుగా వ్యక్తం చేస్తుంది. ఈ దార్ఢ్యం వలన ధృతరాష్ట్రుడు మారుమాటాడక ఒప్పుకొన్నాడు. కృప యుయుత్సుల అత్తెఱంగు మాటలాడారు మనసేమిటో, విదుర సంజయులలోని దృఢ నిశ్చయస్థితి లేకపోవడంవలన ధృతరాష్ట్రుడు 'వారిని వారించి' ఆపగలిగాడు తేలికగా, ఇంతవరకు తన ననుసరించి ఉన్నారు. గాబట్టి ఇకపై వారి బాగోగులు చూడటం కొరకు 'ధర్మనందనున కప్పగించాడు వాళ్ళను. తర్వాత కోడళ్ళను వెనక్కి వెళ్ళండన్నాడు. వీళ్ళను గూడ ఇక్కడ ప్రస్తావించటం తిక్కన జాగరూకతకు నిదర్శనం. మరలిపొమ్మంటే వాళ్ళు చివరిసారి అన్నట్లుగా గాంధారీ ధృతరాష్ట్రులకు పాదాభివందనం చేశారు. వెళ్ళి వస్తామని వీడ్కోలూ చెప్పారు. అయినా అత్తగారు ముందుకు వెడుతుంటే తాము తిరిగిపోవటం సరి గాదు కాబట్టి 'పాండురాజ మహిషి' చూచికొని' ఆమె అభిప్రాయంకొరకు ఎదురుచూస్తూ ఆమెనే చూస్తూ వెన్నంటి ముందుకే పోతున్నారు. ద్రౌపదీ ప్రభృతులింటికి పోవాలి. కుంతి నిర్ణయం తేలితే కాని అది కుదరదు. ఆ సంగతి గ్రహించిన ధర్మరాజు కుంతితో అదే మాటాడుతున్నాడు. కార్యకారణభావంతో క్రమంగా సన్నివేశాన్ని చిత్రీకరించటం ఇక్కడి విశేషం.

**క.** **'మా యయ్య కాననమునకుఁ । బోయెడు; నే నితనితోడఁ బోయెద శుశ్రూ**
**షాయత్తుఁడ నై యుండెద । నీ యువిదలఁ గొనుచు మగిడి యేఁగుము తల్లీ!'** **146**

**ప్రతిపదార్థం:** మా+అయ్య= మాకు తండ్రి (పూజనీయుడు) అయిన ధృతరాష్ట్రుడు; కాననమునకున్= అడవికి; పోయెడున్= పోతున్నాడు; నేను= నేను; ఇతని తోడన్= ఈ ధృతరాష్ట్రుడితో కూడి; పోయెదన్= అడవికి పోతాను; శుశ్రూషా+ఆయత్తుఁడను+ఐ= ఆయన సేవకు వశపడి; ఉండెదన్= అడవులలోనే ఉంటాను; తల్లీ= అమ్మా!; ఈ+ఉవిదలన్= ద్రౌపదీ ప్రభృతులైన కోడళ్ళను (ఇతర స్త్రీలను); కొనుచున్= తీసికొని; మగిడి= తిరిగి; ఏఁగుము= అంతఃపురానికి వెళ్ళుము.

**తాత్పర్యం:** 'అమ్మా! ఈ ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళుతున్నాడు. నేనూ ఇతడితో వెళ్ళుతున్నాను. ఆయనకు సేవ చేసికొంటూ అక్కడే ఉంటాను. నీవు నీ కోడళ్ళను తీసికొని ఇంటికి తిరిగివెళ్ళుము.'

**చ.** **అనుటయు గొంతి యక్కురుకులాగ్రణి కి ట్లను 'నీవు తోడఁ గా**
**ననమున కేఁగుదెంచుట జనస్తవనీయచరిత్రుఁ డివ్విభుం**
**డనుమతి చేయునే? యుడుగు మా పని; యియ్యమ యత్త నాకు, నీ**
**మనుజవిభుండు మామ; గరిమంబుగ వీరలఁ గొల్చి పోయెదన్.** **147**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (ధర్మరాజు ఆ విధంగా) అనగానే; గొంతి= కుంతీదేవి; ఆ+కురుకుల+అగ్రణికిన్= కురువంశంలో శ్రేష్ఠుడైన ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నది; జన స్తవనీయ చరిత్రుఁడు= జనాలచేత స్తుతించబడే నడవడి కలిగిన వాడు అయిన; ఈ+విభుండు= ఈ ధృతరాష్ట్రుడు; నీవు= నీవు; తోడన్= తనతో; కాననమునకున్= అడవికి; ఏఁగుదెంచుట= రావటం, అనుమతి - చేయునే= అంగీకరిస్తారా?; ఆ పని= ధృతరాష్ట్రుడితో అడవికి వెళ్ళే పని; ఉడుగుము= మానుకొమ్ము; నాకున్= నాకు; ఈ+అమ= ఈమె (గాంధారి); అత్త= అత్త; ఈ+మనుజవిభుండు= ఈ ధృతరాష్ట్ర మహారాజు; మామ= మామ; వీరలన్= (అత్తమామలైన) గాంధారీ ధృతరాష్ట్రులను; గరిమంబుగన్= గౌరవంతో; కొల్చి= సేవిస్తూ; పోయెదన్= వీళ్ళతో అడవులకు వెళ్ళుతాను.

**తాత్పర్యం:** ఆ మాటలు విని కుంతి ధర్మరాజుతో ఇట్లా అన్నది. 'నీవు తనతో కలసి అడవులకు రావటానికి ధృతరాష్ట్రుడు అంగీకరిస్తాడా? కాబట్టి ఆ పని మానుకొమ్ము నాకు గాంధారీదేవి అత్త. ధృతరాష్ట్ర మహారాజు మామ. వీరిని సగౌరవంగా సేవిస్తూ నేను అడవులకు పోతాను.

**తే. ఇతని కియ్యమకును విను మేన చువ్వె। వలఁతి శుశ్రూష సేయంగ వత్స! మీర**
**లాపనికి నేర్తురే? వీర లడవి కరుగ। నింట నుండఁగ నా మన మియ్యకొనునె? 148**

**ప్రతిపదార్థం:** వత్స!= నాయనా!; వినుము= వినుము; ఇతనికిన్= ఈ ధృతరాష్ట్రుడికీ; ఈ+అమకును= ఈమె (గాంధారి) కీ; శుశ్రూష= సేవ; చేయంగన్= చేయటానికి; ఏను+అ= నేను మాత్రమే; వలఁతిన్= సమర్థను; చువ్వె= సుమా; ఆ పనికిన్= వీరిని సేవించడానికి; మీరు; నేర్తురే?= సమర్థులా?; వీరలు= ఈ గాంధారీ ధృతరాష్ట్రులు; అడవికిన్= అరణ్యానికి; అరుగన్= వెళ్ళితే; ఇంటన్= ఇంట్లో; ఉండఁగన్= ఉండడానికి; నా మనము= నా మనసు; ఇయ్యకొనునే?= ఒప్పుకొంటుందా?

**తాత్పర్యం:** నాయనా! వినుము, గాంధారీ ధృతరాష్ట్రులకు సేవచేయటానికి నేను మాత్రమే సమర్థురాలిని. మీకు ఈ సేవలు చేయటం సాధ్యపడదు. గాంధారీ ధృతరాష్ట్రులు అడవికి పోగా ఇంట్లో ఉండటానికి నాకు మనసొప్పదు.'

**వ. అనిన నా ధర్మపుత్త్రుండును దమ్ములు నుచిత వచనంబుల వేఁడికొనిన నద్దేవి యగ్రతనయుం గనుంగొని. 149**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కుంతి పలుకగా; ఆ ధర్మపుత్త్రుండును= ఆ ధర్మరాజు; తమ్ములును= ఆ ధర్మరాజు తమ్ముళ్ళు భీమాదులూ; ఉచిత వచనంబులన్= తగినమాటలతో; వేఁడికొనినన్= కుంతిని (ఆగిపొమ్మని) ప్రార్థించగా; ఆ+దేవి= ఆ కుంతి; అగ్రతనయున్= పెద్దకొడుకును; కనుంగొని= చూచి; (ఇట్లా అన్నది).

**తాత్పర్యం:** అని కుంతీదేవి పలుకగా ధర్మరాజు అతడి తమ్ములూ కలిసి తగిన మాటలతో ఆమెను ఆగిపొమ్మని వేడుకొనగా, ఆమె ధర్మరాజుతో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'వీరలయెడఁ గొడుకా! యప। చారంబులు పలుకుదునె? విచారము విడు; మే**
**నే రూపంబున నిలువన। గారవమున నిది వ్రతంబుగాఁ గైకొంటిన్.' 150**

**ప్రతిపదార్థం:** కొడుకా!= పుత్రుడా!; వీరల+ఎడన్= ఈ గాంధారీ ధృతరాష్ట్రుల విషయంలో; అపచారంబులు= అకార్యములైన మాటలు; పలుకుదును+ఎ?= చెప్పేదా?; విచారము= చింతను; విడుము= విడిచిపెట్టు; ఏన్= నేను; ఏ రూపంబునన్= ఏ విధంగానూ; నిలువన్+అ= (వీళ్ళతో వెళ్ళకుండా), ఆగనే ఆగను; ఇది= వీళ్ళతో వెళ్ళటం; వ్రతంబు కాన్= తప్పక ఆచరించవలసిన పనిగా; గారవమునన్= వీళ్ళ మీద ప్రేమతో; కైకొంటిన్= స్వీకరించాను.

**తాత్పర్యం:** 'పుత్రా! విచారించకుము. ఈ గాంధారీ ధృతరాష్ట్రుల విషయంలో నేను అపచారపు మాటలు అంటానా? ఏ విధంగానూ నేను ఆగను. వీళ్ళమీద ప్రేమతో వీళ్ళతో వెళ్ళి వీళ్ళను సేవించటమే వ్రతంగా పెట్టుకొన్నాను.'

**వ. అని పలికి నిజస్కంధంబున నున్న గాంధారి కరంబుఁ గరంబు నయంబునం బాపి, యతని దిక్కు మొగం బై. 151**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఆ విధంగా అని; నిజ-స్కంధంబునన్= తన భుజమ్మీద; ఉన్న= ఉన్నటువంటి; గాంధారికరంబున్= గాంధారి చేతిని; కరంబు= మిక్కిలి; నయంబునన్= మృదువుగా; పాపి= తొలగించి; అతని దిక్కు= ఆ ధర్మరాజువైపు; మొగంబు+ఐ= (ముఖ ముంచి) చూస్తూ- (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని చెప్పి కుంతి తనభుజం మీద ఉన్న గాంధారి చేతిని మృదువుగా తొలగించి ధర్మరాజును చూస్తూ, (ఇట్లా అన్నది)

**క. 'నీ వేమియు ననకుము సహ। దేవుని నేమఱక యరయు; దినకరసుతునిన్**
**భావమునఁ దలఁపు; మే నా। దేవసముని పుట్టు వడఁచితిం గపటమునన్. 152**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ఏమియున్= ఇంక ఏమీ; అనకుము= మాటాడకు; సహదేవునిన్= సహదేవుడిని; ఏమఱక= అప్రమత్తంగా; అరయు(ము)= జాగ్రత్తగా చూచుకొమ్ము; భావమునన్= నీ మనసులో; దినకరసుతునిన్= (సూర్యతనయుడైన) కర్ణుడిని; తలఁపుము= స్మరిస్తూ ఉండు; ఏను= నేను; ఆ దేవసముని-పుట్టువు= దైవంతో సమానమైన ఆ కర్ణుడి పుట్టుకను; కపటమునన్= మోసంతో; అడఁచితిన్= దాచి పెట్టాను.

**తాత్పర్యం:** నేను ధృతరాష్ట్రుడితో అడవులకు వెళ్ళవలసిందే. ఇంక నీవేమీ ఎదురు మాటాడకుము. సహదేవుడిని ఏమరుపాటు లేకుండా జాగ్రత్తగా చూచుకొమ్ము. కర్ణుడిని మనసులో స్మరిస్తూ ఉండుము. దేవుడివంటి ఆ కర్ణుడు నాకు జన్మించిన సంగతి వంచనతో మరుగుపరచాను.

**క. అది పాపము దానికి నా। మది నెప్పడు వగతు విమలమానస! యక్కీ**
**డు దొలంగునట్లుగా స। త్పదార్థ దానములు చేయు తాత్పర్యమునన్. 153**

**ప్రతిపదార్థం:** విమల మానస!= స్వచ్ఛమైన మనసు కలవాడా, ధర్మరాజా!; అది= కర్ణుడి పుట్టువు మరుగుపరచటం; పాపము= పాపకర్మ; దానికిన్= అందుకు; ఎప్పుడున్= నిరంతరమూ; నా మదిన్= నా మనసులో; వగతున్= దుఃఖిస్తుంటాను; ఆ+కీడు= దానివలన కలిగిన అపచారం (కూడా); తొలగించునట్లుగాన్= తొలగిపోయే విధంగా; తాత్పర్యమునన్= తదేక బుద్ధితో; సత్-పదార్థ-దానములు= శ్రేష్ఠములైన వస్తువులను దానంగా; చేయు(ము)= ఇమ్ము.

**తాత్పర్యం:** ఆ కర్ణుడి జననాన్ని గురించి తెలియకుండా చేయటం పాపం. అందుకు నా మనసులో ఎప్పుడూ బాధపడుతూనే ఉంటాను. నిర్మల హృదయుడివైన ధర్మరాజా! ఆ పాపం (కూడా) తొలగిపోయేటట్లుగా నీవు గొప్ప గొప్ప వస్తువులు దానాలు చేయుము.

ఆ. **అవ్విధమునఁ గర్ణుఁ డాఱడిఁ బోయిన। నాదు మానసంబు పోదు నూఱు**
**పఱియ లై తలంప బలుఱాతఁ జేసిన। వారు గాఁగ వలయు వంశవర్య!** **154**

**ప్రతిపదార్థం:** వంశవర్య!= కురువంశంలో శ్రేష్ఠుడా! (ధర్మరాజా!); కర్ణుడు= పెద్దకొడుకైన కర్ణుఁడు; ఆ+విధమునన్= ఆ తీరుగా; ఆఱడిన్ పోయినన్= మరణించగా; నాదు మానసంబు= నా హృదయం; నూఱుపఱియలు= వందముక్కలుగా; ఐపోదు= ఐపోలేదు; తలంపన్= ఆలోచించగా; బలుఱాతన్= (నా హృదయాన్ని) దృఢమైన రాతితో; చేసినవారు= తయారు చేసినవారు; కాఁగవలయున్= అయి ఉండవచ్చును.

**తాత్పర్యం:** కులంలో శ్రేష్ఠుడివైన ధర్మరాజా! కర్ణు డావిధంగా మరణించటం, తెలిసి కూడా నా మనసు నూరు ముక్కలైపోలేదు. చూడగా ఈ మనసును ఎంతో బలమైన రాతితో తయారుచేసి ఉంటారు.

క. **'నీవును దమ్ములు భక్తి భ। రావేశముతోడఁ దలఁపుఁ డమ్మహితాత్మున్;**
**ద్రోవది నెప్పుడు దృఢ సం। భావన మన్నింపు మయ్య పౌరవముఖ్యా!** **155**

**ప్రతిపదార్థం:** పౌరవ-ముఖ్యా!= పురువంశ్యులలో శ్రేష్ఠుడా!, ధర్మరాజా!; నీవును= నీవూ; తమ్ములు(న్)= నీ తమ్ముళ్ళూ; భక్తి-భర+ఆవేశముతోడన్= భక్తితో నిండిన పూనికతో; ఆ+మహిత+ఆత్మున్= మహానుభావుడైన ఆ కర్ణుడిని; తలఁపుఁడు= స్మరిస్తూ ఉండండి; ద్రోవదిన్= ద్రౌపదిని; ఎప్పుడు(న్)= నిరంతరమూ; దృఢ - సంభావనన్= పటిష్ఠమైన గౌరవంతో; మన్నింపుము+అయ్య= ఆదరించండి.

**తాత్పర్యం:** పౌరవ శ్రేష్ఠుడా! నీవూ, నీ తమ్ముళ్ళూ, మహాత్ముడైన ఆ కర్ణుడిని భక్తితో స్మరిస్తూ ఉండండి. ద్రౌపదిని సగౌరవంగా ఎప్పుడూ ఆదరించండి.

**విశేషం:** కర్ణుడు బ్రతికి, ఉన్నన్నినాళ్ళూ అగ్రజుడుగా తెలియక ఆదరించలేకపోయారు పాండవులు. అందుకే ఇప్పుడు ఎలాగూ మరణించాడు కాబట్టి గతకాలపు వైరం మనసులో ఉంచుకోకుండా భక్తిభావంతో తలచుకొమ్మంటుంది కుంతి. అవమానమూ, వనవాసము వగైరా కష్టాలు అనేకం మిగిలిన సుభద్రాదుల కంటె అనుభవించి ఉన్నది కాబట్టి అయిదుగురికీ భార్యగా ఉండేది కావటం వలన ద్రౌపది విషయంలో సంభావనతో కూడిన ఆదరం చూపాలని ప్రత్యేకంగా చెప్పడంతో కుంతి ఆంతర్యం అది. అందుకే ఇక్కడ 'ఎప్పుడున్' అని విశేషంగా చెప్పటం కూడా.

క. **భీమార్జున నకుల మనః। కామంబులు సఫలతా ప్రకాశంబులు గా**
**భూమీశ! యరసి యొనరుపు। మేమిట నేమఱకు ధర్మ మిల యరయు నెడన్.** **156**

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ!= రాజా!; భీమ+అర్జున-నకుల-మనస్+కామంబులు= భీముడూ, అర్జునుడూ, నకులుడూ మనసులో వాంఛించిన వాటిని; అరసి= తెలుసుకొని; సఫలతా-ప్రకాశంబులు-కాన్= ఫలవంతములై ఒప్పే విధంగా; ఒనరుపుము= చేయుము; ఇల= రాజ్యం; అరయు+ఎడన్= పాలించే విషయంలో; ఏమిటన్= ఏ అంశంలోనూ; ధర్మము= ధర్మం; ఏమఱకు(ము)= ఉపేక్షించకుము.

**తాత్పర్యం:** రాజా! భీముడూ, అర్జునుడూ, నకులుడూ ఏమి కావాలని మనసులో అనుకొంటున్నారో తెలిసికొని ఆ వాటిని నెరవేర్చుము. రాజ్య పాలనంలో ఎప్పుడూ, ధర్మాన్ని ఉపేక్షించకుము.

**వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాదు। మీరు మరలుండని పలికినఁ బాండవాగ్రజుండు విషాదం బంది యూరకుండె; భీమాదులు డెందంబులు గొందలం బంద నశ్రు లొలుకం దలలు వాంచి; రిట్ల మ్మొత్తంబుగ మనంబు గుదిపడుచు మందం బై చెల్ల ధృతరాష్ట్రుండు గొండొకయెడగలుగం జనియె; నా ధర్మతనయుండు తల్లియాననం; బాలోకించి. 157**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; నా నిశ్చయంబు= నేను చేసికొన్న నిర్ణయం; శిథిలంబు= సడలేది; కాదు= కాదు; మీరు= మీరు అందరూ; మరలుండు= తిరిగి ఇండ్లకు వెళ్ళండి; అని= అని; పలికినన్= కుంతీదేవి చెప్పగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; విషాదంబు= బాధను; అంది= పొంది; ఊరక+ఉండెన్= మాటాడకుండా ఊరుకొన్నాడు; భీమ+ఆదులు= భీముడు మొదలైనవారు; డెందంబులు= మనసులు; కొందలంబు= కలత; అందన్= చెందగా; అశ్రులు= కన్నీళ్ళు; ఒలుకన్= ఉబికి జారి పడుతుండగా; తలలు-వాంచిరి= తలవంచుకొన్నారు; ఇట్లు= ఈ విధంగా; ఆ+మొత్తంబుగన్= సంపూర్ణంగా అందరికీ; మనంబు= మనసు; గుదిపడుచున్= చేష్టలు దక్కి (చైతన్యం పోయి); మందంబు-ఐ= బరువై; చెల్లన్= ఉండగా; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; కొండొక= కొంచెం; ఎడ= దూరం; కలుగన్= కలిగేటట్లుగా; చనియెన్= వెళ్ళాడు; ఆ ధర్మతనయుండు= ఆ ధర్మరాజు; తల్లి-ఆననంబు= కుంతి ముఖం; ఆలోకించి= చూచి-ఇట్లా అంటున్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి కుంతి 'ఇక నా నిర్ణయం సడలేది కాదు. మీరు తిరిగి యిండ్లకు వెళ్ళండి అన్నది. అపుడు ధర్మరాజు విచారంతో మాటాడకుండా ఊరుకున్నాడు. భీముడు మొదలైనవారు మనసులు కలతపడి కన్నీళ్లు ఉబికి జారుతుండగా తలలు వంచుకొని నిలుచున్నారు. ఈ విధంగా అక్కడ అంతా మనసులు జడత్వంతో, బరువెక్కిపోయి ఉండగా ధృతరాష్ట్రుడు వాళ్ళకు కొంచెం దూరంగా వెళ్ళాడు. అపుడు ధర్మరాజు తల్లితో ఇట్లా అన్నాడు.

ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవలదని ప్రార్థించుట. (సం.15-22-19)

**సీ. ఇది యేమి సేయంగ నెత్తి కొం టిమ్మాట। యాడకు; మేను ని న్నడవి కేఁగఁ**
**బనుతునే? మముఁ దొల్లి పనిచి పనుల్ గొను। భంగిన సామ్రాజ్య భార నిర్వ**
**హణము తెఱంగులు నప్పటి కప్పటి। కి ట్లని యానతి యిచ్చి నడపఁ**
**బంపక యున్న నొప్పమి రాదె మాకు? ము। న్నీవును గృష్ణుండు నేవిధమున**

**తే. నడిపితిరి కార్య మెఱుఁగవే యడలు వెల్లి। మమ్ముఁ బాంచాలి నిటు ముంచి యమ్మ! యడవి**
**నెట్టు లుండెద?' వనఁగ నయ్యింతి బాష్ప। పూర్ణనయన యై యూరక పోవుచుండె. 158**

**ప్రతిపదార్థం:** అమ్మ!= తల్లీ!; ఇది= ఈ విధంగా; ఏమి+చేయంగన్= ఏం చేయాలని; ఎత్తికొంటి?(వి)= పూనుకొన్నావు?; ఈ+మాట= అడవులకు వెళ్ళుతాను అనేమాట; ఆడకుము= మళ్ళీ అనకు; నిన్నున్= (తల్లివై సంరక్షించే) నిన్ను; అడవికిన్= అరణ్యానికి; ఏఁగన్= వెళ్ళటానికి; ఏను= నేను; పనుతును+ఏ?= పంపగలనా?; తొల్లి= ఇంతకుపూర్వం; మమున్= నీ కొడుకులను (కోడళ్ళనూ); పనిచి= ఆజ్ఞాపించి; పనుల్= పనులు; కొనుభంగిన్+అ= చేయించుకొన్న విధంగానే; ఇపుడు గూడా-సామ్రాజ్య-భార-నిర్వహణము-తెఱంగులు= ఈ విశాలమైన ఈ రాజ్యంయొక్క బరువు మోపే మార్గాలు - (పరిపాలనం తీరు); అప్పటికిన్+అప్పటికిన్= ఎప్పటికప్పుడు; ఇట్లు+అని= ఈ విధం (ఇట్లా చేయుమని) అని; ఆనతి+ఇచ్చి= ఆజ్ఞలు చేసి; నడపన్= పంపక; ఉన్నన్= మమ్మల్ని, నడిపించేవిధంగా చేయకపోతే; మాకున్= మాకు; రాజ్యపాలనంలో, ఒప్పమి= పొరపాటు; రాదె=

కలుగదా?; మున్ను= ఇంతకు పూర్వం; ఈవును= నీవూ; కృష్ణుండున్= కృష్ణుడూ; ఏ విధమునన్= ఏ తీరుగా; కార్యము జరగవలసిన దానిని; నడిపితిరి= జరిపించారో; ఎఱుఁగవే?= తెలియదా!; మమ్మున్= నీ కొడుకులైన మమ్మల్నీ; పాంచాలిన్= ద్రౌపదినీ (కోడళ్ళను); అడలు-చెల్లిన్= శోక ప్రవాహంలో; ముంచి= మునిగేటట్లు చేసి; అడవిన్= నీవు అడవిలో; ఎట్టులు= ఏ విధంగా; ఉండెదవు?= ఉండగలవు?; అనఁగన్= అని ధర్మరాజు పల్కగా; ఆ+ఇంతి= ఆ కుంతి; బాష్ప-పూర్ణ-నయన+ఐ= కన్నీరు నిండిన కనులు కలిగినదై; ఊరక= సమాధానం చెప్పకుండా; పోవుచున్+ఉండెన్= ముందుకు వెళ్ళిపోతూ ఉన్నది.

**తాత్పర్యం:** 'అమ్మా! నీవు చేయదలచుకొన్న ఈ పని ఏమిటి?-ఇట్లా (అడవికి వెళ్ళుతానని) మాటాడకుము. నేను నిన్ను అడవులకు పంపుతానా? లోగడ మమ్మల్ని ఆజ్ఞాపించి మా చేత పనులు చేయించిన విధంగానే ఇప్పుడు కూడా నీవు దగ్గరుండి ఎప్పటికప్పుడు సమయోచితంగా ఇట్లా చేయండి అని శాసించి ఈ సామ్రాజ్యాన్ని పరిపాలించే విధానం చెప్పి మమ్మల్ని నడిపించకపోతే మాకు ప్రమాదం సంభవించదా? పూర్వం నీవూ, కృష్ణుడూ ఏ విధంగా వ్యవహారాలు నడిపించారో మరచిపోయావా? మమ్మల్ని, ద్రౌపదినీ (కోడళ్ళనూ) దుఃఖ ప్రవాహంలో ముంచి నీవు, అడవులలో ఎట్లా ఉండగలవు?' అని ధర్మరాజు అంటుంటే కుంతి ఏమీ సమాధానం చెప్పకుండానే నీళ్ళు నిండిన కళ్ళతో ముందుకు సాగిపోతున్నది.

**విశేషం:** (అడలువెల్లి-అడలు అనే వెల్లి-రూపకం)

**ఉ.** **అయ్యమలాత్మతోడఁ బవనాత్మజుఁడి ట్లను 'ధర్మపుత్త్రు నీ**
**వెయ్యది యుక్త హేతువుగ నిమ్మెయిఁ బాసెదు? నీదు పన్పునం**
**గయ్యము సేసి భూపతినికాయములం బరిమార్చెఁ దల్లి! నీ**
**కియ్యన లక్ష్మి నూఁది చరియింపక యిప్పుడు వాయఁ బాడియే?** **159**

**ప్రతిపదార్థం:** పవన+ఆత్మజుఁడు= (వాయుపుత్రుడైన) భీముడు; ఆ+అమల+ఆత్మతోడన్= నిర్మలమైన మనసు గలిగిన కుంతితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనున్= అన్నాడు; తల్లి!= అమ్మా!; నీవు= నీవు (కుంతి); ధర్మపుత్త్రున్= ధర్మరాజును; ఏ+అది= ఏది; యుక్తహేతువుగన్= తగిన కారణంగా; ఈ+మెయిన్= ఈవిధంగా; పాసెదు= విడిచి వెళుతున్నావు?; నీదు పన్పునన్= నీవు ఆజ్ఞాపించిన విధంగా; కయ్యము-చేసి= కౌరవులతో యుద్ధం చేసి; భూపతి నికాయములన్= రాజుల సమూహాలను; పరిమార్చెన్= చంపాడు, అలా చేయటం; లక్ష్మిన్= (రాజ్యాది) సంపదల్ని; నీకున్+ఇయ్యన్+అ= నీకు ఇవ్వటం కొరకే, అటువంటి లక్ష్మిని; ఊఁది= గ్రహించి; చరియింపక= సుఖింపక; ఇప్పుడు= (సంపదలు కలిగి సుఖించే వీలు ఏర్పడిన) ఈ సమయంలో; పాయన్= ఈ రాజ్యాన్ని విడిచిపెట్టటం; పాడియే?= (నీకు) న్యాయమేనా?

**తాత్పర్యం:** అప్పుడు భీముడు కుంతితో ఇట్లా అన్నాడు. 'అమ్మా, నీవు ఇట్లా ధర్మరాజును విడిచి వెళ్ళటానికి తగిన కారణం ఏమైనా ఉన్నదా? ధర్మరాజు నీవు చెప్పిన ప్రకారం కౌరవులతో యుద్ధం చేసి రాజులందరినీ సంహరించి ఆ(రాజ్య) సంపద నీకు ఇవ్వటం కొరకే అట్లా శ్రమించి రాజ్యం సంపాదించగా సుఖించవలసిన ఈ సమయంలో రాజ్యం విడిచి నీవు అరణ్యాలకు వెళ్ళటం న్యాయమేనా?

**క.** **మనమునఁ దోఁచిన దానము । లనుదినమును జేయుచును సమాశ్రిత జనులం**
**బెనుచుచు బంధులఁ బ్రోచుచు । జననుతచరితమునఁ బరఁగు సౌజన్యనిధీ!** **160**

**ప్రతిపదార్థం:** సౌజన్యనిధీ!= మంచితనానికి గని వంటిదానా! (కుంతీ!); అనుదినమును= ప్రతిరోజూ; మనమునన్= నీ మనసులో; తోయిన= అనిపించిన; దానములు= దానాలను; చేయుచును= జనాలంతా పొగడే విధంగా ప్రతిరోజూ నీకు తోచిన దానాలు చేస్తూ; సమ్-ఆశ్రిత-జనులన్= నిన్ను ఆశ్రయించిన వారిని; పెనుచుచున్= కాపాడుకొంటూ; జన-నుత-చరితమునన్= మనుష్యులచేత ప్రశంసించబడేటటువంటి నడవడితో; పరఁగుము= ఒప్పుము.

**తాత్పర్యం:** మంచితనానికి నిధివంటిదానా! జనాలంతా పొగడే విధంగా, ప్రతిరోజూ నీకు తోచిన దానాలు చేస్తూ, నిన్ను ఆశ్రయించిన వారిని పోషిస్తూ చుట్టాలను సాకుతూ. ఇక్కడే ఉండుము.

**క. వనమున మాద్రీపుత్త్రులు । వెనుఁబడుటకుఁ దలరి తట్లు విక్రమమునకున్**
**గొనకొల్పి తిట్లు వీరల । ననూన దుఃఖముల ముంచి యరుగం దగునే?' 161**

**ప్రతిపదార్థం:** మాద్రీపుత్త్రులు= (మాద్రి కొడుకులు) నకుల సహదేవులు; వనమునన్= అడవులలో; వెనుఁబడుటకున్= కష్టపడినందుకు; అట్లు= ఆ విధంగా, (ఎంతో); తలరితి(వి)= నీవు దుఃఖించావు; విక్రమమునకున్= (పిల్లలు సుఖపడటం కొరకు రాజ్యం సంపాదించుకొనాలని) పరాక్రమం ప్రదర్శించేందుకు; గొన కొల్పితి(వి)= పురికొలిపావు; వీరలన్= అటువంటి ఈ నకుల సహదేవుల్ని; ఇట్లు= ఈవిధంగా; అనూన(న+ఊన) దుఃఖములన్= అధికమైన బాధలలో; ముంచి= మునిగేటట్లు చేసి; అరుగన్= అడవులకు వెళ్ళటం; తగునే?= ఉచితమా?

**తాత్పర్యం:** నకుల సహదేవులు వనవాసంలో కష్టపడుతున్నారని ఆనాడు ఆ విధంగా కుమిలిపోయావు. రాజ్య సుఖాల కొరకు యుద్ధానికీ, పరాక్రమం ప్రదర్శించడానికీ ప్రేరేపించావు. మరి ఈ రోజు వీళ్ళను ఈ విధంగా బాధలలో ముంచి నీవు అడవులకు వెళ్ళటం తగునా?'

**వ. అనియె, నట్టియెడ. 162**

**ప్రతిపదార్థం:** అనియెన్= భీముడు ఆ ప్రకారంగా అన్నాడు: అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** (పై విధంగా) అన్నాడు భీముడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. ద్రోవదియు సుభద్రయు శో । కావేశం బడర మోము లశ్రులఁ దోఁగం**
**గా వెక్కి వెక్కి యేడ్చిరి, భూవర! పాండుక్షితీశ పుత్త్రులు నేడ్వన్! 163**

**ప్రతిపదార్థం:** భూ-వర!= ఓ జనమేజయ మహారాజా!; పాండు-క్షితి+ఈశ-పుత్త్రులున్= పాండురాజు కుమారులు కూడా; ఏడ్వన్= ఏడుస్తూ ఉండగా; ద్రోవదియున్= ద్రౌపదీ; సుభద్రయున్= సుభద్రా; శోక+ఆవేశంబు= దుఃఖంయొక్క వ్యాప్తి; అడరన్= అతిశయించగా; మోములు= ముఖాలు; అశ్రులన్= కన్నీళ్ళతో; తోఁగంగాన్= తడిసి (మునిగి) పోగా; వెక్కి, వెక్కి= వెక్కిళ్ళతో; ఏడ్చిరి= శోకించారు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ద్రౌపదీ, సుభద్రా మనసులో దుఃఖం ప్రవేశించి వ్యాపించగా, ముఖాలు కన్నీళ్ళలో మునిగిపోతూ ఉంటే, వెక్కి వెక్కి ఏడ్చారు. పాండవులు కూడా ఏడ్వసాగారు.

**విశేషం:** కొడుకులూ కోడళ్ళూ దుఃఖిస్తున్నారు. ఏడ్చేవాళ్ళను చూస్తే దుఃఖం అతిశయించి చూచేవాళ్ళు కూడా ఏడ్వటం సహజం. పాండు కుమారు లేడుస్తుంటే ద్రౌపది సుభద్రలు వెక్కి వెక్కి ఏడ్చారు. స్త్రీ రోదనం గూర్చి ముందుగా వర్ణించి పాండు 'రాజకుమారుల'

ఏడ్పు చివరలో చెప్పటం రచనా విధానంలో విశేషం. స్త్రీలు కాబట్టి 'వెక్కి వెక్కి' ఏడ్చిరి. రాకుమారులు 'ఏడ్వన్'.....మామూలుగా కుంతి ముందూ, వీళ్ళంతా వెనకా పోతూనే ఉన్నారు.

**క. పరిజనములు కన్నీళ్ళులు। దొరఁగఁగ నడ లొంది వారితోడం జని రి**
**ప్పరుసునఁ దనదుతనూజులు మరలమికిం బాండురాజమహిషి మఱుఁగుచున్. 164**

**ప్రతిపదార్థం:** పరిజనులు= భృత్యులు; అడలు= దుఃఖం; ఒంది= పొంది; కన్నీళ్ళులు= కన్నీళ్ళు; తొరఁగఁగన్= జారుతుండగా; వారితోడన్= పాండవుల (వారి స్త్రీల వెంట); చనిరి= ముందుకు వెళ్ళారు; ఈ+పరుసునన్= ఈ విధంగా; తనదు తనూజులు= తన కొడుకులు; మరలమికిన్= తిరిగి వెళ్ళనందుకు; పాండు-రాజ-మహిషి= పాండురాజు భార్య; మఱుఁగుచున్= విచారిస్తూ;

**తాత్పర్యం:** వారి సేవకులు కూడా దుఃఖంతో కన్నీరు కారుస్తూ పాండవుల వెంట, ముందుకు వెళ్ళారు. కొడుకులు తిరిగి వెళ్ళకుండా తననే అనుసరిస్తున్నందుకు కుంతి దుఃఖపడుతూ.(తరువాతి వచనంతో అన్వయం)

**వ. 'తెగ నాడకున్నఁ బోవ' రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని, వారలు వినుచుండం దత్పరి జనంబుల తోడ. 165**

**ప్రతిపదార్థం:** తెగన్+ఆడక+ఉన్నన్= కఠినంగా మాటాడకపోతే; పోవరు= (కొడుకులు) తిరిగి వెళ్ళరు; అని= అనుకొని; కన్నీరు-తుడిచికొని= తన కంటి నీరు తొలగించుకొని; వారలన్= తన కొడుకులను; కలయన్-కనుంగొని= పరిశీలనగా (దీర్ఘంగా) చూచి; వారలు= కొడుకులు; వినుచున్+ఉండన్= వింటుండగా; తద్-పరిజనంబుల తోడన్= వారి వెంట వస్తున్న భృత్యులతో; (ఇట్లా అన్నది).

**తాత్పర్యం:** ఖండితంగా, కటువుగా మాటాడకపోతే ఇక వీళ్ళు వెనుకకు పోరు అనుకొని కుంతి తన కన్నీరు తుడుచుకొని, ఒక్కసారి పాండవులందరినీ చూచి వాళ్ళు వింటూ ఉండగా వారి వెంట ఉన్న భృత్యులతో ఇట్లా అన్నది.

**సీ. 'దుర్ద్యూతమునఁ దారు దూలపోవుటయును। నా సభ యపకీర్తి యగు తెఱంగు**
**పాటిల్లుటయుఁ, బెక్కుభంగుల నడవుల। నిడుమలఁ బడుటయు నే సహింపఁ**
**జాలక కార్యంబు చర్చించి సంధిమై। నొవ్వని వా రెల్ల నవ్వఁ దలలు**
**వంచి కౌరవులలో వర్తింప నే? లని। హరితోడ నాడితి; నవ్విధమున**

**ఆ. మాననీయు ధర్మసూను నాగాయుత। బలుని భీము శత్రుభంజనైక**
**శీలుఁ బార్థు శౌర్యలోలురఁ గవల దై। న్యంబు నొందఁ జూచు టర్హ మగునె?' 166**

**ప్రతిపదార్థం:** తారు= తమరు-పాండవులు; దుర్ ద్యూతమునన్= మోసపు జూదంలో; తూలపోవుటయున్= చిన్న బోవటమూ; ఆ సభన్= ఆ విధమైన సభలో; అపకీర్తి= పాడుపేరు; అగు తెఱంగు= కలిగే పని; పాటిల్లుటయున్= సంభవించటమూ; అడవులన్= తరువాత, అడవులలో; పెక్కు-భంగులన్= అనేక విధాలుగా; ఇడుమలన్-పడుటయున్= కష్టాలు అనుభవించటమూ; సహింపన్-చాలక= ఓర్చుకొనలేక; నేను= నేను (కుంతి); కార్యంబు= తర్వాత జరగవలసిన పనిని గురించి; చర్చించి= ఆలోచనలు చేసి; సంధిమైన్= కౌరవులతో సంధి చేసికొనటం వలన; ఒవ్వనివారు= పాండవులంటే పడనివారు (శత్రువులు); ఎల్లన్= అందరూ; నవ్వన్=

అపహాస్యం చేసే విధంగా; తలలు వంచి= (కౌరవులకు) తల ఒగ్గి; కౌరవులలోన్= దుర్యోధనాదులతో; వర్తింపన్= కలిసి ఉండటం; ఏల?= ఎందుకు; అని= ఎందుకు; అని= అనుకొని; హరితోడన్= కృష్ణుడితో; ఆ+విధమునన్= ఆ ప్రకారంగా; ఆడితిన్= మాటాడాను; మాననీయున్= గౌరవింపదగినట్టి; ధర్మసూనున్= ధర్మరాజునూ; నాగ+అయుత-బలునిన్= పదివేల యేనుగుల బలం కలిగిన; భీమునిన్= భీముడినీ; శత్రు-భంజన-ఏక-శీలున్= విరోధులను రూపు మాపడమే ప్రధానం ఐన చరిత్ర కలిగిన; పార్థున్= అర్జునుడినీ; శౌర్య-లోలురన్= పరాక్రమవంతులైన; కవలన్= నకుల సహదేవులనూ; దైన్యంబున్= (దరిద్రంవంటి) దురవస్థను; ఒందన్= పొందగా; చూచుట= చూస్తూ ఉండటం; అర్హము-అగును+ఏ?= (నాకు) తగిన దేనా?

**తాత్పర్యం:** ఆ రోజు దుర్మార్గపు జూదంలో తమరు చిన్నబోవడమూ, ఆ సభలో దుష్కీర్తి కలిగించే పని, (ద్రౌపదీ పరాభవం) జరగటమూ (ఉద్యో4-19) ఆ తరువాత అడవులలో అనేక విధాలుగా కష్టాలపాలు కావడమూ (ఉద్యో3-183) చూచి, నేను ఓర్చుకొనలేకపోయాను. ఏం చేయాలి అని కర్తవ్యాన్ని గురించి అనేక విధాలుగా ఆలోచనలు చేశాను. కౌరవులతో సంధి చేసికొని, పాండవులంటే గిట్టని వాళ్ళు అందరూ ఎగతాళి చేసేవిధంగా తల ఒగ్గి కౌరవులతో కలిసి ఉండటం ఎందుకు? అని కృష్ణుడితో ఆ రోజు ఆ విధంగా చెప్పాను. పూజించదగిన ధర్మరాజూ, పదివేల యేనుగుల బలం కలిగిన భీముడూ, శత్రువులను నిర్మూలించటమే ప్రధానమైన పనిగా కలిగిన అర్జునుడూ, పరాక్రమవంతులైన నకుల సహదేవులూ, వీ ళ్ళందరూ ఎందుకూ కొరగాని వారివలె దురవస్థలపాలు కావటాన్ని చూస్తూ ఉండడం నాకు తగునా?'

**వ. అని ధర్మతనయు వదనంబు వీక్షించి, పాంచాలిం జూపి. 167**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ధర్మతనయు-వదనంబు= ధర్మరాజు ముఖం; వీక్షించి= చూచి; పాంచాలిన్= ద్రౌపదిని; చూపి= చూపించి. (ఇట్లా అన్నది).

**తాత్పర్యం:** అని చెప్పి కుంతి ధర్మరాజు ముఖం చూచి, అతడికి ద్రౌపదిని చూపిస్తూ (తరువాతి పద్యంతో అన్వయం)

**సీ. 'గౌరవంబున సుకుమారత్వమున నొప్పు । నిప్పొల్తిఁ దలవట్టి యీడ్చి తెచ్చి**
**సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన । పెట్టంగ నచ్చటి పెద్ద లెల్లఁ**
**బలుకక యుండ నబ్బన్నంబునకు నోర్వ । వలసె మీ కప్పటి కలఘుతేజ!**
**నీ తేజ మట్టులు నీ అయి పోయినఁ । బాండునికులము చెప్పంగఁ జూప**

**తే. లేకపోదె యబ్బంగిఁ బల్కితి ముకుందు । తోడ నేను మీ రెమ్మెయి రూఢి కెక్కి**
**వెలుఁగఁ గోరుట కతమునఁ దలఁచి; దాని । ననిలసుతుఁ డెత్తిపెట్టె; నే మనఁగఁ గలదు?' 168**

**ప్రతిపదార్థం:** అలఘుతేజ!= గొప్ప పరాక్రమం కలిగినవాడా! ధర్మరాజా!; గౌరవంబునన్= గౌరవింపదగిన లక్షణంతోనూ; సుకుమారత్వమునన్= కష్టాన్ని తట్టుకొనలేని మెత్తదనంతోనూ; ఒప్పు= ఒప్పుతున్న; ఈ+పొల్తిన్= ఈ కాంతను (ద్రౌపదిని); తల+పట్టి= జుట్టు పట్టుకొని; ఈడ్చి= లాక్కుంటూ; తెచ్చి= తీసికొనివచ్చి; సభలోనన్= (పదుగురు ఉండే) కొలువులో; దుశ్శాసనుండు= దుశ్శాసనుడు; అట్లు= ఆ విధంగా; అవమాన పెట్టంగన్= అవమానం చేస్తుంటే; అచ్చటి పెద్దలు= ఆ సభలో ఉన్న వృద్ధులు; ఎల్లన్= అందరూ కూడా; పలుకక-ఉండన్= ఏమీ(అది తప్పని) మాటాడక ఊరుకొనగా; ఆ+బన్నంబునకున్=

ఆ కష్టపాటుకు; మీకున్= మీకు (పాండవులకు); అప్పటికిన్= ఆ సమయంలో; ఓర్వన్-వలసెన్= సహించవలసివచ్చింది; నీ తేజము= నీ తేజస్సు; అట్టులు= ఆ విధంగా, (ధర్మబద్ధత వలన); నీఱు-అయిపోయినన్= బూడిద (వ్యర్థం) అయిపోగా; పాండునికులము= పాండురాజు వంశం; చెప్పంగన్= చెప్పుకొనటానికీ; చూపన్= చూపించటానికి; లేక= లేకుండా; పోదె= పోదా; మీరు= మీరు, పాండవులు; ఏ+మెయిన్= ఏ విధంగా నైనా; రూఢికిన్= ప్రసిద్ధికి; ఎక్కి= వచ్చి; వెలుఁగన్= ప్రకాశించాలని; కోరుట కతమునన్= కోరినందులవలననే; నేను= నేను (కుంతి); తలఁచి= ఆలోచించి; ముకుందు తోడన్= కృష్ణుడితో; ఆ+భంగిన్= ఆ విధంగా; పల్కితిన్= అన్నాను; దానిన్= దానిని, కృష్ణుడితో ఆ విధంగా మాటాడటాన్ని; అనిలసుతుఁడు= భీముడు; ఎత్తిపెట్టెన్= ఎత్తి చూపెట్టాడు; ఏమి-అనఁగన్-కలదు?= ఇంక నేను ఏమని చెప్పేది?

**తాత్పర్యం:** 'పరాక్రమవంతుడా! ధర్మరాజా! పూజించదగిన లక్షణమూ, సౌకుమార్యమూ కలిగి ఉన్న ఈమె (ద్రౌపది)ని జుట్టు పట్టుకొని ఈడ్చుకొంటూ తీసికొని వచ్చి సభలో (పదుగురి సమక్షంలో) దుశ్శాసను డా విధంగా అవమానం చేస్తుంటే, ఆ సభలో ఉన్న వృద్ధులంతా ఏమీ మాటాడకుండా చూస్తూ ఉంటే అటువంటి కష్టాలను చూస్తూ మీకు అప్పటికి ఊరుకొనవలసి వచ్చింది. నాడు మీ తేజస్సు ఆ విధంగా బూడిదయిపోతుంటే పాండురాజు వంశమే ఇక భూమి మీద చెప్పటానికి, చూపటానికి లేకుండా నశించిపోవడమేనా? అనీ ఏ విధంగా నైనా మీరు మళ్ళీ ప్రసిద్ధులై పేరు పొందాలనీ అనుకొనటం వలన ఆలోచించి నేను కృష్ణుడితో ఆ రోజు ఆ విధంగా చెప్పాను. భీముడు దాన్ని ఎత్తి చూపిస్తున్నాడు. ఇంక నేను మాటాడేదేమున్నది?'

**వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గు వడి; రిట్లు పలికి గొంతి యిమ్మాటకు భీము చిత్తం బెట్లగునో యనుతలంపున ధర్మసుతున కతనిం జూపి. 169**

**ప్రతిపదార్థం:** అనినన్= కుంతి పై విధంగా పల్కగా; విని= ఆలకించి; ధర్మసుతుండును= ధర్మరాజు; భీముండును= భీముడూ; సిగ్గు+పడిరి= (తగని మాటలు అన్నందుకు) సిగ్గుపడ్డారు; ఇట్లు= ఈ ప్రకారంగా; పలికి= అని; గొంతి= కుంతీదేవి; ఈమాటకున్= తానన్నమాటకు; భీముచిత్తంబు= భీముడి మనస్సు; ఎట్లు+అగునో?= ఏమవుతుందో?; అను తలంపునన్= అనే ఉద్దేశంతో; అతనిన్= ఆ భీముడిని; చూపి= చూపించి; ధర్మసుతునకున్= ధర్మరాజుతో (ఇట్లా అన్నది).

**తాత్పర్యం:** కుంతి అన్న మాటలు విని ధర్మరాజూ, భీముడూ పొరపాటు మాటాడినందుకు సిగ్గుపడ్డారు. తాను అన్న మాటలకు భీముడు మనసులో బాధపడుతున్నాడేమో అనుకొని కుంతి భీముడిని చూపిస్తూ (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** కుంతి మాటలు విని ధర్మరాజు, భీముడు సిగ్గుపడ్డారు. అంటే వీళ్ళన్న మాట పొరపాటన్నమాట. అందులో భీముడి పొరపాటును కుంతి వాచ్యంగానే చెప్పింది. మొత్తంమీద 'నీవు ఆజ్ఞాపించటం వలన యుద్ధం చేయవలసి వచ్చింది అని కుంతిమీద నెపంపెట్టినందుకు (మీ సౌఖ్యం, వంశగౌరవం నిల్పటం కొరకే చేశాను తప్ప ఇందులో నా స్వార్థం ఏం లేదని చెప్పిన కుంతి మాటలకు) ధర్మజ భీములు సిగ్గుపడ్డారు. సిగ్గుపడ్డారంటే తాము పొరపాటుగా మాటాడామని గ్రహించారన్నమాట (157ప.) అయితే భీముడిని గురించి వాచ్యంగా అన్నది కాబట్టి, అతడి స్వభావాన్ని బట్టి గూడా భీముడు బాధపడతాడేమో నని కుంతి మళ్ళీ ఇట్లా అంటున్నది. తల్లిగా ఎపుడూ భీముడిని గురించి ధర్మరాజుతోనే మాటాడుతున్నది. ఇట్లా మనసు పరిశీలించి నడుచుకొనటం తిక్కన పాత్రలలో ప్రత్యేకత.

**ఉ. 'నామది నొండు లేదు; విను నవ్వితి నీతనితోడ; నీదు ల**
**క్ష్మీ మహిమన్ మనం బలరఁ జేసితి నుత్తమదానముల్; జన**
**స్తోమ నుతంబుగా నడపఁజూచితి జన్నము గన్నులార; నిం**
**కేమి కొఱంత నా; కుడుగ; నెట్లును బోదు నరణ్యవృత్తికిన్. 170**

**ప్రతిపదార్థం:** విను(ము)= ధర్మరాజా-వినుము; నామదిన్= నా మనసులో; ఒండు= వేరే ఉద్దేశం ఏమీ; లేదు= లేదు; ఈతని తోడన్= ఈ భీముడి విషయంలో; నవ్వితిన్= నవ్వుతూ అన్నమాటలే సుమా; నీదు-లక్ష్మీ-మహిమన్= నీ సంపదల పెంపుతో; మనంబు= (నా నీ మనస్సు); అలరన్= తృప్తిపడే విధంగా; ఉత్తమ దానముల్= గొప్ప గొప్ప దానాలు; చేసితిన్= చేశాను; జన-స్తోమ-నుతంబుగాన్= జన సమూహాలు పొగడేవిధంగా; జన్నము= యజ్ఞం (అశ్వమేధయాగం); నడపన్= నీవు నిర్వహించగా; కన్నులారన్= కంటినిండా; చూచితిన్= చూచాను; ఎట్లును= ఏ విధంగా చూచినా; ఉడుగన్= అరణ్యాలకు వెళ్ళకుండా ఆగను; నాకున్= నాకు; ఇంకన్= ఇంకా; కొఱంత= లోటు; ఏమి= ఏమి ఉన్నది; అరణ్య వృత్తికిన్= అడవులలో ఉండడానికి; పోదున్= పోతాను.

**తాత్పర్యం:** 'కొడుకా! విను, నా మనసులో వేరే ఉద్దేశం ఏమీ లేదు. ఊరకే భీముడితో నవ్వులాటగా అన్నాను. నీ సంపదలతో మనసు తృప్తి తీరా ఎన్నో గొప్ప గొప్ప దానాలు చేశాను. నీవు అశ్వమేధయాగం చేస్తుంటే కళ్లారా చూచాను. ఇక నాకు కొఱత ఏమున్నది? అడవులకు వెళ్ళకుండా ఉండను. (నా జీవితానికి ఏ కొఱతా లేదు.) అడవులలో ఉండడానికే వెళ్ళుతాను.

**విశేషం:** నా మనసులో వేరే ఉద్దేశం లేదు. అంటే ధర్మరాజు భీముడు అన్న మాటలను గురించి వాళ్ళపై కోపం లేదని భావం. ఏదో నవ్వుతూ అన్నాను. అంటే తానన్న మాటలను గట్టిగా పట్టించుకుని బాధపడవద్దని భావం. ఇటువంటి మాటలకు భీముడు మెత్తబడటం అతడి స్వభావానికి సహజం. తల్లిగా కుంతికి తెలుసు. పిల్లలతత్త్వం. భీముడు ఆ తర్వాత లక్ష్మి నూఁది భరియింపక యిప్పుడు వాయఁబాడియే'. 'మనము తోఁచిన దానములు' రోజూ చేసికొంటూ ఇక్కడే ఉండుమన్నాడు. అందుకు సమాధానంగా కుంతి నీదులక్ష్మీ మహిమన్ మనం బలర నుత్తమదానముల్ చేసితి నన్నది. భీముడన్న మాటలనే ఉపయోగించడంలో దానికి సమాధానంగానే అంటున్నట్లు సూచన. ఎన్నో దానాలు మనసు తీరా చేశాను అనటం వలన పాండవలక్ష్మిని ఉపయోగించుకొనటమూ సత్కార్యాలు చేయటమూ రెండూ జరిగాయి కాబట్టి బాధపడనక్కరలేదని ఆంతర్యం- నడపఁ జూచితి' అనే కాక 'జన స్తోమనుతంబుగా నుత్తమదానముల్ చేసితి' అనీ అన్వయం. తను చేసిన దానాలు జనబాహుళ్యం ప్రశంసించారు. అంటే అధికంగా అధికులకు దానాలు చేసినట్లు తాత్పర్యం. మా చేత యుద్ధం చేయించావని వాళ్ళంటే ఎందుకోసం చేయించానో ఆ లక్ష్యం నెర వేరింది అని కుంతి ఇక్కడా వ్యంగ్యంగా సమాధానం చెప్తున్నది. ఇన్నీ సాధించిన తర్వాత ఇంకా ఏ కోర్కె ఉన్నదని? నగరంలో ఉండిపోవటానికి? అందుచే అడవులకు ప్రయాణం ఆపుకోవలసిన కారణం ఏమీ లేదు. అడవులకు వెళ్ళడం (పాడియే- అని భీముడి ప్రశ్న) న్యాయమే అని కుంతి సమాధానం. కాబట్టి 'అరణ్య వృత్తికిన్ పోదు' అని ఫలితాంశంగా తన నిర్ణయం మళ్ళీ చెప్పింది. ఇక్కడ అన్వయంలో కొంచెం మార్పుతో-ఈ నిర్ణయం కొంచెం కటువుగా కూడా వ్యక్తం అవుతుంది. 'ఇంకేమి కొఱంత నాకు'- నాకు లోటేముంది? ఉడుగన్= ఎట్లును అడవులకు పోవడం ఏ విధంగా కూడా మానుకోను. ఎట్లును బోదు నరణ్య వృత్తికిన్. ఏ విధంగానైనా మీరెన్ని చెప్పినా అడవులకు వెళ్ళి తీరుతాను- అని మార్దవం పనిచేయకపోతే ఇట్లా కఠినంగా అన్వయించాలి.

**తే. రాజ్య ఫలము కామింపఁ బుత్త్రా! సమగ్ర। తపమునకు ఫల మైన యుత్తమ గతి ప్ర**
**సిద్ధి గోరుదు నది గల్గఁ జేత కిట్టి। తోడు మఱి నాకుఁ గలుగునే? దురితదూర! 171**

**ప్రతిపదార్థం:** పుత్త్రా!= కొడుకా! (ధర్మరాజా), రాజ్యఫలము= రాజ్యం వలన కలిగే సుఖాలను; కామింపన్= నేను కోరను; సమగ్ర-తపమునకు(న్)= సంపూర్ణమైన తపస్సుకు; ఫలము= ప్రయోజనం; ఐన= అయినటువంటి; ఉత్తమగతి= శ్రేష్ఠమయిన లోకాలను; ప్రసిద్ధి= చక్కగా లభించటాన్ని; కోరుదున్= కోరుకొంటాను; దురితదూర!= పాపాలకు దూరంగా ఉండేవాడా!; అది= అటువంటి, ఉత్తమగతి; కల్గన్-చేఁతకున్= కలిగేటట్లు చేయటానికి, (సంపాదించుకోవటానికి); ఇట్టి తోడు= ఇటువంటి (గాంధారీ ధృతరాష్ట్రుల) సాయం; నాకున్= నాకు; మఱి= వేరొక సమయంలో; కలుగునే?= దొరుకుతుందా?

**తాత్పర్యం:** కొడుకా! నేను రాజ్య సుఖాలను కోరను. నిండైన తపస్సుకు ఫలితం ఐన ఉత్తమ లోకాలను పొందటమే నా కోరిక. పుణ్యాత్ముడా ధర్మరాజా! (తపస్సుతో సాధించుకొనవలసిన) అటువంటి ఉత్తమగతిని సంపాదించుకొనటానికి ఈ ధృతరాష్ట్రుడివంటి తోడు మళ్ళీ యింకొకసారి నాకు లభిస్తుందా?

**క.** **కురు రాజునకును దేవికిఁ బరిచర్య లొనర్చుచుం దపంబునఁ గృశతం**
**బొరయు తనువుతోఁ గడపెదఁ గరము నియతి నింకఁ గలుగు కాలము వత్సా! 172**

**ప్రతిపదార్థం:** వత్సా!= నాయనా!; ఇంకన్= ఇకపైన; కలుగుకాలము= వచ్చే రోజులన్నీ; కురు రాజునకును= ధృతరాష్ట్రుడికీ; దేవికి(న్)= అతడి భార్య గాంధారికీ; పరిచర్యలు= సేవలు; ఒనర్చుచున్= చేస్తూ; తపంబునన్= తపస్సుతో; కృశతన్= క్షీణతను; పొరయు= పొందే; తనువుతోన్= శరీరంతో; కరము= మిక్కిలి; నియతిన్= నియమంగా; కడపెద(న్)= గడుపుతాను.

**తాత్పర్యం:** నాయనా! ఇంక పై కాలమంతా, గాంధారీ ధృతరాష్ట్రులకు సేవ చేస్తూ, తపస్సుతో శరీరాన్ని కృశింపజేసికొంటూ నియమంగా గడిపేస్తాను.

**వ.** **మీరు మరలుం' డనియె; నట్టియెడ నప్పాండురాజమహిషి, తమతోడ వనవాసంబునకై వచ్చుటకుం గడంగుటయు, దాని కొడంబడక పాండవులు దగు పలుకులం బ్రార్థించుటయు నెఱుంగుం గావున ధృతరాష్ట్రుండు 'ధర్మతనయుం డెట్లు సెప్పెనట్లు సేయు' మని విదురసంజయులచేత నద్దేవికిఁ జెప్పి పుత్తెంచిన వార లేతెంచి యబ్భంగి చెప్పినను వదలక వారి పలుకు లాయమ వారించి దృఢనిశ్చయంబునఁ గొడుకులఁ గోడండ్రను దక్కటి బంధుజనులకు సర్వభరత భార్యలను బరిజనంబులను గలయం గనుంగొని 'యి ట్లేల వచ్చెదరు? నిలువుండు; సుఖుల రై యుండుం' డనుటయు. 173**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు (పాండవులు); మరలుండు= తిరిగి నగరుకు వెళ్ళండి; అనియెన్= అన్నది (కుంతి); అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+పాండురాజు-మహిషి= ఆ పాండురాజుగారి పట్టపుదేవి (కుంతి); వనవాసంబునకై= అడవులలో ఉండి పోవటం కొరకు; తమతోడన్= తమతో (గాంధారీ ధృతరాష్ట్రులతో) కలిసి; వచ్చుటకున్= (అడవులకు) రావడానికి; కడంగుటయున్= పూనుకొనటమూ; పాండవులు= పాండురాజు కొడుకులు; దానికిన్= కుంతి అడవులకు వెళ్ళటానికి; ఒడంబడక= అంగీకరించకుండా; తగు పలుకులన్= తగిన మాటలతో; ప్రార్థించుటయున్= (వద్దని) వేడుకొనటమూ; ఎఱుంగున్= తెలుసు; కావునన్= కాబట్టి; ధర్మతనయుండు= ధర్మరాజు; ఎట్లు= ఏ ప్రకారంగా; చెప్పెన్= చెప్పాడో; అట్లు= ఆ ప్రకారంగా; చేయుము= చేయవలసింది అని అనే విధంగా; ఆ+దేవికిన్= ఆ కుంతీదేవికి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; విదుర-సంజయులచేతన్= విదురుడితోనూ, సంజయుడితోనూ; చెప్పి= పై విధంగా పలికి; పుత్తెంచినన్= కుంతి వద్దకు పంపగా; వారలు= ఆ విదుర సంజయులు; ఏతెంచి= కుంతి వద్దకు వచ్చి; ఆ+భంగి= ధృతరాష్ట్రుడు చెప్పుమన్నమాటలు; చెప్పినను= కుంతికి చెప్పినప్పటికీ; ఆ+అమ= ఆ కుంతి;

వదలక= అడవులకు (ధృతరాష్ట్రుడితో వెళ్ళాలనే) తన నిశ్చయం విడిచి పెట్టకుండా; వారి పలుకులు= విదుర సంజయుల మాటలు; వారించి= నిరోధించి; దృఢ-నిశ్చయంబునన్= మారని గట్టి నిర్ణయంతో; (అడవులకు వెళ్ళాలని); కొడుకులన్= పాండవులనూ; కోడండ్రను= కోడళ్ళనూ; తక్కటి-బంధుజనులను= మిగిలిన బంధువులనూ; సర్వ-భరత-భార్యలను= భరతవంశపు రాజుల స్త్రీలు అందరినీ; పరిజనంబులను= భృత్యులనూ; కలయన్= ఒక్కసారి పరికించి; కనుంగొని= చూచి; ఏల= ఎందుకు; ఇట్లు= ఈ విధంగా; వచ్చెదరు?= నన్ను వెన్నంటి వస్తున్నారు?; నిలువుండు= ఇంక ఆగిపొండి; సుఖులరు+ఐ= సుఖాన్ని పొందినవారై; ఉండుండు= (నగరులో) ఉండండి; అనుటయు(న్)= అని కుంతి పల్కగానే.

**తాత్పర్యం:** 'ఇక మీరు తిరిగి (ఇళ్ళకు) వెళ్ళండి' అన్నది కుంతి. కుంతి తమతో అరణ్యాలకు రావటానికి పూనుకొనటమూ, అందుకు ఆమె కొడుకులు అంగీకరించకుండా ఆమెను వారించటమూ తెలిసినవాడు కాబట్టి ధృతరాష్ట్రుడు ఆ సమయంలో, విదురుడినీ, సంజయుడినీ పిలిచి, 'కుంతికి ధర్మరాజు ఏ విధంగా చేయుమంటే ఆ విధంగా చేయు' మని కబురు పంపాడు. వాళ్ళిద్దరూ వచ్చి ధృతరాష్ట్రుడి సందేశాన్ని కుంతికి చెప్పారు. అయినా కుంతి పట్టు విడవకుండా విదుర సంజయుల మాటలకు అడ్డం వచ్చి గట్టి నిర్ణయంతో కొడుకులనూ, కోడళ్ళనూ, మిగిలిన చుట్టాలనూ, భరతవంశ స్త్రీలనూ, సేవకులనూ-అందరినీ ఒక్కసారి పరికించి చూచి 'ఎందు కిట్లా వెంట వస్తారు? ఇంక ఆగండి. (ఇళ్ళకు వెళ్ళి) సుఖంగా ఉండండి' అన్నది. అప్పుడు.

**విశేషం:** మూలంలో గాంధారీ ధృతరాష్ట్రులు ధర్మరాజాదుల మాటలన్నీ వింటూ ఇక్కడే ఉన్నారు కాని తెలుగులో తిక్కన గాంధారీ ధృతరాష్ట్రులు - కుంతీ పాండవులకు కొంచెం దూరంగా వెళ్ళి అక్కడ ఆగారు. దుఃఖిస్తున్న కుంతికీ - తత్పుత్రులకూ ఏకాంతం కలిగించటం వారి మాటలకు తాను అడ్డంగా ఉండటం తగదని ధృరాష్ట్రుడు అనుకొని దూరంగా వెళ్ళాడన్నమాట. అట్లానే 'విషాదం బంది ఊరకున్న ధర్మరాజు, ధృతరాష్ట్రుడు 'కొండొక యెడగలుగం జనిన తర్వాత తల్లితో మాట్లాడాడు(157). ఏకారణంగా నైనా కుంతి దుర్యోధనాదుల వలన పాండవులకు కలిగిన కీళ్ళు (166,168) ప్రస్తావించింది. ఇంకా ఆ రోజు సభలో పెద్దలు ఎవరూ నోరుమెదపలేదన్నమాట ధృతరాష్ట్రుడికీ తగిలేదే. (ఉద్యో.3,198) ధృతరాష్ట్రుడు ప్రక్కన ఉంటే కుంతి కూడా ఇట్లా మాట్లాడటం కుదురుతుందా? ఏ ఉద్దేశంతో అన్నప్పటికీ ఆ మాటలు యథార్థాలే కదా! అందుకే తిక్కన ధృతరాష్ట్రుడిని ఆ సన్నివేశం నుండి తప్పించాడు. కాబట్టి యిక్కడి మాటలలో మూలానికీ తెలుగుకీ తేడా వస్తుంది. గాంధారీ ధృతరాష్ట్రు లిక్కడ లేరు కాబట్టి వారు ధర్మరాజు చెప్పినట్లు చెయ్యుమని స్వయంగా కుంతితో (మూలంలోవలె) అనే వీలు లేదు. విదుర సంజయుల చేత కబురు చేసినట్లు తెలుగులో కల్పనం, ధృడనిశ్చయం చేసికొన్న కుంతి ధృతరాష్ట్రుడి మాటను అతడి ముఖమ్మీద కాదనటంకంటె కబురు తెచ్చిన విదుర సంజయులతో కా దనడంలో 'వారి పలుకులు వారించటం లో సౌకర్యమూ లభించింది. కుంతి నిర్ణయం అంగీకరించి (సరే అడవులకు పొమ్మని) అందరూ వెళ్ళిపోయాక గాంధారీ ధృతరాష్ట్రులు కుంతిని వారించినట్లు మూలం. తెలుగులోని మార్పు ఉచితం.

**క. హృదయములు దలర నందఱుఁ। బ్రదక్షిణము గాఁగ నేడ్పుఁ గ్రందుటెలుఁగు లె**
**ల్ల దెసలఁ జెలఁగఁ దిరిగి త। త్పదంబులకు నెఱఁగి నంతఁ దనువులు దూలన్.** **174**

**ప్రతిపదార్థం:** అందఱున్= అప్పుడు (పాండవాదులు) అందరూ కూడా; హృదయములు= మనసులు; తలరన్= చెదరిపోగా; ఏడ్పు (న్) క్రందు+ఎలుఁగు= ఒక్కసారిగా రేగిన ఏడుపుల గొంతులు, (ధ్వనులు); ఎల్ల, దెసలన్= అన్ని దిక్కులలోనూ; చెలఁగన్= రేగుతుండగా; ప్రదక్షిణము కాఁగన్= ఆ కుంతీదేవికి, ప్రదక్షిణంగా; తిరిగి= తిరిగి వచ్చి; తద్-పదంబులకున్= ఆ కుంతి పాదాలకు; ఎఱఁగి= (సాష్టాంగంగా) నమస్కరించి; వంతన్= దుఃఖంవలన; తనువులు= ఒళ్ళు (శరీరాలు); తూలన్= తూలిపోతూ ఉండగా.-(తరువాతి వచనంతో అన్వయం.)

**తాత్పర్యం:** అపుడు పాండవులు వారి భార్యలు మొదలుగా అక్కడ ఉన్నవాళ్లంతా కుంతి నిశ్చయానికి, మనసులు చెదరిపోవటంతో, ఒక్కసారిగా ఏడ్చారు. ఆ ఏడుపు ధ్వనులు నాల్గుదిక్కులా నిండిపోయాయి. అట్లా ఏడుస్తూ కుంతికి ప్రదక్షిణం చేసి పాదాభివందనం చేశారు. బాధవలన శరీరం తూలిపోతుండగా అక్కడే నిలబడిపోయారు.

**విశేషం:** పాండవులతోపాటు అందరూ కుంతికి ప్రదక్షిణం చేసి నమస్కరించడం తెలుగులో విశేషం. మనసులలో దుఃఖం, కంఠంలో నుండి ఏడుపుగా వ్యక్తమై ఈ రెంటిచేత కలిగిన నిస్సత్తువవలన ఒళ్ళు తూలిపోయింది. అంటే వాళ్ళకు ఒళ్ళంతా దుఃఖం నిండిపోయింది. ప్రదక్షిణాదులన్నీ ఏడూస్తూనే చేయడం అప్పటి మనఃస్థితికి దర్పణం.

**వ. నిలిచి రందుఁ బాండవు లేవురుం బాండురాజ మహిషి ననుప మఱియుం జని యాయమను ధృతరాష్ట్ర గాంధారులను గలిపి 'వారల నిరువుర నుద్దేశించి' మీరు వనంబునకుం బోయి తానును లేకున్న మా కెట్లు కాలంబు గడపవచ్చు ననుతలంపునం దన్ను నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడంబడ దయ్యెఁ; నీ సాధ్వికి బుద్ధి సెప్పికొనుచుం బరిచర్యసేయించు కొం' డని యప్పగించి, యారాజునకు నద్దేవికిం గుంతికిం బ్రదక్షిణంబు సేసి దండ ప్రణామంబు లాచరించిన, దీవించి వా రామంత్రణంబు సేయ నా ధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబు లగువదనంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని. 175**

**ప్రతిపదార్థం:** నిలిచిరి= (అందరూ) నిలబడిపోయారు; అందున్= వాళ్ళలో; పాండవులు= పాండురాజు కుమారులు; ఏవురున్= అయిదుగురూ; పాండురాజ మహిషిన్= పాండురాజు పట్టపుదేవి కుంతిని; అనుపన్= పంపటానికి; మఱియున్= మరికొంత ముందుకు; చని= వెళ్ళి; ఆ+అమను= ఆమెను (కుంతిని); ధృతరాష్ట్ర గాంధారులను= కొంచెం దూరంగా ఉన్న గాంధారీ ధృతరాష్ట్రులతో; కలిపి= చేర్చి; వారలన్-ఇరువురన్= ఆ ఇద్దరినీ (గాంధారీ ధృతరాష్ట్రులను); ఉద్దేశించి= గురించి; మీరు= మీ రిద్దరూ; వనంబునకున్= అడవికి; పోయి= వెళ్ళి; తానును= కుంతి కూడా; లేకున్నన్= మాకు తోడుగా లేకపోతే; మాకున్= మా అందరికీ; కాలంబు= ముందరిరోజులు; ఎట్లు= ఏ విధంగా; కడపన్= వెళ్ళదీయటం; వచ్చున్= సాధ్యమవుతుంది; అనుతలంపునన్= అన్న ఉద్దేశంతో; తన్నున్= కుంతిని; ఎంత= ఎంతగా; ప్రార్థించినను= వేడుకొన్నప్పటికీ; గొంతి= కుంతి; నిలుచుటకున్= ఆగటానికి; ఒడంబడదు అయ్యెన్= అంగీకరించలేదు; ఈ సాధ్వికిన్= పతివ్రత అయిన ఆమెకు; బుద్ధి-చెప్పికొనుచున్= సదుపదేశాలు చేస్తూ; పరిచర్య= సేవ; చేయించుకొండు= మీరు చేయించుకొనండి; అని= అని చెప్పి; అప్పగించి= కుంతిని గాంధారీ ధృతరాష్ట్రులకు ఒప్పజెప్పి; ఆ రాజునకున్= (ఆ) ధృతరాష్ట్రుడికీ; ఆ+దేవికిన్= గాంధారికీ; కుంతికిన్= తల్లికీ; ప్రదక్షిణంబు - చేసి= ప్రదక్షిణగా తిరిగి; దండ ప్రణామంబులు= సాష్టాంగ నమస్కారాలు; ఆచరించినన్= చేయగా; వారు= గాంధారీ, ధృతరాష్ట్రులూ, కుంతీ; దీవించి= పాండవులను ఆశీర్వదించి; ఆమంత్రణంబు - చేయన్= వీడు కొల్పగా; ఆ ధర్మపుత్త్ర-ఆదులు= ధర్మరాజు మొదలైన వారు (పాండవులు); అశ్రు ప్లావితంబులు= కన్నీళ్ళతో తడిసినవి; అగు= అయినటువంటి; వదనంబుల తోడన్= ముఖాలతో; మరలి= వెనక్కు తిరిగి; వనితా జనంబులన్= అక్కడ ఆగిఉన్న అంతఃపురకాంతలను; తోడ్కొని= తీసికొని.

**తాత్పర్యం:** కుంతి నిశ్చయానికి విచారిస్తూ అందరూ ఆమెకు పాదాభివందనం చేసి ఆగిపోయారు. వారిలో పాండవులు మాత్రం కుంతీదేవికి వీడ్కోలు ఇచ్చి పంపటానికి మరికొంత ముందుకు వెళ్లారు. కుంతిని గాంధారీ ధృతరాష్ట్రులు ఉన్నచోటికి తీసికొనిపోయి వాళ్ళతో 'మీరు ఇద్దరూ అడవికి వెళ్ళుతున్నారు. ఈ కుంతి కూడా మిమ్మల్ని అనుసరించివస్తే

ఆమె కూడా లేకుండా మేం కాలం గడిపేదెట్లాగని ఆమెను వెళ్లవద్దని మేము ఎంతగా ప్రార్థించినా వినటం లేదు. ఈ పతివ్రతకు మీరే మంచి మాటలు చెప్పుతూ ఆమెచేత సేవలు చేయించుకొనండి' అని కుంతిని గాంధారీ ధృతరాష్ట్రులకు అప్పగించారు. ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ, కుంతికీ ప్రదక్షిణం చేసి సాష్టాంగంగా ప్రణామం చేశారు. వాళ్ళు కూడా పాండవులను దీవించి వీడ్కోలు చెప్పారు. అపుడు ధర్మరాజాదులు కన్నీళ్ళతో తడిసిన ముఖాలతో, వెనుకకు తిరిగి వచ్చి అక్కడే ఉన్న అంతఃపుర స్త్రీలను కలుపుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఈ వీడ్కోలు సన్నివేశం మూలంలో ఇట్లా లేదు. రాచ మర్యాదలు ప్రత్యక్షంగా చూసిన తిక్కన సహజంగా చిత్రించటం ఇందులో విశేషం. గాంధారీ ధృతరాష్ట్రులను తిక్కన దూరంగా పంపించాడు. కాబట్టి అడవులకు వెళ్లవలసిన కుంతిని ముందుకు తీసుకొని వెళ్ళి వాళ్ళతో కలిపాడు. కుంతి 'ఇట్టి తోడు మఱి నాకు కలుగునే' అన్నది (171) కాబట్టి కుంతికి వాళ్ళు తోడుగా, కుంతిని వాళ్ళ కప్పగించారు. పెద్దదిక్కయిన మీరూ లేకా, ఆమె కూడా లేకపోతే ఎట్లాగని నగరంలో ఉండుమని వేడుకున్నాం అన్నాడు ధర్మరాజు. ఆంతర్యం అదే అయినా, అక్కడ అనుకొన్న మాటలు ధృతరాష్ట్రుడు వినదగ్గవి కావు కాబట్టి తమ మాటల సారం ప్రకటించాడు. 'ఎంత ప్రార్థించినను నిలుచుట కొడంబడదయ్యె'- అనటం అందువలన మా తల్లిని మీ కప్పగించవలసి వచ్చిందని భావం. ఇట్లా అనటం వలన గాంధారీ ధృతరాష్ట్రులు మళ్ళీ ప్రత్యేకంగా అడవులకు రావద్దని చెప్పనవసరం లేకుండా పోయింది.

**తే.** **పొగులుచును నల్ల నల్లన పురికి నరిగి। రదియు నుమ్మలికంబు ప్రోవైన యట్లు**
**చూడఁ గూడక యుండంగఁ జొచ్చి రాత్మ। మందిరము లందఱును బుధమాన్యచరిత! 176**

**ప్రతిపదార్థం:** పొగులుచును= దుఃఖంతో కుమిలిపోతూ; అల్లన+అల్లన= అతికష్టంగా, (మిక్కిలి మెల్లగా); పురికిన్= హస్తినకు; అరిగిరి= వెళ్లారు; బుధ-మాన్య-చరిత!= విజ్ఞులచే, గౌరవింపబడే నడవడి కలవాడా - జనమేజయ మహారాజా!; అదియున్= ఆ హస్తి నగరం కూడా (అప్పుడు); ఉమ్మలికంబు= విచారం; ప్రోవు - ఐన - అట్లు= కుప్పగా ఒకేచోటకు చేరిన తీరుగా; చూడన్-కూడక= చూడలేని విధంగా; ఉండంగన్= ఉండగా; అందరును= పాండవాదులందరూ; ఆత్మమందిరములు= తమ తమ నివాసాలు; చొచ్చిరి= ప్రవేశించారు.

**తాత్పర్యం:** (కుంతీ ప్రభృతులు వీడ్కోలివ్వగా వెనుకకు మళ్ళిన పాండవులు అంతఃపుర స్త్రీలను కలుపుకొని) దుఃఖంతో కుమిలిపోతూ, మెల్లగా అతికష్టం మీద హస్తి నగరానికి తిరిగివచ్చారు. ఆ నగరం మొత్తం విచారం అంతా ఒక్కచోట పోగుగా కూడిందా అన్నట్లుగా చూడలేనట్లుగా ఉన్నది. గౌరవించే నడత కలిగిన ఓ జనమేజయ మహారాజా! పాండవులూ వారి కాంతలూ తమతమ ఇండ్లలో ప్రవేశించారు. (అని వైశంపాయనుడు జనమేజయుడితో అన్నాడు.)

**విశేషం:** ('అదియు నుమ్మలికంబు ప్రోవైన యట్లు-అలంకారం ఉత్ప్రేక్ష')

**వ.** **అట్లు పుర ప్రవేశంబు చేసి ధర్మనందనుండును దమ్ములుం దగిన వర్తనంబుల నుండి; రట నక్కురువృద్ధుండు నిశ్చింతుం డై గాంధారియుఁ గుంతియు విదుర సంజయులు నగ్నిహోత్రంబునకు వలయు ఋత్విగ్జనంబులతోడ నరుగుదేర నలయక భాగీరథీ తీరంబునకుం బోయి, యొక్క యోగ్య ప్రదేశంబున విడిసెఁ; దదనంతరంబ యతండు. 177**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ ప్రకారంగా; పురప్రవేశంబు చేసి= తిరిగి హస్తినగరానికి వచ్చి; ధర్మనందనుండును= ధర్మరాజూ; తమ్ములున్= అతడి తమ్ముళ్ళు భీమాదులూ, తగిన వర్తనంబులన్= యోగ్యమైన నడవడులతో; ఉండిరి= ఉన్నారు; అటన్= ఇంక అక్కడ; ఆ+కురువృద్ధుండు= ఆ ధృతరాష్ట్రుడు; నిశ్చింతుండు-ఐ= చింతలు (ఇతరాలోచనలు) ఏమీ లేకుండా; అగ్నిహోత్రం బునకున్= నిత్యమూ అగ్నికార్యానికి; వలయు= అవసరమైన; ఋత్విగ్జనంబులతోడన్= ఋత్విక్కులతో కలిసి; గాంధారియున్= గాంధారీ; కుంతియున్= కుంతీ; విదుర సంజయులున్= విదురుడూ, సంజయుడూ; అరుగుదేరన్= రాగా; అలయక= శ్రమ తెలియకుండా; భాగీరథీ, తీరంబునకున్= గంగానది ఒడ్డుకు; పోయి= చేరుకొని; ఒక్క-యోగ్య-ప్రదేశంబునన్= ఉండడానికి తగిన ఒకానొకచోట; విడిసెన్= విడిది ఏర్పరచుకొన్నాడు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; అతండు= ఆ ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా నగరానికి తిరిగి వెళ్ళిన ధర్మరాజూ, అతడి తమ్ముళ్ళూ తమకు యోగ్యమైన నడవడికతో ఉన్నారు. ఇంక పాండవులు విడిచిన తర్వాత అక్కడ నిత్యమూ, అగ్నికార్యానికి అవసరమైన ఋత్విక్కులను తీసికొని గాంధారీ, కుంతీ, విదురుడూ, సంజయుడూ తనతో రాగా, ధృతరాష్ట్రుడు నిశ్చింతగా, అలుపు తెలియకుండా గంగానది ఒడ్డుకు చేరుకొన్నాడు. అక్కడ నివాసానికి తగిన ఒకానొక స్థలంలో వచ్చిన బలగంతో ఆ నాటికి బస ఏర్పాటు చేసికొన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **స్నానాదిక విహితాను। ష్ఠానంబులు నడపి శ్రుతి విశారద భూదే**
**వానీక ప్రణయనమున। మానిత రుచి వెలుఁగుచున్న మహితాగ్నులకున్** **178**

**ప్రతిపదార్థం:** స్నాన+ఆదిక-విహిత-అనుష్ఠానంబులు= స్నానం మొదలైన (ధర్మ శాస్త్రములందు ఆచరింపవలసినవిగా) విధించబడినటువంటి పనులు ఆచరించటం; నడపి= జరిపి; శ్రుతి-విశారద-భూదేవ+అనీక-ప్రణయనమునన్= వేదపారంగతులైన బ్రాహ్మణుల సమూహంచేత తీసికొనిరాబడటం వలన; మానిత-రుచిన్= పూజ్యమైన గొప్ప కాంతితో; వెలుఁగుచున్+ఉన్న= ప్రకాశిస్తూ ఉన్నటువంటి; మహిత-అగ్నులకున్= పూజ్యా (ప్రభావ వంతా) లైన అగ్నులకు.

**తాత్పర్యం:** గంగానదీ తీరంలో బలగాన్ని విడిది చేసిన తరువాత ధృతరాష్ట్రుడు స్నానమూ మొదలైన శాస్త్ర విహిత కర్మలను ఆచరించి, వేద పారగులైన బ్రాహ్మణులు తయారుచేయటం వలన (గొప్పకాంతితో) ప్రకాశిస్తున్న పూజించదగిన అగ్నులకు- (అర్చనలు చేశాడు)

**తే.** **అర్చ లిచ్చి హోమంబు సమంచితముగఁ। జలిపి యెల్లవారలకు భోజనము సంఘ**
**టించి యాహారవిధి యాచరించి విదుర। సంజయుల యొనర్చిన దర్భశయ్య నుండె.** **179**

**ప్రతిపదార్థం:** అర్చలు-ఇచ్చి= పూజలు చేసి; సమంచితంబుగన్= (తగిన విధంగా) విధ్యుక్తంగా; హోమంబు చలిపి= సమిధాదులను ఆ అగ్నిలో ప్రయోగించి, (హుతం చేసి) (వైశ్వదేవంచేసి); ఎల్ల వారలకున్= తనతో (అడవికి) వచ్చిన వాళ్ళందరికీ; భోజనము= తిండి; సంఘటించి= కూర్చి; ఆహారవిధి= తాను కూడ, భోజనం పని; ఆచరించి= పూర్తి చేసి; విదుర సంజయుల= విదురుడూ, సంజయుడూ; ఒనర్చిన= సిద్ధం చేసిన; దర్భశయ్యన్= దర్భలతో ఉన్న పడకమీద; ఉండెన్= కూర్చున్నాడు.

**తాత్పర్యం:** ఆ అగ్నికి అర్చనలు చేసి, విధిమంతంగా హోమం చేసి, తనతో వచ్చిన అందరికి భోజనాలు ఏర్పాటు చేసి, తానూ భోంచేసి, విదురుడూ సంజయుడూ సిద్ధం చేసిన దర్భల పడకమీద విశ్రాంతిగా కూర్చున్నాడు ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుఁడు శతయూప రాజర్షి యాశ్రమంబున వసియించుట (సం.15-25-9)

**వ. ఆ శయ్యకు ననతిదూరంబునం గల్పితం బైన తల్పంబున గాంధారియుం దదనంతర సన్నిహితశయనంబున గొంతియు నింత నంత విదుర సంజయులును జుట్లం దమకుఁ జూడం బోలిన చోటుల యాజకజనంబును విశ్రమించి; రట్లద్ది న శేషంబు సనిన సాయంతన కృత్యంబులు సలిపి; రయ్యామిని యచ్చటఁ గడపి సూర్యోదయ సమయంబునం గాలోచిత కరణీయంబులు నిర్వర్తించి యాంబికేయుండు తన వారును దానును గంగానది యుత్తరించి చని కురుక్షేత్రంబుఁ బ్రవేశించి యొక్క పుణ్యాశ్రమంబు నుపాంతంబునం దరుచ్ఛాయాశీతలంబైన సికతాతలంబున నాసీనుం డయ్యెఁ; నట్లక్కురురాజు నిజాశ్రమప్రదేశంబునకు వచ్చుట శతయూప నామధేయుండును గేకయవంశ వర్యుండును దపోధుర్యుండును నైన రాజర్షిసత్తముండు విని యయ్యెడకు వచ్చి. 180**

**ప్రతిపదార్థం:** ఆ శయ్యకున్= ధృతరాష్ట్రుడు విశ్రమించిన శయ్యకు; అనతిదూరంబునన్= కొంచెం ఎడంగా; కల్పితంబు-ఐన= ఏర్పాటు చేయబడిన; తల్పంబునన్= శయ్యమీద; గొంతియున్= కుంతీదేవి; ఇంతన్-అంతన్= కొంచెం దూరంగా; విదుర సంజయులును= విదురుడూ, సంజయుడూ; చుట్లన్= వారందరికీ చుట్టూ; తమకున్= ఎవరికి వారికి; చూడన్= ధృతరాష్ట్రుడు కనబడటానికి; పోలిన చోటులన్= తగిన స్థానాలలో; యాజక జనంబును= ఋత్విక్కులూ; విశ్రమించిరి= విశ్రాంతి తీసికొన్నారు; అట్లు= ఆ ప్రకారంగా; ఆ+దిన= శేషంబు= వాళ్ళు అడవికి వచ్చిన నాటి పగలులో మిగిలిన భాగం; చనినన్= గడచిపోగా; (సాయంత్రం) సాయంతన-కృత్యంబులు= సాయంకాలంలో జరపవలసిన సంధ్యావందనాదులైన పనులను; చలిపిరి= ఆచరించారు; ఆ+యామిని= ఆరోజు రాత్రి; అచ్చటన్= భాగీరథీతీరంలోనే; కడపి= గడపి; సూర్య+ఉదయ-సమయంబునన్= సూర్యుడు ఉదయించే సమయంలో; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; కాల+ఉచిత, కరణీయంబులు= సూర్యోదయకాలంలో ఆచరించవలసిన కార్యాలు; నిర్వర్తించి= పూర్తి చేసి; తనవారును= గాంధారీ ప్రభృతులు (తనతో వచ్చినవారూ); తానును= తానూ; గంగానది= గంగానదిని; ఉత్తరించి= దాటి; చని= (అవతలి ఒడ్డుకు) వెళ్ళి; కురుక్షేత్రంబున్= కురుక్షేత్ర స్థలాన్ని; ప్రవేశించి= చేరుకొని; ఒక్క-పుణ్య-ఆశ్రమంబు-ఉపాంతంబునన్= ఒకానొక పవిత్రమైన మునులు నివసించే చోటికి దగ్గరలో; తరు-ఛాయా- శీతలంబు+ ఐన= చెట్లనీడ వలన చల్లగా ఉన్న; సికతా- తలంబునన్= ఇసుక తిన్నెమీద; ఆసీనుండు+అయ్యెన్= (తనవారందరితో గూడ) కూర్చున్నాడు; శతయూప-నామధేయుండును= శతయూపుడు అనేపేరు గలవాడూ; కేకయ-వంశ-వర్యుండును= 'కేకయ' వంశంలో శ్రేష్ఠుడూ; తపస్-ధుర్యుండును= గొప్ప తపస్వీ; ఐన= అయినటువంటి; రాజ-ఋషి-సత్తముండు= గొప్ప రాజర్షి; అట్లు= ఆప్రకారంగా (గాంధారీ ప్రభృతులలో వనవాసార్థం); ఆ+కురురాజు= ఆ ధృతరాష్ట్రుడు; నిజ-ఆశ్రమ-ప్రదేశంబునకున్= తన నివాస ప్రాంతానికి; వచ్చుట= రావటం; విని= తెలిసికొని; ఆ+ఎడకున్= ఆ ధృతరాష్ట్రాదులు విడిసిన చోటికి; వచ్చి= వచ్చి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు విశ్రమించిన శయ్యకు కొంచెం ఎడంగా ఏర్పరచిన పక్కమీద గాంధారీ, దానికి దగ్గరలో శయ్యమీద కుంతీ, అక్కడికి కొంచెం ప్రక్కగా విదురుడూ, సంజయుడూ, ధృతరాష్ట్రుడూ తమకు కనబడేవిధంగా వీలయిన స్థలాలలో వారికి చుట్టూ ఋత్విక్కులూ, విశ్రాంతి తీసికొన్నారు. ఆ విధంగా ఆ రోజు పగలు గడిచింది. సాయంకాలం కావటంతో అందరూ సంధ్యాదికృత్యాలు జరిపారు. ఆ రాత్రి భాగీరథీ తీరంలో అక్కడే గడిపారు. సూర్యోదయం కాగానే ఆ సమయంలో చేయవలసిన హోమాది విధులన్నీ పూర్తి చేశారు. తరువాత ధృతరాష్ట్రుడు తనతో అడవికి వచ్చినవారూ తానూ కలిపి, గంగానదిని దాటి ఆవలిఒడ్డుకు చేరుకొని, కురుక్షేత్రంలో ప్రవేశించి,

అక్కడ ఒక పవి(త్రమైన ముని ఆ(శమానికి దగ్గరలో చెట్టు నీడవలన చల్లగా ఉన్న ఇసుకదిబ్బమీద కూర్చున్నారు. కేకయవంశంలో (శేష్ఠుడూ, గొప్ప తపస్వీ అయిన శతయూపుడు అనే రాజర్షి ధృతరా(ష్ట్రుడు వనవాసార్థం గాంధారీ (ప్రభృతులతో వచ్చి తన ఆ(శమానికి సమీపంలో ఉన్నాడని తెలిసికొని ధృతరా(ష్ట్రుడి వద్దకు వచ్చాడు.

**క. కని గారవంబునం దో। డ్కొని చని యర్ఘ్యాది విధు లకుంఠితవినయం**
**బున నడపిన నయ్యాశ్రమ। మున నతఁడు వసింపఁగోరె భూపవరేణ్యా! 181**

**(ప్రతిపదార్థం:** భూప-వరేణ్యా!= జనమేజయ మహారాజా!; కని= ధృతరా(ష్ట్రుడిని (అతడితో వచ్చినవారినీ) చూచి; గారవంబునన్= అభిమానంతో; తోడ్కొని= (శతయూపుడు) తనతో తీసికొని; చని= ఆ(శయానికి వెళ్ళి; అకుంఠిత-వినయంబునన్= మిక్కిలి అణకువతో; అర్ఘ్య-ఆది-విధులు= పూజ్యమైన జలం ఇవ్వటం మొదలైన పనులు; నడపినన్= జరపగా; అతఁడు= ఆ ధృతరా(ష్ట్రుడు; ఆ+ఆ(శమమునన్= ఆ శతయూపుడి ఆ(శమంలో; వసింపన్= ఉండాలని; కోరెన్= కోరుకొన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా!; ఆ విధంగా ధృతరా(ష్ట్రుడి వద్దకు వచ్చిన శతయూపుడు ధృతరా(ష్ట్రుడిని (ఇతరులనూ) చూచి, సగౌరవంగా తనతో ఆ(శమానికి తీసికొని వెళ్ళి గొప్పవినయంతో, అర్ఘ్యం మొదలైన సత్కారాలు చేశాడు. ధృతరా(ష్ట్రుడు ఆ ఆ(శమంలోనే ఉండాలని కోరుకొన్నాడు.

**క. కోరిన విదురాదులు నా। కౌరవపతితలఁపు మేలుగాఁ గొని తగ న**
**చ్చేరువను బర్ణశాలలు। వే రచియించి రుచితంపు విధమున నధిపా! 182**

**(ప్రతిపదార్థం:** అధిపా!= జనమేజయమహారాజా!; కోరిన= ధృతరా(ష్ట్రుడు శతయూపుడి ఆ(శమంలో నివసించాలనుకొంటున్నట్లుగా చెప్పగా; ఆ కౌరవపతి-తలఁపు= ఆ ధృతరా(ష్ట్రుడి ఆలోచనను; మేలుగాన్= మేలైనదిగా; కొని= (గ్రహించి; విదుర-ఆదులు= విదురుడు మొదలైన వారు; తగన్= తగినంతగా; ఆ+చేరువను= అక్కడికి దగ్గరలోనే; ఉచితంపు విధమునన్= అర్హమైన తీరులోనే; వే= వేగంగా; పర్ణశాలలు= ఆకుటిళ్ళు; రచియించిరి= నిర్మించారు.

**తాత్పర్యం:** జనమేజయమహారాజా! ధృతరా(ష్ట్రుడు శతయూపుడి ఆ(శమంలోనే నివసించాలని కోరగా అతడి అభి(ప్రాయం మంచిదే అని (గ్రహించిన విదురుడు మొదలైనవారు అక్కడికి తగినంత దగ్గరలోనే (ప్రక్కనే తగిన విధంగా పర్ణశాలలు త్వరగా నిర్మించారు.

**వ. అం దక్కురువిభుండు దానును గాంధారియుఁ జీరాజిన వసనులును సువ్రతపరులు నగుచుఁ గుంతీ విదుర సంజయులతో వసియించి తపం బాచరింప యాజకులు నిజకృత్యంబు నడపుచుండి రిట్లు నియమ నిష్ఠలతిశ యిల్ల నాభూవల్లభుం డచ్చటి మును ల చ్చేరువ నతి తీవ్రతపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టి కార్శ్యంబు దనకు నొప్పుగా వర్తి లై నని యిట్లు ధృతరాష్ట్ర వృత్తాంతంబు చెప్పిన విని యవ్విచిత్రవీర్య నందనుండు పదంపడి యెట్టివాఁ డయ్యె? మునీంద్రా! యెఱిఁగింపు' మనుటయు. 183**

**(ప్రతిపదార్థం:** అందున్= ఆ పర్ణశాలలో; గాంధారియున్= గాంధారీ; ఆ+కురువిభుండు= ఆ ధృతరా(ష్ట్రుడు; తానును= తానూ; చీర+అజినవసనులును= నారచీరలు, మృగచర్మాలూ వ(స్త్రాలుగా ధరించి; సు(వ్రత పరులున్= (శేష్ఠములైన వేదోక్త విధుల ఆచరణలో దీక్ష కలిగి; కుంతీ-విదుర-సంజయులతోన్= కుంతీ, విదురుడూ; సంజయుడూ-వీళ్ళతో కలిసి; వసియించి= వినసిస్తూ; తపంబు=

తపస్సు; ఆచరింపన్= చేస్తుండగా; యాజకులు= ఋత్విక్కులు; నిజకృత్యంబులు= అగ్నికార్యాదులైన తమ పనులను; నడపుచుండిరి= నిర్వహిస్తున్నారు; ఇట్లు= ఈ ప్రకారంగా; ఆ భూవల్లభుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; నియమ-నిష్ఠలు= ఉపవాసాది నియమాలూ, వానిలో శ్రద్ధా; అతిశయిల్లన్= పెంపొందగా; అచ్చటి మునులు= ఆ ప్రాంతంలో ఉండే తాపసులు; (అచ్చెరువు-అందన్= ధృతరాష్ట్రుడి తపోవ్రతానికి ఆశ్చర్యపడుతుండగా), ఆ+చేరువన్= అచ్చట; అతి-తీవ్ర-తపస్+చరణంబునన్= మిక్కిలి కఠినమైన తపస్సును ఆచరించటం వలన; నిర్-మాంసత్వంబునన్= శరీరంలోని మాంసం నశించిపోగా; నిజ+అంగంబు= అతడి (ధృతరాష్ట్రుడి) శరీరం; చర్మ+అస్థులు= చర్మమూ, ఎముకలూ; కదియు-అట్టి-కార్శ్యంబు= అతుక్కుపోయేంతగా కృశించిపోవటం; తనకున్= ధృతరాష్ట్రుడికి; ఒప్పు-కాన్= తేజస్సు, కాగా; వర్తిల్లెన్= ఉన్నాడు; అని= అనేవిధంగా; ఇట్లు= ఈ ప్రకారంగా; ధృతరాష్ట్ర వృత్తాంతంబు= ధృతరాష్ట్రుడియొక్క (వనగమన) వృత్తాంతాన్ని; చెప్పినన్ విని= చెప్పగావిని; ముని+ఇంద్రా= మహర్షీ!; పదంపడి= ఆ తర్వాత; ఆ+విచిత్ర వీర్యనందనుండు= ఆ (విచిత్రవీర్యుడి కొడుకు) ధృతరాష్ట్రుడు; ఎట్టివాఁడు-అయ్యెను= ఏమైనాడు (ఎట్లా ఉన్నాడు); ఎఱిఁగింపుము= తెలియజెప్పవలసింది; అనుటయున్= అని అడగ్గా (వైశంపాయను డిట్లా చెపుతున్నాడని పై-ఆశ్వాసంలోనికి అన్వయం).

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు, గాంధారీ, నారచీరలూ, మృగచర్మాలూ ధరించి ఉత్తమ నియమాలనుసరిస్తున్నారు. కుంతీ, విదుర సంజయులతో కలిసి విదురాదులు నిర్మించిన పర్ణశాలలో ఉంటూ గాంధారీ ధృతరాష్ట్రులు తపస్సు చేసికొంటు న్నారు. ఋత్విక్కులు తమ తమ పనులు చేస్తున్నారు. ఈ విధంగా ధృతరాష్ట్రుడు అక్కడి మునులంతా ఆశ్చర్యపడే విధంగా, తీవ్రమైన తపస్సు చేస్తూ, శరీరంలో మాంసం లేకుండా పోవటంతో చర్మం ఎముకలకు అతుక్కుపోయేంతగా కృశించాడు. ఆ విధంగా కృశించిన శరీరం కూడా తనకు తేజస్సు కలిగిస్తుండగా ధృతరాష్ట్రుడు శతయూపుడి ఆశ్రమంలో తీవ్రమైన తపస్సు చేసుకొంటూ ఉన్నాడు అని వైశంపాయనుడు చెప్పగా విని జనమేజయుడు 'మునీంద్రా! ఆ తర్వాత ధృతరాష్ట్రుడు ఏమైనాడు (ఏం చేశాడు) అతని వృత్తాంతం ఏమిటి నాకు తెలియ జెప్పవలసింది' అని అడిగాడు. అపుడు వైశంపాయనుడు ఇట్లా అన్నాడు (తరువాత ఆశ్వాసంతో అన్వయం).

ఆశ్వాసాంతము

**శా.** **ఆశాపాశ విమోచనోపకరణ వ్యాకోచహృద్ధామ! సం**
**క్లేశో త్పారక దివ్యనామ! వర దృగ్లీలాప్త నిస్సీమ ల**
**క్ష్మీ శుంభ త్సురలోక చక్రపరశుచ్ఛిన్నా సురానీక! వి**
**ద్యాశోభా స్ఫురణాకృతీ! శమదమానంతర్య భాస్వీకృతీ!** **184**

**ప్రతిపదార్థం:** ఆశా= కోరికలు అనే; పాశ= కట్టుత్రాళ్ళను; విమోచన= విడిపించుకోవడం అనే; ఉపకరణ= సాధనం చేత; వ్యాకోచ= వికాసం పొందినటువంటి; హృద్= (భక్తులయొక్క) హృదయాలే; ధామ= నివాసంగా కలిగినవాడా; సంక్లేశ= గొప్ప కష్టాలను; ఉత్పాదక= పారదోలేటటువంటి; దివ్య= మహిమ కలిగిన; నామ!= నామము(లు) గలవాడా!; వర= శ్రేష్ఠమైన; దృక్= చూపుల (యొక్క); లీలా= విలాసం చేత; ఆప్త= పొందబడిన; నిస్సీమ= మేర లేని; లక్ష్మీ= సంపదలతో; శుంభత్= ప్రకాశిస్తున్న; సురలోక= దేవతాసమూహం కలవాడా; చక్ర= సుదర్శనం అనే చక్రాయుధంతోనూ; పరశు= గండ్రగొడ్డలితోనూ; ఛిన్న= నరికివేయబడిన; అసుర= రాక్షసుల; అనీక= సమూహం కలవాడా; విద్యా= జ్ఞానం అనే; శోభా= తేజస్సు చేత; స్ఫురణ= తెలియబడే; ఆకృతీ!= ఆకారం కలవాడా!; శమ= మనస్సును నిగ్రహించటమూ; దమ= కన్నులు మొదలైన బాహ్యేంద్రియాలను నిగ్రహించటమూ; సాధించిన; అనంతర్య= వెంటనే; భా= కాంతితో; స్వీకృతీ!= స్వీకరించేవాడా!

**తాత్పర్యం:** కోరిక లనే పాశాలను వదలించుకొనడంద్వారా విస్తరించిన (భక్తుల) హృదయాలలో నివసించేవాడా! భక్తుల కష్టాలు ఎంతటివైనా తొలగించే మహిమాన్వితమైన నామాలు, (పేర్లు) గలవాడా! మేలైన చూపుల లీలలచేత పొందబడిన మేరలేని సంపదలతో శోభించే దేవలోకం కలవాడా! చక్రంతోనూ, పరశువుతోనూ రాక్షసులను నరికినవాడా!, జ్ఞానం అనే కాంతితో స్ఫురించే ఆకారం కలవాడా! (జ్ఞానం చేత గోచరించేవాడా!) శాంతీ దాంతీ కలిగిన వెంటనే (ఆ భక్తులను నీ) తేజస్స్వరూపంలోకి స్వీకరించేవాడా!-ఓ హరిహరనాథా!

**విశేషం:** మనస్సు కోరికలు అనే కట్టుత్రాళ్లతో బంధింపబడి ఉన్నప్పుడు కుంచించుకుపోయి ఉంటుంది. ఆ బంధాలు కోరికలు తెంచుకుంటే హృదయం విశాలమవుతుంది. అటువంటి కోరికలు లేనిచోట, కోరికలు లేకపోవడం వలన సర్వసృష్టిని ఆత్మసమంగా ఆదరించగలిగిన విశాలమైన హృదయంలోనే హరిహరనాథుడు నివాసం చేస్తాడు. (2) హరిహరనాథుడి నామం పైకి ఉచ్చరించినా లేదా మనసులో అనుకొన్నా ఎంతో గొప్ప కష్టాలు కూడా తొలగిపోతాయి. దానికి కారణం హరిహరనామంలోని దివ్యత్వం, మహిమ. జ్ఞానులు తదర్థం భావిస్తే సామాన్యులు కేవలం నామస్మరణమాత్రంచేతనే కష్టాలు పోగొట్టుకుంటారు. జ్ఞానులకు కష్టాలలోను కష్టభావన ఉండదు. సామాన్యులే కష్టాలలోనే వాటి నిష్కృతి కోసమే దేవుడిని తలచుకునేది. తావన్మాత్రం చేతనే. స్మరించిన వారి కోర్కెల కనుగుణంగా ఆ నామం - వారి కష్టాలను ఎంతటివైనా తొలగించి వేస్తుంది. ఇది నామ మహిమ (3) కటాక్షంచేతనే దేవతలకు అపారమైన సంపదలు కలుగుతున్నాయి. దేవతలపై ఉన్న ఈ కటాక్షం వలననే 'అసురానీకం చక్రపరశుచ్ఛిన్నం కాగా దేవతలు నిస్సీమ -లక్ష్మీ శుంభత్తులవుతున్నారు. చక్ర-పరశు-ఛిన్న-అసురానీక అన్నపుడు, క్రమంగా చక్ర ఛిన్నాసురుడు-సుదర్శన చక్రాయుధంతో రాక్షసులను చంపేవాడు. హరి, పరశుచ్ఛిన్నాసురానీకుడు. పరశువుచేత రాక్షసులను చంపేవాడు. హరుడు 'భూతేశః ఖండపరశుః (అమరం) ఖండ పరశువు గదా శివుడు. సుధన్వా ఖండ పరశుః. విష్ణువు సహస్రనామాలలో ఖండపరశు వొకటి. హరిహరుడు చక్ర పరశు ఛ్ఛిన్నాసురుడు. (4) విద్యాశోభా స్ఫురణాకృతీ- జ్ఞాన (విద్య) జ్యోతి (శోభా) యే- స్ఫురించే- తోచే ఆకారంగా కలిగినవాడు. హరిహరస్వరూపం భావిస్తే అది జ్ఞానజ్యోతిగానే స్ఫురిస్తుంది. జ్ఞాన(విద్యా), జ్యోతీ(శోభ), స్ఫూర్తి(స్ఫురణ). ఆకారంగా కలవాడని కూడా. (5) శమమూ (అంతరింద్రియ మనో-నిగ్రహము), దమమూ (బాహ్యేంద్రియ నిగ్రహమూ) సాధించిన వెంటనే తనయొక్క తేజస్స్వరూపంలోకి స్వీకరించేవాడు. తానుగా, తనలో కలుపుకొనేవాడు. శాంతిదాంతులు సాధించినవారు హరిహరుడి తేజఃస్వరూపంలో కలిసిపోతారు.

**క. ముని హృదయ నిలయ పాదా! వినత జనావన వినోద! విద్యా విద్యా**
**ఘన చింతాంతిక దూరల। సన! పీత స్ఫీత సామజత్వగ్వసనా! 185**

**ప్రతిపదార్థం:** ముని= జ్ఞానులయొక్క; హృదయ= మనసులే; నిలయ= నివాసమైన; పాదా!= పాదాలు కలవాడా!; వినత= ఆశ్రయించిన; జన= జనాలను; అవన= కాపాడటం; వినోద= వేడుక అయినవాడా!; విద్యా= జ్ఞానంయొక్క; అవిద్యా= అజ్ఞానం యొక్క; ఘన= మిక్కిలి; చింతా= విచారణం చేత; అంతిక= సమీపంలోనూ; దూర= దూరంగానూ; లసన!= ప్రకాశించేవాడా!; పీత(వసన)= పసుపుపచ్చని, (పట్టు పుట్టము); స్ఫీత= మందమైన; సామజ= ఏనుగుయొక్క; త్వక్= చర్మమూ; వసనా!= వస్త్రముగా గలవాడా!.

**తాత్పర్యం:** జ్ఞానులయొక్క హృదయాలే నివాసంగా కలిగిన పాదాలు కలవాడా! ఆశ్రయించిన వారిని రక్షించటమే వేడుక అయినవాడా! జ్ఞానులకు దగ్గరగాను, అజ్ఞానులకు దూరంగానూ ఉండేవాడా! పట్టుపుట్టమూ, ఏనుగుతోలూ, వస్త్రాలుగా ధరించినవాడా!- హరిహరనాథా!.

**విశేషం:** హరిహరనాథుడి పాదాలు ఎప్పుడూ జ్ఞానుల హృదయంలోనే ఉంటాయి. జ్ఞానులు సదా ధ్యానంతో హరిహరనాథుడి పాదాలు తమ తమ మనస్సులో దర్శిస్తూ ఉంటారు. ఇక సామాన్యులు ఆపదాది సమయాలలో తన్నివృత్తికొరకు రక్షణకొరకు ఆశ్రయిస్తే వాళ్ళని వినోదంగా కాపాడుతుంటాడు హరిహరనాథుడు. అజ్ఞానం చేత తాత్కాలిక సౌఖ్యాలను కోరటం వలన అవే గొప్పవి అనుకొనటం. అట్టి వారిని చూస్తూ వారి కోరికలు తీర్చటం హరిహరనాథుడికి వినోదం. జ్ఞానులు ఎప్పుడూ తలచుకొనటం వలన వారి హృదయాలలో- అత్యంతం సన్నిహితుడై ఉంటాడు. విద్యా ఘనులకు అంతిక లసనుడు. జ్ఞానంవలన ఘనులైన వారికి సమీపస్థుడు. అవిద్యా చింతకు- దూరుడు. అజ్ఞానం చేత 'చింత'లపా లైన వారికి దూరంగా చింతలు తీర్చినా భిన్నంగా భాసిస్తూ దూరంగా ఉంటాడు హరిహరనాథుడు. పీతాంబరమూ, సామజత్వక్కు వసనంగా కలిగి ఉండటంలో యథాక్రమంగా (పీతాంబరుడు) హరి (గజ చర్మడు) హర స్వరూపం స్ఫురిస్తుంది. పీతాంబరం పట్టుపుట్టం కోమలమైతే సామజత్వక్కు, స్పృతం-మందం. కఠినం,పరస్పర భిన్న లక్షణాలు ఏకీభవించినతత్త్వం హరిహరనాథుడిది.

**మాలిని,**

> **అపరిమిత విభూతీ! యప్రమత్తానుయాతీ!**
> **లపన నిభృతవేదా! లక్షణ స్వైరనాదా!**
> **జపపర వరదాయీ! సర్వవిద్యా విధాయీ!**
> **విపుల కృప కటాక్షా! విశ్వసంహ్లాదదక్షా!** **186**

**ప్రతిపదార్థం:** అపరిమిత-విభూతీ!= మేర లేని ఐశ్వర్యం కలవాడా!; అప్రమత్త+అనుయాతీ!= ప్రమాదాన్ని పొందని వారే, నీవెంట వచ్చేవాళ్ళుగా కలవాడా!; లపన= మాటలలో; నిభృత= స్థిరపడ్డ, (నిండిన); వేదా!= వేదాలు గలవాడా!; లక్షణ= లక్షణం (శబ్దాదిశాస్త్రం)గా ఏర్పడిన; స్వైర= స్వేచ్ఛగా వెలువడ్డ; నాదా!= ధ్వనులు కలవాడా!; జప= జపం చేసికొనటంలో; పర= ఏకాగ్రత కలవారికి; ఫలదాయీ!= గొప్ప ఫలితాన్ని ఇచ్చేవాడా; సర్వ= సమస్తమైన; విద్యా= విద్యలనూ; విధాయీ!= ఏర్పాటు చేసేవాడా!; విపుల= విస్తారమైన; కృప= దయ గలిగినట్టిదైన; కటాక్షా!= కడగంటి చూపు కలవాడా!; విశ్వ= సమస్తసృష్టినీ; సంహ్లాద= సంతోషపెట్టటంలో; దక్షా!= నైపుణ్యం గలవాడా!

**తాత్పర్యం:** కొలది లేని ఐశ్వర్యం కలవాడా! ఏకాగ్రత ఉన్న (భక్త) జనం చేత అనుసరించబడేవాడా! మాటలే వేదాలు అయినవాడా! స్వేచ్ఛగా (నీవు) చేసిన ధ్వనులే ఆయా లక్షణాలుగా ఏర్పడటం కలవాడా! ధ్యానశీలురైన వారికి తగిన ఫలితాన్ని అందజేసేవాడా! సమస్తమయిన విద్యలను కలుగజేసేవాడా! విస్తృతమైన దయ కలిగిన కొనచూపులవాడా! ఈ సమస్తమైన సృష్టిని సంతోషపెట్టటంలో నైపుణ్యం కలవాడా! ఓ హరిహరనాథా!.

**విశేషం:** అపరిమిత 'విభూతి'- విభూతి అంటే సంపద అని హరి రూపంలోనూ, భస్మమని హర రూపంలోనూ అర్థం. ఐక్యం హరిహరత్వం అప్రమత్త-అనుయాతి. అనుయాతి, వెంటబడి వచ్చేవాడు. ప్రమత్తులైతే అజ్ఞానం వలన సంసారంలో పడిపోతారు. జ్ఞానులు హరిహరనాథుడి వెంటబడిపోతారు. హరిహరుడి మాటలలో వేదాలు స్థిరపడ్డాయి. ఆ మాటలే వేదాలు. అతడు స్వైరంగా చేసిన ధ్వనులే లక్షణాలు, శాస్త్రాలు, పరమేశ్వరుడి ఢక్కానాదమే ఆఇఉణ్ మొదలైన రూపాలలో మాహేశ్వర సూత్రాలయి పాణినీయ శబ్ద లక్షణానికి మూలాలయ్యాయి. పరమేశ్వరుడే వేలాది విద్యలకు ప్రవర్తకుడు (చూ, తిక్కయజ్వ హరిహరనాథతత్త్వము పుట.383) (అలంకారం అంత్యానుప్రాసం).

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నాశ్రమవాసపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మహితాత్ముడు సంస్కృతాంధ్ర కవులకు మిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, పండితులను ఆరాధించటం చేత ప్రకాశించేవాడూ, (విద్వాంసులు తనను సేవించటం చేత విరాజిల్లేవాడు) అయిన తిక్కన సోమయాజి చేత రచించబడిన శ్రీమహాభారతంలో ఆశ్రమవాసపర్వంలోని మొదటి ఆశ్వాసం.

**ఆశ్రమవాసపర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.**

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మీ 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాథ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | |
|---|---|
| 24. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. హృదయంలో సాయి | 15-00 |
| 32. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | |
|---|---|
| 25. ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. జాతక మకరందం | 63-00 |
| 31. జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. శుభశకునాలు | 30-00 |
| 42. హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. ముహూర్త దీపిక | 99-00 |
| 45. పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. కలలు ఫలితాలు | 30-00 |
| 47. జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. అంగసాముద్రికం | 36-00 |
| 55. హస్త సాముద్రికం | 63-00 |
| 56. లాల్ కితాబ్ | 99-00 |
| 57. శకునశాస్త్రం | 63-00 |
| 58. ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | |
|---|---|
| 60. అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. లగ్నరత్నాకరం | 63-00 |
| 63. షట్పంచాశిక | 120-00 |
| 64. 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. ముహూర్తచింతామణి | 99-00 |
| 72. సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. నాడీజ్యోతిషం | 63-00 |
| 80. నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. గౌతమసంహిత | 63-00 |
| 83. హోరరత్నమాల | 63-00 |
| 84. జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. వింత జోస్యములు | 63-00 |
| 88. షోడశవర్గులు | 200-00 |
| 89. రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్ధరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

## రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి
## శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | | |
|---|---|---|---|
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. | కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. | దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. | 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | | 36-00 |
| 99. | ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. | భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. | చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. | భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. | సూర్యోపాసన | | 36-00 |
| 104. | కాశీఖండం | | 250-00 |
| 105. | దేవీభాగవతం | | 360-00 |
| 106. | శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. | ధర్మసందేహాలు | | 216-00 |
| 108. | ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. | రామాయణం | | 600-00 |
| 110. | పోతన భాగవతం | | 900-00 |
| 111. | శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. | మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. | ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. | గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. | గృహవైద్యసారం | 36-00 |
| 6. | హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. | ప్రకృతివైద్యం | 36-00 |
| 8. | ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

